




# భగవద్గీత

## విచారణ

భగవద్గీత-పరమార్థ చంద్రికా సంహిత- 1 నుంచి 4 భాగాలు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050005769,780,2020050005808,45

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

శ్రీ కృష్ణాయ నమః.

# శ్రీమద్భగవద్గీత

చదలువాడ సుందరరామశాస్త్రులచే

వ్రాయఁబడిన గీతార్థసర్వస్వరూపము గు

# పరమార్థచంద్రిక

యను నాంధ్రవ్యాఖ్యానముతోఁ గూడినది.

ప్రథమ ద్వితీయాధ్యాయములు

సంపుటము ౧.

చన్నపురి

శారదాంబావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రితమయి ప్రకటింపఁబడెను.



1911.

శ్రీ

శ్రీకృష్ణాయ నమః

# విజ్ఞాపిక.

శ్రీమద్భగవద్గీతామాహాత్మ్యం బిప్పుడు సకలభూభాగంబులందును సుప్రసిద్ధంబై వెలయుచున్నది. శ్రీభగవద్గీత సర్వభాషలందును దర్జుమా చేయఁబడి సర్వదేశజులచేతను బఠింపఁబడుచున్నది. శ్రద్ధావిశేషము గలవారు, భరతఖండజులు మాత్రమే కాక, యితరఖండజులు గూడ మూలగ్రంథమునే పారాయణము చేయుచున్నారు. ఇట్టిమహనీయగ్రంథమును సకలదేశవాసులును ముఖ్యతత్త్వగ్రంథముగాఁ గొనియాడ న్నారు. ఇట్టి తత్త్వగ్రంథముయొక్క పరమతాత్పర్యము యథాయథముగ నెఱుంగుటకుఁ దత్త్వజిజ్ఞాసువు లగుసజ్జను లందఱు నపేక్షింతు రని చెప్పవలయునా ?

ఏతత్పరమతాత్పర్యము భగవంతుం డాదిగా గురుశిష్యపారంపర్యక్రమంబున సంప్రదాయప్రవృత్తంబై యుండి లోపభయంబునం జేసి శ్రీశంకరప్రభృతులచే భాష్యవ్యాఖ్యానాది రూపంబున గ్రంథస్థము గావింపఁబడియె. ఆభాష్యవ్యాఖ్యానంబులు గీర్వాణభాషం బ్రౌఢశైలి నుండుటవలనఁ దద్భాషాపరిజ్ఞానంబును మీమాంసాదిసకలశాస్త్రపరిభాషాపరిచయంబునుం గలవారికిఁ గాని తెలియ నలవి గాకున్నవి.

ఈకారణంబువలన నస్మత్సుహృత్తులు ఆంధ్రులు పెక్కండ్రు ప్రేరించుటం జేసి యాంధ్రలోకోపకారార్థం బీప్రస్తుతకార్యము ప్రారంభింపంబడియె. ఇందు, శ్రీమచ్ఛంకరభగవత్పాదీయభాష్యము ౧, ఆనందగిరికృతతద్వ్యాఖ్యానము ౨, హనుమద్విరచితపైశాచభాష్యము ౩, శంకరానందీయవ్యాఖ్యానము ౪, మధుసూదనసరస్వతీకృతగూఢార్థదీపిక ౫, శ్రీధరస్వామికృతటీక ౬, సూర్యదైవజ్ఞకృతపరమార్థప్రప ౭ ఈయద్వైతవ్యాఖ్యానములును, శ్రీమద్రామానుజీయభాష్యము ౮, శ్రీమన్మాధ్వభాష్యము ౯ ఈవిశిష్టాద్వైతద్వైతభాష్యములు రెండును వెరసి తొమ్మిదివ్యాఖ్యానములు ఆంధ్రీకరింపఁబడుచున్నవి. ఈవ్యాఖ్యానములలోని విషయము కొంచె మేని విడువక అన్యూనానతిరిక్తంబుగాఁ దెనుఁగు వ్రాయంబడుచున్నది.

ఈవ్యాఖ్యానములు న్యాయమీమాంసాది శాస్త్రవిషయచర్చలు గలిగి సాధారణసంస్కృతవ్యుత్పత్తి గలవారికిఁ గూడ దురవగాహంబులై యున్నవి. ఆంధ్రం

బునన్ యిదివఱకు శాస్త్రవిషయవ్యవహారంబు గల గ్రంథంబులే లేవు. కావున, అట్టి గ్రంథం బిదియే మొదటిదిగా నున్నది. అయినను ఆంధ్రీకరణము సాధ్య మయినంతవఱకు సుబోధముగా నుండునట్లు బహుప్రయత్నము చేయఁబడినది. ప్రథమప్రయత్నసాధారణంబు లగు లోపంబు లున్నను మన్నించి సహృదయులు సదయులై నివేదింతు రేని మునుముందు సవరించుకోఁబడును.

మిక్కిలి గొప్పగ్రంథం బగుటవలనఁ జందాదారులసాహాయ్యం బాశ్రయింపఁబడియె. ఇదివఱకుఁ జందాదారు లిచ్చుధనంబె యేతత్కార్యనిర్వాహము నకుఁ బ్రధానసాధనంబై యున్నది. చందాదారులు పెక్కండ్రు పరమప్రీతి సమన్వితులై సంచికాప్రకటనసమయము నిరీక్షించుచు శ్రద్ధమెయిం బఠించుచుఁ గ్రమం బునఁ జందాధనం బందించుచు నిమ్మహాకార్యమునకు భక్తివిశేషంబునం దోడ్పడు చున్నవారు. ఇట్లు వారు తాము పఠింపఁ గల్గుటం జేసి తమకును, గ్రంథప్రకటనసా ధనీభూతధనహేతువు లగుటం జేసి పరులకును ఉపకర్త లగుచున్నారు. అట్టివారలే గదా ధన్యులు. అస్మదీయగ్రంథము గొనువార లని వినుతించుట గాదిది. భగవం తుండే గదా యట్టివారలే తనకుఁ బరమప్రియు లని తానే వక్కాణించి యున్న వాఁడు!—

"య ఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా మా మే వైష్య త్యసంశయః.
నచ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః
భవితా నచ మే తస్మా దన్యః ప్రియతరో భువి."

(ఎవ్వఁడు నాయందుఁ బరమం బగుభక్తి నుంచి—ప్రకటనంబుచేఁ బరమగురు వగు భగవంతుని శుశ్రూష నేఁ జేయుచున్నా నని తలఁచి, పరమ గుహ్యం బగుదీని నాభక్తులయందుఁ బ్రకటించుచున్నాఁడో అతఁడు నన్నే పొందు చున్నాఁడు; సందేహము లేదు. అ. ౧౮ శ్లో. ౬౮.

అట్టి వానికన్నను నా కధికముగాఁ బ్రియము చేయువాఁడు మనుష్యుల యం దెవ్వఁడును లేఁడు. ఇఁక ముందును భూమియందు నా కతనికన్న నధికప్రి యుండు కలుగఁ బోఁడు. అ. ౧౮ శ్లో. ౬౯.)

అని.

కొందఱు మాత్రము కొంతవఱకు గ్రంథము పుచ్చుకొని నడుమ న్వఁ దనుచున్నారు. కొందఱు సంచికలు గ్రహించుచుండి చందాధనంబుఁ గోరినపుడు నిరాకరించుచున్నారు. మఱి కొందఱు మాపంపుసంచికలమాత్రం బంగీకరింప

దరు, మా వ్రాయుప్రార్థనపత్త్రికల మాత్రము పెడచెవిం బెట్టెదరు. ఇంకఁ గొందఱు «అధికగ్రంథ మగుచున్నది, అవిఘ్నసమాప్తి యగునా?" అని యధిక్షేపము మాత్రమే చేసెదరు.

ఇట్లు వీ రేతత్కార్యంబునకుఁ బ్రతిబంధహేతువు లని తోఁచుం గాని వాస్తవము విమర్శించినచో విధాంతరంబున సమాప్తిసాధనంబె యయ్యెదరు. ఎట్లనఁగా, ఇందుఁ బ్రథములు కొంతధనము వెచ్చించి కొంతగ్రంథము నొందినవా రగుటచే నిరర్థకధనవ్యయంబు నొల్లక లబ్ధగ్రంథవ్యాసంగసముత్తేజిత కౌతుకులై యవశిష్టగ్రంథముం గూడఁ బడయఁ గోరుదురు. అట్లు ద్వితీయ తృతీయులకును బ్రాప్తగ్రంథభాగం బప్రాప్తతదవశిష్టప్రాప్తియం దపేక్షను ఘటింపక తప్పదు. ఇదియ గదా భగవద్భక్తిమహిమంబు! ఇసుమంత చవిచూతు రేని మూర్ఖులైనను విడువ నొల్లరు. ఇట్టి మావిశ్వాసమునకు హేతువు లగుటచే వీరు మువ్వురును గ్రంథసమాప్తికే సాధనభూతు లగుచున్నారు. ఇఁక నధిక్షేపము సేయువారు గూడఁ బ్రతిజ్ఞాపాలనంబునందు మా కత్యంతజాగరూకత గల్గించెదరు, కావున వారును నేతత్కార్యపరిసమాప్తికే ప్రకారాంతరంబునఁ గారణం బగుచున్నారు. ఇట్లు వీ రందఱు నొకానొకవిధంబున భగవదనుగ్రహభాజనభూతు లగుటంజేసి యిట్టి వారి వలన నస్మత్కార్యంబున కుపకారంబె పరిణమింప వలయు నని సుదృఢమ్ముగ నమ్ముచున్నారము.

ఇఁకఁ బరిసమాప్తియో సర్వకార్యసాధారణకారణం బగుభగవంతుని కాయత్తంబు గదా! భగవంతుఁడో నిజభక్తు లగుచందాదారులయం దున్నవాఁడు. కావున నేతద్గ్రంథనిర్విఘ్నపరిసమాప్తి చందాదారులకే యధీనంబై యున్నది. చందాదారులు శ్రద్ధతో బద్ధసంకల్పులై వర్ధమానసంఖ్యులై తోడ్పాటుగావింతు రేని యిది పరిపూర్తి నొందు ననుట కేమి సందియము? ఇప్పుడు గీతాశాస్త్రము నందు అత్యంతగహనభాగము ద్వితీయాధ్యాయ మేమో ముగిసినది గదా! ఇఁక నున్నవి చిన్నయధ్యాయములు. అంత గహనములునుం గావు. కావునఁ జందాదారులు మాత్రము సత్యప్రతిజ్ఞులై సహాయపడుచుండినయెడఁ దప్పక శీఘ్రముగాఁ బరిపూర్తి నొందఁ గలదు.

ఇందుఁ బ్రథమాధ్యాయం బర్జునవిషాదము ప్రతిపాదించుటంజేసి యర్జునవిషాదయోగం బనఁబడుచున్నది. విషాదంబు సిద్ధించినం గాని తీవ్ర మయినముముక్షయు జిజ్ఞాసయు జనియింప నేరదు, కావున నది యోగనామంబు నొంది యనుబంధబోధకంబై శాస్త్రమునకుఁ బ్రథమవిషయతం బ్రాపించెను.

ద్వితీయాధ్యాయము సాంఖ్యయోగం బనం బరఁగును. సాంఖ్యయోగం బనఁగా జ్ఞాననిష్ఠ. అది సాధ్యం బగుటవలన, సాధనం బగు కర్మయోగనిష్ఠ నపే

క్షించుటం జేసి, కర్మయోగనిష్ఠాప్రతిపాదనపూర్వకంబుగా నీయధ్యాయంబునఁ బ్రతిపాదింపఁబడియె. కావున, సాధ్యసాధనరూపము లగు జ్ఞానకర్మనిష్ఠలు రెండును బ్రతిపాదించుటవలన శాస్త్రార్థం బంతయు నీయధ్యాయంబున నిరూపితం బగుచున్నది. అట్లు ఆనందగిరి, « ఉపాయోపేయభూతము నిష్ఠాద్వయం బధ్యాయముచే సిద్ధించుచున్నది » యని వచియించెను. మధుసూదనసరస్వతియు « ఈయధ్యాయము సర్వగీతార్థసూత్రణం బనఁబడును " అని వక్కాణించెను. ఏతదధ్యాయప్రతిపాదితాంశములనే వేఱు వేఱుగా నొక్కొకటి గ్రహించి యితరాధ్యాయములు వివరించుచున్నవి. ఈవిషయము ముందు తృతీయాధ్యాయవ్యాఖ్యారంభంబున మధుసూదనసరస్వతులు విస్తరించి నిరూపించెదరు.

ఏతత్ప్రథమద్వితీయాధ్యాయములు ఒక సంపుటము (వాల్యుము) గాఁ గట్టింప (బైండుచేయ) వలసినంతప్రమాణము గల వగుటంజేసి క్రేతృలోకసౌకర్యార్థము ప్రథమభాగముగాఁ గట్టింపఁబడియె. దీని క్రయము అయిదురూపాయలు మాత్రమే. ప్రాపణభృతి (పోస్టేజి) వేఱే యియ్యవలెను. నెలనెలసంచికలను బదిలపఱచుట కష్టమని తలంచువార లిట్టి సంపుటములుగాఁ గొనవచ్చును.

భగవద్భక్తు లందఱును దీనిం గొని శాస్త్రార్థవిచారభాగ్యముం బడయుదురుగాక. ఈభాగము గ్రహించినవారలకు నవశిష్టగ్రంథం బంతయు గ్రహింపనపేక్ష నొడముట సహజంబె గదా. అట్లు వారే యేతద్గ్రంథపరిపూర్తిం బ్రతీక్షించువార లగుటవలన వలసినట్లు తాము తోడ్పడియుఁ దమమిత్రులఁ దోడ్పడం జేసియు మీఁది గ్రంథము సర్వంబును సంపూర్తి నొందింతు రని ప్రార్థించుచున్నాను. భగవద్భక్తుల భక్తిమహిమంబు వలననే యిమ్మహాగ్రంథము సమాప్తి నొందవలయును, ఏతత్సర్వభారంబును భక్తులే వహియింప వలంతులు. కానఁ వారియందే న్యస్తసమస్తభరుండ నగుచున్నాను. భక్తులం బ్రార్థించుట వలననే భక్తపరతంత్రుం డగుభగవంతునిం బ్రార్థించినవాఁడ నగుదు నని విరమించెదను.

తేషాం సమ్మానా దియ మయతా మృద్ధిం కృతి ర్మ మోదారామ్
యేషాం దర్శనపథ మిద మేష్యతి భగవత్కృపాయోగాత్.

౧౯౧౧ సం.
డిసంబరు ౧ తేది.

ఇట్లు భాగవతవిధేయుఁడు,
చదలువాడ సుందరరామశాస్త్రులు.



# అకారాదిశ్లోకానుక్రమణిక.

## ప్రథమాధ్యాయము.



## ద్వితీయాధ్యాయము.

# సంకేతాక్షర వివరణము.

భా. శంకరభాష్యము.

ఆ. ఆనందగిరికృత శంకరభాష్య టీక.

హ. హానుమద్విరచిత పైశాచభాష్యము.

శం. శంకరానందీయ గీతా తాత్పర్యబోధిని.

మ. మధుసూదనసరస్వతీరచిత గూఢార్థదీపిక.

శ్రీ. శ్రీధరస్వామిప్రణీత సుబోధిని.

ప. పరమార్థప్రప, దైవజ్ఞసూర్యపండిత ప్రణీతము.

రా. రామానుజభాష్యము.

మా. మాధ్వభాష్యము.

శ్రీ

శ్రీగణేశ శారదా గురుభ్యో నమః.

శ్రీమద్భగవద్గీతాంధ్రవ్యాఖ్యాన

# పరమార్థచంద్రికా మంగళాచరణము.

శ్లోకః. మాతు స్తన్యం ప్రపిబన్ లోలతయా కుమ్భయో స్తదాదిత్సుః
కలయన్ కరం ప్రమోదితజనక స్సోఽవ్యా ద్గజాస్యో నః. ౧

శ్రీవాణీశివవల్లభాభి రభితోఽనక్ష్యాభి రాసేవితా
బ్రహ్మామ్భోజవిలోచనత్రినయనై స్సక్ష్యావిహీనై ర్నుతా
పఞ్చప్రేతమహాసనే మణిమయే సర్వోత్తమే సంస్థితా
లీలాం వాఙ్మనసాతిగాం విదధతీ త్రైలోక్యమాతాఽవతాత్. ౨

మాయాచ త్రిగుణీ త్రిమూర్తిరపి సంభూత్యాతిభక్త్యాప్తయే
కామానాం పరిపూరణేనచ జనోపాస్య స్తదీయోద్ధృతౌ
వ్యాస క్తః కరుణాదిమఙ్గళగుణామ్భోరాశి రీశోఽవ్యయః
సర్వాదిత్యశరీరభృ త్స భగవా న్స్వశ్శ్రియసా యాస్తు నః. ౩

సచ్చిదానన్ద మజడ మపరిచ్ఛేద్య మద్వయమ్
అవికార మనాకారం బ్రహ్మైక్యేన సమాశ్రయే. ౪

శ్రీసచ్చిదానన్దశివాభినవ్యనృసింహభారత్యమలాఙ్ఘ్రిపద్మే
సమర్పితేయం ప్రణతి స్సదా మే విశుద్ధవిద్యాధియ మాతనోతు. ౫

రఘూద్వహకృపాపాత్ర మస్మదీయకులోద్వహమ్
సహస్రనామనామానం సహస్రత్విట్ప్రభం భజే. ౬

సర్వవేదాన్తతత్త్వజ్ఞం శిష్యాళీసంశయచ్ఛిదమ్
సీతామ్బికామనోనాథం శ్రీరామం పితరం శ్రయే. ౭

శ్లో॥ కౌశికగోత్ర స్సున్దరరామో దశబిన్దుపఞ్చనక్షత్రే ఉబ్దే
తిష్యే ఖవాటకులజ స్సౌమ్యే మార్గశిరపూర్ణిమాసుదినే. ౮

పరదేవతాం గురువరాన్ హృదయే కృత్వా తదీయకరుణాతః
పరమార్థచన్ద్రికాఖ్యం గీతాశాస్త్రార్థవివరణం కుర్వే. ౯

శ్రీభాష్యకారప్రముఖై రుక్తమే వార్థభావయా
వివృణోమి తత స్సన్త ఆద్రియన్తాం వచో మమ. ౧౦



శా. శ్రీమాతృస్తనకుంభదుగ్ధముల వాసిం గ్రోలుచో లోలుఁడై
యామాద్రి న్నిజకుంభయుగ్మమున దుగ్ధాదానసజ్జత్కగుం
డై మారారిమదిన్ ముదం బొసఁగునాహాస్తీంద్రవక్త్రుం గృపా
ధాముఁ విఘ్నమహాంధకారమిహిరున్ ధ్యానింతు భద్రాప్తికిన్. ౧

శా. శ్రీవాణీశివవల్లభామరపురంధ్రీరత్నసందోహముల్
సేవింప స్సహసంఖ్య లబ్జభవనాళీకేతుణత్రీక్షణుల్
కైవారంబులు సేయఁ బంచశివలీలామంచపీఠి న్వచో
భావాతీతవిలాస మొప్పెసఁగునంబ న్గొల్తు నేకాగ్రతన్. ౨

చం. పొలుపుగ మాయిరై త్రిగుణభూషితుఁడై భువనావనక్రియా
కలనత మూఁడుమూర్తు లయి కామితసంఘము దీర్చుచు న్జనుల్
గొలువఁగనై తదుద్ధరణలోలత సర్వసురాత్ముఁ డౌకృపా
జలనిధి నీశ్వరున్ హృదయసారసమందుఁ దలంతు నెప్పుడున్. 3

చం. సకలవికల్పవర్జిత మసంగ మదేహ మదేశకాలవ
స్తుకృతవిభాగ మప్రకృతిదోష మనంత మవిక్రియం బశే
షకృతివిలక్షణం బఖిలసాక్షి యభేద మఖండచిత్సుఖా
త్మక మగుబ్రహ్మతత్త్వము సతంబు తదేకత నాశ్రయించెదన్. ౪

కం. భగవత్పాదాకారున్, జగతీదేశికు శివాభినవనరసింహా
ఖ్యుఁ గృపాబ్ధి సచ్చిదానం, దగురున్ భజియింతు నెమ్మనంబున భక్తిన్.

కం. మహనీయుని మత్కులధూ, ర్వహునిన్ శ్రీరామచరణపాథోజకృపా
మహిమాగతపురుషార్థుని, సహస్రనామున్ దలంతు స్వాంతమునందున్.

గీ. నిఖిలవేదాంతపరమార్థనిష్ఠితాత్ము
శిష్యహృత్తాపవిచ్ఛేదశీతకిరణు
నాదుజనకు సీతాంబికానాథు విబుధ
వంద్యు శ్రీరాము ప్రెుక్కెదు భావమందు. ౭

గీ. కౌశికమహర్షిగోత్రవిఖ్యాతచదలు
వాడకులుఁడ సుందరరామపండితుండఁ
గలియుగావతారఖబాణకలితసౌమ్య
మార్గశిరమాసవరపూర్ణిమాదినమున. ౮

కం. పరదేవత గురువరులన్, స్మరియించి తదీయకరుణసాహాయ్యమునన్
పరమార్థచంద్రికాఖ్య మొ, నరింతు గీతార్థవివరణం బాంధ్రమునన్. ౯

గీ. భాష్యకారులు మున్నగువారిభాష
ణములు తెనుఁగున మార్చెద నాదుకల్ప
నంబు లేదిందుఁ దద్గౌరవంబుఁ బట్టి
కొనుఁడు జిజ్ఞాసువులు దీని ఘనత మీఱ. ౧౦



శ్రీ ర స్తు.

శ్రీ వాసుదేవపరబ్రహ్మణే నమః.

# శ్రీ శాంకర భాష్యోపక్రమణిక.

నారాయణః పరో ఽవ్యక్తా దణ్డ మవ్యక్తసమ్భవమ్
అణ్డ స్యాన్త స్త్విమే లోకా స్సప్తద్వీపాచ మేదినీ.

---

## ఆనందగిరి టీక.

మంగళశ్లోకార్థము.—గణేశా! ఉత్తమపురుషార్థమయిన మోక్షము నొసంగునదియు దయయనెడు నమృతము వర్షించునదియు విఘ్నము లనెడు విషసమూహము నివారించునదియు నగు కటాక్షమును నాయందుఁ బరఁగింపుము. సమస్త జగత్కార్యాదాకారణంబును సాధ్యసాధనరూపంబున మోక్షరూపపరమపురుషార్థ జనకము నగు నిష్ఠ యను నమృతము నెవ్వనిముఖారవిందమునుండి వెడలెనో అట్టి వాసుదేవు నెల్లప్పుడు నమస్కరించుచున్నాను. ప్రత్యగాత్మ యగు నచ్యుతుని ఉత్తము లగు గురువులను నమస్కరించి శిష్యశిక్షకొఱకు గీతాభాష్యవివరణము చేయఁబడుచున్నది.

* ఉపాయమయిన కర్మనిష్ఠయు ఉపేయమయిన జ్ఞాననిష్ఠయు అను రెండునిష్ఠలను బ్రతిపాదించుటకై ప్రవర్తించిన గీతాశాస్త్రమును వ్యాఖ్యానము చేయఁ దలంచినవారై భగవంతు లగు భాష్యకారులు విఘ్నోపద్రవోపశాంతి మొదలగు ప్రయోజనములఁ గలిగించునట్టి యిష్టదేవతా తత్త్వానుస్మరణరూపమయిన మంగళాచరణముకొఱకు ఈ పౌరాణికశ్లోకము నుదాహరించుచున్నారు. ప్రామాణికు లగుపూర్వాచార్య లనుష్ఠించుటవలన గ్రంథాదియందు మంగళాచరణ మవశ్య మనుష్ఠింపవలయును. ఈ పౌరాణికశ్లోకము నుదాహరించుటచే, అట్టి మంగళాచరణంబును సిద్ధించుటయే కాక తాము వ్యాఖ్యానముచేయు నీ గీతాశాస్త్రమును ఇతి

---

* ఉపాయ మనఁగా—సాధనము, ఉపేయ మనఁగా—సాధ్యము.

హేతుప్రమాణములును ఏకాభిప్రాయము లని యాచార్యుల స్వాభిప్రాయము దెలుపఁబడుచున్నది. దీని యర్థము.—

నారాయణః = నారాయణుఁడు; అవ్యక్తాత్ = మాయకన్నను; పరః = అతిరిక్తుఁడు, మాయాసంబంధము లేనివాఁ డనుట. అణ్డమ్ = బ్రహ్మాండము, అపంచీకృత పంచభూతాత్మకమయిన హిరణ్యగర్భతత్త్వ మనుట; అవ్యక్తసమ్భవమ్ = మాయవలనఁ బుట్టినది. అణ్డస్య = హిరణ్యగర్భాండముయొక్క; అన్తస్తు = లోపలనో; ఇమే = ఈ; లోకాః = లోకములును; సప్తద్వీపా = ఏడుద్వీపములుగల; మేదినీచ = భూమియును; సన్తి = ఉన్నవి.

“ ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపోవై నరసూనవః, అయనం తస్య తాః పూర్వం తేన నారాయణః స్మృతః ”—జలములు నారము లని చెప్పఁబడినవి, ఏల యనఁగా జలములు నరునివలన అనఁగా పరమాత్మవలనఁ బుట్టినవి, ఆ జలము లీయనకు ము న్నాశ్రయముగా నుండెను, అందువలన నారాయణుఁ డని చెప్పఁబడెను. అని నారాయణశబ్దమునకు స్మృతిసిద్ధ మయిన యర్థము. ఇది స్థూలదృష్టులకు మాత్రమే యుద్దేశింపఁబడినది. సూక్ష్మదృష్టులగు విద్వాంసులు “ నరశబ్దముచేఁ జరాచరస్వరూప మయిన శరీరసమూహము చెప్పఁబడుచున్నది, ఆశరీరములందు నిత్యసన్నిహితు లయిన చిదాభాసులు జీవులు నారు లని చెప్పఁబడుచున్నారు, ఆ జీవుల కితఁ డాశ్రయము నియామకుఁడు—అనఁగా నంతర్యామి ” యని నారాయణశబ్దార్థము వచియింతురు. ఈ యంతర్యామి నధికరించియే యంతర్యామిబ్రాహ్మణము నారాయణం బను పేరు గల మంత్రామ్నాయమును బ్రవర్తించుచున్నవి. అందువలన నీ నారాయణశబ్దముచే శాస్త్రప్రతిపాద్యమయిన విశిష్టతత్త్వము చెప్పఁబడినది. అయ్యా! పరమాత్మకు మాయాసంబంధమువలననే అంతర్యామిత్వము శాస్త్రప్రతిపాద్యత్వము చెప్పవలెను. కూటస్థుఁ డసంగుఁ డవిషయ మద్వితీయుఁ డగువాని కంతర్యామిత్వశాస్త్రప్రతిపాద్యత్వములు సంభవింపవు. అందువలన శుద్ధత్వము సిద్ధింపని యప్పుడు శాస్త్రాదియం దెట్లు నారాయణ స్మరణము చేయఁబడుచున్నది? శుద్ధతత్త్వమును గదా స్మరింపవలెను. తత్స్మరణమే గదా యభీష్టఫలప్రద మగుటవలన నభీష్ట మగును. అని యాశంకించి సమాధానము చెప్పుచున్నారు.—అవ్యక్తాత్ = మాయకన్నను, అవ్యక్తము అవ్యాకృతము అని మాయకుఁ బర్యాయపదములు. పరః = అతిరిక్తుఁడు, తత్సంబంధము లేనివాఁ డనుట, వాస్తవముగా మాయాసంబంధము లేకున్నను గల్పనచేఁ దత్సం

బంధము నంగీకరించి యితని కంతర్యామిత్వాది వ్యవహార మని గ్రహింపవలెను. అట్లు శుద్ధ మగుటం జేసి నారాయణస్మరణ ముచితమే యగును. అవ్యక్తసంబంధము లేనివాఁ డీశ్వరుఁ డని వివక్షిత మగుటవలన నాయవ్యక్తము సాక్షిసిద్ధ మగుచున్నది. అవ్యక్తము లేనియెడ దానితో సంబంధము లేనివాఁ డీశ్వరుఁ డని చెప్పుట ప్రసక్తింపదు గదా! అయినను అవ్యక్తముయొక్క కార్య ముండుటవలనఁ దత్కార్యరూపహేతువుచే ననుమానప్రమాణముగూడఁ గల దని యీ యనుమానము చెప్పుచున్నారు. అణ్డమ్ = అపఞ్చీకృతపంచమహాభూతాత్మక మయిన హిరణ్యగర్భతత్త్వము అండ మని చెప్పఁబడును, అది; అవ్యక్తసమ్భవమ్ = అవ్యక్తమువలనఁ బుట్టినది. శ్రుతిస్మృతులందు మూలకారణమువలన హిరణ్యగర్భోత్పత్తి ప్రసిద్ధ మగుటం జేసి హిరణ్యగర్భతత్త్వరూపకార్యము అను హేతువువలనఁ దత్కారణ మయిన మూలకారణ మగు నవ్యక్తము సిద్ధించుచున్నది యని భావము. హిరణ్యగర్భతత్త్వము శ్రుతిస్మృతి ప్రసిద్ధ మయినను తత్సిద్ధికిఁగూడఁ గార్యహేతుకమయిన యనుమానము గల దని విరాడుత్పత్తిచే దాని నిరూపించుచున్నారు.—అణ్డస్య = మున్ను చెప్పఁబడిన హిరణ్యగర్భుఁ డను పేరుగల యండముయొక్క; అన్తః = లోపల; ఇమే = ఈ; లోకాః = భూరాదిలోకములు, విరాట్టు అని పేరు గలవి; వర్తన్తే = ఉన్నవి. కార్య మైనం గదా కారణము లోపల నుండును, కావున హిరణ్యగర్భతత్త్వము లోపలనుండు విరాడాత్మకము లయిన భూరాదిలోకములు ఆహిరణ్యగర్భునిచే సృజింపఁబడినవి. అట్లు కార్యమైన విరాడాత్మకభూరాదిలోకములు అను హేతువువలనఁ దత్కారణహిరణ్యగర్భసిద్ధి యవుచున్న దని భావము. ఆభూరాదిలోకములు పంచీకృతపంచభూతాత్మకవిరాడ్రూపము లని తెలుపుచున్నారు.—సప్తద్వీపా = ఏడుద్వీపములుగల; మేదినీచ = భూమియు, అండములోపల నున్నది. “సా పృథి వ్యభవత్” అను శ్రుతియందు విరాట్టుజన్మము చెప్పఁబడినది యని యంగీకరించుటవలన సమస్తద్వీపములతోఁ గూడిన భూమియనుటచేఁ బంచీకృతపంచభూతాత్మకసర్వలోకరూపుఁ డగు విరాట్టే చెప్పఁబడును. భూమియు అనుచోటి సముచ్చయముచేత విరాట్టునకు పూర్వోక్తాండరూపుఁ డగు హిరణ్యగర్భునం దంతర్భావమును ఆ హిరణ్యగర్భునివలన జన్మమును సూచింపఁబడుచున్నవి. అట్లు విరాడ్రూపకార్యము అను హేతువువలన హిరణ్యగర్భసిద్ధి యని భావము. పరమాత్మ స్వాజ్ఞానద్వారమున సమస్తప్రపంచమును బుట్టించి తనయందే యిముడ్చికొని తానఖండైకరససచ్చిదానందరూపంబున స్వమహిమయందుఁ బ్రతిష్ఠితుఁడై యున్నాఁ

డని శ్లోకార్థము. ఇట నారాయణశబ్దముచే విషయము చెప్పఁబడుచున్నది. ఎట్లనఁగా, నారులు= జీవులు త్వంపదవాచ్యులు, వారలకు; అయనమ్ = అధిష్ఠానము తత్పదవాచ్య మయిన పరబ్రహ్మము. అట్లు కల్పితమునకు అధిష్ఠానముకంటె అతిరిక్త మయిన స్వరూపము లేమింజేసి వాచ్యము కల్పిత మయినను లక్ష్యము బ్రహ్మమాత్రమె యగుటవలన బ్రహ్మాత్మైక్యము విషయము సూచిత మగుచున్నది. అందుచే విషయవిషయిభావ మను సంబంధముగూడ సూచింపఁబడుచున్నది. అవ్యక్తాత్పరః= మాయకంటె అతిరిక్తుఁడు అనుటచే మాయాసంబంధములేమి చెప్పఁబడుటంజేసి సర్వానర్థనివృత్తిపూర్వకపరమానం దావిర్భావము అనుమోక్షము చెప్పఁబడును. అందుచే మోక్షము గోరినవాఁ డధికారి యని సూచిత మయ్యెను. ఇఁక శేషించిన అన్నస్తు అనుచోటి తు శబ్దముచే వస్తువునకుఁ బారమార్థిక మగు నద్వితీయత్వము తెలుపఁబడినది. అందుచే శాస్త్రమునకు వస్తుద్వారమునఁ దజ్జ్ఞాననిష్ఠ ముఖ్యవిషయ మనియు ఆజ్ఞాననిష్ఠకు నుపాయభూత మయిన కర్మనిష్ఠ యవాంతరవిషయ మనియు సూచింపఁబడినది.

అయ్యా! భగవంతుండు భూమిభారముఁ బాపుటకొఱకు బ్రహ్మదేవునిచేఁ బ్రార్థితుండై వసుదేవునిచే దేవకియం దావిర్భవించినవాఁడు కాఁబట్టి భూభారపరిహారముకొఱకే ప్రసిద్ధబలపరాక్రముఁ డగు నర్జునునిఁ బ్రేరించుటకై రెండు ధర్మముల నిం దనువదించె నని చెప్పవలెను. అనువాదమాత్ర మగుటంజేసి ధర్మోపదేశము భగవంతునికి ముఖ్యాభిప్రాయము కాఁ జాలదు. యుద్ధప్రేరణమే భగవంతుని ముఖ్యోద్దేశ్యము. అందువలన సాధ్యసాధనరూపము లయిన జ్ఞానకర్మనిష్ఠ లిందు భగవంతునిచేఁ బ్రతిపాదింపఁబడినవి కావు. దానంజేసి యా జ్ఞానకర్మనిష్ఠ లీ గీతాశాస్త్రమునకు ముఖ్యావాంతరవిషయము లనుట చెల్లదు? ఈ యాక్షేపమునకు సమాధానము.—అది సరికాదు. భగవంతునికి ధర్మసంస్థాపనమే స్వభావము. అట్లు ధర్మస్థాపనముకొఱకే తా నావిర్భవించినట్లు భగవంతుఁడు తానే "యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్" అని వచించెను. కాఁబట్టి భూభారపరిహారము ధర్మస్థాపనార్థ మగును గాని ముఖ్యోద్దేశ్యము కాదు. ధర్మస్థాపనమే ముఖ్యోద్దేశ్య మగును. అట్లు అధికారి యగు నర్జునుని నిమిత్తముగాఁ జేసికొని యతని స్వధర్మమునందుఁ బ్రవర్తింపఁజేయుటచేఁ గర్మనిష్ఠానిష్ఠునిఁ గావించి తద్ద్వారమున జ్ఞాననిష్ఠయందు దించుటకై భగవంతునిచే గీతాశాస్త్రము ప్రణీత మగుటవలన దీనికి నిష్ఠాద్వయము విషయ మనుట యుచితమే

యగును. అని «ఆభగవంతుఁడు» అనుట మొదలుగా «ధర్మద్వయ మర్జునున కుపదేశించెను» అనువఱకుఁ గల భాష్యముచేఁ దెలుపుచున్నారు.

భా. ఆ భగవంతుఁ డీజగమును సృజియించి దానికి స్థితిఁ గల్పింపఁ గోరిన వాఁడై మొదట మరీచిప్రభృతు లగు ప్రజాపతులను బుట్టించి వేదోక్త మగు ప్రవృత్తిలక్షణధర్మమును నేర్పెను. అంత నితరులను సనకసనందనాదులం బుట్టించి జ్ఞానవైరాగ్యలక్షణం బగు నివృత్తిధర్మంబు నేర్పెను.

ఆ. అందు «ఆప్తునిచే * రచియింపఁబడిన దను నిశ్చయము లేమిం జేసి బౌద్ధాదిశాస్త్రములవలె నీ గీతాశాస్త్రంబు వ్యాఖ్యానార్హము గాదు» అని యాశంకించి మంగళాచరణోద్దేశ్యముఁ దెలుపుచు మొదట శాస్త్రప్రణేత యాప్తుఁ డని నిర్ధారించుకొఱకు సర్వజ్ఞత్వాదిప్రతిజ్ఞాపూర్వకముగా సర్వజగత్తులకును స్రష్ట యనుటను జెప్పుచున్నారు. «ఆభగవంతుఁ డీ జగమును సృజియించి» యని. ఆ నారాయణాఖ్యుం డగు దేవుఁడు సర్వజ్ఞుండు సర్వేశ్వరుండు ప్రపంచము సమస్తమునుం బుట్టించియున్నవాఁడు. అట్టి యీశ్వరు ననుగ్రహము వొందినవార లే యాప్తు లని ప్రసిద్ధ మగుటచే నా యీశ్వరుండు పరమాప్తుఁ డనుట సిద్ధ మగును. కావున నాతని కనాప్తత్వములే దని యర్థము. అయ్యా! భగవంతునిచే సృజియింపఁబడినను హిరణ్యగర్భాదిలక్షణ మయిన జగత్తు చాతుర్వర్ణ్యాదులతోఁ గూడిన దగుటవలన వ్యవస్థ చేయువాఁడు లేనియెడ వ్యవస్థ నొందఁ జాలదు. పరమేశ్వరుఁడే వ్యవస్థచేయు నన్నయెడ నతనికి వైషమ్యాదులు ప్రసక్తించును? అందుకుఁ జెప్పుచున్నారు. «దానికి» అని. సృజింపఁబడిన జగత్తునకు మర్యాద లేమి ప్రసక్తింపఁగా దానికి వ్యవస్థ చేయఁ గోరినవాఁడై వ్యవస్థాపకము నాలోచించి రాజునకును రాజైనది § అని ప్రసిద్ధమయిన ధర్మము వ్యవస్థాపక మగు నని నిశ్చయించి యాధర్మమును సృజియించె నని యర్థము. ఇఁక నాధర్మము సాధ్యస్వభావ మగుటవలన సాధకుఁడు లేనిచో సంభవింపదు. పరమేశ్వరుఁడే సాధకుఁ డగు ననుట యుచితము గాదు. ధర్మజ్ఞులుగాని జీవులును దాని ననుష్ఠింపఁ జాలుదు రనుటయు ననుపపన్నము. కావున ధర్మము సృజించుట వ్యర్థ మని యా శంకించి చెప్పుచున్నారు «మరీచిప్రభృతులను» అని. భగవంతునిచే సృజింపఁ

* ఆప్తుఁ డనఁగా–యథార్థవక్త, ప్రామాణికుఁడు.

§ అనఁగా–జనులకు నియామకుఁ డగు రాజునకుఁగూడ నియామకము.

బడిన యామరీచి మొదలగువారు భగవన్నియోగంబునఁ బ్రజాసృష్టికర్తలు, యాగము దానము మొదలగువానిచే సాధ్య మయిన ధర్మము ననుష్ఠించుటకు నధికృతులు. కావున వారిచే ధర్మము ప్రవర్తింపఁ గల దని భావము. ఇట వేదోక్త మనుటచే బౌద్ధబోధిత చైత్యవందనాదులు ధర్మము కా దనుట తెలుపఁబడినది. అయ్యా! ఇంతమాత్రమున జగమున కంతయు వ్యవస్థచేయ శక్యము గాదు, ఏల యనఁగా, ఇందుచే ప్రవృత్తిమార్గము వ్యవస్థాపిత మయినను నివృత్తిమార్గము వ్యవస్థాపితము కాఁ జాలదు? ఇందుకుఁ జెప్పుచున్నారు—« అంత నితరులను" అని. శమదమాదిస్వరూప మగు నివృత్తిధర్మమునకు గమకము చెప్పుచున్నారు—« జ్ఞానవైరాగ్య లక్షణము" అని. వివేకము వైరాగ్యము అతిశయించుటచే శమాద్యతిశయము అధిగత మగును, కావున వివేకాదికము దానికి గమక మని యర్థము.

భా. ఆ వేదోక్త మగు ధర్మము, ప్రవృత్తిలక్షణము నివృత్తిలక్షణము అని రెండువిధములు. జగత్తునకు స్థితికారణంబు ప్రాణులకు సాక్షాదభ్యుదయనిశ్శ్రేయసహేతు వగు నా ధర్మము శ్రేయస్సు గోరు నట్టి బ్రాహ్మణాదులగు వర్ణులచేతను ఆశ్రములచేతను అనుష్ఠింపఁబడుచుండెను, పెద్ద కాలంబుగా, అనుష్ఠాతలకుఁ గామోదయంబుచే వివేకవిజ్ఞానంబులు క్షయించుట కారణంబుగా నధర్మముచే ధర్మం బభిభూయమానం బగుటయు నధర్మంబు వర్ధిల్లుచుండుటయు నాయాదికర్త నారాయణాఖ్యుఁడగు విష్ణువు ప్రపంచస్థితిని బరిపాలింపఁ గోరినవాఁడై భౌమబ్రహ్మ మగు బ్రాహ్మణత్వము రక్షించుటకై దేవకియందు వసుదేవునివలన నంశముచేఁ గృష్ణుం డనుపేర నవతరించెను గదా! వర్ణాశ్రమభేదములు బ్రాహ్మణాధీనము లగుటచే బ్రాహ్మణత్వము రక్షించినం గదా! వైదిక ధర్మము రక్షిత మగును.

ఆ. ధర్మమువిషయమై విద్వాంసులకు వివాదము కనఁబడుటవలన జగత్ స్థితికిఁ గారణ మయిన మఱియొక ధర్మముగూడ సృజింపవలసినది కల దని యాశంకించి చెప్పుచున్నారు—రెండువిధము లని. అతిప్రసంగము నప్రసంగమును * దొలఁగించుటకై ప్రకృత మగు ధర్మమునకు లక్షణము చెప్పుచున్నారు—ప్రాణుల కని.

* అతిప్రసంగ మనఁగా—అలక్ష్యమునందు లక్ష్యబుద్ధి, ఇట నధర్మమునందు ధర్మబుద్ధి; అప్రసంగ మనఁగా—లక్ష్యమునం దలక్ష్యబుద్ధి, ఇట ధర్మమునం దధర్మబుద్ధి.

సాక్షాదభ్యుదయ నిశ్శ్రేయసహేతువు = ప్రవృత్తిలక్షణ మగు ధర్మము అభ్యుదయము * గోరువారలకు సాక్షా దభ్యుదయహేతువు, నిశ్శ్రేయసము § గోరువారలకుఁ బరంపరగా నిశ్శ్రేయసహేతువు, నివృత్తిలక్షణధర్మమో సాక్షాన్నిశ్శ్రేయసహేతు వని విభాగము. నిశ్శ్రేయసమునకు జ్ఞానముమాత్రమే హేతువైనను శమాదులు ‖ జ్ఞానద్వారమున హేతు వగును. జ్ఞానముకంటె వేఱువ్యవధానము లేమింజేసి సాక్షాన్నిశ్శ్రేయసహేతు వని చెప్పఁబడినది. ధర్మమున కిట్లు లక్షణము చెప్పవలమున వర్ణాశ్రమ నియమము లేక పురుషార్థముఁ గోరువా రందఱు రెండుధర్మములను యథావిధి ననుష్ఠింప నర్హు లగుదురు, అందుచే అనుష్ఠాతలకు నియమము లేకపోవు నని యాశంకించి చెప్పుచున్నారు—బ్రాహ్మణాదులగు వర్ణులచేతను ఆశ్రములచేతను అని. పురుషార్థాపేక్షసాధారణ మయినను శ్రుతిస్మృతులఁ బర్యాలోచించి యనుష్ఠించుటవలన నియమము సిద్ధించు నని యర్థము. నిత్యనైమిత్తికకర్మములు యావజ్జీవ మనుష్ఠింపవలయును, కామ్యముల యనుష్ఠానమునందుఁ బ్రవృత్తి రాగాధీనము, అనుష్ఠానప్రకారమును మాత్రమే శాస్త్రము విధించు నని విభాగ మున్నను అనుష్ఠానము ఒకానొకప్పుడే సంభవించు నను నభిప్రాయముచేఁ జెప్పుచున్నారు—పెద్దకాలముగా ♦ నని. ఇఁక నిప్పుడు చెప్పఁబడిన ధర్మమువలననె జగత్తునకు స్థితి సిద్ధించుటంజేసి భగవంతుం డాదికర్త యగు నారాయణుండు బహుదుఃఖదూషితం బగు శరీరముఁ బరిగ్రహించుటకు నిమిత్తము లేదు. కావున నితఁడే యొకానొకం డనాప్తుండు వైషమ్యనైర్ఘృణ్యములు గలవాఁడు శరీరముఁ బరిగ్రహించి యీ గీతాశాస్త్రము రచియించి యుండవచ్చును. ఎట్లిది యాప్తప్రణీత మగును? ఇందుకుఁ జెప్పుచున్నారు—అనుష్ఠాతల కని. లేక యీ యాశంకకు "పెద్దకాలముగా" అనునది యారంభించియే యుత్తరము గావచ్చును. పెద్దకాలము కాఁగా ననఁగా కృతత్రేతాయుగములు గడచి ద్వాపరాంతము వచ్చినపుడు అనుష్ఠాతలకుఁ గామక్రోధాదుల వలనఁ గలిగిన యవివేకంబున బహుళం బగు నధర్మంబుచే ధర్మంబు తగ్గి యధర్మంబు వర్ధిల్లుటవలన జగన్మర్యాద తప్పుటయు స్వాకృత మయిన యామర్యాదను బాలింపఁ గోరినవాఁడై భగవంతుం డగు నారాయణుండు తన్నిమిత్తమయి చాతుర్వర్ణ్యాదుల

* స్వర్గము.

§ మోక్షము.

‖ శమాదులు = నివృత్తిలక్షణ ధర్మము.

♦ ఈ పక్షమున పెద్దకాలంబుగా అనుటకు అనుష్ఠింపఁబడుచుండెను అను దానితో వెనుక కన్వయము. పెద్దకాలంబుగా ననుష్ఠింపఁబడుచుండె నని యర్థము.

రక్షించుటకొఱకు మాయాశక్తి ప్రయుక్త మగు లీలామయం బయిన స్వేచ్ఛాశరీరము గ్రహించె నని యర్థము. "భౌమస్య బ్రహ్మణో గుప్త్యై వసుదేవా దజీజనత్" * అను స్మృతి ననుసరించి భౌమబ్రహ్మశబ్దము లనువదించి దాని వ్యాఖ్యానము § చేయుచున్నారు—భౌమబ్రహ్మ మని. అంశముచే ననఁగా స్వేచ్ఛానిర్మిత మయిన మాయామయం బగు స్వరూపముచే నని యర్థము. కదా అనుటచేఁ బౌరాణిక ప్రసిద్ధి యనువదింపఁబడుచున్నది—ఇది భగవదవతారము కాక మఱియొకని జన్మ మనుట యుక్తము కాదు, అట్లు చెప్పినచో బహువిధప్రమాణములు విరోధించు నని భావము. అయ్యా! యదా యదాహి ధర్మ స్యేత్యాదివచనములవలన వైదిక ధర్మసంరక్షణార్థము భగవంతుని జన్మము, ఇది యేమి బ్రాహ్మణత్వము రక్షించుట కని చెప్పఁబడినది? ఇందుకుఁ జెప్పుచున్నారు—బ్రాహ్మణత్వము రక్షించినం గదా యని. అట్లయినను వర్ణాశ్రమభేదవ్యవస్థ చేయక ధర్మ మెట్లు రక్షిత మగును? అని యాశంకించి చెప్పుచున్నారు—వర్ణాశ్రమభేదము లని. బ్రాహ్మణునేగదా పురోహితునిఁగాఁ జేసికొని క్షత్రియాదులు ప్రతిష్ఠను బొందుదురు. యాజనాధ్యాపనములు బ్రాహ్మణధర్మములు, యాజనాధ్యాపనద్వారమున వర్ణాశ్రమభేదములు వ్యవస్థాపితము లగును, కావున బ్రాహ్మణ్యము రక్షిత మయినచో సమస్తమును సురక్షిత మగు నని యర్థము.

భా. ఆ భగవంతుండు జ్ఞానైశ్వర్యశక్తి బలవీర్యతేజంబు లెల్లప్పుడును గలవాఁడు, త్రిగుణాత్మిక వైష్ణవి యగు తనమాయను మూలప్రకృతి యనఁబడు దాని వశీకరించి తాను జన్మము లేనివాఁడును నాశము లేనివాఁడును భూతముల కీశ్వరుండును నిత్యశుద్ధబుద్ధస్వభావుండు నైనను దన మాయచే దేహముగలవాఁడుంబోలె జన్మము నొందినవాఁడుంబోలె లోకానుగ్రహము సేయుచుఁ జూడఁబడుచున్నాఁడు. స్వప్రయోజనము లేకున్నను భూతానుగ్రహేచ్ఛచే వేదోక్త మగు ధర్మద్వయమును శోకమోహమహాసముద్రమునందు నిమగ్నుఁడగు నర్జునున కుపదేశించెను. గుణాధికు లగువారు గ్రహించి యనుష్ఠించినం గదా ధర్మం బభివృద్ధి నొందఁ గల దని. ఆధర్మముమ భగవంతునిచే నె ట్లుపదేశింపఁబడె నట్లు సర్వజ్ఞుండు భగవంతుం డగు వేదవ్యాసుఁడు గీత లను పేరుగల యేడు వందల శ్లోకములుగా గ్రథితము గావించెను.

* భౌమబ్రహ్మమును రక్షించుటకొఱకు వసుదేవునివలనం బుట్టెను.

§ భౌమబ్రహ్మ మనఁగా—భూమియందలి బ్రహ్మము, దానికి బ్రాహ్మణత్వ మని యర్థము.

ఆ. ఇట్లయినను భగవంతుఁ డగు నారాయణునకు శరీరాదులు గల వన్న యెడ నస్మదాదులకు నతనికిని విశేషము లేమిం జేసి యీశ్వరుఁడు కాఁ డనుట ప్రసక్తించు నని యాశంకించి జ్ఞానాదికృత మయిన విశేషము గల దని చెప్పుచున్నారు—ఆ భగవంతుం డని. జ్ఞానము= తెలివి, పదార్థములను విశేషాకారముగాఁ దెలియుట, ఐశ్వర్యము = ఈశ్వరత్వము, స్వతంత్రత. శక్తి = అపదార్థముల నెఱవేర్చు సామర్థ్యము. బలము = సహాయసంపత్తి. వీర్యము = పరాక్రమము * గలవాఁడగుట, తేజస్సు = ప్రగల్భత, ఎదిరింపనలవిగామి. ఈ యాఱుగుణములు సర్వవిషయము లెల్లప్పుడు భగవంతునియందు వర్తించుచున్నవి, కావున నతనికి శరీరాదు లున్నను అస్మదాదులతో సామ్యము సంభవింప దని యర్థము. ఇఁక నిట్లయినను, అనాదినిధనుండు నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుండు నగు నీశ్వరునకు స్వభావవిరుద్ధ మయిన జన్మాదిక మెట్లు సంభవించును? భూతముల కీశ్వరుండును స్వతంత్రుఁడు నగువాఁడు తనకుఁ దానే యనర్థము గలిగించు కొనఁడు గదా! ఇతనికి దేహాదిపరిగ్రహంబున నేమియు ఫలంబునుం గానరాదు? ఇందుకుఁ జెప్పుచున్నారు—త్రిగుణాత్మిక...జూడఁబడుచున్నాఁ డని. సృజింపఁ దలంచిన దేహాదికమునందు వివిధరూపత సిద్ధించుటకొఱకు త్రిగుణాత్మిక యను విశేషణము. దానికి వ్యాపకత్వము చెప్పుటకు వైష్ణవి § యని చెప్పఁబడినది. తనది యనుటచే దానికి ఈశ్వరపరతంత్రత తెలుపఁబడుచున్నది. అది ప్రతిభానమాత్రశరీరమే కాని వాస్తవముకా దని చెప్పుచున్నారు—మాయ నని. అయ్యది నానావిధకార్యకారణరూపంబునఁ బరిణామి యని సూచించుచున్నారు—మూలప్రకృతి ‖ యని. ఈశ్వరుఁడు ప్రకృతివశుండు కాఁ డని చెప్పుచున్నారు—వశీకరించి యని. నిత్యత్వము = కార్యాకారము లేకుండుట, శుద్ధత్వము = కారణము కాకుండుట, బుద్ధత్వము = జడము కాకుండుట. ముక్తత్వము = అవిద్యాకామకర్మపారతంత్ర్యరహితుఁ డగుట. ఈ నిత్యత్వాదులు సంసారావస్థయందు లేనివై మోక్షావస్థయందు సంభవించునవి యనుట యుక్తము గా దని చెప్పుచున్నారు స్వభావుం డని. శరీరగ్రహణమునందుఁ బ్రాధాన్యము మాయ కని తెలుపుటకై మరల తన మాయచే అని చెప్పఁబడినది. "సవా అయం పురుషో జాయమానశ్శరీర మభిసంపద్యమానః" అను శ్రుతి నాశ్రయించి చెప్పుచున్నారు—దేహము

---

* పరాక్రమ మనఁగా—ఇతరుల లోఁ గొనుట.

§ విష్ణువు = వ్యాపనశీలుఁడు, తత్సంబంధి వైష్ణవి.

‖ ప్రకృతి యనఁగా—కారణ మని యర్థము. కావున పరిణామి.

గలవాఁడని. ఇవార్థకములచే దేహాదికము వాస్తవము గామింజేసి కల్పితము లని తెలుపఁబడుచున్నది. లోకానుగ్రహము = ధర్మద్వయము నుపదేశించుద్వారమునఁ బ్రాణులను అభ్యుదయనిశ్శ్రేయసతత్పరులనుగాఁ జేయుట. ఈ యీశ్వరుండు పరమార్థమునఁ గూటస్థుఁడును స్వతంత్రుఁడును నిత్యత్వాదిలక్షణుండు ననియే తెలియ వచ్చుచున్నను, మాయాశక్తిచే దేహాదికము గ్రహించి లోకానుగ్రహము సేయుచుండుటచేఁ దత్స్వభావవిరోధము సంభవింప దని యర్థము. అయ్యా! "ప్రయోజన మనుద్దిశ్య న మన్దోపి ప్రవర్తతే" * అను న్యాయం బుండుటవలన నీశ్వరుండు పూర్ణకాముఁ డగుటచేఁ గృతకృత్యుం డగుటంజేసి యతనికిఁ బ్రయోజనము లేదు, అనుగ్రాహ్యు లగువారును అద్వైతవాదంబున నీశ్వరవ్యతిరిక్తులు సంభవింపరు, అందువలన ధర్మద్వయము నుపదేశించె ననుట యుచితము గాదు? ఇందుకుఁ జెప్పుచున్నారు—స్వప్రయోజనము...ఉపదేశించెను అని. కల్పితమయిన భేదమున నాశ్రయము లగు భూతములను గ్రహించి తదనుగ్రహేచ్ఛచేఁ బూర్ణకాముఁడైనను భగవంతుండు అర్జునుని నిమిత్తీకరించి చైత్యవందనాదివిలక్షణ మయిన ధర్మద్వయము నుపదేశించె నని యర్థము. అర్జునున కుపదేశాపేక్ష కల దని తెలుపుటకై శోకేత్యాదివిశేషణము చెప్పఁబడినది. అయ్యా! భూతానుగ్రహము చేయువలసియుండఁగా భగవంతుఁ డర్జునున కెందుకు ధర్మద్వయము నుపదేశించెను? ఇందుకుఁ జెప్పుచున్నారు—గుణాధికు లని. అభివృద్ధి నొందఁ గల దని తలంచి ధర్మద్వయ మర్జునున కుపదేశించె నని సంబంధము. ఇఁక అట్లయినను బుద్ధోపదిష్టధర్మమువలె నీ భగవదుపదిష్టధర్మంబును బ్రామాణికుల కంగీకార్యము కా దని యాశంకించి వేదోక్త మగుటచే నిది బౌద్ధధర్మమువంటిది కా దని చెప్పఁబడిన దను నభిప్రాయము గలవారై శిష్టులచేఁ బరిగ్రహింపఁబడిన దగుటవలనఁగూడ బౌద్ధధర్మమువంటిది కా దని చెప్పుచున్నారు—ఆధర్మమును...గావించెను అని. వేదవ్యాసునకును అధర్మమునందు ధర్మబుద్ధి గావచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు—సర్వజ్ఞుఁ డని. "కృష్ణద్వైపాయనం విద్ధి వ్యాసం నారాయణం ప్రభుమ్" § అను స్మృతివలన వ్యాసుఁడు నశేషలోకోపకారార్థక మయిన భగవదవతార మగుటచే నాతనికి అధర్మమునందు ధర్మబుద్ధి గలుగు ననుట కవకాశమే లే దని చెప్పుచున్నారు—భగవంతుఁ డని.

---

* ప్రయోజనము నుద్దేశింపక మూఢుఁడును బ్రవర్తింపఁడు.

§ కృష్ణద్వైపాయనవ్యాసుని ప్రభు వగు నారాయణునిఁగా నెఱుంగుము.

భా. అట్టి యీ గీతాశాస్త్రము సమస్తవేదార్థ సారసంగ్రహభూతము దుర్విజ్ఞేయార్థము, తదర్థము దెలుపుట కనేకులచేఁ బదార్థవాక్యార్థ న్యాయములు వివరింపఁబడియున్నను మిక్కిలి విరుద్ధము లయిన యనేకార్థములు గలదిగా లౌకికులచే గ్రహింపఁబడుచుండుటంజూచి నేను వివేకమున నర్థనిశ్చయముకొఱకు సంక్షేపంబున వివరణము చేయుచున్నాను.

ఆ. గీతాశాస్త్ర మనాప్తప్రణీత మను శంకను నిరాకరించి వ్యాఖ్యానయోగ్య మని చేసిన యుపపాదనము నుపసంహరించుచున్నారు—« అట్టి యీ గీతాశాస్త్ర మని. పౌరుషేయగ్రంథమునకు మూలప్రమాణము లేనియెడఁ బ్రామాణ్యము లే దని తలంచి విశేషణము చేయుచున్నారు—సమస్తవేదార్థసారసంగ్రహభూత మని. మూలగ్రంథముచేతనే తదర్థము తెలియుచుండఁగా వ్యాఖ్యాన మేల యని యాశంకించి చెప్పుచున్నారు, దుర్విజ్ఞేయార్థ * మని. « పదచ్ఛేదః పదార్థోక్తిర్విగ్రహో వాక్యయోజనా, ఆక్షేపస్య సమాధానం వ్యాఖ్యానం పఞ్చలక్షణమ్ » § ఇత్యాదిక్రమంబునఁ బూర్వాచార్యులచే నీ శాస్త్రము వ్యాఖ్యాతమై యుండఁగాఁ జర్వితచర్వణముగా నీయారంభ మెందు కని యాశంకించి చెప్పుచున్నారు—తదర్థము...చూచి అని. గీతాశాస్త్రార్థము బోధించుటకొఱకుఁ, బదవిభాగము, ఆ పదములయర్థము చెప్పుట, వాక్యముయొక్క యర్థము ప్రతిపాదించుట, అందపేక్షిత మయిన ఆక్షేపసమాధానరూప మగు న్యాయము నిరూపించుట యివన్నియు వృత్తికారులచేఁ జేయఁబడినది. అయినను అట్టి యీశాస్త్రమే శాస్త్రపరిచయము లేనిసముచ్చయవాదులచే విరుద్ధ మయిన యర్థము గలదిగాను అనేకార్థములు గలదిగాను గ్రహింపఁబడుటను జూచి వారిని సమాధానపఱచుటకై యిది యారంభింపవలయు నని యర్థము. ఎవరికిఁ బ్రాచీనవ్యాఖ్యానమున బుద్ధిప్రవేశింపదో వారికి వ్యాఖ్యానమునందుమాత్రము బుద్ధిప్రవేశింపఁగల దని యేమి నియమము? ఇందుకుఁ జెప్పుచున్నారు—వివేకంబున ¶ నని. పూర్వవ్యాఖ్యానమునఁ దత్తత్పదార్థ

---

* కష్టముచే తెలియఁదగిన యర్థము గలది.

§ పదచ్ఛేదము, పదముల యర్థము చెప్పుట, విగ్రహము, వాక్యార్థము చెప్పుట, ఆక్షేపమునకు సమాధానము అని వ్యాఖ్యానము అయిదు లక్షణములు గలది. “ఆక్షేపోథసమాధానం వ్యాఖ్యానం షడ్విధం స్మృతమ్” అని పాఠాన్తరము.

¶ స్పష్టముగా నని భావము.

నిశ్చయములకొఱకుఁ జేయఁబడిన యుపన్యాసము సంకీర్ణముగాఁ * గనఁబడుచున్నది, అందువలన నందుఁ గొందఱికి బుద్ధి ప్రవేశింపదు, ఈ వ్యాఖ్యానమునందో తత్త్వపదార్థ నిర్ణయమున కుపయోగించున్యాయము లసంకీర్ణముగా వివరింపఁబడును, అందుచే నిందు మందమధ్యమాధికారులకుఁగూడ బుద్ధి ప్రవేశింపఁ గల దని యర్థము. మఱియు అనావశ్యకమయిన యధికగ్రంథము కలుగుటవలనఁ బ్రాచీనవ్యాఖ్యానమున శ్రోతలకుఁ బ్రవృత్తి కలుగదు, ఈ వ్యాఖ్యానమునందో ఆవశ్యక మయి యల్ప మయిన గ్రంథము కలుగుటవలన నందఱకును బ్రవృత్తి జనియించు నని తలంచి చెప్పుచున్నారు—సంక్షేపమున నని.

భా. అట్టి యీ గీతాశాస్త్రమునకుఁ బ్రయోజనము పరమం బగు నిశ్శ్రేయసము, లేక, సహేతుక మయిన సంసారమున కత్యంతోపరమము. అయ్యది సర్వకర్మసన్న్యాసముచేఁ గలుగునట్టి యాత్మజ్ఞాననిష్ఠవలనఁ గలుగుచున్నది. అట్టి గీతార్థధర్మమునే యుద్దేశించి భగవంతునిచేతనే యనుగీతలందుఁ జెప్పఁబడినది.—« సహిధర్మ స్సుపర్యాప్తో బ్రహ్మణః పదవేదనే » అని. ఇంక న్మఱియు నచటనే చెప్పఁబడినది.— « నైవధర్మీ నచాధర్మీ నచైవ హి శుభాశుభీ, యస్స్యా దేకాసనే లీన స్తూష్ణీం కించిదచిన్తయన్ » అనియు, « జ్ఞానం సన్న్యాసలక్షణమ్ » అనియు. ఇందుఁగూడఁ జివర నర్జునునకుఁ జెప్పఁబడినది. « సర్వధర్మా న్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ » అని. అభ్యుదయము గలిగించునట్టి ప్రవృత్తిలక్షణం బగు ధర్మ మేది వర్ణంబులను ఆశ్రమంబులను నుద్దేశించి విధింపఁబడినదో అదియు దేవాదిస్థానప్రాప్తికారణ మయినను ఫలాభిసంధి విడిచి యీశ్వరార్పణబుద్ధిచే ననుష్ఠింపఁబడినదై చిత్తశుద్ధి గలిగించును. శుద్ధచిత్తునకు జ్ఞాననిష్ఠయందు యోగ్యతను గలిగించు ద్వారమున జ్ఞానోత్పత్తికి హేతువగుటం జేసి నిశ్శ్రేయసంబునకును హేతు వగుచున్నది. ఈ యభిప్రాయము ముందు చెప్పఁబడును.—« బ్రహ్మణ్యాధాయకర్మాణి యతచిత్తా జితేన్ద్రియాః, యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాఽఽత్మశుద్ధయే » అని. నిశ్శ్రేయసప్రయోజనం బగు నీ రెండు విధములు ధర్మంబును బరమార్థతత్త్వ మయిన వాసుదేవాఖ్యపరబ్రహ్మము అను విషయంబును విశేషించి ప్రతిపాదించుటవలన గీతాశా

* ఒకదానితో నొకటి కలిసి యుండుటచే అస్పష్టముగా నని భావము.

శ్రాస్త్రము విశిష్టప్రయోజనసంబంధవిషయములు గలది యగుచున్నది. తదర్థము చక్కగాఁ దెలియుటచే సమస్తపురుషార్థంబులు సిద్ధించును గావునఁ దద్వ్యాఖ్యానంబునందు నాచే యత్నము చేయఁబడుచున్నది.

ఆ. ఆప్తప్రణీతమయినను విషయాద్యనుబంధము ప్రతిపాదింపఁబడకుండుటవలన శాస్త్రత్వము లేమింజేసి యీ శాస్త్రము వ్యాఖ్యానయోగ్యము గాదని యాశంకించి సర్వవ్యాపారంబులును బ్రయోజనముకొఱకే ప్రవర్తించుటవలన మొదటఁ బ్రయోజనము చెప్పుచున్నారు.—అట్టి...ఉపరమము అని. అట్టి = సాధింపఁబడిన ప్రామాణ్యము గలది. ఈ = వ్యాఖ్యానముచేయవలె నని మనస్సున సన్నిహితము, అగు గీతాశాస్త్రమునకు, సంక్షేపంబున = సంగ్రహముచేత, చక్కఁగాఁ జేర్పఁబడిన దగుటచే, ఏకాభిప్రాయముచే ననుట, నిశ్శ్రేయసము = నిశ్చిత మయిన శ్రేయము, కైవల్యము, ఇది పరమఫలము. అవాంతరఫలమో అచ్చటచ్చట నవాంతరవాక్యములచే మనోనిగ్రహాదికము వివక్షిత మగుచున్నది. నిశ్శ్రేయసము నిరతిశయసుఖావిర్భావ మని నిశ్శేషానర్థనివృత్తి యని రెండువిధములు. అందు మొదటిదాని నుదహరించుచున్నారు—పరమం బని. రెండవదానిఁ జెప్పుచున్నారు—సహేతుకమయిన సంసారమున కత్యంతోపరమ మని. సంసారమునకు అత్యంతము= మఱలి ఉపరమ మనఁగా ప్రతియోగి యగు సంసారము మరలఁ గలుగుటకు అనర్థ మగుట. నిద్రామూర్ఛాదులవ్యావృత్తికొఱకు * కీ యత్యంత మను విశేషణము దాని సాధించుటకే సహేతుక § మని చెప్పఁబడినది. ఈ చెప్పఁబడిన ఫలము సముచ్చితము లేక యేకాకి యగు కర్మమువలనఁ గలుగును, కావున నదియె శాస్త్రప్రతిపాద్య మని యాశంకించి విషయముఁ జెప్పఁగోరినవారై సమాధానము చెప్పుచున్నారు.—అయ్యది...కలుగుచున్నది యని. ఆత్మజ్ఞాననిష్ఠకు శేషముగా ‖ కర్మనిష్ఠ యిందుఁ జెప్పఁబడుచున్నది. ప్రాధాన్యముననో ఆత్మజ్ఞాననిష్ఠయే యిందుఁ బ్రతిపాదింపఁబడుచున్న దని యర్థము. అయ్యా! కర్మనిష్ఠ శేష మగునెడ శేషియగు ♦

* నిద్రామూర్ఛాదులయందు సంసార ముపరమించినను అవి గడచిన పిమ్మట మరలఁ గలుగుచున్నది కావున వానియం దత్యంతోపరమము లే దని భావము.

§ సంసారహేతు వైన అవిద్య నశించుటవలన సంసారము మరలఁ గలుగ నవకాశము లే దని భావము.

‖ అంగముగా.

♦ అంగి యగు.

జ్ఞాననిష్ఠ సన్న్యాసమువలన నెట్లు కలుగుచున్నది? ఇందుకుఁ జెప్పుచున్నారు—సన్న్యాసద్వారమునఁ బలుమాఱు చేయఁబడు శ్రవణాదికమువలన శేషియగు జ్ఞాననిష్ఠ సిద్ధించును, అందుఁ గర్మము పరంపరాకారణ మగుటచే శేష మగు నని యర్థము. అయ్యా! "యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్య మేవ తత్" అను వాక్యమువలనఁ గర్మసముచ్చిత మగు నాత్మజ్ఞాన మిందుఁ బ్రతిపాదింపఁబడుచున్నది? అట్లు గా దని చెప్పుచున్నారు—అట్లు...చెప్పఁబడినది అని. మున్ను చెప్పఁబడిన నిశ్శ్రేయససాధన మగు సర్వకర్మసన్న్యాసపూర్వక మయిన యాత్మజ్ఞాననిష్ఠారూప ధర్మంబును నిశ్శ్రేయసరూపప్రయోజనంబునుం బరామర్శించుచున్నారు—ఈ గీతార్థ ధర్మమునే యని. వక్తృభిన్నుఁ డగుటచే నభిప్రాయభేదము గావచ్చు నను శంకను నివారించుచున్నారు—భగవంతునిచేతనే యని. బ్రహ్మణః పదవేదనే = బ్రహ్మము యొక్క పదము, మున్ను చెప్పఁబడిన మోక్షము, దానియొక్క వేదనము లాభము, దానియందు. సః ధర్మః = ఆజ్ఞాననిష్ఠారూపధర్మము. సుపర్యాప్తః = మిక్కిలి సమర్థ మగు నని యర్థము. హి యనునది ప్రసిద్ధార్థకము. యజ్ఞదానాదివాక్యమునకో తద్వ్యాఖ్యానావసరంబునఁ దాత్పర్యము చెప్పఁబడును. కర్మత్యాగమే భగవంతుని యభిప్రాయ మనుటయందు మఱియొకవాక్య మనుగీతయందలిదే యుదాహరించుచున్నారు—ఇంక స్మృతియు నచటనే చెప్పఁబడినది యని. ధర్మాధర్మముల యపూర్వముతో సంబంధము లేమికి హేతువు చెప్పఁబడుచున్నది—నైన అని. ధర్మీ = ధర్మము గలవాఁడును, నైవ = కానేకాఁడు. అధర్మీ = అధర్మముగలవాఁడును, న = కానేకాఁడు. శుభాశుభీ = ధర్మఫల మయిన శుభమును అధర్మఫల మయిన అశుభమును గలవాఁడును, నైవహి = కానేకాఁడు గదా! విహితప్రతిషిద్ధరూప మయిన కర్మద్వయముతో సంబంధము లేమిం జేసి ధర్మాధర్మాపూర్వ సంబంధము లేదని యర్థము. చెప్పనారంభించినవిషయమునఁ బ్రసక్త మగు నది చెప్పఁబడుచున్నది—యస్స్యాత్ అని. తూష్ణీమ్ = ఊరక అనుటచే వాగాదిబాహ్యకరణవ్యాపారము లేమి చెప్పఁబడుచున్నది. కించిత్ అచిన్తయన్ = కొంచెమేని చింతింపనివాఁడై, ఇందుచే నంతఃకరణవ్యాపారము లేమి చెప్పఁబడినది. రెండు విధము లయిన కరణముల వ్యాపారములు లేనివాఁడై మున్ను చెప్పఁబడిన, యః = ఏయధికారి, కేవలము, ఏకాననే—ఏక = అద్వితీయ మగు బ్రహ్మమునందు, ఆసన మనఁగా నుండుట, దానియందు. లీనః = దానియందే సమాప్తి నొందినవాఁడు. స్యాత్ = అగునో. అసంప్రజ్ఞాత సమాధినిష్ఠుఁ డగు నతనికి సర్వకర్మత్యాగమువలనఁ గలుగు జ్ఞానము ముక్తిహేతు

వగు నని యర్థము. ఈ చెప్పఁబడిన జ్ఞాన మనుగీతలందు మాత్రమే కాదు, ప్రకృత
శాస్త్రమునందుఁగూడ సమాప్త్యవసరమునఁ బ్రతిపాదింపఁబడియున్న దని చెప్పు
చున్నారు—ఇందుఁగూడ నని. అయ్యా! ఇందు నివృత్తిలక్షణధర్మాత్మక మయిన
సన్న్యాససహిత మగు నాత్మజ్ఞానము మాత్రమే ప్రతిపాదింపఁబడిన దని చెప్పరాదు.
ఏల యనఁగా "కురుకర్మైవ తస్మాత్త్వమ్" ఇత్యాదికమునందుఁ బ్రవృత్తిలక్షణ
ధర్మముగూడఁ జెప్పఁబడినది. కావున రెండుధర్మములకును బ్రకృతత్వము సమా
నము? ఇందుకుఁ జెప్పుచున్నారు—అభ్యుదయము అని. అయ్యా! వర్ణులచేతను
ఆశ్రములచేతను అనుష్ఠేయముగా మఱియొకచోట విహిత మయిన ప్రవృత్తిలక్షణ
ధర్మమునుగూడ మోక్షసాధనత్వాధికారమునందు విధించుట యుచితము కాదు.
ఏల యనఁగా నది దేవాదిస్థానప్రాప్తిహేతు వగుటం జేసి మోక్షమునకుఁ బ్రతిపక్షము?
ఇందుకు—సత్యము. అట్లయినను అది ఫలాభిలాష విడిచి యీశ్వరార్పణబుద్ధితోఁ
జేయఁబడినదై చిత్తశుద్ధిహేతు వగుం గావున నదియు నిందు వచియింపఁబడె నని
చెప్పుచున్నారు—అదియు దేవాది అని. ఫలాభిసంధితోఁ జేయఁబడినదై దేవాదిస్థా
ప్రాప్తికారణ మగు నని యర్థము. ప్రవృత్తిలక్షణధర్మముక్తరీతిం జిత్తశుద్ధిహేతువైనను,
మోక్షహేతువు గామోక్షాధికారంబున నెందువలనఁ దత్ప్రతిపాదనము? అని యా
శంకించి చెప్పుచున్నారు—శుద్ధచిత్తునకు అని. అగుచున్నది—పూర్వోక్తప్రవృత్తిలక్షణ
ధర్మ మని శేషము. ఫలాభిసంధివర్జితమై యీశ్వరార్పణబుద్ధితో ననుష్ఠింపఁబడిన
కర్మము చిత్తశుద్ధిగలిగించు నని యేది చెప్పఁబడెనో అందుకు వాక్యశేషము ప్రమా
ణము చూపుచున్నారు—అట్టీయభిప్రాయ మని. ప్రతిపాదిత మయిన సాధనసహిత
మగు శాస్త్రప్రయోజనము ననువదించి విషయమును బ్రదర్శించుచున్నారు—నిశ్శ్రే
యసప్రయోజనం బని. ప్రదర్శితం బగు ప్రయోజనముతో శాస్త్రమునకు నిష్ఠా
ద్వయద్వారమున సాధ్యసాధనభావము సంబంధము, విషయముతో విషయవిషయి
భావము సంబంధ మని వివక్షించి చెప్పుచున్నారు—విశేషించి యని. ఇట్లనుబంధ
త్రయవిశిష్ట మగుటం జేసి శాస్త్రము వ్యాఖ్యానయోగ్య మని యుపసంహరించు
చున్నారు—విశిష్ట యని. వ్యాఖ్యానయోగ్యత సిద్ధ మయిన పిదప వ్యాఖ్యానము
చేయుటయందు ఫలితముఁ జెప్పుచున్నారు—తదర్థ మని.

శ్రీరస్తు.
శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీహనుమద్విరచిత పైశాచభాష్యోపక్రమణిక.

మంగళశ్లోకార్థము.—

నేను, గూఢముగా నగ్నిచే భయపఱుపఁబడిన రావణుఁడు గలవాఁడనైనను సముద్రతీరరాజహంసుఁడనైనను, ఏడువందలచేఁ బూరితం బగు శ్లోకామృతముచేఁ దక్కఁ, బరమానందరూపుఁ డగు కూటస్థపరమాత్మను బొందలేనైతిని. ౧

శరణాగతులకుఁ గల్పవృక్ష మయినవాఁడును చబుకుబెత్తము ఒకహస్తము నందుఁ గలవాఁడును జ్ఞానముద్ర గలవాఁడును గీత యను నమృతముఁ బితుకువాఁడు నగు కృష్ణునకు నమస్కారము. ౨

ఒక హస్తకమలముచేఁ జూపఁబడిన చిన్ముద్రగలవాఁడును ధరింపఁబడిన యున్నత మయిన నెమిలిఫించము గల జుట్టుగలవాఁడును రెండవచేతఁ బట్టఁబడిన చబుకు బెత్తము గలవాఁడు నగు కృష్ణుఁడు నాహృదయమునందు సన్నిధి సేయుఁ గాక. ౩

ఎవ్వఁడు ముల్లోకముల కుపకారము సేయుటకొఱకు యుద్ధమున నర్జునునకు సారథ్యము సేయుచు గీతామృతము నొసంగెనో ఆ కృష్ణపరబ్రహ్మమునకు నమస్కారము. ౪

పురుషులకు జలస్నానము శరీరమలముఁ బోఁగొట్టును. అది ప్రతిదినమును జేయవలయును. గీతాజలమునందు స్నానము ఒక్కమాఱు చేసినంజాలును. అది సంసారమలముఁ బోఁగొట్టును. ౫

అకృత్యము చేయుచున్నను యథేష్టము తినుచున్నను గీతాధ్యయనము సేయువాఁ డొక్కప్పుడును నరకదుఃఖముఁ జూడఁడు. ౬

వేదములు అను సముద్రమునుండి చిలుకఁబడినదియు వాసుదేవునిచే నెత్తఁబడినదియు నగు గీతామృతరసాయనమును సత్పురుషు లెల్లప్పుడుఁ ద్రావుదురు. ౭

భగవద్గీత యొక్కటే శాస్త్రము. శ్రీకృష్ణుఁ డొక్కఁడే దేవుఁడు, శ్రీకృష్ణ నామము లొక్కటే మంత్రము. తత్సేవన మొక్కటే సత్కర్మము. ౮

ధార్తరాష్ట్రకులము అను మదపుటేనుఁగునకు మేటిమావటివాండ్రు వీరలు నరనారాయణావతారరూపులు నగు కృష్ణార్జునుల కిద్దఱకును నమస్కరించుచున్నాను.

జగత్కారణంబును సాధువులఁ దరింపఁజేయుటయే ప్రయోజనముగాఁ గల వాఁడును బరమాత్మయు నద్వితీయుండు నగు గజాననను నుపాసించుచున్నారము.౧౦

జయశీలుండును సర్వవ్యాపకుండును జగద్గురువు నగు పరమాత్మను నమస్కరించి పరమాత్మజ్ఞానముకొఱకు నాచే గీతావ్యాఖ్యానము చెప్పఁబడుచున్నది. ౧౧

ఈ శాస్త్రమునకు సంబంధాభిధేయప్రయోజనములు చెప్పఁబడుచున్నవి.— ప్రయోజనము మోక్షము. అది గీతాశాస్త్రప్రతిపాదిత మగు పరమాత్మజ్ఞానము వలననే కలుగుచున్నది. పరమార్థస్వరూప మభిధేయము, కావున పరమార్థస్వరూప జ్ఞానమునకు నీ శాస్త్రమునకును సాధ్యసాధనభావం బనుసంబంధము. ఇట్లు విశిష్ట ప్రయోజనసంబంధాభిధేయములు గలది గీతాశాస్త్రము.

ఇట రాజ్యముకొఱకు శత్రువును జయింపఁగోరిన యర్జునునకు ధార్త రాష్ట్రులతో యుద్ధము సంభవించెను. అందు సహాయార్థము వరింపఁబడిన భగ వంతుఁ డగు వాసుదేవునితోఁ గూడ రథం బారోహించి పోరుటకై యుద్ధభూమిం బ్రవేశించినవాఁడై యర్జునుం డుభయసేనామధ్యంబున యుద్ధము సేయ సన్నద్ధు లయియున్న యాచార్యపితృపితామహపుత్రమిత్రాదులం జూచి “నేను వీరిని వధింపవలెను నాకొఱకు వీరు చావఁబోయెదరు” అని పర్యాలోచించి శోక మోహములచేఁ బరవశ మయిన చిత్తము గలవాఁడై పెక్కు ప్రలాపించి యుద్ధము చేయ నని పలికి యుద్ధమునుండి విరమించెను. ఇట్లు విరమించిన యయ్యర్జునునకు వాని యవిద్యామూలక శోకమోహములఁ దొలఁగించుపొంటెఁ బరమకారుణికుండు భక్తవత్సలుండు భగవంతుం డగు వాసుదేవుండు వేదాంతవాక్యములచేఁ దెలియఁ దగిన పరమార్థతత్త్వము నుపదేశించెను.

శ్రీ

శ్రీపార్థసారథయే నమః.

# శ్రీశంకరానందసరస్వతీకృత వ్యాఖ్యానోపక్రమణిక.

మంగళశ్లోకార్థము.—

సత్యజ్ఞానానంతరూపంబును నిష్కలంబును నిష్క్రియంబును బరంబును అద్వితీయంబును నిర్విశేషంబు నగు నదేది గలదో ఆబ్రహ్మము నుపాసించుచున్నాము.

కంఠముక్రింద మనుష్యరూపంబును గంఠముమీఁద గజాకారంబును అవిద్యకతీతము నగు దివ్యతేజ మెల్లప్పుడు మాయెదుట నిలుచుఁ గాక. 2

ఏదేవిచేఁ బంచాశద్వర్ణరూపంబున నీజగంబువ్యాపింపఁబడినదో ఆపరదేవతను శబ్దబ్రహ్మమయి యగు సరస్వతిని సేవించుచున్నాను. 3

ఎవ్వఁడు ప్రకృతిని వికృతిని దద్గుణంబులతోఁగూడ స్పృశింపకయే నాలో నెల్లప్పుడు ప్రకాశించుచున్నాఁడో ఆకృష్ణుని ఈశ్వరుని సేవించుచున్నాను. ౪

సనందనుని శ్రీసనకుని సనాతనుం డగు సనత్కుమారుని సనత్సుజాతుని శ్రీ వామదేవునిఁ బూజ్యుఁ డగు శుకుని ఆత్మజ్ఞానసిద్ధికొఱకు భక్తితో నమస్కరించెదను.

శ్రీశంకరాచార్యులను సద్గురువు లగు తచ్ఛిష్యులను సమ్యగ్జ్ఞానము గలుగుటకొఱకు నెల్లప్పుడును బలుమాఱు శిరస్సుచే నమస్కరించుచున్నాను. ౬

నాగురు వైన యానందాత్మసరస్వతిని భక్తితోఁ బ్రణమిల్లి శ్రీమద్భగవద్గీతాతాత్పర్యబోధిని చేయఁబడుచున్నది. ౭

ఈ భూలోకంబున భగవంతుండు నమితతపోబలతేజశ్శక్తిసంపన్నుండు సర్వవిద్యానిధి సర్వజ్ఞోత్తముండు సాక్షాచ్ఛ్రీనారాయణావతారరూపుఁడు నగు శ్రీకృష్ణ ద్వైపాయనుండు పరమకారుణికాగ్రగణ్యుం డగుటవలనఁ దానే పరమకృపచే భవి

ష్యద్విద్వాంసు లధికబుద్ధియుక్తులు కారని తెలిసి వర్ణాశ్రమములకు సకలపురుషార్థసిద్ధి పొందుటకుఁ దత్సిద్ధిసాధనములను దెలుపునట్టి యనంతవేదరాశిని ఋగ్వేదాదిభేదంబున నాలుగుభాగములుగా విభాగించి యొక్కొకశాఖను పైలవైశంపాయనాదిశిష్య ప్రశిష్యోపశిష్యపరంపరాద్వారమున వర్ధిల్లునట్లు గావించెను. అందును వేదార్థము పరమసూక్ష్మము మిక్కిలి గూఢము దెలియరాని దగుటవలనఁ దదర్థముఁ దెలియ నసమర్థు లగు సత్పురుషులకు ధర్మాదిసర్వపురుషార్థములు సిద్ధించుకొఱకు « భారతం పఞ్చమో వేదః » అనుటచేఁ బంచమవేద మని ప్రసిద్ధంబును ధర్మాదిసర్వపురుషార్థ ములను దత్సాధనములను విశదీకరించునదియును శతసాహస్రీసమ్మితంబు నగు భారతం బను సంహితను బ్రవర్తింపఁ జేసెను. అట్టి యాభారతసంహితయందే నడుమఁ గేవలముముక్షువుల కనాద్యవిద్యాతత్కార్యనివృత్తిద్వారమున విదేహకైవల్యరూప ఫలము సిద్ధించుకొఱకు బ్రహ్మాత్మైకత్వముఁ బ్రతిపాదించునదియుఁ గృష్ణార్జునసంవాద రూపంబును అద్వైతామృతము వర్షించునదియు నగు శ్రీగీతోపనిషన్నామకబ్రహ్మ విద్యను నక్షత్రసమూహమునడుమఁ జంద్రమండలముంబోలె నేడువందలశ్లోకములచే స్థాపించెను. అట్టి యీబ్రహ్మవిద్య నధ్యయనించుటయందును దదర్థగ్రహణమునందును తచ్ఛ్రవణజన్యజ్ఞానమునందును దత్ఫలప్రాప్తియందును సదసద్వివేకము గలవాఁడును అధర్మభీరువును ఐహికాముష్మికసుఖవిముఖుండును శమాదిషట్కసంపన్నుండు నగు ముముక్షువే యధికారి యగు నని నిశ్చయించుటకును బ్రహ్మవిద్యాశ్రోత యగు నర్జు నునియందు సదసద్వివేకము నధర్మభీరుత్వము నైహికాముష్మికసుఖవిముఖత్వము శమాదిషట్కసంపత్తియుఁ బ్రదర్శించుటకును బ్రథమాధ్యాయ మారంభింపఁబడు చున్నది.

శ్రీ

శ్రీగోపాలకృష్ణ పరబ్రహ్మణే నమః.

# శ్రీమధుసూదనసరస్వతీ టీకోపక్రమణిక.

శ్రీశంకరభగవత్పాదవిరచితం బయిన భాష్యమునర్థము నతిప్రయత్నం బున నాలోచించి ప్రాయికముగఁ బ్రతిపదటీకారూప మగు గూఢార్థదీపిక యను భగవద్గీతావ్యాఖ్యను జేయుచున్నాను.

కారణసహిత మయిన సంసారముయొక్క యత్యంతనివృత్తిరూప మయిన పరమనిశ్శ్రేయసం బీ గీతాశాస్త్రమునకుఁ బ్రయోజనము. అయ్యది సచ్చిదానంద రూపంబును బరిపూర్ణంబు నగు పరబ్రహ్మస్వరూపమే యగును. తత్ప్రాప్త్యుపాయము బోధించుటకై కాండత్రయాత్మకము లగు సమస్తవేదములును బ్రవర్తించుచున్నవి. కర్మము భక్తి జ్ఞానము అని క్రమంబున మూఁడు కాండములు. అష్టాదశాధ్యాయరూప మయిన గీతాశాస్త్రమును వేదార్థమునే బోధించునది కావున కాండత్రయాత్మకమె యగును.

ఇందు నొక్కొకయధ్యాయషట్కముచే నొక్కొకకాండము ప్రతిపాదితముగా నెఱుంగునది. కర్మనిష్ఠ మొదటియాఱధ్యాయములచేతను జ్ఞాననిష్ఠ కడపటియాఱధ్యాయములచేతను బ్రతిపాదింపఁబడెను. ఇట్లు వ్యవహితముగాఁ బ్రతిపాదించుటవలనఁ గర్మనిష్ఠాజ్ఞాననిష్ఠల కత్యంతవిరోధము గల్గుటంజేసి సముచ్చయము సంభవింప దని బోధిత మగుచున్నది. భగవద్భక్తినిష్ఠయో, కర్మజ్ఞాననిష్ఠల రెంటికిని అనుగత మగుటంజేసి నడిమి యాఱధ్యాయములం జెప్పఁబడినది. ఎందువలన ననఁగా ఆభక్తి కర్మమిశ్రము శుద్ధము జ్ఞానమిశ్రము అని మూఁడు విధములు.

మఱియు నందుఁ బ్రథమకాండమునఁ గర్మము తత్త్యాగము నుపదేశించుటచేఁ ద్వంపదార్థ మయిన కూటస్థాత్మ నిరూపింపఁబడుచున్నది. ద్వితీయకాండంబున భగవద్భక్తినిష్ఠను వర్ణించురూపంబునఁ దత్పదార్థ మయిన బరమానందస్వరూపుఁడు భగవంతుఁడు నిరూపింపఁబడెను. మూఁడవకాండంబున వారి యైక్యము స్పష్టముంగ వర్ణింపఁబడినది. ఈ విధమునంగూడ, నిందుఁ గాండములకుఁ

బరస్పరము సంబంధము గలదు. ఇఁక నధ్యాయములకుఁ బరస్పరముగల విశేషసంబంధ మాయాస్థలముననే చెప్పఁబడును.

ఈ మోక్షసాధనసోపానక్రమము శాస్త్రోక్తముగాఁ జెప్పఁబడుచున్నది — కామ్యనిషిద్ధకర్మంబుల విడిచి నిష్కామముగా నిత్యనైమిత్తికకర్మంబు లనుష్ఠించుట, అందును విష్ణువుయొక్క జపము స్తుతిమొదలగునది పరమధర్మము. వీనిచే క్షీణపాపం బగు చిత్తమున కెప్పుడు వివేకమునందు యోగ్యత కలుగునో అప్పుడు మిక్కిలి దృఢ మయిననిత్యానిత్యవివేకము కలుగును. అంతఁ గ్రమంబున వశీకార మను పేరుగల యిహాముత్రార్థఫలభోగవైరాగ్యము కలుగును. అందువలన శమాదిసంపత్తి కలిగి సన్న్యాసము స్థిర మగును. ఇట్లు సర్వమును బరిత్యజించుటవలన దృఢ మయిన ముముక్షు పుట్టును. అంత గురూపసదనము, గురువునలన నుపదేశము నొందుట. అంత సందేహనివారణముకొఱకు వేదాంతశ్రవణాదికము. ఇందు నుత్తరమీమాంసాశాస్త్ర మంతయు నుపయుక్త మగుచున్నది, అంత శ్రవణ మననపరిపాకంబున నిధిధ్యాసననిష్ఠ యగును. ఇందు యోగశాస్త్ర మంతయు నిర్వృత్త మగును. అందువలనఁ జిత్తము క్షీణదోష మగుటయు మహావాక్యమువలనఁ దత్త్వజ్ఞాన మగును. శబ్దమువలననే నిర్వికల్పసాక్షాత్కారము కలుగును. తత్త్వజ్ఞాన మయినంతనే యవిద్యానివృత్తి యగును. అందునలన ఆవరణము నశించుటచే భ్రమ సంశయంబులు నశించును. తత్త్వజ్ఞానప్రభావమువలన సంచితకర్మము లంతయు నిశ్శేషముగాఁ దప్పక నశించును. ఆగామికర్మములు జనియింపవు. ప్రారబ్ధకర్మవిక్షేపమునలన వాసనమాత్రము నశింపదు. ఆవాసన సమస్తమునుండి దృఢ మయిన సంయమముచే నశించును. ధారణ ధ్యానము సమాధి యను మూఁడును సంయమం బనఁబడును. తత్పూర్వ మయిన యమాదిపంచకము సంయమార్థ ముపయుక్త మగును. ఈశ్వరప్రణిధానమువలననే సమాధి శీఘ్రమున సిద్ధించును. అందువలన మనోనాశంబును వాసనాక్షయంబును గలుగును. తత్త్వజ్ఞానము మనోనాశము వాసనాక్షయము ఈ మూఁడు నేకకాలమున నలవడుటవలన జీవన్ముక్తి దృఢ మగును. ఏతదర్థమే శ్రుతియందు విద్వత్సన్న్యాసము చెప్పఁబడినది.

ఏయంశము మొదట సిద్ధము కాదో దాని సాధించుటకొఱకే యత్న మగును. మొదట సవికల్పసమాధిచేఁ జిత్తము నిరుద్ధ మయిన పిదప నిర్వికల్పసమాధి యగును. అది మూఁడు భూమికలు గలది. మొదటిదానియందుఁ బురుషుఁడు దనయంతనే లేచును. రెండవదానియం దితరులచే బోధితుఁడై లేచును. మూఁడవదానియందు లేవనే లేవఁడు. సదా తన్మయుం డగును. ఇట్టివాఁ డగు బ్రహ్మణుఁడు బ్రహ్మవాదులలో వరిష్ఠుఁ డగును. గుణాతీతుఁడు స్థితప్రజ్ఞుఁడు విష్ణుభక్తుఁడు అనియు

అతివర్ణాశ్రమి జీవన్ముక్తుఁడు ఆత్మరతి యనియుఁ జెప్పఁబడును. ఇతఁడు కృతకృత్యుఁ డగుటచే శాస్త్ర మితని విడుచుచున్నది.

“యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ, తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః” ఇత్యాది శ్రుతిప్రమాణముచేఁ గాయంబునను మనస్సునను వాక్కునను సర్వావస్థలందును భగవద్భక్తి యిందుపయోగపడుచున్నది. పూర్వభూమికయందుఁ జేయఁబడిన భక్తి యుత్తరభూమికను బొందించును. లేనిచో విఘ్నబాహుళ్యంబున ఫలసిద్ధి బొంద నలవిగాదు. పూర్వజన్మ సంస్కార మచింత్య మగుటవలన నెవ్వఁడేని దానిచే నాకాశమునుండి పండుపడినట్లు మున్నే కృతకృత్యుఁ డగునేని యతఁడు ప్రాక్సిద్ధసాధనాభ్యాసముచేతనే కృతార్థుఁ డగుటవలన శాస్త్ర మునకుఁ బ్రవృత్తి యతనింగుఱించి గాదు. భగవత్కృప దెలియ నలవిగానిది. ఇటు పూర్వభూమికసిద్ధ మయినను ఉత్తరోత్తరభూమిక సిద్ధించుటకొఱకు భగవద్భక్తి చేయవలెను. భగవద్భక్తి లేనిచో నయ్యుత్తరభూమిక సిద్ధింపదు. జీవన్ముక్తిదశ యందు మాత్రము భక్తికి ఫలము లేదు. అద్వేష్టృత్వము మొదలగువానివలె హరి భజనము గూడ వారికి స్వభావము. “ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రన్థా అప్యురుక్రమే, కుర్వన్త్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణో హరిః” “తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే” ఇత్యాదివచనములవలన నితఁడు ప్రేమభక్తుఁడు ముఖ్యుఁ డని చెప్పఁబడుచున్నాఁడు.

ఇది యంతయు భగవంతునిచే గీతాశాస్త్రంబునందుఁ దెలుపఁబడినది. దానివలన దీని వ్యాఖ్యానము చేయుటకు నామనస్సు మిక్కిలియు నుత్సుక మగుచున్నది.

నిష్కామకర్మానుష్ఠానము మోక్షమునకు మూలముగాఁ జెప్పఁబడినది. ఆసురం బగు శోకాదిపాప్మము దానికిఁ బ్రతిబంధకము. ఎట్లనఁగా దానివలన స్వధర్మ పరిత్యాగంబును నిషిద్ధకర్మసేవయు సంభవించును. మఱియు స్వధర్మమునందుఁ బ్రవృత్తియు ఫలాభిసంధిపూర్వకంబును సాహంకారంబు నగును. ఆసురపాప్మము లచే నిత్యము నావిష్టుఁ డగు పురుషుం డిట్లు పురుషార్థము బొందుట కయోగ్యుండై దుఃఖసంతతిని జెందుచుండును.

ఇట సర్వప్రాణులకును స్వభావముచేతనే దుఃఖము ద్వేష్యము. కావునఁ దత్సాధన మయిన శోకమోహాదిక మెల్లప్పుడును బరిత్యాజ్యము. అనాదివాసనచేఁ

బాదుకొన్న దగుటవలన దుఃఖకారణం బగు నీ శోకమోహాదికము విడువ నలవిగా కున్నది. ఇది యే యుపాయముచే విడుచును? అను నీయాకాంక్షచే నావిష్టుండును బరుషార్థాపేక్షియు నగు నర్జునునకు బోధింపఁ గోరినవాఁడై భగవంతుం డుత్తమం బగు నీశాస్త్రముఁ జెప్పుచున్నాఁడు.

అందు, అశోచ్యానన్వశోచ స్త్వ మిత్యాది గ్రంథముచే శోకమోహాది సర్వాసురపాప్మములు నివర్తించునుపాయము నుపదేశించుటంజేసి “స్వధర్మము ననుష్ఠించుటవలనఁ బురుషార్థముఁ బొందవలెను” అనునది భగవదుపదేశము సర్వసాధారణము. భగవదర్జునసంవాదరూపం బయిన యాఖ్యాయిక యుపనిషత్తు లందు జనకయాజ్ఞవల్క్యసంవాదాదులుంబోలె, విద్యాస్తుత్యర్థము. ఎట్లనఁగా, ప్రసిద్ధమహానుభావుం డగు నర్జునుండుగూడ, రాజ్యగురుపుత్త్రమిత్త్రాదులందు “నేను వీరివాఁడను, వీరు నావారలు” అను నీభ్రాంతిచేఁ గలిగిన స్నేహము కారణ ముగాఁ గల శోకమోహములచే అభిభూత మయిన వివేకవిజ్ఞానము గలవాఁడై, తనయంతనే క్షత్త్రియధర్మం బగు యుద్ధమునందుఁ బ్రవృత్తుఁడై నను, ఆ యుద్ధము నుండి విరమించెను. ఇతరుల ధర్మంబును క్షత్త్రియునకు నిషిద్ధంబు నగు భిక్షాజీవ నాదికము సేయుటకుఁ బ్రవర్తించెను. అట్లు గొప్ప యనర్థమునందు మగ్నుఁ డయ్యెను. భగవంతునియుపదేశమువలన నీవిద్యను బొంది శోకమోహంబుల విడిచి మరల స్వధర్మమునందుఁ బ్రవర్తించినవాఁడై కృతకృత్యుం డయ్యెను! కావున నిది ప్రశస్తతరంబును మహాఫలంబు నగు విద్య యని స్తుతింపఁబడుచున్నది. అర్జున వ్యాజంబున నుపదేశముఁ బొందుట కధికారి తెలుపఁబడెను.

ఇఁక వ్యాఖ్యానము చేయఁబడును. స్వధర్మమునందుఁ బ్రవృత్తి కలిగి నను దద్భ్రంశమునకుఁ గారణభూతంబు లగు శోకమోహంబులు కథం భీష్మమహం సంఖ్యే ఇత్యాదిగ్రంథంబున నర్జునునిచేఁ జూపఁబడినవి. అర్జునునకు వివేకము లేనిచో యుద్ధాఖ్య మయిన స్వధర్మమునందు మొదటనే ప్రవృత్తికలుగుట కేమినిమిత్త మనఁగా, దృష్ట్వా తు పాండవానీక మిత్యాదిగ్రంథముచే దన్నిమిత్తము పరసైన్య వ్యాపారము చెప్పఁబడినది. ధర్మక్షేత్ర ఇత్యాదిగా సంజయుం గూర్చి ధృతరా ష్ట్రుని ప్రశ్నము దాని కుపోద్ఘాతము.



శ్రీరస్తు.

శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీధరస్వామికృతవ్యాఖ్యానోపక్రమణిక.

ఆదిశేషుని సమస్తముఖములందలి వ్యాఖ్యానచాతుర్యము నొకముఖము నందే ధరించుచున్న యాశ్చర్యరూపుఁ డగు పరమానందమాధవుని నమస్కరించుచున్నాను. ౧

శ్రీయుతుం డగు విష్ణువును పార్వతీపతి యగు విశ్వేశ్వరుని భక్తితో నమస్కరించి తద్భక్తిప్రేరితుఁడనై సుబోధిని యను గీతావ్యాఖ్యను జేయుచున్నాను. ౨

భాష్యకారులయభిప్రాయమును భాష్యవ్యాఖ్యాతలవాక్యములను యథామతి విచారించి గీతావ్యాఖ్యానము నారంభించుచున్నాను. ౩

దేనిఁ బఠించినమాత్రాన ననాయాసముగా గీతార్థము స్పష్టమగునో అట్టి యీసుబోధిని యను టీక బుద్ధిమంతులచే నెల్లప్పుడు సేవింపఁ దగును. ౪

ఈ లోకంబున సకలజనంబులహితంబు పొంటె నవతరించినవాఁడును సకలవందితచరణుండును బరమకారుణికుండు నగు భగవంతుండు శ్రీకృష్ణుండు, తత్త్వాజ్ఞానముచే విజృంభితము లగు శోకమోహాములచే నుపహత మయిన వివేకము గలవాఁడై నిజధర్మత్యాగంబును బరధర్మాచరణంబును జేయఁ బూనినయర్జునుని, ధర్మజ్ఞానరహస్యోపదేశము అను నోడచే, ఆశోకమోహాసముద్రమునుండి యుద్ధరించెను. ఆ భగవదుపదిష్టార్థమునే కృష్ణద్వైపాయనుం డేడువందలశ్లోకములచే గ్రథితము గావించెను. అందుఁ బ్రాయికముగా శ్రీకృష్ణునిముఖమునుండి నిస్సృతము లయిన శ్లోకములనే లిఖయించెను. తత్సంగతికై కొన్నిటిని దానును రచియించెను. అట్లు గీతామాహాత్మ్యమునందుఁ జెప్పఁబడినది. "గీతా సుగీతాః కర్తవ్యాః కిమన్యైః శాస్త్రవిస్తరైః, యా స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిస్సృతాః" * అని.

* గీతలను జక్కఁగాఁ బారాయణము చేయవలెను. ఇతరశాస్త్రము లెందుకు? ఏల యనఁగా ఆ గీతలు సాక్షాచ్ఛ్రీకృష్ణుని ముఖకమలమునుండి వెడలినవి.



శ్రీవాసుదేవ పరబ్రహ్మణే నమః.



# శ్రీ సూర్య దైవజ్ఞ పండిత విరచిత
# పరమార్థప్రపాఖ్యా టీకోపక్రమణిక.



మంగళశ్లోకార్థము.—

జ్ఞానానందసందోహసాంద్రుండును నల్లగలువలవంటి కన్నులు గలవాఁడును లక్ష్మికి నివాసస్థానమైనవాఁడు నగు దేవుని నందనందనుని నమస్కరించు వీరివాఁడు. ౧

మూగాఁ గఎవ్వని కరుణాకటాక్షసంబంధమువలన అజ్ఞుఁడు సుజ్ఞత్వపరమావధిని తనయంతనేయుండుఁడు గూడ సంసారమువలన భయము నొందఁడో మూకుఁడు నుండి విరమింగునో కుంటివాఁడు పర్వతసమూహముల నుల్లంఘించునో దుఃఖనాదికవము నిశ్శేషముగా నింకిపోవునో అట్టి పరమగురువు శ్రీయశోదాకిశోరుండయొర్యామియై నానమీపంబున సర్వోత్కర్షంబున నున్నవాఁడు. ౨

అగస్త్యుఁడు సముద్రముం బుడిసిటఁ బట్టెను. ఆదిశేషుఁడు గొప్ప దగు భూమిని శిరంబున ధరించుచున్నాఁడు. అగ్ని దహించును. వర్షర్తువునందు మేఘము వర్షించును. వాయువు వీచును. సూర్యుఁ డెండ గాయును. భూమి రత్నముల నొసంగును. వీనిచే లోకాతీత మగు శ్రీకృష్ణునియనుగ్రహముగాని నిగ్రహముగాని యభినయింపఁబడును. ౩

కృష్ణబ్రహ్మము అనుపర్వతమునుండి యవక్రముగా శతపథగామినియై జ్ఞానవిజ్ఞానములు అను తీరములు గలదియై పార్థునిప్రార్థనవలన బహుకాలముగా నమృతవాహినియై యర్థప్రవాహముచేఁ బడిన గొప్ప యశ్వత్థవృక్షము నున్మూలించుచు నాత్మానందసముద్రమునుబొందిన గీత యను నీమహనీయగంగానది స్నానము చేయువానికిఁ గలికలుషమును బోఁగొట్టుచున్నది. ౪

పరమేశ్వరుని నిశ్శ్వాస మగు వేదము జనులకు దుర్బోధ మగుటవలన నీ గీత భారతయుద్ధారంభమున లోకోపకారముకొఱకు నుపనిషదర్థము స్పష్టముగా

బోధించుటకై యావిర్భవించెను. అందువలన ఈ గీతాశాస్త్రము మాకుమాత్రమె కాదు, సర్వజనులకు నత్యంతప్రియమై యొప్పుచున్నది.

వేదములు శాస్త్రములు ఆగమములు చెప్పునట్టి యాచార్యు లతిసమర్థులెటఁ జూచినను గలరు. ఆత్మతత్త్వోపదేష్ట యగు నాచార్యుఁడుమాత్రము ముల్లోకములయందును దుర్లభుఁడు. ఇట్లుండఁగా మిక్కిలి విషాదము నొందిన అర్జునుని భాగ్య మేమనవచ్చును? అతని కాచార్యుఁడగుటకై యుపనిష దర్థ మయిన పరమేశ్వరుఁడు తానే యావిర్భవించెను. ౬

సూర్యద్విజ్ఞుఁ డను పేరుగల నేను జతుర్వేదస్వామివలనఁ దెలిసికొనఁబడిన భగవద్భావమునకు స్థానమయినదియు విశ్రాంతికిఁ గారణమును ఋక్సామయజుర్వేదములకు సమ్మతంబు నగు గీతాభాష్యమును రచియించుచున్నాను. దీని వలన అల్పజ్ఞులగు ననుభవరసికులకు ఆనందము కలుగును. ౭

సర్వవేదములును గీతలును సాక్షాన్నారాయణుని వాక్యములు, భక్తులకు మోక్షము గలుగుటకొఱకుఁ బ్రవర్తించినవి. అవి యొండొంటితో వియోగము నొందెను. వాని నొకటిగాఁ జేర్చుట కంతర్యామి యగు వాసుదేవునిచే నియుక్తుఁడనై ప్రవర్తించుచున్నాను. అంతమాత్రముచేత నేను కృతార్థుండను గాఁ గలను. ౮

ఈ భగవచ్ఛాస్త్రమునందుఁ గేవల యుక్తిసిద్ధమతమున నాగ్రహము లేదు. సమస్తోపనిషత్తులతో నేకార్థ మగుటచేత నిది యాత్మజ్ఞానసాధన మగును. ౯

ఈలోకంబున సాధువుల ననుగ్రహించుటకును దుష్టుల నిగ్రహించుటకును శరీరపరిగ్రహము గావించినట్టి పరమకారుణికుం డగు పరమాత్మ కారుచిచ్చు సర్పములు శిలావృష్టి వస్త్రాపహారము లాక్షాగృహము విషదానము మొదలగు ననర్థములనుండి నిజచరణభక్తుల నుద్ధరించెం గదా! అంత రాక్షససమూహభారముచే వ్యాకులమగు భూమండలము నాలోకించి, మొదటఁ బూతనాదిరాక్షసులను, అనంతరము కంసచాణూరకాలయవనజరాసంధులను వధియించెను. ఇప్పు డర్జునుని నిమిత్తమాత్రము గావించికొని కురుక్షేత్రంబునఁ గూరితము లగు కౌరవుల సంహరింపఁ గోరి యున్నవాఁడు. అందు శ్రుతి.—

“జజ్ఞాన ఏవ వ్యబాధత స్పృధః ప్రాపశ్య ద్వీరో అభిపౌంస్యం రణమ్, అవృశ్చ దద్రి మవ సస్య ద స్సృజ ద స్తభ్నా న్నాకం స్వపస్యయా పృథుమ్”

ఇందుకుఁ జతుర్వేదస్వామిభాష్యము—ఏపరమేశ్వరుఁడు, జజ్ఞానఏవ = పుట్టినంతమాత్రముననే, మాయచే బాలదశను స్వీకరించి యున్నప్పుడే యనుట;

స్పృధః = స్పర్థను చేసినట్టి శత్రువులను, పూతన మొదలు కంసునివఱకుఁ గలవారిని, వ్యబాధత = సంహరించెను. దైత్యులను సంహరించినవాఁడు మాత్రమే కాఁడు, ఇంద్రుఁడు మొదలగువారి గర్వమునుగూడ నడంచె నని చెప్పఁబడుచున్నది—అద్రిమ్= గోవర్ధనపర్వతమును, అవృశ్చిత్ = ఎత్తెను. ఎందుకనఁగా—సస్యదః = ధాన్యము నిచ్చునట్టి మేఘములను, అవిచ్ఛిన్నముగా వర్షించుచున్నవానిని, అవస్పృజత్ = విసర్జించెను. అందుచే, పృథుమ్ = సామర్థ్యవంత మగు, నాకమ్ = ఇంద్రలోకమును, స్వపస్యయా = మాయచేత, అస్తభ్నాత్ = స్తంభించెను, స్తంభితమయిన శక్తిగల దానిఁగాఁ జేసెను. ఇఁక యౌవనదశయందును, అభిపౌంస్యమ్ = సర్వపురుషార్థ సాధక మయిన, రణమ్ = కురుపాండవయుద్ధమును, ప్రవీరః = మిక్కిలి శూరుఁ డయినను, అపశ్యత్ = చూచెను, తటస్థుఁడై చూచెనుగాని తాను బోరఁ డయ్యెను. ఇట వీరపదముచే భీష్మునివలనఁ బరాభవ మొందిన స్వభక్తుఁ డగు నర్జునుని యందలిపక్షపాతంబునం జేసి శస్త్రముఁ బట్టె నని సూచింపఁబడినది. తాత్పర్యము.— పరమేశ్వరుఁ డవతరించినవెంటనే మాయచే నత్యంతబాలుఁడై యున్నపుడె పూతన మొదలు కంసునివఱకుఁ గల లోకశత్రువులను వధించెను. మఱియు మేఘము లత్యంతము వర్షింపఁ దొడఁగఁగా గోవర్ధనపర్వతం బెత్తి గోవులుమొదలగు నాశ్రితబృందము రక్షించి యామేఘంబులను బాఱఁదోలి తన మాయాశక్తిచే స్వర్గలోకమహిమను స్తంభించి యింద్రాదుల నవమానించెను.

మఱియుఁ గంసాదుల వధించుటకు గోకులమునుండి మధుర కేతెంచుచున్న కృష్ణరాములచరిత్రముఁ బ్రశంసించుశ్రుతులు తైత్తిరీయకబ్రాహ్మణమందు.—

“ద్వే విరూపే చరత స్స్వర్థే అన్యాన్యా వత్స ముపధాపయే తే, హారి రన్యస్యాం భవతి స్వధావా న్ఛుక్లో అన్యస్యాం దదృశే సువర్చాః.”

భాష్యము—ధనుర్యాగోత్సవవ్యాజంబునఁ గృష్ణరాములఁ దోడ్కొని వచ్చుటకుఁ గంసునిచేఁ బంపఁబడిన, సువర్చాః=మంచివర్చస్సు— తేజస్సు గల యక్రూరుఁడు, చరతః = సంచరించుచున్న, ద్వే = రెండు, విరూపే = విసదృశములయిన— ఒకదానితో నొకటి సమానము కానట్టి, రూపములను, దదృశే = చూచెను. ఆరూపము లెట్టివనఁగా—స్వర్థే = గొప్పప్రయోజనముగలవి. నృసింహునందువలె నొక మూర్తియందు రెండురూపములను జూచినవాఁడు కాఁడు, మఱేమనఁగా—అన్యా అన్యా = వేఱువేఱుగానున్న రూపములను. మఱియు నెట్టిరూపములను—వత్సముపధాపయే తే—వత్సమ్=దూడను, జాత్యేకవచనము, అందుచే, గోదోహనావసరమునం దుఁ దమసమీపముననున్న గొల్లలచే దూడలను, ఉపధాపయే తే—త్రాగించుచున్నట్టి వానిని. ఇఁక విసదృశత్వమే చెప్పఁబడుచున్నవి—అన్యస్యామ్ = అన్యతరమూర్తి

యందు, అంధోకదానియందు, హారిః=హారిద్వర్ణుఁడగుటచే హారి, మేఘశ్యామలుండు, కృష్ణుఁడు, భవతి = ఉన్నాఁడు. అట్లు అన్యస్యామ్ = మఱియొకదానియందు, శుక్లః= తెల్లనివాఁడు బలదేవుఁ డున్నాఁడు. హారియెట్టివాఁ డనఁగా—స్వభావాః = స్వభ యనఁగా తనయైశ్వర్యము, అవి గలవాఁడు, ఎప్పటికిని దఱుఁగులేని నిజైశ్వర్యము గలవాఁడు. అట్టి రూపముల రెంటి నక్రూరుఁడు చూచె నని సంబంధము. తాత్ప ర్యము.—కంసునిచేఁ బంపఁబడిన యక్రూరుఁడు, భూతహితంబు అను మహాప్రయో జనముకొఱకు నవతరించి భూమియందు సంచరించుచున్నవారును గోవులతోఁ జేరి దూడలను దల్లిపాలు ద్రావించుచున్నవారును వేఱువేఱుగా నొకరివలె నొకరు గాక విలక్షణము లయిన రూపములు ధరించినవారు నగు కృష్ణరాముల నిద్దఱను జూచెను. ఆ యిద్దఱిలో కృష్ణుఁడు మేఘశ్యామలవర్ణుఁడై యపరిమిత నిజైశ్వర్య సంపన్నుండై యుండెను. బలదేవుఁడు తెల్లనివాఁడై యొప్పెను.

“పూర్వాపరం చరతో మాయయైతౌ శిశూ క్రీడన్తౌ పరియాతో అధ్వ రమ్, విశ్వా న్యన్యో భువనాని చష్ట ఋతూ న్యన్యో విదధ జ్జాయతే పునః.

భా.—మఱియు నారూపములు, పూర్వాపరమ్=ముందువెనుకకు, లేక, తూర్పుపడమరకు, చరతః=తిరుగుచున్నవి. అయినను ప్రాకృతములు గా వని చెప్పఁ బడుచున్నది—ఏతౌ=ఈకృష్ణరాములు, మాయయా=మాయచే, శిశూ=బాల్యదశను బొందినవారు, పరమార్థంబున విచారింపఁగా వయోఽవస్థాదులు లేనివారు, ఇట్లు మాయచేతనే రజకవధాదికృత్యములచే, క్రీడన్తౌ = క్రీడించుచు, అధ్వరమ్ = ధను ర్యాగస్థానమును గూర్చి, పరి = అంతటను, కువలయాపీడచాణూరకంసచాణూరాద్ధి స్థానములను, యాతః = పొందిరి. ఇఁక మున్ను విరూపే అనుటచే ఆకారమున విస దృశత్వము చెప్పఁబడినది, ఇప్పుడు సామర్థ్యమునఁగూడ విసదృశత్వము చెప్పఁబడు చున్నది—అన్యః= కృష్ణుఁడు, విశ్వాని = సమస్తము లయిన, భువనాని = భూర్భువ స్స్వరాదిలోకములను, చష్టే = సంకల్పముచేతనే తెలిసినవాఁడు. అన్యః = బలదే వుఁడు, ఋతూః = గర్భములను, మత్స్యాద్యవతారములను, విదధత్ = గ్రహిం చుచు, పునః = మాటిమాటికి, జాయతే = ఆవిర్భవించుచున్నాఁడు. తాత్పర్యము.— వారు పరమార్థంబున వయోఽవస్థారహితులైనను మాయచే బాలురవలె ముందు వెనుకకుఁ దిరుగుచు రజకవధాదులచేఁ గ్రీడించుచుఁ ధనుర్యాగమునకు వచ్చువారై కువలయాపీడచాణూరముష్టికకంసాదిస్థానములం బొందిరి. వారికి ఆకారమునమా త్రమే భేదము కాదు, సామర్థ్యమునందుఁగూడ భేదము కలదు. ఎట్లనఁగా, వారి లోఁ గృష్ణుఁడు సంకల్పమాత్రమున భూర్భువస్స్వరాది సమస్తలోకంబులను సృజించిన వాఁడు. బలదేవుఁడు మత్స్యకూర్మాద్యవతారములను గ్రహించుచు మాటిమాటి కావిర్భవించుచుండును.

ఇట్లు రెండుసేనలును యుద్ధసన్నద్ధములై యుండఁగా, ఆచార్యులను బంధువులను సుహృదులను వధింపవలెనే యని యాశంకించి «కులక్షయకృతం దోషమ్» మఱియు «ఆచార్యాః పితరః పుత్రాః» ఇత్యాదివాక్యములచే నిర్వేదము నొందినవాఁడును, నిత్యానిత్యవస్తువివేకముచేతనే తన్ను శరణుచొచ్చినవాఁడును, «అపి త్రైలోక్యరాజ్యస్య» ఇత్యాదికముచే నిహాముత్రార్థఫలభోగవిరాగము గలవాఁడును, «శిష్యస్తేఽహం శాధి మాం» అనుటచే గురుదైవతవాక్యములం దత్యంతశ్రద్ధ కలిమిం జేసి ముముక్షు గలవాఁడు నగు నర్జునునకు వర్ణాశ్రమోచిత మయిన కర్మము నుపదేశించు నవసరమునందు «న కాఙ్క్షే విజయం కృష్ణ, ఏతాన్న హన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి, శ్రేయో భోక్తుం భైక్ష్యమపి» ఇత్యాదు లగు నర్జునుని వాక్యముల వినుటవలన, అతనిని వైరాగ్యముగలవాఁ డగుటచే జ్ఞానాధికారినిగా గ్రహించి స్వరూపమును గూడ నుపదేశించెను. బృహదారణ్యకోపనిషత్తునందు ద్వయాహ ప్రాజాపత్యాది దైవాసురప్రజ్ఞానోపక్రమము ననుసరించి వేదవ్యాసుఁడు ధృతరాష్ట్రసంజయప్రశ్నోత్తరపూర్వకముగా గీతాశాస్త్రోపక్రమము గావించెను — ధర్మక్షేత్ర ఇత్యాదిగా. ఇందుఁ బూర్వకథాప్రసంగ మేమనఁగా — యుద్ధము నారంభించునపుడు కృష్ణార్జున సంవాదావసరంబున వ్యాసానుగ్రహాలబ్ధ దివ్యశ్రవణప్రజ్ఞాతిశయుం డగు సంజయుండు సాక్షాత్కృష్ణునిముఖంబునుండి వెడలిన శ్లోకములను విన్నవాఁడై సకలవాక్యసముదాయమును హృదయంబున మఱవక ధరించి హస్తినపురమునకు వచ్చెను. అతనిం జూచి ధృతరాష్ట్రుండు పృచ్ఛించెను. అట్లు భీష్మపర్వమునం జెప్పఁబడినది.— «అథ గావల్గణి ర్ధీమాన్ సమరా దేత్య సంజయః, ప్రత్యక్షదర్శీ సర్వస్య భూతభవ్య భవిష్యతః, ధ్యాయతే ధృతరాష్ట్రాయ సముపేత్యైవ మబ్రవీత్.» * అని.



* అంత గవల్గణపుత్త్రుండును బుద్ధిమంతుఁడును భూతవర్తమానభవిష్యదర్థములం బ్రత్యక్షముగాఁ జూచువాఁడు నగు సంజయుఁడు యుద్ధమునుండి వచ్చి యట నేమి జరిగెనో యని ధ్యానించుచున్న ధృతరాష్ట్రునకు సమీపించి యిట్లని పలికెను.

శ్రీ ర స్తు.

శ్రీ కృష్ణ పర బ్రహ్మణే నమః.

# శ్రీమద్రామానుజభాష్యోపక్రమణిక.

మంగళశ్లోకార్థము.—నేను ఎవ్వరిపాదపద్మములధ్యానముచే బోఁగొట్టఁబడిన సమస్తపాపములును గలవాఁడనై వస్తుత్వమును బొందినాఁడనో అట్టియామునాచార్యుల నమస్కరించుచున్నాను.

లక్ష్మీపతియును, చిదచిద్గతము లయిన వికారక్లేశాదిసమస్తదోషములు లేనివాఁడును కల్యాణగుణైకాశ్రయభూతుండును, దనకంటె భిన్నములగు సమస్త చేతనాచేతనవస్తువులకును విలక్షణంబును అపరిచ్ఛిన్నంబు నగు జ్ఞానానందైకస్వరూపము గలవాఁడును, జ్ఞానము బలము ఐశ్వర్యము వీర్యము శక్తి తేజస్సు మొదలగు స్వభావసిద్ధములు మేరలేని యతిశయము గలవి లెక్కింపనలవిగాని వగు కల్యాణగుణముల సమూహములకు సముద్ర మయినవాఁడును, తన కభిమతంబును అనురూపంబును ఏకరూపమును అచింత్యమును బరమవ్యోమనిలయంబును ఆశ్చర్యమును నిత్యమును జరాదిదోషరహితంబును నిరతిశయములైన కాంతి సౌందర్యము సౌగంధ్యము సౌకుమార్యము లావణ్యము యౌవనము మొదలగు ననంతగుణములకు నిధియు నైన యప్రాకృతవిగ్రహము గలవాఁడును, తనకు నుచితములును నానావిధములును విచిత్రములును అసంఖ్యేయములును అనంతాశ్చర్యకరములును నిత్యములును నిర్దోషములును అసంఖ్యాకములును అప్రాకృతములు నగు భూషణములు గలవాఁడును, తను కనురూపములు అసంఖ్యేయములు అచిన్త్యశక్తులు నిత్యములు నిర్దోషములు నిరతిశయకల్యాణావహములు అప్రాకృతము లగు నాయుధములు గలవాఁడును, తన కభిమతంబులును అనురూపంబులును నిత్యములును నిర్దోషములు నగు స్వరూపమును విగ్రహమును ఔజ్జ్వల్యసౌందర్యాదిగుణములును విభవంబును మేరలేని యతిశయముగలవియు అసంఖ్యేయములు నగు నైశ్వర్యశీలాదికల్యాణగుణములసమూహంబునుం గల లక్ష్మీదేవి ప్రియురాలుగాఁగలవాఁడును, తనసంకల్పము ననుసరించు స్వరూపవిశేషంబును స్థితివిశేషంబును వ్యాపారవిశేషంబును గలవారును అశేషశేషతయందుమాత్రమె ప్రీతియె స్వభావముగాఁ గలవారును నిత్యులును నిర్దోషులును నిరతిశయము లైన జ్ఞానము క్రియ యైశ్వర్యము మొదలగు నసంఖ్యేయగుణములసమూహము గలవారును అసంఖ్యేయులు నగు సూరులచే నెల్లప్పుడును మిక్కిలి స్తుతింపఁబడుచున్న పాదయుగళము గలవాఁడును, వాక్కుచేతను మనస్సుచేతను అపరిచ్ఛేద్య మయిన స్వభావము గలవాఁడును, తనకుఁ దగినవియు నానావిధము

లును విచిత్రములును అనంతములు నగు భోగ్యవస్తువులచేతను భోగోపకరణముల చేతను భోగస్థానములచేతను సమృద్ధంబును అనంత మయిన యాశ్చర్యము గలదియు అనంతమయిన మహావిభవముగలదియు అనంతమయిన పరిమాణముగలదియు నిత్యమును నిర్దోషమును నాశరహితంబు నగు పరమవ్యోమము స్థానముగాఁ గలవాఁడును, వివిధములును విచిత్రములును అనంతములు నగుభోగ్యములయు భోక్తలయు సమూహములచే నిండిన సమస్తజగముల యుత్పత్తియు స్థితియు లయమును లీలలుగాఁ గలవాఁడు నగు పరబ్రహ్మము పురుషోత్తముఁడు నారాయణుండు, బ్రహ్మాదియును స్థావరాంతము నగు సమస్తజగంబు సృజించి నిజరూపంబుననున్నచో బ్రహ్మాదిదేవలతకును మనుష్యులకును ధ్యానము ఆరాధనము మొదలగునవి చేయ నలవిగానివాఁడై, అపారకారుణ్యసౌశీల్యవాత్సల్యౌదార్యమహోదధి యగుటంజేసి, తనరూపమునే వారివారికి సదృశ మయిన విగ్రహవిశేషముగలదానిఁగా స్వస్వభావము విడువకయె చేయుచు, ఆయాలోకములం దవతరించి యవతరించి వారివారిచే నారాధింపఁబడినవాఁడై. వారివారియిష్టమున కనురూపమగు ధర్మార్థకామమోక్షాఖ్యంబగు ఫలంబొసంగుచు, భూమిభారము దింపువ్యాజంబున నస్మదాదులకుఁగూడ సమాశ్రణీయుండగుటకై భూలోకంబున నవతరించి సకలమనుష్యులచేతనుం గన్నులారఁ జూడఁబడినవాఁడై, తన్నుపాసింపసమర్థులయు అసమర్థులయు సకలజనులయు మనోనయనంబుల కానందజనకంబు లగు దివ్యచేష్టితంబులు గావించుచు, పూతన శకటాసురుఁడు యమలార్జునులు అరిష్టుఁడు ప్రలంబుఁడు ధేనుకుఁడు కాలియుఁడు కేశి కువలయాపీడుఁడు చాణూరుఁడు ముష్టికుఁడు తోసలుఁడు కంసుఁడు మొదలగువారి వధించి, అనవధికదయాసౌహార్దానురాగగర్భము లగు ఆలోకనాలాపామృతములచేఁ నఖిలప్రపంచముం దృప్తిఁబొందించుచు, తనదు నిరతిశయసౌందర్యసౌశీల్యాదిగుణగణంబులు చూపుటచే అక్రూరుఁడు మాలాకారుఁడు మొదలగువారిం బరమభాగవతులఁ గావించి, అర్జునుని యుద్ధమునకుఁ బ్రోత్సాహపఱచువ్యాజంబునఁ బరమపురుషార్థంబగు మోక్షమునకు సాధనముగా వేదాంతములందు విధింపఁబడిన స్వవిషయం బగు జ్ఞానకర్మసాధ్యమయిన భక్తియోగమును బ్రవర్తింపఁజేసెను.

అందుఁ బాండవులకును కౌరవులకును యుద్ధము ప్రారంభింపఁబడుటయుఁ బురుషోత్తముఁడు సర్వేశ్వరేశ్వరుఁడు లోకోపకారముకొఱకు మనుష్యరూప మొందినవాఁ డగు నాభగవంతుఁడు, ఆశ్రితవాత్సల్యపరవశుం డగుటచే, సర్వలోకసాక్షికముగాఁ, బార్థుని రథికుని గావించి తా నతనికి సారథి యయ్యెను.

ఇది తెలిసియు సర్వవిధంబునను అంధుండగుటచే, ధృతరాష్ట్రుఁడు దుర్యోధనునిజయము తెలియఁగోరినవాఁడై సంజయు నడిగెను.



శ్రీ

శ్రీవాసుదేవ పరబ్రహ్మణే నమః.



# శ్రీమన్మాధ్వభాష్యోపక్రమణిక.



శ్రీభగవద్గీతాప్రతిపాద్యదేవతయు అజ్ఞానపారతంత్ర్యాదిసమస్తదోషవివర్జితుండును దేశముచేతను కాలముచేతను గుణముచేతను బూర్ణుండు నగు నారాయణుని గురువు లగు వేదవ్యాసులను నమస్కరించి సంగ్రహముగా గీతార్థము చెప్పెదను.

నివృత్తిధర్మంబును జ్ఞేయ మగు వాసుదేవాఖ్యపరతత్త్వంబును బ్రకృత్యాదికమగు నపరతత్త్వంబును దెలియని సజ్జనులయెడ దయాళువు లగు బ్రహ్మరుద్రేంద్రాదులచేఁ బ్రార్థింపఁబడినవాఁడై జ్ఞేయ మగు పరాపరతత్త్వము బోధించుటకొఱకు భగవంతుం డగు నారాయణుండు వ్యాసరూపంబున నవతరించెను. అంత, ఇష్టప్రాప్తికిని అనిష్టపరిహారమునకును సాధనము తెలియమివలనను వేదార్థము తెలియమివలనను సంసారమునందు శ్రమపడుచున్న వేదానధికారులగు స్త్రీశూద్రాదులకుఁగూడ ధర్మజ్ఞానద్వారంబున మోక్షము కలుగు నని దయగలవాఁడై, సర్వవేదార్థములచే నుపబృంహితంబును, * ఆవేదములందుఁ జెప్పఁబడనిదియు నింద్రియాది నిరపేక్ష మయిన ఈశ్వరజ్ఞానముచేఁ జూడఁబడినదియు నగు నర్థముతోఁ గూడినదియు, సర్వప్రాణులకును దెలియవచ్చు నర్థమును దెలియరాని యర్థమును గలదియు, భగవత్స్వరూపమునుమాత్రమె ముఖ్యముగాఁ బ్రతిపాదించునదియు, అత్యంతగూఢ మయిన యర్థము గలదియు నగు మహాభారతసంహితను గల్పించెను.

ఆవిషయము చెప్పఁబడియు నున్నది.—

§ «లోకేశా బ్రహ్మరుద్రాద్యా స్సంసారే క్లేశినం జనమ్
వేదార్థాజ్ఞ మధీకారవర్జితంచ స్త్రియాదికమ్. ౧

---

* విరివిచేయఁబడినదియు.

§ లోకనాథు లగు బ్రహ్మరుద్రాదులు సంసారమునందు శ్రమపడుచున్న జనమును వేదార్థముఁ దెలియనిదియు నం దధికారము లేనిదియు నగు స్త్రీలు మొదలగు జనమును. ౧

అవేక్ష్య ప్రార్థయామాసు ర్దేవేశం పురుషోత్తమమ్
తతః ప్రసన్నో భగవాన్ వ్యాసో భూత్వాచ తేనచ. ౨
అన్యావతారరూపైశ్చ వేదానుక్తార్థ భూషితమ్
కేవలే నాత్మబోధేన దృష్టం వేదార్థసంయుతమ్. 3
వేదాదపి పరం చక్రే పఞ్చమం వేద ముత్తమమ్
భారతం పఞ్చరాత్రంచ మూలరామాయణం తథా. ౪
పురాణం భాగవతం చేతి సంభిన్న శ్శాస్త్రపుఙ్గవః. "
అని నారాయణాష్టాక్షరకల్ప మందు.

* "బ్రహ్మాపి త న్న జానాతి ఈషత్సర్వోపి జానతి
బహ్వర్థ మృషయ స్తత్తు భారతం ప్రవద న్తి హి. "
అని యుపనారదీయమందు.

§ "బ్రహ్మాద్యైః ప్రార్థితో విష్ణు ర్భారతం స చకారహ
యస్మిన్ దశార్థా స్సర్వత్ర న జ్ఞేయా స్సర్వజన్తుభిః. "
అని నారదీయమందు.

$ "భారతంచాపి కృతవాన్ పఞ్చమం వేద ముత్తమమ్
దశావరార్థం సర్వత్ర కేవలం విష్ణుబోధకమ్. ౧

---

చూచి దేవేశుండగు పురుషోత్తమునిఁ బ్రార్థించిరి. అంత భగవంతుఁడు ప్రసన్నుఁడై వ్యాసరూపంబున నవతరించి యావ్యాసరూపంబుచేతను. ౨

ఇతరము లయిన యవతారరూపములచేతను వేదములందుఁ జెప్పఁబడని యర్థముచే నలంకరింపఁబడినదియు నింద్రియాదినిరపేక్ష మయిన యీశ్వరజ్ఞానముచే దృష్ట మయినదియు వేదార్థముతోఁ గూడినదియును. 3

వేదముకన్న నధికంబును ఉత్తమము నగు పంచమవేదమును గావించెను. పంచమవేద మగు భారతమును పంచరాత్రంబును మూలరామాయణంబును. ౪

భాగవతమును పురాణమును అను శాస్త్రోత్తమము ఏకార్థముగా సంగతమయి యున్నది.

* దాని యర్థమునంతయు బృహస్పతిగూడ నెఱుంగఁడు. కొంచెము సమస్తజనముగూడ నెఱుంగును. అట్టిదాని పెక్కర్థములుగల దనియు భారత మనియు ఋషులు చెప్పుదురు.

§ బ్రహ్మాదులచేఁ బ్రార్థితుండై యావిష్ణువు దేనియం దంతటను సర్వప్రాణులచేతను దెలియరాని పదియర్థములు గలవో అట్టి భారతమును జేసెను.

$ ఉత్తమమయిన పంచమవేదమును అంతటను పదియర్థములు గలదియు కేవలము విష్ణుబోధక

పరోక్షార్థంతు సర్వత్ర వేదాద ప్యుత్తమం చ యత్. ”
అని స్కాందమందు.

“ యది విద్యా చ్చతుర్వేదాన్ సాఙ్గోపనిషదా న్ద్విజః
నచే త్పురాణం సంవిద్యా న్నైన స స్యా ద్విచక్షణః. ౧
ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్
బిభే త్యల్పశ్రుతా ద్వేదో మా మయం ప్రచలిష్యతి. ౨
మన్వాది కేచి ద్బ్రువతే హ్యాస్తీకాది తథాపరే
తథోపరిచరా ద్యన్యే భారతం పరిచక్షతే. ౩
భారతం సర్వవేదాశ్చ తులా మారోపితాః పురా
దేవై ర్బ్రహ్మాదిభి స్సర్వై ఋషిభిశ్చ సమన్వితైః.
వ్యాస స్యైవాజ్ఞయా తత్ర వ్యత్యరిచ్యత భారతమ్
మహత్త్వా ద్భారవత్త్వాచ్చ మహాభారత ముచ్యతే. ౪
నిరుక్త మస్యయో వేద సర్వపాపైః ప్రముచ్యతే
యది హాస్తి త దన్యత్ర య న్నేహాస్తి న తత్ క్వచిత్. ౬
విరాటోద్యోగసారవాన్.” §

మును అంతటను మిక్కిలి గూఢమయిన యర్థము గలదియు వేదముకన్నను ఉత్తమము నగు భారతమును గూడ చేసెను.

§ ద్విజుఁడు అంగములతోను ఉపనిషత్తులతోనుం గూడిన నాలుగువేదములనుం దెలిసినను, బురాణము చక్కఁగాఁ దెలియనిపక్షమున అతఁడు పండితుఁడు కానేకాఁడు. ౧

ఇతిహాసపురాణములచే వేదమును వివరివిచేయవలయును. ఇతఁడు నన్నుఁ గదలించును— నా కపార్థము చేయును అని యల్పశ్రుతునివలన వేదము భయపడుచున్నది. ౨

భారతగ్రంథము కొందఱు “ నారాయణం నమస్కృత్య ” అను మహామంత్రము ప్రారంభముగాఁ గలది యని చెప్పుచున్నారు. కొందఱు ఆస్తీకచరిత్రము ప్రారంభముగాఁ గలది యనియు మఱికొందఱు ఉపరిచరునిచరిత్రము ప్రారంభముగాఁ గలద యనియుఁ జెప్పుచున్నారు. ౩

బ్రహ్మాదులగు దేవతలచేతను సమస్తమహర్షులచేతను కలిసి, మున్ను భారతమును సమస్తవేదములును, వ్యాసునియాజ్ఞచేతనే త్రాసునం దుంపఁబడినవి. అందు భారత మధికమయ్యెను. మహత్తు— గొప్పది యగుటవలనను, భారము గలది యగుటవలనను మహాభారత మని చెప్పఁబడుచున్నది. ౪

దీని శబ్దార్థము నెవ్వఁడు తెలియునో అతఁడు సమస్తపాపములచేతను విడువఁబడును. ఏది యిందున్నదో అదియే యితరగ్రంథములందు నున్నది. ఇం దేదిలేదో అది యెందును లేదు. ౬

విరాటపర్వము ఉద్యోగపర్వము అను చేవ గలది.

అనునది మొదలగు నాభారతమునందలి వాక్యములం బర్యాలోచించుట చేతను, వైశంపాయనాది మహర్షులు శిష్యుల కుపదేశించుటవలనను,

* "కోహ్యన్యః పుణ్డరీకాక్షా న్మహాభారత కృద్భవేత్."

అనునది మొదలగు పురాణగ్రంథాంతరమునందలి వాక్యముయొక్క అన్యథానుపపత్తిచేతను, § నారదుఁ డధ్యయనించుట మొదలగు హేతువులచేతను పూర్వోక్తార్థము నిశ్చిత మగుచున్నది.

అట్లు కానియెడ, భారతశబ్దార్థజ్ఞానమాత్రంబున సర్వపాపక్షయం బెట్లగును? తద్బాధకప్రమాణము లేమింజేసి యయ్యర్థము ప్రసిద్ధంబే యగుచున్నది.

మఱియు నెట్లితరునకుఁ జేయనలవి గాదు? "కోహ్యన్యః" ఇత్యాది వచనము గ్రంథాంతరగత మగుటవలనను ఇది అవిద్యమానార్థస్తుతి గాదు.

గ్రంథకర్తృత్వము నారాయణునియందేగాక తదితరులయందును సమాన మగుటవలన ఈస్తుతి కర్తకు మాత్రమే కాదు భారతమునకుఁగూడ నని యంగీకరింపవలెను.

అట్టి మహాభారతమునందు వాసుదేవార్జునసంవాదప్రతిపాదకంబును సర్వభారతార్థసంగ్రహముగలదియు భారతంబు అను పారిజాతమునకుఁ దేనెయయినదియు నగు గీతను గ్రథితము గావించెను. అదియుం జెప్పఁబడినది.—

$ "భారతం సర్వశాస్త్రేషు భారతే గీతికా వరా
విష్ణో స్సహస్రనామాపి జ్ఞేయం పాఠ్యంచ తద్ద్వయమ్."

అని మహాకౌర్మ్యమునందు.

¶ "సహిధర్మ స్సుపర్యాప్తో బ్రహ్మణః పదవేదనే."

ఇత్యాదిగా ననుగీతలయందునుం జెప్పఁబడినది.

ఇది శ్రీమదానందభగవత్పాదార్యవిరచితం బగు శ్రీమద్గీతాభాష్యమునందుఁ బ్రథమాధ్యాయము.

---

* విష్ణువుదక్క మఱియెవ్వఁడు మహాభారతకర్త యగును?

§ మహాభారతము సర్వోత్తమ మని యంగీకరింపకున్నచో నీవాక్య మనుపపన్న మగుటచేతను.

$ భారతము సమస్తశాస్త్రములయందును శ్రేష్ఠము, భారతమునందు గీత శ్రేష్ఠము, విష్ణుసహస్రనామమును శ్రేష్ఠము. అవి రెండును దెలియవలసినవియుఁ బఠింపవలసినవియు.

¶ అగీతాప్రతిపాదిత మయిన ధర్మము జ్ఞానముకన్న ముందు అనుష్ఠితమయి బ్రహ్మస్వరూపజ్ఞానము కలిగించుటయందును బ్రహ్మస్వరూపజ్ఞానము కలిగిన పిమ్మట ననుష్ఠితమై ముక్తి కలిగించుటయందును మిక్కిలి సమర్థము.

శ్రీ

శ్రీ కృష్ణాయ నమః.

శ్రీ భగవద్గీతా పారాయణప్రారంభమునఁ బ్రతిదినము చేయవలసిన

# అనుసంధానక్రమము.

స్వస్వసంప్రదాయానుసారముగా గురుస్మరణానంతరము.—

అస్య శ్రీభగవద్గీతాశాస్త్రమహామంత్రస్య, శ్రీవేదవ్యాసో భగవానృషిః, అనుష్టుప్ ఛందః, శ్రీమహావిష్ణుః పరమాత్మా శ్రీమన్నారాయణో దేవతా, అశోచ్యానన్వశోచ స్త్వమితిబీజమ్, సర్వధర్మాన్పరిత్యజ్య మామేకంశరణంవ్రజేతిశక్తిః, అహంత్వా సర్వపాపేభ్యోమోక్షయిష్యామిమాశుచఇతికీలకమ్, మమ శ్రీగోపాలకృష్ణప్రసాదసిద్ధ్యర్థే పారాయణేవినియోగః, శ్రీమజ్జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయఅంగుష్ఠాభ్యాంనమః, శ్రీమదైశ్వర్యాత్మనే గోవిందాయతర్జనీభ్యాంస్వాహా, శ్రీమచ్ఛక్త్యాత్మనే వేదవ్యాసాయ మధ్యమాభ్యాంవషట్, శ్రీమద్బలాత్మనే బలభద్రరామాయఅనామికాభ్యాంహుమ్, శ్రీమత్తేజసాత్మనే వాసుదేవాయకనిష్ఠికాభ్యాంవౌషట్, శ్రీమద్వీర్యాత్మనే విజయాయ గాండీవధన్వనే అర్జునాయ కరతలకరపృష్ఠాభ్యాంఫట్, ఏవం హృదయాదిన్యాసః.

భూర్భువస్సువరోమితి దిగ్బంధః.

ధ్యానమ్. ప్రపన్నపారిజాతాయ తోత్త్రవేత్త్రైకపాణయే
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః. ౧
సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్. ౨
వాచకః ప్రణవో యస్య క్రీడా వ స్త్వఖిలం జగత్
శ్రుతి రాజ్ఞా వపు ర్జ్ఞానం తం వన్దే దేవకీసుతమ్. ౩
సారథ్య మర్జున స్యాజౌ కుర్వన్ గీతామృతం దదౌ
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః. ౪
వన్దే కృష్ణార్జునౌ వీరౌ నరనారాయణౌ ప్రభూ
ధార్తరాష్ట్రకులోన్మత్తగజారోహణవల్లభౌ. ౫

కరకలితనిదర్శితాత్మముద్రః పరికలితోన్నతబర్హిబర్హచూడః
ఇతరకరగృహీతవేత్రతోత్రో మమ హృది సన్నిధి మాతనోతు శౌరిః.

కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనమ్
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్. ౭

అగ్రే కృత్వా కమపి చరణం జాను నైకేనతిష్ఠ
పశ్చాత్పార్థం ప్రణయరసజుషా చక్షుషా వేక్షమాణః
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథ మధివసన్ పాతు నస్సూతవేషః. ౮

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ
మమ్బ త్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీ. ౯

గీతాశాస్త్ర మిదం పుణ్యం యః పఠేత్ ప్రయతః పుమాన్ దేనేయ్
విష్ణోః పద మవాప్నోతి భయశోకాదివర్జితః. ౧౦

గీతాధ్యయనశీలస్య ప్రాణాయామపరస్య చ
నైవ సన్తిహి పాపాని పూర్వజన్మకృతానిచ. ౧౧

మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే
సకృద్గీతామ్భసి స్నానం సంసారమలమోచనమ్. ౧౨

గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రసంగ్రహైః
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిస్సృతా. ౧౩

భారతామృతసర్వస్వం విష్ణో ర్వక్త్రా ద్వినిస్సృతమ్
గీతాగఙ్గోదకం పీత్వా పున ర్జన్మ న విద్యతే. ౧౪

ఏకం శాస్త్రం దేవకీపుత్రగీత మేకో దేవో దేవకీపుత్ర ఏవ
ఏకో మన్త్ర స్తస్య నామాని యాని కర్మా ప్యేకం తస్య దేవస్య సేవా.



శ్రీ ర స్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

శ్రీ పరమార్థచంద్రికాసహిత

# శ్రీభగవద్గీత, ప్రథమాధ్యాయము.

మూలమ్. ధృతరాష్ట్ర ఉవాచ.

✻ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాణ్డవా శ్చైవ కిమకుర్వత సఞ్జయ. ౧

శ్రీశాంకరభాష్యము.—

ఇందు కారంభము—ధృతరాష్ట్రుండు పలికెను ధర్మక్షేత్ర ఇత్యాదిగా.

ఆనందగిరికృత టీక.—

ఇట్లు గీతాశాస్త్రము సాధ్యసాధనభూత నిష్ఠాద్వయవిషయమయి పరాపరాభిధేయప్రయోజనవంతం * బగుటంజేసి వ్యాఖ్యానయోగ్యం బని ప్రతిపాదించి శాస్త్రమును వ్యాఖ్యానము చేయఁ గోరినవారై యం దేకదేశ మగుద్వితీయాధ్యాయైకదేశసహిత మయినప్రథమాధ్యాయమునకుఁ దాత్పర్యము చెప్పఁబోవుచుఁ గథాసంబంధప్రదర్శనార్థము ప్రారంభము చూపుచున్నారు— ఇందు కని. ఈ గీతాశాస్త్రంబునఁ బ్రథమాధ్యాయము ప్రథమశ్లోకము కథాసంబంధప్రదర్శనపరం బని యర్థము.

---

✻ ఈ ప్రథమాధ్యాయమునకును ద్వితీయాధ్యాయము పదియవశ్లోకము వఱకును శ్రీశాంకరభాష్యమునందును పైశాచభాష్యమునందును శ్రీమద్రామానుజ శ్రీమాధ్వభాష్యములందును బ్రతిపదటీక వ్రాయఁబడ లేదు. శ్రీరామానుజభాష్యమున అచ్చటచ్చటఁ దాత్పర్యసంగ్రహము వ్రాయఁబడినది.

* పర=జ్ఞేయ మయిన నిర్విశేషబ్రహ్మము, అపర=ధ్యేయ మయిన సగుణబ్రహ్మము అను, అభిధేయ = విషయమును, పర = మోక్షము, అపర = మనోనిగ్రహము మొదలగునది అను, ప్రయోజనవంతంబు = ప్రయోజనమునుం గలది.

ఇందుకుఁ బ్రతిపదటీక.——ధృతరాష్ట్రః = ధృతరాష్ట్రుఁడు; ఉవాచ = పలికెను. ధృతరాష్ట్రుఁడు ప్రజ్ఞాచక్షువు అనఁగా బుద్ధియే నేత్రముగాఁ గలవాఁడు గదా! వెలుపలినేత్రము లేనివాఁ డగుటచే వెలుపలిసంగతిని బ్రత్యక్షముగాఁ దెలిసికొన నసమర్థుండై సమీపంబున నున్నవానికిని దనకు హితము నుపదేశించువాఁడు నగు సంజయు నడుగుచున్నాఁడు—ధర్మక్షేత్రే అని. సంజయ=సంజయుఁడా! ధర్మక్షేత్రే= ధర్మమునకును ధర్మబుద్ధికిని అభివృద్ధికారణ మగు; కురుక్షేత్రే = కురుక్షేత్రమునందు; సమవేతాః = చేరినవారును; యుయుత్సవః = యుద్ధము చేయఁగోరినవారు నగు; మామకాః = కొందఱు నావార లగు దుర్యోధనాదులును; పాణ్డవాశ్చైవ = మఱికొందఱు పాండుకుమారు లగు యుధిష్ఠిరాదులును; కిమ్ = ఏకార్యమును; అకుర్వత = చేసిరి?

సంజయా! ధర్మక్షేత్ర మగుకురుక్షేత్రమునందు యుద్ధము సేయుటకై చేరిన మాదుర్యోధనాదులును పాండవులును వీరందఱు యుద్ధభూమియందుఁ జేరిన పిమ్మట నేమి చేసిరి? చెప్పు మని తాత్పర్యము.

శంకరానందసరస్వతీకృత వ్యాఖ్యానము.——

అం దారంభంబున యుద్ధసన్నద్ధు లయినపాండవులయు ధార్తరాష్ట్రులయు వృత్తాంతము వినఁగోరినవాఁడై ధృతరాష్ట్రుఁడు పలికెను.—ధర్మక్షేత్రే= ధర్మప్రధాన మగుటవలన, ధర్మము నిచ్చునది యగుటవలన, లేక, ధర్మనాశమునుండి రక్షించునది యగుటవలన ధర్మక్షేత్ర మయినది, నివాసము చేయుటమాత్రముచేతనే ధర్మమును తత్ఫలంబును ఇచ్చునది యగు; కురుక్షేత్రే, యుయుత్సవః = యుద్ధముచేయఁ గోరినవారును, ఇందువలననే; సమవేతాః = చేరికను పొందినవారు నగు; మామకాః = దుర్యోధనాదులును; పాణ్డవాశ్చైవ; కిమ్ = ఏకార్యమును; అకుర్వత = చేసిరి? సంజయా! దాని చెప్పు మని యర్థము.

అయ్యా! ఇచట యుయుత్సవః— యుద్ధముచేయఁగోరినవారు అనువిశేషణము స్వారస్యముచే, చేరినట్టివారలకుఁ జేయవలసినకార్యము యుద్ధమే యగుటవలన యుద్ధమే చేయవలసినదిగాఁ దెలియుచుండఁగా "ఎట్లు యుద్ధము జరగెను?" అని యడుగుటను విడిచి "కి మకుర్వత సంజయ — ఏమిచేసిరి సంజయా" అని ధృతరాష్ట్రుం డడుగుట యుపపన్నము గాదు? అని శంకింపఁ దగదు. ఎందు వలన ననఁగా—ధర్మక్షేత్రే అని చెప్పుటవలన, ఆక్షేత్రముయొక్క ప్రభావముచేఁ దన

యంతనే ధర్మమునం దాసక్తుఁడై దుర్యోధనుఁడు పాండవులకు వారిపిత్ర్య మగుటచే ధర్మ్యం బగునర్థరాజ్యము నిచ్చినవాఁడా? లేక, తత్క్షేత్రప్రభావముచేతనే ధర్మబుద్ధి యధికమయి ధర్మపుత్త్రుఁడు బంధువుల వధించుట నరకము కలిగించు నని నరక భయమువలన యుద్ధమునుండి విరమించెనా? లేక, అందఱును యుద్ధమే చేసిరా? అచట నేమి జరిగెనో అది చెప్పు మని ధృతరాష్ట్రుం డడుగుట మిక్కిలి యుపపన్నమే యగు నని యర్థము.

మధుసూదనసరస్వతీకృత వ్యాఖ్యానము.—

ధృతరాష్ట్రుఁడు మున్ను పాండవులకు జయము కలుగు ననుటకు బహువిధ మయినకారణమును విన్నవాఁ డగుటవలనఁ దనపుత్త్రునకు రాజ్యభ్రంశ మగు నేమో యని భయపడినవాఁడై, ఎట్లయినను దనపుత్త్రునకు జయము సిద్ధించుట కవకాశ మేమేని కలుగదా యను నాశతో సంజయు నడిగెను.—

యుయుత్సవః = పూర్వము యుద్ధము చేయఁగోరినవా రైనను; కురుక్షేత్రే — కురుక్షేత్రమందు; సమవేతాః = చేరిన; మామకాః = దుర్యోధనాదులును; పాణ్డవాశ్చైవ = పాండవులును; కిమ్ అకుర్వత = ఏకార్యము చేసిరి? ఏమి పూర్వము కలిగినయుద్ధేచ్ఛ ననుసరించి యుద్ధమే చేసిరా? లేక, ఒకానొకనిమిత్తముచే యుద్ధేచ్ఛ వదలి వేఱే యేదోయొకటి చేసిరా? యుద్ధేచ్ఛ నివర్తించుటకుఁ గారణము భీష్ముఁడు అర్జునుఁడు మొదలగు వీరపురుషు లుండుటచే దృష్టమయిన భయం బనునది ప్రసిద్ధముగానే యున్నది. అదృష్టమయిన భయమును గూడఁ జెప్పుచున్నారు—ధర్మక్షేత్రే = పైరునకు కయ్యవలె ధర్మమునకు లేనిదాని నుత్పత్తిని ఉన్నదానికి వృద్ధిని కలిగించునది, అట్టిది కురుక్షేత్రము సర్వశ్రుతిస్మృతిప్రసిద్ధము, ఎట్లనఁగా—“బృహస్పతి రువాచ యాజ్ఞవల్క్యం య దను కురుక్షేత్రం దేవానాం దేవయజనం సర్వేషాం భూతానాం బ్రహ్మసదనమ్” అని జాబాలశ్రుతియు, కురుక్షేత్రం వై దేవయజనమ్” అని శతపథశ్రుతియుఁ జెప్పుచున్నవి. ఆకురుక్షేత్రమునందుఁ జేరినపాండవులు ముందే ధార్మికులు ఉభయపక్షంబుల హింసించుటచేఁ గలుగునధర్మంబువలన భయము నొంది యుద్ధము నుండి నివర్తిల్లుదు రేని యంత నాకుమారులకు రాజ్యము సిద్ధమే యగును. అటుగాక, ధర్మక్షేత్రప్రభావముచేఁ బాపులైనను నాపుత్త్రు లొకవేళ చిత్తప్రసాదము నొంద వచ్చును. అపుడు వారు పశ్చాత్తాపము నొంది తాము కపటముచే సంపాదించినరాజ్యమును బాండవుల కిత్తు

లేని, ఆపక్షమున యుద్ధము జరగకున్నను హేతులే యగుదురు. ఇట్లు రాజ్యము తన తనూజులకు వచ్చునట్లును పాండవులకు రా కుండునట్లును దృఢతర మయిన యుపాయముదోఁపకున్న ధృతరాష్ట్రుని గొప్పపరితాపమే ప్రశ్నమునకుఁ గారణము. సంజయ యనుసంబోధనము « నీవు రాగద్వేషాదిదోషములను జక్కఁగా జయించిన వాఁడ వగుటచే నిష్కపటముగనే చెప్ప వలెను " అని సూచించుచున్నది. « మామకాః కిమకుర్వత—నా కొడుకు లేమి చేసిరి " అను నింతమాత్రమే ప్రశ్నమునకుఁ జాలి యుండఁగా « పాణ్డవాశ్చ—పాండవులును " అని వేఱుగాఁ జెప్పి పాండవులయందు మమకారము లేమిని దెలుపుటచే వారలయందుఁ దనకుం గల ద్రోహమును దెలుపుచున్నాఁడు.

శ్రీధరస్వామికృత వ్యాఖ్యానము.—

అందు ధర్మక్షేత్ర ఇత్యాదిగా విషీదన్నిదమబ్రవీత్ అనువఱకుఁ గల గ్రంథముచే శ్రీకృష్ణార్జునసంవాద ప్రస్తావముకొఱకుఁ గథ నిరూపింపఁబడుచున్నది. అంతఁగడవఱకు ధర్మజ్ఞానార్థ మయిన వారిసంవా[illegible]న్నది. అందు ధర్మక్షేత్రే యనుశ్లోకమున ధృతరాష్ట్రుఁడు హ[illegible]మున్న తన సారథి యగుసంజయునిఁ గురుక్షేత్రవృత్తాంత మడుగఁగా సంజయుండు హస్తినాపురమున నున్నవాఁడయ్యును వ్యాసులయనుగ్రహమువలన దివ్యదృష్టిగలవాఁడై కురుక్షేత్రవృత్తాంతమును బ్రత్యక్షముగాఁ జూచుచున్నవాఁడపోలె ధృతరాష్ట్రునకుఁ జెప్పెను—దృష్ట్వాతు పాణ్డవానీక మిత్యాదిగా.

సంజయ = ఓయి సంజయుఁడా! ధర్మక్షేత్రే = ధర్మభూమియగు కురుక్షేత్రమందు, నాకొడుకులును పాండుపుత్త్రులును, యుయుత్సవః = యుద్ధముచేయఁగోరినవారై; సమవేతాః = చేరినవారై; ఏమి చేసిరి ?

పరమార్థప్రప.—

ధర్మక్షేత్రే=అచట మృతిఁబొందినవారలకు సద్గతినిచ్చునట్టి;కురుక్షేత్రే; యుయుత్సవః = పోరఁగోరినవారును; సమవేతాః = చేరినవారునగు; మామకాః=నాకొడుకులును; పాణ్డవాశ్చైవ; కిమ్‌అకుర్వత=ఏమిచేసిరి ? అదిచెప్పు మని యడిగెను.

దృష్ట్వా తు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. ౨

ఆ. భీష్ముఁడు మొదలగు ధీరపురుషులచే నధిష్ఠితంబై ప్రబలంబగు మాసేనం జూచి పాండవులు భయము నొందిరా? లేక యుభయపక్షములను హింసించుట వలనం గలుగు నధర్మమునకు భయపడిరా? అట్లయినయెడ వారు యుద్ధమునుండి యుపరమింతురు. అని యిట్లు పుత్త్రపరవశుండును బుత్త్రస్నేహాభినివిష్టుం డగు ధృతరాష్ట్రుం డడుగఁగా, సఞ్జయః = సంజయుఁడు; ఉవాచ = పలికెను, ఉత్తరము చెప్పెను—వ్యూఢమ్ = వ్యూహములుగాఁ బన్నంబడిన, మిక్కిలి శూరులగు ధృష్టద్యుమ్నాదులచే వ్యూహములుగాఁ దీర్పఁబడిన దనుట; పాణ్డవానీకమ్ = పాండుకుమారులగు యుధిష్ఠిరాదులసైన్యమును; దృష్ట్వా = చూచి; రాజా=రాజయిన; దుర్యోధనస్తు = దుర్యోధనుఁడుమాత్రము, తు—మాత్రము అనుటచే పాండవులకు భయప్రసక్తియే లేదు, మ ఱేమనఁగా, దుర్యోధనునకే పాండవసేనం జూడఁగా మహాభయము కలిగె నని సూచింపఁబడుచున్నది, అట్లు పాండవసైన్యమును బ్రత్యక్షముగాఁ దెలిసికొని భయపడినవాఁడై; తదా=అప్పుడు, యుద్ధమున కారంభించు నవస్థయందు; ఆచార్యమ్ = ధనుర్విద్యాగురు వగు ద్రోణుని; ఆచార్యశబ్దముచే, తనకు విద్య నేర్పినవాఁడును రక్షకుండు నని ద్రోణుని శ్లాఘించుచు నని యర్థము. ఉపసంగమ్య = సమీపము చక్కఁగా పొంది, వినయమున ద్రోణాచార్యుని సమీపమునకుఁ బోయి; వచనమ్ = వాక్యమును, అర్థము గల మాట యనుట; అబ్రవీత్ = పలికెను, మిక్కిలి భయపడినవాఁడైనను బెదరునంజేసి తడఁబడి యసంబద్ధప్రలాపములు సేయఁ డయ్యెను, మ ఱేమనఁగా తేజస్వి యగుటచే యర్థసహిత మగు వాక్యమునే పలికె నని యర్థము.

ధృష్టద్యుమ్నాదిమహావీరులచే వ్యూహములుగాఁ దీర్పఁబడియున్న పాండవసైన్యమును జూచినంతనే దుర్యోధనుఁడు భయము నొందినవాఁడై యాచార్యుండగు ద్రోణునియొద్దకుఁ బోయి యీవాక్యముఁ బలికె నని తాత్పర్యము.

శం. మూఁడవపక్షమే సిద్ధించె నని సంజయుఁడు చెప్పెను—రాజా దుర్యోధనః= రాజయిన దుర్యోధనుఁడు; తదా = యుద్ధసన్నాహసమయమందు; వ్యూఢమ్= మొగ్గరములుగా తీరియున్న; పాణ్డవానీకమ్ = పాండవులసైన్యమును; దృష్ట్వాతు = చూచినంతనే; ఆచార్యమ్= ధనుర్విద్యాగురు వగు ద్రోణుని; ఉపసంగమ్య; వచనమ్, అబ్రవీత్—పాండవసైన్యమునందలి యతిశయము వర్ణించుటచేఁ దన సైన్యమునకు శౌర్యము బలము పౌరుషము నుత్సాహము వృద్ధిఁబొందింపఁ గోరినవాఁడై యీ వాక్యముఁ బలికెను.

మ. ఇట్లు దయాదృష్టి వ్యవహారదృష్టి యీరెండును లేనివాఁ డగుటచే మిక్కిలి యంధుండును బుత్త్రస్నేహ మెక్కుడే పట్టినవాఁడు నగు ధృతరాష్ట్రుం డడుగఁగా నతనియభిప్రాయముఁ దెలిసినవాఁడును బరమధార్మికుఁడు నగు సంజయునియుత్తరమునకు వైశంపాయనుని యవతారిక—సంజయ ఉవాచ అని.

అందుఁ బాండవులకు దృష్టభయము కల దనుటకుఁ గారణమే లేదు. అదృష్టభయముమాత్రము భ్రాంతిచే నర్జునునకుఁ గలిగెను. భగవంతునిచేఁ బోఁ గొట్టఁబడెను. అని పాండవుల యతిశయము తు అను శబ్దముచేఁ దెలుపఁబడు చున్నది. నీకొడుకులు పాండవులకు రాజ్యమును మరల నిచ్చియుందు రను శంకచేత మాత్రము దుఃఖపడవలదని ధృతరాష్ట్రుని సంతోషపెట్టుటకై దుర్యోధనుని దౌష్ట్య మునే మొదట వర్ణించుచున్నాఁడు—వ్యూఢమ్ = ధృష్టద్యుమ్నాదులచే వ్యూహ ములుగాఁ దీర్చి స్థాపింపఁబడిన; పాణ్డవానీకమ్ = పాండుపుత్త్రులసైన్యమును; దృష్ట్వా = చక్షుర్జన్యజ్ఞానమునకు విషయమునుగాఁ జేసి; తదా = యుద్ధారంభకాలమునందు; ఆచార్యమ్ = ధనుర్విద్యాసంప్రదాయమును బ్రవర్తింపఁజేసిన ద్రోణుని; ఉపసం గమ్య = తానే తత్సమీపమునకుం బోయి, ఆయనను దనసమీపమునకుఁ బిలిచి కా దనుట, ఇందుచేఁ బాండవసైన్యముఁ జూచుటచేఁ గలిగిన భయము సూచింపఁబడు చున్నది, భయముచేఁ దన రక్షణముకొఱకు ద్రోణునియొద్దకుఁ బోయినను ఆచార్యుని యందలి గౌరవముచేఁ బోయినట్లు నటించి భయమును ఇతరులకుఁ దెలియనియట్లు ఆచ్ఛాదించుట రాజనీతికుశలుఁ డగుటవలన నని చెప్పుచున్నాఁడు.—రాజా అని. ఆచార్యందుర్యోధనోఽబ్రవీత్—ఆచార్యునితో దుర్యోధనుఁడు పలికెను అన్నంత మాత్రముననే నిర్వాహ మగుచుండఁగా వచనమ్ అని చెప్పుట సంక్షిప్తత అధి కార్థత మొదలగు పెక్కుగుణములతోఁ గూడిన వాక్యవిశేష మని తెలుపుటకు, లేక, మాటమాత్రమే పలికెనుగాని యేయర్థమునుం జెప్పినవాఁడు కాఁడు అని తెలుపుటకు.

శ్రీ. వ్యూఢమ్ = వ్యూహములుగాఁ దీరియున్న; పాణ్డవానీకమ్; దృష్ట్వా; ఆచార్యమ్ ఉపసంగమ్య = ద్రోణాచార్యసమీపమును బొంది; రాజా దుర్యోధనః; వచనమ్ = చెప్పఁబోవువాక్యమును; అబ్రవీత్ = పలికెను.

ప. రాజాదుర్యోధనః = రాజయిన దుర్యోధనుఁడు; వ్యూఢమ్ = వ్యూహ ములుగాఁ దీరియున్న; పాణ్డవానీకమ్; దృష్ట్వా; ఆచార్యమ్ = ద్రోణుని; ఉపసంగమ్య; వచనమ్, అబ్రవీత్.

పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా. 3

ప్ర. ఆవాక్యమునే యుదాహరించుచున్నాఁడు.—ఆచార్య = ఆచార్యుఁడా! ఏతామ్ = ఈ; మహతీమ్ = గొప్పదియు; తవ = నీయొక్క; శిష్యేణ = శిష్యుఁడును; ధీమతా = బుద్ధిమంతుఁడు నగు; ద్రుపదపుత్రేణ = ద్రుపదరాజకుమారుఁ డయినధృష్టద్యుమ్నునిచేత; వ్యూఢామ్ = వ్యూహములుగాఁ దీర్పఁబడినదియు నగు; పాణ్డుపుత్రాణామ్ = పాండవులయొక్క; చమూమ్ = సేనను; పశ్య = చూడుము. ఇందు, ఏతామ్ = ఈ, మనయెదుట నీవు మొదలగు మహాపురుషులనుగూడ లక్ష్యపెట్టక నిర్భయమై నిలుచున్నది, మహతీమ్ = గొప్పది, అనఁగా పెక్కు—అక్షౌహిణులతోఁ గూడినది, కలఁతపెట్ట శక్యముకానిది అగు, పాణ్డుపుత్రాణామ్ = పాండవులయొక్క, పాండవులచే తేఁబడిన దాని ననుట; చమూమ్ = సేనను; పశ్య = చూడుము, అని యాచార్యుని దుర్యోధనుఁడు నియోగించుచున్నాఁడు. ఇట్లు నియోగించుద్వారమున నతనియెడఁ బాండవులకుఁ గల యలక్ష్యబుద్ధిని దెలిపి వారియం దాయనకుఁ గ్రోధాతిశయము పుట్టింపఁగోరుచున్నాఁడు. శత్రుసేనయతిశయముఁ జెప్పుద్వారమునఁ బరపక్షమునందును స్వపక్షమునందును నీవలనఁ గలిగిన బలమే యని సూచించుచు, ఆచార్యునకుఁ బరపక్షనిరసనము సులభమే యని తలంచినవాఁడై చెప్పుచున్నాఁడు—ద్రుపదపుత్రేణ = ద్రుపదరాజుకుమారుఁడు, తవశిష్యేణ = నీయొద్దనే ధనుర్విద్య నేర్చినవాఁడు, ధీమతా—తానును శస్త్రాస్త్రవిద్యయందుఁ బండితుండు మహాప్రభావుఁ డని లోకమునందు ఖ్యాతిఁ బొందినవాఁ డగు ధృష్టద్యుమ్నునిచేత; వ్యూఢామ్ = వ్యూహములుగాఁ దీర్చి యధిష్ఠిత మయిన, యీసేనను ఏల తెలియకున్నావు? ఎందు కోర్చి యున్నావు? అని యర్థము.

ఆచార్యా! లోకమున కంతయు ధనుర్విద్యాచార్యుఁడ వగు నీవు మొదలగు మహాపురుషులనుగూడ లక్ష్యపెట్టక కొంచెమైనను భయపడక పెక్కక్షౌహిణులతోఁ గూడినదై యక్షోభ్య మయి నిలుచున్నయీపాండవసేనం జూడుము. నీశిష్యుఁడు ద్రుపదరాజుకొడుకు మహాప్రభావుఁ డని ప్రసిద్ధుఁ డగు ధృష్టద్యుమ్నుఁడు దీనికి నాయకుఁడై యున్నాఁడు. ఇది తెలిసి యెట్లు లోర్చియున్నావు? అని తా.

శం. “ఉవాచ మధుసూదనః” అనుచోట “శ్రీభగవానువాచ” అని యున్నట్లు, ఇచటఁగూడ “దుర్యోధన ఉవాచ—దుర్యోధనుఁడు చెప్పెను” అని

యుండవలెను. అయినను అట్లు పాఠము కనఁబడదు. అది పొరపాటు. ఓయి యాచార్యుఁడా! ధీమతా = సూక్ష్మబుద్ధిగల; తవశిష్యేణ = నీశిష్యుఁ డగు, ఇది గూఢాభిప్రాయముగల మాట; ద్రుపదపుత్రేణ = ధృష్టద్యుమ్నునిచే; వ్యూఢామ్ = శకటపద్మాదిరూపముగా నేర్పఱుపఁబడినది; ఇందువలననే, మహతీమ్ = చూచువారలకుఁ బొగడఁదగినది; ఏతామ్ = సమీపమున నున్నది, అగు; పాణ్డుపుత్రాణామ్, చమూమ్ = సేనను; పశ్య—రథికులయొక్క తేజోబలపౌరుషసన్నాహములచే విజృంభిత మయియున్నది చూడు మని యర్థము.

వ్య. ఆవాక్యవిశేషరూప మయినవచనమునే యుదాహరించుచున్నాఁడు «పశ్యైతామ్" అనునది మొదలుగా «తస్య సంజనయన్హర్షమ్" అనువఱకుఁ గల గ్రంథముచేత. ప్రియశిష్యులగుపాండవులయందు మిక్కిలి స్నేహముగలవాఁ డగుటచే నాచార్యుఁడు యుద్ధము సేయఁ డని తలఁచి యతనిం బాండవులు లక్ష్యపెట్ట కున్నా రని తెలుపుచు వారియెడ నతనికిఁ గ్రోధాతిశయము పుట్టించుటకై చెప్పుచున్నాఁడు.—

ఏతామ్ = దీని, మిక్కిలి సమీపించియున్న దగుటచే మహానుభావుల రగు మీవంటివారినిగూడ లక్ష్యపెట్టక భయము లేక యున్నదానిని, పాణ్డుపుత్రాణాం చమూమ్, మహతీమ్ = అనే కాక్షౌహిణులతోఁ గూడిన దగుటచే నివారింప నశక్య మయినదానిని, పశ్య = చూడు మని ప్రార్థనము. నేను శిష్యుఁడ నగుటచే నాచార్యుఁడ వగు నిన్నుఁ బ్రార్థించుచున్నా నని చెప్పుచున్నాఁడు—ఆచార్య యని. చూచి వారు చేయు నవమానమును నీవే తెలియఁగల వని భావము. ఓయీ! వారు చేయు నవమానమునకు బదులు చేయఁజాలము కావున దాని మేము సహింపవలసి నదే యని ద్రోణాచార్యుఁడు చెప్పు నని యాశంకించి వారి నిరసించుట నీకు సులభమే యని చెప్పుచున్నాఁడు—తవశిష్యేణ వ్యూఢామ్ = నీశిష్యునిచే వ్యూఢమయినదాని, శిష్యునికన్న గురు వధికుం డనుట ప్రసిద్ధము. వ్యూఢాంతుధృష్టద్యుమ్నేన—ధృష్టద్యుమ్నునిచే వ్యూఢము, అని చెప్పక «వ్యూఢాం ద్రుపదపుత్రేణ—ద్రుపద పుత్రునిచే వ్యూఢము, అని చెప్పుట ఆచార్యునకు ద్రుపదునందుఁగల పూర్వవైరము సూచించి కోపము రేఁపుటకొఱకు. ధీమతా = బుద్ధిమంతుఁడు, అను విశేషణము సమర్థుఁ డగు శత్రువు నుపేక్షింపరా దని సూచించుటకు, ఇతరవిషయమును విడిచి మిక్కిలి త్వరపడుటకై చూడు మని ప్రార్థన.

వ్యాఖ్యానాంతరము—పాణ్డుపుత్రాణామ్ ఆచార్య = పాండవుల యాచార్యుఁడా! నీవు పాండవులయెడ నధికస్నేహముగలవాఁడ వగుటచే వారికే యాచార్యుఁడవు, నాకుఁ గావు. "ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ" అనుటచే నిన్ను వధించుటకై పుట్టినవానికిఁ గూడ నీవు విలువిద్యనేర్పినవాఁడవు, కావున నీ తెలివిమాలినతనమే నా కనర్థము కలిగించె నని సూచించుచున్నాఁడు. శత్రుండ వగు నీయొద్దనే నిన్ను వధించుట కుపాయభూత మయిన విద్యను నేర్చినవాఁ డగుటచే ధృష్టద్యుమ్నుఁడు ధీమంతుఁడు. కావుననే నీవు మూఢుఁడ వగుటచే తత్సైన్యము చూచుటవలన నీకే యానందము కలుగును. మఱి యెవ్వనికీసేన చూపినను, వానికానందము కలుగదు. కావున నీవే దీనిఁ జూడు మని యాచార్యునకుఁ దత్సైన్యము చూపుచు నతనియందుఁ దనకుం గల గాఢ మయిన ద్వేషమును వెల్లడిచేయుచున్నాఁడు. ఇందుచే, ఎవ్వనికి ధర్మక్షేత్రముఁ బొందినప్పుడును ఆచార్యునియందుఁ గూడ నిట్టి దుష్టబుద్ధి యున్నదో అట్టి పరమదుష్టుం డగు దుర్యోధనునకుఁ బశ్చాత్తాపము కలుగు నను శంక కవకాశమే లేదని భావము.

శ్రీ. ఆవాక్యమునే పశ్యైతా మిత్యాదు లగు తొమ్మిదిశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు—ఆచార్య! పాండవులయొక్క, మహతీమ్ = విస్తీర్ణ మయిన, ఏడక్షౌహిణులపరిమితి గల, ద్రుపదపుత్రేణ = ధృష్టద్యుమ్నునిచే, వ్యూఢామ్ = వ్యూహములుగాఁ దీర్చి యధిష్ఠిత మయిన, చమూమ్ = సేనను, పశ్య.

ప. ఆచార్యా! మహతీమ్ — చాలినబలము గల, పాణ్డుపుత్రాణామ్, చమూమ్= సేనను, పశ్య, వట్టిసైన్యబాహుళ్యముచే నుపయోగములే దని యాచార్యుఁడు చెప్పు నని యాశంకించి చెప్పుచున్నాఁడు—ధీమతా = వ్యూహములు దీర్చుటయందు నేర్పరి, అందును, తవశిష్యేణ = నీశిష్యుఁడు నగు, ద్రుపదపుత్రేణ = ధృష్టద్యుమ్నునిచే, వ్యూఢామ్ = వ్యూహములుగాఁ దీర్పఁబడినదానిని.

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః. ౪
ధృష్టకేతు శ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్
పురుజి త్కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః. ౫
యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః. ౬

టీ. ఇతరులును బలపరాక్రమవంతులు పెక్కండ్రు శత్రుసేనయం దున్నారు. కావున దాని నుపేక్షింపరా దని తెలుపుటకై చెప్పుచున్నాఁడు.—అత్ర = ఈశత్రుసేన యందు; శూరాః = శౌర్యముగలవారును; మహేష్వాసాః = గొప్పవిల్లుగలవారును; యుధి = యుద్ధమునందు; భీమార్జునసమాః = భీమునితోను అర్జునునితోను సమానులగు వారు; సన్తి = ఉన్నారు. యుయుధానః = సాత్యకియును; విరాటశ్చ = విరాటరాజును; మహారథః = మహారథుఁడగు; ద్రుపదశ్చ = ద్రుపదరాజును; ధృష్టకేతుః = ధృష్టకేతు వనురాజును; చేకితానః = చేకితానుఁ డనువాఁడును; వీర్యవాన్ = అధికమయిన పరాక్రమముగల; కాశిరాజశ్చ = కాశిరాజును; పురుజిత్ = పురుజిత్తనువాఁడును; కున్తిభోజశ్చ = కుంతిభోజుఁడును; నరపుఙ్గవః = మనుష్యులయం దుత్తముఁ డగు; శైబ్యశ్చ = శైబ్యుఁడును; విక్రాన్తః = పరాక్రమము గల; యుధామన్యుశ్చ = యుధామన్యువును; వీర్యవాన్ = అధికపరాక్రమముగల; ఉత్తమౌజాశ్చ = ఉత్తమౌజుండును; సౌభద్రః = సుభద్రకొడుకైనయభిమన్యువును; ద్రౌపదేయాశ్చ= ద్రౌపదికొడుకులయిన ప్రతివింధ్యుఁడు మొదలగువారైదుగురును; సర్వఏవ= అందఱుసే; మహారథాః= మహారథులు. ఈశత్రుసేనయందు, శూరాః = భయములేనివారును శస్త్రాస్త్రములందు నేర్పరులును, భీమార్జునసమాః= సర్వప్రసిద్ధమయిన మహాపరాక్రమము గల భీమార్జునులతో సమానులును, యుద్ధభూమియందు, చూడఁబడుచున్నారు. వారి యుద్ధపాండిత్యము తెలుపుటకై మహేష్వాసాః అనువిశేషణము, ఇషుః అస్యతే అస్మిన్—బాణము ప్రయోగింపఁబడుచున్నది దీనియందు అను వ్యుత్పత్తిచే ఇష్వాసమనఁగా విల్లు, మహాత్—గొప్పది, ఇతరులచే నెదిరింపరానిది యగు విల్లుగలవారలు మహేష్వాసులు. యుయుధాన ఇత్యాదిగా ద్రౌపదేయాశ్చ అనువఱకుఁ గల గ్రంథముచే అట్టివారినే శత్రుపక్షమునం దనురాగముగలవారై శత్రుసేనామధ్యమున నున్న రాజులను విన్నవించుచున్నాఁడు. సర్వఏవ మహారథాః అనుటచే వారలందఱు మహాబలపరాక్రమములు గలవారగుటచే వారి నుపేక్షింపరా దని తెలుపుచున్నాఁడు.

చూచితివా యీశత్రుసేనలో, శూరులును గొప్పధనుస్సుగలవారును సుప్రసిద్ధబలపరాక్రమములు గల భీమార్జునులతో సమానులును యుద్ధభూమియందు నిలుచున్నారు. వా రెవ్వరనఁగా, సాత్యకి విరాటుఁడు ద్రుపదుఁడు ధృష్టకేతువు చేకితానుఁడు కాశిరాజు పురుజిత్తు కుంతిభోజుఁడు శైబ్యుఁడు యుధామన్యువు ఉత్తమౌజుఁడు అభిమన్యువు ప్రతివింధ్యాదు లగు ద్రౌపదికొడుకులు. వీరందఱుగూడ మహారథు లని తాత్పర్యము.

తా. రథికుల తేజోబలపౌరుష సన్నాహమునే మూఁడు శ్లోకములచేఁ దెలుపుచున్నాఁడు—అత్ర = ఈపాండవసేనయందు, రథికులందఱు, శూరాః = విక్రాన్తానపి శృణన్తి—పరాక్రమవంతులనుగూడ హింసించువారు, మహేష్వాసాః—ఇషువులు బాణములు వీనిచేఁ బ్రయోగింపఁబడును కావున ఇష్వాసము లనఁగా ధనుస్సులు, అవి గొప్పవి గలవారు, యుధి=యుద్ధమునందు, భీమార్జునసమాః=బలమునను బరాక్రమమునను భీమార్జునులతో సరియయినవారు, అందఱును సమాను లని యర్థము. ఎవ్వరు వారనఁగా వారినే పేర్కొనుచున్నాఁడు—యుయుధానః= మిక్కిలి యుద్ధముసేయువాఁడు, సాత్యకి; విరాటః = విశేషించి శత్రువులను అణఁపించువాఁడు, విరాటరాజు; ద్రుపదః = ద్రువు వృక్షము పదము చిహ్నముగా టెక్కెమునందుఁ గలవాఁడు, ద్రుపదరాజు, మహారథః—“ఏకోదశసహస్రాణి యోధయేద్యస్తు ధన్వినామ్। శస్త్రశాస్త్రప్రవీణశ్చ మహారథ ఇతి స్మృతః.” * అని మహారథలక్షణము. ద్రుపదుఁడు మహారథుఁడు. ధృష్టకేతుః—ధృష్టము = శత్రువులకు భయంకరము అయిన, కేతువు= టెక్కెముగలవాఁడు, ఒకరాజు; వీర్యవాన్ = పరాక్రమము గలవాఁడగు; చేకితానః = చికితానునికొడుకు, ఒకరాజు. పురుజిత్—యుద్ధమునందు పురువులను—పెక్కండ్రను, జిత్ = జయించినవాఁడు, అట్టి; కున్తిభోజశ్చ = కుంతిభోజుఁడును, ఇతఁడు కుంతితండ్రి; నరపుఙ్గవః, శైబ్యశ్చ—శిబిగోత్రమునందుఁ బుట్టిన యొకరాజు; యుధామన్యుశ్చ—యుధామామ్ = యుద్ధమునందు, మన్యుః = కోపవేగము గలవాఁడు, ఇతఁడు పాంచాలుఁడు. ఉత్తమౌజాః = ఉత్తమ మయిన యోజస్సు బలము గలవాఁడు, ఇతఁడును బాంచాలుఁడు. వీర్యవాన్—తేజోబలముచేఁ బరాక్రమించునట్టి శత్రువులనుగూడ, వి = వివిధముగా, ఈరయతి = పాఱఁదోలువాఁడు వీరుఁడు, తత్కర్మము వీర్యము, అది గలవాఁడు వీర్యవంతుఁడు, అట్టి, సౌభద్రః = సుభద్రాపుత్త్రుఁడు, ద్రౌపదేయాశ్చ = ద్రౌపదికొడుకు లయిన ప్రతివింధ్యాదులును; సర్వఏవ= చెప్పఁబడిన వారందఱునుగూడ; మహారథాః—“ఆత్మానం సారథిం చాశ్వాన్ రక్షన్ క్షత మాయుధైః। యో యుధ్యత్యయుతైర్వీరైస్స మహారథ ఉచ్యతే” § అని చెప్పిన లక్షణము గలుగుటవలన వీరందఱు మహారథు లనుట సిద్ధము.

---

* ఎవ్వఁడొక్కఁడే పదివేల విలుకాండ్రతో యుద్ధముచేయునో ఆయుధశాస్త్రమునందుఁ బండితుఁడును అగునో అతఁడు మహారథుఁడని చెప్పఁబడెను.

§ తన్నును సారథిని గుఱ్ఱములను ఆయుధములచే గాయము తగులనియట్లు రక్షించుకొనుచు ఎవ్వఁడు పదివేలవీరులతో యుద్ధముసేయునో అతఁడు మహారథుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

వ్య. ఓయీ! ఈసేనయందు బ్రసిద్ధుఁడగు నొక్క ధృష్టద్యుమ్నుఁ డున్న మాత్రమునకే నీవేల పరితపించుచున్నావు? దీని మనవాఁ డెవ్వఁడైనను జయింపఁ గలఁ డని యాచార్యవాక్యము నాశంకించి చెప్పుచున్నాఁడు అత్రశూరా ఇత్యాదు లగు మూఁడుశ్లోకములచేత—ఈసేనయందు శూరుం డొక ధృష్టద్యుమ్నుఁడుమాత్రమే యుండినయెడ దీని నుపేక్షింపవచ్చును. ఇతరులుగూడఁ బెక్కండ్రు శూరు లున్నారు. కావున నవశ్యముగానే దీని జయించుటకుఁ దగినప్రయత్నము సేయవలె నని యభిప్రాయము. శూరులకే విశేషణము—మహేష్వాసాః = గొప్పవి ఇతరులచేఁ జెనకరానివి యగు ధనుస్సులు గలవారు, దూరమునుండియే శత్రుసైన్యములఁ బాఱఁదోలఁ జాలినవా రని భావము. గొప్పధనుస్సు గలవా రైనను యుద్ధకౌశ లము లేనివారు కావచ్చు నని యాశంకించి చెప్పుచున్నాఁడు—యుధి = యుద్ధము నందు; భీమార్జునసమాః = పరాక్రమశాలు లని ప్రసిద్ధులయిన భీమార్జునులతో సమానులు. వారినే పేర్కొనుచున్నాఁడు యుయుధాన ఇత్యాది మహారథా ఇత్యన్తగ్రంథముచేత—యుయుధానః = సాత్యకి. మహారథః ద్రుపదశ్చ = మహారథుఁ డగు ద్రుపదుఁడు, లేక, మహారథః అనునది యుయుధాన విరాట ద్రుపదులకు ముువ్వురికిని విశేషణము. అట్లు ధృష్టకేతు చేకితాన కాశిరాజులకు మువ్వురకు వీర్యవాన్ అనునది విశేషణము. పురుజి త్కుంతిభోజ శైబ్యులకు మువ్వురికి నర పుఙ్గవః అనునది విశేషణము. విక్రాంతుఁ డగు యుధామన్యువు వీర్యవంతుఁ డగు నుత్తమౌజుఁడు అని యిష్టము. లేక, విశేషణము లన్నింటిని జేర్చి యందఱియందును అన్వయింపవచ్చును. సౌభద్రః = అభిమన్యువు. ద్రౌపదేయాః = ద్రౌపదికొడుకులు ప్రతివిన్ధ్యాదు లైదుగురు. చకారమువలన ఇతరులును పాండ్యరాజ ఘటోత్కచ ప్రభృతులు గల రని యర్థము. పాండవు లైదుగురు నతిప్రసిద్ధులే యని వారి లెక్కింప లేదు. ఈపరిగణితు లగు పదునేడుగురును * మఱియు నాసేనలో నున్న యితరవీరు లును, సర్వ ఏవ మహారథాః = అందఱును మహారథులే, ఒక్కఁడైనను రథుఁడుగాని యర్ధరథుఁడుగాని లేఁడు. మహారథు లనుట యతిరథత్వమునకు నుపలక్షణము. § మహారథాదిలక్షణము—"ఏకోదశసహస్రాణి యోధయే ద్యస్తు ధన్వినామ్। శస్త్ర శాస్త్రప్రవీణశ్చ మహారథ ఇతి స్మృతః॥ అమితా న్యోధయే ద్యస్తు సంప్రోక్తో ఽతి

* ఇంక రాజులు కాశిరాజశబ్దము చేకితానునకు "పురుజిత్" అనుదాని కుంతిభోజునకు విశే షణము చేయుటవలనఁ బ్రస్తుతమునఁ బదునైదుగురే యని తెలియునది.

§ అందఱును మహారథులును అతిరథులునుగా నున్నా రని భావము, ఉపలక్షణము=తన్నును స్వసంబంధ మగు నితరమును బోధించునది.

రథస్తు సః । రథ స్త్వేకేన యో యోద్ధా తన్న్యూనోర్ధరథః స్మృతః." * అని చెప్పఁబడినది.

శ్రీ. అత్ర = ఈసేనయందు; మహేష్వాసాః—ఇషువులు = బాణములు, అస్యన్తే=ప్రయోగింపఁబడుచున్నవి వీనిచేత నని, ఇష్వాసములు = ధనుస్సులు, గొప్ప ధనుస్సులు గలవారును; భీమార్జునసమాః = భీమార్జును లతిప్రసిద్ధు లయిన శూరులు, వారలతో సమానులు నగు; శూరాః = శూరులు; సన్తి = కలరు. వారలనే పేరులతోఁ జెప్పుచున్నాఁడు—యుయుధానః = సాత్యకి, చేకితానుఁ డని యొకరాజు. నరపుఙ్గవః = నరశ్రేష్ఠుఁ డగు, శైబ్యః. విక్రాంతుఁ డగు, యుధామన్యు వని యొకఁడు. సౌభద్రః = అభిమన్యువు. ద్రౌపదేయాః = ద్రౌపదియందు యుధిష్ఠిరుఁడు మొదలగు నైదుగురివలనఁ బుట్టినవారు ప్రతివింధ్యాదు లైదుగురు, మహారథాదుల లక్షణము « ఏకోదశసహస్రాణి......" అని యొఱుంగునది.

ప. అత్ర = ఈసేనయందు; శూరాః = పరాక్రమవంతులు; మహేష్వాసాః—మహాన్తః = గొప్ప వగు, ఇషవః = బాణములు, అసాః = ప్రయోగింపఁబడును వీరిచేత, గొప్పబాణములను ప్రయోగించువార లనుట; యుధి = యుద్ధమునందు; భీమార్జునసమాః = భీమార్జునులతో సమాన మయిన బలముగలవారు, సన్తి = కలరు. ఇఁక వారినే చెప్పుచున్నాఁడు—యుయుధానః = సాత్యకి, అట్లు విరాటుఁడు, ద్రుపదః= ద్రౌపదితండ్రి. చేకితానుః డని యొకానొకరాజు. శైబ్యః = శిబిగోత్రమునందుఁ బుట్టినరాజు; అతఁడు, నరపుఙ్గవః = నరశ్రేష్ఠుఁడు. విక్రాన్తః = పరాక్రమముగలవాఁడగు; యుధామన్యుః = యుధామన్యు వనువాఁడును; చ = మఱియు; వీర్యవాన్, ఉత్తమౌజాశ్చ = ఉత్తమౌజుఁడును, వీరిద్దఱును అర్జునుని చక్రరక్షకులు. అట్లు భీష్మపర్వమునఁ జెప్పఁబడినది—« పృష్ఠగో ర్జునస్యాపి యుయుధానో మహారథః । చక్రరక్షౌచ పాఞ్చాల్యౌ యుధామన్యూత్తమౌజసౌ " § అని. సౌభద్రః= అభిమన్యువు, ద్రౌపదేయాః = ద్రౌపదియం దైదుగురిచేఁ బుట్టినవారు ప్రతివింధ్యాదు లైదుగురు పుత్త్రులు. ఇప్పుడు చెప్పఁబడిన వారందఱును మహారథులు. తల్లక్షణము « ఏకోదశ సహస్రాణి......" అని.

* "లెక్కలేని విలుకాండ్రతోఁ బోరువాఁ డతిరథుఁ డని చెప్పఁబడెను. ఒకనితోఁ బోరువాఁడు రథుఁడు. వానికిఁ దక్కువయగువాఁ డర్ధరథుఁడు.

§ అర్జునుని వెనుక మహారథుఁ డగు సాత్యకి యున్నాఁడు. పాంచాలు రగు యుధామన్యువు నుత్తమౌజుఁడును నీ యర్జునునకుఁ జక్రరక్షకులు.

అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. 7

టీ. ఇట్లు మిక్కిలి గొప్పదైన శత్రుసైన్యమును గుఱించి మిక్కిలి భయపడినవానియట్లు పలుకుచున్నావే, అట్లయినయెడ యుద్ధమునందలి పట్టుదల విడిచి శత్రువులతో సంధియే చేసికొనరాదా యని యాచార్యునియభిప్రాయము నాళంకించి చెప్పుచున్నాఁడు—ఇఁక, ద్విజోత్తమ = బ్రాహ్మణోత్తముఁడా! అస్మాకంతు = మనలోనో; యే = ఎవ్వరు, విశిష్టాః = అధికులో, తాన్ = వారలను, నిబోధ = ఎఱుంగుము. మమ = నాయొక్క, సైన్యస్య = సేనకు, యే = ఎవ్వరు, నాయకాః = ముఖ్యులో; తాన్ = వారిని, తే = నీకొఱకు, సంజ్ఞార్థమ్ = గుఱుతుకొఱకు, అనఁగా కొందఱిని జెప్పి యిందుచే ఇతరుల సూచించుటకొఱకు, బ్రవీమి = చెప్పుచున్నాను. "తు" అనుటచే, తనమనస్సులో భయము కలిగియున్నను దాని మఱుఁగుపఱచి తాను నిర్భయుఁడని తెలియఁజేయుచున్నాఁడు. మనపక్షమున నున్నవారలు అందఱికన్న నధికులు ఎవ్వరు గలరో, తాన్ = చెప్పఁబడుచున్న ఆశూరులను, నిబోధ—నిశ్చయముచే నావాక్యమువలన నెఱుంగుమని యర్థము. త్రైవిద్య వృద్ధు లగు త్రైవర్ణికులయందుఁ * ప్రధానుఁడ వగుటచే నీవే తెలిసికొనఁ జాలుదువు. అయినను నా సైన్యమునందు ముఖ్యులెవ్వరో వారలను నేను, తే—నీకొఱకు, సంజ్ఞార్థమ్—లెక్కకు మీఱినవార లగు ఆముఖ్యులలోఁ గొందఱను పేరులతోఁ జెప్పి తక్కినవారిని సూచించుటకు విజ్ఞాపనము సేయుచున్నాను గాని నీకుఁ దెలియని దేదియుఁ దెలుపువాఁడఁ గా నని చెప్పుచున్నాఁడు ద్విజోత్తమా యను సంబోధనముచేత.

ద్విజోత్తమా! ఇఁక మనలో నందఱికన్న నుత్తము లగువారిం జెప్పెదను. నిశ్చయముగా నెఱుంగుము. నీకుఁ దెలియనిది లేదు. అయినను నాసైన్యములో ముఖ్యులగువారు లెక్కకు మీఱియున్నారు, అందుఁ గొందఱను నీకు గుఱుతుగాఁ జెప్పుచున్నా నని తాత్పర్యము.

---

* త్రైవిద్యవృద్ధులు—ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అను మూఁడు విద్యలఁ దెలిసినవారు త్రైవిద్యులు, వారియందు వృద్ధు లనఁగా నుత్తములు. త్రైవర్ణికులు—బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులనెడు మూఁడువర్ణములం బుట్టినవారు.

శం. ఇట్లు పాండవసేనానాయకులను నిర్దేశించి తన సేనానాయకుల నిర్దేశించుటకుఁ జెప్పుచున్నాఁడు—అస్మాకమ్= మనలో, ఎవ్వరు, విశిష్టాః= విద్య బలము పౌరుషము పరాక్రమము కులము నడవడి మొదలగువానిచేతఁ బ్రసిద్ధులు, సైన్యమునకు, నాయకాః = నడపువారలో, వారలను, నీకు, సంజ్ఞార్థమ్ = నాకుఁ బరమాప్తుఁడ వగుటచే స్పష్టముగాఁ దెలియుటకొఱకు, చెప్పుచున్నాను. నిబోధ = ఎఱుంగుము. ద్విజోత్తమా !

మ. ఇట్లు మిక్కిలి గొప్పదైన శత్రుసైన్యముఁ జూచి భయపడితివేని, అయ్యో! ఆపక్షమున శత్రువులతో సంధియే చేసికొనరాదా! యుద్ధమునందుఁ బట్టుదల యేల? అని యాచార్యునియభిప్రాయము నాశంకించి చెప్పుచున్నాఁడు—తు శబ్దముచే మనస్సులో భయము గలిగినను దాని మఱుఁగుపఱచికొని తన నిర్భయత్వముఁ దెలుపుచున్నాఁడు. మనయందఱిలో ఎవ్వరు, విశిష్టాః = అతిశయము గలవారో, తాన్ = వారలను నాచేఁ జెప్పఁబడుచున్నవారిని, నిబోధ = నామాట వలన నిశ్చయముచే నెఱుంగుము. మఱియు నెవ్వరు, నాసైన్యమునకు, నాయకాః = ముఖ్యులో, నడపించువారలో, వారలను, సంజ్ఞార్థమ్—లెక్కలేనివారిలోఁ గొందఱను పేర్కొని తక్కినవారలను సూచించుటకు, తే = నీకొఱకు, చెప్పుచున్నాను, కాని తెలియనిసంగతి యేదియు నీకుఁ జెప్పవాఁడను గా నని ద్విజోత్తమ యను విశేషణముచే ఆచార్యునిఁ బొగడుచుఁ దనకార్యమునం దతని అనుకూలునిగాఁ జేసికొనుచున్నాఁడు.

ఇఁక దుర్యోధనుఁ డాచార్యునియెడ దుష్టాభిప్రాయముగలవాఁ డనుపక్షమందు—ద్విజోత్తమ, నీవు బ్రాహ్మణుఁ డగుటచే యుద్ధమునందు సమర్థుఁడవు కావు, ఇందుచే నీవు యుద్ధమునకు రాకున్నను, భీష్ముఁడు మొదలగువారలు క్షత్రియోత్తము లుండుటచే మా కంతగా గొప్పకొఱఁత లేదని యర్థము. సంజ్ఞార్థమ్ = తెలియుటకొఱకు, ప్రియశిష్యు లయిన పాండవుల సేనం జూచి పట్టరాని సంతోషముచేఁ బరవశ మయినమనసు గలవాఁడ వగు నీవు నాసేనయందలి వీరులను మఱతువేమో యని నే నిప్పుడు నీకు వారలం జెప్పుచున్నా నని భావము.

శ్రీ. నిబోధ= చక్కఁగా నెఱుంగుము. నాయకాః= నడపువారు. సంజ్ఞార్థమ్—చక్కఁగాఁ దెలియుటకొఱ కని యర్థము.

ప. ఇఁకఁ దన సేనను జెప్పుచున్నాఁడు.—మాయొక్క సైన్యమునందు, ఎవ్వరు, విశిష్టాః = అధికులు, చెప్పఁ దలంచినవారు, కలరో, వారలను, నిబోధ = ఎఱుంగుము. నాసైన్యమునకు, నాయకాః = నియమించువారు.

భవాన్భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితిఞ్జయః
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి ర్జయద్రథః. ౮

ఆ. వారలనే తనసేనయందున్న శూరవర్యులను దనకు భయపరిహారము కొఱకుఁ బరిగణించుచున్నాఁడు—భవాన్ = నీవును, ద్రోణాచార్యుఁడు ననుట, భీష్మశ్చ = భీష్ముఁడును, కర్ణశ్చ = కర్ణుఁడును, సమితిఞ్జయః = యుద్ధమును జయించువాఁ డగు, కృపః = కృపాచార్యుఁడును; అశ్వత్థామా = అశ్వత్థామయును, వికర్ణశ్చ = వికర్ణుఁడును, సౌమదత్తిః = సోమదత్తునికొడుకైన భూరిశ్రవుఁడును, జయద్రథః = సైంధవుఁడును, నాసేనయం దున్నా రని తాత్పర్యము.

శ్రీ. వా రెవ్వ రనఁగా రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁ డు—నీవు, భీష్ముఁడు, కర్ణుఁడు, కృపః = కృపాచార్యుఁడు, సమితిఞ్జయః—సమితిమ్ = నిబోధ—నిశ్చయుద్ధమునుగూడ, జయతి = జయించువాఁడు, యుద్ధమునందు జయిం లగు వానివాఁడనుట, అట్టి, అశ్వత్థామ, వికర్ణుఁడును, సౌమదత్తిః = సోమదత్తునికొడుకు భూరిశ్రవుఁడు, « సౌమదత్తి స్తథైవచ ” అని నీరిపాఠము.

మ. అం దందఱికన్న నధికులం బరిగణించుచున్నాఁడు—భవాన్—ద్రోణుఁడు, భీష్ముఁడు, కర్ణుఁడు, కృపుఁడు, సమితిఞ్జయః—సమితిమ్ = యుద్ధమును, జయతి = జయించువాఁడు, ఇది కృపాచార్యునకు విశేషణము, ఈవిశేషణము కృపాచార్యునిఁ గర్ణుని పిమ్మట గణియించుటచే నతనికిఁ గోపము వచ్చు నని తలఁచి తత్పరిహారార్థము చెప్పఁబడినది. వీరు నలుగురు అందఱికన్నను అధికులు. ఇంక నాయకులను లెక్కించుచున్నాఁడు—అశ్వత్థామా—ద్రోణాచార్యునికొడుకు, భీష్మునికన్న మున్ను ఆచార్యునిగణనమును వికర్ణునికన్న మున్ను ఆయనపుత్త్రునిగణనమును ఆచార్యుని సంతోషపెట్టుటకొఱకు, వికర్ణశ్చ—దుర్యోధనునితమ్ముఁడు, సౌమదత్తిః=సోమదత్తునిపుత్త్రుఁడు భూరిశ్రవుఁడు, శ్రేష్ఠుఁ డగుటచే నితనిగణనము, జయద్రథః = సైంధవుఁడు, « సిన్ధురాజ స్తథైవచ ” అనియుఁ బాఠము కలదు. సిన్ధురాజః = సైంధవుఁడు, వీరు నాసైన్యమునందు నాయకు లని యర్థము.

శ్రీ. వారలనే చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత—భవాన్—ద్రోణుఁడు. సమితింజయః = యుద్ధమును జయించువాఁడు. సౌమదత్తిః = సోమదత్తునిపుత్త్రుఁడు భూరిశ్రవుఁడు.

ప. వారలనే చెప్పుచున్నాఁడు—భవాన్—ద్రోణుఁడు, భీష్ముఁడు, కృపః = కృపాచార్యుఁడు, సమితింజయః = యుద్ధమును జయించువాఁడు, సౌమదత్తిః = సోమదత్తునికొడుకు భూరిశ్రవుఁడు.

అన్యే చ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః. ౯

ఆ. ద్రోణాదులఁ బరిగణించుటచే నిఁక శూరులు లేరని యాశంక గలుగు నని తలఁచి దానిఁ బరిహరించుచున్నాఁడు.—అన్యేచ= ఇతరులును; బహవః = పెక్కండ్రు; శూరాః = శూరులు; సన్తి = కలరు. నీవు మొదలుగా నాసేనయం దున్నవారందఱును దమ ప్రాణముకన్నను నాయందుఁ బ్రీతిగలవా రని చెప్పుచు న్నాఁడు—సర్వే= అందఱును; మదర్థే=నా కార్యమునిమిత్తము; త్యక్తజీవితాః= విడువఁ బడిన ప్రాణము గలవారు. వారు శూరు లని చెప్పఁబడినదాని విశదీకరించు చున్నాఁడు—నానాశస్త్రప్రహరణాః = నానావిధము లయిన యాయుధములు యుద్ధ సాధనములుగాఁ గలవారు. బహువిధము లగు నాయుధము లున్నను వానిఁ బ్రయోగించుటయందు నేర్పులేనియెడఁ బ్రయోజన ముండ దనఁగా నట్లు గా దని చెప్పుచున్నాఁడు—యుద్ధవిశారదాః = యుద్ధమునందుఁ బండితులు.

నే నిప్పుడు పరిగణించిన మీరు మాత్రమే గాదు. ఇతరులుగూడ పెక్కండ్రు శూరు లున్నారు. మీరేమి వారేమి అందఱును బ్రాణము విడిచియైనను నాకార్యము సాధింపఁ బూని యున్నవారు. నానావిధము లయిన యాయుధ ములతోఁ జక్కఁగా యుద్ధము సేయ నేర్పు గల వా రని తాత్పర్యము.

శం. అన్యేచ = తక్కినవారును, బాహ్లికుఁడు భగదత్తుఁడు మొదలగు వారును; బహవః; శూరాః = శౌర్యముగలవారు. నానాశస్త్రప్రహరణాః = నానా విధము లయిన శస్త్రములు శూలము చక్రము గద ఖడ్గము పరిఘము మొదలగు నవి యుద్ధసాధనములుగాఁ గలవారు; అందువలననే, యుద్ధవిశారదాః = సకల యుద్ధములందును నిపుణులు. సర్వే = అందఱును; మదర్థే = నా జయసిద్ధికొఱకు;

త్యక్తజీవితాః—ప్రాణము విడిచియైనను జయము సంపాదించెద మని నిశ్చయముతో నున్నా రని యర్థము.

మ. వీరుమాత్రమే నాయకులా? అనఁగా కా దని చెప్పుచున్నాఁడు— అన్యేచ—శల్యుఁడు కృతవర్మ మొదలగువారును; మదర్థే= నాప్రయోజనముకొఱకు; త్యక్తజీవితాః—ప్రాణమునుగూడ విడుచుటకు నిశ్చయించినవారు, ఇందుచేఁ దన యందు వారికిఁ గల యనురాగాతిశయము చెప్పఁబడుచున్నది. ఇట్లు, శూరాః అను నది మొదలగు విశేషణములచేఁ దన సైన్యముయొక్క బాహుళ్యమును తనసేనకుఁ దనయందు భక్తియు శౌర్యమును యుద్ధప్రయత్నమును యుద్ధమునందు నైపుణ్యమునుం దెలుపఁబడినవి.

శ్రీ. మదర్థే= నాప్రయోజనముకొఱకు; త్యక్తజీవితాః—జీవితము విడుచుటకు నిశ్చయించినవా రని యర్థము. నానాశస్త్రప్రహరణాః = అనేకము లయిన శస్త్రములు యుద్ధసాధనములుగాఁ గలవారు. యుద్ధవిశారదాః = యుద్ధమునందు విశారదులు నిపుణు లని యర్థము.

ప. అన్యేచ = వీరికంటె ఇతరులుగూడ; బహవః శూరాః, సన్తి = కలరు. మదర్థే= నాప్రయోజనముకొఱకు, త్యక్తజీవితాః = సంకల్పింపఁబడిన ప్రాణము గలవారు. నానాశస్త్రప్రహరణాః = నానాశస్త్రములచే యుద్ధము చేయువారు, ఇందువలననే, యుద్ధవిశారదులు.

అపర్యాప్తం త దస్మాకం బలం భీష్మాభిరక్షితమ్
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్. ౧౦

ఆ. దుర్యోధనుఁడు తనకు భయము లేకుండుటకుఁ గారణాంతరమును గూడ ఆచార్యునితోఁ జెప్పుచున్నాఁడు—అస్మాకమ్ = మనయొక్క; ఇదమ్ = ఈ, పదునొకం డక్షౌహిణులసంఖ్య గల దగుటచే అపరిమిత మయిన; భీష్మాభిరక్షితమ్= భీష్మునిచే అంతటను రక్షింపఁబడిన, ప్రసిద్ధ మయిన ప్రభావము గలవాఁడును సూక్ష్మబుద్ధియు నగు భీష్మునిచే నంతటను రక్షింపఁబడిన; బలంతు = సైన్యమో; పర్యాప్తమ్ = సమర్థము, శత్రువుల జయించుటకు సమర్థము. ఏతేషామ్ = ఈపాండవులయొక్క, తత్ = అ, ఏడక్షౌహిణులుమాత్రమే గల దగుటచే అల్ప మయిన; భీమాభిరక్షితమ్= భీమునిచేఁ బరిపాలింపఁబడిన, చపలబుద్ధియు నైపుణ్యము లేనివాఁడు నగు భీమునిచే

బరిపాలింపఁబడిన; బలమ్ = సైన్యము; అపర్యాప్తమ్ = అసమర్థము, మనల జయించు టకు సమర్థము కాదు.

మనసైన్య మిది పదునొకండక్షౌహిణులు గలది, మఱియు మహాప్రభావుఁడును సూక్ష్మబుద్ధియు నగు భీష్మునిచే నన్ని భాగములందును రక్షింపఁబడుచున్నది, కావున మనసైన్యము శత్రువుల జయింప సమర్థ మగును. పాండవులసైన్యమో యేడక్షౌహిణులుమాత్రమే గలిగి యల్పమయి యున్నది, మఱియుఁ జపలబుద్ధియును నైపుణ్యము లేనివాఁడు నగు భీముఁడు దాని రక్షించుచున్నాఁడు, కావున నది మనల జయింప సమర్థము గా దని తాత్పర్యము.

అర్థాంతరము.—తత్ = అట్టి; అస్మాకమ్ = మనయొక్క, భీష్మాభిరక్షితమ్ = భీష్మునిచే రక్షింపఁబడిన, బలమ్ = సేన, అపర్యాప్తమ్ = అపరిమితము, ఎదిరింపరాని దియుఁ గలఁగింపరానిదియు నని యర్థము. ఏతేషామ్=ఈపాండవులయొక్క; భీమాభి రక్షితమ్ = భీమునిచే రక్షింపఁబడిన, ఇదంబలంతు = ఈసైన్యమో, పర్యాప్తమ్ = పరి మితము, జయింప శక్యమయిన దని యర్థము. భీష్మునిచే రక్షింపఁబడుచున్న అట్టి మనసైన్యము పదునొకండక్షౌహిణులు గల దగుటచేఁ గొలఁదికి మీఱి శత్రువులకు దుర్జయమై యున్నది. భీమాభిరక్షిత మయిన పాండవులసైన్యమో యేడక్షౌహిణులు మాత్రమే గల దగుటచేఁ బరిమితమై మనకు జయింప శక్య మగు నని తా.

మఱియొకయర్థము—తత్ = ఆ అల్ప మయిన, భీష్మాభిరక్షితమ్ = భీష్ముఁడు రక్షింపఁబడినవాఁడుగాఁ గల, భీష్ముఁడు ఏపాండవసేనకొఱకు అనఁగా తజ్జయము కొఱకు మనచే రక్షింపఁబడినవాఁడో అట్టి, ఏసేనను జయించుటకొఱకు మనము భీష్ము నుంచికొనియున్నామో అట్టి యని యర్థము; బలమ్= పాండవసేన; అస్మాకమ్ = మనకు; అపర్యాప్తమ్ = చాలినదికాదు, మనల జయింపఁ జాల దని యర్థము. భీమాభిరక్షితమ్ = భీముఁడు రక్షితుఁడుగాఁ గల, భీముఁడు ఏ మనసైన్యముకొఱకు అనఁగా తజ్జయము కొఱకు రక్షింపఁబడినవాఁడో అట్టి, ఏసేనను జయించుట కొఱకుఁ బాండవులు భీము నేర్పఱచుకొని యున్నారో అట్టి యని యర్థము; ఇదమ్ = ఈ, పదునొకండక్షౌహిణులతోఁ గూడిన; బలంతు = మనసైన్యమో; ఏతేషామ్ = ఈపాండవులకు; పర్యాప్తమ్= చాలినది, వీరి జయింపఁ జాలిన దని యర్థము. కావున మనకుఁ గొంచెమేని భయపడవలసినది లే దని యర్థము. ఆపాండవసేన మిక్కిలి యల్పము, మఱియు దాని జయించుటకై మనము మహాప్రభావుఁ డగు భీష్ము

నేర్పఱచుకొనియున్నాము, కావున నది మనల జయింపఁ జాలదు. మన సేనయో మిక్కిలి గొప్పది, దీని జయించుటకు పాండవులు చపలబుద్ధి యగు భీము నేర్పఱచుకొని యున్నారు. కావున మన సేన పాండవుల జయింపఁ జాలు నని తా.

శ ౧౦. మఱియును—అపర్యాప్తమ్ = యుద్ధమునకు సమర్థము కానిది, ఇప్పుడు చెప్పఁబడినవారికంటె భిన్న మయిన సేన యేది గలదో; అస్మాకమ్ = మనయొక్క; తత్ = ఆసైన్యము; భీష్మాభిరక్షితమ్ = భీష్మునిచే అన్నివిధంబులను అనఁగా శరీరబలముచేతను వాగ్బలముచేతను శస్త్రాస్త్రములబలముచేతను రక్షింపఁబడినది, మహాపురుషుఁ డగు భీష్ముని ప్రాపుబలిమివలన నాకు జయము కలిగించుటకుఁ బర్యాప్తమే చాలినదే యగు నని యర్థము. ఇప్పుడు నేను జెప్పిన శూరులు గాక మనసేనలో యుద్ధమునకు సమర్థముకానిభాగ మేది గలదో అదియు భీష్మునిచే రక్షింపఁబడిన దగుటచే నతనిబలమువలన యుద్ధమునకు సమర్థమే యగు నని భావము. ఏతేషాంతు = ఈపాండవులదన్ననో; ఇదమ్ = ఈ, ముందు కనఁబడుచున్న; బలమ్ = సైన్యము; పర్యాప్తమ్ = సమర్థ మయినను; భీమాభిరక్షితమ్ = భీమునిచే రక్షింపఁబడినది, కావున అసమర్థమే యగు నని యర్థము. ఈపాండవులసేనయందన్ననో, యుద్ధమునకు సమర్థ మయిన యుత్తమభాగముకూడ, అసమర్థుఁ డగు భీమునిచే రక్షింపఁబడుటవలన నాయకునిదోషముచే యుద్ధమునకు సమర్థము కాఁజాల దని భావము. ఇటుగాక వేఱువిధముగా వ్యాఖ్యానము చేసినచో సంధి ప్రసక్త మగును. అట్లు సంధికార్యము కనఁబడదు. అందువలన ఈవ్యాఖ్యానమే యుక్త మని తోఁచుచున్నది.

మ. దుర్యోధనుఁడు మరల రెండుపక్షములవారి సైన్యములును సమములని యాచార్యుఁడు తలంచునేమో యని యాశంకించి తనసైన్యమే యధిక మని చెప్పుచున్నాఁడు—అస్మాకంబలమ్ = మనసైన్యము; అపర్యాప్తమ్ = అనంతము, పదునొకండక్షౌహిణులపరిమితి గలది; భీష్మాభిరక్షితమ్—ప్రసిద్ధమయిన మహిమగలవాఁడును సూక్ష్మబుద్ధియు నగు భీష్మునిచే అంతటను రక్షింపఁబడినది; తత్ = అట్టిది, అట్టి గుణవంతు లగు పురుషులచే నధిష్ఠింపఁబడినది. ఏతేషామ్ = ఈపాండవులయొక్క; బలంతు = సైన్యమన్ననో; పర్యాప్తమ్ = పరిమితము, ఏడక్షౌహిణులుమాత్రమె యగుటచేఁ దక్కువ యయినది; భీమాభిరక్షితమ్—మిక్కిలి చపలబుద్ధి యగు భీమునిచే రక్షింపఁబడినది. అందువలన మనకే విజయము కలుగు నని యభిప్రాయము.

అర్థాంతరము—తత్ బలమ్ = ఆపాండవుల సైన్యము; అస్మాకమ్ = మనకు; అపర్యాప్తమ్ = చాలినదికాదు, మనల జయింప సమర్థము కాదు. ఆపాండవసైన్య మెట్టిదనఁగా, భీష్మాభిరక్షితమ్=భీష్ముఁడు మనచే దేనికొఱకు అనఁగా దేని జయించుకొఱకు రక్షింపఁబడియున్నాఁడో అట్టిది. ఇదంబలంతు = ఈ మనసైన్యమో; ఏతేషామ్ = ఈ పాండవులకు; పర్యాప్తమ్ = చాలినది, పాండవుల జయింప సమర్థము; మన సైన్య మెట్టి దనఁగా, భీమాభిరక్షితమ్ = మిక్కిలి దుర్బల మయిన హృదయము గల భీముఁడు పాండవులచే దేనికొఱకు అనఁగా దేని జయించుటకొఱకు రక్షింపఁబడియున్నాఁడో అట్టిది, మిక్కిలి యసమర్థుఁ డగు భీమునే పాండవులు మనసైన్యము జయించుట కేర్పఱచుకొనియున్నారు, కావున మనకుఁ గొంచెమైనను భయపడవలసినది లేదని యభిప్రాయము.

శ్రీ. దానివలన నేమి యనఁగా చెప్పుచున్నాఁడు—తత్ = అట్టివా రగు వీరులతోఁ గూడినదైనను, భీష్మాభిరక్షితమ్ = భీష్మునిచే రక్షింపఁబడినదైనను, అస్మాకం బలమ్ = మనసైన్యము, అపర్యాప్తమ్ = వారితోఁ బోరుటకు అసమర్థము, అని తోఁచుచున్నది. ఏతేషామ్= ఈపాండవులయొక్క, ఇదంబలంతు= ఈసైన్యమన్ననో, భీమాభిరక్షితమ్ = భీమునిచే రక్షింపఁబడినదై, పర్యాప్తమ్ = సమర్థము, అని తోఁచుచున్నది. భీష్ముఁడు రెండుపక్షములయందును బక్షపాతముగలవాఁ డగుటచేఁ మన సైన్యము పాండవసైన్యమును జయింప సమర్థము కాదు. భీముఁడు ఒకపక్షమునందే పక్షపాతము గలవాఁ డగుటచేఁ బాండవసైన్యము మనసైన్యమును జయింప సమర్థమని తోఁచుచున్నది.

ప. ఇఁక రెండుసైన్యముల నుపన్యసించుటకు నిమిత్తము చెప్పుచున్నాఁడు—తత్ = ఆచెప్పుటకు ముఖ్యముగా నుద్దేశించిన; అస్మాకంబలమ్ = మనసైన్యము; భీష్మాభిరక్షితమ్ = భీష్మునిచే రక్షింపఁబడినదైనను; అపర్యాప్తమ్ = అసంపూర్ణము, వారితోఁ బోరుటకు అసమర్థము, ఏతేషామ్ బలమ్ = ఈపాండవుల సైన్యము; భీమాభిరక్షితమ్ = భీమునిచే రక్షింపఁబడినదై; పర్యాప్తమ్ = సంపూర్ణము, మనతోఁ బోరుటకు సమర్థము.

అయనేషుచ సర్వేషు యథాభాగ మవస్థితాః
భీష్మ మేవాభిరక్షన్తు భవన్త స్సర్వ ఏవహి. ౧౧

ఆ॰ తనసైన్యము భీష్మాధిష్ఠిత మగుటచే బలిష్ఠ మని చెప్పి, ద్రోణుఁడు మొదలగువారు భీష్మునకు లోఁబడినవారగుటచే వా రతని ననుసరించి యుండవలె నని ప్రార్థించుచున్నాఁడు—భవన్తః= మీరు, నీవు అశ్వత్థామ కర్ణుఁడు మొదలగువారు; సర్వేఏవహి = అందఱునుగూడ; సర్వేషు = సమస్తము లయిన; అయనేషుచ = స్థానములయందును, యుద్ధ మారంభించు నప్పుడు వీరులకు వారివారి ప్రాధాన్యమును బట్టి యుద్ధభూమియందుఁ దూర్పుపడమర మొదలగు దిక్కుల నేర్పఱచి నిలుచుటకు ఏస్థానములు నియమింపఁబడునో, ఆస్థానము లిచట అయనము లని చెప్పఁబడుచున్నవి, సేనాపతి సమస్తసైన్యము నధిష్ఠించువాఁడై నడుమ నిలుచును; చకారము చేయవలసిన విశేషమును దెలుపుచున్నది. యథాభాగమ్= నియమింపఁబడిన యేస్థానమును అతిక్రమింపక, మీకు మీకు ఏర్పఱచినస్థానముల విడువక యనుట; అవస్థితాః= ఉన్నవారలై; భీష్మమేవ = సేనాపతియగు భీష్మునే; అభిరక్షన్తు = అంతటను రక్షింపుఁడు. ఏల యనఁగా, శత్రుసేనను జయించుటకై మనము భీష్ము నేర్పఱచుకొని యున్నాము, కావున నతని రక్షించికొన్నయెడ మనసేన యంతయు రక్షింపఁబడినది యగు నని యర్థము.

ఆయానియతస్థానములందు మీకు మీ కేర్పఱచిన స్థానము విడువక నిలుచున్నవారై మీరందఱు నన్నివిధంబుల భీష్ముని రక్షింపవలెను. మీరు భీష్ము నొక్కని రక్షించినయెడ మనసేన యంతయు నతఁడు రక్షించు నని తా.

శం॰ అట్లే యగుఁ గాక. ఇప్పు డేమి చేయవలె ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—హి—ఎందువలన నాకు జయము భీష్ముని యధీనమో అందువలన; భవన్త ఏవ = మీరే, ఇప్పుడు చెప్పఁబడిన వీరు లనుట; సర్వే = అందఱును; అయనేషు = చక్రము మొదలగు వ్యూహముల మార్గములయందు; యథాభాగమ్ = మీమీ స్థానము విభక్తముగా అనఁగా వేఱువేఱుగా నుండునట్లు; అవస్థితాః = ఉన్నవారై; భీష్మమేవ = సేనాముఖమునందు యుద్ధముచేయుచుండు భీష్మునే; అభిరక్షన్తు = అంతటను రక్షింపుఁడు, భీష్మునకు శత్రువులవలన నుపద్రవము కలుగని యట్లు అతనిఁ బరివేష్టించి రక్షించుచునే మీరు యుద్ధము చేయుఁ డని యర్థము.

మ॰ ఇట్లు నీవు నిర్భయుఁడవైనయెడ ఎందు కెక్కువగా మాటలాడుచున్నావు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—« అయనేషుతు » అని వీరిపాఠము, తు శబ్దము చేయవలసిన విశేషమును దెలుపుచున్నది, చేయవలసిన దేమనఁగా. యుద్ధ

మారంభించునపుడు వీరులకు వారివారిప్రాధాన్యము ననుసరించి యుద్ధరంగము నందుఁ దూర్పుపడమర మొదలగు దిక్కు లేర్పఱచి నిలుచుండుటకై నియమింపఁబడు స్థానములు ఇచట అయనము లని చెప్పఁబడుచున్నవి. సేనాపతియో సమస్తసైన్యమునకు అధిష్ఠాతయై నడుమ నిలుచుండును. అట్లుండఁగా, యథాభాగమ్ = ఏర్పఱుపఁబడిన మీ మీ యుద్ధస్థానమును విడువక; అవస్థితాః = ఉన్నవారలై; భవన్తః సర్వేఏవ=మీరందఱును; భీష్మమేవఅభిరక్షన్తు—యుద్ధమునం దేకాగ్రతచే ముందును వెనుకను ప్రక్కలను జూడక యుద్ధరంగమునందే దృష్టియుంపవలసిన సేనాపతి యగు భీష్మునే రక్షింపుఁడు. ఏల యనఁగా సేనాపతి యగు భీష్ముఁడు రక్షితుఁ డయినయెడ నతని యనుగ్రహంబున సమస్తసైన్యమును సురక్షిత మగు నని యభిప్రాయము.

శ్రీ. అందువలన మీ రిట్లు ప్రవర్తింపవలె నని చెప్పుచున్నాఁడు—అయనేషు = వ్యూహములను ప్రవేశించుమార్గములందు, యథాభాగమ్ = ఏర్పఱుపఁబడిన మీమీయుద్ధస్థానమును విడువక, అవస్థితులై, భీష్మునే అంతటను రక్షింపుఁడు, ఎట్లు ఇతరులతో యుద్ధము చేయుచుండు భీష్ముని వెనుకవైపున వచ్చి యెవ్వరైనను వధింపరో అట్లు రక్షింపుఁడు. భీష్ముని బలముచేతనే మనము ప్రతుక వలె నని భావము.

ప. అందువలన మీ రిట్లు చేయవలె నని చెప్పుచున్నాఁడు—అయనేషు= వ్యూహప్రవేశమార్గములందు; యథాభాగమ్ = యుద్ధభూమిని విభజించుకొని, ఉన్నవారై; అందఱును మీరు, భీష్మునే, అభిరక్షన్తు = అంతటను రక్షింపుఁడు, భీష్ముఁడు వ్యూహమును ప్రవేశింపఁగా మీ రతని వెనుకవైపు రక్షింపుఁడు.

శ్రీమద్రామానుజభాష్యము.—

దుర్యోధనుఁడు తానే భీమునిచే రక్షింపఁబడిన పాండవులసైన్యంబును భీష్మునిచే రక్షింపఁబడిన తనసైన్యమునుం జూచి, తన్ను జయించుట కాసైన్యము సమర్థ మగుటయుఁ దనసైన్యము వారిజయించుట కసమర్థం బగుటయు నాచార్యునకుఁ దెలిపి, హృదయంబున విషాదము నొందెను. *

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చైః శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్. ౧౨

* ఇది పదునొకండుశ్లోకములకుఁ దాత్పర్యసంగ్రహము.

**ఆ.** ఇట్లాచార్యునితో సంవాదము చేయుచున్న భయావిష్టుం డగు రాజునుజూచి సమీపంబున నున్న భీష్ముఁడు వానిమనస్సు ననుసరించుటకై యిట్లు చేసె నని చెప్పుచున్నాఁడు—కురువృద్ధః = కౌరవులయందు ముసలివాఁడును; ప్రతాపవాన్ = పరాక్రమముగలవాఁడు నగు; పితామహః = తాతయయిన భీష్ముఁడు; తస్య = ఆ దుర్యోధనునకు; హర్షమ్ = సంతోషమును, బుద్ధియందలి యుల్లాసవిశేషమును, శత్రువులకుఁ బరాజయమువలనను దనకు జయమువలనను గలుగుదానిని; సంజనయన్ = చక్కఁగా కలిగించువాఁడై, అతని భయమును బోఁగొట్టఁగోరినవాఁడై; ఉచ్చైః = గొప్పదగు; సింహనాదమ్ = సింహముయొక్క గర్జనవంటి యఱపును; వినద్య—చేసి; శఙ్ఖమ్ = శంఖమును; దధ్మౌ = ఊఁదెను. ఎందువలన భీష్ముఁడు దుర్యోధనునకుహర్షము పుట్టించుటకు యత్నించుచున్నాఁ డనఁగా, భీష్ముఁడు కురువృద్ధుఁడును దుర్యోధనుఁడు కురురాజు నగుటవలనను భీష్ముఁడు పితామహుఁ డగుటవలనను అని తెలియవలెను. మఱియు నితఁడు దుర్యోధను నుపజీవించువాఁడై తదధీనుం డగుటవలనఁగూడ నతఁడు దుర్యోధనునిభయము తొలఁగించుటకుఁ బ్రవర్తించుట యుచితము. ఈభీష్ముఁడు దూరమునుండియే శత్రుసమూహమునకు భయము కలిగించుపరాక్రమము గలవాఁ డగుటవలన నితని సింహనాదమువలనను శంఖధ్వనివలనను శత్రువులకు మనోవ్యథ కలుగు నని యర్థము.

ఆదుర్యోధనునకు భయము పోఁగొట్టి సంతోషము కలిగించుటకై కురువృద్ధుఁడును బరాక్రమశాలియుఁ బితామహుఁడు నగు భీష్ముఁడు గొప్పసింహనాదము గావించి శంఖముఁ బూరించె నని తాత్పర్యము.

**శం.** ఇట్లు రాజు చెప్పిన పిమ్మట నేమి జరగె నని ధృతరాష్ట్రుఁ డడుగఁగా సంజయుఁడు చెప్పుచున్నాఁడు.—ప్రతాపవాన్, కురువృద్ధః, పితామహః = భీష్ముఁడు, అట్లే జయము కలిగించెద నని సూచించు నట్లు, తస్య = ఆదుర్యోధనునకు, హర్షము కలిగించుచు, సింహనాదమును, వినద్య = చేసి; ఉచ్చైః = ఉత్తమమయిన, శఙ్ఖమ్ = తనశంఖమును, దధ్మౌ = పూరించెను.

**మ.** ఇతఁడు పొగడుఁగాక, తిట్టుఁగాక, ఎట్లయినను వీనికిఁగా నాదేహము తప్పక పతనము పొందఁ గల దనునభిప్రాయముచే భీష్ముఁడు దుర్యోధనునకు సంతోషమే చేయువాఁడై సింహనాదమును శంఖధ్వనియును గావించె నని చెప్పుచున్నాఁడు—తస్య—ఇట్లు పాండవులసేనం జూచుటవలన మిక్కిలి భయపడినవాఁడును, భయనివృత్తి

కొఱకు ఆచార్యుని గపటముచే శరణు పొందినవాఁడును, ఇప్పుడుగూడ నితఁడు నన్ను మోసపుచ్చుచున్నాఁడని సంతోషము లేమింజేసి యాచార్యునిచే మాటమాత్రముననైనను ఆదరింపఁబడనివాఁడును, ఆచార్యుఁడు తన్నుపేక్షించుటం దెలిసి అయనేష్విత్యాదిశ్లోకముచే భీష్మునే పొగడినవాఁడు నగు ఆరాజునకు; భయమును బోఁగొట్టునట్టి, హర్షమ్ = తనకు జయమును సూచించునట్టి బుద్ధియందలి యుల్లాసవిశేషమును; సంజనయన్ = కలిగించుచు; ఉచ్చైః = గొప్పదియగు; సింహనాదమ్, వినద్య = చేసి, లేక, సింహనాదమ్ అని ణముల్ప్రత్యయాంతము, కావుననే, రైపోషం పుష్యతి * అనునట్లు ఆధాతువే మరలఁ బ్రయోగింపఁబడినది, అప్పుడు, సింహనాదమ్ = సింహమునలె, లేక, సింహము గర్జించునట్లు, వినద్య = అఱచి; శఙ్ఖమ్ = శంఖమును; దధ్మౌ = పూరించెను. కురువృద్ధుఁ డగుటచే ఆచార్యదుర్యోధనుల యభిప్రాయము నెఱుఁగుటయు, పితామహుఁ డగుటచే నాచార్యునివలె నుపేక్షింపక దుర్యోధను నాదరించుటయుఁ, బ్రతాపవంతుఁ డగుటచే శత్రువులకు భయము పుట్టించుటకై సింహనాదశంఖవాద్యములు సేయుటయు నని తెలియునది. ఇచట సింహనాదశంఖవాద్యములు హర్షజనకము లగుటచే, హర్షజననము సింహనాదశంఖవాద్యముల యనంతరము గలుగునదియైనను, జనయన్ అనుచో వర్తమానకాలబోధక మయిన శతృప్రత్యయము అవశ్యంభావిత్వరూపవర్తమానార్థకముగా వ్యాఖ్యానము చేయవలెను. §

శ్రీ. ఇట్లు బహుమానపూర్వకముగా రాజుచెప్పినవాక్యము విని భీష్ముఁ డేమిచేసె ననఁగాఁ జెప్పుచున్నాఁడు—తస్య = ఆరాజునకు, హర్షమ్, సంజనయన్ = చేయుచు, పితామహః = భీష్ముఁడు, ఉచ్చైః = గొప్పదగు, సింహనాదమునుజేసి, శఙ్ఖమ్, దధ్మౌ = పూరించెను.

ప. తస్య—ఇట్లు ప్రోత్సాహము గలిగించుమాటలచే తనవీరులను హెచ్చినశౌర్యముగలవారిఁగాఁ జేసినట్టి దుర్యోధనునకు, హర్షమ్ = ఉత్సాహమును, సంజనయన్, కురువృద్ధః = కౌరవసైన్యములయందు ముసలివాఁడు, పితామహః = భీష్ముఁడు, ప్రతాపవాన్ = తాను ఉత్సాహముగలవాఁడై, సింహనాదంవినద్య—సింహమువలె అట్టహాసముచేసి, శఙ్ఖమ్, దధ్మౌ = వాయించెను.

* ధనముచేఁ బోషించుచున్నాఁడు.

§ సింహనాదశంఖవాద్యములచే హర్షజనన మవశ్యము కలుగును కావున నది భవిష్యత్కాలిక మయినను వర్తమానముగా జెప్పఁబడినది యని యభిప్రాయము.

తత శ్శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః
సహసై వాభ్యహన్యన్త స శబ్దస్తుములో ఽభవత్. ౧౩

ఆ. తతః = అటుపిమ్మట, రాజాభిప్రాయము దెలిసి భీష్ముఁ డట్లు ప్రవర్తిం చిన పిమ్మట; వారిపక్షమునందలి రాజులచే, శఙ్ఖాశ్చ = శంఖములును; భేర్యశ్చ = భేరులును; పణవానకగోముఖాః = ఉడుకలును తప్పెటలును గోముఖము లను వాద్య ములును; సహసైవ = మిక్కిలి త్వరగానే; అభ్యహన్యన్త = కొట్టఁబడినవి, ధ్వని గలవిగాఁ జేయఁబడినవి. సః = ఆశంఖాదివాద్యములచేఁ గలిగిన; శబ్దః = ధ్వని; తుములః = గొప్పది, ఇతరుల కధికభయము చూపునది; ఆసీత్ = అయ్యెను.

అట్లు భీష్ముఁడు సింహనాదముచేసి శంఖముఁ బూరించిన పిదప వారిసేన లోని వారందఱు వెంటనే యతిత్వరగా శంఖములు పూరించి భేరులు మొదలగు వాద్యముల నతిత్వరగా వాయించిరి. అందువలన గలిగిన ధ్వని భయంకరంబై యొప్పె నని తాత్పర్యము.

శం. తతః = అంత, భీష్ముని శంఖధ్వనిచే యుద్ధోత్సాహము చెందిన ద్రోణుఁడు మొదలగు సర్వరథికులచేతను; శఙ్ఖాశ్చ = తమశంఖములును, సేనాచరు లచే, భేర్యశ్చ, పణవానకగోముఖాః = పణవములు మొదలగు వాద్యవిశేషములును; సహసైవ = మిక్కిలి వేగముగానే; అభ్యహన్యన్త. సః శబ్దః = శంఖభేర్యాదులచేఁ బుట్టిన యాధ్వని; తుములః = కలిసినదై గొప్పది; ఆసీత్ = అయ్యెను.

మ. తతః = సేనాపతి యగు భీష్ముఁ డట్లు ప్రవర్తించిన పిదప; పణవములు ఆనకములు గోముఖములు అను వాద్యవిశేషములు; సహసైవ = తత్క్షణమే; అభ్య హన్యన్త = వాయింపఁబడినవి. ఆశబ్దము, తుములః = గొప్పది, అయ్యెను; అయి నను పాండవులకు భయము కలుగలే దని యభిప్రాయము.

శ్రీ. ఇట్లు భీష్ముఁడు యుద్ధోత్సవము గావించుటం జూచి సైనికులందఱును యుద్ధోత్సవము గావించి రని చెప్పుచున్నాఁడు—పణవములును ఆనకములును గోము ఖములును అను వాద్యవిశేషములు; సహసైవ = ఆక్షణమే; అభ్యహన్యన్త = వాయింపఁబడినవి. ఆశంఖాదిశబ్దము, తుములః = గొప్పది, అయ్యెను.

ప. తతః అనునది మొదలుకొన్ని యాఱుశ్లోకములు సులభములు.

రా. ఆ దుర్యోధనుని విషాదముఁ జూచి భీష్ముఁ డతనికి హర్షము పుట్టించుటకై సింహనాదంబును శంఖపూరణంబునుం జేసి శంఖభేరీధ్వనులచేతనుగూడ విజయోత్సాహము గలిగించుఘోషమునుం జేయించెను. *

తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ
మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః. ౧౪

అ. తతః = దుర్యోధనుపక్షమునందలివా రట్లు ప్రవర్తించిన పిదప; శ్వేతైః = తెల్లని వగు; హయైః = గొప్ప బలపరాక్రమములు గల గుఱ్ఱములతో; యుక్తే = కూడిన; మహతి = ఎదిరింపరాని; స్యన్దనే = రథమునందు; స్థితౌ = ఉన్నవారలగు; సమీపముననున్న, మాధవః = కృష్ణుఁడును; పాణ్డవశ్చైవ = అర్జునుఁడును; దివ్యౌ = స్వర్గమునందుఁ బుట్టిన, అప్రాకృతము లగు; శఙ్ఖౌ = శంఖములను; ప్రదధ్మతుః = ఊఁదిరి.

దుర్యోధనుపక్షమునందలివారు శంఖాదిధ్వనులు గావించిన పిదప సమీపంబునఁ దెల్లనిగుఱ్ఱంబులు పూన్చిన గొప్పరథంబునందున్న కృష్ణార్జునులు అప్రాకృతము లగు తమ శంఖములం బూరించి రని తాత్పర్యము.

శం. ఇట్లు దుర్యోధనుని సైన్యముయొక్క ప్రవృత్తిం జెప్పి యిఁక పాండవసేనాప్రవృత్తిని జెప్పుచున్నాఁడు-తతః = భీష్మాదులు శంఖధ్వనిచేసిన పిమ్మటనే; శ్వేతైః, హయైః, యుక్తే; మహతి = పూజ్య మయిన; స్యన్దనే = రథమునందు; స్థితౌ, మాధవః = కృష్ణుఁడును; పాణ్డవశ్చైవ = అర్జునుఁడును; దివ్యౌ = స్వర్గమునందుఁ బుట్టిన; శఙ్ఖౌ, ప్రదధ్మతుః.

మ. ఇతరవీరులును రథస్థులెయై యుండఁగా తత శ్శ్వేతై ర్హయై ర్యుక్త ఇత్యాదిగా కృష్ణార్జులను రథస్థు లని చెప్పుట వారి రథమునకు ఇతరులరథములకు లేని గొప్పయుత్కర్షము కల దని తెలుపుటకొఱకు. అందుచే, అగ్నిదత్తమును ఎదిరింప శక్యముగానిదియు నగు రథమున నున్నవారు కృష్ణార్జునులు, అన్నివిధంబులను జయింప నలవిగానివా రని యర్థము.

శ్రీ. ఇఁకఁ బాండవసైన్యమునందు జరగిన యుద్ధోత్సవముఁ జెప్పుచున్నాఁడు-తత ఇత్యాదులగు నైదుశ్లోకములచేత-తతః = కౌరవసేనయందు వాద్య

* ఇది ౧౨-౧౩ శ్లోకముల యర్థము.

కోలాహల మయిన పిమ్మట; స్యన్దనే = రథమునందు; స్థితౌ = ఉన్నవారలై; కృష్ణార్జునులు, దివ్యములగు శంఖములను, ప్రదధ్మతుః = అధికముగా వాయించిరి.

పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనఞ్జయః
పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః. ౧౫
అనన్తవిజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః
నకులః సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ. ౧౬

ప్రతి. ఆ శంఖములు దివ్యము లనుటనే చెప్పుచున్నాఁడు—హృషీకేశః = కృష్ణుఁడు; పాఞ్చజన్యమ్ = పాంచజన్య మను శంఖమును; ధనఞ్జయః = అర్జునుఁడు; దేవదత్తమ్ = దేవదత్త మను శంఖమును; ప్రదధ్మతుః = పూరించిరి. కృష్ణార్జునులు యుద్ధమున కభిముఖు లగుటం జూచి సంతోషించినవాఁడై యుద్ధరసికుం డగు భీముఁడును యుద్ధమున కభిముఖుం డయ్యె నని చెప్పుచున్నాఁడు—భీమకర్మా = భయంకరము లయిన కార్యములు గల; వృకోదరః = భీముఁడు; పౌణ్డ్రమ్ = పౌండ్ర మను పేరుగల; మహాశఙ్ఖమ్ = గొప్పశంఖమును; దధ్మౌ = పూరించెను. వీర లిట్లు ప్రవర్తించుటను జూచి రాజయిన యుధిష్ఠిరుఁడును శంఖముఁ బూరించె నని చెప్పుచున్నాఁడు—కున్తీపుత్రః = కుంతికొడుకును; రాజా = రాజు నగు; యుధిష్ఠిరః = ధర్మరాజు; అనన్తవిజయమ్ = అనంతవిజయ మను పేరుగల శంఖమును; దధ్మౌ = ఊఁదెను. అన్నల ననుసరించుట యావశ్యక మని తలఁచి వీరితమ్ములును శంఖములు పూరించి రని చెప్పుచున్నాఁడు—నకులః = నకులుఁడును; సహదేవశ్చ = సహదేవుఁడును; సుఘోషమణిపుష్పకౌ = సుఘోష మను శంఖమును మణిపుష్పక మను శంఖమును; దధ్మతుః = ఊఁదిరి.

కృష్ణుఁడు పాంచజన్యమును అర్జునుఁడు దేవదత్తమును బూరించిరి. అంత భయంకరము లయిన కార్యములు చేయునట్టి భీముఁడు పౌండ్ర మనియెడు మహాశంఖమును బూరించెను. అంత రాజయిన కుంతీపుత్త్రుఁ డగు యుధిష్ఠిరుఁడు అనంతవిజయ మనుదానిని బూరించెను. నకులుఁడు సుఘోషమును సహదేవుఁడు మణిపుష్పకమును బూరించి రని తాత్పర్యము.

శం. చెప్పినదానినే స్పష్టీకరించుచున్నాఁడు—హృషీకేశః, పాఞ్చజన్యమ్ = పంచజనుఁ డను రాక్షసునివలనఁ బుట్టిన, ఆపేరుగల శంఖమును; పూరించెను. ధన

ఘోషః, దేవదత్తమ్ = దేవతలచే నియ్యఁబడిన, ఆపేరుగల శంఖమును, పూరించెను. భీమకర్మా = లోకభయంకరము లగు కర్మములు గలవాఁ డగు; వృకోదరః = వృక మను అగ్ని యుదరమునందుఁ గలవాఁడు, భీముఁడు; పౌణ్డ్రమ్ = పౌండ్ర మను పేరు గల; మహాశఙ్ఖమ్, దధ్మౌ. రాజా, యుధిష్ఠిరః = యుద్ధమునందు స్థిరుఁడు, ధర్మపుత్త్రుఁడు; అనన్తవిజయమ్—అనంత = నాశరహిత మగు, విజయమ్ = గెలుపు దేని వలనఁ గలుగునో, అట్టి అనంతవిజయ మను పేరుగల శంఖమును, పూరించెను. నకులః, సహదేవశ్చ, సుఘోషమణిపుష్పకౌ = సుఘోషము మణిపుష్పకము అను పేరులు గల శంఖములను; దధ్మతుః అని యధ్యాహార్యము.

వ్య. పాంచజన్యము దేవదత్తము పౌండ్రము అనంతవిజయము సుఘోషము మణిపుష్పకము అని శంఖముల పేరులు చెప్పుట "పాండవసైన్యమునందుఁ దమతమ పేరులం బ్రసిద్ధము లయినవి యన్ని శంఖములు గలవు, మీ సేనయందో యొకటిగూడ పేరుగల శంఖము లేదు" అని పాండవుల యుత్కృష్టాతిశయము దెలుపుటకొఱకు. హృషీకేశుఁడు * అనుపదముచే, సర్వేంద్రియములను బ్రేరించువాఁడును సర్వాంతర్యామియు నగు భగవంతుఁడు పాండవులకు సహాయుం డని తెలుపఁబడుచున్నది. ధనంజయపదము, దిగ్విజయమునందు సర్వరాజుల జయించి ధనముఁ దెచ్చినవాఁ డగుటచే నితని సర్వథా జయింప శక్యము గా దని తెలుపుచున్నది. భీమకర్మా—భీమ = హిడింబవధము మొదలయిన, కర్మము ఎవ్వనిదో అట్టివాఁడు, వృకోదరుఁ డనుటచే అధికమయిన యాహారమును జీర్ణించుకొనుటవలన అతిబలిష్ఠుఁడు భీమసేనుఁ డని చెప్పఁబడినది. కున్తీపుత్త్రః = కుంతిచే గొప్పతపస్సుచేసి ధర్ము నారాధించి పొందఁబడినవాఁడు, తానే రాజసూయయాగము చేయుటచే ముఖ్యుఁ డయినరాజు, యుద్ధమునందు ఇతఁడు జయముఁ బొందువాఁ డగుటచే స్థిరుఁడు, వీని శత్రువు లెంతమాత్రము స్థిరులు కాఁబో రని యుధిష్ఠిరపదముచే సూచింపఁబడినది. నకులుఁడు సుఘోషమును సహదేవుఁడు మణిపుష్పకమును బూరించి రని యన్వయము.

శ్రీ. దానినే విభాగించి చూపుటకై చెప్పుచున్నాఁడు—పాంచజన్యము మొదలగునవి శ్రీకృష్ణుఁడు మొదలగువారి శంఖముల పేరులు. భీమకర్మా = ఘోర మయిన కార్యము గలవాఁడు, వృకోదరః = వృక మను నగ్ని యుదరమునందుఁ

---

* ఇంద్రియములకుఁ బ్రేరకుఁడు.

గలవాఁడు; మహాశఙ్ఖమ్, పౌణ్డ్రమ్, దధ్మౌ, నకులుఁడు సుఘోష మను శంఖమును బూరించెను, సహదేవుఁడు మణిపుష్పక మనుదాని.

కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖణ్డీచ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః. ౧౭
ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే
సౌభద్రశ్చ మహాబాహు శ్శఙ్ఖా న్దధ్ముః పృథక్పృథక్. ౧౮

**ఆ.** పాండవపక్షమునందలి యితరరాజులుంగూడ ఐకమత్యముతో శంఖములు పూరించి రని దెలిపి సంజయుండు ధృతరాష్ట్రుని దురాశను నిరాకరించుచున్నాఁడు—పరమేష్వాసః = ఉత్తమమయిన విల్లు గల; కాశ్యశ్చ = కాశీరాజును; మహారథః = మహారథుఁ డగు; శిఖణ్డీచ = శిఖండియును; ధృష్టద్యుమ్నః = ధృష్టద్యుమ్నుఁడును; విరాటశ్చ = విరాటరాజును; అపరాజితః = పరాజయములేని; సాత్యకిశ్చ = సాత్యకియును; ద్రుపదః = ద్రుపదరాజును; ద్రౌపదేయాశ్చ = ద్రౌపది కొడుకులును, ప్రతివింధ్యుఁడు శ్రుతసోముఁడు శ్రుతకర్ముఁడు శతానీకుఁడు శ్రుతసేనుఁడు అనువారు క్రమముగా ధర్మపుత్రభీమార్జుననకులసహదేవులవలన ద్రౌపది యందుఁ బుట్టినవారు; మహాబాహుః = గొప్పచేతులుగల; సౌభద్రశ్చ = అభిమన్యువును; సర్వశః = అందఱును; పృథివీపతే = రాజా! ధృతరాష్ట్రుని సంబోధనము; పృథక్ పృథక్ = వేఱువేఱుగా; శఙ్ఖాన్ = శంఖములను; దధ్ముః = ఊఁదిరి.

రాజా! అట్లు మహాధనుర్ధరుం డగు కాశీరాజును మహారథుం డగు శిఖండియు ధృష్టద్యుమ్నుఁడును విరాటరాజును ఎట్టివారివలనను బరాజయము పొందని సాత్యకియును ద్రుపదుండును ద్రౌపదీపుత్త్రు లయిన ప్రతివింధ్య శ్రుతసోమ శ్రుతకర్మ శతానీక శ్రుతసేనులును మహాబాహుం డగు సుభద్రాపుత్త్రుం డభిమన్యువును అందఱును వేఱువేఱ తమతమ శంఖములు పూరించి రని తాత్పర్యము.

**శం.** మఱియును—పరమేష్వాసః = గొప్పవిల్లుగల, కాశ్యశ్చ = కాశీపతియును, శిఖణ్డీచ—శిఖండ మనఁగా మీసములు లేకుండుట, అది గలవాఁడు, శిఖండి యను పేరుగల పాంచాలుఁడును; మహారథుఁ డగు, ధృష్టద్యుమ్నః—ధృష్ట = శత్రువుల నెదిరించునట్టి, ద్యుమ్నః = బలముగలవాఁడు, పాండవసేనాపతి; విరాటుఁడును, అపరాజితః = శత్రువులచేఁ బరాజితుఁడు కానివాఁ డగు, సాత్యకిశ్చ=సత్యకునికుమా

రుఁడును; ద్రుపదుఁడును, ద్రౌపదేయులును, మహాబాహుః = అజానుబాహుఁ డగు * సౌభద్రుఁడును, సర్వశః = చెప్పఁబడినవా రందఱును; పృథక్పృథక్ శఙ్ఖాన్ దధ్ముః = ప్రత్యేకముగా శంఖములను బూరించి రని యర్థము.

మ. పరమేష్వాసః = గొప్పధనుస్సుగల; కాశ్యశ్చ = కాశిరాజును; అపరాజితః—పారిజాతహరణము బాణయుద్ధము మొదలగు మహాయుద్ధములందుఁ బరాజయము నొందనివాఁడు, అట్టి, సాత్యకి. పృథివీపతే = ఓయి ధృతరాష్ట్రుఁడా! స్థిరుండవై విను మని యభిప్రాయము. ఇతరము సులభము.

శ్రీ. కాశ్యః = కాశిరాజు, ఎట్టివాఁ డనఁగా—పరమేష్వాసః= శ్రేష్ఠమయిన ధనుస్సుగలవాఁడు. పృథివీపతే—ఓయి ధృతరాష్ట్రుఁడా!

రా. అంత నాఘోషంబు విని పార్థసారథి యగు సర్వేశ్వరేశ్వరుండును రథికుం డగు నర్జునుండును ముల్లోకంబుల జయించుటకు సాధనభూత మగు మహారథంబున నున్నవారై ముల్లోకంబులఁ గంపింపంజేయుచు శ్రీమత్పాంచజన్యము దేవదత్తము అను దివ్యము లగు శంఖములం బెల్లు పూరించిరి. అంత యుధిష్ఠిరుండును భీమసేనాదులును దమతమశంఖములను వేఱువేఱుగాఁ బూరించిరి.

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్. ౧౯

ఆ. సః = ఆ, శంఖములు పూరించుచున్న యారాజులచేఁ బుట్టింపఁబడిన; ఘోషః=మహాధ్వని; తుములః=మిక్కిలి భయంకరమై; నభశ్చ=ఆకాశమును; పృథివీం చైవ= భూమినిగూడ, సమస్త మయిన ముల్లోకముల ననుట; వి అనునాదయన్ = విశేషించి క్రమమున ధ్వనింపఁజేయుచు; ధార్తరాష్ట్రాణామ్ = దుర్యోధనాదుల యొక్క; హృదయాని = అంతఃకరణములను; వ్యదారయత్ = భేదించెను. వారు గావించిన శంఖధ్వని వినుటవలన ముల్లోకములందును ఆక్రోశము కలుగఁగా నిఁక దాని వినుచున్న దుర్యోధనాదుల హృదయములు కంపమొందుట యుక్తమే గదా!

అమ్మహాధ్వని మహాభయంకరంబై ముల్లోకములందును బ్రతిధ్వని గల్గించెను. అది విని దుర్యోధనాదు లందఱును దల్లడిల్లి రని తాత్పర్యము.

---

* మోఁకాలివఱకు నిడుపులయిన చేతులుగలవాఁడు.

౧౯. మఱియును—సః = ఆ పాంచజన్య దేవదత్త పౌండ్రాది మహాశంఖములవలనఁ బుట్టిన, ఘోషః = మహాధ్వని; తుములః = సమస్తశంఖధ్వనులతోఁ గలసినదై, నభశ్చ = ఆకాశమును చకారముచే సమస్తములయిన దిక్కులను, పృథివీంచైవ = భూమిని, చకారముచేఁ బర్వతములందలి గుహలను; వ్యనునాదయన్ = తమతమధ్వని కనురూపముగా మాఱుమోఁగునట్లు చేయుచు, అధ్వనితోఁ దాను కలిసి, ధార్తరాష్ట్రాణామ్—ఇట సంబంధార్థమున అణ్ప్రత్యయము, * ధృతరాష్ట్రుని కొడుకులును మనుమలును సైనికులును అందఱును ధార్తరాష్ట్రులు, వారలయొక్క, హృదయాని = హృదయమునందుండు కాలఖండ మను పేరు గల మాంసఖండములను; వ్యదారయత్ = ఛేదించెను. ఆధ్వనిచే గుండెలు పగిలినవారైరి యని యర్థము.

మ. ధార్తరాష్ట్రుల సైన్యమునందలి శంఖాదివాద్యముల ధ్వని మిక్కిలి తుముల మైనను అందుచేఁ బాండవులకు భయము కలుగ లేదు. పాండవులసైన్యమునందుఁ బుట్టిన ఆశంఖధ్వనియో, ధార్తరాష్ట్రాణామ్—ధృతరాష్ట్రుని—నీసంబంధులగు భీష్మద్రోణాదుల కందఱకును, హృదయాని వ్యదారయత్—గుండె పగల్చుటతో సమాన మయిన బాధను బుట్టించె నని యర్థము. ఎందువలన ననఁగా—తుములః = మిక్కిలి భయంకరము, ఆకాశమును భూమిని, ప్రతిధ్వనులచే నిండించుచున్నది.

శ్రీ. ఆ శంఖములధ్వని నీవారలకు మహాధ్వని కలిగించె నని చెప్పుచున్నాఁడు—ధార్తరాష్ట్రాణామ్—నీవారలకు, హృదయములను భేదించెను. ఏమి చేయుచు ననఁగా—నభశ్చ, పృథివీంచైవ, తుములః, వ్యనునాదయన్ = ప్రతిధ్వనులచే నిండించుచు.

ప. సఘోషః—పాండవసైన్యమువలనఁ బుట్టిన ధ్వని, ధార్తరాష్ట్రాణామ్—నీవారలయొక్క, హృదయాని, వ్యదారయత్ = వ్యాకులములుగాఁ జేసెను. ఎట్టిదై యనఁగా—తుములః = భయంకరమై, ఏమిచేయుచు ననఁగా—నభశ్చ, పృథివీంచైవ, వ్యనునాదయన్ = ప్రతిధ్వనిచే నిండించుచు.

రా. ఆఘోషము దుర్యోధనుఁడు మొదలగు నీకొడుకు లందఱికిని హృదయభేదనము గావించెను. ఇప్పుడె కౌరవసైన్యము నశించె నని దుర్యోధనాదులు తలంచిరి. ఇట్లు వారికి విజయము గోరునట్టి ధృతరాష్ట్రునకు సంజయుఁడు చెప్పెను.

* ధృతరాష్ట్రునకు సంబంధించినవా రని యర్థము.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాణ్డవః
హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే. ౨౦౪

ఆ. దుర్యోధనుఁడు మొదలగు ధార్తరాష్ట్రుల*కిట్లు భయము గలుగుటం దెలిపి యిఁక నర్జునుఁడు మొదలగు పాండవులకుఁ దద్వైపరీత్యముం జెప్పుచున్నాఁడు— మహీపతే = రాజా! అని సంజయుఁడు అంధుఁ డగు ధృతరాష్ట్రుని సంబోధనము చేయుచున్నాఁడు. అథ = భయము కలిగిన పిమ్మట; వ్యవస్థితాన్ = నిలిచియున్న, ఎట్లో ధైర్యముఁ బుట్టించుకొని నిలిచియున్న; ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను; దృష్ట్వా = చూచి, మిక్కిలి కలఁత నొందినవారినిగాఁ బ్రత్యక్షంబునఁ దెలిసికొని; కపిధ్వజః = వానరవరుం డగు హనుమంతుఁడు ధ్వజచిహ్నముగాఁ గల యర్జునుఁడు; ఎట్టి యవస్థయం దనఁగా—శస్త్రసంపాతే = బాణములు ఈటెలు మొదలగు ఆయుధములయొక్క సమూహము; ప్రవృత్తే = ప్రవర్తించుచుండఁగా, ప్రయోగమున కభిముఖ మగుచుండఁగా నని యర్థము; ఏమిచేసి యనఁగా—ధనుః = వింటిని; ఉద్యమ్య = ఎత్తి; తదా = అప్పుడు; హృషీకేశమ్ = కృష్ణునిఁగూర్చి; ఇదమ్ = ఈ; చెప్పఁబోవునట్టి, వాక్యమ్ = హేతుయుక్త మయిన వచనమును; ఆహ = పలికెను.

రాజా! అంత నట్లు భయమునొందియు ధైర్యమూని నిలిచియున్న దుర్యోధనాదులంజూచి, హనుమంతుఁడు ధ్వజచిహ్నముగాఁగల యర్జునుండు, ఉభయ సైనికులును ఒండొరులపై నాయుధములు ప్రయోగించుసమయంబున, గాండీవం బెత్తిపట్టి, శ్రీకృష్ణుం జూచి యీవాక్యముఁ బలికె నని తాత్పర్యము.

శ౦. * (౧) "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే. (౨) సస్య మివ మర్త్యః పచ్యతే సస్యమి వాజాయతే పునః. (3) అష్టాద శోక్త మవరం యేషు

* (౧) తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవ మే వాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే—అందువలన ఎట్లీలోకమునందు కర్మముచేఁ గలిగిన లోకము క్షయించుచున్నదో యిట్లే పరలోకమునందును బుణ్యముచేఁ గలిగిన లోకము క్షయించుచున్నది. (౨) పైరువలె మనుష్యుఁడు జీర్ణుఁడై మృతుఁ డగుచున్నాఁడు—పైరువలె మరల నావిర్భవించుచున్నాఁడు. (3) ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్త మవరం యేషు కర్మ, ఏత చ్ఛ్రేయో యే ఽభినన్దన్తి మూఢా జరామృత్యుం తే పునరే వాపి యన్తి—యజ్ఞనిర్వర్తకులగు పదునాఱుగురు ఋత్విక్కులు పత్ని యజమానుఁడు ఈపదునెనమండుగురు అస్థిరులు నశ్వరులుగా నున్నారు. ఇట్టి వీరు జ్ఞానరహిత మయిన

కర్మ, ఏత చ్ఛ్రేయో యే ఽభినన్దన్తి మూఢా జరామృత్యుం తే పునరేవాపి యన్తి. (౪) శ్వోభావా మర్త్యస్య యదన్తకైతత్. (౫) పరాచః కామా ననుయాన్తి బాలాః." అనియు, (౬) "కర్మణా పితృలోకో విద్యయా దేవలోకః." అనియు, (౭) "అన్ధం తమః ప్రవిశన్తి యే ఽవిద్యా ముపాసతే, తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ం రతాః." అనియు మొదలగు శ్రుతులచేతను, (౮) "జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ. (౯) మోఘాశా మోఘకర్మాణః. (౧౦) క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి." ఇత్యాది స్మృతులచేతను, జన్యత్వము దృశ్యత్వము మొదలగుయుక్తులచేతను, మోక్షమునుమాత్రమే కోరునట్టిపండితుఁడు, తాను యజింపవలసిన దేవతలను ఆదేవతల నుద్దేశించి చేయుచుండు కర్మములను దత్ఫలములను గుఱించి విచారముఁ జక్కఁగాఁ జేయవలె నని సూచించుటకై, పరమార్థము గోరునట్టి యర్జునునకు యుద్ధము చేయవలసినదై ప్రసక్తింపఁగా నతఁడు యుద్ధము చేయువారలను యుద్ధరూపకార్యమును దానిఫలంబునుం గుఱించి విచారముచేయుటయు నందుచే నతనికిఁ గలిగిన వైరాగ్యమునుం బ్రతిపాదించుట కీప్రకరణం బారంభింపఁబడుచున్నది.

అథ = రెండుసేనలయందును యుద్ధసన్నాహ మయినపిమ్మట; పాణ్డవః = పాండుపుత్త్రుఁడగు; కపిధ్వజః = అర్జునుఁడు; వ్యవస్థితాన్ = యుద్ధముకొఱకు సమీ

---

కేవలకర్మమున కాశ్రయ మని శాస్త్రముచేఁ జెప్పఁబడినది. కాఁబట్టి ఆశ్రయముతోఁ గూడ తత్కర్మము ఫలసహితముగా నశించును. ఇట్టి కర్మము శ్రేయస్సాధన మని యేమూఢు లభినందింతురో వారలు కొంతకాలము స్వర్గముననుండి మరల జరామరణరూపసంసారమును బొందుచున్నారు. (౪) శ్వోభావా మర్త్యస్య యదన్తకైతత్సర్వేన్ద్రియాణాం జరయన్తి తేజః—ఈభోగములు రేపు ఉండునో ఉండవో అని సంశయింపఁ దగినవి. మఱియు, మృత్యూ! సర్వేంద్రియములయొక్కయు తేజస్సేదిగలదో దాని క్షయింపఁజేయుచున్నవి. (౫) పరాచః కామా ననుయాన్తి బాలా స్తే మృత్యోర్యన్తి వితతస్య పాశమ్—బహిర్గతము లయిన కామములను మూఢు లనుసరించుచున్నారు. అందుచే వారలు విస్తీర్ణ మయిన సంసారరూపమృత్యువుయొక్క పాశమును బొందుచున్నారు. (౬) కర్మముచేఁ బితృలోకము కలుగును. విద్యచే దేవలోకము కలుగును. (౭) ఎవ్వరు అవిద్యారూపకర్మము నుపాసించుచున్నారో వారు అజ్ఞానరూప మయిన చీఁకటిని పొందుచున్నారు. ఇఁక నెవ్వరు కర్మమును విడిచి దేవతాజ్ఞానరూప మగు విద్యయందుమాత్రమే ఆసక్తు లగుదురో వార లంతకన్నను గొప్పదైన చీఁకటిని బొందుచున్నారు. (౮) జన్మము పొందినవానికి మరణము తప్పదు. మృతునకు జన్మము తప్పదు. (౯) అట్లు నన్నవమానించువారలు వ్యర్థములైన యాశలు గలవారలును నిష్ఫలము లయిన యగ్నిహోత్రాదికర్మములు గలవారలు నగుదురు. (౧౦) పుణ్యము తఱిఁగిన పిదప మనుష్యలోకముఁ బ్రవేశించుచున్నారు.

పించిన; ధార్తరాష్ట్రాన్; దృష్ట్వా; తాను, ధనుః, ఉద్యమ్య; శస్త్రసంపాతే
ఆయుధముల ప్రయోగించు సమయము, ప్రాప్తింపఁగా, తదా, హృషీకేశమ్,
ఇదమ్ = చెప్పఁబోవునట్టి, వాక్యమ్, ఆహ.

మ. దుర్యోధనాదులకు భయము కలిగె నని దెలిపి పాండవులకుం దద్విపరీత్య మయ్యె నని చెప్పుచున్నాఁడు—అథ = భయము గలిగినపిమ్మట; పలాయనము చేయవలసియున్నను అందుకు విరుద్ధముగా యుద్ధమునందలి పూనికతో నిలుకడ గలవారలై యేయున్న శత్రువులను బ్రత్యక్షమునం దెలిసి, అప్పుడు, శస్త్రసంపాతము; ప్రవృత్తే= ప్రవర్తమాన మగుచుండఁగా, వర్తమానమునందు క్తప్రత్యయము; కపిధ్వజఃపాణ్డవః—మహావీరుఁ డగు హనుమంతునిచే ధ్వజరూపంబున ననుగ్రహింపఁబడినవాఁ డగునర్జునుండు, అన్ని విధంబులను భయములేనివాఁ డగుటవలన యుద్ధము కొఱకు గాండీవ మనుధనువుఁ బట్టి; హృషీకేశమ్ = ఇంద్రియములఁ బ్రేరించువాఁ డగుటచే సర్వజనుల యంతఃకరణవృత్తులం దెలిసినవాఁ డగు శ్రీకృష్ణునిఁగూర్చి; ఇదమ్= చెప్పఁబోవునట్టి, వాక్యమ్, ఆహ = చెప్పెను, కాని ఆలోచింపక వేగిరపడి తానే యేదో యొకటిచేసినవాఁడు కాఁడు, అని సంజయుండు పాండవు లాలోచించి చేయువార లగుటచే నీతిధర్మములయందుఁ గుశలు లని చెప్పుచు, నీవు ఆలోచన లేక పరులరాజ్యము గైకొంటివి కావున నీతిధర్మములు లేకుండుటచే నీకు జయము కలుగ దని మహీపతే అను సంబోధనముచే సూచించుచున్నాఁడు.

శ్రీ. ఈసమయమునందు అర్జునుఁడు శ్రీకృష్ణునితో విజ్ఞాపనము చేసె నని చెప్పుచున్నాఁడు అథేత్యాదు లగు నాలుగుశ్లోకములచేత—వ్యవస్థితాన్ = యుద్ధప్రయత్నముచే నిలిచియున్నవారిని. కపిధ్వజః = అర్జునుఁడు.

ప. పిమ్మట నేమి జరిగె ననఁగాఁ జెప్పుచున్నాఁడు—కపిధ్వజః = అర్జునుఁడు, నాలుగుశ్లోకములచే కృష్ణునితో విన్నవించుచున్నాఁడు.

సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మే ఽచ్యుత
యావ దేతా న్నిరీక్షే ఽహం యోద్ధుకామా నవస్థితాన్. ౨౧

అ. అథ్యర్జునుని వాక్యమునే యారంభించు చున్నాఁడు—అచ్యుత = నాశములేనివాఁడా! కృష్ణునిసంబోధనము; యావత్ = ఎంతదూరములో; అవస్థితాన్ = ప్రతిపక్షులయి నిలిచినవారును; యోద్ధుకామాన్ = మనతోఁ బోరుటకుఁ

గోరుచున్నవారు నగు; ఏతాన్ = ఈ భీష్మద్రోణాదులను; అహమ్ = నేను; నిరీక్షే = చూతునో; తావత్ = అంతదూరమునందు; ఉభయోః = రెండైన; సేనయోః = సేనలయొక్క, ఒండొంటిని సమీపించియున్న రెండుసేనలయొక్క; మధ్యే = నడుమను; మే = నాయొక్క; రథమ్ = రథమును; స్థాపయ = నిలువుము. రథము నిలుపుమని యర్జునుండు సర్వేశ్వరుని సారథికృత్యమునందు నియోగించుచున్నాఁడు! భక్తులగు పాండవుల కేమి యశక్యము? భగవంతుఁడుగూడ వారియాజ్ఞను జేయుచున్నాఁడు! యుక్తమే గదా భగవంతుఁడు భక్తపరవశుం డగుట. అచ్యుత యను సంబోధనముచే భగవంతుని స్వరూపమున కెప్పుడును చ్యుతిలే దని చెప్పఁబడుచున్నది. యావత్ అను నుత్తరార్ధముచే రథస్థాపనస్థానము నిశ్చయించుచున్నాఁడు, ఎంతదూరమున నున్నచో నేను భీష్మద్రోణాదుల నందఱను జూచుటకు సమర్థుఁడ నగుదునో అంతదూరమునందలి ప్రదేశమునందు రథమును నిలుపవలె నని యర్థము.

అచ్యుతా! మనతో యుద్ధము సేయఁ గోరి మన కెదురై నిలుచున్న యీభీష్మద్రోణాదుల నందఱను నేను జక్కఁగాఁ జూచుట కనువగుచోట రెండు సేనలనడుమ నారథము నిలుపు మని తాత్పర్యము.

శ ౦. యోద్ధుకామాన్ = యుద్ధముచేయఁ గోరినవారును, కావుననే, అవస్థితాన్ = సేనను సన్నాహపఱచుకొని యుద్ధమున కుద్యుక్తులు నగు, ఏతాన్ = ఈవీరులనందఱను, యావత్ = ఎంత దూరమునందలి ప్రదేశమునందు నిలిచి, అహమ్ = నేను, నిరీక్షే = చక్కఁగాఁ జూతునో, ఓఅచ్యుతా! అంతదూరము నారథమును గొనిపోయి, సేనయోః ఉభయోః మధ్యే స్థాపయ.

మ. ఆయర్జునవాక్యమునే చెప్పుచున్నాఁడు.—సేనయోః ఉభయోః—మన పక్షమునందును శత్రుపక్షమునందును వచ్చి యుద్ధమునకై సమీపించిన రెండుసేనల నడుమ, నారథమును, స్థాపయ = స్థిరముగాఁ జేయుము, అని యర్జునునిచే సర్వేశ్వరుఁడు నియోగింపఁబడుచున్నాఁడు. ఇందుచే "భక్తుల కశక్య మేమియున్నది? భగవంతుఁడుగూడ వారి నియోగముఁ జేయుచున్నాఁడు! పాండవులకు జయము తప్పదు" అని సూచించుచున్నాఁడు. ఓయీ! నీవు చెప్పినచోట్లను రథమును నిలుపునపుడు నీశత్రువులు రథమునుండి పడఁద్రోతు రని భగవంతుఁడు శంకించునని యాశంకించి చెప్పుచున్నాఁడు—అచ్యుత—దేశకాలవస్తువులయందును ఎందును

త్రోపుడులేని నిన్ను ఎవ్వఁడు త్రోయఁ గలఁడని భావము. ఇందుచే, భగవంతుఁడు సర్వదా నిర్వికారుం డగుటవలన అర్జునుఁడు నియోగించుటచే ఆయనకుఁ గోపము కలుగుటకు నవకాశమే లే దని చెప్పఁబడినది. సేనలకు నడుమ రథము నిలుపుటకుఁ బ్రయోజనముఁ జెప్పుచున్నాఁడు—యోద్ధుకామాన్—యుద్ధముసేయఁ గోరినవారలను, కాని మనతోఁగూడ సంధిని గోరువారలను కాదు. అవస్థితాన్—నిలిచినవారలను, కాని భయమువలనఁ బరుగెత్తినవారలను గాదు. ఏతాన్—ఈభీష్మద్రోణాదులను, యావత్—ఎంతదూరము పోయినయెడ నేను జూచుటకు సమర్థుఁడ నగుదునో, అంతదూరమునందలి ప్రదేశమునందు రథము నిలుపు మని యర్థము. యావత్ అనునది కాలపర మయినను గావచ్చును. *

శ్రీ. ఆవాక్యమునే చెప్పుచున్నాఁడు—సేనయోః అని.

కైర్మయా సహ యోద్ధవ్య మస్మి న్రణ సముద్యమే. ౨౨

టీ. మఱియు యుద్ధప్రారంభ మయినప్పుడు, పెక్కండ్రు రాజు లీయుద్ధభూమియందుఁ గనఁబడుచున్నారు. వారిలో నెవ్వరితోఁగూడ నేను బోరవలెను? నాకెందును ఎదురులేదు గదా! అని చెప్పుచున్నాఁడు—అస్మిన్=ఈ; రణసముద్యమే=యుద్ధప్రారంభమునందు; మయా=నాచేత; కైస్సహ=ఎవ్వరితోఁగూడ; యోద్ధవ్యమ్=పోరుట కావలెను.

ఈ యుద్ధభూమియం దనేకులు రాజు లున్నారు, వీరిలో నే నెవ్వరితో యుద్ధము సేయవలెను? నాయెదుట నెవ్వరు నిలువఁగలరు? తెలిసికొనవలె నని తాత్పర్యము.

శం. నీ వేమి యిచటికి సేనం జూడ వచ్చితివా? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—అస్మిన్, రణసముద్యమే=యుద్ధవ్యాపారమునందు, కైస్సహ, మయా, యోద్ధవ్యమ్=యుద్ధముచేయవలసినది యగుచున్నది?

మ. ఓయీ! నీవు యుద్ధము సేయువాఁడవుకాని యుద్ధము చూడవచ్చినవాఁడవు కావు. కావున వీరిఁ జూచుటచే నీ కేమిప్రయోజనము? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—అస్మిన్ రణసముద్యమే—బంధువులే పరస్పరము చేయు నీయుద్ధప్రయత్నమునందు, మయాకైస్సహ యోద్ధవ్యమ్—నే నెవ్వరితోఁగూడ యుద్ధము చేయ

* ఎంతకాలము నిలిపినయెడ నేను జూడఁగలనో అంతకాలము నిలుపు మని యర్థము.

వలెను? కైః మయా సహ యోద్ధవ్యమ్—ఎవ్వరు నాతోఁగూడ యుద్ధము చేయ వలెను? అని నాకు గొప్పకౌతుకము కలుగుచున్నది. ఇది తెలియుటయే సేనల నడుమ రథము నిలుపుటకుఁ బ్రయోజన మని యర్థము.

శ్రీ. ఓయి! నీవు యుద్ధముచేయువాఁడవు కాని యుద్ధముచూచువాఁడవు కావు అనఁగాఁ జెప్పుచున్నాఁడు—కైస్సహ మయా యోద్ధవ్యమ్—ఎవ్వరితోఁగూడ నాచే యుద్ధముచేయుట కావలెను?

యోత్స్యమానా నవేక్షే௨హం య ఏతే௨త్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః. ౨3

రా. ప్రతిభటులు లేనియెడ నీయుద్ధోత్సాహ మెట్లు సఫలం బగును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—యే = ఏ; ఏతే = ఈరాజులు; అత్ర = ఈ కురుక్షేత్రము నందు; సమాగతాః = నానాదేశములనుండి చేరినవారలై, ఇందుచేఁ బ్రతిభటులు పెక్కండ్రు కల రని యర్థము; వారికి మనతో మున్ను ఎప్పుడును వైరము లేకుండఁగా వా రెట్లు ప్రతిభటు లగుదు రనఁగా చెప్పుచున్నాఁడు—దుర్బుద్ధేః = చెడుబుద్ధిగల, తన్ను రక్షించుకొను నుపాయము తెలియనివాఁడై యుద్ధమునకు సంరంభము సేయుచున్న; ధార్తరాష్ట్రస్య = దుర్యోధనునకు; యుద్ధే = యుద్ధ భూమియందు, నిలిచి, ప్రియమ్ = సంతోషమును; చికీర్షవః = చేయఁగోరినవారై, ఇందుచే వారికి మనతో సోపాధికమయిన వైరము గల దని యర్థము. సన్తి = ఉన్నారో; యోత్స్యమానాన్ = పోరఁ బోవుచున్న, ఆయుధముల ధరించి యుద్ధో త్సాహము పాటించియున్న; తాన్ = ఆరాజులను; అహమ్ = నేను; అవేక్షే = చూచు చున్నాను.

ఈ కురుక్షేత్రమునందు నానాదేశములనుండి వచ్చి దుర్బుద్ధి యగు దుర్యోధనునకు జయము కలిగింపఁ గోరి చేరియున్న రాజులు పెక్కండ్రు కనఁబడు చున్నారు. వారిలో నే నెవ్వరితోఁ బోరవలెనో చూచి తెలిసికొనవలె నని తా.

శం. దుర్బుద్ధేః = అధర్మమునందున్న; ధార్తరాష్ట్రస్య = ధృతరాష్ట్రుని కొడుకయిన దుర్యోధనునకు; యుద్ధేప్రియచికీర్షవః = యుద్ధముచే నతఁడు కోరు ప్రయోజనమును కలిగింపఁ గోరినవారై; అత్ర = ఈ కురుక్షేత్రమునందు; యే = ఎవరు; సమాగతాః, అట్టి, యోత్స్యమానాన్ = యుద్ధముచేయఁ బోవుచట్టి, వార

లను, అందఱను; అహమ్, అవేక్షే—పేరును రూపమును కులమును సంబంధమును ఎట్లు ఎఱుంగుదునో అట్లు రథమును నిలుపు మని యర్థము.

మ. వీరలందఱు బంధువులు, ఎట్లయినను బరస్పరము సంధి కావించు కొందురు, కావున యుద్ధమునకుఁ బ్రసక్తియుండ దని యాశంకించి చెప్పుచున్నాఁడు— యే ఏతే= ఏ యీభీష్మద్రోణాదులు, దుర్బుద్ధేః—తన్ను రక్షించుకొను నుపాయము తెలియనట్టి, ధార్తరాష్ట్రస్య= దుర్యోధనునకు; యుద్ధేప్రియచికీర్షవః= యుద్ధము నందు సంతోషము చేయఁగోరువారలు గాని దుర్బుద్ధిని బోఁగొట్టుట మొదలగు వానియందుఁ గాదు. అట్టి, యోత్స్యమానాన్ = యుద్ధముచేయఁబోవువారిని, అహమ్, అవేక్షే = చూచుచున్నాను, కాని సంధికోరువారలను గాదు. కావున యుద్ధముకొఱకుఁ బ్రతిభటులఁ జూచుట యుచితమే యని భావము.

శ్రీ. ధార్తరాష్ట్రస్య= దుర్యోధనునకు, ప్రియమును చేయఁగోరినవారలై, ఎవరు ఇచట చేరియున్నారో వారల నేను ఎంతలోఁ జూడఁగలనో అంతవఱకు రెండు సేనలనడుమ రథమును నిలుపు మని యర్థము.

ప. దుర్బుద్ధేః= మోసముచేయునట్టి, ధార్తరాష్ట్రస్య, యుద్ధే, ప్రియచికీర్షవః= ప్రియమును జేయఁ గోరునట్టి, యేఏతే = ఏయీరాజులు, అత్ర, సమాగతాః సన్తి= చేరియున్నారో, వారల నెంతలోఁ జూతునో అంతవఱకు రెండుసేనల నడుమ రథమును నిలుపు మని యర్థము.

రా. అంత యుద్ధము సేయఁ గోరినవారై నిలిచియున్న ధార్తరాష్ట్రులం జూచి, లంకాపురము దహించిన వానరుఁడు * ధ్వజచిహ్నముగాఁ గల యర్జునుండు, జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజస్సులకు నిధియును స్వసంకల్పమాత్రముచేఁ గావింపఁబడిన జగదుత్పత్తిస్థితిలయంబు లను లీలలుగలవాఁడు నగు, హృషీకేశుని= జ్ఞానులును అజ్ఞానులు నగు సమస్తజనుల అంతరింద్రియంబులను బాహ్యేంద్రియంబులను సర్వవిధంబుల నియమించుటయం దున్నవానిని, ఆశ్రితవాత్సల్యపరవశుం డగుటచేఁ దనకు సారథియైయున్నవానిని భగవంతుని, యుద్ధముచేయఁగోరినవాఁడై, చక్కఁగాఁ జూచుటకై, వారిఁ జూచుటకు యోగ్యమయిన స్థానంబున రథంబు నిలుపు మని నియోగించెను. §

---

* హనుమంతుఁడు.

§ ౨౦ మొదలు ౨౩ శ్లోకములవఱకుఁ దాత్పర్యము.

సఞ్జయ ఉవాచ.

ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. ౨౪
భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాంచ మహీక్షితామ్
ఉవాచ పార్థ పశ్యైతా౯ సమవేతా౯ కురూ నితి. ౨౫

అ. ఇట్లర్జునునిచేఁ బ్రేరితుండై భగవంతుఁ డహింసారూప మగు ధర్మము నాశ్రయించి యనేకముగా నయ్యర్జునుని యుద్ధమునుండి మరలించు నను ధృతరాష్ట్రునితలంపును నిరాకరింపఁ గోరినవాఁడై సంజయుం డతనికిఁ జెప్పె నని చెప్పుచున్నాఁడు—సంజయః ఉవాచ = సంజయుఁడు పలికెను.

భగవంతుఁడు భూమిభారపరిహారార్థము ప్రవర్తించినవాఁ డగుటంజేసి యర్జునుని యభిప్రాయము దెలిసికొని తద్ద్వారంబునఁ దనకోర్కి నెఱవేర్చుకొనఁ జూచును. కావున నర్జునునివాక్యము ననుసరించి తన యభిప్రాయమున కనుకూలముగా ననుష్ఠించె నని చెప్పుచున్నాఁడు—భారత = ధృతరాష్ట్రా! హృషీకేశః = కృష్ణుఁడు; ఏవమ్ = ఇట్లు; గుడాకేశేన = అర్జునునిచేత; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; ఉభయోః = రెండైన; సేనయోః = సేనలయొక్క; మధ్యే = నడుమను; భీష్మద్రోణప్రముఖతః = భీష్మద్రోణులయెదుటను; సర్వేషామ్ = అందఱి; మహీక్షితాంచ = రాజులయొక్కయు; ప్రముఖతః = ఎదుటను; రథోత్తమమ్ = రథశ్రేష్ఠమును; స్థాపయిత్వా = నిలిపి; అట్లు భీష్మద్రోణాదులయు నితరరాజులయు సమీపమున రథమును నిలిపి భగవంతుఁ డేమిచేసె ననఁగాఁ జెప్పుచున్నాఁడు—పార్థ = అర్జునా! ఏతా౯ = ఈసమీపమునం దున్న; సమవేతా౯ = మీతోఁగూడఁ బోరుటకుఁ జేరినట్టి; కురూ౯ = కురువంశమునందుఁ బుట్టిన రాజులను; పశ్య = చూడుము. చూచి నీ కిం దెవ్వరితో యుద్ధము సేయ నిచ్ఛ గలుగునో వారితో యుద్ధము సేయుము. శస్త్రాస్త్రములందుఁ బండితులగు నీరాజుల నుపేక్షించుట యుచితము గాదుగదా! సారథ్యవిషయమునమాత్రము నీవు మనస్సులోఁ జింతసేయవల దని యర్థము. ఇతి = అని; ఉవాచ = పలికెను.

సంజయుఁడు ధృతరాష్ట్రునితో నిట్లనియె. రాజా! అర్జునునివాక్యము విని కృష్ణుఁడు రెండుసేనలనడుమ భీష్ముఁడు ద్రోణుఁడు మొదలగువారియొక్కయు సమస్తరాజులయొక్కయు సమీపమున రథమును నిలిపి, అర్జునా! వీరుగో మీతో యుద్ధము సేయుటకై చేరియున్నవారు కౌరవులు, చూడు మని పలికెను.

శం. గుడాకేశేన—« అఙ్గుష్ఠతర్జనీయోగో గుడా నామ్నాతు ముద్రికా'' * అను వచనమువలన అంగుష్ఠతర్జనీయోగము గుడ యని చెప్పఁబడును, గుడ యంత పరిమాణముగల ముంగురులు గలవాఁడు గుడాకేశుఁడు, లేక, « గుడో గోళేక్షుపాకయోః'' అను నిఘంటువువలన గుడము అనఁగా బ్రహ్మాండగోళము, దానిని తప్తాయఃపిండము నగ్నివలె లోపలను వెలుపలను, అకతి=వ్యాపించుచున్నాఁడు అని గుడాకుఁడనఁగా శివుఁడు, అట్లు « విశ్వస్యైకం పరివేష్టితారం జ్ఞాత్వా శివమ్'' అని శ్రుతి, § లేక, గుడ మనఁగా ఇక్షుపాకము బెల్లము, దానివలె మధురుఁడై, సద్భక్తులన్, అకతి = పొందుచున్నాఁ డని గుడాకుఁడు శివుఁడు, « స్వాదుష్కిలాయం మధుమాఉతాయన్'' అని శ్రుతి, $ అట్టి శివుఁడు ఈశుఁడుగాఁ గలవాఁడు గుడాకేశుఁడు అర్జునుఁడు, వానిచేత; హృషీకేశః=హృషీకములకు ఇంద్రియములకు ఈశుఁడు హృషీకేశుఁడు శ్రీకృష్ణుఁడు, ఏవముక్తస్సన్; రథోత్తమమ్—రథికునిచేతను సారథిచేతను అశ్వవిశేషములచేతను ధ్వజప్రధానముచేతను ఉత్కృష్ట మగుటచే ఆరథమునకు నుత్తమత్వము. ఆరథోత్తమమును సేనలు రెంటినడుమ నిలిపి. భీష్మద్రోణప్రముఖతః — షష్ఠీబహువచనార్థమందు తసిప్రత్యయము, భీష్మద్రోణులు ప్రముఖము ఆదిగాఁ గల; మహీక్షితామ్ = రాజులు, ఇట ఛత్రిన్యాయముచే భీష్మద్రోణులకు రాజత్వము, భీష్మద్రోణప్రముఖు లగు రాజులు; సర్వేషామ్ = అందఱును; శృణ్వతామ్ = వినుచుండఁగా అని యధ్యాహార్యము; హేపార్థ; సమవేతాన్ = చేరికనుపొందిన; ఏతాన్; కురూన్; పశ్య. ఇతి ఉవాచ.

మ. ఇట్లర్జునునిచేఁ బ్రేరితుండై భగవంతుం డహింసారూప మగు ధర్మము నాశ్రయించి ప్రాయికముగా యుద్ధమునుండి యర్జునుని మరల్పఁగలఁ డని ధృతరాష్ట్రుని యభిప్రాయము నాశంకించి దాని నిరాకరింపఁ గోరినవాఁడై సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పె నని వైశంపాయనుఁడు చెప్పుచున్నాఁడు—సంజయ ఉవాచ అని.

హేభారత = భరతవంశమునందుఁ బుట్టిన ధృతరాష్ట్రుఁడా! భరతవంశమర్యాదను దలఁచియైనను జ్ఞాతులయెడ ద్రోహమును విడువు మని సంబోధనాభిప్రాయము. గుడాకేశేన—గుడాకా = నిద్రకు, ఈశేన = నియామకుఁడగు, నిద్రను

---

* అంగుష్ఠమును తర్జనియును జేర్చుట గుడా యను పేరుగల ముద్ర యగును.

§ సర్వప్రపంచమును వ్యాపించినవానిఁగాను ఒక్కనిఁగాను శివునిఁ దెలిసి.

$ ఇశుఁడు స్వాదున్న మధురుఁడై పొందువాఁడు.

జయించినవాఁ డగుటచే అన్నివిషయములందును ఎచ్చరిక గలవాఁ డగు నర్జునుని చేత, ఇట్లు చెప్పఁబడినవాఁడై; భగవంతుండు ఈయర్జునుఁడు నాభృత్యుఁడై యుండియు నన్ను సారథ్యమునందు నియోగించుచున్నాఁ డని దోసంబుఁ దలఁచి కోపించిన వాఁడు కాఁడు, అతని యుద్ధమునుండి మరలించినవాఁడును గాఁడు. మఱేమిచేసె ననఁగా—సేనల రెంటినడుమను, భీష్మద్రోణప్రముఖతః = భీష్మద్రోణులయెదుటను; సర్వేషామ్ = అందఱి; మహీక్షితాంచ = రాజులయొక్కయు; ప్రముఖతః = ఎదుటను, ఆద్యాది యగుటచే తసిప్రత్యయము సార్వవిభక్తికము, ప్రముఖతః అనుశబ్దము సమాసగత మయినను చకారముచే ఆకర్షింపఁబడుచున్నది. భీష్మద్రోణుల వేఱుగాఁ జేర్కొనుట వారు ప్రధాను లని సూచించుటకొఱకు. రథోత్తమమ్ = అగ్నిచే నియ్యఁబడిన దివ్యరథమును, భగవంతుఁడు తానే సారథియయి యధిష్ఠించియుండుటచేతను గూడ సర్వోత్తమ మయినదానిని; స్థాపయిత్వా = నిలిపి; హృషీకేశః = సర్వజనుల గూఢాభిప్రాయముల నెఱింగినట్టి భగవంతుఁడు, అర్జునునకు శోకమోహములు సంభవించె నని యెఱింగి పరిహాసముగాఁ బలికెను—హేపార్థ—పృథ స్త్రీస్వభావంబున శోకమోహగ్రస్తురా లగుటచేఁ దత్సంబంధంబున నీకును శోకమోహగ్రస్తత సంభవించె నని తాను హృషీకేశుఁ డగుటను దెలుపుచున్నాఁడు, పృథ నాతండ్రితోఁ బుట్టువు, ఆమె కుమారుఁడవు నీవని సంబంధము దెలుపుటచేతనుగూడ ఆశ్వాసించుచున్నాఁడు. నాసారథ్యము విషయమున నిశ్చయము గలవాఁడనై యుద్ధము సేయఁ గోరినవారలై చేరియున్న కౌరవుల నందఱను నిశ్శంకముగాఁ జూడు మని చూడుము అను విధి కభిప్రాయము. నేను సారథ్యమునందు మిక్కిలి సావధానుఁడనై యున్నాను నీవో యిప్పుడే రథికత్వము విడువఁబోవుచున్నావు. కావున నీకు శత్రుసైన్యముఁ జూచుటచే నేమి ప్రయోజనము? అని యర్జునునకు ధైర్యము గలిగింపవలె నని చూడు మను నీభగవద్వాక్యమున కుద్దేశ్యము. అట్లు కానియెడ రథమును సేనల నడుమ నిలిపెను అనుటమాత్రమే చాలును.

శ్రీ. పిమ్మట నేమి జరగె ననఁగా—హేభారత = ధృతరాష్ట్రుఁడా! గుడాకేశేన = నిద్రకు ఈశ్వరుఁడైన, నిద్రను జయించినట్టి యర్జునునిచేత, ఇట్లు చెప్పఁబడినవాఁడై, భీష్మద్రోణులయొక్కయు, మహీక్షితామ్ = రాజులయొక్కయు, ప్రముఖతః = సమ్ముఖమునందు, రథమును నిలిపి, పార్థా! ఈకౌరవులను జూడు మని పలికెను.

ప. అంత శ్రీకృష్ణుఁడును సేనలనడుమ, భీష్మద్రోణప్రముఖులగు, సర్వేషామ్, మహీక్షితామ్ = రాజులయొక్క, సమ్ముఖమును, రథమును జేర్చి, ఉవాచ= పలికెను. ఏమని యనఁగా—పార్థ! ఏతాన్, సమవేతాన్, కురూన్, పశ్య.

రా. భగవంతుఁడును అట్లర్జునునిచే నియోగింపఁబడినవాఁడై యాక్షణమె భీష్మద్రోణాదు లగు సర్వరాజులును జూచుచుండఁగా నియోగించినచొప్పునఁ గావించెను. ఇట్టిది మీవారలవిజయస్థితి యనియుం బలికెను.

తత్రాపశ్యత్స్థితా న్పార్థః పితౄ నథ పితామహాన్
ఆచార్యా న్మాతులా న్భ్రాతౄన్ పుత్త్రాన్ పౌత్త్రాన్ సఖీంస్తథా
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయో రపి. ౨౬

ఆ. ఇట్లుండఁగా నర్జునునకు హింస గొప్పయధర్మ మని విపరీతబుద్ధి యుదయించి యుద్ధమునుండి విరమింపుతలంపు కలిగె నని చెప్పుచున్నాఁడు—తత్త్ర—ఈ సప్తమికి యుద్ధము నారంభించుటకు భగవంతుని యనుజ్ఞ యగుచుండఁగా నని యర్థము. పార్థః = అర్జునుఁడు; సేనయోః ఉభయో రపి = సేనలరెంటియందును; స్థితాన్ = ఉన్నవారలగు; పితౄన్ = తండ్రులను; అథ—ఇది తథాశబ్దపర్యాయము అట్లు అని యర్థము; పితామహాన్ = తాతలను; ఆచార్యాన్ = ఆచార్యులను; మాతులాన్ = మేనమామలను; భ్రాతౄన్= తోఁబుట్టువులను; పుత్త్రాన్ = కొడుకులను; పౌత్త్రాన్=మనుమలను; తథా=అట్లు; సఖీన్= సావాసకాండ్రను; శ్వశురాన్= భార్యలతండ్రులను, మామలను; సుహృదశ్చైవ= మిత్త్రులను, కృతవర్మ మొదలగు వారిని; అపశ్యత్ = చూచెను.

అట్లు భగవంతుఁడు యుద్ధారంభమున కనుజ్ఞ చేయుచుండఁగా నర్జునుఁడు రెండుసేనలయందును ఉన్నట్టి తండ్రులను తాతలను ఆచార్యులను మేనమామలను సోదరులను బుత్త్రులను మనుమలను సావాసకాండ్రను మామలను మిత్త్రులనుం జూచె నని తాత్పర్యము.

శం. ముముక్షు వగు విద్వాంసుఁడు తాను యజింపవలసిన దేవతలపరిశీలనమే చేయవలసిన దని సూచించుటకై యర్జునుఁడు సైనికులఁ బరిశీలించువిధమును రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు—అథ = భగవంతుఁ డట్లు చెప్పినపిమ్మట; పార్థః—పృథయనఁగా కుంతీదేవి, ఆయమకొడు కైనయర్జునుఁడు; తత్త్ర = ఎచట

రథము నిలుపఁబడెనో అచట, ఉండి; సేనయోః ఉభయోరపి, స్థితాన్, పితౄన్—పినతండ్రులను పెదతండ్రులను; సఖీన్ = సమానమయిన యీడుగల సావాసకాండ్రను; శ్వశురాన్; సుహృదః = మిత్త్రులను; ఇట్లు అందఱనుగూడ తనవారినే చూచెనుగాని, తదితరులను జూచినవాఁడు కాఁడని యర్థము.

ప. తత్త్ర = యుద్ధము నారంభించుటకై సైన్యముఁ జూచుటకు భగవంతుఁ డనుజ్ఞ యిచ్చినపిదప; సేనయోరుభయోరపి= సేనలరెంటియందును, స్థితాన్= ఉన్నవారలను, పార్థుఁడు చూచె నని యన్వయము. అథ శబ్దము తథాశబ్దపర్యాయము. శత్రుసేనయందు, పితౄన్ = పితృవ్యు లగు * భూరిశ్రవుఁడు మొదలగు వారిని; పితామహాన్—భీష్ముఁడు సోమదత్తుఁడు మొదలగువారిని; ఆచార్యాన్—ద్రోణుఁడు కృపుఁడు మొదలగువారలను; మాతులాన్—శల్యుఁడు శకుని మొదలగు వారలను; భ్రాతౄన్—దుర్యోధనుఁడు మొదలగువారిని; పుత్త్రాన్—లక్ష్మణుఁడు మొదలగువారలను; పౌత్త్రాన్—లక్ష్మణుఁడు మొదలగువారి కొడుకులను; సఖీన్—అశ్వత్థామ జయద్రథుఁడు మొదలగు సావాసకాండ్రను; శ్వశురాన్ = భార్యలకుఁ దండ్రులను; సుహృదః = మిత్త్రులను కృతవర్మ భగదత్తుఁడు మొదలగువారలను; సుహృదః అనుటచే ఉపకారము చేసినవా రెవ్వరెవ్వరుగలరో అట్టి మాతామహాదులును గ్రహింపఁబడుచున్నారు. ఇట్లు స్వసేనయందును ఊహించుకొనునది.

శ్రీ. అంత నేమి జరిగె ననఁగా ఒకటియునర శ్లోకముచేఁ జెప్పుచున్నాఁడు—పితౄన్—పితృవ్యుల నని యర్థము. పుత్త్రాన్ పౌత్త్రాన్—దుర్యోధనాదులకుఁ గొడుకులును మనుమలును ఎవ్వరుగలరో వారల నని యర్థము. సఖీన్ = మిత్త్రులను; సుహృదః = ఉపకారము చేసినవారలను; అపశ్యత్.

ప. అంత నేమి జరిగె ననఁగాఁ జెప్పుచున్నాఁడు—పితౄన్—పితృవ్యులను, పితామహాన్ = వృద్ధులను, ఆచార్యాన్, మాతులాన్ = తల్లివలెఁ బూజ్యులయిన మేనమామలను, ఇట్లు పూజ్యులు చెప్పఁబడిరి. ఇఁక ప్రేమాస్పదులఁ జెప్పుచున్నాఁడు—భ్రాతౄన్—దుర్యోధనుఁడు మొదలగువారిని, నూటయొక్క సంఖ్యగల వారలను; ఇంకఁ గనికరింపఁ దగినవారిని జెప్పుచున్నాఁడు—పుత్త్రాన్ పౌత్త్రాన్—దుర్యోధనాదుల పుత్త్రపౌత్త్రుల నని యర్థము. ఇఁక అపకీర్తికిఁ గారణ మగువారిం జెప్పుచున్నాఁడు—సఖీన్ ఇత్యాదిగా.

* పినతండ్రులు పెదతండ్రులు.

తాన్ సమీక్ష్య స కౌన్తేయ స్సర్వా న్బన్ధూ నవస్థితాన్
కృపయా పరయాఽఽవిష్టో విషీద న్నిద మబ్రవీత్. ౨౭

టీ. చెప్పఁబడినప్రకారము ఉభయసేనలయందును నిలిచియున్న పితృపితామహాదులం జూచి పరమకృపాపరవశుండై యర్జునుండు భగవంతునితో నిట్లనియె నని చెప్పుచున్నాఁడు—సః = ఆ; కౌన్తేయః = అర్జునుఁడు; అవస్థితాన్ = నిలిచియున్న; తాన్ = ఆ; బన్ధూన్ = చుట్టాలను; సర్వాన్ = అందఱను; సమీక్ష్య = చూచి; పరయా = అధికమయిన; కృపయా = దయచేత; ఆవిష్టః = వ్యాపింపఁబడినవాఁడై; విషీదన్ = పరితపించుచు, పై చెప్పఁబడిన పిత్రాదుల హింసింప సంరంభము చేయుటచేఁ గలిగిన విషాదమును అనఁగా పరితాపమును బొందుచు నని యర్థము; ఇదమ్ = ఈ మాటను; అబ్రవీత్ = పలికెను.

ఆయర్జునుం డట్లుభయసేనలయందు యుద్ధసన్నద్ధులయియున్న పితృపితామహాదు లగు బంధువుల నందఱం జూచి మిక్కిలి కరుణగలవాఁడై పరితపించుచు భగవంతునితో నీవాక్యముఁ బలికె నని తాత్పర్యము.

శం. ఇట్లు వారలం జూచినయర్జునునకు వారలఁ జూచుటచే నేమి కలిగె ననఁగాఁ జెప్పుచున్నాఁడు—సః = చూచుటయందుఁ బ్రవృత్తుఁడైన; కౌన్తేయః = కుంతి కొడుకైన యర్జునుఁడు; బన్ధూన్ = బంధుత్వముతోఁ గూడినవారలనే; తాన్ = ఆ; అవస్థితాన్ = యుద్ధసన్నద్ధులను; సర్వాన్ = అందఱను; సమీక్ష్య = మొదలెత్తి చక్కఁగాఁ జూచి; వారలయందు, అధికమయిన కృపచే ఆవిష్టుఁడై; విషీదన్, ఇదమ్ = చెప్పఁబోవునట్టి వచనమును; అబ్రవీత్.

మ. ఇట్లుండఁగా, నర్జునునకు, « హింస గొప్పయధర్మము » అను మోహాఖ్య మయిన విపరీతబుద్ధిచేతను, « శాస్త్రవిహిత మగుటచే యుద్ధము ధర్మమే యగును » అను జ్ఞానమునకుఁ బ్రతిబంధకంబును మమకారముచేఁ బుట్టినదియు నగు శోకము అను మనోవ్యాకులతచేతను, వివేకంబు నశించి, పూర్వ మారంభింపఁబడిన స్వధర్మ మగు యుద్ధమునుండి విరమించుతలంపు గొప్పయనర్థము కలిగించునది సంభవించె నని తెలుపుచున్నాఁడు—కౌన్తేయః—స్త్రీకి కొడు కని చెప్పుట పార్థుఁ డన్నట్లు అప్పుడు కలిగిన మూఢత నపేక్షించి. కృపయా = దయచేత, ఇది కర్త; తన వ్యాపారముచేతనే, ఆవిష్టః = వ్యాపింపఁబడినవాఁడై, కృప యితనిఁ బొంది

నది కాని, ఇతఁడు ఏవ్యాపారముచేతనుం గృపను బొందినవాఁడు కాఁడని స్వత స్సిద్ధమే యీతనికిఁ గృప యని సూచింపఁబడుచున్నది. దీనిఁ బ్రకటీకరించుటకు పరయా అను విశేషణము. లేక, అపరయా అని పదవిభాగము, * స్వసైన్యము నందుఁ బూర్వముగూడఁ గృప కలిగియే యుండెను. ఆసమయమునందుమాత్రము కౌరవసైన్యమునందుఁగూడ మఱియొకకృప కలిగె నని యర్థము. విషీదన్—విషాద ము ననఁగాఁ బరితాపమును బొందుచు, అబ్రవీత్ అని వచనమునకును విషాదమున కును సమకాలతను జెప్పుటచేఁ గంఠమునందు డగ్గుత్తిక కన్నీరుకాఱుట మొదలగు నవి సూచించుచున్నాఁడు.

శ్రీ. అంత నేమిచేసె ననఁగాఁ జెప్పుచున్నాఁడు—ఆవిష్టః = వ్యాపింపఁబడిన వాఁడై, కూడినవాఁడై, విషీదన్—విశేషించి సీదన్ = అవసాద మనఁగా హర్షక్షయ మును బొందుచు.

అర్జున ఉవాచ.

§ దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్
సీదన్తి మమ గాత్రాణి ముఖంచ పరిశుష్యతి ౨౮

ఆ. ఆవచనమునే యుదాహరించుచున్నాఁడు — కృష్ణ = కృష్ణుఁడా! యుయుత్సుమ్ = యుద్ధముచేయఁ గోరినదియు; సముపస్థితమ్ = సమీపించియున్న దియు నగు; ఇమమ్ = ఈ; స్వజనమ్ =బంధుజనమును; దృష్ట్వా = చూచి; యుద్ధము సేయు కోరికతో యుద్ధభూమిఁ జేరియున్న తన బంధువర్గముం జూచి శోకము పొందె నని తెలుపుచున్నాఁడు — స్థితస్య = ఉన్న; మమ = నాయొక్క; గాత్రాణి= అవయవములు; సీదన్తి=అధీనత తప్పుచున్నవి, సడలుచున్నవి. ముఖంచ=నోరుగూడ; పరిశుష్యతి = ఎండుచున్నది. దేవాంశుఁ డగు నర్జునుఁడుగూడ ఆత్మజ్ఞానము లేని వాఁడై స్వదేహమునం దాత్మాభిమానమును బరులదేహములం దాత్మీయాభిమానం బును గలిగి వానియందుఁ బ్రీతిగలవాఁడై యుద్ధారంభంబున వానికి మరణము గలుగు నని తలంచి మహాశోకము నొందె నని యర్థము.

---

* అపరయా కృపయా = మఱియొక దయచేత.

§ దృష్ట్వేమాన్ స్వజనాన్ కృష్ణ యుయుత్సూన్ సముపస్థితాన్—అని పాఠాంతరము.

కృష్ణా! యుద్ధము సేయుటకై సన్నద్ధులై నిలిచియున్న యీబంధువులం జూడఁగా నాచేతులు కాళ్ళు మొదలగు నవయవము లన్నియు వడలి నోరెండిపోవు చున్న దని తాత్పర్యము.

శం. «తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః» * అనియు, «ముఖా దిన్ద్రశ్చాగ్నిశ్చ» § అనియు మొదలగు శ్రుతులవలన దేవతలకు జన్మము చెప్పఁబడుటచేఁ జన్మముగలవార లగు నాదేవతలు అనిత్యు లనియు ఆగంతుక మయిన యైశ్వర్యము గలవా రనియు $ సంసారు లనియు ఫలము నొసంగువార లగుటచే బంధము కలిగించువా రనియుఁ దెలిసి, నిత్య మయిన సుఖముఁ గోరునట్టి ముముక్షువు, ఆదేవతల యజించు విషయంబున «దుఃఖప్రద మయిన యీకర్మముచే నేమి ప్రయోజనము» అని పరితాపము పొందవలె నని సూచించుటకై, యర్జునుఁడు తాను జేయఁబోవు బంధుజనవధమునిమిత్తమయి పరితపించువిధమును, అధ్యాయము కడవఱకుఁ జెప్పుచున్నాఁడు.—

యుయుత్సుమ్— సేనను ఆయితపఱచి యుద్ధేచ్ఛతోఁ గూడినదాని, సముపస్థితమ్ = ఎదుటనున్నదాని; ఇమంస్వజనమ్ = ఈపితృపితామహాది బంధుజనమును; దృష్ట్వా—నావార లని యెఱింగి; వధించుటకు, మమ, గాత్రాణి = చేతులుకాళ్ళు మొదలగునవి; సీదన్తి—శిథిలములువలె నున్నవి. ముఖంచ = నోరును; పరిశుష్యతి = ఎండుచున్నది.

మ. సంజయుఁడు భగవంతునితో నర్జునుఁడు చెప్పిన యీవాక్యమునే యుదాహరించుచున్నాఁడు అర్జున ఉవాచ అనునది మొదలుకొని ఏవము క్త్వార్జున స్సఙ్ఖ్యే అనువఱకుఁ గల గ్రంథముచేత. అందు, స్వదేహమునం దాత్మాభిమానంబును బరులదేహములం దాత్మీయాభిమానంబును గలవాఁడును ఆత్మవిదుఁడు కానివాఁడు నగు నర్జునుఁడు యుద్ధమునందుఁ దనదేహమునకును బరులదేహములకును వినాశము కలుగు నని తలంచినవాఁడై స్వధర్మప్రవృత్తికిఁ గారణమయిన తత్త్వజ్ఞానమునకుఁ బ్రతిబంధక మగు మహాశోకము నొందె నని ఆశోకముయొక్క చిహ్నములు చెప్పుటచే దెలుపుచున్నాడు మూఁడుశ్లోకములచేత.—

---

* దానివలన దేవతలు నానావిధులు పుట్టినారు.

§ ముఖమునుండి యింద్రుఁడును అగ్నియుఁ బుట్టిరి.

$ నిత్యమయిన యైశ్వర్యము గలవారు కారు.

ఇమమ్, స్వజనమ్ = నాదైన బంధువర్గమును, యుద్ధేచ్ఛ గలదానిని, యుద్ధభూమియందు సమీపించినదానిని, దృష్ట్వా = చూచి, స్థితస్య మమ = ఉన్న నాకు, చూచుచున్న నాకు అని యర్థము. అవయవములు నొచ్చుచున్నవి. నోరును, పరిశుష్యతి—శ్రమాదులచేఁ గలుగు శోషముకన్నను అధిక మని చెప్పుటకై అంతటను అను నర్థము గల పరిశబ్దము ప్రయోగింపఁబడెను. *

శ్రీ. ఏమి చెప్పె నని యడుగఁగా దృష్ట్వేమమ్ అని మొదలుకొని యధ్యాయ సమాప్తిపఱకుఁ జెప్పుచున్నాఁడు—హేకృష్ణ; యుద్ధముచేయఁగోరినదియు ఎదుటను చక్కఁగా సమీపించియున్నదియు నగు, ఈబంధుజనమును జూచి నాయవ యవములు చేతులు కాళ్ళు మొదలగునవి, సీదన్తి = పడుచున్నవి. మఱియు, ముఖమ్ = నోరు, పరి = అంతటను, శుష్యతి = తడిలేని దగుచున్నది.

ప. ఇఁక నర్జునుఁడు తన నిర్వేదమును జెప్పుచున్నాఁడు—గాత్రాణి = అవ యవములు, చేతులు కాళ్ళు మొదలగునవి, సీదన్తి = శిథిలము లగుచున్నవి. ముఖంచ, శుష్యతి = శుష్క మగుచున్నది.

వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే
గాణ్డీవం స్రంసతే హస్తా త్త్వక్చైవ పరిదహ్యతే. ౨౯

ఆ. అవయవములు సడలుటయు నోరెండుటయు నను నీరెండు శోక చిహ్నములు చెప్పఁబడినవి. ఇప్పుడు వణఁకు మొదలగు భయచిహ్నముల నుపన్య సించుచున్నాఁడు.—

మే= నాయొక్క; శరీరే= దేహమునందు; వేపథుశ్చ = వడఁకును; రోమ హర్షశ్చ = వెండ్రుకలకు గగుర్పాటును; జాయతే = కలుగుచున్నది. గాణ్డీవమ్ = గాండివము; హస్తాత్ = చేతినుండి; స్రంసతే= జాఱుచున్నది. త్వక్చైవ= చర్మము గూడ; పరిదహ్యతే = అంతటను దహింపఁబడుచున్నది.

నా దేహ మంతయు వడఁకుచున్నది, గగుర్పాటు కలిగెను. గాండీవమును జేతఁ బట్టఁజాల కున్నాను. నాదేహమునఁ జర్మమంతయు నిక్కిలి తాపము గలిగి యున్న దని తాత్పర్యము.

---

* అంతటను ఎండుచున్నది—బొత్తిగా తడి లే దని భావము.

శం. శరీరే, వేపథుః = కంపము; రోమహర్షశ్చ—భయమువలనను సంతాపమువలనను వెండ్రుకల గగుర్పాటుగూడ; జాయతే. హస్తాత్, గాణ్డీవమ్ = గాండీవమనుధనుస్సు; స్రంసతే = పడుచున్నది. త్వక్ చ = చర్మముగూడ; పరి = అంతటను, తాపముచే, దహ్యతే = దహింపఁబడుచున్నది.

మ. వేపథుః = కంపము. రోమహర్షః = గగుర్పాటు. గాండీవము పడుటచే అధైర్యరూప మయిన దౌర్బల్యంబును జన్యదాహముచే మనస్సంతాపంబును దెలుపఁబడినవి.

శ్రీ. వేపథుః = కంపము. రోమహర్షః = రోమాంచము. స్రంసతే = పడుచున్నది. పరిదహ్యతే = అంతటను సంతాపము నొందుచున్నది.

ప. ఇఁకఁ గరుణారసం బావిర్భవించుటచే సాత్త్వికభావములం జెప్పుచున్నాఁడు—సమస్తదేహమునందును, వేపథుః = కంపము కలుగుచున్నది. రోమహర్షః = రోమాంచము. ఇఁక నవయవముల పరవశతను జెప్పుచున్నాఁడు—గాణ్డీవమ్ = గాండివ మను విల్లు; హస్తాత్, స్రంసతే = పడుచున్నది. త్వక్, పరిదహ్యతే = సంతాపము నొందుచున్నది.

నచ శక్నో మ్యవస్థాతుం భ్రమ తీవచ మే మనః
నిమిత్తానిచ పశ్యామి విపరీతాని కేశవ. 304

శం. మఱియు నధైర్యముగూడఁ గలిగిన దని చెప్పుచున్నాఁడు—అవస్థాతుంచ = నిలుచుటకుఁ గూడ; నశక్నోమి = చాలకున్నాను. గొప్పమోహముగూడఁ గలుగుచున్న దని చెప్పుచున్నాఁడు—మే = నాయొక్క; మనః = మనస్సు; భ్రమతీవచ = తిరుగున ట్లున్నది. విపరీతము లయిన నిమిత్తములు తోఁచుటవలనఁగూడ మోహము కలుగుచున్న దని చెప్పుచున్నాఁడు—కేశవ = కృష్ణా! విపరీతాని = అశుభఫలము సూచించునట్టి; నిమిత్తానిచ = శకునములనుగూడ; పశ్యామి = చూచుచున్నాను.

కృష్ణా! నిలుచుటకుఁగూడ శక్తిలే కున్నాను. నామనస్సు భ్రమణము పొందున ట్లున్నది. మఱియు విపరీతము లయిన నిమిత్తములు ఎడమక న్నదరుట మొదలగునవి కనఁబడుచున్న వని తాత్పర్యము.

శ౦. మే, మనః, అపిచ = మఱియును. భ్రమతి = పరవశ మగుచున్నది. ఇందువలననే రథమునందు నిలుచుటకుఁగూడ శక్తుఁడను గా కున్నాను. నిమిత్తానిచ = నిమిత్తములనుగూడ, యుద్ధమునందుఁ బ్రవర్తించుటవలన అనర్థములే కలుగు నని సూచించునట్టివిపరీతము లయిన వానినే చూచుచున్నాను, కాని అనుకూలములను గాదు. హే కేశవ = ఓకృష్ణా!

మ. అవస్థాతుంచ=దేహమును వహించుటకుఁగూడ, నశక్నోమి. ఇందుచే మూర్ఛ సూచింపఁబడుచున్నది. అందుకు హేతువు—నామనస్సు భ్రమణము పొందున ట్లున్నది. భ్రమణము పొందుటవంటి దేమనఁగా, మూర్ఛకుఁ బూర్వావస్థ యయిన యొకానొక మనోవికారము. చకారము హేతువును దెలుపును. నామనస్సు భ్రమణము నొందున ట్లుండుటచే నిలువఁజాల కున్నా నని యర్థము. నిలువఁజాల కుండుటకు మఱియొక కారణము గూడఁ జెప్పుచున్నాఁడు— నిమిత్తములనుగూడ, సమీపదుఃఖమును సూచించునవి యగుటచే విపరీతములను ఎడమకన్నదరుట మొదలగువాని, పశ్యామి = అనుభవించుచున్నాను. ఇందువలనఁగూడ నిలువఁజాల కున్నా నని యర్థము. నేను ఆత్మవేత్తను గాకుండుటచే దుఃఖముగలవాఁడ నగుటవలన శోకముచేఁ గలుగునట్టి క్లేశము ననుభవించుచున్నాను. నీవో సదానందరూపుఁడ వగుటవలన శోకసంబంధము లేనివాఁడ వని కృష్ణపదముచే శ్లో. ౨౮. సూచింపఁబడినది. ఇందువలన నీవును నాయట్లు బంధుజనమును జూచుచున్నను, నీయందు శోకసంబంధము లేకుండుట యను విశేషముండుటవలన, నీవు నన్ను శోకరహితునిఁ జేయు మని భావము. కేశవపదముచే నట్లు చేయుసామర్థ్యము సూచింపఁబడినది, ఎట్లనఁగా—కః = సృష్టికర్తయగు బ్రహ్మ, ఈశః = సంహారకర్త యగురుద్రుఁడు, తౌ = ఆ బ్రహ్మరుద్రులను, వాతి = కరుణింపఁదగినవారు లగుటచే పొందుచున్నాఁ డని కేశవశబ్దమునకు వ్యుత్పత్తి. * లేక, కృష్ణపదముచే భక్తులదుఃఖము నాకర్షించువాఁ డగుట చెప్పఁబడినది. కేశవపదముచే "కేశి మొదలగు దుష్టదైత్యుల వధించుటచే నెల్లప్పుడును భక్తులను బాలించుచున్నవాఁడవు, కావున నన్నుఁగూడ నాశోకము నివారించి పాలించెదవు" అని సూచింపఁబడినది.

---

* బ్రహ్మరుద్రులనుగూడఁ గరుణించి రక్షించువాఁడవు నన్ను రక్షించుట నీ కెంతమాత్ర మని భావము.

శ్రీ. మఱియును. విపరీతానినిమిత్తాని = అనిష్టము సూచించునట్టి శకున ములను, పశ్యామి = చూచుచున్నాను.

ప. ఇఁకమీఁద నెట్లు యుద్ధము చేయవలె నని చెప్పుచున్నాఁడు—నిలు చుటకే శక్తుఁడను కాను, ఇఁక యుద్ధము చేయ శక్తుఁడను గా నని చెప్పనలయునా? మనస్సున ధైర్యము నవలంబించి పోరవలె నని చెప్పుదువేని, యదియు శక్యముకా దని చెప్పుచున్నాఁడు—మనః, భయము నొందిన దగుటచే ప్రకృతిస్థము * కా కున్నది. మఱియును, భోకేశవ, మనస్సునందుఁ బుట్టిన, నిమిత్తాని = రాఁగల విషయ ముల సూచించునట్టి యిహలోకసాధనములను, విపరీతాని = అనిష్టమునకు హేతువు లయినవానిని, పశ్యామి.

న చ శ్రేయో ఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే. ౩౧

ఆ. యుద్ధమునందు బంధుజనుల హింసించుటచే ఫలము కనఁబడకుండుట వలనఁగూడ యుద్ధమునుండి విరమింపవలె ననుతలంపు కలుగుచున్న దని చెప్పు చున్నాఁడు—ఆహవే = యుద్ధమునందు; స్వజనమ్ = బంధుజనమును; హత్వా = వధించి, వధించుటచే; శ్రేయశ్చ = మేలునుగూడ; న అనుపశ్యామి = చూడకున్నాను.

ఇంతియగాక యుద్ధమునందు బంధువుల వధించుటచే నెంతమాత్రము మేలు గలుగు ననియు నాకుఁ దోఁపలే దని తాత్పర్యము.

శం. ఇప్పు డిట్లుండుఁ గాక, అ ట్లయినను పిమ్మట మాత్రము మేలు గలుగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—స్వజనమ్ = ఈపితృపితామహాది బంధుజనమును; ఆహవే = యుద్ధమునందు; హత్వా = వధించి. అను = పిమ్మట, యుద్ధానంతరము గూడ; కొంచెమయినను మేలును, నపశ్యామి, వీరల వధించుటచే రాఁగల పురు షార్థ మేదియు నెఱుంగ నని యర్థము.

మ. ఇట్లు చిహ్నములద్వారమున సత్ప్రవృత్తికిఁ గారణమయిన తత్త్వ జ్ఞానమునకుఁ బ్రతిబంధక మగు శోకముం జెప్పి యిప్పుడు శోకముచేఁ బుట్టింపఁబడిన విపరీతప్రవృత్తిహేతు వగు విపరీతబుద్ధిని జూపుచున్నాఁడు—శ్రేయః = పురుషార్థ మును, దృష్టమును గాని అదృష్టమును గాని, § అను = అధికముగా నాలోచించిన

* తన స్వభావమున నుండునది.

§ దృష్టమును = ఇహలోకమునందుఁ గలుగువాని, అదృష్టమును = పరలోకమునందుఁ గలుగు దాని.

పిమ్మటఁగూడ, నపశ్యామి. బంధువులు కానివారిని యుద్ధమునందు వధించినను శ్రేయస్సు కనఁబడదు. ఏల యనఁగా "ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమణ్డలభేదినౌ, పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖో హతః" * ఇత్యాదివచనములచే హతునకుమాత్రమే శ్రేయస్సు చెప్పఁబడినది. వధించినవానికో కొంచెమైనను సుకృతము లేదు. ఇట్లు పరజనులను వధించుటచేతనుగూడ శ్రేయము లేదనఁగా స్వజనులవధించుటచే మఱియు లేదని తెలుపుటకొఱకు "స్వజనమ్" అని చెప్పఁబడినది. ఇట్లు, యుద్ధభిన్న మయిన కార్యముచే వధించుటవలన శ్రేయస్సు లేదని సిద్ధ మగుటచే సిద్ధసాధనదోష § నివారణార్థము "ఆహవే" అని చెప్పఁబడినది.

శ్రీ. స్వజనమ్, ఆహవే = యుద్ధమునందు, హత్వా, శ్రేయః = ఫలమును, నపశ్యామి.

ప. మఱియు, శ్రేయః = పరలోకసాధనమును; నపశ్యామి.

న కాఙ్క్షే విజయం కృష్ణ నచ రాజ్యం సుఖానిచ
కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగైర్జీవితేన వా. ౩౨

ఆ. యుద్ధముచేయఁ గోరివచ్చిన వీరి వధించుటచే జయమును రాజ్యమును సుఖంబును బొందవచ్చునే, యుద్ధమునుండి విరమించుట యెందువలన? అని యాశంకించి చెప్పుచున్నాఁడు—కృష్ణ = కృష్ణా! విజయమ్ = గెలుపును; నకాఙ్క్షే = కోరను. రాజ్యంచ = దొరతనమునుగూడ; నకాఙ్క్షే = కోరను. సుఖానిచ = సుఖములనుగూడ; నకాఙ్క్షే = కోరను. సర్వజనులును గోరునట్టి రాజ్యాదికమును నీవేల కోరవు? రాజ్యాదిక మున్నం గదా పుత్త్రులు భ్రాతలు మొదలగువారికి నెమ్మది కలిగింపవచ్చును. అని యాశంకించి చెప్పుచున్నాఁడు—గోవిన్ద= కృష్ణా! నః= మనకు; రాజ్యేన = దొరతనముచేత; కిమ్ = ఏమిప్రయోజనము? భోగైః = సుఖములచేత; కిమ్ = ఏమిప్రయోజనము? జీవితేనవా = బ్రతుకుచేతఁగాని; కిమ్ = ఏమిప్రయోజనము?

---

* యోగయుక్తుఁ డయిన సన్న్యాసియు యుద్ధమున నభిముఖుఁడై హతుఁడైన శూరుఁడును— ఈపురుషు లిద్దఱుమాత్రమే లోకమునందు సూర్యమండలము భేదించువారు.

§ సిద్ధ మగువాని సాధించుట యని యొకదోషము.

కృష్ణా! నాకు జయముగాని రాజ్యముగాని సుఖములుగాని వలదు. ఏలయనఁగా, గోవిందా! ఈరాజ్యముచేతను సుఖములచేతను జీవితముచేతనుగూడ మాకుఁ బ్రయోజనము లేదని తాత్పర్యము.

శ౦. వీరి వధించుటచే జయము నొందలగు శ్రేయస్సు ఉండినే యున్న దనఁగాఁ జెప్పుచున్నాఁడు—స్వజనమును హింసించుటచేఁ గలుగునట్టి జయ మేది గలదో దాని నేను కోరను. అందుచేతఁ గలుగు రాజ్యంబును దానివలన సిద్ధించు విషయసుఖంబులను నేను కోర నని యర్థము. ఇందుచే అధర్మమువలనఁ గలుగునట్టి నైహికసుఖంబు మాకు వల దని చెప్పఁబడినది. వీర లెట్లు రాజ్యాదికముఁ గోరి యుద్ధము చేయుచున్నారో అట్లు మీరును యుద్ధముచేయుఁ డనఁగాఁ జెప్పుచున్నాఁడు—ఇది ధర్మము ఇది యధర్మము అను వివేకముగల, నః = మాకు, స్వజనుల హింసించుటచేఁ బ్రాప్తమగు రాజ్యముచే నేమి ఫలము? అందువలన సిద్ధించు భోగములచేతఁగాని యేమిఫలము? అందుకొఱకైన జీవితముచేతఁగాని యేమి ఫలము? అధర్మమువలనఁ గలుగునది యగుటంజేసి దోషావహమగు నిది యంతయు సత్పురుషులకుఁ గోరఁదగినది కా దని యర్థము.

వ. అయ్యా! అదృష్ట మగు ప్రయోజనము లేకపోవుఁ గాక. దృష్ట ప్రయోజనములు మాత్రము విజయము రాజ్యము సుఖములు అనునవి కల వనుట నిర్వివాద మనఁగాఁ జెప్పుచున్నాఁడు—కార్యసాధనోపాయమునందుఁ బ్రవర్తించుటకు ఫలాపేక్షగదా కారణము. ఇందువలన, భోజనాపేక్ష లేనివానికి భోజనరూప ఫలప్రాప్తికి సాధన మయిన పాకాదికమునందుఁ బ్రవృత్తి కలుగనియట్లు, విజయాది ఫలాపేక్ష లేకుండుటవలనఁ దత్సాధన మయిన యుద్ధమునందు నాకుఁ బ్రవృత్తి కలుగ కున్న దని యర్థము. ఇతరపురుషులచే అపేక్షింపఁబడుచున్న యీవిజయాదులందు నీ కెందువలన నపేక్ష లే దనఁగాఁ జెప్పుచున్నాఁడు—భోగైః = సుఖములచేత. జీవితేన = జీవితమునకు సాధన మయిన జయముచే నని యర్థము. రాజ్యము భోగములు కొరవుల జయించుట యివి లేకయే, వనమున నున్నవారము అందుచేత లోకమున శ్లాఘనీయ మయిన జీవితము గలవారల మగు మాకు వీనిఁ గోరనేల యని భావము. గోశబ్దమున కర్థ మయిన యింద్రియములను వానికధిష్ఠాన మయినవాఁడ వగుటచే నెల్లప్పుడును పొందియుండువాఁడవు నీవే నాకు ఐహికఫలములయందు రాగము లే దనుట నెఱుంగుదు వని సూచించుచు గోవిన్ద * అని సంబోధనము చేయుచున్నాఁడు.

* ఇంద్రియములను పొందినవాఁడు.

శ్రీ. విజయము మొదలగు ఫలము కల దనుట నెఱుంగవా యేమి యనఁగాఁ జెప్పుచున్నాఁడు—నకాఙ్క్షే అని. దీనినే వివరించుచున్నాఁడు కిం న ఇత్యాదు లగు రెండున్నర శ్లోకముల చేత.

ప. మఱియును ఇంత యుద్ధప్రసంగ మెందుకొఱకుఁ జేయఁబడుచున్నదో అదియు నాకు రుచింప దని చెప్పుచున్నాఁడు—నకాఙ్క్షే ఇత్యాదిగా.

యేషా మర్థే కాఙ్క్షితం నో రాజ్యం భోగా స్సుఖానిచ
త ఇమే ఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ. 33
ఆచార్యాః పితరః పుత్రా స్తథైవచ పితామహాః
మాతులా శ్శ్వశురాః పౌత్రా శ్శ్యాలా స్సంబన్ధిన స్తథా. 3౪

ఆ. రాజ్యాదులు వల దనుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు—యేషామ్ అర్థే= ఎవ్వరినిమిత్తమయి; నః= మాకు, మాచే; రాజ్యమ్ = దొరతనము; కాఙ్క్షితమ్= కోరఁబడినదో; భోగాః = భోగ్యవిషయములును; కాఙ్క్షితాః = కోరఁబడినవో; సుఖానిచ = సుఖములును; కాఙ్క్షితాని = కోరఁబడినవో; తే = అట్టి; ఇమే = వీరు, వారినే పేర్కొనుచున్నాఁడు—ఆచార్యాః = ఆచార్యులును; పితరః = తండ్రులును; పుత్రాః= కొడుకులును; తథైవ = అట్లు; పితామహాశ్చ = తాతలును; మాతులాః = మేనమామలును; శ్వశురాః= మామలును; పౌత్రాః= మనుమలును; శ్యాలాః= భార్యల తోఁబుట్టువులును, ధృష్టద్యుమ్నాదులును; తథా=అట్లు; సంబన్ధినః=ఇతరసంబంధము గలవారును; ప్రాణాన్ = ప్రాణములను; ధనానిచ = ధనములను; త్యక్త్వా = విడిచి; యుద్ధే = యుద్ధము నిమిత్తమయి; అవస్థితాః = నిలిచియున్నారు.

ఎవ్వరికొఱకు మేము రాజ్యమును భోగ్యవిషయములను సుఖములను గోరవలయునో అట్టి మా ఆచార్యులు తండ్రులు తాతలు కొడుకులు మనుమలు మామలు మేనమామలు మఱఁదులు ఇతరబంధువులు అందఱును బ్రాణములమీఁదను ధనములమీఁదను ఆశ విడిచి యుద్ధసన్నద్ధులై నిలిచి యున్నా రని తాత్పర్యము.

శం. «అప్యకార్యశతం కృత్వా భర్తవ్యా మనురబ్రవీత్ » * అను మనువచనమువలనఁ బితాదులఁ బోషించుటకొఱకు అధర్మము గావించినను దోష

* అకార్యములు నూఱు చేసియయినను మాతాపిత్రాదులను బోషింపవలె నని మనువు చెప్పెను.

ముగా దనఁగాఁ జెప్పుచున్నాఁడు—నాకు అకార్యములచేనైనను బోషింపఁ దగిన, యేషామర్థే = ఏతండ్రులు కొడుకులు మొదలగువారి నిమిత్తమయి, రాజ్యమ్, భోగాః, సుఖానిచ, నః = మాచేత, నః అని తృతీయార్థమున షష్ఠి, కాఙ్క్షితమ్ = కోరఁబడిన వగుచున్నవో, తే = వారే, ఇమే = ఈపితౄదులు, ప్రాణాన్ ధనానిచ, త్యక్త్వా, యుద్ధే = యుద్ధనిమిత్తమయి, అవస్థితాః = నిలిచియున్నారు. ప్రాణముమీఁది యాశను వదలి యుద్ధమునందు మరణము నొందుటకై వచ్చి నిలిచియున్నా రని యర్థము. వార లెవ్వ రనఁగాఁ జెప్పుచున్నాఁడు—ఇందు నాకుఁ గొందఱు ఆచార్యులు, కొందఱు తండ్రులు, కొందఱు కొడుకులు, అట్లె కొందఱు పితామహులు, చకారమువలనఁ గొందఱు మాతామహులు, కొందఱు మేనమామలు, కొందఱు మామలు, కొందఱు మనుమలు, కొందఱు మఱఁదులు, కొందఱు సంబంధులు, ఇట్లు అందఱును స్వజనులుగాని యితరులు లే రని యర్థము.

వ్య. రాజ్యము మొదలగునవి వల దనుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు—ఇందుచేఁ దనకు రాగము లేకున్నను దనవారికొఱకు యత్నింపఁ దగు ననుట యుక్తము కా దని చెప్పఁబడినది. ఏకాకిగా నుండువానికి రాజ్యాదులయపేక్షతో నవసరము లేదు గదా! ఇఁక ఏబంధువులకోసము ఆరాజ్యాదిక మపేక్షింపవలెనో అట్టి యాబంధువులు, ప్రాణాన్—ప్రాణములమీఁది యాశను, ధనానిచ = ధనముల మీఁది యాశను, త్యక్త్వా=విడిచి, యుద్ధము నిమిత్తమయి నిలిచియున్నారు, కావున ఈప్రయత్నముచేఁ దనకుఁగాని తనవారికిఁగాని ప్రయోజనము లే దని భావము. భోగశబ్దము పూర్వశ్లోకంబున సుఖపరముగాఁ జెప్పఁబడినదైనను ఇందు వేఱుగా సుఖశబ్దము ప్రయోగించుటవలన సుఖసాధనము లయిన విషయముల బోధించును. ప్రాణశబ్దమును ధనశబ్దమును లక్షణచే ప్రాణాశను ధనాశను బోధించుచున్నవి. తమప్రాణములు విడిచినను దమబంధువులయుపభోగార్థము ధనాశ సంభవించును. కావున దాని నివారించుటకై వేఱుగా ధనపదము ప్రయోగింపఁబడినది. ఎవ్వరి నిమిత్తమయి రాజ్యాదిక మపేక్షిత మగునో అట్టి బంధువు లిచటికి వచ్చినారు కా రని యాశంకించి వారలం బేర్కొనుచున్నాఁడు—ఆచార్యాః—ద్రోణాదులు, పితరః—స్వగోత్రజు లగు తండ్రులు. పుత్రాః—ద్రౌపదియందుఁ బుట్టినవారు, లేక అభిమన్యువు మొదలగు నాకొడుకులు. పితామహాః—భీష్మాదులు. మాతులాః—శల్య శకుని ప్రభృతులు. శ్వశురాః—ద్రుపదుఁడు మొదలగువారు. పౌత్రాః—లక్ష్మణాదుల కొడుకులు. శ్యాలాః—ధృష్టద్యుమ్నుఁడు మొదలగువారు. సంబన్ధినః = వివాహాది

సంబంధము గలవారు. అట్లితరులును బెక్కండ్రు మా సేనయందును శత్రుసేనయందును ఉండు వీరులు నావారలుగానే కనఁబడుచున్నారు. కావున యుద్ధము చేయనని భావము.

శ్రీ. ఎవ్వారినిమిత్తమై మేము రాజ్యాదులు కోరవలెనో అట్టి వీరు ప్రాణధనంబులను, త్యక్త్వా=త్యాగము నంగీకరించి, యుద్ధముకొఱకు నిలిచియున్నారు. కావున మాకు రాజ్యాదులచే నేమి ప్రయోజన మని యర్థము.

వ. అందుకు యుక్తిని జెప్పుచున్నాఁడు—యేషామర్థే= ఎవ్వారినిమిత్తము, ఎవ్వరిఁ బోషించుటకొఱకు; రాజ్యమ్, కాఙ్క్షితమ్= కోరఁబడినదో. చ= మఱియు; భోగాః, సుఖానిచ, కాఙ్క్షితాని= కోరఁబడినవో. తే ఇమే= అట్టి వీరు, యుద్ధే, ధనాని—విషముల భోగించుటకు సాధనము లయిన స్త్రీలు పుత్త్రులు మొదలగు వానిని, ప్రాణాంశ్చ, త్యక్త్వా, అవస్థితాః= నిలిచియున్నారు. వారలు హతులయిన పిదప రాజ్యం బెవ్వ రనుభవించుటకు? కేవలము నాశరీరమును బోషించుకొనుటకు మాత్రమే యగు నని యర్థము.

ఏతా న్న హన్తు మిచ్ఛామి ఘ్నతో ఽపి మధుసూదన
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే. 3౫

ఆ. తనరాజ్యమునకు శత్రువులును తన్ను వధింపవచ్చినవారు నగుటచే వధింపఁ దగినట్టి వారలయందుఁగూడ కృప దలఁచి పూర్వోక్తమోహాదివశుండై యర్జునుఁడు స్వధర్మమగు యుద్ధమును విడువఁజూచె నని చెప్పుచున్నాఁడు—మధుసూదన= కృష్ణా! ఘ్నతోఽపి= నన్ను వధించువారైనను గూడ; ఏతాన్= ఈ దుర్యోధనాదులను; హన్తుమ్ = వధించుటకు; న ఇచ్ఛామి = కోరను. జిఘాంసన్తం జిఘాంసీయాత్ * అను న్యాయమువలన వీరి హింసించుటచే దోషము లేదని యాశంకించి చెప్పుచున్నాఁడు—ఘ్నతోఽపి అని. § భూమికొఱకుఁగదా వీరిని వధింపవలెను ఆభూమి నాకు వల దని కైముతికన్యాయముచేఁ జెప్పుచున్నాఁడు—త్రైలోక్యరాజ్యస్య హేతోః అపి= ముల్లోకముల దొరతనము నిమిత్తముగూడ, నేను వీరి

---

* వధింపఁగోరువానిని వధింపఁగోరవలెను.

§ వీరు నన్ను వధించినను వధింతును గాక. వీరి నేను వధింప నని భావము.

వధింప నొల్లను. మహీకృతే కిన్ను = భూమినిమిత్తము చెప్పవలెనా? మహనీయ మగు త్రైలోక్యరాజ్యము పొందుటకుఁగూడ నామనస్సు స్వజనుల హింసింప నొల్లదు గదా! ఇఁక ఈస్వల్పభూమిని బొందుటకై బంధువుల వధింప నంగీకరింప నని చెప్పవలెనా యని యర్థము.

వీరు నన్ను వధించిన వధింతురు గాక, నేనైతే వీరి వధింప నొల్లను. నాకుఁ ద్రైలోక్యరాజ్యము లభించునట్లున్నను నేను వీరి వధింప నొల్లను. ఇఁక నీ యల్పపుభూమికై బంధువధమునకుఁ బాలుపడుదునా? అని తాత్పర్యము.

శం. వారందఱు స్వజనులే యగుదురు గాక. నీ విప్పు డేమి చేయఁ దలఁచెద వనఁగాఁ జెప్పుచున్నాఁడు—ఖడ్గములచే నన్ను, ఘ్నతో౽పి = హింసించుచున్నవారైనను, ఏతాన్ = ఈ ద్రోణాచార్యాదులను, హన్తుమ్, నేచ్ఛామి. త్రైలోక్యరాజ్యస్య హేతో రపి = ముల్లోకముల రాజ్యము నిమిత్తముగూడ. వీరల వధించుటచే ఇంద్రత్వమైనను వచ్చుఁ గాక. అట్లయినను వీరల వధింప నొల్లను. కిన్ను మహీకృతే = ఇఁక రాజ్యార్థము వీరి వధింప నొల్ల నని చెప్పవలెనా యేమి? ఇందుచే స్వర్గసుఖముగూడ వల దని ప్రతిపాదిత మగుచున్నది.

మ. ఓయీ! కృపచే నీవు వీరల వధింపవేని అప్పుడు నిన్ను వీరు రాజ్యలోభంబునం జేసి వధింపక మానరు. కావున నీవే వీరల వధించి రాజ్యం బనుభవింపుము అనఁగాఁ జెప్పుచున్నాఁడు—త్రైలోక్యరాజ్యస్యాపి హేతోః = త్రైలోక్యరాజ్యము పొందుటకొఱకుఁగూడ, మన్ను, ఘ్నతో౽పి, ఏతాన్, నహన్తుమిచ్ఛామి— ఇచ్ఛనుగూడఁ జేయను, ఇఁక వధింతునా? భూమినిమాత్రము పొందుటకు వధింప నని చెప్పవలయునా? అని యర్థము. మధుసూదన * అని సంబోధించుటచే భగవంతుఁడు వైదికమార్గప్రవర్తకుఁ డనుటను సూచించుచున్నాఁడు.

శ్రీ. ఓయీ! కృపచే నీవు వీరి వధింపవేని అప్పుడు నిన్ను వీరు రాజ్యలోభంబున వధింపక విడువరు. కావున నీవే వీరి వధించి రాజ్యము ననుభవింపుమనఁగాఁ జెప్పుచున్నాఁడు—ఏతాన్ అని. ఘ్నతో౽పి—మమ్ము వధించుచున్నవారైనను, ఏతాన్, త్రైలోక్యరాజ్యస్య అపి హేతోః—త్రైలోక్యరాజ్య ప్రాప్తికొఱకుఁగూడ, నేను, హన్తుం నేచ్ఛామి. భూమిమాత్రము పొందుటకొఱకుఁ జెప్పవలయునా? యని యర్థము.

* మధువను రాక్షసుని వధించినవాఁడా!

ప. నీవు కులమునందలి ప్రీతిచే యుద్ధమునుండి యుపరమించినను వార లేమో మనల వధింపకవిడువ రని యాశంకించి చెప్పుచున్నాఁడు—త్రైలోక్యరాజ్యము నిమిత్తముగూడ వీరిని వధింప నొల్లను. భూమినిమిత్తము చెప్పవలెనా? ఎట్టి వీరిని—ఘ్నతోపి=చంపుచున్న వారినైనను, నన్నుఁ జంపుటకు ప్రవృత్తులైనను వీరు వధింపఁ దగినవారు కా రని యర్థము. ఎట్టు దైవవశంబున అడ్డముగాఁ దిరిగి తన ప్రాణాపాయమునకు హేతు వయిన శిశువును వధించుటకుఁ దల్లి యత్నింపదో. అట్లు, మనదైవముచేఁ బ్రేరితులై వీ రేమైనను జేయుదురు గాక? అయినను మనము వీరి వధింపఁ దగదు. అట్లు «ఉత్క్షేపణం గర్భగతస్య పాదయోః కిం కల్పతే మాతు రధోక్షజాగసే" § అని చెప్పఁబడినది.

నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన
పాప మే వాశ్రయే దస్మాన్ హత్వై తా నాతతాయినః. ౩౬

టీ. దుర్యోధనుఁడు మొదలగు శత్రువుల శిక్షించుటచేఁ బ్రీతి కలుగును, కావున యుద్ధము చేయవలయు నని యాశంకించి చెప్పుచున్నాఁడు—జనార్దన=కృష్ణా! ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను; నిహత్య = వధించి; స్థితానామ్ = ఉన్న; నః = మాకు; కా = ఏమి; ప్రీతిః = సంతోషము; స్యాత్ = కలుగును? ఈదుర్యోధనాదులకునూత్రము మీరు శిక్షింపనిపక్షమున అప్పుడు వీరు మిమ్ము శిక్షింతురు కావున మీకు దుఃఖము కలుగు నని యాశంకించి చెప్పుచున్నాఁడు—అస్మాన్ = మమ్మును; హత్వా=వధించి; స్థితాన్=ఉన్నవారలను, అందువలన; ఆతతాయినః=ఇంటికి నిప్పు పెట్టుట విషముపెట్టుట అనునవి మొదలగు నాతతాయిలక్షణములతోఁ గూడిన వార లగు; ఏతాన్ = ఈ దుర్యోధనాదులను; పాపమేవ = పాపమే; ఆశ్రయేత్ = పొందును. ఈ దుర్యోధనాదులు నిర్దోషుల మగు మమ్ము యుద్ధభూమి యందు వధింతురేని అప్పుడు పూర్వమే పాపిష్ఠు లగు వీరు అగ్నిదుఁడు గరదుఁడు అని చెప్పఁబడిన ఆతతాయులలోఁ జేరినవారై, నిర్దోషు లగు బంధువుల హింసించుటచేఁ గలుగు పాపమును మఱియుఁ బొందుదు రని యర్థము.

దుర్యోధనుఁడు మొదలగు వారిని జంపుటచే మాకు దుఃఖమే కలుగుం గాని సంతోషము గలుగదు. మమ్ము వీరు వధించుపక్షమునఁ, బూర్వమే మహాపాపు

§ నారాయణా! గర్భగతుం డగు శిశువు పాదములతో తన్నుట తల్లికిఁ దప్పుగాఁ దోఁచునా?

లగు వీరికే, నిర్దోషులము బంధువుల మగు మమ్ము ఆతతాయులయి వధించు పాపము గూడ అధికముగాఁ గలుగును. అందుచే మా కేమియు హాని లే దని తాత్పర్యము.

ఉత్తరార్థమున కర్థాంతరము—ఆతతాయినః = మమ్ము చంప నుద్యుక్తులయిన; ఏతాన్ = దుర్యోధనాదులను; హత్వా = చంపి; స్థితాన్ = ఉన్న; అస్మానేవ = మమ్మే; పాపమ్ = పాపము; ఆశ్రయేత్ = కలుగును. వీర లాతతాయులే యగుదురు గాక, అయినను మిక్కిలి శోచ్యు లయిన యీ దుర్యోధనాదుల హింసించినయెడ తత్పాపము మమ్మే పొందును. కావున మేము వీరి వధింపఁ దగ దని యర్థము. లేక. ఏతాన్ = వీరలను; హత్వా = చంపి; ఆతతాయినః = ఆతతాయులమైన; అస్మానేవ = మమ్మే; పాపమ్ = పాపము; ఆశ్రయేత్ = పొందును. గురువులు భ్రాతలు సుహృదులు మొదలగు వీరి వధించినచో మే మాతతాయుల మగుదుము. అందువలన వీరి వధింతుమేని తత్పాప మాతతాయుల మగు మాకే కలుగును. కావున యుద్ధమునుండి యుపరమించుట మాకు శ్రేయస్కర మని యర్థము.

౩౦. వీరిచే మాకు లక్కయిల్లుదహించుట మొదలగు పెక్కపకారములు చేయఁబడినవి. అపకారము చేసినవారి వధించుటచే సంతోషంబును ధర్మంబును గలుగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదు లగు మా తోఁబుట్టువులను బంధుసహితులను, వధించినయెడ, వారి వధించుటచే మాకు, కా ప్రీతిః స్యాత్—అపరాధము గావించిన శిశు వగు పుత్త్రుని వధించుటచేఁ దండ్రికి సంతోష మగునేని మాకు వీరి వధముచే సంతోష మగును. ఎట్లు పుత్త్రుని వధించుటచేఁ దండ్రికి శిశుహత్య యగునో అట్లు మాకుఁగూడ వీరి వధముచే భ్రాతృహత్య యగును. ఓయీ! “అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః। క్షేత్రదారాపహర్తాచ షడేతే హ్యాతతాయినః॥ ఆతతాయిన మాయాన్తం హన్యా దేవా విచారయన్। నాతతాయి వధే దోషో హన్తు ర్భవతి కశ్చన” * అను వచనమువలన, ప్రతిపాదితములైన సమస్తదోషములతోనుం గూడిన వీరి వధించుటచే ఏదోషమునుం గలుగ దనఁగాఁ జెప్పుచున్నాఁడు—ఆతతాయినః—చెప్పఁబడిన యాఱువిధములగు దోషములు ఆతతాయములు, అవి గలవారు ఆతతాయులు, అట్టి చెప్పఁ

---

* ఇంటికి నిప్పుపెట్టువాఁడు, విషము నిచ్చువాఁడు, ఆయుధముఁ బట్టి పొడువవచ్చువాఁడు, ధనము నపహరించినవాఁడు, భూమి నపహరించినవాఁడు, భార్యను జెఱపట్టువాఁడు—ఈ యాఱుగురును ఆతతాయులు. ఆతతాయి వచ్చినచో నాలోచింపక వాని వధింపవలసినదే. ఆతతాయిని జంపుటచేఁ జంపినవాని కదోషమునుం గలుగదు.

బడిన దోషములు గలవారైనను, ఏతాన్, హత్వా, వీరి వధించుట యను కర్మముచే, అస్మాన్ పాపమేవ ఆశ్రయేత్, ఏవకారమున కన్యయోగవ్యవచ్ఛేద * మర్థము. ఆతతాయివధముచే దోషము లేదని వచన మున్నది వాస్తవమే, అయినను, "స ఏవ పాపిష్ఠతమో యః కుర్యాత్కులనాశనమ్" § అను ధర్మశాస్త్రవచనము గలదు. "అర్థశాస్త్రాత్తు బలవ ద్ధర్మశాస్త్ర మితి స్థితిః" ¶ అను న్యాయమువలన ఆతతాయివధముచే దోషము కలుగ దను నర్థశాస్త్రవచనముకన్నను ధర్మశాస్త్రవచనము ప్రబలము. కావున ఆతతాయిత్వ దోషముకన్నను కులనాశకత్వదోషము మిక్కిలి గొప్పది. ఆదోషము మాకు సంభవించు నని భావము.

ము. ఓయీ! ఇతరులను విడిచి ధార్తరాష్ట్రులను మాత్రమే వధింపవలయును. ఏల యనఁగా మిక్కిలి క్రూరము లయిన ఆయాదుఃఖములఁ గలిగించినట్టి దుర్యోధనాదుల వధించుటచేఁ బ్రీతి కలుగును. అనఁగాఁ జెప్పుచున్నాఁడు—ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదు లగు తోఁబుట్టువులను; నిహత్య = వధించి, ఉన్న; నః = మాకు; కా ప్రీతిస్స్యాత్ = ఏమి ప్రీతి కలుగును? ఏమియుఁ గలుగ దని యర్థము. మూఢజనులవలె క్షణమాత్ర ముండునట్టి యాభాససుఖమున కాశపడి బహుకాల నరకదుఃఖమునకు హేతువైన బంధువధము మాకు యుక్తము కా దని భావము. జనార్దన ※ అని సంబోధించుటచే "వీరు వధింపఁదగిన వారలే యగుదు రేని ఆపక్షమున నీవే వీరల సంహరింపుము. ఏల యనఁగా, నీవు ప్రళయమున సర్వజనుల హింసించువాఁడ వైనను సమస్తపాపములను అంటక యున్నవాఁడవు" అని సూచించుచున్నాఁడు. ఓయీ! "అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః । క్షేత్రదారాపహారీ చ షడేతే హ్యాతతాయినః" అని స్మృతి చెప్పుచున్నది. ఈ దుర్యోధనాదులో అన్నివిధముల నాతతాయులై యున్నారు. "ఆతతాయిన మాయాన్తం హన్యాదేవావిచారయన్ । నాతతాయివధే దోషో హన్తుర్భవతి కశ్చన" అను వచనముచే దోషము లేదని తెలియవచ్చుటవలన ఆతతాయు లగు దుర్యోధనాదులు వధింపఁదగినవారే యగుదు రని యాశంకించి చెప్పుచున్నాఁడు—ఆతతాయు లయి

* పాపము వచ్చునే గాని మఱేమియు రా దని యర్థము.

§ ఎవ్వఁడు కులనాశము సేయునో అతఁడే అందఱికన్నను పాపిష్ఠుఁడు.

¶ అర్థశాస్త్రముకన్నను ధర్మశాస్త్రము ప్రబలప్రమాణ మని సిద్ధాంతము. అర్థశాస్త్రము=ఈ లోకమునం దిష్టసిద్ధిని బొందుట కుపాయము దెలుపు శాస్త్రము, నీతిశాస్త్రము.

※ ప్రళయకాలమునందు సర్వజనుల సంహరించువాఁడా!

నను వీరి వధించియున్న మమ్ము, పాప మాశ్రయేదేవ—పాపము పొందనే పొందు నని యర్థము. లేక, పాపమేవ ఆశ్రయేత్—పాపమే పొందును, ఇతరము దృష్టము గాని యదృష్టముగాని ప్రయోజనము ఏదియు పొంద దని యర్థము. ఏమువలన ననఁగా, “నహింస్యాత్” * అను ధర్మశాస్త్రముకంటె, “ఆతతాయినం హన్యాత్” § అను నర్థశాస్త్రము దుర్బలము. అది యాజ్ఞవల్క్యునిచేఁ జెప్పఁబడినది. “స్మృత్యోర్విరోధే న్యాయస్తు బలవాన్ వ్యవహారతః । అర్థశాస్త్రాత్తు బలవ ద్ధర్మశాస్త్ర మితి స్థితిః” ‡ అని.

ఉత్తరార్థమున కర్థాంతరము—ఓయీ! ధార్తరాష్ట్రుల వధించుటచే మాకుఁ బ్రీతి లేకున్నను మిమ్ము వధించుటచే ధార్తరాష్ట్రులకుఁ బ్రీతియుండనే యున్నది. కావున వారు మిమ్ము వధింతు రనఁగాఁ జెప్పుచున్నాఁడు—అస్మాన్=మమ్ము, హత్వా స్థితాన్ = వధించియున్న, కావున, ఆతతాయులను, ఏతాన్—ధార్తరాష్ట్రులను, పూర్వముగూడ పాపిష్ఠులైనవారిని, ఇప్పుడుగూడ, పాపమేవ ఆశ్రయేత్— పాపమే పొందునుగాని కొంచెమయినను సుఖము పొంద దని యర్థము. అందువలన యుద్ధము చేయకున్న మమ్ము వధించి వీరే పాపము పొందెదరు. మాకో పాపసంబంధము లేకుండుటవలన ఏకాంతియును గలుగ దని యభిప్రాయము.

శ్రీ. ఓయీ! “అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః । క్షేత్రదారాపహార్తాచ షడేతే హ్యాతతాయినః” అను స్మృతివలన అగ్గిపెట్టుట మొదలగు ఆఱు హేతువులచేతనుగూడ ఈదుర్యోధనాదు లాతతాయులు. ఆతతాయులనో వధించుట యుక్తమే యగును, ఎందువలన ననఁగా “ఆతతాయిన మాయాన్తం హన్యా దేవా విచారయన్ । నాతతాయివధే దోషో హన్తు ర్భవతి కశ్చన” అని చెప్పఁబడియున్నది. అందుకుఁ జెప్పుచున్నాఁడు—పాపమేవ అను నర్థముచేత—ఆతతాయిన మాయాన్త మనునది యర్థశాస్త్రము గదా! అది ధర్మశాస్త్రముకన్న దుర్బలము. అట్లు “స్మృత్యోర్విరోధే న్యాయస్తు బలవాన్ వ్యవహారతః । అర్థశాస్త్రాత్తు బలవ ద్ధర్మశాస్త్ర మితి స్థితిః” అని యాజ్ఞవల్క్యునిచేఁ జెప్పఁబడినది.

---

* హింసింపఁ గూడదు.

§ ఆతతాయిని వధింపవలెను.

‡ వ్యవహారమునందు స్మృతులకు విరోధము కలిగినప్పుడు న్యాయము ప్రబలము—న్యాయవంతముగు స్మృతి ప్రబలము. అర్థశాస్త్రముకన్న ధర్మశాస్త్రము ప్రబలము అని సిద్ధాంతము.

అందువలన ఆతతాయులైనను ఈయాచార్యాదుల వధించుటచే మాకు పాపమే కలుగును. ఏల యనఁగా వీరి వధము అన్యాయ్యము అధర్మము.

ప. వారియందలి కృపచే మనము యుద్ధము విడిచినప్పుడు వా రెట్లు వధింతు రనఁగాఁ జెప్పుచున్నాఁడు—ఆతతాయినః = అపరాధులుగాకున్నను ఇతరుల చంపువారిని. ఇచట « అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః । క్షేత్రదార హరశ్చైవ షడేతే హ్యాతతాయినః " అని స్మృతి గలదు. మఱి, « ఆతతాయిన మాయాన్తం హన్యాదేవా విచారయన్ " ఇత్యాదిగాఁగూడ స్మృతియందుఁ జెప్పఁబడియున్నది ? అనఁగా నది యుచితము గాదు. ఏల యనఁగా, ఇది, దండనీయు లయిన దొంగలు మొదలగువారి విషయమయి రాజనీతియందుఁ జెప్పఁబడినదిగాని పుత్త్రపౌత్త్రాదుల విషయమయి కాదు.

తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ సబాన్ధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ. 32

ఆ. ఫలము లేకుండుటవలనను అనర్థము కలుగుటవలనను పరహింస చేయఁగూడ దని యుపసంహరించుచున్నాఁడు—తస్మాత్ = అందువలన; సబాన్ధవాన్= బంధువులతోఁగూడిన; ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను; హన్తుమ్ = చంపుటకు; వయమ్ = మేము; నఅర్హాః = తగినవారము కాము. మఱియు రాజ్యసుఖముపొందుటకై గదా యుద్ధము నారంభింపవలెను. ఆయుద్ధముచే బంధువులు నశించిన పిదప సుఖము కలుగదు. కావున యుద్ధము చేయఁగూడ దని చెప్పుచున్నాఁడు—మాధవ= కృష్ణా! స్వజనంహి = బంధుజనమునే; హత్వా = చంపికొని; కథమ్ = ఎట్లు; సుఖినః = సుఖము గలవారలము; స్యామ = అగుదుము ?

అందువలన మేము దుర్యోధనాదులను బంధుసహితముగా వధింపరాదు. బంధువులనే వధించికొన్న పిదప మాకు సుఖ మెట్లు కలుగును? అని తాత్పర్యము.

శం. అట్లయిన నీ వేమి నిశ్చయించితి వనఁగాఁ జెప్పుచున్నాఁడు— తస్మాత్—ధార్తరాష్ట్రుల వధించుటచే కులనాశనదోషమే సంభవించుటవలన; సబాన్ధవాన్ ధార్తరాష్ట్రాన్ = బంధువులతోఁగూడిన దుర్యోధనాదులను, హన్తుమ్, వయమ్, నార్హాః = యోగ్యులము కాము, ఇచ్ఛింప మని యర్థము. మీసుఖము కొఱకు వీరి వధింపవలసినదే యనఁగాఁ జెప్పుచున్నాఁడు—పురుషుఁ డేకార్యమునందుఁ

బ్రవర్తించినను అది స్వజనుల సుఖముకొఱకుఁ గదా! మేముమాత్రము స్వజనమును వధించి యెట్లు సుఖము గలవార మగుదుము?

మ. ఫలము లేకుండుటవలనను అనర్థము కలుగుటవలనను పరహింస చేయఁగూడ దని "నచ శ్రేయోఽనుపశ్యామి" అని యారంభించి చెప్పఁబడిన దాని నుపసంహరించుచున్నాఁడు—తస్మాత్ అనుటచే అదృష్టఫలము లేకుండుటయు అనర్థము కలుగుటయుఁ బరామర్శింపఁబడుచున్నవి. * స్వజనమ్ అను నుత్తరార్ధముచే దృష్ట సుఖముగూడ లే దని చెప్పుచున్నాఁడు. మాధవ = లక్ష్మీపతీ! నీవు లక్ష్మీపతివి కావున, నన్ను అలక్ష్మీప్రద మయిన కర్మమునందుఁ బ్రవర్తింపు మనుట నీకు యుక్తము కా దని భావము.

శ్రీ. ఈలోకమునందుఁగూడ సుఖము కలుగ దని చెప్పుచున్నాఁడు—స్వజనమ్ అను నుత్తరార్ధముచేత.

> యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః
> కులక్షయకృతం దోషం మిత్రద్రోహేచ పాతకమ్. ౩౮
>
> కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్
> కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన. ౩౯

ఆ. అట్లయినయెడ దుర్యోధనాదులకుఁ గులనాశమునందును స్వజనవధమునందును బ్రవృత్తి యెట్లు కలిగె ననఁగాఁ జెప్పుచున్నాఁడు—ఏతే = ఈదుర్యోధనాదులు; లోభోపహతచేతసః = ఆశచేఁ గొట్టఁబడిన బుద్ధిగలవారలై; కులక్షయకృతమ్ = వంశనాశముచేఁ జేయఁబడిన; దోషమ్ = పాపమును; మిత్రద్రోహే = మిత్త్రుల హింసించుటయందు; పాతకంచ = పాపమునుగూడ; నపశ్యన్తి యద్యపి = తెలియకున్నను, వీరలు లోభమునకు వశ మయిన బుద్ధిగలవారలు, కావున వీరికిఁ గులక్షయము మొదలగు వానిచేఁ గలుగు దోషము తెలియనందున నిస్సందేహముగాఁ బ్రవృత్తి కలుగుచున్న దని యర్థము. వీరికివలె మనకును నిస్సందేహప్రవృత్తి కలుగు ననఁగా నట్లు కలుగ దని చెప్పుచున్నాఁడు—జనార్దన = కృష్ణా! కులక్షయకృతమ్ = వంశనాశముచేతఁ జేయఁబడిన; దోషమ్ = దోషమును; ప్రప

* అదృష్టఫలము లేకుండుటవలనను అనర్థము సంభవించుటవలనను. అని యర్థము.

శ్యద్భిః = చక్కఁగాఁ దెలియుచున్న; అస్మాభిః = మాచేత; అస్మాత్ = ఈ; పాపాత్ = పాపమునుండి; నివర్తితుమ్ = మరలుటకు; తత్ = అదోష మను పాపము; కథమ్ = ఎట్లు; నజ్ఞేయమ్ = తెలియకుండవచ్చును? కులక్షయమువలనను మిత్త్రద్రోహము వలనను గలుగు పాపమును మనము చక్కఁగా నెఱింగి యున్నవారము, ఇట్లుండఁగా మన మాపాపమును దెలియనివార మెట్లగుదుము? ఆపాపమునుండి నివర్తించుటకు ఆ పాపముయొక్క జ్ఞాన మావశ్యకము. వారికో ఆపాపము తెలియనందున దానిఁ బరిహరించుకొనుట శక్యము గాదు. ఆపాపము పరిహరించుకొనఁ గోరునట్టి మనకు యుద్ధమునందుఁ బ్రవృత్తి యుచితము కాదని యర్థము.

ఈ దుర్యోధనాదులు రాజ్యలోభమునకు లోఁబడినవా రగుటచే వీరికిఁ గులక్షయమువలనను మిత్త్రద్రోహమువలనను గలుగు మహాపాపము తెలియరాకున్నది, కావున యుద్ధమునందుఁ బ్రవర్తించుచున్నారు. మనకును ఈపాపము తెలియనియెడ మనము నట్లే ప్రవర్తింతుము. అట్లు గాదు, మనకుఁ గులక్షయమిత్త్రద్రోహములచేఁ గలుగు పాపము చక్కఁగాఁ దెలిసియున్నది. కావున మన మీ పాపము తొలఁగించుకొనుటకు యత్నింపవలసినదే కాని యుద్ధమునందుఁ బ్రవర్తించుట యుచితముగా దని తాత్పర్యము.

శ్లో ౧. ఈవిచారము మీకును వారికినిగూడ ఆవశ్యకము. నీవుమాత్రమే చేయుచున్నా వేమి యనఁగాఁ జెప్పుచున్నాఁడు—ఏతే = దుర్యోధనాదులు; లోభ ఉపహతచేతసః—లోభ మనఁగా ఉన్నద్రవ్యమును విడువ నొల్లకుండుట, దానిచేత, ఉపహత = ద్రుంగఁబడిన, చేతసః = బుద్ధిగలవారలై; కులక్షయకృతమ్ = వంశనాశము చేయుటచే లభించునట్టి, దోషమును; మిత్త్రద్రోహే = విశ్వాసఘాతమునందు, పాతకంచ = దానివలనఁ గలుగుపాపమును; యద్యపి నపశ్యన్తి = విచారింపకున్నను. అట్లయినను, ధర్మస్వరూపము తెలిసినవారము, కులక్షయకృతందోషమ్, ప్రపశ్యద్భిః = తెలిసినవారము పండితుల మగు, అస్మాభిః = మాచేత; అస్మాత్ పాపాత్—కులక్షయకృత మగు పాపమునుండి; నివర్తితుమ్ కథం నజ్ఞేయమ్ = ఎట్లు విచారింపఁ దగినది కాకపోవును? అని కాదు, విచారింపవలసినదే. కిమకార్యం దురాత్మనామ్ * అను న్యాయమునుచే వీరలు రాజ్యలోభంబునఁ గులక్షయంబును మిత్త్రద్రోహమునుం జేయుచున్నారు, అట్లు మేము చేయఁజాల మని యర్థము.

---

* దుష్టుల కేది చేయరానిది!

వ్యా. అట్లయినయెడ వీరుమాత్రము కులక్షయమునందును స్వజనులహింస యందును ఎట్లు ప్రవర్తించుచున్నా రనఁగాఁ జెప్పుచున్నాఁడు—వారలు లోభోపహతబుద్ధు లగుటచే వారికిఁ గులక్షయాదులచేఁ గలుగు దోషములు తోఁపక ప్రవృత్తి కలుగుచున్న దని యర్థము. ఇందువలననే శిష్టులగు భీష్మాదులు బంధువధము నందుఁ బ్రవృత్తు లగుటవలన బంధువధము శిష్టాచార మగుటచే వేదమూలక మగుట వలన నితరులకుఁగూడ బంధువధమునందుఁ బ్రవర్తించుట యుచిత మనుట 'హేతుదర్శనాచ్చ *' యను న్యాయముచే నిరాకరింపఁబడుచున్నది. భీష్మాదులప్రవృత్తియందు లోభము మొదలగునది హేతువు కనఁబడుటవలన దానికి వేదమూలత్వము కల్పింప శక్యము కా దని స్థాపింపఁబడినది. వీరలు తెలియకున్నను మన మెట్లు తెలియక యుండ వచ్చు నని యుత్తరశ్లోకముతో సంబంధము. ఓయీ! వీరలు లోభమువలనఁ బ్రవృత్తులే యయినను «ఆహూతో న నివర్తేత ద్యూతాదపి రణాదపి। విజితం క్షత్రియస్య" § ఇత్యాదివచనములచే క్షత్రియునకు యుద్ధము ధర్మమనియు యుద్ధము నందు జయింపఁబడినది ధర్మ్య మయిన ధన మనియు ధర్మశాస్త్రమునందు నిశ్చయింపఁబడియుండుటవలన, మీరు వారిచేఁ బిలువఁబడినవా రగుటచే మీకును యుద్ధమునందుఁ బ్రవర్తించుట యుచితమే యగు నని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు—అస్మాత్ పాపాత్ = బంధువధము ఫలముగాఁ గల యుద్ధరూప మయిన పాపకర్మమునుండి. ఇది యభిప్రాయము—ఏకార్యమునందుఁగాని 'ఇది శ్రేయస్సునకు సాధనము' అనుజ్ఞానము గదా ప్రవర్తకము. శ్రేయస్సేదియనఁగా, ఏది యశ్రేయస్సుతో సంబంధింపదో అది శ్రేయస్సు. అట్లు కానియెడ, శ్యేనాదులు ¶ గూడ ధర్మము గావలసివచ్చును. అట్లు «ఫలతోపిచ యత్కర్మ నానర్థే నానుబధ్యతే। కేవలప్రీతిహేతుత్వా త్తద్ధర్మ ఇతి కథ్యతే" $ అని చెప్పఁబడినది. అందువలన అనర్థముతో సంబంధించిన దగుటచే శాస్త్రమునందుఁ జెప్పఁబడిన వైనను శ్యేనయాగాదులందుఁ బ్రవృత్తి యెట్లుచితము గాదో అట్లు ఈ యుద్ధమునందును ప్రవృత్తి మా కుచితము గాదు.

---

* ఏహేతువును లేక కేవలధర్మబుద్ధిచేత శిష్టులు ప్రవర్తించినపుడే యది శిష్టాచారమయి యితరులకుఁ బ్రవర్తక మగు నని భావము.

§ క్షత్రియుఁడు పిలువఁబడినవాఁడై జూదమునుండిగాని యుద్ధమునుండిగాని నివర్తిల్లఁ గూడదు. జయింపఁబడిన ధనము క్షత్రియునకు.

¶ శ్యేనయాగ మనఁగా శత్రుహింసార్థము చేయు నొక యాగము.

$ ఏకర్మము కేవలప్రీతికిఁ గారణ మగుటవలన ఫలమునందుఁగూడ అనర్థముతోఁ గలియదో అది ధర్మ మని చెప్పఁబడుచున్నది.

శ్రీ. ఓయి! నీకును వీరికిని బంధువధదోషము సమానమగుటవలన ఎట్లు వీరు బంధువధదోషము నంగీకరించి యుద్ధమునందుఁ బ్రవర్తించుచున్నారో అట్లే నీవును బ్రవర్తింపుము. ఈవిషాద మేల? అనఁగా రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు—లోభోపహతచేతసః—రాజ్యలోభముచేత, ఉపహతము = వివేకము నశించిన, చేతసః = మనసు గలవార లగు; ఏతే = దుర్యోధనాదులు; యద్యపిదోషం నపశ్యన్తి = దోషమును జూడకున్నను; తథాపి; దోషమును జక్కఁగాఁ జూచుచున్న మాచేత; అస్మాత్ పాపాత్ నివర్తితుం కథం నజ్ఞేయమ్? నివృత్తియందే బుద్ధి నుంపవలయు నని యర్థము.

ప. ఇఁక వారుగూడ పుత్రపౌత్రులకుఁ దగిన వ్యవహారము నెట్లు పాటింపకున్నా రనఁగా చెప్పుచున్నాఁడు—లోభఉపహతచేతసః = రాజ్యభోగేచ్ఛచే, ఉపహతము = స్మృతిపోయిన, చేతస్సు గలవారు. పుత్రాదపి ధనభాజాం భీతిః, * అని చెప్పఁబడినది. కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిః = కులక్షయముచేఁ గలుగు దోషమును జూచుచున్న, అస్మాభిః = స్మృతిగల మాచేత; అస్మాత్ పాపాత్ = కులక్షయకృతపాపమునుండి, నివర్తితుం కథం నజ్ఞేయమ్? జనార్దన = ఓ సంహారము చేయఁ గోరినవాఁడా! చెప్పుము అని యధ్యాహార్యము.

కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాస్సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత. ౪౦

ఆ. దేనిఁ జూచి మీరు యుద్ధమునుండి యుపరమింపఁ గోరుచున్నారో అట్టి దోషము కులక్షయమం దేది గలదు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—కులక్షయే= వంశముయొక్క నాశమందు; సనాతనాః = అనాదిగా నుండునట్టి; కులధర్మాః = కులముయొక్క ధర్మములు, వారివారి యగ్నిహోత్రములు మొదలగు కర్మములచే సాధ్యము లయినవి; ప్రణశ్యన్తి = నాశము పొందుచున్నవి, కర్తలు లేకుండుటవలన నని యర్థము. ధర్మము నశించినయెడ నేమి యగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—ధర్మే= కులమునందలి పురుషులచేఁ జేయఁబడుధర్మము; నష్టే = కులనాశమువలననే నశించిన దగుచుండఁగా; ఉత = మఱి; కృత్స్నమ్= సమస్తమయిన; కులమ్ = కులమును, కులక్షయము చేసినవానియొక్క మిగిలిన కులమంతయు ననుట; అధర్మః = కులక్ష

* ధనము గలవారలకుఁ గొడుకువలనఁగూడ భయము గలుగును.

యము చేసినవాని అధర్మము; అభిభవతి = ఆక్రమించుచున్నది, వాని కులము అధర్మభూయిష్ఠ మగు నని యర్థము.

కులము నశించిన పిదప, ఆకులమునందలి పురుషులచేఁ జేయఁబడునట్టి అగ్నిహోత్రాదిసత్కర్మములచేఁ గలుగు సనాతనము లగు ధర్మము లన్నియు కర్తలు నశించుటవలన నశించును. ఇఁక ధర్మము నశించినచో, శేషించిన బాలురు మొదలగు కులస్థు లందఱును ఆకులక్షయకర్తయొక్క అధర్మముచే బాధితు లగుదు రని తాత్పర్యము.

శ౦. కులనాశము చేయఁబడినయెడ నేమి యనర్థము కలుగును? అనఁగా నొకటే యనర్థము కాదు. మఱి కులనాశము తద్ధర్మనాశము మొదలగు ననర్థముల పరంపరయే సంభవించును. ఆసంభవించువిధముఁ జెప్పుచున్నాఁడు అయిదుశ్లోకముల చేత—ఇచట కులపదముచే కులసంబంధిపురుషులు లక్షితు లగుచున్నారు, కులక్షయే—కులధర్మప్రవర్తకు లగు పురుషులనాశము కాఁగా; సనాతనాః = వంశపారంపర్యముగా వచ్చిన, కులధర్మాః—కులమునకును జాతికిని అనురూపముగాఁ జేయవలసిన యాచారములు; ప్రణశ్యన్తి = ప్రవర్తకులు లేకుండుటవలన మిక్కిలి నశించును. ధర్మే = కులాచారమును జాత్యాచారమును; నష్టే = స్వరూపముతో నాశము పొందిన కాఁగా; కృత్స్నంకులమ్; అధర్మఃఉత = అనాచారముగూడ; అభిభవతి = ఆక్రమించును, శిక్షించువారు లేకపోవుటవలన కులమంతటను అనాచారమే వృద్ధిఁ బొందును.

మ. ఇట్లు జయము మొదలగునవి యన్నియు అశ్రేయస్సు లగుటచేఁ గోరఁదగినవి కావు కావున వానికొఱకుఁ బ్రవర్తింపఁగూడ దనుటను దృఢీకరించుటకై, అనర్థముతో సంబంధించిన వగుటవలన అవి అశ్రేయస్సు లను నర్థమును విస్తరించి చెప్పుచున్నాఁడు—సనాతనాః= పరంపరగా వచ్చిన; కులధర్మాః= కులమునకు ఉచితము లయిన ధర్మములు; కులక్షయే, ప్రణశ్యన్తి—చేయువారు లేకపోవుటవలన నశించుచున్నవి. మఱియు అగ్నిహోత్రము మొదలగు కర్మము లనుష్ఠించుపురుషులు నశించుటవలన, ధర్మేనష్టే—జాత్యభిప్రాయముచే నేకవచనము, ధర్మములు నశింపఁగా; బాలురు మొదలగు శేషించిన, కులమ్, కృత్స్నమ్ ఉత = సమస్తమును; అధర్మః, అభిభవతి = తనకు లోఁబడునట్లు వ్యాపించుచున్నది. ఉతశబ్దమునకుఁ గృత్స్నపదముతో నన్వయము.

శ్రీ. ఆదోషమునే చూపుచున్నాఁడు—సనాతనాః = పరంపరగా వచ్చినవి. అవశిష్ట మగు, కులమ్, కృత్స్నమ్ ఉత = సమస్తమును; అధర్మః, అభిభవతి = వ్యాపించుచున్నది.

ప. ఇఁక కులక్షయేప్రణశ్య న్తీత్యాదివాక్యములచే నధ్యాయముకడవఱకు తత్పాపముచే సంభవించునవర్థమును జెప్పుచున్నాఁడు—సనాతనాః = పరంపరగా వచ్చినవి.

అధర్మాభిభవా త్కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసఙ్కరః. ౪౧

ఆ. కులక్షయమువలన శేషించినకులము అధర్మముపా లగుటచే నేమి దోష మనఁగాఁ జెప్పుచున్నాఁడు—కృష్ణ= కృష్ణుఁడా! అధర్మ అభిభవాత్ = అధర్మము యొక్క ఆక్రమించుటవలన; కులస్త్రియః = కులమునందలిస్త్రీలు; ప్రదుష్యన్తి = మిక్కిలి దోషము నొందుదురు. పాపిష్ఠ మయిన కులమునందుఁ బుట్టినస్త్రీలు చెడుటచే నేదోషము గలుగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—వార్ష్ణేయ = వృష్ణివంశమునఁ బుట్టిన కృష్ణుఁడా! స్త్రీషు = స్త్రీలు; దుష్టాసు = చెడినవారలు కాఁగా; వర్ణసఙ్కరః = వర్ణములకలయిక; జాయతే = కలుగుచున్నది.

కృష్ణా! అధర్మము వ్యాపించుటవలన ఆకులమునందుఁ బుట్టు స్త్రీలు దుష్ట లగుదురు. స్త్రీలు దుష్ట లగుటచే వర్ణసంకర మగు నని తాత్పర్యము.

శం. అధర్మ అభిభవాత్ = అనాచారముయొక్క వృద్ధివలన; కులస్త్రియః; ప్రదుష్యన్తి = మిక్కిలి దుష్ట లగుదురు, నిందితవృత్తిచే దూషిత లగుదురు. స్త్రీషు= భార్యలు; దుష్టాసు; వర్ణ సఙ్కరః—అనులోమముగాను ప్రతిలోమముగాను * బ్రాహ్మణాదివర్ణముల కలయిక; జాయతే—వ్యవస్థ లేక బ్రాహ్మణాదివర్ణములు కలిసి పోవు నని యర్థము.

మ. మా భర్తలు ధర్మము నతిక్రమించి కులక్షయము చేసినప్పుడు, మేమును వ్యభిచారము చేసినయెడ నేమిదోషము? అని యిట్లు కుయుక్తికి లోనై

* పురుషుఁడు తనకన్నఁ దక్కువజాతి స్త్రీతో సంబంధము నొందుట అనులోమము, పురుషుఁడు తనకన్న నెక్కుజాతి స్త్రీతో సంబంధము నొందుట ప్రతిలోమము.

కులస్త్రీలు చెడిపోవుదు రని యర్థము. లేక, కులక్షయము చేయుటచే పతితులైన పతులతో సంబంధము వలననే స్త్రీలు దుష్ట లగుదురు. అట్లు "ఆ శుద్ధే స్సంప్రతీక్ష్యో హి మహాపాతకదూషితః" * ఇత్యాదిగా స్మృతి గలదు.

శ్రీ. అందువలన, స్త్రీలు చెడి వర్ణసంకర మగును.

ప. వర్ణసఙ్కరః = సర్వవర్ణములు నొకటి యగుట.

సఙ్కరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః. ४२

ఆ. వర్ణసంకరము గొప్పదోష మనుటను నిరూపించుచున్నాఁడు— సఙ్కరః = వర్ణసంకరము; కులఘ్నానామ్ = కులమును వధించినవారికిని; కులస్యచ = మిగిలిన కులమునకును; నరకాయైవ = నరకముకొఱకే, నరకమునే కలిగించును. కులక్షయము చేసినవారికి మఱియొక దోషమునుగూడఁ గలుగు నని చెప్పుచున్నాఁడు—హి = మఱియు, ఏషామ్ = ఈకులక్షయకర్తలయొక్క; పితరః = తండ్రులు మొదలగువారు, కులక్షయము చేసినవారి పితరులు నరకము నొందుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు—లుప్తపిణ్డఉదకక్రియాః = కొడుకులు మొదలగు కర్తలు లేకపోవుట వలన, లోపించిన పిండముయొక్కయు ఉదకముయొక్కయు కర్మములుగలవారలై; పతన్తి = పడుదురు, ప్రేతత్వవిముక్తికిఁ గారణము లేకుండుటవలన వారికి నరకపతనమే తప్పక సంభవించు నని యర్థము.

వర్ణసంకర మగుటచేఁ గులక్షయము చేసినవారును వారికులమునఁ బుట్టినవారును నరకమునే పొందుదురు. మఱియు నీకులక్షయకారు లగువారి పితరులకుఁగూడ, కర్తలు నశించుటచే శ్రాద్ధములు తర్పణములు మొదలగునవి లోపించుటవలన, ప్రేతత్వము విడుచుటకు నుపాయము లేక, నరకపతనమే తప్పక కలుగును. అందువలన ఆదోషముగూడఁ గులక్షయము చేసినవారికి సంభవించు నని తా.

శ౦. ఇంతమాత్రమే గాదనర్థము. మఱియు విశేషము గల దని చెప్పుచున్నాఁడు—కులధర్మముల వ్యవస్థచేయు పురుషులఁ జంపినవారు కులఘ్నులు, వారి

* ప్రాయశ్చిత్తముచే శుద్ధుఁ డగువఱకు మహాపాతకి కనుపెట్టియుండఁ దగినవాఁడు—వానితో సవ్యవహారము చేయరాదు.

కిని, కులస్యచ = కులమునకును, సఙ్కరః, నరకాయైవ= నరకము కొఱకే యగును; కులపురుషులను వధించి సాంకర్యము కలిగించినవారును సంకరము నొందినవారును సాంకర్యమునఁ బుట్టినవారును అందఱును నరకంబునందుఁ బడుదు రని యర్థము. ఈయనర్థ ముంతేగాక, ఇంతకన్నను మిక్కిలి గొప్పది కల దని చెప్పుచున్నాఁడు—హి=మఱియు, లేక, ఇది ప్రసిద్ధిని దెలుపును. ఏషామ్—కులఘ్నులయొక్కయు కులముయొక్కయు సంకరము నొందినవారియొక్కయు, పితరః = స్వర్గస్థు లగు పితరులు, తండ్రులు తాతలు మొదలగువారలు, లుప్తపిండోదకక్రియులై, ఆకులఘ్నులు మొదలగువారి దోషముచేతనే, తాముగూడ, నరకమునందుఁ బడుదురు. "సంకీర్ణకానాం పితర శ్చ్యవన్తే నాత్రసంశయః" * అని చెప్పఁబడియున్నది.

మ. కులస్య= కులముయొక్క, సంకరశ్చ= కలియుటయు; కులఘ్నానామ్= కులమును వధించినవారికి; నరకాయైవ = నరకముకొఱకే, భవతి = అగు నని యన్వయము. కులఘ్నులకుమాత్రమే కాదు నరకపతనము, మ ఱేమనఁగా, వారి పితరులకుఁగూడ సంభవించు నని చెప్పుచున్నాఁడు—హి అనునది అప్యర్థము బోధించును, లేక, హేతువును బోధించును, § కొడుకులు మొదలగు కర్తలు లేకపోవుటవలన, లోపించిన పిండక్రియయును ఉదకక్రియయును గలవారలై, కులఘ్నుల పితరులు పడుదురు, నరకముకొఱకే యని యనువర్తించుచున్నది.

శ్రీ. ఇట్లగుటవలన, ఏషామ్ = ఈ కులఘ్నులయొక్క, పితరః, పతన్తి: హి = పడుదురు, లుప్తపిణ్డోదకక్రియాః = లోపించిన పిండోదకకార్యములు గలవారలు.

ప. లుప్తపిణ్డోదకక్రియాః—లుప్త= లోపమునొందిన, పిణ్డ= శ్రాద్ధాదులు, ఉదక = తర్పణాదులు నగు, క్రియాః = కర్మములు గలవారు.

దోషై రేతైః కులఘ్నానాం వర్ణసఙ్కరకారకైః
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. ౪౩

అ. కులఘ్నానామ్ = కులమును వధించిన వారియొక్క; వర్ణసంకరకారకైః = వర్ణసంకరమును జేయునట్టి; ఏతైః = ఈ; దోషైః = చెప్పఁబడిన దోష

* సంకరము నొందినవారి పితరులు పడిపోవుదురు, సందేహము లేదు.

§ మొదటిపక్షమున పితరః అనుదానితో నన్వయము, పితరులుగూడ నని యర్థము. రెండవపక్షమున లుప్తపిణ్డోదకక్రియాః అనుదానితో నన్వయము, లుప్తపిండోదకక్రియు లగుటవలన నని యర్థము.

ములచేత; శాశ్వతాః = ఎల్లప్పుడు నుండునట్టి, అనాదు లయిన; జాతిధర్మాః = జాతి యొక్క ధర్మములును, క్షత్త్రియత్వము మొదలగువానిచే వచ్చిన ధర్మములును; కుల ధర్మాః= వంశముయొక్క ధర్మములును, ఆయావంశములకుఁ బ్రత్యేకముగా నేర్పడిన ధర్మములును; ఉత్సాద్యన్తే = నశింపఁ జేయఁబడుచున్నవి. అందుచేఁ గులక్షయ కారణ మయిన యుద్ధమునుండి విరమించుటయే మేలు.

కులనాశము చేయుటచేఁ గలుగునట్టి యీదోషములవలన వర్ణసంకర మగుటంజేసి అనాదులయిన యాయాజాతులధర్మములును ఆయాకులములధర్మము లును నశించు నని తాత్పర్యము.

శం. మఱియు వంశనాశముచేసినవారికి కలుగునసర్థము చెప్పుచున్నాఁడు— యుక్తాయుక్తవిచారమును విడిచి, కులధర్మమునకుఁ బ్రవర్తకు లయినవారిని కామ క్రోధలోభాదులచే నెవరు వధింతురో వారు కులఘ్నులు, వారియొక్కయే, వర్ణ సంకరకారకైః, ఏతైః దోషైః = చెప్పఁబడిన దోషములచేతనే, శాశ్వతాః = శ్రుతి విహితములైన, స్వర్గమును మోక్షమును ఇచ్చునట్టి, కులధర్మములును జాతిధర్మ ములును, చకారమువలన, ఆశ్రమధర్మములును, ఉత్సాద్యన్తే = నశింపఁజేయఁ బడుచున్నవి.

మ. జాతిధర్మాః = క్షత్త్రియత్వాది జాతులనుబట్టి వచ్చినధర్మములు, కుల ధర్మాశ్చ = ఆయాకులముయొక్క అసాధారణధర్మములును; ఈదోషములచే, ఉత్సా ద్యన్తే = ఉత్పన్నములుగాఁ జేయఁబడుచున్నవి, నశింపఁజేయఁబడుచున్న వని యర్థము.

శ్రీ. చెప్పఁబడిన దోషము నుపసంహరించుచున్నాఁడు రెండుశ్లోకముల చేత—ఉత్సాద్యన్తే = లోపము నొందింపఁబడుచున్నవి. జాతిధర్మాః= వర్ణధర్మములును, కులధర్మాశ్చ, చకారమువలన ఆశ్రమధర్మాదులుగూడ గ్రహింపఁబడుచున్నవి.

ప. ఉత్సాద్యన్తే = లోపమునొందఁ జేయఁబడుచున్నవి.

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. ४४

ఆ. మఱియు జాతిధర్మములును కులధర్మములును నశించుటవలన ఆ ధర్మములచే వర్జితులై స్వధర్మానుష్ఠానమునం దధికారము లేకయుండు మనుష్యులకు

నరకపతనము నిశ్చయ మగుటచే అనర్థకారణ మయిన యీయుద్ధమునే విడువవలె నని చెప్పుచున్నాఁడు—జనార్దన = కృష్ణా! ఉత్సన్నకులధర్మాణామ్ = నశించిన కుల ధర్మములు గల; మనుష్యాణామ్ = మనుష్యులకు; నరకే = నరకమునందు; వాసః = ఉనికి; భవతి = అగును. నియతమ్ = నిశ్చయము. ఈ చెప్పఁబడిన మనుష్యులకు నరకవాసము తప్ప దనువిషయమునఁ బ్రమాణముఁ జెప్పుచున్నాఁడు—ఇతి అని, అనుశుశ్రుమ = విన్నారము.

అట్లు జాతిధర్మములును కులధర్మములును నశించినపిదప ధర్మహీనులైన మనుష్యులు నిరంతరము నరకవాసము నొందుట నిశ్చయ మని పెద్దలవలన విని యున్నార మని తాత్పర్యము.

శం. అందువలన, ఉత్సన్నకులధర్మాణామ్—ఉత్సన్న = నశింపఁజేయఁబడి నవి, కులధర్మాణామ్ = కులధర్మములు ఎవ్వరిచేతనో అట్టి, కులధర్మముల నశింపఁ జేసినట్టి; మనుష్యాణామ్ = మనుష్యులకు; నరకే = రౌరవాదినరకమునందు; అని యతమ్ = యుగము మన్వంతరము మొదలగు కాలావధి లేనట్లుగా, ఎల్లకాల మనుట, * వాసః = ఉనికి; భవతి = అగును. ఇతి = అని; అనుశుశ్రుమ—మహర్షుల వచనంబులవలన విన్నారము మే మని యర్థము.

మ. అందువలనఁ బ్రేతత్వము నివర్తిల్లుటకుఁ గారణము లేకపోవుట వలన నరకమునందె నిరంతరము వాస మగును నిశ్చయ మని, అనుశుశ్రుమ—ఆచా ర్యులముఖమున మేము విన్నవారముగాని మాయూహచేఁ గల్పనచేయువారము కాము, అని మున్ను చెప్పినదానినే దృఢీకరించుచున్నాఁడు.

శ్రీ. ఉత్సన్నకులధర్మాణామ్= నశించిన కులధర్మములు గలవారికి, ఇందుచే ఉత్సన్నజాతిధర్మాదులకుఁగూడ ఉపలక్షణము. అనుశుశ్రుమ = విన్నవారము మేము "ప్రాయశ్చిత్త మకుర్వాణాః పాపేషు నిరతా నరాః । అపశ్చాత్తాపినః కష్టా న్నిరయా న్యాన్తి దారుణాన్" § ఇత్యాది వచనములవలన.

వ. అనుశుశ్రుమ = విన్నారము.

* వీరి మతమునందు అనియతమ్ అని పదచ్ఛేదము.

§ పాపములందు నిరతులై ప్రాయశ్చిత్తము చేసికొనక పశ్చాత్తాపము లేకయుండు మనుష్యులు భయంకరములైన నరకముల నొందుదురు.

అహో బత మహ త్పాపం క ర్తుం వ్యవసితా వయమ్
య ద్రాజ్యసుఖలోభేన హ న్తుం స్వజన ముద్యతాః. ౪౫

తా. ఇదిగుణము ఇదిదోషము అను వివేకజ్ఞానముగల మేముగూడ రాజ్యప్రాప్తిచేఁ గలుగునట్టి సుఖోపభోగమునందలి లోభముచే స్వజనుల హింసించుటకుఁ బ్రవ ర్తించుట మిగులఁ బరితాపకరం బని మిక్కిలి శోకముతోఁ జెప్పుచున్నాఁడు—అహో = ఆశ్చర్యము! బత = అయ్యో! వయమ్ = మేము; మహత్ = గొప్పది యగు; పాపమ్ = పాపమును; క ర్తుమ్ = చేయుటకు; వ్యవసితాః = యత్నించినారము! యత్—ఏది యనఁగా; రాజ్యసుఖలోభేన = రాజ్యముచేతఁ గలుగు సుఖమునందలి యాశచే; స్వజనమ్ = బంధుజనమును; హ న్తుమ్ = చంపుటకు; ఉద్యతాః = పూనినారము.

ఏమి! రాజ్యసుఖమున కాశపడి బంధువులను వధించుటకు యత్నించుచున్నాము. వివేకుల మయిన మేముగూడ ఈమహాపాపకార్యము చేయఁబూనితిమి. ఇంతకన్న నాశ్చర్య మేది గలదు? మిక్కిలి పరితాప మగుచున్నది! అని తా.

శం. «పశ్యతి పుత్త్రిం పశ్యతి పౌత్త్రిమ్, అపామ సోమ మమృతా అభూమ, అక్షయ్యగ్ం హవై చాతుర్మాస్య యాజిన స్సుకృతం భవతి, దక్షిణావన్తో అమృతం భజ న్తే" * ఇత్యాదులగు ప్రరోచనశ్రుతులచే § ఎవ్వఁడు విషయసుఖమున కాశపడి శ్రౌతస్మా ర్తకర్మమునందుఁ బ్రవ ర్తించునో, అతఁడు నిరంతరము జననమరణప్రవాహరూపసంసారమునే పొందు నని ముముక్షు వగువాఁడు సంతాపపడవలె నని సూచించుటకై, యర్జునుఁడు కులనాశము చేసినవారికిఁ గులక్షయదోషముచే నిట్టి మహ త్తర మయిన యనర్థము సంభవించు నని నిశ్చయించి యందుచేఁ బరమసంతాపము నొంది చెప్పినయా ర్తవచనముఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకముల చేత—అహో—దీని కాశ్చర్య మర్థము. బత—దీనికి ఖేద మర్థము. మహత్ = గొప్పది, వాక్కుచేఁ జెప్పుటకు నశక్య మయిన, పాపమ్, క ర్తుమ్, వయమ్ = వివేకుల మగు మేముగూడ, వ్యవసితాః = ప్రయత్నించుచున్నాము. అహో—ఎంత యాశ్చర్యము!

* పుత్త్రినిఁ జూచును పౌత్త్రినిఁ జూచును, సోమపానము చేసితిమి మరణము లేనివారమయితిమి, చాతుర్మాస్యయాగము చేసినవానికి తఱుఁగులేని సుకృతము కలుగును, దక్షిణగలవారు అమృతము నొందుదురు.

§ కర్మములయం దభిరుచి గల్గించుటకుఁ బ్రవృ త్తము లయిన శ్రుతులచే.

బత—ఎంత ఖేద మగుచున్నది! ఆమహాపాప మేది యనఁగాఁ జెప్పుచున్నాఁడు—రాజ్య సుఖలోభేన—రాజ్యసుఖ = రాజ్యప్రాప్తిచే లబ్ధ మగు రాజార్హ మయిన సుఖమునందు, లోభేన = ఆశ చేత, ఈదోషము చేత; స్వజనమ్ = తండ్రులు తోఁబుట్టువులు కొడుకులు మొదలగు బంధుజనమును; హన్తుమ్ = ఆయుధములచేఁ జంపుటకు; ఉద్యతాః ఇతియత్ = మేము ఉద్యుక్తుల మయితి మనునది యేది గలదో, అదియె మహాపాప మని యర్థము.

మ. బంధువధముగాఁ బర్యవసానము నొందునట్టి యుద్ధమునకు నిశ్చయించుటగూడ మిక్కిలి పాపిష్ఠము. ఇఁక నట్టి యుద్ధము పాపిష్ఠ మని చెప్పవలెనా? అని చెప్పుటకై యట్టి యుద్ధమునకు నిశ్చయించుటచేఁ దన్నుగుఱించి శోకించుచుఁ జెప్పుచున్నాఁడు—నీ కిట్టిబుద్ధి యున్నయెడ యుద్ధము చేసెద నని పూనికతో నేల వచ్చితి వని చెప్పవలదు. ఏల యనఁగా, ఆలోచింపకపోవుటచే నేనట్టి సంరంభము చేసితి నని భావము.

శ్రీ. బంధువుల వధించుటకు నిశ్చయించుటచే సంతాపము నొంది చెప్పుచున్నాఁడు—స్వజనం హన్తుమ్ ఉద్యతా ఇతియత్ = బంధుజనమును జంపుటకుఁ బూనివార మనునది యేది గలదో, ఈ గొప్పపాపమును జేయుఁటకు నిశ్చయముఁ జేసినారము మేము, అహోబత—మిక్కిలి కష్ట మని యర్థము.

ప. అహోబత—ఇందుచే బంధువుల వధింపఁ బూనుటవలనఁ గలిగిన సంతాపమును జెప్పుచున్నాఁడు.

యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే * క్షేమతరం భవేత్. ౪౬

ఆ. ఇట్లు నీవు యుద్ధమునందు విముఖుఁడవై శత్రువులు చేయు పరిభవమునకు మాఱుసేయ కుందు వేని ఆయుధధారణము లేని శత్రు వగు నిన్ను ఆయుధపాణు లగు ధార్తరాష్ట్రులు నిగ్రహింతు రనఁగాఁ జెప్పుచున్నాఁడు—అప్రతీకారమ్ = మాఱుచేయుట లేనివాఁడను; అశస్త్రమ్ = ఆయుధము లేనివాఁడ నగు; మామ్ = నన్ను; ధార్తరాష్ట్రాః = దుర్యోధనాదులు; రణే = యుద్ధమునందు; హన్యుర్యది =

* "ప్రియతరంభవేత్" అని పాఠాంతరము.

వధింతురేని; తత్ = అది, మే = నాకు; క్షేమతరమ్ = మిక్కిలి క్షేమము, బ్రతుకు కన్నను మే లనుట; భవేత్ = అగును. నాప్రాణము రక్షించుకొనుటకన్నను ప్రాణి హింస చేయకుండుట యుత్తమధర్మ మని భావము.

నేను ఆయుధమునే ధరింపక, నామీఁద శత్రువులు ఆయుధములు ప్రయోగించినను అందుకు నివారణము మొదలగు మాటేమియుఁ జేయకుండెదను. ఇట్లుండు నన్ను దుర్యోధనాదులు ఆయుధపాణులై వచ్చి యుద్ధమున వధింతురు గాక. అదియె నాకు బంధువధముచేఁ బ్రాణములు రక్షించుకొనుటకన్నను క్షేమ మని తా.

శ్రీ౦. పాపభయముచే నీవు యుద్ధమునుండి యుపరమింతువేని వారలే నిన్ను వధింతు రనఁగాఁ జెప్పుచున్నాఁడు—అప్రతీకారమ్—చేయఁబడిన దానికి మాఱుఁ జేత ప్రతీకారము, కొట్టువానిని బదులుకొట్టుట, పాపభయముచేతను దయ చేతను అనురాగముచేతను దానిఁ జేయనివాఁడను; కావుననే, అశస్త్రమ్—ఆయుధము విడిచినవాఁడ నగు; మామ్ = నన్ను; ధార్తరాష్ట్రులు తాము శస్త్రపాణులై రణమునందు; యదిహన్యుః—నిర్దాక్షిణ్యముగా ధర్మము విడిచి నన్ను వధించినపక్షమున; తత్ = అట్లు వధించుట; మమ = స్వధర్మమున నున్న నాకు; క్షేమతరం భవేత్ = మిక్కిలియు క్షేమముకొఱకే యగును. « అప్రాప్తప్రాపణం యోగః క్షేమస్తు స్థిత రక్షణమ్ " * అను న్యాయముచే ఉన్నదానిఁ బరిపాలించుట క్షేమము, దానికన్న నధికము క్షేమతరము. కులనాశనదోషమును అందుచేఁ గలుగు నరకపతనమును అపకీర్తియు మొదలగు ననర్థములు లేకుండుటవలనఁ బూర్వముచేసిన పుణ్యసమూహామునకు నాశము కలుగకుండుటయే క్షేమతరశబ్దార్థము. అది యట్లు వారు నన్ను వధించుటవలననే గలుగు నని యర్థము.

మ. ఓయి! నీకు వైరాగ్యము కలిగినను భీముఁడు మొదలగువారికి యుద్ధమునం దుత్సాహ ముండుటవలన బంధువధము కాక తప్పదు. ఇఁక నీ వేమి చేసెద వనఁగాఁ జెప్పుచున్నాఁడు—తనప్రాణము రక్షించుకొనుటకంటెఁ బ్రాణుల హింసింపకుండుట యుత్తమధర్మము. ఎందువలన ననఁగా దానిచేఁ బాపము సంభవింపదు. అందువలన బ్రతుకుటకంటె మరణమే నాకు, క్షేమతరమ్ = మిక్కిలి హితము, అగును. ప్రియతరమ్ అను పాఠమునందును అదియె యర్థము. అప్రతీకారమ్ = నాప్రాణము రక్షించుకొనుటకొఱకు నవ్యాపారమునుం జేయనివాఁడను,

* లేనివాని ప్రాప్తియోగము, ఉన్నవాని రక్షించుట క్షేమము.

లేక, బంధువుల వధింప నిశ్చయించుట యను పాపమునకు ఇతరప్రాయశ్చిత్తము లేనివాఁడను, అట్లు ప్రాణాంతప్రాయశ్చిత్తముచేతనే దానికి శుద్ధి కలుగు నని యర్థము.

శ్రీ. ఇట్లు సంతాపము నొందినవాఁడై మరణమునే ప్రార్థించి చెప్పుచున్నాఁడు—అప్రతీకారమ్ = మాఱుసేఁత చేయనివాఁడను, ఊరకకూర్చున్నవాఁడనగు నన్ను, వధింతురేని, అప్పు డావధించుట నాకు, క్షేమతరమ్ = మిక్కిలి మేలు, అగును, ఏల యనఁగా అందుచే పాప మేమియు సంభవింపదు.

ప. ఇఁక యుద్ధప్రయత్నమును విడిచి యూరక యున్న నన్ను వారలాయుధపాణులై వధించినయెడ, తన్మే క్షేమతరం భవేత్—అది నాకుఁ బాపము కలిగింప దని యర్థము.

సంజయ ఉవాచ.

ఏవ ముక్త్వా ఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః. ౪౭

ఆ. సంజయ ఉవాచ = ఇప్పుడు చెప్పఁబడిన యర్జునుని వృత్తాంతమును సంజయుఁడు రాజయిన ధృతరాష్ట్రునకు విన్నవించెను. ఆ విన్నవించు విధమును దెలుపుచున్నాఁడు—ఏవమ్ = చెప్పఁబడినవిధమున; ఉక్త్వా = భగవంతునితో విజ్ఞాపనము చేసి; అర్జునః = అర్జునుఁడు; శోకసంవిగ్నమానసః = శోకశబ్దము మోహమునకు నుపలక్షణము, శోకమోహములచే పీడింపఁబడిన మనస్సుగలవాఁడై; సంఖ్యే = యుద్ధమునందు; సశరమ్ = బాణముతోఁ గూడిన; చాపమ్ = గాండీవ మను ధనుస్సును; విసృజ్య = విడిచి; రథ ఉపస్థే = రథము నడుమ; ఉపావిశత్ = కూర్చుండెను, నేను యుద్ధము చేయ నని చెప్పుచు సన్న్యాసమే శ్రేయస్కర మని తలంచి కూర్చుండె నని యర్థము.

ఇట్లు భగవంతునితో విన్నవించి యర్జునుండు శోకమోహములచేఁ బరవశ మయిన మనస్సు గలవాఁడై యుద్ధంబున చేతనుండుధనుర్బాణంబులు పాఱవైచి రథము మీఁదఁ గూర్చుండె నని తాత్పర్యము.

శం. “పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాన్నాస్త్యకృతః కృతేన। తద్విజ్ఞానార్థం సగురు మే వాభిగచ్ఛే త్సమిత్పాణి శ్శ్రోత్రియం

బ్రహ్మనిష్ఠమ్ " * ఇత్యాదులగు శ్రుతులందుఁ జెప్పఁబడిన విధంబున ముముక్షువు విద్వాంసుం డగు బ్రాహ్మణుండు, కర్మములును కర్మఫలంబులును తద్దాతృదేవతలును క్లేశకరత్వము అనిత్యత్వము సంసారిత్వము మొదలగు దోషములు గలవారనియు కర్మకర్తలకు జననమరణప్రవాహమునందుఁ బడుట తప్ప దనియు నిరంతర సంసారదుఃఖప్రాప్తి మొదలగు ననర్థముల పరంపర సంభవించు ననియు శ్రుతులచేతను స్మృతులచేతను యుక్తులచేతను నిశ్చయించి మోక్షముమాత్రమె కోరినవాఁడై యసత్ప్రపంచమునుండి వైరాగ్యము నొంది సాధనసహితముగా సమస్తకర్మమును సన్న్యసించి మోక్షము కొఱకు సద్గురువు నాశ్రయింపవలె నను నీయర్థమును సూచించుటకై, యర్జునుండు సదసద్విచారమును అసత్ప్రవృత్తియందుఁ బరితాపంబును అధర్మముచేఁ బ్రాప్త మగు రాజ్యమునందును తత్సుఖమునందును దోషబుద్ధియును వైరాగ్యంబును గలవాఁ డగుటను బ్రతిపాదించి యిప్పుడు హింసాసాధనము లైనయాయుధముల సన్న్యసించుటయు యుద్ధమునుండి నివర్తిల్లుటయుఁ జెప్పుచు నధ్యాయము నుపసంహరించుచున్నాఁడు—అర్జునః = అర్జునుఁడు; సంఖ్యే = యుద్ధము అగుచుండఁగా; ఏవమ్= 'ధార్తరాష్ట్రా రణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్' అను నీవాక్యమును, ఉక్త్వా; శోకసంవిగ్నమానసః= బంధువినాశమునిమిత్తమయి పుట్టిన శోకముచే కలఁగిన మనస్సుగలవాఁడై; సశరం చాపం విసృజ్య; నేను యుద్ధము చేయంజాల నని, రథోపస్థే = రథముమీఁద; ఉపావిశత్ = కూర్చుండెను. ఇందుచే, సదసద్వివేకము గలవాఁడును బరమార్థము నపేక్షించువాఁడు నగు ముముక్షువు, అనిత్యంబగుటంజేసి యసద్దైన స్వర్గాదిసుఖము నెడ వైరాగ్యము నొంది ఆస్వర్గాదిసుఖమునకు సాధన మగు దానినంతయు సన్న్యసింపవలె నని సూచితం బగుచున్నది. అట్లు శ్రుతి 'పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్' అనియు, " యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్ " § అనియు నుపదేశించుచున్నది.

* కర్మములచే సంపాదింపఁబడిన లోకములను బరీక్షించి—అవి యనిత్యము లని తెలిసి, బ్రాహ్మణుఁడు చేయఁబడిన దానిచే—కర్మముచేఁ జేయఁబడినది కానట్టి మోక్షము కలుగదు అని నిర్వేదము పొందవలెను. ఆబ్రహ్మమును దెలియుటకొఱకు అతఁడు సమిత్పు హస్తమునఁ గలవాఁడై వేదముల నధ్యయనించినవాఁడును బ్రహ్మనిష్ఠుండు నగు గురువునొద్దకు పోవలెను.

§ ఏదినమే వైరాగ్యము నొందునో ఆదినమే సన్న్యసింపవలెను.

మ. పిమ్మట నేమి జరగెననఁగాఁ జెప్పుచున్నాఁడు—సఙ్ఖ్యే=యుద్ధమునందు, రథోపస్థే = రథముమీఁద, ఉపావిశత్ = కూర్చుండెను, అంతకు మున్ను యుద్ధము కొఱకును చూచుటకొఱకును నిలుచున్నవాఁడు. శోకసంవిగ్నమానసః = శోకముచే బాధింపఁబడిన మనస్సు గలవాఁడై.

శ్రీ. అటుపిమ్మట నేమి జరగె ననఁగాఁ జెప్పుచున్నాఁడు—సఙ్ఖ్యే = యుద్ధమునందు, రథోపస్థే = రథముమీఁద, ఉపావిశత్ = కూర్చుండెను, శోకసంవిగ్నమానసః = శోకముచే చలించిన మనస్సు గలవాఁడై.

ప. అంత నేమిజరగె ననఁగా సంజయుఁడు చెప్పుచున్నాఁడు—సఙ్ఖ్యే = యుద్ధమునందు, రథోపస్థే = రథముమీఁద, ఉపావిశత్ = కూర్చుండెను, శోకసంవిగ్నమానసః = శోకముచే చలనము నొందిన మనస్సుగలవాఁడై. ఇఁక నధ్యాయ తాత్పర్యము—ఎవఁడు పాపభయము గలిగి వైరాగ్యవంతుఁ డగునో, అతఁడు తత్త్వజ్ఞానమే మోక్షము నొందుట కధికారి యగును. అర్జునుఁడు కులపురుషవధమునుండియు రాజ్యభోగమునుండియు నివృత్తుం డగుటవలన అట్టి మోక్షాధికారి [illegible]ను. అని తలంచి శ్రీకృష్ణుఁ డతనికి క్షత్త్రియధర్మానురూప మగు బ్రహ్మవిద్యోపదేశము వెంటనే చేసెను. ఇది ప్రథమాధ్యాయకృత్యము చెప్పఁబడినది.

రా. అంత నుదారమయిన చిత్తవృత్తిగలవాఁడును బరమకారుణికుండును మిక్కిలియు దృఢ మయిన బంధుస్నేహము గలవాఁడును బరమధార్మికుండు నగు నాయర్జునుండు, తాను దన తోఁబుట్టువులును మీఁచే లక్కయిండ్లు దహించుట మొదలగు నతిఘోరమారణోపాయములచేఁ బలుమాఱు వంచింపఁబడినవాఁ డయ్యును, పరమపురుషునిసాహాయ్యము నొందిన తనచే వధింపఁబడఁబోవునట్టి మీవారిం జూచి, బంధుస్నేహముచేతను బరమ కృపచేతను ధర్మాధర్మభయము చేతను అత్యంతము పరవశములైన సర్వావయవములుం గలవాఁడై, సర్వథా నేను యుద్ధము చేయ నని పలికి, బంధువియోగ జనిత శోకముచే మిక్కిలి చలితంబగు మనస్సుగలవాఁడై బాణంబును ధనువును విసర్జించి రథంబుమీఁదఁ గూర్చుండెను. *

* ఇది యధ్యాయసమాప్తిపఱ్యంతం దాత్పర్యము.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః.

వ్యాసప్రోక్త మయిన శతసహస్రగ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రంబును బ్రహ్మవిద్యాబోధకంబునగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు అర్జునవిషాదయోగం బనంబరఁగు ప్రథమాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమత్ఖ్వాటోపనామశ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవద్గీ
తాంధ్రవ్యాఖ్యానంబునందుఁ
బ్రథమాధ్యాయటీక.



శ్రీ ర స్తు.

శ్రీవాసుదేవ పరబ్రహ్మణే నమః.

పరమార్థచంద్రికాసహిత

# శ్రీభగవద్గీత, ద్వితీయాధ్యాయము.

సంజయ ఉవాచ.

తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్
విషీదన్త మిదం వాక్య మువాచ మధుసూదనః. ౧

ఆనందగిరికృత టీక.—

అహింసయు భిక్షాశనంబును బరమధర్మం బను బుద్ధిచే నర్జునుండు యుద్ధవిముఖుం డగుటను విని తనకొడుకు లైశ్వర్యమునకుఁ జలనము లేదని నిశ్చయించి నెమ్మదినొందియున్నటవలన నట్టి ధృ జూచి యతని దురాశను దొలఁగించెద ననుతలంపున సంజయుఁ ధృతరాష్ట్రునకుఁ బలికె నని చెప్పుచున్నాఁడు. సంజయ ఉవాచ అని.

పరమేశ్వరునిచే బోధింపఁబడుచున్నను అర్జునుండు కార్యాకార్యములను శీఘ్రమున నెఱుంగఁ డయ్యెను. ఏల యనఁగా భ్రాంతిప్రయుక్తం బగు శోక మత నికి మిక్కిలి దృఢ మయిన మోహముఁ బుట్టించెను. అట్లయినను భగవంతుం డతని నుపేక్షింపలే దని చెప్పుచున్నాఁడు—తథా = అట్లు, బంధుజనమునకు మర ణము ప్రసక్తించుటచే; కృపయా = కరుణచే; ఆవిష్టమ్ = ఆవేశింపఁబడినవాఁడును; అశ్రుపూర్ణ ఆకుల ఈక్షణమ్ = కన్నీళ్ళచే నిండినవియు కలఁగినవియు నగు కన్నులు గలవాఁడును; విషీదన్తమ్ = దుఃఖించుచున్నవాఁడు నగు; తమ్ = ఆయర్జునునిఁగూర్చి; మధుసూదనః = మధువను నసురుని చంపినవాఁ డగు కృష్ణుఁడు; ఇదమ్ = ఈ, చెప్పఁ బోవునట్టి; వాక్యమ్ = యుక్తియుక్త మయిన వచనమును; ఉవాచ = పలికెను. అ ట్లున్న యర్జును నుపేక్షించినవాఁడు కాఁ డని యర్థము.

అట్లు కృపాపరవశుండై కన్నులనిండ నీరు గాఱఁగా దుఃఖించుచున్న యా యర్జునుం జూచి భగవంతుం డీవాక్యముఁ బలికె నని తాత్పర్యము.

శంకరానందసరస్వతీకృత వ్యాఖ్యానము.—

ఆత్మానాత్మవివేకముచేతను అందుచేఁ గలిగిన తీవ్రవైరాగ్యముచేతను మోక్షేచ్ఛచేతను సమస్తకర్మములను సన్న్యసించి మోక్షమునుమాత్రమే కోరునట్టి బ్రాహ్మణుఁడు, ఆత్మానాత్మవివేకము వైరాగ్యము మొదలగు సాధనములసంపత్తియును బ్రాహ్మణత్వమును సఫలమగుటకై « అథాతో బ్రహ్మజిజ్ఞాసా ” అనియు « ఆత్మా వా అరే ద్రష్టవ్యశ్శ్రోతవ్యః ” అనియు « తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్ ” ఇత్యాదిప్రమాణములచేఁ జెప్పఁబడినవిధంబున శ్రోత్రియుండును బ్రహ్మనిష్ఠుండు నగు సద్గురువును శరణుచొచ్చి బ్రహ్మవిచారము చేయవలెనను నీయర్థమును సూచించుటకై, ఆత్మానాత్మవివేకము గలవాఁడును బరమార్థము కోరినవాఁడు నగు నర్జునుండు « శిష్యస్తే ఽహంశాధి మాం త్వాం ప్రపన్నమ్ అని యీశ్వరుని శరణుచొచ్చుటయు, అతని కీశ్వరుం డాత్మానాత్మజ్ఞానము నుపదేశించినవిధంబును బ్రతిపాదించుట కీ ద్వితీయాధ్యాయం బారంభింపఁబడుచున్నది.—

అందు మొదట « సో ఽహం భగవశ్శోచామి తం మా భగవాఞ్ఛోకస్య పారం తారయతు ” * అని శ్రుతి ప్రతిపాదించుటంజేసి, సంసారదుఃఖముచే శోకించుచు తన్ను శరణుచొచ్చిన ముముక్షువును అభయప్రదానపూర్వకముగా అభిముఖుం గావించుకొని గురువు తత్త్వము బోధింపవలెనని సూచించుటకై, అట్లు దుఃఖించుచున్న యర్జునునికి వివేకవచనంబులచే భగవంతుఁడు బోధించెనని చెప్పఁ గోరి ధృతరాష్ట్రునితో సంజయుఁడు పలికెను.

తథా = చెప్పఁబడిన విధంబున, నావారలైన ఈ తోఁబుట్టువులు కొడుకులు మొదలగువారు యుద్ధంబున మరణంబు నొందెదరని చావఁబోవుచున్న బంధుజనులయందు, కృపయా ఆవిష్టమ్, కావునసే, విషీదన్తమ్, అందువలనసే, అశ్రుపూర్ణాకులేక్షణమ్, తమ్ అర్జునమ్, చూచి, మధుసూదనః = మధు వను రాక్షసుని చంపినవాఁడు, లేక, అందఱకు దేహములందు తేనియవలె ఇష్టమగుటవలన మధు వనఁగా అహంకారము, దానిని అత్మను దెలుపుటచేఁ బోఁగొట్టువాఁడు, లేక, « ఇయం పృథివీ సర్వేషాం భూతానాం మధు ” § అను శ్రుతివలన మధు వనఁగా ఆత్మానందము, దానిని తన సాక్షాత్కారము గలవారికి స్ఫురింపఁజేయువాఁడు,

* భగవంతుఁడా! అట్టి నేను దుఃఖించుచున్నాను. అట్టి నన్ను భగవంతుఁడవగు నీవు దుఃఖముయొక్క పారమును దరింపఁజేయవలెను.

§ ఈపృథివి సమస్తభూతములకును మధువు—ఆనందము.

శ్రీకృష్ణుఁడు; ఇదమ్—చెప్పఁబోవునట్టి, వాక్యమ్, ఉవాచ. ఇచట, "కృపయా విష్టమ్" అనుట ముముక్షువు కృప మొదలగు నాత్మగుణము లెనిమిదియుఁ గలవాఁడై యుండవలె నని సూచించుటకు. కృపాపదము క్షాన్తి మొదలగువాని కుప లక్షణము. "దయా సర్వభూతేషు క్షాన్తి రనసూయా శౌచ మనాయాసో మఙ్గళ మకార్పణ్య మస్పృహాచే త్యష్టా వాత్మగుణాః" * అని గౌతమమునిచేఁ జెప్పఁబడిన యెనిమిది యాత్మగుణములు గలవానికే చక్కని జ్ఞానము కలుగును. "సోఽహం భగవ శ్శోచామి" అను శ్రుతివలన, ఎట్లు సంసారసముద్రమును దాటఁగలను? అని దుఃఖించుచుఁ బరితపించుచున్నవానికే గురువును ఈశ్వరుఁడును బ్రసన్నులగుదు రని సూచించుటకై "విషీద న్తమ్ అశ్రుపూర్ణా కులేక్షణమ్" అని చెప్పఁబడినది. ముముక్షువై గురువును శరణుచొరఁ గోరువానికిఁ జెప్పఁబడిన గుణంబు లుండవలెనని యీ శ్లోకముచేఁ దెలుపఁబడినది.

---

* ఆత్మవ త్సర్వభూతేషు యద్ధితాయ శివాయచ, వర్తతే సతతం హృష్టః కృత్స్నా హ్యేషా దయా స్మృతా.—ఎల్లప్పుడును సంతుష్టుండై తనయందువలెనే సర్వభూతములందును వాని హితంబు కొఱకును మంగళముకొఱకును వర్తించుట యనునది యేదిగలదో అది యంతయు దయ యనఁబడును. ఆక్రుష్టోవాపి నాక్రోశే త్తాడితో నైవ తాడయేత్, అదుష్టో వాఙ్మనః కాయై స్సాతితిక్షా క్షమా స్మృతా—తన్ను నిందించినను దాను బదులు నిందింపఁగూడదు, కొట్టినను గొట్టఁగూడదు. వాక్కుచేతను మనస్సుచేతను కాయముచేతను రోషము పొందకుండవలెను. అట్టి సహనము క్షాంతి యనఁబడును. యోధర్మ మర్థం కామం వా లభతే మోక్ష మేవచ। న ద్విష్యాత్తం సదా ప్రాజ్ఞ స్సానసూయా స్మృతా బుధైః—ఎవ్వఁడేని ధర్మముగాని యర్థముగాని కామముగాని మోక్షముగాని పొందినపుడు, ప్రాజ్ఞుఁ డతనియెడ నెల్లప్పుడును ద్వేషము నొందకుండవలెను. అది యనసూయ యని పండితులచేఁ జెప్పఁబడినది. ద్రవ్యశౌచం మనశ్శౌచం వాచికం కాయికం తథా, శౌచం చతుర్విధం ప్రోక్త మృషిభి స్తత్త్వదర్శిభిః—ద్రవ్యశుద్ధి మనశ్శుద్ధి వాక్శుద్ధి కాయశుద్ధి యని శౌచము తత్త్వవేత్త లగు ఋషులచే నాలుగువిధములుగాఁ జెప్పఁబడినది. య దారమ్భే భవే త్పీడా నిత్య మత్యన్త మాత్మనః। త ద్వర్జయే ద్ధర్మ్య మపి సో నాయాసః ప్రకీర్తితః—దేని నారంభించినయెడ తన కెల్లప్పుడును మిక్కిలి బాధ యగునో అది ధర్మ్యమైనను విడువవలెను. అది యనాయాస మని చెప్పఁబడినది. ప్రశస్తాచరణం నిత్య మప్రశస్తస్య వర్జనమ్, ఏతద్ధి మఙ్గళం ప్రోక్తం మునిభి స్తత్త్వదర్శిభిః—పెద్దలు ప్రశంసించుకార్యము చేయుటయు నిందించుకార్యము విడుచుటయు నిదియె మంగళ మని తత్త్వవేత్త లగు మునులచేఁ జెప్పఁబడినది. అప ద్యపిచ కష్టాయాం భవే ద్దీనో నకర్హిచిత్, సంవిభాగరుచిశ్చ స్యా త్త దకార్పణ్య ముచ్యతే—ఎంత గొప్పయాపద సంభవించినను దైన్యము నొందరాదు. దానమునందుఁ బ్రీతికలవాఁడు కావలయును. అది యకార్పణ్య మని చెప్పఁబడినది. వివర్జయేత్తు సంతోషం విషయేషు సదా నరః। పరద్రవ్యాభిలాషంచ సాఽస్పృహా కథ్యతే బుధైః—మనుష్యుఁ డెల్లప్పుడు విషయములందుఁ బ్రీతిని పరద్రవ్యమునం దభిలాషను విడువవలెను. అది యస్పృహా యని పండితులచేఁ జెప్పఁబడుచున్నది.

మధుసూదనసరస్వతీకృత వ్యాఖ్యానము.—

అహింసయు భిక్షాశనంబును బరమధర్మం బనుబుద్ధిచే నర్జునుండు యుద్ధవిముఖుం డగుటను విని తనపుత్త్రులకు రాజ్యము స్థిరపడిన దని స్వస్థచిత్తుం డైనధృతరాష్ట్రునకు 'పిమ్మట నేమి జరిగె' నని సంతోషమునం దోఁచు నాకాంక్షను దొలఁగింపఁ గోరినవాఁడై సంజయుం డతనితోఁ బలికె నని వైశంపాయనుఁడు చెప్పుచున్నాఁడు. 'సంజయ ఉవాచ' అని.

కృప యనఁగా నావారు వీరు అను వ్యామోహముచేఁ గలిగిన స్నేహవిశేషము, ఆకృపచే, ఆవిష్టమ్—స్వభావసిద్ధ మయినదానిచే వ్యాపింపఁబడినవాఁడును, అని అర్జునునకుఁ గర్మత్వమును కృపకుఁ గర్తృత్వమును బ్రతిపాదించుటచే ఆకృప ఆగంతుకము * కా దని తెలుపఁబడినది. కావుననే, విషీదన్తమ్—విషాద మనఁగా స్నేహమునకు విషయ మయిన బంధుజనులకు మరణము కలుగు నను శంకవలనఁ బుట్టినదియు శోకమను నామాంతరము గలదియు నగు మనోవ్యాకులత, దానిఁ బొందుచున్నవాఁడును, ఇట విషాదము కర్మముగాను అర్జునుఁడు కర్తగా నుండుట వలన విషాదము ఆగంతుక మని సూచింపఁబడినది. కావుననే, కృపవలనను విషాదమువలనను, అశ్రుపూర్ణ ఆకులఈక్షణమ్—కన్నీళ్ళచే నిండినవియు కానరానివియు నగు కన్నులుగలవాఁడును; ఇట్లు కన్నీళ్ళుకాఱుట వ్యాకులత్వము అను రెండుకార్యములను కలిగించినవై పుష్టిని బొందియుండు కృపావిషాదములచే మిక్కిలి పీడితుం డగు, తమ్—అర్జునునిగూర్చి, ఇదమ్—చెప్పఁబోవునట్టి, వాక్యమ్=ఉపపత్తితోఁగూడిన మాటను; ఉవాచ=పలికెను. కాని యుపేక్షించినవాఁడు కాఁడు. మధుసూదనః—తాను దుష్టనిగ్రహము చేయువాఁడు అర్జునునకుఁగూడ అట్లే చెప్పు నని భావము.

శ్రీధరస్వామికృత వ్యాఖ్యానము.—

అటుపిమ్మట నేమి జరిగె నని యడుగఁగా సంజయుఁడు చెప్పుచున్నాఁడు—అశ్రుపూర్ణఆకులఈక్షణమ్ = కన్నీళ్ళచే నిండినవై కలఁగిన కన్నులుగలవానిని. అట్లు చెప్పఁబడిన విధమున, విషీదన్తమ్ = దుఃఖించుచున్న, తమ్ = ఆయర్జునుని గూర్చి, మధుసూదన ఇదం వాక్య మువాచ.

పరమార్థప్రపా —

అంత నేమిజరిగె నని యపేక్షింపఁగా సంజయుఁడు చెప్పెను—కృపయా ఆవిష్టమ్ = బంధుజనులందలి కృపచే వ్యాపింపఁబడినవాని; విషీదన్తమ్ = విషాదము

* స్థిరముగా నుండనిది.

నొందినవానిని, కావుననే అశ్రుపూర్ణములు వ్యాకులము లైన కన్నులుగలవాని, ఆయర్జునుం గూర్చి, మధుసూదనః = దైత్యుల వధించునట్టి కృష్ణుఁడు, ఉవాచ.

శ్రీభగవా నువాచ.

కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున. ౨

టీ. ఏది యీ వాక్యమనఁగాఁ జెప్పుచున్నాఁడు—శ్రీభగవా నువాచ— శ్రీభగవంతుఁడు పలికెను. కుతః = ఏకారణమువలన; త్వా = నిన్ను, క్షత్త్రియులలో నెల్ల మేటివయిన వానిని; విషమే = సంకటకాలమునందు; కశ్మలమ్ = మలినమయి నదియు, శిష్టులచే నిందింపఁబడినదియు; అనార్యజుష్టమ్ = శాస్త్రార్థము తెలియని వారి చేత సేవింపఁబడినదియు; అస్వర్గ్యమ్ = స్వర్గమునకు తగినది కానిదియు, దోషము కలిగించునదియు ననుట; ఈలోకమునందును, అకీర్తికరమ్ = అపకీర్తి కలిగించు నదియు నగు; ఇదమ్ = ఇది, యుద్ధమునుండి విముఖుండగుట; సముపస్థితమ్ = పొందినది? అర్జున = అర్జునా! అర్జునుం డని పేరిచేతఁ బ్రఖ్యాతినొందినట్టి నీకిది యుక్తము కా దని యర్థము.

శ్రీ భగవంతుఁ డిట్లనియె. అర్జునా! ఈ సంకట సమయమందు పాపిష్ఠంబును మూఢులకు యోగ్యమయినదియు నరకప్రదంబును అపకీర్తికరంబు నగు నీబుద్ధి నీకెందువలనఁ గలిగెను? అని తాత్పర్యము.

శం. శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత—అర్జున = ఓయర్జునుఁడా, శుద్ధమయిన స్వభావము గలవాఁడా! విషమే = సంకటమునందు, శత్రువులు శస్త్రములచే మనల వధించుటకుఁ బ్రవర్తించు సమయమునందు; ఇదమ్ కశ్మలమ్ = 'ఏతాన్న హన్తు మిచ్ఛామి' 'యదిమామప్రతీకారమ్' ఇత్యాదిగాఁ జెప్పబడిన చిత్త వ్యామోహము; కుతః = ఏకారణమువలన; త్వా = నిన్ను; సముపస్థితమ్ = పొందినది? కాలదోషమువలననా? కర్మదోషమువలననా? ఎందువలన ఈభ్రమ శుద్ధ స్వభావుండవు వివేకి వగు నీకుఁ గలిగిన దని యర్థము. అనార్యజుష్టమ్—అనార్య = పెద్దల శిక్షలేనివారిచేత, పామరులచేత, జుష్టమ్ = సేవింపఁబడినదియు, అస్వర్గ్యమ్ = స్వర్గము కలిగింపనిదియు, దుర్గతికలిగించునదియు; ఈలోకము నందును, అకీర్తికరమ్ = అపకీర్తిని చేయునదియు నగు, పైశ్లోకమునందలి క్లైబ్యము నకు విశేషణములు.

వ్య. ఆభగవంతుని వాక్యమునే యుదాహరించుచున్నాఁడు—శ్రీభగవాన్— ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశస శ్శ్రియః। వైరాగ్య స్యాథ మోక్షస్య షణ్ణాం భగ ఇతీఙ్గనా॥ ఇందు సమగ్రస్య అను నది ప్రత్యేకమునకు అన్వయించుచున్నది. మోక్షమనుటచే తత్సాధనమయిన జ్ఞానము చెప్పఁబడును. ఇఙ్గనా = సంజ్ఞ. ఇట్టి సమగ్రమయిన యైశ్వర్యమును ధర్మమును యశస్సును శ్రీయును వైరాగ్యమును జ్ఞానమును నిత్యముగా అడ్డిలేక యెవనియం దున్నవో అతఁడు భగవంతుఁడు. నిత్య యోగ మను నర్థమునందు మతుప్ప్రత్యయము. మఱియు, ఉత్పత్తించ వినాశంచ భూతానా మాగతిం గతిమ్ । వేత్తి విద్యా మవిద్యాంచ స వాచ్యో భగవా నితి॥ ఇందు భూతానామ్ అనునది ప్రత్యేకమునకును అన్వయించుచున్నది. ఉత్పత్తి వినాశశబ్దములు తత్కారణమునకుఁ గూడ ఉపలక్షకములు. ఆగతి గతు లనఁగా రాఁబోవునట్టి సంపదయును ఆపదయును, * ఇట్టి భగవచ్ఛబ్దార్థము శ్రీ వాసు దేవుని యందె యుండుట వలన నతఁడె భగవంతుం డని చెప్పఁబడును.

ఇదమ్—కృపయు వ్యామోహము కన్నీళ్ళు గాఱుట మొదలగువానితో స్వధర్మమునుండి విముఖుం డగుట. కశ్మలమ్ = శిష్టులచే నిందింపఁబడిన దగుటచే మలినము; విషమే = భయము గలిగినచోట, భయ నివృత్త్యర్థము యుద్ధము చేయ వలసినప్పుడు; త్వా = నిన్ను సర్వ క్షత్త్రియులలో నుత్తముఁ డైనవాని; కుతః = ఏ కారణమువలన; సముపస్థితమ్ = పొందినది? మోక్షమునందలి కోరికవలననా? స్వర్గమునందలి కోరికవలననా? కీర్తియందలి కోరికవలననా? అని కుతః అను శబ్దముచే నాక్షేపము చేయఁబడుచున్నది. మూఁడు హేతువులనుగూడ నిషేధించు చున్నాఁడు ఉత్తరార్ధమున మూఁడు విశేషణములచేత—అనార్యజుష్టమ్ = ముముక్షు వులచే సేవితము కానిది, స్వధర్మానుష్ఠానముచేఁ జిత్తశుద్ధిమూలముగా మోక్షముఁ గోరునట్టి అపక్వకషాయు లగు § ముముక్షువులు స్వధర్మము నెట్లు విడువవచ్చు నని యర్థము. ఇఁక సన్న్యాసమునం దధికారియగు పక్వకషాయుఁడు ¶ ముందు చెప్పఁ బడును. అస్వర్గ్యమ్—స్వర్గమును కలిగించునట్టిది, ధర్మమునకు విరోధియగుటవలన స్వర్గేచ్ఛచే సేవింపఁ దగినది కాదు. అకీర్తికరమ్= కీర్తియొక్క అభావమును జేయు

* భూతములకు ఉత్పత్తిని వినాశమును తత్కారణములను రాఁబోవునట్టి సంపదను ఆపదను జ్ఞానమును అజ్ఞానమును ఎవ్వం డెఱుంగునో అతండు భగవంతుఁ డని చెప్పఁదగును.

§ పక్వము—నశించినది కాని అంతఃకరణము దోషము గల వారలు.

¶ నశించిన యంతఃకరణ దోషము గలవాఁడు.

నది, లేక, అపకీర్తిని జేయునది, కీర్తియందలి యిచ్ఛచే సేవింపఁ దగినది కాదు. అట్లు మోక్షకాములును స్వర్గకాములును కీర్తికాములును విడువవలసినది. ఆమోక్షాదులను గోరువాఁడవే నీవు పొందుచున్నావు! కావున అయ్యో! నీకార్యము మిక్కిలి యనుచిత మని భావము.

శ్రీ. ఆవాక్యమునే చెప్పుచున్నాఁడు—కుతః = ఏకారణమువలన; త్వా = నిన్ను; విషమే = సంకటమునందు; ఇదం కశ్మలం సముపస్థితమ్ = ఈమోహము పొందినది? ఎందువలన ననఁగా—అనార్యజుష్టమ్ = ఆర్యులచే సేవింపఁబడనిది, అస్వర్గ్యమ్ = ధర్మ్యముకానిది. అకీర్తికరమ్ = అపకీర్తిని చేయునదియు.

ప. విషమే = యుద్ధసంకటమునందు; త్వా = నిన్ను; ఇదమ్, కశ్మలమ్ = అజ్ఞానము; కుతః = ఏకారణమువలన; సముపస్థితమ్ = పొందినది? ఇఁక నా యజ్ఞానముయొక్క స్వరూపముఁ జెప్పుచున్నాఁడు—అనార్యజుష్టమ్—అనార్య = ఆర్యులు కానివారు అనార్యులు వారిచే, జుష్టమ్ = సేవింపఁబడినది, ఆర్యులచే సేవింపఁబడినది కాదు, ఇట్టి యజ్ఞానము కశ్మల మని తెలిసి శిష్టులచే విడువఁబడిన దని యర్థము. ఎందువలన ననఁగా—ఈలోకము నందును బరలోకము నందును నిందింపఁబడినది. అది యెట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు—అకీర్తికరమ్ అస్వర్గ్యమ్.

క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప. 3

ఆ. మఱియు భగవంతుఁ డర్జునునకుఁ జెప్పుచున్నాఁడు—పార్థ = పృథాపుత్త్రుఁడా! క్లైబ్యమ్—క్లీబుఁ డనఁగా పుంస్త్వము లేనివాఁడు, అతనితనము క్లైబ్యమును, అధైర్యము ననుట; మాస్మగమః = పొందవలదు. త్వయి = నీయందు, మహేశ్వరునితోఁగూడ యుద్ధముచేసినవాఁడవు ప్రసిద్ధమయిన పౌరుషము గలవాఁడవు మహాప్రభావుఁడ వగు నీయందు; ఏతత్ = ఈ యధైర్యము; నోపపద్యతే = యుక్తము కాదు. పరన్తప = శత్రువులఁ దపింపఁజేయువాఁడా! క్షుద్రమ్ = అల్పమయిన, అల్పత్వమునకుఁ గారణమయిన; హృదయదౌర్బల్యమ్ = మనస్సుయొక్క బలహీనతను, అధైర్యమును; త్యక్త్వా = విడిచి; ఉత్తిష్ఠ = లెమ్ము, యుద్ధమున కారంభము సేయుము.

అర్జునా! అధైర్యము పొందకుము. ఇది వఱకు మహేశ్వరుఁడంతటి వానితోఁ గూడ యుద్ధముచేసి మహాబలపరాక్రముఁ డని ఖ్యాతిఁ గాంచిన వాఁడ వగు నీకిది తగదు. శత్రువులను భయపఱచువాఁడా! ఈ యధైర్యముచే నీ గౌరవము చెడును కావున దీని విడిచి లేచి యుద్ధము సేయు మని తాత్పర్యము.

శం. క్లైబ్యమ్=క్లీబత్వమును, పిఱికితనమును, శూరులకు యోగ్యము కాని దానిని; మాస్మగమః=పొందకుము. రాజధర్మముఁ దెలిసినవాఁడవు యుద్ధమునందుఁ బండితుఁడ వగు, త్వయి=నీయందు; ఏతత్ న ఉపపద్యతే, మహావీరులచేతఁ గూడఁ బొగడ్తనొందిన నీ కిది యుక్తముకా దని యర్థము. పరన్తప = శత్రువుల తపింపఁ జేయువాఁడా! క్షుద్రమ్ = క్షుద్రత్వమును కలిగించునట్టి, నీచతను కలిగించునట్టి; హృదయదౌర్బల్యమ్= అధైర్యమును, మనోవ్యామోహమును, దీని, త్యక్త్వా=విడిచి; ఉత్తిష్ఠ—యుద్ధమునకు సన్నద్ధుఁడ వగు మని యర్థము.

మ. ఓయి! బంధువుల సైన్యముఁ జూచుటచేఁ గలిగిన యధైర్యముచే ధనువును బట్టుటకుఁగూడ శక్తిలేకయుండు నేను ఏమిచేయఁ జాలుదు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—క్లైబ్యమ్ = క్లీబభావమును, బలము తేజస్సు మొదలగువానియొక్క భంగరూప మయిన అధైర్యమును; మాస్మగమః = పొందకుము. పార్థ = పృథకుమారుఁడా! పృథచే—కుంతిచే దేవతాప్రసాదంబునఁ బొందఁబడిన కుమారులు వీర్యాతిశయముగలవా రనుట ప్రసిద్ధము, కావున నీవు పృథాకుమారుఁడ వగుటచే నీ కీ క్లైబ్యము యోగ్యము కా దని యర్థము. అర్జునుఁడ వగుటచేతఁగూడ నీ కిది యోగ్యము కా దని చెప్పుచున్నాఁడు—త్వయి = నీయందు, సాక్షాన్మహేశ్వరుతోఁ గూడ యుద్ధముచేసి ప్రఖ్యాత మయిన మహాప్రభావము గలవాఁ డగు నర్జునుని యందు, ఏతత్—క్లైబ్యము; నోపపద్యతే = యుక్తము కాదు, అని యసాధారణముగా దానికి యోగ్యుఁడవు కాఁ డనుట చెప్పఁబడినది. ఓయి! “ నచ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవచ మే మనః ” అని నేను మున్నే చెప్పితి ననఁగాఁ జెప్పుచున్నాఁడు—హృదయదౌర్బల్యమ్ = మనోభ్రమణాదిరూప మయిన యధైర్యమును; క్షుద్రమ్ = క్షుద్రత్వమునకు కారణ మగుటవలన క్షుద్ర మయినదాని, లేక, సులభముగా పోఁగొట్టఁ దగినదానిని; త్యక్త్వా = వివేకముచేఁ బోఁగొట్టి; ఉత్తిష్ఠ = యుద్ధమునకు సన్నద్ధుఁడ వగుము. పరన్తప—శత్రువును తపింపఁజేయువాఁడ వని అట్లు హేతుగర్భముగా సంబోధించుచున్నాఁడు.

శ్రీ. పార్థ! క్లైబ్యమ్= పిఱికితనమును; మాస్మగమః= పొందకుము. ఎందువలన ననఁగా, త్వయి, ఏతత్, నోపపద్యతే= యోగ్యము కాదు. క్షుద్రమ్ = తుచ్ఛమయిన; హృదయదౌర్బల్యమ్ = పిఱికితనమును; త్యక్త్వా; యుద్ధమునకు; ఉత్తిష్ఠ = లెమ్ము. పరన్తప = శత్రువులఁ దపింపఁజేయువాఁడా!

ప. అందువలన నేమి చేయవలె ననఁగా భగవంతుఁడు చెప్పుచున్నాఁడు—పార్థ! నీవు; క్లైబ్యమ్ = పురుషార్థహీనతను, 'యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః' ఇత్యాదివాక్యముచేఁ జెప్పఁబడినదానిని; మాస్మగమః = పొందవలదు. ఎందువలన ననఁగా, ఏతత్ = ఇది; త్వయి = గాండీవమును ధరించిన నీయందు; నోపపద్యతే = యుక్తము కాదు. అట్లయిన నేమి చేయవలె ననఁగాఁ జెప్పుచున్నాఁడు—పరంతప = శత్రువులఁ దపింపజేయువాఁడా! క్షుద్రమ్ = అల్పమయిన, విచారింపమిచేఁ గలిగిన; హృదయదౌర్బల్యమ్—కల్పిత మయిన మమకారముచేఁ బుట్టిన శోకమును; త్యక్త్వా; యుద్ధమునకు, ఉత్తిష్ఠ.

రామానుజభాష్యము.—

అర్జునుం డిట్లు కూర్చుండఁగా, ఎందువలన అసమయమునం దీ శోకము వచ్చెను? అని యాక్షేపించి యపండితులచే సేవింపఁబడినదియుఁ బరలోకవిరోధియు అపకీర్తికరంబును అతితుచ్ఛంబును మనోదౌర్బల్యముచేఁ బుట్టినదియు నగు నట్టి యీవిషమసమయజాతం బయిన శోకమును విడిచి యుద్ధమునకు లెమ్మని శ్రీభగవంతుండు పలికెను. *

అర్జున ఉవాచ.

కథం భీష్మ మహం సఙ్ఖ్యే ద్రోణంచ మధుసూదన
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హౌ వరిసూదన. ౪

ఆ. ఇట్లు భగవంతునిచే బోధింపఁబడుచున్నను శోకపరవశ మయిన మనస్సుగలవాఁ డగుటంజేసి తెలియఁజాలనివాఁడై యర్జునుండు ప్రకృత మగు తన యభిప్రాయమునే భగవంతునితోఁ జెప్పెను—మధుసూదన = కృష్ణా! అహమ్ = నేను; పూజార్హౌ = పూజించుటకుఁ దగిన; భీష్మమ్—పితామహుని; ద్రోణంచ—ఆచార్యుని; సఙ్ఖ్యే = యుద్ధమునందు; కథమ్ = ఎట్లు; ఇషుభిః = బాణములచే; ప్రతి

* ఇది మూఁడు శ్లోకముల తాత్పర్యసంగ్రహము.

యోత్స్యామి = నొప్పింతును? ఎవరిని మాటమాత్రముననుగూడ నొప్పింతు నని చెప్పుట యనుచితమో అట్టివారిని ఎట్లు బాణములచే నొప్పింతు నని భావము. వారు పుష్పములచేఁ బూ౦చుటకుఁ దగినవారలు గదా! వారిమీఁద బాణముల నెట్లు ప్రయోగింతును? అరిసూదన = శత్రువుల వధించువాఁడా! సమస్తశత్రువులను మాత్రమే యత్నమున వధించినవాఁడు కావున భగవంతుఁ డిట్లు సంబోధింపఁ బడుచున్నాఁడు.

కృష్ణా! పితామహుండగు భీష్మునిమీఁదను ఆచార్యుండగు ద్రోణుని మీఁదను యుద్ధమున నేనెట్లు బాణములు ప్రయోగింతును? వారు పూలచేఁ బూజింపఁ దగిన వారలే, అట్టివారిని నేను బాణములు ప్రయోగించి యెట్లు నొప్పింపవచ్చును? నీవును శత్రువులను మాత్రమే వధించిన వాఁడవుగదా! చెప్పు మని తాత్పర్యము.

శ౦. ఈభగవంతుని వచనమును వినియును ఆచార్యుఁడు మొదలగు స్వజనుల హింసించుదోషముచేఁ గలిగిన దుఃఖమును సహింపఁజాలక యర్జునుండు తాను మున్ను చెప్పిన సంగతినే విశేషించి చెప్పుచున్నాఁడు—భీష్మమ్—కులవృద్ధుండును గుణములచే నధికుండు నగు భీష్ముని, ద్రోణంచ—విద్యాగురు వగు ద్రోణునిగూర్చి, సఙ్ఖ్యే= యుద్ధమునందు, ఇషుభిః = బాణములచేత, కథమ్ = ఎట్లు, ప్రతియోత్స్యామి = ప్రతిభటుండనై యుద్ధము చేయుదును? ఏమి వారలు మహాశూరు లని వారితో యుద్ధము చేయఁ జాలవా? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—పూజార్హౌ. అరిసూదన—భక్తులయొక్క కామాదు లగు అరులను పోఁగొట్టువాఁడా! భీష్మద్రోణులు గృహమునందుఁ దండ్రివలెఁ బుష్పాదులచేఁ బూజింపఁదగినవారు కాని మాటమాత్రమునఁ గూడ యుద్ధమునకు యోగ్యులు కారు. ఇఁక మర్మచ్ఛేదనము లయిన బాణములచే యుద్ధమునకు యోగ్యులు కా రని చెప్పవలెనా? బాణములచే వారి మర్మస్థానముల నెట్లు భేదింతు నని యర్థము.

మ. ‘అయ్యా! నే నిప్పుడు శోకమోహాదివశంబున స్వధర్మము విడువ లేదు. మ ఱేమనఁగా, ఈయుద్ధము ధర్మము కాకుండుటవలనను అధర్మ మగుటవలనను దీని నేను విడుచుచున్నాను’ అని, భగవదభిప్రాయము తెలియనివాఁ డగు నర్జునుని యభిప్రాయము నుదాహరించుచున్నాఁడు—‘అర్జున ఉవాచ’ అని. భీష్మమ్—పితామహుని, ద్రోణంచ—ఆచార్యుని, సఙ్ఖ్యే = యుద్ధమునందు, ఇషుభిః = బాణములచేత, కథంప్రతియోత్స్యామి = ఎట్లు ప్రహరింతును? ఎట్లును బ్రహరింపఁ

జాల నని యర్థము. ఎందువలన ననఁగా, వారు, పూజార్హౌ = పుష్పాదులచేఁ బూజింపఁ దగినవారు. పూజింపఁదగినవారితో ఆటలయందుఁగూడ మాటమాత్రమునఁగూడ సంతోషముకలిగించునట్టి వేడుకయుద్ధముగూడ ఉచితము కాదు. ఇఁక యుద్ధ భూమియందు బాణములతోఁ బ్రాణత్యాగము కలిగించునట్టి ప్రహరించుట యుచితము కా దని చెప్పవలెనా? అని యర్థము. మధుసూదన అరిసూదన అని రెండు మార్లుసంబోధనములు శోకవ్యాకులుఁ డగుటచేఁ పౌర్వాపర్యము * మఱచుటవలనఁ జేయఁబడినవి. కావున మధుసూదన అరిసూదన అనువాని యర్థమునకుఁ బునరుక్తి దోషము లేదు. ఎవరియందు యుద్ధమాత్రముగూడ ఉచితము కాదో వారివిషయమున వధము మొదలే యుచితము కా దని ప్రతియోత్స్యామి అనుటచే సూచింపఁబడినది. లేక; పూజార్హౌ కథం ప్రతియోత్స్యామి—పూజార్హు లయినవారిని ఎట్లు ప్రహరింతును? ఆపూజార్హులనే వివరించుచున్నాఁడు—భీష్మం ద్రోణంచ అని. “ద్వౌ బ్రాహ్మణౌ భోజయ దేవదత్తం యజ్ఞదత్తంచ” అనునట్లు అన్వయము. § ఇది భావము.—దుర్యోధనాదులు భీష్మద్రోణులను బురస్కరించుకొనియే యుద్ధమునకు సన్నద్ధు లగుదురు. అప్పుడు వారితో యుద్ధము పూజాదికమువలె శాస్త్ర విహితము కాకుండుటవలన ధర్మము కాదు. ఇఁక నిషిద్ధము కాకుండుటవలన అధర్మముగూడఁ గా దని చెప్పఁగూడదు. ఏల యనఁగా, ‘గురుం త్వఙ్కృత్య హుఙ్కృత్య’ ¶ ఇత్యాదిగా మాటమాత్రమున గురుద్రోహము చేయుటగూడ పాపము కలిగించు నని తెలిపి నిషేధింపఁబడియుండఁగా, ఇఁక వారితోఁగూడ యుద్ధము చేయుట అధర్మ మని నిషిద్ధ మని చెప్పవలసిన దేమి యున్నది?

శ్రీ॰ నేను బిఱికితనముచే యుద్ధమునుండి యుపరమించినవాఁడఁ గాను. మఱేమనఁగా యుద్ధము అన్యాయ్య మగుటవలన నుపరమించితి నని యర్జునుఁడు చెప్పుచున్నాఁడు—భీష్మద్రోణులు, పూజార్హౌ = పూజించుట యందుఁ దగినవారు. వారిలనుగూర్చి ఎట్లు నేను యుద్ధము సేయుదును? అందును, ఇషుభిః = బాణముల చేత. ఎవ్వరివిషయమున మాటమాత్రమునఁగూడ యుద్ధము చేసెద నని చెప్పుట తగదో, అట్టి వారిమెడ బాణములతో నెట్లు యుద్ధము చేయుదు నని యర్థము. అరిసూదన = ఓశత్రువుల వధించువాఁడా!

---

* ముందువెనుకలు.

§ ఇద్దఱు బ్రాహ్మణులను భుజింపఁజేయుము, దేవదత్తుని యజ్ఞదత్తుని.

¶ గురువును నీవని ఏకవచనముగాఁ బలికి ధిక్కరించి.

ప. ఇఁక భ్రాతృపుత్త్రాదివధము కలుగు నను శంక యుండనీ. వేదనిందితమయిన బ్రాహ్మణవధము కలుగునే, దాని కేమి గతి? అను నభిప్రాయముతో అర్జునుఁడు చెప్పుచున్నాఁడు—మధుసూదన—దైత్యులను మాత్రము వధించుటయందు యోగ్యుం డైనవాఁడా! సంఖ్యే = యుద్ధమునందు; భీష్మం ద్రోణంచ, ఇషుభిః = బాణములచేత; కథమ్, ప్రతియోత్స్యామి = ప్రతిపక్షుఁడనై యెట్లు యుద్ధము చేయుదును? ఎందువలన ననఁగా వారు, పూజార్హౌ—ఆచార్యులగుటచేఁ బూజింపఁ దగిన వారు, బ్రాహ్మణులు మాత్రమే కారు.

ఈ యర్థమునందు శతపథశ్రుతియును గలదు « తస్మా ద్యద్యపి రాజా పరమతాం గచ్ఛతి, బ్రహ్మైవాన్తత ఉపనిశ్రయతి, స్వాం యోనిం య ఉ హినస్తి, స్వాం స యోని మృచ్ఛతి, స పాపీయాన్భవతి, యథా శ్రేయాం సం హింసిత్వా'' భాష్యము—తస్మాత్ యద్యపి రాజా—పూర్వశ్రుతియందు 'క్షత్త్ర ఏవ తద్యశో దధాతీత్యాదిగా చెప్పఁబడుటవలన రాజు క్షత్త్రియుఁడే యయినను, పరమతామ్—రాజసూయాది యాగములచేత ఉత్కృష్టతను, గచ్ఛతి = పొందుచున్నాఁడు. అట్లు స్వధర్మము నాచరించుటచేత, అన్తతః = తుదియందు, బ్రహ్మైవ = బ్రాహ్మణత్వమునే, ఉపనిశ్రయతి = ఆశ్రయించుచున్నాఁడు, పొందుచున్నాఁడు. ఇట్లుండఁగా, ఉ అని తలఁచి * యః = ఏక్షత్త్రియుఁడు, స్వామ్ = తనదైన, యోనిమ్ = పొందవలసినస్థానమగు ఈ బ్రాహ్మణుని, హినస్తి = చంపునో, సః = అతఁడు, స్వాం యోనిమ్ = తనతండ్రిని, హినస్తి = చంపినవాఁ డగుచున్నాఁడు. కావుననే, సః పాపీయాన్ భవతి = అతఁడు అధికపాపము గలవాఁ డగుచున్నాఁడు. ఎట్లనఁగా.—యథా = ఎట్లు, శ్రేయాంసమ్ = మహానుభావుని, హింసిత్వా = చంపి. §

మఱియుఁ దైత్తిరీయకశ్రుతియును గలదు—« యావతీ ర్వై దేవతా స్తాస్సర్వా వేదవిది బ్రాహ్మణే వసన్తి తస్మా ద్బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివే దివే నమస్కుర్యా న్నాశ్లీలం కీర్తయేత్ '' భాష్యము—ఎందఱు దేవతలు గలరో వారలందఱు వేదవేత్త యగు బ్రాహ్మణునియందు వసించుచున్నారు. అందువలన వేదవేత్తలగు బ్రాహ్మణులకు, దివేదివే = ప్రతిదినసమును, నమస్కుర్యాత్ = నమస్కరింపవలెను. మఱి, ఎప్పుడును, అశ్లీలం న కీర్తయేత్ = విరుద్ధవచనమును గీర్తింప

* తిరస్కారబుద్ధితో ననుట.

§ మహానుభావుని జంపినవానివలె పాతకి యగు నని యర్థము.

రాదు, మర్యాద తప్పి మాటలాడ రాదు. ఇట్లుండఁగా భీష్మద్రోణాదుల నెట్లు వధింపవచ్చు నని భావము.

గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే
హత్వార్థకామాంస్తు గురూ నిహైవ
భుఞ్జీయ భోగా న్రుధిరప్రదిగ్ధాన్. ౫

టీ. రాజులకు యుద్ధము ధర్మ మయినను, గుర్వాదుల వధించుటయందు జీవికమాత్రమే ఫల మని గ్రహించి పాపము నారోపించి చెప్పుచున్నాఁడు—మహాను భావాన్=గొప్పమహిమగల, వేదశాస్త్రసంపన్నులగు; గురూన్=భీష్మద్రోణాదులను, దుర్యోధనాదులనుగూడ; అహత్వా = వధింపక; ఇహలోకే = వ్యవహారమునకుఁ జోటయిన యీలోకమునందు; భైక్ష్యమ్ అపి = భిక్షలసమూహమునైనను, రాజులు మొదలగువారికి భిక్షాశనము నిషిద్ధ మయినను; భోక్తుమ్=భుజించుట; శ్రేయః హి= మేలు గదా! గుర్వాదుల హింసించుటచే రాజ్యభోగము నపేక్షించుట యుచితము కాదు గదా! మఱియు, గురూన్= భీష్మద్రోణాదులను; హత్వాతు = వధించియో; రుధిరప్రదిగ్ధాన్=నెత్తుటం దడుపఁబడినవి, అట్లు మిక్కిలి గర్హితములగు; అర్థకామాన్ = అర్థములు కామములు అను; భోగాన్= భోగింపఁబడునట్టి విషయములను; ఇహైవ= ఈలోకమునందుమాత్రమే, స్వర్గమునందు లే దనుట; భుఞ్జీయ = భుజింతును, కాని మోక్షమనుభవింపను. కావున గురువధాదులచేఁ గలుగు భోగములను విడిచి భిక్షాశనమే యుక్త మని యర్థము.

మహానుభావు లగు భీష్మద్రోణులు మొదలగు గురువులను వధింపక క్షత్రి యులకు నిషిద్ధ మయినను భిక్షాశనము చేసి యీలోకమున జీవించుట మేలు. ఈ గురువుల వధించిననో వారి నెత్తురు తగిలినవాని యట్లు మిక్కిలి రోఁతపడఁ దగిన యీ యర్థకామరూపభోగములను ఈ లోకమునందుమాత్ర మనుభవింపవచ్చును గాని ధర్మముగాని మోక్షముగాని లభింపదు, మఱియు నీలోకము దాఁటిన పిదప శాశ్వతముగా నరకవాసము సంభవించు నని తాత్పర్యము.

శం. క్షత్రియులకు యుద్ధము శ్రేయస్కరము, దాని నెట్లు విడువవచ్చు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—మహానుభావాన్—మహత్ = అష్టలేని, అనుభావాన్= ధర్మమునుగుఱించియు బ్రహ్మమునుగుఱించియు జ్ఞానముగలవారలగు; గురూన్=భీష్మ

ద్రోణకృపాదులను; అహత్వా = చంపక; ఇహలోకే; భైక్ష్యమ్ = బిచ్చమెత్తుటచే గలుగు అన్నము; శ్రేయః-యుద్ధమువలె శ్రేయస్కర మగును. అదియే, భోక్తుమ్= భుజించుట, యుక్తము. గురువులు మొదలగు స్వజనుల హింస లేని భిక్షాశనము మాకు శ్రేయస్కర మని యర్థము. ‹ అకృత్వా పరసంతాప మగత్వా ఖలమన్దిరమ్। అక్లేశయిత్వా చాత్మానం యదల్ప మపి తద్బహు, * ఇత్యాది శాస్త్రప్రసిద్ధిని హి అనునది తెలుపును. ఏమి దిక్కులేనివాని యట్లు భిక్షాశనమా శూరులు చేయ వలెను ? శత్రువుల జయించి రాజ్యభోగము కదా చేయవలె ననఁగాఁ జెప్పు చున్నాఁడు-కముధాతువు జ్ఞానార్థకము, అర్థకామాన్-అర్థ = ధర్మాదిపురుషార్థ ములను, కామాన్ = శిష్యులకు బోధించువార లగు, ధర్మము నుపదేశించువార లగు; గురూన్, హత్వా, నేను, ఇహైవ = ఈలోకమునందే; రుధిరప్రదిగ్ధాన్ = నెత్తురుచేఁ దడుపఁబడిన, రక్తమయము లగు; భోగాన్ = విషయములను, నరకము నిచ్చువానిని; భుఞ్జీయ = అనుభవింపవలెను. ఈభోగములు మరణానంతరము నర కము కలిగించు ననుట మాత్రమే కాదు, మ ఱేమనఁగా గురువులు మొదలగువారి వధించుటచే రోఁత పడునట్టి నరకభోగ మీలోకముననే కలుగును. కావున గుర్వా దుల హింస చేయక లభించునట్టి భిక్షాశనము శ్రేయస్కర మని తలఁచుచున్నా నని యర్థము.

వ. ఓయి ! భీష్మద్రోణులు గురువు లగుటచేతనే గదా పూజార్హులు, ఇట్లే ఇతరులు కృపాదులుగూడ, ఇప్పు డేమో వారలను గురువులుగా గౌరవించుట యుచితము గాదు. ఏల యనఁగా ‹ గురో ర ప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః। ఉత్పథం ప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే ’ § అని స్మృతి గలదు. అందువలన యుద్ధగర్వముచే గర్వించినవారలును అన్యాయముగా రాజ్యము నపహరించుటచేతను శిష్యద్రోహముచేతను కార్యాకార్యవివేకము లేనివారును అధర్మమార్గమున నున్న వారు నగు వీరి వధించుటయే మేలు అని యాశంకించి చెప్పుచున్నాఁడు-గురూన్ అహత్వా = గురువులను చంపక, పరలోకమేమో యుండనేయున్నది. ఈలోకము నందో, మాకు రాజులు మొదలగువారికి నిషిద్ధ మయిన, భైక్ష్యముగూడ, భోక్తుం,

---

* ఇతరులకు సంతాపము చేయక నీచునిగృహమునకుఁ బోనక తన్ను శ్రమపెట్టుకొనక కొంచె మైనను యేది లభించునో అది యధికము.

§ గర్వించినవాఁడును కార్యాకార్యము తెలియనివాఁడును అధర్మమార్గము నవలంబించిన వాఁడును అగునెడ గురువునుగూడ విడుచుట విధింపఁబడుచున్నది.

శ్రేయః = మిక్కిలి ప్రశంసనీయము ఉచితము, కాని, వారిని వధించుటచే రాజ్యము గూడ ఉచితము గాదు, అని యుద్ధము ధర్మమయినను దానియందు జీవికమాత్రమే ఫలముగా గ్రహించి పాపము నారోపించి చెప్పుచున్నాఁడు. ఓయీ! అవలిప్తత్వము మొదలగువానిచే వారలు గురువులుకా రని చెప్పఁబడినది యని యాశంకించి చెప్పుచున్నాఁడు—మహానుభావాన్ = గొప్ప యను భావము—శాస్త్రము అధ్యయనము తపస్సు ఆచారము మొదలగువానిచేఁ గలిగిన ప్రభావము గలవారలను, అట్లు మృత్యువు కామము మొదలగు వానినిగూడ వశీకరించినట్టి పుణ్యాతిశయసంపన్నుల యెడ అవలిప్తత్వాను లగు అల్పదోషముల కవకాశము లే దని యర్థము. లేక. హిమమహానుభావాన్ అని ఏకపదము. హిమమ్ = జాడ్యమును, హన్తి = పోఁగొట్టుచున్నాఁ డని హిమమహా అనఁగా సూర్యుఁడు లేక అగ్ని చెప్పఁబడును. వాని యొక్క అనుభావమువంటి యనుభావము సామర్థ్యము గలవారలను, అట్లు మిక్కిలి తేజస్సు గలవార లగుటచే వారికి అవలిప్తత్వాది దోషము కలుగనే కలుగదు. "ధర్మవ్యతిక్రమో దృష్ట ఈశ్వరాణాంచ సాహసమ్। తేజీయసాం న దోషాయ వహ్నే స్సర్వభుజో యథా" * అని చెప్పఁబడినది. ఓయీ! ఎప్పుడు వీ రర్థమున కాశపడినవారై యుద్ధమునందుఁ బ్రవర్తించిరో అప్పుడు ఆత్మవిక్రయము చేసినట్టి వీరికి మున్ను చెప్పఁబడిన మాహాత్మ్య మెక్కడిది? అట్లు భీష్మునిచే యుధిష్ఠిరునితో "అర్థస్యపురుషో దాసో దాసస్త్వర్థో నకస్యచిత్। ఇతి సత్యం మహారాజ బద్ధోస్మ్యర్థేన కౌరవైః" § అని చెప్పఁబడినది అని యాశంకించి చెప్పుచున్నాఁడు—అర్థకామాన్—అర్థమున కాశపడినవారైనను, వారు నాకన్న గురువులే యగుదురని మరల గురుశబ్దముఁ బ్రయోగించుటచేఁ జెప్పఁబడినది. తుశబ్దము అప్యర్థకము, ఇట్టి గురువులనుగూడ, హత్వా; భోగాన్ = విషయములనే, భుఞ్జీయ=అనుభవింతును కాని మోక్షమునొందను. ఆభోగములును, ఇహైవ = ఈలోకమునందే, పరలోకమునందు లేవు. ఈలోకమునందుఁగూడ, రుధిరప్రదిగ్ధాన్ = నెత్తుటిచేఁ బూయఁబడిన వానిని, అపకీర్తిచే పూరితము లయి యుండుటవలన మిక్కిలి రోఁతపడఁ దగినవాని

---

* మహానుభావులకు ధర్మాతిక్రమణమును సాహసంబును—ఆలోచింపక దోషము గలిగించు కార్యముఁ జేయుటయు చూడఁబడినది. గొప్పతేజస్సు గలవారికి అది సమస్తమును భుజించు అగ్నికి వలె దోషావహము గాదు.

§ అర్థమునకుఁ బురుషుఁడు దాసుఁడు, అర్థముమాత్ర మెవ్వనికిని దాసుఁడు కాదు. కావున మహారాజా! నేను సత్యముగా కౌరవులచే నర్థమున బద్ధుఁడ నైతిని.

నని యర్థము. ఎప్పుడు ఈలోకమునందును ఇట్లగునో అప్పుడు పరలోకదుఃఖం బెంత యని వర్ణింపవచ్చు నని భావము. లేక, గురూన్ హత్వా = గురువులను వధించి, అర్థకామాన్ = అర్థము కామము అను, భోగాన్ = భోగములనే, భుఞ్జీయ = అనుభవింతును కాని ధర్మమును మోక్షమును అనుభవింపను. అని మఱియొక వ్యాఖ్యానము. దీనియందు అర్థకామపదము భోగవిశేషణముగాఁ దెలియవలెను.

శ్రీ. అట్లయినయెడ నీకు దేహయాత్రగూడ సిద్ధింప దనఁగాఁ జెప్పుచున్నాఁడు—గురూన్ = ద్రోణాదులను, అహత్వా—పరలోకవిరుద్ధము గురువధము, దానిఁ జేయక, ఇహలోకే, భైక్ష్యమపి = భిక్షాన్నమునుగూడ, భోక్తుమ్ = భుజించుట; శ్రేయః = ఉచితము. గురువుల వధించు పక్షమునందో, పరలోకమున మాత్రమే కాదు దుఃఖము, ఈలోకమునందే నరకదుఃఖ మనుభవింతు నని చెప్పుచున్నాఁడు—గురూన్ హత్వా, ఇహైవతు = ఈలోకమునందే, రుధిరప్రదిగ్ధాన్ = నెత్తురుచే మిక్కిలి పూయఁబడిన, అర్థకామాన్ భోగాన్ = అర్థకామాత్మక భోగములను, నేను, భుఞ్జీయ = భుజింతును. లేక. అర్థకామాన్ అనునది గురువులకు విశేషణము, అర్థమునందలి లోభముచేఁ బరవశు లగుటవలన వీర లేమో యుద్ధము నుండి నివర్తిల్లరు కావున వీరిని వధించుట ప్రసక్తింపక తప్ప దని యర్థము. అట్లు 'అర్థస్య పురుషో దాసో దాసస్త్వర్థో నకస్యచిత్ । ఇతి సత్యం మహారాజ బద్ధోస్మ్యర్థే నకౌరవైః' అని భీష్మునిచే యుధిష్ఠిరునకుఁ జెప్పఁబడినది.

ప. చెప్పఁబడిన దాని విమర్శించి చెప్పుచున్నాఁడు—మహానుభావాన్, గురూన్ = ద్రోణాదులను, అహత్వా—లోకమునకును శాస్త్రమునకును విరుద్ధమయిన గురువధమును జేయక, ఇహలోకే, భైక్ష్యమ్ = భిక్షచేఁ బ్రాప్త మయిన యన్నమును; భోక్తుమ్, శ్రేయః = ఉచితము. అటుగాక, గురూన్‌హత్వా = గురువులను వధించి, రుధిరప్రదిగ్ధాన్ = వారి నెత్తుటిచేఁ బూయఁబడిన; అర్థకామాన్ భోగాన్ = అర్థకామాత్మకము లయిన భోగములను, ఇహైవ = ఈలోకమునందే, కథంభుఞ్జీయ—గురువుల వధించితినే యను శంకచే దూషితుఁడనై యెట్లు భుజింతును? ఇఁకఁ బరలోకకథ మొదలే లేదని యర్థము.

శ్రుతియును ఆపస్తమ్బసంహితయందు 'తస్మా ద్బ్రాహ్మణాయ నావగురేత న నిహన్యా న్న లోహితంకుర్యా దేతావ తా హ్యేనసా భవతి. భాష్యము—తస్మాత్ = అందువలన, బ్రాహ్మణాయ—ద్వితీయార్థమునచతుర్థి, బ్రాహ్మణుని, అవగురేత=కోపము

చేత ఉమియఁగూడదు. అట్లు, నవిహన్యాత్ = చేతులు కాళ్ళు మొదలగు వానితోఁ గొట్టఁగూడదు. అట్లు, లోహితమ్ = ఆయుధము మొదలగువానిచే నెత్తుటఁ దడిసినవానిఁగా, నకుర్యాత్ = చేయఁగూడదు. హి = ఎందువలన ననఁగా, ఏతావతా = ఇంతమాత్రము దుష్కార్యముచేత, ఏనసాభవతి = పాతకముతోఁ గూడినవాఁ డగుచున్నాఁడు.

ఉ. రెండియు నర్జునుండు స్నేహముచేతను గారుణ్యముచేతను ధర్మాధర్మభయముచేతను గలఁతఁబొందినవాఁ డగుటవలన భగవంతుఁడు చెప్పినది పరమహితమని తెలియనివాఁడై, యీవచనముఁ బలికెను—భీష్మద్రోణులు మొదలగు గురువులను బూజింపఁదగినవారిని ఎట్లు నేను వధింతును? మఱియు భోగములయందు మిక్కిలి యాసక్తు లయిన ఆగురువుల వధించి వారిచే భుజింపఁబడుచున్న యాభోగములనే వారి నెత్తుటితోఁగలిపి యీ యాసనములందుఁ గూర్చుండి యెట్లు భుజింతును?

న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః
యానేవ హత్వా న జిజీవిషామ
స్తే ఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. ౬

ఆ. క్షత్త్రియులకు స్వధర్మ మగుటవలన యుద్ధమే శ్రేయస్కర మగునని యాశంకించి చెప్పుచున్నాఁడు—భైక్ష్య యుద్ధములలో, కతరత్ = ఏది; నః = మాకు; గరీయః = శ్రేష్ఠము? ఏతచ్చ = దీనినిగూడ; నవిద్మః = ఎఱుంగము. హింసాశూన్య మగుటచే భిక్షాశన ముత్తమమో స్వధర్మ మగుటచే యుద్ధమే యుత్తమమో, నాకు నిశ్చయింప శక్యము గాకున్న దని యర్థము. యుద్ధమునందును, యద్వాజయేమ = మేమే జయింతుమో, యదివా = లేక, నః = మమ్ము; జయేయుః = దుర్యోధనాదులు జయింతురో; ఏతచ్చ నవిద్మః = దీనినిగూడ ఎఱుంగము, యుద్ధము చేసినను మేమును జయింపవచ్చును, వారును మమ్ము జయింపవచ్చును, లేక, రెండు పక్షములును సమములు గావచ్చును, కావున మాకే జయము కలుగు నను నిశ్చయము లే దని యర్థము. ఇఁక మాకు జయము కలిగినను వ్యర్థమే యగును, ఏల యనఁగా—యాన్ = ఏబంధువులను; హత్వా = వధించి; నజిజీవిషామః = బ్రతుకనిచ్ఛింపమో, తే = అట్టి; ధార్తరాష్ట్రాఏవ = దుర్యోధనాదులే; ప్రముఖే = ఎదుటను;

అవస్థితాః = యుద్ధమునకై నిలిచి యున్నారు. కావున భిక్షాశనముకంటె యుద్ధము శ్రేష్ఠము కా దని యర్థము.

భిక్షాశనము యుద్ధము ఈరెంటిలో నేది యుత్తమమో నిశ్చయింప శక్యము గాదు. అయినను యుద్ధముచేసినను జయము మాకే కలుగునో వారికే కలుగునో అదియు నిశ్చయింపరాదు గదా! ఒకవేళ మాకే జయము కలుగు నన్నను, ఎవరు హతులైనచో మేము బ్రతుకునందలి యిచ్ఛనుగూడ విడుచునంతటి పరమదుఃఖముఁ బొందుదుమో అట్టి మాపరమబంధువులగు దుర్యోధనాదులను వధించి గదా జయము పొందవలెను. అట్టి జయముచే మాకేమి సుఖము కలుగును? కావున భిక్షాశనముకన్నను యుద్ధము మేలుకా దని తాత్పర్యము.

శం. "యే యుధ్యన్తే ప్రధనేషు శూరాసో యే తనూత్యజః" * అను శ్రుతివలన క్షత్త్రియులకు శ్రేయస్కరము యుద్ధమే కాని భిక్షాశనము కా దనఁగాఁ జెప్పుచున్నాఁడు—భిక్షాశనయుద్ధముల రెంటిలో, నః = ధర్మపరులగు మాకు; గరీయః = ఉత్తమము; కతరత్ = ఏది? గురుహింస అపకీర్తి మొదలగు దోషములు లేని దగుటవలన భిక్షాశనమే యుత్తమమా? స్వధర్మ మగుటవలన యుద్ధమే యుత్తమమా? లేక, రెండును సమములా? చ కారము తు అనుదాని యర్థము గలది. ఏతచ్చ = దీనినో; నవిద్మః = ఎఱుంగము. జయము గలిగినయెడ రాజ్యసుఖము సిద్ధించును, అపజయ మైనచో స్వర్గము లభించును, మఱియు స్వధర్మము, కావున యుద్ధము విషయమయి సంశయింపవలసినది లే దనునెడ, అట్లయినను, మాకు జయము కలిగినను దానిచే దుఃఖమే కలుగుంగాని సుఖము కొంచెమైనను కలుగ దని చెప్పుచున్నాఁడు—ప్రాణములకన్నను ప్రియు లయిన, యాన్ = ఏతోఁబుట్టువులు కొడుకులు మొదలయిన వారిని; హత్వా = యుద్ధమునందు వధించి; న జిజీవిషామః = బ్రతుకఁజాలమో; తే = అట్టి, ధార్తరాష్ట్రాః ఏవ = దుర్యోధనాదులే; ప్రముఖే = యుద్ధమున కెదుట; అవస్థితాః = చచ్చెద మని నిలుచున్నారు. కావున అనర్థకారణమయిన యుద్ధముకంటె భిక్షాశనమే మాకు శ్రేయస్కర మని యర్థము.

**మ.** ఓయి! క్షత్త్రియునకు భిక్షాశనము నిషిద్ధము, యుద్ధము విహితము, కావున స్వధర్మ మగుటచే యుద్ధమే నీకు శ్రేయస్కర మని భగవద్వచనము నాశంకించి చెప్పుచున్నాఁడు—భైక్ష్యయుద్ధముల నడుమ, కతరత్ = ఏది; నః = మాకు;

* ఎవ్వరు యుద్ధముచేయుదురో యుద్ధములందు శూరులై యెవ్వరు దేహము విడుతురో.

గరీయః = శ్రేష్ఠము? హింసాశూన్య మగుటవలన భైక్ష్యమా? స్వధర్మ మగుట వలన యుద్ధమా? ఏతచ్చ నవిద్మః = దీనినిగూడ నెఱుంగము. యుద్ధము చేసినను, యద్వా జయేమ = మేమే జయింతుమో; యదివానః జయేయుః = దుర్యోధనాదులే మమ్ము జయింతురో, దీనినిగూడ నెఱుంగము. ఇట్టు, రెండుపక్షములవారమును సమానులమే యగుదుమో యనుటయు గ్రహింపవలెను. ఇదిగాక, జయము కలిగినను మాకది, ఫలముం జూడఁగా, పరాజయమువంటిదే యగును. ఏల యనఁగా, యాన్హత్వా = ఏబంధువులను వధించి; నజిజీవిషామః = బ్రతుకుటకుఁగూడ మేము అపేక్షింపమో, ఇఁక భోగముల ననుభవించుట కేమి చెప్పవలెను? తఏవ = వారే; ధార్తరాష్ట్రాః = ధృతరాష్ట్రసంబంధు లయిన భీష్మద్రోణాదులు, అందఱును, యుద్ధమునకై సమ్ముఖమున నిలిచియున్నారు. కావున భిక్షాశనముకన్నను యుద్ధము శ్రేష్ఠ మనుట సిద్ధము కా దని యర్థము.

ఇట్లు ఇదివఱకుఁ గల గ్రంథముచే సంసారదోషము నిరూపించుటవలన అధికారివిశేషణములు చెప్పఁబడినవి. అందు 'నచ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే' అనుచోట, యుద్ధమునందు హతుఁ డగువాఁడు సన్న్యాసి పొందు లోకము నొందు నని చెప్పుటవలన, 'అన్యచ్ఛ్రేయో ఽన్యదుతైవ ప్రేయః'* ఇత్యాదిశ్రుతిప్రసిద్ధ మయిన మోక్షాఖ్య మగు శ్రేయస్సు ఉపన్యసింపఁబడినది. మఱియు నందువలన నామోక్షముదక్కఁ దక్కినది యశ్రేయస్సని నిత్యానిత్యవస్తువివేకము తెలుపఁబడినది. 'నకాఙ్క్షే విజయం కృష్ణ' అనుచో నిహలోకఫలవిరాగమును, 'అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః' అనుచో పరలోకఫలవిరాగమును, 'నరకే నియతం వాసః' అనుచో స్థూలదేహాతిరిక్తుఁ డయిన ఆత్మయు, 'కిం నో రాజ్యేన, అనుచో మేము వ్యాఖ్యానము చేసిన విధంబున శమమును, 'కిం భోగైః' అనుచో దమమును, 'యద్యప్యేతే నపశ్యన్తి' అనుచోట లోభరాహిత్యమును, 'తన్మే క్షేమతరంభవేత్' అనుస్థలమునఁ దితిక్షయుఁ జెప్పఁబడినవి. ఇట్లు ప్రథమాధ్యాయమున సన్న్యాససాధనము సూచింపఁబడినది. ఇఁక నీయధ్యాయమునందు 'శ్రేయో భోక్తుం భైక్ష్యమపి' అనుచోట భిక్షాచరణోపలక్షిత మయిన సన్న్యాసము ప్రతిపాదింపఁబడినది. ఇప్పుడు గురూపసదనము చెప్పఁబడుచున్నది. ఎందు కనఁగా—సంసారమునందలి దోషము లన్నియుఁ దెలిసి నిర్విణ్ణుఁడై యథావిధిగా గురువు నాశ్రయించినవానికే విద్యాగ్రహణమునం దధికారము.

* నిశ్శ్రేయసము వేఱుగా నున్నది. మఱియు బ్రియతర మగు నభ్యుదయముగూడ వేఱుగా నున్నది.

శ్రీ. మఱియు అధర్మమునే యంగీకరించెదము గాక. అట్లయినను, మాకు జయము కలుగునా? పరాజయము కలుగునా? అను నది తెలియరాదని చెప్పుచున్నాఁడు—ఈ రెంటిలో, నః = మాకు, కతరత్ = ఏది, గరీయః = మిక్కిలి యధికము అగును? అను నది, నవిద్మః = ఎఱుంగము. ఆ రెంటినే చెప్పుచున్నాఁడు—యద్వాజయేమ = వీరిని మేమే జయింతుమో, యదివా = లేక, నః = మమ్ము, జయేయుః= వీరే జయింతురో. మఱియు, మాకు జయము కలిగినను అది ఫలమందుఁ బరాజయమువంటిదే యగు నని చెప్పుచున్నాఁడు—యానేవ హత్వా, నజిజీవిషామః = బ్రతుకుట కిచ్ఛింపమో, తే ఏవ ధార్తరాష్ట్రాః= అట్టి ధార్తరాష్ట్రులే, ప్రముఖే అవస్థితాః.

ప. ఇఁక వారలయెడ మాకు జయము కలిగినను బరాజయము కలిగినను మరణమే శేషించు నని చెప్పుచున్నాఁడు—జయపరాజయములన్యవస్థయేమో దైవాధీనము, అట్లయినను, యద్వా వయం జయేమ = మేమే జయింతుమో, యదివా, నః = మమ్ము, జయేయుః= వారు జయింతురో, ఈపక్షములలో, కతరత్ గరీయః = ఏది శ్రేష్ఠము? దానిని, నవిద్మః = ఎఱుంగము. ఎట్లు మాకుఁ బరాజయము కలిగినయెడ మరణమే శేషించును గాని పలాయనము కా దని నిశ్చితమో అట్లు మాకుఁ జయము కల్గుపక్షమునను. ఆచార్యులు బంధువులు మొదలగు వారలందఱును హతులగుటవలనఁ బిమ్మట మే మెందుకుఁగా జీవింపవలెను? లోకమువలనను శాస్త్రము వలనను నిందకు భయపడి చావవలసినదే యని చెప్పుచున్నాఁడు—యాన్ హత్వా, మేము, నజిజీవిషామః = బ్రతుకుటకు ఇచ్ఛింపమో, తే ధార్తరాష్ట్రాః, ప్రముఖే= యుద్ధముముందటఁ నిలిచి యున్నారు.

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వా ధర్మసమ్మూఢచేతాః
య చ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి త న్మే
శిష్య స్తే ఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. ౭

ఆ. సంసారమునందలి దోషసమూహములం దెలిసి మిక్కిలి నిర్విణ్ణుఁడై మోక్షేచ్ఛ నొంది గురువును శరణు చొచ్చువానికే ఆత్మోపదేశము గ్రహించుటయందధికారం బని సూచించుచున్నాఁడు—కార్పణ్యదోష ఉపహతస్వభావః—కార్పణ్యా-

ఎవ్వఁడు స్వల్పమయిన ధననాశమునుగూడ సహింపఁడో అతఁడు కృపణుఁడు, ఆత్మను దెలియనివా రందఱును బరమపురుషార్థమును బొందనివార లగుటవలన నట్టివారే యగుటచేఁ గృపణులగుచున్నారు. 'యోవా ఏత దక్షరం గార్గ్యవిదిత్వాస్మాల్లోకా త్ప్రైతి సకృపణః' * అని శ్రుతి వచించుచున్నది, ఆకృపణునిభావము కార్పణ్యము, దైన్యము, అది అను, దోష= దోషముచేత, ఉపహత= దూషితమయిన, చెఱుపఁబడిన; స్వభావః = మనస్సుగలవాఁడ నగు; అహమ్ = నేను; ధర్మసమ్మూఢచేతాః—ధర్మ—ధరించునది కావున ధర్మ మనఁగా బ్రహ్మము, అట్టి బ్రహ్మమునందు, సమ్మూఢ = మోహమునొందిన, వివేకహీనతను బొందిన, చేతాః = బుద్ధిగలవాఁడనై; త్వా = నిన్ను; పృచ్ఛామి = అడుగుచున్నాను. ఏమి యడిగెద వనఁగా—యత్ = ఏది; నిశ్చితమ్ = ఐకాంతికమును § అనాపేక్షికమును ¶ నగు; శ్రేయః = మేలు, స్యాత్ = అగునో, రోగనివృత్తివలె అనైకాంతికమును $ అనాత్యంతికమును ‖ కాదు. మఱియు స్వర్గమువలె ఆపేక్షికమును ♦ గాదు. తత్ = అట్టి నిశ్శ్రేయసమును; మే = నాకు; బ్రూహి = చెప్పుము. 'నాపుత్త్రాయాశిష్యాయ' ‡ అని నిషేధముండుటవలనఁ జెప్పఁగూడ దని తలంపవల దని చెప్పుచున్నాఁడు—అహమ్= నేను; తే= నీయొక్క; శిష్యః = శిష్యుఁడను. త్వామ్ = నిన్ను; ప్రపన్నః=శరణుచొచ్చిన; మామ్= నన్ను; శాధి = శిక్షింపుము, ఆ నిశ్శ్రేయసము నుపదేశింపుము.

నేను కార్పణ్యదోషముచే మనస్సు చెడుటవలన బ్రహ్మస్వరూప మయిన ధర్మము విషయమున వివేకములేనివాఁడనై నిన్ను అడుగుచున్నాను. ఏది సాధనము సంపాదించిన పిదప నవశ్యము సిద్ధించునో సిద్ధించిన పిదప మరల నశింపదో మఱియు దేనికంటె నధికమైనది లేదో అట్టి నిశ్శ్రేయసమును నాకుఁ జెప్పుము. పుత్త్రుఁడును శిష్యుఁడును గానివాని కెట్లుపదేశింపవచ్చు నని తలంపవలదు, నేను నీ

* గార్గీ! ఎవ్వఁడేని ఈ యక్షరమును దెలిసికొనక యీ లోకమునుండి పోవునో అతఁడు కృపణుఁడు.

§ సాధనానంతరము దప్పక కలుగునది.

¶ తనకన్నను ఎక్కువ లేనిదియు.

$ ఔషధసేవచేసినను ఒకానొకప్పుడు కలుగకుండునది.

‖ సిద్ధించినను మరల నశించునది, మరల రోగము పుట్టుటచే నశించునది.

♦ తనకన్న అధికమయిన శ్రేయస్సు గలది.

‡ పుత్త్రుఁడు కానివానికిని శిష్యుఁడు కానివానికిని చెప్పఁగూడదు.

శిష్యుఁడను, నిన్ను శరణుచొచ్చితిని. కావున నాకు అనిశ్శ్రేయసము నుపదేశింపు మని తాత్పర్యము.

శం॰ నీవు పండితుఁడవై యుండి యెట్లు మూఢునివలె అధర్మమును ధర్మముగాను ధర్మము నధర్మముగాను దలంచుచున్నావు? అని భగవద్వచనము నాశంకించి, నేను అతిసూక్ష్ములగు నాధర్మాధర్మముల నిర్ణయింప శక్తుఁడఁగాను, ఏది చేయవలెనో అది నీవే యుపదేశింపుమని చెప్పుచున్నాఁడు—అవిద్యాకృత మయిన దేహేంద్రియాదికము అనాత్మస్వరూపము, అదియే నేనని వ్యవహరించుచున్నాఁడు కావున కృపణుఁడు * అనఁగా అజ్ఞాని, అట్లు 'యో వా ఏత దక్షరం గార్గ్యవిదిత్వాస్మాల్లోకా త్ప్రైతి సకృపణః' అని శ్రుతియు, 'కృపణో యో ఽజితేన్ద్రియః' § అని స్మృతియుఁ జెప్పుచున్నవి, కృపణభావము కార్పణ్యము అనఁగా అజ్ఞానము, తమఃప్రధాన మగుటవలన వస్తుస్వరూపము నాచ్ఛాదించును గావున నదియె దోషము దానిచే, ఉపహత = కప్పఁబడిన, స్వ = అవికారుఁడైన ప్రత్యగాత్మయొక్క, భావః = సత్తగలవాఁడను, అవిద్యచేఁ గప్పఁబడినయాత్మస్వరూపముగలవాఁడను, అవిద్యచే సంసారమునందుఁ ద్రోయఁబడినవాఁడను. దీనిచే ధరింపఁబడును గావున ధర్మ మనఁగా స్వరూపమును బ్రకాశింపఁ జేయునట్టి జ్ఞానము, దానియందు, సమ్మూఢ = ప్రవేశింపనట్టి, చేతాః = మనస్సు గలవాఁడను, ఇట్టి లక్షణములతోఁ గూడిన నేను; త్వా = నిన్నుఁ బరమేశ్వరుని; పృచ్ఛామి = అడుగుచున్నాను. శ్రుతి స్మృతుల చేతను మహాత్ములచేతను, యత్ = ఏది; నిశ్చితమ్ = నిర్ణయింపఁబడిన, నియతమయిన ఫలముగల; శ్రేయః = శ్రేయస్సాధనమో, శోకమును పోఁగొట్టునదో, తత్ మే బ్రూహి = దాని నాకుఁ జెప్పుము. ఓయి! 'నా పుత్రాయ నా శిష్యాయ వా పునః' అను శ్రుతివలనఁ బుత్త్రునకును శిష్యునకును దక్క నతిరహస్యముఁ జెప్పరా దనఁగాఁ జెప్పుచున్నాఁడు—ధర్మముఁ దెలియఁ గోరినవాఁడ నగుటచే; అహమ్, తే శిష్యః = నీకు శిష్యత్వము నొందినవాఁడను. త్వామ్—జగద్గురుఁడవు పరమేశ్వరుఁడ వగు నిన్ను; ప్రపన్నమ్ = శరణుచొచ్చిన, మామ్ = ముముక్షువు నగు నన్ను; శాధి = అనుగ్రహింపుము. ఎట్లీ శోకము నిశ్శేషముగా నశించునో అట్లు నాకు బోధింపు మని యర్థము.

---

* కృపణ—కృ—కృతమయిన, అవిద్యాకృతమయిన దేహేంద్రియాదికమును, పణ— నేనని వ్యవహరించువాఁడు.

§ ఎవఁడు జితేంద్రియుఁడు కాఁడో వాఁడు కృపణుఁడు.

వ. భీష్మాదులవలనఁ గలిగిన సంకటముచే నర్జునుండు 'వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి' * అను శ్రుతిచే సిద్ధమయిన భిక్షాచరణమునం దభిలాష నొందుటను దెలిపి తత్సంకటమువలననే యథావిధిగా గురువును శరణుచొచ్చుటను గూడఁ దెలుపుచున్నాఁడు—ఎవ్వఁడు కొంచెమేని ధనవ్యయము నోర్వఁడో అతండు కృపణుం డని లోకమునందుఁ బ్రసిద్ధము. ఆత్మవేత్తలు కానివా రందఱు పురుషార్థము లేనివా రగుటచే అట్టివారలే యగుదురు కావునఁ గృపణులు. అట్లు 'యో వా ఏత దక్షరం గార్గ్యవిదిత్వా స్మాల్లోకా త్ప్రైతి సకృపణః' అని శ్రుతి, కృపణుని తనము కార్పణ్యము, అనఁగా అనాత్మాధ్యాసము కలవాఁ డగుట, దానిచేఁ గలిగిన, దోష = ఈజన్మమునందు వీరే నావారలు, వారు హతులైనయెడ నాకు బ్రతుకేల? అను అభినివేశరూప మయిన మమత యను దోషముచేత, ఉపహత = కొట్టఁబడిన, కప్పఁబడిన, స్వభావః= యుద్ధప్రయత్నరూప మయిన క్షత్త్రియస్వభావము గలవాఁడను; ధర్మసమ్మూఢచేతాః—ధర్మ = ధర్మమువిషయమయిన, నిశ్చయము కల్గించు ప్రమాణము కనఁబడకుండుటవలన, సమ్మూఢ = వీరిని వధించుట యధర్మమా? లేక వీరిఁ బరిపాలించుట యధర్మమా? భూపాలనమా ధర్మము? లేక యిదివఱ కున్న యరణ్యావాసమా ధర్మము? ఇత్యాది సంశయములచే వ్యాపింపఁబడిన, చేతాః = మనస్సుగలవాఁడను. నచైతద్విద్మః కతరన్నో గరీయః అనుచో నిది వ్యాఖ్యాత మయ్యెను. ఇట్టివాఁడనై నేను, త్వాం=నిన్ను; పృచ్ఛామి= అడుగుచున్నాను, శ్రేయస్సు నని యధ్యాహార్యము. కావున, యత్ = ఏది, నిశ్చితమ్ = ఐకాంతికమును ఆత్యంతికము నగు, శ్రేయః = పరమపురుషార్థమయిన ఫలము, స్యాత్ = అగునో, తత్ = దాని, మే = నాకొఱకు, బ్రూహి = చెప్పుము. ఐకాంతిక మనఁగా సాధనానంతర మవశ్యము కలుగునది, ఆత్యంతిక మనఁగా కలిగిన పిమ్మట నశింప కుండునది. ఎట్లనఁగా, ఔషధమును సేవించినను ఒకానొకప్పుడు రోగనివృత్తి కలుగకపోయినను బోవును. రోగనివృత్తి కలిగినను మరల రోగము సంభవించుటచే నది నశించును. ఇట్లే యాగముచేసినను బ్రతిబంధవశము వలన స్వర్గము కలుగకపోయినను బోవును. కలిగినను స్వర్గము దుఃఖాక్రాంతమయి నశించును. కావున రోగనివృత్తియు స్వర్గంబును ఐకాంతికములు కావు, ఆత్యంతికములును గావు. ఈవిషయము, "దుఃఖత్రయాభిఘాతా జ్జిజ్ఞాసా తదపఘాతకే

* సన్న్యసించి యంత భిక్షాచరణము చేయుదురు.

హేతా। దృష్టే సా ఉపార్థాచే న్నైకాన్తాత్యన్తతో ఉభావాత్" * అనియు "దృష్టవ దానుశ్రవిక స్స హ్యవిశుద్ధిక్షయాతిశయయుక్తః। తద్విపరీత శ్శ్రేయాన్ వ్యక్తావ్యక్తజ్ఞవిజ్ఞానాత్" § అనియు చెప్పఁబడియున్నది. ఓయి! నీవు నాకుఁ జెలికాఁడవు కాని శిష్యుఁడవు కా వనఁగాఁ జెప్పుచున్నాఁడవు—నీచే నుపదేశము పొందుటకు యోగ్యుఁడ నగుటవలన, అహమ్ = నేను, తే = నీకు, శిష్యః = శిష్యుఁడనే, కాని, తక్కువజ్ఞానము కలవాఁడ నగుటవలన సఖుఁడఁ గాను. కావున, త్వామ్ = నిన్ను, ప్రపన్నమ్ = శరణుచొచ్చిన, మామ్ = నన్ను, శాధి = కృపచే శిక్షింపుము, నేర్పుము, వీఁడు శిష్యుఁడు కాఁ డని శంకించి నన్ను పేక్షింపఁ దగ దని యర్థము. ఇందుచే "తద్విజ్ఞానార్థం సగురు మే వాభిగచ్ఛేత్సమిత్పాణి శ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" 'భృగుర్వై వారుణిః వరుణం పితర ముపససార, అధీహిభగవో బ్రహ్మేతి' $ ఇత్యాదిగా గురువును శరణుపొందవలె నని ప్రతిపాదించునట్టి శ్రుత్యర్థము తెలుపఁబడినది.

శ్రీ. అందువలన, కార్పణ్యదోషోపహతస్వభావః—కార్పణ్యా=వీరిని వధించి యెట్లు బ్రతుకుదు మను దీనతచేతను, దోష = వంశక్షయచేఁ గలుగు దోషముచేతను; ఉపహత = తిరస్కరింపఁబడిన, స్వభావః = శౌర్యరూపస్వభావముగలవాఁడ నగు, నేను; అట్లు, ధర్మసమ్మూఢచేతాః = ధర్మమునందు వివేకములేని మనస్సు గలవాఁడనై, యుద్ధంబును విడిచి భిక్షాటనము చేయుటయు క్షత్త్రియునకు ధర్మమా? అధర్మమా? అని సందేహము నొందిన మనస్సుగలవాఁడనై యని యర్థము; త్వాం పృచ్ఛామి. కావున, మే = నాకు; యత్ = ఏది, నిశ్చితమ్ = నిశ్చయముగాఁ

* ఆధ్యాత్మికము ఆధిభౌతికము ఆధిదైవికము అను దుఃఖములు మూఁటిచే బాధింపఁబడుటవలన ఆదుఃఖములను బోఁగొట్టునట్టి శాస్త్రప్రోక్తసాధనము విషయమయి జిజ్ఞాస కలుగును. ఔషధము మొదలగు దృష్టమయిన సాధనముచేతనే తద్దుఃఖనాశము సిద్ధించుటవలన ఆ జిజ్ఞాస వ్యర్థమగు ననఁగా అట్లు గాదు. ఏల యనఁగా ఆ యౌషధములు మొదలగువానిచేఁ గలుగు అదుఃఖనివృత్తి యైకాంతికము గాదు, ఆత్యంతికమును గాదు.

§ వేదోక్తమయిన కర్మకలాపముగూడ, యౌషధాదులవంటిదే, ఏల యనఁగా నది హింసాదిరూపమగుటచే అపరిశుద్ధత్వమును నాశమును ఒకదానికన్న నొకటికి ఆధిక్యమును గలది. కావున ఆకర్మకలాపమునకు విపరీతమయిన—శుద్ధమును నిత్యమును నిరతిశయము నగు ప్రకృతి సంబంధరహిత పురుషజ్ఞానము శ్రేష్ఠము, అది, వ్యక్తము అవ్యక్తము పురుషుఁడు—వీని జ్ఞానమువలనఁ గలుగును.

$ వరుణునిపుత్త్రుఁడైనభృగువు తండ్రియైన వరుణుని భగవంతుఁడా! బ్రహ్మమును నేర్పు మని శరణుచొచ్చెను.

శ్రేయః = యుక్తము, స్యాత్; తత్, బ్రూహి = దానిఁ జెప్పుము. ఇదిగాక, తే = నీకు; అహమ్ శిష్యః = శిక్షింపఁదగినవాఁడను. కావున, త్వామ్, ప్రపన్నమ్ = శరణాగతుండ నగు, మామ్ = నన్ను; శాధి = శిక్షింపుము.

ప. అంతఁ గలఁతపడినమనస్సుగలవాఁడై శ్రీకృష్ణునియడుగుచున్నాఁడు— కార్పణ్య=స్నేహసంబంధముగల బంధువుల ప్రాణము రక్షించు తలంపుచేతను, దోష= వారి వధించుటచేఁ గలుగు దోషముచేతను, ఉపహత= కలఁతపెట్టఁబడిన, స్వభావః = మనస్సుగలవాఁడను; కార్పణ్యమునందు క్షత్త్రియధర్మమును విడుచుట యగును, వారి వధించుటయందు వేదోక్త మయిన యహింసారూపధర్మమును విడుచుట యగును; ఇట్లు రెండువిధములను, ధర్మసమ్మూఢచేతాః = ధర్మమువిషయమందు వివేకములేని మనస్సుగలవాఁడను. ఇఁకమీఁద రెండు ధర్మములను రక్షించి, యత్ = ఏది, శ్రేయఃస్యాత్ = ఉచిత మగునో, తత్ = దాని, మే = నాకు; నిశ్చితమ్ = సందేహము లేనియట్లు; బ్రూహి. ఎందువలన ననఁగా, అహమ్ నేను; తే శిష్యః, కావున, త్వామ్ ప్రపన్నమ్ = శరణాగతుఁడ నగు, మామ్ = నన్ను; శాధి = శిక్షింపుము. అట్లు "ఆచార్యవాన్ పురుషో వేద" * అని శ్రుతి.

రా. ఇట్లు యుద్ధము నారంభించి యీవ్యాపారము విడిచిన మిమ్ము ధార్తరాష్ట్రులు బలాత్కారంబున వధింతు రందు వేసి, అవ్విగాక. వారిని వధించుటచే లభించు నధర్మ్య మయిన విజయముకన్నను మాకు ధర్మాధర్మములు దెలియనివారగు నాధార్తరాష్ట్రులచే వధింపఁబడుటయే మే లని నాకుఁ దోఁచుచున్న దని పలికి, ఏది నాకు శ్రేయం బని నిశ్చిత మగునో దాని శరణాగతుండను నీశిష్యుండ నగు నాకుఁ జెప్పు మని మిక్కిలి దీనుండై భగవంతునిపాదములను శరణుచొచ్చెను. §

నహి ప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోక ముచ్ఛోషణ మిన్ద్రియాణామ్
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్. ౮

ఆ. ఎందువలన నిశ్శ్రేయసముచే కోరుచున్నావనఁగాఁ జెప్పుచున్నాఁడు— హి = ఎందువలన ననఁగా; భూమౌ = ఈభూలోకమునందు; అసపత్నమ్ = శత్రువులు

---

* ఆచార్యుఁడు గల పురుషుఁడు తెలియును.

§ ఇది ౬ - ౭ శ్లోకముల యర్థము.

లేని; ఋద్ధమ్ = సమృద్ధ మగు; రాజ్యమ్ = దొరతనమును, ప్రజలరక్షించుట శిక్షించుట మొదలగుదానిని; అవాప్య = పొందియును; సురాణామ్ = దేవతలయొక్క; ఆధిపత్యమ్ = దొరతనమును, ఇంద్రత్వమునుగాని బ్రహ్మత్వమునుగాని; అవాప్యాపిచ= పొందియును; యత్ = ఏది; ఇన్ద్రియాణామ్ = ఇంద్రియములయొక్క; ఉచ్ఛోషణమ్ = తపింపఁజేయునట్టి; మమ = నాయొక్క; శోకమ్ = దుఃఖమును; అపనుద్యాత్ = పోఁగొట్టునో; తత్ = దాని; నప్రపశ్యామి = చూడను.

ఇప్పుడు నాయింద్రియముల కన్నిటికిని మిక్కిలి సంతాపకరమైన మహా దుఃఖమును బోఁగొట్టు నుపాయ మేదియు నాకుఁ గనఁబడ లేదు. శత్రువులను జయించి నిష్కంటకమై సమృద్ధ మయిన భూరాజ్యము నొందినను ఈ దుఃఖము పోవునట్లు దోఁప లేదు. మఱియు సమస్తదేవతలకును బ్రభుఁడనై యింద్రత్వము నొందినను బ్రహ్మత్వము నొందినను ఈ దుఃఖము పోవు నని తోఁపదు. కావున నిశ్శ్రేయసము నే కోరుచున్నా నని తాత్పర్యము.

శ్లో ౦. నేను నీ కేమి చెప్పవలెను? నీవు పండితుఁడవు గదా! ఏది శ్రేయస్సాధనమో దాని సూక్ష్మబుద్ధిచేతను యుక్తిచేతను నీవే తెలిసికొనవలె ననఁగాఁ జెప్పుచున్నాఁడు—ఇన్ద్రియాణామ్ — దేహేంద్రియమనోబుద్ధులకు; ఉచ్ఛోషణమ్ = మిక్కిలి సంతాపము కలిగించునట్టి; మమ=నాయొక్క; శోకమ్ = దుఃఖమును; యత్ అపనుద్యాత్ = ఏది పోఁగొట్టునో, ద్రవ్యగుణకర్మములలో నుత్తమపదార్థ మేది నాకుఁ బ్రాప్తమయి నాదుఃఖమును నివర్తించునో; తత్ అహమ్ నప్రపశ్యామి = అట్టిదాని దేనినిగూడ నే నెఱుంగను. ఎఱుంగుదు నేని ఈదుఃఖ మేల వచ్చు నని "హి" అను నది యజ్ఞానముయొక్క ప్రసిద్ధిని దెలుపుచున్నది. శత్రువులను జయించి రాజ్యంబు నొంది యుత్తమపదార్థములభోగముచే శోకము విడువశక్య మగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—భూమౌ=భూమియందు; అసపత్నమ్ = శత్రువులు లేనట్టి; ఋద్ధమ్= సమగ్రమయిన; రాజ్యమ్ = చక్రవర్తిత్వమును; అవాప్య = పొందినను గాని; సురాణామ్ ఆధిపత్యమ్ = ఇంద్రత్వమును లేక బ్రహ్మత్వమును, అవాప్య = పొందినను గాని; నేను శోకమును విడువఁ జాలను. చక్రవర్తిత్వము ఇంద్రత్వము బ్రహ్మత్వము మొదలగునవి జన్యము లగుటచే ధ్వంసప్రతియోగులు * కావున అవి గలవానికి శోకనివృత్తి సంభవింపదు. ప్రకృతమునందుఁగూడ స్వజనులనాశమువలన నె గదా శోకము కలుగుచున్నది. అందువలన వివేకవంతునకు విషయప్రాప్తియు విషయ

* నశించునవి.

భోగమును శోకనివర్తకములు కావు. కావున, ఎందువలన శోకమును నిశ్శేషముగా విడువఁగలనో అట్టి ధర్మమును నాకుపదేశింపు మని సమస్తభోగములందు విరక్తితోను తీవ్రమయినమోక్షేచ్ఛతోను భగవంతుని ప్రార్థించిననాఁడర్జునుఁడు ‘ శాధిమామ్ ’ అని. ఇందుచే, ‘ బ్రహ్మత్వాదిపదప్రాప్తి ఆత్యంతికసంసారదుఃఖనివృత్తికిఁ గారణము కాఁజాలదు. మఱియునఁగా బ్రహ్మజ్ఞానము లేనియెడ దుఃఖమునకే కారణమగును. ఆబ్రహ్మజ్ఞానము గురూపదేశముచేతనేగాని సిద్ధింపదు. అట్లు ‘ ఆచార్యవాన్ పురుషో వేద ’ అని శ్రుతి యుపదేశించుచున్నది. కావున బ్రహ్మజ్ఞానముఁ గోరువాఁడు గురూపసదనము చేయవలెను ” అని సూచింపఁబడినది.

మఱి. ఓయి! నీవే శ్రేయస్సేదో విచారించుకొనుము. వేదశాస్త్రములు దెలిసినవాఁడవు. ఒకనికి శిష్యుఁ డేల కావలయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—యత్ = ఏశ్రేయస్సు, ప్రాప్తమై, మమశోకమ్ = నాదుఃఖమును, అపనుద్యాత్ = పోఁగొట్టునో, తత్ = దాని, హి = ఏకారణమువలన, నప్రపశ్యామి = చూడనో, అందువలన, మాంశాధి—నన్నుశిక్షింపుము, అని « సోఽహం భగవశ్శోచామి తం మా భగవాన్ శోకస్యపారం తారయతు ”* అను శ్రుతియొక్క యర్థము తెలుపఁబడినది. శోకము నివారింపనియెడ నేమి హాని యని యాశంకించి దాని విశేషణముఁ జెప్పుచున్నాఁడు—ఇన్ద్రియాణామ్ ఉచ్ఛోషణమ్—ఎల్లప్పుడును మిక్కిలి తాపము చేయునట్టిదాని నని యర్థము. ఓయీ! యుద్ధము చేయుదువేని నీకు శోకనివృత్తి కాఁగలదు, ఎట్లనఁగా, జయింతువేని అప్పుడు రాజ్యము లభించుటచే శోకనివృత్తి యగును. వేఱువిధమయినయెడ స్వర్గము సిద్ధించుటంజేసి శోకనివృత్తి యగును, అట్లు ‘ ద్వావేతౌ పురుషౌ లోకే ’ § ఇత్యాదిగా ధర్మశాస్త్రము వచించుచున్నది, అని యాశంకించి చెప్పుచున్నాఁడు—శత్రువర్జితమై పైరులు మొదలగువానిచే నసమృద్ధమయిన రాజ్యమునుగాని, అట్లు సురాణామ్ ఆధిపత్యమ్ = హిరణ్యగర్భత్వపర్యంతమయిన యైశ్వర్యమునుగాని; అవాప్య = పొంది, ఉన్నవాఁడనైనను, నాశోకము నేది పోఁగొట్టునో దానిం జూడ నని యన్వయము. « తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే

* భగవంతుఁడా! అట్టి నేను శోకించుచున్నాను, భగవంతుఁ డట్టి నన్ను శోకముయొక్క అంతమును దరింపఁజేయుఁ గాక.

§ లోకమునందు వీర లిద్దఱుపురుషులు—యోగయుక్తుఁడైన సన్న్యాసియును యుద్ధమునం దభిముఖుఁడై హతుఁడైన శూరుఁడును సూర్యమండలము భేదించువారలు.

ఏవ మే వాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" § అను శ్రుతివలనను, ఏది కార్య మో అది యనిత్య మను ననుమానప్రమాణమువలనను, ప్రత్యక్షమందును ఈలోక మునఁ గలిగిన వస్తువులవినాశమును జూచుటవలనను, ఇహలోకభోగముగాని పరలోక భోగముగాని శోకనివర్తకము కాదు. మ త్తేమనఁగా ఆభోగ ముండునపుడును పురు షుని పారతంత్ర్యముచే బంధించుటవలన శోకజనకమే యగును, అది నశించునపు డును విచ్ఛిన్న మగుటవలన శోకజనకమే యగును. కావున శోకనివృత్తికొఱకు యుద్ధము చేయఁదగినది కాదని యర్థము. ఇందుచే ఇహాముత్రభోగవిరాగము అధి కారివిశేషణ మని తెలుపఁబడినది.

శ్రీ. నీవే విచారించి యేది యుక్తమో యది చేయు మనఁగాఁ జెప్పు చున్నాఁడు—ఇన్ద్రియాణామ్, ఉచ్ఛోషణమ్ = మిక్కిలి శోషిల్లఁ జేయున దగు, నాయొక్క, శోకమ్, యత్ = ఏకార్యము, అపనుద్యాత్ = పోఁగొట్టునో, తత్ = దానిని, అహమ్ న ప్రపశ్యామి = నే నెఱుంగను. భూమౌ, అసపత్నమ్ = నిష్కం టకమయిన, సమృద్ధ మగు రాజ్యమును పొందినను, అట్లు దేవేంద్రత్వమునుగూడ పొందినను, ఇట్లు అభీష్టమగునది యంతయుఁ బొందినను శోకము పోఁగొట్టు నుపా యము కనఁబడ దని యర్థము.

ప. ఇప్పుడు నీవే విచారించి యేది యుక్తమో దానిఁ జేయు మనఁగా మరలఁ జెప్పుచున్నాఁడు—ఈ యుద్ధమునందు రెండు కార్యములు కనఁబడుచున్నవి. అవి యేవి యనఁగా—మాకు జయ మయినయెడ భూలోకరాజ్యము, అట్లు మాకు మరణము కలిగినయెడ స్వర్గలోకరాజ్యము. ఈ రెంటిలో నొకటియును, యత్ మమ శోకమ్ అపనుద్యాత్ = ఏది నా దుఃఖమును బోఁగొట్టునో, అట్టిదిగాఁ గనఁబడదు. ఎట్టి దుఃఖము సనఁగా—ఇన్ద్రియాణామ్ ఉచ్ఛోషణమ్ = సమస్తేంద్రియములను బాధించునట్టిదాని. ఇఁక భూలోక రాజ్యమును వర్ణించుచున్నాఁడు. అసపత్నమ్ = శత్రువులు లేనిదానిని, ఋద్ధమ్ = సమృద్ధ మయినదానిని. స్వర్గలోక రాజ్యమును గూడ వర్ణించుచున్నాఁడు—సురాణామ్ = ముప్పదిమూఁడుకోటుల పరిమితిగల దేవ తలయొక్క, ఆధిపత్యమ్ = ప్రభుత్వమును. అందు భూలోకరాజ్యమునం దేభోగ ములుగలవో అవి నెత్తుటం దడిసినవి, స్వర్గలోకభోగములుగూడ మరల భ్రంశము

§ అందువలన ఎట్లీలోకంబున కర్మముచే సంపాదంపఁబడిన లోకము నశించుచున్నదో, ఇట్లే పరలోకమునందును బుణ్యముచే సంపాదింపఁబడిన లోకము నశించుచున్నది.

కలుగుటవలన క్షణభంగురములు. కావున శోకము నిచ్చునవి కాని శోకమును బోఁగొట్టునవి కా వని యర్థము.

సంజయ ఉవాచ.

ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తపః
న యోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవ హ. ౯

ఆ. ఈ ప్రకారముగా నర్జునుఁడు భగవంతునితోఁ జెప్పిన యభిప్రాయమును సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పె నని చెప్పుచున్నాఁడు 'సంజయ ఉవాచ' అని. పరన్తపః = శత్రువులను దపింపఁజేయునట్టి; గుడాకేశః = అర్జునుఁడు; హృషీకేశమ్ = కృష్ణునిఁగూర్చి; ఏవమ్ = ఇప్పుడు ...చుకొనుచుండఁగా; ఉక్త్వా = పలికి; మరల, నయోత్స్యే = యుద్ధముచేయను; ఇట్లనఁగాఁ జెప్పుచు ...మ్ = కృష్ణునిఁగూర్చి; ఉక్త్వా = చెప్పి; తూష్ణీమ్ = ఊరక, ...ఃఖమును, అపనుద... , బభూవహ = ఉండెను గదా. నప్రపశ్యామి = చూడనో,

సర్వశత్రువులను జయించునట్టి యర్జునుఁడు భగవంతునితో నీ విధముగాఁ బలికి, మరల నా కృష్ణునిం జూచి అయ్యా! యుద్ధము చేసినయెడ మిక్కిలి దుస్సహమయిన దుఃఖము సంభవించుం గావున నేను యుద్ధము చేయ నని చెప్పి యంతనేమియుఁ బలుకకుండె నని తాత్పర్యము.

శం. "శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నమ్" అని యర్జునుఁడు భగవంతునితోఁ బలికె నని ధృతరాష్ట్రునకు సంజయుండు చెప్పెను. ఏవముక్త్వా, మరల; పరన్తపః = శత్రువులఁ దపింపఁ జేయువాఁ డయ్యును, గుడాకేశః—నామైకదేశముచే నామగ్రహణ మను న్యాయమువలన లగుడ శబ్దము గుడ అని చెప్పఁబడినది, లగుడ = దండమువలె దీర్ఘములును, ఆ = అంతటను సమములు నగు, కేశః = తలవెండ్రుకలు గలవాఁ డగు నర్జునుఁడు; గోవిన్దమ్—గో = వేదాంతవాక్యములచేత, విన్దమ్ = పొందఁబడునట్టి; హృషీకేశమ్ = కృష్ణుని గూర్చి; బంధువుల హింసించుట దుస్సహదుఃఖము గలిగించుం గావున, నేను, నయోత్స్యే=యుద్ధము చేయను; ఇతి = అని; ఉక్త్వా; తూష్ణీం బభూవహ—మరల నేమియుఁ బలుకఁ డయ్యె నని యర్థము.

మ. అటుపిమ్మట నర్జునుం డేమిచేసె నని ధృతరాష్ట్రుఁ డడుగఁగా సంజయుఁడు పలికెను—గుడాకేశః = సోమరితనమును జయించినవాఁడును, పరన్తపః =

శత్రువులఁ దపింపఁజేయువాఁడు నగు నర్జునుఁడు; హృషీకేశమ్ = సర్వేంద్రియములను బ్రేరించువాఁ డగుటవలన అంతర్యామియును; గోవిన్దమ్—గో = వేదరూపమయిన వాక్కును, విన్దమ్ = పొందువాఁ డను వ్యుత్పత్తిచే సమస్తవేదములకును గారణ మయినవాఁ డగుటచే సర్వజ్ఞుఁడు నగు కృష్ణుని గూర్చి; మొదట, ఏవమ్—కథం భీష్మ మహం సంఖ్యే ఇత్యాదిగా యుద్ధము అయోగ్య మని; ఉక్త్వా; అటుపిమ్మట, నయోత్స్యే; ఇతి = అని, యుద్ధము నిష్ఫల మనియు; ఉక్త్వా; తూష్ణీం బభూవ—యుద్ధము కొఱకుఁ బూర్వము చేయఁబడిన బాహ్యేంద్రియవ్యాపారము విరమించుటచే నిర్వ్యాపారుఁ డయ్యె నని యర్థము. స్వభావముచే ఆలస్యమును జయించినవాఁడును సర్వశత్రువులఁ దపింపఁజేయువాఁడు నగు నర్జునునియందు నడుమ వచ్చిన యాలస్యమును అతాపకత్వమును నిలుపఁజాల వని « హ » అనునది సూచించుచున్నది. సర్వజ్ఞత్వమును బోధించునట్టి గోవిన్దశబ్దముచేతను సర్వశక్తత్వమును బోధించునట్టి హృషీకేశశబ్దముచేతను భగవంతుని కా యర్జునుని మోహముం బోఁగొట్టుట సులభసాధ్య మని సూచింపఁబడినది.

శ్రీ. ఇట్లు పలికి యర్జునుఁ డేమి యొనర్చె నని యడుగఁగా సంజయుఁడు పలికెను—ఏవ మిత్యాదిగా. అర్థము స్పష్టము.

ప. అటుమీఁద నేమి జరిగె ననఁగా సంజయుఁడు చెప్పుచున్నాఁడు—ఏవ ముక్త్వేత్యాదిగా. స్పష్టము.

రా. ఇట్లు అయోగ్యస్థానమునందుఁ గలిగిన స్నేహకారుణ్యములచే స్వభావవిరుద్ధగుణమును బొందినవాఁడును క్షత్రియులకు యుద్ధము పరమధర్మ మైనను దాని నధర్మముగాఁ దలంచువాఁడును ధర్మము దెలియఁ గోరి శరణాగతుం డైన వాఁడు నగు నర్జును నుద్దేశించి యాత్మస్వరూపజ్ఞానంబును ఫలాభిసంధిరహిత మయిన యుద్ధం బాత్మప్రాప్తికి నుపాయం బను జ్ఞానంబును గలిగినంగాని వీని మోహము శమింప దని తలంచి పరమపురుషుం డగు భగవంతునిచే శాస్త్రావతరణము గావింపఁబడెను. అది చెప్పఁబడినది. « అస్థానస్నేహకారుణ్య ధర్మాధర్మధియాఽఽకులమ్ । పార్థం ప్రపన్న ముద్దిశ్య శాస్త్రావతరణం కృతమ్ » * అని. §

* అయోగ్యస్థానమునందలి స్నేహకారుణ్యములచేఁ గలిగిన ధర్మమునందలి యధర్మబుద్ధిచేఁ బీడితుండును శరణాగతుండు నగు నర్జును నుద్దేశించి శాస్త్రావతరణము చేయఁబడినది.

§ ఇది ౮-౯ శ్లోకముల యర్థము.

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత
సేనయో రుభయో ర్మధ్యే * విషీదన్త మిదం వచః. ౧౦

ప్ర॰ సేనయోః = సేనలయొక్క; ఉభయోః = రెంటియొక్క; మధ్యే = నడుమను; విషీదన్తమ్ = దుఃఖించుచున్న; తమ్ = ఆ యర్జునునిఁగూర్చి; హృషీకేశః = భగవంతుఁడు; ప్రహసన్నివ = పరిహాసము చేయువాఁడుంబోలె; భారత = భరతవంశమునఁ బుట్టినవాఁడా! అని సంబోధించి; ఇదమ్ = ఈ; వచః = వాక్యమును; ఉవాచ = పలికెను.

ఇట్లు శోకమోహములచే నభిభూతుండై రెండుసేనల నడుమ మిక్కిలి శోకించుచు స్వధర్మము విడువఁ బూనియున్న యర్జునుం జూచి భగవంతుం డతని అనుచితకార్యము చేయుచున్నా వని పరిహాసము చేయువాని యట్లు భారతా! అని యాశ్వాసించి ప్రశ్నోత్తరరూపంబును నిశ్శ్రేయసము పొందుటకు సాధన మయినదియు నగు నీ వాక్యముఁ బలికె నని తాత్పర్యము.

శం॰ "యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే" అని యడుగఁబడినవాఁడై శ్రీభగవంతుఁడు శోకించుచున్న యతనిం జూచి యేమిచెప్పి ననఁగాఁ జెప్పుచున్నాఁడు — ఓ భారతుఁడా! ధృతరాష్ట్రుని సంబోధనము. సేనయోః ఉభయోః మధ్యే = సేనల రెంటినడుమ; విషీదన్తమ్ = నావారలు వీరు చావఁ బోవుచున్నా రని దుఃఖించుచున్నవాని, వీరిని వధించి యాదోషముచే నేను నరకముఁ బొందుదు నని విక్రియయుండును నిర్వికారుండును కర్తృత్వాది ధర్మశూన్యుండు నగు నాత్మయందు అనాద్యవిద్యచే అనాత్మను అనాత్మధర్మములను అధ్యసించి నేను కర్తను భోక్త నని విపరీతబుద్ధిచే మోహపడియున్నవాని; తమ్ = ఆయర్జునుని, చూచి, పరమదయాళు వగు, హృషీకేశః = భగవంతుఁడు; 'తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః' § ఇత్యాది శ్రుతిప్రసిద్ధ మగు బ్రహ్మాత్మైక్యము తెలిసినం గాని ద్వైతభ్రమను గలిగించునట్టి భేదబోధకశాస్త్రమునకు లోఁబడియుండునట్టి యితఁడు భ్రాంతిచేఁ గలిగిన శోకసాగరమును దాఁటఁ జాలఁ డని తలంచి తత్త్వంపదార్థ విచారపూర్వకముగా తద్జ్ఞానము నుపదేశింపఁ గోరినవాఁడై మొదట త్వంపదార్థ విచారము బోధించుటకు; ప్రహసన్నివ = నీవు పండితుఁడ వని నేను దలంచితినే, నీ

* "సీదమాన మిదం వచః" అని పాఠాంతరము.

§ ఏకత్వముఁ దెలిసినవానికి అందు మోహ మేది? శోక మేది?

పాండిత్య మింతే గదా యని యతని నడవడిని పరిహసించువాని యట్లు; ఇదం వచః, ఉవాచ.

మ. ఇట్లు యుద్ధము నర్జునుం డుపేక్షించినను భగవంతుం డుపేక్షించినవాఁడు గాఁ డని ధృతరాష్ట్రునిదురాశను తొలఁగించుటకై చెప్పుచున్నాఁడు—సేనయోః ఉభయోః మధ్యే = సేనల రెంటినడుమ, యుద్ధము సేయవచ్చి, విషీదన్తమ్ = దానికి విరుద్ధమయిన మోహముఁ బొందుచున్న, తమ్ = ఆయర్జునుని; ప్రహసన్నివ = అనుచితమయిన నడవడిని వెల్లడిచేయుటచే సిగ్గు అను సముద్రమునందు ముంచువాని యట్లు; హృషీకేశః = సర్వాంతర్యామి యగు భగవంతుఁడు; ఇదమ్—చెప్పఁబోవునట్టి, అశోచ్యా నిత్యాదిక మయిన; వచః = మిక్కిలి గంభీర మయిన యర్థము గలదియు అనుచితమయిన చర్యను వెల్లడిచేయునదియు నగు వాక్యమును; ఉవాచ = పలికెను, కాని ఉపేక్షించినవాఁడు కాఁ డని యర్థము. అయోగ్య మయిన నడతను వెల్లడిచేసి లజ్జఁబుట్టించుట ప్రహాస మనఁబడును, లజ్జ దుఃఖాత్మక మగుటవలన ముఖ్య మయిన ప్రహాసము శత్రువు విషయముననే చేయఁ నగును. అర్జునుఁడో భగవంతుని కృపకుఁ బాత్ర మయినవాఁడు, అతనికి అనుచితపు నడతను బయలుపుచ్చుటయు వివేకోత్పత్తికిఁ గారణము, కావున లజ్జను బుట్టించుటయను ప్రహాసపదార్థమునందలి భాగము ఈ విషయమున లేదు, కావున ఈ ప్రహాసము గౌణమే యని ఇవశబ్దము తెలుపుచున్నది. లజ్జను బుట్టించుటకుంబోలె వివేకముఁ బుట్టించుటకు అర్జునుని యనుచితపు నడత భగవంతునిచే వెల్లడి చేయఁబడుచున్నది. అందుచే, ననివార్యముగాఁ గలుగునట్టి లజ్జ కలుగనీ, కలుగకపోనీ, అది భగవంతునకు వివక్షితము కా దని భావము. అర్జునుఁడు యుద్ధారంభమునకు మునుపే గృహంబునుండి యుద్ధము నుపేక్షించునేని అప్పుడు అనుచితము చేసినవాఁడు కాఁడు. గొప్ప సంరంభముతో యుద్ధభూమికి వచ్చిన పిమ్మట యుద్ధము నుపేక్షించుట మాత్రము మిక్కిలి యనుచితం బని 'సేనయో రుభయో ర్మధ్యే' అనునది సూచించుచున్నది. ఇది యశోచ్యా నిత్యాది శ్లోకమునందు స్పష్టము కాఁగలదు.

శ్రీ. అటుపిమ్మట నేమి జరిగె ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—ప్రహసన్నివ—ప్రసన్న మయిన ముఖము గలవాఁడై యని యర్థము.

ప. అంత విషాదముచే యుద్ధము చేయ నని నిశ్చయించి యూరక యున్న యర్జునునకు భగవంతుఁడు చెప్పె నని చెప్పుచున్నాఁడు—హృషీకేశః = సర్వ

జనుల మనస్సునందలి యభిప్రాయము నెఱింగినట్టి కృష్ణుఁడు, తమ్ = ఆ యర్జునుని గూర్చి, ప్రహసన్నివ ఉవాచ—నవ్వులోపలఁ గలదానివలె నుండు వాక్యమును బలికెను. అయ్యా! విషాదసమయమునందు నవ్వు గలుగదు, అట్లుండఁగా ప్రహసన్నివ అని యెట్లు చెప్పఁబడినది? అందుకు సమాధానము చెప్పుచున్నారము—విషాదము కలుగుటకుఁ గారణము లేదు. ఏల యనఁగా దీనులను అనాథులను వధించినప్పుడే విషాదము కలుగును. ప్రకృతమునందో, భీష్మద్రోణకర్ణదుర్యోధనాదులు శౌర్యముచే దేవేంద్రునైన సరకుసేయనివారు క్షాత్త్రధర్మము ననుసరించి యుద్ధమునకుఁ బ్రవర్తించిరి కాని మూర్ఖతచేఁ గాదు. అట్టివా రెట్లు కృపకుఁ బాత్రులగుదురు? మఱియు, వారు నాచే హతులగుదు రని యర్జునునకు దేనివలనఁ దెలిసెను? తనభుజపరాక్రమమునందు నమ్మకము వలననా? సహాయుఁ డగు నా * ప్రభావము వలననా? మొదటిది సరికాదు. ఎందువలన ననఁగా నాతో నిజభుజప్రతాపము చెప్పుకొనుట యనుచితము. మఱియు ఆపక్షమున నాసాహాయ్యము నిరుపయోగ మగును. వేడుకచూచుటకు నన్నుఁ దోడ్కొనివచ్చుట యందు తేని అప్పుడితర జనులవలె ఏమియుఁ జేయనివాఁడ నగుటచే నాయాగమనము వ్యర్థ మగును. రెండవదియు సరి గాదు. ఎట్లనఁగా, అప్పుడు నేనే వధమునకు నిమిత్త మగుటచేఁ దద్వధదోషము తనకు సంభవించు నని విషాదం బర్జునునకుఁ గలుగ నవసరము లేదు. కావున ఏది విషాదమునకుఁ గారణముగాఁ జెప్పఁబడినదో, కర్మమార్గమునకును నైష్కర్మ్యమార్గమునకును ఈ రెంటికిని బహిర్భూత మగుటచే నది వంచనమాత్రమె కాని కొంచె మయినను యుక్తము కా దను నభిప్రాయముచే ఇంచుక నగుమోము గలవాఁడై పలికె నని యర్థము.

రా. ఈ ప్రకారముగా దేహాత్మల స్వరూపము తెలియమిచేఁ గలిగిన శోకముచే నావేశింపఁబడినవాఁడును దేహముకన్న ఆత్మ అతిరిక్తుఁ డన్న జ్ఞానముచేఁ దెలియునట్టి ధర్మమును బలుకుచున్నవాఁడును అందువలన బరస్పరవిరుద్ధగుణములతోఁ గూడినవాఁడును యుద్ధమున కుద్యుక్తము లయిన రెండుసేనలనడుమ నిష్కారణముగా నిరుద్యోగుండై యున్నవాఁడు నగు పార్థుం జూచి పరమపురుషుఁడు; ప్రహసన్ ఇదమ్ ఉవాచ—పరిహాసవాక్యమును జెప్పువాఁడుపోలె ఆత్మయొక్కయుఁ బరమాత్మయొక్కయు స్వరూపంబును తత్ప్రాప్తి కుపాయమైన కర్మయోగ జ్ఞానయోగ భక్తి

* భగవంతుని.

యోగంబులను బ్రతిపాదించుదాని, 'నత్వేవాహం జాతునాసమ్' అనునది మొదలుగా 'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః' అనువఱకుఁ గల వచనమును బలికె నని యర్థము.

శ్రీభగవానువాచ.

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః. ౧౧

శ్రీశాంకరభాష్యము.—

"దృష్ట్వాతు పాణ్డవానీకమ్" అనునది మొదలు "నయోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవహ" అనువఱకుం గల గ్రంథమునకు, ప్రాణుల శోకమోహాదిసంసారబీజభూతదోషోద్భవకారణహేతువ్రుం దెలుపుట యభిప్రాయముగా వ్యాఖ్యేయము. ఎట్లనఁగా—అర్జునుని చే రాజ్యగురు పుత్త్ర మిత్త్ర సుహృత్స్వజనసంబంధిబాంధవులయందు 'నేను వీరివాఁడను, వీరు నావారలు' అను భ్రాంతిజ్ఞానము చేఁ గలిగిన స్నేహవిచ్ఛేదాదులు నిమిత్తముగాఁ గల తన శోకమోహంబులు, కథం భీష్మ మహం సఙ్ఖ్యే ఇత్యాది గ్రంథమునఁ దెలుపఁబడెను. శోకమోహములచే నభిభూత మయిన వివేకజ్ఞానము గలవాఁడై గదా యతండు తనయంతనే క్షత్త్రధర్మ మయిన యుద్ధమునందుఁ బ్రవర్తించినవాఁ డయ్యు నయ్యుద్ధంబునుండి యుపరమించెను. పరధర్మ మయిన భిక్షాజీవనాదికమును జేయుటకునుం బ్రవర్తించెను. అట్లు సర్వప్రాణులకును శోకమోహాది దోషావిష్టచిత్తు లగు వారికి స్వభావంబుననే స్వధర్మపరిత్యాగంబును నిషిద్ధధర్మసేవనంబును సంభవించును. వారు స్వధర్మమునందుఁ బ్రవృత్తులైనను వారి వాఙ్మనఃకాయాదులప్రవృత్తి ఫలాభిసంధిపూర్వకంబు నహంకారయుక్తంబు నగును. ఇవ్విధం బగుటచే ధర్మాధర్మంబుల యభివృద్ధివలన ఇష్టానిష్టజన్మసుఖదుఃఖాదిప్రాప్తిరూప మయిన సంసారం బవిచ్ఛిన్న మగుచున్నది. ఇందువలన సంసారబీజభూతములు శోకమోహములు. ఆ శోకమోహంబులనివృత్తి సర్వకర్మసన్న్యాసపూర్వక మయిన యాత్మజ్ఞానము చేతనే గాని యితరముచేతం గానేరదు. కావున సర్వలోకానుగ్రహార్థము దాని నుపదేశింపఁ

గోరినవాఁడై యర్జును న్నిమి త్తీకరించి భగవంతుఁ డగు వాసుదేవుఁడు చెప్పుచున్నాఁడు అశోచ్యా నిత్యాదిగా.

ఆనందగిరికృత టీక.—

ఇదివఱ కైన గ్రంథమున కిది యభిప్రాయ మని చెప్పఁగోరి యాగ్రంథమునందే వాక్యవిభాగమునుగూడఁ దెలియఁజేయుచున్నారు.—ధర్మక్షేత్రే కురుక్షేత్రే అను మొదటిశ్లోకము శాస్త్రమునకు భారతకథతో సంబంధమును దెలుపున దగుటవలన నొకవాక్యము. ‘దృష్ట్వాతు పాణ్డవానీకమ్’ అనునది మొదలు ‘తూష్ణీం బభూవహ’ అనువఱకు నొకవాక్యము. అటుపిమ్మట, ‘ఇదం వచః’ అనువఱకుఁ గల శ్లోకము మఱియొకవాక్య మగు నని విభాగము. ఓయీ! మొదటిశ్లోకము ప్రకృతశాస్త్రమునకు మహాభారతమునందు అవతారిక యగుటవలన ఏకవాక్య మనుట యుక్తము. కడపటిశ్లోకముగూడ అర్జును నూఱడించుట యభిప్రాయముగాఁ గల దగుటవలన నేకవాక్యము గావచ్చును. నడిమి గ్రంథమునకంతయు నేకవాక్యత యెట్లు? అని యాశంకించి యేకార్థక మగుటవలన నేకవాక్యత యని చెప్పుచున్నారు ప్రాణుల అని. శోక = మన స్సంతాపము, మోహ = వివేకము లేకుండుట, ఆదిశబ్దమునకు వాని యవాంతరభేదము లర్థము, శోకమోహములు ఆదులుఁ గలది శోకమోహాది, అదియే, సంసారదుఃఖ = దుఃఖాత్మక మయిన సంసారమునకు, బీజభూత మయినదోషము, దానియొక్క, ఉద్భవమునందు ఉత్పత్తియందు కారణము అహంకార మమకారములు, వానికి హేతువు అవిద్య—శోకమోహాదిక మనెడు సంసారదుఃఖబీజభూత మయిన దోషముయొక్క యుత్పత్తికిఁ గారణ మగు అహంకార మమకారములకు హేతు వగు అవిద్యను అని యన్వయము. సంగ్రహించిన యర్థమును వివరించుచున్నారు.—ఎట్లనఁగా అని. రాజ్య = రాజుయొక్క కర్మము, పరిపాలనము మొదలగునది, గురు = పూజార్హు లగు ద్రోణాదులు, పుత్త్ర = తనకుఁ బుట్టిన అభిమన్యువు మొదలగువారు, మిత్త్ర — ఇతరసంబంధము లేక స్నేహము నకు విషయ మయినవారు గురుపుత్త్ర * ప్రభృతులు, సుహృత్ = ప్రత్యుపకార మపేక్షింపక తామై యుపకారము చేయువారు మనస్సులో ననురాగము గలవారు నగు భగవంతుఁడు మున్నగువారు, స్వజన = జ్ఞాతులగు దుర్యోధనాదులు, సంబంధి= మామ మఱఁది మొదలగు ద్రుపద ధృష్టద్యుమ్నాదులు, బాంధవులయందు = పరం

* అశ్వత్థామ.

పరగాఁ బితృపితామహాదులయం దనురాగము గల రాజులు—వీరియందు, ఈ చెప్పఁ బడిన భ్రాంతిజ్ఞానముచేఁ గలిగిన, స్నేహ = చెలిమి, విచ్ఛేద = వారితో నెడఁబాటు, ఆదిశబ్దముచే, వీరి వధించుటచేఁ బాతకము లోకనింద, అవి యన్నియు. అట్టి సంసారబీజభూతము లయిన తన శోకమోహములు కథ మిత్యాదిగ్రంథముచేఁ దెలుపఁ బడిన వని యర్థము. ఓయీ! ప్రసిద్ధ మయిన మహానుభావముగలవాఁడు వివేకవిజ్ఞానవంతుండు స్వధర్మమునందుఁ బ్రవృత్తుండు నగు నర్జునునియందు అనర్థకారణము లయిన శోకమోహములు సంభావితములు కావు, కావున సంసారబీజము లగు నీశోకమోహము లర్జునునకు సంభవించె ననుట యుపపన్నము కాదు, అని యాశంకించి, అవి వివేకముఁ దిరస్కరించి § విహితాకరణము నిషిద్ధాచరణము చేయించి యనర్థము కలిగించుం గావునఁ గలదు వాని కర్జునునందు సంభావనం బని చెప్పుచున్నారు—శోకమోహములచే నిత్యాదిగా. భిక్షాజీవనాదికమును—భిక్షచే, జీవన=ప్రాణధారణము, ఆదికమును= మొదలుగాఁ గలదానిని. ఆదిశబ్దముచేత సర్వకర్మసన్న్యాసరూప మయిన పారివ్రాజ్యము * ఆత్మధ్యానము మొదలగునవి గ్రహింపఁబడుచున్నవి. మఱియు, 'అర్జునునందుఁ గనఁబడుచున్న శోకమోహములు సంసారబీజము, శోకమోహము లగుటవలన, అస్మదాదినిష్ఠ శోకమోహములవలె' అని కనఁబడిన శోకమోహములను బ్రత్యేకము పక్షముగా గ్రహించి యనుమానము చేయవలె నని చెప్పుచున్నారు—అట్లు ఇత్యాదిగా. శోకమోహాది యనుచోటి యాదిశబ్దముచేత మిథ్యాభిమానస్నేహనిందాదులు గ్రహింపఁబడుచున్నవి. స్వభావంబుననె—చిత్తదోషసామర్థ్యమువలననె యని యర్థము. స్వధర్మమునందుఁ బ్రవృత్తుల మయిన యస్మదాదులకు శోకమోహములచే విహితాకరణాదులు సంభవింపనందున శోకమోహములు సంసారబీజము కా వని యేర్పడుటచే దృష్టాంతమునందు సాధ్యము సిద్ధింప దనఁగా నందుకుఁ జెప్పుచున్నారు—వారు స్వధర్మమునందుఁ బ్రవృత్తులైనను ఇత్యాదిగా. వాఙ్మనఃకాయాదుల అనుచోటి ఆదిశబ్దముచే అవశిష్టము లయిన యింద్రియములు గ్రహింపఁబడుచున్నవి. ఫలాభిసంధి—ఫలమునం దభిలాష. అహంకారము—కర్తను భోక్తను అను నభిమానము. ఇప్పుడు చెప్పినవిధంబున వాఙ్మనఃకాయాదులవ్యాపారం బగునెడ నేమి సిద్ధించు ననఁగాఁ జెప్పుచున్నారు—ఇవ్విధం బగుటచే నిత్యాదిగా.

§ కప్పి.

* యత్యాశ్రమము.

పుణ్యకర్మానుష్ఠానముచే ధర్మాభివృద్ధి యగుటవలన ఇష్ట మయిన దేవాదిజన్మము అందువలన సుఖప్రాప్తి, పాపకర్మానుష్ఠానముచే నధర్మాభివృద్ధి యగుటవలన అనిష్ట మయిన తిర్యగాదిజన్మము అందువలన దుఃఖప్రాప్తి, మిశ్రకర్మానుష్ఠానముచే ధర్మాధర్మములు రెండును అభివృద్ధి నొందుటవలన మనుష్యజన్మము అందువలన సుఖదుఃఖములు రెండును కలుగును, ఏతద్రూప మయిన సంసారము ఎడతెగనిదై యుండు నని యర్థము. అర్జునునకును ఇతరప్రాణులకును శోకమోహములు సంసారబీజ మని యుపపాదించిన దాని నుపసంహరించుచున్నారు—ఇందువలన నని. ఇట్లు ద్వితీయాధ్యాయైకదేశసహిత మయిన ప్రథమాధ్యాయమునకు ఆత్మాజ్ఞానముచేఁ బుట్టిన శోకమోహము లనెడు సంసారబీజమును దెలుపుట యభిప్రాయం బని తెలిపి, ఇఁకమీఁది గ్రంథమునకు సహేతుకసంసారనివృత్తి చేయునట్టి సమ్యక్ జ్ఞానము నుపదేశించుటయందుఁ దాత్పర్యముం జూపుచున్నారు—ఆ శోకమోహంబులనివృత్తి ఇత్యాదిగా. భగవంతుం డర్జునునకే యుపదేశించుటవలన సర్వలోకానుగ్రహార్థ ముపదేశింపఁ గోరినవాఁడై యనుట యుక్తము గా దని యాశంకించి చెప్పుచున్నారు—అర్జునుని అని. ఆ యవస్థయం దర్జునునకు సమ్యగ్జ్ఞానము నుపదేశించుట భగవంతుని యిష్టము గాదు, మ జేమనఁగా, స్వధర్మానుష్ఠానంబువలనఁ జిత్తశుద్ధి నొందిన పిదప నర్జునునకు దాని నుపదేశించుట భగవదుద్దేశం బను నభిప్రాయమునఁ జెప్పఁబడినది—నిమిత్తీకరించి యని.

భా॰ « అందుఁ గొందఱు చెప్పుచున్నారు.—సర్వకర్మసన్న్యాసపూర్వక మయిన కేవల మాత్మజ్ఞాననిష్ఠామాత్రమువలననె కైవల్యము కలుగనే కలుగదు. మఱి యే మనఁగా అగ్నిహోత్రాది శ్రౌతస్మార్తకర్మసహిత మగు జ్ఞానమువలనఁ గైవల్యప్రాప్తి యగును. ఇదియె సమస్తగీతాశాస్త్రమునందును నిశ్చిత మయిన యర్థము ” అని. మఱియు నీయర్థమునకు జ్ఞాపకమునుగూడఁ జెప్పుచున్నారు—‘ అథ చేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ’ * ‘ కర్మణ్యేవాధికార స్తే ’ § ‘ కురు కర్మైవ తస్మాత్త్వమ్ ’ ¶ ఇత్యాదిగా. హింసాదియుక్త మగుటవలన వైదిక మగు కర్మ మధర్మ మను నీ యాశంక చేయఁ దగదు. ఎట్లనఁగా—గురుభ్రాతృపుత్రాది హింసారూప మగు క్షాత్త్రకర్మము యుద్ధము అత్యంత

* ౨-౩౩. § ౨-౪౭. ¶ ౪-౧౫.

క్రూరతర మైనను స్వధర్మ మగుటచే నధర్మము కా దనియు దాని నను ష్ఠింపనియెడ 'తత స్స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి' § అనియుఁ జెప్పినట్టి భగవంతునిచే యావజ్జీవాది శ్రుతివిహితము లయిన స్వకర్మములు పశ్వాదిహింసారూపము లయినను మొదలే అధర్మములు కా వని స్పష్టముగాఁ జెప్పఁబడిన దగుచున్నది—అని.

ఆ. సర్వకర్మసన్న్యాసపూర్వక మయిన కేవల మాత్మజ్ఞానము వలననె కైవల్యప్రాప్తి యనుట గీతాశాస్త్రార్థ మని స్వాభిప్రాయము చెప్పఁబడినది. ఇప్పుడు వృత్తికారుల యభిప్రాయమును నిరసించుటకై యనువాదము చేయుచున్నారు—అందు ఇత్యాదిగా. అందు అను సప్తమిచే నిశ్చిత మయిన శాస్త్రార్థము పరామర్శింపఁ బడుచున్నది. వారి వచనమునే యనువదించుచు మొదట సిద్ధాంతసిద్ధ మయిన యభిప్రాయమును దూషించుచున్నారు—సర్వక ర్మేత్యాదిగా. శ్రౌతకర్ముతో సముచ్చయమును నిరాకరించుటకు మాత్రపదము, స్మార్తకర్ముతో సముచ్చయము నిరసించుటకు ఏవకారము. కేవలశబ్దముచే అభ్యాససంబంధమును నిరాకరించుచున్నారు. అట్లయినయెడ నేవిధముచే జ్ఞానము కైవల్యప్రాప్తి కారణ మగు నని యాశంకించి చెప్పుచున్నారు—మఱి యే మనఁగా నని. అందు కేమిప్రమాణ మని యాశంకించి యీశాస్త్రమే ప్రమాణ మని చెప్పుచున్నారు—సమస్తగీతాశాస్త్రమునందును అని. ఎట్లు ప్రయాజానుయాజాది సాహాయ్యమును బొందియె దర్శపూర్ణమాసాదికము స్వర్గసాధన మగునో అట్లు శ్రౌతస్మార్తకర్మసాహాయ్యము నొందియె బ్రహ్మజ్ఞానము కైవల్యసాధన మగును. బ్రహ్మజ్ఞానము ఇతి కర్తవ్యతాసహితమైయే * స్వఫలసాధక మగును, కారణ మగుటవలన, దర్శపూర్ణమాసాదికమునలె. అని యనుమానప్రమాణము. కావున నీవిధముగా శాస్త్రము జ్ఞానకర్మసముచ్చయమును బోధించునది యని యర్థము. అని యనునది చెప్పుచున్నారు అనుదానితోఁ బూర్వమున కన్వయించుచున్నది. పౌర్వాపర్యము పర్యాలోచించునెడ శాస్త్రము సముచ్చయపర మనుట నిశ్చితము గా దని యాశంకించి చెప్పుచున్నారు—మఱియు నీయర్థమునకు జ్ఞాపకమునుగూడ నని. కేవలజ్ఞానము ముక్తిహేతువు కాదు, మ ఱేమనఁగా కర్మసముచ్చిత మయిన జ్ఞానమే

§ ౨-౩౩.

* దీనిఁ జేసి దీనిఁ జేయవలయు నను అనుపూర్వీరూప మయిన కర్మానుష్ఠానక్రమము ఇతికర్తవ్యత.

ముక్తిహేతు వను నీయర్థమునకు, స్వధర్మము ననుష్ఠింపనియెడఁ బాపము కలుగు ననువచనముయొక్క సామర్థ్యరూప మయిన లింగము జ్ఞాపక మని యర్థము. * శాస్త్రము సముచ్చయపర మనుటయందు లింగమువలె వాక్యముగూడఁ బ్రమాణ మని చెప్పుచున్నారు—కర్మణ్యేవాధికారస్తే అని. ఆ విషయమునందే మఱియొక వాక్యము నుదాహరించుచున్నారు—కురుకర్మైవతస్మాత్త్వమ్ అని. ఓయి! 'మా హింస్యాత్సర్వాభూతాని' ఇత్యాదిగా నిషిద్ధ మగుటవలన హింస యనర్థహేతు వగు నని తెలియవచ్చుటచే దానితోఁగూడిన వైదికకర్మము అధర్మ మగును, కావున నది యనుష్ఠింప రాదు. అట్లు దానికి సాపేక్షజ్ఞానముతో సముచ్చయము సిద్ధింప దని సాంఖ్యమతము నాశంకించి పరిహరించుచున్నారు—హింసాదియుక్త మగుట వలన నిత్యాదిగా. హింసాది యనుచోటి ఆదిశబ్దముచే ఉచ్ఛిష్టభక్షణము గ్రహింపఁ బడుచున్నది. ఈశంక చేయరా దను విషయమునందు ఆకాంక్షాపూర్వకముగా హేతువును జెప్పుచున్నాఁడు—ఎట్లనఁగా నని. స్వధర్మము—స్వశబ్దమునకు క్షత్రియుఁ డర్థము. యుద్ధము చేయనిచో క్షత్రియునకుఁ బ్రత్యవాయము కలుగు నని చెప్పుటవలన ఆయుద్ధ మాక్షత్రియునకు నిత్యముగా నవశ్యకర్తవ్య మని తెలియ వచ్చుటచే గుర్వాదిహింసారూపమయి మిక్కిలి క్రూరకర్మ మయినను యుద్ధము అధర్మము కా దని మఱియొకహేతువును జెప్పుచున్నాఁడు—అది యనుష్ఠింపనియెడ నిత్యాదిగా. ఆచార్యాదిహింసాయుక్తమయి యతిక్రూర మయినను యుద్ధము అధర్మము కా దని వచించుచున్న భగవంతునిచే హింసాదియుక్తము లయినను శ్రౌత కర్మములు అంతకుమున్నే యధర్మము కా వని స్పష్టముగా నుపదిష్ట మగుచున్నది. మా హింస్యాత్తను సామాన్యశాస్త్రము వ్యర్థ మయిన హింసను నిషేధించుచున్నది. క్రతువిషయంబున విధింపఁబడిన హింస దానికి విషయము కాదు. కావున వైదిక కర్మము ననుష్ఠించుట కనుపపత్తి లే దని యర్థము. వాక్యాంతమున అని అను దానిచే జ్ఞానకర్మసముచ్చయమువలనఁ గైవల్యము సిద్ధించు నని యుపసంహారము చేయఁబడుచున్నది.

భా. అది సరికాదు. బుద్ధిద్వయాశ్రయము లైన జ్ఞానకర్మనిష్ఠలకు విభాగము చెప్పఁబడినది. అశోచ్యాన్ అనునది మొదలుకొని స్వధర్మమపి చావేక్ష్య అనుశ్లోకమువఱకుఁ గల గ్రంథముచే బరమార్థతత్త్వ

* ౨—౩౩ నకు.

నిరూపణ మేది భగవంతునిచేఁ జేయఁబడినదో అది సాంఖ్యము. తద్విషయమయిన బుద్ధి, ఆత్మకు జన్మాది షడ్వికారములు లేకుండుటచే, ఆత్మ అకర్త యని, ప్రకరణార్థనిరూపణంబువలన, ఏది పుట్టుచున్నదో అది సాంఖ్యబుద్ధి. అది యేజ్ఞానుల కుపచిత మగునో వారు సాంఖ్యులు. బుద్ధి

ఈ బుద్ధి యుదయించుటకు మున్ను ఆత్మ దేహాదివ్యతిరిక్తుఁడు కర్తృత్వభోక్తృత్వాదులు గలవాఁ డను తలంపుతో ధర్మాధర్మవివేకపూర్వకముగా మోక్షసాధనానుష్ఠానము యోగము. తద్విషయ మయిన బుద్ధి యోగబుద్ధి. అది యేకర్ముల కుపచిత మగునో వారు యోగులు. అట్లు భగవంతునిచే "ఏషా తే ఽభిహితా సాఙ్ఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు" * అని రెండుబుద్ధులు విభక్తములుగాఁ జెప్పఁబడినవి. అందులో సాంఖ్యబుద్ధ్యాశ్రయ మయిన జ్ఞానయోగనిష్ఠను సాంఖ్యులకు విభక్తముగాఁ జెప్పఁబోవుచున్నాఁడు 'పురా వేదాత్మనా మయా ప్రోక్తా' అని. § అట్లు యోగబుద్ధ్యాశ్రయ మయిన కర్మయోగనిష్ఠనుగూడఁ గర్మయోగులకు విభక్తముగాఁ జెప్పఁబోవుచున్నాఁడు 'కర్మయోగేన యోగినామ్' $ అని. ఇట్లు సాంఖ్యబుద్ధిని యోగబుద్ధిని ఆశ్రయించి రెండునిష్ఠలను విభక్తములుగా భగవంతుఁడే వచియించెను, అకర్తృత్వైకత్వబుద్ధ్యాశ్రయ మయిన జ్ఞానమును కర్తృత్వానేకత్వబుద్ధ్యాశ్రయ మయిన కర్మమును ఏకపురుషునందు సంభవింప వని తెలిసినవాఁ డగుటచేత. ఎట్లీవిభాగ మిచటఁ జెప్పఁబడెనో, అట్లే శతపథీయ బ్రాహ్మణమందును జెప్పఁబడియున్నది. ఎట్లనఁగా—"ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తో బ్రాహ్మణాః ప్రవ్రజన్తి" ¶ అని సర్వకర్మసన్న్యాసమును విధించి, తచ్ఛేషమయిన "కిం ప్రజయా కరిష్యామో యేషాం నో ఽయమాత్మా ఽయం లోకః" ♦ అనువచనముచే జ్ఞానయోగము చెప్పఁబడినది. అందే "ప్రాగ్దారపరిగ్రహాత్ పురుష శ్చాత్మా ప్రాకృతో ధర్మజిజ్ఞాసోత్తరకాలం లోక

* ౨–౩౯.

§ మున్ను వేదరూపుఁడ నైన నాచేఁ జెప్పఁబడినది.

$ ౩–౩.

¶ ఈ నిత్యజ్ఞానస్వరూపుఁడై యకర్తయైన యాత్మయొక్క జ్ఞానమును గోరినవా రగు బ్రాహ్మణులు సన్న్యసింపవలెను.

♦ ఏ మాకు ఈ యాత్మయే యీ లోక మగునో అట్టి మేము సంతతిచే నేమి చేయుదుము.

త్రయసాధనం పుత్త్రం, ద్విప్రకారంచ విత్తం మానుష్యం దైవంచ, తత్త్రమానుష్యం విత్తం కర్మరూపం పితృలోకప్రాప్తిసాధనం, విద్యాచ దైవం విత్తం దేవలోకప్రాప్తిసాధనం, సో ఽకామయత" * అని యవిద్యాకామవంతునకే శ్రౌతాదిసమస్తకర్మములును అని తెలుపఁబడినది. 'తేభ్యో వ్యుత్థాయ ప్రవ్రజన్తి' § అని సన్న్యాసం బాత్మ యను లోకమునుమాత్రమే కోరునట్టి యకామునకు విధింపఁబడినది. అట్టి యీ విభాగవచనము అనుపపన్న మగును, శ్రౌతకర్మమునకును జ్ఞానమునకును సముచ్చయం బనుట భగవంతుని యభిప్రాయ మగుపక్షమున.

ఆ. ఇఁక సిద్ధాంతము.—అందు "బ్రహ్మజ్ఞానము ఇతి కర్తవ్యతా సహితమైయే స్వఫలసాధక మగును, కారణ మగుటవలన, దర్శపూర్ణమాసాదికమువలె" అను ననుమాన మేది ప్రయోగింపఁబడెనో దాని నిరాకరించుచున్నారు—అది సరి కాదు అని. ఎట్లనఁగా శుక్తికాదిజ్ఞానము అజ్ఞాననివృత్తిరూప మయిన స్వఫలమును సాధించుటయందు సహాయమును దేనినిగూడ నపేక్షింపదు. కావున వ్యభిచారమువలనఁ గారణత్వము సాధకము కా దని యర్థము. ‡ మఱియు యీశాస్త్ర

---

* వివాహమునకు మునుపు ప్రాకృతజీవరూపుఁ డయిన పురుషుఁడు ధర్మజిజ్ఞాసయయినపిమ్మట, లోకత్రయసాధన మయిన పుత్త్రుని-౧, రెండువిధము లగు మానుష్యము దైవము అను విత్తమును-౨, అందు మానుష్యవిత్తము పితృలోకప్రాప్తిసాధన మయిన కర్మము, దైవవిత్తము దేవలోకప్రాప్తిసాధన మయిన విద్య—ఈ మూఁటిని అతఁడు కామించెను.

§ ఆ కర్మములనుండి లేచి సన్న్యసింపవలెను.

‡ శుక్తిక యనఁగా ముత్తెపుచిప్ప. ముత్తెపుచిప్పయొక్క అజ్ఞానముచేఁ గదా దానియందు ఇది రజతము అను భ్రమజ్ఞానము కలుగుచున్నది. ఈ యజ్ఞానము శుక్తికాజ్ఞానముచే—ఇది ముత్తెపుచిప్ప యని తెలియుటచే నశించును. కావున ముత్తెపుచిప్ప యజ్ఞానముయొక్క నివృత్తికి శుక్తికాజ్ఞానము కారణము, శుక్తికాజ్ఞానమునకుఁ దదజ్ఞాననివృత్తి ఫలము. శుక్తికాజ్ఞానము ఇతర మయిన సహాయమును దేనిని అపేక్షింపకయే తదజ్ఞాననివృత్తిని జేయుచున్నది. అనఁగా ఇది ముత్తెపుచిప్ప అని తెలిసినంతనె తదజ్ఞాననివృత్తి యగుచున్నది. వ్యభిచార మనఁగా సాధ్య మున్నచో హేతువు లేకుండుట. ఇచట సాధ్యము ఇతి కర్తవ్యతాసహితమైయె ఫలసాధక మనుట, అనఁగా, సహాయసహితమైయె ఫలసాధకమనుట, హేతువు కారణత్వము. ఇచట శుక్తికాజ్ఞానమునందు సహాయసహితమైయె ఫలసాధకత్వము అను సాధ్యము లేనిచోట, కారణత్వ మను హేతు వున్నది. కావున ఈ హేతువునకు వ్యభిచారము అను దోషము కలదు. అందువలన నది సరియైన హేతువు కాఁ జాలదు. సరియైన హేతువు లేకుండుటచే 'బ్రహ్మజ్ఞానము ఇతి కర్తవ్యతాసహితమైయె స్వఫలసాధకము' అను అనుమానము సరికాదు.

మునందు సముచ్చయమే ప్రతిపాదింపఁబడినది యని యేది ప్రతిజ్ఞ చేయఁబడినదో అదియు విభాగవచనవిరుద్ధ మని చెప్పుచున్నారు—బుద్ధిద్వయాశ్రయము లిత్యాదిగా. సాంఖ్యబుద్ధి యోగబుద్ధి యని బుద్ధిద్వయము, * అందు సాంఖ్యబుద్ధ్యాశ్రయ మయిన జ్ఞాననిష్ఠను వ్యాఖ్యానము చేయుటకు సాంఖ్యశబ్దార్థము చెప్పుచున్నారు—అశోచ్యాన్ అనునది మొదలుకొని ఇత్యాదిగా. అశోచ్యాన్ అనుశ్లోకము మొదలుకొని స్వధర్మ మపి చావేక్ష్య § అను శ్లోకమువఱకుఁ గలవాక్యము ఎంత గ్రంథ మగునో అంత గ్రంథముచేతఁ బరమార్థభూత మయిన ఆత్మతత్త్వ మేది భగవంతునిచేత నిరూపింపఁ బడెనో అది సాంఖ్యము, చక్కఁగా వ్యాఖ్యానము చేయఁబడుచున్నది—విశదము చేయఁబడుచున్నది కావున సంఖ్య యనఁగా వేదప్రోక్త మయిన సమ్యగ్బుద్ధి. $ దానిచే ప్రకాశ్య ¶ మగుటచే తత్సంబంధి యగు తత్త్వము సాంఖ్య మని యర్థము. సాంఖ్యశబ్దార్థము ప్రతిపాదించి తత్ప్రకాశక మయిన బుద్ధిని అట్టి బుద్ధి గల సాంఖ్యులను వివరించుచున్నారు—తద్విషయ మయిన బుద్ధి ఇత్యాదిగా—తద్విషయ మయిన బుద్ధి సాంఖ్యబుద్ధి యని యన్వయము. ఆబుద్ధినే విశదీకరించుచున్నారు—ఆత్మకు ఇత్యాదిగా. “న జాయతే మ్రియతే వా విపశ్చిత్” ♦ ఇత్యాది ప్రకరణముయొక్క యర్థము నిరూపించుటవలన ఆత్మయందు భావవికారములు ఆఱును సంభవింపకుండుటచే ‘ఆత్మ కూటస్థుఁడు’ అని యేబుద్ధి పుట్టుచున్నదో అది సాంఖ్యబుద్ధి. దానియందు ఆసక్తు లగు సన్న్యాసులు సాంఖ్యు లని యర్థము. ఇఁక యోగబుద్ధ్యాశ్రయ మయిన కర్మనిష్ఠను వ్యాఖ్యానింపఁ గోరినవారై యోగశబ్దార్థముఁ జెప్పుచున్నారు—ఈబుద్ధి యుదయించుటకు మున్ను ఇత్యాదిగా. యథోక్త మయిన సాంఖ్యబుద్ధి పుట్టిన పిదప, యోగమునకు దానితో విరోధ మగుటవలన యోగము ననుష్ఠించుట సంభవింపదు. మఱియు నీసాంఖ్యబుద్ధి యోగబుద్ధినివర్తకము. కావున సాంఖ్యబుద్ధి పుట్టుటకు మునుపే, ఆత్మ దేహాదివ్యతిరిక్తుఁడు కర్త భోక్త ఇత్యాది విశ్వాసముతో ధర్మాధర్మములను వివేచించి, అట్టి యీశ్వరారాధనరూప మగు కర్మముచే పురుషుఁడు మోక్షముకొఱకు యుజ్యతే—యోగ్యుఁ డగుచున్నాఁ డని

---

* బుద్ధిద్వయము ఆశ్రయము విషయముగాఁ గలవి బుద్ధిద్వయాశ్రయములు.

§ ౨-౩౧.

$ సమ్యక్ జ్ఞానము.

¶ తెలుపఁదగినది.

♦ ౨-౨౦.

యోగశబ్దార్థము, మోక్షసిద్ధికొఱకుఁ బరంపరాసాధన మయిన పూర్వోక్తధర్మము ననుష్ఠించుట యోగ మని యర్థము. ఇఁక యోగబుద్ధిని విభజించి యోగులను విభజించుచున్నారు—తద్విషయ మయిన బుద్ధి ఇత్యాదిగా. ఈ చెప్పఁబడిన బుద్ధిద్వయమందు భగవంతుని సమ్మతిని జూపుచున్నారు—అట్లు భగవంతునిచే నిత్యాదిగా. సాంఖ్యబుద్ధ్యాశ్రయము జ్ఞాననిష్ఠ యనుటయు భగవంతునకు సమ్మత మని చెప్పుచున్నారు—అందులో నిత్యాదిగా. జ్ఞానయోగము—జ్ఞానమే యోగము, ఎట్లనఁగా ఈ జ్ఞానముచే బ్రహ్మముతో యుజ్యతే—తదాత్మ్యతను బొందుచున్నాఁడు, అజ్ఞానయోగముచేత, సాంఖ్యులకు = సన్న్యాసులకు, నిష్ఠ యనఁగా నిశ్చయముచే ఉనికి, తత్పరత్వముచే పరిసమాప్తి, దానిని, కర్మనిష్ఠకన్న భిన్నమునుగా, రెండునిష్ఠలలో నిష్కర్షించి భగవంతుఁడు చెప్పఁబోవుచున్నాఁ డని యభిప్రాయము. «లోకే ఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయా ఽనఘ। జ్ఞానయోగేన సాఙ్ఖ్యానామ్"* అనునీ యుక్తార్థవిషయ మయిన వాక్యము నర్థముచే ననువదించుచున్నారు. § పురా వేదాత్మ నేత్యాదిగా. యోగబుద్ధ్యాశ్రయము కర్మనిష్ఠ యను విషయమునందుఁ గూడ భగవంతుని యనుమతిని జూపుచున్నారు—అట్లు ఇత్యాదిగా. కర్మయోగము—కర్మమునునదియే యోగము, ఎట్లనఁగా, ఈ కర్మముచేఁ జిత్తశుద్ధిద్వారమున మోక్షహేతు వగు జ్ఞానమునకుఁ బురుషుఁడు యుజ్యతే—యోగ్యుఁ డగుచున్నాఁడు, ఆకర్మయోగముచే నిష్ఠను కర్ములకు ♦ జ్ఞాననిష్ఠకన్న భిన్నమునుగా ‹కర్మయోగేన యోగినామ్› అనుదానిచే భగవంతుఁడు చెప్పఁబోవుచున్నాఁ డని యర్థము. బుద్ధిద్వయాశ్రయ మయిన నిష్ఠాద్వయమును భగవంతునిచే విభజించి చెప్పఁబడినదానినుపసంహరించుచున్నారు—ఇట్లు ఇత్యాదిగా. ఏ యనుపపత్తిచే భగవంతుఁడు రెండు నిష్ఠలను విభజించి చెప్పె నని యాశంకించి చెప్పుచున్నారు—అకర్తృత్వైకత్వేత్యాదిగా. కర్మము, ఆత్మ కర్తృత్వాదులు అనేకత్వము గలవాఁ డను బుద్ధి యాశ్రయముగాఁ గలది. జ్ఞానమో, ఆత్మ అకర్తృత్వము ఏకత్వము గలవాఁ డను బుద్ధి యాశ్రయముగాఁ గలది. ఆరెండును ఇట్లు పరస్పరవిరుద్ధము లయిన సాధనములచే సాధ్యము లగుటవలన ఒకచేయవస్థలో నుండు పురుషునందు సంభవింపవు, కావున యుక్తమే వానికి విభాగము చెప్పుట యని యర్థము. భగవంతుఁడు వచియించిన

* 3_33.

§ ఆ వాక్యముయొక్క యభిప్రాయముఁ జెప్పుచున్నారు.

♦ కర్మము చేయువారికి.

విభాగమునకు మూలముగా శ్రుతి నుదాహరించుచున్నారు—ఏతమేవ ఇత్యాదిగా. ప్రకృత మయిన ఆత్మను నిత్యజ్ఞానస్వరూపునిఁ దెలిసికొనుటకుఁ గోరినవారు, మూఁడు విధము లయిన కర్మఫలమునందును ఆశ లేనివారై సమస్తకర్మములను విడిచి జ్ఞాననిష్ఠు లగుదు రని ప్రవ్రజన్తి అనుచోటి అయిదవలకారమయిన లేట్ అనుదాని గ్రహించుటచే సన్న్యాసవిధిని వివక్షించి, తచ్ఛేషమైన—ఆ సన్న్యాసవిధికే అర్థవాద మయిన కిం ప్రజయేత్యాదివచనముచే మోక్షఫలక మగు జ్ఞానము చెప్పఁబడినది యని యర్థము. ఓయి! ఫలము లేదను కారణమువలన 'ప్రజతో నేమి చేయుదుము' అను నాక్షేప ముపపన్నము కాదు, ఏల యనఁగా పుత్త్రునిచే ఇహలోకముయొక్క జయము అను ఫలము కలుగు నని వాక్యాంతరము చెప్పుచున్నది, అని యాశంకించి విద్వాంసులకుఁ బ్రజాసాధ్య మయిన మనుష్యలోకము ఆత్మకన్న భిన్నము కాదు, ఆత్మయో సాధ్య మయిన వస్తువు కాదు, కావునఁ బ్రజాక్షేపము యుక్తియుక్త మని వివక్షించి చెప్పుచున్నారు—యేషాం నో௨యమాత్మా௨యం లోకః అని. ఆ బ్రాహ్మణమునందే కర్మనిష్ఠాప్రతిపాదకవాక్యమును జూపుచున్నారు—అందే యిత్యాదిగా. ప్రాకృతః—తత్త్వము తెలియనివాఁ డగుటచే నజ్ఞాని, అట్టివాఁడు బ్రహ్మచారియయి గురువునొద్ద యథావిధిగా వేదాధ్యయనము చేసి అర్థజ్ఞానము కొఱకు ధర్మజిజ్ఞాసను గావించి యటుపిమ్మటను మూఁడులోకములను బొందుటకు సాధనము లయిన పుత్త్రాదులను మూఁటిని అతఁడు కామించెను. 'జాయా మే స్యాత్'* ఇత్యాదిగాఁ గామించె నని శ్రుతియందుఁ జెప్పఁబడిన దని యర్థము. విత్తమును విభాగించుచున్నాఁడు—ద్విప్రకారమ్ అని. ఆ రెండువిధములనే చెప్పుచున్నాఁడు మానుష్యమ్ ఇత్యాదిగా. మానుష్యవిత్తమును వివరించుచున్నాఁడు—కర్మరూపమ్ అని. దాని ఫలమును జెప్పుచున్నాఁడు—పితృలోకప్రాప్తిసాధనమ్ అని. దైవవిత్తమును వివరించుచున్నాఁడు—విద్యా చ అని. దాని ఫలమును జెప్పుచున్నాఁడు—దేవలోకప్రాప్తిసాధనమ్ అని. కర్మనిష్ఠను బ్రతిపాదించునదిగా నుదాహరించిన శ్రుతికిఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు—అవిద్యాకామవత ఏవ కే యిత్యాదిగా. అజ్ఞానియై కామనావిశిష్టుఁ డైనవానికే కర్మము లని సో௨కామయతేత్యాదివచనముచేఁ దెలుపఁబడినవి యని యర్థము. జ్ఞాననిష్ఠను బ్రతిపాదించునదిగా నుదాహరించిన శ్రుతికిఁగూడఁ దాత్పర్యమును జెప్పుచున్నారు—తేభ్యో వ్యుత్థాయ ప్రవ్రజన్తి అని. కర్మములందు నిరిచ్ఛుఁ డైనవానికే సన్న్యాసపూర్వక

* [illegible]

మగు జ్ఞాననిష్ఠ యని మున్నుదాహరించిన శ్రుతిచేఁ దెలుపఁబడినది యని యర్థము. అవస్థాభేదముచేత జ్ఞానకర్మములకు వేఱువేఱు అధికారు లని శ్రుతియందుఁ జెప్పఁబడుటవలన ఆశ్రుతి మూలముగాఁ గల భగవంతుని విభాగవచనముచేత గీతాశాస్త్రము సముచ్చయపరం బను ప్రతిజ్ఞ బాధిత మగుచున్న దని సాధింపఁబడినది. మఱియు సముచ్చయము జ్ఞానమునకు శ్రౌతకర్మముతోనా? స్మార్తకర్మముతోనా? శ్రౌతకర్మముతో నన్నపక్షమున అందుకుఁ జెప్పుచున్నారు—అట్టి యీవిభాగవచనము ఇత్యాదిగా.

భా. మఱియును ఆపక్షమున * 'జ్యాయసీ తే కర్మణస్తే' ఇత్యాది యగు నర్జునునిప్రశ్న ముపపన్నము కాదు. జ్ఞానకర్మము లేకపురుషునిచే ననుష్ఠింప శక్యములు గా వనియు కర్మముకంటె జ్ఞానము శ్రేష్ఠ మనియు, మున్ను భగవంతుఁడు చెప్పకయుఁ దాను వినకయు నున్నపక్షమున నర్జునుం డెట్లు భగవంతునియందు దతఁడు చెప్పినట్లుగా నసత్యము నారోపించును 'జ్యాయసీ చేత్ కర్మణస్తే మతా బుద్ధి ర్జనార్దన । తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ' § అని? మఱియు జ్ఞానకర్మముల సముచ్చయము సర్వజనులకును ఉద్దేశింపఁబడిన దగునేని అర్జునునకును అది యుద్దేశింపఁబడినదియే కావలెను. అప్పుడు 'యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్' ‖ అని యెట్లు రెండు నిష్ఠల నుపదేశింపఁగా నర్జునుం డొకదానిగుఱించియె ప్రశ్న చేయును? వైద్యుఁడు పిత్తప్రశమనార్థమయి యొకనికి మధురవస్తువును శీతలవస్తువును జేర్చి భుజింపు మని యుపదేశింపఁగా ఆరెంటిలో నేది పిత్తప్రశమనము చక్కఁగాఁ జేయునో చెప్పు మని యడుగుట కవకాశము లేదు గదా! ఇఁక నర్జునుండు భగవంతుఁడు చెప్పినయర్థమును జక్కఁగా గ్రహింపకపోవుటవలన నిట్టిప్రశ్న చేసె నని కల్పింపవలెను. అట్లయినను, భగవంతుఁడు ప్రశ్న కనురూపముగా 'నేను జ్ఞానకర్మముల సముచ్చయము చెప్పితిని. ఏల యిట్లు నీవు భ్రాంతుఁడ వయితివి?' అని యుత్తర మీయవలెను. కాని, అడిగినదానికి భిన్నముగా 'రెండు

* జ్ఞానకర్మసముచ్చయపక్షమున.

§ ౩-౧.

‖ ౫-౧.

నిష్ఠలు నాచే పూర్వము చెప్పఁబడినవి' అని అననురూప మయిన యుత్తరము చెప్పుట యుక్తము కాదు.

ఆ. సముచ్చయ మభిప్రాయ మగుపక్షమున అర్జునునిప్రశ్న యనుపపన్న మగు నను మఱియొకదోషముఁ జెప్పుచున్నారు—మఱియును ఇత్యాదిగా. ఆ యనుపపత్తినే వివరించుచున్నారు—జ్ఞానకర్మము లేక పురుషునిచే నిత్యాదిగా. సముచ్చయమే శాస్త్రార్థ మని భగవంతుని యభిప్రాయ మగుపక్షమున జ్ఞానకర్మములు రెండును ఒక్కపురుషుఁడే యనుష్ఠింపవలె ననియే భగవంతుఁడు చెప్పియుండవలెను. అట్లే అర్జునుఁడును విని యుండవలెను. అట్లుండఁగా భగవంతుఁడు చెప్పనిదియుఁ దాను విననిదియు నగు ఏకపురుషానుష్ఠేయత్వాసంభవమును * భగవంతుఁడు చెప్పినట్లుగా నతనియందు నర్జునుం డసత్యము నెట్లారోపించును? అట్లారోపింపనియెడ, 'ఏమని నన్ను అతిక్రూర మగు యుద్ధరూప మయిన కర్మమునందే నియోగించుచున్నావు?' అను ప్రశ్న కవకాశము కలుగదు. కావున నీప్రశ్నను బర్యాలోచింపఁగా అడిగినవానికిని చెప్పినవానికిని సముచ్చయము శాస్త్రార్థ మను నభిప్రాయము లే దని తోఁచుచున్న దని యర్థము. మఱియును సముచ్చయపక్షమున, కర్మముకంటె జ్ఞానము శ్రేష్ఠ మనుటను భగవంతుఁడు పూర్వము చెప్పని దానిని తాను వినని దానిని ఎట్లీ యర్జునుఁడు భగవంతునియం దారోపింపవచ్చును? కావున భగవంతుఁడు కర్మముకన్న జ్ఞాన మధికముగాఁ జెప్పినట్లు శ్రోత యనువదించుట యనుచిత మని చెప్పుచున్నారు—కర్మముకంటె జ్ఞానము శ్రేష్ఠ మనియు అని. సముచ్చయము శాస్త్రార్థ మగుపక్షమున పంచమాధ్యాయాదిని అర్జునుఁడు గావించిన ప్రశ్న యనుపపన్న మగును, ఈ కారణమువలనఁగూడ సముచ్చయము గీతాశాస్త్రాభిప్రాయ మనుట సంభవింప దని చెప్పుచున్నారు—మఱియు నిత్యాదిగా. ఓయి! సముచ్చయము సర్వజనులకును జెప్పఁబడిన దైనను అర్జునునకుమాత్రము చెప్పఁబడినది కాదు, అందువలన నతనిప్రశ్న యుపపన్న మగు నని యాశంకించి చెప్పుచున్నారు—జ్ఞానకర్మములసముచ్చయము ఇత్యాదిగా. ఏతయోః—కర్మము కర్మత్యాగము అను నీరెంటిలో నని యర్థము. § ఓయీ! కర్మముకన్నను కర్మత్యాగ పూర్వక మయిన జ్ఞానము ప్రధాన మగుటచే శ్రేష్ఠ మగును, అందువలన దానివిషయమయి ప్రశ్న యుపపన్నము కావచ్చు ననఁగా, అట్లు కా దని చెప్పుచు

* ఒక్కపురుషుని కనుష్ఠింప శక్యముగా దనుటను.

§ ౫-౧.

న్నారు—వైద్యుఁడు ఇత్యాదిగా. ఆవిధముననె సముచ్చయము పురుషార్థసాధన మని భగవంతుఁ డుపదేశింపఁగా రెంటిలో నొకదానివిషయమయి ప్రశ్న సంభవింప దని భావము. సముచ్చయమునే భగవంతుఁడు చెప్పినను అది తెలియకపోవుట వలన నర్జునుఁ డట్లు ప్రశ్న చేయవచ్చు నని యాశంక చేయుచున్నారు—ఇఁక నిత్యాదిగా. తెలియకపోవుటచేఁ బ్రశ్న చేసె ననుట నంగీకరించియుగూడ నిరాకరించుచున్నారు—అట్లయినను ఇత్యాదిగా. భగవంతునకు భ్రాంతి లేకపోవుటచేఁ దాను ముందు వెనుక చెప్పిన విషయములస్మృతి గలుగుటవలన నని యర్థము. ప్రశ్నానురూపమైన యుత్తరమును జూపుచున్నారు—నేను జ్ఞానకర్మంబుల ఇత్యాదిగా. అననురూపమయిన యుత్తరమును జూపుచున్నారు—కాని ఇత్యాదిగా. ఉత్తరము ప్రశ్నానురూపము కా దనుటను స్పష్టీకరించుచున్నారు—అడిగినదానికి భిన్నముగా నని.

భా. స్మార్తకర్మముతోమాత్రమె జ్ఞానమునకు సముచ్చయ మని చెప్పినను ఈ విభాగవచనాదికము సర్వము నుపపన్నము కాఁ జాలదు. మఱియు నాపక్షమున క్షత్త్రియునకు యుద్ధము స్మృతిప్రోక్త మయిన కర్మము స్వధర్మము అని తెలిసినట్టి యర్జునుఁడు 'తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి' అని భగవంతు నాక్షేపించుట యనుపపన్న మగును. అందువలన గీతాశాస్త్రమునందు ఈషన్మాత్ర మయినను శ్రౌతకర్మముతోఁగాని స్మార్తకర్మముతోఁగూడ ఆత్మజ్ఞానమునకు సముచ్చయముం జెప్పనిచేతనుం జూప నలవి గాదు.

ఆ. శ్రౌతకర్మముతో జ్ఞానమునకు సముచ్చయం బనుపక్షమును నిరాకరించి రెండవపక్షమును నిరాకరించుచున్నారు—స్మార్తకర్మముతో నిత్యాదిగా. విభాగవచనాదికము—విభాగవచన = శ్రుతిస్మృతులందు జ్ఞానకర్మములకు విభాగము చెప్పుట, ఆదికము = మొదలుగాఁ గలది, అనఁగా జ్ఞానము శ్రేష్ఠ మనుట, పంచమాధ్యాయమొదలు నర్జునుని ప్రశ్న, భగవంతునియుత్తరము; ఇది సర్వంబును, శ్రౌతకర్మముతో జ్ఞానమునకు సముచ్చయపక్షంబున విరుద్ధ మగునట్లు, స్మార్తకర్మముతో జ్ఞానమునకు సముచ్చయం బనుపక్షమునందుఁగూడ విరుద్ధ మగు నని యర్థము. ఈ రెండవపక్షము సంభవింప దనుటకు మఱియొక హేతువునుగూడఁ జెప్పుచున్నారు—మఱియు నిత్యాదిగా. సముచ్చయపక్షంబునందుఁ బ్రశ్నప్రతివచనము లనుపపన్నము లగుటవలన ఈ గీతాశాస్త్రము సముచ్చయప్రతిపాదకము కా దని యుపసంహరించు

చున్నారు—అందువలన నిత్యాదిగా. పరిశుద్ధబ్రహ్మాత్మజ్ఞానము, స్వఫలసిద్ధియందు సహాయాపేక్ష గలది కాదు, అజ్ఞాననివృత్తియె ఫలముగాఁ గలది యగుటవలన, రజతాది యథార్థజ్ఞానమువలె; లేక; బంధము, సహాయము నపేక్షింపని జ్ఞానముచే నివర్తింపఁబడును, అజ్ఞానాత్మక మగుటవలన, రజ్జుసర్పమువలె; అని భావము.

భా. ఇఁక, నెవ్వఁ డజ్ఞానమువలనను రాగాదిదోషములవలనను గర్మమునందుఁ బ్రవర్తించి యజ్ఞము దానము తపస్సు మొదలగువానిచే అంతఃకరణశుద్ధి నొందినవాఁడై పరమార్థతత్త్వవిషయ మగు జ్ఞానమును 'ఒక్కఁడె ఇదంతయు బ్రహ్మము అకర్తయు' అనుదానిఁ బొందెనో వానికిఁ గర్మమును గర్మప్రయోజనంబును నివృత్తము లైనను అతఁడు లోకసంగ్రహముకొఱకు మునుపటియట్లు కర్మమునందుఁ బ్రవర్తించుచుండెనేని అట్టివానియం దేది ప్రవృత్తిరూపము కనఁబడునో అది కర్మము కాదు. అట్టిదానితో జ్ఞానమునకు సముచ్చయము చెప్పఁ దగదు. ఎట్లు భగవంతుం డగు వాసుదేవుఁడు చేయు క్షాత్త్రకర్మము పురుషార్థసిద్ధికొఱకు జ్ఞానముతో సముచ్చితము కాదో అట్లు అజ్ఞాని చేయుకర్మముగూడ జ్ఞానముతో సముచ్చితము కాదు. ఏల యనఁగా ఫలాభిసంధి లేకుండుటయు నహంకారము లేకుండుటయు రెండుస్థలములందును సమానము. తత్త్వవేత్త 'నేను జేయుచున్నా' నని తలంపఁడు. తత్ఫలమునుం గోరఁడు. మఱియు నెట్లు ఎవ్వఁడైనను స్వర్గాదికామార్థియై యగ్నిహోత్రాది కర్మము అను ధర్మము ననుష్ఠించుటకు అగ్న్యాధానము గావించుకొని కామ్య మయిన యగ్నిహోత్రాదికమునందే ప్రవర్తించినవాఁడై సగము అనుష్ఠించి, యంత నాకోరికె నశించి నప్పటికిని, ఆ యగ్నిహోత్రాదికమునే యనుష్ఠించుచుండునేని, అతఁడు చేయు నాయగ్నిహోత్రాదికము కామ్యము కాదో, అట్లు ఆతత్త్వవేత్త చేయునదియుఁ గర్మము కాదు. అట్లు తెలుపుచున్నాఁడు భగవంతుఁడు 'కుర్వన్నపి నకరోతి నలిప్యతే'* అని యచ్చటచ్చట.

ఆ. ఓయీ! 'కుర్యాద్విద్వాం స్తథా౽సక్తశ్చికీర్షు ర్లోకసంగ్రహమ్' § అని చెప్పఁబోవుటవలన ఎట్లు గీతాశాస్త్రమునందు సముచ్చయము లే దనవచ్చును?

---

* చేయుచున్నను జేయువాఁడు కాఁడు, అంటఁడు.

§ 3-౨౫.

అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు—ఇఁక నెవ్వఁడు ఇత్యాదిగా. చోదనామాత్రము చొప్పున విధినిబట్టి యనుష్ఠించిన కర్మమే ధర్మ మగుం గాని వ్యాపారమాత్రము ధర్మము కాదు. తత్త్వవేత్తయో వర్ణాశ్రమాభిమానము లేనివాఁ డగుటచే, నత నికి 'నే నధికారము కలవాఁడను' అను నభిమానము లేదు. కావున అవిద్యాలే శమువలనఁ బుట్టుచున్న వాని వాగాదివ్యాపారములు కర్మాభాసములే కాని కర్మములు కాఁ జాలవు. అందువలన కుర్యా ద్విద్వా నిత్యాదివాక్యము సముచ్చయము బోధిం చునది కా దని భావము. సాంసారికజ్ఞానము కా దని చెప్పుచున్నారు—పరమార్థ తత్త్వవిషయ మని. అజ్ఞానమునే తెలుపుచున్నారు—ఒక్కటే యిత్యాదిగా. ప్రవృత్తి రూపము—ప్రవృత్తిసదృశము, ఆభాస మయిన ప్రవృత్తి యనుట. కర్మాభాసము యాదృచ్ఛిక * మగుటచే దానితో సముచ్చయము మోక్షమును కలిగించు నని వచించుట యుక్తము కా దని యర్థము. మఱియు, జ్ఞానియొక్క వాగాదిప్రవృత్తి జ్ఞానముతో సముచ్చితము కాదు, ఏల యనఁగా, ఫలాభిసంధిలేని ప్రవృత్తి యగుట వలనను అహంకారములేని ప్రవృత్తి యగుటవలనను, భగవంతుని ప్రవృత్తివలె నని చెప్పుచున్నారు—ఎట్లు భగవంతుం డిత్యాదిగా. ఈ చెప్పిన రెండుహేతువులును అసిద్ధము లని యాశంకించి దానిఁ బరిహరించుచున్నారు—తత్త్వవేత్త ఇత్యాదిగా. కూటస్థ మయిన బ్రహ్మమే నే నని తలంచుతత్త్వవేత్త ప్రవృత్తినిగాని తత్ఫలమును గాని తనవిగాఁ దలంపఁడు. ఏల యనఁగా రూపాదికమునకుంబోలె దృశ్యమునకు ద్రష్టృధర్మము పొసఁగదు. మఱి యేమనఁగా నతనికిఁ గార్యకరణసంఘాతరూపము గానే ప్రవృత్త్యాదికము కలుగుచుండును. కావునఁ దత్త్వవేత్తకుఁ బరోపదేశము భిక్షాటనము మొదలగువానియం దహంకారమును తృప్త్యాదిఫలమునం దభిసం ధియు లేకుండుటవలన హేతుద్వయము సిద్ధమే యని యర్థము. ఓయీ! జ్ఞానము కలుగుటకు మున్నుఁడినట్లు జ్ఞానము కలిగిన పిమ్మటఁగూడ నియతముగాఁ బ్రవృత్తి యుండుటవలన తత్త్వవేత్తయొక్క ప్రవృత్తి యాభాసము కాదు? ఇందుకుఁ జెప్పు చున్నారు—మఱియు నెట్లు ఇత్యాదిగా. స్వర్గాదికామార్థి—కామము అనఁగా కోరఁ బడునట్టి వస్తువు, స్వర్గములు మొదలగుకామములఁ గోరినవాఁడు. స్వర్గాదు లను గోరినవాఁడు ఆ స్వర్గాదులకు సాధన మయిన యగ్నిహోత్రాదుల ననుష్ఠిం చుటకై త్రేతాగ్నుల నుంచుకొనియుండి ఆ కామ్య మయిన యగ్నిహోత్రాదికము నందే ప్రవృత్తుఁడై అది సగము చేయఁబడిన పిమ్మట ఒకానొకకారణముచే ఆకోరిక

* సేచ్ఛచే వచ్చినది, విధిప్రాప్తము కానిది.

నశింపఁగా, అటుపిమ్మటఁగూడ ఆ యగ్నిహోత్రాదికమునే నెఱవేర్చుచున్న యెడ నతఁడు చేయు నగ్నిహోత్రాదికము కామ్యము కాదు. ఏల యనఁగా నది స్వర్గాది ఫలాపేక్షచేఁ జేయఁబడినది కాదు. ఫలాపేక్ష లేక చేయఁబడుటచే నది నిత్య మగును. అట్లు తత్త్వవేత్తకుఁగూడ నిత్యము నధికారము లేకుండుటవలన నతని వాగాది ప్రవృత్తు లాభాసములే యగు నని యర్థము. జ్ఞానియొక్క ప్రవృత్తులు కర్మాభాసము లనుటయందు భగవంతునియనుమతిం జూపుచున్నారు—అట్లు ఇత్యాదిగా.

భా. మఱియు 'పూర్వైః పూర్వతరం కృతమ్' 'కర్మణైవహి సంసిద్ధిమాస్థితా జనకాదయః' అని యేది గలదో, అచట చక్కగా విభజించి యర్థము తెలియవలెను. అది యెట్లనఁగా—పూర్వు లగు జనకాదులు తత్త్వవేత్తలైనను కర్మప్రవృత్తులై రనుపక్షమున, వారు లోకసంగ్రహము కొఱకు 'గుణాగుణేషు వర్తన్తే' అని జ్ఞానముచేతనే, సంసిద్ధిమాస్థితాః—సంసిద్ధిని బొందిరి—కర్మసన్న్యాసము ప్రాప్తమైనను కర్మముతోఁగూడనే సంసిద్ధిని బొందిరి, కర్మసన్న్యాసమును జేసినవారు కారని యర్థము. ఇఁక వారు తత్త్వవేత్తలు కా రనుపక్షమున సాధన మగు ఈశ్వరసమర్పిత కర్మముచేత, సంసిద్ధిమ్ = అంతఃకరణశుద్ధిని, లేక, జ్ఞానోత్పత్తి యను సంసిద్ధిని, జనకాదులు పొంది రని యర్థము, ఇట్లు వ్యాఖ్యానము చేయవలెను. ఈయర్థమునే నచింపఁ గలఁడు భగవంతుఁడు 'సత్త్వశుద్ధయే కర్మకుర్వన్తి'* అని. 'స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః' అని పలికి సిద్ధిని బొందినవానికి మరల జ్ఞాననిష్ఠను జెప్పుచున్నాఁడు 'సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ' ఇత్యాదిగా. అందువలన గీతాతాత్పర్యము 'కేవలము తత్త్వజ్ఞానము వలననె మోక్షప్రాప్తి' యనియె కాని 'కర్మసముచ్చిత మయిన తత్త్వజ్ఞానమువలన మోక్షప్రాప్తి' యని గాదు. ఇదె గీతాతాత్పర్య మనుటను ఆయాప్రకరణములం దచ్చట చ్చట విభజించి చూపెదము.

టీ. ఓయీ! జ్ఞానియొక్క వ్యాపారమునందును కర్మశబ్దము ప్రయోగింపఁబడుటవలన అది కర్మాభాస మనుట యుపపన్నము కాదు. అందుచే సముచ్చయము సిద్ధించుచున్నది యనఁగా నందుకుఁ జెప్పుచున్నారు—మఱియు నిత్యాదిగా.

* చిత్తశుద్ధికొఱకు కర్మము చేయుచున్నారు.

జ్ఞానకర్మములు రెండును గలసియే సంసిద్ధికి హేతు వగు ననుట సిద్ధ మగుచుండఁగా ఏల విభజించి యర్థము తెలిసికోవలె నని ప్రశ్న చేసికొని యుత్తరము చెప్పుచున్నారు—అది యెట్లనఁగా నిత్యాదిగా. అందు, జనకాదులుగూడ తత్త్వవేత్తలై కర్మమునందుఁ బ్రవృత్తులైరా? లేక, తత్త్వవేత్తలు కాకయే కర్మమునందుఁ బ్రవృత్తులైరా? అని వికల్పించి మొదటిపక్షమును గుఱించి చెప్పుచున్నారు—పూర్వులగు జనకాదు లిత్యాదిగా. తత్త్వవేత్తలైనచో కర్మములం దెట్లు ప్రవర్తించిరి? కర్మములు నిష్ప్రయోజనములు గదా! అని యాశంకించి చెప్పుచున్నారు—వారు లోకసంగ్రహము కొఱకు ఇత్యాదిగా. వారలకు లోకసంగ్రహము కొఱకుఁ గూడ ప్రవృత్తి యుక్తము గాదు, వారు సర్వవిషయమునందు నుదాసీనులై యుండువారు గదా! అని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నారు—గుణా గుణేషు వర్తన్తే అని. ఇంద్రియములు విషయములందుఁ బ్రవర్తించుట మూలముగాఁ దత్త్వవేత్తలకుఁ గర్మములందుఁ బ్రవృత్తి కలిగినను వారలకు జ్ఞానముచేతనే ముక్తి యని చెప్పుచున్నారు—జ్ఞానముచేతనే యని. చెప్పినయర్థమునే సంక్షేపించి చూపుచున్నారు—కర్మసన్న్యాస మిత్యాదిగా. కర్మణా ఇత్యాదిస్థలమునందు, ఆభాసరూప మయిన బాధితానువృత్తి గ్రహింపవలెను.* రెండవపక్షము ననువదించుచున్నారు—ఇఁక వా రిత్యాదిగా. ఆపక్షమున శ్లోకార్థమును జెప్పుచున్నారు—సాధన మగు ఈశ్వరసమర్పితకర్మముచేత నిత్యాదిగా. శ్లోకార్థమును విభజించి తెలియవలె నని చెప్పినదాని నుపసంహరించుచున్నారు—ఇట్లు వ్యాఖ్యానము చేయవలె నని. కర్మములు చిత్తశుద్ధిద్వారమున జ్ఞానమునకు హేతు వగు నను నర్థమునందుఁ బ్రమాణముఁ జూపుచున్నారు—ఈ యర్థమునే యిత్యాదిగా. 'యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాత్మశుద్ధయే' అనువాక్యము నర్థముచే ననువదించుచున్నారు—సత్త్వశుద్ధయే కర్మ కుర్వన్తి అని. స్వకర్మణా తమభ్యర్చ్య ఇత్యాదివచనమునందు కర్మములు సాక్షాత్తుగానే మోక్షహేతువు లని చెప్పఁబడుచున్నది యని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నారు—స్వకర్మ ణేత్యాదిగా. స్వకర్మము ననుష్ఠించుటవలన ఈశ్వరానుగ్రహద్వారమున జ్ఞాననిష్ఠాయోగ్యత కలుగును. అంత జ్ఞాననిష్ఠచే ముక్తి కలుగును. అందుచే సాక్షాన్మోక్షహేతువు కర్మములు కావని ముందు స్పష్టము కాఁగల దని యర్థము. తత్త్వజ్ఞానము కలిగిన పిమ్మట కర్మము సంభవింప దనుట నిశ్చిత మయినది. ఇఁక ఫలితము నుపసంహరించుచున్నారు—అందువలన నిత్యాదిగా. ఓయీ!

---

* జ్ఞానముచే బాధింపఁబడిన యవిద్యయొక్క యనువృత్తి—దగ్ధపటాదులవలెఁ దోఁచుచుండుట.

గీతాశాస్త్ర మేకవాక్యతచేఁ దత్త్వజ్ఞానమునే ప్రధానముగా బోధించునదియే, ఐనను తన్మధ్యమున కర్మము చెప్పఁబడుటచే ప్రకరణప్రామాణ్యమునుబట్టి కర్మమును జ్ఞానాంగముగా నంగీకరింపవలెను, కావున సముచ్చయము సిద్ధించుచున్నది? అనఁగా నిందుకుఁ జెప్పుచున్నారు—ఇదే గీతాతాత్పర్య మనుటను ఇత్యాదిగా. ఇదే—ఆత్మజ్ఞాన మొక్కటియే మోక్షమునకు హేతు వనుటయే

భా. అది యిట్లు. ధర్మమువిషయమయి సమ్మోహ మయిన మనస్సు గలవాఁడును మిథ్యాజ్ఞానవంతుఁడును గొప్ప శోకసముద్రమునందు మునింగినవాఁడు నగు నర్జునునకు ఆత్మజ్ఞానముచేతం గాని యితరముచే నుద్ధారము లే దని భగవంతుఁ డగు వాసుదేవుం డయ్యర్జునుని ఆశోక సముద్రమునుండి యుద్ధరింపఁ దలంచినవాఁడై ఆత్మజ్ఞానమునకు దించుచుఁ జెప్పుచున్నాఁడు.—

అశోచ్యా నిత్యాది. అశోచ్యాన్—శోచ్యులు * కానివారు అశోచ్యులు, భీష్మద్రోణాదులు, ఎందువలన ననఁగా, వారు సదాచారము గలవారు పరమార్థరూపంబున నిత్యులు, అట్టి అశోచ్యు లయిన భీష్మద్రోణాదులనుగూర్చి; అన్వశోచః=దుఃఖించినవాఁడై తివి, వారు నానిమిత్తము చావఁబోయెదరు నేను వారి విడిచి రాజ్యసుఖాదులతో నేమి చేయఁగల నని. త్వమ్ = నీవు; ప్రజ్ఞావాదాంశ్చ = బుద్ధిమంతులయొక్క వాక్యములనుగూడ; భాషసే = పలుకుచున్నావు. ఆమూఢతను ఈ పాండిత్యమును బరస్పరవిరుద్ధము లగువాని ఉన్మత్తుని యట్లు చూపుచున్నా వని యభిప్రాయము. ఎందువలన ననఁగా—గతాసూన్ = పోయిన ప్రాణము గలవారిని గూర్చియు, చచ్చినవారిని గూర్చియు; అగతాసూన్ = పోని ప్రాణములు గలవారిని గూర్చియు, బ్రదికియున్నవారిని గూర్చియు; పణ్డితాః = ఆత్మజ్ఞానము గలవారు, పండ యనఁగా ఆత్మవిషయ మయిన జ్ఞానము అది యెవరికి గలదో వారు గదా పండితులు, అట్లు ‹ పాణ్డిత్యం నిర్విద్య ' అని శ్రుతి; నానుశోచన్తి=దుఃఖింపరు. నీవో పరమార్థంబున నిత్యులును అశోచ్యులు నగు వారింగూర్చి దుఃఖించుచున్నావు. ఇందువలన నీవు మూఢుఁడవగా నున్నా వని యభిప్రాయము.

* దుఃఖింపఁ దగినవారు.

భీష్మద్రోణాదులు సదాచారసంపన్నులు, కావున వారు శోచనీయులు గారు, మఱియు వారి పరమార్థరూపంబు విచారించునెడ వారు నిత్యులుగా నున్నారు. ఇందువలనఁగూడ వారు శోచనీయులు గారు, ఇట్టివారిని గూర్చి నీవు, ‘వారు చావఁ బోవుచున్నారే, వారు చచ్చిన పిదప నీరాజ్యాదిభోగము నాకేల’ అని శోకించుచున్నావు. ఇదిగాక పండితులు చెప్పుమాటలుగూడఁ జెప్పుచున్నావు, కావునఁ బరస్పరవిరుద్ధముగా మూఢత్వపాండిత్యములం బ్రకటించుటచేఁ బిచ్చివానియట్లు దోఁచుచున్నావు. చచ్చినవారినిగాని బ్రతికియున్నవారినిగాని గూర్చి పండితులు శోకింపరు. నీవో నిత్యు లయినవారిని గూర్చి దుఃఖించుచున్నావు, కావున నీవు పండితుఁడవు కావు, మూఢుఁడవు అని తాత్పర్యము.

ఆ. వృత్తికారుల యభిప్రాయమును నిరసించి స్వాభిప్రాయముచొప్పున శాస్త్రార్థము సమర్థింపఁబడినది. ఇప్పుడు అశోచ్యాన్ననుదాని ముందటిగ్రంథమునకు మున్ను చెప్పిన తాత్పర్యము ననువదించి అశోచ్యాన్ అనునది మొదలు స్వధర్మమపి చావేక్ష్య అనుదానివఱకుఁ గల గ్రంథమునకుఁ దాత్పర్యము చెప్పుచున్నారు—అందు ఇత్యాదిగా. ఈ గీతాశాస్త్రమునందుఁ బదునెనిమిది యధ్యాయములు, అందు మూఁడుషట్కములను మూఁడుభాగములుగా గ్రహించుటచే మూఁడు కాండము లగుచున్నవి. అందు మొదటిషట్క మయిన మొదటికాండమునకు త్వంపదార్థము విషయము. మధ్యషట్కరూప మయిన మధ్యమకాండమునకుఁ దత్పదార్థము విషయము. కడపటిషట్క మయిన కడపటికాండమునకు మహావాక్యార్థ మయిన తత్త్వంపదార్థముల నైక్యము విషయము. తద్జ్ఞానసాధనములు, వానివలననే అది గలుగవలసినందున అచ్చటచ్చటఁ బ్రసక్తినిబట్టి చెప్పఁబడుచున్నవి. తత్త్వజ్ఞాన మొక్కటియె కైవల్యసాధన మనునదియు సంతతమును జక్కఁగాఁ బ్రతిపాదింపఁబడినది. ఇట్లు—పూర్వోక్తరీతిగా గీతాశాస్త్రార్థము చక్కఁగా నిశ్చయింపఁబడినది గాఁగా నని యర్థము. సమ్మూఢము = ఇది చేయవలెను ఇది చేయరాదను వివేకము లేనిదగుట మిథ్యాజ్ఞానవంతుఁడు = అహంకార మమకారములు గలవాఁడు. గొప్ప = దాఁట నశక్య మయిన, శోక అను సముద్రమునందు, మునింగినవాఁడు= ప్రవేశించి శ్రమపడుచున్నవాఁడు. ఆత్మజ్ఞానము = బ్రహ్మాత్మైకత యను వాక్యార్థముయొక్క జ్ఞానము. అది లేక యుద్ధారంభము సిద్ధింపనందున, అయ్యర్జునుని—మిక్కిలి భక్తుండును మిక్కిలి స్నేహమునకు విషయ మయినవాఁడు నగు నర్జునుని. శోకమునుండి లేవనెత్తఁగోరినవాఁడై యథోక్త మయిన ఆత్మజ్ఞానముకొఱకు వానిని, దించుచు =

పదార్థముల విచారించుటయందుఁ బ్రవర్తింపఁజేయుచు, త్వంపదార్థవిచారమునకొఱకు అశోచ్యా నిత్యాదివాక్యముఁ బలికె నని యర్థము.

ఎవ్వనికి అజ్ఞానము కలదో వానికి భ్రాంతి కలుగును. ఎవ్వనికి భ్రాంతి కలదో వానికి త్వంపదార్థవిచారముచే మహావాక్యము వలన సమ్యగ్జ్ఞాన ముదయించును. అని జ్ఞానమున కధికారి యిట్టివాఁ డను నభిప్రాయముతోఁ జెప్పుచున్నారు—అశోచ్యా నిత్యాది యని. కొందఱిచే, 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః * అను ఆత్మస్వరూపజ్ఞానవిధివాక్యమును ఈశ్లోకముచే భగవంతుఁడు తానే వివరించుచున్నాఁడు' అని చెప్పఁబడినది. అది యుక్తము గాదు. ఏల యనఁగా, కృతియోగ్య మయి శ్రేయస్సాధన మగు ననుట విధ్యర్థము, లేక పూర్వపక్షుల కభిమతముచొప్పున నియోగము విధ్యర్థము, ఈరెండును ఈవాక్యమునందుఁ బ్రతీతములు కావు, అట్లుండఁగా నట్టి విధ్యర్థమును కల్పించుటకు హేతువు లేదు. మఱియుఁ బురుషతంత్రము కానిదియు విధేయము లగు యాగాదులకు విలక్షణ మయినదియు నగు జ్ఞానమునందు విధి యుపపన్నము కాదు. ద్రష్టవ్యః అను చోటి తవ్యప్రత్యయము కృత్యాంతర్భూతము అర్హార్థక § మగుటవలన విధిని బోధింప దను నభిప్రాయముతో వ్యాఖ్యానము చేయుచున్నారు—శోచ్యులు కాని వారు అని. వారలకు శోచ్యత్వ మెట్లు లేదని యాక్షేపము రాఁగా, శోచ్యత్వము భీష్మాదిశబ్దములకు వాచ్యార్థ మయిన తద్దేహములకా? లక్ష్యార్థ మయిన ఆత్మలకా? అని వికల్పించి మొదటిపక్షమును నిరాకరించుచున్నారు—సదాచారము గలవా రని. ఎవ్వరు భీష్మాదిశబ్దములచేఁ జెప్పఁబడుచున్నారో వారు శ్రుతిస్మృతులందుఁ బ్రతిపాదింపఁబడిన నిర్దోష మగు నాచారము గలవా రగుటవలన శోచ్యులు కా రని యర్థము. రెండవపక్షమును నిరసించుచున్నారు—పరమార్థరూపంబున నిత్యు లని. రజతము కానిదాని రజత మని తలఁచినట్లు శోచ్యులు కానివారిని శోచ్యు లని తలఁచినవాఁడ వగుటచే భ్రాంతుఁడవు నీ వని చెప్పుచున్నారు—ఆ అశోచ్యులైన ఇత్యాదిగా. అనుశోచనవిధము ననువదించుచు ఆభ్రాంతినే ప్రకటించుచున్నారు—వారు నానిమిత్తము ఇత్యాదిగా. రాజ్యసుఖాదులతో అనుచోటి ఆదిశబ్దముచే పుత్త్రభార్యాదిసుఖము గ్రహింపఁబడుచున్నది. అని దుఃఖించినవాఁడవైతి వని యన్వయము. పరస్పరవిరుద్ధముగా మాటలు చెప్పుటచేతం గూడ అర్జునుఁడు భ్రాంతుఁ డని సాధించుచున్నారు—నీవు బుద్ధిమంతులయొక్క వాక్య

---

* ఆత్మను తెలియవలెను.

§ తగినది అనునర్థము గలది.

ములనుగూడ ఇత్యాదిగా. వాక్యములను—“ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన। నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ” * ఇత్యాదులను. ఏమి యింతమాత్రముచే ఫలిత మనఁగాఁ జెప్పుచున్నారు—ఆమూఢతను= అశోచ్యుల యందు శోచ్యబుద్ధిని, ఈపాండిత్యమును= బుద్ధిమంతుల మాటలు చెప్పుటను అని యర్థము. అర్జునుఁడు పూర్వోక్తభ్రాంతిని బొందుటకు నిమిత్తము ఆత్మాజ్ఞాన మని చెప్పుచున్నారు—ఎందువలన ననఁగా నిత్యాదిగా. ఓయీ! సూక్ష్మబుద్ధి గలుగుటయే పాండిత్యము, ఆత్మజ్ఞుఁ డగుట కాదు. ఏల యనఁగా అట్లనుటకు హేతువు లేదు అని యాశంకించి చెప్పుచున్నారు—వారలు గదా పండితులు అని. పాణ్డిత్యమ్= పండితభావమును, ఆత్మజ్ఞానమును, నిర్విద్య= నిశ్చయముగాఁ బొంది, ‘బాల్యేన తిష్ఠాసేత్’ § అను బృహదారణ్యకశ్రుతిని ఇప్పుడు చెప్పఁబడిన యర్థము గలదాని నుదాహరించుచున్నారు—పాణ్డిత్యం నిర్విద్య అని. అర్జునున కిట్టి పాండిత్యము లేదనుట యెట్లు తెలిసె నని యాశంకించి కార్యము కనఁబడుటవలనఁ గారణము తెలిసె నని చెప్పుచున్నారు—నివో ఇత్యాదిగా.

హనుమద్విరచిత పైశాచభాష్యము.—

ఇందు ‘దృష్ట్వాతు పాణ్డవానీకమ్’ అనునది మొదలు ‘న యోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవహ’ అనుదానివఱకుఁ గల గ్రంథమునకుఁ బ్రాణులకు శోకమోహ బహుల మయిన సంసారము అవిద్యవలనఁ గలుగుచున్న దని తెలుపుట యభిప్రాయముగా వ్యాఖ్యానము చేయవలెను.

అశోచ్యాన్ = శోచ్యులు కానివారిని, భీష్మద్రోణాదులను గూర్చి; ఎందువలన శోచ్యులు కా రనఁగా, ధార్మికు లగుటవలనను వాస్తవమునఁ బర మాత్మస్వరూపు లగుటవలనను; అన్వశోచః= దుఃఖించితివి. త్వమ్=నీవు. ప్రజ్ఞావాదాంశ్చ—ప్రజ్ఞ యనఁగా పరమాత్మజ్ఞానము, తన్నిమిత్తము లయిన మాటలను గూడ; ఇప్పుడు, భాషసే= చెప్పుచున్నావు. గతాసూన్ = పోయిన ప్రాణములు గలవారిని; అగతాసూంశ్చ=పోని ప్రాణములు గలవారినిగూడ, కూర్చి; పణ్డితాః= పరమార్థము దెలిసినవారు; నానుశోచన్తి. ఇందువలన మూఢుఁడవు నీవు, అపరమ ప్రజ్ఞ యెక్కడిది నీకు ?

* ౧_౪౪.

§ బాల్యమున నుండుటకుఁ గోరవలెను.

శ౦. శోచ్యులుకానివారశోచ్యులు, శోకించుట కనర్హులు, భీష్మద్రోణాదులు, అట్టి యీ అశోచ్యులయినవారిని; త్వమ్; అన్వశోచః—వీరి నుద్దేశించి శోకము వహించితివి. ఓయీ! బంధుమరణంబున నందఱకును దుఃఖము కలిగినే కలుగును. ఎట్లు వీరి గుఱించి శోకించుట కాక్షేపము చేసితివి? చావఁబోవుచున్నవారు వీరు అశోచ్యులెట్లగుదురు? అందువేని, అందు నిన్ను * అడుగవలెను “ఏమి భీష్మద్రోణాదిశబ్దముల వాచ్యార్థము నుద్దేశించి శోకించుచున్నావా? లేక లక్ష్యార్థము నుద్దేశించి శోకించుచున్నావా? అని. మొదటిపక్షమున, భీష్మద్రోణాదిశబ్దవాచ్యార్థము సదాచారము కలది కాదని శోకించుచున్నావా?” లేక యది నశింపఁబోవునని శోకించుచున్నావా? అని. అందు సదాచారము కలది కాదని శోకింప నవసరము లేదు, ఏల యనఁగా మహానుభావులని నీవే వారి మాహాత్మ్యము చెప్పియున్నావు. నశించునని శోకించుటకు నవసరము లేదు, ఏల యనఁగా, ‘మఘవన్ మర్త్యంవా ఇదం శరీర మాత్తం మృత్యునా’ ‡ అని శరీరము మృత్యుగ్రస్తమని శ్రుతి చెప్పుచున్నది. ‘దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణభఙ్గురః’ ♦ అని దేహము నశ్వరమని చెప్పఁబడుచున్నది. ప్రాణులు మరణంబు పొందుటను ఎల్లప్పుడును జూచుచున్నాము. ఇట్లు ప్రత్యక్షాది ప్రమాణములచేతనే దేహమునకు మృత్యువు నిశ్చయమని యేర్పడుచున్నది. కావున నది నశించునని దుఃఖింప నవసరము లేదు. ఇఁక భీష్మద్రోణాది శబ్దముల లక్ష్యార్థమును గుఱించి శోకించుటయు సంభవింపదు. ఎట్లనఁగా, ఆత్మ జన్మము లేనివాఁడగుటవలనఁ బుట్టఁడు, పుట్టుక లేనివాఁడగుటవలనఁ జావఁడు, చావు లేనివాఁడగుటవలన నిత్యుఁడు. ‘అజో నిత్యః శాశ్వతః’ అనియు ‘నిత్యో నిత్యానామ్’ అనియు లక్ష్యార్థమయిన యాత్మ నిత్యుఁడని శ్రుతి చెప్పుచున్నది. నిత్యుఁడును నిత్యసిద్ధుఁడు నగు నాత్మను గుఱించి దుఃఖించుట సంభవింపదు. బుద్ధిమంతులు నిత్యపదార్థము నుద్దేశించియు అనిత్యపదార్థము నుద్దేశించియు శోకింపరు. ఇట్లు వాచ్యార్థమును లక్ష్యార్థమును రెండును అశోచ్యములని సిద్ధములగుచుండఁగా, నీవు అశోచ్యులగువారిని గుఱించియె శోచ్యులని తలంచి మూఢుని యట్లు శోకించుచున్నావు. ఇంతి మాత్రముతో నిలిచినవాఁడవును కావు, మఱేమనఁగా, ప్రజ్ఞావాదాంశ్చభాషసే—

* అర్జునుని.

‡ ఇంద్రుఁడా! ఈ శరీరము మర్త్యము, ఏల యనఁగా మృత్యువుచేతఁ బొందఁబడినది.

♦ ప్రాణులకు మనుష్యదేహము దుర్లభము క్షణములో నశించునది.

సత్పదార్థ స్వరూపమును వివేకించి యెవ్వరు చక్కఁగాఁ దెలియుచున్నారో వారు ప్రజ్ఞులు, వారియొక్క, శాస్త్రమునంతయు వ్యాపించిన వాదములు అవాదములు, అట్టి ప్రజ్ఞావాదములను, 'కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాస్సనాతనాః' 'ఉత్సన్న కులధర్మాణామ్' 'కథం భీష్మ మహం సఙ్ఖ్యే' ఇత్యాదు లగు ప్రౌఢవచనములను గూడ, భాషసే = పలుకుచున్నావు. అశోచ్యుల గుఱించి శోకించుట, శాస్త్రార్థము ప్రకటించు పాండిత్యము—ఈ రెండును తేజస్తిమిరములవలె [1] విరుద్ధము లగుటచే నొకచోట నుండుట సంభవింపదు. కావున నీవు మూఢుఁడవే యగుదువు కాని పండితుఁడవు కావు. ఇట్టి సమయమునందుఁ బండితు లెట్లు వర్తింతు రందువేని వినుము:—గతాసూన్—చచ్చినవారిని, కేవలము మూఢు లగువారు మాపుత్రాదులు వీరు మృతిం బొందిరని మృతులను గూర్చియె శోకింతురు కాని, గతాసూన్—బ్రతికి యున్నవారిని గూర్చి శోకింపరు; శాస్త్రజ్ఞులో మా పుత్రాదులు వీరు మూఢులు దుష్టులు దురాచారపరులై రని బ్రతికియున్నవారిని గుఱించియె దుఃఖింతురు కాని మృతిఁ బొందినవారి నుద్దేశించి దుఃఖింపరు; ఇఁకఁ బండితులన్ననో పుత్రాదులు గతాసువులైనను అగతాసువులైననుగూడ దుఃఖపడరు. గతాసువులును అగతాసువులును గూడ అవిద్యాకార్యము లగుటచే స్వప్నమునందుఁ దోఁచు పదార్థములవలె అసత్యము లగుటవలన, రెండు స్థలములయందును బ్రహ్మమునే చూచుచుందురు. ఎవ్వరు అసత్యమును విడిచి సత్యమునే సదా గ్రహింతురో వారే గదా పండితులు, ఏల యనఁగా, సర్వత్ర బ్రహ్మదర్శనమే గదా పాండిత్యము. అట్లు 'బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య' అని శ్రుతి. కావున, ఇప్పుడుచెప్పిన పండితలక్షణము లేనివాఁడవగుటచే నీవు మూఢుఁడవే కాని పండితుఁడవు కా వని యర్థము.

మ. అం దర్జునుండు యుద్ధరూపం బగు స్వధర్మమునందుఁ దనయంతనే ప్రవర్తించినవాఁ డయ్యు రెండువిధము లగు మోహముచేతను అందుచేఁ గలిగిన శోకముచేతను ఆయుద్ధమునుండి విరమించెను. కావున వాని మోహములు రెంటిని నిరాకరింపవలెను. వానిలో స్వప్రకాశపరమానందరూపుఁడును సర్వసంసార ధర్మములతోను సంబంధింపనివాఁడు నగు నాత్మయందు స్థూలశరీరము సూక్ష్మ శరీరము తత్కారణ మయిన అవిద్య యను నీమూఁడు ఉపాధులను వివేకింపక పోవుటచే సంసారము మిథ్యాభూత మయినను అది సత్యమనియు ఆత్మధర్మమనియు

[1] తేజస్సు—వెలుఁగు, తిమిరము—చీఁకటి.

నిత్యాదిగాఁ దోఁచుట యనునది యొకటి సర్వప్రాణి సాధారణ * మయిన మోహము. రెండవది యుద్ధరూప మయిన స్వధర్మమునందు హింసాది బహుళ మగుటచే అధర్మత్వము తోఁచుట, అది అర్జునునకు మాత్రమె కరుణాది దోషముల వలనఁ బుట్టిన దగుటచే అసాధారణ మయిన § మోహము. ఇట్లు మూఁడుపాధు లను వివేకించి శుద్ధాత్మస్వరూపము తెలియుట మొదటిమోహమునకు నివర్త కము, ఇది సర్వప్రాణి సాధారణము. ¶ హింసాదులు కలిగినను యుద్ధము స్వధర్మ మగుటచే అధర్మము కా దని తెలియుట రెండవమోహమునకు నివర్తకము, ఇది యర్జునునకుమాత్రమె యావశ్యక మగుటచే అసాధారణము. ఇఁక శోకమునకో, కారణనివృత్తిచేతనే నివృత్తి కలుగుం గావున వేఱుగా సాధనాంతరము వల దని యభిప్రాయము గలవాఁడై క్రమంబున మోహద్వయము ననువదించుచు భగ వంతుఁ డి ట్లనియె.

అశోచ్యాన్ = శోకించుటకుఁ దగనివారినే, ఆత్మసహితు లయిన భీష్మ ద్రోణాదులను, గూర్చి, నీవు పండితుఁడవై యుండియు, అన్వశోచః = శోకించినవాఁడ వయితివి, ‘ వారు నానిమిత్తము మృతిఁ బొందెదరు, నేను వారిని విడిచి రాజ్య సుఖాదులతో నేమి చేయఁ గలను? ’ అను నర్థముగల ‘ దృష్ట్వేమం స్వజనమ్ ’ ఇత్యాది గ్రంథముచేత. కావున అశోచ్యులయందు శోచ్యభ్రాంతి పశ్వాదులకుఁ గలుగవలసినది, యత్యంతపండితుఁడ వగు నీకుఁ గలుగుట యనుచిత మని యర్థము. అట్లు కుతస్త్వా కశ్మల మిద మిత్యాదిక మగు నా వాక్యముచే ‘ నేఁ జేసినది యిది యనుచిత ’ మని విమర్శింపవలసియుండియు నీవు స్వయము ప్రజ్ఞుఁడవై ‖ యుండియు, ప్రజ్ఞఅవాదాంశ్చ= ప్రజ్ఞులకు అవాదము లయిన శబ్దములను, పండితులచేఁ జెప్పరాని మాటలను గూడ, కథం భీష్మ మహం సంఖ్యే ఇత్యాదులను; భాషసే= చెప్పుచున్నావు, కాని లజ్జచే ఊరకున్నవాఁడవు కావు. ఇంతకన్నను ఏమి యనుచితము కల దని చకారము సూచించుచున్నది. ఇట్లు అధర్మమునందు ధర్మత్వభ్రాంతియు ధర్మము నం దధర్మత్వభ్రాంతియు అసాధారణముగా నీకుఁ గలిగినది. ఇది అతిపండితుఁడ వైన నీ కుచితము గా దని భావము. లేక; ప్రజ్ఞావాదాన్ — ప్రజ్ఞావంతులయొక్క

* సమస్తప్రాణులకును కలుగునది.

§ ఒక్కనికి మాత్రమె కలుగునది.

¶ సమస్తప్రాణులకును ఆవశ్యకము.

‖ పండితుఁడవై.

అనఁగా పండితులయొక్క మాటలను, భాషసే = చెప్పుచున్నావు మాత్రమె, కాని తెలిసినవాఁడవు కావని భావము. భాషణముకన్నను అనుశోచనము ముందు కలిగిన దగుటచే భూతకాలికముగాఁ జెప్పఁబడినది. భాషణమో అనుశోచనమునకుఁ బిమ్మటఁ గలిగిన దగుటచే అవ్యవహితము కాఁబట్టి వర్తమానముగాఁ జెప్పఁబడినది. లేక, లకారవ్యత్యయము ఛాందస మని కల్పించి అన్వశోచః అనఁగా శోకించుచున్నావు అని వర్తమానార్థము చెప్పవచ్చును. ఓయి! మహానుభావు లగు వసిష్ఠాదులుగూడ బంధుమరణమున శోకించియున్నారు. కావున బంధుమరణమునకై శోకించుట యనుచితము కాదు? అని యాశంకించి చెప్పుచున్నారు—ఎవ్వరు పండితులో—విచారముచే ఆత్మతత్త్వజ్ఞానము నొందినవారో వారు, బంధువు లని కల్పితము లయిన దేహములు గతప్రాణము లయినను * అగతప్రాణము లయినను § వాని గుఱించి, నానుశోచన్తి. వీరు మృతులైరి—సమస్తము లయిన యుపకరణములను విడిచి పోయిరి ఏమి చేయుచున్నారు? ఎక్కడ నున్నారు? వీరు బ్రతికియున్నవారు, వీరి బంధువులు పోయిరే, ఎట్లు జీవింపఁ గలరు? అను వ్యామోహము నొందరు. ఎందువలన ననఁగా, సమాధిసమయంబునఁ దత్ప్రతిభాసము ǂ లేకుండుటవలనను, లేచినప్పుడు తత్ప్రతిభాస మున్నను మిథ్య యని నిశ్చయము కలుగుటవలనను. రజ్జుతత్త్వసాక్షాత్కారముచే సర్పభ్రమము నశించిన పిమ్మట ఆభ్రమముచేఁ గలుగు భయకంపాదులు సంభవింపవు గదా! మఱియు పిత్తప్రకోపము కలవాని కొకానొకప్పుడు గుడము చేఁదుగాఁ దోఁచినను మధురం బను నిశ్చయము బలవత్తరముగా నుండుటవలన చేఁదువస్తువుమీఁది కోరికచే గుడమునందుఁ బ్రవృత్తి సంభవింపదు గదా! ఇట్లు శోచ్యభ్రమము ఆత్మస్వరూపాజ్ఞానముచేఁ గలిగిన దగుటవలన తత్స్వరూపజ్ఞానమువలన ఆయజ్ఞానము నశించిన పిమ్మట ఆయజ్ఞానముయొక్క కార్య మయిన శోచ్యభ్రమము నిలువఁజాల దని భావము. ఇఁక వసిష్ఠాదుల శోకమో ప్రారబ్ధకర్మప్రాబల్యమునవలన ఆయావిధముగా అనుకరణ మగుటచే నితరు లట్లనుష్ఠించుట కది శిష్టాచారరూపప్రమాణము గాఁ జాలదు. ఏల యనఁగా శిష్టులు ధర్మబుద్ధిచే ననుష్ఠించునట్టి యలౌకికవ్యవహారమే ♦ శిష్టాచార మనఁబడును. అట్లు కాని

* మృతిఁ బొందినను.

§ జీవించియున్నను.

ǂ అది తోఁచుట.

♦ పరలోకమునందే ఫలము కలిగించునట్టి వ్యవహారము.

యెడ, వారోకానోకప్పుడు నిష్ఠీవనము * చేయుదు రేని యట్లుండఁగను నిష్ఠీవనము చేయవలసివచ్చును. ఇట్లుండుటవలన నీవును బండితుఁడవై శోకమును విడువు మని యభిప్రాయము.

శ్రీ. దేహాత్మల వివేకించి తెలియకపోవుటవలన నితని కిట్లు శోకము కలుగుచున్న దని దేహాత్మవివేకము తెలుపుట కొఱకుఁ జెప్పుచున్నాఁడు—అశోచ్యాన్ = శోకమునకు విషయము కాని బంధువులనే గుఱించి, త్వమ్, అన్వశోచః—దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థిత మిత్యాదిగా శోకించితివి. అప్పుడు కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థిత మిత్యాదిగా నాచే బోధింపఁబడినవాఁడ వయ్యును, మరల, ప్రజ్ఞావాదాన్—ప్రజ్ఞావంతు లగు పండితులశబ్దములను, కథం భీష్మ మహం సంఖ్యే ఇత్యాదులను, భాషసే. పండితుఁడవేమో కావు. ఎందువలన ననఁగా, గతాసూన్ = గతప్రాణు లయిన బంధువులను గూర్చియు; అగతాసూంశ్చ= బ్రతికియున్నవారిని గూర్చియు, బంధువులను విడిచి వీ రెట్లు జీవింపఁ గల రని; నానుశోచన్తి పండితాః.

ప. ఇఁక నర్జునునకు జ్ఞానకర్మముల నుపదేశించి విషాదము పరిహరింపఁ గోరినవాఁడై భగవంతుఁడు నలుబదిమూఁడు శ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు—అశోచ్యాన్ = శోకమునకు అనర్హు లయిన బంధువులనే, అను = గుఱించి, అశోచః= శోకించితివి దృష్ట్వేమం స్వజనం కృష్ణ ఇత్యాదిగా. పిమ్మట కుతస్త్వా కశ్మల మిద మిత్యాదిగా మాచే బోధితుఁడ వయ్యును, ప్రజ్ఞావాదాన్—ప్రజ్ఞా= మాటలనేర్పుచేత మాత్రమె, వాదాన్ = శబ్దములను, భాషసే—అజ్ఞానముచే వదరినట్లు పలుకుచున్నావు. ఇట్టి మాటలు నీవు చెప్పుట యుక్తము కా దని భావము. ఎందువలన ననఁగా, పణ్డితాః = తెలిసినవారు, గతాసూన్ = గతప్రాణులనుగాని; అగతాసూన్ = జీవించియున్నవారిని గాని, ఎట్లు జీవింతు రని; అను = గుఱించి, నశోచన్తి.

రా. త్వమ్ = నీవు; అశోచ్యాన్ = శోకింపఁ దగనివారిని గూర్చి; అన్వశోచః = శోకించుచున్నావు. ♦ ప్రజ్ఞావాదాంశ్చ= మంచి తెలివిచేఁ గలుగునట్టి మాటలను గూడ, దేహాత్మలస్వభావము చక్కఁగాఁ దెలిసి చెప్పునట్టి మాటలనుగూడ, పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియా ఇత్యాదులను; భాషసే = పలుకు

---

* ఉమ్మివేయుట.

♦ వర్తమానసామీప్యమునందు భూతార్థకలకారము.

చున్నావు. దేహాత్మలస్వభావము దెలిసినవారి కిందుఁ గొంచెమేని శోకమునకు నిమిత్తము లేదు. గతాసూన్ = పోయిన ప్రాణములు గలవానిని, అనఁగా అవశ్యము నశించునట్టి దేహములను గూర్చియు; అగతాసూన్ చ= పోని ప్రాణములు గలవానిని, ఎప్పుడును నశింపని ఆత్మలను గూర్చియు; పణ్డితాః = దేహాత్మలస్వభావముయొక్క తత్త్వముఁ దెలిసినవారు; నానుశోచన్తి = దుఃఖింపరు. కావున వీరిని వధింపఁ బోయెద నని శోకంబును దేహాతిరిక్తుఁడు ఆత్మ యను జ్ఞానముచేఁ జేయఁబడునట్టి ధర్మాధర్మభాషణంబును—ఈ రెండును బరస్పర విరుద్ధములు నీయందుఁ గానఁబడుచున్నవి. కాఁబట్టి నీవు దేహస్వభావమునుం దెలిసినవాఁడవు కావు, తదతిరిక్తుఁడై నిత్యుఁడైన ఆత్మనుగూడఁ దెలిసినవాఁడవు కావు, తత్ప్రాప్తి కుపాయభూత మయిన యుద్ధాదిధర్మమునుం దెలిసినవాఁడవు కావు. ఈ యుద్ధమే ఫలాభిసంధిని విడిచి యనుష్ఠించినయెడ ఆత్మతత్త్వప్రాప్తికి సాధన మగును. ఆత్మ జన్మమరణములు లేని వాఁ డగుటవలన జన్మముచే సద్భావము * గలవాఁడు కాఁడు, మరణముచే వినాశము నొందువాఁడును గాఁడు, కావున నతఁడు శోకమునకు విషయము కాఁడు. దేహమో అచేతనము పరిణామస్వభావము. దానికి ఉత్పత్తివినాశములు కలుగుట స్వాభావికము. కావున నదియు శోకమునకు విషయము కా దని యభిప్రాయము.

నీవు ఎవరినిగూర్చి శోకించుట యుచితము కాదో వారినిగూర్చి శోకించుచున్నావు. మఱియు దేహాత్మస్వభావము చక్కఁగాఁ దెలిసినవారు చెప్పు మాటలనుగూడఁ జెప్పుచున్నావు, దేహము నశ్వరము కావున దానిఁ గూర్చి శోకించుట వ్యర్థ మగుటచే నుచితము కాదు, ఆత్మ నిత్యుఁడు, కావున ఆత్మనుగూర్చి శోకింప నవసరము లేదు. అందువలన దేహముయొక్కయు ఆత్మయొక్కయు స్వభావము దెలిసినట్టి పండితులు నశ్వరము లయిన దేహములను గూర్చియు నిత్యులయిన యాత్మలను గూర్చియు శోకింపరు. కావున నీవు చెప్పినట్టి ప్రజ్ఞావాదములను నీవు పడునట్టి శోకమును బరస్పరవిరుద్ధములుగా నున్నవి. ఇందుచే నీవు దేహాత్మలస్వభావము దెలిసినవాఁడవు కా వని యేర్పడుచున్న దని తాత్పర్యము.

మాధ్వభాష్యము.—

అందు రెండుసేనల నడుమ బాంధవాది మోహజాలముచేఁ జుట్టఁబడినవాఁడై విషాదపడుచున్న యర్జునునకు భగవంతుం డి ట్లనియె—త్వమ్ = నీవు;

* ఉండుట.

అశోచ్యాన్ = శోకింపఁ దగనివారినిగూర్చి; అన్వశోచః=శోకించితివి, నీ వెవ్వరినిగూర్చి శోకించితివో వారు శోకింపఁ దగినవారు కారు, కావున వారి గుఱించి శోకింప రా దని యర్థము. ప్రజ్ఞావాదాంశ్చ—ప్రజ్ఞా = స్వబుద్ధియొక్క, వాదాంశ్చ = మాటలను గూడ, స్వబుద్ధి కల్పితము లయిన మాటలనుగూడ; భాషసే = పలుకుచున్నావు. నీ వేమాటలు చెప్పుచున్నావో అవి నీ బుద్ధిచే కల్పితములు కాని శాస్త్రయుక్త ములు కావు కావున అట్టి మాటలు పలుక రా దని భావము. ఎట్లు శోకింపఁ దగిన వారు కా రనఁగాఁ జెప్పుచున్నాఁడు—అగతాసూంశ్చ = బ్రతికియున్నవారిని గూర్చి వలెఁ; గతాసూన్ = చావఁబోవువారినిగూర్చియు; పణ్డితాః= విద్వాంసులు, నానుశో చన్తి = దుఃఖింపరు.

నీ వెవ్వరినిగూర్చి దుఃఖించుచున్నావో వారినిగూర్చి దుఃఖించుట యుచి తము కాదు, మఱియు నీవు ధర్మాధర్మవిషయముగా నేమాటలు చెప్పుచున్నావో అవి నీవు స్వబుద్ధిచేఁ గల్పించినవి కాని శాస్త్రయుక్తములు కావు. లోకమునందుఁ జావఁ బోవువారిని గూర్చి జనులు శోకించుటను చూచుచున్నారము, అట్లుండఁగా వీ రెట్లు శోచ్యులు కా రనఁగా, అట్లు శోకించువారు మూఢులు, బ్రతికియున్నవారిని గూర్చి మూఢు లెట్లు దుఃఖింపరో అట్లు చావఁబోవువారిని, లేక, చచ్చినవారిని గూర్చియుఁ బండితులు దుఃఖింప రని తాత్పర్యము.

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
నచైవ న భవిష్యామ స్సర్వే వయ మతః పరమ్. ౧౨

భా. ఎందువలన వారు శోచ్యులు గారు? నిత్యు లగుటవలన. ఎట్లు నిత్యులు? అనఁగా, జాతు = ఒకానొకప్పుడును; అహమ్ = నేనును; న త్వేవనాసమ్ = లేకయుండినవాఁడను కానే కాను, మ ఱేమనఁగా ఉండనే యుంటిని, కడచినట్టి దేహముల యుత్పత్తివినాశములయందు నిత్యుఁడనై యే నే నుంటి నని యభిప్రాయము. అట్లు, త్వమ్ = నీవు; న నాసీః = లేక యుండినవాఁడవు కావు, మ ఱేమనఁగా ఉండనే యుంటివి. అట్లు, ఇమే = ఈ, జనాధిపాః = రాజులు; న నాసన్ = లేకయుండినవారు కారు, మ ఱేమనఁగా ఉండనే యుండిరి. అట్లు, వయమ్ = మనము; సర్వే = అందఱమును; అతః = ఈదేహముయొక్క నాశమునకంటెఁ;

పరమ్ = అవతలఁగూడ; నైవచ న భవిష్యామః = లేకుండువారము కానే కాము, మఱేమనఁగా ఉండనే యుండఁగలముగూడ. ఆత్మస్వరూపముచే మూఁడుకాలములయందును నిత్యుల మని యర్థము. దేహభేదానువృత్తిచేత బహువచనము, ఆత్మభేదాభిప్రాయముచేఁ గాదు.

ఆ. అశోచ్యు లనుటకు నిత్యత్వము కారణ మని సూచించినదాని స్పష్టపఱచుటకై ప్రశ్నపూర్వకముగాఁ బ్రతిజ్ఞ చేయుచున్నారు—ఎందువలన నిత్యాదిగా. ప్రమాణము లేకుండుటవలన నిత్యత్వముసిద్ధముకాదని యాక్షేపించుకొనుచున్నారు—ఎట్లు ఇత్యాదిగా. ఆత్మ పుట్టఁడు, ప్రాగభావము * లేకుండుటవలన, మనిషికొమ్మువలె అను ననుమానముచే సమాధానము చెప్పుచున్నారు పూర్వార్థముచేత. మఱియును, ఆత్మ నిత్యుఁడు, భావపదార్థమయి జన్మము లేకుండుటవలన, వ్యతిరేకమున ఘటమువలె ¶ అని మఱియొక యనుమానము చెప్పుచున్నారు ఉత్తరార్థముచేత. ఇచటఁ గొందఱు 'జిజ్ఞాసిత మయిన § ఆత్మతత్త్వమును భగవంతుఁ డుపదేశించుచున్నాఁడు నత్వేత్యాది శ్లోకచతుష్టయముచేత' అని వచించిరి. అది యుక్తము కాదు. ఏల యనఁగా శాస్త్ర మంతటను ఆత్మతత్త్వప్రతిపాదనము సమాన మగుటవలన ఈ నాలుగు శ్లోకములయందుమాత్రమే యాత్మతత్త్వప్రతిపాదనము, తక్కినచోట లే దనుటకు హేతువు లేదు. ఈ యభిప్రాయముతో 'పదచ్ఛేదః పదార్థోక్తి ర్విగ్రహో వాక్యయోజనా' అను వ్యాఖ్యానాంగములు మూఁటిని బ్రతిపాదించుచున్నారు—జాతు ఇత్యాదిగా. ఓయీ! దేహమున కుత్పత్తివినాశములు కలిగినప్పుడు ఆత్మకును ఉత్పత్తివినాశము లగునట్లు ప్రసిద్ధ మగుటవలన మీరు చెప్పిన రెం డనుమానములును లోకప్రసిద్ధి విరుద్ధము లగుటచే సాధ్యబాధవలన ♦ బాధితము లగును? అనఁగా అట్లు కా దని చెప్పుచున్నారు—కడచినట్టి ఇత్యాదిగా. చరాచరవ్యపాశ్రయస్తుస్యా త్తను న్యాయముచే $ ఆత్మకు జన్మ

---

* ప్రాక్ అభావము—వస్తువు పుట్టుటకు మునుపు దానియొక్క అభావము.

¶ ఏది భావపదార్థమై జన్మము లేనిదికాదో అది నిత్యము కాదు—ఇది వ్యతిరేకము, అనఁగా ఏది భావపదార్థమై జన్మము గలదో అది అనిత్యము, ఇందుకు ఘటము దృష్టాంతము.

§ తెలియఁ గోరఁబడిన.

♦ సాధ్యములు—జన్మాభావము నిత్యత్వము అవి లేకపోవుటవలన.

$ దేవదత్తుఁడు పుట్టెను దేవదత్తుఁడు చచ్చె నను లౌకికప్రసిద్ధివలనను శాస్త్రమునందు జాతకర్మాదిసంస్కారము విధించుటవలనను జీవున కుత్పత్తివినాశములు కల వని యాక్షేపము, అందుకు

మరణములు కల వను ప్రసిద్ధి తదుపాధిభూతదేహముయొక్క జన్మమరణములనుబట్టి గౌణముగా వచ్చినది. నిరుపాధికుఁడైన ఆత్మకు జన్మాదులు సంభవింప వని భావము. ఈశ్వరుఁడవు నీకు జన్మము లేదనుటసరే, ఐనను నాకట్లు లేదనఁగాఁ జెప్పుచున్నాఁడు—అట్లు ఇత్యాదిగా. అట్లయినను భీష్మాదుల కట్లు జన్మము లేదనఁగాఁ జెప్పుచున్నారు—అట్లు ఇమే ఇత్యాదిగా. రెండవ యనుమానమును వివరించుచు నుత్తరార్ధమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు—అట్లు వయమ్ ఇత్యాదిగా. ఓయీ! దేహమునకు జన్మవినాశములు కలిగినప్పుడు జన్మవినాశములు లేకున్నను అగ్నివిస్ఫులింగదృష్టాంతము శ్రుతియందుఁ జెప్పఁబడుటవలన మహాసృష్టి మహాప్రళయములయందు ఆత్మకు జన్మవినాశములు కల వని యంగీకరింపవలయును. అని యాశంకించి నాత్మాశ్రుతేః* యను న్యాయముచే సమాధానము చెప్పుచున్నారు.—ఆత్మస్వరూపముచే నిత్యాదిగా. ఓయీ! యావద్వికారంతు విభాగో లోకవత్తను న్యాయముచే♦ ఆత్మలు పరస్పరభిన్నులగుటవలన కార్యము లగుదు

---

సమాధానము—అ-౨. పా-౩. సూ-౧౬. చరాచరవ్యపాశ్రయస్తుస్యాత్తద్వ్యపదేశో భాక్తస్తద్భావభావిత్వాత్—తద్వ్యపదేశః=జన్మవినాశములు కల వని చెప్పుట, భాక్తః—జీవునివిషయమున గౌణము. మఱియెక్కడ ముఖ్య మనఁగా—చరాచరవ్యపాశ్రయస్తుస్యాత్ = జంగమస్థావరరూప మయిన జీవుని శరీరము విషయముగాఁ గలదియే యగును. శరీరముయొక్క జన్మవినాశములనుబట్టి జీవునకు జన్మవినాశములు కల వనుమాట వచ్చినది కాని వాస్తవముగా జీవునకవి లే వని యర్థము. ఎందువలన ననఁగా—తద్భావభావిత్వాత్ = ఆ శరీరముయొక్క జన్మవినాశములందే కలుగుటవలన, జన్మము కాని వినాశము కాని శరీరమునకుఁ గలిగినప్పుడే జీవునకవి కలిగె ననుమాట కలుగుచున్నది కాని శరీరసంబంధము లేనప్పుడు జీవుఁడు పుట్టుటగాని చచ్చుటగాని యెవ్వఁడేని చూచియున్నాఁడా! కావున ఈ లౌకిక ప్రసిద్ధియు జాతకర్మసంస్కారవిధానమును శరీరజన్మనాశనిమిత్తములు.

* అ-౨. పా-౩. సూ-౧౭. నాత్మాఽశ్రుతేర్నిత్యత్వాచ్చతాభ్యః—కొన్ని శ్రుతులం దగ్నివిస్ఫులింగాది దృష్టాంతములచే జీవాత్మకుఁ బరబ్రహ్మమువలన నుత్పత్తి చెప్పఁబడుచున్నది. అందుచే జీవునకు జన్మము గల దనఁగా సమాధానము చెప్పుచున్నారు—ఆత్మా= జీవుఁడు, న— పుట్టఁడు. ఎందువలన ననఁగా, అశ్రుతత్వాత్= ఉత్పత్తిప్రకరణమున శ్రుతులయందు జీవుని యుత్పత్తి చెప్పఁబడకుండుటవలన, మఱియు నెందువలన ననఁగా, తాభ్యః = ఆశ్రుతులవలన, నిత్యత్వాత్ = నిత్యుఁ డగుటవలన, నిత్యుఁడని చెప్పఁబడుటవలన ననుట, మఱియు చకారముచే అజుఁ డనియు బ్రహ్మ మనియుఁ జెప్పఁబడుటవలనను. ఉత్పత్తిప్రకరణమున జీవుని కుత్పత్తి చెప్పఁబడ లేదు. మఱియు నిత్యుఁ డనియు అజుఁ డనియు ఇతఁడే బ్రహ్మ మనియు శ్రుతులు చెప్పుచున్నవి. కావున జీవున కుత్పత్తి సంభవింపదు. విస్ఫులింగాది శ్రుతులు జీవునికి ఉపాధినిమిత్తమయిన జన్మవినాశములనే ప్రతిపాదించు నని యభిప్రాయము.

♦ అ-౨. పా-౩. సూ-౭. తు అనునది ఆకాశోత్పత్తి సంభవింప దనుట లే దని సూచించుచున్నది. ఎందువలన ననఁగా, యావద్వికారమ్—ఎంత కార్యసమూహము కనఁబడుచున్నదో, అంతే, విభాగః=

రని యనుమానింపఁబడుచున్నది. భిన్నులెట్లనఁగా ఈ శ్లోకంబున—ఇమే వయమ్ అను బహువచనముచే భిన్నులని యేర్పడుచున్నది యని యాశంకించి సమాధానము చెప్పుచున్నారు— దేహభేదానువృత్తిచేత నిత్యాదిగా.

౯. వార లెందువలన అశోచ్యులు? అనఁగా జన్మమరణాదులు సంభవింపకుండుటవలన నని చెప్పుచున్నారు—జాతు = ఒకానొకప్పుడును; అహమ్ ననాసమ్ = నేను లేకుండినవాఁడఁ గాను. మఱి యే మనఁగా ఉండనే యుంటిని. త్వమ్. ననాసీః—ఉండనే యుంటి వని యర్థము. ఇమే జనాధిపాః= ఈ భీష్మాదులు; ననాసన్, మఱే మనఁగా ఉండనే యుండిరి. నీవును నేనును ఈ రాజులును, వయమ్ సర్వే = మన మందఱమును, ఒకానొకప్పుడును, ననభవిష్యామః, మఱే మనఁగా ఉండనే యుందుము. ఇదివఱకుఁ గడచిన దేహోత్పత్తివినాశములయందు మన కందఱకును ఉత్పత్తివినాశములు లేవు. ఏల యనఁగా మనము పరమాత్మస్వరూపుల మగుటచే నిత్యులము. అట్లు రాఁబోవు దేహోత్పత్తివినాశములయందును శంకింప వలసినది లే దని యర్థము. బహువచనము దేహాభిప్రాయముచేత. పెక్కుదేహములు జన్మించినను నశించినను ఆత్మకు జన్మవినాశములు లే వని ప్రతిపాదిత మగుచున్నది.

౧౦. అశోచ్యా నన్వశోచ స్త్వ మ్మను శ్లోకముచేత భీష్మాదు లశోచ్యు లని ప్రతిపాదించుటచే భీష్మాదిపదములకు లక్ష్యార్థ మయిన ఆత్మ దేహేంద్రియాదులకు భిన్నుఁడనియు నిత్యుఁడనియు సూచిత మగుచున్నది. ఈ యర్థము నర్జునుఁడు తెలియకున్నాఁ డని చూచి భగవంతుఁడు—« లక్ష్యార్థ మయిన ఆత్మ నిత్యుఁ డనుటకు అజత్వము * హేతువన్న పక్షమున అజత్వము అను హేతువుచే శశవిషాణము § గూడ నిత్య మనుట సంభవించును. కావున భావత్వముతోఁ ‖ గూడిన అజత్వము నిత్యత్వమునకు హేతు వని చెప్పవలెను. దేనికిఁ గాలత్రయమునందు సత్త వ్యభిచరిం

విభక్తత్వము — వేఱుపాటు కనఁబడుచున్నది, లోకవత్ = లోకమునందలి ఘటాదివస్తువులవలె. ఏది యేది విభక్తమో అది యంతయు కార్యము, ఘటాదులవలె. ఆకాశము పృథివ్యాదులకంటె విభక్తముగాఁ గనఁబడుటవలన, ఆకాశము కార్యము ఉత్పత్తి గలది యని యర్థము.

* పుట్టనివాఁ డగుట.

§ కుందేటికొమ్ము

‖ భావ మనఁగా ఉండునట్టి పదార్థము, శశవిషాణము ఉండునది కాదు, కావున నది భావపదార్థము కాదు.

పదో * అది భావమును నిత్యమును అగును. దేనికి వ్యభిచరించునో అది భావమునుం గాను నిత్యమునుం గాదు" అని ఆత్మ కాలత్రయమునందును సత్తగలవాఁడని ప్రతిపాదించు ద్వారమున దేహేంద్రియాదులకన్న భిన్నుఁడనియు నిత్యుఁడనియు శోధించుటకు మరల తత్త్వంపదార్థశోధనంబును శోధితము లయిన ఆ తత్త్వంపదార్థముల కేకతయును బ్రతిపాదించుచున్నాఁడు, త్వంపదార్థమునకు నిశ్శేషసంసారదుఃఖనివృత్తిపూర్వకముగా నిత్యనిరతిశయాఖండానందప్రాప్తికొఱకును, తత్పదార్థమునకుఁ బరోక్షత్వము పరిచ్ఛిన్నత్వము అను అనర్థము నివర్తిల్లి అద్వితీయత్వమును అఖండైకరసత్వమును సిద్ధించుటకొఱకును.—

అహమ్ = తత్పదార్థము పరమాత్మ సర్వజ్ఞుఁడు సర్వశక్తి సర్వతంత్రుఁడు స్వతంత్రుఁడు పరమేశ్వరుఁడు నగు నేను; జాతు=ఒకానొకప్పుడును; నాసమ్ ఇతిన = లేకయుంటిని అనుట లేదు, మఱి యేమనఁగా, ఎల్లప్పుడును ఉండనేయుంటిని. నేను లేకయుండినయెడ జగత్సృష్ట్యాదులు లేకపోవును. ఎట్లనఁగా—‘ జన్మాద్యస్య యతః, § యతోవా ఇమాని భూతాని జాయన్తే, యతోజాతాని భువనాని విశ్వా, సఈక్షతలోకాన్ను సృజా ఇతి, స ఇమాఀ లోకా నసృజత ’ ¶ ఇత్యాది శ్రుతులచే నావలననే జగదుత్పత్తి యని చెప్పఁబడుచున్నది. ‘ యేన జాతాని జీవన్తి, వ్యక్తావ్యక్తం భరతే విశ్వమీశః, స దాధార పృథివీం ద్యాముతేమామ్, భీషాస్మా ద్వాతః పవతే, తస్మిఀ లోకాశ్శ్రితా స్సర్వే, † ఇత్యాది శ్రుతులచే నావలనని జగముయొక్కస్థితి యని ప్రతిపాదింపఁబడుచున్నది. ‘ యత్ప్రయ న్త్యభిసంవిశన్తి, తథాక్షరాద్వివిధా స్సోమ్య భావాః ప్రజాయన్తే తత్ర చైవాపియన్తి, యస్మిఀ క్షేత్రే సంహరత్యేష దేవః ’ $ ఇత్యాది శ్రుతులచే జగత్ప్రలయంబుగూడ నావలననె యని చెప్పఁ

* ఉండుట తప్పదో.

§ బ్రహ్మసూ. అ-౧. పా-౧. సూ-౨.

¶ ఈ జగత్తుయొక్క జన్మాదికము ఏ బ్రహ్మమువలన నయ్యెనో, ఎవ్వనివలన ఈ భూతములు పుట్టుచున్నవో, ఎవ్వనివలన సమస్తభువనములును బుట్టినవో, అతఁడు లోకములను సృజించెద నని చూచెను, అతఁ డీలోకములను సృజించెను.

† పుట్టినవి ఎవ్వనివలన జీవించుచున్నవో, ఈశ్వరుఁడు వ్యక్తమును అవ్యక్తమును భరించుచున్నాఁడు, అతఁడు భూమిని ఆకాశమునుగూడ ధరించెను. వీనివలని భయముచే వాయువు వీచుచున్నాఁడు. అతనియందు సమస్తలోకములును పొందియున్నవి.

$ దేనిఁ బొందుచున్నవో తాదాత్మ్యము నొందుచున్నవో, అట్లు సౌమ్యుఁడా! బ్రహ్మమువలన నానావిధభావములు పుట్టుచున్నవి అందే లయము నొందుచున్నవి. ఏక్షేత్రమునం దీదేవుఁడు సంహరించుచున్నాఁడో.

బడుచున్నది. ఎందువలన జగత్సృష్టిస్థితిలయములకు నే నొకఁడనే కర్తగా నున్నానో, అందువలన జగత్సృష్టి స్థితిలయాదు లగుచుండఁగా వాని కధిష్ఠాత నగుటచే నెల్లప్పుడు నేను ఉండనేయుంటి నని యిప్పు డుదాహరించిన శ్రుతుల ప్రామాణ్యమువలన మూఁడుకాలములయందును నాసద్భావము * నిశ్చయింపవలె నని యర్థము. ఇందుచే, మేఘమునకును తత్సంచారము మొదలగువానికిని ఆధార మయిన ఆకాశమునకు మేఘతద్ధర్మాదులతో నెంతమాత్రము సంబంధము లేనియట్లు, ప్రపంచమునకును తదుత్పత్త్యాదులకును అధిష్ఠాన మయియున్న తత్పదార్థమునకు, నిష్కల నిష్క్రియస్వరూప మగుటచే, ప్రపంచముతోను తద్ధర్మముతోను తత్కర్మముతోను లేశమైనను సంబంధము లే దనుటయు తద్భిన్నత్వంబును నిత్యత్వంబును సూచిత మగుచున్నది. ఓయి! పరమేశ్వరుఁడవు స్వతంత్రుఁడ వగు నీకు సరే కాలత్రయమునందును సద్భావము కలదు. మర్త్యుఁడ నగు నా కెట్లు నిత్యత్వము సిద్ధించు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—త్వమ్—త్వం పదమునకు లక్ష్యార్థ మయిన నీవును, జాతు = ఒకానొకప్పుడును; నాసీరితిన, మ తేమనఁగా ఉండనేయుంటివి. నీవు జాగ్రదాద్యవస్థలం దుండునట్లు అతీతములు అనాగతములు నగు దేహాత్పత్త్యాదులందును ఉండనేయున్నావు. ఎట్లు నీవు జాగ్రదవస్థయందుండియే స్వప్నముఁ బొందుచున్నావో, స్వప్నముననుండియే సుషుప్తిని బొందుచున్నావో, సుషుప్తియందుండియె మరల జాగ్రత్తను బొందుచున్నావో, అట్లు నీవు కడచిన దేహమునందుండియే యీదేహము నొందితివి, ఈదేహమున నున్నవాఁడవే భవిష్యద్దేహము నొందఁగలవు అని యంగీకరింపవలెను. అట్లు గానియెడ సుఖదుఃఖాదివైచిత్ర్యము § సంభవింపక పోవును. ఇప్పుడు నీకు కలుగుచుండు సుఖదుఃఖాదివైచిత్ర్యము కర్మవైచిత్ర్యమువలననె కలుగవలయును. అట్టి నానావిధకర్మములు నీవే చేసియుండవలయును, కావున నీవు దేహాంతరములం దుండనేయున్నావు. లేనిచో కృతనాశము అకృతాభ్యాగమము ¶ అను దోషము ప్రసక్తించును. మఱియు ‘యత్కర్మ కురుతే తదభిసంపద్యతే’ ♦

* ఉండుటను.

§ సుఖదుఃఖాదులు నానావిధములుగా నుండుట.

¶ ఇఁకమీఁద నీవు లేనియెడ కృతనాశము—ఈ దేహమునందు నీచే చేయఁబడినకర్మముల ఫలములకు నాశము—అనుభవము లేకయె నశించుట యనుదోషము. ఇదివఱకు మున్ను నీవు లేనియెడ అకృతాభ్యాగమము—నీచేఁ జేయఁబడని కర్మముల ఫలములయొక్క ప్రాప్తి యనుదోషము వచ్చును.

♦ ఏకర్మమును జేయుచున్నాఁడో దానిఁ బొందుచున్నాఁడు.

'జన్మాన్తరకృతం కర్మ భుజ్యతే జన్తవోఽధునా' * ఇత్యాది శ్రుతిస్మృతి విరోధము ప్రసక్తించును. పూర్వజన్మమునందలి కర్మముయొక్క ఫలం బీ జన్మమునందును ఈ జన్మంబునఁ జేయుకర్మముయొక్క ఫలంబు భవిష్యజ్జన్మమునందును అనుభవింపఁ బడును. అట్లే 'ప్రాప్యాన్తం కర్మణస్తస్య యత్కిం చేహ కరోత్యయమ్, తస్మాల్లోకాత్పునరేత్యస్మై లోకాయ కర్మణే' § అని శ్రుతి వచించుచున్నది. అందువలన జాగ్రదాద్యవస్థలందుంబోలె గతదేహములందును భవిష్యద్దేహములందును ఈ దేహమునం దెట్లో అట్లు నీకు కాలత్రయమునందును సద్భావము ఉండనే యున్న దని యర్థము. ఇందుచే త్వంపదలక్ష్యార్థ మయిన యాత్మ దేహేంద్రియాదులకన్న భిన్నుఁ డనియు నిత్యుఁ డనియు సూచిత మగుచున్నది. ఇమే జనాధిపాః, నాసన్నితిన, మ జేమనఁగా వీరును త్వంపదార్థములే యగుటవలన మూఁడుకాలములయందును ఉండనే యున్నారు. నే నెట్లో అట్లు వీరును నిత్యసిద్ధ మయిన సద్భావము గలవారని యర్థము. జనాధిపాః అని అవిద్యావృత్తిభేదముచే బహువచనము, ఆత్మభేదముచేఁ గాదు, ఏల యనఁగా ఆత్మభేదమునందుఁ బ్రమాణము లేదు. ఓయీ! ఆత్మభేదమునందుఁ బ్రమాణము లే దని చెప్పుట యతిసాహసము. ఆత్మతత్త్వము విచారించినచో ఆత్మైక్యము సిద్ధింపదు. ప్రత్యక్షాదిప్రమాణము లన్నియు ఆత్మభేదమునే తెలుపుచున్నవి. ఎట్లనఁగా—ఎక్కడెక్కడ అహం ప్రత్యయ భేదమో ¶ అక్కడక్కడ ఆత్మభేదము. అట్లు ప్రతిదేహమునందును అహంప్రత్యయభేదము ప్రత్యక్షముగాఁ గనఁబడుచున్నది. ఆత్మ యేకమన్ననో 'నీవు నేను ఇతఁడు' ఇత్యాది వ్యవహారములు లేకపోవును. కావున ఆత్మ భేదమునందుఁ బ్రత్యక్షము ప్రమాణము. ఆత్మభేదము లేనియెడ వ్యవహారము సిద్ధింపమిచే వ్యవహారసిద్ధ్యన్యథానుపపత్తివలన ♦ అర్థాపత్తియుఁ బ్రమాణము. ఆత్మ ప్రతివ్యక్తియందును భిన్నుఁ డగుచున్నాఁడు, వ్యక్తులు భిన్నము లగుటవలన, గోవు మొదలగువానివలె; మఱియు, ఆత్మ భిన్నుఁడే యగుచున్నాఁడు, ప్రతివ్యక్తియందును అహంప్రత్యయము భిన్న మగుటవలన, వ్యక్తులు భిన్నము లగుటవలన, ఘటాదులవలె, ఇత్యాద్యనుమానములును ప్రమా

* జన్మాంతరమునందుఁ జేయఁబడిన కర్మమును ప్రాణు లిప్పు డనుభవించుచున్నారు.

§ ఈ లోకంబున నితఁ డే యే కర్మము జేయుచున్నాఁడో ఆ కర్మముయొక్క అంతము బొంది మరల నాలోకమునుండి యీ లోకమునకుఁ గర్మముకొఱకు వచ్చుచున్నాఁడు.

¶ నేను అను జ్ఞానము భిన్నముగాఁ గనఁబడుచున్నదో.

♦ వ్యవహారసిద్ధి, అన్యథా = వేఱువిధమున, అనుపపత్తి = ఉపపన్నము కాకుండుట.

ణము. 'అదితి ర్దేవా గన్ధర్వా మనుష్యాః పితరో ఽసురాః' అను దేవాదిభేదప్రతిపాదక మయిన శ్రుతియును బ్రమాణము. 'దేవ దానవ గన్ధర్వా యక్ష రాక్షస కిన్నరాః' ఇత్యాదిపురాణవచనమునుం బ్రమాణము. ఆత్మ యేక మే యని యంగీకరించుపక్షమున అప్పుడు నీకు సుఖదుఃఖాదుల వ్యవస్థగూడ సిద్ధింపదు. ఒకఁడు దుఃఖి యైనయెడ అందఱును దుఃఖులు కావలయును. ఒకఁడు సుఖి యైనచో అందఱును సుఖులు కావలయును. దేవాది సర్వదేహములందును ఆత్మ యొకఁడే యన్న పక్షమున అందఱును సర్వజ్ఞులు కావలయును. అందుచే విధినిషేధశాస్త్రములు నిరర్థకము లగును. ఒకఁడు బద్ధుఁ డైనచో బంధము, ముక్తుఁ డైనచో మోక్షము అందఱును గలుగవలసి వచ్చును. కావున సర్వప్రమాణసిద్ధం బాత్మభేదము నీవు నంగీకరింపక తప్పదు అనఁగా—అట్లు కాదు. వ్యాప్తి వ్యభిచరించుటవలనఁ బ్రత్యక్షప్రమాణము సిద్ధింపదు. ఎక్కడెక్కడ అహంప్రత్యయ భేదమో అక్కడక్కడ ఆత్మభేద మనువ్యాప్తి వ్యభిచరించుచున్నది.* ఎట్లనఁగా, నేను బాలుఁడను నేను కుమారుఁడను నేను యౌవనవంతుఁడను నేను వృద్ధుఁడను అని బాల్యాద్యవస్థల భేదమువలన ఆ యవస్థలందలి యహంప్రత్యయములు[illegible]త్యాదులందును ఉన్నవి. కౌమారమునందు నేను బాలుఁడను అను ప్రత్యయము పొందుచున్నావో, స్వప్నా అప్పుడు ఆ ప్రత్యయమును కలిగించునట్టి బాల్యము లేక[illegible]ందుండియె మరల జాగ్రత్త్వమునందును వృద్ధత్వమునందును అహంప్రత్యయము భిన్న[illegible]ందుఁగాచున్నది. అట్లయినను, బాల్యాద్యవస్థావంతుఁ డగు ఆత్మకేమో భేదము లేదు. కావున ఆత్మభేదమునకుఁ బ్రత్యక్షప్రమాణము లేదు. ఓయీ! విశేషణభేదమువలన విశిష్టమునకును భేద మగు నను న్యాయముచే అవస్థాభేదమువలన అవస్థావంతునకును భేద మగును అనఁగా—అది యుక్తము గాదు. అవస్థాభేదప్రయుక్త మయిన ఆభేదము బాల్యాద్యభిమాని యగు నహంకారమునకే యగును కాని నిత్యుఁ డైన ఆత్మకుఁ గాదు. ఆత్మకును ఆ భేదము కల దన్నచో బాల్య మాదిగా దేహేంద్రియకృతము లయిన కార్యముల స్మరణము సంభవింపక పోవును. 'నేను బాల్యమునందుఁ జెండా టాడితిని' అని స్మరణమో సంభవించుచున్నది. అవస్థాకృత మయిన భేద మాత్మకుఁ గల దన్నపక్షమున ఈ స్మరణము ఘటిల్లదు. ఒకఁడు చేసిన కార్యమును మఱియొకఁడు తాఁ జేసితి నని యెట్లు స్మరించును? కావున బాల్య మాదిగా వృద్ధత్వమువఱకుఁ జేసిన కార్యములను స్మరించుటవలన, అహంప్రత్యయభేదముచే ఆత్మ

* అహంప్రత్యయభేద మున్నచోట ఆత్మభేదము లేకున్నది.

భేద మను ప్రత్యక్షప్రమాణము సిద్ధము కాదు. వ్యక్తిభేదమువలన ఆత్మకును భేదమను ననుమానప్రమాణముగూడ సిద్ధింపదు. స్థూలసూక్ష్మకారణదేహములును జాగ్రత్స్వప్నదేహములును భిన్నము లయినను ఆత్మకు భేదము లేకుండుటవలన అనుమానము సిద్ధింపదు. అదితి ర్దేవా గన్ధర్వా యను శ్రుతియును ఆత్మోపాధిభేదములను జెప్పుచున్నది గాని ఆత్మ భేదమును గాదు. అంతటను చైతన్యమేకరూపమే యగుటవలన ఆత్మ భేదమున కుపపత్తి లేదు. కావున దేవగంధర్వమనుష్యాది దేహము లన్నియు జాగ్రత్స్వప్నాది దేహములవలె ఆత్మకు భోగాయతనములే కాని యాత్మ భేదము తెలుపునవి గావు. ఎట్లు స్థూలసూక్ష్మాదిదేహములచే ఒక్కయాత్మకే భిన్నభిన్నభోగము లగుచుండునో అట్లే దేవగంధర్వాదిదేహములచేతనుగూడ ఒక్కయాత్మకే భిన్నభిన్నభోగము లగుచుండును, కావున దేవాదిదేహములు భోగాయతనములే యగుచున్నవి. మఱియు వానియందు రూపతేజస్స్వభావాదులే భిన్నములుగాఁ గనఁబడుచున్నవి కాని చైతన్యమునకు భేదములేదు. అందువలననె ఆత్మవిషయక మయిన అహమ్ అను ప్రత్యయము ఎల్లప్పుడును ఏకరూపముగానే యున్నది. అందుచే శ్రుతి కభిప్రాయము దేహభేద ప్రతిపాదనమేగాని ఆత్మభేదప్రతిపాదనము గాదనుట సిద్ధము. అట్లే పురాణవచనమునకును అభిప్రాయము. ఎట్లు ఒక్కదేహమునందే అవయవభేదము నాశ్రయించి శిరస్సు హస్తము పాదము ఇత్యాదివ్యవహారము కలుగుచున్నదో అట్లు ఆత్మ యొక్కటియయినను దేహభేదము నాశ్రయించి నీవు నేను వీఁడు ఇత్యాదివ్యవహారము సిద్ధించుచున్నది. ఇందుకై యాత్మభేదము కావలసినది లేదు. ఇట్లు వ్యవహారమునకు అన్యథానుపపత్తి లేకుండుటవలన అర్థాపత్తిప్రమాణంబుగూడ లేదు. ఇఁక ఆత్మభేదము లేనియెడ సుఖదుఃఖాదివ్యవస్థ సిద్ధింప దనుటకుఁ జెప్పుచున్నాము. సుఖదుఃఖాదివ్యవస్థ కర్మముచేతనే కలుగును. అట్లు ఒకదేహమునందే కర్మభేదముచే సుఖదుఃఖాదివైచిత్ర్యము కనఁబడుచున్నది. కావున సుఖదుఃఖములు పుణ్యపాపకార్యము లగుటచేఁ బుణ్యపాపభేదమువలనను భోక్తలు భిన్నులగుటవలనను ఆత్మ యొక్కటైనను సుఖాదివ్యవస్థ యుపపన్నమగును. అట్లు 'యత్కర్మ కురుతే తదభిసంపద్యతే' * అనియు 'యథాకారీ యథాచారీ తథా భవతి' § అనియు శ్రుతి చెప్పుచున్నది. కావున ఆత్మ యొక్కటె యనుపక్షమునందు సుఖదుఃఖాదిసాంకర్యప్రసక్తి లేదు. ఏల యనఁగా,

* ఏకర్మమును జేయుచున్నాఁడో దానిఁ బొందుచున్నాఁడు.

§ ఎట్లు చేయుచున్నాఁడో ఎట్లు చరించుచున్నాఁడో అట్లగుచున్నాఁడు

'నాన్యో ఽతో ఽస్తి విజ్ఞాతా' * అను శ్రుతివలనను భోక్తలనేకులగుటవలనను ఆత్మ యొక్కటియైనను తదాభాసము లనేకములు కావచ్చును. మఱియు సదా సర్వత్ర ఎఱుంగువాఁ డాత్మయొక్కఁడే యనుట సరే. అయినను ఆయా దేహమునందు ఆయా బుద్ధి § ద్వారమునఁ దా నెఱుంగుచున్నాఁడు. దేహభేదమునుబట్టి బుద్ధిభేదము నియత మగుటవలన జ్ఞానముమాత్రము ప్రతిదేహమును భిన్న మగుచున్నది. దీనిచే వస్తువు తెలియఁబడు నను వ్యుత్పత్తిచే జ్ఞాన మనఁగా బుద్ధివృత్తి. అది పరిచ్ఛిన్నము. కావున నేత్రమువలెఁ దనతో సంబంధముగల వస్తువునుమాత్రమె ప్రకాశింపఁ జేయును. బుద్ధివృత్తి పరిచ్ఛిన్న మగుటవలన దానికి సర్వపదార్థములతో సంబంధము ఘటిల్లదు. దానికి సర్వపదార్థసంబంధము కలుగుపక్షమున అప్పుడు అందఱు సర్వజ్ఞు లగుదురు. సర్వపదార్థసంబంధము లేకుండుటవలన అందఱకును సర్వజ్ఞత్వము లేదు. ఎట్లు విభువును $ శబ్దోత్పత్తిహేతువు నగు మహాకాశమునకు సర్వత్ర భేరీపణవాదులతో సంయోగ మున్నను ఎచట భేర్యాదికము వాయింపఁ బడునో అచటమాత్రమె శబ్దోత్పత్తి యగునో, సర్వత్ర కాదో, అట్లే ఒక్కఁడే యాత్మ పరిపూర్ణుఁడై యున్నను ఎచట బుద్ధివృత్తికి పదార్థముతో సంబంధ మగునో అచటనే జ్ఞానోదయ మగును. ఇతరస్థలమునఁ గాదు. కావున బుద్ధివృత్తు లనేకము లగుటవలనను బరిచ్ఛిన్నము లగుటవలనను అందఱకును సర్వజ్ఞత్వము కలుగ దనుట సిద్ధము. అందువలనఁ గించిజ్జ్ఞులకుఁ బ్రవృత్తినివృత్తి హేతువు లగుటచే విధినిషేధశాస్త్రములు సార్థకములే యగును. ప్రాణులు సర్వజ్ఞులు కా రని ప్రతిపాదించితిమి. కావున నెవ్వఁడు వేదాంతశ్రవణమునం గలిగిన జ్ఞానముచే ప్రత్యగభిన్న మగు పరబ్రహ్మము దానే యని యెఱుంగుచున్నాఁడో అతనికే ముక్తి. ఇతరునకు లేదు. అట్లు శ్రుతి 'తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవ త్తథర్షీణాం తథా మనుష్యాణామ్' ¶ అని ప్రతిపాదించుచున్నది. అందువలన ఆత్మయొక్కఁడే యయినను ముక్తి యాత్మజ్ఞానమువలననె సిద్ధించును. అట్లు 'జ్ఞానాదేవతు కైవల్యమ్' ♦ అని శ్రుతి నియమించు

---

* వీనికన్నను తెలియువాఁడు ఇతరుఁడు లేఁడు.

§ అంతఃకరణము.

$ సర్వవ్యాపకమును.

¶ అబ్రహ్మమును ఎవ్వఁడెవ్వఁడు దేవతలలో నెఱింగెనో అతఁడే అబ్రహ్మ మయ్యెను. అట్లే ఋషులలోను. అట్లు మనుష్యులలోను.

♦ కైవల్యము జ్ఞానమువలననే.

చున్నది. కాబట్టి ఆత్మైకత్వ పక్షమునందు ఈ చెప్పిన దోషముల కవకాశమే లేదు. ఇఁక ఆత్మ లనేకులును పరిపూర్ణులు నని యంగీకరించునట్టి నీయొక్క * మతమునందే యీదోషములు సంపూర్ణముగా సంభవించుచున్నవి. చెప్పెదము వినుము. ఆత్మలకు అనేకత్వమును విభుత్వమునుగూడ అంగీకరించినపక్షమున ఆత్మలకుఁ బరస్పరమనోబుద్ధ్యాదులతో సంయోగ మగును. అందుచే నిప్పుడు చెప్పిన విధముగా సుఖదుఃఖబంధమోక్షాదులకు సాంకర్యము ప్రసక్తించును. ఇది యొక్కటే కా దనర్థము. మ తేమనఁగా విభుత్వాదులుగూడ సిద్ధింపవు. ఎట్లనఁగా- ఏయేవస్తువు తనకంటె నితరములో భేదము గలదో ఆయావస్తువు పరిచ్ఛిన్న మను వ్యాప్తిచే ఆత్మ లనేకు లైనపక్షమునందు పరస్పరభేదము కలవా రగుటచేఁ బరిచ్ఛిన్ను లగుదురు. అందుచేఁ బూర్ణత్వము సిద్ధింపదు. పూర్ణత్వము నంగీకరించిననో అనేకత్వము సిద్ధింపదు. ఇట్లు పూర్ణత్వానేకత్వములు పరస్పరవిరుద్ధములగుటవలన ఆత్మలకుఁ బూర్ణత్వమును అనేకత్వమును బ్రహ్మదేవునిచే నేనియు సాధింప శక్యము కాదు. కావున నీకు ఆత్మైకత్వమె యంగీకరింపక తప్పదు. ఇఁక, 'ఆత్మలు పరిచ్ఛిన్నులు చిద్రూపులు అనేకులును' అనుపక్ష మేది గలదో § అదియు యుక్తము కాదు. ఏల యనఁగా నది బహుశ్రుతిస్మృతియుక్తివిరుద్ధము. 'ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః, ఏక స్తథా సర్వభూతాన్తరాత్మా, ఏకోదేవస్సర్వభూతేషుగూఢః, ఏకస్సన్ బహుధా విచచార, ఏకఏవహి భూతాత్మా' 'నిరపేక్ష ఏకఏవసాక్షీ ఏక స్తే నేదం పూర్ణం పురుషేణ సర్వమ్' ¶ 'అశరీరం శరీరే ష్వనవస్థే ష్వవస్థితమ్। మహాన్తం విభుమాత్మానమ్' ‡ ఇత్యాదిశ్రుతులును, 'నిత్యస్సర్వగతస్థాణుః' 'నిత్యస్సర్వగతో హ్యాత్మా కూటస్థో దోషవర్జితః। ఏకస్సన్ భిద్యతే భ్రాన్త్యా మాయయా నస్వరూపతః' ♦ ఇత్యాది స్మృతులును, 'ఆత్మ సర్వశరీరములందును ఒకఁడే యున్నాఁడు, పూర్ణుఁ డగుటవలన, ఘటాదులం దాకాశము

---

* తార్కికునియొక్క.

§ ద్వైతము విశిష్టాద్వైతము.

¶ అపేక్షారహితుఁడు ఒక్కఁడే, సాక్షి ఒక్కఁడే, ఆ పురుషునిచే నిదంతయు వ్యాపింపఁబడినది.

‡ శరీరరహితుండును నిలుకడలేని శరీరములందు నిలిచియున్నవాఁడు సర్వాధికుండు సర్వవ్యాపకుండు నగు ఆత్మను-తన్ను.

♦ నిత్యుఁడును సర్వగతుండును కూటస్థుఁడును దోషరహితుఁడు నగు ఆత్మ ఒక్కఁడే యయ్యును భ్రాంతిరూప మయిన మాయచే భిన్నుఁ డగుచున్నాఁడు. స్వరూపముచే భిన్నుఁడు కాఁడు.

వలె' 'ఆత్మ యొక్కఁడే యగును, నిష్కలుఁడు * అగుటవలనను, సర్వప్రకాశకుఁడగుటవలనను, సర్వసాక్షి యగుటవలనను, సర్వత్ర అహం ప్రత్యయమునకు అర్థమగుటవలనను' ఇత్యాది యుక్తులును, ఆత్మ పూర్ణుఁ డనియే సాధించుచున్నవి. ఈ శ్రుతిస్మృతి యుక్తులవలన ఒక్కఁడే యాత్మ యని సిద్ధాంతము. ఎందువలన, నేనును నీవును ఈ రాజులును మున్ను చెప్పినవిధమున భూత భవిష్య ద్వర్తమాన కాలములయందు ఒకప్పుడును, నభవిష్యామ ఇతిన, మ లేమనఁగా ఉండనే యుండుమో, మూఁడుకాలములయందును సత్త గలవారమే యగుదుమో, అందువలన, నేనును నీవును వీరును మన మందఱమును పరబ్రహ్మమె, ప్రపంచమును తదభిమానియు మొదలగు సమస్తదృశ్యములయొక్క కల్పన కధిష్ఠానభూతము నిష్కలము నిష్క్రియము శాంతము అనంతము నిత్యశుద్ధబుద్ధముక్త సత్యజ్ఞానానందాద్వయంబగు బ్రహ్మమే యగుచున్నాము. 'భోక్తా భోజ్యం ప్రేరితారంచ మత్వా సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మ చైతత్'§ 'బ్రహ్మై వేదం సర్వమ్' అని శ్రుతులు ప్రతిపాదించుటవలన నీవును నేనును వీరును అందఱమును పరబ్రహ్మమే యని తెలియుంగు మని యర్థము.

మ. అందు మొదటిమోహము 'అశోచ్యా నన్వశోచః' అనుటచేతను రెండవ మోహము 'ప్రజ్ఞావాదాంశ్చ భాషసే' అనుటచేతను ఉద్దేశింపఁబడినవి. ఈ రెండు మోహములును వేఱువేఱు ప్రయత్నములచే నిరాకరింపవలసిన వగుటవలన నత్వేవాహ మ్మనునది మొదలు పందొమ్మిదిశ్లోకములచే 'అశోచ్యా నన్వశోచః' అనుటకు వివరణము చేయఁబడుచున్నది. స్వధర్మ మపి చావేక్ష్య యనునది మొదలు ఎనిమిదిశ్లోకములచే 'ప్రజ్ఞావాదాంశ్చ భాషసే యనుటకు వివరణము చేయఁబడుచున్నది. అందు స్థూలశరీరమునుండి యాత్మను వివేకించుటకై నిత్యత్వమును సాధించుచున్నాఁడు—తు అనునది దేహాదులకన్న ఆత్మకు విలక్షణతను సూచించుచున్నది. ఎట్లు, అహమ్ = నేను, ఇంతకు మునుపు, జాతు = ఒకానొకప్పుడును, నాసమ్ ఇతి నైవ= లేకుంటిని అనునది లేనేలేదు; మ లేమనఁగా ఉండనే యుంటినో, అట్లు నీవును ఉంటివి. ఇమే జనాధిపాశ్చ, ఉండనే యుండిరి. ఇందుచే ఆత్మకు ప్రాగభావప్రతియోగిత్వము అనఁగా ప్రాగభావము లేకుండుట చెప్పఁబడి

---

* అవయవము లేనివాఁడు.

§ భోక్తయు భోజ్యమును ప్రేరకుఁడును, ఆలోచింపఁగా, ఈ త్రివిధప్రపంచ మంతయు బ్రహ్మమే యని చెప్పఁబడినది.

నది. అట్లు, వయమ్ సర్వే=మన మందఱమును, నేనును నీవును ఈ రాజులును; అతః పరమ్, నభవిష్యామ ఇతిన, మ తేమనఁగా ఉండనే యుందుము, ఇందుచే ధ్వంసాప్రతియోగిత్వము—నాశము లేకుండుట చెప్పఁబడినది. ఇందువలన కాలత్రయము నందును సత్తగలవాఁ డగుటచే ఆత్మ నిత్యుఁ డగుటవలన అనిత్య మయిన దేహము కంటె విలక్షణుఁ డనుట సిద్ధ మని యర్థము.

శ్రీ. అశోచ్యు లనుటకు హేతువుఁ జెప్పుచున్నారు—ఎట్లు, అహమ్ = పరమేశ్వరుఁడను నేను, జాతు = ఒకానొకప్పుడును—నా లీలావిగ్రహముయొక్క ఆవిర్భావమునందును తిరోభావమునందును, * నాసమితినైవ, మ తే మనఁగా అనాది నగుటవలన ఉండనే యుంటిని. త్వం = నీవును, ననాసీః, మ తేమనఁగా ఉండనే యుంటివి. ఇమే, జనాధిపాః = రాజులును, నాసన్ ఇతిన, మ తేమనఁగా నాయంశము లయినవా రగుటవలన ఉండనేయుండిరి. అట్లు, అతఃపరమ్ = ఇంకమీఁదఁగూడ, నభవిష్యామ ఇతినైవ = ఉండము అనునదియు లేనే లేదు, మ తే మనఁగా ఉండఁగలము. ఇట్లు జన్మమరణశూన్యు లగుటవలన అశోచ్యు లని యర్థము.

ప. ఓయీ! నీవు జీవులనుగుఱించి శోకించెదవా? లేక దేహములను గుఱించి శోకించెదవా? జీవులు నిత్యు లగుటవలన మొదటిపక్షము యుక్తము కాదు. దేహములు నశ్వరము లగుటవలన రెండవదియు సరి కాదు. ఈ యభిప్రాయమున అశోచ్యు లనుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు—ఎట్లు; అహమ్=ఈశ్వరుఁడను నేను, జాతు—స్వేచ్ఛచే ధరించు విగ్రహముయొక్క ఆవిర్భావమునందుఁగాని తిరోభావమునందుఁగాని, మున్ను, నాసమితిన, అనాది నగుటవలన ఉండనే యుంటిని. నీవును, ననాసీః—ఉండనే యుంటివి. ఇమే, జనాధిపాః = రాజులు, నాసన్ ఇతిన, మ తే మనఁగా నాయంశము లగుటవలన ఉండనే యుండిరి. అట్లు, ఇతః పరమ్—ఇటుమీఁదను, వయమ్, సర్వే—మున్ను చెప్పినవార మందఱమును; నైవ భవిష్యామ ఇతిన—ఉండకయే పోవుదు మనుట లేదు, మ తే మనఁగా ఉండనే యుందుము. జీవనిరూపణప్రకరణమునందు అహమ్ అనుపదముచే గమనాగమనరహితుఁడగు నీశ్వరునకుఁ బ్రసక్తి యెట్లనఁగా, దృష్టాంతార్థ మని తెలియవలెను. పరమార్థము విచారించినయెడ నే నెట్లో అట్లే నాయంశ మయిన జీవుఁడుగూడ నిత్యుఁడును అనాదియు నగు నని యేర్పడును, కావున నది తెలిసి పండితులు శోకింప రని యర్థము.

* వెల్లడి యగుటయందును మఱఁగుపడుటయందును.

రా. మొదట ఆత్మలస్వభావంబు వినుము—అహమ్ = నేను సర్వేశ్వరుఁడను; జాతు = ఒకానొకప్పుడును, ఇంతకు మున్ను అనాదియైన కాలమునందు; నవాసమ్= లేక యుండినవాఁడను కాను. తు—మ తే మనఁగా, ఆసమ్= ఉంటిని. త్వమ్= నీవు; ననాసీః = లేకుండినవాఁడవు కావు, తు ఆసీః = మఱి యే మనఁగా ఉంటివి. ఇమే జనాధిపాః = ఈ రాజులు; ననాసన్ = లేకుండినవారు కారు, తు ఆసన్ = మ తే మనఁగా ఉండిరి—నీవు మొదలగు ఈశితవ్యులయిన క్షేత్రజ్ఞులు వీరుగూడ ఉండిరి. నేనును మీరును, వయమ్ సర్వే = మన మందఱమును; అతః పరమ్ = ఇఁక మీఁదికాలమునందు; నచైవ నభవిష్యామః = ఉండనివారము కానే కాము, తు భవిష్యామ ఏవ=మ తే మనఁగా ఉండనే యుందుము. ఎట్లు పరమేశ్వరుఁ డను బరమాత్మ నగు నేను నిత్యుఁడ నను విషయమునందు సంశయము లేదో అట్లే క్షేత్రజ్ఞులు ఆత్మలు అగు మీరుగూడ నిత్యు లని తలంపవలెను.

పరమేశ్వరుఁడనగు నే నిదివఱ కెప్పుడును లేకుండినవాఁడఁ గా ననునది సరియే కదా! అట్లు నీవును ఈ రాజులును లేకుండినవారు కారు, మీ రందఱు నా యట్లు ఇదివఱ కెల్లప్పుడును అనాదిగా నుండినవారలే కాని వేఱు కాదు. అట్లు ఇఁకమీఁదఁ గూడ నేనును నీవును ఈ రాజులును మన మందఱమును ఉండఁబోవు వారలమే. సర్వేశ్వరుఁడ నగు నే నెట్లు నిత్యుఁడనో అట్లు జీవాత్మ లగు మీ రందఱు నిత్యులే యని తెలియు మని తాత్పర్యము.

ఇందుచే సర్వేశ్వరుఁ డగు భగవంతునకును ఆత్మలకును, ఆత్మలకుఁ బరస్పరమునకును భేదము పారమార్థిక మని భగవంతునిచేతనె ప్రతిపాదింపఁబడిన దని తెలియుచున్నది. ఎట్లనఁగా, అజ్ఞానమోహితునకు ఆ యజ్ఞానము నివర్తించుటకై పారమార్థికనిత్యత్వము నుపదేశించు సమయమునందు నేను నీవు వీరు మన మందఱము అని భేదనిర్దేశము చేయఁబడినది. ఆత్మభేదము ఔపాధిక మను వాదమునందో, ఆత్మభేదము అతాత్త్విక మగుటచే తత్త్వోపదేశసమయంబున భేదము నిర్దేశించుట సంగతము కాదు. భగవంతునిచేఁ జెప్పఁబడిన ఆత్మభేదము స్వాభావికం బని శ్రుతియుఁ బ్రతిపాదించుచున్నది 'నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామేకో బహూనాం యో విదధాతి కామాన్' అని. నిత్యానాం బహూనాం చేతనానామ్ = నిత్యులును అనేకులు నగు చేతనులకు, నిత్యః చేతనః = నిత్యుఁ డగు చేతనుఁడు, ఏకః = ఒకఁడు—ఈశ్వరుఁ డెవ్వఁడు గలఁడో, అతఁడు, కామాన్ విద

భాతి = కోఁదుకొలఁ దీర్చుచున్నాఁ డని యర్థము. అజ్ఞానకృతభేదదృష్టివాదము నందో, పరమపురుషునకుఁ బరమార్థదృష్టికలుగుటవలన నిర్విశేషకూటస్థ నిత్యచైతన్యాత్మతత్త్వసాక్షాత్కారముచే నజ్ఞానంబును తత్కార్యములును నివర్తిల్లిన వగుటం జేసి అజ్ఞానముచేఁ గలుగు భేదదృష్టియును తన్మూలకము లయిన యుపదేశాది వ్యవహారములును సంగతంబులు కావు. ఇఁక అద్వైతజ్ఞానవంతుఁ డగు పరమపురుషునకు బాధితానువృత్తిరూప మయిన భేదజ్ఞానము దగ్ధపటాదికమువలె బంధకము కా దని చెప్పెదరు—ఇది యుపపన్నము కాదు. ఏల యనఁగా, మరీచికాజలజ్ఞానాదికము * బాధిత మయి యనువర్తించుచున్నను, అది జలము దెచ్చుట మొదలగు కార్యములయందుఁ బ్రవృత్తికి హేతువు కాదు. ఇట్లిచ్చటఁగూడ అద్వైతజ్ఞానముచే బాధిత మయిన భేదజ్ఞాన మనువర్తించుచున్నను మిథ్యార్థవిషయం † బని నిశ్చయ ముండుటవలన నది యుపదేశాదిప్రవృత్తికి హేతువు కాదు. మఱియు ఈశ్వరుఁడు పూర్వ మజ్ఞానియై శాస్త్రముచేఁ దత్త్వజ్ఞానము నొందె ననియు అతనికి బాధితానువృత్తి కల దనియుఁ జెప్పుటకు శక్యము కాదు. అట్లు చెప్పినయెడ 'యస్సర్వజ్ఞ స్సర్వవిత్, పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ. వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున । భవిష్యాణిచ భూతాని మాం తు వేద న కశ్చన' ‡ అను శ్రుతిస్మృతులు విరోధించును. ఇంతియ కాదు. పరమపురుషుండుగాని యిప్పటి గురుపరంపరగాని, అద్వితీయాత్మస్వరూపనిశ్చయము కలిగి యుండఁగా, భేదజ్ఞాన మనువర్తించియున్నను, తమ నిశ్చయము నొప్పక అద్వితీయాత్మజ్ఞానమును ఎవరి కుపదేశింతు రని చెప్పవలెను? ప్రతిబింబములయందు దోఁచుచున్న యర్జునాదుల కందురేని—ఇది యుపపన్నము కాదు. ఏల యనఁగా పిచ్చిపట్టనివాఁ డెవ్వఁడేని, మణికృపాణదర్పణాదులం దన ప్రతిబింబములు కనఁబడఁగా, అవి తనకు భిన్నములు కా వని యెఱింగి, వాని కేమైన నుపదేశింపఁ బోవునా? బాధక మయిన యద్వితీయాత్మజ్ఞానముచే ఆత్మవ్యతిరిక్తభేదజ్ఞానకారణ మయిన

* ఎండమావులందు జలము అను ప్రతీతి మొదలగునవి.

† మిథ్య యయిన యర్థము విషయముగాఁ గలది.

‡ ఎవ్వఁడు సర్వజ్ఞుఁడో సర్వవిదుఁడో. ఇతనిశక్తి యనంతము నానావిధముగానే వినఁబడుచున్నది, మఱియు నితని స్వాభావిక మయిన జ్ఞానము బలము క్రియ—ఇవియు అనంతములుగాను వివిధములుగాను వినఁబడుచున్నవి. అర్జునా! నేను కడచినవియు వర్తమానములును రాఁబోవునవియు నగు భూతముల నెఱుఁగుదును. నన్నుమాత్రము ఎవ్వఁడును ఎఱుఁగఁడు.

యజ్ఞానాదికము నశించిన దగుటవలన బాధితానువృత్తి కల దనియు వారలకుఁ * జెప్ప శక్యము కాదు. ద్విచంద్రజ్ఞానాదిస్థలమునందో, చంద్రైకత్వజ్ఞానముచే ద్విచంద్రజ్ఞానహేతు వగు పారమార్థికతిమిరాదిదోషము నశింప కుండుటవలన బాధితానువృత్తి కావచ్చును. అనువర్తించుచున్నను ప్రబలప్రమాణముచే బాధిత మగుటంజేసి కార్యకారి కాఁ జాలదు. ఇచటనో భేదజ్ఞానంబును తద్విషయంబును తత్కారణంబును బారమార్థికములు కావు, కావున నీభేదజ్ఞానము వస్తుతత్త్వజ్ఞానముచే నశించిన పిదప దాని కేవిధంబునను బాధితానువృత్తి సంభవింపదు. కావున సర్వేశ్వరునకును ఇప్పటి గురుపరంపరకును తత్త్వజ్ఞానము కలదేని భేదదర్శనమును తత్కార్య మయిన యుపదేశాదులును సంభవింపవు. లేదేని, తత్కారణ మయిన యజ్ఞాన ముండుటచే అజ్ఞులే యగుటవలన మఱియు నుపదేశము సంభవింపదు. ఇంతియ కాదు గురువునకు అద్వితీయాత్మవిజ్ఞానము కలుగుటవలనని కార్యసహిత మయిన బ్రహ్మాజ్ఞానము నశించిన దగుటవలన శిష్యున కుపదేశించుట నిష్ప్రయోజనము. గురువును తజ్జ్ఞానంబును కల్పితం బనునెడ, శిష్యుఁడును తజ్జ్ఞానంబునుగూడ కల్పిత మగుటవలన శిష్యునిజ్ఞానముగూడ అజ్ఞాననివర్తకము కాదు. కల్పిత మయినను పూర్వ ముండిన భేదజ్ఞానమునకు విరోధి యగుటవలన నివర్తకం బగు ననునెడ, అది గురుజ్ఞానంబునందును సమానము, కావున నదియె నివర్తక మగును. ఇట్లుపదేశము నిరర్థకమే యగుచున్నది. కావునఁ జాలు నయోగ్యవాద నిరాసము.

మూ॥ ఎందువలనఁ బండితులు చావఁబోవువారిని జచ్చినవారిని గూర్చి దుఃఖింపరు? అనఁగాఁ జెప్పుచున్నారు—అహమ్ = నేను, ఈశ్వరుఁడను; జాతు = ఒకానొకప్పుడును; న అసమ్ = లేకుండినవాఁడను కానేకాను, ఇచట ఈశ్వరుఁడు [illegible] చెప్పఁబడు ప్రస్తుతము కాదు, కావున, నిది దృష్టాంతముగాఁ జెప్పఁబడినది. ఎట్లు ఈశ్వరుఁడ నగు నేను ఇదివఱ కెప్పుడును లేకయుండినవాఁడను కానే కానో, అట్లు అను యభిప్రాయము; త్వమ్ = నీవును; న ఆసీః = లేకయుండినవాఁడవు కావు. ఇమే జనాధిపాః = ఈ రాజులును; న ఆసన్ = లేకయుండినవారు కారు. ఇతఃపరమ్ = ఇఁకమీఁదను; వయమ్ = మనము; సర్వే = అందఱమును; నైవచ న భవిష్యామః = లేకయుండువారము కానేకాము.

సర్వేశ్వరుండ నగు నేను నిత్యుఁడ నని సర్వవేదాంతములందును బ్రసిద్ధ మయి యున్నది గదా! అట్లే నీవును ఈరాజులును నిత్యులు. జీవు లందఱును నిత్యు లగుటవలన వీరినిగూర్చి పండితులు దుఃఖింప రని తాత్పర్యము.

---

* అద్వైతవాదులకు.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాన్తరప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి. ౧౩

భా. అట్లుండఁగా, ఏవిధంబున నిత్యుఁ డాత్మ యనఁగా దృష్టాంతము చెప్పుచున్నారు—దేహినః = దేహముకలవాఁడు దేహీ, అతనికి, అనఁగా దేహము గల ఆత్మకు; అస్మిన్ దేహే = ఈదేహమునందు, ఇప్పుడున్న దేహమునం దనుట; యథా = ఎట్లు; కౌమారమ్ = కుమారభావము, బాల్యావస్థయు; యౌవనమ్ = యువభావము, మధ్యావస్థయును; జరా = ముసలితనము, జీర్ణావస్థయును, పరస్పరవిలక్షణము లయిన యీ మూఁడవస్థలు; భవన్తి = అగుచున్నవో; ఎట్లు ఆత్మకు వానిలో మొదటియవస్థ నశించినపుడు నాశము లేదో, రెండవయవస్థ జనియించినపుడు జననము లేదో, ఏ లేమనఁగా, నిర్వికారుఁ డై యేయున్న ఆత్మ యొకనికే రెండవ మూఁడవ యవస్థలు కలుగుట కనఁబడుచున్నదో; తథా = అట్లే; దేహాన్తరప్రాప్తిః = మఱియొక దేహముయొక్క ప్రాప్తి, నిర్వికారుఁ డై యేయుండు ఆత్మకుఁ గలుగు నని యర్థము. ధీరః= బుద్ధిమంతుఁడు; తత్ర = అట్లుండఁగా; నముహ్యతి = మోహమును బొందఁడు.

టీ. మొదటి దేహమును విడిచి నూతనదేహమును గ్రహించుటచే ఆత్మ వికారము గలవాఁ డని తలఁచి యందుచే ఉత్పత్తివినాశములు గలవాఁ డని భ్రమించునేమో యని శంకించి సమాధానము చెప్పుచున్నారు—అట్లుండఁగా—అశోచ్యు లనుటకు నిత్యత్వము హేతువుగాఁ జెప్పఁబడియుండఁగా నని యర్థము. అవస్థలు భిన్నము లైనను వాస్తవముగా వికారము లేనివాఁ డగుటచే ఆత్మకు నిత్యత్వ ముపపన్న మని యీశ్లోకమున దృష్టాంతముచేఁ జెప్పఁబడుచున్న దని చెప్పుచున్నారు దృష్టాంతము చెప్పుచున్నా రని. ఆత్మకు నిత్యత్వము, వేదప్రామాణ్యమువలన మాత్రమె కాదు, ఏ లేమనఁగా అవస్థాంతరమునందువలె జన్మాంతరమునందును బూర్వసంస్కార మనువర్తించుటవలనఁగూడ సిద్ధ మగుచున్న దని చెప్పుచున్నారు దేహినః ఇత్యాదిగా. దేహముగలవాఁ డనఁగా దేహమునందు నేను నాది యను నభిమానము గలవాఁ డని యర్థము. బుద్ధిమంతుఁ డనుచోటి బుద్ధిపదముచే శ్రుతిస్మృతియుక్తుల వలన ఆత్మ నిత్యుఁ డనుజ్ఞానము వివక్షితము. అ

ట్లుండఁగా—వాస్తవముగా వికారము లేనివాఁ డగుటచే ఆత్మ నిత్యుఁ డని తెలిసి యుండఁగా నని యర్థము.

ఈ దేహమునందు బాల్యము యౌవనము వార్ధకము అను వేఱువే ఱవస్థలు వచ్చినపుడు ఆత్మ కెట్లు నాశముగాని జన్మముగాని కలుగదో, అట్లే మఱియొక దేహము నొందునపుడును ఆత్మకు నాశముగాని జన్మముకాని లేదు. కావున ఆత్మ నిత్యుఁ డని తెలిసి, పండితుఁ డగువాఁడు ఆత్మవిషయమయి యెంతమాత్రము మోహము నొందఁ డని తాత్పర్యము.

హ. ఇందుకుఁ దగిన దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు—దేహినః = దేహము గలవానికి, అస్మిన్ = వర్తమానదేహమునందు, యథా, కౌమారమ్ = కుమారభావమును, యౌవనమ్ = యువభావమును, జరా = వృద్ధత్వమును, కలుగునో, తథా = అట్లు, దేహాన్తరప్రాప్తిః. ధీరః = బుద్ధిమంతుఁడు, తత్ర, నముహ్యతి = మోహమును బొందఁడు. ఎట్లీ దేహమునఁ గౌమారయౌవనవార్ధకములందు ఆత్మకు భేదమే లేదు, ఈశరీరావస్థలుమాత్రమె భిన్నములో, అట్లు ఇతరదేహములందును ఆత్మకు భేదము లేదు. ఆ దేహములుమాత్రమె భిన్నము లని యర్థము.

శం. ఇట్లు తత్త్వంపదార్థములను శ్రుతియుక్తులచే విచారించి రెంటికిని ఏకత్వము ప్రతిపాదించినను, త్వంపదార్థ మగు ఆత్మ అవిద్యచేతను అనంతము లయిన తత్కార్యములచేతను తిరోహితుఁడును అతిసూక్ష్ముఁడు నగుటచే అతనిం దెలియుట కష్ట మగుటవలన, శ్రోత యగు మందబుద్ధి యయిన ముముక్షువు, సంపూర్ణ మయిన యపరోక్షజ్ఞానము కలుగువఱకు, 'ఆవృత్తిరసకృదుపదేశాత్' * అను న్యాయంబున మాటిమాటికి త్వంపదార్థవిచారమే చక్కఁగాఁ జేయవలె నని సూచించుటకై యుత్తరగ్రంథ మారంభింపఁబడుచున్నది. అందుఁ బూర్వము త్వంపదార్థ మయిన ఆత్మ కాలత్రయమునందును సద్భావము § కలవాఁ డని ప్రతిపాదింపఁబడినది. అయినను ఈదేహము నశించిన పిదప సద్భావము కనఁబడదు. కావున ఎట్లు సద్భావము కలవాఁ డని చెప్పవచ్చు నని శంకగలవానికిఁగా నర్జును

* అ-౪. పా-౧. సూ-౧. అసకృత్ ఉపదేశాత్— శ్రోతవ్యః మన్తవ్యః నిదిధ్యాసితవ్యః అని పలుమా ఱుపదేశించుటవలన, ఆవృత్తిః = ఆత్మజ్ఞానముయొక్క పలుమాఱు అభ్యాసము చేయవలెను, చక్కఁగాఁ దెలియువఱకు తచ్చింతనమే చేయవలె నని యర్థము.

§ ఉండుట.

నెఱింగి, ఆత్మ దేహనాశానంతరముగూడ సద్భావము గలవాఁడని ప్రత్యక్షానుమాన ప్రమాణములచే దృష్టాంతసహితముగాఁ దెలుపుచున్నారు.—అస్మిన్ దేహే = ఈ దేహమునందు, నేను నేను అని నిర్వికారుఁడై యేకరూపముగా నెల్లప్పుడును ఉన్న వాఁడే యగునట్టి; దేహినః—దేహమునందే ఆత్మ కనఁబడుటవలన ఆత్మ దేహి యని చెప్పఁబడుచున్నాఁడు, అట్టి దేహికి, అనఁగా దేహోపాధి కలిగిన ఆత్మకు; కౌమారమ్ = కుమారునిదైన దేహమును; యౌవనమ్ = యువసంబంధియైన దేహమును; జరా = ముసలితనముతోఁ గూడిన జీర్ణదేహమును; యథా = ఎట్లు, వచ్చుచుండునో; ఎట్లు కౌమారదేహమును విడిచి యున్నవానికే యౌవనదేహమును, యౌవనదేహమును విడిచి యున్నవానికే ముసలిదేహమును వెంటనే వచ్చుచుండునో, తథా = అట్లే; ఈ స్థూలదేహమును విడిచి యుండువానికే; దేహాన్తరప్రాప్తిః = ఇతరదేహము యొక్క ప్రాప్తి, ఇతరదేహముగూడ వచ్చుచున్నది, కాని ఆత్మకేమో వినాశము లేనేలేదు. అట్లు 'జీవాపేతం వావ కిలేదం మ్రియతే న జీవో మ్రియతే' * అని శ్రుతి యుపదేశించుచున్నది. మఱియు, జాగ్రత్స్వప్నదేహములకు సుషుప్తియందు నాశము కలిగినప్పుడు ఆత్మసద్భావము తెలియరాదు, అట్లయినను, నిదురించి లేచినవాఁడు, తాను, ఎవ్వఁడను స్వప్నముఁ జూచితినో యెవ్వఁడను సుఖముగా నిదురించితినో అతఁడే నే నిప్పుడు మేలుకొనియున్నా నను తన ప్రత్యభిజ్ఞచే § జాగ్రత్స్వప్నసుషుప్తులయం దాత్మ యున్నాఁ డనియు నిత్యుఁ డనియు నెట్లు తెలిసికొనుచున్నాఁడో, అట్లు, ఈ దేహము నశించిన పిదపఁ గూడ ఆత్మ యున్నాఁ డనియు నిత్యుఁ డనియుఁ దెలిసి, ధీరః = విద్వాంసుఁడు, ఆత్మతత్త్వముఁ దెలిసినవాఁడు, కావున, తత్ర = ఆత్మ నిత్యుఁ డను విషయమందు, నముహ్యతి = మోహము నొందఁడు. ఈ శిశువు గతజన్మమునందు అన్నాద్యాహారము గలవాఁడై యుండవలయును, ఈ జన్మమునందు ఉపదేశము లేకయె తానె స్తన్యము ద్రాగుటయందుఁ బ్రవృత్తుఁ డగుటవలన, ఏది గతజన్మమునం దాహారము గలది కాదో అది యీ జన్మమునందు ఉపదేశము లేక స్తన్యము ద్రాగుటయందుఁ బ్రవృత్తము కానేరదు, ప్రతిమాదులవలె. ఆత్మ దేహాంతరములు వచ్చుచున్నను ఉన్నాఁడు, నిత్యుఁ డగుట వలన, ఎట్లు కౌమారాదిదేహములు వచ్చుచున్నను ఉన్నాఁడో అట్లు. ఈ చెప్పఁబడిన ప్రత్యక్షశ్రుత్యనుమానప్రమాణములచే ఆత్మ జన్మాంతరములందు సద్భావము

* జీవునిచే విడువఁబడినదే గదా యిది మరణము నొందుచున్నది. జీవుఁడు మరణము నొందఁడు.

§ అనుభవింపఁబడిన వస్తువు కనఁబడినప్పుడు పూర్వానుభవస్మరణము ప్రత్యభిజ్ఞ యనఁబడును.

కలవాఁ డని తెలిసియుండుటవలన నిత్యుఁడే యని నిశ్చయించి ఆత్మ కలఁడా లేఁడా అని పండితుఁడు భ్రమింపఁ డని యర్థము.

వ్య. ఓయీ! చైతన్యముతోఁ గూడిన దేహమే యాత్మ యని చార్వాకులు చెప్పెదరు. ఆపక్షమునందే 'నేను స్థూలుఁడను నేను గౌరవర్ణుఁడను * నడచుచున్నాను' ఇత్యాది ప్రత్యక్షవ్యవహారము లుపపన్నము లగును. కావున ఆత్మ దేహముకన్న భిన్నుఁ డెట్లగును? భిన్నుఁడైనను జన్మవినాశములు లేనివాఁ డెట్లగును? 'పుట్టెను దేవదత్తుఁడు, చచ్చెను దేవదత్తుఁడు' అను ప్రతీతివలన దేహముయొక్క జన్మనాశములతోఁగూడ ఆత్మకుఁగూడ జన్మనాశములు కల వని యేర్పడుచున్నది గదా! అని యాశంకించి యందుకు సమాధానము చెప్పుచున్నారు— దేహినః—జగత్తునందుఁ గల భూతభవిష్యద్వర్తమానము లగు సర్వదేహములును వీనికిఁ గలవు కావున దేహి యనఁబడును, విభు వగుటచే ఒక్కయాత్మయే సర్వదేహములందు నున్నాఁడు, అంతటను ఉన్నాఁ డనుటయు ఇష్టమె, కావున ప్రతి దేహమును ఆత్మ భిన్నుఁ డనుటకుఁ బ్రమాణము లే దని సూచించుటకై యేకవచనము. పూర్వశ్లోకమునందు 'సర్వేవయమ్' అను బహువచనము దేహభేదానువృత్తిచేతనేగాని ఆత్మభేదాభిప్రాయముచేఁ గాదు, కావున అది విరుద్ధము కాదు, అట్టి దేహికి, ఒకఁడై యే యున్నవానికి; అస్మిన్ దేహే = వర్తమానదేహమునందు; యథా = ఎట్లు; కౌమారమ్, యౌవనమ్, జరా—అను మూఁ డవస్థలు పరస్పరవిరుద్ధములు అగుచున్నవో, ఆ యవస్థలు భిన్నము లగుటచే ఆత్మకు భేదము లేదో, ఏలయనఁగా—'ఏ నేను బాల్యమునందుఁ దలిదండ్రుల ననుభవించితినో అతఁడే నేను వార్ధకమునందు మునిమనుమల ననుభవించుచున్నాను' అను దృఢతర మయిన ప్రత్యభిజ్ఞ కలుగుచున్నది, ఒకనికిఁ గలిగిన యనుభవజన్యసంస్కారము మఱియొకనికిఁ బ్రత్యభిజ్ఞాజనకము కాఁ జాలదు; తథా = ఆవిధముననే, నిర్వికారుఁ డైయే యున్న ఆత్మకు; దేహాన్తరప్రాప్తిః = ఈ దేహముకన్న మిక్కిలి విలక్షణ మయిన దేహముయొక్క పొందిక, స్వప్నమున దేహాంతరము పొందినప్పుడును యోగశక్తిచే బహుదేహములు ధరించినప్పుడును ఆ దేహములు భిన్నము లని తెలియుచున్నను అతఁడే నేనను ప్రత్యభిజ్ఞ కలుగుటవలన. కావున, దేహమే యాత్మ యగు పక్షమున అప్పుడు కౌమారాద్యవస్థాభేదముచే దేహము భిన్న మగుటవలనఁ బ్రత్య

* పసుపురంగు గలవాఁడను.

భిజ్ఞ కలుగక పోవలెను. ఇంక కౌమారాద్యవస్థలు పరస్పరభిన్నము లయినను, ‘యావత్ప్రత్యభిజ్ఞం వస్తుస్థితిః’ * అను న్యాయంబువలన, అవస్థావంత మయిన దేహము ఒక్కటే యని చెప్పవలెను. యప్పుడుగూడ స్వప్నదేహమునందును యోగశక్తికల్పితదేహములందును అవస్థావంతము లయిన దేహములందే పరస్పర భేద ముండుటచేఁ బ్రత్యభిజ్ఞ లేక పోవలసివచ్చు నని స్వప్న యోగదేహములుగూడ నుదాహరింపఁబడినవి. కావున, మృగతృష్ణిక మొదలగు వానియందు జలాది ప్రతీతివలె ‘నేను స్థూలుఁడను’ ఇత్యాదిప్రతీతియు భ్రమ యని యంగీకరింపవలెను, ఏల యనఁగా ఆ జలప్రతీతికివలె నేను స్థూలుఁడ నను ప్రతీతికిని బాధ § యగును. ఈవిషయము నజాయతే ఇత్యాది శ్లోకమునందు విస్తరింపఁబడును. ఇందుచే ‘ఆత్మ దేహాభిన్నుఁడైనను దేహముతోఁగూడ జనియించును నశించును’ అనుపక్షముగూడ నిరాకరింపఁబడినది. ఎట్లనఁగా, ఆపక్షమున అవస్థ భిన్న మయినపుడు ప్రత్యభిజ్ఞ యుపపన్నమయినను అవస్థావంత మయిన దేహము భిన్న మయినపుడు ప్రత్యభిజ్ఞ యుపపన్నము కాదు. అర్థాంతరము—ఎట్లు కౌమారాద్యవస్థాప్రాప్తి వికారరహితుఁ డయిన ఆత్మకు ఒక్కనికే యగునో అట్లే యీ దేహమునుండి యుత్క్రమణము ¶ నొందినపుడు దేహాంతరప్రాప్తియును. ఆ దేహాంతరమునందు ‘అతఁడే నే, నను ప్రత్యభిజ్ఞ లేకున్నను పుట్టినంతనే శిశువునకుఁ బూర్వజన్మసంస్కారమువలనఁ గలుగునట్టి హర్షశోకభయాదులు కలుగుటం జూచుచున్నారము. అట్లు కానియెడ శిశువునకు స్తన్యపానాదులందుఁ బ్రవృత్తి కలుగకపోవును, ఏల యనఁగా అది యిష్టసాధనతాజ్ఞానముచేఁ $ గలుగు ననియు అదృష్టముచేఁ గలుగు ననియు నంగీకరింపఁబడియున్నది. కావునఁ బూర్వదేహమునందును ఉత్తరదేహమునందును ఆత్మ యొక్కఁడే యని సిద్ధించుచున్నది, లేనియెడ కృతనాశము అకృతాభ్యాగమము అను దోషము సంభవించును—కృతనాశము—కృత = చేయఁబడిన పుణ్యాపాపములకు, నాశః = భోగము లేకయె నాశము. అకృతాభ్యాగమము—అకృత = చేయఁబడని పుణ్యాపాపములయొక్క, అభ్యాగమము—రాకడ, ఆకస్మికముగా వానిఫలము ననుభవించుట. ఈవిషయము మఱియొకచో విస్తరించియున్నా

---

* ప్రత్యభిజ్ఞ కలుగువఱకు వస్తువున్నది.

§ యథార్థజ్ఞానముచే నివృత్తి.

¶ విడువల.

$ ఇది నాయిష్టమును సాధించును అను జ్ఞానముచే.

రము. మఱియొకఅర్థము—దేహినైన నీకు ఒకనికే ఎట్లు వరుసగా దేహావస్థలు పుట్టినపుడును నశించినపుడును భేదము లేవో నిత్యుఁడగుటవలన, అట్లు ఏకకాలమున సమస్తము లయిన దేహాంతరములప్రాప్తియు నీకు ఒకనికే విభుఁడ * వగుటవలన. మధ్యమపరిమాణుఁ డన్నచో అవయవములు గలుగుటచే నిత్యత్వము సిద్ధింపదు. అణువు అన్నయెడ సకలదేహవ్యాపి యయిన సుఖాదికముయొక్క ప్రత్యక్షము లేక పోవును. ఇట్లు విభుత్వము నిశ్చిత మగుటవలన సర్వశరీరములందును ఒకఁడే యాత్మవు నీవు అను నీ యర్థము సిద్ధ మగుచున్నది. కావున, 'వీరు వధ్యులు నేను ఘాతుకుఁడను, అను భేదమును గల్పించికొని నీవు అధీరుఁడ వగుటవలన మోహము నొందుచున్నావు, కాని, ధీరః = విద్వాంసుఁ డన్నవాఁ, 'నేను వీరి వధించువాఁడను, వీరు నాకు వధ్యులు' అను భేదదృష్టి లేకుండుటవలన, నముహ్యతి = మోహము నొందఁడు. అట్లు, వివాదవిషయము లయిన సర్వదేహములును ఒక్కఁడే భోక్త గలవి, దేహ మగుటవలన, నీ దేహమువలె అని యనుమానంబును, 'ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా' ❡ ఇత్యాదిశ్రుతియును ప్రమాణములు. ఇందుచే, 'ఆత్మ నిత్యుఁడు విభువు' అని స్థాపిత మగుటవలన, 'ఆత్మ దేహమే' యని చార్వాకులును, 'ఇంద్రియములు మనస్సు ప్రాణము' అని వారిలోఁ గొందఱును, 'క్షణిక మగు విజ్ఞానము' అని బౌద్ధులును, 'దేహాతిరిక్తుఁడు స్థిరుఁడు దేహపరిమాణుఁడు §' అని జైనులును, మధ్యమపరిమాణునకు అనిత్యత్వము సంభవించుటవలన, 'నిత్యుఁడు అణుపరిమాణుండు ‡' అని మఱికొందఱును జెప్పునవి యంతయు నిరాకృత మగుచున్నది.

శ్రీ. ఓయీ! ఈశ్వరుఁడవు నీవు జన్మాదులు లేనివాఁడ వనుట సత్యమే. కాని జీవులకు జన్మమరణములు ప్రసిద్ధములు. అనఁగాఁ జెప్పుచున్నారు—దేహినః = దేహాభిమాని యగు జీవునకు, యథా, అస్మిన్ దేహే = ఈ స్థూలశరీరమునందు, కౌమారము మొదలగు నవస్థలు దేహమునకే కాని తనకు లేవో పూర్వావస్థ నశించి మీఁది యవస్థ వచ్చినపుడు అతఁడే నేనని ప్రత్యభిజ్ఞ కలుగుటవలన; అట్లే, ఈ

* విభుఁడు = సర్వవ్యాపకుఁడు.

❡ ఒకఁడే దేవుఁడు సర్వభూతములందును గూఢుఁడు, సర్వవ్యాపి, సర్వభూతములకును అంతరాత్మ.

§ దేహ మంతటి పరిమాణము గలవాఁడు'.

‡ పరమాణు వంతటి పరిమాణము గలవాఁడు.'

దేహము నశించినపుడు దేహాంతరము వచ్చుటయు లింగదేహమునకే కాని ఆత్మ కేమో నాశము లేదు, పుట్టినంతనే శిశువునకుఁ బూర్వసంస్కారముచే స్తన్యపానాదికమునందుఁ బ్రవృత్తి కనఁబడుటవలన. కావున, ధీరః=బుద్ధిమంతుఁడు, తత్ర=దేహనాశమునందును దేహోత్పత్తియందును, నముహ్యతి—ఆత్మ చచ్చెను పుట్టెను అని తలంపఁడు.

ప. ఇట్లు జీవుని గుఱించి శోకింపవలసినది లేదని చెప్పి యిఁక దేహమునుగుఱించియు శోకింపవలసినది లేదని చెప్పుచున్నారు—దేహినః = దేహాభిమానియయిన జీవునకు, కౌమారము యౌవనము జర యను మూఁడవస్థల యనుభవము ఎట్లు కనఁబడుచున్నదో—నేను కౌమారదశయందు నగ్నుఁడనై* బాలురతోఁ గ్రీడించితిని, అతఁడే నేను యౌవనమున సభలలో గౌరవము పొందుచుంటిని, మరల అతఁడే నేను ఇప్పుడు దంతములు పోయి వృద్ధుఁడనైతి నను ప్రతీతి యున్నది. అట్లు చెప్పఁబడినది 'క స్త్వా ఽయం జడో మూకో దేహో భవతి రాఘవ' ♦ అని. మఱియు పుత్త్రునకు మొదటియవస్థ పోయి మీఁదియవస్థ వచ్చినపుడు తలిదండ్రులు దుఃఖింపరు గదా! అట్లే, దేహాంతరము పొందినపుడును, ఉపదేశము లేకయే శిశువు పూర్వసంస్కారవశమువలన స్తన్యగ్రహణము రోదనము మొదలగు కార్యములందుఁ బ్రవర్తించుచున్నది. ఇట్లు తెలిసి ధీరుఁడు ఆ విషయమునందు మోహము నొందఁడని యర్థము.

రా. అస్మిన్ దేహే = ఈ దేహమునందు, ఒకదేహమునందు, ఉన్నట్టి; దేహినః = దేహికి; కౌమారమ్ = బాల్యావస్థయు; యౌవనమ్ = యౌవనావస్థయు; జరా = వార్ధకమును; యథా = యెట్లో; దేహాన్తరప్రాప్తిః = మఱియొక దేహము నొందుటయు; తథా = అట్లు; తత్ర = ఆవిషయమునందు; ధీరః = బుద్ధిమంతుఁడు; నముహ్యతి = మోహము నొందఁడు.

ఒకదేహమునం దున్నపుడు దేహి కౌమారావస్థను విడిచి యౌవనాద్యవస్థల నొందినపుడు, ఆత్మ నిత్యుఁడను జ్ఞానముండుటవలన, ఎట్లు ఎవ్వఁడును ఆత్మ నశించె నని దుఃఖింపఁడో, అట్లే దేహాంతరము నొందినపుడును ఆత్మ నిత్యుఁడను

* వస్త్రము—గోచి లేనివాఁడనై.

♦ రామా! జడము జ్ఞానహీనము మూఁగయు నగు ఈదేహము నీ కేమి యగుచున్నది?—దీనితో నీ కేమి సంబంధము.

జ్ఞానము గలవాఁడు దుఃఖింపఁడు. కావున ఆత్మలు నిత్యు లగుటవలన ఆత్మలను గుఱించి దుఃఖింపవలసినది లే దని తాత్పర్యము.

ఇంతమాత్ర మిపుడు చేయవలెను—నిత్యు లైన ఆత్మలే అనాదికర్మవశ్యు లగుటం జేసి తత్తత్కర్మోచితము లయిన దేహములు పొంది యా దేహములచేతనే బంధనివృత్తికొఱకు శాస్త్రీయ మగు స్వవర్ణోచిత మయిన యుద్ధాదికర్మమును ఫలాభిసంధిరహితముగాఁ జేయుచుండునపుడు, వీరికి అనివార్యముగా ఇంద్రియములతో ఇంద్రియవిషయముల సంబంధము కలిగి శీతోష్ణాదిప్రయుక్తము లయిన సుఖదుఃఖముల నొసంగును. వానిమాత్రము శాస్త్రీయకర్మము నెఱవేర్పుపర్యంతము సహింపవలెను.

మా. దేహి యనువాఁ డున్నాఁ డనుట సిద్ధ మయినయెడ అతఁడు నిత్యుఁ డనుట చెల్లును. అదే సిద్ధము కాదు, అనఁగా అట్లు కా దని చెప్పుచున్నారు—దేహినః = దేహము గల ఆత్మకు; అస్మిన్ దేహే = ఈ దేహమునందు; కౌమారమ్, యౌవనమ్, జరా, యథా = ఎట్లో; దేహాన్తరప్రాప్తిః = మఱియొక దేహము పొందుటయు, తథా = అట్లు. ఎట్లు కౌమారాద్యవస్థలు గల శరీరము భిన్న మయినను వాని ననుభవించునట్టి దేహి కలఁ డనుట సిద్ధ మగునో, అట్లు దేహాంతరములు వచ్చినపుడును వాని ననుభవించు దేహి కలఁ డనుట సిద్ధ మగుచున్నది. ఏల యనఁగా జడ మయిన దేహమునకుఁ గౌమారాద్యనుభవము సంభవింపదు, మృతశరీరమునందు అట్టి యనుభవము కనఁబడ కుండుటవలన. మృతశరీరమునందు ప్రాణాదులు పోవుటవలన అనుభవము కనఁబడదు, ‘నేను మనుష్యుఁడను’ ఇత్యాద్యనుభవమువలనఁ గూడ ఈ దేహమే యనుభవించునది యని సిద్ధ మగుచున్నది యనఁగా నది సరి కాదు. ఏల యనఁగా, దేహము ప్రాణాదులతో నున్నపుడుగూడ సుషుప్త్యాదికమునందు జ్ఞానాదివిశేషము కనఁబడదు. అట్లు మనస్సునకును జ్ఞాతృత్వము లేదు. ఎట్లు పాకాదిక్రియయందుఁ గరణ * మగుటచేఁ గాష్ఠాదికము పాకకర్త కాదో అట్లు మనస్సు జ్ఞానమునకు కరణ మగుటచే జ్ఞాత కాఁ జాలదు. శ్రుతివలనఁగూడ దేహాతిరిక్తుఁ డైన యాత్మ కలఁ డని సిద్ధ మగుచున్నది. ప్రత్యక్షాదుల కెట్లో అట్లే శ్రుతికిని ప్రామాణ్యము. బౌద్ధాదివాక్యములవలె శ్రుతియును అప్రమాణ మని శంకింపరాదు, శ్రుతి అపౌరుషేయ § మగుటవలన. అపౌరుషయమునందుఁ బౌరుషేయా

* సాధనము.

§ పురుషరచితము కానిది.

జ్ఞానాదు లెట్లు కల్పింపవచ్చును? అపౌరుషేయవాక్యమే లేదన్నయెడ సర్వశాస్త్రాభిమతము లయిన ధర్మాధర్మములు సిద్ధింపక పోవును. ఎవ్వఁ డాధర్మాధర్మముల నంగీకరింపఁడో, అతనిది శాస్త్రము కాదు, విషయప్రయోజనములు లేకుండుట వలన. ధర్మాధర్మములు నిరూపింప నలవికానివి, కావున అవి లేనేలే వందు రేని అట్లు చెప్పఁ దగదు. ఏల యనఁగా సర్వాభిమత మయినది ప్రమాణముచేతనే గాని లేదని చెప్ప శక్యము కాదు. ప్రమాణము లేనిది యెట్లు సిద్ధించు నందు రేని సర్వాభిమతియే ధర్మాధర్మములకుఁ బ్రమాణము. శ్రుత్యనుమానములకుఁ బ్రామాణ్యము లేదన్నయెడ సమస్త మయిన వాగ్వ్యవహారముగూడ సిద్ధింపదు. నీవచనము నేను వింటి నని నీ కెట్లు తెలియును. అనుమానము ప్రమాణము కా దనుయెడ నాప్రత్యుత్తరము నీకు జ్ఞాపకము కాఁ జాలదు. ప్రమాణము కాదు, జ్ఞాపకము కావచ్చు ననుయెడ దానివలన నీకు భ్రాంతియో సంశయమో కలుగవలెను గాని ప్రమ * కలుగఁ జాలదు. మఱియు ధర్మాదులు లే వను శాస్త్రము సర్వజనులకును దుఃఖ కారణం బగును. శాస్త్రప్రణేత తా నొక్కఁడె నను సర్వజనులకును అపకారకుం డగును. ఇఁక ధర్మప్రమాణము పురుషప్రణీతమే కావలయు నన్నచో తత్కర్త యందు అజ్ఞానాదిదోషశంక కలుగును. స్వవాక్యముచేతనే దానికి నిర్దోషత సిద్ధింపదు గదా! ఒకానొకఁడు రచియించినదాని మఱియొకఁడు అపౌరుషేయ మన్నయెడ నది వేదమువలె అపౌరుషేయము కాఁ జాలదు. ఏల యనఁగా వేదమునకు అపౌరుషేయత అనాదికాలమునుండి సర్వసమ్మతిచేఁ బ్రసిద్ధము. కావున శ్రుతి ప్రమాణము. కావున కుతర్కములచే, ధీరః = విద్వాంసుఁడు; తత్ర = ఆవిషయమందు; నముహ్యతి = మోహము నొందఁడు.

ఎట్లు జీవునకు ఇప్పు డున్న దేహమునందుఁ గౌమారాద్యవస్థలలో నొకటిపోయి మఱియొకటి వచ్చినపుడు, ఆ యవస్థల ననుభవించునట్టి ఆత్మ దేహముకన్న భిన్నుఁడుగా నున్నాఁ డని సిద్ధ మగుచున్నదో, అట్లు ఈ దేహము పోయి మఱియొక దేహము వచ్చినపుడును, బూర్వదేహానుభవసంస్కారము కలవాఁ డగుటవలన, దేహముకంటె భిన్నుఁడుగా ఆత్మ కలఁ డని సిద్ధించుచున్నది. కావున ఆత్మ లేదని చెప్పువారి కుయుక్తులచేఁ బండితుఁడు మోహము నొందఁ డని తాత్పర్యము.

అర్థాంతరము.—నీవు శోకించుట జీవుఁడు నశించు ననియా? లేక దేహము నశించు ననియా? జీవుఁడు నిత్యుఁ డగుటచే జీవుఁడు నశించు నని దుఃఖించుట తగ

* యథార్థజ్ఞానము.

దని 'నత్వేవాహ' మ్మను శ్లోకముచేఁ జెప్పఁబడినది. దేహము నశించు నని దుఃఖించుటయుఁ దగ దని చెప్పుచున్నారు—ఎట్లు కౌమారాదిదేహము విడిచి జరాదిదేహము పొందినప్పుడు దుఃఖించుటకుఁ గారణము లేదో అట్లు జీర్ణాదిదేహము విడిచి దేహాంతరము నొందినపుడును దుఃఖించుటకుఁ గారణము లేదు. కావున ఆవిషయమున ధీరుఁడు మోహము నొందఁడు.

మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః
ఆగమాపాయినో ఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత. ౧౪

భా. నిత్యుఁ డాత్మ యని తెలిసినవానికి ఆత్మవినాశనిమిత్త మయిన మోహము సంభవింపదు వాస్తవమే, అయినను శీతోష్ణసుఖదుఃఖప్రాప్తినిమిత్త మైన మోహము లౌకికము సంభవించుటం జూచుచున్నాము. సుఖవియోగముచే మోహమును దుఃఖసంయోగాదులచే శోకమును గలుగుచున్నవి యని యర్జునుండు పలుకు నని యాశంకించి భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—కౌన్తేయ=కుంతీపుత్త్రుఁడా! మాత్రాస్పర్శాః తు—వీనిచే శబ్దాదులు తెలియఁబడును కావున మాత్ర లనఁగా శ్రోత్రము మొదలగు నింద్రియములు, మాత్రలయొక్క స్పర్శములు—శబ్దాదులతో సంయోగములు, అవియే శీతోష్ణసుఖదుఃఖదాః= శీతమును ఉష్ణమును సుఖమునుదుఃఖమును ఇచ్చునవి. లేక, స్పృశింపఁబడుచున్నవి కావున స్పర్శము లనఁగా శబ్దాదివిషయములు,మాత్రలును స్పర్శములును మాత్రాస్పర్శములు, శీతోష్ణసుఖదుఃఖదములు. శీతముగూడ ఒకప్పుడు సుఖము నొసంగును, ఒకప్పుడు దుఃఖము నొసంగును, అట్లు ఉష్ణము గూడ అనియత మయిన స్వరూపము గలది. సుఖదుఃఖములుమాత్ర మెల్లప్పుడు నియతరూపములే యగుచున్నవి. ఇందువలన వానికంటె వేఱుగా శీతోష్ణములు చెప్పఁబడినవి. అవి, ఆగమాపాయినః=రాకయు పోకయు స్వభావముగాఁ గలవి; కావున, అనిత్యాః= నిత్యములు కానివి, కావున, భారత = భరతవంశమునఁ బుట్టినవాఁడా! తాన్ = ఆ శీతోష్ణాదులను; తితిక్షస్వ = సహింపుము, అవి కలిగినపుడు హర్షమునుగాని విషాదమునుగాని పొందకు మని యర్థము.

అర్జునా! ఈ శబ్దాదివిషయములవలన శీతోష్ణసుఖదుఃఖములు కలుగుచున్నవి, కాని యవి యాత్మకు సహజములు కావు. ఈ విషయములును ఉత్పత్తివినాశములు గలవి కావున అనిత్యములు, కావున ఈ శీతోష్ణములను సహింపవలెను, వీనిచే సంతోషమునుగాని విషాదమునుగాని పొందకు మని తాత్పర్యము.

**ఆ.** ఆత్మ నిత్యుఁ డని శ్రుత్యాదులచేఁ దెలియుటవలన, తదుత్పత్తివినాశప్రయుక్తము లయిన శోకమోహములు లేకున్నను, మఱియొకనిమిత్తముచే శోకమోహములు కలుగు నను నాశంకను అనువదించి దానికి నుత్తరముగా శ్లోకమున కవతారిక చేయుచున్నారు నిత్యుఁ డాత్మ ఇత్యాదిగా. శీతోష్ణములయొక్కయు వానిచే సుఖదుఃఖములయొక్కయుఁ బ్రాప్తిచేఁ గలుగునట్టి యేమోహాదికము కనఁబడుచున్నదో అది యన్వయవ్యతిరేకములచే దృష్టమగుచున్న దని తెలుపుటకై లౌకిక మను విశేషణము. అశోచ్యా నిత్యాది శ్లోకమునందు ఎట్టివాఁడు జ్ఞానాధికారిగా సూచింపఁబడెనో అతనికి 'తితిక్షు స్సమాహితో భూత్వా' అను శ్రుతి వలన, తితిక్ష యుండవలె నని ఈ శ్లోకమునం దుపదేశింపఁబడుచున్నది. మాత్రా పదమును గ్రహించి కరణవ్యుత్పత్తిచే నది యింద్రియబోధక మని తెలుపుచున్నారు. షష్ఠీసమాసమును బ్రదర్శించి భావవ్యుత్పత్తిచే స్పర్శశబ్దార్థముఁ జెప్పుచున్నారు— మాత్రలయొక్క ఇత్యాదిగా. వాని యర్థక్రియను జూపుచున్నారు—అవి శీతోష్ణ ఇత్యాదిగా. ఇఁక స్పర్శశబ్దమునకు కర్మవ్యుత్పత్తిచే శబ్దాదివిషయబోధకత్వమును బ్రతిపాదించుచు సమాసాంతరము నిర్దేశించి విషయములకార్యమును జెప్పుచున్నారు లేక ఇత్యాదిగా. ఓయీ! శీతోష్ణములవలన సుఖదుఃఖములు కలుగు ననుట సిద్ధమై యుండఁగా ఎందుకు శీతోష్ణములను సుఖదుఃఖములకంటె వేఱుగాఁ జెప్పవలయును? అనఁగా అందుకు సమాధానముఁ జెప్పుచున్నారు శీతము ఇత్యాదిగా. విషయములకంటె వాని వేఱుగాఁ జెప్పుటయో, విషయాంతర్భూతములే యయిన యాశీతోష్ణములయొక్క సుఖదుఃఖహేతువు లగు ఆనుకూల్యప్రాతికూల్యముల యుపలక్షణముకొఱకు. ఎట్లనఁగా బాహ్యము లయిన విషయములు, శరీరమునందు శీతమునుగాని ఉష్ణమునుగాని ఆనుకూల్యమునుగాని ప్రాతికూల్యమునుగాని కలిగించి గదా సుఖాదికముఁ బుట్టించుచున్నవి. ఓయీ! విషయేంద్రియసంయోగ మాత్మయం దెల్లప్పుడు నుండుటవలన దానిచేఁ గలుగు శీతోష్ణాదికముగూడ నెల్లప్పుడు గలుగుచుండును, అప్పుడు శీతోష్ణాదికముచేఁ బుట్టునట్టి హర్షవిషాదము లాత్మకెల్లప్పుడు నుండవలసివచ్చును అని యాశంకించి యందుకు సమాధానముగా

ను త్తరార్థము వివరించుచున్నారు అవి ఆగమాపాయినః ఇత్యాదిగా. ఈ శ్లోకము నందు కౌన్తేయ భారత అను రెండు సంబోధనములచే ఉభయకులశుద్ధుఁ డయిన వానికి * మాత్రమే విద్యయం దధికార మనుట తెలుపఁబడుచున్నది.

హ. ఆత్మ నిత్యుఁ డని తెలిసినవానికి ఆత్మనాశనిమిత్త మయిన శోకము సంభవింపదు గాని శీతోష్ణనిమిత్త మయిన శోకము సంభవించు నని యర్జునువచనము నాశంకించి చెప్పుచున్నారు—మాత్రాశ్శ్బాస్తు—వీనిచే శబ్దాదులు గ్రహింపఁబడును గావున మాత్ర లనఁగా ఇంద్రియములు, మాత్రలయొక్క, స్పర్శములు=శబ్దాదులతో సంయోగములు; శీతోష్ణసుఖదుఃఖదాః=శీతోష్ణములు అను సుఖదుఃఖములను ఇచ్చునవి; ఆగమాపాయినః = రాకయు పోకయు గలవి; అందువలన, అనిత్యాః. తాన్ = ఆ మాత్రాస్పర్శములను; తితిక్షస్వ = ఓర్వుము, అవి సంభవించినపుడు హర్షవిషాదము లొందకు మని యర్థము.

శం. ప్రత్యక్షానుమానప్రమాణములచేతను శ్రుతిస్మృతులచేతను త్వం పదలక్ష్యార్థ మయిన ఆత్మ నిత్యుఁడే యని యెఱుంగుచున్నాను. అయినను భీష్మాది శబ్దవాచ్యార్థము లయిన దేహములు మృతిఁ బొందునపుడు తద్వియోగమువలనఁ గలుగు దుఃఖము సహింప శక్యము కా దను నభిప్రాయము గలవానిఁగా నర్జును నెఱింగి, ' బ్రహ్మవేత్తలు అనాత్మను గుఱించి సుఖదుఃఖములు పెట్టుకోరాదు, మ ఱేమనఁగా, దేహాభిమానము విడిచి, ప్రారబ్ధవశమువలనఁ బ్రాప్తము లగు ఆధ్యాత్మికాది త్రివిధదుఃఖములను సహించుచు తీవ్రముముక్షుచే సదా బ్రహ్మానుసంధానమే చేయవలెను ' అని సూచించుటకై చెప్పుచున్నారు—మాత్రాస్పర్శాః—చక్షురాది జ్ఞానేంద్రియములచే సామాన్యముగాఁ దెలియఁబడునవి కావున మాత్రలు; వాగాద్యుభయేంద్రియములచే విశేషించి స్పృశింపఁబడునవి—గ్రహింపఁబడునవి కావున స్పర్శములు—ఈ రెండుశబ్దములును శబ్దాదులను ఇతరభోగ్యపదార్థములను బోధించును, అవి; తు—తమయంతనె; శీతోష్ణసుఖదుఃఖదాః = శీతోష్ణములవలె సుఖదుఃఖముల నిచ్చునవి, ఎట్లు శీతోష్ణములు అనుకూలములై సుఖమును ప్రతికూలములయి దుఃఖమును ఇచ్చునో అట్లే శబ్దాదులుగూడ అనుకూలములైనపుడు సుఖమును ప్రతికూలములైనపుడు దుఃఖమును ఇచ్చు నని యర్థము; లేక, శబ్దాదులు అనుకూలమునుగాని ప్రతికూలమునుగాని శీతమునుగాని యుష్ణమునుగాని శరీరమునందుఁ

* మాతృకులమును పితృకులమును బరిశుద్ధములుగాఁ గలవానికి.

గలిగించి తద్ద్వారముననఁగాని సాక్షాత్తుగాఁగాని సుఖమును దుఃఖమును ఇచ్చుచున్నవి కావున శీతోష్ణసుఖదుఃఖదములు. ఓయీ! విషయేంద్రియసంప్రయోగము నిత్యమయినయెడ దానివలనఁ గలుగు సుఖదుఃఖములును నిత్యములగును. అప్పుడు ఆత్మవేత్తకు ఆ సుఖదుఃఖముల యనుసంధానము విడిచి బ్రహ్మానుసంధానము చేయుట యెట్లు శక్యమగును? అనఁగా ఇందుకుఁ జెప్పుచున్నారు—ఆగమాపాయినః=ఉత్పత్తియును వినాశమును గలవి కావున, విషయములును వానివలనఁ బుట్టు సుఖదుఃఖాదులును మెఱపువలె అనిత్యములు. తాన్= క్షణకాలముండునట్టి యా విషయములను తత్సంయోగవియోగములను; తితిక్షస్వ. భారత—భా అనఁగా బ్రహ్మవిద్య, దానియందే రమించువాఁడవగు, కౌంతేయ. నిత్యమైన సుఖమును గోరునట్టి ముముక్షువు ప్రారబ్ధమువలన వచ్చిన సుఖదుఃఖాదుల సహనమవశ్యము చేయవలెను. తత్సహనము చేయువానికే శ్రవణాదులును తజ్జన్యమయిన జ్ఞానమును తత్ఫలంబును సిద్ధించును. కావున, నీవు వీరి సమాగమమునందుఁ గలుగు సుఖమునువలె వియోగమునందుఁ గలుగు దుఃఖమునుగూడ సహింపుము. ప్రతిక్రియయును చింతయును విషాదమును విడిచి ప్రాప్తములయిన సుఖదుఃఖములసహించుట ముముక్షువున కుత్తమ ధర్మము. అట్లు శ్రుతి 'వృక్ష ఇవ తిష్ఠాసే ఛిద్యమానో నకుప్యేత నకమ్పేత। ఉపల ఇవ తిష్ఠాసే ఛిద్యమానో నకుప్యేత నకమ్పేత' * అని యుపదేశించుచున్నది. దేహేంద్రియాదులును శబ్దాదులును అనిత్యములు, ఆగమాపాయములు కలవగుటవలన, ఏది యనిత్యముగాదో అది ఆగమాపాయవంతము గాదు, ఆత్మవలె. ఆత్మ నిత్యుఁడు, ఆ దేహేంద్రియాదుల ఆగమాపాయములకు సాక్షియగుటవలన, ఏది నిత్యము గాదో అది సాక్షి గాదు, దేహమువలె. ఇత్యాద్యనుమానప్రమాణముచే దేహేంద్రియాదు లనిత్యములనియు తత్సాక్షియైన ఆత్మ నిత్యుఁడనియు, ఇచటఁగూడ సూచితమగుచున్నది.

వ. ఓయీ! 'ఆత్మ నిత్యుఁడు విభువు' అనుట కాక్షేపింపము. సర్వదేహములందును ఆత్మ యొక్కఁడే యనుటనుమాత్ర మంగీకరింపఁజాలము. ఏలయనఁగా, 'ఆత్మలు, బుద్ధి సుఖము దుఃఖము ఇచ్ఛ ద్వేషము ప్రయత్నము ధర్మము అధర్మము భావన అను తొమ్మిదివిశేషగుణములు కలవారనియు ప్రతిదేహమును భిన్నులేయనియు నిత్యులు విభువులు ననియు వైశేషికులు చెప్పుచున్నారు. ఈమతమునే తార్కికులును మీమాంసకాదులును అంగీకరించుచున్నారు. సాంఖ్యులుమా

* చెట్టువలె నుండఁ గోరవలెను ఛేదింపఁబడుచున్నను కోపింపఁగూడదు, చలింపఁగూడదు. ఱాయివలె నుండఁ గోరవలెను, ఛేదింపఁబడుచున్నను కోపింపఁగూడదు, చలింపఁగూడదు.

త్రము ఆత్మగుణవంతుఁ డనుటను అంగీకరింపనివారైనను ప్రతిదేహమును భిన్నుఁడు అను నంశమున విరోధము చెప్పరు, లేనిచో సుఖదుఃఖాదిసంకరము సంభవించును. కావున, భీష్మాదులకంటె భిన్నుఁ డగు నేను నిత్యుఁడను విభుఁడను ఐనను, సుఖదుఃఖాదులు కలవాఁడ నగుటంజేసి, భీష్మాదిబంధుదేహముల మరణముచే నాకు సుఖవియోగంబును దుఃఖసంయోగంబును సంభవించును. కావున శోకమోహములు పొందుట యనుచితము కాదు. అని యర్జునుని యభిప్రాయము నాశంకించి భగవంతుఁడు లింగదేహవివేకముకొఱకై చెప్పుచున్నాఁడు.—మాత్రాస్పర్శాః—వీనిచే విషయములు తెలియఁబడుచున్నవి కావున మాత్రలు=ఇంద్రియములు, వానియొక్క, స్పర్శాః=విషయములతో సంబంధములు, లేక, తత్తద్విషయాకారము లయిన అంతఃకరణపరిణామములు, అవి; ఆగమాపాయినః తు = ఉత్పత్తివినాశములు గల అంతఃకరణమునకే; శీతోష్ణసుఖదుఃఖదాః = శీతోష్ణాదిద్వారమున సుఖదుఃఖముల నిచ్చునవి, కాని నిత్యుఁడు విభుఁడు నగు ఆత్మకుఁ గాదు, ఏల యనఁగా ఆత్మ నిర్గుణుఁడు నిర్వికారుఁడు, ఎట్లనఁగా నిత్యుఁడు అనిత్యధర్మాశ్రయుఁడు కాఁజాలఁడు, ధర్మాధర్ముల కభేదము వలనను, సంబంధాంతరము అనుపపన్న మగుటవలనను, సాక్ష్యము సాక్షి ధర్మమనుట యసంగత మయినందువలనను. ఆవిషయము చెప్పఁబడినది. « న వర్తేస్యాద్విక్రియాం దుఃఖీ సాక్షితా కా వికారిణః । ధీవిక్రియాసహస్రాణాం సాక్ష్యతోఽహమవిక్రియః » * అని. కావున సుఖదుఃఖాదుల కాశ్రయ మయిన యంతఃకరణముయొక్క భేదమువలననె సర్వవ్యవస్థయు నుపపన్న మగుటంజేసి నిర్వికారుఁడు సర్వప్రకాశకుఁ డగు ఆత్మకు భేదము కల దనుటకుఁ బ్రమాణము లేదు, సద్రూపంబునను స్ఫురణరూపంబునను ఆత్మ సర్వత్ర ఏకరూపముగా అనుగతుఁ డగుటవలన. అంతఃకరణమే సుఖదుఃఖాదిజనక మనునది యుభయవాదులు † అంగీకరించెదరు. అందు, సమవాయికారణత్వమే యుక్తమ మగుటవలన సుఖదుఃఖాదుల కంతఃకరణము సమవాయికారణ మని చెప్పుటయె యుచితము. కాని మఱియొక సమవాయికారణము నిరూపింపక నిమిత్తకారణ మనుట యుక్తము కాదు. అట్లు కామస్సంకల్ప ఇత్యాదిశ్రుతి 'ఏతత్సర్వం మనఏవ' ♦ యని కామా

---

* వికారము లేక దుఃఖవంతుఁడు కాఁడు, వికారవంతునకు సాక్షిత్వ మెక్కడిది? నేనో అంతఃకరణవికారసహస్రములకు సాక్షినై యున్నాను. కావున నేను నిర్వికారుఁడను.

† భేదవాదులును అభేదవాదులును.

♦ ఇది యంతయును మనస్సే.

దులకును అంతఃకరణమునకును అభేదము నిర్దేశించుటవలన అంతఃకరణము కామాదిసర్వవికారములకును ఉపాదానకారణము * అనుటను జెప్పుచున్నది. ఆత్మ స్వప్రకాశజ్ఞానానందస్వరూపుఁ డని శ్రుతులు బోధించుటవలన, అతఁడు కామాద్యాశ్రయుఁ డనుట చెల్లదు. కావున వైశేషికాదులు భ్రాంతిచేతనే ఆత్మకు వికారిత్వమును భేదమును అంగీకరించి రని యర్థము. ఆగమాపాయములు గలదియు దృశ్యమును అగుటవలన నిత్యుఁడవు దృగ్రూపుఁడవు అగు నీకంటె భిన్న మగు నంతఃకరణమునకు సుఖాదిజనకము లయిన యేమాత్రాస్పర్శములు గలవో అవియును, అనిత్యాః = నియతము కాని స్వరూపము గలవి, ఎట్లనఁగా, ఒకప్పుడు సుఖమును గల్గించునట్టి శీతోష్ణాదికమే మఱియొకప్పుడు దుఃఖము కల్గించుచున్నది, ఇట్లు ఒకానొకప్పుడు దుఃఖజనక మయినదిగూడ మఱియొకప్పుడు సుఖజనక మగుటం జూచుచున్నాము. శీతోష్ణగ్రహణము ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికదుఃఖముల యుపలక్షణమునకొఱకు. శీతముగాని యుష్ణముగాని యొకప్పుడు సుఖమును ఒకప్పుడు దుఃఖమును అగును, సుఖదుఃఖములుమాత్ర మెల్లప్పుడును ఏకరూపముగానే యుండును కావున నవి వేఱుగాఁ జెప్పఁబడినవి. కావున, మిక్కిలి యస్థిరంబులును నీకంటె భిన్నము వికారవంతము నగు నంతఃకరణమునకు సుఖదుఃఖాదిప్రదంబులు నగు శీతోష్ణాదిసంయోగవియోగరూపము లయిన మాత్రాస్పర్శములను నీవు, తితిక్షస్వ— ఇవి నా కేమియును జేయునవి కా వని వివేకముచే నుపేక్షింపుము, దుఃఖి యగు నంతఃకరణముతో తాదాత్మ్యాధ్యాసముచే ♦ 'నేను దుఃఖిని' అని తలంపవల దని యర్థము. కౌన్తేయ భారత అను రెండు సంబోధనములచే ఉభయకులశుద్ధుఁడవైన నీకు అజ్ఞానము అనుచితం బని సూచించుచున్నాఁడు.

శ్రీ. ఓయీ! నేను గతాసువులను అగతాసువులను గుఱించి శోకింపను. మఱే మనఁగా, వారి నెడఁబాయుట మొదలగు దుఃఖము నొందునట్టి నన్ను గుఱించియె శోకించుచున్నాను. అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు—వీనిచే విషయములు తెలియఁబడుచున్నవి కావున మాత్ర లనఁగా ఇంద్రియవృత్తులు, మాత్రలయొక్క స్పర్శములు = విషయములతో సంబంధములు; అవి శీతోష్ణాదిప్రదము లగుచున్నవి. అవియో, ఆగమాపాయములు గలవి, కావున, అనిత్యాః = అస్థిరములు.

---

* తనకు స్వరూపముచే సమ మయిన కార్యమును బుట్టించునది, ఘటమునకు మృత్తికవలె, సమవాయికారణము ఇదియు పర్యాయములు.

♦ అంతఃకరణమే నేను అను భ్రమచేత.

కావున, తాన్, తితిక్షస్వ=సహింపుము. ఎట్లు జలము ఎండ మొదలగు వానితో సంబంధములు ఆయా కాలమునందుఁ జేయఁబడినవై స్వభావముచే శీతోష్ణాదికము నిచ్చుచున్నవో, అట్లు ఇష్టసంయోగములును తద్వియోగములునుగూడ సుఖదుఃఖాదికము నిచ్చుచున్నవి. అవి యస్థిరము లగుటవలన వాని సహనము ధీరుఁడ వగు నీ కుచితము కాని తన్నిమిత్తము లయిన హర్షవిషాదములకుఁ బరవశుఁ డగుట తగ దని యర్థము.

ప. ఓయీ! వారినిగుఱించి నేను శోకింప లేదు. మ తే మనఁగా, వారి వియోగదుఃఖము నాకుఁ గలుగునే యని దుఃఖించుచున్నా ను అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు—మాత్రాస్పర్శాః = ఇంద్రియవృత్తులకు విషయములతో సంబంధములు; * శీతోష్ణసుఖదుఃఖదాః = శీతోష్ణములు మొదలగు సుఖదుఃఖముల నిచ్చునవి, అగుచున్నవి. అవియు, ఆగమాపాయములు గల వగుటవలన, అనిత్యాః, కావున, తాన్ = వాని; తితిక్షస్వ = సహింపుము. ఎందువలన ననఁగా నీవు భారతుఁడవు, భరతవంశమునఁ బుట్టినవాఁడవు, వీరుఁడవు; పుత్త్రుఁడు పౌత్త్రుఁడు మొదలగు విషయము లన్నియు దేహముకొఱకుఁ గదా అపేక్షింపఁబడుచున్నవి, కావున సర్వోత్కృష్ట మయిన విషయము దేహము, ఇట్టి దేహమునుగూడ యుద్ధమున వీరులు తృణముగాఁ జూచెదరు. ఇఁక క్షణభంగురము శీతోష్ణాదితుల్య మగు బంధువియోగ మనఁగా నెంతమాత్రము? అని యర్థము.

రా. ఈ యర్థమును వెంటనె చెప్పుచున్నాఁడు—మాత్రాస్పర్శాః—ఆశ్రయము లయిన ద్రవ్యములతోఁ గూడిన శబ్దస్పర్శరూపరసగంధములు తన్మాత్రల యొక్క ♦ కార్యము లగుటవలన మాత్ర లని చెప్పఁబడుచున్నవి, వాని యొక్క, స్పర్శాః = శ్రోత్రాదీంద్రియములతో సంబంధములు, తు= అనివార్యముగా; శీతోష్ణసుఖదుఃఖదాః = శీతోష్ణములు మృదుపరుషములు మొదలగు సుఖదుఃఖముల నిచ్చునవి, అగుచున్నవి. శీతోష్ణశబ్దము శస్త్రపాతాదుల కుపలక్షణార్థము. తాన్ = వానిని; ధైర్యముచే యుద్ధము మొదలగు శాస్త్రీయకర్మము నెఱవేర్చుపర్యంతము, తితిక్షస్వ = సహింపుము. అవి, ఆగమాపాయినః = ఉత్పత్తివినాశములు గలవి, కావున ధైర్యము గలవారికి సహించుటకు శక్యములు. మఱియు నవి, అనిత్యాః = నిత్యములు కానివి, బంధహేతు వయిన కర్మము నశింపఁగానే వీని యాగమాపాయ

---

* వృత్తి శ్రీధరీయము.

♦ సూక్ష్మభూతములయొక్క...

ములుగూడ నివర్తిల్లు నని యర్థము. 'కౌంతేయ భారత' యను సంబోధనములచే రెండుపార్శ్వములందును ఉత్తమక్షత్రియవంశజుండ వగు నీకు ధైర్యమె యుచితమని సూచింపఁబడుచున్నది.

విషయముల కింద్రియములతో సంబంధము కలిగినప్పుడు అవి తప్పక శీతోష్ణములు ఆయుధవేధలు మొదలగు సుఖదుఃఖములఁ గలిగించును. వాని నీవు ధైర్యముచే శాస్త్రీయ మయిన యుద్ధాదికర్మము సమాప్త మగువఱకు సహింపవలెను. అవి యాగమాపాయములు గలవగుటచే ధైర్యవంతులకు సహింప శక్యము లయినవే కాని వేఱుకాదు. సంసారబంధకారణ మయిన కర్మము నశించిన పిదప వీవి యాగమాపాయములుగూడ సంభవింపవు. కావునఁ దల్లినైనను దండ్రినైనను గూడ ఉత్తమక్షత్రియవంశజాతుండవు నీవు ఈ మాత్రాస్పర్శముల నహించు ధైర్యము వహింపవలయు నని తాత్పర్యము.

మా. అట్లయినను వారిదర్శనము లేకపోవుట మొదలగునవి సంభవించు నని నాకు శోకము కలుగుచున్న దనఁగా అది యనుచితము కా దని చెప్పుచున్నాఁడు— మాత్రాస్పర్శాః తు - తెలియఁబడుచున్నవి కావున మాత్ర లనఁగా విషయములు, వానియొక్క, స్పర్శాః తు = సంబంధములే; శీతోష్ణసుఖదుఃఖదాః = శీతోష్ణములను వానిచే సుఖదుఃఖములను ఇచ్చునవియా? దేహమునందు శీతోష్ణాదిసంబంధము గలుగుట వలనఁ గదా ఆత్మకు శీతోష్ణాద్యనుభవము, అందువలన సుఖదుఃఖములు. ఆత్మకు విషయేంద్రియసంబంధమాత్రముచే దుఃఖాదికము సంభవింపదు గదా! కావున ఇష్టాద్యభిమానసహితములైయే యీమాత్రాస్పర్శములు ఆత్మకు సుఖదుఃఖము లిచ్చుచున్నవి. ఎందువలన ననఁగా, ఆగమాపాయినః = ఉత్పత్తివినాశములు గలవి, అగుటవలన. మాత్రాస్పర్శములు మాత్రమె * ఆత్మకు శీతోష్ణసుఖదుఃఖదము లగుపక్షమున సుషుప్తియందును శీతోష్ణసుఖదుఃఖదములు కావలయును. కావున, ఎందువలన జాగ్రత్స్వప్నములందుమాత్రమె అవి శీతోష్ణసుఖదుఃఖదము లగుచున్నవో ఇతరకాలమునందుఁ గావో, అందువలన అన్వయవ్యతిరేకములచే అభిమానముతోఁ గూడినవే యవి యాత్మకు శీతోష్ణసుఖదుఃఖదము లగుచున్నవి కాని తాముమాత్రమె కావు. మఱియు ఆత్మకు వీనితో విషయవిషయిభావ సంబంధము దక్క మఱియొక సంబంధము లేదు. ఆగమాపాయ

---

* అభిమానము నపేక్షింపక యే.

వంతములైనను ప్రవాహరూపమునఁగూడ ఇవి నిత్యములు కావు, సుషుప్తిప్రలయాదులయందు లేకుండుటవలన నని చెప్పుచున్నాఁడు—అనిత్యాః = నిత్యములు కానివి. అందువలన ఆత్మకు దేహాదులందు ఆత్మభ్రాంతియె దుఃఖకారణము. కావున ఆ భ్రాంతి విడిచినవానికి బంధుమరణాదులయందు దుఃఖము కలుగదు. కావున అభిమానమును విడిచి, తాన్ = ఆ శీతోష్ణాదులను; తితిక్షస్వ = సహింపుము.

అర్జునా! ఈ విషయసంబంధములు మాత్రమె ఆత్మకు శీతోష్ణసుఖదుఃఖము లిచ్చునవి కావు, మఱేమనఁగా ఆత్మకు వీనియందుండు నభిమానము * తోఁ జేరి యివి సుఖదుఃఖాదులఁ గలిగించుచున్నవి. ఎట్లనఁగా అభిమానములేని సుషుప్త్యాదులయం దివి సుఖదుఃఖములు కలిగింపవు, అభిమానముండునట్టి జాగ్రత్స్వప్నములయందుమాత్రమె సుఖదుఃఖముల నిచ్చుచున్నవి. ఇట్లన్వయవ్యతిరేకములచే అభిమానసహితము లయిన యీ విషయసంబంధములే సుఖదుఃఖప్రదములని యేర్పడుచున్నది. మఱియు ఇవి యనిత్యములు. ఈ యభిమానమునకు ఆత్మకు దేహాదులయం దాత్మభ్రాంతి కారణము. అది తొలఁగినచో బంధుమరణాదులచే దుఃఖము కలుగదు. కావున నీవీ యభిమానమును విడిచి శీతోష్ణాదుల సహింపుమని తాత్పర్యము.

యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. ౧౫

భా. శీతోష్ణాదులను సహించుటచే నేమి సిద్ధించు నందువేని వినుము. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుఁడా! యం పురుషమ్ హి = ఏ పురుషుని మాత్రము; సమదుఃఖసుఖమ్ = సమానము లయిన దుఃఖమును సుఖమును గలవాని, సుఖము గలిగినపుడు హర్షముగాని దుఃఖము కలిగినపుడు విషాదముగాని లేనివాని ననుట; ధీరమ్ = బుద్ధిమంతుని; ఏతే = ఈ శీతోష్ణాదులు; నవ్యథయన్తి = చలింపఁజేయవో, నిత్యాత్మజ్ఞానమువలన; అట్టి నిత్యాత్మస్వరూపజ్ఞాననిష్ఠుఁడును శీతోష్ణాదిద్వంద్వముల సహించువాఁడు నగు పురుషుఁడు; అమృతత్వాయ = మరణము లేనివాఁ డగుటకొఱకు, మోక్షము కొఱకని యర్థము; కల్పతే = సమర్థుఁ డగుచున్నాఁడు.

* ఇవి నాకుఁ బ్రియములు, ఇవి నాకు అప్రియములు అను తలంపు.

ఈ శీతోష్ణాదులకుఁ జలనమునొందక దుఃఖము వచ్చినపుడు విషాదము గాని సుఖము వచ్చినపుడు హర్షముగాని లేనివాఁడై బుద్ధిమంతుఁ డగు పురుషుఁడు మోక్షము నొందుటకు యోగ్యుం డగు నని తాత్పర్యము.

ఆ. తితిక్షుత్వమును అధికారి విశేషణము చేయుటచే నుపయోగము లేదు, ఏల యనఁగా తితిక్షుత్వ మొకదానివలనఁ బురుషార్థము కలుగఁ జాలదు. అని యాశంకించుచున్నారు—శీతోష్ణాదుల నిత్యాదిగా. వివేకవైరాగ్యాదిసహిత మైన తితిక్షుత్వము జ్ఞానద్వారమున మోక్షహేతు వగును. అందుకొఱకు తితిక్షుత్వ మధికారి విశేషణము చేయుట యని యాశంకను బరిహరించుచున్నారు వినుము ఇత్యాదిగా. తితిక్ష చేయునట్టివానికిఁ జెప్పఁదలఁచిన లాభమును జూపుచున్నారు యంపురుషమ్ ఇత్యాదిగా. హర్షముగాని...విషాదముగాని లేనివాఁ డనుటచే శమాదిసాధన సంపత్తి చెప్పఁబడుచున్నది. ధీమన్తమ్ అనుటచే నిత్యానిత్యవస్తువివేకము కలుగుట చెప్పఁబడుచున్నది. ఈరెండును వైరాగ్యాదికమునకు * నుపలక్షణము. నిత్యాత్మజ్ఞాన మనఁగా త్వంపదార్థముయొక్క జ్ఞానము. సాధనచతుష్టయసంపన్నుఁ డగు నధికారి ననువదించి త్వంపదార్థజ్ఞానము గల ఆ యధికారి మోక్షసాధన మయిన వాక్యార్థజ్ఞానమునందు సమర్థుఁ డగు నని చెప్పుచున్నారు అట్టి నిత్యాత్మజ్ఞా నేత్యాదిగా.

హ. మాత్రాస్పర్శముల సహించువాని కేమి కలుగు ననఁగాఁ జెప్పుచున్నారు.—యం హి పురుషమ్ = ఏపురుషుని; సమదుఃఖసుఖమ్ — సుఖదుఃఖములు వచ్చినపుడు హర్షవిషాదములు లేనివానిని; ధీరమ్ = బుద్ధిమంతుని; ఏతే = ఈ మాత్రాస్పర్శములు; నవ్యథయన్తి = చలింపఁజేయవో; సః = ఆ పురుషుఁడు; అమృతత్వాయ = అమృతభావము కొఱకు, మోక్షముకొఱ కని యర్థము; కల్పతే = సమర్థుఁ డగుచున్నాఁడు.

శం. వివేకము వైరాగ్యము శమాదికము సన్న్యాసము—వీనితోఁ గూడిన తితిక్షుత్వమే శ్రవణాదులకు సాధనమై శ్రవణాదిజన్యజ్ఞానద్వారమున మోక్షఫలము నొసంగు నని చెప్పుచున్నారు.—పురుషర్షభ—సర్వదుఃఖములను సహించుచు నిరంతర బ్రహ్మనిష్ఠచే ఎవ్వఁడు మోక్షమును సంపాదించునో అతఁడే పురుషోత్తముఁ డని సూచించుటకై యీసంబోధనము, ఓ పురుషోత్తముఁడ వైన యర్జునుఁడా! ధీరమ్—విషయగ్రహణములనుండి, ధియమ్=బుద్ధిని, రాతి = నిగ్రహించుచున్నాఁడు కావున

* ఆదిశబ్దముచే ముముక్షుత.

ధీరుఁ డనఁగా ఎల్లప్పుడు ఆత్మనిష్ఠుఁ డగువాఁడు, అట్టివాఁడును; కావునసె, సమ దుఃఖసుఖమ్ = సమానము లయిన దుఃఖసుఖములు గలవాఁడును, సుఖదుఃఖములు వచ్చినపుడు నిర్వికారస్వరూపముచే ఉండువాఁడును; లేక, సమ = సమభావమును అనఁగా బ్రహ్మభావమును పొందింపఁబడిన, దుఃఖసుఖమ్= దుఃఖమును సుఖమును గల వాఁడు నగు; యంపురుషమ్= బ్రహ్మవేత్త యగు ఏపురుషుని; ఏతే=ఈ శీతోష్ణాదులు; నవ్యథయన్తి = బాధింపవో, నిష్ఠనుండి చలింపఁ జేయవో; సః = అతఁడే; అమృతత్వాయ—దేనిఁ దెలియ కుండుటవలన, మృతమ్ = మరణమును, జన్మమును పురుషున కగునో అది అమృతము బ్రహ్మము, అట్లు శ్రుతి ‘ ఏ దమృత మభయ మేత ద్బ్రహ్మ ’ * అని, అట్టి బ్రహ్మ మగుటకొఱకు; కల్పతే—ముక్తుఁ డగు నని యర్థము. ‘ హి ’ అనునది ‘ శాన్తో దాన్త స్తితిక్షు స్సమాహితో భూత్వా త్మన్యే వాత్మానం పశ్యతి సర్వమాత్మానం పశ్యతి ’ ‘ అభయంవై బ్రహ్మ అభయంహివై బ్రహ్మ భవతి ’ § ఇత్యాది శ్రుతిప్రసిద్ధిని దెలుపుచున్నది.

వ్య॰ ఓయీ! అంతఃకరణమే సుఖదుఃఖాదుల కాశ్రయ మయినయెడ నదియె కర్తయు భోక్తయు నగుటచే దానికే చేతనత్వ మంగీకరింపవలెను. త ద్వ్యతిరిక్తుఁడు తద్భాసకుఁ డగు భోక్త కలఁ డనుటకుఁ బ్రమాణము లేదు. కావునఁ బేరునందుమాత్రమె వివాదము కలుగుచున్నది. అంతఃకరణవ్యతిరిక్తుఁ డయిన చేతనుని అంగీకరించినచో బంధమోక్షములకు వ్యధికరణత ❘ సంభవించును. ఎట్లనఁగా, సుఖదుఃఖాద్యాశ్రయ మగుటచే అంతఃకరణమునకు బంధము, తద్వ్యతిరిక్తుఁ డయిన ఆత్మకు మోక్షము. ఈ యర్జునుని యాశంకను బరిహరించుటకై చెప్పుచున్నాఁడు భగవంతుఁడు.—యమ్ = ఎవ్వని, స్వప్రకాశుఁ డగుటచేఁ దనంతనె ప్రసిద్ధుఁ డయినవాని, ‘ అత్రాయం పురుష స్స్వయం జ్యోతిః ’ ♦ అను శ్రుతివలన; పురుషమ్=పూర్ణుఁ డగుటచే పురమునందు వ్యాపించినవాని, ‘ సవా అయం పురుష

* ఇది యమృతము అభయము, ఇది బ్రహ్మము.

§ శమముగలవాఁడును దమముగలవాఁడును తితిక్షగలవాఁడు సమాధిగలవాఁడునై ఆత్మయందే ఆత్మను దెలియుచున్నాఁడు సర్వమును ఆత్మనుగాఁ దెలియుచున్నాఁడు, అభయమే బ్రహ్మము, అభయ మయిన బ్రహ్మమే గదా యగుచున్నాఁడు.

❘ బంధము ఒకరికి మోక్షము మఱియొకరికి అగుట

♦ ఇచట ఈ పురుషుఁడు స్వప్రకాశుఁడు.

స్సర్వాసు పూర్షు పురిశయో నైనేన కించ నానావృతం నైనేన కించ నాసంవృతమ్' $ అను శ్రుతివలన; సమదుఃఖసుఖమ్—అనాత్మధర్మములును భాస్యములును * అగుటచే సుఖదుఃఖములు నిర్వికారుఁడును స్వయంప్రకాశుఁడు నగు నెవ్వనికి సమములో అట్టివానిని, సుఖదుఃఖముల గ్రహణము సమస్తము లయిన అంతఃకరణపరిణామముల యుపలక్షణము కొఱకు; ఏల యనఁగా, 'ఏషనిత్యో మహిమా బ్రాహ్మణస్య, నకర్మణా వర్ధతే నోకనీయాన్' § అను శ్రుతి వృద్ధి తగ్గుట యనుశబ్దములచేఁ జెప్పఁబడిన సుఖదుఃఖముల నిషేధించుచున్నది; ధీరమ్—ధియమ్ ఈరయతి ❦ అను వ్యుత్పత్తిచే చిదాభాసుని ద్వారమున బుద్ధితో తాదాత్మ్యాధ్యాసముచే బుద్ధిని ప్రేరించువాని, బుద్ధిసాక్షి యని యర్థము, 'సధీస్స్వప్నో భూత్వేమం లోక మతిక్రామతి' ♦ అను శ్రుతివలన; ఇందుచే బంధప్రసక్తి చూపఁబడినది, అట్లు చెప్పఁబడినది 'యతో మానాని సిధ్యన్తి జాగ్రదాది త్రయం తథా । భావాభావవిభాగశ్చ సబ్రహ్మాస్మీతి బోధ్యతే' ¶ అని; ఏతే = ఈ సుఖదుఃఖప్రదము లయిన మాత్రాస్పర్శములు; హి = ఏదువలన, నవ్యథయన్తి = పరమార్థముచే వికారము గలవానిఁగాఁ జేయవో, సర్వవికారములకును భాసకుఁ డగుటచే వికారమున కయోగ్యుఁ డగుటవలన, అట్లు శ్రుతి «సూర్యో యథా సర్వలోకస్య చక్షుర్నలిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః । ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా నలిప్యతే లోకదుఃఖేన బాహ్యః" ↓ అని. కావున అట్టి పురుషుఁడు, తనస్వరూప మయిన బ్రహ్మాత్మైక్యము తెలియుటచే సమస్తదుఃఖో

---

$ ఆ యీ పురుషుఁడు సర్వపురములయందును పురిశయుఁడు—వ్యాపించినవాఁడు, ఇతనిచే కొంచెమైనను ఆవృతము కానిది లేదు ఇతనిచే కొంచెమైనను సంవృతము కానిది లేదు.

* ప్రకాశింపఁజేయఁ దగినవియు.

§ ఇది బ్రహ్మవేత్తకు నిత్య మయిన మహిమ, అతఁడు కర్మముచే వృద్ధి పొందఁడు, తగ్గువాఁడును కాఁడు.

❦ బుద్ధిని ప్రేరించుచున్నాఁడు.

♦ ధీ సహితుఁడై స్వప్నమయి యీ లోకము నతిక్రమించుచున్నాఁడు.

¶ ఎవనివలనఁ బ్రత్యక్షాది ప్రమాణములును జాగ్రదాదు లగు మూఁడవస్థలును భావము అభావము అను విభాగమును సిద్ధించుచున్నవో అట్టివాఁడు బ్రహ్మాస్మి యని బోధింపఁబడుచున్నాఁడు.

↓ ఎట్లు సూర్యుఁడు సమస్తలోకమునకును నేత్ర మయినను నేత్రసంబంధు లయిన అశుచ్యాది దర్శననిమిత్తము లగు ఆధ్యాత్మిక దోషములతోను బాహ్యము లయిన అశుచ్యాదిసంసర్గదోషములతోను అంటఁడో అట్లు ఒకఁడే సర్వభూతములకును అంతరాత్మ యయినను విపరీతాధ్యాసకృత మయిన లోకదుఃఖముతో నంటఁడు, ఏల యనఁగా నతఁడు విపరీతాధ్యాసమునకు బాహ్యుఁడు—అది లేనివాఁడు.

పాదాన మయిన బ్రహ్మాజ్ఞానముయొక్క నివృత్తి నొంది అద్వైతస్వప్రకాశ పరమానందరూప మయిన, అమృతత్వాయ = మోక్షముకొఱకు; కల్పతే—యోగ్యుఁ డగు నని యర్థము. ఆత్మకు బంధము స్వాభావిక మన్నయెడ, స్వాభావికధర్మములకు ధర్మి నశించినంగాని నాశము సంభవింపమివలన, ఆత్మ కెప్పుడును మోక్షమే లేకపోవలయును. ఆవిషయము చెప్పఁబడినది 'ఆత్మా కర్త్రాదిరూపశ్చే న్మాకాఙ్క్షీ స్తర్హి ముక్తతామ్। నహి స్వభావో భావానాం వ్యావర్తే తౌష్ణ్యవద్రవేః' * అని. ప్రాగభావమునందే తప్పఁ దక్కినచో నేకకాలమునందు సర్వవిశేషగుణనివృత్తికి ధర్మినివృత్తి యావశ్యక మనుటం జూచుచున్నాము. ఇఁక, ఆత్మకు బంధము స్వాభావికము గాదు, మ తేమనఁగా, బుద్ధ్యాద్యుపాధికృతము, 'ఆత్మేన్ద్రియ మనోయుక్తం భోక్తేత్యాహు ర్మనీషిణః' ♦ అను శ్రుతివలన, కావున ధర్మియుండునపుడును బంధనివృత్తిచే ముక్తి యుపపన్న మగు నని చెప్పుదువేని, సంతోషము. అప్పుడు ఏది తనధర్మమును అన్యగతమునుగాఁ దోఁపఁజేయునో అది యుపాధి యని యంగీకరించుటవలన, బుద్ధ్యాదిక మయిన యుపాధి తనధర్మమును ఆత్మనిష్ఠమునుగాఁ దోఁపఁజేయుచున్న దని యేర్పడినది. దారికి వచ్చినాఁడవు, ఇఁక నీవు బంధ మసత్య మని యంగీకరించితివి. ఎట్లనఁగా, స్ఫటికమణియందు జపాకుసుమోపాధిచేఁ దోఁచు నెఱ్ఱఁదనము సత్యము కాదు గదా! కావున ఆత్మ సమస్తసంసారధర్మసంసర్గము లేనివాఁ డైనను, అతని యందు ఉపాధివశంబున తత్సంసర్గము తోఁచుటయే బంధము. స్వస్వరూపజ్ఞానము వలన, స్వరూపాజ్ఞానముయొక్కయు తత్కార్య మయిన బుద్ధ్యాద్యుపాధియొక్కయు నివృత్తిచే, తన్నిమిత్త మయిన సమస్తభ్రమలును నివర్తిల్లుటవలన, సకలభాస్యసంబంధములును వీడుటచే శుద్ధుఁడై, స్వప్రకాశపరమానందరూపుఁ డగుటచేఁ బూర్ణుఁ డైన ఆత్మకు స్వతస్సిద్ధ మైన స్వరూపావస్థితియే మోక్షము. కావున బంధమోక్షములకు వ్యధికరణత సంభవింపదు. ఇందుచేతనే పేరునందుమాత్రమె వివాదమనుట నిరాకృత మయ్యెను, ఏల యనఁగా భాస్యమును భాసకమును ఒకవస్తువే యనుట చెల్లదు. దుఃఖ స్వవ్యతిరిక్తవస్తువుచే భాస్యము, భాస్య మగుటవలన, ఘటమువలె అను ననుమానమువలన భాస్యమునకు భాసకత్వము లే దని యేర్పడుచున్నది. ఒకదానికే భాస్యత్వమును భాసకత్వమును అన్నచో కర్తృకర్మవిరో

* ఆత్మ కర్త్రాదిరూపుఁ డైనయెడ, ఇఁక నీవు మోక్షము నపేక్షింపకుము. ఏల యనఁగా, పదార్థములస్వభావము పదార్థముల విడిచి పోదు, సూర్యుని వేఁడిమివలె.

♦ శరీరేంద్రియమనస్సులతోఁ గూడిన ఆత్మను భోక్త—సంసారి యని పండితులు చెప్పుచున్నారు.

ధము * అగును. అట్లు ఆత్మకును భాసకత్వము విరుద్ధ మనఁగా అది చెల్లదు, ఎట్లనఁగా ఆత్మకు భాసకత్వమును మాత్రమె యంగీకరించుచున్నాము. నేను దుఃఖము గలవాఁడను ఇత్యాది వృత్తిసహితాహంకారమునకుఁగూడ భాసకుఁ డగుటచే ఆత్మ యెప్పుడును భాస్యకోటిప్రవిష్టుఁడు కాఁడు. కావుననే, దుఃఖ స్వవ్యతిరిక్తభాస కాపేక్షము § కాదు, భాసక మగుటవలన, దీపమువలె అను ననుమానముగూడ యుక్తము కాదు. స్వవ్యతిరిక్తభాసకాపేక్షత్వసాధన మయిన భాస్యత్వము అను హేతు వుండుటవలన. భాసక మనఁగా భాసకరణమా? లేక స్వప్రకాశభానరూపమా? మొదటిపక్షమున, దీపమునకువలె, కరణాంతరాపేక్ష లేకున్నను స్వవ్యతిరిక్తభానాపేక్ష దుఃఖకిఁ దప్పదు, అట్లు కానియెడ దృష్టాంతమునకు సాధ్యము • సిద్ధింపక పోవును. రెండవపక్షమునందు హేతువే అసిద్ధము. కావున భాస్యత్వము అను హేతువే జయము పొందుచున్నది. నీవు $ బుద్ధివ్యతిరిక్త మయిన భానము నంగీకరింపవు, గావున బుద్ధియే భానరూపము, అన్నయెడ అది సరికాదు. ఏల యనఁగా, సర్వదేశకాలములయందు అనుస్యూతము భేదక ధర్మశూన్యము ❩ అగుటచే విభువు నిత్యము ఏకము నగు భానము, పరిచ్ఛిన్నము అనిత్యము అనేకరూపము నగు బుద్ధిపరిణామ మనుట యుపపన్నము కాదు. ఉత్పత్తివినాశాదిప్రతీతికో అవశ్యము కల్పింపవలసిన విషయములసంబంధము విషయమని యుపపత్తి కావచ్చును. లేనిచో తత్తద్జ్ఞానోత్పత్తివినాశభేదాదులు కల్పించునెడ అతిగౌరవ మను దోష మగును. ఇత్యాదిగా మఱియొకచో విస్తరింపఁబడినది. అట్లు శ్రుతి « నహి ద్రష్టుర్ద్రష్టే ర్విపరిలోపో విద్యతే అవినాశిత్వాత్, ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః, మహద్భూత మనన్త మపారం విజ్ఞానఘన ఏవ, తదేతద్బ్రహ్మాపూర్వమనపర మనన్తర మబాహ్య మయ మాత్మా బ్రహ్మ సర్వానుభూః" ※ ఇత్యాదిగా విభు నిత్యస్వప్రకాశజ్ఞానరూపుఁ

* సకర్మకక్రియకు కర్తవేఱుగాను కర్మము వేఱుగాను నుండవలెను. అవి రెండును ఒకటియే యగుట విరోధము.

§ తనకన్న భిన్న మయిన భాసకమును-ప్రకాశకమును అపేక్షించునది, తనప్రకాశమునకు ఇతరప్రకాశము నపేక్షించునది యగుట.

• స్వవ్యతిరిక్తభాసకాపేక్షము కాకుండుట.

$ అద్వైతి.

❩ భేదము కలిగించు ధర్మము లేనిది.

※ ద్రష్టయొక్క జ్ఞానమునకు లోపము లేదుగదా! అవినాశి యగుటవలన, ఆకాశమువలె సర్వగతుఁడును నిత్యుఁడును, గొప్పభూతము అనంతము అపారము విజ్ఞానఘనుఁడే, ఆ యీబ్రహ్మము ముందు లేనిది వెనుక లేనిది లోపల లేనిది వెలుపల లేనిది యీయాత్మ బ్రహ్మము సర్వసాక్షి.

డాత్మ యని యుపదేశించుచున్నది. ఇందుచే అవిద్య యను నుపాధికంటెఁగూడ ఆత్మ వ్యతిరిక్తుఁ డని సిద్ధము. కావున అసత్యోపాధిచేఁ గలిగిన బంధభ్రమము సత్యాత్మజ్ఞానమువలన నివృత్తము కాఁగా మోక్షము అని సర్వమును సమంజసము. పురుషర్షభ అను సంబోధనముచే "తాను స్వప్రకాశచైతన్యరూపుఁ డగుటచేతను పరమానందరూపుఁ డగుటచేతను బురుషుఁ డనియు సర్వద్వైతప్రపంచముకన్నను ఋషభుఁడు అనఁగా శ్రేష్ఠుఁ డనియుఁ దెలియకయే నీవు శోకించుచున్నావు. కావున స్వస్వరూపజ్ఞానమువలననే నీకు శోకనివృత్తియగును, 'అట్లు తరతిశోకమాత్మవిత్'* అని శ్రుతి చెప్పుచున్నది" అని సూచించుచున్నాఁడు. ఇట 'పురుషమ్' అని యేక వచనముచే పురుషు లనేకు లని చెప్పునట్టి సాంఖ్యులమతము నిరాకరింపఁబడినది.

శ్రీ. ఆ మాత్రాస్పర్శములకుఁ బ్రతీకారము చేయ యత్నించుట కన్నను వాని సహించుటయే యుచితము మహాఫలప్రద మగుటవలన నని చెప్పుచున్నాఁడు.— ఏతే = ఈ మాత్రాస్పర్శములు, సమదుఃఖసుఖమ్ = సమము లయిన సుఖదుఃఖములు గలవాని, యంపురుషమ్, నవ్యథయన్తి = అభిభవింపవో,♦ సః = వానిచే విక్షేపము నొందని యా పురుషుఁడు, ధర్మజ్ఞానద్వారమున, అమృతత్వాయ = మోక్షము కొఱకు, కల్పతే = యోగ్యుఁ డగుచున్నాఁడు.

మ. దుఃఖసహనమునకు రెం డుపాయములు గలవు, ధైర్యమును, వివేకమును. అందు మొదటిదానిఁ జెప్పుచున్నాఁడు.—ఏతే = ఈ మాత్రాస్పర్శములు, యమ్, పురుషమ్ = పురుషార్థమున కధిష్ఠాన మయినవానిని, నవ్యథయన్తి = అభిభవింపవో, పురుషర్షభ = పురుషశ్రేష్ఠుఁడా! ధీరమ్ = వికారము లేనివానిని, సహించు స్వభావము గలవాని, సమదుఃఖసుఖమ్—సుఖమునందు ఆశ లేనివాని దుఃఖమునందు విషాదము లేనివాని—ఇవి పురుషవిశేషణములు; సః = ఆ పురుషుఁడు, అమృతత్వాయ = జీవన్ముక్తుఁ డగుటకొఱకు, కల్పతే.

రా. వాని సహించుట యెందుకొఱకనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ధీరమ్= ధైర్యము గలవాఁడును; సమదుఃఖసుఖమ్ = సమానము లయిన దుఃఖసుఖములు గలవాఁడును, అమృతత్వమునకు సాధన మగుటచే అనివార్య మయిన దుఃఖమును సుఖముగాఁ దలంచువాఁడును, స్వవర్ణోచిత మయిన యుద్ధాదికర్మమును ఫలాభిసంధి లేక

* ఆత్మను తెలిసినవాఁడు శోకమును దాఁటును.

♦ లోట్, బహువ.

చేయుచున్నవాఁడు నగు, యం పురుషమ్ = ఏ పురుషుని; ఏతే = ఈ, యుద్ధాదికర్మాంతర్గతము లయిన ఆయుధపాతములు మొదలగు మృదుపరుషస్పర్శములు; నవ్యథయన్తి = చలింపఁ జేయవో; సహి = అతఁడే; అమృతత్వాయ = మోక్షముకొఱకు; కల్పతే = సమర్థుఁ డగుచున్నాఁడు, అమృతత్వమును సాధించుచున్నాఁడు, కాని దుఃఖమును సహింపఁ జాలని నీయట్టివాఁడు సాధింపఁజాలఁ డని యర్థము. పురుషర్షభ= పురుషశ్రేష్ఠుఁడా! దుఃఖమును సహింపఁజాలనివాఁడ వగుటచే నీవు పురుషశ్రేష్ఠుఁడవు కా వని భావము. ఆత్మలు నిత్యు లగుటవలన ఇంతమాత్రమే యీవిషయము నంచుఁ జేయవలె నని యర్థము.

తన వర్ణమునకు శాస్త్రమునందు విహిత మయిన యుద్ధాదికర్మమును ఫలాభిసంధి లేక యనుష్ఠించుచు ధైర్యముగలవాఁడై యనివార్యముగా అనుభవింపవలసిన దుఃఖమును సుఖముగాఁ దలంచుచు అట్లు చేయుట అమృతత్వసాధన మని తెలిసి సర్వదుఃఖముల సహించుచుండునట్టి ఏ పురుషుఁడు, శాస్త్రీయ యుద్ధాదికర్మానుష్ఠానమునందు అనివార్యముగా సంభవించునట్టి శస్త్రపాతాదిమృదుక్రూరస్పర్శములకుఁ జలింపఁడో అతఁడే మోక్షమును సాధింపఁ గలఁడు. కాని దుఃఖమునకు భయపడునట్టి నీయట్టి యధీరుఁడు సాధింపఁ జాలఁ డని తాత్పర్యము.

వ్యా. ఇందువలనఁ గలుగు ప్రయోజనముఁ జెప్పుచున్నాఁడు.—యమ్ = ఎవ్వని, ఏతే= ఈమాత్రాస్పర్శములు; నవ్యథయన్తి = చలింపఁ జేయవో, ఎట్టివాని ననఁగా, పురుషమ్ = పురిశేయుఁడై యే— దేహమునందున్నవాఁడై యే యున్నవాని, శరీరసంబంధము లేనియప్పుడు ఎవ్వరికిని వ్యథ లేకుండుటవలన పురుషమ్ అను విశేషణము, ఎట్లు వ్యథపడఁడు వనఁగా, సమదుఃఖసుఖమ్—సమానము లయిన దుఃఖసుఖములు గలవాఁ డగుటవలన; సమదుఃఖసుఖుఁ డగుట యెట్లనఁగా, ధీరమ్—ధీరుఁ డగుటవలన; సః= అతఁడు; అమృతత్వాయ= మోక్షముకొఱకు; కల్పతే= యోగ్యుఁ డగుచున్నాఁడు.

దేహమునందు జాగ్రత్స్వప్నావస్థలలో నుండునప్పుడే యెవ్వఁడు ధైర్యమువలన, ఎట్లు దుఃఖ మగ్రాహ్యమో అట్లు విషయసుఖముగూడ అమృతత్వమునకు విరోధి యగుటచే అగ్రాహ్య మని విడిచినవాఁడై, యీ మాత్రాస్పర్శములవలనఁ జలింపఁడో అతఁడు మోక్షము నొందు నని తాత్పర్యము.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయో రపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః. ౧౬

భా॰ ఇందువలనఁగూడ శోకమోహములను వహింపక శీతోష్ణాదుల సహించుట యుక్తము, ఎందువలన ననఁగా.—అసతః = అవిద్యమాన మయిన—ఉండునది కానట్టి కారణసహిత మయిన శీతోష్ణాదికమునకు; భావః = భవనము—ఉండుట; నవిద్యతే = లేదు. ఏల యనఁగా, కారణసహిత మయిన శీతోష్ణాదికమును ప్రమాణములచేఁ బరీక్షించి నచో అది సద్వస్తువు * కాఁ జాలదు. వికారము గదా అది, వికారము వ్యభిచరించుచున్నది. ♦ ఎట్లు ఘటాదిసంస్థానము ❙ చక్షురింద్రియముచేఁ బరీక్షింపఁబడినప్పుడు మృద్వ్యతిరేకంబుచేఁ § గనఁబడకుండుటవలన అసత్తగునో అట్లు సమస్తవికారము కారణవ్యతిరేకముచేఁ గనఁబడకుండుటవలన అసత్తగును. మఱియు ఘటాదికార్యము జన్మమునకు ముందును ధ్వంసమునకుఁ బిమ్మటను కనఁబడకుండుటవలనఁ గూడ కార్యము అసత్తని యేర్పడుచున్నది. మృత్తికాదికారణము గూడ తత్కారణవ్యతిరేకముచేఁ గనఁబడకుండుటవలన అసత్తే యగును.

పూర్వపక్షము.—అది యసత్తన్నయెడ సర్వాభావము ¶ ప్రసక్తించును ?

సిద్ధాంతము.—అట్లు కాదు. అంతటను రెండుబుద్ధులు కనఁబడుట వలన, సద్బుద్ధి అసద్బుద్ధి అని. యద్విషయ మయిన ** బుద్ధి వ్యభిచరింపదో అది సత్తు. యద్విషయ మయిన బుద్ధి వ్యభిచరించునో అది అసత్తు. ఈ సదసద్విభాగము బుద్ధితంత్రము. అంతటను అందఱిచేతను రెండు బుద్ధులు సమానాధికరణములు ఉపలబ్ధము లగుచున్నవి, ఉన్నది ఘటము ఉన్నది పటము ఉన్నది యేనుఁగు అని. నీలోత్పలస్థలము

* ఉండునట్టి వస్తువు.

♦ ఒకప్పు డున్నది, ఒకప్పుడు లేదు.

❙ ఘటాద్యాకారము.

§ మృత్తికకంటె వేఱుగా.

¶ సర్వమును లేని దగుట—ఏదియు లేకునికి

** ఏది విషయముగాఁ గల.

నందువలెఁ గాదు, ఇట్లెంతటను. ఆ రెండుబుద్ధులలో ఘటాదిబుద్ధి వ్యభిచరించుచున్నది. అట్లు నిరూపించితిమి. సద్బుద్ధిమాత్రము వ్యభిచరింపదు. కావున వ్యభిచరించుటవలన ఘటాదిబుద్ధివిషయము అసత్తు. సద్బుద్ధివిషయమో వ్యభిచరింపదు కావున నది యసత్తు కాదు. *

పూర్వపక్షము.—ఘటము నశించుటచే ఘటబుద్ధి వ్యభిచరించునప్పుడు సద్బుద్ధిగూడ వ్యభిచరించుచున్నది?

సిద్ధాంతము.—అట్లు కాదు, పటాములయందుఁగూడ సద్బుద్ధి కనఁబడుటవలన. ఆ సద్బుద్ధి విశేషణవిషయముగానే వర్తించును. ఇందువలనఁ గూడ అది నశింపదు.

పూర్వపక్షము.—ఇఁక సద్బుద్ధివలె ఘటబుద్ధియును, మఱియొక ఘటమునందుఁ గనఁబడుచున్నది?

సిద్ధాంతము.—అది సరి కాదు, పటాములయందుఁ గనఁబడకుండుటవలన.

పూర్వపక్షము.—సద్బుద్ధియును ఘటమునశించినపుడు కనఁబడదు?

సిద్ధాంతము.—అట్లు కాదు. ఏలయనఁగా, అప్పుడు సద్బుద్ధి విశేష్యము లేకుండుటవలనఁ గనఁబడదు. సద్బుద్ధి విశేషణవిషయ మగుటచే విశేష్యము లేనందువలన విశేషణమున కుపపత్తి లేకుండునపుడు దేనివిషయ మయి ప్రవర్తించును? కాని, ఆ సద్బుద్ధి విషయము లేకుండుటవలనఁ గనఁబడనిది గాదు.

పూర్వపక్షము.—ఘటాదివిశేష్యములు లేనియెడ సామానాధికరణ్యము యుక్తము కాదు?

సిద్ధాంతము.—అట్లు కాదు. 'ఉన్నది యీ జలము' అని యెండమావులు మొదలగువానియందు రెంటిలో నొకటి లేకున్నను సామానాధికరణ్యము కనఁబడుటవలన.

---

* ఒకస్థలమునందే 'ఉన్నది ఘటము' అనుచో ఉన్నది అనుబుద్ధియు ఘటము అనుబుద్ధియు ఇట్లు రెండుబుద్ధులు కలుగుచున్నవి. అంచు, 'ఉన్నది పటము' అనుచో ఘటబుద్ధి లేదు, కావున నది వ్యభిచరించినది. ఉన్న దను బుద్ధి కలదు, కావున దానికి వ్యభిచారము లేదు.

అందువలన, దేహాదికమునకును శీతోష్ణాదిద్వంద్వమునకును తత్కారణమునకును ‘ అసతః నవిద్యతే భావః ’ * అని. అట్లు, సతః=ఆత్మకు; అభావః = లేకుండుట; నవిద్యతే= లేదు, అంతటను వ్యభిచరింపకుండుట వలన నని ప్రతిపాదించితిమి. ఇట్లు, అనయోః = ఈసదసద్రూపము లయిన ఆత్మానాత్మలయొక్క; ఉభయోః అపి = రెంటియొక్కయు; అన్తః = నిర్ణయము, సత్తు సత్తే అసత్తు అసత్తే అని; తత్త్వదర్శిభిః— తత్ అనఁగా సర్వనామము, సర్వ మనఁగా బ్రహ్మము, కావున తత్ అనునది ఆ బ్రహ్మముయొక్క నామము, తత్త్వ = ఆ బ్రహ్మముయొక్క యాథాత్మ్యమును, దర్శిభిః = చూచుట స్వభావముగాఁ గల వారిచేత; దృష్టః తు=చూడఁబడినదే. కావున నీవును తత్త్వదర్శులదృష్టి నాశ్రయించి శోకమును మోహమును విడిచి నియతానియతరూపము లయిన శీతోష్ణాది ద్వంద్వములను ‘ వికారము సుది యసత్తే, మృగతృష్ణికాజలమువలె మిథ్యగాఁ దోఁచుచున్నది ’ అని నిశ్చయించి సహింపు మని యభిప్రాయము.

కారణసహితము లయిన యీ శీతోష్ణాదులు కల్పితములు కాని వాస్తవముగా నుండునవి కావు, కావున వాని కెప్పుడును ఉనికి ఘటిల్లదు. ఆత్మ యెల్లప్పుడు స్వతస్సిద్ధుఁడై యుండువాఁడు, కావున వాని కెప్పుడును లేకుండుట సంభవింపదు. యీ యాత్మానాత్మ లిట్టివా రను నిర్ణయము బ్రహ్మవేత్తలగువారికిఁ దెలిసియే యున్నది. కావున నీవును వారి ననుసరించి శోకమోహముల విడిచి శీతోష్ణాదిద్వంద్వములు వికారము లగుటచే మృగతృష్ణికాజలాదులవలె మిథ్య యని నిశ్చయించి వాని సరకుసేయక సహింపు మని తాత్పర్యము.

ఆ. తితిక్షుత్వ మధికారివిశేషణ మనుటకు మఱియొక హేతువును నిరూపించుచున్న దీశ్లోక మని యవతారిక చెప్పుచున్నారు ఇందువలన ఇత్యాదిగా. ఇందువలన అను శబ్దముయొక్క అర్థమునే స్పష్టీకరించుచున్నారు ఎందువలన ననఁగా అని. క్లేశాదులకు హేతు వగు శీతాద్యనాత్మ వస్తువు ¶ కాదు, వస్తు వయిన ఆత్మ నిర్వికారుఁ డగుటచే ఏకరూపుఁడు, ఈకారణమువలన ముముక్షువునకు తితిక్షుత్వము కావలయు నని చెప్పుచున్నారు అసతః ఇత్యాదిగా. కార్యము అసత్తైనను కార

* లేనిదానికి లేదు ఉనికి.

¶ ఉండునది.

ణము సత్తైనయెడ అత్యన్తాసత్త్వము * సిద్ధింప దని యాశంకించి తత్పరిహారార్థము విశేషణము చేయుచున్నారు కారణసహిత మయిన అని. శూన్య మయిన అసత్తునకు అస్తిత్వప్రసక్తి ♦ లేకుండుటవలన ప్రసక్తము కానిదానికి నిషేధ మెట్లని యాశంకించి పరిహారము చెప్పుచున్నారు ఏల యనఁగా నిత్యాదిగా. విమతము ¶ తాత్త్వికము కాదు, అప్రామాణిక మగుటవలన, రజ్జుసర్పమువలె. ధర్మిజ్ఞాన సాధన మయిన ప్రత్యక్షాదులకు తత్త్వజ్ఞానయోగ్య మయిన ప్రామాణ్య మంగీకరింపఁ జనదు గదా! విషయము దుర్నిరూప మగుటవలన $. కావున ద్వైతము అనిర్వాచ్య మని యర్థము **. ప్రత్యక్షాదివిషయ మయిన శీతోష్ణాదిద్వైతము దుర్నిరూప మగుటవలన అనిర్వాచ్య మెట్లగును? అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు ‘వికారము గదా అది’ అని. అందువలన ‘విమతము మిథ్య ఆగమాపాయి యగుటవలన, సంప్రతిపన్నము ♦♦ వలె అని ఫలితార్థమును జెప్పుచున్నారు వికారమో వ్యభిచరించుచున్నది యని. వాచారంభణశ్రుతి ద్వైతము మిథ్య యనుట ననుగ్రహించుచున్న దని తెలుపుటకై యోకారము. మఱియు, కార్యము కారణము కంటె భిన్నమా? అభిన్నమా? అని వికల్పించి మొదటిపక్షమును దూషించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. పరీక్షింపఁబడినప్పుడు—లోపలను వెలుపలను అని శేషము. విమతము కారణముకంటెఁ బరమార్థభేదము కలది గాదు, కార్య మగుటవలన, ఘటమువలె నని యర్థము. ఇందువలనఁగూడ కార్యముకంటె భిన్నరూపమునఁ గార్యము లేదు ‘ఆదావన్తేచ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా’ *♦ అను న్యాయమువలన నని చెప్పుచున్నారు మఱియు ఘటాదికార్యము ఇత్యాదిగా. కార్యము కారణముకంటె అభిన్న మన్నచో, అప్పుడు భిన్నరూపముచే కార్యము లేనియెడ, పూర్వముకన్న విశేషము లేదు, తాదాత్మ్యముచే నున్నదనుట యుక్తము కాదు, అదియు కారణవ్యతిరేకమున లేకుండుటవలన. ఇది కార్యము ఇది కార

---

* కాలత్రయమునందును అసత్తగుట.

♦ ఉన్న దనుటకు ప్రసక్తి.

¶ వివాదవిషయము.

$ నిరూపించుటకు అశక్య మగుటవలన.

** ఇట్లు అసత్తునకు అస్తిత్వ ప్రసక్తి కల దని భావము.

♦♦ అందఱును అంగీకరించిన విషయము.

*♦ ఆదియందును అంతమునందును ఏది లేదో వర్తమానంబునందును అది యట్టిది.

ణము అను విభాగములేని వస్తువునందు కార్యకారణపరంపర భ్రాంతికల్పిత మను నభిప్రాయముచేఁ జెప్పుచున్నారు మృత్తికా దీత్యాదిగా.

కార్యకారణ విభాగములోఁ జేరని వస్తువే లే దని తలంచువాఁ డాక్షేపించుచున్నాఁడు అవి యసత్తైనయెడ నిత్యాదిగా.

అనువృత్తము * వ్యావృత్తము ❨ అను రెండుబుద్ధులు కనఁబడుట వలనను అనువృత్తమునందు వ్యావృత్తములు కల్పితము లగుటవలనను కల్పితము. కానిదియు సర్వభేదకల్పనలకు నధిష్ఠాన మయినదియు కార్యము గానిదియు కారణము గానిదియు నగు వస్తువు సిద్ధించుచున్న దని పరిహరించుచున్నారు అట్లు కా దిత్యాదిగా. ఇప్పుడు సత్తేవస్తు వనుటకు అనుమానప్రమాణము నుపన్యసించుచున్నారు యద్విషయ మయిన ఇత్యాదిగా. ఏది వ్యావృత్తములయం దనువృత్త మగునో అది సత్తు, సర్పమాల్యాదులయం దనుగతమయిన రజ్జ్వాదుల యిదమంశము వలె ♦. విమతము సత్యము, అవ్యభిచారి యగుటవలన, సంప్రతిపన్నమువలె నని యర్థము. వ్యావృత్తము కల్పిత మనుటకుఁ బ్రమాణము చెప్పుచున్నారు యద్విషయ మయిన ఇత్యాదిగా. ఏది వ్యావృత్తమో అది మిథ్య. విమతము మిథ్య, వ్యభిచారి యగుటవలన, సంప్రతిపన్నమువలె నని యర్థము. ఈ రెం డనుమానములచే సత్తు అకల్పితమనియు అసత్తు కల్పితమనియు సిద్ధమని యధ్యాహార్యము. ఓయీ! ఈ రెం డనుమానములు నుపపన్నములు కావు, ఏల యనఁగా ద్వైతమే మిథ్య యని వాదించువానికి విభాగమే సిద్ధింపదు, అనుమానాదివ్యవహారము లెట్లు సంభవించును? అనఁగా అందుకు సమాధానము చెప్పుచున్నారు ఈ సదసద్విభాగము ఇత్యాదిగా. ఈ చెప్పఁబడిన విభాగము బుద్ధిద్వయాధీన మగుటచే అనుమానాదివ్యవహారనిర్వాహ మగుచున్నది, ఎట్లనఁగా ప్రాతిభాసిక § విభాగము లేకపోలేదు,

* అంతట నుండునది.

❨ ఒకచోటనుండి మఱియొకచో లేనిది.

♦ రజ్జువునందు సర్పము పుష్పమాలిక మొదలగు భ్రమలు కలుగుచున్నవి, ఇది సర్పము ఇది మాల్యము ఇత్యాదిభ్రమ జ్ఞానము లందంతటను, ఇదమంశము అనఁగా ఇది అను నంశముమాత్రము అనుగతముగా నున్నది. యథార్థజ్ఞానముచే సర్పము మాల్యము అను నంశములకు బాధ కలుగుచున్నది కాని ఇదమంశమునకు బాధ కలుగదు, ఏల యనఁగా ఈ ఇదమంశము ఇది రజ్జువు అను యథార్థ జ్ఞానమునందుఁగూడ అనుగత మయియున్నది. కాఁబట్టి ఇదమంశము సత్యము.

§ భ్రాంతి కల్పిత మయిన.

పరమార్థమే విభాగహేతు వన్నచో కేవల వ్యతిరేకము లేకపోవు నని యర్థము. సదసద్విభాగము బుద్ధిద్వయాధీన మగుట యెట్లు? బుద్ధివిభాగముగూడ నీకు లేదే యనఁగా అందుకుఁ జెప్పుచున్నారు అంతటను ఇత్యాదిగా. అంతటను—వ్యవహారమునం దని యర్థము. కల్పిత మయిన బుద్ధివిభాగమే బోధ్యవిభాగప్రతిభాసమునకు హేతు వగుచున్న దని భావము *. బుద్ధిద్వయముచే సదసద్విభాగము సిద్ధించినను సత్తు సామాన్యరూప మగుటచే విశేషాంశ కలుగుటవలన సామాన్యవిశేషములు రెండువస్తువులు పారమార్థికము లుండవలె ననఁగా అందుకుఁ జెప్పుచున్నారు సమానాధికరణము లని, పదముల సామానాధికరణ్యమునకు బుద్ధులయం దుపచారము. 'అతఁడు వీఁడు' అను సామానాధికరణ్యమువలె 'ఉన్నది ఘటము' ఇత్యాది సామానాధికరణ్యము ఒకటేవస్తువునం దుండునది. వస్తువులు భిన్నము లైనయెడ ఘటపటములకుంబోలె సామానాధికరణ్యము ఘటిల్ల దని యర్థము. నీల మయిన యుత్పల మనునట్లు ధర్మధర్మివిషయముగా సామానాధికరణ్యము చెప్పుట సులభమై యుండుటచే ఏకవస్తువిషయం బనుట యుక్తము కా దనఁగా అట్లు కా దని చెప్పుచున్నారు నీలోత్పలస్థలమునందువలెఁ గా దని. ఏల యనఁగా సామాన్యవిశేషములకు భేద మన్నను అభేద మన్నను సామానాధికరణ్యము ఘటిల్లదు, భేదాభేదములో విరుద్ధములు, కావున జాతివ్యక్తులకు సామానాధికరణ్యము నీలోత్పలములకువలె గౌణము గాదు, మ జేమనఁగా వ్యావృత్తము అనువృత్తమునందుఁ గల్పిత మగుటచే ఏకవస్తునిష్ఠ మని యర్థము. సామాన్యవిశేషములయందుఁ జెప్పిన న్యాయమును గుణగుణ్యాదులయందుఁగూడ అతిదేశించుచున్నారు ❨ ఇట్లంతటను అని. అందుఁగూడ వికల్పదోషములు ♦ సమానములే గదా యని భావము. సామానాధికరణ్య మనుపపన్న మను హేతువుచే 'సామాన్యవిశేషములు రెండు భిన్నవస్తువు లనుపక్షమును నిరాకరించి విశేషములే రెండును వస్తువులు అను పక్షమును నిరాకరించుచున్నారు ఆ రెండుబుద్ధులలో నిత్యాదిగా. బుద్ధివ్యభిచారమువలన బోధ్యమునకు వ్యభిచార మయినను వ్యావృత్తము లయిన విశేషములు అవస్తువు లనుట యెట్లనఁగా చెప్పుచున్నారు అట్లు నిరూపించితిమి అని. వికారముగదా అది ఇత్యాదిగా నని యధ్యాహార్యము. మఱియు ఒకటే వస్తువు సామాన్యమును

---

* బుద్ధి—జ్ఞానము, తెలివి. బోధ్యము—జ్ఞేయము, తెలియఁదగినది.

❨ ఒకదానిధర్మమును మఱియొకదానియందుఁగూడ విధించుట అతిదేశము.

♦ భేద మన్నను అభేద మన్నను సామానాధికరణ్యము ఘటిల్లదు ఇత్యాది.

విశేషమును అని చెప్పఁదగదు, ఒక్కదానికి రెండురూపములు విరుద్ధ మగుటవలన ననుసభిప్రాయముతో, సామాన్య మొకటియే వస్తువు, సద్బుద్ధి వ్యభిచరింపకుండుటవలన, బోధ్య మయిన సత్తుగూడ అట్టిదే అగుటవలన నని చెప్పుచున్నారు సద్బుద్ధిమాత్రము వ్యభిచరింపదని. విశేషములు వ్యభిచారు లనియు సత్తు అవ్యభిచారి యనియు నేర్పడుటచే ఫలితము నుపసంహరించుచున్నారు కావున ఇత్యాదిగా. కావున అనుశబ్దముయొక్క అర్థమునే తెలుపుచున్నారు వ్యభిచరించుటవలన నని. అసత్తు=కల్పితము. సద్బుద్ధివిషయ మయిన సత్తు అకల్పిత మనుటకు కావున అను శబ్దముచేఁ జెప్పఁబడిన హేతువునే చెప్పుచున్నారు వ్యభిచరింపదు అని.

సద్బుద్ధి వ్యభిచరించుట మూలమున బోధ్యమునకుఁగూడ వ్యభిచారము కలుగుటచే ‘ అది యవ్యభిచారి యగుటవలన ’ సను హేతువు సిద్ధింపదని శంకించుచున్నారు ఘటము నశించుటచే ఇత్యాదిగా.

సద్బుద్ధి ఘటబుద్ధివలె ఘటమాత్రవిషయము కాదు, అందువలన ఘటము నశించుటచే సద్బుద్ధికి వ్యభిచారము లేదని పరిహరించుచున్నారు అట్లు కాదు పటాదులయందుఁగూడ ఇత్యాదిగా. సద్బుద్ధి ఘటవిషయము కాదన్నచో నిరాలంబ మనుట యొప్పదు, కావున విషయాంతరము చెప్పవలె నని యాశంకించి చెప్పుచున్నారు ఆసద్బుద్ధి ఇత్యాదిగా.

సత్తు అకల్పిత మనుటకు హేతువు అవ్యభిచారిత్వము సిద్ధింపదని యాక్షేపించి, యిఁక, విశేషములు కల్పితము లనుటకు హేతువు వ్యభిచారిత్వము సిద్ధింపదని యాక్షేపించుచున్నారు ఇఁక సద్బుద్ధివలె నిత్యాదిగా. ఎట్లు సద్బుద్ధి, ఘటము నష్ట మయినను, పటాదులయందుఁ గనఁబడుటవలన వ్యభిచారము లేని దనుకారణముచే సత్తునకు వ్యభిచారము లే దని చెప్పఁబడినదో, అట్లు ఘటబుద్ధియును, ఘటము నష్ట మయినను మఱియొకఘటమునందుఁ గనఁబడుటవలన వ్యభిచారము లేని దని యేర్పడుటచే ఘటమునకును వ్యభిచారము సిద్ధింపదు. ఈ విధముగా నితరవిశేషము లందును కల్పితత్వహేతు వగు వ్యభిచారము సిద్ధింపదని యర్థము.

ఘటబుద్ధి ఘటాంతరమునందుఁ గనఁబడినను బటాదులయందుఁ గనఁబడదు, కావున దానికి వ్యభిచారము, ఇట్లు పటాదివిశేషములకును వ్యభిచారిత్వము సిద్ధించు నని సమాధానము చెప్పుచున్నారు అది సరికాదు ఇత్యాదిగా.

ఇట్లు విశేషములు వ్యభిచారులయినచో సత్తునకును ఇట్టి వ్యభిచారిత్వము సంభవించుటచే అవ్యభిచారిత్వరూపహేతువు సిద్ధింప దను నాక్షేపము ఎప్పటివలెనే వచ్చుచున్న దని శంక చేయుచున్నారు సద్బుద్ధియును ఇత్యాదిగా.

ఘటాదినాశప్రదేశమునందు తత్సంబంధిరూపమున సత్త్వము భాసిల్లకున్నను సత్తునకు అసత్త్వము చెప్పఁగూడదు, ఘటాద్యభావమున కధిష్ఠానమయి భాసిల్లుటవలన నని చెప్పుచున్నారు అట్లు కాదు ఇత్యాదిగా. ఎట్లు, సర్వగతము జాతి యను స్థలమునందు, వ్యక్తిలేనిప్రదేశమున గోత్వరూపజాతి వ్యంజకము లేనందున వ్యక్తము గాదు, కాని గోత్వము లేనందువలనఁ గా దని చెప్పుచున్నారో, అట్లు సత్త్వముగూడ ఘటాదినాశమునందు వ్యంజకము లేనందున వ్యక్తము గాదు, కాని స్వరూపము లేనందునఁ గాదు అని చెప్పినదానినే విస్తరించుచున్నారు సద్బుద్ధి ఇత్యాదిగా. విశేష్యము లేనియప్పుడు విశేషణత్వము వ్యభిచరించినను స్వరూపమునకు వ్యభిచారము లేనందున సత్తునకు సత్త్వము యుక్తమే యని భావము.

రెండును సత్తులైనవానికే విశేషణవిశేష్యభావము చూచుచున్నారము, కావున సత్తునకును ఘటమునకును విశేషణవిశేష్యభావము కలుగుటచే నవి రెండును సత్తులే యని నిశ్చయ మగుటవలన, ఘటాదులు కల్పితంబు లను ననుమానము ఈ సామానాధికరణ్యముచే బాధిత మగుచున్న దని యాక్షేపించుచున్నారు ఘటాది విశేష్యములు ఇత్యాదిగా.

అనుభవమునుబట్టి పై యనుమానము బాధిత మనుటను నిరాకరించుచున్నారు అట్లు కాదు ఇత్యాదిగా.

ఘటాదులు సత్తునందుఁ గల్పితములను ననుమానము నిర్దోష మని యేర్పడుటచే ఫలితము నుపసంహరించుచున్నారు అందువలన ఇత్యాదిగా. అని అనునది ప్రథమపాదవ్యాఖ్యానసమాప్తిని దెలుపుచున్నది.

ఓయీ! ఈ వ్యాఖ్యానము భాష్యకారుల యభిప్రాయము కాదు. ఏల యనఁగా సమస్తద్వైతమును శూన్య మని చెప్పుట శాస్త్రమునకును తద్భాష్యమునకును విరుద్ధము. కావున ఇది యెవ్వఁడో కుబుద్ధి స్వబుద్ధిచేఁ గల్పించినది కావలయును. అనఁగా, అట్లు కాదు. ద్వైతప్రపంచము శూన్య మనఁగా నేమి యభిప్రాయము? తుచ్ఛ మనియా? సద్విలక్షణ మనియా? తుచ్ఛము * అని

* శశవిషాణాదులవంటిది.

కాదు, అట్లు మే మంగీకరింప కుండుటవలన. సద్విలక్షణ మని యంగీకరింపనియెడ నీకే శాస్త్రవిరోధమును భాష్యవిరోధమును ప్రసక్తించును. ఏల యనఁగా, శాస్త్ర మంతయు తద్భాష్యంబును, ద్వైతము సత్యత్వానధికరణము * అని సాధించి యద్వైతము సత్య మనుటను స్థాపించుచున్నది యని త్రైవిద్యవృద్ధు లచ్చటచ్చట * సిద్ధాంతీకరించి యున్నారు. కావున ఈ యాశంక సంప్రదాయపరిచయము లేకుండుటవలన నని యెఱుంగునది.

ప్రథమపాదమునకు అనాత్మకల్పిత మగుటచే వస్తువు గా దనుట యభిప్రాయ మని వ్యాఖ్యానము చేసి, ద్వితీయపాదమునకు సమస్తకల్పనలకును అధిష్ఠాన మైన ఆత్మ అకల్పిత మగుటచే వస్తు వని సాధించుట యభిప్రాయ మని వ్యాఖ్యానము చేయుచున్నారు అట్లు ఇత్యాదిగా. ఓయీ! సద్రూపుఁడగు ఆత్మ విశేషములం గలసి యుండుటచే ఆ విశేషములు నశించునపుడు ఆత్మకుఁగూడ నాశము గలుగు నని యాశంక రాఁగా, విశిష్టమునకు నాశము గలిగినను స్వరూపమునకు నాశము లే దని యిదివఱకే మేము చెప్పియుండుటచే అట్లు కా దని చెప్పుచున్నారు అంతటను ఇత్యాదిగా. ఓయీ! ఒకానొకప్పుడు అసత్తే సత్తగుచున్నది, పూర్వము అసత్తుగా నుండిన ఘటము జన్మము నొందిన పిదప సత్త్వము పొందు నని యంగీకరించుటవలన. మఱియు నది యొకానొకప్పుడు అసత్తగుచున్నది, స్థితికాలమునందు సత్తుగానుండిన ఘటమునకు మరల నది నశించిన పిదప అసత్త్వము నంగీకరించుటవలన. ఇట్లు సదసత్తులకు అవ్యవస్థితత్వము సమానము కావున రెంటికిని హేయత్వముగాని యుపాదేయత్వముగాని సమానమే యగును? ఇందుకు సమాధానము చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. తుశబ్ద మవధారణార్థకము, దృష్టశబ్దముతో నన్వయించుచున్నది, నిశ్చయముగాఁ జూడఁబడిన దని యర్థము. పూర్వము అసత్తై యుండిన ఘటమునకు సత్త్వ మెట్లు సిద్ధించును? అసత్త్వ ముండునపుడు తద్విరుద్ధమైన సత్త్వము కలుగదు గదా! ఇఁక సత్త్వప్రాప్తిచే అసత్త్వనివృత్తి యగు నన్నయెడ అన్యోన్యాశ్రయదోషము ప్రసక్తించును ♦. ఇఁక సత్తాపత్తి లేకయె అసత్త్వనివృత్తి యగు నన్నయెడ

* సత్యత్వమునకు అధికరణము—చోటు కానిది.

♦ సత్త్వప్రాప్తికి అసత్త్వనివృత్తి, అసత్త్వనివృత్తికి సత్త్వప్రాప్తి అపేక్షక మగుటచే. రెంటిలో మొదటిది సిద్ధించినంగాని రెండవది సిద్ధింపకుండుటయు రెండవది సిద్ధించినంగాని మొదటిది సిద్ధింపకుండుటయు అన్యోన్యాశ్రయ దోష మనఁబడును.

అసత్త్వమే సిద్ధింపక పోవును. ఇందుచేతనే సత్తునకు అసత్త్వము కలుగుటయు నిరాకరింపఁబడిన దని భావము. అట్లయినయెడ, సత్తు అసత్తుగాను అసత్తు సత్తుగాను దోఁచుచున్నదే, ఇది యెందువలన నని యాశంకించి తత్త్వజ్ఞానము లేకుండుటవలన నట్లు దోఁచుచున్న దని చెప్పుచున్నారు తత్త్వదర్శిభిః అని. తత్త్వ మనఁగా తద్భావము, ఇచటఁ బ్రకృతము ననుసరించి నియతముగా తచ్ఛబ్దముచేఁ బరామర్శింపఁ దగిన దేదియు లే దని యాశంకించి యందుకు సమాధానముగా వ్యాఖ్యానము చేయుచున్నారు తత్ అనఁగా నిత్యాదిగా. ఓయీ! సదసత్తులను వేఱువిధముగాఁ గొందఱు చెప్పుచున్నారు, కొందఱుమాత్రము ఈనిర్ణయము ననుసరించి యిట్లే ప్రతిపాదించుచున్నారు, అం దెవ్వరిమతం బాశ్రయణీయ మనఁగాఁ జెప్పుచున్నారు కావున నీవును ఇత్యాదిగా.

హ. ఈ కారణమువలనఁగూడ శోకమోహములు వహింపక శీతోష్ణాదుల సహింపవలెను, ఏకారణమువలన ననఁగా.—అసతః=లేనిదగు, రజ్జువునందుఁ దోఁచు సర్పమువలె దృష్టనష్టస్వభావము * అగు జగత్తునకు; భావః = సత్త, ఉండుట; నవిద్యతే = లేదు. అట్లు, సతః = పరమార్థ మయిన ఆత్మకు; అభావః= లేకుండుట; నవిద్యతే = లేదు, అంతటను వ్యభిచరింపకుండుటవలన. అనయోః = ఈ సదసత్తుల యొక్క; అన్తః=నిశ్చయము; తత్త్వదర్శిభిః—ఆత్మవేత్తలచేత నని యర్థము; దృష్టః = తెలియఁబడినది. కావునఁ దత్త్వదర్శుల దృష్టి నాశ్రయించి శోకమును మోహమును విడిచి శీతోష్ణాదుల సహింపు మని యభిప్రాయము.

శం. ఓయీ! అంతటను ఉండునట్టి శబ్దాదుల యనుసంధానమును బొత్తిగా విడిచి యెల్లప్పుడును బ్రహ్మానుసంధానమే చేయుట శక్యము కా దనఁగా, బ్రహ్మము కంటె ఇతర మయిన వస్తువే లేకుండుటవలనను బ్రహ్మ మొక్కటియె నిత్యమయి నిరంతరమై ♦ పూర్ణమయి యుండుటవలనను ముముక్షువు లెల్లప్పుడును ఆ బ్రహ్మమునే యనుసంధింపవలె నని సూచించుటకై బ్రహ్మ మొక్కటియె సత్తనియు తదితర మంతయు అసత్తనియుఁ బ్రతిపాదించుచున్నారు.—సత్ అనఁగా ఉన్నది యనఁబడునది, ఏది సర్వవేదాంతములవలనఁ దెలియఁబడుచున్నదో అట్టి సర్వగతంబును సూక్ష్మమును ఏకమును ఏకరసమును నిత్యమును నిరవయవమును నిరంజనమును

* కనఁబడి నశించుస్వభావము గలది.

♦ సందులేనిదై—అపరిచ్ఛిన్నమై.

జ్ఞానస్వరూపము నగు వస్తువు, దీనికి విలక్షణ మయినది యసత్తు శబ్దాదిరూప మయిన జగత్తు, అసతః = అట్టి యసత్తునకు; భావః = సత్త; నవిద్యతే = లేదు. స్వరూప ముచే వస్తు వయిన సత్తునకు సత్త యుపపన్న మగును. స్వరూపముచే వస్తుత్వము లేకుండుటవలన అసత్తునకు సత్త లేదు. అసద్రూప మయిన జగత్తునకు సత్త గల దనుటకుఁ బ్రమాణము లేదు. ఓయీ! ఉన్నది ప్రత్యక్షాదిప్రమాణము అందు వేని, ఇట నిన్నడుగవలెను, జగత్తునకు సత్త్వము గల దనుటకుఁ బ్రమాణము ప్రత్యక్షమా? అనుమానమా? ఉపమానమా? శబ్దమా? ప్రత్యక్షము కాఁ జాలదు, ఇది రజతము ❘ చంద్రుఁడు ప్రాదేశమాత్రుఁడు ♦ ఇత్యాదికమునందు వ్యభిచారము కనఁబడుటవలన. అచటఁ బ్రమాణప్రమేయములకుఁ § జక్కఁగా సంబంధము కలుగనందున వ్యభిచారము, ఇతరస్థలమునందుఁ బ్రమాణమే యగు నందు వేని, అట్లు కాదు, గారువు ** నందు గజ మనియు మృత్తికయందు ఘట మనియు విపరీతజ్ఞానము కనఁబడుటచే వ్యభిచార మనివార్య మగుటవలన. నీమతము నందుఁ బ్రపంచము ప్రత్యక్ష మగుటకలె దని యిదివఱకే మేమాగపడనందున అను మానంబును బ్రమాణము కాఁ జాలదోటను ఇత్యాదిగా. బ్రమాణము కాదు, గో సదృశము గవయ మనునట్లు జగత్తునకు స అసత్తుగా నుఁడింపమివలన. స్వప్నము నందు సాదృశ్యము సిద్ధించుచున్న దందు వేని మటవల్లసాదృశ్యము మిథ్యాత్వము నకుఁగూడ సాధక మగుచున్నది. శబ్దము కానేకాదు, ఏల యనఁగా, 'వికల్పో నహి వస్తు, నహ్యస్తి ద్వైతసిద్ధిః అసత్త్వాదవస్య' * ఇట్లు శ్రుతి జగత్తు అస త్తని యుపదేశించుచున్నదియే గాని యెచటనైనను జగత్తునకు సద్భావము ప్రతిపాదిం చుటం గానము. ఓయీ! 'ఆత్మన ఆకాశ స్సమ్భూతః' అనియు 'యతోవా ఇమాని భూతాని జాయన్తే' అనియు బ్రహ్మమువలన జగ త్తుత్పన్న మని శ్రుతి చెప్పు చున్నది. కావున జగము బ్రహ్మకార్యమై యున్న దనుటకు శ్రుతిప్రమాణ ముం డనే యున్న దందు వేని, ఇట నిన్నడుగవలెను. బ్రహ్మకార్య మయిన ప్రపంచ

---

❘ శుక్తి—ముత్తెపుచిప్పను జూచి.

♦ లాడితెఁడు.

§ ఇంద్రియమునకును విషయమునకును.

** కొయ్య.

* వికల్పము—ఒకప్పుడు ఒకవిధముగాను మఱియొకప్పుడు మఱియొకవిధముగాను ఉండునది వస్తువు కాదు గదా! ఇతరము లేనందువలన ద్వైతసిద్ధి కాఁ జాలదు.

మేది గలదో అది బ్రహ్మముకన్న భిన్నమా? అభిన్నమా? లేక, భిన్నాభిన్నమా? భిన్న మగుపక్షమునందు కార్యము సత్తా? అసత్తా? లేక సదసత్తా? కార్యము సత్తనునెడ కార్యమునకుఁ గారణసత్తచే సత్త కలుగుచున్నదా? లేక స్వసత్త వేఱే కలదా? కార్యమునకు కారణసత్త అనుట సరికాదు, ఏల యనఁగా కార్య కారణములకు రెంటికిని ఒకసత్తయే యన్నయెడ స్వతస్సత్త లేకుండుటవలనఁ గార్యము అసత్తని యేర్పడును. కార్యమునకు వేఱే స్వసత్త కల దన్నయెడ, ఈ కార్యసత్త సద్రూపమా? అసద్రూపమా? మొదటిపక్షమున, సద్రూప కార్యసత్త కారణసత్తకంటె భిన్నమా? అభిన్నమా? కారణసత్తకంటె భిన్న మనుట యుక్తము కాదు, ఏల యనఁగా, బ్రహ్మము పూర్ణము నిరంతర మగుటవలన కార్యమునకు బ్రహ్మసత్తావ్యతిరిక్త మయిన సత్త సంభవింపనందున అసత్త్వమే యగును. అభిన్న మనుటయు సరికాదు, రెండు సత్తలును సద్రూపమున ఒక్కటియె యని యేర్పడుటచేఁ గార్యమునకుఁ గారణభిన్నత్వము సంభవింపనందున అసత్త్వమే యనివార్య మగుటవలన. కార్యసత్త అసద్రూప మనునెడ, అసద్రూప మయి కారణసత్తకన్న భిన్న మయిన కార్యసత్తకు స్వతస్స్వరూపము లేనందునఁ గార్యము శూన్య మని యేర్పడును. కార్యము అసత్తనుపక్షమునందు జగత్తు శశవిషాణమువలె స్వరూపశూన్య మగుటవలన బ్రహ్మకార్య మనుట చెల్లదు. ఓయీ! జగము అసత్తైనను ప్రధ్వంసాభావమునవలెఁ గార్యము కానే కావచ్చు నందువేని, కాదు. ఏల యనఁగా ప్రధ్వంసాభావముగూడఁ గారకసంబంధము సంభవింపమివలనఁ గార్యము కాఁ జాలదు. జనసమునందు కర్త కరణము మొద లగు కారకములసంబంధము కలిగినం గదా ఘటాదులయెడఁ గార్యత్వము కనఁబడు చున్నది. అట్లే ప్రధ్వంసాభావమునకుఁగూడ కారకసంబంధము కల దన్నయెడ నప్పు డది భావపదార్థ మని యేర్పడుటచే అభావ మనుట యొప్పదు. ఏల యనఁగా కారకసంబంధము అవయవసహిత మయిన సత్పదార్థమునకే గాని యితరమునకు ఘటిల్లదు. ఘటమును నశింపఁజేయు సామగ్రిసంబంధము అత్యంతము అసత్తయిన ఘటప్రధ్వంసాభావమునం దుపయుక్తము కాదు గదా! అది లేకుండుటవలననే ప్రధ్వంసాభావమునకుఁ గార్యత్వము లేదు. అట్లే అసత్తయిన జగమునకును గార్యత్వము సిద్ధింపదు. కార్యము సదసత్తనుపక్షమునందును, సత్త్వాసత్త్వములు భావాభావరూపము లగుటచే బరస్పరవిరుద్ధము లగుటవలన ఒకచో నుండఁ జాలవు, కావున సదసత్తనుట యనుపపన్న మగుటవలన జగత్తు బ్రహ్మకార్య మనుట మఱియు

ననుపపన్న మగును. ఇఁకఁ గార్యము కారణమునకు అభిన్నమే యగు ననఁగా, నదియు సరి కాదు, అట్లు చెప్పినయెడ పెక్కనర్థములు ప్రసక్తించును. జడాత్మక మయిన జగత్తు బ్రహ్మాభిన్న మగునెడ బ్రహ్మమునకుఁగూడ దృశ్యత్వము అనిత్యత్వము అప్రకాశత్వము దుఃఖరూపత్వము సావయవత్వము మొదలగు దోషముల పరంపర ప్రసక్త మగును. అది యిష్టమే యందువేని సర్వలోకమునకు అంధత * ప్రసక్తించుటవలన నీకు నేను నాది ఇత్యాదివ్యవహారము సిద్ధింపక పోవును, నీకును జడత్వముచే జ్ఞానమున కవకాశమే లేక మోక్షమే లేదని యేర్పడును, ‘తరతి శోక మాత్మవిత్’ ♦ ఇత్యాదిశ్రుతులు వ్యర్థము లగును, బ్రహ్మానందప్రాప్తిఁ గోరునట్టి సత్పురుషులకు మోక్షముకొఱకుఁ బ్రవృత్తియే లేక పోవును, మఱియు ‘యత్తద ద్రేశ్య మగ్రాహ్యమ్, అజో నిత్యశ్శాశ్వతః’ § ఇత్యాది శ్రుతివిరోధము సంభవించును. అట్లయినయెడ మూఁడవపక్షమే ❡ అగుఁ గాక యందువేని అదియుఁ గానేరదు. ఏల యనఁగా భిన్నత్వమును అభిన్నత్వమును అన్యోన్యవిరుద్ధము లగుటచే నేకస్థలమున సంభవింపవు. ఇట్లు జగము బ్రహ్మకార్య మనుట యనుపపన్నము, కావున అందుకు శ్రుతిప్రమాణ మనుట చెల్లదు. ఓయీ! ఇట్లయినయెడ ‘యతో వా ఇమాని భూతాని జాయన్తే’ ఇత్యాది శ్రుతి యసత్యము నుపదేశించుచున్నదని యేర్పడుటచే శ్రుతి కప్రామాణ్యము సంభవించు నందువేని, అట్లు కాదు. ఆ శ్రుతికి బ్రహ్మమునకు అద్వితీయత్వము చెప్పుట యభిప్రాయ మగుటచేఁ బ్రామాణ్య లోపము లేదు. కొందఱు జగత్కారణము పరమాణువు లని చెప్పెదరు, మఱి కొందఱు ప్రకృతి యనెదరు. దాని నంగీకరించినచోఁ గార్యకారణములభేదముచే బ్రహ్మముయొక్క యద్వితీయత్వము సర్వశ్రుతిప్రసిద్ధము విరుద్ధ మగును. దాని సహింపక యీ శ్రుతి బ్రహ్మమునకు జగదుపాదానత్వము చెప్పుచున్నది. ఓయీ! ఇప్పుడు జగత్తునకుఁ గార్యత్వమును బ్రహ్మమునకుఁ గారణత్వమును అనుపపన్న మని చెప్పితివే, ఎట్లు బ్రహ్మము జగత్తున కుపాదాన మగును? అందువేని, బ్రహ్మము వివర్తోపాదాన మని చెప్పెదము. వివర్తత్వ మనఁగా అధిష్ఠానముయొక్క అన్యథాభాన

---

* గ్రుడ్డితనము—జడత్వము.

♦ ఆత్మ నెఱింగినవాఁడు శోకము దాఁటును.

§ ఏది యదృశ్యమో అగ్రాహ్యమో, అజుఁడు నిత్యుఁడు శాశ్వతుఁడు.

❡ భిన్నాభిన్న మనునదియే.

మాత్రమే §. అది జ్ఞాతకుఁ బ్రమాణదోషముచేఁ $ గలుగుచున్నది, శుక్తియొక్క రజతాకారప్రతీతివలె. ఎట్లు శుక్తిస్వరూపజ్ఞానముచే రజతప్రతీతి శుక్తిమాత్రమే యని యేర్పడునో అట్లు అధిష్ఠాన మయిన బ్రహ్మముయొక్క స్వరూపము దెలియుటచే జగత్ప్రతీతియు బ్రహ్మమాత్రమే యని యేర్పడును. అట్లు 'తదనన్యత్వమారమ్భణశబ్దాదిభ్యః' * అను స్మృతియును 'వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్' ♦ ఇత్యాదిశ్రుతులును జెప్పుచున్నవి. ఇట్లు బ్రహ్మమునకు అద్వితీయత్వము అవ్యాహత మగుటచే, మున్ను చెప్పిన దృశ్యత్వాదిదోషములు ప్రసక్తింపవు, ఏల యనఁగా కార్యము నామమాత్రమే కాని సత్యము కాదు. ఈ కారణములచే శబ్దాదిప్రపంచసద్భావమునకు శ్రుతిప్రమాణము లేదు. ప్రత్యక్షానుమానములును లేవు. కావున అప్రామాణిక మగుటవలన జగత్తునకు స్వతస్సత్త లేదనుట సిద్ధము. ఇట్లు అసత్తైన శబ్దాదికమునకు సత్త లేదని ప్రతిపాదించి యిఁక స్వస్వరూప మయిన బ్రహ్మమునకు ఎల్లప్పుడు సద్భావమే యని ప్రతిపాదించుచున్నారు నాభావో విద్యతే సతః అని. సతః — సామాన్యవిశేషభావశూన్యంబును అఖండచిదేకరసంబును సర్వవికారరహితంబును సదేవసోమ్యేత్యాది శ్రుతిప్రసిద్ధంబును ముందు వెనుకలు లేనిదియు లోపల వెలుపలలు లేనిదియు నగు ఏసత్పదార్థము గలదో అట్టి సత్తునకు; అభావః = లేకుండుట; నవిద్యతే = ఎచ్చటను ఎప్పుడును లేదు. జాగ్రత్స్వప్నసుషుప్త్యాదులందు సద్భావము కనఁబడుటవలన ఆత్మ సదా సద్భావము గలవాఁ డనుటకుఁ బ్రత్యక్షప్రమాణము కలదు. ఆత్మ నిత్యసత్త గలవాఁడు, అవస్థాత్రయ సాక్షి యగుటవలన, ఏది నిత్యసత్త గలది కాదో అది అవస్థాత్రయ సాక్షి కాదు, దేహాదికమువలె ఇత్యాద్యనుమానప్రమాణమునుం గలదు. అట్లు, 'అయమాత్మా సన్మాత్రో నిత్యశ్శుద్ధో బుద్ధః, అజో నిత్యశ్శాశ్వతః, తథా ఽరసం నిత్య మగన్ధవచ్చ' ❡ ఇత్యాదిశ్రుతిప్రమాణమునుం గలదు.

---

§ వేఱువిధముగాఁ దోఁచుటమాత్రమే.

$ తెలిసికొనువానియొక్క తెలిసికొనుటయందలి దోషముచే.

* అ-౨. పా-౧. సూ-౧౪. ఆరమ్భణశబ్దఆదిభ్యః = ఆరంభణశ్రుతిమొదలగు శ్రుతులవలన, తదనన్యత్వమ్ = కారణ మయిన బ్రహ్మముకంటె కార్య మయిన ఆకాశాదిప్రపంచమునకు అభేదము.

♦ వాక్కుచే ఆరంభింపఁబడునది-చెప్పఁబడునది, వికారము-కార్యము పేరుమాత్రమే కాని, మృత్తికయే సత్యము, కార్య మయిన ఘటము పేరుమాత్రమే కాని సత్యము కాదనుట.

❡ అట్లు రసము లేనిదియు నిత్యమును గంధము లేనిదియు.

ఇట్లు సర్వప్రమాణములచేతను బ్రహ్మము నిత్యసత్తాక మని నిర్ధారిత మగుటవలన, ప్రత్యగభిన్న మయి సత్తయిన బ్రహ్మమునకు అభావ మెప్పుడును లే దని యర్థము. తత్త్వదర్శిభిః—తత్త్వ = సర్వాధిష్ఠానభూత మయిన బ్రహ్మముయొక్క కాలత్రయము నందును అబాధిత మయిన సత్యజ్ఞానానందాత్మకస్వరూప మేది గలదో దానినే, దర్శిభిః = ఎల్లప్పుడును ఎల్లచోట్లను చూచుట స్వభావముగాఁ గలవారిచేత, బ్రహ్మ వేత్తలచేత; ఇట్లు, ఉభయోరపి=సదసత్తుల రెంటియొక్కయు; అన్తః = నిశ్చయము, సదా సర్వత్ర బ్రహ్మ మొక్కటియె కలదు ఇతరము లేదు అను నిశ్చయము, దృష్టః— చేయఁబడిన దని యర్థము. ఇందుచే, నీవును ఆత్మ యనిత్యుఁ డన్న భ్రమను విడిచి శోకరహితుఁడవై ‘ సర్వం ఖల్విదం బ్రహ్మ ’ * ఇత్యాది శ్రుత్యర్థము నవలంబించి సర్వత్ర బ్రహ్మదర్శనపరుండ వగు ’ మని సూచిత మగుచున్నది.

మ. ఓయీ! పురుషుఁ డొక్కఁడే యగుఁ గాక. అయినను అతనికి సత్య జడప్రపంచదర్శనరూప మయిన సంసారము సత్యమే యగును. అప్పుడు శీతోష్ణాదిసుఖ దుఃఖములకుఁ గారణ ముండుటచే తద్భోగ మావశ్యక మగుటవలనను, సత్యవస్తువు నకు జ్ఞానమువలన వినాశ మనుపపన్న మగుటవలనను, ఎట్లు తితిక్ష? ఎట్లితం డమృతత్వమునకు యోగ్యుఁ డగును? అన్న యెడ, అది సరికాదు. ఎట్లనఁగా, ద్వైతప్రపంచము సమస్తంబును ఆత్మయందుఁ గల్పిత మగుటచే ఆత్మజ్ఞానమువలన దానికి వినాశ ముపపన్నము, శుక్తియందుఁ గల్పిత మయిన రజతమునకు శుక్తిజ్ఞాన ముచే వినాశము గలుగునట్లు. అయ్యా! ఆత్మానాత్మలప్రతీతియందు విశేష మేమి యుఁ గనఁబడదు. అట్లుండఁగా, ఎందువలన అనాత్మయు ఆత్మవలె సత్యము కాదు? ఎందువలన ఆత్మయు అనాత్మవలె మిథ్య కాదు? రెండును తుల్యయోగక్షేమములు గదా! అని యాశంకించి రెంటికిని విశేషము చెప్పుచున్నాఁడు భగవంతుఁడు.— ఏది కాలముచేతఁగాని దేశముచేతఁగాని వస్తువుచేతఁగాని పరిచ్ఛిన్నమో అది యసత్తు. ఎట్లనఁగా, ఘటాదికము జన్మనాశములు గల దగుటచే జన్మమునకు ముందటికాలముచేతను నాశమునకు వెనుకటికాలముచేతను బరిచ్ఛిన్న మగు చున్నది. ధ్వంసప్రాగభావములకుఁ బ్రతియోగి యగుటవలన † కాదాచిత్కము ♦

* ఇది యంతయు బ్రహ్మమే గదా.

† ధ్వంసాభావమును బ్రాగభావమును గల దగుటవలన.

♦ ఒకానొకప్పుడు పుట్టినది—కార్యము.

కాలపరిచ్ఛిన్న మని చెప్పఁబడును. ఇట్లు అదియే దేశపరిచ్ఛిన్నముగూడ, మూర్త* మగుటచే సర్వదేశమునందును ఉనికి లేని దగుటవలన. కాలపరిచ్ఛిన్నమునకు దేశపరిచ్ఛేదము కలదన్న నియమమున్నను, దేశపరిచ్ఛిన్నములయిన పరమాణ్వాదులకుఁ గాలపరిచ్ఛేదము లే దని తార్కికు లంగీకరించుటవలన, దేశపరిచ్ఛేదముగూడ వేఱుగాఁ జెప్పఁబడినది. ఒకానొకప్రదేశమునం దత్యంతాభావ ముండుట దేశపరిచ్ఛేద మనఁబడును. ఇట్లు సజాతీయభేదము విజాతీయభేదము స్వగతభేద మని మూఁడువిధము లయిన భేదము వస్తుపరిచ్ఛేదము. వృక్షమునకు మఱియొకవృక్షమువలని భేదము సజాతీయభేదము, ఱాయి మొదలగు వానివలని భేదము విజాతీయభేదము, పత్త్రపుష్పాదులకుఁ గల పరస్పరభేదము స్వగతభేదము. లేక, జీవేశ్వరుల భేదము జీవజగత్తులభేదము జీవులపరస్పరభేదము ఈశ్వరజగత్తులభేదము జగత్పరస్పరభేదము అని యైదువిధములు వస్తుపరిచ్ఛేదము. కాలదేశములచే అపరిచ్ఛిన్నమయిన ఆకాశాదులకు వస్తుపరిచ్ఛేదము కల దని తార్కికు లంగీకరించుటవలన వస్తుపరిచ్ఛేదము వేఱుగాఁ జెప్పఁబడినది. ఇట్లు సాంఖ్యమతమునందును యోజనీయము. ఇట్టి, అసతః = శీతోష్ణాదిసమస్తప్రపంచమునకును; భావః = సత్త, పారమార్థికత—తనకంటె తక్కువ కాని సత్త గల వస్తువులని పరిచ్ఛేదము లేకుండుట; నవిద్యతే = సంభవింపదు, ఘటత్వమును అఘటత్వమునువలెఁ బరిచ్ఛిన్నత్వమును అపరిచ్ఛిన్నత్వమును ఒకచోటనుండుట విరుద్ధ మగుటవలన. అంతటను అనుగతము కాకుండుటవలన దృశ్య మేదియు ఒకానొకకాలమునందుఁగాని దేశమునందుఁగాని వస్తువునందుఁగాని లేకయుండనిది కాదు. అట్లు అంతటను అనుగత మగుటవలన సద్వస్తువు ఒకానొకదేశమునందుఁగాని కాలమునందుఁగాని వస్తువునందుఁగాని లేకయుండునది కాదు. కావున, ఎట్లు అనుగత మయిన రజ్జుఖండమునందు వ్యభిచారి యగు సర్పధారాదికము కల్పితమో అట్లు సర్వత్రానుగత మయిన సద్వస్తువునందు అననుగత మగుటచే వ్యభిచారి యగు దృశ్యప్రపంచము కల్పిత మని భావము. ఓయీ! వ్యభిచారి కల్పిత మనుపక్షమున సద్వస్తువుగూడఁ గల్పితమే యని చెప్పవలెను. ఏల యనఁగా, సద్వస్తువుగూడ తుచ్ఛవ్యావృత్తము ♦ అగుటవలన వ్యభిచారి యగును? ఇందుకు సమాధానము చెప్పుచున్నారు నాభావో విద్యతే సతః అని.

---

* క్రియాశ్రయము—పరిచ్ఛిన్నమైన పరిమాణము గలది.

♦ తుచ్ఛమునందు—శశవిషాణాదికమునందు లేనిది.

సదధికరణకభేదప్రతియోగిత్వము * కదా వస్తుపరిచ్ఛిన్నత్వము. అది తుచ్ఛవ్యావృత్త మగుటచే ఘటిల్లదు, ఏల యనఁగా తుచ్ఛ మయిన శశవిషాణాదికమునందు సత్త లేదు. 'సద్భ్యామభావో నిరూప్యతే' § అని న్యాయము. స్వప్రకాశము నిత్యము విభువు నగు సత్తు ఒక్కటియె. అది సర్వానుగతము. కావున దానియందు వ్యక్తిభేదము ఘటిల్లదు. ఘటః సన్ ¶ ఇత్యాదిప్రతీతి సర్వలోకసిద్ధమగుటవలన, సత్తునకు ఘటాద్యధికరణకభేదప్రతియోగిత్వము ♦ లేదు. అభావః = దేశమువలనఁగాని కాలమువలనఁగాని వస్తువులనఁగాని పరిచ్ఛిన్నత్వము; సతః = సర్వానుగత మయిన సన్మాత్రమునకు; నవిద్యతే = సంభవింపదు, మున్ను చెప్పినట్లు విరుద్ధ $ మగుటవలన అని యర్థము. ఓయీ! ఏ సత్తునకు దేశకాలవస్తుపరిచ్ఛేదము లేదని చెప్పుచున్నావో, అట్టి సత్తను వస్తువే యేదియు లేదు. మతేమనఁగా, సత్త్వమనఁగా పరమయిన సామాన్యము ↓, తదాశ్రయత్వసంబంధముచే ద్రవ్యగుణకర్మములందును తదేకాశ్రయత్వసంబంధముచే ** సామాన్యవిశేషసమవాయములందును సద్వ్యవహారము. అట్లు ప్రాగభావప్రతియోగియు అసత్తు నగు ఘటాదికమునకుఁ గారణవ్యాపారమువలన సత్త్వ మగును. సత్తైన ఆఘటాదికమునకే కారణనాశముచే సత్త్వాభావము కానే యగును. కావున 'నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః' అని చెప్పుట యుచితము కాదు? ఈ యాశంకను బరిహరించుచున్నారు ఉత్తరార్థముచేత. ఉభయోరపి = రెంటియొక్కయు, సత్తుయొక్కయు అసత్తుయొక్కయు; అన్తః = మర్యాద, నియత మయిన రూపము గలుగుట—ఏది సత్తో అది సత్తే ఏది యసత్తో అది యసత్తే అనుట; దృష్టః = శ్రుతిస్మృతియుక్తులచే విచార

---

* సత్తు అధికరణముగాఁ గల భేదమునకు బ్రతియోగి యగుట—స్వసమాన మయిన సత్తగల వస్తువుతో భేదము గల దగుట.

§ రెండు సద్వస్తువులచే అభావము నిరూపింపఁబడుచున్నది.

¶ ఘట మున్నది.

♦ ఘటాదికము అధికరణముగాఁ గలభేదమునకుఁ బ్రతియోగి యగుట—ఘటాదులతో భేదము గల దగుట.

$ అపరిచ్ఛిన్నత్వమును బరిచ్ఛిన్నత్వమును ఒకచోట నుండుట విరుద్ధము.

↓ సామాన్యము పరము అపర మని రెండువిధములు, పర మనఁగా అధికదేశవృత్తి, అపరము—అల్పదేశవృత్తి.

** ఏకాశ్రయత్వ మనఁగా ఒకటే యాశ్రయము గల దగుట—ఆ సత్త్వమున కాశ్రయ మయిన ద్రవ్యగుణకర్మములే ఈ సామాన్యాదులకును ఆశ్రయము—ఈసంబంధముచేత.

పూర్వకముగా నిశ్చయింపఁబడినది; ఎవ్వరిచేత ననఁగా, తత్త్వదర్శిభిః= వస్తుస్వరూపముఁ దెలియుట స్వభావముగాఁ గల బ్రహ్మవేత్తలచేత, కాని కుత్సితు లగు తార్కికులచేఁ గాదు. కావున కుతార్కికుల విపరీతజ్ఞానమున కవకాశము కలదు. తు శబ్దము అవధారణార్థకము, అవ్యభిచారి యగు నియమమే నిశ్చయింపఁబడినది, కాని వ్యభిచారి యగు అన్యథాత్వము * కాదని యర్థము. లేక, తత్త్వదర్శులచేతనే నిశ్చయింపఁబడినది కాని యతత్త్వదర్శులచేఁ గాదని యర్థము. అట్లు శ్రుతి, ‘ సదేవసోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్ ’ § అని యుపక్రమించి ‘ ఐతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ’ ¶ అని యుపసంహరించుచు, సత్తు ఒక్కటే యనియు సజాతీయవిజాతీయస్వగతభేదశూన్య మనియు సత్య మనియుఁ దెలుపుచున్నది. ‘ వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్ ’ ♦ అను శ్రుతియో, సమస్తవికారములును వ్యభిచారు లగుటచే వాచారంభణము లగుటవలన అసత్యము లని తెలుపుచున్నది. ‘ అన్నేన సోమ్య శుఙ్గేనాపో మూలమన్విచ్ఛాద్భిస్సోమ్య శుఙ్గేన తేజో మూలమన్విచ్ఛ తేజసా సోమ్య శుఙ్గేన సన్మూలమన్విచ్ఛ సన్మూలాస్సోమ్యేమాస్సర్వాః ప్రజాస్సదాయతనాస్సత్ప్రతిష్ఠాః ’ ** అను శ్రుతి సమస్తవికారములును సత్తునందుఁ గల్పితము లని తెలుపుచున్నది. సత్త్వమేమో సామాన్యము కాదు. ఏల యనఁగా అందుకుఁ బ్రమాణము లేదు. సత్తు సత్తు అను ప్రతీతి సర్వపదార్థసాధారణము. అది ద్రవ్యగుణకర్మములందు మాత్రమె యుండుసట్టి యొకానొకసత్త్వమును స్వానుపపాదక మయిన దానిని ♦♦ కల్పింపఁ జాలదు. ఇందుకు వైపరీత్యముగూడఁ జెప్పనచ్చును ¶¶. ఏకరూపప్రతీతికి ఏకరూపమే విష

---

* వేఱువిధము.

§ సౌమ్యుఁడా! ఇది మొదట ఒకటియె యయినదియు అద్వితీయము నగు సత్తుగానే యుండెను.

¶ ఏతద్రూపమే యిది యంతయు. అది సత్యము, అది ఆత్మ, అది నీవగుచున్నావు. శ్వేతకేతూ!

♦ నోటిచే ఆరంభింపఁబడునది వికారము పేరు, మృత్తిక యనుటయే సత్యము.

** శుంగ మనఁగా అంతము—చివర, అంతము గలదానికి మూలము—మొద లుండవలెను. కావున, సౌమ్యుఁడా! అన్నము అను శుంగముచే అబ్రూప మయిన మూలమును వెదకుము, అప్పులు అను శుంగముచే తేజోరూప మయిన మూలమును వెదకుము, తేజస్సు అను శుంగముచే సత్తు అను మూలమును వెదకుము. ఈ ప్రజలు—కార్యము లన్నియు సన్మూలములు, సదాయతనములు—సత్తు స్థానముగాఁ గలవి, సత్ప్రతిష్ఠములు—సత్తు ఆధారముగాఁ గలవి.

♦♦ తనకు—ప్రతీతికి ఉపపత్తిసాధకము కానిదాని.

¶¶ సత్త్వము సామాన్యాదులయందుఁగూడఁ గల దనవచ్చును.

యము కావలెను, కావున సంబంధభేదంబును * స్వస్వరూపమునందే సత్త్వం బును § గల్పించుట యుచితము కాదు. విషయము అననుగత మగునప్పుడు గూడ ప్రతీతి యనుగత మగు నన్నపక్షమున జాతియె యుచ్ఛిన్న మగును. కావున ఒకటియె సద్వస్తువు స్వప్రకాశరూపము జ్ఞాతాజ్ఞాతావస్థలను భాసిల్లఁ జేయునది, తత్తాదాత్మ్యాధ్యాసముచే అంతటను సద్వ్యవహారము గలుగుచున్నది. సన్ ఘటః అను ప్రతీతికి ఘటము సద్వ్యక్తిమాత్రాభిన్న మనుట విషయము, కాని సత్తాసమవాయి యనుట కాదు. ఏల యనఁగా భేదఘటితసంబంధముచే అభేదప్రతీతి సంభవింపదు. ఇట్లు 'ద్రవ్యం సత్ గుణస్సన్' ఇత్యాదిప్రతీతిచే సత్తు సర్వాభిన్న మనుట సిద్ధ మగుచున్నది. ద్రవ్యగుణాదిభేదములు అసిద్ధము లగుటచే అవి ధర్మ్ములని కల్పించి వానియందు సత్త్వ మను ధర్మము కల్పింపఁ దగదు. మఱేమనఁగా ధర్మియయిన సత్తునందు ద్రవ్యాద్యభిన్నత్వము కల్పింపఁబడుచున్నది లాఘవమువలన. అదియో వాస్తవము కాఁ జాలదు, కావున అధ్యాసకృత మనుట వేఱు విషయము. అది వార్తికకారులచేఁ జెప్పఁబడినది "సత్తాతోఽపి నభేదస్స్యా ద్ద్రవ్యత్వాదేః కుతోఽన్యతః । ఏకాకారాహి సంవిత్తి స్సద్ద్రవ్యం సన్ గుణ స్తథా" ♦ ఇత్యాదిగా. సత్తగూడ అసత్తునకు భేదజనకము గాదు అసత్తు అప్రసిద్ధ మగుటవలన, ద్రవ్యత్వాదికమో సద్ధర్మ మగుటవలన సత్తునకు భేదజనకము కా దని యర్థము. కావున 'ఘటముకన్న భిన్నము పటము' ఇత్యాదిప్రతీతిగూడ భేదసాధకము గాదు, ఘటము పటము తద్భేదము ఇవన్నియు సదభిన్నము లగుటచే ఏకరూప మగుటవలన. ఇట్లుచట భేదప్రమాణము లేకో అచటనే పట్టుగలదై సదభేదప్రతీతి విజయము నొందుచున్నది. తార్కికులు కాల మను పదార్థము సర్వాత్మక మని యంగీకరించెదరు గదా! దానిచేతనే సర్వవ్యవహారము లుపపన్నము లగుచుండఁగాఁ దదతిరిక్త మయిన పదార్థము కల్పించుటకుఁ బ్రమాణ మేమి? ఏల యనఁగా సర్వానుస్యూత మయిన కాలమే సద్రూపమునను స్ఫురణరూపమునను సర్వతాదాత్మ్యముచేఁ బ్రతీత మగుచున్న దనవచ్చును.

* ద్రవ్యగుణకర్మములందు సత్త్వమునకు సమవాయ సంబంధము, సామాన్యములందు తదేకాశ్రయత్వసంబంధము—అని భేదము.

§ 'సత్ సామాన్యమ్' అనునప్పుడు సత్త్వస్వరూప మయిన సామాన్యమునందు సత్త్వము కల్పింపవలెను. ఇది 'సద్ద్రవ్యమ్' ఇత్యాదులకు విలక్షణ మగుటచే ఏకరూప ప్రతీతికి విరుద్ధము.

♦ ద్రవ్యత్వాదికమువలన సత్తయందుఁగూడ భేదము కలుగదు. ఇతరమునందు—అసత్తువం దెట్లు భేదము కలుగును? సత్ ద్రవ్యమ్, సన్ గుణః అని ప్రతీతి యేకాకారము గదా!

స్ఫురణముకూడ సర్వానుస్యూతమయి యేకమగుటవలన నిత్యమని విస్తరించి మీఁది శ్లోకమునఁ జెప్పఁబడును. కావున, ఎట్లు ఒకానొకదేశమునందుఁగాని కాలమునందుఁగాని అఘట * మయిన ఘటాదికమునకు దేశాంతరమందుఁగాని కాలాంతరమునందుఁగాని ఘటత్వంబును, మఱియును ఒకానొకదేశమునందుఁగాని కాలమునందుఁగాని ఘటమయినదానికి ఇతరదేశకాలములయందు అఘటత్వంబును, ఇంద్రునిచేనైనను సంపాదింప శక్యము కాదో పదార్థస్వభావమునకు భంగము సంభవింపమివలన; అట్లు ఒకానొకదేశమునందుఁగాని కాలమునందుఁగాని అసత్తైనదానికి దేశాంతరమునందుఁగాని కాలాంతరమునందుఁగాని సత్త్వమును, ఒకానొకదేశమునందుఁగాని కాలమునందుఁగాని సత్తైనదానికి ఇతరదేశకాలములందు అసత్త్వమును సంపాదింప శక్యము గాదు అదేయుక్తివలన •. కావున రెండును నియతరూపములనియే నిశ్చయింపవలెను. ఈవిషయ మద్వైతసిద్ధియందు విస్తరింపఁబడినది. కావున సద్వస్తువే మాయాకల్పితమయిన అసత్తు నిన ద్రిల్లఁగా అమృతత్వమునకు సమర్థమగును, సన్మాత్రదృష్టిచేత తితిక్షయు నుపపన్నమగు నని భావము.

శ్రీ. ఓయీ! అట్లయినను మిక్కిలి దుస్సహమయిన శీతోష్ణాదికము నెట్లు సహింపవచ్చును? ఏలయనఁగా అత్యంతకష్టముచే దాని సహించునెడ నొకానొకప్పు డాత్మనాశముకూడ సంభవించును? అని యాశంకించి తత్త్వవిచారముచే సమస్తమును సహింపవచ్చు నను నభిప్రాయముచేఁ జెప్పుచున్నారు.—అసతః = అనాత్మధర్మ మగుటచే లేని యట్టి శీతోష్ణాదికమునకు ఆత్మయందు, భావః = సత్త, నవిద్యతే = లేదు. అట్లు, సతః = సత్స్వభావుఁడైన ఆత్మకు; అభావః = నాశము; నవిద్యతే = లేదు. ఇట్లు, ఉభయోః = సదసత్తులయొక్క, అన్తః = నిర్ణయము; దృష్టః, ఎవ్వరిచేత ననఁగా, తత్త్వదర్శిభిః = వస్తుస్వరూపము దెలిసినవారిచేత. ఇట్టి వివేకముచే సహింపు మని యర్థము.

ప. ఇఁక రెండవయుపాయముఁ జెప్పుచున్నాఁడు —అసతః=శుక్తియందుఁ దోఁచు రజతమువలె అసద్రూపమయిన దృశ్యమునకు; భావః = ఉండుట, చెప్ప శక్యము కాదు. అట్లు, సతః = సచ్ఛబ్దముచే వ్యపదేశ్యమయిన ఆత్మకు; అభావః = లేకుండుటయు, చెప్ప శక్యము కాదు. ఇట్లు, అసత్తుయొక్కయు సత్తుయొక్కయు,

* ఘటము కానిది.

• పదార్థస్వభావమునకు భంగము సంభవింపమివలన.

అన్తః= నిర్ణయము, తత్త్వదర్శిభిః = స్వస్వరూపము దెలిసినవారిచేత, దృష్టః. ఇట నిది యభిప్రాయము— దేని కుత్తరక్షణమునందు బాధ కనఁబడుచున్నదో అది అస చ్ఛబ్దవ్యపదేశ్యము *. అట్లు ఏది సదా అబాధితమో అది సచ్ఛబ్దవ్యపదేశ్యము. 'అశోన్యదార్తమ్' ♦ అని శ్రుతి చెప్పుచున్నది. ఈ విషయ మధ్యాత్మసారము నందుఁ జెప్పఁబడినది— "యద్వత్తర్కాద్ధ మనభాతి మరీచి కామ్బు శ్చా సన్ని ధాన మపి రజ్జు భుజఙ్గముఖ్యమ్। స్వప్నః కిం నావధి సుషుప్త్యవధీహ తద్వ ద్విశ్వం విభాతి తదపి ప్రవదన్తి సత్యమ్॥ సర్వప్రపఞ్చవిలయావసరే సుషుప్తౌ యత్ప్రాణవాయ్వనుచరం చి దిహాస్తినూనమ్। అర్థప్రతీతిరపి తత్ర చ జాగరాదౌ తస్మాత్సదిత్యభిహితం ఖలుచి త్స్వరూపమ్" ❡ ఇట్లు అవస్థాత్రయమునందును అబాధితమయి సత్యమయిన బ్రహ్మ మునందు ఆసక్తచిత్తు లగు తత్త్వదర్శులకు అసద్రూప మయిన శీతోష్ణాదిద్వంద్వ ముల దుఃఖము సహించుట యనఁగా నెంతమాత్రము? స్వప్నమునందు సర్పము కఱ చినచో జాగ్రత్తయందు దానికిఁ బ్రతీకారము సంభవింపదు గదా! అని యర్థము.

రా. ఆత్మలనిత్యత్వమును దేహముల స్వాభావిక మయిన నశ్వరత్వమును శోకము లేకుండుటకుఁ గారణ మని చెప్పఁబడినవి. ఆకారణమునే యుపపాదింప నారం భించుచున్నారు.—అసతః = దేహమునకు; భావః = సద్భావము, ఉండుట; నవి ద్యతే = లేదు. సతః = ఆత్మకు; అభావః = అసద్భావము, లేకుండుట; నవిద్యతే = లేదు. ఉభయోః = దేహాత్మల రెంటియొక్కయు; తత్త్వదర్శిభిః తు = అవి యుప లబ్ధము లగుచుండఁగా, ఎట్లు ఉపలబ్ధము లగుచున్నవో అట్లే వానితత్త్వమును దెలి సినవారిచేత §; అన్తః = నిర్ణయము; దృష్టః = తెలియఁబడినది. నిరూపణము నిర్ణ

---

* అసత్ అను శబ్దముచేఁ జెప్పఁదగినది.

♦ దీనికంటె ఇతరము నశ్వరము.

❡ ఎట్లు గ్రీష్మకాలము మధ్యాహ్నకాలజలమును సమీపమునకుఁ బోవునంతవఱకు రజ్జు సర్పము మొదలగునదియు నిర్వ్యాప్తిసాక్షిత్వమునకు స్వప్నమును దోఁచుచున్నవో అట్లు ఇచట సుషుప్తివఱకుఁ బ్రపంచము తోఁచుచున్నది. దానినిగూడ సత్య మని చెప్పుచున్నారు!—అది అసత్య మని భావము. సమస్తప్రపంచమునకును లయము కలుగునట్టి సుషుప్తికాలమునందు ఏచిత్తు ప్రాణవాయుసహిత మయి యున్నదో, జాగరాదియందు అర్థప్రతీతి—సుషుప్తియం దనుభవించిన సుఖాజ్ఞానరూప మయిన అర్థము యొక్క స్మృతి గలుగుటవలనఁగూడ ఏది సుషుప్తియందు వాస్తవముగా నున్నదో ఆకారణమువలన ఆచిత్తు గదా సత్తని చెప్పఁబడినది.

§ తు శబ్దముచే ఎట్లు కనఁబడుచున్నవో అట్లు కొంచెమైనను పొరపాటు నొందక తెలిసిన వా రని సూచితము.

యాంత మగుటవలన ఇచట అంతశ్శబ్దముచే నిర్ణయము చెప్పఁబడుచున్నది. అచిద్వస్తు వయిన దేహమునకు అసత్త్వమే స్వరూపము, చేతనుఁడైన ఆత్మకు సత్త్వమే స్వరూప మను నిర్ణయము దృష్ట మని యర్థము. వినాశస్వభావము గదా అసత్త్వము, సత్త్వమో అవినాశస్వభావము. అట్లు భగవంతుఁ డగు పరాశరునిచేఁ జెప్పఁబడినది— "సత్యం న విజ్ఞాన మృతే ఽస్తి కించిత్క్వచిత్కదాచి ద్ద్విజవస్తుజాతమ్॥ సద్భావ ఏవం భవతో మయోక్తో జ్ఞానం యథా సత్య మసత్య మన్యత్ ॥ అనాశీ పరమార్థశ్చ ప్రాజ్ఞై రభ్యుపగమ్యతే । తత్తు నాశి న సందేహో నాశిద్రవ్యోపపాదితమ్॥ యత్తు కాలాన్తరేణాపి నాన్యసంజ్ఞా ముపైతి వై । పరిణామాదిసంభూతాం తద్వస్తు నృప తచ్చ కిమ్ '* అని. ఇందుఁగూడ 'అన్తవన్త ఇమే దేహాః, అవినాశితు తద్విద్ధి' అని గదా చెప్పఁబడుచున్నది. కావున అదియె సత్త్వము అసత్త్వము అను స్వభావములకు హేతువని తెలియవచ్చుచున్నది. సత్కార్యవాదమో యిటఁ బ్రస్తుతము కాదు, కావున ఈ శ్లోకము సత్కార్యవాదపరము కాదు. దేహాత్మలస్వభావము తెలియక మోహితుఁడైనవానికిఁ దన్మోహశాంతికొఱకు దేహాత్మల రెంటియొక్క నాశిత్వము అనాశిత్వము అను స్వభావములయొక్క వివేకమే కదా చెప్పవలెను. అదియె 'గతాసూనగతాసూం' అని ప్రస్తుతము. మఱియు అదియే 'అవినాశితు తద్విద్ధి' 'అన్తవన్త ఇమే దేహాః' అని వెంటనే యుపపాదింపఁబడుచున్నది. కావున మేము చెప్పినదే యర్థము.

అచిద్వస్తు వయిన దేహము నశించుస్వభావము గల దగుటచే దానికి సద్భావము లేదు. చిద్వస్తు వయిన ఆత్మయో నశింప కుండుస్వభావము గల దగుటచే దానికి అసద్భావము లేదు. ప్రత్యక్షముగాఁ గనఁబడుచున్న దేహాత్మల రెంటిని జక్కఁగా విమర్శించి కన్నది కన్నట్లుగానే వీనితత్త్వము నెవ్వారు తెలిసికొనియున్నారో వారలుమాత్రమె యీనిర్ణయ మెఱుంగుదు రని తాత్పర్యము.

---

* ఇందు జ్ఞానస్వరూప మయిన ఆత్మ దక్క ఇతరవస్తువు ఏదియు ఎచ్చటను ఎప్పుడును ఉండునది కాదు, ఇది సత్యము. పరమార్థ మిట్లు నీకు నాచేఁ జెప్పఁబడినది—జ్ఞానస్వరూప మయిన ఆత్మ సత్యము, ఇతరము అసత్యము అని. పరమార్థము నాశము లేని దని ప్రాజ్ఞులచే నంగీకరింపఁబడుచున్నది. నాశము గల ద్రవ్యములచేఁ గలిగింపఁబడిన దేహో నాశము గలదియే, సందేహము లేదు. ఏది కాలాంతరమునఁ గూడ పరిణామాదులచేఁ గలిగిన ఇతరసంజ్ఞను పొందదో అది పరమార్థవస్తువు, అట్టిది యేది?—దృశ్యవములం దేదియు లే దని భావము.

మా. నిత్యుఁ డాత్మ యని చెప్పఁబడినది. ఆత్మమాత్రమె నిత్యుఁడా? లేక యితరముగూడ నిత్యపదార్థ మున్నదా? ఇతరముగూడ నిత్యపదార్థ మున్నది. అది యేది యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అసతః = కారణ మయిన ప్రకృతికి; అభావః = లేకుండుట *; నవిద్యతే = లేదు. సతః = బ్రహ్మమునకును; అభావః = లేకుండుట; నవిద్యతే = లేదు. అట్లు 'ప్రకృతిః పురుషశ్చైవ నిత్యౌ కాలశ్చ సత్తమ' ‖ అని విష్ణుపురాణంబునఁ జెప్పఁబడినది. అభావః నవిద్యతే అనునది వేఱుగాఁ జెప్పుట యాదరార్థము. అసత్తునకుఁ గారణత్వమో 'సదసద్రూపయా చాసౌ గుణమయ్యా౽గుణో విభుః' § అని భాగవతమునందుఁ జెప్పఁబడినది. 'అసత స్సదజాయత' • అని శ్రుతియును. అవ్యక్త మగుటవలనఁగూడ కారణము అస త్తని చెప్పఁబడును. సంప్రదాయమువలనఁగూడ ఈ యర్థము సిద్ధ మగుచున్న దని చెప్పుచున్నాఁడు— అనయోః = ఈ; ఉభయోరపి = ప్రకృతిపురుషుల యిద్దఱియొక్కయు; అన్తః = నిర్ణయము; తత్త్వదర్శిభిః తు = తత్త్వజ్ఞులచేతనుగూడ; దృష్టః = తెలియఁబడినది.

కారణ మయిన ప్రకృతి యసత్తనఁబడును. బ్రహ్మము సత్తనఁబడును. ప్రకృతికిని అభావము లేదు, బ్రహ్మమునకును అభావము లేదు. ఈ రెండును నిత్యములు. ప్రకృతిపురుషులు నిత్యు లను నీ నిర్ణయము శ్రుతిస్మృతులవలనను తత్త్వదర్శులగువారి యుపదేశపరంపరారూప మయిన సంప్రదాయమువలనను దెలియుచున్నది యని తాత్పర్యము.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి. ౧౭

భా. ఏది యెల్లప్పుడును ఉండునదిగానే యున్నదో అట్టి సత్తనఁగా నేది? అని యందువేని అందుకు చెప్పఁబడుచున్నది.—అవినాశి తు = నశించుస్వభావము లేనిదానినిగా మాత్రము, తు అనునది అసత్తునుండి విశేషము దెలుపుచున్నది; తత్ = దానిని; విద్ధి = ఎఱుంగుము. దేని

* వీరి మతమునందు 'విద్యతే ఆభావః' అని పదవిభాగము.

‖ ప్రకృతియును పురుషుఁడును—పరమాత్మయును నిత్యులు. కాలముగూడ నిత్యము.

§ కార్యకారణరూప మయి గుణమయ మయిన ప్రకృతిచే అగుణుఁ డగు విభువు.

• అసత్తునలన సత్తు పుట్టెను.

అనఁగా, యేన = సత్తు అను పేరు గల ఏ బ్రహ్మముచేత; ఇదమ్ = ఈ; జగత్ = ప్రపంచము; సర్వమ్ = అంతయు, ఆకాశసహితముగా; తతమ్ = వ్యాపింపఁబడినదో, ఘటాదులు ఆకాశము చేతంబోలె. వినాశమ్ = అదర్శనమును * అభావమును. అవ్యయస్య—న వ్యేతి = వృద్ధిక్షయములను బొందదు కావున అవ్యయము, అట్టి అవ్యయమయిన, ఈసదాఖ్య మయిన బ్రహ్మము స్వరూపముచే న వ్యేతి—వ్యయము పొందదు దేహాదులవలె, నిరవయవ మగుటవలన. ఆత్మీయము † వలనఁగూడ వ్యయము నొందదు, ఆత్మీయము దీనికి లేకుండుటవలన. ఎట్లు దేవదత్తుఁడు ధనహానిచేత వ్యయము నొందుచున్నాఁడో, అట్లు బ్రహ్మము వ్యయము నొందునది కాదు; ఇందువలన అవ్యయ మయిన; అస్య = ఈ బ్రహ్మమునకు; వినాశమ్ = అభావమును; కశ్చిత్ = ఒకానొకఁడుగూడ; కర్తుమ్ = చేయుటకు; న అర్హతి = సమర్థుఁడు కాఁడు. ఎవ్వఁడును ఈశ్వరుఁడైనను తన్నుఁ దా నశింపఁజేయ శక్తుఁడు గాఁడు. తానే గదా బ్రహ్మము. తనయందుఁ దనక్రియ చెల్లదు.

సత్తు అనఁబడునట్టి యే బ్రహ్మము ఈ ఆకాశాది సమస్తప్రపంచమును వ్యాపించియున్నదో ఆ బ్రహ్మముమాత్రమే నశించుస్వభావము కలది కాదని యెఱుంగుము. నిరవయవ మగుటవలన వృద్ధిక్షయాదివికారములు లేనట్టి బ్రహ్మమునకు నాశము ఎట్టివాఁడును జేయఁ జాలఁ డని తాత్పర్యము.

ఆ. ఓయీ! సత్తనునది సామాన్యమా? స్వరూపమా? మొదటిపక్షమున సామాన్యము విశేషసాపేక్ష మగుటచేఁ బ్రలయావస్థయందు సమస్తవిశేషములు నశించునప్పుడు నాశము నొందవలయును. అప్పుడుగూడ ఆత్మాదులగు విశేషములు కలవని చెప్పవలను గాదు. ఏలయనఁగా ఆత్మభిన్నములయిన విశేషములన్నియుఁ గార్యము లగుటచేఁ బ్రలయావస్థయం దుండఁ జాలవు. సామాన్యరూపమయిన ఆత్మయో ధర్మి యగుటవలన దానికిఁ బ్రథమపక్షమునఁ జెప్పిన దోషమే ప్రసక్తించును. రెండవపక్షమునందును స్వరూపము వ్యావృత్త మందు లేని కల్పిత మగుటవలన వినాశి యగును, అనువృత్త మందు లేని అది యే సామాన్య మగుటచేఁ బూర్వోక్తదోషమే యగును. అను నాశఁకతోఁ బ్రశ్న చేయుచున్నారు, ఏది యెల్ల

* కనఁబడ కుండుట.

† తనవాని.

ప్పుకును ఇత్యాదిగా. సామాన్యవిశేషభావశూన్యంబును అఖండైకరసమును సదేవేత్యాదిశ్రుతిబోధితంబును సర్వవికారరహితంబు నగు వస్తువు ప్రకృతము సత్తని వివక్షిత మని దాని కుత్తరముఁ జెప్పుచున్నారు అందుకుఁ జెప్పఁబడుచున్నది యని. సద్రూపుఁ డయిన ఆత్మ వినాశరహితుఁ డని తెలియుటకు సర్వజగద్వ్యాపకత్వము హేతు వని తెలుపుచున్నారు 'యేన సర్వ మిదం తతమ్' * అని. ఆత్మకు వినాశము లే దనుటకు యుక్తిఁ జెప్పుచున్నారు వినాశ మిత్యాదిగా ¶. ఆత్మకు వినాశము కల దన్న యెడ ఆత్మకు నాశము తనవలననే గలుగునా? లేక ఇతరునివలనఁ గలుగునా? మొదటిపక్షము సరి కా దని చెప్పుచున్నారు అవినాశి అని. దేహాది ద్వైతము అసత్తు దానికన్న విశేషము—విలక్షణత సత్తునకు తనయంత నాశము లేకుండుట, దానిని దెలుపుచున్నది తు అను నిపాత మని చెప్పుచున్నారు తు అనునది ఇత్యాదిగా. ఆకాంక్షాపూర్వకముగా విశేష్యముఁ జూపుచున్నారు దేనిని ఇత్యాదిగా. విమతము నాశము లేనిది, వ్యాపక మగుటవలన, ఆకాశమువలె, ఉదాహరణము శాస్త్రసిద్ధము మాత్రమె కాదు లోకప్రసిద్ధముగూడ నని భావము. రెండవపక్షంబును సరి కా దని చెప్పుచున్నారు వినాశ మిత్యాదిగా. దీనికి వినాశ మెవ్వఁడును జేయఁజాలఁ డని సంబంధము. వినాశము సావశేషము ♦ నిరవశేషము అని రెండువిధములుగాఁ దలఁచి వ్యాఖ్యానము చేయుచున్నారు అదర్శనమును అభావమును అని. ఎవ్వఁడును దీని కభావము కలిగించుటకు శక్తుఁడు గాఁ డనుటకు హేతువుఁ జెప్పుచున్నారు అవ్యయస్య అని. బ్రహ్మము స్వరూపముచే నశించునా? లేక స్వసంబంధిచే నశించునా అని వికల్పించి మొదటిపక్షమును దూషించుచున్నారు ఈసదాఖ్యమయిన బ్రహ్మము ఇత్యాదిగా. నిరవయవమునకు అవయవక్షయరూప మయిన వ్యయము సంభవింప దనుటకు వైధర్మ్యదృష్టాంతముఁ జెప్పుచున్నారు దేహాదులవలె నని. రెండవపక్షమును నిరసించుచున్నారు ఆత్మీయమువలనఁగూడ ఇత్యాదిగా, దానినే వ్యతిరేకదృష్టాంతముచే స్పష్టీకరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. రెండువిధము లయిన వ్యయమును లేకుండుటచే ఫలితమును జెప్పుచున్నారు ఇందువలననిత్యాదిగా. మఱియు బ్రహ్మము ఇతరునివలన నశింపదు, ఆత్మ యగుటవలన, వ్యతిరేకమున ఘటమువలె నని చెప్పుచున్నారు ఎవ్వఁడును ఇత్యాదిగా. ఆత్మ యగుటవలన

---

* మూలమునందు.

¶ మూలమునందు.

♦ మిగత గలది.

అను హేతువు అసిద్ధ మనఁగా అందుకుఁ జెప్పుచున్నారు తానే యిత్యాదిగా. కదా అనుటచే తాదాత్మ్యము బోధించు శ్రుతి యిట హేతువుగాఁ దెలుపఁబడినది. అగుఁగాక, అయినను బ్రహ్మము తానే తనకు నాశక మగును ఉద్బంధనాదులం * జూచుచున్నాము గదా, అనఁగా అట్లు కా దని చెప్పుచున్నారు తనయందు ఇత్యాదిగా.

హ. ఏదిమాత్రమె యెల్లప్పుడును సత్తే యని చెప్పఁబడునో అది యేది? ఇందుకుఁ జెప్పుచున్నారు.—నశించుస్వభావము గలది వినాశి, వినాశి కానిది అవినాశి అట్టిదానిఁగా, తుశబ్దము అసత్తునుండి విశేషణార్థము. తత్ = దానిని; విద్ధి = ఎఱుంగుము. దేనిని అనఁగా, యేన= దేనిచేత, సర్వమ్= సమస్త మయిన; ఇదమ్ = ఈజగత్తు; తతమ్ = వ్యాపింపఁబడినదో, ఆకాశము చేతంబోలె. వినాశ మనఁగా అదర్శనము. ఘటాదులకువలె, అస్య = ఈ; అవ్యయస్య = నాశరహిత మయిన బ్రహ్మమునకు; వినాశమ్, కర్తుమ్, కశ్చిత్, నార్హతి. ఎవ్వఁడును తన్నుఁ దా నశింపఁ జేయఁ జాలఁడు.

శం. ఓయీ! సత్తనునది సామాన్యమా? లేక స్వరూపమా? సామాన్య మనునెడ, అది విశేషాపేక్ష మగుటచేఁ బ్రలయదశయందు సర్వవిశేషములు నశించునప్పుడు దానికిని వినాశ మగును. స్వరూప మను పక్షమునందు అది వ్యావృత్త మనునెడఁ గల్పిత మగుటవలన దానికి వినాశిత్వము సంభవించును. అనువృత్త మనునెడ అదియే సామాన్య మగుటచేఁ బూర్వోక్తదోష మే యగును. అని యాశంకించి, అది సామాన్యమునుం గాదు విశేషమునుం గాదు. కావున దాని కెట్లును వినాశము సంభవింప దని సమాధానము చెప్పుచున్నారు.—ఇదమ్=ఈ కనఁబడుచున్నదియు అవిద్యాకార్యమును అసత్తు నగు జగత్తు; సర్వమ్; యేన=అతిసూక్ష్మంబును సర్వవ్యాపకంబు నగు ఏసత్తుచేత; సూర్యకిరణముచే జలప్రవాహమువలె, తతమ్= లోపలను వెలుపలను వ్యాపింపఁబడినదో; తత్ =ఆ సత్తనువస్తువు; అవినాశి—అసత్తువలె, నశించుటకు—నాశనక్రియకు విషయ మగుటకు అనర్హ మయిన స్వభావము—సత్త గలది కావున అవినాశి యని చెప్పఁబడును. అతిసూక్ష్మ మగుటవలనను అతిమహత్తగుటవలనను తాను వినాశక్రియ నతిక్రమించినట్టి సత్తు నిత్యమే యగు నని యర్థము. ఆత్మ నిత్యుఁడు, పరిపూర్ణుఁ డగుటవలన, ఆకాశమువలె అని నిత్యత్వమునం దనుమానము ప్రమాణము. ఒకదేహము నష్ట మయినను అంతటను అంద

* ఉరివోసికొనుట మొదలగువాని.

అగుటను అన్నిపదార్థములు కనఁబడుచున్నవి. సూర్యునివలె సర్వప్రకాశకుఁడై సత్యుఁడైన యాత్మ యున్నంగదా పదార్థములు కనఁబడును. లేనిచో నెట్లు కనఁబడు? ఈ యన్యథానుపపత్తిచే అర్థాపత్తియుఁ బ్రమాణము. ఇందు ఆత్మకు నాశము కల దని చెప్పెడు వాది నడుగవలెను. ఆత్మకు నాశము దేనివలనఁ గలుగును? తనయంతనా? ఇతరమువలననా? ఆశ్రయనాశమువలననా? సంబంధినాశమువలననా? కారణనాశమువలననా? కార్యనాశమువలననా? మొదటి పక్షము సరి కాదు, ఆత్మ నిరవయవుఁ డగుటవలన, ఎట్లు సావయవమునకు తన యవయవముల క్షయముచే నాశ మగునో అట్లు నిరవయవుఁ డగు ఆత్మకుఁ దనయంత నాశము ఉపపన్నము కాదు. రెండవది యుక్తము గాదు, ఏల యనఁగా ఆ యితరముగూడ ఆత్మయే యగుటవలన నది తనకుఁ దానే కర్మమును కర్తయుఁ గాఁజాలదు. కావున అందువలనఁ గూడ నాశము సంభవింపదు. మూఁడవదియు కాదు, ఏలయనఁగా 'కస్మిన్ భగవః ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్నీతి' * అను శ్రుతి ఆత్మకు స్వాతిరిక్త మయిన ఆశ్రయము లే దని యుపదేశించుటవలన ఆశ్రయనాశనిమిత్తక మయిన నాశము ఆత్మ కుపపన్నము గాదు. నాలవదియుఁ గాదు, నిరవయవుఁ డగుటచే ఆత్మకు ద్రవ్యగుణక్రియాదులతో సంయోగాదిసంబంధము నిరూపింప నశక్య మగుటవలన తత్సంబంధనాశముచే నాశము సంభవింపదు. అయిదవదియు ఉచితము గాదు, ఏల యనఁగా 'నచాస్య కశ్చి జ్జనితా' § అను శ్రుతి బ్రహ్మమునకుఁ గారణము లే దని చెప్పుటవలన కారణనాశనిమిత్త మయిన నాశము అనుపపన్నము. ఆఱవదియు కానే కాదు, ఎందువలన ననఁగా, 'నతస్య కార్యం కరణంచ విద్యతే' ‖ అను శ్రుతి బ్రహ్మమునకుఁ గార్యము లే దని యుపదేశించుటవలనఁ గార్యనాశనిమిత్తక మయిన నాశము సంభవింపదు. కావున, ఏవిధముచేతను ఈ సద్రూప మయిన బ్రహ్మము, వ్యేతి—నాశము నొందదు, కావున అవ్యయము, అట్టి యీ యవ్యయ మయిన, నిత్యసిద్ధసత్త గల బ్రహ్మమునకు; వినాశమ్ = అభావమును; కర్తుమ్ = చేయుటకును చెప్పుటకును; కశ్చిత్ = ఎట్టివాదియును; నార్హతి = శక్తుఁడు గాఁడు. అట్లు చెప్పినయెడ తనకే 'నాహ మస్మి' ¶ అని యభావము చెప్పిన ట్లగును, బహుశ్రుతివిరోధంబును బ్రత్యక్షాదివిరోధంబును బ్రసక్తించు నని భావము.

---

* భగవంతుఁడా! దేనియందుఁ బ్రతిష్ఠితము? తనమహిమ యందే.

§ ఇతనికి కారణ మేదియు లేదు.

‖ ఇతనికి కార్యమును కరణమును లేదు.

¶ నేను లేను.

**వ్యా.** ఓయీ! ఇట్టి సత్తు జ్ఞానముకన్న భిన్న మన్నయెడఁ బరిచ్ఛిన్న మగ వలసివచ్చును, కావున జ్ఞానాత్మకమే యని యంగీకరింపవలెను. అజ్ఞానమో అధ్యాసికము * కాదని చెప్పవలెను, లేనియెడ జడ మనుట సంభవించును. అట్లు అనాధ్యాసిక జ్ఞానరూప మయిన సత్తు ధాత్వర్థ † మగుటవలన ఉత్పత్తివినాశములు గల దని చెప్పవలెను. ఘటజ్ఞానము పుట్టెను ఘటజ్ఞానము నశించెను అను ప్రతీతి వలనఁ గూడ ఈ యుత్పత్తివినాశవత్త్వము సిద్ధ మగుచున్నది. మఱియు 'నేను ఘటము నెఱుంగుచున్నాను' అను ప్రతీతివలన అది సాశ్రయ మనియు సవిషయ మనియు నేర్పడుచున్నది. కావున స్ఫురణము దేశకాలవస్తుపరిచ్ఛిన్న మగుటవలన, తద్రూప మయిన సత్తు దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యం బెట్లగు నని యాశంకించి సమాధానము చెప్పుచున్నారు.—వినాశ మనఁగా దేశమువలనఁగాని కాలమువలనఁగాని వస్తువువలనఁగాని పరిచ్ఛేదము, అది కలది వినాశి పరిచ్ఛిన్నము, అట్టిది కానిది అవినాశి = అన్నివిధములచేతను బరిచ్ఛేదము లేనిది, అవినాశితు = పరిచ్ఛేదములేనిదే అని; తత్ = ఆ సద్రూప మయిన స్ఫురణమును; నీవు, విద్ధి = ఎఱుంగుము. అది యేది యనఁగా, యేన = ఏకమును నిత్యమును విభువు నగు ఏసద్రూప స్ఫురణముచేత; సర్వమ్ = సమస్త మయిన; ఇదమ్ = సొంతముగా సత్తాస్ఫూర్తులు లేనట్టి యీదృశ్యప్రపంచము; తతమ్ = వ్యాపింపఁబడినదో, రజ్జువుచే సర్పధారాదికమువలెఁ దన సత్తాస్ఫురణముల యధ్యాసముచేఁ దనయందు సమావేశిత మయ్యెనో, దానిని అవినాశినిగానే యెఱుంగు మని యర్థము. ఎందువలన ననఁగా, వినాశమ్ = పరిచ్ఛేదమును; అవ్యయస్య = అపరిచ్ఛిన్న మయిన; అస్య = ఈ, అపరోక్షమును సర్వానుస్యూతము నగు స్ఫురణరూప మయిన సత్తునకు; కశ్చిత్ = ఏదియు, ఆశ్రయముగాని విషయముగాని ఇంద్రియ సన్నికర్షాదిరూప మయిన హేతువుగాని; కర్తుమ్ = చేయుటకు; నార్హతి = సమర్థము కాదు, ఏల యనఁగా కల్పితము అకల్పితమున కెట్లు పరిచ్ఛేదము చేయఁ జాలును? పరిచ్ఛేదము ఆరోపితమాత్రమె యన్నచో ఇష్టాపత్తి. నేను ఘటము నెఱుంగుచున్నా ననుచోట అహంకారము ఆశ్రయముగాను ఘటము విషయముగాను భాసిల్లుచున్నది. ఉత్పత్తివినాశవంత మగు ఒకానొక అహంకారవృత్తియో సర్వవ్యాపక మయిన సద్రూపస్ఫురణమునకు వ్యంజకము. అట్లు ఆత్మమనస్సంయోగము జ్ఞానహేతు వని తార్కి.

---

* భ్రాంతి కల్పితము.

† జ్ఞా అవబోధనే అను ధాతువుయొక్క అర్థము.

కులుగూడ అంగీకరించెదను. ఆ యహంకారవృత్తియొక్క యుత్పత్తివినాశముల చేతనె తదుపహిత మయిన స్ఫురణరూపసత్తునం దుత్పత్తివినాశప్రతీతి యుపపన్న మగుటవలన ఏక మగు సద్రూపస్ఫురణమునకు స్వతఉత్పత్తివినాశములు కల్పించుట యనవసరము, ధ్వన్యవచ్ఛేదముచే శబ్దమునకును ఘటాద్యవచ్ఛేదముచే ఆకాశమునకునుంబోలె *. అహంకారమో ఆ స్ఫురణమందు అధ్యస్త మయిన ద్వైతను దాని కాశ్రయముగాఁ దోఁచుచున్నది, దానియందు అహంకారవృత్తి తాదాత్మ్య మధ్యస్త మగుటవలన. ఏల యనఁగా సుషుప్తియం దహంకారము లేకున్నను తద్వాసనావాసిత మయిన అజ్ఞానమును భాసిల్లఁ జేయునట్టి చైతన్యమునకు స్వతస్స్ఫురణము కలదు. లేనియెడ 'ఇంతకాలము నే నేమియుఁ దెలియకుంటిని' అని సుప్తోత్థితునకు ♦ స్మృతి కలుగక పోవలయును. ఇది జ్ఞానాభావానుమితి యని చెప్ప శక్యము గాదు. ఏల యనఁగా సుషుప్తికాలము అనుపక్షముయొక్క జ్ఞానము లేదు, లింగముగూడ సంభవింపదు, అస్మరణాదికము వ్యభిచారి యగుటవలన స్మరణ జనకము కానట్టి నిర్వికల్పకాదుల యభావమునకు సాధకము కాఁజాలదు, జ్ఞానసామగ్రి లే దనుటయోం అన్యోన్యాశ్రయదోషగ్రస్తము. మఱియు 'యద్వైతన్నపశ్యతి పశ్యన్వై తద్ద్రష్టవ్యం నపశ్యతి నహి ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్' ¶ ఇత్యాదిశ్రుతి నిత్య మగుటచే స్వప్రకాశస్ఫురణము సుషుప్తియందుఁ గల దని తెలుపుచున్నది. ఇట్లు ఘటాదివిషయముగూడ తదజ్ఞాతావస్థాభాసక మయిన స్ఫురణమునందుఁ గల్పితము. 'ఏది మున్ను తెలియ కుండెనో అదియే యిప్పుడు నాచే నెఱుంగఁబడినది' అని ప్రత్యభిజ్ఞ కలుగుటవలన. ప్రామాణ్య మనఁగా అజ్ఞాతజ్ఞాపకత్వము § అని సర్వశాస్త్రసిద్ధాంతము గదా! యథార్థానుభవము ప్రమ యని ప్రమాణలక్షణమునందు జ్ఞాత జ్ఞాపక $ మైన

---

* ఎట్లు ధ్వనుల ఉత్పత్తినాశములచేతనే తదవచ్ఛిన్న మయిన శబ్దమునందలి యుత్పత్తివినాశ ప్రతీతి యుపపన్న మగుటచే శబ్దమునకు స్వతఉత్పత్తివినాశములు చెప్పరో, ఎట్లు ఘటాదుల యుత్పత్తి వినాశములచేతనే తదవచ్ఛిన్న మయిన ఆకాశమునందలి యుత్పత్తివినాశప్రతీతి యుపపన్న మగుటచే ఆకాశమునకు స్వతఉత్పత్తివినాశములు చెప్పరో అట్లు.

♦ నిదురించి లేచినవానికి.

¶ దానిఁ దెలియకున్నాఁ డనుట యేది గలదో అది తెలియుచునే తెలియవలసినదానిఁ దెలియకున్నాఁడు. ఏల యనఁగా ద్రష్టయొక్క దృష్టికి లోపము కలుగదు, అవినాశి యగుటవలన.

§ తెలియఁబడనిదాని తెలుపుట.

$ తెలియఁబడినదానిఁ దెలుపునది.

స్మృతికి వ్యావర్తక మగు అనుభవపదముఁ బ్రయోగించుచున్న తార్కికులు గూడ దీని నంగీకరించుచున్నారు. ఘటాదికముయొక్క అజ్ఞాతత్వమో చక్షురాదులచే గ్రహింపఁబడునది కాదు, అందుఁ జక్షురాదికము అసమర్థ మగుటవలనను, లేనియెడ ఘటాదిజ్ఞానానంతరము గూడ త దజ్ఞానానువృత్తి ప్రసంగమువలనను. అనుమానముచేతనుగూడ గ్రహింపఁబడదు, హేతువు లే కుండుటవలన. ఇప్పుడు జ్ఞాత మగుట యను హేతువుచే మున్ను అజ్ఞాత మగుట ననుమానింప శక్యము గాదు గదా! హేతువునకు ధారావాహికజ్ఞానవిషయమున వ్యభిచారము గలుగుటవలన *. ఇఁక, ఇప్పుడుమాత్రమే జ్ఞాతము అనఁగా మున్ను అజ్ఞాత మయి యిప్పుడు జ్ఞాతము అని యర్థము. అది హేతు వన్నయెడ, సాధ్యముకన్న అభిన్న మగుటవలన అది యసిద్ధము. మఱియు అజ్ఞాతావస్థాజ్ఞాన మున్నంగాని జ్ఞానమునకు ఘటాదికము హేతు వని గ్రహింప శక్యము గాదు, హేతువు పూర్వవర్తియయి గదా యుండవలెను. అజ్ఞాతావస్థాజ్ఞానము లేదన్న చో 'ఘటము నెఱుంగను' అను సార్వలౌకిక మయిన అనుభవమునకు విరోధ మగును. అందువలన అజ్ఞాత మయిన స్ఫురణము భాసమానమై తనయం దధ్యస్త మయిన ఘటాదికమును భాసిల్లంజేయుచున్నది. ఇట్లు ఘటాదులు అజ్ఞాత మయిన స్ఫురణమునందుఁ గల్పితము లనుట సిద్ధము. కానిచో ఘటాదులు జడము లగుటచే అజ్ఞాతత్వము తద్భానము అనుపపన్నము లగును. స్ఫురణము తనయం దధ్యస్త మయిన యజ్ఞానముచేతనే అజ్ఞాత మగు నని తానే భగవంతుఁడు చెప్పఁబోవుచున్నాఁడు. 'అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః' అని. ఇందుచే విభుత్వము సిద్ధము. అట్లు శ్రుతి 'మహద్భూత మనన్త మపారం విజ్ఞాన ఘన ఏవ' అనియు, 'సత్యం జ్ఞాన మనన్తమ్' అనియు, జ్ఞానమునకు మహత్త్వమును అనంతత్వమును దెలుపుచున్నది. మహత్త్వ మనఁగా స్వాధ్యస్త సర్వసంబంధిత్వము ♦, అనంతత్వ మనఁగా త్రివిధపరిచ్ఛేదశూన్యత్వము అని వివేకము. ఇందుచే శూన్యవాదముగూడ నిరాకృతము, ఏల యనఁగా అధిష్ఠానము లేక భ్రమ సంభవింపదు, అవధి లేక బాధ సంభవింపదు. అట్లు శ్రుతి 'పురుషా న్నపరం కించి త్సాకాష్ఠా సాపరాగతిః' ❡ అని సర్వబాధలకును అవధి

* ఒక్కటే విషయమును గూర్చిన వృత్తిపరంపర ధారావాహికజ్ఞాన మనఁబడును. దాని విషయము పూర్వము జ్ఞాత మగుటవలన ఇప్పుడు జ్ఞాత మగుట యను హేతువున కందు వ్యభిచారము.

♦ తనయం దధ్యస్తము లైన సర్వపదార్థముల సంబంధము గల దగుట.

❡ పురుషునికన్నఁ బర మేదియు లేదు, అది హద్దు, అది పర మయిన గతి.

గాఁ బురుషుఁడు శేషించు నని చెప్పుచున్నది. భాష్యకారులచేతనుం జెప్పఁబడినది 'సర్వం వినశ్య ద్వస్తు జాతం పురుషాన్తం వినశ్యతి. పురుషో వినాశ హేత్వ భావా న్న వినశ్యతి' * అని. ఇందుచే క్షణికవాదముగూడ నిరాకృతము, అబాధిత మయిన ప్రత్యభిజ్ఞ గలుగుటవలనను ఒకరు చూచినదాని మఱియొకరు స్మరించుట మొద లగునవి యనుపపన్నము లగుటవలనను. కావున, ఏకంబును సర్వానుస్యూతంబును స్వప్రకాశస్ఫురణరూపంబు నగు సత్తు సర్వప్రకారములచేతను బరిచ్ఛేదశూన్యం బగుటవలన ఉపపన్నము 'నాభావో విద్యతే ఽసతః' అనుట.

శ్రీ. అందు సత్స్వభావము అవినాశి యగు వస్తువు సామాన్యముగాఁ జెప్పఁబడినది. విశేషించి చూపుచున్నాఁడు.—యేన, సర్వమ్, ఇదమ్ = ఆగమా పాయములు స్వభావముగాఁ గల యీ దేహాదికము, తతమ్ = తత్సాక్షి యగుటచే వ్యాపింపఁబడినదో. తత్ తు = అట్టి యాత్మస్వరూపమును మాత్రము, అవినాశి = వినాశశూన్యమునుగా, విద్ధి = ఎఱుంగుము. అందుకు హేతువుఁ జెప్పుచున్నాఁడు వినాశ మిత్యాదిగా.

ప. పై చెప్పిన యుక్తిచే సిద్ధమగు నర్థముఁ జెప్పుచున్నాఁడు.—తత్ =ఆవస్తువును, తు—సత్యముగా, అవినాశి = వినాశము లేనిదానిఁగా, విద్ధి = ఎఱుంగుము. అది యేది యనఁగా. యేన = అధ్యాసమునకు అధిష్ఠాన మయిన దేనిచేత, సర్వమ్, ఇదమ్ = దృశ్యసమూహము, తతమ్ = విస్తారముఁ బొందినదో, సత్య మయిన యధిష్ఠానము లేక అసత్యము భాసిల్లదు గదా ! శుక్తి లేనిచో రజత మెట్లు భాసిల్లును ? అని యర్థము. కావున, అవ్యయస్య, అస్య, వినాశమ్, ఎవ్వఁడు చేయఁ జాలును ? ఎవ్వఁడును జేయఁ జాలఁ డని యర్థము.

రా. ఆత్మమాత్రము వినాశరహితుఁ డనుట యెట్లు తెలియవచ్చు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—యేన=ఏ చేతన మయిన ఆత్మతత్త్వముచేత; ఇదమ్= ఈ అచేతన తత్త్వము; సర్వమ్ = సమస్తమును; తతమ్ = వ్యాపింపఁబడినదో; తత్ తు = ఆ ఆత్మతత్త్వమునుమాత్రము; అవినాశి= వినాశము లేనిదానిఁగా; విద్ధి= ఎఱుంగుము. వ్యాపకుఁ డగుటచే నిరతిశయసూక్ష్ముఁ డగుటవలన, అవ్యయస్య = నాశమునకు అశక్య మయిన; అస్య = ఈ యాత్మకు; కశ్చిత్ = తద్వ్యతిరిక్త మయిన ఏపదార్థముగూడ;

* నశించునట్టి సమస్తవస్తుసమూహంబును బురుషునివఱకు నశించుచున్నవి. పురుషుఁడు వినాశహేతువు లేకుండుటవలన నశింపఁడు.

వినాశమ్ = నాశమును; కర్తుమ్ = చేయుటకు; నార్హతి = సమర్థము కాదు. ఏల యనఁగా అది ఆత్మవ్యాప్య మగుటచే ఆత్మకన్న స్థూల మగుటవలన. నాశక * మయిన శస్త్రజలాగ్నివాయ్వాదికము తాను నశింపఁజేయు పదార్థమును వ్యాపించి గదా శిథిలీకరించుచున్నది. ముద్గరాదులుగూడ వేగవంత మగు సంయోగముచే వాయువును బుట్టించి తద్ద్వారమునఁ గదా నశింపఁజేయుచున్నవి. అందువలన ఆత్మతత్త్వము అవినాశి.

ఆత్మతత్త్వము ఈ యచేతనతత్త్వమునంతయు వ్యాపించి యుండునది కావున వ్యాపకము నిరతిశయసూక్ష్మము అగుటవలన దానికి నాశము శక్యము కాదు. నాశజనక మయిన ఆయుధాదిపదార్థ మంతయు తాను నశింపఁ జేయవలసిన పదార్థమును వ్యాపించియే దానికి నాశము కల్గింపవలెను, ఆత్మ నిరతిశయసూక్ష్మఁము కావున స్థూల మయిన ఆత్మవ్యతిరిక్తపదార్థ మేదియు ఆత్మను వ్యాపింపఁ జాలదు, అందువలన ఆత్మకు ఏదియు నాశము కలిగింప సమర్థము గాదు. కావున ఆత్మతత్త్వము అవినాశి యని తెలియుము అని తాత్పర్యము.

మూ. అధిక మేల? ఏది దేశముచే అనంతమో అది నిత్యమే, అట్లు వేదము మొదలగునవి యితరపదార్థములుగూడ నిత్యములు గల వని చెప్పుచున్నారు.— యేన = దేనిచేత; ఇదమ్ = ఇది; సర్వమ్ = సమస్తమును; తతమ్ = వ్యాపింపఁబడినదో, దేశకృతపరిచ్ఛేదము లేనిదో; తత్ = అట్టి, వేదములు ఆకాశము మొదలగు దాని; అవినాశితు = నశించుస్వభావము లేనిదానిఁగానే, నిత్యమునుగానే. విద్ధి = ఎఱుంగుము. వీనికి శాపాదికముచేతఁగూడ వినాశము లే దని చెప్పుచున్నాఁడు— అవ్యయస్య = నాశము లేనట్టి; అస్య = ఈ వేదాదికమునకు; కశ్చిత్ = ఒకానొకఁడును; వినాశమ్ = నాశమును; కర్తుమ్ = చేయుటకు; నార్హతి = సమర్థుఁడు కాఁడు.

జీవుఁడు, ప్రకృతి, బ్రహ్మము ఇవిమాత్రమె కావు నిత్యములు, మఱే మనఁగా, దేశకృతపరిచ్ఛేదశూన్యము లయిన వేదాకాశాదులుగూడ నిత్యపదార్థములు కలవు. వీనికి స్వాభావిక మయిన నాశము లేదు సరే గదా? నైమిత్తిక మయిన నాశముగూడ వీనికి లేదు. ఏల యనఁగా ఇవి నాశము చేయ శక్యము గానివి, కావున శాపము మొదలగువానిచేత వీనికి నాశము కలిగింప నెవ్వరికిని శక్యము కా దని వేఱుగా చెప్పవలెనా యేమి? అని తాత్పర్యము.

---

* నశింపఁ జేయునది.

అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః
అనాశినో ఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత. ౧౮

భా. ఏదయ్యా ఆ అసత్తు, స్వాత్మసత్తను వ్యభిచరించుచున్న దని చెప్పితివే? చెప్పెదము.—అన్తవన్తః— అంతము వినాశము గల, ఎట్లనఁగా మృగతృష్ణికాదులందు అనువృత్త మయిన సద్బుద్ధి ప్రమాణ నిరూపణాంతమున విచ్ఛిన్న మగుచున్నది, అది ఆ సద్బుద్ధికి అంతము, అట్లు, ఇమే దేహాః=ఈ దేహములు, స్వప్నమాయాదేహాదులవలెఁగూడ అంతవంతములు. నిత్యస్య = నిత్యుఁడును; శరీరిణః = దేహముగలవాఁడును; అనాశినః = నాశము లేనివాఁడును; అప్రమేయస్య = అప్రమేయుండు నగు ఆత్మయొక్క; ఇమేదేహాః = ఈ దేహములు; అన్తవన్తః = నాశము గలవి యని; ఉక్తాః=చెప్పఁబడినవి, వివేకులచేత నని యర్థము. నిత్యస్య అనాశినః అని పౌనరుక్త్యము * లేదు, లోకమునందు నిత్యత్వము రెండువిధము లగుటవలన. అట్లు నాశముగూడ రెండువిధములు. ఎట్లనఁగా దేహము భస్మీభూత మయి అదర్శనము నొందిన నప్పుడు అది నష్ట మని చెప్పఁబడుచున్నది. మఱియు ఉన్నదయ్యును వ్యాధ్యాదియుక్తమై వేఱువిధముగాఁ బరిణమించినప్పుడును నష్ట మని చెప్పఁబడుచున్నది. అందు అనాశినః నిత్యస్య అనుటకు రెండువిధములైన నాశముతోను సంబంధములే దాత్మ కని యర్థము. లేనిచో ఆత్మ నిత్యత్వము పృథివ్యాదులనిత్యత్వమువంటి దనిగూడ యేర్పడును. అట్లు కారా దని 'నిత్యస్య అనాశినః' అని చెప్పుచున్నారు. అప్రమేయస్య = ప్రమేయుఁడు కానివానికి, ప్రత్యక్షాదిప్రమాణములచే అపరిచ్ఛేద్యున కని యర్థము.

ఆక్షేపము.—ఓయీ! ఆగమముచే ♦ ఆత్మపరిచ్ఛిన్నుఁ ¶ డగుచున్నాఁడు, ప్రత్యక్షాదికము చేతఁగూడఁ బరిచ్ఛిన్నుఁ డగుచున్నాఁడు.

సమాధానము.—కాదు. మున్నె ఆత్మ స్వతస్సిద్ధుఁ డగుటవలన, ప్రమాత యగు తాను సిద్ధుఁ డైనంగదా ప్రమిత్సువునకు § ప్రమాణా

* పునరుక్తభావము, చెప్పినదానినే మరలఁ జెప్పుట.

♦ వేదముచే.

¶ తెలియఁబడినవాఁడు.

§ ప్రమాణముచే దెలియఁ గోరువానికి.

న్వేషణ కలుగును. ఏల యనఁగా ప్రమాణముచేఁ బ్రమేయముఁ దెలియఁ గోరువాఁడు మొదట నిత్యుఁడు అవిక్రియుఁడు నగు ఆత్మను నే నని తన్నుఁ బ్రమాణముచేఁ దెలిసికొని యటుపిమ్మటనా ప్రమేయముఁ బరిచ్ఛేదించుటకుఁ బ్రవర్తించుచున్నాఁడు? కాఁడు. తాను అనువాఁ డెవ్వనికిని అప్రసిద్ధుఁడు కాఁడు గదా! అంత్యప్రమాణ మయిన శాస్త్రమో అతద్ధర్మాధ్యారోపణమాత్రనివర్తక మగుటచే ఆత్మకుఁ బ్రమాణ మగుచున్నది, కాని అజ్ఞాతార్థజ్ఞాపక మగుటచేఁ గాదు. అట్లు శ్రుతి చెప్పుచున్నది 'యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ య ఆత్మా సర్వాన్తరః' అని. ఎందువలన ఇట్లు ఆత్మ నిత్యుఁడును అవిక్రియుఁడు నగుచున్నాఁడో, తస్మాత్= అందువలన, భారత=అర్జునా! యుధ్యస్వ=యుద్ధము చేయుము, యుద్ధము నుండి యుపరమింప వల దని యర్థము. ఏల యనఁగా ఇచట యుద్ధము కర్తవ్య మని విధింపఁబడదు. యుద్ధమునందుఁ బ్రవృత్తుఁడై యే గదా యితండు శోకమోహములచేఁ బ్రతిబంధింపఁబడినవాఁడై యూరక యున్నవాఁడు. కావున, అతనికి యుద్ధప్రతిబంధమును దొలఁగించుట మాత్రమె భగవంతునిచేఁ జేయఁబడుచున్నది. అందువలన యుధ్యస్వ అనునది యనువాద * మాత్రమే కాని విధి కాదు.

ఈ యాత్మ నిత్యుఁడు నాశరహితుఁడు ప్రత్యక్షాదిసర్వప్రమాణముల చేతను అప్రమేయుఁడు, అట్టి యాత్మయొక్క ఈ దేహములు నశ్వరములే కాని నిత్యములు కా వని వివేకులు చెప్పెదరు. కావున, అర్జునా! యుద్ధమునుండి యుపరమింప వలదు అని తాత్పర్యము.

అ. అనంతరప్రకృతములైన † సదసత్తులలో, స్వరూపమునకు వ్యభిచారము లేకుండుటచేఁ బరమార్థ మని సత్తు నిర్ధారింపఁబడినది. ఇప్పుడు అసత్తును నిర్ధారించుటకై ప్రశ్న చేయుచున్నారు.—ఏది ఇత్యాదిగా. అది యసత్తే యని నిర్ధారిత మగుటవలన ప్రశ్న కవకాశము లే దని యాశంకించి, శూన్యమునకు భిన్నముగా వివక్షిత మయిన యసత్తు నిర్ధారించుటకై ప్రశ్న కవకాశము కల దని చెప్పుచున్నారు స్వాత్మసత్తను ఇత్యాదిగా. దేహాదిక మగు అనాత్మవర్గము ఈ యస

* సిద్ధ మయిన యర్థము చెప్పుట.

† అంతరము—వ్యవధానము లేక ప్రకృతములైన, సదసత్తులు ఒకటివెంబడి ఒకటి ప్రకృతములు అని యర్థము.

చ్ఛబ్దమునకు విషయ మని చెప్పుచున్నారు చెప్పెదము అని. ఆదేహములకు స్వాతంత్ర్యమును నిరాకరించుచున్నాఁడు నిత్యస్య అని. ఆకాశాదివ్యావృత్తికొఱకు విశేషణము చెప్పుచున్నాఁడు శరీరిణః అని. పరిణామినిత్యత్వమును వ్యవచ్ఛేదించుచున్నారు అనాశినః అని. ప్రత్యక్షాదులకు విషయము కా దని చెప్పుచున్నాఁడు అప్రమేయస్య అని. దేహాదులు వస్తువులు కానందువలనను ఆత్మ ఏకరూపుఁ డగుటవలనను స్వధర్మ మగు యుద్ధమునందు ప్రవృత్తుఁడ వైనను నీకు హింసాదిదోషము సంభవింప దని చెప్పుచున్నారు తస్మాత్ అని *. ఓయీ! దేహాదులందు సద్బుద్ధి యనువృత్త మగుటచే ఆ సద్బుద్ధికి విచ్ఛేదము లేకుండుటవలన ఎట్లు అంతవత్త్వము వాని కంగీకరింపవచ్చును? అందుకుఁ జెప్పుచున్నారు ఎట్లనఁగా ఇత్యాదిగా. అట్టి దేహములు సద్బుద్ధియుక్తము లయినను ప్రమాణముచే నిరూపించినచో తుదను సద్బుద్ధి విచ్ఛిన్న మగుటవలన అంతవంతము లగుచున్న వని శేషము. దేహత్వాదిహేతువుచే జాగ్రద్దేహాదులకు సంప్రతిపన్నమునకువలె అంతవత్త్వ మనుమానింపవచ్చు నని చెప్పుచున్నారు స్వప్నమాయాదేహాదులవలె నని. శరీరాదికము అంతవంత మయినను ప్రవాహరూపమున ఆత్మకుఁ గల తచ్ఛరీరాదిసంబంధము అంతవంతము గా దని యాశంకించి సమాధానముగాఁ జెప్పుచున్నారు నిత్యస్య అని. ప్రవాహి లేక ప్రవాహము సిద్ధింపదు కావున దేహాదులు లేనియప్పుడు ప్రవాహరూపమునఁ దత్సంబంధము సిద్ధింపదను నభిప్రాయముతోఁ జెప్పుచున్నారు వివేకులచేత నని. రెండుపదము లేకార్థములని యాశంకించి నిరసించుచున్నారు నిత్య స్యేత్యాదిగా. నిత్యత్వము రెండువిధము లనుట సిద్ధించుటకు నాశము రెండువిధము లని ప్రతిజ్ఞ చేసినదానిని ప్రకటించుచున్నారు ఎట్లనఁగా ఇత్యాదిగా. నాశము సావశేష మని నిరవశేష మని రెండు విధము లనుట సిద్ధ మగుటచే ఫలితముఁ జెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. రెండు విశేషణములచే కూటస్థనిత్యత్వ మాత్మకు వివక్షిత మని యర్థము. రెంటిలో నొకవిశేషణము మాత్రమె చెప్పినయెడ ఆత్మకుఁ బరిణామినిత్యత్వము అను శంక సంభవించు నని యాశంకించి చెప్పుచున్నారు లేనిచో ఇత్యాదిగా.

ఔపనిషదుఁడు ♦ అను విశేషణము నాశ్రయించి యప్రమేయత్వము నాక్షేపించుచున్నాఁడు ఓయి ఇత్యాదిగా. ఇందువలనఁగూడ ఆత్మకు అప్రమేయత్వము లేదని చెప్పుచున్నాఁడు ప్రత్యక్షాదికముచేత ఇత్యాదిగా. ప్రత్యక్షాదికముచే

* మూలమునందు.

♦ ఉపనిషత్ప్రతిపాదితుఁడు.

అగమప్రవృత్తికిఁ బూర్వావస్థయందు ఆత్మయే పరిచ్ఛిన్నుఁ డగుచున్నాఁడు, ఏల యనఁగా అతనియందే యజ్ఞాతత్వము సంభవించును, అజ్ఞాతజ్ఞాపకము ప్రమాణ మని ప్రమాణలక్షణము అని యర్థము.

ఈ యాశంకను అప్రమేయ మిత్యాది శ్రుతి ననుసరించి పరిహరించుచున్నారు కాదు ఇత్యాదిగా. ఎట్లు ప్రమాణము లేకయె యాత్మ సిద్ధించు నని యాశంకించి ఉక్తార్థము వివరించుచున్నారు ప్రమాత యగు తాను ఇత్యాదిగా. ప్రమిత్సువునకు—ప్రమేయము నని యధ్యాహార్యము. దానిని వ్యతిరేకరీతిచే విశదీకరించుచున్నారు. ఏల యనఁగా ఇత్యాదిగా; ఆత్మ సర్వలోకప్రసిద్ధుఁ డగుట వలనఁగూడ అతని విషయమయి ప్రమాణాపేక్ష లే దని చెప్పుచున్నారు తాను అనువాఁడు ఇత్యాదిగా. ప్రత్యక్షాదికము అనాత్మ విషయ మగుటవలనను అందు అజ్ఞాతజ్ఞాపకత్వమునకు వ్యవహారము సంభవించుటవలనను తత్ప్రామాణ్యము వ్యావహారిక మగుటవలనను విశిష్టమునందు దానికిఁ బ్రవృత్తి యున్నను కేవలమునందుఁ బ్రవృత్తి లేకుండుటవలనను దానికి ఆత్మవిషయమయి ప్రామాణ్యము లే దనుట సరే. అయినను తద్ధితశ్రుతిచే * శాస్త్రమునకు ఆత్మవిషయమయి ప్రవృత్తి యవశ్య మంగీకరింపవలె నని యాశంకించి చెప్పుచున్నారు అంత్యప్రమాణము ఇత్యాదిగా. శాస్త్రముచే ప్రత్యగభిన్న మయిన బ్రహ్మము బోధింపంబడఁగాఁ బ్రమాత్రాదివిభాగము ఉచ్ఛిన్న మగుం గావున దీని కంత్యత్వంబును † అపౌరుషేయ మగుటచే నిర్దోష మగుటవలనఁగూడ బ్రామాణ్యంబును యుక్తము లని యర్థము. అట్లయినను ఎట్లు దీనికిఁ బ్రత్యగాత్మవిషయమునఁ బ్రామాణ్యము? ప్రత్యగాత్మ స్వతస్సిద్ధుఁ డగుటచే అవిషయ మగుటవలన అజ్ఞాతజ్ఞాపనము సంభవింపదే అని యాశంకించి ప్రత్యగాత్మ స్వావభాసమానుఁడైనను లోకప్రతీతియందు 'మనుష్యుఁడను నేను, కర్తను నేను' ఇత్యాదిగా మనుష్యకర్తృత్వాదు లగు అతద్ధర్మములు ‡ అధ్యారోపముచే ఆత్మయందుఁ బ్రతీయమానము లగుటవలన వానిమాత్రము నివర్తించుటచే, ఆత్మను విషయముగాఁ జేయకయె శాస్త్రము ప్రామాణ్యముఁ బొందు

* తద్ధితప్రత్యయాంత మగు ఔపనిషదశబ్దము గల శ్రుతిచే—ఔపనిషదుఁడు= ఉపనిషత్ప్రతిపాదితుఁడు అని చెప్పు శ్రుతిచే.

† కడపటి ప్రమాణ మగుట.

‡ అతత్= అది కానిదానియొక్క, ఆత్మకాని దానియొక్క, అనాత్మయొక్క యనుట, ధర్మములు.

చున్నది ‘సిద్ధంతు నివర్తకత్వాత్’ * అను న్యాయమువలన నని చెప్పుచున్నారు అతద్ధర్మేత్యాదిగా ¶. ఘటాదివిషయమునందుంబోలె స్ఫురణాతిశయజనక మగుటచే ఆత్మవిషయమున శాస్త్రమునకుఁ బ్రామాణ్య మెందు కంగీకరింపరు? అని యాశంకించి ఘటాదికము జడము ఆత్మ అజడము అను విశేష ముండుటవలన అట్లు కా దను నాశయముచేఁ జెప్పుచున్నారు కాని యజ్ఞాతార్థజ్ఞాపక ♦ మగుటచేఁ గా దని. బ్రహ్మరూపాత్మ ప్రమాణాపేక్ష లేక స్వతస్స్ఫురణము గల దనుటకుఁ బ్రమాణము చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. సాక్షాత్=ఇతరాపేక్ష లేకయె, అపరోక్షాత్=అపరోక్షస్ఫురణాత్మకమైన, యత్ బ్రహ్మ=ఏ బ్రహ్మము గలదో, అది ఆత్మకన్న అర్థాంతరము కాదు, ఏల యనఁగా, సర్వాన్తరః=సమస్తమునకును అభ్యంతరము § అగుటచే సర్వవస్తుసార మగుటవలన, అది యాత్మ యని చెప్పుచున్నా రని యోజన. అప్రమేయుఁ డగుటచే అవినాశి యని ప్రతిపాదించి ఫలితము నుపసంహరించుచున్నారు ఎందువలన ఇత్యాదిగా. స్వధర్మమునుండి నివర్తిల్లుటకు హేతు వగు దాని నిషేధించుట తాత్పర్య మని చూపుచున్నారు యుద్ధమునుండి ఇత్యాదిగా. ఆత్మయొక్క నిత్యత్వాదిస్వరూపము నుపపాదించి యుద్ధము కర్తవ్య మని విధించుటవలన ఇందు జ్ఞానకర్మసముచ్చయాంగీకారము తోఁచుచున్న దని యాశంకించి సమాధానము చెప్పుచున్నారు ఏల యనఁగా ఇత్యాదిగా. యుధ్యస్వ అని చెప్పుటవలన తత్ప్రవర్తక మయిన విధి కల దని యాశంకించి సమాధానము చెప్పుచున్నారు యుద్ధమునందు ఇత్యాదిగా. అట్లయినయెడ అర్జునుఁడు యుద్ధోపరమపర మయిన ‘కథం భీష్మ మహం సఙ్ఖ్యే’ ఇత్యాదివాక్యము నెట్లు పలికెను? అందుకుఁ జెప్పుచున్నారు శోకమోహములచేఁ బ్రతిబంధింపఁబడినవాఁడై యని. అర్జునుఁడు తానై యె యుద్ధమునందుఁ బ్రవృత్తుఁ డన్నచో భగవద్వచనమున కేమి ప్రయోజనము? అని యాశంకించి చెప్పుచున్నారు అతనికి ఇత్యాదిగా. భగవద్వచనము ప్రతిబంధనివర్తక మనియు అర్జునప్రవృత్తి స్వాభావిక మనియు ఏర్పడుటచే ఫలితము చెప్పుచున్నారు అందువలన ఇత్యాదిగా.

---

* సిద్ధమునో అతద్ధర్మనివర్తక మగుటవలనఁ దెలుపును.

¶ ఆత్మ కానిదానియొక్క ధర్మముల యధ్యారోపణమును మాత్రమె తొలఁగించునది.

♦ తెలియనివిషయమును దెలుపునది.

§ లోపలిది వ్యాపక మనుట.

హ॰ ఏది యాత్మసత్తను వ్యభిచరించుచున్నదో ఆ యసత్తేది యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అంతము—నాశము కలవి యంతవంతములు, ఎట్లనఁగా, మృగతృష్ణికాదులయందు అనువృత్తమయినసద్బుద్ధి ప్రమాణనిరూపణమువలన విచ్ఛిన్నమగును, ఆవిచ్ఛిత్తి దాని కంతమనఁబడును. అట్లు ఈ దేహములు స్వప్నదేహాదులవలె అట్టి అంతము కలవి; నిత్యస్య, శరీరిణః = శరీరము గలవాఁడును, అనాశి అప్రమేయుఁడు నగు ఆత్మయొక్క, యీదేహములు, అంతవంతము లని, ఉక్తాః = చెప్పఁబడినవి పండితు లను బ్రహ్మవేత్తలచేత నని యర్థము. అప్రమేయస్య = ప్రత్యక్షాదిప్రమాణములచేఁ బరిచ్ఛేదింపరానివాఁడు, ఏల యనఁగా ఆత్మ ప్రమాణములచేఁ బరిచ్ఛేదింపఁబడువాఁడు కాఁడు. అట్లు శ్రుతి 'యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ' అని. ఇట్లు ఆత్మ నిత్యుఁడును అపరిచ్ఛేద్యుఁడును కావున, యుధ్యస్వ—యుద్ధమునుండి యుపరమింపకు మని యర్థము. ఏల యనఁగా, ఇచట యుద్ధము కర్తవ్యముగా విధింపఁబడదు. యుద్ధమునందుఁ బ్రవృత్తుఁడై యే యితఁడు మోహముచేఁ బ్రతిబంధింపఁబడినవాఁడై యూరకున్నాఁడు. అతని కాప్రతిబంధముఁ దొలఁగించుచున్నాఁడు భగవంతుఁడు. కావున యుధ్యస్వ అనునది యనువాదమాత్రమె కాని విధి కాదు.

శం॰ 'అశోచ్యా నన్వశోచ స్త్వమ్' అను శ్లోకమునందు, "త్వంపదవాచ్యార్థ మయిన దేహాదికము జన్మాదులు కల దగుటచే అనిత్యము, కావున శోచ్యము కాదు. త్వంపదలక్ష్యార్థ మయిన ఆత్మయూ అజుఁ డగుటచే జన్మాదిశూన్యుఁడు నిత్యుఁడు, కావున ఆత్మగూడ శోచ్యుఁడు కాఁడు." అని దేహాత్మలు శోచ్యులు కా రనుటకు అనిత్యత్వమును నిత్యత్వమును కారణముగా సూచింపఁబడినది. దాని నిప్పుడు కంఠోక్తిచే స్పష్టీకరించుచు, అందుచే అర్జునుని శోకము నివృత్తమయ్యె నని యెఱింగి, యతం డేకార్యమునందు తనకుఁ దానే మున్ను ప్రవృత్తుఁ డయ్యెనో ఆకార్యమునందే యతనిఁ బ్రోత్సాహపఱచుచున్నాఁడు శ్రీ భగవంతుఁడు.—అప్రమేయస్య= ప్రత్యక్షాదిప్రమాణములచేఁ దెలియరానివాఁడు, ఏల యనఁగా ఆత్మ ప్రత్యక్షాది ప్రమాణములకు విషయము కాఁడు. ఎట్లనఁగా, ఆత్మ ప్రత్యక్షమునకు విషయము కాఁడు శబ్దాదిరహితుఁ డగుటవలన, అట్లు 'అశబ్ద మస్పర్శమ్' * అని శ్రుతి. అనుమానమునకును విషయము కాఁడు హేతువు లేమివలన, అట్లు 'నైవచ తస్యలిఙ్గమ్'♦

---

* శబ్దము లేనిది స్పర్శము లేనిది.

♦ ఆ బ్రహ్మమునకు హేతువు లేనే లేదు.

అని శ్రుతి. ఉపమానమునకును విషయము కాఁడు సాదృశ్యము లేమివలన, అట్లు 'హేతు దృష్టాన్త వర్జితమ్' ❨ అని శ్రుతి. శబ్దప్రమాణమునకును విషయము కాఁడు నామరూపజాత్యాదులు లేకుండుటవలన, అట్లు 'యత్త దద్రేశ్య మగ్రాహ్యమ్' అని శ్రుతి. ఓయీ! 'తం త్వౌపనిషదమ్' § అని శ్రుతి చెప్పుచుండఁగా శబ్దమునకు విషయము కాఁడనుట యెట్లు? అందువేని, సత్యము. అట్లు శ్రుతి చెప్పుచున్నను శబ్దప్రవృత్తికి నిమిత్తము లేమివలన ఆత్మవిషయమున శబ్దము ప్రవర్తింపదు. 'యతో వాచో నివర్తన్తే' * అని శ్రుతియే చెప్పుచున్నది. అట్లయినయెడ శ్రుతికి అప్రామాణ్యమగునందువా? అట్లు కాదు. ఆత్మ నిర్విశేషుఁడని దెలుపుట వలనఁ బ్రామాణ్యమున కుపపత్తి కలదు. శ్రుతి యాత్మయందధ్యస్తమగు నశేషవిశేషములను నిరసించుటచే అధిష్ఠానభూతుఁడు సన్మాత్రుఁడు నిర్విశేషుఁడగు ఆత్మను తెలుపుచున్నది. అందుచే దానికిఁ బ్రామాణ్య ముపపన్నము. ఆత్మ జ్ఞాతమయినను సవిశేష మని జ్ఞాతముకాని నిర్విశేష మని జ్ఞాతము కాదు. కావున అజ్ఞాతజ్ఞాపక మగుటచే శ్రుతికిఁ బ్రమాణలక్షణము సిద్ధించుచున్నది. అట్లయినను 'ఇది' యని సాక్షాన్నిర్దేశము చేయ నశక్య మగుటవలన ఆత్మ శ్రుతికిని అవిషయమే యగును. మఱియు ఆత్మవిషయమున అన్యథానుపపత్తి సంభవింపకుండుట వలన అర్థాపత్తికిని విషయము కాఁడు. భావపదార్థ మగుటవలన అనుపలబ్ధికిని విషయము కాఁడు. వాక్కునకు అవిషయ మగుటవలన ఐతిహ్యమునకును విషయము కాఁడు. ఇట్లు ఆత్మ యప్రమేయుఁడనుట సిద్ధము. సమస్తము లయిన ప్రమాణములకును బ్రమేయములకును దేనివలనఁ బ్రామాణ్యము సిద్ధించునో అట్టి యాత్మను ఏది తెలుపఁజాలును? అట్లు 'విజ్ఞాతార మరే కేన విజానీయాత్' ♦ అని శ్రుతి చెప్పుచున్నది. తనయందధ్యస్తము లయిన సర్వప్రమాణప్రమేయములయొక్క కలిమిలేములకును బ్రకాశకుఁడగుటవలనను స్వప్రకాశుఁడగుటవలనను ఆత్మ తనకుఁ దానే ప్రమాణము, కాని యతని కెప్పుడును ఇతరము ప్రమాణము కాఁజాలదు. అందువలననే అప్రమేయుఁడు, అట్టివాఁడును. అవినాశినః—వినాశ మనఁగా సత్తావిచ్ఛేదము లేక పరిచ్ఛేదము, అది యతనికి లేదు, కావున అవినాశి అనఁగా అసం

❨ హేతువును దృష్టాంతమును లేనిది.

§ ఉపనిషత్ప్రతిపాద్యుఁడైన ఆ యాత్మను.

* దేనినుండి వాక్కులు నివర్తించునో—దేనివిషయమున శబ్దప్రమాణము ప్రవర్తింపదో.

♦ ఎఱుఁగువానిని దేనిచే నెఱుఁగ నగును!

తుఁడు, అట్లు 'సత్యం జ్ఞాన మనన్తమ్' అని శ్రుతి,—అపరిచ్ఛిన్నుఁడు అనఁగా పరిపూర్ణుఁడైనవాఁడును. కావుననే, నిత్యస్య. ఓయీ! పరిచ్ఛిన్నమయినను బరమాణువు నిత్యము అందువేని అది సరి కాదు. ఏల యనఁగా పరమాణువు నిత్య మనుటకుఁ బ్రమాణములేదు. 'సర్వగతశ్చ నిత్యః' అనియు 'యో వై భూమా తదమృతమ్' ‡ అనియు శ్రుతి వచించుటవలన అపరిచ్ఛిన్న మయిన భూమపదార్థమే నిత్య మగుం గాని పరిచ్ఛిన్న మెప్పుడును నిత్యము కాఁ జాలదు. అట్లు 'యదల్పం తన్మర్త్యమ్' * అని శ్రుతి. శరీరిణః—బ్రహ్మదేవుఁడు మొదలుగా గడ్డిపోఁచవఱకుఁ గల శరీరములు ఉపలబ్ధి ♦ స్థానములుగా నితనికిఁ గలవు, కావున శరీరి—సమస్తప్రాణుల శరీరములును ఉపాధిగాఁ గలవాఁడు ఆత్మ యొక్కఁడే యనుట శ్రీ భగవద్వాక్యము ప్రమాణము, ఎట్లనఁగా, శరీరిణః అని యేకవచనముచేత ఆత్మ యొక్కఁడే యనియు ఇమే దేహాః అని బహువచనముచేత యిదం § శబ్దముచే నిర్దిశ్యమానము లగు దేహము లనేకము లనియుఁ జెప్పుచున్నాఁడు. శరీరిణః—సమస్తశరీరములందును నే నని తెలియఁబడుచున్న నిత్యుఁడైన యాత్మయొక్క; ఇమే = రెండుసేనల యందును గనఁబడుచున్న భీష్మాదిశబ్దవాచ్యు లగు; ఉక్తాః=ఆచార్యాః పితరః పుత్రాః ఇత్యాదిగా నీచేఁ జెప్పఁబడిన; దేహాః = దేహములు; అన్నియు; అన్తవన్తః—అంతమనఁగా నాశము అదర్శనము, అది కలవి, జన్మాదులు కల వగుటచేతను బ్రతీతిమాత్రమే యగుటచేతను నియత మయిన సత్త లేని వని యర్థము. శుక్తి రజతము వలె అధిష్ఠానమునందు భ్రమచేఁ గల్పితము లగు దేహాదులకుఁ, బ్రమాణముచే నిరూపించినచో, సత్త యెట్లు సంభవించును? అట్లు అసత్తునకు సత్త సంభవింపదని 'నాసతో విద్యతే భావః' అని నిరూపింపఁబడినది గదా! అందువలన నీ విట్లు దేహాదు లంతవంతము లనియు దేహి యగు ఆత్మ నిత్యుఁ డనియుఁ జక్కఁగా నెఱుంగనివాఁడ వగుటచే మున్ను నావారు వీరు మృతిఁ బొందెద రని శోకించితివి. ఇప్పుడో శ్రుతియుక్త్యనుభవములచే విచారింపఁగా ఆత్మయు దేహాదులును శోచ్యములు కా వనుట సిద్ధ మయ్యెను. నీకును దెలియవచ్చెను. తస్మాత్ = అందువలన; భారత = వివేకవిజ్ఞానసంపన్నుఁడా! యుధ్యస్వ—యుద్ధమునకు యత్నింపు మని

---

‡ ఏది భూమ—సర్వవ్యాపక మగునో అది యమృతము—నాశము లేనిది.

* ఏది యల్పమో—పరిచ్ఛిన్నమో అది నాశము గలది.

♦ సాక్షాత్కారమునకు.

§ ఈ అని.

పూర్వమే యుద్ధమునకుఁ బ్రవృత్తుఁడై భ్రాంతిచే శోకించుచున్న యర్జునుని తచ్ఛోకకారణముఁ దొలఁగించి స్వకార్యము చేయు మని భగవంతుం డనుజ్ఞ చేయుచున్నాఁడు, భోజనము సేయఁ గోరినవాఁడై సందేహపడి యున్నవానిని ఆ సందేహముఁ దొలఁగించి భుజింపు మన్నట్లు. కాని యుద్ధము చేయు మని నియోగించువాఁడు కాఁడు. ఏల యనఁగా జ్ఞానకాండమునందుఁ గర్మవిధి యెట్లుపయుక్తమగును? ‘నహి కర్మణి కర్మారమ్భః’ * అని కర్మమునందే మఱియొకకర్మము ఆరంభింపఁ దగ దని యేర్పడుచుండఁగా, ఇఁక కర్మమునకుఁ బ్రతిపక్ష మయిన జ్ఞానప్రకరణమునందుఁ గర్మవిధి యుక్తము కా దని చెప్పవలసిన దేమి? పోఁ దలఁచిన వానిఁ బొమ్మనునట్లు యుద్ధము చేయఁ దలఁచినవాని యుద్ధము చేయు మని యనుమతించుటయే భగవద్వచనమునకుఁ దాత్పర్యము. లేక, ‘ఏతం వై త మాత్మానం విదిత్వా బ్రాహ్మణా వ్యుత్థాయ భిక్షాచర్యం చరన్తి’ ♦ అను శ్రుతిచే బ్రహ్మవేత్తలయి సమస్తము లయిన యీషణలను విడిచిన బ్రాహ్మణులకు శరీరయాత్రకొఱకు భిక్షాచరణము విధింపఁబడుచున్నది, జ్ఞానులుగూడ అవశ్యము శరీరయాత్రయందు వర్తింపవలె నని. అట్లిచ్చట బ్రహ్మవేత్తలకు శరీరరక్షణ మవశ్యము కర్తవ్య మని సూచించుటకై, జ్ఞానప్రకరణమునందు ఆత్మజ్ఞాని యగు నర్జునుండు క్షత్త్రియుఁడును యౌవనవంతుఁడు నగుటచే సన్న్యాసమును వానప్రస్థమును ఇతని కనుపపన్నములనియు రాజయిన యితండు రాజ్యముచేతనే శరీరయాత్ర చేయవలె ననియుఁ దలఁచి, రాజ్యము శత్రువులచే నాక్రమింపఁబడియుండుటవలన దాని జయించుటకు యత్నింపు మని శరీరయాత్ర యిట భగవంతునిచే విధింపఁబడుచున్నది. అట్లు ‘శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః’ అని ముందు చెప్పఁబడును. అందువలన ఇచటఁ గర్మవిధి సంభవింప దని తలంపవలెను.

ప్ర. ఓయీ! స్ఫురణరూప మయిన సత్తు అవినాశి యగుట యెట్లు? అది దేహధర్మమే గదా! దేహమో ప్రతిక్షణము వినాశము గలదే యని భూతచైతన్యవాదులు ‡ చెప్పెదరు. వారి నిరాకరించుటకై ‘నాసతో విద్యతే భావః’ అనుటను వివరించుచున్నారు.—అన్తవన్తః = నాశముగల; ఇమే = ప్రత్యక్షము లయిన; దేహాః—వృద్ధిక్షయములు గల వగుటవలన శరీరములు, బహువచనమువలన స్థూలసూక్ష్మ

* కర్మమునందుఁ గర్మముయొక్క ఆరంభము కూడదు.

♦ ఇట్టి ఆ యాత్మను తెలిసి బ్రాహ్మణులు సన్న్యసించి భిక్షాచర్యము చరింతురు.

‡ చార్వాకులు.

కారణరూపములును విరాట్టుసూత్రము అవ్యాకృతము అను పేరు గలవియు సమష్టి వ్యష్టిరూపములు నగు దేహము లన్నియు; నిత్యస్య = అవినాశియే యగు; శరీరిణః= అధ్యాసకృత మయిన సంబంధముచే శరీరములు గలవాఁడు స్వప్రకాశస్ఫురణ రూపుఁ డగు ఒక్కఁడైన యాత్మయొక్క సంబంధులు ♦ దృశ్యము లగుటచేతను భోగ్యము లగుటచేతను అని; ఉక్తాః = చెప్పఁబడినవి శ్రుతులచేతను బ్రహ్మవేత్తల చేతను. అట్లు తైత్తిరీయకమునందు అన్నమయము మొదలు ఆనందమయమువఱకు అయిదుకోశములను గల్పించి వాని కధిష్ఠానము అకల్పితము 'బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా' అని చూపఁబడినది. అందుఁ బంచీకృత పంచమహాభూత తత్కార్యాత్మకము విరాట్టను పేరు గలది మూర్తరాశి యగు అన్నమయకోశము స్థూలసమష్టి. తత్కారణ మయినదియు అపంచీకృత పంచమహాభూత తత్కార్యాత్మకమును హిరణ్యగర్భసూత్రాఖ్యము నగు అమూర్తరాశి సూక్ష్మసమష్టి. అది 'త్రయంవా ఇదం నామరూపం కర్మ' అని బృహదారణ్యకమునందు త్ర్యాత్మకముగాఁ జెప్పఁబడినది. అందు సర్వకర్మాత్మక మగుటచేఁ గ్రియాశక్తిమాత్రమును గ్రహించి ప్రాణమయకోశము చెప్పఁబడినది. నామాత్మక మగుటచే జ్ఞానశక్తిమాత్రమును గ్రహించి మనోమయకోశము చెప్పఁబడినది. రూపాత్మక మగుటచే క్రియాజ్ఞానశక్తులు రెంటికిని ఆశ్రయ మగుటవలనఁ గర్తృత్వము గ్రహించి విజ్ఞానమయకోశము చెప్పఁబడినది. అందువలనఁ బ్రాణమయ మనోమయ విజ్ఞానమయములు మూఁడును జేరి హిరణ్యగర్భుఁ డను పేరుగల యొకలింగశరీరకోశ మగుచున్నవి. వానికిఁ గారణమై మాయోపహితచైతన్యాత్మక మయి సర్వసంస్కారశేషమై అవ్యాకృత మను పేరు గలది ఆనందమయకోశము. ఆకోశము లన్నియు ఒకఁడే యైన యాత్మకే శరీరము లని చెప్పఁబడినది 'తస్యైష ఏవ శారీర ఆత్మా యః పూర్వస్య' అను శ్రుతిచేత. తస్య = ఆప్రాణమయకోశమునకు, ఏషఏవ = ఇతఁడే, శారీరః = శరీరమునందున్న, ఆత్మా= ఆత్మ, ఇతఁ డెవ్వఁ డనఁగా, యః = సత్యజ్ఞానాదిలక్షణుఁడై గుహానిహితుఁడుగాఁ జెప్పఁబడిన ఎవఁడు, పూర్వస్య అన్నమయకోశమునకు, ఆత్మయో * ఇట్లు ప్రాణమయ మనోమయ విజ్ఞానమ యానందమయము లందును అన్వయింపవలెను. లేక; ఇమే దేహాః = త్రైలోక్యమున నుండు సర్వప్రాణుల దేహములును, ఒక్కఁడే యగు

♦ ఆత్మవి.

* అన్నమయకోశమునకు ఆత్మ యయిన సత్యజ్ఞానాదిలక్షణుఁడే ప్రాణమయమునకుఁగూడ ఆత్మ యని యర్థము.

ఆత్మవిగాఁ జెప్పఁబడినవి యని యన్వయము. అట్లు శ్రుతి "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా । కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" • అని నిత్యుఁడు విభువు అగు ఒక్కఁడే యాత్మ సర్వశరీరసంబంధి యని తెలుపుచున్నది. ఓయీ! నిత్యత్వ మనఁగా యావత్కాలావస్థాయిత్వము †. అట్లైన అవిద్యాదులవలె కాలముతోఁగూడ నాశము నొందునది యైనను నిత్యత్వ ముపపన్న మగును? అందుకుఁ జెప్పుచున్నారు అనాశినః అని. దేశముచేతను కాలముచేతను వస్తువుచేతను పరిచ్ఛిన్న మయిన యవిద్యాదికము కల్పిత మగుటచే అనిత్య మయినను, దానికి యావత్కాలావస్థాయిత్వరూప మగు ఔపచారిక మయిన నిత్యత్వము వ్యవహరింపఁబడుచున్నది. 'యావ ద్వికారంతు విభాగో లోకవత్' * అను న్యాయమువలన. త్రివిధపరిచ్ఛేదశూన్యుఁడు అకల్పితుఁడు నగుటచే ఆత్మకు వినాశహేతువు లేకుండుటవలన ముఖ్య మయిన కూటస్థనిత్యత్వమే యగును, కాని పరిణామినిత్యత్వమును యావత్కాలావస్థాయిత్వమును గా దని యభిప్రాయము. ఓయీ! ఇట్టి దేహివిషయమున ఏదేని ప్రమాణ మవశ్యము చెప్పవలెను. ప్రమాణము లేనిచో మిథ్య యనుట సంభవించును, మఱియు శాస్త్రారంభమే వ్యర్థ మగును. అందుచే ¶ వస్తుపరిచ్ఛేదము తప్పదు. 'శాస్త్రయోనిత్వాత్' $ అను న్యాయమువలనఁగూడ ఆత్మ ప్రమాణవేద్య మని యేర్పడుచున్నది? ఇందుకుఁ జెప్పుచున్నారు అప్రమేయస్య అని. 'ఏకధైవానుద్రష్టవ్యమేత దప్రమయం ధ్రువమ్' § అప్రమయ మ్మనఁగా అప్రమేయ మని యర్థము.

---

• ఒక్కఁడే దేవుఁడు సర్వభూతంబులయందును బ్రచ్ఛన్నుఁడు, సర్వవ్యాపకుఁడు, సర్వభూతములకును అంతరాత్మ, కర్మాధ్యక్షుఁడు, సర్వభూతములకు ఆశ్రయము, సాక్షి, జ్ఞాత, కేవలుఁడు, నిర్గుణుఁడును.

† కాల మందుపఱకు నుండున దగుట.

* అ-౨. పా-౩. సూ-౭. యావద్వికారంతు = ఎంతవఱకు వికారము—కార్యము అగునో, అంతవఱకుమాత్రమె; విభాగః = విభక్తత. లోకవత్ = లోకమునందలి ఘటాదులవలె. ఏదేది కార్యమగునో అదిమాత్రమె లోకమునందు విభక్తముగాఁ గనఁబడుచున్నది. కార్యము కానిది విభక్తముగాఁ గనఁబడదు. ఆకాశము పృథివ్యాదులకంటె విభక్తముగాఁ గనఁబడుచున్నది, కావున ఆకాశము కార్యము.

¶ ప్రమాణము కల దనుటచే.

$ అ-౧. పా-౧. సూ-౩. శాస్త్రము ఋగ్వేదాదిశాస్త్రము, యోనిత్వాత్ = కారణము—స్వరూపజ్ఞానమునందుఁ బ్రమాణముగాఁ గల దగుటవలన.

§ ఒకవిధముగానే తెలియవలసినది యిది యప్రమేయము స్థిరము.

అనియు «న తత్ర సూర్యోభాతి న చన్ద్ర తారకం నేమావిద్యుతో భాన్తి కుతో, యమగ్నిః। తమేవ భాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి" * అనియు శ్రుతి వచించుటవలన, ఆత్మ స్వప్రకాశచైతన్యరూపుఁడే యగుచున్నాఁడు. కావున సర్వంబును బ్రకాశింపఁ జేయునట్టి యతని స్వప్రకాశముకొఱకు తనచేఁ బ్రకాశము నొందునట్టి వస్తువు నపేక్ష యుండదు. మఱే మనఁగా కల్పిత మయిన అజ్ఞానము తత్కార్యము నివర్తించుటకొఱకు కల్పిత మయిన వృత్తివిశేషము యొక్క యపేక్ష కలదు, కల్పితమే గదా కల్పితమునకు విరోధి యగును 'యథాను రూపో బలిః' ♦ అను న్యాయమువలన. అందువలన సర్వకల్పితములను నివర్తిల్లఁ జేయునట్టి వృత్తివిశేషము పుట్టుటకొఱకు శాస్త్రారంభము, ఆ వృత్తివిశేషము తత్త్వమస్యాదివాక్యములవలననే పుట్టవలసినందువలన. తనయంతనే యెల్లప్పుడును బ్రకాశించుచుండువాఁ డగుటవలనను సమస్తకల్పనలకు నధిష్ఠాన మగుటవలనను సర్వదృశ్యములను బ్రకాశింపఁజేయువాఁ డగుటవలనను అతని కెప్పుడును తుచ్ఛత్వము సంభవింపదు. అట్లు 'ఏక మేవాద్వితీయమ్' 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' ఇత్యాదిశాస్త్రమే స్వప్రమేయము ననుసరించి తనకును గల్పితత్వమును గల్గించుకొనుచున్నది. కానిచో దానికిఁ బ్రామాణ్యము అనుపపన్న మగును. కల్పితం బకల్పితమును బరిచ్ఛేదింపఁ జాల దని మున్నె ప్రతిపాదించితిమి. ఆత్మ స్వప్రకాశుఁ డనుటను యుక్తివలనఁగూడ భగవత్పూజ్యపాదు లుపపాదించి యున్నారు. ఎట్లనఁగా. ఏ విషయమునందు జిజ్ఞాసువునకు సంశయవిపర్యయవ్యతిరేకప్రమలలో నేదియు లేదో ఆ విషయమునందు ఆ సంశయాదులకు విరోధి యగు జ్ఞానము కల దని సర్వస్థలములందును జూచుచున్నారము. అట్లు కాదన్నచో సంశయాదులు మూఁడింటిలో నొకటి కలుగవలసివచ్చును. ఆత్మయందో 'నేనా? నేను కానా?', అను సంశయ మెవ్వనికిని లేదు. 'కాను నేను' అను విపర్యయము గాని, వ్యతిరేకప్రమ ‖ గాని లేదు. కావున ఆత్మస్వరూపప్రకాశము సర్వదా కల

* ఆ యాత్మవిషయమున సూర్యుఁడు ప్రకాశింపఁడు. చంద్రుఁడును నక్షత్రములును బ్రకాశింపవు. ఈ మెఱపులును బ్రకాశింపవు. ఈ యగ్ని యెట్లు ప్రకాశించును? ప్రకాశించుచున్న ఆ యాత్మనే అనుసరించి సమస్తమును ప్రకాశించుచున్నది, ఆ యాత్మయొక్క ప్రకాశముచేత ఇది సమస్తమును బ్రకాశించుచున్నది.

♦ యక్షునకుఁ దగిన బలి.

‖ అభావజ్ఞానము.

దని చెప్పవలెను. ఏల యనఁగా అతఁడు సర్వసంశయవిపర్యయధర్మిగా నున్నాఁడు. ‘ధర్మ్యంశే సర్వమభ్రాన్తం ప్రకారేతు విపర్యయః’.† అని న్యాయము. కావుననే చెప్పఁబడినది ‘ప్రమాణ మప్రమాణంచ ప్రమాభాస స్తథైవచ । కుర్వన్త్యేవ ప్రమాం యత్ర తదసంభావనా కుతః’* అని. ప్రమాభాస మనఁగా సంశయ మని యర్థము. స్వప్రకాశము సద్రూపము నగు ధర్మివిషయమున ప్రమాణాప్రమాణములకు విశేషము లేదని యర్థము. ఆత్మ భాసమానుఁడై యున్నంగదా ఘటజ్ఞానము నాకుఁ గలిగెనా? లేదా? అను సంశయము సంభవించును. ఆంతరపదార్థమునందు విషయమే సంశయాదిప్రతిబంధక మని కల్పింపఁ దగదు, ఏల యనఁగా బాహ్యపదార్థమునందు క్లృప్త మయిన విరోధిజ్ఞానముచేతనే సంశయాదిప్రతిబంధము సంభవించుచుండఁగా ఆంతరపదార్థమునకు స్వభావభేదము కల్పించుట యనుచితము. కాదన్నయెడ సర్వానిర్మోక్షము ♦ వాటిల్లును. మఱియు ఆత్మమనస్సంయోగమె ఆత్మసాక్షాత్కారమునకు హేతువు. అదియె సర్వజ్ఞానములకును హేతు వగుటవలన ఘటాదిభానమునందుఁగూడ ఆత్మభానమును సమూహాలంబనన్యాయముచే సర్వతార్కికోక్తముఁ జేసినయు నొప్పక తప్పదు. చాక్షుషత్వమానసత్వాదిసంకరము వచ్చుననియుఁ జెప్పఁ దగదు, లౌకికత్వాలౌకికత్వములవలె అంశభేదముచే నుపపన్న మగుటవలన. లేక, చాక్షుషత్వాదికమునకు జాతిత్వ మంగీకరింపము, కావున సంకరము దోషమే కాదు. ఇట్లు వ్యవసాయమునందే ఆత్మభానసామగ్రి యుండుటవలన అనువ్యవసాయముగూడ నిరాకృత మగుచున్నది. వ్యవసాయభానార్థము అనువ్యవసాయము కావలె నని వచింపఁ దగదు, ఏల యనఁగా, వ్యవసాయము దీపమునవలె స్వవ్యవహారమునందు సజాతీయము నపేక్షింపదు. ఘటతద్జ్ఞానములకువలె వ్యవసాయానువ్యవసాయములకు విషయత్వవిషయిత్వవ్యవస్థాపక మయిన వైజాత్యము లేదుగదా! ఏల యనఁగా, వ్యక్తిభేదాతిరిక్త మయిన వైధర్మ్యము అంగీకృతము కాదు. విషయత్వావచ్ఛేదకరూపముననే విషయిత్వము నంగీకరింతు మన్నయెడ ఘటతత్జ్ఞానములందును అనువ్యవసాయత్వము చెప్పవలసివచ్చును, విశేషము లేమివలన.

† ధర్మ్యంశమునందు ఏదియు భ్రాన్తి కాదు, ప్రకారమునందు మాత్రమె భ్రాన్తి యగును. ఇది రజతము అనుచో ఇది యనునది ధర్మి, దానియందు భ్రాన్తి లేదు. రజత మనునది ప్రకారము, దానియందుమాత్రమె భ్రాన్తి.

* ప్రమాణమును అప్రమాణమును సంశయమును ఏ విషయమునందు యథార్థజ్ఞానమునే కల్గించుచున్నవో ఆ యాత్మకు అసంభావన లేదనుట చెప్పవలనఁ గలుగును?

♦ అంతటను వైపరీత్యము.

ఓయీ! ఎట్లు ఘటవ్యవహారమునకొఱకు ఘటజ్ఞాన మంగీకరింపఁబడుచున్నదో అట్లు ఘటజ్ఞానవ్యవహారమునకొఱకు ఘటజ్ఞానవిషయక మయిన జ్ఞానము నంగీకరింపవలెను, వ్యవహారము వ్యవహర్తృజ్ఞానసాధ్య మగుటవలన. అందువేని, ఇందుచే స్వప్రకాశవాదికేమి యనుపపత్తి సాధించితివి? వ్యవహారహేతుత్వావచ్ఛేదకమునందు వ్యవహర్తృవ్యభిన్నత్వ మను జ్ఞానవిశేషణము యుక్తము గాదు, గౌరవమువలన. కావున ఈశ్వరునియొక్క జ్ఞానమునవలెను యోగియొక్క జ్ఞానమువలెను ప్రమేయ మ్మను జ్ఞానమువలెను దానిచేతనే దానివ్యవహార ముపపన్న మగుటవలన జ్ఞానాంతరము కల్పింప నవకాశము లేదు. అనువ్యవసాయము ౧ ఘటజ్ఞానవ్యవహారహేతు వనుపక్షమునందును అది ఘటజ్ఞానజ్ఞాన మగుటచే హేతు వగునా? లేక ఘటజ్ఞాన మగుటచే హేతు వగునా? అని విచారింపవలెను. ఎందుకనఁగా, అందు రెండునుం గలవు. అందు ఘటవ్యవహారమునందు ఘటజ్ఞానత్వరూపముచేతనే హేతు వనుట సిద్ధ మగుటవలన ఆ రూపముచేతనే ఘటజ్ఞానవ్యవహారమునందును హేతు వగు ననుట యుపపన్న మగుచుండఁగా ఘటజ్ఞానజ్ఞానత్వము హేతుత్వావచ్ఛేదక మనుట యుచితము గాదు, గౌరవమువలనను ప్రమాణము లేమివలనను. అందువలన అనువ్యవసాయము సిద్ధింపదు, ఒక వ్యవసాయమునకే వ్యవసాతయందును వ్యవసేయమునందును వ్యవసాయమునందును * వ్యవహారజనకత్వ ముపపన్న మగుటవలన, అని త్రిపుటీప్రత్యక్షవాదు లగు ప్రాభాకరులు చెప్పెదరు. ఇఁక ఔపనిషదులసిద్ధాంతము—స్వప్రకాశజ్ఞానరూపుఁడే ఆత్మ, స్వప్రకాశజ్ఞానాశ్రయుఁడు కాఁడు, అట్లయినయెడ కర్తృకర్మవిరోధముచే ఆత్మభానము అనుపపన్న మగును. మఱియు ఆత్మ జ్ఞానభిన్నుఁడన్నచో ఘటాదులవలె జడుఁడనవలసినందునఁ గల్పితుఁడనుట సంభవించును. స్వప్రకాశజ్ఞానమాత్రస్వరూపుఁడైనను ఆత్మ అవిద్యోపహితుఁడై సాక్షి యని చెప్పఁబడును. వృత్తిమదంతఃకరణోపహితుఁడై ప్రమాత యనఁబడును. ఆ ప్రమాతకుఁ జక్షురాదులు కరణములు. అతఁడు చక్షురాది ద్వారమున అంతఃకరణపరిణామముచే ఘటాదులను వ్యాపించి తదాకారుఁ డగుచున్నాఁడు. ఒకటే యంతఃకరణపరిణామమునందు ఘటాద్యవచ్ఛిన్నచైతన్యంబును అంతఃకరణావచ్ఛిన్నచైతన్యంబును ఒక్కటిగా కలియుచున్నవి. అందువలన

---

౧ ఇది ఘటము అను జ్ఞానము వ్యవసాయము, ఘటము నేనెఱుంగుచున్నాను అనునది యనువ్యవసాయము.

* వ్యవసాత—జ్ఞాత, వ్యవసేయము—జ్ఞేయము, వ్యవసాయము—జ్ఞానము.

ఘటావచ్ఛిన్నచైతన్యము ప్రమాతతో అభేదము నొందుటవలన స్వాజ్ఞానమును నశింపఁజేసి యపరోక్ష మగుచున్నది. స్వావచ్ఛేదక మయిన ఘటమునుగూడ స్వతాదాత్మ్యాధ్యాసమువలన భాసిల్లఁ జేయుచున్నది. అంతఃకరణపరిణామము వృత్తి యను పేరు గలది మిక్కిలి స్వచ్ఛము స్వావచ్ఛిన్న మయిన చైతన్యముచేతనే భాసిల్లఁ జేయఁబడుచున్నది. ఇట్లు అంతఃకరణమునకును తద్వృత్తికిని ఘటమునకును అపరోక్షత. ఆ మూఁడు ఆకారములును నేను ఎఱుంగుచున్నాను ఘటమును అని యేర్పడుచున్నవి. భాసకచైతన్యము ఏకరూప మయినను ఘటమునందు వృత్త్యపేక్ష యుండుటవలనఁ బ్రమాత యనియు అంతఃకరణతద్వృత్తులందు వృత్త్యపేక్ష లేకుండుటవలన సాక్షి యనియుఁ దెలియుసది. అద్వైతసిద్ధియందును సిద్ధాంతబిందుప్రసంగమును విస్తరముగాఁ బ్రతిపాదింపఁబడినది. ఇట్లు మున్ను చెప్పిన న్యాయముచే ఆత్మ నిత్యుఁడును విభువును అసంసారియు సర్వదా యేకరూపుఁడును, కావున, అట్టి యాత్మ నశించు నను శంకచే, స్వధర్మ మగు యుద్ధమునందుఁ బూర్వము ప్రవృత్తుఁడ వైన నీ వా యుద్ధమునుండి యుపరమించుట యుచితము కాదని యుద్ధాభ్యనుజ్ఞ చేయుచున్నాఁడు భగవంతుఁడు తస్మాద్యుధ్యస్వ భారత అని. స్వధర్మ మగు యుద్ధమునందుఁ బ్రవృత్తుఁ డగు నర్జునునకు ఆ యుద్ధమునుండి యుపరమించుటకుఁ గారణము శోకమోహములు అవి విచారముచేఁ గలిగిన విజ్ఞానముచే బాధితము లయ్యెను. కావున ‘అపవాదాపవాదే ఉత్సర్గస్య స్థితిః’ * అను న్యాయముచే, యుధ్యస్వ అనునది యనువాదమే కాని విధి కాదు. ఎట్లనఁగా, ‘కర్తృకర్మణోః కృతి’ § అనునది యుత్సర్గము. ‘ఉభయప్రాప్తౌ కర్మణి’ ‖ అనునది దానికపవాదము. ‘అకాకారయోః స్త్రీప్రత్యయయోః ప్రయోగే నేతి వక్తవ్యమ్’ $ అనునది యపవాదమున కపవాదము. ‘బ్రహ్మణః జిజ్ఞాసా’ ♦ అనుచోట అపవాదమున కపవాదమువచ్చుటచే మరల నుత్సర్గశాస్త్రమే నిలుచుటవలన ‘కర్తృకర్మణోః

---

* అపవాదమున కపవాదము కలిగినయెడల ఉత్సర్గమే నిలుచును.

§ అ_౨. పా_౩. సూ_౬౫. కృత్ప్రత్యయము వచ్చినపుడు కర్త్రర్థకమునందును కర్మార్థకమునందును షష్ఠి యగును.

‖ అ_౨. పా_౩. సూ_౬౬. కర్తృకర్మముల రెంటికిని ప్రాప్తి కలిగినప్పుడు కర్మమునందే షష్ఠివచ్చును.

$ అకాకార స్త్రీప్రత్యయములు ప్రయోగింపఁబడునపుడు ‘ఉభయప్రాప్తౌ కర్మణి’ అను నియమము లేదు. ఇది వార్తికము.

♦ బ్రహ్మముయొక్క జిజ్ఞాస.

శృతి' అను సూత్రముచేతనే షష్ఠి. అట్లు 'కర్మణిచ'* అను నిషేధము ప్రసరింపమింజేసి బ్రహ్మజిజ్ఞాస యని కర్మషష్ఠీసమాసము సిద్ధ మగుచున్నది. కొందఱు ఈ విధివలననే మోక్షమునందు జ్ఞానకర్మములకు సముచ్చయం బని వాకొనెదరు. అది సరి కాదు; ఏల యనఁగా యుధ్యస్వ అనుటమాత్రముచే మోక్షము జ్ఞానకర్మసముచ్చయసాధ్య మని యెట్లు సిద్ధ మగును? ఈ విషయము విస్తరించి ముందు భగవద్గీతావచనవిరోధముచేతనె నిరాకరింపఁబడును.

శ్రీ. ఆగమాపాయస్వభావ మయిన యసత్తును తెలుపుచున్నాఁడు. నిత్యస్య = ఎల్లప్పుడు ఏకరూపుఁడును; శరీరిణః = శరీరము గలవాఁడును, కావుననే; అనాశినః= నాశము లేనివాఁడును; అప్రమేయస్య = పరిచ్ఛిన్నుఁడు కానివాఁడు నగు ఆత్మయొక్క; ఇమే—సుఖదుఃఖాదిధర్మములు గల, దేహాః; అన్తవన్తః = నాశము గలవి యని; ఉక్తాః=తత్త్వదర్శులచేఁ జెప్పఁబడినవి. అట్లు, తస్మాత్—ఆత్మకు వినాశము లేనందువలనను సుఖదుఃఖాదిసంబంధము లేనందువలనను; మోహమువలనం బుట్టిన శోకమును విడిచి; యుధ్యస్వ—స్వధర్మమును విడువవల దని యర్థము.

ప. ఇఁక దేనికొఱకు కివ్వు డుపక్రమము చేయఁబడినదో దానిఁ జెప్పుచున్నారు.—నిత్యస్య = ఎల్లప్పుడు ఏకరూపుఁడును, కావుననే; అనాశినః; అప్రమేయస్య = అపరిచ్ఛిన్నుఁడును; శరీరిణః = శరీరానచ్ఛిన్నుఁడు నగు పరమాత్మయొక్క; ఇమే దేహాః = సుఖదుఃఖకారణము లయిన దేహములు; తత్త్వదర్శులచే, అన్తవన్తః = నాశము గలవి యని; ఉక్తాః = చెప్పఁబడినవి, ఘటాంతర్గతాకాశమునకు ఘటముల వలెను, ఒక్కఁడే పెక్కురూపములచే నటించునట్టి నటునకు ఆ నానావిధరూపముల వలెను అని యర్థము. కావున, భీష్మద్రోణాదివిషయమునందుఁ బరితాపము లేనివాఁడవై, యుధ్యస్వ = యుద్ధము సేయుము. లేక, ఇమే దేహాః—స్వప్నావస్థయం దనుభవింపఁబడుచున్న నానావిధదేహములు; అన్తవన్తః = జాగ్రదవస్థయందు నశ్వరము లని; ఉక్తాః = వేదముచేఁ బ్రతిపాదింపఁబడినవి. ఎవ్వనియొక్క, అనఁగా—శరీరిణః = ఆయాశరీరములం దున్నవాఁడై యాయాభోగముల భుజించుచున్న ఆత్మయొక్క, నిత్యస్య = అవస్థాత్రయమునందును అనుస్యూతుఁ డైన వానియొక్క. తక్కినది సమానము. అట్లు చెప్పఁబడినది. 'సుఖం త్వల్పగతో యేన స్వప్నదేహేన దిక్త

* అ-౨. పా-౩. సూ-౧౬. 'ఉభయప్రాప్తౌ కర్మణి' అనుశాస్త్రముచే ఏ షష్ఠివచ్చునో, ఆ షష్ఠిసమాసము కలుగదు.

రామ । పరిభ్రమసి హే రామ స దేహస్తే క్వసంప్రతి ’ * అని. శాతపథశ్రుతి యును ‘ అథైతత్ స్వప్నయా చరతి తే హాస్య లోకా స్తదుతేవ మహారాజా భవ త్యుతేవ మహాబ్రాహ్మణ ఉతేవోచ్చావచం నిగచ్ఛతి ’ • అని భాష్యము — స్వప్న యా = స్వప్నావస్థచేత. చరతి = వ్యవహరించుచున్నాఁడు. అస్య = ఆయాత్మకు. లోకాః—భోగస్థానములు. తక్కినది స్పష్టము.

రా. దేహములకో వినాశిత్వమే స్వభావ మని చెప్పుచున్నాఁడు.— నిత్యస్య = నిత్యుఁడును; శరీరిణః = శరీరము గలవాఁడు నగు ఆత్మకు; ఇమే = ఈ; దేహాః—దిహ ఉపచయే అని దిహధాతువునకు ఉపచయము—వృద్ధి అర్థ మగుటవలన, ఉపచయరూపము లయిన దేహములు, కర్మఫలభోగార్థములై భూతసంఘాత § రూపము లగు దేహములు; ‘ పుణ్యః పుణ్యేన ’ ఇత్యాదిశాస్త్రములచేత; అన్త వన్తః = వినాశస్వభావములుగా, కర్మాంతమున నశించునవిగా; ఉక్తాః = చెప్పఁబడి నవి. ఆ ఆత్మ యెట్టివాఁ డనఁగా, అనాశినః=నాశము లేనివాఁడు. ఎందువలన ననఁగా, అప్రమేయస్య = ప్రమేయుఁడు కానివాఁడు, ఆత్మ ప్రమేయుఁడుగాఁ గనఁబడు చున్నాఁడా? కాఁడు. మ ఱే మనఁగాఁ బ్రమాతగా కనఁబడుచున్నాఁడు. అట్లె ముందు చెప్పఁబడును ‘ ఏతద్యోవేత్తితం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ’ అని. మఱియు అనేకోపచయాత్మకుఁడుగా ⸿ ఆత్మ కనఁబడఁడు. ఏల యనఁగా సర్వదేహము నందును ‘ నేను దీని నెఱుంగుచున్నాను ’ అని ఆదేహమునకును ఇతరమునకును బ్రమా తగా ఏకరూపమునఁ గనఁబడుటవలన. మఱియు దేహాదికమునకువలె ప్రదేశభేదం బునఁ బ్రమాత కాకారభేదము కనఁబడదు. కావున ఏకరూపుఁ డగుటచే అనుపచ యాత్మకుఁ డగుటవలనను బ్రమాత యగుటవలనను వ్యాపకుఁ డగుటవలనను ఆత్మ నిత్యుఁడు. దేహమో ఉపచయాత్మక మగుటవలనను శరీరికిఁ గర్మఫలభోగార్థక మగుటవలనను అనేకరూప మగుటవలనను వ్యాప్య మగుటవలనను నాశవంతము. తస్మాత్ —అందువలన; దేహము వినాశస్వభావ మగుటవలనను ఆత్మ నిత్యుఁ డగుట

* ఓ రామా! సుఖముగాఁ బాల్పునఁ బరుండిన నీవు ఏ స్వప్నదేహముచే దిగంతములఁ బరి భ్రమింతువో ఆ నీ దేహము ఇప్పు డెక్కడ?

• ఇఁక నీ యాత్మ స్వప్నావస్థచే వ్యవహరించును. అవి వీనికి భోగస్థానములు. మహారాజు అగును. మహాబ్రాహ్మణుఁడు అగును. నానావిధరూపమును బొందును.

§ భూతముల చేరిక.

⸿ పెక్కు అవయవముల కలయిక స్వరూపముగాఁ గలవాఁడుగా.

ఫలనను పెందుటను శోకస్థానము కా దని తెలిసి, అనివార్యము లగు ఆయుధపాతాది పరుషస్పర్శములను నీకుఁ గలుగువానిని గాని ఇతరులకుఁ గలుగువానిని గాని ధైర్యముచే నోర్చి, యుధ్యస్వ—అమృతత్వప్రాప్తికొఱకు ఫలాభిసంధి లేని యుద్ధాఖ్యమగు కర్మము నారంభింపుము.

నిత్యుఁ డైన శరీరికి పూర్వకృత కర్మఫలము ననుభవించుటకొఱ కేర్పడిన భూతసంఘాతరూపము లయిన యీ దేహములు నశ్వరము లని వేదములు చెప్పుచున్నవి. ఆత్మయో ప్రమేయుఁడు కాఁడు కావున నాశము లేనివాఁడు. దేహములతనికిఁ బ్రమేయములు—భోగ్యములు లగుటచే నశ్వరములు. కావున దేహాత్మల విషయ మయి శోకింపవలసినది లేదు. ఇది తెలిసి, నీవు, నీకుఁగాని నీవారలకుఁగాని అనివార్యముగాఁ దగులునట్టి ఆయుధపాతాదుల బాధల నోర్చి మోక్షప్రాప్తికై ఫలాభిసంధి విడిచి యుద్ధము చేయు మని తాత్పర్యము.

పరా. దేహమునకుఁ గూడ ఒకానొకదానికి నిత్యత్వ మగుఁ గాక యను నాక్షేపము రాఁగా అట్లు కా దని సమాధానము చెప్పుచున్నారు.—ఇమే దేహాః = ఈ దేహములు; అన్తవన్తః = నాశము గలవి. అట్లయిన అద్దము నశించుటవలనఁ బ్రతిబింబము నశించునట్లు ఆత్మ గూడ నశించును అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు—నిత్యస్య అని, నిత్యునియొక్క దేహములు నాశము గలవి యనఁగా ఈశ్వరుని దేహముగూడ నాశము గలది యని యేర్పడుటచే తత్పరిహారార్థము చెప్పుచున్నారు శరీరిణః అని, నిత్యుఁ డైన జీవునియొక్క శరీరములు నాశవంతము లని యర్థము. నైమిత్తికనాశముగూడ జీవునకు లే దని చెప్పుచున్నారు—అనాశినః = నైమిత్తిక నాశము లేనివానియొక్క యని యర్థము. ఎందువలన ననఁగా — అప్రమేయస్య—అప్రమేయత్వము జీవునం దన్వయింపదు కావున అప్రమేయుఁ డైన యీశ్వరుని రూపమువంటి రూపము గలవానియొక్క యని యర్థము. ఉపాధిరూప మయిన దర్పణంబును బింబమును ఆ ఉపాధిబింబముల సన్నిధియు నష్టము కాక యుండునప్పుడు ప్రతిబింబనాశము సంభవింపదు గదా! ఇట చిత్తగుటవలనఁ దానే ఉపాధిరూప దర్పణము. ఎట్లనఁగా, నిత్య మయిన యుపాధియు ఒకానొకటి కలదు. అట్లు భగవద్వచనము ‘ప్రతిపత్తౌ విమోక్షస్య నిత్యోపాధ్యా స్వరూపయా। చిద్రూపయా యుతో జీవః కేశవప్రతిబిమ్బకః’ * అని. తస్మాత్. భారత. యుధ్యస్వ.

* మోక్షము పొందినపుడు జీవుఁడు తనస్వరూపమే యయినదియు చిద్రూపము నగు నిత్యోపాధిలోఁ గూడినవాఁడై విష్ణు ప్రతిబింబమై యుండును.

ఈశ్వరుని దేహముదక్కఁ దక్కిన యీ జీవుల దేహము లన్నియు నాశవంతములు. జీవుఁడో దేహము నశించినను నశించువాఁడు కాఁడు. అతనికి ఉపాధి నాశముచే నాశము లేదు గదా! ఉపాధిబింబసన్నిధినాశము అను నిమిత్తమువలనఁ గూడ నాశము లేదు. ఎందువలన ననఁగా, అతఁడు అపరిచ్ఛిన్నుఁడైన యీశ్వరుని ప్రతిబింబము. నిత్యమయిన యుపాధి యతనికి వేఱే కలదు. కావున అతని కేవిధమయిన నాశమును లేదు. అందువలన యుద్ధము చేయుము. అని తాత్పర్యము.

య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే. ౧౯

భా. 'శోకమోహాదిక మగు సంసారకారణముయొక్క నివృత్తి గీతాశాస్త్రమునకుఁ బ్రయోజనము. కాని ప్రవృత్తి కాదు.' అను నీ యర్థమునకు సాక్షిభూతములుగా రెండుఋక్కుల నుదాహరించుచున్నాఁడు భగవంతుఁడు.—'యుద్ధమునందు భీష్మాదులు నాచే వధింపఁబడెదరు. నేనే వారి వధించువాఁడను' అని నీవు తలఁచుచున్నావే. ఈ నీ బుద్ధి మిథ్యయే. ఎట్లనఁగా—యః = ఎవఁడు; ఏనమ్ = ఈ ప్రకృతుఁడైన దేహిని; హన్తారమ్ = హననక్రియకు * కర్తనుగా; వేత్తి = తెలియుచున్నాఁడో; యః చ = ఎవఁడు మఱియొకఁడు; ఏనమ్ = ఈ యాత్మను; హతమ్ = వధింపఁబడినవానిఁగా, దేహహననముచే హతుఁడను నే నని హననక్రియకుఁ గర్మభూతునిఁగా; మన్యతే = తలఁచుచున్నాఁడో; తౌ = వారు; ఉభౌ = ఇద్దఱును; నవిజానీతః = ఎఱుంగరు, దేహమును వధించినప్పుడు అవివేకమున అహంప్రత్యయమునకు విషయమయిన ఆత్మను, 'నేను హంతను నేను హతుఁడను' అని యెవ్వరు తలంతురో వా రాత్మస్వరూపము తెలియనివా రని యర్థము. ఎందువలన ననఁగా — అయమ్ = ఈ ఆత్మ; నహన్తి = వధింపఁడు, హననక్రియకు కర్త కాఁడు. నహన్యతే = వధింపఁబడఁడు, హననక్రియకుఁ గర్మము కాఁడు. అవిక్రియుఁ డగుటవలన.

* వధించుట యను కార్యమునకు.

దేహములు హతము లయినప్పుడు, నేను అను వ్యవహారమునకు విషయ మయిన యీ యాత్మ వధించువాఁ డని యెవ్వఁడు తలఁచునో, ఇతఁడు వధింపఁ బడువాఁ డని యెవ్వఁడు తలంచునో వార లిద్దఱును ఆత్మస్వరూపము తెలియని వారు. ఎందువలన ననఁగా ఆత్మ నిర్వికారుఁ డగుటవలన వధించువాఁడును కాఁడు, వధింపఁబడువాఁడును కాఁడు అని తాత్పర్యము.

ఆ. ‘అవినాశితు తద్విద్ధి యనుశ్లోకముసఁ బూర్వార్థముచే తత్పదార్థ సమర్థనము చేయఁబడినది, ఉత్తరార్థముచే నిరీశ్వరవాదము, లేక పరిణామవాదము నిరాకరింపఁబడినది. ఆత్మయందు జన్మాదులు తోఁచుట యౌపచారిక మని అన్త వన్త ఇత్యాదిశ్లోకముచే తెలుపఁబడినది’ అని కొందఱు వచించెదరు. ఉండుఁ గాక యీ మార్గము గూడ. పూర్వోక్త మగు గీతాశాస్త్రార్థము స్వబుద్ధికల్పిత మని కా దని తెలుపుటకై రెండు మంత్రములను భగవంతుఁ డుదాహరించుచున్నాఁ డని రెండుశ్లోకములకును సంగతిని జూపుచున్నారు శోకమోహాదిక మిత్యాదిగా. అందు మొదటిశ్లోకమునకు సంగతిఁ జెప్పుచున్నారు యుద్ధమునం దిత్యాదిగా. ప్రత్యక్ష సిద్ధ మగుటచే ఈ బుద్ధి మిథ్య యనుట యనుచితం బని యాక్షేపించుచున్నారు ఎట్లనఁగా అని. ప్రత్యక్షము అజ్ఞానముచేఁ గలిగిన దగుటచే ఆభాస మగుటవలన నీ బుద్ధి ప్రమ కా దని పరిహరించుచున్నారు యః ఇత్యాదిగా. ఆత్మను హంత యని గాని హతుఁ డని గాని తలంచువాని కెట్లజ్ఞాన మని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నారు దేహమును వధించినపుడు ఇత్యాదిగా. హంతృత్వాదిజ్ఞానము అజ్ఞాన మనుటకు హేతువుఁ జెప్పుచున్నారు ఎందువలన ననఁగా ఇత్యాదిగా. ఆత్మకు హననక్రియయందుఁ గర్తృత్వము గాని కర్మత్వము గాని లే దనుటకు హేతువుఁ జూపుచున్నారు అవిక్రియుఁ డగుటవలన నని.

హ. శోకమోహాదిసంసారకారణనివృత్త్యర్థమె గీతాశాస్త్రము ప్రవర్తించుచున్న దను నీ యర్థమునకు సాక్షిభూతము లయిన రెండుమంత్రములు నుదాహరించుచున్నాఁడు భగవంతుఁడు.—యుద్ధమున భీష్మాదులు వధింపఁబడెదరు నేను వారి వధించువాఁడ నని నీవు తలంచు తలంపు మిథ్యయే గాని వేఱు గాదు. ఎట్లనఁగా — యః = ఎవ్వఁడు; ఏనమ్ = దేహిని; హన్తారమ్ = వధము చేయువానిఁగా; వేత్తి = ఎఱుంగుచున్నాఁడో. యశ్చ = మఱియు నెవ్వఁడు; ఏనమ్; హతమ్ = దేహమును వధించుటచే వీఁడు వధింపఁబడె నని హననక్రియకుఁ గర్మభూతునిఁగా;

మన్యతే = తలంచుచున్నాఁడో. తౌ, ఉభౌ; నవిజానీతః = అహంప్రత్యయవిషయమయిన ఆత్మను ఎఱుంగరు, ఆత్మస్వరూపముఁ దెలియనివా రని యర్థము. ఎందువలన ననఁగా. అయమ్ = ఈ యాత్మ. హన్తి = హననక్రియకుఁ గర్త కాఁడు. న హన్యతే—కర్మమునుం గాఁ డని యర్థము, అవిక్రియుఁ డగుటవలన.

౨౦. 'పాపమేవాశ్రయేదస్మాన్' అని 'సంకరో నరకాయైవ కులఘ్నానామ్' అని 'కథం భీష్మమహం సంఖ్యే' అని, ఆత్మ పాపక్రియకు విషయ మనియు తత్ఫలభోక్త యనియు తత్క్రియాకర్త యనియు ఏమి దలఁచుచున్నావో ఆ తలంపు ఆత్మస్వరూపము తెలియమిచేఁ గలిగినది. ఆత్మతత్త్వము తెలిసినచో ఏ వికల్పమునకును అవకాశ ముండదు. అని యాత్మతత్త్వము తెలుపుటకై తత్ప్రకాశనపరము లయిన రెండుమంత్రములను అర్థముచేఁ బఠించుచున్నాఁడు. అందు మొదటిమంత్రముచే ఆత్మ క్రియకు ఆశ్రయ మనిగాని విషయ మనిగాని యెవ్వఁడు తలంచునో అతఁడు వేదాంతములు విన్నవాఁడైనను మూఢుఁడే యని చెప్పుచున్నాఁడు.—యః = ఎవ్వఁడు, నేను వీని వధించుచున్నా నని, ఏనమ్ = అహంప్రత్యయార్థ మయిన యీ ఆత్మను; హన్తారమ్ = హననక్రియకు కర్తనుగా; వేత్తి = తలంచుచున్నాఁడో; మఱియు, యః = ఎవ్వఁడు, నేను వీనిచే హతుఁడనైతి నని; ఏనమ్ = ఈ యాత్మను; హతమ్ = ఇతరునిచే వధింపఁబడినవానిఁగా, హననక్రియకు విషయభూతునిఁగా; మన్యతే. ఇట్లు ఆత్మను హననక్రియకు ఆశ్రయమునుగాను విషయమునుగాను తలంచుచున్న, తౌ ఉభౌ = ఆ యిద్దఱు పురుషులు; ఆత్మను, నవిజానీతః = ఎఱుంగరు, వాస్తవ మయిన ఆత్మతత్త్వమును అపరోక్షముగాఁ దెలిసినవారు కారు. ఎందువలన ననఁగా, అయమ్ = ఈ యాత్మ; నహన్తి = తా నెవ్వనిఁ గాని వధింపఁడు. నహన్యతే = ఎవ్వనిచేతను వధింపఁబడఁడు. దేహేంద్రియాదులు వ్యాపారములు చేయుచుండఁగా ఈ యాత్మ, వృక్షము చలింపఁగా దానిలో నున్న ఆకాశమువలె, కూటస్థాసంగచిద్రూపంబున అంతట నుదాసీనుఁడై యూరకయుండు నని యర్థము. అట్లు 'నత దశ్నాతి కించన నత దశ్నాతి కశ్చన'* అని శ్రుతియు 'ఆత్మ నిష్క్రియుఁడే యగును, నిరవయవుఁ డగుటవలన, ఆకాశమువలె' అను యుక్తియుఁ బ్రమాణములు. 'నిష్కలం నిష్క్రియం శాన్తమ్ । సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ' ఇత్యాదిశ్రుతులచే ఆత్మ నిష్క్రియుఁడే యని శ్రవణము చేసియు మననము చేసియు, తాను కర్త భోక్త యనియు సుఖి దుఃఖి యనియు ఎవ్వఁడు తలంచుచున్నాఁడో

* అది దేనిని భుజింపదు. దానిని ఎవఁడును భుజింపఁడు.

అతఁ డాత్మతత్త్వము దెలిసినవాఁడు కాఁడు. మ ఱే మనఁగా అతని శ్రవణాదులకు మృతప్రసవ యగు స్త్రీయొక్క ప్రసవమునకువలె శ్రమమాత్రమె ఫలం బని సూచిత మగుచున్నది.

మ. ఓయీ! ఇట్లు అశోచ్యా నన్వశోచస్త్వ మిత్యాదిగ్రంథముచేత భీష్మాదిబంధువియోగముచేఁ గలుగు శోకము తొలఁగింపఁబడినను తద్వధము చేయుటచేఁ గలుగు పాపమునకుఁ బ్రతీకారము లేదు. ఏల యనఁగా, ఎచట శోకము లేదో అచటఁ బాపము లే దను నియమము లేదు. కా దేని, శత్రు వయిన బ్రాహ్మణుని వధమునందు శోకము లేమివలనఁ బాపము లే దనుట ప్రసక్త మగును. కావున నేను గర్తను నీవు ప్రేరకుఁడవు, మన యిద్దఱకును హింసచేఁ గలుగు పాతకము తప్పదు. అందువలన, ‘ తస్మా ద్యుధ్యస్వ భారత ’ అను నీవచనం బయుక్త మని, యర్జునువాక్యము నాశంకించి కాఠకోపనిషత్ప్రతిత మయిన ఋక్కుచేఁ బరిహరించుచున్నాఁడు భగవంతుఁడు.—ఏనమ్ = ప్రకృతుఁ డైన అదృశ్యత్వాదిగుణములు గల దేహిని; యః = ఎవ్వఁడు; హన్తారమ్ = హననక్రియకు కర్తనుగా; వేత్తి = నేను వీని వధించువాఁడ నని తెలియుచున్నాఁడో. యశ్చ = మఱియొకఁడు ఎవ్వఁడు; ఏనమ్; హతమ్ = హననక్రియకుఁ గర్మభూతునిఁగా; మన్యతే = దేహహననముచే నేను హతుఁడ నైతి నని తలంచుచున్నాఁడో. తౌ ఉభౌ; దేహాభిమాను లగుటవలన అవికారియు అకారకస్వభావుఁడు నగు ఈ యాత్మను; నవిజానీతః = శాస్త్రము వలన వివేకముచే నెఱుంగరు. ఎందువలన ననఁగా—నాయం హన్తి నహన్యతే—కర్తయు కర్మమును కాఁ డని యర్థము. ఇట ‘ య ఏనం వేత్తి హన్తారం హతంచ ’♦ అని యింతమాత్రము చెప్పవలసియుండఁగా, పదముల ఆవృత్తి వాక్యాలంకారార్థము. లేక, య ఏనం వేత్తి హన్తారమ్—ఆత్మకుఁ గర్తృత్వము నంగీకరించునట్టి యే తార్కికుఁడు ఈ యాత్మను హంతనుగాఁ దలఁచుచున్నాఁడో, యశ్చైనం మన్యతే హతమ్—ఆత్మకు నాశము సంగీకరించునట్టి యే చార్వాకుఁడు ఈ యాత్మను హతునిఁగాఁ దలఁచుచున్నాఁడో, తౌ ఉభౌ నవిజానీతః అని యన్వయింపవలెను. ఇట్లు వాదిభేదముఁ దెలుపుటకై వేఱువేఱ చెప్పఁబడినది. లేక, పూర్వభాగము అతిశూరవిషయ మనియు ఉత్తరభాగము అతిభీరువిషయ మనియుఁ గాని చెప్పవచ్చును. ‘ హన్తాచే న్మన్యతే హన్తుం హతశ్చే న్మన్యతే హతమ్ ’ అని పూర్వార్ధమునం దుపనిషత్పాఠము.

♦ ఎవ్వఁ డీయాత్మను హంతనుగాను హతునిగాను దలంచుచున్నాఁడో.

శ్రీ. ఇట్లు భీష్మాదిమరణనిమిత్త మయిన శోకము నివారింపఁబడినది. ఇఁక, 'ఏతాన్నహన్తు మిచ్ఛామి' ఇత్యాదిగా తాను వారి వధింపవలెనే అను దుఃఖ మేది చెప్పఁబడెనో అదియు దానివలెనే నిష్కారణ మని చెప్పుచున్నాఁడు. ఏనమ్ = ఈ యాత్మను. ఆత్మ హననక్రియకు ఎట్లు కర్మము కాఁడో అట్లు కర్తయును కాఁ డని యర్థము. అందుకు హేతువు—నాయం హన్తి న హన్యతే.

ప. ఇఁక 'ఏతాన్నహన్తు మిచ్ఛామి' ఇత్యాదిగా తనకు భీష్మాదుల వధించుటచేఁ గలుగు దుఃఖ మేది చెప్పఁబడెనో దానికిఁగూడ అవకాశమే లే దని చెప్పుచున్నాఁడు.—ఎట్లు ఘటముచేతనే ఘటము పగిలినప్పుడు తదంతర్గత మయిన ఆకాశమునకు ఆ క్రియయందు కర్మత్వముగాని కర్తృత్వముగాని లేదో అట్లు ఆత్మకు హననక్రియయందుఁ గర్మత్వమును గర్తృత్వమును లేదు. అందుకు హేతువుఁ జెప్పుచున్నాఁడు—నాయ మిత్యాదిగా.

రా. ఏనమ్= ఈ చెప్పఁబడిన స్వభావముగల యాత్మనుగూర్చి; హన్తారమ్= ఖడ్గము మొదలగు ఏ పదార్థమునైనను, హననహేతువునుగా; యః = ఎవ్వఁడు; వేత్తి= తలంచుచున్నాఁడో; యశ్చ= మఱియు నెవ్వఁడు; ఏనమ్ = ఈ యాత్మను; హతమ్ = ఏ పదార్థముచేత నైనను వధింపఁబడినవానిఁగా; మన్యతే = తలంచుచున్నాఁడో; తౌ ఉభౌ = వా రిద్దఱును; నవిజానీతః = తెలిసినవారు కారు. చెప్పిన హేతువులచే ఈ యాత్మ నిత్యుఁ డగుటవలన, అయమ్= ఖడ్గాదికము; న హన్తి = ఈ యాత్మను వధింపదు, హననహేతువు కాదు. ఇందువలననే, అయమ్ = ఈ యాత్మ, నహన్యతే = వధింపఁబడఁడు. హన్తిధాతువు ఆత్మ కర్మక మయినను * శరీర వియోగకరణమును ♦ వచించుచున్నది. 'నహింస్యాత్సర్వాభూతాని, బ్రాహ్మణో నహన్తవ్యః' ఇత్యాదిశాస్త్రములును అవిహితశరీరవియోగకరణవిషయములు ‡.

ఈ యాత్మను ఆయుధాదిపదార్థములు వధించు నని యెవ్వఁడు తలంచునో ఈ యాత్మ వానిచే వధింపఁబడు నని యెవ్వఁడు తలంచునో వా రిద్దఱును మూఢులు.

---

* వధించుచున్నాఁడు అను క్రియకు ఆత్మయె కర్మము కావలసియున్నను.

♦ ఆత్మను శరీరమునుండి యెడఁబాపుటను.

‡ శాస్త్రమునందు విధింపఁబడని శరీరవియోగకరణము విషయముగాఁ గలవి, యాగీయపశు వధము యజమానునకును యుద్ధమునందు శత్రువధము క్షత్త్రియునకును విహితము లగుటవలనఁ దద్విషయములు కా వని యర్థము.

మున్ను చెప్పిన హేతువులచే ఆత్మ నిత్యుఁ డగుటవలన ఆయుధాదు లేవియు ఆత్మను వధింపఁ జాలవు. అందువలననే ఆత్మ వధింపఁబడఁ డని తాత్పర్యము.

మూ. హననాదివ్యవహార మున్నదే యన్నచో నది భ్రాంతి యని చెప్పుచున్నాఁడు.—యః = ఎవ్వఁడు; ఏనమ్ = ఈ జీవుని; హన్తారమ్ - వధించువానిఁగా; వేత్తి = తలంచుచున్నాఁడో. యశ్చ = మఱియు నెవ్వఁడు; ఏనమ్ = ఇతని; హతమ్= వధింపఁబడినవానిఁగా; మన్యతే = తలంచుచున్నాఁడో; తౌ ఉభౌ = వా రిద్దఱు; నవిజానీతః = తెలిసినవారు కారు. ఎందువలన ననఁగా, చెప్పిన హేతువులవలన, అయమ్= ఈతఁడు, నహన్తి = వధింపఁడు. నహన్యతే = వధింపఁబడఁడు. ఓయీ! వధింపఁబడఁ డనుటకు సత్యత్వాదులు హేతువుగా చెప్పితిరి సరే. వధింపఁ డనుట కే హేతువును జెప్పలేదే యన్నయెడ అది సరికాదు. జీవుఁ డీశ్వరుని ప్రతిబింబ మని చెప్పఁబడినది గదా! ప్రతిబింబమునకు స్వతంత్రముగా క్రియ యెట్లు కలుగును? బింబక్రియచేతనే గదా ప్రతిబింబము క్రియావంత మగును. అట్లు 'ధ్యాయతీవ' అని శ్రుతి. *

అట్లయినయెడ శూరుఁడు శత్రువును వధించెను ఇత్యాదివ్యవహార మెట్లుపపన్న మగును? అనునెడ, ఆ వ్యవహార మంతయు భ్రాంతియె. ఈ జీవుఁడు వధము చేయువాఁ డనియు వధింపఁబడువాఁ డనియు నెవ్వరు తలంతురో వారు భ్రాంతులే కాని తెలిసినవారు కారు. ఎట్లనఁగా జీవుఁడు నిత్యుఁ డగుటవలన వధింపఁబడఁడు. ప్రతిబింబ మగుటవలన నతనికి స్వతంత్రముగాఁ గర్తృత్వము లేదు. కావున వధింపఁడు అని తాత్పర్యము.

న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్య శ్శాశ్వతో ఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. ౨౦

భా. ఎట్లు అవిక్రియుఁ డాత్మ? అందుకు రెండవమంత్రముఁ జెప్పుచున్నాఁడు.—నజాయతే = పుట్టఁడు, జననం బను భావవికారము ఆత్మకు లేదని యర్థము. అట్లు, న ♦ మ్రియతేవా—వాశబ్దము చ అనుదాని

---

* ఈశ్వరుఁడు జీవుని ధ్యానించుచున్నాఁడు. ఇశబ్ద మల్పార్థకము.

♦ నశబ్ద మిచట అధ్యాహార్యము.

యర్థము గలది = చావఁడుగూడ, కడపటిదైన మరణ మను భావ వికార మాత్మకు లే దని యర్థము. కదాచిత్ అనునది సర్వవికార నిషేధములతోను అన్వయించును, కదాచిత్ = ఒకానొకప్పుడును, నజాయతే. కదాచిత్ = ఒకానొకప్పుడును, నమ్రియతే. అని యీవిధముగా. ఎందువలన ననఁగా, అయమ్ = ఈ యాత్మ; భూత్వా = ఉండుటను పొంది; పిమ్మట, భూయః = మరల; అభవితా = అభావమును — లేకుండుటను బొందువాఁడు; న = కాఁడు. అందువలనఁ జావఁడు. ఏల యనఁగా ఎవఁడు ఉండి పిమ్మట లేకయుండునో అతఁడు గదా చచ్చె నని లోకమునందుఁ జెప్పఁబడుచున్నాఁడు. వా అను శబ్దమువలనను న అను శబ్దమువలనను 1 'అయమ్ అభూత్వా భూయః భవితా న' అని వాక్య పరివృత్తి సిద్ధించుచున్నది. అయమ్ = ఈయాత్మ; అభూత్వా = దేహము వలె లేక యుండి; భూయః = మరల; భవితా న = ఉండువాఁడు కాఁడు, ఏది మొదట లేక యుండి పిమ్మట కలుగునో అది గదా పుట్టిన దని చెప్పఁబడును, ఇట్టివాఁడు కాఁ డాత్మ, కావునఁ బుట్టఁడు. ఎందువలనఁ బుట్టఁడో అందువలన, అజః = పుట్టనివాఁడు, ఎందువలనఁ జావఁడో అందువలన, నిత్యః = నాశము లేనివాఁడును. ఆద్యంతము లగు వికారముల నిషేధముచేతనే సర్వవికారములును నిషిద్ధము లగుచున్నను, మధ్యభావు లగు వికారముల నిషేధము స్వశబ్దములచేతనే చేయవలె నని, అందుచే అనుక్తము లయిన యౌవనాదివికారములనుగూడ నిషేధించిన ట్లగు నను నభిప్రాయముచేఁ జెప్పుచున్నారు శాశ్వత ఇత్యాదిగా. శాశ్వతః అనుటచే అపక్షయం * బను వికారము ప్రతిషిద్ధ మగుచున్నది, అయమ్ = ఈయాత్మ; శాశ్వతః = ఎల్లప్పుడు నుండువాఁడు, స్వరూపముచే తగ్గఁడు నిరవయవుఁ డగుటవలన, నిర్గుణుఁ డగుటవలన గుణక్షయముచేతఁ గూడ అపక్షయము లేదు. అపక్షయమునకు విపరీత మయిన వృద్ధి యను వికారము నిషేధింపఁబడుచున్నది పురాణః అని. ఏది యవయవములచేరికచే అధిక మగుచున్నదో అది వర్ధిల్లుచున్నది యనియు అభినవ మనియు లోకమునందుఁ జెప్పఁబడును, ఈ ఆత్మయో నిరవయవుఁ డగుటవలన

---

1 నభూయః అనువో నుండు నశబ్దమువలనను.

* తగ్గుట.

'పురా అపి నవః ఏవ' పూర్వముగూడఁ గ్రొత్తవాఁడే యగుటవలనఁ బురాణుఁడు, వృద్ధి బొందఁ డని యర్థము. అట్లు, శరీరే=దేహము; హన్యమానే=మార్పఁబడుచున్నను; నహన్యతే=మార్పఁబడఁడు. ఇట హన్తి ధాతువునకు విపరిణామము ♦ అర్థముగా గ్రహింపవలెను పునరుక్తి దోషము లేకుండుటకొఱకు, మాఱఁ డని యర్థము. ఈ మంత్రమునందు ఆఱు భావవికారములు—లౌకికవస్తువులకుఁ గల్గు వికారములు ఆత్మయందు నిషేధింపఁబడుచున్నవి. అన్నివిధము లయిన విక్రియలును లేనివాఁ డాత్మ యని వాక్యార్థము. ఇట్లు ఆత్మ భావవికారము లాఱును లేనివాఁ డగుటవలన 'ఉభౌ తౌ న విజానీతః' అని పూర్వమంత్రముతో దీనికి సంబంధము.

ఈ యాత్మ మొదట లేకయుండి పిమ్మట నుండువాఁడు కాఁడు, అందువలన నితనికి జన్మము లేదు. మొదటనుండి పిమ్మట లేకపోవువాఁడు కాఁడు, అందువలన నితనికి మరణము లేదు. ఇతఁడు, జన్మము లేనివాఁ డగుటచే అజుఁడు, మరణము లేనివాఁ డగుటచే నిత్యుఁడు, ఎల్లప్పుడు ఒకేవిధముగా నుండువాఁ డగుటచే అపక్షయము ఇతనికి లేదు, ఇప్పు డెట్లో అట్లు పూర్వము—అనాదికాలమునందుఁ గూడ క్రొత్తవాఁడే యగుటవలన ఇతనికి వృద్ధి లేదు. అట్లు శరీరము శస్త్రాదిసంబంధముచే విపరిణామము నొందినను ఇతనికి విపరిణామము లేదు. ఇట్లు లౌకికము లయిన కార్యవస్తువులకుఁ గలుగునట్టి ఆఱు వికారములును ఆత్మకు సంభవింపవు. కావున ఇతని వధించువాఁ డనియు హతుఁ డనియు నెవ్వరు తలంతురో వారు అజ్ఞాను లని తాత్పర్యము.

ఆ. దానినే సాధించుటకు నజాయతే మ్రియతే వా విపశ్చి దిత్యాది మన్త్రాంతరమున కవతారిక చేయుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. మూలమునందు.— "సర్వవికారరహితత్వము దెలిపి హేతువును స్పష్టీకరించుటకై మంత్రమునే పఠించుచున్నాఁడు నజాయత ఇత్యాదిగా. జన్మమరణంబు లను రెండువికారంబుల నిషేధము సాధించుచున్నాఁడు నాయ మిత్యాదిగా, 'అయమ్ భూత్వా భూయః అభవితా న, అభూత్వా భూయః భవితా న' అని యన్వయము. ఇట ఈ రెండు వికారములకుమాత్రమె కాదు నిషేధము, మ తే మనఁగా సర్వవికారములకును

♦ మార్పు.

నిషేధము చేయఁబడు నని చెప్పుచున్నాఁడు అజ ఇత్యాదిగా." వాచ్యార్థముఁ జెప్పి వివక్షించిన యర్థము చెప్పుచున్నారు జననంబు ఇత్యాదిగా. వికల్పార్థమును తొలఁగించుచున్నారు వాశబ్దము ఇత్యాదిగా. అప్పు డేర్పడిన యర్థముఁ జూపుచున్నారు చావఁడుగూడ అని. అన్వయముఁ జూపుచున్నారు కదాచిత్ ఇత్యాదిగా. కడపటి వికారము లే దనుటకు హేతువుగా నాయ మిత్యాదిని వ్యాఖ్యానము చేయుచున్నారు ఎందువలన ననఁగా ఇత్యాదిగా. చెప్పినదానినే వివరించుచున్నారు ఎవ్వఁడు ఇత్యాదిగా. ఆత్మయో ఉండి పిమ్మట లేక పోవువాఁడు కాఁడు, కావున నతనికి మరణము లే దని యర్థము. ఆత్మకు జన్మము లే దనుటకు హేతు విందే వివక్షిత మని చెప్పుచున్నారు వాశబ్దమువలన నిత్యాదిగా. దేహమువలె నని వ్యతిరే కోదాహరణము. చెప్పిన యర్థమునే సాధించుచున్నారు ఏది ఇత్యాదిగా. జన్మము లేమివలన, జన్మపూర్వక మయిన * అస్తిత్వము అను వికారముగూడ ఆత్మకు లే దని చెప్పుచున్నారు ఎందువలన నిత్యాదిగా. ప్రాణవియోగమువలన ఆత్మకు మరణము లేనందువలన సావశేషనాశము లేనియట్లు నిరవశేషనాశముగూడ లే దనుట సిద్ధించుచున్న దని చెప్పుచున్నారు ఎందువలన నిత్యాదిగా. ఓయీ! జన్మనాశముల నిషేధముచేతనే తదంతర్గతము లయిన యితర వికారములకుఁ గూడ నిషేధము సిద్ధించుటవలన వాని నిషేధించుటకొఱకు వేఱుగా యత్నింపవలసినది లేదు? అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు ఆద్యంతములు ఇత్యాదిగా. స్వశబ్దముచేతనే—మధ్యవర్తివికారనిషేధవాచకము లగు శబ్దములచేతనే యని యర్థము. ఆర్థికనిషేధము చేతనే నిషేధము సిద్ధించుచుండఁగా శాబ్దనిషేధమునకు వేఱుగా ప్రయోజనము లే దని యాశంకించి చెప్పుచున్నారు అందుచే నిత్యాదిగా. నిత్యశబ్దముచేత శాశ్వతశబ్దమునకుఁ బునరుక్తతను బరిహరించుచు వ్యాఖ్యానము చేయుచున్నారు శాశ్వత ఇత్యాదిగా. అపక్షయము స్వరూపముచేత నైనను కలుగవలెను లేక గుణక్షయముచే నైనను కలుగవలె నని వికల్పించి క్రమముగా నిరసించుచున్నారు స్వరూపముచే నిత్యాదిగా. పురాణపదము గతార్థము కా దని తెలుపుచున్నారు అపక్షయమునకు ఇత్యాదిగా. దానినే స్పష్టీకరించుచున్నారు ఏది ఇత్యాదిగా. నమ్రియతే వా అనుటచే చతుర్థపాదము పునరుక్త మగు నని యాశంకించి వ్యాఖ్యానము చేయుచున్నారు అట్లు ఇత్యాదిగా. ఓయీ! హంతిధాతువు హింసార్థకము, అట్లుండఁగా విపరిణామ మెట్లు నిషేధింపఁబడును? అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు ఇట హంతి

* జన్మముచేఁ గలుగునట్టి.

ధాతువునకు ఇత్యాదిగా. హంతికి హింసార్థము సంభవించుచుండఁగా అర్థాంతర మేల కల్పింపవలె ననఁగా అందుకుఁ జెప్పుచున్నారు పునరుక్తిదోషము లేకుండుటకొఱకు అని. హింస అర్థ మన్నచో మరణము నిషేధింపఁబడుటచేఁ బౌనరుక్త్యము సంభవించును, తద్ద్వారణార్థము విపరిణామమె యర్థ మని చెప్పవలె నని యర్థము. విపరిణామ మనఁగా పూర్వావస్థను విడిచి మఱియొకయవస్థను బొందుట, ఇచట హంతికది యర్థ మయినప్పుడు సిద్ధ మయిన యర్థముఁ జెప్పుచున్నారు మాఱుఁ డని యర్థమని. నజాయత ఇత్యాదిమంత్రముయొక్క యర్థము నుపసంహరించుచున్నారు ఈమంత్రమునందు ఇత్యాదిగా. ఆఱువికారములును ఆత్మకు సంభవింప వని సాధించుటచే ఫలితముఁ జెప్పుచున్నారు అన్నివిధము లయిన ఇత్యాదిగా. ఆత్మ సర్వవిక్రియారహితుఁ డనుటచే నేమి వచ్చె నని యాశంకించి చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా.

హ. ఎట్లు అవిక్రియుఁ డాత్మ యనఁగా అందుకు రెండవమంత్రము. నజాయతే= పుట్టఁడు, జననము చేయువాఁడు కాఁడు, జన్మ మను భావవికార మాత్మకు లే దని యర్థము. అట్లు; కదాచిత్ = ఒకానొకప్పుడు; న మ్రియతే వా—ఉత్పత్తిక్రియవలన అస్తిత్వము ననుభవింపఁడు, ఏల యనఁగా ఉత్పత్తిచే అస్తిత్వానుభవము దేనికిఁ గలదో దానికి మరణము తప్పదు, ఉత్పత్తివలన అస్తిత్వమును * ఏది యనుభవింపదో అది మరణము నొందుచున్న దని చెప్పఁబడదు. అందువలన అస్తి అను భావవికారము ఆత్మకు లే దని యర్థము. వాశబ్దము చ అనుదాని యర్థము గలది. కదాచిత్ = అనునది సర్వవికారనిషేధములతోను సంభవించుచున్నది, కదాచిత్ నజాయతే, కదాచిత్ న మ్రియతే అని యంతటను అన్వయించునది. అయం భూత్వా భవితా వా న భూయః ♦—అయమ్ = ఈయాత్మ; భూత్వా = ఉత్పత్తిక్రియ ననుభవించి; భూయః = మరల; భవితా న =, అగువాఁడు కాఁడు, ఒకయవస్థను బొంది మరల మఱియొకయవస్థను బొందువాఁడు కాఁడు, విపరిణామము పొందువాఁడు కాఁడు, విపరిణామ మను భావవికారము ఆత్మకు లే దని యర్థము. అజః—అవయవములచేరికచే పెరుఁగనివాఁడు, వృద్ధి యను భావవికారము లే దని యర్థము. కావునను, నిత్యః—అపక్షయ మను భావవికారము ఆత్మకు లే దని యర్థము. శాశ్వతః = ఎల్లప్పుడు నుండువాఁడు, వినాశము లేనివాఁ డని యర్థము. కావున, పురాణః—

---

* ఉండుటను.

♦ ఈ వ్యాఖ్యానమున పాదాదియందలి న అనునది మ్రియతే అనుదానితో నన్వయింపఁబడెను.

పురాపి నవః—పూర్వమందును నవీనుఁడు, సదా ఏకరూపుఁ డని యర్థము. అందు వలన, శరీరే; హన్యమానే—వికారము నొందింపఁబడుచున్నను; నహన్యతే—వికారము నొందింపఁబడఁడు. ఈ మంత్రమునందు లౌకికవస్తువులకుఁ గలుగునట్టి యాఱు భావవికారములును ఆత్మకు సంభవింప వని చెప్పఁబడుచున్నది. సర్వవిధము లయిన వికారములు లేనివాఁ డాత్మ యని వాక్యార్థము. ఇట్లుండుటవలన ‘ఉభౌ తౌ నవిజానీతః’ అని పూర్వమంత్రముతో దీనికి సంబంధము.

౨౦. అట్లయినచో ఆత్మతత్త్వ మెట్టి దని యాకాంక్ష కలుగఁగా, యాస్కపఠితము లయిన జన్మాదిషడ్భావవికారములు లేనివాఁడై కూటస్థానంగచిద్రూపుఁ డాత్మ, ఇదియే ఆత్మయొక్క స్వాభావిక మయిన తత్త్వము అని ఆత్మతత్త్వనిరూపణముకొఱకు రెండవమంత్రముఁ బఠించుచున్నాఁడు.—ఇట కదాచిత్ అను శబ్దము కదాచిత్ నజాయతే కదాచిత్ న మ్రియతే అని అంతటను సంబంధించుచున్నది, వాశబ్దములు రెండు చ అనుదాని అర్థము గలవి. ఇచట అజః అని అజత్వముచే సర్వవికారనిషేధము సంభవించుచున్నను శ్రుతి అవికారములను ప్రత్యేకము కంఠోక్తిచే నిషేధించుచున్నది, ఆత్మ నిర్వికారుఁ డనుట నిస్సందేహముగాఁ దెలియుటకొఱకు. అజః—ఎవ్వనిసాక్షాత్కారమువలన విద్వాంసుఁడు మరలఁ బుట్టఁడో అతఁడు అజుఁడు, లేక, జననము లేనివాఁడు, అట్టి; అయమ్=ఈయాత్మ; కదాచిత్; నజాయతే=నిరవయవుఁ డగుటవలన పుట్టఁడు. ‘నిష్కలం నిష్క్రియమ్’ * అని ‘న చాస్య కశ్చి జ్జనితా న చాధిపః’ ‖ అని ఆత్మ నిరవయవుఁ డనియు కారణరహితుఁ డనియు శ్రుతి చెప్పుటవలన ఆత్మకు జన్మక్రియ సంభవింపదు. ఇందుచే మొదటిభావవికారము నిరసింపఁబడినది. న మ్రియతే వా ♦ = చావఁడుగూడ, అకారణముచేతనే యీయాత్మ నాశక్రియను బొందఁడు, ఇందుచే ఆఱవది యగు భావవికారము నిరసింపఁబడినది. అయమ్=ఈయాత్మ; భూత్వా=జననక్రియను పొంది; భూయః=మరల; భవితావా=ఉండుట కలవాఁడుగూడ, న=కాఁడు, ఘటమువలె జన్మముచేఁ గలుగు అస్తిత్వమును బొందఁడు, మ తే మనఁగా, మృత్తువలె జన్మము నపేక్షింపని పూర్వసిద్ధ మయిన అస్తిత్వము గలవాఁడే యగును, ఇందుచే రెండవవికారము నిరసింపఁబడినది. నిత్యః=నిరవయవుఁ డగుటవలన ఆత్మ సదా యేకరూపుఁడు, ఇందుచే

* అవయవములు లేనిది క్రియ లేనిది.

‖ ఇతనికి ఎవ్వఁడును బుట్టించువాఁడు లేఁడు, అధిపుఁడును లేఁడు.

♦ ఈ వాశబ్దము ద్వితీయపాదాదిలోనిది.

విపరిణామము బను నాల్గవవికారము నిరసింపఁబడినది. శాశ్వతః— ఏకరూపమే యగు నత్తచే, శశ్వత్ భవః—ఎల్లప్పుడు నుండువాఁడు, ఇందుచే అపక్షయం బనెడు అయిదవ వికారము నిరసింపఁబడినది. పురాణః—నిరవయవుఁ డగుటచే ఇతఁడు పూర్వమును ఇప్పుడును ఎల్లప్పుడును నవుఁడు—క్రొత్తవాఁడు అగుటవలన పురాణుఁడు, ఇందుచే వృద్ధి యను మూఁడవవికారము నిరసింపఁబడినది. ఇట్లు ఆఱు భావవికారములును లేనివాఁ డని ప్రతిపాదించుటచే, ఆత్మ నిత్యకూటస్థాసంగచిద్రూపుఁ డనియు ఆద్యంతశూన్యుఁ డనియు అద్వితీయుఁ డనియు సూచిత మగుచున్నది. అయినను శ్రోతకు దేహము నశించుటచే ఆత్మ నశించు నను భ్రమ విడువ లే దని తలంచి, ఏవిషయమున భ్రమ యున్నదో ఆవిషయమునందే పురుషునకుఁ జక్కఁగా బోధింప వలె నని యాతని కాభ్రమ తొలఁగించుటకై చెప్పుచున్నారు—శరీరే = ఈదేహము; హన్యమానే= ఖడ్గాదులచే ఛేదింపఁబడుచున్నను; నహన్యతే=ఆత్మ నిర్వికారుఁ డగుట వలన ఘటము పగుల్పఁబడుచున్నను ఘటాకాశమువలెఁ దాను హననక్రియకు విష యము కాఁడు, ఘటము నశించినను ఘటాకాశముం బోలె దేహము నశించినను ఆత్మ తాను తనస్వరూపముచేతనే యుండును. అట్లు శ్రుతి ‘అవినాశీ వా అరే ఽయమాత్మా ఽనుచ్ఛిత్తి ధర్మా’ * అని.

మ. ఎందువలన ఈయాత్మ హననక్రియకుఁ గర్తయుఁ గర్మమును కాఁడు? అనఁగా నిర్వికారుఁ డగుటవలన నని సమాధానము చెప్పుచున్నాఁడు రెండవమంత్ర ముచేత.—“జాయతే అస్తి వర్ధతే విపరిణమతే అపక్షీయతే వినశ్యతి ఇతి షట్ భావవికారా ఇతి వార్ష్యాయణిః” * అని నైరుక్తులు చెప్పెదరు. అందు ఆద్యంత ముల నిషేధము చేయఁబడుచున్నది నజాయతే మ్రియతే వా అని. వాశబ్దమునకు సముచ్చయ మర్థము. నజాయతే= పుట్టఁడు, నమ్రియతే వా † = చావఁడుగూడ అని యర్థము. ఎందువలన ఈయాత్మ పుట్టఁ డనఁగా—అయమ్ = ఈయాత్మ; కదా చిత్ = ఒకానొకకాలమునందును; నభూత్వా = పూర్వము ఉండక; భూయః= మరల; భవితాన = ఉండువాఁడు కాఁడు, ఏది పూర్వ ముండనిదై వెనుక నుండునో అది గదా పుట్టుట యను క్రియ ననుభవించుచున్నది. ఈయాత్మయో, పూర్వమును

* ఈ యాత్మ వినాశము లేనివాఁడే, అనుచ్ఛిత్తి—నశింపకుండుట స్వభావముగాఁ గలవాఁడు.

‡ ౧-పుట్టుచున్నది, ౨-ఉన్నది, ౩-పెరుఁగుచున్నది, ౪-మాఱుచున్నది, ౫-తగ్గుచున్నది, ౬-నశించుచున్నది, అని యాఱుభావవికారములు అని వార్ష్యాయణి.

† నశబ్ద మిట భాష్యమునందువలె సముచ్చయాకృష్టము.

ఉన్నవాఁ డగుటవలనఁ బుట్టఁడు; అందువలన అజుఁడు. అట్లు, అయమ్= ఈయాత్మ, భూత్వా = పూర్వము ఉండి, కదాచిత్ = ఒకానొకప్పుడును; భూయః = మరల. న భవితా న = లేకుండువాఁడు కాఁడు, వాశబ్దముచే వాక్యపరివృత్తి, ఏది పూర్వమున్నదై యుత్తరకాలమునందు లేకయుండునో అది గదా మృతి యను వికారము ననుభవించుచున్నది. ఈయాత్మయో యుత్తరకాలమునందుఁగూడ ఉండువాఁడగుటవలన చావఁడు, అందువలన నిత్యుఁడు—వినాశమునకు అయోగ్యుఁ డని యర్థము. ఇట నభూత్వా అనుచోట సమాసము లే కున్నను అనుపపత్తి లేదు, నానుయాజేషు అను స్థలమునందుబోలె, భగవంతుఁ డగు పాణిని మహావిభాషాధికారమునందు నఞ్సమాసముఁ బఠించుటవలన. మఱి కాత్యాయనునిచే సమాసము నిత్య మను నభిప్రాయమున 'వా వచనానర్థక్యంతు స్వభావసిద్ధత్వాత్' అని చెప్పఁబడినదే యనఁగా, అది భగవత్పాణినివచనవిరుద్ధ మగుటవలన అగ్రాహ్యము. అట్టు లాచార్యశబరస్వామిచే వచియింపఁబడినది 'అసద్వాదీహి కాత్యాయనః' * అని. ఇట 'నజాయతే మ్రియతే వా' అని ప్రతిజ్ఞ, 'కదాచి న్నాయం భూత్వా భవితా నభూయః' అని తదుపపాదనము, 'అజో నిత్యః' అని తదుపసంహార మని విభాగ మెఱుంగునది. ఆద్యంతము లగు వికారముల నిషేధించుటచేతనే వానికి వ్యాప్యము లయిన మధ్యవర్తివికారములకుఁగూడ నిషేధము కలుగుచున్నను, అనుక్తము లయిన గమనాదివికారములకుఁగూడ ఉపలక్షణముకొఱకు అపక్షయమును వృద్ధియును స్వశబ్దములచేతనే నిరాకరింపఁబడుచున్నవి. అందు ఆత్మకూటస్థనిత్యుఁడును నిర్గుణుఁడును అగుటవలన స్వరూపముచేఁగాని గుణముచేఁగాని యతనికి అపక్షయము సంభవింప దని చెప్పఁబడుచున్నది శాశ్వతః అను శబ్దముచేత. శాశ్వతః=ఎల్లప్పుడును ఉండువాఁడు, అపక్షయముఁ బొందఁడు—తగ్గఁ డని యర్థము. అపక్షయముఁ బొందఁ డనునెడ వృద్ధిఁ బొందనచ్చు ననఁగా అట్లు కా దని చెప్పుచున్నారు పురాణః అని, పురాపి నవః—పూర్వమందును నూతనుఁడు—ఒక్కటే రూపమున నున్నవాఁడు కాని యిప్పుడు నూతన మయిన యవస్థను దేనిని బొందినవాఁడు కాఁడు, ఏది నూతన మయిన యొకానొకయుపచయావస్థను బొందునో అది గదా వృద్ధిఁ బొందిన దని లోకమునందుఁ జెప్పఁబడును. ఈయాత్మయో సదా యేకరూపుఁ డగుటవలన తగ్గఁడు పెరుగఁడుగూడ అని యర్థము. అస్తిత్వము విపరిణామము అను రెండువికారములుమాత్రము జన్మవినాశాంతర్భూతము లగుటవలన

* అసద్వాది గదా కాత్యాయనుఁడు.

వేఱుగా నిషేధింపఁబడినవి కావు. ఇట్లు ఆత్మ సర్వవికారరహితుఁ డగుటవలన, శరీరే హన్యమానే, తత్సంబంధము గలవాఁడైనను ఆత్మ యేయుపాయముచే నేనియు, నహన్యతే = చంప నలవికాఁ డని యుపసంహారము.

శ్రీ. 'నహన్యతే' అనుదానినే ఆఱుభావవికారములును లేనివాఁ డనుటచే దృఢీకరించుచున్నాఁడు.—నజాయతే—ఇందుచే జన్మము నిషేధింపఁబడినది. న మ్రియతే వా *—ఇందుచే వినాశము నిషేధింపఁబడినది. వాశబ్దములు రెండును చార్థకములు. అయమ్; భూత్వా=జన్మమునొంది; భూయః—పిమ్మట; నభవితా=ఉండువాఁడు కాఁడు, అస్తిత్వము నొందువాఁడు కాఁడు, మతే మనఁగా పూర్వమే తనయంత స్వయం వృఁడై యున్నవాఁడు, ఇందుచే జన్మము పొందిన పిమ్మట ఉండుట యను రెండవ వికారము నిషేధింపఁబడినది. అందుకు హేతు వేమి యనఁగా, అజః, ఏది పుట్టు చున్నదో అది జన్మానంతరము అస్తిత్వము నొందును, ఏది స్వయమే యున్నదో, అది మరల మఱియొక అస్తిత్వము నొంద దని యర్థము. నిత్యః—సదా యేక రూపుఁడు, ఇందుచే వృద్ధి నిషిద్ధము. శాశ్వతః = ఎల్లప్పుడు నుండువాఁడు, ఇందుచే అపక్షయనిషేధము చేయఁబడినది. పురాణః అనుటచే విపరిణామము నిషేధింపఁ బడినది, పురాపి నవ ఏవ—పూర్వమందును నూతనుఁడే గాని, ఎప్పుడును మార్పు పొందఁడు, రూపాంతరము నొందుటచే నూతనుఁడు కాఁ డని యర్థము. లేక, న భవితా అనుదాని అధ్యాహరించుకొని, భూయః = అధికముగా; నభవితా= కాఁడు అని యర్థము చేయవచ్చును, అప్పుడు దీనిచే వృద్ధినిషేధము చేయఁబడినది. అజః నిత్యః—ఈ రెండుపదములును వృద్ధి లేదనుటకు హేతువులు, కావునఁ బౌనరుక్త్యము లేదు. ఇట్లు 'జాయతే ఽస్తి వర్ధతే విపరిణమతే అపక్షీయతే వినశ్యతి' అని యాస్కాదులచేఁ జెప్పఁబడిన ఆఱుభావవికారములును నిరసింపఁబడినవి. ఎందుకొఱకీవికారములు నిరసింపఁబడెనో ఆ ప్రకృత మయిన వినాశాభావము నుపసంహరించు చున్నాఁడు న హన్యతే హన్యమానే శరీరే అని.

ప. ఇఁక నహన్యతే అనుటచే ఆత్మ షడ్భావవికారశూన్యుఁ డనుట యేది చెప్పఁబడెనో దానినే స్పష్టీకరించుటకై చెప్పుచున్నాఁడు.—జాయతే అస్తి వర్ధతే విపరిణమతే అపక్షీయతే వినశ్యతి—ఇవి యాఱువికారములు, వీనిఁ గ్రమముగా

* నశబ్దము ద్వితీయపాదాది లోనిది.

నిషేధించుచున్నాఁడు—నజాయతే అనుటచే జన్మనిషేధము, న మ్రియతే వా * — వా శబ్దములు చార్థకములు, దీనిచే వినాశనిషేధము. అయమ్, భూత్వా = పుట్టి, న భవితా—అస్తిత్వము పొందువాఁడు కాఁడు, మ తే మనఁగా పూర్వమునందే తన యంతనె సద్రూపుఁడై యుండువాఁడు, దీనిచే జన్మానంతరము అస్తిత్వము నొందుట యను రెండవవికారమునకు నిషేధము. దీనికి హేతువు—అజః, ఏది జన్మము నొందునో అది గదా జన్మానంతర మస్తిత్వముఁ బొందును. నిత్యః—ఎల్లప్పుడు ఏకరూపుఁడు, ఇందుచే వృద్ధిప్రతిషేధము. శాశ్వతః అనుటచే అపక్షయనిషేధము, నిరవయవుఁ డగుటవలనను నిర్గుణుఁ డగుటవలనను ఆత్మకు అపక్షయము సంభవింపదని యర్థము. పురాణః అనుటచే విపరిణామమునకు నిషేధము, పూర్వమందును నవీనుఁడే, కాని పరిణామమువలన రూపాంతరము నొంది నవీనుఁ డగువాఁడు కాఁడని యర్థము. లేక నభవితా అనుదాని ఈవలికి అధ్యాహరించుకొనునది, భూయః= అధికముగా, నభవితా = కాఁడు. ఇందుచే వృద్ధినిషేధము. అజః నిత్యః అనునవి వృద్ధ్యాదులు లే వనుటకు హేతువులు, కావునఁ బునరుక్తి లేదు. ఇట్లు వేదవాదులచేఁ జెప్పఁబడిన ఆఱువికారము లెందుకొఱకు నిరసింపఁబడెనో అట్టి ప్రకృత మయిన వినాశాద్యభావము నుపసంహరించుచున్నాఁడు న హన్యతే హన్యమానే శరీరే అని. ఈ యర్థమునందు కాఠకశ్రుతి—“న జాయతే మ్రియతే వా విపశ్చి న్నాయం కుతశ్చి న్న బభూవ కశ్చిత్ । అజో నిత్య శ్శాశ్వతో ఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే॥ హన్తాచే న్మన్యతే హన్తుం హతశ్చే న్మన్యతే హతమ్ । ఉభౌ తౌ నవిజానీతో నాయం హన్తి న హన్యతే ॥ అశరీరం శరీరేషు అనవస్థే ష్వవస్థితమ్ । మహాన్తం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి ” ♦ దీనియర్థమె ప్రతిపాదింపఁబడినది.

---

* ద్వితీయపాదాది వశబ్దము.

♦ అక్షతచైతన్యస్వభావుఁ డగు ఈ యాత్మ పుట్టఁడు చావఁడుగూడ, ఈ యాత్మ ఒకానొక కారణాంతరమువలనఁ గలిగినవాఁడు కాఁడు, ఈతనివలనను ఏవస్తువును గలిగినది కాదు. ఈతఁడు అజుఁడు నిత్యుఁడు, శాశ్వతుఁడు, పురాణుఁడు, అందువలన శరీరము హత మగుచున్నను హతుఁడుం గాఁడు. వధించువాఁడు ఇతని వధించుటకుఁ దలఁచునేని, హతుఁ డగువాఁడు తన్ను హతునిఁగాఁ దలఁచునేని, వా రిద్దఱు ఆత్మస్వరూపము నెఱుంగరు; ఈతఁడు వధింపఁడు, వధింపఁబడఁడు. శరీరము లేనివాఁడును నిత్యనిర్వికారుఁడును అనిత్యము లయిన శరీరములం దున్నవాఁడును గొప్ప వాఁడును వ్యాపకుఁడు నగు ఆత్మను దెలిసి యటుపిమ్మట పండితుఁడు శోకింపఁడు.

రా. చెప్పిన హేతువులచేతనే ఆత్మ నిత్యుఁడగుటచే అపరిణామి యని యేర్పడుటవలన అతనికి జననమరణాదు లగు అచేతన దేహధర్మము లేవియు సంభవింపవని చెప్పఁబడుచున్నది.—కదాచిత్ = ఒకానొకప్పుడును; నజాయతే=పుట్టఁడు, నమ్రియతేవా * = చావఁడుగూడ, ఆయాకాలమునందు సర్వదేహములందును అందఱిచేతను అనుభవింపఁబడుచున్న జననమరణము లొకప్పుడును ఆత్మను స్పృశింపవు. అయమ్= ఈయాత్మ; భూత్వా= కల్పాదియందుండి; భూయః = కల్పాంతమునందు; నభవితా= లేకపోవువాఁడు కాఁడు, కొన్ని ప్రజాపతిప్రభృతిదేహములకు కల్పాదియందును గల్పాంతమందును జననమును మరణమును గలుగునట్లు శబ్దప్రమాణముచే తెలియ వచ్చుచున్నది, ఆ జననమరణములుగూడ ఆత్మను స్పృశింప వని యర్థము. అందువలన సర్వదేహములను బొందునట్టి ఆత్మ, అజః = పుట్టనివాఁడు; కావుననె, నిత్యః = నాశము లేనివాఁడు; శాశ్వతః — ప్రకృతివలెఁ బ్రలయావస్థయందు సూక్ష్మ పరిణామముగూడ లేనివాఁడు. పురాణః = పూర్వమందును క్రొత్తవాఁడు, ఎల్లప్పుడును క్రొత్తవానియట్లు తోఁచువాఁ డని యర్థము. అందువలన, అయమ్ = ఈ యాత్మ; శరీరే = దేహము; హన్యమానే = వధింపఁబడుచుండఁగా; నహన్యతే = వధింపఁబడఁడు.

ఆయాకాలమునందు, ‘ఆయాదేహములు పుట్టుచున్నవి చచ్చుచున్నవి’ యని వర్తమానకాలికముగా ఏ జననమరణములు వ్యవహరింపఁబడుచున్నవో అవి ఆత్మను స్పృశింపవు. మఱియుఁ బ్రజాపతిప్రభృతిదేహములకుఁ గల్పాదియందుఁ గలుగు జననమును వానికిఁ గల్పాంతమునందుఁ గలుగు మరణంబును ఆత్మను స్పృశింపవు. కావున సర్వదేహగతుఁ డైన ఆత్మ అజుఁడు నిత్యుఁడు, సృష్ట్యవస్థయందు స్థూలపరిణామ మెట్లు లేదో అట్లు ప్రలయావస్థయందు సూక్ష్మపరిణామముగూడ ఆత్మకు లేదు. ఆత్మ సదా నవీనుఁడుగాఁ దోఁచువాఁడు. కావున, దేహము వధింపఁబడుచున్నను ఆత్మ హతుఁడు కాఁ డని తాత్పర్యము.

మా. ఈవిషయమునందు మంత్రవర్ణముగూడఁ గల దని చెప్పుచున్నాఁడు.—నజాయతే=పుట్టఁడు; నమ్రియతేవా † = చావఁడుగూడ. మఱియు, ఈశ్వరజ్ఞానమువలె, భూత్వా = ఉండి; భవితా న = పుట్టువాఁడును కాఁడు. ‘తదైక్షత’ ‡

* నశబ్దము అధ్యాహార్యము.

† ద్వితీయపాదాది నశబ్దము.

‡ ఆది చూచెను.

‘ దేశతః కాలతో యో ఽసా వవస్థాతః స్వతో ఽన్యతః । అవిప్లుతావబోధాత్మా ’ * ఇత్యాది శ్రుతిస్మృతులచే, ఈశ్వరజ్ఞానము వృద్ధిహ్రాసాదివర్జితమై యెల్లప్పుడును ఏకరూపముగా నుండునది యైనను ఒకానొక అచింత్యశక్తిచేఁ బుట్టెనను వ్యవహారము నొందుచున్నది గదా! ఎందువలనఁ బుట్టఁడు చావఁ డనఁగా, అజః నిత్యః శాశ్వతః—అజాదిలక్షణుఁ డయిన యీశ్వరునితో సరూపుఁ డగుటవలన; అజః = జన్మము లేనివాఁడు, నిత్యః = నాశరహితుఁడు, శాశ్వతః = సదా యేకరూపుఁడు. పురాణః= పురమ్ అణతి = దేహమును బొందుచున్నాఁడు, కావున పురాణుఁడు, దేహాంతరముఁ బొందువాఁ డనుట; అట్లయినను, శరీరే = దేహము; హన్యమానే = వధింపఁబడుచుండఁగా, నహన్యతే = వధింపఁబడఁడు.

ఈ జీవుఁడు పుట్టఁడు చావఁడు, మఱియు ఈశ్వరజ్ఞానము వృద్ధిహ్రాసాదులు లేనిదై సర్వదా యేకరూప మయి యుండియు ఒకానొక అచింత్యశక్తిచే క్రొత్తగాఁ గలిగె నను వ్యవహారము నొందునట్లు శ్రుతిస్మృతిప్రసిద్ధ మయి యున్నది, జీవుఁ డట్టి వ్యవహారమునకుఁగూడ విషయము గాఁడు. ఎందువలన జీవునికి జననమరణములు లేవనఁగా, అతఁడు అజనిత్యశాశ్వతలక్షణుఁ డైన యీశ్వరునకు సరూపుఁడు ♦. అయినను దేహాంతరము పొందువాఁ డగుటచే జననాదివ్యవహారభ్రాంతి గలుగుచున్నది, కాని, దేహము హత మయినను అతఁ డెంతమాత్రము హతుఁడు కాఁ డని తా.

వేదా ఽవినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్. ౨౧

భా. ‘య ఏనం వేత్తి హన్తారమ్’ అను మంత్రముచే ఆత్మ హనన క్రియకుఁ గర్తయుఁ గర్మమును గాఁ డని ప్రతిజ్ఞ చేసి, ‘నజాయతే’ అను మంత్రముచే అందుకు హేతువును అవిక్రియత్వమును బ్రతిపాదించి, యిఁకఁ బ్రతిజ్ఞాతార్థము నుపసంహరించుచున్నాఁడు.—యః = ఎవ్వఁడు; ఏనమ్ = పూర్వమంత్రముచేఁ జెప్పఁబడిన లక్షణము గల ఈ యాత్మను; అవినాశినమ్ = కడపటిభావవికార మయిన వినాశము లేనివానిఁగాను;

* దేశమువలనను కాలమువలనను అవస్థవలనను తనవలనను ఇతరమువలనను ఎపుడు అక్షయజ్ఞానస్వరూపుఁడో.

♦ సదృశ మయిన రూపము గలవాఁడు.

నిత్యమ్ = విపరిణామము లేనివానిఁగాను; అజమ్ = జన్మము లేనివానిఁగాను; అవ్యయమ్ = అపక్షయము లేనివానిఁగాను; వేద = ఎఱుంగుచున్నాఁడో. పార్థ= అర్జునుఁడా! కథమ్= ఏవిధముచేత; సః=ఆ విద్వాంసుఁడగు; పురుషః = అధికారి యయిన పురుషుఁడు; కమ్ = ఎవ్వని; హన్తి = వధించును ? కమ్ = ఎవ్వని; ఘాతయతి = వధించుటకుఁ బ్రేరించును ? ఏవిధముచేతను ఎవ్వనిని వధింపఁడు ఏవిధముచేతను ఎవ్వనిని వధించుటకుఁ బ్రేరింపఁడు అని రెండుస్థలము లందును కింశబ్దమునకు ఆక్షేపమే యర్థము, ప్రశ్నార్థము సంభవింపమివలన.

ఎవ్వఁడు పూర్వోక్తమంత్రార్థము గ్రహించి యీయాత్మ వినాశము లేనివాఁ డనియు విపరిణామము లేనివాఁ డనియు జన్మము లేనివాఁ డనియు అపక్షయము లేనివాఁ డనియుఁ దెలిసికొనుచున్నాఁడో అట్టి జ్ఞాని యగు పురుషుఁడు, అర్జునా! ఏవిధమునను ఎవ్వనినిఁ గూడ వధింపఁడు, ఎవ్వనినిగూడ వధించుటకుఁ బ్రేరింపఁ డని తాత్పర్యము.

ఆ. పూర్వశ్లోకార్థమే యుత్తరశ్లోకమునందును గనఁబడుటవలనఁ బౌనరుక్త్యశంకఁ బరిహరించుటకై కడచినవిషయము ననువదించి యుత్తరశ్లోకమున కవతారిక చేయుచున్నారు య ఏన మిత్యాదిగా. మూలమునందు.—కర్తృత్వాద్యభిమానవిరోధమువలనను ఆత్మ అద్వైతకూటస్థుఁ డను నిశ్చయముయొక్క సామర్థ్యమువలనను, విద్వాంసునకు సిద్ధ మయిన సన్న్యాసమును విద్యాపరిపాకముకొఱ కనుమతించుచున్నాఁడు వే దేత్యాదిశ్లోకముచేత. పూర్వమువలెఁ బదద్వయమునకు పునరుక్తతను బరిహరించుచున్నారు అవినాశిన మిత్యాదిగా. ప్రశ్నకూడ సంభవించుచుండఁగా వేఱువిధముగా నేల వ్యాఖ్యానము చేయఁబడుచున్న దనఁగా అందుకుఁ జెప్పుచున్నారు రెండుస్థలములందును ఇత్యాదిగా. దీనియనంతరము ఉత్తరము కనఁబడ కుండుటవలనఁ బ్రశ్న సంభవింప దని యర్థము.

భా. హేత్వర్థము తుల్య మగుటవలన విద్వాంసునకు సర్వకర్మముల నిషేధించుటయే ప్రకరణార్థం బని భగవంతునియభిప్రాయము. హన్ననాక్షేపమో యుదాహరణార్థము.

ఆక్షేపము.—విద్వాంసునకుఁ గర్మము సంభవింప దనుట కేమికారణవిశేషము చూచి కర్మముల నాక్షేపించుచున్నాఁడు భగవంతుఁడు కథం

స పురుషః అని. ఓయీ! సర్వకర్మములును సంభవింప వనుటకు ఆత్మ అవిక్రియుఁ డగుట యను కారణవిశేషము చెప్పఁబడియే యున్నది. సత్యము, చెప్పఁబడియున్నది. కాని అది కారణవిశేషము కాఁజాలదు, ఏల యనఁగా, ఆత్మ యవిక్రియుఁడైనను, విద్వాంసుఁ డతనికన్న భిన్నుఁడు. ఒకానొక స్తంభమును అవిక్రియ మని తెలిసినవానికిఁ గర్మము సంభవింప దని చెప్పుట యొప్పునా?

సమాధానము.—అది సరికాదు, విద్వాంసుఁడే యాత్మ యగుట వలన. ఎట్లనఁగా, దేహాదిసంఘాతమునకు విద్వత్త్వ మనుట చెల్లదు గదా! అందువలన పారిశేష్యమువలన § అసంహతుఁ డైన * ఆత్మయె విద్వాంసుఁడు, అతం డవిక్రియుఁ డగుటచే విద్వాంసునకుఁ గర్మము సంభవింపదు, కావున 'కథం స పురుషః' అని యాక్షేపము యుక్తమే. ఎట్లు బుద్ధ్యాద్యాహృత మైన ♦ శబ్దాద్యర్థమునకు, అవిక్రియుఁడే యగు ఆత్మయే బుద్ధివృత్త్యవివేకజ్ఞానంబున ❥ అవిద్యచే, ఉపలబ్ధ యని కల్పింపఁబడుచున్నాఁడో; అట్లే, ఆత్మానాత్మవివేకజ్ఞానంబున, బుద్ధివృత్తిరూప విద్యచే అసత్యరూప మయిన దానిచేతనే, పరమార్థంబున అవిక్రియుఁడే యగు ఆత్మయే విద్వాంసుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. విద్వాంసునకుఁ గర్మము సంభవింప దని వచించుటవలన ఏకర్మంబులు శాస్త్రముచే విధింపఁబడుచున్నవో అవి యవిద్వాంసునకు విధింపఁబడిన వని భగవంతునినిశ్చయము తెలియవచ్చుచున్నది.

ఆక్షేపము.—ఓయీ! విద్యగూడ అవిద్వాంసునకే విధింపఁబడుచున్నది, విద్య యెఱింగినవానికిఁ బిష్టపేషణముంబోలె విద్యను విధించుట నిష్ప్రయోజన మగుటవలన. అందు అవిద్వాంసునకే కర్మములు విధింపఁబడుచున్నవి, విద్వాంసునకుఁ గా వను విశేష ముపపన్నము కాదు.

సమాధానము.—అట్లు కాదు. అనుష్ఠేయం బుండుట లేకపోవుట యను విశేష ముపపన్న మగుటవలన. అగ్నిహోత్రాదివిధియొక్క

§ శేషించినవాఁ డగుటవలన.

* దేహాదిసంఘాతముయొక్క సంబంధము లేనివాఁ డగు.

♦ బుద్ధి మొదలగువానిచే తేఁబడిన.

❥ బుద్ధివృత్తికి ఆత్మకును అవివేకజ్ఞానంబున—తాదాత్మ్యము తలంచుటవలన.

యర్థము తెలిసిన పిమ్మట 'కర్తను నేను నేను జేయవలెను' ఇట్టి జ్ఞానము గల యవిద్వాంసునకు అనేకసాధనములు సంపాదించి యగ్నిహోత్రాదికర్మ మనుష్ఠేయము. ఎట్లు వానికి అనుష్ఠేయ మున్నదో, అట్లు మఱి నజాయత ఇత్యాద్యాత్మస్వరూపవిధియొక్క యర్థము తెలిసిన పిదపఁ గొంచెమేని యనుష్ఠేయము సంభవింపదు. మఱేమనఁగా 'కాను నేను గర్తను, కాను నేను భోక్తను' ఇత్యాదిగా 'ఆత్మయొకఁడు అకర్త' ఇత్యాదివిషయముఁ దెలియుట దక్క ఇతరము జనియింపదు అను నీవిశేష ముపపన్నము. ఎవ్వఁడు మఱి 'కర్తను నేను' అని యాత్మను తలఁచునో, వానికి 'నే నిది చేయవలెను' అను బుద్ధి యవశ్యము కలుగును. అందువలన నతఁ డధికారి యగుచున్నాఁడు, కావున వానికిఁ గర్మములు. వాఁడు అవిద్వాంసుఁడు, 'ఉభౌ తౌ నవిజానీతః' అనువచనమువలనను, విశేషితుఁ డగు * విద్వాంసునకు 'కథం సపురుషః' అని కర్మాక్షేపవచనమువలనను. అందువలన విద్వాంసునకును ముముక్షువునకును సర్వకర్మసన్న్యాసమునందే యధికారము. కావుననే, భగవంతుఁడు నారాయణుండు విద్వాంసు లగు సాంఖ్యులకును అవిద్వాంసు లగు కర్ములకును విభాగించి రెండు నిష్ఠలను విధించుచున్నాఁడు 'జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్' అని. అట్లు భగవంతుఁ డగు వ్యాసుఁడు తనపుత్త్రునకుఁ జెప్పెను. 'ద్వావిమావథ పన్థానౌ' ♦ ఇత్యాదిగా. అందు కర్మమార్గమే మొదటిది యనియుఁ బిమ్మటిది సన్న్యాసం బనియు. ఈ విభాగములనే మాటిమాటికిఁ జూపఁబోవుచున్నాఁడు భగవంతుఁడు 'అతత్త్వవిత్, అహఙ్కారవిమూఢాత్మా కర్తాహ మితి మన్యతే, ❨ 'తత్త్వవిత్తు నాహం కరోమి, § అని. మఱియు 'సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే' ♦ ఇత్యాదిగా.

ఆ॰ హేత్వర్థము—అవిక్రియత్వము, అది విద్వాంసునకు సర్వకర్మములను నిషేధించుటయందును సమాన మగుటవలన నని యర్థము. విద్వాంసునకు సర్వకర్మ

* అవినాశి ఇత్యాదిగా ఆత్మను దెలిసికొన్నవాఁడు అను విశేషణము చెప్పఁబడినవాఁ డగు.

♦ ఇఁక ఇవి రెండుమార్గములు—మోక్షధర్మము—౨౪౧—౬.

❨ ౩—౨౭. § ౩—౨౮. నేను జేయుదు—౨౧ వ శ్లోకమున కర్థము.

♦ ౫—౧౩.

ములను నిషేధించుట యిష్టం బగునేని అప్పు డేల హననక్రియమాత్రమె యాక్షేపింపఁ బడుచున్నది అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు హననాక్షేపమో ఇత్యాదిగా.

చెప్పిన హేతువు నాక్షేపించుట కడుగుచున్నాఁడు విద్వాంసునకు ఇత్యాదిగా. అభిప్రాయముఁ దెలియనివాఁడై పూర్వోక్త మయిన హేతువిశేషమును స్మరణకుఁ దెచ్చుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. దాని నంగీకరించి యాక్షేపించుచున్నాఁడు సత్యము ఇత్యాదిగా. విజ్ఞానాత్ముఁ డగు విద్వాంసుండును జ్ఞేయ మగు బ్రహ్మమును విరుద్ధధర్ము లగుటచే నిప్పును మంచునుంబోలె భిన్ను లగుటవలన విద్వాంసునకు సర్వకర్మములు సంభవింప వనుట కిది కారణవిశేషము కా దని చెప్పుచున్నాఁడు ఏల యనఁగా ఇత్యాదిగా. అట్లయినను బ్రహ్మమును కూటస్థమునుగాను అవిక్రియముగాను దెలిసినవానికి ఎట్లు విక్రియ సంభవించును? బ్రహ్మజ్ఞానమునకు విరోధం బగును గదా! అని యాశంకించి చెప్పుచున్నాఁడు ఒకా ... త్యాదిగా.

!విక్రియుఁడే యగి

'అయ మాత్మా బ్రహ్మ' ఇత్యాదిశ్రుతిచే ఃపలబ్ధ యని... చెప్పుచున్నారు అది సరికాదు ఇత్యాదిగా. మఱియు విద్వత్త్వముంబున్న ుకా? కేవలునకా? మొదటిది కాదు, విశిష్టునకు విద్వత్త్వ మన్నచో విశేషణమునకుఁగూడ విద్వత్త్వము ప్రసక్త మగును, విశేషణ మయిన దేహాదిసంఘాతమో అచేతన మగుటచే దానికి విద్వత్త్వము యుక్తము కా దని చెప్పుచున్నారు దేహాదిసంఘాతమునకు ఇత్యాదిగా. రెండవపక్షమునందో జీవుఁడు వేఱు బ్రహ్మము వేఱు అను విభాగము సిద్ధింప దని చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. మఱియుఁ బ్రామాణిక మయిన విరుద్ధధర్మము అసిద్ధ మగుటవలనను బ్రాతిభాసిక మయిన విరుద్ధధర్మమో అసత్య మగుటవలనను బింబప్రతిబింబము లనియతము లగుటవలనను భేదానుమానము సిద్ధింపమివలనను జీవబ్రహ్మముల కభేదము సిద్ధించుచున్న దను నభిప్రాయముతో ఫలితముఁ జెప్పుచున్నారు అతం డవిక్రియుఁ డగుటచే నిత్యాదిగా. ఓయీ! అవిక్రియుఁ డగు విద్వాంసుఁడు బ్రహ్మరూపుఁ డగుటచే నతనికి సర్వకర్మములు సంభవింప వన్న పక్షమునందు అతనికి విద్వత్త్వముమాత్ర మెట్లు సంభవించును? అవిక్రియ మయిన బ్రహ్మమునకు విద్యారూపవికారము కల దనుట యొప్పునా? అందుకుఁ జెప్పుచున్నారు. ఎట్లు ఇత్యాదిగా. అదృష్టేంద్రియాదిసహకృత మయి ప్రదీపప్రభవలె విషయపర్యంతము ప్రసరించిన యంతఃకరణము బుద్ధివృత్తి యని చెప్పఁబడును. అందుఁ బ్రతిబింబిత మయిన చైతన్యము, అభివ్యంజక మయిన బుద్ధివృత్తితో అవివేకము

వలన విషయజ్ఞాన మని వ్యవహరింపఁబడుచున్నది. అందుచే ఆత్మ ఉపలబ్ధ * యని కల్పింపఁబడుచున్నాఁడు. అది అవిద్యాప్రయుక్త మయిన మిథ్యాసంబంధముచేఁ గలిగినది. అట్లే ఆధ్యాసికసంబంధముచే బ్రహ్మాత్మైక్యాభివ్యంజక మయిన మహా వాక్యోత్పన్న మగు బుద్ధివృత్తిద్వారమున ఆత్మ విద్వాంసుఁ డని వ్యపదేశింపఁబడు చున్నాఁడు. అట్లు మిథ్యాసంబంధముచేఁ బారమార్థిక మయిన అవిక్రియత్వమునకు హాని కలుగ దని యర్థము. 'అహం బ్రహ్మ' అను బుద్ధివృత్తి మోక్షావస్థయందుఁగూడ ఉండుటవలన ఆత్మకు సవిశేషత్వము సంభవించు నని యాశంకించి యది యుపాధి యుండువఱకే యుండు నని చెప్పుచున్నారు అసత్యరూప మయినదానిచేత నే యని. ఓయీ! కూటస్థుఁ డైన ఆత్మ మిథ్యావిద్యావంతుఁడే యయినను అతనికిఁ గర్మములం దధికారము చెల్ల దన్న యెడ, ఇఁకఁ గర్మము లెవ్వనికి విధింపఁబడుచున్నవి? అధికారి లేకయే విధింపఁబడుచున్న వని చెప్పఁ దగదు గదా! అని యాశంకించి చెప్పుచున్నారు విద్వాంసునకు ఇత్యాదిగా.

కర్మము లవిద్వాంసునకు విధింపఁబడినవి అను విశేషము నాక్షేపించు చున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. కర్మవిధానము అవిద్వాంసునకు విద్వాంసునకు విద్యావిధాన మని విభాగము చేయుటచే ఏమి హాని యని యాశంకించి చెప్పు చున్నాఁడు విద్య యెఱింగినవానికి ఇత్యాదిగా. విద్య యెఱింగినవానికి—విద్యను బొందినవాని కని యర్థము. కర్మవిధి యవిద్వాంసునకు విద్వాంసునకు విద్యావిధి యను విభాగము సంభవింప దని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నాఁడు అందు ఇత్యాదిగా.

ధర్మజ్ఞానానంతరము అనుష్ఠేయము కలుగుటవలనను బ్రహ్మజ్ఞానోత్తర కాలము అది లేమివలనను బ్రహ్మజ్ఞానము లేనివానికే కర్మ విధి యని సమాధానము చెప్పుచున్నారు అట్లు కాదు ఇత్యాదిగా. విశేష ముపపన్న మనుటనే ప్రకటించు చున్నారు అగ్నిహోత్రాది ఇత్యాదిగా. ఓయీ! దేహాదివ్యతిరిక్తుఁడు ఆత్మ యను జ్ఞానము లేక పరలోకఫలము లయిన కర్మములందుఁ బ్రవృత్తి కలుగదు, కావున అట్టి జ్ఞానము గలవాఁడే కర్మము ననుష్ఠింపవలెను అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు కర్తను నేను ఇత్యాదిగా. ఆత్మ కర్త భోక్త యను జ్ఞానము గలవాఁ డైనను బ్రహ్మ జ్ఞానము లేనివాఁ డగుటచే అవిద్వాంసునకే కర్మ మనుష్ఠేయం బని యర్థము. దేహాదివ్యతిరిక్తాత్మజ్ఞానమువలె బ్రహ్మజ్ఞానముగూడ జ్ఞానమే యగుటవలన కర్మము

* ప్రమాత—జ్ఞాత.

నందుఁ బ్రవృత్తి కుపకరింపఁ గల దని యాశంకించి చెప్పుచున్నారు అట్లు మఱి ఇత్యాదిగా. అవిక్రియాత్మజ్ఞానము అనుష్ఠేయమునకు విరోధి యగుటవలన నని శేషము. ఓయీ! బ్రహ్మాత్మైక్యజ్ఞానము కలిగిన పిమ్మటఁగూడ కర్తృత్వాదిజ్ఞాన మున్నయెడ కర్మవిధి సావకాశ మగు ననఁగా అందుకుఁ జెప్పుచున్నారు కాను నేను కర్తను ఇత్యాదిగా. కారణము లేమివలన అని శేషము. ఇతరము. కర్తృత్వాదిజ్ఞానము అనుష్ఠానమునందును అననుష్ఠానమునందును చెప్పినవిశేష ముండుటవలన అవిద్వాంసునకు అనుష్ఠాన మనియు విద్వాంసున కది లే దనియు నుపసంహరించుచున్నారు అను నీవిశేష ముపపన్న మని. ఓయీ! ఆత్మవేత్తకు అనుష్ఠేయము కొంచెమేని లే దనునెడ, అప్పుడు ఎట్లు 'విద్వాన్ యజేత' * ఇత్యాదిశాస్త్రముచే విద్వాంసు నుద్దేశించి కర్మములు విధింపఁబడుచున్నవి? అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు ఎవ్వఁడు మఱి ఇత్యాదిగా. ఆత్మకు కర్తృత్వాదులు గల వను జ్ఞానము గలవాఁడై తాను గర్మములయందు అధికృతుఁ డని యెవ్వఁడు తలఁచునో వాని నుద్దేశించి కర్మములు విధింపఁబడుచున్నవి, వాఁడో పైచెప్పిన వచనమువలన అవిద్వాంసుఁడే యని నిశ్చయింపఁబడుచున్నది. అకర్తృత్వాదిజ్ఞానము గలవానికి తద్విపరీత మయిన కర్తృత్వాదిజ్ఞానముచేఁ గలుగవలసిన కర్మప్రవృత్తి సంభవింపదు గదా యని యర్థము. బ్రహ్మవేత్తకుఁ గర్మము సంభవింప దనుటకు మఱియొకహేతువుఁ జెప్పుచున్నారు విశేషితుఁ డగు విద్వాంసునకు ఇత్యాదిగా. విశేషితుఁడు — వేదా వినాశిన మిత్యాదిగా విశేషణము చెప్పఁబడినవాఁడు. విద్వాంసునకుఁ గర్మము లేకున్నను వివిదిషువునకు ♦ కర్మము గలుగవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. కర్మములు విద్యకు విరుద్ధములగుటవలనను అపేక్షించునట్టి మోక్షమునకుఁ బ్రతిపక్షము లగుటవలనను అని యర్థము. ముముక్షువునకు ఆశ్రమకర్మము లపేక్షితములే యయినను అవి విద్యకును తత్ఫలాభ్యాసమునకును అవిరుద్ధము లయినవే యంగీకార్యములు, కానిచో వివిదిషా సన్న్యాసవిధి విరోధించు నని యభిప్రాయము గలవారై చెప్పిన యర్థమునందు భగవంతుని యనుమతిం జూపుచున్నారు కావుననే ఇత్యాదిగా. విద్వాంసునకును వివిదిషువునకును సన్న్యాసమునం దధికారము, అవిద్వాంసునకుమాత్రము కర్మమునం దధికార మని విభాగము సమ్మత మగుటవలన నని యర్థము. అధికారిభేద

* విద్వాంసుఁడు యజ్ఞము చేయవలెను.

♦ తెలియఁ గోరువానికి.

ముచే రెండునిష్ఠలు భగవంతుఁ డగు వేదవ్యాసునిచేతఁగూడఁ జెప్పఁబడిన వని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. అధ్యయనవిధింబట్టి త్రైవర్ణికుఁడు స్వాధ్యాయ పాఠమునందుఁ బ్రవర్తించిన పిదప, వానికి అందు కర్మమార్గము జ్ఞానమార్గము అని రెండుమార్గములు అధికారిభేదముచేఁ దెలుపఁబడిన వని యర్థము. ఆదిశబ్ద ముచే † 'యత్ర వేదాః ప్రతిష్ఠితాః' * ఇత్యాదికము గ్రహింపఁబడుచున్నది. చెప్పిన రెండుమార్గములు తుల్యము లనుటను బరిహరించుటకై యుదాహరణాంత రము చెప్పుచున్నారు మఱియు ఇత్యాదిగా. బుద్ధిశుద్ధిద్వారమునఁ గర్మమునందును తత్ఫలమునందును వైరాగ్యము కలుగుటకుఁ బూర్వము కర్మమార్గము విహితము, విరక్తునకు మఱి సన్న్యాసపూర్వక మయినజ్ఞానమార్గము దర్శితము, ఆ జ్ఞానమార్గము కర్మమార్గముకన్నను అతిశయితము అని తెలియవచ్చుచున్నది యని యర్థము. చెప్పిన విభాగమునకు ఇంక అనుకూలము లయిన వాక్యశేషములు చూపుచున్నారు ఈ విభాగములనే ఇత్యాదిగా. అహఙ్కారవిమూఢాత్మా అనుదానికి వ్యాఖ్యానము అతత్త్వవిత్ అని. తత్త్వవిత్తు అని శ్లోకము నారంభించి తాత్పర్యార్థమును సంగ్రహించుచున్నారు నాహం కరోమి అని. విరక్తునిగూర్చి మఱియొకవాక్యముఁ బఠించుచున్నారు మఱియు ఇత్యాదిగా. ఆదిశబ్దమునకు ♦ ఆశ్లోకముయొక్క శేషము సంగ్రహించుట ప్రయోజనము.

భా. ఆక్షేపము.—అందుఁ గొందఱు పండితమ్మన్యులు పలికెదరు. జన్మాదిషడ్భావవికారరహితుఁడు అవిక్రియుఁడు అకర్త యగు ఆత్మ నే నను జ్ఞాన మెవ్వనికిని గలుగదు. అట్టి జ్ఞానము కలిగినం గదా సర్వకర్మసన్న్యాస ముపదేశింపఁబడుచున్నది. అని.

సమాధానము.—అట్లు కాదు. నజాయత ఇత్యాదిశాస్త్రోపదేశమునకు నిష్ప్రయోజనత ప్రసక్తించుటవలన. మఱియు, ఎట్లు శాస్త్రోపదేశసామర్థ్యమువలన ధర్మాధర్మములు కల వను జ్ఞానంబును కర్తకును దేహాంతరసంబంధము కల దను జ్ఞానంబును సంభవించుచున్నవో, అట్లు శాస్త్రమువలన వానికే ఆత్మ అవిక్రియుఁడు అకర్త ఇత్యాదిజ్ఞానం బెందు

† ఇత్యాదిగా అనుచోట నున్న ఆదిశబ్దముచే.

* దేనియందు వేదములు ప్రతిష్ఠితములో—ఏది వేదములకు ముఖ్యాభిప్రాయమో.

♦ ఇత్యాదిగా అనుచోటి ఆదిశబ్దమునకు.

వలన సంభవింప దని వాని నడుగవలెను. కరణములకు * అవిషయ మగుటవలన అన్న యెడ అట్లు కాదు. 'మనసై వానుద్రష్టవ్యమ్' ‡ అను శ్రుతివలన. శాస్త్రాచార్యోపదేశ శమదమాదిసంస్కృతం బగు మనస్సు ఆత్మదర్శనమునందుఁ గరణము. అట్లు తజ్ఞానముకొఱకు అనుమానంబును శాస్త్రంబును ఉండఁగా జ్ఞానము సంభవింప దను నీ మాట సాహసమాత్రము.

జ్ఞానమో పుట్టుచునే తద్విపరీత మయిన యజ్ఞానము బాధించు నని యవశ్య మంగీకరింపవలెను. ఆ యజ్ఞానమునుం జూపఁబడినది 'హన్తా అహమ్ హతో౽స్మి' అనియు 'ఉభౌ తౌ నవిజానీతః' అనియు. ఇందు ఆత్మ హననక్రియకు కర్త యనుటయు కర్మ మనుటయు హేతుకర్త ♦ అనుటయు అజ్ఞానకృత మని తెలుపఁబడినది. అట్లు కర్తృత్వాదికము అవిద్యాకృత మనుట సర్వక్రియలందును సమానము, ఆత్మ అవిక్రియుఁ డగుటవలన. వికారవంతుఁడు గదా కర్త యగును, మఱి, తనకుఁ గర్మభూతుఁ డైన యితరునిఁ బ్రేరించును 'చేయుము' అని. కావున అవిశేషముగా విద్వాంసునకు సర్వక్రియలందును కర్తృత్వమును హేతుకర్తృత్వమును నిషేధించుచున్నాఁడు భగవంతుఁడు వాసుదేవుఁడు, విద్వాంసునకు కర్మములం దధికారము లే దని తెలుపుటకొఱకు. 'వేదావినాశినమ్...కథం సపురుషః' ఇత్యాదిగా.

మఱి దేనియందు విద్వాంసున కధికారము? అనఁగా, దీనికి మున్నె చెప్పితిమి 'జ్ఞానయోగేన సాఙ్ఖ్యానామ్' § అని చెప్పఁబడియున్న దని. మఱియు సర్వకర్మసన్న్యాసముఁ జెప్పఁబోవుచున్నాఁడు 'సర్వకర్మాణి మనసా' $ ఇత్యాదిగా.

ఆక్షేపము.—మనసా అని చెప్పుటవలన వాచికములకును కాయికములకును సన్న్యాసము చెప్పఁబడదు?

---

* ఇంద్రియములకు.

‡ బృహ. ౪. ౪. ౧౯. మనసుచేతనే తెలియవలెను.

♦ ప్రేరకుఁడు.

§ అ. 3-3.

$ అ. ౫-౧౩.

సమాధానము.—కాదు. 'సర్వకర్మాణి' అని విశేషణము చెప్పుట వలన.

ఆక్షేపము.—మానసము లయిన సర్వకర్మములకే సన్న్యాసము.

సమాధానము.—కాదు. ఏల యనఁగా. మనోవ్యాపారము గలిగిన పిమ్మటఁ గదా వాక్కాయవ్యాపారములు కలుగును. మనోవ్యాపారము లేనియెడ కర్మమే సంభవింపదు.

ఆక్షేపము.—శాస్త్రీయము లయిన వాక్కాయకర్మములకుఁ గారణము లయిన మానసకర్మములు—మనోవ్యాపారములు దక్క ఇతరము లయిన సర్వకర్మములను మనస్సుచే సన్న్యసించి యున్నాఁడు, అని యభిప్రాయము.

సమాధానము.—అట్లు కాదు. 'నైవ కుర్వన్న కారయన్' అను విశేషణమువలన.

ఆక్షేపము.—ఈ సర్వకర్మసన్న్యాసము భగవంతునిచేఁ జావఁ బోవువానికిఁ జెప్పఁబడినది, బ్రతికియుండువానికిఁ గాదు.

సమాధానము.—కాదు, 'నవద్వారే పురే దేహీ ఆస్తే' * అను విశేషణము అనుపపన్న మగుటవలన. సర్వకర్మసన్న్యాసముచే మృతునకు తనదేహమునం దుండుట సంభవింపదు గదా!

ఆక్షేపము.—చేయకయు చేయింపకయు దేహమునందు సన్న్యసించి యని యన్వయము. దేహమునం దున్నాఁ డని కాదు.

సమాధానము.—అట్లు కాదు. ఏల యనఁగా, అంతటను ఆత్మయవిక్రియుఁ డని నిర్ధారింపఁబడినది. ఆసనక్రియకు ♦ అధికరణము కావలెను. సన్న్యాసమునకో అది యపేక్షితము కాదు. మఱియు ఇట సంపూర్వక మయిన ❛ న్యాసశబ్దమునకు త్యాగము అర్థము కాని నిక్షేపము అర్థము కాదు. §

---

* నవద్వార మయిన పురరూప మైన దేహమునం దున్నాఁడు.

♦ ఉండుట యను కార్యమునకు.

❛ సమ్ అను ఉపసర్గము ముందుగాఁ గల.

§ త్యాగము—విడుచుట, నిక్షేపము—ఉంచుట.

అందువలన గీతాశాస్త్రమునం దాత్మజ్ఞాననంతునకు సన్న్యాసము నందే యధికారము కాని కర్మమునందుఁ గా దని సిద్ధాంతము. ఈ విషయం బచ్చటచ్చట ముందు ఆత్మజ్ఞానప్రకరణంబునఁ జూపఁగలము.

ఆ. అవిక్రియాత్మజ్ఞానమువలనఁ గర్మసన్న్యాసము నిరూపించి యందుకు మీమాంసకుల యాక్షేపముఁ జెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. ఆత్మ జ్ఞాన క్రియాశ్రయుఁ డగుటచే అతనికి అవిక్రియత్వము సంభవింపమివలన సన్న్యాసము నకుఁ గారణ మయిన అవిక్రియాత్మజ్ఞానము సంభవింప దని యర్థము.

అవిక్రియాత్మజ్ఞానము సంభవింప దనుట విషయాభావమువలననా? ప్రమాణాభావమువలననా? అని వికల్పించి మొదటిపక్షమును దూషించుచున్నారు అట్లు కాదు ఇత్యాదిగా. అవిక్రియాత్మ లేఁ డని చెప్పఁ దగదు. ఏల యనఁగా. ఆప్తవాక్య మగుటచేఁ బ్రమాణ మైన 'నజాయతే మ్రియతే వా' ఇత్యాదిశాస్త్ర మును కారణము లేక నిరర్థక మని యెట్లు చెప్పవచ్చును? అని యర్థము. రెండవ పక్షము నిరాకరించుచున్నారు మఱియు ఎట్లు ఇత్యాదిగా. పరలోకఫలకర్మవిధిసామ ర్థ్యముచే సిద్ధ మగు విజ్ఞానము నుదాహరించుచున్నారు కర్తకును ఇత్యాదిగా. కర్మ కాండమువలన అజ్ఞాత మయిన ధర్మాదులవిషయ మయి విజ్ఞానము కలుగునట్లు జ్ఞానకాండమునలన అజ్ఞాత మయిన బ్రహ్మాత్మవిషయ మయి విజ్ఞానము కలుగు ననియె చెప్పవలెను, కర్మజ్ఞానకాండములకుఁ బ్రామాణ్యము సమాన మగుటవలన నని యర్థము. జ్ఞానము మనస్సంయోగజన్య మగుటవలన ఆత్మ మనోగోచరుఁడు కాఁ డని శ్రుతి వచించుటవలన ఆత్మజ్ఞానమునందు సాధనము లే దని శంకించుచున్నాఁడు కరణములకు ఇత్యాదిగా. శ్రుతి నాశ్రయించి పరిహరించుచున్నారు అట్లు కాదు మన సైవ ఇత్యాదిగా. శాస్త్రాచార్యోపదేశము ననుసరించి తత్త్వమస్యాదివాక్య ముచేఁ గలిగిన మనోవృత్తిచేతనే తత్త్వమును దెలియవలె నని శ్రుతి యుపదే శించుచున్నది. స్వరూపముచే స్వప్రకాశ మయినను బ్రహ్మాత్మవస్తువు వాక్యజన్యబుద్ధి వృత్తిచే అభివ్యక్తమై సవికల్పకవ్యవహారమునకు విషయ మగుచున్నది. కావున మనోగోచరత్వము సిద్ధించుటంజేసి కరణములకు అవిషయం బనుట యుక్తము కా దని యర్థము. అట్లయినచో, బ్రహ్మాత్మ మనోవిషయము కా దను శ్రుతి కేమి యుపపత్తి యని యాశంకించి అసంస్కృత మయిన మనోవృత్తి దానికి విషయ మని యభిప్రాయము గలవారై చెప్పుచున్నారు శాస్త్రాచా ర్యేత్యాదిగా. శ్రుత్యాదిక మున్నను తదనుగ్రాహక మయిన యనుమానము లేకుండుటవలన మాకు అవిక్రి

యాత్మజ్ఞానము పుట్ట దనియె తోఁచుచున్న దని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. తత్ జ్ఞానముకొఱకు—ఆయవిక్రియాత్మయొక్క జ్ఞానముకొఱకు, విమత మయిన వికారము ఆత్మధర్మము కాదు, వికార మగుటవలన, ఉభయాభిమతవికారమువలె * అను అనుమానమును పూర్వోక్తశ్రుతిస్మృతిరూప మగు శాస్త్రంబును ఉండఁగానే అవిక్రియాత్మవిషయ మయి జ్ఞానము కలుగ దనుమాట సాహసమే యగును, ప్రమాణ ముండఁగానే ప్రమేయము తెలియ లే దనున ట్లని యర్థము.

ఓయీ! ఇట్టి జ్ఞానము పుట్టినను హానమునకుఁగాని యుపాదానమునకుఁగాని ♦ యుపయోగింపదు, కావున నది నిష్ఫలం బనఁగా అందుకుఁ జెప్పుచున్నారు జ్ఞానమో ఇత్యాదిగా. తమోనివృత్తి కలుగక ప్రకాశప్రవృత్తి యెట్లనుపపన్నమో అట్లు ఆత్మాజ్ఞాననివృత్తి కలుగక ఆత్మజ్ఞానోత్పత్తి యనుపపన్న మగుటవలన నని యర్థము. ఓయీ! అజ్ఞాన మనఁగా జ్ఞానప్రాగభావము, కావున అజ్ఞాననివృత్తియే జ్ఞానము, కాని యజ్ఞాననివర్తకము కాదు అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు ఆయజ్ఞానమును ఇత్యాదిగా. ఎక్కడ మఱి భగవంతుఁడుమాత్రము జ్ఞానాభావముకంటె భిన్న మయిన యజ్ఞానముం జెప్పెను? అని యాశంకించి చెప్పుచున్నారు ఇందు ఇత్యాదిగా. అజ్ఞానము జ్ఞానాభావము కాదు, ఉపాదానకారణ మగుటవలన, మృత్తికాదులవలె నని భావము. ఓయీ! హననక్రియ 'నహింస్యాత్' ❧ అని నిషిద్ధ మగుటవలన తత్కర్తృత్వాదికము అజ్ఞానకృతమే కావచ్చును, కాని విహితక్రియాకర్తృత్వము అట్టిది కాదు అనఁగా అట్లు కా దని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. ఆత్మయందుఁ గర్తృత్వాదులు నిత్యము లేమో కావు, మోక్షమే లేకపోవుట ప్రసక్తించుటవలన; అనిత్యము లన్నను ఉపాదానరహితము లనఁ దగదు, భావకార్యమునకు ఉపాదానకారణ ముండవలె నని నియమమువలన; వానికి అనాత్మ యుపాదానము కాఁ జాలదు, అవి యాత్మయందుఁ దోఁచుటవలన; ఆత్మయే వానికుపాదాన మనియుఁ జెప్ప నొప్పదు, కూటస్థుఁ డైన ఆత్మకు అవిద్య లేక యపి సంభవింపమివలన అని చెప్పుచున్నారు ఆత్మ యవిక్రియుఁ డగుటవలన నని. కర్తృత్వము లేకున్నను కారయితృత్వము కలుగవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు వికార

* ఉభయ—ఇద్దఱికిని—మాకును మీమాంసకులకును సమ్మత మయిన వికారమువలె.

♦ విడుచుటకుఁగాని గ్రహించుటకుఁగాని.

❧ హింసింపఁగూడదు.

వంతుఁడు గదా ఇత్యాదిగా. ఆత్మయందుఁ గర్తృత్వాదులు తోఁచుటకు అనాద్య నిర్వచనీయ మయిన యజ్ఞాన ముపాదాన మనియుఁ దన్నివృత్తి తత్త్వజ్ఞానము వలన నగు ననియుఁ జెప్పఁబడినది. ఇప్పుడు కర్తృత్వకారయితృత్వములు అవిద్యాకృతము లనుటకు భగవంతుని యనుమతిం జూపుచున్నారు కావున ఇత్యాదిగా.

విద్వాంసునకుఁ గర్మమునం దధికారము లేదనుట భగవంతుని యభిమత మయినయెడ అప్పు డతనికి బ్రతికియుండినప్పుడు దేనియం దధికార మని యడుగుచున్నాఁడు మఱి దేనియందు ఇత్యాదిగా. జ్ఞాననిష్ఠయం దని చెప్పినదాని స్మృతికిఁ దెచ్చుచున్నారు దీనికి మున్నె ఇత్యాదిగా. తదఙ్గభూత మయిన సర్వకర్మ సన్న్యాసమునందును వాని కధికారము కల దని చెప్పుచున్నారు మఱియు ఇత్యాదిగా.

ఈవాక్యమునందు విశేషణవశమువలన మానసకర్మములకే త్యాగము చెప్పఁబడుసట్లు తెలియుటవలన సర్వకర్మసన్న్యాసము చెప్పఁబడ దని శంకించుచున్నాఁడు మనసా ఇత్యాదిగా.

మఱియొకవిశేషణము నాశ్రయించి సమాధానము చెప్పుచున్నారు కాదు ఇత్యాదిగా.

మనసా అను విశేషణమువలన సర్వశబ్దము మానసకర్మములందే సంకుచిత మగు నని శంకించుచున్నాఁడు మానసము లయిన ఇత్యాదిగా.

మనోవ్యాపారము సంపూర్ణముగా విడిచినప్పుడు ఇతరవ్యాపారములు అనుపపన్నము లగుటవలన సర్వకర్మసన్న్యాసము సిద్ధించు నని పరిహరించుచున్నారు కాదు ఇత్యాదిగా.

మానసకర్మములకుఁగూడ సన్న్యాసమునందు సంకోచము చేయుటవలన * వాగాదివ్యాపారముల కనుపపత్తి లే దని శంకించుచున్నాఁడు శాస్త్రీయము లయిన ఇత్యాదిగా. ఇతరము లయిన సర్వకర్మములను—అశాస్త్రీయము లగు వాక్కాయకర్మములకుఁ గారణములు అశాస్త్రీయములు అగు మానసము లయిన సర్వకర్మములను అని యర్థము.

వాక్యశేషమును గ్రహించి పరిహరించుచున్నారు అట్లు కాదు ఇత్యాదిగా. వివేకబుద్ధిచే సర్వకర్మములను అశాస్త్రీయములను మాత్రము సన్న్యసించి

* సర్వమానసకర్మములకును సన్న్యాసము కా దని చెప్పుటవలన.

యున్నాఁ డనుట యుక్తము కాదు, ఏల యనఁగా, నైవకుర్వ న్నిత్యాదివిశేషణం బును వివేకబుద్ధియును సర్వకర్మత్యాగమునందును తుల్యహేతువు లగుచున్నవి యని యర్థము.

భగవదభిమత మయిన సర్వకర్మసన్న్యాసమునకు ఒకానొక యవస్థ యందు సంక్షేపము కల్పించి శంకించుచున్నాఁడు చావఁబోవువానికి ఇత్యాదిగా.

సన్న్యాసము జీవదవస్థయం దనియె యిట వివక్షితం బనుటకు గమకముఁ జూపుచు ఉత్తరముఁ జెప్పుచున్నారు కాదు ఇత్యాదిగా. అనుపపత్తినే ప్రకటీకరించుచున్నారు సర్వకర్మసన్న్యాసముచే ఇత్యాదిగా.

అన్వయభేదము నవలంబించి వ్యాఖ్యానము చేయుటచే గమకము సిద్ధింప దని పూర్వపక్షి చెప్పుచున్నాఁడు చేయకయు చేయింపకయు ఇత్యాదిగా. వివేకవశంబున సర్వకర్మములను దేహమునందు సన్న్యస్య—ఉంచి చేయకయు చేయింపకయు విద్వాంసుఁ డున్నాఁడు. ఇట్లు అన్వయము సంభవించుటవలన విశేషణము * దేహ ముండునపుడు కర్మత్యాగబోధకము కాదు, కావున జీవించియుండు వానికి సర్వకర్మత్యాగము లే దని యర్థము.

అంతటను ఆత్మ అవిక్రియుఁ డని నిర్ధారింపఁబడియుండుటవలనను దేహసంబంధము లేక కర్తృత్వకారయితృత్వములు సంభవింపమివలనను అప్రాప్తప్రతిషేధము ♦ అను దోషమును బరిహరించుటకొఱకు మేము చెప్పిన యన్వయమే యుక్త మని సమాధానము చెప్పుచున్నారు అట్లు కాదు ఏలయనఁగా ఇత్యాదిగా. అంతటను—శ్రుతులయందును స్మృతులయందును అని యర్థము. మఱియు అన్వయము ఆకాంక్ష సన్నిధి యోగ్యత మొదలగువానిఁబట్టి చేయవలెను, ఆకాంక్షా వశంబున మేముచేయునట్టి యన్వయమే సిద్ధించు నని చెప్పుచున్నారు ఆసనక్రియకు ఇత్యాదిగా. నీవు చెప్పునట్టి యన్వయమో ఆకాంక్ష లేమివలన యుక్తము కా దని చెప్పుచున్నారు సన్న్యాసమునకో ఇత్యాదిగా. సన్న్యాసశబ్దము నిక్షేపార్థకము ❘ అది యధికరణము నపేక్షించును కావున నా యన్వయము సిద్ధించు నని యాశంకించి యందుకు చెప్పుచున్నారు మఱియు ఇత్యాదిగా. కానిచో ఉపసర్గము వ్యర్థ మగు నని యర్థము.

---

* నైవకుర్వ న్నకారయన్ అనునది.

♦ ప్రాప్తింపని దాని నిషేధించుట.

❘ ఉంచుట అను నర్థము గలది.

'మనసా—వివేకజ్ఞానముచేత సర్వకర్మములను బరిత్యజించి యున్నాఁడు దేహమునందు విద్వాంసుఁడు, అను నీయన్వయంబే యుక్తమను నభిప్రాయముతో నుపసంహరించుచున్నారు అందువలన ఇత్యాదిగా. సర్వవ్యాపారోపరమరూప మయిన సర్వకర్మసన్న్యాసము అవిక్రియాత్మజ్ఞానమునకు అవిరోధి యగుటవలన ప్రయోజకజ్ఞానవంతునకు * వైధ మయిన ♦ సన్న్యాసమునం దధికారము, సమ్యక్ జ్ఞానము కలవానికిమాత్రము అవైధము స్వాభావిక మగు ఫలరూప మయిన సర్వకర్మ సన్న్యాసమునం దధికారము, అని విభాగము నంగీకరించి చెప్పినవిషయమునందు భగవద్వాక్యముల ఆనుకూల్యముఁ జూపుచున్నారు ఈ విషయంబు ఇత్యాదిగా.

హా. య ఏనం వేత్తి హన్తార మ్మను మంత్రముచే ఆత్మ హననక్రియకుఁ గర్తయును గర్మమును గాఁ డని ప్రతిజ్ఞ చేసి, నజాయతే యను మంత్రముచే అందుకు హేతువును అవిక్రియత్వముం బ్రతిపాదించి ప్రతిజ్ఞాతార్థము నుపసంహరించుచున్నాఁడు.—యః, ఏనమ్—మున్ను చెప్పిన మంత్రములచేఁ జెప్పఁబడిన లక్షణము గల యీ ఆత్మను, అవినాశినమ్ = మరణ మను వికారము లేనివానిఁగాను, నిత్యమ్= విపరిణామము లేనివానిఁగాను, అజమ్ = జననక్రియ లేనివానిఁగాను, అవ్యయమ్ = అపక్షయము లేనివానిఁగాను, వేద, కథమ్ = ఏవిధముచేత, సః పురుషః = అవిద్వాంసుఁ డగు అధికారి; కమ్, హన్తి = హననక్రియను జేయును; కథంవా, కమ్, ఘాతయతి = వధించువానిఁ బ్రేరించును? రెండుచోట్లను కింశబ్దమున కాక్షేపమే యర్థము, ఏల యనఁగా ప్రశ్న సంభవింపదు. హేతువు తుల్య మగుటవలన విద్వాంసునకు సర్వకర్మముల నిషేధించుటయె ప్రకరణార్థంబుగా భగవంతునిచేఁ జెప్పఁబడినది. హననక్రియాక్షేప ముదాహరణార్థము.

శం. ఇట్లు అహమర్థ మయిన ఆత్మ నిర్వికారుఁడు నిత్యుఁడు కూటస్థుఁడు అసంగుఁడు చిద్రూపుఁడు, ఇది పారమార్థిక మయిన తత్త్వము, అని ప్రతిపాదించి, యిట్టి యాత్మతత్త్వమును దెలిసికొన్న విద్వాంసునకు సర్వకర్మసన్న్యాసమునందే యధికారము కాని యితరమునందుఁ గా దని సూచించుటకుఁ జెప్పుచున్నాఁడు.—బ్రహ్మచర్యము అహింస మొదలగునవి, వివేకవైరాగ్యాదులు, శమదమాదులు, శ్రవణాదులు, ఆచార్యేశ్వరప్రసాదాదులు—ఇత్యాదిరూపం బగు సాధనసంపత్తితోఁ

* సాధకజ్ఞానము గలవానికి—ముముక్షువునకు.

♦ విధిప్రాప్త మయిన.

గూడినవాఁడై ఇతర మన్నియు విడిచి మోక్షమునే కోరునట్టి ముముక్షు వైన యధికారి బ్రహ్మవేత్త యగు గురువుయొక్క సన్నిధానమునందు శ్రద్ధాభక్తులతో నిరంతరము శ్రవణము చేయుటవలన నుదయించిన జ్ఞానముచే ననుభవింపఁబడుచున్న, ఏనమ్ = ఈ అహంశబ్దార్థ మయిన ప్రత్యగాత్మను; అజమ్—జన్మాదిసర్వవికారశూన్యునిఁగాను; కావుననే, అవ్యయమ్ = దేహిచేతను వికారము నొందనివానిఁగాను; అవినాశినమ్—వినాశ మనఁగా రజ్జు సర్పాదులకువలెఁ బ్రమాణముచే సత్త బాధితమగుట, లేక, ద్రవ్యగుణాదులచేఁ బరిచ్ఛేదము, అది లేనివానిఁగాను, పరిపూర్ణునిఁగా ననుట; కావుననే, నిత్యమ్—ఏకరూపునిఁగాను; ఇట్టి యద్వితీయ మయిన ఆత్మతత్త్వమే నే నని అపరోక్షముగా; యః వేద = ఎవ్వఁడు తెలియుచున్నాఁడో; సపురుషః = సర్వాత్మభావమును బొందునట్టి ఆవిద్వాంసుఁడు; కథమ్ = ఏవిధముచేత; కం హన్తి = ఎవ్వని వధించుచున్నాఁడు ? కం ఘాతయతి = ఎవ్వని హననక్రియయందుఁ బ్రవర్తింపఁజేయుచున్నాఁడు ? అంతటను కింశబ్దమున కాక్షేపమే యర్థము, ప్రశ్న కాదు, ప్రత్యుత్తరము లేమివలన. కథమ్ అనుటచే సాధనము ఆక్షేపింపఁబడుచున్నది, కమ్ అనుటచే విషయమున కాక్షేపము, కం ఘాతయతి అనుచో ప్రయోజ్యునకు * ఆక్షేపము, ఇట్లు క్రియయు తత్సాధనమును సంభవింపకుండుటవలన నిర్వికల్పబ్రహ్మాత్మవేత్తకు సర్వకర్మసన్న్యాసమునందే యధికార మని సిద్ధము. ఓయీ! నిర్వికారబ్రహ్మజ్ఞానము గలవానికి, ఎట్లు వధించును ? ఎవ్వని వధించును ? ఎవ్వని వధింపఁజేయును ? అని సాధనాదుల నాక్షేపించుటచే హననక్రియానివృత్తిమాత్రమె సూచింపఁబడుచున్నది, కాని సర్వకర్మనివృత్తి కాదు అందురేని, అట్లు కాదు. హేతువు తుల్య మగుటవలన. ఎవ్వని కెవ్వనికి అవిక్రియాత్మజ్ఞానము గలదో వానివానికి ప్రవృత్తి కలుగదు అను వ్యాప్తిచే నిర్వికారాత్మజ్ఞానము సర్వప్రవృత్తుల నివృత్తికిని హేతు వగుటవలన అది హననక్రియానివృత్తిమాత్రమె హేతు వని నియమింప శక్యము కాదు. కావున నిర్వికారాద్వితీయ బ్రహ్మాత్మజ్ఞానికిఁ జేయవలసినదియుఁ జేయింపవలసినదియుఁ గొంచెమేని లేదనుట సిద్ధము. ఓయీ! నజాయతే మ్రియతే అనుమంత్రముచే జన్మాదిసర్వవికారశూన్యత్వము బ్రహ్మమునకుఁ జెప్పఁబడినది. కావున జ్ఞేయ మయిన బ్రహ్మము నిర్వికారము. జ్ఞాత యగు విద్వాంసుఁడో వికారియే యగును. అట్లు బ్రహ్మమునకును జ్ఞాతకును నిర్వికారత్వము సవికారత్వము అను విరుద్ధధర్మములచేఁ బరస్పరభేదము కలుగుటవలన వికారి యగు

* ప్రేరింపఁ దగినవానికి.

విద్వాంసునకు అవిక్రియత్వము సంభవింపదు. కావున నతనికి సన్న్యాస ముపపన్నము కాదు. బ్రహ్మము అవిక్రియ మను జ్ఞానమే సన్న్యాసమునకు హేతు వందు రేని యది యుక్తము కాదు, ఏల యనఁగా, అది జ్ఞేయవిషయ మగుటవలన విద్వాంసునకు సన్న్యాసహేతువు కాఁజాలదు. పర్వతము నిశ్చలం బను జ్ఞానము క్రియానివృత్తికిఁ గారణంబు కాదు గదా! అట్లు తాను వికారి యగుటచే విద్వాంసునకు 'అవిక్రియుఁ డను నేను' అని యవిక్రియాత్మజ్ఞానము సంభవింపమివలనఁ గర్మసన్న్యాసం బనుపపన్నమే యగును. అందు రేని అది సరికాదు. ఇట నిన్నడుగవలెను. ఇద మహం జానామి * అనుచో ఇదమర్థమునకు జ్ఞాత యయిన అహంప్రత్యయార్థము దేహమా? ప్రాణమా? ఇంద్రియములా? మనస్సా? అహంకారమా? విశ్వుఁడా? తైజసుఁడా? ప్రాజ్ఞుఁడా? లేక ఆత్మయే యగునా? మొదటిపక్షమున స్వప్నదేహమా? జాగ్రద్దేహమా? లేక యీరెండు దేహములా? మొదటిది కాదు, జాగ్రత్తయందు స్వప్నదేహము నశించుటచే జ్ఞాత యగు అహంప్రత్యయార్థమునకుఁగూడ నాశము ప్రసక్తించుటవలన అహంప్రత్యయమే లేకపోవును. ఇష్టాపత్తి యనుటయుఁ దగదు, ఏల యనఁగా జాగరమునందు 'నాహ మస్మి' ♦ అని నీకే యభావము ప్రసక్తించును, ప్రత్యక్షవిరోధంబుగూడ సంభవించును. రెండవది కాదు, ఏల యనఁగా ఎవ్వనికిని స్వప్నమునందు 'నే నున్నాను' అని యహంప్రత్యయోదయము లేకపోవును. నేను బోవుచున్నా నని పలికి దేహమే పోవుచున్నది, కావున దేహమే అహంశబ్దార్థ మందు రేని యది సరికాదు, 'దేవతలను యజించి నేను స్వర్గమునకుఁ బోయెదను' ఇత్యాదిస్థలమునందు వ్యభిచారమువలనను ❘ మృత మయిన దేహము ఉన్నను అహంప్రత్యయము లేమివలనను. మూఁడవదియుఁ గాదు, రెండు దేహములకు సామానాధికరణ్యము సంభవింపమివలన. ఇఁక రెండవపక్షమును § యుక్తము కాదు, ప్రాణము స్వభావముచే జడ మగుటవలన, జాగరమునందుఁగాని స్వప్నమునందుఁగాని తన్నుఁగాని యితరమునుగాని ప్రాణ మెఱుంగఁజాలునా? అట్టి జ్ఞానము లేకుండుటవలన అది యహంప్రత్యయార్థము కాఁజాలదు. మూఁడవపక్షమునందు అహమర్థము ఒకటే యింద్రియమా? అన్ని

* దీని నే నెఱుంగుచున్నాను.

♦ నేను లేను.

❘ దేహము పోవుట సంభవింపకుండుటవలనను.

§ ప్రాణము అనుట.

యునా? ఇందు మొదటిది కాదు, ఏల యనఁగా నేయింద్రియము అహమర్థ మనె దరో తదింద్రియార్థమునకుఁదక్కఁ దక్కినవాని కుపలబ్ధి లేకపోవలయును, ఇంద్రియార్థములో అన్నియు అందఱకును అంతటను ఉపలబ్ధము లగుటఁ జూచుచున్నారము కావునఁ బ్రత్యక్షవిరోధ మగును. రెండవది కాదు, ఎట్లనఁగా, నేను బ్రాహ్మణుఁడను అనుచో, శ్రోత్రాదీంద్రియములు ఒక్కొకటియు బ్రాహ్మణశబ్దార్థము కావలసి వచ్చును, అప్పుడు బ్రాహ్మణు లనేకులు సిద్ధించుటచే 'వీఁడు ఒకఁడు బ్రాహ్మణుఁడు' అను ప్రత్యక్షసిద్ధ మయిన బ్రాహ్మణైకత్వవ్యవహారమునకు విరోధ మగును. మఱియు 'నేను ఘటమును మున్ను నేత్రముచేఁ జూచితిని, ఇప్పుడు హస్తముచే స్పృశించుచున్నాను' ఇత్యాదివ్యవహారముచే అహమర్థము నేత్రాదీంద్రియములకన్న భిన్నమని సిద్ధించుచుండఁగా ఇంద్రియము అహమర్థ మనుట యనుపపన్నము. నాలవ పక్షమును యుక్తము కాదు, మనస్సుగూడ చక్షురాదులవలె కరణమె యగుట వలన, అట్లు 'మనసా హ్యేవ పశ్యతి' ♦ అని శ్రుతి. ఐదవపక్షముగూడ సరి కాదు అహంకారము వికారి యగుటవలన దానికి జ్ఞాతృత్వము అనుపపన్న మగుటచే అహమర్థత్వముగూడ అనుపపన్న మగుటవలన. ఓయీ! 'అహం జానామి' * అను వ్యవహారముచే అహంకారమునకుఁగూడ జ్ఞాతృత్వము సిద్ధించుచున్న దందు రేని యట్లు కాదు. అది స్వభావముచే జడ మగుటవలన దానికి జ్ఞాతృత్వ ముపపన్నము కాదు. ఎట్లు 'నేను మనుష్యుఁడను' అనుచో అన్యధర్మాధ్యాసమో అట్లె 'జ్ఞాతను నేను' అనుచోఁగూడ అన్యధర్మాధ్యాసమె. స్వభావమున జడ మగుటచే జ్ఞాతృత్వము దీనికి సంభవింపదు. ఏల యనఁగా జ్ఞాతృత్వము చేతనధర్మము అగ్నికి దగ్ధృత్వము ❡ వలె, 'బాల్యమునందు నేను ద్రాక్షపండు తింటిని' అని యాయా వికారములతోఁగూడ నశించునట్టి వికారి యగు అహంకారమునకు, వార్ధకమునందు బహుకాలమునకు మున్ను తిన్న ద్రాక్షాఫలముయొక్క స్మృతి యుపపన్నము కాదు. అది యనుపపన్న మగునప్పుడు దాని కహమర్థత్వము సిద్ధింపదు. మఱియు 'ఈ నా యహంకారము చెడ్డది' అను వ్యవహారముచే జ్ఞేయ మనియు అహంశబ్దార్థాతిరిక్త మనియు నేర్పడుటవలన అహంకారమునకు జ్ఞాతృత్వమును అహమర్థత్వమును సిద్ధింపవు. ఇఁక ఆఱవ యేడవ యెనిమిదవపక్షములు సరికావు, విశ్వాదులు

---

♦ మనస్సుచేతనే గదా చూచుచున్నాఁడు.

* నే నెఱుంగుచున్నాను.

❡ కాల్చుట.

జ్ఞాతకన్న భిన్ను లగుటచే వారు అహమర్థ మనుట చెల్లదు, ఎట్లనఁగా వారు ఒక్కొకరు ఒక్కొకయవస్థ కభిమాను లగుటచే మూఁడవస్థలయొక్కయు తద్ధర్మముల యొక్కయు జ్ఞానము వారికి సంభవింపదు. 'పూర్వము స్వప్నముఁ జూచినవాఁడను సుఖముగా నిదురించినవాఁడ నగు నట్టి నేను మేలుకొనియున్నాను' అను వ్యవహారముచే అవస్థాత్రయజ్ఞాత విశ్వాదులకన్న భిన్నుఁడే యని తెలియవచ్చుచున్నది. కావునఁ బారిశేష్యమువలన ఆత్మయే జ్ఞాత, అట్లు 'నాఽన్యోఽతోఽస్తి విజ్ఞాతా'* అని శ్రుతి. ఓయీ! ఆత్మ నిరవయవుఁ డగుటచే అతనికి బుద్ధి తద్వృత్తులతోను ఇంద్రియములతోను ఇంద్రియార్థములతోను సంబంధము సంభవింపమివలన జ్ఞాతృత్వము సిద్ధింపదు అందురేని అట్లు కాదు. బుద్ధ్యాదులతో ఆధ్యాసికసంబంధము కలుగుటవలన అవిక్రియుఁ డైనను ఆత్మకు జ్ఞాతృత్వము సిద్ధించుచున్నది. అట్లు కావున జ్ఞాత యగు ఆత్మయే అహమర్థము. అట్లు 'అహం విజానామి వివిక్తరూపః'♦ అని శ్రుతి. అందువలన ఆత్మయే విద్వాంసుఁడు. అట్లు అవిక్రియాత్మజ్ఞానము గల విద్వాంసుఁడు సంభవించుచున్నాఁడు. అట్టి విద్వాంసునకును ఆత్మకును అభేదము గూడ సిద్ధము. 'అయ మాత్మా బ్రహ్మ' ❡ అను శ్రుతి ఆత్మ బ్రహ్మాభిన్నుఁ డని యుపదేశించుచున్నది. కావున నేను అవిక్రియుఁడు, అద్వితీయుఁడు ఇత్యాదిజ్ఞానము నిరంకుశముగా సిద్ధించుటవలన అవిక్రియ బ్రహ్మాత్మజ్ఞానబలముచే అతనికి సర్వకర్మసన్న్యాస ముపపన్నమే యగు ననుట సిద్ధము.

౨౧. 'నాయం హన్తి న హన్యతే' అని ప్రతిజ్ఞచేసి 'న హన్యతే'$ అనుట యుపపాదింపఁబడినది. ఇప్పుడు 'న హన్తి'§ అనుట నుపపాదించుచు నుపసంహరించుచున్నాఁడు.—అవినాశినమ్ = నశించుస్వభావము లేనివానిఁగాను, కడపటివికారము లేనివానిఁగా ననుట; అందుకు హేతువు—అవ్యయమ్ = వ్యయము అనఁగా అవయవక్షయముగాని గుణక్షయముగాని లేనివానిఁగాను, అవయవక్షయముచేఁగాని గుణక్షయముచేఁగాని వినాశము కలుగవలెను, ఆ రెండును లేనివానికి వినాశము సంభవింప దని యర్థము; ఓయీ! జన్య మగుటచే వినాశి యని యను

---

* ఇతనికన్నను ఇతరుఁడు జ్ఞాత లేఁడు.

♦ నిర్లేపస్వరూపము గల నేను ఎఱుఁగుచున్నాను.

❡ ఈయాత్మ బ్రహ్మము.

$ వధింపఁబడఁడు.

§ వధింపఁడు.

మానించుచున్నా మందు లేని యట్లు కా దని చెప్పుచున్నారు—అజమ్= పుట్టనివానిఁగాను, మొదటివికారము లేనివానిఁగా ననుట; అందుకు హేతువు—నిత్యమ్= ఎల్లప్పుడు ఉండువానిఁగాను, పూర్వము లేకుండిన దానికిఁ గదా జన్మముఁ జూచుచున్నాము, ఎల్లప్పుడు ఉన్నవానికి జన్మము సంభవింప దని యభిప్రాయము. లేక; అవినాశినమ్= బాధితుఁడు కానిదానిఁగాను, సత్యుఁడైనవానిఁగా ననుట; నిత్యమ్= సర్వవ్యాపకునిఁగాను, అందుకు హేతువు—అజమ్ అవ్యయమ్—జన్మవినాశములు లేనివానిఁగాను, జన్మము గలదానికి నాశము గలదానికి సర్వవ్యాపకత్వమును సత్యత్వమును ఘటిల్ల వని యర్థము; ఇట్లు సర్వవికారశూన్యునిఁగా, ఏనమ్= ప్రకృతుఁడైన యీదేహిని—ఆత్మ యయిన తన్ను; యః వేద=ఎవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో, నేను సర్వవికారశూన్యుఁడను సర్వప్రకాశకుఁడను సర్వద్వైతరహితుఁడను బరమానందబోధరూపుఁడను అని శాస్త్రాచార్యోపదేశములచే సాక్షాత్కరించుచున్నాఁడో; సః—ఇట్లు తెలిసికొన్న పూర్ణరూపుఁ డగు ఆపురుషుఁడు; కం హన్తి= ఎవ్వని వధించును? కథం హన్తి = ఏవిధమున వధించును? కింశబ్ద మాక్షేపార్థకము, ఎవ్వనినిగూడ వధింపఁడు, ఏవిధమునఁగూడ వధింపఁ డని యర్థము. అట్లు, కం ఘాతయతి = ఎవ్వని వధింపఁజేయును? కథం ఘాతయతి = ఏవిధమున వధింపఁజేయును? ఎవ్వనినిగూడ వధించుటకు ప్రేరింపఁడు, ఏవిధమునఁగూడ వధించుటకు ప్రేరింపఁ డని యర్థము. ఏల యనఁగా సర్వవికారశూన్యుఁడై అకర్తయగు వానికి హననక్రియయందుఁ గర్తృత్వము ఎట్లు సంభవించును? అట్లు శ్రుతి 'ఆత్మానం చే ద్విజానీయాదయ మస్మీతి పూరుషః। కి మిచ్ఛ న్కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్' * అని శుద్ధుఁడైన ఆత్మను దెలిసినవానికి ఆత్మాజ్ఞానముచేఁ గలిగిన యధ్యాసము నివర్తిల్లుటంజేసి యాయధ్యాసముచేఁ గలుగు రాగద్వేషములు లేకుండుటవలనఁ కర్తృత్వభోక్తృత్వాదులు లే వని చెప్పుచున్నది. ఇది యిచ్చట భగవంతుని యభిప్రాయము—సర్వవికారశూన్యమయిన స్వభావము గలవాఁ డగుటవలన, ఎవ్వఁడును వాస్తవముగా దేనినిగూడఁ జేయఁడు చేయింపఁడు. మఱి యే మనఁగా, స్వప్నమునందుంబోలె అవిద్యచేఁ గర్తృత్వాదికమును దనయం దభిమానించుచున్నాఁ డజ్ఞాని. అదియె చెప్పఁబడినది 'ఉభౌ తౌ నవిజానీతః' అని. 'ధ్యాయతీవ లేలాయతీవ' ఇత్యాదిశ్రుతి

* పురుషుఁడు ఇతఁడు నే నగుచున్నా నని యాత్మను దెలియునేని, ఏమి కోరినవాఁడై దేని మీఁది కోరికకొఱకు శరీరము ననుసరించి తాపము నొందును?

యును జెప్పుచున్నది. కావుననే సర్వశాస్త్రములకును అధికారు లజ్ఞానులు. విద్వాంసుఁడో సకారణ మయిన యధ్యాసము బాధిత మగుటవలనఁ దనయందుఁ గర్తృత్వాదికము నభిమానింపఁడు, స్తంభరూపముఁ దెలిసినవాఁడు దానియందు చోరత్వము ♦ తలంపని యట్లు. కావున వికారరహితుఁ డగుటవలనను అద్వితీయుఁ డగుటవలనను విద్వాంసుఁడు 'చేయఁడు చేయింపఁడు' అని చెప్పఁబడుచున్నది. అట్లు శ్రుతి 'విద్వాన్న బిభేతి కుతశ్చన' ¶ అని. అర్జునుఁడు తనయందుఁ గర్తృత్వమును భగవంతుని యందుఁ గారయితృత్వమును అధ్యసించి హింసానిమిత్త మయిన దోషము నిద్దఱి యందును ఆశంకించెను గదా! భగవంతుఁడును అతని యభిప్రాయ మెఱింగిన వాఁడై 'కం హన్తి కం ఘాతయతి' అని యారెంటిని ఆక్షేపించెను. నీయందుఁ గర్తృత్వమును నాయందుఁ గారయితృత్వము నారోపించికొని ప్రత్యవాయము గలుగు నను శంకఁ బొందవల దని యభిప్రాయము. అవిక్రియుఁ డని చెప్పుటచే ఆత్మకుఁ గర్తృత్వము నిషేధించుటవలన సర్వకర్మాక్షేపమే భగవంతుని యభిప్రాయము. హననక్రియ అప్పు డెదుట ఉపస్థిత మగుటవలన తదాక్షేప ముపలక్షణార్థము. ఏల యనఁగా నిషేధహేతువు సమాన మగుటవలన ఇతరకర్మాభ్యనుజ్ఞ * అనుపపన్నము. అట్లే చెప్పఁబోవుచున్నాఁడు. 'తస్య కార్యం నవిద్యతే' అని. కావున, ఇట హననమునుమాత్రమె నిషేధించుటవలన ఇతరకర్మాభ్యనుజ్ఞ భగవంతునిచేఁ జేయఁబడుచున్న దనుట యసంగతము, 'తస్మాద్యుధ్యస్వ' అనుచో భగవంతునిచే హననాభ్యనుజ్ఞయె చేయఁబడుటవలనను వాస్తవకర్తృత్వాదులు లే వనుట సర్వకర్మములందును సమాన మగుటవలనను ఇత్యాదిగా తెలియవలెను.

శ్రీ. ఇందువలననే పూర్వోక్త మయిన హంతృత్వాఽభావముగూడ సిద్ధ మని చెప్పుచున్నాఁడు.—నిత్యమ్ = వృద్ధిలేనిదానినిగాను, అవ్యయమ్=అపక్షయము లేనిదానినిగాను, అజమ్, అవినాశినం చ, యః వేద; సపురుషః, కం హన్తి— ఎవ్వని వధించును? కథంవా హన్తి—ఎట్లు వధించును? ఇట్టివాని వధించుటకు సాధనము లేకుండుటవలన. అట్లు తాను ప్రేరకుఁడై ఇతరునిచే, కం ఘాతయతి = ఎవ్వని వధింపఁజేయును? కథంవా ఘాతయతి = ఎట్లు వధింపఁజేయును? ఎవ్వనిని

♦ ఆ స్తంభము చోరుఁ డని.

¶ విద్వాంసుఁడు భయపడఁడు దేనివలనను.

* ఇతరకర్మము కావచ్చు ననుట.

వధింపఁజేయుఁడు, ఏవిధముననువధింపఁజేయుఁ డని యర్థము. ఇందుచే, నేను ప్రేరకుఁడ నని నాయందుఁగూడ దోషదృష్టి యుంపవల దని చెప్పఁబడుచున్నది.

ప. కావుననే హంతృత్వముగూడ యుక్తము కా దని చెప్పుచున్నాఁడు.— నిత్యమ్ = వృద్ధిశూన్యునిఁగాను, అవ్యయమ్ = అపక్షయశూన్యునిఁగాను, అజమ్ = జన్మశూన్యునిఁగాను, ఈమూఁడువికారములు లేకుండుటచే, ఏనమ్—ఈయాత్మను, అవినాశినమ్, యః, వేద = తెలిసికొనునో, సః, కం హన్తి, కంఘాతయతి— తాను హననక్రియకు అయోగ్యుఁ డగుటవలన, మఱియు ప్రయోజకత్వమునందును అయోగ్యుఁ డని యర్థము. ఇందుచే నాయందుఁగూడ ప్రయోజకత్వదృష్టి యుంపవల దని ప్రతిపాదింపఁబడినది. అట్లు చెప్పఁబడినది ‘శుద్ధో నిరఞ్జనో ఽనన్తో బోధో ఽహం ప్రకృతేః పరః। చేష్టమాన మిమం దేహం పశ్యా మ్యన్యశరీరవత్’* అని.

రా. ఇట్లు, అవినాశినమ్ = నాశము లేనివాఁడును; అజమ్ = జన్మము లేనివాఁడును; అవ్యయమ్ = అపక్షయము లేనివాఁడును, కావుననే; నిత్యమ్ = నిత్యుఁడు నగు; ఏనమ్ = ఈయాత్మను; యః = ఏపురుషుఁడు; వేద = ఎఱుంగుచున్నాఁడో; సః పురుషః = ఆపురుషుఁడు; దేవమనుష్యతిర్యక్స్థావరశరీరములందున్న ఆత్మలయందు, కమ్ = ఎవ్వనినైనను; కథమ్ = ఎట్లు; ఘాతయతి = చంపించును? ఎవ్వనినైనను; కథంహన్తి = ఎట్లు చంపును?—ఎట్లు నశింపఁజేయును ఎట్లు అందుకుఁ బ్రేరకుఁ డగును అని యర్థము. ఈయాత్మలను వధింపించుచున్నానే వధించుచున్నానే యని శోకించుటకు ఆత్మస్వరూపతత్త్వము తెలియమియే కారణ మని యభిప్రాయము.

ఈయాత్మ నాశము లేనివాఁ డగుటవలనను జన్మము లేనివాఁ డగుటవలనను ఆయుధాదులచే అవయవములు తెగిపోవుట ఇత్యాదిరూప మయిన అపక్షయము లేనివాఁ డగుటవలనను నిత్యుఁ డని యెవ్వఁ డెఱుంగునో అతఁడు దేవాదినానావిధశరీరావస్థితు లయిన అనంతాత్మలలో ఎవ్వనినిగూడ దాను వధించుచున్నా ననిగాని వధింపించుచున్నా ననిగాని శోకింపఁ డని తాత్పర్యము.

మా. కావున, యః = ఎవ్వఁడు; ఇట్లు, అవినాశినమ్ = నైమిత్తిక మయిన నాశము లేనివాఁడును; నిత్యమ్ = స్వాభావిక మయిన నాశము లేనివాఁడును; లేక; అవినాశినమ్ = దోషసంబంధము లేనివాఁడును, నిత్యమ్ = ఎల్లప్పుడు నుండువాఁ

* నేను శుద్ధుఁడను నిర్లేపుఁడను అనంతుఁడను జ్ఞానరూపుఁడను ప్రకృతికి అతీతుఁడను, కర్మములు చేయుచున్న యీదేహమును ఇతరునిదేహమునుంబోలెఁ జూచుచున్నాను.

డును అని అంతటను అర్థము తెలుంగునది, దోషయుక్తు లయిన పురుషాదులందు నష్ట శబ్దము ప్రయోగింపఁబడుటవలన; అజమ్ = జన్మము లేనివాఁడును; అవ్యయమ్ = వికారము లేనివాఁడు నగు; ఏనమ్ = ఈయాత్మను; వేద = ఎఱుంగుచున్నాఁడో; సః పురుషః = ఆ పురుషుఁడు; కథమ్ = ఎట్లు; కిమ్ = ఎవ్వని; ఘాతయతి = వధింపించును ? కమ్, హన్తి = వధించును ?

ఇట్లు ఈ యాత్మ నైమిత్తికవినాశముగాని స్వాభావికవినాశముగాని లేనివాఁ డనియు—దోషసంబంధము లేనివాఁ డనియు ఎల్లప్పుడు నుండువాఁ డనియు ఉత్పత్తిరహితుఁ డనియు నిర్వికారుఁ డనియు నెవ్వఁ డెఱుంగునో అతఁ డెవ్వనినైనను దాను వధింపించుచున్నాఁ డని గాని వధించుచున్నాఁ డని గాని యెట్లు తలంచు నని తాత్పర్యము.

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరో ఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ. ౨౨

భా. ఇఁకఁ బ్రకృతముఁ జెప్పెదము. అం దాత్మకు అవినాశిత్వము ప్రతిజ్ఞ చేయఁబడినది. అది దేనివలె ననఁగాఁ జెప్పుచున్నాఁడు.— యథా = ఎట్లు, లోకమునందు; నరః = పురుషుఁడు; జీర్ణాని = దుర్బలత నొందిన, చినిఁగిన; వాసాంసి=వస్త్రములను; విహాయ= విడిచి; నవాని = క్రొత్తవైన; అపరాణి = ఇతరవస్త్రములను; గృహ్ణాతి = గ్రహించుచున్నాఁడో; తథా = అట్లే; దేహీ = ఆత్మ; జీర్ణాని = దుర్బలము లయిన; శరీరాణి= దేహములను; విహాయ = విడిచి; నవాని = నూతనము లయిన; అన్యాని = ఇతరదేహములను; సంయాతి = పొందుచున్నాఁడు, పురుషునివలె అవిక్రియుఁ డై యే యని యర్థము.

ఎట్లు లోకమునందుఁ బురుషుఁడు చినిఁగినవస్త్రములను విడిచి యితరము లయిన నూతనములను గ్రహించునపుడు తాను నిర్వికారుఁ డై యే యుండునో, అట్లే ఆత్మ జీర్ణము లయిన దేహములను విడిచి యితరము లయిన నూతనదేహములను పొందునపుడు తాను నిర్వికారుఁ డై యే యుండు నని తాత్పర్యము.

ఆ. అవిక్రియుఁ డగుటచే ఆత్మకుఁ గర్మము సంభవింప దని ప్రతిపాదించి అవిక్రియుఁ డగుట యను హేతువును సమర్థించుటకొఱకే యుత్తరగ్రంథమున కవతారిక చేయుచున్నారు—ఇఁకఁ బ్రకృతము ఇత్యాదిగా. అప్రకృతం వేది యనఁగాఁ జెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. అవినాశిత్వ మనుట యుపలక్షణము అవిక్రియత్వ మని యర్థము. దానినే దృష్టాంతముచే స్పష్టీకరించుటకై యుత్తరశ్లోకమున కాకాంక్ష తీయుచున్నారు అది ఇత్యాదిగా. ఆత్మకుఁ దనవలనఁ దనకు విక్రియ లేకున్నను బురాతనదేహము విడుచుటయందును నూతనదేహము గ్రహించుటయందు విక్రియావత్త్వము తప్పదు, కావున అవిక్రియత్వము అసిద్ధము అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు యథా ఇత్యాదిగా. జీర్ణము లయిన శరీరములను—వయోహానిని బొందినవై చర్మమునందు ముడుతలును నరపును గల వగు శరీరముల నని యర్థము. పురాతనము లగు వస్త్రముల విడుచుటయందును నూతనవస్త్రముల గ్రహించుటయందును విడుచుటకును గ్రహించుటకును కర్తయైన లౌకిక పురుషుఁడుగూడ నిర్వికారుఁడై యేకరూపుఁడై యుండునట్లు ఆత్మ దేహము విడుచుట దేహము గ్రహించుట యను కార్యములందు నిర్వికారుఁడై యుండు ననుట అవిరుద్ధ మని వాక్యార్థము చెప్పుచున్నారు పురుషునివలె ఇత్యాదిగా.

హ. ఆత్మకు నిత్యత్వము చెప్పఁబడినది. శరీరములు నశించుచుండఁగా ఆ నిత్యత్వ మెట్లు సిద్ధించును? అందుకుఁ జెప్పుచున్నారు.—ఎట్లు నరుండు జీర్ణము లయిన వస్త్రములను విడిచి నవములైన వస్త్రములను గ్రహించుచున్నాఁడో తాను ఉన్నవాఁడై యే; అట్లు జీర్ణము లయిన శరీరములను విడిచి యితరము లయిన నూతనశరీరములను బొందుచున్నాఁడు దేహి, తాను బూర్వదేహము నశించినను అవిక్రియుఁడు వినాశరహితుఁడై.

శం. ఓయీ! ఆత్మ తనకు విక్రియ లేకున్నను, బూర్వదేహత్యాగమునందును అపరదేహపరిగ్రహమునందును ఔపాధిక మయిన విక్రియ గలవాఁ డగుచున్నాఁడు, పూర్వపశ్చిమపర్వతసంబంధమువలన సూర్యుఁడుంబోలె. అందుచే ఆత్మకు అవిక్రియత్వము అసిద్ధము. అని యాశంకించి, వస్త్రములను విడుచుచున్నవాఁడును గ్రహించుచున్నవాఁడు నగు పురుషునకె ట్లవిక్రియత్వము సిద్ధించుచున్నదో అట్లె ఆత్మకుఁగూడ దేహపరిగ్రహమునందును తత్పరిత్యాగమునందును అవిక్రియత్వము సిద్ధించుచున్నది యని ఆత్మ అవిక్రియుఁ డనియు దేహాదిభిన్నుఁ

డనియు దేహములధర్మములును వానికర్మములును వానియవస్థలును లేనివాఁడనియు సూచించుటకై చెప్పుచున్నాఁడు.— నరః = పురుషుఁడు, జీర్ణాని, వాసాంసి, విహాయ, అపరాణి—నామముచేతను రూపముచేతను లక్షణముచేతను మునుపటి వానికన్న భిన్నము లయిన, నవాని = నూతనవస్త్రములను, తాను అవిక్రియుఁడై యే, యథా= ఎట్లు, గృహ్ణాతి. తథా = అట్లే, దేహీ—దేహమునందు నే నని కనఁబడుచున్న ఆత్మ, తాను నిర్వికారరూపముతో నున్నవాఁడై యే, జీర్ణాని—కాలకర్మనశమువలన త్యాజ్యతను * పొందిన, శరీరాణి, విహాయ, అన్యాని = నామరూప జాతి గుణవిశేషములచేత మునుపటిదేహములకన్న విలక్షణము లయిన దేహములను; సంయాతి= పొందుచున్నాఁడు. కాని తాను వికారము నొందఁడు. ఎట్లు ఆగమనిర్గమములును నామరూపాదిభేదమును శిథిలశయును వస్త్రములకే కాని పురుషునకు లేవో, అట్లు ఆగమాపాయములును అవాంతరవికారంబును దేహములకే కాని నిరవయవుఁడగు ఆత్మకు లేవు. ఇందుచే, ఆత్మ దేహేంద్రియాదులకన్న భిన్నుఁడనియు అవిక్రియుఁడనియు నిత్యుఁడనియు సూచిత మగుచున్నది.

మ॰ ఓయీ! ఇట్లు ఆత్మకు వినాశము లేకున్నను, దేహములు వినాశము కల వగుటవలనను, యుద్ధ మాదేహములకు నాశము కలిగించునది యగుటవలనను, ఎట్లు నేను అనేకసుకృతసాధనము లయిన భీష్మాదిదేహములకు యుద్ధముచే నాశము కలిగింపవచ్చును? ఈ యాశంక కుత్తరముఁ జెప్పుచున్నాఁడు — యథా, నరః, విక్రియాశూన్యుఁడై యే, జీర్ణాని, వాసాంసి, విహాయ, నవాని గృహ్ణాతి—ఇంత మాత్రముచేతనే నిర్వాహ మగుచుండఁగా, ‹ అపరాణి › అను విశేషణము ఉత్కర్షాతిశయము తెలుపుటకొఱకు; అందుచే, ఎట్లు నికృష్టము లయిన వస్త్రములను విడిచి యుత్కృష్టములను నరుఁడు గ్రహించుచున్నాఁడో అను నర్థము ఔచిత్యముచే ఏర్పడుచున్నది. తథా = అట్లు, జీర్ణాని—వయసుచేతను తపసుచేతను కృశించిన, భీష్మాదిశరీరములను విడిచి, అన్యాని—సర్వోత్కృష్టము లయిన దేవాదిశరీరములను, బహుకాలముగాఁ దాను సంపాదించిన ధర్మముయొక్క ఫలము ననుభవించుటకొఱకు, సంయాతి=చక్కఁగా—గర్భవాసాదిక్లేశము లేకయే పొందుచున్నాఁడు, దేహీ—ఉత్తమధర్మము ననుష్ఠించు దేహము గల భీష్మాదిదేహి యని యర్థము. అట్లు ‹ అన్య న్నవతరం కల్యాణతరం రూపం కురుతే పిత్ర్యంవా గాన్ధర్వంవా దైవంవా

* విడువఁదగిన వగుటను.

ప్రాజాపత్యంవా బ్రాహ్మంవా'♦ అని శ్రుతి. ఇది యభిప్రాయము—భీష్మాదులు యావజ్జీవము ధర్మానుష్ఠానక్లేశముచేతనే జీర్ణ మయిన శరీరము గలవారలు, ఈ శరీరము పోయినంగాని తత్ఫలభోగము నొందఁ జాలరు, కావున ధర్మయుద్ధముచే స్వర్గ ప్రతిబంధకము లయిన జీర్ణశరీరములను దొలఁగించి దివ్యదేహములు కలిగించి వారికి స్వర్గభోగ మొనగూర్తువేని నీవు వారి కుపకారము చేసినవాఁడవే యగుదువు. మఱియు ధనాదులకుఁగూడ స్వర్గభోగయోగ్య మయిన దేహము కలిగించుటచేఁ గొప్ప యుపకారమే యగును. కావున మిక్కిలి యుపకారక మయిన యుద్ధమునందు అప కారకత్వభ్రాంతి నొందకుము అని. అపరాణి అన్యాని సంయాతి అను మూఁడు పదములస్వారస్యమువలన భగవ దభిప్రాయ మిట్లూహింపఁబడినది. ఈ దృష్టాంత ముచే 'ఆత్మ యవికృతుఁ డని ప్రతిపాదింపఁబడుచున్నది' యను ప్రాచీనులవ్యాఖ్యా నమో మిక్కిలి స్పష్టము.

శ్రీ. ఓయీ! ఆత్మకు నాశము లేకున్నను తదీయశరీరము నశించునే యని యాలోచించి శోకించుచున్నాను అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—కర్మ ముచేఁ గలుగునట్టి నూతనము లయిన దేహములు తప్పక సిద్ధించుటవలన, జీర్ణ దేహము నశించుటవిషయ మయి శోకమున కవకాశము లే దని యర్థము.

ప. ఓయీ! ఆత్మ యవినాశి యనుట నిశ్చితమే. అయినను తదధిష్ఠిత మయిన దేహమును వధింపవలెనే యను భయముచే శోకము కలుగుచున్నది అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—రాఁబోవునట్టి నూతనదేహములు కర్మముచేఁ గలుగు నవి యగుటవలన రాక మానవు, కావున జీర్ణదేహనాశమునందును శోకమునకు అవకాశము లేదు.

రా. ఆత్మలు నిత్యులే యగుదురు, వారికి శరీరవియోగముమాత్రమె యుద్ధమునందుఁ జేయఁబడుచున్నది. అట్లయినను మనోహరము లయిన భోగము లకు సాధనము లైన శరీరములు నశించుటవలనఁ దద్వియోగరూప మగు శోక కారణ ముండనే యున్నది యనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—యథా = ఎట్లు; నరః = మనుష్యుఁడు; జీర్ణాని = చినిఁగిన; వాసాంసి = వస్త్రములను; విహాయ = విడిచి; అపరాణి = ఇతరము లయిన; నవాని = నూతనము లగు—కల్యాణము లగు

♦ ఇతరమును, అంతకన్నను నూతనమును అంతకన్నను మంగళంబు నగు రూపమును పొందు చున్నాఁడు పిత్ర్యమును—పితృదేవతాసంబంధినిగాని, గాంధర్వమునుగాని, దైవమునుగాని, ప్రాజా పత్యమునుగాని, బ్రాహ్మమును గాని.

వస్త్రములను; గృహ్ణాతి = గ్రహించుచున్నాఁడో; తథా = అట్లు; దేహీ = ఆత్మ; జీర్ణాని = శిథిలము లయిన; శరీరాణి = దేహములను; విహాయ = విడిచి; అన్యాని = ఇతరము లయిన; నవాని = కల్యాణము లగు దేహములను; సంయాతి = పొందుచున్నాఁడు. ధర్మయుద్ధమునందు శరీరము విడుచువారలకు విడిచిన శరీరముకన్నను అధికతరకల్యాణ మయిన శరీరము సిద్ధించు నని శాస్త్రంబువలనఁ దెలియుచున్నది, కావున జీర్ణవస్త్రములను విడిచి నూతనకల్యాణవస్త్రములను ధరించువానివిషయము నంబోలె సంతోషకారణమే యిటఁ గనఁబడుచున్నది.

మనుష్యుఁడు చినిఁగినవస్త్రములను విడిచి క్రొత్తసుందరవస్త్రముల నెట్లు ధరించునో అట్లే ధర్మయుద్ధమునందు హతు లగువారు పూర్వదేహములకన్నను అత్యుత్తమము లయిన దేవాదిదేహములను బొందుదురు, కావున ఇందుచే సంతోషింపవలసినదే కాని దుఃఖింపవలసినది లే దని తాత్పర్యము.

మా. దేహాత్మల వివేకము * అనుభవమునకు వచ్చుటకై దృష్టాంతము చెప్పుచున్నాఁడు.—యథా=ఎట్లు; నరః= మనుష్యుఁడు; జీర్ణాని= చినిఁగిన; వాసాంసి= వస్త్రములను; విహాయ = విడిచి; అపరాణి = ఇతరము లయిన; నవాని = నూతన వస్త్రములను; గృహ్ణాతి = గ్రహించుచున్నాఁడో; తథా = అట్లు; దేహీ = ఆత్మ; జీర్ణాని = జీర్ణించిన; శరీరాణి = దేహములను; విహాయ = విడిచి; అన్యాని = ఇతరము లయిన; నవాని = నూతనదేహములను; సంయాతి = పొందుచున్నాఁడు.

లోకమునందు మనుష్యుఁడు చినిఁగినవస్త్రములను విడిచి క్రొత్తవస్త్రములను ధరించునట్లు, జీవుఁడు జీర్ణము లయిన దేహములను విడిచి క్రొత్తదేహములను పొందుచున్నాఁడు, కావున వస్త్రములవలె దేహములు నశించుచున్నవే కాని వస్త్రధారి యగు మనుష్యుఁ డెట్లు నశించువాఁడు కాఁడో అట్లు జీవుఁడు నశించువాఁడు కాఁ డని తాత్పర్యము.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః. ౨౩

భా. ఎందువలన అవిక్రియుఁడై యే అనఁగా, చెప్పుచున్నాఁడు.— ఏనమ్ = ప్రకృతుఁడైన దేహిని; శస్త్రాణి = ఆయుధములు, ఖడ్గము మొదలగునవి; నఛిన్దన్తి= ఛేదింపవు, నిరవయవుఁ డగుటవలన అవయవ

* దేహము వినాశి, ఆత్మ యవినాశి యనుభేదముయొక్క జ్ఞానము.

విభాగము చేయవు. అట్లు, ఏనమ్ = ఈదేహిని; పావకః = అగ్నియును; నదహతి = కాల్పఁడు, భస్మము చేయఁడు. అట్లు, ఏనమ్ = ఈదేహిని; ఆపశ్చ = జలములును; నక్లేదయన్తి = తడుపవు, జలమునకు అవయవ సహిత మైన వస్తువును ఆర్ద్రము గావించి దాని యవయవములను విడఁదీయుటయందుఁ గదా సామర్థ్యము, అది అవయవరహితుఁ డైన ఆత్మ యందు సంభవింపదు. అట్లు వాయువు స్నేహము ❡ గల ద్రవ్యమును స్నేహము నెఁడించుటచే నశింపఁజేయును, ఏనమ్ = ఈయాత్మను మాత్రము, మారుతః=వాయువుగూడ; నశోషయతి=ఎండింపఁజేయఁడు.

ఈయాత్మను ఖడ్గము మొదలగు నాయుధములు ఛేదింపఁజాలవు, ఇతని అగ్నియు దహింపఁజాలఁడు, ఇతని జలములుగూడఁ దడుపఁజాలవు, వాయువుగూడ ఇతని ఎండింపఁజాలఁ డని తాత్పర్యము.

**ఆ.** పృథివ్యాదు లగు నాలుగుభూతములచే ఆత్మ వికారముఁ బొందింపఁ బడును. కావున ఆత్మకు అవిక్రియత్వము అసిద్ధ మని యాశంకించుచున్నాఁడు ఎందు వలన ఇత్యాదిగా. పృథివ్యాదిభూతములు ఆత్మను విషయీకరింపఁజాలవు, కావున యుక్తము ఆకాశమునకుంబోలె ఆత్మకు అవిక్రియత్వము అని చెప్పుచున్నారు చెప్పుచున్నాఁడు ఇత్యాదిగా.

**హ.** ఎట్లు అవిక్రియుఁ డనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఏనమ్=ఈయాత్మను; శస్త్రాణి= ఆయుధములు, ఖాడిస * మొదలగునవి, నఛిన్దన్తి = నిరవయవుఁ డగుట వలన అవయవవిభాగము చేయవు. అట్లు, ఏనమ్, పావకః నదహతి = అగ్నియు భస్మీకరింపదు. అట్లు, ఏనం ఆపః నక్లేదయన్తి—జలములకు సావయవవస్తువును ఆర్ద్రముగాఁ జేయుటచే అవయవముల నెడఁబాపుటయందు సామర్థ్యము, అది యవ యవరహితుఁ డైన ఆత్మయందు చెల్లదు. అట్లు వాయువు స్నేహద్రవ్యమును స్నేహము నెండించుటచే ఎండించును. స్నేహము లేని ఆత్మను వాయువుగూడ ఎండింపఁడు.

**శం.** ఓయీ! ఘటజలము నశించుటవలన అందలి ప్రతిబింబమునకు నాశము గలుగునట్లు ఆయుధాదికముచే దేహము నశింపఁగా అందుఁ గనఁబడుచున్న

❡ తడి.

* కొయ్యలు చెక్కునట్టి ఆయుధము.

ఆత్మకుఁగూడ నాశము తప్పక కలుగవలెను. కావున అవిక్రియత్వము అసిద్ధము. అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—శస్త్రాణి—వీనిచే పదార్థములు ఛేదింపఁబడుచున్నవి కావున శస్త్రములనఁగా ఖడ్గము గద మొదలగునవి పృథివీవికారములు; దేహమునువలె, ఏనమ్ = ఈప్రకృతుఁడైన ఆత్మను; నఛిన్దన్తి = అవయవవిభాగము చేయవు, నిరవయవుఁడగుటవలన ఆకాశమువలె ఆత్మ వాని ఛేదనక్రియకు విషయము కాఁడని యర్థము. ఆపః=జలములుగూడ; ఏనమ్=ఈయాత్మను; దేహమునువలె, నక్లేదయన్తి= తడిపి సావయవవస్తువునకుంబోలె నిరవయవుఁడైన ఈఆత్మకు శిథిలతను కలిగింపఁజాలవు. పావకః = అగ్నియును; దేహమునుంబోలె, ఏనమ్, నదహతి=దహనక్రియకు అవిషయ మగుటచే భస్మీకరింపఁజాలదు. మారుతః= వాయువుగూడ; స్నేహశోషణముచే దేహము నెట్లు శోషిల్లఁజేయునో అట్లు, ఏనమ్, నశోషయతి=శోషణక్రియకు అవిషయ మగుటవలన ఎండింపఁజాలఁడు. ఎట్లు ఘటమును జలము తడుపుచున్నదో, శస్త్రములు కొట్టఁదగినవాని కొట్టుచున్నవో, వాయువు శోషిల్లఁజేయుచున్నదో, అగ్ని దహించుచున్నదో, అట్లు ఆస్థలమునందున్న నిరవయవమైన ఆకాశమును జలము దడుపఁజాలదు, శస్త్రములు కొట్టఁజాలవు వాయువు ఎండింపఁజాలదు, అగ్ని దహింపఁజాలదు గదా! ఆవిధముననే దేహమునందున్న ఆత్మనుగూడ నని భావము. అందువలన అవిక్రియత్వ మాత్మకు సిద్ధము. ఇందుచే, ముసలితనము రోగము మొదలగునవియు భౌతికములును దైవికములునగు నుపద్రవములును—ఇవన్నియు శరీరమునకే కాని అహమర్థ మయిన ఆత్మకుఁ గావు కావున ఆత్మ దేహాదిభిన్నుఁడగుటచే దేహమునకు సంభవించునట్టి యనర్థములకు ఆత్మ విషయము కాఁడని చెప్పఁబడినది, కావున అవి సంభవించినను బ్రహ్మవేత్తలు స్థిరప్రజ్ఞులై యుండవలె నని సూచిత మగుచున్నది.

మ॰ ఓయీ! దేహము నశించునప్పుడు దానిలో నున్న ఆత్మకు, గృహము దగ్ధ మగునప్పుడు దానిలోపలనుండు పురుషునకుంబోలె, ఎందువలన వినాశము కలుగదు? అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—శస్త్రాణి=ఖడ్గము మొదలగునవి, మిక్కిలి వాఁడియైనను; ఏనమ్ = ఈయాత్మను; నఛిన్దన్తి = అవయవవిభాగముచే రెండుగాఁ జేయఁజాలవు. అట్లు, పావకః = అగ్ని, మిక్కిలి జ్వలించుచున్నదైనను; ఏనమ్, నదహతి= భస్మీకరింపఁజాలదు. ఆపః= జలములు, మిక్కిలి వేగము గలవైనను; ఏనమ్; నక్లేదయన్తి = తడుపుటచే అవయవములు సడలునట్లు చేయఁజాలవు. మారుతః = వాయువు, మిక్కిలి ప్రబల మయినను; ఏనమ్; నశోషయతి =

నీరసునిగా * చేయఁజాలదు. నాశకము లయిన సర్వపదార్థములనిషేధము ప్రకృత మయినను యుద్ధసమయమునందు శస్త్రాదులు ప్రకృత మగుటంజేసి యవి యుపన్యసింపఁబడినవి. పృథివ్యప్తేజోవాయువులుమాత్రమె నాశకము లని ప్రసిద్ధింజేసి యవి మాత్రమె యుపన్యసింపఁబడినవి, ఆకాశ ముపన్యసింపఁబడినది కాదు.

శ్రీ. 'కథం హన్తి' అనుదానిచేఁ జెప్పఁబడిన వధసాధనాభావమును ¶ తెలుపుచు ఆత్మ యవినాశి యనుటను స్పష్టీకరించుచున్నాఁడు.—ఆపః ఏనమ్, న క్లేదయన్తి = మెత్తపఱచుటచే శిథిలునిఁగాఁ జేయవు.

ప. క్లేదన మనఁగా మృదువుగాఁ జేసి శిథిలము చేయుట, దానిఁ జేయవు.

రా. §

మా. స్వభావముచేతను ప్రాయికముగా నిమిత్తములచేతను వినాశము లేకున్నను ఆత్మకు ఒకానొకనిమిత్తవిశేషముచే వినాశము కావచ్చును దక్షప్రజాపతి శిరశ్ఛేదమువలె ♦ అని శంక కలుగుటవలన విశేషనిమిత్తములను నిషేధించుచున్నాఁడు.—శస్త్రాణి = ఆయుధములు; ఏనమ్ = ఈజీవుని, నఛిన్దన్తి = నఱకకున్నవి. పావకః = అగ్ని; ఏనమ్ = ఈజీవుని; నదహతి = దహింపకున్నది. ఆపశ్చ = జలములును; ఏనమ్ = ఈజీవుని; నక్లేదయన్తి = తడుపకున్నవి. మారుతః = వాయువు; ఏనమ్ = ఈజీవుని; నశోషయతి = ఎండింపకున్నది.

వర్తమానకాలమునందు ఈజీవుని శస్త్రములు ఛేదింపవు, అగ్ని దహింపదు, జలములు తడిపి శిథిలునిగాఁ జేయవు. వాయువుకూడ ఎండింప దని తా.

అచ్ఛేద్యో ఽయ మదాహ్యో ఽయ మక్లేద్యో ఽశోష్య ఏవచ
నిత్య స్సర్వగతః స్థాణు రచలో ఽయం సనాతనః. ౨౪

భా. ఎందువలన ననఁగా—అయమ్ = ఈయాత్మ; అచ్ఛేద్యః=ఛేదింప శక్యము కానివాఁడు. అయమ్ = ఈయాత్మ; అదాహ్యః = దహింప

---

* ద్రవము లేనివానిఁగా.

¶ వధించుటకు సాధనము—కొఱముట్టు లేమిని.

§ ఇరువదినాలుగవశ్లోకముతోఁ జేర్చి వ్యాఖ్యానము చేయఁబడును.

♦ ఎట్లు దక్షప్రజాపతికి శిరశ్ఛేదము స్వభావముచేఁ గలిగినది కాదు, వీరభద్రుని యాయుధము అను నిమిత్తముచేతనుం గలిగినది కాదు, మఱి యే మనఁగా, యజ్ఞపశుభావన యను నిమిత్తవిశేషముచేఁ గలిగినదో, అట్లు.

శక్యము కానివాఁడు. అక్లేద్యః=తడుప శక్యము కానివాఁడు. అశోష్యః ఏవచ=ఎండింప శక్యము కానివాఁడుకూడ. ఎందువలన అన్యోన్యనాశ హేతువు లయిన ఖడ్గాదు లీయాత్మను నశింపఁజేయ సమర్థములు కావో అందువలన; అయమ్ = ఈయాత్మ; నిత్యః = నిత్యుఁడు. నిత్యుఁ డగుట వలన, సర్వగతః = అంతటను వ్యాపించినట్టివాఁడు. సర్వగతుఁ డగుట వలన, స్థాణుః = స్థిరుఁడు. స్థిరుఁ డగుటవలన, అచలః = కదలనివాఁడు. కావున, సనాతనః = పురాతనుఁడు—అనాది యయినవాఁడు, ఒకానొక కారణమువలనఁ బుట్టినవాఁడు కాఁడు క్రొత్తవాఁడు కాఁ డని యర్థము.

ఈయాత్మను ఛేదింప శక్యము కాదు, దహింపను శక్యము కాదు, తడుపను శక్యము కాదు, ఎండింపను శక్యము కాదు. అట్లు అన్నివిధములనుగూడ నాశము లేనివాఁ డగుటవలన ఈయాత్మ నిత్యుఁడు, నిత్యుఁ డగుటవలన సర్వవ్యాపకుఁడు, సర్వవ్యాపకుఁ డగుటవలన స్థిరుఁడు, స్థిరుఁ డగుటవలన అచలుఁడు. ఈ కారణమువలన సనాతనుఁ డని తాత్పర్యము.

భా. ఈశ్లోకములలోఁ బానరుక్త్యము శంకింపరాదు. ఎట్లు పునరుక్తి యనఁగా, నజాయతే మ్రియతే వా ఇత్యాదిక మయిన ఒకశ్లోకము చేతనే ఆత్మ నిత్యుఁడును అవిక్రియుఁడు నని చెప్పఁబడినది. అందు ఆత్మ విషయమయి యేమి చెప్పఁబడుచున్నదో అది యీశ్లోకమునఁ జెప్పఁబడిన దానికన్న భిన్నము కాదు. కొంత శబ్దముచేతను కొంత అర్థముచేతను బునరుక్త మగుచున్నది. అయినను అట్లు పౌనరుక్త్యము తలంపరాదు. ఆత్మతత్త్వము దుర్బోధ మగుటవలన మాటిమాటికిఁ బ్రసక్తి కలిగించు కొని యితరశబ్దములచే దానినే నిరూపించుచున్నాఁడు భగవంతుఁడు వాసుదేవుఁడు, ఎట్లయినను సంసారులు ఆత్మతత్త్వముం దెలిసి సంసారనివృత్తిఁ బొందుదురు గాక యని.

ఆ. పృథివ్యాదిభూతములచేఁ గలుగు ఛేదనాదిక్రియలు ఆత్మయందు సంభవింప వనుటకు యోగ్యత లేమిని కారణముగాఁ జెప్పుచున్నారు.—ఎందువలన ననఁగా అని. పూర్వార్థము నుత్తరార్థమునకు హేతువుగా అన్వయించుచున్నారు ఎందువలన ఇత్యాదిగా. నిత్యత్వాదులకుఁ బరస్పరము హేతుహేతుమద్భావము సూచించుచున్నారు నిత్యుఁ డగుటవలన ఇత్యాదిగా. నిత్యత్వము పరమాణువులందు

వ్యభిచరించుటవలన * సర్వగతత్వమునకు సాధకము కాదని చెప్పఁదగదు, పరమాణువులే అప్రామాణికము లగుటచే వ్యభిచారమునకవకాశము లేమివలన; సర్వగతుఁడైనను ఆత్మకు వికారశక్తిమత్త్వము కలదనుటయు యుక్తము కాదు, విభువు ♦ అని యంగీకరించిన యాకాశమునందు వికారశక్తిమత్త్వము కనఁబడకుండుటవలన; మఱియు వికారశక్తిమంతుఁడన్నచో స్థైర్యము చెప్ప శక్యము కాదు, వికారశక్తిమంతమయిన మృత్తికాదికము అస్థిరముగాఁ గనఁబడుటవలన—ఈయభిప్రాయముతోఁ జెప్పుచున్నారు స్థిరుఁడగుటవలన ఇత్యాదిగా. స్వభావమున నిత్యుఁడైనను ఏకారణమువలననేని నాశము సంభవించుటవలన జన్మముగూడ సంభవించును. కావున పురాతనత్వ మెట్లు సిద్ధించు నని యాశంకించి చెప్పుచున్నారు ఒకానొక కారణమువలన ఇత్యాదిగా.

ఆత్మ యవిక్రియుఁడనుట 'నజాయతే మ్రియతే' వేత్యాదిశ్లోకముచే సాధిత మగుటవలన దానినే మరల జెప్పినచోఁ బునరుక్తి యని యాశంకించి చెప్పుచున్నారు ఈశ్లోకములలో ఇత్యాదిగా. పునరుక్తిప్రసక్తిని చూపుచున్నారు ఎట్లు పునరుక్తి యనఁగా ఇత్యాదిగా. ఇందువలన వేదావినాశిన మిత్యాదిస్థలమునఁ బౌనరుక్త్యము శంకింపఁబడినది కాదని విశేషము. ఎట్లచ్చటఁ బౌనరుక్త్యశంక కలుగుచున్న దనఁగాఁ జెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. వేదావినాశిన మిత్యాది శ్లోకము అందు అను సప్తమిచేఁ బరామర్శింపఁబడుచున్నది. ఈశ్లోకమున అను శబ్దముచే నజాయతే అనుశ్లోకము చెప్పఁబడుచున్నది. ఓయీ! ఈ శ్లోకమునందు జన్మమరణాద్యభావము చెప్పఁబడుచున్నది, వేదావినాశిన మ్మను శ్లోకమునందో అపక్షయాద్యభావము వివక్షితము. అట్లుండఁగా ఎట్లర్థభేదము లేదని పౌనరుక్త్యము శంకింపఁబడుచున్నది? అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు కొంత ఇత్యాదిగా. అట్లయినమోఁడఁ బౌనరుక్త్యము శంకింప రాదని యెట్లు తలంచెదవు? అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు. అయినను ఇత్యాదిగా. మాటిమాటికి నానావిధములచే తత్త్వము నిరూపించుచున్న భగవంతునియభిప్రాయముఁ జెప్పుచున్నారు ఎట్లయినను ఇత్యాదిగా.

హ. అందువలన, అచ్ఛేద్య ఇత్యాది. ఎందువలన అన్యనాశహేతువులయిన శస్త్రాదులు ఆత్మను నశింపఁజేయఁజాలవో, అందువలన, అయం నిత్యః.

---

* సర్వగతములు కాని పరమాణువులుం డుండుటవలన.

♦ సర్వగతము.

నిత్యుఁ డగుటవలన, సర్వగతః. సర్వగతుఁ డగుటవలన, స్థాణుః—మ్రోడు * వలె స్థిరుఁడు. స్థిరుఁ డగుటవలన, అచలః. అందువలన ఈయాత్మ, సనాతనః—బహు కాలముగా నున్నవాఁడు, ఏకారణమువలనఁగాని పుట్టినవాఁడు కాఁడు క్రొత్త వాఁడు కాఁ డని యర్థము. ఎట్లయినను ఆత్మతత్త్వము సంసారులకుఁ దెలిసి సంసారనివృత్తికావలె నని పలుమాఱు చెప్పఁబడుచున్నది.

శం. 'వాసాంసి జీర్ణాని' అను శ్లోకముచేత ఆత్మ దేహవ్యతిరిక్తుఁ డని ప్రతిపాదింపఁబడినది. అందువలన దృశ్యవస్తువులకు సంభవించునట్టి ఛేదాదులు దేహమునకే కాని నిరవయవుఁ డైన యాత్మకుఁ గావు. కావున భూతచతుష్టయకార్యము లయిన ఛేదక్లేదదహనశోషణములు ఆత్మయందు సంభవింప వని స్పష్టముగాఁ జెప్పుచున్నాఁడు.—సనాతనః = అనాది యయినవాఁడు, 'నతస్య కశ్చి జ్జనితా నచాధిపః' అను శ్రుతివలన, ఈయాత్మ నిరవయవుఁ డగుటచే ఏకారణమువలనను బుట్టినవాఁడు కాఁడు, కావున సనాతనుఁడు—జన్మాదివికారరహితుఁడు. అందువలననే, నిత్యః. నిత్యుఁ డగుటవలననే, సర్వగతః - పరిపూర్ణుఁడు. నిత్యుఁడును సర్వగతుఁడును ఐనను ఆత్మకు క్రియాశక్తిమత్త్వము కావచ్చు నని శంకింపఁ దగదు, నిత్య సర్వగత మయిన ఆకాశమునందు క్రియాశక్తిమత్త్వము లేమివలన. అందువలననే, స్థాణుః = స్థిరస్వభావుఁడు. స్థిరుఁ డగుటవలననే, అచలః. అయమ్ అయమ్ అని అపరోక్షముగా నిర్దేశించుట విద్వాంసున కాత్మ ప్రత్యక్ష మయియుండు నని తెలుపుటకొఱకు. సనాతనుఁ డగుటవలనను నిత్యుఁ డగుటవలనను సర్వగతుఁ డగుటవలనను స్థిరుఁ డగుటవలనను అచలుఁ డగుటవలనను, ఈ యాత్మ తాను, అచ్ఛేద్యః = ఛేదింప నశక్యము. అదాహ్యః = దహింప నశక్యము. అక్లేద్యః = తడుపుటకు అశక్యము. అశోష్యశ్చఏవ=ఎండించుటకును అశక్యమే యగుచున్నాఁడు, శస్త్రాదుల కని యర్థము. సనాతనుఁ డను విశేషణముచే ఆత్మ నిర్వికారుఁ డనియు, నిత్యుఁ డనుటచేఁ బ్రమాణాంతరముచే అబాధ్యుఁ డనియు, స్థిరుఁ డనుటచే క్రియకు ఆశ్రయము కాఁ డనియు, అచలుఁ డనుటచే క్రియకు విషయము కాఁ డనియు, పూర్ణుఁ డనుటచే అద్వితీయుఁ డనియు నిత్యశుద్ధుఁ డనియు ఆనందైకరసుఁ డనియు సూచిత మగుచున్నది.

మం. శస్త్రాదులకు ఆత్మను నశింపఁజేయు సామర్థ్యము లే దనుటకు ఆత్మ వానివలనఁ గలుగు నాశమునకు అయోగ్యుఁ డనుట హేతువుగాఁ జెప్పుచు

* కొమ్మలులేని చెట్టు.

న్నాఁడు.—అయమ్ = ఈయాత్మ; అచ్ఛేద్యః = ఛేదింప శక్యము కాఁడు, కావున ఇతని శస్త్రములు ఛేదింపవు, అయం అదాహ్యః, అందువలన ఇతని అగ్ని దహింపదు. అక్లేద్యః, కావున. ఇతని జలములు తడుపవు. ఇతఁడు, అశోష్యః, కావున ఇతని వాయువు ఎండింపదు, అని క్రమముగా అన్వయింపవలెను. ఏవకారము ప్రత్యేక మన్వయము గలదై యచ్ఛేద్యత్వా ద్యవధారణము చేయును. చకారము పరు సముచ్చయము, లేక, హేతువు అని యర్థము. ఆత్మ ఛేదాదుల కనర్హుఁ డను టకు ఉత్తరార్థముచే హేతువుఁ జెప్పుచున్నాఁడు—అయమ్, నిత్యః—పూర్వాపరకోటులు * లేనివాఁడు, కావున ఉత్పాద్యుఁడు ♦ కాఁడు, సర్వగతుఁడు కానియెడఁ గదా అనిత్యుఁ డగును, ‘యావ ద్విభాగం తు విభాగో లోకవత్’ అనువ్యాయము వలనఁ బరాభిమతము లయిన పరమాణ్వాదుల నంగీకరింపమివలన. ఈయాత్మయో, సర్వగతః=విభువు, కావున నిత్యుఁడే యగును. ఇందుచేఁ బ్రాప్యత్వము ❡ నిరాకరింపఁబడినది. ఇతఁడు వికారవంతుఁ డగునేని అప్పుడు సర్వగతుఁడు కాకపోవును. ఇతఁడో, స్థాణుః = అవికారి, కావున సర్వగతుఁడే యగును, ఇందుచే వికార్యత్వము నిరాకరింపఁబడినది. ఇతఁడు చలుఁడు — క్రియావంతుఁడు అగునేని అప్పుడు ఘటమువలె వికారి యగును, ఇతఁడో అచలః, కావున వికారికాఁడు, ఇందుచే సంస్కార్యత్వము నిరాకరింపఁబడినది. పూర్వావస్థ విడిచి యవస్థాంతర మొందుట విక్రియ, అవస్థ యొకటిగానే యున్నను చలనమాత్రము క్రియ యని విశేషము. అట్టివాఁ డగుటవలన, అయమ్, సనాతనః = సర్వదా ఏకరూపుఁడు, ఎట్టి క్రియకును కర్మము కాఁ డని యర్థము. ఉత్పత్తి ఆప్తి వికారము సంస్కారము—వీనిలో నేదేని క్రియాఫలము కలిగినం గదా కర్మత్వము సంభవించును. ఈయాత్మయో నిత్యుఁ డగుటవలన ఉత్పాద్యుఁడు కాఁడు, అనిత్యమయిన ఘటాదికమే యుత్పాద్య మగుటవలన. సర్వగతుఁ డగుటవలన ప్రాప్యుఁడు కాఁడు, పరిచ్ఛిన్న మయిన క్షీరాదికమే ప్రాప్య మగుటవలన. స్థాణు వగుటవలన వికార్యుఁడు కాఁడు, వికారవంత మగు ఘటాదికమే వికార్య మగుటవలన. అచలుఁ డగుటవలన సంస్కార్యుఁడు కాఁడు, క్రియావంత మగు దర్పణాదికమె సంస్కార్య మగుటవలన. అట్లు శ్రుతులు. ‘ఆకాశవ త్సర్వగతశ్చ నిత్యః, వృక్ష ఇవ స్తబ్ధో

* జన్మనాశములు.

♦ పుట్టింపఁదగినవాఁడు.

❡ పొందఁదగినవాఁ డగుట.

దివి తిష్ఠత్యేకః, నిష్కలం నిష్క్రియం శాన్తమ్' * ఇత్యాదులు చెప్పుచున్నవి. 'యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో యో ఽప్సు తిష్ఠన్నద్భ్యో ఽన్తరో యస్తేజసి తిష్ఠన్ తేజసో ఽన్తరో యో వాయౌ తిష్ఠన్ వాయోరన్తరః' ¶ ఇత్యాదిశ్రుతియు సర్వగతుఁడు సర్వాంతర్యామి యగుటచే ఆపృథివ్యాదులకు విషయము కాఁడని తెలుపుచున్నది. ఎవ్వఁడు శస్త్రాదులందు లేఁడో వానిని గదా శస్త్రాదులు ఛేదించును. ఇతఁడో శస్త్రాదులకు సత్తాస్ఫూర్తులొసంగువాఁ డగుటచే వానికిఁ బ్రేరకుఁడు వాని కంతర్యామి, కావున ఎట్లు వీనిని శస్త్రాదులు స్వవ్యాపారమునకు విషయముగాఁ జేయఁగలవు? అని యభిప్రాయము. ఇట 'యేన సూర్యస్తపతి తేజసేద్ధః' ♦ ఇత్యాది శ్రుతు లనుసంధింపఁ దగును. మఱియు ఈవిషయము సప్తమాధ్యాయమునందు వివరింపఁగలఁడు శ్రీభగవంతుఁడు.

శ్రీ. అందుకు హేతువులఁ జెప్పుచున్నాఁడు ఒకటియు నరశ్లోకముచేత.— నిరవయవుఁ డగుటవలన ఇతఁడు అచ్ఛేద్యుఁడును అక్లేద్యుఁడును, అమూర్తుఁడు § అగుటవలన అదాహ్యుఁడు, ద్రవత్వము లేనివాఁ డగుటవలన అశోష్యుఁడు అని భావము. ఈకారణమువలనఁగూడ ఛేదనాదియోగ్యుఁడు కాఁడు, ఏకారణమువలన ననఁగా—నిత్యః= వినాశము లేనివాఁడు, సర్వగతః = అంతటను వ్యాపించినవాఁడు, స్థాణుః = స్థిరస్వభావుఁడు, రూపాంతరముఁ బొందనివాఁ డనుట, అచలః = పూర్వరూపము విడువనివాఁడు, సనాతనః = అనాది.

ష. నిరవయవుఁ డగుటవలనను అమూర్తుఁ డగుటవలనను ద్రవత్వము లేనివాఁ డగుటవలనను ఆత్మయందు ఛేద్యత్వాదులు సంభవింపవు. ఛేద్యత్వాదులు దేహగతములు ఆత్మయం దారోపింపఁబడుచున్నవి, అట్లు "అయఃపిణ్డగతే వహ్నౌ లోహకారస్య తాడనమ్, ఆరోప్యతే యథా లోహే దాహకత్వాది వహ్నిజమ్" $.

* ఆకాశమువలె సర్వగతుఁడును నిత్యుఁడును, వృక్షమువలె నిశ్చలుఁడై యాకాశమునం దొక్కఁ డున్నాఁడు, నిష్కలము నిష్క్రియము శాంతము.

¶ ఎవ్వఁడు పృథివియం దున్నవాఁడై పృథివికన్నను సూక్ష్ముఁ డగునో, ఎవ్వఁడు జలములం దున్నవాఁడై జలములకన్నను సూక్ష్ముఁడో, ఎవ్వఁడు తేజస్సునం దున్నవాఁడై తేజస్సుకన్నను సూక్ష్ముఁడో, ఎవ్వఁడు వాయువునం దున్నవాఁడై వాయువుకన్నను సూక్ష్ముఁడో.

♦ ఎవ్వనిచే తేజస్సుచేఁ బ్రకాశించువాఁడై సూర్యుఁడు వెలుఁగుచున్నాఁడో.

§ క్రియాశ్రయుఁడు కానివాఁడు.

$ అయఃపిండమునందలి యగ్నిమీఁద కమ్మరివాని సమ్మెటపోటును, అగ్నివలనఁ గలుగు దాహకత్వాదికము అయఃపిండమునందును ఎట్లు ఆరోపింపఁబడుచున్నవో, అట్లు దేహధర్మ మాత్మయందును ఆత్మధర్మము దేహమునందును ఆరోపింపఁబడును.

అని చెప్పఁబడినది. ముందును అట్లే యున్నాఁడని చెప్పుచున్నాఁడు—నిత్యః = వినాశము లేనివాఁడు, సర్వగతః = అపరిచ్ఛిన్నుఁడు, స్థాణుః = స్థిరస్వభావుఁడు రూపాంతరము లేనివాఁడు; అచలః = పూర్వరూపము విడువనివాఁడు, సనాతనః = ఆది లేనివాఁడు.

రా. మరల 'అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్' అనుశ్లోకముచే మున్ను చెప్పఁబడిన యవినాశిత్వమును రెండుశ్లోకములచే సుఖగ్రహణముకొఱకు స్పష్టీకరించుచు దృఢపఱచుచున్నాఁడు.—ఏనమ్ = ఈయాత్మను ; శస్త్రాణి=ఆయుధములు; నఛిన్దన్తి=నఱకవు. ఏనమ్=ఈయాత్మను; పావకః=నిప్పు; నదహతి=కాల్పదు; ఏనమ్= ఈయాత్మను; ఆపశ్చ= జలములుగూడ; నక్లేదయన్తి= తడుపవు. మారుతః= గాలి; నశోషయతి = ఎండింపదు. అయమ్ = ఈయాత్మ; అచ్ఛేద్యః = ఛేదింపరానివాఁడు. అయమ్=ఇతఁడు, అదాహ్యః = దహింపరానివాఁడు. అక్లేద్యః=తడుపరానివాఁడు. అశోష్యఏవచ= ఎండింపనుగూడ రానివాఁడు. శస్త్రములును అగ్నియును జలంబును వాయువును ఛేదనదహనక్లేదనశోషణములను ఆత్మయెడఁ జేయ సమర్థములు కావు. ఎందువలన ననఁగా, ఆత్మ, సర్వగతః = సర్వమును పొందు వాఁడు, సర్వగతుఁ డగుటవలన సర్వతత్త్వములను వ్యాపించుస్వభావము గలవాఁ డగుటచే సర్వతత్త్వములకన్నను సూక్ష్ముఁడు, కావున ఈయాత్మను ఆతత్త్వములు వ్యాపింపఁజాలవు. వ్యాపించి కదా ఛేదనదహనక్లేదనశోషణముల నవి చేయవలెను. అందువలన, అయమ్= ఈయాత్మ; నిత్యః=నిత్యుఁడు; స్థాణుః=స్థిరస్వభావుఁడు. అచలః= కదలింప నలవికానివాఁడు. సనాతనః = పురాతనుఁడు, అనాదియైనవాఁడు.

ఈయాత్మను శస్త్రములు ఛేదింపఁజాలవు, అగ్ని దహింపఁజాలదు, జలము తడుపఁజాలదు, వాయువు ఎండింపఁజాలదు. ఇతఁడు ఛేదింపను దహింపను తడుపను ఎండింపనుగూడ అలవికాఁడు. ఎందువలన ననఁగా శస్త్రాదులు ఛేదనము మొదలగు కార్యములు దేనికిఁ జేయవలెనో దాని వ్యాపించి కాని ఆకార్యములను చేయఁజాలవు. ఈయాత్మయో సర్వగతుఁ డగుటచే సర్వతత్త్వములను దాను వ్యాపించుస్వభావము గలవాఁ డగుటవలన సర్వతత్త్వములకన్న సూక్ష్ముఁడు, కావున ఇతని శస్త్రాదులు వ్యాపింపఁజాలవు. అందువలన ఈయాత్మ నవి నశింపఁజేయఁజాలవు. కావున ఇతఁడు నిత్యుఁడు స్థిరుఁడు అచలుఁడు సనాతనుఁడు. అని తాత్పర్యము.

మ. వర్తమానకాలమునందు ఛేదాదులు సంభవింప వని చెప్పుటవలన భవిష్యత్కాలమునందు సంభవింపవచ్చు నని యాశంకించి చెప్పుచున్నాఁడు.—

అచ్ఛేద్య ఇత్యాదిగా. వర్తమానకాలమునందు సంభవింప వని చెప్పుటచేతనో వర్తమానకాలమునందు ఛేదాదులు కనఁబడకుండుటవలన ఛేదాద్యయోగ్యుఁ డనుట యుక్త మని సూచింపఁబడినది. అయమ్ = ఈ జీవుఁడు; అచ్ఛేద్యః = ఛేదింపయోగ్యుఁడు కానివాఁడు. అదాహ్యః = దహింపయోగ్యుఁడు కానివాఁడు. అయమ్ = ఈజీవుఁడు; అక్లేద్యః = తడుపుటకు యోగ్యుఁడు కానివాఁడు. అశోష్యఏవచ=ఎండించుటకునుకూడ యోగ్యుఁడు కానివాఁడు. ఎందువలన యోగ్యుఁడు కాఁ డనఁగా— నిత్యత్వము సర్వగతత్వము మొదలగు విశేషణములు గల ఈశ్వరునితో సరూపుఁ డగుటవలన మున్ను, శాశ్వతః అనుటచే ఏకరూపత్వము మాత్రము చెప్పఁబడినది, ఇప్పుడు స్థాణుశబ్దముచే నైమిత్తిక మయిన అన్యథాభానమును నివారించుచున్నాఁడు—అయమ్ స్థాణుః= నైమిత్తిక మయిన అన్యథాభావము లేనివాఁడు. నిత్యః సర్వగతః—నిత్యత్వము సర్వగతత్వమునకు విశేషణము, నిత్యముగా సర్వవ్యాపకుఁ డని యర్థము, రెండును వేఱువేఱ ఈశ్వరునకే విశేషణము లన్నచోఁ బునరుక్తిదోషము ప్రసక్తించును. ఈశ్వరప్రతిబింబత్వము మున్ను చెప్పినదే యయినను పూర్వము చెప్పని విశేషణములు చెప్పుటవలన ఈశ్వరప్రతిబింబత్వమును మరలఁ జెప్పుటయందుఁ బునరుక్తిదోషము లేదు. విరోధము లేనియప్పుడు బింబధర్మములు ప్రతిబింబమునందు సంభవించుచున్నవి. కావున అచ్ఛేద్యత్వాదులు జీవునియందును సంభవించును. జీవున కీశ్వరప్రతిబింబత్వమో ‘రూపం రూపం ప్రతిరూపో బభూవ’ ‘ఆభాస ఏవచ’ ఇత్యాదిశ్రుతిస్మృతులవలన సిద్ధము. అంశ మనుటకు విరోధము కలుగదు. ఏల యనఁగాఁ బ్రతిబింబమే యంశ మగును. అంశశబ్దమున కొక్కటే యర్థ మని చెప్పఁ దగదు. అందుకు జీవుఁ డీశ్వరప్రతిబింబమనియు తదంశ మనియుఁ బ్రతిపాదించువచనమే ప్రమాణము. అంశమే ప్రతిబింబమని కల్పించుటయు నుచితము గాదు. ఏల యనఁగా గాధి మొదలగువారియందు అంశశబ్దమునకు అనేకార్థములు కనఁబడుచున్నవి. ప్రతిబింబశబ్దమున కట్లు కాదు. స్థాణుత్వ మున్నను ఈశ్వరునకు ‘త దైక్షత’ ఇత్యాదిశ్రుతిసిద్ధ మయిన యీక్షితృత్వాదికము విరుద్ధము కాదు, రెంటిని బోధించుప్రమాణ ముండుటవలను, అచింత్యశక్తివలనఁగూడ. అందు ఒకటి మాయిక మని చెప్పఁ దగదు, ఏల యనఁగా, ‘త్వ యీశ్వరే బ్రహ్మణి నో విరుధ్యతే’ * ‘న యోగిత్వా దీశ్వరత్వాత్’ ♦

---

* ఈశ్వరుఁడవు బ్రహ్మము వగు నీయందు విరుద్ధము కాదు.

♦ యోగి యగుటవలనఁ గాదు, మఱి యేమనఁగా ఈశ్వరుఁ డగుటవలను.

'చిత్రం న చైతత్త్వయి కార్యకారణే' ౹ ఇత్యాదిగా ఐశ్వర్యముచేతనే విరుద్ధధర్మము లుండుట యవిరుద్ధ మని చెప్పఁబడినది. ఇదిగాక సకలవేదములకుఁ బరమేశ్వరుని గుణోత్కర్షప్రతిపాదనమునందే మహాతాత్పర్యము. మోక్షము గదా మహాపురుషార్థము, చతుర్విధపురుషార్థములందును మోక్షమే పురుషార్థము. అట్లు, «అన్తేషు రేమిరే ధీరా నతే మధ్యేషు రేమిరే। అన్తప్రాప్తిం సుఖం ప్రాహుర్దుఃఖ మన్తర మేతయోః, * పుణ్యచితో లోకః క్షీయతే» ♦ ఇత్యాదిశ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. ఆమోక్షము విష్ణుప్రసాదమువలననే సిద్ధించును. అట్లు «వాసుదేవ మనారాధ్య కో మోక్షం సమవాప్నుయాత్, తుష్టేతు తస్మిన్ కిమలభ్య మనన్త ఈశే, తత్ప్రసాదా దవాప్నోతి పరాం సిద్ధిం న సంశయః, యేషాం స ఏవ భగవాన్ దయయే దనన్తః సర్వాత్మనాశ్రితపదో యది నిర్వ్యలీకమ్। తే వై విద న్త్యతితరన్తి చ దేవమాయాం నైషాం మమాహ మితి ధీ శ్శ్వసృగాలభక్ష్యే, తస్మిన్ ప్రసన్నే కిమిహా స్త్యలభ్యం ధర్మార్థకామై రల మల్పకాస్తే, యుతే యదస్మిన్ భవ ఈశ జీవా స్తాపత్రయే ణోపహతా న శర్మ, ఆత్మన్లభన్తే, యుతే భవత్ప్రసాదాద్ధి కస్య మోక్షో భవే దిహ, త మేనం విద్వాన్» § ఇత్యాది శ్రుతిస్మృతులు ప్రతిపాదించుచున్నవి. ఆవిష్ణుప్రసాదము ఉత్కృష్టజ్ఞానమువలననే కలుగును, అది లోకప్రసిద్ధము. లోకప్రసిద్ధ మగు విషయము అవిరుద్ధమైనచో ఇచటఁగూడ అంగీకార్యము. అహల్యాజారత్వాదిప్రతిపాదక మయినవాక్యముగూడ

---

౹ సకలకార్యములఁ గలిగించు నీయందు ఇది చిత్రము కాదు.

* అంతము లయిన ధర్మమోక్షములందు విద్వాంసులు రమించిరి. కాని వారు మధ్యము లయిన అర్థకామములందు రమించినవారు కారు, అంతముల ప్రాప్తి సుఖ మని చెప్పెదరు, వీనినడుమ నుండు అర్థకామములు దుఃఖరూపములు.

♦ పుణ్యముచే సంపాదింపఁబడిన లోకము క్షయించుచున్నది.

§ వాసుదేవు నారాధింపక యెవఁడు మోక్షము నొందును? అనంతుఁ డయిన ఈశ్వరుఁడు సంతోషించినయెడ ఏది యలభ్యము? అతనిప్రసాదమువలన ఉత్తమసిద్ధిని బొందుచున్నాఁడు సందేహము లేదు. సర్వప్రకారముచేతను నిష్కపటముగా ఆశ్రయింపఁబడిన పాదములు గలవాఁడై యెవరికి భగవంతుం డగు ననంతుఁడు కృప చేయునో వారు దేవమాయ నెఱుంగుదురు; తరింతురు, అట్టి వీరికి కుక్కలకును నక్కలకును భక్ష్య మయిన దేహమునందు నాది నేను అనుబుద్ధి యుండదు. అతఁడు ప్రసన్నుఁడైనయెడ ఇంక ఏది యలభ్యము కలదు? ధర్మార్థకామము లెందుకు? అవి మిక్కిలి యల్పములు. ఈశుఁడా! ఎందువలన సత్యమైన యీసంసారమునందుఁ దాపత్రయముచే ఉపహతులై జీవులు మనస్సునందు సుఖము నొందరో, నీప్రసాదము లేనిచో ఇం కెవ్వనికి మోక్షము కలుగును! అతని ఇట్లు తెలిసినవాఁడు.

'ద్రోహము చేసినవాఁడవైనను నీకు ఎక్కువపాపలేపము కలుగ దయ్యె' నని యింద్రోత్కర్షమునే చెప్పుచున్నది. గొప్పనరకము గదా దీనికి ఫలము. అయినను 'తస్య నలోమ చ మీయతే' * అని శ్రుత్యంతరముచే చెప్పఁబడినది. మఱియు 'యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్' అని భగవంతుఁడు తానే చెప్పుచున్నాఁడు. 'సత్యం సత్యం పునస్సత్యం శపథైశ్చాపి కోటిభిః। విష్ణుమాహాత్మ్య లేశస్య విభక్తస్య చ కోటిధా॥ పునశ్చానన్తధా తస్య పునశ్చాపి హ్యనన్తధా। నైకాంశే సమమాహాత్మ్యాః శ్రీశేషబ్రహ్మశఙ్కరాః' † అని నారదీయమునందు వచింపఁబడినది. కొన్నిచోటుల అన్యదేవతలకు ఉత్కర్షమును విష్ణువుతో ఐక్యమును జెప్పుట, 'తత్రైవ సర్వశాస్త్రేషు మహాభారత ముత్తమమ్, కోహ్యన్యః పుణ్డరీకాక్షా న్మహాభారతకృ ద్భవేత్' ♦ ఇత్యాదిగ్రంథాంతరసిద్ధమయిన యుత్కర్షము గల మహాభారతమునకు విరుద్ధము. మహాభారతమునందో, 'నాస్తి నారాయణసమం నభూతం నభవిష్యతి। ఏతేన సత్యవాక్యేన సర్వార్థాన్ సాధయామ్యహమ్, యస్య ప్రసాదజో బ్రహ్మా రుద్రశ్చ క్రోధసమ్భవః, నత్వత్సమోస్తి' § ఇత్యాదిగా సాధారణప్రశ్నావసరమునందే పరమోత్కర్షము విష్ణువునకుఁ బ్రతిపాదింపఁబడుచున్నది. ఇతరస్థలమున నేమేని చెప్పఁబడినను అది యసాధారణావసరమునందే చెప్పఁబడినది. అట్టిది అగ్న్యాదులకుఁగూడ వేదాదికమునందుఁ గలదు 'త్వ మగ్న ఇన్ద్రో వృషభః సతా మసి త్వం విష్ణు రురుగాయో నమస్యః, విశ్వస్మా దిన్ద్ర ఉత్తరః' ¶ ఇత్యాదిగా. మఱియు రుద్రోత్కర్షము తదీయగ్రంథమునకుఁగూడ విరుద్ధము. ఎట్లనఁగా— శైవమగు స్కాందమునందు "యదన్తరం వ్యాఘ్రమహర్షిస్త్రియో ర్వనే యదన్తరం

---

* ఆయింద్రునకు వెండ్రుకయును నశింపదు.

† విష్ణుమాహాత్మ్యమునందు లేశమును కోటిభాగములుగా విభాగించి అందొక భాగమును మరల అనంతభాగములుగా విభాగించి అందులో నొకదాని మరల అనంతభాగములుగా విభాగించిన యెడ అందులో నొక యంశముతోఁగూడ సమానమయిన మాహాత్మ్యము గలవారు కాదు లక్ష్మీ శేష బ్రహ్మ శంకరులు.

♦ అట్లే సర్వశాస్త్రములందును మహాభారత ముత్తమము. విష్ణువుకన్న ఇతరుఁ డెవ్వఁడు మహాభారతకర్త యగును?

§ 'నారాయణునితో సమమయిన వస్తువు ఇప్పుడు లేదు, ఇదివఱకును లేదు, ఇఁక మీఁదను కలుగఁబోదు' ఈసత్యవాక్యముచే నేను సర్వార్థంబుల సాధించుచున్నాను. ఎవ్వని ప్రసాదమువలనఁ బుట్టినవాఁడు బ్రహ్మ, క్రోధమువలనఁ బుట్టినవాఁడు రుద్రుఁడు. నీకు సమానుఁడు లేఁడు.

¶ అగ్నీ! నీవు ఇంద్రుఁడవు, సత్పురుషులలో నుత్తముఁడ వగుచున్నావు; నీవు విష్ణుఁడవు పెద్దలచే స్తుతింపఁబడువాఁడవు నమస్కరింపఁదగినవాఁడవు. అందఱికన్నను ఇంద్రుఁ డధికుఁడు.

మేరుగిరీన్ద్రవిన్ధ్యయోః। యదన్తరం సూర్యసురేడ్యబిమ్బయో స్తదన్తరం క్షుద్రమహేన్ద్రయో రపి॥ యదన్తరం సింహగజేన్ద్రయో ర్వనే యదన్తరం సూర్యశశాఙ్కయో ర్దివి। యదన్తరం జాహ్నవిసూర్యకన్యయో స్తదన్తరం బ్రహ్మగిరీశయో రపి॥ యదన్తరం ప్రలయజవారివిప్రుషో ర్యదన్తరం స్తమ్బహిరణ్యగర్భయోః। స్ఫులిఙ్గసంవర్తకయో ర్యదన్తరం తదన్తరం విష్ణుహిరణ్యగర్భయోః॥ అనన్తత్వా న్మహావిష్ణో స్తదన్తర మనన్తకమ్। మాహాత్మ్యసూచనార్థాయ హ్యుదాహరణ మీరితమ్॥ తత్సమో హ్యధికో వాపి నాస్తి కశ్చిత్కదాచన। ఏతేన సత్యవాక్యేన తమేవ ప్రవిశా మ్యహమ్॥" * అని చెప్పఁబడినది. అందే శివునిగూర్చి మార్కండేయవచనము 'సంసారార్ణవనిర్మగ్న ఇదానీం ముక్తి మేష్యసి'॥ ఇత్యాదిగా నున్నది. శైవ మగు పాద్మపురాణంబున మార్కండేయకథాప్రబంధమునందు మోక్షము శివునివలనఁ గలుగ దని చెప్పి విష్ణువువలననె కలుగు నని చెప్పఁబడినది 'అహం భోగప్రదో వత్స మోక్షదస్తు జనార్దనః' ♦ ఇత్యాదిగా. మఱియు శివోత్కర్షము శైవవైష్ణవపక్షములకు సమాన మయిన బ్రాహ్మపురాణంబునకుఁగూడ విరుద్ధము. వేదమునకుఁగూడ ఇతిహాసాదులకు అవిరోధముగా అర్థము చేయవలెను. 'యదివిద్యాత్' § అనువచనమువలన. అట్లు కానిచో ఇంద్రాదులకును ఉత్కర్షశంక గలుగుటచే నిర్ణయము సిద్ధింపదు. అప్పుడును అస్మదిష్ట మయిన విష్ణూ

* వనమునందు పులికిని సింహమునకును ఎంత యంతరము కలదో, మేరుపర్వతమునకును వింధ్యపర్వతమునకును ఎంత యంతరమో, సూర్యబింబమునకును బృహస్పతిబింబమునకును ఎంత యంతరమో, క్షుద్రునకును దేవేంద్రునకును అంత యంతరము కలదు. వనమునందు సింహమునకును గజమునకును ఎంత యంతరమో, ఆకాశమునందు సూర్యునకును చంద్రునకును ఎంత యంతరమో, గంగాయమునల కెంత యంతరమో, బ్రహ్మదేవునకును రుద్రునకును అంత యంతరము. ప్రలయకాలమునందలి జలమునకును నీటితుంపరకును ఎంతయంతరమో, గడ్డిపోఁచకును బ్రహ్మకును ఎంత యంతరమో, మిణుఁగుఱునకును బడబానలమునకును ఎంత యంతరమో, విష్ణువునకును బ్రహ్మకును అంత యంతరము. మహావిష్ణువు అనంతుఁ డగుటవలన, వానికిని వీరికిని అంతరము అనంతము. మాహాత్మ్యము సూచించుటకొఱకు ఉదాహరణముమాత్రమె చెప్పఁబడినది. వానికి సముఁడు కాని యధికుఁడు కాని ఒకానొకఁడును ఒకానొకప్పుడును లేఁడు. ఈసత్యవాక్యముచే అతనినే నేను ప్రవేశించుచున్నాను.

॥ సంసారసముద్రమునందు మునిఁగినవాఁడవు ఇప్పుడు ముక్తిని బొందఁగలవు.

♦ నాయనా! నేను భోగప్రదుఁడను, మోక్షము నిచ్చువాఁడో విష్ణువు.

§ యదివిద్యా చ్చతుర్వేదా న్సాఙ్గోపనిషదా న్ద్విజః। న చే త్పురాణం సంవిద్యా న్నైవ స స్యా ద్విచక్షణః—బ్రాహ్మణుఁడు అంగములతోను ఉపనిషత్తులతోను గూడిన నాలుగువేదముల నెఱింగినవాఁ డైనను పురాణము నెఱుంగఁడేని యతఁడు పండితుఁడు కాఁడు.

త్కర్షము సిద్ధించుచున్నది, ఇంద్రాదినామములుగూడ విష్ణువునకే కల్గుటవలన. కావున భగవంతుని యుత్కర్షముఁ బ్రతిపాదించుటయందే సర్వాగమంబులకును మహాతాత్పర్యము. అట్లయినను స్వతఃప్రమాణ మగుటవలన సత్యమయిన గుణోత్కర్షమే చెప్పఁబడుచున్నది, విరోధము లేమివలన. మఱియొకచోఁ గనఁబడమిచేఁ బ్రమాణసిద్ధ మగుదాని లేదనుట యుచితము కాదు, అర్థములు ధర్మవిచిత్రము లగుటవలన. స్వతఃప్రామాణ్యము నంగీకరింపనియెడ, అందుకుఁ బ్రమాణముగాఁ జెప్పినదానికిని బ్రామాణ్యము సాధింపవలసివచ్చుటం జేసి అనవస్థ సంభవించును. ప్రయోజనాపేక్ష లేకగూడ విష్ణూత్కర్షపరత్వం బాగమములకు సిద్ధించుచున్నది, 'నారాయణ పరా వేదాః, సర్వే వేదా యత్పద మామనన్తి, వాసుదేవపరా వేదాః' ఇత్యాదివచనములచేత. ప్రయోజనాపేక్షత్వమును తదనపేక్షత్వమును విరుద్ధము కాదు. ఈశ్వరనియమమునం జేసి జడ మయిన వేదమునకును చేతనునకుం బోలెఁ బ్రవృత్తి యవిరుద్ధము. 'ద్రవ్యం కర్మ చ కాలశ్చ' ఇత్యాదిగా అనాది పదార్థములందును ఈశ్వరనియమము ప్రతిపాదింపఁబడుచున్నది. అనాదిపదార్థ విషయమున నియామకత్వ మెట్లనఁగాఁ బూర్వోక్తన్యాయముచే * నని యెఱుంగునది. కావున ప్రయోజనాపేక్ష లేకయె ఆగమంబులకు నారాయణపరత్వము సిద్ధము. అట్లు స్థాణువైన వానికిని ఈక్షితృత్వము స్వతంత్ర మయిన యచిన్త్యశక్తి గలవాఁ డగుటవలననే యుక్తము. కావున ఈక్షితృత్వము మాయామయము కాదు. అచలః—డీని అప్రహర్షమ్ అనానన్దమ్ అదుఃఖమ్ అసుఖమ్ ఇత్యాదివాక్యములకుం బోలె వ్యాఖ్యానము చేయవలెను ❡ 'తపో మే హృదయం సాక్షాత్తను ర్విద్యా క్రియాకృతిః' ♦ ఇత్యాదివచనముచే క్రియ కనఁబడుటవలన. మహాతాత్పర్యవిరోధమువలనఁగూడ సర్వమును మాయామయం బనుట యొప్పదు. ఐశ్వర్యవాచక మయిన భగశబ్దముచేతనే యీశ్వరుని సంబోధించుటవలనఁగూడ ఈశ్వరధర్మములు మాయామయము లని చెప్పఁ దగదు. 'తం త్వా భగ' ఇత్యాదికమునందు భగశబ్దార్థము ఈశ్వరస్వరూపముగాఁ దెలియుటచే మాయామయత్వము యుక్తము గాదు, 'విజ్ఞానశక్తి రహమా స మనన్తశక్తేః, మయ్యనన్తగుణే ఽనన్తే గుణతో

---

* అచిన్త్యశక్తి గలవాఁ డగుటచే.

❡ లౌకికక్రియ లేనివాఁ డని యర్థము.

♦ తపస్సు హృదయము, విద్య సాక్షాద్దేహము, క్రియ స్వాకారము.

ఽనన్తవిగ్రహే, పరాఽస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ'
ఇత్యాదివచనములవలన.

ఈజీవుఁడు, ఇప్పుడుమాత్రమె కాదు, ఎప్పుడును ఛేదించుటకుఁగాని దహించుటకుఁగాని తడుపుటకుఁగాని ఎండించుటకుఁగాని యలవికాఁడు. ఏల యనఁగా, ఈజీవుఁడు నిత్యముగా సర్వవ్యాపకుఁడును నైమిత్తిక మయిన యన్యథాభావము గూడ లేనివాఁడును లౌకిక మయిన క్రియ లేనివాఁడును సనాతనుండు నగు ఈశ్వరుని ప్రతిబింబమె యయినవాఁడు అని తాత్పర్యము.

> అవ్యక్తో ఽయ మచిన్త్యో ఽయ మవికార్యో ఽయ ముచ్యతే
> తస్మా దేవం విది త్వైనం నా ఽనుశోచితు మర్హసి. ౨౫

భా. మఱియును. అయమ్= ఈయాత్మ; అవ్యక్తః= సర్వేంద్రియములకును అవిషయ మగుటవలన, తెలియఁబడనివాఁడు; అని, ఉచ్యతే= చెప్పఁబడుచున్నాఁడు. ఇందువలననే, అయమ్= ఈయాత్మ; అచిన్త్యః= ఎన్న రానివాఁడు అని; ఉచ్యతే= చెప్పఁబడుచున్నాఁడు, ఏవస్తువు ఇంద్రియములకు గోచర మగునో, అది గదా చింతావిషయ మగును, ఈయాత్మయో ఇంద్రియ గోచరుఁడు కాఁడు, కావున అచింత్యుఁడు. అందువలననే, అయమ్= ఈయాత్మ, అవికార్యః= వికారము నొందింప నశక్య మయినవాఁడు అని, ఉచ్యతే= చెప్పఁబడుచున్నాఁడు, ఎట్లు క్షీరము చేమిరిపెట్టుట మొదలగువానిచే పెరుఁగుగా వికారము నొందింప శక్య మగునో అట్లు ఈయాత్మ వికారము నొందింప శక్యము కాఁడు. నిరవయవుఁ డగుటవలనఁగూడ ఇతఁడు అవిక్రియుఁడు, ఏల యనఁగా నిరవయవ మైన దేదియు విక్రియ గలదిగాఁ గనఁబడదు. అవిక్రియుఁ డగుటవలన ఈయాత్మ అవికార్యుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. తస్మాత్= అందువలన; ఏవమ్= చెప్పినవిధముగా; ఏనమ్= ఈయాత్మను; విదిత్వా= ఎఱింగి; అనుశోచితుమ్ = ఇతనిగూర్చి దుఃఖించుటకు; నార్హసి= తగినవాఁడవు కావు, నేను వీరి వధించువాఁడను నాచే వీరు వధింపఁబడుదు రని.

ఈయాత్మ యింద్రియములచేఁ దెలియఁబడువాఁడు కాఁ డనియు, అందువలన చింతించుటకును శక్య మయిన వాఁడు కాఁ డనియు, అందువలన వికారము

నొందింపను శక్య మయిన వాఁడు కాఁ డనియు శాస్త్రములును శాస్త్రవేత్త లగు నాచార్యులును జెప్పుచున్నారు. కావున నీవు ఈయాత్మ ఇట్టివాఁ డని తెలిసికొని వీనిగుఱించి శోకించుటను విడువుము. అని తాత్పర్యము.

ఆ. త్వంపదార్థపరిశోధనము ప్రకృత మగుటవలన అవిషయమునసే మఱి యొకహేతువుఁ జెప్పుచున్నారు.—మఱియును అని. ఆత్మ నిత్యత్వాదిలక్షణుఁడై యుండఁగా అట్లే ప్రసిద్ధి యేల కలుగకున్నది యనఁగాఁ జెప్పుచున్నారు అవ్యక్తః అని. ప్రత్యక్షత్వము లేకపోవుఁ గాక, ఆత్మకు అనుమానవిషయత్వ మేల యుండఁ గూడదు? అని యాశంకించి చెప్పుచున్నారు ఇందువలననే యని. దానినే వివరించు చున్నారు ఏవస్తువు ఇత్యాదిగా. అతీంద్రియుఁడైనను సామాన్యతో దృష్టానుమానము నకు విషయము కావచ్చు నని యాశంకించి కూటస్థరూపుఁ డగుటచే వ్యాప్తిలింగము లేమిం జేసి యట్లు కా దని చెప్పుచున్నారు అవికార్యః అని. అవికార్యుఁ డనుటకు వ్యతిరేకదృష్టాంతము చెప్పుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. మఱియును, ఆత్మ వికా రము నొందఁడు, నిరవయవద్రవ్య మగుటవలన, ఘటాదికమువలె అని వ్యతిరేకా నుమానము చెప్పుచున్నారు నిరవయవుఁ డగుటవలన ఇత్యాదిగా. నిరవయవుఁ డైనను విక్రియావంతుఁ డేల కారా దని యాశంకించి చెప్పుచున్నారు ఏల యనఁగా ఇత్యాదిగా. అవయవసహిత మయిన వస్తువునకే విక్రియ కనఁబడుటవలన విక్రియ కల దన్నచో నిరవయవుఁ డనుట యనుపపన్న మగు నని యర్థము. ఏది యవయవ సహితము విక్రియాసహితము అగునో అట్టి క్షీరాదికము దధ్యాదిరూపమున వికా రము నొందును, ఆత్మయో నిరవయవుఁ డని శ్రుతి ప్రతిపాదించుచున్నది, కావున అతఁడు అవయవసహితుఁడు కాఁడు, అందువలన అవిక్రియుఁడు, అవిక్రియుఁ డగుట వలన వికార్యుఁడు కాఁ జాలఁ డను ఫలితార్థము చెప్పుచున్నారు అవిక్రియుఁ డగుట వలన ఇత్యాదిగా. ఆత్మస్వరూపోపదేశమును, అశోచ్యా నన్వశోచ స్త్వ మిత్యా దిగా నుపక్రమించినదాని ఉపసంహరించుచున్నారు తస్మాత్ ఇత్యాదిగా. ఎందు వలన ఈయాత్మ, అవ్యక్తుఁడు అచింత్యుఁడు అవికార్యుఁడు నిత్యుఁడు సర్వగతుఁడు ఇత్యాదిస్వరూపుఁడుగా నిర్ధారింపఁబడెనో, అందువలన, ఇతని అట్లే తెలిసికొన వలెను, అట్టి ఆత్మజ్ఞానమే ఫలవంత మగుటవలన నని యర్థము. నిషేధింపఁ దగిన యనుశోచనమునే చూపుచున్నారు నేను వీరి ఇత్యాదిగా.

హ. అవ్యక్తః = సర్వేంద్రియములకును అవిషయ మగుటవలనఁ దెలియ రానివాఁడు. ఈయాత్మ యవ్యక్తుఁ డగుటవలననే అచింత్యుఁడు, ఏది ఇంద్రియను

లకు గోచర మగునో అది చింతకు విషయ మగును, ఈయాత్మయో ఇంద్రియములకు గోచరము కానివాఁ డగుటచే అచింత్యుఁడు. ఇతఁడు అవికార్యుఁడు, ఎట్లు క్షీరము పులుసు చేమిరిపెట్టుట మొదలగువానిచే వికారము నొందునో అట్లు ఈయాత్మ వికారము నొందఁడు, మఱే మనఁగా నిరవయవుఁ డగుటవలన అవిక్రియుఁడు, నిరవయవమై విక్రియ నొందువస్తు వేదియుఁ గనఁబడదు, కావున అవిక్రియుఁ డగుటవలన అవికార్యుఁ డని యీయాత్మ చెప్పఁబడుచున్నాఁడు. తస్మాత్ = అందువలన, ఏవమ్ = ఈచెప్పిన లక్షణము గల; ఏనమ్ ఆత్మానమ్, విదిత్వా, అనుశోచితుం నార్హసి, నేను వీరి వధించువాఁడను నాచే వీరు వధింపఁబడుదు రని.

శ౦. «తరతి శోక మాత్మవిత్" * అనుశ్రుతివలన ఆత్మజ్ఞానమువలన శోకనివృత్తి యగు నని యేర్పడుచున్నది. ఆత్మజ్ఞానమో ఆత్మానాత్మవివేకము లేక సిద్ధింపదు. కావున ఆత్మానాత్మశోధనము నుపక్రమించి 'వాసాంసి' ఇత్యాదిశ్లోకముచే ఆత్మ స్థూలశరీరభిన్నుఁ డని ప్రతిపాదించి 'నైనం ఛిన్దన్తి శస్త్రాణి' అనుశ్లోకముచే ఛేదాదులకు అవిషయం బని చెప్పఁబడినది. అప్పుడు సూక్ష్మకారణశరీరాదులుగూడ ఛేదాదులకు అవిషయం బనుట సంభవించుటంజేసి వానియందు ఆత్మబుద్ధి కలుగును, అట్లు కాఁ గూడ దని అవ్యక్తాచింత్యపదములచే ఆత్మ సూక్ష్మకారణశరీరభిన్నుఁ డనుటను ప్రతిపాదించుచు అవికార్యుఁ డనియుఁ జెప్పి, ఇట్టి లక్షణముగల యాత్మను దెలిసినట్టి నీ విఁక మరల శోకించుట యుచితము కా దని యుపక్రమించిన విషయము నుపసంహరించుచున్నాఁడు — అహంకార మమకారాదులచే వ్యజ్యతే—తెలియఁబడుచున్నది కావున వ్యక్తము అనఁగా సూక్ష్మశరీరము, దాని ధర్మములకును దానియవస్థలకును సాక్షి యగుటచే దానికంటె భిన్నుఁ డగుటవలన, అయమ్ ఆత్మా = ఈయాత్మ, అవ్యక్తః = వ్యక్త మయిన సూక్ష్మశరీరముకన్న భిన్నుఁడు, 'నా కీ దుఃఖము కలిగెను' అని దుఃఖము ననుభవించునట్టిది ఎవనిచే నెఱుంగఁబడుచున్నదో అతఁడు దానికన్న భిన్నుఁడే యగును, ఇందు సందేహము లేదు. అట్లే అచింత్యుఁడుగూడ, అదృష్టాదులవలె కార్య మయిన శోకమోహాదికముచే, చిన్త్యతే—అనుమానింపఁబడుచున్నది, కావున చింత్య మనఁగా అవ్యాకృతము అజ్ఞానము అనంబడు కారణశరీరము. ఎవ్వనిచే నేది యెఱుంగఁబడుచున్నదో అతఁడు దానికన్న భిన్నుఁ డనుట యనుభవసిద్ధము. 'నన్ను నే నెఱుంగను, నేను

* ఆత్మను దెలిసినవాఁడు శోకమును దాఁటుచున్నాఁడు.

అజ్ఞుఁడను' అని అజ్ఞత్వరూప మయిన అజ్ఞానము అనుభవింపఁబడుచున్నది. కావున స్వవిషయక మయిన అజ్ఞానమునకు సాక్షి యగుటవలన ఈయాత్మ చింత్య మయిన ఆ యజ్ఞానముకన్నను భిన్నుఁ డగుటచే, అచిన్త్యః = చింత్యముకన్న భిన్నుఁడు. అవికార్యుఁడుగూడ, నిరవయవుఁ డగుటవలన ఈయాత్మ వికారమునకు విషయము కాఁడు, కావున అవికార్యుఁడు. అవికార్యుఁ డనుట అనుత్పాద్యత్వాదు లగు అనాత్మధర్మముల కుపలక్షణము. 'పురస్తాత్సిద్ధం హి బ్రహ్మ' * అను శ్రుతివలన అనాదిసిద్ధుఁ డగుటవలన ఈయాత్మ ఉత్పాద్యుఁడు ♦ కాఁడు. 'నాఽన్యోఽతోఽస్తి విజ్ఞాతా' ‖ అను శ్రుతివలన జ్ఞాతృస్వరూప మయినవాఁ డగుటవలన ఆప్యుఁడు § కాఁడు. 'శుద్ధోఽబాధ్యస్వరూపో బుద్ధస్సుఖస్వరూపః' ¶ అను శ్రుతివలన నిత్యశుద్ధుఁ డగుటవలన సంస్కార్యుఁడు $ కాఁడు. తస్మాత్— 'అద్వయ ఏ వాయ మాత్మా సన్మాత్రో నిత్య శ్శుద్ధో బుద్ధ స్సత్యో ముక్తో నిరఞ్జనో విభు రద్వయ ఆనన్దః పరః ప్రత్యగేకరసః ప్రమాణై రేతై రవగతః' ↓ అని శ్రుతి వచించుటవలన, ఏవమ్ = ఇట్లు, ఇప్పుడు చెప్పిన లక్షణములు గలవానిఁగా, ఏనమ్ = ఈయాత్మను, అస్థూలునిఁగా అవ్యక్తునిఁగా నిష్కలునిఁగా నిష్క్రియునిఁగా కూటస్థాసంగచిద్రూపునిఁగా, విదిత్వా = నే నిట్టివాఁడ నని తెలిసికొని, అనుశోచితుమ్, నార్హసి, నేను వీరి వధించువాఁడను నాచే వీరు వధింపఁబడుచున్నా రని మును పటి యట్లు దుఃఖింపఁగూడ దని యర్థము. ఇందుచే అద్వైతదర్శు లగు బ్రహ్మవేత్తలకు శోచ్య మేదియు లే దని సూచిత మగుచున్నది.

మ. ఈయాత్మకు ఛేద్యత్వాదులు గల వని తెలుపు ప్రమాణము లేకుండుటవలనఁగూడ ఇతనికి ఛేద్యత్వాదులు లే వని చెప్పుచున్నాఁడు.—ఏది యింద్రియములకు విషయ మగునో అది కదా ప్రత్యక్ష మగుటచే వ్యక్త మని చెప్పఁబడు

---

* మున్నే సిద్ధము గదా బ్రహ్మము.

♦ పుట్టింపఁ దగినవాఁడు.

‖ ఇతనికన్న ఇతరుఁడు ఎఱుంగువాఁడు లేఁడు.

§ పొందఁదగినవాఁడు.

¶ శుద్ధుఁడు బాధ్యము కాని స్వరూపము గలవాఁడు బుద్ధుఁడు సుఖస్వరూపుఁడు.

$ సంస్కరింపఁ దగినవాఁడు.

↓ అద్వితీయుఁడే యీయాత్మ, సన్మాత్రుఁడు నిత్యుఁడు శుద్ధుఁడు బుద్ధుఁడు సత్యుఁడు ముక్తుఁడు నిరంజనుఁడు విభువు అద్వయుఁ డానందుఁడు పరుఁడు ప్రత్యగాత్మతో ఏకరసుఁడు అని యీప్రమాణములచే తెలియఁబడువాఁడు.

చున్నది, ఈయాత్మయో రూపాదులు లేనివాఁ డగుటవలన అట్టివాఁడు కాఁడు. కావున ఇతనికి ఛేద్యత్వాదులు కల వనుటకుఁ బ్రత్యక్షప్రమాణము లే దని యర్థము. ప్రత్యక్షము లేకున్నను అనుమానప్రమాణము కలుగవచ్చు ననఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు—అచిన్త్యః—చిన్త్యుఁ డనఁగా అనుమానింపఁ దగినవాఁడు, తద్విలక్షణుఁ డితఁడు, ఒకచోఁ బ్రత్యక్ష మయినది కదా వహ్ని మొదలగునది, వ్యాప్తిగ్రహణ మయిన పిదప, ధూమాదికము కనఁబడుటవలన ఒకచో అనుమేయ మగుచున్నది. ప్రత్యక్షము కానిదానికి వ్యాప్తిగ్రహణము సంభవింపమివలన అనుమేయత్వము సిద్ధింప దని భావము. అప్రత్యక్ష మయిన యింద్రియాదికముకూడ సామాన్యతో దృష్టానుమానమునకు * విషయ మగుచున్నది. కావున అందుకుఁ జెప్పుచున్నాఁడు—అయమ్ అవికార్యః—వికారము గల చక్షురాదిక మేది గలదో అది స్వకార్యాన్యథానుపపత్తిచే ♦ కల్పింపఁబడిన అర్థాపత్తిప్రమాణమునకు సామాన్యతో దృష్టానుమానమునకును విషయ మగుచున్నది. ఈ యాత్మయో, వికార్యుఁడు—వికారము గలవాఁడు కాఁడు, కావున అర్థాపత్తికిఁగాని సామాన్యతో దృష్టానుమానమునకుఁగాని విషయము కాఁ డని యర్థము. లౌకికమైన శబ్దముగూడ ప్రత్యక్షాదిపూర్వక మగుటవలన దానికిఁ బ్రత్యక్షాది నిషేధముచేతనే నిషేధ మగును. ఓయీ! వేదముచేతనే ఆత్మకు ఛేద్యత్వాదులు తెలియవచ్చును అనఁగాఁ జెప్పుచున్నాఁడు—ఉచ్యతే—వేదముచేత అచ్ఛేద్యత్వాదిరూపుఁడుగానే యీయాత్మ చెప్పఁబడుచున్నాఁడు—తాత్పర్యముచేఁ బ్రతిపాదింపఁబడుచున్నాఁడు, కావున ఆత్మతత్త్వప్రతిపాదక మయిన వేదమునందును ఛేద్యత్వాదులు ప్రతిపాదితములు కా వని యర్థము. ఇచట 'నైనం ఛిన్దన్తి' అనుచో శస్త్రములకు ఆత్మను నశింపఁజేయు సామర్థ్యము లే దని చెప్పఁబడినది. 'అచ్ఛేద్యో ఽయమ్' అనుచో ఆత్మ ఛేదాదిక్రియాకర్మ మగుటకు అయోగ్యుఁ డని చెప్పఁబడినది. 'అవ్యక్తో ఽయమ్' అనుచో ఆ ఛేద్యత్వాదులు కల వని తెలుపు ప్రమాణము లే దని చెప్పఁబడినది. ఇట్లు పునరుక్తిదోషము లే దని తెలియవలెను. 'వేదావినాశినమ్' ఇత్యాదిశ్లోకములలో, అర్థముచేతను శబ్దముచేతను పౌనరుక్త్యము భాష్యకారులచేఁ బరిహరింపఁబడినది "దుర్బోధత్వా దాత్మవస్తునః పునఃపునః ప్రసఙ్గ మాపాద్య శబ్దాన్తరేణ తదేవ వస్తు నిరూపయతి భగవా న్వాసుదేవః, కథంను నామ సంసారిణాం

* కార్యముచే కారణానుమానము సామాన్యతో దృష్టానుమాన మనఁబడును.

♦ స్వకార్యము అన్యథా—తాను లేనియెడ, అనుపపన్న మను కారణముచేత.

బుద్ధిగోచర మాపన్నం సత్సంసారనిస్తృత్తయే స్యాదితి" * అని. ఇట్లు పూర్వోక్త యుక్తులచే ఆత్మ నిత్యుఁడును నిర్వికారుఁడును అని సిద్ధ మగుటవలన నీకు శోకము యుక్తము కా దని యుపసంహరించుచున్నాఁడు ఉత్తరార్ధముచేత. ఇట్టి యాత్మ స్వరూపముయొక్క జ్ఞానము శోక కారణమునకు నివర్తక మగుటవలన అది కలిగిన పిమ్మట శోకము యుక్తము కాదు, కారణము లేనియప్పుడు కార్యము లేకుండుట ఆవశ్యక మగుటవలన. అందుచే, ఆత్మజ్ఞానము లేని యప్పుడు నీవు శోకించినది యుక్తమే, ఇఁక ఆత్మజ్ఞానము కలిగిన పిమ్మట శోకించుట తగ దని యభిప్రాయము.

శ్రీ. మఱియు. అవ్యక్తః = చక్షురాదులకు విషయము కానివాఁడు. అచిన్త్యః= మనస్సునకుఁగూడ విషయము కానివాఁడు. అవికార్యః—కర్మేంద్రియము లకుఁగూడ విషయము కానివాఁ డని యర్థము. ఉచ్యతే అని నిత్యత్వాదులయందు అభియుక్తులవచనముఁ బ్రమాణీకరించుచున్నాఁడు. ఉపసంహరించుచున్నాఁడు తస్మా దిత్యాదిగా.

ప. ఇట్టివాఁ డగునేని యేల యనుభవింపఁబడఁడు? అనఁగాఁ జెప్పు చున్నాఁడు.—అవ్యక్తః = చక్షురాదులకు అవిషయము. మనస్సుచే నెఱుంగవచ్చు ననఁగా, అచిన్త్యః. కావుననే దేహాదులచే, అవికార్యః=వికారము పొందనివాఁడు. ఇఁక నుపసంహరించుచున్నాఁడు తస్మా దిత్యాదిగా. తస్మాత్ = ఆకారణమువలన, ఏవమ్ = ఈవిధముగా నిరూపింపఁబడిన, ఏనమ్ = ఈయాత్మను, విదిత్వా, అను శోచితుమ్, నార్హసి.

రా. అయమ్ = ఈయాత్మ; అవ్యక్తః = ఛేదనాదులకు యోగ్యములుగా వస్తువులు ఏప్రమాణములచే తెలియఁబడుచున్నవో, ఆప్రమాణములచే అట్లు తెలి యఁబడుచున్నవాఁడు కాఁడు, కావున ఛేద్యాదివస్తువులకన్నను విలక్షణుఁడు. అయమ్ = ఈయాత్మ; అచిన్త్యః = తలంపరానివాఁడుగూడ, సర్వవస్తువులకును విలక్షణుఁ డగుటచే ఆయావస్తువుస్వభావము గలవానిఁగా చింతించుటకుఁగూడ శక్యము కానివాఁడు. కావున, అయమ్ = ఇతఁడు; అవికార్యః = వికారము నొందిం చుటకు శక్యము కానివాఁడు. తస్మాత్ = అందువలన; ఏవమ్ = ఇప్పుడు చెప్పిన లక్షణములు గలవానిఁగా; ఏనమ్=ఈయాత్మను; విదిత్వా= తెలిసి. అనుశోచితుమ్= అతనినిమిత్తము శోకించుటకు; నార్హసి = తగవు.

---

* 3౧౨ పేజీ. భాష్యమునందు తెనిఁగింపఁబడినది.

ఈయాత్మ ఛేదనాదియోగ్యుఁడుగా ఏప్రమాణముచేనైనను తెలియరాఁడు, కావున ఛేద్యాదివస్తువులకు భిన్నుఁడు. అట్లు సర్వవస్తువిలక్షణుఁ డగుటచే ఏవస్తువుయొక్క స్వభావము గలవాఁ డనిగాని తలంప శక్యము కాఁడు. ఇందువలననె వికారమునకుఁగూడ అర్హుఁడు కాఁడు. ఇట్టి లక్షణములు గలవాఁ డని యీయాత్మను ఎఱింగిన పిదప నీ విట్లు శోకించుట యుక్తము కా దని తాత్పర్యము.

ప్ర. ఇందువలననే, అయమ్ = ఇతఁడు, అవ్యక్తః = చక్షురాదిజ్ఞానేంద్రియములకు విషయము కానివాఁడు. అయమ్, అచిన్త్యః = మనస్సునకు విషయము కానివాఁడు. అయమ్, అవికార్యః = కర్మేంద్రియములకు విషయము కానివాఁడు, అని, ఉచ్యతే = శ్రుతిస్మృతులచేఁ జెప్పఁబడుచున్నాఁడు. తస్మాత్ = అందువలన, ఏనమ్ = ఈయాత్మను, ఏవమ్ = ఇట్లు; విదిత్వా = తెలిసి, అనుశోచితుమ్ = దుఃఖించుటకు; నార్హసి = తగవు.

ఈకారణమువలననె ఇతఁడు జ్ఞానేంద్రియములకును మనస్సునకును కర్మేంద్రియములకును గోచరుఁడు కాఁడు. ఇట్లు స్వాభావికనాశంబును నైమిత్తికనాశంబును శస్త్రాదికృతనాశంబును లేనివాఁ డగుటవలన ఇతం డిట్టివాఁ డని యెఱింగియుఁక నీవు శోకము నొందుట యుచితము కా దని తాత్పర్యము.

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్
తథా ఒపి త్వం మహాబాహో నైనం శోచితు మర్హసి. ౨౬

భా. ఆత్మ అనిత్యుఁ డనుట నంగీకరించి యిది చెప్పఁబడుచున్నది.— అథచ—ఇది యంగీకారార్థకము. ఏనమ్ = ఈయాత్మను; నిత్యజాతమ్ = ఎల్లప్పుడు పుట్టువానిఁగా, లోకప్రసిద్ధిచే ఒక్కొకశరీరము పుట్టినప్పుడును పుట్టినాఁడు పుట్టినాఁ డని, మన్యసే=తలంచుచున్నావు కాఁబోలు. అట్లు, నిత్యమ్ = ఎల్లప్పుడును; మృతంవా = చచ్చినవానిఁగా, ఆయాదేహము నశించునప్పు డంతయు, చచ్చినాఁడు చచ్చినాఁ డనియు, మన్యసే = తలంచుచున్నావు కాఁబోలు. అథచ = సరే. తథాఽపి = అట్లయినను, ఆత్మ యట్టివాఁ డైనను; మహాబాహో=గొప్పచేతులు గలవాఁడా! త్వమ్ = నీవు; ఏవమ్ = ఇట్లు; శోచితుమ్ = దుఃఖించుటకు,

నార్హసి = తగవు. జన్మవంతునకు నాశమును నాశవంతునకు జన్మము నను నివి యవశ్యము గలుగునవి యగుటవలన.

ఇఁక నీవు ప్రతిదేహము పుట్టునప్పు డంతయు నీయాత్మ పుట్టుచున్నాఁ డనియు ప్రతిదేహము నశించునప్పు డంతయు నీయాత్మ నశించుచున్నాఁ డనియుఁ దలంచెదవా యేమి? ఆపక్షమునుగూడ నంగీకరించి చెప్పెదము. అట్లు ఆత్మ జన్మ నాశములు గలవాఁ డన్నపక్షమునందుఁగూడ నీ విట్లు శోకించుట యుపపన్నము కాదు. ఏల యనఁగా జన్మము గలదానికి నాశమును నాశము గలదానికి జన్మమును తప్పదు, కావున నీవు శోకింప రా దని తాత్పర్యము.

ఆ. ఆత్మ నిత్యుఁ డనుట మున్నె సిద్ధ మగుటవలన మీఁదిశ్లోకం బనుపపన్న మని యాశంకించి చెప్పుచున్నారు ఆత్మ ఇత్యాదిగా. ఇది యనుటచే శాక్య మతముగాని లోకాయతమతముగాని చెప్పఁబడుచున్నది. శ్రోత యగు నర్జునునకుఁ బూర్వోక్తం బగు నాత్మస్వరూపము వినియు దానియందు నిశ్చయము కలుగకుండుటవలన ఈరెండుమతములలో నొకటియం దతని కంగీకారము కావచ్చును. దానిఁ దెలుపుచున్నది రెండు నిపాతములప్రయోగ మని చెప్పుచున్నారు అథ చ అని. నిత్యత్వాదిలక్షణుం డగు నీయాత్మ మాటిమాటికిఁ బుట్టువాఁ డని తలఁచుట ప్రమాణము లేమివలన సంభవింప దని యాశంకించి చెప్పుచున్నారు లోకప్రసిద్ధిచే అని. నిత్యజాతుం డను తలంపుచే మాటిమాటికి మృతుం డను తలంపు బాధిత మగు నని యాశంకించి చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. అనువాదింపఁబడిన పరకీయమతము నంగీకరించి 'అహో బత మహ త్పాపం కర్తుం వ్యవసితా వయమ్' ఇత్యాదిక మగు నతనిశోకమున కవకాశము లే దని చెప్పుచున్నారు తథాపి ఇత్యాదిగా. ఇట్లు అర్జునుని శోకప్రకారముఁ జూపి యది యయోగ్య మనుటకు హేతువుఁ జెప్పుచున్నారు జన్మవంతునకు ఇత్యాదిగా. అవశ్యము కలుగునవి—పరస్పరము వ్యాప్తి కల వని యర్థము.

హ. ఆత్మకు వధము నంగీకరించి యిది చెప్పఁబడుచున్నది.—అథచ—అంగీకారార్థకము. ఏనమ్ = ఈయాత్మను; నిత్యజాతమ్ = ఎల్లప్పుడును జాతునిఁగా, నిత్యమ్, మృతంవా, మన్యసే. తథాపి=అట్లయినను; ఏనమ్=ఈయాత్మనుగూర్చి, * శోచితుమ్, నార్హసి, నీనికి జన్మమరణములు స్వాభావికము లగుటవలన.

* వీరి పక్షమున 'నైనం శోచితు మర్హసి' అని పాఠము.

శం. ఇట్లు సంసారభ్రమధ్వంసము చేయునట్టి యాత్మస్వరూపవిజ్ఞాన ముపదేశించి, శ్రీభగవంతుఁడు, ఇట్టి విజ్ఞానం బాత్మప్రసాదమునం గాని లభింప నశక్య మగుటవలన, అర్జునున కది యుదయింపకుండుటం జూచి, ప్రకారాంతరమున వాని శోకముఁ దొలఁగించుటకై యిది చెప్పుచున్నాఁడు.—మహాబాహో—ఇది సాభిప్రాయ మయిన సంబోధనము. చ శబ్దము యది యనుదాని యర్థము గలది. అథవా = అటు కాదేని. ఏనమ్ = ఈయాత్మను, నిత్యజాతమ్—ఎప్పుడెప్పుడు దేహ ముత్పన్న మగునో అప్పుడప్పుడు దేహముతోఁగూడ ఉత్పన్నునిఁగాను; దేహము మృతిఁ బొందినప్పుడు దేహముతోఁగూడ, నిత్యం మృతమ్; మూఢజనుని యట్లు, త్వమ్ = నీవు; మన్యసేచ = తలంతువేని. తథాపి = ఆపక్షమునందును; ఏవమ్—'నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ సబాన్ధవాన్' అని చెప్పినట్లు, శోచితుం నార్హసి.

మ. ఇట్లు ఆత్మ నిర్వికారుఁ డగుటచే శోచ్యుఁడు కాఁ డని చెప్పఁబడినది. ఇప్పుడు వికారవంతుఁ డని యంగీకరించికూడ శోచ్యుఁడు కాఁ డని రెండుశ్లోకములచే ప్రతిపాదించుచున్నాఁడు భగవంతుఁడు.—అం దాత్మ జ్ఞానస్వరూపుఁడు ప్రతిక్షణము నశించువాఁ డని సౌగతులు చెప్పెదరు. దేహమే ఆత్మ, అది స్థిరమయ్యును ప్రతిక్షణము పరిణామము గలది, జన్మమును నాశమునుం బొందును, ప్రత్యక్షసిద్ధమే యిది యని చార్వాకులు వచించెదరు. దేహముకన్న భిన్నుఁడు అయినను దేహముతోఁగూడనే జనించును నశించును అని యితరులు చెప్పెదరు. సర్గాదికాలమునందే ఆకాశమువలె జనియించును, దేహములు భిన్నము లయినను అనువర్తించి యున్నవాఁడై కల్పాంతపర్యంతము ఉండును, ప్రలయమునందు నశించును అని కొందఱు నుడివెదరు. నిత్యుఁడే ఆత్మ జన్మనాశములు పొందు నని తార్కికుల మతము. ఎట్లనఁగా, జన్మ మనఁగా నూతనదేహేంద్రియాదులతో సంబంధము, అట్లు మరణంబును పూర్వదేహేంద్రియాదివిచ్ఛేద మని చెప్పవలెను. ఈ జన్మమరణములు రెండును ధర్మాధర్మనిమిత్తకము లగుటవలన ఆధర్మాధర్మముల కాధారమైన నిత్యునకే ముఖ్యములు కావలయును. అనిత్యమునకో, కృతహాని అకృతాభ్యాగమము ప్రసక్తించుటచే ధర్మాధర్మాధారత యనుపపన్న మగుటవలన దానికి జన్మమరణములు ముఖ్యములు కాఁజాల వని వారు చెప్పుచున్నారు. నిత్యుఁడైనను ఆత్మకు, కర్ణశష్కులీ జన్మముచే ఆకాశమునకుంబోలె, దేహజన్మముచే జన్మమును దేహనాశముచే నాశంబును ఈ రెండును ఔపాధికములు, ముఖ్యములుగా వని యితరులు చెప్పుచున్నారు.

అందు అనిత్యత్వపక్షమునందుఁగూడ ఆత్మకు శోచ్యత్వము నిషేధించుచున్నాఁడు—అథ—దీనికి పక్షాంతర మర్థము, చకారము అప్యర్థకము. ఆత్మవస్తువు దెలియుట కష్ట మగుటవలన పలుమాఱు విన్నను నిశ్చయబుద్ధి నొందుటకు సామర్థ్యము లేమిం జేసి నీవు నేను జెప్పినపక్షము నంగీకరింపక పక్షాంతరము నంగీకరింతువేని, అందును అనిత్యత్వపక్షమునే యాశ్రయించి, ఏనమ్ = ఈయాత్మను, నిత్యం జాతం నిత్యం మృతంవా మన్యసే—వాశబ్దమునకు చ అనుదాని యర్థము. క్షణికత్వపక్షము నందు, * నిత్యమ్—ప్రతిక్షణము, పక్షాంతరమునందు ♦ ఆవశ్యక మగుటవలన, నిత్యమ్—నియతముగా, పుట్టినాఁ డితఁడు, చచ్చినాఁ డితఁడు అని లోకప్రసిద్ధి వశమున కల్పింతువేని. తథాఽపి, మహాబాహో—పురుషశ్రేష్ఠుఁడా అని పరిహాసము, కుత్సిత మతము నంగీకరించుటవలన, లేక, నీయం దిట్టి కుబుద్ధి సంభవింపదే యని కనికరము. ఏవమ్—‘ అహోబత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ’ ఇత్యాదిగా నీవు దుఃఖించితివే, ఈవిధముగా దుఃఖించుటకు, త్వమ్—నీయట్టుకు నీవుగూడ అట్టివాఁడవే కావున, నీవు; నార్హసి=యోగ్యుఁడవు కావు. క్షణికత్వపక్షమునందును దేహాత్మవాదపక్షమునందును దేహముతోఁగూడ జన్మవినాశములు కల వనుపక్షమునందును జన్మాంతరము లేకుండుటచేఁ బాపభీతి సంభవింపదు. పాపభీతిచేతనే గదా నీవు శోకించెదవు. అది యీమతమునందు సంభవింప దని యర్థము. క్షణికత్వపక్షమునందు బంధువినాశముఁ జూచుట సంభవింపమివలన దృష్టదుఃఖము గూడ ఉపపన్నము కా దని యధికము. పక్షాంతరమునందు దృష్టదుఃఖనిమిత్తమైన శోకము ననుమతించుటకు ఏవమ్ అనుశబ్దము ⁋. దృష్టదుఃఖనిమిత్త మయిన శోకము సంభవించినను అదృష్టదుఃఖ నిమిత్త మయిన శోక మెంతమాత్రము నుచితము కా దని శ్లోకమున కర్థము.

శ్రీ. ఇట్లాత్మకు జన్మవినాశములు లేకుండుటవలన శోకము ఉపపన్నము కా దని చెప్పఁబడినది. ఇప్పుడు దేహముతోఁగూడ ఆత్మకు జన్మమును దద్వినాశముతో నాశంబును అంగీకరించియు శోకము చేయఁ దగినది కా దని చెప్పుచు

---

* సౌగతమతమునందు.

♦ చార్వాకమతమునందు.

⁋ దేహాత్మవాదపక్షమునందును దేహముతోఁగూడ జన్మవినాశములు కల వనుపక్షమునందును దృష్టదుఃఖనిమిత్త మయిన శోకము కావచ్చునుగాని ఏవమ్—ఇట్లు అనఁగా పాపభీతిచే శోకించుట సంభవింప దనుట.

న్నాఁడు.—ఏనమ్ = ఈయాత్మను; నిత్యమ్ = ఎల్లప్పుడును, ఆయాదేహము పుట్టిన పుడు, జాతమ్ = పుట్టినవానిఁగా, అట్లు, ఆయాదేహము మృతిఁ బొందినపుడు, మృతమ్ = మృతిఁ బొందినవానిఁగాను, మన్యసే అథచ = తలంచుచున్నావు సరే, § పుణ్యాపాపములును తత్ఫలము లయిన జన్మమరణంబులును ఆత్మసంబంధు లగుట వలన. తథాపి, త్వమ్, శోచితుమ్, నార్హసి.

ప. ఇఁక దేహాత్మలు సహచరములుగాఁ గనఁబడుటవలన ఆత్మకు దేహముతోఁగూడ జన్మమరణముల నంగీకరించి నప్పటికిని శోకము చేయఁ దగినది కాదు. ఏనమ్ = ఈయాత్మను; నిత్యజాతమ్ = ఎల్లప్పుడును ఆయాదేహముతోఁగూడఁ బుట్టిన వానిఁగాను, మృతంవా = మృతిఁబొందినవానిఁగాను, మన్యసే అథ = తలంచుచున్నావు సరే, పుణ్యాపాపములును తత్ఫలము లయిన జన్మమరణములును ఆత్మకే యగుటవలన. తథాపి త్వం నశోచితు మర్హసి.

రా. అథ = అట్లు గాక; ఏనమ్ = ఈయాత్మను; నిత్యజాతమ్ = నియతముగాఁ బుట్టినదియు; నిత్యమ్ = నియతముగా; మృతంవాచ = చచ్చునదియు నగు దేహమునుగానే; మన్యసే=తలంచుచున్నావు, కాని ఇప్పుడు నేను చెప్పినట్లు దేహాతిరిక్తునిఁగాఁ గాదు. తథాఽపి = ఆపక్షమునందుఁగూడ; మహాబాహో = మిక్కిలి శూరుఁడా! త్వమ్ = నీవు; ఏవమ్ = ఇట్లు మిక్కిలి యధికముగా; శోచితుమ్ = శోకించుటకు; న అర్హసి = తగవు, పరిణామస్వభావ మగు దేహమునకు జన్మనాశములు అనివార్యము లగుటవలన.

నీవు నేను జెప్పినది యంగీకరింపక, యీయాత్మ, నియతముగా జన్మమరణములు గల దేహమే కాని దేహముకన్న భిన్నుఁడు కాఁ డని తలంతువు కాఁబోలు. అట్లు తలంచినప్పటికిని, నీ వింత యధికముగా శోకించుట యుపపన్నము కా దని తాత్పర్యము.

మ. ఇట్లు ఆత్మ నిత్యుఁ డగుఁ గాక. అట్లయినను దేహసంయోగము దేహవియోగము అను జన్మమరణములు ఉండనే యున్నవి యనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—ఏనమ్ = ఈయాత్మను; నిత్యజాతమ్ = నియమముచేఁ బుట్టుక గల వానిఁగాను; నిత్యమ్ = నియమముచే; మృతమ్ = మరణము గలవానిఁగాను; అథచ మన్యసే = నీవు తలంచిన పక్షమున; తథా ఽపి = అట్లయినను; మహాబాహో =

§ అత్రచ అ. ట. స యద్యపి యని యర్థము.

మహాశూరుఁడా! త్వమ్ = నీవు; ఏవమ్=ఇట్లు; శోచితుమ్= దుఃఖించుటకు; నార్హసి= తగినవాఁడవు కావు.

నీ వీ యాత్మకు దేహసంయోగరూప మయిన జన్మమును దేహావియోగ రూప మయిన మరణంబును నియమముచేఁ దప్పక కలుగుచున్న వని తలఁచెద వేమో, ఆపక్షమునందుఁగూడ నీ విట్లు శోకము నొందుట యుపపన్నము కా దని తాత్పర్యము.

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యే ఽర్థే న త్వం శోచితు మర్హసి. ౨౭

భా. అట్లుండఁగా. జాతస్య = జన్మము నొందినవానికి; మృత్యుః= మరణము; ధ్రువోహి = అవ్యభిచారి, తప్పనిది గదా! మృతస్యచ = మృతిఁ బొందినవానికిని; జన్మ = జననము; ధ్రువమ్ = తప్పనిది. తస్మాత్ = అందువలన; అపరిహార్యే = తప్పింపరానియట్టి; అర్థే = జన్మమరణరూప మయిన విషయమునందు; త్వమ్ = నీవు; శోచితుమ్ = శోకించుటకు; నార్హసి = తగినవాఁడవు కావు.

ఆత్మకు జన్మము కల దనునెడ, జన్మము కలిగినవానికి మరణము తప్పదు. అట్లు మరణము నొందినవానికి జన్మము తప్పదు. అందువలన ఈజన్మమరణము లని వార్యములు, అనివార్య మయిన విషయమునందు నీవు శోకించుట యుచితము గా దని తాత్పర్యము.

ఆ. ఆ జన్మమరణములు అవశ్యము కలుగునవి యనుటకును శోకము కర్తవ్యము కా దనుటకును మఱి యొక హేతువుఁ జెప్పుచున్నారు అట్లుండఁగా ఇత్యాదిగా.

హ. దానినే నిరూపించుచున్నాఁడు.—జన్మవంతునకు నాశంబును నాశ వంతునకు జన్మంబును స్వాభావికము. అప్పుడు అది యపరిహార్యము. అందువలన అపరిహార్య మయిన యర్థమునందు, త్వం శోచితుం నార్హసి.

శం. ఈపక్షమునందు శోకము కర్తవ్యము కా దనుటకు హేతువుఁ జెప్పు చున్నాఁడు.—హి = ఏకారణమువలన, జాతస్య = జన్మము గలవానికి, మృత్యుః = మరణము; ధ్రువః = స్థిరమో. అట్లు, మృతస్యచ = మృతిఁ బొందినవానికిని; జన్మ=

పునర్జననము; ధ్రువమ్ = నియతమో. ఇట్లు జన్మమరణములకును మరణజన్మములకును అహోరాత్రములకుంబోలె అవ్యభిచారి యగు ఈనియమము అపరిహార్యము. తస్మాత్—అందువలన, అపరిహార్యే = బ్రహ్మదేవునిచేత నేనియుఁ బరిహరించుట కశక్య మయిన, అర్థే, త్వమ్, శోచితుమ్—ఈదేవదత్తుఁడు నావాఁడు మరణము నొందుచున్నాఁ డని శోకించుటకు, నార్హసి—తగినవాఁడవు కావు.

ము. ఓయీ! ఆత్మ ప్రలయమువఱకు ఉండువాఁ డనుపక్షమునందును నిత్యుఁ డనుపక్షమునందును దృష్టదుఃఖమును అదృష్టదుఃఖమును సంభవించుటవలన, ఆభయముచే శోకించుచున్నాను అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు రెండవశ్లోకముచేత.—హి = ఏకారణమునవలన; జాతస్య=తాను చేసిన ధర్మాధర్మముల వశమువలన శరీరేంద్రియాదిసంబంధము నొందినవానికి; మృత్యుః = వానిఁ గలిగించిన కర్మముయొక్క నాశముచేఁ గలుగవలసిన తచ్ఛరీరాదివియోగము; ధ్రువః = ఆవశ్యకము, సంయోగము కలిగినప్పుడు వియోగము కలుగుట యావశ్యక మగుటవలన. అట్లు, మృతస్యచ జన్మ, ధ్రువమ్, పూర్వదేహకృతకర్మఫలము నుపభోగించుటకొఱకు. అనుశయవంతుఁడే * ప్రసూతుఁ డగుటవలన జీవన్ముక్తునియందు వ్యభిచారము లేదు. తస్మాత్, ఇట్లు, అపరిహార్యే = పరిహరింప శక్యము కానట్టి, అర్థే = ఈజన్మమరణవిషయమునందు; త్వమ్ = ఇట్టి పండితుఁడవు నీవు, శోచితుం నార్హసి. అట్లు చెప్పఁబోవుచున్నాఁడు 'ఋతే ఽపి త్వాం న భవిష్యన్తి సర్వే' అని. నీవు యుద్ధంబున వధింపనియెడ వీరు జీవించియే యుందు రనుట సిద్ధ మగుపక్షమున అప్పుడు యుద్ధమువిషయమై నీవు శోకించుట యుచిత మగును. వీరలో, కర్మము నశించుటవలన తమయంతనె మరణము నొంద నున్నారు. నీవు దానిఁ బరిహరింప సమర్థుఁడవుకుం గావు. కావున నీకు దృష్టదుఃఖనిమిత్త మయిన శోక ముచితము కా దని భావము. ఇట్లు అదృష్టదుఃఖ ♦ నిమిత్త మయిన శోకము గల దనుటకును 'తస్మాదపరిహార్యే అర్థే' అనుటయె యుత్తరము. ఎట్లనఁగా—యుద్ధము అను కర్మము క్షత్త్రియునకు నియతము, అగ్నిహోత్రాదులవలె. ఆయుద్ధశబ్దము 'యుధసంప్రహారే' అను ధాతువువలన నిష్పన్నము, శత్రుప్రాణవియోగానుకూలశస్త్రప్రహారరూపవ్యాపారము బోధించును. అది, విహిత మగుటవలన ప్రత్యవాయజన

* పరలోకంబునఁ గర్మము అనుభవించిన తరువాతఁ బునర్జన్మంబునకుఁ గారణ మయిన కర్మశేషము అనుశయ మనఁబడును, అది కలవాఁడు అనుశయవంతుఁడు.

♦ దృష్టదుఃఖము-ఈలోకమునఁ గలుగుదుఃఖము, అదృష్టదుఃఖము-పరలోకమునందలి దుఃఖము.

కము కాదు, అగ్నీషోమీయాది పశుహింసవలె. అట్లు గౌతమస్మృతి 'న దోషో హింసాయా మాహవే ఽన్యత్ర వ్యశ్వా సారథ్యనాయుధ కృతాఞ్జలి ప్రకీర్ణకేశ పరాఙ్ముఖోపవిష్ట స్థల వృక్షాధిరూఢ దూత గో బ్రాహ్మణ వాదిభ్యః'* అని. ఇందు బ్రాహ్మణ గ్రహణము యుద్ధము చేయని బ్రాహ్మణుని విషయము, గోవు మొదలగువానితో సహపాఠమువలన. ఇది యంతయు 'స్వధర్మమపి చావేక్ష్య' అనుచోట స్పష్టీకరించెదము. కావున, అర్థే = యుద్ధము అను విషయము, అగ్నిహోత్రాదులవలె విహిత మగుటవలన, అపరిహార్యే = పరిహరించుటకశక్య మయిన దానియందు, అది చేయనియెడ ప్రత్యవాయము ప్రసక్తించుటవలన; నీవు, అదృష్టదుఃఖభయముచే, శోచితుం నార్హసి అని పూర్వమునందువలె. ఇఁక, 'య ఆహవేషు యుధ్యన్తే భూమ్యర్థ మపరాఙ్ముఖాః। అకూటై రాయుధై ర్యాన్తి తే స్వర్గం యోగినో యథా' ♦ అను యాజ్ఞవల్క్యవచనమువలనను 'హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్' అను భగవద్వచనమువలనను, యుద్ధాఖ్యకర్మము కామ్యమే యనుపక్షమున, అప్పుడుగూడఁ బ్రారంభించినది కామ్య మయినను అవశ్యము పరిసమాప్తి నొందింపవలసినందున నిత్యతుల్య మగును. యుద్ధమో నీచే ప్రారంభింపఁబడినది, కావున నిత్యముంబోలె యుద్ధముగూడ అపరిహార్యమె యగును. లేక. ఆత్మ నిత్యుఁ డన్నపక్షమునందే రెండుశ్లోకములును చెప్పఁబడినవి, మిక్కిలి యాస్తికుఁ డగు నర్జునునందు వేదబాహ్య మయిన మతము నంగీకరించుట సంభవింపమివలన. అప్పుడు వ్యాఖ్యానము—నిత్యజాతమ్—నిత్యుఁడును దేహేంద్రియసంబంధవశమువలన జాతుండును, కావున నిత్యజాతుఁడు, ఈయాత్మను, నిత్యుఁడైనను పుట్టినవానిఁగా, మన్యసే—తలంతువేని; అట్లు, నిత్యం మృతమ్—నిత్యుఁడైనను మృతునిఁగా; మన్యసే—తలంతువేని; తథా ఽపి త్వం శోచితుం నార్హసి అని ప్రతిజ్ఞ చేసి హేతువుఁ జెప్పుచున్నాఁడు జాతస్య హీత్యాదిగా. నిత్యునకు జాతత్వమును మృతత్వమును ముఖ్న వివరింపఁబడినది. ఇతరము స్పష్టము. భాష్యముగూడ ఈపక్షమునందు యోజనీయము.

---

* యుద్ధమున హింసించుటయందు దోషము లేదు. గుఱ్ఱములు లేనివాఁడు, సారథి లేనివాఁడు, ఆయుధము లేనివాఁడు, చేమోడ్పు చేసినవాఁడు, విరియఁబాఱిన వెండ్రుకలు గలవాఁడు, వెన్నిచ్చినవాఁడు, కూర్చుండినవాఁడు, మిట్ట యెక్కినవాఁడు, చెట్టెక్కినవాఁడు, దూత, గోవు, బ్రాహ్మణుఁడు, మాటలాడుచున్నవాఁడు—వీరి విషయమునఁ దప్ప.

♦ ఎవరు భూమికొఱకు యుద్ధములందు వెన్నియ్యనివారై నిష్కపటవిధములతో ఆయుధములచేఁ బోరుచున్నారో వారు యోగులుంబోలె స్వర్గము నొందుదురు.

శ్రీ. ఎందువలన ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—హి = ఏకారణమువలన, జాతస్య=పుట్టినవానికి, తనజన్మముఁ గలిగించిన కర్మము క్షయించినపుడు, మృత్యుః, ధ్రువః = నిశ్చితమో, మృతస్యచ = చచ్చినవానికిఁగూడ, ఆదేహమునఁ జేయఁబడిన కర్మముచే, జన్మ = పుట్టుకయును; ధ్రువమ్ = నిశ్చితమో. తస్మాత్ = అందువలన. ఇట్లు, అపరిహార్యే—అవశ్యము కలుగవలసిన, అర్థే=జన్మమరణవిషయమునందు, త్వమ్—పండితుఁడవు నీవు, శోచితుమ్, నార్హసి = యోగ్యుఁడవు కావు.

ప. ఎందువలన ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—హి = ఎందువలన, జాతస్య, జన్మమునకుఁ గారణ మయిన కర్మము నశింపఁగా, మృత్యుః, ధ్రువః= నిశ్చితమో, మృతస్యచ, ఆదేహమునఁ జేయఁబడిన కర్మముచే, జన్మముగూడ, ధ్రువమే యగును. తస్మాత్—అందువలన, అపరిహార్యే = అవశ్యంభావి యగు, అర్థే= జన్మ మరణరూప మయిన విషయమునందు, త్వం శోచితుం నార్హసి.

రా. జాతస్య = పుట్టినదానికి; మృత్యుః = వినాశము; ధ్రువోహి = అని వార్య మని ప్రత్యక్షముగాఁ గనఁబడుచున్నదిగదా. అట్లు, మృతస్యచ = నశించిన దానికిని; జన్మ = పుట్టువు; ధ్రువమ్; అనివార్యము. ఎట్లిది యుపపన్నము నశించిన దాని కుత్పత్తి యనివార్య మనుట? సత్తునకే * యుత్పత్తి కనఁబడుటవలనను అస త్తునకు ♦ ఉత్పత్తి కనఁబడమివలనను అని చెప్పుచున్నాము. ఉత్పత్తివినాశాదులు స త్తయిన ద్రవ్యమున కవస్థావిశేషములు. ఎట్లనఁగా తంతుప్రభృతు లగు ద్రవ్య ములు ఉన్నవైయే రచనావిశేషయుక్తము లయి పటాదు లని చెప్పఁబడుచున్నవి. అసత్కార్యవాదికిఁగూడ నింతమాత్రమె యుపలబ్ధ మగుచున్నది. అందు తంతువుల సంస్థానవిశేషము ♪ తప్ప ద్రవ్యాంతర మేమేని కనఁబడుచున్నదా? కారకవ్యాపా రములకును నామాంతరప్రాప్తికిని వ్యవహారవిశేషములకును ఇంతమాత్రముచేతనే యుపపత్తి సంభవించుటవలన ద్రవ్యాంతరకల్పనము యుక్తము కాదు. కావున ఉత్పత్తివినాశాదులు సత్తైనద్రవ్యమున కవస్థావిశేషములు. ఉత్పత్తి యను పేరు గల యవస్థను బొందిన ద్రవ్యమునకు తద్విరుద్ధ మయిన మఱియొకయవస్థ కలుగుట వినాశ మని చెప్పఁబడుచున్నది. మృత్తికకు పిండత్వమును ఘటత్వమును కపాలత్వ మును చూర్ణత్వమును మొదలగునవియుంబోలె పరిణామిద్రవ్యమునకు పరిణామ

* ఉన్నదానికే.

♦ లేనిదానికి.

♪ సంయోగవిశేషము.

పరంపర యనివార్యము. అందు పూర్వావస్థయందున్న ద్రవ్యమునకు ఉత్తరావస్థా ప్రాప్తి వినాశము, ఆయవస్థయం దున్నదానికి తదుత్తరావస్థాప్రాప్తియె యుత్పత్తి. ఇట్లు ఉత్పత్తినాశము లనుపరిణామపరంపర పరిణామిద్రవ్యమున కపరిహార్యము. తస్మాత్ = అందువలన; అపరిహార్యే = అనివార్య మయిన; అర్థే = విషయమునందు; త్వమ్ = నీవు; శోచితుమ్ = శోకించుటకు; నార్హసి = యోగ్యుఁడవు కావు.

ఉత్పత్తి నొందిన ద్రవ్యమునకు నాశము అనివార్యము. అట్లు నాశము నొందినదానికి ఉత్పత్తియు అనివార్యము. ఇట్లు పరిణామము నొందు స్వభావము గల ద్రవ్యమునకు ఉత్పత్తివినాశము లనుపరిణామములు ఒకటి వెనుక నొకటి పరంపరగా సంభవించుటను పరిహరింప శక్యము కాదు. కావున అపరిహార్య మయిన యీవిషయమునందు నీవు శోకించుట యర్హము గా దని తాత్పర్యము.

షూ. ఎందువలన శోకము నొందుట యుపపన్నము కా దనఁగా నియతము లగుటవలన నని చెప్పుచున్నాఁడు.—హి = ఏకారణమువలన; జాతస్య = పుట్టినవానికి; మృత్యుః = మరణము; ధ్రువః = నియతమో, మృతస్యచ = మరణము నొందినవానికిని; జన్మ = పుట్టుక; ధ్రువమ్ = నియతమో. తస్మాత్ = అందువలన; అపరిహార్యే = పరిహరింప శక్యముగాని; అర్థే = జన్మమరణనిమిత్తక మయిన దుఃఖము విషయ మయి; త్వమ్=నీవు; శోచితుమ్=శోకించుటకు; నార్హసి=తగినవాఁడవు కావు.

జన్మము నొందినవానికి మరణము నియతము, అట్లు మరణము నొందిన వానికిఁగూడ జన్మము నియతము. అందువలన ఈజన్మమరణములచేఁ గలుగు దుఃఖము అనివార్యము, కావున దీనివిషయ మయి నీవు శోకము నొందుట యుపపన్నము కా దని తాత్పర్యము.

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా. ౨౮

భా. కార్యకారణసంఘాతాత్మకము లయిన ‡ భూతములనుగూడ నుద్దేశించి శోకము వహింప నుచితము కాదు. ఎందువలన ననఁగా.— అవ్యక్తాదీని—అవ్యక్త = కనఁబడకుండుట అనుపలబ్ధి *, ఆదీని=మొదలు, ఏ పుత్రమిత్రాదికార్యకారణసంఘాతాత్మకము లగు భూతములకో

‡ సంఘాత = సమూహము.

* ప్రత్యక్షము కాకుండుట.

అవి, అవ్యక్తాదులు, భూతాని—ఈభూతములు; అవ్యక్తాదులు ఉత్పత్తికి మున్ను. ఉత్పన్నము లయిన పిదప మరణమునకు మునుపు, వ్యక్తమధ్యాని = ప్రత్యక్ష మగుచున్న మధ్యము కలవి. అవ్యక్తనిధనాని ఏవ = మరల కనఁబడకుండుట మరణముగాఁ గలవియె, మరణమునకుఁ బిదప అవ్యక్తతనే పొందుచున్నవి యని యర్థము. అట్లు చెప్పఁబడినది «అదర్శనా దాపతితః పునశ్చా ఽదర్శనం గతః । నా ఽసౌ తవ న తస్య త్వం వృథా కా పరిదేవనా» ♦ అని. తత్ర = అందు; భారత = అర్జునా! కాపరిదేవనా = ఏమి విలాపము? అదృష్ట దృష్ట ప్రనష్ట భ్రాంతి భూతములవిషయ మయి యని యర్థము.

ఈ పుత్త్రమిత్త్రాదికార్యకారణసంఘాతరూపము లయిన భూతములు ఉత్పత్తి నొందుటకు మున్ను అవ్యక్తములు. ❡ ఉత్పత్తి నొందిన పిదప మరణము నొందుటకు మున్ను మధ్యకాలమున మాత్రము వ్యక్తము లగును. మరల మరణము నొందిన పిదప ఎప్పటియట్లు అవ్యక్తములే యగుచున్నవి. ఇట్లు భ్రాంతిచేఁ దోఁచునట్టి వీనివిషయమున దుఃఖించుట యుక్తము కా దని తాత్పర్యము.

ఆ. ఆత్మనుగూర్చి శోకించుట అయోగ్యమైనను భూతసంఘాతరూపము లయిన భూతములనుగూర్చి శోకించుట యోగ్యమే యగు నని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నారు.—కా ర్యేత్యాదిగా. ఈశ్లోకమె యిందుకు హేతు వని చెప్పుచున్నారు ఎందువలన ననఁగా నని. చాక్షుషదర్శనమునకు విషయము కాకుండుటమాత్రము కా దని చెప్పుచున్నారు అనుపలబ్ధి యని. ఈసంఘాతరూపము లయిన భూతములు ఉత్పత్తికి మున్ను ఉపలబ్ధములు కావు గదా! అందుచే నవి యవ్యక్తాదు లనం బరఁగుచున్నవి యని యర్థము. ఈ భూతములకు ఏది వ్యక్తమో అమధ్య మనఁగా నేది యనఁగా దానిఁ జెప్పుచున్నారు ఉత్పన్నము లయిన పిదప ఇత్యాదిగా. ఉత్పత్తికిఁ బిమ్మటను మరణమునకు మునుపును వ్యావహారిక మైన సత్తయే మధ్యము ఈభూతములకు వ్యక్తము కావున వ్యక్తమధ్యము లని చెప్పఁబడుచున్నవి. జన్మము ననుసరించుట విలయమునకు యుక్త మని తలఁచి తాత్పర్యార్థము చెప్పుచున్నారు మరణమునకుఁ బిదప ఇత్యాదిగా. ఈచెప్పినవిషయము

---

♦ అదర్శనమునుండి వచ్చినాఁడు, మరల అదర్శనమునే పొందినాఁడు. ఇతఁడు నీవాఁడు కాఁడు, నీ వతనివాఁడవు కావు—నీకు నతనికి సంబంధము లేదు. వ్యర్థముగా ఏడ్చుట యేమి?

❡ ఉపలబ్ధములు కావు.

నంపుఁ బౌరాణికసమ్మతిని జూపుచున్నారు అట్లు ఇత్యాదిగా. తత్ర అనుశబ్దము యొక్క యర్థముఁ జెప్పుచున్నారు అదృ ష్టేత్యాదిగా. పూర్వము అదృష్టములై పిదప దృష్టములైనవి అవియే మరల ప్రనష్టము లగుచున్నవి, ఇట్లు భ్రాంతివిషయము లగుటచే ఘటీకాయంత్రమువలె చక్రీభూతము లయిన భూతములవిషయమయి శోకనిమిత్తక మయిన విలాపమున కవకాశము లే దని యర్థము.

హ. కార్యకారణధర్మకము లయిన వీని నుద్దేశించి శోకము సహించుట యుక్తము కాదు, ఎందువలన ననఁగా. ఉత్పత్తికి మున్ను, అవ్యక్త ఆదీని— అవ్యక్తము—అదర్శనము లేక అనుపలబ్ధి, ఆది—మొదలుగాఁ గలవి. ఉత్పన్నములై వినాశమునకు మున్ను, వ్యక్తమధ్యాని = వ్యక్త మయిన అంతరాళము గలవి. మరల, అవ్యక్తనిధనాన్యేవ—అవ్యక్తము—అదర్శనము, నిధనము—మరణముగాఁ గల వియె, మరణమునకుఁ బిమ్మట అవ్యక్తములే యగు నని యర్థము. అట్లు చెప్పఁ బడినది 'అదర్శనా దిహా ఽఽయాతః పునశ్చా ఽదర్శనం గతః' అని. తత్ర; కాపరి దేవనా—ఏమి విలాపము? దృష్టనష్టభ్రాంతిభూతము లయిన భూతములయందుం బోలె నని యర్థము.

శం. ఈ భీష్మాదిశబ్దవాచ్యము లగు దేహము లన్నియు మాయాకార్య మగుటచే సత్యములు కావు. కావున నీవు నావా రని యెప్పుడును శోకింపఁ దగ దని సూచించుచున్నాఁడు.— అవ్యక్తాదీని—నామరూపగుణాదులచే, నవ్యజ్యతే—తెలియఁ బడదు, కావున అవ్యక్త మనఁగా మాయ, ఆమాయవలన, ఆదీని—జన్మము గలవి, కావున అవ్యక్తాదీని; భూతాని—భవన్తి—పుట్టుచున్నవి కావున భూతము లనఁగా శరీరములు, భావార్థమందు క్తప్రత్యయము. వ్యక్తమధ్యాని—వ్యక్త = వ్యక్తత, మధ్యాని = నడుమఁ గలవి. దేవ మనుష్య తిర్యక్ బ్రాహ్మణాదిరూపమున ఆభాసముగా నడుమ స్వరూపము నొందినవి. మరల, అవ్యక్తనిధనాని—అవ్యక్త=మాయయందే, నిధనాని = లయము గలవి, ఇంద్రజాలకల్పితపదార్థములవలె దృష్టనష్ట స్వరూపములు. కావున నే, శరీరములు మాయాకార్యములు. 'యథా స్వప్నప్రపఞ్చో ఽయం మయి మాయావిజృమ్భితః । తథా జాగ్రత్ప్రపఞ్చో ఽయం మయి మాయా విజృమ్భితః' * అను వచనమువలన, ఇది యంతయు స్వప్నపదార్థమువలె

* ఎట్లు ఈస్వప్నప్రపంచము నాయందు మాయచే విజృంభించునో అట్లే యీజాగ్రత్ప్రపంచముగూడ నాయందు మాయచే విజృంభించుచున్నది.

మాయికమే, కావున, సమస్తమును మాయాకార్య మనుట నెఱింగిన పురుషునకు ఆమాయాకార్యము విషయ మయి, నావాఁ డితఁడు హాతుఁ డగుచున్నాఁడు మరణము నొందుచున్నాఁడు నశించుచున్నాఁ డని, కాపరిదేవనా—మిథ్య యయిన పదార్థమునందు ఏమి పరితాపము? అని విద్వాంసులకుఁ బరితాపము లేదని చెప్పుచున్నాఁడు శ్రీభగవంతుఁడు. లేక—సర్వప్రమాణములచేతను నవ్యజ్యతే—వ్యక్తముగాఁ జేయ శక్యము కానిది కావున అవ్యక్త మనఁగా పరబ్రహ్మము, త దజ్ఞానము వలన ఆదీని—జన్మము గలవి, కావున అవ్యక్తాదులు భూతములు. శుక్త్యజ్ఞానము వలన రజతమువలె ఆత్మాజ్ఞానమువలన జన్మము నొందినవి. అట్లు వ్యక్తమధ్యాని—సమస్తమును తెలియఁ జేయునది కావున వ్యక్త మనఁగా అంతఃకరణము, అది, మధ్యాని—మధ్యమందు—స్థితికాలమునందుఁ గలవి, దేవతిర్యఙ్మనుష్యాదిభేదమును స్త్రీపురుషాదిభేదమును పితృపుత్త్రాదిభేదమును అహంకారమమకారాది సంబంధమునుం గల్పించి యంతఃకరణమే ప్రపంచనిర్వాహము చేయుచున్నది, అందుచే వ్యక్తమధ్యములు, అధిష్ఠానము తెలియకుండు నంతవఱకు ఆభూతములకు సత్తస్ఫూర్తి మొదలగునవి వాసనాసహితాంతఃకరణబలమువలనె కలుగుచున్నవి, కావున భూతములు వ్యక్తమధ్యము లని చెప్పఁబడుచున్నవి, 'మనోవృత్తి మయం ద్వైత మద్వైతం పరమార్థతః' * అను వచనమువలన. సత్పదార్థ మయిన అధిష్ఠానము తెలిసిన పిదప అప్పుడు మరల, అవ్యక్తనిధనాని—అవ్యక్త= స్వాధిష్ఠాన మయిన బ్రహ్మమునందు, నిధనాని = నిధనము గలవి, అధిష్ఠానము తెలియమివలనఁ బుట్టినవై, అధిష్ఠానము తెలియకుండు నంతవఱకు స్వతస్స్వరూపము గలవియుం బోలె, భూతములు మృగతృష్ణికాజలమువలెఁ దోఁచుచుండును, అధిష్ఠానము తెలియఁగానే అవి అధిష్ఠానమాత్రములే యగును గాని దానికన్న భిన్నములు గావు. తత్ర—మృగతృష్ణికాజలమువలెఁ బ్రతిభాసమాత్రంబును అధిష్ఠానము తెలియమివలన విజృంభితంబు నగు దేహాదిప్రపంచము విషయమై; అధిష్ఠానజ్ఞానముచే సర్వము బ్రహ్మమే యని చూచునట్టి విద్వాంసునకు, కాపరిదేవనా — శోకమున కవకాశమే లేదని యర్థము.

మ. ఇట్లన్నివిధములచేతను ఆత్మ యశోచ్యుఁ డని యుపపాదింపఁబడినది. ఇఁక ఆత్మ అశోచ్యుఁ డయినను భూతసంఘాతరూపము లయిన శరీరములనుద్దేశించి శోకించుచున్నా ననునర్జునుని యాశంకను బరిహరించుచున్నాఁడు భగ

* మనోవృత్తిచేతఁ గలిగినది ద్వైతము, పరమార్థమున అద్వైతము.

వంతుఁడు—అవ్యక్తాదీని, ఆదియందు—జన్మమునకు మున్ను అవ్యక్తములు—కనఁబడ నివి; భూతాని—పృథివ్యాదిభూతమయము లయిన శరీరములు; వ్యక్తమధ్యాని, మధ్యమునందు—జన్మమునకు వెనుక మరణమునకు మున్ను, వ్యక్తములు—కనఁబడు నవి. అవ్యక్తనిధనాని—నిధనమునందు మరల అవ్యక్తములే యగుచున్నవి, స్వప్నము ఇంద్రజాలము మొదలగువానియందుంబోలెఁ, బ్రతిభాసమాత్రసత్తాకములు శుక్తి రూప్యాదులవలె, మఱి జ్ఞానమునకు ముందుగాని వెనుకఁగాని యుండునవి కావు, సిద్ధాంతమునందు దృష్టిసృష్టి * అంగీకరించుటవలన. అట్లు 'ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానే ఽపి తత్తథా' అను న్యాయముచే మధ్యకాలమునందును ఇవి యుండున వియే కావు. 'నా ఽసతో విద్యతే భావః' అని మున్ను చెప్పఁబడినది. ఇట్లుండఁగా, తత్ర—మిథ్యాభూతములును మిక్కిలి తుచ్ఛములు నగు ఆభూతములవిషయమై; కాపరిదేవనా—ఏమి దుఃఖప్రలాపము? ఏదియు నుచితము కాదని యర్థము. స్వప్న మునందు నానావిధము లయిన బంధువులను జూచి మేలుకొన్న పిదప నెట్టి పామ రుఁడైనను వారి వియోగమునకు శోకించునా? ఇదియే చెప్పఁబడినది పురాణము నందు 'అదర్శనా దాపతితః పునశ్చా ఽదర్శనం గతః' అని, ఇందు భూతసంఘ మని యధ్యాహార్యము. అందువలన శరీరముల నుద్దేశించియు శోకించుట యుచితము కా దని భావము. ఆకాశాదిమహాభూతాభిప్రాయముగాఁగూడ శ్లోక మన్వయింపఁ దగును. ఎట్లనఁగా—అవ్యక్తాదీని, అవ్యక్త=అవ్యాకృతము అనఁగా అవిద్యోపహిత చైతన్యము, ఆదిని=పూర్వావస్థగాఁ గలవి; అట్లు, వ్యక్తమధ్యాని—వ్యక్త=అవిద్యకము లయిన నామరూపములచేఁ బ్రకటీభూతము, మఱి తన పరమార్థస్వరూపముచే నేమో గాదు, అట్టి, మధ్యాని = స్థిత్యవస్థ గలవి; అట్టి, భూతాని—ఆకాశాదిభూత ములు; అవ్యక్తనిధనాన్యేవ, అవ్యక్త = స్వకారణమునందు మృత్తునందు ఘటాదుల కుంబోలె, నిధనాని= ప్రలయము గలవి. తత్ర=ఆభూతములవిషయ మయి; కాపరి దేవనా? 'అట్లుతద్ధే దం తర్హ్యవ్యాకృత మాసీ త్తన్నామరూపాభ్యా మేవ వ్యా క్రియతే' ♦ ఇత్యాదిశ్రుతి సర్వప్రపంచమునకును అవ్యక్తమే యుపాదాన మని దెలుపుచున్నది. దానియందే లయ మనుటయో అర్థసిద్ధము, కారణమునందే కార్య మునకు లయము కనఁబడుటవలన. ఇది గ్రంథాంతరమున విస్తరించి చెప్పఁబడినది. అందువలన, అజ్ఞానకల్పిత మగుటచే తుచ్ఛము లయిన ఆకాశాదిభూతములనుగూడ

---

* దృష్టి—జ్ఞానముచేత, సృష్టి—జ్ఞానము కలుగునప్పుడె పదార్థభానము.

♦ ఇది ఆ యవ్యాకృతముగా నుండెను, నామరూపములచేతనే వ్యాకృత మగుచున్నది.

ఉద్దేశించి శోకించుట యుచితము కా దనఁగా, ఇఁకఁ దత్కార్యముల నుద్దేశించి శోకించుట యుచితము కా దని చెప్పవలయునా? అని భావము. లేక, సర్వదా అవి యవ్యక్తరూపమున ఉండుటవలన విచ్ఛేదము లేమింజేసి తన్నిమిత్తముగాఁ బ్రలాపము యుక్తము కా దని యర్థము. భారత యని సంబోధించుటచే, శుద్ధవంశమునఁ బుట్టినవాఁడ వగుటచే నీవు శాస్త్రీయ మయిన యర్థమునే గ్రహింపవలెను. అ ట్లేల గ్రహింపవు? అని సూచించుచున్నాఁడు.

శ్రీ. మఱియు దేహములస్వభావము నాలోచించి, ఆత్మకుఁ దద్దేహరూపోపాధివలనఁగలుగు జన్మమరణములనుగుఱించి శోకమువిడువు మనిచెప్పుచున్నాఁడు.— అవ్యక్తాదీని—అవ్యక్త మనఁగా ప్రధానము, అదియే, ఆదీని—ఉత్పత్తికిఁ బూర్వమందలి రూపముగాఁ గలవి, భూతాని = శరీరములు, కారణరూపమున ఉన్నవానికే యుత్పత్తి కలుగుటవలన. అట్లు, వ్యక్తమధ్యాని—వ్యక్త = అభివ్యక్త మయిన, మధ్యాని = జన్మమరణములమధ్య మయిన స్థితి కలవి. అవ్యక్తనిధనాని = అవ్యక్తమునందు—ప్రధానమునందు లయము గలవి. తత్ర = వానివిషయ మయి; కాపరిదేవనా = శోకముచే విలపించుట యేమి? మేలుకొన్నవానికి స్వప్నమునందుఁ జూడఁబడిన బంధువులవిషయమునంబోలె శోకించుట యుచితము కా దని యర్థము.

ప. ఇఁక, దేహాగతి యజ్ఞానమూలకం బగుటవలన తన్నిమిత్త మయిన శోకముగూడ అజ్ఞానకృతమే యని చెప్పుచున్నాఁడు.—భూతాని = శరీరములు; అవ్యక్తాదీని=ప్రధానమే యుత్పత్తికిఁ బూర్వమునందలి రూపముగాఁ గలవి. అవ్యక్తమధ్యాని= అభివ్యక్త మయిన జన్మమరణ మధ్యస్థితి గలవి. అవ్యక్తనిధనాని = అవ్యక్తమునందే లయము గలవి. ఇట్టి అజ్ఞానరూపము లయిన ఆదిమధ్యావసానములు గల శరీరములు నశించుటకు, కాపరిదేవనా = ఏమి దుఃఖము? స్వప్నమున సోదరుఁడు నశించుటకుం బోలె నని యర్థము. స్వప్నమునందుఁ బుట్టిన శోకమునకు జాగ్రత్తయే గదా ప్రతీకారము. అట్లు నవస్తుజ్ఞానమునం గలిగిన శోకమునకు వస్తుజ్ఞానమే ప్రతీకారము.

రా. సత్తయిన ద్రవ్యమునకుఁ బూర్వావస్థావిరోధి యగు నవస్థాంతరము ప్రాప్తించినపుడు మిక్కిలి యల్ప మయిన శోకము కలిగినను గలుగవచ్చును. అట్టి యల్పశోకముగూడ మనుష్యాదిభూతములవిషయ మయి సంభవింప దని చెప్పుచున్నాఁడు.—భూతాని = మనుష్యాదిభూతములు, సత్తులే యైన ద్రవ్యములు; అవ్య

క్తాదీని = ఉపలబ్ధములు కాని పూర్వావస్థ కలవి. వ్యక్తమధ్యాని = ఉపలబ్ధము లయిన మధ్యమావస్థ కలవి. అవ్యక్తనిధనాని ఏవ = ఉపలబ్ధములు కాని యుత్త రావస్థ కలవియే, ఇట్లు తమస్వభావములయం దున్నవి. కావున, తత్ర = వాని విషయమున; భారత = అర్జునా! కాపరిదేవనా = ఏమి విలాపము, విలాపమునకు నిమి త్తము లేదు.

మనుష్యాదిభూతములు, పూర్వావస్థయందు ఉపలబ్ధములు కాకుండు టయు, మధ్యమావస్థయందుమాత్రమె ఉపలబ్ధము లగుటయు, మరల నుత్తరావస్థ యం దుపలబ్ధములు కాకుండుటయు వాని స్వభావము. స్వభావము అపరిహార్యము, కావున వానివిషయ మయి విలపించుట యుచితము కా దని తాత్పర్యము.

మా. దానినే స్పష్టీకరించుచున్నాఁడు.—భూతాని = జీవులు; అవ్యక్తాదీని = అవ్యక్త మయిన లింగశరీరము మొదటిదిగాఁ గలవారు. వ్యక్తమధ్యాని = స్థూల శరీరము మధ్యకాలమునందుఁ గలవారలు. అవ్యక్తనిధనాని ఏవ = లింగశరీరమే వెనుకటి శరీరముగాఁ గలవారలు. తత్ర = అట్టి జీవులవిషయ మయి; కాపరిదే వనా = శోకనిమిత్తక మయిన ప్రలాప మేమి? అందు కవకాశ మే లే దని యర్థము.

జీవులు మొదట లింగశరీరముతోఁ గూడినవారై స్థూలదృష్టికిఁ గనఁబడ కుందురు, వెనుకఁ గర్మవశమునఁ బ్రకృతికార్య మైన స్థూలశరీరము నొంది సుఖ దుఃఖముల ననుభవించి తత్కర్మనాశ మయిన పిదప ఆస్థూలదేహము విడిచి మరల మునుపటి లింగశరీరమునే పొందుదురు. ఇట్టి శరీరసంయోగవియోగములు వార లకు కర్మవశమున నియతములై యుండును. మోక్షముచేతనేగాని నివర్తిల్లవు. కావున వీరివిషయమున శోకింప వల దని తాత్పర్యము.

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాఽన్యః
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి
శ్రుత్వాఽప్యేనం వేద న చైవ కశ్చిత్. ౨౯

భా. ఈ యాత్మ దుర్విజ్ఞేయుఁడు. భ్రాంతినిమిత్తము సర్వజనుల కును గలుగుచుండఁగా నిన్నొక్కనిమాత్రమె యేల నిందించుచున్నాను? ఎట్లు దుర్విజ్ఞేయుఁడు * ఈయాత్మ అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఆశ్చర్య

* తెలియరానివాఁడు.

వత్—ఆశ్చర్య మనఁగా పూర్వము చూడనిది, అద్భుతము, ఆకస్మిక ముగాఁ గనఁబడునది, దానితో తుల్యముగా, ఆశ్చర్యముగా ననుట; ఏనమ్ = ఈయాత్మను; కశ్చిత్= ఒకానొకఁడు; పశ్యతి = చూచుచున్నాఁడు.* తథైవచ=అట్లే; ఆశ్చర్యవత్= ఆశ్చర్యముగా; అన్యః= మఱియొకఁడు, ఒకానొకఁడు; వదతి= చెప్పుచున్నాఁడు. ఆశ్చర్యవత్ = ఆశ్చర్యముగా; ఏనమ్= ఈయాత్మను; అన్యః కశ్చిత్ = మఱియొకఁడు, ఒకానొకఁడు; శృణోతిచ=వినుచున్నాఁడుగూడ. శ్రుత్వా అపి = వినియును, అపిశబ్దముచే, చూచియును చెప్పియును; ఏనమ్= ఈయాత్మను; కశ్చిత్ = ఒకానొకఁడును; నచైవవేద = ఎఱుఁగనే యెఱుఁగఁడు.

లేక. ఎవ్వఁడు, కశ్చిత్= ఒకానొకఁడు, ఏనమ్ = ఈయాత్మను, పశ్యతి= చూచుచున్నాఁడో, అతఁడు, ఆశ్చర్యవత్ = ఆశ్చర్యమువంటివాఁడు. అన్యః = ఇతరుఁడు, ఎవఁడు, వదతి = చెప్పుచున్నాఁడో, అతఁడును, తథైవచ=అట్లే, ఆశ్చర్యవత్= ఆశ్చర్యమువంటివాఁడు. ఎవఁడు, అన్యః=మఱియొకఁడు; ఏనమ్= ఈయాత్మను, శృణోతి= వినుచున్నాఁడో. అతఁడును, ఆశ్చర్యవత్. అట్టివాఁడు పెక్కువేలజనులయం దొకానొకఁడే యుండును. కావున, ఆత్మ దుర్విజ్ఞేయుఁ డని యభిప్రాయము.

ఎవ్వఁడును ఈయాత్మను జూచుటయుఁ జెప్పుటయు వినుటయు దుర్లభము, అట్లు చూచినను చెప్పినను విన్నను ఈయాత్మను దెలియుట దుర్లభ మని తాత్పర్యము. లేక—ఈయాత్మను జూచువాఁడుగాని చెప్పువాఁడుగాని వినువాఁడుగాని దుర్లభుఁడు. కావున ఈయాత్మ నెవ్వరు నెఱుంగఁ జాల రని తాత్పర్యము.

ఆ. అర్జునుని యెడ నుపాలంభము చూపి ప్రకృతమైన యాత్మ దుర్విజ్ఞేయుఁ డగుట వలన అతనియెడ నుపాలంభము సంభవింప దని తలఁచినవారై చెప్పుచున్నారు.—ఈయాత్మ ఇత్యాదిగా. అట్లు ఆత్మాఽజ్ఞాననిమిత్తమైన ప్రలాపము సర్వజనసాధారణ మగుటవలన నొక్కనిమాత్రమె యుపాలంభింప నవకాశము లే దని చెప్పుచున్నారు భ్రాంతినిమిత్తము ఇత్యాదిగా. అహంప్రత్యయవేద్యుఁ డగుటవలన ఆత్మ దుర్విజ్ఞేయుఁ డనుట యసిద్ధ మని శంకించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. విశిష్టుఁడైన ఆత్మ అహంప్రత్యయము తెలియఁబడినప్పటికిని కేవలుఁడు

* ఎవఁడో ఒకానొకఁడుగూడ చూచుట ఆశ్చర్యము—అనఁగా దుర్లభము, ఇట్లు ముందును.

తెలియరా కుండుటవలన ఆత్మ దుర్విజ్ఞేయుఁడే యగు నని శ్లోకమున కవతారిక చేయు చున్నారు చెప్పుచున్నాఁడు అని. ఈశ్లోకమునందు మొదటిపాదముచే, ఆత్మవిషయక దర్శనము దుర్లభ మని చూపుటవలన, ఆత్మ ద్రష్ట దుర్లభుఁ డని ప్రతిపాదింపఁబడు చున్నది. రెండవపాదమున ఆత్మవిషయకవచనము దుర్లభం బనుటవలన ఆత్మ నుప దేశించువాఁడు దుర్లభుఁ డని చెప్పఁబడుచున్నది. మూఁడవపాదమున తద్విషయ శ్రవణము దుర్లభ మనుటవలన శ్రోత దుర్లభుఁ డని చెప్పఁబడుచున్నది. శ్రవణము దర్శనము వచనము కలిగినను ఆత్మవిషయసాక్షాత్కారము అత్యంతశ్రమ సాధ్య మనుట చతుర్థపాదాభిప్రాయము. ఇట్లు విభాగము. ఆత్మ విషయదర్శనాదికము దుర్లభ మనుటచే ఆత్మ దుర్విజ్ఞేయుఁ డనుటను సాధించుచున్నారు ఆశ్చర్యవత్ ఇత్యాదిగా.

ఇప్పుడు ఆత్మవిషయమున ద్రష్టయు వక్తయు శ్రోతయు సాక్షాత్కర్తయు దుర్లభుఁ డనుటచే ఆత్మ దుర్బోధుఁ డనుటను జెప్పుచున్నారు లేక ఇత్యాదిగా. రెండువ్యాఖ్యానములందును ఫలితార్థముఁ జెప్పుచున్నారు కావున ఇత్యాదిగా.

హ. ఈయాత్మ దుర్బోధుఁడు, నిన్నొక్కనిమాత్రమే యేల నిందింప వలెను? ఈభ్రాంతినిమిత్తము సర్వజనులకును గలదు. ఆత్మ దుర్బోధుఁ డె ట్లనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—ఆశ్చర్యవత్—ఆశ్చర్య మనఁగా అద్భుతము, స్వార్థము నందు వతిప్రత్యయము, ఆశ్చర్యమే ఆశ్చర్యవత్తు, ఇదివఱకుఁ జూడఁబడనిది అనుభవింపఁబడనిది ఆకస్మికముగాఁ గనఁబడునది ఆశ్చర్యము. ఏనమ్ = ఈయాత్మను, కశ్చిత్, పశ్యతి = చూచుచున్నాఁ డనునది, ఆశ్చర్యము. తథైవ, ఈయాత్మను, అన్యః= ఇతరుఁ డొకానొకఁడు; వదతి= చెప్పుచున్నాఁ డనునది, ఆశ్చర్యము. వినియు చెప్పియు చూచియు, ఏనమ్= ఈయాత్మను, కశ్చిత్ = ఒకఁడును, నచఏవ వేద = ఎఱుఁగనే యెఱుఁగఁ డనునది, ఆశ్చర్యము. కావున దుర్బోధుఁ డాత్మ యని యభిప్రాయము.

శం. ఓయీ ! పెక్కండ్రు పండితు లాత్మతత్త్వము వినిపించుచున్నారు వినుచున్నారు మననము చేయుచున్నారు. అయినను ఇట్టి జ్ఞానము ఎవరియందును గనఁబడదు, అని యాశంకింపఁగా, ఈశ్వరుఁడ నగు నాయొక్కయు శ్రుత్యాచార్యాత్మలయొక్కయుఁ బ్రసాదమునంగాని యిట్టిజ్ఞానము లభింప శక్యము గా దని సూచించుటకై, ఏతద్విషయమున జిజ్ఞాసువుగాని శ్రోతగాని వక్తగాని దుర్లభుఁ డని

చెప్పుటచే, ఆత్మ దుర్బోధుఁ డనుటం బ్రతిపాదించుచున్నాఁడు.—పెక్కుకోట్లసంఖ్య గల మనుష్యులందు, ఎవఁడు, కశ్చిత్ = ఒకానొకఁడు నాప్రసాదమునకుఁ బాత్ర మయినవాఁడు; ఏనమ్ = కూటస్థానంగచిద్రూపుఁడును అద్వితీయుఁడును అఖండానందైకరసుండు నగు ఆత్మను; పశ్యతి=సాక్షాత్కరించుటకుఁ గోరుచున్నాఁడో, అతఁడు; ఆశ్చర్యవత్ = ఆశ్చర్యమువంటివాఁడే యగుచున్నాఁడు. లోకులచేఁ జేయ నలవి గాని కార్యమును జేయుట ఆశ్చర్యము, అది ఆకార్యముఁ జేయ సమర్థుఁ డైనవాని యందే సంభవించును, హనుమంతునందు సముద్రలంఘనముంబోలె. ఇందు, సమస్త విషయాశాపాశము దహించి మోక్షేచ్ఛ వహించుట యాశ్చర్యము. మోక్షేచ్ఛ అతిదుర్లభ మగుటవలనను, బహుజన్మలభ్య మగుటవలనను, బహుపుణ్యపరిపాక సాధ్య మగుటవలనను, చిత్తప్రసాదముచేతనే సంభవించునది యగుటవలనను సమస్త విషయాశాసముద్రమును దాఁటి శుద్ధాంతఃకరణుండై మోక్షముమాత్రమె కోరు నట్టి ముముక్షువు మిక్కిలి దుర్లభుఁ డని యర్థము. మఱియు, ఏనమ్—ఈచెప్పిన లక్షణము గల ఆత్మను; అన్యః — మున్నుచెప్పిన దిదృక్షువుకన్న * భిన్నుఁడు, ఒకానొకఁడు ఎవఁడు; శృణోతి = వినునో, అతఁడును; ఆశ్చర్యవత్ = ఆశ్చర్యము వంటివాఁడే యగుచున్నాఁడు, ఆకాశమున నడచుపురుషుఁడుంబోలె. ప్రాణాత్యయమునం దేనియు విడువ నలవికాని భోగ్యపదార్థములందు వైరాగ్యము దుర్లభము, అది కలిగినను సాధనసహిత మయిన కర్మమును సన్న్యసించుట దుష్కరము, అట్లు సన్న్యసించినను అమానిత్వము అక్రోధత్వము బ్రహ్మచర్యము మొదలైన దైవి యగు సాధనసంపద దుర్లభము, అది లభించినను ‹ అనన్యప్రోక్తే గతి రత్ర నాస్తి, ఆచార్యవాన్ పురుషో వేద › ఇత్యాదిశ్రుతులచొప్పున బ్రహ్మవేత్త యగు ఆచార్యుఁడు దుర్లభుఁడు, ఈచెప్పిన లక్షణము గల గురువు సిద్ధించినను నాప్రసాదము చేతమాత్రమె లభ్య మయిన శ్రవణాదినిష్ఠయేమో మిక్కిలి దుర్లభము, ఏల యనఁగా నాయనుగ్రహము పొందినవాఁడు చేయుశ్రవణాదికము మాత్రమే సమ్యక్ జ్ఞానము గలిగించి మోక్షఫలము నొసంగం జాలును, ఇట్టి సర్వసాధనములతోఁ గూడినవాఁడై ఆత్మవిషయము శ్రవణము చేయువాఁడు దుర్లభుఁ డని యర్థము. తథైవ = అట్లే. ఈ చెప్పిన సర్వసాధనములతోఁ గూడినవాఁడును అద్వేష్టృత్వము మొదలగు స్వధర్మముతోఁ గూడినవాఁడును నాయనుగ్రహమునకుఁ బాత్ర మైన వాఁడు నగు ఎవఁడు, అన్యః కశ్చిత్ —చెప్పినవానికన్న భిన్నుఁడు శ్రవణాదినిష్ఠచే ఆత్మ

* చూడఁగోరిన వానికన్న.

తత్త్వముం దెలిసినవాఁడు బ్రహ్మనిష్ఠుఁడే యొకానొకఁడు; ఏనమ్ = ఈయాత్మను; వదతి—శరణాగతుఁ డగు నుత్తమశిష్యునకు ఆత్మతత్త్వము నుపదేశించుచున్నాఁడో; అతఁడును, ఆశ్చర్యవత్ = ఆశ్చర్యమువంటివాఁడే యగుచున్నాఁడు. 'బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేద్బాల్యంచ పాణ్డిత్యం చ నిర్విద్యాఽథ మునిరమౌనంచ మౌనంచ నిర్విద్యాఽథ బ్రాహ్మణః' * అను శ్రుతిచేఁ జెప్పఁబడిన బ్రాహ్మణత్వసిద్ధి హేతువు సాధింప నశక్య మగుటవలన ఈచెప్పినలక్షణము గల బ్రహ్మవేత్తయగు తత్త్వోపదేష్ట మిక్కిలి దుర్లభుఁ డని యర్థము. ఇట్లు పరమార్థము గోరునట్టి శ్రోతయు తత్త్వోపదేష్టయు అతిదుర్లభు లని ప్రతిపాదించి యిప్పుడు యథోక్తసాధనసంపద లేనివానికి నాయందు భక్తి లేనివానికి ఆత్మను దెలియ శక్యము కా దని చెప్పుచున్నాఁడు—శ్రుతియొక్కయు ఆచార్యునియొక్కయు నాయొక్కయుఁ బ్రసాదము లేనివాఁడును అమానిత్వాదిక మగు దైవసంపద లేనివాఁడు నగు, ఎవఁడు, కశ్చిత్ =ఒకానొకఁడు, ఆత్మతత్త్వము దెలియుటకై శ్రవణాదికము చేయునో, అతఁడు సాధనసంపత్తి లేనివాఁ డగుటవలన నూఱుమార్లుగాని వేయిమార్లుగాని, శ్రుత్వాఽపి = శ్రవణము చేసియు, అపి శబ్దమువలన, మననముగూడ చేసియు, ఏనమ్=ఈయాత్మను, నైవవేద—తెలియుటకును జ్ఞానఫలము నొందుటకును శక్తుఁడు కాఁ డని యర్థము. ఇందుచే 'ఇది యంతయు నేనును బ్రహ్మము' అని సర్వము బ్రహ్మమాత్ర మగుటం దెలియుట దుర్లభతరం బని సూచిత మగుచున్నది.

మం॰ ఓయీ! విద్వాంసులుగూడఁ బెక్కండ్రు శోకించుచున్నారు. అట్లుండఁగా, ఏల నన్నుమాత్రమే మాటిమాటికి నుపాలంభించెదవు? మఱియు, 'వక్తురేవ హి త జ్జాడ్యం శ్రోతా యత్ర న బుధ్యతే' ♦ అనున్యాయమువలన, నీవు చెప్పిన విషయము నాకు తెలియకుండుటగూడ నాదోషము కాదు. అని యాశంకింపఁగా, అందుకు, 'ఇతరులకుఁగూడ నీకుంబోలె ఆత్మజ్ఞానము లేమివలననె శోకము.

* బ్రాహ్మణః = ఇప్పటి బ్రాహ్మణుఁడు, పాణ్డిత్యమ్ = శ్రవణమును, నిర్విద్య = నిశ్చయముచే పొంది, బాల్యేన=శ్రవణముయొక్క బాలభావముచే, మననముచే, లేక, బాలునివలె దంభదర్పాదులు లేమిచే; తిష్ఠాసేత్ = ఉండుటకు కోరవలెను. బాల్యంచ = మననమును, పాణ్డిత్యంచ = శ్రవణమును, నిర్విద్య=నిశ్చయముచే పొంది, మునిః= నిదిధ్యాసనము చేయువాఁడు కావలెను. అథ= పిమ్మట. అమౌనంచ = మననశ్రవణములను; మౌనంచ = నిదిధ్యాసనమును; నిర్విద్య = నిశ్చయముచే పొంది, అథ= పుష్కల మయిన జ్ఞానసామగ్రి కలిగిన పిమ్మట, బ్రాహ్మణః = నేను బ్రహ్మ మను అనుసాక్షాత్కారము గల బ్రాహ్మణుఁ డగుచున్నాఁడు.

♦ వినువానికి బోధపడనియెడ ఆదోషము చెప్పువానిదే కదా.

ఆత్మప్రతిపాదకశాస్త్రార్థము తెలియకుండుటయు నీకును ఇతరులకుంబోలె స్వబుద్ధి దోషమువలననే. కావున నీవు చెప్పిన దోషములు రెండును సంభవింపవు' అను నభిప్రాయముతో ఆత్మ దుర్విజ్ఞేయుం డనుటను జెప్పుచున్నాఁడు.—ఏనమ్—ఈదేహిని; ఆశ్చర్యవత్ = అద్భుతముతో సమానుఁడై యున్నవానిని, అవిద్యాకల్పితము లయిన నానావిధవిరుద్ధధర్మములు గలవాఁడై, ఉన్నవాఁడైనను లేనివానివలె, స్వప్రకాశ చైతన్యరూపుఁడైనను జడునివలె, ఆనందఘనుఁడైనను దుఃఖితునివలె, నిర్వికారుఁడైనను వికారివలె, నిత్యుఁడైనను అనిత్యునివలె, ప్రకాశించువాఁడైనను ప్రకాశము లేనివానివలె, బ్రహ్మాభిన్నుఁడైనను బ్రహ్మాభిన్నునివలె, ముక్తుఁడైనను బద్ధునివలె, అద్వితీయుఁడైనను సద్వితీయునివలె, సంభావితము లయిన నానావిధము లగు ప్రతీతులకు విషయ మయినవాని; పశ్యతి = శాస్త్రాచార్యోపదేశములచే అవిద్యాకల్పిత సర్వద్వైతమును నిషేధించి వేదాంతమహావాక్యజన్యంబును సమస్తసుకృతఫలభూతంబు నగు పరమాత్మస్వరూపమాత్రాకార మయిన అంతఃకరణవృత్తియందు ప్రతిఫలితుఁ డగువాని సమాధిపరిపాకముచే సాక్షాత్కరించుచున్నాఁడు; కశ్చిత్ — శమదమాదిసాధనసంపన్న మయిన చరమ ♦ శరీరము గలవాఁడు ఒకానొకఁడు కాని యందఱును కారు. అట్లు ఒకానొకఁ డీయాత్మను, పశ్యతి యత్ = చూచుచున్నాఁ డనునది యేది గలదో, అది, ఆశ్చర్యవత్ — ఆశ్చర్యమువంటిది యని క్రియావిశేషణముగాఁగూడ నన్వయము. ఆత్మదర్శనము గూడ ఆశ్చర్యము వంటిదే, ఏల యనఁగా, అది స్వరూపముచే మిథ్య యయిన దైనను సత్యవ్యంజక మగుచున్నది, అవిద్యాక మయినను అవిద్యను నశింపఁజేయుచున్నది, అవిద్యను నశింపఁజేయుచు తాను అవిద్యాకార్య మగుటచేఁ దన్నుఁగూడ నశింపఁజేయుచున్నది. అట్లు, ఎవ్వఁడు, కశ్చిత్ = ఒకానొకఁడు, ఏనమ్ = ఈయాత్మను, పశ్యతి=చూచుచున్నాఁడో, అతఁడు, ఆశ్చర్యవత్ అని కర్తృవిశేషణముగాఁగూడ అన్వయము. ఏల యనఁగా, ఆత్మద్రష్ట యగువాఁడు, అవిద్యాతత్కార్యములు నివర్తిల్లినవాఁడైనను, ప్రారబ్ధకర్మప్రాబల్యమువలన అవి గలవాఁడువోలె వ్యవహరించుచున్నాఁడు, సర్వదా సమాధినిష్ఠుఁడైనను సమాధినుండి లేచుచున్నాఁడు, లేచినవాఁడైనను మరల సమాధి ననుభవించుచున్నాఁడు, ప్రారబ్ధకర్మము విచిత్ర మగుటవలన విచిత్ర మయిన చరిత్రము గలవాఁ డగుచున్నాఁడు, ఎవ్వరికిని బొందశక్యముగాని జ్ఞానము నొందినవాఁ డగుటవలన సకలలోకములకును ఆశ్రయణీయుఁ డగుచున్నాఁడు. అందువలన అతఁడు

♦ కడపటి.

ఆశ్చర్యమువంటివాఁడే యగుచున్నాఁడు. అందువలన, ఆత్మ తద్జ్ఞానము తద్జ్ఞాత—త్రయమును ఆశ్చర్యము. కావున పరమదుర్విజ్ఞేయుఁ డైన ఆత్మను నీ వెట్లు అనాయాసమున నెఱుంగఁ జాలుదువు? అని యభిప్రాయము. ఇట్లు ఉపదేశించువాఁడు లేమివలనఁగూడ ఆత్మ దుర్విజ్ఞేయుఁడు. ఎవ్వాఁ డాత్మ నెఱుంగునో అతఁడే గదా ఆయాత్మ నితరునకు నిశ్చయముగాఁ జెప్పవలెను. అజ్ఞాని యెట్లుపదేశింపఁజాలును? జ్ఞానియుఁ దఱచుగా సమాధిలో నుండువాఁ డెట్లు చెప్పును? సమాధినుండి లేచి యుండునప్పుడును ఇతఁడు ఆత్మజ్ఞుం డని యితరున కెట్లు తెలియఁ గలదు? ఎట్లో తెలిసినను లాభము పూజ యశస్సు మొదలగు ప్రయోజనములం దపేక్ష లేనివాఁ డగుటవలనఁ జెప్పనే చెప్పఁడు. ఎట్లైని కారుణ్యమాత్రముచేఁ జెప్పఁ దలఁచినను అట్టివాఁడు పరమేశ్వరునివలె అత్యంతదుర్లభుఁడే యని చెప్పుచున్నాఁడు—ఆశ్చర్యవత్ వదతి తథైవ చ అన్యః. ఎట్లు ఎఱుంగుచున్నాఁడో, తథైవ = అట్లే, వదతి = చెప్పుచున్నాఁడు, చకారము ఏనమ్ అనుశబ్దమును అనుకర్షించుచున్నది, ఏనమ్—ఈయాత్మను. ఆచెప్పువాఁడును, అన్యః—అజ్ఞజను లందఱికన్న విలక్షణుఁడు, కాని ఎవఁడు చూచుచున్నాఁడో వానికి విలక్షణుఁడు కాఁడు, ఏల యనఁగా, చూడనివాఁ డెట్లు చెప్పఁ గలఁడు? ఇచటఁగూడ, కర్మ మయిన ఆత్మయందును క్రియయందును కర్తయందును ఆశ్చర్యవత్ అనుదాని నన్వయింపవలెను. అందు కర్మమునకును కర్తకును ఆశ్చర్యత్వము పూర్వమువలె గ్రహించునది. క్రియకు వివరింపఁబడును—సర్వశబ్దములకును అవాచ్యుఁ డగు శుద్ధుఁ డైన ఆత్మను జెప్పుట యనున దేది గలదో అది యాశ్చర్యమువంటిది. అట్లు శ్రుతి ‘యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ’ అని. ఏశబ్దముచేతను వచింప శక్యముకాని శుద్ధాత్మను విశిష్టశక్త మయి జహదజహాత్స్వార్థలక్షణచేఁ గల్పిత మయిన సంబంధము గల పదముచే లక్ష్యతావచ్ఛేదకము లేకయే ప్రతిపాదించుట, అదియు నిర్వికల్పసాక్షాత్కారరూపము, అత్యాశ్చర్య మని యర్థము. లేక. శక్తిగాని లక్షణగాని యితరసంబంధముగాని లేకయె, నిదురించువాని లేపునట్లు తత్త్వమస్యాదివాక్యముచే ఆత్మతత్త్వము ప్రతిపాదించుట యనునది యేది గలదో అది యాశ్చర్యమువంటిది, శబ్దశక్తి యచింత్య మగుటవలన. సంబంధము లేక బోధనమునం దతిప్రసంగ మనఁ దగదు, అది లక్షణాపక్షమునందును తుల్య మగుటవలన, శక్యసంబంధము అనేకసాధారణ మగుటచే ఒకచోటనే అను నియమము లేమివలన. తాత్పర్యవిశేషమువలన నియమము సిద్ధించు ననుటయు నుచితము కాదు. ఏల యనఁగా అదియు సర్వసాధారణము.

ఒకానొకఁడే తాత్పర్యవిశేషమును గ్రహించునుగాని సర్వజనులు గ్రహింపరన్నచో, ఆ! అప్పుడు పురుషగత మయిన నిర్దోషత్వరూప మగు ఒకానొకవిశేషమె నియామక మని చెప్పవలెను. అది యీపక్షమునందును ఉండనే యున్నది. కావున, ఎట్టి శుద్ధాంతఃకరణుఁ డగు పురుషునకు తాత్పర్యానుసంధానపూర్వకముగా లక్షణచే వాక్యార్థబోధము మీచే నంగీకరింపఁబడుచున్నదో, అట్టివానికే కేవల మయిన శబ్దవిశేషము అఖండసాక్షాత్కారమును సంబంధము లేకున్నను జనియింపఁజేయు నన్నఁ దోష మేమి? ఈ పక్షమునందు శబ్దవృత్త్యవిషయ మనుటవలన 'యతో వాచో నివర్తన్తే' అను శ్రుతి మిక్కిలి యనుగత మగుచున్నది. ఈ భగవ దభిప్రాయము వార్తికకారులు వివరించి యున్నారు—దుర్బలత్వా దవిద్యాయా ఆత్మత్వా ద్బోధరూపిణః। శబ్దశక్తే రచిన్త్యత్వా ద్విద్మ స్తం మోహహానతః, అగృహీత్వైవ సంబన్ధ మభిధానాభిధేయయోః। హిత్వా నిద్రాం ప్రబుధ్యన్తే సుషుప్తే ర్బోధితాః పరైః, జాగ్రద్వన్న యతః శబ్దం సుషుప్తే వేత్తి కశ్చన। ధ్వస్తేఽతో జ్ఞానతోఽజ్ఞానే బ్రహ్మాస్మీతి భవేత్ఫలమ్, అవిద్యాఘాతిన శ్శబ్దా ద్యాఽహం బ్రహ్మేతి ధీ ర్భవేత్। నశ్యత్యవిద్యయా సార్ధం హత్వా రోగ మివౌషధమ్'* ఇత్యాది గ్రంథముచేత. కావున, ఇట్లు, చెప్పుటకు కర్మ మయిన ఆత్మయు చెప్పువాఁడును చెప్పుట యను క్రియయును ఆశ్చర్యము లగుటవలన ఆత్మ దుర్విజ్ఞేయుఁ డని ప్రతిపాదించి, శ్రోత దుర్లభుఁ డగుటవలనఁగూడ దుర్విజ్ఞేయుఁ డని ప్రతిపాదించుచున్నాఁడు—ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి శ్రుత్వాఽప్యేనం వేద. అన్యః— చూచినవాఁడును చెప్పువాఁడు నగు ముక్తునికన్న విలక్షణుఁడు ముముక్షువు, వక్త యగు బ్రహ్మవేత్తను యథావిధి నాశ్రయించి, ఏనమ్—ఈయాత్మను, శృణోతి— శ్రవణ మను పేరు గల విచారమునకు విషయముగాఁ జేయుచున్నాఁడు, వేదాంత వాక్యముల తాత్పర్యము నిశ్చయించుటచే ఇట్టివాఁ డని నిశ్చయించుచున్నాఁ డని యర్థము. శ్రుత్వా= విని, ఏనమ్, మనననిదిధ్యాసనపరిపాకమువలన, వేద అపి =

---

* అవిద్య దుర్బల మగుటవలనను బోధరూపుఁడే ఆత్మ యగుటవలనను శబ్దశక్తి యచింత్య మగుటవలనను మోహము విడుచుటవలన అతని నెఱుంగుచున్నాము. శబ్దార్థముల సంబంధమును గ్రహింపకయే ఇతరులచే బోధింపఁబడినవారై జనులు నిద్రను విడిచి సుషుప్తినుండి లేచుచున్నారు. జాగ్రదవస్థయందుంబోలె సుషుప్తియందు ఎవ్వఁడును శబ్దము నెఱుంగఁజాలఁడు గదా! కావున జ్ఞానమువలన అజ్ఞానము నశింపఁజేయఁబడిన పిదప 'బ్రహ్మాస్మి' యను వృత్తి ఫల మగును. అవిద్యను నశింపఁజేయునట్టి శబ్దమువలన 'అహం బ్రహ్మ' అను వృత్తి యేది కలుగుచున్నదో, అది, రోగమును నశింపఁజేసి యౌషధముంబోలె, అవిద్యతోఁగూడ నశించుచున్నది.

ఎఱుఁగుచున్నాఁడుగూడ, ఆశ్చర్యవత్ — ఆశ్చర్యమువలె. ఇందుచే 'ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమ్' అనునది వ్యాఖ్యాత మగుచున్నది. ఇచటఁగూడ అనేకజన్మానుష్ఠితము లయిన సుకృతములచే క్షాళిత మగు మనోమలము గలవాఁ డగుటచే అతిదుర్లభుఁ డగుటవలన కర్తకు ఆశ్చర్యత్వ మని యెఱుంగునది. అట్లు చెప్పఁబోవుచున్నాఁడు 'మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే। యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః' అని. 'శ్రవణాయాఽపి బహుభిర్యో న లభ్యః శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః। ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః' * అని శ్రుతియుఁ జెప్పుచున్నది. ఇట్లు శ్రవణక్రియకును శ్రోతవ్యాత్మకును ఆశ్చర్యత్వము మునుపటియట్లు గ్రహించునది. ఓయీ! ఎవఁడు శ్రవణమననాదికము చేయుచున్నాఁడో అతఁ డెఱుంగుచున్నాఁ డనుట యేమి యాశ్చర్యము? అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు—నచైవ కశ్చిత్. చకారము (క్రియాకర్తృపదముల) యనుకర్షణము కొఱకు. కశ్చిత్ = ఒకానొకఁడు, ఏనమ్— ఈ యాత్మను; నైవవేద=ఎఱుఁగనే యెఱుంగఁడు శ్రవణాదికము చేసినను. ఇఁక శ్రవణాదికము చేయనివాఁ డెఱుంగఁ డని చెప్పవలయునా? శ్రవణాదికము చేసినవాఁడుగూడ ఎఱుంగలేఁ డనుట 'ఐహిక మప్రస్తుత ప్రతిబన్ధే తద్దర్శనాత్' ♦ అను న్యాయము వలన. వార్తికకారులచేతనుం జెప్పఁబడినది 'కుతస్తద్ జ్ఞాన మితి చేత్తద్ధి బన్ధపరిక్షయాత్। అసావపిచ భూతో వా భావీ వా వర్తతేఽథవా' ❨ అని. శ్రవణాదికము చేయువారికిఁగూడ ప్రతిబంధపరిక్షయమువలననే జ్ఞానము జనియించుచున్నది కాని వేఱు గాదు. ఆ ప్రతిబంధపరిక్షయము ఒకానొకనికిఁ గడచియే యుండును హిరణ్యగర్భునకుంబోలె. ఒకానొకనికి రాఁబోవునది యగును వామదేవునకుంబోలె. ఒకానొకనికి వర్తమానమై యుండును శ్వేతకేతువునకుంబోలె. కావున ప్రతిబంధక్షయ

---

* శ్రవణము చేయుటకుఁగూడ అనేకులచే నెవఁడు పొంద నలవికాఁడో. శ్రవణము చేయువారైనను అనేకులు ఎవనిఁ దెలియఁజాలరో. చెప్పువాఁడు సమర్థుఁడు. అట్టి సమర్థునిచే శిక్షితుఁడై తెలియువాఁడు ఆశ్చర్యరూపుఁడు.

♦ అప్రస్తుతప్రతిబన్ధే = ఆరంభింపఁబడిన విద్యాసాధనమునకుఁ బ్రతిబంధము లేనియెడ, ఐహికమ్ = విద్యాప్రాప్తి యీజన్మమునందే కలుగును. తద్దర్శనాత్—అట్లు శ్రుతియందుఁ గనఁబడుటవలన 'శ్రవణాయాపి బహుభిర్యోనలభ్యః శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః' ఇత్యాదిగా.

❨ దేనివలన అజ్ఞానము కలుగు ననఁగా అది ప్రతిబంధనాశమువలననె కలుగును. ప్రతిబంధనాశముగూడ భూతము—కడచినది కలుగఁబోవునది వర్తమానము అని మూఁడువిధములు.

మతి దుర్లభ మగుటవలనను 'జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః'* అను స్మృతివలనను దుర్విజ్ఞేయుఁ డీయాత్మ యని నిర్గళిత మైన యర్థము. 'శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్' అనియే వ్యాఖ్యానము చేయవలె నన్నపక్షమున, అప్పుడు 'ఆశ్చర్యో జ్ఞాతా కుశ లానుశిష్టః' అను శ్రుతితో నేకవాక్యత లేక పోవును, 'యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః' అను భగవద్వచనముతో విరోధ మగును, కావున విద్వాంసు లీయవినయము క్షమింపవలెను. లేక. నచైవ కశ్చిత్ అనుదానికి సర్వత్ర యన్వయము. కశ్చిత్ ఏనం నపశ్యతి నవదతి నశృణోతి శ్రుత్వా ఽపి నవేద—ఒకానొకఁడు ఈయాత్మను జూడఁడు చెప్పఁడు వినఁడు వినియు నెఱుంగఁడు అని. ఇందు అయిదుప్రకారములు చెప్పఁబడినవి. ఎట్లనఁగా—ఒకఁడు చూచనుమాత్రము చూచును చెప్పఁడు, ఒకఁడు చూచును జెప్పను గూడ, ఒకఁడు వానివాక్యము వినును తదర్థము నెఱుంగునుగూడ, ఒకఁడు వినియు నెఱుంగఁడు, ఒకఁడు చూచుట మొదలగున దేమియుఁ జేయఁడు. అవిద్వాంసునిపక్షమున అసంభావనావిపరీతభావనలచే నభిభూతుఁ డగుటవలన దర్శనవదనశ్రవణములు ఆశ్చర్యతుల్యము లనుట స్పష్టము. చతుర్థపాదమునందు మాత్రము, దృష్ట్వా ఉక్త్వా శ్రుత్వా ఽపి—చూచియు చెప్పియు వినియును అని యన్వయము.

శ్రీ. అప్పు డెందువలన విద్వాంసులుగూడ లోకమునందు శోకించెదరు? అనఁగా ఆత్మాజ్ఞానమువలనని యను నభిప్రాయముచే ఆత్మ దుర్విజ్ఞేయుఁ డనుటం జెప్పుచున్నాఁడు.—కశ్చిత్ = ఒకానొకఁడు, ఏనమ్ = ఈయాత్మను, శాస్త్రాచార్యోపదేశములచేఁ జూచుచు, ఆశ్చర్యవత్ పశ్యతి = ఆశ్చర్యమునలెఁ జూచుచున్నాఁడు, సర్వగతుండును నిత్యజ్ఞానానందస్వభావుఁడు నగు ఆత్మ అలౌకికుఁ డగుటవలన ఐంద్రజాలికవస్తువునువలె ఘటిల్లనిదానిం జూచునట్లు విస్మయమునఁ జూచుచున్నాఁడు అసంభావనచే అభిభూతుఁ డగుటవలన. అట్లు, ఆశ్చర్యవత్ ఏవ=ఆశ్చర్యమువలెనే, అన్యః, వదతిచ. అన్యః శృణోతిచ. కశ్చిత్—ఒకానొకఁడుమాత్రము, విపరీతభావనచే అభిభూతుఁ డగువాఁడు, శ్రుత్వా ఽపి నైవ వేద. చకారమువలన ఉక్త్వా ఽపి దృష్ట్వా ఽపి—చెప్పియును చూచియును, చక్కఁగా నెఱుంగఁ డని తెలియునది.

ప. ఆ యాత్మజ్ఞానమో అతిదుర్లభ మని చెప్పుచున్నాఁడు.—కశ్చిత్—అనాదిగా బహుకోటి జన్మముల దృశ్యసంఘాతమునే చూచుటయందు అభి

* పాపకర్మక్షయమువలనఁ బురుషునకు జ్ఞానము జనించును.

నివిష్ట మయిన దృష్టి గల పురుషుండు ఒకానొకఁడు, శాస్త్రాచార్యోపదేశమువలన, ఏనమ్—నిరాకారాద్వైతచిదేకరసుం డగు ఆత్మను, ఆశ్చర్యవత్ పశ్యతి, ఏల యనఁగా మున్నెప్పుడును అనుభవింపనివస్తువును జూచుటగాని వినుటగాని యాశ్చర్యజనక మగును, దృష్టాంతము లేకుండుటవలన మోహము నొందుచున్నవాఁడై యని యర్థము. అట్లు, అన్యః—ఇతరుఁడు ఒకానొకఁడు ఆత్మతత్త్వము తెలియనివాఁడు, ఎవఁడు, శాస్త్రమువలన వినఁబడుచున్న శబ్దమాత్రముచే, వదతి=చెప్పుచున్నాఁడో, వాఁడుగూడ, ఆశ్చర్యవత్—ఆశ్చర్యమువలె, తలఁచి యేమో చెప్పుచున్నాఁడు. కావున ఏతన్నిరూపణమునందు సావధానుండవై యుండవలె నని యర్థము. ఈయర్థమున అథర్వశాఖీయశ్రుతియును గలదు. “శ్రవణా యాఽపి బహుభి ర్యో న లభ్యః శృణ్వన్తోఽపి బహవో యం నవిద్యుః । ఆచార్యో వక్తా కుశలోఽస్య లబ్ధా ఽఽశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః” అని. ఇందుకు భాష్యము—యః=ఏపరమాత్మ, ఉత్తమాచార్యువలన, శ్రవణాయాపి= వినుటకొఱకుగూడ, బహుభిః నలభ్యః= పెక్కండ్రకు సులభుఁడు కాఁడో, మఱి యే మనఁగా, దైవవశమున ఎవ్వనికో ఒకనికిమాత్రమె యని యర్థము. అట్లు, యమ్ = ఏపరమాత్మను, శృణ్వన్తః అపి=వినుచున్నవారైనను, బహవః=పెక్కండ్రు, నవిద్యుః=పొందరైరి, మఱి యే మనఁగా ఒకానొకఁడుమాత్రమె. అట్లు, అస్య = ఈపరమాత్మయొక్క, లబ్ధౌ = పొందుటయందు, ఎవఁడు, అకుశలః = అసమర్థుఁడైన, ఆచార్యః = ఆచార్యుఁడు, వక్తి= చెప్పుచున్నాఁడో, సః= ఆయాచార్యుఁడు, ఆశ్చర్యః= ఆశ్చర్యరూపుఁడగుచున్నాఁడు, మోహము నొందుచున్నాఁ డని యర్థము. అట్లు, కుశలానుశిష్టః= సమర్థుం డైన ఆచార్యునిచే ఉపదేశింపఁబడిన, జ్ఞాతా = శిష్యుఁడును, ఆశ్చర్యః = ఆశ్చర్యరూపుఁ డగుచున్నాఁడు.

రా. అట్లు, శరీరాత్మవాదమునందుంగూడ లేదు శోకమునకు నిమిత్త మని చెప్పి, శరీరాతిరిక్తుఁడును ఆశ్చర్యస్వరూపుఁడు నగు ఆత్మను తెలియువాఁడును శ్రవణము చేయువాఁడును ఉపదేశించువాఁడును దుర్లభులు, కావున అట్టి శ్రవణముచేఁ గలుగు ఆత్మతత్త్వనిశ్చయంబును దుర్లభము అని చెప్పుచున్నాఁడు.—ఆశ్చర్యవత్= స్వేతరము లయిన సమస్తవస్తువులకును విలక్షణుఁ డగుటచే ఆశ్చర్యమువలె నున్నవాఁడగు; ఏనమ్=ఇట్లు చెప్పఁబడిన స్వభావము గల యీఆత్మను; కశ్చిత్ = అనంతజంతువులందు మహాతపస్సుచే పాపక్షయము నొంది బహుపుణ్యపరిపాకము గలవాఁడు ఒకానొకఁడుమాత్రమె; పశ్యతి = చూచుచున్నాఁడు. తథైవ = అట్లే; అన్యః = అట్టి

వాఁడు ఒకానొకఁడుమాత్రమె; ఆశ్చర్యవత్ = ఆశ్చర్యమువలె నున్న యీయా త్మను; వదతిచ = మఱియొకనికిఁ జెప్పుచున్నాఁడుగూడ. ఇట్లు, అన్యః= ఒకానొకఁడు మాత్రమె; ఆశ్చర్యవత్= ఆశ్చర్యమువలె నున్న; ఏనమ్=ఈయాత్మను; శృణోతిచ= వినుచున్నాఁడుగూడ. శ్రుత్వాపి= వినియును; ఏనమ్ = ఈయాత్మను; కశ్చిత్ = ఒకానొకఁడును; నైవవేద = యథాతత్త్వముగా ఎఱుంగనే యెఱుంగఁడు. నచైవ అనుచోటి చకారమునవలన ద్రష్టయందును వక్తయందును శ్రోతయందునుగూడ, తత్త్వదర్శనము తత్త్వవచనము తత్త్వశ్రవణము దుర్లభ మని చెప్పఁబడుచున్నది.

ఇతరము లయిన ప్రపంచమునందలి సమస్తవస్తువులకన్నను విలక్షణుఁడై యాశ్చర్యమువలె నున్న యీయాత్మను అందఱు నెఱుంగఁ జాలరు. లెక్కకు మీఱిన జనులలో బహుజన్మములందు మహాతపస్సుచేసి పాపక్షయము నొందినవాఁడై బహుసుకృతోపచయము పొందినవాఁ డెవ్వఁడో ఒకానొకఁడుమాత్రమె యెఱుంగఁ జాలును. అట్టివాఁ డెవ్వఁడో ఒకానొకఁడుమాత్రమె యితరున కుపదేశింపఁ జాలును. అట్లు బహుజన్మకృత సుకృతపరిపాకము గలవాఁ డెవ్వఁడో ఒకఁడుమాత్రమె యీ యాత్మను శ్రవణము చేయును. శ్రవణము చేసినను ఈయాత్మయొక్క వాస్తవ తత్త్వము నెఱుంగుట మిక్కిలి దుర్లభము. అట్లు ఎఱింగితి మనువారికి తత్త్వజ్ఞా నము గలుగుటయుఁ బరుల కుపదేశము చేయువారికిఁ దత్త్వోపదేశము సేయు సామ ర్థ్యమును శ్రవణము చేయువారికిని తత్త్వము వినఁ గలుగుటయు దుర్లభ మని తాత్పర్యము.

మా. దేహయోగంబును తద్వియోగంబును నియతము లగుటవలనను, ఆత్మ ఈశ్వరసరూపుఁ డగుటవలన అతనికి సర్వథా నాశము లేమివలనను, శోకము చేయరా దని యుపసంహరించుటకై యీశ్వరుని సామర్థ్యమును మరల నుగ్గడించు చున్నాఁడు.—ఏనమ్ = ఈజీవుని, ఈ చెప్పిన లక్షణములు గల ఈశ్వరునితో సరూప త్వము గలవానిఁగా; కశ్చిత్ = ఒకానొకఁడు, ఎవ్వఁడు; పశ్యతి = చూచుచున్నాఁ డో; అతఁడు, ఆశ్చర్యవత్ = ఆశ్చర్యరూపుఁడు. అట్లు, అన్యః = ఇతరుఁడు, ఎవఁడు; వదతి = తత్త్వముచొప్పునఁ జెప్పుచున్నాఁడో, సచ—అతఁడును; తథైవ = అట్లే; ఆశ్చర్యవత్ = ఆశ్చర్యరూపుఁడు. అన్యః = మఱియొకఁడు. ఎవఁడు; ఏనమ్ = ఈ జీవుని; తత్త్వముగా, శృణోతి = వినుచున్నాఁడో; సచ = అతఁడును; ఆశ్చర్యవత్ = ఆశ్చర్యరూపుఁడు. స్వార్థమునందు వతిప్రత్యయము. కశ్చిచ్చ = ఒకానొకఁడుగూడ;

ఏనమ్ = ఈ జీవుని; శ్రుత్వా అపి = వినియును; నైవవేద = ఎఱుఁగనే యెఱుఁగఁడు. ఎందువలన వీరు ఆశ్చర్యరూపు లనఁగా, దుర్లభు లగుటవలన నని యెఱుంగునది. దుర్లభమైన వస్తువు గదా లోకమున ఆశ్చర్య మనఁబడుచున్నది. ఆత్మ ఈశ్వర సహాపుఁడు సూక్ష్ముఁడు అగుటవలన ఆత్మజ్ఞానము గలవాఁడు దుర్లభుఁడు.

ఈ జీవునితత్త్వము తెలియువాఁడు ఆశ్చర్యము, మఱియొకరికిఁ జెప్పువాఁడును ఆశ్చర్యము, వినువాఁడును ఆశ్చర్యము. ఏల యనఁగా దుర్లభ మైన వస్తువు లోకమున ఆశ్చర్య మనఁబడుచున్నది. ఆత్మజ్ఞానము గలవాఁడు దుర్లభుఁడు. ఎందువలన ననఁగా ఆత్మ యీశ్వరసహాపుఁడును సూక్ష్మరూపుఁడును అగుటవలన శ్రవణము చేసినను అతని దెలియుట మిక్కిలి కష్టమని తాత్పర్యము.

దేహీ నిత్య మవధ్యో ఽయం దేహే సర్వస్య భారత
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి. 30

భా. ఇఁక నిప్పుడు ప్రకరణార్థము నుపసంహరించుచున్నాఁడు.— భారత = అర్జునుఁడా! ఎందువలన, అయమ్ = ఈ; దేహీ = ఆత్మ; సర్వగతుఁ డగుటవలన, సర్వస్య = సమస్త ప్రాణిజాతముయొక్క, దేహే = దేహమునందు, ఉన్నవాఁడైనను; నిత్యమ్ = ఎల్లప్పుడును, సర్వావస్థలందును; అవధ్యః = వధింప శక్యము కాఁడో, సమస్త ప్రాణిజాతము యొక్క శరీరములు వధింపఁబడుచున్నను; తస్మాత్ = అందువలన; సర్వాణి= సమస్తము లయిన; భూతాని = భీష్మాదిభూతములను గూర్చి; త్వమ్ = నీవు; శోచితుమ్ = దుఃఖించుటకు; నార్హసి = తగినవాఁడవు కావు.

అర్జునా! ఇట్లు సర్వప్రాణిజాతముల దేహములందును ఉండునట్టి యీ యాత్మను, ఆ దేహము లన్నియు హతము లగుచున్నను సర్వావస్థలందును వధింప శక్యము కా దని యేర్పడుచున్నది గదా! అందువలన భీష్మాదులు మాత్రమె కాదు, సమస్తభూతములును వధింపఁబడినను వారిఁగూర్చి నీవు దుఃఖించుట యుచితము కా దని తాత్పర్యము.

ఆ. మీఁదిశ్లోకమున కవతారిక చేయుచున్నారు ఇఁక నని. ఆత్మను దెలియుట కష్ట మని నిరూపించిన యనంతర మని యర్థము. వస్తుగతిని శోకమోహములు వహింప రా దనుట ప్రకరణార్థము. దేహము వధింపఁబడుచున్నను

దేహీ వధ్యుఁడు కాఁడని యేర్పఱుటచే ఫలితముఁ జెప్పుచున్నాఁడు మూలమునందు తస్మాత్ ఇత్యాదిగా. హేతుభాగమును విభజించుచున్నారు ఎందువలన నిత్యాదిగా. ఫలితముం దెలుపునట్టి శ్లోకార్థమును వివరించుచున్నారు తస్మాత్ = అందువలన ఇత్యాదిగా.

హ. ఇఁక నిప్పుడు ప్రకరణ ముపసంహరింపఁబడుచున్నది.—తస్మాత్. సర్వాణి భూతాని—భీష్మాదిసర్వభూతములనుగూర్చి. న త్వం శోచితు మర్హసి.

శం. మున్ను 'అవ్యక్తా దీని భూతాని' అను శ్లోకముచే భీష్మాదిశబ్దవాచ్యార్థము శోచ్యము కా దనుట యుపసంహరింపఁబడినది. ఇప్పుడు లక్ష్యార్థ మయిన ఆత్మ శోచ్యుఁడు కాఁ డనుట నుపసంహరించుచున్నాఁడు.—భారత = ఆత్మజ్ఞానసంపన్నుఁడా! అయమ్ = ఈ; దేహీ—సర్వదేహములును ఉపలబ్ధిస్థానముగా నితనికిఁ గలవు, కావున దేహీ, సర్వదేహములు నుపాధిగాఁ గల ఆత్మ; సర్వస్య = బ్రహ్మాది స్తంబపర్యంత మయిన ప్రాణిజాతముయొక్క; దేహే = దేహము, వధ్యమానే ఽపి * వధింపఁబడుచున్న దైనను; నిత్యమ్; తాను, అవధ్యః = వధింప నలవిగానివాఁడే యగుచున్నాఁడు. అక్రియుఁ డగుటవలన, ఆత్మ, ఘటములు నశించుచుండఁగా వానియందున్న ఆకాశమువలె, తా నేమో నశింపఁడు. తస్మాత్ = అందువలన, ఆత్మ నశింపఁ డని తెలియుటవలన, 'త ఇమే ఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ' అని చెప్పినవిధముగ, సర్వాణి భూతాని—భీష్మాదిసర్వభూతములను, శరీరములను, వీరు నావారు మరణము నొందుచున్నా రని, త్వం శోచితుం నార్హసి. వీరు వధింపఁబడుచున్నను ఆత్మ నశింపఁ డని యాత్మనిత్యత్వము నెఱిఁగినట్టి నీవు ఆత్మనుగూర్చి శోకమునుగాని మోహమునుగాని వహింప నర్హుఁడవు గావని యర్థము. ఇట, 'దేహము నశించును' అనియు 'నాది యిది' అనియు ఎవనికి దేహవిషయము లయిన శోకమోహములు లేవు, అట్టి అప్రతిబద్ధ మైన అపరోక్షజ్ఞానముగల విద్వాంసునకు 'దైవాధీనే శరీరే ఽస్మిన్ గుణభావ్యేన కర్మణా' ♦ అను న్యాయమున, శరీరము ప్రారబ్ధాధీన మగుటవలన శరీరయాత్రార్థ కర్మమేనియుఁ గొంచెమయినను చేయవలసినది లేదు. ఇఁక నితరకర్మము చేయవలసినది లే దని చెప్పవలయునా? కావున సిద్ధుఁ డైన బ్రహ్మవేత్తకు సర్వకర్మసన్న్యాసమునందే యధి

* అధ్యాహార్యము.

♦ ఈశరీరము ప్రారబ్ధాధీనము, కర్మము గుణాధీన మని తాత్పర్యము.

కార మని ‘భూతాని న త్వం శోచితు మర్హసి’ అను పదములచే సూచిత మగుచున్నది.

మ. ఇప్పుడు సర్వప్రాణులకును సాధారణ మగు భ్రమయొక్క నివృత్తికి సాధనమైన చెప్పినవిషయము నుపసంహరించుచున్నాఁడు.—సర్వస్య= సమస్తప్రాణిజాతముయొక్కయు; దేహే= దేహము, వధింపఁబడుచున్నను; అయమ్ = ఈ; దేహీ= లింగశరీరోపాధికుఁ డైన ఆత్మ; అవధ్యః = వధ్యుఁడు కాఁడు, అనుట; నిత్యమ్ = నియతము, ఎందువలననో; తస్మాత్ = అందువలన; సర్వాణిభూతాని = భీష్మాదిభావాపన్నము లైన స్థూలశరీరములను సూక్ష్మశరీరములను అన్నిటిని ఉద్దేశించి; త్వం శోచితుం నార్హసి. అపరిహార్య మగుటవలన స్థూలదేహము అశోచ్యము, ఆత్మ వలెనే అవధ్య మగుటవలన లింగదేహము అశోచ్యము, ఇట్లు స్థూలదేహమును గాని సూక్ష్మదేహమును గాని ఆత్మను గాని యుద్దేశించి శోకింప నవసరము లే దని భావము.

శ్రీ. ఇట్లు దుర్బోధ మయిన ఆత్మతత్త్వమును సంక్షేపమున నుపదేశించుచు అశోచ్యత్వము నుపసంహరించుచున్నాఁడు దే హీత్యాదిగా.

ప. ఇఁకఁ బ్రకృతము ననుసరించుచున్నాఁడు.—దేహీ = శరీరప్రేరకుఁ డైన ఆత్మ; నిత్యమ్ = నిరంతరము; అవధ్యః=వధింపశక్యము కాఁడు, ఇందుచే నిత్యత్వము చెప్పఁబడినది. ఒకఁడే, సర్వస్య=సమస్తభూతజాతముయొక్కయు; దేహే = దేహమునందు, ఉన్నాఁడు, ఇందుచే వ్యాపకత్వము చెప్పఁబడినది. తస్మాత్ = ఆకారణమువలన; సర్వాణిభూతాని= తోఁబుట్టువులు సుహృదులు మొదలగు సర్వభూతములను గూర్చి; త్వం శోచితుం నార్హసి. తన్నిమిత్త మయిన శోకము వ్యర్థము. ఇఁక దేహనిమిత్తము శోకింతు నందువేని. తస్మాత్= అధిష్ఠానభూతుఁడు సత్యుఁడగు ఆత్మయొద్దనుండి; సర్వాణిభూతాని = సమస్తభూతములును, ఆవిర్భవించుచున్నవి, కావున దేహములు అధ్యాసరూపము లగుటచే అసత్యము లయిన దేహములను గుఱించి శోకించుటయు వ్యర్థము. ఈవిషయమే బృహదారణ్యకోపనిషత్తునం దుపదేశింపఁబడినది ‘స యథోర్ణనాభి స్తన్తు నోచ్చ రేద్యథా ఽగ్నేః క్షుద్రా విస్ఫులిఙ్గా వ్యుచ్చర న్త్యేవ మేవా ఽస్మా దాత్మన స్సర్వే ప్రాణా స్సర్వే లోకా స్సర్వే దేవా స్సర్వాణి భూతాని సర్వ ఏత ఆత్మానో వ్యుచ్చరన్తి। తస్యోపనిష త్సత్యస్య సత్య మితి। ప్రాణా వై సత్యం తేషా మేష సత్యమ్’ అని. ఇందుకు

భాష్యము—పూర్వగ్రంథమునందు 'అథ యదా సుషుప్తో భవతి న కస్య చన వేద'* ఇత్యాదిశ్రుతిచే సుషుప్తియందు మనస్సు పరమాత్మయందు లయము నొందఁగా, మనఃకల్పిత మయిన స్థూలసూక్ష్మప్రపంచముగూడ లయము నొందు నని ప్రతిపాదింపఁబడినది. అంత మరల జాగరావస్థయందు మనస్సు బహిర్ముఖము కాఁగానే పూర్వసంస్కారములచే మునుపటియట్లు మనఃకల్పితప్రపంచ మావిర్భవించుచున్నది. అట్లు 'ధాతా యథా పూర్వ మకల్పయత్' అని శ్రుతి వచించుచున్నది. ఇట్లు ప్రపంచము సుషుప్తియందు లయము నొందుటకును జాగరమునందు మరల నావిర్భవించుటకును దృష్టాంతము చెప్పఁబడుచున్నది.—ఊర్ణనాభిః— ఊర్ణ యనఁగా తంతువిశేషము, అది నాభియందుఁ గలది, ఒకానొకపురుఁగు ♦, సః = అది, యథా = ఎట్లు, తన్తునా—మున్ను తనచేఁ బుట్టింపఁబడినదియు మరల తనచే మ్రింగఁబడుచున్నదియు నగు తంతువుచే, ఉచ్చరేత్ = ఊర్ధ్వము చరించునో, సమస్తతంతువును మ్రింగునటు; అట్లు మనస్సు సర్వసంస్కారరూప మయిన తంతువును మ్రింగి తానును లీన మగుచున్నది. ఇఁక మరలఁ బ్రపంచము ఆవిర్భవించుట దృష్టాంతము చెప్పఁబడుచున్నది.—యథా = ఎట్లు; అగ్నేః = కొట్టఁబడుచున్న కొఱవినిప్పునుండి, ఏకకాలమునందే, క్షుద్రాః = మిక్కిలి యల్పము లయిన, విస్ఫులిఙ్గాః = అగ్నికణములు, ఉచ్చరన్తి - వేనవేలుగా వెడలుచున్నవో, ఏవ మేవ = ఇట్లే, అస్మాత్ ఆత్మనః = ఈమేలుకొన్న మనస్సునుండి, సర్వేప్రాణాః = సూక్ష్మప్రపంచరూపము లయిన సమస్తప్రాణములును, అట్లు, సర్వేలోకాః = స్థూలప్రపంచరూపము లయిన భూర్భువస్స్వరాదు లగు సమస్తలోకములును, సర్వేదేవాః = ఇంద్రాదిసమస్తదేవతలును, సర్వాణిభూతాని = స్థావరజంగమాత్మకము లయిన సమస్తభూతములును, ఏతే సర్వే ఆత్మానః = ఈసమస్తదేహములును, వ్యుచ్చరన్తి = వెడలుచున్నవి. తస్య= ఆపరమాత్మకు, ఉపనిషత్—ఆత్మబోధక మయిన శాస్త్రము, సత్యస్య సత్యమ్ =పరమాత్మ సత్యమునకుఁగూడ సత్యము, ఇతి—అని చెప్పుచున్నది. దీనినే నైౕ అనునది ప్రకటీకరించుచున్నది. వ్యవహారమునందు, ప్రాణాః = ముఖ్యప్రాణాదులు హిరణ్యగర్భప్రభృతులు, సత్యమ్=సత్యము, తేషా మపి=వారిలోఁగూడ, ఏషః = ఈయాత్మ, సత్యమ్. అదియే సత్యత్వమునకు పరమావధి అని యర్థము. ఇట్లు రెండువిధ

---

* ఇఁక ఎప్పుడు సుషుప్త్యవస్థను బొందినవాఁ డగుచున్నాఁడో. అప్పుడు దేనినిగూడ ఎఱుంగఁడు.

♦ సాలెపురుగు.

ములనుగూడ శోకముప కవసరము లేదని యర్థము. అట్లు అధ్యాత్మ మీమాంస యందుఁ జెప్పఁబడినది. “ఇన్ద్రైః ప్రాణై రితాన్తే ప్రవిశతి మనసా చేతసా సాక మేతత్ । బుద్ధ్యాస్తద్విశ్వజాతం సనకలకరణం తేన గర్భం దధానా, సా ఽన్యత్రే లీయమానా పునరుదయ మితా జాగరాదౌ ప్రసూతే । కీటీ చోర్ణా మివా సా పుత హుతవహాత్ సన్సరన్తి స్ఫులిఙ్గాః” * అని.

రా. భారత! సర్వస్య = సమస్త మయిన దేవాదిప్రాణిజాతముయొక్క; దేహే = దేహము; వధ్యమానే ఽపి = వధింపఁబడుచున్నను; అయమ్ = ఈ; దేహీ = ఆత్మ; నిత్యమ్ = ఎల్లప్పుడు; అవధ్యః = వధింప శక్యము కానివాఁడు, అని తెలియవలెను. అందువలన దేవాదిస్థావరాంతము లయిన సమస్తభూతంబులును విషమ మయిన ♦ యాకారము గలవిగాఁ దోఁచుచున్నను ఇప్పుడు చెప్పిన స్వభావముచే స్వరూపమునందు సమానములును నిత్యములునుగా నున్నవి. వైషమ్యమును అనిత్యత్వమును దేహగతముమాత్రమే యగును. తస్మాత్ = అందువలన, సర్వాణి భూతాని = దేవతలు మొదలగు సమస్తభూతములను ఉద్దేశించి; త్వమ్ = నీవు; శోచితుమ్ = శోకించుటకు; నార్హసి = తగినవాఁడవు కావు, భీష్మాదుల నుద్దేశించి మాత్రమే కాదు.

దేవతలు మొదలుగాఁ గల సర్వజీవులయొక్క దేహములును వధింపఁబడుచున్నను దేహి యగు నీజీవుఁడుమాత్రము వధ్యుఁడు కానేకాఁడు. దేవాదిస్థావరాంతము లైన సమస్తభూతములును స్వరూపమున ఈ యవధ్యత్వస్వభావము గలవై సమానములును నిత్యములునుగా నున్నవి. వానియందుఁ దోఁచునట్టి యాకార వైషమ్యమును అనిత్యత్వమును దేహగతములుగాని స్వరూపగతములు కావు. అందువలన భీష్మాదులనుమాత్రమె కాదు, దేవాదిస్థావరాంతము లగు సమస్తభూతముల నుద్దేశించియు నీవు శోకింప నవసరము లేదని తాత్పర్యము.

---

* జీవునియొక్కయు బుద్ధియొక్కయు వ్యవహారాంతమునందు—సుషుప్తి వచ్చినపుడు, శేలో రూప మయిన వాసనాజాలముతోఁగూడ సమస్తకరణసహిత మయిన ప్రపంచజాతము బుద్ధిలోపలఁ బ్రవేశించుచున్నది. అందుచే ఆబుద్ధి గర్భము ధరించినదై పరమాత్మయందు లీన మగుచున్నది. అది మరల జాగరాదియందు ఉదయము నొంది ప్రసవించుచున్నది. ఎట్లు కీటము తంతువును మ్రింగుచున్నదో అట్లు బుద్ధి విశ్వజాతమును మ్రింగుచున్నది. ఎట్లు కొఱవినిప్పునుండి యగ్నికణములు వెడలునో అట్లు ఈబుద్ధినుండి విశ్వజాతము వెడలును.

♦ పరస్పరభిన్న మయిన.

మూ. *

స్వధర్మ మపి చావేక్ష్య న వికమ్పితు మర్హసి
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయో ఽన్య త్క్షత్త్రియస్య న విద్యతే. ౩౧

భా. ఇందుఁ బరమార్థతత్త్వము నాలోచించినచో శోకముగాని మోహముగాని సంభవింప దని చెప్పఁబడినది. పరమార్థతత్త్వము నాలోచించినచో మాత్రను కాదు. మ తే మనఁగా.—స్వధర్మ మపి చ—స్వధర్మ మనఁగా నీదైన ధర్మము, క్షత్త్రియుని ధర్మ మయిన యుద్ధము, దానినిగూడ; అవేక్ష్య = ఆలోచించి; వికమ్పితుమ్ = చలించుటకు, తొలఁగుటకు; నార్హసి = తగినవాఁడవు కావు, క్షత్త్రియునియొక్క స్వాభావిక మయిన ధర్మమునుండి, నీయొక్క స్వాభావిక మయిన ధర్మము నుండి యని యభిప్రాయము. హి = ఎందువలన ననఁగా; ఆయుద్ధము పృథివీజయద్వారమున ధర్మార్థమును ప్రజారక్షణార్థమును అగుచున్నది, కావున, ఉత్తమ మయిన, ధర్మ్యము—ధర్మమునుండి తొలఁగనిది, అట్టి, ధర్మ్యాత్ = ధర్మ్య మయిన; యుద్ధాత్ = యుద్ధముకంటె; అన్యత్ = ఇతర మయిన; శ్రేయః = మేలు; క్షత్త్రియస్య = క్షత్త్రియునకు; నవిద్యతే = లేదు.

పరమార్థతత్త్వము విచారించినచో నీవు యుద్ధము విడువ నవసరము లేదని చెప్పఁబడినది గదా! పరమార్థతత్త్వము విచారింపకున్ననుగూడ నీవు యుద్ధము నుండి తొలఁగుట యుక్తము గాదు. ఏల యనఁగా, నీవు క్షత్త్రియుఁడవు, కావున యుద్ధము నీకు స్వధర్మము; అట్టి ధర్మ్య మయిన యుద్ధమువంటి శ్రేయస్కర మయిన కర్మము క్షత్త్రియునకు మఱియొకటి కాన రా దని తాత్పర్యము.

ఆ. మీఁదిశ్లోకమున కవతారిక చేయుచుఁ గడచిన విషయముఁ జెప్పుచున్నారు ఇందు ఇత్యాదిగా. ఇందు—పూర్వశ్లోకమునందు. పారమార్థిక మయిన తత్త్వ మేది గలదో దాని నపేక్షించినపుడుమాత్రమే శోకమోహములు సంభవింప వనుట గాదు, మఱి యే మనఁగా స్వధర్మమునుగూడ అపేక్షించినను అని యన్వయము. నీదైన క్షత్త్రియధర్మము నాలోచించి దానినుండి తొలఁగుటను

* ఈ శ్లోకము మొదలు ౩౮వ శ్లోకమువఱకు స్పష్టార్థ మ్మను నభిప్రాయముచే మధ్వాచార్యులు వ్యాఖ్యానము చేయ రైరి.

విడువవలె నని యర్థము. ఏది క్షత్త్రియునకు ధర్మ్య మైన * శ్రేయస్సాధనమో దానినే కదా నే ననువర్తింపవలె నని యాశంకింపఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు ఉత్తరార్థముచేత. జాతిప్రయుక్త మగు—స్వాభావిక మగు స్వధర్మమునకే విశేషణము చేయుచున్నారు క్షత్త్రియునియొక్క అని. చలించుట కయోగ్య మనుటకు హేతువుఁ జెప్పుచున్నారు స్వాభావిక మయిన అని. స్వాభావిక మనఁగా అశాస్త్రీయ మను శంకను వారించుటకై తాత్పర్యముఁ జెప్పుచున్నారు నీయొక్క స్వాభావిక మైన అని. స్వాభావికము—క్షత్త్రియత్వస్వభావప్రయుక్త మైనది వర్ణాశ్రమోచిత మైనది యని యర్థము. ధర్మార్థమును ప్రజాపరిపాలనార్థమును ప్రయత్నించువాఁడు యుద్ధమునుండి యుపరమింపఁ గోరుట యుచిత మని యాశంకింపఁగా అందుకుఁ జెప్పుచున్నారు ఆయుద్ధము ఇత్యాదిగా. దానికన్నను శ్రేయస్కరమయిన కర్మము ననుష్ఠించుటకు యుద్ధము విడువవచ్చు నని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నారు అట్టి ధర్మ్యాత్ ఇత్యాదిగా. అందువలన యుద్ధమునుండి తొలఁగుట యనుచిత మని శేషము.

హ. పరమార్థతత్త్వాపేక్షచే శోకమోహములు సంభవింప వని చెప్పఁబడినది. పరమార్థతత్త్వాపేక్షచేమాత్రమె కదా శోకమోహములు కర్తవ్యములు కావని యాశంకింపఁగా అట్లు గా దని చెప్పుచున్నాఁడు.—స్వధర్మమపిచ = క్షత్త్రియునకు స్వధర్మ మయిన యుద్ధమునుగూడ; అవేక్ష్య; నీవు; వికమ్పితుం నార్హసి = చలింపరాదు. హి = ఎందువలన ననఁగా. ధర్మ్యాత్ = స్వాభావిక మయిన; యుద్ధాత్, అన్యత్, శ్రేయః, క్షత్త్రియస్య, నవిద్యతే.

శం. 'వేదా వినాశినం నిత్యమ్' అనుశ్లోకముచే « ఇది యంతయు నేనును బ్రహ్మము అని సమస్తమును బ్రహ్మమాత్ర మను ఆత్మప్రసాదజన్య మయిన జ్ఞానమెవ్వనికిఁ గలుగునో అతనికిఁ గొంచెమేని కర్తవ్యము లే » దని స్పష్టముగా నిరూపింపఁబడినది. ఇఁక తద్భిన్నుఁడును నేను నాది యను నభిమానము గలవాఁడు నగు ముముక్షువు, « బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన » ఇత్యాది శ్రుతివలన, పూర్వోక్తజ్ఞానము సిద్ధించుకొఱకు చిత్తశుద్ధికై, శాస్త్రచోదిత మగు స్వధర్మము అనుష్ఠింపవలసినదే యని బోధించుట కీప్రకరణ మారంభింపఁబడుచున్నది. అందు మొదట అర్జునునకు ఆత్మజ్ఞానము లే దని యెఱింగి, తన భక్తుండును ముముక్షువు

* ధర్మమునుండి తొలఁగని.

నగు అతని, కర్తవ్య మయిన స్వధర్మమునందుఁ బ్రవర్తింపఁజేయుటకై యీవాక్యము చెప్పుచున్నాఁడు శ్రీభగవంతుఁడు.—కర్తయు కరణమును కార్యమును సర్వమును బ్రహ్మమే యని తెలిసినయెడ అప్పుడు కొంచెమేని చేయవలసినదే లేదు. ఇఁక, ‘వీరు నావారు నాచే వధింపఁబడుచున్నారు’ అను భేదజ్ఞాన మున్నపక్షమునన్, చ అనునది తు అనుదాని యర్థము గలది, తదా అపి = అప్పుడుగూడ; స్వధర్మమ్— ‘యుద్ధం స్వధర్మో నృపతేః ప్రజానాం పరిపాలనమ్’ * ఇత్యాదిశాస్త్రముచే క్షత్త్రియునకుఁ గర్తవ్యముగా విధింపఁబడిన దానిని; అవేక్ష్య = స్వబుద్ధిచే విచారించి; నీవు, వికమ్పితుమ్ = స్వధర్మమునుండి తొలఁగుటకు; నార్హసి. స్వధర్మమును విడువరా దనుటవలన, స్వధర్మ మగుటచేఁ గర్తవ్యముగాఁ బ్రాప్తించిన యుద్ధము విషయ మయి, యాగవిషయమునంబోలె, శోకమోహములను హింసాదిదోషవిచారంబును విద్వాంసుఁడు చేయఁగూడ దని సూచిత మగుచున్నది. ధర్మ్యాత్ = ధర్మశాస్త్రమువలనఁ బ్రాప్తము, కర్తవ్య మని విహిత మగునట్టి; యుద్ధాత్; అన్యత్ = ఇతరము; శ్రేయః — శ్రేయస్సాధనము; క్షత్త్రియస్య; నవిద్యతే = లేదు. జయలబ్ధము లగు ధనాదులచేతమాత్రమె సాధ్యము లగు యాగములచేతను దానములచేతను వ్రతాదులచేతను చిత్తశుద్ధి సిద్ధించును, దానిచే జ్ఞానము కలుగును, దానిచే మోక్షప్రాప్తి యగును, కావున యుద్ధము శ్రేయస్సాధన మనుట యుక్తము. అందువలన యుద్ధము కర్తవ్యమే యని సిద్ధము. హి అనునది ‘యే యుధ్యన్తే ప్రధనేషు శూరాసః’ ♦ ఇత్యాదిశ్రుతిప్రసిద్ధిద్యోతనార్థము.

వ్య. ఈప్రకారముగా స్థూలశరీరము సూక్ష్మశరీరము వీనికిఁ గారణ మయిన కారణశరీరము అను నుపాధిత్రయముయొక్క వివేకము లేమిచే మిథ్యాభూత మయినను సంసారము సత్యమని ఆత్మ ధర్మమని ఇత్యాదిగాఁ దోఁచుట యేది గలదో, అట్టి సర్వప్రాణిసాధారణ మయిన భ్రమను అర్జునునకు నిరాకరించుటకై యుపాధిత్రయవివేకపూర్వకముగా ఆత్మస్వరూపము ప్రతిపాదించెను. ఇప్పుడు యుద్ధాఖ్యమయిన స్వధర్మమునందు హింసాదిదోషబాహుల్యమునంజేసి యధర్మత్వబుద్ధి యేది గలదో అట్టి కరుణాదిదోషజన్య మయిన యసాధారణభ్రమను అర్జునునకుమాత్రమె కలిగిన దాని నిరాకరించుటకై హింసాదులు గలదైనను యుద్ధము స్వధర్మం బగుటచే అధర్మము గాఁజాల దని బోధించుచున్నాఁడు భగవంతుఁడు.—కేవలము పరమార్థ

* రాజునకు యుద్ధమును ప్రజాపరిపాలనమును స్వధర్మము.

♦ ఎవ్వరు శూరులై యుద్ధములందుఁ బోరుదురో.

తత్త్వమునుమాత్రమె యాలోచించి కాదు. మఱేమనఁగా, స్వధర్మమపి = క్షత్త్రియధర్మమునుగూడ, యుద్ధమునకు వెనుదీయరాదనుటను; అవేక్ష్య = శాస్త్రముచేఁ బర్యాలోచించి; వికమ్పితుమ్ = చలించుటకు, అధర్మత్వ భ్రాంతిచేఁ దొలఁగుటకు; నార్హసి = తగినవాఁడవు కావు. అది యెట్లనఁగా, 'యద్యప్యేతే న పశ్యన్తి' ఇత్యాదిగా, 'నరకే నియతం వాసో భవతి' ఇత్యంతగ్రంథముచే యుద్ధము పాపహేతు వని నీ వేమి చెప్పితివో, 'కథం భీష్మ మహం సంఖ్యే' ఇత్యాదిగా గురువధ బ్రహ్మవధాదిదోష మగు నని యేమి చెప్పితివో అది యంతయు ధర్మశాస్త్ర పర్యాలోచనము లేనివాఁడ వగుటవలననే చెప్పితివి. హి — ఎందువలన ననఁగా. ధర్మ్యాత్ = వెనుదీయకుండుట యను ధర్మమునుండి తొలఁగని యట్టి; యుద్ధాత్ = యుద్ధముకన్న; అన్యత్ = ఇతరము; క్షత్త్రియస్య; శ్రేయః = శ్రేయస్సాధనము; న విద్యతే = లేదు. యుద్ధమే గదా పృథివీజయద్వారమునఁ బ్రజారక్షణము బ్రాహ్మణ శుశ్రూష మొదలగు క్షాత్త్రధర్మములకు నిర్వాహకము. కావున నదియే క్షత్త్రియునకుఁ బ్రశస్తతర మను యభిప్రాయము అట్లు చెప్పఁబడినది పరాశరునిచేత "క్షత్త్రియో హి ప్రజా రక్షన్ శస్త్రపాణిః ప్రదణ్డవాన్ । నిర్జిత్య పరసైన్యాని క్షితిం ధర్మేణ పాలయేత్" * అని. మనువుచేతఁ గూడ "సమోత్తమాధమై రాజా చాహూతః పాలయన్ ప్రజాః । న నివర్తేత సంగ్రామాత్ క్షాత్త్రం ధర్మ మనుస్మరన్ ॥ సంగ్రామేష్వనివర్తిత్వం ప్రజానాం చైవ పాలనమ్ । శుశ్రూషా బ్రాహ్మణానాం చ రాజ్ఞాం శ్రేయస్కరం పరమ్" ♦ ఇత్యాదిగా. రాజశబ్దమో క్షత్త్రియ జాతినే వచించు నని యిష్ట్యధికరణమునందు నిరూపితము. అందుచే భూపాలునికే యిది ధర్మ మని భ్రమింప రాదు. ఉదాహృతవచనమునందును 'క్షత్త్రియో హి' అనియు 'క్షాత్త్రం ధర్మమ్' అనియు లింగము క్షత్త్రియుఁడే రాజశబ్దార్థ మని స్పష్టముగాఁ దెలుపుచున్నది. అందువలన 'క్షత్త్రియునకు యుద్ధము ప్రశస్తమయిన ధర్మ' మని చక్కఁగా నుపదేశించెను భగవంతుఁడు. 'అపశవో ऽన్యే గోఅశ్వేభ్యః

---

* క్షత్త్రియుఁడు శస్త్రపాణియై శత్రుసైన్యముల జయించి ప్రకృష్టమయిన దండము—శిక్ష గలవాఁడై ప్రజల రక్షించుచు ధర్మమున భూమిం బాలింపవలెను.

♦ ప్రజలం బాలించుచు రాజు సమునిచేతఁగాని ఉత్తమునిచేతఁగాని అధమునిచేతఁగాని పిలువఁబడినవాఁడై, క్షాత్త్రధర్మమును దలఁచి, యుద్ధమునుండి తొలఁగక నిలువవలెను. యుద్ధములందు తొలఁగకుండుటయుఁ బ్రజలఁ బాలించుటయు బ్రాహ్మణుల శుశ్రూషయు రాజునకు మిక్కిలి శ్రేయస్కరము.

పశవ్యా గో అశ్వాః' * అనునట్లు ప్రశంసాలక్షణచే యుద్ధముకన్న నితరము శ్రేయస్సాధనము లేదని చెప్పఁబడినది. కావున ఇతరశ్రేయస్సాధన మున్నను దోషము లేదు. ఇందుచే 'యుద్ధముకన్న ప్రశస్తతర మయిన కర్మ మేదని యనుష్ఠించుటకై యుద్ధనివృత్తి కావచ్చు ననుట నిరాకరింపఁబడినది. 'నచ శ్రేయో ఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే' అనునదియు నిరసింపఁబడినది.

శ్రీ. అర్జునుఁడు 'వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే' అని యేమి చెప్పెనో అది యయుక్త మని చెప్పుచున్నాఁడు—ఆత్మకు నాశము లేకుండుట వలననె వీరిని వధించుటయందుఁగూడ నీవు కంపము నొందఁ దగినవాఁడవు కావు. ఇంతియ కాదు. స్వధర్మ మపి, అవేక్ష్య, వికమ్పితుం, నార్హసి అని యన్వయము. మఱియును 'నచ శ్రేయో ఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే' ఇత్యాదిగా నేమి చెప్పెనో అందుకుఁ జెప్పుచున్నాఁడు—ధర్మ్యాత్ = ధర్మమువలనఁ దొలఁగనిది, న్యాయ్యము అయిన, యుద్ధాత్ అన్యత్.

ప. ఇఁక నీ కీ స్వధర్మప్రతిపాదనమును సత్యముగానే తలంతువు గాక. అప్పుడు గూడ శోకము యుక్తము కా దని చెప్పుచున్నాఁడు.—స్వధర్మం = ప్రసిద్ధ మగు క్షత్త్రియధర్మమును; అవేక్ష్య = చక్కఁగా విచారించి; వికమ్పితుం నార్హసి. ఇఁక నీవే ధర్మమును జెప్ప వలెనా? చెప్పుచున్నాఁడు — క్షత్త్రియస్య; ధర్మ్యాత్ = న్యాయమువలన వచ్చిన; యుద్ధాత్; అన్యత్ = ఇతర మయిన అహింసాదికము; శ్రేయః = శ్రేయస్సు గలిగించునది; నవిద్యతే. ఇఁక నర్థమును వివరించిన శ్రుతికిఁ దాత్పర్యము ప్రతిపాదించుటకై శ్రుతి యుదాహరింపఁబడుచున్నది.— "తచ్ఛ్రేయో రూప మత్యసృజత ధర్మం తదేతత్ క్షత్త్రస్య క్షత్త్రం యద్ధర్మ స్తస్మాద్ధర్మా త్పరం నాస్త్యథో అబలీయాన్ బలీయాంసం సమాశంసతే ధర్మేణ యథా రాజ్ఞైవం యో వై స్వధర్మ స్సత్యం వై తత్తస్మాత్సత్యం వదన్త మాహు ర్ధర్మం వదతీతి ధర్మం వా వదన్తం సత్యం వదతీ త్యేత ద్ధ్యే వైత దుభయం భవతి" ఇందును భాష్యము—తత్ = అటుపిమ్మట, శ్రేయోరూపమ్ = శ్రేయోరూప మయిన, ధర్మమ్ = ధర్మమును, అత్యసృజత = సృజించెను. తత్ = అది, 'తత్ = ఈ చెప్పఁబోవునది. అదే దనఁగా. ధర్మః యత్ = ధర్మ మనునది యేది గలదో, అది, క్షత్త్రస్య = క్షత్త్రియజాతికిని, క్షత్త్రమ్ — శిక్షక మనుట. తస్మాత్ ధర్మాత్ = ఆధర్మము కన్న,

* గోవులు అశ్వములు—వీనికన్న నితరములు పశువులు కావు. గోవులు అశ్వములు పశువులు.

పరమ్ = ఉత్కృష్టము, నాస్తి = లేదు. ఎందువలన ననఁగా. 'అథో — ఆరంభార్థకము. ధర్మేణ = ధర్మముచేత, ధర్మబలముచేత, అబలీయాన్ = దుర్బలుఁడైనను, బలీయాంసమ్ = సమర్థునిఁగూడ, సమాశంసతే = చక్కఁగా ఆక్షేపించుచున్నాఁడు. యథారాజ్ఞా = రాజుచేత, రాజబలముచేత, ఎట్లో, ఏవమ్ = ఇట్లు. రాజు తనవశమున నున్నయెడ ఎట్లు దుర్బలుఁడైనను సమర్థుని ఆక్షేపించునో, అట్లు అని యర్థము. యో వై స్వధర్మః = ఏది స్వధర్మమో. తత్ = అది, సత్యం వై = సత్యమే నిశ్చయము, సత్యమును బొందించునది, తస్మాత్ = అందువలన, సత్యం వదన్తమ్ = సత్యమును జెప్పుపురుషుని, ధర్మం వదతీతి = ధర్మమును జెప్పుచున్నాఁడని, ఆహుః = చెప్పెదరు. వా = లేక, ధర్మంవదన్తమ్ = ధర్మమును జెప్పునట్టి పురుషుని, సత్యం వదతీతి = సత్యమును జెప్పుచున్నాఁడని. ఆహుః = చెప్పుచున్నారు. ఏతత్ హి ఏవ = ఇదియే గదా! సత్యధర్మములకు ఒకటే యర్థ మనుట నిశ్చయముగాఁ జెప్పఁబడిన దనుట. ఏతత్ = ఈ, ఉభయమ్ = సత్యధర్మములు రెండును; తత్ = బ్రహ్మరూపము, భవతి = అగుచున్నది. 'తత్త్వమసి, తత్సద్బ్రహ్మ' ఇత్యాదిశ్రుతి తత్ అనఁగా బ్రహ్మ మని చెప్పుచున్నది.

౩౧. అపిచ = మఱియును, ఈయారంభించిన యుద్ధము ప్రాణిమరణజనక మయినను అగ్నిషోమీయాదికము వంటిది. స్వధర్మమ్ = నీదైన ధర్మమును; అవేక్ష్య = ఆలోచించి; వికమ్పితుమ్ = చలించుటకు, సంశయించుటకు; నార్హసి = తగినవాఁడవు కావు. ధర్మ్యాత్ = న్యాయప్రవృత్త మయిన, యుద్ధాత్ = యుద్ధముకన్న; అన్యత్ = ఇతర మయిన, శ్రేయః = మేలు; క్షత్త్రియస్య = క్షత్త్రియునకు, నవిద్యతే హి = లేదు గదా! 'శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చా ప్యపలాయనమ్ । దాన మీశ్వరభావశ్చ క్షాత్త్రం కర్మస్వభావజమ్' అని గదా చెప్పఁబోవుచున్నాఁడు. అగ్నిషోమీయాదులందును పశువునకు హింస కాదు, సంజ్ఞపనము * మిక్కిలి నీచ మయిన ఛాగాదిదేహము తొలఁగించి కల్యాణతరదేహస్వర్గాదులను బొందించు నను శ్రుతివలన. 'న వా ఉ వేత న్మ్రియసే నరిష్యసి దేవా నిదేషి పథిభి స్సుగేభిః । యత్ర యన్తి సుకృతో నాపి దుష్కృతః । తత్ర త్వా దేవ స్సవితా దధాతు' ♦ అని శ్రుతి చెప్పుచున్నది. ఇందుఁగూడ యుద్ధమునందు మృతు లగు

---

* పశుప్రాణవియోజనవ్యాపారము.

♦ ఓపశువా! ఈ సంజ్ఞపనముచే నీవు ఎంతమాత్రము మరణము నొందవు. కావున నశింపవు. మఱి యనఁగా, సుఖములైన మార్గములచే దేవతలనే పొందెదవు. ఏలోకమును పుణ్యవంతులు పొందుదురో పాపవంతులు పొందఁజాలరో, అట్టి యుత్తమలోకమున నిన్ను భగవంతుఁ డగు సవిత నిలుపుఁ గాక.

వారికి కల్యాణతరదేహాదిప్రాప్తి చెప్పఁబడినది. ‘వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి’ ఇత్యాది గ్రంథముచేత. కావున, చికిత్సకుని శల్యాదికర్మము * రోగికింబోలె అగ్నిషోమీయాదులందు సంజ్ఞపనము పశువునకు రక్షణమే యగును.

మఱియును స్వధర్మమును బర్యాలోచించినను నీవు యుద్ధమువిషయమయి సంశయించుట యుక్తము కాదు. ఏల యనఁగా న్యాయ్యమయిన యుద్ధము కన్న క్షత్త్రియునకుఁ బ్రశస్తకర్మ మితర మేదియు లే దని తాత్పర్యము.

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్
సుఖినః క్షత్త్రియాః పార్థ లభన్తే యుద్ధ మీదృశమ్. 3౨

భా. మఱియు ఎందువలన ఆయుద్ధము చేయవలెను? చెప్పెదము— యదృచ్ఛయా చ = ప్రార్థింపకయే; ఉపపన్నమ్ = సిద్ధించిన; అపావృతమ్ = తెఱవఁబడిన; స్వర్గద్వారమ్ = స్వర్గముయొక్క వాకిలియైన; ఈదృశమ్ = ఇట్టి; యుద్ధమ్ = యుద్ధమును; క్షత్త్రియాః = క్షత్త్రియులు ఎవరు; లభన్తే = పొందుచున్నారో; పార్థ = ఓ యర్జునా! వారు, సుఖినః = సుఖవంతులు. సుఖవంతులు కారా యేమి?

యుద్ధము చేయునట్టి క్షత్త్రియులకు వారు కోరకున్నను స్వర్గము కలుగును. వాకిలి దెఱచియున్న గృహమునుంబోలె అడ్డులేక వారు స్వర్గముఁ జొత్తురు. అట్టి యుద్ధ మెవ్వరికి సిద్ధించునో ఆ క్షత్త్రియులు సుఖవంతు లని చెప్పవలయునా యేమి యని తాత్పర్యము.

ఆ. గుర్వాద్యనేకప్రాణిహింసాత్మకమయిన యుద్ధము హింసానిషేధశాస్త్రమునకు విరుద్ధ మగుటవలనఁ గర్తవ్య మనుట యొప్పదని యాశంకించుచున్నాఁడు మఱియు నెందువలన నిత్యాదిగా. అగ్నిషోమీయహింసవలె యుద్ధముగూడ క్షత్త్రియునకు విహిత మగుటవలనఁ గర్తవ్యము, సామాన్యశాస్త్రముకన్న విశేషశాస్త్రము బలవత్తర మగుటవలన నని చెప్పుచున్నారు చెప్పెద మని. అట్లయిన యుద్ధమునందుఁ బ్రవృత్తులకు ఐహికముగాని యాముష్మికముగాని సుఖము లేకుండుటవలన దానినుండి యుపరమించుటయె యుచిత మని తోఁచుచున్న దని యాశంకించి యందుకు చెప్పుచున్నాఁడు యదృచ్ఛ యేత్యాదిశ్లోకముచేత. బహు

* ప్రాణచ్ఛేదనాది.

కాలము గడచిన తరువాత యాగాద్యనుష్ఠాతలు స్వర్గాదికము పొందుచున్నారు, యుద్ధము చేయు క్షత్త్రియులో బహిర్ముఖత లేనివారై వెంటనే స్వర్గాదిసుఖము ననుభవింతురు. కావున నీకు కర్తవ్యమే యుద్ధ మని వ్యాఖ్యానముచే స్పష్టీకరించుచున్నారు యదృచ్ఛయా చ ఇత్యాదిగా. ఇహపరములందు భావిసుఖము గల క్షత్త్రియులకుమాత్రమే స్వధర్మ మయిన యుద్ధము సిద్ధించును, కావున నీవు శోకమోహములు విడిచి యుద్ధాచరణముకొఱకు లేవవలసినదే యని యర్థము.

హ. ఇందువలనఁగూడ యుద్ధము కర్తవ్య మని చెప్పఁబడుచున్నది — యదృచ్ఛయా చ, ఉపపన్నమ్ = వచ్చినది, కర్తవ్యముగాఁ బ్రాప్తించిన దైనను.

శం. ఓయీ! జయము కలిగినచో యుద్ధము శ్రేయస్సాధనము కావచ్చును. మరణము కలిగినయెడ నేమి యున్నది? ఇందుకుఁ జెప్పుచున్నాఁడు.— పార్థ = పృథాపుత్త్రా! యదృచ్ఛయా చ = ప్రయత్నము లేకయే; ఉపపన్నమ్ = ప్రాప్తమైన; అపావృతమ్ = తెఱవఁబడిన తలుపులు గల; స్వర్గద్వారమ్—స్వర్గప్రాప్తికి ద్వారభూత మయిన; ఈదృశమ్, యుద్ధమ్; సుఖినః = స్వర్గసుఖము గోరునట్టి, లేక, ధన్యు లగు; క్షత్త్రియాః; పుణ్యముచే, లభన్తే = పొందుచున్నారు. భాగ్యవంతులకు మాత్రమె యిట్టి యుద్ధము తనకుఁ దానే సిద్ధించు నని యర్థము. యుద్ధమునందు మృతునకుఁగూడఁ గలదు స్వర్గసుఖము. కావున రెండువిధములనుగూడ ఫలప్రద మగుటవలన అవశ్యకర్తవ్యము యుద్ధ మని యర్థము.

మ. ఓయి! యుద్ధము కర్తవ్య మయినను భీష్మద్రోణాదు లగు గురువులతోఁ జేయుట యుచితము కాదు, మిక్కిలి నిందిత మగుటవలన. అని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నాఁడు.—యదృచ్ఛయా = స్వప్రయత్నము లేక, చకారమనధారణార్థకము, ప్రార్థింపకయే; ఉపపన్నమ్ = సిద్ధించిన, ఈదృశమ్ = ఇట్టి, భీష్మద్రోణులు మొదలగు వీరపురుషులు ప్రతిద్వంద్వులుగాఁ గలదియు కీర్తి రాజ్యము మొదలగు దృష్టఫలమునకు సాధనమైనదియు నగు; యుద్ధమ్; ఎవరు, క్షత్త్రియాః, లభన్తే=పొందుచున్నారో; వారు, సుఖినః=సుఖము గలవారే యగుదురు. ఎట్లనఁగా, జయము కలుగునేని అనాయాసముగాఁ గీర్తియు రాజ్యమును లభించును. ఇఁకఁ బరాజయము సంభవించినను అతిశీఘ్రముగనే స్వర్గము లభించు నని చెప్పుచున్నాఁడు—స్వర్గద్వార మపావృతమ్ — ప్రతిబంధము లేని స్వర్గసాధనము, యుద్ధము వ్యవధానము లేకయె స్వర్గము కలిగించునది, జ్యోతిష్టోమాదికమో బహుకాలవ్యవ

ధానముచేత, ఏల యనఁగా అది దేహపాతమును ప్రతిబంధాభావమును అపేక్షించు నని యర్థము. స్వర్గద్వారమ్మనుటచే శ్యేనయాగాదులందుంబోలెఁ బ్రత్యవాయము కలుగు నను శంక పరిహరింపఁబడినది. ఎట్లనఁగా — శ్యేనాదులు విహితము లయినను ఫలదోషముచే దుష్టములు. ఏల యనఁగా తత్ఫలమైన శత్రువధము 'న హింస్యాత్సర్వాభూతాని, బ్రాహ్మణం న హన్యాత్' * ఇత్యాదిశాస్త్రముచే నిషిద్ధ మగుటవలనఁ బ్రత్యవాయజనకము. ఫలమునందు విధి లేమివలన 'విధి స్పృష్టే నిషేధా నవకాశః' ♦ అను న్యాయమున కిట నవకాశము లేదు. ఇఁక యుద్ధమునకో ఫలము స్వర్గము, అదియో నిషిద్ధము కాదు. అట్లు మనువు "ఆహవేషు మిథోఽన్యోన్యం జిఘాంసన్తో మహీక్షితః । యుధ్యమానాః పరం శక్త్యా స్వర్గం యాన్త్యపరాఙ్ముఖాః" § అని. మఱియు, యుద్ధము అగ్నీషోమీయాదిపశ్వాలంభము వలె విహిత మగుటవలన నిషేధమునకు విషయము కాఁజాలదు. షోడశిగ్రహణాదికమువలె, గ్రహణాగ్రహణములు తుల్యబలము లగుటచే వికల్పము వచ్చినట్లు ¶ సామాన్యశాస్త్రమునకు విశేషశాస్త్రముచే సంకోచము సంభవించుటవలన. అట్లు 'విధి స్పృష్టే నిషేధా నవకాశః' అను న్యాయమువలన యుద్ధము ప్రత్యవాయజనకము కాదు. భీష్మద్రోణాదిగురుబ్రాహ్మణవధనిమిత్తమయిన దోషంబు గూడ లేదు, భీష్మద్రోణాదులు ఆతతాయు లగుటవలన. అది మనువుచేఁ జెప్పఁబడినది. "గురుం వా బాలవృద్ధౌ వా బ్రాహ్మణం వా బహుశ్రుతమ్ । ఆతతాయిన మాయాన్తం హన్యాదేవా విచారయన్ ॥ ఆతతాయిన మాయాన్త మపి వేదాన్తపారగమ్ । జిఘాంసన్తం జిఘాంసీయా న్న తేన బ్రహ్మహా భవేత్ ॥ నాతతాయివధే దోషో హన్తుర్భవతి కశ్చన" $ ఇత్యాదిగా. ఓయీ! స్మృత్యోర్విరోధే న్యాయస్తు బలవా

* సమస్తభూతములను హింసింపఁగూడదు, బ్రాహ్మణుని వధింపఁగూడదు.

♦ విధిచే స్పృశింపఁబడిన విషయమునందు నిషేధమునకు అవకాశము లేదు.

§ రాజులు పరస్పరము యుద్ధములందు ఒండొరులను వధింపఁ గోరినవారై పరాక్రమముచేఁ బరాఙ్ముఖులు కాక పోరినవారై యుత్తమ మయిన స్వర్గము నొందుచున్నారు.

¶ అతిరాత్రే షోడశినం గృహ్ణాతి — అతిరాత్రమునందు షోడశిని గ్రహింపవలెను. నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి — అతిరాత్రమునందు షోడశిని గ్రహింపఁగూడదు. ఇచట గ్రహణవిధిశాస్త్రమును గ్రహణనిషేధశాస్త్రమును తుల్యప్రమాణము లగుటవలన వికల్పము వచ్చినది.

$ గురువుగాని బాలునిఁగాని వృద్ధునిఁగాని బహుశ్రుతుఁడైన బ్రాహ్మణునిఁగాని, తన్ను వధింపఁబూనినవాఁడై వచ్చువాని, విచారింపక వధింపవలయును. వేదాంతపారగుఁడైనను ఆతతాయియై వచ్చువానిని, తన్ను హింసింపఁగోరువాని, హింసింపఁగోరినవాఁడై వానివిూఁదికిఁ బోవలెను. అందుచే బ్రహ్మహత్య చేసినవాఁడు కాఁడు. ఆతతాయిని వధించుటయందు వధించువానికి దోష మేమియు లేదు.

స్వ్యవహారతః । అర్థశాస్త్రాత్తు బలవ ద్ధర్మశాస్త్ర మితి స్థితిః ’ అను యాజ్ఞవల్క్య వచనమువలన, ఆతతాయిబ్రాహ్మణవధమునందును ప్రత్యవాయము ఉండనే యున్నది. ఎట్లనఁగా, ‘ బ్రాహ్మణం న హన్యాత్ ’ అనునది దృష్టప్రయోజనాపేక్ష లేమిం జేసి ధర్మశాస్త్రము. ‘ జిఘాంసన్తం జిఘాంసీయా న్న తేన బ్రహ్మహా భవేత్ ’ అనునదియో, స్వప్రాణరక్షణరూపదృష్టప్రయోజనాపేక్ష కలిమిం జేసి యర్థశాస్త్రము. ఇందుకు సమాధానము—‘ బ్రహ్మణే బ్రాహ్మణ మాలభేత ’ ♦ అను దానివలె యుద్ధము విధించుశాస్త్రము గూడ ధర్మశాస్త్రమే యగును, ‘ సుఖ దుఃఖే సమే కృత్వా ’ అనుచోట దృష్టప్రయోజనాపేక్ష లేమి చెప్పఁబోవుటవలన. యాజ్ఞవల్క్యవచనమునకు దృష్టప్రయోజనము నుద్దేశించి చేయుయుద్ధాదులందుఁ జేయఁబడునధము విషయము, కావున దోషము లేదు. మితాక్షరా * కారులు మాత్రము, ‘ ధర్మార్థసన్నిపాతే అర్థగ్రాహిణ ఏత దేవ ’ § అని యేతచ్ఛబ్దబోధిత మయిన ద్వాదశవార్షికప్రాయశ్చిత్తము ఆపస్తంబునిచే విహిత మగుటవలన, మిత్రలబ్ధి మొదలగు అర్థశాస్త్రము ననుసరించి చతుష్పాజ్జంతువ్యవహారమునందును ❘ శత్రువును జయించుటయందును ధర్మశాస్త్రము నతిక్రమింపఁగూడ దని వచియించిరి. ఇట్లే యగుఁ గాక. మాకు హాని లేదు. ఇట్లు యుద్ధము చేసినచో సుఖము కల దని చెప్పుటవలన, ‘ స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ ’ అని యర్జునుండు చెప్పినది నిరాకరింపఁబడినది.

శ్రీ. మఱియు, గొప్పశ్రేయస్సు తనయంత నీకు సిద్ధించినపుడు ఏల సంశయించుచున్నావు ? అని చెప్పుచున్నాఁడు.—యదృచ్ఛయా = ప్రార్థింపకయే, ఉపపన్నమ్ = ప్రాప్త మగు, ఈదృశమ్, యుద్ధమ్, సుఖినః = భాగ్యవంతు లగువారే, లభన్తే. ఎందువలన ననఁగా; ఆవరణము లేని స్వర్గద్వారమే యీయుద్ధము. లేక. ఎవ్వరు, ఇట్టి యుద్ధమును పొందుచున్నారో వారే సుఖవంతు లని యర్థము. ఇందుచే ‘ స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ ’ అను నర్జునువాక్యము నిరసింపఁబడినది.

♦ బ్రహ్మకొఱకు బ్రాహ్మణునిఁ పశువుగాఁ బట్టవలెను.

* యాజ్ఞవల్క్యస్మృతి వ్యాఖ్యాన.

§ ధర్మమునకును అర్థమునకును ప్రసక్తి కలిగినపుడు ధర్మమును విడచి యర్థము గ్రహించినవానికి ఇదియే—ద్వాదశవార్షికప్రాయశ్చిత్తమే.

❘ క్రయవిక్రయమునందును.

ప. ఇఁక శ్రుత్యర్థమునే దృఢీకరించుచుఁ జెప్పుచున్నాఁడు.—పార్థ! ఈదృశమ్ — జయమునందుఁగాని పరాజయమునందుఁగాని యభినివేశము లేనట్టి, యుద్ధమ్, సుఖినః = పుణ్యవంతు లగు, క్షత్త్రియాః, లభన్తే. ఇఁక ఇట్టి యుద్ధము దుర్లభ మని చెప్పుచున్నాఁడు— స్వర్గద్వారమ్, అపావృతమ్ = ఆవరణము లేనిదై, యదృచ్ఛయా = ప్రార్థన లేకయె, ఉపపన్నమ్ = సిద్ధము, అగుచున్నది.

రా. పార్థ = అర్జునుఁడా! యదృచ్ఛయా = ప్రయత్నము లేకయె; ఉపపన్నమ్ = సిద్ధించినదియును; స్వర్గద్వారమ్ = నిరతిశయసుఖమున కుపాయ మయినదియు; అపావృతం చ = విఘ్నము లేనిదియు నగు; ఈదృశమ్ = ఇట్టి; యుద్ధమ్ = యుద్ధమును; సుఖినః = పుణ్యవంతు లగు; క్షత్త్రియాః = క్షత్త్రియులు; లభన్తే = పొందుచున్నారు.

నిరతిశయసుఖము నొసంగునట్టి యీయుద్ధము, ఇట్లు అప్రయత్నముగాను నిర్విఘ్నముగాను, బుణ్యవంతు లగు క్షత్త్రియులకు లభించును గాని యితర క్షత్త్రియులకు లభింపఁజాల దని తాత్పర్యము.

అథ చేత్త్వ మిమం ధర్మ్యం సఙ్గ్రామం న కరిష్యసి
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి. 33

భా. అథ— ఇట్లు కర్తవ్యముగాఁ బ్రాప్త మయినను, త్వమ్= నీవు; ఇమమ్ = ఈ, ధర్మ్యమ్ = ధర్మమునుండి తొలఁగని యట్టి, విహితమైన; సఙ్గ్రామమ్ = యుద్ధమును; నకరిష్యసి చేత్ = చేయవేని; తతః = అట్లు చేయకుండుటవలన; స్వధర్మమ్ = నీయొక్క—ధర్మమును; కీర్తిం చ = మహాదేవాదిసమాగమముచేఁ గలిగిన యశస్సునుగూడ; హిత్వా=విడిచి; పాపమ్ = పాపమునుమాత్రమె; అవాప్స్యసి = పొందఁగలవు.

ఇట్లు విధిచోదితముగా నేర్పడినను నీ వీ ధర్మ్య మయిన యుద్ధము ననుష్ఠింపనియెడ, నీవు స్వధర్మమును, శివుఁడు మొదలగువారితో సమాగమము నొంది సంపాదించిన యశస్సునుం బోఁగొట్టుకొని, కేవలము పాపము నొందుదు వని తా.

ఆ. స్వధర్మ మగుటచే యుద్ధము శ్రద్ధతో ననుష్ఠించినచో స్వర్గాదిమహాఫలము కలిగించు నని నిరూపించి దానిఁ జేయనియెడ ప్రత్యవాయము సంభవించు నని నిరూపించువారై యీఁదిశ్లోకమునందలి అథశబ్దముయొక్క అర్థముఁ జెప్పుచు

న్నారు.—ఇట్లు ఇత్యాదిగా. విహిత మనఁగా ఫలవంత మని యర్థము. మహాదేవాది అనుచోటి ఆదిశబ్దముచే మహేంద్రాదులు గ్రహింపఁబడుచున్నారు.

హ. ధర్మ్యం సఙ్గ్రామమ్ = ధర్మమువలనఁ దొలఁగని యుద్ధమును.

శ౦. ముముక్షువు మోక్షసాధన మగు విధ్యుక్తస్వధర్మమునందుఁ బ్రమాదము * లేకయుండవలె నని తెలుపుటకై స్వధర్మ మగుటచేఁ గర్తవ్యముగాఁ బ్రాప్తించిన యుద్ధమును అనుష్ఠింపవేని ప్రత్యవాయము అకీర్తి మొదలగు ననర్థములపరంపర సంభవించు నని నయభయములచే అర్జునుని స్వధర్మమునందుఁ బ్రవర్తింపఁ జేయుచున్నాఁడు ఐదుశ్లోకములచేత. అందు మొదటిదానిచే, హింసారూప మగుటవలన దోష మగు నని కాని భీష్మాదులందు స్వీయత్వభ్రమంబునంగాని స్వధర్మ మగు యుద్ధము విడుతువేని ప్రత్యవాయంబును కీర్తినాశంబును ఈ రెంటిచేఁ బరలోకభ్రంశంబును సంభవించు నని చెప్పుచున్నాఁడు.—అథ = యుద్ధమునకు సన్నాహము చేసిన పిమ్మట; త్వమ్; ఇమమ్; ధర్మ్యమ్ = ధర్మ మని తెలిసినట్టి, శాస్త్రోక్త మయిన; సఙ్గ్రామమ్ = యుద్ధమును; న కరిష్యసి చేత్. తతః—దానిఁ జేయకుండుటవలన; కీర్తిమ్ = అర్జునుఁడు శివుఁడు మున్నగువారితో యుద్ధము చేసినవాఁడు, లేక, అర్జునుఁడు స్వధర్మము దప్పనివాఁడు అను లోకప్రసిద్ధ మయిన కీర్తిని; స్వధర్మం చ = నీదైన ధర్మమును, లేక, ధర్మము బోధించునట్టి వేదాదిరూప మయిన శాస్త్రమును; విడిచినవాఁడ వగుదువు, వేదోక్తకర్మము విడుచుటచే వేదముగూడ విడువఁబడినదియే యగుచున్నది; ఇట్లు, స్వధర్మమును కీర్తిని, హిత్వా = విడిచి; పాపమ్ = వేదమును వేదోక్తకర్మమును విడుచుట యను పాపమును; అవాప్స్యసి = పొందఁగలవు, కాని సన్న్యాసఫలమును బొందఁజాల వని యర్థము.

మ. ఓయీ! నేను యుద్ధఫలముఁ గోరువాఁడఁ గాను. అట్లు 'న కాఙ్క్షే విజయం కృష్ణ' 'అపి త్రైలోక్యరాజ్యస్య' అని చెప్పియున్నాను గదా! అట్లుండఁగా నెట్లు యుద్ధము చేయవలె నని యాశంకించి చేయనిచో దోషము చెప్పుచున్నాఁడు.—అథ = పక్షాంతరమునందు; ఇమమ్—భీష్మద్రోణాదివీరపురుషులు ప్రతిద్వంద్వులుగాఁ గలదాని, ధర్మ్యమ్ = హింసాదిదోషముచే దుష్టముకానియట్టిదాని, లేక, సత్పురుషులయొక్క ధర్మమువలనఁ దొలఁగనియట్టిదాని, అది మనువు వచియించెను. "న కూటై రాయుధై ర్హన్యా ద్యుధ్యమానో రణే రిపూన్। న కర్ణిభి ర్నా

---

* ఏమఱుపాటు.

పి
గ్ధై ర్నాగ్నిజ్వలితతేజనైః॥ నచ హన్యాత్ స్థలారూఢం న క్లీబం న కృతాఞ్జలిమ్ । న ముక్తకేశం నాసీనం న తవాస్మీతి వాదినమ్॥ న సుప్తం న విసన్నాహం న నగ్నం న నిరాయుధమ్ । నాయుధ్యమానం పశ్యన్తం న పరేణ సమాగతమ్॥ నాయుధవ్యసన ప్రాప్తం నార్తం నాతిపరిక్షతమ్ । నభీతం నపరావృత్తం సతాం ధర్మ మనుస్మరన్॥ "* సత్పురుషుల ధర్మము నుల్లఘించి పోవువాఁడు గదా పాపి యగును. నీవో, శత్రువులచేఁ బిలువఁబడినవాఁడవైనను, స్వధర్మయుక్తము నైనను, సఙ్గ్రామమ్ = యుద్ధమును; నకరిష్యసి చేత్ = చేయవేని, ధర్మమువలనఁగాని లోకమువలనఁగాని భయము నొంది వెన్నిచ్చినవాఁడ వగుదువేని; తతః=అందువలన, ‘ నిర్జిత్య పరసైన్యాని క్షితిం ధర్మేణ పాలయేత్ ’ ‖ ఇత్యాదిశాస్త్రముచే విహిత మయిన యుద్ధమును చేయకుండుటవలన; స్వధర్మమ్=క్షత్త్రియధర్మమును; హిత్వా–అనుష్ఠింపక; కీర్తించ–మహాదేవాదిసమాగమమునుచేఁ గలిగినదాని; హిత్వా; ‘ ననివర్తేత సఙ్గ్రామాత్ ’ ♦ ఇత్యాదిశాస్త్రనిషిద్ధ మయిన యుద్ధనివృత్తిని జేయుటచేఁ గలుగునట్టి; పాపమ్ = పాపమునుమాత్రమే; అవాప్స్యసి = పొందుదువు, కాని ధర్మమును గీర్తిని బొందఁజాలవని యభిప్రాయము. లేక. స్వధర్మమ్ = అనేకజన్మార్జిత మయిన ధర్మమును; విడిచి, రాజుయొక్క పాపమునే పొందుదు వని యర్థము. వెన్నిచ్చిన నిన్ను దుష్టు లగు నీశత్రువులు అవశ్యము వధింపఁ గలరు, కావున వెన్నిచ్చి హతుఁడ వగుటచే, నీవు బహుకాలముగా సంపాదించిన సుకృతమును గోలుపోయి ఇతరులు చేసిన దుష్కృతమునుమాత్రముఁ బొందువాఁడవు కాఁ గలవని యభిప్రాయము. అట్లు మనువు చెప్పియున్నాఁడు “ యస్తు భీతః పరావృత్తః సఙ్గ్రామే హన్యతే పరైః । భర్తుర్యద్దుష్కృతం కించి తత్సర్వం ప్రతిపద్యతే॥ యచ్చాస్య సుకృతం కించి దముత్రార్థ ముపా

* యుద్ధమునందుఁ బోవుచున్నవాఁడై శత్రువులను కపటాయుధములచేఁగాని చెవులుగల బాణములచేఁగాని విషదిగ్ధము లగు నాయుధములచేఁగాని నిప్పుచే జ్వలించుచున్న యలుఁగులు గల వానిచేతఁగాని కొట్టఁగూడదు. రథమునుండి క్రిందికి దిగినవానిని, నపుంసకుని, అంజలి–చేమోడ్పు గావించినవాని, వీడినజుట్టుగలవానిని, కూర్చుండినవానిని, నీవాఁడ నని చెప్పువాని, నిద్రించియున్న వాని, యుద్ధప్రయత్నము లేనివాని, లేక కవచము లేనివాని, వస్త్రము వీడినవాని, ఆయుధము లేనివాని, యుద్ధము చేయక చూచుచున్న వాని, మఱియొకనితోఁ బోరువానిని, ఆయుధము విఱిగినవాని, దుఃఖితుని, మిక్కిలి నొచ్చినవాని, భయపడినవాని, వెన్నిచ్చినవాని సత్పురుషుల ధర్మము స్మరించుచు వధింపఁగూడదు.

‖ శత్రుసైన్యములను జయించి భూమిని ధర్మమునఁ బాలింపవలయును.

♦ యుద్ధమునుండి తొలఁగఁగూడదు.

ర్జితమ్। భర్తా తత్సర్వ మాదత్తే పరావృత్తహతస్యతు" * అని. యాజ్ఞవల్క్యుఁడు గూడ 'రాజా సుకృత మాదత్తే హతానాం విపలాయినామ్' † అని. అందుచే, "పాప మేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః। ఏతా న్నహన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన" అని యర్జునుఁడు పలికినది నిరాకృత మగుచున్నది.

శ్రీ. యుద్ధము చేయనిచో దోషముఁ జెప్పుచున్నాఁడు.—అథచే త్త్వ మిత్యాదిగా.

ప. ఇఁకఁ బక్షాంతరమునందు దోషము చెప్పుచున్నాఁడు అథ చేదిత్యాదిగా నాలుగుశ్లోకములచేత.—అథ = ఇఁకఁ బిమ్మట, నేను చెప్పినది వినక, ధర్మ్యమ్= ధర్మసాధక మయిన, సంగ్రామమ్, నకరిష్యసి చేత్, అప్పుడు, స్వధర్మం హిత్వా— స్వధర్మమునకు వెలియై, అట్లు ఈలోకమునందు శ్లాఘనీయ మయిన, కీర్తించ హిత్వా = కీర్తినిగూడ విడిచి; పాపమ్= పరలోకప్రతిబంధక మైనదాని, అవాప్స్యసి. ఇందుచే 'పాప మేవాశ్రయే దస్మాన్' అను నర్జునవాక్యమునకుఁ బరిహారము సూచింపఁబడినది.

రా. అథ = అటుగాక; త్వమ్ = నీవు, క్షత్త్రియుఁడవు; ధర్మ్యమ్= క్షత్త్రియుని ధర్మ మయిన; ఇమమ్ = ఈ, ఆరంభింపఁబడిన; సఙ్గ్రామమ్ = యుద్ధమును; నకరిష్యసి చేత్ = మోహమువలన చేయవేసి; తతః = ఆరంభించిన స్వధర్మమును జేయకుండుటవలన; స్వధర్మమ్ = స్వధర్మముయొక్క ఫలమైన నిరతిశయసుఖమును; కీర్తించ= జయముచేఁ గలుగు నిరతిశయ మయిన యశస్సునుగూడ; హిత్వా=విడిచి; పాపమ్= నిరతిశయ మయిన పాపమును; అవాప్స్యసి = పొందుదువు.

ఇఁక, నీవు క్షత్త్రియుఁడ వగు నీకు స్వధర్మ మయిన యుద్ధమును ఆరంభించినదాని అనుష్ఠింపకవిడుతువేని, అట్లు స్వధర్మమును విడుచుటవలన స్వధర్మముయొక్క ఫల మయిన నిరతిశయము సుఖము నీకు లేక పోవును. మఱియు యుద్ధమునందు జయించినచో సిద్ధించునట్టి నిరతిశయయశస్సు గూడ లేకపోవును. ఇంతియ కాదు. నిరతిశయదుఃఖహేతు వయిన పాపముగూడ సంభవించు నని తాత్పర్యము.

---

* ఎవఁడు యుద్ధమునందు భయపడి పాఱిపోవుచు శత్రువులచే వధింపఁబడునో అతఁడు తన రాజుయొక్క పాప మేది గలదో అదియంతయుఁ బొందును. మఱియు పరాఙ్ముఖహతుం డగు వీని పుణ్యము పరలోకార్థము సంపాదితం బేది గలదో అది యంతయు రాజు గ్రహించును.

† పాఱిపోవుచు హతు లయినవారి సుకృతమును రాజు గ్రహించును.

అకీర్తిం చా ఽపి భూతాని కథయిష్యన్తి తే ఽవ్యయామ్
సమ్భావితస్య చా ఽకీర్తి ర్మరణా దతిరిచ్యతే. 3౪

భా. స్వధర్మమును గీర్తిని గోలుపోవుటమాత్రమే కాదు. తే = నీ యొక్క; అవ్యయామ్ = తఱుఁగులేని, దీర్ఘకాల ముండునట్టి; అకీర్తిం చాపి = అపకీర్తినిగూడ; భూతాని = జనులు; కథయిష్యన్తి- చెప్పుదురు. ధర్మాత్ముఁడు శూరుఁడు ఇత్యాదిగుణములచే, సమ్భావితస్య చ = సమ్మానింపఁబడినవానికో; అకీర్తిః = అపకీర్తి; మరణాత్ = చావుకన్నను; అతిరిచ్యతే = అధిక మగుచున్నది. సంభావితునకు అపకీర్తియే మేలు మరణముకన్న నని యర్థము.

ఇది గాక, నీకు శాశ్వత మయిన అపకీర్తి కలుగును. దాని సర్వజనులు చెప్పుకొనుచుందురు. ధర్మాత్ముఁడు ఇత్యాదిగా గౌరవము నొంది యాగౌరవము చెఱచికొని యపకీర్తి నొందుటకన్న మరణము నొందుట మేలు అని తాత్పర్యము.

అ. యుద్ధము చేయనియెడ క్షత్రియునకు ఆముష్మిక మగు ప్రత్యవాయముం దెలిపి బహుకాలము నిలిచియుండునట్టి యైహిక మయిన శిష్టనిందితత్వరూపప్రత్యవాయమును * దెలుపుచున్నారు.—స్వధర్మమును ఇత్యాదిగా. యుద్ధమునందు మరణము సంభవించు నను సంశయము కలుగుటవలన తత్పరిహారార్థము అపకీర్తినిగూడ సహింపవలెను స్వాత్మసంరక్షణము శ్రేయస్కర మగుటవలన నని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నారు ధర్మాత్ముఁడు ఇత్యాదిగా. పూజనీయులకు అపకీర్తి మరణముకన్నను దుస్సహ మగు నని తాత్పర్యార్థముఁ జెప్పుచున్నారు సంభావితునకు ఇత్యాదిగా.

హ. స్వధర్మకీర్తిపరిత్యాగము మాత్రమే కాదు.—సమ్భావితస్య—ధర్మాత్ముఁడు శూరుఁడు ఇత్యాదిగుణములచే సమ్మానింపఁబడినవానికి, అపకీర్తి కన్న మేలు మరణం బని యర్థము.

శం. ఇంతమాత్రమే కాదు. మ ఱే మనఁగా.—భూతాని=ఇచటను ఇతర స్థలములందును ఉండునట్టి జనులు అాదఱును; తే = నీయొక్క; స్వధర్మము విడుచుటవలనఁ గలిగిన, అవ్యయామ్=చిరకాల ముండునట్టి, అకీర్తించ; కథయిష్యన్తి=

* శిష్టులచే నిందితుఁ డగుట యను ప్రత్యవాయము.

సభలయందుఁ జెప్పెదరు, పాపిష్ఠుఁడు స్వధర్మమును విడిచినాఁడని. ఓయీ! స్వజనవధముచేఁ గలుగు నపకీర్తికన్నను యుద్ధము విడుచుటచేఁ గలుగు నపకీర్తి సహింపవచ్చును. అందువేసి చెప్పెద వినుము. 'బ్రహ్మణే బ్రాహ్మణ మాలభేత' అను శాస్త్రమువలన నెట్లు బ్రాహ్మణాలంభము దోషావహము కాదో అట్లు శాస్త్రీయ మగుటవలన యుద్ధమునందు స్వజనవధము దోషావహము కాదు. యుద్ధమునుండి యుపరమించుటయో యశాస్త్రీయ మగుటవలన, దానిచేఁ గలుగునట్టి యీ, అకీర్తిః= అపకీర్తి; సంభావితస్య చ-చకారము తు అనుదాని యర్థము గలది, ధర్మాత్ముఁడు సత్యసంధుఁడు శూరతముఁడు అర్జునుఁ డని సర్వదేశములందును సర్వజనుల చేతను స్తుతింపఁబడినట్టి సత్కీర్తిసంపన్నుఁడవు పుణ్యపురుషుండ వగు నీకు మాత్రము; మరణాత్, అతిరిచ్యతే= అధిక మగుచున్నది. లోకమునందు మరణదుఃఖము క్షణకాలికము, అపకీర్తిదుఃఖమో సత్పురుషులకు బహుకాల ముండున దగుటవలన మరణదుఃఖముకన్నను మిక్కిలి గొప్పది. కావున అపకీర్తికన్న మరణమే మేలని యర్థము.

౫. ఇట్లు యుద్ధము విడిచినచో ఇష్టము లయిన కీర్తి ధర్మముల అప్రాప్తియును అనిష్టపాపప్రాప్తియుఁ బ్రదర్శింపఁబడినవి. అందు పాపాఖ్య మయిన అనిష్టము కాలవ్యవధానముచే ఫలము నొసంగును ఆముష్మిక మగుటవలన, శిష్టులచే నిందింపఁబడుట యను అనిష్టమో సమీపమునందే ఫలము నొసంగునది, కావున నది దుస్సహ మని చెప్పుచున్నాఁడు.—భూతాని—దేవతలు మహర్షులు మనుష్యులు మొదలగువారు; తే= నీయొక్క; అవ్యయామ్= దీర్ఘకాలావస్థాయి యగు; అకీర్తిమ్—'ఇతఁడు ధర్మాత్ముఁడు కాఁడు ఇతఁడు శూరుఁడు కాఁడు' అనునట్టి అపకీర్తిని; కథయిష్యన్తి, ఒండొరులతో మాటలప్రస్తావమునందు. చ అపి అను నిపాతములకు కీర్తినాశ ధర్మనాశముల సముచ్చయ మర్థము. లేక. కీర్తిధర్మములను విడిచి పాపమును బొందుదు వనుటమాత్రమె కాదు మ తే మనఁగా అపకీర్తినిగూడ బొందుదువు. నీవుమాత్రము అపకీర్తి బొందుదు వనుటమాత్రమె కాదు మ తే మనఁగా భూతములుగూడ దాని చెప్పుకొందురు, అని నిపాతముల యర్థము. ఓయీ! యుద్ధమునందు స్వమరణముగూడ సంభవించు నను సంశయము కలుగుటవలన తత్పరిహారార్థము అపకీర్తినిగూడ సహింపవలెను, ఆత్మరక్షణము గదా అన్నిటికన్నను అత్యంతము ఆవశ్యకము. అట్లు చెప్పఁబడినది శాంతిపర్వమునందు "సామ్నా దానేన భేదేన సమస్తై రథవా పృథక్ । విజేతుం ప్రయతేతారీన్నయు

ధ్యేత కదాచన॥ అనిత్యో విజయో యస్మా ద్దృశ్యతే యుధ్యమానయోః। పరాజయశ్చ సంగ్రామే తస్మా ద్యుద్ధం వివర్జయేత్॥ త్రయాణా మప్యుపాయానాం పూర్వోక్తానా మసమ్భవే। తథా యుధ్యేత సంయత్తో విజయేత రిపూ న్యథా॥" * అని. ఇట్లే మనువుచేతనుం జెప్పఁబడినది. కావున మరణభయము గలవానికి అపకీర్తి దుఃఖ మేమి? అను శంకను నివారించుచున్నాఁడు—సమ్భావితస్య = ధర్మాత్ముఁడు శూరుఁడు ఇత్యాదు లగు అనన్యసాధారణగుణములచే గౌరవింపఁబడిన పురుషునకు, అకీర్తిః, మరణాత్ = చావుకన్నను, అతిరిచ్యతే = అధిక మగుచున్నది. చకారము హేత్వర్థకము. ఎందువలన అపకీర్తి మరణముకన్న నధికమో, అందువలన అపకీర్తికన్న మరణమే మేలు, తక్కువ యగుటవలన. నీవును అత్యంతము సంభావితుఁడవుగా నున్నావు మహాదేవాదిసమాగమముచేత, కావున అపకీర్తిదుఃఖము సహింపఁజాల వని యభిప్రాయము. పై నుదాహరించిన వచనము అర్థశాస్త్రమగుటవలన 'ననివర్తేత సంగ్రామాత్' ఇత్యాది ధర్మశాస్త్రముకన్న దుర్బలమని భావము.

శ్రీ. మఱియును. అవ్యయామ్= శాశ్వతమైన. సమ్భావితస్య=బహుమానింపఁబడినవానికి, అకీర్తిః, మరణాత్, అతిరిచ్యతే= మిక్కిలి యధిక మగుచున్నది.

ప. మఱియును. భూతాని = లోకులు; తే = నీయొక్క, అవ్యయామ్ = కల్పాంతమువఱకు ఉండునట్టి, అకీర్తిమ్ = అపయశస్సును; కథయిష్యన్తి. అల్పునకు అపకీర్తివలన భయము కలుగదు. సంభావితస్య = సంభావితుఁ డగు పురుషునకు, అకీర్తిః, మరణముకన్నను, అతిరిచ్యతే = అతిశయము నొందుచున్నది. జీవించి యున్నవానికి మరణసమయమునందే దుఃఖము కలుగును. అపకీర్తి మరణానంతరము గూడ ఉండు నని యర్థము.

రా. నీకు నిరతిశయములగు సుఖయశస్సులహానిమాత్రమె కాదు. 'పార్థుఁడు యుద్ధప్రారంభము కాఁగానే పాఱిపోయెను' అని, తే = నీయొక్క; అవ్యయామ్ = సర్వదేశములను సర్వకాలములను వ్యాపించునది యగు; అకీర్తిం చ=అపకీర్తినిగూడ;

---

* సామదానభేదోపాయములచే అన్నిటిచేఁగాని ఒక్కొకటిచేఁగాని శత్రువుల జయించుటకు యత్నింపవలెను. ఎప్పుడును యుద్ధము సేయ రాదు. ఎందువలన ననఁగా యుద్ధమునందుఁ బోరువారలకు ఇద్దఱికిని జయముగాని పరాజయముగాని నియతము కాదు. అందువలన యుద్ధమును విడువవలెను. మున్ను చెప్పఁబడిన మూఁడు ఉపాయములును సంభవింపనియెడ, ఎట్లయినచో శత్రువుల జయించునో అట్లు సన్నద్ధుండై యుద్ధము చేయవలెను.

భూతాని అపి—సమర్థములును అసమర్థములు నగు సర్వభూతములును; కథయిష్యన్తి= చెప్పఁగలవు. అందువలన నేమి యందువేని. సమ్భావితస్య = శౌర్యవీర్యపరాక్రమాది గుణములచే అందఱిచేతను గౌరవింపఁబడినవానికి; తద్విపరీతగుణములచేఁ బుట్టిన, అకీర్తిః= అపకీర్తి; మరణాత్ = చావుకన్న; అతిరిచ్యతే చ = అధిక మగును కదా. ఇట్టి యపకీర్తి నొందుటకన్న మరణమే నీకు మే లని యర్థము.

యుద్ధము విడుతువేని నీకు నిరతిశయము లగు సుఖకీర్తులు లేక పోవుటయె గాక, 'యుద్ధము మొదలుపెట్టఁగానే యర్జునుఁడు వెఱచి పాఱెను' అను నపకీర్తి గూడ కలుగును. ఆయపకీర్తిని సమర్థులుమాత్రమె కాదు, అసమర్థులుగూడ ఉగ్గడించి చెప్పసాగుదురు. శూరుఁడు వీరుఁడు పరాక్రమవంతుఁడు ఇత్యాదిగా సర్వజనులచేతను మన్నింపఁబడుచున్న వానికి తద్విపరీతముగా పిఱికి బలహీనుఁడు ఇత్యాదిగా అపకీర్తి పొందుట మరణముకన్నను దుస్సహము. కావున నీవు యుద్ధముచేసి మరణము పొందినను పొందుము. అట్టి యపకీర్తిపాలు కావల దని తాత్పర్యము.

భయాద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ 35

భా. చ.—మఱియును. మహారథాః=దుర్యోధన ప్రభృతు లగు మహారథులు, త్వామ్ = నిన్ను; భయాత్ = కర్ణాదుల వలని భయమువలన; రణాత్ = యుద్ధమునుండి; ఉపరతమ్=విరమించిన వానిఁగా; మంస్యన్తే = తలంపఁగలరు, దయవలన నని కాదు; యేషామ్ = ఏదుర్యోధనాదులకు; బహుమతః = బహుగుణములతోఁ గూడినవాఁడని గౌరవింపఁబడిన వాఁడవై; భూత్వా = ఉండి; మరల, త్వమ్ = నీవు; లాఘవమ్ = చులుకఁదనమును; యాస్యసి = పొందఁగలవో. అట్టి మహారథులగు దుర్యోధనాదు లని పూర్వార్థముతో నన్వయము.

ఇదిగాక. దుర్యోధనాదులందఱు, నీవు కర్ణాదులకు భయపడి యుద్ధము చేయఁ జాలక మానుకొంటి వని తలంతురు గాని భీష్మాదులందఱి కరుణచే యుద్ధము మానితి వని తలంపరు. ఇంత కాలము నిన్నెవ్వరు శౌర్యాది బహుగుణములు గల వాఁ డని గొప్పగాఁ దలఁచుచుండిరో ఆదుర్యోధనాదులె యింక నిన్ను కర్ణాదులకు భయపడిన వానిఁగాఁ దలఁచి చులుకనగాఁ జూతు రని తాత్పర్యము.

ఆ. ఈకారణమువలనఁ గూడ నీవు యుద్ధము చేయవలె నని చెప్పుచున్నారు మఱియును అని. ప్రాణులయందలి కరుణచే నేను యుద్ధము చేయకున్నా నని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నారు మహారథాః ఇత్యాదిగా. మహారథులకే విశేషణము చెప్పుచున్నారు యేషామ్ ఇత్యాదిగా. దుర్యోధనులచేఁ బరిహాసము నొందకుండుటకై నీవవశ్యము యుద్ధమునందుఁ బ్రవర్తింపవలయు నని యర్థము.

హ. భయాత్ = కర్ణాదిభయమువలన, రణాత్ = యుద్ధమునుండి, ఉపరతమ్ = నివర్తిల్లినవానిఁగా, త్వామ్ మన్యన్తే = తలంతురు కృపచేతనని కాదు, మహారథాః—దుర్యోధన ప్రభృతులు. ఎవరు తలంతురనగాఁ జెప్పుచున్నాఁడు.—యేషామ్= ఏదుర్యోధనాదులకు, త్వాం బహుమతో భూత్వా, మరల, లాఘవమ్ = లఘు భావమును, యాస్యసి, వారుతలంతురు.

శం. అపకీర్తిమాత్రమే కాదు. శూరులు నిన్నవమానింతురని చెప్పుచున్నాఁడు.—మహారథాః = బాహ్లీక భగదత్త సౌమదత్తి ప్రభృతులగు శూరులు; ఇట్లు కృపచే నుపరమించిన, త్వామ్=నిన్ను,భయాత్ రణాత్ ఉపరతమ్—భీష్మద్రోణ కర్ణులు మొదలగు వీరులతోఁ బోరఁ జాలక వారివలని భయముచే యుద్ధమునుండి యుపరమించినాఁ డర్జునుఁడు కాని కృపచేతఁగాదని; మంస్యన్తే = నిశ్చయింపఁగలరు. పూర్వము, యేషామ్; త్వమ్; బహుమతః—శౌర్యము ధైర్యము యుద్ధచాతుర్యము మొదలగు గుణములచే నుత్తముం డని బహుమానము పొందినాఁడవో; అట్టి నీవు ఇప్పుడు వారివలననె, లాఘవమ్=యుద్ధమునుండి పాఱిపోయెనని చులుకఁదనమును, అవమానమును, యాస్యసి. అపకీర్తి పరోక్షమునందుఁ గలుగు తిరస్కారము, అవమానము ప్రత్యక్షమునందుఁ గలుగునది యని వాని రెంటికిని భేదము.

మ. ఓయి! ఉదాసీనులగు * జనులు నన్ను నిందించినను నిందింతురు గాక. భీష్మద్రోణాదు లగు మహారథులు మాత్రము కరుణాశాలి యని స్తుతింపఁ గలరు నన్ను. అని యాశంకింపఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు—భయాత్ =కర్ణాదుల వలని భయమువలన; రణాత్ =యుద్ధమునుండి; ఉపరతమ్ = నివృత్తునిఁగా, దయచేతఁ గా దని, త్వాం మంస్యన్తే, మహారథాః = భీష్మ ద్రోణ దుర్యోధనాది మహారథులు. ఓయీ! వారు నన్ను గొప్పగాఁ దలఁచువారు. ఎట్లు భయపడినవానిఁ గాఁ దలంతురు? అని యాశంకించియందుకుఁ జెప్పుచున్నారు—యేషాంచ=ఏభీష్మాదులకే, త్వమ్,

* సంబంధ రహితులగు.

బహుమతః = బహుగుణములతోఁ గూడినవాఁడు అర్జునుఁ డని సమ్మతుఁడవో, ఆమహారథులే, త్వాం భయాత్ ఉపరతం మంస్యన్తే అని యన్వయము. ఇందు వలన, భూత్వా—అయి, యుద్ధమునుండి యుపరతుఁడవై యని యర్థము, లాఘవమ్= అనాదరమునకు విషయమగుటను, అందఱికిని అని శేషము; యాస్యసి = పొందఁ గలవు. లేక. యేషాంచ=ఎవ్వారికే, త్వమ్, మున్ను, బహుమతుఁడవై తివో, వారికే; అట్టివాఁడవై, భూత్వా = ఉండి, లాఘవమ్, యాస్యసి.

శ్రీ. మఱియును. యేషామ్= ఎవరికి, బహుగుణసంపన్నుఁడ వని మున్ను సమ్మతుఁడ వయితివో, వారే భయముచే యుద్ధమునుండి నీవు నివృత్తుఁడవైతి వని తలంతురు. అందువలన మున్ను బహుమతుఁడవై యుండి లాఘవము నొందఁగలవు.

ప. ఇఁక సంభావితత్వమునే చెప్పుచున్నాఁడు.—ఆమహారథులు, త్వామ్— భయాత్ = భయమను నిమిత్తమువలన, రణాత్ = యుద్ధమునుండి, ఉపరతమ్=మర లినవానిఁగా, మంస్యన్తే = తలంతురు, కాని తమయందలి కృపచే మరలితి వని తలం పరు. వారెవరనఁగా—ఏషామ్ = ఏవీరులకు, త్వమ్, బహు = గొప్పగా, మతః = సమ్మతుఁడవై, భూత్వా = ఉండి, లాఘవమ్ = లఘుత్వమును, యాస్యసి = పొందఁ గలవో, వారు.

రా. బంధువులందు స్నేహమువలనను కారుణ్యమువలనను యుద్ధమునుండి నివృత్తుండను శూరుండను నాకపకీర్తి యెట్లు వచ్చుననఁగా అందుకుఁ జెప్పుచు న్నాఁడు.— యేషామ్ = ఏకర్ణదుర్యోధనాదు లగు మహారథులకు; ఇంతకుమున్ను, త్వమ్ = నీవు; బహుమతః = ఈశత్రువు శూరుఁ డని గౌరవింపఁబడినవాఁడవై; భూత్వా = ఉండి; ఇప్పుడు యుద్ధమురాఁగానే వెనుదీసినవాఁడ వగుటచే, లాఘ వమ్—వీని సులువుగాఁ బట్టుకోవచ్చు నను నభిప్రాయమునకు విషయమగుటను; యాస్యసి = పొందఁగలవో; తే, మహారథాః చ = కర్ణదుర్యోధనాది మహారథులును; త్వామ్ = నిన్ను; భయాత్ = భయంబువలన; రణాత్ = యుద్ధమునుండి; ఉపర తమ్ = విరమించినవానిఁగా ; మంస్యన్తే = తలంపఁగలరు. ఏలయనఁగా, శూరులకు శత్రుభయమువలననె గాని బంధుస్నేహాదులచే యుద్ధమునుండి యుపరతి యుప పన్నము కాదు.

నిన్నిదివఱకు కర్ణాదులు శూరుఁడ వని తలఁచి గౌరవించుచుండిరి, వార లిపుడు నిన్ను సులభముగాఁ బట్టుకొనశక్య మయినవానిఁగాఁ దలఁతురు గదా. అట్టి

కర్ణదుర్యోధనాది మహారథులు, నిన్నిఁక భయమువలన యుద్ధంబు విడిచినవానిఁ గానే తలంతురుగాని బంధుస్నేహాదులచే యుద్ధంబు విడిచితి వని యెంతమాత్రము తలంప రని తాత్పర్యము.

అవాచ్యవాదాంశ్చ బహూన్వదిష్యన్తి తవాఽహితాః
నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్. ౩౬

భా. మఱియును. తవ = నీయొక్క; అహితాః = శత్రువులు; తవ = నీయొక్క; సామర్థ్యమ్ = సమర్థతను; నిన్దన్తః = నిందించుచు; బహూన్ = అనేకవిధము లయిన; అవాచ్యవాదాన్ చ = చెప్పరాని మాటలనుగూడ; వదిష్యన్తి = చెప్పఁగలరు. తతః = ఆనిందాప్రాప్తి దుఃఖము కన్నను; దుఃఖతరమ్ = అధికమైనదుఃఖము; కిం ను = ఏది? అంతకన్నను కష్టతరమైన దుఃఖము లే దని యర్థము.

ఇంతియ కాదు. నీశత్రువులు, 'అర్జునుఁడేమి? నివాతకవచులు మొదలగువారితో యుద్ధము చేయుటయనఁగానేమి? వీని కంత సామర్థ్యమెక్కడిది? అది యంతయుఁ గల్పితము' ఇత్యాదిగా నీసామర్థ్యము విషయమై నిన్ను నిందించుచుఁ జెప్పరానిమాటలు చెప్పసాగుదురు. అట్టి నిందల నొందుటకన్నను కష్టమైన దుఃఖ మేదియు లే దని తాత్పర్యము.

ఆ. ఇందువలనఁగూడ నీవు యుద్ధమునుండి యుపరమింపఁగూడ దని చెప్పుచున్నారు మఱియును అని. ఓయీ! భీష్మద్రోణాది వధముచేఁ గలుగునట్టి కష్టతరమైన దుఃఖము సహింపఁజాలక యుద్ధమునుండి నివృత్తుఁడనైతిని, శత్రువులు గావించు మత్సామర్థ్య నిందాదికమును ఎట్లయిన సహింపఁ జాలుదు నని యాశంకించి అందుకుఁ జెప్పుచున్నారు తతః ఇత్యాదిగా.—

హ. *

శం. విద్యచేతను కులముచేతను సచ్చరిత్రముచేతను ధర్మముచేతను కర్మముచేతను ప్రతిష్ఠను బొందినవానికి దుఃఖము అపకీర్తి, అంతకన్నను అధికమైన దుఃఖము అవమానము, అంతకన్నను అధికతరమైన దుఃఖం బీప్రత్యక్షదూషణ మని చెప్పుచున్నాఁడు.— అహితాః = శత్రువులు, దుర్యోధన కర్ణ వికర్ణా

* శంకరభాష్యముతో సమానము.

దులు; తవ; సామర్థ్యమ్ = ఇక్కడఁ గనఁ బడని పౌరుషమును బరాక్రమమును; నిన్దన్తః=యుద్ధమునుండి పాఱినవానికి నీకు శౌర్య మెక్కడిది దని నిందించుచున్నవారై; అవాచ్య వాదాన్ = చెప్పుటకు అయోగ్యము లయిన మాటలను, ధిక్ ఇత్యాది శబ్దములతోఁగూడిన దూషణశబ్దములను; ఇకమీఁద, వదిష్యన్తి, తతః—కర్ణకఠోరం బులును మర్మస్థానములు భేదించునవియు నగు నిందావాక్యంబుల కన్నను; దుఃఖ తరమ్; అభిమానముగలవాఁడు శూరుఁ డగు క్షత్త్రియునకు; కిం ను—ఏమికలదు? అంతకన్నను దుఃఖతరము వేఱు లే దని యర్థము.

మ. ఓయీ! భీష్మాదులు మహారథులు నన్ను బహుమానింపకపోనీ. దుర్యోధనాదులు శత్రువులు మాత్రము నన్ను బహుమానించెదరు, ఏలయనఁగా యుద్ధమునుండి నివృత్తుఁడ నగుటచే వారి కుపకారిని గదా నేను. ఇందుకుఁ జెప్పుచున్నారు.—తవ, సామర్థ్యమ్—లోకప్రసిద్ధమైన అసాధారణ సామర్థ్యమేదిగలదో దాని; నిన్దన్తః = నిందించుచున్న; తవ = నీయొక్క; శత్రవః—దుర్యోధనాదులు; అవాచ్య వాదాన్ చ = చెప్పుటకు అయోగ్యము లయిన నపుంసకుఁడు ఇత్యాదులగు మాటలనే; వదిష్యన్తి. కాని బహుమానింప రని యభిప్రాయము. లేక. స్తవసామర్థ్యమ్= స్తోత్రయోగ్యతను, నిన్దన్తః, తవ, అహితాః, అవాచ్యవాదాన్, వదిష్యన్తి అని యన్వయము. ఓయీ! భీష్మద్రోణాది వధముచేఁ గలుగునట్టి కష్టతర మయిన దుఃఖమును సహింపఁజాలక యుద్ధమునుండి యుపరమించితిని. శత్రువులు చేయు సామర్థ్య నిందనముచేఁ గలుగుదుఃఖమును సహింపఁజాలుదును అనఁగా ఇందుకుఁ జెప్పుచున్నాఁడు—తతః = అనిందను పొందు దుఃఖముకన్న; కిం ను దుఃఖతరమ్—అంత కన్న నధికమైన దుఃఖ మేదియు లే దని యర్థము.

శ్రీ. మఱియు. అవాచ్య వాదాన్ = చెప్పుటకు అనర్హము లయిన శబ్దములను, తవ, అహితాః = శత్రువులు, వదిష్యన్తి.

ప. తవ అహితాః=సహజశత్రువు లగు దాయాదులు, అవాచ్య వాదాన్= చెప్పుటకు అనర్హము లయిన అపవాదములను, వదిష్యన్తి. వారెట్టివారనఁగా.—తవ సామర్థ్యమ్ నిన్దన్తః. అంతకన్నను దుఃఖతర మేది కలదు?

రా. మఱియు. తవ = నీయొక్క; అహితాః = శత్రువులగు దుర్యోధనాదులు; 'శూరుల మగు మాదగ్గఱ ఎట్లీ యర్జునుఁడు క్షణమైన నిలువఁజాలును? మేము లేనిచోటఁగదా యితనిసామర్థ్యము?' అని, తవ=నీయొక్క; సామర్థ్యమ్=

పరాక్రమమును ; నిన్దన్తః = నిందించుచు ; అవాచ్య వాదాన్ చ = శూరులమ గుఱించి చెప్పరానిమాటలనుగూడ; బహూన్ = అనేకములను; వదిష్యన్తి = చెప్పఁ గలరు. తతః = అట్టిమాటలు వినుటకన్నను; దుఃఖతరమ్ = అధికతర మయిన దుఃఖము; కిం ను = నీకేమియున్నది ? ఇట్టి యవాచ్యముల వినుటకన్న మరణమే మే లని నీవే తలంతువు.

మాయెదుట నర్జునుఁడు పనికిరాఁ డని నీపరాక్రమమును నిందించుచు నీశత్రువు లగు దుర్యోధనులు నిన్ను గుఱించి మిక్కిలి నీచము లయిన మాటలు పలుకుచుందురు. అట్టి మాటలు వినుటకన్నను అధిక దుఃఖమేమియు లే దని తాత్పర్యము.

హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్
తస్మా దుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః 32

భా. ఇఁక యుద్ధముచేసిననో. త్వమ్ = నీవు; హతో వా = కర్ణాదు లచే వధింపఁబడినవాఁడవై తివా; స్వర్గమ్ = స్వర్గమును; ప్రాప్స్యసి = పొందఁగలవు. జిత్వా వా = కర్ణాదులను శూరులను జయించితివా; మహీమ్ = భూమిని; భోక్ష్యసే = అనుభవింపఁగలవు. రెండువిధంబులను నీకు లాభమే యని యభిప్రాయము. ఎందువలన నిట్లున్నదో, తస్మాత్ = అందువలన. కౌన్తేయ= అర్జునా ! యుద్ధాయ = యుద్ధముకొఱకు; కృత నిశ్చయః = చేయఁబడిన నిశ్చయముగలవాఁడవై, జయింతును శత్రువు లను లేక చత్తును అని నిశ్చయముచేసి యని యర్థము; ఉత్తిష్ఠ = లెమ్ము

యుద్ధము చేయుదువేని, ఒకవేళ నీవు కర్ణాదులచే హతుఁడవే యయి నను, నీకు నష్టము లేదు, స్వర్గముకలుగును. జయించినపక్షమున రాజ్యము నొం దుదు వనుట సిద్ధమేకదా! అందువలన అర్జునా ! జయమునుగాని మరణమునుగాని పొందెద నని నిశ్చయించి లేచి యుద్ధము సేయు మని తాత్పర్యము.

టీ. అట్లయిన నొడ, యుద్ధముచేసినచో గుర్వాదివధము సంభవించుట వలన, మధ్యస్థులగువారు నిందింతురు. యుద్ధమువిడిచినచో శత్రువులు నిందింతురు. ఇట్లు రెండుపక్షములందును బాధ యున్నదని యాశంకించి యందుకుఁ జెప్పుచు న్నారు.—ఇఁక ఇత్యాదిగా. జయము కలిగినను బరాజయము కలిగినను లాభము నిశ్చితమగుటవలన యుద్ధమునకు లేచుట యావశ్యక మని చెప్పుచున్నాఁడు ఉత్త

ర్థముచేత. పరిశుద్ధ మయిన వంశమునఁ బుట్టి యుద్ధమున కుద్యుక్తుఁ డయిన క్షత్రి యునకు దానివిడుచుట మంచిది కా దని చెప్పుచున్నాఁడు కౌన్తేయ యను సంబో ధనముచేత *. రెండువిధంబులను—జయమునందును బరాజయమునందు. జయ పరాజయ నియమము లేకున్నను లాభనియమము కలుగుటచే ఫలితముఁ జెప్పుచు న్నారు ఎందువలన ఇత్యాదిగా. నిశ్చయమునే విశదీకరించుచున్నారు జయింతును ఇత్యాదిగా.

హ. ఇఁకఁ గర్ణాదులతో యుద్ధము చేసినపక్షమునను. జిత్వావా=కర్ణా దులను జయించిన పక్షమున. మహీం భోక్ష్యసే. రెండు పక్షములందును నీకు లాభ మని యభిప్రాయము. అందువలన కౌంతేయ, కృతనిశ్చయః—శత్రువుల నైనను జయించెదను మరణము నైనను బొందెదను అని నిశ్చయముచేసి యని యర్థము; ఉత్తిష్ఠ.

శం. ఓయీ! యుద్ధముచేసినయెడ గుర్వాది వధవశమువలన శిష్టజనులు నిందింతురు. చేయనియెడ శత్రువులు నిందింతురు. ఇట్లు రెండుపక్షములందును నిందాదుఃఖమే ఫలమగుచున్నది. అంతకితరము లేదని యాశంకించి, ‘యుద్ధముచేసిన యెడ యాగమువలె యుద్ధము స్వధర్మమగుటవలన గుర్వాదిహింస పశుహింసవలె స్వధర్మములోఁ జేరుటవలన శిష్ట నింద సంభవింపదు, శత్రునిందయు సంభవింపదు. మఱియు జయము కలిగినను కలుగకపోయినను యుద్ధముచేయుటచే దృష్టఫలము కల’ దని చెప్పుచున్నాడు—యుద్ధమునందు, హతో వా=కర్ణాదులచే చంపఁబడినవాఁ డవైనను నీవు, స్వర్గంప్రాప్స్యసి. జిత్వా వా = శత్రువులను జయించినను; మహీమ్= నిష్కంటక మయిన భూమిని, భోక్ష్యసే. ఎందువలన యుద్ధము రెండుపక్షములందును సఫలమే యగునుగాని విఫలముకాదో, తస్మాత్ = అందువలన; యుద్ధంబుకొఱకే కృతనిశ్చయుఁడవై ఓకౌంతేయుఁడా! ఉత్తిష్ఠ— సన్నద్ధుడవు కమ్మని యర్థము.

మ. ఓయి! అప్పుడు, యుద్ధము చేయుటయందు గుర్వాది వధవశమున మధ్యస్థకృత మయిన నింద, దానివిడుచుటయందు శత్రుకృతమైన నింద సంభవిం చును. ఇట్లు ఎటు పోయినను అనర్థము అని యాశంకించి, జయమునందును బరా జయమునందును లాభము నియతమగుటవలన యుద్ధార్థమే లేచుట యావశ్యక మని చెప్పుచున్నాఁడు—పూర్వార్ధము స్పష్టము. ఎందువలన రెండుపక్షములందును నీకు

---

* కుంతీపుత్త్రుఁడా.

లాభమే కలుగునో, తస్మాత్; ‘జయింతును శత్రువులను, లేక చత్తును’ అని కృతనిశ్చయుండవై, యుద్ధాయ ఉత్తిష్ఠ, స్వర్గరాజ్యములలో ఏఫలము కలుగు ననుసందేహమున్నను, యుద్ధము కర్తవ్యమని నిశ్చితమగుటవలన. ఇందుచే ‘నచైతద్విద్మః కతరన్నో గరీయః’ ఇత్యాద్యర్జునవాక్యమునకు సమాధానము చెప్పఁబడినది.

శ్రీ. ‘నచైతద్విద్మః కతరన్నో గరీయో యద్వా జయేమ యది వా నోజయేయుః’ అను నర్జునవాక్యమునకు సమాధానము చెప్పుచున్నాఁడు.—రెండు పక్షములందును నీకు లాభమే యని యర్థము.

ప. ఓయీ! మరణము పొందినవానికే స్వర్గప్రాప్తి చెప్పఁబడుచున్నది కాని జయముఁబొంది జీవించి యున్నవానికిఁ గాదే యనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—యుద్ధమునందు మృతునకు స్వారాజ్యము, జయించినవానికి సామ్రాజ్యము * సిద్ధించు నని యర్థము.

రా. ఇందువలన, శూరునకుఁ దాను శత్రువుల వధించుటగాని తాను శత్రువులచే వధింపఁబడుటగాని, రెండును శ్రేయస్సుఁగలిగించునని చెప్పుచున్నాఁడు.— హతోవా = ధర్మయుద్ధమున శత్రువులచే వధింపఁబడినవాఁడవైతివేని; అందువలననే, స్వర్గమ్ = పరమనిశ్శ్రేయసమును ♦; ప్రాప్స్యసి = పొందఁగలవు. జిత్వావా = జయించినయెడ, శత్రువులను వధింతువేని; మహీమ్ = నిష్కంటక మయిన రాజ్యమును; భోక్ష్యసే = అనుభవింపఁగలవు; ఫలాభిసంధివిడిచి యుద్ధాఖ్యధర్మము ననుష్ఠించుటచే పరమనిశ్శ్రేయసంబునుగూడఁ బొందెదవు. తస్మాత్ = అందువలన; కృతనిశ్చయః = చేయఁబడిన నిశ్చయముగలవాఁడవై, యుద్ధముసేయుట పరమపురుషార్థరూప మయిన మోక్షమునకు సాధన మని నిశ్చయించినవాఁడవై; యుద్ధాయ = అట్టి యుద్ధముకొఱకు; ఉత్తిష్ఠ=లెమ్ము. కౌన్తేయ= కుంతీపుత్త్రుఁడా! కుంతీపుత్త్రుఁడవైన నీకిదియే యుక్తమని యభిప్రాయము.

ధర్మయుద్ధముచేసి యందు నీవు శత్రువులచే హతుఁడవగుదువేని దాని వలననే యనాయాసముగా పరమనిశ్శ్రేయసంబు నొందుదువు. జయమునే పొందుదువేనియు, నిష్కంటక మయిన రాజ్యము నొందుటయేగాక ఫలాభిసంధి లేక యుద్ధము అను స్వధర్మము ననుష్ఠించుటవలనఁ బరమనిశ్శ్రేయసమునుగూడ పొందఁ

* స్వారాజ్యము—స్వర్గరాజ్యము, సామ్రాజ్యము—చక్రవర్తిత్వము.

♦ మోక్షమును.

గలవు. కావున యుద్ధము మోక్షసాధన మని నిశ్చయించి యుద్ధముసేయుటకు లెమ్ము. కుంతికిఁబుట్టి నీ విట్లు వెనుదీయుట తగ దని తాత్పర్యము.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి. 38

భా. అట్లుండఁగా, యుద్ధము స్వధర్మమని యుద్ధముసేయువాని కీయుపదేశము వినుము.—సుఖదుఃఖే = సుఖమును దుఃఖమును; సమే= తుల్యములనుగా; కృత్వా=చేసి, రాగద్వేషములనుగూడ వహింపక యనుట; అట్లు, లాభాలాభౌ= లాభమును నష్టమును; జయాజయౌ = జయమును పరాజయమునుగూడ; సమౌకృత్వా—తుల్యములనుగాఁ దలఁచి; తతః = అంత; యుద్ధాయ = యుద్ధముకొఱకు; యుజ్యస్వ= పూనుము. ఏవమ్— ఇట్లు యుద్ధము చేయుచున్నవాఁడవై; పాపమ్ = ఫలరూపమయిన పాపమును; నావాప్స్యసి = పొందవు. ఈయుపదేశము ప్రాసంగికము.

నీవు రాగద్వేషములను వహింపక, సుఖముగాని దుఃఖముగానికలిగినను, లాభముగాని నష్టముగాని వచ్చినను, జయముగాని పరాజయముగానిసంభవించినను సమానముగా గ్రహించువాఁడవై యుద్ధము సేయుము. ఇట్లు యుద్ధముచేయుదువేని తత్ఫలరూప మయిన పాపము నీకుఁ గలుగదు. యుద్ధము స్వధర్మముగా నిశ్చయించి చేయువాఁ డిట్లు చేయవలెను. ప్రసక్తినిబట్టి నీకుఁజెప్పితి నని తాత్పర్యము.

శ్రీ. పాపహేతువఁడ నగుటచే యుద్ధముసేయ నిశ్చయించి లేవఁజాలకున్నా నని యాశంకింపఁగా అందుకుఁ జెప్పుచున్నారు అట్లుండఁగా ఇత్యాదిగా. అట్లుండఁగా.—యుద్ధము స్వధర్మమగుటచే అవశ్యకర్తవ్యమై యుండఁగా నని యర్థము. బంధుజీవనము తన్మరణము మొదలగువానిచేఁ గలుగు సుఖదుఃఖములను సమములుగఁ జేయుట యెట్లనఁగాఁ జెప్పుచున్నారు రాగద్వేషములనుగూడ వహింపక యనుట యని. లాభము—శత్రువుల బొక్కసము మొదలగునవి పొందుట. అలాభము— అందుకు విపరీతము. జయము—న్యాయ్య మయిన యుద్ధముచేఁ దాను లోఁబడక శత్రువును లోఁబఱచుట, అజయము—అందుకు విపరీతము. లాభాలాభములను జయాజయములనుగూడ సమములుగాఁ జేయుటకును రాగద్వేషములను వహింపకుండుటయె సాధన మని తెలుపుటకై అట్లు అని చెప్పఁబడినది. ఈయుపదేశము

వలనఁ బరమార్థదర్శన ప్రకరణమునందు యుద్ధము కర్తవ్య మని చెప్పుటవలన శాస్త్రమునకు సముచ్చయపరత్వము సంభవించు నని యాశంకించి చెప్పుచున్నారు ఈయుపదేశము ప్రాసంగికము అని. ఈయుపదేశము క్షత్రియుఁడ వగు నీకు స్వధర్మమయిన యుద్ధము కర్తవ్య మని యనువాదముచేయుప్రసంగమునఁ జేయఁబడిన దగుటవలన నింతమాత్రముచే సముచ్చయము సిద్ధింప దని యర్థము.

హ. అందువలన స్వధర్మమనియే యుద్ధముసేయుము. ఈయుపదేశము విను.—సుఖదుఃఖములను సమములుగాఁ జేసి లాభాలాభములను జయాజయములను సమములుగాఁ జేసి యనుటను. ఈయుపదేశము ప్రరోచనార్థము * ప్రాసంగికము.

శం. ఓయీ! 'హతో వా ప్రాప్స్యసి స్వర్గమ్' అను వాక్యముచే యుద్ధము ఐహికాముష్మిక సుఖసాధన మని మాత్రమే యేర్పడుచున్నది, కాని 'ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయో ఽన్యత్' అని చెప్పఁబడిన న్యాయముచొప్పున శ్రేయస్సాధన మని యేర్పడదు అందువలన ఇంద్రియసుఖాపేక్షులకుమాత్రమె యుద్ధము కర్తవ్యము. స్వర్గాది సుఖహేతు వని తెలియవచ్చుటచే యుద్ధము బంధకమగుట వలనఁ బరమార్థాపేక్ష గలవారికిఁ గర్తవ్యము కాదు అని యాశంకింపఁగా. « అట్లు కాదు. భావనాభేదమువలన ఇట తత్ఫలముగూడ భేదించుచున్నది. ఎట్లు జ్యోతిష్టోమము స్వర్గకామనచేఁ జేయఁబడినదై స్వర్గహేతువును అకామనచేఁ జేయఁబడినదై చిత్తశుద్ధిహేతువు నగునో, అట్లు యుద్ధమును ప్రజాపాలనంబును దానంబును కామకృతంబులై స్వర్గాదిఫలమునకును అకామకృతంబులై చిత్తశుద్ధికిని హేతువులగును. శ్రేయస్కాముఁడ వేని నీవు యుద్ధమును కామనలేకయే యనుష్ఠింపుము» అని చెప్పుచున్నాఁడు.—లాభాలాభౌ, జయాజయౌ, ఆలాభాలాభ జయాజయముల ఫలములయిన, సుఖదుఃఖే = సుఖమును దుఃఖమును, సమేకృత్వా—సమబుద్ధివై, లాభాదులు సిద్ధించినను సిద్ధింపకున్నను హర్షవిషాదంబుల నొందక యని యర్థము. తతః—నాయందు భక్తియుంచి విధికి విధేయుఁడవై యటుపిమ్మట, యుద్ధాయ—విధిప్రోక్తమయిన స్వధర్మము ననుష్ఠించుట కొఱకు, యుజ్యస్వ = యత్నింపుము. ఏవమ్—విధివిహిత మేదిగలదో దాని ఈశ్వరార్పణబుద్ధిచే చేసెద నని నిశ్చయించి యుద్ధముచేయుదు వేని, పాపం నావాప్స్యసి. 'బ్రహ్మణే బ్రాహ్మణ మాలభేత' అను శ్రుతిచే విహిత మగు నరమేధమునందు బ్రాహ్మణునిఁ బశువుగాఁ బట్టి కర్త యెట్లు పాపము నొందఁడో అట్లు 'యేయుధ్యన్తే ప్రధనేషు' అను శ్రుతిచే విహిత మయిన

* రుచిపుట్టించుట ప్రయోజనముగాఁగలది.

స్వధర్మమగు యుద్ధమునందు గుర్వాదుల వధించి దానిచేఁ గలుగు పాపమును బొందవని యర్థము.

వ్యా. ఓయీ! ఇట్లు, స్వర్గము నుద్దేశించి యుద్ధము చేసినచో దానికి నిత్యత్వము లేకపోవును. రాజ్యమునుద్దేశించి యుద్ధముచేసినచో అర్థశాస్త్రమగుటవలన ధర్మశాస్త్రముకన్న దుర్బలంబగును. అందువలనఁ గామ్యకర్మము చేయకుండుట వలనఁ బాపమెట్లు కలుగును? దృష్టార్థమైన ❘ గురుబ్రాహ్మణాది వధము ధర్మం బెట్లగును? అట్లు 'అథచేత్త్వమిమమ్' అను శ్లోకముయొక్క యర్థము వ్యాహతమగుచున్నది. అని యాశంకింపఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.— సమతకుఁ గారణము రాగద్వేషములులేకుండుట. సుఖమునందును దానికిఁ గారణమయిన లాభమునందును దానికిఁ గారణమయిన జయమునందును రాగమును జేయక, ఇట్లు దుఃఖంబునందును దానికిఁ గారణ మయిన అలాభమునందును దానికిఁ గారణమైన అజయమునందును ద్వేషమును జేయక, తతః, యుద్ధాయ, యుజ్యస్వ = సన్నద్ధుఁడవగుము. ఏవమ్—సుఖకామనను దుఃఖనివృత్తికామనను విడిచి స్వధర్మబుద్ధిచే యుద్ధముచేయుదువేని, పాపమ్—గురుబ్రాహ్మణాది వధముచేఁ గలుగు పాపమును నిత్యకర్మము చేయకుండుటచేఁ గలుగుపాపమును, నావాప్స్యసి=పొందవు. ఇఁక నెవ్వఁడు ఫలకామనచేఁ జేయుచున్నాఁడో అతఁడు గురుబ్రాహ్మణాది వధనిమిత్తమయిన పాపమును బొందుచున్నాఁడు, ఎవఁడు చేయఁడో అతఁడు నిత్యకర్మపరిత్యాగ నిమిత్తమైన పాపమును బొందుచున్నాఁడు. కావున ఫలకామన లేక చేయువాఁడు రెండువిధము లయిన పాపములనుగూడఁ బొందఁడని యీయభిప్రాయము మున్నె వ్యాఖ్యాతము. 'హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్' అనునదియో యానుషంగిక ఫల ప్రతిపాదకము * కావున దోషము గాదు. అట్లు ఆపస్తంబస్మృతి 'తద్యథా ఽఽమ్రే ఫలార్థే నిమితే ఛాయాగన్ధావనూత్పద్యేతే ఏవం ధర్మం చర్యమాణ మర్థా అనూత్పద్యన్తే నోచే దనూత్పద్యన్తే న ధర్మహాని ర్భవతి' ♦ అని. అందువలన యుద్ధశాస్త్రమునకు అర్థశాస్త్ర

❘ దృష్టమయిన రాజ్యాదిప్రయోజనము గలదైన.

* అపేక్షింపకయే కలుగు ఫలము జెప్పునది.

♦ అది యెట్లు మామిడిచెట్టు ఫలార్థమై వేయఁగా ఛాయాగంధములు వెంబడిఁబుట్టుచున్నవో అట్లు ధర్మము ననుష్ఠింపఁగా అర్థములు వెంబడిఁ బుట్టుచున్నవి. అట్లు వెంబడిఁ బుట్టనియెడ ధర్మహానిలేదు.

త్వము సంభవింపమివలన 'పాపమే వాశ్రయే దస్మాన్' ఇత్యాదికము నిరాకృత మగుచున్నది.

**శ్రీ.** 'పాపమే వాశ్రయే దస్మాన్' అను నర్జున వాక్యమునకుఁ జెప్పుచున్నాఁడు.—సుఖదుఃఖే, సమే, కృత్వా; అట్లు, ఆసుఖదుఃఖములకుఁ గారణము లయిన లాభాలాభములను, వానికిఁగూడ కారణములైన జయాజయములనుగూడ, సమములనుగాఁజేసి; ఇవి సమములగుటకుఁ గారణము హర్షవిషాదములు లేకుండుట. యుధ్యస్వ = సన్నద్ధుఁడవగుము. సుఖాదులందు అభిలాష విడిచి స్వధర్మబుద్ధితో యుద్ధమును జేయుదువేని పాపమును బొందవని యర్థము.

**మ.** ఇఁక ధర్మ్యయుద్ధస్వరూపముఁ జెప్పుచున్నాఁడు.—సుఖదుఃఖే, సమే, కృత్వా; అట్లు, వానికిఁ గారణము లయిన, లాభాలాభౌ, జయాజయౌ, సమములనుగాఁజేసి, హర్షవిషాదములు లేనివాఁడవై యుద్ధముసేయుమని యర్థము. ఏవమ్—ఈవిధముగా యుద్ధముచేసి, పాపం నావాప్స్యసి.

**రా.** ముముక్షువు యుద్ధముచేయువిధముఁ జెప్పుచున్నాఁడు.—ఇట్లు దేహాతిరిక్తునిఁగాను సమస్త దేహ స్వభావసంబంధము లేనివానిఁగాను నిత్యునిఁగాను ఆత్మనుదెలిసి, యుద్ధమునందు అనివార్య మయిన శస్త్రపాతాదులచేఁ గలుగునట్టి, సుఖదుఃఖే = సుఖదుఃఖములను; సమేకృత్వా=సమానములనుగాఁజేసి; లాభాలాభౌ = ధనలాభమును తన్నాశమును; జయాజయౌ = జయమును బరాజయమును; సమౌ కృత్వా= సమానములనుగాఁజేసి, ఈసుఖదుఃఖాదులందు వికారమునొందని * బుద్ధి గలవాఁడవై స్వర్గాది ఫలాభిసంధి లేనివాఁడవై; యుద్ధాయ = యుద్ధముకొఱకు; యుజ్యస్వ = చేయవలసినదిమాత్రమే యిది యని పూనికవహింపుము. ఏవమ్ = ఇట్లు చేయుదువేని; పాపమ్ = పాపమును, ఇటఁ బాపము ననఁగా దుఃఖస్వరూప మయిన సంసారమును; నావాప్స్యసి = పొందవు, సంసారబంధమునుండి ముక్తుఁడవగుదువని యర్థము.

ఇట్లు నీవు ఆత్మ నిత్యుఁ డనియు దేహములజన్మనాశాదిస్వభావమును ఎంతమాత్రము అంటనివాఁ డనియుఁ దెలిసి, ఆయుధముల దెబ్బలచేఁ గలుగు సుఖదుఃఖములకును ధనలాభ తన్నాశములకును జయపరాజయములకును హర్షశోకములను పొందక ఫలాభిసంధిలేనివాఁడవై 'చేయవలెను' అని మాత్రమె తలఁచి యుద్ధము

* హర్షశోకము లొందని.

చేయుము. ఇట్లు చేయుదువేని నీవు దుఃఖరూప సంసారబంధము వీడి **మోక్షము** నొందుదు వని తాత్పర్యము.

ఏషా తేఽభిహితా సాఙ్ఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి. ౩౯

భా. శోకమోహములఁ దొలఁగించుటకొఱకు లౌకికన్యాయము స్వధర్మమపిచావేక్ష్యేత్యాది శ్లోకములచేఁ జెప్పఁబడినది. కాని తాత్పర్యముచేఁ గాదు. పరమార్థదర్శనము గదా యిటఁ బ్రకృతము. దానినే చెప్పినదాని నిప్పు డుపసంహరించుచున్నాఁడు 'ఏషా తేఽభిహితా' అని, శాస్త్రవిషయ విభాగప్రదర్శనముకొఱకు. ఇచట శాస్త్రవిషయవిభాగముఁ జూపినం గదా మీఁదు 'జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్' అని నిష్ఠాద్వయవిషయం బగు శాస్త్రము సుఖముగాఁ బ్రవర్తింపఁగలదు. శ్రోతలును విషయవిభాగముచే సుఖముగా గ్రహింపఁగలరు. కావునఁ జెప్పుచున్నాఁడు.—ఏషా=ఇది; సాఙ్ఖ్యే=పరమార్థవస్తువివేకవిషయమునందు; బుద్ధిః=జ్ఞానము, సాక్షాత్తుగా శోకమోహాది సంసారహేతుదోషనివృత్తికిఁ గారణము; తే=నీకొఱకు; అభిహితా = చెప్పఁబడినది. యోగేతు = యోగమునందును, తత్ప్రాప్త్యుపాయమునందును—నిస్సంగతిచే ద్వంద్వప్రహాణపూర్వకముగా * ఈశ్వరారాధనార్థమైన కర్మయోగమునందును—కర్మానుష్ఠానరూప సమాధియోగమునందును; ఇమామ్—ఈవెంటనె చెప్పఁబడుచున్న; బుద్ధిమ్=జ్ఞానమును; శృణు = విను. ఆబుద్ధిని స్తుతించుచున్నాఁడు ప్రరోచనార్థము—యయా=ఏయోగవిషయ మయిన; బుద్ధ్యా = బుద్ధితో; యుక్తః=కూడిన వాఁడవై; పార్థ = అర్జునా! కర్మబన్ధమ్—ధర్మాధర్మాఖ్య మగు కర్మమె బంధము, దానిని; ప్రహాస్యసి=విడువఁగలవు, ఈశ్వరప్రసాదనిమిత్త జ్ఞానప్రాప్తిచేతనే యని యభిప్రాయము.

పరమార్థవస్తువివేకవిషయక మయిన జ్ఞానము గుఱించి యిదివఱకు నీకుఁ జెప్పితిని. ఇఁక నట్టి జ్ఞానమునొందుట కుపాయ మయిన కర్మయోగముయొక్క జ్ఞానముగుఱించి చెప్పెదను. ఈకర్మయోగము దెలిసి యనుష్ఠింతువేని యీశ్వర

* సుఖదుఃఖాది ద్వంద్వములను విడిచి—వానియందు సమబుద్ధిగలవాఁడై యనుట.

ప్రసాదముచేఁ బరమార్థవస్తుజ్ఞానమునొంది సంసారమునుండి విముక్తుఁడగుదు వని తాత్పర్యము.

టీ. ఓయీ! స్వధర్మమపిచావేక్ష్యేత్యాది శ్లోకములచే లౌకికన్యాయ బలమున శోకమోహాపనయనము తాత్పర్యముచేఁ జేయఁబడుటవలన, అలౌకిక న్యాయ ముపసంహరింపవలసినదై యుండఁగా, ఎట్లు పరమార్థదర్శన ముపసంహరింపఁ బడుచున్న దని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నారు శోకమోహముల నిత్యాదిగా. స్వధర్మమపీత్యాదు లగు నెనిమిది శ్లోకములచే, బంధుమరణంబును గుర్వాది వధయును సంభవించు నను శంకచేఁ గలిగినవియు సమ్యగ్జ్ఞానప్రతిబంధకములు నగు శోకమోహముల నపనయించుటకై, 'వర్ణాశ్రమధర్మ మనుష్ఠించినచో స్వర్గాదికము సిద్ధించును లేనిచో సిద్ధింపదు' అని యన్వయ వ్యతిరేక రూపమయిన లోకప్రసిద్ధన్యాయము ప్రతిపాదింపఁబడినదే యయినను, అది ముఖ్యతాత్పర్యముచేఁ బ్రతిపాదింపఁబడినది కా దని యర్థము. అప్పు డేది తాత్పర్యముచేఁ బ్రతిపాదింపఁ బడినది యనఁగా దానిఁ జెప్పుచున్నారు పరమార్థదర్శనము ఇత్యాదిగా. ఇటః అను శబ్దముచే 'నత్వేవాహం జాతు నాసమ్' ఇత్యాదికము పరామర్శింపఁబడుచున్నది. చెప్పినదానిఁ—'నజాయతే మ్రియతే' ఇత్యాదిగా ఉపపాదింపఁబడినదాని నని యర్థము. ఉపసంహారమునకుఁ బ్రయోజనముఁ జెప్పుచున్నారు శాస్త్రవిషయ విభాగ ప్రదర్శనముకొఱకు అని. శాస్త్రమునకు విషయము నిష్ఠాద్వయము. దాని విభాగించి యావిభాగముతోనే తెలుపుటకొఱకుఁ బరమార్థదర్శనోపసంహార మని యర్థము. ఓయీ! ఇతరస్థలమునందు. విషయవిభాగము చేయఁబడియున్నది అచ్చటనే దాని గ్రహింపవచ్చునుగదా! అట్లుండఁగా ఎందుకిచట శాస్త్రవిషయవిభాగము తెలుపవలెను? అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు ఇచట నిత్యాదిగా. శాస్త్రప్రవృత్తికిని శ్రోతృగ్రహణమునకును సౌకర్యార్థము మొదట విషయవిభాగ సూచన మని యర్థము ఇట్లు ఉపసంహారము ఫలవంత మని ప్రతిపాదించి యీ యుపసంహారమునకే యవతారిక చేయుచున్నారు కావునఁ జెప్పుచున్నాఁ డని. పరమార్థతత్త్వవిషయ మయిన జ్ఞాననిష్ఠను జెప్పినదాని నుపసంహరించి చెప్పఁ బోవుదాని గ్రహించుచున్నాఁడు యోగేతు అని. ఆబుద్ధినే విశిష్టఫలవంత మని స్తుతించుచున్నాఁడు ఉత్తరార్ధముచేత. అం దుపసంహారభాగమును విభజించుచున్నారు ఏషా—ఇది ఇత్యాదిగా. బుద్ధిశబ్దము అంతఃకరణ విషయము కా దని తెలుపుచున్నారు జ్ఞానమని. అది సహకార్యపేక్ష లేకయే విశిష్టఫలవంత మని

చెప్పుచున్నారు సాక్షాత్తుగా ఇత్యాదిగా. శోకమోహములు రాగద్వేషములు కర్తృత్వము భోక్తృత్వము ఇత్యాదిక మయిన అనర్థము సంసారము, దానికి హేతువైనదోషము స్వాజ్ఞానము, దాని నివృత్తియందు ఇతరాపేక్ష లేనికారణము జ్ఞానము, అజ్ఞాననివృత్తికి జ్ఞానమే కారణ మని అన్వయ వ్యతిరేక సిద్ధ మగుటవలన నని యర్థము. యోగేత్విమా మిత్యాది భాగము వ్యాఖ్యానముచేయువారై యోగశబ్దము ప్రకృతమునందు చిత్తవృత్తి నిరోధవిషయము కా దని తెలుపుచున్నారు తత్ప్రాప్తీత్యాదిగా. ప్రకృత మోక్షోపయుక్త మయిన జ్ఞానము తత్పదముచేఁ బరామర్శింపఁ బడుచున్నది. జ్ఞానోదయోపాయమునే ప్రకటించుచున్నారు నిస్సంగతచే నిత్యాదిగా. ఫలాభిసంధి లేకుండుట నిస్సంగత. బుద్ధి స్తుతి ప్రయోజనముఁ జెప్పుచున్నారు ప్రరోచనార్థ మని. స్తుతించినంగదా బుద్ధి శ్రద్ధకు విషయమై యనుష్ఠాత నధికరించును *. అందుచే స్తుతి యర్థవంత మని యర్థము. కర్మానుష్ఠానవిషయబుద్ధిచే కర్మబంధంబున కెట్లు నివృత్తి కలుగును? తత్త్వజ్ఞానము కలిగిననే గదా సమూల మయిన కర్మము విడువ శక్యమగును అని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నారు ఈశ్వరేత్యాదిగా.

హ. స్వధర్మ మపిచా వేక్ష్యేత్యాది శ్లోకములచే శోకాపనయనార్థము లౌకికన్యాయము చెప్పఁబడినది తాత్పర్యముచేఁ గాదు. ఇచటఁ బ్రకృతము పరమార్థదర్శనము. దాని నుపసంహరించుచున్నాఁడు.—ఏషా, సాంఖ్యే = పరమాత్మవస్తువివేకమునందు, బుద్ధిః = జ్ఞానము, సాక్షాత్తుగా శోకమోహాది సంసారనివృత్తికిఁ గారణము; తే = నీకొఱకు, అభిహితా = చెప్పఁబడినది. యోగేతు—ఆసాంఖ్యజ్ఞానము పొందుట కుపాయ మయిన, ఫలాభిసంధిలేక సుఖదుఃఖాది ద్వంద్వముల విడిచి యీశ్వరారాధనార్థముగా కర్మముల ననుష్ఠించుట యను సమాధియోగమునందును ♦, ఇమామ్ = ఇప్పుడవ్యవధానముగా నేను జెప్పునట్టి, బుద్ధిం శృణు. ఆబుద్ధిని స్తుతించుచున్నాఁడు శ్రోతలకు రుచిపుట్టించుటకొఱకు—యయాబుద్ధ్యా = ఏయోగవిషయబుద్ధితో, యుక్తః, పార్థ, కర్మబన్ధమ్ = ధర్మాధర్మాఖ్య మయిన కర్మమను బంధమును, ప్రహాస్యసి—ఈశ్వరప్రసాదము వలన జ్ఞానమును బొందుదు వని యభిప్రాయము.

---

* అనుష్ఠాతచే అనుష్ఠింపఁబడును.

♦ ఇచ్చట సమాధియనఁగా ఫలాభిసంధియు ద్వంద్వములును విడిచి యీశ్వరారాధనార్థ మనుష్ఠించుట.

౪౦. ఓయీ! వేదావినాశినం నిత్య మిత్యాదిగా బ్రహ్మవిదునకుఁ గొంచెమేని కర్తవ్యము లేదని యుపపాదించి యిప్పుడు స్వధర్మ మపిచేత్యాది గ్రంథముచేఁ గర్మముచేయవలె నని నీవు మరలఁ గర్మమును విధించుచున్నావు. దుఃఖభూయిష్ఠమయిన కర్మమును జేయుటకన్నను కర్తయును గరణమును గార్యమును సర్వంబును మిథ్యయే యని సమస్తకర్మమును సన్న్యసించి యూరకయుండుటయే సుఖము అని యర్జును నాక్షేపము నాశంకించి ఇందుకు ‘ అది సత్యము. ఇట్టి జ్ఞానమే యహంకారమమకారాది సంసారభ్రమ నివర్తక మగుచున్నది. అయినను అది యారూఢునకే గాని యారురుక్షువునకు ఉపయుక్తము కాదు.’ అను నభిప్రాయముతో, ముముక్షువులకుఁ గర్మమార్గమును గర్మసన్న్యాసమార్గమును దెలుపుటకొఱకుఁ గర్మసన్న్యాసకర్మయోగముల విషయవిభాగము సూచించుటకును గర్మ మనుష్ఠించు విధమును బోధించుటకును ఇది చెప్పుచున్నారు.—సాంఖ్యే—‘ యయా తదక్షర మధిగమ్యతే’ అని బ్రహ్మవిదులగు ఋషులచే సమ్యక్ ఖ్యాయతే—చక్కఁగాఁ బఠింపఁబడుచున్నది, కావున సంఖ్య అనఁగా పరవిద్య, ఆసంఖ్యచే ‘ యత్త దద్రేశ్యమగ్రాహ్యమ్ ’ ఇత్యాదిగా ప్రతిపాదింపఁబడుచున్నది కావున సాంఖ్యమనఁగా నిర్విశేషపరబ్రహ్మము, దాని విషయమై, బుద్ధిః తే అభిహితా.—‘ నజాయతే మ్రియతే’ ఇత్యాదిగా పరబ్రహ్మమును విషయీకరించి మున్ను ఏజ్ఞానము నీకు ఉపదేశింపఁబడినదో, ఏషా = అట్టి యాజ్ఞానము, ఆరూఢునకే ఆశ్రయణీయము కాని యారురుక్షువునకుఁ గాదు. ఆరురుక్షు వగు నీవు చిత్తశుద్ధికొఱకు శ్రద్ధతో ఈశ్వరార్పణబుద్ధిచే అభిమానమును కామనమును విడిచి సుఖదుఃఖాదులందు సమబుద్ధి వహించి కర్మయోగమునే చేయవలెను. కాని నీకు జ్ఞానయోగము యోగ్యము కాదు ఇట్లు కర్తవ్య మయిన, యోగేతు = కర్మయోగమునందో, ఇమామ్ = చెప్పఁబోవునట్టి, బుద్ధిమ్, శృణు. ఓ పార్థుఁడా ? యయా బుద్ధ్యా, యుక్తః = కూడినవాఁడవై, నేను జెప్పఁబోవునుపదేశముచొప్పునఁ గర్మయోగంబునం దున్నవాఁడవై, నీవు, కర్మబన్ధమ్—బంధమనఁగా జన్మమృత్యుజరాదులతో మాటిమాటికిఁ బురుషుని, బధ్నాతి—కూర్చునది. కర్మమే బంధము, దాని; ప్రహాస్యసి—బంధకము లయిన సర్వకర్మములనుండి, వైదికకర్మము ననుష్ఠించుటచేఁ గలుగు చిత్తశుద్ధివలన నుత్పన్న మగు అకర్త్రాత్మ జ్ఞానము యొక్క బలముచే విడివడ్డవాఁ డగుదు వని యర్థము. ఓయీ! ఈశ్వరుఁడే చేయువాఁడును చేయించువాఁడును కర్మఫలములు భుజించువాఁడును అను నీ నిశ్చయరూపమయిన బుద్ధిచేతనే కర్మబంధము వదలుచుండఁగా అకర్త్రాత్మ జ్ఞానమువలనఁ గర్మ

బంధమునుండి ముక్తుండ వగుదు వని నడుమ కర్మబంధమునకు ఆత్మజ్ఞాన నివర్త్యత్వము * నేల కల్పింపవలెను? అందువేని, ఇట నిన్నడుగవలెను—ఏమి కర్మముల నీశ్వరున కర్పించుటమాత్రానఁ గర్మబంధము నివర్తిల్లు నని చెప్పెదవా? లేక ఈశ్వరుఁడే చేయువాఁడు చేయించువాఁడు అని చెప్పుటమాత్రానఁ గర్మబంధము నివర్తిల్లుననియా? మొదటిపక్షము యుక్తముగాదు, అంతమాత్రముచే నైష్కర్మ్యము సంభవింపమివలన, 'నాదత్తే కస్యచి త్పాపం నచైవ సుకృతం విభుః' అని పరమేశ్వరుఁడు భక్తులు సమర్పించెడు పుణ్యపాపాదుల గ్రహింపఁడని యుపదేశింపఁబడి యుండుటవలన. అంగీకరించినను ఈపక్షమును, ఈశ్వరార్పితములుగాని శతకోటి బ్రహ్మకల్పకృతము లగు సుకృతాది కర్మములకు నివృత్తి యసంభవము, భక్తి యిప్పుడు కలిగిన దగుటచే ఆకర్మములకు ఈశ్వరార్పణము సంభవింపమివలన. ఎప్పుడు జన్మము ప్రారంభమయ్యెనో అది మొద లుండనే యున్నది భక్తి యనఁగా నది సరిగాదు. అట్లయిననో జన్మాంతరమునందే నీకు భక్తి కలిగి యుండవలెను. అప్పుడు, "లోకత్రయాధిపతి మప్రతిమ ప్రభావ మీశం ప్రణమ్య శిరసా ప్రభవిష్ణుమీశమ్। జన్మాన్తర ప్రలయ కల్ప సహస్ర జాత మాశు ప్రణాశ ముపయాతి నరస్య పాపమ్" ♦ ఇత్యాదిగా ఒకమాఱు చేయునమస్కారమే సంసార మహాసముద్రతారకం బను భక్తవాక్యములకు అప్రామాణ్యము ప్రసక్తించును. ఆపక్షమునందును బాపమునకే నాశమగును గాని పుణ్యమునకుఁగాదు. రెండవపక్షంబును యుక్తముకాదు. 'అయుద్ధేన హతో వాలీ తస్యేదం కర్మణః ఫలమ్' ❨ అని యీశ్వరునకు తాఁ జేసిన కర్మమే తన కపరిహార్యమగుచుండఁగా ఇంక నతండు పరులుచేసిన కర్మంబు లెట్లు పరిహరింపఁగలఁడు? అందువలన అవిక్రియాత్మజ్ఞానమువలననే పురుషునకు సర్వకర్మనివృత్తి యని చెప్పవలెను. అట్లు 'సర్వం పాప్మానం తరతి' 'క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే' § ఇత్యాది శ్రుతి వచించుచున్నది. అప్పుడు 'బుద్ధ్యా

* ఆత్మజ్ఞానముచే నివర్తిల్లునది యగుటను.

♦ ముల్లోకంబులకును నాథుండును సాటిలేని ప్రభావముగలవాఁడును ప్రభుండు నగు ఈశ్వరునిఁ గొంచెము శిరస్సుచే నమస్కరించినచో వేనవేలు కల్పములందలి జన్మములందుఁ గలిగిన మనుష్యుని పాపము శీఘ్రమున నాశమునొందును.

❨ యుద్ధము చేయమిచే—ఎదుర్కొని పోరకుండుటచే వాలి హతుఁడయ్యెను. ఆకర్మము యొక్క ఫలంబిది.

§ సమస్తమయిన పాపమును దాఁటుచున్నాఁడు, ఆపరబ్రహ్మము తెలియఁబడఁగానే వీనికర్మములు నశించుచున్నవి.

యుక్తో యయాపార్థ' అనువచనమున కేమిగతి యన్నచో, దానికి, ఫలాభిసంధి లేక చేసినకర్మము బంధజనకము కా దని కర్మమును స్తుతించుటచే, ముముక్షువులు నిష్కాములై చిత్తశుద్ధికొఱకుఁ గర్మముచేయవలె నని కర్మము విధించుచున్న దనుటయే గతి యని చెప్పుచున్నారము. అందువలన అవిక్రియాత్మజ్ఞానమువలననె కర్మబంధనివృత్తి యనుట సిద్ధము.

మ. ఓయీ! లేకపోవుఁ గాక పాపము స్వధర్మబుద్ధిచే యుద్ధము చేయువానికి. అయినను నాకు యుద్ధముచేయవలె నని నీ వుపదేశించుట యుచితముకాదు, 'యఏనం వేత్తి హన్తారం' అనునది మొదలు 'కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్' ఇత్యంత మగు గ్రంథముచే నీవే విద్వాంసునకు సర్వకర్మములును నిషేధించుటవలన. అకర్త్రభోక్తృశుద్ధ స్వరూపుఁడను నేను అనియు యుద్ధముచేసి తత్ఫలంబు భుజించెదను అనియు జ్ఞానము సంభవింపదు విరుద్ధమగుటవలన, జ్ఞానకర్మములకు సముచ్చయము సంభవింపమినలనఁ బ్రకాశాంధకారములకుం బోలె. ఈ యర్జునాభిప్రాయము 'జ్యాయసీ చేత్' అనుచోట వ్యక్తముకాఁగలదు. అందువలన ఒక్కనికే నాకు జ్ఞానమును కర్మమునుగూడ ఉపదేశించుట యుపపన్నము కాదు. అనఁగా, అట్లు కాదు. విద్వాంసుఁడు అవిద్వాంసుఁడు అను నవస్థల భేదమునుబట్టి జ్ఞానకర్మముల యుపదేశ ముపపన్నమగుచున్న దని చెప్పుచున్నాఁడు భగవంతుఁడు.— ఏషా—నత్వే వాహ మిత్యాద్యేకవింశతి శ్లోకములచే, తే = నీకొఱకు, అభిహితా = చెప్పఁబడినది, సాంఖ్యే—సమ్యక్ ఖ్యాయతే చక్కఁగా సర్వోపాధి శూన్య మని ప్రతిపాదింపఁబడుచున్నది పరమాత్మతత్త్వము దీనిచేత, కావున సంఖ్య అనఁగా ఉపనిషత్తు, దానిచేతనే పరమతాత్పర్యముచేఁ బ్రతిపాదింపఁబడుచున్నాఁడు, కావున సాంఖ్యుఁడు అనఁగా ఔపనిషదుఁ డగు పురుషుఁడు * అని యర్థము. ఆపరమాత్మయందు, బుద్ధిః = ఆపరమాత్మమాత్రమే విషయముగాఁ గల జ్ఞానము, సర్వానర్థనివృత్తికారణము, నీకు నాచేఁ జెప్పఁబడినది. ఇట్టి జ్ఞానము గలవాని కెందును కర్మము చెప్పఁబడదు. అట్లు 'తస్య కార్యం నవిద్యతే' అని చెప్పఁబోవుచున్నాఁడు. ఇఁక, నే నిట్లు చెప్పినను నీకీబుద్ధి యుదయింపదు, చిత్తదోషమువలన. అప్పుడు దానిఁ దొలఁగించుకొని యాత్మతత్త్వసాక్షాత్కారము నొందుటకై కర్మయోగమే నీ వనుష్ఠింపవలెను. అట్టి, యోగేతు = కర్మయోగమునందో, చేయవలసినదాని, ఇమాం బుద్ధిమ్—సుఖదుఃఖే సమే కృత్వా అనుచోటఁ జెప్పఁబడిన ఫలాభిసంధిత్యాగరూప

* పరమాత్మ.

మయిన బుద్ధిని, విరివిగా నీకుఁ జెప్పఁబోవుదానిని; శృణు. తు శబ్దము పూర్వబుద్ధి* యోగవిషయము కాదని సూచించుచున్నది. అందుచే, శుద్ధాంతఃకరణునకు జ్ఞానోపదేశము, అశుద్ధాంతఃకరణునకుఁ గర్మోపదేశము. ఇట్లు సముచ్చయ శంక కవకాశము లేమింజేసి విరోధమునకును అవకాశము లేదని యభిప్రాయము. యోగ విషయ మయిన బుద్ధిని ఫలము చెప్పుటచే స్తుతించుచున్నాఁడు—యయా బుద్ధ్యా= ఏవ్యవసాయాత్మక మయిన బుద్ధిచే, యుక్తః= కర్మములందుఁ బూనినవాఁడవై, నీవు, కర్మబన్ధమ్ = కర్మమువలనఁ గలిగిన బంధమును, చిత్తముయొక్క అశుద్ధి యను జ్ఞాన ప్రతిబంధమును; ప్రహాస్యసి = చక్కఁగా—మరలఁ బ్రతిబంధము పుట్టనియట్లు విడువఁ గలవు. ఇది భావము—కర్మమువలనఁ గలుగు జ్ఞానప్రతిబంధము ధర్మాఖ్య మయిన కర్మముచేతనే తొలఁగింప శక్యమగును, అట్లు 'ధర్మేణ పాప మపనుదతి' ♦ అని శ్రుతి. శ్రవణాది రూపమయిన విచారమో, కర్మనిమిత్త ప్రతిబంధము లేనివానికి అసంభావనాది రూపమయిన ప్రతిబంధమును దృష్టద్వారమునఁ దొలఁగించు చున్నది ❘. కావున నది కర్మబంధ నిరాకరణముకొఱకు నుపదేశింపఁదగినది కాదు. అందువలన అత్యంత మలిన మయిన అంతఃకరణముగలవాఁడ వగుటవలన నీవు బహిరంగసాధన మయిన కర్మమునే యనుష్ఠింపవలెను. ఇప్పుడు నీకు శ్రవణాది యోగ్యతగూడ కలుగలేదు. ఇఁక జ్ఞానయోగ్యత కలుగ లేదని చెప్పవలెనా? అని. అట్లు చెప్పఁబోవుచున్నాఁడు 'కర్మణ్యే వాధికారస్తే' అని. ఇందుచే 'సాంఖ్యబుద్ధి కంతరంగసాధన మగు శ్రవణాదికమును విడిచి బహిరంగసాధన మయిన కర్మమును మాత్రమే భగవంతుఁ డేల యర్జునున కుపదేశించె' ననుట నిరసింపఁబడినది. 'కర్మబంధమ్—సంసారమును, ఈశ్వరప్రసాదనిమిత్త జ్ఞానప్రాప్తిచే, ప్రహాస్యసి' అను ప్రాచీనవ్యాఖ్యానమునందు అధ్యాహార దోషంబును § కర్మ పదవైయర్థ్యంబును బరిహరింపవలెను.

శ్లో. ఉపదేశించిన జ్ఞానయోగము నుపసంహరించుచుఁ దత్సాధన మయిన కర్మయోగము నుపక్రమించుచున్నాఁడు—సమ్యక్ ఖ్యాయతే—చక్కఁగా ప్రకాశింపఁబడుచున్నది వస్తుతత్త్వము దీనిచేతఁ గావున సంఖ్యయనఁగా సమ్యక్ జ్ఞానము,

---

* సాంఖ్యబుద్ధి.

♦ ధర్మముచే పాపమును దొలఁగించుచున్నాఁడు.

❘ ధర్మము అదృష్టద్వారమునఁ గర్మప్రతిబంధమును దొలఁగించు నని భేదము.

§ ఈశ్వరప్రసాదనిమిత్త జ్ఞానప్రాప్తిచే అనుదాని నధ్యాహరించు దోషంబును.

దానియందుఁ బ్రకాశించుచుండు ఆత్మతత్త్వము సాంఖ్యము, దానియందు; చేయఁదగిన బుద్ధి యిది నీకుఁ జెప్పఁబడినది. ఇట్లు సాంఖ్యబుద్ధిని జెప్పినను నీకు ఆత్మతత్త్వము అపరోక్షము కా దేని, అప్పుడు అంతఃకరణశుద్ధిద్వారమున ఆత్మతత్త్వము అపరోక్షమగుటకొఱకు, కర్మయోగమునందును, ఇమాం బుద్ధిం శృణు. యయా బుద్ధ్యా యుక్తః—పరమేశ్వరార్పిత మయిన కర్మయోగముచేతఁ బరిశుద్ధ మయిన అంతఃకరణము గలవాఁడవై, తత్ప్రసాదముచేఁ బొందఁబడిన యపరోక్ష జ్ఞానముచేత, కర్మబన్ధమ్—కర్మరూప మయిన బంధమును, ప్రహాస్యసి = చక్కఁగా విడువఁగలవు.

ప. ఇఁక నుపదిష్ట మయిన జ్ఞానయోగము నుపసంహరించుచు స్వధర్మమపీత్యాదిగాఁ జెప్పఁబడిన దగుటవలనఁ గర్మయోగముఁ బ్రశంసించుచుఁ జెప్పుచున్నాఁడు.—సాఙ్ఖ్యే—చక్కఁగా తెలుపఁబడుచున్నది ఆత్మతత్త్వము దీనిచేతఁ గావున సంఖ్యయనఁగా చక్కని జ్ఞానము, దానియందుఁ దెలియఁబడుచున్న ఆత్మతత్త్వము సాంఖ్యము, దానియందు; సాధన మయిన బుద్ధి, ఇది, తే= నీకొఱకు, అభిహితా= చెప్పఁబడినది. ఇట్లు సాంఖ్యబుద్ధి నుపదేశించినను నీకు ఆత్మతత్త్వసాక్షాత్కారము కానియెడ, అంతఃకరణశుద్ధిద్వారమున ఆత్మతత్త్వసాక్షాత్కారము పొందుటకై కర్మయోగమునందును, ఇమాం బుద్ధిం శృణు. యయా బుద్ధ్యా, కర్మబన్ధమ్=కర్మము అనునట్టి బంధమును, ప్రహాస్యసి = మిక్కిలి విడువఁగలవు.

రా. ఈప్రకారముగా ఆత్మతత్త్వజ్ఞానము నుపదేశించి యాత్మతత్త్వజ్ఞానపూర్వకంబును మోక్షసాధనము నగు కర్మయోగముఁ జెప్పనారంభించుచున్నాఁడు.—సాఙ్ఖ్యే—సంఖ్య యనఁగా బుద్ధి, బుద్ధిచే నిర్ధారింపఁదగిన ఆత్మతత్త్వము సాంఖ్యము, అట్టి తెలియవలసిన ఆత్మతత్త్వమునందు; అది తెలియుటకొఱకు ఏబుద్ధి చెప్పఁదగినదో; 'నత్వేవాహమ్' అనునది మొదలు 'తస్మాత్సర్వాణి భూతాని నత్వం శోచితుమర్హసి' ఇత్యంత మగు గ్రంథముచే, ఆ, ఏషా బుద్ధిః = ఈబుద్ధి; తే= నీకు; అభిహితా= చెప్పఁబడినది. ఆత్మజ్ఞాన పూర్వక మోక్షసాధన భూత కర్మానుష్ఠానమునందు * ఏబుద్ధియోగము చెప్పవలెనో అది యిట యోగశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది. 'దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాత్' అని గదా చెప్పఁబోవుచున్నాఁడు. అట్టి, యోగేతు=యోగమునందును, ఏబుద్ధి చెప్పవలెనో, అట్టి, ఇమామ్—చెప్పఁబడుచున్నదాని; శృణు = వినుము. యయా బుద్ధ్యా = ఏబుద్ధితో; యుక్తః =

* ఆత్మజ్ఞానము నొందినవెనుకఁ జేయవలసినదియు మోక్షసాధనము నగు కర్మానుష్ఠానమునందు.

కూడినవాఁడవై; పార్థ = అర్జునా! కర్మబన్ధమ్ = కర్మముచేఁ గలిగిన బంధమును, సంసారబంధము నని యర్థము; ప్రహాస్యసి = విడువఁగలవు.

అర్జునా! ఆత్మతత్త్వము దెలియుటకై యేది యుపదేశింపవలెనో ఆబుద్ధిని నీకుఁ జెప్పితిని. ఇఁక ఆత్మతత్త్వము తెలిసిన పిమ్మట మోక్షసాధనార్థము చేయవలసిన కర్మానుష్ఠానము విషయమయి యేది చెప్పవలెనో ఆబుద్ధినిగూడఁ జెప్పెద వినుము. ఈ బుద్ధితోఁ గూడినవాఁడవై కర్మానుష్ఠానము చేయుచుండువేని సంసారబంధము వీడి ముక్తుఁడ వగుదు వని తాత్పర్యము.

మా. సాంఖ్య మనఁగా జ్ఞానము. అట్లు 'శుద్ధాత్మతత్త్వవిజ్ఞానం సాఙ్ఖ్యమి త్యభిధీయతే' * అని వ్యాసస్మృతియందు భగవద్వచనము. యోగమనఁగా నుపాయము, 'దృష్టా యోగాః ప్రసిద్ధాశ్చ పుంసాం శ్రేయఃప్రసిద్ధయే' † అని భాగవతమునందుఁ బ్రయోగింపఁబడియున్నది. ఇతరములైన సాంఖ్యయోగములు ‡ ఎందును సాకల్యముచే ఉపాదేయములుగా వివక్షితములు గావు. కర్మయోగ మని ప్రయోగింపఁ బడియుండుటవలనఁగూడ యోగశబ్దము పాతంజలయోగపరము కాదు. మోక్షధర్మములందు ఇతరసాంఖ్యయోగములు భిన్నమతము లని ప్రతిపాదించి పాంచరాత్రస్తుతిచే నిందితము లగుటవలనఁగూడ. వేదములకో పాంచరాత్రముతో ఏకార్థము లగుటవలన విరోధములేదు. భిన్నమతత్వమో సాంఖ్యాదుల నపేక్షించి చెప్పఁబడినది. అచటనే పాంచరాత్రమూలక మయిన శిత్రశిఖండిశాస్త్రము వేదములతో ఏకార్థ మని చెప్పుటవలనఁగూడ. ఇట్లు అంతట సాంఖ్యయోగశబ్దములు ఉపాదేయవాచకములుగాఁ జెప్పవలెను. యుక్తివలనఁగూడ జీవతత్త్వజ్ఞానము గదా పూర్వము చెప్పఁబడినది. ఉపాయమునో చెప్పఁబోవుచున్నాఁడు. దీనిచేఁ దెలియఁబడును కావున బుద్ధి యనఁగా వాక్కు. తే=నీకు; సాఙ్ఖ్యే=సాంఖ్యవిషయము నందు; ఏషా = ఈ; బుద్ధిః = సాంఖ్యవిషయము ఏవాక్కుచేఁ దెలియఁబడునో అట్టి వాక్కు; అభిహితా = చెప్పఁబడినది యని యర్థము. తు = ఇఁక, యోగే = తదుపాయమైన కర్మయోగవిషయమునందు; ఇమామ్ = ఈ, బుద్ధిమ్ = వాక్యమును; శృణు = వినుము. యయా = ఏ, బుద్ధ్యా = వాక్యముచేఁ గలిగినజ్ఞానముతో; యుక్తః = కూడినవాఁడవై; కర్మబన్ధమ్ = సంసారమును; ప్రహాస్యసి = విడుతువు.

---

* శుద్ధాత్మతత్త్వజ్ఞానము సాంఖ్యమని చెప్పఁబడుచున్నది.

† పురుషులకు శ్రేయస్సిద్ధికొఱకు ఉపాయములు దృష్టములు ప్రసిద్ధములునై యున్నవి.

‡ కాపిల పాతంజలములు.

ఇదివఱకు జీవతత్త్వము నీ కుపదేశించితిని. ఇఁక నది తెలియు నుపాయ మయిన కర్మయోగము నుపదేశించెదను. ఇది చక్కఁగాఁ దెలియుదువేని సంసారము దాఁటుదు వని తాత్పర్యము.

నేహాఽభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే
స్వల్పమ ప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్. ౪౦

భా. మఱియొకటిగూడ. ఇహ = ఈమోక్షమార్గమైన కర్మయోగమునందు; అభిక్రమనాశః = ప్రారంభముయొక్క నాశము; నాస్తి = లేదు. కృష్యాదులవిషయమునఁబోలె యోగవిషయమునఁ బ్రారంభము నకు ఫలము వ్యభిచరింప * దని యర్థము. మఱియును, చికిత్సయందువలె, ప్రత్యవాయః = దోషము; నవిద్యతే = కలుగదు. మఱియేమి యనఁగా, అస్య = ఈ; ధర్మస్య = యోగధర్మముయొక్క; స్వల్పమపి = మిక్కిలి కొంచెమైనను; అనుష్ఠింపఁబడినచో, మహతః= గొప్పదైన; భయాత్ = జన్మమరణాది రూపమయిన సంసారభయమునుండి; త్రాయతే= రక్షించుచున్నది.

కృషి మొదలగునవి యారంభింపఁగా ఒకవేళ ఫలము లేకపోవచ్చును. ఈకర్మయోగము అట్లు కాదు, దీని నారంభించినచో తప్పక ఫలము సిద్ధించును. మఱియు చికిత్సయందుఁ గలుగునట్లు దోషము గూడ దీనియందుఁ గలుగదు. దీనిఁ గొంచె మనుష్ఠించినను జన్మమరణాదిరూప మయిన సంసారము వీడి మోక్షము సిద్ధించు నని తాత్పర్యము.

శ్రీ. ఓయీ! కర్మానుష్ఠానము అనియతఫలం బగుటచే అకించిత్కరం ♦ బగుటవలనను అనేకానర్థములు గల దగుటచే దోషవంత మగుటవలనను యోగబుద్ధి గూడ నమ్మఁ దగినది కా దనఁగాఁ అందుకుఁజెప్పుచున్నారు మఱియొకటిగూడ నని. మఱియొకటిగూడఁ జెప్పెదను, కర్మానుష్ఠానం బావశ్యకంబనుట కది కారణం బని భావము. "కర్మముతోఁగూడ సమాధి ననుష్ఠింప శక్యముగాదు, పెక్కంతరాయములు సంభవించును, తత్ఫలమైన సాక్షాత్కారమూ దీర్ఘకాలాభ్యాససాధ్యము, అదియో యొక్క జన్మమునందు సంభవింపదు, కావున యోగి పురుషార్థమునుండి

* తప్పదు.

♦ వ్యర్థము.

భ్రష్టుఁ డగును, అనర్థమునందునుం బడును. ” అని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నాఁడు నేహేత్యాదిగా. కర్మానుష్ఠానము అనియతఫలంబగుటచే అకించిత్కరం బని యేది చెప్పఁబడినదో దాని నిరాకరించుచున్నారు కృష్యాదుల ఇత్యాదిగా. కృషి వాణిజ్యాదుల ఆరంభమునకు ఫలము అనియతము, పురుషునియూహాచేమాత్రమే సంభావిత మగుటవలన. అట్లు వైదిక మగు కర్మువిషయమున ప్రారంభమునకు ఫలము అనియత మనుట యుక్తముగాదు శాస్త్రవిరోధంబువలన నని యర్థము. ఇఁక అనేకానర్థములు గలదగుటచే దోషవంత మని యేది చెప్పఁబడెనో అందుకుఁ జెప్పుచున్నారు మఱియును అని. ఇందువలనఁగూడ కర్మానుష్ఠాన మావశ్యక మని ప్రతిజ్ఞ చేసి ఆయితర హేతువునే స్పష్టీకరించుచున్నారు చికిత్సయందువలె నిత్యాదిగా. చికిత్స చేయునపుడు గదా వ్యాధి యెచ్చుటగాని మరణముగాని దోషముగూడ సంభవించు నున్నది కర్మపరిపాకము దుర్బోధమగుటవలన. అట్లు కర్మానుష్ఠానమునందు దోషమునకు లుగదు, విహితమగుటవలన నని యర్థము. ఇప్పుడు కర్మానుష్ఠానముయొక్క ఫలము నడుగుచున్నారు మఱియేమి యని. ఉత్తరార్థమునకు వ్యాఖ్యానము చేయుచు వివక్షిత మయిన ఫలమును జెప్పుచున్నారు అస్య ఇత్యాదిగా. సమ్యక్ జ్ఞానము పుట్టించి తద్ద్వారమున రక్షించు నని వివక్షితము “సర్వపాప ప్రసక్తోఽపి ధ్యాయన్నిమిష మచ్యుతమ్ । భూయ స్తపస్వీ భవతి పఙ్క్తిపావనపావనః ” * ఇత్యాది స్మృతివలన నని యర్థము.

హ. ♦

శం. చెప్పిన కర్మయోగమునే ముముక్షువుల ప్రవృత్తికొఱకు స్తుతించుచున్నాఁడు.— ఇహ = మోక్షము ప్రయోజనముగాఁ గల యీ చెప్పిన కర్మయోగమునందు; అభిక్రమనాశః—అభిక్రమ మనఁగా ఉపక్రమము, కర్మముయొక్క ఆరంభము, దానికి నాశము; నాస్తి = లేదు. కృషి వాణిజ్యాదుల నారంభింపఁగా ఒకానొకప్పుడు ఫలించును, ఒకానొకచో ఫలింపదు; అట్లు కా దిది. మ తే మనఁగా, నియతముగా ఫలముగలదియే యగుచున్నది, భోజనమువలె. ఇందు, ప్రత్యవాయః— జ్ఞానముచేఁగాని యజ్ఞానముచేఁగాని సంభవించునట్టి కర్మనియమాదిలోపముచేఁ

---

* సమస్తపాపములందును సంబంధించినవాఁడైనను నిమిషమాత్రము అచ్యుతుని ధ్యానించినచో వెంటనే అంతకన్నను మహాతపస్సంపన్నుఁడు పంక్తిపావనులలోను పావనుఁడు అగును.

♦ శంకరభాష్యముతో సమానము.

గలుగు దోషము, రాజాజ్ఞయందుంబోలె; నవిద్యతే = లేదు, అనర్థజనకము కాదు. అస్యధర్మస్య—భక్తితోఁజేయఁబడునట్టి యీశ్వరారాధనాత్మక మయిన యీవేదోక్త ధర్మములో, స్వల్పమపి—శ్రౌతమైన కేవలాగ్నిహోత్రముగాని స్మార్తమైన * యోపాసనముగాని శ్రద్ధతో చేసిన కర్మము; చిత్తశుద్ధి జననద్వారమున జ్ఞానమునకు హేతువగుటవలనఁ జేయువానిని, మహతః భయాత్—జనన మరణ దుఃఖమునుండి, త్రాయతే = రక్షించుచున్నది. ఇందువలన, ముముక్షువు శ్రౌతము గాని స్మార్తము గాని యుభయవిధకర్మము గాని శ్రద్ధాభక్తులతో నిష్కాముఁడై యీశ్వరప్రీతి కొఱకు యథాశక్తి యవశ్య మనుష్ఠింపవలెను. ఈశ్వరప్రీత్యర్థము మాత్రమే యనుష్ఠించిన కర్మముచేతఁ బురుషుఁడు తరించును. వేఱువిధంబున గాదు. అని సూచిత మగుచున్నది.

ప్ర. ఓయీ! „తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసా ఽనాశకేన‟ • అను శ్రుతిచే వివిదిషను జ్ఞానమునుగూడ నుద్దేశించి సంయోగ పృథక్త్వన్యాయమున సర్వకర్మములు వినియుక్తము లగుటవలన, అందుకు అంతఃకరణశుద్ధి ద్వారమగుటవలన, నాకుఁ గర్మానుష్ఠానము విధింపఁబడుచున్నది. అందు, „తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవ మేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే‟ ‖ అను శ్రుతిచే బోధింపఁబడిన ఫలనాశము సంభవించును. జ్ఞానమును వివిదిషనుగూడ నుద్దేశించి చేయు యజ్ఞాది కర్మము, కామ్యమగుటవలన, సర్వాంగోప సంహారముచే § ననుష్ఠింపవలెను. అందు ఒకానొక యంగము లోపించినను వైగుణ్యంబు సంభవించును. మఱియు యజ్ఞేనేత్యాది వాక్య విహితంబు లగు సర్వకర్మంబులు ఒక్కనిచే యావజ్జీవమైనను అనుష్ఠింప శక్యముగాదు. అట్లుండఁగా 'కర్మబన్ధం ప్రహాస్యసి' అని చెప్పిన ఫలం బెట్లు సిద్ధించును? అనఁగా ఇందుకుఁ జెప్పుచున్నాఁడు భగవంతుఁడు.—అభిక్రమనాశః—అభిక్రమ్యతే—కర్మముచే ప్రారంభింపఁబడుచున్నది యేఫలమో అది అభిక్రమము, దానికి నాశము తద్యథేహేత్యాది

* శ్రౌతము—శ్రుతిచోదితము, స్మార్తము—స్మృతిచోదితము.

• అట్టి యీయాత్మను బ్రాహ్మణులు వేదానువచనముచే యజ్ఞముచే తపస్సుచే భోగము విడుచుటచే తెలియఁగోరుచున్నారు.

‖ ఎట్లీ లోకమునఁ గర్మముచే సంపాదింపఁబడిన వస్తువు క్షయించుచున్నదో అట్లు పరలోకమునందుఁ బుణ్యముచే సంపాదింపఁబడిన లోకము క్షయించుచున్నది.

§ సర్వాంగములను సంపూర్ణముగా అనుష్ఠించియే.

శ్రుతిచే బోధింపఁబడినది; ఇహ = ఈ నిష్కామ కర్మయోగమునందు; నాస్తి = లేదు, దీనియొక్క ఫలమైన చిత్తశుద్ధి పాపక్షయరూప మగుటచేతను లోకశబ్దవాచ్యమైన భోగ్యపదార్థము కానందుచేతను దానికి నాశము సంభవింపమివలన. వేదనపర్యంతమయిన * వివిదిష యే కర్మఫలమగుటవలన, అవ్యవధానముగా అజ్ఞాననివృత్తిఫలమును గల్గించునట్టి వేదనమునకు ఫలము గల్గింపక నాశము సంభవింపమివలన, ఇందు ఫలనాశము లే దని లెస్స చెప్పెను. అట్లు « తద్య థేహేతి యా నిన్దా సా ఫలే నతు కర్మణి। ఫలేచ్ఛాంతు పరిత్యజ్య కృతం కర్మ విశుద్ధికృత్ » † అని ప్రతిపాదింపఁబడినది. అట్లు, ప్రత్యవాయః—అంగలోపముచేఁ గలుగు వైగుణ్యము; ఇందు, నవిద్యతే = లేదు, ఎట్లనఁగా తమేతమితి వాక్యముచే నిత్యకర్మములకు మాత్రమెయుపాత్తదురితక్షయద్వారమున వివిదిషయందు వినియోగము. నిత్యకర్మములందు సర్వాంగోపసంహారనియమము లేదు. కామ్యకర్మములకుఁగూడ సంయోగపృథక్త్వన్యాయమున వినియోగం బను పక్షమునందును, ఫలాభిసంధి రహితములగుటచే నవి నిత్యతుల్యము లగును. కామ్యాగ్నిహోత్రమునకును నిత్యాగ్నిహోత్రమునకును స్వరూపముచే నేమేని విశేషము కలదా? ఫలాభిసంధి కలిమిలేములవలన మాత్రమె కామ్యమని నిత్యమని వ్యపదేశము ‡. ఈరెండు పక్షములు వార్త్తికమునందుఁ జెప్పఁబడినవి. « వేదానువచనాదీనా మైకాత్మ్యజ్ఞానజన్మనే। తమేత మితి వాక్యేన నిత్యానాం వక్ష్యతే విధిః ॥ యద్వా వివిదిషార్థత్వం కామ్యానా మపి కర్మణామ్ । తమేత మితి వాక్యేన సంయోగస్య పృథక్త్వతః » § అందువలన, ఫలాభిసంధిలోఁ జేయు కర్మమునందే సర్వాంగోపసంహార మావశ్యకము. తద్విలక్షణ మయిన చిత్తశుద్ధ్యర్థ మగు కర్మమునందు ప్రతినిధి మొదలగువానిచే

* జ్ఞానమువఱకు ఉండునట్టి.

† తద్య థేహేతి శ్రుతి యే నింద చేయుచున్నదో అనింద ఫలవిషయమునందే కాని కర్మవిషయమునందుఁ గాదు. ఫలేచ్ఛనుమాత్రమే విడిచి చేయుకర్మము చిత్తశుద్ధి కలిగించును.

‡ పేరు.

§ తమేత మితివాక్యముచేత నిత్యము లయిన వేదానువచనాదులకు ఐకాత్మ్యజ్ఞాన జననమునకొఱకు వినియోగము చెప్పఁబడుచున్నది. లేక, తమేత మితివాక్యముచేఁ గామ్యకర్మములకుఁ గూడ సంయోగపృథక్త్వముచే వివిదిషార్థత్వము—వివిదిష ప్రయోజనముగాఁగల దనుట చెప్పఁబడినది. సంయోగముయొక్క—స్వర్గాదిఫలసంబంధముయొక్క, పృథక్త్వము—భేదము, అనఁగా ఒక్కటే కర్మము స్వర్గాదిఫలసంబంధముచేఁ గామ్య మగును, చిత్తశుద్ధిపూర్వక వివిదిషాసంబంధముచే నిత్య మగును. ఇది సంయోగపృథక్త్వన్యాయము.

నమాప్తి కావచ్చును. కావున, ప్రత్యవాయః= అంగవైకల్యముచేఁ గలుగుదోషము; నవిద్యతే = లే దని యర్థము. అట్లు, తమేత మిత్యాదివాక్యవిహిత మగు చిత్త శుద్ధ్యర్థ మయిన, అస్యధర్మస్య = ఈధర్మములో; స్వల్పమపి—సంఖ్యచేతఁగాని కర్తవ్యప్రకారముచేతఁగాని యథాశక్తిగా భగవదారాధనార్థము కొంచెమయినను, అనుష్ఠింపఁబడినదై, మహతః భయాత్ = సంసారభయమునుండి; త్రాయతే—భగవ త్ప్రసాదసంపాదనముచే, అనుష్ఠించువాని రక్షించుచున్నది, "సర్వపాపప్రసక్తో ఽపి ధ్యాయ న్నిమిష మచ్యుతమ్, భూయ స్తపస్వీ భవతి పఙ్క్తి పావన పావనః" ఇత్యాదిస్మృతివలన, తమేత మిత్యాదివాక్యమునందు సముచ్చయవిధాయకము లేమి వలనఁగూడ. అశుద్ధితారతమ్యమువలననె అనుష్ఠానతారతమ్య ముపపన్న మగుట వలన యుక్తమే చెప్పఁబడినది 'కర్మబన్ధం ప్రహాస్యసి' అని.

శ్రీ. ఓయీ! కృష్యాదులకుంబోలె కర్మములకు ఒకానొకప్పుడు విఘ్న బాహుళ్యముచే ఫలమునందు వ్యభిచారము * కలుగుటవలనను, మంత్రాద్యంగ వైకల్యముచేఁ బ్రత్యవాయము సంభవించుటవలనను, ఎట్లు కర్మయోగముచేఁ గర్మబంధమోక్షము సిద్ధించును? అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—ఇహ = ఈనిష్కామకర్మయోగమునందు; అభిక్రమనాశః = ప్రారంభమునకు నిష్ఫలత్వము; నాస్తి = లేదు. ప్రత్యవాయముగూడ, నవిద్యతే, ఈశ్వరోద్దేశముచేతనే విఘ్నము వైకల్యము మొదలగునవి సంభవింపమివలన. మఱియును. అస్యధర్మస్య, స్వల్ప మపి— ప్రారంభమాత్రముగూడ, చేయఁబడినదై, మహతః భయాత్ = సంసారము నుండి, త్రాయతే = రక్షించుచున్నది. కాని, మఱి కామ్యకర్మమునకువలె కించి దంగవైకల్యాదికముచే లేదు నిష్ఫలత దీని కని యర్థము.

ప. ఇఁకఁ బరమేశ్వరార్పణముగాఁ జేయు కర్మమునకు ఇంద్రాదులవలన విఘ్నము కలుగ దని చెప్పుచున్నాఁడు.— ఇహ = నిష్కామకర్మమునందు, అభిక్ర మనాశః = కర్మారంభమునకు విఘ్నాదులచే నాశము, నాస్తి. ఎందువలన ననఁగా, దానికి ఈశ్వరుఁడే విఘ్నములు పరిహరించును. ఇఁక హింసాప్రధాన మయినకర్మము నందు ఈశ్వరునకుఁ బ్రీతి యె ట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ప్రత్యవాయః=పాపము; నాస్తి = లేదు, "అగ్నీషోమీయం పశు మాలభేత" ఇత్యాది వాక్యములచే వేదబోధిత మగుటవలన. మఱియు, అస్య—పరమేశ్వరార్పణముగాఁ జేయఁబడిన,

* ఫలము లేక పోవుట.

ధర్మస్య, స్వల్పమపి = ఆరంభమాత్రముగూడ, మహతః భయాత్ = సంసారము నుండి, త్రాయతే = రక్షించుచున్నది, కాని కామ్యకర్మ మట్లు గాదు. ఎందువలన ననఁగా పుణ్యము క్షయించినపుడు మరల సంసారము చెప్పఁబడుచున్నది.

రా. చెప్పఁబోవు బుద్ధితోఁగూడిన కర్మముయొక్క మాహాత్మ్యముఁ జెప్పుచున్నాఁడు.—ఇహ = ఈకర్మయోగమునందు; అభిక్రమనాశః—అభిక్రమ మనఁగా ఆరంభము, దానికి నాశ మనఁగా ఫలసాధనము గాకపోవుట; నాస్తి=లేదు. ఆరంభింపఁబడి సమాప్తముగాక విచ్ఛిన్న మయినను ఇది నిష్ఫలము కాదు. ఆరంభింపఁబడి విచ్ఛిన్న మయినయెడ, ప్రత్యవాయః = దోషముగూడ; నవిద్యతే = లేదు. అస్య ధర్మస్య = ఈకర్మయోగాఖ్య మగు ధర్మముయొక్క; స్వల్పమపి = స్వల్పాంశము గూడ; మహతః భయాత్ = సంసారమునుండి; త్రాయతే = రక్షించుచున్నది. ఈ యర్థము "పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే" అని ముందు విశదీకరింపఁబడును. ఇతరములు లౌకికసాధనములును వైదికసాధనములును విచ్ఛిన్నములైనచో, ఫలము నొసంగవు గదా! ప్రత్యవాయమును గలిగించును గదా!

ఈ కర్మయోగమునందు ఆరంభించినపిదప సమాప్తి లేక విచ్ఛిత్తి కలిగినను అది నిష్ఫలము కాదు. సమాప్తి లేక విచ్ఛిత్తి కలుగుటచే ప్రత్యవాయము గూడ సంభవింపదు. మఱియు దీనియందు స్వల్పభాగము ననుష్ఠించినను సంసారమునుండి విముక్తుఁ డగు నని తాత్పర్యము.

మూ. *

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయో ఽవ్యవసాయినామ్. ౪౧

భా. ఏబుద్ధి, సాంఖ్యమునందుఁ జెప్పఁబడినదో, యోగమునందును జెప్పఁబడునో. అట్టి—బుద్ధిః=జ్ఞానము; ఏకా= ఒకటియే; ఇహ=ఈ శ్రేయోమార్గమునందు; వ్యవసాయాత్మికా = నిశ్చయస్వభావము, ఇతర విపరీత బుద్ధిశాఖాభేదమును శాధించునది, చక్రనిప్రమాణముచేఁ బుట్టిన దగుటవలన. కురునన్దన=అర్జునుఁడా! ఇఁక నితరబుద్ధు లేవి గలవో, వేని యొక్క శాఖాభేదములప్రచారవశమువలన అనంతం బపారం బనుపరతం బగుసంసారము నిత్యవిస్తీర్ణం బగుచున్నది, మఱియు ప్రమాణజనిత వివేక బుద్ధి నిమిత్తవశంబున అనంతభేదబుద్ధు లెవ్వి యుపరమింపఁగా సంసారము

* ఈ శ్లోకమునకు మాధ్వభాష్యము లేదు.

గూడ నుపరమించుచున్నది, అట్టి బుద్ధులు, ఎవరియొక్క అనఁగా, అవ్యవసాయినామ్ = నిశ్చయము లేనివారియొక్క, ప్రమాణజనిత వివేకబుద్ధిరహితులయొక్క అని యర్థము; బుద్ధయః = ఆ జ్ఞానములు; బహుశాఖాః = పెక్కుశాఖలు గలవి, పెక్కుభేదములు గలవి యనుట; ప్రతిశాఖాభేదమునుచేతను, అనన్తాశ్చహి = సంఖ్యలేనివియుఁ గదా !

ఇప్పుడు నేను నీకుఁ జెప్పిన సాంఖ్యబుద్ధియుఁ జెప్పఁబోయెడు యోగబుద్ధియు, ఇది యొక్కటె మోక్షమార్గమున నిశ్చయరూపమయిన బుద్ధి యని యెఱుంగుము. ఇది గలిగినవెంటనే సంసారహేతు వగు నితర విపరీతబుద్ధులు బాధితము లగును. ఇట్టి నిశ్చయబుద్ధి లేనివారికే బహుశాఖలు గలవియు అనంతములు నగు విపరీతబుద్ధులు కలిగి వానిచే సంసారము ఎడతెగక ప్రవర్తించుచుండు నని తాత్పర్యము.

ఆ. ఓయీ! ఈ రెండుబుద్ధులే గాక యితరబుద్ధులుగూడ కాణాదాది శాస్త్రప్రసిద్ధములు గలవు. అట్లుండఁగా ఎట్లు రెండుబుద్ధులనుమాత్రము భగవంతుఁ డుపదేశించె ననఁగా అందుకుఁ జెప్పుచున్నారు—ఏబుద్ధి ఇత్యాదిగా. అదియే యొక్కటి ప్రమాణభూతమైన బుద్ధి యని చెప్పుచున్నాఁడు పూర్వార్ధముచేత. ఇతర బుద్ధులు అవివేకమూలములు అప్రమాణము లని చెప్పుచున్నాఁడు ఉత్తరార్ధముచేత. శ్రేయోమార్గమునందుఁ బ్రవర్తించిన వ్యవసాయాత్మకబుద్ధికి వివక్షిత మగు ఫలమును జెప్పుచున్నారు ఇతరవిపరీతేత్యాదిగా. ఇతర—ఈబుద్ధిద్వయమునకంటె భిన్నములు, విపరీత—ప్రమాణజనితములు కానివి, స్వకపోలకల్పితములు అగు, బుద్ధి—ఏబుద్ధులు గలవో వానియొక్క, శాఖాభేదము—సంసారహేతువు ఏది గలదో దాని, బాధించునది యని యర్థము. అందు హేతువు చక్కని ఇత్యాదిగా. నిర్దోష మగు వేదవాక్యముచేఁ బుట్టిన దగుటవలన ఈచెప్పిన ఉపాయోపేయరూపం బగు బుద్ధిద్వయము సాక్షాత్తుగాను బరంపరగాను సంసారహేతువును బాధించు నని * యర్థము. ఉత్తరార్ధమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు—ఇఁక ఇత్యాదిగా. ఇతరము లనఁగా ప్రకృతబుద్ధిద్వయముకంటె భిన్నములు. అవి యనర్థహేతువు లనుటను జూపుచున్నారు వేనియొక్క ఇత్యాదిగా. ప్రసక్తానుప్రసక్తిచేఁ బుట్టుచున్న అప్రామాణిక బుద్ధులయొక్క అత్యంతపరిణామవిశేషములు శాఖాభేదములు, వానియొక్క,

* ఉపాయము—కర్మయోగము, ఉపేయము—సాంఖ్యము, సాంఖ్యము సాక్షాత్తుగా, యోగము పరంపరగా—సాంఖ్యోత్పాదనద్వారమున, సంసారహేతునివర్తక మని భావము.

ప్రచారము—ప్రవృత్తి, దానివశమువలన ననుట. అనంతము—సమ్యక్ జ్ఞానముచేతనే గాని నివృత్తి లేనిది. అపారము—తాను కార్యమైనను వస్తుభూత మయిన కారణము లేనిది *. అనుపరతశబ్దార్థమునే స్పష్టీకరించుచున్నారు నిత్యవిస్తీర్ణం బని. అప్పుడు ఎట్లది నివర్తిల్లి పురుషార్థము సిద్ధించుట? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు ప్రమాణేత్యాదిగా. అన్వయవ్యతిరేకాఖ్య మయిన అనుమానప్రమాణముచేతను పదార్థపరిశోధనపరమైన ఆగమప్రమాణముచేతను బుట్టిన వివేకరూప మగు బుద్ధి యేది గలదో అది నిమిత్తముగా నుదయించిన సమ్యక్ జ్ఞానముయొక్క వశమువలన, ఈ విపరీతబుద్ధులు బాధితము లగును, అవి బాధితములు కాఁగా, ఆలంబనము లేని దగుటవలన సంసారముగూడ నిలువఁజాలక యుపరమించుచున్న దని యర్థము ఇతరబుద్ధు లేవి గలవ్రా అని యుపక్రాంతము లైన తత్త్వజ్ఞాననివర్త్యములు సంసార హేతుభూతములు నగు బుద్ధులఁ బరామర్శించుచున్నారు అట్టి బుద్ధులు అని. సమ్యక్ జ్ఞానవంతు లగు ఈ భిన్నబుద్ధులు కలుగుట యప్రసిద్ధ మని యాశంకించి యవి గలవారు సమ్యక్ జ్ఞానవంతులు గా రని చెప్పుచున్నారు ఎవరియొక్క ఇత్యాదిగా. బుద్ధులకు వృక్షమునకుంబోలెఁ బెక్కుశాఖ లెట్లనఁగా అందుకుఁ జెప్పుచున్నారు పెక్కుభేదములు గలవి యనుట యని. ఒక్కొకబుద్ధియందును శాఖాభేద మనఁగా అవాంతరవిశేషము, దానిచే బుద్ధులు అసంఖ్యము లనుట సిద్ధ మని చెప్పుచున్నారు ప్రతిశాఖాభేదముచేతను అని. బుద్ధు లనంతము లనుట ప్రసిద్ధ మని తెలుపుచున్నది హి అనునది.

ప. వ్యవసాయాత్మికా = నిశ్చయాత్మక మయిన, బుద్ధిః, సాంఖ్య యోగమునందు, వ్యవసాయులకుఁ బురుషార్థకసాధకము. అవ్యవసాయులయొక్క, బుద్ధయః, బహుశాఖాః = పెక్కుస్కంధములు గలవియు, అనన్తాశ్చ, అగుచున్నవి. అవి పురుషార్థమునకు సాధనము కా దని యభిప్రాయము.

శం. యోగవిషయక మైన బుద్ధితోఁ గూడినవాఁడు తరించు నని చెప్పఁబడినది. ఆ యోగవిషయ మైన బుద్ధి యేది యని యాకాంక్ష కలుగఁగా దానిం జెప్పువాఁడై తదితర మైన బుద్ధి నవలంబించినవారి కెన్నటికిని తరణము లే దని సూచించుచున్నాఁడు.—“మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చా ఽశుద్ధ మేవచ ।

* పారము-కారణము, అది లేనిది అపారము.

అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామ వివర్జితమ్ » * అని చెప్పఁబడి యుండుటవలనఁ గామసంకల్పాది కషాయరహితమై శుద్ధ మగుటచే, ఈశ్వరుఁడే మాకుఁ బరమగతి యని వ్యవస్థితమైన వ్యవసాయము అనఁగా నిశ్చయము దేనియందుఁ గలదో, అది వ్యవసాయాత్మకము, వస్తుతత్త్వనిశ్చయము గలదై యీశ్వరాశ్రయ మైన దనుట, అట్టి; బుద్ధిః ♦; ఇహ—మోక్షైకప్రయోజన మగు కర్మయోగమునందు, ప్రవృత్తుఁ డయిన వ్యవసాయి యగు ముముక్షువునకు; ఏకా—వెలుపలను లోపలను సదా యేక రూపమే యగును. « యో వా ఏ తదక్షరం గార్గ్యవిదిత్వా ఽస్మిఁల్లోకే జుహోతి యజతే తప స్తప్యతే అన్తవ దే వాస్య త ద్భవతి » ❡ అని వ్యతిరేక ముఖముగా ‘ తెలిసి హోమము చేయువానియొక్కయు యజించువానియొక్కయు తపస్సు చేయువానియొక్కయు సమస్తవైదికకర్మము అనంతమే యగును ’ అని ప్రతి పాదించునట్టి శ్రుతిప్రమాణముచే జనిత మగుటవలన ఏకరూపముననే నిలిచియుం డును, ఒకప్పుడును భేదిల్లదు. అవ్యవసాయినామ్ — వివేకబుద్ధి లేనివారియొక్క, వ్యవస్థాశూన్యు లయిన కాములయొక్క; బుద్ధయః; బహుశాఖాః = పెక్కువిధ ములు గలవి, « ఆశాస్తే యం యజమానో ఽసౌ » § అని చెప్పినచొప్పున బహుకామితవిషయము లగుటం జేసి బహువిధముగా భేదిల్లుచున్నవి. కావుననే, అనన్తాః—కామితము లనంతము లగుటవలన ఇట్లు బుద్ధు లనంతము లయినప్పుడు అవి కలవారికి సంసారముగూడ అనంతమే యగును, ఎప్పుడును శాంతము కా దని యర్థము.

మ. దీని నుపపాదించుటకై తమేత మిత్యాదివాక్యవిహితములు ఏకా ర్థము లనుటను చెప్పుచున్నాఁడు—కురునన్దన—అర్జునా! ఇహ=శ్రేయోమార్గమునందు, లేక, తమేత మితివాక్యమునందు; వ్యవసాయాత్మికా = ఆత్మతత్త్వనిశ్చయాత్మక మయిన; బుద్ధిః; ఏకా = ఒక్కటియే, నాలుగాశ్రమములకును సాధ్యముగా వివ క్షింపఁబడినది, తృతీయావిభక్తి ఒక్కొకటియు ఇతరము నపేక్షింపక సాధన ము

---

* మనస్సు రెండువిధములుగాఁ జెప్పఁబడినది. శుద్ధమును అశుద్ధమును అని. కామసంక ల్పము గలది అశుద్ధము, కామవర్జితము శుద్ధము.

♦ అంతఃకరణము.

❡ గార్గీ! ఎవ్వఁడీ యక్షరమును దెలియక ఈలోకమునందు హోమము చేయునో యజించునో తపస్సు చేయునో అతనియాకర్మము అంతవంతమే యగును.

§ ఈయజమానుఁడు దేనిఁ గోరుచున్నాఁడో.

నని బోధించుటవలన. భిన్నార్థ మగునెడ సముచ్చయ ముండును గదా! ఏకార్థ మగునను "దర్శపూర్ణమాసాభ్యామ్" అనుచోటంబోలె ద్వంద్వసమాసముచేతను 'యదగ్నయే ప్రజాపతయే చ' అనుచోటంబోలె చ శబ్దముచేతను సముచ్చయము చెప్పవచ్చును. అట్లిచ్చట నేదియుఁ బ్రమాణము లే దని యర్థము. "సాంఖ్యవిషయంబును యోగవిషయంబు నగు బుద్ధి యొక్కటేఫలము గల దగుటవలన నొక్కటియే వ్యవసాయాత్మకము—సర్వవిపరీతబుద్ధులను బాధించునది" యని భాష్యకారులు. ఇతరులుమాత్రము 'పరమేశ్వరారాధనముచేత నే సంసారమును దాఁటెద నని నిశ్చయము గలదై యొకటెనిష్ఠ గల బుద్ధియే, ఇటఁ గర్మయోగమునం దగుచున్న' దని యర్థ మని చెప్పిరి. అన్నివిధములచేతనుగూడ జ్ఞానకాండానుసారముగా 'స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్' అనుట యుపపన్నము. కర్మకాండమునం దైననో, బహుశాఖాః = పెక్కుభేదములు గలవియు, కామనలు పెక్కుభేదములు గల వగుటవలన; అనన్తాశ్చ— కర్మఫలము గుణఫలము మొదలగు ఉపశాఖలభేదమువలన; బుద్ధయః, అగుచున్నవి, అవ్యవసాయినామ్—ఆయాఫలమును గోరువారలకు. బుద్ధులు అనంతము లను ప్రసిద్ధిని సూచించుచున్నది హిశబ్దము. ఇందువలనఁ గామ్యకర్మముల యపేక్షచే గొప్పనైలక్షణ్యము గలదు చిత్తశుద్ధ్యర్థకర్మములకని యభిప్రాయము.

శ్రీ. ఎందువలన ననఁగా రెంటికిని తారతమ్యమును జెప్పుచున్నాఁడు—

ఇహ = ఈశ్వరారాధనరూప మయిన కర్మయోగమునందు, వ్యవసాయాత్మికా=పరమేశ్వరంభక్తిచేత నే నిశ్చయముగా తరించెద నని నిశ్చయము గల, ఏకాబుద్ధిః = ఏకనిష్ఠ యగు బుద్ధియే యగును. అవ్యవసాయినామ్ - బహిర్ముఖులగు కామనావంతులకో, కామనలు అనంతము లగుటవలన, అనన్తాః; అందును, కర్మఫలము గుణఫలము మొదలగు భేదమునలన, బహుశాఖాశ్చ: బుద్ధయః, అగును ఎట్లనఁగా ఈశ్వరారాధనార్థ మయిన నిత్యనైమిత్తిక కర్మము కించిదంగవైకల్యము గలిగినను నశింపదు. 'యథా శక్నుయా త్తథా కుర్యాత్' * అని గదా యది విధింపఁబడుచున్నది. విఘ్నాదికముచే వైగుణ్యముగూడఁ గలుగదు, ఈశ్వరోద్దేశముచేత నే యది యుపశాంత మగుటవలన. కామ్యకర్మమో అట్టిది కాదు. కావున గొప్పతారతమ్యమున్న దని భావము.

* ఎట్లు శక్యఁ డగునో అట్లు చేయవలెను.

ప. ఇఁక దానినే ప్రకటించుచున్నాఁడు—ఇహ = ఈ పరమేశ్వరారాధనరూపమయిన కర్మయోగమునందు, వ్యవసాయాత్మికా=ఈశ్వరభజనానువృత్తిచేతనే తరించెద నను నిశ్చయము గలది, అట్టి బుద్ధియేమో, ఏకా = ఒకనిష్ఠ గలదియే యగుచున్నది. ఇఁక, అవ్యవసాయినామ్ = కామాత్ములయొక్క, బుద్ధయః—ఏ బుద్ధులు గలవో అవి; బహుశాఖాః—ఒకకామమునుండి మఱియొకకామముఁ బుట్టించునవి యగును. అనన్తాః, కామము లనంతము లగుటవలన, 'జాయా మే స్యాదథ ప్రజాయేయాథ విత్తం మే స్యాత్' * అను శ్రుతివలనను.

రా. కామ్యకర్మవిషయ మగు బుద్ధికిని మోక్షసాధనభూతకర్మవిషయమయిన బుద్ధికిని వైషమ్యమును జెప్పుచున్నాఁడు.—కురునన్దన = అర్జునా! ఇహ—శాస్త్రీయమయిన సమస్తకర్మమునందు; వ్యవసాయాత్మికా బుద్ధిరేకా—ముముక్షువనుష్ఠించునట్టి కర్మమునందు, వ్యవసాయాత్మికా బుద్ధిః—వ్యవసాయ మనఁగా నిశ్చయము, ఆత్మయాథాత్మ్యనిశ్చయము, ఆబుద్ధి ఆత్మయాథాత్మ్యనిశ్చయపూర్వకము ♦ గదా! కామ్యకర్మవిషయం బగు బుద్ధియో, అవ్యవసాయాత్మకము. అటఁ గామాధికారమునందు దేహాతిరిక్తుఁడైన ఆత్మ కలఁ డను జ్ఞానమమాత్రమే గదా యపేక్షితము. ఆత్మస్వరూపయాథాత్మ్యనిశ్చయం బపేక్షితము గాదు, స్వరూపయాథాత్మ్యనిశ్చయము లేకున్నను స్వర్గాదిఫలకామనయును తత్సాధనకర్మానుష్ఠానంబును తత్ఫలానుభవంబును సంభవించుటవలనను విరోధము లేమివలనను. అట్టి యీవ్యవసాయాత్మక మగు బుద్ధి, ఏకఫలసాధనవిషయ మగుటచే, ఏకా = ఒక్కటి, ఒక్కటే మోక్షాఖ్యఫలముకొఱకుఁ గదా ముముక్షువునకు సర్వకర్మంబులును విధింపఁబడుచున్నవి. కావున శాస్త్రార్థ మొక్కటియే యగుటవలన సర్వకర్మవిషయ మయిన బుద్ధి యొక్కటియే యగును. ఎట్లు ఒక్కటే ఫలమునకు సాధన మగుటచే ఆగ్నేయాదు లగు యాగములు ఆఱును ఇతికర్తవ్యతాసహితముగా ఒక్కటే శాస్త్రముయొక్క అర్థ మగుటచే తద్విషయ మయిన బుద్ధి యొక్కటే యగునో, అట్లు అని యర్థము. అవ్యవసాయినామ్ = స్వర్గము పుత్త్రులు పశువులు అన్నము మొదలగు ఫలములకు సాధనము లయిన కర్మములం దధికృతు లగు వ్యవసాయరహితులయొక్క; బుద్ధయః = బుద్ధులో; ఫలములు అనంతము లగుటవలన, అనన్తాః = అనంతములు.

* నాకు భార్య కావలెను, అంత, సంతానము కావలెను, అంత, ధనము నాకుఁ గావలెను.

♦ ఆత్మయాథాత్మ్యనిశ్చయముచేఁ గలిగినది.

అందును, బహుశాఖాః = పెక్కుభేదములు గలవి, ఒకటేఫలమునకు విధింపఁబడిన దైనను దర్శపూర్ణమాసాదికర్మమునందు 'ఆయురాశాస్తే' ఇత్యాదివచనములచేఁ దెలియవచ్చునట్టి యవాంతరఫలములభేదముచే బహుభేదములును అగుచున్నవి. అందువలన అవ్యవసాయులయొక్క బుద్ధులు అనంతములును బహుశాఖములును. ఇది చెప్పఁబడినది—నిత్యనైమిత్తికకర్మములందు ప్రధానఫలములును అవాంతరఫలములును ఏవి ప్రతిపాదింపఁబడుచున్నవో వాని అన్నిటిని విడిచి మోక్షైకఫలార్థము సర్వకర్మములును ఏకశాస్త్రార్థముగా ననుష్ఠింపవలెను. కామ్యకర్మములనుగూడ స్వవర్ణాశ్రమోచితము లగువానిఁ దత్తత్ఫలములు విడిచి మోక్షసాధనార్థము నిత్యనైమిత్తికములతో సమానముగా యథాశక్తి అనుష్ఠింపవలెను అని.

ముముక్షువులకు మోక్షార్థముగా అనుష్ఠింపవలసిన శాస్త్రీయసమస్తకర్మములందును బుద్ధి ఆత్మస్వరూపనిశ్చయపూర్వకముగనే కలుగును. అది యొకటే మోక్షరూపఫలము గలది కావున నొకటే శాస్త్రమున కర్థము ఒకటే యగుచున్నది. ఆత్మస్వరూపనిశ్చయము లేనివారలబుద్ధులు ఒకటే ఫలము గలవి కావు, వానిఫలము లనంతము లగుటవలన అవి యనంతములు, ఆఫలములందును అవాంతరభేదములు పెక్కులు గలుగుటవలన పెక్కుశాఖలు గలవి యగును. కావున ముముక్షువు మోక్షైకార్థి యగుటవలన వాని నన్నిటిని ఫలాపేక్ష లేనివాఁడై యొకటే శాస్త్రార్థముగా గ్రహించి ఏకవిధముగా మోక్షసాధనార్థ మనుష్ఠింపవలెనని తాత్పర్యము.

వ్యా యోగమునందు ఈబుద్ధిని విను మని చెప్పఁబడినది. అనేకములు గదా బుద్ధులు మతభేదమువలన. కావున ఎట్లు ఒకదానియందే విశ్వాస ముంతును? అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—కురునన్దన! ఇహ = ఇందు; వ్యవసాయాత్మికా= మంచియుక్తిచే నిర్ణీతమయిన; బుద్ధిః=వాక్కు; ఏకా=ఒకటియే. అవ్యవసాయినామ్= మంచియుక్తిచే నిర్ణయము లేనివారియొక్క; బుద్ధయః = వాక్కులు; బహుశాఖాః= పెక్కుభేదములు గలవి; అనన్తాశ్చ = అనంతములుగూడ. చక్కనియుక్తిచే నిర్ణీతము లయిన మతములకు ఐక్యమే యని యర్థము.

చక్కనియుక్తిచే నిశ్చయము లేనివారిమతములు భిన్నములుగా నుండును గాని సమ్యగ్యుక్తినిర్ణీతము లయిన మతము లన్నియు నేకాభిప్రాయములే యని తాత్పర్యము.

యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః. ౪౨

కామాత్మానస్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి. ౪౩

భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే. ౪౪

భా. ఎవరికి వ్యవసాయాత్మక మయిన బుద్ధి లేదో వారు. పార్థ = అర్జునా! యామ్ = ఏ; ఇమామ్ = చెప్పఁబోవుదాని; పుష్పితామ్ = పుష్పితవృక్షమువలె శోభిల్లుచున్నట్టి, వినుటకు రమణీయ మైనట్టి; వాచమ్ = వాక్యలక్షణ మగు శబ్దమును; ప్రవదన్తి = చెప్పుచున్నారో; వా రెవ్వరు? అవిపశ్చితః = అల్పబుద్ధులు, అవివేకు లని యర్థము; వేదవాదరతాః—వేదవాద = అనేకార్థవాద ఫలసాధనములను దెలుపునట్టి వేదవాక్యములందు, రతాః = రతిగలవారు; అన్యత్ = స్వర్గప్రాప్తి మొదలగు ఫలములకు సాధనము లయిన కర్మములకన్న ఇతరము; నాస్తి = లేదు. ఇతి వాదినః = అని చెప్పుట స్వభావము గలవారు.

మఱియును, కామాత్మానః = కామస్వభావులు, కామపరు లని యర్థము; స్వర్గపరాః—స్వర్గమె పరము—పురుషార్థముగాఁ గలవారు స్వర్గపరులు, స్వర్గప్రధానులు; ఎట్టివాక్యలక్షణ మైన శబ్దము ననఁగా—జన్మకర్మఫలప్రదామ్—కర్మముయొక్క ఫలము కర్మఫలము, జన్మమే కర్మఫలము జన్మకర్మఫలము, దానినిచ్చుదాని; క్రియావిశేషబహులామ్—కర్మములయొక్క విశేషములు బహులములుగా ఏశబ్దమునందుఁ గలవో, స్వర్గపశుపుత్త్రాద్యర్థము * లగు క్రియావిశేషములు ఏవాక్కుచే బాహుల్యమునఁ దెలుపఁబడుచున్నవో, అట్టిదాని; భోగైశ్వర్య గతిం ప్రతి — భోగమును ఐశ్వర్యమును — భోగైశ్వర్యములు, వానియొక్క గతిని—ప్రాప్తినిగూర్చి, సాధనభూతము లయిన యేక్రియావిశేషములు గలవో అవి బహులములుగాఁ గలదాని, అట్టి యేవాక్కును చెప్పు

* స్వర్గము పశువులు పుత్త్రులు మొదలగునవి ప్రయోజనముగాఁ గలవి.

చున్నారో అని యన్వయము. అట్టివాక్కును జెప్పెడు మూఢులు సంసారమునందుఁ బరివర్తనము నొందుచుందు రని యభిప్రాయము.

వారికి, భోగైశ్వర్యప్రసక్తానామ్=భోగమును ఐశ్వర్యమును జేయవలె నని భోగైశ్వర్యములందే ప్రీతిగలవారలకు, తదాత్మభూతులైన వారికి; తయా=అట్టి క్రియావిశేషబహుల మయిన వాక్కుచే; * అపహృతచేతసామ్ = అపహరింపఁబడిన బుద్ధి గలవారలకు, ఆచ్ఛాదింపఁబడిన వివేకప్రజ్ఞ గలవారలకు; వ్యవసాయాత్మికా = నిశ్చయాత్మక మయిన, సాంఖ్యమునందుఁగాని యోగమునందుఁగాని; బుద్ధిః = బుద్ధి; సమాధౌ—సమాధీయతే అస్మిన్ పురుషోపభోగాయ సర్వమ్—చేర్పఁబడుచున్నది దీనియందు పురుషుని యుపభోగముకొఱకు సమస్తమును కావున సమాధి యనఁగా అంతఃకరణము, బుద్ధి, దానియందు; న విధీయతే—కలుగ దని యర్థము.

వ్యవసాయాత్మక మగు బుద్ధి లేని యవివేకులు నానావిధము లయిన ఫలములు మొదలగువాని బోధించునట్టి వేదవాక్యములకు మోహితులై అట్టి కర్మములకన్నను అధిక మేదియు లే దని చెప్పుచుఁ గామస్వభావులై స్వర్గమె పురుషార్థమని తలఁచి కర్మఫల మయిన జన్మము నొసంగునవి యయినను భోగైశ్వర్యప్రాప్త్యర్థము నానావిధకర్మములనే యనుష్ఠింపవలె నని చెప్పుదురు. వారివాక్యము, పుష్పించినవృక్షం బెట్లు చూడనుమాత్రము రమణీయముగా నుండునో ఫలానుభవమునకుపయోగింపదో, అట్లు విననుమాత్రము రమణీయముగా నుండును, కాని పురుషార్థమునకుపయోగింపదు. అట్టివాక్యముచే మోహితులై భోగైశ్వర్యములందే యాసక్తులగువారికి మున్ను చెప్పిన వ్యవసాయాత్మక మైన బుద్ధి యంతఃకరణంబున నిలువఁజాల దని తాత్పర్యము.

ఆ. సాంఖ్యయోగరూప మొక్కటే ప్రమాణభూత మైన బుద్ధి యనునెడ, అప్పుడు, అదియే యందఱి చిత్తమునందును ఏల స్థిరముగా నిలువదు? అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు. ఎవరికి నిత్యాదిగా. వారు ఏయీవాక్కును జెప్పుచున్నారో దానిచే అపహృతచేతసులకు కామవంతులకుఁ గామవశమునం జేసి నిశ్చయాత్మక మయిన బుద్ధి స్థిరముగా నిలువఁజాల దని చెప్పుచున్నారు వారు ఇత్యా

* యా మిమామ్ అనువోట యన్వయార్థము ఇట తచ్ఛబ్దముచేఁ బరామర్శింపఁబడుచున్నది.

దిగా. ఇమామ్ అనుటచే అధ్యయనవిధిసిద్ధ మగుటవలన కర్మకాండరూప మయిన వాక్కు ప్రసిద్ధ మనుట వివక్షితము. చెప్పఁబోవుదాని—క్రియావిశేషబహులా మిత్యాదిగా ననుట. ఎట్లు మోదుగుచెట్లు పుష్పములతో శోభమానమై కనఁబడు చున్నది, కాని యుపభోగ్య మయిన ఫలము గలది కాదు. అట్లు ఈకర్మకాండాత్మక మయిన వాక్కుగూడ వినునప్పుడు రమణీయముగాఁ గనఁబడును, సాధ్యసాధనసంబంధము తోఁచుటవలన, కాని నిరతిశయఫలము గలది కాదు కర్మానుష్ఠానఫలం బనిత్య మగుటవలన, అని తలఁచి చెప్పుచున్నాఁడు పుష్పితామ్ అని. వాక్యలక్షణము—వాక్యముగాఁ గనఁబడుచున్నది, కాని వస్తుతత్త్వమున వాక్యము కాదు అర్థాభాస మగుటవలన నని యర్థము. చెప్పువారలు వేదవాక్యతాత్పర్యపరిజ్ఞానము లేనివార లని చెప్పుచున్నారు అవిపశ్చితః అని. వేదవాదరతాః—అనేకము లయిన అర్థవాదములను ఫలములను సాధనములను దెలుపునట్టి వేదవాక్యములందు రతి అనఁగా ఆసక్తి అది గలవా రనుట. కర్మకాండనిష్ఠకు ఫలమును చెప్పుచున్నాఁడు నాన్య దిత్యాదిగా. ఈశ్వరుఁడును లేఁడు మోక్షమును లే దని చెప్పుచు నాస్తికులై సమ్యక్జ్ఞానదూరు లగుచున్నా రని యర్థము.

అవివేకు లగు ఈచెప్పువారలకు వ్యవసాయాత్మకబుద్ధి లేమి సిద్ధించుటకై మఱియు విశేషణములు చెప్పుచున్నారు మఱియును ఇత్యాదిగా. వారు సంసారమునందుఁ బరివర్తనము నొందుచుందు రని తెలుపుటకై ప్రస్తుత మగు వాక్కునకే విశేషణము చెప్పుచున్నారు జన్మకర్మేత్యాదిగా. ఓయీ! పురుషులకు కామస్వభావత యుచితము కాదు, చేతనునికి ఇచ్ఛ గలవానికి తదాత్మత్వము * అనుపపన్న మగుటవలన. అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు కామపరు లని. తత్పరు † లనఁగా తత్తత్ఫలార్థులై తత్సాధనుపాయము లైన కర్మములందే ప్రవృత్తు లగుటచే కర్మసన్న్యాసపూర్వక మయిన జ్ఞానమునకు బహిర్ముఖు లనుట. ఓయీ! కర్మనిష్ఠులకుఁగూడ పరమపురుషార్థము నందలి యపేక్షచే మోక్షోపాయ మయిన జ్ఞానమునందుఁ గావచ్చు నాభిముఖ్యము అనఁగా కా దని చెప్పుచున్నారు స్వర్గపరాః అని. స్వర్గపరు లనఁగా స్వర్గముననే యాసక్తులై స్వర్గాతిరిక్త మయిన పురుషార్థము లే దని నిశ్చయము గల వా రనుట. జన్మ మనఁగా నానావిధము లయిన మధ్యమదేహప్రభేదములను గ్రహించుట. వాక్కు యథోక్తఫలప్రద మనుట యప్రామాణిక మని యాశంకించి

---

* ఇచ్ఛయే స్వరూపముగా గలవాఁ డగుట.

† కామపరులు.

అనుష్ఠానద్వారమున నది యుపపన్న మగు నని చెప్పుచున్నారు క్రి యేత్యాదిగా. క్రియలయొక్క— అనుష్ఠానములయొక్క, విశేషములు, దేశకాలాధికారి ప్రయుక్తము లగు సత్త్రము అహీనము ఏకాహము ఇత్యాదులు, అవి గదా యీవాక్యమునందుఁ బ్రచురముగాఁ దెలియవచ్చుచున్నవి యని యర్థము. ఎట్లు ఈవాక్కునందు క్రియావిశేషములకు బాహుళ్యమున ఉనికి సంభవించు నని యాశంకించి ప్రకాశ్యములు [1] అగుటచే నని దీని విశదీకరించుచున్నారు స్వర్గేత్యాదిగా. అట్లయినను ఆక్రియావిశేషములు మోక్షోపాయములు కావచ్చును, అందుచే తన్నిష్ఠులకు మోక్షాభిముఖ్యము కలుగవచ్చు ననఁగా కలుగ దని చెప్పుచున్నారు భో గేత్యాదిగా. అట్టి వాక్కును జెప్పువారికిఁ బర్యవసానముఁ జూపుచున్నారు అట్టివాక్కును ఇత్యాదిగా.

ఓయీ! కర్మకాండనిష్ఠులై కర్మము ననుష్ఠించువారికిఁగూడ చిత్తశుద్ధి ద్వారమున అంతఃకరణమునందు సాధ్యసాధనభూత మగు బుద్ధిద్వయసముదాయము సంభవించుటవలన మోక్షప్రాప్తి కలుగ దనఁగా అట్లు కా దని చెప్పుచున్నారు. వారికి ఇత్యాదిగా. తదాత్మభూతు లైనవారికి—తనచేఁ గర్తవ్యములుగా ఆరోపింపఁబడిన ఆభోగైశ్వర్యములందే అభినివిష్ట మయిన చిత్తమునందు తాదాత్మ్యాధ్యాసము గలవారికి, బహిర్ముఖుల కని యర్థము. అట్లయినను శాస్త్రానుసారి యగు వివేకప్రజ్ఞచే వ్యవసాయాత్మక మగు బుద్ధి వారి కుదయింపఁ గల దని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నారు. తయా అపహృతచేతసామ్ అని. ఓయీ! సమాధి సంప్రజ్ఞాతము అసంప్రజ్ఞాతము అని రెండువిధములు. అందు బుద్ధిద్వయవిధి అప్రసక్తమై యుండఁగా ఎట్లు నిషేధింపవచ్చును? అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు— సమాధీయతే ఇత్యాదిగా.

పా. యామ్, ఇమామ్—వైదిక మయినదాని, వేదమునఁ బుట్టినదాని; స్వర్గాదిఫలముఁ బుట్టించుటకు సమర్థము లగు ద్రవ్యగుణకర్మములు ఫలమునకుఁ బూర్వభావు లగుటవలన పుష్పమువంటివి, అవియే పుష్పితములు, అపుష్పితములగు ద్రవ్యగుణకర్మములను బ్రతిపాదించునట్టి వాక్కుగూడ పుష్పితము, అట్టి, వాచమ్= వాక్కును; ప్రవదన్తి = పఠించుచున్నారు; అవిపశ్చితః = అపండితులు; వేదవాదరతాః = వేదము చెప్పుటయందు ఆసక్తులు, వేదవాక్యముచేఁ బ్రతిపాదింపఁబడిన స్వర్గాదిఫలమునందలి యాశచే బద్ధు లని యర్థము. స్వర్గాదిఫలముకంటె, అన్యత్ =

[1] తెలుపఁ దగినవి.

ఇతరము, మోక్షాఖ్య మయిన సుఖము; నాస్తి ఇతి; వాదినః—లే దని చెప్పుస్వభావము గలవారు.

ఆ యపండితులు ఎట్టివా రనఁగా చెప్పుచున్నాఁడు.—కామాత్మానః—కామము గలవారు; స్వర్గపరాః = స్వర్గమే ప్రధానముగాఁ గలవారు; జన్మకర్మఫలప్రదామ్—జన్మ = శరీరేంద్రియప్రాప్తిని, కర్మఫల = కర్మములయొక్క ఫలము లయిన స్వర్గాదులను, ప్రదామ్ = ఇచ్చునట్టి దానిని; క్రియావిశేషబహులామ్—క్రియావిశేష=కర్మభేదము లయిన పాకయజ్ఞాదులచే, బహులామ్=పెక్కువిషయములను బ్రతిపాదించుదానిని; భోగైశ్వర్యగతిం ప్రతి—భోగ = శబ్దాదివిషయలాభములయొక్కయు, ఐశ్వర్య= అణిమాద్యైశ్వర్యములయొక్కయు, గతిం ప్రతి = ప్రాప్తిని గూర్చి, సాధనభూత మైనదాని నని యర్థము. అట్టివాక్కును పలుకుచుందురు. అట్టివాక్కును వినుచుందురు, దాని విషయమునఁ బరమార్థబుద్ధి యుంచుదు రని యర్థము. అట్లు శ్రుతి "ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్తమవరం యేషు కర్మ" * ఇత్యాదిగాఁ బ్రతిపాదించుచున్నది.

ఎందువలన ఆవాక్కును వినవల దనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు. ఆవాక్కును బ్రమాణముగా గ్రహించినయెడ తదుక్తకర్మానుష్ఠానమును తత్ఫలప్రాప్తియుఁ బ్రసక్తించును. అందువలన—భోగైశ్వర్యప్రసక్తానామ్ = భోగైశ్వర్యము లందే ఆసక్తి గలవారికి; తయా = ఆవాక్కుచే, అపహృతచేతసామ్ = ఆచ్ఛాదిత మయిన వివేకప్రజ్ఞ గలవారికి; వ్యవసాయాత్మికా, సాంఖ్యమునందుఁగాని యోగము నందుఁగాని, బుద్ధిః; సమాధౌ=పరమాత్మజ్ఞానము నిమిత్తమై; ఈబుద్ధియే పరమపురుషార్థ మని నిశ్చిత మయిన బుద్ధి; అట్టి బుద్ధి, నవిధీయతే—పుట్టింప శక్యము గాదు. అందువలన ఈవాక్కు పరమపురుషార్థవిరోధి యగుటచే వినవల దని యభిప్రాయము.

౪౫. ఓయీ! వ్యవసాయరహితులకుఁగూడ యోగబుద్ధి సిద్ధించుఁ గాక యని యాశంకింపఁగా, కామపరు లగు వారి కది యంతఃకరణమున నిలువఁజాల దని బోధించుటకై వారిస్వభావము వర్ణించుచున్నాఁడు మూఁడు శ్లోకములచేత.—వేదవాదరతాః—వాదము లనఁగా వాక్యములు, "వాయవ్యగ్ శ్వేత మాలభేత భూతి

* ఎవరియందు అవర మైన—జ్ఞానరహిత మైన కర్మము చెప్పఁబడినదో అట్టి పదునెనిమిదుండి—ఋత్విక్కులు పదునారుగురు పత్ని యజమానుఁడు, ఆను నీయజ్ఞముయొక్క రూపములు, దృఢములు కావు, కావున నశ్వరములు గదా.

కామాః" ఇత్యాద్యు లగు కర్మ తత్ఫల తత్సాధన ప్రకాశకము లైన అర్థవాదాదివేద వాక్యములందు ఆసక్తులు, వానియందే తాత్పర్యము గలవారు; కావుననే, నాన్యద స్తీతి—సాధనసాధ్యరూపము లయిన కర్మ తత్ఫలములకంటె ఇతరము ఈశ్వరుఁడుగాని మోక్షముగాని యేమియు లే దని; వాదినః—అడుగువారలకుఁ జెప్పుస్వభావము గల వారు. ఎందువలన ననఁగా, అవిపశ్చితః—వేదవాక్యములకు ఉపక్రమోపసంహారాదు లచేఁ దాత్పర్యము నెఱుంగఁజాలనివారు, బహిర్ముఖు లగు మీమాంసకులు; పుష్పి తామ్—పుష్పములచే మల్లెతీఁగవలె, 'అపామ సోమమ్' 'దక్షిణావన్తో అమృతం భజన్తే' 'పశ్యతి పుత్రిమ్ పశ్యతి పౌత్రిమ్' 'అక్షయ్యం హ వై చాతుర్మాస్య యాజిన స్సుకృతం భవతి' ఇత్యాద్యర్థవాదరూపము లయిన ఫలశూన్యము లగు పుష్పములచే రంజిల్లఁ జేయునట్టి, ఇమామ్—ఈ, జన్మకర్మఫలప్రదామ్ ఇత్యాదిగా చెప్పఁబోవు లక్షణము గల, యాం వాచమ్ 'అగ్నిమీళే పురోహితమ్' 'ఇషే త్వోర్జే త్వా' 'బ్రహ్మ సంధత్తం తన్మే జిన్వతమ్' ఇత్యాదివాక్యమును; ప్రవదన్తి—కర్మకాండమునే ప్రశస్తమునుగా చెప్పుచున్నారు, కాని ఉపాసనాకాండమును గాని బ్రహ్మకాండమునుగాని ప్రశస్తముగాఁ జెప్ప రని యర్థము.

యోగబుద్ధికి అనర్హు లయినప్పుడు వారిస్వభావము దుష్ట మని సూచించుటకై వారిగుణములనే వర్ణించుచున్నాఁడు కృష్ణుఁడు—స్వర్గపరాః—స్వర్గమే పరము అనఁగా సర్వోత్తమ మయిన పురుషార్థము అను నిశ్చయము గలవారు; అందువలననే, భోగైశ్వర్యగతిం ప్రతి—భోగము లనఁగా భుజింపఁబడుచున్నవి అను వ్యుత్పత్తిచే దివ్యము లగు స్రక్చందనవనితాదులు, వాని సమగ్రముగా భోగించుటకొఱకు, ఐశ్వర్యముయొక్క—వానికి స్వామి యగుటయొక్క ప్రాప్తిని గూర్చియే; కామాత్మానః—కామము—ఇచ్ఛావేగము బుద్ధియందుఁ గలవారు, విషయభోగలంపటు లయిన మీమాంసకులు; క్రియావిశేషబహులామ్—ఫలవిశేష హేతువులయిన అగ్నిష్టోమము అతిరాత్రము మొదలగు కర్మవిశేషములు బహులములు—పెక్కులు దేనిచే చెప్పఁబడుచున్నవో అట్టిదాని; అందువలననే, జన్మకర్మఫలప్రదామ్—జన్మపదముచే మృత్యుజరారోగములును తద్దుఃఖములును లక్షితము లగుచున్నవి, జన్మాదులు అను స్వప్రతిపాదిత కర్మములయొక్క ఫలములను అనుష్ఠించువారల కిచ్చుదాని, లేక, నానాయోనులందు జన్మములను సుఖాదికర్మఫలములను తనచే బోధింపఁబడిన కర్మముల ననుష్ఠించువారి కిచ్చుదాని; అట్టివాక్యమును, ప్రవదన్తి అని మునుపటి కన్వయము.

ఇట్టివార లగుటవలన వారికి యోగబుద్ధియు తత్ఫలంబును సిద్ధింప దని చెప్పుచున్నాఁడు.—తయా—అర్థవాదబహుల మయిన ఆకర్మకాండరూపవాక్కుచే; అపహృతచేతసామ్—ఆచ్ఛాదిత మైన కార్యాకార్యవివేకజ్ఞానము గలవారలకు, విషయములం దాశచే భ్రమణము నొందుచున్న బుద్ధి గలవారలకు; అందువలననే, భోగైశ్వర్యప్రసక్తానామ్—భోగ్యపదార్థములందును వానిస్వామిత్వమునందును మాత్రమె ఆసక్తిగలవారలకు; సమాధౌ—చక్కఁగా ఉంపఁబడుచున్నాఁడు పురుషుఁడు విషయములందు దీనిచే, లేక, వాసనారూపమున జగత్తంతయు చక్కఁగా ఉంపఁబడుచున్నది పురుషునిచే దీనియందు, కావున సమాధి యనఁగా అంతఃకరణము, దాని యందు; వ్యవసాయాత్మికా బుద్ధిః = యోగబుద్ధి; నవిధీయతే = చొనుపఁబడదు, కామములచే అవకాశము లేమివలన చొరదు. అందువలన, "కారణాభావే కార్యాభావః" * అనున్యాయముచే యోగబుద్ధి లేకుండుటచే తత్కార్య మయిన మోక్షము వీరి కెప్పటికిని సంభవింప దని యర్థము.

మ. వ్యవసాయము లేనివారికిఁ గూడ వ్యవసాయాత్మక మైన బుద్ధి యెందువలన సిద్ధింపదు? సమానమే గదా ప్రమాణము. అని యాశంకించి ప్రతిబంధక ముండుటవలన సిద్ధింప దని చెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—యామిమాం వాచం ప్రవదన్తి తయా వాచా అపహృతచేతసామ్ వ్యవసాయాత్మికాబుద్ధిః నభవతి అని యన్వయము; ఇమామ్—అధ్యయనవిధిచే వచ్చిన దగుటవలనఁ బ్రసిద్ధ మయినదాని; పుష్పితామ్= పూచినపలాశవృక్షమువలె తత్కాలమునందుమాత్రమే రమణీయ మయినదాని, సాధ్యసాధనసంబంధము కనఁబడుటవలనను నిరతిశయ ఫలము లేమివలనను; ఎందువలన నిరతిశయఫలము లే దనఁగా దానిఁ జెప్పుచున్నాఁడు—జన్మకర్మఫలప్రదామ్—అపూర్వశరీరేంద్రియాది సంబంధరూప మయిన జన్మమును తదధీనమును తత్తద్వర్ణాశ్రమాభిమాననిమిత్తంబు నగు కర్మమును తదధీనమగు పశుపుత్త్రస్వర్గాదిరూపము నశ్వర మయిన ఫలమును ప్రకర్షముగా—ఘటీయంత్రమువలె అవిచ్ఛిన్నముగా ఇచ్చుచున్నదాని; ఇట్లిందువలన ననఁగాఁ జెప్పుచున్నాఁడు—భోగైశ్వర్యగతిం ప్రతి క్రియావిశేషబహులామ్—అమృతపానము ఊర్వశీవిహారము పారిజాతపరిమలము మొదలయిన రూపము గల భోగ మేది గలదో దానికి కారణ మగు దేవాదిస్వామిత్వ రూప మయిన ఐశ్వర్య మేది గలదో వాని యొక్క ప్రాప్తిని గూర్చి సాధనము లయిన అగ్నిష్టోమ దర్శపూర్ణమాస జ్యోతి

* కారణము లేనియప్పుడు కార్యము ఉండదు.

స్తోమాదులగు క్రియావిశేషము లెవి గలవో వానిచే విస్తీర్ణమయినదాని, మిక్కిలి బాహుల్యముగా భోగైశ్వర్యసాధనము లయిన క్రియాకలాపములఁ బ్రతిపాదించు దాని నని యర్థము. కర్మకాండము జ్ఞానకాండముకన్న అంతటను అతివిస్తీర్ణం బగుట ప్రసిద్ధంబే గదా! ఇట్టి కర్మకాండరూప మయిన, వాచమ్ = వాక్కును, ప్రవదన్తి = ప్రకృష్టమునుగా—పరమార్థ మయిన స్వర్గాదిఫలము గలదానిఁగా నంగీకరించుచున్నారు. ఎవ్వరు? అవిపశ్చితః—విచారజన్య మయిన తాత్పర్యపరిజ్ఞానము లేనివారు; కావుననే, వేదవాదరతాః = వేదమునందు వాదము లనఁగా అర్థవాదములు «అక్షయ్యం హ వై చాతుర్మాస్యయాజిన స్సుకృతం భవతి» ఇత్యాదు లెవి గలవో వానియందే ఆసక్తులు, వేదార్థము సత్య మగుటచే ఇట్లే యిది యని మూఢవిశ్వాసముచే సంతుష్టులై యుండువారు; ఓపార్థుఁడా! కావుననే, నాన్యదస్తీతి వాదినః—కర్మకాండముకంటె లేదు వేఱే జ్ఞానకాండము, సమస్తవేదమును క్రియాపర మగుట వలన, అట్లు కర్మఫలముకంటె లేదు వేఱే నిరతిశయ మయిన జ్ఞానఫలము అని చెప్పుస్వభావము గలవారు, మహాప్రబంధముచే జ్ఞానకాండవిరుద్ధ మయిన యర్థము ప్రతిపాదించువార లని యర్థము. ఎందువలన మోక్షద్వేషులు వారు? అందుకుఁ జెప్పుచున్నాఁడు—కామాత్మానః—కోరఁబడుచున్న అనంత విషయములచే ఆకుల మయిన చిత్తముగలవా రగుట వలన కామమయులు; ఇట్లయిన మొఱ మోక్షమునుగూడ ఏల కోరరు? ఇందుకుఁ జెప్పుచున్నాఁడు—స్వర్గపరాః = స్వర్గమే ఊర్వశ్యాదికము గల దగుటచే ఉత్కృష్టముగాఁ గలవారు, స్వర్గమునకు మించినపురుషార్థము లే దని భ్రమించి యుండువారలు వివేకవైరాగ్యము లేమింజేసి మోక్ష మను మాటనుగూడ సహింపఁజాల రని యర్థము. వారికి, భోగైశ్వర్యప్రసక్తానామ్ = పూర్వోక్తము లయిన భోగైశ్వర్యములందు నశ్వరత్వము మొదలగు తద్దోషములు తెలియనివా రగుటచే అభినివిష్ట మయిన యంతఃకరణము గలవారికి; తయా—ఆక్రియావిశేషబహుల మయిన వాక్కుచేత; అపహృతచేతసామ్ = కప్పఁబడిన వివేకజ్ఞానము గలవారికి; «అర్థవాదములు స్తుత్యర్థములు, ప్రమాణాంతరముచే బాధితము కాని తాత్పర్య విషయమునందే వేదమునకుఁ బ్రామాణ్యము» అను నీవిషయము సుప్రసిద్ధ మయినను ఎఱుంగఁజాలనివారికి; సమాధౌ = అంతఃకరణమునందు; వ్యవసాయాత్మికా బుద్ధిః; నవిధీయతే = కలుగదు, లేక, సమాధివిషయమయిన * వ్యవసాయాత్మక

---

* పరమాత్మవిషయ మయిన.

బుద్ధి కలుగదు, అధికరణముగాని విషయముగాని అర్థ మనుట సప్తమికి సమాన మగుటవలన. సమాధీయతే—చక్కఁగా నుంపఁబడుచున్నది దీనియందు సమస్తమును అను వ్యుత్పత్తిచే సమాధిశబ్దమునకు అంతఃకరణముగాని పరమాత్మగాని యర్థ మనుట అప్రసిద్ధార్థకల్పనము కాదు. « అహం బ్రహ్మ అనుస్థితి సమాధి, తన్నిమిత్తము వ్యవసాయాత్మకమైన బుద్ధి యుత్పన్నము కా» దను వ్యాఖ్యానమునందో రూఢిమాత్రమే యాదరింపఁబడినది యగును. ఇది భావము—కామ్యాగ్నిహోత్రాదులు శుద్ధ్యర్థము లయినవాని * కన్నను భిన్నములు కానివే యయినను, ఫలాభిసంధి దోషమువలనఁ జిత్తశుద్ధిని గలిగింపఁ జాలవు. భోగానుగుణ మయిన శుద్ధియో జ్ఞానోపయోగి కాదు. దీనిఁ దెలుపుటకే భోగైశ్వర్యప్రసక్తానామ్ అని మరలఁ జెప్పఁబడినది. ఫలాభిసంధి లేక చేయఁబడినదో, జ్ఞానోపయోగి యగు శుద్ధిని గలిగించును. కావున, సిద్ధము పండితులకును అపండితులకును ఫలవైలక్షణ్యము. విస్తరించి యీ విషయము ముందు ప్రతిపాదింపఁబడును.

శ్రీ. ఓయీ! కామపరులుగూడ కష్టము లయిన కామముల న్విడిచి వ్యవసాయాత్మక మగు బుద్ధినే యేల సంపాదింపరు? అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—పుష్పితామ్—పుష్పిత మగు విషలతవలె తత్కాలమునందు మాత్రమే రమణీయ మయినదాని; వాచమ్—స్వర్గాదిఫలశ్రుతిని; ప్రవదన్తి—ప్రకృష్టమునుగా—పరమార్థఫలపరముగానే ఎవరు చెప్పుచున్నారో, వారికి తయావాచా అపహృతచేతసామ్ వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ నవిధీయతే అని మూఁడవశ్లోకముతో నన్వయము. ఎందువలన అట్లు చెప్పుచున్నారు అనఁగా, అవిపశ్చితః = మూఢులు; అందుకు హేతువు — వేదవాదరతాః = వేదమునందు ఏయర్థవాదములు గలవో « అక్షయ్యం హవై చాతుర్మాస్య యాజినస్సుకృతం భవతి ’ ‹ అపామ సోమ మమృతా అభూమ ” ఇత్యాదులు, వానియందే ప్రీతిగలవారు; అందువలననే, న అన్యత్ అస్తీతి వాదినః = ఇంతకన్న నధికము వేఱే ప్రాప్య మయిన యీశ్వరతత్త్వము లేదని చెప్పుస్వభావము గలవారు.

కావుననే, కామాత్మానః = కామములచే ఆకుల మయిన చిత్తము గలవారు; కావున, స్వర్గపరాః = స్వర్గమే పురుషార్థముగాఁ గలవారు; జన్మకర్మఫలప్రదామ్ = జన్మమును దానియందు కర్మములను తత్ఫలములను ఇచ్చుదాని; భోగైశ్వర్యగతిం ప్రతి = భోగైశ్వర్యముల ప్రాప్తిని గూర్చి; క్రియావిశేషబహులామ్ =

* అగ్నిహోత్రాదుల.

సాధనము లయిన క్రియావిశేషములు పెక్కులు గలదాని; అట్టివాక్కును, ప్రవదన్తి అని యన్వయము.

అందువలన; భోగైశ్వర్యప్రసక్తానామ్ = భోగైశ్వర్యములందు అభినివేశము గలవారికి; తయా = ఆ పుష్పితవాక్కుచేత; అపహృతచేతసామ్ = ఆకర్షింపఁబడిన మనస్సు గలవారికి; సమాధౌ—సమాధి యనఁగా చిత్తైకాగ్రత, పరమేశ్వరునియందలి యేకాగ్రతకు అభిముఖత, దానియందు; * వ్యవసాయాత్మికా = నిశ్చయాత్మక మయిన; బుద్ధిః; నవిధీయతే— పుట్టదని యర్థము.

ప. ఇఁక, కాములుగూడ ఈ వ్యవసాయబుద్ధిని ఏల యనుష్ఠింపరు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఎట్లు లోకమునందు పుష్పము ఫలోత్పత్తిని సూచించుచున్నదో అట్లు, పుష్పితామ్ = ఫలాభిసంధిని సూచించుదాని; అవిపశ్చితః = తాత్పర్యముఁ దెలియనివారు; ప్రవదన్తి= సమర్థించుచున్నారు. ఎట్లు? నాన్యదస్తీతివాదినః—ఇది దక్క వేఱు తాత్పర్యము శ్రుతికి లేదని పట్టుదల గలవారలై; కావున, వేదవాదరతాః—వేదముయొక్క అర్థవాదమునందు ఆసక్తులు, అందే శ్రుతికిఁ దాత్పర్యము నిశ్చయించువారు. లేక, "అధేన్వా చరతి మాయయైష వాచం సుశ్రువా మఫలా మపుష్పామ్" అను శ్రుతియందు, 'పుష్పఫలే హి దేవతాధ్యాత్మే' † అని నిరుక్తి యుండుటవలన పుష్పస్థానీయ మైన దేవతోపాసనము విషయముగాఁ గల, వాచమ్—వేదవాక్కును; ప్రవదన్తి.

ఇఁక దానినే ప్రకటించుచుఁ జెప్పుచున్నాఁడు—కామాత్మానః = కోర్కులచే ఆకుల మయిన చిత్తము గలవారు; కావుననే, స్వర్గపరాః = స్వర్గమే యుత్కృష్టముగాఁ గలవారు; జన్మకర్మఫలప్రదామ్ = జన్మమును అందు కర్మమును ఫలమును ఇచ్చునట్టి; భోగైశ్వర్యగతిమ్ = రంభాదిభోగముయొక్కయు దేవాధిపత్యముయొక్కయు ప్రాప్తిని; ప్రవదన్తి. ఎట్టిదాని ననఁగా, క్రియావిశేషబహులామ్ = భోగైశ్వర్యమునకు సాధనము లయిన క్రియావిశేషములచే గొప్పదిగా నుండుదానిని, అతిప్రయాసముచే సాధ్య మయిన దానిని.

భోగైశ్వర్యప్రసక్తానామ్ = భోగైశ్వర్యములందు ఆసక్తు లయినవారికి; తయా = ఆ పుష్పితవేదవాక్కుచేత; అపహృతచేతసామ్ = అపహరింపఁబడిన

---

* దానినిమిత్తము.

† పుష్పము దేవత, ఫలము అధ్యాత్మము.

మనస్సు గలవారలకు; అట్టి పురుషులకు; ఆవేదవాక్యముచేతనే, సమాధౌ = పరమేశ్వరారాధనైకాగ్రతయందు; వ్యవసాయాత్మికా బుద్ధిః, నవిధీయతే = ఉత్పన్నము కాదు. అట్లు చెప్పఁబడినది «సోఽహం చిన్మాత్ర మే వేతి చిన్తనం ధ్యాన ముచ్యతే। ధ్యానస్య విస్మృతి స్సమ్య క్సమాధి రభిధీయతే» * అని.

టీ. యా మిమామ్, పుష్పితామ్ = పుష్పమాత్రమె ఫలముగాఁ గల, తత్కాలమునందుమాత్రమే రమణీయ మయిన; వాచమ్; అవిపశ్చితః = అల్పజ్ఞులు; భోగైశ్వర్యగతిం ప్రతి, ఉన్నదాని; ప్రవదన్తి. వేదవాదరతాః = వేదములందు స్వర్గాదిఫలవాదము లేవి గలవో వానియందు ఆసక్తులు; నాన్యదస్తీతివాదినః = వానియందలి యాసక్తి యెక్కువగుటచే, స్వర్గాదికముకంటె అధికమైన ఫలము వేఱు లే దని చెప్పుచున్నవారు; కామాత్మానః = కామాధీన మయిన మనస్సుగలవారు; స్వర్గపరాః = స్వర్గమె పరమప్రాప్యముగాఁ గలవారు; స్వర్గాదిఫలాంతమునందు మరల, జన్మకర్మఫలప్రదామ్ = జన్మకర్మము లను ఫలముల నిచ్చుదానిని; క్రియావిశేషబహుళామ్ = తత్త్వజ్ఞానము లేకుండుటచే క్రియావిశేషము లధికముగాఁ గలదియు; భోగైశ్వర్యగతిం ప్రతి = భోగైశ్వర్యముల ప్రాప్తినిగూర్చి; ప్రవర్తించుచున్నదియు నగు; యా మిమామ్ = ఏయీ; పుష్పితాం వాచమ్ = ఆపాతరమణీయ మగు వాక్కును; ఎవరు, ప్రవదన్తి = చెప్పుచున్నారో, అని యన్వయము. అట్టి, భోగైశ్వర్యప్రసక్తానామ్ = భోగైశ్వర్యములందు మిక్కిలి ఆసక్తులును; తయా = ఆ భోగైశ్వర్య విషయకమైన వాక్కుచేత; అపహృతచేతసామ్ = అపహరింపఁబడిన జ్ఞానము గలవారు నగు పురుషులకు; వ్యవసాయాత్మికా బుద్ధిః = ఈ చెప్పఁబడిన వ్యవసాయాత్మక మైన బుద్ధి; సమాధౌ = మనస్సునందు; నవిధీయతే = ఉత్పన్నము కాదు. సమాధీయతే అస్మిన్ ఆత్మజ్ఞానమ్ అను వ్యుత్పత్తిచే సమాధి యనఁగా మనస్సు. వారి మనస్సునందు ఆత్మస్వరూపనిశ్చయపూర్వకము మోక్షసాధనభూతకర్మవిషయ మైన † బుద్ధి యెన్నఁడును పుట్ట దని యర్థము. అందువలనఁ గామ్యకర్మములందు ముముక్షువునకు ఆసక్తి యుండరాదు.

* చిన్మాత్రమే నేను అనుచింతనము ధ్యాన మనఁబడును. ధ్యానముయొక్క సంపూర్ణలయము సమాధి యని చెప్పఁబడును.

† ఆత్మస్వరూపనిశ్చయము ముందుగాఁ గలదియు మోక్షసాధన మగుచున కర్మానుష్ఠానము విషయముగాఁ గలది యగు.

అల్పజ్ఞు లగువారు వేదములందుఁ జెప్పఁబడు స్వర్గాదిఫలవాదములం దాసక్తు లగుటచే స్వర్గాదులకంటె అధిక మయిన ఫలము లే దని చెప్పుచు, కామములకు లోనగు మనస్సు గలవారై స్వర్గమె పరమపురుషార్థ మని తలఁచి, స్వర్గాది ఫలము ననుభవించిన పిదప మరల జన్మకర్మములఁ గలిగించునదియు తత్త్వజ్ఞాన రహితము లయిన నానావిధకేవలకర్మములను బ్రతిపాదించునదియు భోగైశ్వర్యములఁ గలిగించుకొఱకే ప్రవర్తించుచున్నదియునై మోక్షరూప పరమపురుషార్థప్రదము కామింజేసి ఆపాతరమణీయ మగు ఈ వేదవాక్కును బ్రధానముగాఁ జెప్పుచుందురు. వారు ఈవాక్కుచే జ్ఞానము చెడి భోగైశ్వర్యములు పొందుచు వానియందే యాసక్తులైయుందురు కాని వారిమనస్సునందు ఒకానొకప్పుడును మున్ను చెప్పిన వ్యవసాయాత్మకబుద్ధి పుట్ట దని తాత్పర్యము.

వ్యా. అవైదికము లయిన మతములు అవ్యవసాయాత్మకములు కావచ్చును, గాని వైదికమతములు కావు. అట్టి వైదికమతము నవలంబించిన వారుగూడ కొందఱు కర్మములకు స్వర్గమె ఫల మని చెప్పెదరు. అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—యామ్ ఆహుః తయా అని మూఁడవశ్లోకముతో నన్వయము. మోక్షఫలమును అపేక్షించి, పుష్పితామ్—స్వర్గాదిపుష్పయుక్త మయిన, వాచమ్, ప్రవదన్తి. వేదవాదరతాః—కర్మములు మొదలగువానిప్రతిపాదించునట్టి వేదవాదములం దాసక్తులు, వేదములచే నేది ముఖమునఁ జెప్పఁబడినదో * అందే ఆసక్తులు; నాన్య దస్తీతి వాదినః; పరోక్షవిషయములు వేదములు. పరోక్షప్రియులవంటి వారు గదా దేవతలు. « మాం విధత్తే అభిధత్తే మామ్ » ♦ ఇత్యాదిగా పరోక్షముగానే ప్రాయికముగ భగవంతుని వేదములు చెప్పుచున్నవి. భోగైశ్వర్యగతిం ప్రతి = భోగైశ్వర్యములప్రాప్తినిగూర్చి, భోగైశ్వర్యప్రాప్తియె ఫలము వేదముల కని చెప్పుచున్నా రని యర్థము. వారలకు; వ్యవసాయాత్మికా బుద్ధిః—సమ్యగ్వ్యక్తి నిర్ణయాత్మక మగుబుద్ధి; సమాధౌ= సమాధినిమిత్తము; నవిధీయతే, చక్కఁగా నిశ్చయించుకొనఁబడిన అర్థము గలవారలకు ఈశ్వరునియందు మనస్సమాధానము చక్కఁగా సిద్ధించును. అది కదా మోక్షసాధనము. మఱియొకచోఁగూడ నిది చెప్పఁబడినది. « న తస్య తత్త్వగ్రహణాయ సాక్షా ద్వరీయసీ రపి వాచ స్స

* అంతరంగముచేఁ గాదో.

♦ నన్ను విధించుచున్నాఁడు, చెప్పుచున్నాఁడు నన్ను.

మాసక్ ! స్వప్నే నిరుక్త్యా గృహమేధిసౌఖ్యం న యస్య హేయానుమితం స్వయం స్యాత్ " * అని.

అర్జునా ! వేదములయొక్క అంతరంగికార్థము తెలియక బాహ్యార్థమును మాత్రమె యవలంబించి యవివేకముచే తాము మోక్షఫలము గోరవలసినవార లయ్యుఁ గొంద అపండితులు స్వర్గాదిఫలరూప మయిన పుష్పమును మాత్రమె ప్రతిపాదించునట్టి వాక్యములను నమ్మి భోగైశ్వర్యములఁ బొందుటయె వేదప్రతిపాద్య మయిన ఫల మని చెప్పుచున్నారు. అట్టివారికి సమ్యగ్వ్యక్తినిర్ణయరూప మయిన బుద్ధి కలుగదు, కావున వారికి ఈశ్వరునియందు చక్కని మనస్సమాధి సిద్ధింప దని తా.

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. ౪౫

భా. ఎవ్వ రిట్లు వివేకబుద్ధిరహితులో అట్టి కామాత్ములకు ఏది ఫలమో దానిం జెప్పుచున్నాఁడు.—త్రైగుణ్యవిషయాః—త్రైగుణ్య మనఁగా సంసారము, అది విషయము—ప్రకాశయితవ్యము ♦ గాఁ గలవి. వేదాః = వేదములు, త్రైగుణ్యవిషయాః = త్రైగుణ్యవిషయములు. నీవో, అర్జున ! నిస్త్రైగుణ్యః= త్రైగుణ్యమునుండి నిర్గతుండవు, భవ = అగుము, నిష్కాముండ వగు మని యర్థము. నిర్ద్వంద్వః—సుఖదుఃఖహేతువులు సప్రతిపక్షములు ❡ అగు పదార్థములు ద్వంద్వశబ్దమున కర్థము, ఆద్వంద్వముల నుండి నిర్గతుఁడవు; భవ= అగుము. నిత్యసత్త్వస్థః= ఎల్లప్పుడును సత్త్వగుణమునం దున్నవాఁడవు, సత్త్వగుణము నాశ్రయించినవాఁడవు; భవ= అగుము. అట్లు, నిర్యోగక్షేమః—అప్రాప్త మైనదాని సంపాదించుట యోగము, ప్రాప్తమును రక్షించుట క్షేమము, యోగక్షేమ ప్రధానునకు శ్రేయస్సునందుఁ బ్రవృత్తి దుర్లభ మగుటవలన యోగక్షేమముల విడిచినవాఁడవు; భవ = అగుము. ఆత్మవాన్—ప్రమాదము § లేని

---

* ఎవ్వనికి గృహస్థసౌఖ్యము—సంసారసుఖము స్వప్నమునందుఁ దోఁచుపదార్థముల దృష్టాంతముచే స్వయముగా హేయము—విడువఁదగినది అని అనుమితముకాదో వానికి ఉత్తమములైన వేదవాక్యములుగూడ సాక్షాత్తత్త్వగ్రహణమునకు సమర్థములు కావు.

♦ తెలుపవలసినది.

❡ విరోధిపదార్థము గలవి.

§ ఏమఱుపాటు.

నాఁడవుగూడ; భవ = అగుము. ఇది నీకు స్వధర్మ మనుష్ఠించువాని కుపదేశము.

ఈ కర్మకాండమంతయు కామనాపూర్వకకర్మానుష్ఠానవిధాయక మగుటచే సంసారఫలమునే ప్రతిపాదించుచున్నది. కావున దీనినే శరణముగా నాశ్రయించినవారికి సంసారవిచ్ఛిత్తి యెప్పటికిని గలుగదు. అందువలన ఈమార్గమునఁ బడక నీవు నిష్కాముఁడ వగుము. మఱియు శీతోష్ణాదిద్వంద్వములను విడిచి యెల్లప్పుడును సత్త్వగుణము నాశ్రయింపుము. యోగక్షేమములమీఁద మనస్సు పెట్టకుము. విషయములకుఁ బరవశుఁడవు కావల దని తాత్పర్యము.

ఆ. అవివేకు లయినను వేదాభ్యాసము గలవారికి వివేకబుద్ధి యుదయింపఁ గల దని యాశంకించి చెప్పుచున్నారు. ఎవ్వ రిట్లు ఇత్యాదిగా. అప్పుడు వేదమున కర్థ మగుటచే కామాత్మత ప్రశస్త మగు నని యాశంకించి చెప్పుచున్నాఁడు నిస్త్రైగుణ్యో భవ అని. మూఁడైన సత్త్వాదిగుణములయొక్క పుణ్యపాపమిశ్రకర్మ తత్ఫలసంబంధరూప మైన సమాహారము త్రైగుణ్యము అని యంగీకరించి వ్యాఖ్యానము చేయుచున్నారు సంసారము అని. వేదశబ్దముచే నిచటఁ గర్మకాండమే గ్రహింపఁబడుచున్నది. కావున వేదాభ్యాసవంతులకు తదర్థానుష్ఠానద్వారమున సంసారము స్థిర మగుటవలన వివేకమున కవకాశము లే దని యర్థము. అప్పుడు సంసారము తొలఁగించుటకు వివేకము సిద్ధించుటకొఱకు ఏమి చేయవలె నని యాశంకించి చెప్పుచున్నారు నీవో ఇత్యాదిగా. 'నిస్త్రైగుణ్యో భవ' యని గుణత్రయరాహిత్య మెట్లు విధింపఁబడుచున్నది? 'నిత్య సత్త్వస్థో భవ' అను వాక్యశేషము విరోధించును గదా! అని యాశంకించి చెప్పుచున్నారు నిష్కాముఁడ వని. సప్రతిపక్షములు అనఁగా పరస్పరవిరోధులు. పదార్థములు—శీతోష్ణాదులు. నిష్కామత్వమునకు నిర్ద్వంద్వత్వమును అనఁగా శీతోష్ణాదిసహిష్ణుత్వమును హేతువునుగాఁ జెప్పి దానికిని హేతువు నపేక్షింపఁగా సదా సత్త్వగుణాశ్రితత్వమును హేతువుగాఁ జెప్పుచున్నారు నిత్యసత్త్వస్థః అని. యోగక్షేమములందు ఆసక్త మయిన మనస్సుగలవానికి రజస్తమోగుణముల స్పర్శలేని సత్త్వగుణముమాత్రము నాశ్రయించుట యశక్య మని యాశంకించి చెప్పుచున్నారు—అట్లు ఇత్యాదిగా. యోగక్షేమములు జీవనహేతు వగుటచే పురుషార్థసాధన మగుచుండఁగా నిర్యోగక్షేమో భవ అని యేల విధింపవలె నని యాశంకించి చెప్పుచున్నారు యోగక్షేమప్రధానుఁడను ఇత్యాదిగా. యోగక్షేమప్రధానత్వము సర్వజనులకు స్వాభావిక మగుటచే దాని

విడుచుట యశక్య మని యాశంకించి చెప్పుచున్నారు ఆత్మవాన్ అని. ప్రమాదము లేమి యనఁగా మనస్సునకు విషయపరవశత లేకుండుట. ఈ యుపదేశము ముముక్షువిషయ మగుటవలన అర్జునుఁడు ముముక్షు వనుట వివక్షితము అనఁగా అట్లు కా దని చెప్పుచున్నారు ఇది ఇత్యాదిగా.

హ. ఏ యుపాయముచేత ఆవాక్కు విడువవచ్చు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—త్రైగుణ్యవిషయాః—త్రైగుణ్య మనఁగా సత్త్వరజస్తమంబులను మూఁడు గుణములు, వాని కార్యము లగుటచే రాగద్వేషములు త్రైగుణ్యము గలవి కావున త్రైగుణ్యశబ్దముచేఁ జెప్పఁబడును. ఆ రాగద్వేషములు విషయములుగాఁ గలవి వేదములు. నిస్త్రైగుణ్యో భవ—ఉపాయములచే రాగద్వేషములఁ దొలఁగించుకొన్నవాఁడ వగు మని యర్థము. నిర్ద్వన్ద్వః = శీతోష్ణాదుల విడిచినవాఁడవు. నిత్యసత్త్వస్థః = ఎల్లప్పుడును సత్త్వగుణప్రధానుఁడవు. అట్లు, నిర్యోగక్షేమః—లేనిదాని సంపాదించుట యోగము, ఉన్నదాని రక్షించుట క్షేమము, యోగక్షేమములం దాసక్తుఁ డైనవానికి శ్రేయస్సునందుఁ బ్రవృత్తి ఘటిల్లదు, కావున నిర్యోగక్షేముఁడవు కమ్ము. ఇది నీ కావాక్కును విడు మనుపాయము.

శం. ఇట్లు శ్రుతివాక్యముల కుపక్రమోపసంహారాదులయందే అవాంతర తాత్పర్యమును మహాతాత్పర్యమును అని యెఱుంగనివారను అర్థవాదములచే మోహితులు నగు కాములకు యోగబుద్ధి లేమిం జేసి యీశ్వరప్రసాదము సిద్ధింపదు. అందుచేతనే సంసారోపరమము కలుగ దని ప్రతిపాదించి, యిప్పుడు « కేవల ముముక్షువులై యోగబుద్ధి గలవారై యీశ్వరప్రీతికొఱకుఁ గర్మము చేయువారు ప్రరోచన * వాక్యములకు మోహము నొంద రాదు. మఱి ఇష్టము ప్రాప్తించినను అనిష్టము ప్రాప్తించినను సమబుద్ధి గలవారై శ్రద్ధాభక్తులతో ఈశ్వరారాధనాత్మక మైన వైదికకర్మము చేయవలెను. » అని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—రాజసములు తామసములు సాత్త్వికములు అని త్రివిధము లగు గుణములు త్రిగుణములు రాగద్వేషలోభమోహాదులు, వానియొక్కయు తత్కార్యములయొక్కయు తత్ఫలములయొక్కయు సమాహారము త్రైగుణ్యము, అనఁగా సంసారము, అదియే విషయముగా— కర్మతత్సాధనాదిప్రకాశనాదిద్వారమున వృద్ధిపఱుపఁ దగినదిగాఁ గలవి త్రైగుణ్యవిషయములు, వేదములు. సంసారవృద్ధి వేదోక్తకర్మముల యధీన మగుటచే

* అర్థవాద.

వేదములు త్రైగుణ్యవిషయములు అని చెప్పఁబడుచున్నవి. త్రైగుణ్యము వేదవిషయ మగుటచే అందఱకు నుపాదేయ మయినను, కాదది ముముక్షువుల కాదరణీయ మని చెప్పుచున్నాఁడు—నీవు మోక్షేచ్ఛచే యోగబుద్ధియుక్తుఁడవై స్వధర్మము నందుఁ బ్రవర్తించినాఁడ వగుటంజేసి, నిస్త్రైగుణ్యః భవ—ప్రరోచనశ్రుతులవలనను రాగద్వేషాదులవలనను తత్ప్రధానము లైన కర్మములవలనను తత్ఫలంబులవలనను నిష్క్రాంతుఁడవు—వెలువడినవాఁడ వగుము. నిర్ద్వన్ద్వః—ఇష్టము అనిష్టము అను పదార్థములు రెండు ద్వంద్వశబ్దమున కర్థము, అవియె రాగద్వేషాదిదోషములను బుట్టించునవి, వానియందు సమబుద్ధిచే, వానినుండి * నిష్క్రాంతుఁడవు—వెలువడిన వాఁడవు అగుము. మోక్షంబును తత్సాధనం బగు శమదమాదికమును సత్త్వ గుణముచేతనే లభ్య మగుటవలన, నిస్త్రైగుణ్యుఁడైనను ముముక్షువు సత్త్వవంతుఁడు గావలయు నను నభిప్రాయముచేఁ జెప్పుచున్నాఁడు—నిత్యసత్త్వస్థః—ఎల్లప్పుడును సత్త్వగుణమునందే యుండువాఁడవు అగుము, వివేకము వైరాగ్యము శమదమా దులు మొదలగువానియందే యుండు మని యర్థము. యోగక్షేమప్రధానునకు రాగ ద్వేషాదికము ప్రసక్తించును, దానిచే శమాదులు పాఱిపోవును, దానంజేసి సాధ నము విచ్ఛిన్న మగును, దానివలన మోక్షము సిద్ధింపక పోవును, అందువలన ముము క్షువు యోగక్షేమములనుండి వెలువడినవాఁడు కావలయు నను నభిప్రాయముచే చెప్పు చున్నాఁడు—నిర్యోగక్షేమః—లేనిదాని సంపాదించుట యోగము, ఉన్నదాని రక్షిం చుట క్షేమము, ప్రారబ్ధాధీనుఁడవై నీవు ఆరెంటినుండి నిష్క్రాంతుఁడవు కమ్ము. మనస్సు విషయాంతరమునకుఁ బరవశ మైనచో స్వధర్మము సిద్ధింపదు, కావున అట్లు కాకయుండవలయు నని చెప్పుచున్నాఁడు—ఆత్మవాన్—విహిత మయిన కర్మము నందును శ్రవణము ధ్యానము కీర్తనము మొదలగువానియందును మాత్రమె నిలిచి యుండు ఆత్మ—మనస్సు గలవాఁడవు, నిశ్చలచిత్తుఁడ వగు మని యర్థము.

లేక. « నజాయతే మ్రియతే వా కదాచిత్, వేదాఽవినాశినం నిత్యమ్ » ఇత్యాదివాక్యములచేఁ బ్రతిపాదింపఁబడిన సాంఖ్యవిషయబుద్ధి నీకు దృఢముగాఁ గల దేని, అప్పుడు నీవు ఈప్రకారముగా నుండవలయు నని జ్ఞాని యగువాఁడు చేయ వలసిన దాని సూచించుచున్నాఁడు—సత్త్వాదులు మూఁడుగుణములు గలది త్రిగు ణము జగత్కారణము అవ్యాకృతము, దానివలనఁ బుట్టిన జగత్తు త్రైగుణ్యము, అదియె ప్రతిపాద్య మగుటచే విషయముగాఁ గలవి త్రైగుణ్యవిషయములు,

* ఇష్టానిష్టములనుండి.

సాధ్యము సాధనము సాధకుఁడు ఫలము దేవత యేతద్రూప మయిన జగత్తును తెలుపుటయె ముఖ్యాభిప్రాయము గలవి సమస్తవేదము లని యర్థము. వేదములయందును తదుక్తకర్మములయందును తత్ఫలమందును బ్రవర్తించినవానికి, ద్వైతజ్ఞానబాధ కలిగినం గాని, అద్వైతజ్ఞానము తన్నిష్ఠ తత్ఫలంబును సిద్ధింపవు. ఇందువలన తన్నిష్క్రమమును * విద్వాంసుఁడు చేయవలె నని చెప్పుచున్నాఁడు—నిస్త్రైగుణ్యః భవ—« వేదా నిమం లోక మముంచ పరిత్య జ్యాత్మాన మన్విచ్ఛేత్ » ♦ అని చెప్పఁబడియుండుటవలన వేదములవలనను తదుక్తకర్మములవలనను త్రైగుణ్యములవలనను—జగత్తువలనను సమస్తమువలనను నిష్క్రాంతుఁడ వగుము. సర్వసన్న్యాసము చేయు మని యర్థము. సర్వకర్మసన్న్యాసము చేసినను బహిర్ముఖుఁడై ద్వైతము నవలంబించువానికి బ్రహ్మనిష్ఠ సంభవింపదు, దానిచే జ్ఞానభ్రంశ మగును, దానిచే మోక్షసిద్ధి లేకపోవును. అందువలన జ్ఞాని యగువాఁడు ద్వైతావలంబనము విడువవలె నని చెప్పుచున్నాఁడు—నిర్ద్వన్ద్వః—ద్వంద్వము అనఁగా నామరూపములు, సర్వత్ర వానిని గ్రహించుటనుండి నిర్గతుఁడ వగుము, నామరూపగ్రహణము చేయకు మని యర్థము. నిద్రచేయువానికి నామరూపగ్రహణము సంభవింపదు, అందువలన విద్వాంసునకు నిద్రయే ప్రాప్త మగును, కావున దాని నిషేధించుటకుఁ జెప్పుచున్నాఁడు—నిత్యసత్త్వస్థః—సత్తుయొక్క భావము సత్త్వము, అనఁగా బ్రహ్మస్వరూపము, నిత్యమును దానియందే యుండువాఁడ వగుము, సర్వదా బ్రహ్మమునే యనుసంధింపు మని యర్థము. బ్రహ్మవేత్త శరీరయాత్రనుగూడ బ్రహ్మదృష్టిచేతనె చేయవలెను కాని బాహ్యదృష్టిచేఁ జేయఁగూడ దని సూచించుటకై చెప్పుచున్నాఁడు—నిర్యోగక్షేమః—స్థిత మయిన దేహమును సర్పకంటకాదులవలనఁ జాత్పర్యముచే పాలించుట క్షేమము, దాని కనుకూల మయిన ద్రవ్యములు సంపాదించుట యోగము, ఈ రెండును బ్రారబ్ధాధీనము లగుటవలనను తనదృష్టిచే దేహమే లేమివలనను అధిష్ఠానజ్ఞానబలముచే ఆ యోగక్షేమములనుండి నిష్క్రమముచేసి నిర్యోగక్షేముఁడ వగుము. బ్రహ్మనిష్ఠయందు ఏమఱుపాటు ఒకానొకప్పుడును కలుగ రా దని చెప్పుచున్నాఁడు—ఆత్మవాన్—ఆత్మ యనఁగా బ్రహ్మాకారబుద్ధి, ఎల్లప్పుడు అదియె కలవాఁడవు; లేక; అహంబుద్ధికి విషయము ఆత్మయే యెల్లప్పుడు కావలయును, కాని ఒక్కచోఁగూడ

* దానినుండి వెలువడుటను.

♦ వేదములను ఇహలోకమును బరలోకమును విడిచి యాత్మను గోరవలయును.

ప్రమాదమునఁ * గూడ అనాత్మ కాఁ గూడ దని తలఁచి చెప్పుచున్నాఁడు—ఆత్మవాన్ భవ, అనాత్మను అహంబుద్ధికి విషయమునుగా నెచ్చటను ఎప్పుడును చేయకు మని యర్థము.

ప్ర. ఓయీ! సకాములకు లేకపోవుఁ గాక చిత్తదోషమువలన వ్యవసాయాత్మకబుద్ధి. నిష్కాములకుఁ గూడ వ్యవసాయాత్మకబుద్ధిచేఁ గర్మ మనుష్ఠించువారికిఁ గర్మస్వభావమువలన స్వర్గాదిఫలము ప్రాప్తించుటచే జ్ఞానప్రతిబంధము సమానమని యాశంకించి చెప్పుచున్నాఁడు—త్రయాణాం గుణానాం కర్మ—మూఁడైన గుణములయొక్క కర్మము త్రైగుణ్యము, అనఁగా కామమూల మయిన సంసారము, అదియె ప్రకాశ్య మగుటచే విషయముగాఁ గలవి; వేదాః—కర్మకాండాత్మకములు; ఎవఁడు ఏఫలముఁ గోరునో వానికే తత్ఫలమును బోధించుచున్న వని యర్థము. ఏల యనఁగా, సర్వకామములకును దర్శపూర్ణమాసము లని వినియోగ మున్నను ఒక్కమా అనుష్ఠించుటవలన సర్వఫలప్రాప్తి కాఁజాలదు, తత్తత్కామన లేకుండుటవలన; ఏఫలమునందలి కామనచే అనుష్ఠించుచున్నాఁడో అదియే ఫలము అప్రయోగమునం దని యున్నది యోగసిద్ధ్యధికరణమునందు. ఇట్లు కామన లేనియెడ ఫలము లేదు, కావున నీవు, నిస్త్రైగుణ్యః = నిష్కాముఁడవు; భవ. అర్జున! ఇందుచే కర్మస్వభావమువలన సంసారము ♦ అనుట. నిరస్తము. ఓయీ! శీతోష్ణాదిద్వంద్వప్రతీకారమునకొఱకు వస్త్రాదిక మపేక్షిత మగుటవలన నిష్కామతె యెట్లు కలుగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—నిర్ద్వన్ద్వః = పూర్వోక్తాన్స్పర్శాన్ అను శ్లోకమునఁ జెప్పిన న్యాయముచే శీతోష్ణాదులను సహించువాఁడవు కమ్ము. సహింపరాని దుఃఖమును ఎట్లు సహింపవచ్చు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—నిత్యసత్త్వస్థః—నిత్య = నిశ్చల మయిన, సత్త్వ = ధైర్య మను నామాంతరము గల సత్త్వగుణమునందు, స్థః = ఉన్నవాఁడవు, రజస్తమోగుణములకు లోఁబడిన సత్త్వము గలవాఁడు గదా శీతోష్ణాది పీడచే చత్తు నేమో యని ధర్మవిముఖుఁ డగును. నీవో రజస్తమోగుణములను లోఁబఱిచి కొని సత్త్వమాత్రము నవలంబించినవాఁడ వగుము. ఓయీ! శీతోష్ణాదికము సహించినను క్షుత్పిపాసాదిప్రతీకారముకొఱకుఁ గొంచెము లేనిదాని సంపాదింపను ఉన్నదాని రక్షింపను వలయును, కావున దానికి యత్నము చేయునపుడు ఎట్లు సత్త్వస్థుఁడను గావచ్చు నని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు—నిర్యోగక్షేమః—

* ఏమఱుపాటుచే.

♦ జ్ఞానప్రతిబంధము.

అలబ్ధలాభము యోగము లబ్ధరక్షణము క్షేమము, అని లేనివాఁడ వగుము, చిత్త విక్షేపము కలిగించు పరిగ్రహము లేనివాఁడ వగు మని యర్థము. ఇట్లుండఁగా ఎట్లు జీవింతు నని చింతింపవలసినదియు లేదు. ఏల యనఁగా, సర్వాంతర్యామి యగు పరమేశ్వరుఁడే, నీకు యోగక్షేమాదికము నిర్వహింపఁ గలఁ డని చెప్పుచున్నాఁడు—ఆత్మవాన్— ఆత్మ— పరమాత్మ, ధ్యేయుఁడుగాను యోగక్షేమాది నిర్వాహకుఁడుగాను ఎవనికి ఉన్నాఁడో అతఁడు ఆత్మవంతుఁడు, సర్వకామనలను బరిత్యజించి పరమేశ్వరు నారాధించుచున్న నాకు అతఁడే దేహయాత్రామాత్రము అపేక్షిత మైనది సంపాదింపఁ గలఁ డని నిశ్చయించి నిశ్చింతుండ వగు మని యర్థము. లేక, ఆత్మవాన్—అప్రమత్తుఁడవు * అగుము.

శ్రీ. ఓయీ! స్వర్గాదికము పరమఫలము కా దేని అట్లేల వేదములు తత్సాధనముగా కర్మముల విధించుచున్నవి? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—త్రైగుణ్య విషయాః—త్రిగుణాత్మకులు అనఁగా సకాములు అయిన అధికారు లెవ్వరు గలరో, తద్విషయములు, వారికిఁ గర్మఫలసంబంధములఁ బ్రతిపాదించునవి, వేదములు. నీవు, నిస్త్రైగుణ్యః= నిష్కాముఁడవు, భవ. అందు కుపాయముఁ జెప్పుచున్నాఁడు—నిర్ద్వంద్వః— సుఖదుఃఖములు శీతోష్ణములు మొదలగు జంటలు ద్వంద్వములు, అవి లేనివాఁడ వగుము, వానిని సహింపు మని యర్థము. ఎట్లనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు— నిత్యసత్త్వస్థః, నిత్యసత్త్వస్థుఁడవై ధైర్య మవలంబించి యని యర్థము. అట్లు, నిర్యోగ క్షేమః—అప్రాప్తము స్వీకరించుట యోగము, ప్రాప్తమును బరిపాలించుట క్షేమము, అవి లేనివాఁడవు; ఆత్మవాన్ = అప్రమత్తుఁడవు అగుము. ఏల యనఁగా, ద్వంద్వ ములచేఁ గలఁగినవానికిని యోగక్షేమపరునకును బ్రమత్తుఁ డైనవానికిని త్రైగుణ్యా తిక్రమము సంభవింపదు.

ప. ఓయీ! స్వర్గాదికము ఫలము కా దేని, వేదములు తత్సాధనము లయిన కర్మంబుల నేల విధించుచున్నవి? అని యాశంకించి వాని విధించు శ్రుతి వాక్యంబులకు వేఱుతాత్పర్య మున్న దని చెప్పుచున్నాఁడు—ఇందు కేవలము వేద ములు త్రైగుణ్యవిషయము లనుట సిద్ధ మగు నంతేఁగాక, ప్రకృతము భగవంతుఁ డుపదేశించునట్టి నిస్త్రైగుణ్యత్వము, వేదమూలకము కా దని యేర్పడుటచే, ఉపదేశింప యోగ్యము కా దనవలసివచ్చును. మఱియు «తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే"

* ఏమఱనివాఁడవు.

« వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః » అని ముందు భగవంతుఁడే చెప్పఁబోవు చున్నాఁడు. దానికిని విరుద్ధ మగును. అందువలన వేఱువిధమున వ్యాఖ్యానము చేయఁబడుచున్నది. తత్తదధికారముచొప్పున సత్త్వాదిత్రిగుణసంబంధి యగు ఫల మేది గలదో అది త్రైగుణ్యము, అదియే విషయముగా—నిరూపింపఁ దగినదిగాఁ బ్రాప్త మయ్యెనో వేనియందు, అట్టివిగా వేదములు ఉన్నవి. నీవ్రో, సాత్త్విక ఫలము గలవాఁడవు, నిత్యసత్త్వస్థుఁడవై నిస్త్రైగుణ్యుఁడ వగుము. నిత్యసత్త్వస్థః— నిత్య—శుద్ధ మైన, సత్త్వస్థః=సత్త్వగుణమునం దున్నవాఁడవై, దానిచే తత్త్వజ్ఞానో త్పత్తి యగుటచే గుణత్రయాతీతుఁడ వగుము. ఇట సామాన్యముగా సత్త్వస్వరూ పము « ఉపాసనాయాం య దనఞ్చకత్వం వాక్కాయ చిత్తేషు త దేవ సత్త్వమ్ " * అని చెప్పఁబడినది. వేదముచే ఉపాసనయందు మిశ్రము శుద్ధము అని రెండువిధము లగు సత్త్వము నిర్వచింపఁబడియున్నది. అం దొక్కటి స్వర్గసుఖము కలిగించును. రెండవది తత్త్వజ్ఞానము పుట్టించునది, ఇదే భగవంతుఁడుగూడ ముందు నిరూపింపఁ బోవుచున్నాఁడు—« తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్, సుఖ సఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చా౽నఘ " అని. ఆశ్వలోపనిషచ్ఛ్రుతియును « వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థా స్సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః, తే బ్రహ్మ లోకే తు పరాన్తకాలే పరామృతా త్పరిముచ్యన్తి సర్వే " అని యుపదేశించుచున్నది. బ్రహ్మలోకే—బ్రహ్మమే లోకము బ్రహ్మలోకము, దానియందు, శేషము స్పష్టము, అందువలన, శుద్ధసత్త్వముచే రజస్తమంబుల నడంచి అట్లు తత్త్వజ్ఞానము పుట్టింపఁ బడినప్పుడు పుష్పఫలన్యాయముచే సత్త్వముగూడ ఉపశమించును, అందువలన నిస్త్రై గుణ్యత్వమె పర్యవసన్న మగుచున్న దని యర్థము. లేక, త్రైగుణ్యమె అను విష ము, దాని, యాః = పోఁగొట్టునవి, త్రైగుణ్యవిషయములు, వేదములు మొదట త్రైగుణ్యమును నిరూపించినను, త్రిగుణసంబంధి త్రైగుణ్యము, అది విషము=ఘాతు కము, జన్మమరణపర్యవసాయి యగుటచే బంధహేతు వగుటవలన, అని మరల నుప నిషద్భాగముచే దాని, యాపయన్తి—దూషించుచున్నవి. కావున వేదములు త్రైగు ణ్యవిషయములు. అట్లు శాతపథశ్రుతియును « పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ వ్యుత్థాయాథం భిక్షాచర్యం చరన్తి » అని చెప్పుచున్నది. ఓయి! ఇట్లు తెలిసియు వాని నెట్లు విధింపవచ్చును? అనఁగా, అట్లు కాదు, గుడజిహ్వికాన్యాయమునఁ

---

* ఉపాసనయందు వాఙ్కాయమనస్సులలో వంచకత లేకుండుట యేది గలదో అదియే సత్త్వము.

గర్మమునందుఁ బ్రవర్తింపఁజేయుటకుఁ బ్రరోచనమాత్ర మగుటవలన. ఇది యభి ప్రాయము, శరీరాయాసము ద్రవ్యవ్యయము మొదలగువానిచే అతిక్లేశమున సాధ్యము లగు కర్మములందు సులభముగాఁ బ్రవృత్తి కలుగదు. కావున రుచిపుట్టిం చుటకొఱకు ఫలశ్రుతి చెప్పఁబడినది. ఎట్లు, రోగార్తుఁడైన శిశువు చేఁదుమందును నోట వేయనియ్యఁడు, అందుఁ జక్కెర వేసియున్న దని తల్లి చెప్పుచున్నది, శిశువు చక్కెరతీపునందలి యాశచే మందు తినుచున్నాఁడు, తల్లికో ఆరోగ్యమునందుఁ దాత్పర్యము. అట్లు. అందువలన నీవు, నిస్త్రైగుణ్యః భవ—త్రైగుణ్యమును మాపిం చునట్టి వేదవాక్యముల యభిప్రాయమును సేవింపుము. ఇఁక వ్యతిరేకముఖంబునఁ ద్రైగుణ్యము విషరూప మని చెప్పుచున్నాఁడు నిర్ద్వన్ద్వ ఇత్యాదిగా. ద్వంద్వ ములు శీతోష్ణాదులు వాని సహింపలేమి, అట్లు అప్రాప్తముయొక్క ప్రాప్తి యోగము ప్రాప్తముయొక్క సంరక్షణము క్షేమము వీనికి అధీనుఁ డగుట, ఇట్టి దుఃఖహేతువులు త్రైగుణ్యమునందు సంభవించుచున్నవి, కావున నది విషరూపము. నిస్త్రైగుణ్య తయం దవి లేవు అని; నిత్యసత్త్వస్థః = ధైర్యవంతుఁడవు; ఆత్మవాన్ = ఎచ్చరిక గల వాఁడవు.

రా. ఇట్లు అత్యల్ప మయిన ఫలము గలవియు పునర్జన్మములను గలిగించు నవియు నగు కర్మములను వేనవేలు తలిదండ్రులకన్న వత్సలతరములై ఆత్మోజ్జీవనంబు నందుఁ బ్రవర్తించిన వేదంబు లేమిటకుఁ జెప్పుచున్నవి? ఎట్లు వేదోక్త మగునది త్యాజ్య మని చెప్పఁబడుచున్నది? అని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు— త్రైగుణ్యవిషయాః—సత్త్వరజస్తమంబులు మూఁడుగుణములు త్రైగుణ్యము, ఆ సత్త్వరజస్తమంబులు ప్రచురములుగాఁ గల పురుషులు త్రైగుణ్యశబ్దముచేఁ జెప్పఁ బడుచున్నారు, వారు విషయముగాఁ గలవి; వేదాః = వేదములు, తమోగుణప్రచు రులకును రజోగుణప్రచురులకును సత్త్వగుణప్రచురులకును మిక్కిలి వత్సలము లైయె హితమును బోధించుచున్నవి వేదములు, వీరికి వీరిగుణమున కనుగుణముగా స్వర్గాదిసాధనమునే హితముగా బోధింపవేని, అప్పుడు వీరు రజస్తమంబులు ప్రచుర ముగాఁ గలవా రగుటచే సాత్త్వికఫల మయిన మోక్షమునందు విముఖులై తా మపేక్షించు ఫలమునకు సాధన మెఱుంగక, కామాసక్తిపరవశులై అనుపాదేయ ములం దుపాదేయభ్రాంతిచేఁ * ప్రవేశించి చెడిపోవుదురు, అందువలనఁ ద్రైగుణ్య విషయములు వేదములు. నీవ్వో, నిస్త్రైగుణ్యో భవ—ఇప్పుడు సత్త్వప్రచురుఁడ

* అయోగ్య మగు మతమును యోగ్య మని భ్రమించి.

మైన నీవు దానినే వృద్ధిపఱచుకొనుము, పరస్పరసంకీర్ణ మగు గుణత్రయము ప్రచురముగాఁ గలవాఁడవు కావలదు, గుణత్రయప్రాచుర్యమును వృద్ధిపఱచుకో వల దని యర్థము. నిర్ద్వన్ద్వః = నిర్గత మయిన సమస్తసాంసారికస్వభావము గలవాఁడవు; నిత్యసత్త్వస్థః— గుణద్వయరహితమై నిత్యము వృద్ధిఁ బొందిన సత్త్వగుణమునందున్నవాఁడవు, అగుము. ఎట్లనఁగా, నిర్యోగక్షేమః— ఆత్మస్వరూపప్రాప్తి కుపాయము మైనవానికి బహిర్భూతము లయిన విషయములయొక్క యోగమును ప్రాప్తము లయిన వానియొక్క క్షేమమును విడిచినవాఁడవై; ఆత్మవాన్— ఆత్మస్వరూపాన్వేషణపరుఁడవు, అగుము. అప్రాప్తముయొక్క ప్రాప్తి యోగము, ప్రాప్తముయొక్క పరిరక్షణము క్షేమము. ఇట్లు ఉండునట్టి నీకు రజస్తమః ప్రచురత నశించుచున్నది. సత్త్వము వృద్ధిఁ బొందుచున్నది.

వేదములు జీవులందు మిక్కిలి కరుణ గలవి యగుటవలన, తమోగుణ మధికముగాఁ గలవారికిని రజోగుణ మధికముగాఁ గలవారికిని సత్త్వగుణం బధికముగాఁ గలవారికిని వారివారిగుణములకును అపేక్షకును దగినట్లు హితము బోధించుచున్నవి. నీ విప్పుడు సత్త్వగుణ మధికముగాఁ గలవాఁడవై యున్నాఁడవు, కావునఁ బరస్పరసంకీర్ణము లయిన గుణత్రయమును విడిచి, సత్త్వాధిక్యమునే వృద్ధిపఱచుకొనుము. సమస్తసాంసారికస్వభావములను విడిచి రజస్తమంబులసంబంధము లేని సత్త్వగుణమును వృద్ధిపఱచుకొని తన్నిష్ఠుండవై యుండుము. దీని కుపాయ మేమనఁగా, ఆత్మస్వరూపప్రాప్తి కుపాయము లయినవి దక్కఁ దక్కిన సర్వవిషయములను, లేనివాని సంపాదించుటగాని ఉన్నవాని రక్షించుటగాని చేయ వలదు, ఆత్మస్వరూపము మాత్రము విచారించుచుండు మని తాత్పర్యము.

వివ. ఆ యోగబుద్ధిని జెప్పుచున్నాఁడు త్రైగుణ్యవిషయా ఇత్యాదిగా నితరము విడిచి. వేదములు పరోక్షార్థము లగుటవలన, త్రిగుణసంబంధి స్వర్గాదికము ఆపాతముగా * అర్థమువలెఁ దోఁచుచున్నది. పరోక్షవాదము ఈవేదము అని గదా చెప్పఁబడినది. కావునఁ బ్రాతీతిక ♦ మైన అర్థమునందు భ్రాంతిపడకు మని యర్థము. "వాదో విషయకృత్త్వంచ ముఖతో వచనం స్మృతమ్" అని నిఘంటువు. కాని, వేదపక్షము నిషిద్ధము కాదు. "వేదే రామాయణే చైవ పురాణే భారతే తథా,

* బాహ్యముగా.

♦ బాహ్య.

ఆదావన్తేచ మధ్యేచ విష్ణుస్సర్వత్ర గీయతే" "సర్వే వేదా యత్పదమ్" "వేదో ఽఖిలో ధర్మమూలం స్మృతిశీలేచ తద్విదామ్, ఆచారశ్చైవ సాధూనా మాత్మనో రుచి రేవచ" "వేదప్రణిహితో ధర్మో హ్యధర్మ స్తద్విపర్యయః" * అని వేదములు సర్వములును విష్ణుపరము లని చెప్పఁబడుటవలనను, వేదవిహితము ధర్మ మనియు వేదవిరుద్ధము అధర్మ మనియుఁ జెప్పఁబడుటవలనను.

యావా నర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. ౪౬.

భా॰ సమస్తము లయిన వేదోక్తకర్మములందు అనంతఫలము లేవి గలవో అవి యపేక్షింపనియెడ, ఎందు కాకర్మములను ఆశ్వాసించుము గ్త మని యనుష్ఠింపవలెను? చెప్పెదము. వినుము—ఎట్లు లోకమునందు, కూపము తటాకము మొదలగు నానావిధ మయిన, ఉదపానే = పరిచ్ఛిన్నోదక మైన దానియందు ♦; యావాన్ = ఎంతమాత్రము, స్నానపానాదిక మైన, అర్థః = ఫలము, ప్రయోజనము, అగునో, ఆసర్వప్రయోజనమును, సర్వతః సంప్లుతోదకే = అంతటను నిండిన జలము గల దానియందు; తావాన్ = అంతయునే, ఉన్నది, దానియం దంతర్భవించుచున్న దని యర్థము. ఇట్లు, తావాన్ = అంతయునే, ఉన్నది. సర్వేషు = సమస్తము లయిన; వేదేషు = వేదములందు, వేదోక్తము లయిన కర్మములందు; యావాన్ అర్థః = ఎంత ప్రయోజనము గలదో, కర్మఫల మేది గలదో; ఆ ప్రయోజనము; బ్రాహ్మణస్య = సన్న్యాసియు; పరమార్థతత్త్వమును, విజానతః = ఎఱింగినవాఁడు నగువానియొక్క ప్రయోజన మేది గలదో, సర్వతస్సంప్లుతోదకస్థానీయ మైన విజ్ఞానఫల మేది గలదో; దానియందు, తావాన్ = అంతయునే; ఉన్నది, అందే యంతర్భవించుచున్నదని యర్థము.

* వేదమునందును రామాయణమునందును విష్ణుపురాణమునందును భారతమునందును మొదలను కడను నడుమను సర్వత్ర విష్ణువు ప్రతిపాదింపఁబడుచున్నాఁడు, సర్వవేదములును ఎవ్వనిస్వరూపమును. అఖిల మయిన వేదమును వేదవేత్తలయొక్క స్మృతియును మనోగతియును సాధువుల ఆచారమును తనయొక్క అభిరుచియును ధర్మము తెలియుటకుఁ గారణము. వేదవిహిత మయినది ధర్మము, తద్భిన్నము అధర్మము.

♦ కొంచెము జలము గల దానియందు.

« సర్వం తదభిసమేతి యత్కించ ప్రజా స్సాధు కుర్వన్తి యస్తద్వేద యత్స వేద » అను శ్రుతివలన. « సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే » అనిగూడఁ జెప్పఁబోవుచున్నాఁడు. అందువలన, జ్ఞాననిష్ఠయం దధికారము పొందుటకు మున్ను కర్మమునం దధికృతుఁ డగువాఁడు కూపతటాకాద్యర్థస్థానీయ మైనను కర్మము చేయవలెను.

కొంచెము జలము గల కూపతటాకాదులందు స్నానపానాదిప్రయోజన మెంతమాత్రము కలుగునో అది యంతయు అపరిచ్ఛిన్న మయిన జలము గల మహాజలప్రవాహమునందుఁ గలుగనే కలుగుచున్నది గదా! అట్లు కూపతటాకాదుల వంటి వేదోక్తసర్వకర్మములందుఁ గలుగు ఫలము సర్వకర్మసన్న్యాసియై జ్ఞాననిష్ఠ నవలంబించువాఁడు పొందునట్టి మహాజలప్రవాహమువంటి పరమార్థతత్త్వజ్ఞానంబునందుఁ గలుగనే కలుగుచున్నది. కావున అట్టి జ్ఞాననిష్ఠయం దధికారము గలుగుటకై వేదోక్తకర్మమును ఈశ్వరార్పణబుద్ధిచే ఫలాభిసంధి విడిచి యనుష్ఠింపవలసినదియే యని తాత్పర్యము.

ఆ. ఈశ్వరార్పణబుద్ధిచే స్వధర్మ మనుష్ఠించుపక్షమునందును ఫలకామన లేమివలన యోగమార్గము నిష్ఫలం బగు నని తలంచి శంకించుచున్నాఁడు వేదోక్తములైన ఇత్యాదిగా. కర్మమార్గము ఫలవంతం బని ప్రతిజ్ఞ చేయుచున్నారు చెప్పెదము అని. ఆఫల మెట్టిది యనఁగా తత్ప్రతిపాదక మయిన శ్లోకమును దీయుచున్నారు వినుము అని. ఎట్లు, ఉదపానే = పరిచ్ఛిన్నోదక మైన కూపము మొదలగు దానియందు, స్నానాచమనాదిక మగు ఏ, అర్థః = ప్రయోజనము, యావాన్ = ఎంతమాత్రము; కలుగుచున్నదో, అది, తావాన్ = అంతయును; అపరిచ్ఛిన్న మయిన యుదకము గల « సర్వతస్సంప్లుతోదకే—సముద్రమునందు, అంతర్భవించుచున్నది, పరిచ్ఛిన్నోదకములు అపరిచ్ఛిన్నోదకములయొక్క అంశ మగుటవలన, అట్లు, సమస్తము లయిన వేదోక్తము లగు కర్మములందు, యావాన్ = ఎంత మాత్రము, అర్థః = విషయవిశేషములచే ఉపరక్త మగు * సుఖవిశేషము కలుగుచున్నదో; అది, తావాన్ = అంతయును; ఆత్మవేత్తయొక్క స్వరూపభూత మైన సుఖమునందు అంతర్భవించుచున్నది, పరిచ్ఛిన్నానందములకు అపరిచ్ఛిన్నానందమునం దంతర్భావము నంగీకరించుటవలన, « ఏతస్యైవా నన్దస్యాన్యాని భూతాని

* కలిసిన.

మాత్రా ముపజీవన్తి" * అను శ్రుతివలన. కావున, అపరిచ్ఛిన్న మైన ఆత్మానందముయొక్క ప్రాప్తిని పొందించునట్టి యోగమార్గము నిష్ఫలము కా దని చెప్పుచున్నాఁడు ఈశ్లోకముచేత. ఈ చెప్పిన యర్థమును అక్షరయోజనచేఁ బ్రకటించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. ఉదకం పీయతే అస్మిన్—ఉదకము త్రాగఁబడుచున్నది దీనియందు అను వ్యుత్పత్తిచే ఉదపానశబ్దము పరిచ్ఛిన్నోదక మయిన కూపాదికమును నచియించు నని చూపుచున్నారు కూపము ఇత్యాదిగా. కూపాదిగత మైన అభిధేయము ♦ నకు సముద్రమునం దంతర్భావము సంభవింపమువలన, ఎట్లిది యిట్లు చెప్పవచ్చు నని యాశంకించి యర్థశబ్దము ప్రయోజనవాచకం బని తెలుపుచున్నారు ఫలము అని. ఏది ఫల్గు వగుటచే లయము నొందునో అది ఫల మని చెప్పఁబడును. అట్లుండఁగా తటాకాదికృత మయిన స్నానపానాదిక మట్టిది యెట్లగు నని యాశంకించి దానికి మిక్కిలి యల్ప మగుటచే నాశము ఉపపన్న మని చెప్పుచున్నారు ప్రయోజన మని. తటాకాదులయందలి ప్రయోజనమునకు సముద్రప్రయోజనత్వము చెప్పుట అయుక్తము, ఒకటి మఱియొకటి యగుట యనుపపన్న మగుటవలన అని యాశంకించి చెప్పుచున్నారు దానియందు ఇత్యాదిగా. మహాకాశమునందు ఘటాకాశాదికమునకుంబోలెఁ బరిచ్ఛిన్నోదకప్రయోజనమునకు అపరిచ్ఛిన్నోదకప్రయోజనమునం దంతర్భావము సంభవించుచున్నది, తత్ప్రాప్తియం దితరాపేక్ష లేమివలన నని యర్థము. దృష్టాంతభూత మయిన పూర్వార్థమున కిట్లు వ్యాఖ్యానము చేసి దార్ష్టాంతిక మయిన యుత్తరార్థమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. కర్మములయం దెంతప్రయోజనము గలదో అనుదాని స్పష్టీకరించుచున్నారు కర్మఫల మేది గలదో అని. ఆప్రయోజనము పరమార్థతత్త్వము తెలిసిన బ్రాహ్మణునియొక్క ప్రయోజన మేది గలదో దానియం దంతయునే ఉన్నది యని సంబంధము. దానినే వివరించుచున్నారు విజ్ఞానఫల మని. సమస్త మయిన కర్మఫలంబును జ్ఞానఫలమునం దంతర్భవించుచున్న దనుటకుఁ బ్రమాణముఁ జెప్పుచున్నారు సర్వం తదభిసమే తీత్యాదిగా. యత్ కించ= దేని ఏమేని; ప్రజలు, సాధుకర్మకుర్వన్తి = సాధుకర్మమును జేయుచున్నారో, తత్ సర్వమ్ = దానినంతయు, ఆపురుషుఁడు, అభిసమేతి = పొందుచున్నాఁడు; ఏపురుషుఁ డనఁగా, యః = ఏపురుషుఁడు, తత్ = దాని, వేద = ఎఱుంగుచున్నాఁడో,

* ఈ యానందముయొక్కయే యంశమును ఇతరభూతము లుపజీవించియున్నవి.

♦ కూపాదిశబ్దార్థము.

వాఁడు; దేని ననఁగా, యత్ = దేని, సః = ఆరైక్వుఁడు, వేద = ఎఱుంగుచున్నాఁడో దాని. అని శ్రుతి కర్థము. కర్మఫలమునకు సగుణజ్ఞానఫలమునం దంతర్భావ మని సంవర్గవిద్యయందు శ్రుతి ప్రతిపాదించుచున్నది. ఎట్లు ఇంతమాత్రముచే నిర్గుణ జ్ఞానఫలమునందు కర్మఫలమున కంతర్భావము సంభవించు నని యాశంకించి చెప్పు చున్నారు సర్వం కర్మాఖిలమ్ ఇత్యాదిగా. అట్లయినచో, జ్ఞాననిష్ఠనే చేయవలెను, అంతమాత్రముచేతనే కర్మఫలము ప్రాప్త మగుటచే కర్మానుష్ఠానము అనావశ్యక మగుటవలన. అని యాశంకించి చెప్పుచున్నారు అందువలన ఇత్యాదిగా. అందు వలన—యోగమార్గము నిష్ఫలము గామిఁవలన.

హ. జ్ఞాననిష్ఠయే ప్రయోజనముగాఁ గల బుద్ధి గల యోగనిష్పన్నుఁ డగు వ్యవసాయికి శ్రౌతస్మార్తకర్మములఫలము లే దనుదోషము కలుగుచున్న దనఁగా. అట్లు కాదు. ఎందువలన ననఁగా. ఎట్లు లోకమునందు, ఉదపానే—ఉదకము త్రాఁగఁ బడుచున్నది దీనియందు కావున ఉదపాన మనఁగా, కూపతటాకాదిజలాశయము, దానియందు, యావాన్ = ఎంతపరిమాణము గల, అర్థః = స్నానపానాదిఫలము, కలదో, ఆసర్వప్రయోజనమును, సర్వతస్సంప్లుతోదకే—కూపము తటాకము అను విభాగము లేకయున్న మహాజలప్రవాహమునందు, ఉండనే యున్నది. అట్లు, వేద విహితము లయిన యాగదానాదిసాధనములచే సాధ్య మగు, అర్థః= ప్రయోజనము, యావాన్ = ఎంతమాత్రమో, తావాన్ = ఆప్రయోజనము అంతమాత్రమును, విజానతః = అకామహతుఁడైన, బ్రాహ్మణస్య= బ్రాహ్మణునకు, ఉన్నది. « సర్వం త దభిసమేతి యత్కించ ప్రజా స్సాధు కర్మ కుర్వన్తి య స్త ద్వేద య త్స వేద » అను శ్రుతివలన. « సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే » అనియుఁ జెప్పఁ బోవుచున్నాఁడు.

శం. ఓయీ ! బ్రహ్మవేత్త వేదోక్త మయిన సర్వకర్మసన్న్యాసము చేయునేని « సాధనము లేని యప్పుడు సాధ్యము లే » దను న్యాయముచే అతనికి ఆయాకర్మవిశేషములచే లభ్యము లయిన సుఖవిశేషములు సంభవింపవు. అప్పుడు ఉన్మత్తుని ప్రవృత్తివలె ఈతనిప్రవృత్తి నిష్ఫలమే యని యాశంకింపఁగా, అట్లు కాదు. « సర్వం పదం హస్తిపదే నిమగ్నమ్ " అను న్యాయముచే సత్కర్మములచేఁ బొందఁ దగిన ఆనందములు సార్వభౌమత్వము మొదలు బ్రహ్మత్వమువఱకుఁ గలవి అన్నియు బ్రహ్మానుభవమునం దున్న ఆనఘునకు సంభవించుచున్నవి యని దృష్టాంతసహిత

ముగాఁ జెప్పుచున్నాఁడు—ఉదపాన మనఁగా ఉదకము దీనియందుఁ ద్రాగఁబడుచున్నది యను వ్యుత్పత్తిచే జలాశయము, జాత్యర్థమం దేకవచనము, భూమియందంతటను ఉన్న వాపీకూపతటాకపుష్కరిణీ నదనదులు మొదలగు పుణ్యతీర్థములందు, స్నానము దానము అర్చనము మొదలగు క్రియచే పొందఁబడునట్టి, అర్థః = పుణ్యము; యావాన్ = ఎంతమాత్రము, సిద్ధించుచున్నదో; సర్వతః సంప్లుతోదకే = అంతటను నిండిన జలము గల సముద్రమునందును; స్నానదానార్చనాదిక్రియచే పొందఁబడునట్టి, అర్థః = పుణ్యము; తావాన్ = అంతమాత్రమె అగుచున్నది, గంగాదిపుణ్యతీర్థములం దచ్చటచ్చట చేయఁబడు స్నానదానాదిక్రియలచే లబ్ధ మగు పుణ్యవిశేషములతో సమాన మయిన పరిమాణము గలదే యగుచున్నది కాని అంతకన్న తక్కువ కాదు, శతే పంచాశన్న్యాయముచే * పరిచ్ఛిన్న జలము లయిన గంగాదులు సముద్రమునం దంతర్భవించుటవలన. ఈప్రకారముగనే, సర్వేషు వేదేషు అర్థః—ఋగ్వేదాదులందు ప్రసిద్ధము లగు యాగయజ్ఞదానాధ్యయనవ్రతతపోయోగాదులగు కర్మములచేతను ఇతరము లయిన పుణ్యవిశేషములచేతను సిద్ధించునట్టి వేదోక్త మయిన సార్వభౌమత్వాది బ్రహ్మత్వపర్యంత మగు ఆనందము అంతకంతకు శతగుణిత మగునది, యావాన్ = ఎంతమాత్ర మగునో; తావాన్ = అంతమాత్ర మగు ఆనందము; విజానతః = ఇది సర్వమును నేనును బ్రహ్మమే యని సమస్తజగిత్తును తన్నును సచ్చిదానందబ్రహ్మముగానే చూచుచున్న; బ్రాహ్మణస్య = బ్రహ్మవేత్త యగు సన్న్యాసికి, బ్రహ్మానుభవముచే సిద్ధించుచున్నది. అందువలన బ్రహ్మవిదుఁడు నిత్యానందుఁడే యగును « సమోదతే మోదనీయం హి లబ్ధ్వా » ‡ అను శ్రుతివలన.

లేక. ఉదపానే = భూమియం దంతటను ఉండునట్టి వాపీకూపతటాకనదనద్యాదిక మయిన జలప్రదేశమునందు, కలుగునట్టి, అర్థః=జలరూప మయిన అర్థము; యావాన్ = ఎంతమాత్రము ఉన్నదో; తావాన్ = అంతమాత్ర మైన ఆజలరూపార్థము; సర్వతస్సంప్లుతోదకే = సముద్రమునందు, ఒకమూలనున్న జలముయొక్క "అంశాంశము" ♦ ఎట్లగునో; అట్లు సర్వేషు వేదేషు — శబ్దాదివిషయజాతమును విదన్తి—ఎఱుంగుచున్నవి, కావున వేదము లనఁగా బ్రహ్మాదిపిపీలికాంతము లగు సమస్తప్రాణులు, ఆసమస్తప్రాణులందు; పుణ్యకర్మపరిపాకవశమువలన, ఇష్టార్థము సన్ని

* నూటియందు ఏఁబది గల దను న్యాయముచే.

‡ అతఁడు సంతోషింపఁ దగినదాని పొంది సంతోషించుచున్నాఁడు.

♦ అంశములో అంశము.

హిత మగునపుడు కలుగుచున్న, అర్థః = ఆనందరూప మయిన అర్థము; యావాన్ = ఎంతమాత్రమో; తావాన్ = అంతమాత్రము ఆనందరూపార్థము; సర్వతస్సంప్లుతోదకస్థానీయ మగున బ్రహ్మమునందున్న ఆనందముయొక్క లేశముయొక్క అంశ మగుచున్నది, "ఏతస్యై వానన్ద స్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి" అను శ్రుతివలన. ఇట్లు, స్వప్రతిబింబలేశముయొక్క అంశమాత్రముచేత బ్రహ్మాదిపిపీలికాంతప్రాణివర్గమునకు వారివారిపుణ్యవిశేషముయొక్క తారతమ్యముచే సుఖతారతమ్యము నిచ్చునట్టి సర్వతస్సంప్లుతోదకస్థానీయము అద్వితీయము సత్యజ్ఞానానందఘన మగు పరబ్రహ్మమును, విజానతః = ఇదియె నేను అని తనస్వరూపముగా సాక్షాత్కరించినవాఁ డగు, బ్రాహ్మణస్య = బ్రహ్మవిదునియొక్క, అఖండాకారవృత్తిచే సర్వదా అనుభవింపఁబడుచున్న అనంత మయిన బింబానందము ఇట్టిది ఇంతమాత్రము అని వచియింప నెవ్వనికిని శక్యము కా దని యర్థము.

మ. సర్వకామనలను విడిచి కర్మము చేసినచో ఆయాకర్మములచే జనితములగు నానందములు నాకు లేకపోవు నని శంకింపవలదు. ఎందువలన ననఁగా—ఉదపానే = చిన్నజలాశయమునందు, జాత్యర్థమునం దేకవచనము; యావాన్ అర్థః = ఎంతమాత్రము స్నానపానాదిప్రయోజనము; భవతి = కలుగుచున్నదో; సర్వతస్సంప్లుతోదకే = మహాజలాశయమునందు, తావాన్ అర్థః = అంతమాత్రము ప్రయోజనము, భవత్యేవ = కలుగనే కలుగుచున్నది. ఎట్లనఁగా—పర్వతనిర్ఝరంబులు * అన్నియెడలనుండి ప్రవహించుచుఁ గొండచేరువభూమియందు ఒక్కచోఁ జేరి, పెద్దకాసార మగుచున్నవి. అందు ఒక్కొకనిర్ఝరమందును గలుగునట్టి జలప్రయోజనము సర్వనిర్ఝరసముదాయరూప మయిన యీకాసారమునందు మఱింత యధికముగాఁ గలుగుచున్నది, సర్వనిర్ఝరంబులకును ఒకస్థలమునందే యీకాసారమునం దంతర్భావము కలుగుటవలన. ఈప్రకారముగా, సర్వేషు వేదేషు—వేదోక్తములయిన కామ్యకర్మములందు; యావాన్ అర్థః = హైరణ్యగర్భానందపర్యంత మయిన యెంతమాత్రపుప్రయోజనము కలుగుచున్నదో; తావాన్ = అంతమాత్రము; విజానతః = బ్రహ్మతత్త్వమును సాక్షాత్కరించిన, బ్రాహ్మణస్య = బ్రహ్మము కాఁబోవు వానికి; భవత్యేవ—కలుగనే కలుగుచున్నది, క్షుద్రానందములు బ్రహ్మానందముయొక్క అంశము లగుటవలన అందు వానికి అంతర్భావ మగుటవలన. అట్లు "ఏత

* సెలయేఱులు.

స్యై వానన్ద స్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి» అని శ్రుతి. ఒకటే యయి నను ఆనందము, అవిద్యాకల్పితశక్తురూపాధిపరిచ్ఛేదమును బట్టి అంశ మని అంశ యని వ్యపదేశింపఁబడుచున్నది, ఆకాశముంబోలె ఘటాద్యవచ్ఛేదకల్పనచే. అట్లు నిష్కామకర్మములచే నంతఃకరణశుద్ధి నొందినట్టి నీకు తత్త్వజ్ఞాన ముదయించి పర బ్రహ్మానందప్రాప్తి యగును, దానిచేతనే సర్వానందప్రాప్తియు సిద్ధించుటవలన క్షుద్రానందములు కలుగ వని చింతింప నవసరము లేదు. ఇందువలన పరమానం దముఁ గల్గించునట్టి తత్త్వజ్ఞానముకొఱకు నిష్కామకర్మములం జేయు మని యభి ప్రాయము. ఇట యథా తథా భవతి యను మూఁడుపదముల యధ్యాహారం బును దార్ష్టాంతికంబున యావాన్ తావాన్ అనుపదముల అనుషంగంబును అని తెలియునది.

శ్రీ. ఓయీ! వేదోక్తనానాఫలములను విడిచి నిష్కామతచే ఈశ్వరా రాధననిమిత్తము కర్మానుష్ఠానము చేయవలె నను వ్యవసాయాత్మకబుద్ధి కుబుద్ధియె యని యాశంకించి యందుకుఁ జెప్పుచున్నాఁడు—ఉదకము త్రాగఁబడుచున్నది దీని యందుఁ గావున ఉదపాన మనఁగా వాపీకూపతటాకాదికము, దానియందు, స్వల్పో దక మగుటచే నొకదానియందే సమస్త మయిన ప్రయోజనంబును సంభవింపమి వలన అక్కడక్కడకు ఒకొక్కదానియొద్దకుఁ బోవుటచే వేఱువేఱుగా, యావాన్= ఎంతమాత్రము, స్నానపానాదిక మయిన, అర్థః = ప్రయోజనము, అగుచున్నదో, తావాన్= అంతమాత్రమైన సమస్తప్రయోజనంబును; సర్వతస్సమ్ప్లుతోదకే= మహా ప్రవాహమునందు; ఒకదానియందే, ఎట్లగుచున్నదో; ఇట్లు, యావాన్, సర్వేషు వేదేషు, తత్తత్కర్మఫలరూప మయిన ప్రయోజనము కలుగునో; అది యంతయును, విజానతః = వ్యవసాయాత్మకబుద్ధితోఁ గూడిన; బ్రాహ్మణస్య = బ్రహ్మనిష్ఠునకు, కలు గనే కలుగును, బ్రహ్మానందమునందు క్షుద్రానందములు అంతర్భూతము లగుట వలన, «ఏక స్యైవానన్ద స్యాన్యాని భూతాని మాత్రా ముప జీవన్తి» అను శ్రుతి వలన. అందువలన ఈబుద్ధియే సుబుద్ధి యని యర్థము.

ప. ఇందువలననే వేదతాత్పర్యము దెలిసినపురుషుని స్తుతించుచు న్నాఁడు—ఉదపానే-ఉదకము త్రాగఁబడుచున్నది దీనియందు, అను వ్యుత్పత్తిచే, పానమునకుఁ జాలిన జలము గల సెలయేఱు పడియ మొదలగు వానియందు భ్రమ ణము చేసినపురుషునకు, యావాన్ అర్థః, సిద్ధించునో; తావాన్ సర్వతః = అంత

ప్రయోజనము సమస్తమును; ఒకదానియందే, సమ్ప్లుతోదకే= మహాహ్రదమునందు, సిద్ధించుచున్నది. ఇట్లు, యావాన్, సర్వేషు—పూర్వోత్తర మీమాంసాదిదర్శనము లందు; కర్మము నైష్కర్మ్యము మొదలగు ప్రయోజనము నిరూపితమై యున్నదో, తావాన్ = అది అంతయు; విజానతః = చక్కఁగా వేదతాత్పర్యమును దెలిసిన, బ్రాహ్మణస్య = బ్రహ్మవేత్త యగు పురుషునకు; వేదేషు—సంప్లుతోదకస్థానీయము లయిన వేదములందు, సిద్ధించుచున్నది.

రా. వేదోక్తమయినదిగూడ అంతయు అందఱకు నుపాదేయము కాదు. ఎట్లు, సర్వప్రయోజనములకొఱకుఁ గల్పింపఁబడిన, సర్వతఃసమ్ప్లుతోదకే = అంత టను నిండిన జలము గల; ఉదపానే = కూపతటాకాదికమునందు; పిపాసువునకు ♦, యావాన్ అర్థః = ఎంతమాత్రమే ప్రయోజనమో, అంతమాత్రమే వానిచే గ్రహింపఁబడుచున్నది కాని అంతయును గ్రహింపఁబడదు. ఈప్రకారముగా, సర్వేషు వేదేషు = సమస్తవేదములయందును, బ్రాహ్మణస్య = వైదికుఁ డగు; విజానతః = ముముక్షువునకు; ఏదిమాత్రమే మోక్షసాధనమో, అదిమాత్రమే యుపాదేయము, ఇతరము కాదు.

వేదములచేఁ జెప్పఁబడిన దన్నమాత్రాన అంతయు నందఱును గ్రహింప రాదు. నిండుతటాకము పెక్కుప్రయోజనముల కుపయోగించినను, దప్పిగొన్న వాఁడు దానియందుఁ దనదప్పికి ఎంతగావలయునో అంతజలమునే గదా గ్రహించును. అట్లు వేదములు నానావిధవిషయములు ప్రతిపాదించుచున్నను వైదికుఁ డగు ముము క్షువు సమస్తవేదములందును మోక్షసాధన మేదో దానిమాత్రమే గ్రహింపవలెను గాని యితరమును గ్రహింపఁగూడ దని తాత్పర్యము.

మ. అట్లయినను కామ్యకర్మము లనుష్ఠించువారికిఁ గలుగుఫలము జ్ఞాను లకుఁ గలుగదు కావున వారికిని జ్ఞానులకును సామ్యమే యనఁగా అందుకుఁ జెప్పు చున్నాఁడు—ఎట్లు, యావాన్ అర్థః = ఎంతప్రయోజనము; ఉదపానే = నూతి యందు, కలదో; తావాన్ = అంతమాత్రము ప్రయోజనము; సర్వతః సమ్ప్లు తోదకే; * అంతర్భవించియె యున్నది. ఇట్లు సర్వేషు వేదేషు; ఏమిఫలము గలదో,

♦ ప్రాగఁ గోరినవానికి.

* మహాహ్రదమునందు.

అది; విజానతః = జ్ఞానిమైనను, బ్రాహ్మణస్య, ఫలమునందు అంతర్భవించుచున్నది. బ్రహ్మ అణతి—బ్రహ్మమును పొందుచున్నాఁడు అను వ్యుత్పత్తిచే బ్రాహ్మణుఁ డనఁగా అపరోక్షజ్ఞాని, అతఁడే గదా బ్రహ్మమును బొందుచున్నాఁడు, విజానతః అనునది బ్రహ్మప్రాప్తి జ్ఞానఫల మనుటను తెలుపుచున్నది.

ఎట్లు కూపమునందుఁ గలుగుప్రయోజనము అతివిస్తీర్ణ మయిన పూర్ణ జల మగు మహాహ్రదమునందుఁ గలుగు ప్రయోజనములో నంతర్భవించుచున్నదో అట్లు సర్వవేదములందును గలుగుఫలము అపరోక్షజ్ఞాని యగు పురుషునిజ్ఞానమునం దంతర్భవించుచున్నది. కావున కామ్యకర్మానుష్ఠాతకన్న జ్ఞానులందు విశేషము గల దని తాత్పర్యము.

కర్మణ్యేవా ఽధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్భూర్మా తే సఙ్గో ఽస్త్వ కర్మణి.     ౪౭

భా. నీకును. కర్మణ్యేవ = కర్మమునందే; అధికారః = అధికారము; లేదు జ్ఞాననిష్ఠయందు, తే = నీకు. అట్లుండఁగా, కర్మము చేయుచున్నట్టి నీకు, ఫలేషు = ఫలములందు, అధికారము—కర్మఫలమునందు తృష్ణ; కదా చన = ఒకానొకప్పుడును, ఏయవస్థయందును అని యర్థము; మా అస్తు = లేకుండుఁ గాక. ఎప్పుడు కర్మఫలమునందు తృష్ణ నీకుఁ గలుగునో అప్పుడు కర్మఫలప్రాప్తికి హేతువ వగుదువు. ఇట్లు, కర్మఫలహేతుః= కర్మ ఫలమునకుఁ గారణమవు, మాభూః = కావలదు. ఎప్పుడు కర్మఫలము నందలి తృష్ణచేఁ బ్రేరితుఁడై పురుషుఁడు కర్మమునందుఁ బ్రవర్తించుచు న్నాఁడో అప్పుడు గదా కర్మఫలమే యగు జన్మమునకు హేతు వగును. కర్మఫలము ఇష్టము కానిపక్షమున దుఃఖరూప మయిన కర్మ మేల చేయ వలె నని, తే = నీకు, అకర్మణి = చేయకుండుటయందు; సఙ్గః = ప్రీతి; మా అస్తు = కావలదు.

నీకును గర్మనిష్ఠయందే యధికారము కాని జ్ఞాననిష్ఠయందు లేదు. అట్లు కర్మము ననుష్ఠించునపుడు తత్ఫలములందు ఆసక్తి యుంపవలదు. కర్మఫలమునం దాసక్తి యుంటివేని నీకుఁ గర్మఫలప్రాప్తికి నీవే కారణ మగుదువు. అట్లు నీవు కర్మ ఫలము సంభవించునట్లు చేసికోవలదు. ఫలము వల దన్నప్పుడు కర్మముమాత్ర మేల యని కర్మమును జేయకయు నుండ వల దని తాత్పర్యము.

ఆ. అప్పుడు పరంపరగాఁ బురుషార్థసాధన మయిన యోగమార్గమును విడిచి సాక్షాత్పురుషార్థకారణ మైన ఆత్మజ్ఞాన ముపదేశింపవలెను. దానిమీఁదఁ గదా నామనస్సు ఆశపడుచున్నది. అని యాశంకించి చెప్పుచున్నారు నీకును అని. అప్పుడు తత్ఫలాభిలాషగూడఁ గా వచ్చు ననఁగా కారా దని చెప్పుచున్నాఁడు మా ఫలేషు కదాచన అని. మున్ను చెప్పిన అర్థమునే వివరించుచున్నాఁడు మా కర్మఫలహేతుర్భూః అని. ఫలాభిసంధి సంభవింపనియెడ కర్మము చేయకయే యుండుట సంభవించు నని యాశంకించి చెప్పుచున్నాఁడు మా తే సఙ్గో ఽస్త్వకర్మణి అని. జ్ఞానమునం దనధికారి యగువాఁడుగూడ కర్మత్యాగము చేయుట ప్రసక్తించు ననఁగా దాని నివారించుచున్నారు కర్మణ్యేవ—కర్మమునందే అని. కర్మణ్యేవ అనుచోటి యేవకారార్థము చెప్పుచున్నారు లేదు జ్ఞాననిష్ఠయం దని. అందు అబ్రాహ్మణుఁడును అపక్వకషాయుఁడు నగువానికి ముఖ్య మయిన అధికారము సిద్ధింప దని యర్థము. అప్పుడు ఫలములచే బంధము దుర్వార మగు నని యాశంకించి చెప్పుచున్నారు అట్లుండఁగా అని. కర్మమునందే యధికార ముండఁగా నని యర్థము. ఫలములం దధికారము లే దనుటను దెలుపుచున్నారు కర్మము ఇత్యాదిగా. కర్మానుష్ఠానమునకు ముందును వెనుకను తత్కాలమునందును అని కదాచన అనుదానిచే వివక్షితము అని చెప్పుచున్నారు ఏయవస్థయందును అని యర్థము. ఫలాభిసంధియందు దోషమును జెప్పుచున్నారు ఎప్పుడు ఇత్యాదిగా. ఇట్లు—కర్మఫలమునందలి తృష్ణమూలముగా నని యర్థము. కర్మఫలహేతుత్వమును వివరించుచున్నారు ఎప్పుడు ఇత్యాదిగా. అట్లయినయెడ నిష్ఫలము క్లేశరూపము నగు కర్మము కర్తవ్యము గా దని శంకను లేపి దాని దూషించుచున్నారు కర్మఫలము ఇత్యాదిగా.

హ. కర్మణ్యేవ అధికారః, జ్ఞాననిష్ఠయందు లేమ, తే = నీకు. అందు, కర్మము చేయువానికి, ఫలేషు అధికారః మా ఽస్తు—కర్మఫలమునందు తృష్ణ కలుగఁగూడదు. కదాచన—ఏయవస్థయందును అని యర్థము. కర్మఫలమునందు తృష్ణ కలుగుటవలన కర్మఫలము ప్రాప్తించును. అందువలన, కర్మఫలహేతుర్మా భూః. ఎప్పుడు కర్మఫలమునందు తృష్ణ గలవాఁడై కర్మము ననుష్ఠించుచున్నాఁడో అప్పుడు కర్మఫల మగు జన్మమునకే కారణ మగును. కర్మఫలము వల దన్నచో బహువిధ మయిన కర్మము నేల యనుష్ఠింపవలె నని, తే అకర్మణి సఙ్గః మా ఽస్తు—చేయకుండుటయందు ప్రీతివహింపవలదు.

శ౦. ఇట్టి లక్షణములతోఁ గూడిన బ్రహ్మవిత్తమునకు సర్వకర్మసన్న్యాసమునందే యధికారము సరే. అట్లయినను శోకమోహావిష్టత్వాదిధర్మములను బట్టి విచారింపఁగా ఈలక్షణము నీయందుఁ గనఁబడదు. అందువలన నీకుఁ గర్మమునందే యధికారము, కాని జ్ఞానమునందును సన్న్యాసమునందును లే దని చెప్పుచు నూఁగువిధముల శ్రవణము చేసియు ఆత్మజ్ఞానము నొందని ముముక్షువులు స్వధర్మానుష్ఠాన మవశ్యము చేయవలెను. కాని ఒకానొకప్పుడును విడువఁగూడ దను నిష్కర్షముఁ జెప్పుచున్నాఁడు—ముముక్షువైన, తవ = నీకు; శ్రుతిస్మృతులచే విధింపఁబడినదియు కామ్యవర్జితంబును నిత్యనైమిత్తికరూపము నగు, కర్మణ్యేవ = కర్మమునందే; అధికారః = యోగ్యత, ఇతరత్ర జ్ఞాననిష్ఠయందుఁగాని సన్న్యాసమునందుఁగాని నీకు యోగ్యత లే దని అన్యయోగవ్యవచ్ఛేదార్థ మేవకారము. అందుఁగూడ, ఫలేషు = కర్మఫలములందు, «యజ్ఞో దానం తపశ్చైవ పావనాని» అనియును, «ధర్మేణ పాప మపనుదతి"* అనియు నిత్యకర్మములకుఁగూడ ఫలము చెప్పఁబడుటవలన వాని ఫలములందు; మా = నీకు యోగ్యత లేదు, ఒకానొకప్పుడును కర్మఫలములం దపేక్షచేయఁగూడ దని యర్థము. కర్మఫలముల నపేక్షించినయెడ, బీజ మున్నయెడ అంకురము గలుగునట్లు, దుఃఖకారణము లయినపునర్జన్మాదులు కలుగును, అందువలన, కర్మఫలహేతుః మా భూః—ఎట్లు స్వర్గమునందుఁ గోరికి గలవాఁడు స్వర్గఫలమునకు హేతు వగునో అట్లు నీ వీకర్మములఫలములకు హేతువు కావలదు, కర్మఫలములం దపేక్ష గలవాఁడవు కావల దని యర్థము. ఓయీ! ఫలము లేనిదియు ఇంతియగాక క్లేశప్రధానం బైనదియు నగు కర్మము చేయశక్యము గాదు, అట్లు కర్మము చేయుటకన్నను దాని విడుచుట మే లని యాశంకింపఁగా ఆరురుక్షువునకుఁ గర్మత్యాగము యుక్తము కా దని చెప్పుచున్నాఁడు—అకర్మణి—అకర్మ మనఁగా కర్మభిన్నము, కర్మత్యాగ మని యర్థము, దానియందు; తే = నీకు; సఙ్గః = మనస్సునకాసక్తి; మా అస్తు = కాఁగూడదు, కర్మము చేయనియెడఁ బ్రత్యవాయంబును దానిచే నరకంబును దుష్టయోనిజన్మమును సంభవించును, అందువలన ముముక్షువునకు కర్మసన్న్యాసము యుక్తము కా దని యర్థము. ఇందుచేఁ గర్మఫలము నపేక్షింపక శ్రద్ధచే ఈశ్వరప్రీత్యర్థము భక్తితో కర్మము ననుష్ఠించువానికే మోక్షము, ఇతరునకు లే దని సూచిత మగుచున్నది.

* ధర్మముచేఁ బాపమును బోఁగొట్టుచున్నాఁడు.

మ. ఓయీ! నిష్కామకర్మములచేత ఆత్మజ్ఞానము కలిగి దానిచే పరమానందప్రాప్తి సిద్ధించుపక్షమున అప్పుడు ఆత్మజ్ఞానమే సంపాదించెదము, బహ్వాయాససాధ్యములు బహిరంగసాధనభూతము లగు కర్మములచే నేమి ప్రయోజనము? అని యాశంకించి చెప్పుచున్నాఁడు—తే = నీకు, అంతఃకరణశుద్ధి లేనివానికి, తత్త్వజ్ఞానోత్పత్తికి యోగ్యత లేనివానికి; కర్మణ్యేవ = అంతఃకరణశుద్ధి కలిగించునట్టి కర్మమునందే; అధికారః—నే నిది చేయవలె ననుజ్ఞానము; ఉండవలెను, జ్ఞాననిష్ఠారూప మయిన వేదాంతవాక్యవిచారాదికమునం దుండఁగూడదు. కర్మమును జేయుచున్నపుడును నీకు; ఫలేషు = కర్మఫలము లయిన స్వర్గాదులందు; కదాచన—ఒకానొకయవస్థయందును, కర్మము చేయుటకు మున్నుగాని పిమ్మటఁగాని చేయునపుడుగాని; అధికారః—నేను దీని భుజింపవలె ననుజ్ఞానము; మా అస్తు = ఉండఁగూడదు. ఓయీ! నేను దీని భుజింపవలె నను జ్ఞానము లేకున్నను కర్మము తనసామర్థ్యము వలననె ఫలము కలిగించు ననఁగా అట్లు కా దని చెప్పుచున్నాఁడు—కర్మఫలహేతుర్మాభూః, ఫలకామనచేఁ గదా కర్మము చేయువాఁడు ఫలమునకు హేతువు—పుట్టించువాఁడు అగుచున్నాఁడు, నీవో నిష్కాముఁడవై నీకర్మముయొక్క ఫలమునకు హేతువు కావలదు, నిష్కామునిచే భగవదర్పణబుద్ధితోఁ జేయఁబడు కర్మము ఫలమును గలిగింప దని చెప్పియున్నారము గదా! ఫలము లేనియప్పుడు కర్మ మేల యనఁగాఁ జెప్పుచున్నాఁడు—అకర్మణి తే సఙ్గః మా అస్తు—ఫలము వల దన్నచో దుఃఖరూప మయిన యీకర్మ మెందు కని కర్మము చేయకుండుటయందు నీకు ప్రీతి కాఁగూడదు.

శ్రీ. అప్పుడు సర్వకర్మఫలములు పరమేశ్వరారాధనమువలననె సిద్ధింపఁగలవని తలంచి యట్లు ప్రవర్తించు నని యాశంకించి దాని వారించుటకై చెప్పుచున్నాఁడు—తే= నీకు, తత్త్వజ్ఞానము కోరినవానికి; కర్మణ్యేవ, అధికారః. ఫలేషు= బంధహేతువు లయినవాని ఫలములందు; అధికారః=కోరిక; మా—ఉండఁగూడదు. ఓయీ! కర్మము చేసినపుడు దానిఫలము కలుగనే కలుగును, భోజనము చేసినప్పుడు తృప్తివలె, అని యాశంకించి చెప్పుచున్నాఁడు—మా కర్మఫలహేతుర్భూః—కర్మఫలము ప్రవృత్తికి * హేతువుగాఁ గలవాఁడవు కావలదు. కామిత మయిన స్వర్గాదికమే నియోజ్యునకు విశేషణ మగుటచే ఫల మగును, కావున కామితము కావది

* కర్మానుష్ఠానమునందుఁ బ్రవర్తించుటకు.

ఫలము కాఁజాల దని భావము. ఇందువలననె, ఫలము బంధక మగు నని భయమువలన, అకర్మణి = కర్మముచేయకుండుటయందుఁగూడ; నీకు, సఙ్గః = నిష్ఠ *, మా అస్తు = ఉండఁగూడదు.

ప. ఇఁక నీవిషయమునందు పర్యవసిత మయిన యర్థముఁ జెప్పుచు న్నాఁడు—తత్త్వజ్ఞానముఁ గోరునట్టి, తే = నీకు; ఈశ్వరకృపచే, కర్మణ్యేవ, అధికారః, ఉండుఁ గాక. ఫలేషు, అధికారః, మా =లేకుండుఁ గాక, స్వర్గాదిఫలభోగాధికారము లేకుండుఁ గాక యని యాశీర్వచనము. అట్లు, నీవును, కర్మఫలహేతుః మా భూః—కర్మఫలభోగమునందు కారణము కావలదు. నీమనస్సును కర్మఫలసంకల్పముగూడ స్పృశింపకుండుఁ గాక. ఇఁక, సాంగమైన కర్మమునకు అవశ్యము ఫలము గలుగు నను నియమము ప్రసిద్ధము, కావున ఫలము కలుగనే కలుగును, అందువలన కర్మ మెట్లు చేయవచ్చు నని యాశంకించి చెప్పుచున్నాఁడు—తే= నీకు, అకర్మణి = కర్మము చేయకుండుటయందు, సఙ్గః = నిష్ఠ. మా అస్తు = కావలదు, తన తృప్తి నుద్దేశింపక యీశ్వరార్పణముగా భోజనసామగ్రిని సంపాదించునట్లు కర్మము చేయవలె నని యర్థము.

రా. ఇందువలన సత్త్వ నిష్ఠుం డగు ముముక్షువున కింతమాత్రమే యుపాదేయ మని చెప్పుచున్నాఁడు—ఏద్దైనను ఒకఫలవిశేషముతో సంబంధము గల దని చెప్పఁబడునట్టి, నిత్యము నైమిత్తికము కామ్యము అని త్రివిధ మయిన కర్మమునందు, నిత్యసత్త్వస్థుఁడవు ముముక్షుఁడవు అగు, తే= నీకు; కర్మణ్యేవ= కర్మమాత్రమునందే; అధికారః = అధికారము, ఆకర్మముతో సంబంధము గలవిగా తెలియవచ్చుచున్న, ఫలేషు = ఫలములందు; కదాచన = ఒకప్పుడును; అధికారః = అధికారము, మా= లేదు, ఫలసహితమైనకర్మము బంధరూప మగుటవలనను, ఫలరహితమై కేవల మగు మదారాధనరూపకర్మము మోక్షహేతు వగుటవలనను. మా కర్మఫలహేతుర్భూః—కర్మఫలమునకుహేతువవుగూడ కావలదు, నీవు కర్మమనుష్ఠించుచున్ననుదాని యందు నిత్యసత్త్వస్థుఁడవు ముముక్షుఁడ వగు నీకు అకర్తృత్వము ననుసంధింపవలెను, క్షున్నివృత్త్యాదిక మగు ఫలమునకుఁగూడ నీవు హేతువు కా వని యనుసంధింపవలెను. ఆ రెంటను ♦ గుణములందుఁగాని సర్వేశ్వరుఁడను నాయందుఁగాని అను

* ఉనికి.

♦ కర్తృత్వము ఫలహేతుత్వమును.

సంధింపవలె నని ముందు చెప్పఁబడును. ఇట్లనుసంధించి కర్మము చేయుము. అకర్మణి = అనుష్ఠింపకుండుటయందు, యుద్ధము చేయ నని నీ వేమి చెప్పితివో దాని యందు; తే= నీకు; సఙ్గః= ఆసక్తి; మాస్తు= ఉండఁగూడదు. చెప్పినప్రకారము యుద్ధాదికర్మమునందే యాసక్తి యుండుఁ గాక.

నిత్యనైమిత్తికకామ్యము లని త్రివిధ మయిన కర్మమునకు ఏమేమిఫలము చెప్పియున్నను ముముక్షుఁడ వగు నీకు కర్మమునందుమాత్రమె యధికారము గాని దానికిఁ జెప్పియున్నఫలములం దెప్పుడును అధికారము లేదు. ఏల యనఁగా ఫలముఁ గోరినచో ఆకర్మము సంసారబంధమునకు కారణ మగును. ఫలము విడిచి మదారాధనరూపముగా అనుష్ఠించినచో అది మోక్షహేతు వగును. మఱియు నీవు కర్మము చేయునపుడును ఆకర్మమునందు నీవు కర్తవు కావనియు, తృప్త్యాదిక మగు తత్ఫలమునకు నీవు హేతువవు కా వనియు అనుసంధించుచు కర్మము చేయుము. నీవు కర్మము చేయకయు నుండవలదు. ఇప్పుడు చెప్పినప్రకారము యుద్ధాదికర్మమును విడువక చేయుచునే యుండవలె నని తాత్పర్యము.

మూ. కామాత్ములనింద ఎట్లు చేయఁబడినది. నీరికి «స్వర్గకామో యజేత" ఇత్యాదిస్థలమున కామముగూడ విహితముగా నున్నది గదా! అనఁగాఁ జెప్పుచున్నాఁడు—తే అనునది ఉపలక్షణార్థము, నీకు జ్ఞానివైనవానికిఁగూడ ఫలకామన కర్తవ్యము కాదు. ఇఁక నితరులకుఁ గర్తవ్యము కా దని చెప్పవలెనా? కొందఱకుఁ గావచ్చును నీకుఁ గాదని కాదు. అర్జునుఁడు జ్ఞాని గదా! నరాంశసంభవుండును ఇంద్రుఁడును. మోహాదికమో జ్ఞానము ఆచ్ఛాదిత మగుటవలన. వారలకు శుద్ధసత్త్వులకు జ్ఞానము లేదేని ఇతరుల కెక్కడ? ఇంద్రాదులు ఉపదేశము మొదలగు చేసియుండుటవలన వారలకు జ్ఞానము సిద్ధము. పార్థుఁడు ఆర్ష్టిషేణుఁడు ఇత్యాదిగా జ్ఞానులలో గణనము చేసి యుండుటవలనఁగూడ. కామనిషేధమే యుచ్చుట. ఏల యనఁగా ఫలములు పురుషస్వాతంత్ర్యముచేఁ గలుగునవి కావు. కర్మఫలములు యత్నముచేఁ గర్మము అనుష్ఠింపనియెడ కలుగవు గదా! కామ్యకర్మములు చేసినవానికి ఫలము వల దని యత్నించినప్పటికి విరోధము లేనియప్పుడు తత్ఫలములు కలుగనే కలుగును గదా! ఇందువలన కర్మము చేయకుండుటచేతనే ప్రత్యవాయముకాని జ్ఞానాదికముచేతంబోలె కామాభావముచే ఫలము ప్రాప్తింపనియెడఁ ప్రత్యవాయము లేదు. కావునఁ గర్మమునందే యధికారము. కావున అదియె

చేయవలెను. కాని కామముచేఁ గాని జ్ఞానాదికము విడిచి కాని ఫలప్రాప్తి చేయరాదు. కామవచనములకుఁ దాత్పర్యమో భగవంతునిచేతనే చెప్పఁబడినది. "రోచనార్థం ఫలశ్రుతిః, యథా భైషజ్య రోచనమ్" * అని భాగవతమునం దున్నది. అందువలననే కామి యజింపవలె నని యర్థము. కాని కామియై యజింపవలె నని యర్థము కాదు. "నిష్కామం జ్ఞానపూర్వం చ" అనువచనమువలన, ఇందుఁ జెప్పఁబోవువచనములవలనను, "వసన్తే వసన్తే జ్యోతిషా యజేత" ఇత్యాదివాక్యములవలనను. కావున, మా కర్మఫలహేతుర్భూః—కర్మఫలము దానిఁ జేయుటయందు హేతువుగాఁ గలవాఁడు కర్మఫలహేతువు, అట్టివాఁడవు కావలదు. అట్లయిన కర్మము చేయ ననఁగాఁ జెప్పుచున్నాఁడు—మా తే సఙ్గః అస్త్వకర్మణి—నీకుఁ గర్మము చేయకుండుటయందు స్నేహము వల దని యర్థము. ఇతరఫలము లేకున్నను నాప్రసాదము అనుఫలము కలుగుటవలన. ఇచ్ఛయు దానికి యుక్తము. "వృణీమహే తే పరితోషణాయ" ¶ అని పెద్దలయాచారమువలన, దీని నిందింపమివలనను విశేషించి యితరకామనను నిందించుటవలనను. సామాన్యమును విశేషము బాధించు ననుటయు ప్రసిద్ధము. అంతటను దోసెత్తమ్ము, ఒకమ్మెత్తునిఁ దేవలదు? ఇత్యాదికమునందు. అందువలన, "నైకాత్మ్యతాం మే స్పృహయన్తి కేచిత్" ♦ "భక్తిమన్విచ్ఛన్తః, బ్రహ్మజిజ్ఞాసా, విజ్ఞాయ ప్రజ్ఞామ్, ద్రష్టవ్యః" ఇత్యాదివచనములవలన, స్వకార్యార్థము సేవించువానియం దట్లు స్నేహము కలుగదు. ఏమి యిత్తు ననఁగా సేవాదికమును యాచించువానియందు మిక్కిలి ఎక్కుడు స్నేహము కలుగు ననులోకన్యాయమువలనఁగూడ భక్తిజ్ఞానాదులందుఁ గామన జేయవలె నని సిద్ధము.

నీకుఁ గర్మము చేయవలె నని విధి యున్నది, ఫలములు పొందవలె నని విధి లేదు. కావునఁ గర్మము చేయకున్నయెడఁ బ్రత్యవాయము కలుగును గాని తత్ఫలము పొందకున్నఁ బ్రత్యవాయము కలుగదు. కాఁబట్టి నీవు కర్మమును చేయవలసినదిమాత్రమే, ఫలమును గోరి చేయ నలదు. చేయకయు నుండవల దని తా.

యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. ౪౮

* రుచి పుట్టించుటకు ఫలశ్రుతి, ఔషధమునందు రుచిపుట్టించుట యెట్లో అట్లు.

¶ నిన్ను సంతోషపెట్టుట కొఱకు సమస్తకర్మమును గోరుచున్నాము.

♦ కొందఱు నాసాయుజ్యమును గోరరు.

భా॰ ఫలప్రయుక్తుఁడై కర్మము చేయఁగూడదేని ఇఁక నెట్లు చేయవలెను? చెప్పెదము.—ధనఞ్జయ = అర్జునా! యోగస్థః = యోగమునం దున్నవాఁడవై; కర్మాణి కురు = కర్మములను జేయుము, కేవలము ఈశ్వరార్థము. అప్పుడును, ఈశ్వరుఁడు నాయెడ సంతోషించుఁ గాకయను, సఙ్గమ్ = ఆసక్తిని; త్యక్త్వా = విడిచి; చేయుము. ఫలమునందు తృష్ణ లేక కర్మము చేయుటవలన, సత్త్వశుద్ధిజన్య మయిన జ్ఞానప్రాప్తి యనునది సిద్ధి, తద్విపర్యయజన్యము అసిద్ధి, సిద్ధ్యసిద్ధ్యోః = ఆసిద్ధియందును అసిద్ధియందునుగూడ; సమః = తుల్యుఁడవు; భూత్వా = అయి; చేయుము కర్మములను. దేనియం దుండి చేయు మని చెప్పితివో ఆయోగ మనఁగా నేమి? ఇదియే అది—సమత్వమ్ = సిద్ధియందును అసిద్ధియందును సముఁ డగుట; యోగః = యోగ మని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

నీవు యోగమునం దున్నవాఁడవై యితరఫలములు కోరక యీశ్వరప్రీత్యర్థము కర్మములు చేయుము, ఆయీశ్వరప్రీతిగూడ కావలె నని యపేక్షింపఁగూడదు. ఇట్లు ఫలాభిసంధి లేక కర్మము లనుష్ఠించుటవలన సత్త్వశుద్ధిమూలముగా జ్ఞానప్రాప్తి సిద్ధించును. అది సిద్ధించినను సిద్ధింపకున్నను నీవు హర్షవిషాదముల నొందక సముఁడవై యనుష్ఠించుచుండుము. సిద్ధి కలిగినను కలుగకున్నను హర్షవిషాదములం బొందక సముఁడై యుండుటయె యోగ మని చెప్పఁబడుచున్నదని తాత్పర్యము.

టీ॰ చేయ కుండుటయం దాసక్తి యుంచుట యుక్తము కాదేని, అప్పుడు క్లేశాత్మక మయిన కర్మమును దేని నుద్దేశించి చేయవలె నను నాశంక ననువదించి మీఁదిశ్లోకమున కవతారిక చేయుచున్నారు ఫలప్రయుక్తుఁడై ఇత్యాదిగా. చెప్పఁబోవుయోగము నుద్దేశించి దానియం దున్నవాఁడై కర్మములను క్లేశాత్మకములనైనను విహితము లగుటవలన అనుష్ఠింపవలె నని చెప్పుచున్నారు యోగస్థః ఇత్యాదిగా. కర్మానుష్ఠానమునకు ఉద్దేశ్యమును జూపుచున్నారు కేవలము ఇత్యాదిగా. కేవలము—ఇతరఫలాపేక్ష లేక, ఈశ్వరార్థము—ఈశ్వరప్రసాదము కొఱకు అనుష్ఠానమని యర్థము. అట్లయినయెడ ఈశ్వరసంతోషము అపేక్షణీయ మగుచున్నదనఁగా అట్లు కా దని చెప్పుచున్నారు అప్పుడును అని. కర్మానుష్ఠానము ఈశ్వర

ప్రసాదనార్థ మయినను అని యర్థము. సిద్ధి శబ్దార్థముఁ జెప్పుచున్నారు—ఫలము నందు ఇత్యాదిగా. తద్విపర్యయజన్యము—సత్త్వముయొక్క అశుద్ధిచేఁ గలుగునట్టి జ్ఞానాప్రాప్తి * యనునది యని యర్థము. కర్మము లనుష్ఠించువానికి యోగము నుపదేశించి ఈయోగమును ఆకాంక్షాపూర్వకముగాఁ బ్రకటించుచున్నారు దేని యందుండి ఇత్యాదిగా.

హ. ఫలముఁ గోరి కర్మము చేయఁగూడ దన్నపక్షమున ఇఁక నెట్లు చేయ వలె ననఁగాఁ జెప్పుచున్నాఁడు—యోగస్థః=యోగమునం దున్నవాఁడవై, కర్మాణి—చేయవలసిన కర్మములను, కురు—చేయుము, కేవల మీశ్వరప్రీతికొఱకు; ఈశ్వరుఁడు నామెడ సంతోషించు నని, సఙ్గమ్ = ఆసక్తిని, త్యక్త్వా = విడిచి; ఫలాభిసంధి లేక కర్మములు చేయునెడ, సత్త్వశుద్ధి పూర్వకజ్ఞానప్రాప్తి యనునది సిద్ధి, తద్విపరీతము అసిద్ధి, ఆసిద్ధ్యసిద్ధులయందును; సమః భూత్వా = తుల్యుఁడవై; కర్మాణి కురు. ఆ యోగ మే మనఁగా ఇదియే అది—సిద్ధ్యసిద్ధులయందు, సమత్వమ్ యోగః ఉచ్యతే.

శం. జన్మాదిదుఃఖము నిశ్శేషముగా నివర్తిల్లవలె నను నపేక్షయే నీకుఁ గలదేని, నీవు కర్మమునే చేయవలె నని యుపదేశించుచున్నాఁడు—'నిర్దోషం హి సమం బ్రహ్మ' అని చెప్పఁబోయెడు బ్రహ్మ మిందు సమశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది. సమభావము సమత్వము, అదియే జ్ఞానముచే యుజ్యతే—పొందఁబడుచున్నది కావున యోగ మని చెప్పఁబడుచున్నది. యోగస్థః = ఆయోగమునందు—బ్రహ్మమునందు తాను తద్భావమును పొందవలె నను నీయొక్కటే యపేక్షతో నున్నవాఁడవై, మోక్షము ఒక్కటే కోరువాఁడవై; నీవు, సఙ్గమ్ = వీనిచే నాకుఁ బాపక్షయము కావలె నని కాని ప్రతిబంధనివృత్తి కావలె నని కాని నాకీశ్వరుఁడు ప్రసన్నుఁడు కావలె నని కాని కర్మజన్య మగు ఫలము నాకుఁ గలుగవలె నని కాని కోరికను; కర్మములందు; త్యక్త్వా = విడిచి; సిద్ధ్యసిద్ధ్యోః—ఆరంభించిన కర్మము సాంగ మగుట సిద్ధి, అట్లు కాకుండుట అసిద్ధి, ఈశ్వరప్రసాదము కలుగుట సిద్ధి, అది కలుగమి అసిద్ధి, చిత్తప్రసాదము సిద్ధి, అది లేకుండుట అసిద్ధి, ఇవి మొదలగు, సిద్ధ్యసిద్ధులందును; సమః = హర్షవిషాదములు లేనివాఁడవు, భూత్వా = అయి; కర్మాణికురు—కర్మములు క్లేశాత్మకము లయినను విహితము లను బుద్ధిచే ననుష్ఠింపు మని యర్థము.

* జ్ఞానము పొందకుండుట.

మ. మున్ను చెప్పిన దానినే వివరించుచున్నాఁడు—ఓ ధనంజయుఁడా! నీవు, యోగమునం దున్నవాఁడవై, సఙ్గమ్ = ఫలాభిలాషను, కర్తృత్వాభినివేశమును; త్యక్త్వా, కర్మాణి, కురు. ఇచట కర్మాణి అని బహువచనము ప్రయోగించుట వలన, 'కర్మణ్యే వాధికారస్తే' అనుచో జాతియం దేకవచనము. సంగము విడుచు నుపాయముఁ జెప్పుచున్నాఁడు—సిద్ధ్యసిద్ధ్యోః సమః భూత్వా—ఫలసిద్ధియందు హర్షమును ఫలము సిద్ధింపని యప్పుడు విషాదమును విడిచి, కేవలము ఈశ్వరారాధన బుద్ధితో కర్మములను జేయు మని యర్థము. ఓయీ! యోగశబ్దముచే మున్ను కర్మము చెప్పఁబడినది, ఇచటనో "యోగస్థుఁడవై కర్మములను జేయుము" అని చెప్పఁబడుచున్నది, కావున ఎట్లిది తెలియవలెను? అనఁగాఁ జెప్పుచున్నాఁడు— సమత్వం యోగ ఉచ్యతే—సిద్ధ్యసిద్ధులందు సముఁడుగా నుండుట యనునది యేది గలదో ఇదియే యోగస్థుఁ డనుచో యోగశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది, కాని కర్మము కాదు, ఇందువలన ఏవిరోధంబును లే దని యర్థము. ఇటఁ "బూర్వార్థమున కుత్తరార్థముచే వ్యాఖ్యానము చేయఁబడుచున్నది, కావునఁ బౌనరుక్త్యము లేదు" అని భాష్యకారుల మార్గము. "సుఖదుఃఖే సమే కృత్వా" అనుచో జయాజయములందు సమత్వబుద్ధితో యుద్ధముమాత్రము కర్తవ్య మని ప్రకృత మగుట వలనఁ జెప్పఁబడినది. ఈశ్లోకమునందో దృష్టాదృష్టము లగు సర్వఫలములను విడిచి సర్వకర్మములు కర్తవ్యము లని చెప్పఁబడుచున్న దని విశేషము.

శ్రీ. మఱి యే మనఁగా. యోగస్థః—యోగ మనఁగా పరమేశ్వరైకపరత్వము [1], దానియం దున్నవాఁడవై; కర్మాణి కురు. అట్లయినను, సఙ్గమ్ = కర్తృత్వాభినివేశమును, త్యక్త్వా = విడిచి, కేవలము ఈశ్వరాశ్రయముచేతనే చేయుము. దానిఫల మయిన జ్ఞానముయొక్కయు; సిద్ధ్యసిద్ధ్యోః; సమః భూత్వా, కేవలము ఈశ్వరార్థముగానే చేయుము. ఎందువలన ననఁగా, ఇట్టి సమత్వమే, యోగః ఉచ్యతే, సత్పురుషులచేత, చిత్తసమాధానరూప మగుటవలన.

ప. అప్పుడు ఎట్లనఁగా చెప్పుచున్నాఁడు —యోగస్థః—యోగ మనఁగా పరమేశ్వరసాన్నిధ్యము, అందు నిశ్చయము చేసినవాఁడు యోగస్థుఁడు, అట్టివాఁడవై; కర్మాణి, కురు. ఇంచువలనను, ధనఞ్జయ = ధనమును—స్వర్గాదిసుఖమును జయించువాఁడు, తుచ్ఛ మని విడుచువాఁడు, అట్టివాఁడవు నీ వని యర్థము. ఏమి

---

[1] పరమేశ్వరుఁడొక్కనియందే యాసక్తుఁ డగుట.

చేసి యనఁగా—సఙ్గం త్యక్త్వా = కర్తృత్వాభినివేశమును విడిచి. మఱియు నేమి చేసి? సిద్ధ్యసిద్ధ్యోః సమః భూత్వా—సిద్ధించినను సిద్ధింపకున్నను హర్షవిషాదములు లేనివాఁడవై. ఎందువలన ననఁగా, సమత్వమ్ = నిర్వికారుఁ డగుట యే, యోగ మని చెప్పఁబడుచున్నది.

రా. దీనినే విశదీకరించుచున్నాఁడు.—రాజ్యము బంధువులు మొదలగు వానియందు, సఙ్గమ్ = ఆసక్తిని; త్యక్త్వా = విడిచి; యుద్ధము మొదలగు, కర్మాణి = కర్మములను; యోగస్థః = యోగమునం దున్నవాఁడవై; కురు = చేయుము. సిద్ధ్యసిద్ధ్యోః = తదంతర్భూతము లయిన జయము మొదలగువానియొక్క- సిద్ధియందును అసిద్ధియందును; సమః = హర్షవిషాదములు లేనివాఁడవై; చేయుము. సమత్వమ్ = సిద్ధియందును అసిద్ధియందును సమత్వ మేది గలదో అదియే; యోగః—యోగస్థః అను చోటి యోగశబ్దముచేత; ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. యోగ మనఁగా సిద్ధ్యసిద్ధులయందు సమత్వరూప మయిన చిత్తసమాధానము.

నీవు రాజ్యము మొదలగువానియందు ఆసక్తిని విడిచి జయము మొదలగునవి సిద్ధించినను సిద్ధింపకున్నను సమత్వము వహించి యోగమునం దున్నవాఁడవై యుద్ధాదికర్మముల ననుష్ఠింపుము. సిద్ధ్యసిద్ధులయందు సమత్వము అనఁగా చిత్తసమాధానము ఇదియే యోగ మని చెప్పఁబడు నని తాత్పర్యము.

మా. పూర్వశ్లోకముచేఁ జెప్పినదాని స్పష్టీకరించుచున్నాఁడు.—యోగస్థః = ఉపాయమునం దున్నవాఁడవై *; సఙ్గమ్ = ఫలమునందలి స్నేహమును; త్యక్త్వా. అందువలననే, సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా. అదియే నేను జెప్పిన యోగము.

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనఞ్జయ
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. ౪౯

భా. ఇఁక సమత్వబుద్ధియుక్త మయిన ఈశ్వరారాధనార్థ మగు కర్మ మేది చెప్పఁబడెనదో, అట్టి, బుద్ధియోగాత్ = సమత్వబుద్ధియుక్త మైన కర్మముకన్నను, దూరేణ=మిక్కిలి; అవరం హి=నికృష్టముగదా! ఫలార్థిచేఁ జేయఁబడు, కర్మ = కర్మము, జన్మమరణహేతు వగుటవలన.

* జ్ఞానోపాయము ననుష్ఠించువాఁడవై యని యర్థము.

ధనఞ్జయ = అర్జునా! అందువలన, బుద్ధౌ = యోగవిషయ మయిన బుద్ధియందు, తత్పరిపాకజన్య మయిన సాంఖ్యబుద్ధియందుఁ గాని; శరణమ్ = ఆశ్రయమును, అభయప్రాప్తికిఁ గారణమును; అన్విచ్ఛ = ప్రార్థింపుము, పరమార్థజ్ఞానశరణుఁడవు * కమ్మని యర్థము. ఎందువలన ననఁగా. అవర మయిన కర్మమును జేయుచుండువారు, కృపణాః = దీనులగుచున్నారు; ఫలహేతవః—ఫలమునందలి తృష్ణచేఁ బ్రయుక్తులై, "యో వా ఏత దక్షరం గా గ్యవిదిత్వా ఽస్మా ల్లోకా త్ప్రైతి స కృపణః" అను శ్రుతివలన.

ఇప్పుడు చెప్పిన సమత్వబుద్ధి యుక్త మయిన ఈశ్వరారాధనార్థ మగు కర్మముకంటె ఫలాపేక్షతో చేయు కర్మము మిక్కిలి నికృష్టము. కావున నీవు ఫలాపేక్ష విడిచి కర్మ మనుష్ఠించి దానిచేఁ గలుగు పరమార్థజ్ఞానమునే యాశ్రయింపుము. ఫలాపేక్షతో కర్మము చేయువారు సంసారములోఁ బడి దుఃఖితు లగుదు రని తా.

టీ. ఎందుకు యోగస్థుఁడై తత్త్వజ్ఞానముకొఱకు కర్మము చేయవలెను? ఫలాభిలాష యున్నను కర్మ మనుష్ఠింపవచ్చుఁ గదా! అని యాశంకించి యథోక్త మయిన యోగముతోఁ గూడిన కర్మమును స్తుతించుచు మీఁదిశ్లోకము నెత్తుచున్నారు ఇఁక ఇత్యాదిగా. అవరం కర్మ, బుద్ధి సంబంధికర్మమునకు విరుద్ధమని యధ్యాహార్యము. బుద్ధియుక్త మయిన దానికి బుద్ధియోగముచేఁ గలుగు నుత్కర్షము సూచించుచున్నాఁడు బుద్ధియోగాత్ అని. బుద్ధిసంబంధమువలనను తదసంబంధమువలనను గర్మమునందు ఉత్కర్షనికర్షము లేర్పడినపుడు, కర్తవ్యమును నియమించుచున్నాఁడు ఉత్తరార్ధముచేత. ఫలాభిలాషతోఁగూడ కర్మ మనుష్ఠింపవచ్చు ననునాక్షేపమునకుఁ జెప్పుచున్నాఁడు కృపణాః ఇత్యాదిగా. దేనికన్న ఇది నికృష్టము అని యాశంకించి మూలస్థపదమును గ్రహించి వ్యాఖ్యానము చేయుచున్నారు బుద్ధియోగాత్ ఇత్యాదిగా. నికృష్ట మయిన కర్మమునకే విశేషణము చేయుచున్నారు ఫలార్థిచే ఇత్యాదిగా. ఫలాభిలాషచేఁ జేయు కర్మము నికృష్ట మనుటకు హేతువుఁ జెప్పుచున్నారు జన్మేత్యాదిగా. సమత్వబుద్ధితోఁగూడిన కర్మముకన్నను అది లేని కర్మము జన్మాదిహేతు వగుటచే నికృష్ట మని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన అని. యోగవిషయ మయిన బుద్ధి—సమత్వబుద్ధి. బుద్ధిశబ్దమున కర్థాంతరముఁ జెప్పుచున్నారు తత్పరిపాకేత్యాదిగా. తత్ అనుదానిచే సమత్వబుద్ధి

* పరమార్థజ్ఞానమే శరణముగాఁ గలవాఁడవు.

యుక్త మైన కర్మము గ్రహింపఁబడుచున్నది, దానియొక్క పరిపాకము—దాని ఫల మైన చిత్తశుద్ధి. శరణశబ్దమునకు పర్యాయపదమును గ్రహించి వివక్షితార్థముఁ జెప్పుచున్నారు అథ యేత్యాదిగా. సప్తమీసమాసము కాదని తలఁచినవారై ద్వితీయపక్షమును గ్రహించి వ్యాఖ్యానముఁ జెప్పుచున్నారు పరమార్థేత్యాదిగా. అట్టి జ్ఞానము శరణముగాఁ గలవాఁడు కావలయు ననుటకు హేతువుఁ జెప్పుచున్నారు ఎందువలన ననఁగా అని. ఫలహేతుత్వమును వివరించుచున్నారు ఫలము నందలి ఇత్యాదిగా. అందుచే పరమార్థజ్ఞానశరణుఁ డగుటయె యుక్త మని శేషము. పరమార్థ జ్ఞానబహిర్ముఖు లగువారు కృపణు లనుటకు శ్రుతిని జూపుచున్నారు యో వా ఇత్యాదిగా. ఏ తత్—ఈ, అనఁగా అష్ఠూలాదివిశేషణములు గలది యని యర్థము.

హ. *

శ్లో. మోక్షమునే కోరి ఫలాపేక్ష లేక సమబుద్ధితో నిత్యనైమిత్తిక కర్మములు చేయుచున్నవానికి, «కర్మములచేతను తత్ఫలము లయిన భోగ్యములచేతను ఏమియుఁ బ్రయోజనము లేదు, తుచ్ఛము లవి» అని అలంబుద్ధి ♦ రూప మయిన చిత్తశుద్ధి యెప్పుడు జనియించుచున్నదో అప్పుడు నికృష్టఫలజనక మైన కర్మమునం దాస్థ వదలుటచే జ్ఞానయోగమునే యాదరింపవలె నని బోధించుచున్నాఁడు—పెక్కు సాధనములచే సాధ్య మగుటవలనను, క్లేశభూయిష్ఠ మగుటవలనను, సాంగము కానిచో ఫలము విగుణ మగుటవలనను, సాంగ మయినను జన్మాదిదుఃఖకారణ మగుటవలనను, చేయనియెడ ప్రత్యవాయజనక మై నరకహేతు వగుటవలనను, అవరమ్ = నికృష్టమయిన; కర్మ; నిత్యనిరతిశయమోక్షహేతు వైన, బుద్ధియోగాత్ = జ్ఞానయోగము కన్న; దూరేణ—దూరముగా నున్నది, «దూరమేతే విపరీతే విషూచీ అవిద్యా యా యాచ విద్యా" ❨ అను శ్రుతివలన; విపరీతభావహేతు వగుటచే మోక్షహేతు వగు జ్ఞానయోగమునకు దూరమే యగుచున్నది. «అష్టాదశోక్త మవరం యేషు కర్మ" అను శ్రుతిచే కర్మము అవరమని

* శంకరభాష్యముతో సమానము.

♦ వలదు అను బుద్ధి.

❨ విద్య యనునదియు అవిద్య యనునదియు నీరెండును ఒకటికొకటి మిక్కిలి దూరమున నున్నవి, ఒకటికొకటి మిక్కిలి భిన్నములు, భిన్న మయిన ఫలము గలవి.

చెప్పఁబడిన దని హి శబ్దము దెలుపుచున్నది. కావున కర్మము నవలంబింపఁ దగి నది కా దని భావము. ఓయీ! పెక్కండ్రు కర్మయోగమునే అనుష్ఠించు చున్నారు, ఎట్లు కర్మము అవరం బని చెప్పవచ్చును? అనఁగా ఇందుకుఁ జెప్పుచు న్నాఁడు—ఫలహేతవః = కర్మజన్య మయిన ఫలమునకు స్వర్గమునకుఁ గాని ఐహిక సుఖమునకుఁ గాని కారణములు, కర్మఫలహేతువులు, కర్మఫలమును గోరువారు, అట్టి కాములు ఎవరో వారే, కృపణాః = అధములు; నీచులు. «యో వా ఏత దక్షరం గార్గ్య విదిత్వా ఽస్మా ల్లోకా త్ప్రైతి సకృపణః» అని శ్రుతి ఉత్తమము లైన జన్మకర్మశీలగుణములు గలవాఁడైనను బ్రహ్మతత్త్వము తెలియని కర్మి అధ ముఁ డని చెప్పుచున్నది. «ఏత చ్ఛ్రేయో యే ఽభినన్దన్తి మూఢా జరామృత్యుం తే పునరే వాపి యన్తి" «యత్కర్మిణో న ప్రవేదయన్తి రాగా త్తే నాతురాః క్షీణలో కాశ్చ్యవన్తే"* అని కర్మఫలమోహితు లగు కర్ములకు అనర్థమునే శ్రుతి వచియించు చున్నది. «అథ ధీరా అమృతత్వం విదిత్వా ధ్రువ మధ్రువే ష్విహ న ప్రార్థ యన్తే, ఏత ద్యో వేద నిహితం గుహాయాం సో ఽవిద్యాగ్రన్థింవికిర తీహ సౌమ్య, జ్ఞానాదేవతు కైవల్యమ్, యయా ఽచిరా త్సర్వపాపం వ్యపోహ్య పరాత్పరం పురుష ముపైతి విద్వాన్"♦ ఇత్యాది శ్రుతులు వివేకవంతులకు భోగ్యములు ప్రార్థ నీయములు కా వనియు మోక్షమె ప్రార్థనీయ మనియు అది విద్యచేతనే పొందఁదగిన దనియుఁ బ్రతిపాదించుచుండుటవలన, ధనఞ్జయ! బుద్ధౌ = సాంఖ్యబుద్ధియందు; చిత్తప్రసాదముచేఁ బొందఁబడిన జ్ఞానయోగమునందే, శరణమ్ = మనస్సుయొక్క నివాసమును; అన్విచ్ఛ, దానియందే మనస్సు నిలుపుము. నీచిత్త మెప్పుడు ప్రసన్న మగునో అదిమొదలు జ్ఞానయోగమునందే యుండుము. అవరం బగుటవలనను అసాధన ‡ మగుటవలనను అనాత్మయందు ఆత్మభ్రాంతి నిమిత్తముగాఁ గల దగుట వలనను, ఒకానొకప్పుడును కర్మమునం దుండవల దని యర్థము. ఇందుచే, చిత్తప్ర

* ఎవరు మూఢులై దీనిని శ్రేయస్సుగాఁ దలఁచి సంతోషింతురో వారు మరల జరామృత్యు రూప మయిన సంసారమును బొందుదురు. ఎందువలన కర్ములు రాగమున ఎఱుంగఁజాలరో అందుచే వారు ఆతురులై క్షయించిన లోకము గలవారై పడుదురు.

♦ అందువలన వివేకులు స్థిర మయిన అమృతత్వము నెఱింగి అస్థిరము లయిన సర్వపదార్థము లందును దేనినిగూడ ప్రార్థింపరు. గుహానిహిత మైన దీనిని ఎవఁడు తెలిసికొనుచున్నాఁడో, సౌమ్యుఁడా అతఁడు ఈజన్మమునందే అవిద్యాగ్రంథిని విచ్చుచున్నాఁడు. జ్ఞానమువలననే కైవల్యము, దేనిచే విద్వాంసుఁడు శీఘ్రమున సమస్తపాపమును బోఁగొట్టి పరాత్పరుఁ డగు పురుషునిఁ బొందుచున్నాఁడో.

‡ మోక్షసాధనము కానిది.

సాధనము కలుగునట్లుకే ముముక్షువునకుఁ గర్మము సాధనము, అటు పిమ్మట జ్ఞానయోగమే యని సూచింపఁబడినది. అందుచే యావజ్జీవ మగ్నిహోత్ర మజుహుయా చిత్తునకే యని సిద్ధము.

ప్ర॰ ఫలము లేకనె యెల్లప్పుడును జేయవలె నని చెప్పుచున్నావే, ఏమి కర్మానుష్ఠానమే పురుషార్థమా? ప్రయోజన మనుద్దిశ్య నమన్దోపి ప్రవర్తతే" § అని న్యాయ మున్నది గదా! కావున మేలు ఫలకామనచేతనే కర్మమనుష్ఠించుట. అనఁగా నట్లు కాదని చెప్పుచున్నాఁడు.—బుద్ధియోగాత్ = ఆత్మ బుద్ధిసాధనభూత మయిన నిష్కామకర్మయోగముకంటె; దూరేణ=మిక్కిలి యధికముగా; అవరమ్= అధమము; కర్మ = ఫలాభిసంధితోఁ జేయునట్టిదియు జన్మమరణహేతుభూత మయినదియు నగుకర్మము. లేక. బుద్ధియోగాత్ = పరమాత్మజ్ఞానయోగముకంటె, దూరేణ అవరమ్, కర్మ = సమస్తకర్మమును. హి—ఎందువలననో, ధనంజయా! అందువలన; బుద్ధౌ = పరమాత్మజ్ఞానమునందు, సర్వానర్థములను నివారించునట్టి దానియందు; శరణమ్ = ప్రతిబంధక మయిన పాపమును బోఁగొట్టుటచే రక్షకం బగు నిష్కామకర్మయోగమును; అన్విచ్ఛ = చేయుట కిచ్ఛింపుము. ఇఁక నెవ్వరు, ఫలహేతవః = ఫలకాములు, అవర మయిన కర్మమును జేయుచున్నారో, వారు; కృపణాః—ఎల్లప్పుడును జన్మమరణాదిఘటీయంత్రమునందు భ్రమణముచేఁ బరవశులు, మిక్కిలి దీను లని యర్థము. "యోవా ఏత దక్షరం గార్గ్య విదిత్వాఽస్మాల్లోకా త్ప్రైతి సకృపణః" అను శ్రుతివలన. అందువలన, నీవును గృపణుఁడవు కావలదు, మరేమనఁగా సర్వానర్థనివర్తక మయిన ఆత్మజ్ఞానము కలిగించునట్టి నిష్కామకర్మ యోగమునే యనుష్ఠింపు మని యభిప్రాయము. ఎట్లు కృపణు లయిన జనులు అతి ప్రయాసముచే ధనము సంపాదించి యేదో అల్ప మయిన దృష్టసుఖమున కాశపడి దానాదులచేఁ గలుగునట్టి మహాసుఖము ననుభవించుట కశక్తు లగుటచే తమ్మే తాము వంచించుకొనుచున్నారో, అట్లు మహాప్రయాసముచే కర్మములు చేసి అల్ప మయిన తత్ఫలమునందలి లోభముచే పరమానందానుభవము గోల్పోయి తమచేఁ దామే వంచితు లగుచున్నారు! ఆహా! వీరి దౌర్భాగ్యమును మూఢతను ఏమని చెప్ప వలెను. అని కృపణపదముచే ధ్వనిత మగుచున్నది.

శ్రీ॰ కామ్యకర్మమో మిక్కిలి నికృష్ట మని చెప్పుచున్నాఁడు—వ్యవసాయాత్మక మగు బుద్ధితో చేయఁబడు కర్మయోగము బుద్ధియోగము, లేక, బుద్ధికి

§ ప్రయోజనము నుద్దేశింపక మూఢుఁడుగూడ ప్రవర్తింపఁడు.

సాధన మయినది బుద్ధియోగము, అట్టి బుద్ధియోగముకంటె; ఇతర మయిన కామ్య కర్మము; దూరేణ అవరమ్ = మిక్కిలి నికృష్టము; హి—ఎందువలననో, అందువలన. బుద్ధౌ = జ్ఞానమునందు; శరణమ్ = ఆశ్రయ మయిన కర్మయోగమును; అన్విచ్ఛ = అనుష్ఠింపుము. లేక, బుద్ధౌ, శరణమ్ = రక్షకుఁ డైన యీశ్వరుని, ఆశ్రయింపు మని యర్థము. ఫలహేతవః = కామసహితు లగు మనుష్యులో; కృపణాః = దీనులు, "యోవా ఏతదక్షర మవిదిత్వా గార్గ్యస్మాల్లోకాత్ప్రైతి సకృపణః" అను శ్రుతివలన.

ప. ఇందువలననే జ్ఞానయోగమును ప్రశంసించి చెప్పుచున్నాఁడు—ఓ ధనంజయుఁడా! బుద్ధియోగముకంటె; ఫలోద్దేశముతో చేయఁబడునట్టి, కర్మ; దూరేణ = మిక్కిలి; అవరమ్ = అపకృష్టము. కావున, చిత్తశుద్ధిద్వారమున జ్ఞానయోగము నుద్దేశించియే కర్మము చేయవలెను. అందువలన నీవు, బుద్ధౌ = జ్ఞానమునందు, శరణమ్—కర్మయోగమును, అన్విచ్ఛ—ఆశ్రయింపు మని యర్థము. హి—ఎందువలన ననఁగా, ఫలహేతవః—కర్మమును జేయుటయందు తత్ఫలమే కారణ మని తలంచునట్టి పురుషులు; కృపణాః = విషయసుఖలంపటులు. లేక. ఫలము లేమింజేసి నిరర్థకముగా కర్మముకొఱకు ధనవ్యయ మెట్లు చేయవచ్చు ననుట వారి కార్పణ్యము. శ్రుతియును "యోవా ఏతదక్షర మవిదిత్వా గార్గ్యస్మాల్లోకాత్ప్రైతి సకృపణో ఽథయ ఏత దక్షరం గార్గి విదిత్వా ప్రైతి సబ్రాహ్మణః" అని ప్రతిపాదించుచున్నది. భాష్యము—ఓ, గార్గి—వాచక్నవీ! యః—ఏపురుషుఁడు, ఏతత్, అక్షరమ్ = పరబ్రహ్మమును, అవిదిత్వా = తెలియక, ఫలోద్దేశముచే కర్మము చేసి, అస్మాత్ లోకాత్ = ఈమనుష్యలోకమునుండి, లోకాంతరమును, ప్రైతి—మృతుఁడై పొందుచున్నాఁడో, సః కృపణః—వాఁడు సర్వవిషయ భోగమును గోరువాఁడు. అట్లు, ఏతత్ అక్షరమ్, విదిత్వా = తెలిసి, ప్రైతి, సః—అతఁడు, బ్రాహ్మణః—బ్రహ్మరూపుఁ డగుచున్నాఁడు.

రా. ఎందు కిది పలుమాఱు చెప్పఁబడుచున్నది? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—బుద్ధియోగాత్—ఈ, ప్రధానఫలత్యాగవిషయంబును అవాంతరఫలములు సిద్ధించినను సిద్ధింపక పోయినను సమత్వవిషయము నగు బుద్ధియోగం బేది గలదో, దానితోఁ గూడిన కర్మముకన్న; ఇతరమైన, కర్మ = కర్మము; దూరేణ అవరమ్ = మిక్కిలి యపకృష్టము, రెంటికిని ఉత్కర్షాపకర్షరూప మయిన సంసారరూప్యము

మిక్కిలి గొప్పది. ఎట్లనఁగా—ఈబుద్ధియోగముతోఁ గూడిన కర్మము నను స్తసాంసారికదుఃఖమును దొలఁగించి పరమపురుషార్థరూప మయిన మోక్షమునుగూడ కలిగించుచున్నది, ఇతరకర్మము అపరిమితదుఃఖరూప మయిన సంసారమునే కలిగించుచున్నది. కావున కర్మము చేయునపుడు, బుద్ధౌ—ఈచెప్పిన బుద్ధియందు; శరణమ్ = వాసస్థానమును; అన్విచ్ఛ = కోరుము, ఆబుద్ధియందే వర్తింపు మని యర్థము. ఫలహేతవః = ఫలమునందలి యాసక్తి మొదలగు వానిచేఁ గర్మము చేయువారు; కృపణాః = సంసారు లగుదురు.

నేను చెప్పిన బుద్ధియోగముతోఁ జేయు కర్మముకంటె, ఫలాపేక్షతోఁ జేయుకర్మము మిక్కిలి నికృష్టము. కావున నీవాబుద్ధినే యవలంబించి యుండుము. ఫలాపేక్షతో కర్మము చేయువారు సంసారమునే పొందుదు రని తాత్పర్యము.

మా. ఇందువలనఁగూడ యోగముకొఱకుఁ బ్రయత్నింపు మని చెప్పుచున్నాఁడు—బుద్ధియోగాత్ = జ్ఞానరూప మయిన యుపాయముకంటె. దూరేణ = మిక్కిలి. కావున; బుద్ధౌ = జ్ఞానమునందు; శరణమ్ = స్థితిని. ఫలహేతవః—ఫలము కర్మము చేయుటయందు హేతువుగాఁ గలవారు.

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్.　　౫౦

భా. సమత్వబుద్ధితోఁ గూడినవాఁడై స్వధర్మ మనుష్ఠించి యేఫలమును బొందునో దాని వినుము.—బుద్ధియుక్తః = సమత్వకర్మవిషయ మయిన* బుద్ధితోఁ గూడినవాఁడు; ఇహ = ఈలోకమునందు; సుకృతదుష్కృతే = పుణ్యపాపములను; ఉభే = రెంటిని; జహాతి = విడుచుచున్నాఁడు, సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి ద్వారమున •. తస్మాత్ = అందువలన; యోగాయ = సమత్వబుద్ధియోగముకొఱకు; యుజ్యస్వ = ప్రయత్నింపుము. ఏల యనఁగా, యోగః=సమత్వబుద్ధియోగము; కర్మసు=కర్మములందు, కౌశలమ్—స్వధర్మాఖ్యము లయిన కర్మములందు వర్తించుచున్నవానికి ఈశ్వరార్పితమనస్కుఁ డగుటచే సిద్ధ్యసిద్ధులయందు సమత్వబుద్ధి

* సమత్వముతో కర్మ మనుష్ఠించుట విషయముగాఁ గల.

• చిత్తశుద్ధిని బొంది జ్ఞానము బొందుటచేత.

యేది గలదో, అది కౌశలము కుశలత *. అది గదా కౌశలము, బంధన స్వభావము లయినను కర్మములు సమత్వబుద్ధిచే తమస్వభావమును విడుచుచున్నవే! అందువలన సమత్వబుద్ధి యుక్తుఁడ వగుము నీవు.

ఈ సమత్వబుద్ధి నవలంబించి స్వధర్మ మనుష్ఠించినయెడ, చిత్తశుద్ధిపూర్వకముగా జ్ఞానప్రాప్తి కలుగుటచే, నతని కీలోకంబునఁ బుణ్యపాపములు రెండును నశించును. అందువలన నీసమత్వబుద్ధియోగము నవలంబింపుము. కర్మము లనుష్ఠించుటయం దీయోగము కౌశలము. ఎట్లనఁగా కర్మములకు బంధజనకమే స్వభావమయినను, ఈయోగముచే వాని కాస్వభావము నశించుచున్నది గదా. అని తాత్పర్యము.

ఆ. మున్ను చెప్పిన సమత్వబుద్ధితోఁ గూడినవాఁడై స్వధర్మానుష్ఠానమునందుఁ బ్రవర్తించినవాని కేమి కలుగు నని యాశంకించి చెప్పుచున్నారు సమత్వబుద్ధితో నిత్యాదిగా « బుద్ధి యుక్తుఁడై స్వధర్మాఖ్యమయిన కర్మము ననుష్ఠించుచు » అని శేషము ♦. బుద్ధియోగము ఫలవంత మని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నాఁడు ఉత్తరార్ధముచేత. పూర్వార్ధమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు బుద్ధియుక్తః ఇత్యాదిగా. ఓయీ! సమత్వ బుద్ధివలననే పుణ్యపాపనివృత్తి యగు ననుట యుక్తము కాదు, పరమార్థదర్శనమువలనఁ గదా తన్నివృత్తి యగును? అని యాశంకించి చెప్పుచున్నారు సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తిద్వారమున నని. ఉత్తరార్ధమునకు వ్యాఖ్యానముచే యుచున్నారు తస్మాత్ ఇత్యాదిగా. స్వధర్మ మనుష్ఠించువాఁడు ఈయోగముకొఱకు ఏల మనస్సును యోజింపవలెను? అని యాశంకించి చెప్పుచున్నారు ఏల యనఁగా నిత్యాదిగా. అప్పుడు ఈయోగముయొక్క సామర్థ్యముచేతనే చెప్పిన ఫలము సిద్ధించుటవలన స్వధర్మానుష్ఠానమునందు ఆస్థ లేకపోవు నని యాశంకించి చెప్పుచున్నారు స్వధర్మాఖ్యము లయిన ఇత్యాదిగా. ఈశ్వరార్పితచేతస్కుఁడై కర్మములందు వర్తించుచున్నవానికి—అనుష్ఠాననిష్ఠుం డయినవానికి యథోక్తబుద్ధి యేది గలదో, అది ఆకర్మములందు కౌశలం బని యన్వయము. కర్మములు బంధించు స్వభావము గలవి యగుటవలన వాని ననుష్ఠించుటచే మఱియు బద్ధుఁడే యగు నని యాశంకించి కౌశలమునే విశదీకరించుచున్నారు అది గదా ఇత్యాదిగా. సమత్వబుద్ధి యిట్టిఫలము గలదని యేర్పడఁగా ఫలితము నుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా.

---

* నేర్పు.

♦ మూలమునందు.

హ.

శం. ముముక్షువునకు జన్మాదిహేతువు లగు సమస్తకర్మములనిశ్శేషనివృత్తి జ్ఞానయోగబలముచేతనే సిద్ధించుచున్నది, ఇతరముచేతఁ గాదు. కావున నీవు దానియందే నిష్ఠను వహింపు మని బోధించుచున్నాఁడు.—బుద్ధియుక్తః—బుద్ధి యనఁగా మున్ను చెప్పిన సాంఖ్యవిషయబుద్ధి, దానితోఁ గూడినవాఁడు, జ్ఞానయోగముతోఁ గూడినవాఁడు, బ్రహ్మజ్ఞాన మొందినవాఁడు; తాను కూటస్థాసంగచిదాత్మ యను జ్ఞానముయొక్క బలముచేతనే, ఇహ = ఈలోకమునందు, జన్మాంతరశతసహస్రములందు ఇప్పుడును జ్ఞానోత్పత్తికి ముందును వెనుకను చేయఁబడినవి నానా యోనిసహస్రములను బొందించునవి యగు, ఉభే సుకృతదుష్కృతే జహాతి—జ్ఞానాగ్నిచే నిర్మూలించి యిట జీవించియుండియే ముక్తుఁ డగుచున్నాఁడు. తస్మాత్ =అందువలన; నీవు, యోగాయ = జ్ఞానయోగముకొఱకు; యుజ్యస్వ = యత్నింపుము. ఓయీ! కృచ్ఛ్రచాంద్రాయణాది ప్రాయశ్చిత్తములచేతను త్రిసుపర్ణాది జపములచేతను అశ్వమేధాదియాగములచేతను గంగాదిమహానదీస్నానములచేతను దానములచేతను సర్వపాపక్షయ మగుచుండఁగా ఎందుకు జ్ఞానయోగము నభ్యసించు క్లేశము? అనఁగా అట్లు కాదు, వానిచే నిశ్శేషనివృత్తి సంభవింపమివలన. ఈ ప్రాయశ్చిత్తాదులు దేని నుద్దేశించి చేయఁబడుచున్నవో వానిచే నది మాత్రమే నివర్తింపఁబడును, ఇతరము కాదు. అట్లు కానిచో వేఱువేఱు ప్రాయశ్చిత్తములు విధించుట యనర్థకము కావలసివచ్చును. మఱియు «తరతి బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేన యజతే» ♦ అను శ్రుతి బ్రహ్మహత్యావ్యతిరిక్తపాపమును దరించు నని చెప్పదు. ప్రాయశ్చిత్తాదికము చేసినను నివృత్తి పాపమునకే యగును గాని శతకోటిజన్మహేతు వగు పుణ్యమునకుఁ గానేరదు. ఏల యనఁగా పుణ్యమునకుఁ నివర్తక మగు నది యాత్మజ్ఞానముదక్క మఱి గొప్పసాధనము ఏదియు లేదు. «తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ» అనియు, «న య ఏవం విద్వాన్ నేతే ఆత్మానం స్పృణుతే» అని శ్రుతి. స్మృతియందును ఇందే యున్నది «ఉభే సుకృతదుష్కృతే» అని. కావున పాపపుణ్యోభయాత్మకము లయిన, కర్మసుకర్మములు నివర్తింపవలసియుండఁగా; యోగః = జ్ఞానయోగమే; కౌశలమ్—కుశలమే కౌశలము, సమర్థము, జ్ఞానమునందు కుశలు లగువారిచేఁ జూడఁబడిన పరమ

* శంకరభాష్యముతో సమానము.

♦ ఎవ్వఁడు అశ్వమేధముచే యజించుచున్నాఁడో ఆతఁడు బ్రహ్మహత్యను తరించును.

సాధనము. అందువలన, యోగాయ యుజ్యస్వ యని ముందు కన్వయము. జహాతీహా + ఉభే అనుచో సంధి లేమి ఆర్షము.

మ. ఇట్లు బుద్ధియోగము లేనిచో దోషము ప్రతిపాదించి యది యున్నచో గుణమును జెప్పుచున్నాఁడు.—ఇహ = ఈకర్మములందు; బుద్ధియుక్తః= సమత్వబుద్ధితోఁ గూడినవాఁడు; జహాతి = విడుచుచున్నాఁడు; ఉభే, సుకృత దుష్కృతే= పుణ్యపాపములను, సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తిద్వారమున. తస్మాత్; సమత్వబుద్ధియోగముకొఱకు, నీవు, యుజ్యస్వ = ఉద్యుక్తుఁడ వగుము. ఎందువలన ననఁగా. ఇట్టి సమత్వబుద్ధియోగము, ఈశ్వరార్పితచిత్తుఁడై కర్మములందుఁ బ్రవర్తించువానియొక్క; కౌశలమ్=కుశలభావము, నేర్పు. బంధహేతువు లయినను కర్మములు, బంధహేతువులు కాకుండుటయు మోక్షపర్యవసాయు లగుటయు నేది గలదో అది గొప్ప కౌశలము గదా! సమత్వబుద్ధియుక్తమైన కర్మయోగము కర్మరూపమే యైనను దుష్టకర్మక్షయము చేయుచున్నది, కావున మహాకుశలము. నీవ్రా, చేతనుఁడవే యయినను సజాతీయదుష్టక్షయము చేయవు, కావునఁ గుశలుఁడవు కావు అని వ్యతిరేక మిచ్చుట ధ్వనిత మగుచున్నది. లేక. ఇహ = సమత్వబుద్ధితోఁ గూడిన కర్మము చేసినయెడ; సత్త్వశుద్ధిద్వారమున, బుద్ధియుక్తః = పరమాత్మ సాక్షాత్కారము గలవాఁడై; ఉభే సుకృతదుష్కృతే జహాతి. తస్మాత్, సమత్వబుద్ధి యుక్త మయిన కర్మయోగముకొఱకు, యుజ్యస్వ. ఎందువలన ననఁగా, కర్మసు = కర్మములయందు; సమత్వబుద్ధియుక్త మయిన కర్మయోగము, కౌశలమ్ = కుశలము, దుష్టకర్మముల నివారించుటయందు సమర్థ మని యర్థము.

శ్రీ. బుద్ధియోగముతోఁ గూడినవాఁడో ఉత్తముఁ డని చెప్పుచున్నాఁడు.— సుకృతము—స్వర్గాదులఁ బొందించునది, దుష్కృతము—నరకాదులఁ బొందించునది, వానిని, ఉభే = రెంటిని; ఇహ = ఈజన్మమునందే; పరమేశ్వరప్రసాదముచే, జహాతి = విడుచుచున్నాఁడు. తస్మాత్, యోగాయ = తదర్థ మయిన కర్మయోగము కొఱకు; యుజ్యస్వ = యత్నింపుము. ఎందువలన ననఁగా. కర్మసు = కర్మములందు, కౌశలమ్ = అవి బంధకము లయినను ఈశ్వరారాధనముచే మోక్షపరత్వము సంపాదించు చాతుర్యము ఏది గలదో; అదియే, యోగః.

ప. ఇఁక జ్ఞానమును బ్రశంసించి చెప్పుచున్నాఁడు.—బుద్ధి యనఁగా విజ్ఞానము, తద్యుక్తుఁడు—జ్ఞాని యగుపురుషుఁడు; సుకృతదుష్కృతే = స్వర్గమును గలి

గించునట్టి సుకృతమును అధమయోనిని పొందించునట్టి దుష్కృతమును; ఉభే; జహాతి = విడుచుచున్నాఁడు. అట్లు శ్రుతియును “పాప మకరవ మిత్యేతః కల్యాణ మకరవ మిత్యుభే ఏష ఏతే తర త్యమృతః సాధ్వసాధునీ నైనం కృతాకృతే తపతః” అని. భాష్యము—అతః=జ్ఞానోత్పత్తికి పిమ్మట, నేను, పాపమకరవమ్ ఇతి= పాపము చేసితి ననియు; అట్లు, కల్యాణమ్ = పుణ్యమును, అకరవమ్ ఇతి=చేసితిని అనియు; ఏతే ఉభే సాధ్వసాధునీ = ఈరెండు సుకృతదుష్కృతములను; అమృతః = ముక్తుఁడై; తరతి = దాఁటుచున్నాఁడు. అట్లు; ఈ తత్త్వజ్ఞాని యగుపురుషుని; కృతా ఽకృతే = కృతము లయినవి కాని అకృతము లయినవి కాని సుకృత దుష్కృతములు; నతపతః—అతిక్రమింపవు, స్వాధీనునిఁ జేయవు; అనుష్ఠింపఁబడినవి కాని అనుష్ఠింపఁబడనివి కాని ఫలదానమునకు సమర్థములు కా వని యర్థము. తస్మాత్, నీవు, యోగాయ = పరమేశ్వరప్రాప్తికొఱకు; యుజ్యస్వ = యత్నింపుము. ఇఁక యోగముయొక్క స్వరూపముఁ జెప్పుచున్నాఁడు—యోగః కర్మసు కౌశలమ్, బంధజనకము లయిన కర్మములందు బంధజనకములు కాకుండుటను సంపాదించుట కౌశలము.

రా. బుద్ధియుక్తః=బుద్ధియోగముతోఁ గూడినవాఁడో; కర్మము చేయుచు, ఉభే = రెంటిని; సుకృతదుష్కృతే = పుణ్యపాపములను, అనాదికాలసంచితములు అనంతములు బంధహేతువు లైనవానిని; ఇహ = ఈలోకమునందు; జహాతి = విడుచుచున్నాఁడు. తస్మాత్ = అందువలన; యోగాయ= నేను జెప్పిన బుద్ధియోగము కొఱకు; యుజ్యస్వ = ఉద్యుక్తుఁడ వగుము. యోగః కర్మసు కౌశలమ్—కర్మములు చేయునపుడు ఈబుద్ధియోగము కౌశలము—అతిసామర్థ్యము, అతిసామర్థ్యముచే సాధ్య మని యర్థము.

బుద్ధియోగముతోఁ గూడినవాఁడై కర్మము లనుష్ఠించినచో అనాదిగా బహుజన్మసంచితములు అనంతములు సంసారబంధహేతువులు నగు పుణ్యపాపములు రెంటిని ఈజన్మమునందే విడుచుచున్నాఁడు. కావున నీవు ఈబుద్ధియోగము నవలంబింపుము. కర్మములు చేయువానికి ఈబుద్ధియోగము మిక్కిలి సామర్థ్యముచేతనే సాధ్య మగు నని తాత్పర్యము.

మా. జ్ఞానఫలముఁ జెప్పుచున్నాఁడు.—సుకృతమునుగూడ అప్రియమును మనుష్యత్వాదికము ఫలముగాఁ గలదాని, జహాతి = విడుచుచున్నాఁడు, కాని,

ఉపాసనాదికముచేఁ గలుగు మహాఫల మైన సుకృతమును గాదు, «నహాస్య కర్మ క్షీయతే. అవిదిత్వాఽస్మిఀల్లోకే జుహోతి యజతే తపస్తప్యతే బహూని వర్షసహస్రాణ్యన్తవ దేవాస్య తద్భవతి» * ఇత్యాది శ్రుతులవలన. కావున కర్మక్షయము బోధించుశ్రుతి సర్వత్ర యజ్ఞానివిషయము. ఉభయక్షయశ్రుతియును ¶ అశిష్టవిషయము. ఏల యనఁగా ఇష్టపుణ్యక్షయమునం దేమి ప్రయోజనము? ఇష్టనాశంబును జ్ఞానికి యుక్తము గాదు. కొన్నివిషయములు జ్ఞానికిని ఇష్టములు గలవు. «స యది పితృలోకకామో భవతి సంకల్పాదేవాస్య పితరస్సముత్తిష్ఠన్తి, ప్రజాపతే స్సభాం వేశ్మ ప్రపద్యే, యశోఽహం భవాని బ్రాహ్మణానామ్, స్త్రీభిర్వా యానైర్వా, అస్మాద్ధ్యేవాత్మనో యద్యత్కామయతే తత్తత్సృజతే, కామాన్నీ కామరూప్యనుసఞ్చరన్, న ఏకధా భవతి» ♦ ఇత్యాదిశ్రుతులవలన. ఆత్మసుఖము గొప్పదైనను ఇష్టమగుటవలనఁ గర్మసుఖము నంగీకరించుటచే విరోధము లేదు. అనుభవశక్తియు ఈశ్వరప్రసాదమువలన. శ్రుతివలనఁ గూడ. శరీరపాతమునకు మున్నే యనఁ దగదు. «స తత్ర పర్యేతి, ఏత మానన్దమయ మాత్మాన ముపసంక్రమ్య» § ఇత్యాదిగా మీఁద చెప్పఁబడుటవలన. అతఁడు బ్రహ్మముతో ఏకీభూతుఁడును గాఁడు, «మగ్నస్య హి పరేఽజ్ఞానే కిం న దుఃఖతరం భవేత్» $ అని మోక్షధర్మమునందు యుధిష్ఠిరప్రశ్నమున నిందిత మగుటవలనను, భీష్ముని యుత్తరమునందు ముక్తులను వేఱువేఱుగా భోగము చెప్పఁబడుటవలనను, శుకాదులకు భేదదృష్టి యుండుటవలనను, 'జగద్వ్యాపారవర్జమ్' అని ముక్తుల యైశ్వర్యమునకు అవధి చెప్పుటవలనను, «ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః" అను గీతావచనమువలనను, ఉపాధినాశము చెప్ప

* వీని కర్మము క్షయింపదు. తెలియక యీలోకమునందు వర్షసహస్రములు హోమము చేసినను యజించినను తపస్సు చేసినను వీనియొక్క అకర్మ మంతయు నాశవంతమే యగును.

¶ పుణ్యపాపములు రెంటియొక్క క్షయము బోధించు శ్రుతి.

♦ అతఁడు పితృలోకము గోరినవాఁ డగునేని ఇతని సంకల్పమువలననే పితరులు లేచి వత్తురు, ప్రజాపతిసభను గృహమునుగాఁ బొందెదను, నేను బ్రాహ్మణులలో యశస్వి నగుదును, స్త్రీలచేతనుగాని వాహనములచేఁగాని, దేని దేనిఁ గోరుచున్నాఁడో ఆయాకర్మమును ఈపరమాత్మనుండియే సృజించుచున్నాఁడు, కామాన్నము గలవాఁడును కామరూపము గలవాఁడునై సంచరించుచు, అతఁ డొకవిధముగా నగుచున్నాఁడు.

§ అతఁ డక్కడికిఁ బోవుచున్నాఁడు, ఈయానందమయాత్మను ఉపసంక్రమించి.

$ గొప్ప అజ్ఞానమునందు మునిఁగిన వానికి అంతకన్న దుఃఖ మేది గలదు!

పక్షమునఁ బ్రతిబింబమైన జీవునకే నాశము కానఁబడవచ్చుటవలనను. ఏకీభూతుఁడగువానికి భేదదృష్టి కలుగుటకును బ్రమాణము కానరాదు. “దుఃఖము గలవాఁడ నైతిని, దుఃఖము గలవాఁడను కాను” అను జ్ఞానము ఈశ్వరునందు విరుద్ధమగుటవలన. ఈరూపముచే * అనిగూడ, భేదము లేమివలన. ప్రతిబింబమునకు బింబముతో ఐక్యముగూడ లోకమునందుఁ గానము. ఉపాధినాశమునందుఁ బ్రమాణముం గానము. “మగ్నస్య హి పరే జ్ఞానే” అనువచనముచే దుఃఖాత్మకమని చెప్పఁబడుటవలనను, ‘యావ దాత్మభావిత్వాత్’ ‖ అనుటచే ఉపాధి నిత్యమని చెప్పఁబడుటవలనను. అందువలన అభేదవచనము ప్రతీయమాన మైనను ఔపచారిక మని తలంపవలెను. మఱియు వారు భగవంతునికంటె భిన్నులుగా నారదమునిచేఁ జూడఁబడినవారుగూడ. అన్నిశాఖలయందును ‘స ఏకధా’ ఇత్యాదులందు భిన్నులుగానే తెలియవచ్చుచున్నారు. విరోధము గలిగినప్పుడు యుక్తిమంతము లగు వాక్యములె ప్రబలములు. యుక్తులో ‘మగ్నస్య హి’ ఇత్యాదులిటఁ జెప్పఁబడినవి. అందువలన, జలమునందు జలమున కేకీభావమువలె నేకీభావము. అట్లు ‘యథోదకే శుద్ధే శుద్ధమ్’, ‘యథానద్యః’ ఇత్యాదికమునందుఁ జెప్పఁబడినది. అప్పుడుగూడ అన్యోన్యాత్మత యంగీకరించినచో వృద్ధి సంభవింపక పోవును. కలదుకొంచెము సముద్రమునఁగూడ వృద్ధి, నదీద్వారమునందుఁ గనఁబడుచున్నది. గొప్ప దగుటవలన ఇతరస్థలమునఁ గనఁబడదు. “తాపవోపాదదాతస్య సఋషిశ్శంసితవ్రతః” § అని మహాకౌర్మమునం దున్నది. అట్లు సమర్థులగు వసిష్ఠాదులకు భేదము కనఁబడుటవలనఁ గూడ. “నైన తత్ప్రాప్నువన్త్యేతే బ్రహ్మేశానాదయ స్సురాః, యత్తేపదం తే కైవల్యమ్” ♦ అని నారదీయమునందు అభేదమును నిషేధించుటవలనఁగూడ. విచారసహితమైన నిర్ణయము ※ చేయఁబడినది మోక్షధర్మములందు. విచారసహితనిర్ణయము నట్టివాక్యముల కన్నను బ్రబలము.

---

* స్వరూపముచేతనే దుఃఖి నైతిని, దుఃఖిని కాను అని.

‖ ఆత్మ యుండువఱకు నుండున దగుటవలన.

§ ఏది యింద్రుని కమండలువునుండి గ్రహించి తనకమండలువునందుఁ బోయఁబడినదో—ఆజలములచే యతనికి శంసితవ్రతుం డగు ఆపస్తంబమహర్షి యొసంగెను.

♦ నీయొక్క కైవల్యము సర్వోత్తమత్వరూపమైన నీస్థాన మేది గలదో దాని ఈబ్రహ్మేశానాదు లగు సురలు పొందనే పొందరు.

※ జీవేశ్వరభేదనిశ్చయము.

కావున, « యత్ర నాన్యత్పశ్యతి " ఇత్యాదికముగూడ భగవదధీన సత్తాదికమును* చెప్పుచున్నది. కానిచో నెట్లు అచటనే ' స ఏకధా ' ఇత్యాదిగాఁ జెప్పును? « నహ వై సశరీరస్య " ఇత్యాదివిరోధముగూడ లేదు. ఆశరీరములు విలక్షణము లగుట వలన. అభౌతికములు ( గదా అవి! ఈశ్వరశక్తిచే నిత్యోపాధివినిర్మితములు. అట్లు చెప్పఁబడినది « శరీరం జాయతే తేషాం షోడశ్యా కలయైవ హి '' ♦ అని నారాయణరామకల్పమునందు. లౌకికపదార్థములకంటె వైలక్షణ్య మున్నచో అభావశబ్దమును జెప్పుచున్నారు « అప్రహర్ష మనానన్దమ్, సుఖదుఃఖబాహ్యాః » ఇత్యాదులందు. నిరుక్తి § లేమివలనను అవి శరీరములు కావు. « అశారీతి హి తచ్ఛరీరమభవత్ » (§) అని శ్రుతి. అవి శీర్ణములు కావు గదా! ' సర్గే ఽపి నోపజాయన్తే ప్రలయే నవ్యథన్తిచ ' అను వచనమువలన. అస్మదాదిశరీరములతో సామ్యము గలుగుటవలన వానియందు శరీరశబ్దప్రయోగము. « అనిన్ద్రియా అనాహారా అనిష్పన్దా స్సుగన్ధినః, దేహేన్ద్రియాసుహీనానాం వైకుణ్ఠ పురవాసినామ్» (♦) ఇత్యాదిగా నారదాదు దృష్టదేహములందే ప్రయోగించుటవలనను. ఇది వేఱే గౌణముక్తియనుటయు సరి గాదు « బహూనాత్ర కి ముక్తేన యావ చ్ఛ్వేతం నగచ్ఛతి, యోగీ తావన్న ముక్తస్స్యా దేష శాస్త్రస్య నిర్ణయః " (*) అని యాదిత్యపురాణమునందు తదితరముక్తిని నిషేధించుటవలన. ఇఁక నెవ్వ రిచ్చటనే భగవంతుం జొత్తురో వారుగూడ షిమ్మట నచటికే పోయెదరు. యోగ్యత యిట వివక్షింపఁబడినది. యుధిష్ఠిరప్రశ్నమునందు ఇతరముక్తి నిందిత మగుటవలనను. సాయుజ్యమో గ్రహ

---

* ఇతరపదార్థములు భగవదధీనము లయిన సత్తాదులు గలవి అనుటను.

( జడములు కానివి.

♦ వారలకు షోడశి యగు కల చేతనే గదా శరీరము పుట్టుచున్నది. షోడశకల యనఁగా నిత్యోపాధి.

§ శరీరశబ్దార్థము.

(§) శీర్ణము—నశించినది అయ్యెను. అందువలన అది శరీరము అయ్యెను.

(♦) ఇంద్రియములు లేనివారు ఆహారము లేనివారు చలనము లేనివారు సుగంధులు. దేహము ఇంద్రియములు ప్రాణములు లేనివారలగు వైకుంఠపురవాసులకు.

(*) పెక్కుమాట లేల? ఎంతవఱకు శ్వేతద్వీపము నొందఁడో అంతవఱకు యోగి ముక్తుఁడు కాఁడు. ఇది శాస్త్రముయొక్క నిశ్చయము.

దులకుంబోలె *. అట్లు చెప్పఁబడినది. "భుఞ్జతే పురుషం ప్రాప్య యథా దేవగ్రహాదయః । తథా ముక్తా వుత్తమాయాం బాహ్యాన్ భోగాంస్తు భుఞ్జతే" • అని నారాయణాష్టాక్షరకల్పమునందు. అందువలన ఇష్టము కాని దానికే క్షయము. అది యుండనే యున్నది సంపూర్ణముగా. "అదుఃఖమ్, సర్వదుఃఖవివర్జితాః, అశోకమహిమమ్, యత్ర గత్వా నశోచన్తి" ఇత్యాదులవలన. విశేషవచనము లేమివలనఁగూడ. ఎవ్వరికిఁ గొంచెము కనఁబడుచున్నదో, వారు కారు సాయుజ్యము పొందినవారు. సామీప్యమే వారికి. అందువలనఁ బ్రారబ్ధకర్మశేష ముండు టంజేసి దాని భుజించి సాయుజ్యము నొందెదరు. ఆప్రకారము చెప్పఁబడినది "సంకర్షణాదయస్సర్వే స్వాధికారా దనన్తరమ్, ప్రవిశన్తి పరందేవం విష్ణుం నాస్త్యత్ర సంశయః" ‖ అని వ్యాసయోగమునందు. అందువలన అనిష్టమునకు సంపూర్ణముగా క్షయము. "పరబ్రహ్మత్వ మిచ్ఛామి పరబ్రహ్మన్ జనార్దన" § ఇత్యాదిగా బ్రహ్మాదులచేతఁగూడఁ బ్రార్థిత మగుటవలనను, "నమోక్ష సదృశం కించిత్ అధికం వా సుఖం క్వచిత్ । ఋతే వైష్ణవ మానన్దం వాఙ్మనో ఽగోచరం మహత్" (*) ఇత్యాదివచనములవలనను, బ్రహ్మాదిపదముకన్నను మిక్కిలి యధిక మైన సుఖము మోక్ష మని సిద్ధము. అందువలన, యోగాయ—జ్ఞానోపాయముకొఱకు, యుజ్యస్వ. అది గదా కర్మకౌశలము.

కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్. ౫౧

భా. ఎందువలన ననఁగా. కర్మజం ఫలం త్యక్త్వా అని వ్యవహితముతో నన్వయము. కర్మజమ్ = కర్మములవలనఁ బుట్టిన, ఫలమ్—ఇష్టా

* ఎట్లు పిశాచాదులు పురుషుఁ బ్రవేశించుచున్నవో ఆట్లీశ్వరుం బొందుట సాయుజ్య మని యభిప్రాయము.

• ఎట్లు దేవగ్రహాదులు పురుషునిఁ బొంది భోగములను పొందుదురో అట్లు ఉత్తమ మయిన ముక్తియందు బాహ్యభోగములను భుజింతురు.

‖ సంకర్షణాదు లందఱును తమ యధికారమున కనంతరము పరదేవత యగు విష్ణువును బ్రవేశింతురు. ఇందు సందేహము లేదు.

§ పరబ్రహ్మమా! జనార్దనా! పరబ్రహ్మత్వమును గోరుచున్నాను.

(*) అవాఙ్మానసగోచరం బగు విష్ణుదేవుని పరమానందంబు దక్క, ఇఁక నెందును మోక్షమునకు సమానముగాని అధికముగాని సుఖ మేదియు లేదు.

నిష్టదేహప్రాప్తి. బుద్ధియుక్తాః హి = సమత్వబుద్ధితోఁ గూడినవారలై గదా; అందువలన, కర్మజమైన ఫలమును; త్యక్త్వా = విడిచి; మనీషిణః=జ్ఞానులయి; జన్మబన్ధవినిర్ముక్తాః = జన్మమే బంధము—జన్మబంధము, దానిచే విడువఁబడినవారలై, జీవించి యున్నవారలై యే జన్మబంధవినిర్ముక్తులై; అనామయమ్ = సర్వోపద్రవరహితమైన; పదమ్ = విష్ణువు యొక్క పరమస్థానమును మోక్షమను పేరు గల దానిని; గచ్ఛన్తి = పొందుచున్నారు అని యర్థము.

టీక. బుద్ధియోగాద్ధనఞ్జయ యనునది మొదలు, పరమార్థజ్ఞానరూపమైన సర్వతి స్నమ్ప్లుతోదకస్థానీయ మగు కర్మయోగజన్య చిత్తశుద్ధి జనితబుద్ధి చెప్పఁబడినది, సాక్షాత్సుకృతదుష్కృతక్షయహేతు వనుటవలన. *

సమత్వబుద్ధి గలవారలై కర్మానుష్ఠానము చేయువారు, కర్మఫలము నొందక చిత్తశుద్ధిద్వారమున జ్ఞానము నొంది జన్మబంధము వీడినవారై సర్వోపద్రవరహితమైన యుత్తమపద మగు మోక్షము నొందుదురు. అందువలన సమత్వబుద్ధి నాశ్రయింపు మని తా. వ్యాఖ్యానాంతరమునకు—కర్మయోగానుష్ఠానముచే సత్త్వశుద్ధి నొంది తద్ద్వారమునఁ బరమార్థజ్ఞానము నొందినవారు కర్మఫలములు వీడి జన్మబంధము దాఁటినవారై జీవన్ముక్తి నొంది ప్రారబ్ధక్షయమైనంతనే విదేహముక్తి నొందుదు రని తాత్పర్యము.

ఆం. సమత్వబుద్ధియుక్తునకు సుకృతదుష్కృతములు విడిచినను ఎట్లు మోక్షము కలుగు నని యాశంకించి చెప్పుచున్నారు. ఎందువలన ననఁగా అని. ఎందువలన సమత్వబుద్ధితోఁ గర్మ మనుష్ఠింపఁబడినదై దురితాదికము తొలఁగించునో అందువలనఁ బరంపరగా నది ముక్తిహేతు వని యర్థము. మనీషులు గదా జ్ఞానాతిశయము గలవారు, 'సమత్వబుద్ధియుక్తులై స్వధర్మాఖ్య మగు కర్మము ననుష్ఠించి అందువలనఁ బుట్టిన దేహప్రద మయిన ఫలమును వారు విడిచి జన్మరూపమైన బంధమునుండి వినిర్ముక్తులై వైష్ణవపదమును సర్వసంసారస్పర్శశూన్యమును పొందుచున్నా రను శ్లోకోక్తార్థము పదయోజనచేఁ జూపుచున్నారు.—ఇష్టదేహము దేవాదిరూపము, అనిష్టదేహము తిర్యగాదిరూపము, తత్ప్రాప్తియే కర్మమువలనఁ

* బుద్ధియోగాద్ధనంజయ యనునది మొదలు జ్ఞానయోగము ప్రతిపాదింపఁబడిన దని భావము.

బుట్టెడుఫలము. దానిని, బుద్ధియుక్తులు, జ్ఞానులై, తత్ఫలమువలనను విడిచి, బంధవిముక్తి నొంది, జీవన్ముక్తులై యుండి, విదేహముక్తి పొందువా రగుదు రని యర్థము.

బుద్ధియోగా దిత్యాదిస్థలమునందు బుద్ధిశబ్దమునకు సమత్వబుద్ధి యర్థముగా వ్యాఖ్యానము చేయఁబడినది; ఇప్పుడు పరంపరను విడిచి సుకృతదుష్కృతక్షయహేతుత్వము సమత్వబుద్ధియందు సిద్ధింపఁజేసి బుద్ధిశబ్దమునకు యోగ్యమయిన యర్థాంతరము చెప్పుచున్నారు లేక అని. అనవచ్ఛిన్నవస్తువిషయం బగుటచే నది యనవచ్ఛిన్నం బని సూచించుచు దానియందు ఇతరబుద్ధికన్న విశేషమును జూపుచున్నారు సర్వత స్సంప్లు తేత్యాదిగా. దాని కసాధారణ మయిన కారణమును నిర్దేశించుచున్నారు కర్మయోగ జ అని. ఇదియే బుద్ధిశబ్దార్థ మనుటకు హేతువుఁ జెప్పుచున్నారు సాక్షా దిత్యాదిగా. జన్మబంధ విమోక్షాదికము అది శబ్దార్థము.

ఏకర్మము చేయునప్పుడు పరమార్థబుద్ధి యుద్దేశ్యముగా ఘటింపఁబడునో ఆకర్మముకంటె ఇతరకర్మము అట్టి యుద్దేశ్యమైన పరమార్థబుద్ధి సంబంధము లేనిది మిక్కిలి నికృష్టము. అందువలనఁ బరమార్థబుద్ధి నుద్దేశ్యముగా నవలంబించి కర్మ మనుష్ఠింపవలెను. అట్లుగాక పరిచ్ఛిన్నమైన ఫలాంతరము నుద్దేశించి కర్మ మనుష్ఠించినచో కార్పణ్యము సంభవించును. మఱియుఁ బరమార్థబుద్ధి నుద్దేశ్యముగా నాశ్రయించి కర్మ మనుష్ఠించువారలు, చిత్తశుద్ధిద్వారమునఁ బరమార్థదర్శనము నొంది, దేహము జీవించియుండునప్పుడే సుకృతాదికము వీడి మోక్షము నొందుచున్నారు. కావునఁ బరమార్థదర్శనరూపయోగముకొఱకు మనస్సును నిలుపుకోవలెను. యోగశబ్దవాచ్య మయిన పరమార్థదర్శనము నుద్దేశ్యముగా కర్మములందు నవలంబించువాఁడు నిపుణుఁ డని చెప్పఁబడును. ఇఁక పరమార్థదర్శనము నుద్దేశించి ఆయుద్దేశ్యముతోఁ గూడినవారైయే కర్మముల నారంభింతు రేని అప్పుడు తదనుష్ఠానజనిత మయిన చిత్తశుద్ధిచే జ్ఞానము నొంది కర్మజం బగు ఫలంబు విడిచి నిర్ముక్తబంధనులై ముక్తి నొందుదురు. అని యిట్లు ఈపక్షమునందు ఈమూఁడుశ్లోకములు వ్యాఖ్యాతవ్యములు.

వ్యా. ఇందువలనఁగూడ ఫలప్రసంగమును విడిచి స్వధర్మ మనుష్ఠింపవలెను —కర్మజం ఫలమ్=ఇష్టదేహాదిప్రాప్తిరూప మయిన కర్మఫలమును; త్యక్త్వా=విడిచి; బుద్ధియుక్తాః=జ్ఞానులు; మనీషిణః=మననశీలురు; జన్మముచేఁ గలుగు బంధము

జన్మబంధము, దానిచే వినిర్ముక్తులై, జీవించియుండియే జన్మబంధ వినిర్ముక్తులై; పదమ్— మోక్షం బను వైష్ణవపదమును, గచ్ఛన్తి, అనామయమ్ — సర్వోపద్రవరహిత మును అని యర్థము.

శ౦. ఫలము నపేక్షింపక సమబుద్ధితోఁ జక్కఁగా అనుష్ఠింపఁబడిన నిత్యనైమిత్తికకర్మములపరిపాకమువలనఁ గలుగునట్టి చిత్తశుద్ధికి ఫలభూత మయిన శ్రవణాదిజనిత మగు అవిక్రియాత్మతత్త్వజ్ఞానసిద్ధియొక్క ఫలముఁ జెప్పుచున్నాఁడు.— బుద్ధియుక్తాః—బుద్ధి యనఁగా సాంఖ్యబుద్ధి, బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము, దానితోఁ గూడినవారు, తన్నిష్ఠతోఁ గూడినవారు, జ్ఞానయోగనిష్ఠులైనవారు గదా! మనీషిణః = విద్వాంసులు; కర్మజమ్ = సంచితాదికర్మములవలనఁ బుట్టిన, నానాయోనిసహస్రములు పొందించునట్టి; ఫలమ్—జన్మాదిలక్షణ మైనదానిని; త్యక్త్వా— « నిమిత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయః » * అను న్యాయముచే జ్ఞానాగ్నిచే సమస్తకర్మములకును దాహము కలుగఁగా తత్ఫలము లయిన జన్మాదులకుఁగూడ దాహము సంభవించుటవలన అందుచే కర్మఫలము విడిచినవా రగుచున్నారు, ఆత్మ కూటస్థుఁడు అను జ్ఞానముయొక్క శక్తిచే విద్వాంసులు తాము కర్మఫలమునకు విషయము కానివారలై యని యర్థము; జన్మబన్ధవినిర్ముక్తాః — జన్మముతో బంధము సంబంధము గలది జన్మబంధము—దేహము, ఉత్తరకాలమునందుఁ గలుగఁబోవునదియు వర్తమానమును, దానిచే వినిర్ముక్తులై, కారణము లేమివలన భవిష్యద్దేహసంబంధము లేనివారును తాదాత్మ్యము లేమివలన వర్తమానదేహసంబంధము లేనివారునై; తామీ లోకమునందు జీవించి యుండియే, అనామయమ్ = ఆధ్యాత్మికాది సర్వోపద్రవములును లేనిది, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము, అఖండానందైకరసంబు అగు; పదమ్ = పద్యతే—జ్ఞానముచేఁ బొందఁబడుచున్నది కావున పరబ్రహ్మమును; గచ్ఛన్తి, అవిద్యాకృతమును వాసనాకృతమునుగూడ అన్యభావమును విడిచి బ్రహ్మభావమునే పొందుచున్నా రని యర్థము. హి అనునది విద్వాంసులయనుభవమును దెలుపుచున్నది.

మ. దుష్కృతహానమే యపేక్షితము, కాని సుకృతత్యాగము కాదు, పురుషార్థభ్రంశము సంభవించుటవలన. అని యాశంకించి తుచ్ఛఫలత్యాగముచే పరమపురుషార్థప్రాప్తిఫలముఁ జెప్పుచున్నాఁడు.—సమత్వబుద్ధియుక్తులు; హి=ఏకారణ

* నిమిత్తమునకు నాశము కలుగఁగా నైమిత్తికమునకుఁగూడ నాశము.

మావలన; కర్మజం ఫలం త్యక్త్వా, కేవలము ఈశ్వరారాధనార్థము కర్మములను చేయుచు సత్త్వశుద్ధిద్వారమున; మనీషిణః = తత్త్వమస్యాదివాక్యజన్య మయిన ఆత్మజ్ఞానము గలవా రగుచున్నారు. అట్టివారలై, జన్మరూప మయిన బంధముచే, వినిర్ముక్తాః = విశేషముచే — ఆత్యంతికముగా నిశ్శేషముగా విడువఁబడినవారై; పదమ్ = పొందఁ దగినదాని, ఆత్మతత్త్వమును, ఆనందరూప మయిన బ్రహ్మమును; అనామయమ్ = అవిద్యా తత్కార్యరూపరోగము లేనిదాని, అభయ మైనదాని, మోక్షాఖ్యమును; గచ్ఛన్తి = అభేదముచేఁ బొందుచున్నా రని యర్థము. ఎందువలన నట్లు ఫలకామనను విడిచి సమత్వబుద్ధితోఁ గర్మము లనుష్ఠించి వానిచే నంతఃకరణశుద్ధి నొందినవారై తత్త్వమస్యాది ప్రమాణములచే ఆత్మతత్త్వజ్ఞానము నొంది దానంజేసి నశించిన యజ్ఞానతత్కార్యములు గలవారై సకలానర్థనివృత్తి పరమానందప్రాప్తిరూప మైన మోక్షాఖ్యం బగు విష్ణుని పరమపదముం బడయుచున్నారో; అందువలన నీవును "యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే" అని యడిగినవాఁడవు శ్రేయస్సు తెలియఁ గోరినవాఁడ వగుటంజేసి యిట్టి కర్మయోగము ననుష్ఠింపు మని భగవంతుని యభిప్రాయము.

శ్రీ. కర్మములు మోక్షసాధనం బగు విధముఁ జెప్పుచున్నాఁడు.—కర్మజం ఫలం త్యక్త్వా, కేవల మీశ్వరారాధనార్థము కర్మము చేయుచున్నవారలు; మనీషిణః = జ్ఞానులై; జన్మరూప మయిన బంధముచే వినిర్ముక్తులై; అనామయమ్= సర్వోపద్రవరహిత మయినదానిని, విష్ణువుయొక్క, పదమ్—మోక్షాఖ్య మయిన స్థానమును, గచ్ఛన్తి.

ప. ఇఁకఁ గౌశలముచేఁ జేయఁబడిన కర్మములు మోక్షసాధనము లనుటం జెప్పుచున్నాఁడు.——వ్యవసాయాత్మక మయిన బుద్ధితోఁ గూడినవారు, మనీషిణః = జ్ఞానులు, కర్మజం ఫలం త్యక్త్వా=తృణమువలె లెక్కింపక, అనామయమ్ = సర్వోపద్రవరహిత మగు, పదం గచ్ఛన్తి. ఎట్టివారలై యనఁగా. జన్మబన్ధవినిర్ముక్తాః—కర్మజ ఫల ముండినం గదా పునర్జన్మబంధము కనఁబడుచున్నది, దానినుండి విశేషముచే నిర్ముక్తులై.

రా. మనీషిణః = పండితులు; బుద్ధియుక్తాః = బుద్ధియోగముతోఁ గూడినవారై; కర్మజం ఫలం త్యక్త్వా = కర్మములవలనఁ గలుగు ఫలమును విడిచి, కర్మములను జేయుచుండి; దానివలన; జన్మబన్ధవినిర్ముక్తాః = జన్మరూప మ్మయిన బంధము

నుండి విముక్తులై; అనామయమ్, పదమ్, గచ్ఛన్తి హి—ప్రసిద్ధము గదా యిది యన్ని యుపనిషత్తులయందును అని యర్థము.

పండితు లగువారు ఈబుద్ధియోగము నవలంబించినవారై కర్మఫలమును విడిచి కర్మము లనుష్ఠించి, యందువలన జన్మబంధము వీడినవారై పరమపదముం బడయుదు రని తాత్పర్యము.

మా. తదుపాయముఁ జెప్పుచున్నాఁడు.—కర్మజం ఫలం త్యక్త్వా—కామన చేయక ఈశ్వరునకు సమర్పించి; బుద్ధియుక్తాః = సమ్యక్జ్ఞానము గలవారై; పదం గచ్ఛన్తి. యోగసహిత మైన కర్మము జ్ఞానసాధనము, అజ్ఞానము మోక్షసాధన మని భావము.

యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ. ౫౨

భా. యోగానుష్ఠానజనిత మగు చిత్తశుద్ధిచేఁ గలుగు బుద్ధి యెప్పుడు పొందఁబడును? అనఁగా, చెప్పెదము.—యదా = ఏకాలమునందు; తే = నీయొక్క; మోహకలిలమ్ = మోహాత్మక మయిన అవివేకరూప మైన కాలుష్యమును, ఏది ఆత్మానాత్మవివేకజ్ఞానమును కలుషపఱచి విషయమును గూర్చి యంతఃకరణమును ప్రవర్తింపఁజేయు చున్నదో, దానిని; తే=నీయొక్క; బుద్ధిః=చిత్తము; వ్యతితరిష్యతి=అతిక్రమించునో, మిక్కిలి శుద్ధత్వము నొందునో యని యర్థము; తదా=ఆకాలమునందు; శ్రోతవ్యస్య = వినవలసినదానియొడను; శ్రుతస్యచ = వినఁబడినదానియె డను; నిర్వేదమ్ = వైరాగ్యమును; గన్తాసి = పొందఁ గలవు, అప్పుడు వినవలసినదియు విన్నదియు నీకు నిష్ఫలంబుగాఁ దోఁచు నని యభి ప్రాయము.

ఎప్పుడు అవివేకరూప మయిన కాలుష్యము తొలఁగి నీచిత్తము శుద్ధ మగునో అప్పుడు నీకు వినవలసినదియు విన్నదియు నిష్ఫలముగాఁ దోఁచి సమస్త మయిన అనాత్మవిషయంబునందును వైరాగ్యము కలుగు నని తాత్పర్యము.

ఆ. ఈబుద్ధి లభించుకాలమును ప్రశ్నపూర్వకముగాఁ బ్రకటించుచు న్నారు యోగానుష్ఠా నేత్యాదిగా. «శ్రుతం శ్రోతవ్యం దృష్టం ద్రష్టవ్యమ్» *

* వినఁబడినది వినవలెను చూడఁబడినది చూడవలెను.

ఇత్యాదికమునందు ఫలాభిలాషప్రతిబంధకమువలన *బుద్ధి యుదయింపదని యాశంకించి చెప్పుచున్నారు యదా ఇత్యాదిగా. వివేకముయొక్క పరిపాకావస్థ కాలశబ్దముచే జెప్పఁబడుచున్నది. కాలుష్యము దోషపర్యవసాయి ♦ అని తెలుపుచు విశేషణము చేయుచున్నారు ఏది ఇత్యాదిగా. ఆకాలుష్యరూపమయిన అవస్థము నీకుఁ గలదని యన్వయము గలుగుటకై తే అని మరలఁ జెప్పుట. చిత్తశుద్ధిఫలమయిన వివేకము లభించుటచే వైరాగ్యము లభించునని తెలుపుచున్నారు తదా ఇత్యాదిగా. అధ్యాత్మశాస్త్రవ్యతిరిక్తమయిన శాస్త్రము శ్రోతవ్యాదిశబ్దముచే గ్రహింపఁబడుచున్నది. చెప్పిన వైరాగ్యమునే విశదీకరించుచున్నారు వినవలసినదియు ఇత్యాదిగా. *వివేకము సిద్ధించినచో సమస్తమైన అనాత్మవిషయంబును నిష్ఫలమని తోఁచునని యర్థము.

హా॰ యోగానుష్ఠానజనితం బగు సత్త్వశుద్ధి యెప్పుడు పొందఁబడుననఁగాఁ జెప్పుచున్నాఁడు.—యదా = ఏకాలమునందు, తే = నీయొక్క, మోహకలిలమ్ = అవివేకాత్మకమగు కాలుష్యమును, ఏది యాత్మానాత్మవివేకమును కలుషముగాఁ జేసి విషయములం గూర్చి యంతఃకరణమును బ్రవర్తింపఁజేయుచున్నదో దాని; బుద్ధిః; వ్యతితరిష్యతి, శుద్ధత్వమును బొందుచున్నదో అని యర్థము. తదా = ఆకాలమునందు; గన్తాసి = పొందఁగలవు, నిర్వేదమ్ = వైరాగ్యమును, శ్రోతవ్యస్య శ్రుతస్యచ— అప్పుడు శ్రోతవ్యంబును శ్రుతంబును నిష్ఫలముగాఁ దోఁచునని యర్థము.

శ౦॰ చిత్తశుద్ధిజన్యంబును అన్నివిషయంబులందు అలంబుద్ధిలక్షణంబును ‡ నగు వైరాగ్యంబును ప్రజ్ఞాస్థైర్యరూపమయిన యోగమును ఎప్పుడు దేనిచేఁ బొందఁగలను ? అను నర్జునుని యభిప్రాయము నాశంకించి « ఎప్పుడు నీకు చిత్తకాలుష్యనివృత్తి యగునో, ఎప్పుడు మఱి నీకు ప్రజ్ఞ నిర్వికల్పం బగునో అప్పుడు వైరాగ్యమును యోగమును బొందఁగలవు " అని యీరెంటిని రెండుశ్లోకములచేఁ గ్రమంబునఁ జెప్పుచున్నాఁడు.—సదసద్వివేకశూన్య మగుటంజేసి యంతఃకరణము అసద్విషయములందే రమ్యము అరమ్యము § ఇష్టము అనిష్టము గ్రాహ్యము అగ్రా

♦ దోషముగా పేర్పడునది.

‡ వలదు అను బుద్ధి స్వరూపముగాఁ గలదియును.

§ రమణీయము కానిది.

హ్యాము అని దేనిచే రాగద్వేషగ్రస్తమయి సర్వదా ప్రవర్తించుచున్నదో అదే మోహకలిలము, మోహ మనఁగా బుద్ధిహీనత, ఈవిషయసమూహ మంతయు అసత్తు మాయికము తుచ్ఛము అను వివేకము లేకుండుట, పదార్థము తెలియక పోవుట, అదియే కలిల మనఁగా కాలుష్యము, అద్దమును దుమ్మువలె వివేకబుద్ధిని ఆవరించునది, ఇట్టి మోహకలిలమును; తే బుద్ధిః, యదా, వ్యతితరిష్యతి—"యదిదం మనసా వాచా చక్షుర్భ్యాం శ్రవణాదిభిః । నశ్వరం గృహ్యమాణంచ విద్ధి మాయా మనోమయమ్" $ ఇత్యాదివచనార్థమును జక్కఁగా గ్రహించుటచేఁ గలుగునదియు ఈశ్వరప్రసాదమూలకంబు నగు—'దృశ్య మంతయు మిథ్యయే' యను నిశ్చయముచే విడువఁ గలవో; తదా, శ్రోతవ్యమును శ్రుతమును, ద్రష్టవ్యమును దృష్టమును, జ్ఞాతవ్యమును జ్ఞాతమును, గ్రాహ్యమును గృహీతమును ♦ అను వస్తువు మిథ్యయే యని తెలిసి, నిర్వేదమ్ = వైరాగ్యమును, అంతటను అలంబుద్ధిరూపమును; గన్తాసి = పొందఁగలవు. వ్యవహార్యము * మిథ్య యగుటవలన, వ్యవహారము మిథ్యార్థము విషయముగాఁ గల దగుటవలన, నిష్ఫల మయిన దీనిచే నాకేమి యని సమస్త మయిన వ్యవహార్యమునుండియు వ్యవహారమునుండియు ఉపరతి నొందఁ గల వని యర్థము.

మ. ఇట్లు కర్మము లనుష్ఠింతునేని ఎప్పుడు నాకు సత్త్వశుద్ధి యగు నన నఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఇంతకాలముచే సత్త్వశుద్ధి కలుగు నను కాలనియమ మేమీ లేదు, మ తే మనఁగా, యదా = ఏకాలమునందు; తే=నీయొక్క; బుద్ధిః = అంతఃకరణము; మోహకలిలం వ్యతితరిష్యతి = అవివేకాత్మక మయిన కాలుష్యమును, నేను ఇది—నాది యిది ఇత్యాద్యజ్ఞానవిలాసమును మిక్కిలి గహనమైన దాని, అతిక్రమించునో, రజస్తమోమలము విడిచి శుద్ధత్వము నొందునో అని యర్థము. తదా = ఆకాలమునందు; శ్రోతవ్యస్య శ్రుతస్యచ—కర్మఫలమునెడ; నిర్వేదమ్ = తృష్ణ లేమిని; గన్తాసి = పొందఁ గలవు, "పరీక్ష్యలోకాన్ కర్మచితాన్

---

$ ఏ యిది మనస్సుచేతను వాక్కుచేతను నేత్రములచేతను శ్రవణాదులచేతను గ్రహింపఁబడుచు నశ్వర మగుచున్నదో అది యంతయు మాయామనోమయం బని యెఱుంగుము.

♦ వినవలసినదియు వినఁబడినదియు, చూడవలసినదియుఁ జూడఁబడినదియు, తెలియవలసినదియుఁ దెలియఁబడినదియు, గ్రహింపవలసినదియు గ్రహింపఁబడినదియు.

* వ్యవహరింపఁ దగినది.

బ్రాహ్మణో నిర్వేద మాయాత్ ॥ • అను శ్రుతివలన. నిర్వేదమానఫలముచే అంతః కరణశుద్ధి నెఱుంగుదు వని యభిప్రాయము.

శ్రీ. ఎప్పు డాపదమును నేను బొందుదు ననఁగాఁ జెప్పుచున్నాఁడు రెండు శ్లోకములచేత—మోహ మనఁగా దేహాదులం దాత్మబుద్ధి, అదియే, కలిలము—గహనము, ⁋ ‹కలిలం గహనం విదుః› అని యభిధానకోశస్మృతివలన. అందువలన నిది యర్థము—ఇట్లు పరమేశ్వరారాధనము చేయుచుండఁగా, యదా = ఎప్పుడు, తత్ప్రసాదముచేత, తే బుద్ధిః, దేహాభిమానలక్షణమోహమయ మగు గహనమును—దుర్గమును, విశేషించి దాఁటఁ గలదో, అప్పుడు శ్రోతవ్యము శ్రుతము అగు అర్థము నెడ, నిర్వేదమ్ = వైరాగ్యమును, గన్తాసి = పొందుదువు, అవి యుపాదేయములు కానందువలన వానియెడ జిజ్ఞాసను సహింప వని యర్థము.

ప. ఇఁక ఎప్పుడు పదప్రాప్తి యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—తే బుద్ధిః, యదా, మోహకలిలం వ్యతితరిష్యతి — మోహము— దేహాత్మబుద్ధి, అదియే కలిలము—గహనము, అతిక్రమింపనశక్య మగుటవలన; దాని, ఎప్పుడు, నీబుద్ధి, విశేషించి దాఁటునో; తదా, శ్రోతవ్యస్య, శ్రుతస్యచ-ఫలమునెడ, నిర్వేదమ్=వైరాగ్యమును, గన్తాసి = పొందఁ గలవు. అట్లు చెప్పఁబడినది పాతంజలమునందు «భోగాపవర్గౌ బుద్ధికృతౌ బుద్ధావేవ వర్తమానౌ కథం పురుషే వ్యపదిశ్యేతే సహి తత్ఫలభోక్తేతి. యథా విజయః పరాజయోవా యోధేషు వర్తమాన స్స్వామిని వ్యపదిశ్యతే సహి తత్ఫలభోక్తేతి. బుద్ధిరేవ పురుషార్థాపరిసమాప్తి ర్బన్ధః తదర్థవ్యవసాయో మోక్షః ॥* అని.

రా. చెప్పినవిధమునఁ గర్మమునందుఁ బ్రవర్తించినవాఁడవై అట్లు వర్తించుటచే నిర్ధూతకల్మషుండ వగు, § తే= నీయొక్క; బుద్ధిః=అంతఃకరణము; మోహకలిలమ్ = మిక్కిలి స్వల్పపు ఫలాసక్తికిఁగూడ హేతువైన మోహరూప మగు కాలు

---

• కర్మసంపాదితము లగు లోకములను బరీక్షించి బ్రాహ్మణుఁడు నిర్వేదమును బొందును.

⁋ అడవి.

* భోగమోక్షములు బుద్ధికృతములు బుద్ధియందే యున్నవి ఎట్లు పురుషునందు చెప్పఁబడుచున్నవి? అతఁడు గదా తత్ఫలము భుజించువాఁడు అందువలన. ఎట్లు జయముగాని పరాజయముగాని భటులయం దున్నది రాజునందుఁ జెప్పఁబడుచున్నదో అతఁడు గదా తత్ఫలభోక్త యను కారణమువలన, అట్లు. బుద్ధియే పురుషార్థపరిసమాప్తి లేనిచో బంధము, పురుషార్థవ్యవసాయము మోక్షము.

§ పోఁగొట్టఁబడిన పాపములు గలవాఁడ వగు.

వ్యమును; వ్యతితరిష్యతి = దాటఁ గలదో; తదా = అప్పుడు; శ్రుతస్య = మావలన ఇంతకు మున్ను త్యాజ్య మని వినఁబడిన ఫలాదికమునకుఁగాను; శ్రోతవ్యస్యచ = ఇఁకమీఁద వినవలసినదానికిఁగాను; నీయంత నీవే, నిర్వేదమ్ = స్వనిందను *; గన్తాసి = పొందఁ గలవు.

ఇప్పుడు మేము చెప్పినప్రకారము నీవు కర్మము లనుష్ఠించి యందుచేఁ బాపము లన్నియు వీడిన పిమ్మట, ఎప్పుడు నీబుద్ధియందుఁ గొంచె మయినను ఫలాసక్తికిఁ గారణ మయిన మోహకాలుష్యము లేక పరిశుద్ధత కలుగునో, అప్పుడు నీవు మే మిదివఱకు ఫలాదికము విడువు మని చెప్పినవిషయమును ఇఁకఁ జెప్పఁబోవువిషయమును దలఁచికొని, మున్నంత యవివేకినై యుంటి నని, నీయంత నిన్ను నీవే నిందించుకొందు వని తాత్పర్యము.

మూ. ఎదివఱకు అవశ్యము చేయవలెను ముముక్షువు ఇట్లు కర్మములను? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—నిర్వేదమ్ = మిక్కిలి లాభమును. ఇట్లు ప్రయోగము వలన «తస్మా ద్బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య» ఇత్యాదిగా. అప్పుడు వైరాగ్య మర్థమనుట యుపపన్నము గాదు గదా! అట్లయినయెడ పాణ్డిత్యాత్ • అని యుండును. మఱియు, జ్ఞానులకు భగవన్మహిమాదిశ్రవణమునందు విరక్తి కలుగదు. «ఆత్మారామా హి మునయో నిర్గ్రన్థా అప్యురుక్రమే, కుర్వ న్త్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణో హరిః» § అను వచనమువలన. శుకాదుల యనుష్ఠానమువలనను. వారికి ఫలము సుఖము లేకపోలేదు, అదియే వారికి మహాసుఖ మగుటవలను. «యా నిర్వృతి స్తనుభృతాం తవ పాదపద్మ ధ్యానా ద్భవజ్జనకథాశ్రవణేన వా స్యాత్, సా బ్రహ్మణి స్వమహి మన్యపి నాథ మాభూ త్కిం త్వన్తకాసిలులితా త్పతతాం విమానాత్» ¶ ఇత్యాదివచనమువలన. వారికిఁగూడ ఉపాసనాదిఫలము సాధిత మగుటవలన, తారతమ్యము తెలియవచ్చుటవలనఁగూడ. అవును. తారతమ్యము లేనియెడ—«నాత్యన్తికం విగణయ న్త్యపి తే ప్రసాదమ్, నైకాత్మతాం మే

* నిన్ను నీవు నిందించుకొనుటను.

• పాండిత్యమువలన.

§ ఆత్మారాము లగు మునులుగూడఁ గదా నిర్విషయులయ్యు భగవంతునియందు నిర్హేతుకభక్తిఁ జేయుచున్నారు. ఇట్టి గుణములు గలవాఁడు హరి.

¶ స్వామీ! నీపాదపద్మముల ధ్యానించుటవలనఁగాని, నీభక్తులకథల వినుటవలనఁగాని, దేహధారులకు ఏయానందము కలుగునో అది స్వకీయమహిమ నగు బ్రహ్మానుభవమునందును లేదు, ఇఁక యమునిఖడ్గముయొక్క చాలనమువలన విమానమునుండి పడువారికి లే దని చెప్పవలెనా?

స్పృహయన్తి కేచిత్, ఏకత్వ మప్యణ దీయమానం నగృహ్ణన్తి" ‡ అని ముక్తి యిచ్ఛింపనివారు స్తుతింపఁబడుచున్నారు. ముక్తినిగూడ ఇచ్ఛింపనివారికిఁగూడ మోక్షమే ఫలము. దానిఁ గోరువారికిఁగూడ సుప్రతీకాదులకు మోక్షము కలదు. అప్పుడు ఇచ్ఛింపనివారి స్తుతించుట యెట్లుపపన్న మగును? * వచనములవలనఁగూడ "యథా భక్తివిశేషో ఽత్ర దృశ్యతే పురుషోత్తమే, తథా ముక్తివిశేషో ఽపి జ్ఞానినాం లిఙ్గభేదనే" † అనియు, "యోగినాం భిన్నలిఙ్గానా మావిర్భూతస్వరూపిణామ్। ప్రాప్తానాం పరమానన్దం తారతమ్యం న హ్యైవహి" § అనియు, "నత్వాం మతిశయిష్యన్తి ముక్తావపి కదాచన, మద్భక్తియోగాత్ జ్ఞానాచ్చ సర్వానతిశయిష్యసి" ¶ అనియును. సామ్యవచనమో ప్రాచుర్యవిషయము. దుఃఖాభావవిషయమును. అట్లు చెప్పఁబడినది "దుఃఖాభావః పరానన్దో లిఙ్గభేద స్సమో మతః। తథా ఽపి పరమానన్దో జ్ఞానభేదాత్తు భిద్యతే" ‖ అని నారాయణాష్టాక్షర కల్పమునందు. అందువలన, శ్రుతాదికములందు వైరాగ్యమాట వివక్షితము కాదు. ఇతరస్థలమున లాభార్థమునఁ బ్రయోగ ముండఁగా శ్రుతాద్యర్థసంకోచమునందుఁ బ్రమాణ మేమియు లేదు. పెద్దలచే శ్రోతవ్యంబును శ్రుతంబు నగు వేదాదికముయొక్క ఫలమును బొందుదు వని యర్థము.

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధావచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి. ౫౩

భా. మోహకలిలనాశద్వారంబున ఆత్మవివేకజన్యమైన ప్రజ్ఞ నొందినవాఁడవై యెప్పుడు కర్మయోగమువలనం గలుగు ఫలమును

---

‡ అత్యంతికమైన నీప్రసాదమునుగూడ వారు గణియింపరు. నాయొక్కత్వము—సాయుజ్యమును కొందరు అపేక్షింపరు. ఏకత్వమునుగూడ ఇయ్యఁబడుచున్న దాని గ్రహింపరు.

* అందువలన ఇచ్ఛింపనివారికిఁ గలుగు మోక్ష మధిక మని భావము.

† ఎట్లు విష్ణువునందు భక్తివిశేషము కనఁబడుచున్నదో, అట్లు జ్ఞానులకు లింగభేదనమున ముక్తివిశేషముగూడ కలదు.

§ భిన్నలింగులై ఆవిర్భూతస్వరూపులై పరమానందము నొందిన యోగులకుఁ దారతమ్యమెల్లప్పుడు కలదు.

¶ నిన్ను ముక్తియందుఁగూడ ఎప్పుడును యతిశయింపఁజాలరు. నాయందలి భక్తియోగమువలనను జ్ఞానమువలనను నీ వందఱ నతిశయించి యుందువు.

‖ దుఃఖాభావము పరానందము లింగభేదము సమముగాఁ జెప్పఁబడినది. అట్లయినను పరమానందము జ్ఞానభేదమువలన భేదిల్లుచున్నది.

బరమార్థయోగమును బొందఁగలను? అందువేని, అది వినుము.—

శ్రుతివిప్రతిపన్నా—శ్రుతి = అనేకము లగు సాధ్యములయు సాధనములయు సంబంధములఁ దెలుపునట్టి ప్రవృత్తినివృత్తిలక్షణము లగు శ్రుతివాక్యముల శ్రవణములచే, విప్రతిపన్నా = నానావిధముగా గ్రహించియున్న, విక్షేపము నొందియున్న; తే = నీయొక్క; బుద్ధిః = అంతఃకరణము; యదా = ఏకాలమునందు; స్థాస్యతి = స్థిరముగా నుండునో; నిశ్చలా = విక్షేపరూపచలనము లేనిదై; సమాధౌ = సమాధీయతే చిత్తమస్మిన్—చక్కఁగా నుంపఁబడును చిత్తము దీనియందు, కావున సమాధి యనఁగా ఆత్మ, ఆత్మయం దనుట; అచలా—అందును వికల్పము లేనిదై యనుట. తదా = ఆకాలమునందు; యోగమ్ = వివేకజన్యప్రజ్ఞా సమాధిని; అవాప్స్యసి = పొందుదువు.

ఇదివఱకు అనంతము లగు కర్మములను తత్ఫలములను తన్నివృత్తిని దెల్పుచు నానావిధాభిప్రాయములై తోఁచునట్టి శ్రుతులు వినుటవలన నానావిధ విక్షేపములు కలిగియుండు నీయంతఃకరణము ఎప్పుడు ఈ సర్వవిక్షేపములును నశించి, చలనము లేనిదై పరమాత్మయందు నిర్వికల్పమై స్థిరముగా నిలుచునో, అప్పుడు నీవు వివేకజన్య మైన పరమాత్మైక్యజ్ఞానమునందు నిష్ఠను బొందుదు వని తాత్పర్యము.

ఆ. చిత్తశుద్ధియు వివేకము వైరాగ్యము సిద్ధించినను మున్ను చెప్పిన పరమార్థబుద్ధియొక్క ప్రాప్తికాలము తెలుపఁబడినది కా దని శంకించుచున్నాఁడు మోహేత్యాదిగా. మున్ను చెప్పిన వివేకాదియుక్తచిత్తమునకు ఆత్మయందు స్థైర్యావస్థ కలిగినపుడు ఈబుద్ధి సిద్ధించు నని చెప్పుచున్నారు అది విను మని. అడుగఁబడిన కాలవిశేషము అది యనుటచే గ్రహింపఁబడుచున్నది. బుద్ధి శ్రుతివిప్రతిపన్న మగుటను విశదీకరించుచున్నారు అనేకములు ఇత్యాదిగా. నానాశ్రుతివిప్రతిపన్నత్వమునే సంక్షేపించుచున్నారు విక్షేపము నొందియున్న అని. చెప్పఁబడిన రెండుహేతువుల ననుసరించి వైరాగ్యపరిపాకావస్థ కాలశబ్దార్థము. నైశ్చల్యము—విక్షేపము లేకుండుట. అచలత్వము—వికల్పము లేకుండుట. విక్షేప మనఁగా విపర్యయము, వికల్ప మనఁగా సంశయము అని తెలియునది. వివేకజన్యప్రజ్ఞాసమాధివి—వివేకద్వారమునఁ బుట్టిన ప్రజ్ఞ అనఁగా మున్ను చెప్పిన బుద్ధి, దానియందే నిష్ఠ సమాధి.

హ౦. మోహకలిలము వీడిన పిదప ఆత్మవివేకప్రజ్ఞ గలవాఁడవై యెప్పుడు కర్మయోగఫల మయిన పరమార్థయోగమును బొందుదువో దాని వినుము.— శ్రుతివిప్రతిపన్నా = అనేకము లగు సాధ్యసాధనములఁ బ్రకటించునట్టి శ్రుతుల వినుటచే సంప్రతిపన్నము కానట్టి, విక్షిప్తమై యుండునట్టి; తే బుద్ధిః, యదా = ఏకాలమునందు; స్థాస్యతి, నిశ్చలా = విక్షేపరూప మగు చలనము లేనిదై, సమాధౌ—సమాధీయతే అస్మిన్ అని సమాధి, ఆత్మ యందనుట, అచలా=అందును వికల్పవర్జితమై, ఇది పరమార్థయోగమునకుఁ గారణము. తదా యోగ మవాప్స్యసి.

శం. ఇట్లు ముముక్షువునకు జ్ఞానయోగసిద్ధి కసాధారణకారణం బగు బాహ్యోపరతిని నిరూపించి యిఁక జ్ఞానయోగము సిద్ధించువిధముం జెప్పుచున్నాఁడు.—శ్రుతి విప్రతిపన్నా—ఋగ్వేదాదు లగు శ్రుతులు ఒక్కచోఁ గర్మవిశేషములను తత్ఫలవిశేషములను తన్మహత్త్వవిశేషములను బ్రతిపాదించుచున్నవి, ఒకచో ఉపాసనవిశేషములను తత్ఫలవిశేషములను తన్మహత్త్వవిశేషములను బ్రతిపాదించుచున్నవి, ఒకచో సగుణబ్రహ్మమును తన్మాహాత్మ్యమును తత్ఫలోత్కర్షముఁ బ్రతిపాదించుచున్నది, ఒకచో నిర్గుణబ్రహ్మమును తద్జ్ఞానమును తన్మాహాత్మ్యమును తత్ఫలోత్కర్షముఁ బ్రతిపాదించుచున్నవి, ఇది యంతయు విన్నవాని కిట్లు విప్రతిపత్తి కలుగును—ఏమి యన్నిటికిఁ బ్రాధాన్యము? సగుణమునకా? నిర్గుణమునకా? లేక రెండింటికిని బ్రాధాన్యము? ఈప్రకారముగా శ్రుతివాక్యములచే, విప్రతిపన్నము—సంశయావిష్ట మగు; తే బుద్ధిః; ప్రజ్ఞావిశేషముచే శాస్త్రమునంతయు విచారించి శ్రుతిస్మృతియుక్తి బలముచేతను గురూపదేశముచేతను "సర్వే వేదా యత్పద మామనన్తి" అను న్యాయంబున సమస్తశాస్త్రమునకును నిర్విశేషబ్రహ్మమునందే మహాతాత్పర్యము నిశ్చిత మగుచున్న దని తెలిసి విప్రతిపత్తుల నన్నిటిని విడిచి; నిశ్చలా = నిర్విశేష మయి; సమాధౌ = సమాధీయతే అస్మిన్ అని సమాధి యనఁగా పరబ్రహ్మము, దానియందు; తదాకారమునసే, అచలా = చలనహేతువు లగు బాహ్యవాసనలు నశించుటవలన అవిక్రియమై నిశ్చలమై; యదా స్థాస్యతి; తదా; యోగమ్—ప్రజ్ఞాస్థైర్యరూపమును; అవాప్స్యసి.

లేక. "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ, సర్వం బ్రహ్మైత దాత్మ్య మిదం సర్వమ్, సద్ధీదం సర్వం చిద్ధీదం సర్వమ్ * తత్త్వమసి, అయ మాత్మా బ్రహ్మ, త

* సత్తు—ఉన్నది గదా యివి యంతయు, చిత్తు—ప్రకాశించునది గదా యివి యంతయు.

చేత దృష్టిన్తే పూర్వ మనపర మనన్తర మబాహ్యమ్, బ్రహ్మై వేదం సర్వమ్ ఇ ఇత్యాదు లగు శ్రుతులచే సర్వమును బ్రహ్మమాత్రమే యను జ్ఞానము గలిగించువానిచే విశేషప్రతిపత్తి గలది యేదో అది శ్రుతి విప్రతిపన్నము, సర్వం బ్రహ్మై వేత్యాది శ్రుతులచే కలిగింపఁబడిన విశేషజ్ఞానము గలది యని యర్థము; అందువలననే, నిశ్చలా = విక్షేపము లేనిది, పరమార్థవాక్యముచేతఁగాని అధిష్ఠానసందర్శనముచేఁ గాని పుట్టునట్టి బుద్ధికి విప్రతిపత్తిగాని విక్షేపముగాని యెట్లు సంభవించును? కావున, ఇట్లు చక్కఁగ శ్రవణముతోను మననముతోను గూడిన, తే బుద్ధిః; సమాధౌ=అసంప్రజ్ఞాతసమాధియందు; అచలా = గాలి లేనిచోట నుండు దీపమువలె నిశ్చలమయి; యదా = ఏకాలమునందు, చిత్తపరిపాకావస్థయందు; స్థాస్యతి=నిలువఁగలదో; తదా, త్వమ్, యోగమ్ = జ్ఞానయోగమును, ప్రతిబంధము లేనియట్లు; అవాప్స్యసి, యోగారూఢుఁడవు కాఁగల వని యర్థము.

మ. అంతఃకరణశుద్ధిచే నిట్లు నిర్వేదము నొందినవాని కెప్పుడు జ్ఞానప్రాప్తి యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—తే = నీయొక్క; బుద్ధిః; శ్రుతివిప్రతిపన్నా—శ్రుతి = నానావిధఫలశ్రవణములచే, తాత్పర్యవిచారము చేయనివానిచే, విప్రతిపన్నా = అనేకవిధసంశయవిపర్యయములు గల దగుటచే, విక్షిప్తమై యుండినది మున్ను; యదా = ఏకాలమునందు; అంతఃకరణశుద్ధిచేఁ బుట్టిన వివేకముచే జనితమయిన దోషదర్శనముచేత ఆవిక్షేపమును విడిచి; సమాధౌ = పరమాత్మయందు; నిశ్చలా = జాగ్రత్స్వప్నదర్శనరూప మయిన విక్షేపము లేనిదై; అచలా = సుషుప్తి మూర్ఛ స్తబ్ధత ఇత్యాదిరూప మయిన లయము అను చలనము లేనిదై; స్థాస్యతి—లయవిక్షేపములు అను దోషములు వీడి సమాహిత మగునో అని యర్థము; లేక; నిశ్చలా = అసంభావనావిపరీతభావనలు లేనిదై; అచలా = దీర్ఘకాలా ~~[illegible]~~ నైరంతర్య సత్కార~~సేవనములచే~~ (ంబులతో సేవింపబడుటచే) విజాతీయప్రత్యయవర్జితమై; నిర్వాతదీపమువలె, ఆత్మయందు, స్థాస్యతి అని యర్థము; తదా = ఆకాలమునందు; యోగమ్ = జీవపరమాత్మైక్యరూప మయిన తత్త్వమస్యాదివాక్యజన్య మగు అఖండసాక్షాత్కారమును సర్వయోగములకును ఫలమైనదాని; అవాప్స్యసి. అప్పుడిఁక సాధింపఁ దగినది మఱి యేదియు లేకపోవుటవలనఁ గృతకృత్యుఁడవు స్థితప్రజ్ఞుఁడవు కాఁగల వని యభిప్రాయము.

శ్రీ. అందువలనను. శ్రుతివిప్రతిపన్నా.—శ్రుతి=నానావిధములగు వైదిక లౌకికార్థముల శ్రవణములచేత, విప్రతిపన్నా = ఇంతకు మున్ను విక్షేపము గలిగి

యున్న దగు; తే బుద్ధిః; యదా; సమాధౌ = సమాధీయతే చిత్త మస్మిన్ అని సమాధి యనఁగాఁ బరమేశ్వరుఁడు, వానియందు నిశ్చలా = ఇతరవిషయములచే ఆకర్షింపఁబడనిదై; కావున నే, అచలా = అభ్యాసపాటవముచే వానియందే స్థిరము అయినదై; స్థాస్యతి. తదా, యోగమ్ = యోగఫలమును; అవాప్స్యసి.

ప. ఇఁక ఇదియే పరమేశ్వరప్రాప్తికి నిమిత్తమని చెప్పుచున్నాఁడు.—శ్రుతి విప్రతిపన్నా—శ్రుతి యనఁగా ప్రరోచనార్థ * మగు ఫలశ్రుతి, దానియందు, విప్రతిపన్నా = ఆదరము విడిచినది, ఇట్టిదైన, తే బుద్ధిః. సమాధీయతే = సమ్యక్ ఆధీయతే చిత్త మస్మిన్ అని సమాధి యనఁగా పరమేశ్వరరూపము, దానియందు; నిశ్చలా = నిశ్చయము గలదై; కావున నే, అచలా = విక్షేపము లేనిదై; యదా, స్థాస్యతి = నిలిచిన దగునో; తదా, యోగమ్ = ఆపరమేశ్వరుని సాన్నిధ్యమును; అవాప్స్యసి.

రా. "యోగే త్విమాం శృణు" ఇత్యాదికముచేఁ బ్రతిపాదింపఁబడినదియు ఆత్మతత్త్వజ్ఞానపూర్వకంబును బుద్ధివిశేషముచే సంస్కృతము నగు ధర్మానుష్ఠానంబునకు ఉద్దేశ్యభూత మయిన యోగాఖ్యఫలముఁ జెప్పుచున్నాఁడు.—శ్రుతి విప్రతిపన్నా—శ్రుతి యనఁగా శ్రవణము ♦, మావలన వినుటచే విశేషముగా తెలియఁబడినది, ఇతరము లన్నిటికిని విజాతీయమును నిత్యమును నిరతిశయము నగు సూక్ష్మ మయిన ఆత్మతత్త్వము విషయముగాఁ గలది; తాను, అచలా = ఏకరూప మయినది; అట్టిదై; బుద్ధిః = జ్ఞానము; తే = నీయొక్క; సమాధౌ = ఫలాభిసంధిలేక కర్మ మనుష్ఠించుటచే నిర్మలీకృత మయిన మనస్సునందు; యదా = ఎప్పుడు; నిశ్చలా = చలనములేనిదై; స్థాస్యతి = నిలుచునో; తదా = అప్పుడు; యోగమ్ = ఆత్మావలోకనమును ‡; అవాప్స్యసి = పొందఁగలవు. ఇది యభిప్రాయము—శాస్త్రజన్య మయిన ఆత్మజ్ఞానముతోఁ గూడిన కర్మయోగము స్థితప్రజ్ఞత యను జ్ఞాననిష్ఠను గలిగించును. జ్ఞాననిష్ఠారూప మయిన స్థితప్రజ్ఞతయే యోగాఖ్య మగు ఆత్మావలోకనంబును గలుగఁజేయుచున్నది. అని.

---

* రుచిపుట్టించుట ప్రయోజనముగాఁ గలది.

♦ వినుట.

‡ ఆత్మను జూచుట.

మాయొద్ద శ్రవణము చేయుటచే విశేషముగా గ్రహింపఁబడిన యాత్మతత్త్వవిషయకజ్ఞానము కర్మయోగానుష్ఠానముచే నిర్మల మయిన నీమనస్సునందు నిశ్చలముగా నిలుచునేని అప్పుడు నీకు ఆత్మావలోకనము [illegible] తాత్పర్యము.

మా॰ దానినే స్పష్టీకరించుచున్నాఁడు.—శ్రుతివి[illegible] = మున్ను, వేదములతో విరుద్ధ మయినది, నీబుద్ధి; యదా = ఎప్పుడు; [illegible] మయిన తత్త్వనిశ్చయమునంజేసి యసచ్ఛాస్త్రములచేతఁగూడ, నిశ్చ[illegible]దగునో, అందువలన, సమాధౌ = సమాధియందు; అచలా = బ్రహ్మప్ర[illegible]ముచే భేదివాయించినను చలింపనిది యగునో, పరమానందమగ్న మగు[illegible], తదా = అప్పుడు యోగమ్ అవాప్స్యసి—ఉపాయముచే సిద్ధిఁ బొందినవాఁడ వగుదు వని యర్థము.

ఇదివఱకు వేదార్థమునకు విరుద్ధముగానుండిన నీబుద్ధి యెప్పుడు వేదార్థసిద్ధాంతమును జక్కఁగాఁ దెలిసి యందు దృఢవిశ్వాసముచేత విరుద్ధశాస్త్రములకు లోఁబడక నిశ్చలమయి, సమాధియందు * కొంచెమేని భేదధ్వనికిఁగూడఁ జలనము నొందకుండునో, అప్పుడు నీవు యోగఫలము నొందినవాఁడ వగుదు వని తాత్పర్యము.

అర్జున ఉవాచ.—

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్. ౫౪

భా॰ ప్రశ్నమున కవసరము నొంది యర్జునుండు పలికెను లబ్ధసమాధిప్రజ్ఞునిలక్షణము నెఱుంగఁ గోరినవాఁడై—స్థితప్రజ్ఞస్య—స్థితము ప్రతిష్ఠితము « నేను బరబ్రహ్మ మను" అను ప్రజ్ఞ యెవనికో అతఁడు స్థితప్రజ్ఞుఁడు, వానికి; కా భాషా = ఏమి భాషణము—మాట? ఎట్లితఁడు పరులచేఁ జెప్పఁబడుచున్నాఁడు? సమాధిస్థస్య=సమాధియందున్న వానికి; కేశవ= కృష్ణా! స్థితధీః = స్థితప్రజ్ఞుఁడును; తానుగాని, కిం ప్రభాషేత = ఎట్లు పలుకును? కిమ్ ఆసీత = ఎట్లు ఉండును? కిం వ్రజేత = ఎట్లు చరించును? భాషణము ఆసనము వ్రజనము గాని అతని కెట్లు? అని యర్థము. స్థితప్రజ్ఞుని లక్షణము నీ శ్లోకముచే నడుగుచున్నాఁడు.

---

* పరమేశ్వరధ్యానమునందు.

సమాధిస్థితుం డగు జ్ఞానియొక్క లక్షణ మేమి? అతని భాషణము ఆసనము చర్య యెట్లుండును? అని యర్జునుం డడిగె నని తాత్పర్యము.

ఆ. సన్న్యాసికి జ్ఞాననిష్ఠాప్రాప్తి చెప్పుట ప్రశ్నమున కవసరము. అడుగుచున్న యర్జునుని యభిప్రాయముఁ జెప్పుచున్నారు లబ్ధేత్యాదిగా. లబ్ధ = పొందఁబడిన, సమాధి = ఆత్మయందు, ప్రజ్ఞుని= పరమార్థదర్శనము గలవానియొక్క, లేక, పొందఁబడిన సమాధానముచే ఆత్మదర్శనము గలవానియొక్క. ఓయీ! ఆతని భాష అతనికార్యమున కనురూపముగా నుండును, ఎందు కది తెలియఁ గోరుట? అనఁగా చెప్పుచున్నాఁడు ఎట్లు ఇత్యాదిగా. జ్ఞాననిష్ఠుని లక్షణము చెప్ప తలంపుచేఁ బ్రశ్నము నుద్ఘాటించి యాసిద్ధుని సాధనము తెలుపఁగోరినవారై విశేషణము చేయుచున్నారు సమాధిస్థస్య అని. వాని యర్థక్రియనే యడుగుచున్నాఁడు స్థితధీరిత్యాదిగా. ప్రశ్నాక్షరములకు వ్యాఖ్యానము చేసి వాక్యార్థము చెప్పుచున్నారు. స్థితప్రజ్ఞుని ఇత్యాదిగా.

హ. యోగము నొందినవాని లక్షణము తెలియఁగోరి యర్జునుఁడు పలికెను.—స్థితప్రజ్ఞస్య=స్థిరమయిన « నేను బ్రహ్మ » అను ప్రజ్ఞఁ గలవానికి; కాభాషా—భాషణము ఏమి? ఎట్లు ఇతఁడు చెప్పఁబడుచున్నాఁడు? సమాధిస్థస్య = సమాధియందున్నవానికి. కేశవ. స్థితధీః = స్థితప్రజ్ఞుఁడు, కిం ప్రభాషేత = ఎట్టి యర్థముఁ గల శబ్దస్వరూపమును బలుకును? కిమ్ ఆసీత = ఎట్లు ఉండును? కిం వ్రజేత— ఎట్లు నడచు నని యర్థము. స్థితప్రజ్ఞుని లక్షణము ఈశ్లోకమున నడుగఁబడుచున్నది.

శం. శ్రవణ మననములచే నాత్మతత్త్వము దెలిసిన విద్వాంసునకు సమాధిచే ప్రజ్ఞ స్థిర మగు నని విని స్థితప్రజ్ఞునిలక్షణము దెలియఁ గోరినవాఁడై యర్జునుం డడుగుచున్నాఁడు —స్థితప్రజ్ఞస్య = స్థితము—బ్రహ్మాకారముచే నిశ్చలము బాహ్యస్పర్శము లేనిది అగు, ప్రజ్ఞ—బుద్ధి యెవ్వనికో అతఁడు స్థితప్రజ్ఞుఁడు ఆరూఢుఁడు, అతనియొక్క, భాషా = భాషణము, కా = ఎవ్వడు సిద్ధించును? సమాధిస్థస్య = నిత్యము నిరంతరము నియమంబున సమాధి చేయునట్టివానియొక్క, సమాధినిష్ఠానిరతుఁ డగు విద్వాంసుఁడు పండితులచే ఇతఁడు స్థితప్రజ్ఞుఁ డని యెప్పుడు చెప్పఁబడు నని యర్థము. స్థితధీః = స్థితప్రజ్ఞుఁడు; తాను, కిం ప్రభాషేత, కిమాసీత, కిం వ్రజేత—ఎట్లు చరించును? ఎట్లు ఉండును? ఏమి పలుకును? అని యర్థము.

ప. ఇట్టవసరమునొంది స్థితప్రజ్ఞుని లక్షణము నెఱుంగుటకై యర్జునుండు పలికెను ఏవి జీవన్ముక్తునిలక్షణంబులో అవియే గదా ముముక్షువులకు మోక్షోపాయభూతము లని తలంచినవాఁడై.—స్థితప్రజ్ఞస్య = స్థితము—నిశ్చలము అహం బ్రహ్మాస్మి యను ప్రజ్ఞ యెవనికో అతఁడు స్థితప్రజ్ఞుఁడు, అతఁడు రెండవస్థలు గలవాఁడు సమాధిస్థుఁడు వ్యుత్థితచిత్తుఁడు § అని, కావున విశేషణము చేయుచున్నాఁడు సమాధిస్థస్య అని. సమాధిస్థుఁడైన స్థితప్రజ్ఞునియొక్క; భాషా కా? కర్మార్థమున షష్ఠి, భాష్యతే అనయా—దీనిచే భాషింపఁబడును అని భాష యనఁగా లక్షణము, సమాధిస్థుఁ డగు స్థితప్రజ్ఞుని ఏలక్షణముచే నితరులు వ్యవహరింతురు? అని యర్థము. వ్యుత్థితచిత్తుం డగు, స్థితధీః = స్థితప్రజ్ఞుఁడు; తాను, కిం ప్రభాషేత—స్తుతినిందాదులందు అభినందనము ద్వేషము మొదలగు లక్షణము గల వాక్యే ఎట్లు పలుకును? అట్లు, కిమాసీత—సమాధి బహిర్ముఖ మయిన చిత్తమునుయద్గ్రహించుటకు ఎట్లు బహిరింద్రియములనిగ్రహము చేయుచున్నాఁడు? అట్టి నిగ్రహ లేనియప్పుడును, కిం వ్రజేత = ఎట్లు విషయములఁ బొందుచున్నాఁడు? అత్యర్థ చేయుభాషణము ఆసనము వ్రజనము మూఢజనవిలక్షణములు గదా! అవి యెట్టి యని యర్థము. ఇట్లు నాలుగుప్రశ్నములు. సమాధిస్థుఁ డగు స్థితప్రజ్ఞునివిషయమై యొకటి, వ్యుత్థితునివిషయ మయి మూఁడు. కేశవ యని సంబోధించుటచే సర్వాంతర్యామి వగుటను నీవే యిట్టి రహస్యముఁ జెప్ప సమర్థుఁడ వని సూచించుచున్నాఁడు.

శ్రీ. పూర్వశ్లోకమునందుఁ జెప్పఁబడిన యాత్మతత్త్వజ్ఞుని లక్షణముఁ దెలియఁ గోరినవాఁడై యర్జునుఁడు పలికెను—స్వాభావిక మయిన సమాధియందున్నవాఁడు, కావుననే, స్థితము—నిశ్చల మగు ప్రజ్ఞ బుద్ధి యెవనికో వానికి; కా భాషా? భాషింపఁబడును దీనిచేత అని భాష, లక్షణ మని యర్థము. ఏలక్షణముచే స్థితప్రజ్ఞుఁ డని చెప్పఁబడు నని యర్థము. అట్లు, స్థితధీః, ఎట్లు భాషణమును ఆసనమును వ్రజనమును జేయు నని యర్థము.

ప. ఇఁక సమాధియందు స్థిరబుద్ధి యగువానిస్వరూపము నర్జునుం డడుగుచున్నాఁడు.—చెప్పఁబడుచున్నాఁడు దీనిచేత అనువ్యుత్పత్తిచే భాషయనఁగా లక్షణము. పురుషుఁడు స్థితప్రజ్ఞుఁ డనియే లక్షణములచేఁ జెప్పఁబడుచున్నాఁ డని

§ సమాధినుండి లేచినవాఁడు.

యర్థము. అట్లు, సమాధిస్థునకుఁగూడ ఏమి లక్షణము? స్థితప్రజ్ఞుని సమాధిస్థునిఁగాని యేలక్షణములచే నెఱుంగవలెను? పరులబుద్ధి యప్రత్యక్ష మగుటవలన దర్శనమాత్రమున నెట్లు వారిస్వరూపము దెలియవచ్చును? అనఁగా—బుద్ధిమంతుఁడాకారముచేతనే మనోగతము నెఱుంగఁ గలఁడు. అట్లు « ఉదీరితో౽ర్థః పశునాపి గృహ్యతే హయాశ్చ నాగాశ్చ వహన్తి నోదితాః । అనుక్తమప్యూహతి పణ్డితో జనః పరేఙ్గితజ్ఞానఫలాహి బుద్ధయః » * అని చెప్పఁబడుచున్నది. ఇఁక వ్యవహారముచేతఁగాని తల్లక్షణము నడుగుచున్నాఁడు—స్థితధీః, కిం ప్రభాషేత = ఎట్లు మాటలాడును? కి మాసీత = ఎట్లు కూర్చుండును? కిం వ్రజేత = ఎట్లు నడచును? అని ప్రశ్నార్థము.

రా. ఇట్లు చెప్పఁబడినవాఁడై పార్థుం డసంగకర్మానుష్ఠానరూప మయిన కర్మయోగముచే సాధ్యంబును యోగమునకు సాధనంబు నగు స్థితప్రజ్ఞతయొక్క స్వరూపమును స్థితప్రజ్ఞుం డనుష్ఠించువిధంబును అడుగుచున్నాఁడు.—సమాధిస్థస్య, స్థితప్రజ్ఞస్య, కా భాషా = ఏది వాచకమైన శబ్దము? § అతని స్వరూపం బెట్టి దని యర్థము. స్థితధీః = స్థితప్రజ్ఞుఁడు; ఎట్టి భాషణాదికమును జేయుచున్నాఁడు? స్థితప్రజ్ఞునిస్వరూప మెట్టిది? మఱియు నతఁడు చేయుభాషణాదిక మెట్టిది? వచియింపు మని తాత్పర్యము.

మా. స్థిత మైన ప్రజ్ఞ—జ్ఞానము గలవాఁడు స్థితప్రజ్ఞుఁడు, భాషా—దీనిచే భాష్యతే—చెప్పఁబడుచున్నాఁడు, లక్షణ మని యర్థము. చెప్పఁబడిన లక్షణము ననువదించుచున్నాఁడు లక్షణాంతరము నడుగుచున్నా నని తెలుపుటకు సమాధిస్థస్య అని. కమ్—బ్రహ్మను, ఈశమ్—రుద్రుని, వర్తయతి—వర్తింపఁజేయుచున్నాఁడు కావున కేశవుఁడు. అట్లే గదా నిరుక్తి చేయఁబడినది హరివంశములయందుఁ గైలాసయాత్రాప్రకరణమున. « హిరణ్యగర్భః కః ప్రోక్తః ఈశః శ్శఙ్కర ఏవచ । సృష్ట్యాదినా వర్తయతి తౌ యతః కేశవో భవాన్ » ¶ అను వచనాంతరమువలనఁ

* చెప్పఁబడిన యర్థము పశువుచేతఁగూడ నెఱుంగఁబడుచున్నది, గుఱ్ఱములును ఏనుంగులును గూడఁ బ్రేరింపఁబడినవై మోయుచున్నవి. పండితుఁడు చెప్పఁబడని దానినిగూడ నూహించును. ఏలయనఁగా బుద్ధులు పరులయింగితము నెఱుంగుటయే ఫలముగాఁ గలవి.

§ అతని వచించు శబ్దము.

¶ కః అనఁగా బ్రహ్మదేవుఁడు చెప్పఁబడును, ఈశః అనఁగా శంకరుఁడు, నీవు వారలను సృష్ట్యాదివ్యాపారముచే వర్తింపఁజేయుదువు కావున కేశవుఁడ వయితివి.

గూడ. కి మాసీత—దేనినిగూర్చి యుండును? అర్జునుఁడేమో తల్లక్షణాదికము నెఱుఁగనివాఁడు కాఁడు. « జానన్తి పూర్వరాజానో దేవర్షయ స్తథైవచ। తథాఽపి ధర్మాన్ పృచ్ఛన్తి వార్తాయై గుహ్యవిత్తయే॥ న తే గుహ్యాః ప్రతీయన్తే పురాణే ష్వల్పబుద్ధినామ్ » ♦ అను వచనమువలన.

శ్రీ భగవానువాచ.—

ప్రజహాతి యదా కామాన్ సర్వా న్పార్థ మనోగతాన్
ఆత్మ న్యేవాఽఽత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. ౫౫

భా. ఎవఁడే మొదటనే కర్మములను సన్న్యసించి జ్ఞానయోగనిష్ఠ యందుఁ బ్రవర్తించెనో, యెవ్వఁడు మఱి కర్మయోగముచేఁ బ్రవర్తించెనో వారలకు § ప్రజహాతీత్యాదిగా నధ్యాయపరిసమాప్తివఱకు స్థితప్రజ్ఞలక్షణంబును సాధనంబును ఉపదేశింపఁబడుచున్నది. అంతటనే గదా యధ్యాత్మశాస్త్రమునందుఁ గృతార్థునిలక్షణము లేవో యవియే సాధనములుగా నుపదేశింపఁబడుచున్నవి, యత్నసాధ్యము లగుటవలన. ఏవి యత్నసాధ్యము లయి సాధనములును లక్షణములును అగుచున్నవో అవి శ్రీభగవంతుఁడు చెప్పెను.—ప్రజహాతి = చక్కఁగా విడుచుచున్నాఁడు; యదా = ఏకాలమునందు; సర్వాన్ = సమస్తము లయిన; కామాన్ = ఇచ్ఛావిశేషములను; పార్థ = అర్జునా! మనోగతాన్ = మనస్సునందుఁ బ్రవేశించినవానిని; సర్వకామములను విడిచినయెడ, సంతోషకారణము లేమివలన శరీరధారణనిమిత్తము * శేషించి యుండునపుడు ఉన్మత్త ప్రమత్తునకుంబోలెఁ బ్రవృత్తి సంభవించును అనఁగా అందుకుఁ జెప్పఁబడుచున్నది.—ఆత్మన్యేవ = ప్రత్యగాత్మయందే; ఆత్మనా = తనచేతనే, బాహ్యలాభము నపేక్షింపకయే; తుష్టః = పరమార్థదర్శనామృతరసము లభించుటచే ఇతరమునెడ అలంబుద్ధి ‖

♦ పూర్వరాజులును దేవర్షులును ఎఱుంగుదురు అయినను ధర్మముల నడుగుచున్నారు ప్రసిద్ధికొఱకును రహస్యము తెలియుటకొఱకును. పురాణములయం దారహస్యములు అల్పబుద్ధులకుఁ దెలియరావు.

§ స్థితప్రజ్ఞస్య ప్రజహాతీత్యాదిగా అని పాఠాంతరము.

* ప్రారబ్ధము.

‖ వలదు అనుబుద్ధి.

గలవాఁడై. తదా = అప్పుడు; స్థితప్రజ్ఞః = స్థితము స్థిరము ఆత్మానాత్మ వివేకజన్య మయిన ప్రజ్ఞ యెవనికో అతఁడు స్థితప్రజ్ఞుఁడు, విద్వాంసుఁడు అని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు. పుత్త్రవిత్తలోకైషణలు విడిచినవాఁడు సన్న్యాసి ఆత్మారాముఁడు ఆత్మక్రీడుఁడు నగువాఁడు స్థితప్రజ్ఞుఁ డని యర్థము.

అర్జునా! ఎప్పుడు మనస్సునందుఁ గలుగునట్టి కామములను సమస్తములను సంపూర్ణముగా విడిచి యితరలాభ మేదియు నపేక్షింపక ప్రత్యగాత్మయందే తనయంతఁ దానే యానందించుచుండువాఁ డగునో అప్పుడు స్థితప్రజ్ఞుఁ డని చెప్పఁబడు నని తాత్పర్యము.

ఆ. ప్రతివచనప్రస్తావనార్థమై పాతనికను § జేయుచున్నారు ఎవ్వఁడే నిత్యాదిగా. ఏన్ అనుటచే కర్మసన్న్యాసమునకుఁ గారణ మయిన వైరాగ్యసంపత్తి సూచింపఁబడుచున్నది. మొదటనే — బ్రహ్మచర్యావస్థయందే యనుట. జ్ఞానమే యోగము బ్రహ్మాత్మభావము పొందించుటవలన, దానియందు నిష్ఠ — పరిసమాప్తి, దానియం దని యర్థము. కర్మయోగముచే — కర్మమే యోగము దానిచేత, కర్మముల సన్న్యసింపక, అజ్ఞాననిష్ఠయందే యని శేషము. ఓంయా! అది యెట్లు ఒక వాక్యముచే రెం డర్థము లుపదేశింపవచ్చును? అర్థభేదముచే వాక్యభేదం బగును గదా! మఱియు లక్షణమే సాధనం బనుటయుఁ జెల్లదు, ఏల యనఁగా, కృతార్థుని లక్షణము అతనిస్వరూప మగుటచే ఫలమై యుండఁగా దాని సాధన మనుట యుపపన్నము కాదు. అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు అంతటనే ఇత్యాదిగా. కృతార్థుఁ డగు జ్ఞానికేమో జ్ఞానలక్షణము స్వరూపమయి ఫల మగుటవలన సాధనము కాఁ జాల దనుట సరే. అయినను జిజ్ఞాసువున కదియే ప్రయత్నసాధ్య మగుటవలన సాధన మగుచున్నది. లక్షణముగూడ ఇచట జ్ఞానసామర్థ్యమునం బొందఁబడినది యనువదింపఁబడుచున్నది కాని విధింపఁబడదు, విద్వాంసుఁడు విధినిషేధములకు అవిషయ మగుటవలన. అందుచే జిజ్ఞాసువునకు సాధన మనుష్ఠించుటకై లక్షణ మనువదింపఁబడిన దగుటవలన సాధనానుష్ఠానమం దొక్కటనే తాత్పర్యమని యర్థము. ఈచెప్పిన యర్థమునందు భగవద్వాక్య మెత్తుచున్నారు ఏవి ఇత్యాదిగా. లక్షణములును — జ్ఞానసామర్థ్యలభ్యములై అప్రయత్నసాధ్యములై యని శేష

§ ఈ పాఠ్యాంతరము.

ము. స్థితప్రజ్ఞస్య కా భాషా అను మొదటిప్రశ్నకు త్తరము చెప్పుచున్నాఁడు ప్రజహా తీత్యాదిగా. చక్కఁగా విడుచుట యనఁగా వాసనారాహిత్యము. కామములు ఆత్మ నిష్ఠము లని కొందఱు చెప్పెదరు, అది అయుక్తము, అవి మనోనిష్ఠము లని శ్రుతి చెప్పుటవలన. అను నభిప్రాయముతోఁ జెప్పుచున్నాఁడు మనోగతాన్ అని. ఆత్మ న్యే వాత్మనా తుష్టః అను నుత్తరభాగముచే నిరసింపఁ దగిన ఆక్షేపము ననువదించుచున్నారు సర్వకామములను ఇత్యాదిగా. అప్పుడు ప్రవర్తకము ✠ లేమివలన, విద్వాంసునకు సర్వప్రవృత్తియు నుపశాంత మగును. అనఁగా అట్లు కా దని చెప్పుచున్నాఁడు శరీరధార ణేత్యాదిగా. ఉన్మాదవంతుఁడు ఉన్మత్తుఁడు, వివేకవిరహితుఁడై బుద్ధిభ్రాంతి నొందినవాఁడు. మిక్కిలి మదము గలవాఁడై ఉన్న వివేకముఁగూడ విడిచి భ్రాంతునియట్లు వ్యవహరించుచుండువాఁడు ప్రమత్తుఁడు. అని విభాగము. ఉత్తరార్ధము దీసి వ్యాఖ్యానము చేయుచున్నారు చెప్పఁబడుచున్నది అని. ఆత్మన్యేవ అనుచోటి యేవకారమునకు ఆత్మనా అనుచోటఁగూడ సంబంధమును దెలుపుచున్నారు తనచేతనే అని. బాహ్యలాభము నపేక్షింపక సంతోషించుటనే స్పష్టీకరించుచున్నారు పరమార్థేత్యాదిగా. ప్రజ్ఞాప్రతిబంధకము లయిన సర్వకామములును విరమించిన యవస్థ తదా అనుదానిచే నిర్దేశింపఁబడుచున్నది. స్థితప్రజ్ఞపదమును విభజించుచున్నారు స్థితము ఇత్యాదిగా. చెప్పినదానినే వివరించుచున్నారు వృత్తివి త్తేత్యాదిగా. ఆత్మను దెలియఁ గోరినవాఁడై వైరాగ్యద్వారమున సర్వైషణాత్యాగరూప మగు సన్న్యాసము నొంది శ్రవణాదుల ఆవృత్తిచే ♦ ఆత్మజ్ఞానము నొంది ఆయాత్మయందే నిరంతరస్థితిచే విషయవిముఖుఁడై తత్ఫలభూతమయిన పరితుష్టిని అందే పొందుచున్నవాఁడు స్థితప్రజ్ఞుఁ డని పేర్కొనఁబడు నని యర్థము.

హ. *

శ్లో. సిద్ధునిలక్షణము లేవో అవియే సాధకునకు సాధనములు ప్రయత్నముచే సంపాదింపఁదగినవి, ఏవి సిద్ధించిననే విద్వాంసునకుఁ బ్రజ్ఞాస్థైర్యంబును విదేహకైవల్యంబును సిద్ధించునో వానిని అందువలననే ముముక్షువు యత్నంబున సాధింపవలె

✠ ప్రవర్తింపఁజేయునది.

♦ పెక్కుమార్లు చేయుటచే.

* శంకరభాష్యముతో సమానము.

నని సూచించుటకై యధ్యాయపరిసమాప్తిపర్యంతము అవియే ప్రతిపాదింపఁబడు చున్నవి. అందు మొదటఁ బ్రథమప్రశ్నమున కుత్తరముఁ జెప్పుచున్నాఁడు శ్రీభగవంతుఁడు.—శ్రవణాదికముచే చక్కఁగా ఆత్మతత్త్వము దెలిసినవాఁడై ముముక్షువు సమాధియందున్నవాఁడై, మనోగతాన్ —« మనసైవానుద్రష్టవ్యమ్ » అను శ్రుతివలన ఆత్మస్వరూపప్రకాశనమునకు ఒకటే కారణ మయిన మనస్సునందే ఉన్నవానిని; కామాన్ = కామయన్తి—కోరుచున్నవి కావున కామములు అనఁగా విషయభోగేచ్ఛలు, వానిని; సర్వాన్; యదా = ఏకాలమునందు, సమాధిసిద్ధి యవస్థయందు; ప్రజహాతి = నిశ్శేషముగాఁ బరిత్యజించునో. విషయాశలను నిశ్శేషముగాఁ బరిత్యజించుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు—స్వతస్సిద్ధంబును నిత్యకూటస్థాసంగచిద్రూపంబును నేత్రమునకు రూపమువలె సర్వత్ర కనఁబడు చున్నదియు ఆనందైకరసంబు నగు, ఆత్మని = స్వస్వరూపమునందు; క్రీడించు చున్న బ్రహ్మవిదుండు, ఆత్మనా = ఈచెప్పిన లక్షణము గల స్వస్వరూపముచేతనే. తుష్టః = స్వాత్మానందరసానుభవముచేతనే సంతోషమును దృప్తిని పొందినవాఁడై, అమృతరసపానము చేసినవాఁడు లవణోదకముంబోలె తుచ్ఛ మయిన విషయసుఖము నపేక్షింపఁడు. అందువలననే ఆవిషయములందలి కామముల నన్నిటిని బరిత్యజించు చున్నాఁడు. ఎప్పు డిట్టి లక్షణము గలవాఁ డగునో అప్పుడు స్థితప్రజ్ఞుం డితఁ డని పండితులచేఁ జెప్పఁబడు నని యర్థము. « యదా సర్వే ప్రముచ్యన్తే కామా యే ఽస్య హృది స్థితాః » అను శ్రుతియొక్క యర్థ మిందుచేఁ బ్రతిపాదిత మగు చున్నది. ఓయీ! విషయములందుఁ గామోదయమునకుఁ గారణము లుండఁగా అవియుఁ గనఁబడుచుండఁగా విద్వాంసునకుఁగూడ వానియనుభవమునందుఁ గామము కలుగనే కలుగును, నిశ్శేషముగాఁ గామపరిత్యాగము సంభవింపదు. అందు వేని, నిన్నిట నడుగవలెను. విషయములందుఁ గామోదయము ఏమి విషయస్వభావమా? లేక పురుషస్వభావమా? మొదటిది కాదు, తృణపర్ణాదికము కనఁబడినపుడు పురుషునకు భుజింప నిచ్ఛ యుదయింపమివలన. రెండవదియు కాదు, స్త్రీసన్నిధానంబున బాలునకుఁ గామము కనఁబడమివలన. అప్పు డెట్లు కామోదయ మనఁగాఁ జెప్పెదము. ‘ కామ జానామి తే మూలం సఙ్కల్పా త్కిల జాయసే ’ ♦ అను స్మృతివలన, కామము సంకల్పమువలనఁ గలుగుచున్నది. సంకల్పము వాసన

♦ కామమా! నీమూలము నెఱుఁగుదును. సంకల్పమువలనఁ గదా పుట్టుచున్నావు.

వలనఁ గలుగుచున్నది. ఎట్లనఁగా, వాసన లేక వస్తువునందు సమీచీనత్వబుద్ధి ♦ కలుగదు. సమీచీనత్వబుద్ధి లేక కామముగూడ కలుగదు. అందువలనఁ గామోత్పత్తికిఁ గారణము విషయములందు భోగ్యత్వవాసనయే *. వాసన యనఁగా భోగమువలనఁ గలుగు సంస్కారము. భోగ్యత్వవాసనాబలమువలననే విషయములందుఁ గామంబును బ్రవృత్తియును జంతువులకుఁ గలుగుచున్నవి. ఇది లోకమునందును శాస్త్రమునందును బ్రసిద్ధము. విద్వాంసునకో నిత్యము నిరంతరము సమాధినిష్ఠయందే యున్నవానికి సదా సర్వత్ర బ్రహ్మమునే చూచుచున్నవానికి విషయగ్రహణము సంభవింపదు. మృద్రూపమునఁ జూచువానికి ఘటగ్రహణము ఎట్లో అట్లు సర్వంబును బ్రహ్మరూపమునఁ జూచువానికి విషయగ్రహణము లేమిఁ జేసి విషయవాసనలు తమయంతనే నశించుచున్నవి. అవి నశింపఁగాఁ గామములు తమయంతనే నశించును. తమయంతనే నశించు కామములయొక్క నాశము గదా విద్వాంసునం దుపచరింపఁబడుచున్నది ప్రజహాతి యదా యని †, వెలుంగుచే నశించుచున్న చీఁకటియొక్క నాశమును సూర్యుఁడు చేయుచున్నాఁ డనునట్లు. అందువలన నిర్వాసనత్వము విద్వాంసునిలక్షణ మని సిద్ధము. అట్టి యీనిర్వాసనత్వమును సాధకుఁడు సమాధిచే సంపాదింపవలె ననియు నేర్పడినది.

వ్యా. ఈ నాలుగుప్రశ్నములకుఁ గ్రమముగా నుత్తరము భగవంతుఁడు వచియించెను అధ్యాయసమాప్తిపర్యంతము.—కామాన్ = కామము సంకల్పము మొదలగు మనోవృత్తివిశేషములను, ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతులు ** లని తంత్రాంతరమునందు ♦♦ అయిదువిధములుగాఁ జెప్పఁబడినవాని; సర్వాన్ = నిశ్శేషములనుగా; యదా, ప్రజహాతి = చక్కఁగా కారణమును బాధించుటచే విడుచుచున్నాఁడో, సర్వవృత్తిశూన్యుఁడే యెప్పుడు అగుచున్నాఁడో. అప్పుడు స్థితప్రజ్ఞుఁడని చెప్పఁబడుచున్నాఁడు, సమాధిస్థుఁ డని శేషము. కామములు అనాత్మధర్మము

♦ ఇది మంచిది యను తలంపు.

* ఇవి భోగ్యము లను వాసనయే.

† అవి తమయంతనే నశించుటంజేసి విద్వాంసుఁడు వానిని విడుచుచున్నాఁ డనుట వాస్తవార్థము కా దనుట.

** ప్రత్యక్షము అనుమానము ఆగమము—ఇవి ప్రమాణములు. విపర్యయము—భ్రాంతి. నిశ్చయము లేనిది వికల్పము. తమోవిషయక మైన వృత్తి నిద్ర. అనుభవింపఁబడినదాని యనుసంధానము స్మృతి.

♦♦ యోగశాస్త్రమునందు.

లగుటచే విడుచుటకు యోగ్యము లనుటం జెప్పుచున్నాఁడు మనోగతాన్ అని. ఆత్మధర్మములే యగునేని విడువ శక్యములు కావు, నిప్పువేఁడిమివలె స్వాభావిక మగుటవలన. ఇవియో మనస్సుయొక్క ధర్మములు, కావున దాని విడుచుటచే విడువ శక్యములే యగు నని యర్థము. ఓయీ! స్థితప్రజ్ఞునకు సంతోషవిశేషము గలదు, అది ముఖప్రసాదము అను హేతువునుబట్టి యనుమానింపఁబడుచున్నది, సర్వకామములు విడిచినచో ఆసంతోషవిశేష మెట్లుపపన్న మగును? అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు—ఆత్మన్యేవ = పరమానందరూపుఁడైన ఆత్మయందే, కాని తుచ్ఛమయిన యనాత్మయందుఁ గాదు; ఆత్మనా = స్వప్రకాశ చిద్రూపమున వెలుంగుచున్న ఆత్మచేత, కాని వృత్తిచేఁ గాదు; తుష్టః = పరితృప్తి నొందినవాఁడు, పరమపురుషార్థలాభమువలన. అట్లు శ్రుతి “యదా సర్వే ప్రముచ్యన్తే కామా యే ఽస్య హృది శ్రితాః। అథ మర్త్యో ఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే” అని. ఈ ప్రకారముగా, సమాధిస్థుఁ డగు స్థితప్రజ్ఞుఁడు ఇట్టి లక్షణము గల శబ్దములచేఁ జెప్పఁబడు నని ప్రథమప్రశ్న కుత్తరము.

శ్రీ. ఇందు ఏవి సాధకునకు జ్ఞానసాధనములో అవియే స్వాభావికములై సిద్ధునకు లక్షణము లగుచున్నవి. కావున సిద్ధునిలక్షణములు చెప్పుచునే అంతరంగ జ్ఞానసాధనములం జెప్పుచున్నాఁడు అధ్యాయపరిసమాప్తిపర్యంతము. అందుఁ బ్రథమప్రశ్న కుత్తరము ప్రజహా తీత్యాదిశ్లోకద్వయముచేత— మనస్సునందున్న సర్వకామములను ఎప్పుడు చక్కఁగా విడుచుచున్నాఁడో. విడుచుటకు హేతువు—ఆత్మన్యేవ = పరమానందరూపుఁడైన తనయందే, ఆత్మనా = తనయంతనే, తుష్టః అని. ఆత్మారాముఁడై యెప్పుడు క్షుద్రవిషయాభిలాషను విడుచుచున్నాఁడో అప్పుడు ఆలక్షణముచే ముని స్థితప్రజ్ఞుఁ డని చెప్పఁబడు నని యర్థము.

ప. అందుకు భగవంతుఁడు క్రమంబున నుత్తరము చెప్పుచున్నాఁడు ప్రజహా తీత్యాదిగా అధ్యాయసమాప్తివఱకు.—ఓపార్థుఁడా! మనోగతాన్ సర్వాన్ కామాన్, ప్రజహాతి = ఆత్యంతికముగా విడుచుచున్నాఁడో. అప్పుడు నిరాలంబముగా మనస్సు నిలువఁజాల దనఁగాఁ జెప్పుచున్నాఁడు—ఆత్మని = ఆనందఘనుఁడైన ఆత్మయందు; ఆత్మనా = తనయంతనే; తుష్టః—ఆత్మసుఖానుభవముచే సంతోషించినవాఁడై, కావుననే, అల్పము లయిన ఆనందములను విడిచినవాఁడు. ఇట్టి యవస్థ యెప్పుడో అప్పుడు స్థితప్రజ్ఞుఁ డని చెప్పఁబడును, ఇట ప్రజ్ఞాశబ్దముచే విజ్ఞా

నమే చెప్పఁబడుచున్నది, స్థిరీభూత మయిన విజ్ఞానము గలవాఁడు జీవన్ముక్తుఁ డని యర్థము. అట్లు శ్రుతియును « యదా సర్వే ప్రముచ్యన్తే కామా యే ఽస్య హృది శ్రితాః । అథ మర్త్యో ఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే » అని. అత్ర—ఈ దేహమునందే, బ్రహ్మానంద మనుభవించుచున్నాఁడు. శేషము స్పష్టము.

రా. వృత్తివిశేషము ప్రతిపాదించుటచే స్వరూపముగూడ ప్రతిపాదితం బగు నని వృత్తివిశేషము చెప్పఁబడుచున్నది.—ఆత్మన్యేవ = ఆత్మయందే, ఉండు నట్టి; ఆత్మనా = మనస్సుచే, ఆత్మయొక్కటే అవలంబముగాఁ గల మనస్సుచే; తుష్టః = సంతోషించినవాఁడై; ఆసంతోషముచే, తద్వ్యతిరిక్తము లయిన, సర్వాన్ కామాన్ = ఎల్లకామములను; యదా = ఎప్పుడు; ప్రజహాతి = చక్కఁగా విడుచుచున్నాఁడో; తదా = అప్పుడు, ఇతఁడు; స్థితప్రజ్ఞుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. ఇది జ్ఞాననిష్ఠకుఁ బరమావధి.

ఆత్మయందే మనస్సును నిలిపి యందుచేతనే సంతోషము నొందినవాఁడై యితరము లగు కామము లన్నిటిని యెప్పుడు నిశ్శేషముగా విడుచుచున్నాఁడో అప్పు డతఁడు స్థితప్రజ్ఞుఁ డని చెప్పఁబడు నని తాత్పర్యము.

ఘా. గమనాదిప్రవృత్తి విషయాదిప్రవృత్తివలె అధిక మయిన యభిసంధిచేఁ గలుగునది కా దని « యా నిశా » ఇత్యాదిశ్లోకముచేఁ దెలుపఁబోవువాఁడై లక్షణమును మొదటఁ జెప్పుచున్నాఁడు.—ఇట్లు పరమానందతృప్తుఁ డగువాఁడు ఎందుకొఱకిట్లు ప్రవృత్తిని జేయుచున్నాఁడు? అని ప్రశ్నయొక్క యభిప్రాయము. ప్రారబ్ధకర్మముచేఁ గొంచెము తిరోహిత మయిన బ్రహ్మము గలవానికి వాసనచేఁ బ్రాయికముగా అల్పాభిసంధిచే ప్రవృత్తి సంభవించు నను నభిప్రాయము గలవాఁడై పరిహరించుచున్నాఁడు—ప్రాయికముగా, సర్వాన్ కామాన్ ప్రజహాతి, శుకాదులకుఁగూడఁ గొంచెము కనఁబడుటవలన. « త్వత్పాదభక్తి మిచ్ఛన్తి జ్ఞానిన స్తత్త్వదర్శినః » * అని చెప్పుటవలన. దానిఁ గోరుచున్నారు. ఎప్పుడుమాత్రము ఇంద్రాదులకు ఆగ్రహము ♦ కనఁబడునో అప్పుడు వారిజ్ఞానము తిరోహిత మని తెలియవలెను. అట్లు చెప్పఁబడినది « ఆధికారికపుంసాంతు బృహ

* తత్త్వదర్శు లగు జ్ఞానులు నీపాదభక్తిని గోరుచున్నారు.

♦ విరుద్ధకామమునం దభినివేశము.

త్కృ-ర్మత్వ కారణాత్ । ఉద్భవాభిభవౌ జ్ఞానే తతో౽న్యేభ్యో విలక్షణాః" * అని. కావుననే వైలక్షణ్యమువలన అధికారికులు కానివారికి అనుగ్రహాదికము కలుగునేని కాను వారు జ్ఞానులని తెలియవలెను. మఱియు నిట సమాధి చేయువానికి లక్షణము చెప్పఁబడమి, «య స్సర్వత్రా నభిస్నేహః» ఇత్యాదిగా స్నేహము నిషేధింపఁబడుటవలన. సమాధి చేయునట్టి యతనికి శుభాశుభప్రాప్తి యెట్లగును. అసంప్రజ్ఞాతసమాధి గలవానికి? సంప్రజ్ఞాత సమాధియందుమాత్రము విరోధము లేదు. అయినను అందే యను నియమము ¶ లేదు. «కామాదయో నజాయన్తే హ్యపి విక్షిప్త చేతసామ్ । జ్ఞానినాం జ్ఞాననిర్ధూతమలానాం దేవసంశ్రయాత్." ❡ అనియు స్మృతి చెప్పుటవలన. మనోగతములు గదా కామములు. కావున అందే తద్విరుద్ధ మయిన జ్ఞాన ముత్పన్న మగుటచే యుక్తము కామపరిత్యాగము అని చూపుచున్నాఁడు మనోగతాః అని. విరోధముగూడఁ జెప్పఁబడుచున్నది. «రసో౽ప్యస్య పరం దృష్ట్వా నివర్తతే» అని. ఇది §§ కనఁబడమిచే నిరాకరింప శక్యము గాదు, పురుషులందు ♦ తారతమ్య ముండుటవలన. ఆత్మనా = పరమాత్మచేత. ఆత్మన్యేవ = పరమాత్మయందే; ఉన్నవాఁడై; ఆత్మాఖ్యుఁడైనవాని యందున్న వానికి వానిప్రసాదమువలననే తుష్టి కలుగుచున్నది. «విషయాం స్తు పరిత్యజ్య రామే స్థితిమత స్సతః । దేవా ద్భవతి నైతుష్టి ర్నాన్యథాతు కథంచన" § అని నారాయణనామకల్పమునందుఁ జెప్పఁబడినది. అందువలన ఆత్మ జీవుఁడు కాఁడు.

మనోగతము లయిన కామము లన్నిటిని విడిచి పరమాత్మయందే మనస్సును నిలిపినవాఁడై యప్పరమాత్మప్రసాదమువలనఁ బరమానందము నొందుచుండువాఁడు స్థితప్రజ్ఞుఁ డని చెప్పఁబడు నని తాత్పర్యము.

---

* అధికారికులగు పురుషులకుమాత్రము గొప్పకర్మము గలవారను కారణమువలన జ్ఞానమునందు ఉద్భవమును అభిభవమును కలుగును. అందువలన వారు ఇతరులకన్న విలక్షణులు.

¶ సమాధియందే కామాద్యభావము అను నియమము.

❡ జ్ఞానముచే నిర్ధూత మయిన మలము గలవారగు జ్ఞానులకు విక్షేపము నొందిన చిత్తము గల వారికిఁగూడ భగవదాశ్రయమువలన కామాదులు కలుగవు.

§§ సాధారణజనులందు.

♦ పండితమూర్ఖులందు.

§ విషయములనుమాత్రము విడిచి రామునం దునికి గలవానికి ఆ దేవునివలన తుష్టి కలిగినే కలుగుచున్నది. వేఱువిధమునమాత్రము ఎట్లును కలుగదు.

దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః
వీతరాగభయక్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే. ౫౬

**భా.** మఱియును. దుఃఖేషు = ఆధ్యాత్మికాదులు ప్రాప్తించినపుడు; అనుద్విగ్నమనాః = ఉద్విగ్నము కానిది క్షుభితము కానిది దుఃఖప్రాప్తి యందు ఎవ్వనిమనస్సో అతఁడు అనుద్విగ్నమనస్కుఁడు; అట్లు, సుఖేషు = సుఖములు ప్రాప్తింపఁగా; విగతస్పృహః = విగతము పోయినది స్పృహ తృష్ణ యెవ్వనికో, అగ్నివలె చిదుగులు మొదలగునవి వేసినపుడు సుఖములు ప్రాప్తించినపుడు పెంపబడి వర్ధిల్లదో, అతఁడు విగతస్పృహుఁడు; వీతరాగభయక్రోధః=విగతము లైనవి పోయినవి రాగము భయము క్రోధము ఎవ్వనినుండియో అతఁడు వీతరాగభయక్రోధుఁడు. అట్టి, మునిః = సన్న్యాసి; స్థితధీః = స్థితప్రజ్ఞుఁడని; అప్పుడు, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

ఎప్పుడు ఇతనికి దుఃఖములు వచ్చినను మనస్సు క్షోభము నొందదో సుఖములు వచ్చినను తృష్ణ కలుగదో మఱియు రాగము భయము క్రోధము ఇతని విడిచి పోవునో అప్పు డాసన్న్యాసి స్థితప్రజ్ఞుఁ డని చెప్పఁబడు నని తాత్పర్యము.

**టీ.** మఱి యొకలక్షణము ననువదించుద్వారమున జిజ్ఞాసువునకే కర్తవ్యాంతరము నుపదేశించుచున్నారు మఱియును అని. జ్వరము శిరోరోగము మొదలగువానిచేఁ గలిగింపఁబడిన దుఃఖములు ఆధ్యాత్మికములు. ఆదిశబ్దముచే వ్యాఘ్రసర్పాదిప్రయుక్తము లగు ఆధిభౌతికములును అతివాత ♦ వర్షాదిప్రయుక్తము లగు ఆధిదైవికములును అను దుఃఖములు గ్రహింపఁబడుచున్నవి. అవి పొందఁబడినను ఉద్విగ్నము కానిది మనస్సు ఎవ్వనిదో అతఁ డని సంబంధము. ఉద్విగ్నము కానిది అనుటకు వ్యాఖ్యానము చేయుచున్నారు క్షుభితము కానిది అని. ఈచెప్పిన దుఃఖములు ప్రాప్తించినపుడు పరిహరింప నసమర్థునకు వాని ననుభవింపవలసివచ్చెనే యను దుఃఖము ఉద్వేగము, దానితోఁ గూడినది ఎవ్వని మనస్సు కాదో అట్టివాఁడని చెప్పుచున్నారు దుఃఖప్రాప్తియందు అని. సుఖములుగూడ దుఃఖములవలె మూఁడువిధము లని యభిప్రాయముతో అట్లు అని చెప్పఁబడినది. అవి ప్రాప్తించినపుడు వానినుండి విగతము పోయినది స్పృహ తృష్ణ యెవ్వనికో అతఁడు విగత

♦ పెనుగాలి.

స్పృహాలుఁడు అని యర్థము. అజ్ఞానికిఁ గదా సుఖములు కలుగఁగా వెంబడి తృష్ణ వృద్ధి నొందును, విద్వాంసునకు అట్లు కాదు అనుటకు వైధర్మ్యదృష్టాంతముఁ జెప్పుచున్నారు అగ్నివలె నిత్యాదిగా. ఎట్లు దహింపఁబడు చిదుగులు మొదలగునవి వేసినపుడు అగ్ని వెంబడిగా వృద్ధిఁ బొందునో అట్లు అజ్ఞునకు సుఖములు వచ్చినపుడు తృష్ణ వెంబడిగా వృద్ధిఁ బొందుచున్నను విద్వాంసున కది వానివెంబడి వృద్ధిఁ బొందదు. అగ్ని దహింపఁబడనివస్తువులు వేసినను వాని దహించుటకు వృద్ధిఁ బొందదు గదా! అందుచే జ్ఞానివు సుఖదుఃఖములందుఁ దృష్టోద్వేగములు వహింపఁగూడ దని యర్థము. రాగాదులుగూడ నతఁడు వహింపరా దని చెప్పుచున్నారు. వీతరాగేత్యాదిగా. అనుభవింపఁబడిన విషయములందు అభినివేశము రంజకరూపమగు తృష్ణావిశేషము రాగము. ఇతరునిచే నపకారము నొందినవానికి గాత్రనేత్రాదులవికారమునకుఁ గారణము భయము. ఇట్టి క్రోధ మనఁగా తన్నుఁ బరవశునిఁగాఁ జేసి తనకుఁగాని బరునకుఁగాని యపకారముసంధింపఁ బ్రవృత్తికి హేతు వగు బుద్ధివృత్తివిశేషము. మునిః మననము చేయువాఁడు అనువ్యుత్పత్తిచే ముని యనఁగా ఆత్మనిష్ఠుఁ డని యంగీకరించి చెప్పుచున్నారు సన్న్యాసి యని. సుఖదుఃఖములందుఁ దృష్టోద్వేగములును రాగాదులును లేని యవస్థ అప్పుడు అనుపదముచేఁ జెప్పఁబడుచున్నది.

హ. *

శం. ఇది ముముక్షువునకు అవశ్యము సాధింపఁబడినసాధన మని సూచించుటకై స్థితునకు మఱియొకలక్షణముఁ జెప్పుచున్నాఁడు.—దుఃఖేషు=దుఃఖము గలిగించునట్టి యుపద్రవములు జ్వరశిరోవేదనాదులగు నాధ్యాత్మికములును చోరసర్పవ్యాఘ్రాదులగు ఆధిభౌతికములును వర్షవాతాతివాతాదులగు అధిదైవికములును సంభవించినపుడు; తాను, అనుద్విగ్నమనాః = అనుద్విగ్నము—ఏమి చేయుదును? ఎటుఁ బోవుదును? అని విక్షేపమును వ్యథయును లేని, మనస్సు ఎవనికో అతఁడు అనుద్విగ్న మనస్కుఁడు, సమాధినిష్ఠచే వానిచేఁ గలంగని చిత్తము గలవాఁ డని యర్థము. అట్లు, సుఖేషు = సుఖము గలిగించునట్టి పుత్త్రలాభాదులు తమయంతనే ప్రాప్తించినపుడు; విగతస్పృహః = విగతము—విశేషించి పోయిన, స్పృహః—రసనాదీంద్రియముల చాపలము గలవాఁడు, ఆత్మానందరసము నాస్వాదించుటయందే

* శంకరభాష్యముతో సమానము.

యుండువాఁ డగుటచే వానియం దాదరము లేనివాఁ డని యర్థము. వీతరాగభయక్రోధః = ఉపకారియందు రాగము—ప్రీతి, మిక్కిలి యపకారియందు క్రోధము—అప్రీతి, మరణజనకమయినది సమీపించినపుడు భయము, ఈమూఁడును స్వాత్మనిష్ఠచే వీతము—ఎవనిచేత పొందఁబడినది కాదో అతఁడు వీతరాగభయక్రోధుఁడు, ప్రీతి అప్రీతి, భయము—వీనికి హేతువు లయినవానికిని తత్కార్యము లయిన ప్రీత్యాదులకును విషయము కానివాఁ డని యర్థము. దుఃఖాదులందు విషాదము మొదలగునవి యుదయింప కుండుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు మునిః అని. విన్నది కన్నది తాఁకినది సమస్తమును బ్రత్యగ్దృష్టిచే బ్రహ్మముగానే, మఱి తే—తెలియుచున్నాఁడు కాని తత్తద్రూపమునఁ గాదు అని, ముని యనఁగా బ్రహ్మనిష్ఠుఁడు; ఇట్టి లక్షణము గలవాఁ డెవ్వఁడో అతఁడు, స్థితధీః = స్థితప్రజ్ఞుఁడు, స్థిరుఁ డని; చెప్పఁబడు నని యర్థము. ఇందుచే దుఃఖాదిబాహ్యధర్మములస్పర్శము లేనివానికే బ్రహ్మనిష్ఠ, బ్రహ్మనిష్ఠ గలవానికే సమ్యగ్జ్ఞానము, సమ్యగ్జ్ఞానము గలవానికే విదేహముక్తి యని సూచితం బగుచున్నది. స్థిరుండు బ్రహ్మవిదుం డగు యతి సంపదలు వచ్చినను ఆపదలు వచ్చినను ఏమియుఁ బలుకఁడు, మఱి యేమనఁగా ఊరకయే స్వాత్మరూపముననుండు నని «కిం ప్రభాషేత» అనుప్రశ్న కుత్తర మియ్యఁబడినది.

వ్యా. ఇప్పుడు వ్యుత్థితుం డగు స్థితప్రజ్ఞునిభాషణమును ఉపవేశనమును గమనమును మూఢజనవిలక్షణము లగువానిం జెప్పవలెను. అందు ‘కిం ప్రభాషేత’ అనుదాని కుత్తరము చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—దుఃఖములు మూఁడు విధములు, శోకమోహజ్వరశిరోరోగాదులచేఁ గలుగునవి యాధ్యాత్మికములు, సర్పాదిప్రయుక్తము లాధిభౌతికములు, అతివాతము అతివర్షము మొదలగువానిచేఁ గలుగునవి యాధిదైవికములు. రజోగుణప్రధానము సంతాపరూప చిత్తవృత్తివిశేషము లగు ఈదుఃఖములు ప్రారబ్ధకర్మముచేఁ గలిగింపఁబడినపుడు; ఉద్విగ్నము కానిది దుఃఖపరిహారము చేయు సామర్థ్యము లేమిచే వ్యాకులము కానిది యెవ్వని మనస్సో అతఁడు అనుద్విగ్నమనస్కుఁడు. అవివేకికిఁ గదా దుఃఖము వచ్చినపుడు “నేఁ బాపుఁడను, ఇట్టి దుఃఖము నొందితిని, దురాత్ముఁడను నన్నుఁ గాల్పనా? ఎవ్వఁడు నా యీదుఃఖముఁ బోఁగొట్టును? ఇట్లు అనుతాపాత్మకము భ్రాంతిరూపము తామస మగు ఉద్వేగం బను చిత్తవృత్తివిశేషము పుట్టును. ఈయుద్వేగము పాప మనుష్ఠించినపుడు ఉండి యుండునేని అప్పుడు పాపానుష్ఠానప్రవృత్తికిఁ బ్రతిబంధక మగుటం జేసి సఫలం బగును. భోగకాలమునందో ఇట్టి యుద్వేగము

కలుగుట కారణ ముండునపుడు కార్యము నివారింప నశక్య మగుటవలన నిష్ప్రయోజనము. దుఃఖకారణ ముండునపుడుకూడ ఎందుకు నాకు దుఃఖము కలుగుచున్నది? అను వృత్తి యవివేకజంబై భ్రమరూపం బగుటవలన వివేకి యగు స్థితప్రజ్ఞునకు సంభవింపదు. దుఃఖముమాత్రమే గదా ప్రారబ్ధకర్మముచేఁ గలిగింపఁ బడుచున్నది. కాని తదుత్తరకాలమునం గలుగు భ్రమముగూడఁ బ్రారబ్ధప్రాపిత మనం దగదు. ఓయీ! దుఃఖాంతరమునకుఁ గారణ మగుటవలన ఆభ్రమయును మఱియొక ప్రారబ్ధకర్మముచేఁ బ్రాపితం బగుఁ గాక యుండునేని అది సరి గాదు. స్థితప్రజ్ఞునకు భ్రమమున కుపాదానకారణ మయిన యజ్ఞానము నశించుటచే భ్రమ సంభవింపదు, అందువలన భ్రమముచేఁ బుట్టుదుఃఖము కలిగించు ప్రారబ్ధము గూడ సంభవింపదు. ఎట్లో యొకవిధమున దేహయాత్రామాత్రము నిర్వహించునట్టి ప్రారబ్ధకర్మఫలము భ్రమ లేకున్నను బాధితానువృత్తిచే నుపపన్న మగును. ఇది విస్తరించి ముందు చెప్పఁబడును. అట్లు, సుఖేషు—ప్రారబ్ధపుణ్యకర్మముచేఁ గలిగింపఁబడిన త్రివిధము లగు సత్త్వగుణపరిణామ ప్రీత్యాత్మక చిత్తవృత్తివిశేషములందు; విగతస్పృహః = రాఁబోవునట్టి తజ్జాతీయమైన * సుఖమునందు స్పృహ లేనివాఁడు; స్పృహ యనఁగా సుఖానుభవకాలమునందు తజ్జాతీయసుఖమునకుఁ గారణ మగు ధర్మము ననుష్ఠింపక వ్యర్థముగనే దానిఁ గోరుట యను తామసచిత్తవృత్తి, భ్రాంతియే గదా! అదియో అవివేకికే కలుగును. కారణము లేనిచోఁ గార్యము కలుగదు గదా! కావున, ఎట్లు కారణ ముండునపుడు కార్యము కలుగఁగూడ దను వ్యర్థమైన కోర్కి యుద్వేగము వివేకికి సంభవింపదో, అట్లే కారణము లేనియపుడు కార్యము కలుగవలె నను వ్యర్థ మయిన కోర్కి తృష్ణాత్మక మగు స్పృహగూడ ఉపపన్నము కాదు, ప్రారబ్ధకర్మము సుఖమునుమాత్రమే కలిగించునది యగుటవలన. లేక, హర్షాత్మక మగు చిత్తవృత్తి స్పృహాశబ్దముచేఁ జెప్పఁబడినది. అదియును భ్రాంతియే—అహో ధన్యుఁ డను నేను! ఇట్టి సుఖము నాకుఁ జేకుఱినది గదా! ఎవ్వఁడు నాకు సమానుఁడు ముల్లోకములందు? ఏయుపాయముచేత నా కిట్టిసుఖము విచ్ఛిన్నము గాక యుండును? ఇట్టి యుత్ఫుల్లతా ♦ రూప మయిన తామసచిత్తవృత్తి. అందువలననే చెప్పఁబడినది భాష్యమునందు “నాగ్ని రివేన్ధనాద్యాధానే

* అట్టివిధ మయిన.

యా స్సుఖా స్యను విపద్ధతే స విగతస్పృహః" ¶ అని. చెప్పఁబోవుచున్నాఁడుగూడ "న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నో ద్విజే త్ప్రాప్య చా ప్రియమ్" అని. అదియును వివేకికి సంభవింపదు, భ్రాంతి యగుటవలన. అట్లు, వీతరాగభయక్రోధః— రాగము అనఁగా శోభనాధ్యాసముచే * గలిగినది విషయములందు రంజనాత్మకమయిన చిత్తవృత్తివిశేషము అత్యంతాభినివేశరూపము. రాగముయొక్క విషయమును నశింపఁజేయునది వచ్చినపుడు తాను దాని నివారింప నసమర్థుఁడని తలంచువానికిఁ గలుగు దైన్యాత్మకమైన చిత్తవృత్తివిశేషము భయము, ఇట్లు రాగవిషయమును నశింపఁజేయునది వచ్చినపుడు తాను దాని నివారింప సమర్థుఁడని తలంచువానికిఁ గల్గు అభిజ్వలనాత్మకమయిన చిత్తవృత్తివిశేషము క్రోధము, అవియన్నియు భ్రాంతిరూపము లగుటవలన ఎవ్వనినుండి పోయినవో అట్టివాఁడు. ఇట్టి, మునిః = మననశీలుఁడు సన్న్యాసి; స్థితప్రజ్ఞుఁడని చెప్పఁబడుచున్నాఁడు. ఇట్టి లక్షణము గల స్థితప్రజ్ఞుఁడు స్వానుభవము ప్రకటించుటచే శిష్యుల శిక్షించుటకొఱకు, అనుద్వేగము నిస్పృహత్వము మొదలగునవి బోధించువాక్యములను పలుకు నని యన్వయము. ఇట్లే ఇతరుఁడగు ముముక్షువుకూడ దుఃఖము వచ్చినపుడు ఉద్వేగము నొందఁగూడదు, సుఖము వచ్చినపుడు హర్షము నొందఁ గూడదు, రాగభయక్రోధములు లేనివాఁడుగాను ఉండవలె నని యభిప్రాయము.

శ్రీ. మఱియును దుఃఖములు ప్రాప్తము లయినను అనుద్విగ్నము క్షుభితము కాని మనస్సు ఎవనికో అతఁడు; సుఖములందు, పోయినది స్పృహ యెవనికో అతఁడు; అందుకు హేతువు—వీతరాగభయక్రోధః—వీతములు తొలఁగినవి రాగభయక్రోధములు ఎవనినుండియో అతఁడు. అందు రాగ మనఁగా ప్రీతి. అట్టి ముని, స్థితధీః = స్థితప్రజ్ఞుఁడు, అని చెప్పఁబడుచున్నాఁడు.

ప. ఇంక మఱియొకటి చెప్పుచున్నాఁడు—దైవమువలన ప్రాప్తము లయిన, దుఃఖేషు; అనుద్విగ్నమనాః = ఉద్వేగము నొందని మనస్సుగలవాఁడు; అట్లు ప్రాప్తము లయిన, సుఖేషు; విగతస్పృహః = ఆదరము లేనివాఁడు; ఇందుకు యథాసంభవము హేతువుఁ జెప్పుచున్నాఁడు—వీతరాగభయక్రోధః—స్పష్టము.

---

¶ [illegible] మొదలగునవి చేసినపుడు, [illegible] సుఖముల వెంబడి వృద్ధిఁ బొందఁడో వాఁడు విగతస్పృహుఁడు.

* శోభనా[illegible]ధ్యాసముచే—ప్రేమముచే.

రా. ఇప్పుడు అంతకన్న వెనుకటిదియును మిక్కిలి దూరము కానిదియు నగు జ్ఞాననిష్ఠుని యవస్థ ♦ చెప్పఁబడుచున్నది.—దుఃఖేషు = ప్రియవియోగము మొదలగు దుఃఖకారణములు సంభవించినపుడు; అనుద్విగ్నమనాః = దుఃఖము నొందని మనస్సు గలవాఁడు; సుఖేషు = సుఖకారణము లయిన ప్రియములు కలిగినపుడు; విగతస్పృహః = స్పృహ లేనివాఁడు; వీతరాగభయక్రోధః—అనాగతములందు స్పృహ రాగము, అది లేనివాఁడు; ప్రియవియోగమునకును అప్రియప్రాప్తికిని హేతువును జూచుటచేఁ గలుగుదుఃఖము భయము, అది లేనివాఁడు; ప్రియవియోగమునకును అప్రియప్రాప్తికిని హేతువైన మఱియొకచేతనునికి దుఃఖమునకు హేతువైన స్వమనోవికారము క్రోధము, అది లేనివాఁడు; ఇట్టివాఁడగు, మునిః = ఆత్మమననశీలుఁడు; స్థితధీః = స్థితప్రజ్ఞుఁ డని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

దుఃఖకారణములు సంభవించినను దుఃఖము నొందనివాఁడును సుఖకారణములు కలిగినను స్పృహ లేనివాఁడును మఱియు రాగము భయము క్రోధము లేనివాఁడునై ఆత్మ మననము చేయుచుండువాఁడు స్థితప్రజ్ఞుఁ డని చెప్పఁబడు నని తాత్పర్యము.

మా. దానినే స్పష్టీకరించుచున్నాఁడు మీఁది మూఁడుశ్లోకములచేత.— ఇవియే జ్ఞానోపాయములు. అట్లు చెప్పఁబడినది «తదేవ జిజ్ఞాసుభి స్సాధ్యం జ్ఞానినో యత్తు లక్షణమ్» * శోభనాధ్యాసము రాగము, «రతీ రాగ స్తథా రక్తి శ్శోభనాధ్యాస ఇష్యతే» అని నిఘంటువు.

యస్సర్వత్రాఽనభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్
నాఽభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౫౭

భా. మఱియును. యః = ఏముని; సర్వత్ర = అంతటను, దేహము జీవితము మొదలగువానియందుఁగూడ; అనభిస్నేహః = స్నేహము లేనివాఁడో; తత్తత్ = ఆయా; శుభాశుభమ్ = శుభమునుగాని అశుభమును గాని; ప్రాప్య = పొంది; నాభినన్దతి న ద్వేష్టి—శుభమును బొంది సంతోషింపఁడో హర్షింపఁడో, అశుభమును బొంది ద్వేషింపఁడో అని యర్థము;

♦ తృతీయావస్థ.

* జ్ఞానియొక్క లక్షణ మేదో అదియే జిజ్ఞాసువులచే సాధింపఁ దగినది.

తస్య = ఇట్లు హర్షవిషాదములు లేని యట్టివానియొక్క; ప్రజ్ఞా = వివేక జన్యమయిన జ్ఞానము; ప్రతిష్ఠితా = స్థిర మగుచున్నది.

ఎవ్వఁడు దేహజీవితాదులయందు స్నేహము లేనివాఁడై శుభము వచ్చినపుడు హర్షముగాని అశుభము సంభవించినపుడు విషాదముగాని పొంద కుండునో అట్టి సన్న్యాసియొక్క ప్రజ్ఞ స్థిర మగు నని తాత్పర్యము.

ఆ. ఇంకొకలక్షణము ననువదించుద్వారమున జిజ్ఞాసువునకే కర్తవ్యాంతర ముపదేశించుచున్నారు మఱియును అని. వివేకసంభూఁ డగు వివిదిషునకు వివేక జన్య మగు ప్రజ్ఞ యొట్లు స్థైర్యముఁ బొందు నని యాశంకించి చెప్పుచున్నాఁడు యస్సర్వ త్రేత్యాదిగా. ఓయీ! దేహజీవితాదులందు స్నేహాయును శుభాశుభప్రాప్తియందు హర్షవిషాదములును విద్వాంసునకును వివిదిషునకును అనివార్యములు కావునఁ బ్రజ్ఞాస్థైర్యము సిద్ధింపఁజాలదు అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు. ఏమని ఇత్యాదిగా. తత్తత్ అని శుభ మనిగాని అసుభ మనిగాని ప్రసిద్ధి నిర్దేశింపఁబడు చున్నది. దానినే విభజించుచున్నాఁడు శుభమును ఇత్యాదిగా. విషయము లందు అభిష్వంగము లేకుండుటయు శుభాశుభప్రాప్తియందు హర్షవిషాదములు లేకుండుటయు ప్రజ్ఞాస్థైర్యమునకుఁ గారణ మని చెప్పుచున్నారు త స్యేత్యాదిగా.

హ. *

శం. శ్రవణాదులచే ఆత్మతత్త్వముఁ దెలిసినవాఁడై విదేహకైవల్యముఁ గోరి జ్ఞానపరిపాకముకొఱకు సమాధియందుఁ బ్రవర్తించిన సాధకుం డెవ్వఁడు, ఈ ప్రకారము వర్తించుచున్నాఁడో వానికే జ్ఞాననిష్ఠ సిద్ధించు నని చెప్పుచున్నాఁడు.— యః = సమాధియందుఁ బ్రవర్తించిన సన్న్యాసి యెవ్వఁడు; సర్వత్ర— కంథ • కౌపీనము మొదలగువానియందు దేహజీవనమునందును; అనభిస్నేహః = మిక్కిలి యాసక్తి లేనివాఁ డగునో; ప్రారబ్ధవశంబున వచ్చినది యేది శుభము అనుకూల మగునో దాని, నాభినన్దతి, ఏది అసుభము ప్రతికూల మగునో దాని, నద్వేష్టి, హర్షవిషాదములు లేనివాఁడై సర్వత్ర సమబుద్ధియై సమాధియందే యుండునో;

* శంకరభాష్యముతో సమానము.

• బొంత.

వానికే; ప్రజ్ఞా; ప్రతిష్ఠిత మగును, జ్ఞాననిష్ఠ సిద్ధించును, కాని ఇతరునకుఁ గాదని యర్థము.

వ. మఱియును. సర్వదేహములందు జీవనాదులందుఁగూడ, యః = ఏముని, అనభిస్నేహః—ఏది యున్నచో ఇతరసంబంధు లగు హానివృద్ధులు తనయం దారోపింపఁబడుచున్నవో అది అట్టి ఇతరము విషయముగాఁ గలది ప్రేమము అను నామాంతరము గల తామసవృత్తివిశేషము స్నేహము, అన్నివిధములను ఆస్నేహము లేనివాఁడు అనభిస్నేహుఁడు. భగవంతుఁ డగు పరమాత్మయందో అన్నివిధములను అభిస్నేహవంతుఁడే కావలయును, అనాత్మయందు స్నేహము లేకుండుట పరమాత్మస్నేహార్థ మగుటవలన నని తెలియవలెను. ఆయా, ప్రారబ్ధకర్మప్రాపిత మును, శుభమును—సుఖహేతు వగు విషయమును, పొంది, నాభినన్దతి = హర్షాతి శయపూర్వకముగా ప్రశంసింపఁడు. అశుభమును—దుఃఖహేతు వగు విషయ మును పొంది, నద్వేష్టి = మనస్సున అసూయ గలవాఁడై నిందింపఁడు. అజ్ఞునకుఁ గదా సుఖహేతు వేదో అట్టి స్వకళత్రాదివిషయము శుభ మగును, తద్గుణవర్ణ నాదులందుఁ బ్రవృత్తికిఁ గారణ మయిన భ్రాంతిరూప మగు చిత్తవృత్తి యభినంద మును సంభవించును. ఆయభినందము తామసము, తద్గుణవర్ణనాదికము పరప్రరో చనార్థము * కామింజేసి వ్యర్థ మగుటవలన. ఇట్లు అసూయ పుట్టించుటచే దుఃఖ హేతు వగు పరకీయవిద్యాప్రకర్షాదికము వీనికి ♦ అశుభ మైనవిషయము. తన్నిం దనమునందుఁ బ్రవృత్తికిఁ గారణ మయిన భ్రాంతిరూపచిత్తవృత్తి ద్వేషము. అదియుఁ దామసము, తన్నిందనము నివారణార్థము ‖ కామింజేసి వ్యర్థ మగుట వలన. భ్రాంతిరూపములు తామసములు నగు ఆయభినందద్వేషములు ఎట్లు, అభ్రాంతుఁడు శుద్ధసత్త్వుఁడు అగు స్థితప్రజ్ఞునియందు సంభవించును? అందువలన విచాలకము § లేకుండుటవలన, తస్య—అనభిస్నేహుఁడును హర్షవిషాదములు లేని వాఁడు నగు మునియొక్క—; ప్రజ్ఞా=పరమాత్మతత్త్వవిషయ మగు జ్ఞానము; ప్రతిష్ఠితా= ఫలపర్యవసాయి యగుచున్నది, అట్టివాఁడు స్థితప్రజ్ఞుఁ డని యర్థము. ఇట్లు ఇతరుఁ డగు ముముక్షువుగూడ సర్వత్ర అనభిస్నేహుఁడు కావలెను, శుభమును బొంది

* ఇతరులకు రుచిపుట్టించుట ప్రయోజనము గాఁ గలది.

♦ అజ్ఞునకు.

‖ ఇతరులను విద్యాప్రకర్షాదికమునుండి నివారించుట ప్రయోజనము గాఁ గలది.

§ చలింపఁ జేయునది.

ప్రశంసింపఁగూడదను, అశుభమును బొంది నిందింపఁగూడ దని యభిప్రాయము. ఇందు నిందాప్రశంసారూపము లయిన వాక్యములను బలుకఁ డని వ్యతిరేకము చెప్పఁబడినది.

**శ్రీ.** ఎట్లు మాటలాడును? అను ప్రశ్న కుత్తరము చెప్పుచున్నాఁడు.—యః, సర్వత్ర = పుత్త్రమిత్త్రాదులందుఁగూడ, అనభిస్నేహః = స్నేహము లేనివాఁడో; కావుననే, బాధితానువృత్తిచే, తత్తత్, శుభమును అనుకూలమును, పొంది; నాభినన్దతి = ప్రశంసింపఁడో; అశుభమును ప్రతికూలమును పొంది, న ద్వేష్టి = నిందింపఁడో; మఱేమనఁగా కేవల ముదాసీనుఁడై యే మాటలాడుచుండునో; తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా అని యర్థము.

**ప.** ఇం కొకటిగూడ చెప్పుచున్నాఁడు.—యః, సర్వత్ర = దేహాదివిషయములందు, లేక, సర్వావస్థలయందును, అనభిస్నేహః = స్నేహము లేనివాఁడో; ఇఁక దానినే చెప్పుచున్నాఁడు—తత్తత్ శుభాశుభం ప్రాప్య, క్రమముగా, నాభినన్దతి—శుభమును బొంది ప్రశంసింపఁడో; న ద్వేష్టి = అశుభమును పొంది నిందింపఁడో; కేవల ముదాసీనుఁడై యుండునో; తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా అని యెఱుంగుము.

**రా.** దానికిని క్రిందిదశ § చెప్పఁబడుచున్నది.—యః = ఎవ్వఁడు, సర్వత్ర = సర్వప్రియములందును; అనభిస్నేహః = ఉదాసీనుఁడో; శుభాశుభమ్ = ప్రియప్రాప్తిరూప మయిన శుభమును ప్రియవియోగరూప మయిన అశుభమును; ప్రాప్య; అభినందనమును ద్వేషమును లేనివాఁడో; అతఁడుగూడ స్థితప్రజ్ఞుఁడు.

**మా.** సర్వత్ర అనభిస్నేహుఁ డగుటవలన, శుభాశుభం ప్రాప్య నాభినన్దతి న ద్వేష్టి.

యదా సంహరతే చాఽయం కూర్మోఽఙ్గానీవ సర్వశః
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౫౮

**భా.** మఱియును. యదా = ఎప్పుడు; అయమ్ = ఇతఁడు, జ్ఞాననిష్ఠయందుఁ బ్రవృత్తుఁ డగు యతి; సంహరతే = చక్కఁగా నుపసంహరించుచున్నాఁడో; కూర్మః అఙ్గాని ఇవ సర్వశః—ఎట్లు, కూర్మః = తాఁబేలు; భయమువలన, తనవైన, అఙ్గాని = అవయవములను; సర్వశః = అంతట

§ ద్వితీయదశ.

నుండియు, ఉపసంహరించుచున్నదో; అట్లు, జ్ఞాననిష్ఠుఁడు, ఇన్ద్రియాణి = ఇంద్రియములను; ఇన్ద్రియార్థేభ్యః = సమస్తవిషయములనుండి, ఉపసంహరించుచున్నాఁడో; తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా—దీని యర్థము చెప్పఁబడినది.

తాఁబేలు భయమువలనఁ దనయవయవము లన్నియు సర్వపదార్థముల నుండియు ఆకర్షించి ముడుఁచుకొనునట్లు, ఎప్పుడు జ్ఞాననిష్ఠుం డగువాఁడు తనయింద్రియము లన్నిటిని, విషయముల వెంటఁ బోనీయక యాకర్షించి తనస్వాధీనము చేసికొనుచున్నాఁడో అప్పుడు అతఁడు స్థితప్రజ్ఞుం డగు నని తాత్పర్యము.

ఆ. జిజ్ఞాసువునకే కర్తవ్యాంతరము సూచించుచున్నారు మఱియును అని. విషయములు ఇంద్రియములనుండి వైముఖ్యము నొందుట ప్రజ్ఞాస్థైర్యమునకుఁ గారణ మగుటవలన మొదట జిజ్ఞాసువు దాని సంపాదింపవలె నని చెప్పుచున్నాఁడు ఈశ్లోకముచేత. మోక్షహేతు వగు ప్రజ్ఞను గోరునట్టి ముముక్షువు ఇంద్రియముల నన్నిటిని విషయము లన్నిటినుండియు విముఖములుగాఁ జేసికోవలె నని శ్లోకవ్యాఖ్యానముచేఁ జెప్పుచున్నారు యదేత్యాదిగా. అయమ్ అనునది ప్రకృతస్థితప్రజ్ఞునిఁ బరామర్శించునది కా దని చెప్పుచున్నారు జ్ఞాననిష్ఠయందుఁ బ్రవృత్తుఁ డని. ఉపసంహరించుట యనఁగా తనకు వశ్యములను జేయుట. చక్కఁగా—మిక్కిలి దృఢముగా. ఇంద్రియోపసంహారము ప్రలయరూపము కా దని సంకోచరూప మని దృష్టాంతముచేఁ జూపుచున్నారు కూర్మ ఇత్యాదిగా. దృష్టాంతము వ్యాఖ్యానము చేయుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. దార్ష్టాంతికమునందు యోజించుచున్నారు అట్లు ఇత్యాదిగా. ఇంద్రియములను విషయములనుండి విముఖములుగాఁ జేయుట ప్రజ్ఞాస్థైర్యమునకు హేతు వని చెప్పినదాని నుపసంహరించుచున్నారు తస్యేత్యాదిగా.

హ. *

శం. జ్ఞాననిష్ఠాసిద్ధికి గొప్పవైరాగ్యంబును తీవ్రమోక్షేచ్ఛయు తత్పరతయు అను నీమూఁడే కారణము, వాస్తవమే. అట్లయినను ఇంద్రియనిగ్రహము లేనియెడ వైరాగ్యాదులును జ్ఞాననిష్ఠయును సిద్ధింపవు, కావున సాధకుం డగు యతి ప్రయత్నంబున నింద్రియజయమును సంపాదింపవలెను ప్రజ్ఞాసిద్ధికొఱకు కని చెప్పు

* శంకరభాష్యముతో సమానము.

చున్నాఁడు.—ఎవఁడు, అయమ్—జ్ఞాననిష్ఠయందుఁ బ్రవర్తించిన యతి; ఎట్లు, కూర్మః = తాఁబేలు, అఙ్గాని = తనయంగములను; పరులవలని భయమువలన, సర్వశః = అన్నిటిని; ఆయాకాలమునందు తనయందే ఉపసంహరించుచున్నదో; అట్లు, ఇన్ద్రియార్థేభ్యః = ఆయావిషయములనుండి; భయమువలన—రాగాదిదోషములు ప్రసక్తించు నను భయమువలనను సమాధికి విఘ్నము కలుగు నను భయమువలనను; ఇన్ద్రియాణి = వాగాదులను చక్షురాదులను; సర్వశః = అన్నిటిని; యదా; తాను తనయందే, సంహరతే = సంహరించుచున్నాఁడో, సమాధిస్థైర్యము కొఱకు ఆయింద్రియములప్రవృత్తిని నిరోధించుచున్నాఁడో; అప్పుడు, అతనికి ప్రజ్ఞ ప్రతిష్ఠితం బగు నని యర్థము.

మ. ఇప్పుడు ‹‹కి మాసీత'' అనుప్రశ్నమున కుత్తరము చెప్ప నారంభించుచున్నాఁడు భగవంతుం డాఱుశ్లోకములచేత.—అందు, ప్రారబ్ధకర్మవశమువలన వ్యుత్థానముచే ♦ విక్షిప్తము లగు నింద్రియములను మరల నుపసంహరించి సమాధికొఱకే స్థితప్రజ్ఞుం డుపవేశనంబు * సేయు నని తెలుపుటకై చెప్పుచున్నాఁడు.—అయమ్ = వ్యుత్థితుం డగు నితఁడు; సర్వశః = సమస్తము లయిన; ఇన్ద్రియాణి; ఇన్ద్రియార్థేభ్యః = శబ్దాదుల యన్నిటినుండియు; చ అనఁగా మరల నని యర్థము; యదా; సంహరతే = మరల నుపసంహరించుచున్నాఁడో, ముడుఁగునట్లు చేయుచున్నాఁడో. అందుకు దృష్టాంతము—కూర్మో ఽఙ్గానీవ. అప్పుడు, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా—స్పష్టము. ముందటి రెండుశ్లోకములచే వ్యుత్థానదశయందుఁగూడ సమస్తతామసవృత్తుల యభావము చెప్పఁబడినది. దీనిచేతనో మరల సమాధిదశయందు సకలవృత్త్యభావమని విశేషము.

శ్రీ. మఱియును. యదాచ, అయమ్ = ఈయోగి; ఇన్ద్రియార్థేభ్యః = శబ్దాదులనుండి; ఇన్ద్రియాణి; సంహరతే=మరలించుచున్నాఁడో. అనాయాసముగా సంహరించుటకు దృష్టాంతము—అఙ్గాని = కరచరణాదులను; కూర్మః, ఎట్లు, స్వభావముచేతనే ఆకర్షించుచున్నదో అట్లు.

ప. మఱియును. అయమ్ = ఈయోగి; ఇన్ద్రియార్థేభ్యః = శబ్దాదివిషయములనుండి; యదా; ఇన్ద్రియాణి, సంహరతే = ఆకర్షించుచున్నాఁడో; అప్పు

♦ సమాధినుండి లేచుటచే.

* కూర్చుండుట.

డతనిప్రజ్ఞ ప్రతిష్ఠిత మని యెఱుంగుము. ఎట్లు పరిపక్వముకాని మనస్సు గలవానికి ఇంద్రియాకర్షణమునందు అధికప్రయాస మగునో అట్లు అతనికిఁ గాదని సుఖోపాయంబున ఇంద్రియాకర్షణమునకు దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు.—ఎట్లు, కూర్మః = తాఁబేలు; అఙ్గాని = కరచరణాదులను; స్వభావముచేతనే ఆకర్షించుచున్నదో; అట్లు, అలౌకికాత్మసుఖానుభవము గలిగినపుడు సుషుప్త్యారంభమునందువలెఁ దనయంతనే యింద్రియముల నివృత్తి యగును.

రా. దానికిఁ గ్రింది * దశను జెప్పుచున్నాఁడు.—ఎప్పుడు ఇన్ద్రియములు విషయములను స్పృశింప నుద్యుక్తము లగునో అప్పుడే; కూర్మః అఙ్గానీవ = తాఁబేలు తనయంగములనుంబోలె; ఇన్ద్రియార్థేభ్యః = విషయములనుండి, సర్వశః = అన్నిటినుండియు; ఇన్ద్రియాణి = ఇంద్రియములను; ఆకర్షించి, మనస్సును ఆత్మయందే నిలుపుచున్నాఁడో; అతఁడుగూడ స్థితప్రజ్ఞుఁడు. ఇట్లు నాలుగువిధములు జ్ఞాననిష్ఠ, పూర్వపూర్వము ఉత్తరోత్తరముచే సంపాదనీయము.

మా. ♦

విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. ౫౯

భా. అందు విషయములను ఆహరింపకుండువానికి ఆతురునకుఁగూడ ఇంద్రియము లుపసంహృతము లగుచున్నవి. కాని యావిషయములందలి రాగముమాత్రము నిలిచి యుండును. అది యెట్లుపసంహరింపఁబడును? అనఁగా, చెప్పఁబడుచున్నది.—వాస్తవమే, విషయాః — విషయోపలక్షితములు కావున విషయశబ్దవాచ్యము లగు నింద్రియములు; నిరాహారస్య = ఆహరింపఁబడని విషయములు గల; దేహినః = దేహికి, కష్టమయిన తపస్సునందున్న వానికి, మూర్ఖునకుఁగూడ; వినివర్తన్తే = మరలుచున్నవి. అయినను, రసవర్జమ్ = రసము అనఁగా విషయములందలి రాగము, దాని విడిచి; రసశబ్దము రాగమునందుఁ బ్రసిద్ధము, “స్వరసేన ప్రవృత్తః, రసికః, రసజ్ఞః” § ఇత్యాదిప్రయోగములు కనఁబడుట

* ప్రథమ.

♦ మాధ్వభాష్యము లేదు.

§ స్వరసముచేఁ బ్రవర్తించినవాఁడు, రసికుఁడు, రసజ్ఞుఁడు.

వలన. ఆ, రసో౽పి = రంజనరూపము సూక్ష్మ మగు రాగముగూడ; అస్య = ఈసన్న్యాసికి; పరమ్ = పరమాత్మతత్త్వ మయిన బ్రహ్మమును; దృష్ట్వా = చూచి, నేనే యిది యని యున్నవానికి; నివర్తతే = మరలుచున్నది, నిర్బీజము విషయవిజ్ఞానం § బగు నని యర్థము. సమ్యగ్దర్శనము లేకున్నచో రసోచ్ఛేదము సిద్ధింపదు. అందువలన సమ్యగ్దర్శనరూపమయిన ప్రజ్ఞకు స్థైర్యము సంపాదింపవలె నని యభిప్రాయము.

విషయముల నుపభోగింపఁగూడ దని నిర్బంధముతో కష్టతపస్సుచేయు వానికిఁగాని రోగి యగువానికిఁగాని మూర్ఖునకుఁగూడ ఇంద్రియములు విషయముల నుండి నివర్తిల్లుచున్నవి. అయినను ఆవిషయములందలి రాగము నివర్తిల్లదు. అది యుండనే యుండును. ఆరాగముగూడఁ బరమార్థతత్త్వముఁ దెలిసి బ్రహ్మైకాత్మ్యానుభవము గలవానికి నివర్తిల్లు నని తాత్పర్యము.

ఆ. ఇంద్రియములు విషయములయెడ విముఖంబులైనను ఆవిషయములందు రాగ ముండునేని ప్రజ్ఞ యెట్లు పొందవచ్చు నని శంకించుచున్నాఁడు అందు ఇత్యాదిగా. ప్రకృతవ్యవహారవిషయము అందు అనుదానిచేఁ జెప్పఁబడుచున్నది. విషయములను ఆహరింపకుండువానికి—వాని యుపభోగమునందు విముఖుఁడైనవానికని యర్థము. రాగము ఉపసంహృతము కాదేని అప్పుడు ప్రజ్ఞాప్రాప్తి సంభవింపదు, రాగము దానిశత్రు వగుటవలన నని తలఁచి చెప్పుచున్నాఁడు అది యెట్లు ఇత్యాదిగా. రాగనివృత్త్యుపాయము నుపదేశించువారై యుత్తరము చెప్పుచున్నారు చెప్పఁబడుచున్నది అని. విషయోపభోగవిముఖుం డగువానికి విషయములందుఁ బరావృత్తి ♦ యెక్కడిది? తత్పరావృత్తియు అప్రస్తుతం బని యాశంకించి చెప్పుచున్నారు వాస్తవమే అని. నిరాహారస్య అనుదానికి వ్యాఖ్యానము ఆహరింపఁబడని విషయములు గల అని. ఎవఁడే విషయపరుండు గాఁడో వానికి ఆత్యంతిక మయిన క్లేశరూప మగు తపస్సునందు నిలిచియున్నవానికి విద్యాహీనునకుఁగూడ ఇంద్రియములు విషయములనుండి సంహృతము లగు ననుట సరే. అయినను రాగము శేషించి యుండును. అదియు తత్త్వజ్ఞానమువలన ఉచ్ఛిన్నం బగు నని యర్థము. రసశబ్దము మాధుర్యాదిషడ్విధరసపరంబు కా దని చెప్పుచున్నారు రస

§ విషయములను విశేషించి గ్రహించుట.

♦ మరల నభిముఖుం డగుట.

శబ్దము ఇత్యాదిగా. పృథక్ప్రయోగము లేక యెట్లు ప్రసిద్ధి యని యాశంకించి చెప్పుచున్నారు స్వరసే నేత్యాదిగా. స్వరసేన—స్వేచ్ఛచే నని యర్థము, రసికః—స్వేచ్ఛావశమున నుండువాఁడు, రసజ్ఞః—వివక్షితమును అపేక్షితమును దెలిసినవాఁ డని యర్థము. అట్లయినయెడ దానికి నివృత్తి యెట్లనఁగా, అందుకుఁ జెప్పుచున్నారు రసో ఽపి ఇత్యాదిగా. ఉపలబ్ధి యను నామాంతరము గల దర్శనమునే స్పష్టీకరించుచున్నారు నేనే యది యని. రాగము నివర్తించెనేని సిద్ధ మగు నర్థమును జెప్పుచున్నారు నిర్బీజము ఇత్యాదిగా. ఓయీ! సమ్యగ్జ్ఞానము లేక రాగము విడువదేని, అది విడువక రాగవంతునకు సమ్యగ్జ్ఞానము కలుగమివలన, అన్యోన్యాశ్రయం బగును. అనఁగా అట్లు కా దని చెప్పుచున్నారు సమ్యగ్దర్శనము ఇత్యాదిగా. ఇంద్రియములవిషయపారవశ్యమును వివేకద్వారంబునఁ దొలఁగించినచో స్థూల మగు రాగము తొలఁగును. అంత సమ్యగ్జ్ఞానోదయముచే సూక్ష్మరాగమునకుఁగూడ సాకల్యమున నివృత్తి యుపపన్న మగుటవలన అన్యోన్యాశ్రయత లే దని యర్థము. ప్రజ్ఞాస్థైర్యము సఫలం బని యేర్పడఁగా ఫలితంబుఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

హ. అందు విషయముల నుపభోగింపనివాఁడు అభ్యాసమువలనఁ గూర్మములు అంగములనుంబోలె నింద్రియంబుల విషయములనుండి యుపసంహరించుచున్నాఁడు. అందువలన, వానికిఁగూడఁ బ్రజ్ఞ ప్రతిష్ఠిత మని చెప్పవలసివచ్చును. అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.——వాస్తవమే, విషయోపలక్షితములు విషయశబ్దవాచ్యము లగు నింద్రియములు; నిరాహారస్య = ఆహరింపఁబడని విషయములు గలవానికి, ఆతురునకు, లేక, కాష్ఠతపస్సునం దున్నవానికి, మూర్ఖునకుఁగూడ, ఇంద్రియములు; వినివర్తన్తే = ప్రవర్తింపవు. దేహినః = దేహము గలవానికి. మూర్ఖమయిన పట్టుదలచేఁ జేయుతపస్సు కాష్ఠతపస్సు. రసవర్జమ్—రస మనఁగా రాగము, రసికః రసజ్ఞః ఇత్యాదిప్రయోగమువలన, రాగమును విడిచి; స్థితప్రజ్ఞలక్షణమో, రాగసహితముగా నింద్రియములకు విషయములనుండి నివృత్తి యని యభిమతము. అప్పుడు ఎట్లు విషయములనుండి రాగమునకు నివృత్తి యనఁగా—రసో ఽపి; అస్య = ఈ సన్న్యాసికి; పరమ్ = పరమాత్మను; దృష్ట్వా = నేనే యది యని సాక్షాత్కరించి; నివర్తతే. నిర్బీజము రాగం బగు నని యర్థము. సమ్యగ్దర్శనము లేనిచో రసనివృత్తి కాదు. కావున సమ్యగ్దర్శనాత్మకం బగుప్రజ్ఞను స్థిరపఱుపవలె నని యభిప్రాయము.

శం. ఓయీ! ఇంద్రియములను విషయంబులమీఁద విముఖంబులుగాఁ జేయుట ప్రజ్ఞాస్థైర్యకారణం బనుట యుక్తము కాదు. ఏదో యొకకార్యము నుద్దేశించి సర్వేంద్రియములను నిగ్రహించి యుండు పురుషునందు ఇంద్రియనిగ్రహము కనఁబడుచున్నది. కాని ప్రజ్ఞాస్థైర్యము లేదు. అనఁగా నది సరికాదు. రాగవంతుఁడగుటచే నతనికి బ్రహ్మజ్ఞానంబును తన్నిష్ఠయు సంభవింప వని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—నిరాహారస్య—ఆహరింపఁబడుచున్నవి విషయములు వేనిచేతనో, అవి యాహారములు ఇంద్రియములు, నియమముకొఱకు ఆయింద్రియములనుండి నిర్గతుండెవ్వఁడో అతఁడు నిరాహారుఁడు, ఇంద్రియనిగ్రహము గలవాఁడు, తాపసుఁడు, అట్టి; దేహినః—దేహమే నేను అను అహంబుద్ధి యాలంబనముగాఁ గలవాఁడు, కావున దేహి యనఁగా దేహాభిమాని, వానికి; ఇంద్రియములు నిగ్రహింపఁబడినవగుటవలన, విషయాః = శబ్దాదులన్నియు; వినివర్తన్తే = విశేషించి నివర్తిల్లుచున్నవి; రసవర్జమ్ = రాగము దప్ప, «రసో రాగే గుణే ద్రవ్యే» అను నిఘంటువువలన; రసము—రాగము నివర్తిల్లదు, «రాగో లిఙ్గమబోధస్య» ♦ అని నియమమువలన, ఇది సర్వంబును నేనును బ్రహ్మమే యని సర్వంబును దానును బ్రహ్మమాత్రం బను జ్ఞానంబును రాగంబును ఈరెండును ఒకచో నుండఁ జాలవు. కావున రాగవంతుఁడగుటవలననే యితనికి జ్ఞానము లేదు, అందువలననే ఇంద్రియంబులనిగ్రహమున్నను ప్రజ్ఞాస్థైర్యమునకుఁ బ్రసక్తి లే దని యర్థము. అప్పుడు, ఎట్లతనికి రాగనివృత్తియుఁ బ్రజ్ఞయు సిద్ధించు ననఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు—అస్య = ఇతనికి, మౌనముచేత ఇంద్రియనిగ్రహముచేత వ్రతాదులచేత చిత్తశుద్ధి నొంది శ్రవణాదిజన్యజ్ఞానముచే, పరమ్ = అద్వితీయపరబ్రహ్మమును; దృష్ట్వా = ఇదియే నేనని ఆత్మరూపమున సాక్షాత్కరించినవానికి; రసః, నివర్తతే = తొలఁగుచున్నది. విషయములందు భోగ్యత్వభావన ❨ నివర్తిల్లుటచే రాగము నివర్తిల్లును. భోగ్యత్వభావనయో బ్రహ్మదర్శనముచే నివర్తిల్లుచున్నది. సర్వంబును దానును బ్రహ్మమే యను జ్ఞానము అను నగ్నిచే భోక్తృత్వ భోగ్యత్వాదిభేదరూప మైన అడవి దగ్ధమగుచుండఁగా ఆవనమున నుండున దగుటవలన దానితోఁ గూడనే తాను $

♦ అజ్ఞానమునకుఁ జిహ్నము రాగము.

❨ భోగ్యములు అను తలంపు.

$ రాగము.

దగ్ధ మగుచున్నది యని యర్థము. అపిశబ్దమువలన ప్రజ్ఞాస్థైర్యముగూడ సిద్ధించు నని సూచింపఁబడుచున్నది.

**మ.** ఓయీ! మూఢునకుఁగూడ రోగాదులచే విషయములనుండి యింద్రియములకు నివృత్తి యగుచున్నది. అప్పు డతని కెట్లు ప్రజ్ఞ ప్రతిష్ఠితం బని చెప్పఁబడినది? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—నిరాహారస్య = ఇంద్రియములచే విషయముల నాహరింప కున్నవానికి; దేహినః = దేహాభిమానము గలవానికి, మూఢునకుఁగూడ, రోగికిఁగాని కాష్ఠతపస్సునం దున్నవానికిఁగాని; విషయాః = శబ్దాదులు; వినివర్తన్తే, కాని, రసవర్జమ్—రస మనఁగా తృష్ణ, దాని విడిచి; అజ్ఞునకు విషయములు నివర్తిల్లును గాని దానియందలి రాగమాత్రము నివర్తిల్ల దని యర్థము. అస్య = ఈ స్థితప్రజ్ఞునకో; పరమ్ = పరమపురుషార్థమును; దృష్ట్వా = అదియే నే నని సాక్షాత్కరించి యున్నవానికి, రసో౽పి = క్షుద్రసుఖమునందలి రాగముగూడ; నివర్తతే, అపిశబ్దమువలన, విషయములును. అట్లు యావానర్థ ఉదపానే ఇత్యాదిశ్లోకమున వర్ణింపఁబడినది. ఇట్లు రాగసహితవిషయనివృత్తి స్థితప్రజ్ఞునిలక్షణం బగుటచే మూఢునందు వ్యభిచారము లే దని యర్థము. పరమాత్మసమ్యగ్జ్ఞానము లేనిచో రాగసహితవిషయనివృత్తి సిద్ధింపదు, కావున రాగసహితవిషయనివర్తకం బగు సమ్యగ్దర్శనాత్మక మయిన ప్రజ్ఞకు స్థైర్యము మహాప్రయత్నమున సంపాదింపవలె నని యభిప్రాయము.

**శ్రీ.** ఓయీ! ఇంద్రియములకు విషయములందు అప్రవృత్తి * స్థితప్రజ్ఞుని లక్షణం బనఁ దగదు. జడులకును ఆతురులకును ఉపవాసులకును విషయములందు అప్రవృత్తి సమానముగాఁ గలుగుటవలన. అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—ఇంద్రియములచే విషయముల ఆహరించుట గ్రహించుట ఆహారము. నిరాహారస్య = ఇంద్రియములచే విషయగ్రహణము చేయనివానికి; దేహినః = దేహాభిమానము గలవానికి, అజ్ఞునకు; విషయాః వినివర్తన్తే—విషయానుభవము నివర్తిల్లుచున్న దని యర్థము. మఱి యేమనఁగా. రసవర్జమ్ — రస మనఁగా రాగము అభిలాష, అది దక్క; అభిలాషమాత్రము నివర్తిల్ల దని యర్థము. రసో౽పి = రాగముగూడ; పరమ్ = పరమాత్మను; దృష్ట్వా; అస్య—స్థితప్రజ్ఞునకే

* ప్రవృత్తి లేకుండుట.

యున్న వానికి; నివర్తతే—నశించుచున్న దని యర్థము. లేక. నిరాహారస్య = ఉపవాసపరునకు; విషయాః, ప్రాయికముగా, నివర్తన్తే, క్షుద్బాధచే సంతప్తుఁడైన వానికి శబ్దస్పర్శాద్యపేక్ష కలుగకుండుటవలన. అయినను, రసవర్జమ్. రసాపేక్ష * మాత్రము నివర్తిల్ల దని యర్థము. తక్కినది సమానము.

ప. ఓయీ! ఉపవాసము నొందినవానికి జనునకు రోగగ్రస్తునకు ఎవ్వని కన్న వానికి శబ్దస్పర్శాదివిషయములు నివర్తిల్లనే నివర్తిల్లుచున్నవి. ఇట్లు ఆవిధముగా విషయనివృత్తి గలవానికిని స్థితప్రజ్ఞునకును ఏమి విశేషము? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—నిరాహారస్య = ఉపవాసము నొందినవానికి, ఎవనికైనను, దేహాభిమానము గల జీవునకు; విషయాః, అప్రాప్యములయి తమయంతనే, నివర్తన్తే. మ తే మనఁగా, రసవర్జమ్—రస మనఁగా రాగము ఆవిషయములందలి యపేక్ష, అది దప్ప; వాస్తవమే, అసాధ్యము లగుటంజేసి విషయములనివృత్తి కలుగుచున్నది, అయినను విషయములు కావలె నని సంకల్పము వీనికిఁ గలదు. స్థితప్రజ్ఞనకో, పరమ్ = పరమాత్మను, దృష్ట్వా, విషయాభిలాష నివర్తిల్లుచున్నది యని గొప్పవిశేషము కల దని యర్థము.

రా. ఇప్పుడు జ్ఞాననిష్ఠ ప్రాప్తించుట కష్ట మనుటయుఁ దత్ప్రాప్తికి ఉపాయంబునుం జెప్పుచున్నాఁడు.—ఇంద్రియముల ఆహారములు విషయములు, నిరాహారస్య = విషయములనుండి మరలింపఁబడిన యింద్రియములు గల, దేహినః = జీవునకు; విషయాః = విషయములు; నివర్తిల్లుచున్ననైౖ, రసవర్జమ్, నివర్తన్తే—విషయములందలి రాగము నివర్తిల్ల దని యర్థము. రసో ఽపి = ఆరాగముగూడ, ఆత్మస్వరూపమును, విషయములకన్న, పరమ్ = మిక్కిలి సుఖరూపమైనదానిని; దృష్ట్వా = తెలిసి; నివర్తతే.

ప్రయత్నముచే విషయములనుండి ఇంద్రియములను మరలించి యుండు వానికి విషయనివృత్తి కలిగినను ఆవిషయములందలి రాగమునకు నివృత్తి కలుగదు. విషయములకన్న మిక్కిలి సుఖరూపమైన ఆత్మస్వరూపమును తెలిసినవానికి ఆవిషయములందలి రాగముగూడ నివర్తిల్లు నని తాత్పర్యము.

మా. ఇట్టిలక్షణము గల జ్ఞానము అప్రయత్నముగా సిద్ధింప దని చెప్పుచున్నాఁడు మీఁది శ్లోకముచేత.—నిరాహారత్వముచే ♦ విషయభోగమునందు

---

* రసనేంద్రియవిషయమైన రసమునందలి అపేక్ష.

♦ భోజనము లేకుండుటచే.

సామర్థ్యము లేమియే కలుగును, లేక, ఇతరవిషయములయందు ‡ కాంక్ష లేమి కలుగును. రసమునందలి కాంక్ష మొదలగునవి నివర్తిల్లవు. అదియో అపరోక్షజ్ఞానమువలననే నివర్తిల్లుచున్నది యని చెప్పుచున్నాఁడు విషయా ఇత్యాదిశ్లోకము చేత. "ఇన్ద్రియాణి జయన్త్యాశు నిరాహారా మనీషిణః । వర్జయిత్వా తు రసన మసౌ రస్యే హి వర్ధతే" * అను భాగవతవచనమువలన, రసశబ్దము రాగవాచక మగుటవలనను.

యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః. ౬౦

భా. సమ్యగ్దర్శనరూపం బగు ప్రజ్ఞాస్థైర్యము సంపాదించువాఁడు మొదట నింద్రియములను స్వవశమున నిలుపుకొనవలయును. ఏల యనఁగా అట్లు నిలుపుకొననియెడ దోషముఁ జెప్పుచున్నాఁడు.— కౌన్తేయ = అర్జునా! యతతః అపి = ప్రయత్నము చేయుచున్నవాని యొక్కగూడ; పురుషస్య = పురుషునియొక్క; విపశ్చితః అపి = మేధావి యొక్కగూడ, అపిశబ్దము వ్యవహిత మయినను విపశ్చితః అనుదానితోఁ గూడ సంబంధించుచున్నది; ఇన్ద్రియాణి = ఇంద్రియములు; ప్రమాథీని = ప్రమథనము ♦ స్వభావముగాఁ గలవి, అవి విషయాభిముఖుఁడగు పురుషుని క్షోభపెట్టుచున్నవి — వ్యాకులపఱచుచున్నవి గదా! వ్యాకులపఱచియు, హరన్తి = హరించుచున్నవి; ప్రసహ్య = బలాత్కరించి, ప్రకాశముగనే, చూచుచున్నవానియొక్క, వివేకవిజ్ఞానయుక్తమైన, మనః = మనస్సును. హి = ఎందువలననో. అందువలన.

అర్జునా! ప్రయత్నము చేయుచుండువానిని బుద్ధిమంతునిఁగూడ ప్రబలము లయిన యింద్రియంబులు వ్యాకులపఱచి యతని వివేకయుక్త మయిన మనస్సునుగూడ బలాత్కారమున ఆకర్షించుకొని పోవును. అందువలన ఇంద్రియములను మొదట వశపఱచుకోవలె నని తాత్పర్యము.

---

‡ రసముకన్న ఇతరము లయిన రూపాదులందు.

* ఆహారమును వర్జించినవారై పండితులు రసనేంద్రియముమాత్రము దక్కఁ దక్కినయింద్రియములను శీఘ్రింబున జయించుచున్నారు. ఏల యనఁగా ఈ రసనేంద్రియము స్వవిషయమునందు వృద్ధిఁ బొందుచున్నది.

♦ క్లేశ పెట్టుట.

ఆ. శ్లోకాంతరమున కవతారిక చేయుచున్నారు సమ్యగ్దర్శనేత్యాదిగా. మనస్సు స్వవశ మగుటవలననే ప్రజ్ఞాస్థైర్యము సంభవించుచుండఁగా ఇంద్రియములను వశపఱచుకొనుట యేల? అని యాశంకించి చెప్పుచున్నారు ఏల యనఁగా నిత్యాదిగా. ఓయీ! వివేకవంతునకు విషయంబులందు దోషదృష్టి గలవానికి విషయములనుండి తమయంతఁ దామే యింద్రియములు మరలుచున్నవి. అందు ప్రజ్ఞాస్థైర్యము సంపాదించువాఁ డేమి చేయవలెను? అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు యతతః ఇత్యాదిగా. విషయములందు మాటిమాటికి దోషదర్శనమే ప్రయత్నము. ఎందువలన అను నర్థము గల హిశబ్దమునకు కడను అన్వయము చెప్పఁబోవుచున్నారు. అపిశబ్దమునకు యతతః అను శబ్దముతో అన్వయముఁ జెప్పి మఱియొకదానితోఁగూడ అన్వయముఁ జెప్పుచున్నారు విపశ్చితః అపి అని. ప్రమథనస్వభావమునే ప్రకటించుచున్నారు అపి ఇత్యాదిగా. క్షోభ పెట్టుటకును వ్యాకులపఱచుటకును ఫలమును జెప్పుచున్నారు వ్యాకులపఱిచియు నిత్యాదిగా. ప్రకాశముగనే యని చెప్పినదాని వివరించుచున్నారు చూచుచున్నవానియొక్క అని. విపశ్చితః అపి—విద్వాంసునియొక్కఁగూడ, ప్రకాశముగ అనఁగా వివేకముతో — వివేకాఖ్యవిజ్ఞానయుక్త మయిన మనస్సునే హరించుచున్నవి యింద్రియములని సంబంధము. హిశబ్దముయొక్క అర్థము ననుసరించి అందువలన నింద్రియములను స్వవశమున నిలుపుకొనవలయునను పూర్వవాక్యముతో సంబంధము నభిసంధించి చెప్పుచున్నారు ఎందువలననో అందువలన అని.

హ. అట్టి సమ్యగ్దర్శనస్థైర్యమున కుపాయముఁ జెప్పుచున్నాఁడు.—యతతః= యత్నించుచున్నవానియొక్కఁగూడ, పురుషస్య, విపశ్చితః = బుద్ధిమంతుఁ డైనవానియొక్కఁగూడ; మనః, ఇన్ద్రియాణి, ప్రమాథీని = ప్రమథనస్వభావములు; ప్రసభం, హరన్తి.

శాం. ఇందువలన, ముముక్షు వగు యతి సర్వంబును బ్రహ్మమే యను జ్ఞానము సంపాదింపవలెను రాగద్వేషముల నిశ్శేషనివృత్తికొఱకు నిష్ప్రివృత్తికొఱకును విదేహముక్తికొఱకును అని సిద్ధము. ఇఁక విదేహకైవల్యసిద్ధికిఁ గారణభూత మగు బ్రహ్మజ్ఞానము దృఢం బగుటకొఱకు సమాధియందుఁ బ్రవృత్తుం డగు యతి యింద్రియనిగ్రహమునే మొదట నవశ్యము సాధింపవలెను. అది లేనిచో గొప్ప యనర్థము సంభవించు నని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—హి = ఏకారణము

వలన; యతతః అపి = సమాధిచే జ్ఞానము అప్రతిబంధ మగుటకొఱకు ప్రయత్నము చేయువాఁడైనను, సమాధియం దుండువాఁడైనను అని యర్థము; విపశ్చితః = విషయ సమూహము మాయికము అసత్తు తుచ్ఛము అనియు విషయప్రవృత్తి బంధము కలిగించు ననియు తెలిసినవాఁడైనను; పురుషస్య— ముముక్షువుయొక్క; మనః— మనుతే బ్రహ్మ అనేన— తెలియుచున్నాఁడు బ్రహ్మమును దీనిచేత నని, మన స్సనఁగా సర్వత్ర బ్రహ్మదర్శనమునకుఁ గారణము, దాని, ప్రమాథీని = విషయదర్శనమాత్ర మున వ్యాకులపఱచు స్వభావము గల; ఇన్ద్రియాణి = రాగాదిదోషగ్రస్తము లగు ఇంద్రియములు; ప్రసభమ్ = బలాత్కారముగా, ఇతఁడు చూచుచుండఁగానే; వివేక యుక్త మయిన మనస్సునుగూడ, హరన్తి = పట్టి విషయములందుఁ బడఁద్రోయు చున్నవి, స్వరూపమునుండి తొలఁగించుచున్న వనుట. ఇంద్రియనిగ్రహము చేయ నిచో స్వరూపమునుండి భ్రంశమే విద్వాంసునకు గొప్ప యనర్థము.

మ. అట్టి ప్రజ్ఞాస్థైర్యమునకు బహిరింద్రియనిగ్రహంబును మనోనిగ్రహం బును అసాధారణ మయిన కారణము, ఆ రెంటను లేనిచో ప్రజ్ఞానాశము కనఁబడుట వలన. అని చెప్పుటకై మొదట బహిరింద్రియనిగ్రహము లేనిచో దోషముఁ జెప్పు చున్నాఁడు.—ఓ కౌంతేయుఁడా! యతతః అపి=మాటిమాటికి విషయములందు దోష దర్శనం బను యత్నమును చేయువాఁడైనను; విపశ్చితః = మిక్కిలి వివేకి యయి నను; పురుషస్య; మనః = మనస్సును, క్షణమాత్రము నిర్వికారముగాఁ జేయఁబడిన దానినిగూడ; ఇన్ద్రియాణి; హరన్తి= వికారము నొందించు చున్నవి. ఓయీ! విరోధి యగు వివేకము ఉండఁగా ఎట్లు వికారప్రాప్తి యగును? అనఁగా అందుకుఁ జెప్పు చున్నాఁడు——ప్రమాథీని = ప్రమథనస్వభావములు, మిక్కిలి బలిష్ఠము లగుటవలన వివేకము నడంచుటకు సమర్థములు. కావున, ప్రసభమ్ = బలాత్కరించి; స్వామి యగు నీవిద్వాంసుఁడు చూచుచుండఁగానే రక్షక మయిన వివేకము ఉండఁగానే సర్వ ప్రమాథు లగుటవలననే యింద్రియములు వివేకజన్య మయిన ప్రజ్ఞయందుఁ బ్రవిష్ట మగు మనస్సును దానినుండి తొలఁగించి స్వవిషయములందు ఆవిష్టము లగు నట్లు హరించుచున్న వని యర్థము. హి శబ్దము ప్రసిద్ధిని దెలుపుచున్నది. ప్రసిద్ధమే గదా యీవిషయము లోకమునందు.——ఎట్లు ప్రమాథు లగు చోరులు బలాత్కా రముగనే ధనస్వామిని ధనరక్షకుని లోఁబఱచికొని ధనమును హరింతురో అట్లు ఇంద్రియములుగూడ విషయములు సన్నిహితము లగునపుడు మనస్సును హరించు చున్నవి అని.

లను భయముచేతను రాగద్వేషంబులు వీడి యున్న, తాని = ఆయింద్రియములను; సర్వాణి; సంయమ్య = ఆవిషయములందు ప్రవర్తింపని యట్లు నిరోధించి, ఆయా గోళకములందు నిలిపి; బ్రహ్మవేత్త యగు యతి, యుక్తః = యోగముతోఁ గూడిన వాఁడై, సమాధి నొందిన చిత్తము గలవాఁడై, చిత్తవృత్తిని బ్రహ్మాకారముగాఁ జేసి యని యర్థము; మత్పరః = అహమ్—నేనే పరః—పరమాత్మ యని పరబ్రహ్మము నందే నేను అను బుద్ధి యెవనికో అతఁడు మత్పరుఁడు, ఇది యంతయు నేనును బ్రహ్మమే యని సమస్తమును దన్నును బ్రహ్మముగానే చూచుచు; ఆసీత—ప్రత్యగ్దృష్టితో నెల్లప్పుడు నుండవలె నని యర్థము. ఇట్లు నిత్యంబును నిరంతరమును జూచుచున్న, యస్య = ఏయతికి; ఇన్ద్రియాణి, విషయముల గ్రహింప నవకాశము లేమింజేసి రాగశూన్యములై, వశే—వశ్యము లగుచున్నవో, వానికిఁ గదా ప్రజ్ఞ ప్రతిష్ఠితము—నిశ్చల మగుచున్నది, మోక్షంబును సిద్ధించును, ఇతరున కెంతమాత్రమును గా దని యర్థము.

మ. ఇట్లయినయెడ అందు కేమి ప్రతీకార మనఁగాఁ జెప్పుచున్నాఁడు.— తాని = ఆయింద్రియములను; సర్వాణి—జ్ఞానసాధనభూతములను కర్మసాధనభూతములను; సంయమ్య = వశీకరించి; యుక్తః = సమాహితుఁడై, నిగ్రహింపఁబడిన మనస్సు గలవాఁడై; ఆసీత—నిర్వ్యాపారుఁడై యుండవలెను. ప్రమాథు లగు ఇంద్రియంబుల నెట్లు వశీకరింపవచ్చు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.——మత్పరః = అహమ్—నేను సర్వాత్ముఁడను వాసుదేవుఁడనే, పరః—ఉత్కృష్టుఁ డగు ఉపాదేయుఁడు ఎవ్వనికో అతఁడు మత్పరుఁడు, నాకు ఏకాంతభక్తుఁడై యని యర్థము. అట్లు చెప్పఁబడినది « న వాసుదేవభక్తానా మశుభం విద్యతే క్వచిత్ » * అని. ఎట్లు బలవంతుఁ డగు రాజు నాశ్రయించి చోరులు నిగ్రహింపఁబడుదురో, మఱియు రాజు నాశ్రయించినవాఁ డితఁ డని తెలిసి చోరులు తమయంతనే వానికి వశ్యు లగుదురో, అట్లే భగవంతుని సర్వాంతర్యామిని ఆశ్రయించి తత్ప్రభావముచేతనే దుష్టము లగు నింద్రియముల నిగ్రహింపవలెను, అవియు భగవదాశ్రితుం డితఁ డని తెలిసి యతనికి వశ్యములే యగు నని భావము. భగవద్భక్తి మహాప్రభావము గల దను విషయము విస్తరించి ముందు వక్కాణింతుము. ఇంద్రియముల వశీకరించుటకు ఫలముఁ జెప్పుచున్నాఁడు ఉత్తరార్థముచేత. స్పష్టము. ఇట్లు, ఇంద్రియములవశీకరించిన వాఁడై కూర్చుండవలె నని ప్రశ్న కుత్తరము చెప్పఁబడినది.

* వాసుదేవభక్తుల కెందును అశుభము లేదు.

శ్రీ॥ అందువలన. యుక్తః=యోగి; తాని—ఆ యింద్రియములను; సంయమ్య, మత్పరః, ఆసీత. యస్య, వశే—వశవర్తులో. ఇందుచే, కథ మాసీత అను ప్రశ్నకు ఇంద్రియముల వశీకరించినవాఁడై యుండవలె నని యుత్తరము చెప్పఁబడినది.

ప॥ అట్లు మనోనిగ్రహము లేనిచో బహిరింద్రియనిగ్రహము నిష్ప్రయోజన మగును. కావున, తాని, సర్వాణి, సంయమ్య = అంతరింద్రియనిగ్రహముచే స్వాధీనములను జేసి; మత్పరః = నేను ఆశ్రయముగాఁ గలవాఁడై, యుక్తః, ఆసీత. ఇట్టివిధమునన్నైనను, ఇన్ద్రియాణి, యస్య, వశే—వశములనున్నవో, వానికి ప్రజ్ఞ ప్రతిష్ఠితం బగు నని యర్థము. ఇందుచే "కి మాసీత" అనుదాని కుత్తరము చెప్పఁబడినది. ఈవిషయ ముపనిషత్తులందుఁ జెప్పఁబడినది "యస్తు విజ్ఞానవాన్ భవ త్యయుక్తేన మనసా సదా । తస్యేన్ద్రియా ణ్యవశ్యాని దుష్టా ఽశ్వా ఇవ సారథేః॥ యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా । తస్యేన్ద్రియాణి వశ్యాని స దశ్వా ఇవ సారథేః" † అని. ఈశ్రుతికి అర్థము స్పష్టము.

రా॥ దీని నంతయు * పరిహరించుటకై, తాని = విషయానురాగము గల వగుటచే దుర్జయము లయిన యింద్రియములను; సర్వాణి = అన్నిటిని; సంయమ్య = నిగ్రహించి; మత్పరః = మనస్సునకు శుభాశ్రయభూతుఁడ నగు నాయందు మనస్సు నుంచినవాఁడై; యుక్తః = సమాహితుఁడై; ఆసీత = ఉండవలెను. మనస్సు మద్విషయం బగుటచే అశేషకల్మషంబులును నిర్దగ్ధంబులై నిర్మలీకృతం బగు మనస్సు ఇంద్రియంబుల స్వవశంబులుగాఁ జేయుచున్నది. అంత వశ్యము లయిన యింద్రియములు గల మనస్సు ఆత్మదర్శనంబునకు సమర్థ మగుచున్నది. అట్లు చెప్పఁబడినది "యథా ఽగ్ని రుద్ధత శిఖః కక్షం దహతి సా ఽనిలః । తథా చిత్తస్థితో విష్ణు ర్యోగినాం సర్వకిల్బిషమ్" ‡ అని. అది చెప్పుచున్నాఁడు "వశే హి య స్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా" అని.

† బుద్ధి యను సారథి యెవ్వఁడు ఎల్లప్పుడు అయుక్త మయిన మనస్సుతోఁ గూడినవాఁడై అవివేకి యగునో అతనికి ఇంద్రియములు వశ్యములు కావు, దుష్టాశ్వములుంబోలె సారథికి. ఏబుద్ధిసారథి ఎల్లప్పుడు యుక్త మయిన మనస్సుతోఁ గూడినవాఁడై వివేకవంతుఁ డగునో అతనికి ఇంద్రియములు వశ్యము లగును, మంచియశ్వములుంబోలె సారథికి.

* అన్యాశ్రయదోషమును.

‡ ఎట్లు గొప్పజ్వాలలు గల యగ్ని వాయుసహితమై యెండుగడ్డిని—లేక అడవిని దహించునో అట్లు మనస్సునందుండు విష్ణువు యోగులయొక్క సమస్తపాపమును దహించును.

ఆ యింద్రియములను నిగ్రహించి నాయందే మనస్సు నిలిపి యుండవలెను. నాయందు మనస్సును నిలిపినచో సమస్తపాపములు దగ్ధము లగుటచే ఇంద్రియములు వశ్యంబు లగును. ఎవ్వనికి ఇంద్రియములు వశ్యము లగునో వానికి ప్రజ్ఞ ప్రతిష్ఠితం బగును, ఇట్లు అన్యోన్యాశ్రయదోషము లే దని తాత్పర్యము.

మూ. అట్లయిన అశక్యములే యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అధికయత్నముచే శక్యములు, కావున యత్నము చేయవలె నని యాశయము. యుక్తః = నాయందు మనోయోగముతోఁ గూడినవాఁడై. మత్పరః = నేనే పరుఁడను అన్నిటికన్నను ఉత్కృష్టుఁడనుగాఁ గలవాఁడు మత్పరుఁడు. ఫలము చెప్పుచున్నాఁడు వశే హీత్యాదిగా.

ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తేషూపజాయతే
సఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే. ౬౨

భా. ఇఁక నిప్పుడు పరాభవము నొందఁబోవువానికి సర్వానర్థంబులకు మూలం బిది చెప్పఁబడుచున్నది.—విషయాన్ = శబ్దాదివిషయవిశేషములను; ధ్యాయతః = చింతించుచున్న, ఆలోచించుచున్న, పుంసః = పురుషునకు; తేషు = ఆవిషయములందు; సఙ్గః = ఆసక్తి, ప్రీతి; ఉపజాయతే = పుట్టుచున్నది. సఙ్గాత్ = ప్రీతివలన; కామః = తృష్ణ; సంజాయతే = చక్కఁగా పుట్టుచున్నది. ఆ, కామాత్ = ఏదో యొకదానిచేఁ బ్రతిహత మయిన, తృష్ణవలన; క్రోధః = క్రోధము; అభిజాయతే = పుట్టుచున్నది.

పురుషుఁడు శబ్దాదివిషయములను చింతింపఁగానే వానియందతనికిఁ బ్రీతి పుట్టును, ఆప్రీతివలన వానియందుఁ గామము జనించును, ఆకామము దేనిచేతనేని ప్రతిహత మగునపుడు క్రోధము కలుగు నని తాత్పర్యము.

తా. మీఁది రెండుశ్లోకములతాత్పర్యము చెప్పుచున్నారు ఇఁక నిత్యాదిగా. ఇఁక—పురుషార్థోపాయము నుపదేశించిన పిమ్మట. తన్నిష్ఠత లేని యవస్థను జూపుచున్నారు ఇప్పుడు అని. పరాభవము నొందఁబోవువానికి—గొప్ప యనర్థము నొందఁబోవువానికి, వివేకవిజ్ఞానరహితున కని యర్థము. సర్వానర్థములకు మూలము విషయధ్యానము, అది యట్టి దనుట యనుభవసిద్ధం బని చెప్పుటకై ఇది

యని చెప్పఁబడినది. విషయవిశేషములను—విషయములందు విశేషత్వము అనఁగా ఆరోపిత మయిన రమణీయత్వము. ప్రీతి ఆసక్తి యని సాధారణాసక్తిమాత్రము గ్రహింపఁబడుచున్నది. తృష్ణ యని ఉద్రిక్త మయిన ♦ ఆసక్తి చెప్పఁబడినది. ప్రతిహత మయిన—ప్రతిబంధముచేతఁగాని వినాశము చేతఁగాని.

హ. ఇఁక నిప్పు డాత్మనాశమునకు మూలము చెప్పఁబడుచున్నది.— *

శ్లో ౦. ఓయీ! ఇంద్రియములచే అంతఃకరణము విషయంబులం ద్రోయఁబడినయెడ విద్వాంసున కేమి యనర్థము? అందు వేని విషయాభిధ్యానమే సర్వానర్థములకును బీజము. దానిచే అనర్థహేతువులపరంపర సంభవించును. దానిచే బ్రహ్మైక్యవిజ్ఞానము నశించును. తన్నాశంబువలన జననమరణాఖ్యతరంగమాలా సంకులం బగు సంసారసముద్రంబునం బడి విద్వాంసుఁడు తానును నశించును. అందువలన విద్వాంసుఁడైనను బహిర్ముఖుఁ డగునేని అందుకు జన్మాదిదుఃఖప్రవాహపతనము తప్ప కుండుటయె ఫలం బగుం గాని ముక్తి కానేరదు, కారణము లేమివలన. రాగద్వేషములచే విషయములందుఁ బ్రవిష్టుం డగు విద్వాంసునకుఁగూడ విషయాభిధ్యానమే ప్రసక్త మగును. కాని బ్రహ్మధ్యానము గానేరదు, అని సర్వానర్థమూల మయిన విషయాభిధ్యానమును తత్కార్యమును బ్రతిపాదించుచున్నాఁడు రెండుశ్లోకములచేత—విషయాన్ = శబ్దాదులను; ధ్యాయతః = వానియందలి రమ్యత్వమును అరమ్యత్వమును, లేక ఇది భోగ్య మని, చింతించుచున్న; పుంసః; తేషు = ఆవిషయములు రమ్యములని, లేక భోగ్యములని భావింపఁబడిన భోగములందు; సఙ్గః = ప్రీతి, పూర్వసంస్కారవశమువలన ఆసక్తి; ఉపజాయతే = అప్పుడే పుట్టుచున్నది. సఙ్గాత్ = ప్రీతివలన; అందు నా కిది కావలెను అని, కామః = భోగేచ్ఛావేగము; సంజాయతే = చక్కఁగాఁ బుట్టుచున్నది, దేనిచే గ్రస్తుఁడై పురుషుఁడు అభోగ్యమునైనను కలంజాదికమును అగమ్యలనైనను భగిన్యాదులను భోగ్యత్వబుద్ధితో భుజింప వేగిరపడుచున్నాఁడో అది కామము. కామాత్—ఏదో ఒక ప్రతిబంధముచేత హత మయిన దానివలన; క్రోధః, అభిజాయతే, పరాధీన మయిన మనస్సు గలవానికి పరుల కపకారంబు చేయుటయందుఁ బ్రవృత్తికి హేతు వైన బుద్ధివిశేషము క్రోధము.

---

♦ అతిశయించిన.

* తక్కినది శంకరభాష్యముతో సమానము.

మ. ఓయీ! మనస్సు బహిరింద్రియముల ప్రవృత్తిద్వారముచేఁ గదా అనర్థహేతు వగును. బహిరింద్రియముల నిగ్రహించినవానికి కోఱలు పెఱికిన పాముపంటి మనస్సును నిగ్రహింపకున్నను ఏమియుఁ గొఱఁత లేదు, బాహ్యేంద్రియోద్యోగము లేకుండుటచేతనే కృతకృత్యుఁ డగుటవలన. కావున "యుక్త ఆసీత" అని వ్యర్థము చెప్పఁబడినది. అని యాశంకించి బాహ్యేంద్రియముల నిగ్రహించిన వానికిఁగూడ యుక్తత లేనియెడ సర్వానర్థములును ప్రాప్తించు నని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—బాహ్యేంద్రియముల నిగ్రహించినవానికిఁగూడ, శబ్దాదివిషయములను, ధ్యాయతః=మనస్సుచే మాటిమాటికిఁ దలంచుచుండునట్టి, పుంసః= పురుషునకు; తేషు = ఆవిషయములందు; సఙ్గః = ఆసక్తి, నాకు మిక్కిలి సుఖహేతువు లివి యని శోభనాధ్యాసరూప మయిన ప్రీతివిశేషము; ఉపజాయతే. సఙ్గాత్ = సుఖహేతుత్వజ్ఞానరూప మయిన ఆసక్తివలన; కామః = నా కివి కావలె నను తృష్ణావిశేషము. ఆ, కామాత్ = దేనివలననైనను ప్రతిహత మయిన కామమువలన, తత్ప్రతిఘాతకవిషయ మయిన ♦, క్రోధః—అభిజ్వాలనాత్మకవృత్తి; అభిజాయతే.

శ్రీ. బాహ్యేంద్రియనిగ్రహము లేనిచో దోషముఁ జెప్పి మనోనిగ్రహము లేనిచో దోషముఁ జెప్పుచున్నాఁడు.—గుణబుద్ధిచేత * విషయములను ధ్యానించుచుండు పురుషునకు, వానియందు, సఙ్గః = ఆసక్తి, కలుగుచున్నది. ఆసక్తిచే వానియందు అధిక మయిన కామము కలుగుచున్నది. ఒకానొకదానిచేఁ బ్రతిహత మయిన కామమువలన, క్రోధము కలుగుచున్నది.

ప. ఇట్లు బహిరింద్రియసంయమము లేనియెడ దోషముఁ జెప్పి యిప్పుడు మనస్సంయమము లేనియెడ దోషముఁ జెప్పుచున్నాఁడు.—విషయాన్, ధ్యాయతః, పుంసః = పురుషునికి; తేషు, సఙ్గః = ఆసక్తి, కలుగుచున్నది. ఆసంగమువలన, కామః = ఆవిషయములు అవశ్యము కావలె నని వాని సంపాదించుటయం దాదరము, కలుగుచున్నది. అందు ఎవ్వఁడేని విఘ్నము చేసినచో క్రోధము కలుగుచున్నది.

రా. ఇట్లు నాయందు మనసు నిలుపక స్వయత్నగౌరవమువలన నింద్రియముల జయించుటకుఁ బ్రవర్తించినవాఁడు నాశము నొందు నని చెప్పుచున్నాఁడు.—

♦ దానిఁ బ్రతిహతము చేసినవాని గుఱించిన.

* గుణము గలది యను బుద్ధిచేత.

విషయములందలి యనురాగము విడువనివాఁడు నాయందు మనస్సు నుంపఁజేని యింద్రియముల నిగ్రహించి యున్నవాఁడైనను వానికి అనాదిపాపవాసనచే విషయ ధ్యానము అనివార్యముగా సంభవించును గదా! విషయాన్, ధ్యాయతః, పుంసః, పురల, సఙ్గః, ఉపజాయతే = మిక్కిలి ప్రవృద్ధ మగుచున్నది. సఙ్గాత్, కామః, సంజాయతే. కామ మనఁగా సంగముయొక్క విపాకావస్థ. ఏయవస్థను బొందిన వాఁడు, విషయముల భుజింపక నిలువఁజాలఁడో అది కామము. కామాత్, క్రోధః, అభిజాయతే—కామము ఉండఁగా విషయము సన్నిహితముగాని యప్పుడు సన్నిహితు లయిన పురుషులయెడ వీరిచే నాయిష్టము ప్రతిహత మయ్యె నని క్రోధము కలుగుచున్నది.

నాయందు మనసు నిలుపఁజేని అనాదిపాపవాసనచే విషయధ్యానము విడువఁజాలఁడు, ఆవిషయధ్యానముచే విషయములందు ఆసక్తి మిక్కిలి వృద్ధిఁ బొందును. అందుచేఁ గామము కలుగును. కామముచే, విషయము ప్రాప్తింపని యప్పుడు క్రోధము పుట్టు నని తాత్పర్యము.

మా. రాగాదిదోషములకుఁ గారణముఁ జెప్పుచున్నాఁడు పరిహారము కొఱకు శ్లోకద్వయముచేత.

క్రోధా ద్భవతి సమ్మోహ స్సమ్మోహా త్స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి. 63

భా. క్రోధాత్ = క్రోధమువలన; సమ్మోహః = కార్యాకార్యముల అవివేకము; భవతి = కలుగుచున్నది. క్రుద్ధుఁడు గదా సమ్మూఢుఁడై గురువునుగూడ నాక్రోశించుచున్నాఁడు. సమ్మోహాత్ = సమ్మోహము వలన; స్మృతివిభ్రమః = శాస్త్రాచార్యోపదేశములచేఁ గలిగిన సంస్కారముచేఁ బుట్టునట్టి స్మృతియొక్క భ్రంశము, స్మృతి పుట్టుటకు నిమిత్తము కలిగినను అది పుట్టకుండుట; కలుగుచున్నది. అట్టి, స్మృతిభ్రంశాత్ = స్మృతిభ్రంశమువలన; బుద్ధినాశః = బుద్ధియొక్కనాశము కలుగుచున్నది, కార్యాకార్యవిషయవివేకమునందు అయోగ్యత అంతఃకరణమునకు బుద్ధికి నాశ మని చెప్పఁబడుచున్నది. బుద్ధినాశాత్ ప్రణశ్యతి—ఎంతవఱకు పురుషుని యంతఃకరణము కార్యాకార్యవిషయవివేక

మునందు యోగ్యము ♦ అగునో అంతవఱకే గదా పురుషుఁడు, అది అయోగ్య మగునేని నష్టుఁడే పురుషుఁ డగుచున్నాఁడు. కావున, బుద్ధి నాశాత్ = అతని అంతఃకరణముయొక్క బుద్ధియొక్క నాశమువలనఁ ప్రణశ్యతి=నశించుచున్నాఁడు, పురుషార్థమున కయోగ్యుఁ డగుచున్నాఁ డని యర్థము.

క్రోధమువలన యుక్తాయుక్తముల అవివేకము కలుగును, ఆ యవివేకము వలన శాస్త్రాచార్యోపదిష్ట మయిన యర్థముయొక్క స్మృతికి నాశము కలుగును. స్మృతినాశమువలన బుద్ధికి కార్యాకార్యవివేకసామర్థ్యము నశించును. అందువలనఁ బురుషుఁడు పురుషార్థప్రాప్తికి అనర్హుఁ డగు నని తాత్పర్యము.

ఆ. క్రోధము సమ్మోహమునకు హేతు వనుటను అనుభవముచే దృఢీకరించుచున్నారు క్రుద్ధుఁడు గదా ఇత్యాదిగా. ఆక్రోశించుచున్నాఁడు— అధిక్షేపించుచున్నాఁడు. గురువునుగూడ అనుటచే అది అయోగ్యకార్య మని తెలుపఁబడినది. సమ్మోహముయొక్క కార్యముఁ జెప్పుచున్నారు సమ్మోహాత్ ఇత్యాదిగా. స్మృతియొక్క నిమిత్తము దెలుపుద్వారంబున స్వరూపమును నిరూపించుచున్నారు శాస్త్రాచా ర్యేత్యాదిగా. స్మృతి క్షణిక మగుటవలననే దానికిఁ దనయంతనె నాశము సంభవించుటవలన స్మృతినాశము సమ్మోహాధీనము కా దని యాశంకించి చెప్పుచున్నారు స్మృతిపుట్టుటకు ఇత్యాదిగా. స్మృతిభ్రంశ మయినను ఎట్లు బుద్ధి నాశము స్వరూపముచే సిద్ధించు ననఁగాఁ జెప్పుచున్నారు కార్యాకా ర్యేత్యాదిగా. ఓయీ! పురుషునకు నిత్యసిద్ధునగు బుద్ధినాశ మయినను నాశము కలుగనేరదు అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు ఎంతవఱకు ఇత్యాదిగా. కార్యాకార్యములవివేచించుటకు సమర్థ మయిన అంతఃకరణము లేనియెడ ఉన్నవాఁడైనను బురుషుఁడు కరణము లేమిం జేసి తత్త్వవివేకమున కసమర్థుఁ డగుటచే నష్టుఁ డని వ్యపదేశము. అదియే చెప్పుచున్నారు పురుషార్థమునకు ఇత్యాదిగా.

హ. *

శం. క్రోధాత్; సమ్మోహః = విచిత్తత, కార్యాకార్యవివేకము లేకుండుట; కలుగుచున్నది, క్రోధావిష్టుఁడు గదా సమ్మోహముచే పెద్దలకుఁగూడ నప

♦ సమగ్రము.

* శంకరభాష్యముతో సమానము.

చారము చేయుచున్నాఁడు, గురువునుగూడ ధిక్కరించుచున్నాఁడు. ఈలక్షణము గల, సమ్మోహాత్; స్మృతివిభ్రమః, కలుగుచున్నది, వేదాంతశ్రవణజన్యజ్ఞానముచే "బ్రహ్మైవాహమ్" అని మాటిమాటికి స్వానుభవముచేఁ గలుగు సంస్కారముచేఁ బుట్టునట్టి తదాకారపరిణామిబుద్ధివృత్తివిశేషము స్మృతి యని చెప్పఁబడుచున్నది, దానికి విభ్రమ మనఁగా భ్రంశము, స్మృతికి హేతువు ఉన్నను అది యుదయింప కుండుట. ఆస్మృతిభ్రంశమువలన బుద్ధినాశము. బుద్ధి యనఁగా బ్రహ్మమయ మయిన వృత్తి, దానికి స్వవిషయకస్మృతి నశించుటవలన నాశ మగుచున్నది. ఎట్లు, పురుషుఁ డెదుటనే యున్నను, ఇతఁడు పుత్త్రుఁ డను స్మృతి యున్ననే నా పుత్త్రుఁ డితఁ డని పుత్త్రాకారబుద్ధి కలుగుచున్నది, భ్రాంతునకో అట్టి స్మృతి సంభవింపమివలనఁ బుత్త్రాకారబుద్ధి జనియింపదు. అట్లు, బ్రహ్మము అపరోక్షమై యున్నను విషయవ్యామోహపరవశ మయిన చిత్తము గల విద్వాంసునకు స్వవిషయకస్మృతి లేమివలన, ఇదియు నేనును బ్రహ్మమే యని, దృశ్యాకారతను విడిచి, జగత్తునకును దనకును బ్రహ్మాకారతను విషయము చేయునట్టి యఖండాత్మకచిన్మయవృత్తి జనియింపదు. మ ఱేమనఁగా, భోక్తృభోగ్యాద్యాకారవృత్తులచేఁ దిరోహితమై నష్ట మగుచున్నది. ఇట్లు స్వవిజ్ఞానముయొక్క నాశమువలన విద్వాంసుఁడు తానును, ప్రణశ్యతి = మిక్కిలి నశించుచున్నాఁడు, సంసారాకారసాగరమునందుఁ బడినవాఁ డగుటవలన ఒకప్పుడును ముక్తిని బొందఁజాలఁడు. విషము ద్రాగినవానికి అమరత్వ ♦ మెట్లు సిద్ధింపదో అట్లు అసన్మార్గమునందుఁ బ్రవిష్టునికి సద్గతి సంభవింపదు. అందువలన విషయంబుల కవకాశం బొసంగక సర్వేంద్రియములను నిగ్రహించి సమాధి చేయుచుండువానికే సమ్యక్ జ్ఞానంబును దత్ఫలంబును సిద్ధించు నని సిద్ధము.

మ. క్రోధాత్, భవతి, సమ్మోహః = కార్యాకార్యవివేకము లేకుండుట. సమ్మోహాత్, స్మృతివిభ్రమః = స్మృతియొక్క — శాస్త్రాచార్యోపదిష్ట మయిన యర్థముయొక్క అనుసంధానముయొక్క, విభ్రమః—విచలనము, విభ్రంశము. ఆ స్మృతిభ్రంశమువలన, బుద్ధినాశః = ఐకాత్మ్యాకారమనోవృత్తికి నాశము, విపరీతభావన యతిశయించుదోషముచేఁ బ్రతిబంధము కలుగుటవలన జనింపకుండుట, జనించినను ఫలాయోగ్య మగుటచే విలయము. బుద్ధినాశాత్ ప్రణశ్యతి—ఫలభూత మయిన ఆబుద్ధియొక్క లోపమువలన, ప్రణశ్యతి—సర్వపురుషార్థములకును అనర్హుఁ

♦ చావులేమి.

డగుచున్నాఁడు. ఎవ్వఁడే పురుషార్థమునకు అనర్హుఁ డగునో వాఁడు మృతుఁడే యని లోకమునందు వ్యవహరింపఁబడుచున్నాఁడు. కావున ప్రణశ్యతి అని చెప్పఁబడినది. ఎందువలన ఇట్లు మనోనిగ్రహము లేనియెడ బాహ్యేంద్రియముల నిగ్రహించినవానికిఁ బరమానర్థము సంభవించునో, అందువలన మహాప్రయత్నముచే మనస్సును నిగ్రహింపవలె నని యభిప్రాయము. కావున యుక్తము చెప్పఁబడినది « తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత » అని.

శ్రీ. క్రోధాత్, సమ్మోహః = కార్యాకార్యవివేకాభావము. దానివలన, శాస్త్రాచార్యోపదిష్టార్థముయొక్క- స్మృతికి, విభ్రమః— విచలనము, విభ్రంశము. దానివలన, బుద్ధికి—చేతనకు, వినాశము—వృక్షాదులందుంబోలె అభిభవము ౧. దానివలన, ప్రణశ్యతి — మృతతుల్యుఁ డగుచున్నాఁడు.

ప. క్రోధాత్, సమ్మోహః = ఇది కార్యము ఇది అకార్యము అను విచారము లేకుండుట. దానివలన, స్మృతివిభ్రమః—శాస్త్రముచేతను ఆచార్యుని చేతను ఉపదేశింపఁబడినవాఁడై ఎట్టివాఁడను నేను? ఏమి చేయుచున్నాను? అని స్మరింపఁడు. దానివలన, బుద్ధినాశః, దానివలన, ప్రణశ్యతి— లోకనిందకు విషయమగుటచే జీవించియు మృతతుల్యుఁ డగుచున్నాఁడు. ఇట్లు దీనిచే మొదట విషయానుస్మృతిని బరిహరింపవలె నని చెప్పఁబడినది. అట్లు చెప్పియున్నారు గూడ « లోక ఏష విషయానురఞ్జనం దుఃఖగర్భ మపి మన్యతే సుఖమ్ । ఆమిషం బడిశగర్భ మప్యహో మోహతో గ్రసతి యద్వ దణ్డజః ” * అని.

రా. క్రోధాత్ భవతి, సమ్మోహః = కృత్యాకృత్యవివేకము లేకుండుట. దానిచే సమస్తమును జేయుచున్నాఁడు. దానివలన, ప్రారంభింపఁబడిన యింద్రియజయము మొదలగు ప్రయత్నమునందు, స్మృతివిభ్రమః = స్మృతిభ్రంశము అగుచున్నది. స్మృతిభ్రంశాత్, బుద్ధినాశః = ఆత్మజ్ఞానమునం దేవ్యవసాయము చేయఁబడినదో దానికి నాశము, అగును. బుద్ధినాశాత్; మరల సంసారమునందు మునింగినవాఁడై, ప్రణశ్యతి = నష్టుఁ డగుచున్నాఁడు.

---

౧ తిరోభావము.

* ఈలోకము, విషయసుఖము దుఃఖగర్భ మయినను దాని సుఖమునుగాఁ దలంచుచున్నది. ఆశ్చర్యము! మాంసము గాలము లోపలఁ గల దైనను దానిని మోహమువలన మత్స్యం బెట్లు మ్రింగుచున్నదో అట్లు.

క్రోధమువలన కృత్యాకృత్యవివేకము లేమి కలుగును, దానివలన అకార్యానుష్ఠానమునందుఁ బ్రవర్తించుటంజేసి ఇంద్రియనిగ్రహాదిప్రయత్నమునం దలిస్మృతి భ్రష్టమగును, స్మృతి భ్రంశమువలన, ఆత్మజ్ఞానమునందుఁ దాను జేసియుండు వ్యవసాయము నశించును. దానివలన మరల సంసారమగ్నుండై చెడిపోవునని తాత్పర్యము.

మా. సమ్మోహః = అధర్మమునం దిచ్ఛ. అట్లుగదా మోహశబ్దార్థము చెప్పఁబడినది యుపగీతలందు "మోహసంజ్ఞితమ్, అధర్మలక్షణం చైవ నియతం పాపకర్మసు" అని. మఱియు నితరస్థలమునందుఁగూడ "సమ్మోహో ఽధర్మకామితా" అని. స్మృతివిభ్రమః = నిషేధాదిస్మృతికి నాశము ♦, బుద్ధినాశః = సాకల్యముగా దోషబుద్ధికి నాశము. ప్రణశ్యతి = నరకాద్యనర్థమును బొందుచున్నాఁడు. అట్లు చెప్పఁబడినది గదా! "అధర్మకామిన శ్శాస్త్రే విస్మృతి ర్జాయతే యదా। దోషాదృష్టే స్తత్కృతే శ్చ నరకం ప్రతిపద్యతే" * అని.

రాగద్వేషవియుక్తై స్తు విషయా నిన్ద్రియై శ్చరన్
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి. ౬౪

భా. సర్వానర్థంబునకు మూలము చెప్పఁబడినది విషయాభిధ్యానము. ఇఁక నిప్పుడు మోక్షకారణం బిది చెప్పఁబడుచున్నది.— రాగద్వేషవియుక్తైః—రాగమును ద్వేషమును రాగద్వేషములు, తత్పూర్వకము గదా యింద్రియముల స్వాభావికప్రవృత్తి, అందు ఎవ్వఁడు ముముక్షు వగుచున్నాఁడో అతఁడు ♦♦ వానిచే, వియుక్తము లయిన; ఇన్ద్రియైః = శ్రోత్రాదీంద్రియములచేత; విషయాన్—అవర్జనీయము లగు విషయములను; చరన్ = పొందుచు; ఆత్మవశ్యైః = ఆత్మకు § వశ్యములు అధీనములు అగువానిచేత ¶; విధేయాత్మా = ఇచ్ఛచే విధేయము

♦ ఇది ప్రతిషిద్ధము అను స్మరణము నశించుట.

* అధర్మము కోరువాని కప్పుడు శాస్త్రమునందు విస్మృతి—మఱపు గలుగుచున్నదో అప్పుడు దోషబుద్ధి లేమివలనను ఆదోషము ననుష్ఠించుటవలనను నరకమును బొందుచున్నాఁడు.

♦♦ ఇది తు శబ్దతాత్పర్యము, పూర్వశ్లోకము అముముక్షువిషయము ఇది ముముక్షు విషయం బని వ్యావృత్తి చేయుచున్నది.

§ అంతఃకరణమునకు.

¶ ఇంద్రియముల విశేషణము.

లోఁబడినది యగు ఆత్మ అంతఃకరణము గలవాఁడై; ఇతఁడు, ప్రసాదమ్ = ప్రసన్నతను. స్వాస్థతను; అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

ఇఁక ముముక్షు వగువాఁడు మనస్సును స్వాధీనము చేసికొని రాగద్వేషములు విడిచినవాఁడై మనస్సున కధీనము లగు నింద్రియములచే అవర్జనీయము లయిన అన్నపానాదివిషయములను బొందుచుండి, చిత్తప్రసాదము నొందునని తా.

ఆ. విషయముల స్మరణముగూడ అనర్థకారణ మైనయెడ, అప్పుడు భోగము మఱి యనర్థకారణ మగును. అందుచే జీవనార్థము విషయముల భుజించువాఁ డనర్థము నెట్లు పొందకుండును? అని యాశంకించి, కడచినవిషయము ననువదించుచు నుత్తరశ్లోకతాత్పర్యము చెప్పుచున్నారు సర్వానర్థమునకు ఇత్యాదిగా. ఇఁక—అనర్థమూలము చెప్పిన పిమ్మట. పరిహరింపవలసినది నిశ్చయింపఁబడిన పిమ్మటఁ దత్పరిహారోపాయమునందు జిజ్ఞాసను చూపుచున్నారు ఇప్పుడు అని. రాగద్వేషపూర్వకము ఇంద్రియములప్రవృత్తి అనువిషయమునందు అనుభవము చూపుటకు కదా అనుశబ్దము. శాస్త్రీయప్రవృత్తి కా దని చెప్పుటకు స్వాభావిక ప్రవృత్తి యని చెప్పఁబడినది. అందు అని అధికారుల నధికరించి ప్రయోగింపఁబడినది ♦. అవర్జనీయములు—అన్నపానాదులు, దేహస్థితిహేతువు లని యర్థము. ఇంద్రియములకు విషయములందుఁ బ్రవృత్తి యగునేని నియమము లేమిచే వర్జనీయములందుఁగూడఁ బ్రవృత్తి యగు నని యాశంకించి చెప్పుచున్నారు ఆత్మవశ్యైః అని. ఇంద్రియములు అంతఃకరణమున కధీనములైనను దానికి నియమము లేమిం జేసి వానికిఁగూడ నియమము అనుపపన్న మని యాశంకించి చెప్పుచున్నారు విధేయాత్మా అని.

హ. *

శం. ఓయీ! ఇంద్రియములచే విషయగ్రహణము లేనిచో విద్వాంసున కెట్లు శరీరయాత్ర సిద్ధించు నని యాశంకించి విద్వాంసునకు శరీరయాత్రాప్రకారంబును నిత్యము సమాధిచేయువానికిఁ జిత్తప్రసాదంబును జెప్పుచున్నాఁడు.—రాగద్వేషములకు బీజము విషయములందు "ఇది యిష్టము ఇది యనిష్టము" అను బుద్ధియే. దోషదర్శనముచే నది వదలఁగా ఇంద్రియములు రాగద్వేషవియు

♦ అధికారులలో అనుట.

* శంకరభాష్యముతో సమానము.

క్తంబు లగును. అట్టి రాగద్వేషవియుక్తైః—విషయములందు అసత్త్వ తుచ్ఛత్వ బన్ధకత్వ బుద్ధిచే రాగద్వేషములవలన విడిపింపఁబడిన వని యర్థము, అందువలననే, ఆత్మవశ్యైః = తనకు వశ్యములు, సంకోచపఱచుటకును వికాసపఱచుటకును వశవర్తులు, ప్రసన్నములు, అగు; ఇన్ద్రియైస్తు = ఇంద్రియములచే మాత్రము; విషయాన్—నిషిద్ధములు కాని యన్నరసాదులను, అందును ప్రాణరక్షణమునకు మాత్రమె చాలినవానిని; చరన్ = భుజించునట్టి బ్రహ్మవిదుఁ డగు యతి; విధేయాత్మా = విధేయము ఇంద్రియశుద్ధిచేతను సమాధిచేతను రాగాదిదోషములు వీడిన దగుటచే శుద్ధ మగుటచే స్వాధీన మగు ఆత్మ—మనస్సు గలవాఁడై; ప్రసాదమ్ = చిత్తముయొక్క స్వాస్థ్యమును, అత్యంతనిర్మలత్వమును; అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు, « ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః, సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః » అని చెప్పఁబడియుండుటవలన, ఇంద్రియశుద్ధిచే చిత్తశుద్ధి సిద్ధించుచున్నది యని యర్థము.

మ. మనసు నిగ్రహింపఁబడినయెడమాత్రము బహిరింద్రియనిగ్రహము లేకున్నను దోషము లే దని చెప్పుచు « కిం ప్రజేత » అనుప్రశ్న కుత్తరముఁ జెప్పుచున్నాఁ డెనిమిదింటిచేత.——ఎవ్వఁడు సమాహిత మయిన మనసుగలవాఁడు కాఁడో అతఁడు బాహ్యేంద్రియముల నిగ్రహించియు రాగద్వేషములచే దుష్ట మయిన మనస్సుతో విషయములఁ జింతించుచుఁ బురుషార్థమునుండి భ్రష్టుఁ డగుచున్నాఁడు. విధేయాత్మా తు—తుశబ్దము పూర్వునికన్నను వ్యతిరేకముఁ జెప్పుచున్నది, ఇఁక వశీకృత మయిన అంతఃకరణము గలవాఁడో; ఆత్మవశ్యైః = మనస్సున కధీనములు, లేక, స్వాధీనములు; రాగద్వేషవియుక్తైః = రాగద్వేషములచే విడువఁబడినవి అగు; ఇన్ద్రియైః = శ్రోత్రాదులచేత; విషయాన్ = నిషిద్ధములు కాని శబ్దాదులను; చరన్ = పొందుచు; ప్రసాదమ్ = చిత్తముయొక్క ప్రసన్నతను, స్వచ్ఛతను, పరమాత్మసాక్షాత్కారయోగ్యతను; అధిగచ్ఛతి. రాగద్వేషప్రయుక్తము లగు నింద్రియములు దోషహేతువు లగును. మనసు స్వవశంబైనచో రాగద్వేషములు లేవు. అవి లేనియప్పుడు తదధీనమైన ఇంద్రియప్రవృత్తి కలుగదు. అవర్జనీయ మగుటచే విషయగ్రహణమో, దోషము కలిగింపదు. కావున శుద్ధికి హాని లే దని భావము. ఇందుచే « విషయముల స్మరణముగూడ అనర్థకారణం బగునేని అపుడు భోగము మఱి యనర్థకారణము. అందుచే జీవనార్థము విషయముల భుజించువాఁ డెట్లనర్థము చెందకుండును ?» అనుశంక నిరసింపఁబడినది,

స్వాధీనము లగు నింద్రియములచే విషయములం బ్రాపించుచున్నాఁ డని కిం ప్రజేత యనుప్రశ్న కుత్తరమునుం జెప్పఁబడినది.

శ్రీ. ఓయీ! విషయపరత్వము ఇంద్రియములస్వభావ మగుటచే వాని నిరోధింప శక్యము గామిం జేసి యీదోషము పరిహరింప నలవి గాదు. కావున స్థితప్రజ్ఞు డెట్లు సిద్ధించు నని యాశంకించి చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత— రాగద్వేషరహితములు దర్పము లేనివి అగు, ఇన్ద్రియైః, విషయాన్, చరన్ = ఉపభోగించుచున్నను, ప్రసాదమ్ = శాంతిని; పొందుచున్నాఁడు. రాగద్వేషరాహిత్యమునే చెప్పుచున్నాఁడు.—ఆత్మవశ్యైః = మనసునకు వశ్యము లయినవానిచేత. విధేయాత్మా = వశవర్తి యయిన మనస్సు గలవాఁడు అని. దీనిచేతనే “కథం ప్రజేత—భుజించును” అను వాల్గనప్రశ్నకు, “స్వాధీనము లగు నింద్రియములచే విషయముల నొందుచున్నాఁ” డని యుత్తరము చెప్పఁబడినది.

ప. ఇఁక దీనిఁ జేయ నసమర్థుఁ డైనను తరించుచున్నాఁ డని “కిం ప్రజేత” అనుదాని కుత్తరముఁ జెప్పుచున్నాఁడు.—రాగద్వేషవియుక్తైః = ఇన్ద్రియైః విషయాన్ చరన్ ప్రసాదమ్ అధిగచ్ఛతి—రాగ మనఁగా ప్రీతి ఆసక్తి, ద్వేషము—వీనిచే వియుక్తములు ఉదాసీనము లగు, ఇంద్రియములచే విషయముల భుజించుచు. ఇఁక రాగద్వేషవియుక్తము లగుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు ఆత్మవశ్యైః—ఆత్మవశ్యుఁడుగాఁ గలవి, సర్వత్ర ఆత్మభావన గలవి, అట్టి యింద్రియములచేత; విధేయాత్మా = విధేయము పరినిష్ఠితము ♦ అగు ఆత్మ—మనస్సు గలవాఁడు. ప్రసాదమును శాంతిని పొందుచున్నాఁ డని యర్థము. అట్లు చెప్పఁబడినది. “అగ్నిసఙ్గా ద్యథా లోహ మగ్నిత్వ ముపగచ్ఛతి । ఆత్మసఙ్గా త్తథా గచ్ఛత్యాత్మతా మిన్ద్రియాదికమ్” * అని.

రా. చెప్పినవిధంబున చిత్తమునకు శుభాశ్రయ మయినవాఁడను సర్వేశ్వరుఁడనగు నాయందు ఉంపఁబడిన మనస్సు గలవాఁడు, దహింపఁబడిన అశేషకల్మషములు గలవాఁ డగుటచే; రాగద్వేషవియుక్తైః, ఆత్మవశ్యైః, ఇన్ద్రియైః, విషయాన్ చరన్ = విషయములను దిరస్కరించి యున్నవాఁడై; విధేయాత్మా = విధేయ మయిన

---

♦ స్థిరము.

* అగ్నిసంగమువలన నెట్లు లోహము అగ్నిభావమును బొందుచున్నదో అట్లు ఆత్మసంగమువలన ఇంద్రియాదికము ఆత్మత్వమును బొందుచున్నది.

మనస్సు గలవాఁడై; ప్రసాదమ్ అధిగచ్ఛతి—నిర్మల మయిన అంతఃకరణము గలవాఁ డగుచున్నాఁ డని యర్థము.

ఈ చెప్పినవిధంబున నాయందు మనస్సు నిలిపి, దగ్ధకల్మషుండై, రాగద్వేషరహితము లయి ఆత్మవశ్యము లగు నింద్రియములు గలవాఁడై సర్వవిషయములఁ బరిత్యజించినయెడ, మనస్సు అతనికి విధేయంబై నిర్మలం బగు నని తాత్పర్యము.

మా. ఇంద్రియజయంబును దత్ఫలమునుం జెప్పుచున్నాఁడు మీఁది రెండు శ్లోకములచేత.—విషయములను అనుభవించుచున్నను, విధేయాత్మా = విధేయ మయిన ఆత్మ గలవాఁడై, జితాత్ముఁడై యని యర్థము. ప్రసాదమ్ = మనః ప్రసాదమును.

ప్రసాదే సర్వదుఃఖానాం హాని ర స్యోపజాయతే
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే. ౬౫

భా. ప్రసాదము కలిగినయెడ నేమి యగును? అనఁగాఁ జెప్పెదము.—ప్రసాదే = చిత్తస్వాస్థ్యము కలుగఁగానే; అస్య = ఈయతికి; సర్వదుఃఖానామ్ = ఆధ్యాత్మికాది సమస్తదుఃఖములకును; హానిః = వినాశము; ఉపజాయతే = కలుగుచున్నది. మఱియును. ప్రసన్నచేతసః = స్వచ్ఛ మయిన అంతఃకరణము గలవానికి; హి = ఎందువలన; ఆశు = శీఘ్రముగా; బుద్ధిః = చిత్తము; పర్యవతిష్ఠతే = ఆకాశమువలె, పరి—అంతటను, అవతిష్ఠతే—నిలిచియుండునో, ఆత్మరూపముననే నిశ్చలముగానుండునో అని యర్థము. ఇట్లు ప్రసన్నచేతసుండును అవస్థితబుద్ధియు నగువానికిఁ గృతకృత్యత యెందువలననో, అందువలన రాగద్వేషవియుక్తంబు లగు నింద్రియములచే శాస్త్రమున కవిరుద్ధంబులు అవర్జనీయంబు లగు విషయంబులందు యుక్తుఁడై వ్యవహరింపవలె నని వాక్యార్థము.

ప్రసాదము కలిగినయెడ, ఈయతికి సర్వదుఃఖములును నశించును. మఱియు చిత్తప్రసాదము గలవానికి శీఘ్రముగ బుద్ధి ఆత్మాకారమై స్థిరముగ నిలుచును. అందువలనఁ జిత్తప్రసాదము సంపాదింపవలె నని తాత్పర్యము.

ఆ. అట్లయినను నానావిధదుఃఖములచే అభిభవింపఁబడి యుండుటవలన స్వాస్థ్యము నిలుపుకొన శక్యము కాదనునభిప్రాయముతో నడుగుచున్నాఁడు ప్రసాదము ఇత్యాదిగా. అర్ధశ్లోకముచే నుత్తరము చెప్పుచున్నారు చెప్పెదము ఇత్యాదిగా. సర్వదుఃఖహానిచే చిత్తస్వాస్థ్యము సిద్ధించినను ప్రకృత మగు ప్రజ్ఞాస్థైర్యం బెట్లు సిద్ధించు నని యాశంకించి చెప్పుచున్నాఁడు ఉత్తరార్ధముచేత. చిత్త ప్రసాదమునకే ఫలాంతరము చెప్పుచున్నారు మఱియును ఇత్యాదిగా. అందువలన చిత్తప్రసాదముకొఱకుఁ బ్రయత్నింపవలె నని శేషము. రెండుశ్లోకములకును అక్షరార్థము చెప్పి తాత్పర్యార్థము నుపసంహరించుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. యుక్తుఁడై—సమాహితుఁడై విషయపరవశుఁడు కానివాఁడై యని యర్థము.

హ. ప్రసాదము కలుగఁగా నేమి యగును? దీనికిఁ జెప్పుచున్నాఁడు.—ప్రసాదే = ప్రసన్నత కలుగఁగానే; సర్వదుఃఖానామ్ = ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికములకు; హానిః = నాశము. ఆధ్యాత్మికములు—జన్మమరణములు తన్మధ్యమున వాతపిత్తశ్లేష్మసంక్షోభముచేఁ బుట్టు వికారములు. ఆధిభౌతికములు—భూతములకు బండరాతిచే వధ్యఘాతుకభావంబునఁ గలుగు దుఃఖములు ఆయుధప్రహారాదులు. ఆధిదైవికములు—గాలి యెండ వర్షము తత్ప్రతిబంధము—వీనిచేఁ బుట్టుదుఃఖములు. ఈయాధ్యాత్మికాది దుఃఖములకు, హానిః—నాశము, అస్య = ఈయోగికి, కలుగుచున్నది. మఱియును. ప్రసన్నచేతసః = స్వస్థమయిన అంతఃకరణము గలవానికి; ఆశు = శీఘ్రముగా; బుద్ధిః; పర్యవతిష్ఠతే—ఆకాశమువలె, ఆత్మైకత్వము గ్రహించునదియై, పరి—అంతటను అవతిష్ఠతే—ఆత్మస్వరూపముచేతనే నిశ్చల మగుచున్న దని యర్థము.

శ్రీ౦. నిత్యమును సమాధినిష్ఠచే ఇంద్రియములకును మనస్సునకును శుద్ధిరూప మయిన ప్రసాదమును సంపాదించిన విద్వాంసునకు ఆప్రసాదము సిద్ధించుటచేఁ గలుగుఫలమును జెప్పుచున్నాఁడు—ఇంద్రియశుద్ధి సిద్ధించుటవలనఁ బ్రసాదము ప్రాప్తము కాఁగా. అస్య = ఈవిద్వాంసునకు; సర్వదుఃఖానామ్—ఇట దుఃఖశబ్దముచే తత్కారణములగు విక్షేపములు లక్షింపఁబడుచున్నవి, ఆ సమస్తవిక్షేపములకును; హానిః = నిశ్శేషనివృత్తి; ఉపజాయతే. అందువలననే, ఆశు = శీఘ్రముగానే; ప్రసన్నచేతసః = నిర్మలచిత్తుఁడగు నతనియొక్క; బుద్ధిః = సర్వాత్మ బ్రహ్మముఁ జూచునట్టి ప్రజ్ఞ; పర్యవతిష్ఠతే—ప్రతిష్ఠిత మగుచున్న దని యర్థము.

మ. ప్రసాద మధిగచ్ఛతి యని చెప్పఁబడినది. అందుఁ బ్రసాదము కలుగుటచే నేమి యగు ననఁగాఁ జెప్పఁబడుచున్నది.—చిత్తమునకు, ప్రసాదే = స్వాచ్ఛ త్వము కలుగఁగా; సర్వదుఃఖానామ్ = అజ్ఞాననిబంధనము లయిన ఆధ్యాత్మికాదుల యొక్క; హానిః = వినాశము; అస్య = ఈయతికి; ఉపజాయతే. హి = ఎందువలన ననఁగా. ప్రసన్నచేతసుఁ డగు యతికి; ఆశు = శీఘ్రముగనే; బుద్ధిః = బ్రహ్మైకాత్మ్యాకార మయిన బుద్ధి; పర్యవతిష్ఠతే—పరి = అంతటను, అవతిష్ఠతే = స్థిర మగు చున్నది, విపరీతభావనాదిప్రతిబంధములు లేకుండుటవలన. అట్లు కావున, ప్రసా దము గలుగుటచే బుద్ధిపర్యవస్థానము *, దానివలన తద్విరోధి యగు నజ్ఞానము యొక్క నివృత్తి, దానివలన అజ్ఞానకార్యము లయిన సకలదుఃఖములయొక్క హాని, అని క్రమము ఉన్నను, ప్రసాదమునం దధికయత్నము చేయవలె ననుటకై, దానిచే సర్వదుఃఖహాని యగు నని చెప్పుట. కావున విరోధము లేదు.

శ్రీ. ప్రసాదము కలిగిన పిమ్మట నేమగు ననఁగాఁ దానికిఁ జెప్పు చున్నాఁడు.—ప్రసాదము కలుగఁగా, సర్వదుఃఖనాశ మగును. అందువలన, ప్రసన్న చేతసునిబుద్ధి ప్రతిష్ఠిత మగుచున్న దని యర్థము.

ప. ఇఁక దానిచే నేమి యగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—అస్య = ఈపురుషునకు, ప్రసాదము కలుగఁగా, సర్వదుఃఖానామ్, హానిః, కలుగుచున్నది. ఇట్లు సర్వదుఃఖములకును అతీతుఁ డగుటచే, ప్రసన్నమనస్కుఁ డగువానికి, ఆశు = శీఘ్రముగా, బుద్ధిః, పర్యవతిష్ఠతే = నిశ్చల మగుచున్నది.

రా. అస్య = ఈపురుషునకు; ప్రసాదే - మనఃప్రసాదము కలుగఁగా; సర్వ దుఃఖానామ్ = ప్రకృతిసంసర్గముచేఁ గలుగు సమస్తదుఃఖములకును; హానిః; ఉప జాయతే = కలుగుచున్నది. ప్రసన్నచేతసః = ఆత్మావలోకనమునకు విరోధి యగు దోషము లేని మనసు గలవానికి; ఆశు—అప్పుడే; హి = ఏకారణమువలన, బుద్ధిః = వివిక్తాత్మవిషయ మయిన బుద్ధి; పర్యవతిష్ఠతే = స్థిర మగుచున్నదో. అందువలన మనఃప్రసాదము కలిగినప్పుడ సర్వదుఃఖములకును హాని కానే యగును.

ఈపురుషునకు మనఃప్రసాదము కలుగుటచేఁ బ్రకృతిసంబంధ జనితము లగు సర్వదుఃఖములును నశించుచున్నవి. ఏల యనఁగా మనస్సు ఆత్మావలోకన

* స్థైర్యము.

విక్షేపాదిదోషము నశించి ప్రసన్నమైనవెంటనే ఆత్మవిషయబుద్ధి స్థిరముగా నిలుచుచున్నది. కావున సర్వదుఃఖములును నశించు ననుటకు సందేహము లేదని తా.

మూ. ఎట్లు ప్రసాదమాత్రముచే సర్వదుఃఖహాని? ప్రసన్నచేతసో హి= ప్రసన్నచేతసునకుఁ గదా, బుద్ధిః, పర్యవతిష్ఠతే= బ్రహ్మమునకు అపరోక్షముగా చక్కఁగా స్థితిని చేయుచున్నది. ప్రసాద మనఁగా—తనయంతఁ బ్రాయికముగా విషయములందు అప్రవృత్తి.

నాఽస్తి బుద్ధి రయుక్తస్య నచాఽయుక్తస్య భావనా
నచాఽభావయత శ్శాన్తి రశాన్తస్య కుత స్సుఖమ్. ౬౬

భా. ఆయీ ప్రసన్నత స్తుతింపఁబడుచున్నది.—నాఽస్తి = కలుగదు; బుద్ధిః = ఆత్మస్వరూపవిషయమైన బుద్ధి; అయుక్తస్య = సమాహితమైన అంతఃకరణము గలవాఁడు కానివానికి. అయుక్తస్య = సమాహితుఁడు కానివానికి; భావనా = ఆత్మజ్ఞానమునందభినివేశము; నచ = లేదు. అట్లు, అభావయతః = ఆత్మజ్ఞానాభినివేశమును చేయనివానికి; శాన్తిః = ఉపశమము; నచ = కలుగదు. అశాన్తస్య = శాంతి నొందనివానికి; సుఖమ్ = సుఖము; కుతః = ఎక్కడిది? ఇంద్రియములకు విషయసేవయందలి తృష్ణనుండి నివృత్తి యేది గలదో అది గదా సుఖము. కాని విషయమునందలి తృష్ణ సుఖము కాదు. దుఃఖమేగదా అది. తృష్ణ యుండఁగా సుఖముయొక్క గంధమాత్రమైనను కలుగదని యర్థము.

చిత్తస్థైర్యము లేని వానికి ఆత్మస్వరూపజ్ఞానము కలుగదు. ఏల యనఁగా, వానికి ఆత్మస్వరూపచింతనము సంభవింపదు. స్వరూపచింతనము లేని వానికి అనర్థనివృత్తి సంభవింపదు. అనర్థనివృత్తికానిచో సుఖము లేనే లేదని తా.

ఆ. ఏమి మఱి సత్త్వశుద్ధిచేతనే యీబుద్ధి సిద్ధించునా? అనఁగా అట్లు కాదని చెప్పుచున్నారు ఆయీ ఇత్యాదిగా. అసమాహితునకుఁగూడ బుద్ధిమాత్రము పుట్టుటం జూచుచున్నా మని యాశంకించి విశేషణము చేయుచున్నారు ఆత్మస్వరూపవిషయమైన అని. విక్షిప్తమయిన చిత్తముఁగలవానికి ఆత్మస్వరూపవిషయం బగు

బుద్ధి యొక్క ఉదయింపఁజాల దను నీవిషయమునందు హేతువుఁ జెప్పుచున్నారు అయుక్తస్యేత్యాదిగా. ఆత్మజ్ఞానము శబ్దమునలన అపాతముగాఁ గలిగినపిమ్మట సాక్షాత్కారార్థ మగు అవిచ్ఛిన్న స్మరణము అభినివేశమనియు భావనయనియుఁ జెప్పఁబడుచున్నది. ఇది విక్షిప్తచిత్తునకు సిద్ధింప దని హేత్వర్థమును వివక్షించి చెప్పుచున్నారు ఆత్మజ్ఞానమునం దని. భావనాద్వారమున సాక్షాత్కారము లేకున్నను ఏమి హాని? అని ఆశంకించి చెప్పుచున్నారు అట్లు అని. సమాహితుఁడు కాని వానికి భావన కలుగని యట్లని యర్థము. ఆత్మ అపాతముగా తెలియఁబడినపిమ్మట శ్రవణాద్యావృత్తిరూప మయిన స్మృతిని జేయనివానికి అపరోక్షజ్ఞానము కలుగమి వలన అనర్థనివృత్తి సిద్ధింప దని చెప్పుచున్నారు ఉపశమము అని. అనర్థనివృత్తి నొందనివానికిఁ బరమానందసాగరమునుండి విభక్తుఁడై సంసారసముద్రమునందు నిమగ్నుఁడైన వానికి సుఖావిర్భావము సంభవింప దని చెప్పుచున్నారు అశాన్తస్యేత్యాదిగా. వానికిఁగూడ విషయములు సేవించుటవలన విషయజన్యసుఖము సంభవించుచున్న దని యాశంకించి చెప్పుచున్నారు ఇంద్రియములకు ఇత్యాదిగా. తృష్ణాక్షయమే సుఖమనుట శాస్త్రప్రసిద్ధమును అనుభవసిద్ధమును అని చెప్పుటకు కదా అను శబ్దము. విషయసేవాతృష్ణచేతఁ గూడ విషయోపభోగద్వారమున సుఖము కనఁబడుచున్న దని యాశంకించి చెప్పుచున్నారు దుఃఖమే ఇత్యాదిగా. అటఁగూడ కదా అనునది అనుభవము దెలుపుచున్నది. దానినే స్పష్టీకరించుచున్నారు తృష్ణయుండఁగా ఇత్యాదిగా.

హ. కలుగదు, అట్టి యాప్రసన్న మయిన, బుద్ధిః= ఆత్మస్వరూపవిషయ బుద్ధి, అయుక్తస్య= అసమాహితునకు. న చ అయుక్తస్య భావనా, ఆత్మజ్ఞానాభినివేశము భావన. న చ అభావయతః శాన్తిః—అభావయతః= ఆత్మజ్ఞానాభినివేశము లేనివానికి, శాన్తిః= ఉపశమము, కలుగదు. అశాన్తస్య= ఉపరతములు కాని యింద్రియములుగలవానికి; కుతః సుఖమ్=ఇంద్రియములకు విషయతృష్ణవలన నివృత్తి సుఖము, కాని విషయతృష్ణ సుఖము కాదు. దుఃఖంబే గదా అది. తృష్ణయుండునప్పుడు సుఖగంధ మయినను ఉపపన్నముగాదు.

శ్రీం. నిత్యానిత్యవివేకముచేతను వైరాగ్యముచేతను తీవ్రముముక్షుచేతను సమస్తమును సన్న్యసించి ముముక్షువు లగు యతు లెవ్వరు శ్రవణము చేయుచున్నారో వారలకు ముక్తి సమ్యక్జ్ఞానముచేతంగాని సిద్ధింపదు, సమ్యక్జ్ఞానంబును సమాధిచేతంగాని, సమాధియు ఇంద్రియనిగ్రహముచేతం గాని, ఇంద్రియనిగ్ర

హంబును నిశ్శేషముగా రాగాదిత్యాగముచేతంగాని సిద్ధింప దని యతతో హ్యపి కౌంతే యేత్యాదిగ్రంథముచే రాగద్వేషపరిత్యాగంబును ఇంద్రియనిగ్రహంబును సమాధ్యనుష్ఠానంబునుం బ్రతిపాదించి ధ్యాయతో విషయాన్పుంస ఇత్యాదిగా. జ్ఞానికిఁగూడ బహిస్సుఖునకు జ్ఞాననాశము మొదలగు అనర్థములు సంభవించు నని ప్రతిపాదించి, యిప్పుడు బహువిధంబుల శ్రుతులచే వేదాంతశ్రవణము చేసినవాఁడై పతనపాతనమాత్రంబునఁ దన్నుఁ గృతార్థునిఁగాఁ దలంచెడు ముముక్షువునకు ఆలస్యముచేఁ గాని దుస్సంగ్రహముచేఁ గాని ధ్యానాదికమునందుఁ బ్రవర్తింపకుండువానికి సమాధి యవశ్యము చేయవలె నని సూచించుటకై యది చేయనివాని కనర్థముఁ జెప్పుచున్నాఁడు.—నానావిధములగు వేదాంతశ్రవణము చేసినవాఁ డయ్యు నెవ్వఁడు తీవ్రముముక్షుచే శాంతుఁడు దాంతుఁడు ఉపరతుఁడు తితిక్షువునై అప్రతిబద్ధజ్ఞానసిద్ధి కొఱకు సమాధిని జేయఁడో అట్టి, అయుక్తస్య = సమాహితచిత్తుఁడు కాని పురుషునకు; బుద్ధిః = సర్వత్ర బ్రహ్మదర్శనరూపమైన చిత్తప్రసాదైకలభ్యమగు ప్రత్యగ్దృష్టిః; నాస్తి. బహువిధముల శ్రవణము చేసినను దానిచేఁ గలుగు జ్ఞానము పదార్థవాక్యార్థగోచరమే యగును గాని వస్తుగోచరము కానేరదు, సూక్ష్మబుద్ధిచే నొకానొకప్పుడు పుట్టినను స్థిరముగా నిలువ దని యర్థము. అయుక్తస్య అని పునరుక్తి సమాధి యవశ్యకర్తవ్య మని తెలుపుటకొఱకు. "కారణాభావే కార్యాభావః" * అను న్యాయముచే, అయుక్తస్య = సమాధిచేఁ గలిగిన బ్రహ్మాపరోక్షజ్ఞానము లేనివానికి; భావనా, చ = లేదు. దేహమునందుంబోలె ఇదియే నేను అని స్వాత్మరూపమున సాక్షాత్కృత మయిన బ్రహ్మమునందే ఆత్మత్వాభినివేశము † భావన, తత్తాదాత్మ్యము నొందుటచే తనకు బ్రహ్మమునందే వ్యవస్థితమైన అహంబుద్ధి యేది గలదో అది అయుక్తునకు సంభవింప దని యర్థము. అది సంభవింపని యప్పుడు దానికార్యమును సంభవింప దని చెప్పుచున్నాఁడు నచా భావయత ఇత్యాదిగా. మేలుకొన్నవాఁడు దేహము నేనో అట్లు బ్రహ్మమే నేను ఇతరము కా నని తన్ను బ్రహ్మమునుగానే, అభావయతః = తలంపనివానికి, బ్రహ్మరూపమునఁ దాను ఉండని యతికి; శాన్తిః = అనాత్మతాదాత్మ్యము తత్కార్యము తత్సంబంధము—వీనియొక్క అదర్శనరూప మయిన ఉపశాంతి; సిద్ధింపదు. మఱియు, అశాన్తస్య = అనాత్మనుగానే తన్నును ద్వైతంబునుగూడ చూచుచున్నవానికి; సుఖమ్=నిత్యము

* కారణము లేనిచో కార్యము లేదు.

† తాను అను అభినివేశము.

నిరంతర మగు బ్రహ్మానందము; కుతః = ఇది యంతయు నేను బ్రహ్మమే యని సమస్తమును తన్నును బ్రహ్మముగానే చూచుటకు మాత్రమే బ్రహ్మానందరసానుభవము కలుగును, తద్విపరీతముగా చూచువాని కెట్లు సిద్ధించు నని యర్థము. లేక. నచా ఉభావయతః శ్శాన్తిః—శ్రోతవ్యమైనదియు ద్రష్టవ్యమైనదియు స్పృష్టమైనదియు మతమైనదియు విజ్ఞాతమైనదియు తానును సర్వంబును చిద్రూపబ్రహ్మమే యని సర్వంబును చిన్మాత్ర మనుటను అఖండచిదాత్మైకత్వబుద్ధిచే నిత్యము నిరంతరము, అభావయతః = చూడనివానికి అవిద్యావంతునకు; శాన్తిః = చిదానందైకరసబ్రహ్మరూపావస్థానలక్షణ మయిన విదేహముక్తి లేదు. ఇట్లు, అశాన్తస్య = విదేహముక్తిం బొందనివానికి; సుఖమ్ = విదేహానైసర్గ్యసుఖము, కుతః ? బ్రహ్మభావము పొందనివానికి బ్రహ్మసుఖము సిద్ధింప దని యర్థము.

మ. ఈయర్థమునే వ్యతిరేకముఖమున దృఢీకరించుచున్నాఁడు.—అయుక్తస్య = మనోజయము లేనివానికి; బుద్ధిః = శ్రవణమననాఖ్య మయిన వేదాంతవిచారముచే గలుగునట్టి ఆత్మవిషయబుద్ధి; నాస్తి= పుట్టదు. ఆబుద్ధి లేనియప్పుడు, నచా యుక్తస్య భావనా, భావనా = విజాతీయప్రత్యయానంతరిత సజాతీయప్రత్యయప్రవాహరూప మగు నిదిధ్యాసనము *, అంతట నకారమునకు అస్తి అను దానితో నన్వయము. నచ, అత్మను, అభావయతః, శాన్తిః = కార్యసహితావిద్యానివృత్తిరూప మైన వేదాంతవాక్యజన్య మగు బ్రహ్మైక్యసాక్షాత్కారము. అశాన్తస్య=ఆత్మసాక్షాత్కారము లేనివానికి, కుతః, సుఖమ్—మోక్షానంద మని యర్థము.

శ్రీ. ఇంద్రియనిగ్రహము స్థితప్రజ్ఞతకు సాధనం బనుట వ్యతిరేకముఖంబున నుపపాదించుచున్నాఁడు —అయుక్తస్య = వశీకరింపఁబడిన యింద్రియములు గలవాఁడు కానివానికి; బుద్ధిః=శాస్త్రాచార్యోపదేశములచే, ఆత్మవిషయ మగు బుద్ధి; నాస్తి. ప్రజ్ఞయే పుట్టదు. ఇఁక దానికి స్థైర్యవార్త యెక్కడిది? ఎందువలన ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—నచా ఉయుక్తస్య భావనా, భావనా = ధ్యానము. భావనచేతం గదా బుద్ధికి ఆత్మయందు స్థైర్యము కలుగును? అదియో అయుక్తునకుఁ గలుగదు ఎందువలననో అందువలన. నచ, అభావయతః = ఆత్మధ్యానము చేయనివానికి; శాన్తిః = ఆత్మయందు చిత్తమునకుపరతి. అశాన్తస్య కుతః సుఖమ్ ? సుఖమ్—మోక్షానంద మని యర్థము.

* వేఱు జ్ఞానము నడుమ రానీయక యొకటే జ్ఞానము ప్రవాహముగాఁ జేయుట ధ్యానము.

ప. ఇంద్రియనిగ్రహము స్థితప్రజ్ఞతాసాధనం బనుటను వ్యతిరేకముఖం బున నుపపాదించుచున్నాఁడు.—అయుక్తస్య = వశీకృతేంద్రియుఁడు కానివానికి, బుద్ధిః, నాస్తి = పుట్టదు. ఆబుద్ధితో, అయుక్తస్య = కూడియుండనివానికి; భావనా= ఆత్మభావన, కలుగదు. అట్లు, అభావయతః = బ్రహ్మభావన లేనివానికి, సుఖమ్ = ఆత్మసుఖము, కుతః—లే దని యని యర్థము.

రా. అయుక్తస్య = నాయందు సన్న్యసింపఁబడిన మనస్సు లేనివానికి, స్వప్రయత్నముచే నింద్రియముల నిగ్రహించుటయందుఁ బ్రవృత్తుఁ డైనవానికి; ఒకానొకప్పుడును, బుద్ధిః = వివిక్తాత్మవిషయ మయిన బుద్ధి; నాస్తి = సిద్ధింపదు. కావుననే, అయుక్తస్య—వానికి, భావనా చ = వివిక్తాత్మభావనయును; న = సంభవింపదు. అభావయతః = వివిక్తాత్మను భావన చేయనివానికి; శాన్తిః = విషయము లందు స్పృహ నశించుట; న = కలుగదు. అశాన్తస్య—విషయస్పృహతోఁ గూడినవానికి; సుఖమ్—నిత్యనిరతిశయసుఖము; కుతః—ఎట్లు కలుగును ?

నాయందు మనసు చక్కఁగా నిలుపక స్వప్రయత్నబలంబున నింద్రియం బుల జయింపఁ గోరువానికి, ఆత్మవిషయబుద్ధి యేకాలమునకును సిద్ధింపనేరదు. ఆత్మవిషయబుద్ధి లేమింజేసి యతని కాత్మభావనయు శక్యము గాదు. వివిక్తాత్మ భావన చేయనివానికి విషయములందలి స్పృహ తొలంగదు. విషయస్పృహ గలవానికి నిత్యనిరతిశయసుఖము కలుగనే కలుగ దని తాత్పర్యము.

మ. ప్రసాదము లేనిచో దోషముఁ జెప్పుచున్నాఁడు మీఁది రెండుశ్లోక ములచేత. ప్రసాదము లేనిచో, యుక్తి—చిత్తనిరోధము కలుగదు గదా! అయు క్తస్య, బుద్ధిః చ = సమ్యక్ జ్ఞానంబును; నాస్తి = కలుగదు. దానినే యుపపాదిం చుచున్నాఁడు. నచా యుక్త స్యేత్యాదిగా. శాన్తిః = ముక్తి, "శాన్తి ర్మోక్షో ఽథ నిర్వాణమ్" అను నిఘంటువలన.

ఇన్ద్రియాణాం హి చరతాం య న్మనో ఽను విధీయతే
త దస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివా ఽమ్భసి. ౬౭

భా. అయుక్తున కెందువలన బుద్ధి కలుగదు? చెప్పెదము.—హి= ఎందువలననఁగా; ఇన్ద్రియాణామ్=ఇంద్రియములు; చరతామ్=స్వవిషయ ములందుఁ బ్రవర్తించుచుండఁగా; యత్ మనః = ఏమనస్సు; అనువిధీయతే = అనుసరించి ప్రవర్తించుచున్నదో; తత్ = ఆయింద్రియవిషయ

వికల్పనముచేఁ బ్రవర్తించిన మనస్సు; అస్య = ఈ యతియొక్క; ప్రజ్ఞామ్ = ఆత్మానాత్మవివేకజన్య మయిన బుద్ధిని; హరతి = హరించు చున్నది, నశింపఁ జేయుచున్నది. ఎట్లు అనఁగా—అమ్భసి = ఉదకము నందు, వాయుః = వాయువు; నావమివ = ఓడనుంబోలె, ఉదకము నందుఁ బోవుచున్న వర్తకులయోడను ఎట్లు వాయువు దారి దప్పించి పెడదారిం బడఁద్రోయునో అట్లు ఆత్మవిషయప్రజ్ఞను హరించి మనస్సు విషయవిషయ మయిన ప్రజ్ఞను జేయుచున్నది.

ఇంద్రియములు విషయములం బ్రవర్తించునపుడు మనస్సు వానికి లోఁబడి వెంబడిఁ బ్రవర్తించునేని, యామనస్సు సముద్రమునందు పెనుగాలి యోడను హరించునట్లు వీని యాత్మవిషయప్రజ్ఞను హరించుచున్నది. కావున యుక్తుఁడు కానివానికి బుద్ధి నిలువ దని తాత్పర్యము.

ఆ°. ఆకాంక్షాద్వారమున శ్లోకాంతరము నెత్తుచున్నారు అయుక్తునకు ఇత్యాదిగా. విక్షిప్త మయిన మనస్సు గలవానికి భావన సిద్ధింపమినలన ఆత్మవిష యబుద్ధి కలుగ దని మఱియొక హేతువుచే సాధించుచున్నారు హి ఇత్యాదిగా. యత్పదముచే గ్రహింపఁబడిన మనస్సే తత్పదముచేఁగూడఁ బరామర్శింపఁబడు చున్నది. ఇంద్రియవిషయవికల్పనముచేత—ఇంద్రియములయొక్క శ్రోత్రాదుల యొక్క విషయములు శబ్దాదులు వానియొక్క వికల్పనము ఒకటితో నొకటి విభ జించి గ్రహణము దానిచేత నని యర్థము. దృష్టాంతము వ్యాఖ్యానము చేయు చున్నారు ఎట్లు ఇత్యాదిగా. ఎందువలన చేయుచున్నదో అందువలన అయుక్తునకుఁ గలుగదు బుద్ధి యని యోజన.

హ°. ఉపరతేంద్రియుఁడు కానివానికి సుఖము లేదు ఎందువలన ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు —హి = ఎందువలన, ఇంద్రియాణామ్, చరతామ్ = విషయము లందు వర్తించుచున్నవానికి, యత్ మనః, అనువిధీయతే = అనుసరించి వర్తించు చున్నదో; త దస్య హరతి ప్రజ్ఞామ్—తత్ = ఇంద్రియవిషయ వికల్పనమునందుఁ బ్రవర్తించిన మనస్సు, అస్య = ఈయతియొక్క, ప్రజ్ఞామ్ = ఆత్మానాత్మవివేకజన్య మగు ప్రజ్ఞను, హరతి. వాయుః నావ మివ అమ్భసి—జలమునందుఁ బోవుచుండఁగా మార్గము దప్పించి దుష్టమార్గమునం దెట్లు వాయువు ఓడను పోవునట్లు చేయునో అట్లు ఆత్మవిషయ మగు ప్రజ్ఞను ఇంద్రియముల ననుసరించుమనస్సు విషయాభి ముఖమునుగాఁ జేయుచున్నది.

౪౦. ఓయీ! సూక్ష్మబుద్ధి యగువానికి శ్రవణాదిజన్యజ్ఞానము సమాధి చేయకున్నను నశింపదు. ఎట్లు మేధావి యగువానికి అతఁ డధ్యయనించిన మీమాంసాదిశాస్త్రములచేఁ గలుగు జ్ఞానము మేధచేఁ బ్రతిష్ఠితమే యగునో అట్లే. అనఁగా, కాదు. ఇష్టకాచయనాదిజ్ఞానము * ఎంతకాలి స్థూలముగూడ మాటి మాటికి అవలోడనము ఆచరణము ప్రచారణము ♦ లేనిచో స్ఫుటముగా భాసిల్లదు. ఇఁక చెప్పవలసిన దేమి అతిసూక్ష్మము అతీంద్రియము అవిషయము అప్రచురము ❙ అసంస్కృతము అనారూఢము ♦♦ అవినష్టప్రతిపక్షము ** అగు ఆత్మజ్ఞానము భాసిల్ల దని. అందువలన అది సిద్ధించుకొఱకు ముముక్షువు సమాధి చేయవలె నని సూచించుటకై జహీః ప్రవృత్తి గలవానికి జ్ఞానము నశించువిధము ను దృష్టాంతసహితముగాఁ జెప్పుచున్నాఁడు.—హి = ఏకారణమునవలన; ఇన్ద్రియాణామ్ = శ్రోత్రాదులును వాగాదులును; చరతామ్ = స్వస్వవిషయములందు వ్యాపించుచుండఁగా; లోకశాస్త్రవిషయకర్మవాసనలచే ఆక్షిప్త మయిన, యత్ మనః; అనువిధీయతే = ఆయావిషయములం దిచ్ఛగలవాఁ డగు విద్వాంసునిచే తన యిచ్ఛవోప్పునఁ బ్రవర్తింపఁ జేయఁబడుచున్నదో; తత్ = ఆమనస్సే; అమ్భసి = నదీజలమునందు; వాయుః; నావ మివ; అస్య = తనవాసనకుఁ దగునట్లు ప్రవర్తించుచున్న యీవిద్వాంసునియొక్క; ప్రజ్ఞామ్ = ఆత్మానాత్మవివేకబుద్ధిని; హరతి = సంహరించుచున్నది. ఇచట ఇది యభిప్రాయము.—ఏటి యావలిగట్టునకుఁ బోవుచున్న యోడను ప్రతికూలవాయువు పట్టి దాని గొప్పసుడిలోఁ బడఁద్రోయుచున్నది, జలముచే నిండించిగాని ముంచుచున్నది, పెద్దఱాతికిఁ గొట్టిగాని పగల్చుచున్నది, మరల నాగట్టునకేగాని విషమస్థానమునకుఁ గాని చేర్చుచున్నది, అన్నివిధముల ననర్థమునే పొందించుచున్నది ఎట్లో, అట్లు, విద్వాంసుఁడైనను అతని వివేకబుద్ధిరూపప్రజ్ఞను నానావిధము లగు అనాద్యవిద్యావాసనలచే ఆకృష్ట మగు మనస్సు విషయమునందుఁగాని కర్మమునందుఁగాని యోగమునందుఁగాని యుపాసనయందుఁగాని యితరమయిన వ్యవహారమునందుఁగాని పడఁద్రోసి ధ్వంసము చేయుచున్న దని యర్థము.

---

* యజ్ఞమునందు ఇటికరాలను పక్ష్యాదిరూపముగాఁ బేర్చుట మొదలగువానియొక్క జ్ఞానము.

♦ ఇతరులచేఁ జేయించుట.

❙ బహుళము గానిది.

♦♦ స్థిరము కానిది.

** నశించిన ప్రతిబంధకములు గలది కానిది.

మ. అయుక్తున కెందువలనఁ గలుగదు బుద్ధి యనఁగాఁ జెప్పు చున్నాఁడు.—చరతామ్ = స్వవిషయములందుఁ బ్రవర్తించుచున్న, వశీకృతములు కాని; ఇన్ద్రియాణామ్ = ఇంద్రియములనడుమ; యత్ = దేనిని, ఒకయింద్రియము నైనను; అను = గుఱిచేసి; మనః = మనస్సు; విధీయతే = ప్రేరింపఁబడుచున్నదో, ప్రవర్తించుచున్నదో అని యర్థము; తత్ = మనస్సుచే అనుసరింపఁబడినది అయిం ద్రియము ఒకటైనను; అస్య = ఈసాధకునియొక్క, లేక, మనస్సుయొక్క; ప్రజ్ఞామ్= శాస్త్రీయ మగు ఆత్మవిషయబుద్ధిని; హరతి = తొలఁగించుచున్నది, మనసు దాని విషయమునం దావిష్ట మగుటవలన. ఎప్పుడు ఒకయింద్రియముగూడ ప్రజ్ఞను హరించుచున్నదో అప్పుడు సర్వేంద్రియములును జేరినచో ప్రజ్ఞను హరించు నని చెప్పెడి దేమి? అని యర్థము. దృష్టాంతము స్పష్టము. జలమునందే వాయువు నకు ఓడను హరించు సామర్థ్యము, భూమియందు లే దని సూచించుటకై అమ్భసి అని చెప్పఁబడినది. ఇట్లు దార్ష్టాంతికమందును జలస్థానీయమైన మనశ్చాంచల్య ముండిననే ప్రజ్ఞను హరించు సామర్థ్యం బింద్రియమునకు, కాని భూస్థానీయ మయిన మనఃస్థైర్యము గలిగినచో లే దని సూచింపఁబడినది.

శ్రీ. నాస్తి బుద్ధి రయుక్తస్య అనుచో హేతువుఁ జెప్పుచున్నాఁడు.— ఇన్ద్రియాణామ్, వశీకృతములు గాక స్వేచ్ఛమెయి విషయములందు, చరతామ్ = చరించు నింద్రియములనడుమ; యత్ = ఏ ఒకటేయింద్రియమైనను; మనః, అను విధీయతే = వశీకృతముగాక యింద్రియముతోఁగూడ వెంబడించుచున్నదో; తత్ = అయింద్రియమే యొక్కటే యయినను; అస్య = ఈమనుజునియొక్క, లేక, పురుషుని యొక్క; ప్రజ్ఞామ్=బుద్ధిని; హరతి=విషయవిక్షిప్తమున్గాఁ జేయుచున్నది. ఇఁకఁ జెప్పవలసిన దేమి పెక్కు ఇంద్రియములు ప్రజ్ఞను హరించు నని? ఎట్లు, ఏమఱియున్న కర్ణధారుని § యోడను వాయువు సముద్రమున నంతటను ద్రిప్పుచున్నదో అట్లు.

ప. ఇఁక. నాస్తి బుద్ధి రయుక్తస్య అనుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.— విషయములందు స్వేచ్ఛగా చరించుచున్న యింద్రియములలో, ఒకయింద్రియము నైనను, యత్ =దేనిని, మనః, అను=వెంబడించి, దాని కనుగతముగానే, విధీయతే= ప్రేరింపఁబడుచున్నదో, తత్, అస్య=ఈపురుషునియొక్క, ప్రజ్ఞాం హరతి. అట్లు కావున, ఒక మనస్సును నిగ్రహించినచో సర్వేంద్రియములను నిగ్రహించినట్లే యగు నని

§ ఓడనడపువానియొక్క.

యర్థము. ఇఁకఁ బ్రజ్ఞాహరణమునందు దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు. వాయురిత్యాదిగా. ఎచ్చరిక లేని కర్ణధారునిచే నడుపఁబడు నావను వాయు వెట్లు ఇచటికి అచటికి త్రిప్పునో అట్లు.

రా. మరలఁగూడ చెప్పినవిధంబున నింద్రియనియమనంబుఁ జేయనివానికనర్థముఁ జెప్పుచున్నాఁడు.—ఇన్ద్రియాణామ్ = ఇంద్రియములయొక్క; విషయములందు, చరతామ్ = విషయములందు వర్తించుచున్నవానియొక్క; వృత్తిని, అను = అనుసరించి; యత్ మనః = ఏమనస్సు; పురుషునిచే, విధీయతే = ప్రవర్తింపఁ జేయఁబడుచున్నదో. తత్ = ఆమనస్సు; అస్య = ఈపురుషునియొక్క; ప్రజ్ఞామ్ = వివిక్తాత్మపర మయిన బుద్ధిని; హరతి—విషయపరముగాఁ జేయుచున్న దని యర్థము. ఎట్లు, అమ్భసి = జలమునందు; నడుపఁబడుచున్న, నావమ్ = ఓడను; ప్రతికూలమయిన, వాయుః = గాలి; బలాత్కారంబున, హరతి = హరించునో, అట్లు.

ఇంద్రియములు విషయములందు వర్తించునపుడు వానివెంబడి మనస్సును బోనిచ్చినయెడ ఆమనస్సు, జలమునందుఁ బోవు నోడను ఎదురుగాలి హరించునట్లు, పురుషుని ఆత్మపర మయిన బుద్ధిని హరించి విషయాధీనముగాఁ జేయునని తాత్పర్యము.

మా. ఎట్లు అయుక్తునకు భావన సిద్ధింపదు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అను, విధీయతే = చేయఁబడుచున్నది, ఓయి యాశ్వయునిచేత *, ఇన్ద్రియాణామ్ అను = ఇంద్రియములవెంబడి. బుద్ధి జ్ఞాన మని చెప్పఁబోవుటవలన. ప్రజ్ఞామ్ = జ్ఞానమును, పుట్టఁబోవుదానినిఁగూడ నివారించుచున్నది యని యర్థము. పుట్టిన దానికిఁగూడ అభిభవ మగుచున్నది.

తస్మా ద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః
ఇన్ద్రియా ణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౬౭

భా. యతతో హీత్యాదినా నుపన్యసించిన యర్థంబునకు అనేకవిధంబుల నుపపత్తిం జెప్పి యాయర్థమునే యుపపాదించి యుపసంహరించుచున్నాఁడు.—ఇంద్రియముల ప్రవృత్తియందు దోష ముపపాదింపఁబడినది యెందువలననో, తస్మాత్ = అందువలన; మహాబాహో = పెద్ద బాహువులు గలవాఁడా! యస్య = ఏయతియొక్క; సర్వశః = మానసాది

* జీవునిచేతఁ గా దనుట.

భేదముల అన్ని విధములచేతను; ఇన్ద్రియాణి = ఇంద్రియములు; ఇన్ద్రియార్థేభ్యః = శబ్దాదివిషయములనుండి; నిగృహీతాని = నిగ్రహింపఁబడినవో; తస్య = అతనియొక్క; ప్రజ్ఞా = బుద్ధి; ప్రతిష్ఠితా = స్థిర మగుచున్నది.

అందువలన, ఓయర్జునా! ఏయతి విషయధ్యానాదులు విడిచి యన్ని విధములచేతను ఇంద్రియములను విషయములందుఁ బ్రవర్తింపని యట్లు నిగ్రహించి యుండునో అతని కాత్మవిషయబుద్ధి స్థిరముగా నిలిచియుండు నని తాత్పర్యము.

ఆ. యతతో హీత్యాదులు రెండుశ్లోకములచేతఁ జెప్పఁబడిన యర్థమే యీరెండుశ్లోకములందును జెప్పఁబడుటవలనఁ బునరుక్తి యగు నని యాశంకించి పరిహరించుచున్నారు యతతో హీత్యాదిగా. ధ్యాయతో విషయా౯ అనునది మొదలగువానిచే ఉపపత్తివచనము ఊహించునది. తస్మాత్ అనుశబ్దముచే నపేక్షింపఁబడిన యర్థముఁ జెప్పుచు శ్లోకమున కవతారిక చేయుచున్నారు ఇంద్రియముల ఇత్యాదిగా. ఎందువలన సమాహితముకాని మనస్సుచే ననుసరింపఁబడుచున్న యింద్రియములు బలాత్కారంబునఁ బ్రజ్ఞను హరించుచున్నవో అందువలన నని యోజన.

హ. యతతో హ్యపీత్యాదిగా నుపన్యస్త మగు నర్థమున కనేకవిధం బగు నుపపత్తిం జెప్పి దాని యర్థము నుపపాదించి యుపసంహరించుచున్నాఁడు.—ఏయోగికిమాత్రమే నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుండు సర్వగతుం డగు పరమాత్మయందు «ఇతఁడు నేనే» యని ప్రజ్ఞ ప్రతిష్ఠితం బగునో అతఁడు సంయమయోగి.

శం. ఎందువలన, రాగద్వేషలోభమోహాదిదోషములచేతనే యింద్రియప్రవృత్తి, దానిచే సమాధి చెడుట, దానిచే జ్ఞానము లోపించుట, దానిచే స్వాత్మ యగు బ్రహ్మమునందు అహంభావము లేకపోవుట, దానివలన ముక్తి లేకుండుట, దానివలన సుఖము లేకపోవుట, ఇట్లనర్థపరంపర, రాగద్వేషములచే ఇంద్రియనిగ్రహము చేయక బహిఃప్రవృత్తుం డగు జ్ఞానికిఁగూడ సంభవించునో, అందువలన ఇంద్రియగ్రామమును రాగాదులతో నెడఁబాపి చక్కఁగా నిగ్రహించి ముముక్షు వగు యతి విదేహముక్తికొఱకు సమాధి యవశ్యము చేయవలె నని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—రాగాదిశత్రువుల సంహరింప సమర్థుఁ డగువానికే యింద్రియనిగ్రహము ఇతరునకు లే దని సూచించుటకొఱకు మహాబాహో అని సంబోధనము.

యస్య—మోక్షమును మాత్రమే కోరునట్టి యేయతికి, ఇన్ద్రియార్థేభ్యః; సర్వశః = సమస్తము లయిన, ఇన్ద్రియాణి, నిగృహీతాని, అగుచున్నవో తీవ్రవైరాగ్యముచేత; తస్య = అధన్యునకే, సమాధి సిద్ధించుచున్నది, ప్రజ్ఞ ప్రతిష్ఠితం బగుచున్నది, విదేహముక్తియు తత్సుఖంబును ముందు నిలుచుచున్నది యని యర్థము.

మ. హి—ఇట్లందువలననో *; తస్మాత్ = అందువలన, సర్వశః = సమస్తములును, మనస్సుతోఁగూడ, ఓమహాబాహూఁడా! అని సంబోధించుచు సర్వశత్రువుల నివారింప సమర్థుఁడ వగుటవలన ఇంద్రియశత్రువుల నివారించుటయందును నీవు సమర్థుఁడ వగుచున్నా వని సూచించుచున్నాఁడు. తక్కినది స్పష్టము. తస్య అనుదానిచే సిద్ధుఁడును సాధకుఁడును బరామర్శింపఁబడుచున్నాఁడు, ఇంద్రియసంయమము స్థితప్రజ్ఞునికి లక్షణముగాను ముముక్షువునకు సాధనముగాను ఉపసంహరింప వలసిన దగుటవలన.

శ్రీ. ఇంద్రియసంయమము స్థితప్రజ్ఞత్వమునకు సాధనముగాను లక్షణముగాను జెప్పినదాని నుపసంహరించుచున్నాఁడు.—ప్రతిష్ఠిత మగుచున్నది యని యర్థము. లక్షణ మని యుపసంహరించుపక్షమున, వానిప్రజ్ఞ ప్రతిష్ఠిత మని తెలియవలె నని యర్థము. మహాబాహో అని సంబోధించుచు శత్రునిగ్రహమునందు సమర్థుఁడ వగు నీకు ఇందుఁగూడ సామర్థ్యంబు గలుగు నని సూచించుచున్నాఁడు.

ప. ఇఁక నుపసంహరించి చెప్పుచున్నాఁడు.—ఓ మహాబాహూఁడా! ఎందువలన ఇట్లో, తస్మాత్ = ఆకారణమువలన, యస్య = ఏపురుషునియొక్క, సర్వశః = సమస్తము లగు, ఇన్ద్రియాణి, ఇన్ద్రియార్థేభ్యః, నిగృహీతాని = ఆకర్షింపఁబడినవి అగుచున్నవో, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

రా. తస్మాత్ = అందువలన; చెప్పినవిధంబున శుభాశ్రయభూతుఁడ నగు నాయం దుంపఁబడిన మనస్సు గలవాఁ డగు, యస్య = ఎవనియొక్క; ఇన్ద్రియాణి = ఇంద్రియములు; ఇన్ద్రియార్థేభ్యః = విషయములనుండి, సర్వశః = అన్నిటినుండియు; నిగృహీతాని = మగలింపఁబడినవో, తస్య = వానికే, ఆత్మయందు, ప్రజ్ఞా ప్రతిష్ఠితా—ప్రజ్ఞ ప్రతిష్ఠితం బగుచున్నది.

అందువలన నేఁ జెప్పినట్లు ఎవ్వఁడు శుభాశ్రయభూతుఁడ నగు నాయందు మనస్సు నిలిపి ఇంద్రియంబులను విషయంబుల యన్నిటినుండియు నిగ్రహించునో, వానికిమాత్రమే ఆత్మవిషయకప్రజ్ఞ ప్రతిష్ఠితం బగు నని తాత్పర్యము.

* ఈ హిశబ్దము పూర్వశ్లోకస్థము.

మా. అందువలన సాకల్యంబుగ నింద్రియంబుల నిగ్రహించినవాఁడే జ్ఞాని యగు నని నిగమనము * చేయుచున్నాఁడు తస్మా దిత్యాదిగా.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. ౬౯

భా. ఈవ్యవహారము లౌకికంబును వైదికంబును ఏది గలదో అది వివేకజ్ఞానము నొందిన స్థితప్రజ్ఞునకు అవిద్యాకార్య మగుటవలన అవిద్య నివర్తిల్లఁగానే నివర్తిల్లుచున్నది. అవిద్యకును విద్యావిరోధి యగుట వలన నివృత్తి యగుచున్నది. అను నీయర్థము స్ఫుటీకరించుచుఁ జెప్పుచున్నాఁడు.—యా = ఏది; నిశా = రాత్రియో, సర్వపదార్థములయు అవివేకము కలిగించునది, తమస్స్వభావ మగుటవలన; సర్వభూతానామ్ = సమస్తప్రాణులకును. ఏది యది? స్థితప్రజ్ఞవిషయ మగు పరమార్థతత్త్వము; ఎట్లు ఇతరభూతములకుఁ బగలే యగుచున్నను అది రాత్రిచరంబులకు రాత్రి యగుచున్నదో, అట్లు రాత్రిచరస్థానీయు లగు అజ్ఞాను లయిన సర్వప్రాణులకును, నిశా—రాత్రివంటిది పరమార్థ తత్త్వము, అగోచర మగుటవలన అతద్బుద్ధులకు. తస్యామ్ = దాని యందు, పరమార్థతత్త్వమునందు; అజ్ఞాననిద్రనుండి మేలుకొన్నవాఁడు, సంయమీ = జితేంద్రియుఁడు, యోగి యని యర్థము; జాగర్తి = మేలు కొనియున్నాఁడు. యస్యామ్ = ఏనిశయందు, గ్రాహ్యగ్రాహక ♦ భేద రూప మయిన అవిద్యానిద్రయందు; నిద్రించియే యున్న, భూతాని = ప్రాణులు; జాగ్రతి = మేలుకొనియున్న వని చెప్పఁబడుచున్నవో, నిద్రించియుండి స్వప్నము చూచువారలుంబోలె; సా = అది, నిశా = రాత్రి, అవిద్యారూప మగుటవలన; పరమార్థతత్త్వమును, పశ్యతః = చూచుచున్న; మునేః = యోగికి.

ఏది పదార్థముల వివేకమునకు విరోధియై తమస్స్వభావ మగుచున్నదో అది రాత్రి, ఏది పదార్థవివేకమునకు సాధన మయి ప్రకాశస్వభావ మగునో అది పగలు అని లోకవ్యవహారము. అట్లు ఆవరణరూప మగుటచే అవిద్య రాత్రి

* నిశ్చయము.

♦ గ్రాహ్యము—జ్ఞేయము, గ్రాహకము—జ్ఞాత.

యనియు స్వప్రకాశరూప మగుటచేఁ బరమార్థతత్త్వము పగ లనియు నిట చెప్పఁబడుచున్నవి. పగలు సంచరించునట్టి కాకాదులకుఁ బ్రకాశరూప మయి పదార్థవివేకసాధనముగా నుండునట్టి పగలు రాత్రిచరము లగు గూబలు మొదలగువానికి రాత్రి యగుచున్నది. అట్లు తత్త్వవేత్తలకుఁ బ్రకాశైకస్వభావ మయి పగలుగా నుండు పరమార్థతత్త్వము అజ్ఞాను లగు సర్వభూతములకును, రాత్రి యగుచున్నది. అజ్ఞానులకు ఏపరమార్థతత్త్వము రాత్రి యగునో, ఆపరమార్థతత్త్వము ఆత్మవేత్త యగు స్థితప్రజ్ఞునకుఁ బగలు. దానియం దతఁడు అవిద్యానిద్రనుండి లేచినవాఁడై మేలుకొని యుండును. పరమార్థతత్త్వముఁ దెలిసినవాఁడై ఆత్మానందము ననుభవించుచుండును. ఇఁక ఇతరప్రాణులకు వాస్తవముగా రాత్రి యగునది గూబలకుఁ బగ లగునట్లు, తత్త్వవేత్తలకు ఆవరణరూప మగుటచే రాత్రిగాఁ దోఁచునట్టి అవిద్యావస్థ, అజ్ఞానులకు నానావిధభేదబుద్ధుల కాలయం బగుటచేఁ బగలుగా నున్నది. దానియందు వారు వాస్తవముగా అవిద్యానిద్రితులై నే యున్నను మేలుకొనుచున్నా రని చెప్పఁబడుదురు. ఆయవస్థ యవిద్యారూప మగుటవలన పరమార్థతత్త్వముఁ దెలిసిన స్థితప్రజ్ఞునకు రాత్రి యగును. అతఁడు ఆవిద్యకమైన భేదవ్యవహారమునందుఁ బ్రవర్తింపఁ డని తాత్పర్యము.

ఆ. ఆత్మవేత్త యగు స్థితప్రజ్ఞునకు సర్వకర్మపరిత్యాగమునం దధికారము, తద్విపరీతుఁ డగు అజ్ఞునకు కర్మమునం దధికారము. అను నీయర్థమునందు మీఁదిశ్లోకమున కవతారిక చేయుచున్నారు.—ఈవ్యవహారము ఇత్యాదిగా. అవిద్యానివృత్తి యైనఁ సర్వకర్మనివృత్తి యగునేని ఆ అవిద్యానివృత్తి యె ట్లగు నని యాశంకించి చెప్పుచున్నారు అవిద్యకును ఇత్యాదిగా. స్ఫుటీకరించుచు—బాహ్యాభ్యంతరకరణంబుల § పరాక్ * ప్రవృత్తియు ప్రత్యక్ ‖ ప్రవృత్తియుఁ బరస్పరవిరుద్ధము లగునట్లు పరాగ్దృష్టియు ప్రత్యగ్దృష్టియుఁ బరస్పరవిరుద్ధము లగుచున్నవి. ఏల యనఁగా పరాగ్దర్శనము ఆత్మావరణ మయిన అనాద్యవిద్యయొక్క కార్యము, ఆత్మదర్శనమో తన్నివర్తకము. అందువలన, ఆత్మదర్శనముకొఱకు ఇంద్రియంబుల విషయములనుండి నిగ్రహింపవలె నని, చెప్పుచున్నాఁ డని యోజన. సర్వప్రాణులకును రాత్రి పదార్థావివేకము కలిగించునది యనుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు

§ బహిరింద్రియములయొక్కయు అంతరింద్రియములయొక్కయు.

* బాహ్య.

‖ ఆత్మయందు.

తమస్స్వభావ మగుటవలన నని. సర్వప్రాణిసాధారణ మగు ప్రసిద్ధ మయిన రాత్రిని దెలిపి, దానినే ప్రకృతానుగుణముగాఁ బ్రశ్నపూర్వకముగా విశదీకరించు చున్నారు ఏది యది ఇత్యాదిగా. స్థితప్రజ్ఞునివిషయ మగు పరమార్థతత్త్వము ప్రకాశైకస్వభావము, అది యెట్లజ్ఞానులకు రాత్రి యగు నని యాశంకించి చెప్పు చున్నారు ఎట్లు ఇత్యాదిగా. అందుకు హేతువుఁ జెప్పుచున్నారు అగోచర మగుట వలన నిత్యాదిగా. అతద్బుద్ధులకు—పరమార్థతత్త్వముకంటె భిన్న మయిన ద్వైతప్రపంచమునందు ప్రవృత్త మగు బుద్ధి గలవారికి, అజ్ఞాత మగుటవలన పర మార్థతత్త్వము రాత్రివంటిది అవిద్వాంసుల కని యర్థము. తస్యా మిత్యాదిభాగ మునకు వ్యాఖ్యానము చేయుచున్నారు—తస్యామ్—రాత్రివంటి దని చెప్పఁబడిన యవస్థయం దని యర్థము. యోగి యనుటచే జ్ఞాని చెప్పఁబడుచున్నాఁడు. ఉత్త రార్ధమును విభజించుచున్నారు యస్యా మిత్యాదిగా. ప్రసుప్తులకు జాగరణము విరుద్ధ మని యాశంకించి చెప్పుచున్నారు నిద్రించుచుండి ఇత్యాదిగా. అవిద్య తొలంగి పరమార్థతత్త్వము ననుభవించుచున్న సన్న్యాసికి ద్వైతావస్థ రాత్రి యనుటకు హేతువుఁ జెప్పుచున్నారు అవిద్యారూప మగుటవలన నని.

భా. ఇందువలనఁ గర్మములు అవిద్యావస్థయందే విధింపఁబడుచున్నవి, కావు విద్యావస్థయందు. ఏల యనఁగా విద్య కలుగఁగానే సూర్యుఁ డుదయింపఁగా రాత్రిచీఁకటివలె అవిద్య నాశము పొందుచున్నది. విద్యోత్పత్తికి మున్ను అవిద్య ప్రమాణబుద్ధిచే గ్రహింపఁబడినదై క్రియాకారకఫలభేదరూపం బగుచు, సర్వకర్మములకు హేతు వగు చున్నది. అప్రమాణబుద్ధిచే గ్రహింపఁబడునది కర్మహేతువు కాఁజా లదు. ప్రమాణభూతం బగు వేదముచే నాకు విధింపఁబడినది చేయవల సినది కర్మం బని గదా కర్మమునందుఁ గర్త ప్రవర్తించుచున్నాఁడు. అవిద్యామాత్ర మిది యంతయు రాత్రివంటి దని కాదు. ఎవనికి మఱి రాత్రివంటిది యవిద్యామాత్ర మీభేదజాత మంతయు ననుజ్ఞానము గలదో అట్టియాత్మజ్ఞునకు సర్వకర్మసన్న్యాసమునందే యధికారము, కాదు ప్రవృత్తియందు. అట్లు తెలుపఁబోవుచున్నాఁడు “తద్బుద్ధ యస్తదాత్మానః” ఇత్యాదిగా జ్ఞాననిష్ఠయందే యధికారంబును.

టీ॰ పరమార్థావస్థ రాత్రివంటిది యవిద్వాంసులకు, విద్వాంసులకో ద్వైతావస్థ రాత్రివంటిది యని నిశ్చితము కాఁగా ఫలితముఁ జెప్పుచున్నారు ఇందువలన ఇత్యాదిగా. అవిద్యావస్థయందే క్రియాకారకఫలభేదములు తోఁచుట వలన నని యర్థము. విద్య యుదయించినను అవి యట్లె తోఁచును కావున మునుపటి యట్లు కర్మములు విధింపఁబడుఁ గాక యని యాశంకించి చెప్పుచున్నారు ఏల యనఁగా ఇత్యాదిగా. అవిద్య నివర్తిల్లిన పిదప బాధితానువృత్తిచే భేదము తోఁచినను గర్మవిధి సంభవింపదు భేదమునం దభినివేశము లేకుండుటవలన నని యర్థము. అవిద్యావస్థయందే కర్మము లని చెప్పినదాని స్పష్టీకరించుచున్నారు విద్యోత్పత్తికి ఇత్యాదిగా. విద్య యుదయించుటకు మున్ను బాధకము లేకుండుటవలన అబాధితమయిన అవిద్య క్రియాదిభేదము గలిగించి ప్రమాణరూపబుద్ధిచే గ్రాహ్యమై కర్మహేతు వగుచున్నది క్రియాదిభేదమునందలి యభినివేశము దానికి హేతు వగుటవలన నని యర్థము. కావు విద్యావస్థయం దని చెప్పినదాని వివరించుచున్నారు అప్రమాణబుద్ధిచే నిత్యాదిగా. విద్య యుదయింపఁగానే అవిద్య నివృత్త మగుటవలనఁ గ్రియాకారకాదిభేదము తోఁచుట యప్రమాణ మను బుద్ధి పుట్టుచున్నది, దానిచే గ్రహింపఁబడుచున్న అవిద్య ఆభేదము తోఁచుచున్నను కర్మహేతువు కాఁజాలదు, బాధిత మయి ఆభాస మగుటచే దానికి కర్మహేతుత్వము సంభవింపమివలన నని యర్థము. విద్యను అవిద్యను విభజించుటచే ఈచెప్పిన విశేషమునే వివరించుచున్నారు ప్రమాణభూతంబు ఇత్యాదిగా. వేదముచే కామనాదిమంతుఁడ నగు నాకుఁ గర్మము విధింపఁబడినది, అందుచే నేను దానిఁ జేయవలెను అని తలంచి స్వకర్మమునం దజ్ఞుఁ డధికారము నొందుచున్నాఁడు, వానికే సాధనవిశేషముల బోధించునట్టి వేదము ప్రవర్తక మగుటవలన నని యర్థము. ఈ ద్వైతము సమస్తమును అవిద్యామాత్రము రాత్రివంటిది అని తలంచువాఁడో ప్రవర్తింపఁడు కర్మమునందు అని వ్యావర్త్యమును ♦ జెప్పుచున్నారు అవిద్యామాత్రము ఇత్యాదిగా. విద్వాంసునకుఁ గర్మమునం దధికారము లే దేని అప్పు డతని కధికారం బెక్కడ నని యాశంకించి చెప్పుచున్నారు ఎవనికి ఇత్యాదిగా. అట్టి యాత్మజ్ఞునకు ఫలభూతసన్న్యాసమునం దధికారం బనుటకు వాక్యశేషమును బ్రమాణీకరించుచున్నారు అట్లు ఇత్యాదిగా.

భా॰ అందును బ్రవర్తకం బగు ప్రమాణము లేనిచోఁ బ్రవృత్తి యుపపన్నము కా దని యాక్షేపింతు రేని, అది చెల్లదు, ఆత్మ

♦ వ్యావృత్తి చేయఁదగినదానిని—వేఱుపఱుపఁ దగినదానిని.

విజ్ఞానము స్వాత్మవిషయ మగుటవలన. తనకుఁ దనస్వరూపమునందుఁ బ్రవర్తకప్రమాణాపేక్ష కలుగదు గదా! తా నగుటవలననే. సర్వప్రమాణములకును ప్రమాణత్వము ఆత్మజ్ఞానాంత మగుటవలనఁ గూడ. ఆత్మస్వరూపజ్ఞానము కలిగిన పిమ్మట మరలఁ బ్రమాణప్రమేయ వ్యవహారము సంభవింపదు గదా! ఏల యనఁగా ఆత్మయొక్క ప్రమాతృత్వమును నివర్తించుచున్నది యంత్యప్రమాణము. నివర్తించుచునే యప్రమాణ మగుచున్నది స్వప్నకాలప్రమాణముంబోలెఁ బ్రబోధమునందు. లోకమునందుఁగూడ వస్తుజ్ఞానమునందుఁ బ్రవృత్తిహేతుత్వము కనఁబడదు ప్రమాణమునకు. అందువలన లేదు ఆత్మవిదునకుఁ గర్మమునం దధికారం బని సిద్ధము.

టీ. ప్రవర్తకం బగు ప్రమాణము అనఁగా విధి, అది లేని యప్పుడు కర్మములయందుంబోలె విద్వాంసునకు జ్ఞాననిష్ఠయందుఁగూడఁ బ్రవృత్తి యనుపపన్న మగుటవలనఁ గావలెను జ్ఞానవంతునకును విధి యని శంకించుచున్నాఁడు అందును ఇత్యాదిగా. ఏమి యాత్మజ్ఞానము విధి నపేక్షించుచున్నదా? లేక, ఆత్మయే విధి నపేక్షించునా? అందు, మొదటిపక్షము కాదు, స్వరూపవిషయం బగు నాత్మజ్ఞానము ప్రమాణప్రమేయములంబట్టి పుట్టుటకు విధ్యపేక్ష లేమివలన నని చెప్పుచున్నారు అది చెల్లదు ఆత్మవిజ్ఞానము ఇత్యాదిగా. రెండవదియుఁ గా దని చెప్పుచున్నారు తనకు ఇత్యాదిగా. ప్రవర్తకప్రమాణశబ్దవాచ్య మయిన విధికి విషయము సాధ్యము కావలెను, ఆత్మయో సాధ్యుఁడు కాఁడని హేతువుఁ జెప్పుచున్నారు తా నగుటవలననే యని. ఆత్మయు తత్‌జ్ఞానంబును విధి నపేక్షింపకున్నను, జ్ఞానికిఁ బ్రమాణప్రమేయాది వ్యవహారనియమమునకొఱకు విధ్యపేక్ష యగు నని యాశంకించి చెప్పుచున్నారు సర్వప్రమాణములకును ఇత్యాదిగా. సర్వప్రమాణములకును ప్రామాణ్యము ఆత్మజ్ఞానోదయపర్యంతమె యగుటవలన ఆత్మజ్ఞానముదయించిన పిదప వ్యవహారమునకే అవకాశము లేకుండుటవలన వ్యవహారనియమార్థము జ్ఞానికి విధి యపేక్షితము కా దని యర్థము. చెప్పినదాని స్పష్టీకరించుచున్నారు ఆత్మస్వరూపజ్ఞానము ఇత్యాదిగా. ధర్మజ్ఞానమునందుంబోలె ఆత్మజ్ఞానమునందును ఎందుకు పై చెప్పిన వ్యవహారము కాఁగూడ దని యాశంకించి చెప్పుచున్నారు ఏల యనఁగా ఇత్యాదిగా. ప్రమాతృత్వము నివర్తిల్లినచో ఎట్లద్వైత

జ్ఞానంబునకుఁ బ్రామాణ్యం బని యాశంకించి చెప్పుచున్నారు నివర్తించుచునే ఇత్యాదిగా. ప్రమాతృత్వమును నివర్తించుచు అద్వైతజ్ఞానము తానును నివర్తిల్లు టవలనఁ బ్రమాణము కా దనుటకు దృష్టాంతము చెప్పుచున్నారు స్వప్నేత్యాదిగా. ఆత్మజ్ఞానము విధి నపేక్షింప దనుటకు మఱియొక హేతువుం జెప్పుచున్నారు లోకమునందుఁగూడ ఇత్యాదిగా. లోకవ్యవహారమునందుఁ బ్రమాణము వస్తు నిశ్చయరూప ఫలపర్యంతమే యగుచున్నది కాని ప్రవర్తకవిధి నపేక్షించుట కనఁబడదు, కావున అద్వైతజ్ఞానముగూడ ప్రమాణ మగుటవలన విధి నపేక్షింపదు, రజ్జ్వాదిజ్ఞానమువలె నని యర్థము. ఆత్మజ్ఞానవంతునకు తత్ జ్ఞాననిష్ఠ విధి లేకయే జ్ఞాన మాహాత్మ్యమువలననే సిద్ధ మగుటవలన నతనికిఁ గర్మసన్న్యాసమునం దధికారము, కాదు కర్మమునం దని యుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా.

హ. యా; నిశా = రాత్రి, సర్వపదార్థములయు అవివేకము చేయునది, సర్వభూతానాం నిశా అనుటచే సర్వప్రాణుల వ్యవహారమునకును అగోచర మయిన బ్రహ్మరూపము చెప్పఁబడుచున్నది. తస్యామ్, జాగర్తి = మేలుకొనియున్నాఁడు. యస్యామ్, సర్వభూతంబులును, జాగ్రతి = మేలుకొనియున్నవో, దేనియందు వ్యవహరించుచున్నవో, సా = ఆ అవిద్య, నిశా, పరమార్థస్వరూపమును బ్రహ్మమును, పశ్యతః, మునేః= యోగికి. ఇట్లు అవిద్యకును విద్యకును భేదమువలన అవిద్వాంసునకు సర్వకర్మములును. విద్వాంసునకు సర్వకర్మనివృత్తి, స్వభావమువలన సర్వకర్మసన్న్యాసమే యగును.

శ౦. అనేకశతసహస్రజన్మకృత సుకృతపరిపాకముచే శాస్త్రాచార్యేశ్వర ప్రసాదమును బుష్కలంబుగాఁ బొందినట్టి యెవనికి సమాధిచే ఇది యంతయు నేనును బ్రహ్మమే యని బ్రహ్మాపరోక్షజ్ఞానము అప్రతిబద్ధముగాఁ గలుగునో, అట్టి మహాత్ముఁడగు స్థితప్రజ్ఞునకు, మేలుకొన్నవానికి స్వప్నవ్యవహారముంబోలె, నేను నాది యిది ఇత్యాదివ్యవహారము లౌకికంబును వైదికంబును నిశ్శేషముగా నివర్తిల్లుచున్నది. నిద్రవలె అవిద్య నిశ్శేషముగా నశించుటవలనఁ దత్కార్యమునకుఁగూడ నిశ్శేష నివృత్తి యగుచున్నది. కావున మేలుకొన్నవాఁడు జాగ్రత్తయందుంబోలె, జీవన్ముక్తుఁ డగు బ్రహ్మవిదుండు బ్రహ్మమునందే రమించుచుండును, వానికి ఇతరము సంభవింప దని ప్రతిపాదించుచున్నాఁడు.—పూర్వకర్మఫలము ననుభవించుటకై మాటిమాటికి, భవన్తి—పుట్టుచున్నవి, కావున భూతములు అనఁగా ప్రాణులు. సర్వభూ

తానామ్ = అట్టి సర్వప్రాణులకును, స్థితప్రజ్ఞుఁడు దక్కఁ దక్కిన సర్వభూతములకును; యా నిశా = ఏది రాత్రి యగుచున్నదో, 'తేజః పరస్యాం దేవతాయామ్' * ఇత్యాదిశ్రుతులచేఁ జెప్పఁబడిన యేపరదేవత సర్వప్రమాణములకును అగోచరమైనది నిర్విశేషమైనది సత్తామాత్రమైనది తాను రాత్రివంటి దగుచున్నదో; ఎట్లు, నిశా—నితరాం శేరతే ప్రాణినః యత్ర—ప్రాణులు ఎపుడు మిక్కిలి పరుండుదురో అది నిశ యనఁగా చీఁకటి గలది రాత్రి సర్వవ్యాపక మగుటచేతను చూపుచొర నలవిగామిచేతను సర్వపదార్థంబులను తానుగానే చేయునది యగుటచేతను మనుష్యాదిభూతంబులకు వ్యవహరింపను అశక్య మగుచున్నదో, అట్లు ఈపరదేవతయుఁ గూడ, సర్వవ్యాపకత్వాదిధర్మములచే సర్వభూతంబులకును వ్యవహరింప నశక్య మగుటవలన నిశ యని చెప్పఁబడుచున్నది. శమ్ అనఁగా సుఖము, మిక్కిలి సుఖరూప మగుటవలన నిశ, తస్యామ్—ఆ నిశయందు అత్యంతసుఖరూప మగు పరదేవతయందు అనఁగా ఆనందఘన మయిన పరబ్రహ్మమునందు; తాను అవిద్యానిద్రనుండి మేలుకొన్నవాఁ డగు, సంయమీ—బహిర్వ్యాపారమునుండి నివృత్తములయిన సర్వేంద్రియంబులును గలవాఁడు, బ్రహ్మవేత్త యొకఁడే; జాగర్తి—దానియందే రమించుచున్నాఁడు క్రీడించుచున్నాఁడు ఆనందించుచున్నాఁడు, తక్కినవారో పరుండియున్నారు, వేదాంతశ్రవణము చేసినవారైనను నిద్రించియున్నవారలుంబోలె తత్స్వరూపము నేమియు నెఱుంగ రని యర్థము. యస్యామ్ = దేనియందు, ద్రష్ట దర్శనము దృశ్యము మొదలగు భేదములు గల అవిద్యయందు; భూతాని, జాగ్రతి—నేను నాది యిది యిష్టం బిది యిది యనిష్టము కార్యం బిది యిది యకార్యము అని వ్యవహరించుచున్నారో; సా—ఆ యవిద్య, ద్వైతభూమి; పశ్యతః = ద్రష్టను దర్శనమును దృశ్యమును సర్వమును ప్రత్యగ్దృష్టిచే బ్రహ్మముగానే చూచుచున్న; మునేః = బ్రహ్మనిష్ఠునకు; నిశ అగుచున్నది. ఎట్లు రాత్రియందుఁ బ్రాణులు వ్యవహరింపరో అట్లు ఇతఁడు అవిద్యారాత్రియందు నేను నాది ఇత్యాదిగా వ్యవహరింపఁడు. నేను నాది ఇత్యాదిప్రత్యయములకు హేతువు లయిన అనాద్యవిద్యావాసనలు నిశ్శేషముగా నశించిన వగుటచే ఆవాసనలకు వానిబ్రహ్మమయబుద్ధిని ప్రవేశింప నశక్య మగుటవలన. ఈలోకమునందు నేను నాది ఇత్యాదిప్రాకృతవ్యవహారమునే చేయఁడు, ఇఁక నిట్టివాఁ డగు విద్వాంసునకు వైదికవ్యవహారం బెట్లు సంభవించు నని యర్థము. లేక. "అధీహి భగవో బ్రహ్మవిద్యాం వరిష్ఠామ్"

* పరదేవతయందు తేజస్సు.

ఇత్యాదిశ్రుతిప్రసిద్ధ మయిన, యా—ఏబ్రహ్మవిద్య, సర్వభూతానామ్ = సర్వప్రాణుల కును, నిశా = రాత్రి యగుచున్నదో, తాను చిద్రూపంబున సూర్యప్రభవలె ప్రకాశరూపమే యయినను చక్కనిదృష్టి లేనివారికి రాత్రివలె నున్నది కావున నిశ యని చెప్పఁబడునో, ఎట్లు ప్రసిద్ధరాత్రి తనతమశ్శక్తిచే నామరూపభేదమును దొలఁగించి సమస్తవస్తుజాతంబును తమోమాత్రముగాఁ జేసి తానే సర్వత్ర విజృంభించుచున్నదో, అట్లే యీబ్రహ్మవిద్య తన చిచ్ఛక్తిచే నామరూపభేదమును దొలఁగించి సమస్తదృశ్యజాతంబును చిన్మాత్రముగాఁ జేసి తా నొకటే సర్వత్ర విజృంభించుచున్నది; దేనియందు రాత్రియందుంబోలెఁ పామరులును బండితులును అందఱును అవస్థాత్రయరూపములైన స్వప్నములం జూచుచు శయనించి యుందురో, తస్యాన్ = ఆబ్రహ్మవిద్యయందు; సంయమీ = బహిఃప్రవృత్తి లేనివాఁడు స్థితప్రజ్ఞుఁడు బ్రహ్మవేత్తయొకఁడే, జాగర్తి—ఎల్లప్పుడును ఆత్మరతియై ఆత్మక్రీడుఁడై ఆత్మమిథునుఁడై ఆత్మజ్యోతియై ఆత్మానందుఁడై యున్నాఁడు. యస్యామ్ = ఏ యవిద్యయందు, భూతాని—సమస్తము లయిన భూతములును, జాగ్రతి—నీవు నేను ఇది యది యని వ్యవహరించుచున్నారో, సా = ఆ యవిద్య ద్వైతావస్థ, పశ్యతః = ద్రష్టను దర్శనమును దృశ్యమును అంతయును మిథ్యయే యని చూచుచున్న బ్రహ్మవేత్తకు, నిశా—రాత్రి యగుచున్నది, ఎట్లు ప్రాణులకు బ్రహ్మవిద్య నిశ యగునో అట్లు బ్రహ్మవిదునకు అవిద్య నిశ యగుచున్నది. బ్రహ్మవిద్యచే బ్రహ్మమే నే నని తన్ను ఆనందైకరసునిఁగాఁ బరిపూర్ణునిఁగా విషయీకరించుటకు ఎట్లు అజ్ఞానులు శక్తులు కారో, అట్లే యీబ్రహ్మవిదుఁడు అవిద్యచే నేను నాది యిది యని దేహేంద్రియాదికమును విషయీకరించుటకు శక్తుఁడు కాఁ డని యర్థము. అందువలననే వీనికి లౌకికవైదిక కర్మములందు అధికారము లేదు, యోగ్యత లేకుండుటవలన. ఎవనికి దేహమునందును దాని నాశ్రయించిన వర్ణజాత్యాదులందును అభిమానంబును, ఫలాపేక్షయును, నేను దీనిఁ జేయవలెను దీనిఁ జేయఁగూడదు అని కర్మములందు గుణదోష దృష్టియును గలవో వానికిమాత్రమే కర్మమునందు యోగ్యత కనఁబడుచున్నది, కాని యీలక్షణము లేనివానికి లేదు. నిత్యనిరంతరసమాధినిష్ఠచే నిరూఢం బగు విజ్ఞానముయొక్క బలముచేత అవిద్యను తత్కార్య మయిన అధ్యాసాదికంబును నిర్మూలించి బ్రహ్మ తాదాత్మ్యము పొంది బ్రహ్మమే నే నని సర్వదా బ్రహ్మమునందే తద్రూపంబున నుండునట్టి విద్వాంసునకు మరల శరీరతాదాత్మ్యాపత్తియును ఆశరీరమునందు నేను నాది యను నభిమానంబును సంభవింపదు గదా! అది సంభవిం

పనియున్నపుడు ఆశరీరమునం దారోపితము లయిన వర్ణజాత్యాదులం దభిమానంబు గూడ సిద్ధింపదు. అది సిద్ధింపనిచో సర్వము మిథ్య యని చూచువానికి ఫలాభి సంధియు సిద్ధింపదు, కర్మములందు గుణదోషదృష్టియును సిద్ధింపదు. ఇట్లుండుట వలన విద్వాంసునకుఁ గర్మమునం దధికారము యోగ్యము కాదు, సర్వమిథ్యాత్వ దృష్టియును బ్రవృత్తియును పరస్పర విరుద్ధము లగుటచే ఒకయధికరణమునం దుండుట యనుపపన్న మగుటవలన. వస్తువు సత్యము అను నిశ్చయబుద్ధిచేఁ గలుగు నది ప్రవృత్తి, వస్తువు భ్రమకల్పితము అను నిశ్చయబుద్ధిచేఁ గలుగునది మిథ్యాత్వ జ్ఞానము, కావున నవి రెండును బరస్పరవిరుద్ధములు, వానికి ఒకయధికరణమునం దునికి సంభవింపదు. ఓయీ! కర్తయు కరణమును కార్యమును సర్వంబును మిథ్యయే యని విద్వాంసుఁడు కర్మము చేయనీ, మిథ్యాబుద్ధితోఁ జేయుకర్మము బంధకారణము కాదు అందు రేని, అది సరికాదు. మిథ్యాత్వజ్ఞాన మున్నచోఁ బ్రవృత్తియే సంభవింపమివలన. ఇది జలము కాదు మఱేమనఁగా మరుభూమియే యని జలమిథ్యాత్వము నెఱింగినవానికి దప్పిగొన్నవానికిఁగూడఁ బ్రవృత్తి సంభవిం పదుగదా! ఇఁక ఆరోపితము దృశ్యము సమస్తమును మిథ్యయే యని తదధిష్ఠాన మయిన బ్రహ్మమునే సర్వత్ర చూచుచున్నవానికిఁ బ్రవృత్తి సంభవింప దని చెప్పెడి దేమి? అందువలన అవిద్యావంతునకే కర్మమునం దధికారము, కాని విద్యావంతు నకుఁ గాదు. విద్య అవిద్యాతత్కార్యవిరోధి యగుటవలన విద్యావంతుఁ డగు బ్రహ్మవిదునందు అవిద్యాతత్కార్యములు తేజస్సునందుఁ దమస్తత్కార్యములుం బోలె నిలువం జాలవు. అందువలన, విధియు విధానంబును విధేయంబును విధాత యును సమస్తమును అవిద్యాకల్పితము మిథ్యయే యని చక్కఁగా నెఱింగిన బ్రహ్మ విదునకు బ్రహ్మరూపంబున నూరకయుండుట దక్కఁ గొంచెమేని కర్తవ్యము లే దని సిద్ధము.

మ. ఇట్లు ముముక్షువు ప్రజ్ఞాస్థైర్యముకొఱకుఁ బ్రయత్నపూర్వకముగా నింద్రియసంయమము చేయవలె నని చెప్పఁబడినది. స్థితప్రజ్ఞునకో స్వతస్సిద్ధమే యింద్రియసంయమం బని చెప్పుచున్నాఁడు.—యా = ఏ వేదాంతవాక్యజనితసాక్షా త్కారరూపం బగు అహం బ్రహ్మాస్మి యను ప్రజ్ఞ, సర్వభూతానామ్— అజ్ఞులకు; నిశా = రాత్రివంటిదో, వారల కది అప్రకాశరూప మగుటవలన. తస్యామ్ = బ్రహ్మ విద్యాలక్షణ మయిన ఆసర్వభూతరాత్రియందు; జాగర్తి = అజ్ఞాననిద్రనుండి మేలు కొన్నవాఁడై మెళ్ళుకువ గలిగియున్నాఁడు; సంయమీ = ఇంద్రియసంయమము

గలవాఁడు, స్థితప్రజ్ఞుఁ డని యర్థము. యస్యామ్ = ద్వైతదర్శనరూప మయిన ఏయవిద్యానిద్రయం దైనచో; నిద్రించియున్నవారలే యయిన, భూతాని; జాగ్రతి = స్వప్నమునందుంబోలె వ్యవహరించుచున్నారో; సా = అది, నిశా—ప్రకాశింపదు; పశ్యతః— ఆత్మతత్త్వమును అపరోక్షముగాఁ జూచుచున్న; మునేః = స్థితప్రజ్ఞునకు. ఎంతవఱకు మేలుకొనఁడో అంతవఱకే గదా స్వప్నదర్శనము. అట్లు భ్రమము జ్ఞానపర్యంతము మాత్రమే యగును. తత్త్వజ్ఞానకాలమునందో భ్రమనిమిత్తం బగు వ్యవహార మేదియు సంభవింపదు. అది చెప్పఁబడినది వార్తికకారులచేత "కారకవ్యవహారే హి శుద్ధం వస్తు న వీక్ష్యతే। శుద్ధే వస్తుని సిద్ధే చ కారకవ్యాపృతిస్తథా॥ కాకోలూక నిశేవాఽయం సంసారోఽజ్ఞాత్మవేదినోః। యా నిశా సర్వభూతానా మిత్యవోచ త్స్వయం హరిః" ♦ అని. ఎట్లనఁగా—ఎవనికి విపరీత దర్శనము కలదో వానికి వస్తుదర్శనము సిద్ధింపదు, విపరీతదర్శనము వస్తువుయొక్క—అదర్శనముచేఁ బుట్టునది యగుటవలన. ఇఁక నెవ్వానికి వస్తుదర్శనము సిద్ధించెనో వానికి విపరీతదర్శనము సంభవింపదు, విపరీతదర్శనకారణం బగు వస్త్వదర్శనము వస్తుదర్శనముచే బాధితం బగుటవలన. అట్లు శ్రుతి "యత్ర వా అన్య దివ స్యాత్ తత్రాఽన్యోఽన్య త్పశ్యేత్ యత్ర త్వస్య సర్వ మాత్మైవాఽభూ త్తత్కేన కం పశ్యేత్" § అని విద్యాఽవిద్యలకు వ్యవస్థ వచియించుచున్నది. ఎట్లు రాత్ర్యంధ మగు కాకికి పగలైనది దివాంధ మగు గూబకు రాత్రి యగునో రాత్రియందు దృష్టి గల గూబకు పగలైనది కాకికి రాత్రియే యగునో అట్లు గొప్ప యాశ్చర్యం బిది. అందువలన, తత్త్వదర్శికి ఎట్లు అవిద్యాక మయిన క్రియాకారకాదివ్యవహారము సంభవించును? కావున స్వతస్సిద్ధమే వాని కింద్రియసంయమం బని యర్థము.

శ్రీ. ఓయీ! ఎవ్వఁడును నిద్రించినవానియట్లు దర్శనాదివ్యాపారములు లేనివాఁడై యన్నివిధంబుల నింద్రియముల నిగ్రహించినవాఁడు లోకమునఁ గానం బడఁడు, కావున అసంభావితం బీలక్షణం బని యాశంకించి చెప్పుచున్నాఁడు.—

♦ కారకవ్యవహార ముండునపుడు శుద్ధవస్తువు—ఆత్మ చూడఁబడదు గదా! అట్లు శుద్ధవస్తువు సిద్ధ మగునపుడు కారక వ్యాపారమును చెల్లదు. అజ్ఞానిజ్ఞానులకు ఈసంసారము కాకిగూబల రాత్రివంటిది. యా నిశా సర్వభూతానా మిత్యాదిగా భగవంతుఁడు తానే చెప్పియున్నాఁడు.

§ ఎప్పుడు ఇతర ముండునట్లు కనఁబడునో అప్పుడు ఇతరుఁడు ఇతర మయినదానిఁ జూచును ఎప్పుడు మఱి వీనికి సర్వమును ఆత్మయే యయ్యెనో అప్పుడు దేనిచే దేనిఁ జూచును?

సర్వభూతానామ్ = సమస్తప్రాణులకును; యా = ఏ ఆత్మనిష్ఠ; నిశా = రాత్రి వంటిదో, ఆత్మా ఉజ్ఞాన మను నంధకారముచేఁ గప్పఁబడిన బుద్ధి గలవారలకు దాని యందు దర్శనాది వ్యవహారము లేకుండుటవలన; తస్యామ్ = ఆ ఆత్మనిష్ఠయందు; సంయమీ = ఇంద్రియనిగ్రహము గలవాఁడు; జాగర్తి = మేలుకొనుచున్నాఁడు. యస్యామ్ = ఏ విషయనిష్ఠయందైనను, భూతాని, జాగ్రతి = మేలుకొనియున్నవో, సా, పశ్యతః = ఆత్మతత్త్వమును జూచుచున్న, మునేః, నిశా—దానియందు దర్శనాదివ్యాపారము వానికి లే దని యర్థము. ఇది యభిప్రాయము.—ఎట్లు దివాంధము లగు గూబలకు రాత్రియందే దృష్టియో, పగలు లేదో, అట్లు కన్నుదెఱచిన బ్రహ్మజ్ఞునకుఁగూడ బ్రహ్మమునందే దృష్టి, విషయములందు లేదు. అందువలన అసంభావితము కాదు లక్షణం బని.

ప. ఇఁక విషయములనుండి మరలిన యింద్రియములు గలవాని స్థితిని జెప్పుచున్నాఁడు.—సమస్తభూతంబులును ఆత్మ నెఱుంగరు, కావున ఆత్మజ్ఞానము ఆభూతములకు రాత్రి, ఎట్లు గూబలకు పగలే రాత్రియో అట్లు. తస్యామ్ = ఆరాత్రియందు, సంయమీ = ఇంద్రియముల మరలించి నట్టియోగి; జాగర్తి = మేలుకొనియున్నాఁడు. అట్లు యస్యామ్ = ఏజాగ్రద్దశయందు, భూతాని, జాగ్రతి = తమ వ్యవహారమును జేయుచున్నారో; సా, పశ్యతః = ఆత్మదర్శనము గల, మునేః = మననశీలునకు, నిశా = రాత్రి యగుచున్నది, అం దతనికి వ్యవహారము లేకుండుట వలన. అట్లు చెప్పఁబడినది. «ఆత్మా నహి స్ఫురతి సర్వశరీరభాజాం తేషాం నిశా భవతి సా ఖలు తత్ర యోగీ । జాగర్తి జాగ్రతి చ తే వ్యవహారజాతే తన్న స్ఫురత్యురుధియః క్షణదా ఽస్య సా ఽతః» ♦ అని. ఇట్లు సకలేంద్రియములును విషయములనుండి మరలినవిగాఁ గలవాఁ డగుటయె స్థితప్రజ్ఞత్వం బని యర్థము. లేక. సర్వభూతానామ్ = సమస్తదేహులకును; యా = సకలేంద్రియోపరతిరూప మయిన దే, నిశా = సుషుప్తి గలదో, అం దాత్మాకార మయిన అంతఃకరణవృత్తి యున్నను ఆత్మను దెలియఁ జాలరు. తస్యామ్ = తుర్యావస్థగాఁ బరిణమించినట్టి దానియందు; సంయమీ = ఆత్మనిష్ఠుఁ డగు పురుషుఁడు; జాగర్తి—ఆత్మసుఖానుభవము గలవాఁడై యున్నాఁడు. «ద్వైవం హ్యేతన్మిథునం పరమో

♦ సర్వదేహులకును ఆత్మ స్ఫురింపదు, అందువలన వారి కది రాత్రి యగును. దానియందు యోగి మేల్కొని యుండును. ఆదేహులు వ్యవహారసమూహమునందు మేలుకొని యున్నారు. అది యావిద్వాంసునకు స్ఫురింపదు. అందువలన నది యతనికి రాత్రి.

హ్యేష ఆనన్ద స్తస్మా దేవం విత్స్వా ప్యా ల్లోక్యం హైంత ఏవంతదేవ తేన మిథునేన ప్రియేణ ధామ్నా సమర్ధయతి" అను శ్రుతివలన. వాసిష్ఠమందును "నిద్రాదా జాగరస్యా న్తే యో భావ ఉపపద్యతే । తం భావం భావయన్ సాక్షా దద్వయా నన్ద మశ్నుతే" * అని. ఇఁక, యస్యామ్ = ఏజాగ్రదవస్థయందు, భూతాని, జాగ్రతి—స్వవ్యాపారమును జేయుచున్నారో, సా, అపశ్యతః = వ్యవహారమును జూడకున్నట్టి ఆత్మదృష్టి యగు పురుషునకు, నిశా, దృశ్యప్రపంచము స్ఫురింపమివలన.

**రా.** ఇట్లు నియమింపఁబడిన యింద్రియములు గలవాఁడై ప్రసన్నమానసుం డగువానికి సిద్ధిని జెప్పుచున్నాఁడు.—యా = ఏ ఆత్మవిషయబుద్ధి; సర్వభూతానామ్ = సమస్తప్రాణులకును; నిశా = రాత్రివలె అప్రకాశమయి యుండునో; తస్యామ్ = ఆ ఆత్మవిషయబుద్ధియందు; సంయమీ = ఇంద్రియనిగ్రహము గలవాఁడు ప్రసన్న మయిన మనస్సు గలవాఁడు; జాగర్తి—ఆత్మను జూచుచున్నాఁ డని యర్థము. యస్యామ్ = ఏ శబ్దాదివిషయవిషయ మయిన బుద్ధియందు; భూతాని = సర్వప్రాణులును; జాగ్రతి = మేలుకొన్న వగునో; సా = ఆశబ్దాదివిషయబుద్ధి; పశ్యతః = ఆత్మను జూచుచున్న; మునేః = యోగికి; నిశా = రాత్రివలె అప్రకాశ మగుచున్నది.

సర్వప్రాణులకును ఏది అప్రకాశ మగుటచే రాత్రివలె నుండునో అట్టి యాత్మ విషయప్రజ్ఞ జితేంద్రియుండై ప్రసన్నహృదయుం డగు యోగికి ప్రకాశమానమయి యుండును, అతండు ఆత్మదర్శనము నొందుచున్నాఁడు. సర్వప్రాణులకును ఏది ప్రకాశమయి యుండునో అట్టి శబ్దాదివిషయబుద్ధి ఆత్మదర్శనము గల యోగికి రాత్రివలె అప్రకాశమై యుండును, అతండు శబ్దాదివిషయముల స్మరింపఁడని తాత్పర్యము.

**మా.** చెప్పిన లక్షణమును పిండీకరించి చెప్పుచున్నాఁడు.—యా = ఏ పరమేశ్వరస్వరూపము, సర్వభూతానామ్ = సర్వప్రాణులకును; నిశా = రాత్రియో, దేనియందు నిదురించినవారియట్లు కొంచెమేని యెఱుంగరో; తస్యామ్ = ఆపరమేశ్వరస్వరూపరూప రాత్రియందు; సంయమీ = జ్ఞాని; జాగర్తి—చక్కఁగా అపరోక్షముగా చూచుచున్నాఁడు పరమాత్మ నని యర్థము. యస్యామ్ = ఏవిషయలక్షణ

---

* నిద్రయొక్క యాదియందును జాగరముయొక్క అంతమందును ఏస్థితి యగుచున్నదో, అస్థితి భావించుచున్నచో సాక్షాదద్వైతానందమును బొందుచున్నాఁడు.

రాత్రి యందు; భూతాని, జాగ్రతి; సా = అది, మునేః = మననయుక్తుఁడగు, పశ్యతః = పరమాత్మదర్శనము గలవానికి; నిశా, దానియందు రాత్రియందుంబోలె నిదురించినవానియట్లు ఎఱుంగఁడు. అతనికి మత్తాదులకుంబోలె ¶ గమనాది ప్రవృత్తి యగును. అట్లు చెప్పఁబడినది « దేహంతు తన్న చరమమ్, దేహోఽపి దైవవశగః'' § అను రెండుశ్లోకములచేత. పశ్యతః అనుదానికి సాధనము మునేః అని చెప్పఁబడుచున్నది.

ఏది సర్వభూతములకును రాత్రివలెఁ గొంచెమైనను దెలియక యుండునో అట్టి పరమేశ్వరస్వరూపమును జ్ఞాని చక్కఁగా ప్రత్యక్షముగాఁ జూచుచున్నాఁడు. దేనియందు సర్వభూతములును మేలుకొని వ్యవహరించుచుండునో అట్టి విషయవ్యవహారము ఈజ్ఞానికి రాత్రివలె నుండును. అతఁడు నిద్రించినవానివలె విషయవ్యవహారము చేయఁడని తాత్పర్యము.

ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్,
తద్వ త్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తి మాప్నోతి న కామకామీ. 20

భా. విద్వాంసుఁడు ఏషణలు విడిచినవాఁడు స్థితప్రజ్ఞుఁడు సన్న్యాసియు నగువానికే మోక్షప్రాప్తి యగును, కాని సన్న్యాసి గాక కామకామి యగువానికిఁ గా దని దృష్టాంతముచేఁ బ్రతిపాదింపఁబోవువాఁడై చెప్పుచున్నాఁడు.—ఆపూర్యమాణమ్ = జలములచే నిండింపఁబడుచున్నదియు; అచలప్రతిష్ఠమ్ = నిశ్చల మ్మయిన నిలుకడ గలదియు నగు; సముద్రమ్ = సముద్రమును; ఆపః = అంతటనుండియు వచ్చిన జలములు; యద్వత్ ప్రవిశన్తి = తనస్వరూపమునం దున్నదాని విక్రియారహితమ్మైయే యున్నదాని ఎట్లు ప్రవేశించుచున్నవో; తద్వత్ = అట్లు; కామాః = విషయసన్నిధియందుఁ గూడ అన్నిటియందును ఇచ్ఛావిశేషములు; యమ్ = ఏపురుషుని; సముద్రమునుంబోలె జలములు వికారమునొందింపకయే, ప్రవిశన్తి = ప్రవేశించుచున్నవో, అన్నియును

¶ కైపు పట్టినవారికిం బోలె.

§ ఆదేహమో కడపటిది కాదు, దేహముగూడ దైవవశమున నున్నది.

ఆత్మయందే లయము పొందుచున్నవి కాని తమకు అధీనునిగాఁ జేయవో; సః = అతఁడు; శాన్తిమ్ = మోక్షమును; ఆప్నోతి = పొందుచున్నాఁడు. ఇతరుఁడైన, కామకామీ—కామింపఁబడుచున్నవి కావున కామము లనఁగా విషయములు, ఆవిషయములను కామించుట స్వభావముగాఁ గలవాఁడు; న = పొందనే పొందఁ డని యర్థము.

ఎంత జలము వచ్చుచుండినను నిశ్చలమయి యేకాకార మయిన స్థితి గల సముద్రమునందు నదులు మొదలగువానినుండి ప్రవాహములు వచ్చుచున్నను ఆజలములు సముద్రములో లయము పొందుచున్నవి గాని ఆసముద్ర మేమో హెచ్చుటను గాని తగ్గుటను గాని పొందక యొకటేవిధముగా నిర్వికారమై యుండును. ఆప్రకారము, సన్న్యాసి యగు ఏపురుషునియందు, విషయములు సన్నిహితములయి యున్నను ఆసర్వవిషయములందలి ఇచ్ఛలును ప్రవేశించి స్వరూపమునందు లయము పొందుచున్నవో అట్టియేసన్న్యాసి తానేమో కొంచె మయినను వికారముఁ జెందక యేకరసుఁడై యే యుండునో అట్టివాఁడు మోక్షము నొందును. కాని విషయములం దిచ్ఛ గల అసన్న్యాసి యెంతమాత్రము పొందఁజాలఁ డని తాత్పర్యము.

ఆ. ఓయీ! విద్యావంతులకు విద్యాఫల మయిన మోక్షమును సన్న్యాసి కానివాఁడును బొందవచ్చును. కావున విద్వాంసుఁడు సన్న్యసింపవలె నను నియమం బేల? అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు విద్వాంసుఁడు ఇత్యాదిగా. ఆపాత్మజ్ఞానము గలవాఁడై వివేకవైరాగ్యాదులతోఁ గూడినవాఁడై సర్వైషణలును విడిచి శ్రవణాదిద్వారమున సాక్షాత్కారము గలవాఁడగు ముఖ్యుఁడైన సన్న్యాసికి మోక్షము కలుగును కాని ఇతరులకు విషయతృష్ణకు లోనైనవానికిఁ గలుగ దను నీయర్థమును దృష్టాంతముచేఁ బ్రతిపాదింపఁ గోరి రాగద్వేషవియుక్తైస్తు అనుశ్లోకముచేఁ జెప్పిన యర్థమునే మరలఁ జెప్పుచున్నాఁ డని యోజన. సముద్రము జలములచే నంతటను బూరింపఁబడునప్పుడు దానిస్థితి వృద్ధిహ్రాసములు * గలది యగు నని యాశంకించి చెప్పుచున్నారు అచ లేత్యాదిగా. సముద్రముయొక్క జలాత్మకమైనరూపము ఎప్పుడును ప్రతినియతంబై యుండును గాని యొకానొకప్పుడును హెచ్చదు తగ్గదు గదా! అందుచే దానిస్థితి యేకరూపమే యని యర్థము. ఆయా నదులజలంబులు సముద్రములోనికిఁ బోవునేని అప్పుడు దానికి వికారము కలిగి అప్ర

---

* ఎచ్చుతక్కువలు.

తిష్ఠ సంభవించు నని యాశంకించి చెప్పుచున్నారు స్వరూపమునం దున్న దాని నని. ఇచ్ఛావిశేషములు విషయముల అసన్నిధానమున నిర్వికారుఁ డగు విద్వాంసునియందుఁ బ్రవేశింపకున్నను సన్నిధానమున వానియందుఁ బ్రవేశించి వికారము గలిగించు నని యాశంకించి చెప్పుచున్నారు విషయసన్నిధియందుఁగూడ ఇత్యాదిగా. ప్రవేశించుటను విశదీకరించుచున్నారు అన్నియును ఇత్యాదిగా. యో ఽకామః ఇత్యాదిశ్రుతివలన విషయవిముఖుఁడై నిష్కాముఁ డగువానికి మోక్షము కాని కామకామునకు లే దని చెప్పుచున్నారు సః ఇత్యాదిగా.

హ. విద్వాంసుఁడును ఏషణాత్రయము విడిచినవాఁడును స్థితప్రజ్ఞుఁడును యతియు నగువానికే మోక్షము కామకామికి లేదు అనుసర్గము దృష్టాంతముచేఁ బ్రతిపాదించుచున్నాఁడు.—ఆపూర్యమాణమ్ — జలములచేత; అచలప్రతిష్ఠమ్ = అచల మయిన ప్రతిష్ఠ గల; సముద్రమ్; ఆపః, ప్రవిశన్తి, యద్వత్ = ఎట్లో; తద్వత్ = అట్లు; కామాః, యమ్—పరమాత్మజ్ఞానమువలన రాగద్వేషములచే కదలింపఁబడని యేపురుషుని; ప్రవిశన్తి. సః, శాన్తిమ్—మోక్షరూపశాంతిని. పొందుచున్నాఁడు. పొందఁడు, కామకామీ=కామములను—విషయములను కామించువాఁడు.

౭౦. ఎట్లు కన్యక తాను ఋతుమతియై తల్లిని దండ్రిని తోఁబుట్టువును స్వజనుల నందఱనుగూడ విడిచి భర్తను ఒక్కనినే యాశ్రయించి యతఁ డొక్కఁడే యాలంబనముగాఁ గలదై వానియందే రమించుచున్నది వానిచేతనే సంతోషించుచున్నది హర్షించుచున్నది ఆనందించుచున్నది, ఇతరుని వినదు చూడదు స్మరింపదు స్పృశింపదు, తానే పతివ్రతయై వానియందే యున్నది; అట్లే బ్రహ్మవిదుం డగు ప యతికి ప్రజ్ఞ సమాధిచేఁ బ్రౌఢభావము నొంది దేహమును బ్రాణమును ఇంద్రియసమూహమును సమస్తమును దూరమున విడిచి సచ్చిదానందైకరసం బగు పరబ్రహ్మము నొకటినే యాశ్రయించి అదియే యాలంబనముగాఁ గలదై దానియందే రమించుచు క్రీడించుచు ఆనందించుచు సంతోషించుచు హర్షించుచున్నదై పతివ్రతవలె ఇతరమును వినదో చూడదో తలఁపదో ఎఱుంగదో తాను సదా తద్రూపమున నున్నదో అతఁడు మాత్రమే జీవన్ముక్తిసుఖమును విదేహకైవల్యసుఖంబును బొందుచున్నాఁ డని సూచించుటకై స్థితప్రజ్ఞుఁ డగు యతికి భిక్షాదికమునందుఁ గూడఁ జిత్తవృత్తి బాహ్యాలంబనము కాకయే యుండు నని ప్రతిపాదించుచున్నాఁడు శ్రీభగవంతుఁడు ఇట్టి లక్షణము గల యతియే మోక్షము నొం

దును గాని వేఱువిధంబువాఁడు పొందఁజాలఁ డని నిర్ధారించుచు.—ఆపూర్య మాణమ్ = గంగ నర్మద గోదావరి కృష్ణ కావేరి సింధువు మొదలగు మహానదీ నదంబులచే లక్షలకొలంది అతివిశాలంబు లగు ముఖంబులవలన నింగి నొరయు నపరిమితమహాప్రవాహంబులచే అంతటను నిండింపఁబడుచున్నదైనను; తాను, అచలప్రతిష్ఠమ్ = అచలము — చలనము లేనిది మునుపటి తన లక్షణము నతిక్ర మింపనిది వృద్ధిక్షయములు లేని దగు, ప్రతిష్ఠమ్—జలము నిలుచుహద్దు గలది యగు దాని, ప్రవాహములు ప్రవేశించుటకు ముందు ఎట్లుండెనో అట్లె ప్రవాహము ప్రవే శించునప్పుడును భేదము లేక యున్న దాని నని యర్థము, ఇట్లు సదా యేకరూప మునసే యున్నదాని; సముద్రమ్ = సముద్రమును; ఆపః = నానాముఖంబులనుండి వచ్చిన గంగాదిమహానదీజలములు నానావిధరసగంధఫలములు గలవి; యద్వత్ ప్రవిశన్తి = తమ శుక్ల నీల రక్త పీతాది వర్ణవిశేషమును, మధు రామ్ల తిక్త కషా యాదిరసవిశేషమును, పరిమల దుర్గంధాది గంధవిశేషమును, లఘుత్వ గురుత్వాది గుణవిశేషమును, ఒకటి రెండు మూఁడు నాలుగు ఐదు ఆఱు ఏడు ఎనిమిది తొమ్మిది పది నూఱు మొదలగు కృచ్ఛ్రముల ఫలవిశేషమును, తత్తన్నామవిశేష మును విడిచి సముద్రభావమునే యెట్లు పొందుచున్ననో, సముద్రమును బొంది తత్సంబంధమహిమవలన నామరూపగుణవిశేషములచే ఎట్లు సముద్రమునుండి భిన్నములు కావో అని యర్థము. తద్వత్ కామాః యం ప్రవిశన్తి—కామ్యన్తే— నామభేదమునను రూపభేదమునను రసభేదమునను గంధభేదమునను పాక భేదమునను వివేచించి గ్రహింపఁబడుచున్నవి కావున కామము లనఁగా భోగ్య పదార్థములు సూదాపూపరసాన్నాదులు ♦, ఇతరము లయిన భోగ్యవస్తు వులును; నానావిధంబులు నామ రూప రస గంధ పాక సంస్కారాదివిశేషములచే విచిత్రములు అనేకములు అగు భోగ్యవిశేషములచేత అంతటనుండియు అని చ్ఛాప్రారబ్ధమువలననే ప్రాప్తించుచున్నవానిచేత, ఆపూర్యమాణమ్ — నన్ను గ్రహింపుము నన్ను గ్రహింపుము అని దాతృజనులద్వారమున అన్నిప్రక్కల నుండియు వచ్చుచున్నవానిచేత వ్యాకులుఁడుగాఁ జేయఁబడుచున్నవాఁడైనను; అచలప్రతిష్ఠమ్ = అచల— నిర్వికల్పము విపరీతభావనాశూన్య మగు, ప్రతిష్ఠమ్— సమాధినుండి లేచినప్పుడుగూడ అహోరాదులందు బ్రహ్మరూపత నాపాదించి బ్రహ్మ రూపముననే నిశ్చలమయి యున్న అఖండాకారవృత్తియొక్క ప్రతిష్ఠ—స్థితి గల

♦ పప్పు పిండివంటలు రసము అన్నము మొదలగునవి.

వాఁడు అచల ప్రతిష్ఠుఁడు, అప్పుడు గూడ బాహ్యములను వికల్పింపక సమాధి నిష్ఠచే విపరిణామరహిత మయిన అంతఃకరణము గలవాఁ డని యర్థము, అట్టి యచలప్రతిష్ఠుఁ డైన, యమ్ = బ్రహ్మవేత్త యగు యతిని; సర్వే కామాః ప్రవిశన్తి — ఏ బ్రహ్మనిష్ఠునిఁ బొంది సర్వవిషయంబులును చిన్మాత్రతను బొందినవై అధ్యాత్మదృష్టిచేఁ బ్రవిలయముఁ బొందింపఁబడినవై తమ నామవిశేషమును రూప విశేషమును గంధవిశేషమును పాకవిశేషమును సంస్కారవిశేషమును రుచి విశేషమును విడిచి సముద్రమును బ్రవేశించిన మహానదీజలములు సముద్రభావ మును బొందునట్లు తమయంతనే బ్రహ్మభావమును బొందుచున్నవో అని యర్థము. ఎవ్వఁ డిట్టి లక్షణము గల బ్రహ్మవిత్సన్న్యాసియో, సః = అతఁడే; శాన్తిమ్ = అవిద్యాప్రపంచోపశమరూప మయిన విదేహముక్తిని; ఆప్నోతి = పొందుచు న్నాఁడు. కామకామి యేమో పొందఁజాలఁడు, కామములను — విషయములను ఎవఁడు కామించుచున్నాఁడో అతఁడు కామకామి, తానే కైవల్యకారణభూత మయిన స్వధర్మ మగు బ్రహ్మనిష్ఠను విడిచి అనాత్మయందే ఆత్మభావము నాపాదించి భోక్తయై శుక్తియందు రజతమునువలె మరుభూమియందు జలమునువలె అద్వి తీయ మయిన బ్రహ్మమునందు లేనిదానినే ద్వైతమును కల్పించి, నేను భోక్తను ఇది భోగ్యము అను మిథ్యాభిసంధి గలవాఁడై బాహ్యవాసనలవలన అసత్తునందు అహంకార మమకారాభినివేశముచేత బద్ధుండై, ఇది రమ్యము ఇది యిష్టము ఇత్యాదిభేదబుద్ధిచే నామరూపాదివిశేషముల విభజించి పదార్థములను ఎందువలన గ్రహించుచున్నాఁడో అందువలన కామకామి—భేదదృష్టి గలవాఁడు, శాంతిని పొందఁడు, దేహాదితాదాత్మ్యాపత్తిచే ఎవఁడు అసత్తునందు అభినివేశము గల వాఁడై అద్వితీయబ్రహ్మమునందు భేదమును జూచుచున్నాఁడో అతఁడే కామకామి ద్వైతదృష్టి గలవాఁడు, ముక్తిని బొందఁ డని యర్థము. అట్లు శ్రుతి «యదా హ్యేవైష ఏతస్మి న్నుదర మన్తరం కురుతే అథ తస్య భయం భవతి, తత్త్వేవ భయం విదుషో ఽమన్వానస్య» ౧ అని. దేహతాదాత్మ్యము లేక భేదదృష్టియు కామనయు సంభవింపవు గదా! అట్లు దేహతాదాత్మ్యంబును అవిద్య లేక సిద్ధింపదు. అవిద్యావంతునకు ముక్తి లే దనుట యుక్తమే యగును. కావున ఎవ్వ టను ఎప్పుడును దేహతాదాత్మ్యాపత్తిచే భేదదృష్టి చేయఁగూడదు విదేహ...

---

౧ ఎప్పుడు ఇతఁడు ఈ బ్రహ్మమునందు అల్ప మయినను భేదదృష్టి చేయుచున్నాఁడో అప్పుడు వానికి భయ మగును. ఆ బ్రహ్మమే ఐక్యముఁ దెలియని విద్వాంసునకు భయ మగుచున్నది.

ల్యాము గోరునట్టి యతి యని సిద్ధము. పూర్వశ్లోకము ఇది యీరెంటిచేతను ఆహారాదులందుఁగూడ స్థితప్రజ్ఞుఁడు బ్రహ్మవిదుఁ డగు యతి బ్రహ్మరూపమున బ్రహ్మముసందే యుండును, ఎప్పుడును అనాత్మ్యయం దుండఁడు అని కి మాసీత అను ప్రశ్నకు త్తరం బియ్యఁబడినది.

మ. ఇట్టి స్థితప్రజ్ఞునకు సర్వవిక్షేపశాంతిగూడ అర్థసిద్ధం బని దృష్టాంత సహితముగాఁ జెప్పుచున్నాఁడు.—ఆపూర్యమాణమ్ = సమస్తనదులచేతను నిండింపఁబడుచున్న, సముద్రమ్; ఆపః = వర్షము మొదలగువానివలనఁ గలుగునట్టి జలములు; ప్రవిశన్తి. ఎట్టి సముద్రమును—అచలప్రతిష్ఠమ్ = అతిక్రమింపఁబడని హద్దు గలదానిని, లేక, అచలములకు మైనాకాదిపర్వతములకు ప్రతిష్ఠ ఉనికి దేని యందో అట్టిదానిని, ఇందుచే గాంభీర్యాతిశయము చెప్పఁబడినది; యద్వత్—ఏ విధముగా, నిర్వికారముగా. తద్వత్ = అట్లు నిర్వికారముగనే; యమ్ = ఏ స్థితప్రజ్ఞుని, నిర్వికారుఁడై యున్నవానిని; కామాః = అజ్ఞాను లగు లోకులచే కామింపఁబడుచున్న శబ్దాదివిషయములు; సర్వే; అవర్జనీయములై ప్రారబ్ధకర్మవశమున, ప్రవిశన్తి, వికారము నేమో కలిగింపఁజాలవో; సః—ఆమహాసముద్రస్థానీయుఁ డగు స్థితప్రజ్ఞుఁడు; శాన్తిమ్ = సమస్తము లయిన లౌకికాలౌకికకర్మవిక్షేపముల నివృత్తిని బాధితానువర్తమానా ఽవిద్యాకార్యముయొక్క నివృత్తినిగూడ; ఆప్నోతి = పొందుచున్నాఁడు, జ్ఞానబలముచేత. న కామకామీ—కామము లను విషయములను కామించు స్వభావము గలవాఁడు అజ్ఞుఁడు ఈచెప్పిన శాంతిని పొందఁడు మఱి యే మనఁగా సర్వదా లౌకికాలౌకికకర్మవిక్షేపములచే మహాక్లేశసముద్రమునందు మగ్నుం డగుచున్నాఁ డని వాక్యార్థము. ఇందుచే, జ్ఞానము గలవానికే ఫలభూతం బగు విద్వత్సన్న్యాసము, అతఁడే సర్వవిక్షేపనివృత్తిరూప మయిన జీవన్ముక్తి నొందును, దైవాధీనవిషయభోగమునందును నిర్వికారుఁడై యుండును. ఇత్యాదికము చెప్పఁబడినది యని తెలియునది.

శ్రీ. విషయములందు దృష్టి లేనిచో ఎట్లితఁడు విషయముల భుజించుచున్నాఁ డనఁగా జెప్పుచున్నాఁడు.—ఆపూర్యమాణమ్ = నానానదులచే నిండింపఁబడుచున్నదైనను, అచలప్రతిష్ఠమ్ = అతిక్రమింపఁబడని హద్దు గలదై యే యున్న, సముద్రమ్, మఱియు నితరము లయిన, ఆపః = జలములు, ఎట్లు ప్రవేశించుచున్నవో, అట్లు, కామాః = విషయములు; యమ్ = ఏ అంతర్దృష్టి యగు మునిని,

భోగములచే వికారము పొందకయే యున్నవాని, ప్రారబ్ధకర్మనశమున, ప్రవిశన్తి; సః, శాన్తిమ్ = కైవల్యమును, ఆప్నోతి. కాని, న కామకామీ = భోగములఁ గామించు స్వభావము గలవాఁడు పొందఁజాలఁడు.

ప. ఇఁక ఇంద్రియముల పరావృత్తి ♦ దృష్టాంతముచేఁ జెప్పు చున్నాఁడు.—సః = ఆపురుషుఁడు, శాన్తిమ్ = శమసుఖమును, ఆప్నోతి. అతఁ డెవ్వఁడు?—సర్వే కామాః=సమస్తవిషయంబులును, యమ్, తద్వత్ ప్రవిశన్తి, అట్లు మరలినవి యగుచున్నవో; ఎట్లు? యద్వత్ = ఎట్లు, ఆపః = నానానదీప్రవాహ ములు, సముద్రమ్ ప్రవిశన్తి. ఎట్టి సముద్రమును?—ఆపూర్యమాణమ్—మేఘ ములచే వెలికి జలము గ్రహింపఁబడుచున్నను తెలుఁగనిదానిని, అట్లు మరల నక్ష ములచేఁ బుట్టిన ప్రవాహములతోఁ గూడినను, అచలప్రతిష్ఠమ్ = దాఁటఁబడని హద్దు గలదానిని. ఇట్లు ప్రకృతమందును, విషయవృత్తులు వెలికిఁ బ్రసరించినప్పు డును స్థితప్రజ్ఞుఁ డగుటవలన తెలుఁగనివానిని, మరలఁ బరావృత్తము లయినప్పు డును నేను నివృత్తేంద్రియుఁడ నని యభిమానము లేనివానిని అని యర్థము. ఇట్టి వాఁడే ఆత్మసుఖమును బొందును. కాని, న కామకామీ—భోగములఁ గామించు స్వభావము గలవాఁడు పొందఁజాలఁడు.

రా. యద్వత్ = ఎట్లు; ఆపూర్యమాణమ్ = తనయంతనే నిండియున్న దియు; అచలప్రతిష్ఠమ్ = ఏకరూపంబు నగు; సముద్రమ్ = సముద్రమును; ఆపః = నదీజలములు; ప్రవిశన్తి = ప్రవేశించుచున్నవో, ఎట్లు ఈజలములు ప్రవేశించునప్పు డును ప్రవేశింపనియప్పుడును సముద్రము కొంచెమేని భేదమును బొందదో; తద్వత్ = అట్లు; సర్వే = సమస్తము లయిన; కామాః = శబ్దాదివిషయములు; యమ్ = ఏసంయమిని; ప్రవిశన్తి—ఆతనికి ఇంద్రియగోచరము లగుచున్నవో; సః = అతఁడు; శాన్తిమ్, ఆప్నోతి — శబ్దాదివిషయములు ఇంద్రియగోచరము లయి నప్పుడును కానియప్పుడును స్వాత్మదర్శనతృప్తిచేతనే యెవ్వఁడు వికారము నొందఁడో అతఁడుమాత్రమే శాంతిని బొందుచున్నాఁ డని యర్థము. న కామకామీ — ఎవ్వఁడు శబ్దాదులచే వికారము పొందుచున్నాఁడో అతఁడు ఒకానొకప్పుడును శాంతిని బొందఁడు.

♦ విషయములనుండి మరలుటను

తనంతఁ దాను పూర్ణమై యేకరూపమయి యుండుసముద్రము ఎట్లు నదీప్రవాహములు తనలోఁ బ్రవేశించినప్పుడును బ్రవేశింపనియప్పుడును కొంచెమైనను భేదము నొందక యుండునో అట్లు ఎవ్వఁడు ఆత్మదర్శనతృప్తిచే సంపూర్ణుఁడై శబ్దాదివిషయములు తనకు ఇంద్రియగోచరము లయినప్పుడును కానియప్పుడును కొంచెమేని వికారముఁ జెందక యుండునో అట్టి సంయమియే శాంతి నొందుచున్నాఁడు. శబ్దాదివిషయములకు వికారముఁ జెందువాఁ డెప్పుడును ఎంతమాత్రమును శాంతి బొందఁజాలఁ డని తాత్పర్యము.

మహా. అతఁడు విషయము లనుభవించువిధముఁ జెప్పుచున్నాఁడు.—ఎవ్వఁడు విషయములచే నిండింపఁబడుచున్నను, అచలప్రతిష్ఠుఁ డగుచున్నాఁడో — ఉద్రేకమును బొందఁడో, ప్రయత్నమునుం జేయఁడో, లేనియప్పుడు శోషమునుం జెందఁడో; ఎట్లు సముద్రము నదులు ప్రవేశించుటవలనఁ వృద్ధినిగాని ప్రవేశింపమివలన క్షయమునుగాని అధికముగాఁ బొందదో, ప్రయత్నమునుగాని జేయదో అట్లు. అతఁడు ముక్తిని బొందుచున్నాఁ డని యర్థము.

విహాయ కామా న్యః సర్వా న్పుమాం శ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహఙ్కార స్స శాన్తి మధిగచ్ఛతి. ౭౧

భా. ఇట్లు ఎందువలననో అందువలన. యః = ఏసన్న్యాసి యగు; పుమాన్ = పురుషుఁడు; కామాన్ = విషయములను; సర్వాన్ = అన్నిటిని, సాకల్యముగా; విహాయ = విడిచి; చరతి — జీవనమాత్ర చేష్టాశేషుఁడై * పర్యటించు ♦ చున్నాఁడో అని యర్థము. నిస్పృహః = శరీరజీవనమాత్రమునందుఁగూడ నిర్గతమైన § స్పృహ గలవాఁడై; నిర్మమః = శరీరజీవనమాత్రముకొఱకు అపేక్షింపఁబడిన వస్తువునందుఁ గూడ నాది యిది యను నభినివేశము లేనివాఁడై; నిరహఙ్కారః = విద్వాంసుఁడను నేను ఇత్యాదిగా ఆత్మగౌరవము లేనివాఁడై; సః = అట్టి స్థితప్రజ్ఞుఁ డగు బ్రహ్మవేత్త; శాన్తిమ్—సర్వసంసారదుఃఖోపరమరూప

* జీవనమునకుమాత్రమే అపేక్షితమయిన వ్యాపారము మిగతగాఁ గలవాఁడై.

♦ తిరుగు.

§ పోయిన.

మును నిర్వాణ మను పేరు గలదాని; అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు, బ్రహ్మాభూతుఁ డగుచున్నాఁ డని యభిప్రాయము.

ఏసన్న్యాసి సర్వవిషయములను బరిత్యజించి శరీరధారణమునకుఁ గావలసిన వ్యాపారముమాత్రమె గలవాఁడై ఆశరీరధారణమునందుఁగూడ స్పృహ లేనివాఁడై దానికిఁ గావలసిన విషయమునందుఁగూడ నాది యిది యను నభినివేశమును నేను విద్వాంసుఁడు ఇత్యాద్యహంకారమును లేక తిరుగుచుండునో అతఁడు ముక్తుఁడై బ్రహ్మభావము నొందుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. గృహస్థుఁడుగూడ మనస్సున సమస్తాభిమానంబును విడిచి కూటస్థుఁడైన బ్రహ్మమే నే నని భావించుచుండి బ్రహ్మనిర్వాణమును బొందుచున్నాఁ డను నెడ అంతకన్నను మూఢత లే దని యాశంకించి చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. శబ్దాదివిషయపరుండై తత్త్వదిదృక్షావిశేషములు పొందువానికి ముక్తి కలుగ దని వ్యతిరేకము సిద్ధ మగుటవలనఁ బూర్వోక్తాన్వయమును స్థిరపఱచుటకు విహాయేతివాక్య మని యర్థము. సర్వవిషయములను విడిచిన మీఁద జీవనముగూడ ఎట్లని యాశంకించి చెప్పుచున్నారు జీవనమా త్రేత్యాదిగా. రాగద్వేషాదులు సంభవించు దేశమునందు నివసింపఁ డని చెప్పుటకై చరతి అనుటకు వ్యాఖ్యానము చేయుచున్నారు పర్యటించుచున్నాఁ డని. విహాయ కామాన్ అనుటచేఁ బునరుక్తిని బరిహరించుచున్నారు శరీరజీవ నేత్యాదిగా. నిస్పృహత్వమును బ్రతిపాదించి మరల నిర్మమత్వము చెప్పినప్పుడు అర్థసిద్ధం బగు పునరుక్తి యగు నని యాశంకించి చెప్పుచున్నారు శరీరజీవనమాత్రముకొఱకు ఇత్యాదిగా. అహంకార ముండునప్పుడు మమకారము ఆవశ్యక మగుటవలన నిరహంకారతను వ్యాఖ్యానము చేయుచున్నారు విద్వాంసుఁడను ఇత్యాదిగా. సశాన్తి మాప్నోతి యని చెప్పినదాని నుపసంహరించుచున్నారు అట్టి స్థితప్రజ్ఞుఁడు ఇత్యాదిగా. సన్న్యాసియై మోక్షము నపేక్షించువాఁడు ఈశ్లోకమునందుఁ జెప్పఁబడిన సర్వకామపరిత్యాగాదివిశేషణములను సర్వప్రయత్నములచే నవశ్యము సంపాదింపవలెను. తత్సంపత్తియొక్క ఫలము కైవల్యము అని యర్థము.

హ. ఎందువలన ఇట్లో అందువలన; చరతి = శరీరజీవనమునకుమాత్రమే చేష్టించుచున్నాఁడు. నిస్పృహః = శరీరజీవనమాత్రమునందుఁగూడ స్పృహ లేనివాఁడు, ఉపేక్షచేయువాఁడు. నిర్మమః = శరీరాదులందు నాది యిది యనుబుద్ధి లేని

వాఁడు. నిరహఙ్కారః = విద్వాంసుఁ డగుట మొదలగు కారణములచే ఆత్మగౌరవము లేనివాఁడు. సః, శాన్తిమ్ = అవిద్యోపరమరూపశాంతిని; అధిగచ్ఛతి. ఇది జ్ఞానినిష్ఠ.

శ్లో॰. ధ్యాయతో విషయాన్ అనుస్థలమునందు «విషయముల శ్రవణము దర్శనము లేక కేవల ధ్యానమాత్రముచేతనే కామాద్యనర్థములు సంభవించుటం జేసి విద్వాంసునకుఁగూడ నాశము కలుగును. ఇఁక బ్రహ్మనిష్ఠను విడిచి బాహ్యవృత్తిచే విషయముల నింద్రియంబులచే గ్రహించుచుండువానికిఁగాని భుజించుచుండువానికిఁగాని యథేచ్ఛము విహరించుచుండువానికిఁగాని కామకామికి నాశము గలుగు నని చెప్పెడి దేమి ?» అని యెందువలనఁ బ్రతిపాదింపఁబడినదో, అందువలన విదేహకైవల్యము గోరు బ్రహ్మవేత్త యగు యతి అన్నివిధములను విషయగ్రహణంబు విడిచి సర్వేంద్రియంబులను నిగ్రహించి సదా ఆత్మనిష్ఠచే నుండవలయును. ఇట్లు ఎవ్వఁ డున్నాఁడో అతఁడే విదేహకైవల్యమును బొందుచున్నాఁ డని ప్రతిపాదించుచున్నాఁడు.—పుమాన్ — అతిదుర్లభపురుషార్థ మగు మోక్షమును మహాప్రయత్నముచే సంపాదించుచున్నాఁడు బ్రహ్మవేత్త, అతఁడు గదా పురుషశబ్దవాచ్యుఁడు, అట్టి; యః = బ్రహ్మవేత్త యగు ఏయతి; తాను, నిరహఙ్కారః — బ్రహ్మమే నే నని బ్రహ్మమునందే నిరూఢ మయిన ఆత్మత్వాభినివేశముచే దేహము నుండి నిర్గత మయిన అహంకారము—నే నను బుద్ధి గలవాఁడు నిరహంకారుఁడు, నిత్యనిరంతరబ్రహ్మనిష్ఠచే నిర్మూలింపఁబడిన అనాత్మతాదాత్మ్యగ్రంథి గలవాఁ డని యర్థము; అందువలననే, నిర్మమః= దేహమునుండియు తద్ధర్మములనుండియు తత్కార్యములనుండియు తదవస్థలనుండియు నిర్గత మయిన మమకారము గలవాఁడు, బ్రహ్మతాదాత్మ్యము పొందుటచే దేహమునం దహంభావము లేనియప్పుడు తద్ధర్మాదులందు మమకారము లేకుండుట విద్వాంసునకు యుక్తమే యని యర్థము; అందువలననే, నిస్స్పృహః = విషయములనుండి నిర్గతమైన సుఖాశారూప మగు స్పృహ గలవాఁడు, బ్రహ్మమునందే ఆత్మబుద్ధిగలుగుటచే దేహాదికము అనాత్మ యని దానియందభిమానము లేనివాఁ డగుటవలన దాని నుద్దేశించి సుఖాశ సంభవింపమివలనను, తాను నిరంతరబ్రహ్మానందామృతరసముచేతనే తృప్తుఁ డగుటవలనను విద్వాంసునకు విషయసుఖాపేక్ష లేకుండుట యుక్తము; అందువలననే, సర్వాన్, కామాన్ = బాహ్యశబ్దవాచ్యము లయిన విషయములను, విహాయ = శుక్తిరజతసమానము లయిన ఆవిషయములచే ప్రయోజనము లేకుండుటవలన నింద్రియములచే వాని గ్రహించుటను

విడిచి; ఇది యంతయు నేనను బ్రహ్మమే యని తన్నును బ్రపంచమును బ్రహ్మము గానే చూచుచు, యః, చరతి = కామాన్నీ కామరూ ప్యనుసంచరన్ ♦ ఇత్యాది శ్రుతులచేఁ జెప్పఁబడినవిధంబున భూమియం దంతటను అసంగోదాసీనుఁడై యే పరమహంస పర్యటించుచున్నాఁడో; సః = అతఁడే; శాన్తిమ్ = ఆత్యంతికసంసారో పరమరూప మగు విదేహముక్తిని; అధిగచ్ఛతి. కాని ఇందుకు విపరీత మగు లక్షణము గలవాఁడు పొందఁజాలఁ డని యర్థము. బ్రహ్మరూపమున సమస్తమును జూచుచు బ్రహ్మానంద మనుభవించుచు బ్రహ్మవిదుండు సర్వత్ర చరించుచుండును ఒక చో నిలువఁడు అని వ్రజేత కిమ్ అనుప్రశ్న కుత్తరం బియ్యఁబడినది.

మ. ఇక్కెందువలననో అందువలన, ప్రాప్తము లైన వానిఁగూడ, సర్వాన్ = బాహ్యము లైన గృహక్షేత్రాదులను ఆంతరము లయిన మనోరాజ్యరూపములను వాసనారూపములనుగూడ; దారిం బోవువానికి తృణస్పర్శమువంటి వానిని, కామాన్ = త్రివిధకామములను; విహాయ=ఉపేక్షించి; శరీరజీవనమాత్రమునందుఁ గూడ, నిస్స్పృహుఁడై; నిరహఙ్కారః = శరీరేంద్రియాదులందు నే నను నభిమానము లేనివాఁడై; లేక, విద్యావంతుఁ డగుట మొదలగు కారణములచే ఆత్మగౌరవము లేనివాఁడై; ఇందువలన, నిర్మమః = శరీరయాత్రామాత్రము కొఱకుఁ గూడ ప్రారబ్ధకర్మముచేఁ బ్రాప్తము లగు కౌపీనాచ్ఛాదనాదులందు నాది యిది యను నభిమానము లేనివాఁడై; యః పుమాన్, చరతి = ప్రారబ్ధకర్మవశమున భోగముల భుజించుచున్నాఁడో, లేక, యాదృచ్ఛికముగా ఎచటికో పోవుచున్నాఁడో; సః = అట్టి స్థితప్రజ్ఞుఁడు; శాన్తిమ్ = సర్వసంసారదుఃఖో పరమరూప మయిన అవిద్యా తత్కార్యనివృత్తిని; అధిగచ్ఛతి = జ్ఞానబలముచేఁ బొందుచున్నాఁడు. ఇట్టి వ్రజనంబు స్థితప్రజ్ఞునిది యని నాల్గవప్రశ్న కుత్తరము సమాప్తమయ్యెను.

శ్రీ. ఇక్కెందువలననో అందువలన. ప్రాప్తము లయిన, కామాన్, విహాయ = విడిచి, ఉపేక్షించి; అప్రాప్తములందు, నిస్స్పృహః, ఎందువలన నిరహంకారుఁడో, అందువలననే తద్భోగసాధనములందు నిర్మముఁడై, అంతర్దృష్టియై; యః చరతి = ప్రారబ్ధవశమున భోగములను భుజించునో, లేక ఎచటికో పోవునో, అతఁడు శాంతిని బొందుచున్నాఁడు.

---

♦ ఇచ్ఛకు వచ్చిన అన్నము గలవాఁడై ఇచ్ఛకు వచ్చిన రూపము గలవాఁడై తిరుగుచు.

ప. ఇఁక దానినే ప్రకటించుచున్నాఁడు.—యః, పుమాన్—పురుషార్థము సాధించినవాఁడు; సర్వాన్, కామాన్, విహాయ = తృణమువలె విడిచి; నిస్పృహః, చరతి; ఇఁక నిస్పృహత్వమునే చెప్పుచున్నాఁడు.—నిర్మమః = విషయము లుండినను మమతాభిమానము లేనివాఁడు, నిరహఙ్కారః = ఇన్ద్రియములు వానినుండి నిగ్రహింపఁబడియున్నను నేను కృతకృత్యుఁడ నని శ్లాఘనము లేనివాఁడు; ఇట్టి నిస్పృహుఁ డెవ్వఁడో అతఁడే శాంతిని బొందుచున్నాఁడు. ఇతరుఁడు పొందఁడు.

రా. కామింపఁబడుచున్నవి కావున కామము లనఁగా శబ్దాదులు. యః పుమాన్ = ఏపురుషుఁడు; సర్వాన్ = సమస్తము లయిన; కామాన్ = శబ్దాదివిషయములను; విహాయ = విడిచి; వానియందు, నిస్పృహః = ఆశ లేనివాఁడై; వానియందు, నిర్మమః = మమకారము లేనివాఁడునై; నిరహఙ్కారః = అనాత్మ యగు దేహమునందు ఆత్మాభిమానము లేనివాఁడునై; చరతి = వర్తించుచున్నాఁడో; సః = అతఁడు; ఆత్మదర్శనము నొంది, శాన్తిమ్, అధిగచ్ఛతి.

ఎవ్వఁడు శబ్దాదివిషయము లన్నిటిని విడిచి వానియెడ స్పృహయును మమకారమును లేనివాఁడై యనాత్మ యగు దేహమునందు ఆత్మాభిమానంబును లేనివాఁడై యుండునో అతనికి ఆత్మదర్శనము కలిగి శాంతి సిద్ధించు నని తా.

మా. దీనినే వివరించుచున్నాఁడు.—కామాన్ = విషయములను, నిస్పృహుఁ డగుటచే, విహాయ = విడిచి, యః, చరతి = భక్షించుచున్నాఁడో, నిర్మమః నిరహఙ్కారః—భక్షించుచున్నా నని అహంకారమును మమకారమును లేనివాఁడునై, అతఁడు గదా పురుషుఁడు, అతఁడే ముక్తినిం బొందుచున్నాఁ డని యర్థము.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యా మన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. ౭౨

భా. అట్టి యీజ్ఞాననిష్ఠ స్తుతింపఁబడుచున్నది.—ఏషా = ఈచెప్పినది; బ్రాహ్మీ = బ్రహ్మమునం దుండునట్టి; స్థితిః = ఉనికి, సమస్తకర్మమును సన్న్యసించి బ్రహ్మరూపముననే యుండుట యనుట. పార్థ = ఓ యర్జునా! ఏనామ్ = ఈ స్థితిని; ప్రాప్య = పొంది; న విముహ్యతి = మోహమును బొందఁడు. అస్యామ్ = ఈచెప్పిన బ్రాహ్మస్థితియందు; అన్తకాలేఽపి = కడపటివయస్సునందును; స్థిత్వా = ఉండి; బ్రహ్మనిర్వా

ణమ్ = బ్రహ్మనిర్వృతిని, మోక్షమును; ఋచ్ఛతి = పొందుచున్నాఁడు. ఇఁక చెప్పవలసిన దేమి "బ్రహ్మచర్యమునుండియే సన్న్యసించి యావజ్జీవం బెవ్వఁడు బ్రహ్మమునందే యున్నాఁడో అతఁడు బ్రహ్మనిర్వాణముఁ బొందుచున్నాఁ" డని.

ఇది బ్రాహ్మస్థితి. పార్థా! దీనిఁ బొందినవాఁడు మోహము నొందఁడు. ఈబ్రహ్మనిష్ఠను అన్త్యవయస్సున ♦ నవలంబించినను మోక్షము నొందుచున్నాఁడని తాత్పర్యము.

ఆ. అచ్చటచ్చట సంక్షేపంబునను విస్తరంబునను జెప్పఁబడిన జ్ఞాననిష్ఠను అధికారిప్రవృత్తికొఱకు స్తుతించుటకై యుత్తరశ్లోకం బని దాని కవతారిక చేయుచున్నారు. అట్టి యీ ఇత్యాదిగా. గృహస్థుఁడు సన్న్యాసి—వి నిర్లేఖును మోక్షము నొందుమరేని అప్పుడు కష్టం బగు సర్వసన్న్యాసంబుచే నేమి ప్రయోజన మని యాశంకించి సన్న్యాసి యొకఁడు దక్కఁ దక్కినవారికి విఘ్నములు సంభవించుటవలన సన్న్యాసం బపేక్షితము ముముక్షువున కని చెప్పుచున్నాఁడు ఏ షేత్యాదిగా. స్థితినే వివరించుచున్నారు సమస్తకర్మమును ఇత్యాదిగా. సన్న్యాసికి విమోహము లేకున్నను, గృహస్థుఁడు ధనహాన్యాదులవలనఁ బ్రాయికముగా, విచిత్రుఁడై * పరమార్థవివేకరహితుఁ డగుచున్నాఁ డని యర్థము. ఈ చెప్పిన బ్రాహ్మస్థితి యనఁగా సర్వకర్మసన్న్యాసపూర్వకమైన బ్రహ్మనిష్ఠ, అస్యామ్...ఉండి — అట్టి దీని ఆయుస్సుయొక్క నాలవభాగమునందైనను చేసి యని యర్థము. అపిశబ్దముచే సూచింపఁబడిన కైముతికన్యాయముఁ జెప్పుచున్నారు ఇఁక చెప్పవలసిన దేమి ఇత్యాదిగా. ఇట్లు తత్త్వంపదార్థములును వాక్యార్థ మగు తదైక్యంబును తత్ జ్ఞానం బొక్కటనే ముక్తి యగు ననుటయు తదుపాయంబును అనునివి ఒక్కొకశ్లోకంబునందుఁ బ్రాధాన్యంబునఁ బ్రతిపాదింపఁబడిన వగుటవలన ఉపాయోపేయభూతము నిష్ఠాద్వయం బధ్యాయముచే సిద్ధించుచున్నది.

హ. §

♦ ముసలితనమునందు

* వ్యాకులుఁడై.

§ శంకరభాష్యముతో సమానము.

శ౦. ముముక్షు వగు యతికి శ్రవణజన్యం బగు జ్ఞానము ప్రపంచవాసనల చేతను కామక్రోధాదులచేతను అహంమమాద్యభిమానములచేతను ప్రతిబంధక సహితం బగునేని విదేహముక్తికి సమర్థము కా దని నిశ్చయించి పరమదయాళు వగు శ్రీభగవంతుఁడు “సమాధా వచలా బుద్ధిః” అని బ్రహ్మనిష్ఠను బ్రస్తావించి, నిరంతరము బ్రహ్మనిష్ఠచే సర్వకామప్రహాణముఁ జేసి శరీరయాత్రాదికమునందుఁ గూడ బ్రహ్మరూపంబున బ్రహ్మమునం దున్నవాఁడై అహంకారమమకారాదిబంధము నుండి విడివడిన విద్వాంసునకే విదేహముక్తి యని ప్రతిపాదించి, యిప్పుడు “ముముక్షువు దీనినే సంపాదింపవలెను. దీనిచేతనే గదా విదేహముక్తి, వేఱువిధంబునం గాదు” అని సూచించుచు నుపక్రమించిన బ్రహ్మనిష్ఠ నుపసంహరించుచున్నాఁడు.— స్వస్వరూపమును దెలిపి ముముక్షువును సంసారం బను మృత్యువునుండి, పాతి— రక్షించుచున్నాఁడు కావున పతి అనఁగా పరమాత్మ, వానినే అర్థయతే— కోరుచున్నాఁడు కావున, పార్థుఁడు—ముముక్షువు, ఓముముక్షూ! నీవు నేఁ జెప్పునట్టి యీ విషయమును వినుము, విని చేయుము. బ్రాహ్మీ—బ్రహ్మప్రాప్తికి నియతకారణ మగుటవలన బ్రహ్మమును బొందించునది, స్థితిః = నిష్ఠ, ఏషా—ఇది, నాచేఁ జెప్పఁబడినది; ముముక్షువులకు విదేహకైవల్యముఁ గోరునట్టి బ్రహ్మవేత్త యగు ముముక్షువు, ఏనామ్—ఈబ్రహ్మనిష్ఠను; ప్రాప్య = అనుష్ఠించి; న విముహ్యతి = విమోహమునకు యోగ్యుఁడు గాఁడు, సర్వప్రాణులకును నేను అను విశిష్ట మయిన మోహము దేనియందో అది విమోహము—దేహము, దాని పొందఁడు, ఈనిష్ఠయందుండి బ్రహ్మవిదుండు మరల దేహి కాఁ డని యర్థము. మఱియును, పూర్వవయస్సునందే, సాధనసిద్ధి గలవాఁడై జన్మాంతరీయము లగు సన్న్యాసశ్రవణాది పుణ్యకర్మములపరిపాకవశమువలన విద్వాంసుఁడై యిచట ప్రారబ్ధవిశేషబలముచే స్వల్పకాలము, అన్తకాలే ఽపి = సంసారాంతకాలమునందు, చరమావస్థయందైనను; అస్యామ్ = ఈనిష్ఠయందు; స్థిత్వా; నిర్వాణమ్ = నిష్క్రియము నిత్యానందైకరస మగు; బ్రహ్మ, ఋచ్ఛతి—ముక్తిని బొందుచున్నాఁ డని యర్థము, “విజ్ఞాయ చరమావస్థాం దేవతాభ్యో నృపోత్తమః, ఖట్వాఙ్గో నామ రాజర్షి ర్ముహూర్తే ముక్తిమేయివాన్” § అని ప్రసిద్ధ మగుటవలన. అందువలన విదేహకైవల్యార్థు లగు యతులు బాహ్యప్రవృత్తిని విడిచి యీనిష్ఠయందే సర్వదా యుండవలయు నని సిద్ధము.

---

§ రాజశ్రేష్ఠుఁ డగు ఖట్వాంగుఁ డను రాజర్షి దేవతలవలనఁ జరమావస్థను దెలిసి ముహూర్తమునను ముక్తిఁ బొందెను.

**మ.** ఇట్లు నాలుగుప్రశ్నలకు నుత్తరము చెప్పువ్యాజంబున సమస్తము లయిన స్థితప్రజ్ఞలక్షణములను ముముక్షువునకుఁ గర్తవ్యములుగాఁ జెప్పఁబడినవి. ఇప్పుడు కర్మయోగఫల మయిన సాంఖ్యనిష్ఠను ఫలముచే స్తుతించుచు నుపసంహరించుచున్నాఁడు.—ఏషా = ఈస్థితప్రజ్ఞలక్షణవ్యాజంబున చెప్పఁబడినది, "ఏషా తే ఽభిహితా సాఙ్ఖ్యే బుద్ధిః" అనియు మున్ను చెప్పఁబడినది; స్థితిః = సర్వకర్మ సన్న్యాసపూర్వక పరమాత్మజ్ఞానరూప మయిననిష్ఠ; బ్రాహ్మీ = బ్రహ్మవిషయము. ఓపార్థుఁడా! ఏనామ్ = ఈస్థితిని; ప్రాప్య; ఎవ్వఁడును మరల, న విముహ్యతి. ఏల యనఁగా, జ్ఞానబాధిత మయిన అజ్ఞానమునకు మరల నుత్పత్తి ఘటిల్లదు, అనాది యగుటచే ఉత్పత్తి సంభవింపమివలన. అస్యామ్=ఈస్థితియందు; అన్తకాలే ఽపి= అన్త్యవయస్సునం దైనను; స్థిత్వా; బ్రహ్మనిర్వాణమ్ = బ్రహ్మమునందు నిర్వృతిని, లేక, బ్రహ్మరూప మయిన నిర్వృతిని; ఋచ్ఛతి = అభేదముచేఁ బొందుచున్నాఁడు. ఇఁకఁ జెప్పవలసిన దేమి ఎవ్వఁడు బ్రహ్మచర్యమునుండియే సన్న్యసించి యావజ్జీవం బీబ్రాహ్మస్థితియం దున్నాఁడో అతండు బ్రహ్మనిర్వాణము నొందుచున్నాఁడని అని అపిశబ్దార్థము. జ్ఞానంబును తత్సాధనంబు కర్మ మనుటయు కర్మ ఫలంబు సత్త్వశుద్ధి యనుటయు సత్త్వశుద్ధిఫలంబు జ్ఞాననిష్ఠయే యనుటయు నీ యధ్యాయంబునఁ బ్రతిపాదింపఁబడినది. ఈయధ్యాయము సర్వగీతార్థసూత్రణం బనఁబడును.

**శ్రీ.** చెప్పిన జ్ఞాననిష్ఠను స్తుతించుచు నుపసంహరించుచున్నాఁడు.— బ్రాహ్మీస్థితిః = బ్రహ్మజ్ఞాననిష్ఠ, ఏషా = ఇట్టిది. ఏనామ్, పరమేశ్వరారాధనముచే శుద్ధ మయిన యంతఃకరణము గల పురుషుఁడు, ప్రాప్య, నవిముహ్యతి = మరల సంసారమోహమును బొందఁడు. ఎందువలన ననఁగా. అన్తకాలే ఽపి = మరణ సమయమునం దైనను, అస్యామ్, క్షణమాత్రమేని, స్థిత్వా, బ్రహ్మనిర్వాణమ్ = బ్రహ్మమునందు లయమును, ఋచ్ఛతి = పొందుచున్నాఁడు, చెప్పెడి దేమి బాల్యము మొదలుకొని యుండి పొందుచున్నాఁ డని.

**ప.** ఇఁక నుపసంహరించి చెప్పుచున్నాఁడు.—ఏషా = చెప్పినలక్షణము గల, బ్రాహ్మీస్థితిః = బ్రహ్మాకారమున నుండుట; ఉపన్యసింపఁబడినది. ఏనాం ప్రాప్య, నవిముహ్యతి—మరల మోహమును బొందఁడు. అస్యామ్, అన్తకాలే = దేహావసానమునందు, క్షణము, స్థిత్వా ఽపి = ఉండియును, బ్రహ్మనిర్వాణమ్, ఋచ్ఛతి =

పొందుచున్నాఁడు, యావజ్జీవ ముండినచోఁ జెప్పెడి దేమి యని యర్థము. ఇఁక అధ్యాయతాత్పర్యము—శోకము దేహాత్మబుద్ధిచేఁ గలుగుచున్నది. ఆదేహాత్మబుద్ధి భ్రాంతియే యగును. ఏల యనఁగా ఆత్మ దేహాతిరిక్తుఁడు దేహద్రష్ట ఒకఁడు వ్యాపకుఁడు నిర్వికారుఁడు హననకర్తృత్వము గాని హననకర్మత్వము గాని లేనివాఁడు. ఆయాత్మను దెలియుటవలన శోకనాశ మగును. ఆజ్ఞానము చిత్తశుద్ధివలనఁ గలుగును. చిత్తశుద్ధి స్వధర్మమువలనఁ గలుగును. స్వధర్మము వేదవిహిత మగునది. ఇట్లీసాంఖ్యయోగప్రకరణమును భగవంతుఁడు ద్వితీయాధ్యాయమునందుఁ జక్కఁగాఁ బ్రతిపాదించెను.

రా. ఏషా= ఈనిత్యాత్మజ్ఞానపూర్వక మయిన; స్థితిః = అసంగకర్మనిష్ఠ *, స్థితప్రజ్ఞతకు సాధనమై, బ్రాహ్మీ = బ్రహ్మమును పొందించునది. ఏనామ్ = ఇట్టి కర్మనిష్ఠను; ప్రాప్య = పొంది; నవిముహ్యతి = మరల సంసారమును బొందఁడు. అస్యామ్ = ఈనిష్ఠయందు; అన్తకాలేపి = అంత్యవయస్సునం దైనను; స్థిత్వా-ఉండి; నిర్వాణమ్ = నిర్వాణమయ మగు, బ్రహ్మ = బ్రహ్మమును; ఋచ్ఛతి = పొందుచున్నాఁడు, సుఖైకస్వరూపుఁడగు ఆత్మను పొందుచున్నాఁ డని యర్థము. ఇట్లు ఆత్మతత్త్వంబును యుద్ధాఖ్యం బగు కర్మము తత్ప్రాప్తిసాధన మనుటను ఎఱుంగక శరీరాత్మబుద్ధిచే మోహితుఁడై యామోహముచే యుద్ధమునుండి నివృత్తుఁ డైన యర్జునునకు మోహశాంతికై, నిత్యాత్మవిషయ మగు సాంఖ్యబుద్ధి యేది గలదో తత్పూర్వక మగు స్థితప్రజ్ఞతాయోగసాధనభూత మయిన అసంగకర్మానుష్ఠానరూప కర్మయోగవిషయబుద్ధి ద్వితీయాధ్యాయంబునఁ బ్రతిపాదింపఁబడినది. అట్లు చెప్పఁబడినది « నిత్యాత్మాసఙ్గకర్మేహాగోచరా సాఙ్ఖ్యయోగధీః । ద్వితీయే స్థితధీలక్షా ప్రోక్తా తన్మోహశాన్తయే » ♦ అని.

ఇట్లు ఆత్మతత్త్వము దెలిసి ఫలాభిసంధి లేక కర్మము ననుష్ఠించుట యను కర్మయోగనిష్ఠయే బ్రహ్మప్రాప్తిని కలిగించును. ఈనిష్ఠ నవలంబించినవానికి మరల సంసారము లేదు. అంత్యవయస్సునందైనను ఈనిష్ఠయం దుండినచో సుఖైకస్వరూప మగు బ్రహ్మము నొందఁగలఁ డని తాత్పర్యము.

మా. ఉపసంహరించుచున్నాఁడు.—బ్రాహ్మీ స్థితిః=బ్రహ్మవిషయ మగు స్థితి, లక్షణము. అన్తకాలే ఽపి = అన్తకాలమునందుఁగూడ, అస్యామ్, స్థిత్వా = ఉండి

---

* ఫలాభిసంధి లేని కర్మానుష్ఠానము.

♦ దీనియర్థమే వెనుక భాష్యంబునఁ జెప్పఁబడినది.

ననేః బ్రహ్మమును బొందుచున్నాఁడు, అట్లు కానిచో జన్మాంతరము నొందుచున్నాఁడు, "యం యం వాఽపి" అని చెప్పఁబోవుటవలన. జ్ఞానులకుఁగూడఁ బ్రారబ్ధకర్మం బున్నచో శరీరాంతరము యుక్తము. "భోగేన త్వితరే" ⸸ అని గదా చెప్పఁబడినది. బహుశరీరఫలము లగు కర్మములు కొన్ని యున్నవిగదా! "సప్తజన్మనివి ప్రసన్నాత్ § ఇత్యాదివచనమువలన. జ్ఞానులకుఁగూడ బహుశరీరప్రాప్తి దృష్టమగుటవలనఁగూడ. ఎట్లనఁగా. "స్థితప్రజ్ఞోఽపి యస్సూర్ధ్వః ప్రాప్య రుద్రపదం గతః। సాఙ్కర్షణం తతో ముక్తి మగా ద్విష్ణు ప్రసాదతః" * అని గారుడమునందు, "మహాదేవ పరే జన్మం స్తవ ముక్తి ర్భవిష్యతి" ♦ అని నారదీయమునందుఁ జెప్పఁబడినది. జ్ఞానమో నిశ్చితఫలము "తస్య తావ దేవ చిరమ్, య దుచ న అర్చిష మే వాభిసంభవతి" ఇత్యాని శ్రుతులవలన §§. జ్ఞానికిఁ గర్మక్షయార్థము కాయువ్యూహాపేక్షయును ❡ లేదు. "త ద్యథేషీకతూలమ్, త ద్యథా పుష్కరఫలాశే, జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి" ఇత్యాది వచనములవలన. ప్రారబ్ధమునందో విరోధము లేదు. అట్లు కాయవ్యూహాపేక్ష కలదనుటకుఁ బ్రమాణమునుం గానరాదు. వారిశాస్త్రమో ప్రమాణము కాదు. "అక్షపాదకణాదానాం సాఙ్ఖ్యయోగజటాభృతామ్, మత మాలమ్బ్య యే వేదం దూషయ న్త్యల్పచేతసః" ** అని నిందించుటవలన. ఇఁక నెచట స్తుతి చేయఁబడునో అది శివభక్తస్తుతిపరంబే కాని సత్యము కాదు. వానికిఁగూడ ఇతరగ్రంథవిరుద్ధార్థమునందుఁ బ్రామాణ్యము కలదా? అట్లు చెప్పఁబడినది గదా! "ఏష

---

⸸ భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే–ఇతరములను–అరబ్ధకార్యములు కాని పుణ్యపాపములనుమాత్రము భోగముచేఁ గడపి ముక్తుఁడగుచున్నాఁడు. బ్ర. అ ౪. పా ౧. సూ ౧౯.

§ ఏడుజన్మములందు బ్రాహ్మణుఁ డగును.

* స్థితప్రజ్ఞుఁడై యూర్ధ్వుఁ డనువాఁడు రుద్రపదము నొంది యంత సాంకర్షణపదము నొంది యటుపిమ్మట విష్ణుప్రసాదమువలన ముక్తి నొందెను.

♦ మహాదేవా! నీకు మీఁదిజన్మమునందు ముక్తి కలుగును.

§§ అతనికి అంతవఱకే విలంబము ఎంతవఱకు ప్రారబ్ధకర్మముచే విడువఁబడఁడో. అతనికిఁ బుత్త్రాదులు అపరకర్మము చేయకున్నను ముక్తినే పొందును.

❡ పాశుపత వైశేషికులు చెప్పునట్లు యోగబలమున బహుశరీరములు పరిగ్రహింపవలసిన అవశ్యకతయును.

** ఎవ్వరు అల్పబుద్ధులు గౌతమకణాదాదులయు సాంఖ్యయోగకాపాలికులయు మతము నవలంబించి వేదమును దూషించుచున్నారో.

మోహం సృజా మ్యాశు యో జనా న్మోహయిష్యతి । త్వం చ రుద్ర మహా బాహో మోహశాస్త్రాణి కారయ, అతథ్యాని వితథ్యాని దర్శయస్వ మహా భుజ । ప్రకాశం కురు చా ఽఽత్మాన మప్రకాశం చ మాం కురు » ♦ అని వారాహమునందు, « కుత్సితాని చ మిశ్రాణి రుద్రో విష్ణు ప్రచోదితః । చకార శాస్త్రాణి విభుః ఋషయ స్త త్ప్రచోదితాః ॥ దధీ చాద్యాః పురాణాని త చ్ఛాస్త్రసమయేన తు । చక్రు ర్వేదైశ్చ బ్రాహ్మాని వైష్ణవా విష్ణుచోదితాః ॥ పఞ్చరాత్రం భారతంచ మూలరామాయణం తథా । తథా పురాణం భాగవతం విష్ణు ర్వేద ఇతీరితః । అత శ్శైవపురాణాని యోజ్యా న్యన్యావిరోధతః » * అని నారదీయమందును. అందువలన జ్ఞానులకు కానే యగును ముక్తి §. భీష్మాదులకో తత్కాలమునఁ బరమేశ్వరునందు మనోయోగము లేకుండెను. « స్మరం స్త్యజతి » ※ అని వర్తమానవ్యపదేశము గదా చేయఁబడినది. అదియుఁ జెప్పఁబడినది. « జ్ఞానినాం కర్మయుక్తానాం కాయత్యాగక్షణో యదా । విష్ణుమాయా తదా తేషాం మనో శాహ్యం కరోతి హి » ♦♦ అని గారుడమునందు. ఇతరుల కప్పుడు స్మృతి కలుగనే కలుగదు « బహుజన్మవిపాకేన భక్తిజ్ఞానేన యోహరిమ్ । భజన్తి తత్స్మృతిం త్వన్తే దేవో యాతి న చాన్యథా » ** అని బ్రహ్మాకైవర్తమునం దున్నది. నిర్వాణమ్ = శరీరము లేని దగు, « కాయో వాణం శరీరం చ » అను నిఘంటువువలన, « ఏత ద్వాణ మవష్టభ్య » అను ప్రయోగమువలనను.

---

♦ నేను శీఘ్రమున మోహమును సృజించుచున్నాను. అది జనుల మోహింపఁజేయును. మహాబాహుఁడ వగు రుద్రుఁడా! నీవును మోహశాస్త్రములు చేయుము, అసత్యములను విపరీతములను తెలుపుము. మహాభుజా! నన్నుఁ బ్రసిద్ధునింగాఁ జేసికొనుము. నన్ను అప్రసిద్ధునిఁగాఁ చేయుము.

* ప్రభు వగు రుద్రుఁడు విష్ణుప్రేరితుండై కుత్సితములు మిశ్రములు నగు శాస్త్రములను జేసెను. దధీచాదిఋషులును రుద్రప్రేరితులై రుద్రకృతశాస్త్రము ననుసరించి పురాణములను జేసిరి. విష్ణుప్రేరితులై వైష్ణవులు వేదములచే బ్రాహ్మపురాణములను జేసిరి. పంచరాత్రము భారతము మూలరామాయణము భాగవతము విష్ణుపురాణము వేదము ఇవి ప్రమాణము లని చెప్పఁబడినది. అందువలన శైవపురాణములను ఇతరగ్రంథములకు విరోధము లేనియట్లు నయింపవలెను.

§ శరీరపాతానంతరమే యను నియమము లే దనుట.

※ స్మరించుచు విడుచుచున్నాఁడు.

♦♦ ప్రారబ్ధకర్మశేషముతోఁ గూడిన జ్ఞానులకు ఎప్పుడు దేహత్యాగసమయము వచ్చునో అప్పుడు విష్ణుమాయ వారి మనస్సును బహిఃప్రవృత్తి గల దానిఁగా జేయుచున్నది గదా.

** బహుజన్మపరిపాకంబున భక్తిజ్ఞానములచే ఎవ్వరు విష్ణువును భజించుచుందురో అన్త్యకాలంబున భగవంతుఁడు వారి స్మృతికి విషయం బగును. వేఱువిధంబునఁ గాఁదు.

నిర్గుణ మ్మనుట అనింద్రియా ఇత్యాదికమువలె §. అట్లు కానియెడ, ఎట్లు సర్వపురాణాదిప్రసిద్ధం బగు భగవంతుని యాకృతి యుపపన్నం బగును? భగవంతుని కన్న నుత్తమము మఱియొకటి బ్రహ్మం బన శక్యము గాదు. «బ్రహ్మేతి పరమాత్మేతి భగవా నితి శబ్ద్యతే" అని భాగవతవాక్యమునలనను, «భగవస్త్వం పరం బ్రహ్మ పరబ్రహ్మ జనార్దన, పరమం యో మహ ద్బ్రహ్మ, యస్మా త్క్షరమతీ తోఽహ మక్షరా దపి చోత్తమః, యో ఽసా వతీన్ద్రియగ్రాహ్యః, నా ఽస్తి నారాయణ సమం న భూతం న భవిష్యతి, న త్వ త్సమో ఽస్త్య భ్యధికః కుతో ఽన్యః» ఇత్యాదులవలనను. ఆబ్రహ్మము * అశరీర మగుటవలన ఇట్లు ♦ కల్పింతు మనుటయుఁ జెల్లదు, ఆబ్రహ్మమునకును శరీర ముపాదిత మగుటవలన, «ఆనన్దరూపమమృతమ్, సువర్ణజ్యోతిః, దహరో ఽస్మి న్నన్తర ఆకాశః" ఇత్యాదిశ్రుతులందు. రూపము లే దేని ఆనన్దమ్ అనియే యుండును కాని ఆనన్దరూపమ్ అని యుండదు. ఎట్లు సువర్ణరూపత్వం బగును అరూపునకు? ఎట్లు దహరత్వము? దహరస్థుఁడును కేచి త్స్వదే హేత్యాదిస్థలమున రూపవంతుఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. «సహస్రశీర్షా పురుషః, రుక్మవర్ణం కర్తారమ్, ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, సర్వతః పాణిపాదం తత్, విశ్వ తశ్చక్షు రుత విశ్వతో ముఖః" ఇత్యాదివచనములవలనను విశ్వరూపాధ్యాయాదులవలనను రూపవంతుఁ డని నిశ్చిత మగుచున్నది. అతిపరిపూర్ణతమంబు లగు జ్ఞానైశ్వర్య వీర్యానంద యశ శ్శ్రీ శక్త్యాదులు గలవాఁడు గూడ భగవంతుఁడు. «పరా ఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బల క్రియా చ, యః సర్వజ్ఞః ఆనన్దం బ్రహ్మణః, ఏ తస్యై వానన్ద స్యా ఽన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి ♦♦, అనాదిమధ్యాన్త మనన్త వీర్యం సహస్రలక్షా ఽమితకాన్తికాన్తమ్ $, మ య్యనన్తగుణే ఽనన్తే గుణతో ఽనన్తవిగ్రహే, విజ్ఞాన శక్తి రహ మాస మనన్తశక్తేః, తుర్యం త త్సర్వ దృ క్సదా, ఆత్మాన మన్యంచ స వేద విద్వాన్, అన్య తమో ముకున్దా ల్లోకే నామలోకే భగవ త్పదార్థః **,

§ ప్రాకృతశరీరము లేని దనుట.

* పరులు చెప్పునట్టి బ్రహ్మము.

♦ విష్ణుకన్న బ్రహ్మము భిన్న మని.

♦♦ వీని యానందము యొక్క లేశ మితరము లగు భూతములు లేశము నుపజీవించుచున్నది.

$ ఆదిమధ్యాన్తములు లేనిది అనంత మగు వీర్యము గలది వేయిలక్షల కొలఁదిలేని కాంతులచే మనోహర మైనది.

** ముకుందునికన్న అన్యుఁడు ఎవ్వఁడు లోకమునందు భగవత్పదమున కర్థము.

అతీవ పరిపూర్ణం తే సుఖం జ్ఞానంచ సౌభగమ్ ♦♦, యచ్చాఽత్యయుక్తం స్మర్తుం వా శక్తః కర్తుమతః పరః § ఇత్యాదులవలన. అవి యన్నియు పరస్పరము అనన్యరూపములు ¶. "విజ్ఞాన మానన్దం బ్రహ్మ, ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్, సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ, యస్య జ్ఞానమయం తపః, సమా భగ ప్రవిశస్వాహా" ఇత్యాదులవలనను, "న తస్య ప్రాకృతా మూర్తి ర్మాంస మేదోఽస్థి సంభవా। న యోగిత్వా దీశ్వరత్వా త్సత్య రూపాఽచ్యుతో విభుః ♦, సద్దేహ స్సుఖగన్ధశ్చ జ్ఞానభా స్సత్పరాక్రమః। జ్ఞాన జ్ఞాన స్సుఖ సుఖః స విష్ణుః పరమోఽక్షరః" ** అని పైంగళవచనము వలనను; "దేహోఽయం మే సదానన్దో నాఽయం ప్రకృతినిర్మితః। పరిపూర్ణశ్చ సర్వత్ర తేన నారాయణోఽస్మ్యహమ్" * అని బ్రహ్మకైవర్తవచనము వలనను. దానినే లీలమెయి నితండు పరిచ్ఛిన్నాదిరూపంబునఁ జూపుచున్నాఁడు మాయచేత "నచ గర్భేఽవస ద్దేవ్యా నచాఽపి వసుదేవతః। నచాఽపి రాఘవా జ్జాతో న చాఽపి జమదగ్నితః। నిత్యానన్దోఽవ్యయోఽప్యేవం క్రీడతేఽమోఘదర్శనః" §§ అని పాద్మవచనము వలనను; "న వై న ఆత్మాఽఽత్మవతా మధీశ్వరో భుఙ్క్తే హి దుఃఖం భగవా న్వాసుదేవః॥ స్వర్గాదే రీశితాఽజః పరమసుఖనిధి ర్బోధరూపోఽథ బోధం లోకానాం దర్శయ న్వ్యాముని సుతహృతాత్మప్రియార్థే జగామ। స బ్రహ్మావన్ద్య చరణో జనమోహనాయ

---

♦♦ నీయొక్క సుఖమును జ్ఞానమును సౌందర్యమును మిక్కిలి పరిపూర్ణములు.

§ ఏది స్మరించుటకుఁగూడ మిక్కిలి అయుక్తమో దానినిగూడ జేయుటకు శక్తుఁడు, కావున అధికుఁడు.

¶ అభిన్నములు.

♦ వాని మూర్తి మాంస మేదోఽస్థిసంభవ మయిన ప్రాకృతమూర్తి కాదు. అట్లు తాను౦డుట యోగి యగుటవలనఁగాదు, మఱేమనఁగా ఈశ్వరుఁ డగుటవలన. అందువలన విభువు సత్యరూపమునుండి అచ్యుతుఁడు—తొలఁగనివాఁడు.

** సత్యమైన దేహము గలవాఁడు సుఖ మయిన గంధము గలవాఁడు జ్ఞానరూప మయిన ప్రకాశము గలవాఁడు సత్య మయిన పరాక్రమము గలవాఁడు జ్ఞానమైన జ్ఞానము గలవాఁడు సుఖ మయిన సుఖము గలవాఁడు, ఆవిష్ణువు పరముఁడు అక్షరుఁడు.

* నా యీదేహము సదానందము, ఇది ప్రకృతినిర్మితము కాదు. సర్వత్ర పరిపూర్ణముగూడ. అందుచే నేను నారాయణుఁడ నగుచున్నాను.

§§ దేవకీదేవి గర్భమునందు వసించినవాఁడును కాఁడు, వసుదేవువలనఁ బుట్టినవాఁడును కాఁడు. దశరథునివలనఁ బుట్టినవాఁడును కాఁడు. జమదగ్నివలనఁ బుట్టినవాఁడును కాఁడు. నిత్యానందుఁడు అవ్యయుఁడు ఐనను ఇట్లు క్రీడించుచున్నాఁడు, వ్యర్థము కాని దర్శనము గలవాఁడు.

స్త్రీసఙ్గినా మితి రతిం ప్రథయాఞ్చకార । పూర్తే రచిన్త్య వీర్యో యో యశ్చ దాశరథి స్స్వయమ్ । రుద్రవాక్య మృతం కర్తు మజితో జితవత్స్థితః । యోఽజితో విజితో భక్త్యా గాఙ్గేయం న జఘాన హ । నచాఽమ్బాం గ్రాహయామాస కరుణః కోఽపర స్తతః ” * ఇత్యాది స్కాందవచనముల వలనను. వాని యందు సంసారధర్మము నిరూపింపవలను గాదు. ఎచట పరాఽపరభేదము చెప్పఁబడుచున్నదో అచట విశ్వరూపమునపేక్షించి యితరమూర్తులకు అజ్ఞానిబుద్ధినిబట్టి అపరత్వము చెప్పఁబడిన దని తెలియవలెను. అదియుఁ జెప్పఁబడినది « పరిపూర్ణాని రూపాణి సమా న్యఖిలరూపతః । తథాఽ ప్యపేక్ష్య మన్దానాం దృష్టిం త్వా మృషయోఽపి హి । పరావరం వ దన్త్యేవ హ్యభక్తానాం విమోహనమ్ » ♦ అని గారుడమునందు. ఇటుఁ గొంచెమేని యుపచారమువలన నని వచియింప శక్యము గాదు, అచింత్యశక్తివలనను పదార్థవైచిత్ర్యమువలనను అని చెప్పియున్నారము. « రామకృష్ణాది రూపాణి పరిపూర్ణాని సర్వదా । నచాఽణుమాత్రం భిన్నాని తథాఽప్య స్మా న్విమోహసి ” ❡ ఇత్యాది నారదీయవచనమువలనఁ గూడ. అందువలన సర్వదా సర్వరూపములందును అసంఖ్యేయానన్తగుణగణంబును నిత్యనిరస్తాఽశేషదోషంబు నగు నారాయణాఖ్యమైన పరబ్రహ్మమును అపరోక్షజ్ఞాని పొందుచున్నాఁ డని సిద్ధము.

---

* ఆత్మవంతులకు ఆత్మయును—భాగవతులకుఁ బరమప్రియుఁడును అధీశ్వరుఁడును భగవంతుఁడు నగు అట్టి వాసుదేవుఁడు దుఃఖమును భుజింపనే భుజింపఁడు. స్వర్గాదిలోకములకు ఈశ్వరుఁడును అజుఁడును పరమసుఖనిధియు బోధస్వరూపుఁడు ఎవ్వఁడు లోకులకు బోధమును జూపుటకై మునిసుతునిచే—రావణునిచే నపహరింపఁబడిన తనభార్యనిమిత్తము దుఃఖమును బొందెనో, బ్రహ్మదేవునిచే నమస్కరింపఁ దగిన పాదములు గల ఆభగవంతుఁడు జనమోహముకొఱకు స్త్రీసంగుల యానంద మిట్టిదని ప్రకటించెను. పరిపూర్తివలన అచింత్యవీర్యుఁడు ఎవ్వఁడో, యెవఁడు తాను రాముఁడయ్యెనో, యెవఁడు రుద్రవాక్యమును సత్యము చేయుటకై అజితుఁ డయ్యును జితునివలె నుండెనో ఎవ్వఁడు అజితుఁ డయ్యును భక్తిచే జితుఁడై భీష్ముని వధించినవాఁడు కాఁడో అంబనుగూడ స్వీకరించునట్లు చేసినవాఁడు కాఁడో, అతనికన్నను దయాళువు ఇతరుఁ డెవ్వఁడు?

♦ నీరూపములు పరిపూర్ణములు, సర్వధర్మములచేతను సమానములు, అట్లయినను మూఢులబుద్ధి నవలంబించి ఋషులుగూడ అభక్తులకు మోహము కలిగించుటకై పరాఽపరరూపములు గలవానిఁగా నిన్నుఁ జెప్పుచున్నారు.

❡ రామకృష్ణాదిరూపములు సర్వదా పరిపూర్ణములు, అణుమాత్రమైనను భిన్నములు కావు. అయినను మమ్ము మోహపఱచుచున్నావు.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయా
సిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సాఙ్ఖ్యయోగో నామ ద్వితీయో
ఽధ్యాయః.

వ్యాసప్రోక్తమయిన శతసహస్ర గ్రంథసమ్మితంబగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రంబును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు సాంఖ్యయోగం బనంబరఁగు ద్వితీయాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమత్థ్సవాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాస శ్రీమద్భగవద్గీ
తాంధ్రవ్యాఖ్యానంబునందు
ద్వితీయాధ్యాయటీక.



అధ్యాయద్వయ మిద మిహ కృతాస్మి గీతార్థవివృతి రఖిలేయమ్
పరిపూర్తి మియా దచిరాత్ శ్రీమద్భగవత్ప్రసాదేన
ఘటయతు భాగవతీమే దుర్ఘటఘటనాపటీయసీ కరుణా
సాధనవికలస్యాఽపి చ గీతా పరమార్థచంద్రికాపూర్తిమ్.



శ్రీ

శ్రీకృష్ణాయ నమః.

# విజ్ఞాపిక.

శ్రీకృష్ణానుగ్రహంబువలన నిప్పుడు పంచమాధ్యాయము పరిపూర్తిచేయఁ గాంచితి మనుట కెంతయు సంతసించుచున్నారము. యదేకసాహాయ్యమే యేతత్సంపూర్తికిఁ బరమసాధన మయ్యెనో అట్టిభాగవతు లగుచందాదారుల మహిమంబుఁ గడు నభినందించుచున్నారము.

అందుఁ దృతీయాధ్యాయము సాధనభూత మయినకర్మనిష్ఠను బ్రధానముగాను సాధ్యభూత మయినజ్ఞాననిష్ఠ నప్రధానముగాను నుద్దేశించి ప్రతిపాదించునది యగుటవలనఁ గర్మయోగం బనం బరఁగుచున్నది. జ్ఞానమును గర్మమును దత్సన్న్యాసంబును అధికారిభేదనిరూపణంబునఁ బ్రతిపాదించుటం జేసి చతుర్థాధ్యాయము జ్ఞానకర్మసన్న్యాసయోగం బనంబడియె. మధుసూదనసరస్వతు లిందుఁ గర్మము విశేషరూపంబునఁ బ్రతిపాదితం బయ్యె నని వక్కాణించి దీనిని బ్రహ్మార్పణయోగం బని పేర్కొనిరి. సర్వకర్మసన్న్యాసనిష్ఠను బోధించునది యగుటచేఁ బంచమాధ్యాయము సన్న్యాసయోగం బన నొప్పెను. వీనియందలియర్థక్రమము మధుసూదనసరస్వతుల తృతీయాధ్యాయోపోద్ఘాతంబువలనఁ దెలియ నగుం గావున నిట విస్తరింపఁబడ దయ్యె.

ఈమూఁ డధ్యాయములును ద్వితీయసంపుటంబుగాఁ గట్టింపఁబడినవి. దీనిక్రయము ప్రతి ౧ కి (బైండుచార్జితో) రు. ౫-౮-౦. వి. పి. రు ౬-౨-౦.

చందాదారులు పెక్కండ్రు రొక్కము పంపకయుఁ బ్రత్యుత్తరము వ్రాయకయుఁ గార్యమునకును మాకును గష్టము గలిగించుచున్నను శ్రద్ధాభక్తిగుణభూషితులైనచందాదారులు కొందఱు దృఢతరప్రీతిమెయి నభిమానించుచుండుటవలన వారి పుణ్యమహిమంబునం జేసి యీరెండవసంపుటము నిర్విఘ్నముగా నెఱవేఱినది. మాయుత్తరములకుఁ బ్రత్యుత్తరములు గూడ వ్రాయకుండుట యిమ్మహాప్రయత్నమునందనాదరసూచకంబై మిక్కిలి యుపతాపహేతు వగుచున్నది. గ్రంథమధ్యమున స్ఖలదనుట యెంతకన్నం జింతాకరము గదా. అందువలన నేతన్మహనీయగ్రంథము

నందు నిరతిశయాదరము గలపరమభాగవతు లగుచందాదారులు, ఒక్కొక్కరును దమశక్తికొలఁది తమమిత్రప్రభృతులను ఇద్దఱ ముగ్గుర గ్రంథము కడవఱకుం గొనుచందాదారులనుగాఁ జేర్చి యీభాగవత్కార్యము నిర్వహించి భగవత్ప్రీతికి భాజనము కావలయు నని ప్రార్థించుచున్నారము.

భగవద్భక్తులభక్తిమహిమంబువలనఁ యిమ్మహాగ్రంథము సమాప్తి నొందవలయును. ఏతత్సర్వభారంబును భక్తులే వహించి యింప వలంతులు. కాన న్నాఁటియందే న్యస్తసమస్తభరుండ నగుచున్నాను. భక్తులం బ్రార్థించుటవలననె భక్తపరతంత్రుం డగు భగవంతునిం బ్రార్థించినవాఁడ నగుదు నని విరమించెదను.

తేషాం సమ్మానా దియ మయుతా మృద్ధిం కృతి ర్మహోదారాన్
యేషాం దర్శనపథ మిద మేష్యతి భగవత్కృపాయోగాత్.

1913 సం. జూన్ 25.

ఇట్లు, భాగవతవిధేయుఁడు
చదలువాడ - సుందరరామశాస్త్రి.

# సంకేతాక్షరవివరణము.

భా. శంకరభాష్యము.
ఆ. ఆనందగిరికృత శంకరభాష్య టీక.
హ. హనుమద్విరచిత పైశాచభాష్యము.
శం. శంకరానందీయ గీతా తాత్పర్యబోధిని.
మ. మధుసూదనసరస్వతీరచిత గూఢార్థదీపిక.
శ్రీ. శ్రీధరస్వామిప్రణీత సుబోధిని.
ప. పరమార్థప్రపా, వైనజ్ఞసూర్యపండిత ప్రణీతము.
రా. రామానుజభాష్యము.
మా. మాధ్వభాష్యము.

శ్రీ ర స్తు.

# అకారాదిశ్లోకానుక్రమణిక.

## తృతీయాధ్యాయము.



## చతుర్థాధ్యాయము.

## పఞ్చమాధ్యాయము.

# శుద్ధాశుద్ధపత్త్రిము.

| పుట. | బంతి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 11 | 12 | మిచ్ఛన్నః | మిచ్ఛన్తః |
| 19 | 18 | యా నిపా | యా నిష్ఠా |
| 23 | 25 | పొందించిన | పొందిన |
| 27 | 12 | భగవంతుఁడు | భగవంతుఁడు నీవు |
| ,, | 13 | చెప్పుచున్నాఁడు | చెప్పుచున్నావు |
| 31 | 7 | బరులకు మతము | బరులకుమతము |
| 36 | 28 | ప్రజను | ప్రజ్ఞను |
| 40 | 1 | కొర్రసే | కారస్సే |
| 51 | 4 | ఽవిత్వా | ఽవిత్త్వా |
| 54 | 25 | రుఘుఁడయి= | రుఘుఁడయిన |
| 57 | 26 | అసదా | అసదా |
| 61 | 7 | అత్మపేక్ష | అత్మతర మయిన మనస్సుచే, నియమ్య, అసక్తః = ఫలాపేక్ష |
| 63 | 6 | చున్నాఁడు | చున్నారు |
| 70 | 16 | వాడఁవై | వాఁడవై |
| 76 | 25 | భావితాః= | భావితులై— |
| 81 | 15 | గహింపఁ | గ్రహింపఁ |
| 86 | 5 | రేత్తో | రేతో |
| 87 | 12 | ఋత్విజమాన | ఋత్విగ్యజమాన |
| 93 | 24 | శ్రేయతే | క్షీయతే |
| 94 | 2 | పరిమాణ | పరిణామ |
| 95 | 10 | గాపు | గాపు |
| 100 | 3 | మయిస | మయిన |
| 107 | 17 | బ్రహ్మాత్మే | బ్రహ్మాత్మే |
| 118 | 22 | సదేవాశ్చ | నదేవాశ్చ |
| 122 | 10 | బ్రహణో | బ్రహ్మణో |
| ,, | ,, | స్త్వశ్తే | స్త్వశ్త్వే |
| ,, | 24 | యతాౄల | యతాౄలం |
| ,, | ,, | గవిఃస్మృతో | గఃస్మృతో |
| 123 | 11 | కర్తల | కర్తల |
| 131 | 7 | ముఖాజా | ముఖజా |
| 134 | 9 | కరమును | కర్మమును |
| 140 | 5 | న్నసంచి | న్ననుసరించి |
| 145 | 17 | అతజ్ఞాఁడు | అతజ్ఞాఁడు |
| ,, | 21 | గరాను | గర్రాను |
| 152 | 20 | నేనుబుది | నేనుబుద్ధి |
| 165 | 1 | అధికారి | అధికారి |
| ,, | 17 | అధికారి | అధికారి |
| 167 | 16 | శ్యాన్తా | శ్యాన్తా |
| 184 | 25 | ప్రతిప్రతికూ | ప్రతికూ |
| 199 | 1 | కామయమ | కామమయ |
| 228 | 20 | దున్నటి | దున్నట్టి |
| 233 | 3 | కారణామ్ | కారాణాం |
| 234 | 16 | పసన్న్యాసము | సన్న్యాససహితము |
| 235 | 26 | ఆదిరాజాయ | ఆదిరాజుకొఱకు |
| 236 | 21 | ఇమ్ | ఇమమ్ |
| 237 | 11 | దీపట | దీటుట |
| 241 | 5 | శిష్యుపరం | శిష్యపరం |

| పుట. | బంతి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 245 | 4 | అదృ | అద్య |
| 248 | 17 | నైయింగ దని | నైయింగని |
| 251 | 15 | యగము | యాగ్ధము |
| 253 | 10 | మాయాస్ప | మయాస్ప |
| 264 | 8 | వనుష్టిం | వనుష్ఠిం |
| 276 | 18 | అ గ్రహ | అ త్రిహ |
| 281 | 20 | ;మను | ;మమ |
| 285 | 1 | ప్రసిదము | ప్రసిద్ధము |
| 290 | 21 | కర్తృత్వ | కర్తృత్వ |
| 303 | 2 | నిర్భంధ | నిర్బంధ |
| ,, | 9 | సామాగ్రశ్రీ | సామగ్రశ్రీ |
| ,, | 15 | గూడ వని | గూడ దని |
| 312 | 24 | (డమా | చూడ( |
| 317 | 19 | అట్లు అట్లు | అట్లు. అట్లు |
| 319 | 26 | అప్రసిద్దం | అప్రసిద్ధం |
| 329 | 26 | —కరణః | —కర్తృణః |
| 344 | 16 | లోకసృష్టి | లోకదృష్టి |
| 345 | 19 | నమ్యగ్ద | సమ్యగ్ద |
| 356 | 1 | మాణాజ | మాణజ |
| 374 | 25 | కారములును | కారకములును |
| 393 | 3 | కర్తానిచ | కర్తాణిచ |
| 395 | 22 | తపోజ్ఞాలు | తపోయజ్ఞాలు |
| 419 | 16 | అంతర్బ | అంతర్భ |
| 420 | 3 | రీతముగా( | రీతముగా |
| 421 | 15 | చేతఏవిధిచేశా.— | చేత.ఏవిధిచేశా— |
| ,, | 17 | యగము | యగ్ధము. |
| 428 | 10 | యాత్రము | యాత్రలు |
| 430 | 6 | అసిచేత్ | అపిచేత్ |
| 442 | 27 | వాప్తి | వ్యాప్తి |
| 444 | 12 | గురుపా | గురూపా |
| 472 | 9 | కర్త | కర్తృ |
| 479 | 21 | యములో | యనులో |
| 482 | 15 | బనుట | బగుట |
| 494 | 17 | భిన్నము | భిన్నము |
| 500 | 24 | నిష్టచే | నిష్ఠ |
| ,, | ,, | హేతువు | హేతువుచే |
| 503 | 1 | సన్న్యాసనమే | సన్న్యాససమే |
| 509 | 23 | రజోజ్ఞా | జోరజ్ఞా |
| 514 | 26 | శ్వపశా | శ్వసశా |
| 515 | 18 | నవా(డై; | నవా(డై; |
| 524 | 16 | నొక(డు | యొక(డు |
| 526 | 9 | జములను | జములనుండి |
| 527 | 10 | కారణకరణ | కార్యకరణ |
| 530 | 5 | దీనిని | దీనికి |
| 533 | 19 | ధ్యానమును | ధ్యాసమును |
| 536 | 2 | మన్నాసని | నున్నానని |
| 538 | 4 | అత్రకు | అత్ర |
| 547 | 12 | యజ్ఞాన | ఏయజ్ఞాన |
| 549 | 6 | మన్నా(డు | కున్నాను |
| 551 | 3 | నిషయ | విషయ |
| 559 | 13 | విషయ | విషమ |
| 561 | 11 | సమా | సమాఽసమా |
| 567 | 5 | అట్లు | అట్లు. |
| 574 | 7 | శిష్యశి | శిష్యశి |
| 576 | 1 | ప్రియను | ప్రియందను |
| ,, | 22 | నుండిన | నొందిన |
| 584 | 14 | త్పలదం | త్పలదలం |
| ,, | 27 | దమువలన | దమువలన— |
| 585 | 25 | నాకల్యం | సాకల్యం |
| 587 | 14 | గర్భమపి | గర్భమపి |
| 590 | 17 | మాసాధ్య | మాసాదృ |
| 593 | 26 | అటితర | అట్టితర |
| 596 | 9 | యముచే | యములచే |
| 597 | 18 | అనర్జోశి | అనర్జోశి |
| 607 | 23 | జక్రగా | చక్రగా |
| 610 | 21 | నాయుజ్యం | సాయుజ్యం |
| ,, | 24 | కేవ్రతమ్ | కేవవ్రతమ్ |
| 613 | 19 | జ్యోతిపై | జ్యోతిసై |

శ్రీ ర స్తు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.

పరమార్థచంద్రికాసహిత

# శ్రీభగవద్గీత, తృతీయాధ్యాయము.

పరమపురుషార్థరూపం సాఙ్ఖ్యై ర్యోగైశ్చ యత్నతః ప్రాప్యమ్
కామాదీనవిదూరం భాగవతం హృది పదం కలయే.

శంకరభాష్యము.—

శాస్త్రమునకుఁ బ్రవృత్తి విషయభూతములు ♦ రెండు బుద్ధులు భగవంతునిచే నిర్దేశింపఁబడినవి సాంఖ్యబుద్ధియు యోగబుద్ధియు. అందు ప్రజహాతి యదా కామాన్ అని యారంభించి అధ్యాయపరిసమాప్తి వఱకు సాంఖ్యబుద్ధ్యాశ్రితులకు సన్న్యాసము కర్తవ్య మని చెప్పి వారలకుఁ దన్నిష్ఠతచేతనే కృతార్థతయుం బ్రతిపాదింపఁబడినది ఏషా బ్రాహ్మీ స్థితిః అని. అర్జునునకును "కర్మ ణ్యే వాధికార స్తే, మాతే సఙ్గో ఽ స్త్వ కర్మణి" అని కర్మమే కర్తవ్యముగా వచియించెను యోగబుద్ధి నాశ్రయించి. దానివలననే శ్రేయఃప్రాప్తిఁ జెప్పినవాఁడు కాఁడు.

ఆనందగిరికృత టీక.—

పూర్వోత్తరాధ్యాయముల సంబంధముఁ జెప్పుటకై పూర్వాధ్యాయమునందు జరగిన విషయము సంక్షేపముగా ననువదించుచున్నారు శాస్త్రమునకు ఇత్యాదిగా. గీతాశాస్త్రప్రారంభమునకు అపేక్షిత మగు హేతుఫలభూతమయిన * బుద్ధిద్వయము భగవంతునిచే నుపదేశింపఁబడిన దని యర్థము. ప్రశ్న చేయునట్టి యర్జునుని యభిప్రాయము నిర్దేశించుటకై ప్రసక్తించిన యర్థాంతరముఁ జెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. అందుక—అధ్యాయమునందు, లేక, బుద్ధిద్వ

♦ ప్రవృత్తి నివృత్తి విషయభూతములు అని పాఠాంతరము.

* హేతువు—సాధనము అయిన యోగబుద్ధి, ఫలము—సాధ్యము అయిన సాంఖ్యబుద్ధి.

యములో, పారమార్థిక మగు తత్త్వమునందు ఏజ్ఞానము గలదో దానియందు నిష్ఠ గలవారు—అశేషకామములను విడిచినవారు, కామమూలములగు కర్మములనుగూడ ప్రతిపత్తికర్మములనుంబోలె ♦ విడువవలసినదిగా భగవంతుఁడు చెప్పినాఁడని యర్థము. అట్లయినను మోక్షసాధనమునందు వికల్పసముచ్చయములలో నొకటి వివక్షితం బను తలంపుచే మీఁదిప్రశ్నకుఁ బ్రవృత్తి యని యాశంకించి యట్లు కా దని చెప్పుచున్నారు ప్రతిపాదింపఁబడినది ఇత్యాదిగా. అర్జునకు మనస్సున వ్యాకులత ప్రశ్నకారణం బని తెలుపుటకై ప్రతిపాదితం బగు నర్థాంతరము ననువదించుచున్నారు అర్జునకును ఇత్యాదిగా. సాంఖ్యబుద్ధి నాశ్రయించి కర్మత్యాగముఁ జెప్పి మరల నాకర్మమునే చేయవలె నని యెట్లు పరస్పరవిరుద్ధముగాఁ జెప్పు నని యాశంకించి చెప్పుచున్నారు యోగబుద్ధి నాశ్రయించి యని. ఎట్లు సాంఖ్యబుద్ధి నాశ్రయించి సన్న్యాసద్వారమునఁ దన్నిష్ఠు లయిన వారికిఁ గృతార్థత చెప్పఁబడినదో అట్లు యోగబుద్ధి నాశ్రయించి కర్మముఁ జేయుచుండువారికిఁగూడఁ గృతార్థత చెప్పఁబడినది యని యాశంకించి చెప్పుచున్నారు దానివలననే ఇత్యాదిగా. «దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాత్» అని చెప్పుటవలన నని శేషము.

భా. దానిని దీనినిం జూచి పర్యాకులీభూతబుద్ధియై యర్జునుండు పలికెను. ఎట్లు, భక్తుఁడు శ్రేయోర్థి యగువాని కేది సాక్షాచ్ఛ్రేయః ప్రాప్తిసాధనమో దాని సాంఖ్యబుద్ధినిష్ఠను వినిపించి నన్ను దృష్టము లయిన యనేకానర్థములు గలదియుఁ బారంపర్యముగానైనను అనియతశ్రేయః ప్రాప్తిఫలంబు * నగు కర్మమునందు నియోగింపవచ్చును? అని యుక్తము పర్యాకులీభావం బర్జునునకు. జ్యాయసీ చే దిత్యాది ప్రశ్నముగూడ దాని కనురూపము. ప్రత్యుత్తరవాక్యముగూడ భగవంతునిది యుక్తం బగుచున్నది, పైఁ జెప్పిన విభాగము విషయము శాస్త్రంబున కనుపక్షమున.

ఆ. ప్రశ్నకారణ మయిన మనోవ్యాకులతను బొంది ప్రశ్న చేయుచున్నాఁ డని చెప్పుచున్నారు దానిని దీనిని ఇత్యాదిగా. సాక్షాత్తుగానే శ్రేయస్సాధన మగు జ్ఞానము ఇతరులకుఁ జెప్పఁబడినది దానిని అని చెప్పఁబడుచున్నది.

---

♦ ఉపాసనాకర్మములనుం బోలె—ఉపాసనా కర్మములను గూడ నని యర్థము.

* నియతముగాని శ్రేయఃప్రాప్తిరూపఫలము గలది—శ్రేయఃప్రాప్తికలుగునను నియమములేనిది

తద్విపరీతం బగు కర్మము తనకు ననుష్ఠింపవలసినదిగాఁ జెప్పఁబడినది దీనిని అని నిర్దేశింపఁబడుచున్నది. భగవంతుఁడు చెప్పిన యర్థమునందు సందేహము గలిగి నిర్ణయార్థము ప్రశ్న ప్రవర్తించుటవలనఁ గలదు పూర్వోత్తరాధ్యాయములకు ఉత్థాప్యోత్థాపకత్వరూప మయిన సంగతి ♦ యని యర్థము. అర్జునునియొక్క ప్రశ్న నిమిత్త మగు పర్యాకులతను వివరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. ఏది సాక్షాత్తుగానే శ్రేయస్సాధనమో అట్టి సాంఖ్యనామకం బగు పరమార్థతత్త్వవిషయబుద్ధినిష్ఠను ఇతరునకు శ్రేయోభిలాషిభక్తునకు వినిపించి నన్ను మఱి భక్తుఁడును శ్రేయోభిలాషియుఁ గానివానిం బోలె దానికి విపరీతము * అగు కర్మమునందు ఎట్లు భగవంతుఁడు నియోగింపవచ్చును? అని యర్జునునికిఁ బర్యాకులీభావము యుక్త మని సంబంధము. జ్ఞాననిష్ఠకంటె వైపరీత్యముఁ దెలుపుటకై కర్మమునకు విశేషణము దృష్టములు ఇత్యాదిగా. అనేకానర్థములు—గురుభ్రాతృహింసాదులు అవి గలదియు, బుద్ధిశుద్ధిద్వారమున నైనను వర్తమాన జన్మమునందే ఫలము గలుగు నను నియమము లేనిదియు నగు క్షత్త్రికర్మ మయిన యుద్ధమునందు భక్తుఁడను శ్రేయోభిలాషి నగు నన్ను నియోగించుట భగవంతున కుచితంబుగా దని శేషము. పై చెప్పిననిమిత్తము ప్రశ్నకు యుక్తము ప్రశ్న దాని కనురూప మగుటవలన నని ద్యోతకము § చెప్పుచున్నారు జ్యాయసీచే దిత్యాదిగా. “జ్ఞాననిష్ఠులు కృతార్థు లగుదురు కర్మనిష్ఠులు అట్లు కారు” అని చెప్పిన విభాగము గలది శాస్త్రం బనుటకు లోకేస్మి న్నిత్యాదివాక్యముగూడ ద్యోతకంబని చూపుచున్నారు ప్రత్యుత్తరవాక్యము ఇత్యాదిగా.

భా. కొందఱు అర్జునుని ప్రశ్న కర్థము వేఱువిధముగాఁ గల్పించి దానికిఁ బ్రతికూలముగా భగవంతుని ప్రతివచనము వర్ణించుచున్నారు. మఱియు, ఎట్లు తమచే సంబంధగ్రంథంబున గీతార్థము నిరూపింపఁబడెనో దానికిఁ బ్రతికూలముగాఁగూడ ఇచట మఱి ప్రశ్నప్రతివచనముల కర్థము నిరూపించెదరు. ఎట్లు? అట సంబంధగ్రంథమున నంతట సర్వాశ్రమముల వారికిని జ్ఞానకర్మముల సముచ్చయము గీతాశాస్త్రనిశ్చితార్థం బని వచిం

♦ పూర్వోధ్యాయము ఉత్థాపకము—లేవఁదీయునది ఆకాంక్ష కలిగించునది, ఉత్తరాధ్యాయము ఉత్థాప్యము—లేవఁ దీయఁదగినది—ఆకాంక్షను పూరించునది, అను నీ సంబంధము.

* సాక్షాత్ శ్రేయస్సాధనము కానిది.

§ తెలియఁజేయుదానిని.

చిరి. మఱి దృఢీకరించిరిగూడ, యావజ్జీవ శ్రుతిచోదితము * లగు కర్మములం బరిత్యజించి కేవలమైన జ్ఞానమువలననే మోక్షము పొందఁబడు నను నిది నియమముచేతనే నిషేధింపఁబడినది యని. ఇచటనో ♦ ఆశ్రమవికల్పము ప్రతిపాదించుచు యావజ్జీవశ్రుతిచోదితకర్మములకే పరిత్యాగము చెప్పిరి. అప్పుడు, ఎట్లు ఇట్టి విరుద్ధమైనయర్థము నర్జునునకుఁ జెప్పును భగవంతుఁడు? శ్రోతగాని యెట్లు విరుద్ధమైనయర్థము గ్రహించును?

ఆ. సాక్షాత్తుగానే శ్రేయస్సాధన మగుదాని నితరులకు భగవంతుఁడు చెప్పెను, కాని నాకుఁ జెప్పఁడయ్యె నని తలఁచి వ్యాకులీభూతుఁడై యర్జునుండు ప్రశ్న చేయుచున్నాఁ డని స్వాభిప్రాయము చూపుచు సంబంధము వచియించి వృత్తికారాభిప్రాయమును దూషించుచున్నారు కొందఱు ఇత్యాదిగా. జ్ఞానకర్మముల సముచ్చయము నిశ్చయించుటకుఁ బ్రశ్న యని యంగీకరించినపక్షమున సముచ్చయనిశ్చయమే ప్రత్యుత్తరమునందును ఉచితము. భగవంతుఁ డట్లు ప్రతివచనము చెప్పినవాఁడు కాఁడు. అట్లు, ప్రశ్న సముచ్చయవిషయమును ప్రత్యుత్తరము అసముచ్చయవిషయమును § అగుటవలన, వృత్తికారమతమునందుఁ బ్రశ్నప్రతివచనములకుఁ బరస్పరవిరోధము సంభవించు నని యర్థము. మఱియు వృత్తికారమతమునందుఁ బ్రశ్నప్రతివచనములకుఁ బరస్పరవిరోధము మాత్రమే కాదు, మఱేమనఁగా వారి స్వగ్రంథమునందుఁగూడఁ బూర్వాపరవిరోధము కల దని చెప్పుచున్నారు మఱియు ఇత్యాదిగా. తమచేఁ—వృత్తికారులచే ననుట. సంబంధగ్రంథం బనఁగా గీతాశాస్త్రారంభోపోద్ఘాతము. ఇచటఁ—తృతీయాధ్యాయారంభమునందు. దానినే వివరించువారై ఆకాంక్షను జెప్పుచున్నారు ఎట్లు అని. పూర్వాపరవిరోధమును స్ఫురింపఁజేయుటకై సంబంధగ్రంథమునందుఁ జెప్పిన యర్థము నను వదించుచున్నారు అట ఇత్యాదిగా. అటఁ—పరుల వృత్తియందు. సంబంధగ్రంథమున నంతట నీయర్థము వచించి రని సంబంధము. ఆయర్థమునే విశదీకరించుచున్నారు సర్వాశ్రమములవారికిని ఇత్యాదిగా. సర్వకర్మసన్న్యాసపూర్వకమయిన జ్ఞాననిష్ఠ—దానివలననే కైవల్యం బగు నను నీయర్థమునందు శాస్త్ర

* యావజ్జీవము కర్మము లనుష్ఠించుచుండవలయు నని విధించునట్టి "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః" అను శ్రుతిచే విధింపఁబడినవి.

♦ తృతీయాధ్యాయారంభమునందు.

§ సముచ్చయవిషయము కానిది.

మునకుఁ బర్యవసానమగుటవలన సముచ్చయము వివక్షితము కా దచ్చుట నని యాశంకించి చెప్పుచున్నారు మఱి ఇత్యాదిగా. ఈచెప్పఁబడిన గీతార్థము వృత్తికారులచేతనే కర్మత్యాగం బనుపపన్నం బని దృఢీకృతం బగుటవలన అవివక్షితము కాఁజాలదు. అందువలన, శ్రౌతకర్మములను విడిచి జ్ఞాన మొక్కదానివలననే ముక్తి యగు నను నీమతము నియమమునవే యావజ్జీవశ్రుతులచే నిషిద్ధ మగుట వలన నంగీకరింపఁ దగ దని వారియభిప్రాయము. అయినను ఎట్లు విరోధము? అని యాశంకించి చెప్పుచున్నారు ఇచటనో ఇత్యాదిగా. మొదట సంబంధగ్రంథమునందు సముచ్చయము గీతాప్రతిపాద్యం బని వృత్తికారుఁడు ప్రతిజ్ఞ చేసెను, శ్రౌతకర్మపరిత్యాగముగూడ శ్రుతివిరోధమువలననే సంభవింప దని చెప్పెను, తృతీయాధ్యాయారంభమున మఱి సన్న్యాసులకు జ్ఞాననిష్ఠ కర్ములకుఁ గర్మనిష్ఠ యని యాశ్రమవిభాగము ప్రతిపాదించి మున్ను నిషేధించిన కర్మత్యాగము నంగీకరించినవాఁ డగుటవలనఁ బరస్పరవిరోధ మగుచున్న దని యర్థము. ఓయీ! ఎట్లు భగవంతుఁడు ప్రతిపాదించెనో అట్లె వృత్తికారుఁడు వ్యాఖ్యానము చేసెను, కావున వానితప్పేమియు లే దని యాశంకించి చెప్పుచున్నారు అప్పుడు ఎట్లు ఇత్యాదిగా. ఇట భగవంతుఁడేమో విరుద్ధార్థముఁ బ్రతిపాదింపఁడు, సర్వజ్ఞుఁడు పరమాప్తుఁడు నగు నతనియందు విరుద్ధార్థము చెప్పుట సంభవింపమివలన; మఱేమనఁగా భగవంతుని యభిప్రాయము తెలియమివలననే వ్యాఖ్యాత విరుద్ధార్థముఁ జెప్పుచున్నాఁ డని యర్థము. భగవంతుఁడు విరుద్ధార్థముఁ జెప్పకున్నను శ్రోత విరుద్ధార్థము గ్రహించుటను జూచి వృత్తికారుం డట్లు వ్యాఖ్యానము చేసినాఁడు, కావున నతం డపరాధికాఁ డని యాశంకించి చెప్పుచున్నారు శ్రోతగాని ఇత్యాదిగా. అర్జునుఁడు గదా శ్రోత, అతండును బుద్ధిపూర్వముగాఁ జేయువాఁడు, భగవంతునిచేఁ జెప్పఁబడినదానినే గ్రహించును గాని విరుద్ధార్థము గ్రహింపఁడు, కావున వృత్తికారుఁడే విరుద్ధార్థముఁ జెప్పినవాఁ డని యర్థము.

భా. పూర్వపక్షము.—అందిట్లు చెప్పుదురు. గృహస్థులకుమాత్రమె శ్రౌతకర్మము విడిచి కేవల మయిన జ్ఞానమువలననె మోక్షముపొంద నగు ననుట నిషేధింపఁబడినది. కాని, ఇతరాశ్రమములకుఁ గాదు. అని.

సిద్ధాంతము.—ఇదియుఁ బూర్వోత్తరవిరుద్ధంబే. ఎట్లు? సర్వాశ్రమములకును జ్ఞానకర్మములసముచ్చయము గీతాశాస్త్రమునందు

నిశ్చితం బని ప్రతిజ్ఞ చేసి యిట నెట్లు తద్విరుద్ధముగా నితరాశ్రమములకుఁ గేవల మయిన జ్ఞానమువలననే మోక్షముఁ జెప్పవచ్చును?

పూర్వపక్షము.—ఇఁక నిట్లు చెప్పుదురు కాఁబోలు. శ్రౌతకర్మాపేక్షచే ఈమాట. కేవల మయిన—శ్రౌతకర్మరహిత మయిన జ్ఞానము వలనమాత్రమె గృహస్థులకు మోక్షము నిషేధింపఁబడినది. అందు గృహస్థులకు స్మార్తకర్మ మున్నను లేనియట్లు దాని నుపేక్షించి కేవల మయిన జ్ఞానమువలనమాత్రమే యని చెప్పఁబడినది యని.

సిద్ధాంతము—ఇదియు విరుద్ధము. ఎట్లు? గృహస్థునకుమాత్రమే స్మార్తకర్మసముచ్చిత మయిన జ్ఞానమువలన మోక్షము నిషేధింపఁబడినది, కాని యితరాశ్రమములకుఁ గాదని యెట్లు వివేకులకు నిశ్చయింప శక్య మగును? మఱియు, మోక్షసాధనం బగుటచే స్మార్తకర్మము లూర్ధ్వరేతసులకు 1 సముచ్చితంబు లగు నన్నచో నట్లు గృహస్థునకుఁగూడ స్మార్తకర్మములతోనే సముచ్చయము చెప్పఁబడుఁ గాక, శ్రౌతకర్మములతో నేల?

పూర్వపక్షము.—ఇఁక, శ్రౌతములతోను స్మార్తములతోను గృహస్థునకుమాత్రమే సముచ్చయము మోక్షముకొఱకు. ఊర్ధ్వరేతసులకో స్మార్తకర్మమాత్ర సముచ్చితం బగు జ్ఞానమువలన మోక్షము.

సిద్ధాంతము—అప్పుడు గృహస్థునకే ఆయాసబాహుళ్యము, శ్రౌతము స్మార్తముగూడ దుఃఖరూపమైన బహుకర్మము తలమీఁద వేయఁబడిన దగును.

పూర్వపక్షము.—గృహస్థునకే ఆయాసబాహుళ్యానుష్ఠానము వలన మోక్షము, లేదు ఇతరాశ్రమములకు, శ్రౌతనిత్యకర్మ రహితు లగుటవలన.

సిద్ధాంతము.—అదియు సరికాదు. సర్వోపనిషత్తులందును ఇతిహాసపురాణయోగశాస్త్రములందును జ్ఞానాంగముగా ముముక్షువునకు సర్వకర్మసన్న్యాసము విధించుటవలనను, శ్రుతిస్మృతులం దాశ్రమముల వికల్పమును సముచ్చయమును విధించుటవలనను.

1 సన్న్యాసులకు.

పూర్వపక్షము.—అప్పుడు సిద్ధము సర్వాశ్రములకును జ్ఞానకర్మసముచ్చయము.

సిద్ధాంతము.—కాదు ముముక్షువునకు సర్వకర్మసన్న్యాసము విధించుటవలన. ఎట్లు, "పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి, తస్మాత్సన్న్యాసమేషాం తపసా మతిరిక్త మాహుః, న్యాస ఏవా త్యరేచయత్" అనియు, "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వ మానశుః" అనియు, "బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజేత్" * ఇత్యాది శ్రుతులు. "త్యజ ధర్మ మధర్మంచ ఉభే సత్యానృతే త్యజ! ఉభే సత్యానృతే త్యక్త్వా యేన త్యజసి తం త్యజ॥ సంసార మేవ నిస్సారం దృష్ట్వా సార దిదృక్షయా। ప్రవ్రజన్త్యకృతోద్వాహాః పరం వైరాగ్యమాశ్రితాః" అని బృహస్పతి; కర్మణా బధ్యతే జన్తుర్విద్యయాచ విముచ్యతే। తస్మాత్కర్మ న కుర్వన్తి యతయః పారదృశ్వనః" అని శుకానుశాసనము. ♦ ఇచటఁగూడ "సర్వకర్మాణి మనసా సన్న్యస్య" ఇత్యాదిగా నున్నది. మోక్షము కార్యము గామివలనం గూడ ముముక్షువునకుఁ గర్మం బనర్థకము.

ఆ. విరోధముఁ బరిహరించుటకై ఆశంకించుచున్నాఁడు అందు ఇత్యాదిగా. సంబంధగ్రంథమున ఇది గదా వృత్తికారుని యభిప్రాయము—గృహస్థులుగానే యుండి పరిపక్వజ్ఞానము లేక యావజ్జీవశ్రుతివిహితము లగు అగ్నిహోత్రాదుల విడిచి కేవలమైన ఆపాతజ్ఞానమువలన మాత్రమే మోక్షముఁ గోరువారలకు యావజ్జీవాది శ్రుతులచే మోక్షము నిషిద్ధ మగుచున్నది కాని స్వరూపము చేతనే కర్మత్యాగమునుగాని జ్ఞానమువలన మోక్షమునుగాని నిషేధించుట యిష్ట

* పుత్రైషణనుండియు విత్తైషణనుండియు లోకైషణనుండియు లేచి యంత భిక్షాచర్యము చరింతురు. అందువలన సన్న్యాసమును ఈతపస్సులలో అధికమునుగాఁ జెప్పుచున్నారు. సన్న్యాసమే యతిశయించెను. బ్రహ్మచర్యమునుండియే సన్న్యసింపవలెను.

♦ ధర్మమును అధర్మమును విడువుము; సత్యానృతంబులను రెంటిని విడువుము; సత్యానృతములు రెంటిని విడిచి, దేనిచే విడుచుచున్నావో దాని విడువుము. సంసారమునే నిస్సారముగాఁ దెలిసి సారము దెలియు కోరికిచే నుత్తమ మగు వైరాగ్యము నాశ్రయించినవారై వివాహము చేసికొనక సన్న్యసించు చున్నారు. జన్తువు కర్మముచే బద్ధుఁ డగును; విద్యచే విముక్తుఁ డగును; అందువలనఁ, బారము చూచినట్టి యతులు కర్మముఁ జేయరు.

ముగాదు. తృతీయాధ్యాయమునందో, గృహస్థ వ్యతిరిక్తులకు–కర్మత్యాగులకు మాత్రమే కేవల మయిన ఆత్మజ్ఞానమువలన మోక్షము వివక్షిత మగుచున్నది. అందువలన, నిషేధంబునకును అభ్యనుజ్ఞకును విషయము భిన్నము [1] అగుటవలన విరోధము సంభవింప దని యర్థము.

మఱియొకవిధమున విరోధముఁ జూపుచు నుత్తరము చెప్పుచున్నారు ఇదియు ఇత్యాదిగా. విరోధమునే ఆకాంక్షాద్వారమున సాధించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా.

శ్రౌతకర్మమును గృహస్థు లవశ్య మనుష్ఠింపవలె నను నభిప్రాయముచే వారికిఁ గేవలాత్మజ్ఞానమువలన మోక్షము నిషేధింపఁబడుచున్నది, కాని గృహస్థులకు జ్ఞానమాత్రమున మోక్షము లే దనియు నితరులకుఁ గేవలజ్ఞానమువలననే మోక్షము కలుగు ననియు వివక్షితము కాదు, ఇతరాశ్రమములవారికిఁగూడ స్మార్తకర్మముతో సముచ్చయము నంగీకరించుటవలన. అని యాశంకించుచున్నాఁడు ఇఁక నిత్యాదిగా. ఈమాట అని పరామర్శించినవాక్యమునే యుదాహరించుచున్నాఁడు కేవల మయిన ఇత్యాదిగా. ఓయీ! గృహస్థులకు శ్రౌతకర్మము లేకున్నను స్మార్తకర్మము ఉండునపుడు జ్ఞానమునకుఁ గేవలత్వం బెట్లగును? జ్ఞానమునకుఁ గేవలత్వము సిద్ధించినం గదా నిషేధించుట అర్థవంత మగును అనఁగాఁ జెప్పుచున్నాఁడు అందు ఇత్యాదిగా. అందు–ప్రకృతవచనమునందు. ప్రధానము గదా శ్రౌతకర్మము, అది లేనియపుడు స్మార్తకర్మము ఉన్నను లేనియట్లు తలఁచి జ్ఞానమునకుఁ గేవలత్వము చెప్పఁబడినది, కావున నిషేధించుట యుక్త మని యర్థము.

గృహస్థులకుమాత్రమే శ్రౌతకర్మముతో సముచ్చయము, ఇతరులకుఁ గాదు; ఇతరులకో స్మార్తకర్మముతో సముచ్చయము అని పక్షపాతమునకు హేతువు లే దని తలంచినవారై పరిహరించుచున్నారు ఇదియు ఇత్యాదిగా. హేతువు లేమినే ప్రశ్నద్వారమున వివరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. గృహస్థులకు శ్రౌతస్మార్తకర్మసముచ్చితమైన జ్ఞానము ముక్తిహేతు వని యంగీకరించుటవలనఁ గేవలస్మార్తకర్మసముచ్చిత మయిన జ్ఞానమువలన మోక్షము కలుగ దని నిషేధము యుక్తమే, కాని యూర్ధ్వరేతసులకు మాత్రము కేవలస్మార్తకర్మసముచ్చిత మైన జ్ఞానమువలన మోక్షం బని విభాగమునకు హేతువు లే దని యర్థము. పక్షపాతము

[1] నిషేధమునకు విషయము గృహస్థులు, అభ్యనుజ్ఞకు విషయము తద్వ్యతిరిక్తు లగు కర్మత్యాగులు.

చేయుటకుఁ గారణము లేదని చెప్పి పక్షపాతము విడుచుటకుఁ గారణమున్న దని చెప్పుచున్నారు మఱియు అని. గృహస్థులకుఁగూడ బ్రహ్మజ్ఞానము స్మార్తకర్మముల తోనే సముచ్చితమై మోక్షసాధన మగును, బ్రహ్మజ్ఞాన మగుటవలన, ఊర్ధ్వరేత సులకు వ్యవస్థితమైన బ్రహ్మజ్ఞానమువలె. అని పక్షపాతత్యాగమునకు హేతువును స్ఫుటీకరించుచున్నారు మోక్షసాధనం బగుటచే నిత్యాదిగా.

గృహస్థులకు బ్రహ్మజ్ఞానము స్మార్తకర్మములతో మాత్రము సముచ్చితమే మోక్షసాధన మని వివక్షించినచో అప్పుడు వారికి యావజ్జీవశ్రుతి విరోధించును. స్మార్తకర్మములతోనుం గూడ సముచ్చితమైన జ్ఞానము మోక్షసాధన మని వివక్షిం తు రేని అప్పుడు సిద్ధసాధ్యత * యగు నని పూర్వోక్తమునే యభిప్రాయపడి యాశంకించుచున్నాఁడు ఇఁక నిత్యాదిగా. అట్లయినయెడ ఇతరాశ్రమములకుఁ గేవల మయిన జ్ఞానమువలననే ముక్తి యని మున్ను చెప్పినవిరోధము అట్లే యున్నది యని యాశంకించి చెప్పుచున్నాఁడు ఊర్ధ్వరేతసులకో ఇత్యాదిగా.

పూర్వపక్షి చెప్పిన విభాగమునందు గార్హస్థ్యము క్లేశాత్మకకర్మబాహు ళ్యమునంజేసి ఉపాదేయము ♦ గాక పోవు నని దూషించుచున్నారు అప్పుడు ఇత్యాదిగా.

« సాధనభూయస్త్వే ఫలభూయస్త్వమ్ » § అనున్యాయము నవలం బించి యాశఁకించుచున్నాఁడు గృహస్థునకే ఇత్యాదిగా. ఆయాసబాహుళ్యానుష్ఠా నమువలన—క్లేశబాహుళ్యముతోఁగూడిన శ్రౌతస్మార్తములు బహుకర్మములు వాని ననుష్ఠించుటవలన, గృహస్థునకు మోక్షము కలుగనే కలుగు నని యర్థము. ఏవా ర్థకముచే నిరసింపఁదగినదానిఁ జూపుచున్నారు లేదు ఇతరాశ్రమములకు అని. వారికి లేదు ముక్తి యనుటకు యావజ్జీవశ్రుతివిహితము లయిన యవశ్యానుష్ఠే యము లగు కర్మములు లేకుండుటను హేతువునుగా సూచించుచున్నాఁడు శ్రౌ తేత్యాదిగా.

శాస్త్రవిరోధ ముండునపుడు న్యాయమున కవకాశము లే దను నభిప్రాయ ముతో నిరాకరించుచున్నారు అదియు సరికాదు అని. ఒకటే ఆశ్రమమును విధించు

* సాధ్యము—గృహస్థులకు స్మార్తకర్మములతోను శ్రౌతకర్మములతోను సముచ్చితమైనజ్ఞా నము మోక్షసాధన మనుట సిద్ధముగా నున్నది, సాధింప నవసరము లేదు అనుదోషము.

♦ గ్రాహ్యము.

§ సాధన మధిక మైనపుడు ఫలము అధిక మగును.

శ్రుతిచే ♦ గార్హస్థ్యమే ప్రధాన మగుటవలన అధికృతులు కాని యంధులు మొదలగువారివిషయము కర్మసన్న్యాసము విధించుట యని యాశంకించి చెప్పుచున్నారు జ్ఞానాంగముగా అని. అధికృతులు కాని యంధాదులకు సన్న్యాసము శ్రవణాద్యావృత్తిద్వారమున జ్ఞానాంగము కాఁజాలదు గదా! వారలకు శ్రవణాద్యభ్యాసమునందు సామర్థ్యము లేమివలన. కావున శ్రుత్యాదులు విరోధించునపుడు గార్హస్థ్యమునకుఁ బ్రాధాన్య మనుట చెల్ల దని యర్థము. దానికిఁ బ్రాధాన్యము లే దనుటకు మఱియొక హేతువుఁ జెప్పుచున్నారు శ్రుతిస్మృతులయందు ఇత్యాదిగా. «బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్ గృహీ వనీ భూత్వా ప్రవ్రజే ద్యది వేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజే ద్గృహాద్వా వనాద్వా» * అని శ్రుతియందును «తస్యా శ్రమవికల్ప మేకే బ్రువతే» ♦♦ అనియు «య మిచ్ఛే త్త మావసేత్» ‖ అనియు స్మృతియందును ఆశ్రమములు సముచ్చయముగాను వికల్పముగాను ఆశ్రమాంతరము గోరువానికి విధించుటవలన గార్హస్థ్యమునకుఁ బ్రాధాన్యము చెల్ల దని యర్థము.

వర్ణాశ్రమంబులును శ్రుతిస్మృతిమూలంబు లగునెడ అప్పుడు ఆయా యాశ్రమంబునకు విహితంబు లగు కర్మములకు జ్ఞానముతో సముచ్చయము సిద్ధించుచున్న దని యాశంకించుచున్నాఁడు అప్పుడు ఇత్యాదిగా.

జ్ఞానోత్పత్తియం దాశ్రమకర్మములు సాధనము లగుఁ గాక. అయినను, ఉత్పన్న మైన జ్ఞానము ఫలమునందు వానిని సహకారులుగా నెంతమాత్ర మపేక్షింపదు, అట్లు కానిచో సన్న్యాసవిధి యనుపపన్న మగుటవలన నని నిరాకరించుచున్నారు కాదు ఇత్యాదిగా. విధానమునే క్రమముగా నుదాహరించుచున్నారు «పుత్త్రైషణాయా ఇత్యాదిగా. ఏషణలనుండి విముఖుఁడై లేచుట యనఁగా వాని విడుచుట. ఆశ్రమము పొందిన పిమ్మట దానికి విహితము లయిన కర్మకలాపముల

---

♦ యావజ్జీవశ్రుతిచే—యావజ్జీవము కర్మము లనుష్ఠింపవలె నని విధించు "కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః" అను శ్రుతిచే.

* బ్రహ్మచర్యము సమాప్తిచేసి గృహస్థుఁడు కావలెను. గార్హస్థ్యము నుండి వానప్రస్థుఁడై సన్న్యసింపవలెను. లేదా, వేఱువిధమున బ్రహ్మచర్యమునుండిగాని సన్న్యసింపవలెను. గృహమునుండిగాని వనమునుండిగాని సన్న్యసింపవలెను.

♦♦ అతని కాశ్రమవికల్పముఁ గొందఱు చెప్పుచున్నారు.

‖ దేనిఁ గోరునో దానియం దుండునది.

యనుష్ఠానముగూడఁ జేయవలె ననఁగాఁ జెప్పుచున్నారు అథ ఇత్యాదిగా. మున్ను చెప్పిన సత్యాదులు అల్పఫలంబు లగుటవలనను న్యాసము జ్ఞానద్వారంబున మోక్షఫలకం బనుటవలనను నని చెప్పుచున్నారు తస్మాత్ ఇత్యాదిగా. అతిరిక్తమ్—అతిశయము గలది మహాఫల మని యర్థము. ప్రకృతకర్మములకన్న న్యాసమే యతిశయవంత మయ్యె నని చెప్పిన యర్థమునందు మఱియొకవాక్యము పఠించుచున్నారు న్యాస ఏవ ఇత్యాదిగా. లోకత్రయహేతు వయిన సాధనత్రయమును విడిచి సంసారమునుండి విరక్తులై సన్న్యాసపూర్వక మయిన ఆత్మజ్ఞానమువలననే పొందిరి మోక్షము నని చెప్పుచున్నారు నకర్మణా ఇత్యాదిగా. వైరాగ్యము ఉండునపుడు క్రమము నపేక్షింపవలసినది లేదు, సాధన సామగ్రి యుండునపుడు కార్యవిషయమైన ఆక్షేపము అనుపపన్న మగుటవలన నని చెప్పుచున్నారు బ్రహ్మచర్యాదేవ ఇత్యాదిగా. ఇత్యాదు లగు శ్రుతులు సర్వకర్మసన్న్యాసము విధించునవి కల వని శేషము. “ఆత్మానమేవ లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి” ఇత్యాదివాక్యముల సంగ్రహించుచున్నది ఆదిపదము. అందే స్మృతి నుదాహరించుచున్నారు త్యజ ధర్మ మిత్యాదిగా. ధర్మాధర్మములును సత్యానృతములును సంసారహేతువు లగుటవలన ముముక్షువు వాని విడుచుటయందు యత్నింపవలె నని యర్థము. విడుచువాఁడ ననుమభిమానముగూడ వాస్తవమున స్వరూపముతో సంబంధము లేనిది యగుటవలన అదిగూడ విడువఁ దగినదే యని చెప్పుచున్నారు యేన ఇత్యాదిగా. అనుభవానుసారంబునఁ బ్రమాతృత్వము మొదలగు సంసారము దుఃఖఫలకం బని తెలిసి మోక్షహేతు వగు సమ్యగ్జ్ఞానము సిద్ధించుకొఱకు బ్రహ్మచర్యమునుండియే సన్న్యాసాశ్రమము ననుష్ఠింపవలె నని యుత్పత్తివిధి § నుపన్యసించుచున్నారు సంసారమేవేత్యాదిగా. తత్త్వజ్ఞానము నుద్దేశించి బ్రహ్మచర్యమునుండియే కర్మసన్న్యాసమునకు సామగ్రిని వచించుచు వినియోగవిధిని ♦ సూచించుచున్నారు “పరం వైరాగ్య మాశ్రితాః” అని *. జ్ఞానకర్మములకు సముచ్చయము లేదనుటకు ఫలవిభాగముఁ జెప్పుచున్నారు కర్మణా ఇత్యాదిగా. చెప్పిన ఫలవిభాగము ననువదించి జ్ఞాననిష్ఠులు కర్మసన్న్యాసము చేయవలె, నని చెప్పుచున్నారు తస్మా దిత్యాదిగా. ఇట వాక్యశేషమునందుఁగూడఁ గర్మసన్న్యాసము వివక్షిత మగుచున్న దని చెప్పు

§ మీమాంసకమతమునఁ గర్మస్వరూపము దెలుపువిధి.

♦ దీనిచే నిది చేయవలెను అనువిధిని.

* ఇట సన్న్యాసమునకు సామగ్రి వైరాగ్యము.

చున్నారు ఇచటఁ గూడ ఇత్యాదిగా. జ్ఞానార్థి యగు ముముక్షువు నుద్దేశించిన సన్న్యాసవిధికి అనుపపత్తి సంభవించుటచే సముచ్చయవాక్యము బాధితం బగు నని చెప్పఁబడినది. ఇప్పుడు మోక్షస్వభావం బాలోచించినను సముచ్చయవాక్యం బను చితం బగు నని చెప్పుచున్నారు మోక్షము ఇత్యాదిగా.

భా. పూర్వపక్షము.—నిత్యములు ప్రత్యవాయ పరిహారార్థములు అందురేని.

సిద్ధాంతము.—అట్లు కాదు. ప్రత్యవాయ ప్రాప్తి అసన్న్యాసి విషయ మగుటవలన §. అగ్నికార్యాదులు చేయమివలన సన్న్యాసికిఁ బ్రత్యవాయము కల్పింప శక్యము గాదు గదా! బ్రహ్మచారులకు అస న్న్యాసులకునుం బోలె.

ఆ. « అకుర్వ న్విహితం కర్మ నిన్దితం చ సమాచరన్ । ప్రసజ్జం శ్చేన్ద్రియార్థేషు నరః పతనమృచ్ఛతి » * అనుస్మృతివలన ముముక్షువుగూడు ప్రత్యవాయనివృత్తికొఱకుఁ జేయవలెను నిత్యకర్మము నని యాశంకించుచున్నాఁడు నిత్యములు ఇత్యాదిగా.

ఎవఁడు ఏకర్మమునం దధికృతుఁడో అతనికి దానిఁ జేయమివలనఁ బ్రత్యవాయ మగును, కాని కర్మమునం దనధికారి యగు సన్న్యాసికి దానిఁ జేయమి వలనఁ బ్రత్యవాయము సంభవింప దని నిరాకరించుచున్నారు అట్లు కాదు ఇత్యాదిగా. దానినే స్పష్టీకరించుచున్నారు అగ్నికార్యాదులం దిత్యాదిగా. సమిధల హోమము అధ్యయనము మొదలగునవి చేయకుండుటవలనఁ బ్రత్యవాయము సన్న్యాసికి లే దని యర్థము. అందుకు వ్యతిరేకదృష్టాంతముఁ జెప్పుచున్నారు బ్రహ్మచారులకు ఇత్యాదిగా.

భా. మఱియు నిత్యముల అకరణము ♦ వలన అభావమువలననే భావ రూపమయిన ప్రత్యవాయమున కుత్పత్తి కల్పింప శక్యమే కాదు « కథమ సత స్సజ్జాయేత » అని అసత్తువలన సత్తునకు జన్మము సంభవింప దని

* సన్న్యాసి కానివాని విషయ మగుటవలన.

§ విధింపఁబడిన కర్మమును జేయకున్నను నిషిద్ధ మయినదానిఁ జేసినను ఇంద్రియవిషయముల యందు ఆసక్తుండైనను మనుష్యుఁడు పతనము నొందుచున్నాఁడు.

♦ చేయకుండుట.

శ్రుతి చెప్పుటవలన. విహితకర్మము చేయకుండుటవలన అసంభావ్యమైనను ప్రత్యవాయము కల దని వేదము చెప్పుచున్న దనునెడ అప్పుడు అనర్థకరము వేదము అప్రమాణం బని చెప్పిన ట్లగును, విహితముఁ జేయుటకును జేయమికిని దుఃఖమాత్రమే ఫలం బని యేర్పడుట వలన. మఱియు « కారకము § శాస్త్రము, జ్ఞాపకము ♦ కాదు అని యనుపపన్నార్థము ❡ కల్పించిన ట్లగును. ఇదియో ఇష్టము కాదు. అందువలన లేవు సన్న్యాసులకుఁ గర్మములు. ఇందువలన జ్ఞానకర్మములకు సముచ్చయం బనుపపన్నము. « జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిః » అను నర్జునుని ప్రశ్న అనుపపన్న మగుటవలనఁ గూడ.

టీ. అకరణంబువలనఁ బ్రత్యవాయోత్పత్తి నంగీకరించి చెప్పఁబడినది. ఇప్పుడు నిషిద్ధకర్మమును జేయుటవలననే ప్రత్యవాయము, కాని అకరణంబువలనఁ గానేరదు, అభావంబువలన భావోత్పత్తి లోకవేదవిరుద్ధం బగుటవలన నని చెప్పుచున్నారు మఱియు ఇత్యాదిగా. ఓయీ! నిత్యకర్మమును విధించునట్టి వేదము దానిఁ జేయమివలనఁ బ్రత్యవాయం బగు నని చెప్పుచున్నది, అప్పుడు ఎట్లు అకరణంబువలనఁ బ్రత్యవాయంబు కలుగ దని శ్రుతి నాశ్రయించి చెప్పెదవు, ఇతర శ్రుతి విరోధము ఉండుటవలన? ఇందుకు సమాధానము చెప్పుచున్నారు విహితకర్మము ఇత్యాదిగా. విహితకర్మముఁ జేయకున్నపుడు అనర్థము కలుగుటవలన నిత్యకర్మము విధించు వేదము అనర్థకరంబై యప్రమాణంబు కాఁజాల దని యాశంకించి చెప్పుచున్నారు విహితము నిత్యాదిగా. విహితకర్మముఁ జేయుటవలనఁ బితృలోకప్రాప్తిరూపఫలమును నీ వంగీకరింపవు గదా! ధూమాదులచే ＊ నేత్రపీడాది దుఃఖమేమో ప్రత్యక్షమే, చేయమివలనను బ్రత్యవాయము కలుగును, ఇట్లు రెండు విధంబులనుగూడఁ బురుషున కనర్థకరంబై వేదము అప్రమాణమే యగు నని యర్థము. ఓయీ! అభావమునకుఁగూడ భావముఁ బుట్టించు సామర్థ్యమును వేదము కలిగించును, అట్లు, విహితముఁ జేయమివలనఁ గలుగు ప్రత్యవాయము యొక్క పరిహారము విహితానుష్ఠానమునకు ఫల మగును అనఁగా నట్లు కా దని

§ లేనిదానిఁ గల్పించునది.

♦ ఉన్నదానిఁ దెలుపునది.

❡ ఉపపత్తి లేని యర్థము గల యభిప్రాయము, యుక్తము కాని యభిప్రాయము.

＊ అగ్నిహోత్రాదులు చేయునపుడు పొగ మొదలగువానిచే.

చెప్పుచున్నారు మఱియు నిత్యాదిగా. లోకప్రసిద్ధపదార్థశక్తి నాశ్రయించి శాస్త్రము ప్రవర్తించుచున్న దని యంగీకరించుటవలనను అపూర్వశక్తిని § కల్పించుట యసంభవ మగుటవలనను జ్ఞాపకమే శాస్త్ర మని యర్థము. కారకం బన్నచో దానికి అప్రామాణ్యము నిర్విఘ్నముగా సంభవించు నని చెప్పుచున్నారు కారకము ఇత్యాదిగా. అగుఁ గాక శాస్త్రమునకు అప్రామాణ్య మని యాశంకించి అపౌరుషేయం బగుటచే నిర్దోష మగుటవలన నట్లు కా దని చెప్పుచున్నారు ఇదియో ఇత్యాదిగా. అనిర్వాచ్య మయిన అనుపలబ్ధియొక్క జ్ఞానము అభావజ్ఞానమునకుఁ గారణము ఇష్టసాధనతాజ్ఞానము చరణన్యాసాది ప్రవృత్తికిఁ గారణము అని యంగీకరించి యుపసంహరించుచున్నారు అందువలన ఇత్యాదిగా. అందువలన—అకరణమువలనఁ బ్రత్యవాయమున కుత్పత్తి సంభవింపమివలన. సన్న్యాసులగు జ్ఞాననిష్ఠులు కర్మసన్న్యాసు లగుటవలననే వారికిఁ గర్మము సంభవింప దనుటకు ఫలితముఁ జెప్పుచున్నారు ఇందువలన ఇత్యాదిగా. సముచ్చయం బనుపపన్నం బనుటకు మఱియొక హేతువుఁ జెప్పుచున్నారు జ్యాయసీ ఇత్యాదిగా.

భా. భగవంతునిచే ద్వితీయాధ్యాయంబునందు జ్ఞానంబును గర్మమును జేర్చి నీవనుష్ఠింపవలె నని చెప్పఁబడియే యుండునేని, అప్పుడు అర్జునుని ప్రశ్నము “జ్యాయసీ చే త్కర్మణస్తే మతా బుద్ధిః” అనునది యనుపపన్నమగును. అర్జునునకు “బుద్ధికర్మములు రెండును నీవనుష్ఠింపవలెను” అని చెప్పఁబడి యుండునేని, అప్పుడు, కర్మము కన్న జ్యాయం ♦ బగు బుద్ధియేదిగలదో అదియుఁ జెప్పఁబడినదియే యగును, కావున “తత్ కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ” అని యుపాలంభముగాని ప్రశ్నముగాని యేవిధంబునను ఉపపన్నము కాదు. ఇఁక నర్జునునకు మాత్రమే జ్యాయం బగు బుద్ధి యనుష్ఠేయము కా దని భగవంతుఁడు వచియించె మన్నని కల్పించుటయో యుచితము కాదు. అప్పుడు గదా “జ్యాయసీ చేత్” అని వివేకముచేఁ బ్రశ్న సంభవించును.

ఆ. ప్రశ్నానుపపత్తినే వివరించుచున్నారు భగవంతునిచే నిత్యాదిగా. సముచ్చయోపదేశపక్షమునందుఁ బ్రశ్నైకదేశము అనుపపన్న మగుటవలనఁ

§ లేని శక్తిని.

♦ శ్రేష్ఠము.

గూడ నది * ఉపపన్నము కా దని చెప్పుచున్నారు అర్జునునకు ఇత్యాదిగా. "కర్మణ్యేవా ఽధికారస్తే మాఫలేషు కదాచన" అని యర్జునున కుపదేశించుట వలన అతనికి జ్యాయం బగు బుద్ధి చెప్పఁబడినది కాదు, కావున యుక్తము "తత్కిం కర్మణి ఘోరే" అను నుపాలంభవచనము అని యాశంకించి చెప్పుచున్నారు ఇఁక నర్జునునకు ఇత్యాదిగా. అప్పుడు—అర్జునునకు బుద్ధిచెప్పఁ బడినది కా దని కల్పించినప్పుడు, "జ్యాయసీ చేత్" అనియు "తత్కిం కర్మణి" అనియు నుపాలంభరూప మయిన ప్రశ్న సంభవించును, అట్లు కల్పించుట యుక్తముగాదు, ఏషా తే ఽభిహితా సాఙ్ఖ్యే బుద్ధిః" అను వచనము విరోధించుటవలన. అని యన్వయము.

భా. ఇఁక జ్ఞానకర్మములు విరుద్ధములగుటవలన ఏకపురుషునకు నేక కాలంబున వానిరెంటిని అనుష్ఠించుట సంభవింప దని యవి భిన్న పురుషానుష్ఠేయంబు లని భగవంతుఁడు పూర్వము వచియించె నను పక్షంబు ననో, అప్పు డీజ్యాయసీచే దిత్యాది ప్రశ్నం బుపపన్నం బగును. అవివేకమువలనఁ బ్రశ్న మని కల్పించుపక్షమునందుఁ గూడ భిన్నపురుషానుష్ఠేయంబు లని భగవంతునిప్రతివచనం బుపపన్నము కాదు. అజ్ఞాననిమిత్తము భగవంతుని ప్రతివచనం బని కల్పింపఁ దగదు గదా! ఇట్లు జ్ఞానకర్మనిష్ఠలు భిన్నపురుషానుష్ఠేయంబు లని భగవంతుని ప్రతివచనము కనఁబడుటవలనఁ గూడ జ్ఞానకర్మంబులకు సముచ్చయం బనుపపన్నము. అందువలనఁ, కేవలమైన జ్ఞానమువలన మాత్రమే మోక్షం బను నీ యర్థమే నిశ్చితము గీతలందును, సర్వోపనిషత్తులందును గూడ. "జ్ఞానకర్మములలో నొకటిచెప్పుము నిశ్చయించి" యని యేకవిషయమే యగు ప్రార్థనముగూడ అనుపపన్నము రెంటికిని సముచ్చయము సంభవించునెడ. "కురు కర్మైవ తస్మాత్త్వమ్" అని గూడ నర్జునునకు జ్ఞాననిష్ఠ సంభవింపమి నవధారణముచే † దెలుపఁ బోవుచున్నాఁడు.

టీ. అట్లయినచో ఏపక్షమునందుఁ బ్రశ్నము ఉపపన్న మని యాశంకించి చెప్పుచున్నారు ఇఁక ఇత్యాదిగా. భగవంతుఁడు చెప్పిన యర్థమునందు అర్జు

* సముచ్చయము ముపదేశింపఁ బడె నను పక్షము.

† ఏవ అనుపదముయొక్క అర్థ మయిన నిశ్చయముచే.

మనకు వివేకము § లేమివలన ప్రశ్నము కా వచ్చునని యాశంకించి మున్ను చెప్పినదానినే యధికము చెప్పఁగోరినవారై స్మరణకుఁ దెచ్చుచున్నారు అవివేకము వలన ఇత్యాదిగా. భగవంతుని ప్రతివచనముగూడ అజ్ఞాననిమిత్తము.—అజ్ఞానమే కారణముగాఁ గలది, ప్రశ్నకు అను రూపమగుటవలన నని యాశంకించి యధికమును జూపుచున్నారు అజ్ఞానేత్యాదిగా. భగవంతుఁడు సర్వజ్ఞుం డను ప్రసిద్ధికి విరుద్ధమగుటంజేసి అజ్ఞాననిమిత్తప్రతివచనము సంభవింపమివలన నని యర్థము. ఇందువలనఁ గూడ సముచ్చయము శాస్త్రాభిప్రాయము కా దని చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. అట్లయిన ఏది శాస్త్రాభిప్రాయ మని చెప్పెద రనఁగాఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. జ్ఞానకర్మముల సముచ్చయం బనుపపన్న మనుటకు మఱియొక కారణముఁ జెప్పుచున్నారు జ్ఞానకర్మములలో ఇత్యాదిగా. వాక్యశేషమువలనఁ గూడ సముచ్చయము శాస్త్రార్థము కా దని చెప్పుచున్నారు కురు కర్మై వేత్యాదిగా.

అర్జున ఉవాచ.—

జ్యాయసీ చేత్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ. ౧

భా. జనార్దన = కృష్ణా! కర్మణః = కర్మముకన్నను; బుద్ధిః = జ్ఞానము; జ్యాయసీ = ఉత్తమము అని. తే = నీకు; మతా = అభిప్రేతము; చేత్ = అగునెడ; బుద్ధికర్మముల సముచ్చయమే యిష్టమగునేని అప్పుడు ఒకటియే శ్రేయస్సాధనమగుం గావునఁ గర్మముకన్న నుత్తమము బుద్ధియని యర్జునుఁడు కర్మముకన్న బుద్ధి నతిరిక్తముగాఁ జెప్పుట యనుపపన్న మగును. అదే దానికన్న ఫలముచే నతిరిక్తము కాఁజాలదు గదా! అట్లు, కర్మముకంటె శ్రేయస్కరముగా బుద్ధి భగవంతునిచేఁ జెప్పఁబడినది, అశ్రేయస్కరమయిన కర్మముఁ జేయుమని నాకుఁ జెప్పుచున్నాఁడు. అందుకేమి కారణము? అని భగవంతు నుపాలంభము చేయువాని యట్లు, తత్ = అప్పుడు; కిమ్ = ఎందువలన; ఘోరే = క్రూరమయిన, హింసారూపమయిన; కర్మణి = కర్మమునందు; మామ్ =

§ విమర్శించి తెలిసికొనుట.

నన్ను; నియోజయసి=నియోగించుచున్నావు? కేశవ=కృష్ణా! అనియు నేమిచెప్పెనో అదియు నుపపన్నము కాదు.

ఇఁక, స్మార్తకర్మముతోనే సముచ్చయం బందఱకును భగవంతునిచేఁ బ్రతిపాదింపఁబడినది అర్జుననిచేతనుం గ్రహింపఁబడినది, అగునేని, «తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి» ఇత్యాది వచనం బెట్లు యుక్త మగును?

కృష్ణా! కర్మముకంటె జ్ఞానమే యుత్తమం బని నీయభిప్రాయము దోఁచుచున్నది. ఇదియే నీయభిప్రాయ మగు పక్షమున, నన్ను, హింసారూపమై క్రూరం బగు యుద్ధాఖ్యకర్మమునే చేయుమని నీవు నియోగించుటకుఁ గారణ మేమి? చెప్పు మని తాత్పర్యము.

ఆ. సమస్త శాస్త్రార్థసంగ్రాహకం బగు ప్రథమోపస్థిత మైన సంబంధగ్రంథముచే ♦ తద్వివరణరూపమైన మీఁది గ్రంథమునకు లేదు పౌనరుక్త్యం బని తలంచినవారై ప్రతిపదము వ్యాఖ్యానము చేయుటకై ప్రశ్నైకదేశమును లేవఁదీయుచున్నారు జనార్దనేత్యాదిగా. బుద్ధిశబ్దము అంతఃకరణవాచకము కాదని చెప్పుచున్నారు జ్ఞానము అని. «వేదాశ్చేత్ప్రమాణమ్" అనుచోటం బోలె నిట చేత్ అనునది నిశ్చయార్థకము కాదని తెలుపుచున్నారు అగునేని అని. పూర్వార్థమునకు అక్షరయోజనచేసి సముచ్చయము సంభవింప దనుటయందుఁ దాత్పర్యము చెప్పుచున్నారు బుద్ధికర్మముల సముచ్చయము ఇత్యాదిగా. ఇష్టము.—భగవంతునికి నని శేషము. ఒకటియే—జ్ఞానముఁ గర్మమును సముచ్చితమై యని యర్థము. జ్ఞానకర్మముల సముచ్చయం బిష్ట మైనపుడు సముచ్చిత మయిన శ్రేయస్సాధనం బొకటియే యగుటవలనఁ గర్మమునుండి జ్ఞానమును వేఱుచేయుట యుక్తము కాదని యర్థము. ఒకటే యయినను సాధనము ఫలమునుబట్టి అతిరిక్తము * ఏల కాఁ గూడ దని యాశంకించి చెప్పుచున్నారు అదే ఇత్యాదిగా. కేవల మయిన కర్మముకంటెఁ గేవల మయిన జ్ఞానము ఫలమునుబట్టి యతిరిక్తం బని వివక్షించి వేఱు పఱచుట సముచ్చయపక్షమునఁ జెల్లదు గదా! జ్ఞానకర్మములు ప్రత్యేకము శ్రేయస్సాధనం బని యంగీకరింపమివలన అని భావము. పూర్వార్థమునకుం బోలె

♦ పైచెప్పిన యుపోద్ఘాతముచేత.

* వేఱు.

నుత్తరార్ధంబునకును సముచ్చయపక్షంబున సమానం బనుపపత్తి యని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. దూరేణ హ్యవరం కర్మ అనుచోటఁ గర్మముకంటె బుద్ధి శ్రేయస్కరం బని భగవంతునిచేఁ జెప్పఁబడినది; కర్మము బుద్ధికంటె అశ్రేయస్కరం బని ప్రతిపాదింపఁ బడినది; అట్లయినను అకర్మమునే, కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు అని స్నిగ్ధుఁ డను శిష్యుఁ డను భక్తుఁడ నగు నాకుఁ జేయు మని భగవంతుండు నియోగించుచున్నాఁడు; అందుకుఁ గారణము కనఁబడమివలన అయుక్తము అతిక్రూర మయిన కర్మమునందు భగవంతుండు నన్ను నియోగించుట అని యర్జునుం డేది చెప్పుచున్నాఁడో అదియును సముచ్చయపక్షంబున అనుపపన్నం బగు నని యర్థము.

ఇఁక వృత్తికారులచే నేది చెప్పఁబడినదో « శ్రౌతకర్మములతోను స్మార్తకర్మలతోనుం గూడ సముచ్చయము గృహస్థులకు శ్రేయస్సాధనము ఇతరులకు స్మార్తకర్మములతో మాత్రము సముచ్చయం బని భగవంతునిచేఁ జెప్పఁబడినది, అర్జునునిచేతను గ్రహింపఁ బడినది " అని. దాని ననువదించుచున్నారు ఇఁక ఇత్యాదిగా. అప్పుడుగూడ * « తత్కిం కర్మణి ఘోరే » ఇత్యాద్యుపాలంభవచనము అనుపపన్నము, సముచ్చయవాది యగు భగవంతుఁడు కర్మమాత్రమునం దర్జునుని నియోగింపమివలన అని నిరాకరించుచున్నారు తత్కిమిత్యాదిగా.

**పా.** ఓజనార్దనుఁడా! కర్మణః = కర్మముకంటె; బుద్ధిః, జ్యాయసీ; తే = నీకు; మతా చేత్ = సమ్మత మగుపక్షమున; తత్ = అప్పుడు; ఘోరే = యుద్ధరూప మయిన; కర్మణి; మామ్; కిమ్ = ఎందుకొఱకు; నియోజయసి? కేశవ!

**శాం.** « న త్వేవాహం జాతు నాసమ్ " అని యాత్మానాత్మ వివేచనము నుపక్రమించి, « న జాయతే మ్రియతే వా » ఇత్యాదికముచేఁ జక్కఁగా ఆత్మతత్త్వ నిర్ధారణముచేసి, « వేదా వినాశినమ్ " ఇత్యాదికముచేఁ బ్రహ్మవిదునకు సర్వకర్మసన్న్యాసముం జెప్పి, అతనికే « ప్రజహాతి " అనునదిమొదలు « సశాన్తిమాప్నోతి » అను వఱకుఁ గల గ్రంథముచే బ్రహ్మనిష్ఠను తత్ఫలమైన మోక్షం

---

* స్మార్తకర్మములతో మాత్రమే సముచ్చయం బనుపక్షమునందుఁగూడ—" మఱియు, మోక్షసాధనం బగుటచే స్మార్తకర్మము లూర్ధ్వరేతసులకు సముచ్చితంబు లగు నన్నచో నట్లు గృహస్థునకుఁ గూడ స్మార్తకర్మములతోనే సముచ్చయము చెప్పఁబడుఁగాక శ్రౌతకర్మములతో నేల " అని భాష్యకారులచే అపత్తి యాపాదింపఁబడినది—అపక్షము నంగీకరించినను అని భావము.

బునుం బ్రతిపాదించి "న కామ కామీ" అని కామ కామి యగువానికి మోక్షము లే దని ప్రతిపాదింపఁ బడినది. అందుచే, సర్వకర్మ సన్న్యాసపూర్వకముగా బ్రహ్మనిష్ఠచే మోక్షము సంపాదింపవలె నని సర్వజనులకును బ్రవృత్తి బ్రసక్తించుటవలన, "విరక్తః ప్రవ్రజే ద్ధీమాన్ సరక్తస్తు గృహే వసేత్, సరాగో నరకం యాతి ప్రవ్రజన్ హి ద్విజాధమః ॥ యదా మనసి సంజాతం వైతృష్ణ్యం సర్వవస్తుషు । తదా సన్న్యాస మిచ్ఛన్తి పతిత స్స్యా ద్విపర్యయే ॥ ప్రవృత్తిలక్షణం కర్మ జ్ఞానం సన్న్యాసలక్షణమ్ । తస్మాద్ జ్ఞానం పురస్కృత్య సన్న్యసేదిహ బుద్ధిమాన్ ॥ యదా తు విదితం తత్త్వం పరం బ్రహ్మ సనాతనమ్ । తదైకదణ్డం సంగృహ్య సోపవీతాం శిఖాం త్యజేత్ ॥ అహమేవ పరం బ్రహ్మ వాసుదేవాఖ్య మవ్యయమ్ । ఇతి బోధో దృఢో యస్య తదా భవతి భైక్ష్యభుక్ ॥ ప్రాణే గతే యథా దేహ స్సుఖం దుఃఖం న విన్దతి । తదా చే త్ప్రాణయుక్తో ఽపి స కైవల్యాశ్రమే వసేత్ ॥ అనధీత్యా ఽఖిలా న్వేదా ననిష్ట్వా వా ఽఖిలాన్ సురాన్ । అనుత్పాద్య సుతా న్విప్రో న సన్న్యసితు మర్హతి ॥ అకుర్వ న్విహితం కర్మ నిన్దితం చ సమాచరన్ । ప్రచర న్నిన్ద్రియార్థేషు నరః పతన మృచ్ఛతి ॥ జ్ఞాత్వా నైష్కర్మ్య మాచరేత్ ॥ సశిఖం వపనం కృత్వా బహి స్సూత్రం త్యజే ద్బుధః ॥ తే హాస్మ పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయా ఽథ భిక్షాచర్యం చరన్తి ॥ పరం బ్రహ్మ పరిజ్ఞాయ ప్రవ్రజే ద్బ్రాహ్మణోత్తమః । అన్యథా కర్మ కుర్వీత న ప్రమాద్యేత కర్హిచిత్ ॥ స్వే స్వే ఽధికారే యా నిష్ఠా స గుణః పరికీర్తితః । విపరీతస్తు దోషస్స్యా దుభయో రేష నిశ్చయః ॥ 1

---

1 విరక్తుఁ డైనచో బుద్ధిమంతుఁడు సన్న్యసింపవలెను, రాగసహితుఁ డగు నేని గృహస్థాశ్రమమున నుండవలెను, ఏలయనఁగా రాగసహితుఁ డగువాఁడు సన్న్యసించు నేని యాద్విజాధముఁడు నరకము నొందును. ఎప్పుడు మనస్సున సర్వ పదార్థములయందును వైరాగ్యము చక్కఁగాఁ బుట్టునో అప్పుడు సన్న్యాసము నంగీకరించుచున్నారు, అటుగానిచోఁ బతితుం డగును. కర్మము ప్రవృత్తిలక్షణము, జ్ఞానము సన్న్యాసలక్షణము, అందువలన జ్ఞానమును బురస్కరించికొని బుద్ధిమంతుఁ డిట సన్న్యసింపవలెను. ఎప్పుడు సనాతనము తత్త్వము అగు పరబ్రహ్మము విదితం బగునో, అప్పుడు మాత్రమే ఏకదండము గ్రహించి యజ్ఞోపవీతమును జుట్టును త్యజింపవలెను. నేనే అవ్యయమైన వాసుదేవాఖ్యమగు పరబ్రహ్మమను అను దృఢమైన జ్ఞానము ఎవ్వనికిఁ గలుగునో అప్పు డతఁడు భైక్ష్యము భుజించువాఁడు—సన్న్యాసి యగును. ఎట్లు ప్రాణము పోయినప్పుడు దేహము సుఖమును దుఃఖమును బొందదో, ప్రాణముతోఁ గూడినపుడును అట్లుండు నేని అతఁడు కైవల్యాశ్రమమున నుండవలెను. వేదముల నెల్ల నధ్యయనింపక దేవతల నెల్ల యజ్ఞములచేఁ దనియింపక పుత్త్రులను బుట్టింపక యే విప్రుఁడు సన్న్యసింపఁ గూడదు. విహితకర్మమును జేయకున్నను నిందితకర్మముఁ జేసినను, విషయము

ఇత్యాది శ్రుతి స్మృతివచనముల వలన అధికారులకే సన్న్యాసము, అనధికారులకుఁ గాదు, ఇందుకు విరుద్ధముగా నాచరించినచోఁ బతితుండగును. అని జ్ఞానయోగ కర్మయోగములకు అధికారి భేదముచే భేదమే యగు నని ఆ రెంటికిని విభాగము చూపుటకును, అనధికారులకుఁ గర్మమే చిత్తశుద్ధిద్వారమున మోక్షసాధనము అదియే యవశ్యం బనుష్ఠింపవలె నని బోధించుటకును దృతీయాధ్యాయం బారంభింపఁ బడుచున్నది. అందు మొదట, « కర్మణ్యేవా ఽధికార స్తే మా ఫలేషు కదా చన " అని నీకుఁ గర్మమునందే యధికారము ఇతరమునందు లేదని యవధారణ పూర్వకముగాఁ గర్మము విధించి, « దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనఞ్జయ। బుద్ధౌ శరణ మన్విచ్ఛ » అని జ్ఞానయోగము కన్నఁ గర్మయోగము నికృష్టము కావున జ్ఞానయోగమునే యాశ్రయింపు మని జ్ఞానయోగమును గూడ విధించుటవలన, అందుచే వ్యాకులమయిన మనస్సు గలవాఁడై యర్జునుండు తాను ' దూరేణ హ్యవరం కర్మ ' అను నభిప్రాయమునే మనస్సున నుంచుకొని కర్మయోగముకన్న జ్ఞానయోగము సాక్షాన్మోక్షసాధనం బగుటచే శ్రేయం బని తలంచుచు నీవచనముఁ బలికెను.—జనార్దన—జన = జన్మమును తత్కారణమయిన యజ్ఞానమును గూడ, స్వ సాక్షాత్కారముచే, అర్దన = నశింపఁజేయువాఁడా! కర్మణః = కర్మయోగముకంటె; బుద్ధిః = జ్ఞానయోగమే; జ్యాయసీ = శ్రేష్ఠ మని; తే = నీకు; మతా చేత్ = సమ్మత మగునేని; తత్; కిమ్ = ఎందు కొఱకు; « కర్మణ్యే వా ఽధికార స్తే " అని మామ్ = నన్ను; కర్మణి = కర్మమునందు, జ్ఞానముకంటె నికృష్ట మయిన దానియందు; నియోజయసి? అందును, ఘోరే = హింసాత్మకమైన కర్మమునందు, « తస్మా దుధ్యస్వ భారత » అని నియోగించుచున్నావు? నీ వీశ్వరుఁడవు, నీవాక్యము దాఁటరాదు, భక్తుండను మిత్త్రుండ నగు నన్ను, యోగ్యమయిన దాని విడిపించి యయోగ్యమైన దానియందుఁ బ్రేరించెద వేమి? అని యర్థము.

---

లందుఁ బ్రవర్తించినను మనుష్యుఁడు పతనము నొందును. తెలిసి నైష్కర్మ్యమును—కర్మము లేకుండుటను—సన్న్యసమును ఆచరింపవలెను. పండితుఁడు శిఖాసహితముగా క్షౌరము చేసికొని బహిస్సూత్రమును—యజ్ఞోపవీతమును విడువవలెను. వారుగదా పుత్త్రైషణనుండియు విత్తైషణనుండియు లోకైషణనుండియు లేచి అంత భిక్షాచర్యము చరింతురు. పరబ్రహ్మమును దెలిసి బ్రాహ్మణోత్తముఁడు సన్న్యసింపవలెను, లేనిచో కర్మము చేయవలెను, ఒకప్పుడును ఏమటి యుండఁగూడదు. తనతన యధికారమునందు నిష్ఠ యేదిగలదో అది గుణ మని చెప్పఁబడినది, అందును విపరీతము.—తన కధికారము లేని దానియందు నిష్ఠ దోషమగును, రెంటియందును ఇది నిశ్చయము.

వ్యా॥ ఇట్లు ప్రథమాధ్యాయముచే నుపోద్ఘాతితంబై శాస్త్రార్థం బంతయు ద్వితీయాధ్యాయముచే సూత్రితం బయ్యెను. ఎట్లనఁగా. మొదట నిష్కామ కర్మనిష్ఠ; అందువలన నంతఃకరణశుద్ధి; అందువలన శమదమాది సాధన పూర్వక మయిన సర్వకర్మ సన్న్యాసము; అందువలన వేదాంతవాక్య విచారసహిత మయిన భగవద్భక్తినిష్ఠ; అందువలనఁ దత్త్వజ్ఞాననిష్ఠ; దాని ఫలము త్రిగుణాత్మక మైన అవిద్య నివర్తిల్లుటచే ప్రారబ్ధఫల భోగపర్యంతము జీవన్ముక్తియు తత్ఫల భోగాంతం బున విదేహముక్తియు; జీవన్ముక్తిదశయందుఁ బరమపురుషార్థము నే యాలంబించు టచేఁ బరవైరాగ్యప్రాప్తి; దాని కుపకారియై యుపాదేయ * మైన దైవ సంపద యను శుభవాసన; పర వైరాగ్యవిరోధియై హేయ ♦ మగు అశుభవాసన ఆసుర సంపద యను పేరుగలది; దైవసంపదకు అసాధారణ కారణము సాత్త్విక మగు శ్రద్ధ; ఆసురసంపదకో రాజసశ్రద్ధయు తామసశ్రద్ధయు నని హేయోపాదేయ విభాగముచే శాస్త్రార్థం బంతయుఁ బరిసమాప్త మగుచున్నది. అందు, "యోగస్థః కురు కర్మాణి" ఇత్యాదికముచే సూత్రితం బగు సత్త్వశుద్ధి సాధన భూత నిష్కామ కర్మనిష్ఠ సామాన్యవిశేషరూపంబునఁ దృతీయ చతుర్థాధ్యాయములచే విస్తరించి చెప్పఁబడుచున్నది. అంత శుద్ధ మయిన యంతఃకరణము గలవానికి "విహాయ కామాన్యస్సర్వాన్" ఇత్యాదికముచే సూత్రితం బగు శమదమాది సాధనపూర్వక మైన సర్వకర్మ సన్న్యాసనిష్ఠ సంక్షేప విస్తరరూపంబునఁ బంచమ షష్ఠాధ్యాయంబులం బ్రపంచిత మగుచున్నది. ఇంతమాత్రముచేఁ ద్వంపదార్థము నిరూపితం బయ్యెను. అంత, "యుక్త ఆసీత మత్పరః" ఇత్యాదికముచే సూత్రితం బగు అనేకప్రకారమైన వేదాంతవాక్య విచారసహిత భగవద్భక్తినిష్ఠ ఆఱధ్యాయంబులచేఁ బ్రతిపాదింపఁ బడుచున్నది. అంతమాత్రముచేఁ దత్పదార్థము గూడ నిరూపితమయ్యెను. ప్రత్యధ్యాయమును అవాంతరసంగతి § అవాంతరప్రయోజనము అచ్చటచ్చట జూపఁగలము. అంత "వేదావినాశినం నిత్యమ్" ఇత్యాదికముచే సూత్రిత మగు తత్త్వం పదార్థైక్య జ్ఞానరూప మైన తత్త్వ జ్ఞాననిష్ఠ త్రయోదశాధ్యాయంబునఁ బ్రకృతి పురుషవివేకద్వారంబునఁ బ్రపంచితం బయ్యెను. "త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవా ఽర్జున" ఇత్యాదికముచే సూత్రి

* గ్రహింపఁ దగినది.

♦ విడువఁ దగినది.

§ సంబంధము.

తమైన జ్ఞాననిష్ఠాఫలము త్రైగుణ్య నివృత్తి చతుర్దశాధ్యాయంబునందు అదియే జీవన్ముక్తి యని గుణాతీతలక్షణ ప్రతిపాదనద్వారమున వివరింపఁ బడెను. “తదా గన్తాసి నిర్వేదమ్” ఇత్యాదికముచే సూత్రితం బగు పర వైరాగ్యనిష్ఠ సంసార వృక్ష చ్ఛేదనద్వారంబునఁ బంచదశంబునం బ్రపంచిత మయ్యెను. “దుఃఖేష్వను ద్విగ్నమనాః” ఇత్యాదిగా స్థితప్రజ్ఞ లక్షణముచే సూత్రితంబైన పర వైరాగ్యోప కారియు ఉపాదేయము నగు దైవసంపదయు, “యా మిమాం పుష్పితాం వాచమ్” ఇత్యాదికముచే సూత్రితమైన పర వైరాగ్యవిరోధియు హేయము నగు నాసురసంపదయును షోడశాధ్యాయంబునఁ బ్రతిపాదింపఁ బడెను. దైవసంపదకు అసాధారణ కారణ మగు సాత్త్వికశ్రద్ధ “నిర్ద్వన్ద్వో నిత్య సత్త్వస్థః” ఇత్యా దికముచే సూత్రితము తద్విరోధి పరిహారముచే సప్తదశాధ్యాయంబున వచి యింపఁబడెను. ఇట్లు ఫలసహిత మగు జ్ఞాననిష్ఠ యయిదధ్యాయములచేఁ బ్రతిపా దితం బయ్యెను. అష్టాదశాధ్యాయమునఁ బూర్వోక్తసర్వార్థములకు నుపసంహారము. ఇట్లు గీతాశాస్త్రంబున కంతయు సంగతి యెఱుంగునది. అందు ద్వితీయాధ్యాయ మున సాంఖ్యబుద్ధి నాశ్రయించి జ్ఞాననిష్ఠ భగవంతునిచేఁ జెప్పఁబడినది “ఏషా తే ఽభిహితా సాఙ్ఖ్యే బుద్ధిః” అని. అట్లు యోగబుద్ధి నాశ్రయించి కర్మనిష్ఠ చెప్పఁ బడినది “యోగే త్విమాం శృణు” అని యారంభించి “కర్మణ్యే వాధికారస్తే, మా తే సఙ్గో స్త్వకర్మణి” అనువఱకుఁ గల గ్రంథముచేత. ఈసిష్ఠల కధికారి భేదమును స్పష్టముగ నుపదేశించినవాఁడు కాఁడు భగవంతుఁడు. రెంటికిని యొకఁడే యధికారి, సముచ్చయము వివక్షిత మగుటవలన నని చెప్ప శక్యము గాదు.— “దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనఞ్జయ” అని కర్మనిష్ఠ బుద్ధినిష్ఠకంటె నికృష్ట మని చెప్పుటవలనను; “యావానర్థ ఉదపానే” అనుచోట జ్ఞానఫలమునందు సర్వకర్మములయు ఫలంబుల కంతర్భావముఁ దెలుపుటవలనను; స్థితప్రజ్ఞుని లక్ష ణము వచించి “ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ” అని ప్రశంసా సహితముగా జ్ఞానఫ లము నుపసంహరించుటవలనను; “యా నిశా సర్వభూతానామ్” ఇత్యాది స్థల మున జ్ఞానికి ద్వైతదృష్టి లేమింజేసి కర్మానుష్ఠానము సంభవింప దని చెప్పుటవల నను; అవిద్యా నివృత్తిరూప మయిన మోక్షఫలమునకు లోకానుసారముగా జ్ఞాన మొక్కటియే సాధన మని యేర్పడుటవలనను; “తమేవ విదిత్వా ఽతి మృత్యు మేతి నాన్యః పన్థా విద్యతే ఽయనాయ” * అను శ్రుతివలనను. ఓయీ! అ

* వానినే తెలిసి మోక్షము నొందుచున్నాఁడు, మోక్షమునకు ఇతరమార్గము లేదు.

ట్లయినచో తేజస్తిమిరంబులుం బోలెఁ బరస్పర విరోధు లగు జ్ఞానకర్మంబులకు సముచ్చయము సంభవింపమివలన భిన్నులే యధికారు లగుదురుగాక. అందు లేని సత్యము! ఇట్లు సంభవించు పక్షమున, అర్జునున కొక్కనికే రెండు నుపదేశించుటయే మో యుక్తము కాదు. కర్మాధికారికి జ్ఞాననిష్ఠనుగాని జ్ఞానాధికారికిఁ గర్మనిష్ఠనుగాని యుపదేశించుట యుచితముగాదు గదా! ఒక్కనికే వికల్పమున రెండు నుపదేశింపఁబడె నందురేని, అదిసరిగాదు. ఏలయనఁగా, ఉత్కృష్ట నికృష్టములకు వికల్పము ఉపపన్నముగాదు, అవిద్యా నివృత్త్యుప లక్షితాత్మస్వరూపమైన మోక్షమునందుఁ దారతమ్యంబును సంభవింపదు. అందువలన, జ్ఞాన కర్మనిష్ఠలకు అధికారులు భిన్ను లనుపక్షమున ఒక్కనికి రెండు నుపదేశించుట యనుపపన్న మగుటవలనను, ఒక్కఁడే యధికారి యను పక్షమునఁ బరస్పర విరుద్ధము లగువానికి సముచ్చయము సంభవింపమివలనను గర్మముకంటె జ్ఞానము ప్రశస్తమనుట యనుచితమగుటవలనను, వికల్పము నంగీకరించినచో ఉత్కృష్టమును అనాయాససాధ్యమునగు జ్ఞానమును విడిచి నికృష్టమును అనేకాయాస సాధ్యము నగు కర్మము ననుష్ఠించుట అయోగ్య మని తలఁచి పర్యాకులం బయిన బుద్ధి గలవాఁడై యర్జునుం డిట్లనియె.—జనార్దన—సర్వజనులచే, అర్థ్యతే—యాచింపఁ బడువాఁడు తమ కోర్కె సిద్ధించుటకొఱకు, అట్టివాఁడవు నీవు, కావున నాచేతఁ గూడ శ్రేయోనిశ్చయము కొఱకు యాచింపఁబడుచున్నా వనుట యనుచితము కానేకాదు అని సంబోధనము యొక్క అభిప్రాయము. కర్మణః = నిష్కామ కర్మముకన్నను; బుద్ధిః = ఆత్మతత్త్వ విషయ జ్ఞానము; జ్యాయసీ = మిక్కిలి ప్రశస్త మని; తే = నీకు; మతా చేత్ = అభిమతమగు నేని; తత్ = అప్పుడు; కిమ్ = ఎందువలన; కర్మణి; ఘోరే = హింస మొదలగు అనేకాయాసములు అధికముగాఁ గలదానియందు; మామ్—మిక్కిలి భక్తుఁడనగు నన్ను; నియోజయసి = కర్మణ్యేవాధికారస్తే ఇత్యాదిగా విశేషముగాఁ ప్రేరించుచున్నావు? కేశవ = సర్వేశ్వరా! సర్వేశ్వరుఁడవు సర్వజనులకును గోరినది యిచ్చువాఁడవు నీవు, భక్తుఁడను «శిష్యస్తేఽహం శాధి మామ్» ఇత్యాదిగా నిన్నే దిక్కుగా శరణుపొందిన వాఁడ నగు నా విషయమున వంచనము సేయుట యుచితము కా దని యభిప్రాయము.

శ్రీ. శోకపంకమగ్ను నాకులీభూతునిఁ
బార్థు భక్తు నెవఁడు పరమకరుణ

సాంఖ్యయోగములను సరవితో బోధించి
నాఁకెఁ గృష్ణుఁ డతఁడు శరణు నాకు.

ఇట్లు « అశోచ్యా నన్వశోచ స్త్వమ్ » ఇత్యాదికముచే మొదట మోక్ష సాధనముగా దేహాత్మవివేక బుద్ధి చెప్పబడినది. అటుపిమ్మట « ఏషా తే ఽభి హితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు » ఇత్యాదికముచేఁ గర్మముగూడఁ జెప్పఁబడినది. కాని వానికి గుణప్రధానభావము * స్పష్టముగాఁ బ్రదర్శింప లేదు. అందు బుద్ధియుక్తుఁడైన స్థితప్రజ్ఞుఁడు నిష్కాముఁ డనియు నియతేంద్రియుఁ డనియు నహంకార రహితుఁ డనియు నిత్యాదిగాఁ జెప్పుటవలనను « ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ » అని ప్రశంసతో నుపసంహరించుట వలనను బుద్ధి కర్మములలో బుద్ధి శ్రేష్ఠం బని భగవంతుని యభిప్రాయముగాఁ దలంచిన వాఁడై యర్జునుం డిట్లనియె.— కర్మణః = కర్మముకంటె; మోక్షమున కంతరంగమగుటచే, బుద్ధిః; జ్యాయసీ = మిక్కిలి యధికము శ్రేష్ఠము అని; తవ; మతా చేత్ = సమ్మత మగు నేని, తత్ = ఆపక్షమున; కిమ్=ఎందుకొఱకు; « తస్మాద్యుధ్యస్వ » అనియు « తస్మా దుత్తిష్ఠ » అనియుఁ బలుమాఱు చెప్పుచు, ఘోరే = హింసా రూప మయిన; కర్మణి; మామ్; నియోజయసి = ప్రవర్తింపఁ జేయుచున్నావు?

ప. మొదట « కర్మణ్యే వాధికార స్తే » ఇత్యాది వాక్యములఁ గర్మ ప్రశంస చేయఁబడినది. పిమ్మట « స్థితప్రజ్ఞస్య » ఇత్యాది వాక్యములచే అధ్యాయ సమాప్తి పర్యంతము బుద్ధియోగప్రశంస చేయఁబడినది. ఇట్లు రెంటినిం బ్రశంసించుటచే సందేహపడినవాఁడై యర్జునుం డడుగుచున్నాఁడు రెండు శ్లోకములచేత— ఓ జనార్దనుఁడా! తే = నీకు; కర్మణః = కర్మయోగముకంటె; బుద్ధిః; జ్యాయసీ = శ్రేష్ఠముగా; మతా చేత్ — జ్ఞాన యోగము శ్రేష్ఠ మని యభిమత మగు నేని; అప్పుడు; మామ్; ఘోరే = అతి ప్రయాసమగు; కర్మణి; కిమ్ = ఎట్లు; నియోజయసి = ఆజ్ఞాపించుచున్నావు?

రా. అందువలన నిట్లు ముముక్షువులకుఁ బ్రాప్యుఁ డని వేదాంతములచేఁ బ్రతిపాదితుండును అవిద్యాది నిఖిలదోషగంధ రహితుండును అవధిలేని యతిశయము గలవాఁడును అసంఖ్యేయము లయిన కల్యాణ గుణగణంబులు గలవాఁడునగు పరబ్రహ్మమైన పురుషోత్తమునిఁ బొందుట కుపాయభూతంబును జ్ఞానము ఉపాసనము

* సాధన సాధ్యభావము—కర్మము సాధన మనియు బుద్ధి సాధ్య మనియు.

ధ్యానము మొదలగు శబ్దములచే వాచ్యము నగు తదైకాంతికాత్యంతికభక్తిని * ప్రతిపాదించుటకై, తదంగభూతమును “య ఆత్మా ఽపహత పాప్మా” ♦ ఇత్యాది ప్రజాపతి వాక్యముచేఁ జెప్పఁబడినదియు నగు ప్రాప్తృయాథాత్మ్య దర్శనము,❘ ఆ ఆత్మ నిత్యుఁ డని తెలిసి నిష్కామకర్మం బనుష్ఠించుటచే సిద్ధించు జ్ఞానయోగముచే సాధ్యం బగునది ప్రతిపాదింపఁబడెను. ప్రజాపతి వాక్యమునందు § దహరవాక్య ప్రతిపాదిత మగు పరవిద్యకు అంగముగఁ గదా ప్రాప్త యగు ఆత్మయొక్క స్వరూప దర్శనంబును “యస్త మాత్మాన మనువిద్య విజానాతి” ** అని చెప్పి జాగరిత స్వప్న సుషుప్తుల కతీతంబును అశరీరంబు నగు ప్రత్యగాత్మస్వరూపంబు ప్రతిపాదించి “ఏవమేవైష సంప్రసాదో ఽస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపేణాభి నిష్పద్యతే” ♦♦ అని దహరవిద్యాఫలముచే నుపసంహరింపఁబడినది (1). ఇతరస్థలములందుఁగూడ §§ “అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి” ఇత్యాదులు “దేవంమత్వా” అని విధింపఁబడు పరవిద్యకు అంగముగా “అధ్యాత్మయోగేన” అని ప్రత్యగాత్మజ్ఞానమునుగూడ విధించి, “న జాయతే మ్రియతే వా విపశ్చిత్” ఇత్యాదికముచేఁ బ్రత్యగాత్మ స్వరూపమును శోధించి, “అణో రణీయాన్” అని యారంభించి “మహాన్తం విభు మాత్మానం మత్వా ధీరో నశోచతి, నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన । యమేవైష వృణుతే తేన లభ్య స్తస్యైష

---

* తత్ = ఆపురుషోత్తమునియందే, ఐకాంతిక = ఒక్కనియందే నిశ్చయము గల, ఇతర దేవతలను విడిచి పురుషోత్తముఁ డొక్కనియందే నెలకొన్నట్టిదియు, ఆత్యంతిక = ఫలదశయందుఁ గూడ నశింపనిదియునగు, భక్తిని.

♦ పాపరహితుఁ డగు ఏయాత్మ గలఁడో.

❘ పొందువాఁ డగునట్టి ఆత్మయొక్క—జీవునియొక్క తత్త్వజ్ఞానము.

§ ఛాందోగ్యమునందు.

** ఎవఁడు అట్టి యాత్మను దెలిసి ధ్యానించుచున్నాఁడో.

♦♦ ఇట్లే ఈయాత్మ యీశరీరమునుండి లేచి పరమాత్మనుబొంది తనదైనరూపముచే నిలుచుచున్నాఁడు.

(1) దహరవాక్య ప్రతిపాదిత మగు పరవిద్యయొక్క ఫలమే చెప్పఁబడినది. ప్రత్యగాత్మస్వరూప దర్శనమునకు వేఱుఫలము చెప్పఁబడినది కాదు. కావునఁ బరవిద్యకు ఇది యంగ మని యభిప్రాయము.

§§ కఠోపనిషత్తునందు.

ఆత్మా వివృణుతే తనూం స్వామ్ " * ఇత్యాదులచేఁ బరస్వరూపంబును దదుపాసనంబును ఉపాసనము భక్తిరూపం బనుటయుఁ బ్రతిపాదించి " విజ్ఞాన సారథి ర్యస్తు మనః ప్రగ్రహవా న్నరః । సో ఒధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్" • అని పరవిద్యాఫలము చేతనే యుపసంహరింపఁబడినది. ఇఁకఁ బిమ్మట నాలుగధ్యాయంబులచే దీనినే—ప్రాప్త యగు ప్రత్యగాత్మయొక్క దర్శనమును సాధనసహితముగాఁ బ్రపంచించుచున్నాఁడు —

కర్మణః = కర్మముకంటె; బుద్ధిః = జ్ఞానమే; జ్యాయసీ = శ్రేష్ఠమని; తే = నీకు; మతాచేత్ = అభిప్రాయ మగునేని; తత్ = అప్పుడు; కిమ్ = ఎందుకొఱకు; ఘోరే = భయంకర మయిన; కర్మణి = కర్మమునందు; మామ్ = నన్ను; నియోజయసి = నియోగించుచున్నావు ? ఇది యాశయము—జ్ఞాననిష్ఠయే ఆత్మావలోకనమునకు సాధనము; కర్మనిష్ఠయో జ్ఞాననిష్ఠకు సాధనము; మఱియు ఆత్మావలోకనమునకు సాధనభూతమైన జ్ఞాననిష్ఠ సకలేంద్రియములను మనస్సును శబ్దాది విషయ వ్యాపారములనుండి యుపరమింపఁ జేయుటచే సాధ్యము అని చెప్పఁబడినది. ఇంద్రియ వ్యాపారోపరతి సాధ్యం బగు ఆత్మావలోకనంబే సాధింపవలసిన యెడ సకలకర్మనివృత్తి పూర్వకం బగు జ్ఞాననిష్ఠయందే నన్ను నియోగింపవలెను; ఎందుకు; ఘోరే కర్మణి—సర్వేంద్రియ వ్యాపారరూప మగుటచే ఆత్మావలోకనంబునకు విరోధి యగు కర్మమునందు నన్ను నియోగించుచున్నావు ?

జ్ఞాననిష్ఠయే ఆత్మావలోకనమునకు సాధన మని చెప్పితివి. అప్పుడు కర్మనిష్ఠకన్న జ్ఞాన నిష్ఠయే గదా యధిక మని చెప్పిన ట్లగుచున్నది. జ్ఞాననిష్ఠయు సకలేంద్రియోపరతిచే సాధ్య మని చెప్పినాఁడవు. అట్లుండఁగా ఇంద్రియ వ్యాపార రూపము అందువలన ఆత్మావలోకనవిరోధి అందువలన భయంకరం బగు కర్మమునందు నన్నేల నియోగించుచున్నావు ? అని తాత్పర్యము.

మా. ఆత్మస్వరూపంబును జ్ఞానసాధనంబును జెప్పఁబడినది పూర్వాధ్యాయమందు. ఇఁక మీఁది యధ్యాయంబున అకర్మమును ‡ నిందించి జ్ఞానసాధనం

* పరమాత్మను తెలిసి ధీరుఁడు శోకింపఁడు. ఈయాత్మ ప్రవచనముచేఁగాని మేధచే—బుద్ధిచేఁగాని బహుశ్రుతముచేఁగాని లభ్యుఁడు కాఁడు. ఎవనిపై ఈపరమాత్మ ప్రియపడునో వానిచేతనే లభ్యుఁ డగును. వానికీపరమాత్మ తనరూపమును వెల్లడించును.

• విజ్ఞానము సారథిగాను మనస్సు పగ్గముగాను గల వరుఁడు సంసారమార్గముయొక్క పారమైన అవిష్ణుని పరమపదంబు నొందుచున్నాఁడు.

‡ కర్మము చేయకుండుటను.

బుగా కర్మము విధింపఁబడుచున్నది. కర్మముకన్న జ్ఞానము మిక్కిలి యుత్తమం బని చెప్పఁబడినది భగవంతునిచేత, 'దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాత్' ఇత్యాది స్థలములందు. ఇట్లని, ఎందుకుఁ గర్మమునందు ఘోరమైన యుద్ధమునందు నన్ను నియోగించుచున్నావు నివృత్తిధర్మములను విడిచి? అని చెప్పుచు న్నాఁడు.—కర్మణః = కర్మముకంటె; బుద్ధిః = జ్ఞానము; జ్యాయసీ = మిక్కిలి యుత్తమం బని; తే = నీకు; మతా చేత్ = అభిప్రాయ మగునేని; తత్ = ఆపక్ష మునందు.

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయో௨హ మాప్నుయామ్. ౨

భా. మఱియును. వ్యామిశ్రేణ ఇవ = సంకీర్ణమువలె నున్న, § వాక్యేన = వాక్యముచేత; మే = నాయొక్క; బుద్ధిమ్ = మనస్సును; మోహయసీవ = మోహపఱచుచున్నట్లున్నావు.—భగవంతుఁడు నిన్ స్పష్టము గనే చెప్పుచున్నాఁడు, అయినను నాకు మందబుద్ధికి వ్యామిశ్రమువలె భగవంతుని వాక్యము తోఁచుచున్నది. అందుచే నాబుద్ధిని మోహపఱచుచున్నట్లున్నావు. మందబుద్ధి నగు నా వ్యామోహము తొలంగింపను గదా ప్రవృత్తుండవు. నీవెట్లు మోహపఱతువు? కావునఁ జెప్పు చున్నాను 'బుద్ధిని మోహపఱచుచున్నట్లున్నా' వని. అందు, భిన్న కర్తృకము లైన ‖ జ్ఞాన కర్మములను ఏకపురుషుఁ డనుష్ఠించుట సంభ వింప దని తలంతువేని, అట్లయినయెడ; తత్ = వానిలో; ఏకమ్ = ఒకదానిని, జ్ఞానమును గాని కర్మమును గాని; ఇదియే యర్జు నునకు యోగ్యము బుద్ధి శక్త్యవస్థలకుఁ దగినది యని, నిశ్చిత్య = నిశ్చ యించి; వద = చెప్పుము; యేన = దేనిచేత, జ్ఞానము చేతఁ గాని కర్మము చేతఁ గాని రెంటిలో నొకదానిచే; శ్రేయః = శ్రేయస్సును; అహమ్ = నేను; ఆప్నుయామ్ = పొందుదునో. అట్టిదాని నిశ్చయించి చెప్పుము. కర్మనిష్ఠయందు గుణభూతముగా నైనను జ్ఞానమును భగవంతుఁడు వచి యించియే యుండునేని, అప్పుడు ఎట్లు "వానిలో నొకదానిఁ జెప్పుము"

§ కలిసినట్లున్న—స్పష్టముకాని.

‖ భిన్నులైన కర్తలు—అధికారులు గల.

అని యర్జునుం డొకదానినే తెలియఁగోరును? భగవంతుఁడు "జ్ఞాన కర్మములలో నొకటినే చెప్పుదును రెంటినిం జెప్పను" అని చెప్పినాఁడు కాఁడు గదా! అట్లు చెప్పియుండినం గదా యుభయప్రాప్తి ♦ సంభవింపదు తన కని తలంచి యర్జునుం డొకటినే ప్రార్థించును.

నీవు స్పష్టముగానే చెప్పువాఁడవు. అయినను నేను మందబుద్ధి నగుటం జేసి నీయభిప్రాయము నాకు గ్రహింప శక్యము గాక యస్పష్టమువలె నున్నది. నీవు నావ్యామోహమును బోఁగొట్టుటకుఁ బ్రవర్తించినవాఁడవు గాని నాకు మోహము గల్గించుటకుఁ గాదు. అయినను నీయభిప్రాయము నాకు అస్పష్టమగుట వలన నాకు మోహము గలుగున ట్లున్నది. కావున ఆజ్ఞానకర్మములలో యేదో యొకటి నా కేది యోగ్యమో దేనిచే నేను శ్రేయస్సు పొందుదునో అట్టిది నిశ్చయించి దాని నాకుం జెప్పుమని తాత్పర్యము.

ఆం. ఇందువలనఁ గూడఁ బ్రశ్న సముచ్చయానుసారి కా దని చెప్పుచున్నారు.—మఱియును అని. భగవంతుఁడు స్పష్టార్థ మగు వాక్యము చెప్పువాఁడగుటవలన వ్యామిశ్రే ణేత్యాదివచనము అయుక్తం బని యాశంకించి చెప్పుచున్నారు భగవంతుఁడు ఇత్యాదిగా. భగవద్వచనము సంకీర్ణమువలె నీకుఁ దోఁచునేని అప్పుడు అందుచే నీబుద్ధిని వ్యామోహపఱచుటయే యతని యుద్దేశ మని యేర్పడుచుండఁగా ఎందుకు 'మోహయసీవ' * అని చెప్పెదవు? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు మందబుద్ధిని ఇత్యాదిగా. జ్ఞానకర్మములు పరస్పరవిరుద్ధములగుటవలన ఏకకాలమునం దొకపురుషునిచే ననుష్ఠింప శక్యము గామిం జేసి యవి భిన్నకర్తృకము లనియే చెప్పఁబడుచున్నవి, ఇట్లు ఆరెంటిలో నొకదానియందే నీవు నియుక్తుఁడవు, కాని నీబుద్ధికి వ్యామోహము గల్గించుట యిష్టము కాదు అని భగవంతుని యభిప్రాయము ననువదించుచున్నాఁడు నీవు ఇత్యాదిగా. తదేక మిత్యాది శ్లోకార్థముచే అందుకు బదులు చెప్పుచున్నాఁడు అందు ఇత్యాదిగా. పై చెప్పిన భగవంతుని యభిప్రాయము అంద్గా అనుపదముచేఁ బరామర్శింపఁబడుచున్నది. ఏకమ్ అని పైచెప్పిన విధము చెప్పఁబడుచున్నది. ఏకమ్ అని చెప్పినదానినే స్ఫుటీకరించుచున్నాఁడు జ్ఞానమును గాని కర్మమునుగాని యని. నిశ్చయప్రకారముఁ

♦ జ్ఞాన కర్మముల రెంటిని బొందుట.

* మోహపఱచునట్లున్నావు.

దెలుపుచున్నాఁడు ఇదియే ఇత్యాదిగా. క్షత్రియుఁడైన వీని యంతఃకరణమునకును దేహశక్తికిని యుద్ధారంభావస్థకును జ్ఞానమో కర్మమో యిదియే యోగ్యమని నిర్ధారించి చెప్పుమని యర్థము. నిశ్చయించి రెంటిలో నొకటి చెప్పినచో అందుచే శ్రోతకు శ్రేయఃప్రాప్తి ఫలం బని చెప్పుచున్నాఁడు యేనేత్యాదిగా. తదేక మిత్యాది వాక్యమున కక్షరార్థముఁ జెప్పి సముచ్చయము శాస్త్రాభిప్రాయము కాదనుటయందుఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు కర్మనిష్ఠయందు ఇత్యాదిగా. గుణభూతముగా నైనను—ఇందుచే ప్రధానభూతముగా నైనను అనియు వివక్షితము. ఓయీ! తనకు ఉభయప్రాప్తి ♦ సంభవింప దని తలంచి యర్జునుండు రెంటిలో నొకటి తెలియఁగోరి యుండవచ్చును. అనఁగా, అట్లు కా దని చెప్పుచున్నారు భగవంతుఁడు ఇత్యాదిగా. ఇట్లు భగవద్వచనము లేమిం జేసి యుభయప్రాప్తి తనకు సంభవింప దను తలంపుచే అన్యతరము * ప్రార్థించుట సంభవింప దని చెప్పుచున్నారు అట్లు చెప్పియుండినం గదా ఇత్యాదిగా. భగవంతుం డట్లు చెప్పినాఁ డనుట నీకు సమ్మతంబుగాదు గదా! భగవంతుఁడు సముచ్చయవాది యని నీ వంగీకరించుటవలన; కావున నట్లు భగవంతుండు చెప్పకుండుటవలన ఆతలంపుచే అన్యతరప్రార్థనము యుక్తము గా దని యర్థము.

౯. మఱియును. వ్యామిశ్రేణేవ = సంకీర్ణమువలెనుండు; వాక్యేన; బుద్ధిం మోహయసీవ.—ఒకమాఱు కర్మము శ్రేయం బనియు ఒకమాఱు బుద్ధి శ్రేయం బనియు సంకీర్ణమువలె నుండు వాక్యముచే బుద్ధిని మోహము నొందించున ట్లున్నావు. తత్ = అందువలన; ఇది యనుష్ఠేయం బని నిశ్చయించి చెప్పుము, యేన—అనుష్ఠింపఁబడినదేనిచేత, శ్రేయో ఽహ మాప్నుయామ్.

౧౦. మఱియును. 'కర్మణ్యే వాధికారస్తే' అనియు 'బుద్ధౌ శరణ మన్విచ్ఛ' అనియు నీప్రకారముగా, వ్యామిశ్రేణేవ.—క్షీర నీరములనుం బోలె రెంటిని కలపునది వ్యామిశ్రము, అట్టిదానివలెనున్న, జ్ఞానకర్మముల సముచ్చయము బోధించుదానివలెనున్న; వాక్యేన; మే; బుద్ధిమ్; మోహయసీవ.—నన్నుఁ గర్మమునందు నియోగించుచున్నావు, యుద్ధము చేయువలెనా? విడువవలెనా? అని సంశయమునొంది నిన్ను శరణుచొచ్చినట్టి నాయొక్క భ్రమము తొలఁగించుట

---

♦ జ్ఞాన కర్మ నిష్ఠల రెంటియొక్కయు ప్రాప్తి.

* రెంటిలో నొకటి.

నైయే నీవు దయచేఁ బ్రవర్తించినాఁడవు కాని మోహము నొందించుటకుఁ గాదు, అట్లయినను వివేకవిహీనుఁడను మందబుద్ధి నగు నాకు నీవాక్యము వ్యామిశ్రము పోలెఁ దోఁచుచున్నది, అట్టి వ్యామిశ్రవాక్యముచే నాబుద్ధిని మోహింపఁజేయు వాఁడవు పోలెఁ దోఁచుచున్నావు, అదియు నా బుద్ధిదోషమే యని భావము. అట్లయినయెడ నిప్పు డేమి చేయవలె ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—జ్ఞానకర్మములు క్రియాకారక ఫలభేదముచేఁ బరస్పర విరుద్ధములగుటచే రెంటికిని ఒకఁడే కర్తయగుట సంభవింపమివలన, తత్ = వానిలో; ఏకమ్ = జ్ఞానమునుగాని కర్మమునుగాని నాయధికారమునకుఁ దగినదాని, అందు నాయోగ్యతను అయోగ్యతను విచారించి యిదియే యితనికిఁ దగినది యని; నిశ్చిత్య; వద. యేన—ఏజ్ఞానముచేఁగాని కర్మముచేఁగాని రెంటిలో నొకదానిచేత; అహమ్; సాక్షాత్తుగాఁ గాని పరంపరగాఁ గాని; శ్రేయః = పరమపురుషార్థమును; ఆప్నుయామ్ = పొందుదునో.

మ. ఓయీ! నే నెవనినిగూడ మోసపుచ్చను, ఇఁక మిక్కిలి ప్రియుఁడవగు నిన్ను మోసపుచ్చ నని చెప్పవలయునా! నీవు మాత్రము నేను మోసము చేయుచున్నా ననుట కేమి చిహ్నముఁ జూచుచున్నావు? అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—నీ వాక్యము వ్యామిశ్రము కానేకాదు, నాకు మాత్రము 'ఏకాధికారికమా? భిన్నాధికారికమా?' ♦ అను సందేహము వలన, వ్యామిశ్రమునలె—సంకీర్ణమువలెఁదోఁచుచున్నది నాకు జ్ఞాన కర్మ నిష్ఠాద్వయ ప్రతిపాదక మైన నీవాక్యము, అట్టి; వాక్యేన = వాక్యముచేత; మే = మందబుద్ధి నగు నాయొక్క; వాక్యముయొక్క తాత్పర్యము తెలియమివలన, బుద్ధిమ్ = అంతఃకరణమును; మోహయసీవ = భ్రాంతినొందఁ జేయున ట్లున్నావు, పరమకారుణికుండ వగుటవలన నీవు మోహమునొందించువాఁడవు కానే కావు, నాకు నాబుద్ధి దోషమువలననే మోహము గలుగుచున్నది యని ఇవశబ్దార్థము. ఒకఁడే యధికారి యనుపక్షమున విరుద్ధము లగువానికి సముచ్చయము అనుపపన్నంబనియు ఏకార్థములు * కాకుండుటవలన వికల్పం బనుపపన్న మనియు మున్ను చెప్పియుండుటవలన, భిన్నులే యధికారు లని తలంతువేని అప్పుడు నాకొక్కనికి విరుద్ధము లయిన నిష్ఠలను రెంటిని ఉపదేశించుట సంభవింపమివలన, తత్ = దానిని

♦ ఒకఁడే యధికారికలదా? వేఱు వేఱు అధికారులు కలదా?

* ఒకటే ప్రయోజనము గలవి.

జ్ఞానమునుగాని కర్మమునుగాని; ఏకమ్ = ఒకదాని; నిశ్చిత్య = నా యధికారమును నిశ్చయించి; వద. యేన—అధికారము నిశ్చయించి నీచేఁ జెప్పఁబడినదియు నాచే ననుష్ఠింపఁ బడినదియు నగు దేనిచేత, జ్ఞానముచేఁ గాని కర్మముచేఁ గాని; శ్రేయః = మోక్షమును; అహమ్; ఆప్నుయామ్ = పొందుటకుఁ దగినవాఁడ నగుదునో. ఇట్లు జ్ఞాన కర్మ నిష్ఠలకు ఒకఁడే యధికారి యనుపక్షమున వికల్ప సముచ్చయములు సంభవింపమివలన అధికారిభేదము దెలియుట కర్జునుని ప్రశ్నం బని సిద్ధము. ఇటుఁ బరులకు మతము సమస్తంబును శ్రుతి స్మృతి న్యాయ బలంబువలన భాష్యకారులచేత మాటిమాటికి నతిప్రయత్నమున నిరసింపఁబడినది, కావునఁ దానిఁ జేయుటకు నేఁ బ్రవర్తింప నైతిని.

భాష్యకృన్మత సారంబు భావమందు
నరసి గ్రంథమాత్రమునకు వ్యాఖ్య సేయ
భగవదాశయంబును స్పష్టపఱుపఁ బూని
చూపె నాయది నిజవచశ్శుద్ధికొఱకు.

శ్రీ. ఓయీ! «ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయో ఽన్యత్ క్షత్రియస్య న విద్యతే» ఇత్యాదికముచే కర్మముగూడ శ్రేష్ఠ మని చెప్పఁబడియే యున్నది అని యాశంకించి చెప్పుచున్నాఁడు.—ఒకచోఁ గర్మప్రశంస, ఒకచో జ్ఞానప్రశంస, ఇట్లు, వ్యామిశ్రము—సందేహము పుట్టించునదివలె నున్నది యేవాక్యము గలదో, దానిచే; మే; బుద్ధిమ్ = మతిని, రెంటియందును దోలాయమానమును గాఁ జేయుచు, మోహయసీవ, పరమకారుణికుఁడ వగు నీవు మోహకుఁడవు కానే కావు, అయినను, భ్రాంతిచే నా కిట్లు తోఁచుచున్న దని ఇవశబ్దముచేఁ జెప్పఁబడినది. కావున, రెంటిలో నేది మంచిదో దాని నొకటి నిశ్చయించి చెప్పుము. లేక, ఇదియే శ్రేయస్సాధన మని నిశ్చయించి, యేన = దేనిచే, దేని ననుష్ఠించుటచే; శ్రేయః = మోక్షమును; ఆప్నుయామ్ = పొందుదునో; దానినే యొకటి చెప్పు మని యర్థము.

ప. ◆

రా. అందువలన, వ్యామిశ్రేణవాక్యేన = మిశ్రవాక్యముచేత §; మే బుద్ధిం మోహయసీవ—నీవు నన్ను మోహపఱుచునట్లు తోఁచుచున్నది. ఎ

◆ ఈశ్లోకమునకు వ్యాఖ్యానము లేదు.

§ సంకీర్ణ మయిన మాటచేత.

ట్లనఁగా. ఆత్మావలోకనమునకు సాధనభూతం బైనసర్వేంద్రియ వ్యాపారోప రతి రూప మగు జ్ఞాన నిష్ఠకుఁ దద్విపరీతరూపం బగు ♦ కర్మము సాధనంబు దానినే చేయు మను నీవాక్యము విరుద్ధము వ్యామిశ్రమే యగును * తత్ = అందువలన; ఏకమ్ = మిశ్రము కాని వాక్యమును; వద చెప్పుము. యేన = ఏవాక్యముచేత; అహమ్ = నేను; నిశ్చిత్య = అనుష్ఠింపవలసినదాని నిశ్చయించుకొని; శ్రేయః = మేలును; ప్రాప్నుయామ్ = పొందుదునో.

నీవు ఆత్మావలోకనమునకు సాధనము సర్వేంద్రియ వ్యాపారోపరమరూప మయిన జ్ఞాననిష్ఠ యని చెప్పితివి. ఆ జ్ఞాననిష్ఠకు తద్విరుద్ధము మఱి ఇంద్రియ వ్యాపారరూప మగు కర్మము సాధన మని చెప్పి యాకర్మమునే యనుష్ఠింపు మని యుప దేశించుచున్నావు. ఇట్లు నీవాక్యము పూర్వాపరవిరుద్ధ మగుట వలన వ్యామిశ్రము గానే తోఁచుచున్నది. అట్టి వాక్యముచే నాబుద్ధికి మోహము గలుగున ట్లున్నది. కావున మిశ్రము గానియట్లు ఏకవాక్యముగాఁ జెప్పుము, ఆవాక్యము చొప్పున నేను ఎట్లు అనుష్ఠింపవలెనో నిశ్చయించుకొని శ్రేయస్సు పొందవలె నని తాత్పర్యము.

మా. ❡

శ్రీభగవానువాచ.—

లోకే ఽస్మి న్ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయా ఽనఘ
జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్. 3

భా. ప్రశ్నానురూపమునే ప్రతివచనము శ్రీభగవంతుఁడు వచిం చెను.—అస్మిన్ లోకే = ఈలోకమునందు; శాస్త్రార్థానుష్ఠానమునందు అధికృతు లగు వారికి, ద్వివిధా = రెండువిధములగు; నిష్ఠా= ఉనికి, అను ష్ఠేయ తాత్పర్యము. § పురా = పూర్వము సృష్ట్యాదియందు; ప్రజ లను సృజించి వారలకు అభ్యుదయ ప్రాప్తికిని నిశ్శ్రేయస ప్రాప్తికిని సాధన మైన వేదార్థ సంప్రదాయమును వెలయించుచనట్టి,

♦ ఇంద్రియ వ్యాపారరూపం బగు.

* వీరి మతమునందు "వ్యామిశ్రేణైవ" అను పాఠము తోఁచుచున్నది.

❡ ఇందుకు మాధ్వభాష్యము లేదు.

§ ఈవిధముగా ననుష్ఠింపవలె నను విధి.

మయా = సర్వజ్ఞుం డను ఈశ్వరుండ నగు నాచేత; ప్రోక్తా = చెప్పఁబడినది. అనఘ = ఓ పాపరహితుఁడా! అంగేది యాద్వివిధనిష్ఠ యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అందు, జ్ఞానయోగేన—జ్ఞానమే యోగము జ్ఞానయోగము, దానిచేత; సాఙ్ఖ్యానామ్ = ఆత్మవిషయ వివేకజ్ఞానము గలవారికి, బ్రహ్మచర్యాశ్రమము నుండియే సన్న్యసించినవారై వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థులైన పరమహంస పరివ్రాజకులకు బ్రహ్మమునందే నిలిచియుండు వారికి, నిష్ఠ చెప్పఁబడినది. కర్మయోగేన = కర్మమే యోగము కర్మయోగము, దానిచేత; యోగినామ్ = కర్ములకు; నిష్ఠ చెప్పఁబడిన దని యర్థము. ఒకవేళ, ఒకఁడే పురుషుఁడు ఒక్కటేపురుషార్థము కొఱకు జ్ఞానమును గర్మమును జేర్చి యనుష్ఠింపవలె నని భగవంతుఁడు సమ్మతించి చెప్పి యుండునేని, ముందుగాని గీతలందుఁ జెప్పఁబోవునేని, వేదములందుఁ గాని చెప్పఁబడియుండునేని, ఎట్లిచ్చట నర్జునునకు శరణాగతునకుఁ బ్రియునకు « భిన్నపురుష కర్తృకంబులే * జ్ఞానకర్మనిష్ఠ » లని వచించును? ఇఁక « అర్జునుఁడు జ్ఞానంబును గర్మమును రెంటిని విని తానే యనుష్ఠింపఁగలఁడు, ఇతరులకుమాత్రము భిన్నపురుషానుష్ఠేయంబు లని చెప్పెదను » అని భగవంతునభిప్రాయము కల్పింతురేని, అప్పుడు « రాగద్వేషవంతుఁడు అప్రమాణము భగవంతుం » డని కల్పించి నట్లగును. అదియో అయుక్తము. అందువలన, ఏహేతువుచే నేనియు లేదు సముచ్చయము జ్ఞానకర్మములకు.

పూర్వము సృష్ట్యాదియందు సర్వజ్ఞుం డను సర్వేశ్వరుండ నగు నేను బ్రజల సృజించి వారికి అభ్యుదయ నిశ్శ్రేయసములు పొందుటకై వేదమార్గమును బ్రకటించునపుడు రెండునిష్ఠలను జెప్పియున్నాను. అందు సాంఖ్యులకు జ్ఞాననిష్ఠను కర్మయోగులకుఁ గర్మనిష్ఠను జెప్పితి నని తాత్పర్యము.

అ॰. సముచ్చయవిరుద్ధముగాఁ బ్రశ్నమును వివరించి సముచ్చయవిరుద్ధముగనే యుత్తరమును లేవఁదీయుచున్నారు ప్రశ్నేత్యాదిగా. సర్వవ్యవహారములకును స్థానమేది కనఁబడుచున్నదో అట్టి లోకమునందు, శాస్త్రీయ మయిన జ్ఞానమును గాని కర్మమును గాని యనుష్ఠించుట కెవ్వ రధికృతులో అట్టివారికి, రెండువిధము

* భిన్ను లగు పురుషులు కర్తలుగాఁ గలవియే.

లయిన స్థితి నాచేఁ జెప్పఁబడినది యని పూర్వార్ధమునకు యోజన చేయుచున్నారు అస్మిన్ లోకే ఇత్యాదిగా. పూర్వము చెప్పుటకుఁ బ్రసక్తిం జూపుచుఁ జెప్పినవానికి విశేషణము చెప్పుచున్నారు సృష్ట్యాదియందు ఇత్యాదిగా. చెప్పినది యథార్థము కాకపోవచ్చు ననుశంకను నివారించుచున్నారు సర్వజ్ఞుండను అని. అజ్ఞునకు భగవదుపదేశము వినుటయందు యోగ్యతను సూచించుచున్నారు అనఘ అని. అందుఁ.—నిర్ధారణార్థమందు సప్తమి, వానిలో. జ్ఞానము పరమార్థవస్తు విషయము, అదియే యోగము దీనిచే బ్రహ్మమునందు యుజ్యతే—చేరుచున్నాఁడు ఏకీభవించు చున్నాఁడు అను వ్యుత్పత్తివలన, దానిచే; నిష్ఠయని యనువర్తించుచున్నది. చెప్పిన జ్ఞానమున కుపాయము నుపదేశింపఁ గోరినవారై సాంఖ్యశబ్దార్థముఁ జెప్పుచున్నారు ఆత్మ విషయేత్యాదిగా. వారలకే కర్మనిష్ఠత యని చెప్పఁగూడ దని చెప్పుచున్నారు బ్రహ్మచర్యేత్యాదిగా. వారలు జపాది పరవశులై శ్రవణాదులను జేయుకుందురనుటను నిరాకరించుచున్నారు వేదాంతేత్యాదిగా. ఈ విశేషణములు గలవారు ముఖ్యసన్న్యాసు లగుటచే ఫలావస్థనుండువా రని చెప్పుచున్నారు పరమహంసేత్యాదిగా. కర్మమనఁగా వర్ణాశ్రమములకు విధింపఁబడినది ధర్మమనుపేరుగలది అదియే అందుచే అభ్యుదయముతో యుజ్యతే—చేరుచున్నాఁ డను వ్యుత్పత్తిచే యోగము, దానిచే; నిష్ఠ కర్మలకుఁ జెప్పఁబడినది అని యన్వయముఁ జూపుచుఁ జెప్పుచున్నారు కర్మమే యోగము ఇత్యాదిగా. ఇట్లు ప్రతివచన వాక్యమునందలి వేయగు నక్షరములకు వ్యాఖ్యానముచేసి దానికే తాత్పర్యము చెప్పుచున్నారు ఒకవేళ నిత్యాదిగా. సమ్మత మైనను తెలియకపోవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు చెప్పియుండునేని అని. తెలిసినను మూలరహితం బగుటచే భ్రాంతి కావచ్చునని యాశంకించి చెప్పుచున్నారు వేదములందుఁ గానియని. అర్జునుఁడు శిష్యుఁడు గాఁడని యతనికి వేఱువిధముగాఁ జెప్పియుండవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు శరణాగతున కని. అయినను అతనియెడ నుదాసీతచే వేఱువిధముగాఁ జెప్పె నని యాశంకించి చెప్పుచున్నారు ప్రియున కని. నిష్ఠాద్వయము భిన్నపురుషానుష్ఠేయంబు లనియో చెప్పుచున్నాఁడు, అందుచే సముచ్చయము శాస్త్రార్థం బనుట భగవదభిమతము కాదని శేషము. ఓయీ! అర్జునుఁడు మిక్కిలి బుద్ధిమంతుఁ డగుటవలన, జ్ఞానకర్మముల విన్నపిమ్మట, రెంటిని జెప్పుట యనుపపన్నమగుటచే * సము

* భగవంతుఁడు రెంటిని జెప్పుటవలన రెంటిని జేర్చి యనుష్ఠించుట భగవంతుని యభిప్రాయము, లేనిచో రెంటిని భగవంతుండు చెప్పుట యనుపపన్నమగును గదా అని తెలిసి.

చ్చయమునే యనుష్ఠింపఁ గలఁడు; ఇతరులో జ్ఞానకర్మములు భిన్నపురుషానుష్ఠేయంబు లని విని వానిని బ్రత్యేకముగనే యనుష్ఠింతురుగాక—ఇది భగవంతుని యభిప్రాయం బని కల్పించెదము, భగవంతున కర్జునుని యం దనురాగాతిశయము గలుగుటవలనను ఇతరులయం దది లేమివలనను, అందు రేని అందుకుఁ జెప్పుచున్నారు ఇఁక ఇత్యాదిగా. అప్రమాణము—అనాప్తుఁడు ♦. భగవంతుఁడు రాగాదియుక్తుఁడగుటచే అనాప్తుఁ డనుటయో యుక్తము కాదు «సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తమ్» ఇత్యాది వచనములకు విరుద్ధ మగుటవలన నని చెప్పుచున్నారు అదియో ఇత్యాదిగా. నిష్ఠాద్వయము భిన్నపురుషానుష్ఠేయం బని చెప్పుటకు ఫలము నుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా.

హ. ❡

శం. నీవేమిచెప్పితివో అది సత్యము. నీబుద్ధిదోషంబే యిది. అప్పుడు నేనేమి చెప్పితినో అది నీకుఁ దెలియలేదు. విద్య బుద్ధి శక్తి అవస్థ మొదలగువాని విచారించినచో నీకుఁ గర్మమునందే యధికారము కాని సన్న్యాసమునందు లేదు. అందువలననే నేను జెప్పితిని 'కర్మణ్యేవా ఽధికారస్తే' అని. అట్లయినను «చిత్తశుద్ధిద్వారమున జ్ఞానసిద్ధికొఱకుఁ గర్మము చేయుము, కాని ఫలమునకై చేయకుము» అని సూచించుటకై 'బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః' అని చెప్పితిని, కాని కర్మము విడిచి బుద్ధి నాశ్రయింపు మని కాదు; రెంటినిం జేయుమనియుఁ గాదు; జ్ఞానకర్మములు రాజసూయబృహస్పతిసవములు వోలె § భిన్నపురుషకర్తృకంబు లగుటవలన వానిని ఏకపురుషుఁ డనుష్ఠించుట సంభవింపమివలన. దీనిని బూర్వమే సూచించితిని «ఏషా తే ఽభిహితా సాఙ్ఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు" అని. దానినే మరలఁ జెప్పెద వినుము అను నభిప్రాయముతో శ్రీభగవంతుం డి ట్లనియె.—అస్మిన్ లోకే; బ్రాహ్మణాదు లగు స్వధర్మపరు లైన ముముక్షువులకు, పురా = పూర్వకాలమునందు; మయా = వేదరూపుఁడను సర్వజ్ఞుఁడను సర్వధర్మముల నుపదేశించువాఁడ నగు నాచేత; ద్వివిధా = రెండువిధములు గల; నిష్ఠా = శాస్త్రీయ మయిన యనుష్ఠింపవలసిన ధర్మమునకు సాంకర్యము సంభవింప

♦ అప్తుఁడు కానివాఁడు, ఆప్తుఁడు = యథార్థవక్త.

❡ పదయోజన శంకరభాష్యముతో సమానము.

§ రాజసూయమును క్షత్త్రియుఁడును బృహస్పతిసవమును బ్రాహ్మణుఁడు మాత్రమే చేయవలెను.

నియట్లు నియమంబున స్థితి, వ్యవస్థ; ప్రోక్తా-చేయఁబడిన దని యర్థము. ఎట్లు చేయఁబడిన దనఁగాఁ జెప్పెదను—సాఙ్ఖ్యానామ్-సర్వవేదాంతములచేతను సమ్యగ్ఖ్యాయతే—ఏకతాత్పర్యముచేఁ బ్రతిపాదింపఁ బడుచున్నది కావున సాంఖ్యమనఁగా నిర్విశేషపరబ్రహ్మము, అదియే స్వాత్మ * అని యెవరెఱింగిరో వారు సాంఖ్యులు బ్రహ్మవేత్తలు, అట్టి సాఁఖ్యులకు-బ్రహ్మవిదు లగు యతులకు; జ్ఞానయోగేన-బ్రహ్మవిదుండు బ్రహ్మముతో యుజ్యతే-ఏకముగాఁ జేయఁబడుచున్నాఁడు దీనిచేతఁ గావున యోగము, జ్ఞానమే యోగము-జ్ఞానయోగము దానిచేత, ఇదియంతయు నేమను బ్రహ్మమే యని బ్రహ్మాకారవృత్తిచే; నిష్ఠా =నిశ్చలస్థితి; ప్రోక్తా-ఎల్లప్పుడు నేకరీతిగాఁ జేయవలె నని విధింపఁబడినది, “తమే వైకం విజానథ ఆత్మాన మన్యావాచో విముఞ్చథ, ఓ మిత్యేవం ధ్యాయథ ఆత్మానం స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్, వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థాః, సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానితి శాన్త ఉపాసీత, తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః నానుధ్యాయే ద్బహూఞ్ఛబ్దా న్వాచో విగ్లాపనం హి తత్ ” ♦ ఇత్యాది వాక్యములచే అనాత్మయందుఁ బ్రవృత్తిని నిషేధించి వారలకు బ్రహ్మనిష్ఠమాత్రమే కర్తవ్య మని చెప్పఁబడిన దని యర్థము. యోగినామ్ = కర్మయోగులకు, గృహస్థులకు; కర్మయోగేన-యుజ్యతే-కూర్పఁబడుచున్నది అభ్యుదయము దీనిచేత నని యోగము, కర్మమే యోగము-కర్మయోగము, దానిచేత; నిష్ఠా = నియమస్థితి; చెప్పఁబడినది, “అహ రహ స్సన్ధ్యా ముపాసీత, ఉదితే సూర్యే ప్రాతర్జుహోతి, వసన్తే బ్రాహ్మణో ఽగ్ని నా దధీత, కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః, తస్మాత్స్వ ధ్యాయో ఽధ్యేతవ్యః, ఋతంచ స్వాధ్యాయ ప్రవచనే చ సత్యంచ స్వాధ్యాయ ప్రవచనేచ అగ్నయశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ అగ్నిహోత్రంచ స్వాధ్యాయ ప్రవచనేచ సత్యం వద ధర్మం చర తాని త్వయోపా

---

* తమ స్వరూపము.

♦ ఆయాత్మను ఒకనినే యెఱుంగుఁడు ఇతరము లయిన వాక్కులను విడువుఁడు, ప్రణవముచే ఆత్మను ధ్యానింపుఁడు, మీకు అజ్ఞానపారము దాఁటి మేలు కలుగును, వేదాంత విచారముచేఁ జక్కఁగా నిశ్చయింప బడిన పరమార్థవస్తువు గలవారై, ఇదిసమస్తమును గదా బ్రహ్మము, దానియందే పుట్టినది దానియందే లయము నొందినది దానియందె నిలిచినది అని శాంతుఁడై యుపాసింపవలెను, పండితుఁ డగు బ్రాహ్మణుఁడు వానినే తెలిసి ప్రజ్ఞను ధరింపవలెను పెక్కు శబ్దములను స్మరింపఁ గూడదు అది వాక్కును శ్రమయింపఁ జేయునది గదా!

స్యాని" [1] అని శ్రౌత స్మార్త కర్మనిష్ఠయే కర్ములు చేయవలె నని విధింపఁబడినది. ఇట్లు రెండునిష్ఠలును కర్ము లగు గృహస్థులకు ఒకటియు కర్మరహితు లగు సన్న్యాసుల కొకటియు నని యసంకీర్ణముగా విభజించి ప్రదర్శింపఁబడినవి యని యర్థము.

వ్యా. ఇట్లధికారిభేదము నర్జునుం డడుగఁగా దాని కనురూపం బగు ప్రతివచనమును భగవంతుండు పలికెను.——అస్మిన్ = ఈఅధికారి యని సమ్మత మయిన; లోకే = శుద్ధాంతఃకరణుఁడు అశుద్ధాంతఃకరణుఁడు అని రెండువిధములు గల జనమునందు; ద్వివిధా = రెండువిధములుగల; నిష్ఠా = స్థితి, జ్ఞానపరత్వమును కర్మపరత్వమును; పురా = పూర్వాధ్యాయమునందు; మయా = నీకత్యంతము హితము చేయువాఁడనగు నాచేత; ప్రోక్తా=చక్కఁగా—స్పష్టముగా చెప్పఁబడినది. కావున ఒక్కఁడే యధికారి యనుశంకచే వ్యాకులపడవల దని భావము. అనఘ= ఓపాపరహితుఁడా! అని సంబోధించుచు అర్జునున కుపదేశయోగ్యతను సూచించుచున్నాఁడు. ఒక్కటే నిష్ఠ, సాధ్యము సాధనము అను నవస్థలభేదముచే రెండు విధములు, కాని రెండే స్వతంత్రము లయిన నిష్ఠలు కా వని వచించుటకు నిష్ఠా యని యేకవచనము. అట్లు చెప్పఁబోవుచున్నాఁడు 'ఏకం సాఙ్ఖ్యంచ యోగంచ యః పశ్యతి సపశ్యతి' అని. ఆనిష్ఠనే రెండువిధములుగాఁ జూపుచున్నాఁడు.——సాఙ్ఖ్యానామ్—సంఖ్య యనఁగా ఆత్మయొక్క సమ్యక్ జ్ఞానము, దానిఁ బొందినవారికి, బ్రహ్మచర్యమునుండియే సన్న్యసించి వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థులై జ్ఞానభూమి నారోహించిన శుద్ధాంతఃకరణులకు; జ్ఞానయోగేన——జ్ఞానమే యుజ్యతే—కూడుచున్నాఁడు బ్రహ్మముతో దీనిచే నను వ్యుత్పత్తిచే యోగము, దానిచేత; నిష్ఠ చెప్పఁబడినది "తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః" ఇత్యాదికముచేత. అశుద్ధాంతఃకరణులకో, జ్ఞానభూమి నారోహింపనియట్టి, యోగినామ్ = కర్మాధికార యోగులకు; కర్మయోగేన——కర్మమే యుజ్యతే——కూడుచున్నాఁడు అంతఃకరణశుద్ధితో దీనిచేత నను వ్యుత్పత్తిచే యోగము, దానిచేత; నిష్ఠ చెప్పఁబడినది అంతఃకరణశుద్ధిద్వారమున జ్ఞానభూమిక నారోహించుటకొఱకు "ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయో

---

[1] ప్రొద్దు ప్రొద్దునను సంధ్య నుపాసింపవలెను, సూర్యుఁ డుదయించినంతనే ప్రాతఃకాలమున వేల్వవలెను, వసంత ఋతువునందు బ్రాహ్మణుం డగ్న్యాధానము చేయవలెను, కర్మములను జేయుచునే యిట నూఱుసంవత్సరములును జీవింపఁగోరవలెను, అందువలన స్వాధ్యాయము—వేదము అధ్యయనింపవలెను, ఋతమును స్వాధ్యాయ ప్రవచనంబులును సత్యమును స్వాధ్యాయ ప్రవచనంబులును అగ్నులును స్వాధ్యాయ ప్రవచనంబులును అగ్నిహోత్రంబును స్వాధ్యాయ ప్రవచనంబులును సత్యముఁ బలుకుము ధర్మము నాచరింపుము వానిని నీ వుపాసింపవలెను.

ఽన్యత్ క్షత్త్రియస్య న విద్యతే ” ఇత్యాదికముచేత. ఇందువలననే, లేదు జ్ఞాన కర్మములకు సముచ్చయమును వికల్పమును, మ తేమనఁగా, నిష్కామకర్మముచే శుద్ధ మయిన యంతఃకరణము గలవారికి సర్వ కర్మసన్న్యాసముచేతనే జ్ఞానం బని యంతఃకరణముయొక్క శుద్ధి అశుద్ధి అను నవస్థల భేదముఁ బట్టి యొకనికే నీకు ద్వివిధ మైన నిష్ఠ చెప్పఁబడినది, «ఏషా తే ఽభిహితా సాఙ్ఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు » అని. కావున భూమికాభేదంబున నొక్కనికే రెండు నుపయోగించుటవలన అధికారభేద మున్నను ఉపదేశము వ్యర్థము కా దని యభిప్రాయము. దీనినే తెలుపుటకు అశుద్ధచిత్తుఁడు చిత్తశుద్ధి గలుగు పర్యంతము కర్మ మనుష్ఠింపవలె నని ‘ న కర్మణా మనారమ్భాత్ ’ ఇత్యాదిగా ‘ మోఘం పార్థ స జీవతి ’ అనువఱకుఁ గల పదు మూఁడు శ్లోకములచేఁ దెలుపుచున్నాఁడు. శుద్ధచిత్తుఁ డగు జ్ఞానికో కొంచెమేని కర్మ మపేక్షితము కా దని తెలుపుచున్నాఁడు ‘ యస్త్వాత్మరతి రేవ స్యాత్ ’ ఇత్యాదు లగు రెండు శ్లోకములచేత. ఇఁక ‘ తస్మా దసక్త స్సతతమ్ ’ అని యారంభించి ‘ కర్మము బంధహేతు వైనను దానికి మోక్షహేతుత్వము చిత్తశుద్ధి జ్ఞానోత్పత్తి ద్వారమున సంభవించుచున్నది ఫలాభిసంధి లేకుండుట యను కౌశలముచేత ’ నని తెలుపఁ బోవుచున్నాఁడు. అటుపిమ్మట ‘ అథ కేన ప్రయుక్తో ఽయమ్ ’ అని ప్రశ్న పుట్టించికొని ‘ కామదోషంబుచేతనే కామ్యకర్మమునకు శుద్ధిహేతుత్వము లేదు. కావునఁ గామమును విడిచి కర్మములను జేయుచుండుటచే అంతఃకరణశుద్ధినొంది జ్ఞానాధికారి వయ్యెదవు ’ అని అధ్యాయ పరిసమాప్తి వఱకు వచియింపఁ బోవుచున్నాఁడు భగవంతుఁడు.

శ్రీ. దీని కుత్తరము.—ఇది యర్థము. నేను బరస్పర నిరపేక్షముగా మోక్షసాధన మని కర్మనిష్ఠా జ్ఞాననిష్ఠలు రెండు చెప్పియుందునేని అప్పుడు రెంటిలో నేదిమంచిదో అదియొకటి చెప్పు మని నీప్రశ్న యుపపన్న మగును. నేనేమో యట్లు చెప్పనైతిని. మ తేమనఁగా రెంటిచేతను ఒకటే బ్రహ్మనిష్ఠ చెప్పితిని, గుణప్రధానభూతము లయిన ఆరెంటికిని బ్రత్యేకము స్వాతంత్ర్యము అనుపపన్న మగుటవలన. ఒక నిష్ఠకే యధికారభేదమును బట్టి ప్రకారభేదము మాత్రమే వచించితిని. అని. అస్మిన్—ఈ, శుద్ధాంతఃకరణులు అశుద్ధాంతఃకరణులు అని రెండువిధములైన; లోకే = అధికారిజనమునందు; ద్వివిధా = రెండువిధములు గల; నిష్ఠా = మోక్షపరత్వము; పురా = పూర్వాధ్యాయమునందు; మయా = సర్వజ్ఞుండ నగు నాచేత; ప్రోక్తా = స్పష్టముగానే చెప్పఁబడినది. ప్రకార ద్వయమునే చూపుచు

న్నాఁడు—సాఙ్ఖ్యానామ్ = శుద్ధాంతఃకరణులై జ్ఞానభూమి నారోహించినవారికి; జ్ఞాన పరిపాకము కొఱకు, జ్ఞానయోగేన—ధ్యానాదికముచేత; నిష్ఠా—బ్రహ్మపరత్వము, చెప్పఁబడినది "తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః" ఇత్యాదికము చేత. సాంఖ్యభూమిక నారోహింపఁ గోరినవారలకు మాత్రము, అంతఃకరణశుద్ధి ద్వారమున సాంఖ్యభూమిక సిద్ధించుటకొఱకు, యోగినామ్ = తదుపాయభూతమైన కర్మయోగమునం దధికారు లగు వారికి; కర్మయోగేన; నిష్ఠ చెప్పఁబడినది "ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయో ఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే" ఇత్యాదికము చేత. ఇందువలననే చిత్తముయొక్క శుద్ధి అశుద్ధి అను నవస్థలభేదమును బట్టియే రెండువిధము లైన నిష్ఠయును జెప్పఁబడినది. "ఏషా తే ఽభిహితా సాఙ్ఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు" అని.

ప. అంత భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—లోకే—తెలియఁబడుచున్నది వీనిచేత నను వ్యుత్పత్తిచే లోక మనఁగా ముముక్షుజనము, దానియందు; ద్వివిధా = రెండుప్రకారములు గల; నిష్ఠా = మర్యాద; పురా = పూర్వాధ్యాయమునందు; ప్రోక్తా. అందు; సాఙ్ఖ్యానామ్ = శుద్ధాంతఃకరణులకు; జ్ఞానయోగేన. అట్లు, అశుద్ధాంతఃకరణులైన, యోగినామ్ = కర్మకుశలులకు; కర్మయోగేన. ఒక్కనికి రెండుపాయములఁ జెప్పినవాఁడఁగాను, మరేమనఁగా, అధికారభేదమునుబట్టి చెప్పితిని కావున "వ్యామిశ్రేణేవ వాక్యేన" అని పలుకుట యుచితము గా దని యర్థము.

రా. మున్ను చెప్పినది చక్కఁగా గ్రహింపవైతివి. ఏలయనఁగా, పురా = మున్ను; అస్మిన్, లోకే = నానావిధాధికారులచే నిండిన లోకమునందు; ద్వివిధా = రెండువిధములు గల; నిష్ఠా—జ్ఞానవిషయమును కర్మవిషయము నగు నిష్ఠ; మయా= నాచేత; వారివారి అధికారము చొప్పున అసంకీర్ణముగానే, ప్రోక్తా=చెప్పఁబడినది. లౌకికులగు పురుషులందఱు మోక్షాభిలాష గలిగినంతనె యప్పుడే జ్ఞానయోగాధికారము నొందఁజాలరుగదా! మరేమనఁగా, ఫలాభిసంధిలేక పరమపురుషారాధనరూపంబున ననుష్ఠితంబగు కర్మముచే నంతఃకరణ మలము నశించి అవ్యాకులేంద్రియులై జ్ఞాననిష్ఠయం దధికారు లగుదురు. "యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతమ్ । స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" అని పరమ పురుషారాధనైకరూపత కర్మములకుఁ జెప్పఁబడును. ద్వితీయాధ్యాయమునందుఁగూడ "కర్మ

ణ్యే వాధి కా ర్యస్తే" ఇత్యాదికముచే ఫలాభిసంధిరహితముగాఁ గర్మం బనుష్ఠేయం బని విధించి యందుచే విషయ వ్యాకులతారూప మైన మోహము నుండి యుత్తీర్ణ మయిన • బుద్ధిగలవానికి "ప్రజహాతి యదా కామాన్" ఇత్యాదికముచే జ్ఞాన యోగము ప్రతిపాదింపఁ బడినది. ఇందువలన, సాఙ్ఖ్యానామ్ = సంఖ్య అనఁగా బుద్ధి, దానితోఁ గూడినవారు సాంఖ్యులు, ఆత్మైకవిషయ మగు బుద్ధి గలవారు సాంఖ్యులు; అట్టివారికి మాత్రమే; జ్ఞానయోగేన = జ్ఞానయోగముచే; స్థితి చెప్పఁ బడినది. యోగినామ్ = అజ్ఞాన యోగమునకు యోగ్యత లేనికర్మయోగాధికారు లకో; కర్మయోగేన = కర్మయోగముచే, స్థితి చెప్పఁబడినది. ఇట్లు విషయ వ్యాకుల మయిన బుద్ధి గలవారలకుఁ గర్మయోగమునం దధికారము, అవ్యాకుల బుద్ధులకు మాత్రము జ్ఞానయోగమునం దధికారము చెప్పఁబడినది, కావున ఇంచే మియు విరుద్ధము వ్యామిశ్రముగా వచియింపఁబడినది కాదు.

ఈలోకమునం దధికారులు నానావిధములుగా నుంటువలన వారివారి యధికారము చొప్పున నేను జ్ఞానవిషయము కర్మవిషయము అని రెండు విధము లయిన నిష్ఠలు వేఱువేఱుగా నే చెప్పితిని. అందు విషయములం దగిలి వ్యాకులపడు చిత్తము గలవారికి కర్మయోగమునం దధికారము. కర్మయోగము ననుష్ఠించుటచేఁ జిత్త మలంబు తొలంగి అవ్యాకుల చిత్తు లగువారికి జ్ఞానయోగమునం దధికారము. కావున నీవు పరస్పర విరుద్ధం బని సంశయింప నవకాశము లే దని తాత్పర్యము.

మా. బుద్ధి జ్యాయంబైనను నీవు అధికారికుఁడవు ‡ అగుటవలన కర్మ మునం దధికృతుఁ డవు అని అందు నిన్ను నియోగించుచున్నానను నభిప్రాయము గలవాఁడై భగవంతుండు చెప్పుచున్నాఁడు.—అస్మిన్ లోకే = ఈలోకమునందు; ద్వివిధాః = రెండు విధము లయినవారు గూడ జనులు కలరు, గృహస్థాదులకు విహితమైన కర్మమును విడిచి జ్ఞాననిష్ఠు లగువారు సనకాదులవలె, ఆకర్మమునం దున్నవారై యే జ్ఞాననిష్ఠు లగు వారును జనకాదులవలె, నాధర్మమునం దున్నవా రలే § యని యర్థము. సాఙ్ఖ్యానామ్ = జ్ఞానులకు, సనకాదులకు. యోగినామ్ = ఉపాయులకు *, జనకాదులకు. జ్ఞాననిష్ఠులు గూడ ఈశ్వరేచ్ఛచే అధికారికు

• దాఁటిన.

‡ అధికారము గలవాఁడవు—ఈశ్వరేచ్ఛచేఁ గర్మాధికారము నొందినవాఁడవు.

§ జ్ఞాన మార్గమున నున్నవారలే.

* ఉపాయము గలవారికి.

లగుటవలనను లోకసంగ్రహార్థులగుటవలనను ఎవరు కర్మయోగ్యు లగుదురో వారును యోగులు. నిష్ఠా = స్థితి. నీవో జనకాదులవలె కర్మసహితుఁడ వైయే జ్ఞానయోగ్యుఁడవు, కాని సనకాదులవలె కర్మమును విడిచి కా దని యర్థము. కలరుగదా యీశ్వరేచ్ఛచేతనే కర్మముచేయువారు ప్రియవ్రతాదులుగూడ జ్ఞానులే. అట్లు చెప్పఁబడినది « ఈశ్వరేచ్ఛయా వినివేశిత కర్మాధికారః » * అని.

ఈలోకమున జ్ఞాననిష్ఠులే రెండువిధములుగా నున్నారు. సనకాదులవలెఁ గర్మములను విడిచినవారు కొందఱు. జనకాదులవలె కర్మమును విడువక జ్ఞాననిష్ఠయం దుండువారు కొందఱు. జ్ఞాననిష్ఠులై యీశ్వరేచ్ఛచేఁ గర్మాధికారము గలవారై కర్మ మనుష్ఠించుచుండు జనకాదులు అధికారికు లనఁబడుదురు. కేవల జ్ఞానులగు సనకాదులకు జ్ఞాన యోగ నిష్ఠమాత్రమె చెప్పఁబడినది. అధికారిక లగు యోగులకు కర్మనిష్ఠయు జ్ఞాననిష్ఠయుఁ జెప్పఁబడినవి. నీవు అధికారికుఁడ వగుటచే రెండును నీ వనుష్ఠింపవలె నని తాత్పర్యము.

న కర్మణా మనారమ్భా న్నైష్కర్మ్యం పురుషో ఽశ్నుతే
నచ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి. ౪

భా. ఏది యర్జునుండు చెప్పెనో కర్మముకంటె జ్యాయసి బుద్ధి యని, అది సత్యమె నిరాకరింపమివలన; అజ్ఞాననిష్ఠయు సన్న్యాసియే యనుష్ఠింపవలె ననుటయు సిద్ధము, భిన్నపురుషానుష్ఠేయంబులని చెప్పుట వలన; భగవంతునకు నిశ్లే యనుమతం బని తెలియుచున్నది. నన్ను నైనను బంధకారణం బగు కర్మమునందే నియోగించుచున్నా వని విషణ్ణహృదయుం డగు నర్జునుని 'కర్మముచేయు' నని తలంచుచున్న వానిం జూచి చెప్పుచున్నాఁడు భగవంతుఁడు నకర్మణా మనారమ్భా దిత్యాది. లేక. జ్ఞానకర్మనిష్ఠలు పరస్పర విరుద్ధము లగుటవలన ఒకపురుషునిచే ఏకకాలమునం దనుష్ఠింప నశక్యము లగుటం జేసి యన్యోన్యనిరపేక్షంబులై యే ♦ పురుషార్థహేతువు లగుననుట ప్రాప్త మగుచున్నది. అందుకై «కర్మనిష్ఠ జ్ఞాననిష్ఠాప్రాప్తిహేతు వగుటచేఁ బురుషార్థమునకు హేతువగును, స్వాతంత్ర్యమునం గాదు. జ్ఞాననిష్ఠయో

* ఈశ్వరేచ్ఛచే కలిగింపఁబడిన కర్మాధికారము గలవాఁడై—ప్రియవ్రతుఁడు.
♦ ఒకటియొకటి యపేక్షింపనివైయే—ఒక్కొకటియు స్వతంత్రమైయే.

కర్మనిష్ఠారూప మయిన యుపాయముచేఁ బొందఁబడినదై స్వాతంత్ర్యముసం బురుషార్థహేతు వగును, ఇతరము నపేక్షింపదు" అను నీయర్థముం బ్రదర్శించువాఁడై చెప్పుచున్నాఁడు భగవంతుఁడు నకర్మణామిత్యాదిగా. కర్మణామ్ = క్రియలయొక్క, యజ్ఞాదులయొక్క, ఈజన్మమునందు జన్మాంతరమునందుఁగాని యనుష్ఠితంబులై యుపాత్తదురితక్షయ హేతువు § లగుటచేఁ జిత్తశుద్ధికిఁ గారణంబులును జిత్తశుద్ధికారణంబు లగుటచే జ్ఞానోత్పత్తిద్వారంబున జ్ఞాననిష్ఠాహేతువులు నగువానియొక్క, "జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయా త్పాపస్య కర్మణః। యథా దర్శతలప్రఖ్యే పశ్య త్యాత్మాన మాత్మని" * ఇత్యాది స్మృతివలన; అనారమ్భాత్ = అనుష్ఠింపమివలన; నైష్కర్మ్యమ్ = నిష్కర్మభావమును, కర్మశూన్యతను, జ్ఞానయోగముచే నిష్ఠను, నిష్క్రియాత్మస్వరూపమున నుండుట నని యర్థము; పురుషః = పురుషుఁడు; న అశ్నుతే—పొందఁ డని యర్థము. కర్మముల ననుష్ఠింపమివలన నైష్కర్మ్యమును బొందఁ డని చెప్పుటవలన దానికి విపర్యయంబునఁ గర్మముల ననుష్ఠించుటవలన నైష్కర్మ్యమును బొందుననుట సిద్ధించుచున్నది. ఏకారణంబువలన మఱి, కర్మముల ననుష్ఠింపకుండుటవలన నైష్కర్మ్యము పొందఁడు? ఇందుకుఁ జెప్పెదము.—కర్మానుష్ఠానమే నైష్కర్మ్యమున కుపాయ మగుటవలన. ఉపాయము లేక యుపేయము సిద్ధింపదు గదా! కర్మయోగమే యుపాయము నైష్కర్మ్యలక్షణం బగు జ్ఞానయోగంబునకని శ్రుతియందును ఇందును బ్రతిపాదింపఁబడినది. శ్రుతియందుఁ బ్రకృతమైన జ్ఞేయం బగు ఆత్మలోకముయొక్క జ్ఞానమున కుపాయం బని "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన" ఇత్యాదికముచేఁ గర్మయోగము జ్ఞానయోగోపాయం బనుట ప్రతిపాదింపఁ బడినవి. ఇందుఁగూడ "సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తు మయోగతః। యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాత్మశుద్ధయే॥ యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్" ఇత్యా

§ పొందఁబడిన పాపముయొక్క నాశమునకు హేతువులు.

* పాపమైన కర్మముయొక్క క్షయమువలనఁ బురుషులకు జ్ఞానము పుట్టుచున్నది ఎట్లు అద్దమువంటి శుద్ధహృదయమునందు ఆత్మను జూచునో అట్టి జ్ఞానము.

దిగాఁ బ్రతిపాదింపఁ బోవుచున్నాఁడు. ఇఁక ఓయీ! «అభయం సర్వ భూతేభ్యో దత్వా నైష్కర్మ్య మాచరేత్" * ఇత్యాదికముచేఁ గర్తవ్యం బగు కర్మసన్న్యాసమువలనంగూడ నైష్కర్మ్యప్రాప్తి చెప్పఁబడుచున్నది, లోకంబునందుఁ గూడఁ గర్మములయనారంభము వలన నైష్కర్మ్యం బని మిక్కిలి ప్రసిద్ధము; ఇందువలనను నైష్కర్మ్యార్థికిఁ గర్మానుష్ఠానం బేల? అని ప్రాప్తించుచున్నది. ఇందుకుఁ జెప్పుచున్నాఁడు నచ సన్న్యసనా దేవేత్యాదిగా. సన్న్యసనాదేవచ = కేవల మయిన కర్మ పరిత్యాగమువలన మాత్రమెగూడ, జ్ఞానరహిత మైన దానివలన; సిద్ధిమ్ = నైష్కర్మ్యరూప మయిన సిద్ధిని, జ్ఞానయోగనిష్ఠను, నసమధిగచ్ఛతి = పొందఁడు.

కర్మముల ననుష్ఠించినం గాని నైష్కర్మ్యం బనఁబడు జ్ఞానయోగనిష్ఠ సిద్ధింపదు. జ్ఞానము లేక వట్టి కర్మ పరిత్యాగముచేసిన మాత్రాన నైష్కర్మ్యము లభించునది కా దని తాత్పర్యము.

ఆ. అర్జునుఁడు «జ్యాయసీ చేత్» అని బుద్ధి జ్యాయం బని చెప్పినాఁడుగదా! దానినేల భగవంతు డుపేక్షించె ననఁగా చెప్పుచున్నారు ఏది ఇత్యాదిగా. మఱియు జ్ఞాననిష్ఠయందు సన్న్యాసులకే యధికార మని భగవంతుని యభిప్రాయము; కానిచో భగవంతుని విభాగవచనము ♦ విరోధించు నని విభాగ వచన సామర్థ్యమువలన సిద్ధ మైన యర్థముఁ జెప్పుచున్నారు అజ్ఞాననిష్ఠయు నిత్యాదిగా. అట్లయిన యెడ విభాగ వచనానుసారముగ నర్జునునకుఁగూడ సన్న్యాసపూర్వకం బగు జ్ఞాననిష్ఠయందే యధికారము కావచ్చును అనఁగా కా దని చెప్పుచున్నారు నన్వ ఇత్యాదిగా. ఐనను—బుద్ధి జ్యాయసి యని యంగీకరించికూడ. కర్మములు చేయకున్నను శ్రవణాదులచే జ్ఞానప్రాప్తి కావచ్చు నని పరమతము ననుసరించి విశేషణము చేయుచున్నారు కర్మము చేయను ఇత్యాదిగా. విభాగ వచనమునుబట్టి సముచ్చయము కా దన్నచో జ్ఞానకర్మములు రెండును స్వాతంత్ర్యమునఁ బురుషార్థహేతువు లగును, కావన్నయెడఁ గర్మమువలె జ్ఞానముగూడ స్వాతంత్ర్యమునఁ బురుషార్థహేతువు కా దనవలెను అని యాశంకించి వేఱుసంబంధముఁ జెప్పుచున్నారు లేక అని. అట్లయినచో జ్ఞాననిష్ఠయును గర్మనిష్ఠవలె

* సర్వభూతములకును అభయం బొసంగి నైష్కర్మ్యము నాచరింపవలెను.

♦ జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్ అనునది.

నిష్ఠాత్వమునందు విశేషము లేమివలన స్వాతంత్ర్యమునఁ బురుషార్థహేతువు కాదు, కావున సముచ్చయమే సిద్ధించు నని యాశంకించి చెప్పుచున్నారు జ్ఞాననిష్ఠయో ఇత్యాదిగా. రజ్జుతత్త్వజ్ఞాన ముత్పన్నమై ఫలసిద్ధియందు సహకారి నపేక్షించుటం గానము కదా! అట్లు ఇదియు ఉత్పన్నమైనపిదప మోక్షమునకు ఇతరము నపేక్షింపదు—అది చెప్పుచున్నారు ఇతరము నపేక్షింపదని. "యస్య వై తత్కర్మ" అను శ్రుతియందుం బోలెఁ గర్మశబ్దము చేయఁబడు వస్తువును వచించు నని యాశంకించి వ్యాఖ్యానము చేయుచున్నారు క్రియలయొక్క అని. ఆక్రియలను నిత్యనైమిత్తికము లని విభజించుచున్నారు యజ్ఞాదులయొక్క అని. ఈజన్మమునందే యనుష్ఠితంబు లగు కర్మములు బుద్ధిశుద్ధిద్వారమున జ్ఞానహేతువు లగు ననుచో బ్రహ్మచారుల § కెట్లు జ్ఞానోత్పత్తి యగును? జన్మాంతరకృతము లైన కర్మంబులే యట్లు జ్ఞానహేతువు లగుననుచో గృహస్థాదులకు నేతజ్జన్మకృతంబు లగు కర్మములు జ్ఞానహేతువులు కాక పోవును అని యాశంకించి నియమము లేదని తెలుపుచున్నారు ఈజన్మమునందు ఇత్యాదిగా. ఇవి సత్త్వశుద్ధి కారణంబులు కాఁజాలవు ఉపాత్త దురితంబులు ప్రతిబంధకము లుండుట వలన నని యాశంకించి చెప్పుచున్నారు ఉపాత్తేత్యాదిగా. అప్పుడు అంతమాత్రమే వాని ప్రయోజనము కావలయును, ఎట్లవి జ్ఞాననిష్ఠాహేతువు లగు ననఁగాఁ జెప్పుచున్నారు చిత్తశుద్ధీత్యాదిగా. కర్మములు చిత్తశుద్ధిద్వారమున జ్ఞానహేతువు లనుటకుఁ బ్రమాణముఁ జెప్పుచున్నారు జ్ఞాన ముత్పద్యతే ఇత్యాదిగా. అనారంభ పదమునకు ఉపక్రమింపమి యర్థము కాదని చెప్పుచున్నారు అనుష్ఠింపమివలన నని. నిష్కర్ముని యొక్క—సన్న్యాసియొక్క కర్మము—జ్ఞానము నైష్కర్మ్య మని వ్యాఖ్యానము చేయుచున్నారు నిష్కర్మేత్యాదిగా. అది కర్మాభావావస్థ కాదని చెప్పుచున్నారు జ్ఞానయోగముచే నిష్ఠ నని. అది సాధనములలోఁ జేర దని చెప్పుచున్నారు నిష్క్రియేత్యాదిగా. కర్మానుష్ఠానం బను నుపాయముచేఁ బొందఁబడినదై జ్ఞాననిష్ఠ స్వతంత్రముగనే పురుషార్థహేతు వగు నని ప్రకృతార్థమును సమర్థించుట వ్యతిరేకవచనముయొక్క తాత్పర్యం బని తలఁచి వ్యాఖ్యానము చేయుచున్నారు కర్మముల నిత్యాదిగా. తద్విపర్యయమునే వివరించుచున్నారు కర్మముల ననుష్ఠించుటవలన నిత్యాదిగా. చెప్పినయర్థమునకు హేతువు నడుగుచున్నాఁడు ఏకారణంబువలన ఇత్యాదిగా. తెలియఁగోరిన హేతువును జెప్పుచున్నారు చెప్పెదము ఇత్యాదిగా.

§ సన్న్యాసులకు.

ఉపాయం బైనను అవి లేనియెడ నెందువలన నైష్కర్మ్యము సిద్ధింప దని యాశంకించి చెప్పుచున్నారు ఉపాయము లేక ఇత్యాదిగా. జ్ఞానయోగమునకుఁ గర్మయోగం బుపాయం బనుటకు శ్రుతిస్మృతులను బ్రమాణముగాఁ జూపుచున్నారు కర్మయోగమే ఇత్యాదిగా. శ్రుతియందు ఉపాయోపేయత్వము ప్రతిపాదించుటం బ్రకటించుచున్నారు శ్రుతియందు ఇత్యాదిగా. ఇఁక గీతాశాస్త్రమునందుఁ గర్మయోగము జ్ఞానయోగమున కుపాయం బని యేయుపపాదనము చేయఁబడెనో దాని నుదాహరించుచున్నారు ఇందుఁగూడ నిత్యాదిగా. ఇట్లు పూర్వార్ధమునకు వ్యాఖ్యానము చేసి యుత్తరార్ధమునకు వ్యాఖ్య చేయుటకై యాశంక చూపుచున్నారు ఓయీ ఇత్యాదిగా. ఇత్యాదికముచే—ఇట ఆదిశబ్దముచే « శాన్తో దాన్త ఉపరతస్తితిక్షుః, సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః " ఇత్యాదికము గ్రహింపఁబడుచున్నది. అంతే లోకప్రసిద్ధి యనుకూలించుచున్న దని చెప్పుచున్నారు లోకంబునందుఁగూడ నిత్యాదిగా. మిక్కిలి ప్రసిద్ధము « యతో యతో నివర్తతే తతస్తతో విముచ్యతే। నివర్తనా ద్ధి సర్వతో నవేత్తి దుఃఖ మణ్వపి » ♦ ఇత్యాదులు కనఁబడుటవలన నని శేషము. లౌకికప్రసిద్ధివలనను వైదికప్రసిద్ధివలనను సిద్ధ మైనయర్థముఁ జెప్పుచున్నారు ఇందువలనను ఇత్యాదిగా. అందు కుత్తరముగా నుత్తరార్ధమును దించి వ్యాఖ్యానము చేయుచున్నారు ఇందుకుఁ జెప్పుచున్నాఁడు ఇత్యాదిగా. ఏవకారార్థము చెప్పుచున్నారు కేవలమైన అని. దానినే స్పష్టీకరించుచున్నారు కర్మపరిత్యాగమువలన నిత్యాదిగా.

హా. భయంకర మైన కర్మము చేయఁగూడ దని తలంచుచున్నయర్జునుం జూచి కర్మమునం దధికారి యగువాఁడు కర్మము చేయవలె నని తెలుపుటకై చెప్పుచున్నాఁడు.—కర్మణామ్ = కర్మములయొక్క ; అనారమ్భాత్ = చేయకుండుటవలన; నైష్కర్మ్యమ్ = నైష్కర్మ్యరూపము-అకర్త్రాత్మజ్ఞానరూప మగు సిద్ధిని; పురుషః; నాశ్నుతే. ఎట్లు జ్ఞానాధికారి జ్ఞానమువలన సిద్ధిని బొందుచున్నాఁడో అట్లు. అట్లయినయెడ సకల కర్మసన్న్యాసమే పురుషార్థము, దాని ననుష్ఠించెద నందువేని, అదియు నియతము గాదు.—సన్న్యసనా దేవచ = కర్మపరిత్యాగమాత్రము వలనఁగూడ; సిద్ధిమ్ = నైష్కర్మ్యరూపసిద్ధిని; సమధిగచ్ఛతి = పొందఁడు.

---

♦ దేని దేనినుండి నివర్తిల్లుచున్నాఁడో దాని దానినుండి విముక్తుఁ డగుచున్నాఁడు. అన్నిటినుండియు నివర్తిల్లుటవలనఁ గదా దుఃఖము కొంచెమైనను ఎఱుంగకుండును.

శం. ఓయీ! ఇట్లయినయెడ, జ్ఞానకర్మములు రెండును ఒకటి నొకటి యపేక్షింపకయే సాక్షా న్మోక్షహేతువు లనుట ప్రసక్తించుచున్నది అనఁగా. అట్లు కాదు. «న కర్మణా న ప్రజయా" ఇత్యాది శ్రుతులు కర్మము మోక్షసాధన మనుటను నిషేధించుట వలనను, «జ్ఞానాదేవతు కైవల్యమ్» అని యితరమును నిషేధించి జ్ఞానమే మోక్షసాధన మని నిర్ధారించుటవలనను గర్మమునకు మోక్ష సాధనత్వము సంభవింపదు. జ్ఞాన ముత్పన్న మైన పిదప నదియే తానే యితరము నపేక్షింపక ముక్తి సుఖము నొసంగుచున్న దనుట వాస్తవమే. అయినను «సత్త్వ శుద్ధా ధ్రువా స్మృతిః" అని చెప్పుటవలన సత్త్వ శుద్ధి లేక జ్ఞాన ముదయింప నేరదు. సత్త్వశుద్ధియో «బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన" అను శ్రుతి వలన యజ్ఞాది సత్కర్మము ననుష్ఠించినం గాని సిద్ధింపదు. అందువలన ముముక్షువు ఆత్మజ్ఞానము నొందనివాఁడు అవశ్యము చిత్తశుద్ధికొఱకు కర్మము చేయవలెను. చేయనిచో మోక్షము సిద్ధింపదు అని చెప్పుచున్నాఁడు—కర్మణామ్ = నిత్యములైన శ్రౌతస్మార్త కర్మములయొక్క; అనారమ్భాత్ = ఆచరింపమివలన; నైష్కర్మ్యమ్ = దేనియందుఁ గర్మము లేదో అది నిష్కర్మము—బ్రహ్మము, «నిష్కలం నిష్క్రియమ్» అను శ్రుతివలన, నిష్కర్మముయొక్క భావము నైష్కర్మ్యము, నిష్క్రియ బ్రహ్మరూపమున నుండుటను, ముక్తిని; పురుషః; నాశ్నుతే, ఉపాయము లేకుండుట వలన; ఉపాయం బున్న నే యుపేయము సిద్ధించును, ఎందువలన ఉపాయభూతంబు లగు కర్మముల ననుష్ఠింపకుండుటవలన ఉపేయభూతం బగు జ్ఞానంబును దత్ఫలమైన నైష్కర్మ్యమును బురుషునకు సిద్ధింపదో, అందువలన ముముక్షువు ఈశ్వరార్పణ బుద్ధిచే నిత్యనైమిత్తిక కర్మంబుల నవశ్య మనుష్ఠింపవలెను, అందుచే జ్ఞానమును మోక్షమును సిద్ధించు నని యర్థము. ఓయీ! 'న కర్మణా న ప్రజయా' అని శ్రుతియే కర్మము మోక్షసాధనమనుటను నిషేధించుట వలనను 'సన్న్యాస యోగాత్' అని సన్న్యాసమే యతులకు ముక్తిహేతు వని యుపదేశించుట వలనను సర్వకర్మములను సన్న్యసించియే నేను ఊరక సుఖంబుండెదను, ఒకప్పుడును జేయను క్లేశభూయిష్ఠం బగు కర్మమును, అందును హింసాప్రధానం బగు దానిని, అని యాశంకించి చెప్పుచున్నారు—సన్న్యసనాదేవ—కర్మము క్లేశభూయిష్ఠ మను బుద్ధిచేఁ గాని అలసతచేఁ గాని ఆపాత వైరాగ్యమువలన శిఖాయజ్ఞో పవీత ములను విడుచుటవలన మాత్రమె; సిద్ధిమ్ = నైష్కర్మ్యసిద్ధిని, విదేహముక్తిని; ముముక్షువు బ్రాహ్మణుఁడు, న సమధిగచ్ఛతి, వేదాంత శ్రవణజన్య మగు జ్ఞానము

లేకయే, « జ్ఞానాదేవతు కైవల్యమ్ " అను శ్రుతివలన. ఓయీ! సన్న్యసించి మోక్షముకొఱకు దహరోపాస్తిని గాని వైశ్వానరోపాస్తిని గాని శివపూజను గాని తన్నామ కీర్తనమునుగాని చేయుదును అందువేని. అందు మొదటిది సరికాదు, « సత్యకామ స్సత్య సంకల్పః » అని దహరోపాసనము సత్యకామత్వాది గుణసహిత మని చెప్పుటవలన గుణవంతము నుపాసించుటవలనఁ దద్భావమే పొందవలసి వచ్చును. రెండవదియుఁ గాదు, 'స సర్వేషు భూతేష్వన్నమత్తి' అని చెప్పఁబడియుండుటవలన వైశ్వానరోపాసనముచే సర్వభూతాత్ముఁడై అన్నాదనఫలమును ♦♦ మాత్రమే పొందవలసి వచ్చును. తృతీయంబును గాదు, « దేవో భూత్వా దేవా నప్యేతి » ** అను వచనమువలన శివలోకము పొందవలసి వచ్చును. నాలవపక్షమును యుక్తము గాదు « నా ఽస్తి పాతక మాహో కలికాలే నామకీర్తన పరేషు నరేషు। పుణ్య శ్రవణ కీర్తనమ్ " ❡ ఇత్యాది వచనమువలనఁ బాపక్షయము మాత్రమే ప్రయోజనము సిద్ధించుటవలన. ఏది దృశ్యమో అది యసత్తు అను వ్యాప్తిచే అవ్యాకృతము మొదలుగా స్థూలమువఱకుఁ గల సగుణము సమస్తంబును దృశ్యమగుటం జేసి అసత్తని తెలియుటవలన ఉపాస్యము సర్వంబును సగుణం బగుటచే తప్పక యసత్తే యగుం గావున అసత్తు నుపాసించుటచే అసద్భావమే ఫలము సిద్ధించును గాని సద్భావము ఎప్పుడును సిద్ధింపదు, ఫలసిద్ధి యుపాసనానురూప మగుటవలన. అట్లు « తం యథా యథో పాసతే తథైవ భవతి, అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేదచేత్ » § ఇత్యాది శ్రుతియును « యే యథా మాం ప్రపద్యన్తే» ఇత్యాది భగవద్వాక్యమును చెప్పుచున్నవి. మఱియు « అసుర్యా నామ తే లోకాః " ♦ అనియు 'న చేదిహా వేదీ న్మహతీ వినష్టిః' * అనియు ఆత్మతత్వము తెలియనివారికి అసురలోక ప్రాప్తిరూప మయిన మహానర్థము కలుగు నని చెప్పుటవలనను « అరున్ముఖాన్ యతీన్ సాలావృకేభ్యః ప్రాయచ్ఛత్ " అని వేదాంత

♦♦ అన్నము భక్షించుట యను ఫలమును.

** దేవుఁడై దేవతలను బొందుచున్నాఁడు.

❡ ఆశ్చర్యము! నామకీర్తనపరు లగు నరులందుఁ గలికాలమునఁ బాపములేదు, పుణ్యము గలిగించు శ్రవణమును కీర్తనమును గలవాని.

§ వాని ఎట్లు ఎట్లు ఉపాసించునో అట్లే యగుచున్నాఁడు, అసత్తు బ్రహ్మ మని తెలియునేని అతఁడు అసత్తే యగును.

♦ ఆత్మను తెలియనివారు అసుర లోకములను బొందుదురు.

* ఇచట తెలియఁ డేని గొప్పనష్టి యగును.

విముఖు లగు యతులకు ఇంద్రునివలన భయము గలుగు ననుటవలనను, 'ప్రత్యక్తత్త్వ వివేకాయ సన్న్యాస స్సర్వ కర్మణామ్ । శ్రుత్యా విధీయతే యస్మాత్ త్త్యాగీ పతితో భవేత్' ♦ అను స్మృతివలనను, సన్న్యాసముగూడఁ గర్మమే యగుటవలనను అంతమాత్రము వలననె మోక్షము సంభవింపమివలనను; అందువలన, ముముక్షు వగు యతి, యన్నివిధంబులచేతను వేదాంతశ్రవణముచేసి ప్రయత్నమున జ్ఞానము సంపాదింపవలె నని సూచించుచున్నాఁడు భగవంతుఁడు 'న చ సన్న్యసనా దేవ సిద్ధిం సమధి గచ్ఛతి' యని. చకారము తు అనుదాని యర్థము గలది. 'సన్న్యాసయోగాత్' ¶ అనుచోట బ్రహ్మవిదు లగు యతులు బ్రహ్మమునం దారోపితము లయిన నామరూపముల గ్రహణమును విడుచుట సన్న్యాస శబ్దముచేఁ జెప్పఁబడుచున్నది, కాని కర్మసన్న్యాసము కాదు, యతయః అను పదముచేతనే సన్న్యాసము సిద్ధమగుటవలన, కానిచోఁ బునరుక్తి ప్రసక్తించును. అందువలన యతికి సన్న్యాస ఫలము వేదాంతశ్రవణ జన్య జ్ఞానమే యని సిద్ధము.

వ్య. అందుఁ గారణములేనిచోఁ గార్యము కలుగదు, కావున, కర్మణామ్ = 'తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన' అను శ్రుతిచే ఆత్మజ్ఞానము నిమిత్తమై వినియుక్తము లయిన కర్మములయొక్క; అనారమ్భాత్ = అనుష్ఠానము చేయకుండుటవలన; చిత్తశుద్ధి లేమిం జేసి జ్ఞానమునకు అయోగ్యుఁడై బహిర్ముఖుఁ డైన, పురుషః = పురుషుఁడు; నైష్కర్మ్యమ్ = సర్వ కర్మశూన్యత్వమును, జ్ఞానయోగనిష్ఠ నని యర్థము; నాశ్నుతే = పొందఁడు. ఓయీ! 'ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి' § అను శ్రుతివలన సర్వ కర్మ సన్న్యాసముచేతనే జ్ఞాననిష్ఠాప్రాప్తి యుపపన్న మగుటవలన, కర్మము లనుష్ఠింపనేల? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—సన్న్యసనాత్ ఏవ = చిత్తశుద్ధి లేక చేయఁబడిన సన్న్యాసమువలన మాత్రమే; సిద్ధిమ్ = జ్ఞాననిష్ఠారూపసిద్ధిని; చక్కఁగా ఫలించునట్లు, నచ సమధి గచ్ఛతి = పొందనే పొందఁడు. కర్మజన్య మయిన చిత్తశుద్ధి లేనిచో సన్న్యాసమే సంభవింపదు.

♦ ప్రత్యగాత్మ తత్త్వము విచారించుటకొఱకు శ్రుతిచే సర్వ కర్మసన్న్యాసము విధింపఁబడుచున్నది, అందువలన అప్రత్యక్తత్త్వ వివేకమును విడిచినవాఁడు పతితుఁ డగును.

¶ సన్న్యాసయోగాద్యతయ శ్శుద్ధచిత్తాః.

§ ఈలోకమునే కోరినవారై సన్న్యాసులు సన్న్యసించుచున్నారు.

ఎట్లో యొకవిధమున ఔత్సుక్యమాత్రమున సన్న్యాసము నవలంబించినను అది ఫలజనకము కాఁ జాల దని భావము.

శ్రీ. ఇందువలనఁ జిత్తశుద్ధికలిగి జ్ఞానోత్పత్తి యగు పర్యంతము వర్ణాశ్రమోచితంబు లగు కర్మము లనుష్ఠింపవలెను, కానిచోఁ జిత్తశుద్ధి కలుగమింజేసి జ్ఞానము లభింపదని చెప్పుచున్నాఁడు.—కర్మణామ్; అనారమ్భాత్ =అనుష్ఠింపకపోవుటవలన; నైష్కర్మ్యమ్=జ్ఞానమును; నాశ్నుతే = పొందఁడు. ఓయీ! « ఏతమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి " అని సన్న్యాసము మోక్షాంగమని శ్రుతి యుపదేశించుటవలన సన్న్యాసమువలననె మోక్షము సిద్ధించుచుండగాఁ గర్మము లెందుకు? అనియాశంకించి చెప్పుచున్నాఁడు.—చిత్తశుద్ధిలేక చేయఁబడిన, సన్న్యసనాదేవ—జ్ఞానశూన్య మయిన దానివలన; సిద్ధిమ్ = మోక్షమును; సమధిగచ్ఛతి = పొందఁడు.

ప. చక్కని చిత్తశుద్ధిచే జ్ఞానోదయంబగువఱకు వర్ణాశ్రమోచితంబు లగు కర్మములు చేయవలెను; చేయనియెడఁ జిత్తశుద్ధి లేక జ్ఞానము కలుగదు. అను నీయభిప్రాయమును బ్రకటించుచుఁ జెప్పుచున్నాఁడు.—కర్మణామ్; అనారమ్భాత్ = అనుష్ఠింపమివలన; నైష్కర్మ్యమ్ = జ్ఞానమును; నాశ్నుతే = పొందఁడు. ఓయీ! « ఏతమేవప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి" ఇత్యాది శ్రుతివలన సన్న్యాసము గూడ మోక్షసాధన మగుటం జేసి దానిచేతనే పురుషార్థము సిద్ధించుచుండఁగాఁ గర్మమెందు కని యాశంకించి చెప్పుచున్నాఁడు ఉత్తరార్థముచేత. శ్రుతియును యజుస్సంహితయందు « కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః ఏవం త్వయి నాన్యథే తో౽స్తి నకర్మ లిప్యతే నరే" ఇందుకుభావ్యము.—ఇహ = ఈమోక్షమార్గమునందు, కర్మాణి కుర్వన్నేవ=కర్మములను జేయుచునే, శతంసమాః= నూఱేండ్లు, జిజీవిషేత్ = జీవింపఁగోరవలెను; కర్మము చేయకున్న నో మరణమే మే లని యర్థము. ఏవకారము అన్యయోగ వ్యవచ్ఛేదార్థము *. అందుచే కర్మము చేయవలసినదియే యని చెప్పఁబడినది; ఏవమ్ = ఈవిధముగా, కర్మము చేయుచుండఁగా, నరే = మనుష్యుఁడవు—దేహాభిమానివి, త్వయి = నీయందు, ఆమోక్షసాధనమైన, కర్మ = కర్మము; నలిప్యతే = ఫలభోగము కలిగింపదు. ఇతః = ఇంతకన్న, అన్యథా = వేఱుమోక్షమార్గము; నాస్తి = లేదు.

---

* ఇతరము గూడ దని బోధించుచున్నది.

మును * అగుచున్నది. అప్రయతులై ♦ గదా ప్రాయికముగా గృహస్థాదులు, ఇతరకర్మములందుఁ బ్రవృత్తి గల వార లగుటవలన, అప్రయతులకు జ్ఞానము సిద్ధింపదు. అట్లు శ్రుతి « నాశాన్తో నాసమాహితః » అని. యత్యాశ్రమమునందు భగవంతున కెక్కుడు సంతోషము. అట్లు « యత్యాశ్రమం తురీయం తు దీక్షాం మమ సుతోషణీమ్ » ¶ అని నారాయణాష్టాక్షరకల్పము. అధికారికులుమాత్రము ఆయధికారమునందియే ప్రాయత్యము ననుష్ఠింప సమర్థులు. అదియే భగవంతునకు గొప్పసంతోషజనకము. అట్లు చెప్పఁబడినది « దేవాదీనా మాదిరాజ్ఞాం మహోద్యోగేపి భోగినః। విష్ణో శ్చలతి తద్భోగో ఉత్యతీవ హరితోషణమ్ » ** అని పాద్మమునందు.

కర్మములను జేయకుండుటవలనఁ బురుషుఁడు మోక్షము నొందఁజాలఁడు, కామ్యకర్మముల విడుచుటమాత్రమువలనఁ గూడ మోక్షము సిద్ధింపదు. మఱేమనఁగా అకామకర్మానుష్ఠానముచే అంతఃకరణశుద్ధి గలిగి దానిచే జ్ఞానము సిద్ధించి యాజ్ఞానమువలననె మోక్షము గలుగవలె నని తాత్పర్యము.

నహి కశ్చి త్క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః. ౫

భా. ఏకారణమువలన మఱి కేవలము జ్ఞానరహితమగు కర్మసన్న్యాసమాత్రమువలననె నైష్కర్మ్యరూప సిద్ధిని బురుషుఁడు పొందనేరఁడు? అని హేతువు నాకాంక్షింపఁగాఁ జెప్పుచున్నాఁడు.—హి—ఎందువలననఁగా; క్షణమపి=కొంచెముసేపైనను; జాతు = ఒకానొకప్పుడైనను; కశ్చిత్ = ఒకానొకఁడును; అకర్మకృత్ = కర్మము చేయనివాఁడై; నతిష్ఠతి=ఉండఁడు. ఎందువలన? హి—ఎందువలన ననఁగా; సర్వః=సమస్తప్రాణియును; అవశః= స్వాధీనత లేనివాఁడైయె; కర్మ=కర్మమును, ప్రకృతిజైః=ప్రకృతివలనఁబుట్టిన; గుణైః = సత్త్వరజస్తమోగుణములచేత;

* ప్రాయత్యము—ప్రయతత్వము—ఈశ్వరునందు మనస్సమాధానము ప్రయోజనముగాఁ గలది, భగవంతుని సంతోషపెట్టుట ప్రయోజనముగాఁ గలది.

♦ ఈశ్వరునందు మనస్సమాధానము లేనివారలే.

¶ చాలవదైన యత్యాశ్రమమును—నాకు మిక్కిలి సంతోషముగలిగించునట్టి దీక్షను.

** దేవతలు మొదలగువారును ఆదిరాజులును గొప్ప యుద్యోగము గలవారైనను వారిభోగము భోగించుటకు విష్ణువుఁ జెందుచున్నది. అది మిక్కిలి హరితోషణం బగుచున్నది.

కార్యతే= చేయింపఁబడుచున్నాఁడు; అజ్ఞుఁ డని వాక్యశేషము*. అట్లు చెప్పఁబోవుచున్నాఁడు « గుణైర్యో నవిచాల్యతే » అని. సాంఖ్యులను వేఱుచేయుటవలన అజ్ఞులకే గదా కర్మయోగము, జ్ఞానులకుఁ గాదు గదా! జ్ఞానులకో గుణములచేఁ జలింపఁజేయఁబడని వారికి స్వతశ్చలనము లేమివలనఁ గర్మయోగం బుపపన్నముగాదు. అట్లు వ్యాఖ్యానము చేయఁబడినది, « వేదా వినాశినమ్ » అనుస్థలమున.

ఏలయనఁగా అజ్ఞాని ఎవ్వఁడును గూడ ఒకప్పు డైనను గొంచెముసేపైనను కర్మము చేయక యుండఁ జాలఁడు. ఎందువలన ననఁగా, అజ్ఞానులందఱును ప్రకృతిజన్యంబు లగు సత్త్వరజస్తమోగుణములచే స్వేచ్ఛ లేకున్నను బరవశులై కర్మము చేయునట్లు చేయఁబడుదు రని తాత్పర్యము.

ఆ. చెప్పినయర్థమునందుఁ దెలియఁగోరిన హేతువును జెప్పుటకై మీఁది శ్లోకము నెత్తుచున్నారు ఏకారణమువలన ఇత్యాదిగా. ఒకానొకప్పుడును క్షణమాత్ర మైనను ఎవ్వఁడును కర్మముచేయకుండఁ డనుటకు హేతువుగా నుత్తరార్థమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు ఎందువలన ఇత్యాదిగా. సర్వశబ్దమువలన జ్ఞానియును గుణములచే అవశుఁడై కర్మము చేయింపఁబడు నని యేర్పడుచున్నది, అందుచే జ్ఞానికి సన్న్యాసము చెప్పుట నిరవకాశం బగు నని యాశంకించి చెప్పుచున్నారు అజ్ఞుఁడు ఇత్యాదిగా. ఆత్మజ్ఞానవంతుఁడు గుణములచేఁ జలింపఁజేయఁబడనివాఁ డగుటచే గుణాతీతుఁ డనఁబడును, కావున స్వేచ్ఛమెయిఁ గార్యకరణ సంఘాతమును బ్రవర్తింపఁజేయుట కశక్తుఁడు కార్యకరణ సంఘాతము జయింప నేరనివాఁ డగు అజ్ఞుఁడే సత్త్వాదిగుణములచేఁ గర్మమునందుఁ బ్రవర్తింపఁ జేయఁబడువాఁ డని యర్థము. జ్ఞానయోగేనే త్యాదిగాఁ జెప్పిన న్యాయమువలనఁ గూడ వాక్యశేషం బుపపన్నం బని చెప్పుచున్నారు సాంఖ్యులను ఇత్యాదిగా. జ్ఞానికి గుణప్రయుక్త చలనము లేకున్నను స్వాభావికచలనబలమువలనఁ గర్మయోగము కావచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు జ్ఞానులకో ఇత్యాదిగా. ప్రత్యగాత్మకు స్వాభావికచలనము సంభవింపదనుటకు మును చెప్పిన న్యాయమును స్మరణకుఁ దెచ్చుచున్నారు అట్లు ఇత్యాదిగా.

హ. ♦

---

* సర్వః అనుదానికి విశేషణము చేయవలెను.

♦ పదయోజన శంకరభాష్యముతో సమానము.

శ్రీం. సర్వకర్మసన్న్యాసము చేసి నేను ఊరక సుఖంబుగనుండెద నని చెప్పితివే. అది సంభవింపదు, పూర్వసంస్కారమువలన సంభవించునట్టి క్రియను నిశ్శేషముగా విడుచుట యశక్యమగుటవలనను, వృత్తికి * ఆలంబనము లేమి వలనను, ఊరకయుండుట బ్రహ్మనిష్ఠునికిం దక్క మఱియెవ్వనికిని ఘటిల్లదను నభిప్రాయముతోఁ జెప్పుచున్నాఁడు.—ఈలోకమునందు, జాతు = ఒకానొకప్పుడుగూడ; కశ్చిత్ = ఎవ్వఁడైనను, ఏప్రాణిగూడ; క్షణమ్= క్షణకాలముగూడ; అకర్మకృత్ = ఏకర్మను నైనను జేయనివాఁడై; నతిష్ఠతి = ఉండఁడు, మఱే మనఁగా, సుషుప్తియందుఁ దక్క జాగ్రత్స్వప్నములం దెల్లప్పుడు కాయముచేఁగాని మనస్సుచేఁగాని వాక్కుచేఁ గాని చక్షురాదులచేఁ గాని యేదో యొకకర్మము చేయుచునేయుండును, ఒకానొకప్పుడును ఊరకయుండఁ డని యర్థము. ఇదియంతయుఁ బ్రత్యక్ష మని, హి యనునది ప్రసిద్ధినిదెలుపుచున్నది. ఎందువలన ఊరకయుండఁ జాలఁడనఁగాఁ జెప్పుచున్నాఁడు—హి=ఎందువలన ననఁగా; సర్వః = సమస్తమైన ప్రాణివర్గమును; ప్రకృతిజైః—ప్రకృతియనఁగా సత్త్వరజస్తమోగుణాత్మక మగు మూలప్రకృతి, దానివలనఁ బుట్టినవి ప్రకృతిజములు, అట్టి; గుణైః = ద్రవ్యవాసన గుణవాసన కర్మవాసన జాతివాసన రాగద్వేషాదులు, వీనిచేత; లోపలఁ బ్రేరేంపఁ బడుచున్నదై, అవశః = అస్వతంత్రమైయే; వెలుపలను లోపలను, కర్మ = కర్మమును; కార్యతే = చేయింపఁబడుచున్నది. వాసనాత్మకం బగు ప్రకృతికి వశుఁ డగుటం జేసి యెవ్వండును ఊరకయుండంజాలఁడు బ్రహ్మవిద్వర్యుఁడుదక్క, బ్రహ్మవిద్వర్యుఁడో నిర్వికల్పసమాధి యను నగ్నిచే ప్రకృతిగుణంబులును తత్కార్యంబులును అను తూలరాశిని దహించినవాఁ డగుటవలన వాయువుచే మేరుపర్వతముఁ బోలెఁ దాను గుణములచేఁ జలనమునొందఁడు. మఱే మనఁగా నిష్క్రియ బ్రహ్మరూపంబున ఊరకయేయుండును, "ఉదాసీనవ దాసీనో గుణైర్యో నవిచాల్యతే" అని చెప్పఁబోవుటవలన. అందువలన బ్రహ్మవిద్వర్యుఁ డొక్కఁడే యూరకయుండఁ జాలును, అతఁడుదక్క మఱియెవ్వండును జాలఁ డని యర్థము.

మ. అందుఁ గర్మముచేఁ గలుగు చిత్తశుద్ధిలేనిచో బహిర్ముఖుఁ డయ్యే=పురుషుఁడు; హి = ఏకారణమువలన; క్షణమపి = క్షణకాల మైనను, జాతు= ఒకానొకప్పుడును; కశ్చిత్ = అజితేంద్రియుం డెవ్వఁడును; అకర్మకృత్ = కర్మమును జేయనివాఁడై; నతిష్ఠతి = ఉండఁడు, మఱే మనఁగా లౌకిక వైదిక కర్మములనను

* అంతఃకరణవృత్తికి.

ష్ఠించుచునే యుండును. అందువలనఁ జిత్తశుద్ధిలేనివానికి సన్న్యాసము సంభవింప దని యర్థము. ఎందువలన మఱియవిద్వాంసుఁడు కర్మములఁ జేయకుండఁడు ? హి = ఎందు వలన ననఁగా. సర్వః = సమస్తప్రాణియును, చిత్తశుద్ధిరహితుఁడు; అవశః = స్వతంత్రుఁడు కానివాఁడై యె; ప్రకృతిజైః గుణైః = ప్రకృతివలనఁ బుట్టిన వై కార్యాకారంబున అభివ్యక్తములయిన సత్త్వరజస్తమోగుణంబులచేత, లేక, స్వాభావంబు వలనఁ బుట్టిన రాగద్వేషాది గుణములచేత; కర్మ = లౌకిక కర్మమునుగాని వైదిక కర్మమునుగాని; కార్యతే = చేయింపఁబడుచున్నాఁడు; కావునఁ గర్మములను జేయక యెవ్వఁడు నుండఁ డని యర్థము. స్వాభావికము లయిన గుణంబులు చలింపంజేయునవి యగుటవలనఁ బరవశుఁడై సర్వదా కర్మములం జేయుచుండెడు చిత్తశుద్ధిరహితునకు సర్వకర్మసన్న్యాసము సంభవింపదు. కావున సన్న్యాసముచేఁ గలుగు జ్ఞాననిష్ఠయు సంభవింప దని యర్థము.

శ్రీ. కర్మముల సన్న్యాస మనఁగా వానియందు ఆసక్తి లేకయుండుటయే, కాని స్వరూపమున విడుచుటకాదు, అశక్యమగుటవలన నని చెప్పుచున్నాఁడు.—జాతు = ఏయవస్థయందును; క్షణమపి = క్షణమాత్ర మైనను; కశ్చిత్ = ఎవ్వఁడును, జ్ఞానిగాని అజ్ఞానిగాని; అకర్మకృత్ = కర్మములను జేయనివాఁడై; నతిష్ఠతి. అందుకు హేతువు—ప్రకృతిజైః = స్వభావమువలనఁ గలుగునట్టి; గుణైః = రాగద్వేషాది గుణములచేత; సర్వః = సమస్తజనమును; కర్మ కార్యతే—కర్మమునందుఁ బ్రవర్తింపఁజేయఁబడుచున్నాఁడు; అవశః = అస్వతంత్రుఁడై.

ప. ఇఁక సత్కర్మమునం దుద్విగ్నచిత్తుఁ డగువానిం గూర్చి యుపపత్తిచే బోధించుచున్నాఁడు.—కశ్చిత్ = ఒకానొకఁడుగూడ; జాతు = ఒకానొకప్పుడు గూడ; అకర్మకృత్; నహితిష్ఠతి = ఉండఁడుగదా! మ తే మనఁగా, సర్వః = సమస్తజనముగూడ; అవశః = అస్వతంత్రమై; ప్రకృతిజైః = స్వభావమువలనఁ గలిగిన; గుణైః; కర్మ = కరచరణ చేష్టారూప మయిన కర్మమును; కార్యతే—కర్మమునందుఁ బ్రేరింపఁబడుచున్నాఁడు; అందు ఉద్విగ్నుఁ డయ్యును జేయనే చేయుచున్నాఁడు, మఱి, సత్కర్మమునందు మాత్రము ప్రవర్తింపఁ డని యాశ్చర్యము!

రా. దీనినే యుపపాదించుచున్నాఁడు—ఈలోకమునందున్న పురుషుఁడు, కశ్చిత్ = ఒకానొకఁడును; జాతు = ఒకానొకప్పుడును; క్షణమపి; అకర్మకృత్ = కర్మముచేయనివాఁడై; నతిష్ఠతి హి = ఉండఁడుగదా! హి = ఎందు వలనననఁగా.

ఏమియుఁ జేయ నని నిశ్చయించుకొన్న వాఁడైనను, సర్వః = సమస్తపురుషుఁడును; ప్రకృతిజైః = ప్రకృతివలనఁ బుట్టిన, ప్రాచీనకర్మమున కనుగుణముగా వృద్ధిఁబొందినట్టి; గుణైః = సత్త్వరజస్తమో గుణములచేత; కర్మ = స్వోచిత మయిన కర్మమును గూర్చి; అవశః = స్వతంత్రత లేనివాఁడై; కార్యతే = ప్రవర్తింపఁ జేయఁబడుచున్నాఁడు. ఇందువలన ఉక్తలక్షణం బగు కర్మయోగముచేఁ బ్రాచీనంబగు కర్మమును నశింపఁజేసికొని సత్త్వాదిగుణములను స్వాధీనపఱచుకొని నిర్మలాంతః కరణుండై జ్ఞానయోగము సంపాదింపవలెను.

ఈలోకమునందున్న పురుషుఁ డెవ్వఁడును క్షణకాలమైనను గర్మము చేయకయుండఁ జాలఁడు. అతఁడు చేయనని పట్టుపట్టినను, ప్రకృతిజన్యములై పూర్వకృతకర్మానురూపముగా వృద్ధినొందియుండు సత్త్వరజస్తమోగుణంబు లతని నిర్బంధించి తమకనురూప మయిన కర్మమునందుఁ బ్రవర్తించునట్లు చేయును. అందువలన జ్ఞానయోగముపొందఁ గోరువాఁడు మొదట కర్మయోగము ననుష్ఠించి యందుచే పూర్వకృతపాపసంచయము నశింపఁజేసి సత్త్వాదిగుణంబుల స్వాధీనపఱచుకొని యంతఃకరణశుద్ధి నొందినవాఁడై యటుపిమ్మట జ్ఞానయోగమునకు యత్నింపవలె నని తాత్పర్యము.

మూ. కర్మములేమో నిశ్శేషముగా విడువ శక్యములు గా వని చెప్పుచున్నాఁడు న హీత్యాదిగా.

కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇన్ద్రియార్థా న్విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే. ౬

భా. ఇఁక 'ఆత్మను దెలియనివాఁడెవ్వఁడు విహితమైన కర్మముఁ జేయఁడో' అది సరి కా దని చెప్పుచున్నాఁడు.— యః = ఎవ్వఁడు; విమూఢాత్మా = విమూఢ మయిన అంతఃకరణముగలవాఁడు *; కర్మేన్ద్రియాణి=హస్తము మొదలగు కర్మేన్ద్రియములను; సంయమ్య=నిగ్రహించి; మనసా = మనస్సుచేత; ఇన్ద్రియార్థాన్ = విషయములను; స్మరన్=స్మరించుచు; ఆస్తే = ఉన్నాఁడో; సః = అతఁడు; మిథ్యాచారః= మిథ్యయైన యాచారము గలవాఁడు † అని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

* మోహయుక్త మయిన–రాగద్వేషాదిదూషిత మయిన అంతఃకరణముగలవాఁడు.

† తనచిత్తవృత్తికి విరుద్ధమైన వేషముగలవాఁడు, కపటపు నడవడిగలవాఁడు.

ఎవ్వఁడు అంతఃకరణశుద్ధి లేక కర్మేంద్రియములను మాత్రము నిర్బంధించి, చిత్తము అశుద్ధమగుటచే దాని నిరోధింపఁజాలక విషయములను స్మరించుచుండునో, అతనియాచారము చిత్తవృత్తికి విరుద్ధము నిష్ప్రయోజనము అగుటవలన అతఁడు మిథ్యాచారుఁ డని చెప్పఁబడు నని తాత్పర్యము.

ఆ. అప్పుడు ఆత్మజ్ఞానికివలె అనాత్మజ్ఞునకును గర్మముచేయనిచోఁ బ్రత్యవాయములేదు, శరీరేంద్రియ సంఘాతమును నిగ్రహించుట కసమర్థుఁడై మూర్ఖుఁడైనవానికిఁ గూడ సన్న్యాసము సంభవించుటవలన. అని యాశంకించి చెప్పుచున్నారు ఇఁక ఇత్యాదిగా. అది—అతఁడు విహితకర్మము చేయకుండుట, సరికాదు మిథ్యాచారుఁ డగుటవలన నని భావము. మిథ్యాచారత్వమునే వర్ణించుచున్నారు యః ఇత్యాదిగా.

ప. కర్మేన్ద్రియాణి = వాక్పాణిపాదపాయూపస్థములను; సంయమ్య = నిరోధించి; మనసా; ఇన్ద్రియార్థాన్ = విషయములను; స్మరన్, యః, విమూఢాత్మా-విమూఢ మయిన యంతఃకరణము గలవాఁడు; ఆస్తే = కూర్చుండునో; సః; మిథ్యాచారః = పాపాచారుఁ డని; ఉచ్యతే. ఇతఁడు సన్న్యాసికాఁడు, మానసవ్యాపారముండుటవలన నని యభిప్రాయము.

శం. ఓయీ! సమస్తకర్మమును సన్న్యసించి పాణిపాదాదు లగు నింద్రియముల నిరోధించి వెలుపలికి ఊరకస్థాణువువలె నిశ్చలముగానుండుట శక్యముకానే యగు నని యాశంకించి; అట్లు కాదు, బంధమోక్షగతిని దనయధికారమునుం దెలియక నిష్ఫలము క్లేశభూయిష్ఠం బగు కర్మమేల చేయవలయునను దురహంకారముచే మోక్షసాధనం బగు వైదికకర్మము సమస్తంబును సన్న్యసించి యెవ్వఁడు ఊరకయుండునో అతఁడు దంభాచారుఁ డని చెప్పుచున్నాఁడు.—విమూఢాత్మా = విమూఢము—కార్యాకార్య వివేకము లేనిదియగు మనస్సుగలవాఁడై; తనకుఁ గర్తవ్యముగా వేదవిహితమయిన ముక్తిసాధనం బగుకర్మమును విడిచి వెలుపలికి; కర్మేన్ద్రియాణి; సంయమ్య= నిరోధించి; కన్నులు మూసికొనిలోపల, మనసా = మనస్సుచే; ఇన్ద్రియార్థాన్ = శబ్దాదులను; స్మరన్ = చింతించుచు; యః, ఆస్తే, బ్రహ్మవిదుఁడను నేనే కర్మసన్న్యాసముచేఁ గృతార్థుఁడనైతి నని; సః, మిథ్యాచారః = అసదాచారుఁడు, కపటపు ఆచారము గలవాఁడు ఆత్మవంచకుఁడు * అని; సత్పురుషులచే,

* తన్నుఁ దా వంచించుకొనువాఁడు.

ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁ డని యర్థము. ఇందుచే, శ్రవణార్థముగాని మఱియొక విధమునఁగాని సన్న్యసించి శ్రవణాదికముచేయక వేషముచే జీవనము చేయుచు, సన్న్యాసముచేతనే కృతకృత్యుఁడ నైతి నని యేయతి తలంచుచున్నాఁడో అతఁడు గూడ మిథ్యాచారుఁడే యని సూచితం బగుచున్నది.

మ. శుద్ధచిత్తుఁడు కాక ఎట్లో యొకవిధంబున ఔత్సుక్యమాత్రముచే సన్న్యాసము చేసినచో, తత్ఫలము పొందఁ జాలఁడు. ఎందువలన నఁగా—యః, విమూఢాత్మా = రాగద్వేషాదులచే దూషిత మయిన అంతఃకరణము గలవాఁడు; ఔత్సుక్యమాత్రమున, కర్మేన్ద్రియాణి = వాక్పాణిపాదాదులను; సంయమ్య = నిగ్రహించి, బహిరింద్రియములచేఁ గర్మములఁ జేయనివాఁడై యని యర్థము. మనసా= రాగాదిప్రేరిత మయిన మనస్సుచే; ఇన్ద్రియార్థాన్ = శబ్దాదులను, కాని ఆత్మతత్త్వ మును గాదు; స్మరన్, ఆస్తే = సన్న్యాసము చేసినవాఁడ నే నను నభిమానముచేఁ గర్మశూన్యుఁ డై యున్నాఁడో, సః, మిథ్యాచారః = సత్త్వశుద్ధి లేమిం జేసి ఫల మున కయోగ్యుఁ డగుటవలనఁ బాపాచారుఁ డని; ఉచ్యతే, “త్వంపదార్థ వివేకాయ సన్న్యాస స్సర్వకర్మణామ్ । శ్రుత్యేహ విహితో యస్మా త్తత్త్యాగీ పతితో భవేత్ ॥” * ఇత్యాదిధర్మశాస్త్రముచేత. అందువలన ఉపపన్నము అశుద్ధాంతః కరణుఁడు సన్న్యసించుమాత్రాన సిద్ధినిబొందఁ డని.

శ్రీ. అందువలనఁ గర్మత్యాగి యయిన అజ్ఞుని నిందించుచున్నాఁడు— కర్మేన్ద్రియాణి= వాక్పాణ్యాది కర్మేంద్రియములను; సంయమ్య = నిగ్రహించి; యః, మనసా; భగవద్ధ్యానవ్యాజంబున, ఇన్ద్రియార్థాన్ = విషయములను; స్మరన్, ఆస్తే, మనస్సు అశుద్ధమగుటచే ఆత్మయందు నిలువక చలించుటవలన. సః, మిథ్యాచారః= కపటాచారుఁడు దాంభికుఁ డని; ఉచ్యతే.

ప. ఇఁక, ఏపురుషుఁడు నేను నైష్కర్మ్యసిద్ధి నొందినవాఁడ నని ధ్యాన వ్యాజమునఁ గన్నులు మూసికొని యుండునో వానినిగూడ నిందించుచున్నాఁడు.— కర్మేన్ద్రియాణి—వాక్పాణిపాదాదులను; సంయమ్య=నియమించి; ఊరక యున్నాఁడో. మనసా = మనస్సుచేతనో. ఇన్ద్రియార్థాన్ = రూపరసాది విషయములను, స్మరన్ = స్మరించుచు, మిథ్యాచారః = దాంభికుఁడై, ఆస్తే; సః, విమూఢాత్ముఁ డని చెప్పఁ

* త్వం పదార్థముయొక్క వివేకముకొఱకు సర్వకర్మసన్న్యాసము శ్రుతిచే నిట విహిత మయ్యెను. అందువలన దాని విడిచినవాఁడు పతితుం డగును.

బడుచున్నాఁడు, తన హితముఁ దెలియక వ్యర్థముగా ఆయుస్సు గడపుచున్నాఁ డని యర్థము.

రా. అట్లు గాక జ్ఞానయోగమునకుఁ బ్రవర్తించినచో మిథ్యాచారుం డగుచున్నాఁ డని చెప్పుచున్నాఁడు —పాపములు నశింపమిచే బాహ్యాంతఃకరణముల జయింపఁజాలక ఆత్మజ్ఞానమునకుఁ బ్రవర్తించినవాఁడై, యః = ఎవ్వఁడు; కర్మేన్ద్రియాణి; సంయమ్య; విమూఢాత్మా మనసా ఇన్ద్రియార్థాన్ స్మరన్—విషయపరుం డగుటచే ఆత్మవిముఖ మయిన మనస్సుగలవాఁడై విషయములనే స్మరించుచు; ఆస్తే = ఉన్నాఁడో; సః= అతఁడు; ఒకవిధముగా సంకల్పించి మఱియొకవిధముగాఁ జరించుచున్నాఁడు కావున, మిథ్యాచారః ఉచ్యతే = మిథ్యాచారుం డని చెప్పఁబడుచున్నాఁడు—ఆత్మజ్ఞానమున కుద్యుక్తుఁడై యందుకు విపరీతముగా వినాశము పొందుచున్నాఁ డని యర్థము.

యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతే௨ర్జున
కర్మేన్ద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే. ౭

భా. అర్జున = అర్జునుఁడా! యస్తు = ఎవ్వఁడు మఱి, కర్మమునం దధికృతుఁడైన అజ్ఞుఁడు; ఇన్ద్రియాణి = జ్ఞానేంద్రియములను; మనసా = మనస్సుచే; నియమ్య = నిగ్రహించి; కర్మేన్ద్రియైః = వాక్కు పాణి మొదలగు కర్మేంద్రియములచేత; కర్మయోగమ్= కర్మయోగమును; అసక్తః=ఫలాభిలాష లేనివాఁడై; ఆరభతే = చేయుచున్నాఁడో; సః = అతఁడు; విశిష్యతే = అధికుఁ డగుచున్నాఁడు, ఇతరుఁ డైన మిథ్యాచారునికంటె.

అజ్ఞాని యగుటచేఁ గర్మమునం దధికృతుఁ డైనవాఁడు ఎవఁడు మనస్సుచే జ్ఞానేంద్రియములను నిగ్రహించి ఫలాభిలాష లేనివాఁడై కర్మేంద్రియములచేఁ గర్మయోగమునను ష్ఠించుచుండునో అతఁడు మున్ను చెప్పిన మిథ్యాచారునికన్నను మిక్కిలి యధికుఁ డగుచున్నాఁ డని తాత్పర్యము.

రా. అనాత్మజ్ఞుఁడు విహితకర్మము చేయకున్నచో జాగ్రదవస్థయందు విషయదర్శనము తప్పమివలన మిథ్యాచారుఁ డగు నని యతనికిఁ బ్రత్యవాయము చెప్పి అతఁడే విహితకర్మము చేయుచు ఫలాభిలాష లేక యున్నచో సదాచారుం డగునని యతని కాధిక్యము చెప్పుచున్నాఁడు యస్త్విన్ద్రియాణీత్యాదిశ్లోకముచేత. విహిత

కర్మము చేయువాఁడు కర్మము విడిచిన మూర్ఖునికన్న నధికుఁ డనుటను అతిరహస్యా జనచే స్పష్టీకరించుచున్నారు అర్జున ఇత్యాదిగా.

హ. ♦

శం. అనాత్మజ్ఞుఁడు ముముక్షువు అగువానికిఁ గర్మసన్న్యాసముకన్నఁ గర్మయోగమే శ్రేష్ఠ మని చెప్పుచున్నాఁడు.—తు శబ్దము మున్ను చెప్పినవాని కంటె వీనియందు శ్రేష్ఠతను దెలుపుటకొఱకు. యస్తు = ఎవ్వఁడు మఱి అనాత్మజ్ఞుఁడు ముముక్షువు, విచక్షణతచేఁ గర్మసన్న్యాసమును జేయకయే; ఇన్ద్రియాణి = చక్షురాదీంద్రియములను; రాగద్వేషాదిదోషముల కాస్పదము ఎట్లు కావో అట్లు, మనసా, నియమ్య; తాను, అసక్తః = ఫలాభిసంధి లేనివాఁడై; ఈశ్వరార్పణబుద్ధిచే, కర్మేన్ద్రియైః = వాగాదికర్మేంద్రియములచే; కర్మయోగమ్—శ్రౌతమునుగాని స్మార్తమునుగాని; ఆరభతే = శ్రద్ధచేఁ జిత్తశుద్ధికొఱకుఁ జేయుచున్నాఁడో; సః, విశిష్యతే—మోక్షసాధన మయిన కర్మయోగముసం దున్నవాఁ డగుటవలనఁ గర్మయోగి మున్ను చెప్పిన దాంభికకర్మసన్న్యాసికంటె శ్రేష్ఠుఁ డని యర్థము.

మ. ఔత్సుక్యము గలిగినమాత్రాన సర్వకర్మములను సన్న్యసింపఁ గూడదు. మ ఱే మనఁగా చిత్తశుద్ధికొఱకు నిష్కామకర్మములనే యథాశాస్త్ర మనుష్ఠింపవలెను, ఎందువలన ననఁగా—తు శబ్దము అంతఃకరణశుద్ధి లేక సన్న్యసించినవాని వ్యావృత్తికొఱకు *; ఇన్ద్రియాణి = శ్రోత్రాదిజ్ఞానేంద్రియములను; మనసా = మనస్సుతోఁగూడ; నియమ్య—పాపహేతువు లగు శబ్దాదివిషయములం గల యాసక్తినుండి మరలించి; లేక, మనసా = వివేకయుక్త మయిన మనస్సుచే, నియమ్య; కర్మేన్ద్రియైః—వాక్పాణ్యాదులచేత; కర్మయోగమ్ = శుద్ధిహేతు వగుటచే విహిత మగు కర్మమును; ఆరభతే = చేయుచున్నాఁడో; అసక్తః = ఫలాభిలాష లేనివాఁడై; యః = ఏవివేకి. సః = అతఁడు; ఇతరుఁ డైన మిథ్యాచారునికంటె; విశిష్యతే—పరిశ్రమము సమమైనను ఫలాతిశయముఁ బొందువాఁ డగుటచే శ్రేష్ఠుఁ డగుచున్నాఁడు. అర్జున—ఓయర్జునా! ఆశ్చర్యం బిది చూడుము—ఒకఁడు కర్మేంద్రియముల నిగ్రహించి జ్ఞానేంద్రియవ్యాపారము గలవాఁడై పురుషార్థశూన్యుఁ డగుచున్నాఁడు, మఱియొకఁడో జ్ఞానేంద్రియముల నిగ్రహించి కర్మేంద్రియవ్యాపారము గలవాఁడై పరమపురుషార్థము నొందుచున్నాఁడు!

---

♦ శంకరభాష్యములో సమానము.

* మున్ను చెప్పినవానివలె చిత్తశుద్ధి లేకయే సన్న్యసింపక.

శ్రీ. వీనికి విపరీతుఁడైన కర్మకర్త శ్రేష్ఠుఁడని చెప్పుచున్నాఁడు— యస్తు; జ్ఞానేన్ద్రియాణి, మనసా, నియమ్య = ఈశ్వరాసక్తములనుగాఁ జేసి; కర్మేన్ద్రియైః; కర్మయోగమ్ = కర్మరూప మయిన యుపాయమును; ఆరభతే = అనుష్ఠించుచున్నాఁడో; అసక్తః = ఫలాభిలాష లేనివాఁడై, సః, విశిష్యతే = అధికుఁడగుచున్నాఁడు, చిత్తశుద్ధి నొందుటచే జ్ఞానవంతుఁ డగుచున్నాఁ డని యర్థము.

ప. ఇఁక విమూఢాత్ముఁడు కానివాని వర్ణించుచున్నాఁడు—యస్తు; కరణములనోశ, నస్పూతె, నియమ్య, అసక్తం, క్రొత్తలా
జ్ఞానేంద్రియములను, మనసా = ఆత్మాపేక్ష లేనివాఁడై, కర్మేంద్రియైః, కర్మయోగమ్, ఆరభతే, అతఁడే, విశిష్యతే = అధికుఁ డగుచున్నాఁడు, చిత్తశుద్ధి నొంది జ్ఞానవంతుఁ డగుచున్నాఁడు. అందువలన నీ వట్టివాఁడ వగు మని తాత్పర్యము.

రా. అందువలన మున్ను అభ్యస్తమైన విషయమునకు సజాతీయమైన శాస్త్రీయకర్మమునందు, ఇన్ద్రియాణి= ఇంద్రియములను; మనసా= ఆత్మావలోకనమునందుఁ బ్రవృత్తమయిన మనస్సుచే; నియమ్య =నియమించి; కర్మేన్ద్రియైః = తమయంతనే కర్మపరములైన ఆయింద్రియములచే; అసక్తః = అసంగపూర్వకముగా *; యః = ఎవఁడు; కర్మయోగమ్ = కర్మయోగమును; ఆరభతే = ఆరంభించుచున్నాఁడో; సః = అతఁడు; ప్రమాదమున కవకాశము లేనివాఁ డగుటచే జ్ఞాననిష్ఠపురుషునికన్నను, విశిష్యతే = అధికుఁ డగుచున్నాఁడు.

అందువలన, ఇంద్రియములకు అనాదిగాఁ గర్మాచరణమే అభ్యస్తమై యుండుటంజేసి యందు నిషిద్ధకర్మములనుండి వాని మరలించి శాస్త్రవిహితము లయిన కర్మములందుమాత్రమే మనస్సుచే నిలుపవలయును. ఇట్లు తమయంతఁ దామే కర్మములందుఁ దగిలియుండు నింద్రియములచే ఫలాపేక్ష విడిచి కర్మయోగము నెవ్వఁ డారంభించుచున్నాఁడో అతఁ డెప్పుడును ప్రమాదము పొందఁడు. అందువలన నతఁడు జ్ఞాననిష్ఠునికంటె నధికుఁ డగుచున్నాఁ డని తాత్పర్యము.

మా. అట్లయిన శక్తిలేదని త్యాగము చేయవచ్చు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—మనస్సే ప్రయోజకము ♦ అని తెలుపుటకై అన్వయవ్యతిరేక

---

* మొదట ఫలాభిలాష విడిచినవాఁడై.

♦ మనస్సే బంధమునుం గలిగించునది మోక్షమునుం గలిగించునది, కాని కర్మ కరణాకరణములు బంధమోక్షజనకములు కావు.

ములు చెప్పుచున్నాఁడు మనసా స్మరన్ ♦ మనసా నియమ్య ❡ అని. కర్మయోగమ్—తనవర్ణాశ్రమముల కుచితమైనదానిని; కాని గృహస్థకర్మము నే యని నియమము లేదు, సన్న్యాసాదులు విధించుటవలనను కర్మసామాన్యము చెప్పుటవలనను.*

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః. ౮

భా. అందువలన. నియతమ్ = నిత్యము, శాస్త్రముచే నుపదేశింపఁబడినది, ఎవ్వఁడు ఏకర్మమునం దధికృతుఁడో ఏది ఫలముకొఱకు విధింపఁబడినది కాదో అది యతనికి నియత మైనకర్మము, అట్టి, కర్మ = కర్మమును; త్వమ్ = నీవు; కురు = చేయుము. ఓ అర్జునుఁడా! హి = ఎందువలన ననఁగా. కర్మ = కర్మము; జ్యాయః = మిక్కిలి యధికము, ఫలముచేత; అకర్మణః = అకర్మము చేయకుండుటకంటె, అనారంభముకంటె. ఎట్లు? శరీరయాత్రా ఽపిచ = శరీరస్థితియును; § తే = నీకు; అకర్మణః = చేయకుండుట వలన; న ప్రసిద్ధ్యేత్ = సిద్ధింపదు. కావున దృష్టమై యున్నది కర్మాకర్మములవిశేషము లోకమునందు.

అందువలన, ఏకర్మము నీకు శాస్త్రముచే విహితమై యున్నదో ఫలముకొఱకు విధింపఁబడినది కాదో అట్టి నిత్యమైనకర్మమును నీ వనుష్ఠింపుము. ఎందువలన నందువేని కర్మము చేయుట, దాని విడుచుటకన్నను ఉత్తమము. కర్మము చేయవేని నీకు దేహయాత్రగూడ సిద్ధింప దని తాత్పర్యము.

ఆ. కర్మానుష్ఠాయికిఁ జెప్పిన ఆధిక్యము ననువదించి తదనుష్ఠానమును అధికృతుఁడు చేయవలె నని నిగమనము ** చేయుచున్నారు అందువలన నని. చెప్పిన హేతువునే భగవ దనుమతిఁ దెలుపుటచే స్ఫుటీకరించుచున్నాఁడు కర్మ జ్యాయో హ్యకర్మణః అని. ఇందువలనఁ గూడ నీవు చేయవలెను గర్మము నని చెప్పుచున్నాఁడు ఉత్తరార్ధముచేత. స్వర్గఫల మయిన దర్శపూర్ణమాసాదికమునం దధికృ

♦ మనస్సుచే స్మరించుచు. శ్లో. ౬.
❡ మనస్సుచే నియమించి. శ్లో. ౭.
* ౬_౭ శ్లోకముల వ్యాఖ్యానము.
§ జీవనమును.
** నిశ్చయము.

తునకు వాని కదియును నిత్య మగు నని యాశంకించి విశేషణము చెప్పుచున్నారు ఏది ఫలముకొఱకు విధింపఁబడినది కాదో అని. నిత్యకర్మమును నియమముచేఁ జేయవలె ననుటకు హేతువుఁ జెప్పుచున్నారు హి ఇత్యాదిగా. చేయకుండుట కన్నను జ్యాయంబనుటను ప్రశ్నపూర్వకముగాఁ బ్రకటించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. దేహాదిచేష్టాద్వారంబునఁ గర్మము ఉన్ననే శరీరము నిలువఁజాలును, అది లేనిచో జీవనమే దుర్లభం బగు నని ఫలితముఁ జెప్పుచున్నాఁడు కావున నిత్యాదిగా.

హ. అందువలన. నియతం కర్మ = నిత్య మగు కర్మమును; త్వం కురు. ఎందువలన ననఁగా. అకర్మణః = అనారంభముకంటెను; కర్మ; జ్యాయః = శ్రేష్ఠము. ఫలకరం బగుటవలన. ఇందువలనఁగూడ జ్యాయము—శరీరయాత్రా ఉపిచ=శరీర స్థితియును; తే = నీకు; అకర్మణః = అకరణమువలన; న ప్రసిద్ధ్యేత్ = సిద్ధింపదు. అందువలనఁ జేయవలె నని యభిప్రాయము.

శం. ముముక్షువు నైష్కర్మ్యము సిద్ధించుటకును మిథ్యాచారత్వాదులు నివర్తిల్లుటకును అవశ్యము కర్మము చేయవలె నని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—హి = ఏకారణమువలన; అకర్మణః—దేనిచేఁ బురుషునకుఁ గర్మబంధము సంభావితము కాదో అది అకర్మము—కర్మసన్న్యసము, మూఢుఁడు చేయునట్టి అకర్మసన్న్యసముకంటెను; వివేకవంతుఁడు మోక్షసాధనముగాఁ జేయునట్టి, కర్మ = కర్మము; జ్యాయః = శ్రేష్ఠమో. వాస్తవమే "న్యాస ఏ వాత్య రేచయత్" అని శ్రుతి సన్న్యసమే సర్వోత్కృష్టతమం బని యుపదేశించుచున్నది, ఐనను "యోగ్యప్రయుక్తం సాధనం కార్యసాధకమ్" * అను న్యాయముచే, ఈ సన్న్యసమును "నేను కర్మము చేయ" నను నభిమానము గల మూఢుఁడు చేయుటవలన ఇట్టి సన్న్యసముకంటె, "పరమేశ్వరు నారాధించి నేను తరించెద" నని యీశ్వరార్పణబుద్ధిచే నిరభిమాని యగు ముముక్షువు చేయుకర్మము జ్యాయం బని యుపచరింపఁబడినది, కాని సన్న్యసము దూషింపఁబడినది కాదు. మ తే మనఁగా, విద్వత్సన్న్యసముకంటె వివిదిషాసన్న్యసముకంటె ♦ విలక్షణమైన సన్న్యసమును స్వస్థుఁ డగువాఁడు చేయఁగూడ దని చెప్పఁబడుచున్నది, అట్టి

---

* యోగ్యునిచేఁ బ్రయోగింపఁబడిన సాధనము కార్యసాధక మగును.

♦ విద్వత్సన్న్యసము—జ్ఞాని చేయు సన్న్యసము, వివిదిషాసన్న్యసము—జ్ఞానేచ్ఛచేఁ జేయు సన్న్యసము.

సన్న్యాసమునందు విధి లేకుండుటవలన. మఱియు, ఆత్మతత్త్వము తెలియకయే కేవలమూఢుఁడుగాని జిజ్ఞాసువు కానివాఁడు గాని కర్మసన్న్యాసము చేయునేని; అందుచేఁ బ్రత్యవాయము ఒకయనర్థము, నరకప్రాప్తి రెండవయనర్థము, దుష్టయోనిజననము మూఁడవది, మోక్షమే లేకపోవుట నాలవది; కర్మము చేసినచో ప్రత్యవాయాభావము, ఈశ్వరప్రసాదమువలనఁ జిత్తశుద్ధి, జ్ఞానము, మోక్షంబును సిద్ధించుచున్నవి; అందువలన, కర్మము అధికఫలక మగుటవలన, త్వమ్ = నీవు; నియతమ్ = విధ్యుక్త మయిన; కర్మ—నిత్యమును నైమిత్తికమును; ఈశ్వరప్రీత్యర్థమును చిత్తశుద్ధ్యర్థమును, కురు — చేయు మని యర్థము. కేవల మాముష్మికార్థమే కాదు కర్మము చేయవలసినది, మ తే మనఁగా ఐహికార్థముగూడ చేయవలె నని చెప్పుచున్నాఁడు—స్థాణువువలె నిశ్చలముగా ఊరకయుండుట కదా అకర్మము—కర్మసన్న్యాసము, అట్టి, అకర్మణః = నిశ్చేష్టముగాఁ గర్మము విడుచుటవలన; తే; శరీరయాత్రాపి; న ప్రసిద్ధ్యేత్—సుఖముగా సిద్ధింప దని యర్థము. పెద్దఱాయివలె గుహాయందుఁ గాని కందరమందుఁ గాని యూరకయున్నవానికి శరీరయాత్ర యెట్లు సిద్ధించును ఏదో యొకటి తదనుకూలవ్యాపారము లేనియెడ? అందువలన దాని కొఱకుఁగూడ కర్మము చేయవలసినదియే. ఓయీ! ఎంతమాత్రపు కర్మముచే శరీరపరిత్రాణము సిద్ధించునో అంతమాత్రము కర్మము చేసెదను, అంత కధికము చేయను అందువేని, అందువలననే నీ వతిమూఢుఁడవు సన్న్యాసమున కనర్హుఁడవు నగుచున్నావు; ఎందువలన ననఁగా నీకు భిన్నమైన అనాత్మ యగు దేహమునే రక్షింపఁ గోరుచున్నావు, కాని ఆత్మను రక్షింపఁ దలంపవు; నీయాత్మ జననమరణప్రవాహమునం బడి మాటిమాటికి మునుఁగుచుఁ దేలుచు నిరంతర దుఃఖముచేఁ గ్లేశము నొందుచున్నాఁడు; నీవూ ఆత్మను రక్షింపక అనాత్మ యగు నీశత్రువునే రక్షింప యత్నించెదవు; ఇఁక నైనను ఈదురభిమానంబు విడిచి కర్మముచే శరీరరక్షణము మిక్కిలి యాస్థతో నెట్లు చేయుచున్నావో అట్లు విహితంబు లగు కర్మముల ననుష్ఠించి యందుచేఁ జిత్తశుద్ధి నొంది యపరోక్షాత్మజ్ఞానము సంపాదించి యాత్మను దుఃఖసాగరమునుండి యుద్ధరించుకొనుము; "ఉద్ధరే దాత్మనా ఽఽత్మానమ్" అను వచనమువలన, ఆత్మకు మోక్షార్థమే కర్మము చేయుము, ఎప్పుడును అన్యార్థము * చేయకు మని యర్థము.

---

* మఱియొకదానికొఱకు.

మ. అందువలన మనస్సుచే జ్ఞానేంద్రియముల నిగ్రహించి కర్మేంద్రియములచే, త్వమ్ = మున్ను చిత్తశుద్ధిహేతు వగు కర్మము ననుష్ఠింపనివాఁడ వగు నీవు; నియతమ్—విధియొక్క యుద్దేశమునందు ఫల సంబంధము లేని దగుటచే నియతనిమిత్తముచే విహిత మగు; కర్మ—శ్రౌతమును స్మార్తమును, నిత్య మని ప్రసిద్ధ మైనదానిని; కురు. కురు అని మధ్యమపురుషను ప్రయోగించుటచేతనే త్వమ్ అని లబ్ధ మగుటవలన, త్వం పదమునకు అర్థాంతరము ♦ చెప్పఁబడినది. ఎందువలన అశుద్ధాంతఃకరణుండు కర్మమునే చేయవలెను? హి = ఎందువలన ననఁగా; అకర్మణః = చేయకుండుటకంటె; కర్మమే; జ్యాయః = మిక్కిలి ప్రశస్యము. కర్మము లేనిచో నీకు అంతఃకరణశుద్ధియే సిద్ధింపకపోవుట మాత్రమే గాదు, మ తేమనఁగా; అకర్మణః = యుద్ధాదికర్మరహితుఁడ వైన; తే = నీకు; శరీరయాత్రాపిచ = శరీరస్థితిగూడ; న ప్రసిద్ధ్యేత్ = చక్కగా—క్షత్త్రియవృత్తిచే సంపాదింపఁబడినదిగా సిద్ధింపదు. అట్లు పూర్వము చెప్పఁబడినది. అపిచ అనుటకు అంతఃకరణశుద్ధిసముచ్చయ మర్థము. *

శ్రీ. అందువలన; నియతమ్ = నిత్యము సంధ్యోపాసనాదిక మయిన; కర్మ కురు. హి = ఎందువలన ననఁగా; అకర్మణః = కర్మము చేయకుండుటకంటె; కర్మ; జ్యాయః = మిక్కిలి యధికము. కర్మము చేయవేని, అకర్మణః = సర్వకర్మశూన్యుఁడ వైన; తే = నీకు; శరీరయాత్రాపి చ = శరీరనిర్వాహముగూడ; న ప్రసిద్ధ్యేత్ = కలుగదు.

ప. ఇట్లు వేదవిహితం బగు కర్మము రెండువిధము లుపన్యసింపఁబడెను. ఒకటి ఇహాముత్రఫలభోగములు కలిగించునది, రెండవది నైష్కర్మ్యము కలిగించునది, ఆరెంటిలో నేది రుచించునో అది చేయునది. కాని రెంటినిగూడ విడువవలదు అని చెప్పుచున్నాఁడు.—నియతమ్ = చేయనిచోఁ బ్రత్యవాయజనకం బగు, కర్మ = సంధ్యోపాసనాదికర్మమును, కురు. హి = ఎందువలన ననఁగా. అకర్మణః = కర్మము చేయకుండుటకంటె; కర్మ; జ్యాయః = శ్రేష్ఠము. ఎందువలన ననఁగాఁ జెప్పుచున్నాఁడు—కర్మశూన్యుఁడ వగుటవలన, నీకు శరీరయాత్రాపి చ, న ప్రసిద్ధ్యేత్—

---

♦ మున్ను చిత్తశుద్ధిహేతు వగు కర్మము ననుష్ఠింపనివాఁడ వనుట.

* అంతఃకరణశుద్ధియును శరీరయాత్రయును సిద్ధింపదని యర్థము.

మరల నిట్టి శరీరము ప్రాప్తింపదు, అధమయోనిం బొందినచో సర్వంబును నశించు నని యర్థము.

రా. నియతమ్ = వ్యాప్తమయిన, ప్రకృతిసంసృష్టునితో వ్యాప్తముగదా కర్మము *, ప్రకృతిసంసృష్టత్వం బనాదివాసనచేత. కర్మము నియతం బగుటచే సుఖసాధ్య మగుటవలనను ప్రమాదమున కవకాశము లేని దగుటవలనను, కర్మ = కర్మమునే; కురు = చేయుము. అకర్మణః = జ్ఞాననిష్ఠకంటెఁ గూడ; కర్మ = కర్మమే; జ్యాయః = శ్రేష్ఠము, "నైష్కర్మ్య మశ్నుతే" అని యుపక్రమించుటవలన అకర్మ శబ్దముచే జ్ఞాననిష్ఠయే చెప్పఁబడుచున్నది. జ్ఞాననిష్ఠయం దధికారము గలవానికిఁ గూడ, జ్ఞాననిష్ఠ యంతకు మున్ను అభ్యస్తము గామిం జేసి యనియతం బగుటచే దుస్సాధం బగుటవలనను ప్రమాదసహితం బగుటవలనను, జ్ఞాననిష్ఠకంటెఁ గర్మనిష్ఠయే శ్రేష్ఠము. మఱియుఁ గర్మము చేయునప్పుడు ఆత్మస్వరూపజ్ఞానముచే ఆత్మ యకర్త యను అనుసంధానము వెంటనే చెప్పఁబడెను, కావున ఆత్మజ్ఞానముగూడఁ గర్మయోగాంతర్గతం బగుటవలనఁ గర్మయోగమె శ్రేష్ఠం బని యర్థము. కర్మము జ్ఞాననిష్ఠకంటె జ్యాయం బనుట జ్ఞాననిష్ఠయం దధికార మున్ననే యుపపన్న మగును. ఇఁక సమస్త మయిన కర్మమును విడిచి కేవలజ్ఞాననిష్ఠయందే యధికృతుఁడ వగుదు వేని; అప్పుడు; అకర్మణః = జ్ఞాననిష్ఠుఁడ వైన; తే = నీకు; జ్ఞాననిష్ఠోపకారిణియైన, శరీరయాత్రాపి చ = దేహజీవనమును; న ప్రసిద్ధ్యేత్ = సిద్ధింపదు, సాధనసమాప్తి ♦ యగునంతకు శరీరధారణం బవశ్యము చేయవలెను; న్యాయార్జితం బగు ధనముచే మహాయజ్ఞాదులు చేసి తదవశిష్టమును భుజించుటచేత నే శరీరధారణము చేయవలెను, "ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః" ఇత్యాదిశ్రుతివలన. "తే త్వఘం భుఞ్జతే పాపా యే పచ న్త్యాత్మకారణాత్" అని చెప్పఁబోవుచున్నాఁడు. అందువలన జ్ఞాననిష్ఠునకుఁ గూడఁ గర్మము చేయనివానికి దేహయాత్రగూడ సిద్ధింపదు. ఎందువలన జ్ఞాననిష్ఠుండుగూడ శరీరధారణము చేయువాఁడు సాధనసమాప్తి యగుపర్యంతము మహాయజ్ఞాదినిత్యనైమిత్తికకర్మం బవశ్యము చేయవలెనో, ఎందువలనఁ గర్మయోగమునందును ఆత్మ యకర్త యను భావన యుండుటచే ఆత్మస్వ

* వ్యాప్తము—వ్యాప్తి గలది, ప్రకృతిసంసృష్టుఁడు—ప్రకృతిసంబంధము గలవాఁడు, ఎక్కడ ప్రకృతిసంసృష్టత్వము గలదో అక్కడ కర్మము గలదు, ప్రకృతిసంసృష్టునకుఁ గర్మము విడువ శక్యము గా దనుట.

♦ మోక్షసాధనసంపూర్తి.

రూపానుసంధాన మంతర్భూతమై యున్నదో, మఱియు నెందువలనఁ బ్రకృతిసంసృష్టునకుఁ గర్మయోగము సుఖసాధ్యంబును బ్రమాదరహితంబు నగునో, అందువలన జ్ఞాననిష్ఠాయోగ్యునకుఁగూడ జ్ఞానయోగముకంటెఁ గర్మయోగము శ్రేష్ఠము. కావున నీవు కర్మయోగమునే యాచరింపు మని యభిప్రాయము.

ప్రకృతిసంసర్గము గలవానికిఁ గర్మము తప్పదు. కావునఁ గర్మయోగము ననుష్ఠించుట సులభము. మఱియు దానియందుఁ బ్రమాదము సంభవింపదు. ఇంతియు గాక జ్ఞానయోగముగూడఁ గర్మయోగమునందే యంతర్భూతమై యున్నది. ఈకారణములవలన జ్ఞానయోగాధికారికిఁ గూడ జ్ఞానయోగముకంటెఁ గర్మయోగమె యుత్తమము. మఱియు మోక్షసాధనపూర్తి సిద్ధించువఱకు శరీరధారణము చేయవలెను గదా! మహాయజ్ఞాదినిత్యనైమిత్తికకర్మములు నిర్వర్తించి దాన శేషించిన యన్నము భుజించి గదా శరీరధారణము చేయవలయును! కర్మమంతయు విడిచి కేవలజ్ఞానయోగమునందే యుండువేసి నీకట్టి శరీరయాత్రగూడ సిద్ధింప దని తాత్పర్యము.

మూ. ఇందువలన, నియతమ్—వర్ణాశ్రమోచితమైన. కర్మ కురు.

యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః
తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసఙ్గస్సమాచర. ౯

భా. మఱియు నేమి తలంచుచున్నావో బంధార్థం* బగుటవలనఁ గర్మము చేయఁగూడ దని, అదియు సరి గాదు. ఎట్లు? యజ్ఞార్థాత్—"యజ్ఞో వై విష్ణుః" అను శ్రుతివలన యజ్ఞశబ్దమునకు ఈశ్వరుఁడర్థము, ఈశ్వరార్థము ఏది చేయఁబడుచున్నదో అది యజ్ఞార్థము, అట్టి; కర్మణః = కర్మముకంటె; అన్యత్ర = ఇతరమైన కర్మముచేత; అయమ్ = ఈ, అధికృతమై కర్మము చేయునట్టి; లోకః = జనము; కర్మబన్ధనః—కర్మము బంధనముగాఁ గలది; కాని యజ్ఞార్థం బగు కర్మమువలనఁ గాదు. ఇందువలన, తదర్థమ్ = యజ్ఞార్థమైన; కర్మ = కర్మమును; కౌన్తేయ = అర్జునా! ముక్తసఙ్గః = విడువఁబడిన కర్మఫలాసక్తి గలవాఁడవై; సమాచర = నెఱవేర్పుము.

ఫలాపేక్షతోఁ జేయు కర్మమే కర్తకు బంధజనకం బగును గాని ఫలాపేక్ష విడిచి యీశ్వరార్పణబుద్ధితోఁ జేయునట్టి నిత్యనైమిత్తికకర్మము బంధజన

* బంధమే ప్రయోజనముగాఁ గలది.

కంబు గానేరదు. అందువలన నీవు కర్మఫలాసక్తి విడిచి యీశ్వరార్థ మయి కర్మము చేయు మని తాత్పర్యము.

ఆ. "కర్మణా బధ్యతే జన్తుః" అను స్మృతివలనఁ గర్మము బంధార్థం బగుచున్నది, అట్టి దాని శ్రేయోర్థి చేయఁ గూడ దను నాశంక ననువదించి దూషించుచున్నారు మఱియు నిత్యాదిగా. కర్మమునం దధికృతుఁ డగువాఁడు దానిఁ జేయకుండుట యుక్తము గా దని ప్రతిజ్ఞ చేసినవిషయమును వివరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. ఫలాభిసంధి విడిచి యజ్ఞార్థ మగు కర్మము చేయువానికి బంధము లేకుండుటవలనఁ దదర్థముగాఁ గర్మము చేయవలె నని చెప్పుచున్నాఁడు ఉత్తరార్ధముచేత. యజ్ఞార్థాత్ కర్మణః అని చెప్పఁబడినది, కర్మార్థమే కర్మ మెట్లగును ? ♦ అని యాశంకించి వ్యాఖ్యానము చేయుచున్నారు యజ్ఞోవై విష్ణుః ఇత్యాదిగా. అప్పుడు, "కర్మణా బధ్యతే జన్తుః" అను స్మృతి యె ట్లుపపన్న మగును ? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు కర్మముకంటె అన్యత్ర ఇత్యాదిగా. ఈశ్వరార్పణ బుద్ధిచేఁ జేయునట్టి కర్మము బంధార్థకము కా దని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నారు ఇందువలన ఇత్యాదిగా.

హా. బంధహేతు వగుటవలనఁ గర్మము కర్తవ్యము గా దని తలంతువేమో, అది సరి గాదు. ఎట్లనఁగా. యజ్ఞార్థాత్—"యజ్ఞోవై విష్ణుః" అను శ్రుతివలన యజ్ఞుఁడు—విష్ణువు, అర్థము—ప్రయోజనముగాఁ గల కర్మము యజ్ఞార్థము, అనఁగా విష్ణ్వారాధనార్థము, అట్టి, కర్మణః, అన్యత్ర, అయం లోకః, కర్మబన్ధనః. తదర్థమ్ = విష్ణ్వారాధనార్థమైన, కర్మ = యజ్ఞాదికర్మమును, కౌన్తేయ, ముక్తసఙ్గః = విడువఁబడిన సంగము గలవాఁడవై, సమాచర = అనుష్ఠింపుము.

శం. ఓయీ! "కర్మణా బధ్యతే జన్తు ర్విద్యయా చ విముచ్యతే" అని స్మృతియందుఁ గర్మములు బంధహేతువు లని చెప్పుటవలన, ఎట్లు బంధకమైన కర్మము చేయవచ్చును ? అని యాశంకింతు వేమో అట్లు శంకింపవలదు. కామ్యకర్మమే బంధకం బగుం గాని యీశ్వరార్పణబుద్ధిచేఁ జేయుకర్మము కా దని చెప్పుచున్నాఁడు.—"యజ్ఞోవై విష్ణుః" అను శ్రుతివలన యజ్ఞునియొక్క—శ్రీమహావిష్ణువుయొక్క సంతుష్టినిమిత్తము ఏవైదికకర్మము చేయఁబడుచున్నదో అది యజ్ఞార్థ మని చెప్పఁబడుచున్నది. అట్టి, యజ్ఞార్థాత్ కర్మణః = ఈశ్వరప్రీతి

♦ యాగము కర్మమే యగుటవలన.

హేతు వగు నిత్యకర్మముకంటె; అన్యత్ర = ఇతర మయిన కామ్యాదికమునందు; అయం లోకః = అధికారి యగు బ్రాహ్మణాదిలోకము, కర్మబన్ధనః = కర్మమే బంధనము—జన్మాదులకు నిబంధనము—హేతువుగాఁ గలది, అగుచున్నది. విహితకర్మము చేయకుండుటచేఁ గాని కామ్యము నిషిద్ధము చేయుటచేఁ గాని మనుష్యుఁడు బంధము నొందుచున్నాఁడు, కాని ఈశ్వరప్రీతికై చేయు కర్మముచేత బంధము నొందఁడు. 'తత్కర్మ యన్న బన్ధాయ' [1] అను స్మృతివలన ఈశ్వరారాధనాత్మక మగు కర్మమే బంధకము కానిది, తదితర మైనకర్మము మాత్రము బంధకమే యని యభిప్రాయము. అందువలన, తదర్థమ్ = ఈశ్వరప్రీత్యర్థము; అవశ్యము, నీవు, ముక్తసఙ్గః—ఫలాభిసంధి లేనివాఁడవై, కర్మ = విహిత మయిన కర్మమును; సమాచర = చక్కఁగా అనుష్ఠింపుము. అందుచేఁ బరితుష్టుం డగు నీశ్వరుని ప్రసాదమువలన శుద్ధచిత్తుఁడవై జ్ఞానంబుఁ బ్రాపించి ముక్తుఁడవు కాఁ గల వని యర్థము.

మ. "కర్మణా బధ్యతే జన్తుః" అను స్మృతివలన సమస్తకర్మమును బంధాత్మక మగుటవలన ముముక్షువు చేయఁగూడదని తలంచి యందు కుత్తరముఁ జెప్పుచున్నాఁడు.—యజ్ఞుఁడు—పరమేశ్వరుఁడు, "యజ్ఞో వై విష్ణుః" అను శ్రుతివలన; తదారాధనార్థము ఏకర్మము చేయఁబడునో అది యజ్ఞార్థము; అట్టి కర్మము కంటె; అన్యత్ర = ఇతరకర్మమునందు; ప్రవృత్త మయిన, అయం లోకః—కర్మాధికారి; కర్మబన్ధనః = కర్మముచే బంధింపఁబడువాఁడు, కాని ఈశ్వరారాధనార్థ మగు దానిచేతఁ గాదు. కావున, తదర్థమ్ కర్మ = యజ్ఞారాధనార్థ మగు కర్మమును; కౌన్తేయ, నీవు కర్మమునం దధికృతుఁడవు, ముక్తసఙ్గః = విడువఁబడిన ఫలాసక్తి గలవాఁడవై; సమాచర = చక్కఁగా—శ్రద్ధాదిపూర్వకముగా ఆచరింపుము.

శ్రీ. సాంఖ్యులు సర్వకర్మంబును బంధక మగుటవలనఁ గార్యంబు గా దని పలికెదరు; దాని నిరాకరించుటకై చెప్పుచున్నాఁడు.—ఇట యజ్ఞుఁ డనఁగా విష్ణువు, 'యజ్ఞో వై విష్ణుః' అను శ్రుతివలన. విష్ణ్వారాధనార్థ మయిన కర్మముకంటె, అన్యత్ర—అది యొకటి దక్క; అయం లోకః, కర్మబన్ధనః = కర్మములచే బంధింపఁబడునది, కాని యీశ్వరారాధనార్థ మయిన కర్మముచే బంధింపఁబడదు. కావున, తదర్థమ్ = విష్ణుప్రీత్యర్థము; ముక్తసఙ్గః = నిష్కాముఁడవై; కర్మ; సమాచర = చక్కఁగా నాచరింపుము.

---

[1] ఏది బంధము కొఱకుఁ గాదో అది కర్మము.

ప. ఇఁక సాంఖ్యులు 'సమస్తకర్మమును బంధకం బగుటవలన త్యాజ్యం' బని చెప్పుచున్నారు; దాని నిషేధించుచున్నాఁడు.—'యజ్ఞో వై విష్ణుః' అను శ్రుతివలన, యజ్ఞుఁడు—విష్ణువు అర్థము—ప్రయోజనముగాఁగలది యజ్ఞార్థము, పరమే శ్వరార్పణముగాఁ జేయఁబడినది, అట్టి; కర్మణః = కర్మముకంటె; అన్యత్ర = ఇతర మైన బంధక మగు కర్మమునందు; కర్మబన్ధనః = కర్మమే బంధనముగాఁ గల; లోకః = జనము, ఆసక్త మగుచున్నది. కావునసే, నీవు, ముక్తసఙ్గః = విడువఁబడిన ఫలాభిసంధి గలవాఁడవై.

రా. ఇట్లయినయెడ ద్రవ్యార్జనాదికర్మము అహంకార మమకారాది రూప సర్వేంద్రియవ్యాకులతాగర్భం * బగుటచే నీపురుషునకుఁ గర్మవాసనచే బంధ నము కాఁ గల దనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—యజ్ఞార్థాత్ =యజ్ఞాదిశాస్త్రీయ కర్మమునకు శేషభూత మయిన; కర్మణః=ద్రవ్యార్జనాదికర్మముకంటె; అన్యత్ర=ఇతర మైన—స్వప్రయోజనమునకు శేషభూతమైన ♦ కర్మము, చేయఁబడినయెడ; అయం లోకః; కర్మబన్ధనః = కర్మముచే బంధనము గలది, అగుచున్నది. కావున; తదర్థమ్= యజ్ఞార్థ మయిన; కర్మ = ద్రవ్యార్జనాదికర్మమును; సమాచర = చేయుము. అందు, ముక్తసఙ్గః—స్వప్రయోజనమునకు సాధనం బను సంగము ఏది గలదో ఆసంగము నుండి విడువబడినవాఁడవై, చేయుము. ఇట్లు సంగము విడిచి యజ్ఞాద్యర్థముగాఁ గర్మము చేయునేని యజ్ఞాదికర్మములచే ఆరాధితుం డగు పరమపురుషుఁడు వీని కనాదిప్రవృత్త మయిన కర్మవాసనను ఛేదించి అవ్యాకులాత్మదర్శనము నొసంగుచు న్నాఁ డని యర్థము.

యజ్ఞము మొదలగు శాస్త్రీయకర్మము నిర్వర్తించునిమిత్తమయి ద్రవ్యా ర్జనాదులు చేయుటచేఁ బురుషునకు బంధనము కలుగదు. మ తేమనఁగా స్వప్రయో జనోద్దేశముచేఁ జేయుకర్మమే బంధనము కలిగించుచున్నది. కావున నీవు యజ్ఞాది ప్రయోజన మయిన కర్మము చేయుము. అందును స్వప్రయోజనోద్దేశము లేశమై నను లేనివాఁడవై చేయవలయు నని తాత్పర్యము.

మా. "కర్మణా బధ్యతే జన్తుః" అని స్మృతియందుఁ గర్మముబంధకం బని చెప్పఁబడినది యనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—కర్మబన్ధనః = కర్మము బంధ

* అహంకార మమకారాదిరూప మయిన సర్వేంద్రియవ్యాకులత గర్భమునందుఁగలది—అట్టి వ్యాకులతను గలిగించునది, లేక అట్టి వ్యాకులతచేతనే నిర్వర్తితం బగునది.

♦ అంగభూతమైన.

నముగాఁ గలదిలోకము. యజ్ఞుఁడు—విష్ణువు. యజ్ఞార్థమును సంగరహితంబు సగు కర్మము బంధకము కా దని యర్థము, ముక్తసఙ్గః అను విశేషణమువలనను, «కామాన్యః కామయతే' * అను శ్రుతివలనను, « అనిష్ట మిష్టమ్ " అని చెప్పఁబోవుటవలనను, « ఏతా న్యపి తు కర్మాణి " అనుటవలనను, « తస్మా న్నేష్టియాజకస్స్యాత్ " ♦ అనుటవలనను. విశేషవచనత్వము ❡ సమన్వైనను విశేషణము శేషించుచున్నది. §

సహ యజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేష వో ఽ స్త్విష్టకామధుక్. ౧౦

భా. ఇందువలనఁగూడ అధికృతుండు కర్మము చేయవలెను.— పురా= పూర్వము, సర్గాదియందు; సహయజ్ఞాః= యజ్ఞములతోఁ గూడిన; ప్రజాః = ప్రజలను, మూఁడువర్ణములను; సృష్ట్వా = పుట్టించి; ప్రజాపతిః = ప్రజల సృజించువాఁడు, బ్రహ్మ; ఉవాచ = పలికెను. అనేన = ఈయజ్ఞముచేత; ప్రసవిష్యధ్వమ్= వృద్ధిని—ఉత్పత్తిని చేయుఁడు. ఏషః = ఈయజ్ఞము; వః = మీకు; ఇష్టకామధుక్ = కోరఁబడిన ఫలవిశేషములను పితుకునది; అస్తు = అగుఁ గాక.

సృష్ట్యాదిని మున్ను ప్రజాపతి ప్రజల యజ్ఞములతోఁగూడ సృజియించి యిట్లు పలికెను. ఈ యజ్ఞము ననుష్ఠించి మీరు వృద్ధిఁ బొందుఁడు. దీనివలన మీరు కోరినఫలములం బడయుదు రని తాత్పర్యము.

టీ. నిత్యనైమిత్తికకర్మముల నధికృతుం డనుష్ఠింపవలె ననుటకు మఱియొకహేతువుఁ దెలుపుచున్నది యిది యని మీఁదిశ్లోకమున కవతారిక చేయుచున్నారు ఇందువలనఁగూడ ఇత్యాదిగా. ఎట్లు మఱి యీయజ్ఞముచే మేము వృద్ధిఁ జేయఁగలము ? అని యాశంకించి చెప్పుచున్నారు ఏషః ఇత్యాదిగా.

---

* ఎవ్వఁడు కామములను—ఫలములను కోరుచున్నాఁడో.

♦ అందువలన ఇష్టి యాజకుఁడు కా రాదు, ఇష్టి యాజకుఁడు—ఫలేచ్ఛచే యజించువాఁడు.

❡ కర్మణా బధ్యతే జన్తుః అనునదియు ఈగీతావాక్యమును విశేషవచనములే యయినను.

§ ఇందు యజ్ఞార్థాత్ ఇత్యాదివిశేషణము చెప్పఁబడుటవలన ఈగీతావాక్యమునను కర్మణా బధ్యతే అనునది సామాన్యవచనమే యగుం గావున దీనిచే నది బాధితమగుచున్నది

హా. ఇందువలనఁ గూడ అధికారి చేయవలెను గర్మమును.—సహాయజ్ఞాః యజ్ఞసహితు లగు; ప్రజాః = ప్రాణులను, బ్రాహ్మణాదు లగు యజ్ఞాధికారులను; సృష్ట్వా; పురా = మున్ను, సృష్ట్యాదియందు; ఉవాచ; ప్రజాపతిః, ప్రజలనుగూర్చి సృష్టి యయిన పిమ్మట. ఏ మనిచెప్పెను? అనేన = ఈయజ్ఞముచేత; పుట్టింపుఁడు. ఏషః—ఈయజ్ఞము; వః = మీకు; ఇష్టకామధుక్ = అభిమతము లయిన ఫలములను పితుకునది; అస్తు.

శం. పూర్వము నైష్కర్మ్యసిద్ధికొఱకును మిథ్యాచారత్వనివృత్తికొఱకును శరీరయాత్రాసిద్ధికొఱకును గర్మం బవశ్యము చేయవలె నని చెప్పి, యిప్పుడు « ధర్మజ్ఞసమయః ప్రమాణమ్ » అని సూత్రమునందుఁ జెప్పఁబడిన రీతిని ధర్మజ్ఞోత్తముఁ డగుబ్రహ్మదేవునిచే నుపదేశింపఁబడినదగుటంజేసి ప్రామాణికం బగు పరమధర్మంబిది ముముక్షువు లవశ్య మనుష్ఠింపవలెను ఇంద్రాదిదేవతాప్రసాదము సిద్ధించుకొఱ కని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—పురా = సృష్ట్యాదియందు; ప్రజాపతిః = బ్రహ్మదేవుఁడు; సహాయజ్ఞాః = యజ్ఞములతోఁ గూడిన; ప్రజాః = బ్రాహ్మణాది వర్ణములను; సృష్ట్వా; వారినిగూర్చి, ఉవాచ = పలికెను. వీరు, అనేన= ఈయజ్ఞముచేత, స్మార్తముచేతను శ్రౌతముచేతను; ప్రసవిష్యధ్వమ్ = చరుపురోడాశాది ద్రవ్యములచే దేవతలకుఁ బ్రీతిని బుట్టింపుఁడు. ఏషః = దేవతల నుద్దేశించి శ్రద్ధతోఁ జేయఁబడిన యీయజ్ఞముగూడ; వః = మీకు; ఇష్టకామధుక్ = ఇష్టము లయిన—కోరఁబడిన కామములను—కోరఁబడువానిని—ఫలవిశేషములను పితుకునది, అస్తు= అగుఁ గాక, నిష్కాములకు జ్ఞానప్రతిబంధక దురితక్షయమును సకాములకు స్వర్గసుఖమును కలిగించుఁ గాక యని యభిప్రాయము.

మ. ప్రజాపతివచనమువలనఁ గూడ అధికృతుఁడు కర్మ మనుష్ఠింపవలె నని చెప్పుచున్నాఁడు నాలుగుశ్లోకములచేత.—సహాయజ్ఞాః = యజ్ఞముతో—విహిత కర్మకలాపముతోఁగూడ నుండువార లగు, కర్మమునం దధికృతు లయిన యనుట; ప్రజాః = మూఁడువర్ణములను; పురా = కల్పాదియందు; సృష్ట్వా; ఉవాచ; ప్రజాపతిః = ప్రజలయొక్క పతి—స్రష్ట. ఏమి చెప్పినాఁ డనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అనేన = ఈయజ్ఞముచేత, మీమీ యాశ్రమముల కుచిత మగు ధర్మముచేత; ప్రసవిష్యధ్వమ్ = ప్రసవింపుఁడు, ప్రసవ మనఁగా వృద్ధి, ఉత్తరోత్తర మయిన యభివృద్ధిని పొందుఁ డని యర్థము. ఎట్లు దీనిచే వృద్ధి యగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—

ఏషః = ఈయజ్ఞ మనెడు ధర్మము; వః = మీకు; ఇష్టకామధుక్ = ఇష్టము లయిన కామ్యఫలములను పొందించునది, అభీష్టభోగప్రదం బగుఁ గాక యని యర్థము. ఇట, సరే యజ్ఞగ్రహణము ఆవశ్యకకర్మోపలక్షణార్థము, చేయనిచోఁ బ్రత్యవాయమును ముందు చెప్పుటవలన; కామ్యకర్మములకో ప్రకృతమునఁ బ్రస్తావము కలుగలేదు, « మాకర్మఫలహేతు ర్భూః » అని నిరాకృత మగుటవలన; అయినను, నిత్యకర్మములకుఁగూడ ఆనుషంగికఫలము ♦ గలుగుటవలన ‹ ఏషవో ఽస్త్విష్టకామధుక్ › అనుట యుపపన్న మగుచున్నది. అట్లు ఆపస్తంబులు చెప్పుచున్నారు « తద్యథా ఽఽమ్రే ఫలార్థే నిమితే ఛాయా గన్ధా వనూత్పద్యేతే ఏవం ధర్మం చర్యమాణ మర్థా అనూత్పద్యన్తే నో చే దనూత్పద్యన్తే న ధర్మహాని ర్భవతి › * అని. ఫలమున్నను దానియం దభిసంధిచేతను అనభిసంధిచేతను గామ్యనిత్యములయందు విశేషము §. అభిసంధి లేకున్నను వస్తుస్వభావమువలన ఫలము పుట్టుటయందు విశేషము లేదు. విస్తరించి ముందు ప్రతిపాదింపఁబడును.

శ్రీ. ప్రజాపతివాక్యమువలనఁగూడ కర్మము ననుష్ఠించువాఁడే శ్రేష్ఠుఁడని చెప్పుచున్నాఁడు నాలుగుశ్లోకములచేత.—సహయజ్ఞాః = యజ్ఞముతోఁగూడ నుండువార లగు; ప్రజాః = యజ్ఞమునం దధికృతు లైన బ్రాహ్మణాదులను; పురా = సర్గాదియందు; సృష్ట్వా = సృజించి; బ్రహ్మదేవుఁ డీవాక్యముఁ బలికెను. అనేన = ఈయజ్ఞముచేత; ప్రసవిష్యధ్వమ్ = ప్రసవింపుఁడు, ప్రసవము అనఁగా వృద్ధి గదా! ఉత్తరోత్తరాభివృద్ధిని బ్రాపింపుఁ డని యర్థము. అందు హేతువు—ఏషః = ఈయజ్ఞము; వః = మీకు; ఇష్టకామధుక్ = ఇష్టము లయిన కామములను పితుకునది, అభీష్టభోగప్రదం బగుఁ గాక యని యర్థము. ఇచట యజ్ఞగ్రహణము ఆవశ్యకకర్మముల యుపలక్షణముకొఱకు. కామ్యకర్మప్రశంసయో, ప్రకరణంబున అసంగతమైనను, సామాన్యముగా అకర్మముకన్నఁ గర్మము శ్రేష్ఠ మనుటకొఱకు. కావున దోషము గాదు.

♦ కోరకున్నను గలుగు ఫలము.

* అది యెట్లు మామిడిచెట్టును ఫలార్థమై యుంచఁగా ఛాయాగంధములు వెంబడిఁ బుట్టుచున్నవో అట్లు ధర్మము ననుష్ఠింపఁగా వెంబడి నర్థములు పుట్టుచున్నవి వెంబడిఁబుట్టనియెడ ధర్మహాని కలుగదు.

§ ఫలాభిసంధి యున్నయెడఁ గామ్యము, అది లేనియెడ నిత్యము అని విశేషము.

ప॰ ఇట్లనుష్ఠేయరహస్యముఁ జెప్పి యిప్పుడు కర్మనిబంధనము లగు లోకములకు బ్రహ్మప్రోక్త మయిన గతిని దెలుపుచున్నాఁడు.—పురా = సృష్ట్యాదియందు; ప్రజాపతిః = బ్రహ్మ; సహయజ్ఞాః = యజ్ఞములతోఁ గూడినవారలు, వానియం దధికారు లగు; ప్రజాః = బ్రాహ్మణాదులను; సృష్ట్వా = నిర్మించి; ఇట్లని; ఉవాచ. అది యేమి యనఁగా. ఓ ప్రజలారా! అనేన = ఈయజ్ఞముచేత; మీరు, ప్రసవిషధ్వమ్ = పుత్త్రపౌత్త్రాద్యుత్తరోత్తరాభివృద్ధిని పొందుఁడు. అందుకు హేతువు—ఏషః = ఈయజ్ఞము; వః = మీకు; ఇష్టకామధుక్ = అభీష్టభోగప్రదము; అస్తు.

రా॰ యజ్ఞశిష్టాశనముచేతనే సర్వపురుషార్థసాధననిష్ఠులును శరీరధారణము చేయవలె ననుటయు యజ్ఞశిష్టము కాని దానిచే శరీరధారణము చేయువారలకు దోషంబును జెప్పుచున్నాఁడు.—« పతిం విశ్వస్య ” ఇత్యాదిశ్రుతులచే నిరుపాధికం బగు * ప్రజాపతిశబ్దము సర్వేశ్వరుండును విశ్వమునకు స్రష్టయును విశ్వాత్ముండును బరాయణుండు నగు నారాయణునిఁ జెప్పుచున్నది. పురా = సర్గకాలమునందు; ప్రజాపతిః = ఆభగవంతుఁ డగు నారాయణుండు; ప్రజాః = అనాదికాలమునుండి ప్రవర్తించిన అచిత్సంసర్గముచేఁ బరవశులై ఉపసంహృత మయిన నామరూపవిభాగము గలవారలై తనయందు లయముఁ బొంది సకలపురుషార్థములకును అనర్హులయి అచేతనకల్పులగు ప్రజలను; చూచి, పరమకారుణికుం డగుటవలన, వారి నుజ్జీవనము చేయఁ గోరి స్వారాధనభూతము లయిన యజ్ఞముల నెఱవేర్చుటకొఱకు, యజ్ఞైస్సహ ♦ = యజ్ఞములతోఁ గూడ; ఆప్రజలను, సృష్ట్వా = సృజించి; ఇట్లు, ఉవాచ = చెప్పెను. అనేన = ఈయజ్ఞముచే; ప్రసవిష్యధ్వమ్ = ఆత్మవృద్ధిని చేసికొనుఁడు. ఏషః = ఈయజ్ఞము; వః = మీకు; ఇష్టకామధుక్ = పరమపురుషార్థరూపమైన మోక్షం బను కామమును తదనుగుణంబు లగు కామములను జక్కఁగాఁ బూరించునది; అస్తు = అగుఁ గాక.

సృష్టికాలమున భగవంతుం డగు నారాయణుండు తనయందు లీనులైన ప్రజలం జూచి వారి నుజ్జీవింపఁ జేయఁ గోరినవాఁడై యజ్ఞములతోఁ గూడ వారిని సృజించి యి ట్లని వారికిఁ జెప్పెను. మీరీ యజ్ఞము ననుష్ఠించి యాత్మవృద్ధి నొం

* ప్రకరణాదులచే సంకోచితార్థము కానట్టి.

♦ వీరి మతమునందు “ సహ యజ్ఞైః ప్రజా సృష్ట్వా ” అని పాఠము.

దూఁడు. ఈయజ్ఞము ననుష్ఠించుటచే మీకుఁ బరమపురుషార్థమయిన [illegible] దదను రూపంబు లయిన యితరకామములును సిద్ధించు నని తాత్పర్యము.

మా. ఇందు అర్థవాదముఁ జెప్పుచున్నాఁడు.—సహయజ్ఞా ఇత్యాది శ్లోక చతుష్టయముచేత. ¶

దేవా న్భావయతా ఽనేన తే దేవా భావయన్తు వః
పరస్పరం భావయ న్త శ్శ్రేయః పర మవాప్స్యథ. ౧౧

భా. ఎట్లు? అనేన = ఈయజ్ఞముచేత; దేవాన్ = ఇంద్రాదులను; భావయత = వృద్ధి నొందింపుఁడు §. తే = ఆ; దేవాః = ఇంద్రాదులు; వః = మిమ్ము; భావయన్తు = వర్షము మొదలగువానిచే తృప్తిపఱతురు గాక. ఇట్లు, పరస్పరమ్ = ఒండొరులను; భావయన్తః = తృప్తిపఱచుచున్నవారలై; పరం శ్రేయః = మోక్షమును, జ్ఞానప్రాప్తిక్రమంబున; అవాప్స్యథ = పొందెదరు; లేక, పరంశ్రేయః = స్వర్గమును; అవాప్స్యథ.

మీరు ఈయజ్ఞ మనుష్ఠించి యింద్రాదిదేవతలను హవిర్దానములచే దృప్తి నొందింపుఁడు, ఆయింద్రాదులు వర్షాదులచే అన్నాదులను గలిగించి మిమ్ముఁ దృప్తినొందింతురు. ఇట్లు వారిని మీరును మీరు వారిని దృప్తిపఱచుచుండుటవలన మీకు జ్ఞానప్రాప్తిద్వారంబున మోక్షము సిద్ధించును. స్వర్గమైనను లభింపఁ గల దని తాత్పర్యము.

ఆ. ఎట్లు అభీష్టఫలవిశేషమునకు యజ్ఞము హేతు వని తెలియవలెను? దేవతాప్రసాదము లేక స్వర్గాద్యభ్యుదయము లభింపదు గదా! సమ్యగ్దర్శనము లేక మోక్షము గాని సిద్ధింపఁజాలదు గదా! అని యాశంకించుచున్నాఁడు. ఎట్లు అని. అందుకు మీఁదిశ్లోకముచే నుత్తరము చెప్పుచున్నారు అనేన ఇత్యాదిగా. ముముక్షువు బుభుక్షువు ♦ అనువిభాగముచే శ్రేయస్సునందు వికల్పము. *

---

¶ ౧౦. ౧౧. ౧౨. ౧౩. శ్లోకముల వ్యాఖ్యానము.

§ తృప్తిపఱపుఁడు.

♦ భోగము గోరువాఁడు.

* శ్రేయశ్శబ్దము మోక్షపరముగాను స్వర్గపరముగాను వ్యాఖ్యానము చేయఁబడినది.

హ. ఎట్లు ఇష్టకామధుక్కు యజ్ఞము? అనఁగా జెప్పుచున్నారు.—దేవాన్ = ఇంద్రాదులను; భావయత = వృద్ధి నొందింపుఁడు; అనేన = ఈయజ్ఞము చేత. తే, దేవాః = మీచే వృద్ధినొందింపఁబడిన యింద్రాదులు; వః= మిమ్ము; భావయన్తు. పరస్పరమ్, భావయన్తః, శ్రేయఃపరమ్, విజ్ఞానప్రాప్తిక్రమంబున, అవాప్స్యథ.

శం. ఎట్లీ యజ్ఞము మీకిష్టార్థము కలిగించు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—అనేన = ఈయజ్ఞముచేత, శ్రౌతముచేతను స్మార్తముచేతను; మీరు, దేవాన్= ఇంద్రాదులను; భావయత = సంభావింపుఁడు, చరుపురోడాశాదులచే సంతుష్టులం జేయుఁడని యర్థము. దీనిచే, సంభావింపఁబడినవారై—సంతుష్టులై, తే దేవాః = ఇంద్రాదులు; వః = మిమ్ము; భావయన్తు = ఇష్టార్థము నిచ్చుటచే సంభావింతురు గాక. ఇట్లు, పరస్పరమ్, భావయన్తః = సంభావించుచున్నవారలై; మీరు, దేవతలప్రసాదముచే నిశ్శేషముగానశించిన ప్రతిబంధము * గలవారై సత్త్వశుద్ధిచే సమ్యక్ జ్ఞానము నొంది, పరమ్ = నిరతిశయానందరూప మైన; శ్రేయః = విదేహకైవల్యమును; అవాప్స్యథ. ఇచట « పరస్పరం భావయన్త శ్శ్రేయః పర మవాప్స్యథ ” అని దేవతలకును బ్రజలకునుగూడ పరశ్రేయఃప్రాప్తి విహిత మగుచున్నది వాస్తవమే, అయినను విచారింపఁగా ప్రజలె ధర్మోపదేశమునకు విషయం బగుటచే ధర్మానుష్ఠానలభ్య పరమశ్రేయఃప్రాప్తివిధియు ప్రజలకే కాని తదనుగ్రాహకులకు దేవతలకుఁ గాదు. దేవతలు ఉపదేశమున కవిషయు మగుటవలనను స్వయం సిద్ధమైన విజ్ఞానముగలవారలగుటవలనను జీవన్ముక్తులగుటవలనను శ్రేయోవిధి వారి కుపయుక్తము గాదు. అందువలన సంభావనయందే పరస్పరపదమునకు సంబంధము కాని పరమశ్రేయః ప్రాప్తివిధియందు లే దని తెలియవలెను.

మ. ఎట్లు ఇష్టకామదోగ్ధ యగును యజ్ఞము? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అనేన= ఈయజ్ఞముచేత; యజమానుల రగు మీరు; దేవాన్= ఇంద్రాదులను, భావయత = సంవర్ధనము చేయుఁడు, తృప్తిపఱుపుఁ డని యర్థము. తే దేవాః, మీచే; భావితాః = తృప్తిపఱుపఁబడినవారలై; మిమ్ము, భావయన్తు = వర్షము మొదలగువానిచే అన్నోత్పత్తిద్వారమున తృప్తినొందింతురు గాక. ఇట్లు రెండొరులను దృప్తి పఱచుకొనుచు, దేవతలును మీరును, పరం శ్రేయః = ఇష్టార్థమును; అవాప్స్యథ =

---

* జ్ఞానప్రతిబంధము.

పొందెదరు, దేవతలు తృప్తినొందుదురు, మీరు స్వర్గరూప మైన పరమశ్రేయస్సును బొందెద రని యర్థము.

శ్రీ. ఎట్లు యజ్ఞం బిష్టకామదోగ్ధ యగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—అనేన = ఈయజ్ఞముచేత; మీరు, దేవాన్, భావయత—సంవర్ధనము చేయుఁడు. ఆదేవతలును; వః = మిమ్ము; సంవర్ధనము చేయుదురు గాక, వృష్టి మొదలగువానిచే అన్యోన్య తృప్తిద్వారమున. ఇట్లు ఒండొరులను సంవర్ధనము చేయుచున్నవారలై, దేవతలును మీరును, పరం శ్రేయః = అభీష్టార్థమును, పొందెదరు.

ప. ఇఁక భోగప్రదం బనుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—ఓ ప్రజలారా! అనేన = ఈయజ్ఞముచేత; దేవాన్; భావయత = సంతోషింపఁజేయుఁడు. అంత, సంతుష్టు లగు, తే దేవాః; వః = మిమ్ము; భావయన్తు = ఫలదానములచే సంతోషింపఁజేయుదురు గాక. ఇట్లు ఒండొరుల సంతోషపెట్టుటచేత, పరమ్ = ఉత్తమ మయిన; శ్రేయః = ఇష్టార్థమును; పొందెదరు.

రా. ఎట్లు? అనేన= దేవతారాధనభూతమైన ఈయజ్ఞముచేత; దేవాన్—నాకు శరీర మయినవారును నేనే ఆత్మగాఁ గలవారు నగు దేవతలను; భావయత= ఆరాధింపుఁడు. "అహం హి సర్వ యజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ" అని గదా చెప్పఁబోవుచున్నాఁడు. యజ్ఞముచే నారాధితు లగు, తే దేవాః = మదాత్మకులగు దేవతలు; తమ యారాధనమునకు అపేక్షితంబు లగు అన్నపానాదులచే, వః = మిమ్ము; భావయన్తు = పోషింతురు గాక. ఇట్లు పరస్పరమ్, భావయన్తః, పరం శ్రేయః—మోక్ష మని పేరు గలదాని; అవాప్స్యథ = పొందెదరు.

దేవతారాధనభూతం బగు నీయజ్ఞముచే మీరు మచ్ఛరీరభూతులు మదాత్మకులు నగు దేవతలఁ బూజింపుఁడు. ఆదేవతలు మీకుఁ దమపూజకై కావలసిన అన్నపానాదు లొసంగి మిమ్ముఁ బోషింతురు. ఇట్లు పరస్పరము నారాధించుటచే మీరు మోక్షము నొందెద రని తాత్పర్యము.

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః
తై ర్దత్తా నప్రదా యైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః. ౧౨

భా. మఱియును. వః = మీకు; దేవాః = దేవతలు; యజ్ఞభావితాః = యజ్ఞములచే వర్ధితులై, సంతోషింపఁజేయఁబడినవారై యని

యర్థము; ఇష్టాన్ = కోరఁబడిన; భోగాన్ = స్త్రీపశుపుత్త్రాదులను; దాస్యన్తే హి = ఇత్తురుగదా! తైః = ఆదేవతలచేత; దత్తాన్ = ఇయ్యఁబడిన; భోగాన్ = భోగ్యవస్తువులను; ఏభ్యః = ఈదేవతలకొఱకు; అప్రదాయ = ఇయ్యక, ఆనృణ్యము[1] చేయక యని యర్థము; యః = ఎవ్వఁడు; భుఙ్క్తే = తనదేహేంద్రియములనే తృప్తిఁబొందించుచున్నాఁడో; సః = అతఁడు, దేవతలు మొదలగువారి ద్రవ్యము నపహరించినవాఁడు; స్తేన ఏవ = దొంగయే.

మీరు యజ్ఞములచే దేవతల సంతోషింపఁజేయుదురేని వారు మీకు ఇష్టము లయిన భోగములను స్త్రీపశుపుత్త్రాదుల నొసంగుదురు. అట్లు దేవత లొసంగినవానిని వారి కర్పింపకయె యెవఁడు భుజించునో అతఁడు చోరుండే యగు నని తాత్పర్యము.

ఆ. ఇందువలనఁ గూడ అధికృతుఁడు కర్మముచేయవలె నని చెప్పుచున్నారు మఱియును అని. ఎట్లు మాచే భావింపఁబడినవారై దేవతలు మమ్ము భావింతురు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు ఇష్టా నిత్యాదిగా. యజ్ఞానుష్ఠానముచే మున్ను చెప్పినట్లు స్వర్గాపవర్గములు సిద్ధించినను స్త్రీపశుపుత్త్రాదిసిద్ధి యెట్లగు నని యాశంకించి పూర్వార్ధమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు వః ఇత్యాదిగా. పశ్వాదులచే యజ్ఞానుష్ఠానద్వారమున భోగము ననుభవింపవలెను, అట్లు కానిచోఁ బ్రత్యవాయము సంభవించు నని యుత్తరార్ధమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు తైః ఇత్యాదిగా. ఆనృణ్యము చేయక యని యర్థము.—దేవతలకును ఋషులకును బితరులకును యజ్ఞముచేతను బ్రహ్మచర్యముచేతను బ్రజచేతను సంతోషము కలిగింపక తనకార్యకరణసంఘాతమునే పోషించుటకు భుజించువాఁడు తస్కరుఁ డగుచున్నాఁ డని.

హ. మఱియును. దేవాః = ఇంద్రాదులు; యజ్ఞభావితాః; వః = మీకు; ఇష్టాన్ = అభిమతములైన; భోగాన్ = స్వర్గపుత్త్రాదులను; దాస్యన్తే. కావున. తైః; దత్తాన్; పరిగ్రహించి, ఏభ్యః, అప్రదాయ = చరుపురోడాశరూపమున ఇయ్యక; యో భుఙ్క్తే, సః, స్తేన ఏవ, వారలిచ్చిన భోగముల యుపభోగాదులకు ఆనృణ్యము సంపాదింపక, యని యర్థము.

[1] ఋణము లేనివారగుటను.

శ్రీ ం. యజ్ఞములచే సంభావితులై దేవతలు ముముక్షువులకుఁ గేవల మాముష్మికసుఖమును మాత్రమే కాదు, మ త్తే మనఁగా ఐహిక సంపత్సుఖమునుగూడ నొసంగుచున్నారు. కావున వారి ప్రీతికొఱకు యజ్ఞాదికం బవశ్యము చేయవలెను. చేయనిచోఁ బ్రత్యవాయ మగు నని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—యజ్ఞభావితాః = శ్రౌతస్మార్తయజ్ఞములచే సంభావింపఁబడిన; దేవాః = దేవతలు; వః = మీకు; ఇష్టాన్ = ఇచ్ఛకు విషయము లయిన; భోగాన్ = పశు పుత్త్రి కలత్ర ధన ధాన్యాదులను; దాస్యన్తే = ఇత్తురు. ఇట్లు; తైః = ఆదేవతలచేత; దత్తాన్ = ఇయ్యఁబడినపదార్థములను; మరల, చరుపురోడాశాదిరూపంబున; ఏభ్యః = ఈ దేవతలకొఱకు; అప్రదాయ = ఇయ్యక; దేవతలకును ఋషులకును పితరులకును యజ్ఞమునను బ్రహ్మచర్యమునను బ్రజచేతను ఆనృణ్యము సంపాదింపక; యః = ఎవ్వఁడు; తన శరీరమునుమాత్రమే పోషించుటకు, భుఙ్క్తే; సః; స్తేన ఏవ = దేవతలకు దొంగయే యగుచున్నాఁడు, శిష్టులకు నిందింపఁ దగినవాఁడును; దేవస్వమును బ్రహ్మస్వమును ♦ హరించిన చోరున కేగతియో ఆగతిని బొందుచున్నాఁ డని యర్థము.

మ. పరలోకఫలము మాత్రమే కాదు యజ్ఞమువలన మ త్తే మనఁగా ఐహికఫలముగూడఁ గలుగుచున్న దని చెప్పుచున్నాఁడు.—కోరఁబడిన భోగములను—పశ్వన్న హిరణ్యాదులను; వః = మీకొఱకు; దేవాః; దాస్యన్తే = ఇయ్యఁగలరు. హి = ఎందువలన ననఁగా, యజ్ఞములచే భావితులు—సంతోషింపఁ జేయఁబడినవారు వారు. ఎందువలన నవి వారిచే ఋణవంతుల రగు మీకు ఇయ్యఁబడిన భోగములో, అందువలన, తైః= ఆదేవతలచే, దత్తాన్ = ఇయ్యఁబడిన భోగములను; ఏభ్యః = ఈదేవతలకు; అప్రదాయ = యజ్ఞములందు దేవతల నుద్దేశించి ఆహుతులను వేల్వక; యః, భుఙ్క్తే = దేహేంద్రియములను మాత్రమే తర్పించుచున్నాఁడో; సః, స్తేన ఏవ- తస్కరుఁడే, దేవతలసొమ్ము నపహరించినవాఁడు, దేవతల ఋణము దీర్పకపోవుటవలన.

శ్రీ. దీనినే స్పష్టీకరించుచుఁ గర్మము చేయనిచో దోషము చెప్పుచున్నాఁడు.—యజ్ఞములచే భావితులై, దేవతలు వర్షాదిద్వారమున, వః = మీకు; భోగాన్; దాస్యన్తేహి. కావున, తైః= ఆదేవతలచే, దత్తాన్ = ఇయ్యఁబడిన అన్నా

♦ స్వము—ధనము.

దులను, ఏభ్యః = ఈదేవతలకొఱకు, పంచయజ్ఞాదులచే అర్పింపక, యో భుఙ్క్తే, వాఁడు మాత్రము, స్తేన ఏవ = చోరుఁడే యని తెలియవలెను.

ప. ఇట్లు ఫలనిశ్చయము నిరూపించుచుఁ జేయనిచో దోషముఁ జెప్పుచున్నాఁడు.—యజ్ఞభావితాః దేవాః, వః = మీకు, ఇష్టాన్ భోగాన్, దాస్యన్తే. ఇఁక దేవదత్తము లగు భోగములచేఁ బ్రమత్తులై కర్మత్యాగము చేయువారి నిందించుచున్నాఁడు—తైః = ఆదేవతలచే, దత్తాన్ = ఇయ్యఁబడిన అన్నాదిభోగములను, ఏభ్యః = ఈదేవతలకొఱకు, అప్రదాయ = ఇయ్యక; యో భుఙ్క్తే, సః = అతఁడు, స్తేన ఏవ = చోరుఁడే అని తెలియవలెను.

రా. యజ్ఞభావితాః = యజ్ఞముచే ఆరాధింపఁబడిన; దేవాః = మదాత్మకు లగుదేవతలు; ఇష్టాన్ భోగాన్ వః దాస్యన్తే—ఉత్తమపురుషార్థరూపమయిన మోక్షమును సాధించువారికి ఏవి యిష్టము లయినభోగములో అట్టి భోగములను—పూర్వ పూర్వయజ్ఞభావితులగు * దేవతలు ఉత్తరోత్తరారాధనమునకు ♦ అపేక్షితము లగు సమస్తభోగములను మీకిత్తు రని యర్థము. తమ్ము ఆరాధించుటకుఁగా, తైః = వారిచే; దత్తాన్ = ఇయ్యఁబడిన భోగములను; వారికి, అప్రదాయ = ఇయ్యక; యో భుఙ్క్తే = ఎవ్వఁడు భుజించుచున్నాఁడో. సః = అతఁడు; స్తేన ఏవ = చోరుఁడే. చౌర్యం బనఁగా.—పరకీయ మయి అతని ప్రయోజనముకొఱకే యేర్పడియున్న వస్తువునందుఁ దనదియను బుద్ధినుంచి దానిచేఁ దన్ను బోషించుకొనుటయే గదా! ఇందువలనఁ బరమపురుషార్థమున కనర్హుఁ డగుటమాత్రమే కాదు, మఱియేమనఁగా నరకపతనము గూడ సంభవించు నని యభిప్రాయము.

యజ్ఞశిష్టాశిన స్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః
భుఞ్జతే తే త్వఘం పాపా యే పచ న్త్యాత్మకారణాత్. ౧౩

భా. ఎవ్వరు మఱి, యజ్ఞశిష్టాశినః = దేవయజ్ఞాదులను నిర్వర్తించి దాన న్మిగిలినదాని అమృతాఖ్యమును భుజించుట స్వభావముగాఁ గలవారో, వారు యజ్ఞశిష్టాశులు; సన్తః = అట్టివారలగుచు; సర్వకిల్బిషైః = సమస్తపాపములచేతను, చుల్లి మొదలగు ఐదుసూనలచేఁ గలిగినవానిచే

* పూర్వములైన—మున్ను చేయఁబడిన యజ్ఞములచే ఆరాధింపఁబడినవారలగు.

♦ మీఁదు మీఁదు చేయవలసిన యారాధనమునకు.

తను ప్రమాదమునఁ జేయఁబడిన హింసాదులవలనఁ గలుగు నితర పాపములచేతను, ముచ్యన్తే = విడువఁబడుచున్నారు. ఇఁక ఆత్మంభరులు, యే = ఎవ్వరు; ఆత్మకారణాత్ = తమకొఱకు; పచన్తి = పాకము నెఱవేర్చుచున్నారో; తే తు = వారలో; అఘమ్ = పాపమును; భుఞ్జతే = భుజించుచున్నారు; పాపాః = తాము పాపులైన వారై.

దేవయజ్ఞాదులు నెఱవేర్చి యందు మిగిలిన యన్నము నెవ్వరు భుజింతురో వారలు పంచసూనాదులవలనఁ గలుగు పాపములచేతను ప్రమాదకృతహింసాది జన్యములగు ఇతరపాపములచేతను విముక్తులగుదురు. ఇఁక నెవ్వరు తమశరీరము నిమిత్తమె యే పాకము చేయుదురో, వారు తాము పాపులగుటయె గాక పాపమునే భుజించుచున్నారని తాత్పర్యము.

ఆ. దేవాదులకర్పింపక భుజించువారలకుఁ బ్రత్యవాయముఁ జెప్పి తదితరులకు సర్వదోషరాహిత్యముఁ దెలుపుచున్నాఁడు ఎవ్వరుమఱి ఇత్యాదిగా. త్రైగుణ్యాన ప్రదాయ ఇత్యాదిగాఁ జెప్పిన యర్థమును నిగమనము చేయుచున్నాఁడు ఉత్తరార్థముచేత. దేవయజ్ఞాదులను అనుచోటి ఆదిశబ్దముచేత పితృయజ్ఞము మనుష్యయజ్ఞము భూతయజ్ఞము బ్రహ్మయజ్ఞము అను నాలుగుయజ్ఞములు గ్రహింపఁబడుచున్నవి. చుల్లీశబ్దముచే పితరధారణాద్యర్థక్రియ చేయువిన్యాస విశేషవంతములు మూఁడుఱాలు* చెప్పఁబడుచున్నవి. ఆదిశబ్దముచే కండని పేషణి మార్జని ఉదకుమ్భము అను నీహింసాహేతువులు గ్రహింపఁబడినవి. ఇవి యయిదును ప్రాణుల సూనాస్థానములు ♦ —హింసాకారణములు, వానిచేఁ గలుగు బుద్ధిపూర్వము లగు సర్వపాపములచేతను, విడువఁ బడుచున్నారని యన్వయము. ప్రమాద మనఁగా విచారింపకయె అబుద్ధిపూర్వకముగా సంభవించునట్టి పాద పాతము మొదలగు కార్యము, దానిచేఁ బ్రాణుల హింస కావచ్చును, ఆది శబ్దముచే అశుచి సంస్పర్శాదికము గ్రహింపఁబడినది, వానివలనఁ గలుగు పాపములచేతనుం గూడ మహాయజ్ఞములు చేయువారు విడువఁబడుచున్నారు. చెప్పఁబడినది గదా « కణ్డనీ పేషణీ చుల్లీ ఉదకుమ్భశ్చ మార్జనీ । పఞ్చ సూనా గృహస్థస్య పఞ్చయజ్ఞా త్ప్రణశ్యతి ॥ పఞ్చ సూనా గృహస్థస్య చుల్లీ పేష ణ్యవస్కరః ‖ । కణ్డనీ చైవ కుమ్భశ్చ వధ్యన్తే

* ప్రొయ్యి.

♦ సూన యనఁగా పశువధ స్థానము.

‖ అవస్కరము—మార్జని.

యాశ్చ వా హాయన్." * దీని కిది యర్థము—యాః—ఈ చెప్పిన అయిదు సూనలేవి గృహస్థునకుఁ గలవో, వానిని ఎవ్వఁడు, వాహాయన్—నడపుచు ఉన్నాఁడో అతనిచేఁ బ్రాణులు బుద్ధిపూర్వకముగాఁగూడ వధింపఁబడుచున్నవి, అందుచేఁ గలుగు సమస్తపాపంబును మహాయజ్ఞానుష్ఠానంబు వలన నశించుచున్నది అని మహాయజ్ఞానుష్ఠానము స్తుతించుచున్నారు. మహాయజ్ఞముల ననుష్ఠింపని వారలను నిందించుచున్నారు ఇఁక ఆత్మంభరులు ♦ అని. ఆత్మంభరిత్వమునే నిరూపించుచున్నారు యే ఇత్యాదిగా. స్వదేహేంద్రియపోషణార్థమే పాకముచేయునట్టి దేవయజ్ఞాది విముఖులు పాపభూయిష్ఠు లని తెలుపుచున్నారు తే తు ఇత్యాదిగా.

హా. యజ్ఞము లనఁగా అయిదు మహాయజ్ఞములు, దేవయజ్ఞము పితృయజ్ఞము భూతయజ్ఞము మనుష్యయజ్ఞము బ్రహ్మయజ్ఞము అని. ఇవి యయిదు మహాయజ్ఞములు, వానియొక్క శేషము యజ్ఞశిష్టము, దేవయజ్ఞాదులను నెఱవేర్చి తచ్ఛిష్టమయిన అశనమును అమృత మను పేరుగలదాని భుజించుట స్వభావముగాఁ గలవారు యజ్ఞశిష్టాశులు; సర్వకిల్బిషైః = సర్వపాపములచే; ముచ్యన్తే = విడువఁబడుచున్నారు, చుల్లి పేషణి అవస్కరము కండని కుంభము అను అయిదు సూనలచేఁ గలుగు పాపములచేతను బ్రమాదకృతహింసాజన్యము లగు పాపములచేతను విడువఁ బడుచున్నారు. యే = ఎవ్వరు, ఆత్మకారణాత్, పచన్తి, తేతు = వారలో, పాపాః = పాపస్వరూపులు, అఘమ్ = పాపమునే, భుఞ్జతే. అందువలన నవశ్యము పంచమహాయజ్ఞములు చేయవలెను.

శం. ఎవ్వరు పంచమహాయజ్ఞములను జేసి మిగిలిన యన్నము భుజింతురో వారు సర్వపాపములచేతను విముక్తులగుదురు, ఇఁక నెవ్వరు దేవతలు అతిథులు మొదలగువారి నుద్దేశింపక స్వార్థమే వండుకొనుచున్నారో వారలు పాపభోజనులే యని పంచమహాయజ్ఞములయనుష్ఠానమునకును అననుష్ఠానమునకును ఫలముఁ జెప్పుచున్నాఁడు పంచమహాయజ్ఞములు ప్రతిదినమును అవశ్యకర్తవ్యము లని దృఢపఱచుచున్నారు.—బ్రాహ్మణులు, యజ్ఞశిష్టాశినస్సన్తః—"దేవయజ్ఞః పితృయజ్ఞః" ఇత్యాది శ్రుతిచేఁ జెప్పఁబడిన పంచమహాయజ్ఞముల ననుష్ఠించి తచ్ఛేషమైన అన్నమును భుజించు

* కండని—రోలు, పేషణి—సన్నెకల్లు, చుల్లి—ప్రొయ్యి, ఉదకుంభము—నీటికుండ, మార్జనీ—చీపురుకట్ట, ఇవియయిదుసూనలు—వధస్థానములు గృహస్థునకుఁగలవు. ఆదోషము పంచమహాయజ్ఞముల వలన నశించుచున్నవి.

♦ శరీరమును మాత్రము పోషించుకొనువారు.

వారలై; సర్వకిల్బిషైః—“ కణ్డనీ పేషణీ చుల్లీ చోదకుమ్భీ చ మార్జనీ। పఞ్చ సూనా గృహస్థస్య పఞ్చ యజ్ఞా త్ప్రణశ్యతి” అను స్మృతిచేఁ జెప్పఁబడిన బుద్ధిపూర్వక కృతపాపము లేవిగలవో చేతులు కాళ్లు తగులుట మొదలగువానిచేఁ గలిగినవి అవశముగా ప్రాప్తించిన వేవిగలవో, అట్టి సమస్తపాపములచేతను; ముచ్యన్తే, అవి విడుచుటవలనఁ జిత్తశుద్ధిని దానిచే జ్ఞానమును మోక్షమును బొందుదు రని యర్థము. పంచమహాయజ్ఞములను జేయని పాపులైన యే బ్రాహ్మణులు, ఆత్మకారణాత్ = తమ కడుపునిండించుకొనుట నిమిత్తమైయే; పచన్తి; దేవార్థము వైశ్వదేవార్థము కాదు. దేవతలకును బితరులకును బ్రాహ్మణులకును అర్పింపక తామే, భుఞ్జతే = భుజించుచున్నారో; తేతు = వారలో; పాపమునే అన్నరూపమున ఉన్నదాని భుజించుచున్నారు, కాని అన్నమునుగాదు. తమదృష్టిచే నది యన్న మని తోఁచునుగాని శాస్త్ర దృష్టిచేతను దేవతాదృష్టిచేతను పాపమే యగుం గావున వారలే పాపిష్ఠతము లని యర్థము. అట్లు శ్రుతి “ మోఘ మన్నం విన్దతే అప్ర చేతాః । కేవలాఘో భవతి కేవలాదీ ” * అని. ఏకా క్రియా ద్వ్యర్థ కరీ బభూవ, § అనున్యాయమున ముముక్షువగు శ్రోత్రియుఁడు చేయు కర్మము సత్త్వశుద్ధిద్వారమునఁ దనకు మోక్షహేతువగుచున్నది, వృష్ట్యాదిద్వారమున జగత్తునకు స్థితిహేతువగుచున్నది. కావున రెండు విధములను గూడఁ గర్మము కర్తవ్యమే.

మ. ఎవ్వరు, వైశ్వదేవాది యజ్ఞావశిష్ట మయిన యమృతమును భుజించువారలో; వారు, సన్తః= సత్పురుషులు, వేదోక్తము నాచరించి దేవాదులఋణముఁ దీర్చినవా రగుటవలన. కావున, వారు, ముచ్యన్తే, సర్వకిల్బిషైః = విహితకర్మము చేయమిచేఁ గలుగు పాపములచేతను బూర్వకృతము లగు పంచసూనలచేఁ గలుగు పాపములచేతను అన్నిటిచేతను; వారు భూతపాపములతోను భవిష్యత్పాపములతోను ♦ సంబంధములేనివార లగుదు రని యర్థము. ఇట్లు అన్వయమున ❛ భూతభావిపాపముల అభావముఁ జెప్పి వ్యతిరేకమున ♦♦ దోషముఁ జెప్పుచున్నాఁడు — తే = వారు, వైశ్వదేవాదులఁ జేయనివారు; అఘంతు = పాపమునే,

---

* దీని అర్థమును బరమార్థప్రపలోఁ జూచునది.

§ ఒక కార్యము రెండుప్రయోజనములు గలిగించునది అయ్యెను.

♦ పంచసూనాకృతములు భూతములు, విహితకర్మము చేయమిచేఁ గలుగునవి భవిష్యత్పాపములు.

❛ యజ్ఞము లనుష్ఠించుపక్షమున.

♦♦ యజ్ఞము లనుష్ఠింపనియెడ.

తు శబ్ద మవధారణార్థకము; భుఞ్జతే = భుజించుచున్నారు; యే = ఎవరు; పాపాః = పంచసూనా నిమిత్తమునను ప్రమాదకృత హింసానిమిత్తమువలనను పాపము చేసిన వారలై; ఆత్మకారణాత్ = తమనిమిత్తమై; పచన్తి = వండుచున్నారో, కాని వైశ్వదేవాది నిమిత్తము కాదో. అట్లు, పంచ సూనానిమిత్తపాపము ఉండఁగానే వైశ్వదేవాది నిత్యకర్మము చేయమిచేఁ గలుగునట్టి మఱియొక పాపమును పొందుచున్నారు కావున 'భుఞ్జతే తేత్వఘం పాపాః' అని చెప్పఁబడినది. అట్లు స్మృతి «కణ్డనీ పేషణీ చుల్లీ ఉదకుమ్భీ చ మార్జనీ । పఞ్చ సూనా గృహస్థస్య తాభిః స్వర్గం న విన్దతి » 1 అనియు, « పఞ్చ సూనా కృతం పాపం పఞ్చ యజ్ఞైర్వ్యపోహతి » * అనియు. శ్రుతియును 'ఇద మేవా స్య త త్సాధారణ మన్నం యది ద మద్యతే స యఏత దుపాస్తే న స పాప్మనో వ్యా వర్తతే మిశ్రం హ్యే తత్ » ** అని మంత్రవర్ణమును ♦ « మోఘ మన్నం విన్దతే అప్రచేతా స్సత్యం బ్రవీమి వధ ఇత్స తస్య । నార్యమణం పుష్యతి నోసఖాయం కేవలాఘో భవతి కేవలాదీ » 1 అని. ఇది యుపలక్షణము పంచమహాయజ్ఞములకును శ్రౌత స్మార్త నిత్యకర్మములకును. అధికృతుఁడగు వాఁడు నిత్యకర్మముల నవశ్య మనుష్ఠింపవలె నని ప్రజాపతివచనాభిప్రాయము.

శ్రీ. ఇందువలనఁ గూడ యజ్ఞముచేయువారే శ్రేష్ఠులు, ఇతరులు కారని చెప్పుచున్నాఁడు.—వైశ్వదేవాది యజ్ఞముల శేషమును ఎవరు భుజింతురో వారు పంచసూనాకృతము లైన సమస్తకిల్బిషములచేతను విడువఁబడుచున్నారు. సూనలు అయిదు స్మృతియందుఁ జెప్పఁబడినవి. « కణ్డనీ పేషణీ చుల్లీ ఉద కుమ్భీ చ మార్జనీ । పఞ్చ సూనా గృహ స్థస్య తాభి స్స్వర్గం న విన్దతి. » అని. ఇఁక నెవ్వరు తమభోజనము కొఱకే వండుకొనుచున్నారో కాని వైశ్వదేవార్థము కాదో, వారు, పాపాః = దురాచారులు, అఘమునే భుజించుచున్నారు.

---

1 గృహస్థునకు ఈపంచసూనలు గలవు, వానిచే నతఁడు స్వర్గముఁబొందఁడు.

* పంచసూనలచేఁ గలుగు పాపమును పంచయజ్ఞములచేఁ బోఁగొట్టుచున్నాఁడు.

** ఏది యిది భక్షింపఁబడుచున్నదో అట్లు ఇదియే వానికి సాధారణమైన అన్నము. ఎవఁడీ యన్నమును సేవించుచున్నాఁడో అతఁడు పాపమునుండి తొలఁగఁడు. పాపమిశ్రము గదా యిది.

♦ శ్రుతి విశేషము.

1 దీనియర్థము పరమార్థప్రపయందుఁ జూచునది.

ప. ఇఁక సత్పురుషుల స్తుతించుచున్నాఁడు.—వైశ్వదేవాది యజ్ఞశిష్ట మయిన యన్నమును ఎవరు తినుచున్నారో వారలే, సన్తః = సత్పురుషులు; వారు, దైనందినము లగు పంచసూనాది సమస్తపాపములచేతను విడువఁబడుచున్నారు. ఇఁక యే, పాపాః = పాతకు లగు పురుషులు; ఆత్మకారణాత్ = కేవలము దేహపోష ణార్థము; పచన్తి = పాకముచేయుచున్నారో, తే = వారు; అఘం తు = పాపమునే; భుఞ్జతే. ఋక్శాఖియశ్రుతియును "మోఘ మన్నం విన్దతే అప్రచేతా స్సత్యం బ్రవీమి వధ ఇ త్స తస్య। నార్యమణం పుష్యతి నోసఖాయం కేవలాఘో భవతి కేవలా దీ" అని. ఇందుకు భాష్యము.—అప్రచేతాః = మంచిమనస్సు లేనివాఁడు, మూర్ఖుఁడు; మోఘమ్ = నిష్ఫల మయిన; అన్నమ్; విన్దతే= సంపాదించుచున్నాఁడు. సః = వాఁడు; తస్య = అతనికి; వధ ఇత్ = వధించువాఁడే, ఆత్మఘాతుకుఁడే యని యర్థము. వాఁడెవ్వఁడు ? ఎవఁడు వైశ్వదేవముచే, అర్యమణమ్ = సూర్యుని; నపుష్యతి = తృప్తిపఱుపఁడో; రాత్రియందును, సఖాయమ్ = ఉపకారకుఁ డయిన అగ్నిని; నో = తృప్తినొందింపఁడో, వాఁడు. ఇట్లెవఁడు కేవలము భక్షించుచున్నాఁడు కావున, కేవలా దీ—దేహపోషణార్థముమాత్రమే భక్షించుచున్నాఁడో, అతఁడు కేవ లాఘః = పాపమునే భక్షించువాఁడు, భవతి. అని, సత్యం బ్రవీమి= సత్యముఁ జెప్పు చున్నాను, వైశ్వదేవము స్తుతించుకొఱకుఁ గా దని యర్థము. శతపథమందును "న స పాప్మనో వ్యావర్తతే" * అని.

రా. ఇంద్రాదిరూపమున అవస్థితుం డగు పరమపురుషు నారాధించు నుద్దే శముచేతనే ద్రవ్యముల సంపాదించి పక్వములం జేసి వానిచే ఇంద్రాదిరూపమున నున్న పరమపురుషు నారాధించి తచ్ఛేషము భుజించుటచే నెవరు శరీరయాత్రచేయు దురో వారు మాత్రమే అనాదికాలసంపాదితంబులై ఆత్మయాథాత్మ్యావలోకన ప్రతి బంధకము లగు సర్వపాపంబులచేతను విడువఁబడుచున్నారు. ఇఁక నెవ్వరు పరమ పురుషునిచే ఇంద్రాదిరూపంబునఁ దనయారాధనంబుకొఱకు ఒసంగఁబడినవాని ఆత్మార్థములుగా గ్రహించి పక్వములం జేసి భుజించుచున్నారో అట్టి పాపాత్ములు, అఘమునే—పాపమునే భుజించుచున్నారు. అఘముగాఁ బరిణమించుటవలన † అఘ మని చెప్పఁబడుచున్నది. ఆత్మావలోకనవిముఖులై నరకముకొఱకే పచనము చేయుచున్నారు.

---

* అతఁడు పాపమునుండి తొలఁగఁడు.

† అన్నము.

అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసమ్భవః
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః. ౧౪

భా. ఇందువలనఁ గూడ అధికృతుఁడు కర్మము చేయవలెను. జగచ్చక్ర ప్రవృత్తిహేతువు గదా కర్మము. ఎట్లు? చెప్పెదము.— అన్నాత్ = భుజింపఁబడినదై లోహితరేతోరూపంబునఁ బరిణతం బగు అన్నమువలన; భూతాని = ప్రాణులు; భవన్తి = ప్రత్యక్షముగాఁ బుట్టుచున్నవి. పర్జన్యాత్ = వర్షమువలన; అన్నసమ్భవః = అన్నముయొక్క ఉత్పత్తి. యజ్ఞాత్ = యజ్ఞము వలన; పర్జన్యః = వర్షము; భవతి = అగుచున్నది. 'అగ్నౌ ప్రాస్తాహుతిస్సమ్యగాదిత్యముపతిష్ఠతే। ఆదిత్యాజ్జాయతే వృష్టిర్వృష్టేరన్నం తతః ప్రజాః' * అను స్మృతివలన. యజ్ఞః—అపూర్వము, అట్టి యజ్ఞము; కర్మసముద్భవః = కర్మ మనఁగా ఋత్విగ్యజమానాదుల వ్యాపారము, అది సముద్భవము—కారణముగాఁ గలది.

భుక్తమై శుక్రశోణితరూపమునఁ బరిణమించిన అన్నమువలనఁ బ్రజలు పుట్టుచున్నారనుట ప్రత్యక్షముగదా! అట్టి యన్నమో వర్షమువలనఁ బుట్టుచున్నది. వర్షము యజ్ఞమువలనఁ గలుగుచున్నది. యజ్ఞము ఋత్విగ్యజమానాది వ్యాపారరూప మయిన కర్మమువలన సంభవించుచున్నది యని తాత్పర్యము.

ఆ. దేవయజ్ఞాది కర్మము అధికృతుఁడు చేయవలె ననుటకు హేత్వంతరపరముగా మీఁదిశ్లోకమున కవతారిక చేయుచున్నారు ఇందువలనఁ గూడ ఇత్యాదిగా. ఇందువలన అను శబ్దముచే నుపాత్తమైనదానినే తెలుపుచున్నారు జగచ్చక్రేత్యాదిగా. ఓయీ! భుక్తమైన అన్నము శుక్రశోణితరూపముగాఁ బరిణమించి ప్రజారూపంబునఁ బుట్టుచున్నది, ఆయన్నమో వర్షమువలనఁ గలుగు ననుట ప్రత్యక్షసిద్ధము; ఇట్లుండఁగా ఎట్లు కర్మమునకు జగచ్చక్రప్రవర్తకత్వము? అని శంకించుచున్నాఁడు ఎట్లు అని. పారంపర్యమునఁ గర్మము జగచ్చక్రప్రవృత్తిహేతు వగు నని సాధించుచున్నారు చెప్పెదము అని. చెప్పిన యర్థమునందు స్మృత్యంతరసంవాదముఁ జూపుచున్నారు అగ్నౌ ఇత్యాదిగా. అందు, దేవతాభిధ్యానపూర్వక

---

* అగ్నియందుఁ జక్కఁగా వేల్వఁబడిన ఆహుతి సూర్యునిఁ బొందుచున్నది, సూర్యునివలన వర్షము గలుగుచున్నది, వర్షమువలన అన్నము దానివలనఁ బ్రజలు కలుగుచున్నారు.

ముగా తత్తద్దేవతోద్దేశంబున అగ్నియందు వేల్వఁబడిన ఆహుతి అపూర్వత్వము నొందినదై రశ్మిద్వారంబున సూర్యు నారోహించి వర్షరూపంబున భూమింజేరి వ్రీహియవాద్యన్నభావమునుబొంది సంస్కరింపఁబడి భుక్తమై శుక్రశోణిత రూపంబునఁ బరిణమించి ప్రజాభావముఁ జెందుచున్న దని యర్థము. యజ్ఞః కర్మసముద్భవః అనుట అయుక్తము, తానే తన యుత్పత్తికిఁ గారణం బనుట సంభవింపమి వలన అని యాశంకించి చెప్పుచున్నారు ఋత్విగ్యజమానాదుల వ్యాపార మని. ఆది శబ్దము ద్రవ్యదేవతల గ్రహించుచున్నది.

హ. అన్నాత్; భవన్తి; భూతాని = కార్యకారణ సంఘాతాత్మకములు. పర్జన్యాత్ = వృష్టివలన; అన్నసమ్భవః. యజ్ఞాత్ భవతి పర్జన్యః « అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్య గాదిత్య ముప తిష్ఠతే। ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః » అను స్మృతివలన. యజ్ఞాత్ = యాగక్రియాజన్య మయిన ధర్మమువలన. యజ్ఞః—యాగక్రియాజన్య మయిన ధర్మము; కర్మసముద్భవః—కర్మ = ఋత్విగ్యజమాన వ్యాపారరూప మయిన యాగము, సముద్భవః = కారణముగాఁ గలది.

శం. «ముచ్యన్తే సర్వ కిల్బిషైః" అనియు «నైష్కర్మ్యం పురుషో ఒశ్నుతే » అనియుఁ గర్మము మోక్షహేతువనుట ప్రతిపాదింపఁ బడినది. జగత్స్థితి హేతువనుట నిప్పుడు నిరూపించుచున్నాఁడు మూఁడు శ్లోకములచేత.— « అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్య గాదిత్య ముపతిష్ఠతే । ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః » అని స్మృతియందుఁ జెప్పఁబడినచొప్పున, యజ్ఞాత్ = శ్రోత్రియునిచే యథాశాస్త్రముగా నెఱవేర్పఁ బడిన యజ్ఞమువలన; పర్జన్యః = వర్షము; భవతి. పర్జన్యాత్; అన్న సమ్భవః = వ్రీహియవాది రూప మయిన అన్నము యొక్క ఉత్పత్తి యగుచున్నది. అన్నాత్ = స్త్రీపురుషులచే భుజింపఁబడి శుక్లశోణితరూపమునఁ బరిణమించిన యన్నమువలన; భూతాని = ప్రాణులు; భవన్తి= పుట్టుచున్నారు, పుట్టి యన్నముచేతనే జీవించుచున్నారు గూడ. ఇట్లు వృష్ట్యన్నముల ద్వారమున జగజ్జీవన హేతు వగు యజ్ఞ మేదిగలదో, యజ్ఞః = ఆ అపూర్వలక్షణమైన యజ్ఞము; కర్మసముద్భవః = ఋత్విగ్యజమానాదులచేఁ జేయఁబడు హోమ మంత్ర తంత్రాది వైదికక్రియ కర్మమని చెప్పఁబడుచున్నది, ఆకర్మమువలన సముద్భవము—చక్కని యుత్పత్తి గలది.

మ. కేవలము ప్రజాపతి వచనమువలన మాత్రమే కర్తవ్యము కాదు కర్మము, మఱే మనఁగా జగచ్చక్రప్రవృత్తికి హేతు వగుటవలనఁ గూడ కర్తవ్యము కర్మము అని చెప్పుచున్నాఁడు మూఁడింటిచేత.—అన్నాత్ =భుజింపఁబడినదై రేతో లోహిత రూపంబునఁ బరిణమించిన యన్నమువలన; భూతాని = ప్రాణిశరీరములు; భవన్తి = పుట్టుచున్నవి. అన్న సమ్భవః = అన్నముయొక్క జన్మము; పర్జన్యాత్ = వర్షమువలన, ప్రత్యక్షసిద్ధంబే యిది. ఇందు కర్మముయొక్క యుపయోగముఁ జెప్పుచున్నాఁడు.—యజ్ఞాత్ = కారీర్యాదికమును • అగ్నిహోత్రాదికంబు నగు అపూర్వాఖ్యం బైన ధర్మమువలన; పర్జన్యః=వర్షము; భవతి=అగుచున్నది, అగ్నిహోత్రాహుతి వృష్టిజనకం బని అష్టాధ్యాయీకాండమున జనకయాజ్ఞవల్క్యసంవాదరూప మగు షట్ప్రశ్నియందు * ప్రతిపాదింపబడినది. మనువుచేతనుం జెప్పఁబడినది « అగ్నౌ ప్రాస్తా ఽఽహుతి స్సమ్య గాదిత్య ముపతిష్ఠతే । ఆదిత్యాజ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః » అని. యజ్ఞః= ఆధర్మాఖ్య మయినసూక్ష్మము; కర్మసముద్భవః—ఋత్విగ్యజమానవ్యాపారముచే సాధ్యము, అపూర్వలక్షణం బగుయజ్ఞమునకు విహిత కర్మము గదా కారణము.

శ్రీ. జగచ్చక్రప్రవృత్తి హేతువగుటవలనఁ గూడఁ గర్మము కర్తవ్య మని చెప్పుచున్నాఁడు మూఁడు శ్లోకములచేత.—అన్నాత్ = శుక్లశోణితరూపంబునఁ బరిణమించిన అన్నమువలన; భూతాని, పుట్టుచున్నవి. అన్నముయొక్క యుత్పత్తి, పర్జన్యాత్ =వృష్టివలన. పర్జన్యః = అవృష్టి, యజ్ఞాత్, భవతి. యజ్ఞః= అయజ్ఞము; కర్మసముద్భవః—యజమానాదివ్యాపారరూప మయిన కర్మముచేత చక్కగా నిష్పన్న మగునది యని యర్థము. « అగ్నౌ ప్రాస్తా » ఇత్యాది స్మృతివలన.

ప. ఇఁక లోకోపకారార్థముగూడఁ గర్మము చేయవలె నని చెప్పుచున్నాఁడు.—అన్నాత్ రేతోరూపంబునఁ బరిణమించిన దానివలన, భూతాని, భవన్తి, ఇట భవన్తి అనుటచే అన్నముచేత నే జీవించుచున్నవి అన్నముచేతనే వర్ధిల్లుచున్నవి యని తెలియునది. శ్రుతియును బ్రహ్మవల్లియందు « అన్నా ద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే జాతా న్యన్నేన వర్ధన్తే » † ఇత్యాదిగాఁ గలదు. ఇఁక,

• కారీరి అనఁగా వర్షఫలకం బగు ఇష్టి.

* అష్టాధ్యాయి—ఎనిమిది యధ్యాయము లగు బృహదారణ్యకోపనిషత్తు, షట్ప్రశ్ని—అయుప నిషత్తునందలి యాఱు ప్రశ్నములు. ప్రశ్న మనఁగా అడుగుట.

† అన్నముచేతనే గదా యీ భూతములు పుట్టుచున్నవి, పుట్టినవి అన్నముచేతనే పెరుఁగుచున్నవి.

అన్నము, దేనివలన? పర్జన్యునివలన. అది దేనివలన? యజ్ఞాత్ = పర్జన్యేష్టివలన. యజ్ఞమును దేనివలన? అది, కర్మసముద్భవః, కర్మ మనఁగా దానికొఱకు యజమానుని వ్యాపారము.

రా. మరల లోకదృష్టిచేతను శాస్త్రదృష్టిచేతను సర్వంబును యజ్ఞమూలం బని తెలిపి యజ్ఞము ననువర్తించుట యవశ్యకర్తవ్యం బనుటయు ననువర్తింపనిచో దోషంబును జెప్పుచున్నాఁడు.—«అన్నమువలన సర్వభూతంబులును బుట్టుచున్నవి, పర్జన్యుని వలనను అన్నసంభవము"— ఇది సర్వలోక ప్రసిద్ధము. యజ్ఞమువలనఁ బర్జన్యుఁడు కలుగుచున్నాఁ డనునదియుఁ దెలియుచున్నది «అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే । ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః" ఇత్యాదిశాస్త్రముచేత. యజ్ఞమును, కర్మసముద్భవః = ద్రవ్యార్జనాది కర్తృవ్యాపారమువలనఁ బుట్టునది.

మా. హేత్వంతరముఁ జెప్పుచున్నాఁడు.—యజ్ఞము పర్జన్యుని యన్న మగుటవలనఁ, బర్జన్యునికిఁ గారణముగాఁ జెప్పఁబడుచున్నది *; పూర్వయజ్ఞము♦ వివక్షించునెడ దానికిఁ జక్రప్రవేశము ❡ సంభవింపదు. ఆపాద్యము గదా అది కర్మవిధికొఱకు §. సామ్యమాత్రమును బట్టి యేమో యిప్పుడు కర్మము కార్యము గాదు **. లేక పర్జన్యుఁ డనఁగా మేఘచక్రాభిమాని దేవత, ఆమేఘచక్రమో యజ్ఞమువలనఁ బుట్టుచున్నది. «అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే । ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః» అను స్మృతివలనఁ గూడ. రెండును జెప్పఁబడియుండుటవలన ♦♦ ఆదిత్యునివలనను సముద్రునివలనను వృష్ట్యంగీకారమునందు విరోధము లేదు. ఇందువలననుగూడ యజ్ఞము

---

* ఇటఁ బర్జన్యుఁ డనఁగా ఆదిత్యుఁ డని యర్థము.

♦ ఏయజ్ఞముచేయుటచేఁ బర్జన్యుఁడు పర్జన్యత్వమునొందెనో దాని.

❡ జగచ్చక్ర ప్రవేశము.

§ ఆపాద్యము—యజ్ఞముచేఁ బుట్టింపఁ దగినది. విహిత మయిన యజ్ఞము చేయుటచేజగచ్చక్రము ప్రవర్తించును, అందుచే యజ్ఞము నాచరింపవలయు నని కర్మవిధికి ఆపాద్యమైన జగచ్చక్ర ముపయోగించుం గాని ఇదివఱ కాపాదిత మైనది యుపయోగింపదనుట.

** పర్జన్యసామ్యమునుబట్టి—పర్జన్యుండు కర్మముఁ జేసి పర్జన్యత్వమునొందెను. వానివలె [illegible] కర్మముచేయవలె నని యభిప్రాయము గాదు.

♦♦ ఆదిత్యునివలననువృష్టిగలుగు ననియుఁ జెప్పఁబడియుంటవలన.

వలనఁ బర్జన్యోద్భవము సంభవించుచున్నది. యజ్ఞ మనఁగా దేవత నుద్దేశించి ద్రవ్య పరిత్యాగము. కర్మము—ఇతరక్రియ.

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మా ఽక్షరసముద్భవమ్
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. ౧౫

భా. కర్మ = ఆకర్మమును; బ్రహ్మోద్భవమ్= బ్రహ్మ మనఁగా వేదము అదికారణముగాఁ గలదానిఁగా; విద్ధి = ఎఱుంగుము. బ్రహ్మ = ఇఁక వేదము; అక్షరసముద్భవమ్ = అక్షర మనఁగా బ్రహ్మము—పరమాత్మ కారణముగాఁ గలది, వేదము పరమాత్మ వలనఁ గలిగిన దని యర్థము. *ఎందువలన సాక్షాత్తుగాఁ బరమాత్మ యనంబడు నక్షరమువలనఁ బురుష నిశ్వాసమువలెఁ బుట్టినదో అందువలన, బ్రహ్మ = వేదము; సర్వార్థప్రకాశకం బగుటవలన, సర్వగతమ్ = సర్వగతమయ్యును; నిత్యమ్ = ఎల్లప్పుడును; యజ్ఞవిధిప్రధాన మగుటవలన, యజ్ఞే = యజ్ఞమునందు; ప్రతిష్ఠితమ్ = ఉన్నది.

ఆకర్మము వేదముచే బోధితమగుచున్నది. ఆవేదము పరమాత్మవలన పురుషనిశ్వాసమువలె నావిర్భవించినది. ఇట్లు సర్వకారణ మయిన పరమాత్మవలనఁ బురుషనిశ్వసరూపంబున లోకోపకారార్థము వేదము ప్రవర్తించిన దగుటవలన, ఆవేదము సర్వార్థములను బోధించునదియయ్యును, యజ్ఞము జగచ్చక్రప్రవృత్తిహేతు వగుటంజేసి, యజ్ఞవిధానమునందు ముఖ్యతాత్పర్యముగలదియై యున్న దని తాత్పర్యము.

ఆ. ఏది యపూర్వమునకు హేతువుగాఁ జెప్పఁబడినదో ఆకర్మము ఏమిచైత్యవం దనాదికమా ? * అగ్నిహోత్రాదికమా ? అని సందేహించువానికి సమాధానము చెప్పుచున్నారు కర్మేత్యాదిగా. ఎట్లు కర్మముబ్రహ్మోద్భవంబని చెప్పవచ్చును? సర్వంబునకు బ్రహ్మోద్భవత్వము సమాన మగుటవలన. అని యాశంకించి చెప్పుచున్నారు బ్రహ్మ మనఁగా వేదము అని. అ ట్లయిన యెడ వేదాఖ్య మే అనాదినిధనబ్రహ్మం బనవలె ననఁగాఁ జెప్పుచున్నారు ఇఁక వేదము ఇత్యాదిగా. అక్షరరూప మయిన వేదమునకు అక్షరములవలననే యుత్పత్తి సంభవింప దని యాశంకించి చెప్పుచున్నారు అక్షరమనఁగా ఇత్యా

* బౌద్ధులచేఁ జెప్పఁబడినది చైత్యవందనము మొదలగునది.

దిగా. అక్షరమే బ్రహ్మ మని చెప్పఁబడినది, అది యెట్లు దానివలనే జని యించు నని యాశంకించి బ్రహ్మశబ్దార్థమును జెప్పినదానినే మరలఁ జెప్పుచున్నారు వేదము అని. ఓయీ! బ్రహ్మశబ్ద ప్రతిపాదిత మయిన వేదముఁగూడఁ బౌరు షేయమగుటవలనఁ బ్రామాణ్యసందేహము కల్గుటం జేసి తదుక్తం బగు నగ్ని హోత్రాదికము కర్మమని యెట్లు నిర్ధారింప శక్యమగును? అనఁగా నందుకుఁ జెప్పు చున్నారు ఎందువలన ఇత్యాదిగా. అప్పుడు ఎట్లది యజ్ఞమునందుఁ బ్రతిష్ఠితం బగును? సర్వగతం బగుటచే సర్వత్ర ప్రతిష్ఠితం బనిగదా చెప్పవలెను అని యాశం కించి చెప్పుచున్నారు సర్వగతం బయ్యును ఇత్యాదిగా.

హ. బ్రహ్మోద్భవమ్ = బ్రహ్మము—వేదము ప్రకాశకముగాఁ గలదా నిఁగా; విద్ధి = ఎఱుంగుము. బ్రహ్మ = వేదాఖ్య మయిన బ్రహ్మమో; అక్షరసము ద్భవమ్ = అక్షరుఁడు—పరమాత్మ కారణముగాఁ గలదానిఁగా; ఎఱుంగుము. అక్ష రునివలనఁ బురుష నిశ్శ్వాసమువలె నుద్భూతము బ్రహ్మము. తస్మాత్; సర్వార్థప్ర కాశక మగుటవలన, సర్వగతమ్; బ్రహ్మ = వేదము; యజ్ఞప్రకాశకం బగుటవలన, యజ్ఞే, ప్రతిష్ఠితమ్.

శం. యజ్ఞమునకుఁ గారణ మైన దేదిగలదో ఆ, కర్మ = కర్మమును; బ్రహ్మోద్భవమ్ = బ్రహ్మ మనఁగా ఋగాది వేదము, దానివలనఁ బుట్టినదానిఁగా; విద్ధి. ఆ, బ్రహ్మ = వేదమును; అక్షర సముద్భవమ్, విద్ధి—« అస్య మహతో భూత స్య నిశ్శ్వసిత మేత ద్య దృగ్వేదో యజుర్వేదః» * అను శ్రుతివలన సర్వజగ త్కారణభూతుఁడు అక్షరుఁ డగు పరమాత్మ యొద్దనుండి నిశ్శ్వాసరూపంబునఁ దానే యావిర్భవించినది కావుననే నిత్యము అపౌరుషేయము వేదం బని తెలియు మని యర్థము. ఎందువలన జగత్తుయొక్క యుత్పత్తియు స్థితియు యజ్ఞైకమూలమో అందువలన, తాను, సర్వగతమ్ = సర్వార్థప్రకాశక మగుటచేతను సర్వలోకముల కును తత్తద్ధర్మనియతిని స్థాపించునది యగుటచేతను సర్వత్ర యున్నదైనను; బ్రహ్మ= వేదము; యజ్ఞే = బ్రాహ్మణాదులచే అనుష్ఠేయం బగు ఔపాసనాద్యశ్వమేధాంత కర్మమునందే; దాని విధించుటయె ప్రయోజనముగాఁ గలదగుటవలన, ప్రతిష్ఠితమ్= నిత్యమును నియమముచే నున్నది, వర్ణాశ్రమములు అనుష్ఠింపవలసినవిగా కర్మములను వేదమే విధించుచున్నది యని యర్థము.

---

* ఋగ్వేదము యజుర్వేదము ఇత్యాదు లేవి గలవో ఇది యీ మహాభూతముయొక్క నిట్టూర్పు.

**మ.** ఆ యపూర్వోత్పాదకం బగు, కర్మ = కర్మమును, బ్రహ్మోద్భవమ్= వేదమే ప్రమాణముగాఁ గలదానిఁగా, విద్ధి—వేదవిహిత మగు కర్మమే అపూర్వసాధనము కాని ఇతరము పాషండ ప్రతిపాదితము కా దని యెఱుంగు మని యర్థము. ఓయీ! వేదప్రతిపాదితమే ధర్మము కాని యితరము కా దని చెప్పితివే, పాషండశాస్త్రములకంటె వేదమున కేమి వైలక్షణ్యము? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—బ్రహ్మ = వేదము; అక్షరసముద్భవమ్= అక్షరునివలన—నిర్దోషుఁ డగు పరమాత్మవలనఁ బురుషనిశ్శ్వాసన్యాయంబున అబుద్ధిపూర్వకముగా సముద్భవము—ఆవిర్భావముగలది, అట్లు అపౌరుషేయం బగుటచే దోషాశంకల కెంతమాత్ర మవకాశము లేని వేదవాక్యము ప్రమాజనకం బగుటచేఁ బ్రమాణము అతీంద్రియార్థమునందు; కాని భ్రమము ప్రమాదము అసమర్థత మోసముచేయుతలంపు మొదలగు దోషముల కవకాశము గల పురుషునిచేఁ బ్రణీతం బగు పాషండవాక్యము ప్రమాణము కా దని భావము. అట్లు శ్రుతి « అస్య మహతో భూతస్య నిశ్శ్వసితమేత ద్య దృగ్వేదో యజుర్వేద స్సామవేదో ఽథర్వాఙ్గిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రా ణ్యనువ్యాఖ్యానాని వ్యాఖ్యానా న్యస్యైవైతాని నిశ్శ్వసితాని » అని. తస్మాత్ = సాక్షాత్పరమాత్మ సముద్భవ మగుటవలన; సర్వగతమ్ = సర్వప్రకాశకంబును; నిత్యమ్ = నాశములేనిదియు నగు; బ్రహ్మ = వేదము; యజ్ఞే = ధర్మాఖ్య మగు అతీంద్రియార్థమునందు; ప్రతిష్ఠితము తాత్పర్యముచేత. కావునఁ బాషండప్రతిపాదిత మగు దాని విడిచి వేదబోధిత మగు ధర్మమునే యనుష్ఠింపవలె నని యర్థము.

**శ్రీ.** అట్లు, కర్మ = యజమానాది వ్యాపారరూప మయిన కర్మమును; బ్రహ్మోద్భవమ్ = బ్రహ్మ మనఁగా వేదము, దానివలనఁ బ్రవర్తించినదానిఁగా; విద్ధి = ఎఱుంగుము. బ్రహ్మ = ఆ వేదమును; అక్షరసముద్భవమ్ = అక్షరునివలన—పరబ్రహ్మమువలనఁ బుట్టినదానిఁగా, ఎఱుంగుము, « అస్య మహతో భూతస్య నిశ్శ్వసిత మేత ద్య దృగ్వేదో యజుర్వేద స్సామవేదః » అను శ్రుతివలన. ఎందువలన నిట్లు అక్షరమువలననే ♦ యజ్ఞము ప్రవర్తించుటచే అతనికి యజ్ఞము మిక్కిలి యభిప్రేత మగునో, తస్మాత్ = అందువలన; సర్వగతమైనను, బ్రహ్మ = అక్షర మగు పరబ్రహ్మము; నిత్యమ్ = ఎల్లప్పుడును; యజ్ఞే, ప్రతిష్ఠితమ్—ఉపాయభూత మగు యజ్ఞముచేఁ బొందఁబడుచున్నది కావున యజ్ఞమునందుఁ బ్రతిష్ఠితం

♦ పరమాతుని వలననే.

బని చెప్పఁబడుచున్నది «ఉద్యమస్థా సదా లక్ష్మీః» ❦ అనునట్లు. లేక. ఎందువలన జగచ్చక్రమూలము కర్మమో అందువలన, సర్వగతమ్ = సర్వ—మంత్రార్థవాదములచే సమస్తము లయిన సిద్ధార్థప్రతిపాదకము లగు భూతాన్వాఖ్యానములందు *, గతమ్ = ఉన్నదైనను; బ్రహ్మ = వేదము; ఎల్లప్పుడును, యజ్ఞమునందు తాత్పర్యరూపమునఁ బ్రతిష్ఠితము. అందువలన యజ్ఞాది కర్మ మనుష్ఠింపవలయు నని యర్థము.

ప. కర్మ = కర్మమును; బ్రహ్మోద్భవమ్ = బ్రహ్మ మనఁగా మంత్రాత్మక మైన శబ్దము—వేదము, దానివలనఁ బుట్టినది, ఇఁక వేదముగూడ దేనివలనఁ బుట్టిన దనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అక్షరసముద్భవమ్ = క్షరము—నశించునది కానిది అక్షరము—వైరాజబ్రహ్మము, దానివలనఁ బుట్టినది. శాతపథ శ్రుతియును «యథాగ్నే రభ్యాహితస్య పృథ గ్ధూమా వినిశ్చర న్త్యరే ఽస్య మహతో భూతస్య నిశ్శ్వసిత మేత ద్య దృగ్వేదో యజుర్వేద స్సామవేదః» ఇత్యాదిగాఁ గలదు. దీనికి భాష్యము.—యథా = ఎట్లు, అభ్యాహితస్య = చుట్టునువ్యాపించిన, అంతః ప్రవిష్టము కాని దగు, అగ్నేః = తడికట్టె యందలి నిప్పునకు; పృథక్ ధూమాః = నానావిధము లగు పొగలు; వినిశ్చరన్తి = వెడలుచున్నవో. అట్లు, అరే—ఓమైత్రేయీ! అస్య = ఈ, మహతః భూతస్య = మహాభూతారబ్ధ మగు వైరాజబ్రహ్మమునకు, నిశ్శ్వసితమ్ = నిశ్శ్వాసరూప మైనది, ఏతత్—ఇది, ఋగ్వేదము మొదలగునది. ఓయీ! సర్వజ్ఞుఁడు గదా బ్రహ్మ, కర్మముయొక్క ముఖ్యగతిని విడిచి గౌణగతిని ఏల యుపదేశించెను? అని యుపదేశించి యుపసంహారమునందుఁ బరమప్రయోజనమును జూపుచుఁ జెప్పుచున్నాఁడు.—తస్మాత్ = ఆకారణమువలన; సర్వగతమ్ = ఇంద్రుఁడు సూర్యుఁడు మొదలగు సర్వదేవతలందును అంతర్యామియై యున్నట్టి; బ్రహ్మ; నిత్యమ్ = అనశ్వరఫలరూపము; యజ్ఞే; ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠను బొందినది, యజ్ఞోపాయముచేతనే లభ్యము, «యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాః» ♦ అను శ్రుతివలన. ఇఁక అనశ్వరఫలదం బనుటకు శ్రుతి యగ్ని రహస్యమునందు «సయ ఆత్మాన మేవలోక ముపాస్తే నేహాస్య కర్మ క్షీయతే» § ఇత్యాదిగాఁ గలదు.

---

❦ ప్రయత్నంబునం దున్నది యెల్లప్పుడు లక్ష్మి.

* ఉన్నవానిని—కడచినవానిని జెప్పు భాగములందు.

♦ యజ్ఞముచే యజ్ఞుని—ఈశ్వరుని ఆరాధించిరి దేవతలు.

§ ఎవఁడు ఆత్మ లోకమునే యుపాసించుచున్నాఁడో వాని కర్మ మిచ్చట క్షయింపదు.

రా. కర్మ = కర్మమును; బ్రహ్మోద్భవమ్.—ఇట బ్రహ్మశబ్దముచేఁ జెప్పఁబడునది ప్రకృతిపరిణామరూప మైన శరీరము. « తస్మా దేత ద్బ్రహ్మ నామరూప మన్నం చ జాయతే » అను శ్రుతియందు బ్రహ్మశబ్దముచే ప్రకృతిగదా నిర్దేశింపఁబడినది. ఇచటఁ గూడ « మమ యోని ర్మహ ద్బ్రహ్మ » అని చెప్పఁబోవుచున్నాఁడు. అందువలన, కర్మ బ్రహ్మోద్భవమ్ అని ప్రకృతి పరిణామ రూప శరీరమువలనఁ బుట్టునది కర్మ మని చెప్పఁబడిన దగుచున్నది. బ్రహ్మ అక్షరసముద్భవమ్—ఇట అక్షర శబ్దముచేఁజెప్పఁబడినవాఁడు జీవాత్మ, అన్న పానాదులచే తృప్తుఁ డైన యక్షరునిచే—జీవునిచే అధిష్ఠితం బగు శరీరము కర్మమునకు సమర్థ మగుచున్నది కావున కర్మ సాధనభూతంబగు శరీరము అక్షరసముద్భవము. తస్మాత్ = అందువలన; సర్వగతమ్ = సర్వాధికారులనుబొందిన; బ్రహ్మ = శరీరము; నిత్యమ్; యజ్ఞే ప్రతిష్ఠితమ్—యజ్ఞమూలకం బని యర్థము.

ఆకర్మము శరీరమువలనఁ గలుగుచున్నది, శరీరము జీవునిచేఁ బోషింపఁబడునది. అందువలన సర్వజనులయొక్క శరీరములకును యజ్ఞమే మూలం బని తాత్పర్యము.

మా. కర్మము బ్రహ్మమువలనఁ * బుట్టుచున్నది « ఏష హ్యేవ సాధు కర్మ కారయతి, బుద్ధి ర్జ్ఞానమ్ » ఇత్యాదులవలన. ముఖ్యార్థము సంభావిత మగుచుండఁగాఁ బార్యంపర్యమును బట్టి యౌపచారికార్థము ♦ కల్పించుట యుచితముగాదు. జడము లయిన వేదములకు ప్రకాశనమునందు స్వతః ప్రవృత్తియేమో సంభవింపదు; « ఏతస్యవా అక్షరస్య » అను సర్వనియమన శ్రుతి ❡ వలనఁ గూడ; « ద్రవ్యం కర్మ చ కాలశ్చ » అను వాక్యమువలనఁ గూడ. అచింత్య శక్తియును జెప్పఁబడినది §. ప్రతిబింబ మగు జీవునకో చేష్ట బింబమునకుఁ గలిగినంగాని కలుగనేరదు ** « న కర్తృత్వమ్ » ఇత్యాదిగా ♦♦ నిషేధించుటవలనఁగూడ.

* పరబ్రహ్మమువలన.

♦ ఉద్భవశబ్దమునకు ప్రకాశనము అనుట.

❡ సర్వమును నియమించువాఁడు విష్ణు వని తెలుపునట్టి శ్రుతి.

§ శబ్దమునకు అర్థప్రకాశనము స్వభావము, వస్తుస్వభావమును భగవంతుం డెట్లునియమించు ననఁగా భగవంతుఁ డచింత్యశక్తి గలవాఁ డగుటచే నది సంభావిత మని భావము.

** కావున అభిమాని దేవతాదిద్వారమున జడమునకుఁ బ్రవృత్తికావచ్చుననుట సంభవింపదు. బింబభూతుఁ డయిన భగవంతుని ప్రతిబింబములుగదా యీదేవతలు.

♦♦ జీవునకును స్వతః కర్తృత్వాదులను.

అక్షరములు ప్రసిద్ధములు *. వానివలనఁ గదా అభివ్యక్తమగుచున్నది పరబ్రహ్మము. కానిచో అనాదినిధనము అచింత్యము పరిపూర్ణము నగు పరబ్రహ్మము నెవ్వఁడెఱుంగును ‖. అట రూఢిని విడిచి యోగము నంగీకరించుట యుచితముగాదు ♦ తస్మాత్సర్వగతం బ్రహ్మ అని బ్రహ్మశబ్దముచేఁ బరబ్రహ్మమునే పరామర్శించుటవలనఁ గూడ. ఒకచో ప్రకరణమునందు రెండుమాఱులు ప్రయుక్తమైనయొకశబ్దము ప్రమాణములేక భిన్నార్థముల నెచ్చటనేనియు వచియించునా? ఆయక్షరములో నిత్యములు, “వాచా విరూప నిత్యయా, అనాదినిధనా హ్యేషా వా గుత్సృష్టా స్వయమ్భువా, అత ఏవ చ నిత్యత్వమ్” ఇత్యాది శ్రుతిస్మృతి భగవద్వచనముల వలన. దోషమునుం జెప్పఁబడినది సకర్తృకంబు లనుపక్షమునందు. అబుద్ధిపూర్వకముగా నుత్పన్నములునుం గావు, అందుఁ బ్రమాణము లేమివలన. నిశ్శ్వసిత శబ్దమో అక్లేశాభిప్రాయము ** కాని అబుద్ధిపూర్వాభిప్రాయము గాదు; “సోఽకామ యత” ఇత్యాది శ్రుతివలనను; “ఇష్టం హుతమ్” ఇత్యాదిగా రూపప్రపంచముతోఁ జేర్చి నామప్రపంచముఁ జెప్పుటవలనను §; మహాతాత్పర్యవిరోధము వలనఁ గూడ. అదియో ¶ చెప్పఁబడినది మున్ను. స్వాతంత్ర్యము లేనిచో ఉత్పత్తి కర్తకుఁ బ్రాధాన్యము కలుగదు గదా! అబుద్ధిపూర్వక మైనచో స్వాతంత్ర్యము లేకపోవును, రోగాదులు పురుషజన్యము లైనను వానియందుఁ బురుషునకుం బోలె. ఉత్పత్తివచనములు అభివ్యక్త్యర్థములు ♦♦. అభిమాని దేవతావిషయములునుం

---

* అకారాది వర్ణములనుట, వేదము అని భావము.

‖ అనాది నిధనము—ఉత్పత్తినాశములు లేనిది కావున సముద్భవ శబ్దార్థము—పుట్టినదనుట చెల్లదు. పరిపూర్ణము అచింత్య మగు బ్రహ్మమును వేదములు బోధింపనిచో నెఱుంగ శక్యము కాదని భావము.

♦ ఇటసముద్భవ శబ్దమునకు ముఖ్యార్థమును విడిచి యితరార్థము చెప్పినప్పుడు అట బ్రహ్మశబ్దమునకు అట్లు వేదాద్యర్థము నేల చెప్పఁగూడదు? అందు వేని, అట—బ్రహ్మోద్భవమ్ అనుచోట బ్రహ్మ శబ్దమునకు.

** శ్రమలేక కలిగింపబడినవి యను నభిప్రాయము గలది.

§ ఇందువలన నామప్రపంచమునకు మాత్రము అబుద్ధిపూర్వోత్పత్తి యని శంకింపఁ దగ దని భావము.

¶ వేదములకు విష్ణువు పరోత్తముఁ డనుటయందు మహాతాత్పర్యమనుట.

♦♦ వేదములు పుట్టె నని చెప్పువాక్యములు వేదములు ప్రకటితము లయ్యె నను నభిప్రాయము గలవి.

గావచ్చును. నిత్యము అని చెప్పి ఉత్సృష్టము అని చెప్పుటవలన †. అభివ్యంజకుని యందుఁ గర్తృశబ్దప్రయోగమునుం గలదు "కృత్స్నం శత పథం చక్రే" అను చో *. ఎట్లు ఆదిత్యునియం దున్న వేదములు వానిచేత నే చేయఁబడును ? మఱియు నట్టి వచనముకంటె నిర్ణయాత్మక మగు శారీరకసూత్రము ♦ బలవత్తరము. ఇఁక శాస్త్రయోనిత్వాత్ అని యున్నదే యన్ననో, శాస్త్రము యోని—ప్రమాణము గాఁ గలది శాస్త్రయోని. జన్మా ద్యస్య యతః అని లక్షణము చెప్పినపిమ్మటఁ బ్రమాణముగదా అందపేక్షితము. బ్రహ్మము జాతమనుట గాని వేదమునకుఁ గారణమనుట గాని యపేక్షితము గాదు. ఏల యనఁగా వేదకారణత్వము జగత్కారణత్వమునకు హేతువుగాదు. వేదము కార్య మనుపక్షమున విచిత్రజగత్తును సృజించిన వానికి వేదముసృజించుట యశక్యముగాదు గదా! అట్లు సర్వజ్ఞత్వ మునకును వేదకారణత్వము హేతువుగాదు. వేదము సృజించినవాఁడు సర్వజ్ఞుఁ డగునేని జగత్తునుసృజించి వాఁడు సర్వజ్ఞుడేల కాఁడు? అందువలన వేదప్రమాణకత్వమే § శాస్త్రయోనిత్వాత్ అను సూత్రమున వివక్షితము. ఇందువలన నిత్యంబు లక్షరములు. ఎందువలన నిట్లు పరంపరగా బ్రహ్మము యజ్ఞముచే నభివ్యంగ్యమో అందువలన అబ్రహ్మము నిత్యము యజ్ఞమునందుఁ బ్రతిష్ఠిత మని చెప్పఁబడుచున్నది.

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః
అఘాయు రిన్ద్రియారామో మోఘం పార్థ స జీవతి ౧౬

భా. ఏవమ్ = ఇట్లు; ప్రవర్తితమ్ = ఈశ్వరునిచే వేద యజ్ఞపూర్వకముగా ప్రవర్తింపఁ జేయఁబడిన; చక్రమ్ = జగచ్చక్రమును; ఇహ= ఈలోకమునందు; యః = ఎవ్వఁడు, కర్మమునం దధికృతుఁడై; న అనువర్తయతి = అనుసరించి జరిగింపఁడో; అఘాయుః = పాప మయిన జీవనముగలవాఁడును; ఇన్ద్రియారామః = ఇంద్రియములచే విషయములందు ఆరమణము—ఆక్రీడగలవాఁడు నగు; సః= అతఁడు; పార్థ= ఓ అర్జునుఁడా!

† అనాది నిధనా హ్యేషా వాగుత్సృష్టా స్వయమ్భువా అనుచోట. అనాదినిధనా—నిత్యము.

* సమస్త మయిన శతపథము—వేదభాగమును చేసెను.

♦ అత ఏవచ నిత్యత్వమ్ అనునది.

§ వేదము ప్రమాణముగాఁ గలది బ్రహ్మ మనుటయే.

మోఘమ్ = వ్యర్థముగా; జీవతి = బ్రతుకుచున్నాఁడు. అందువలన అజ్ఞుఁడగు నధికృతుఁడు చేయవలసినదియే కర్మమని ప్రకరణార్థము. ఆత్మజ్ఞాననిష్ఠాయోగ్యత సిద్ధించుటకు మున్ను తదర్థమై కర్మయోగానుష్ఠానమును అధికృతుఁడగు అనాత్మజ్ఞుఁడు చేయవలయుననునీవిషయము, 'నకర్మణామనారమ్భాత్' అనునదిమొదలు 'శరీరయాత్రాపిచ తే నప్రసిద్ధ్యేదకర్మణః' అనువఱకుఁ గల గ్రంథముచేఁ బ్రతిపాదించి, 'యజ్ఞార్థాత్కర్మణోన్యత్ర' ఇత్యాదిగా 'మోఘం పార్థ సజీవతి' అనువఱకుఁ గలగ్రంథముచే తనుంగూడ అధికృతుఁడగు అనాత్మవేత్త కర్మము ననుష్ఠింపవలె ననుటయందుఁ బ్రసంగాగతమగు బహుకారణము చెప్పఁబడినది. అది యనుష్ఠింపనిచో దోషప్రతిపాదనమునుం జేయఁబడినది.

ఇట్లు వేదములను యజ్ఞములను బ్రవర్తింపంజేసి పరమేశ్వరుఁ డేర్పఱిచిన జగచ్చక్రము నెవ్వఁ డీలోకమునం దనువర్తించి జరగింపఁడో అతఁడు ఇంద్రియవశుఁ డగుటం జేసి యతనిజీవనము పాపిష్ఠము వ్యర్థము నగు నని తాత్పర్యము.

ఆ. అధికృతుఁడు వేదాధ్యయనాది ద్వారమున జగచ్చక్ర మనువర్తింపవలెను. అనువర్తింపనిచో ఈశ్వరాజ్ఞనతిక్రమించినవాని కతనికిఁ బ్రత్యవాయము సంభవించు నని చెప్పుచున్నాఁడు ఏవమిత్యాదిగా. నకర్మణామనారమ్భాదిత్యాది గ్రంథముచేఁ జెప్పినయర్థము నుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా. జగచ్చక్రమును మున్ను చెప్పినచొప్పున ననువర్తింపనిచో జీవనము వ్యర్థమును పాపహేతువును ఎందువలన నగుచున్నదో అందువలన జీవించియుండువాఁడు నియతమగు కర్మమును జేయవలె నని యర్థము. అధికృతుఁడు కర్మముఁ జేయవలసినచే యగునేని అప్పుడు ఏల యజ్ఞుఁ డని యతనికి విశేషణము చేయవలెను? జ్ఞాననిష్ఠుఁడుగూడ కర్మముఁ జేయవలసినదియే, అతనికిని అధికృతత్వము సమానమగుటవలన; అని యాశంకించి మున్ను చెప్పినదాని ననువదించుచున్నారు ఆత్మజ్ఞానేత్యాదిగా. "జ్ఞానకర్మములు విరుద్ధము లగుటవలన జ్ఞాననిష్ఠునకుఁ గర్మము చేయ శక్యముగాదు గదా! అందువలన అనాత్మజ్ఞుఁడే చిత్తశుద్ధ్యాదిద్వారమున జ్ఞానప్రాప్తికొఱకుఁ గర్మ మనుష్ఠింపవలెను అని ప్రతిపాదింపఁబడిన దని యర్థము. అప్పుడు యజ్ఞార్థాదిత్యాది గ్రంథమెందుకు? అందు జ్ఞాననిష్ఠ ప్రతిపాదింపఁబడదు గదా! కర్మనిష్ఠయో మున్ను చెప్పఁబడిన దగుటవలన ఇటఁ జెప్పవలసినదికాదు. అని యాశంకించి కడచినయర్థాంతరము ననువదించుచున్నారు ప్రతిపాదించిత్యాదిగా. ప్రసంగా

గతము — అజ్ఞుఁడు కర్మము చేయవలె ననుప్రసంగమున వచ్చి దనియర్థము. బహు కారణము — ఈశ్వరప్రసాదమును దేవతాప్రీతియు మొదలగునది. దోషప్రతిపాదనము — తైర్దత్తా న ప్రదాయైభ్యః ఇత్యాదికము.

హ. ఏవమ్; అన్నపూర్వకముగా, ప్రవర్తితమ్ = ఏర్పఱుపఁబడిన, చక్రమ్ = చక్రమువలెఁ దిరుగు స్వభావముగలదాని, నానువర్తయతి = అనుష్ఠింపఁడో; యః. అఘాయుః = అఘము తనకుఁ గోరువాఁడు అఘాయువు, ఇన్ద్రియారామః = ఇంద్రియములకుఁ గ్రీడాస్థానము, మోఘమ్ = వ్యర్థముగా, ఓపార్థుఁడా! సః జీవతి= వాఁడు ప్రాణముల ధరించుచున్నాఁడు. అందువలనఁ గర్మమునం దధికృతుఁడు అజ్ఞుఁడు యజ్ఞములం జేయవలయు నని యభిప్రాయము.

శం. ఈశ్వరుఁడు శ్రుతిముఖంబున యజ్ఞసమూహమును విధించి యజ్ఞద్వారమున వర్షమును అన్నమును సిద్ధించు నని భూతంబుల సృష్టిని వానిస్థితిని నిర్వహించు నిచ్ఛచే దానే యిట్లు చక్రమును బ్రవర్తింపఁ జేసెను. అట్టి యీ, ప్రవర్తితమ్ = ఈశ్వరప్రవర్తిత మగు; చక్రమ్ = చక్రమును నియత మగుదాని; ఇహ= ఈలోకమునందు; యః = కర్మాధికారి యెవ్వఁడు బ్రాహ్మణుఁడు మొదలగువాఁడు; నానువర్తయతి= పరమేశ్వరుఁడు శ్రుతిచే విధించిన కర్మయోగమును అనుష్ఠింపఁడో. అతఁడు, ఈ యీశ్వరశాసనమును జేయక, తాను, ఇన్ద్రియారామః = ఇంద్రియార్థములందే ఎల్లప్పుడు రమించువాఁడు, విషయభోగలోలుఁడు ఐ; కావుననే, అఘాయుః = ఆయుస్సుయొక్క ఫలము పాపమే యెవ్వనికో అతఁ డఘాయువు, అట్టివాఁడై; కాకివలెను బూరుగుచెట్టువలెను, మోఘమ్ = వ్యర్థముగా, నిష్ఫలముగనే; జీవతి. ఇంతమాత్రమే కాదు, మ తే మనఁగా ఈశ్వరాజ్ఞ నతిక్రమించు దోషము చేతను విహితకర్మము చేయమిం గలుగుప్రత్యవాయముచేతను నిత్యము చేయునట్టి పాపసమూహముచేతను అనేకకల్పములు నరకమునుగూడ పొందుచున్నాఁ డని యర్థము. అందువలన వివేకి యగు బ్రాహ్మణుఁడు · ముముక్షువును అనాత్మజ్ఞుఁడు నగు వాఁడు తాను దరించుకొఱకును లోకహితముకొఱకును అవశ్యము వేదోక్త కర్మము చేయవలె నని సిద్ధము.

మ. ఇట్లే యగుఁ గాక. దాన నేమి ఫలితం బనఁగాఁ జెప్పుచున్నాఁడు.— మొదటఁ బరమేశ్వరునివలన సర్వప్రకాశకంబును నిత్యమును నిర్దోషంబు నగు వేదముయొక్క ఆవిర్భావము, దానివలనఁ గర్మపరిజ్ఞానము, దానివలనఁ గర్మానుష్ఠానముచే ధర్మోత్పత్తి, దానివలనఁ బర్జన్యుఁడు, పర్జన్యునివలన అన్న

ము, దానివలన భూతములు, మరల నాప్రకారమే భూతములకుఁ గర్మప్రవృత్తి— ఇట్లు పరమేశ్వరునిచేఁ బ్రవర్తిత మయిన చక్రమును సర్వజగన్నిర్వాహక మగు దానిః యః = నానువర్తయతి = ఎవ్వఁ డనుష్ఠింపఁడో; సః = అతఁడు; అఘాయుః = పాపజీవనుఁడు; మోఘమ్ = వ్యర్థముగానే; జీవతి. ఓపార్థుఁడా! వానికి జీవనము కన్న మరణమే మేలు, జన్మాంతరమున నైనను ధర్మానుష్ఠానము సంభవించుటవలన నని యర్థము. అట్లు శ్రుతి, « అథో అయం వా ఆత్మా సర్వేషాం భూతానాం లోకః స యజ్జుహోతి యద్యజతే తేన దేవానాం లోకో ఽథ య దనుబ్రూతే తేన ఋషీణా మథ యత్పితృభ్యో నిపృణాతి యత్ప్రజా మిచ్ఛతే తేన పితౄణా మథ యన్మనుష్యా న్వాసయతే య దేభ్యో ఽశనం దదాతి తేన మనుష్యాణా మథ యత్పశుభ్య స్తృణోదకం విన్దతి తేన పశూనాం యదస్య గృహేషు శ్వాపదా వయాం స్యాపిపీలికాభ్య ఉపజీవన్తి తేన తేషాం లోకః » * అని. బ్రహ్మవిదుని వ్యావర్తించుచున్నాఁడు ఇన్ద్రియారామః అని. ఎందువలన ఇంద్రియములచే విషయములందు మిక్కిలి రమించుచున్నాఁడో అందువలన, కర్మాధికారియై యాకర్మములను జేయకుండుటవలనఁ బాపమునే సంపాదించుచు వ్యర్థముగానే జీవించుచున్నాఁ డని యభిప్రాయము.

శ్రీ. ఎందువలన నిట్లు పరమేశ్వరుఁడే భూతములకుఁ బురుషార్థము సిద్ధించుకొఱకు కర్మాదిచక్రమును బ్రవర్తింపఁజేసెనో అందువలనఁ దానిఁ జేయనివాని బ్రతుకు వ్యర్థమే యని చెప్పుచున్నాఁడు —పరమేశ్వరవాక్యభూత మగు వేదాఖ్యమైన బ్రహ్మమువలనఁ బురుషులకుఁ గర్మమునందుఁ బ్రవృత్తి, దానివలన యజ్ఞనిష్పత్తి, దానివలనఁ బర్జన్యుఁడు, పర్జన్యునివలన అన్నము, దానివలన భూతములు, భూతములకు మరల నట్లే కర్మమునందుఁ బ్రవృత్తి — ఇట్లు ప్రవర్తిత మయిన

* ఈయాత్మయె సర్వభూతములకును లోకము—స్థితిహేతువు, ఎట్లనఁగా.—అతఁడు దేవతల నుద్దేశించి హోమము చేయుచున్నాఁడే యజించుచున్నాఁడే దానిచే దేవతలకు లోకమగుచున్నాఁడు, అధ్యయనము చేయుచున్నాఁడే దానిచే ఋషులకు లోకము, పితరులకుఁ బిండదానము చేయుచున్నాఁడే సంతానము గోరుచున్నాఁడే దానిచేఁ బితరులకు లోకము, మనుష్యులకుఁ జోటిచ్చి వారికి అన్నము నిచ్చుచున్నాఁడే దానిచేఁ మనుష్యులకు లోకము, పశువులకుఁ దృణము నుదకము నిచ్చుచున్నాఁడే దానిచేఁ బశువులకు లోకము, వీని గృహమునందు శ్వాపదములు—కుక్కలు మొదలగు క్రూరజంతువులు పక్షులు చీమలు మొదలకొని యుపజీవించుచున్న వే దానిచే వానికి లోకము— ఇట్లు ఈయాత్మ సర్వభూతములకును స్థితిహేతు వగుటచే లోకమని చెప్పఁబడును.

చక్రమును; యః; నానువర్తయతి = అనుష్ఠింపఁడో; అఘాయుః = పాపరూప మయిన ఆయుస్సుగలవాఁడు; ఎందువలన, ఇంద్రియములచే విషయములందే మిక్కిలి రమించుచున్నాఁడో, కాని యీశ్వరారాధనార్థ మయిన కర్మమునందు రమింపఁడో, అందువలన, మోఘమ్ = వ్యర్థముగా; సః జీవతి.

ప. ఇఁక ఫలితార్థముఁ జెప్పుచున్నాఁడు.—ఏవమ్ = ఈచెప్పినప్రకారమున; ప్రవర్తితమ్ = ప్రవృత్తిరూపముగ ఏర్పఱుపఁబడినది, ఇహాముష్మికఫలభోగరూపము. అట్లు, చక్రమ్ = చక్ధాతువు గత్యర్థము గలది—పరమగతిరూపమును, అన్నాదికార్యసమూహమునకు ఆత్యంతిక కారణ మయిన అక్షరమును; యః; నానువర్తయతి = తారతమ్యాభావంబున మాటిమాటికిఁ బరిశీలింపఁడో, తెలిసియును మరల నింద్రియముల తృప్తికై ఫలభోగము నపేక్షించునో, అతఁడు అఘాయుః ఇత్యాదివాక్యములచే నిందింపఁబడుచున్నాఁడు—అఘాయుః = పాపేచ్ఛగలవాఁడు; ఇన్ద్రియారామః = విషయసుఖలోలుఁడు.

రా. ఏవమ్ = ఇట్లు; ప్రవర్తితమ్ = పరమపురుషునిచే బ్రవర్తింపఁజేయఁబడిన; చక్రమ్ = ఈచక్రమును.—అన్నమువలన భూతశబ్దముచేఁ జెప్పఁబడిన జీవసహితశరీరములు, పర్జన్యునివలని అన్నము, యజ్ఞమువలనఁ బర్జన్యుఁడు, యజ్ఞమో కర్తృవ్యాపారరూప మయిన కర్మమువలన, కర్మమో జీవసహితశరీరమువలన, జీవసహితశరీరము మరల అన్నమువలన.—ఇట్లు ఒకటి గొకటి కార్యకారణభావంబు నొంది చక్రమువలెఁ దిరుగుచున్నదానిని; ఇహ = ఈసాధనమునం దున్నవాఁడు. యః= ఎవఁడు కర్మయోగాధికారిగాని జ్ఞానయోగాధికారి గాని; నానువర్తయతి= జరిగింపఁడో; యజ్ఞశిష్టాన్నముచే దేహధారణము చేయనివాఁడై, సః = అతఁడు; అఘాయుః = అఘము గలిగించునట్టి—అఘమునకుఁ గారణ మయిన ఆయువుగలవాఁడు, —అఘముగాఁ బరిణమించిన, లేక, అఘకార్య మయిన ఆయువు గలవాఁడు, లేక, ఉభయరూప మయిన—అఘమునకుఁ గారణమును కార్యమును అయిన ఆయువు గలవాఁడు, అగుచున్నాఁడు. కావుననే, ఇన్ద్రియారామః = ఇంద్రియారాముఁడు—ఇంద్రియములే యుద్యానములుగాఁ గలవాఁడు అగుచున్నాఁడు, ఆత్మారాముఁడు కాఁడు. యజ్ఞశిష్టము గాని యన్నముచే వర్ధితము లయిన దేహమనస్సులు గలవాఁడగుటచే రజస్సును దమస్సును ఉద్రిక్తములై ఆత్మావలోకనవిముఖుం డగుటవలన విషయభోగపరవశుఁ డగుచున్నాఁడు. కావున జ్ఞానయోగాదికమునం దున్నవాఁ

డయ్యును అతని ప్రయత్నము నిష్ఫలం బగుటచే, మోఘం పార్థ స జీవతి—పార్థా! వ్యర్థముగా నతఁడు జీవించుచున్నాఁడు.

ఇట్లు పరస్పరము కార్యకారణము లగుటచేఁ జక్రమువలెఁ దిరుగునట్టి యీసంప్రదాయమును బరమపురుషప్రవర్తిత మగుదాని, కర్మయోగమునం దున్న వాఁడు గాని జ్ఞానయోగమునం దున్నవాఁడు గాని యెవ్వఁడు అనుసరింపఁడో, వాఁడు అఘాయువగును. అఘాయువగుటచే ఇంద్రియారాముఁ డగును. అందువలన నతఁడు జ్ఞానయోగము నభ్యసించినను అది సఫలము గాఁజాలదు. కావున వాని బ్రతుకు వ్యర్థమగు నని తాత్పర్యము.

మూ. ఆయుక్షరములును భూతములచే నభివ్యంగ్యములు, కావునఁ జక్రము, అట్టి ఈ జగచ్చక్రమును, యోనానువర్తయతి, అతఁడు తద్వినాశకుఁ డగుటవలన, అఘాయుః—పాపనిమిత్తమే యెవ్వనియాయ స్సగునో అతఁ డఘాయువు.

యస్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్త శ్చ మానవః
ఆత్మ న్యేవచ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే. ౧౭

భా. ఇట్టి స్థితియందు, ఏమి యిట్లు ప్రవర్తితమగుచక్రము నందఱు ననువర్తింపవలయునా? లేక, పూర్వోక్తకర్మ యోగానుష్ఠానరూపమగు నుపాయముచేఁ బ్రాప్యంబును ఆత్మవిదు లగు సాంఖ్యులచే అనుష్ఠేయంబు నగుజ్ఞానయోగనిష్ఠను బొందనివాఁ డగు అనాత్మవిదుఁడు మాత్రమే యనువర్తింపవలయునా? అను నీయర్థము గల యర్జునుని ప్రశ్నము నాశంకించి; తానే గాని శాస్త్రార్థవివేకప్రతిపత్తికొఱకు « ఏనిఁగాఁ గదా ఆయాత్మను దెలిసి మిథ్యాజ్ఞానము నివర్తిల్లినవారలై బ్రాహ్మణులు మిథ్యాజ్ఞానము గలవారి కవశ్యకర్తవ్యము లగు పుత్రైషణాదులనుండి వ్యుత్థితులై * యంత భిక్షాచర్యమును శరీరస్థితిమాత్రప్రయుక్తమును జరియింతురు, లేదు వారికి ఆత్మజ్ఞాననిష్ఠ దక్క వేఱు కార్యము » అను నీ శ్రుత్యర్థమును ఇట గీతాశాస్త్రమునందు వివక్షితమును వెల్లడించువాఁడై; చెప్పుచున్నాఁడు భగవంతుఁడు.—యస్తు = ఇఁక నెవ్వఁడు, సాంఖ్యుఁడు ఆత్మజ్ఞాననిష్ఠుఁ డగువాఁడు; మానవః= మను

* లేచినవారు.

ష్యుఁడు, సన్న్యాసి; ఆత్మరతిరేవ = ఆత్మయందే రతి, లేదు విషయము లందు, ఎవ్వనికో అట్టివాఁడే; ఆత్మతృప్తశ్చ = ఆత్మచేతనే తృప్తుఁడును, కాఁడు అన్నరసాదికముచేత; ఆత్మన్యేవ = ఆత్మయందే; సంతుష్టశ్చ = సంతోషము గలవాఁడును, బాహ్యార్థము లభించినప్పుడు గదా అందఱ కును సంతోషము కలుగుచున్నది, దాని నపేక్షింపక ఆత్మయందే సంతు ష్టుఁడు, అన్నిటనుండియుఁ దృష్ణ విడిచినవాఁ డనుట; స్యాత్ = అగునో; ఇట్టి ఆత్మవిదుఁ డెవ్వఁడో, తస్య = వానికి; కార్యమ్ = చేయఁదగినది; న విద్యతే = లేదు.

ఇఁక ఆత్మవిదుఁ డగు ఏసన్న్యాసి ఆత్మయందే రతి గలిగి ఆత్మచేతనే తృప్తిఁ బొందువాఁడై ఆత్మచేతనే సంతోషించువాఁడై సర్వవిషయములందును అత్యంతవిరక్తుఁడై యుండునో అట్టి జ్ఞానికి మాత్రము ఏమియుఁ జేయ వలసినది లే దని తాత్పర్యము.

**ఆ.** కడచినవిషయము నిట్లు విభజించి యనువదించి, మీఁదిశ్లోకమును ఆశంకకు నుత్తరముగా నెత్తుచున్నారు ఇట్టి ఇత్యాదిగా. అర్జునుప్రశ్నము నాశం కించి చెప్పుచున్నాఁడు భగవంతుఁ డని యన్వయము. ఓయీ! ఈయాశంక కవ కాశము లేదు, అనాత్మజ్ఞుఁడు చేయవలెను గర్మము సని బహువిధములఁ జెప్పఁబ డిన దగుటవలన; అని యాశంకించి చెప్పుచున్నారు తానే ఇత్యాదిగా. ఎందుకు శ్రు త్యర్థమును దానే భగవంతుఁ డిటుఁ బ్రతిపాదించుచున్నాఁడు? అని యాశంకించి చెప్పుచున్నారు శాస్త్రార్థేత్యాదిగా. గీతాశాస్త్రమునకు సన్న్యాససహిత మగు జ్ఞానమే ముక్తిసాధన మనుట యర్థము, అర్థాంతరము కాదు అని వివే కము కొఱకు ఇట శ్రుత్యర్థముఁ గీర్తించుచున్నాఁ డని యర్థము. ఆ శ్రుత్యర్థమునే సంక్షేపించి చెప్పుచున్నారు ఏనిఁగా ఇత్యాదిగా. ఆత్మజ్ఞానము సిద్ధమగు నేని అప్పుడు అనర్థకము వ్యుత్థానము * అని యాశంకించి ఆపాత జ్ఞానముయొక్క ఫలముఁ జెప్పుచున్నారు మిథ్యాజ్ఞానము నివర్తిల్లినవారలై అని. బ్రాహ్మణపదగ్రహణము వారికే వ్యుత్థానమునందు ముఖ్యాధికార మని తెలుపుట కొఱకు. ఏషణలు క్లేశాత్మకము లగుటవలన వానినుండి వ్యుత్థానము స్వర్వస్వాభా విక మగుటం జేసి విధింప వలసినది కా దని యాశంకించి చెప్పుచున్నారు మిథ్యా జ్ఞానము ఇత్యాదిగా. భిక్షాచర్యము చరింతు రని చెప్పుట వ్యుత్థానమునకు విరుద్ధ

* సన్న్యాసము.

మని యాశంకించి చెప్పుచున్నాడు శకిరేత్యాదిగా. అప్పుడు అట్లే వారలు అగ్ని హోత్రాదికముగూడఁ జేయవలసినదిగా నేర్పడు నని యాశంకించి వ్యాఖ్యానముచేసిన వారలచే ఆశ్రమధర్మమును వలె అగ్నిహోత్రాదులను అనుష్ఠింపవలసినది ♦ లేకుండుటవలన అట్లు కా దని చెప్పుచున్నారు లేదు ఇత్యాదిగా. ఈ శ్రుత్యర్థము గీతాశాస్త్రమునందుఁ బౌర్వాపర్యము పర్యాలోచించినచో వినశ్చిత మని యేర్పడు నని ప్రకటీకరించువాఁడై "జీవించి యుండువాఁడు కర్మము చేయవలసినదే" అను నియమ మున్న యెడ "జ్ఞానయోగేన సాఙ్ఖ్యానామ్" అని యెట్లు చెప్పఁబడి నది? అని యాశంకకుఁ బరిహారముఁ జూపుచున్నాఁ డని చెప్పుచున్నారు అను నీ శ్రుత్యర్థమును ఇత్యాదిగా. ఆత్మనిష్ఠునకు విషయసంగము లేమి దృష్టము, దాని ననాత్మజ్ఞుఁ డగుజిజ్ఞాసువు సంపాదింపవలె నని తలఁచి చెప్పుచున్నారు ఇఁక నెవ్వఁడు సాంఖ్యుఁడు ఇత్యాదిగా. మఱియు ఆత్మజ్ఞుఁడు జ్ఞానమువలన ఆత్మచేతనే పరితృప్తుఁ డగుటవలన వానికి తృప్తి అన్నపానాదిసాధ్యము గాదు, అందుచే విద్యార్థి యగు సన్న్యాసియును అన్నరసాదులం దాసక్తి యుంచుట యుక్తము గా దని చెప్పుచు న్నారు ఆత్మతృప్తః అని. మఱియు ఆత్మవిదునకు అన్నిటను తృష్ణారహితత దృష్ట ము, దాని అనాత్మవిదుఁ డగువిద్యార్థి సంపాదింపవలె నని చెప్పుచున్నారు ఆత్మ న్యేవేత్యాదిగా. రతితృప్తిసంతోషములకు మోదప్రమోదానందములకుం బోలె అవాంతరభేదము. లేక. రతి—విషయములం దాసక్తి, తృప్తి—విషయవిశేషసంప ర్కమునం గలుగు సుఖము, సంతోషము—అభీష్ట విషయమాత్ర లాభమువలనఁ గలుగు సుఖసామాన్యము అని భేదము. ఓయీ! ఆత్మరతియు ఆత్మతృప్తుఁడును ఆత్మయందే సంతుష్టుఁడు నైనవానికిఁ గూడ ముక్తికొఱకు ఏదేని కర్తవ్యము వర్తిం పఁగల దనఁగా లే దని చెప్పుచున్నారు ఇట్టి ఆత్మవిదుఁడు ఇత్యాదిగా.

హ. కర్మమునం దధికృతుఁడు కానట్టిజ్ఞానికిఁ గర్మము కర్తవ్యము గాదని చెప్పుచునాఁడు—యస్తు= ఎవ్వఁడు, ఆత్మజ్ఞాననిష్ఠుఁడు సాంఖ్యుఁడు; ఆత్మరతిః = ఆత్మ యందు రతిగలవాఁడు; ఆత్మతృప్తశ్చ= ఆత్మచేతనే తృప్తుఁడైనవాఁడును, కాఁడు అన్న రసాదికముచేత; ఆత్మన్యేవచ సంతుష్టః—బాహ్యార్థము లభించినచో సంతుష్టుఁ డగుచు న్నాఁడు, అది లేకయే ఆత్మయందే సంతుష్టుఁడును. ఆత్మవిదుఁ డగు నట్టి వానికి; కార్యమ్ = చేయవలసినది; నవిద్యతే.

---

♦ స్వర్గకామనాదికము.

౪౦. ఇట శ్రీభగవంతుండు "జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్" అని సాంఖ్యు లగు సన్న్యాసులకును సాంఖ్యులు కాని యోగు లగు గృహస్థులకును ఉత్తరాయణ దక్షిణాయనముల వలె అసంకీర్ణముగా ǂ నిష్ఠాద్వయము విభజించి చూపి "తదేకం వద నిశ్చిత్య" అని తనకుఁ గర్తవ్యం బగుదాని నడిగినట్టి కర్మాధికారి యగు నర్జునుండు సన్నిహితుం డగుటవలన వానికి హిత ముప దేశించుటకై "న కర్మణా మనారమ్భాత్" అని కర్మయోగము నుపక్రమించి "నియతం కురు కర్మ త్వమ్" అని యతనికిఁ గర్మయోగము నుపదేశించెను. "య జ్ఞార్థా త్కర్మణః" అని యారంభించి "మోఘం పార్థ స జీవతి" అనువఱకుఁ గల గ్రంథంబుచే అనాత్మజ్ఞుఁ డగు ముముక్షువు అవశ్యము సత్త్వశుద్ధికొఱకుఁ గర్మము చేయవలసినదే, కర్మము చేయుటవలన దేవతాప్రసాదంబును ఈశ్వరప్రసాదంబును సిద్ధించు నని సూచించుటకై కర్మము చేయవలసినదియే యని బహువిధంబుల నిశ్చయించి యిప్పుడు సాంఖ్యుఁ డగుసన్న్యాసికి జ్ఞానయోగనిష్ఠ దక్క ఇతరము గొంచె మైనను ఎట్లునుం గర్తవ్యము లే దని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—తు శబ్దమునకు అనాత్మరతివ్యావృత్తి యర్థము. యస్తు, మానవః = వెలుపలను లోపలను సర్వత్ర బ్రహ్మమునే మాపయతి = గ్రహింపఁజేయుచున్నది కావున మానము—ప్రత్యగ్దర్శనము, దానినే సర్వదా వాతి—భజించుచున్నాఁడు కావున మానవుఁ డనఁగా బ్రహ్మవేత్త యగుయతి; "అహం బ్రహ్మాస్మి" అను శ్రుతిచేఁ జెప్పఁబడినచొప్పున స్వాత్మరూపమున సాక్షాత్కృత మైన నిత్యానందైకరసము అద్వితీయము నగు పర బ్రహ్మమునందే, రతిః = అంతఃకరణముయొక్క రమణము—క్రీడ సర్వదా విహారము ఎవ్వనికిఁ గలదో అతఁడు ఆత్మరతి, అట్టివాఁడే యగునో, "ఆత్మరతి రాత్మక్రీడ ఆత్మమిథున ఆత్మానన్దః" అను శ్రుతివలన, బ్రహ్మవేత్త యెవ్వఁడు సర్వదా ఆత్మ యందే విహరించుచున్నాఁడో, ఒకానొకప్పుడును అనాత్మయందు విహరింపఁడో అని యర్థము; మఱియు, ఆత్మతృప్తశ్చ = ఆనందైకరసుఁడు పూర్ణుఁడు తానుగాఁ బొందఁబడినవాఁడు అగు ఆత్మచేతనే తృప్తుఁడు "ఆత్మలాభా న్న పరం విద్యతే" అనుస్మృతివలన; కావున ప్రాప్తవ్యము * ఇతరము లేమివలన ఆత్మప్రాప్తిచేతనే సర్వత్ర అలంబుద్ధి ♦ నొందినవాఁడు ఆత్మతృప్తుఁడు, అట్టివాఁడును అగునో;

---

ǂ వేఱువేఱుగా.

* పొందవలసినది.

♦ చాలు ననుబుద్ధి.

ఆత్మన్యేవ = చక్షురింద్రియమునకు రూపమువలె వెలుపలను లోపలను అంతటను వృత్తికి విషయభూత మైన చిదానందైకరసం బగు బ్రహ్మమునందే; సంతుష్టః— ఎట్లు కామవంతుఁడు ఇష్టార్థముచే సంతుష్టుఁ డగుచున్నాఁడో అట్లు ఎవఁడు ఆత్మయందే సంతుష్టుఁ డగునో; తస్య = అట్టి మహాత్ముఁడు ఆత్మారాముఁడు కృతకృత్యుఁడు అగు యతికి; కార్యమ్ = చేయవలసినకర్మము; న విద్యతే = లేదు, పూర్ణకాముఁ డగుటచేఁ బ్రాప్తవ్యము లేమి వలన. ఓయీ! అధికృతత్వము సమాన మగుట వలన విద్వాంసుఁడుగూడఁ జేయవలసినదే వైదికకర్మమును; కర్మవిధి యందఱకును సమాన మగువలనను, కర్మశాస్త్రమును దానియర్థమును దానినియమమును విద్వాంసుఁడే తెలిసినవాఁడగుటవలనను, « విద్వాన్ యజేత » * అని విశేషణము చెప్పుట వలనను విధిబలంబువలన విద్వాంసుఁడుగూడ అవశ్యము కర్మము చేయవలసినదియే అందువేని; నిన్నిట నడుగవలెను—బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానాగ్నిచేనిర్మూలితం బగుద్వైతభ్రమగలవాఁడై సర్వమును బ్రహ్మముగానే చూచుచున్నజీవన్ముక్తుఁ డగుబ్రహ్మవిదునకుఁ గర్మానుష్ఠానము స్వార్థమా? పరార్థమా? మొదటి పక్షమున ఐహికార్థమా? ఆముష్మికార్థమా? అందు మొదటి పక్షమున శరీర రక్షార్థమా? పరిగ్రహ రక్షార్థమా? § విలాసార్థమా? ఇందు మొదటిది సరికాదు « సిద్ధే వాన్య థార్థే నయతేత తత్రి పరిశ్రమం తత్రి సమీక్షమాణః » ♦ అను వచనము వలన శరీరస్థితి ప్రారబ్ధాధీన మగుటంజేసి దాని నుద్దేశించి విద్వాంసునకుఁ గర్మ మనుపపన్న మగుటవలన. రెండవదియుఁ గాదు, « ఏ తం వైత మా మాత్మానం విదిత్వా » ఇత్యాది శ్రుతిచే నిశ్శేషముగా నివర్తిల్లిన మిథ్యాజ్ఞానము గల బ్రహ్మవిదులకుఁ బుత్రైషణాదులనుండి వ్యుత్థానము చెప్పఁబడుట వలన వానినుండి వ్యుత్థితుఁ డైన విద్వాంసునకుఁ బరిగ్రహము లేమిం జేసి తద్రక్షార్థము కర్మము అనుపపన్న మగుట వలన. మూఁడవదియుఁ గాదు, సర్వంబును ఆత్మను గానే చూచుచుండు ఆత్మరతియగు విద్వాంసునకు ఇతరత్ర రతి లేకుండుటంజేసి విలాసము సంభవింపమి వలన. ఇఁక ఆముష్మికార్థం బగుఁగాక యని యందువేని, అప్పుడును ఏమి స్వర్గార్థమా? అపవర్గార్థమా? ఏమి ఆత్మ శుద్ధ్యర్థమా? మొదటిది యుపపన్నము

---

* విద్వాంసుఁడు యజ్ఞము చేయవలెను.

§ పరిగ్రహ మనఁగా నతఁడు స్వీకరించిన పత్నీ పుత్రాదులు.

♦ వేఱు విధమున కార్యము సిద్ధ మయినపుడు అందు యత్నింపఁడు, అట పరిశ్రమ యగు నని తెలిసినవాఁడై.

గాదు "పర్యాప్త కామస్య కృతాత్మనస్తు ఇహైవ సర్వే ప్రవిలీయన్తి కామాః" * అను శ్రుతిచే సర్వకామ ప్రవిలయము ♦ చెప్పఁబడుటవలన విద్వాంసునకు స్వర్గకామన లేమింజేసి తదర్థకర్మానుష్ఠానము సంభవింపమివలన. రెండవదియుఁ గాదు "నకర్మణా న ప్రజయా" ఇత్యాది శ్రుతి కర్మము మోక్షసాధనము కాదని చెప్పుటవలనను జీవన్ముక్తుఁ డగుటవలనను విద్వాంసునకు మోక్షార్థము కర్మము సిద్ధింపమి వలన. మూఁడవ పక్షమున ఏమి శరీరశుద్ధికొఱకా? చిత్తశుద్ధికొఱకా? ఆత్మశుద్ధికొఱకా? ¶ కర్మము చేయవలెను. మొదటిది కాదు "కలే బరం మూత్ర పురీష భాజనమ్" § అను స్మృతివలనను ప్రత్యక్షము వలనను మల మాంసాస్థిరూపమగు దేహమునకుఁ గర్మముచే శుద్ధి సంభవింపమివలన. రెండవదియు సరిగాదు, "యతయ శ్శుద్ధ సత్త్వాః" అను శ్రుతివలన చిత్తశుద్ధిగలవాఁ డగుటచేతనే చక్కనియాత్మజ్ఞానము పొందినవాఁ డగుటవలన విద్వాంసునకు చిత్తశుద్ధ్యపేక్ష లేమివలన. మూఁడవదియు యుక్తముగాదు, "అస్నావిరం శుద్ధ మపాపవిద్ధమ్" ♦♦ అను శ్రుతి వలనను అవయవరహితుం డగుటచే అవిషయం బగుటవలనను కర్మముచే ఆత్మకు శుద్ధికల్పనము సంభవింపమివలన; ఏ ఆయాత్మయొక్క జ్ఞానబలముచే విష్ణురుద్రాదులు శతకోటిసంఖ్యాకము లగు అకార్యముల నాచరించియు శుద్ధు లగుచున్నారో ఇతరులనుం గూడ శుద్ధులఁ జేయుచున్నారో అట్టియాత్మను ఎవఁడు దేనిచే శుద్ధిచేయవలెను? "స్వత ఏవ సత శ్శుద్ధిః నాసతా యేన కేన చిత్" ** అను వచనముచే ఆత్మ స్వతశ్శుద్ధుఁడే యగుటవలన. ఇఁక విద్వాంసునకుఁ గర్మాచరణము పరార్థమే యగుఁ గాఁక అని యందువేని, నిన్నిట నడుగవలెను--లోకార్థము ఎవఁడు కర్మము చేయుచున్నాఁడో అతఁడు అపరోక్షజ్ఞానియా? పరోక్షజ్ఞానియా? మొదటిపక్షమున అతఁడు సన్న్యాసియా? గృహస్థుఁడా? సన్న్యాసి యనుట సరి గాదు, అతఁడు అభిమానరహితుఁ డగుటవలనను సర్వకర్మములను తత్సాధనములను సన్న్యసించినవాఁ డగుటవలనను వానికిఁ గర్మ

* పూర్ణకాముఁడైన ఆత్మజ్ఞునకు ఇచటనే సమస్తకామములు లయించుచున్నవి.

♦ సమస్త కామముల నాశము.

¶ ఆత్మశబ్దమునకు శరీరాద్యర్థములు గలుగుటవలన.

§ దేహము మూత్రఫలాదులకు జోటు.

♦♦ శరీరరహితము శుద్ధము పాపసహితము కానిది.

** సత్తునకు తనవలననే శుద్ధి కాని అసత్తుచే దేనిచేతనుంగాదు.

శబ్దమే ప్రసక్తింపమివలన. దేహవర్ణాశ్రమాదులందు నేను నాది యనునభిమానం బును ప్రపంచము సత్యం బనుబుద్ధియు కర్మము కర్తవ్యం బనుబుద్ధియు చేయనిచోఁ బ్రత్యవాయభయంబును శాస్త్రభయంబును గదా ప్రవృత్తికి బీజము, అది యంతయు సమూలముగా బ్రహ్మాత్మైక్య జ్ఞానమహాగ్నిగే నిర్దహించి తాను నిష్క్రి యబ్రహ్మరూపంబున నున్నవానికి అనాత్మతాదాత్మ్యగ్రంథిని దహించి యుండు వానికి సర్వాత్మభావము పొందినవానికి స్వాత్మారామునకు యతికి అతివాదమే * సంభవింపదు, ఇఁకఁ గర్మప్రవృత్తి సంభవింప దని చెప్పవలయునా? అట్లు శ్రుతి «ప్రాణో హ్యేష సర్వభూతై ర్విభాతి, విజాన న్విద్వా న్భవతే నాఽతివాదీ» ♦ అని. అందువలన బ్రహ్మనిష్ఠున కాత్మరతికి స్వార్థముగాని పరార్థముగాని కర్మము నందుఁ బ్రవృత్తి సంభవింపదు. రెండవదియు సరిగాదు, అనేకసహస్ర జన్మకృత పుణ్యకర్మరాశిపరిపాకంబునను ఈశ్వరప్రసాదంబునను సర్వదృశ్యములును మిథ్య యను నిశ్చయముతో బ్రహ్మమే నేను అను బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము అప్రతిబంధ ముగా ఎప్పుడు జనియించునో అప్పుడే గృహస్థుఁడుగూడ యాజ్ఞవల్క్యాదులవలె ఏషణాదులనుండి వ్యుత్థానము చేయును, కాని నేను నాది యను సంసారము వహిం పఁడు, తత్కారణము సంభవింపమివలన. అనాత్మ యగు దేహాదికమునందు అహంభావమును తదితరమునందు మమభావమునుం గదా సంసారకారణము. ఈ రెండును ఎవనికి బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముచే విధ్వస్తం బగునో అతనికి మరల సం సారము సంభవింపదు. బ్రహ్మమే నేను అనువిజ్ఞానమును బ్రాహ్మణుఁడను నేను నాది యిది యనుబుద్ధియు—ఈ రెండును తేజస్తిమిరంబులవలెఁ బరస్పరవిరుద్ధంబు లొక్కచో నిలువఁ జాలవు గదా! అందువలన బ్రహ్మాత్మత్వవిజ్ఞానం బనుఖడ్గముచే హృదయ గ్రంథిని ఛేదించినవిద్వాంసునకు మరల సంసరణము సంభవింపదు. కావున గృహ స్థుఁడైనను విద్వాంసుఁడు సంసారమునుండి వ్యుత్థానమే చేయును, వ్యుత్థితుఁడు కానిచో అదియే తెలుపుచున్నది అజ్ఞానతత్కార్యములకు లోనై యున్నాఁ డితం డనుటను. ఓయీ! సన్న్యాసమునకుఁ గారణమైన ప్రారబ్ధము లేకుండుటవలన గృహస్థుఁడు బ్రహ్మభావము పొందినవాఁడైనను వ్యుత్థానము చేయం డని యందు వేని; అప్పు డతఁడు జడభరతునివలె నుండును, కాని నేను నాది యను సంసార

* ఇది యుక్తము కాదు. ఇది యుక్తము అను మాటయే.

♦ ఈప్రాణము గదా సర్వభూతములచేతను బ్రకాశించుచున్నది, తెలిసిన విద్వాంసుఁడు అతి వాది కాఁడు—ఎవ రేమి యుపసిద్ధాంతము చెప్పినను అది సరి కా దని చెప్పఁడు.

మునం బ్రవర్తింపఁడు, మిథ్యాత్వజ్ఞానమును సంసారమును బరస్పరవిరుద్ధంబు లగుట వలన. మరుభూమి నిర్జలం బని తెలిసి మరల దూరమునఁ దోఁచుచుండుజలముఁ దెచ్చుటకుఁ గాని త్రాగుటకుఁ గాని వివేకి యచటికిఁ బోఁడు గదా! తన్ను బలవంతుఁడు పంపినను వేగంబునను హర్షంబునను బోఁడు, మఱేమనఁగా అయ్యో కష్టము! అని యేడ్చుచు మెల్లమెల్లగాఁ బోవును, ఇతఁ డేమో మఱియొకనిం బొమ్మనఁడు; అట్లు ప్రతికూలప్రారబ్ధము గలవాఁడైనను విద్వాంసుఁడు సర్వంబును మిథ్య యని తెలిసినవాఁడు సంసరించుటకు హర్షింపఁడు, ఇతరునిం బ్రేరింపఁడు, మఱేమనఁగా నడుమువిఱిగిన సర్పమువలె మందగతి యగును, ప్రవృత్తిహేతువు అనాత్మయం దహంభావము లేమివలన. బ్రహ్మమే నేను అని బ్రహ్మాత్మభావంబున బ్రహ్మమునందే యున్న బ్రహ్మవిదునకు, బ్రాహ్మణునకుఁ జండాలునింబోలె, తనదేహమును స్పృశించుట రుచింపదు. దేహాదితాదాత్మ్యము ఉన్నంగాని నేను నాది యని వ్యవహరింప శక్యము గాదు. బ్రహ్మవిదులకు దేహాదితాదాత్మ్యము మిక్కిలి దుఃఖము, దానిచే నేను నాది యని ప్రవర్తించుట అంతకన్నను మిక్కిలిదుఃఖము, అందును కర్మము చేయుట మఱియు దుఃఖమే యని తెలిసి గృహస్థుఁడైనను విద్వాంసుఁడు సర్వమును సన్న్యసింపనే సన్న్యసించును, స్వార్థము గాని పరార్థము గాని కర్మము చేయఁజాలఁడు. అందువలనఁ బరోక్షజ్ఞానియే చతుర్థాధ్యాయంబునను ఇందును * జెప్పఁబోవువిధంబున లోకసంగ్రహము చేయఁగలఁ డని యెఱుంగవలెను, కాని నిశ్శేషముగా నశించిన యనాత్మాహంభావము గల అపరోక్షజ్ఞాని యొకానొకప్పుడేని చేయఁగలఁ డని కాదు. ఓయీ! « యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః। సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి నలిప్యతే॥ నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ” ఇత్యాదివాక్యముల యర్థము పర్యాలోచించినచో అపరోక్షజ్ఞాని గూడ లోకసంగ్రహార్థము కర్మము చేయవలసినదియే యని తెలియుచున్నది; ఎట్లు పరోక్షజ్ఞానియే లోకసంగ్రహము చేయు నని నియమము చేయవచ్చును? విశుద్ధాత్మా ఇత్యాదివిశేషణములు బ్రహ్మవిదునకు బ్రహ్మనిష్ఠునకే గాని పరోక్షజ్ఞాని కెట్లు సిద్ధించును? తత్త్వవిత్ అని బ్రహ్మవిదర్థబోధకపదము గూడఁ గనఁబడుచున్నది; కావున అపరోక్షజ్ఞానియును లోకసంగ్రహార్థము కర్మము చేయవలసినదే అందువేని; సత్యము విశుద్ధాత్మేత్యాది విశేషణములు బ్రహ్మవిదుని ఇతరపురుషునుండి వ్యావర్తించుచున్నవి, ఈముక్తిలక్షణము శతకోటి జన్మముల కైన

* తృతీయాధ్యాయంబునను.

ఇతరుల కలభ్యము. అయినను నిచ్చట నడుగవలయును. అపరోక్షజ్ఞాని రెండువిధములు సిద్ధుఁడు సాధకుఁడు అని. వారిలో లోకసంగ్రహము సిద్ధునకా సాధకునకా చెప్పెదవు ? మొదటిపక్షము సరికాదు, అతఁడు ముక్తుఁ డగుటచే లోకసంగ్రహము అతని కనుపపన్న మగుటవలన. ఇది సర్వంబును నేనును బ్రహ్మమే యని నిత్యము నిరంతరము బ్రహ్మనిష్ఠచే మిక్కిలి వాఁడి చేయఁబడిన బ్రహ్మైకత్వ విజ్ఞానఖడ్గమున ద్వైతభ్రమబంధము ఛేదించి బ్రహ్మాది స్తంబ పర్యంత సర్వప్రాణులతోఁ గూడ తన్ను ముక్తునిఁగాఁ జూచుచున్న బ్రహ్మవేత్త యగు యతికి తద్దృష్టిచే బద్ధలోకము లేమిఁ జేసి తత్సంగ్రహము సంభవింపదు. ఎట్లు దేవదత్తుఁడు అందఱకు మున్ను తా భుజించి తన్ను మాత్రమె భుజించినవానిఁ గాను ఇతరుల భుజింపనివారిఁగాను జూచుచున్నాఁడో, మఱియు నెట్లు యజ్ఞదత్తుఁడు తాను మున్ను మేలుకొని తన్ను మాత్రమె మేలుకొన్నవానిఁగాఁ జూచుచున్నాఁడో, అట్లుగాదు విద్వాంసుఁడు తన్ను మాత్రమే ముక్తునిఁ గాఁ జూచుట. మఱేమనగా స్వవిజ్ఞానముచే విద్వాంసుఁడు తన్నును సర్వప్రాణిజాతమును ముక్తునిఁ గానే చూచుచున్నాఁడు. ఎట్లు బుద్ధిమంతుఁడు తాను చేతనత్వధర్మము గలవాఁ డని తెలియుటచే బ్రహ్మాండగతం బగు సర్వప్రాణి సమూహమును చేతనత్వము గలదానిఁగానే దెలియుచున్నాఁడో, మఱియు ఎట్లు వంటవాఁడు కుండలోని మెతుకు ఒకటి పక్వ మని తెలియుటచేసమస్తమయినయన్నమును బక్వ మని తెలియుచున్నాఁడో, అట్లు బ్రహ్మవిదుఁ డగు యతి తాను ముక్తుఁ డగుటచే సర్వప్రాణులును ముక్తులే యని దెలియుచున్నాఁడుగాని తాను మాత్రమే ముక్తుఁ డని కాదు. ఎవఁడు తాను మాత్రమే ముక్తుఁ డనియు ఇతరుఁడు కాఁ డనియు తెలియునో అతఁడు బ్రహ్మవిదుఁడు కానే కాఁడు, ముక్తుఁడును గాఁడు. అతఁడు మాటకు ముక్తుఁడే కాని అవిద్యాబంధమునుండి ముక్తుఁడు కాఁడు. ఎట్లు వివేకి సూక్ష్మబుద్ధిచే తరంగఫేనబుద్బుదాదికము * జలమయము సమస్తమును జలమాత్రముగాఁ జూచుచున్నాఁడో ఎట్లు కటక ముకుటాదికము స్వర్ణమయము సర్వమును స్వర్ణమాత్రముగాఁ జూచుచున్నాఁడో మఱియు ఎట్లు రజ్జుసర్పమును రజ్జుమాత్రముగాఁ జూచుచున్నాఁడో, అట్లు ఎవఁడుమాత్రమె ప్రత్యగ్దృష్టిచే తన్ను జగత్తుసమస్తమును బ్రహ్మమాత్రముగాఁ జూచుచున్నాఁడో అతఁడే బ్రహ్మవిదుఁడును అద్వైతదర్శియును అవిద్యాబంధవిముక్తుఁడును. అట్టియీయద్వైతదర్శి యగుమహాత్మునకు

* ఫేనము—నురుఁగు, బుద్బుదము—నీరుబుగ్గ.

సిద్ధునకు సుప్తోత్థితునివలె స్వాతిరిక్తమును * జూడనివానికిఁ బూర్ణవృత్తి యగు బ్రహ్మవిద్వరిష్ఠునకు లోకము విధి విధానము విధేయము మొదలగునవి లేమిం జేసి వానినుద్దేశించి కర్మమునందుఁ బ్రవృత్తి సంభవింపదు. "కుర్వన్నపి న లిప్యతే" అని ప్రవృత్తిసూచకం బగువాక్య మున్నదే అది యెట్లుండునవేని దానియర్థము తచ్ఛ్లోకవ్యాఖ్యానావసరమునం జెప్పెదము. విద్వాన్ యజతే అనుచో వేదార్థము దెలిసినట్టిబ్రాహ్మణుఁడు విద్వచ్ఛబ్దార్థము కాని బ్రహ్మవిద్యతి కాఁడు, అతఁడు సర్వకర్మసన్న్యాసి యగుటవలనను విధియును లోకమువలె మిథ్యయె యగుటవలనను వాని విషయమునఁ గర్మవిధి యనుపపన్నమగుటవలన. ఇఁక సాధకునకును లోకసంగ్రహము చెప్పనలవి కాదు, సాధకుఁ డగుముముక్షుసన్న్యాసికిఁ గర్మవిధి కనఁబడమివలన. నిదిధ్యాసనము చేయునట్టి ముముక్షు వగుయతికి సమాధి విధింపఁబడియున్నది కాని లోకసంగ్రహార్థము కర్మము చేయవలె నని విధి లేదు గదా! "తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత, పరం బ్రహ్మానుసందధ్యాత్, యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞః, బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్" ఇత్యాదిగా జ్ఞాననిష్ఠయె కర్తవ్యమని శ్రుతి యుపదేశించుచున్నది. స్మృతియును "మనస్సం యమ్య మచ్చిత్తః, ధ్యానయోగపరో నిత్యమ్, వాచం యచ్ఛ మనో యచ్ఛ" ఇత్యాదిగాఁ జెప్పుచున్నది. అందువలన సాధకుఁ డగు ఆత్మనిష్ఠ్యతికిఁ గర్తవ్యము సమాధియే, శ్రౌతమును గాదు స్మార్తమునుం గాదు స్వార్థముగాని పరార్థముగాని, "శౌచ మాచమనం స్నానం న తు చోదనయా చరేత్" § అని జ్ఞాననిష్ఠునకు విధ్యభావమును స్మృతి చెప్పుటవలన. "ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి" అను శ్రుతినిబట్టి జిజ్ఞాసచే సర్వకర్మసన్న్యాసము చేసినయతికి వివిదిషువునకే ♦ "జిజ్ఞాసాయాం సంప్రవృత్తో నాద్రియేత్కర్మచోదనామ్" ¶ అని జ్ఞానసాధన మగు శ్రవణాదికము దక్క నితరము కర్తవ్యము లేదని కర్మవిధి యుపేక్షణీయం బని స్మృతి ప్రతిపాదించుచున్నది. ఇఁక ఆత్మతత్త్వము దెలిసినట్టి సాధకు

---

* నిదురించి లేచినవాఁడు నిద్రయందు భిన్నములుగాఁ దోఁచినస్వప్నపదార్థములను జూడని యట్లు ఆత్మను దక్క నితరమును.

§ శౌచమును ఆచమనమును స్నానమును విధిని బట్టి—విధి యున్నది యవశ్యము చేయవలెనను నభిప్రాయముచేఁ జేయఁగూడదు.

♦ తెలియఁగోరిన వానికే.

¶ జిజ్ఞాసయందుఁ బ్రవర్తించినవాఁడు కర్మవిధి నాదరింపఁగూడదు.

నకుఁ గర్మవిధి కవకాశము లే దని చెప్పవలయునా ? అందువలనఁ బరోక్షజ్ఞానియే బహువిధంబుల శ్రవణముచేసి యాభాసాత్మజ్ఞానము నొంది « నేను నాది " మొదలగు బాహ్యవాసనలచే బద్ధుం డై యుండువాఁడు లోకసంగ్రహ వచనమునకు విషయము. లేక. లోకానుగ్రహార్థము బ్రహ్మచే సృజింపఁబడిన మహాత్ములు వ్యాసాగస్త్యవసిష్ఠపరాశరప్రభృతులు, ఇతరులుగాని తత్సమానులు, నిగ్రహానుగ్రహసమర్థులు అధికారికు లనంబడువా రెవ్వరు గలరో, వార లై నను గావచ్చును లోకసంగ్రహవచనమునకు విషయము. ఇతఁ డి సిద్ధుఁడును గాఁడు, సాధకుఁ డగుముముక్షుయతియునుం గాఁడు. అందువలననే చెప్పుచున్నాఁడు భగవంతుఁడు సర్వజ్ఞుఁడు « తస్య కార్యం న విద్యతే » అని.

మ. ఇఁక నెవ్వఁ డింద్రియారాముఁడు కాఁడో అట్టి పరమార్థదర్శి ఇట్లు జగచ్చక్రప్రవృత్తి హేతుభూతం బగు కర్మము ననుష్ఠింప కున్నను ప్రత్యవాయము నొందఁడు కృతకృత్యుఁ డగుటవలన అని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ఇంద్రియారాముఁడు గదా స్రక్చందన వనితాదులయందు రతిని, మనోహర మయిన అన్నపానాదులందుఁ దృప్తిని, పశుపుత్త్రహిరణ్యాదిలాభంబునను రోగాదులయభావంబునను సంతోషమును అనుభవించుచున్నాఁడు. ఈచెప్పిన విషయములు లేనిచో రాగవంతులకు అరతియు అతృప్తియు అతుష్టియుఁ గనఁబడుటవలన రతి తృప్తి సంతోషములు మనోవృత్తివిశేషములు సాక్షిసిద్ధములు. పరమాత్మానందము పొందినవాఁడో ద్వైతదృష్టి లేకుండుటవలనను అతితుచ్ఛం బగుటవలనను విషయసుఖమును గామింపఁ డని చెప్పఁబడినది « యావా నర్థ ఉదపానే " అను స్థలమున. అందువలన అనాత్మ విషయకము లయిన రతి తృప్తి సంతోషములు లేకుండుటవలనఁ బరమానందరూపుఁడు అద్వితీయుఁ డగు ఆత్మను సాక్షాత్కరించినవాఁడు ఉపచారమున ఇట్లు చెప్పఁబడుచున్నాఁడు.—ఆత్మరతి ఆత్మతృప్తుఁడు ఆత్మసంతుష్టుఁడు అని. అట్లు శ్రుతి «ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావానేష బ్రహ్మవిదాం వరిష్ఠః ' * అని. ఆత్మతృప్తశ్చ అనుచో చకారము ఏవకారమును అనుకర్షించుచున్నది ♦. మానవః అనుట « ఎవ్వఁ డై నను మనుష్యుఁ డెవఁ డట్టివాఁ డగునో

* ఆత్మక్రీడుఁడు ఆత్మరతి కావున ఈబ్రహ్మవిద్వరిష్ఠుఁడు క్రియావంతుఁడు—క్రియావంతుఁడు కాకున్నను క్రీడారతులు గలవారివలె నున్నాఁడు.

♦ ఆత్మ రతిరేవ అనుచోటియేవకారమును అకర్షించుచున్నది. ఆత్మతృప్తుఁడునే యని యర్థము.

అతఁడే కృతకృత్యుఁడు కాని బ్రాహ్మణత్వాద్యుత్కర్షచేఁ గృతకృత్యుఁడు కాఁడని సూచించుచున్నది. ఆత్మన్యేవచ సంతుష్టః అనుచో చకారము సముచ్చయార్థకము. ఎవ్వఁడు ఇట్టివాఁ డగునో అతనికి అధికారహేతువు లేకుండుటవలన ఏదియుఁ గార్యము వైదికము గాని లౌకికము గాని లేదు.

శ్రీ. ఇట్లు 'న కర్మణా మనారమ్భా న్నైష్కర్మ్యమ్' ఇత్యాది గ్రంథముచే అర్జునకు అంతఃకరణ శుద్ధ్యర్థము కర్మయోగము చెప్పి, జ్ఞానికిఁ గర్మయోగముచే నుపయోగము లే దని చెప్పుచున్నాఁడు రెండు శ్లోకములచేత—ఆత్మరతిః = ఆత్మయందే ప్రీతి గలవాఁడు. అందువలన, ఆత్మయందే తృప్తుఁడు, ఆత్మానందానుభవముచే నిర్వృతి గలవాఁడు. కావుననే ఆత్మన్యేవ సంతుష్టః. భోగాపేక్ష లేనివాఁ డెవ్వఁడో వానికిఁ గర్తవ్యము లేదు.

ప. ఇట్లు బ్రహ్మమతమును నిరూపించి యిప్పుడు నీకు జ్ఞానోత్పత్తి లేనివానికే యీకర్మోపదేశము కాని జ్ఞానోత్పత్తిగలవానికిఁ గా దని చెప్పుచున్నాఁడు.—యస్తు, ఆత్మరతిః = ఆత్మయందే ప్రీతిగలవాఁడు, అట్లు, ఆత్మయందే తృప్తుఁడు—అవాప్తసకలకాముఁడు, కావుననే, ఆత్మన్యేవ సంతుష్టః—భోగాపేక్ష లేనివాఁడు. తస్య, కార్యమ్ = కర్తవ్యము; నవిద్యతే.

రా. సాధనము లేకయె ఆత్మదర్శనము నొందినవానికి ముక్తునకుంబోలె మహాయజ్ఞాది వర్ణాశ్రమోచితకర్మముల యనుష్ఠానము లే దని చెప్పుచున్నాఁడు—యస్తు = ఇఁక నెవ్వఁడు; జ్ఞానయోగ కర్మయోగము లను సాధనముల యపేక్ష లేనివాఁడై తనయంతనె, ఆత్మరతిః = ఆత్మాభిముఖుఁడును; ఆత్మతృప్తశ్చ = ఆత్మచే తనే తృప్తి పొందినవాఁడును, కాఁడు ఆత్మవ్యతిరిక్తము లగు అన్నపానాదులచేత; ఆత్మన్యేవచ సంతుష్టః, కాఁడు ఉద్యానస్రక్చందన గీతవాదిత్ర నృత్తాదులందు; ఇట్లు ధారణపోషణ భోగ్యాదికము * సమస్తమును ఎవ్వనికి ఆత్మయే యగునో, తస్య = వానికి; ఆత్మదర్శనము కొఱకు; కార్యమ్ = చేయవలసినది; న విద్యతే = లేదు, తనయంతనె సర్వదా ఆత్మదర్శనము గలవాఁ డగుటవలన.

ఎవ్వఁడు జ్ఞానయోగముగాని కర్మయోగము గాని సాధనము లేకయె తనయంతనె ఆత్మదర్శనము నొంది, శరీరధారణపోషణ భోగ్యాదులందుఁ గొంచె

* శరీరధారణము మొదలగునది.

ముని అపేక్ష లేనివాఁడై యెల్లప్పుడును ఆత్మాభిముఖుఁడును ఆత్మతృప్తుఁడును ఆత్మసంతుష్టుఁడునై యుండునో అతఁడు వర్ణాశ్రమోచిత కర్మము చేయవలసినది లే దని తాత్పర్యము.

మూ. అప్పుడు అధికముగా మనస్సమాధానము * గూడఁ జేయఁగూడదు అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు.—రతి యనఁగా పరదర్శనాదులచేఁ గలుగు సుఖము, తృప్తి—ఇతరవిషయమున అలం బుద్ధి, సంతోషము—తృప్తి జనక మగు సుఖము "సంతోష స్తృప్తి కారణమ్" అను నిఘంటువువలన. పరమాత్మ దర్శనాది జన్యమగు సుఖమును బొందినవాఁడును ఇతరత్ర సర్వవిధంబున అలం బుద్ధిగలవాఁడును అని యర్థము ♦. ఆసుఖము గొప్పది కావున దానిచేతనే ఇతరత్ర అలం బుద్ధి కలుగు నని తెలుపుచున్నాఁడు ఆత్మన్యేవచ సంతుష్టః అని. పరమాత్మయందున్నవాఁడే యగుచు సంతుష్టుఁ డని యర్థము. ఇతర మేదియు సంతోషకారణము కా దని యవధారణార్థము ¶. ఆత్మచేత తృప్తుఁడు §, ఏల యనఁగా ఆత్మయందలం బుద్ధియుక్తముగాదు ** తృప్తిశబ్దమునకు అలంబుద్ధి యర్థం బనుట "వయం తు నవితృప్యామ ఉత్తమ శ్లోక విక్రమైః" అని ప్రయోగమువలన సిద్ధము. గత్యంతరము లేనియెడ మాత్రమె యధ్యాహారము కావచ్చును ♦♦. ఆత్మ రతిరేవ అని యవధారణమువలన అసంప్రజ్ఞాత సమాధియందున్నవానికే, కార్యం నవిద్యతే. స్థితప్రజ్ఞునకుఁగూడ కార్యము దేహాదికము కనఁబడుచున్నది, లేక, స్వధర్మము గూడఁగనఁబడుచున్నది "స్వధర్మోమమ తుష్ట్యర్థ స్సాహి సర్వై రపేక్షితా" ¶¶ అని పాంచరాత్రవచనమువలనను. ఇతరకాలమునందు (*) అన్యగతియును గొంచెము అందఱకునుగలుగు

---

* సమాధి.

♦ ఆత్మరతిః ఆత్మతృప్తః అను పదములకు.

¶ ఆత్మన్యేవ అనుచోటి యేవకారమున కర్థము.

§ అని ఆత్మతృప్తః అనుటకు విగ్రహము.

** అందుచే సప్తమీసమాసము సరిగాదు.

♦♦ ఈ శ్లోకమునందు నవితృప్యామః అనుటకు అలంబుద్ధి నొందకున్నాము అను నర్థముచే వాక్యార్థము ఉపపన్న మగుటవలన అనుపపత్తి లేమింజేసి ప్రీతినొందము అని యర్థము కల్పించి ఇతరమునందు అనుట నధ్యాహరింపవలసినది లే దని భావము.

¶¶ స్వధర్మము నాకు సంతోషము కలిగించునది. నేను సంతోషించుట యందఱిచేతను అపేక్షితముగదా!

(*) అసంప్రజ్ఞాత సమాధిలేని కాలమునందు.

చున్నది. అందు అలం బుద్ధి మాత్రము చెప్పఁబడిన దనఁదగదు, ఆత్మతృప్తః అని వేఱుగాఁ జెప్పుటవలన †. కర్తృశబ్దం బిది కాలావచ్ఛేదమునందును బ్రసిద్ధము "యో భుఙ్క్తే స తు న బ్రూయాత్" ♦ ఇత్యాది స్థలమునందు *. అందువలన తస్య కార్యం న విద్యతే అనుట అసంప్రజ్ఞాత సమాధియందే **. మానవః అనునది జ్ఞానికే అసంప్రజ్ఞాత సమాధి సిద్ధించు నని తెలుపుచున్నది మను అవబోధనే అను ధాతువువలన. పరమాత్మ రతియే యిట వివక్షితము "విష్ణావేవ రతి ర్యస్య క్రియా తస్యైవ నాస్తి హి" †† అను వచనమువలన.

నైవ తస్య కృతే నార్థో నా ఽకృతే నేహ కశ్చన
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః. ౧౮

భా. మఱియును. తస్య = ఆ పరమాత్మరతికి; కృతేన = కర్మముచే; అర్థః = ప్రయోజనము; నైవాస్తి = కలుగనే కలుగదు. అప్పుడు అకరణముచే ♦♦ కలుగును ప్రత్యవాయ రూప మయిన అనర్థము? కలుగదు —అకృతేన = అకరణముచేత; ఇహ = ఈలోకమునందు; కశ్చన = ఏదియును, ప్రత్యవాయ ప్రాప్తిరూపముగాని ఆత్మహానిరూపముగాని; న = కలుగనే కలుగదు. అస్య = వీనికి; సర్వభూతేషు = బ్రహ్మాదిస్థావరాంతము లగు సమస్త భూతములయందును; అర్థవ్యపాశ్రయః = ప్రయోజనముకొఱకు క్రియాసాధ్య మయిన వ్యపాశ్రయణము; కశ్చిత్ = ఏదియును; న చ = కలుగదు—ఒకానొక భూతవిశేషము నాశ్రయించి సాధింపఁదగిన ప్రయోజనము ఏదియుఁ గలుగదు. ప్రయోజన మున్నఁగదా తదర్థము క్రియ అనుష్ఠేయం బగును.

† ఆత్మరతిరేవ అని యవధారణముచేతనే ఇతరత్ర అలం బుద్ధి సూచిత మగుచున్నను ఆత్మతృప్తః వేఱుగాఁ జెప్పుటవలన ఇతరత్ర సంపూర్ణముగా అలం బుద్ధి వివక్షిత మని భావము.

♦ ఎవ్వఁడు భోజనము చేయుచున్నాఁడో వాఁడు మాటలాడఁగూడదు.

* ఇట భోజనము చేయునప్పుడు మాటలాడఁగూడ దని భోజన కర్తృశబ్దము తత్కాలబోధక మగుచున్నది. అట్లు ఆత్మరతిః ఇత్యాది స్థలమునఁగూడ రతికర్తృశబ్దము తత్కాలబోధక మగును, ఎప్పుడాత్మ రతి యగునో అప్పు డని యర్థము.

** ఇతర కాలమునందుఁ గాని జ్ఞానులందఱకును గాని కా దనుట.

†† విష్ణువునందే రతి యెవ్వని కగునో వానికేఁ గదా కర్మము లేదు.

♦♦ చేయమిచే.

ఆత్మరతియగు బ్రహ్మవిదునకు కర్మముచేయుటచేఁ బ్రయోజన మేమియు లేదు, చేయకుండుటచే అనర్థముగూడ ఏదియు సంభవింపదు. మఱియు నతనికి బ్రహ్మాదిస్థావరాంతము లగు భూతములలో నేదినిగాని యాశ్రయించి సాధింపవలసిన ప్రయోజనమేదియు లేదు. కావున నతనికిఁ గర్మము సంభవింప దని తాత్పర్యము.

ఆ. ఇందువలనఁ గూడ ఆత్మవిదునకేమియుఁ గర్తవ్యము లే దని చెప్పుచున్నారు మఱియును అని. అభ్యుదయ నిశ్శ్రేయసములలో నేదో యొకటి ప్రయోజనము కర్మానుష్ఠానముచే ఆత్మవిదునకుఁ గాఁగల దని యాశంకించి చెప్పుచున్నాఁడు నైవ తస్య కృతే నార్థః అని. ప్రత్యవాయ నివృత్తికొఱకుఁ గాని స్వరూపచ్యుతి నివృత్తికొఱకుఁగాని కర్మము కావలె ననియాశంకించి చెప్పుచున్నాఁడు నాకృతే నేహ కశ్చన అని. బ్రహ్మాది స్థావరాంతభూతములలో నేదో యొకభూతము నాశ్రయించి యేదో యొకయర్థము విద్వాంసునకు సాధింపవలసియుండును, తదర్థంబతఁడు కర్మము చేయవలయు నని యాశంకించి చెప్పుచున్నాఁడు ఉత్తరార్ధముచేత. అందు మొదటి పాదమునకు వ్యాఖ్య చేయుచున్నారు తస్యేత్యాదిగా. ఆత్మవిదుఁడు స్వర్గాద్యభ్యుదయము నపేక్షింపని వాఁ డగుటవలనను నిశ్శ్రేయస మేమో ప్రాప్తమగుటవలనను వానికిఁ గర్మమువలనఁ బ్రయోజనము లే దని యర్థము. ఆత్మవిదుఁడు కర్మము చేయఁడేని అప్పుడు కర్మముచేయమిచే నతనికి అనర్థము సంభవించును, కావున తన్నివృత్తి కొఱకతండు చేయవలెను గర్మము నని శంకించుచున్నాఁడు అప్పుడు ఇత్యాదిగా. రెండవపాదముచే అందుకుత్తరముఁ జెప్పుచున్నారు అకృతే నేత్యాదిగా. అందువలన తన్నివృత్తికొఱకుఁ గర్మము చేయుటచేఁ బ్రయోజనము లే దని శేషము. ఉత్తరార్ధమును విభజించుచున్నారు అస్యేత్యాదిగా. వ్యపాశ్రయణము—ఆలంబనము. పదార్థము చెప్పి వాక్యార్థము వచించుచున్నారు. ఒకానొక ఇత్యాదిగా. ఇతఁ డాశ్రయించు భూత విశేషముగూడ క్రియాద్వారమునఁ బ్రయోజన హేతువు కావలయు నని తలఁచి చెప్పుచున్నారు ప్రయోజనము ఇత్యాదిగా.

హ. మఱియును. తస్య = ఆయాత్మరతికి; కృతేన = చేయుటచేత; అర్థః = ప్రయోజనము; న = లేదు. ఇట్లు; అకృతేన = చేయకుండుటచేత; కశ్చన = ఒకానొక ప్రత్యవాయంబును; న = లేదు. అస్య = విద్వాంసునకు; సర్వభూతేషు--బ్రహ్మాది స్థావరాంతములయందు; కశ్చిత్; అర్థవ్యపాశ్రయః = కార్యార్థము ఆశ్రయించుట; న = లేదు.

శ౦. ఓయీ! బ్రహ్మేంద్రాదులు తత్తత్పదము నొంది యేసుఖము నొం దుచున్నారో అది కర్మజన్యమేగదా! అందువలన నంతటను సుఖము కర్మజన్యం బగుటవలనను బ్రహ్మవిదుఁడును సుఖార్థి యగుటవలనను అతఁడును నిరంతర సుఖసిద్ధి కొఱకు ఏదేని కర్మము చేయవలసినదియే యని యాశంకింతువేని. అట్లు కాదు. అసన్నో బ్రహ్మ యనియు విజ్ఞాన మానన్దం బ్రహ్మ యనియు బ్రహ్మము ఆనందైకరూప మని శ్రుతి బోధించుటవలన నిరంతర బ్రహ్మనిష్ఠచే బ్రహ్మభావమును బొంది యఖం డానందస్వరూపంబుననే యున్నట్టి బ్రహ్మవిదునకు నిరంతర బ్రహ్మానంద రసానుభవము అవిచ్ఛిన్న మగుటవలనను గర్మజన్యసుఖము అనిత్య మగుటవలనను బ్రహ్మవిదుండు దాని నపేక్షింపఁడు. కావున నతనికిఁ గర్మము ననుష్ఠించుటచే లాభముగాని విడు చుటచే దోషముగాని యేదియు లే దని చెప్పుచున్నాఁడు.—తస్య = నేనే యిది యంతయు నని సమస్తమును అద్వితీయుఁ డగు నాత్మనుగానే చూచుచున్న యాత్మా రాముఁడు ఆత్మానందుఁడు నగు యతికి సిద్ధుఁ డైనవానికి; కృతేన = అనుష్ఠింపఁబడిన కర్మముచే; అర్థః = పొందవలసిన ప్రయోజనము, ఏదియును; నైవ = ఉండనే యుండ దు. ఆత్మ తృప్తుఁ డగుటవలనను సమస్తంబును మిథ్య యని యెఱింగినవాఁ డగుట వలనను యోగముచేఁ బొందఁదగిన యాకాశగమనము అణిమాదిసిద్ధి మొదలగునవి యతని కపేక్షితము గాదు, సర్వాత్మభావము పొందినవాఁ డగుటవలనఁ దపస్సుచేఁ బొందఁదగిన బ్రహ్మేంద్రాది పదం బతని కపేక్షితము గాదు, జీవన్ముక్తుఁ డగుటవలన వైదికకర్మానుష్ఠానముచేఁ బొందఁదగిన చిత్తశుద్ధిద్వారక మోక్షముగూడ నతని కపేక్షితముగాదు, కావున బ్రహ్మవిత్తమునకుఁ గర్మముచే సాధింపఁ దగిన యర్థం బేదియు సంభవింపనే సంభవింప దని యర్థము. ఓయీ! వీనికిఁ గర్మముచేఁ బొం దఁదగిన యిష్టార్థము లేకున్నను కర్మము ననుష్ఠింపనియెడ విధి నుల్లంఘించిన దోషముగాని ప్రత్యవాయరూప దోషముగాని సంభవించును, అందుచే జ్ఞానహాని గాని స్వరూపహానిగాని యగును అని యాశంకింపఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు నాకృతే నేత్యాదిగా. ఈబ్రహ్మవేత్తకు, అకృతేన = విహితకర్మము చేయకుండు టచే; కలుగు నని చెప్పఁబడిన యనర్థ మేదియు; ఇహ = ఈలోకమునందు; న = సంభవింపదు, «మాయామయ మిదం ద్వైతమ్» అను న్యాయంబున విధి గూడ అవి ద్యకం బగుటచే మిథ్య యగుటవలన విద్వాంసునకు దాని నుల్లంఘించుటచే దోష ము లేదు; «ఉభేహ్యేవైష ఏతే ఆత్మానగ్ స్పృణుతే» అను శ్రుతివలన అకర్మ ముగూడ బ్రహ్మ మాత్రమె యగుటచే దానికి స్వతస్సత్త లేకుండుటవలన అకర్మ

ముగూడ దోషావహము కాఁ జాలదు; నిరంతర బ్రహ్మనిష్ఠచేతనే యుండునట్టి విద్వాంసున కందుచే జ్ఞానహాని సంభవింపదు; "ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య" అను శ్రుతి బ్రహ్మవిత్స్వరూపమునకు కర్మముచే వృద్ధిగాని అకర్మముచే క్షయముగాని శక్యము గా దని యుపదేశించుటవలన బ్రహ్మవిదునకు అకర్మముచే స్వరూపహానియు సంభవింపదు; అందువలన అకృతముచే నితని కే యనర్థంబును లే దని యర్థము. ఓయీ! ఇతఁడు ముక్తిప్రతిబంధక నివృత్తికొఱకైనను ఆధ్యాత్మికాద్యుపద్రవ నివృత్తికొఱకైనను ఉపాసనముచే శివునిఁగాని విష్ణువునుగాని యితరులఁగాని ఆశ్రయింపవలెను, లేక, శరీరయాత్రకొఱకు బ్రాహ్మణునిఁగాని క్షత్త్రియునిఁగాని యనుసరించి యాశ్రయింపవలెను, కావున విద్వాంసునకు సర్వథా కర్మత్యాగము యుక్తము గానేకాదు అని యాశంకింపఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు నచేత్యాదిగా. అస్య = ఈబ్రహ్మవిదునకు, దేవతలందు శివుఁడుగాని యితరుఁడుగాని సర్వభూతములందును బ్రాహ్మణుఁడుగాని మఱియొకండుగాని, కశ్చిత్ = ఒకానొకండును; పై చెప్పినప్రయోజన మేదేని యుద్దేశించి, క్రియచే వ్యపాశ్రయుఁడు—ఆశ్రయణీయుడు, న = లేఁడు. "ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః" అను వచనము వలన, ఈదేహమునందే నిత్యనిరంతర బ్రహ్మనిష్ఠచే భవిష్యద్దేహము గలిగించునట్టి యజ్ఞానమును తత్కార్య మగు సంచితాది సమస్తకర్మసమూహంబునుగూడ నిర్మూలించి తాను దేహసంబంధము లేనివాఁడుగానే యెల్లప్పుడు నున్నవాఁ డగుటవలన బ్రహ్మవిదునకు ఇందే ముక్తుఁడైనవానికి ఇఁక ముక్తి ప్రతిబంధము సంభవింపమి వలనను శివ విష్ణ్వాదులు మిథ్యాకోటిలోఁ జేరినవా రగుటవలనను వారి నారాధింపవలసినది లేదు. అధ్యాత్మికాద్యుపద్రవమును దేహయాత్రయును ప్రారబ్ధాధీనం బగుటవలన నటఁ బురుషప్రయత్నము వ్యర్థ మని తెలియుటవలన బ్రాహ్మణాదుల నెవ్వరిని ఆశ్రయింపవలసినదియే లేదు. కావున బ్రహ్మవిదునకు ముక్తునకు ఎప్పుడును ఏదియుఁ గర్మము చేయవలసినదియే లేదు. చేయవలసి యుండునేని యతఁడు బ్రహ్మవిదుఁడే కాఁడు. అట్లు స్మృతి "జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః। నైవాస్తి కించిత్కర్తవ్య మస్తిచేన్న స తత్త్వవిత్" ♦ అని.

♦ జ్ఞానమృతముచేఁ దృప్తుఁడును గృతకృత్యుఁడు నగు యోగికి ఏదియుఁ గర్తవ్యము లేదు. కలదేని యతఁడు తత్త్వవిదుఁడు కాఁడు.

వ. ఓయీ! ఆత్మవిదునకుఁగూడ అభ్యుదయార్థముగాని నిశ్శ్రేయసార్థముగాని ప్రత్యవాయపరిహారార్థముగాని కర్మముగావలయును. ఈయాశంకకుఁ జెప్పుచున్నాఁడు.—తస్య = ఆత్మరతికి; కృతేన = కర్మముచేత; అర్థః = అభ్యుదయముగాని నిశ్శ్రేయసముగాని ప్రయోజనము; నైవ = కలుగనే కలుగదు, అతఁడు స్వర్గాద్యభ్యుదయము నపేక్షింపనివాఁ డగుటవలన, నిశ్శ్రేయసమును కర్మసాధ్యముగామివలన. అట్లు శ్రుతి « పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయా న్నాస్త్య కృతః కృతేన » అని. అకృతః—నిత్యమైన మోక్షము, కృతేన= కర్మముచేత, నాస్తియని యర్థము. జ్ఞానసాధ్య మయిన యర్థముగూడ లే దని యేవకారము సూచించుచున్నది. ఆత్మ స్వరూపమే గదా నిశ్శ్రేయసము, అది నిత్య ప్రాప్తము, దాని యొక్క యజ్ఞానమే గదా అప్రాప్తి, అదియో తత్త్వజ్ఞానముచేతనే వినాశ్యము, అది తత్త్వజ్ఞానముచే వినాశిత మైన పిదప నాయాత్మవిదునకు ఏదియుఁ గర్మసాధ్యము గాని జ్ఞానసాధ్యముగాని ప్రయోజనము లే దని యర్థము. ఇట్టివాఁడుగూడఁ బ్రత్యవాయపరిహారార్థము కర్మముల ననుష్ఠింపవలసినదియే యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అకృతేన = నిత్యకర్మము చేయకుండుటచేత; ఇహ = ఈలోకమునందు; నిందితత్వరూపముగాని ప్రత్యవాయప్రాప్తిరూపముగాని, కశ్చన = ఏదియు ననర్థము; నాస్తి = లేదు. ఈపూర్వార్ధోక్తార్థము నకంతయు నుపపత్తిచెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత—చకారము హేత్వర్థకము. ఎందువలన, అస్య = ఈయాత్మవిదునకు; సర్వభూతేషు—బ్రహ్మాదిస్థావ రాంతములయందు; కశ్చిత్ = ఏదియు; అర్థవ్యపాశ్రయః = ప్రయోజన సంబంధము; నాస్తి = లేదో; ఒకానొక భూతవిశేషము నాశ్రయించి కర్మముచే సాధింపఁదగినప్రయోజనం బేదియు లేదో అని వాక్యార్థము. అందువలన వీనికిఁ గృతాకృతములు * నిష్ప్రయోజనములు, « నైనం కృతాకృతే తపతః ♦ అనుశ్రుతివలన. « తస్యహి న దేవాశ్చ నా భూత్యా ఈశత ఆత్మా హ్యేషాం స భవతి » § అను శ్రుతి దేవతలు గూడ నతనికి మోక్షము నడ్డఁజాల రని చెప్పుటవలన విఘ్ననాశార్థముగూడ దేవతారాధనరూపకర్మము ననుష్ఠింపవలసినది లే దని యభిప్రాయము. ఇట్టి బ్రహ్మవిదుని సప్తభూమి కాభేదంబున నిరూపించియున్నాఁడు వసిష్ఠుఁడు.—జ్ఞానభూమి శ్శుభే చ్ఛాఖ్యా

* కర్మముచేయుటయుఁ జేయకుండుటయు.

♦ వీనిఁ గృతాకృతములు బాధింపవు.

§ వానికి దేవతలుగూడఁ జెడుగు గలిగింపసమర్థులు కారు. ఆత్మ గదా వారల కతఁడగుచున్నాఁడు.

ప్రథమా పరికీర్తితా । విచారణా ద్వితీయా స్యా త్తృతీయా తను మానసా ॥ సత్త్వాపత్తి శ్చతుర్థీ స్యా త్తతో ఽసంసక్తినామికా । పదార్థాభావనీ షష్ఠీ సప్తమీ తుర్యగా మతా ॥ అని. అందు నిత్యానిత్య వస్తువివేకాది పూర్వకము ఫలపర్యవసాయి యగు మోక్షేచ్ఛ శుభేచ్ఛ యనఁబడును. అంత గురువు నుపసర్పించి వేదాంతవాక్యము విచారించుట శ్రవణ మననాత్మకము రెండవది. అంత నిదిధ్యాసనాభ్యాసముచే మనసున కేశాగ్రత—సూక్ష్మవస్తు గ్రహణసమర్థత తనుమానస యనఁబడును. ఈ భూమికలు మూఁడును సాధనరూపము. దీని యోగులు జాగ్రదవస్థ యని చెప్పుదురు, భేదమున జగత్తు కనఁబడుటవలన. అట్లు చెప్పఁబడినది « భూమి కా త్రితయం త్వేత ద్రామ జాగ్ర దితి స్థితమ్ । యథావ ద్భేదబుద్ధ్యేదం జగజ్జాగ్రతి దృశ్యతే »* అని. అంత వేదాంతవాక్యమువలన నిర్వికల్పకబ్రహ్మాత్మైక్య సాక్షాత్కారము చతుర్థభూమిక ఫలరూపసత్త్వాపత్తి. అది స్వప్నావస్థ యని చెప్పఁబడును సమస్త జగత్తుగూడ మిథ్యగా స్ఫురించుటవలన. అట్లు చెప్పఁబడినది, « అద్వైతే స్థైర్య మా యాతే ద్వైతే ప్రశమ మాగతే । పశ్యన్తి స్వప్న వ ల్లోకం చతుర్థీం భూమికా మితాః” § అని. ఈచతుర్థభూమికను బొందిన యోగి బ్రహ్మవిదుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. అయిద యాఱవ యేడవ భూమికలో జీవన్ముక్తికే యవాంతరభేదములు. అందు సవికల్పకసమాధి నభ్యసించుటచే మనసునిరుద్ధముగాఁగా నిర్వికల్పకసమాధ్యవస్థ యేదిగలదో అది అసంసక్తి యనియు సుషుప్తి యనియుఁ జెప్పఁబడును, అందుండి తానే లేచుటవలన ఆయోగి బ్రహ్మవిద్వరుఁడు. అంతఁ దదభ్యాసాతిశయముచే చిరకాలము నిలిచియుండునట్టి యీయవస్థ పదార్థాభావని యనియు గాఢసుషుప్తియనియుఁ జెప్పఁబడును, అందుండి తానై లేవక పరప్రయత్నముచేతనే లేచుటవలన అతండు బ్రహ్మవిద్వరీయుఁడు. అట్లు చెప్పఁబడినది « పఞ్చమీం భూమికా మేత్య సుషుప్తి పద నామికామ్ । షష్ఠీం గాఢ సుషుప్త్యాఖ్యాం క్రమా త్పతతి భూమికామ్ ” ♦ అని. ఇఁక నేసమాధ్యవస్థనుండి తనయంతఁగాని పరప్రయత్నమునం గాని వ్యుత్థితుండు గాఁడో సర్వథా భేదదర్శనము లేమివలన, మఱి యే

* రామా : ఈభూమికలు మూఁడును జాగ్రత్తనఁబడుచున్నది. జాగ్రదవస్థయందువలెజగత్తు భేదబుద్ధిచేఁ గనఁబడుచున్నది.

§ అద్వైతము స్థైర్యముఁ బొంది ద్వైత ముపశాంతిఁ బొందినపిమ్మటఁ జతుర్థభూమికను బొందినవారు స్వప్నమునలె లోకముం జూతురు.

♦ సుషుప్తి యను పేరు గల పంచమభూమికను బొంది గాఢసుషుప్తి యను పేరుగల షష్ఠభూమికను గ్రమంబునఁ బొందుచున్నాఁడు.

మనఁగా సర్వదా తన్మయుఁడై యే స్వప్రయత్నములేకయే పరమేశ్వరప్రేరిత ప్రాణవాయువశంబున తన దేహవ్యవహారము నితరులు నిర్వహింపఁ దాను సదాపరిపూర్ణ పరమానంద ఘనుఁడై యే యున్నాఁడో, ఆభూమిక సప్తమము తురీయావస్థ యనఁబడును. దానిం జెందినయోగి బ్రహ్మవిద్వరిష్ఠుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. అట్లు చెప్పఁబడినది, « షష్ఠ్యాం భూమ్యా మసౌ స్థిత్వా సప్తమీం భూమి మాప్నుయాత్ । కించిదే వైష సంపన్న స్త్వథ వైషన కించన ॥ విదేహ ముక్తతా తూక్తా సప్తమీ యోగ భూమికా । అగమ్యా వచసాం శాన్తా సా సీమా యోగ భూమిషు. » ♦ అని. దీని నధికరించి శ్రీమద్భాగవతమునందుఁ బ్రతిపాదింపఁబడుచున్నది— « దేహం చ నశ్వర మవస్థిత ముత్థితంవా సిద్ధో న పశ్యతి యతో ఽధ్యగమ త్స్వరూపమ్ । దైవా దుపేత మథ దైవవశా దపేతం వాసో యథా పరికృతం మదిరా మదాన్ధః ॥ దేహోఽపి దైవవశగః ఖలు కర్మ యావ త్స్వారమ్భకం ప్రతి సమీక్షత ఏవ సాసుః । తం స ప్రపఞ్చ మధిరూఢ సమాధి యోగః స్వాప్నం పున ర్న భజతే ప్రతి బుద్ధ వస్తుః " ¶ అని. శ్రుతియును « తద్యథా ఽహి నిర్ల్వయనీ వల్మీకే మృతా ప్రత్యస్తా శయీ తైవ మే వేదం శరీరం శేతే ఽథా య మశరీరో ఽమృతః ప్రాణో బ్రహ్మైవ తేజఏవ » * అని. అం దిట్లు సంగ్రహము.——

నాలుగవభూమి యొప్పు జ్ఞానం బనంగఁ,
బూర్వములు మూఁడు భూమికల్ పొందు సాధ
నాభిధానంబు, భూమిత్రయంబు పరము
పరఁగుఁ బరమజీవన్ముక్త్యవస్థ లనఁగ.

---

♦ షష్ఠభూమిక యందుండి యితఁడు సప్తమభూమికను బొందును. అనిర్వచనీయావస్థ నితఁడు పొందినవాఁడు. లేక, యేయవస్థనుం గూడఁ బొందినవాఁడు కాఁడు. సప్తమభూమిక విదేహముక్తి యని చెప్పఁబడినది. వాక్కులకు గోచరము కాదు. శాంతము. అది యోగభూమికలకుఁ బరమావధి.

¶ స్వరూపము నెఱింగెం గావున సిద్ధుఁడు వశించినదానిఁ గాని పరున్నదానిఁ గాని లేచిన దానిఁ గాని దేహముం జూడఁడు. ఎట్లు మద్యముయొక్క కైపుచేఁ గన్నులు గాననివాఁడు దైవవశంబున నొడలిం జేరినదానినిగాని తొలఁగినదానిఁగాని వస్త్రముం జూడఁడో అట్లు. దేహముగూడ దైవవశమె గదా! తనకు అరంభకమైన (కారణమైన) కర్మము ప్రాణసహితమై నిరీక్షింపనే నిరీక్షించును. వస్తువును దెలిసినవాఁడై సమాధియోగము నారోహించినవాఁడు అస్వప్నప్రపంచమును మరలఁ బొందఁడు.

* ఎట్లు పాముకుబుసము పుట్టయందు మృతంబై విడువఁబడినదై పరుండునో ఇట్లే యీ శరీరము పరుండును. ఇఁక నితం డశరీరుఁడు అమృతుఁడు ప్రాణము బ్రహ్మమే తేజస్సే.

ఇట మొదటిమూఁడుభూమికల నారోహించినవాఁ డజ్ఞుఁడుగూడఁ గర్మమునం దధికారి కాఁడు, ఇఁక బ్రహ్మవిదుఁడుగాని వానికంటె నధికుఁడు జీవన్ముక్తుఁడు గాని కర్మమునం దధికారి కాఁ డని చెప్పెడిదేమి? అని యభిప్రాయము.

శ్రీ. అందుకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—కృతేన = కర్మముచేత; తస్య; అర్థః = పుణ్యము; నైవ = సంభవింపనేసంభవింపదు. అకృతేన; కశ్చన = ఏదియు ప్రత్యవాయము. నః= లేదు, నిరహంకారుఁ డగుటచే విధినిషేధముల కతీతుఁ డగుటవలన. అయినను « తస్మా త్తదేషాం దేవానాం న ప్రియం య దేత న్మనుష్యా విద్యుః » * అను శ్రుతివలన మోక్షమునకు దేవతలు విఘ్నము సేయుట సంభవించుటవలనఁ దత్పరిహారము కొఱకు దేవతలను గర్మములచే సేవింపవలయు నని యాశంకించి చెప్పుచున్నాఁడు.—సర్వభూతేషు – బ్రహ్మాది స్థావరాంతములందు; ఎవ్వఁడును; అర్థవ్యపాశ్రయః—ఆశ్రయమే వ్యపాశ్రయము, అర్థమునందు-- మోక్షమునందు, ఆశ్రయణీయుఁడు; వీనికి లేఁ డని యర్థము; విఘ్నాభావమును శ్రుతియే చెప్పుటవలన. అట్లు శ్రుతి « తస్యహ న దేవా శ్చ నా భూత్యా ఈశత ఆత్మా హ్యేషాం స భవతి » అని. దీని అనుసరించి అక్షరార్థక మయిన యన్వయము. దేవాశ్చన—దేవతలుగూడ; తస్య—ఆయాత్మతత్త్వజ్ఞునకు, అభూత్యై = బ్రహ్మాభావము నష్టుటకొఱకు, నేశతే = సమర్థులు కా రని శ్రుతికర్థము. దేవతలు చేయువిఘ్నములో సమ్యక్జ్ఞానోత్పత్తికి మున్నె సంభవించును, ఈబ్రహ్మమును మనుష్యు లెఱుంగుట యేదిగలదో అది యాదేవతలకుఁ బ్రియము గా దని బ్రహ్మజ్ఞానంబే యప్రియం బని చెప్పుటచే దానికే విఘ్నముచేయుదు రనుటను శ్రుతి సూచించుటవలన.

ప. అందుకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—తస్య = ఈయాత్మనిష్ఠునకు కృతేన = కర్మముచేత; అర్థః = పుణ్యాతిశయము; నైవ. అట్లు, అకృతేన = చేయకుండుటచేత; ప్రత్యవాయముగూడ, న, నిరహంకారుఁడగుటచే విధినిషేధాతీతుఁ డగుటవలన. ఇట శ్రుతియును « తదేత దృచా భ్యుక్తం మేష నిత్యో మహిమా బ్రాహ్మణస్య న కర్మణా వర్ధతే నో కనీయాన్ తస్యైవ స్యా త్పదవిత్తం విదిత్వా న కర్మణా లిప్యతే పాపకేన » అని. భాష్యము—బృహదారణ్యకము నిరూపణీయార్థము నందు ఋక్చాఖయశ్రుతిని సంవాదముగాఁ జూపుచున్నది తదేత దిత్యాదిగా. తదే

* అందువలన ఈబ్రహ్మమును మనుష్యు లెఱుంగుట యనునది యేదిగలదో అది యాదేవతలకుఁ బ్రియముగాదు.

తత్—ఆయీవిషయము; ఋచా—ఋగ్వేదముచే; అభ్యుక్తమ్—అంతటనునిరూపింపఁ బడినదిగూడ. అది యేదియనఁగా. బ్రాహ్మణస్య—బ్రహ్మజ్ఞుఁడగుపురుషునకు, ఏషః—ఇది, నిత్యః—శాశ్వతమగు, మహిమా—సామర్థ్యము. అది యేది యనఁగా. కర్మణా—కర్మముచేత, నవర్ధతే—ఉత్కర్షనొందదు. కర్మము చేయకుండుటచేతనుంగూడ, నోకనీయాన్—కనిష్ఠము * కాదు. ఇట్టివాఁడెవఁడో, తస్యైవ—వానికే, పదవిత్—పదము—ఆత్మరూపము, దానియొక్క, విత్—ధ్యానము, స్యాత్—అగును. ఇట్లు, తమ్—ఆపరమాత్మను, విదిత్వా—తెలిసి, కర్మణా—సత్కర్మముచేతఁగాని, పాపకేన—పాపకర్మముచేతఁగాని, నలిప్యతే. ఇఁక నీయుపక్రమించిన ఋక్శాఖయందును « హృదా తష్టేషు మనసో జవేషు యద్బ్రాహ్మణా స్సంయజన్తే సఖాయః। అత్రాహ త్వం విజహు ర్వేద్యాభిరోహ్య బ్రహ్మణో విచర న్త్యుత్వే । ఇమే యే నార్వాఙ్న పరశ్చర న్తి న బ్రాహ్మణాసో న సుతేకరాసః। త ఏతే వాచ మభిపద్య పాపయా సిరీస్తన్త్రింతన్వతే అప్రజజ్ఞయః" అని రెండుఋక్కులు. వీనికి రావణభాష్యము—హృదా—బుద్ధిరూపమయిన మనస్సుచే, మనసః జవేషు—మనస్సుయొక్క వేగరూపములయిన వృత్తులు, తష్టేషు = నిరాకరింపఁబడినవి కాఁగా, యత్—ఏకారణమువలన, బ్రాహ్మణాః—బ్రహ్మజ్ఞులు, సఖాయః—సర్వభూతసుహృదులై; సం యజన్తే—చక్కఁగా అంతర్యాగముచేయుచున్నారు. ఆయంతర్యాగము చేయునపుడేమి యగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—అత్ర—ఇందు, అహ త్వమ్—అహమ్అనుదాని కనుస్వారలోపముఛాందసము—భేదభావనను; విజహుః—విడిచిరి. ఎట్టివారలైయనఁగా, వేద్యాభిః—విద్యాభిజ్ఞానవృత్తులచేత; ఓహబ్రహ్మాణః—అంతటనుఊహ్యమయిన బ్రహ్మము గలవారలై, పదార్థప్రతీతిరూపమున బ్రహ్మమును దెలిసినవారలై యనుట, ఉ అనునది నిర్ధారణార్థకము, విచరన్తి—అఖండైకరసముగావ్యవహరించుచున్నారు, త్వే—వారు. అట్లుచెప్పఁబడినది యోగమమందును « స్వాధిష్ఠానగతే కుణ్డే చిద్రూపం వహ్ని ముజ్జ్వలేత్। జుహుయాత్ప్రాణవే నాత్ర త్వమహన్తాం నివేదయేత్ । ఆత్మనాత్మాన మద్వైతే భూత్వా సచ్చిత్సుఖాత్మకః। స్థీయతే యత్క్రియత్కాలంసో న్తర్యాగః స్మృతో బుధైః॥ ♦ అని.

---

* తక్కువ.

♦ స్వాధిష్ఠానగత మయిన కుండమునందు చిద్రూపాగ్నిని బ్రణయింపవలయును అందుఁ బ్రణవముచే త్వంతాహంతల వేల్వవలయును. ఆత్మచే ఆత్మను నివేదింపవలయును. ఇట్టి యద్వైతమునందు సచ్చిదానందరూపుఁడై కొంతకాల ముండునమట యేదిగలదో అది యంతర్యాగమని పండితులచేఁ జెప్పఁబడినది.

రెండవయుక్కనకుభాష్యము—ఇమే యే—ఈచెప్పిన లక్షణముగల పురుషులెవ్వరు గలరో వారు, అర్వాక్—మనుష్యలోకమునందు, న చరన్తి— జనియింపరు. పరః— ఇది సకారాంతమయిన యవ్యయము, పరమయిన దేవలోకమునందును, న చరన్తి— జనియింపరు, కర్మములచేయుటచేతను జేయకుండుటచేతను ఉత్తమాధమ లోకములను బొందరు. మతే మనఁగా ఇందే బ్రహ్మభూతులై యుందురని యర్థము, "న తస్య ప్రాణా ఉత్క్రామన్త్యత్రైవ సమవలీయన్తే" అను శ్రుతివలన. ఇఁక; బ్రాహ్మణాసః—జాతిమాత్రవిప్రులును, అట్లు, సుతేకరాసః—సోమలతను దంచువారు, యాజ్ఞికులు; న—అట్టివారుకారు, మతే మనఁగా వారు ఉత్తమ మధ్యమాధమగతిని పొందనేపొందుదురనియర్థము. ఇందుకు హేతువుఁ జెప్పుచున్నాఁడు— తేపతే—మీఁదఁ జెప్పిన ఆబ్రాహ్మణులును సుతేకరులును, వాచమ్— వేదవాక్కును, అభిపద్య—తెలిసి, సిరీః—నాఁగేలుగలవారలు, కృషికర్తలవలె, పాపయా — పాపమయినఫలాశచే, తన్త్రిమ్—యజ్ఞాదికమును, తన్వతే—విస్తరించుచున్నారు, కావుననే, అప్రజజ్ఞయః— ప్రకృష్టమయిన జజ్ఞి—జన్మము లేనివారలు, నీచజన్మము గల వారని యర్థము. ఇఁకఁ బ్రకృత మనుసరింతము. అట్లు, అస్య= ఈపురుషునకు; సర్వభూతేషు—బ్రహ్మాదిస్థావరాంతములందు; కశ్చిత్ ; అర్థవ్యపాశ్రయః—అర్థము అనఁగా ప్రయోజనము దానికొఱకాశ్రయము ఎవఁడును వెదకఁబడఁడు, పరమార్థసాధనంబున భగవత్కృపను బొందినట్టియమ్మహాపురుషునకు విఘ్నశాంతికొఱకు ఎవ్వఁడును ఆశ్రయణీయుండు లేఁడని యర్థము. శ్రుతియును "తస్య హ న దేవాశ్చ నాభూత్యా ఈశత ఆత్మా హ్యేషాం స భవతి" అని. ఆపురుషునకు, అభూత్యై—ఐశ్వర్యాభావముకొఱకు—అపకర్షకలిగించుటకొఱకు, దేవాః—ఇంద్రాదులు, నేశతే—సమర్థులు కారు. హి—ఎందువలననఁగా సః—ఆపురుషుఁడు, ఏషామ్— ఈదేవతలకు, ఆత్మా—అంతర్యామి, ప్రయోజకుఁడు, అగుచున్నాఁడు, ప్రయోజకుఁడు లేక విఘ్నముచేయుటకుఁ బ్రవృత్తి కలుగదని యర్థము.

రా. అందువలననే, తస్య = అతనికి; ఆత్మదర్శనముకొఱకు, కృతేన = తత్సాధన మగు కర్మముచేత; అర్థః = కొంచెమైనను ప్రయోజనము; నైవ = కలుగనేకలుగదు. అకృతేన = ఆత్మదర్శనసాధనము చేయకుండుటచేత; కశ్చన = ఏ యనర్థమును; న = లేదు, సాధనము లేకయె సిద్ధమైన ఆత్మదర్శనము గలవాఁడగుటవలన. తనయంతను, ఆత్మవ్యతిరిక్తము లయిన అచిద్వస్తువుల యన్నిటియందును విముఖుండగు, అస్య = ఇతనికి; సర్వభూతేషు = సమస్తము లయిన ప్రకృతి పరిణామ విశేషము లగు ఆకాశాది భూతములందు, కార్యసహితములందు; అర్థవ్యపాశ్రయః =

ప్రయోజనస్వీకారము ♦; కశ్చిత్ = ఏదియు; న= లేదు, వానియందుఁ బ్రయోజన బుద్ధి యున్నంగదా అందుండి విముఖత సంపాదించుటకై సాధనము * నారంభింపవలెను. అతఁడు ముక్తుఁడే యగుటవలన నందు కవకాశమే లేదు.

అందువలన నట్టివాని కాత్మదర్శనము కొఱకు తత్సాధన మయిన కర్మము ననుష్ఠించుటచేఁ బ్రయోజనము లేదు, అనుష్ఠింపకుండుటచేఁ బ్రత్యవాయంబును సంభవింపదు. అతఁడు స్వతస్సిద్ధ మయిన ఆత్మదర్శనము గలవాఁడై ముక్తుఁడే యగుటవలనఁ దనయంతనె ఆత్మవ్యతిరిక్తము లయిన యచిద్వస్తువుల యన్నిటి నుండియు విముఖత గలిగియుండును కావున ఆవిముఖత సిద్ధించుటకై చేయవలసిన కర్మాద్యనుష్ఠాన మతనికి నిష్ప్రయోజన మని తాత్పర్యము.

**మూ.** అసంప్రజ్ఞాత సమాధినుండువాఁడు కర్మసమయము వచ్చినపుడు నన్ను లేపు మని యితరునిఁ బ్రార్థించి యతఁడు తన్ను లేపఁగా; కృతేన = కర్మము చేయుటచేత; తస్య = ఆయసంప్రజ్ఞాత సమాధియుండువానికి; అర్థః = ఆత్మరతికన్న నధికము గాని దానికి సమముగాని ప్రయోజనము; నైవ= లేదు. అకృతేన=సంధ్యాదికము చేయకుండుటచేత; కశ్చన-దోషముఏదియు; న = లేదు. మఱియు నీయసంప్రజ్ఞాతసమాధినివిడిచి, సర్వభూతేషు; అర్థవ్యపాశ్రయః = ప్రయోజనప్రాప్తిదేనిచేఁ గలుగునో అట్టి గురుదర్శనాదికము; కశ్చిత్; న = లేదు. జ్ఞానమాత్రముచేతనే ప్రత్యవాయము లేదని యంగీకరించినను అది యర్జునునకును సమంబగుంగావున నిది యతనికిఁ గర్మోపదేశోపయోగి కాకపోవును. మఱియునిది జ్ఞానికిని ❘ కొంచెమైనచో ప్రారబ్ధానర్థము సూచించుచున్నది, అధికమైనచో వృత్రహత్యాదికమువలె నగును.

ఇతఁ డసంప్రజ్ఞాత సమాధినుండి తన్ను సంధ్యాదిసమయమున లేపుమని యెవ్వనినైనను బ్రార్థించియతనిచే లేపఁబడి కర్మము చేయుననియుఁ జెప్పనలవిగాదు. ఏలయనఁగా వానికిఁ గర్మమువలన ఆత్మరతికన్న నధికప్రయోజనము లేదు, అది చేయకున్నను దోషము లేదు. మఱియు నీసమాధిని విడిచి గురుదేవతాదర్శనాదులు చేయుటవలనఁగూడ నతనికేమియుఁ బ్రయోజనము లేదు. కావున అసంప్రజ్ఞాత సమాధి నుండు వానికిఁ గర్మము చేయవలసినది లే దని తాత్పర్యము.

---

♦ బ్రయోజనబుద్ధి.

* కర్మాదికము.

❘ విహితకర్మత్యాగాదికము.

తస్మా దసక్తస్సతతం కార్యం కర్మ సమాచర
అసక్తో హ్యాచర న్కర్మ పర మాప్నోతి పూరుషః. ౧౯

**భా.** నీవో యాసర్వత స్సంప్లుశోదకస్థానీయ మయిన సమ్యగ్ద ర్శనంబునం దున్నవాఁడవు కావు. తస్మాత్ = అందువలన, అసక్తః = సంగము లేనివాఁడవై; సతతమ్ = ఎల్లప్పుడు; కార్యమ్ = చేయవలసినట్టి; కర్మ = నిత్యకర్మమును; సమాచర = నెఱవేర్పుము. హి = ఎందువలన ననఁగా; అసక్తః = సంగము లేనివాఁడై; కర్మ = కర్మమును; ఆచరన్ = చేయునట్టి, ఈశ్వరార్థము కర్మము చేయునట్టి; పూరుషః = పురుషుఁడు; పరమ్ = మోక్షమును; ఆప్నోతి = పొందుచున్నాఁడు. సత్త్వశుద్ధిద్వారమున నని యర్థము.

నీవట్టి సమ్యగ్దర్శనము గలవాఁడవు కావు, కావున నీవు నిత్యనైమిత్తిక కర్మములను, ఫలాభిసంధి విడిచి యవశ్యము చేయుము. ఫలాభిసంధిలేక కర్మము లనుష్ఠించువాఁడు చిత్తశుద్ధినొంది తద్ద్వారమున మోక్షము నొందుచున్నాఁ డని తాత్పర్యము.

**ఆ.** ఇట్లగునేని నేనుగూడ నీవు చెప్పినతత్త్వము నాశ్రయించి కర్మము విడిచెద నని యర్జును నభిప్రాయము నాశంకించి చెప్పుచున్నారు నీవో ఇత్యాదిగా. సమ్యక్జ్ఞాననిష్ఠ లేనియప్పుడు కర్మానుష్ఠాన మావశ్యక మని చెప్పుచున్నాఁడు తస్మా దిత్యాదిగా. అందువలన—జ్ఞాననిష్ఠ లేనివాఁడ వగుటవలన నని యర్థము. మోక్షమునే యపేక్షించువానిని ఎట్లుఫలాంతరము గల కర్మమునందు నియోగింపవచ్చు నని యాశంకించి చెప్పుచున్నాఁడు అసక్తో హీత్యాదిగా.

**హ.** నీవో కర్మమునం దధికృతుఁడవు. తస్మాత్; అసక్తః = ఫలాభిసంధి లేనివాఁడవై; సతతమ్ = ఎల్లప్పుడు; కార్యమ్ = కర్తవ్యమగు; కర్మ—యుద్ధాదికమును; సమాచర = అనుష్ఠింపుము. ఏమి యందువలన నందువేని. హి = ఎందువలన; అసక్తః = ఫలాసక్తి లేనివాఁడై; కర్మ; ఆచరన్ = అనుష్ఠించునట్టి; పూరుషః; పరమ్ = పరమాత్మను; ఆప్నోతి. అందువలన నిత్యము కర్మము చేయు మని సంబంధము.

**శం.** యోగారూఢుఁడు ముక్తుఁడు ఆత్మారాముఁడు నగు యతిమాత్రమె కర్మము చేయవలసినది లేదు, ఆరురుక్షుఁడవు మోక్షార్థివగు నీవో కర్మము చేయవలసినవాఁడవే యని బోధించుటకై చెప్పుచున్నాఁడు—హి = ఏకారణమువలన;

ముముక్షువగు, పూరుషః = పురుషుఁడు; తాను, అసక్తః = ఫలాభిసంధిలేనివాఁడై; కర్మ = వేదోక్త మగు కర్మమును; ఆచరన్ = చక్కఁగా ననుష్ఠించుచుండియే; పరమ్ = పరమపురుషార్థ మయిన మోక్షమును; ఆప్నోతి = పొందుచున్నాఁడో. ఎట్లీ యాత్మరతి యీజన్మమునందును జన్మాంతరములందును వైదికకర్మము ననుష్ఠించియే చిత్తశుద్ధిఁ బొంది యాత్మజ్ఞానముచే ముక్తిని బొందినాఁడో, అట్లు యితరుఁడును గర్మభూమినుండువాఁడు కర్మము ననుష్ఠించియే జ్ఞానము నొంది ముక్తుఁడు కా వలెను, వేఱువిధమునఁగాదు. తస్మాత్ = అందువలన; ముముక్షు వగు నీవును, అసక్తః = నిష్కాముఁడవై; సతతమ్; కార్యమ్ = కర్తవ్యమగు, విధివిహితమైన; కర్మ = నిత్యనైమిత్తిక కర్మమును; సమాచర= శ్రద్ధాభక్తులతో ఈశ్వరార్పణబుద్ధిచేఁ జక్కఁగాఁ జేయుము. కర్మముచేతనే చిత్తశుద్ధినొంది జ్ఞానమును మోక్షమునుం బొందఁగల వని యర్థము. "ధర్మేణ పాప మపనుదతి, జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః, జ్ఞానా దేవతు కైవల్యమ్" ♦ ఇత్యాది శ్రుతి స్మృతులు ధర్మానుష్ఠానము వలననే పాపక్షయమును పాపక్షయమువలననే జ్ఞానమును జ్ఞానమువలననే మోక్షమును గలుగు నని ప్రతిపాదించుచున్నవి.

మ. నీ విట్టిజ్ఞానివి కావు, మ తే మనఁగా కర్మమునం దధికృతుఁడే యగు ముముక్షుఁడవు. తస్మాత్ = అందువలన; అసక్తః = ఫలకామన లేనివాఁడవై; సతతమ్ = ఎల్లప్పుడును, కాని యొకానొకప్పుడు మాత్రము కాదు; కార్యమ్ = అవశ్యకర్తవ్య మయిన, యావజ్జీవాది శ్రుతి విహితమైన, "తమేవం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేనతపసా ఽనాశకేన" అను శ్రుతిచే జ్ఞానమునందు వినియోగింపఁ బడినట్టి; కర్మ=నిత్యనైమిత్తిక రూప మయిన కర్మమును; సమాచర = చక్కఁగా నాచరింపుము, యథాశాస్త్రముగా నెఱవేర్పుము. హి= ఎందువలన ననఁగా, అసక్తః కర్మ ఆచరన్ = ఈశ్వరార్థము కర్మము చేయుచుండువాఁడు; సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తిద్వారంబున, పరమ్= మోక్షమును; ఆప్నోతి; పూరుషః = పురుషుఁడు; అతండే సరియయిన పురుషుఁడు, ఇతరుఁడు గాఁ డని యభిప్రాయము.

శ్రీ. ఎందువలన నిట్టిజ్ఞానికి మాత్రమే కర్మముచే నుపయోగములేదో ఇతరునకుఁ గర్మము ఆవశ్యకమో అందువలన నీవుకర్మము చేయుమని చెప్పుచున్నాఁ

♦ ధర్మముచేఁ బాపముఁ బోఁగొట్టుచున్నాఁడు, పాపకర్మము యొక్క నాశమువలనఁ బురుషులకు జ్ఞానము జనియించుచున్నది, జ్ఞానమువలననె మోక్షము.

డు.—అసక్తః = ఫలసంగము లేనివాఁడవై, కార్యమ్ = అవశ్యముచేయవలసినది యని విహితమైన; కర్మ=నిత్యనైమిత్తికకర్మమును; చక్కఁగా నాచరింపుము. హి=ఎందువలన ననఁగా; అసక్తః, కర్మ, ఆచరన్, పూరుషః; పరమ్=మోక్షమును; చిత్తశుద్ధి జ్ఞానద్వారమునఁ బొందుచున్నాఁడు.

ప. ఇట్లు జ్ఞానోదయము నొందినవానికి కర్మమునుండి యుపరతి చెప్పఁబడినది, కాని యితరునకుఁ గాదు, అందువలన నీవు కర్మము చేయుమని చెప్పుచున్నాఁడు.—అసక్తః=ఫలసంగరహితుఁడవై; కార్యమ్; కర్మ—నిత్యనైమిత్తికరూపమును; సతతమ్ = నిరంతరము; సమాచర. హి=ఎందువలసననఁగా. అసక్తుఁడై; పూరుషః; పరమ్ = బ్రహ్మమును; ఆప్నోతి.

రా. ఎందువలన సాధనప్రవృత్తిలేకయే యాత్మదర్శనము సిద్ధించినవానికి మాత్రమే సాధనప్రవృత్తి లేదో, మఱియు నెందువలనసాధనమునందుఁ బ్రవర్తించినవానికిఁగూడ సులభంబగుటవలనను బ్రమాదరహితం బగుటవలనను ఆత్మయాథాత్మ్యానుసంధానసహితం బగుటవలనను జ్ఞానయోగికిఁ గూడఁ గొంచెము కర్మానువర్తనం బపేక్షితమగుటవలనను కర్మయోగంబే యాత్మదర్శనసాధనమునందు శ్రేయము * అగునో. తస్మాత్ = అందువలన; అసక్తః = అసంగము ♦ గలవాఁడవై; కార్యమ్= చేయుఁవలసినదనియే; సతతమ్ = ఆత్మప్రాప్తిపర్యంతము; కర్మ = కర్మమునే; సమాచర. « అసక్తుఁడై, కార్యము ” ‖ అని చెప్పఁబోవునట్టి యకర్తృత్వానుసంధానముతో, కర్మ; ఆచరన్; పూరుషః; కర్మయోగముచేతనే; పరమ్ ఆప్నోతి=ఆత్మను బొందుచున్నాఁ డని యర్థము.

అందువలన ఆసక్తి లేనివాఁడవై, విహితం బగుటచే కర్తవ్యము కర్మము అని మాత్రమేనిశ్చయించినవాఁడవై, స్వర్గాద్యపేక్ష లేనివాఁడవై ఆత్మప్రాప్తిపర్యంతము విడువక కర్మముచేయుము. ఇట్లు అసక్తుఁడై కర్తవ్యంబని కర్మమును అకర్తృత్వానుసంధానములో అనుష్ఠించుచుండునేని అతనికిఁ గర్మయోగముచే ఆత్మప్రాప్తి లభించు నని తాత్పర్యము.

మా. ఎందువలన అసంప్రజ్ఞాతసమాధియందున్నవానికి మాత్రమేకార్యము లేదో, తస్మాత్ కర్మసమాచర—అందువలనఁ గర్మమును అనుష్ఠింపుము.

---

* జ్ఞానయోగమునకన్న మేలు.

♦ అనాసక్తి

‖ చేయవలసినది.

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః
లోకసంగ్రహ మే వాపి సంపశ్య౯ కర్తు మర్హసి. ౨౦

భా. ఇందువలనఁ గూడ. హి = ఎందువలన ననఁగా; కర్మణైవ = కర్మముచేతనే; పూర్వులగు క్షత్త్రియులు విద్వాంసులు, జనకాదయః = జనకుఁడు అశ్వపతి మొదలగువారు; సంసిద్ధిమ్ = మోక్షమును; పొందుటకు, ఆస్థితాః = ప్రవర్తించిరి. వారు సమ్యగ్దర్శనము పొందినవారలేని, అప్పుడు లోక సంగ్రహము కొఱకుఁ బ్రారబ్ధకర్మవశమువలన, కర్మణైవ— కర్మముతోఁగూడనే, కర్మమును సన్న్యసింపకయె; సంసిద్ధిమ్ ఆస్థితాః అని యర్థము. ఇఁక జనకాదులు సమ్యగ్దర్శనము పొందినవారు కారు అను పక్షమున, కర్మణా=సత్త్వశుద్ధిసాధనభూత మగు కర్మముచే, క్రమంబున, సంసిద్ధిమాస్థితాః అనిశ్లోకము వ్యాఖ్యేయము. ఇఁకఁ దలంతువు కాఁబోలు —« పూర్వులుగూడ జనకాదులు జ్ఞానము లేనివారలే కర్తవ్య మగుకర్మము ననుష్ఠించిరి, అంతమాత్రముచే నవశ్య మితరుఁడు సమ్యగ్దర్శనవంతుఁడగు కృతార్థుఁడు కర్మము చేయవలసినది లే » దని. అట్లయినను ప్రారబ్ధ కర్మాయత్తుఁడ వగు నీవు, లోకసంగ్రహమేవాపి= లోకముయొక్క యున్మార్గప్రవృత్తిని నివారించుట లోకసంగ్రహము, దానినైనను; ప్రయోజనముగా, సంపశ్య౯ = చూచువాఁడవై; కర్తుమ్ = చేయుటకు; అర్హసి= తగుదువు.

కర్మము నాచరించుచుండిరే గదా జనకాదు లగు పూర్వక్షత్త్రియులు మోక్షము నొందిరి. అందువలన నీవును గర్మముచేయవలెను. మఱియు లోకసంగ్రహముకొఱకైనను నీవు కర్మము ననుష్ఠింపవలయు నని తాత్పర్యము.

ఆ. జితేంద్రియుఁడై వివేకి యగువానికిఁ గూడ శ్రవణాదులచే నిరంతరము బ్రహ్మమునందు నిష్ఠ గలిగియుండుట శక్యమగును వాస్తవమే, అయినను క్షత్త్రియుఁడ వగు నీవు విహితకర్మమును విడువఁగూడ దని చెప్పుచున్నారు ఇందువలనఁ గూడ అని. అందువలన నీవును గర్మముఁ జేయవలయు నని సంబంధము. ఇందువలనఁ గూడ నీవు విహితకర్మముఁ జేయవలయు నని చెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత. పూర్వార్థము విభజించుచున్నారు కర్మణైవ ఇత్యాదిగా. ఎట్లు జనకాదులకుఁ గర్మముచే సంసిద్ధి ప్రాప్తి చెప్పవచ్చును? సమ్యగ్దర్శవంతులకుఁ గర్మసన్న్య

సులకుఁ గదా సంసిద్ధిప్రాప్తి ప్రసిద్ధము. అందు, ఏమి జనకాదులు గూడ సమ్యగ్దర్శనము పొందినవా రగుదురా? కారా? అని వికల్పించి మొదటిపక్షమునకుఁ జెప్పుచున్నారు వారు సమ్యగ్దర్శనమ ఇత్యాదిగా. లోకసంగ్రహముకొఱకు కర్మముతోఁగూడనే సంసిద్ధిని బొంది రని సంబంధము. కర్మముతోఁగూడనే అనుదానికి వ్యాఖ్యానముచేయుచున్నారు కర్మమును సన్న్యసింపకయే యని. అందుకు హేతువుఁ జెప్పుచున్నారు ప్రారబ్ధకర్మవశమువలన నని. జనకాదులు జ్ఞానులైనను ప్రారబ్ధకర్మవశంబునఁ గర్మత్యాగముఁ జేయకయే లోకసంగ్రహార్థము ప్రవర్తించిరి, వారలకు జ్ఞానమాహాత్మ్యమువలన సంసిద్ధి యుపపన్న మని యర్థము. ద్వితీయపక్షము ననువదించి పూర్వార్ధముచేతనే యుత్తరముచెప్పుచున్నారు ఇఁక జనకాదులు ఇత్యాదిగా. ఉత్తరార్ధముచేఁ బరిహార్య మగు నాశంక నెత్తుచున్నారు ఇఁక ఇత్యాదిగా. అర్జునుఁడును అకృతార్థుఁడు నగువాఁడు కర్మముఁ జేసె నన్నంతమాత్రముచే జ్ఞానినై కృతార్థుఁడైన వాఁడు కర్మముచేయవలసినది లేదు అనిచెప్పినదాని నంగీకరించుచున్నారు అట్లయినను ఇత్యాదిగా. అప్పుడు నేనుగూడ జ్ఞానవంతుఁడను గృతార్థుఁడను గర్మముచేయవలసినది లే దని యాశంకించి యర్జునుఁడు చేయవలసినదియే కర్మము నని యుత్తరార్ధవ్యాఖ్యానముచేఁ జెప్పుచున్నారు ప్రారబ్ధేత్యాదిగా.

హ. ఇందువలనఁ గూడఁ గర్మము చేయవలయును.—కర్మణైవ హి=కర్మముచేతనేగదా! పూర్వులు జనకాదు లగు క్షత్రియులు, సంసిద్ధిమ్ = మోక్షమును, పొందుటకుఁ బ్రవర్తించిరి. వారు సమ్యగ్దర్శనముగలవారలై కేవలము లోకసంగ్రహముకొఱకుఁ గర్మమునందుఁ బ్రవర్తించిరేని, అప్పుడునీవుగూడ, లోకసంగ్రహమ్= లోకమునకు ధర్మసంగ్రహమును, పశ్యన్ = చూచువాఁడవై, దానికొఱకే, కర్మమును, కర్తుమ్ అర్హసి.

౨౦. అందువలన ముముక్షువు ఆత్మతత్త్వము తెలియనివాఁడు అవశ్యము కర్మమునే చేయవలయు నని యుపదేశించి యీయర్థమునందు వృద్ధాచారమును ప్రమాణముగాఁ జూపుచున్నాఁడు శ్రీభగవంతుఁడు.—జనకాదయః = జనకుఁడు మొదలుగాఁగలవారు అశ్వపతి భగీరథాది క్షత్రియులు; కర్మణైవ = శ్రౌత స్మార్త కర్మానుష్ఠానముచేతనే; చిత్తశుద్ధినొంది జ్ఞానముచే, సంసిద్ధిమ్ ఆస్థితాః = ముక్తినొంది కృతార్థు లయిరి. ఇందువలన నీవుగూడ కర్మమునే యనుష్ఠించి యందుచేఁగలుగు చిత్తశుద్ధిచే జ్ఞానమునొంది ముక్తుఁడవై సుఖంబుండు మని యర్థము. లేక, జనకా

దులు జ్ఞానయోగనిష్ఠయందు నిరూఢులై, సంసిద్ధిమ్ = ముక్తిని, పొందియు లోక హితముకొఱకు, కర్మణైవ = కర్మముతోఁగూడనే యుండినవారలు, తాము కృతార్థులైనను అజ్ఞానులఁ దరింపఁజేయుటకై కర్మము చేయుచునేయుండినవార లని యర్థము. ఆరూఢులకే యిట్లుండఁగా నీక ఆత్మతత్త్వము దెలియనివాఁడవు ఆరురుక్షుఁడవు నీవు మోక్షముకొఱకుఁ గర్మముచేయవలయు నని చెప్పవలసినదేమి ? ఇట్లు ముముక్షువు అనాత్మజ్ఞుఁడు ఆరురుక్షువు అయినవాఁడు అవశ్యము కర్మము చేయవలసినదియే యని నిర్ధారణచేసి యిప్పుడు ముక్తుఁడైనను ఆధికారికుఁడు లోక హితార్థము కర్మముచేయవలసినదే యని బోధించుటకై యందుకు దృష్టాంతముగా జ్ఞానవృద్ధు లగు జనకాదుల యాచారము నుదాహరించి, “నీకుఁగూడ ఇట్టి యధి కారము ఉండునేని యుండుఁగాక, అట్లయినను జనకాదులవలె నీవుగూడ లోకహి తార్థమైనను గర్మమవశ్యము చేయవలసినదే; మహాపురుషునిప్రవృత్తిచేతం గదా శాస్త్రమునకుఁ బ్రామాణ్యంబును గర్మమునకుఁ బ్రశస్తతయు అజ్ఞులకుఁ దరణం బును బారంపర్యక్రమంబున ఆచారాభివృద్ధియు సిద్ధించును. కావున ముక్తుఁడై నను మహాపురుషుం డవశ్యము కర్మము చేయవలయు” నను నభిప్రాయముచేఁ జెప్పుచున్నాఁడు.—లోకసంగ్రహమేవ = లోకమనఁగా పామరజనము, దానిసంగ్ర హించుట—సత్కర్మమార్గము చూపి తరింపఁజేయుట, లేక, దుర్మార్గమునుండి నివారిం చుట, అట్టి లోకసంగ్రహమునే ప్రయోజనముగా; సంపశ్యన్నపి—నేనుకర్మము చేయుటచే లోకోపకారం బగుచున్న దని చూచియైనను; కర్మమును, కర్తుమ్ = చేయుటకు, నీవు, అర్హసి యని యర్థము.

**మ.** ఓయీ ! వివిదిషువునకుఁగూడ జ్ఞాననిష్ఠ సిద్ధించుటకై శ్రవణమనన నిదిధ్యాసనానుష్ఠానము కొఱకు సర్వకర్మత్యాగరూప మయిన సన్న్యాసము విధింపఁ బడినది; కావున కర్మమునం దధికారము లే దనుట జ్ఞానికిమాత్రమె కాదు, మ తేమ నఁగా విరక్తుఁడై జ్ఞానార్థి యగువానికిఁ గూడ. అందువలన విరక్తుఁడనై జ్ఞానార్థి నగు నేనుగూడ గర్మములను విడువవలసినదే యని యర్జునుం డాశంకింపఁగా ఆయా శంకను క్షత్త్రియునకు సన్న్యాసాధికారము లే దని ప్రతిపాదించుటచే నిరసించు చున్నాఁడు భగవంతుఁడు.—జనకాదయః = జనకుఁడు అజాతశత్రువు మొదలగు వారు శ్రుతి స్మృతి పురాణప్రసిద్ధు లగు క్షత్త్రియులు, విద్వాంసులుగూడ; కర్మ ణైవ=కర్మముతోఁగూడనే, కాని కర్మత్యాగముతోఁగూడఁ గాదు; సంసిద్ధిమ్ = శ్రవ ణాదిసాధ్య మగు జ్ఞాననిష్ఠను; ఆస్థితాః=పొందినారు; హి=ఎందువలననో, అందువలన,

క్షత్త్రియుఁడవునీవుగూడ వివిదిషుఁడవైనను విద్వాంసుఁడవైనను గర్మముచేయవలయు నని యభిప్రాయము, "బ్రాహ్మణాః పుత్త్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైష ణాయాశ్చ వ్యుత్థాయా౽థ భిక్షాచర్యం చరన్తి" అను సన్న్యాసవిధాయకవాక్య మునందు బ్రాహ్మణత్వము వివక్షిత మగుటవలన, "స్వారాజ్య కామో రాజా రాజ సూయేన యజేత" * అనుచోట క్షత్త్రియత్వము వివక్షితమయిన యట్లు; "చత్వార ఆశ్రమా బ్రాహ్మణస్య త్రయో రాజన్యస్య ద్వౌవైశ్యస్య" ¶ అను స్మృతివలనఁ గూడ. పురాణమునందును "ముఖజానా మయం ధర్మో యద్విష్ణోర్లిఙ్గ ధారణమ్। బాహుజాతోరు జాతానాం నాయం ధర్మః ప్రశస్యతే" ♦ అని క్షత్త్రియవైశ్యు లకు సన్న్యాసము లే దనుట చెప్పఁబడినది. అందువలన యుక్తమే చెప్పెను భగ వంతుఁడు "కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః" అని. "సర్వే రాజాశ్రితా ధర్మా రాజా ధర్మస్య కారకః" § ఇత్యాదిస్మృతివలన వర్ణాశ్రమధర్మప్రవర్తకుఁ డగు టచేతనుం గూడ క్షత్త్రియుఁ డవశ్యము కర్మముచేయవలయు నని చెప్పుచున్నాఁడు— లోకములను దమతమ ధర్మమునందుఁ బ్రవర్తింపఁజేయుటయు ఉన్మార్గమునుండి నివ ర్తించుటయు లోకసంగ్రహము, దానిని; సంపశ్యన్, అపిశబ్దమువలన జనకాదిశిష్టా చారమునుగూడ సంపశ్యన్; కర్మమును; కర్తుమ్ అర్హ స్యేవ అని యన్వయము, క్షత్త్రియజన్మము పొందించునట్టి కర్మముచేఁ గలిగిన శరీరముగలవాఁడవు నీవు విద్వాంసుఁడ వైనను జనకాదులవలె ప్రారబ్ధకర్మబలముచే లోకహితార్థము కర్మము చేయుటకే తగినవాఁడవు, కాని విడుచుటకుఁగాదు బ్రాహ్మణజన్మము లభింపమి వలన. అని యభిప్రాయము. ఈభగవదభిప్రాయము నెఱింగినవారు భగవద్భాష్య కారులు "బ్రాహ్మణునకే సన్న్యాసము ఇతరునకుఁ గా" దని నిర్ణయించిరి. వార్తి కకారులో ప్రౌఢివాదమాత్రంబున ** క్షత్త్రియవైశ్యులకుఁగూడ సన్న్యాసము గలదని వ్యాఖ్యానించి రని తెలియవలయు.

---

* స్వారాజ్యము—స్వర్గరాజ్యము గోరురాజు రాజసూయముచే యజింపవలయును.

¶ నాలుగాశ్రమములు బ్రాహ్మణునకు మూఁడు క్షత్త్రియునకు రెండు వైశ్యులకు.

♦ విష్ణులింగము ధరించుట—సన్న్యాసము అనునది యేదిగలదో ఇది బ్రాహ్మణులకు ధర్మము, క్షత్త్రియవైశ్యులకు ఈధర్మము ప్రశస్తముగాదు.

§ సర్వధర్మములును రాజు నాశ్రయించి యున్నవి. రాజుధర్మమునకుఁ గారకుఁడు.

** విషయప్రాధాన్యము నవలంబించి, వారిముఖ్యాభిప్రాయము గా దని భావము.

శ్రీ॰ ఇందుకు సదాచారప్రమాణముఁ జూపుచున్నాఁడు.—కర్మణైవ; సత్త్వశుద్ధినొందినవారలై, సంసిద్ధిమ్ = సమ్యక్‌జ్ఞానమును; పొందినా రని యర్థము. నీవు సమ్యక్ జ్ఞానివే యని తలంతువు కాఁబోలు, అట్లయినను కర్మాచరణము మంచిదే యని చెప్పుచున్నాఁడు—లోకసంగ్రహ మపి—లోకమును సంగ్రహించుట స్వధర్మమునందు బ్రవర్తింపఁజేయుట, నేను గర్మముఁ జేయుదునేని నన్నుఁ జూచి జనులందఱుఁజేయుదురు, చేయనియెడ జ్ఞాని నగు నన్నుదృష్టాంతముగాఁ గొని యజ్ఞానులు కర్మము విడిచి పతితులగుదు రని లోకరక్షణమునైనను బ్రయోజనమునుగా; సంపశ్యన్; కర్మమును, కర్తుమేవ = చేయుటకే; అర్హసి = తగుదువు, కాని విడుచుటకుఁ గా దని యర్థము.

ప॰ ఈయర్థమునందుఁ బ్రమాణముఁ జూపుచున్నాఁడు.—జనకాదయః= జనకుఁడు మొదలగు రాజులుగూడ, వర్ణాశ్రమోచితమగు, కర్మణైవ = కర్మముచేతనే, కర్మముచేసియే; సంసిద్ధిమ్ = తత్త్వజ్ఞానరూప మగుసిద్ధిని; ఆస్థితాః = పొందినారు. ఇఁక తత్త్వజ్ఞానము కలిగినను గర్మము విడువఁగూడ దని చెప్పుచున్నాఁడు—లోకసంగ్రహమపి, సంపశ్యన్, కర్తుమ్, అర్హసి—ఎవ్వరైననుఅల్పజ్ఞులు మేముగూడ జ్ఞానులమే యని తలఁచి కర్మము విడుతురు వారికొఱకైనను జేయుము. అట్లుచెప్పఁబడినది «సర్పి రస్తి పయ సీక్షుగో రస స్తైల మస్తి తిలమధ్య ఏవ తత్ । లభ్యతే మథన యన్త్రి కర్మణా కర్మణా హృదిగతా తథైవ చిత్» * అని.

రా॰ జ్ఞానయోగాధికారికిఁ గూడ కర్మయోగమే యాత్మదర్శనమునందుత్తమ మగుటవలననే గదా, జనకాదయః = జనకుఁడు మొదలగువారు రాజర్షులు, జ్ఞానులలో నుత్తము లయినవారు; కర్మణైవ = కర్మయోగముచేతనే; సంసిద్ధిమ్ ఆస్థితాః—ఆత్మను జెందిరి. ఇట్లు ముముక్షువు మొదట జ్ఞానయోగమున కనధికారి యగుటచేఁ గర్మయోగాధికారి యగువాఁడు కర్మయోగమే యనుష్ఠింపవలయు నని చెప్పి జ్ఞానయోగాధికారికిఁ గూడ జ్ఞానయోగముకన్నఁ గర్మయోగమే మేలని సహేతుకముగాఁ జెప్పఁబడిది. ఇప్పుడు శిష్టుఁ డని చెప్పఁదగినవాఁడు అన్నివిధంబులను గర్మయోగమునే యనుష్ఠింపవలయు నని చెప్పుచున్నాఁడు—లోకసంగ్రహమ్=

* క్షీరమునందు నేయిగలదు, చెఱకునందు రసముగలదు, నువ్వులయందే నూనెయుండును, అయినను మథన యంత్రి కర్మముచేత మాత్రమే అది పొందఁబడును. అట్లె హృదయగత మగు చిద్వస్తువు గూడ కర్మముచేతనే పొందఁబడును.

లోకసంగ్రహమును; సంపశ్యన్నపి = చక్కఁగాఁ జూచుచున్నవనును; కర్మైవ = కర్మమునే; కర్తుమ్ = చేయుటకు; అర్హసి = తగుదువు.

జనకుఁడు మొదలగు రాజర్షులు మహాజ్ఞానులుగూడఁ గర్మయోగమునే యనుష్ఠించి యాత్మప్రాప్తిఁ జెందిరి. మఱియును, లోకసంగ్రహార్థమైనను నీవు తప్పక కర్మమునే చేయవలయును అని తాత్పర్యము.

**పూ.** ఆచారముగూడఁ గలదని చెప్పుచున్నాఁడు.—కర్మణైవ = కర్మముతోఁగూడనే, కర్మముచేయుచునే యని యర్థము; లేక, కర్మముచేసియే దానివలన జ్ఞానమునొంది; కాని జ్ఞానము లేక యని కాదు. ప్రసిద్ధము గదా వారు జ్ఞానులనుట భారతాదులందు. « తమేవం విద్వానమృత ఇహ భవతి » * ఇత్యాది శ్రుతులవలనఁ గూడ ♦. ఇటఁగూడ కర్మములు జ్ఞానసాధనములని చెప్పుటవలనఁ గూడ « బుద్ధియుక్తః » ఇత్యాదిగా. « నాన్యః పన్థాః " అను శ్రుతివలన గత్యంతరమో ముక్తికిలేదు. ఇతరములు జ్ఞానద్వారమున ముక్తిహేతువులన్నను విరోధములేదు. ఇఁక నెచట తీర్థాదికమే ముక్తిసాధనంబని చెప్పఁబడునో « బ్రహ్మజ్ఞానేన వా ముక్తిః ప్రయాగమరణేన వా। అథవా స్నానమాత్రేణ గోమత్యాం కృష్ణసన్నిధౌ " ❡ ఇత్యాది స్థలమునందు; అచట పాపాదిముక్తియు స్తుతిపరత్వమునని తెలియునది. అచటఁగూడ నొకానొకచో ఇతరమువలన ముక్తిని నిషేధించి తీర్థాదికము బ్రహ్మజ్ఞానసాధనమనుటయే చెప్పఁబడుచున్నది « బ్రహ్మజ్ఞానం వినాముక్తిర్న కథంచిదపీష్యతే। ప్రయాగాదేస్తు యా ముక్తిః జ్ఞానోపాయత్వమేవహి "♦♦ ఇత్యాదిస్థలమున. తీర్థస్తుతివాక్యములు తత్ప్రస్తావమునందుఁ గూడఁ జెప్పఁబడిన జ్ఞాననియమమును ** బాధింపఁ జాలవు. ఒకానొక సమర్థభృత్యుని గుఱించి చెప్పఁబ

---

* బ్రహ్మమును ఇట్లు తెలిసినవాఁడు ఇందు అమృతుఁడు—ముక్తుఁడగుచున్నాఁడు.

♦ అని జ్ఞానమే ముక్తిసాధనమని బోధించుటవలన జనకాదులు జ్ఞానమునొందక కేవల కర్మముచేతనే ముక్తి నొందిరనుట యుక్తముగాదని భావము.

❡ బ్రహ్మజ్ఞానము చేతఁగాని ప్రయాగమునందు మరణముచేతఁగాని గోమతియందుఁ గృష్ణసన్నిధానంబున స్నానమాత్రముచే గాని ముక్తి యగును.

♦♦ బ్రహ్మజ్ఞానము లేక ముక్తి యెట్లును గలుగదు. ప్రయాగాదికము వలన ఏముక్తి చెప్పఁబడినదో, జ్ఞానోపాయంబనుటయే దాని కభిప్రాయము.

** జ్ఞానమువలననే ముక్తి కలుగవలయు ననుటను.

డిన «ఇతఁడే గదా రాజు, రాజుతో నేమిపని?» ఇత్యాది వాక్యములుం బోలె*. అట్లు భగవంతుఁడు చెప్పుచున్నాఁడు —«యాని తీర్థాది వాక్యాని కర్మాది విషయాణి చ। స్తావకాన్యేవ తాని స్యురజ్ఞానాం మోహకానివా॥ భవేన్మోక్షస్తు మద్దృష్టే ర్నాన్యథా తు కథం చన" ♦ అని నారదీయమునందు. కావున అపరోక్షజ్ఞానము వలననే మోక్షము. కర్మమో తత్సాధనమే. §

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే. ౨౧

భా. లోకసంగ్రహ మేల చేయవలయును? చెప్పెదము.—శ్రేష్ఠః= ప్రధానభూతుఁ డగువాఁడు; యత్ యత్ = ఏయేకర్మమును; ఆచరతి = చేయుచున్నాఁడో; తత్ తత్ ఏవ = ఆయాకర్మమునే; ఇతరః జనః = ఇతరజనము, వానిననుసరించినదై; ఆచరతి = చేయుచున్నది. మఱియును. సః = ఆశ్రేష్ఠుఁడు; యత్ = దేని, లౌకికమునుగాని వైదికమునుగాని; ప్రమాణమ్ = ప్రమాణమునుగా; కురుతే = చేయుచున్నాఁడో; లోకః = జనము; తత్ = దాని; అనువర్తతే = అనుసరించుచున్నది, దానినే ప్రమాణముగా గ్రహించుచున్న దని యర్థము.

ఉత్తముఁ డగువాఁ డేయే కర్మము ననుష్ఠించునో దానినే యితరులుగూడ ననుష్ఠింతురు. మఱియు వాఁడు దేనిఁ బ్రమాణముగా గ్రహించునో ఇతరజనులును దానినే ప్రమాణముగా గ్రహింతు రని తాత్పర్యము.

ఆ. జ్ఞాని కృతార్థుఁడు తాను లోకసంగ్రహార్థముగూడఁ బ్రవర్తింపవలసినది లే దని యాశంక నుత్థాపించి పరిహరించుచున్నారు లోకేత్యాదిగా. శ్రుతాధ్యయన సంపన్నుఁ డని సర్వసమ్మతుఁ డైనవాఁడు దేనిదేని విహితమునుగాని నిషిద్ధమునుగాని కర్మము ననుష్ఠించునో ఆయాకర్మమునే ప్రాకృతజను లనువర్తింతురు.

---

* ఈవాక్యము లెట్లు, తత్ప్రస్తావముననే చెప్పఁబడు «ఇతఁడు రాజు గాఁడు, భృత్యుఁడు" ఇత్యాది వాక్యముల నెట్లు బాధింపఁజాలవో అట్లు అని భావము.

♦ తీర్థాది విషయములును కర్మాదివిషయములు నగు వాక్యము లేవిగలవో అవి స్తావకములే— స్తుతిచేయునవియే యగును. లేక, అజ్ఞుల మోహింపఁజేయునవి యగును. మోక్షమో నాదర్శనమువలననే కలుగవలయును. వేఱువిధమున నెట్లును గలుగదు.

§ ఆ అపరోక్షజ్ఞానమునకు సాధనమే.

అందుచే విద్యావంతుఁడుగూడ లోకమర్యాదాస్థాపనము కొఱకు విహితకర్మము చేయవలసినదియే యని యర్థము. ఇతరులు శ్రేష్ఠు ననుసరింతు రనుటను ఆచారము నందుఁజూపి, ప్రమాణప్రతిపత్తియందును జూపుచున్నారు మఱియును ఇత్యాదిగా.

హ. *

శం. నేను జేయుకర్మము ఎట్లు లోకోపకారమున కగు నందువేని, చెప్పెదను.—శ్రేష్ఠః = వేదశాస్త్రాధ్యయనాధ్యాపనములందును తదర్థము తెలియుటయందును దెలుపుటయందును వానియందుఁ జెప్పఁబడిన కర్మముల యనుష్ఠానానుష్ఠాపనములందును సమర్థుఁడై యుత్తమకుల శీలాదులు గల ద్విజశ్రేష్ఠుఁడు; యత్ యత్ = శ్రౌతమునుగాని స్మార్తమునుగాని యితరమునుగాని యేయేకర్మమును; ఆచరతి = నియమముచే అనుష్ఠించుచున్నాఁడో; ముముక్షువును; ఇతరః = పామరజనము గూడ; తత్తదేవ = ఆయాకర్మమునే, అనుష్ఠించుచున్నాఁడు, కాని తానుగూడ నితరముచేయఁడు శాస్త్రజ్ఞానమును తదర్థజ్ఞానమును తదుక్తకర్మజ్ఞానంబును లేమివలన. మఱియును, ఇట్టి లక్షణముగల శ్రేష్ఠుఁడు; యత్ = ఏశాస్త్రమును; తాను, ప్రమాణమ్ కురుతే = ఇదియే ప్రమాణ మని వ్యవహరించుచున్నాఁడో; లోకః = మూఢజనము; తత్ = శ్రేష్ఠుఁడు ప్రమాణముగా గ్రహించిన ఆశాస్త్రమునే; అనువర్తతే—ఆశాస్త్రమునే తాను బ్రమాణముగా గ్రహించును; శ్రేష్ఠుని అనుసరింతురు పామరజను లని యర్థము. ఇందుచే శ్రేష్ఠుఁ డగువాఁడు కృతార్థుఁ డైనను లోకహితార్థము కర్మము చేయవలసినదే యని సిద్ధము.

మ. ఓయీ! నేను గర్మముఁ జేయుచున్నను లోకమేల దాని సంగ్రహింపవలయును? అని యాశంకించి లోకము శ్రేష్ఠుని యాచారము ననుసరించునది యగుటవలన నని చెప్పుచున్నాఁడు.—శ్రేష్ఠః = ప్రధానుఁడైన రాజు మొదలగువాఁడు; యత్ యత్ = ఏయే కర్మమును, శుభమునుగాని అశుభమునుగాని; ఆచరతి; తత్తత్ = ఆయాకర్మమునే; ఇతరః జనః = అతని ననుసరించి యుండునట్టి యితరమయిన ప్రాకృతజనము; ఆచరతి; స్వాతంత్ర్యమున మఱియొకటి చేయ దని యర్థము. ఓయీ! శాస్త్రముచూచి యశాస్త్రీయ మగు శ్రేష్ఠుని యాచారమును విడిచి శాస్త్రీయ మగు దానినే యేల యాచరింపదు లోకము? అని యాశంకించి, ఆచారమునందుఁ బోలెఁ బ్రమాణప్రతిపత్తియందును ఇతరజనము శ్రేష్ఠునేయను

* శంకరభాష్యముతో సమానము.

సరించు నని చూపుచున్నాఁడు.—సః—శ్రేష్ఠుఁడు; యత్ = దేని, వైదికమునుగాని లౌకికమునుగాని; ప్రమాణం కురుతే = ప్రమాణ మని తలఁచుచున్నాఁడో; తత్ = దానినే; లోకముగూడ, అనువర్తతే—ప్రమాణమని తలఁచును, స్వతంత్రముగా దేనినిం బ్రమాణముగాఁ దలంప దని యర్థము. అందువలనఁ బ్రధానభూతుఁడవు రాజ వగు నీవు లోకసంరక్షణముకొఱకుఁ గర్మము చేయవలసినదే, « ప్రధాను ననుసరించియుండును లోకవ్యవహారములు " అను న్యాయము వలన నని యభిప్రాయము.

శ్రీ. కర్మము చేసినచో లోకసంగ్రహ మగు ననుటను నిరూపించుచున్నాఁడు —ఇతరః జనః—ప్రాకృతజనము గూడ, తత్తత్—ఆయాకర్మమునే, ఆచరించుచున్నది. సః = ఆశ్రేష్ఠుఁడు; కర్మశాస్త్రమునుగాని నివృత్తిశాస్త్రమునుగాని, యత్ = దేని; ప్రమాణంకురుతే—ప్రమాణముగాఁ దలంచునో; దానినే లోకముగూడ, అనువర్తతే = అనుసరించుచున్నది.

ప. ఇఁక దానినే ప్రకటించి చెప్పుచున్నాఁడు శ్రేష్ఠః=గౌరవింపఁబడువాఁడు; యత్ యత్; ఆచరతి; ఇతరః జనము ప్రాకృతజనముగూడ; దానినే యాచరించుచున్నది. అట్లు, సః—శ్రేష్ఠుఁడు; యత్ = వేదశాస్త్రాదికమును దేనిని; ప్రమాణ మని తలంచు చున్నాఁడో; లోకముగూడ, తత్ = దానిని; అనువర్తతే = గుఱిగాఁ దలఁచియుండును.

రా. శ్రేష్ఠః = సర్వశాస్త్రములు దెలిసినవాఁ డనియు సర్వకర్మములను ననుష్ఠించువాఁ డనియుఁ బ్రసిద్ధుఁ డగు పురుషుఁడు; యత్ యత్ = ఏయేకర్మమును; ఆచరతి = అనుష్ఠించునో; తత్తదేవ = ఆయాకర్మమునే; ఇతరః జనః = సర్వజ్ఞము గాని జనముగూడ; అనుష్ఠించును. అనుష్ఠించు కర్మమునుగూడ, యత్ప్రమాణమ్ = ఏయంగములతోఁ గూడినదానిఁగా; కురుతే= అనుష్ఠించునో; తత్ = ఆయంగములతోఁ గూడినదానిఁగానే; లోకః= అల్పజ్ఞజనము; అనువర్తతే= అనుష్ఠించును. ఇందువలన లోకరక్షణార్థము శిష్టుఁ డని ప్రసిద్ధుఁడు శ్రేష్ఠుఁడు తనవర్ణాశ్రమముల కుచితం బగు కర్మమును సమస్తమును సర్వదాయనుష్ఠింపవలయును, కానిచో లోకనాశజనితం బగు పాపము జ్ఞానయోగమునుండిగూడ నితని భ్రష్టునిగాఁ జేయును.

సర్వశాస్త్రములు దెలిసినవాఁ డనియు సర్వకర్మానుష్ఠాత యనియుఁ బ్రసిద్ధుఁడు మహాపురుషుఁడు ఏయేకర్మము నాచరించునో దానినే అల్పజ్ఞు లగు నితరజనులు నాచరింతురు. మఱియు నతండు తానాచరించు కర్మమును ఏయంగములతోఁ

గూడ నాచరించునో అల్పజ్ఞజనముగూడ ఆయంగములతోఁగూడినదిగానే యాకర్మం బాచరించు నని తాత్పర్యము.

**మా.** సః, యత్ ప్రమాణం కురుతే = ఏవాక్యాదికమును బ్రమాణముగాఁ జేయుచున్నాఁడో, దేనియందుఁ జెప్పఁబడినచొప్పున నున్నాఁడో అని యర్థము.

న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నాఽనవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి. ౨౨

**భా.** లోకసంగ్రహము చేయవలయు ననుటయందు నీకు సంశయ మేని, అప్పుడు నన్నేల చూడవు? పార్థ = అర్జునా! మే = నాకు; త్రిషు లోకేషు= మూఁడులోకముల యందును; కించన = ఏదియు; కర్తవ్యమ్= చేయవలసినది; నాస్తి=లేదు. ఎందువలన? అనవాప్తమ్=ప్రాప్తముకాని వస్తువు; న అవాప్తవ్యమ్ = పొందవలసినది లేదు *. అట్లయినను; కర్మణి = కర్మమునందు; వర్తఏవచ = ఉండనేయున్నాను నేను.

పార్థా! నాకు మూఁడులోకములందును జేయవలసిన దేదియు లేదు. పొందని వస్తువును పొందవలసియున్నం గదా చేయవలసినది యుండును. అవాప్త సర్వకాముఁడ నగుటవలన నాకేదియుఁ బొందవలసినది లేదు. అట్లయినను నేను గర్మము ననుష్ఠించుచునే యున్నాను అని తాత్పర్యము.

**ఆ.** కృతార్థుఁడుగూడ లోకసంగ్రహముకొఱకు విహితకర్మముఁ జేయ వలయు నని చెప్పి యందు భగవంతు నుదాహరణముగా నుపన్యసించుచున్నారు లోకసంగ్రహము ఇత్యాదిగా. పొందనిదానిఁ బొందుటకొఱకు నీకుఁ గూడ కర్త వ్యము సంభవించుచుండఁగా నేదియును లేదు కర్తవ్య మని యెట్లు చెప్పితి వని యాశంకించి చెప్పుచున్నాఁడు నానవాప్త మవాప్తవ్యమ్ అని. శ్లోకవ్యాఖ్యాన ద్వారంబున విద్యావంతునకుఁగూడఁ గర్మప్రవృత్తి సంభవించునని చూపుచున్నారు పార్థ ఇత్యాదిగా. భగవంతునకు లేదు కర్తవ్యం బనుటను ఆకాంక్షాద్వారమున నిరూ పించుచున్నారు ఎందువలన నిత్యాదిగా. ప్రయోజనము లేని యప్పుడు నీవుగూడ అనుష్ఠింపవలసినది లేదు కర్మము నని యాశంకించి లోకసంగ్రహార్థము నాకుఁ గూడ కర్మానుష్ఠానం బను నభిప్రాయముతోఁ జెప్పుచున్నారు అట్లయినను ఇత్యాదిగా.

* అవాప్త సర్వకాముఁడ నగుటవలన.

హ. *

శం. ఓయీ! కృతార్థుఁడును గర్మముచే సాధింపఁ దగినది తనకు లే దని తెలిసినవాఁడు నగు మహాత్మునకు కర్మము సేయుట యెటనుం జూచినది లే దని యాశంకింపఁగా ఈయర్థమునందు నేనే ప్రమాణమని చెప్పుచున్నాఁడు శ్రీభగవంతుఁడు.—ఓపార్థుఁడా! మే = షడ్గుణైశ్వర్యసంపన్నుండను అవాప్త సర్వకాముఁడను సర్వేశ్వరుండ నగు నాకు; దేనినైనను పొందవలసిన ప్రయోజనము నుద్దేశించి, కర్తవ్యమ్ = చేయవలసినకర్మము; నాస్తి= లేదు. అది యెందువలన ననఁగా. అనవాప్తమ్= పొందఁబడినదై యుండి; నాకుఁగర్మముచే, అవాప్తవ్యమ్ = పొందవలసిన వస్తువు; కించన= ఏదియు; త్రిషులోకేషు; న = లేదు. గృహస్వామికి గృహమునందున్న ద్రవ్యములవలె బ్రహ్మాండమునం దున్న సర్వవస్తువులును బ్రహ్మాండస్వామి నగు నాకుఁ బ్రాప్తములే యగుచున్నవి, కాని ప్రాప్తవ్య మయిన వస్తువేదియు సంభవింపదు. ఇట్లు మహాభాగ్య వైరాగ్య జ్ఞానసమృద్ధుఁడను నేనుగూడ లోకసంగ్రహరూప మగు, కర్మణి = కర్మమునందు, వర్తఏవచ = ఉండ నేయున్నానుగదా! చకారము హి అనుదానియర్థము గలది. నేను వైదిక లౌకిక కర్మమునందుఁ బ్రవర్తించుట మీకుఁ బ్రత్యక్షసిద్ధమే యని ప్రసిద్ధిని బోధించుచున్నది.

మ. ఈవిషయమునందు నేనే దృష్టాంత మని చెప్పుచున్నాఁడు మూఁడు శ్లోకములచేత.—ఓపార్థా! మే = నాకు; త్రిషులోకేషు = మూఁడులోకముల యందుఁగూడ; ఏదియు; కర్తవ్యమ్; నాస్తి. ఎందువలన ననఁగా. అనవాప్తమ్ = పొందఁబడనిఫలము, ఏదియు; నాకు, న అవాప్తవ్యమ్= పొందవలసినదిలేదు. అయినను, వర్తఏవకర్మణి—నేను గర్మము చేయనే చేయుచున్నా నని యర్థము. పార్థ యని సంబోధించుటచే "విశుద్ధ క్షత్త్రియ వంశమునం బుట్టినవాఁడవు నీవు శూరుని కొమారిత కొడుకవు ♦ గూడ, కావున మిక్కిలి నాకు సమానుఁడవు నాయట్లుండఁ దగినవాఁడవు" అని సూచించుచున్నాఁడు.

శ్రీ. ఇందుకు నేనే దృష్టాంత మని మూఁడుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.—పార్థా! మే కర్తవ్యం నాస్తి. ఎందువలన ననఁగా. మూఁడులోకముల యందుఁగూడ; అనవాప్తమ్ = అప్రాప్తమయి; అవాప్తవ్యమ్ = ప్రాప్తింపవలసినది;

---

* శంకరభాష్యముతో సమానము.

♦ కుంతీకొడుకవు.

లేదు. అట్లయినను, నేను, కర్మణి వర్త ఏవ — కర్మము చేయుచునేయున్నా నని యర్థము.

ప. ఇది నీకు మాత్రమే యుపదేశించుట కాదు. నేనుగూడనట్లే యాచరించుచున్నా నని చెప్పుచున్నాఁడు.—ఓపార్థా ! త్రిషులోకేషు = భూః భువః సువః అను మూఁడులోకములయందును, లేక, దేవ పితృ మనుష్యలోకములయందును; నాకు; కర్తవ్యమ్ = చేయవలసినది; కించన = ఏదియును; నాస్తి=లేదు. నాకు దేని నుద్దేశించి చేయవలసిన దని చెప్పుచున్నాఁడు—అప్రాప్తప్రాప్తికొఱకుఁ బ్రయత్నము చేయవలయునేని అప్పుడు నాకు, అనవాప్తమ్ = అప్రాప్తము, ఏదియు, న = లేదు, అవాప్త సకలకాముఁడ నగుటవలన. ఇఁక కామనాతీతమగు పరబ్రహ్మము ప్రాప్తవ్యమున్నచో నప్పుడు, అవాప్తవ్యమ్ = అట్టి పొందవలసినది గూడ; న=లేదు, తత్స్వరూపమున నేనేయున్నాను. ఇట్టివాఁడనుగూడ నేను, కర్మణి వర్త ఏవ. ఇతరప్రయోజనము లేకుండుటవలన లోకసంగ్రహార్థమే యని యర్థము.

రా. మే = సర్వేశ్వరుఁ డను అవాప్తసమస్తకాముఁడను సర్వజ్ఞుఁడను సత్యసంకల్పుఁ డను అగు నాకు; త్రిషులోకేషు = దేవమనుష్యాదిరూపములందు, ఈరూపములచే స్వేచ్ఛమెయి వర్తించుచున్న నాకు; కించన = ఏదియు; కర్తవ్యమ్ = చేయవలసినది; నాస్తి = లేదు. ఎందువలన ననఁగా. అనవాప్తమ్ = పొందఁబడనిదై; కర్మముచే, అవాప్తవ్యమ్ = పొందవలసినది; ఏదియు, న = లేదు. ఇట్లయినను, కర్మణ్యేవ = కర్మమునందే; వర్తే = ఉన్నాను.

దేవమనుష్య తిర్యగ్రూపంబుల స్వేచ్ఛచే వర్తించుచున్న సర్వేశ్వరుండ నగు నాకు కర్మము చేయవలసినది లేదుగదా! అవాప్త సమస్తకాముఁడ నగు నాకుఁ బ్రాప్తము కాని దేమున్నది? అప్రాప్త మగు దానిఁ బొందుటకుఁగదా కర్మము చేయవలయును. అయినట్లను నేనుగర్మము నేచేయుచున్నానని తాత్పర్యము.

మూ. [1]

యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః
మమ వర్త్మా౽నువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః. ౨౩

భా. ఇఁక, అహమ్ = నేను; జాతు = ఒకానొకప్పుడైనను; కర్మణి = కర్మమునందు; అతన్ద్రితః = సోమరికానివాఁడనై; న వర్తేయం

[1] ఇదిమొదలు ౨౮. వ శ్లోకమువఱకు మాధ్వభాష్యము లేదు.

యది = వర్తింపనేని; పార్థ = అర్జునా! మమ = శ్రేష్ఠుఁడ నగు నా యొక్క; వర్త్మ = మార్గమును; మనుష్యాః = మనుష్యులు; సర్వశః సర్వప్రకారములచేతను; అనువర్తన్తేహి = అనువర్తింతురు గదా!

ఇఁక నుత్తముఁడ నగు నేనే యెప్పుడైనను గర్మమును జక్కఁగాఁ జేయక పోవుదునేని అప్పుడు మనుష్యులందఱు నన్నివిధంబుల నన్ననుసరించి కర్మములఁ జేయుట మానివేయుదు రని తాత్పర్యము.

**ఆ.** లోకసంగ్రహము గూడ నీకుఁ గర్తవ్యము గాదు, నిష్ప్రయోజనం బగుటవలన నని యాశంకించి చెప్పుచున్నాఁడు యది హీత్యాదిగా.

**హ.** నాయట్లు నీవును కృతార్థుఁడవు ఆత్మవిదుఁడ వైనను, ఆత్మవిదునకుఁ గూడ కర్తవ్యము లేకున్నను పరానుగ్రహము కర్తవ్య మని చెప్పుచున్నాఁడు యది హీత్యాదిగా.

**శం.** ఓయీ! సర్వేశ్వరుఁడవు నీకు లోకసంగ్రహముగూడ కర్తవ్యము గాదు అనర్థములేమివలన నని యాశంకించి, అట్లుకాదు. శ్రేష్ఠుఁడు కానివాఁడు శ్రేష్ఠు ననుసరించు నను న్యాయంబున సర్వజ్ఞుం డీకృష్ణుఁ డని యందఱును నన్ననుసరింతురు, నేను గర్మమువిడిచినచో నందఱును గర్మము విడుతురు, అందుచే లోకక్షయము సంభవించును, అందువలన నేను గర్మము చేయవలసినదియే యను నభిప్రాయముచేఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత — నేను గృతార్థుఁడ నని గాని కర్మముచే సాధింపఁదగినది లేదని కాని. అహమ్ = నేను; అతన్ద్రితః = మంత్రతంత్ర ప్రయోగాదికమునం దేమఱుపాటు లేనివాఁడనై; జాతు = ఎచ్చటను ఎప్పుడును గాని; కర్మణి = విహితకర్మమునందు; నవర్తేయం యది = వర్తింపకుందునేని, విహితకర్మము చేయనేని; కర్మము విడిచిన నన్నుం జూచి మనుష్యులందఱును కర్మము విడుతురు. హి = ఏకారణమువలన ననఁగా. మనుష్యాః సర్వశః = మనుష్యులందఱును; భగవంతుఁ డితఁడు సర్వజ్ఞుఁ డని నన్ను సర్వజ్ఞునిఁ గాఁ దలఁచి; మమ వర్త్మ = నామార్గమునే; అనువర్తన్తే. శ్రేష్ఠుఁడు గానివాఁడు శ్రేష్ఠు ననుసరించుట నియతం బగుటవలన నేను గర్మము విడువఁగానే తాముగూడఁ గర్మము విడుతు రని యర్థము.

**మ.** లోకసంగ్రహమునుగూడ నీవు చేయవలసినది లేదు ఫలము లేమివలన నని యాశంకించి చెప్పుచున్నాఁడు.— అహంహి = నేనేగాని; అతన్ద్రితః =

అలసతలేనివాఁడనై; జాతు = ఒకానొకప్పుడైనను; కర్మణి న వర్తేయం యది—కర్మముల ననుష్ఠింపక యుందునేని; అప్పుడు, మమ = శ్రేష్ఠుఁడనై యున్న నాయొక్క; వర్త్మ=మార్గమును; పార్థ; మనుష్యాః = కర్మాధికారులైనవారు; అనువర్తన్తే= అనువర్తింతురు; సర్వశః = సర్వవిధములచేతనుగూడ.

శ్రీ. చేయనిచో లోకనాశం బగు నని చెప్పుచున్నాఁడు.— జాతు = ఒకానొకప్పుడు; అతన్ద్రితః = అలసత లేనివాఁడనై; కర్మణి న వర్తేయం యది = కర్మము ననుష్ఠింప కుందునేని; అప్పుడు, మమవర్త్మ = నామార్గమునే; మనుష్యాః; అనువర్తన్తే—అనువర్తింతు రని యర్థము.

ప. ఇఁక నట్లుచేయనిచో అనిష్టము చెప్పుచున్నాఁడు.—అహమ్; జాతు = ఒకప్పుడైనను; అతన్ద్రితః = అలసత లేనివాఁడనై; కర్మణి న వర్తేయం యది = కర్మమును జేయక పోదునేని; అప్పుడు, మమ వర్త్మ = నామార్గమునే; మనుష్యాః; సర్వశః = అందఱును; అనువర్తన్తే = అనువర్తింతురు.

రా. అహమ్ = సర్వేశ్వరుఁడను సత్యసంకల్పుఁడను నాసంకల్పముచేఁ గలిగిన జగదుదయ విభవ లయములు లీలలుగాఁ గలవాఁడను జగదుపకారమనుష్యుఁడనై యవతరించినవాఁడ నైనను మనుష్యులందు శిష్టజనాగ్రేసరుఁ డగు వసుదేవునిగృహమున జన్మించినవాఁడ నగు నేను; కర్మణి = తత్కులోచిత మగుకర్మమునందు; అతంద్రితుండనై; సర్వదా, న వర్తేయం యది= వర్తింపకుందునేని; మమ = శిష్టజనాగ్రేసరుఁ డగు వసుదేవునిపుత్త్రుఁడ నగు నాయొక్క; వర్త్మ; కృత్స్నవిదులు కానిశిష్టులు, సర్వప్రకారమునను ఇదియె ధర్మ మని, అనువర్తన్తే. అందువలన వారు తాము చేయవలసినకర్మము ననుష్ఠింపకుండుటచేతను చేయమివలనఁ గలుగుప్రత్యవాయముచేతను ఆత్మప్రాప్తి లేనివారలై నిరయముఁ జెందుదురు.

సర్వేశ్వరుఁడను లోకోపకారార్థము శిష్టజనాగ్రేసరుఁ డగు వసుదేవుని పుత్త్రుఁడనై యవతరించినవాఁడ నగు నేను నిరంతరము శ్రద్ధతోఁ గర్మము చేయని యెడ వసుదేవపుత్త్రుండను నే నాచరించినదియే ధర్మ మని నమ్మువార లగు శిష్టులందఱును నామార్గము ననుసరించి కర్మముల విడిచి యందువలన ఆత్మప్రాప్తి పొందకపోవుటయే కాక నరకమునం బడుదు రని తాత్పర్యము.

ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చే దహమ్
సఙ్కరస్యచ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః. ౨౪

భా. అందువలన నేమి దోష మనఁగాఁ జెప్పుచున్నాఁడు —ఇమే= ఈసమస్తములయిన; లోకాః = జనులు; ఉత్సీదేయుః = నశింతురు, లోకస్థితినిమిత్త మయినకర్మము లేమివలన; అహమ్ = నేను; కర్మ = కర్మమును; నకుర్యాం చేత్= చేయనియెడ. మఱియును. సఙ్కరస్యచ= సంకరమునకుఁ గూడ *; కర్తా= చేసినవాఁడను; స్యామ్ = అగుదును. ఆకారణముచేత, ఇమాః ప్రజాః = ఈప్రజలను; ఉపహన్యామ్-నశింపఁ జేయుదును, ప్రజల ననుగ్రహించుటకై ప్రవర్తించినవాఁడను నేను వారి కుపహతిని ♦ చేసినవాఁడ నగుదు నని యర్థము. ఈశ్వరునకు నా కన నురూపము § సంభవించును.

నేను గర్మముచేయనియెడ జను లందఱు నన్ననుసరించి కర్మము విడిచిన వారై వినాశము నొందుదురు. మఱియు నేను గర్మము చేయనిచో వర్ణసంకరము కూడ సంభవించును. అందుచేఁ బ్రజల ననుగ్రహించుట కవతరించినవాఁడ నీశ్వరుఁడను నేను అందుకు విరుద్ధముగాఁ బ్రజలకు వినాశము కల్గించినవాఁడ నగుదు నని తాత్పర్యము.

ఆ. శ్రేష్ఠుఁడవగునీమార్గము ననువర్తించుటయుచితమే మనుష్యుల కని యాశంకించి పరిహరించుచున్నారు అందువలన నిత్యాదిగా. ఈశ్వరుఁడు కర్మము నందుఁ బ్రవర్తింపనియప్పుడు తదనువర్తిజనులకుఁగూడ కర్మము సంభవింపమివలన అను హేతువుఁ జెప్పుచున్నారు లోకస్థితీత్యాదిగా. ఇందువలనఁ గూడ ఈశ్వరుఁడు కర్మము చేయవలయునని చెప్పుచున్నారు మఱియును అని. కర్మముఁ జేయనేని అని శేషము. సంకరము చేయుటయొక్క ఫలముఁ జెప్పుచున్నారు ఆకారణముచేత నిత్యాదిగా. ప్రజోపహతి ప్రాప్తించునేని అందుచే నీకేమి యనఁగాఁ జెప్పుచున్నారు ప్రజల ననుగ్రహించుటకై ఇత్యాదిగా.

హ. ‖

---

* వర్ణసంకరమునుగూడ.

♦ వినాశమును.

§ అనురూపము కానిస్థితి.

‖ శంకరభాష్యమునకు సమానము.

శం. ఓయీ! వారలుగూడఁ గర్మము విడుతురు గాక. దాన నేమి యనర్థ మనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అందఱును గర్మము విడుతురేని "అన్నా ద్భవన్తి భూతాని" అని చెప్పినరీతిని హవిర్భాగములు లేకుండుటవలన దేవతలు క్షీణు లగుదురు, వర్షాదులు లేకుండుటవలన మనుష్యాదుల కుత్పత్తిలేకపోవును, ఉత్పన్నులకును వినాశం బగును. ఇంతమాత్రమే కా దనర్థము, మ తేమనఁగా వర్ణ సాంకర్యముగూడ సంభవించు నని చెప్పుచున్నాఁడు సఙ్కరస్యేత్యాదిగా. కృత కృత్యుఁడ ననునభిమానముచే నేనుగర్మముచేయక లోకస్థితికారణమగు వైదికకర్మము జనులచే విడిపించి సంకరమునకుఁ గూడ కర్త నగుదును.—తత్తద్వర్ణజాతిభేదవ్యవ స్థాపక మగు కర్మము లేనియప్పుడు అందఱకు నేకరూపత సంభవించుటచే వర్ణ ములు సంకీర్ణము లగుచున్నవి, ఆవర్ణసంకరముగూడ నేఁ జేసినదే యగును. ఇట్లు సాంకర్యము కలిగించుటచే నేను, ప్రజాః = సర్వప్రజలను; ఉపహన్యామ్—సర్వ ప్రజలకు నుపహతి చేసినవాఁడను గూడ నగుదును; ఉపహతి యనఁగా దుర్గతిప్రాప్తి, సద్గతికిహేతు వగుసత్కర్మానుష్ఠానము లేకుండుటవలన సర్వప్రజలును నరకముఁ బొందుదు రని యర్థము. ఇట్టి యనర్థపరంపర సంభవించుటవలనఁ గృతకృత్యుఁ డైనను నేను గాని నీవు గాని ఇతరుఁడైన ఆత్మవిదుఁడు గాని లోకహితార్థము కర్మము చేయవలసినదే యని సిద్ధము.

మ. శ్రేష్ఠుఁడ వగు నీమార్గము ననువర్తించుట మనుష్యుల కుచితమే యగుచున్నది, అట్లనువర్తించినయెడ నేమిదోషమనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అహ మ్ = ఈశ్వరుఁడనునేను; కర్మ = కర్మము, నకుర్యాంచేత్ = చేయనిపక్షమున, అప్పుడు నాయనువర్తు లగుమన్వాదులుగూడ కర్మము చేయనివార లగుదురు; అందుచే లోకస్థితికి హేతువగు కర్మము లోపించుటవలన, ఇమేలోకాః= ఈసర్వలోక ములును; ఉత్సీదేయుః = నశించును. అందువలన, వర్ణసంకరమునకుఁగూడ కర్తను నేనే యగుదును. అందుచే, ఇమాః ప్రజాః; నేనే, ఉపహన్యామ్ = ధర్మలోపముచే నశింపఁజేసినవాఁడ నగుదును. ప్రజల ననుగ్రహించుటకుఁ బ్రవృత్తుఁడను ఈశ్వరుఁ డను నేను ఎట్లు ప్రజల నందఱ నశింపఁజేయుదు నని యభిప్రాయము. యద్యదా చరతీత్యాదిశ్లోకములకు మఱియొకవ్యాఖ్య—లోకసంగ్రహమునుజూచి మాత్రమె కాదు కర్మము చేయవలయుననుట, మ తేమనఁగా కర్మాచరణము శ్రేష్ఠులయాచార మగుటవలనఁ గూడ నీవు కర్మముచేయవలయు నని చెప్పుచున్నాఁడు యద్యదాచరతి

అను శ్లోకముచేత. అందువలన శ్రేష్ఠుఁడ నగునాయాచార మెట్టిదో అట్టియాచారమునే నాయనువర్తి వగు నీవనుష్ఠింపవలయునుగాని స్వతంత్రముగా నీవు వేఱాచారము నవలంబింపఁ గూడ దని యర్థము. ఎట్టిది నీయాచారము? నే ననువర్తించుటకై దానిఁ దెలియవలయు నని యాకాంక్షింపఁగా నమేపార్థేత్యాది శ్లోకత్రయముచే నది ప్రదర్శింపఁబడినది.

శ్రీ. అందువలన నేమి యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఉత్సీదేయుః = కర్మలోపముచేనశించును. అందువలన వర్ణసంకరము సంభవించునో దానికిఁగూడ నేనే, కర్తా, స్యామ్=అగుదును. ఇట్లు నేనే, ప్రజాః, ఉపహన్యామ్=పాపులనుగాఁ జేయుదును.

ప. ఓయీ! అసంగోదాసీనుఁడ నగు నీకు లోకమునం దేమి ప్రయోజనమని యాశంకించి వర్ణాశ్రమధర్మప్రవర్తకుఁడను నేను బరమకారుణికుండ నగుటచే నని చెప్పుచున్నాఁడు.—అహమ్, కర్మ న కుర్యాం చేత్; ఇమేలోకాః = జనులు; ఉత్సదేయుః = స్వకర్మము లోపించుటచే భ్రష్టు లగుదురు. అందువలన వర్ణసంకరమేది కాఁగలదో దానికి కర్తను నేనే యగుదును అందుచే, నాకరుణకుఁ బాత్రములై యున్నప్రజలను, ఉపహన్యామ్ = పాపముచే ఉపహతులనుగాఁ జేయుదును. ఎట్లు దారి దప్పినట్టిజ్ఞానహీనులకు వ్యాఘ్రచోరాదిభయము కలుగకుండుటకై కరుణచే నెవ్వఁడైనను దారి చూపుచున్నాఁడో అట్లు నేనును.

రా. అహమ్ = నేను; కర్మ = కులోచిత మగు కర్మమును; న కుర్యాం చేత్ = చేయనేని; ఇట్లే, ఇమే లోకాః = ఈశిష్టజను లందఱును నాయాచారమును బట్టి ధర్మనిశ్చయము చేయువారలు, కర్మము చేయకుండుటవలననే; ఉత్సీదేయుః = నష్టు లగుదురు. శాస్త్రీయాచారమును బాలింపమివలన శిష్టవంశముల కన్నిటికిని, సఙ్కరస్య చ = సంకరమునకుఁగూడ; కర్తా స్యామ్. ఇందువలననే, ఇమాః, ప్రజాః, ఉపహన్యామ్. ఇట్లే నీవును శిష్టజనాగ్రేసరుఁ డగు పాండురాజుకుమారుఁడవు ధర్మరాజుతమ్ముఁడవు అర్జునుఁడవు, ఇట్టివాఁడవై జ్ఞాననిష్ఠను మాత్రమె యవలంబింతువేని, అంత నీయాచారము ననువర్తించునట్టి అసర్వజ్ఞు లగు శిష్టులు ముముక్షువులు తమ యధికారముఁ దెలియనివారలై కర్మనిష్ఠను విడిచి వినాశము నొందుదురు. కావునఁ బ్రసిద్ధుఁ డయిన విద్వాంసుఁడు కర్మమునే చేయవలయును.

నేను నాకులమున కుచిత మగు కర్మము ననుష్ఠింపనియెడ, నన్నుఁ జూచి శిష్టజను లందఱు కర్మము విడిచి నాశము నొందుదురు. అందుచే శిష్టవంశ

ములన్నియు సంకరము నొందును. అందుకును నేనే కారణమనగుదును. అందువలనఁ బ్రజానాశము చేసినవాఁడ నగుదును. అట్లు కాకుండుటకై నేను గర్మముఁ జేయునట్లు నీవును గర్మము చేయవలయు నని తాత్పర్యము.

సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత
కుర్యా ద్విద్వాం స్తథా ఽసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్. ౨౫

భా. ఇఁక నాయట్లు నీవును గృతార్థబుద్ధివి ఆత్మవిదుఁడవు అగుదువేని, ఇతరుఁడు గాని యట్టివాఁ డగునేని, అట్టివానికిఁ గూడఁ దనకుఁ గర్తవ్యము లే కున్నను బరానుగ్రహమే కర్తవ్య మని చెప్పుచున్నాఁడు.—కర్మణి = కర్మమునందు; సక్తాః = ఈ కర్మముయొక్క ఫలము నాకుఁ గలుగు నని యాసక్తి గలవారలై; కొందఱు, అవిద్వాంసః = అజ్ఞానులు; యథా = ఎట్లు; కుర్వన్తి = చేయుచున్నారో. భారత = అర్జునా! విద్వాన్ = ఆత్మజ్ఞుఁడు; అసక్తః= ఆసక్తి లేనివాఁడై; తథా = అట్లు; కుర్యాత్ = చేయును. ఎందుకుఁ జేయుచున్నాఁ డందువేని, దాని వినుము. లోకసంగ్రహమ్ = లోకసంగ్రహమును; చికీర్షుః = చేయఁగోరినవాఁడు.

అజ్ఞానులు కర్మఫలము నపేక్షించినవారై ఎట్లు యథాశాస్త్రముగా కర్మము చేయుచున్నారో, ఆత్మజ్ఞుఁడు కర్మఫలాపేక్షలేనివాఁడై కర్తృత్వాద్యభిమానరహితుండై, అట్లు యథాశాస్త్రముగా లోకసంగ్రహార్థము కర్మము చేయు నని తాత్పర్యము.

ఆ. నీవు కర్మము చేయనియప్పుడు నిన్ననువర్తించువారి కేమి దోష మని యాశంకింపఁగా, ఈశ్వరుఁడు కృతార్థుఁ డగుటచేఁ గర్మానుష్ఠానము చేయనియెడ నతని ననువర్తించువారు కూడ కర్మానుష్ఠానము విడుతురు, అందువలన స్థితిహేతువు లేమిం జేసి పృథివ్యాదిభూతంబులకు వినాశము సంభవించును, వర్ణాశ్రమధర్మ వ్యవస్థ తప్పి పోవును, మఱియుఁ గర్మాధికృతు లగువారు కర్మము విడిచినవారై పాపోపహతు లగుదురు, కావునఁ బరానుగ్రహార్థం బీశ్వరుఁడు కర్మమునందుఁ బ్రవర్తించుచున్నాఁ డని చెప్పఁబడినది. ఇప్పుడు లోకసంగ్రహముకొఱకుఁ గర్మము చేయువానికిఁ గర్తృత్వాద్యభిమానముచే జ్ఞానము లోపించు ననుట ప్రాప్తింపఁగా దానిఁ బరిహరించుచున్నారు.—ఇఁక నిత్యాదిగా. కృతార్థబుద్ధి యగుటకు హేతు

వుఁ జెప్పుచున్నారు ఆత్మవిదుఁడవు అని. ఆత్మస్వరూపము నెఱింగినవాఁడై కర్తృత్వాద్యభిమానము లేకుండుటవలనఁ గృతార్థుఁడు తానే యగుచున్నాఁడనియర్థము. అర్జునునికంటె ఇతరుఁడైనను జ్ఞానవంతుఁడై కర్తవ్యత్వాద్యభిమానము లేనివాఁడగునేని వానియందును గృతార్థబుద్ధిత్వము సమాన మని చెప్పుచున్నారు ఇతరుఁడుగాని ఇత్యాదిగా. అప్పుడు వానికి నిష్ఫల మగుటచేఁ గర్మానుష్ఠానము సంభవింప దని యాశంకించి చెప్పుచున్నారు అట్టివానికిఁగూడ ఇత్యాదిగా. కర్తవ్యము—ఆత్మవిదుఁడుగూడ పరానుగ్రహముకొఱకుఁ జేయవలసినదే కర్మము నని యర్థము. దృష్టాంతదార్ష్టాంతికరూప మగు శ్లోకమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు కర్మణి ఇత్యాదిగా. అసక్తిలేనివాఁడై — కర్తృత్వాభిమానము గాని ఫలాభిసంధి గాని లేనివాఁడై యని యర్థము.

హ. అందువలన.—సక్తాః = ఫలాభి సంధియం దాసక్తిగలవారై. విద్వాన్ = జ్ఞాని; తథా = ఆప్రకారమున; అసక్తః = ఫలాభిసంధి లేనివాఁడై. చికీర్షుః = చేయఁగోరినవాఁడై; లోకసంగ్రహమ్ = చేయవలసిన ధర్మప్రచారమును.

శం. అప్పుడు లోకహితార్థము కర్మమునందుఁ బ్రవృత్తుఁ డగు విద్వాంసుఁడు ఎట్లు కర్మము చేయవలయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—అవిద్వాంసః = ఆత్మజ్ఞులు కానివారు; కర్మణి—కర్మజన్య ఫలమునందు స్వర్గపుత్త్రి ధనాదికమునందు; సక్తాః = ఆసక్తిగలవారలై; నియమముచే శ్రద్ధాభక్తులతో, యథా = ఎట్లు; విహితకర్మమును, కుర్వన్తి. తథా = అట్లే యున్నవాఁడై; లోకసంగ్రహమ్, చికీర్షుః, విద్వాన్—బ్రహ్మవిదుఁ డగు అధికారికుఁడు; అసక్తః = తాను కర్తృత్వాభినివేశము లేనివాఁడును ఫలాపేక్ష లేనివాఁడునై; కర్మ, కుర్యాత్. ఇట్లు చేయుచు, తాను తరించినవాఁడై పరులనుగూడఁ దరింపఁజేయు నని భావము. కర్తృత్వాభినివేశము లేకుండుట ఫలాపేక్ష లేకుండుట సాకల్యవైకల్యములయందు[1] హర్ష విషాదములు లేకుండుట—ఇవి యవిద్వాంసుని కంటె విద్వాంసునియందు వైలక్షణ్యము. నియమమునఁ గర్మానుష్ఠానమో యిద్దఱియందును సమానమే.

మ. ఓయీ! ఈశ్వరుఁడవు నీకు లోకసంగ్రహార్థము కర్మము చేయుచున్నను గర్తృత్వాభిమానము లేకుండుటవలన నేమియు దోషము లేదు. జీవుఁడను నాకో లోకసంగ్రహార్థము కర్మము చేసినయెడఁ గర్తృత్వాభిమానము చే జ్ఞానము

[1] కర్మము సాంగముగా నెఱవేఱినను అంగలోపము కలిగినను.

లోపించు నని యాశంకింపఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—కర్మణి= కర్మమునందు; సక్తాః= కర్తృత్వాభిమానముచేతను ఫలాభిసంధిచేతను అభినివేశముఁగలవారలు; అవిద్వాంసః= అజ్ఞానులు; యథా= ఎట్లు; కుర్వన్తి=కర్మము చేయుచున్నారో; లోకసంగ్రహం చికీర్షుః= లోకసంగ్రహమును జేయఁగోరినట్టి; విద్వాన్= ఆత్మవేత్తయును; తథా= అట్లే; కుర్యాత్. మఱి యేమనఁగా, అసక్తః = కర్తృత్వాభిమానమును ఫలాభిసంధిని జేయనివాఁడై చేయవలయు నని యర్థము. భారత అనుటచే భరతవంశ సంభవుఁడ వగుటచేత, లేక, భా--జ్ఞానమునందు రత—ఆసక్తుఁడ వగుటచేత నీవు శాస్త్రీయజ్ఞానమునకుఁ దగినవాఁడ వని సూచించుచున్నాఁడు.

శ్రీ. అందువలన ఆత్మవిదుఁడు గూడ లోకసంగ్రహముకొఱకుఁ గరుణచేఁ కర్మము చేయవలయు నని యుపసంహరించుచున్నాఁడు.—కర్మణి సక్తాః = అభినివేశముగలవారలై; అజ్ఞాను లెట్లు కర్మము చేయుచున్నారో, ఆసక్తుఁడై విద్వాంసుఁడు గూడ అట్లే చేయవలయును లోకసంగ్రహము చేయఁగోరినవాఁడై.

ప. ఇట్లు మన్ము దృష్టాంతముగా గ్రహించి సత్పురుషులు గూడ ప్రవర్తింపఁ గూడ దని చెప్పుచున్నాఁడు.—అవిద్వాంసః = పరమార్థముఁ దెలియనివారు, కర్మజడులు; కర్మణి; సక్తాః = సాంగకర్మము వలన ఫలము అవశ్యము సిద్ధించు నని నిశ్చయించి ఫలాశచేఁ బ్రవర్తించినవారలై; యథా; కుర్వన్తి. అట్లు; అసక్తుఁడైనను విద్వాంసుఁడు, ఆమార్గము నుల్లంఘింపక, చేయవలయును. ఎట్టివాఁడై ? లోకసంగ్రహం చికీర్షుః.

రా. అవిద్వాంసః = ఆత్మవిషయమున కృత్స్నవిదులు కానివారు; కర్మణి = కర్మమునందు; సక్తాః = అనివార్యసంబంధము గలవారలై, ఆత్మయందు కృత్స్నవిదులు కాకుండుటచే ఆత్మాభ్యాసరూపజ్ఞానయోగమునం దధికారము లేనివారలు కర్మయోగాధికారులు, కర్మయోగమునే, యథా కుర్వన్తి = ఎట్లు ఆత్మదర్శనముకొఱకు చేయుచున్నారో; తథా = అట్లు; విద్వాన్ = ఆత్మయందుఁ గృత్స్నవిదుఁడై; కర్మమునందు, అసక్తః—అసక్తుఁడు, జ్ఞానయోగాధికారయోగ్యుఁడు అయినను; వ్యపదేశ్యుఁ డగు * శిష్టుఁడు, లోకరక్షణముకొఱకు, లోకసంగ్రహమ్ = తనయాచారముచే శిష్టజనులకు, ధర్మనిశ్చయమును; చికీర్షుః= చేయఁ గోరినవాఁడై; కర్మయోగమునే, కుర్యాత్ = చేయవలయును.

---

* కీర్తిమంతుఁడగు.

సంపూర్ణమైన ఆత్మజ్ఞానము లేనివా రగుటచే కర్మమును విడువఁ గూడని కర్మయోగాధికారులు, జ్ఞానయోగమునందు అధికారము లేనివారలై యెట్లు కర్మయోగమునే యనుష్ఠింతురో, అట్లు ఆత్మజ్ఞుఁ డగుటచేఁ దాను జ్ఞానయోగాధికారి యయ్యును వ్యపదిష్టుఁ డగువాఁడు, తనయాచారముఁ జూచి యితరులు ధర్మనిశ్చయము నొందుటకై, కర్మయోగమునే యనుష్ఠింపవలయు నని తా.

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసఙ్గినామ్
జోషయే త్సర్వకర్మాణి విద్వా న్యుక్త స్సమాచరన్. —౨౬

భా. ఇట్లు లోకసంగ్రహముఁ జేయఁగోరునట్టి ఆత్మవిదునకు, నాకుఁ గాని యితరునకుఁ గాని, కర్తవ్యము లేదు లోకసంగ్రహము దక్క, అట్టి యాత్మవిదున కిది యుపదేశింపఁబడుచున్నది.—బుద్ధిభేదమ్= బుద్ధియొక్క భేదము బుద్ధిభేదము, నేనీకర్మము చేయవలయును ఈకర్మముయొక్క ఫలము భుజింపవలయును అనునిశ్చయరూప మయినబుద్ధియొక్క భేదనము—చలింపఁజేయుట బుద్ధిభేదము, దానిని; నజనయేత్ =పుట్టింపఁగూడదు.*; అజ్ఞానామ్= అవివేకులగు; కర్మసఙ్గినామ్ = కర్మమునందాసక్తిగల జనులకు. మఱి యేమి చేయవలయును? సర్వకర్మాణి = సమస్తకర్మములను; జోషయేత్ = చేయింపవలయును. విద్వాన్= జ్ఞాని; తాను ఆయజ్ఞానులు చేయుకర్మములనే, యుక్తః= అభియుక్తుఁడై †; సమాచరన్= చేయుచు.

కర్తృత్వభోక్తృత్వబుద్ధిగలవారలై ఫలాపేక్షతోఁ గర్మము చేయుచుండునట్టి అవివేకులకు "మీరు కర్తలుకారు, భోక్తలును గారు" ఇత్యాది వాక్యములచే బుద్ధిభేదము కల్గింపఁ గూడదు. మ ఱేమనఁగా, తాను బూనికతోఁ గర్మములను జేయుచున్నవాఁడై, వారలచేతనుం గూడ సమస్తకర్మములను యథావిధిఁ జేయింపవలయు నని తాత్పర్యము.

ఆ. జరగినదాని ననువదించి మీఁదిశ్లోకమున కవతారిక చేయుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. పూర్వార్ధమునకు వ్యాఖ్యానము గావించి యుత్తరార్ధమును ప్రశ్నపూర్వకముగా నవతరింపఁజేసి వ్యాఖ్యానముచేయుచున్నారు మఱి యేమి చేయవలయు నని. సర్వకర్మములను జేయింపవలయును వానియందుఁ బ్రీతినిజూపుచు

---

* చేయఁగూడదనుట.

† పూనికగలవాఁడై.

అని శేషము. ఎట్లు చేయింపవలయు నని యాకాంక్ష రాఁగా చెప్పుచున్నారు తాను ఇత్యాదిగా.

౨౯. మఱియును.—చేయఁగూడదని బుద్ధియొక్క-వేఱుపాటును, నజనయేత్=పుట్టింపఁగూడదు. ఎవరికి? అజ్ఞానామ్=అవివేకులకు; కర్మసఙ్గినామ్=ఇది ఫలసాధన మని కర్మమునం దాసక్తులైనవారికి. మఱి యేమి యనఁగా, జోషయేత్ = చేయింపవలయును, సర్వకర్మాణి—యజ్ఞాదులను, విద్వాన్, తాను ఆ యవిద్వాంసుల కర్మమునే, యుక్తః = అభియుక్తుఁడై, సమాచరన్.

౩౦. మఱియును.— విద్వాన్ = బ్రహ్మవేత్త; తాను, యుక్తః= ఆత్మకు దేహాదితాదాత్మ్యము లేదు అను జ్ఞానయోగమునం దున్నవాఁడై; సమాచరన్= కాలోచిత మగుకర్మమును జేయుచు; కర్మసఙ్గినామ్ = కర్మాసక్తులకు, ఫలాపేక్షచే నియమంబునఁ గర్మము చేయువారల కని యర్థము; లేక, దేహేంద్రియాదులచేతనే చేయఁబడుచుండుకర్మములందు నేను కర్తను భోక్తను అనునభిమానము సంగము, అదిగలవారికి; అజ్ఞానామ్=తత్త్వవిదులు కానివారికి, మూఢులకు; తాను పండితుఁ డను నభిమానముచేత, బుద్ధిభేదమ్ = “ జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత ” ఇత్యాది వచనమువలన జ్యోతిష్టోమముచేసి స్వర్గఫలము భుజించెద నను కామనారూప మయిన బుద్ధియేదిగలదో దానికి భేదమును—చలనమును; నజనయేత్—కర్మములు కామనచేఁ జేయఁగూడ దని గాని, స్వర్గాదిఫల మసత్తనిగాని, కర్మాదికము సమస్తమును మిథ్యయనిగాని వారిబుద్ధికి వైకల్యము కలిగింపఁగూడదు. మఱి యేమనఁగా ” అక్షయ్యం హవై చాతుర్మాస్యయాజిన స్సుకృతం భవతి, పశ్యతి పుత్రిం పశ్యతి పౌత్రిమ్, తస్మా ద్ధర్మం పరమం వదన్తి ” ఇత్యాది వచనములు చెప్పి, సర్వకర్మాణి= సమస్తవైదికకర్మములనుగూర్చి; జోషయేత్ = ప్రీతిని గలిగింపవలయును, కర్మఫలమును స్తుతించుటచేఁ గర్మములఁ జేయుట కిచ్ఛనే కలిగింపవలయు నని యర్థము.

౩౧. ఓయీ! కర్మానుష్ఠానముచేతనే లోకసంగ్రహము సేయవలయుఁ గాని తత్త్వజ్ఞానోపదేశముచేఁ గా దనుటకేమి హేతువు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అజ్ఞానామ్ = అవివేకులకు; కర్తృత్వాభిమానముచేతను ఫలాభిసంధి చేతను, కర్మసఙ్గినామ్ = కర్మమునం దభినివేశముగలవారలకు; నేనీకర్మముచేసెదను దీనిఫలమునుగూడ భుజించెదను అను బుద్ధి యేదిగలదో, దానికి భేదమును—ఆత్మ కర్తకాఁడు అను నుపదేశముచే చాలనమును, చేయఁగూడదు. మఱి యేమనఁగా,

యుక్తః= ఎచ్చరికగలవాఁడై; విద్వాన్, లోకసంగ్రహము చేయఁగోరినవాఁడై; అవిద్వాంసులు అధికారులుగాఁగల *, సర్వకర్మాణి, సమాచరన్ = చక్కఁగానాచరించుచు; వారికిశ్రద్ధఁబుట్టించి, జోషయేత్ = ప్రీతిచేసేవించునట్లు సేయవలయును. అనధికారుల కుపదేశించి బుద్ధిభేదము కలిగించినయెడ, కర్మములందు శ్రద్ధతప్పుట వలనను జ్ఞానముకలుగకుండుటవలనను ఉభయభ్రష్టత సంభవించును, కావుననే చెప్పఁబడినది " అజ్ఞస్యార్ధప్రబుద్ధస్య సర్వం బ్రహ్మేతి యో వదేత్ । మహానిరయ జాలేషు సతేన వినియోజితః " ♦ అని.

శ్రీ. ఓయీ! కృపచేఁ దత్త్వజ్ఞానమే యుపదేశించుట యుచితము అనఁగా నట్లు గా దని చెప్పుచున్నాఁడు.—అజ్ఞానామ్, కావుననే, కర్మసఙ్గినామ్ = కర్మాసక్తు లయినవారికి; ఆత్మకర్తృకాఁడు అను నుపదేశముచేత, బుద్ధికి భేదమును— వేఱుపాటును, న జనయేత్. కర్మమునుండి బుద్ధిచాలనము చేయఁగూడదు. మఱేమనఁగా, జోషయేత్ = సేవించునట్లు చేయవలయును, « జుషీ ప్రీతి సేవనయోః » అనుధాతువు, అజ్ఞులచే కర్మములను జేయింపవలయు నని యర్థము. ఎట్లు? యుక్తః= ఎచ్చరికగలవాఁడై, తాను; సమాచరన్. బుద్ధిచాలనము చేసినయెడఁ గర్మములందు శ్రద్ధ నశించుటవలనను జ్ఞానము జనియింపమివలనను ఉభయ భ్రష్టు లగుదు రని భావము.

ప. దయాళువగువాఁడు జనులకుఁ దత్త్వజ్ఞానమునే యేల యుపదేశింపఁడు? అని యాశంకించి అజ్ఞులకుఁ దత్త్వోపదేశమునం దధికారము లేకుండుట వలన నని చెప్పుచున్నాఁడు.—కర్మసఙ్గినామ్ = కర్మమార్గప్రవృత్తు లయిన వారికి; ఆత్మోపదేశముచే, బుద్ధిభేదం నజనయేత్. ఎందువలన ననఁగా. అట్లు చేసినయెడ నుభయభ్రష్టు లగుదురు. అట్లయిన నేమి చేయవలయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—యుక్తః = కర్మకౌశలము గలవాఁడై, విద్వాంసుఁడుగూడ, సమాచరన్ = చక్కఁగా నాచరించుచున్నవాఁడై, సర్వకర్మాణి, యోజయేత్ ‡ = చేయింపవలయును, లేక, జోషయేత్ = సేవింపఁ జేయవలయును.

---

* అవిద్వాంసులకు విధింపఁబడిన.

♦ అజ్ఞునకు సగము తెలిసినవానికి— తెలిసియుఁ దెలియనివానికి సర్వము బ్రహ్మ మని యెవఁడు చెప్పునో వానిచే ఆ యజ్ఞాని మహానరక సమూహములందుఁ బడఁద్రోయఁబడినవాఁ డగును.

‡ వీరి మతమున యోజయేత్ అని పాఠాంతరము.

రా. అజ్ఞానామ్ = ఆత్మవిషయమున అకృత్స్నవిదు లగుటచే జ్ఞానయోగము గ్రహింప నశక్తు లగు ముముక్షువులకు; కర్మసఙ్గినామ్ = అనాదికర్మవాసనచేఁ గర్మమునందే నియతులై కర్మయోగాధికారు లగువారికి; కర్మయోగము కంటె మఱియొకటి యాత్మదర్శనసాధనంబు కల దని, బుద్ధిభేదమ్, నజనయేత్. మఱి యేమనఁగా. విద్వాన్ = ఆత్మవిషయమున కృత్స్నవిదుఁ డగుటచే జ్ఞానయోగసమర్థుఁడుగూడ; పూర్వోక్తరీతిని కర్మయోగమే జ్ఞాననిరపేక్షముగా * ఆత్మదర్శనసాధనము అను బుద్ధితో, యుక్తః = కూడినవాఁడై; కర్మములనే, సమాచరన్; సర్వకర్మములందును, జోషయేత్ = ప్రీతిఁగల్గింపవలయును.

జ్ఞానయోగమునం దధికారములేనివారలై కర్మయోగమునందుమాత్రమే యధికారము గలవార లగు అజ్ఞానులకు, కర్మయోగముకంటె మఱియొకటిజ్ఞానయోగము ఆత్మదర్శనసాధనము కల దని, విద్వాంసుఁడు బుద్ధిభేదము కలిగింపఁగూడదు. మఱి యేమి చేయవలయు ననఁగా, తాను జ్ఞానయోగమునం దధికారము గలవాఁడైనను, కర్మయోగమే ముఖ్యసాధన మనునిశ్చయము గలవాఁడై కర్మముల ననుష్ఠించుచు వారికి సర్వకర్మములందును బ్రీతిగలుగునట్లు చేయవలయు నని తాత్పర్యము.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహఙ్కారవిమూఢాత్మా కర్తా ఽహ మితి మన్యతే. ౨౭

భా. అవిద్వాంసుఁడు అజ్ఞుఁడు ఎట్లు కర్మములందు సక్తుఁడగుచున్నాఁడనఁగాఁ జెప్పుచున్నాఁడు.---ప్రకృతేః = ప్రకృతియనఁగా ప్రధానము సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థ, ఆప్రకృతియొక్క; గుణైః = కార్యకరణరూప వికారములచేత; క్రియమాణి = చేయఁబడుచున్నవి; కర్మాణి=కర్మములు లౌకికములును శాస్త్రీయములునుగూడ; సర్వశః = సర్వప్రకారములచేతను. అహఙ్కారవిమూఢాత్మా= కార్యకరణ సంఘాతమునందు ఆత్మబుద్ధి యహంకారము దానిచే, విమూఢ—నానావిధముగా మోహమునొందిన,ఆత్మా—అంతఃకరణముగలవాఁడు,కార్యకరణధర్ముఁడు కార్యకరణాభిమాని ♦ అవిద్యచేతఁ గర్మములను ఆత్మయందలివిగాఁ

* జ్ఞానయోగము నపేక్షింపకయే.

♦ కార్యకరణముల ధర్మములను దనధర్మములనుగాఁ దలఁచువాఁడు, కార్యకరణములే తా నని తలఁచువాఁడు.

దలంచి * ఆయాకర్మములకు, అహం కర్తా = నేను కర్తను; ఇతి = అని; మన్యతే = తలంచుచున్నాఁడు.

సమస్తకర్మములును సర్వప్రకారములచేతనుగూడ, సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థయగు ప్రకృతియొక్క కార్యకరణరూపవికారములచేతనే చేయఁబడుచున్నవి. అవిద్వాంసుఁడు అవిద్యచే నీకార్యకరణసంఘాత మునం ♦ దాత్మబుద్ధిగలవాఁడు కావున దానిచే వివేకములేనివాఁడై · కార్యకరణంబులను ఆత్మగాను తద్ధర్మములను ఆత్మధర్మములుగాను దలంచి ఆకర్మములను తాను జేసినట్లు తలఁచుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. అజ్ఞానాం కర్మ సఙ్గినామ్ అని చెప్పఁబడినది, ఆశ్లోకముతో మీఁది శ్లోకమునకు సంగతి చెప్పుచున్నారు అవిద్వాంసుఁడు ఇత్యాదిగా. కర్తృత్వము ఆత్మకు వాస్తవ మని యంగీకరించుటవలన విద్వాంసుం డెట్లు చేయుచుండియే కర్తృత్వాభావము తెలియఁ గలండనియాశంకించి చెప్పుచున్నాఁ డీశ్లోకముచేత. ** కర్మములయందు అవిద్వాంసుఁడు సక్తుఁ డగు విధముఁ బ్రకటించుటకై వ్యాఖ్యానము చేయుచున్నారు ప్రకృతేః ఇత్యాదిగా. ప్రధానము అనుటచే మాయాశక్తి చెప్పఁబడుచున్నది. అవిద్యచేత అనుదానికి ఉభయస్థలంబులను అన్వయము §

హ. ఆత్మకీ కర్తృత్వము పారమార్థికము కాదు, ఎట్లనఁగా.—ప్రకృతేః=అవ్యక్తముయొక్క; గుణైః=సత్త్వరజస్తమోగుణములచేత; క్రియమాణాని = చేయఁబడుచున్నవి; కర్మాణి = లౌకికకర్మములును వైదికకర్మములును; సర్వశః = అన్నివిధములయినవియు. అహఙ్కారవిమూఢాత్మా = అవ్యక్తకరణసంఘాతరూపమయిన అనాత్మయందు నేనను బుద్ధి అహంకారము, ఆయహంకారముచే విమూఢమయిన ఆత్మ ⁋ గలవాఁడు; ఈకర్మములకు, అహం కర్తా ఇతి = నేనుకర్తనని; మన్యతే.

---

* ఆత్మచేఁ జేయఁబడునవిగాఁ దలంచి.

♦ కార్యకరణ సంఘాతము—శరీరము.

** కర్తృత్వమువాస్తవము కా దని చెప్పుచున్నాఁడని భావము.

§ "కార్యకరణధర్ముఁడు కార్యకరణాభిమాని" యను పూర్వమునకును "కర్మములను ఆత్మయందలివిగాఁ దలంచి" అను నుత్తరస్థలమునకు అన్వయము.

⁋ అంతఃకరణము.

శం. మూఢులకే కర్మము కాని పండితులకు లేదని సూచించుటకై "అజ్ఞానాం కర్మసఙ్గినామ్" అని చెప్పఁబడినది. కర్మసఙ్గినామ్ అని చెప్పినదానినే చక్కఁగా స్పష్టీకరించుచున్నాఁడు.—ప్రకృతేః=ప్రకృతియనఁగా మాయ, సత్త్వాది గుణద్వారమున ఆకాశాదిమహాభూతరూపమునఁ బరిణమించినది, ఆప్రకృతియొక్క; గుణములు—కార్యభూతము లయిన దేహేంద్రియాదులు వానిచేతనే, ఒకప్పుడును ఆత్మచేతఁగాదు; క్రియమాణాని = చేయఁబడుచున్న; సర్వశః = సమస్తములైన; కర్మాణి = కర్మములనుగూర్చి; అవిద్వాంసుఁడు, అహఙ్కారవిమూఢాత్మా = తన యవిద్యచే దేహేంద్రియాదిక మగు అనాత్మయందు నేను అనుబుద్ధి అహంకారము, దానిచేత, విమూఢము—విపరీతగ్రహణము * నొందిన, ఆత్మ—మనస్సుగలవాఁడై, లేక, విమూఢ అనుచో అంతర్గర్భిత మయిన ణిచ్ ప్రత్యయము—దేహేంద్రియా దులందు అహంకారముచే విమోహితము—మోహింపఁజేయఁబడినది—నేను జూచు వాఁడను నేను స్పృశించువాఁడను నేను వినువాఁడను నేను మూర్కొనువాఁడను చవి చూచువాఁడను తలంచువాఁడను ఎఱుంగువాఁడను చేయువాఁడను భుజించు వాఁడను అని అన్యో యుపాధుల సంబంధములచేఁ గల్గింపఁబడిన విపరీత వృత్తు లకు విషయముగాఁ జేయఁబడినది ఆత్మ—ప్రత్యగాత్మ యెవ్వనిచేతనో అట్టివాఁడై; లేక, దేహేంద్రియాదులం దహంకారముచే విమోహితము—అహం ప్రత్యయార్థ మని తెలియఁబడనిది ఆత్మ యెవ్వనిచేతనో అట్టివాఁడై; కర్తాఅహమ్ ఇతిమన్యతే— దుష్టాదుష్ట ప్రారబ్ధవశమున దేహేంద్రియములచేతనే దుష్టకర్మములును అదుష్ట కర్మములును జేయఁబడుచుండఁగా అకర్తగానే యున్న తన్ను నేను బాపముఁ జేసి తిని బుణ్యము జేసితి నని ఆయాకర్మములకుఁ గర్తనుగాఁ దలంచుచున్నాఁ డని యర్థము.

మ. విద్వాంసునకును అవిద్వాంసునకును కర్మానుష్ఠానము సమమైనను కర్తృత్వాభిమానమువలనను అది లేమివలనను విశేషము చూపుటకై "సక్తాః కర్మ-ణ్యవిద్వాంసః" అను శ్లోకముయొక్క యర్థమును వివరించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ప్రకృతి అనఁగా మాయ యనఁబడునది సత్త్వరజస్తమోగుణ మయము మిథ్యాజ్ఞానాత్మకము పారమేశ్వరశక్తి, ఆప్రకృతియొక్క; గుణైః = కార్యకరణరూపములగు వికారములచేత; క్రియమాణాని; కర్మాణి = లౌకికములు

* అన్యథాజ్ఞానము.

వైదికములు నగు కర్మములను; సర్వశః = సర్వప్రకారములచేతను; అహఙ్కార విమూఢాత్మా = అహంకారముచేత— కార్యకరణ సంఘాతమునం దాత్మబుద్ధిచేత, విమూఢము—స్వరూప వివేకమున కసమర్థ మగు, ఆత్మ—అంతఃకరణము గలవాఁడు, అనాత్మయం దాత్మాభిమానము గలవాఁడు; ఆ కర్మములను, కర్తా అహమ్= చేయువాఁడను నేను; ఇతి=అని; మన్యతే=తలంచు చున్నాఁడు కర్తృత్వాధ్యాసము చేత. కర్తా అనునది తృన్ప్రత్యయాంతము. అందుచే "న లోకా వ్యయ నిష్ఠా ఖలర్థ తృనామ్" అను సూత్రముచే షష్ఠి నిషిద్ధము.

శ్రీ. ఓయీ! విద్వాంసుఁడుగూడఁ గర్మము చేయవలయునేని, అప్పుడు విద్వదవిద్వాంసుల కేమి విశేషము? అని యాశంకించి యిద్దఱిలో విశేషముఁ జూపుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ప్రకృతేః గుణైః = ప్రకృతికార్యము లగు నింద్రియములచేత; సర్వప్రకారముల చేతను, క్రియమాణాని కర్మాణి = చేయఁబడుచున్న యేకర్మములు గలవో వానిని; అహం కర్తా ఇతి = నేనే చేయుచున్నానని; మన్యతే. అందుకు హేతువు—అహంకారము చేత—ఇంద్రియములం దాత్మాధ్యాసముచేత విమూఢమైన ఆత్మ—బుద్ధి గలవాఁడు.

ప. ఇఁకఁ గర్మము చేయుటయందు అందఱకును విధి సమానమగునేని అప్పుడు విద్వాంసులకును అవిద్వాంసులకును ఏమి భేదము? అనఁగాఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ప్రకృతేర్గుణైః=ప్రకృతికార్యములగునింద్రియములచేత; క్రియమాణాని=చేయఁబడుచున్న; కర్మాణి సర్వశః=సర్వకర్మములను; నేనేచేయుచున్నాను అని; అహంకారముచేత—ఇంద్రియములం దాత్మాధ్యాసముచేత, విమూఢమైన ఆత్మ—బుద్ధిగలవాఁడు, అహం కర్తేతి మన్యతే—కర్తృత్వాభినివేశము గలవాఁ డగుచున్నాఁడు, అందుచే బంధము నొందుచున్నాఁడు.

రా. కర్మయోగము ననుష్ఠించు విద్వాంసునకును అవిద్వాంసునకును విశేషముఁ బ్రదర్శించుచు ఆత్మ అకర్తయని యనుసంధించువిధమును కర్మయోగాపేక్షితము నుపదేశించుచున్నాఁడు.—ప్రకృతేః = ప్రకృతియొక్క; గుణైః = సత్త్వాదిగుణములచేత; ఆగుణముల కనుగుణముగా, క్రియమాణాని = చేయఁబడుచున్న; కర్మాణి = కర్మములనుగూర్చి; అహంకార విమూఢాత్ముఁడు; అహం కర్తా ఇతి = నేను కర్త నని; మన్యతే. అహంకారముచే విమూఢ మయిన ఆత్మ గలవాఁడు అహంకార విమూఢాత్ముఁడు. అహంకార మనఁగా అహమర్థము కాని

ప్రకృతియం దహామభిమానము, దానిచేఁ దెలియఁబడని ఆత్మస్వరూపము గల వాఁడు గుణకర్మములయెడ నేను గర్త నని తలంచుచున్నాఁ డని యర్థము.

ప్రకృతిగుణములైన సత్త్వాదులే స్వానురూపముగా నానావిధములఁ గర్మములు చేయుచున్నవి. ప్రకృతినే తా నని తలఁచి యందుచే ఆత్మస్వరూపము దెలియకుండువాఁడు ఆ ప్రకృతిగుణములు చేయుకర్మములను దాను జేయునట్లు తలంచుచున్నాఁ డని తాత్పర్యము.

మూ. అవిద్వాంసునకును విద్వాంసునకును గర్మవైలక్షణ్యముఁ జెప్పుచున్నాఁడు.—ప్రకృతేః గుణైః = ఇంద్రియాదులచేత. ప్రకృత్యపేక్షచే గుణభూతములు ♦ గదా అవి. తత్సంబంధులు * గూడ. లేదు గదా ప్రతిబింబమునకుఁ గర్మము. ❡

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే. ౨౮

భా. ఇఁక విద్వాంసుఁ డగు.—తత్త్వవిత్తు = తత్త్వవిదుఁడో; మహాబాహో = గొప్ప చేతులు గలవాఁడా! దేనియొక్క తత్త్వవిదుఁడు? గుణకర్మ విభాగయోః—గుణవిభాగముయొక్కయుఁ గర్మవిభాగముయొక్కయు, తత్త్వవిదుఁడని యర్థము. గుణాః = కరణములు§; గుణేషు = విషయములందు; వర్తన్తే = వర్తించుచున్నవి, కాదు ఆత్మ; ఇతి = అని; మత్వా = తెలిసి; నసజ్జతే = సక్తిని చేయఁడు. ♦♦

అర్జునా! గుణవిభాగము యొక్కయుఁ గర్మవిభాగము యొక్కయుతత్త్వము దెలిసినవిద్వాంసుఁడుమాత్రము, కరణములే స్వవిషయములందుఁ బ్రవర్తించి సమస్తకర్మములు చేయుచున్న వని తెలిసినవాఁడై, ఆకర్మములందుఁ గర్తృత్వాభిమానము నొందకుండు నని తాత్పర్యము.

---

♦ అప్రధానములు.

* ప్రకృతికార్యములు.

❡ అందువలన ప్రకృతి గుణములే కర్మము చేయునవి యని భావము.

§ ఇంద్రియములు.

♦♦ నేను గర్త నను తలంపును చేయఁడు.

ఆం. అజ్ఞుఁడు కర్మములందు సక్తుఁడగు నని చెప్పి విద్వాంసుఁడట్లాసక్తుఁడు కాఁడని చెప్పుచున్నారు ఇక విద్వాంసుఁడగు అని. తత్త్వవిదుఁడు—తత్త్వమును—యాథార్థ్యము నెఱింగినవాఁడు. తు శబ్దము అజ్ఞునికంటె విలక్షణుని నిర్దేశించుచున్నది. ప్రశ్నపూర్వకముగా రెండవపాదము నవతరింపఁజేసి వ్యాఖ్యానము చేయుచున్నాడు దేనియొక్క ఇత్యాదిగా. గుణములే గుణములందు వర్తించుట అయుక్తము అవి నిర్గుణము లగుటవలన, అని యాశంకించి విభజించుచున్నారు గుణాః ఇత్యాదిగా. కార్యకరణములు మాత్రమే విషయములందుఁ బ్రవర్తించును ఆత్మయో ప్రవర్తింపఁడు కూటస్థుఁడగుటవలన, అని తెలిసి తత్త్వవిదుఁడు కర్మములందు దృఢతరం బగు కర్తృత్వాభిమానముఁ జేయఁడని యర్థము.

హ. తత్త్వవిత్ = అకర్త్రాత్మస్వరూపము నెఱింగినవాఁడు; గుణములు—సత్త్వాదులు. కర్త లగు గుణములయొక్కయు కార్యభూతము లయిన కర్మములయొక్కయు. గుణాః = సత్త్వరజస్తమస్సులు; గుణేషు = వానికార్యము లయిన గమనాగమనాది కర్మములందు; కర్తలై, వర్తన్తే. ఇతి = అనితలంచి; నసజ్జతే—నేనుకర్త నని తలంపఁడని యర్థము.

శం. «విద్వాన్ యుక్తః» అని విద్వాంసుఁడు తనకు దేహేంద్రియతత్కర్మసంబంధము లే దని యెఱింగినవాఁ డనుట చెప్పఁబడినది. అది యిప్పుడు స్పష్టీకరింపఁబడుచున్నది.—గుణకర్మవిభాగయోః= గుణములు—చక్షురాదులు వాగాదులు బుద్ధియు మనస్సును, అందు చక్షుశ్శ్రోత్రాదులకే దర్శనశ్రవణాది కర్మము, వాక్పాణిప్రభృతులకే వచనాదానాదికర్మము, బుద్ధికే అహంకరణ కర్మము, మనస్సునకే సంకల్పనకర్మము, ఆత్మకో కూటస్థాసంగచిద్రూపంబున నుండుటమాత్రమే, ఇట్లు గుణవిభాగము కర్మవిభాగము, ఆగుణకర్మ విభాగములయొక్కయు ఆత్మయొక్కయు; తత్త్వవిత్ = యాథాత్మ్యమును జక్కగాఁ దెలిసినవిద్వాంసుఁడు, తు శబ్దము అవిద్వాంసుని వ్యావర్తించుచున్నది; సర్వకర్మములందును, గుణాః—చక్షురాదులే, గుణేషు—రూపాదులందు; వర్తన్తే—వాగాదులే వచనాదులందు వర్తించుచున్నవి, బుద్ధియే ఆకర్మములకు నేను కర్త నని యహంకరించుచున్నది, నేనో వినను జూడను వచింపను చేయను పోవను, మ ఱేమనఁగా కూటస్థాసంగచిద్రూపంబున సర్వదా నిష్క్రియుండనై యే యున్నవాఁడను అని; మత్వా = నిశ్చయించి; వానికర్మములందు, నసజ్జతే—నేను నాది యను నభిమానము వహింపఁ డని యర్థము.

**మ.** విద్వాంసుఁడో అట్లు తలంపఁడని చెప్పుచున్నాఁడు.—తత్త్వవిత్ = తత్త్వమును—యాథాత్మ్యమును ఎఱింగినవాఁడు, తు శబ్దముచే అజ్ఞానికంటె వైలక్షణ్యము చెప్పఁబడుచున్నది; దేనియొక్క తత్త్వము ననఁగాఁ జెప్పుచున్నాఁడు—గుణకర్మవిభాగయోః—గుణములు దేహేంద్రియాంతఃకరణములు అహంకారాస్పదములు, కర్మములు వానియొక్క వ్యాపారములు మమకారాస్పదములు *, గుణకర్మ అని ద్వంద్వైకవద్భావము ♦, విభజింపఁబడుచున్నది—వికారు లగు సర్వజడములకును భాసకం బగుటచే వేఱు అగుచున్నది అనువృత్త్యత్తిచే విభాగముఅనఁగా స్వప్రకాశజ్ఞానరూపము అసంగముఅగు ఆత్మ, గుణకర్మమును విభాగమును అని ద్వంద్వసమాసము, భాస్యభాసకములు జడచైతన్యములు వికారినిర్వికారములు అగు ఆగుణకర్మవిభాగములయొక్క; తత్త్వమును యాథాత్మ్యమును ఎవ్వఁడు ఎఱుంగుచున్నాఁడో అతఁడు; గుణాః = కరణములు; గుణేషు= విషయములందు; ప్రవర్తించుచున్నవి వికారు లగుటవలన, కాని నిర్వికారుం డగు ఆత్మ ప్రవర్తింపఁడని, మత్వా= తెలిసి; న సజ్జతే = సక్తిని—కర్తృత్వాభినివేశమును అతత్త్వవిదునియట్లు చేయఁడు. ఓమహాబాహుఁడా ! అని సంబోధించుటచే సాముద్రికోక్త సత్పురుష లక్షణము గలవాఁడ వగుటవలన ఇతరజనులవలె నీవు అవివేకివి కాఁ దగ దని సూచించుచున్నాఁడు. గుణకర్మవిభాగయోః = గుణవిభాగముయొక్కయు కర్మవిభాగముయొక్కయు, తత్త్వము నెఱింగినవాఁ డనియు నర్థము చెప్పవచ్చును. ఈ పక్షమునందు గుణకర్మణోః అన్నమాత్రముచేతనే నిర్వాహమగుటవలన విభాగపదమునకుఁ బ్రయోజనము చింతనీయము.

**శ్రీ.** విద్వాంసుఁడో అట్లు తలంపఁ డని చెప్పుచున్నాఁడు.—నేను గుణాత్మకుఁ డను కాను అని గుణములనుండి ఆత్మకు విభాగము, నాకుఁ గర్మములు లేవు అని కర్మములనుండియు ఆత్మకు విభాగము, ఆగుణవిభాగముయొక్కయు కర్మవిభాగముయొక్కయు తత్త్వము నెవ్వఁ డెఱుంగుచున్నాఁడో, వాఁడు మాత్రము, న సజ్జతే = కర్తృత్వాభినివేశము నొందఁడు. అందుకు హేతువు—గుణాః = ఇంద్రియములు; గుణేషు = విషయములందు; వర్తన్తే; నేను కాను, అని, మత్వా.

**ప.** ఇఁక జ్ఞానికిఁ గల విశేషముఁ జెప్పుచున్నాఁడు.—గుణకర్మవిభాగయోః తత్త్వవిత్—నేను గుణాత్మకుఁడను గాను అని గుణములనుండి ఆత్మకు

* ఆస్పదము—చోటు, విషయము.

♦ గుణములును కర్మములును అని యర్థము.

విభాగము—విభక్తత, నాకు లేవు కర్మము లని కర్మములనుండి ఆత్మకు విభాగము, వానియొక్క తత్త్వము నెఱింగినవాఁడు. గుణాః = ఇంద్రియములు; గుణేషు = విషయములందు; వర్తన్తే = స్వభావమునఁ బ్రవర్తించుచున్నవి. అని; మత్వా; న సజ్జతే = కర్తృత్వాభినివేశమును జేయఁడు. అట్లు చెప్పఁబడినది— "ధూలి ధూమాభ్రదై ర్యద్వన్మలినం క్రియతే నభః । పరామృష్ట స్తథా వాత్మా విశుద్ధః ప్రాకృతై ర్గుణైః" * అని.

రా. గుణకర్మవిభాగయోః = సత్త్వాదిగుణముల విభాగమునందును వాని కర్మముల విభాగమునందును; తత్త్వవిత్ = తత్త్వముఁ దెలిసినవాఁడు; గుణాః = సత్త్వాదిగుణములు; గుణేషు = తమ గుణములందు—తమ కార్యములందు; వర్తన్తే; ఇతి; మత్వా; గుణకర్మములవిషయమై నేను గర్త నని, న సజ్జతే.

సత్త్వాదిగుణములను వానికర్మములను విభజించి తత్త్వము నెఱింగిన వాఁడు సత్త్వాదిగుణములు స్వకార్యములందు వర్తించుచున్న వని తెలిసి తాను తత్కార్యముల విషయ మందు కర్తృత్వాభిమానము వహింపఁ డని తాత్పర్యము.

మా. గుణభేదము యొక్కయు కర్మభేదము యొక్కయు, తత్త్వవిత్. గుణాః = ఇంద్రియాదులు; గుణేషు = విషయములందు.

ప్రకృతే ర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు
తా నకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవి న్న విచాలయేత్. —౨౯

భా. ఎవ్వరు మఱి.—ప్రకృతేః=ప్రకృతియొక్క; గుణసమ్మూఢాః= గుణములచే చక్కగా మూఢులై; గుణకర్మసు = గుణములయొక్క కర్మములందు; మేము కర్మము చేయుచున్నాము ఫలముకొఱకు అని, సజ్జన్తే సక్తిని బొందుచున్నారో. తాన్ = ఆ కర్మసంగులను; అకృత్స్నవిదః— కర్మఫలమున్మాత్రముచూచువారిని; మన్దాన్= మందబుద్ధులను; కృత్స్నవిత్ = ఆత్మవేత్త; తాను, న విచాలయేత్—బుద్ధి భేదము చేయుటచే చాలనము, దానిఁ జేయఁగూడ దని యర్థము.

* దుమ్ము పొగ మేఘము వీనిచే నెట్లు ఆకాశము మలినముగాఁ జేయఁబడునో అట్లే ప్రాకృత గుణములచే—ఇంద్రియములచే విశుద్ధాత్మగూడ పరామర్శింపఁ బడియున్నాఁడు—కప్పఁబడియున్నాఁడు, వాస్తవమున ఆకాశము దుమ్ము మొదలగువానితో సంబంధములేకయె యుండునట్లు ఆత్మయు గుణములతో అంటకయె యున్నాఁ డని భావము.

ప్రకృతి వికారము లయిన దేహాదులచే సమ్మోహితులై అవియే ఆత్మ యని తలఁచి అజ్ఞానులు ఆదేహాదుల కర్మములను తాము చేసినట్లును దత్ఫలము తాము పొందునట్లును అభినివేశము వహించుచున్నారు. వారు అనాత్మజ్ఞులును మందబుద్ధులును గావున వారికి ఆత్మజ్ఞుఁ డగువాఁడు బుద్ధిభేదము కలిగింపఁ గూడ దని తాత్పర్యము.

ఆ. విద్వాంసుఁడు అవిద్వాంసుఁడు అను నీ యిద్దఱను నుద్దేశించి విద్వాంసుం డవిద్వాంసునకు బుద్ధిభేదము చేయరా దని యుపసంహరించుచున్నారు ఎవ్వరు మఱి ఇత్యాదిగా. ప్రకృతియొక్క గుణములచే—దేహాది వికారములచే సమ్మూఢు లగువారు—వానినేఆత్మనుగాఁ దలంచువారు ఎవ్వరు గలరో వారు ఆగుణములయొక్కయే—దేహాదులయొక్కయే కర్మములందు—వ్యాపారములందు సక్తిని—దృఢతర మైన ఆత్మీయ బుద్ధిని ౧ చేయుచున్నా రని చెప్పుచున్నాఁడు పూర్వార్ధముచేత. అట్టి అనాత్మవిదులకుఁ దాను ఆత్మవిదుఁడు బుద్ధిభేదము కలిగింపఁ గూడ దని చెప్పుచున్నాఁడు ఉత్తరార్ధముచేత.

హ. ఇఁక నెవ్వరు.—ప్రకృతేః; గుణసమ్మూఢాః = గుణములచే మేము కర్తల మని సమ్మూఢులై; గుణకర్మసు = గుణములయొక్క కర్మములందు; మేము కర్మము చేయుచున్నాము ఫలముకొఱ కని, సజ్జన్తే—తలంచుచున్నారో; తాన్ = అట్టివారలను; అకృత్స్నవిదః — కర్మఫలమును మాత్రమే చూచువారలను; మన్దాన్ = మందప్రజ్ఞులను; కృత్స్నవిత్ = సర్వమును దెలిసినవాఁడు, బ్రహ్మవిదుఁడు; నవిచాలయేత్—బుద్ధి భేదము చేయుటయె చాలనము, దానిఁ జేయఁ గూడ దని యర్థము.

శం. ఇట్లు దేహేంద్రియాదులే కర్మములు చేయుచుండఁగాఁ దాను అకర్తనై యున్నా నని తెలిసినవాఁ డగుటచేత విద్వాంసుఁడు తనకు విలక్షణులై కర్మపరులైన యజ్ఞులను బ్రమాదమున నైనను * చలింపఁ జేయఁగూడ దని చెప్పినయర్థమునే మరల దృఢీకరించుచున్నాఁడు.—అందు కర్మలయందు విద్వాంసులకంటె వైలక్షణ్యముఁ జూపుచున్నాఁడు ప్రకృతే ర్గుణసమ్మూఢాః అని. ప్రకృతేః = మున్ను చెప్పిన లక్షణము గల ప్రకృతియొక్క, గుణములందు—కార్యము లయిన దేహేం

---

౧ తమవి యనుబుద్ధిని.

* ఏమఱుపాటుననైనను.

్రియాదులందు, అహంబుద్ధిచే ♦ సమ్మూఢులు తాదాత్మ్యమును బొందిన పామరులు, తాము; గుణకర్మసు = గుణములచేత–శ్రోత్రాదులచేతను వాగాదులచేతను జేయఁబడుచున్న కర్మములందు–శ్రవణ దర్శన వచనా దాన భోజనాదులందు; నేనే శ్రోతను ద్రష్టను వక్తను దాతను కర్తను భోక్తను అని, సజ్జన్తే = అభినివేశము చేయుచున్నారు. ఈ కర్ములను, అకృత్స్నవిదః = బ్రహ్మవిదులు కాని వారలను, అజ్ఞులను; కృత్స్నవిత్ = మున్ను చెప్పిన లక్షణము గల బ్రహ్మవిదుఁడు; న విచాలయేత్–కామనచే కర్మము చేయఁగూడ దని గాని, కర్మఫలము అనర్థని కాని, కర్త్రాదికము మిథ్యయని గాని, నీవు బ్రహ్మమే నీకు ఏదియుఁ గర్తవ్యము లే దని గాని విక్షేపము నొందింపఁ గూడదు, మ రేమనఁగా కర్మములను స్తుతించుచు కర్మములందే ప్రవర్తించునట్లు చేయవలయు నని యర్థము.

మ. ఇట్లు విద్వాంసునకును అవిద్వాంసునకును గర్మానుష్ఠానము సమానమగుటచే విద్వాంసుఁడు అవిద్వాంసునకు బుద్ధిభేదము చేయఁగూడ దని చెప్పినదాని నుపసంహరించుచున్నాఁడు —ప్రకృతేః = మున్ను చెప్పిన మాయయొక్క; గుణములచేత–కార్యము లగుటచే ధర్మము లగు దేహాది వికారములచేత, చక్కగా మూఢులు–స్వరూపస్ఫూర్తి లేమిచే వానినే ఆత్మగాఁ దలఁచుచున్నవారు; ఆ గుణముల యొక్కయే–దేహేంద్రియాంతఃకరణములయొక్కయే, కర్మములందు–వ్యాపారములందు; సజ్జన్తే = సక్తిని–మేము కర్మము చేయుచున్నాము ఫలముకొఱ కని దృఢతర మైన ఆత్మీయబుద్ధిని, ఎవరు చేయుచున్నారో; తాన్ = ఆ కర్మసంగులను; అకృత్స్నవిదః = అనాత్మాభిమానులను; మన్దాన్ = చిత్తశుద్ధి లేనివార లగుటచే జ్ఞానాధికారము పొందనివారలను; కృత్స్నవిత్ = పరిపూర్ణాత్మవేత్త; తాను, నవిచాలయేత్–కర్మశ్రద్ధనుండి తొలఁగింపఁగూడ దని యర్థము. ఎవ్వరు మఱి అమందులో–అంతఃకరణ శుద్ధి గలవారలో వారు తమ యంతనె వివేకోదయమునుచే చలియింతురు * జ్ఞానాధికారము నొందినవారలై యని యభిప్రాయము. కృత్స్నా ఽకృత్స్న శబ్దములు ఆత్మా ఽనాత్మ పరము లని శ్రుత్యర్థము ననుసరించి వార్తికకారులచే వ్యాఖ్యానము చేయఁబడియె.—“ స దేవేత్యాది వాక్యేభ్యః కృత్స్నం వస్తు యతో ఽద్వయమ్ । సమ్భవ స్త ద్విరుద్ధస్య కుతో ఽకృత్స్నస్య వస్తునః ॥ యస్మిన్ దృష్టే ఽప్య దృష్టో ఽర్థ స్స తదన్య శ్చ శిష్యతే ! తథా ఽదృష్టే ఽపి దృష్టస్యా

♦ అవి నేను అను బుద్ధిచే.

* కర్మశ్రద్ధ లేనివా రగుదురు.

దకృత్స్నం స్త్వన్య దుచ్యతే" * అని. అనాత్మ అవయవములు గలదియు అనేకధర్మములు గలదియు నగుటవలన, ఒకానొక ధర్మముతోఁ గాని యొకానొక యవయవముతోఁగాని విశిష్ట మగు అనాత్మ వస్తువు ఘటాదికము జ్ఞాతమైనను మఱియొక ధర్మముతోఁ గాని మఱియొక అవయవముతోఁ గాని విశిష్ట మయిన ఆ ఘటాదికమే అజ్ఞాతమై మిగిలియుండును. తదితర మయిన పటాదికమో అజ్ఞాతమై శేషించియుండనే యున్నది. అట్లు ఆ ఘటాదికము అజ్ఞాత మైనను, అవయవాంతర ధర్మాంతర విశిష్ట మగు నాఘటాదికమును బటాదికమును జ్ఞాతము కా వచ్చును. ఇట్లు అది జ్ఞాత మయినను అదియు తదితరమును అజ్ఞాత మగుటవలనను అది అజ్ఞాత మైనను అదియుఁ దదితరమును జ్ఞాత మగుటవలనను అది అకృత్స్న మని చెప్పఁబడుచున్నది. కృత్స్నవస్తువో అద్వితీయాత్మయే యగును. అది జ్ఞాతమైనప్పుడు అజ్ఞాతమేదియు శేషింప కుండుటవలన నని శ్లోకద్వయమున కర్థము.

శ్రీ. న బుద్ధిభేదం జనయేత్ అని చెప్పినదాని నుపసంహరించుచున్నాఁడు.—ఎవరు ప్రకృతియొక్క సత్త్వాదిగుణములచే సమ్మూఢులై, గుణములందును--ఇంద్రియములందును, వానికర్మములందును, సజ్జన్తే, మేము కర్మముచేయుచున్నా మని. వారలను అకృత్స్నవిదులను మందమతులను, కృత్స్నవిత్ = సర్వజ్ఞుఁడు, నవిచాలయేత్.

ప. ఇఁక "న బుద్ధిభేదం జనయేత్" అని చెప్పినదాని నుపసంహరించుచున్నాఁడు.—ప్రకృతేః; గుణములచేత—సత్త్వాదులచేత, సమ్మూఢులు—మోహము నొందినవారై; గుణకర్మసు = గుణములందును—ఇంద్రియములందును, తత్కర్మములందును—దర్శనశ్రవణాదులందును; ఎవ్వరు, సజ్జన్తే. తాన్; అకృత్స్నవిదః = ఒక్కొకయింద్రియము నుపాసించువారలను; కృత్స్నవిత్ = కృత్స్నమును—సర్వేంద్రియచాలకుం డగు ఆత్మను ఎఱింగినవాఁడు; నవిచాలయేత్ = కర్మములను—కరచరణవ్యాపారములను జేయుచుండుపురుషులను భ్రష్టులనుగాఁ జేయఁగూడదు. శతపథశ్రుతియును—"స యో౽త ఏకైకముపాస్తే న సవేదా౽కృత్స్నో హ్యేషో

* "స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్" ఇత్యాది వాక్యములవలన వస్తువు కృత్స్నము అద్వితీయ మని చెప్పఁబడి యుండుటవలన దానికి విరుద్ధ మయిన అకృత్స్నవస్తువునకు సంభవము ఎట్లగును? ఏది జ్ఞాత మైనను అదియు తద్భిన్నమును అజ్ఞాతమై శేషించునో అట్లు ఏది అజ్ఞాతమైనను అదియు తద్భిన్నముగూడ జ్ఞాత మగునో అట్టిది అకృత్స్న మని చెప్పఁబడుచున్నది.

త ఏకైకేన భవత్యాత్మేత్యేవోపాసీతాఽత్ర హ్యేతే సర్వ ఏకం భవన్తి తదేత త్పదనీయ మస్య సర్వస్య య దయ మాత్మా ఽనేన హ్యేత త్సర్వం వేద యథాహ వై పదేనా ఽనువిన్దే దేవం కీర్తిం శ్లోకం విన్దతే య ఏవం వేద" అని. భాష్యము—పూర్వశ్రుతియందు "ప్రాణ న్నేవ ప్రాణోనామభవతి" * ఇత్యాదిగా సర్వేంద్రియములును ఆత్మయొక్క కర్మములకే నామము లగుచున్న వని చెప్పఁబడినది. అది యుక్తము గాదు. యః—ఎవఁడు; ఏకైకమ్ ఉపాస్తే—ఆత్మానభిజ్ఞుఁడై యొక్కొకయింద్రియముయొక్క యుపాసనను జేయుచున్నాఁడో; సః—అతఁడు, నవేద—ఎఱుంగఁడు. ఏషః—ఇతఁడు; ఏకైకేన = ఒక్కొకయింద్రియముచేత; అకృత్స్నో భవతి ♦. ఇఁక ఏవిధమున కృత్స్నము అగుచున్నాఁ డనఁగాఁ జెప్పుచున్నాఁడు—సర్వేంద్రియములును తమతమవిషయముః గ్రహించుచునుండఁగా, పదార్థభాసకుఁడు ఈయాత్మ యనియే యుపాసింపవలయును. ఎందువలన ననఁగా. అత్ర—ఈయాత్మయందు, ఏతే—ఈసర్వవిషయములును ప్రతీతిరూపంబున ఏకమగుచున్నవి. తత్—అది; ఏతత్పదనీయమ్—ఈయాత్మయొక్క తెలియవలసిన స్థానము. ఏకారణమువలన ననఁగా. ఈసమస్తజగత్తునకును, ఇతఁడు ఆత్మ. అనేన ఈయాత్మచేత; సర్వమ్, వేద—ఎఱుంగుచున్నాఁడు. కావున రూపరసాదిసర్వపదార్థములు గ్రహించునపుడును ప్రతీతిరూపంబున ఆత్మయె తెలియవచ్చుచున్నాఁడు. అందుకు దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు.—యథా—ఎట్లు; పదేన—గోపదము ననుసరించి పోవువానికి గోవుయొక్కజ్ఞానము కలుగునో అట్లు. ఇట్లు ఎవ్వఁడు ఎఱుంగుచున్నాఁడో అతఁడు కీర్తిని, శ్లోకమ్—యశస్సునుగూడ; విన్దతే—పొందుచున్నాఁడు. అట్లు చెప్పఁబడినది తైత్తిరీయకమునందుఁగూడ. "అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానా మేకస్సన్ బహుధా విచారః, శతం శుక్రాణి యత్రైకం భవన్తి, సర్వే వేదా యత్రైకం భవన్తి, అత్రో బహుప్రకార మిన్ద్రియమార్గై ర్విచరన్తి" అని. శుక్రాణి—ఇంద్రియవృత్తులు. శేషము స్పష్టము.

రా. అకృత్స్నవిదులో ఆత్మదర్శనమునకుఁ బ్రవృత్తులై, ప్రకృతిసంసృష్టులగుటచే, ప్రకృతేః = ప్రకృతియొక్క; గుణసమ్మూఢాః = గుణములచే ఆత్మతత్త్వమునందు సమ్మూఢులై; గుణకర్మసు—క్రియలందే; సజ్జన్తే, ప్రకృతి వివిక్తాత్మస్వరూ

* ప్రాణనము చేయుచునే—ఊపిరి పుచ్చుచునే ప్రాణము అను పేరుగలవాఁ డగుచున్నాఁడు.

♦ కృత్స్నము కానివాఁడు అగుచున్నాఁడు.

పమునందు సక్తులు కారు. అందువలన వారు జ్ఞానయోగమునకు సమర్థులు కారు. కావునఁ గర్మయోగమునందే వారి కధికారము. ఇట్టివార లగు, తాః; మన్దాః; అకృత్స్నవిదః; కృత్స్నవిత్; తాను జ్ఞానయోగమున నుండుటచే, నవిచాలయేత్, వారు మందులు శ్రేష్ఠజనులయాచారము ననుసరించువారు గదా! కావున కర్మయోగమును విడిచి సట్టిస్థంబు జూచి కర్మయోగమునుండి ప్రచలితచిత్తులు అగుదురు. అందువలన శ్రేష్ఠుఁడు ఆత్మతత్త్వజ్ఞానముచే అత్మ యకర్త యని యనుసంధించుచుఁ దానుగూడఁ గర్మయోగమునం దున్నవాఁడై కర్మయోగమే ఆత్మదర్శనమునకు నిరపేక్షసాధనం బని చూపి వారలను అకృత్స్నవిదులను ప్రీతి గలవారలనుగాఁ జేయవలయు నని యర్థము. జ్ఞానయోగాధికారికిఁగూడ జ్ఞానయోగమునకంటె నిదియె జ్యాయం బని మున్నే చెప్పఁబడినది. అందువలన వ్యపదిష్టుఁడు [1] లోకసంగ్రహముకొఱకు దీనినే చేయవలయును. ప్రకృతివివిక్త మగు ఆత్మస్వభావము నిరూపించుటచే గుణములందుఁ గర్తృత్వము నారోపించి కర్మము ననుష్ఠించు విధము చెప్పఁబడినది. గుణములందుఁ గర్తృత్వానుసంధాన మిది.—ఈకర్తృత్వము ఆత్మకు స్వరూపప్రయుక్తము కాదు, మ తేమనఁగా గుణసంపర్కముచేఁ గలిగినది అని—ప్రాప్తాప్రాప్తవివేకముచే * గుణకృతము—అని యనుసంధానము.

పమా. ప్రకృతేః. గుణములయందు—ఇంద్రియములందు సమ్మూఢులు. ఇంద్రియాదులందలి యభిమానమునలనఁ గదా విషయాదులందు సంగము. గుణకర్మసు= విషయములందును కర్మములందును, "శబ్దాద్యావిషయాద్యాశ్చ సత్త్వాద్యాశ్చ శుభానిచ। అప్రధానాని చ గుణా నిగద్యన్తే నిరుక్తిగైః" అను నిఘంటువువలన. గుణము లనఁగా సత్త్వాదు లని యర్థము చెప్పినచో "గుణా గుణేషు" అనుట అయుక్తం బగును.

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. 30

భా. ఎట్లు మఱి కర్మమునం దధికృతుఁడు అజ్ఞుఁడు ముముక్షు వైన వాఁడు కర్మము చేయవలయును? అందు వేని చెప్పెదము.—మయి =

[1] శ్రేష్ఠుఁడు.

* కర్తృత్వము ఆత్మకుస్వరూపముచే అప్రాప్తము, గుణసంపర్కముచేఁ ప్రాప్తము అను వివేకముచే.

వాసుదేవుఁడను పరమేశ్వరుఁడను సర్వజ్ఞుఁడను సర్వాత్ముఁడను నాయందు; సర్వాణి = సమస్తము లయిన; కర్మాణి = కర్మములను; సన్న్యస్య = నిక్షేపించి; అధ్యాత్మచేతసా = వివేకబుద్ధిచేత, నేను కర్తను ఈశ్వరునికొఱకు భృత్యునివలెఁ జేయుచున్నా నను బుద్ధిచేత. మఱియును; నిరాశీః = ఆశను విడిచినవాఁడవై; నిర్మమః= మమభావము లేని వాఁడవు; భూత్వా = అయి; యుధ్యస్వ = యుద్ధము చేయుము; విగతజ్వరః= విగతసంతాపుఁడవై, విగతశోకుఁడవై [౧].

నీవు ఈశ్వరార్థము కర్మము చేయుచున్నా నని వివేకబుద్ధిచే సర్వాత్ముఁడను వాసుదేవుఁ డను నాయందు సర్వకర్మములను సమర్పించి, ఫలమునం దాశయు మమకారంబును విడిచి, శోకము నొందక యుద్ధము సేయు మని తాత్పర్యము.

ఆ॰ కర్మమునం దజ్ఞుఁ డధికృతుఁ డనుట వాస్తవమే, అయినను, ముముక్షు వగువాఁడు కర్మము విడువవలయును, ఏల యనఁగా, మోక్షము కర్మసాధ్యము కాదు. మఱియు నతనికిఁ గర్మము చేయుట శక్యము కాదు. తా నపేక్షించు మోక్షమునకు కర్మము విరోధి యగుటవలన నని యాశంకించుచున్నాఁడు ఎట్లు ఇత్యాదిగా. మీఁదిశ్లోకముచే నుత్తరము చెప్పుచున్నారు చెప్పెదము అని. చెప్పినప్రకారము పరమాత్మయందు సర్వకర్మములను సమర్పించుటకుఁ గరణముఁ జెప్పుచున్నాఁడు అధ్యాత్మచేతసా అని. వివేకబుద్ధినే వివరించుచున్నారు నేను ఇత్యాదిగా. తెలిపినవిధంబునఁ గర్మములంపుఁ బ్రవర్తించువానికిఁ గర్తవ్యాంతరము చెప్పుచున్నారు మఱియును అని. ఆశను విడిచినవాఁడవై— ఫలాపేక్ష విడిచినవాఁడవై యని యర్థము. నిర్మమః—పుత్త్రభ్రాత్రాదులం దని శేషము. ఓయీ! యుద్ధమునందు నియోగం బుపపన్నము గాదు, పుత్త్రభ్రాత్రాది హింసారూప మయిన యుద్ధము సంతాపహేతు వగుటచే దానియందు నియోగించుట యనుచితం బగుటవలన. అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు విగతజ్వరః అని.

హ॰ నీవో కర్మాధికారివి—మయి = వాసుదేవుఁడను బరమేశ్వరుఁడను సర్వజ్ఞుఁడను సర్వకర్మభోక్త నగు నాయందు; సర్వాణి కర్మాణి సన్న్యస్య; అధ్యాత్మచేతసా = వివేకబుద్ధిచేత. నిరాశీః; నిర్మమః = కర్మమునందును తత్ఫలమునందును మమకారము విడిచినవాఁడవై; యుధ్యస్వ, విగతజ్వరః = విగతసంతాపుఁడవై.

---

[౧] సంతాపము—శోకము పోయినవాఁడవై.

30. ఇట్లు జ్ఞానులుగూడ అధికారికులు లోకసంగ్రహార్థము అవశ్యము కర్మము చేయవలయు ననియు లోకసంగ్రహము చేయువాఁ డిట్లు వర్తింపవలయు ననియు నుపదేశించి యిప్పుడు లోకసంగ్రహదృష్టిచేనైనను స్వధర్మము చేయు మని చెప్పుచున్నాఁడు.—లోకసంగ్రహము చేయునట్టి ఆత్మతత్త్వజ్ఞుఁడవు నీవు; అధ్యాత్మచేతసా = « ఇదం సర్వం య దయ మాత్మా " * అను శ్రుతి చెప్పెడు చొప్పున ఆత్మను అధికరించి ప్రవృత్తము అధ్యాత్మము, చేతః—జ్ఞానము, అధ్యాత్మమైన చేతస్సు—అధ్యాత్మచేతస్సు, దానిచేత—« బ్రహ్మార్పణం బ్రహ్మహవిః » అని చెప్పఁబోవు లక్షణము గల ప్రత్యగ్దృష్టిచే సమస్తమును బ్రహ్మమే అని చూచుట చేత; కర్మాణి—నిత్యనైమిత్తికాదులను; సర్వాణి; మయి = సర్వాత్మ యగు బ్రహ్మమునందు; సన్న్యస్య = సమస్తమును బ్రహ్మమే యని లయము నొందించి; జయముచేఁ బొందఁబడు రాజ్యమునందు యుద్ధఫలమునందు, నిరాశీః = అపేక్ష లేనివాఁడవై; వధింపఁబడు భ్రాత్రాదులందు, నిర్మమః = మమత లేనివాఁడవు; భూత్వా; వీరు నావారలు నాచే వధింపఁబడుచున్నారు అనియే జ్వరము—సంతాపము గలదో అది యెవ్వనికిఁ బోయినదో అట్టి వాఁడవు విగతజ్వరుఁడవు—శోకము లేనివాఁడవై; యుధ్యస్వ. లోకసంగ్రహార్థము కర్మము చేయు మని యర్థము. ఇచట ఇది యభిప్రాయము.—ఇది సమస్తమును నేనును బ్రహ్మమే యని పరాపరైక్య విషయకంబగు అప్రతిబద్ధాఽపరోక్షజ్ఞానము గల అధికారికుఁ డగు బ్రహ్మవిదుఁడు ఇటఁ జెప్పినవిధంబున లోకహితార్థము కర్మము చేయవలయును, ఇతఁడు జీవించియున్నవాఁడైనయే ముక్తుఁ డగుటవలన వీనికిఁ బరులఁ దరింపఁజేయుటయే ప్రయోజనము. పరోక్షజ్ఞాని యగునేని, ఆత్మ దేహాదులకు భిన్నుఁడు దేహాదిద్రష్ట యగుటవలన ఘటద్రష్టవలె అనుయుక్తిచేఁ దాను దేహాదిభిన్నుఁ డను జ్ఞానము గలవాఁడై, యందుచే నేను గర్తను గారయితనుం గా నని అకర్తృత్వబుద్ధి గలవాఁడై, 'మాయామాత్ర మిదం ద్వైతమ్' ఇత్యాది శ్రుతిబలముచేతను, ఇది యంతయు మిథ్య మాయాకార్య మగుటవలన ఐంద్రజాలికమువలె ఇత్యాది యుక్తిబలము చేతను, కర్తయు కార్యమును కరణమును సర్వంబును మిథ్యయే యని కర్త్రాదికము సర్వంబును మిథ్యయే యని చూచుచు, సర్వత్ర నిరాశుండును నిర్మముండునై లోకహితార్థము కర్మము చేయవలయును; అందుచేఁ జిత్తపరిపాకంబును జ్ఞానంబును మోక్షంబును సిద్ధించుచున్నది; లోకోపకారము గూడ సిద్ధించుచున్నది; ఇట్లు ఇత

* ఈ యాత్మ ఏది గలదో అది యీ సమస్తమును.

నికిఁ దాను తరించుటయు నితరులఁ దరింపఁజేయుటయు రెండును ఉపపన్నము లగుచున్నవి. ఇఁక అనాత్మజ్ఞుఁ డగునేని పరిగ్రహామునందు ♦ మమత లేనివాఁడై కర్మఫలాపేక్ష లేనివాఁడునై శ్రౌతములను స్మార్తములను సర్వకర్మములను ఈశ్వరార్పణబుద్ధిచే స్వార్థమే చేయవలయును, అందుచే చిత్తశుద్ధియు దానిచే జ్ఞానంబును మోక్షంబును ఇతనికి సిద్ధించుచున్నవి—అని.

మ. ఇట్లు అజ్ఞానికిని జ్ఞానికిని గర్మానుష్ఠానము సమానమైనను అజ్ఞానియందుఁ గర్తృత్వాభినివేశము జ్ఞానియందది లేమి అను విశేషము చెప్పఁబడినది. ఇప్పుడు అజ్ఞానికిఁ గూడ ముముక్షువునకు, ముముక్షువు కానివాని యపేక్షచే, భగవదర్పణమును ఫలాభిసంధిలేమియు అను విశేషము చెప్పుచు, అజ్ఞాని యగుటచే అర్జునునకుఁ గర్మాధికారమును దృఢీకరించుచున్నాఁడు.—మయి—భగవంతుఁ డను వాసుదేవుఁడను పరమేశ్వరుఁడను సర్వజ్ఞుఁడను సర్వనియంతను సర్వాత్ముఁడను నాయందు; సర్వాణి కర్మాణి = లౌకికములను వైదికములను, సర్వవిధము లయిన కర్మములను గూడ; అధ్యాత్మచేతసా = «నేను కర్తను, అంతర్యామి కధీనుఁడను, ఆయీశ్వరుని కొఱకే రాజుకొఱకు భృత్యుని యట్లు కర్మములను జేయుచున్నాను» అను నీ బుద్ధిచేత; సన్న్యస్య = సమర్పించి; నిరాశీః = నిష్కాముఁడవును, నిర్మమః = స్వీయము లయిన దేహపుత్త్రభ్రాత్రాదులందు మమత లేనివాఁడవును; విగతజ్వరః = సంతాపమునకు హేతు వగుటచే శోకమే జ్వరశబ్దముచేఁ జెప్పఁబడినది, ఐహిక మగు నపకీర్తి పారలౌకిక మగు నరకపతనము మొదలగువాని వలని శోకము లేనివాఁడవును; భూత్వా = అయి; ముముక్షుఁడవు నీవు, యుధ్యస్వ—విహితము లయిన కర్మములం జేయు మని యభిప్రాయము. ఇట ముముక్షువునకు భగవదర్పణమును నిష్కామత్వంబును సర్వకర్మములందును సాధారణము, నిర్మమత్వంబును శోకరహితత్వంబును ప్రకృతం బగు యుద్ధమునందు మాత్రమే యని తెలియవలయును, ఇతరకర్మములందు మమతాశోకంబులు అప్రసక్తము లగుటవలన.

శ్రీ. ఇట్లు తత్త్వవేత్తయుఁగూడ కర్మము చేయవలయును, నీవో యింకం దత్త్వవేత్తవు కావు, కావునఁ గర్మమునే చేయు మని చెప్పుచున్నాఁడు.—సర్వాణి కర్మాణి; మయి; సన్న్యస్య = సమర్పించి; అధ్యాత్మచేతసా = అంతర్యామి కధీనుఁడనై నేను జేయుచున్నా నను దృష్టిచే; నిరాశీః = నిష్కాముఁడవును; కావునసే,

♦ పత్నీ పుత్త్రాదికమునందు.

నాకు ఫలసాధనము నా కొఱకే కర్మము అని మమత లేనివాఁడవునై; విగతజ్వరః= శోకము విడిచినవాఁడవునై; యుధ్యస్వ.

ప. ఇఁకఁ బ్రకృత మనుసరించుచున్నాఁడు.—సర్వాణి కర్మాణి, మయి, సన్న్యస్య = సమర్పించి, అధ్యాత్మచేతసా = అంతర్యామ్యధీనుఁడనై నేను జేయు చున్నా నను దృష్టిచే, నిరాశీః = ఇది నాకుఁ గలుగవలయు నని కామము లేనివాఁ డవై; అట్లు, దేనివలన నీకు జ్వరము కలిగెనో దాని విషయమయి, నిర్మమః = మమత లేనివాఁడవై, భూత్వా, అందువలన, విగతజ్వరుఁడవై, యుధ్యస్వ.

రా. ఇప్పుడు ఆత్మలు పరమపురుషుని శరీరము లగుటచే తన్నియామ్యత్వమే ఆయాత్మలకు స్వరూప మని నిరూపించుటచే, సర్వాత్మభూతుఁడు భగవంతుఁ డగు పురుషోత్తమునియందు గుణకృతమైన కర్తృత్వమునుగూడ ఆరోపించి కర్మము చేయవలయు నని చెప్పుచున్నాఁడు.—మయి = సర్వేశ్వరుఁడను సర్వభూతాంతరాత్మ భూతుఁడ నగు నాయందు; సర్వాణి కర్మాణి అధ్యాత్మచేతసా సన్న్యస్య, నిరాశీః, నిర్మముఁడవునై, విగతజ్వరః, యుద్ధాదిక మగు సమస్తమైన విహిత కర్మమును జేయుము. ఆత్మయందు చేతస్సు ఏది గలదో అది యధ్యాత్మచేతస్సు, శ్రుతిశత సిద్ధం బగు * ఆత్మస్వరూప విషయ జ్ఞానముచేత నని యర్థము. « అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం, సర్వాత్మా, అన్తః ప్రవిష్టం కర్తార మేతమ్, య ఆత్మని తిష్ఠ న్నాత్మనో ఽన్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో య మయతి స త ఆత్మాన్తర్యా మ్యమృతః » ఇత్యాదు లగు శ్రుతులు ఈయాత్మ పరమపురుషునిచే నియామ్యుఁడు తచ్ఛరీరభూతుఁ డనియుఁ బరమ పురుషుఁడు నియామకుఁ డనియుఁ జెప్పుచున్నవి. స్మృతులుగూడ « ప్రశాసితారంసర్వేషామ్ » ఇత్యాదులు. « సర్వస్య చాఽహం హృది సన్నివిష్టో మత్త స్స్మృతి ర్జ్ఞాన మపోహనం చ॥ ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి। భ్రామయ న్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥ అని చెప్పఁబోవుచు న్నాఁడు. అందువలన, నాశరీర మగుటచే ఆత్మ నాచే నియామ్యుఁడు అని యను సంధించుచు సర్వకర్మంబులును నాచేతనే చేయఁబడుచున్న వని పరమపురుషుఁ డను నాయందు సన్న్యసించి, వానిని కేవలము మదారాధనములే యని చేసి, తత్ఫల మునందు ఆశ లేనివాఁడవు కావుననే ఆ యాకర్మమునందు మమతారహితుఁడవై,

* బహుశ్రుతిప్రమాణములచే సిద్ధం బగు.

విగతజ్వరుఁడవై యుద్ధాదికమును జేయుము. స్వకీయుఁ డయిన ఆత్మచే స్వకీయములే యగు నుపకరణములతో స్వారాధనైకప్రయోజనముతోఁ ఆకుఁ బరమపురుషుఁడు సర్వేశ్వరుఁడు సర్వశేషి తానే స్వకర్మములను జేయించుచున్నాఁ డని యనుసంధించి కర్మములయెడ మమత లేనివాఁడవై, 'అనాది కాలప్రవృత్తమై యనంత మగు ప్రాచీనపాప సంచయముతో ఎట్లు నేను ఉండఁగలను?' అను నంతర్జ్వరము విడిచి 'పరమ పురుషుఁడే కర్మములచే నారాధితుఁడై బంధమునుండి విడిపింపఁగలఁ, డని సుఖంబునఁ గర్మయోగమునే చేయు మని యర్థము. "త మీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దేవతానాం పరమం చ దైవతమ్, పతిం విశ్వస్య, పతిం పతీనామ్" ఇత్యాది శ్రుతి సిద్ధము గదా సర్వేశ్వరత్వంబును సర్వశేషిత్వంబును. ఈశ్వరత్వ మనఁగా నియంతృత్వము. శేషిత్వ మనఁగా పతిత్వము.

మా. అందువలన, సర్వాణి కర్మాణి, మయి = నాయందే, సన్న్యస్య—భ్రాంతిచే జీవునియందు అధ్యారోపితము లగు వానిని నాయందే విడిచి, భగవంతుఁడను నేనే సర్వకర్మములను జేయుచున్నాఁడ ననియు నాపూజ యనియు. ఆత్మను అధికరించి చేతస్సు ఏది గలదో అది అధ్యాత్మచేతస్సు *. సన్న్యసము—భగవంతుఁడు చేయుచున్నాఁ డనుట. నిర్మమత్వము—నేను జేయువాఁడం గా ననుట.

యే మే మత మిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః
శ్రద్ధావన్తో ఒనసూయన్తో ముచ్యన్తే తే ఒపి కర్మభిః. ౩౧

భా. కర్మము చేయవలయు నని సప్రమాణముగాఁ జెప్పఁబడినది నామతం బది యేది గలదో దాని.—యే = ఎవరు; మానవాః = మనుష్యులు; మే = నాయొక్క; మతమ్ = మతమునుః నిత్యమ్ = ఎల్లప్పుడును; అనుతిష్ఠన్తి = అనువర్తించుచున్నారో; శ్రద్ధావన్తః = శ్రద్ధ గలవారలై; అనసూయన్తః = పరమగురుఁ డను వాసుదేవుఁడను నాయందు అసూయచేయనివారలై. తే ఒపి = అట్టి వారలుగూడ; ముచ్యన్తే = విడువఁబడుచున్నారు; కర్మభిః = ధర్మా ఒధర్మంబులను కర్మములచేత.

* పరమాత్మలాభముచే ననుట, ఇందుకు నిరాశీః అనుదానితో నన్వయము.

ఇప్పుడు నేను నీకుఁ జెప్పినట్టి నా మతమును ఎవ్వరు శ్రద్ధ గలవారలై నాయం దసూయలేనివారలై యెల్లప్పుడును అనువర్తింతురో వారుగూడ ధర్మాధర్మములచే విముక్తు లగుదు రని తాత్పర్యము.

ఆ. ప్రకృతం బగు భగవంతుని మతమునే చెప్పినవిధంబున ననుసరించి యనుష్ఠించువారలకుఁ గ్రమముక్తి ఫలం బని చెప్పుచున్నారు కర్మము ఇత్యాదిగా. శాస్త్రముచేతను ఆచార్యునిచేతను ఉపదేశింపఁబడిన అదృష్టార్థమునందు నమ్మకము శ్రద్ధ. గుణములందు దోషావిష్కరణము * అసూయ. తే అపి అనుచోట అపి శబ్దము ఈచెప్పిన ముక్తి అముఖ్యం బని తెలుపుటకొఱకు.

హ. యే--అధికారు లగువా రెవరు. కర్మభిః= సకలకిల్బిషములచేతను. ♦

శం. "న కర్మణా మనారమ్భాత్" అనునది మొదలుగా "మయి సర్వాణి కర్మాణి" ఇత్యంత మగు గ్రంథముచే "ముముక్షు వవశ్యము మోక్షార్థము ఈశ్వరార్పణబుద్ధితోఁ గర్మము చేయవలయు" నని చెప్పఁబడినది. ఇది నామతం బని నిశ్చయించి శ్రీభగవంతుఁడు తనమతము ననుసరించువా రెవ్వరో వారు ముక్తు లగుదు రనియు ఎవ్వరు విపరీతముగా వర్తింతురో వారు వినాశము నొందుదు రనియు నియమము చేయుచున్నాఁడు.—యే = ఎవరు; వివేకులైన, మానవాః = మనుష్యులు, ముముక్షువు లగు బ్రాహ్మణాదులు; ఇదమ్ = ఈ చెప్పినట్టి; మే = ఈశ్వరుఁ డను నాయొక్క; మతమ్ = శాసనమును; అనసూయన్తః = అసూయ యనఁగా గుణదూషణము, జగద్గురుఁడ నగు నాయందు దానిఁ జేయనివారలై; మ తే మనఁగా, శ్రద్ధావన్తః= అందు శ్రద్ధను భక్తిని చేయుచున్నవారలై; అనుతిష్ఠన్తి=అనువర్తించుచున్నారో, నాశాసనము నుల్లంఘింపక యెవరు నిత్యమును గర్మమును జేయుచున్నారో అని యర్థము; తే= వారు; సత్త్వశుద్ధిచే నిర్వికారాత్మవిజ్ఞానము నొంది, కర్మభిః= పుణ్యాపుణ్యము లను పేరుగల నానాదుఃఖహేతువు లగు సంచితాదులచేః ముచ్యన్తే. అపి శబ్దమువలన జన్మాదులచేఁగూడ ముక్తు లగుదు రని యర్థము.

మ. ఫలాభిసంధి లేక యీశ్వరార్పణబుద్ధితో విహితకర్మము ననుష్ఠించుటవలన సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తిద్వారంబున ముక్తి కలుగు నని చెప్పుచున్నాఁడు.—

* అవిష్కరణము—వెల్లడి చేయుట.

♦ తక్కినది శంకరభాష్యముతో సమానము.

ఇదమ్—ఫలాభిసంధి లేక విహితకర్మము ననుష్ఠించుట యనునట్టి; మమ మతమ్; నిత్యమ్ = నిత్యవేదబోధిత మగుటచే అనాదిపరంపరగా వచ్చినదానిని, లేక, ఆవశ్యక మయినదానిని; లేక, నిత్యమ్ = ఎల్లప్పుడును; మానవాః = మనుష్యులు; యే = ఎవరు; కర్మములకు మనుష్యులే యధికారు లగుటవలన, శ్రద్ధావన్తః = శాస్త్రము చేతను ఆచార్యునిచేతను ఉపదేశింపఁబడిన విషయమునందు అది యనుభవమునకు రాకపోయినను ఇది యిట్లే యను నమ్మకము శ్రద్ధ, అది గలవారలై; అనసూయన్తః = గుణములందు దోషావిష్కరణము అసూయ, దుఃఖరూప మయిన కర్మమునందు నన్ను నియోగించినాఁడు నిర్దయుఁ డితం డనునట్టిది నాయందుఁ బ్రకృతము ప్రసక్తించినది, అట్టి యసూయను గురుఁడను వాసుదేవుఁడను సర్వలోకసుహృదుఁడను నాయందుఁ జేయనివారై; అనుతిష్ఠన్తి = అనుష్ఠించుచున్నారో; తే ఽపి = వారలును; సత్త్వశుద్ధిజ్ఞానప్రాప్తిద్వారంబున సమ్యక్ జ్ఞానివలె, ముచ్యన్తే, కర్మభిః—ధర్మాధర్మము లనువానిచేత.

శ్రీ. ఇట్లు కర్మము ననుష్ఠించుటవలన గుణముఁ జెప్పుచున్నాఁడు—నా వాక్యమునందు, శ్రద్ధావన్తః; అనసూయన్తః = దుఃఖరూప మైన కర్మమును జేయు మనుచున్నాఁ డని దోషదృష్టి లేనివారలై; యే; మేమతమ్ = నామతమును; అనుతిష్ఠన్తి; తే ఽపి; తిన్నగా, సమ్యగ్జ్ఞానివలె, ముచ్యన్తే.

ప. ఇట్లనుష్ఠించినచో గుణముఁ జెప్పుచున్నాఁడు.—ఇదమ్, మే, మతమ్, యే, నావాక్యమునందు, శ్రద్ధావన్తః, అనసూయన్తః = దుఃఖాస్పద మగు కర్మమునందుఁ బ్రవర్తింపఁజేయుచున్నాఁ డని దోషదృష్టి లేనివారలై, అనుతిష్ఠన్తి; తే ఽపి, తిన్నగా జ్ఞానివలె, కర్మభిః ముచ్యన్తే.

రా. ఇదియే సాక్షాదుపనిషత్సారభూత మైన యర్థమని చెప్పుచున్నాఁడు—యే = ఎవరు; మానవాః—శాస్త్రాధికారులు; ఇదియే శాస్త్రార్థ మని, ఇదమ్ = దీని; మే = నాయొక్క; మతమ్ = మతమును; నిశ్చయించి అట్లు, అనుతిష్ఠన్తి = అనుష్ఠించుచున్నారో. మఱియు నెవ్వరు అనుష్ఠింపనివార లయ్యును ఈశాస్త్రార్థమునందు, శ్రద్ధావన్తః = శ్రద్ధ * గలవార లగుదురో. మఱియు నెవరు శ్రద్ధ లేనివార లయ్యును ఇట్లు శాస్త్రార్థము సంభవింప దని, అనసూయన్తః—ఈమహాగుణవిశిష్ట

* నమ్మకము.

మయిన శాస్త్రార్థమునందు దోషము నావిష్కరింపనివార లగుదురో అని యర్థము. తే—వారలందఱును; కర్మభిః = బంధహేతు లగు అనాదికాలారబ్ధము లయిన సర్వకర్మములచేతను; ముచ్యన్తే. «తే అపి కర్మభిః» అనుచో అపి శబ్దముచే వీరు * వేఱుచేయఁబడుచున్నారు. ఇప్పు డనుష్ఠింపకున్నను శ్రద్ధ గలవారలును అసూయ లేనివారలును అగుదు రేని శ్రద్ధచేతను అసూయ లేమిచేతను క్షీణపాపులై శీఘ్రముగ ఈశాస్త్రార్థమునే యనుష్ఠించి ముక్తు లగుదు రని యర్థము.

మూ. ఫలముఁ జెప్పుచున్నాఁడు.—ఎవ్వ రిట్లు నివృత్తకర్మము గలవార లగుదురో ♦; తే ఽపి = వారలుగూడ, ముచ్యన్తే, జ్ఞానద్వారమున. ఇఁక అపరోక్షజ్ఞానులు ముక్తు లగుదు రని చెప్పవలయునా? కాని, సాధనాంతరము § చెప్పఁబడినది కాదు. «నివృత్తాదీని కర్మాణి హ్యపరోక్షేశదృష్టయే । అపరోక్షేశదృష్టిస్తు ముక్తౌ కించి న్న మార్గతే । సర్వం తదన్తరాధాయ ముక్తయే సాధనం భవేత్ । న కించి దన్తరాధాయ నిర్వాణాయాపరోక్షదృక్» ‖ అని గదా చెప్పఁబడినది నారాయణాష్టాక్షరకల్పమునందు. అందువలననె సముచ్చయనియమము ** నిరాకరింపఁబడినది.

> యే త్వేత దభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్
> సర్వజ్ఞానవిమూఢాం స్తాన్విద్ధి నష్టా నచేతసః. ౩౨

భా. యేతు = తద్విపరీతులు ఎవ్వరు; ఏతత్ = ఈ; మే = నాయొక్క; మతమ్ = మతమును; అభ్యసూయన్తః = నిందించుచున్నవారై; నానుతిష్ఠన్తి = అనువర్తింపరో; తాన్ = వారలను; సర్వజ్ఞానవిమూఢాన్ = సమస్తము లయిన జ్ఞానములందును వివిధముగా మూఢు

---

* శ్రద్ధ గలవారును అసూయ లేనివారలును.

♦ నిష్కామముగా అనుష్ఠిత మగు కర్మము నివృత్తకర్మము.

§ జ్ఞానమువలె నివృత్తకర్మముగూడ ముక్తికి మఱియొక సాధన మని.

‖ నివృత్తము మొదలగు కర్మములు అపరోక్షేశ్వరజ్ఞానమునకుఁ గదా సాధన మగుచున్నవి. అపరోక్షేశ్వరజ్ఞానమో ముక్తియందు దేనినిగూడ—సాధనాంతరము నపేక్షింపదు. నివృత్తాదికర్మము సమస్తమును జ్ఞానమును నడుమనుంచుకొని—జ్ఞానద్వారమున ముక్తికి సాధన మగును. అపరోక్షజ్ఞానము దేనినిగూడ నడుమ నుంచుకొనక—ద్వారము నపేక్షింపక యే మోక్షమునకు సాధన మగుచున్నది.

** జ్ఞానకర్మములు రెండును జేరి ముక్తిసాధనము అను నియమము.

లైన వారినిగాను; నష్టాన్ = నాశము పొందినవారినిగాను; అచేతసః = అవివేకులనుగాను; విద్ధి = ఎఱుంగుము.

ఇఁక నెవ్వరు నీకుఁ జెప్పిన నామతమును నిందించుచు అనువర్తింపరో వారు సర్వవిషయములందును తత్త్వజ్ఞానము లేక మూఢులై యవివేకులయి నాశము నొందువార లని యెఱుంగు మని తాత్పర్యము.

ఆ॰ భగవంతుని మతము ననువర్తింపనివారలకుఁ బ్రత్యవాయముఁ దెలుపుచున్నాఁడు ఈశ్లోకముచేత. తద్విపరీతులు — భగవన్మతము ననువర్తించు వారలకంటె విపరీతులు *. ఆవైపరీత్యమునే చూపుచున్నారు ఏతత్ ఇత్యాదిగా. అభ్యసూయన్తః — అందు లేనిదానినైనను దోషము నారోపించుచున్నవారై యని యర్థము. సర్వజ్ఞానములు సగుణనిర్గుణ విషయములు. వివిధముగా — ప్రమాణ ప్రమేయ ప్రయోజన విభాగముచే వివిధత్వము ♦.

హ॰ యేతు; ఏతత్; మే = ఈశ్వరుఁడను నాయొక్క; మతమ్; అభ్యసూయన్తః = ఈర్ష్య చేయువారై; నానుతిష్ఠన్తి = చేయరో; తాన్; సర్వజ్ఞానములందును, విమూఢులను—పరమార్థము తెలియనివారలనుగాను, నష్టాన్; అచేతసః= అవివేకులనుగాను; విద్ధి = ఎఱుంగుము.

శం॰ అట్లు చేయనిచో దండముఁ జెప్పుచున్నాఁడు.—యేతు = ఇఁక నెవ్వరు అవివేకులు దురహంకారు లగు బ్రాహ్మణాదులు; ఏతత్ — నీకుఁ జెప్పిన దాని; మే = ఈశ్వరుఁడ నగు నాయొక్క; మతమ్ = ఆజ్ఞను; అభ్యసూయన్తః = మిక్కిలి దూషించుచున్నవారలై; నానుతిష్ఠన్తి—దురాగ్రహముచే నాయాజ్ఞను జేయరో; సర్వజ్ఞానవిమూఢాన్ = సర్వాత్మక మగుటచే బ్రహ్మము సర్వ మని చెప్పఁబడుచున్నది, బ్రహ్మవిషయక మైన జ్ఞానము సర్వజ్ఞానము, దానియందు విశేషించి మూఢులను; అచేతసః = అవివేకులను — కర్మము బహుసాధనములచే సాధ్యము క్లేశభూయిష్ఠము, దానిఫలమో అదృష్టము, కావునఁ గర్మసన్న్యాసమే పరమసుఖం బని విపరీత మయిన బుద్ధిగలవారలను; తాన్ = సన్న్యాసమున కయోగ్యులై కర్మనిష్ఠులు కాని ఆ జనులను; నష్టాన్ = నశించిన పుణ్యలోకములు గలవార

* భిన్నులు.

♦ ప్రమాణ ప్రమేయ ప్రయోజనములు మూఁడిటియందును మోహము నొందినవారై యని యర్థము.

లనుగా; విద్ధి. స్వధర్మమును విడిచి పరధర్మమునందు వర్తించువారలు తమకుఁ దామే విపరీతబుద్ధిచే వినాశము నొందుదు రని యర్థము.

మ. ఇట్లు అన్వయమునందు * గుణముఁ జెప్పి వ్యతిరేకమునందు ↑ దోషముఁ జెప్పుచున్నాఁడు.—తు శబ్దము విపరీతశ్రద్ధను ♦ సూచించుచున్నది. అందుచే, యే = ఎవరు; నాస్తికతవలన శ్రద్ధలేనివారలై, అభ్యసూయన్తః = దోషము నారోపించుచు; ఏతత్, మే మతమ్; అనువర్తింపరో. తాన్; అచేతసః = దుష్టచిత్తులనుగాను; కావుననే, సర్వజ్ఞానవిమూఢాన్ = సర్వత్ర—కర్మమునందును సగుణబ్రహ్మమునందును నిర్గుణబ్రహ్మమునందును ఏజ్ఞానము గలదో దానియందు వివిధముగా — ప్రమాణమునను ప్రమేయమునను ప్రయోజనమునను మూఢులను గాను, సర్వవిధముచేతను అయోగ్యులనుగాను; నష్టాన్ = సర్వపురుషార్థములనుండియు భ్రష్టులనుగాను; విద్ధి = ఎఱుంగుము.

శ్రీ. విపక్షమునందు దోషముఁ జెప్పుచున్నాఁడు —యేతు, మే మతమ్ = ఈశ్వరార్థము కర్మము చేయవలయు నను అనుశాసనమును; అభ్యసూయన్తః = ద్వేషించుచు; నానుతిష్ఠన్తి. తాన్, అచేతసః = వివేకహీనులనుగాను; అందువలననే, సర్వమునందును—కర్మవిషయమునను బ్రహ్మవిషయమునను ఏజ్ఞానము గలదో అందు విమూఢులను గాను; నష్టాన్, విద్ధి.

ప. విపక్షమునందు దోషముఁ జెప్పుచున్నాఁడు.—యేతు, మున్ను నిరూపించిన లక్షణము లేనివారలై; మే మతం నానుతిష్ఠన్తి. తాన్, అచేతసః = భ్రాంతులను, అట్లు సర్వజ్ఞానరహితులను నష్టులనుగా, విద్ధి.

రా. భగవంతుని కభిమతము ఉపనిషత్ప్రతిపాదితము అగునర్థము నను ష్ఠింపనివారలకును దానియెడ శ్రద్ధ లేనివారలకును అసూయపడువారలకును దోషముఁ జెప్పుచున్నాఁడు.—యేతు; ఏతత్—ఆత్మవస్తువు సమస్తమును నాకు శరీర మగుటచే నేన యాధారముగాఁ గలదై నాకు శేషభూతమై నాచేతనే ప్రవర్తింపఁ జేయఁ దగినది యనియెడు; మే మతమ్; నానుతిష్ఠన్తి = ఇట్లు అనుసంధించి సర్వకర్మములను జేయరో, ఎవరు నమ్మరో, మఱియు నెవరు దీనియెడ నసూయ వహి

---

* అనువర్తించుటయందు.

↑ అనువర్తింపనియెడ.

♦ విరుద్ధార్థమునందు నమ్మకమును.

యింతురో; తాన్ = వారలను; సర్వజ్ఞానవిమూఢాన్ = సమస్తము లయిన జ్ఞానము లందును విశేషముగా విమూఢులను; కావుననే, నష్టాన్, అచేతసః, విద్ధి. చేతస్సు యొక్క కార్యము వస్తుతత్త్వనిశ్చయము గదా! అది లేమివలన అచేతసులు, విపరీతజ్ఞానులును సర్వత్రవిమూఢులును.

"సర్వాత్మలును నాకు శరీరము, వానికి నేన యాధారము, అవి నాకు శేషభూతములు, వానికన్నిటికి నేనే ప్రవర్తకుఁడను" అను నా యీమతము చెప్పిన ననుసంధించి కర్మముల నెవ్వ రనుష్ఠింపరో దీని నెవ్వరు నమ్మరో ఎవ్వరు దీనిమీఁద సమూయ వహింతురో వారలందఱు సర్వజ్ఞానములందును మూఢులై వస్తుతత్త్వము తెలియక భ్రాంతులై నశింతు రని తెలియు మని తాత్పర్యము.

మూ. *

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవా నపి
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33

భా. ఏకారణమువలన మఱి, నీమతము ననుష్ఠింపక పరధర్మముల ననుష్ఠించెదరు? స్వధర్మమునుగూడ ననువర్తింపరు? నీకుఁ బ్రతికూలురై యెట్లు భయపడరు నీశాసనము నతిక్రమించు దోషమునకు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు —సదృశమ్ = అనురూపముగా; చేష్టతే= చేష్టచేయుచున్నాఁడు. దేని కనురూపముగా? స్వస్యాః = తనదైన, ప్రకృతేః = ప్రకృతికి. ప్రకృతి యనఁగా నేది? పూర్వకృతధర్మాధర్మాదిసంస్కారము వర్తమానజన్మాదికమునం దభివ్యక్తము ప్రకృతి యనఁబడును. ఆప్రకృతికి సదృశముగనే సర్వప్రాణియును, జ్ఞానవా నపి = జ్ఞానము గలవాఁడైనను; చేష్టించుచున్నాఁడు. ఇఁక మూర్ఖుఁ డేమి? అందువలన, ప్రకృతిమ్ = ప్రకృతిని; యాన్తి = వెంబడించుచున్నవి; భూతాని = ప్రాణులు. నిగ్రహః = నిషేధము ♦; నాయొక్కగాని యితరునియొక్కగాని; కిం కరిష్యతి = ఏమి చేయఁ గలదు.

పూర్వజన్మములందుఁ జేసిన ధర్మాధర్మములు మొదలగువాని సంస్కారము ఇప్పటిజన్మాదులం దభివ్యక్తమగును. అది ప్రకృతి యనఁబడును. ఎవ్వని ప్రకృతి

* దీనికి మాధ్వభాష్యము లేదు.

♦ కూడ దనుట.

యెట్టిదిగా నుండునో వానిప్రవృత్తియు నట్టిదే యగును. ఇది జ్ఞానవంతునకుఁగూడ సమానము. ఇఁక అజ్ఞానిసంగతి చెప్ప నేల? అందువలన సర్వప్రాణులును తమ తమప్రకృతిని అనుసరించి ప్రవర్తింతురు. నేను గాని మఱియొకఁడుగాని అట్లు ప్రవర్తింపఁగూడ దని నిషేధించుటవలనఁ బ్రయోజనము లే దని తాత్పర్యము.

ఆ. భగవన్మతము ననువర్తించుటను విడిచి పరధర్మము ననుష్ఠించుట కును స్వధర్మము ననుష్ఠింపమికిని గారణము నడుగుచున్నాఁడు.—ఏకారణమువలన ఇత్యాదిగా. భగవత్ప్రతికూలతయే యందుకుఁ గారణ మని యాశంకించి చెప్పుచు న్నాఁడు నీకుఁ బ్రతికూలురై ఇత్యాదిగా. రాజాజ్ఞ నతిక్రమించినచో దోషము కనఁ బడుటవలన అట్లు భగవంతునియాజ్ఞ నతిక్రమించినను దోషము సంభవించుం గావున భగవత్ప్రతికూలత భయము కలిగించు నని యర్థము. ఉత్తరముగా శ్లోకము నెత్తుచున్నారు అనఁగా జెప్పుచున్నాఁడు అని. సమస్త మయిన ప్రాణివర్గమును బ్రకృతివశవర్తి యనుటయందుఁ గైముతికన్యాయము సూచించుచున్నాఁడు జ్ఞానవా నపి అని. సర్వభూతములును ఇచ్ఛింపని వయ్యును బ్రకృతి కనురూపమయిన చేష్టను బొందుచున్న వని నిగమనము చేయుచున్నాఁడు ప్రకృతిం యాన్తి భూతాని అని. భూతంబులు ప్రకృతి కధీనంబు లయ్యును బ్రకృతిని భగవంతుఁడు నిగ్రహింపవచ్చు నని యాశంకించి చెప్పుచున్నాఁడు నిగ్రహ ఇత్యాదిగా. భూత ములకు చేష్ట దేని ననుసరించియుండునో అట్టి యీ ప్రకృతి యేది యని యడుగు చున్నాఁడు ప్రకృతి యనఁగా నేడి అని. భగవంతుని యభిప్రాయము చొప్పునఁ బ్రకృతిని బ్రకటించుచున్నారు పూర్వేత్యాదిగా. పూర్వకృత ధర్మాఽధర్మాది అనుచోటి ఆదిశబ్దముచే జ్ఞానేచ్ఛాదికము సంగ్రహింపఁబడుచున్నది. ఈ సంస్కా రము స్వసత్తచేతనే ♦ ప్రవర్తక మను నెడఁ బ్రలయమునందును బ్రవృత్తి యుండు నని యాశంకించి విశేషణము చేయుచున్నారు వర్తమా నేత్యాదిగా. సర్వప్రాణి యును అనుట అయుక్తము, వివేకియొక్క ప్రవృత్తి యట్టిది కాకుండుటవలన నని యాశంకించి «పశ్వాదిభిశ్చాఽవిశేషాత్» * అనున్యాయము ననుసరించి చెప్పుచున్నారు జ్ఞానవా నపి అని. జ్ఞానులకును అజ్ఞానులకును ప్రకృత్యధీనత సమాన

♦ తనయునికి మాత్రముచే.

* పశువు మొదలగు వానితో భేదము లేకుండుటవలన నని యర్థము. సర్వప్రాణిప్రవృ త్తియు పశ్వాది ప్రవృత్తివంటిదే యని భావము. ఇది శ్రీశారీరక మీమాంసయందు అధ్యాసభాష్యో క్తన్యాయము.

మని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన ననిఁ. ప్రకృతిం యాన్తి-ప్రకృతిసదృశ మయిన చేష్టను బొందుచున్నవి యిచ్ఛింపనివయ్యును సర్వభూతంబులును అని యర్థము. ప్రకృతిని భగవంతుఁడుగాని తత్సమానుఁడుగాని నిగ్రహింపవచ్చు నని యాశంకించి అనతారితమైన చతుర్థపాదముయొక్క అర్థాపేక్షితమును * పూరించుచున్నారు నాయొక్కగాని యితరునియొక్కగాని అని.

హ. ఎందువలన ననఁగా.— ♦

శ్లో. నామతము నాదరింపక చేయవలసినకర్మమును సన్న్యసించి స్థాణువువలె నూరకయుండెద మని యెవ్వరు మఱి తలంచుచున్నారో అట్టివారికిఁ బ్రకృత్యధీనులకుఁ జలింపక యూరకుండుట ఘటిల్లదు, జ్ఞానులకుఁ గూడ జయింప నలవిగాని ప్రకృతిని-నామాయను నిగ్రహించుట యతిదుష్కరం బగుటవలన. అని « కార్యతే హ్యవశః కర్మ " అను వచనముయొక్క అర్థమునే మరల దృఢీకరించుచున్నాఁడు మూఢులను గర్మమునందు నియమించుకొఱకు —జ్ఞానవా నపి = నిత్యనిరంతరబ్రహ్మనిష్ఠచే సర్వవాసనాగ్రంథిని నిర్మూలించినవాఁడుగూడ బ్రహ్మవిదుఁడు; ప్రాణత్రాణహేతు వగుటచే అవశిష్ట మయిన, స్వస్యాః ప్రకృతేః = తనవాసనకు; సదృశమ్ = అనురూపముగనే; ఆహారాదులందు, చేష్టతే. దాని నిగ్రహించుటకు సమర్థుఁడు గాఁడు, శరీరస్థితికిఁ గారణ మయిన ప్రకృతి నివారింప నశక్య మగుటవలన. ఇట్లు బ్రహ్మనిష్ఠచేఁ బ్రకృతి నతిక్రమించి యున్నవాఁడు జితేంద్రియుఁడు బ్రహ్మవిదుఁడుగూడఁ బ్రకృతివశవర్తియై యుండగాఁ దక్కినమూఢుల గుఱించి చెప్పవలసినదేమి ? అను నభిప్రాయముచేఁ జెప్పుచున్నాఁడు.—సుఖదుఃఖముల ననుభవించుటకై తమతమకర్మముచే భవన్తి-పుట్టుచున్నవి గావున, భూతాని = సర్వప్రాణులును; ప్రకృతిమ్= తమతమజాతి కనురూపముగా నానావిధకర్మముల నొనర్పుటకు హేతుభూతము రాగద్వేషాదిగుణసంతతము వాసనాత్మకము అగు ప్రకృతిని; యాన్తి-తమతమప్రకృతి కనురూపముగా రాగద్వేషములచే నానావిధముగా చేష్టింపనే చేష్టింతురు, ప్రకృత్యధీనులు ఊరకుండుటకు క్షణమేని శక్తులు కారు. అందువలన, మేము ఏమియుం జేయ మని, నిగ్రహః = తాత్కాలికమైన యింద్రియ నిరోధము; కిం కరిష్యతి ? రాగాదిదోషవిశిష్ట మగు తమప్రకృతియొక్క వేగముచే అందఱును

* ఎవ్వనియొక్క నిగ్రహము అని ఆకాంక్షిత మయినదాని.

♦ తక్కినది శంకరభాష్యములో సమానము.

చేష్టలు చేయవలసినవారై యుండుటవలన నేనేమియుఁ జేయ నను నియమము వ్యర్థమని యర్థము.

మ. ఓయీ ! రాజశాసనము నతిక్రమించుటచేతంబోలె నీశాసనము నతిక్రమించుటచే భయము కలుగు నని తెలిసి యెట్లసూయచే నీమతము ననువర్తింపరు ? మఱియు, ఎల్లు సర్వపురుషార్థసాధనమునందును బ్రతికూలు రగుచున్నారు ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ప్రకృతి యనఁగా ఇప్పటి జన్మమునం దభివ్యక్తమై యన్నిటను బలవత్తరమైన పూర్వజన్మకృతధర్మాధర్మజ్ఞానేచ్ఛాదుల సంస్కారము, ఇందుకు « తం విద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞాచ » * అను శ్రుతిప్రమాణము, అట్టి, స్వస్యాః = తనదైన, ప్రకృతేః = ప్రకృతికి; సదృశమ్ = అనురూపముగానే; సర్వప్రాణియును, జ్ఞానవా నపి = బ్రహ్మవిదుఁడుగూడ, « పశ్వాదిభి శ్చావిశేషాత్ " అనున్యాయమువలన, లేక, గుణదోషజ్ఞానవంతుఁడుగూడ; చేష్టతే. ఇఁక మూర్ఖుఁడు ఎంతమాత్రము ? అందువలన, భూతాని = సర్వప్రాణులును; ప్రకృతిమ్; యాన్తి = అనువర్తించుచున్నారు. అందు, నాయొక్కగాని రాజుయొక్కగాని, నిగ్రహః; కిం కరిష్యతి—రాగ మధిక మగుటచే పాపమునుండి నివర్తించుటకు సమర్థము గా దని యర్థము. మహానరకసాధనం బని తెలిసియు దుర్వాసన ప్రబలమగుటచేఁ బాపములందుఁ బ్రవర్తించువారు నాశాసనము నతిక్రమించుదోషమునకు భయపడ రని భావము.

శ్రీ. ఓయీ ! అట్లయినయెడ మహాఫలం బగుటవలన నింద్రియములను నిగ్రహించి నిష్కాములై యందఱును స్వధర్మమునే యేల యనుష్ఠింపరు ? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—ప్రకృతి యనఁగా పూర్వకర్మసంస్కారమున కధీనమైన స్వభావము. స్వస్యాః = తనదైన; ప్రకృతేః = స్వభావమునకు; సదృశమ్ = తగినట్లుగానే; గుణదోషజ్ఞానవంతుఁడుగూడ, చేష్టతే. ఇఁకఁ జెప్పవలసిన దేమి యజ్ఞాని చేష్టించు నని ? అందువలన, భూతాని = ప్రాణులందఱును; ప్రకృతిమ్; యాన్తి = అనువర్తించుచున్నారు. ఇట్లుండఁగా, నిగ్రహః=ఇంద్రియనిగ్రహము; కిం కరిష్యతి ? ప్రకృతి బలిష్ఠం బగుటవలన నని యర్థము.

ప. ఓయీ ! జ్ఞానవంతు లందఱును భగవద్వాక్యమునందలి విశ్వాసము వలన నింద్రియముల నిగ్రహించి యేల స్వధర్మానుష్ఠానము చేయరు ? అందుకుఁ

* అతని విద్యాకర్మములు వెంబడించుచున్నవి పూర్వప్రజ్ఞయును.

జెప్పుచున్నాఁడు.—జ్ఞానవా నపి ప్రకృతే స్సదృశం చేష్టతే—ప్రాచీనకర్మసంస్కారా ధీనమైన స్వభావము ప్రకృతి, దానికి, సదృశమ్ = అనురూపముగా, గుణదోషజ్ఞాన వంతుఁడుగూడ, చేష్టతే. ఇఁక అజ్ఞునిసంగతి చెప్పవలయునా? ఎందువలన ననఁగా. భూతాని—సర్వప్రాణులును; ప్రకృతిమ్; యాన్తి = అనువర్తించుచున్నారు. ఇట్లుండఁగా, ఇంద్రియనిగ్రహము ఏమి చేయఁగలదు? ప్రకృతి బలిష్ఠం బగుటవలన.

రా. ఇట్లు ప్రకృతిసంబంధము గలవానికిఁ గర్తృత్వము ప్రకృతిగుణోద్రేకముచే నగు ననియు, అదియుఁ బరమపురుషాధీన మని యనుసంధించి, కర్మయోగాధికారియును జ్ఞానయోగాధికారియు, కర్మయోగము సుసాధం బగుటవలనను ప్రమాదరహితం బగుటవలనను అంతర్గత మయిన ఆత్మజ్ఞానము గలది యగుటచే నితరాపేక్ష లేనిది యగుటవలనను, జ్ఞానయోగము దుస్సాధం బగుటవలనను ప్రమాదసహితం బగుటవలనను శరీరధారణాద్యర్థమై కర్మాపేక్ష గలది యగుటవలనను, కర్మయోగమునే చేయవలయుననియు, వ్యపదిష్టుఁడో విశేషించి దానినే చేయవలయు ననియు చెప్పఁబడి నది. ఇఁకమీఁద నధ్యాయశేషముచే జ్ఞానయోగము దుస్సాధం బగుటచేఁ బ్రమాదసహితం బని చెప్పఁబడుచున్నది.—ప్రకృతివివిక్తం * బిట్టిది యాత్మస్వరూప మనియు, అదియే సర్వదా యనుసంధింపఁదగిన దనియు శాస్త్రములు ప్రతిపాదించుచున్న వని, జ్ఞానవా నపి = తెలివిగలవాఁడు గూడ; స్వస్యాః = తనదైన; ప్రకృతేః = ప్రాచీనవాసనకు; సదృశమ్ = అనురూపముగా; ప్రకృతివిషయములందే, చేష్టతే. ఎందువలన? అనఁగా. ప్రకృతిం యాన్తి భూతాని = అచిత్సంసృష్టము లయిన జంతువులు అనాదికాలమునుండి ప్రవృత్తమయిన వాసననే యనుసరించుచున్నవి వాసనను అనుసరించెడు ఆభూతములను, నిగ్రహః = శాస్త్రముచేఁ జేయఁబడిన నిగ్రహము ♦; కిం కరిష్యతి?

ఆత్మస్వరూపం బిట్టిది, దీనినే యెల్లప్పుడు ననుసంధింపవలయు నని శాస్త్రాభిప్రాయ మని తెలిసినవాఁడుగూడ తనప్రాచీనవాసన ననుసరించి తద్వాసనావిషయములందే ప్రవర్తించుచున్నాఁడు. ఏల యనఁగా, అచిత్సంబంధము గల జంతువు లన్నియుఁ దమతమవాసన నతిక్రమింపఁ జాలవు, కావున నట్టిజంతువులను శాస్త్రముచేయు నిగ్రహ మేమియుం జేయఁజాల దని తాత్పర్యము.

---

* ప్రకృతినుండి వివేకింపఁబడినది.

♦ నిషేధము.

మూ. ఇట్లయినయెడ, ఎందువలన నీమతము ననుష్ఠింపరు లోకులు ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు —ప్రకృతిః = పూర్వసంస్కారము.

ఇన్ద్రియ స్యేన్ద్రియస్యా ఽర్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపన్థినౌ. ౩౪

భా. సర్వప్రాణియును దనతనప్రకృతికి సదృశముగనే చేష్టించు నను నెడ, ప్రకృతిశూన్యుఁడో యెవ్వఁడును లేఁడు, అందువలనఁ బురుషకార మునకు విషయము లేమిం జేసి శాస్త్రం బనర్థకం బగును. అనఁగా నిది చెప్పుచున్నారు —ఇన్ద్రియస్య ఇన్ద్రియస్య = సర్వేంద్రియములయొక్కయు; అర్థే = శబ్దాదివిషయమందు; ఇష్టమునందు రాగము అనిష్టమునందు ద్వేషము—ఈవిధముగా ప్రతీంద్రియవిషయమునందును; రాగద్వేషౌ = రాగద్వేషములు; వ్యవస్థితౌ = అవశ్యము కలుగుచున్నవి, అందు ఇది పురుషకారమునకును శాస్త్రార్థమునకును విషయ మని చెప్పుచున్నాఁడు.—శాస్త్రార్థమునందుఁ బ్రవర్తించినవాఁడు మున్నే; తయోః= ఆ రాగద్వేషములకు; వశమ్ = లోనగుటను; నాఽఽగచ్ఛేత్ = పొందఁ గూడదు. పురుషుని ప్రకృతి యేదో అది రాగద్వేషపురస్సర మైయే గదా * స్వకార్యమునందుఁ బురుషుం బ్రవర్తింపఁ జేయుచున్నది, అప్పుడు స్వధర్మపరిత్యాగంబును బరధర్మానుష్ఠానంబును సంభవించును. ఎప్పుడు మఱి రాగద్వేషంబులఁ దద్విరోధిచే ♦ నిగ్రహించుచున్నాఁడో, అప్పుడు పురుషుఁడు శాస్త్రార్థమునందు దృష్టి గలవాఁడే యగుచున్నాఁడు, కాఁడు ప్రకృతివశుఁడు. అందువలన ఆరాగద్వేషములవశము నొందఁగూడదు. ఎందువలన ననఁగా, తౌ హి—ఆరాగద్వేషములు; అస్య= ఈపురుషునకు; పరిపన్థినౌ—శ్రేయోమార్గమునకు విఘ్నకర్తలు తస్కరులుంబోలె మార్గమునకు.

ఇంద్రియవిషయము లగు శబ్దాదులందు ఒక్కొకదానియందును ఇష్టమైనదానియందు రాగమును అనిష్టమైనదానియందు ద్వేషంబును వ్యవస్థితంబులై యుండును. ఈ రాగద్వేషంబులను గలిగించి వీనిమూలముననే పూర్వవాసనారూ

* రాగద్వేషములను ముందు గలుగఁజేసి వానిమూలముననే గదా.

♦ రాగద్వేషవిరోధి యగు వివేకవిజ్ఞానముచే.

పమైన ప్రకృతి స్వవిషయమునందుఁ బురుషుం బ్రవర్తింపఁజేయును. వీని నిగ్రహించినచోఁ బురుషుఁడు ప్రకృతివశుండుకాఁడు. యథాశాస్త్రం బనుష్ఠింప సమర్థుండగును. ఇట్లు రాగద్వేషములే పురుషునకు శ్రేయోమార్గమునందు మార్గమునందుదొంగలవలె శత్రువులై యున్నవి, కావునఁ బురుషుఁడు వీనివశము నొందక వివేకవిజ్ఞానముచే వీని నిగ్రహింపవలయు నని తాత్పర్యము.

టీ. సమస్త మయిన భూతవర్గంబును బ్రకృతివశవర్తి యనునెడ లౌకిక వైదిక పురుషకారంబులకు విషయము సంభవింపమివలన విధినిషేధంబు లనర్థకంబు లగు నని శంకించుచున్నాఁడు సర్వప్రాణియును ఇత్యాదిగా. ఓయీ! ఎవ్వనికిఁ బ్రకృతి లేదో వానికిఁ బురుషకారము సంభవించుటవలనఁ దద్విషయంబున విధి నిషేధంబు లర్థవంతంబులు కాఁ గలవు. అనఁగా నట్లు కా దని చెప్పుచున్నాఁడు ప్రకృతిశూన్యుఁడో ఇత్యాదిగా. శంకించిన దోషమును ఈశ్లోకముచేఁ బరిహరించుచున్నారు ఇది ఇత్యాదిగా. వీప్సకు ♦ సర్వేంద్రియము లర్థ మని చూపుచున్నారు సర్వేంద్రియములయొక్కయు అని. ప్రతివిషయమునందు రాగద్వేషములు వ్యవస్థ లేక ప్రాప్తించు ననుటను బరిహరించుచున్నారు ఇష్టమునందు ఇత్యాదిగా. ప్రతివిషయమునందును విభాగముచే రాగద్వేషముల రెంటిలో నొకటి యావశ్యకం బన్నను బురుషకారమునకు విషయము లే దను హేతువుచేఁ బూర్వోక్త మయిన దోషము నెట్లు పరిహరింపవలయు నని యాశంకించి చెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. అవతారిత మయిన తృతీయపాదమును విభజించుచున్నారు శాస్త్రార్థమునందు ఇత్యాదిగా. ప్రకృతివశం బగుటవలనఁ బ్రాణికి నియోజ్యత్వము * సంభవింపనే సంభవింప దని యాశంకించి చెప్పుచున్నారు పురుషుని ఇత్యాదిగా. రాగద్వేషద్వారంబునఁ బ్రకృతివశవర్తి యయినపుడు స్వధర్మత్యాగాదికము నివారింప శక్యము గా దని చెప్పఁబడినది. ఇప్పుడు వివేకవిజ్ఞానముచే రాగాదికము నివారించినచో శాస్త్రీయదృష్టిచేఁ బ్రకృతిపరవశతను బరిహరింప శక్యం బగు నని చెప్పుచున్నారు ఎప్పుడు మఱి ఇత్యాదిగా. మిథ్యాజ్ఞాననిబంధనములు గదా రాగద్వేషములు, మిథ్యాజ్ఞానవిరోధి యగుటచే వివేకవిజ్ఞానము రాగద్వేషవిరోధి యగు నని తెలియునది. రాగద్వేషములకుఁ దత్కారణనివృత్తిచే నివృత్తి యగుటవలనఁ బ్రతిబంధకము తొలఁగుటచేఁ గార్యసిద్ధి యగు నను నభిప్రాయముచేఁ జెప్పుచున్నారు అప్పుడు ఇత్యాదిగా.

---

♦ ఇన్ద్రియస్య ఇన్ద్రియస్య అని రెండుమార్లు చెప్పుటకు.

* శాస్త్రముచే నియోగింప యోగ్య మగుట.

ఏవకారం బన్యయోగవ్యవచ్ఛేదకం బని ♦ తెలుపుచున్నారు కాఁడు ప్రకృతివశుఁడు అని. పూర్వోక్త మగు నియోగము నుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా. అందుకు హేతువు చెప్పుచున్నారు ఎందువలన ఇత్యాదిగా. హి అను శబ్దముచే బోధిత మగు హేతువు ఎందువలన అని ప్రకటింపఁబడినది. అందుకు మున్ను చెప్పిన అందువలన అనుదానితో సంబంధము. ఆరాగద్వేషములు పురుష పరిపంథు లనుటనే యుదాహరణసహితముగాఁ దెలుపుచున్నారు శ్రేయోమార్గము నకు ఇత్యాదిగా.

హా. ఇందువలన శాస్త్రం బనర్థకం బగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.— ఇన్ద్రియ స్యేన్ద్రియాస్యార్థే = సర్వేంద్రియములవిషయమునందును; ఇష్టమునందు రాగము అనిష్టమునందు ద్వేషము ఈ విధముగా ప్రకృతి యనంబడు స్వభావమువలనఁ బ్రవృత్తినివృత్తులు సంభవించుట వాస్తవమే, అయినను ఆ ప్రవృత్తినివృత్తులు రాగద్వేషపూర్వకము లనుట ప్రత్యక్షము, రాగమువలనఁ బ్రవృత్తి ద్వేషమువలన నివృత్తి యని. కావున రాగద్వేషంబుల నిగ్రహించి యథాశాస్త్రముగాఁ బ్రవర్తింపవలయును. ఎందువలన ననఁగా—తౌ = ఆ రాగద్వేషములు; పరిపన్థినౌ = పురుషార్థ ప్రతిబంధకములు.

శం. ఓయీ! సమస్త మయిన ప్రాణిసమూహంబును రాగద్వేషాత్మక మగు ప్రకృతికిఁ బరవశం బనునెడ నీమతము ననుసరించువారలుగూడ ఈప్రకృతికిఁ బరవశు లగుటవలన నీవు చెప్పినకర్మయోగమునం దెట్లు వారికిఁ బ్రవృత్తి సంభవించును? అని యాశంకింపఁగా, రాగద్వేషములు సమీచీనత్వా ఽసమీచీనత్వ బుద్ధిమూలకంబు * లగుటవలన "నద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే" ‖ అను న్యాయముచే ఈశ్వరారాధనాత్మకమై కర్తవ్య మైన విధ్యుక్తకర్మమునందు "ఇది కుశలము ఇది యకుశలము" అనుబుద్ధిని బరిత్యజించినచో రాగద్వేషంబుల కవకాశము లే దని సూచించుటకై రాగద్వేషములస్థితిని అవి నివర్తించువిధంబును అవి బంధకంబు లనుటను జెప్పుచున్నాఁడు —ఇన్ద్రియస్యేన్ద్రియస్య = శ్రోత్రాది సర్వేంద్రియములయొక్క; అర్థే = శబ్దాదివిషయమందు; రాగద్వేషౌ వ్యవస్థితౌ—

♦ శాస్త్రార్థమునందు దృష్టి గలవాఁడే అనుచోటి యేకారము, ఇతరసంబంధము వ్యావర్తించునది యని.

* ఇది మంచిది ఇది చెడ్డది అను బుద్ధిమూలముగాఁ గలవి.

‖ మంచిది కాని కర్మమునెడ ద్వేషింపఁడు మంచిదానియందు సక్తుఁడు కాఁడు.

ఇష్టమునందు రాగము అనిష్టమునందు ద్వేషము ఈరీతిగాఁ బ్రతివిషయమునందును నియమమున నున్నవి. ఇంద్రియములకు విషయములందు రాగముగాని ద్వేషము గాని యుండుఁ గాక, ముముక్షువునకు అందుచే నేమి హాని? అనఁగాఁ జెప్పు చున్నాఁడు.—హి = ఏకారణమువలన; తౌ = ఆరాగద్వేషములు; అస్య—ధర్మ మనుష్ఠింపఁ గోరువానికి; మోక్షమార్గమునకు, పరిపన్థినౌ = మార్గమునకు దొంగ లవలెఁ బ్రతిబంధకములు, మోక్షసాధనము నాశ్రయించుచున్న ముముక్షువును తమయాశ్రయబలముచే విషయారణ్యమునందుఁ బడఁద్రోసి దానిలోపలనే త్రిప్పు చున్నవి. ఆకారణమువలన ముముక్షు వగు పురుషుఁడు సదసద్వివేకము గలవాఁడు విషయమునందు సమీచీనత్వాది బుద్ధిచే, తయోః = ఆరాగద్వేషములయొక్క; వశమ్ = అధీనతను; నాగచ్ఛేత్—ద్రవ్యమునందుఁగాని గుణమునందుఁగాని కర్మము నందుఁగాని సమీచీనత్వాదిబుద్ధిని వహింపఁగూడదు. విషయములందుసమీచీనత్వా ఽసమీచీనత్వబుద్ధి యుంచుటయే గదా ఆవిషయములకు వశవర్తి యగుటకు హేతువు. దానిని ముముక్షువు వహింపక రాగద్వేషములకు విషయము గానివాఁడై స్వధర్మమునందుఁ గుశలమైనదానియందుఁగాని అకుశల మైనదానియందుఁగాని * ఈశ్వరప్రీతికొఱకుఁ బ్రవర్తింపవలయును. ఇట్లు ప్రవర్తించునేని నిర్విఘ్నముగా మోక్షమునొందు నని యర్థము.

మ. ఓయీ! సర్వప్రాణివర్గంబును బ్రకృతివశవర్తి యనునెడ లౌకికవైదిక పురుషకారమునకు విషయము లేకుండుటవలన విధినిషేధములకు వ్యర్థత సంభవించి నది. ప్రకృతిశూన్యుఁడో యెవ్వఁడును లేఁడు. ప్రకృతిశూన్యుఁ డున్నంగదా వానియెడ విధినిషేధములు ప్రయోజనవంతంబు లగును. అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఇన్ద్రి యస్యేన్ద్రియస్య—ఇటవీప్సచే సమస్తములైన యింద్రియములయొక్క అని యర్థము; అర్థే = విషయమునందు, శబ్దమునందును స్పర్శమునందును రూపమునందును రసము నందును గంధమునందును, ఇట్లే కర్మేంద్రియవిషయ మగున వచనాదికమునందును; శాస్త్రనిషిద్ధమునందుఁగూడ అనుకూలమునందు రాగము శాస్త్రవిహితమునందుఁ గూడఁ బ్రతికూలమునందు ద్వేషము-- ఈవిధముగాఁ బ్రతీంద్రియార్థమునందును రాగద్వేషములు, వ్యవస్థితౌ = అనుకూల్యప్రాతికూల్యవ్యవస్థచేఁ గలుగుచున్నవి, కాని నియమము లేక సర్వత్ర ఆరాగద్వేషములు కలుగవు. అందుఁ బురుషకారము నకును శాస్త్రమునకును ఇది విషయము—తయోః వశం నాగచ్ఛేత్ = ఆరాగద్వేష

* కుశలము—సుఖకరము, అకుశలము—దుఃఖకరము.

ముల వశమును బొందఁగూడ దనుట. ఎట్లనఁగా—పురుషుని ప్రకృతి యేది గలదో అది బలవదనిష్టసాధనత్వజ్ఞానాఽభావసహకృత మయిన ** ఇష్టసాధనత్వజ్ఞానముచేఁ ♦♦ గలుగునట్టి రాగమును బురస్కరించికొనియే శాస్త్రనిషిద్ధ మయిన కలంజభక్షణాదికమునందుఁ బ్రవర్తిల్లఁ జేయుచున్నది, అట్లు బలవదిష్టసాధనత్వజ్ఞానాఽభావసహకృత మైన § అనిష్టసాధనత్వజ్ఞానముచేఁ ‖ గలుగునట్టి ద్వేషమును బురస్కరించుకొనియే శాస్త్రవిహిత మైన సంధ్యావందనాదికమునుండియు నివర్తించుచున్నది. అందు నిషిద్ధము గొప్ప యనిష్టమును గలిగించునది యనుట శాస్త్రముచే బోధింపఁబడఁగా సహకారి * లేకుండుటం జేసి కేవల మైన దృష్టేష్టసాధనత్వజ్ఞానము ♦ తేనియతోను విషముతోనుం గలిసిన యన్నము భుజించుటయందుంబోలె నిషిద్ధమునందు రాగముఁ బుట్టింప సమర్థము కాదు. ఇట్లు విహితము గొప్పయిష్టమునకు సాధనం బనుట శాస్త్రముచే బోధింపఁబడఁగా సహకారి ‖‖ లేకుండుటవలనఁ గేవల మయిన అనిష్టసాధనత్వజ్ఞానత్వము భోజనాదికమునందుంబోలె విహితమునందు ద్వేషముఁ బుట్టింప సమర్థము కాదు. అందువలన అడ్డులేనిదై శాస్త్రము విహితమునందుఁ బురుషునిఁ బ్రవర్తిల్లఁ జేయుచున్నది. నిషిద్ధమునుండియు నివర్తిల్లఁ జేయుచున్నది. ఇట్లు శాస్త్రజన్య వివేకవిజ్ఞాన ప్రాబల్యముచే స్వాభావిక రాగద్వేషములకుఁ గారణనాశముచే నాశము కలుగుటవలనఁ బ్రకృతి విపరీతమార్గమునందు శాస్త్రదృష్టి గల పురుషునిఁ బ్రవర్తిల్లఁ జేయఁ జాలదు. కావున లేదు శాస్త్రమునకును బురుషకారమునకును వైయర్థ్యప్రసక్తి. తయోః—ఆ రాగద్వేషములకు; వశం నాగచ్ఛేత్—వాని కధీనుఁడై ప్రవర్తిల్లను నివర్తిల్లనుం గూడదు, ఏ మేమనఁగాఁ శాస్త్రజన్య మగు తద్విరుద్ధజ్ఞానముచే వాని కారణముఁ దొలఁగించి వానిని నశింపఁజేయవలయును. హి = ఎందువలన ననఁగా; తౌ = ఆ రాగద్వేషములు, స్వాభావికదోషముచేఁ బుట్టినవి; అస్య = ఈ పురు

** గొప్పఅనిష్టమునకు సాధనం బిది యనుజ్ఞానము లేమితోఁ గూడిన—అది సహాయముగాఁగల.

♦♦ ఇష్టమునకు సాధనం బిది యనుజ్ఞానముచే.

§ గొప్పయిష్టమునకు సాధనం బిది యనుజ్ఞానము లేమితోఁ గూడిన—అది సహాయముగాఁ గల.

‖ అనిష్టమునకు సాధనం బిది యనుజ్ఞానముచే.

* సహాయము—గొప్ప యనిష్టమునకుఁ సాధనం బిది యను జ్ఞానము లేమి.

♦ దృష్ట మయిన యిష్టమునకు సాధనం బిది యనుజ్ఞానము.

‖‖ గొప్పయిష్టమునకు సాధనం బిది యను జ్ఞానము లేమి.

షునకు, శ్రేయస్సు గోరువానికి; పరిపన్థినౌ = శత్రువులు, శ్రేయోమార్గమునకు విఘ్నము చేయునవి, బాటసారికి దొంగలవలె. ఈవిషయము "ద్వయా హ ప్రాజాపత్యా దేవా శ్చా ఽసురాశ్చ తతః కనీయసా ఏవ దేవా జ్యాయసా అసురా స్త ఏషు లోకే ష్వ స్పర్ధన్త" ఇత్యాది శ్రుతియందు స్వాభావికరాగద్వేషములవలనఁ గలుగు శాస్త్రవిపరీతప్రవృత్తిని అసురులుగాను శాస్త్రీయప్రవృత్తిని దేవతలుగాను నిరూపించి యతివిస్తరముగ వివరింపఁబడియె. కావున నుపరమించెదను.

శ్రీ. ఓయీ! ఇట్లు పురుషునిప్రవృత్తి ప్రకృతి కధీనమే యనునెడ విధినిషేధములకు వ్యర్థత సంభవించు నని యాశంకించి చెప్పుచున్నాఁడు.—ఇన్ద్రియస్యేన్ద్రియస్య అని వీప్సచే సర్వేంద్రియములకును ఒక్కొకదానికిని అని చెప్పఁబడినది. అర్థే=తనతనవిషయమునందు; అనుకూలమునందు రాగము ప్రతికూలమునందు ద్వేషము ఇట్లు, రాగద్వేషౌ; వ్యవస్థితౌ = అవశ్యము గలుగుచున్నవి. అందువలనఁ దదనురూప మయిన ప్రవృత్తి—ఇది భూతములప్రకృతి. అయినను, ఆరాగద్వేషములకు వశవర్తి కాఁగూడ దని శాస్త్రముచే నియమింపఁబడుచున్నది. హి= ఎందువలన ననఁగా. అస్య = ఈముముక్షువునకు; తౌ; పరిపన్థినౌ = ప్రతిపక్షములు. ఇది భావము—విషయస్మరణాదికముచే రాగద్వేషములను బుట్టించి యెచ్చరిక లేనిపురుషుని అనర్థమునందు లోఁతుప్రవాహమునఁ బడుటయందుంబోలెఁ బ్రకృతి బలిమిం బ్రవర్తిల్లఁ జేయుచున్నది, శాస్త్రమో అందుకు మున్నే విషయములందు రాగద్వేషములు కలుగుటకుఁ బ్రతిబంధక మయిన పరమేశ్వరభజనాదికమునందుఁ బ్రవర్తిల్లఁ జేయుచున్నది, అందుచే లోఁతుప్రవాహమునఁ బడుటకు మున్నే యోడ నెక్కినవాని యట్లు అనర్థముఁ బొందఁడు అని.

ప. ఓయీ! ఇట్లు ప్రాచీనస్వభావాధీనంబు పురుషునిప్రవృత్తి యనునెడ అప్పుడు విధినిషేధంబులు వ్యర్థము లగును. అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఇన్ద్రియస్య = ముఖ్యేంద్రియ మైనమనస్సునకు; ఇన్ద్రియస్య అర్థే = ఇంద్రియవిషయ మయిన రూపరసాదికమునందు; రాగద్వేషౌ; వ్యవస్థితౌ = అవశ్యము కలుగును—తన కనుకూల మయిన విషయమునందు రాగము, ప్రతికూల మగు విషయమునందు ద్వేషమును. అట్లయినను, తయోః వశం నాగచ్ఛేత్—వానికి వశవర్తి కాఁగూడదు. హి = ఎందువలన ననఁగా. తౌ= ఆరాగద్వేషములు; అస్య—ఈముముక్షువు మనస్సునకు; పరిపన్థినౌ = క్షోభజనకంబు లగుటచే శత్రువులవలె వచ్చినవి.

లోకమునందుఁగూడ నెవ్వఁడును శత్రువులకు వశవర్తి కాఁడు గదా! దుఃఖజనక మగు దానియందుఁ బ్రవృత్తి సంభవింపమివలన. ఇఁక నారాగద్వేషములు ప్రకృతి బలముచేఁ బురుషునిఁ దమకు వశవర్తిగాఁ జేయునందురేమో, అట్లయినను నాయొక్క * ఆశ్రయబలముచేతను శాస్త్రాచార్యులబలముచేతను తద్వశవర్తి గాక యుండవలయు నని యర్థము. ఓయీ! అందుకుఁగూడఁ బ్రాచీనసంస్కారమే కరణము అందువేని అట్లు కాదు, "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యః" ఇత్యాదివాక్యములచే నుపాస్యుం డని శ్రుతి బోధించుటవలన.

రా. ప్రకృతిని వెంబడించువిధముఁ జెప్పుచున్నాఁడు.—ఇన్ద్రియస్య = శ్రోత్రాది జ్ఞానేంద్రియముయొక్కయు; ఇన్ద్రియస్య = వాగాదికర్మేంద్రియము యొక్కయు; అర్థే = జ్ఞానేంద్రియవిషయ మయిన శబ్దాదికమునందును కర్మేంద్రియ మైన వచనాదికమునందును; ప్రాచీనవాసనచేఁ బుట్టిన తదనుభవేచ్ఛారూపం బయిన రాగము, అనివార్యముగా వ్యవస్థితము. తనుభవము ప్రతిహతమైనప్పుడు అనివార్యమైన ద్వేషమును వ్యవస్థితమైయున్నది. ఆరాగద్వేషములు ఇట్లు జ్ఞానయోగము కొఱకు యత్నించువానిని సర్వేంద్రియములను నిగ్రహించినవానిని దమవశమునం దుంచుకొని బలాత్కారంబునఁ దమకార్యములందుఁ బ్రవేశింపఁజేయుచున్నవి. అంత నితండు ఆత్మస్వరూపానుభవవిముఖుండై వినాశము నొందుచున్నాఁడు. తయోః న వశమాగచ్ఛేత్—జ్ఞానయోగము నారంభించుటచే ఆరాగద్వేషములవశము నొంది నశింపఁగూడదు. తౌ = ఆరాగద్వేషములు; అస్య = వీనికి; పరిపన్థినౌ హి = జయింప నలవి గానిశత్రువులు గదా! జ్ఞానాభ్యాసమును దొలఁగించుచున్నవి.

శబ్దాది జ్ఞానేంద్రియవిషయమునందును వచనాది కర్మేంద్రియవిషయము నందును బూర్వవాసనచే వీని ననుభవింపవలయు నను నిచ్ఛ కలుగుచున్నది. ఈయిచ్ఛయే రాగ మనఁబడును. వీని ననుభవించుట సిద్ధింపని యప్పుడు ద్వేషము కలుగుచున్నది. ఈరాగద్వేషములు అనివార్యములు. కావున జ్ఞానయోగము నారంభించినచోఁ బురుషుఁడు వీనికి లోనై యాత్మానుభవము కోలుపోయి వినాశము నొందును. ఏలయనఁగా నీరాగద్వేషము లనుశత్రువులను జయింప శక్యము గాదు. ఇవి పురుషుని జ్ఞానయోగాభ్యాసమునుండి తొలఁగించి నాశము చేయును. కావున జ్ఞానయోగము నవలంబింపఁగూడ దని తాత్పర్యము.

---

* భగవంతునియొక్క.

మూ. అట్లయినను.—యథాశక్తి నిగ్రహము చేయవలయును, నిగ్రహమువలన ఇష్టప్రయోజనము గలుగకున్నను అతిప్రయత్నము చేసినచో కలుగనే కలుగుచున్నది యనునభిప్రాయము గలవాఁడై చెప్పుచున్నాఁడు ఇన్ద్రియస్యేత్యాదిగా. అట్లే చెప్పఁబడినది «సంస్కారో బలవా నేష బ్రహ్మాద్యా అపి తద్వశాః । తథా ౽పి సో ౽న్యథా కర్తుం శక్యతే ౽తిప్రయత్నతః» * అని.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 35

భా. అందు రాగద్వేషప్రయుక్తుఁడు తలంచుచున్నాఁడు శాస్త్రార్థమునుగూడ వేఱువిధముగా, «పరధర్మముగూడ ధర్మం బగుటవలన ననుష్ఠేయంబే" అని. అది సరి గాదు.—స్వధర్మః=తనదైన ధర్మము; విగుణః=విగతగుణ మయి అనుష్ఠింపఁబడుచున్నదైనను §; పరధర్మాత్ = ఇతరునిధర్మముకంటె; స్వనుష్ఠితాత్ = సాద్గుణ్యముతో ♦ సంపాదింపఁబడినదానికంటెఁగూడ; శ్రేయాన్ = మిక్కిలి ప్రశస్తము. స్వధర్మే = తనధర్మమునందు, ఉన్నవానికి; నిధనమ్ = మరణముగూడ; శ్రేయః= శ్రేష్ఠము, పరధర్మమునం దున్నవానికి బ్రతుకుకంటె. ఎందువలన ననఁగా. పరధర్మః = ఇతరునిధర్మము; భయావహః = నరకాదిరూప మయిన భయము కలిగించునది.

సాంగముగాఁ గాక యథాశక్తి ననుష్ఠితంబైనను స్వధర్మము, చక్కఁగా ననుష్ఠింపఁబడిన పరధర్మముకంటె నుత్తమము. పరధర్మమునందుండి జీవించుటకంటె స్వధర్మముననుండి మరణము నొందుటయైనను మేలు. ఏల యనఁగా పరధర్మము నవలంబించినయెడ నరకప్రాప్తి మొదలగు ననర్థములు సంభవించు నని తాత్పర్యము.

అ. రాగద్వేషములు శ్రేయోమార్గమునకు శత్రువు లనుటను బ్రకటించుటకై పరమతము ‖ నుపన్యసించుద్వారమున మీఁదిశ్లోకమున కవతారిక చేయు

---

* ఈసంస్కారము ప్రబలము. బ్రహ్మాదులుగూడ దానికి వశ్యులు. అట్లయినను అతిప్రయత్నమువలన దాని మార్పవచ్చును.

§ కొంచెము గుణము తక్కువగా అనుష్ఠింపఁబడినదైనను — సాంగముగా అనుష్ఠింపఁబడక యథాశక్తిగా అనుష్ఠింపఁబడినదైనను.

♦ సకలాంగములతోఁ గూడినట్లుగా.

‖ పూర్వపక్షిమతమును.

చున్నారు అందు ఇత్యాదిగా. అందు—వ్యవహారభూమియందు *. శాస్త్రార్థమును వేఱువిధముగాఁ దలంచుటనే చూపుచున్నారు పరధర్మముగూడ ఇత్యాదిగా. స్వధర్మమువలె నని అప్యర్థక మయిన కూడ అనుదాని కర్థము. అనుమానమును దూషించుచు శ్లోకము నెత్తుచున్నారు అది సరిగా దని. అనుష్ఠింప నశక్యమయిన క్షత్త్రి ధర్మ మగు యుద్ధముకన్న భిక్షాశనాదిరూప మయిన సన్న్యాసిధర్మము సుఖముగా అనుష్ఠింపఁ దగిన దగుటచే నాకుఁ గూడఁ గర్తవ్య మ్మనుట ప్రాప్తించుచున్న దని యాశంకించి వ్యాఖ్యానము చేయుచున్నారు స్వధర్మః ఇత్యాదిగా. చెప్పిన యర్థమునందుఁ బ్రశ్నపూర్వకముగా హేతువు చెప్పుచున్నారు ఎందువలన ననఁగా ఇత్యాదిగా. స్వధర్మము విడనాడి పరధర్మము ననుష్ఠించువానికి స్వధర్మము నతిక్రమించుదోషము పరిహరింప నశక్యం బగుటవలన స్వధర్మత్యాగము మంచిది గా దని యర్థము.

హ. ఎందువలన; స్వధర్మః; విగుణః = కొన్నియంగములు లేనిదైనను; పరునిధర్మము పరధర్మము అట్టిపరధర్మముకంటె; స్వనుష్ఠితాత్ = సగుణముగా ననుష్ఠింపఁబడినదానికంటె; శ్రేయాన్ = మిక్కిలి ప్రశస్యమో. అందువలన; స్వధర్మే, నిధనమ్; శ్రేయః = మిక్కిలి ప్రశస్యము. పరధర్మః, భయావహః—భయము కల్గించున ని యర్థము.

శం. ఓయీ! « అభయం సర్వభూతేభ్యో దత్త్వా నైష్కర్మ్య మాచరేత్ » ♦ అనుస్మృతివలన, కర్మసన్న్యాసముగూడ ధర్మము కావునఁ గర్తవ్యమే యగు నందువేని, సత్యము. సన్న్యాసముగూడ శాస్త్రీయమైన ధర్మమే; ముముక్షుచేఁ గర్తవ్యము నగును; అయినను « స్వే స్వే ఽధికారే యా నిష్ఠా స గుణః పరికీర్తితః " ❡ అనువచనమువలన, అంతఃకరణపరిపాకము లేనివాని కది ధర్మము గాదు. మఱి యే మనఁగా, బహుజన్మార్జిత సుకృతరాసులచేత నంతఃకరణపరిపాకము నొంది సమస్తమునుండియు విరక్తుఁడై కర్మములు మోక్షసాధనము కావని యెఱింగినట్టి ముముక్షువునకుమాత్రమే సన్న్యాసము వివిదిషచేఁ గర్తవ్యధర్మ మగుచున్నది. కృతార్థుఁడైన విద్వాంసునకుఁగూడ. కాని మూఢునకుఁ గర్మ

* లోకమునందు.

♦ సర్వభూతంబులకును అభయం బొసంగి నైష్కర్మ్యమును—సన్న్యాసము ననుష్ఠింపవలయును.

❡ తనతన యధికారమునందు నిష్ఠ యేది గలదో అది గుణము—ధర్మ మని చెప్పఁబడినది.

ములందు అలసుఁడైనవానికి * దుఃఖబుద్ధిచే ‡ సన్న్యాసము కర్తవ్యధర్మము గాదు. అందువలన వీనికి సన్న్యాసము పరధర్మమే యగుం గాని స్వధర్మము కాదు, శ్రేయస్కరమునుం గాదు. మ తేమనఁగా నితనికిఁ గర్మమే స్వధర్మము శ్రేయస్కరంబును గావున నదియె యనుష్ఠేయం బని చెప్పుచున్నాఁడు. వర్ణాశ్రముల కిది పరమోపదేశము భగవంతుఁడు చేయుచున్నాఁడు, ముముక్షువులు వినవలయును.—స్వనుష్ఠితాత్ = యథాశాస్త్రముగా, సు—చక్కని నియమముచే ఆచరింపఁబడిన; పరధర్మాత్ = పరధర్మముకంటె; విగుణః = అంగహీనమైనను, చక్కఁగా అనుష్ఠింపఁబడనిది యైనను; స్వధర్మః—తనకుఁ గర్తవ్యముగా శాస్త్రముచే నేది విధింపఁబడినదో అదియే స్వధర్మము; పురుషునకు, శ్రేయాన్ = మిక్కిలి శ్రేష్ఠము, విధివిహిత మగుటవలన. ఎట్లు యతికిఁ గర్మము పరధర్మ మగుటవలన స్నాన దాన జపస్తోత్రాదికర్మములకంటె జ్ఞానసాధన మగు శ్రవణాదికమే ముఖ్యప్రయోజనముగాఁ గల కర్మసన్న్యాసమే శ్రేష్ఠ మగుచున్నదో, అట్లు గృహస్థునకుఁ గూడఁ గర్మసన్న్యాసము పరధర్మ మగుటవలన సర్వకర్మసన్న్యాసముకంటె జ్ఞానసాధన మగు సత్త్వశుద్ధియే ముఖ్యప్రయోజనముగాఁ గల కర్మయోగంబే శ్రేష్ఠ మగుధర్మము. ఈవిధముగనే యితరవర్ణాశ్రమములకుఁగూడఁ బరధర్మముకంటె స్వధర్మమే శ్రేయస్కరం బని యర్థము. మఱియును, చక్కఁగాఁ బరధర్మమును విడిచి స్వల్పము గాని సాంగము గానిది గాని యగు, స్వధర్మే; నియమంబున వర్తించువానికి, నిధనమ్ = మరణము; శ్రేయః—శ్రేయస్సును స్వర్గమును గాని మోక్షమును గాని కలిగించును, ఎప్పుడును అశ్రేయస్సును—నరకమును గలిగింపదు. స్వధర్మమును బరిత్యజించి నోటఁ జెప్పుటకుఁగూడ అశక్య మయిన పరధర్మమునందు వర్తించువానికి మరణం బెప్పుడును శ్రేయస్సును గలిగింపదు. మ తే మనఁగా, పరధర్మో భయావహః—నియమంబున చక్కఁగా ననుష్ఠింపఁబడినదైనను పరధర్మము భయమును—యమదూతలవలన నరకమునుగూడ కలిగించునది, నరకము గర్భవాసము మొద లగు దుఃఖప్రవాహమునకు హేతు వని యర్థము.

మ. ఓయీ ! స్వాభావికరాగద్వేషంబులచేఁ గలుగు పశ్వాది సాధారణ మయిన ♦ ప్రవృత్తిని బరిత్యజించి శాస్త్రీయ మయిన కర్మమే కర్తవ్య మనునెడ

---

* సోమరి యయినవానికి.

‡ కర్మము లనుష్ఠించుట శ్రమ యను తలంపుచే.

♦ పశువులు మొదలగువానికిఁ గలుగు ప్రవృత్తివంటి.

అప్పుడు సుకరం బగు భిక్షాశనాదికమే చేయఁబడుఁ గాక, దుఃఖకరం బగు యుద్ధముచే నేమి ప్రయోజనము? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—శ్రేయాన్ = మిక్కిలి ప్రశస్తము; స్వధర్మః—ఏవర్ణమునుగాని యాశ్రమమునుగాని గూర్చి ఏది విధింపఁబడినదో దాని కది స్వధర్మము; విగుణః = సర్వాంగ సహితముగాఁ గాక చేయఁబడినదైనను; పరధర్మాత్—తన్నుగూర్చి విహితము కానిదాని కన్నను; స్వనుష్ఠితాత్ = సర్వాంగసహితముగాఁ జేయఁబడినదానికన్నను గూడ; ధర్మము వేదమువలనఁ దెలియఁదగినదియే కాని యితర ప్రమాణమువలనఁ దెలియఁదగినది కాదు గదా! అట్లయినం గదా «పరధర్మముగూడ అనుష్ఠేయము ధర్మ మగుటవలన స్వధర్మమువలె» అను ననుమానము ధర్మమునందుఁ బ్రమాణ మగును, «చోదనా లక్షణో ధర్మః» ♦ అను న్యాయమువలన. అందువలన, స్వధర్మే—ఒకానొకయంగము లేనిదానియం దైనను, ఉన్నవానికి; నిధనమ్ = మరణముగూడ; శ్రేయః= మిక్కిలి ప్రశస్తము, పరధర్మమునం దున్నవానికి బ్రతుకుకన్నం గూడ. స్వధర్మమున నుండి మరణము నొందినం గదా యీలోకమునందు యశస్సును బరలోకమునందు స్వర్గాదులును సిద్ధించును. పరధర్మమో, ఈలోకమున అపకీర్తి కల్గించునది యగుటచేతను పరలోకమున నరకప్రద మగుటచేతను, భయావహః = భయము కల్గించునది, ఎందువలననో; అందువలన, రాగద్వేషాదులచేఁ గలుగు స్వాభావిక ప్రవృత్తినింబోలె పరధర్మమునుంగూడఁ బరిత్యజింపవలసినదియే యని యర్థము. ఇట్లంతయు, భగవంతుని మతము నంగీకరించువారికి శ్రేయఃప్రాప్తియు దాని నంగీకరింపనివారికి శ్రేయోమార్గ భ్రష్టతయుఁ జెప్పఁబడినది. శ్రేయోమార్గ భ్రంశమునం జేసి ఫలాభిసంధిపూర్వకముగాఁ గామ్యకర్మాచరణమునందును కేవల పాపకర్మాచరణమునందును బెక్కుకారణములు ప్రతిపాదింపఁబడినవి యే త్వే తదభ్య సూయన్త ఇత్యాదిగా. వాని కిది సంగ్రహపద్యము.—

శ్రద్ధ లేమి యసూయ యశుద్ధచిత్త
మూఢతా ప్రకృతివశత్వములును ద్వేష
రాగములు పరధర్మాచరణమును నివి
పలుకఁబడియెను దుర్మార్గవాహకములు.

శ్రీ. ఇట్లు స్వాభావిక మగు పశ్వాదిసాధారణప్రకృతిని బరిత్యజించి స్వధర్మమునందుఁ బ్రవర్తింపవలయు నని ప్రతిపాదింపఁబడినది. అప్పుడు స్వధర్మ మగు

♦ విధిరూప మయినది ధర్మము.

యుద్ధాదికము దుఃఖరూప మగుటచే యథావిధిగఁ జేయుట యశక్య మగుటవలనను, బరధర్మం బగు అహింసాదికము సుకరం బగుటవలనను ధర్మమే యగుటవలనను అందుఁ బ్రవర్తింపఁగోరువానిం గూర్చి చెప్పుచున్నాఁడు.—కొంచెము అంగహీన మయినను, స్వధర్మః; శ్రేయాన్ = మిక్కిలి ప్రశస్తము; స్వనుష్ఠితాత్ = సర్వాంగ పూర్తితోఁ జేయఁబడిన; పరధర్మాత్ = పరధర్మముకన్నం గూడ. అందుకు హేతువు—స్వధర్మే—యుద్ధాదికమునందు, ప్రవర్తించువానికి; నిధనమ్ = చావుగూడ, శ్రేష్ఠము, స్వర్గాదుల నొందించునది యగుటవలన. పరధర్మమో, తపము, భయావహః—నిషిద్ధ మగుటచే నరకము నొందించునది యగుటవలన.

ప. ఓయీ! ధర్మమే యగుటవలన శమదమాది సంపదతోఁగూడిన బ్రాహ్మణధర్మమే యనుష్ఠింపవచ్చును, తనకును బరులకును హింసారూపమై దుఃఖహేతు వగు క్షత్త్రిధర్మమునం దేల ప్రవర్తింపవలయు నని యాశంకించి చెప్పుచున్నాఁడు.—స్వనుష్ఠితాత్ = చక్కగా అనుష్ఠింపఁబడిన; పరధర్మాత్ = శమదమాది సంపదతోఁ గూడిన బ్రాహ్మణధర్మముకంటె; మీఁదఁ జెప్పినట్లు గుణహీనమైనను, స్వధర్మః, శ్రేయాన్ = మిక్కిలి ప్రశస్య మని చెప్పఁబడినది, ఎట్లు సౌందర్యాదిగుణములతోఁ గూడిన యితరుని తల్లికంటెఁ గురూపిణి యైనను దనతల్లి హితకారిణి యగునో అట్లు. అందువలన, స్వధర్మే మరణం శ్రేయః, శ్రుతిబోధితమై స్వర్గాధిసాధన మగుటవలన. పరధర్మమో, భయావహః, నిషిద్ధ మగుటచే నరకప్రాపక మగుటవలన. అట్లు కానిచో వేదము చాతుర్వర్ణ్యము నేల కల్పింపవలయును?

రా. అందువలన, సుశకం * బగుటచే, స్వధర్మః = తనధర్మమయిన కర్మయోగము; విగుణః = గుణహీనమైనను, ప్రమాదరహిత మగుటచే; ప్రకృతిసంసృష్టునకు దుశ్శక మగుటవలన, పరధర్మాత్ = పరధర్మమైన జ్ఞానయోగముకంటె; స్వనుష్ఠితాత్—గుణసహితమైనను కొంతకాల మనుష్ఠించిన జ్ఞానయోగముకంటె; అది ప్రమాదసహిత మగుటవలన; శ్రేయాన్ = మిక్కిలి మేలు. తనయంతనే గ్రహించుటకు యోగ్యమగుటచే, స్వధర్మే=తనధర్మ మయిన కర్మయోగమునందు; ఉన్నవానికి ఒక జన్మమునందు ఫలము నొందలేక; నిధనమ్= మరణముగూడ; శ్రేయః= మేలు, విఘ్నభయము లేమివలన మీఁదిజన్మమునందుఁగూడ వైకల్యము లేని కర్మయోగము యొక్క ఆరంభము సంభవించుటవలన. ప్రకృతిసంసృష్టునకుఁ దనయంతనే గ్రహిం

---

* సుఖముగా శక్య మయినది.

చుట కశక్య మగుటచే, పరధర్మః = పరధర్మమైన జ్ఞానయోగము; ప్రమాదసహిత మగుటచే, భయావహః = భయము గలిగించునది.

ప్రకృతిసంసృష్టునకు స్వశక్తికి సాధ్య మగుటవలన స్వధర్మము కర్మయోగము. ప్రకృతి సంసృష్టునకు స్వశక్తికి అసాధ్య మగుటచే, బరధర్మము జ్ఞానయోగము. స్వధర్మమైన కర్మయోగము గుణరహితమైనను ♦ ప్రమాదరహితము ?. పరధర్మ మగు జ్ఞానయోగము గుణసహిత మయినను * ప్రమాదసహితము. కావున జ్ఞానయోగముకన్నను కర్మయోగము శ్రేయము. స్వధర్మమైన కర్మయోగము ననుష్ఠించుచుండి యీజన్మమునందు ఫలప్రాప్తి లేక మరణము నొందినను ఉత్తమము. ఏల యనఁగా ఉత్తరజన్మమునందు నిర్విఘ్నముగా కర్మయోగము నారంభింపవచ్చును. పరధర్మ మయిన జ్ఞానయోగమో కొంతకాలము అనుష్ఠించినను ప్రమాదసహితం బగుటచే భయము గలిగించునదియే యగు నని తా.

పూ. అట్లయినను క్రూరము యుద్ధకర్మము అనఁగాఁ జెప్పుచున్నాఁడు శ్రేయా నిత్యాదిగా.

అర్జున ఉవాచ.—

అథ కేన ప్రయుక్తో ఽయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలా దివ నియోజితః. 3౬

భా. అనర్థమూలము "ధ్యాయతో విషయాన్" అనియు "రాగద్వేషములు గదా వీనికి శత్రువులు" అనియుఁ జెప్పఁబడినది వాస్తవమే, అయినను విక్షిప్తముగాను అనిశ్చితముగాను ఏది చెప్పఁబడినదో దాని సంక్షిప్తముగాను నిశ్చితముగాను ఇదియే యని తెలియఁ గోరినవాఁడై, అర్జునుఁడు పలికెను, తెలిసినం గదా అది తన్నాశనమునకు యత్నము చేయుదు నని, అ థేత్యాదిగా. అథ = ఇఁక; కేన = హేతువైన దేనిచేత; ప్రయుక్తః = ప్రేరింపఁబడినవాఁడై, రాజుచే భృత్యుఁ డుంబోలె; పాపమ్ = పాపకర్మమును; చరతి = ఆచరించుచున్నాఁడు;

♦ సాంగము గాక పోయినను.

? భంగము నకవకాశము లేనిది.

* సాంగముగా అనుష్ఠితంబైనను.

అయమ్ = ఈ, పూరుషః = పురుషుఁడు; తాను, అనిచ్ఛన్నపి = ఇచ్ఛింపనివాఁడైనను; వార్ష్ణేయ = వృష్ణికులమునందుఁ బుట్టినవాఁడా! బలాత్ = బలాత్కారముగా; నియోజిత ఇవ = నియోగింపఁ బడినవాని యట్లు, రాజుచే భృత్యుఁడుఁ బోలె నని చెప్పఁబడినది దృష్టాంతము.

అర్జునుఁ డిట్లనియె, వృష్ణివంశమునందు అవతరించిన భగవంతుఁడా! ఈపురుషుఁడు తా నిచ్ఛింపకున్నను బలాత్కారమున రాజుచే ఆజ్ఞాపింపఁబడిన భృత్యునియట్లు దేనిచేఁ బ్రేరింపఁబడినవాఁడై పాపముఁ జేయుచున్నాఁడు? దాని నాకుఁ జెప్పు మని తాత్పర్యము.

రా. మున్నే యనర్థమూలము చెప్పఁబడిన దగుటవలన మరల దానిఁ దెలియఁ గోరి ప్రశ్న చేయుట యనుపపన్న మని యాశంకించి చెప్పుచున్నారు అనర్థమూలము ఇత్యాదిగా. విక్షిప్తము—వివిధము లయిన ప్రదేశములందు క్షిప్తము—* తెలుపఁబడిన దని యర్థము. అనిశ్చితము—అనేకస్థలములందు చెప్పుట వలన, లేక అనేకవిధములుగా—అవివేకమా? కామమా? అని వికల్పమునకు అవకాశము గలుగుటవలన నని యర్థము. ఓయీ! అనర్థమూలమును బరిహరింపవలయును, దాని నేల తెలియఁ గోరుచున్నాఁడు? అందుకుఁ జెప్పుచున్నారు తెలిసినం గదా ఇత్యాదిగా. చేయుదు నని—దానిం దెలియుట సార్థక మని శేషము. అథశబ్దమునకు వాక్యారంభ మర్థ మని గ్రహించి ప్రశ్నవాక్యమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు, అ థేత్యాదిగా. ఇచ్ఛింపకున్నను బలాత్కారముననే పాపకర్మము నందుఁ బ్రేరితుం డగుటయందు దృష్టాంతము చెప్పుచున్నారు రాజుచే భృత్యుఁడుం బోలె నని. నియోజ్యుఁ డగుటకు ఇచ్ఛ ఆవశ్యక మగుటవలన ఇచ్ఛ లేనిచో నియోజ్యత సిద్ధింప దని యాశంకించి మున్ను చెప్పిన దాని మరల నుదాహరించుచున్నారు రాజుచే ఇత్యాదిగా.

హ. బుద్ధిపూర్వకముగాఁ జేయుపురుషులందుఁ బ్రసిద్ధముగాఁ బరధర్మానుష్ఠానము కనఁబడుటవలన దానికిఁ గారణము తెలియఁ గోరినవాఁడై యర్జునుండు పలికెను.—నియోజిత ఇవ అని యన్వయము.

శం. వాస్తవమే « ధ్యాయతో విషయాన్ » అనియు « ఇన్ద్రియస్యేన్ద్రియస్య » అనియుఁ బురుషునకు జననమరణాద్యనర్థపరంపరాప్రాప్తికిఁ గారణము

---

* ఉంపఁబడినది.

నిరూపింపఁబడినది. అయినను విశేషించి దానిస్వరూపమును దానియధిష్ఠానమును దానిజయించు నుపాయమును దెలియఁగోరినవాఁడై యర్జునుఁడు తాను మఱచిన వానియట్లు దానినే యడుగుచున్నాఁడు, సంసారమునకుఁ గారణము తెలిసినయెడఁ బండితులు దాని నుపాయంబునఁ బరిహరింప వచ్చు నని. అర్జునుఁ డిట్లనియె.— అథశబ్దమునకు వేఱుప్రశ్న యారంభించుట యర్థము. బ్రహ్మవిదులకు బ్రహ్మానందామృతము వర్షించును గావున వృష్ణి యనఁగా సమ్యక్‌జ్ఞానము, దానిచేఁ దెలియఁబడువాఁడు కావున వార్ష్ణేయుఁ డనఁగా పరమాత్మ యగు శ్రీభగవంతుఁడు, వార్ష్ణేయ— ఓభగవంతుఁడా! బలవంతుఁ డగు రాజుచేతఁగాని ఇతరునిచేతఁ గాని, బలాత్ = బలాత్కారమున; నియోజిత ఇవ — సేవకుని యట్లు; కార్యాకార్యములు తెలిసినవాఁడైనను, అయం పురుషః; తాను పాపసాధ్య మయిన ఫలమును, అనిచ్ఛన్నపి; పాపమ్; చరతి = ఆచరించుచున్నాఁడు; కేనప్రయుక్తః—ఈకార్యకరణసంఘాతమునందు ♦ బలవంతమైన దేనిచేఁ బ్రేరింపఁబడినవాఁడై అయుక్తమునుగూడఁ జేయుచున్నాఁడు? దానిం జెప్పు మని యర్థము.

మ. అందుఁ గామ్యప్రతిషిద్ధములందుఁ బ్రవర్తించుటకుఁ గారణమును బరిహరించుకొని భగవంతునిహితము ననువర్తించుటకై తత్కారణము నిశ్చయముగాఁ దెలియుటకొఱకు అర్జునుఁ డిట్లనియె.— « ధ్యాయతో విషయాన్పుంసః » ఇత్యాదిగా మున్ను అనర్థమూలము చెప్పఁబడినది. ఇప్పుడుగూడ « ప్రకృతేర్గుణసమ్మూఢాః » ఇత్యాదిగా మిక్కిలి విస్తరించి ప్రతిపాదింపఁబడినది. అందు అన్నియు సమానప్రాధాన్యముచేఁ గారణములా? * లేక యొక్కటియే ముఖ్యకారణము తక్కినవి కేవలము దానికి సహకారులా? అందు మొదటిపక్షమున అన్నిటి వేఱు వేఱుగా నివారించుటయందు మహాప్రయాస మగును, రెండవపక్షమునన్ ఒక్క దాని నిరాకరించినమాత్రమున కృతకృత్యత సిద్ధించును. అందువలనఁ జెప్పుము నాకు; కేన = ఏహేతువుచేత; ప్రయుక్తః = ప్రేరింపఁబడినవాఁడై; అయం పూరుషః = నీమతము ననుసరింపని సర్వజ్ఞాన విమూఢుఁ డగు పురుషుఁడు; పాపమ్ = అనర్థమును గలిగించుకర్మమును, సమస్తమును; ఫలాభిసంధి పూర్వకముగా, కామ్యమైన చిత్రయాగాదికమును శత్రువధసాధన మగు శ్యేనయాగాదికమును, నిషిద్ధ మయిన

♦ శరీరమునందు.

* ఒక్కొక్కటియుఁ బ్రధానకారణమా?

కలంజభక్షణాదికమును, ఇట్లు బహువిధమైనకర్మమును; ఆచరించుచున్నాఁడు; తాను చేయుటకు, అనిచ్ఛన్నపి = ఇచ్ఛింపనివాఁడైనను ? కాని నీవు ఉపదేశించిన దానిని నివృత్తిలక్షణమైన పరమపురుషార్థసాధన మగు కర్మమును ఇచ్ఛించినవాఁడై నను చేయఁడు? పరతంత్రత లేక యిట్లు సంభవింపదు. అందువలన దేనిచే, బలాదివ నియోజితః—రాజుచే భృత్యునివలె, నీమతమునకు విరుద్ధ మగునది సర్వానర్థ జనకం బని తెలిసినవాఁడైనను అట్టి కర్మమును ఆచరించుచున్నాఁడో, అట్టిదాని అనర్థమార్గమునకుఁ బ్రవర్తకమైన దాని నాకొఱకుఁ జెప్పుము, తెలిసి నివారించుట కొఱ కని యర్థము. ఓవార్ష్ణేయుఁడా—నామాతామహవంశ మయిన వృష్ణివంశము నందుఁ గృపచే నవతరించినవాఁడా యని సంబోధించుటచే, వార్ష్ణేయీపుత్త్రుఁడను * నేను నీ కుపేక్షింపఁ దగినవాఁడఁ గా నని సూచించుచున్నాఁడు.

శ్రీ. "తయో ర్న వశ మాగచ్ఛేత్" అని చెప్పఁబడినది. అది యశక్య మని తలఁచి యర్జునుఁడు పలికెను.—వృష్ణివంశమునందు అవతరించినవాఁడు వార్ష్ణేయుఁడు, ఓవార్ష్ణేయుఁడా! అనర్థరూప మయిన పాపమును జేయ నిచ్ఛింపని వాఁడైనను, కేన, ప్రయుక్తః = ప్రేరింపఁబడినవాఁడై, అయం పూరుషః పాపం చరతి ? కామక్రోధములను వివేకబలముచే నిరోధించినపురుషునకుఁగూడ మరలఁ బాపమునందుఁ బ్రవృత్తి కనఁబడుటవలన ఇతరముగూడ ఆకామక్రోధములకు మూలభూత మైనది యొకానొకటి ప్రవర్తకము కావలయు నని తలంచి ప్రశ్న చేయఁబడినది.

ప. ఇఁక "తయో ర్న వశ మాగచ్ఛేత్" అని యేది చెప్పఁబడినదో అది యశక్య మని తలఁచినవాఁడై యర్జును డడుగుచున్నాఁడు.—వార్ష్ణేయ = వృష్ణివంశమునందుఁ బుట్టినవాఁడా, కృష్ణా! పాపముఁ జేయ నిచ్ఛించువాని యట్లు, కేన, ప్రయుక్తుఁడై, పాపం చరతి. ఎవ్వనివలె? బలాత్ = బలాత్కారమున, నియోజిత ఇవ = ఆజ్ఞాపింపఁబడినవానివలె, ఎట్లు నీచే నే నాజ్ఞాపింపఁబడినాఁడనో అట్లని సూచించుటకై వార్ష్ణేయ యని సంబోధనము.

రా. అథ; అయమ్—జ్ఞానయోగముకొఱకుఁ బ్రవర్తించిన; పూరుషః = పురుషుఁడు; తాను విషయముల ననుభవించుటకు; అనిచ్ఛన్నపి = ఇచ్ఛింపనివాఁ

* వృష్ణివంశమునఁ బుట్టిన కుంతికిఁ బుత్త్రుఁడను.

త్తైనను; కేన = దేనిచే; ప్రయుక్తః = ప్రేరింపఁబడినవాఁడై; విషయానుభవరూప మైన, పాపమ్ = పాపమును; బలాత్ = నియోజిత ఇవ = నియోగింపఁబడినవానివలె; చరతి = చేయుచున్నాఁడు ?

జ్ఞానయోగమునందుఁ బ్రవర్తించినపురుషుఁడు తాను విషయముల నను భవింపఁ గోరనివాఁడై నను, బలాత్కారమున నిర్బంధింపఁబడినవాని యట్లు, దేనిచేతఁ బ్రేరితుఁడై, విషయానుభవరూపపాపము చేయుచున్నాఁడు ? దాని నాకుఁ జెప్పు మని తాత్పర్యము.

మా. పెక్కులు పాపకారణములు గలవు, క్రోధాదులును కామమును. వానియందు దేవి బలవత్తర మని యడుగుచున్నాఁడు అథేత్యాదిగా. అథశబ్దము అర్థాంతర బోధకము. « తయో ర్నవశ మాగచ్ఛేత్ " అనునది ప్రశ్నకు హేతువు. ♦

శ్రీ భగవా నువాచ.

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః
మహాశనో మహాపాప్మా వి ద్ధ్యేన మిహ వైరిణమ్. 32

భా. వినుము నీ వా సర్వానర్థకరుఁడైనశత్రువును, ఎవని నీ వడుగు చున్నావో, అని భగవంతుఁడు పలికెను. « ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశస శ్శ్రియః। వైరాగ్య స్యాథ మోక్షస్య షణ్ణాం భగ ఇతీఙ్గనా " ఐశ్వ ర్యాదులు ఆఱును ఏవాసుదేవునియందు నిత్యము అప్రతిబంధముగాను సమస్తముగాను ఉన్నవో, « ఉత్పత్తిం ప్రలయం చైవ భూతానా మా గతిం గతిమ్ । వేత్తి విద్యా మవిద్యాంచ సవాచ్యో భగవా నితి " ఉత్పత్త్యాదివిషయకం బగు విజ్ఞానముగూడ ఎవ్వనికిఁ గలదో, ఆవాసుదే వుఁడు చెప్పఁబడుచున్నాఁడు భగవంతుఁ డని. కామః= కామము; ఏషః= ఈసర్వలోకశత్రువు, దేనివలన సర్వానర్థప్రాప్తి ప్రాణులకు సంభవించు చున్నదో అట్టిది. అట్టి ఈకామము దేనిచేనేని ప్రతిహతమై క్రోధ ముగాఁ బరిణమించుచున్నది. కావున, క్రోధః = క్రోధముగూడ; ఏషః= ఇదియే. రజోగుణసముద్భవః = రజోగుణము సముద్భవము * గాఁ గలది

♦ ఆరెంటిలో నేది బలవత్తరమో దానిం జెప్పు మని యభిప్రాయము.

* కారణము.

యేదో అట్టిది కామము; లేక, రజోగుణమునకు సముద్భవము కామము. కామము గదా ఉద్భూతమై రజస్సును బ్రవర్తింపఁజేసి పురుషునిఁ బ్రవర్తింపఁజేయుచున్నది, తృష్ణచేతఁ గదా నేను చేయింపఁబడినాఁడనని రజఃకార్య మగు సేవాదికమునందుఁ బ్రవృత్తులై దుఃఖితు లగువారి ప్రలాపము వినుచున్నాము. మహాశనః = గొప్పఅశనము * గలది; కావున నే, మహాపాప్మా— § కామముచేఁ బ్రేరితుఁడై ప్రాణి పాపముఁ జేయుచున్నాఁడు. అందువలన, విద్ధి = ఎఱుంగుము; ఏనమ్ = ఈకామమును; ఇహ = ఈసంసారమునందు; వైరిణమ్ = శత్రువునుగా.

శ్రీభగవంతుఁ డుత్తరము చెప్పుచున్నాఁడు.—అర్జునా! నీవు దేని నడిగితివో ఆసర్వానర్థకారణమైన శత్రువు కామము, ఈకామమే ప్రతిహతమైనచోఁ గ్రోధ మగుచున్నది. ఇది సర్వకార్యప్రవర్తకం బగు రజోగుణమువలనఁ బుట్టుచున్నది. లేక, ఇది రజోగుణముఁ బుట్టించి దానిద్వారమున సర్వకార్యములందుఁ బురుషునిఁ బ్రవర్తింపఁజేయుచున్నది. ఇది బహువిషయకం బగుటచే మహాశనము. సర్వపాపములకును నిమిత్త మగుటచే మహాపాపము. కావున ఈసంసారమునందు ఈకామమే శత్రు వని యెఱుంగు మని తాత్పర్యము.

టీ. ఇప్పుడు ప్రతివచనముఁ బ్రస్తావించుచున్నారు వినుము అని.—అది విపరీతం బనుటను తోఁపఁ జేయుచున్నారు సర్వానర్థకరుఁ డని. అప్రస్తుతము నేల ప్రస్తావించెద వనఁగాఁ జెప్పుచున్నారు దేని నీవు ఇత్యాదిగా. భగవచ్ఛబ్దార్థము నిర్ధారించుటకుఁ బౌరాణికవచనము నుదాహరించుచున్నారు ఐశ్వర్యస్య ఇత్యాదిగా. సమగ్రస్య అనుదానికి ఐశ్వర్యాదు లొక్కొక దానితో సంబంధము. వైరాగ్యస్యాథ అనుచోటి అథశబ్దముచే మోక్షోపాయ మగు జ్ఞానము వివక్షింపఁబడుచున్నది. ఉదాహరించిన వచనమునకుఁ దాత్పర్యార్థము చెప్పుచున్నారు ఐశ్వర్యాదులు ఇత్యాదిగా. "ఆవాసుదేవుఁడు చెప్పఁబడుచున్నాఁడు భగవంతుఁ డని" అనుదానితో సంబంధము. అందే మఱియొకపురాణవాక్యము పఠించుచున్నారు ఉత్పత్తి మిత్యాదిగా. భూతానామ్ అనునది ఉత్పత్త్యాదు లొక్కొక దానితోను సంబంధించుచున్నది. ఉత్పత్తిప్రలయశబ్దములు కారణార్థకములు ♦, క్రియామా

* ఆహారము.

§ గొప్పపాపము.

♦ దేనివలన ఉత్పత్తి యగునో దాని, దేనివలనఁ బ్రలయ మగునో దానిని అని యర్థము.

త్రము ‡ ఇతరపురుషునికిని గోచర మనుట సంభవించుటవలన. ఆగతి గతి యను వీనిచే రాకపోకలు గల సంపదాపదలు సూచింపఁబడుచున్నవి. ఈవచనమునకుఁగూడఁ దాత్పర్యము చెప్పుచున్నారు ఉత్పత్త్యాది ఇత్యాదిగా. వేత్తి ♦ అనుశబ్దముచేఁ జెప్పఁబడిన సాక్షాత్కారము విజ్ఞాన మని చెప్పఁబడినది. కూడ అనుదానికి సమగ్రము లయిన యైశ్వర్యాదిసంపదలసముచ్చయం బర్థము. ఇట్టిలక్షణము గల భగవంతుఁ డేమి చెప్పె ననఁగాఁ జెప్పుచున్నారు—కామః ఇత్యాదిగా. కామము సర్వలోకశత్రు వను టను విశదీకరించుచున్నారు దేనివలన నిత్యాదిగా. అట్లయినను అదియే క్రోధం బె ట్లగును ? అనఁగాఁ జెప్పుచున్నారు అట్టి ఈకామము ఇత్యాదిగా. కామక్రోధములే హేయము లని తెలుపుటకొఱకుఁ గారణముఁ జెప్పుచున్నారు రజోగుణము ఇత్యాదిగా. కారణద్వారమునఁ గామాదులకే హేయత్వముఁ బ్రతిపాదించి కార్యద్వారమునఁగూడ వానికి హేయత్వముఁ జెప్పుచున్నారు లేక ఇత్యాదిగా. కామము పురుషప్రవర్తకంబే యగుం గాని రజోగుణజనకము కా దని యాశంకించి చెప్పుచున్నారు కామము గదా ఇత్యాదిగా. అందే యనుభవానుసారి యగు లోకప్రసిద్ధిని ప్రమాణీకరించుచున్నారు తృష్ణచేతఁ గదా ఇత్యాదిగా. ఆకామము యోగ్యాయోగ్యవిభాగము లేక బహువిషయకం బని చూపుచున్నారు మహాశనః అని. బహువిషయకం బగుటచేఁ గలుగు కార్యము చూపుచున్నారు కావుననే ఇత్యాదిగా. బహువిషయకంబైనను కామము పాపం బెట్లగు నని యాశంకించి చెప్పుచున్నారు కామముచే నిత్యాదిగా. కామం బిట్టి దగుటచే ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

హ. ఆత్మకుఁ బాపప్రవృత్తికిఁ గారణమును శ్రీభగవంతుఁడు చెప్పెను.— ఏష కామః = ఈకామమును; క్రోధః = క్రోధమును; రజోగుణసముద్భవః. మహాశనః = గొప్పయశనము గలది, విషయసేవచే నుపరతిఁ జెందునది గాదు. కావుననే, మహాపాప్మా = గొప్పపాపము దేనివలనఁ గలుగునో అట్టిది. ఏనమ్ = ఈకామమును క్రోధమునుగూడ; ఇహ = అధికారిపురుషులవిషయమందు; శత్రువునుగా; విద్ధి.

శం. "అకామస్య క్రియా కాచి ద్దృశ్యతే నేహ కర్హిచిత్ । యద్యద్ధి కురుతే జన్తు స్తత్త ద్ధి కామస్య చేష్టితమ్" § అను న్యాయముచే, పురుషునకు సకల

‡ పుట్టుట లయించుట.

♦ ఎఱుంగుచున్నాఁడు.

§ కామము లేనివానికి ఏకార్యమును ఎచ్చటనుం గనఁబడదు. ప్రాణి యేదేది చేయుచున్నాఁడో అది కామముయొక్క చేష్టయే గదా.

కర్మముల నాచరించుటకును గారణమును సర్వానర్థములకును బీజమును కామమే యని బోధించుటకై శ్రీభగవంతుఁ డిట్లనియె.—సర్వప్రాణులప్రవృత్తియుఁ గామమూలకం బగుటవలనఁ గామము సర్వప్రాణిప్రత్యక్షం బను నభిప్రాయముచే ఏషః * అని నిర్దేశము. యోగ్యము అయోగ్యము అను విచారము లేక వస్తువును జూచిన దానిని విస్మరించి కామింపఁ జేయుచున్నది పురుషుని, కావున కామ మనఁబడుచున్నది. విషయములందలి ప్రబలేచ్ఛ యిట కామశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది. ఏష కామః—ఏది పురుషునకు సంసారకారణమో అది యీ కామము. ఈకామమే దేనిచేనైనను తనవిషయము ప్రతిబద్ధ మైనపుడు క్రోధరూపమునఁ బరిణమించుచున్నది. అందువలన, క్రోధ ఏషః—క్రోధముగూడ ఈకామమే. తాను, రజోగుణసముద్భవః = రజస్సుయొక్క గుణము రాగము రంజనాత్మకమైన విషయములందలి సామాన్యేచ్ఛ, అదియే విషసన్నిధానంబునఁ గామము నుద్భవింపఁ జేయుచున్నది, కావున కామము రజోగుణసముద్భవము; లేక, "ప్రజ్ఞాం తు సాత్త్వికీం ప్రాహు స్తామసీం తు విచిత్రతామ్ । క్రియాం తు రాజసీం ప్రాహు ర్గుణతత్త్వవిదో బుధాః" ♦ అనువచనమువలన, రజోగుణము క్రియ, దానికి సముద్భవము—పుట్టుక దేనివలననో అది రజోగుణసముద్భవము, కామమే ప్రవృత్తిహేతు వని యర్థము. మహాశనః = "న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి" అను వచనమువలన, గొప్పదైన—ఇంత అని మితిలేని అశనము—ఉపభోగరూప మయిన ఆహారము గలది మహాశనము, ఎప్పుడును తృప్తిలేనిది యని యర్థము. అందువలననే, మహాపాప్మా = గొప్పదైన పాప్మము—దోషము దేనివలనఁ బురుషునకు వచ్చునో అది మహాపాప్మము, ఎందువలన కామావిష్టుఁడు భగినినైనను గామించునో చండాలునివలననైనను ధనము గ్రహించునో, క్రుద్ధుఁడు గురువునైనను నిందించునో గోవునుగూడ వధించునో, అందువలన కామము మహాపాప్మ మనుట యుక్తమని యర్థము. అందువలన, నీవు, ఇహ = ఈసంసారమునందు; ముముక్షువునకు, ఏనమ్ = ఈకామమునే; వైరిణమ్ = శత్రువునుగా; విద్ధి, ఇదియే ముక్తిప్రతిబంధక మని యెఱుంగు మని యర్థము.

---

* ఇది.

♦ ప్రజ్ఞ సాత్త్వికి మనియు, విచిత్రత—ఏవ్యాపారమును లేకయుండుట తామస మనియు, క్రియ రాజస మనియు గుణములతత్త్వము నెఱింగిన పండితులు చెప్పుదురు.

వ్యా. ఇట్లర్జునుం డడుగఁగా, "అధో ఖల్వాహుః కామమయ ఏవా ఽయం పురుష ఇతి, ఆత్మైవేద మగ్ర ఆసీ దేక ఏవ సో ఽకామయత జాయా మే స్యా దథ ప్రజాయేయా ఽథ విత్తం మే స్యా దథ కర్మ కుర్వీయ" ♦ ఇత్యాది శ్రుతులందుఁ బ్రతిపాదింపఁబడిన యుత్తరమును శ్రీభగవంతుఁడు చెప్పెను.—దేని నీ వడిగితివో బలాత్కారంబున ననర్థమార్గమునందుఁ బ్రవర్తింపఁజేయు హేతువును, అట్టి, ఏషః కామః = గొప్పశత్రువు కామమే, కామమువలననే సర్వానర్థప్రాప్తి ప్రాణులకు. ఓయీ! క్రోధముగూడ అభిచారాదికమునందు * ప్రవర్తకముగాఁ గనఁబడుచున్నది అనఁగాఁ జెప్పుచున్నాఁడు—క్రోధ ఏషః, కామమే యొకానొక హేతువుచేఁ బ్రతిహతమై క్రోధముగాఁ బరిణమించుచున్నది, కావునఁ గ్రోధముగూడ ఈకామమే; ఈ మహాశత్రువునుమాత్రమే నివారించినయెడ సర్వపురుషార్థప్రాప్తి యగు నని యర్థము. దాని నివారించు నుపాయము దెలియుటకై దానికారణముఁ జెప్పుచున్నాఁడు——రజోగుణ సముద్భవః = దుఃఖప్రవృత్తిబలరూపమయిన రజోగుణము సముద్భవము—కారణముగాఁ గలది, కావునఁ గార్యము కారణమువంటిదే యగుటవలన కామముగూడ నట్టిదే. తమోగుణముగూడ కామమునకుఁ గారణమే యయినను, దుఃఖమునందును బ్రవృత్తియందును రజోగుణమే ప్రధాన మగుటవలన నదియే నిర్దేశింపఁబడినది. ఇందుచే సాత్త్వికవృత్తిచేత రజస్సు నశించినచో కామముగూడ నశించు నని చెప్పఁబడినది. లేక, అది యెట్లు అనర్థమార్గమునందుఁ బ్రవర్తింపఁజేయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు——ప్రవృత్త్యాది లక్షణమయిన రజోగుణమునకు సముద్భవము ‡ దేనివలననో అట్టిది. విషయాభిలాషరూపమయిన కామము గదా తాను బుట్టినదై రజస్సును బ్రవర్తింపఁజేసి పురుషుని దుఃఖాత్మక మగు కర్మమునందుఁ బ్రవర్తింపఁ జేయుచున్నది. అందుచే నీకామరూపశత్రువు నవశ్యము వధింపవలయు నని యభిప్రాయము. ఓయీ! సామదానభేద దండములు నాలు గుపాయములు గలవు, అందు మొదటిమూఁడును సంభవింపనియెడ నాలవ యుపాయము ప్రయోగింపవలయును, గాని హఠంబున

♦ ఇట్లు గదా చెప్పెదరు—కామమయుఁడే యీపురుషుఁ డని, ఆత్మయొకఁడే దీనికి మున్నుండెను, ఒకఁడే, అతఁడు కోరెను—భార్య నాకు కావలయును, అంత, పుత్త్రుఁడు కావలయును, అంత ధనము నాకు కావలయును, అంత కర్మము చేసెదను.

* శత్రుహింసార్థము చేయు మంత్రప్రయోగము మొదలగుదానియందు.

‡ పుట్టుక.

నాలవయుపాయమునే ప్రయోగింపం జనదు. అని యాశంకించి మూఁడింటికి అసంభవముఁ బ్రతిపాదించుటకై విశేషణములు చెప్పుచున్నాఁడు మహాశనో మహాపాప్మా అని. గొప్ప అశనము గలది యని మహాశనము, 'యత్ పృథివ్యాం వ్రీహి యవం హిరణ్యం పశవః స్త్రియః । నాల మేకస్య తత్సర్వ మితి మత్వా శమం వ్రజేత్ '* అను స్మృతివలన. అందువలన దానముచే సంధి చేయ శక్యముగాదు. సామభేదములచేతఁగూడ శక్యము గాదు; ఎందువలన ననఁగా, మహాపాప్మా=మిక్కిలియుగ్రము, కామముచేఁగదా బలాత్కారమునఁ బ్రేరితుఁడై అనిష్టఫలముకలిగించు నని తెలిసియుఁ బాపముఁ జేయుచున్నాఁడు. అందువలన, విద్ధి=ఎఱుంగుము; ఏనమ్=ఈకామమును; ఇహ=ఈసంసారమునందు; వైరిణమ్ = శత్రువునుగా. ఇది యంతయు వివరింపఁబడినది వార్తికకారులచేత « ఆత్మైవేద మగ్ర ఆసీత్ » అను శ్రుతియొక్క వ్యాఖ్యానమునందు.—« ప్రవృత్తౌచ నివృత్తౌచ యథోక్తస్యాధికారిణః। స్వాతన్త్ర్యేసతి సంసార సృతౌ కస్మా త్ప్రవర్తతే॥ నతు నిశ్శేష విధ్వస్త సంసారానర్థవర్త్మని। నివృత్తిలక్షణే వాచ్యం కేనాఽయం ప్రేర్యతే ఽవశః॥ అనర్థపరిపాకత్వ మపి జానన్ప్రవర్తతే। పారతన్త్ర్యమృతే దృష్టా ప్రవృత్తి ర్నేదృశీ క్వచిత్॥ తస్మాచ్ఛ్రేయోఽర్థినః పుంసః ప్రేరకోఽనిష్టకర్మణి। వక్తవ్య స్తన్నిరాసార్థ మిత్యర్థా స్యాత్పరా శ్రుతిః॥ అనాప్తపురుషార్థో ఽయం నిశ్శేషానర్థసఙ్కులః। ఇత్యకామయతాఽనాప్తాన్ పుమర్థాన్ సాధనై ర్జడః॥ జిహాసతి తథాఽనర్థా నవిద్వానాత్మని శ్రితాన్। అవిద్యోద్భూతకామ స్స న్నథో ఖల్వితిచ శ్రుతిః॥ అకామతః క్రియాః కాశ్చిత్ దృశ్యన్తే నేహ కస్యచిత్। యద్యద్ధి కురుతే జన్తు స్తత్తత్కామస్య చేష్టితమ్॥ కామఏష క్రోధఏష ఇత్యాదివచనం స్మృతేః। ప్రవర్తకో నాఽపరోఽతః కామా దన్య త్ప్రతీయతే" ♦ అని. అకామతః అనునది మనువచనము. ఇతరము స్పష్టము.

* భూమియందు వ్రీహియవాదిధాన్యములును బంగారమును బశువులును స్త్రీలును ఏదిగలదో అది యంతయు నొక్కనికిఁ జాలదు. అని యాలోచించి శాంతిఁ బొందవలయును.

♦ ప్రవృత్తియందును నివృత్తియందును ఈయధికారి పురుషునకు స్వాతంత్ర్య మున్నయెడ సంసారమార్గమునందు ఎందువలనఁ బ్రవర్తించుచున్నాఁడు? నిశ్శేషముగా సంసారానర్థములను నశింపఁజేయునట్టి నివృత్తిమార్గమునందే యెందువలనఁ బ్రవర్తింపఁడు? ఇట్లు అవశుఁడై దేనిచేఁ బ్రేరింపఁబడుచున్నాఁడు? దానిం జెప్పవలయును. అనర్థఫలము గలది యని తెలిసినవాఁడయ్యును బ్రవర్తించుచున్నాఁడు. పారతంత్ర్యమునం గాని యిట్టిప్రవృత్తి యెచ్చటనుం గానరాదు. అందువలన శ్రేయస్సు గోరునట్టి పురుషుని అనిష్టకర్మమునందుఁ బ్రేరించుదానిని తన్నివారణార్థము చెప్పవలయును—ఈయభి

శ్రీ. ఇందు కుత్తరము శ్రీభగవంతుఁడు చెప్పెను.—ఏది నీవడిగితివో ఆహేతు వీకామమే. ఓయీ! క్రోధమునుగూడ మున్ను నీవు చెప్పితివి ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే అనుస్థలమున? సత్యము. ఇది దానికంటె వేఱు గాదు, మ తే మనఁగా, క్రోధముగూడ నీకామమే. కామమే గదా దేనిచేత నేని ప్రతిహతమై క్రోధరూపమునఁ బరిణమించుచున్నది. కావున మున్ను క్రోధము వేఱుగాఁ జెప్పఁబడినను, కామజయమే క్రోధజయము అను నభిప్రాయంబునఁ గామముతో నేకము చేసి చెప్పఁబడుచున్నది. రజోగుణమువలన, సముద్భవతి—పుట్టుచున్నది కావున రజోగుణ సముద్భవము. ఇందుచే సత్త్వవృద్ధిచేత రజస్సును క్షయము నొందించినయెడ కామముగూడ క్షయించు నని సూచింపఁబడినది. ఏనమ్ = ఈకామమును; ఇహ = ఈమోక్షమార్గమునందు; వైరిణమ్, విద్ధి. ఈకామరూపశత్రువును జెప్పఁబోవువిధంబున వధింపవలసినదియే, ఎందువలన ననఁగా, ఇది దానముచే సంధికి శక్యము గాదని చెప్పుచున్నాఁడు—మహాశనః = గొప్ప అశనము గలది, పూరింప నలవి గానిది యని యర్థము. సామముచేతఁగూడ సంధికి శక్యము గాదు, ఎందువలన ననఁగా, మహాపాప్మా = మిక్కిలి యుగ్రము.

ప. ఇందు కుత్తరము భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—ఎప్పుడు వివేకియయినపురుషునకును సత్త్వగుణము ప్రచ్ఛన్న మగునో అప్పుడు రజోగుణము ప్రాదుర్భవించుచున్నది. దానివలనఁ గామక్రోధములు పుట్టుచున్నవి. ఆకామక్రోధములస్వరూపమును క్రమముగాఁ జెప్పుచున్నాఁడు —మహాశనః, పూరింప నలవి గానిది యగుటవలన; క్రోధమో, మహాపాప్మా, అతిక్రూర మగుటవలన; ఈరెండును దుర్జయంబు లని సూచింపఁబడినది. ఇట్లు, ఏనమ్—కామమునుగాని, క్రోధమునుగాని; వైరిణం విద్ధి. ఎందువలన ననఁగా పాపమునందు శత్రువే ప్రవర్తింపఁ

---

ప్రాయము గలది మీఁదిశ్రుతి. పురుషార్థములు పొందనివాఁడును సర్వానర్థములచేతను నిండినవాఁడు నగు జడుఁడు—అజ్ఞాని అప్రాప్తము లగు పురుషార్థము లనుసాధనములచే ఈవిధముగా—శ్రుతియందుఁ జెప్పఁబడినవిధముగాఁ గామించెను. అట్లు ఆత్మాశ్రితము లగు అనర్థములనుగూడ అజ్ఞాని యీవిధముగానే తొలఁగించుకొనఁ గోరుచున్నాఁడు, అవిద్యచే ఉద్భూత మయిన కామము గలవాఁడై. అట్లు "అథో ఖల్వాహుః" అను శ్రుతియు; కామము లేనిచో ఇం దెవ్వనికిని ఏక్రియలును గాన రావు, ప్రాణి దేనిదేనిఁ జేయుచున్నాఁడో అయ్యది యంతయు కామముయొక్క చేష్ట; కామం విది క్రోధం విది; ఇత్యాదిస్మృతివచనముగూడ. అందువలన కామము దక్కఁ బ్రవర్తకము మఱియొకటి కానరాదు.

జేయును గాని మిత్త్రుఁడు ప్రవర్తింపఁజేయఁడు; అట్లు నీవు బంధుమిత్త్రులయందలి కామముచేతనే స్వధర్మత్యాగరూప మగు పాతకమునందుఁ బ్రవర్తించుచున్నా వని యర్థము.

రా. శ్రీభగవంతుం డిట్లనియె.—ఉద్భవాభిభవరూపంబున * నుండు గుణములమయ మైనప్రకృతిచే సంస్పృష్టుండును జ్ఞానయోగమునకుఁ బ్రారంభించినవాఁడు నగు ఈపురుషునికి; రజోగుణసముద్భవః = రజోగుణమువలనఁ బుట్టిన; ఏషః—ప్రాచీనవాసనాజనితము శబ్దాదివిషయము నగు; కామః=కామము; మహాశనః= మహాశనమయిన శత్రువు, విషయములలోని కీతని నాకర్షించును. ఏషః—ఈ కామమే; ప్రతిహతమయిన ప్రసారముగలదై, ప్రతిహతిచేసిన చేతనులయెడ, క్రోధః= క్రోధరూపమునఁ బరిణమించినదై; మహాపాప్మా—పరహింసాదులందుఁ బ్రవర్తింపఁజేయుచున్నది. ఏనమ్ = రజోగుణసముద్భవము సహజము నగు ఈకామమును; ఇహ వైరిణమ్ = జ్ఞానయోగవిరోధి యగు శత్రువునుగా; విద్ధి.

ప్రకృతిగుణములు మూఁడును ఒక్కొకటియు ఒకప్పుడు హెచ్చుటయు ఒకప్పుడు తగ్గుటయు స్వభావముగాఁ గలవి యగుటవలన, ప్రకృతిసంస్పృష్టుఁ డగు పురుషుఁడు ఒకానొకప్పుడు సత్త్వగుణము ఉద్రిక్త మైనప్పుడు జ్ఞానయోగమునకుఁ బ్రవర్తించినను, రజోగుణము హెచ్చినపుడు కలుగునట్టి కామము అత్యంత ప్రబల మగుటవలన ప్రాచీనవాసనానుసారముగా శబ్దాదివిషయములలోని కీతని నాకర్షించి విషయలోలునిఁగాఁ జేయుచున్నది. ఆకామము ప్రతిహత మైనప్పుడు అదియే యాప్రతిహతి గావించిన చేతనులయెడఁ గ్రోధరూపముగాఁ బరిణమించి పరహింసాదిక్రూరకార్యంబులం దితనిఁ బ్రవర్తింపఁ జేయుచున్నది. కావున రజోగుణసముద్భవమై ప్రాచీనవాసనాజనితం బగు నీకామము జ్ఞానయోగము నారంభించుపురుషున కు శత్రు వని యెఱుంగుము.

మా. ఏది బలవత్తర మైనప్రవర్తకమో, అది యీకామము; క్రోధము గూడ ఇదియే, క్రోధము కామజన్య మగుటవలన. “కామాత్క్రోధో ఽభిజాయతే” అని గదా చెప్పఁబడినది. ఇఁక నేది గురునిందాదులవలన నగు క్రోధము గలదో అదియు గురుభక్తివలనఁ గలుగు అనిందాకామము † వలననే గలుగుచు

* ఉద్భవము—వికాసము, అభిభవము—సంకోచము.

† గురువును నిందింపఁగూడదు అను కామము.

న్నది. ఇఁక నెవ్వరు వేఱువిధముగాఁ * జెప్పెదరో వారు కామక్రోధములు సంకీర్ణములుగా నుండుటవలన సూక్ష్మము నెఱుంగరు. చెప్పఁబడినదిగూడ “ఋతే కామం న కోపాద్యా జాయన్తే చ కథంచన” ♦ అని. మహాశనః—గొప్పది గదా కామభోగ్యము. మహాపాపము లగు బ్రహ్మహత్యాదులకుఁ గారణ మగుటవలన, మహాపాప్మా. సర్వపురుషార్థ § విరోధి యగుటవలన వైరి.

ధూమే నా ఽఽవ్రియతే వహ్ని ర్యథా ఽఽదర్శో మలేన చ
యథోల్బేనా ఽఽవృతో గర్భ స్తథా తే నేద మావృతమ్. ౩౮

భా. ఎట్లు వైరి యనఁగా దృష్టాంతములచేఁ దెలుపుచున్నాఁడు.—యథా = ఎట్లు; ధూమేన = సహజ మగు అప్రకాశాత్మక మయిన పొగచేత; వహ్నిః = అగ్ని; ఆవ్రియతే = కప్పఁబడుచున్నదో; యథాచ = మఱియు నెట్లు; ఆదర్శః = అద్దము; మలేన = మురికిచేత; ఆవ్రియతే = కప్పఁబడుచున్నదో; యథా = ఎట్లు; ఉల్బేన = గర్భమును జుట్టియున్న మావిచేత; గర్భః = శిశువు; ఆవృతః = కప్పఁబడినదో; తథా = అట్లు; తేన = ఆకామముచేత; ఇదమ్ = ఇది; ఆవృతమ్ = కప్పఁబడినది.

ఎట్లు సహజమైనధూమముచే అగ్ని కప్పఁబడియుండునో ఎట్లు మురికిచే అద్దము గప్పఁబడియుండునో ఎట్లు మావిచే గర్భము గప్పఁబడియుండునో అట్లు ఆకామముచే ఇది ‖ కప్పఁబడియుండు ననితాత్పర్యము.

అ. మీఁదిశ్లోకమున కవతారిక చేయుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. అనేకదృష్టాంతములు గ్రహణసౌకర్యార్థము. సహజం బగుధూమము ప్రకాశాత్మక మగు నగ్నికి ఆవరకం బగు ననుట సిద్ధించుటకై విశేషణము చేయుచున్నారు అప్రకాశాత్మకమైన అని.

హ. ఎట్లది వైరి యనఁగాఁ జెప్పుచున్నాఁడు —యథా = ఎట్లు; ధూమేన, వహ్నిః, ఆవ్రియతే = కప్పఁబడుచున్నదో; యథాచ; ఆదర్శః = దర్పణము;

* కామమే క్రోధముగాఁ బరిణమించు నని.
♦ కామము లేక కోపాదు లెట్లును గలుగవు.
§ మోక్ష.
‖ జ్ఞానము.

జేయును గాని మిత్త్రునిఁ బ్రవర్తింపఁజేయఁడు; అట్లు నీవు బంధుమిత్త్రులయందలి కామముచేతనే స్వధర్మత్యాగరూప మగు పాతకమునందుఁ బ్రవర్తించుచున్నా వని యర్థము.

**రా.** శ్రీభగవంతుం డిట్లనియె.—ఉద్భవాభిభవరూపంబున * నుండు గుణములమయ మైనప్రకృతిచే సంస్పృష్టుండును జ్ఞానయోగమునకొఱకుఁ బ్రారంభించినవాఁడు నగు ఈపురుషునికి; రజోగుణసముద్భవః = రజోగుణమువలనఁ బుట్టిన; ఏషః—ప్రాచీనవాసనాజనితము శబ్దాదివిషయము నగు; కామః=కామము; మహాశనః= మహాశనమయిన శత్రువు, విషయములలోని కీతని నాకర్షించును. ఏషః—ఈ కామమే; ప్రతిహతమయిన ప్రసారముగలదై, ప్రతిహతి చేసిన చేతనులయెడ, క్రోధః= క్రోధరూపమునఁ బరిణమించినదై; మహాపాప్మా—పరహింసాదులందుఁ బ్రవర్తింపఁజేయుచున్నది. ఏనమ్ = రజోగుణసముద్భవము సహజము నగు ఈకామమును; ఇహ వైరిణమ్ = జ్ఞానయోగవిరోధి యగు శత్రువునుగా; విద్ధి.

ప్రకృతిగుణములు మూఁడును ఒక్కొకటియు ఒకప్పుడు హెచ్చుటయు ఒకప్పుడు తగ్గుటయు స్వభావముగాఁ గలవి యగుటవలన, ప్రకృతిసంసృష్టుఁ డగు పురుషుఁడు ఒకానొకప్పుడు సత్త్వగుణము ఉద్రిక్త మైనప్పుడు జ్ఞానయోగమునకొఱకుఁ బ్రవర్తించినను, రజోగుణము హెచ్చినపుడు కలుగునట్టి కామము అత్యంత ప్రబల మగుటవలన ప్రాచీనవాసనానుసారముగా శబ్దాదివిషయములలోని కీతని నాకర్షించి విషయలోలునిఁగాఁ జేయుచున్నది. ఆకామము ప్రతిహత మైనప్పుడు అదియే యాప్రతిహతి గావించిన చేతనులయెడఁ గ్రోధరూపముగాఁ బరిణమించి పరహింసాదిక్రూరకార్యంబులం దితనిఁ బ్రవర్తింపఁ జేయుచున్నది. కావున రజోగుణసముద్భవమై ప్రాచీనవాసనాజనితం బగు నీకామము జ్ఞానయోగము నారంభించుపురుషున కు శత్రు వని యెఱుంగుము.

**మా.** ఏది బలవత్తర మైనప్రవర్తకమో, అది యీకామము; క్రోధము గూడ ఇదియే, క్రోధము కామజన్య మగుటవలన. « కామాత్క్రోధో ఽభిజాయతే » అని గదా చెప్పఁబడినది. ఇఁక నేది గురునిందాదులవలన నగు క్రోధము గలదో అదియు గురుభక్తివలనఁ గలుగు అనిందాకామము ♦ వలననే గలుగుచు

---

* ఉద్భవము—వికాసము, అభిభవము—సంకోచము.

♦ గురువును నిందింపఁగూడదు అను కామము.

న్నది. ఇఁక నెవ్వరు వేఱువిధముగాఁ * జెప్పెదరో వారు కామక్రోధములు సంకీర్ణములుగా నుండుటవలన సూక్ష్మము నెఱుంగరు. చెప్పఁబడినదిగూడ "ఋతే కామం న కోపాద్యా జాయన్తే చ కథంచన" ♦ అని. మహాశనః—గొప్పది గదా కామభోగ్యము. మహాపాపము లగు బ్రహ్మహత్యాదులకుఁ గారణ మగుటవలన, మహాపాప్మా. సర్వపురుషార్థ § విరోధి యగుటవలన వైరి.

ధూమే నా ఽఽవ్రియతే వహ్ని ర్యథా ఽఽదర్శో మలేన చ
యథోల్బేనా ఽఽవృతో గర్భ స్తథా తే నేద మావృతమ్. 38

భా. ఎట్లు వైరి యనఁగా దృష్టాంతములచేఁ దెలుపుచున్నాఁడు.—యథా = ఎట్లు; ధూమేన = సహజ మగు అప్రకాశాత్మక మయిన పొగచేత; వహ్నిః = అగ్ని; ఆవ్రియతే = కప్పఁబడుచున్నదో; యథాచ = మఱియు నెట్లు; ఆదర్శః = అద్దము; మలేన = ముఱికిచేత; ఆవ్రియతే = కప్పఁబడుచున్నదో; యథా = ఎట్లు; ఉల్బేన = గర్భమును జుట్టియున్న మావిచేత; గర్భః = శిశువు; ఆవృతః = కప్పఁబడినదో; తథా = అట్లు; తేన = ఆకామముచేత; ఇదమ్ = ఇది; ఆవృతమ్ = కప్పఁబడినది.

ఎట్లు సహజమైనధూమముచే అగ్ని కప్పఁబడియుండునో ఎట్లు ముఱికిచే అద్దము గప్పఁబడియుండునో ఎట్లు మావిచే గర్భము గప్పఁబడియుండునో అట్లు ఆకామముచే ఇది ℓ కప్పఁబడియుండు నని తాత్పర్యము.

ఆ. మీఁదిశ్లోకమున కవతారిక చేయుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. అనేకదృష్టాంతములు గ్రహణసౌకర్యార్థము. సహజం బగుధూమము ప్రకాశాత్మక మగు నగ్నికి ఆవరకం బగు ననుట సిద్ధించుటకై విశేషణము చేయుచున్నారు అప్రకాశాత్మకమైన అని.

హ. ఎట్లది వైరి యనఁగాఁ జెప్పుచున్నాఁడు—యథా = ఎట్లు; ధూమేన, వహ్నిః, ఆవ్రియతే = కప్పఁబడుచున్నదో; యథాచ; ఆదర్శః = దర్పణము;

* కామమే క్రోధముగాఁ బరిణమించు నని.
♦ కామము లేక కోపాదు లెట్లును గలుగవు.
§ మోక్ష.
ℓ జ్ఞానము.

మలేన = కాలిమము * అను పేరు గల ముటికిచేత; ఆవ్రియతే = కప్పఁబడుచున్నదో; యథా; ఉల్బేన = మావిచేత; గర్భః = గర్భాశయగతుఁడగు ప్రాణి; ఆవృతః= కప్పఁబడినదో; తథా = అట్లు; తేన = ఆకామముచేతను క్రోధముచేతను; ఇదమ్ = వివేకమువలనఁ బుట్టునట్టి జ్ఞానము; ఆవృతమ్ = ఆచ్ఛాదింపఁబడినది. సకల పురుషార్థప్రకాశకం బగు జ్ఞానము నావరించుటచే ఈకామమును క్రోధమును శత్రు వని యభిప్రాయము.

శం. ముముక్షువునకు ముక్తిప్రతిబంధకం బగుటచే కామము వైరి యని యేది చెప్పఁబడినదో దానినే విస్పష్టీకరించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ధూమేన = అప్రకాశస్వరూప మయిన పొగచేత; తాను ప్రకాశస్వరూప మయినను, వహ్నిః = నిప్పు; యథా = ఎట్లు; ఆవ్రియతే = కప్పఁబడుచున్నదో. మలేన = లేపనస్వభావ మయిన ♦ దుమ్ముచేత; తాను బింబమును ప్రకాశింపఁజేయున దగుటచే ఆహ్లాదకర మయిన, ఆదర్శః = అద్దముగూడ; యథా ఆవ్రియతే = ఎట్లు కప్పఁబడుచున్నదో. ఉల్బేన = అచేతన మయిన మావిచేత; గర్భః = చేతన మయిన శిశువు; యథా = ఎట్లు; ఆవృతః = కప్పఁబడియుండునో; తథా= అట్లు; అప్రకాశస్వరూపమును లేపకమును అచేతనము నగు, తేన = ఆకామముచేత; ప్రకాశస్వరూపమును ఆత్మను ప్రకాశింపఁజేయున దగుటచే ఆనందకరంబును ఆభాసవ్యాప్తిచే చేతనతుల్యంబు నగు, ఇదమ్ = ఈపురుషుని జ్ఞానము; ఆవృతమ్ = కప్పఁబడినది, మఱుఁగు చేయఁబడియున్న దని యర్థము.

మ. అది మహాపాప్మ మగుటచే వైరి యనుటనే దృష్టాంతములచే స్పష్టీకరించుచున్నాఁడు.—అందు శరీరారంభమునకుఁ బూర్వము అంతఃకరణము వృత్తిప్రచారశూన్య మగుటవలన సూక్ష్మమయి యుండు కామము శరీరారంభక మగు కర్మముచే స్థూలశరీరావచ్ఛిన్నమై లబ్ధవృత్తికమైన § యంతఃకరణమునందు అభివ్యక్తి నొంది స్థూల మగుచున్నది. అదియే విషయముఁ జింతించునవస్థయందు అప్పటప్పటికి నుద్రేకము నొందినదై స్థూలతరం బగుచున్నది. అదియే మరల విషయము భుజించునవస్థయందు అత్యంతోద్రేకము నొందినదై స్థూలతమం బగుచున్నది. అందుఁ బ్రథమావస్థయందు దృష్టాంతము—యథా = ఎట్లు; ధూమేన = సహజమును అప్ర

* నల్లఁదనము.

♦ పూఁతస్వభావముగాఁ గలదైన.

§ పొందఁబడిన వృత్తి గల.

కాశరూపము నగు పొగచేత; ప్రకాశరూప మగు, వహ్నిః ఆవ్రియతే. ద్వితీయావస్థయందు దృష్టాంతము—యథా; ఆదర్శః; మలేన—సహజము కానిదియు ఆదర్శము పుట్టిన పిమ్మట హెచ్చినదియు నగు దుమ్ముచేత, చకారము మునుపటిదానికన్నను వైధర్మ్యము సూచించుచున్నది; ఆవ్రియతే. తృతీయావస్థయందు దృష్టాంతము—యథా; ఉల్బేన = మావిచేత, గర్భము చుట్టియుండు చర్మముచేత, మిక్కిలి స్థూల మగు దానిచేత; అన్నివైపులను నిరోధించి, గర్భః, ఆవృతః. తథా = అట్లు, మూఁడు విధములచేతనుగూడ; తేన = ఆకామముచేత; ఇదమ్ ఆవృతమ్. అందు ధూమముచే ఆవృతమైనను వహ్ని దహనాదిరూప మయిన స్వకార్యముఁ జేయుచున్నది. మలముచే ఆవృత మయిన ఆదర్శమో ప్రతిబింబగ్రహణరూప మయిన స్వకార్యముఁ జేయదు, స్వచ్ఛత్వధర్మముమాత్రము మఱుఁగుపడుటవలన స్వరూపంబున నేమో కనఁబడక పోదు. ఉల్బముచే ఆవృతమయిన గర్భమో హస్తపాదాదిప్రసారణ*రూప మయిన స్వకార్యమునుం జేయదు, స్వరూపంబునను గనఁబడదు. అని విశేషము.

శ్రీ. కామము వైరి యనుటను జూపుచున్నాఁడు.—యథా, ధూమేన—సహజ మగు దానిచే, వహ్నిః, ఆవ్రియతే= ఆచ్ఛాదింపఁబడుచున్నదో; యథాచ, ఆదర్శః, మలేన—ఆగంతుక మగు † దానిచే; యథా, ఉల్బేన = గర్భము చుట్టియుండుచర్మముచేత, గర్భః, అంతటను నిరోధించి, ఆవృతః; తథా—ఆమూఁడువిధములచేతనుగూడ, తేన = ఆకామముచేత, ఇదమ్ ఆవృతమ్.

ప. ఇఁక సత్త్వము నాచ్ఛాదించుటయందు మూఁడుదృష్టాంతములు చెప్పుచున్నాఁడు.—ఎట్లు, తడికట్టెలు అను నుపాధిచేఁ గలిగిన ధూమముచే అగ్ని ఆవరింపఁబడుచున్నదో; మఱియు నెట్లు ప్రతిబింబముఁ జూపునట్టి యాదర్శము మలముచే ఆచ్ఛాదింపఁబడుచున్నదో; ఎట్లు, ఉల్బేన= గర్భావరణచర్మముచేత, గర్భము ఆవరింపఁబడుచున్నదో; తథా = అట్లు, తేన = ఆకామముచేతను క్రోధముచేతను, ఇదమ్ = ఈసత్త్వోత్పన్న మగు జ్ఞానము, ఆవరింపఁబడుచున్నది.

రా. యథా = ఎట్లు; ధూమేన = పొగచేత; వహ్నిః = నిప్పు; ఆవ్రియతే = ఆచ్ఛాదింపఁబడుచున్నదో; యథా; ఆదర్శః = అద్దము; మలేన = దుమ్ముచేత; ఆవ్రియతే = ఆచ్ఛాదింపఁబడుచున్నదో; యథా; ఉల్బేన = మావిచేత;

* హస్తపాదాదులు చాఁచుట.

† వచ్చునట్టి.

గర్భః = శిశువు; ఆవృతః = ఆచ్ఛాదింపఁబడినదో; తథా = అట్లు; తేన = ఆకామముచేత; ఇదమ్ = ఈప్రాణిసమూహము; ఆవృతమ్ = ఆచ్ఛాదింపఁబడినది.

ధూమము అగ్ని నావరించి యుండినట్లును, దుమ్ము అద్దము నావరించి యుండునట్లును, మావి గర్భస్థశిశువు నావరించియుండునట్లును, ఆకామము ప్రాణిసమూహము నావరించియున్నది యని తాత్పర్యము.

మధు. ఎట్లు విరోధి యగును ఆకామము? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.— ఇదమ్ = ఇది—పరమాత్మయు అంతఃకరణమును జీవుఁడును అను వస్తుత్రయము; తేన = ఆకామముచేత; ఆవృతమ్ = ఆవరింపఁబడినది. యథా = ఎట్లు; ధూమేన = పొగచేత; వహ్నిః = అగ్ని; ఆవ్రియతే = ఆవరింపఁబడుచున్నదో, ప్రకాశరూపమయినను ఇతరులకుఁ జక్కఁగాఁ గనఁబడదో; అట్లు పరమాత్మ. యథా = ఎట్లు; ఆదర్శః=దర్పణము; మలేన=మురికిచేత; ఆవ్రియతే = ఆవరింపఁబడుచున్నదో, ఇతర ప్రతిబింబహేతువు కాదో; అట్లు అంతఃకరణము కామముచే ఆవృతమై పరమాత్మాది జ్ఞానహేతువు కాదు. యథా= ఎట్లు; ఉల్బేన= మావిచేత; గర్భః = శిశువు; ఆవృతః= ఆవరింపఁబడినదై బంధింపఁబడియుండునో; అట్లు జీవుఁడు కామముచే ఆవృతుఁడై యుండును.

ఎట్లు ధూమముచే ఆవరింపఁబడినదై యగ్ని ప్రకాశరూప మయ్యును ఇతరులకుఁ జక్కఁగాఁ గనఁబడదో అట్లు ఈశ్వరుఁడు కామముచే ఆవృతుఁడై తాను సర్వజ్ఞుఁ డయ్యును ఇతరులకుఁ దెలియ రాఁడు. ఎట్లు దర్పణము మలముచే నావృతమై ముఖాదిప్రతిబింబము గ్రహింపఁ జాలదో అట్లు అంతఃకరణము కామముచే నావృతమై పరమాత్మను జీవుని గ్రహింపఁ జాలదు. ఎట్లు మావిచే ఆవరించి బంధింపఁబడినదై శిశువు చలనాదివ్యాపారసమర్థము కాదో అట్లు కామావృతుఁడై జీవుఁడు ఈశ్వరాదిజ్ఞానమునందు సమర్థుఁడు కాఁడు. ఈవిధముగా ఈశ్వరుఁడును అంతఃకరణమును జీవుఁడును అను నీమూఁడువస్తువులును ఆకామముచే ఆవృతములై యున్నవి యని తాత్పర్యము.

ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణా ఽనలేన చ. 39

భా. ఏది మఱి ఆయిదంశబ్దవాచ్యము *? ఏది కామముచే నావృతం

* ఇదమ్—ఇది యని పూర్వశ్లోకమున చెప్పఁబడిన వస్తువు.

బని చెప్పఁబడినదో. అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఆవృతమ్ = ఆవరింపఁబడినది; జ్ఞానమ్ = జ్ఞానము; ఏతేన = ఈ; జ్ఞానినః = జ్ఞానియొక్క; నిత్యవైరిణా = నిత్యశత్రువుచేత. జ్ఞాని గదా యెఱుంగుచున్నాఁడు మొదటనే « దీనిచే నేను అనర్థమందు ప్రేరింపఁబడుచున్నాను » అని, అందువలన దుఃఖియు నగుచున్నాఁడు నిత్యముగనే, అందువలన నిది జ్ఞానికి నిత్యవైరి. మూర్ఖునకో నిత్యవైరి కాదు; అతఁడు కామమును తృష్ణాకాలమునందు మిత్త్రమునుంబోలెఁ జూచుచుండి తత్కార్యము దుఃఖము ప్రాప్తించినపుడు గదా యెఱుంగుచున్నాఁడు « తృష్ణచే నేను దుఃఖము నొందింపఁబడినాఁడ" నని; మొదటనే యెఱుంగఁడు. అందువలన జ్ఞానికే నిత్యవైరి. ఏరూపము గల దానిచేత? కామరూపేణ= కామము—ఇచ్ఛయే రూపముగాఁ గల దానిచేత; దుష్పూరేణ=దుఃఖముచేఁ బూరణము గల దానిచేత §. అందువలన, అనలేన=అలమ్—పర్యాప్తి ♦ లేనిదానిచేత *.

జ్ఞానికి నిత్యశత్రు వైనదియు పూరింప నలవి గానిదియు పర్యాప్తి లేనిదియు నగు ఈకామముచే జ్ఞానము ఆవరింపఁబడినది యని తాత్పర్యము.

ఆ. సామాన్యముగా నిర్దేశించినదానిని విశేషించి నిర్దేశించుటకై ఆకాంక్షాపూర్వకముగా మీఁదిశ్లోకమున కవతారిక చేయుచున్నారు ఏది మఱి ఇత్యాదిగా. కామమునకు జ్ఞానావరణత్వము సిద్ధించుటకై జ్ఞానినో నిత్యవైరిణా ఇత్యాది విశేషణములు. పదము దీసి వ్యాఖ్యానము చేయుచున్నారు ఆవృతమ్ ఇత్యాదిగా. జ్ఞానులకు వైరి యయినను కామము నిత్యవైరి యెట్లగు ననఁగాఁ జెప్పుచున్నారు జ్ఞాని గదా ఇత్యాదిగా. మొదటనే—అనర్థప్రాప్తి లేకయే కామముయొక్క ప్రసక్త్యవస్థయందే ¶ యని యర్థము. అందువలన—కామప్రసక్తివలననే. నిత్యముగనే—కామము పుట్టినపుడును దానికార్య మయినదుఃఖము కలుగునపుడును గూడ. ఓయీ! కామాత్మతా న ప్రశస్తా" అనుటచే సర్వజనులకును కామము నిత్యవైరి యగుచున్నది. అట్లుండఁగా నెందువలన జ్ఞానియొక్క యని విశేషింపఁబడినది? అని యాశంకించి చెప్పుచున్నారు మూర్ఖునకో ఇత్యాదిగా. అజ్ఞాని కిది నిత్యవైరి కా దని యుపపాదించుచున్నారు అతఁడు ఇత్యాదిగా. మొదటనే—కార్య మయిన

§ బహుకష్టముచే పూరింపఁ దగినదానిచేత ననుట.

♦ చాలు ననుట.

* ఈమూఁడుపదములును నిత్యవైరిణా అనుదానికి విశేషణములు.

¶ కామము జనియించునప్పుడే.

దుఃఖము పొందుటకు మున్నే. అజ్ఞునకును కామము వైరి యయినను నిత్యవైరి కా దని యేర్పడుటచే ఫలితము చెప్పుచున్నారు అందువలన ఇత్యాదిగా. స్వరూపముచే నిత్యవైరిత్వము సమాన మయినను జ్ఞానాజ్ఞానములచే అవాంతరభేదము సిద్ధించుచున్నదని యర్థము. ఆకాంక్షా ద్వారమున ప్రకృతవైరినే ప్రకటించుచున్నారు పర్యాప్తము గలదానిచేత ఇత్యాదిగా.

హ. ఆవృతమ్ = మూయఁబడినది; జ్ఞానమ్ = వివేకజ్ఞానము; ఏతేన = ఈకామముచేతను క్రోధముచేతను; జ్ఞానినః = జ్ఞానికిఁగూడ, ఇఁక మూర్ఖునకుఁ జెప్పవలయునా ? నిత్యవైరిణా = ఎప్పుడును శత్రు వయిన దానిచేత, నిత్యవైరిత్వము జ్ఞానము నాచ్ఛాదించుటవలన; కామరూపేణ; దుష్పూరేణ = దుఃఖముచేఁ బూరింపఁబడుదానిచేత; అనలేన = అలమ్—పర్యాప్తి లేనిదానిచేత. మాటిమాటికి విషయసేవచే వర్ధిల్లుచుండు కామముచేఁ బ్రేరితుండై శ్రేయోర్థి యగుపురుషుఁడు పాపము నాచరించుచున్నాఁ డని యర్థము.

శం. జ్ఞానావరణమునే విశదీకరించుచున్నాఁడు.—అనలేన = నిరంతరము విషయములు సేవించినను అలంభావము—చాలు ననుట లేనిదియు, లేక, హృదయముతోపల అనలమువలె—అగ్నివలె నుండునదియు; దుష్పూరేణ = దుఃఖముచేత పూరణము—ఇష్టప్రాప్తి గలదియు, లేక, ఇష్టప్రాప్తి యయినపిమ్మట పురుషుని దుఃఖముచేఁ బూరించునదియు; కామరూపేణ = కామింపఁబడునది కావున కామ మనఁగా విషయము, ఆవిషయమునే అంతటను, రూపయతి—గోచరింపఁ జేయుచున్నది, ఎచ్చటను బ్రహ్మమును గోచరింపఁ జేయదు, కావున కామరూపము, అట్టిదియును; అందువలననే, జ్ఞానినః, నిత్యవైరిణా = నిత్యమును బాహ్యవిషయాలంబనకారణ మగుటచేఁ బ్రతికూల మగుటవలన నిత్యశత్రువు, లేక, నిత్యము ♦ యొక్క గ్రహణమునకు హేతు వయిన జ్ఞానము నావరించుటవలన నిత్యశత్రువు, అట్టిదియు నగు ఏతేన = ఈకామముచేత; జ్ఞానమ్ = సర్వత్ర బ్రహ్మమును గ్రహించు బుద్ధివృత్తి; ఆవృతమ్—పంకముచే జలమువలెను రాహువుచేఁ జంద్రబింబమువలెను ఆచ్ఛాదింపఁబడినది యని యర్థము.

మ. “తథా తే నేద మావృతమ్” అను సంగ్రహవాక్యమును వివరించుచున్నాఁడు.—జ్ఞాయతే అనేన—ఎఱుఁగఁబడుచున్నది దీనిచేత కావున జ్ఞాన

♦ ఆత్మము.

మనఁగా అంతఃకరణము, లేక, పూర్వశ్లోకమున ఇదం శబ్దముచే నిర్దిష్ట మగు వివేక విజ్ఞానము; ఏతేన = ఈకామముచేత; ఆవృతమ్. అట్లయినను తత్కాలమున సుఖ జనక మగుటచే ఉపాదేయం బగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—జ్ఞానినః నిత్యవైరిణా; అజ్ఞుఁడు విషయభోగకాలమునందు కామమును మిత్త్రునింబోలెఁ జూచుచుండి తత్కార్య మగు దుఃఖము వచ్చినపుడు గదా అది వైరి యని యెఱుంగుచున్నాఁడు, కామముచే నేను దుఃఖముఁ బొందింపఁబడినాఁడ నని; జ్ఞానియో భోగకాలమునందుఁ గూడ ఎఱుంగుచున్నాఁడు, ఈకామముచే నేను అనర్థమునందుఁ ద్రోయఁబడినవాఁడ నని; అందువలన వివేకి దుఃఖితుఁ డగుచున్నాఁడు భోగకాలమునందును తత్పరిణామమునందును * గూడ దీనిచేత; ఇట్లు జ్ఞాని కిది నిత్యవైరి కావున అన్నివిధంబులను జ్ఞాని దీని వధింపవలసినదియే యని యర్థము. అట్లయిన దీని కేమిస్వరూప మనఁగాఁ జెప్పుచున్నాఁడు—కామరూపేణ = కామము—ఇచ్ఛ—తృష్ణ, అదియే రూపముగాఁ గలదానిచేత; ఓకౌంతేయుఁడా అని సంబంధముఁ ♦ జూపుటచేఁ బ్రేమను సూచించుచున్నాఁడు. ఓయీ! వివేకి కిది వధింపవలసినది యయినను అవివేకి కుపాదేయం బగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—దుష్పూరేణ అనలేనచ, చకారము సాదృశ్యార్థకము; అలమ్—పర్యాప్తి లేనిది కావున అనల మనఁగా అగ్ని, అది యెట్లు హవిస్సుచేఁ బూరింప నశక్యమో అట్లిదియు భోగముచేఁ బూరింప నశక్య మని యర్థము; అందువలన నిరంతరము సంతాపజనకంబగుటచే వివేకికింబోలె అవివేకికిఁగూడ హేయమే § యిది. అట్లు స్మృతి "నజాతు కామః కామానా ముపభోగేన శామ్యతి। హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవా ఽభివర్ధతే" ¶ అని. లేక; ఇచ్ఛ విషయభోగముచే నివర్తిల్లునది యగుటవలన ఇచ్ఛారూప మయిన కామము విషయభోగముచేఁ దన యంతనే నివర్తిల్లఁ గలదు, అందుకు అతినిర్బంధం బేల? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—దుష్పూరేణా ఽనలేనచ అని. విషయసిద్ధిచేఁ దత్కాలమున ఇచ్ఛ మఱుఁగుపడినను మరలఁ బ్రాదుర్భవించుటవలన విషయసిద్ధి యిచ్ఛానివర్తకము గాదు, మఱేమనఁగా విషయములందు దోషదృష్టియే యిచ్ఛానివర్తకం బని భావము.

---

* తత్కార్య మయిన దుఃఖముయొక్క కాలమునందును.

♦ తనకును—భగవంతునకును అర్జునునకును బంధుత్వమును.

§ విడువఁ దగినదే.

¶ ఒకప్పుడును కామము కామములయుపభోగముచే శమింపదు. హవిస్సుచే అగ్నివలె మఱియు నధికముగా వృద్ధినే పొందును.

శ్రీ. ఇదం శబ్దముచే నిర్దేశించినదానిఁ జూపుచు వైరి యనుటను స్ఫుటీకరించుచున్నాఁడు.—ఈ, జ్ఞానమ్ = వివేకజ్ఞానము; ఏతేన, ఆవృతమ్. అజ్ఞునకు భోగకాలమునందు కామము సుఖహేతువే గదా! పరిణామమునందుమాత్రము వైరి యగుచున్నది; జ్ఞానికి మఱి, తత్కాలమునందుఁ ♦ గూడ అనర్థము ననుసంధించుట వలన దుఃఖహేతువే; కావున నిత్యవైరిణా అని చెప్పఁబడినది. మఱియును, విషయములచేఁ బూరింపఁబడుచున్నను దుష్పూరము, పూరింపకున్ననో శోకసంతాప హేతు వగుటవలన అనలతుల్యము; ఇందుచే సర్వజనులకును నిత్యవైరి యనుట చెప్పఁబడినది.

ప. ఇఁక దానినే వివేకించి చెప్పుచున్నాఁడు.—పూర్వము కామక్రోధములు వేఱుగా నిరూపింపఁబడినవి, ఇపుడు ఒకటిగాఁ జెప్పుచున్నాఁడు. ఎందువలన ననఁగా, కామమే దేనిచేనైనను అడ్డఁబడినచోఁ గ్రోధముగాఁ బరిణమించుచున్నది. ఇట్లు, కామరూప మయిన ఒకదానిచే జ్ఞానము ఆవరింపఁబడినది. ఎట్టిదానిచే? జ్ఞానినః = జ్ఞాని యగు పురుషునియొక్క, నిత్యవైరిణా. అజ్ఞునకు భోగసమయమునందుఁ గామము సుఖహేతు వగుచున్నది, పరిణామమునందు దుఃఖరూప మగును. జ్ఞానికో అనర్థానుసంధానముచే నిత్యము దుఃఖహేతు వగుటవలన నిత్యవైరిణా అని చెప్పఁబడినది. మఱియు నెట్టిదానిచేత? దుష్పూరేణ అనలేనచ—దుష్పూరేణ = భరింప నలవిగాని దానిచేత విషయము ప్రాప్తింపని యప్పుడు, అనలేన = అగ్ని వంటిదానిచేత. ఇఁక కామముయొక్క స్వరూపంబును దుష్పూరత్వంబును నిరూపించుచున్నది శాతపథశ్రుతిగూడ «ఏతావాన్వై కామో నేత్సంశ్చ నాతోభూయో విన్దేత్తస్మా దప్యేత ర్హ్యేకాకీ కామయతే జాయా మే స్యా దథ ప్రజాయే యా ఽథ విత్తం మే స్యా దథ కర్మ కుర్వీ యేతి స యావ దప్యే తేషా మేకైకం నప్రాప్నోత్యకృత్స్న ఏవ తావ న్మన్యతే తస్యా కృత్స్నతా» అని. ఇందుకు భావ్యము—పూర్వశ్రుతిచే నిరూపిత మయిన కామము. ఏతావాన్ = ఇట్టిది. ఇట నేత్ అను నిపాతము నిషేధార్థకము, ఆకామము, సన్ = ఉండునది, నేత్ = కాదు. అయినను, అతః = ఈకామమువలన, భూయః = మహత్తరమును, నవిన్దేత్ = ఎఱుంగఁడు. అందువలన, తస్మాత్ = ఆకామమువలన, ఏతర్హి—మొదట, ఏకాకీ= మాతృగర్భము నుండి యొక్కఁడే పుట్టినవాఁడై, పిమ్మట, జాయా మే స్యా దితి = భార్య నాకుఁ

♦ భోగకాలమునందు.

గావలయు నని, కామయతే. అథ = అటుపిమ్మట, ప్రజాయేయ = ప్రజ యయ్యెదను, "ఆత్మా వై పుత్త్రనామాసి" అను శ్రుతివలన. వారిఁబోషించుటకొఱకు, విత్తం మే స్యాత్ = ధనము నాకుఁ గావలయును. దానికొఱకు, కర్మ = సేవ కృషి మొదలగు కర్మమును, కుర్వీయ= చేసెదను; ఇట్టిది కామ మని ముందు కన్వయము. ఇఁక కామము దుష్పూర మనుటను జెప్పుచున్నది—సః = ఆకామించుపురుషుఁడు, ఏతేషామ్ = పూర్వోక్తకామములలో, యావత్ = ఎంతవఱకు, ఏకైకమ్ = ఒక్కొకకామమును, నప్రాప్నోతి = పొందఁడో, తావత్ = అంతవఱకు, అకృత్స్న ఏవ = నేను అకృతార్థుఁడనే యని, మన్యతే = తలంచుచున్నాఁడు. ఇదియే వాని అకృత్స్నత.

రా. ఆవరణప్రకారముఁ జెప్పుచున్నాఁడు.—ఈప్రాణియొక్క, జ్ఞానినః= జ్ఞానస్వభావునియొక్క; జ్ఞానమ్ = ఆత్మవిషయజ్ఞానము; ఏతేన = ఈ; కామరూపేణ= కామాకార మయిన; విషయములందు వ్యామోహముఁ బుట్టించుటచే, నిత్యవైరిణా= నిత్యశత్రువుచేత; ఆవృతమ్ = ఆవరింపఁబడినది; దుష్పూరేణ = పొందుటకు అర్హము కాని విషయము గల దానిచేత; అనలేనచ = పర్యాప్తి లేనిదానిచేత.

జ్ఞానస్వభావుఁ డగు ఈప్రాణియొక్క ఆత్మవిషయజ్ఞానము, పొందుటకు యోగ్యము గాని విషయములు గలదియుఁ బర్యాప్తిరహితంబును విషయములందు వ్యామోహముఁ బుట్టించునది యగుటచే అనాదిశత్రువు నగు ఈకామముచే ఆవరింపఁబడియున్నది యని తాత్పర్యము.

మా. శాస్త్రమువలనఁ బుట్టినను జ్ఞానము పరమాత్మ సాక్షాత్కారము కొఱకుఁ బ్రకాశింపదు కామముచే ఆవృతమై జ్ఞానికిఁ గూడ, ఇఁక అల్పజ్ఞాని కేమి చెప్పవలయును ? కామరూపేణ = కామాఖ్య మగు, నిత్యవైరిణా. దుష్పూరేణ— దుఃఖముచేఁ గదా కామము పూరింపఁబడుచున్నది, ఇంద్రాదిపదము సుఖముగా లభింపదు గదా! ఇంద్రాదిపదము లభించినను మరల బ్రహ్మాదిపదముఁ గోరుచున్నాఁడు, ఇట్లు అలంబుద్ధి లేమ కావున, అనలః. చెప్పఁబడినదిగూడ "జ్ఞానస్య బ్రహ్మణ శ్చాగ్నే ర్ధూమో బుద్ధే ర్మలం తథా । ఆదర్శ స్యాథ జీవస్య గర్భ స్యో ల్బోహి కామకః" * అని.

---

* కామము, జ్ఞానమునకును బ్రహ్మమునకును అగ్నికిధూమమునువంటిది, బుద్ధికి అద్దమునకుమలము వంటిది, జీవునకు గర్భమునకుమావివంటిది.

ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యా ఽధిష్ఠాన ముచ్యతే
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్. ౪౦

**భా.** ఏది మఱి యధిష్ఠానం బీకామమునకు జ్ఞానావరణం బగుటచే సర్వప్రాణులకును వైరి యయిన దానికి? అనఁగాఁ జెప్పుచున్నాఁడు, శత్రువుయొక్క అధిష్ఠానము తెలిసినంగదా సుఖమున శత్రువధము చేయ శక్య మగు నని.—ఇన్ద్రియాణి = ఇంద్రియములును; మనః = మనస్సును; బుద్ధిః = బుద్ధియును; అస్య = ఈకామమునకు; అధిష్ఠానమ్ = ఆశ్రయము ♦ అని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. ఏతైః= ఈయింద్రియాదు లగు ఆశ్రయములచేత; ఏషః=ఈకామము; జ్ఞానమ్ = వివేకవిజ్ఞానమును; ఆవృత్య = ఆచ్ఛాదించి; దేహినమ్ = శరీరిని §; విమోహయతి = వివిధముగా మోహింపఁ జేయుచున్నది.

ఇంద్రియములును మనస్సును బుద్ధియును ఈకామమునకు ఆశ్రయములు. ఈకామము ఈయింద్రియాదుల నధిష్ఠించి యుండి వివేకజ్ఞానమును ఆచ్ఛాదించి ప్రాణిని నానావిధముల మోహము నొందఁ జేయుచున్నది యని తాత్పర్యము.

**ఆ.** కామము నిరాశ్రయ మైనచో కార్యము చేయఁజాల దని తలఁచి ప్రశ్నపూర్వకముగా దాని యాశ్రయముఁ జూపుచున్నారు ఏది మఱి ఇత్యాదిగా. కామము నిత్యవైరి యగుటచే దానిఁ బరిహరింపవలసి యుండఁగా ఎందుకు దాని యధిష్ఠానముఁ దెలుపవలయును? అనఁగాఁ జెప్పుచున్నారు శత్రువుయొక్క ఇత్యాదిగా. ఇంద్రియాదులు కామమున కధిష్ఠాన మనుటను ప్రకటించుచున్నారు ఏతైః ఇత్యాదిగా. ఓయీ! ఏతాభిః అని స్త్రీలింగప్రయోగము ⁊ చేయవలసి యుండఁగా ఎట్లు ఏతైః అని చెప్పఁబడినది? అనఁగాఁ జెప్పుచున్నారు ఇంద్రియాదు లగు ఆశ్రయములచేత అని. *

**హ.** మఱియు నీకామమునకు కారణము చెప్పఁబడుచున్నది.—ఇన్ద్రియాణి—నేత్రాదులు; మనః—సంకల్పాత్మకము; బుద్ధిః—నిశ్చయాత్మకము; అస్య =

♦ ఉనికిపట్టు.

§ జీవుని—ప్రాణిని.

⁊ కడపటఁ జెప్పఁబడిన బుద్ధిశబ్దము స్త్రీలింగ మగుటవలన.

* ఇట ఏతైః అనునది ఆశ్రయపరంబై పుల్లింగ మని గాని అధిష్ఠానపరంబై నపుంసకలింగ మని గాని యోజింపనగు.

ఈ కామమునకు; అధిష్ఠానమ్ = కారణము; ఉచ్యతే. మొదట ఇంద్రియముచేఁ బ్రహితం బగు * మదలిప్త మైన ♦ విషయమును గ్రహించి మనస్సుచే నది సుఖహేతు వని సంకల్పించి నేనీయింద్రియముచే దీని సేవించెద నని బుద్ధిచే నిశ్చయించి పురుషుఁడు కామించుచున్నాఁడు, అందువలన ఇంద్రియాదులు కామమునకు అధిష్ఠానము--కారణము. ఏతైః = ఈయింద్రియాదు లగు కారణములచేత; దేహినమ్ = ఈపురుషుని; విమోహయతి. తాను భోక్త యనుజ్ఞానము కలిగినంగదా కారణ మగుచున్నది, కావున, జ్ఞానమ్= సమ్యక్ జ్ఞానమును; ఆవృత్య= ఆచ్ఛాదించి.

౪౦. ఓయీ! సంసారమునకుఁ గారణము కామము, దానికార్యము జ్ఞానావరణమును విషయప్రాపణమును తాపజననమును దుఃఖప్రాపణమును అని నిరూపింపఁబడినది. అట్లయినను ముముక్షువునకు ఆకామము జయించుట దుర్ఘటము, దాని యధిష్ఠానము తెలియమివలన; శత్రువుయొక్క స్థానము తెలిసినంగదా వాని జయించుటకు యత్నము చేయ శక్య మగును. అని యాకాంక్షించఁగాఁ జెప్పుచున్నాఁడు.— « యదా పఞ్చా ఽవతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ । బుద్ధిశ్చ నవిచేష్టేత తా మాహుః పరమాం గతిమ్ " ❡ అను నీశ్రుతియొక్క తాత్పర్యము తెలిసినవారిచే, ఇంద్రియాదులు కామమున కాశ్రయం బని చెప్పఁబడుచున్నది, కామమే వానిచేష్టకు హేతు వగుటవలన. అందువలన, ఇన్ద్రియాణి—చక్షురాదులును మనసును బుద్ధియును, అస్య—ఈకామమునకు, అధిష్ఠానమ్ = ఆశ్రయ మని యెఱుంగవలయును. తనప్రవృత్తికి ద్వారభూతము లైన, ఏతైః—ఇంద్రియాదివ్యాపారములచేత; ఏషః = ఈకామము; జ్ఞానమ్ = ప్రత్యగ్దృష్టిని; ఆవృత్య—వృత్తిని బహిర్ముఖముగాఁ జేసి; దేహినమ్ = దేహాత్మబుద్ధి గలపురుషుని, జ్ఞానిని గాని అజ్ఞానిని గాని; విమోహయతి = నేను భోక్తను ఇది భోగ్యము ఇది రమ్యము ఇది అరమ్యము ఇది సుఖము ఇది దుఃఖము ఇత్యాదిగా వివిధముగా భావింపఁ జేయుచున్నది. కామదోషముచే తనే బుద్ధిచలనంబును దేహేంద్రియాదితాదాత్మ్యబుద్ధియు నేను నాది యను సంసారంబును సంభవించుచున్నవి పురుషున కని యర్థము.

---

* పంపఁబడిన.

♦ మదము గప్పిన.

❡ ఎప్పుడు అయిదింద్రియములును మనస్సుతోఁగూడ నిలుచునో బుద్ధియును చేష్టింపదో దానిని పరమగతినిగాఁ జెప్పెదరు.

మ. శత్రువుయొక్క అధిష్ఠానము తెలిసినంగదా సుఖంబున నతని జయింప శక్య మగు నని తదధిష్ఠానముఁ జెప్పుచున్నాఁడు.—ఇన్ద్రియాణి = శబ్దస్పర్శ రూపరసగంధముల గ్రహించునట్టి శ్రోత్రాదిజ్ఞానేంద్రియములును వచనాదానగమన విసర్గానందజనకంబు లగు వాగాదికర్మేంద్రియములును; మనః = సంకల్పాత్మక మయిన మనస్సును; బుద్ధిః = అధ్యవసాయాత్మక మయిన బుద్ధియును; అస్య = ఈకామము నకు; అధిష్ఠానమ్ = ఆశ్రయ మని; ఉచ్యతే. ఎందువలన ననఁగా. ఏతైః = తమ తమవ్యాపారములు గల ఇంద్రియాదు లగు ఈ ఆశ్రయములచేత; విమోహయతి = వివిధముగా మోహింపఁ జేయుచున్నది; ఏషః = ఈకామము; జ్ఞానమ్ = వివేకజ్ఞాన మును; ఆవృత్య = ఆచ్ఛాదించి; దేహినమ్ = దేహాభిమానిని.

శ్రీ. ఇప్పుడు దాని యధిష్ఠానముఁ జెప్పుచు దాని జయించు నుపాయముఁ బ్రతిపాదించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.— విషయదర్శనశ్రవణాదులచేతను సంకల్పముచేతను అధ్యవసాయముచేతను కామ మావిర్భవించుటవలన, ఇంద్రియము లును మనస్సును బుద్ధియును దీని కధిష్ఠాన మని చెప్పఁబడుచున్నది. ఏతైః = ఆశ్రయ భూతములైన దర్శనాదివ్యాపారవంతము లగు ఈయింద్రియాదులచేత; వివేకజ్ఞాన మును ఆవరించి, దేహినమ్ విమోహయతి.

ప. ఇఁకఁ గామము నున్మూలించువిధము నిరూపింపఁ దలఁచినవాఁడై దాని యధిష్ఠానముఁ జెప్పుచున్నాఁడు.—అస్య = ఈకామమునకు; అధిష్ఠానమ్ = ఆశ్రయము, మూఁడువస్తువు లున్నవి—దర్శనాదికమునందు ఇంద్రియములు, సంక ల్పమునందు మనస్సు, ప్రాదుర్భావమునందు బుద్ధి. ఏతైః = అధిష్ఠానము లైన యీమూఁటిచేత; జ్ఞానమ్ ఆవృత్య; దేహినమ్ = జీవుని; విమోహయతి.

రా. ఏయుపకరణములచేత ఈకామము ఆత్మను అధిష్ఠించుచున్న దనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అధిష్ఠించుచున్నది వీనిచేత ఈకామము ఆత్మను, కావున అధి ష్ఠాన మనఁబడుచున్నది. ఇన్ద్రియాణి, మనః, బుద్ధిః, అస్య, అధిష్ఠానమ్, ఏతైః = కామాధిష్ఠానభూతములయి విషయాసక్తములగు ఈఇంద్రియమనోబుద్ధులచేత; దేహి నమ్ = ప్రకృతిసంసృష్టుని; జ్ఞానమ్ ఆవృత్య; విమోహయతి = వివిధముగా మోహింపఁ జేయుచున్నది, ఆత్మజ్ఞానవిముఖునిఁ గాను విషయానుభవపరునిఁ గాను జేయుచున్నది యని యర్థము.

ఇంద్రియములు మనస్సు బుద్ధి—వీనిద్వారమున కామము ఆత్మ నాశ్రయించి యుండును, కావున ఇంద్రియమనోబుద్ధులు కామమున కధిష్ఠానము. విషయాసక్తము లయిన యీయింద్రియమనోబుద్ధులచే, ఈకామము ప్రకృతిసంసృష్టుఁడగు జీవుని, ఆత్మజ్ఞానము నావరించి విషయాసక్తునిఁ గాఁ జేయుచున్న దని తా.

**మూ.** వధము కొఱకు శత్రువు నధిష్ఠానము చెప్పుచున్నాఁడు.—ఏతైః జ్ఞానమావృత్య—విషయగతము లగు బుద్ధ్యాదులచేతఁ గదా జ్ఞాన మావృత మగుచున్నది.

తస్మాత్త్వ మిన్ద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్. ౪౧

**భా.** ఇట్లు కావున—తస్మాత్ = అందువలన; త్వమ్ = నీవు; ఇన్ద్రియాణి = ఇంద్రియములను; ఆదౌ = ముందు; నియమ్య = వశీకరించి; భరతర్షభ—అర్జునా! పాప్మానమ్ = పాపాచారమైన కామమును; ప్రజహిహి = పరిత్యజింపుము. ఏనమ్ = ఈశత్రువైనదానిని; జ్ఞానవిజ్ఞాననాశనమ్ = జ్ఞానము—శాస్త్రమువలనను ఆచార్యునివలనను ఆత్మాదుల అవబోధము *, విజ్ఞానము—విశేషముగ దాని యనుభవము, శ్రేయఃప్రాప్తిహేతువు లగు ఆజ్ఞానవిజ్ఞానములయొక్క, నాశనమ్= నాశము చేయు దానిని; ప్రజహిహి—ఆత్మనుండి పరిత్యజింపు మని యర్థము.

ఈయింద్రియాదులు కామమున కధిష్ఠాన మగుటవలన, ఓ అర్జునా! నీవు మొదట ఇంద్రియములను వశీకరించుకొని జ్ఞానవిజ్ఞానముల నశింపఁ జేయునట్టి పాపిష్ఠమైన యీకామాఖ్యశత్రువును నీయొద్దనుండి తొలఁగించుకొను మని తా.

**టీ.** అవి కామాశ్రయము లని యేర్పడుటచే కామమును ఆశ్రయసహితముగాఁ బరిహరింపవలయు నని చెప్పుచున్నారు ఇట్లు కావున అని. అందువలన—ఇంద్రియాదు లాశ్రయ మగుటవలన నని యర్థము. ముందు—కామము నిరోధించుటకు మున్న ని యర్థము. ఇంద్రియములు నియమితము లైనయెడ మనోబుద్ధులనియమనము సిద్ధించుచున్నది, మనోబుద్ధులప్రవృత్తి ఇంద్రియప్రవృత్తి లేనిచో నిష్ఫల మగుటవలన నని భావము. పాపహేతు వగుటచే కామము పాప్మశబ్దవాచ్య మయ్యె నని యూహించునది. కామము పరిత్యాజ్య మనుటకు వైరిత్వము హేతువు. ఆహేతు

* తెలియుట.

వున్నసాధించుచున్నారు జ్ఞానేత్యాదిగా. జ్ఞానవిజ్ఞానశబ్దములకు అర్థభేదముఁ దెలుపుచున్నారు జ్ఞానము ఇత్యాదిగా.

హ. ఎందువలన ఇంద్రియములు రాగద్వేషములకు మూలమో—తస్మాత్; ఆయింద్రియములను; ఆదౌ = మొదట; నియమ్య=నిరోధించి; ఏనమ్—ప్రకృతవైరిని; పాప్మానమ్ = సకలపాపహేతువును; జ్ఞానము—ఆత్మశాస్త్రముయొక్కయు ఆచార్యునియొక్కయు నుపదేశమువలనఁ బుట్టినది, విజ్ఞానము—దానిచేఁ గలుగు ప్రత్యగాత్మానుభవము, వానియొక్క నాశనమైనదానిని, కామమును; ప్రజహిహి.

శ౦. నిశ్శేషముగా కామమును వధింపనిచో బుద్ధికి నిశ్చలత సంభవింపదు, అది సంభవింపనియెడ విశుద్ధజ్ఞానము కలుగదు; అది లేదేని మోక్షము సిద్ధింపదు; అందువలన ముముక్షువు కామజయం బవశ్యము సేయవలయు నని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—హి—ఏకారణమువలన మనోబుద్ధీంద్రియములవ్యాపారమే బలముగాఁ గలదగు కామము ముముక్షుఁడ వగు నీకు నిత్యశత్రు వగుచున్నదో, తస్మాత్ = ఆకారణమువలన; త్వమ్; ఆదౌ = మొదట; ఇన్ద్రియాణి = ఇంద్రియములను; పిమ్మట మనస్సును బుద్ధిని, నియమ్య=విషయగ్రహణవిముఖములనుగాఁ జేసి; ఇన్ద్రియాణ్యాదౌ అనుట అనంతరము మనోబుద్ధుల నియమనమును సూచించుచున్నది, నియమనవిధియందలి ఆదిపదము అనంతరకృత్యము నపేక్షించుటవలనను, లోపల విషయచింత యుండునేని ఇంద్రియనిగ్రహము నిష్ఫల మగుటవలనను, « మనస్తు పూర్వ మాదద్యాత్కుమీన మివ మత్స్యహా " * అను వచనమువలనను, వస్తుదర్శనమునందు మనస్సే కారణ మగుటవలనను. అందువలన ఇంద్రియముల నిగ్రహించినవెంటనే మనోబుద్ధులనిగ్రహముగూడ చేయవలసినదియే. ఇట్లు కామాధిష్ఠానములను నిరోధించి; జ్ఞానవిజ్ఞాననాశనమ్ = జ్ఞానము—శ్రుతియుక్తులచే « పర్వతమునందు అగ్ని కలదు " అనునట్లు పరోక్షమైనవస్తునిశ్చయము « సర్వమును బ్రహ్మమే"యనునది, విజ్ఞానమో—విషయవ్యాప్తి గల వృత్తిచేఁ గలుగునట్టి మహానసాగ్నిజ్ఞానము † వంటిది «ఇదియే నేను" అనునది, ఇట్టి మోక్షప్రాప్తిహేతువులు చంద్రసూర్యులవలె అవిశేషవిశేషస్ఫురణరూపములు ‡ అగు జ్ఞానవిజ్ఞానములయొక్క,

* మత్స్యములఁ జంపువాఁడు కుత్సితమీనమును—దుష్టమైన—మరల జలములం బడుటకు యత్నించునట్టి చేపనుంబోలె మనస్సునే ముందు గ్రహింపవలయును.

† వంటయింటియందలి యగ్నియొక్కజ్ఞానము—ప్రత్యక్షముగా చూచిన అగ్నియొక్కజ్ఞానము.

‡ అవిశేషము—సామాన్యము, సర్వమును బ్రహ్మమే యనునది సామాన్యస్ఫురణము. ఇదియే నేను అనునది విశేషస్ఫూర్తి.

నాశనమ్ = నాశము చేయునది; కావుననే, నీకు శత్రువైన, పాప్మానమ్ = పాపిష్ఠము; ఏనమ్ = ఈకామమును; ప్రజహి—నిశ్శేషముగా ధ్వంసము చేయు మని యర్థము.

మ. ఎందువలన ఇంద్రియాధిష్ఠానమై కామము దేహిని మోహపఱచు చున్నదో, తస్మాత్ = అందువలన; త్వమ్; ఆదౌ = మోహపఱచుటకు మున్ను, లేక, కామము నిరోధించుటకు మున్ను; ఇన్ద్రియాణి—శ్రోత్రాదులను; నియమ్య = వశీకరించి; అవి గదా వశీకృతము లైనయెడ మనోబుద్ధుల వశీకరణముగూడ సిద్ధించుచున్నది, సంకల్పాధ్యవసాయములు బహిరింద్రియప్రవృత్తిమూలమున నే అనర్థజనకము లగుటవలన. ఇందువలననే « ఇన్ద్రియాణి మనోబుద్ధిః " అని పూర్వము వేఱుగా నిర్దేశించియు ఇచట ఇన్ద్రియాణి అనిమాత్రమే చెప్పఁబడినది. లేక, మనోబుద్ధులను గూడ ఇంద్రియము లని సంగ్రహించుటయుఁ గానచ్చును. ఓభరతర్షభుఁడా! మహావంశమునందుఁ బుట్టినవాఁడ వగుటచే సమర్థుఁడ వగుచున్నావు. పాప్మానమ్ = సర్వపాపములకును మూలభూతమైన; ఏనమ్ = ఈ కామరూపశత్రువును; ప్రజహిహి = పరిత్యజింపుము; లేక, హి = స్ఫుటముగా, ప్రజహి = చక్కఁగా చంపుము, « జహి శత్రుమ్ " అని యుపసంహరించుచున్నాఁడుగూడ. జ్ఞానము—శాస్త్రాచార్యుల యుపదేశమువలనఁ గలుగునది పరోక్షము, విజ్ఞానము—తత్ఫలమైనది అపరోక్షము, శ్రేయః ప్రాప్తిహేతువు లయిన అజ్ఞానవిజ్ఞానములయొక్క, నాశనమ్ = నశింపఁజేయుదానిని.

శ్రీ. ఎందువలన ని ట్లున్నదో—తస్మాత్ = అందువలన; ఆదౌ = విమోహనమునకుఁ బూర్వమే; ఇన్ద్రియములను మనస్సును బుద్ధినిగూడ; నియమ్య; పాపరూపమైన, ఏనమ్ = ఈకామమును; హి = స్ఫుటముగా; ప్రజహి = వధింపుము; లేక, ప్రజహిహి = పరిత్యజింపుము. జ్ఞానము—ఆత్మవిషయము, విజ్ఞానము—శాస్త్రీయము, వానిని నశింపఁ జేయుదానిని; లేక, జ్ఞానము—శాస్త్రాచార్యోపదేశమువలనఁ గలుగునది, విజ్ఞానము—నిదిధ్యాసనమువలనఁ గలుగునది, « త మేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత " అను శ్రుతివలన.

ప. ఇటుకఁ గ్రమంబున నిది యుపరమించువిధముఁ జెప్పుచున్నాఁడు.—ఎందువలన నిది బుద్ధిపర్యంతము వ్యాపించి యున్నదో, తస్మాత్ = ఆకారణమువలన;

ఆదౌ = మొదట; ఇన్ద్రియాణి—చక్షురాదులను; నియమ్య = విషయవిముఖములనుగాఁ జేసి; ఏనమ్ = ఈ; పాప్మానమ్ = అత్యుగ్రమైనకామమును; ప్రజహి = వధింపుము. ఎట్టిదానిని? జ్ఞానవిజ్ఞాననాశనమ్ = జ్ఞానము—శాస్త్రజన్యము, విజ్ఞానము—అనుభవము, వానికి ప్రతిబంధక మైనదానిని.

రా. ఎందువలన సర్వేంద్రియవ్యాపారోపశమరూప మయిన జ్ఞానయోగమునందుఁ బ్రవర్తించినవానికి ఈ కామరూపశత్రువు విషయాభిముఖ్యము కలిగించి ఆత్మవిషయమున విముఖతను ఆపాదించుచున్నదో, తస్మాత్ = అందువలన; ప్రకృతిసంసృష్టుఁడ వగుటచే ఇంద్రియవ్యాపారమున కధీనుఁడవైన, త్వమ్ = నీవు; ఆదౌ = మోక్షోపాయము నారంభించుసమయమునందే; ఇంద్రియవ్యాపారమున కనురూప మయిన కర్మయోగమునందు; ఇన్ద్రియాణి, నియమ్య; ఏనమ్, జ్ఞానవిజ్ఞాననాశనమ్ = ఆత్మస్వరూపవిషయ మయిన జ్ఞానమునకును ఆత్మవివేక * విషయమైన విజ్ఞానమునకును నాశనమైన; పాప్మానమ్ = కామరూపశత్రువును; ప్రజహి = నశింపఁజేయుము.

ఈ కామము, ఇంద్రియవ్యాపార మెంతమాత్రము లేకయుండవలసినట్టి జ్ఞానయోగమునందుఁ బ్రవర్తించినవాని విషయాభిముఖునిగాఁ జేసి ఆత్మవిముఖునిగాఁ జేయును; అందువలనఁ బ్రకృతిసంసృష్టుఁడ వగుటచే ఇంద్రియవ్యాపారము విడువఁ జాలనివాఁడవు నీవు మోక్షసాధనము నారంభించునప్పుడే యింద్రియవ్యాపారమున కనుకూల మయిన కర్మయోగమునందు ఇంద్రియములను నియమించుకొని, జ్ఞానవిజ్ఞాననాశనం బైన యీ కామరూపశత్రువును వధింపవలయు నని తాత్పర్యము.

మా. అధిష్ఠానమును హరించినం గదా శత్రువు నశించును.

ఇన్ద్రియాణి పరా ణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః
మనస స్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః. ౪౨

భా. ఇంద్రియములను ముందు నియమించి కామం బనుశత్రువును దొలఁగించుకొను మని చెప్పఁబడినది. అందు, దేని నాశ్రయించి కామమును దొలఁగింపవలయును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఇన్ద్రియాణి శ్రోత్రాలు అయిదింటిని; స్థూలము బాహ్యము పరిచ్ఛిన్నము నగు దేహముకంటె సూక్ష్మత అంతస్థత వ్యాపకత మొదలగునవి కలవి యగుటచే,

* ఆత్మను వివేకించి—వేఱుపఱచి తెలిసికొనుట.

పరాణి = ప్రకృష్టము ♦ లనుగా; ఆహుః = చెప్పుచున్నారు, పండితులు. అట్లు, ఇన్ద్రియేభ్యః = ఇంద్రియములకంటెను; మనః = సంకల్పాత్మక మయిన మనస్సు; పరమ్= ప్రకృష్టము. అట్లు, మనసస్తు = మనస్సుకంటెను; బుద్ధిః = నిశ్చయాత్మక మయిన బుద్ధి; పరా = ప్రకృష్టము. అట్లు, ఎవ్వఁడు బుద్ధిపర్యంతము లగు సర్వదృశ్యములకంటె అంతరుఁడో, ఎవ్వని దేహియైనవానిని ఇంద్రియాదు లగు నాశ్రయములతోఁ గూడినదై కామము జ్ఞానావరణద్వారంబున మోహింపఁ జేయుచున్న దని చెప్పఁబడినదో, అట్టివాఁడు—యః తు= ఎవ్వఁడు మాత్రము; బుద్ధేః= బుద్ధికంటెను; పరతః = పరుఁడో; సః = అతఁడు—బుద్ధిద్రష్టయైన పరమాత్మ.

ఇంద్రియములు సూక్ష్మత్వాదిహేతువుచే దేహముకంటెఁ బరము లని పండితులు చెప్పెదరు. ఆహేతువుచేతనే ఇంద్రియములకంటె మనస్సు పరము. ఆహేతువుచేతనే మనస్సుకంటె బుద్ధి పరము. ఎవ్వని దేహియైనవానిని కామము మోహింపఁజేయు నని చెప్పఁబడినదో అతఁడే సర్వదృశ్యములకును అంతరుఁడై బుద్ధికిని బరుఁడై ద్రష్టయైనపరమాత్మ అని తాత్పర్యము.

ఆ. పూర్వోక్తవిషయము ననువదించి కామత్యాగము దుష్కరం బని తలఁచినవారై "రసో ఽప్యస్య పరం దృష్ట్వానివర్తతే" అనుస్థలమునఁ జెప్పినదానినే స్పష్టీకరించుటకై ప్రశ్నపూర్వకముగా మీఁదిశ్లోకమున కవతారిక చేయుచున్నారు.—ఇంద్రియములను ఇత్యాదిగా. అయిదింటిని—ఇట జ్ఞానేంద్రియములుంబోలె వాగాదికర్మేంద్రియములును గ్రహింపఁబడుచున్నవి. దేనికంటె అవి పరములు? అనఁగాఁ జెప్పుచున్నారు స్థూలము ఇత్యాదిగా. అట్లయినను ఏకారణముచే పరత్వము వీనికి? అనఁగాఁ జెప్పుచున్నారు సూక్ష్మత ఇత్యాదిగా. మొదలగునవి అనుటచే కరణత్వాదికము గ్రహింపఁబడుచున్నది. ఇంద్రియాదులకంటె సూక్ష్మత్వాదికముచే మనస్సు పరం బనుటను మనస్సుయొక్క స్వరూపముఁ జెప్పుచుఁ బ్రతిపాదించుచున్నారు అట్లు ఇత్యాదిగా. మనస్సునందుఁ జూపఁబడిన న్యాయమును బుద్ధియందు అతిదేశించుచున్నారు అట్లు మనసస్తు ఇత్యాదిగా. కడపటిపాదమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు అట్లు ఇత్యాదిగా. ఈవిశేషణములు గల ఆత్మ అప్రకృత మని యాశంకించి చెప్పుచున్నారు ఎవ్వని దేహియైనవానిని ఇత్యాదిగా.

♦ ఉ త్తమము.

హ॰ ఏ జ్ఞానరూపుఁ డైన ఆత్మను కామ మావరించుచున్నదో ఆయాత్మ యొక్క స్వరూపముఁ జెప్పుచున్నాఁడు.—ఇన్ద్రియాణి—శ్రోత్రాదులను; పరాణి = ప్రకృష్టములనుగా, సూక్ష్మము లగుటవలనను సకలదేహములను వ్యాపించునవి యగుటవలనను; ఆహుః = చెప్పుచున్నారు. ఆయింద్రియములకన్నను, పరమ్ = ప్రకృష్టమునుగా; మనస్సును జెప్పుచున్నారు, ఇంద్రియములప్రవృత్తి మనఃపూర్వక మగుటవలన. మనస్సుకన్నను, పరా; బుద్ధిః—అధ్యవసాయాత్మకము, మనస్సు తదర్థ మగుటవలన. యః, బుద్ధేః, పరతః—ఎఱుంగువాఁడో; సః—అతఁడు కామముచే ఆవృతుఁ డని యభిప్రాయము.

శ౦. ఓయీ! కామము దుర్జయము *, దుర్జయ మగుదాని జయించుటకు బలవత్తరమైన ఆశ్రయము కావలయును, ఎవ్వని నాశ్రయించి యెవ్వనిమహిమచేఁ గామమును జయింపవలయును? అని యాకాంక్షింపఁగా « రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే " అనున్యాయంబునఁ బరమాత్మను సర్వాంతరుఁ డైనవాని సర్వగతుని నెఱింగి వాని నాశ్రయించినవాఁడవై నీవు కామమును వధింపుమని బోధించుటకై ఆత్మ నెఱుంగువిధముఁ జెప్పుచున్నాఁడు.—« ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా హ్యర్థేభ్యశ్చ పరం మనః " ఇత్యాదిశ్రుతులు; ఇన్ద్రియాణి పరాణి ఆహుః—ఇన్ద్రియాణి = శ్రోత్రాదు లైదింటిని, కర్మేంద్రియము లైదింటిని; తమకంటె జడమును బాహ్యమును స్థూలమును వ్యాప్యమును కార్యమును ప్రవర్త్యమును ♦ అగు శరీర మేది కలదో దానికంటె, ప్రకాశకత్వమును అంతరత్వమును సూక్ష్మత్వమును వ్యాపకత్వమును కారణత్వమును ప్రవర్తకత్వమును మొదలగు ధర్మములు గల వగుటచే; పరాణి = ఉత్కృష్టతరములనుగా; ఆహుః = చెప్పుచున్నవి. దేనిచే నేది ప్రకాశింపఁ జేయఁబడుచున్నదో ప్రవర్తింపఁజేయఁబడుచున్నదో అది దానికంటె వ్యాపకంబును సూక్ష్మంబును పరంబును భిన్నంబును అగుచున్నది. ఎట్లు ఇనుముకంటె ఇనుమునందున్న యగ్ని వ్యాపకమును సూక్ష్మమును పరమును భిన్నమును అగుచున్నదో, అట్లు దేహముకంటె ఇంద్రియములు దేహమునకు దేహధర్మములకుఁ బ్రకాశకము లగుటవలనను బ్రవర్తకము లగుటవలనను పరములును భిన్నములును అగుచున్నవి యని యర్థము. అట్లు, ఇన్ద్రియేభ్యః = ఇంద్రియములకంటెః; మనః = మనస్సు; ప్రకాశకత్వాది ధర్మములు గల దగుటచే, పరమ్ = ఉత్కృష్ట

* జయింప నశక్యము.

♦ ప్రవర్తింపఁజేయఁ దగినదియు.

మును భిన్నమును అగుచున్నది, ఇంద్రియములకును ఇంద్రియధర్మములకును ప్రకాశకం బగుటవలన, మనస్సు గదా అంతస్థమై యింద్రియములను తద్ధర్మములను ప్రకాశింపఁజేయుచున్నది, కావున మనస్సు ఇంద్రియములకంటె పరము భిన్నము అనుట యుక్త మని యర్థము. ఇట్లు, మనసస్తు = మనసుకంటెఁగూడ; ప్రకాశకత్వాదిధర్మములచే, బుద్ధిః, పరా = పర మగుచున్నది, బుద్ధి గదా మనస్సునకును తద్ధర్మములకును ప్రకాశకమును ప్రవర్తకమునుగా నున్నది, కావున బుద్ధి మనస్సుకంటె పరము భిన్నము అనుట సిద్ధమే యగుచున్నది. సూక్ష్మత్వము అంతరత్వము వ్యాపకత్వము కారణత్వము ప్రవర్తకత్వము ప్రకాశకత్వము మొదలగు ధర్మములచే, యః = ఎవ్వఁడు; తాను అంతటను వ్యాపించి బుద్ధ్యాదిస్థూలపర్యంత మైన కార్యకరణసంఘాతమును స్వసన్నిధానమాత్రంబునఁ బ్రవర్తింపఁజేయుచు, తద్ధర్మములను తత్కర్మములను తద్గుణములను తద్వికారములను అన్నిటిని అవికారరూపుఁడై ప్రత్యక్షమున నెఱుంగుచున్నాఁడో ప్రకాశింపఁ జేయుచున్నాఁడో, సః = ఆఆత్మయే; బుద్ధేః = బుద్ధికంటె; పరతః = పరుఁడు, సర్వముకంటె ఉత్కృష్టతముఁడును భిన్నుఁడును, నిత్యుఁ డగుటవలనను సర్వజ్ఞుఁ డగుటవలనను సర్వప్రకాశకుఁ డగుటవలనను సర్వసాక్షియగుటవలనను, 'పురుషాన్న పరం కించిత్' అను శ్రుతివలన. అందువలన, సర్వముకంటెఁ బరుఁ డైనవానిసర్వద్రష్టను కావుననే దేహేంద్రియాదులకంటె భిన్నుఁడైనవాని సర్వప్రకాశకుని చిదానందైకరసుని సన్మాత్రుని పరిపూర్ణుని వీనినే స్వాత్మనుగా ♦ ఎఱుంగు మని యర్థము.

**మ.** ఓయీ! ఎట్లో యొకవిధమున బాహ్యేంద్రియముల నియమించుట సాధ్యమైనను లోపలితృష్ణను విడుచుట కడుదుష్కరము అందువేని, అట్లు కాదు, "రసో ఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే" అను స్థలమున పరదర్శనము రసాఖ్యమయిన తృష్ణను విడుచుటకు సాధనముగాఁ జెప్పియుండుటవలన. అట్లయినను ఎవనిదర్శనమువలన తృష్ణానివృత్తి యగునో ఆపరుం డెవఁడు? అని యాశంకించి పరశబ్దార్థ మయిన శుద్ధాత్మను దేహాదులనుండి వివేకించి చూపుచున్నాఁడు.— శ్రోత్రాదు లగు జ్ఞానేంద్రియములను ఐదింటిని; స్థూలమును జడమును పరిచ్ఛిన్నమును బాహ్యము నగు దేహము నపేక్షించి, పరాణి = సూక్ష్మము లగుటవలనను ప్రకాశకము లగుటవలనను వ్యాపకము లగుటవలనను అంతస్థము లగుటవలనను ప్రకృష్టములనుగా; ఆహుః = చెప్పుచున్నారు పండితులు, లేక, చెప్పుచున్నవి

♦ నీయాత్మనుగా—నీస్వరూపమునుగా.

శ్రుతులు. అట్లు, ఇన్ద్రియేభ్యః, పరం, మనః—సంకల్పవికల్పాత్మకము, ఇంద్రియప్రవ ర్తక మగుటవలన. అట్లు, మనసస్తు, పరా, బుద్ధిః—అధ్యవసాయాత్మకము, అధ్యవ సాయ మనఁగా నిశ్చయము, నిశ్చయపూర్వకముగఁ గదా మనోధర్మము సంకల్పా దికము కలుగుచున్నది. యస్తు = ఇఁక నెవఁడు; బుద్ధేః; పరతః—బుద్ధికి భాసకుఁడై యున్నాఁడో, ఎవ్వని దేహిని ఇంద్రియాద్యాశ్రయములతోఁ గూడినదై కామము జ్ఞానావరణద్వారంబున మోహపఱచుచున్న దని చెప్పఁబడినదో; సః = అతఁడు బుద్ధిద్రష్ట యయిన పరమాత్మ. "స ఏష ఇహ ప్రవిష్టః" అను చోటంబోలె వ్యవ హితుఁడైనను దేహి తచ్ఛబ్దముచే ¶ పరామర్శింపఁబడుచున్నాఁడు. ఈయర్థము నందు శ్రుతి.—"ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః । మనస స్తు పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహాన్పరః ॥ మహతః పర మవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః । పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరాగతిః" అని. ఇట ఆత్మ పరుఁడను టయే వాక్యతాత్పర్యవిషయ మగుటవలన, ఇంద్రియాదులపరత్వము వివక్షితము గానందున "ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థాః" అనుస్థానంబున అర్థములకన్నను పరము లింద్రియములు అని అభిప్రాయభేదంబున భగవంతుఁడు చెప్పినది విరుద్ధము గాదు. బుద్ధేః = అస్మదాదులవ్యష్టి బుద్ధికంటె, మహాన్ ఆత్మా = సమష్టిబుద్ధిరూపుఁడు, పరః, "మనో మహా న్మతి ర్బ్రహ్మా పూ ర్బుద్ధిః ఖ్యాతి రీశ్వరః" అను వాయుపు రాణవచనమువలన ♦. మహతః= హిరణ్యగర్భరూప మైన సమష్టిబుద్ధికంటె; పరమ్; అవ్యక్తమ్ = మాయాఖ్య మయిన అవ్యాకృత మగు సర్వజగత్కారణము, "మా యాం తు ప్రకృతిం విద్యాత్" అనుశ్రుతివలనను "తద్ధే దం తర్హ్య వ్యాకృత మాసీత్" అనుశ్రుతివలనను. అవ్యక్తాత్ = అవ్యక్తముకంటె; పురుషః = సకల జడప్రపంచప్రకాశకుఁడై పూర్ణుఁ డగు ఆత్మ; పరః. అతనికంటె మఱియొకఁడు పరుఁడు కావచ్చు ననఁగాఁ జెప్పుచున్నది పురుషా న్న పరం కించిత్ అని. ఎందు వలన ననఁగా—సా = అది, పురుషుఁడు, కాష్ఠా = సమాప్తి, సర్వమునకును అధిష్ఠాన మగుటవలన. సాపరాగతిః—"సో ఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్" అనుశ్రుతి చెప్పునట్టి పరమగతియు నతఁడే యని యర్థము. ఇది యంత యు "యో బుద్ధేః పరత స్తుసః" అనువాక్యముచే సంగ్రహింపఁబడినది.

శ్రీ. దేనియందుఁ జిత్తప్రణిధానము చేయుటచే ఇంద్రియములు నియమింప శక్యము లగునో ఆయాత్మస్వరూపమును దేహాదులనుండి వివేచించి చూపు

---

¶ సః అనుదానిచే. ♦ ఇది నిఘంటువు.

చున్నాఁడు.—ఇన్ద్రియాణి; గ్రాహ్యము లయిన * దేహాదులకంటె, పరాణి = శ్రేష్ఠములనుగా; ఆహుః, సూక్ష్మము లగుటవలనను ప్రకాశకము లగుటవలనను. ఇందువలననే దేహాదివ్యతిరిక్తము లనుటయు అర్థమువలనఁ బ్రతిపాదిత మగుచున్నది. ఇంద్రియములకన్నను; సంకల్పాత్మక మయిన మనస్సు పరము, ఇంద్రియములకుఁ బ్రవర్తక మగుటవలన. మనసస్తు, బుద్ధిః—నిశ్చయాత్మకము, పరా, సంకల్పము నిశ్చయపూర్వక మగుటవలన. యస్తు, బుద్ధేః, పరతః—బుద్ధికిసాక్షియై యున్నాఁడో సర్వాంతరుఁడో, సః = అతఁడు ఆత్మ, విమోహయతి యనుచున్నది దేహిని అని దేహిశబ్దముచే చెప్పఁబడిన ఆత్మ సః ♦ అని పరామర్శింపఁబడుచున్నాఁడు.

ప. ఇఁక, ఇంద్రియాదు లగు అధిష్ఠానముల మూఁడింటి నాశ్రయించి యుండు కామమును జయింప నలవిగాదు అనఁగా ఆమూఁడింటి వలననుండియు వివిక్తుఁ డైన ఆత్మను జూపుచున్నాఁడు.—ఇన్ద్రియాణి, గ్రాహ్యము లయిన దేహాదులకన్నను, పరాణి = ఉత్కృష్టములనుగా, ఆహుః, సూక్ష్మము లగుటవలనను అర్థప్రకాశకంబు లగుటవలనను. ఇందువలననే ఇంద్రియములు వానికంటె అతిరిక్తము లనుటయు అర్థోక్త మగుచున్నది. ఇంద్రియములకన్నను, సంకల్పాత్మక మైన మనస్సు, పరమ్ = ఉత్కృష్టము, ఇంద్రియములకుఁ బ్రవర్తక మగుటవలన. మనసస్తు, నిశ్చయాత్మక మయిన బుద్ధి పరము, సంకల్పము నిశ్చయముచేఁ గలుగునది యగుటవలన. యస్తు, బుద్ధేః, పరతః—తత్సాక్షియై సర్వాంతరుఁడై యున్నవాఁడో, సః = అతఁడు ఆత్మ. ఈయర్థమునందు కఠశాఖీయశ్రుతి.—« ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా హ్యర్థేభ్యశ్చ పరం మనః । మనసస్తు పరా బుద్ధిర్బుద్ధే రాత్మా మహాన్పరః ॥ మహతః పర మవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః । పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సాపరాగతిః ॥ ఏష సర్వేషుభూతేషు గూఢోత్మా న ప్రకాశతే । దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః » అని.

రా. జ్ఞానవిరోధులందుఁ బ్రధాన మయినదానిఁ జెప్పుచున్నాఁడు.—జ్ఞానవిరోధము చేయుటయందు, పరాణి = ప్రధానములనుగా; ఇన్ద్రియాణి, ఆహుః. ఎందువలన ననఁగా, ఇంద్రియములు విషయములందు వ్యాపృతము లైనప్పుడు ఆత్మవిషయమున జ్ఞానము ప్రవర్తింపదు. ఇన్ద్రియేభ్యః పరం మనః—ఇంద్రియములు ఉప

---

* జ్ఞేయము లయిన.

♦ అతఁడు.

రతములై యున్నను మనస్సు విషయాధీనం బగునేని ఆత్మజ్ఞానము సంభవింపదు. మనసస్తు పరా బుద్ధిః—మనస్సు వృత్త్యంతరవిముఖమై యున్నను విపరీతాధ్యవసాయము కలిగి యున్నయెడ జ్ఞానము ప్రవర్తింపదు. బుద్ధిపర్యంతము లయిన యివి యన్నియు నుపరతములైనను రజస్సముద్భవ మయిన ఇచ్ఛాఖ్య మగు కామము ఉండునేని, ఆకామమే యీయింద్రియాదులనుగూడ స్వవిషయమునందుఁ ద్రిప్పి ఆత్మజ్ఞానమును నిరోధించుచున్నది—ఇది చెప్పఁబడుచున్నది « యో బుద్ధేః పరతస్తు సః » అని. బుద్ధేస్తు= బుద్ధికన్నను; యః =ఏది; పరః = పరమో, సః—అది కామ మని యర్థము.

జ్ఞానమునకు విరోధము చేయుటయందుఁ బ్రధానము లింద్రియములు, ఇంద్రియములకంటెఁ బ్రధానము మనస్సు, మనస్సుకంటె బుద్ధి ప్రధానము, బుద్ధికంటె ఏది జ్ఞానవిరోధమునందుఁ బ్రధానమో అది కామ మని తాత్పర్యము.

మా. శత్రువధమునందు ఆయుధరూపమైన జ్ఞానమును బ్రతిపాదించుటకై జ్ఞేయుని * చెప్పుచున్నాఁడు, « అసఙ్గజ్ఞానాసి మాదాయ తరాతిపారమ్ » ** అని గదా చెప్పఁబడినది. శరీరముకంటె, ఇన్ద్రియాణి, పరాణి = ఉత్కృష్టములు. బుద్ధికన్న మాత్రమే కాఁడు పరుఁడు, శ్రుతియందుఁ జెప్పఁబడినచొప్పున అవ్యక్తముకన్ననుగూడ పరుఁడు, « అవ్యక్తాత్తు పురుషః పరః » అని గదా శ్రుతి. అచ్చటచ్చటఁ జెప్పఁబడిన యేకదేశము నెఱింగినమాత్రానఁ గలుగదు గదా ముక్తి. సార్వత్రికగుణోపసంహారము † గదా భగవంతునిచే ‡ గుణోపసంహారపాదమునందుఁ బ్రతిపాదింపఁబడినది « ఆనన్దాదయః ప్రధానస్య » ఇత్యాదిగా. అట్లు ఇతరస్థలమునఁ గూడ « అపౌరుషేయ వేదేషు విష్ణువేదేషు చైవ హి । సర్వత్ర యే గుణాః ప్రోక్తాస్సంప్రదాయాగతాశ్చ యే ॥ సర్వైస్తై స్సహ విజ్ఞాయ యే పశ్యన్తి పరంహరిమ్ । తేషా మేవ భవే న్ముక్తి ర్నాన్యథా తు కథంచన » § అని గారుడమునందు.

* తెలియఁ దగినవానిని.

** వైరాగ్యసహిత మగు జ్ఞానం బను ఖడ్గమును గ్రహించి దాఁటుము, పారమును.

† సర్వత్ర చెప్పఁబడిన గుణములయొక్క చేరిక.

‡ వ్యాసునిచే.

§ అపౌరుషేయవేదములందును విష్ణువేదములందును—పాంచరాత్రాద్యాగమములందును అన్నిటను ఏగుణములు చెప్పఁబడినవో సంప్రదాయాగతములు ఏవి గలవో వాని యన్నిటితోఁ గూడ తెలిసి ఎవరు పరుఁడైన హరిని చూచుచున్నారో వారికే ముక్తి కలుగును. [illegible] ఎన్నటను గలుగదు.

అందువలన అవ్యక్తముకన్నను గూడ పరుఁ డని యెఱుంగవలయును. మఱియు నిట జీవుఁడు చెప్పఁబడఁడు, «రసో ఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే» అని చెప్పియుండుటవలన; «అవిజ్ఞాయ పరం మత్తో జయః కామస్య వై కుతః» ♦ అనుటవలనను. అందువలనఁ బరమాత్మజ్ఞానమే యిట వివక్షితము.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాఽఽత్మాన మాత్మనా
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్. ౪౩

భా. దాన నేమి? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఏవమ్ = ఇట్లు; బుద్ధేః = బుద్ధికంటె; పరమ్ = ఉత్కృష్టునిఁగా ఆత్మను; బుద్ధ్వా = ఎఱింగి; ఆత్మానమ్ = మనస్సును; ఆత్మనా = నీదగు ఆత్మచేత నే—సంస్కృతమైనమనస్సుచేత; సంస్తభ్య = చక్కగా స్తంభనము చేసి, చక్కగా సమాధి నొందించి యని యర్థము; మహాబాహో! జహి = వధింపుము; ఈ, శత్రుమ్ = శత్రువును; కామరూపమ్ = కామాఖ్య మయినదానిని; దురాసదమ్ = దుఃఖముచే ఆసాదము—ఆసాదనము—ప్రాప్తి గల దానిని *, దుర్విజ్ఞేయములైన యనేకవిశేషములు గలదానిని.

మహాబాహుఁడా! ఇట్లు బుద్ధికంటెఁ బరుఁడై సర్వాంతరుఁడైన వానిఁగా ఆత్మను దెలిసికొని పరిశుద్ధ మయి సంస్కృతమైన మనస్సుచే మనస్సు నేకాగ్రముగా నిలిపినవాఁడవై దురాసదం బగు కామరూపశత్రువును వధింపు మని తాత్పర్యము.

ఆ. ఇంద్రియాదిసమాధానపూర్వకముగా ఆత్మజ్ఞానమువలనఁ గామజయ మగు నని ప్రశ్నపూర్వకముగా నుపసంహరించుచున్నారు దాన నేమి ఇత్యాదిగా. సంస్కృత మయిన మనస్సు మనస్సమాధానమునందు హేతు వని సూచించుచున్నారు ఆత్మానమ్ ఇత్యాదిగా. ప్రకృతశత్రువునకే విశేషణములు చూపుచున్నారు కామరూపమ్ ఇత్యాదిగా. అది దురాసదం బనుటకు హేతువుఁ జెప్పుచున్నారు దుర్విజ్ఞేయములు ఇత్యాదిగా. దుర్విజ్ఞేయములు = తెలియరానివి, అనేకవిశేషములు—మహాశనత్వాదులు. ఇట్టీయధ్యాయముచే ఉపాయభూతం బగు కర్-

♦ పరమాత్మను దెలియకున్నయెడ నావలన కామజయం బె ట్లగును.

* కష్టముచే బొందుట గలదానిని.

నిష్ఠ ప్రాధాన్యమునం బ్రతిపాదింపఁబడినది, ఉపేయం బగు జ్ఞాననిష్ఠయో అప్రధాన ముగాఁ బ్రతిపాదితం బయ్యె నని వివేకము.

ప. ఏవమ్; బుద్ధేః; పరమ్ = జ్ఞాత యగు ఆత్మను; బుద్ధ్వా = ఎఱింగి; అంతఃకరణమును ఆత్మచేతనే, సంస్తభ్య; దురాసదమ్ = దుఃఖేన ఆసాద్యతే—దుఃఖముచే నశింపఁజేయఁబడునది యైన; కామరూపమ్; శత్రుమ్; జహి.

తం. ఇట్లు బుద్ధ్యాదిదృశ్యవర్గమునకు ద్రష్ట యగు ఆత్మను సన్మాత్రుని నేఁ దానే యని యెఱింగి తన్నిష్ఠచే స్వశత్రు వగు కామమును సంసారహేతువును నిశ్శేషముగా నిర్మూలింపు మని ఉపాయ భూతమైన కర్మయోగమునకు ఉపేయ మగు * జ్ఞాననిష్ఠచే సంభవించు సర్వకామనిర్మోకమే ముక్తి యని సూచించుటకై కర్మయోగము నుపసంహరించుచున్నాఁడు.—మహాబాహో అను విశేషణము, ముముక్షువు కామరూపశత్రుసంహారమునందు సమర్థుఁడై యుండవలయు నని సూచించుకొఱకు. బుద్ధేః = బుద్ధ్యాదిసర్వదృశ్యమునకును; పరమ్ = విలక్షణుఁడైన ద్రష్టను అఖండానందైకరసుని ఆత్మను; ఇతఁడే నేనని స్వాత్మరూపంబున, బుద్ధ్వా = చక్కఁగా నెఱింగి, ఆత్మయందే ఆత్మబుద్ధిని దృఢముగాఁ జేసి; నీవు; ఆత్మానమ్=కామమున కాశ్రయమును కారణము నగు అంతఃకరణమును; ఆత్మనా = స్వస్వరూపంబున లోపలను వెలుపలను బూర్ణుఁడై యఖండైకరసుఁ డగు ఆత్మతో, సంస్తభ్య= చక్కఁగా నిలిపి, ఆరోపిత మగు నామరూపమును గ్రహింపక సర్వంబును బ్రహ్మమే యని నామరూపాధిష్ఠానభూత మగు బ్రహ్మమును జూచుటయందే నియమించి; సర్వత్ర బ్రహ్మదర్శనముచేతఁ దక్క మఱియొకదానిచే, దురాసదమ్ = దుర్జయము, జయించుటకు అశక్య మయిన స్వభావము గలది యగు; కామరూపం శత్రుమ్; జహి = నశింపఁజేయుము. వేఱువేఱుగా విషయములను గ్రహించుటయె కామావిర్భావమునకుఁ గారణము, సర్వత్ర బ్రహ్మదృష్టిచే అట్లు విషయముల గ్రహింపకుండుటయె కామనాశమునకు హేతువు, కావున సర్వమును బ్రహ్మమే యని చూచుచున్నవాఁడవై కామమును నిర్మూలింపు మని యర్థము. ఈ యధ్యాయమునందు « న కర్మణా మనారమ్భాత్ » అని కర్మయోగము నుపక్రమించి ముముక్షువునకుఁ గర్మత్యాగమును నిందించుచు బహువచనంబులచేఁ గర్మమే కర్తవ్యం బని ప్రతిపాదించి, « నేను నాది » అను సంసారమునకుఁ బ్రకృతిరూపమునకుఁ గారణము కామమే యని కామమాహాత్మ్యమును వర్ణించి,

* కర్మయోగమునకు సాధ్యమైన.

కర్మముచేఁ జిత్తశుద్ధి నొందినపురుషునకు జ్ఞానయోగనిష్ఠచేఁ గామజయము కర్తవ్యం బని భగవంతుఁడు వక్కాణించినవాఁడు; కావున « యదా సర్వే ప్రముచ్యన్తే కామా యే ఽస్య హృది శ్రితాః » * ఇత్యాది శ్రుతిప్రమాణమునుబట్టి కామనిర్మోకమే మోక్షం బని భగవదభిప్రాయము సిద్ధించుచున్నది. అందుచే, మోక్షహేతు వగు జ్ఞానయోగమే ప్రధానము, కర్మయోగము ఉపసర్జనమే ♦ అగును; కావున నీయధ్యాయము జ్ఞానయోగపర్యవసాయి యగుటవలన జ్ఞానయోగపరమే యని సిద్ధ మగుచున్నది.

మ. ఫలితముఁ జెప్పుచున్నాఁడు.— « రసో ఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే » అనుస్థలమున ఎవఁడు పరశబ్దముచేఁ జెప్పఁబడెనో వానిని, ఏవమ్ = ఇట్టివానిఁగా, బుద్ధేః పరమ్—పూర్ణుఁడైన ఆత్మను; బుద్ధ్వా = సాక్షాత్కరించి; ఆత్మానమ్ = మనస్సును; ఆత్మనా = ఇట్టి నిశ్చయరూప మయిన బుద్ధిచేఁ; సంస్తభ్య = స్థిరీకరించి; జహి = వధింపుము; శత్రుమ్ = సర్వపురుషార్థ శాతనమును ‡; ఓమహాబాహుఁడా! మహాబాహునకుఁ గదా శత్రువధము సాధ్యం బగును, కావున యోగ్య మీసంబోధనము; కామరూపమ్= తృష్ణారూపమును; దురాసదమ్= దుఃఖముచేఁ బొందఁ దగినదానిని, దుర్విజ్ఞేయంబు లగు అనేకవిశేషములు గలదానిని; అధికయత్నము కావలయు ననుట కీవిశేషణము.

కర్మనిష్ఠ ప్రధానంబుగా నుపాయ
మిందు నుపసంహృతము తదుపేయ మైన
జ్ఞాననిష్ఠయు మఱి యప్రధానముగను
జెప్పఁబడియెను భగవంతుచేతఁ దెలియ.

శ్రీ. ఉపసంహరించుచున్నాఁడు.—బుద్ధికే విషయేంద్రియాదిజన్యము లగు కామాదివికారములు, ఆత్మయో నిర్వికారుఁడు తత్సాక్షీ—ఇట్లు; బుద్ధేః; పరమ్= పరునిఁగా ఆత్మను; బుద్ధ్వా; ఆత్మనా = ఇట్టి నిశ్చయరూపమైన బుద్ధిచేత; ఆత్మానమ్ = మనస్సును; సంస్తభ్య = నిశ్చలముగాఁ జేసి; కామరూపమ్; శత్రుమ్;

* ఎప్పుడు వీనిహృదయమున ఆశ్రయించిన సర్వకామములును విముక్తము లగుచున్నవో.

♦ అప్రధానమే.

‡ శాతనము—నశింపఁ జేయునది.

జహి = చంపుము; దురాసదమ్ = దుఃఖముచేఁ బొందఁ దగినదానిని, దుర్విజ్ఞేయమయిన గతి గలదాని నని యర్థము.

బుధులు భక్తిచే నిజధర్మమునను గొల్చి
యెవని ముక్తిని బొందిరి భవమునుండి
అట్టి హరిఁ బరమానందుఁ డైనకృష్ణుఁ
దనుపునది సర్వకర్మంబులను జరించి. ౮౩

ప. ఉక్తార్థము నుపసంహరించుచున్నాఁడు.— ఓ మహాబాహుఁడా, పురుషార్థముఁ గోరువాఁడా! ఏవమ్ = ఈవిధమున; బుద్ధేః పరమ్ = బుద్ధివ్యతిరిక్తుఁడు తత్సాక్షియయిన పరమాత్మను; బుద్ధ్వా; ఆత్మనా = ఇట్టి నిశ్చయరూపమయిన బుద్ధిచేత; ఆత్మానమ్ = మనస్సును; సంస్తభ్య = నిశ్చలముగాఁ జేసి; కామరూపమ్, దురాసదమ్ = దుర్జయుఁ డగు; శత్రుమ్; జహి = చంపుము. ఈవిషయమే, బృహదారణ్యకమునందు మొదట దైవాసురసంగ్రామంబుపేర ద్వయాహప్రాజాపత్యాదు లగు పది ఖండికలచేఁ బ్రతిపాదింపఁబడినది. అందుపసంహారశ్రుతి— « అథ హేమమాసన్యం ప్రాణ మూచు స్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్య ఏష ప్రాణ ఉదగాయత్ తే విదు రనేనవై న ఉద్గాత్రా త్యేష్యన్తీతి తమభిద్రుత్య పాప్మనావిధ్యన్ స యథా ఒశ్మానమృత్వా లోష్టోవిధ్వంసత ఏవం హైవ విధ్వంసమానా విశ్వఞ్చోవినేశు స్తతో దేవా అభవన్ పరాసురా భవత్యాత్మనా పరాస్య ద్విషన్ పాప్మా భ్రాతృవ్యో భవతి యఏవం వేద » ఇత్యాదిగా. భాష్యము—అథ=అటుపిమ్మట, హాశబ్దము వృత్తాంతద్యోతకము; నిష్ఫలప్రయత్నులైన ఆదేవతలు; ఇమమ్ = ఈ; ఆసన్యమ్ = సమీపమునం దున్నట్టి; ప్రాణమ్ = సర్వేంద్రియములను జలింపఁజేయునట్టి ముఖ్యప్రాణమును ఇంద్రశబ్దముచే వ్యపదేశింపఁబోవుదానిని, గూర్చి; ఊచుః= పలికిరి. త్వమ్ = నీవు; నః = మాకొఱకు; ఉద్గాయ = ఉద్గానము చేయుము; ఇతి= అని. దానియుద్గానము అవాగ్జప్రణవరూపము*, దానిచేత, తథేతి = అట్లే యని; తేభ్యః= ఆదేవతలకొఱకు; ఏషః ప్రాణః; ఉదగాయత్ = ఉద్గానము చేసెను. అట్లు చెప్పఁబడినది ఛాందోగ్యమునందు « అథాధ్యాత్మమ్ । ఏవం ముఖ్యప్రాణ స్తముద్గీథ ముపాసీతోమితి »♦

* నోటఁ బుట్టని ప్రణవరూపము.

♦ ఇఁక అధ్యాత్మము. ఇట్టిది ముఖ్యప్రాణము. దానిని ఉద్గీథమును ఉపాసించునది, ఓమ్ అని.

అని. తే = ఆకామక్రోధాద్యసురులు; విదుః = ఎఱింగిరి; అనేన ఉద్గాత్రా = ఈయుద్గాతచేత; నః = మమ్ము; అత్యేష్యన్తీతి = దేవతలు అతిక్రమింతు రని. ఇట్లు ఆప్రాణమును ఉద్గాతను గా నెఱింగి కామక్రోధాద్యసురులు; తమ్=ఆప్రాణమును; అభిద్రుత్య=ఎత్తిమి; అవిధ్యన్ = వేధించిరి. విధ్వం సమానాః = ధ్వంసము నొందినవారై; విశ్వఞ్చః = విశ్వస్మిన్ అఞ్చన్తి--అంతటను పోయినవారై, నానాగతులై; వినేశుః = నశించిరి. ఇందుకు దృష్టాంతము చెప్పుచున్నది—యథా = ఎట్లు; అశ్మానమ్ = పాషాణమును; ఋత్వా = పొంది; లోష్టః = మట్టిగడ్డ; విధ్వంసతే. అట్లే ముఖ్యప్రాణమునందు అభిహతులై ఆదైత్యులు నాశము పొందిరని యర్థము. ఇందు ఇది యభిప్రాయము—ప్రాణనమును—జీవనమును జేయుచున్నది కావున ప్రాణము అనఁగా వాగాద్యధిదేవతలకు శక్తిజనకము—హిరణ్యగర్భుఁడు, అట్లు కామాదులకు వ్యాప్తి బుద్ధిపర్యంతమే, బుద్ధికిమీఁద కామాదులు ప్రసరింప వని యర్థము. తతః = అసురనాశానంతరము; దేవాః = దేవతలు; పరాసురాః—ఇది మధ్యమపదలోపిసమము = పరాభూతు లయిన—జయింపఁబడిన అసురులు గలవారు, విజయము గలవా రని యర్థము; అభవన్ = ఐరి. ఏవమ్ = ఈ చెప్పినవిధమున దైవాసురసంగ్రామమును; యః = ఎవ్వఁడు; వేద = ఎఱుంగుచున్నాఁడో; అతఁడు, పరాస్య = కామాదులను జయించి; ఆత్మనా భవతి—తన స్వరూపముననే యుండును, కామాదులతో నుండఁడు. ఇట్లు ఆత్మజ్ఞానసంపత్తి కలిగినపిదప వానియొక్క, ద్విషన్ = ద్వేషించువాఁడు, భ్రాతృవ్యః = శత్రువు; పాప్మా = పాపిష్ఠుఁడు; భవతి. ఈయర్థమే సామవేదమునందు కల్మషసామముచే ఉపపాదింపఁబడినది.— "హా ఉ 3, సేతూం స్తర 3, దుస్తరాన్ 3, దానేనా ఽదానమ్ 3, హా ఉ 3, అహ మస్మి ప్రథమజా ఋతస్యా హా ఉ 3, సేతూం స్తర 3, దుస్తరాన్ 3, అక్రోధేన క్రోధమ్" ఇత్యాదిగా. భాష్యము.—ఎట్లు జలప్రవాహమునకుఁ బ్రతిబంధకములు సేతువులగుచున్నవో, అట్లు అఖండైకరసానుభవమునకు నాలుగు సేతువులు గలవు. అవి—అదానము క్రోధము అశ్రద్ధ అనృతము. ఆనాలుగు సేతువులను, తర = దాఁటుము. అందు మొదటిసేతువును దాఁటుట కుపాయము చెప్పుచున్నది—ఏది బ్రహ్మార్పణముగా ఇయ్యఁబడుచున్నదో అది దానశబ్దముచే జెప్పఁబడుచున్నది, దానికి భిన్నము ఏది భార్యాపుత్త్రాద్యర్థము వ్యయము చేయఁబడుచున్నదో అది అదానము, ఇట్లు, దానముచే అదానమును దాఁటుము, అదానమునుగూడ బ్రహ్మార్పణముగా భావింపుమని యర్థము. ఎందువలన ననఁగా; అహమ్ = నేను; ఋతస్య = సత్యముయొక్క,

బ్రహ్మాముయొక్క; ప్రథమజా = మొదట కలుగఁడైయున్న హిరణ్యగర్భుఁడ నగు చున్నాను; ఏది యేది యియ్యఁబడుచున్నదో అది యంతయు మదర్పణమే * యగుచున్న దని యర్థము. అట్లే, క్రోధరూప మయిన రెండవ సేతువును; అక్రోధేన= క్షమచేత ¶; తర= దాఁటు మని యర్థము. అది చెప్పఁబడినది “క్లమో న వాచాం శిరసో న శూలం న చిత్త తాపో న తనో ర్విమర్దః । న చా ఽపి హింసాది రనర్థయోగః శ్లాఘ్యా పరం క్రోధ జయే ఽహా మేకా” § అని. ఇట “పూర్వం దేవో అమృత స్యనాభా ఇత్యాదిశ్రుతులకు మేము శతశ్లోకభాష్యమునందు చక్కగా వ్యాఖ్యా నము చేసి యున్నారము. ♦

ఇఁక నధ్యాయతాత్పర్యము.—వర్ణధర్మోచిత మగు నియతమైన యజ్ఞాదికర్మము సుఖప్రదం బగును. దాని విడువఁ దగదు. విగుణమైనను జేయవలయును. ఏల యనఁగా — అకర్మముకంటెఁ గర్మము ప్రశస్తము, కాలుసేతులతోఁ గూడినవాఁడు మర్త్యుఁడు జీవించియున్నవాఁడై కర్మము లేక యెప్పుడును ఉండఁజాలఁడు. అందువలన స్వధర్మము శ్రేయం బని యదుపలితిచేఁ దృతీయాధ్యాయమునందుఁ బ్రతిపాదింపఁ బడినది.

రా. ఏవమ్ = ఇట్లు; బుద్ధేః పరమ్ = బుద్ధికన్న గూడ ప్రధాన మయినదానిఁగా, జ్ఞానయోగవిరోధి యగుశత్రువును కామమును; బుద్ధ్వా= ఎఱింగి; ఆత్మానమ్= మనస్సును; ఆత్మనా = బుద్ధిచేత; సంస్తభ్య = కర్మయోగమునందు నిలిపి; కామరూపమ్, దురాసదమ్, శత్రుమ్; జహి = నశింపఁజేయుము.

ఇట్లు బుద్ధికన్ననుగూడ కామము ప్రధానమైన జ్ఞానయోగవిరోధి యగు శత్రు వని యెఱింగి, మనస్సును బుద్ధిచే కర్మయోగమునందుఁ బ్రవర్తింపఁ జేసి దురాసదమైన కామరూపశత్రువును నశింపఁజేయు మని తాత్పర్యము.

మా. ఆత్మానమ్ = మనస్సును. ఆత్మనా = బుద్ధిచేత.

* నాకు అర్పణమే.

¶ ఓర్పుచేత.

§ మాటలకు శ్రమలేదు, శిరస్సునకు వేదన లేదు, మనస్సునకు తాపము లేదు, దేహమునకు నొప్పి లేదు, అనర్థహేతు వగు హింసాదికముగూడ లేదు, నేను—క్షమ అనుదానను ఒక్కతెనే క్రోధ జయమునందు సమర్థురాలను.

♦ ఇట శ్రద్ధచే అశ్రద్ధను సత్యముచే అనృతమును దాఁటు మని మీఁది శ్రుతి తాత్పర్యము.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగోనామ తృతీయో ఽధ్యాయః.

వ్యాసప్రోక్త మయిన శతసహస్రగ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రం బును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు కర్మయోగం బనంబరఁగు తృతీయాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమత్కవాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవద్గీ
తాంధ్రవ్యాఖ్యానంబునందుఁ
దృతీయాధ్యాయ టీక.



అధ్యాయత్రయ మిద మివ కృత్స్నగీతార్థవివృతి రఖిలేయమ్
పరిపూర్తి మియా దచిరాత్ శ్రీమ ద్భగవ త్ప్రసాదేన
ఘటయతు భాగవతీ మే దుర్ఘటఘటనాపటీయసీ కరుణా
సాధనవికలస్యా ఽపి చ గీతాపరమార్థచన్ద్రికాపూర్తిమ్.



శ్రీ ర స్తు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.

పరమార్థచంద్రికాసహిత

# శ్రీభగవద్గీత, చతుర్థాధ్యాయము.

యజ్ఞైకసాధ్యలాభా మజ్ఞానాసురవినాశినీ మాహుః
యా మిహ పినిహతశోకాం తాం విద్యా మమ్బికాం వన్దే.
జ్ఞానానధికారణాం తదుపాయం కర్మయోగ మూచే యః
నిజధర్మచరణలోవ్యం కలయే శ్రీకృష్ణ మాత్మానమ్.

శ్రీభగవానువాచ.—

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్
వివస్వా న్మనవే ప్రాహ మను రిక్ష్వాకవే ఽబ్రవీత్. ౧

శ్రీశంకరభాష్యము.—

ఏయీ యోగము జ్ఞాననిష్ఠాలక్షణము సన్న్యాససహితము కర్మయోగోపాయము * అధ్యాయద్వయమునం జెప్పంబడినదో, దేనియందు వేదార్థము ప్రవృత్తిలక్షణంబును నివృత్తిలక్షణంబును బరిసమాప్తమో; గీతలయందును అంతటను ఆ ఈయోగమే వివక్షితము భగవంతునకు. కావునం బరిసమాప్తము వేదార్థం బని తలంచినవాండై దాని వంశకథనముచే స్తుతించుచున్నాండు శ్రీభగవంతుండు.—ఇమమ్ = ఈరెండధ్యాయములచేం జెప్పంబడిన; యోగమ్ = యోగమును; వివస్వతే = సూర్యునికొఱకు; సృష్ట్యాదియందు, ప్రోక్తవాన్ = చెప్పినాండను; అహమ్ = నేను, జగముం బరిపాలించువారలగు క్షత్త్రియులకు బలము కలుగుటకొఱకు; ఆయోగబలముతోం గూడినవారై సమర్థు లగుచున్నారు బ్రహ్మమును బరిరక్షించుటకు; బ్రహ్మక్షత్త్రింబులు పరిపాలితంబు లగునేని జగము పరిపాలింప శక్య మగును. అవ్యయమ్ = వ్యయము లేనిదానిని, అవ్యయ మయిన ఫలము గల దగుటవలన, లేదు గదా వ్యయము

* కర్మయోగము ఉపాయముగాం గలది.

సమ్యగ్దర్శననిష్ఠాలక్షణమైన యీయోగముయొక్క మోక్షాఖ్య మగు ఫలమునకు. ఆ, ఆవివస్వాన్ = సూర్యుఁడు; మనవే = మనువుకొఱకు; ప్రాహ = చెప్పెను. మనుః = మనువు; ఇక్ష్వాకవే—తనపుత్త్రునికొఱకు, ఆదిరాజుకొఱకు; అబ్రవీత్ = చెప్పెను.

ఈ రెండధ్యాయములం జెప్పఁబడినదానిని అవ్యయ మగు మోక్షఫలము గలదానిని కర్మయోగసాధ్య మయిన జ్ఞానయోగమును నేను మున్ను సూర్యునకుఁ జెప్పితిని. సూర్యుఁడు తనపుత్త్రుఁడైన వైవస్వతమనువునకుఁ జెప్పెను. వైవస్వతమనువు తనపుత్త్రుఁడైన మొదటిరాజునకు ఇక్ష్వాకునకుఁ జెప్పెనని తాత్పర్యము.

ఆనందగిరికృత టీక.—

పూర్వాధ్యాయములు రెంటిచే నిష్ఠాద్వయరూపం బగు యోగము గీతం బయ్యెను, ఇందుచే వేదార్థము సమాప్త మగుచున్నది, ఇఁకఁ జెప్పవలసిన దేదియు లేదు, కావున ఈయోగము కృత్రిమం బను * శంక నివర్తించుటకై వంశ కథనపూర్వకముగా దీని స్తుతిని వచించె నని చెప్పుచున్నాఁడు శ్రీభగవానువాచ అని. ఈభగవద్వచనమును కడచినవిషయం బనువదించుద్వారమునఁ బ్రస్తావించు చున్నారు ఏ యీ ఇత్యాదిగా. ప్రతిపాదితం బగు యోగమునే విభజించి యను వదించుచున్నారు జ్ఞాననిష్ఠాలక్షణము అని. సహిత సన్న్యాసము—సన్న్యాసముతో— కర్తవ్యవిధానముతోఁ గూడినది. కర్మయోగోపాయము—కర్మయోగము హేతు వుగాఁ గలది, ఈ జ్ఞానాఖ్యయోగమునకు కర్మాఖ్య మయినయోగము హేతువు, ఇందువలన ఉపాయోపేయభూతమైన నిష్ఠాద్వయము ప్రతిష్ఠింపఁబడియె నని యర్థము. ఈయోగద్వయమునందుఁ బ్రమాణము నుపన్యసించుచున్నారు దేని యందు ఇత్యాదిగా. లేక. జ్ఞానయోగమునకుఁ గర్మయోగం బుపాయం బనుటనే స్ఫుటీకరించుచున్నారు దేనియందు ఇత్యాదిగా. ప్రవృత్తిలక్షణము—ప్రవృత్తిచే లక్షింపఁబడుచున్నది—తెలియఁబడుచున్నది, కావున ప్రవృత్తిలక్షణ మనఁగా కర్మ యోగము, నివృత్తిలక్షణము—నివృత్తిచేత లక్షింపఁబడుచున్నది—తెలియఁబడుచు న్నది, కావున నివృత్తిలక్షణం బనఁగా జ్ఞానయోగము, అని విభాగము. పూర్వా ధ్యాయములు రెంటియందు ఈనిష్ఠాద్వయము ప్రతిపాదితమే యైనను చెప్పఁబోవు నధ్యాయములందు ఇతరవిషయము చెప్పవలసినది కల దని యాశంకించి చెప్పు

* పురుషబుద్ధికల్పితము అను.

చున్నారు గీతలయందును ఇత్యాదిగా. అప్పుడు మీఁదియధ్యాయం బేల ప్రవర్తింపవలయు ననఁగాఁ జెప్పుచున్నారు కావున ఇత్యాదిగా. వంశకథన మనఁగా సంప్రదాయోపన్యాసము. సంప్రదాయోపన్యాసము కృతిమత్వశంకను నివర్తించుటచే యోగస్తుతియందుఁ బర్యవసించుచున్నది. గురుశిష్యపరంపరోపన్యాసమునే యుపక్రమించుచున్నారు ఇమమ్ ఇత్యాదిగా. ఇమమ్ అనుదానికి సన్నిహితవిషయముఁ జూపుచున్నారు ఈరెండు ఇత్యాదిగా. యోగమును—జ్ఞాననిష్ఠారూపమును కర్మయోగం బను నుపాయముచేఁ బొందఁదగినదాని నని యర్థము. తాము కృతార్థులు కానివారికి స్వప్రయోజనతత్పరులకుఁ బరార్థము ప్రవృత్తి సంభవింపదు, భగవంతునకో అట్టి ప్రవృత్తి కనఁబడుటవలన భగవంతుఁడు కృతార్థుఁ డని కల్పింపవలయు నని చెప్పుచున్నారు వివస్వతే అని. అవ్యయ మయిన వేదము మూలముగాఁ గల దగుటవలన యోగము అవ్యయ మని చెప్పవలయును, భగవంతుఁడు కృతార్థుఁడైనను ఎందుకు యోగప్రవచనము చేసె ననఁగాఁ జెప్పుచున్నారు జగము ఇత్యాదిగా. ఎట్లీయోగముచే క్షత్త్రియులకు బలము కలుగును? అనఁగాఁ జెప్పుచున్నారు ఆయోగబలముతో ఇత్యాదిగా. కూడినవారై—క్షత్త్రియు లని శేషము. బ్రహ్మశబ్దముచే బ్రాహ్మణత్వజాతి చెప్పఁబడుచున్నది. సరే, యోగప్రవచనముచే క్షత్త్రజాతి రక్షిత మగుచున్నది, దానిచే బ్రాహ్మణత్వము రక్షితం బగును, అట్లయినను రక్షింపవలసిన జగమంతయు నెట్లు రక్షితం బగును? అని యాశంకించి చెప్పుచున్నారు బ్రహ్మక్షత్త్రంబులు ఇత్యాదిగా. ఆ బ్రహ్మక్షత్త్రంబులచే కర్మఫలభూతం బగు జగత్తంతయు అనుష్ఠానద్వారంబున రక్షింప శక్య మగు నని యర్థము. యోగం బవ్యయ మనుటకు మఱియొక హేతువుఁ జెప్పుచున్నారు అవ్యయమైన ఇత్యాదిగా. ఓయీ! కర్మఫలమువలె ఏతద్యోగఫలముగూడ సాధ్యం బగుటచే నాశవంతం బని యనుమానింపఁబడుచున్నది. అనఁగా అట్లు గా దని చెప్పుచున్నారు లేదు గదా ఇత్యాదిగా. అపునరావృత్తిశ్రుతిచే ♦ బాధిత మయిన అనుమానము ప్రమాణము కాఁ జాలదని భావము. భగవంతుఁడు వివస్వంతునకుఁ జెప్పిన యోగము వానియందే నిలుచు నని యాశంకించి చెప్పుచున్నారు ఆ ఇత్యాదిగా. తనపుత్త్రునికొఱకు అనుపది రెండుస్థలములందును * సంబంధించుచున్నది. ఆదిరాజు
కొఱకు
—ఇక్ష్వాకువునకు సూర్యవంశప్రవర్తకుఁ డని అతిశయము చెప్పఁబడుచున్నది.

♦ పునరావృత్తి లే దని ప్రతిపాదించు శ్రుతిచే.

* మనువునకును ఇక్ష్వాకునకును,

హనుమద్విరచిత వ్యాఖ్యానము.—

మున్ను చెప్పిన యోగమును అనేకులు శిష్టులు పరిగ్రహించి రని స్తుతించుచున్నాఁడు ప్రరోచనార్థము శ్రీభగవంతుఁడు.—ఇమం యోగమ్ = పూర్వము చెప్పిన యోగమును; వివస్వతే, ప్రోక్తవాన్, అహమ్; అవ్యయమ్ = వినాశము లేనిదానిని. ఆ, వివస్వాన్; మనవే = తనపుత్త్రుఁడైన మనువుకొఱకు; ప్రాహ. ఆ, మనుః, ఇక్ష్వాకవే, అబ్రవీత్.

శంకరానందసరస్వతీకృత వ్యాఖ్యానము.—

ద్వితీయాధ్యాయమునందును తృతీయాధ్యాయమునందును, కర్మయోగము మాత్రమే యుపాయముగాఁ గల దగు జ్ఞానయోగమే, « ఏషా బ్రాహ్మీ స్థితిః, సంన్యస్తభ్యాత్మాన మాత్మనా » ఇత్యాదివచనములచే మోక్షసాధనం బని ప్రతిపాదించి, ఇప్పుడు ఆయోగమునకే « ఏష పన్థా ఏత త్కర్మ » « ఏత ద్బ్రహ్మ » ఇత్యాదిశ్రుతిప్రమాణము సిద్ధించియే యున్నను, సిద్ధపరంపరానుష్ఠానరూపప్రమాణముగూడఁ గల దని సూచించుటకై యిది చెప్పుచున్నాఁడు శ్రీభగవంతుఁడు.—అహమ్ = నేను బరమాత్మను సృష్ట్యాదియందు; అవ్యయమ్ = అవ్యయమైనవేదమే ప్రమాణముగాఁ గల దగుటవలన అవ్యయమైనదానిని, లేక, « న స పునరావర్తతే న స పునరావర్తతే » అను శ్రుతివలన అవ్యయమైన ఫలమునకు హేతు వగుటవలన అవ్యయమైనదానిని, సర్వత్ర బ్రహ్మదర్శనరూపమైన యీయోగముచే సాధ్య మగు మోక్షమునకు వ్యయమ్ము లేమివలన, జ్ఞానము అవ్యయమైనఫలమునకు హేతువు, ఏది సాధ్యమో అది యనిత్యము అను వ్యాప్తిచే మోక్షము జ్ఞానసాధ్యం బగుటవలన అనిత్యము అను ననుమానము శ్రుతిచే బాధిత మగుట్టవలన. అట్టి అవ్యయమైన దానిని, నిత్యమైన ఫలము గలదాని నని యర్థము. ఇమమ్ = ఈ రెండధ్యాయములచేఁ బ్రతిపాదిత మయిన మోక్షైకఫలం బగు; యోగమ్ = జ్ఞానయోగమును; వివస్వతే = సూర్యునికొఱకు; ప్రోక్తవాన్ = చెప్పినాఁడను. « స్వయం తీర్ణః పరాన్ తారయతి » * అను న్యాయముచే, ఆ, వివస్వాన్=సూర్యుఁడును; మనవే ప్రాహ—తనపుత్త్రునికొఱకుఁ జెప్పెను. మనుః = మనువుగూడ; ఇక్ష్వాకవే—తనపుత్త్రునికొఱకు; అబ్రవీత్—ఉపదేశించె నని యర్థము.

---

* తాను తరించినవాఁడు ఇతరులఁ దరింపఁ జేయును.

మధుసూదనసరస్వతీకృత వ్యాఖ్యానము.—

మున్ను ఉపేయ మని జ్ఞానయోగంబును దాని కుపాయం బని కర్మయోగంబును—ఇట్లు రెండుయోగములు ప్రతిపాదింపఁబడినవి సరే; అట్లయినను “ఏకం సాఙ్ఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి” అన్నట్లు, సాధ్యసాధనంబులకు ఫలము ఏకమే యగుటవలన ఏకత్వంబుపచరించి, సాధనభూత మయిన కర్మయోగమును సాధ్యభూత మయిన జ్ఞానమును, అనేకవిధము లయిన గుణముల * విధించుకొఱకు స్తుతించుచున్నాఁడు వంశకథనముచే భగవంతుఁడు—ఇమమ్ = ఈ యధ్యాయద్వయముచేఁ జెప్పఁబడిన; యోగమ్ = జ్ఞాననిష్ఠారూప మయిన యోగమును, కర్మనిష్ఠారూప మగు నుపాయముచేఁ బొందఁ దగినదానిని; వివస్వతే= సర్వక్షత్త్రియవంశములకును బీజభూతుఁ డైన ఆదిత్యునికొఱకు; ప్రోక్తవాన్ = చక్కఁగా—సర్వసంశయములు దీరుట మొదలగునవి సిద్ధించునట్లు చెప్పినాఁడను; అహమ్ = నేను, భగవంతుఁడను వాసుదేవుఁడను సర్వజగత్పరిపాలకుఁడను; సృష్ట్యాదికాలంబున రాజులకు బలము గలిగించి వారియధీన మగు జగము నంతయుఁ బాలించుటకు. ఎట్లు దీనిచే బలము గలిగింప వచ్చు ననఁగా విశేషించి చూపుచున్నాఁడు—అవ్యయమ్—అవ్యయమైన వేదమునూలముగాఁ గల దగుటవలనను అవ్యయమైన మోక్షఫలము గలదగుటవలనను, నవ్యేతి స్వఫలాత్—నశింపదు తనఫలము నుండి అను వ్యుత్పత్తిచే అవ్యయమును, అవ్యభిచారియైన ♦ ఫలము గలదానిని. కావున ఇట్టిదానిచే బలము గలిగించుటశక్య మని భావము. అతఁడు నాశిష్యుఁ డయిన, వివస్వాన్=సూర్యుఁడును; మనవే=వైవస్వతమనువుకొఱకు తనపుత్త్రునికొఱకు; ప్రాహ. ఆమనువును; ఇక్ష్వాకవే—తనపుత్త్రునికొఱకు ఆదిరాజుకొఱకు; అబ్రవీత్. ప్రతిమన్వంతరంబును స్వాయంభువమన్వాదులకును జేయఁబడినదియే యీయుపదేశము భగవంతునిచేత, అయినను, ఇప్పటిది వైవస్వతమన్వంతరము అనునభిప్రాయంబున ఆదిత్యు నారంభించి సంప్రదాయము గణియింపఁబడినది.

శ్రీధరస్వామికృత వ్యాఖ్యానము.—

ఆవిర్భావతిరోభా, వావిష్కృతికై యుపాయ మగు కర్మముఁ బ్ర
స్తావించెఁ దత్త్వంపద, భావవివేకార్థ మిందు భగవంతుఁడు తాన్.

---

* అంగములను.

♦ తప్పని.

ఇట్లింతయు అధ్యాయద్వయముచేఁ గర్మయోగోపాయం * బగు జ్ఞానయోగము మోక్షసాధనం బని చెప్పఁబడినది. దానినే బ్రహ్మార్పణాదిగుణముల విధించుటచేతను తత్త్వంపదార్థవివేకాదికముచేతను విస్తరింపఁ బోవువాఁడై మొదటఁ బరంపరాప్రాప్తం బని స్తుతించుచు శ్రీభగవంతుఁడు పలికెను మూఁడుశ్లోకముల చేత. అవ్యయమైన ఫలము గల దగుటవలన, అవ్యయమ్; ఇమం యోగమ్, పూర్వము; అహమ్; వివస్వతే = సూర్యునికొఱకు; చెప్పినాఁడను. అతఁడు, తన పుత్త్రుఁడైన, మనవే = శ్రాద్ధదేవునికొఱకు; ప్రాహ. ఆమనువును; తనపుత్త్రుఁడైన యిక్ష్వాకువుకొఱకు; అబ్రవీత్.

పరమార్థప్రప.—

ద్వితీయతృతీయాధ్యాయములందు జ్ఞానకర్మయోగములు నిరూపింపఁ బడినవి. ఇప్పుడు బ్రహ్మార్పణంబైననే కర్మము మోక్షము నొందించునని నిరూపించుటకొఱకుఁ జతుర్థాధ్యాయము ప్రవర్తించుచున్నది. అందుఁ జెప్పఁబోవు విషయము నాయుపదేశమువలనఁ బరంపరఁగాఁ బెక్కండ్రచే అనుష్ఠింపఁబడియె నని చెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత—ఇమమ్ = ఈ, చెప్పఁబోవునట్టి; యోగమ్; అవ్యయమ్ = క్షయము లేనిదానిని; పూర్వము, వివస్వతే ప్రోక్తవాన్. అంత ఆయోగమునే, వివస్వాన్ = సూర్యుఁడు; మనవే, ప్రాహ, మనుః ఇక్ష్వాకవే అబ్రవీత్.

రామానుజభాష్యము.—

తృతీయాధ్యాయమునందు, ప్రకృతిసంసృష్టుఁ డగు ముముక్షువునకు ప్రారంబున జ్ఞానయోగమునం దధికారము సంభవింపమివలనఁ గర్మయోగమే కర్తవ్యము, జ్ఞానయోగమునం దధికారము గలవానికిఁ గూడ అకర్తృత్వానుసంధానపూర్వక మగు కర్మయోగంబే శ్రేయము అని సహేతుకముగాఁ బ్రతిపాదింపఁబడినది. శిష్టుఁ డని వ్యపదేశము ♦ గలవానికో విశేషించి కర్మయోగమే కర్తవ్యంబనియుఁ జెప్పఁబడినది. చతుర్థాధ్యాయముచే నిప్పుడు, ఈకర్మయోగమే సకలజగదుద్ధారార్థము మన్వంతరప్రారంభముననే యుపదిష్టం బగుటచే కర్తవ్యం బనుటను దృఢీకరించి, అంతర్గతమైన జ్ఞానము గల దగుటచే దీనికే జ్ఞానయోగాకారతను బ్రదర్శించి, కర్మయోగస్వరూపంబును తద్భేదంబులును గర్మయోగంబున జ్ఞానాంశమే

* కర్మయోగము సాధనముగాఁ గలది.

♦ ప్రసిద్ధి.

ప్రధానం బనుటయుఁ బ్రతిపాదింపఁబడును. ప్రసంగంబువలన భగవదవతారస్వరూపము గూడ చెప్పఁబడును.—ఏ యీయోగము నీకుఁ జెప్పితినో అది కేవలము యుద్ధప్రోత్సాహనముకొఱ కిప్పుడు చెప్పఁబడినది యని తలంపఁగూడదు. మన్వంతరప్రారంభమునందే నిఖిలజగదుద్ధారముకొఱకుఁ బరమపురుషార్థరూపం బగు మోక్షమునకు సాధనం బగుటచే ♦, ఇమం యోగమ్ = ఈయోగమును; అహమ్ = నేనే; వివస్వతే; ప్రోక్తవాన్. వివస్వంతుఁడును; మనవే; ప్రాహ. మనుః, ఇక్ష్వాకవే, అబ్రవీత్.

నీ కిప్పుడు చెప్పిన యీయోగమును మోక్షసాధనం బను నభిప్రాయమున లోకోద్ధారార్థము మన్వంతరప్రారంభముననే నేనే సూర్యునకుఁ జెప్పితిని. సూర్యుఁడు మనువునకును మనువు ఇక్ష్వాకునకును జెప్పిరి అని తాత్పర్యము.

మాధ్వభాష్యము.—

బుద్ధికంటెఁ బరుఁ డని చెప్పఁబడిన పరమాత్మయొక్క మాహాత్మ్యంబును కర్మభేదం బును జ్ఞానమాహాత్మ్యంబును జెప్పఁబడుచున్నవి యీయధ్యాయమునందు. పూర్వులచే అనుష్ఠింపఁబడినదిగూడ ఈధర్మ మని చెప్పుచున్నాఁడు ఇమమిత్యాదిశ్లోకత్రయముచేత.

ఏవం పరమ్పరాప్రాప్త మిమం రాజర్షయో విదుః
స కాలే నేహ మహతా యోగో నష్టః పరన్తప.

భా. ఏవమ్ = ఇట్లు; పరమ్పరాప్రాప్తమ్ = క్షత్త్రియపరంపరవలన వచ్చినట్టి; ఇమమ్= ఈయోగమును; రాజర్షయః= రాజులును ఋషులును అగువారు రాజర్షులు; విదుః = ఎఱుంగుదురు. సః= ఆ; యోగః = యోగము; మహతా = దీర్ఘ మయిన; కాలేన = కాలముచేత; ఇహ = ఇప్పుడు; నష్టః = విచ్ఛిన్నసంప్రదాయం బైనది ✱. పరన్తప = ఓపరంతపుఁడా! తనకు శత్రువులైనవారు పరు లని చెప్పఁబడెదరు, వారలను, శౌర్యతేజస్సులచేఁ గిరణములచే సూర్యుఁడుంబోలె తాపయతి—తపింపఁ జేయుచున్నాఁడు, కావున పరంతపుఁడు, శత్రుతాపనుం డని యర్థము.

♦ ఇందుచే అవ్యయశబ్దార్థము చెప్పఁబడినది.

✱ సంప్రదాయము తప్పియున్నది.

శత్రువులఁ దపింపఁ జేయువాఁడా! ఇట్లు క్షత్రియపరంపరచే వచ్చుచున్న యీయోగమును రాజర్షులు ఎఱింగి యుండిరి. ఇప్పుడు దీర్ఘకాల మగుటచే దాని సంప్రదాయము తప్పియున్న దని తాత్పర్యము.

ఆ. పరంపరాప్రాప్త మయిన యీయోగమునందు శిష్టజనులసమ్మతిని జెప్పుచున్నాఁడు పూర్వార్ధముచేత, అట్లయినదానిని నిప్పు డేల చెప్పవలయును ననఁగాఁ జెప్పుచున్నాఁడు ఉత్తరార్ధముచేత. పూర్వార్ధమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు ఏవ మిత్యాదిగా. ఐశ్వర్యసంపత్తి గలిగియుండుట రాజత్వము. వారికే సూక్ష్మార్థదర్శనసామర్థ్యము ఋషిత్వము. ఇప్పుడు అనుటచే అర్జునునితో వ్యవహరించుకాలము గ్రహింపఁబడుచున్నది. పరంతప అను సంబోధనమును విభజించుచున్నారు తనకు ఇత్యాదిగా.

హ. ఏవమ్, క్షత్రియపరంపరాప్రాప్త మగు, ఈయోగమును; రాజర్షయః = మనుప్రభృతులు; విదుః = ఎఱుంగుదురు. సయోగః, మహతా కాలేన, నష్టః = విచ్ఛిన్న సంప్రదాయం బయ్యెను. పరంతప—పరులను దపింపఁజేయువాఁడా! శత్రువులఁ దపింపఁ జేయువాఁడా యని యభిప్రాయము.

శం. తాను జెప్పిన జ్ఞానయోగము శిష్టజనపరిగృహీతం బనుటనే విస్పష్టీకరించుచున్నాఁడు.—బ్రహ్మనిష్ఠచే పరుని—కామక్రోధాదిరూపశత్రువును తాపయతి—నశింపఁ జేయువాఁడు, కావున పరంతపుఁడా యని సంబుద్ధి. ఏవమ్=ఈప్రకారమున; పరమ్పరాప్రాప్తమ్ = సూర్యుఁడు మొదలుగాఁగల శిష్టజనుల పరంపరవలన ప్రాప్తమయిన; ఇమమ్ = ఈజ్ఞానయోగమును; ఈవలివా రైన, రాజర్షయః—జనకాదులు; విదుః=ఎఱుంగుదురు. లేక, ఈప్రకారముననె యెఱుంగుదు రని యన్వయము. రాజులును ఋషులు నగువారు రాజర్షులు, ఇది బ్రాహ్మణాదులకు నుపలక్షణము. లేక, రాజర్షయః = రాజులును ఋషులును, విదుః. ఓయీ! రాజులును ఋషులును మహాపురుషులు పరిగ్రహించి యుందు రేని సర్వత్రప్రసిద్ధ మగుటవలన, నీ వేల యుపదేశింపవలయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—మున్ను సూర్యుఁడు మొదలగువారి యందు నేను ఏయోగమును బ్రవర్తింపఁజేసితినో, సః యోగః; ఇప్పుడు, మహతా కాలేన—కాలదేశవిపర్యాసముచేత, ప్రవక్తృలును బ్రవర్తకులును * లేకపోవుట వలన, ఇహ=ఈలోకమునందు; నష్టః—సంప్రదాయవిచ్ఛేదము నొందె నని యర్థము.

* శిష్యులును గురువులును.

మ. ఏవమ్; పరమ్పరాప్రాప్తమ్ = ఆదిత్యు నారంభించి గురుశిష్యపరంపరచే ప్రాప్తమైన; ఇమమ్ = ఈ యోగమును; రాజర్షయః = రాజులును ఋషులు నగువారు, ప్రభుత్వము గలిగి సూక్ష్మార్థము నెఱుంగుటకు సమర్థులైన నిమిప్రభృతులు; తమతండ్రులు మొదలగువారిచేఁ జెప్పఁబడిన దానిని, విదుః. అందువలన, అనాదివేదమూలంబును అనంతఫలంబును అనాదిగురుశిష్యపరంపరాప్రాప్తంబు నగుటచే కృత్రిమంబను శంక కవకాశము లేని దగుటవలన మహాప్రభావం బీయోగం బని శ్రద్ధ యెక్కువ యగుటకై స్తుతింపఁబడుచున్నది. సః యోగః—ఇట్లు మహాఫలంబైనను ఆ యోగము; మహతా కాలేన = దీర్ఘము—ధర్మలోపముచేయునది యగు కాలముచే; ఇహ—మనము వ్యవహరించు కాలమునందు, ద్వాపరాంతమునందు; దుర్బలులును అజితేంద్రియులును అనధికారులు నగువారిని బొంది కామక్రోధాదులచే అభిభవింపఁబడినదై, నష్టః = విచ్ఛిన్నసంప్రదాయం బయ్యెను. అది లేనిచో పురుషార్థము సిద్ధింపదు, కావున అయ్యో! ఎంత దౌర్భాగ్యము లోకమున కని శోకించుచున్నాఁడు భగవంతుఁడు. ఓ పరంతపుఁడా! పరమును—కామక్రోధాదిరూపశత్రుగణమును శౌర్యముచేతను బలవత్తరం బగు వివేకముచేతను తపస్సుచేతను సూర్యునివలె తపింపఁజేయుచున్నాఁడు, కావున శత్రుతాపనుఁడు జితేంద్రియుఁ డని యర్థము, ఊర్వశిని నిరాకరించుట మొదలగు అద్భుతకర్మములు గలవాఁ డగుటవలన. అందువలన, నీవు జితేంద్రియుఁడ వగుటవలన ఇం దధికారి వని సూచించుచున్నాఁడు.

శ్రీ. రాజులును ఋషులును—రాజర్షులు ఇతరులుగూడ నిమి మొదలగువారు తమ తండ్రి మొద లగు ఇక్ష్వాకుప్రముఖులచేఁ జెప్పఁబడినదగు, ఇమమ్ = ఈ యోగమును; విదుః = ఎఱుంగుదురు. ఇప్పటివారలు ఎఱుంగకపోవుటకుఁ గారణముఁ జెప్పుచున్నాఁడు.—పరంతప = ఓ శత్రుతాపనుఁడా! స యోగః; కాలవశమువలన, ఇహ = ఈ లోకమునందు; నష్టః = విచ్ఛిన్నమయ్యెను.

ప. ఏవమ్, సూర్యవంశప్రధానభూతుఁడైన యిక్ష్వాకురాజునొద్దనుండి, పరమ్పరాప్రాప్తమ్ = పరంపరచేవచ్చిన; ఇమమ్; రాజర్షయః = రాజులును ఋషులును; విదుః = ఎఱింగిరి. శ్రుతియును «తద్ధైతత్పశ్య న్నృషి ర్వామదేవః ప్రతిపేదే౽హం మనురభవం సూర్యశ్చ» *. సః యోగః = ఆపురాతనమైన యోగమే; మహతా కాలేన; నష్టః—విడువఁబడినదయ్యెను.

---

* అట్టి దీనిఁ జూచినవాఁడై గదా ఋషి యగు వామదేవుఁడు ఎఱింగెను—"నేను మనువనైతిని సూర్యుఁడనైతిని" అని.

రా. ఏవమ్ = ఇట్లు; పరమ్పరాప్రాప్తమ్ = సంప్రదాయపరంపరచే ప్రాప్తమగు; ఇమమ్ = ఈయోగమును; పూర్వులైన, రాజర్షయః; విదుః. సః యోగః; మహతా కాలేన; ఆయాశ్రోతలయొక్క బుద్ధిమాంద్యమువలన; నష్టః = నష్టప్రాయమయ్యెను.

ఇట్లు సంప్రదాయ పరంపరగా వచ్చుచుండిన యీయోగమును పూర్వ రాజర్షులు ఎఱింగియుండిరి. ఇప్పుడు బహుకాలం బగుటచే శ్రోతలు మందబుద్ధులై చక్కగా గ్రహింపమివలన దాని ప్రచారము మిక్కిలి తక్కువ యయ్యె నని తా.

మూ. ♦

స ఏవాఽయం మయా తే ఽద్య యోగః ప్రోక్తః పురాతనః
భక్తో ఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్. 3

భా. దుర్బలులను అజితేంద్రియులను బొంది యోగము నష్టం బగుటయు లోకము పురుషార్థము పొందనేరకుండుటయుం జూచి, సః = ఆ; పురాతనః=అనాదియగు; యోగ ఏవ= యోగమే; మయా=నాచేత; తే = నీకొఱకు; అద్య = ఇప్పుడు; ప్రోక్తః = చెప్పఁబడినది. మే = నాకు; భక్తః = భక్తుఁడవు; అసి = అగుచున్నావు; సఖాచ = చెలికాఁడవును; అసి = అగుచున్నాడవు; ఇతి = అని. హి = ఎందువలన ననఁగా. ఏతత్ = ఈయోగము, జ్ఞానమని యర్థము; రహస్యమ్= రహస్యంబును; ఉత్తమమ్ = శ్రేష్ఠంబును.

ఆయోగమునే నేను నీ కిప్పుడు చెప్పితిని. ఇది రహస్యంబును ఉత్తమంబును, గావున నెవ్వరికిని జెప్పఁదగినది కాదు. అయినను నీవు నాకు భక్తుఁడవు సఖుఁడవును అని నీకుఁ జెప్పితి నని తాత్పర్యము.

టీ. ఎందువలన, ఈకాలమునం దాయోగము సంప్రదాయరహితంబయ్యె ననియాశంకించి అధికారులు లేకపోవుటవలన నని చెప్పుచున్నారు. దుర్బలులను అని. ఆదార్బల్యమునే ప్రకృతోపయోగిగా వివరించుచున్నారు అజితేంద్రియులను అని. కామక్రోధాదిపరు లగు పురుషులను బొంది కామక్రోధాదులచే అభిభూతంబై యోగము నష్టము—విచ్ఛిన్నసంప్రదాయం బయ్యెను, సరే, అట్లయినను యోగము లేకయే పురుషార్థము లోకమునకు లభించు నేని యెందు కీయోగము నుపదేశింప

♦ రెండవశ్లోకమునుండవశ్లోకముల కీభాష్యము లేదు.

వలయు నని యాశంకించి, ఈయోగము లేనియెడఁ బరమపురుషార్థము లభింప నేరదు, కావున నట్లాశంకింపఁ గూడ దని చెప్పుచున్నారు లోకము ఇత్యాదిగా. మునుపటి యోగము విచ్ఛిన్నసంప్రదాయం బయ్యెను, ఇప్పుడో మఱియొక యోగము నాకుఁ జెప్పుచున్నాఁడు భగవంతుం డని యర్జునుం డాశంకించునని చెప్పుచున్నాఁడు సఏవే త్యాదిగా. ఎందువలన ఇతురున కెవ్వనికేని ఈపురాతన యోగముఁ జెప్పఁగూడదు భగవంతుఁ డని యాశంకించి చెప్పుచున్నాఁడు భక్తో ఽసీత్యాదిగా. ఈచెప్పినయర్థ కారిక యోగము వక్తవ్యం బనుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు రహస్యం హీత్యాదిగా. అనాది వేదమూలకం బగుటవలన యోగము పురాతనము. భక్తి—శరణబుద్ధిచే* ప్రీతి. దానితోఁ గూడినవాఁడు భక్తుఁడని నిజస్వరూపము నపేక్షించి♦ వివక్షితము. సమానమైన వయసుగలిగి స్నేహవంతుఁ డగుసహాయుఁడు ‡ సఖుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. ఏతత్ అనుపదముచే ఎట్లు యోగమునకు § విశేషణము చేయవచ్చు ననఁగాఁ జెప్పుచున్నాఁడు జ్ఞానము ♦♦ ఇత్యాదిగా.

హా. సః= అవిచ్ఛిన్న సంప్రదాయమైన; యోగ ఏవ=యోగమే; ప్రోక్తః; పురాతనః; తే=నీకు. రహస్యమ్ = వెల్లడిచేయఁదగనిది; ఉత్తమమ్=అసదృశము.

శం. వినష్టసంప్రదాయం బైన యాయోగము నెందుకు మరల నిప్పుడు నీవు ప్రవర్తింపఁ జేయుచున్నా వని యాకాంక్షింపఁగా, కూటస్థాసంగ చిద్రూపుఁడై అవిక్రియుఁడై అవిషయుఁడైయె యున్నయాత్మయందు అనాత్మను తద్ధర్మములను తత్కర్మములను అధ్యసించి కర్తను నేను భోక్తను నేను సుఖిని దుఃఖిని ఇత్యాదిగా మిక్కిలి మోహమునొందినదై కడు నల్లాడు చున్న యీలోకముం జూచి కృపచే దాని సంసార సముద్రమునుండి యుద్ధరింపఁ గోరినవాఁడనై నేను నిన్ను నిమిత్తముగాఁ జేసి ప్రవర్తింపఁ జేయుచున్నాను, అను నభిప్రాయముచేఁ జెప్పుచున్నాఁడు.— పూర్వము మార్యునకు సంప్రదాయప్రవర్తనమునకై పురాతనము—అనాదిశ్రుతిమూలకం బగుటవలన సనాతనం బగు ఏయోగము చెప్పఁబడినదో, సంసారాంధకారమును నశింపఁ జేయునట్టి, సఏవ అయంయోగః = ఆయీయోగమే; మయా;

* రక్షకుం డను బుద్ధిచే.

♦ ఈశ్వరరూపము నపేక్షించి.

‡ కూడ మాడ నుండువాఁడు.

§ నపుంసకలింగశబ్దముచే పుల్లింగ మగు యోగమునకు.

♦♦ ఇది నపుంసకలింగము.

అద్య; కర్తృత్వభోక్తృత్వభ్రమచేత మోహపడుచున్న, తే = నీకొఱకు; ప్రోక్తః— బుద్ధియందలి మోహము దొలఁగించుటకై యుపదేశింపఁబడినది యని యర్థము. అర్జునుఁడు జ్ఞానోపదేశమునకుఁ దగినవాఁ డనుటను జూపుచున్నారు.—“యథా శివమయో విష్ణు రేవం విష్ణుమయశ్శివః” ♦ అని శివకేశవులకుఁ అభేదము చెప్పఁబడుటవలన శివరూపుఁడ నగు నన్నే వెలుపలను లోపలను కపటములేక శ్రద్ధతో భజించుచున్నావు, కావున, మే భక్తో ఽసి—ఎల్లప్పుడు నన్ను భజించు స్వభావము గలవాఁడ వగుచున్నావు. సఖాచ అసి—స్నిగ్ధుఁ డనఁగా చెలికాని స్మరణశ్రవణాదులచేఁ గరఁగునట్టి మనస్సుగలవాఁడు, అట్టి స్నిగ్ధుఁడవును అగుచున్నావు. నాకు ఇతఁడు భక్తుఁడును స్నిగ్ధుఁడును అను కారణమువలననె ఆయోగమును నీకుపదేశించితి నని యర్థము. ఏల యిట్లు పాత్రము పరిశీలింప వలయును యోగోపదేశమునకు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—గ్రహస్థులకును సన్న్యాసులకును ఉత్తమము పరబ్రహ్మము, తత్ప్రాప్తికి హేతువగుటవలన ఉత్తమసాధనము ముక్తికి; కావుననే, రహస్యము. అందువలననే యెవ్వనికిని జెప్పఁగూడ దని యర్థము.

మ. ఏది యిట్లు పూర్వము ఉపదేశింపఁబడియు అధికారి లేకపోవుటవలన విచ్ఛిన్నసంప్రదాయం బయ్యెనో, ఏది లేనియెడఁ బురుషార్థము లభింపదో, సఏవాఽయం యోగః = ఆపురాతనమును అనాది గురుపరంపరాగతంబు నగు యోగమే; అద్య = సంప్రదాయము విచ్ఛిన్నమైయుండు ఈసమయమునందు; మయా = నీయందు మిక్కిలి ప్రీతిగల నాచేత; తే = నీకొఱకు; ప్రోక్తః = చక్కఁగాఁ జెప్పఁబడినది, కాని ఎవ్వఁడో మఱియొకని కొఱకుఁ గాదు. ఎందువలన ననఁగా. భక్తో ఽసి, మే సఖాచ. ఇతి = ఈకారణమువలన. ఎందువలన నీవు నాకు భక్తుఁడవును—శరణాగతుఁడవై నాయం దత్యంతము ప్రీతిగలవాఁడవును, సఖుఁడవును—సమానవయస్కుఁడవై ప్రీతితోఁ గూడి మాడి యుండువాఁడవును, అసి—ఎల్లప్పుడును అగుచున్నవో, అందువలన నీకుఁ జెప్పఁబడిన దని యర్థము. ఇతరున కెందువలనఁ జెప్పఁబడ దనఁగాఁ జెప్పుచున్నాఁడు.—హి = ఎందువలన; ఏతత్ = ఈజ్ఞానము; ఉత్తమమ్; రహస్యమ్ = మిక్కిలిగోప్యమో, అందువలన.

శ్రీ. సఏవాయం యోగః; అద్య—సంప్రదాయము విచ్ఛిన్నమైన యిప్పుడు; మయా; తే = నీకొఱకు; చెప్పఁబడినది. ఎందువలన ననఁగా. నీవు, నాకు, భక్తో

♦ ఎట్లు విష్ణువు శివమయుఁడో—శివునికంటె భిన్నుఁడు కాఁడో అట్లు శివుఁడు విష్ణుమయుఁడు,— విష్ణువుకంటె భిన్నుఁడు గాఁడు.

ఒసి సఖాచ. ఇతి. ఇతరునకు నేను జెప్పను. హి = ఏందువలన ననఁగా; ఇది, ఉత్తమం రహస్యమ్.

ప. స ఏవా యం యోగః = ఏ యీ యోగము పెద్దకాలమునం జేసి నష్టమయ్యెనో ఆయీయోగమే; ఇతి = ఈకారణమువలన; మయా; తే; అద్య; ప్రోక్తః = చెప్పుట కారంభింపఁబడినది. ఏకారణము వలన ననఁగా. నీవు నాకు భక్తుఁడవై సఖుఁడవై యున్నావు, సఖత్వరూప మయిన భక్తి నీయందుఁ గల దనియర్థము. ఇఁక ఇతరున కిది చెప్పఁగూడదనుటను చెప్పుచున్నాఁడు.—ఉత్తమమ్, రహస్యమ్— ఏకాంతమున నెఱుంగఁ దగినది యని యర్థము.

రా. స ఏవ అయమ్ = అదియే యిది, అస్ఖలితస్వరూపము ♦ పురాతనమగు, యోగః; సఖ్యముచేతను అత్యంతభక్తిచేతను నన్నే ప్రపన్నుఁడవైన, తే= నీకొఱకు; మయా; ప్రోక్తః = సాంగముగాసవిస్తరముగాఁ జెప్పఁబడినది. నాకుఁ దక్క ఇతరుని కెవ్వనికిని ఎఱుంగుటకును జెప్పుటకును శక్యముగా దిది. ఎందువలన ననఁగా, ఏతత్ =ఇది, వేదాంతప్రోక్త మయిన, ఉత్తమము రహస్యము నగుజ్ఞానము.

నీవు నిరతిశయ భక్తిచేతను స్నేహముచేతను నన్నే శరణుపొందినవాఁడవు కావున, ఆయోగమునే నీకిప్పుడు సాకల్యముగాఁ జెప్పితిని. ఇది వేదాంతప్రతిపాదిత మగు పరమ రహస్యము గావున నాకుఁ దక్క మఱి యెవ్వనికిని తెలియను జెప్పనుం దరము కా దని తాత్పర్యము.

అర్జున ఉవాచ.—

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి.    ౪

భా. భగవంతుఁడు విరుద్ధార్థము చెప్పినాఁ డని కలుగఁ గూడదు ఎవ్వనికిని తలంపు. అని పరిహారార్థము చోద్యము * చేయునట్లు అర్జునుండు పలికెను.—అపరమ్ = వెనుకటిది; వసుదేవుని గృహమునందు, భవతః=నీయొక్క; జన్మ=పుట్టుక. పరమ్=మునుపటిది; సృష్ట్యాదియందు, వివస్వతః = ఆదిత్యునియొక్క; జన్మ = పుట్టుక. కథమ్= ఎట్లు; ఏతత్ =

♦ కొలవబడని స్వరూపముగలది.
* ప్రశ్న.

దీనిని; విజానీయామ్ = ఎఱుంగుదును అవిరుద్ధార్థముగా ? త్వమ్ = నీవు; ఆదౌ = సృష్ట్యాదియందు; ప్రోక్తవాన్ = చెప్పినాఁడవు; ఇతి = అని.——ఏ నీవు ఆదియందుఁ జెప్పితివో ఈయోగమును ఆ నీవే యిప్పుడు నాకుఁ జెప్పినాఁడ వని.

నీవు ఇటీవల వసుదేవుని కుమారుఁడవై పుట్టినవాఁడవు. సూర్యుఁడో సృష్ట్యాదియందుఁ బుట్టినవాఁడు. కావున, నీవే ఈ యోగమును ఆయనకు నుపదేశించినవాఁడ వనియు నీవే నాకును ఉపదేశించుచున్నావనియు నే నెట్లు నమ్మవచ్చును ? అని తాత్పర్యము.

ఆం. భగవంతునందు లోకమునకు ఈశ్వరుఁడు కాఁ డను శంకను నివర్తించుటకై ప్రశ్న కల్పించుచున్నారు భగవంతుఁడు ఇత్యాదిగా. పరిహారార్థము—మనుష్యునివలె నున్న భగవంతునియందు అనీశ్వరత్వము గ్రహించి ఆయన వాక్యము విరుద్ధార్థంబను నాశంకను బరిహరించుట కొఱకని యర్థము. భగవంతుని నిజరూపము ను గ్రహించి కాదు చోద్యము, మ తేమనఁగా లీలావిగ్రహమును గ్రహించి యని సూచించుటకై చోద్యము చేయునట్లు అని చెప్పఁబడినది. ఏతత్ అను శబ్దము యొక్క అర్థమునే స్ఫుటీకరించుచున్నారు ఏ నీవు ఇత్యాదిగా.

హ. ఇట్లువిని అర్జునుఁడు పలికెను.——అపరమ్=వెనుకటిది; వసుదేవగృహమునందు, భవతో జన్మ. పరమ్= మునుపటిది; వివస్వతః = సూర్యునియొక్క; సర్గాదియందు, జన్మ. కథమేతద్విజానీయామ్—త్వమ్, ఆదౌ; వివస్వంతునకు, ప్రోక్తవానితి.

శం. సాధారణ క్షత్రియుఁ డీకృష్ణుఁడు, వసుదేవుని పుత్త్రుఁ డగుటవలన. ఈయన చెప్పిన యీశాస్త్రము ప్రమాణము కాదు. అని యీగీతాశాస్త్రమునందు సర్వజనులకును నమ్మకము లేకపోవును. దీనిం జెప్పిన భగవంతుం డీశ్వరుఁ డని యెఱుంగుదురేని యందఱును శ్రద్ధాభక్తులు గలిగి దీనియందుఁ బ్రవర్తింతురు, అందుచేఁ గృతార్థు లగుదురు. అని తలంచి శ్రీకృష్ణుఁడు పరమేశ్వరుం డనుటను కృష్ణముఖంబుననే వెల్లడిచేయింపవలయు నను నభిప్రాయముతో నర్జునుండు పలికెను.——భవతః = కృష్ణుఁ డను పేరుగల నీయొక్క; జన్మ= పుట్టుక; అపరమ్ = వెనుకటిది, వసుదేవుని గృహమున నీవు పుట్టుట ప్రత్యక్షమగుటవలన. వివస్వతః = సర్వజగత్తును బ్రకాశింపఁ జేయు తేజస్సుగలవాఁడు కావున వివస్వంతుఁ డనఁగా సూర్యుఁడు వానియొక్క; జన్మ; పరమ్=ప్రాచీనము, సృష్ట్యాదియందు; «చక్షోస్సూర్యో అజా

యత" అను శ్రుతివలన. ఇట్లు మీ యిద్దఱి జన్మకాలము వ్యత్యస్త మగుటవలన, త్వమ్; ఆదౌ; వివస్వంతునకు, ఇమం యోగమ్ ప్రోక్తవాన్; ఇతి= ఈవాక్యమును; సత్యమని నేను, కథం విజానీయామ్ = ఎఱుంగుదును? ఇతరుఁడు గాని యెట్లెఱుంగును? "వీఁడు వంధ్యాపుత్త్రుఁడు పోవుచున్నాఁడు" అను వాక్యమునందుంబోలె ఈవాక్యమునందును నీవు చెప్పిన శాస్త్రమునందును అందఱకును అవిశ్వాసమే సంభవించు నని యర్థము.

మ. భగవంతుఁ డగు వాసుదేవుఁడు మనుష్యుఁడగుటచే అసర్వజ్ఞుఁడు అనిత్యుఁడు అను శంక యేది మూర్ఖులకుఁ గలదో దానిఁ బరిహరించుటకై యనువదించుచు నర్జునుం డాశంకించుచున్నాఁడు.—అపరమ్= అల్పకాలమైనది—ఇప్పటిది; వసుదేవుని గృహంబున, భవతః; జన్మ = శరీరగ్రహణము. అపరమ్—అపకృష్టముగూడ, మనుష్యుఁడ వగుటవలన. పరమ్ = బహుకాల మయినది—సర్గాదియందుఁ గలిగినది; ఉత్కృష్టముగూడ, దేవత యగుటవలన; వివస్వతః జన్మ. ఇట, ఆత్మకు జన్మము లేదనుట మున్నే స్పష్టముగాఁ దెలుపంబడిన దగుటవలన దేహాభిప్రాయము చేతనే యర్జునిప్రశ్నము. అందువలన, కథ మేత ద్విజానీయామ్, అవిరుద్ధార్థముగా? ఏత చ్ఛబ్దార్థమునే వివరించుచున్నాఁడు త్వ మాదౌ ప్రోక్తవానితి అని. నీవిప్పటివాఁడవు మనుష్యుఁడవు అసర్వజ్ఞుఁడవు, సర్గాదియందుఁ బురాతనుఁడు సర్వజ్ఞుఁడగు ఆదిత్యునకుఁ జెప్పినాఁడవనుట విరుద్ధం బిది యని భావము. ఇచట నిది నిగళితార్థము.— ఈదేహమున నున్న నీవు దేహాంతరమున నున్నపుడు ఆదిత్యున కుపదేశించితివా? లేక, ఈదేహముననే యుపదేశించితివా? మొదటిపక్షము సరి కాదు; జన్మాంతరమునం దనుభవించినదాని సర్వజ్ఞుఁడు కానివానికి స్మరింప నశక్య మగుటవలన, కానిచో నేనును జన్మాంతరమున ననుభవించినదాని స్మరింపఁ గలిగియుండవలయును; మనుష్యుల మగుటచే నీకును నాకును అసర్వజ్ఞత సమాన మగుటవలన. అది యభియుక్తులు చెప్పియున్నారు "జన్మాన్తరానుభూతంచ నస్మర్యతే" ♦ అని. రెండవదియు సరి కాదు, సర్గాదియందు ఇప్పటిదేహము లేకపోవుటవలన. ఇట్లు, దేహాంతరముచే సర్గాదియందుండుట సంభవించినను ఇప్పుడు దాని స్మరణము అనుపపన్నము; ఈదేహంబున స్మరణం బుపపన్న మైనను సర్గాదియం దిది యుండుట యనుపపన్నము; అని యసర్వజ్ఞత్వమును అనిత్యత్వమునుం బట్టి రెండు అర్జునిపూర్వపక్షములు.

♦ జన్మాంతరమున ననుభవింపఁ బడినది తలఁపునకు రాదు.

శ్రీ॰ భగవంతుఁడు సూర్యునకు యోగము నుపదేశించుట అసంభవ మని తలఁచినవాఁడై యర్జునుండు పలికెను.—అపరమ్ = వెనుకటిది, నీజన్మము. పరమ్ = మునుపటిది, వివస్వంతునిజన్మము. కావున, నీవు ఇప్పటివాఁడ వగుటవలనఁ బురాతనుఁ డగు సూర్యునకు, త్వమ్, ఆదౌ, యోగమును, ప్రోక్తవానితి, ఏతత్ = దీనిని; కథమ్, నేను, విజానీయామ్ = ఎటులఁగఁ జాలుదును ?

ప॰ ఇఁక సందేహించినవాఁడై యర్జునుం డడుగుచున్నాఁడు.—భవతః = నీయొక్క; జన్మ; అపరమ్ = ఇప్పటిది. అట్లు; వివస్వతః = సూర్యునియొక్క; జన్మ; పరమ్ = ప్రాచీనము. ఇట్లుండఁగా; ఆదౌ త్వం ప్రోక్తవానితి, కథం విజానీయామ్?

రా॰ ఈసందర్భమునందు భగవ దవతారముయొక్క యథార్థస్వరూపముఁ జక్కఁగా నెఱుంగుటకై యర్జునుం డి ట్లనియె.—కాలసంఖ్యచే, అవరమ్ ♦ = తక్కువ, మాజన్మమునకు సమకాలముగదా, భవతః జన్మ. వివస్వతః = సూర్యుని యొక్క; జన్మ = జన్మమో; కాలసంఖ్యచే, పరమ్= గొప్పది, ఇరువది యెనిమిది చతుర్యుగములసంఖ్యగలది. త్వమ్ = నీవే, ఆదౌ; ప్రోక్తవానితి. కథమ్; ఏతత్ = అసంభవ మయిన దీని; యథార్థముగా, విజానీయామ్ ? ఓయీ ! జన్మాంతరమున నైనను జెప్పియుండవచ్చును. జన్మాంతరకృతస్మరణము గూడ మహాపురుషులకు కలుగవచ్చును. కావున ఇందేమియు విరోధములేదు. మఱియు. అర్జునుఁడు వక్త యగు నీవసుదేవపుత్త్రుని సర్వేశ్వరునిఁగా నెఱుంగఁ డని వాఁడు కాఁడు. ఎందువలన ననఁగా, ఇట్లు చెప్పఁబోవుచున్నాఁడు “పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్। పురుషం శాశ్వతం దివ్య మాది దేవ మజం విభుమ్॥ ఆహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా। అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే” అని. యుధిష్ఠిరుని రాజసూయము మొదలగు వానియందు భీష్ముఁడు మొదలగువారి వలనఁ బలుమాఱు విన్నవాఁడుగూడ “కృష్ణ ఏవహి లోకానా ముత్పత్తి రపిచావ్యయః, కృష్ణస్య హి కృతే భూత మిదం విశ్వం చరాచరమ్” * ఇత్యాదిగా. కృష్ణస్య హి కృతే—కృష్ణునకు శేషభూతము ఈసమస్తజగత్తు అని యర్థము. ఇందుకుఁ జెప్పుచున్నారము.—పార్థుఁడు వసుదేవపుత్త్రుని భగవంతునిఁగా నెఱింగియే యున్నాఁడు. ఎఱింగినవాఁడయ్యును ఎఱుంగనివానియట్లు అడుగుటకు ఇది యభిప్రాయ

♦ వీరిమతమునందు అవరమ్ = అని పాఠము.

* కృష్ణుఁడే లోకముల యుత్పత్తికారణము, అవ్యయుఁడుగూడ. కృష్ణునకు శేషభూతముగదా ఈచరాచర ప్రపంచము.

ము.—నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణైకతానుండును ౹ సర్వేశ్వరుండును సర్వజ్ఞుండును సత్యసంకల్పుఁడును అవాప్తసమస్తకాముఁడు నగు వానికిఁ గర్మపరవశదేవమనుష్యాది సజాతీయ మగు జన్మము, ఏమి యింద్రజాలాదికమువలె అసత్యమా ? లేక సత్యమా ? సత్యమైనయెడ జన్మప్రకారం బెట్లు ? ఎట్టిది యీదేహము ? ఏది జన్మకారణము ? ఎప్పుడు జన్మము ? ఎందుకొఱకు జన్మము ? ఇట్లు పరిహారప్రకారంబును బట్టి * ప్రశ్నార్థము తెలియవచ్చుచున్నది.

నీజన్మము ఇప్పుడు కలిగినది. సూర్యునిజన్మము పూర్వము కలిగెను. నీవే సూర్యునికిఁ జెప్పినాఁడ వనుట యథార్థ మని నేనెట్లు ఎఱుంగవచ్చును ? అని తా.

మూ. మయిసర్వాణి ♦ అని చెప్పఁబడినది. తన్మాహాత్మ్యమును బ్రమాణముచేఁ దెలియుటకై యడుగుచున్నాఁడు అపరమిత్యాదిగా.

శ్రీభగవానువాచ.—

బహూని మే వ్యతీతాని జన్మాని తవచార్జున
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప. ౫

భా. ఏది వాసుదేవునియందు "అనీశ్వరుఁడు అసర్వజ్ఞుఁడు §" అనునాశంక మూర్ఖులకుఁ గలదో దానిఁ బరిహరించుచు శ్రీభగవంతుఁడు చెప్పెను. తదర్థమే గదా యర్జునునిప్రశ్నము.—బహూని=పెక్కులు; జన్మాని = పుట్టువులు; మే = నాకు; వ్యతీతాని = కడచినవి. తవచ= నీకుఁ గూడ. అర్జున—ఓయర్జునుఁడా ! తాని = వానిని; సర్వాణి = అన్నిటిని; అహమ్ = నేను; వేద = ఎఱుంగుదును. త్వమ్ = నీవు; నవేత్థ = ఎఱుంగవు. పరన్తప = శత్రువులఁ దపింపఁజేయువాఁడా ! ధర్మాధర్మాదులచే ఆవరింపఁబడిన జ్ఞానశక్తిగలవాఁడ వగుటవలన. నేనో నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడ నగుటవలన ఆవరణములేని జ్ఞానశక్తి గలవాఁడను, కావున ఎఱుంగుదును నేను.

---

౹ సర్వదోషవర్జితమైన కల్యాణమగు ఆత్మానందముచేతనే తృప్తుఁడైన వాఁడును.

* భగవంతుఁడు చెప్పుసమాధానముయొక్క విధమునుబట్టి.

♦ అ-౭-శ్లో-౭౦.

§ ఈశ్వరుఁడు కానివాఁడు. సర్వజ్ఞుఁడు కానివాఁడు.

అర్జునా! నాకును బెక్కుజన్మములు కడచినవి. నీకును బెక్కుజన్మములు కడచినవి. అయినను, నేను ఆవరణ రహితమైన జ్ఞానశక్తిగలవాఁడ నగుటవలన వాని నన్నింటిని ఎఱింగియున్నాను. నీవు ఆవరణసహితమైన జ్ఞానశక్తిగలవాఁడవు కావున వాని నెఱుంగఁజాలకున్నావు. అని తాత్పర్యము.

ఆ. భగవంతునందు అజ్ఞానులకుఁ గల మనుష్యత్వశంకను వారించుటకై ప్రతివచనమున కవతారిక చేయుచున్నారు ఏది ఇత్యాదిగా. ఇతరమైన ఆశంకచేఁ బ్రశ్నప్రవర్తింపఁగా ఎట్లు మఱియొక ఆశంకను భగవద్వచనము పరిహరించు నని యాశంకించి ప్రశ్న ప్రతివచనము లేకార్థములే యని చెప్పుచున్నారు తదర్థమే గదా ఇత్యాదిగా. శంకితమైన యేవిరోధమును బరిహరించుట కర్జునుని ప్రశ్నమో, ఆపరిహారమును జెప్పుటకే భగవద్వచనం బని యర్థము. అనేకజన్మములు కడిచియుండుట నాకుమాత్రమే కాదు, మఱి యేమనఁగా, సర్వప్రాణులకు నిది సాధారణం బని చెప్పుచున్నాఁడు తవచ అని. అవి ప్రమాణము లేమివలనఁ దెలియరా వని యాశంకించి చెప్పుచున్నాఁడు తా న్యహం వేదసర్వాణి అని. ఈశ్వరుఁడనగు నాకు జ్ఞానావరణము లేకుండుటవలన నని యర్థము. అట్లయినచో, ఎందుకు నే నెఱుంగకున్నా ననఁగా, నీకు జ్ఞానావరణము కలుగుట వలన నని చెప్పుచున్నాఁడు నత్వమ్ ఇత్యాదిగా. పరులను కల్పించుకొని వారిఁ బరిభవించుటకుఁ బ్రవర్తించినవాఁడ వగుటవలన నీకు జ్ఞానావరణము కల దని యెఱుంగఁ దగు నని చెప్పుచున్నాఁడు పరన్తప అని. అర్జునునకు భగవంతునితో అనేకజన్మములు కడచినవాఁ డగుట యందు సామ్యము న్నను ఆజన్మముల జ్ఞానమునందు వైషమ్యము కలుగుటకు హేతువుఁ జెప్పుచున్నారు ధర్మాధర్మాదులచే ఇత్యాదిగా. ఆదిశబ్దముచే రాగలోభాదులు గ్రహింపఁబడుచున్నవి. ఈశ్వరునకు అతీతములు అనాగతములు వర్తమానము లగు సర్వార్థముల జ్ఞానము కలుగుటకు హేతువు చెప్పుచున్నారు నేనో ఇత్యాదిగా.

హ. తాను ఈశ్వరుఁడు కాఁ డను మూర్ఖబుద్ధుల కల్పనను బరిహరించుచు భగవంతుఁడు పలికెను.—తాని; అహమ్; వేద = ఎఱుంగుచున్నాను, ఆవరణము లేనిజ్ఞానము గలవాఁడ నగుటవలన. త్వమ్ = నీవో; నవేత్థ = ఎఱుంగకున్నావు, అవిద్యా కామ కర్మములచే ఆవృతుఁడ వగుటవలన.

శం. ఇది నామాయావిలాసముయొక్క వైభవంబే. సత్యం బని తలంచునట్టి కేవల మూఢుల కిట్టి ప్రతీతి యగుం గాని నాతత్త్వము నెఱింగినట్టి పండితు

లకుఁ గాదు. వారలకు నాయం దీశ్వరత్వభావనయు శ్రద్ధయు భక్తియు నావాక్యము నందుఁ బ్రామాణ్యబుద్ధియు ఉండ నేయుండును. నేనో నిజమున అజుఁడను అవ్యయుఁడను భూతముల కీశ్వరుఁడను నిత్య శుద్ధబుద్ధ ముక్తస్వభావుఁడను, అయినను, అట్టినాకు, స్వమహిమ సిద్ధము లయిన నిత్యజ్ఞానైశ్వర్యశక్తి బల వీర్య తేజస్సులు గల వాఁడనై లోకములకు నిగ్రహానుగ్రహములు చేయఁగోరినవానికి, ఇట్లే పెక్కులు జన్మంబులు కలవు. అని చెప్పుచున్నాఁడు.—మే = నాకు, అప్రమేయస్వభావుఁడను అనంతశక్తిని పరమేశ్వరుఁడ నైన వానికి; దేవతిర్యఙ్మనుష్యులందు, జన్మాని; వ్యతీతాని = కడచినవి; బహూని = లెక్కలేనివి కలవు. తవచ = నీకును, ఇతరము లయిన భూతములకునుగూడ. తాని = ఆకడచిన జన్మములను; సర్వాణి = అన్నిటిని; అహమ్; వేద = ఎఱుంగుచున్నాను; "నహి విజ్ఞాతు ర్విజ్ఞాతే ర్విపరిలోపో విద్యతే" ♦ అను శ్రుతివలన; అప్రతిహతమైన విజ్ఞానశక్తిగలవాఁడ నగుటవలన అతీతానాగత వర్తమానము లగు అర్థముల నన్నిటిని ఎఱుంగుచున్నా నని యర్థము. త్వమ్ = నీవో; ఆజన్మములను, నవేత్థ—పాపపుణ్యరాగద్వేషాది దోషములచేఁ బ్రతిహత మయిన జ్ఞానశక్తి గలవాఁడ వగుటవలన నీవు అతీతానాగతవర్తమానము లేదియు నెఱుంగ వని యర్థము.

మ. అందు సర్వజ్ఞత్వముచే మొదటిదానికిఁ బరిహారము శ్రీభగవంతుఁడు చెప్పెను.—జన్మాని = లీలాదేహగ్రహణములు, లోకదృష్ట్యభిప్రాయముచే సూర్యునకు ఉదయములవలెఁ; మే = నాకు; బహూని; వ్యతీతాని. తవచ = అజ్ఞాని వగు నీకును, కర్మార్జితము లగు దేహగ్రహణములు. తవచ అనునది యితర జీవులకును ఉపలక్షణము. లేక, ఏక జీవాభిప్రాయమున ఏకవచనము. ఓయర్జునా! శ్లేషచే వృక్షవిశేష ❡ వాచక మగు అర్జునశబ్దముచే సంబోధించుచు జ్ఞానావరణము గలవాఁ డనుటను సూచించుచున్నాఁడు. తాని=ఆజన్మములను; అహమ్= సర్వజ్ఞుఁడను సర్వశక్తిని ఈశ్వరుఁడను నేను; వేద = ఎఱుంగుచున్నాను; సర్వాణి = అన్నిటిని—నాజన్మములను నీజన్మములను ఇతరులజన్మములనుగూడ. త్వమ్ = అజ్ఞుఁడవు జీవుఁడవు తిరోభూత మయినజ్ఞానశక్తిగలవాఁడవు నీవు; నవేత్థ = ఎఱుంగవు, నీజన్మములనుగూడ; ఇఁక నితరులవి యెట్లెఱుంగుదువు? ఓపరంతపుఁడా! పరుని—శత్రువును భేదదృష్టిచేఁ గల్పించికొని వధించుటకుఁ బ్రవర్తించితివి, కావున విపరీతదృష్టి

♦ ఎఱింగెడువాని యెఱుకకు లోపము లేదుగదా!

❡ ఏఱు మద్దిచెట్టు.

కలుగుటవలన భ్రాంతుఁడ వని సూచించుచున్నాఁడు. ఇట్లు అర్జున పరన్తప అను నీ రెండుసంబోధనములచే ఆవరణవిక్షేపములు రెండును అజ్ఞానధర్మములు చూపఁ బడినవి.

శ్రీ.* ఇట్లు అడిగిన యర్జుననకు రూపాంతరమున నుపదేశించితి నను నభిప్రాయంబున నుత్తరము శ్రీభగవంతుఁడు చెప్పెను.—మమ, బహూని, జన్మాని, తవచ, వ్యతీతాని. తానిసర్వాణి, అహమ్, వేద = ఎఱుంగుచున్నాను జ్ఞానశక్తికి లోపములేనివాఁడ నగుటవలన. నీత్వం, నవేత్థ = ఎఱుంగవు, అవిద్యావృతుఁడ వగుటవలన.

ప. అందుకు భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—మే=నాకును; తవచ= నీకును; బహూని జన్మాని; వ్యతీతాని = కడచినవి. అట్లయిన నేమి విశేషంబనఁగాఁ జెప్పుచున్నాఁడు—తాని సర్వాణి = ఆజన్మములను సమస్తములను; అహం వేద. త్వమ్; నవేత్థ = ఎఱింగినవాఁడవు కావు. ఇది యభిప్రాయము:--నాకు ఈశ్వరునకు జన్మము స్వేచ్ఛచే ఆవిర్భావమాత్రమే యగుచున్నది, కావుననే జ్ఞానశక్తి లోపము లేకుంటుటవలన సమస్తములను ఎఱుంగుచున్నాను. నీకు జీవునకుఁ గర్మవశంబున దేహధారణ మగుచున్నది, కావున జ్ఞానశక్తిలుప్తమగుటవలనఁ బూర్వజన్మజ్ఞానము లేదు.

రా. ఇందుచే జన్మము సత్యమనుట చెప్పఁబడినది. « బహూని మే వ్యతీతాని జన్మాని " అని చెప్పుటవలనను, « తవచ » అని దృష్టాంతముగా గ్రహించుటవలనను.

మూ.

అజో ఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరో ఽపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సమ్భవా మ్యాత్మమాయయా. ౬

భా. అప్పుడు ఎట్లు నీకు నిత్యేశ్వరునకు ధర్మాధర్మములు లేకున్నను జన్మము కలుగును? అనఁగాఁ జెప్పెదము.—అజో ఽపిసన్ = జన్మరహితుఁడనే నైనను; అట్లు, అవ్యయాత్మా=అక్షయమయిన జ్ఞానశక్తిస్వభావము గలవాఁడనే నైనను; అట్లు, భూతానామ్—బ్రహ్మాదిస్తంబ పర్యంత

* ఇందుకు మాధ్వభాష్యము లేదు.

ములకు; ఈశ్వరో ఒపిసన్ = ఈశనశీలుండనే ♦ యయినను; స్వామ్= నాదైన; ప్రకృతిమ్—మాయను, నాయొక్క-మాయను, వైష్ణవిని త్రిగుణాత్మికను; దేనివశంబున సర్వజగంబును వర్తించుచున్నదో, దేనిచే మోహితంబై తనయాత్మను వాసుదేవుని ఎఱుంగదో, ఆ నాదైన ప్రకృతిని; అధిష్ఠాయ = వశీకరించికొని; సమ్భవామి = దేహముగలవానివలె అగుచున్నాను పుట్టినట్లు; ఆత్మమాయయా = నాయొక్క మాయచేత; కాదు పరమార్థమున, లోకమువలె.

నేను జన్మరహితుఁడనే అవ్యయస్వభావుఁడనే సర్వభూతములకు నీశ్వరుఁడనే యయినను, త్రిగుణాత్మక మగు నామాయను వశీకరించి తన్మాయావశంబున దేహము గలవానియట్లును జన్మమునొందినట్లును దోఁచుచున్నా నని తాత్పర్యము.

టీ. ఈశ్వరునకు జన్మకారణములేకపోవుటవలన జన్మమే యనుపపన్నము, ఇఁక అనేకజన్మములు కడచినవాఁడనుట మఱియు అనుపపన్నము అని శంకించుచున్నాఁడు అప్పుడు ఇత్యాదిగా. వాస్తవముగ జన్మములేకున్నను మాయావశమున జన్మము సంభవించుచున్న దని యుత్తరము చెప్పుచున్నారు చెప్పెదను అని. పారమార్థికజన్మము సంభవింపదనుటకుఁ గారణమును బూర్వార్థముచే అనువదించి ప్రాతిభాసికజన్మము సంభవించు ననుటకుఁ గారణము చెప్పుచున్నాఁడు ఉత్తరార్థముచేత. ప్రకృతిశబ్దము స్వరూపవిషయము కా దని తెలుపుటకై ఆత్మమాయయా అనిచెప్పఁబడినది. వాస్తవజన్మము లేదనుటకుఁ గారణము ననువదించు భాగమును * వివరించుచున్నారు అజో ఒపి సన్ ఇత్యాదిగా. ప్రాతిభాసికజన్మము సంభవించు ననుటకుఁ గారణము ప్రతిపాదించునట్టి యుత్తరార్థమును విభజించుచున్నారు స్వామ్ ఇత్యాదిగా. ప్రకృతిశబ్దము స్వరూపశబ్దపర్యాయం బనుటను నివారించుచున్నారు మాయనుఅని. దానికి స్వాతంత్ర్యము నిరాకరించి భగవదధీనత్వము చెప్పుచున్నారు నాయొక్క-అని. అది యధికరణద్వారంబున అనవచ్ఛిన్నంబనుటను § సూచించుచున్నారు వైష్ణవిని అని. మాయాశబ్దముగూడ ప్రజ్ఞాపర్యాయశబ్దములయందుఁ బఠితం బగుటవలన, విజ్ఞానశక్తివిషయము కావచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు త్రిగుణాత్మికను అని. దానికి

♦ నియమించు స్వభావముగలవాఁడనే.

* పూర్వార్థమును.

§ అధికరణమైన శుద్ధచైతన్యము యొక్క- ద్వారమున—అధికరణము అపరిచ్ఛిన్న మగుటవలన, అనవచ్ఛిన్నంబు—అపరిచ్ఛిన్నము అను నభిప్రాయమును.

కార్యలింగకమైన § యనుమానప్రమాణము సూచించుచున్నారు దేనివశంబున ఇత్యాదిగా. జగత్తు మాయావశవర్తి యనుటనే స్ఫుటీకరించుచున్నారు దేనిచే ఇత్యాదిగా. ఎట్లు లోకంబున నొకానొకఁడు జన్మమునొంది దేహవంతుఁడుగాఁ గనఁబడుచున్నాఁడో అట్లు నేనుగూడ మాయనాశ్రయించి స్వవశ మయిన ఆమాయచే సంభవించుచున్నాను—జన్మవ్యవహారము ననుభవించుచున్నాను, అందుచే మాయామయంబీశ్వరునకు జన్మమని చెప్పుచున్నారు అనాద్యైన ప్రకృతిని ఇత్యాదిగా. సమ్భవామి అను దానినే విభజించుచున్నారు దేహము ఇత్యాదిగా. మా బోంట్లకుంబోలె నీకును జన్మాదివిషయంబునఁ బారమార్థికత్వాభిమానము ఉండు నని యాశంకించి ఈశ్వరుఁడు మున్ను చెప్పిన స్వరూపముయొక్క పరిజ్ఞానము గలవాఁ డగుటవలన అట్లు కాదని చెప్పుచున్నారు కాదు పరమార్థమున అని. జ్ఞానావరణంబు గల లోకమునకు జన్మాదివిషయంబునఁ బారమార్థికత్వాభిమానము సంభవించుచున్నది యని చెప్పుచున్నారు లోకము వలె అని.

హ. అధిష్ఠాయ = స్వీకరించి. ♦

శం. ఓయీ! "కర్మణా జాయతే జన్తుః కర్మణైవ ప్రలీయతే" * అని స్మృతి చెప్పుటవలన, జన్మాది హేతు వగు పుణ్యపాపాదికము లేకపోవుటవలన నీకు ఈశ్వరునకు స్వతంత్రుఁ డైన వానికి ఎట్లు జన్మాదికము కలుగును? అని యాశంకింపఁగా, మాయచేతనే నాకు జన్మాదులు, కాని లోకమునకువలెఁ గర్మముచేతఁ గా దని బోధించుటకై చెప్పుచున్నాఁడు—ఎప్పుడును ఎట్లును ఎందువలనను పుట్టనివాఁడు అజుఁడు, "న తస్య కశ్చి జ్జనితా నచాఽధిపః" ❡ అను శ్రుతివలన, జన్మహేతు వగు ఉపాదానాదికము లేమివలన అజుఁడను—జన్మరహితుఁడనే యగుదును, ఇట్లు అజుఁడ నైనను; అట్లు, అవ్యయాత్మా = అవయవరహితుఁడ నగుటచే వినాశకారణ సామగ్రితో సంబంధము సంభవింపమివలన, అవ్యయ—నాశన క్రియకు విషయము కాని దగు, ఆత్మా—స్వభావము గలవాఁడను, నిత్యుఁడను, "అజో నిత్యః" అను శ్రుతివలన, అవ్యయాత్ముఁడను నిత్యుఁడనే యగుదును, కాని యొకానొకప్పుడును ఆత్మవికారము ♦♦ గలవాఁడఁ గాను; అజః అవ్యయాత్మా అను

---

§ కార్యము హేతువుగాఁగల—కార్యమును బట్టి యూహింపఁ బడునట్టి.

♦ శంకరభాష్యముతో సమానము తక్కినది.

* కర్మముచే జంతువు పుట్టుచున్నది, కర్మముచేతనే లయమగుచున్నది.

❡ వానికి ఎవ్వఁడును జనకుఁడు లేఁడు, అధిపుఁడు లేఁడు.

♦♦ నాశము.

విశేషణములు రెండు వానినడుమవచ్చు వికారములుగూడ సంభవింపవని సూచించుచున్నవి; ఆద్యంతములు ♦♦ సంభవింపని యప్పుడు వానినడుమ వచ్చు అవస్థలు ♦ కలుగుటకు అవకాశములేమివలన. ఓయీ! నీకుఁ గర్మజన్య మగు జన్మము లేకున్నను ఈశ్వరుఁడు నియామకుఁడు కలఁడు అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.— భూతానామ్ = బ్రహ్మాదులకును ఇతరము లయిన భూతములకును; నేనే, ఈశ్వరః = నియామకుఁడను నాసన్నిధానమాత్రమున, "ఏష సర్వేశ్వరః" అను శ్రుతివలన; నాకు మఱియితరుఁడు లేఁడు నియామకుఁడు, "నచాధిపః" అను శ్రుతివలన; కావున నే నెవ్వనికిని నియోజ్యుఁడఁగాను. ఇట్లు అజుఁడ నైనను అవ్యయాత్ముఁడనైనను సర్వభూతముల కీశ్వరుఁడనైనను నిర్వికారుఁడ నైయే పరమాత్మను నేను; ప్రకృతిమ్=ప్రకర్షంబున కృతి—సృష్ట్యాదికార్యము దేనివలన నాకుఁ గలుగునో అది ప్రకృతి, త్రిగుణాత్మిక యైన మాయ, "మాయాం తు ప్రకృతిం విద్యాత్" అను శ్రుతివలన, ఆప్రకృతిని; స్వామ్ = స్వకీయమయిన దానిని, "కార్యోపాధి రయం జీవః కారణోపాధి రీశ్వరః" అను శ్రుతివలన నాకు ఉపాధిభూత మైన అవ్యక్తసంజ్ఞమైన మూలప్రకృతిని; అధిష్ఠాయ= ఆమూలప్రకృతియందును దానికార్యమునందును నేను నాది యను భావనను జేసి; అజత్వాది లక్షణుఁడ నయిన నేనే, ఆత్మమాయయా=నాయొక్క మాయచేత; సమ్భవామి. లేక. సూర్యునకుఁ బ్రకాశమువలెను అగ్నికి దహనశక్తివలెను ఆత్మకు—నాకు అభిన్నమాయ ఆత్మమాయ, కానినాకంటె వ్యతిరిక్తమైనది కాదు, "దేవాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢామ్" అను శ్రుతివలన, అట్లు కానియెడ అద్వైతహానియు శ్రుతివిరోధమును సంభవించును, కావున అగ్నికి దహనశక్తివలె నాకుఅభిన్నమే ఆప్రకృతిసంజ్ఞమైన మాయ, దానిచేతనే నేను జన్మముగలవాఁడను. కాని వాస్తవమునఁ గాను. అట్లయినయెడ § "నిష్కలంనిష్క్రియమ్, నజాయతే మ్రియతేవా విపశ్చిత్" ఇత్యాదిశ్రుతికి విరోధ మగుట వలన; అందువలన మాయచేతనే నేను, దేవాదులందు జనియించుచున్నా నని యర్థము. ఇట్లు తత్పదార్థమైన యీశ్వరునకు జన్మాదికము మాయికం బని బోధిత మగుటవలన, త్వం పదార్థమయినవానికిఁ గూడ ఈశ్వరాభిన్నుఁ డగుటవలన జన్మకర్మాదికము ఆవిద్యకమే యని సూచితమగుచున్నది.

---

♦♦ జన్మనాశములు.

♦ అస్తిత్వ వృద్ధి పరిణామా పక్షయములు.

§ వాస్తవజన్మము గలవాఁడ ననుయెడ.

మ. ఓయీ! నీకు అనేకజన్మములు కడచిన వనుటను స్మరింతు వేని అప్పుడు నీవు జాతిస్మృతి § గలజీవుఁడవు. ఇతరజన్మజ్ఞానముగూడ యోగికి సర్వాత్మభావాభిమానముచే « శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్ " ♦ అను న్యాయముచే సంభవించుచున్నది. అట్లు వామదేవుఁడు తాను జీవుఁడైనను చెప్పెను « అహం మనురభవం సూర్యశ్చా ఒహం కక్షీవా నృషి రస్మి » ♦ ఇత్యాదిగా దాశాతయియందు. కావుననే ముఖ్యుఁ డయిన సర్వజ్ఞుఁడు నీవుకావు. ఇట్లుండఁగా, ఎట్లు సర్వజ్ఞుఁడయిన యాదిత్యునకు ఉపదేశించితివి అనీశ్వరుఁడవు నీవు? ఏల యనఁగా, జీవునకు ముఖ్యమైన సర్వజ్ఞత్వము సంభవింపదు, పరిచ్ఛిన్నుఁ డగుటవలన, వ్యష్ట్యుపాధికి సర్వసంబంధిత్వము సంభవింపమివలన. సమష్ట్యుపాధి యయినను విరాట్టు స్థూలభూతోపాధి యగుటచే నతనికి సూక్ష్మభూతపరిణామ విషయంబును మాయాపరిణామ విషయంబు నగు జ్ఞానము సంభవింపదు. ఇట్లు సూక్ష్మభూతోపాధి యగు హిరణ్యగర్భునకుఁ గూడ తత్కారణ మాయాపరిణామాకాశాది సర్గక్రమాది విషయజ్ఞానము ♦♦ లేదనుట సిద్ధమే. అందువలన ఈశ్వరుఁడే కారణోపాధి యగుటవలన అతీతానాగత వర్తమాన సర్వార్థ విషయ జ్ఞానము గలవాఁడు ముఖ్యసర్వజ్ఞుఁడు. అతీతానాగత వర్తమానవిషయములు మాయావృత్తులు మూఁడు, లేక ఒకటియే మాయావృత్తి సర్వవిషయము అనుట వేఱువిషయము. అట్టి నిత్యేశ్వరునకు సర్వజ్ఞునకు ధర్మాధర్మాదులు లేకపోవుటవలన జన్మమే యనుపపన్నము, ఇఁక అనేకజన్మములు కడచిన వనుట మఱియు అనుపపన్నము. ఇట్లు జీవుఁడ వైనచో సర్వజ్ఞత్వ మనుపపన్నము, ఈశ్వరుఁడ వైనయెడ దేహగ్రహణ మనుపపన్నము అనునీరెండుశంకలను బరిహరించుచు, అనిత్యత్వపక్షమునకుఁ గూడ పరిహారముఁ జెప్పుచున్నాఁడు.—అపూర్వ దేహేంద్రియాదుల గ్రహించుట జన్మము. పూర్వము గ్రహించిన దేహేంద్రియాదుల వియోగము వ్యయము. ఈరెండును తార్కికులు ప్రేత్యభావం బని చెప్పుదురు.

---

§ పూర్వజన్మస్మృతి.

♦ బ్ర-సూ-అ-౧-పా-౧-సూ-౩౦-ఇంద్రుఁడు తానే బ్రహ్మమను అని యెట్లుపదేశించెను? అనఁగా శాస్త్రదృష్టిచే నుపదేశించెను. శాస్త్రమునందు ఆత్మయే బ్రహ్మమని చెప్పఁబడుటవలన అదృష్టిచే నుపదేశించెను. ఎట్లనఁగా—వామదేవునివలె, వామదేవుఁడు నేను మనువనైతిని సూర్యుఁడనేను ఇత్యాదిగా తానే మనుప్రభృతు లని యెఱింగెను గదా! అట్లు.

♦ నేను మనువ నైతిని నేను సూర్యుఁడను కక్షీవంతుం డనుఋషినగుచున్నాను.

♦♦ సూక్ష్మభూతోపాధికి కారణమయిన మాయయొక్క పరిణామమును ఆకాశాది సృష్టి క్రమమును మొదలుగాఁగలవి విషయములుగాఁ గల జ్ఞానము.

అట్లు చెప్పఁబడినది “జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ” అని. ఆరెండును ధర్మాధర్మవశంబునఁ గలుగుచున్నవి. ధర్మాధర్మవశత్వమో అజ్ఞుఁడు దేహాభిమాని యగు జీవునకుఁ గర్మాధికారి యగుటవలనఁ గలుగుచున్నది. అందు, సర్వజ్ఞునకు ఈశ్వరునకు సర్వకారణభూతునకు ఇట్టి దేహగ్రహణము ఉపపన్నము కా దని యేది చెప్పఁబడినదో అది యట్లే. ఏల యనఁగా; అతని శరీరము స్థూలభూతకార్యమగునేని అప్పుడు వ్యష్టిరూపమైనచో జాగ్రదవస్థయును అస్మదాదులతో సమానతయు సంభవించును. సమష్టిరూపమయినచో విరాడ్జీవత్వము చెప్పవలయును. విరాట్టు సమష్టిస్థూలోపాధి యగుటవలన. ఇఁక సూక్ష్మ భూతకార్య మగునేని అప్పుడు వ్యష్టి రూపమైనచో స్వప్నావస్థ అస్మదాదిసమానత్వము సంభవించును. సమష్టిరూపమయినచో హిరణ్యగర్భ జీవత్వము చెప్పవలయును, హిరణ్యగర్భుఁడు సమష్టి సూక్ష్మోపాధియగుటవలన. కావున భౌతికశరీరము జీవునిచే ఆవిష్టము కానిది పరమేశ్వరునకు సంభవింపనే సంభవింప దని సిద్ధము. ఇఁక, జీవావిష్ట మయిన భౌతిక శరీరమునందు ఈశ్వరుఁడు భూతము ఆవేశించునట్లు ప్రవేశించు ననియుఁ జెప్పనొప్పదు; ఆశరీరముచే ఆజీవునకు భోగము నంగీకరించుపక్షమున, ఈశ్వరునకు అంతర్యామిరూపంబున సర్వశరీరప్రవేశము సిద్ధమై యుండఁగా, ఒకానొకశరీరమును ప్రవేశించినాఁడనుట వ్యర్థమగుటవలన; భోగము లేదనుపక్షమున, అది జీవశరీరంబనుట యనుపపన్న మగుటవలన. అందువలన లేదు భౌతికశరీరము ఈశ్వరునకు అని పూర్వార్థముచే నంగీకరించుచున్నాఁడు అజో ఽపి సన్ ఇత్యాదిగా. అజో ఽపి సన్ అనుటచే అపూర్వదేహగ్రహణమును, అవ్యయాత్మాపి సన్ అనుటచే పూర్వదేహవియోగమును, భూతానామ్—జన్మధర్మముగాఁగల బ్రహ్మాదిస్తంబపర్యంతముల కన్నిటికిని, ఈశ్వరో ఽపి సన్ అనుటచేధర్మాధర్మవశత్వమును నివారించుచున్నాఁడు. ఎట్లు ఇఁక దేహగ్రహణము ? అనఁగానుత్తరార్ధముచేఁ జెప్పుచున్నాఁడు.—ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవామి—ప్రకృతిమ్=మాయ యనుపేరుగలదానిని విచిత్రములు అనేకములు అయిన శక్తులుగలదానిని ఘటిల్లనిదానినిగూడ ఘటించుటయందు సమర్థమయినదానిని, స్వామ్ = నాకు ఉపాధిభూత మయిన దానిని, అధిష్ఠాయ = చిదాభాసరూపమున వశీకరించి, సంభవామి = దానిపరిణామవిశేషములచేతనే దేహముగలవానివలెను పుట్టినవానివలెనుఅగుచున్నాను; నాకు ఉపాధిభూతంబునుయావత్కాలమునుండునది యగుటచే నిత్యంబును జగత్కారణత్వసంపాదకంబును నాయిచ్ఛచేతనే ప్రవర్తించునదియు నగు అనాదిమాయయే విశుద్ధసత్త్వమయం బగుటచే

నామూర్తికి తద్విశిష్టునకు అజత్వమును అవ్యయత్వమును ఈశ్వరత్వమును ఉపపన్నము; కావున నిత్యమగు ఈదేహముచేతనే వివస్వంతునకును నీకును ఈయోగము నుపదేశించితిని నేను అనుట యుపపన్నము. అట్లు శ్రుతి "ఆకాశశరీరం బ్రహ్మ" అని. ఆకాశ మనఁగా ఇట అవ్యాకృతము, "ఆకాశ ఏవ తదోతంచ ప్రోతంచ" * ఇత్యాది స్థలంబున అట్లు కనఁబడుటవలన, "ఆకాశ స్తల్లిఙ్గాత్" ♦ అనున్యాయము వలనఁ గూడ. అప్పుడు భౌతిక దేహము లేనిచో భౌతికదేహధర్మము మనుష్యత్వము మొదలగు నవి యెట్లుతోఁచుచున్నవి? అనఁగా అందుకుఁ జెప్పుచున్నాఁడు, ఆత్మ మాయయా అని, నామాయచేతనే నాయందు మనుష్యత్వాదులు తోఁచుచున్నవి లోకానుగ్రహముకొఱకు; కాని వాస్తవము కాదని భావము. అట్లు చెప్పఁబడినది మోక్షధర్మమునందు "మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద। సర్వభూతగుణైర్యుక్తం నతు మాం ద్రష్టుమర్హసి॥" § అని. సర్వభూతగుణైర్యుక్తమ్—కారణోపాధి నగు నన్ను చర్మచక్షువుచేఁ జూడఁజాలవని యర్థము. చెప్పఁబడినది గూడ భగవంతుం డగు భాష్యకారునిచేత, "స చ భగవాన్ జ్ఞానైశ్వర్య శక్తిబల వీర్య తేజోభి స్సదాసంపన్న స్త్రిగుణాత్మికాం వైష్ణవీం స్వాంమాయాం ప్రకృతిం వశీకృత్య అజోఽవ్యయో భూతానామీశ్వరో నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావోఽపిసన్ స్వమాయయా దేహవానివ జాత ఇవచ లోకానుగ్రహం కుర్వన్ లక్ష్యతే స్వప్రయోజనాభావేఽపి భూతానుజిఘృక్షయా" ¶ అని. వ్యాఖ్యాతలచేతనుం జెప్పఁబడినది "స్వేచ్ఛానిర్మితేన మాయామయేన దివ్యేన" •• అని.

---

* ఆకాశమునందే అది లోపలను వెలుపలను వ్యాపించియున్నది.

♦ సూ. అ. ౧. పా. ౧. సూ. ౨౨. ఛాందోగ్యమునందు అస్య లోకస్య కా గతిరితి—ఈలోకమున కేది గతి? అనఁగా ఆకాశ ఇతిహోవాచ—ఆకాశమని చెప్పెను. అనుచో ఆకాశశబ్దమునకు బ్రహ్మము అర్థము, బ్రహ్మలింగ—లక్షణబోధక మగు వాక్యము ముందు చెప్పఁబడుటవలన.

§ మాయగదా యిది నాచే సృజింపఁ బడినది. అందువలననే నీవు నన్నుఁ జూచుచున్నావు. సర్వభూతగుణములతోఁ గూడిన నన్నుఁ జూడఁజాలవు.

¶ ఆ భగవంతుండు జ్ఞానైశ్వర్యశక్తి బలవీర్యతేజంబు లెల్లప్పుడును గలవాఁడు, త్రిగుణాత్మిక వైష్ణవి యను తనమాయను మూలప్రకృతి యనంబడు దాని వశీకరించి తాను జన్మము లేనివాఁడును నాశము లేనివాఁడును భూతముల కీశ్వరుండును నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడు నైనను దన మాయచే దేహముగలవాఁడుంబోలె జన్మము నొందినవాఁడుంబోలె లోకానుగ్రహము సేయుచుఁ జూడఁబడుచున్నాఁడు. స్వప్రయోజనము లేకున్నను భూతానుగ్రహేచ్ఛచే.

•• స్వేచ్ఛావినిర్మితం బగు మాయామయ మయిన—దివ్యమయిన రూపంబుచే.

నిత్యకారణోపాధి యనేకశక్తి
కలిత మేది మాయాఖ్యము కల దది భగ
వంతుని శరీర మనుట శ్రీభాష్యకార
మతమని మధుసూదనసరస్వతి వచించె.

ఇఁకఁ గొందఱు పరమేశ్వరుని యందు దేహదేహిభావము నంగీకరింపరు; ఏ మేమనఁగా, నిత్యుఁడు విభువు సచ్చిదానందఘనుఁడు భగవంతుఁడు వాసుదేవుఁడు పరిపూర్ణుఁడు నిర్గుణుఁడు పరమాత్మ యెవ్వఁడు గలఁడో అతఁడే యతనికి దేహము, ఇతరము భౌతికము మాయికముగాని యతనికి దేహములేదు. అని చెప్పెదరు. ఆపక్షమునందు వ్యాఖ్యానము.—“ఆకాశవ త్సర్వగతశ్చ నిత్యః, అవినాశీ వా అరే ఽయమాత్మా ఽనుచ్ఛిత్తిధర్మా” ♦ ఇత్యాది శ్రుతులవలనను, “అసమ్భవస్తు సతో ఽనుపపత్తేః” § నాఽఽత్మా ఽశ్రుతే ర్నిత్యత్వాచ్చ తాభ్యః” ♦♦ ఇత్యాదిన్యాయములవలనను, వస్తుగతిచే జన్మవినాశరహితుఁడను సర్వభాసకుఁడను సర్వకారణమైన మాయకు అధిష్ఠానభూతుఁడ నగుటచే సర్వభూతేశ్వరుఁడను అయినను నేను; ప్రకృతిమ్ = స్వభావమును సచ్చిదానంద ఘనైకరసముయినదానిని; మాయను వ్యావర్తించుచున్నాఁడు స్వామ్ అని. నిజస్వరూపము నని యర్థము; “స భగవః కస్మి న్ప్రతిష్ఠితః స్వే మహిమ్ని” * అను శ్రుతివలన; నాస్వరూపమును, అధిష్ఠాయ = అధిష్ఠించి—స్వరూపమున నున్నవాఁడనై యే; సంభవామి—దేహదేహిభావము లేకయే దేహివలె వ్యవహరించుచున్నాను. ఎట్లు అప్పుడు దేహరహితుఁ డగు సచ్చిదానందఘనుని యందు దేహిత్వప్రతీతి కావచ్చును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు ఆత్మమాయయా అని నిర్గుణుఁడను శుద్ధుఁడను సచ్చిదానంద రసఘనుఁడ నగు నాయందు భగవద్వాసుదేవునియందు దేహదేహిభావము లేనివానియందు దేహదేహిరూపంబునఁ

---

♦ ఆకాశమువలె సర్వవ్యాపకుఁడును నిత్యుఁడును. అవినాశి ఈయాత్మ అనుచ్ఛిత్తి—వినాశము లేకయుండుట ధర్మముగాఁ గలవాఁడు.

§ బ్ర-సూ-అ౨ పా౩-సూ౯—సన్మాత్రమైన బ్రహ్మమునకు ఉత్పత్తి అసంభవము, అనుపపన్నమగుటవలన—సన్మాత్రమువలననే దీనికుత్పత్తి యనఁదగదు, ప్రకృతి వికారములకు విశేషము లేకపోవుటవలన. అసత్తువలన ఉత్పత్తి ఘటిల్లదు, అసత్తు నిరాత్మకము అవస్తువు అగుటవలన.

♦♦ బ్ర-సూ-అ౨-పా౩-సూ-౧౭—ఆత్మ ఉత్పన్నము కాదు, అశ్రుతేః—ఉత్పత్తి ప్రకరణమునందు ఆత్మకు శ్రుతి యుత్పత్తి చెప్పకుండుటవలన. తాభ్యః నిత్యత్వాచ్చ—ఆశ్రుతులవలన ఆత్మ నిత్యుఁడు అజుఁడు అవికారి అని యేర్పడుటవలన.

* భగవంతుఁడా! అతఁడు దేనియందుఁ బ్రతిష్ఠితుఁడు? తనమహిమయందుఁ బ్రతిష్ఠితుఁడు.

బ్రతీతి మాయామాత్రమే యని యర్థము. అట్లు చెప్పఁబడినది. «కృష్ణమేన మవేహిత్వ మాత్మాన మఖిలాత్మనామ్ । జగద్ధితాయ సో ఽప్యత్ర దేహీవా ఽఽభాతి మాయయా» ♦ అనియు, «అహో భాగ్య మహో భాగ్యం నన్దగోపవ్రజౌకసామ్ యన్మిత్రం పరమానన్దం పూర్ణం బ్రహ్మసనాతనమ్» * అనియు.

కొందఱుమాత్రము నిత్యము నిరవయవము నిర్వికారము అయినను ఆపరమానందఘనమునకు అవయవావయవిభావమును వాస్తవమునే యంగీకరించుచున్నారు. «నిర్యుక్తికం బ్రువాణస్తు నాస్మాభి ర్వినివార్యతే» ♦♦ అను న్యాయంబున వారిని నిరసింపవలసినది లేదు. సంభవించు నేని అట్లేయగుఁగాక. అధికమేల? అని విరమించుచున్నారము.

శ్రీ. అయ్యా! అనాది వగు నీకు జన్మమెక్కడిది? వినాశరహితుఁడ వగు నీకు ఎట్లు పలుమాఱు జన్మములు సంభవించును? బహూని మే వ్యతీతాని అని గదా చెప్పితివి. మఱియు, ఈశ్వరునకు నీకుఁ బుణ్యపాపములు లేనివానికి ఎట్లు జీవునకుం బోలె జన్మము కావచ్చును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—సత్యమే యిది, అయినను; నేను, అజో ఽపిసన్; అట్లు, అవ్యయాత్మా= నాశములేనిస్వభావము గలవాఁడ నైనను; అట్లు, ఈశ్వరో ఽపిసన్—కర్మపరతంత్రతలేనివాఁడనైనను; నామాయచేత; సంభవామి = చక్కఁగా—లోపములేని జ్ఞానబలవీర్యాదిశక్తితోనే పుట్టుచున్నాను. ఓయీ! అట్లయినను షోడశకలాత్మక § మగు లింగదేహములేని నీకు ఎక్కడిది జన్మము? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—స్వామ్, ప్రకృతిమ్ = శుద్ధసత్త్వాత్మక ప్రకృతిని; అధిష్ఠాయ = స్వీకరించి; విశుద్ధసత్త్వమూర్తిచే స్వేచ్ఛ నవతరించుచున్నా నని యర్థము.

ప. ఇఁకఁ దా నీశ్వరుఁడనుటను బ్రకటించుచుఁ జెప్పుచున్నాఁడు.— అజః = ఉత్పత్తిధర్మము లేనివాఁడను; అవ్యయః = వినాశధర్మములేనివాఁడను; భూతానామీశ్వరః= కర్మపరతంత్రత లేనివాఁడ నైనను; సంభవామి =చక్కఁగా—

---

♦ ఈకృష్ణుని నీవు సర్వాత్మలకును ఆత్మనుగా నెఱుంగుము. అట్టివాఁడు గూడ—నిర్వికారసచ్చిదానందరూపుఁడుగూడ ఈలోకంబున మాయచే దేహివలెఁ దోఁచుచున్నాఁడు.

* నందగోపుని వ్రజమున—గొల్లపల్లె నుండువారి భాగ్యమేమి! పరమానందమును బూర్ణమును సనాతనంబు నగు బ్రహ్మము వారికి మిత్త్రమయ్యెను!

♦♦ యుక్తిరహితముగాఁ జెప్పువానిని మేము నివారింపము.

§ జ్ఞానకర్మేంద్రియములు ౧౦, ప్రాణములు ౫ అంతఃకరణము ౧-వెరసి ౧౬.

సర్వజ్ఞత్వాదిగుణలోపము లేనివాఁడనై యగుచున్నాను. ఓయీ! ఈశ్వరుఁడవైన నీకు లింగదేహాది శూన్యుఁడవైన వానికి ఎట్లు జన్మము? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—స్వామ్ = నాయందు అధ్యస్తమైన; ప్రకృతిమ్ = శుద్ధసత్త్వాత్మకమగు ప్రకృతిని; అధిష్ఠాయ = అవలంబించి; స్వేచ్ఛచే ఆవిర్భూతమయిన శుద్ధసత్త్వాత్మకమూర్తిచేత నవతరించుచున్నాను, అట్లు చెప్పఁబడినది "సతో హి మాయయా జన్మ జాయతే నతు తత్త్వతః। అసతో మాయయా జన్మ తత్త్వతో నహి యుజ్యతే॥ వన్ధ్యాపుత్రో న తత్త్వేన మాయయా వాఽపి జాయతే" * అని.

రా. అవతారప్రకారమును దేహస్వరూపంబును జన్మహేతువునుం జెప్పుచున్నాఁడు.—అజో ఽపిసన్ అవ్యయాత్మా భూతానామీశ్వరో ఽపిసన్—అజత్వము అవ్యయత్వము సర్వేశ్వరత్వము మొదలగుసమస్తమైన పారమేశ్వర లక్షణమునువిడువనివాఁడనైయే; స్వాం ప్రకృతిమధిష్ఠాయ ఆత్మమాయయా సమ్భవామి—ప్రకృతియనఁగా స్వభావము, నాదైన స్వభావమునే యధిష్ఠించి నాదైన రూపముచేతనే స్వేచ్ఛచే సంభవించుచున్నానని యర్థము. స్వస్వరూపమో "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, క్షయన్తమస్య రజసః పరాకే, య ఏషో ఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషః, తస్మిన్నయం పురుషో మనోమయః అమృతో హిరణ్మయః, సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి, భారూప స్సత్యసఙ్కల్ప ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామ స్సర్వగన్ధ స్సర్వరసః, మహారజనం వాసః" ఇత్యాది శ్రుతిసిద్ధము. † ఆత్మమాయయా=నాదైనమాయచేత. "మాయావయునం జ్ఞానమ్" అనునిఘంటువువలన జ్ఞానవాచకంబిట మాయాశబ్దము. అట్లు అభియుక్తులు ప్రయోగించియున్నారు "మాయయా సతతం వేత్తి ప్రాణినాం చ శుభాఽశుభమ్" ‡ అని. నాదైన

---

* సత్తునకు మాయచేతనే గదా జన్మమగును. తత్త్వమునఁగాదు. అసత్తునకు మాయచేతను తత్త్వముచేతను జన్మము ఉపపన్నముగాదు. ఎలయనఁగా, వన్ధ్యాపుత్త్రుఁడు తత్త్వమునఁగాని మాయచేఁగాని పుట్టఁడు.

† ఆదిత్యవర్ణమ్ అను శ్రుతిచే అప్రాకృతాసాధారణనిరతిశయదీప్తియుక్తుఁడనియు క్షయన్తమ్ అను శ్రుతిచే దివ్యమంగళనిత్యవిగ్రహము గలవాఁడనియు, య ఏషో ఽన్తరాదిత్యే అనుశ్రుతిచే అతఁడే ఆదిత్యాంతర్వర్తియనియు, తస్మిన్నయమ్ అనుశ్రుతిచే అతఁడే హృదయాంతర్వర్తియనియు సర్వేనిమేషాః అను శ్రుతిచే అతఁడే జగత్కారణమనియు, భారూప స్సత్యసఙ్కల్పః అనుశ్రుతిచే కల్యాణగుణవిశిష్టుఁడనియు, మహారజనం వాసః అను శ్రుతిచే ఆకారవిశేషము గలవాఁడనియుఁ బ్రతిపాదింపఁబడుచున్నది.

‡ మాయచే—జ్ఞానముచే యెల్లప్పుడును ప్రాణుల శుభాశుభముల నెఱుంగుచున్నాఁడు.

జ్ఞానముచేత—నాసంకల్పముచేత నని యర్థము. అంకువలన, అపహత పాప్మత్వాది
సమస్త కల్యాణగుణాత్మకత, యను పారమేశ్వరస్వభావమును సమస్తమును విడువని
వాఁడనై నారూపమునే దేవమనుష్యాదులకుసజాతీయ మయిన సన్నివేశము గలదానిఁ
గాఁ జేసికొని నా సంకల్పముచే దేవాదిరూపుఁడనై సంభవించుచున్నాను. ఈయభి
ప్రాయముఁజెప్పుచున్నది « అజాయమానో బహుధా విజాయతే » అను శ్రుతి. ఇత
రపురుషులకు సాధారణమైన జన్మమును బొందనివాఁడై దేవాదిరూపంబున స్వసంక
ల్పముచే పైచెప్పినవిధమునఁ బుట్టుచున్నాఁడని యర్థము. ఇట్లయినయెడఁ « బహూ
నిమే వ్యతీతాని జన్మాని తవచా ఒర్జున। తాన్యహం వేదసర్వాణి. తదాత్మానం సృజా
మ్యహమ్। జన్మ కర్మ చ మే దివ్య మేవం యోవేత్తి తత్త్వతః » అను పూర్వా
పరములకు అవిరోధతయుం బొసఁగును.

మా. అప్పుడు అనాదివి కావు నీవు అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అవ్య
యను ఆత్మ—దేహముగూడ నాకు కావున అవ్యయాత్ముఁడను. అనన్తం విశ్వతో
ముఖమ్ అని రూపమునకే విశేషణము చెప్పఁబడినది. ఉత్తరత్ర « ఏతన్నానావతా
రాణాం నిధానం బీజమవ్యయమ్ '' ♦ అనియు. జగృహే అని వ్యక్తి చెప్పఁబడు
చున్నది *. యుక్తులో చెప్పఁబడినవి. ఆత్మానాదిత్వ మేమో సర్వసమానము §.
ఎట్లు అనాదినిత్యునకు జన్మము? అనఁగాఁ, లేని జెప్పాఁడు.—ప్రకృతిం స్వా మధి
ష్ఠాయ—ప్రకృతిచేఁ బుట్టిన వసుదేవాదుఁ కలాత్మక ప్రకృతిచేతనే వారలకుఁ బుట్టిన
వాని యట్లు దోఁచుచున్నా నని యర్థము. ఆప్రకృతి స్వతంత్రము కా దని చెప్పు
చున్నాఁడు స్వామ్ అని. «ద్రవ్యం కర్మచ '' అనిగదా చెప్పఁబడినది. ప్రకృతిగదా
అట చెప్పఁబడినది ♦♦, దానివలననే సర్వమును సృజియింపఁ బడుటవలన. ఆత్మ
మాయయా = ఆత్మజ్ఞానముచేత, ప్రకృతిని వేఱుగాఁ జెప్పుటవలన. « కేతుః కేత
శ్చితి శ్చిత్తం మతిః క్రతుర్మనీషా మాయా» అనిగదా నిఘంటువు. లేక. సృష్టికారక
ణ మయిన ప్రకృతిచే వారలకు శరీరాదికము సృజించి విమోహాక మయినమాయచే
పుట్టనివాఁడనే పుట్టినట్లు తోఁచుచున్నాను. చెప్పఁబడినదిగూడ «మహాదా దేశ్చ

♦ ఇది నానావతారములకు నిధియు బీజమును అవ్యయమును.

* అటమీఁద జగృహే—గ్రహించెను అని చెప్పఁబడియున్నదే యనఁగా జగృహే అనుటచే వ్యక్తి—ప్రకటీభావము చెప్పఁబడుచున్నది.

§ జీవులకుఁ గూడఁగలదు.

♦♦ ద్రవ్యశబ్దముచేత.

మూతా యా శ్రీ ర్భూమి రితికల్పితా। విమోహితా చ దుర్గాఖ్యా తాభిర్విష్ణు రజో ఽపి హి॥ జాతవ త్ప్రథతే హ్యాత్మ చిద్బలా న్మూఢచేతసామ్॥ § అని. ఈశ్వరశ్చ ఈశ్వరులకన్నను వరుఁడు. అదియుఁ జెప్పఁబడినది « ఈశేభ్యో బ్రహ్మరుద్ర శ్రీ శేషా దిభ్యో యతో భవాన్। వరో ఽత ఈశ్వరాఖ్యా తే ముఖ్యా నా ఽన్యస్య కస్యచిత్ ♦ అని బ్రహ్మతైవర్తమందు. « సమర్థ ఈశ ఇత్యుక్త స్తద్వరత్వా త్త్వ మీశ్వరః '' * అనియు.

అజుఁడను అనాదినిత్యమయిన దేహము గలవాఁడను సర్వేశ్వరుఁడ నైనను నేను, నాసృష్టికారణ మయిన ప్రకృతిచే వసుదేవాదులకు శరీరాదులు సృజించి, విమోహజనక మగు నామాయచే, నేను జన్మమునొందకున్నను జన్మముపొందినట్లు తోఁచుచున్నా నని తాత్పర్యము.

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత

అభ్యుత్థాన మధర్మస్య తదా ఽఽత్మానం సృజా మ్యహమ్. ౭

భా. ఆజన్మము ఎప్పుడు? అనఁగా చెప్పఁబడుచున్నది.—యదా యదాహి=ఎప్పుడెప్పుడు; ధర్మస్య=ధర్మముయొక్క; గ్లానిః= హాని; వర్ణాశ్రమాది లక్షణము ప్రాణుల కభ్యుదయనిశ్శ్రేయససాధనము అగుధర్మము యొక్క అభావము; భవతి = అగుచున్నదో, భారత = అర్జునా! అధర్మస్య=అధర్మముయొక్క; అభ్యుత్థానమ్ = సముద్భవమును; ♦♦ భవతి= అగుచున్నదో. తదా = అప్పుడప్పుడు; ఆత్మానమ్ **; అహమ్ = నేను; సృజామి = సృజించుచున్నాను మాయచేత.

అర్జునా! ధర్మము నశించునప్పుడును అధర్మము వ్యాపించునప్పుడును నేను మాయచే జన్మము పొందుచున్నా నని తాత్పర్యము.

---

§ మహదాదులకును తల్లి శ్రీ భూమి యని పేరుగల దేది గలదో, విమోహిక దుర్గయను పేరు గల దేదిగలదో వారలచే విష్ణువు ఆత్మజ్ఞాన బలమువలన అజుఁడైనను మూఢబుద్ధు లకు జాతుఁ డైనట్లు తోఁచుచున్నాఁడు.

♦ ఈశులగు బ్రహ్మరుద్ర శ్రీశేషాదులకన్నను నీవు వరుఁడవు ఉత్తముఁడవు కావున ఈశ్వరుఁడను పేరు నీకు ముఖ్యము. ఇతరున కొక్కనికిని ముఖ్యము కాదు.

* సమర్థుఁ డగు వాఁడు ఈశుఁ డని చెప్పఁబడును. నీవు వారలలో నుత్తముఁడ వగుటవలన ఈశ్వరుఁడవు.

♦♦ పుట్టుటయును.

** దేహమును.

ఆం. ఏది యీశ్వరునకు మాయాకల్పితం బగు జన్మ మని చెప్పఁబడినదో దానికి సమయమును బ్రశ్నపూర్వకముగాఁ జెప్పుచున్నారు అజన్మము ఇత్యాదిగా, నాలుగువర్ణములును నాలుగాశ్రమములును యథావిధి ననుష్ఠింపఁబడుచున్న యెడ కలుగదు ధర్మహాని యని తలంచినవారై విశేషణము చెప్పుచున్నారు వర్ణాశ్రమాది లక్షణము అని. వర్ణములచేతను ఆశ్రమములచేతను వాని యాచారములచేతను లక్ష్యతే—ఎఱుంగఁబడుచున్నది, కావున ధర్మము వర్ణాశ్రమాదిలక్షణమని యర్థము. ధర్మహాని యైనచో సమస్తపురుషార్థములకును భంగంబగు నను నభిప్రాయముతోఁ జెప్పుచున్నారు ప్రాణులకు ఇత్యాదిగా. నీవును ఇట్టిధర్మముయొక్క హానిని సహింపఁజాలవని చెప్పుచున్నాఁడు భారత అని. కేవలము ప్రాణులకు ధర్మహానిమాత్రమే కాదు భగవంతుఁడు మాయావిగ్రహముఁ బరిగ్రహించుటకు హేతువు, మ టేమనఁగా వారలకు అధర్మప్రవృత్తియును అని చెప్పుచున్నారు అధర్మస్యఇత్యాదిగా. యదాయదా అని ముందటికి అన్వయము.

హ. అజన్మము ఎప్పుడు? ఎందుకొఱకు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—యదాయదా = ఏయేకాలమునందు; ధర్మస్య--ప్రాణులకు అభ్యుదయ నిశ్శ్రేయస సాధనమైన ధర్మమునకు; గ్లానిః, భవతి. అధర్మస్య; ఎప్పుడు, అభ్యుత్థానమ్ = ప్రవృత్తి; అగునో. తదా, అహమాత్మానం సృజామి = ఉత్పత్తినొందెదను.

శం. దేవాదులందు మాయచే నీవు సంభవించుట యెప్పుడు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—వర్ణాశ్రములచే అభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధికొఱకు చక్కఁగా ననుష్ఠింపఁదగిన, ధర్మస్య = వేదోక్తధర్మమునకు; గ్లానిః = విఘ్నకారులచే నిశ్శేషముగా విచ్ఛిత్తి; యదా యదా భవతి. హి అనునది పురాణప్రసిద్ధిని దెలుపుచున్నది. అస్లే, అధర్మస్య=సర్వానర్థహేతువైనదానికి, అభ్యుత్థానమ్=అభితః—అంతటను ఆశ్రమములయందును వర్ణములయందును ఉత్థానము—ధూమకేతువునకుం † బోలె ఉత్పత్తియగునో, తదా; ఆత్మానమ్ = నాకు ధర్మాఽధర్మములను అవిగలవారిని అనుగ్రహించుటకును నిగ్రహించుటకును సమర్థ మయిన దేహమును. ఆత్మమాయచే, అహమ్ = సర్వనియామకుఁడను ఈశ్వరుఁడను నేను సృజామి అని యర్థము.

మ. ఇట్లు సచ్చిదానందఘనుఁడ వగు నీవు ఎప్పుడు ఎందుకొఱకు దేహివలె వ్యవహరింతువు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ధర్మస్య = వేదవిహితము ప్రాణు

† తోఁకచుక్క—కు.

లకు అభ్యుదయనిశ్శ్రేయససాధనము ప్రవృత్తినివృత్తిలక్షణము వర్ణాశ్రమములచేతను వానియాచారములచేతను వ్యంగ్యమైనది యగు ధర్మమునకు; యదాయదా; గ్లానిర్భవతి= హాని యగునో. ఓభారతుఁడా! భరతవంశమునందుఁ బుట్టినవాఁడ వగుటచే, లేక, భా అనఁగా జ్ఞానము దానియందు రతుఁడ వగుటచే నీవు ధర్మహానిని సహింపఁజాల వని సంబోధనాభిప్రాయము. ఇట్లు, యదాయదా; అధర్మస్య= వేదనిషిద్ధమును నానావిధదుఃఖసాధనంబును ధర్మవిరోధియు నగు అధర్మమునకు; అభ్యుత్థానమ్ = ఉద్భవ మగునో. తదా = అప్పుడప్పుడు; ఆత్మానమ్ = దేహమును; సృజామి = నిత్యసిద్ధ మైనదానినే సృజించినట్లు చూపుచున్నాను మాయచేత.

శ్రీ. ఎప్పుడు సంభవింతు వని యడుగఁగాఁ జెప్పుచున్నాఁడు.—ధర్మస్య, గ్లానిః = హాని. అధర్మస్య, అభ్యుత్థానమ్ = అధికత.

ప. ఇఁక నవతారసమయముఁ జెప్పుచున్నాఁడు.—యదాయదా, ధర్మస్య, గ్లానిః = విచ్ఛిత్తి; అట్లు, అధర్మస్య, అభ్యుత్థానమ్ = అభ్యుదయము; తదా, ఆత్మానం సృజామి—నేనే స్వేచ్ఛచే నావిర్భవించుచున్నాను.

రా. జన్మకాలముఁ జెప్పుచున్నాఁడు.—లేదు కాలనియమము నాజన్మమునకు. యదాయదాహి; ధర్మస్య = నాలుగువర్ణములయు నాలుగాశ్రమములయు వ్యవస్థచేఁ బ్రవృత్త మగు వేదోక్తధర్మమునకు; గ్లాని ర్భవతి. మఱియు, యదాయదా, అధర్మస్య = అధర్మమునకు విపరీతమైనదానికి; అభ్యుత్థానమ్. తదా; అహమ్ = నేనే; నాసంకల్పముచే పైచెప్పిన విధంబున, ఆత్మానం సృజామి.

ఏయేకాలమున వేదోక్తధర్మమునకు గ్లానియు వేదనిషిద్ధ మగు అధర్మమునకు అభ్యుత్థానంబును సంభవించునో ఆయాకాలమున నేను సంకల్పమాత్రముచే మున్ను చెప్పినట్లు అవతారవిగ్రహమును సృజింతు నని తాత్పర్యము.

మూ. *

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే. ౮

భా. దేనికొఱకు? సాధూనామ్= సన్మార్గమున నున్నవారలయొక్క; పరిత్రాణాయ = పరిరక్షణముకొఱకును; దుష్కృతామ్= పాపము చేయు

* దీనికి మాధ్వభాష్యము లేదు.

వారలయొక్క; వినాశాయచ = నాశముకొఱకును; మఱియును, ధర్మ సంస్థాపనార్థాయ = ధర్మముయొక్క చక్కగా స్థాపించుటకొఱకును; యుగేయుగే = ప్రతియుగమును; సమ్భవామి = సంభవించుచున్నాను.

సత్కర్మానుష్ఠానము చేయువారల రక్షించుటకును పాపము చేయువారల శిక్షించుటకును ఇట్లు ధర్మమును జక్కగా స్థాపించుటకును నేను యుగయుగమునందును జన్మము పొందుదు నని తాత్పర్యము.

ఆం. మీఁదఁ జెప్పినకాలమునందుఁ గృతకృత్యుఁ డగు భగవంతుఁడు మాయాకృత మయిన జన్మము పొందుటకుఁ బ్రయోజనమును బ్రశ్నపూర్వకముగాఁ జెప్పుచున్నాఁడు దేనికొఱకు అని. ఎట్లు సాధురక్షణంబును అసాధు శిక్షణంబును భగవదవతారమునకు ఫలమో, అట్లు మఱియొక ఫలముగూడ దానికిఁ గల దని చెప్పుచున్నారు మఱియును అని. ధర్మము స్థాపితమైనంగదా జగమే స్థాపితం బగును, కానిచో మర్యాదాహీనంబై జగత్తు వ్యాకులం బగు నని యర్థము.

హ. దేనికొఱకు అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—యుగేయుగే = ప్రతి యుగమును.

శం. చెప్పినయర్థమును స్పష్టీకరించుచున్నాఁడు.—సాధూనామ్—ప్రాణాపాయము వచ్చినను ఎవరు స్వధర్మమును విడువరో వారలే సాధువులు, స్వధర్మమే శరణముగాఁ గల అట్టివారలయొక్క; పరిత్రాణాయ—వారిప్రార్థన లేకయె, వారికి ఇహపరలోకములందు అపాయము కలుగకుండునట్లు రక్షించుట పరిత్రాణము, దానికొఱకును, ఇందుచే, సాధువులు ఈశ్వరుఁడే మాకు రక్షకుఁ డని ధైర్యంబుచే స్వధర్మంబునందు నిలువవలయు నని సూచిత మగుచున్నది; మఱియును, దుష్కృతామ్—ఎవ్వరు కరణత్రయముచేతను శాస్త్రనిషిద్ధమునే చేయుదురో ఇతరము చేయరో వారు దుష్కృతులు జగమును జెఱచువారు, వారియొక్క; వినాశాయచ= సమూలముగా నశింపఁజేయుటకొఱకును; ధర్మసంస్థాపనార్థాయ—ధర్మ = సత్పురుషులకు అభ్యుదయ నిశ్శ్రేయసహేతు వగు ధర్మముయొక్క, అధర్మనివారణపూర్వకముగా, సంస్థాపనార్థాయ—ధర్మమును అధికారులయందఱిచేతను నియమమున యథాశాస్త్రము గా అనుష్ఠింపించుటయే సంస్థాపనము, అట్టి ధర్మసంస్థాపనము అను ప్రయోజనము కొఱకును; యుగేయుగే—కృతాదియుగమునందు; మాటిమాటికి నామాయచే

నాయంత నే,సంభవామి=అవతరించుచున్నా నని యర్థము. ఇందుచే, సాధువులంబరిపాలించుటయు అసాధువులనిగ్రహించుటయు ధర్మమునుసంస్థాపించుటయు అను నీత్రయమే•భగవదవతారప్రయోజనం బని సూచితం బగుచున్నది. యజ్ఞాదిధర్మసంరక్షణముచే దేవతలు సంతుష్టు లగుదురు, వారివలన వర్షములు గలుగును, వానిచే అన్నము కలుగును, దానిచేఁ బ్రాణులందఱు జీవింతురు, కావున ధర్మము స్థాపించుమాత్రమున జగమంతయు రక్షితమే యగు నని భావము.

మ. అప్పుడు, ధర్మహానియు అధర్మవృద్ధియు నీకు సంతోషకరమా యేమి? అందుచేతఁ గదా అవి కలుగునప్పుడే నీ వావిర్భవించుచున్నావు. అట్లయినయెడ నీ యవతారమువలన అనర్థమే సంభవించును. అనఁగా నట్లు గా దని చెప్పుచున్నాఁడు.—ధర్మహానిచేఁ గృశించుచున్న, సాధూనామ్ = పుణ్యము చేయువారియొక్క; పరిత్రాణాయ = అంతటను రక్షించుటకొఱకును; అట్లు అధర్మవృద్ధిచే వృద్ధిఁబొందుచున్న, దుష్కృతామ్ = పాపముచేయువారియొక్క, వేదమార్గవిరోధులయొక్క; వినాశాయచ; ఆరెంటిని ఎట్లు సిద్ధించు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—ధర్మసంస్థాపనార్థాయ= ధర్మముయొక్క చక్కఁగా—అధర్మము నివారించుటచే స్థాపనము—వేదమార్గపరిరక్షణము ధర్మస్థాపనము, దానికొఱకు; సమ్భవామి—మున్ను చెప్పినట్లు; యుగేయుగే = ప్రతియుగంబును.

శ్రీ. ఎందుకొఱకు అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—సాధూనామ్ = స్వధర్మమునం దుండువారియొక్క; రక్షించుటకొఱకును; దుష్టమైన కర్మము చేయువారు దుష్కృతులు, వారి వధించుటకొఱకును; ఇట్లు, ధర్మసంస్థాపనార్థాయ—సాధువుల రక్షించుటచేతను దుష్టుల వధించుటచేతను ధర్మము సుస్థిరముగా నిలుపుటకై; యుగే యుగే—ఆయాయవసరములందు; సమ్భవామి. ఇట్లు దుష్టనిగ్రహము చేయుటచే భగవంతుఁడు నిర్దయుం డని శంకింపరాదు. ఏల యనఁగా--" లాలనే తాడనే మాతుర్నాకారుణ్యం యథార్భకే। తద్వ దేవ మహేశస్య నియన్తుర్గుణదోషయోః॥" * అని చెప్పెదరు.

ప. ఎందుకొఱకు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—సాధూనామ్ = సన్మార్గమున నుండువారలయొక్క; పరిత్రాణాయ = విఘ్నములనుండి రక్షించుటకొఱకును;

• మూఁడే.

* బుజ్జగించినను కొట్టినను తల్లికి శిశువునందు ఎట్లు నిర్దయత లేదో, అట్లే, గుణదోషనియామకుఁ డగు ఈశ్వరునకుఁ బ్రజలయెడ నిర్దయత లేదు.

అట్లు, దుష్టకర్మము చేయువారు దుష్కృతులు, వారియొక్క; వినాశాయ; ఇదియు దేనికొఱకు? ధర్మసంస్థాపనార్థాయ = ధర్మసంస్థాపనము అను ప్రయోజనముకొఱకు. యుగేయుగే—ఆయాయవసరమునందు; సమ్భవామి. అట్లు కానిచో జాతిసంకర మగును. శ్రుతియును "స సేతు ర్విధరణ మేషాం లోకానా మసమ్భేదాయ"* అని. ఇట సమదృష్టియగు పరమేశ్వరునకు సాధురక్షణంబును దుష్టవధంబును అయుక్త మని శంకింపఁ దగదు. ఏల యనఁగా "లాలనే తాడనే మాతు ర్న వైషమ్యం యథార్భకే। తద్వ దేవ మహేశస్య నియన్తు ర్గుణదోషయోః" అని చెప్పఁబడినది.

రా॰ జన్మప్రయోజనముఁ జెప్పుచున్నాఁడు.—సాధూనామ్—సాధువులు మీఁద చెప్పిన ధర్మము ననుష్ఠించువారు వైష్ణవాగ్రేసరులు, నన్ను ఆశ్రయించుటకుఁ బ్రవృత్తులై నానామమును కర్మమును స్వరూపంబును వాక్కునకును మనస్సునకును అగోచరంబు లగుటచే నాదర్శనము లేక ఆత్మధారణ పోషణాదికముఁ బొందనివారలై క్షణమాత్రకాలమునుగూడ కల్పసహస్రముగాఁ దలంచినవారై ప్రశిథిలసర్వగాత్రులు ♦ అగుదు రని నాస్వరూపముయొక్కయు నాచేష్టితముయొక్కయు దర్శనంబును సంభాషణంబును ఒసంగుటచే ఆసాధువులయొక్క; పరిత్రాణాయ; దుష్కృతామ్ — తద్విపరీతు లయినవారియొక్క; వినాశాయచ; ధర్మసంస్థాపనార్థాయ = క్షీణ మయిన మదారాధనరూప వైదిక ధర్మమును ఆరాధ్యస్వరూపమును ‖ జూపుటచే స్థాపించుటకొఱకును; దేవమనుష్యాదిరూపమున, యుగేయుగే, సమ్భవామి—కృతత్రేతాదియుగవిశేషనియమముగూడ లే దని యర్థము.

మద్దివ్యవిగ్రహదర్శనాదిదానంబుచే సాధువుల రక్షించుటకును దుష్టుల శిక్షించుటకును వేదోక్త మయిన మదారాధనరూపధర్మమును ఆరాధ్యవిగ్రహముఁ బ్రదర్శించి స్థాపించుటకును, ఈయుగము ఆయుగము అను నియమము లేక ప్రతియుగమును అవసరము గలిగినపుడు అవతరించుచున్నా నని తాత్పర్యము.

మా॰ జన్మము నొందియే పరిత్రాణాదికము చేయవలయు నని నియమము లేదు. అట్లయినను, లీలచేతను స్వభావముచేతను యథేష్టముగాఁ జరియించువాఁడు భగవంతుఁడు. అట్లే, గదా చెప్పఁబడినది, "దేవ స్యైష స్వభావో ఽయమ్, లోకవత్తు లీలా కైవల్యమ్, క్రీడతో బాలక స్యేవ చేష్టాం తస్య నిశామయ, అరిభయా

* అతఁడు ఈలోకములకు అసంకరము కొఱకు కట్ట, నిలుపువాఁడు.

♦ మిక్కిలి శిథిలము లయిన సర్వదేహమును గలవారు.

‖ ఆరాధింపఁ దగిన విగ్రహమును.

దివ స్వాయం పురా ద్వ్యవాత్సీ ద్య దన స్తవీర్యః। పూర్ణో ఒయ మస్యా ఒత్రి నిశించి దాప్యం తథా ఒపి సర్వాః కురు తే ప్రవృత్తీః॥ అతో విరుద్ధేషు మిమం వదన్తి పరా వరజ్ఞా మునయః ప్రశాన్తాః ॥ ఇత్యాదిగా ఋగ్వేదఖిలములందు.

జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సో ఒర్జున. ౯

భా. అట్టి; మే = నాయొక్క; జన్మ = మాయారూపమైన జన్మమును; కర్మ చ = సాధుపరిత్రాణాదికర్మమును; దివ్యమ్ = అప్రాకృత మయిన దానిని, ఈశ్వరసంబంధి యైనదానిని; ఏవమ్ = చెప్పినవిధముగా; తత్త్వతః = తత్త్వముచేత, యథార్థముగా; యః = ఎవ్వఁడు; వేత్తి = ఎఱుంగుచున్నాఁడో; సః = అతఁడు; దేహమ్ = ఈదేహమును; త్యక్త్వా = విడిచి; పునఃజన్మ = మరలఁ బుట్టువును; నైతి = పొందఁడు. మామ్ = నన్ను; ఏతి = పొందుచున్నాఁడు, ముక్తుఁ డగుచున్నాఁడు. అర్జున = అర్జునా !

నాజన్మమును సాధుపరిత్రాణాదికర్మమును అప్రాకృతములు ఈశ్వర సంబంధు లని మున్ను చెప్పినట్లు వాస్తవముగా నెవ్వఁడు తెలియుచున్నాఁడో అతఁడు ఈదేహము వదలిన పిమ్మట మరల జన్మము నొందఁడు, ముక్తుఁ డగు నని తా.

ఆ. మాయామయం బీశ్వరుని జన్మము, అతనిదే జగత్పరిపాలనకర్మము ఇతరునిది గాదు, అని యెఱుంగువానికి శ్రేయఃప్రాప్తిని దెలుపుచు అట్లెఱుంగని వానికిఁ బ్రత్యవాయము సూచించుచున్నాఁడు అట్టి ఇత్యాదిగా. చెప్పినవిధముగా— మాయామయము కల్పిత మని యర్థము. యథార్థముగా నెఱుంగుట అనఁగా జన్మాదికము పైచెప్పినస్వరూపము గలదే కాని వేఱువిధము గా దని యెఱుంగుట. ఇఁక భగవంతునికి జన్మము వాస్తవం బనియు సాధుపరిత్రాణాదికము ఇతరుఁ డైన క్షత్రియునికార్య మనియు నెఱుంగునేని అప్పుడు తత్త్వము దెలియఁకపోవుటవలన జన్మాదిసంసారము దుర్వారం బగు నని భావము.

హ. జన్మ—మాయారూప మయిన జన్మమును; కర్మ చ—ధర్మసంస్థాపనము కొఱకుఁ గంసవధాదిరూపమును; దివ్యమ్ = అప్రాకృతము ఐశ్వర మైనదాని; యః వేత్తి; తత్త్వతః=యథార్థముగా. దేహం త్యక్త్వా; పునః; జన్మ; నైతి=పొందఁడు.

షు తే మనఁగా, మామ్ = నన్నే; ఏతి = పొందుచున్నాఁడు, ముక్తుఁ డగుచున్నాఁ డని యర్థము.

శాం. దుష్టుల నిగ్రహించుటకును శిష్టుల ననుగ్రహించుటకును ధర్మము సంస్థాపించుటకొఱకును సూర్యునకు మొదలగువారికి యోగము నుపదేశించుటకును మాయచే సంభావితము లగు శరీరము లేవి గలవో వానిచేఁ జేయఁబడిన కర్మము లేవి గలవో అవియును ఇవియును అన్నియు వాస్తవమున బ్రహ్మమాత్రమే యని యెవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడు ముక్తిఁ బొందుచున్నాఁ డని చెప్పుచున్నాఁడు.—ఇతరాపేక్ష లేక తనయందుఁ దానే స్వప్రకాశముచే దీవ్యతి—ప్రకాశించుచున్నది కావున దివ్ అనఁగా నిర్విశేషచిదేకరసం బగు బ్రహ్మము, దివ్ అని దివు ధాతువువలన క్విబంతరూపము, అట్టి పరబ్రహ్మమునందు పూర్ణానందైకఘనము అద్వితీయము సర్వాధిష్ఠానము ఐన దానియందుఁ బ్రతీత మగు ఏప్రకృతి గలదో ఆప్రకృతిచేఁ గలుగు నాజన్మము—శరీర మేది గలదో, దానిచేఁ జేయఁబడు కర్మ మేది గలదో, అది యంతయును; తత్త్వతః = అధ్యాత్మదృష్టిచేత; పరిశీలించి; దివ్యమ్ = దివ్ అనఁగా బ్రహ్మము, దానియొక్క స్వరూపము దివ్యము చైతన్యము, సన్మాత్రమే యని; యః, వేత్తి—అపరోక్షముగా నెఱుఁగుచున్నాఁడో; సః=సమస్తమును బ్రహ్మమే యని యెఱింగినట్టి ఆవిద్వాంసుఁడు; దేహమ్ = ఈవిద్వద్దేహమును; త్యక్త్వా = విడిచి; పునఃజన్మ నైతి—మరల జనియింపఁడు. మ తేమనఁగా, మామ్ ఏతి = సచ్చిదానందైకరసుఁడ నగు నన్ను బ్రహ్మమునే పొందుచున్నాఁడు, విదేహముక్తి నొందుచున్నాఁ డని యర్థము.

ము. జన్మ—నిత్యసిద్ధుఁడనైయే యుండు నాయొక్క సచ్చిదానందఘనుని యొక్క, లీలమెయి అట్లు అనుకరణమును *; కర్మచ = ధర్మసంస్థాపనముచే లోకపరిపాలనమును; మే = నాయొక్క; దివ్యమ్ = అప్రాకృత మైనదానిని, ఇతరులకుఁ జేయ నశక్య మైనదానిని, ఈశ్వరునకుమాత్రమే అసాధారణ మయినదానిని §; ఏవమ్ = అజో ఽపి సన్నిత్యాదిగ్రంథముచేఁ బ్రతిపాదింపఁ బడినట్లు; యో వేత్తి; తత్త్వతః = భ్రమము నివర్తించుకొని. మూఢులు మనుష్యత్వభ్రాంతిచే భగవంతునకును గర్భవాసాదిరూపమే జన్మ మనియు స్వభోగార్థమే కర్మ మనియు నారోపించెదరు గదా! పరమార్థంబున శుద్ధసచ్చిదానందరూపుఁ డని తెలిసి ఆభ్రాంతిని నివర్తిం

* పుట్టినవానియట్లు అనుకరించుటను.

§ ఈశ్వరునకుమాత్రమే శక్య మయినదానిని.

చికొని అజునకుఁగూడ మాయచే జన్మానుకరణం బనియు అకర్తకుఁగూడఁ బరానుగ్రహముకొఱకుఁ గర్మానుకరణం బనియు ఎవ్వఁ డెఱుంగుచున్నాఁడో; సః = అతఁడు; తనయొక్క తత్త్వముఁగూడ తెలియుటవలన, దేహమ్=ఈదేహమును; త్యక్త్వా; పునర్జన్మనైతి. మ తేమనఁగా, మామ్ = నన్ను, భగవంతుని వాసుదేవుని సచ్చిదానందఘనునే; ఏతి—సంసారమునుండి ముక్తిఁ బొందుచున్నాఁ డని యర్థము.

శ్రీ. ఇట్టి ఈశ్వరుని జన్మకర్మముల నెఱింగినచో ఫలముఁ జెప్పుచున్నాఁడు.—మే = నాయొక్క; జన్మ—స్వేచ్ఛాకృత మయినదానిని; కర్మచ—ధర్మస్థాపనరూపకర్మమును; దివ్యమ్ = అలౌకికమైనదానిని; తత్త్వతః—పరానుగ్రహార్థమే యని యో వేత్తి; సః = ఆతఁడు; దేహాభిమానమును విడిచి; పునర్జన్మ; నైతి= పొందఁడు. మ తేమనఁగా, మామ్ = నన్నే; ఏతి = పొందుచున్నాఁడు.

ప. ఇట్టి యీశ్వరజన్మకర్మములం దెలిసినయెడ ఫలముఁ జెప్పుచున్నాఁడు.—జన్మ—స్వేచ్ఛాకృత మయినదాని; కర్మ—పాలనరూప మైనదానిని; తత్త్వతః—అనుగ్రహార్థమే యని; యథార్థముగాఁ బరమేశ్వరస్వరూపమును, యో వేత్తి. సః, దేహమ్=వర్తమానదేహమును; త్యక్త్వా; పునర్జన్మ; నైతి. మ తేమనఁగా, మామ్ ఏతి = నన్నే పొందుచున్నాఁడు.

రా. ఇట్లు కర్మమూల మగు హేయత్రిగుణ ప్రకృతిసంసర్గరూప మైనజన్మము లేనివాఁడును సర్వేశ్వరత్వ సర్వజ్ఞత్వ సత్యసంకల్పత్వాది సమస్తకల్యాణగుణములతోఁ గూడినవాఁడ నగు, మే = నాయొక్క; సాధుపరిత్రాణము వారలకు నాసమాశ్రయణము సిద్ధించుట—ఇవియే ప్రయోజనముగాఁ గల దగు, దివ్యమ్ = అప్రాకృతము నాయందే అసాధారణముగా నుండున దగు; జన్మ = జన్మమును; కర్మ = కార్యమును; తత్త్వతః, యో వేత్తి. సః = అతఁడు; దేహమ్ = వర్తమానదేహమును; త్యక్త్వా = విడిచి; పునర్జన్మ; నైతి. మామేతి = నన్నే పొందుచున్నాఁడు. దివ్యంబు లగు నాజన్మచేష్టితంబుల యథార్థస్వరూపము దెలియుటచే నాసమాశ్రయణమునకు విరోధి యగు పాప మంతయు నశించి యీజన్మమునందే చెప్పినచొప్పున నన్నాశ్రయించి మదేకప్రియుండై మదేకమనస్కుండై నన్నే పొందుచున్నాఁడు.

మా. ఏకదేశజ్ఞానముచే ♦ ముక్తిని బ్రతిపాదించుట సర్వజ్ఞానము కలుగవలయు నను నియమమున కుపలక్షణార్థము. కాని అంతమాత్రముచే ముక్తి కలుగు

♦ భగవంతుని జన్మకర్మములమాత్రము దెలియుటచే.

వని చెప్పఁబడినది కాదు. “వేదాద్యుక్తంతు సర్వం యో జ్ఞాత్వోపాస్తే సదా హి మామ్ । తస్యైవ దర్శనపథం యామి నాన్యస్య కస్యచిత్ ” * అని మహాకౌర్మమునందుఁగూడఁ జెప్పఁబడియున్నది. ఇటుఁ జెప్పఁబడినదానికి “దీనిఁ దెలిసిననే జన్మము నొందఁడు”అని గతి కల్పింపవచ్చును. ఇతరవాక్యములకు ♦ ఇతర మయిన గతి లేదు, నాన్యస్య కస్య చిత్ అని చెప్పుటవలన. ఇట తత్త్వతః అని చెప్పుటవలనఁ గూడ, సర్వజ్ఞానము వచ్చుచున్నది ❡. ఎచట నిట్లు చెప్పఁబడునో అచట తత్త్వతః అనుటచే విరోధము పరిహృతం బగును. చెప్పఁబడినదిగూడ “ఏకంచ తత్త్వతో జ్ఞాతుం వినా సర్వజ్ఞతాం నరః । న సమర్థో మహేన్ద్రోఽపి తస్మాత్సర్వత్ర జిజ్ఞసేత్ ”§ అని స్కాందమునందు.

వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః

బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః. ౧౦

భా. ఈమోక్షమార్గం బిపుడు ప్రవర్తించినది కాదు, మ తేమ నఁగా, పూర్వముగూడ—వీతరాగభయక్రోధాః = రాగమును భయమును క్రోధమును రాగభయక్రోధములు, వీతములు—విగతములు ♦♦ రాగభయక్రోధములు ఎవ్వరినుండియో వారు వీతరాగభయక్రోధులు; మన్మయాః = బ్రహ్మవిదులు, ఈశ్వరాభేదము చూచినవారు; మామ్ = నన్నే, పరమేశ్వరుని; ఉపాశ్రితాః—కేవలజ్ఞాననిష్ఠు లని యర్థము; ఇట్టివారు, బహవః = అనేకులు; జ్ఞానతపసా = పరమాత్మవిషయ మగు జ్ఞానమేతపస్సు,జ్ఞానతపస్సు, దానిచేత; పూతాః=ఉత్తమమయినశుద్ధిని పొందినవారలై ; మద్భావమ్= ఈశ్వరభావమును, మోక్షమును; ఆగతాః = పొందినారు. ఇతరతపోనిరపేక్షము జ్ఞాననిష్ఠ యనుట కులింగము జ్ఞానతపసా అనువిశేషణము.

---

* వేదములు మొదలగువానియందుఁ జెప్పఁబడినదానినంతయుఁ దెలిసి యెవ్వఁడు సదా నన్నుపాసించునో వానికే నేను సాక్షాత్కరింతును ఇతరుని కెవ్వనికిని సాక్షాత్కరింపను.

♦ కౌర్మము మొదలగువానికి.

❡ సర్వజ్ఞానము ఆవశ్యకం బని యేర్పడుచున్నది.

§ సర్వజ్ఞత్వము లేనియెడ ఒకటిగూడ తత్త్వముచే నెఱుంగుటకు మనుష్యుఁడు మహేంద్రుఁడైనను సమర్థుఁడు కాఁడు. అందువలన సర్వజ్ఞత్వము పొందవలయును.

♦♦ తొలఁగినవి.

రాగభయక్రోధములు విడిచినవారును బ్రహ్మవేత్తలును నన్నే ఆశ్రయించి జ్ఞాననిష్ఠు లైనవారు నగు అనేకులు పరమాత్మజ్ఞాన మను తపస్సుచే పరమశుద్ధి నొందినవారలై మోక్షము నొందిరి అని తా.

ఆ. ఇప్పుడు ఈమోక్షమార్గము నూతనం బగుటచే అవ్యవస్థితం బని యాశంకించి పరిహరించుచున్నారు ఈమోక్షమార్గంబు ఇత్యాదిగా. మద్భావము లనుట మద్భావము పొందినారనుటచే బునరుక్తము గా దని చూపుచున్నారు బ్రహ్మవిదులు అని. ఆత్మకంబె భిన్నముగాఁగాని భిన్నాభిన్నముగాఁగాని గాక బ్రహ్మము నెఱుంగుట యని చెప్పుచున్నారు ఈశ్వరాభేదము ఇత్యాదిగా. అభేదజ్ఞానముతో కర్మానుష్ఠానమునకు సముచ్చయము నిరాకరించుచున్నారు నన్నే యని. పరమేశ్వరో పాశ్రయమునే విశదీకరించుచున్నారు కేవ లేత్యాదిగా. మాముపాశ్రితాః అని కేవలజ్ఞాననిష్ఠత్వముఁ బ్రతిపాదించి జ్ఞానతపసా పూతాః అని యెందుకు మరలఁ జెప్పవలయును ? అనఁగాఁ జెప్పుచున్నారు ఇతరతపోనిరపేక్షము ఇత్యాదిగా. *

హ. ♦

శం. సమస్తమును బ్రహ్మమే యని సమస్తమును బ్రహ్మమాత్రముగా నెఱుంగుటచేఁ బూర్వు లనేకులు ముక్తిఁ బొంది రని « యోగః ప్రోక్తః పురాతనః » యోగము పురాతనం బనుట యేది చెప్పఁబడినదో దానిం బ్రతిపాదించుచున్నాఁడు.—భోగములయందును ఉపకారులయందును రాగము, ఆధ్యాత్మికా ద్యుపద్రవములవలన భయము; అపకారులందుఁ గ్రోధము, క్రోధం బనునది ఆపస్తంబునిచేఁ జెప్పఁబడిన భూతదాహీయము లగు § దోషములకు నుపలక్షణము ¶, తీవ్రముముక్షుచేతను సదసద్వివేకవైరాగ్యములచేతను వీతములు—విశేషించి నిర్గతములు రాగభయక్రోధములు ఎవరినుండియో వారు వీతరాగభయక్రోధులు; జ్ఞానతపసా— జ్ఞాన మనఁగా బ్రహ్మమే నే నని సాక్షాద్బ్రహ్మమునందే ఆత్మత్వజ్ఞానము అప్రతిబద్ధ

---

* జ్ఞానతపసా అని మరలఁ జెప్పుట జ్ఞాననిష్ఠ ఇతర మైనతపస్సు నపేక్షింపక తానే మోక్షము కలిగించు నని సూచించుచున్నది యని భావము.

♦ శంకరభాష్యముతో సమానము.

§ భూతదాహము కల్గించునట్టి.

¶ ఆపస్తంబసూత్రము.—అథ భూతదాహీయాన్ దోషానుదాహరిష్యామః. క్రోధో హర్షో రోషో లోభో మోహో దమ్భో ద్రోహో మృషోద్య మత్యాశ పరీవాదా వసూయా కామమన్యూ అనాత్మ్య మయోగః.

మేది గలదో అది జ్ఞానము, అదియే తపస్సు ముముక్షు వగు యతికిఁ గర్తవ్యము « మనస శ్చేన్ద్రియాణాం చ హ్యైకాగ్ర్యం పరమం తపః " * అను స్మృతివలన, అట్టి జ్ఞానతపస్సుచేఁ; పూతాః = చక్కఁగా నశించిన అనాత్మభావము గల దగుటచే పరిశుద్ధ మయిన మనస్సు గలవార లగు; బహవః = పెక్కండ్రు వామదేవాదులు ముముక్షువులు; తాము సదా, మా ముపాశ్రితాః—నన్ను అపూర్వంబును అనపరంబును అనంతరమును అబాహ్యమును అద్వితీయంబు నగు బ్రహ్మమునే ఆశ్రయించిన వారలై, ఉపాశ్రయణం బనఁగా సర్వంబును బ్రహ్మమే యని వెలుపలను లోపలను సర్వత్ర ప్రత్యగ్దృష్టిచే సద్రూపమాత్రదర్శనము, దానినే చేయుచున్నవారలై; మన్మయాః = మద్రూపంబునఁ బూర్ణులై; దేహపాతానంతరము, మద్భావమ్ = బ్రహ్మాత్మభావంబున నుండుటను, మోక్షమును; ఆగతాః—విదేహముక్తిని బొందినా రని యర్థము.

మ. మా మేతి సోఽర్జున అని చెప్పఁబడినది. అందుఁ దాను సర్వముక్త ప్రాప్యుఁ డగుటచేఁ బురుషార్థ మనుటయు ఈమోక్షమార్గం బనాదిపరంపరాగతం బనుటయుఁ దెలుపుచున్నాఁడు.—రాగం బనఁగా తత్తత్ఫలంబులయందు ఆశ, సర్వ విషయములను విడిచి జ్ఞానమార్గమునం దెట్లు జీవింపవచ్చు నను భీతి భయము, సర్వవిషయంబులను దొలఁగించునట్టి యీమార్గము ఎట్లు హితం బగు నను ద్వేషము క్రోధము, ఈరాగభయక్రోధములు వీతములు-వివేకముచే విగతంబు లయ్యెను ఎవ్వరినుండియో వారు వీతరాగభయక్రోధులు, శుద్ధసత్త్వు లని యర్థము; మన్మయాః = నన్నుఁ బరమాత్ముని తత్పదార్థ త్వంపదార్థముల కభేదముచే అపరోక్షముగాఁ జూచినవారలు, లేక, నాయందే మనస్సు గలవారలు; మా ముపాశ్రితాః = ఏకాంత ప్రేమభక్తిచే నన్ను ఈశ్వరుని శరణుపొందినవారలు; బహవః = పెక్కండ్రు; జ్ఞానతపసా = జ్ఞాన మను తపస్సుచేత; జ్ఞానము సర్వకర్మక్షయహేతు వగుటవలన, « నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే " అని గదా చెప్పఁబోవుచున్నాఁడు, దానిచేత, పూతాః = నశించిన సమస్తపాపములును గలవారలై, అజ్ఞానము తత్కార్యమును అను మలములఁ దొలఁగించుకొన్న వారై; మద్భావమ్ = మద్రూపత్వమును విశుద్ధసచ్చిదానందఘనమైనదాని, మోక్షమును; ఆగతాః = అజ్ఞానము దొలఁగుటచేఁ బొందిరి. లేక. జ్ఞానతపసా పూతాః = జీవన్ముక్తులై; మద్భావమ్= మద్విషయ

* మనస్సునకును ఇంద్రియములకును ఏకాగ్రతయే ఉత్తమ మగు తపస్సు.

మయిన • భావమును—ప్రేమను, ఆగతాః. "తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే" అని గదా చెప్పఁబోవుచున్నాఁడు.

శ్రీ. ఎట్లు జన్మకర్మములఁ దెలియుటచే నన్నుఁ బొందవచ్చు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—నేను శుద్ధసత్త్వావతారములచే ధర్మపరిపాలనము చేయుచున్నా నని నాపరమకారుణికత్వము నెఱింగి, వీతములు—తొలఁగినవి రాగభయక్రోధములు ఎవ్వరినుండియో అట్టివారలై, విక్షేపము లేకపోవుటవలన; మన్మయాః = నాయందే మనస్సు గలవారలై; మా ముపాశ్రితాః = నన్నే యుపాశ్రయించినవారలై; నాప్రసాదముచేఁ బొందఁదగిన ఆత్మజ్ఞాన మేది గలదో తపస్సును దానికరిపాకహేతువు స్వధర్మరూప మేది గలదో అవి జ్ఞానతపస్సులు, వానిసమాహారము జ్ఞానతపస్సు, దానిచేత—జ్ఞానముచేతను తపస్సుచేతను అనుట; పూతాః = అజ్ఞానమును తత్కార్యమును అను మలములు నిరసించుకొన్నవారలై; మద్భావమ్ = నాసాయుజ్యమును; ఆగతాః= పొందినారు; బహవః=పెక్కండ్రు. కాని యిప్పుడే ప్రవర్తించినదికాదీభక్తిమార్గం బని యర్థము. ఇట్లు, "తాన్యహం వేద సర్వాణి" ఇత్యాది గ్రంథముచే విద్యా ఽవిద్యారూపము లయిన యుపాధులచే తత్త్వంపదార్థములను జీవేశ్వరులను దెలిపి, ఈశ్వరుఁడు అవిద్య లేనివాఁ డగుటవలన నిత్యశుద్ధుఁ డనియు, జీవుఁడును ఈశ్వరప్రసాదలబ్ధ మగు జ్ఞానముచే అజ్ఞానము తొలఁగుటవలన శుద్ధుఁడు కాఁగా చిదంశమున నిద్దఱకును ఐక్యము చెప్పఁబడిన దనియు నెఱుంగవలయును.

ప. ఇఁక నెట్లింతమాత్రముచేతనే నన్నుఁ బొందవచ్చు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—వీతములు — దాఁటిపోయినవి రాగభయక్రోధములు ఎవ్వరినుండియో వారు; కావుననే, మన్మయాః = నాయందే చిత్తము గలవారలై; నన్నే యుపాశ్రయించినవారలై; నాప్రసాదముచే లబ్ధ మగు, జ్ఞానతపసా=జ్ఞానము—ఆత్మానాత్మవివేకము, తపస్సు—తత్కారణ మగు కర్మము, ఆ రెంటిచేత; బహవః = పెక్కండ్రుయోగులు; పూతాః = శుద్ధులై; మద్భావమ్ = నాసాయుజ్యమును; ఆగతాః.

రా. దానిం జెప్పుచున్నాఁడు.—జ్ఞానతపసా=మదీయజన్మకర్మతత్త్వజ్ఞానము తపస్సుచేత; పూతాః; ఇట్టివారలైరి *. అట్లు శ్రుతి "తస్య ధీరాః పరిజా

• నేను విషయముగాఁ గల.

* పూర్వశ్లోకవ్యాఖ్యానముచే ఈశ్లోకము వ్యాఖ్యాతప్రాయం బగుటవలన ఇట్టివారలైరి అని సంగ్రహంబున వివరింపఁబడినది.—జ్ఞానతపసా అనుదాని యర్థము "దివ్యంబు లగు...నశించి" అను

న్తి యోనిమ్॥ అని. ధీరాః = బుద్ధిమంతులలో నుత్తములు, ఇట్లు, తస్య = ఆతని యొక్క, యోనిమ్ = జన్మప్రకారమును; పరిజానన్తి = ఎఱుంగుచున్నారని యర్థము.

మా. కలరుగూడ అట్లు ముక్తులైనవా రని చెప్పుచున్నారు. మన్మయాః = మత్ప్రియులు, అంతటను నన్నుఁ దక్క నితరము దేనిని౦ జూడ రని యర్థము.

యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజా మ్యహమ్
మమ వర్త్మాఽనువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః. ౧౧

భా. నీ కప్పుడు రాగద్వేషములు కలవు, ఏల యనఁగా కొందఱకు మాత్రమె ఆత్మఖ్యానము నొసంగెదవు, అందఱకు నొసంగవు. అందువేని, చెప్పెదము.—యే = ఎవరు; యథా = ఏవిధమున, ఏప్రయోజనము చేత, ఏఫలమును గోరి; మామ్ = నన్ను; ప్రపద్యన్తే = సేవించుచున్నారో; తాన్ = వారలను; తథైవ=ఆవిధముననే, ఆఫలము నిచ్చుటచే; అహమ్ = నేను; భజామి=అనుగ్రహించుచున్నాను; వారలు మోక్షము నపేక్షింపనివార లగుటవలన. ఒక్కనికి ముముక్షుతయు ఫలార్థితయు నేకకాలంబున సంభవింపదు గదా ! కావున, ఎవ్వ రేఫలము నర్థింతురో వారలను తత్ఫలప్రదానముచేతను, ఇఁక నెవ్వరు ఫలము నర్థింపక మీఁదఁ జెప్పినచొప్పున ననుష్ఠించుచు ముముక్షువు లగుదురో వారలను జ్ఞానప్రదానంబుచేతను, ఎవ్వరు జ్ఞానులై సన్న్యసించి ముముక్షువు లగుదురో వారలను మోక్షప్రదానముచేతను, అట్లు ఆర్తులను ఆర్తిహరణముచేతను—ఇట్లెవ్వ రేవిధంబున నన్నుఁ బ్రపన్ను లగుదురో వారల నావిధంబుననే భజించుచున్నా నని యర్థము. కాని, రాగద్వేషములవలనఁ గాని మోహమువలనఁ గాని ఎవ్వనిని భజింపను. సర్వవిధంబులను, సర్వావస్థుఁడ నైన ఈశ్వరుఁడను నాయొక్క, వర్త్మ = మార్గమును; అనువర్తన్తే = అనుసరించుచున్నారు; మనుష్యాః = మనుష్యులు; ఒకా

టచేఁ జెప్పఁబడినది, మా మాశ్రితాః అనుదాని యర్థము "నన్నాశ్రయించి" అనుటచేఁ జెప్పఁబడినది. "మదేకప్రియుండై" అనుటచే వీతరాగభయక్రోధాః అనుదాని యర్థము వర్ణింపఁబడినది. "మదేకమనస్కుండై" అనుటచే మన్మయాః అనుదాని యర్థము చెప్పఁబడినది. "నన్నే పొందుచున్నాఁడు" అనుటచే మద్భావ మాగతాః అనుదాని యర్థము ప్రతిపాదింపఁబడినది. అని తాత్పర్యచంద్రిక.

నొకఫలము గోరినవార లగుటచే ఆకర్మమునందు ♦ సధికృతులై రెవ్వరు ప్రయత్నించుచున్నారో వారు మనుష్యు లని యిటఁ జెప్పఁబడుచున్నారు; పార్థ = ఓ యర్జునుఁడా! సర్వశః = సర్వప్రకారములచేతను.

ఎవ్వరు ఏఫలము గోరి నన్నాశ్రయించుచున్నారో నేను వారలను ఆఫలము నిచ్చుటచే ననుగ్రహింతును. అర్జునుఁడా! ఎవ్వ రేఫలము గోరి తదర్థము ప్రయత్నించినను వారలందఱు జ్ఞానకర్మరూప మయిన నామార్గమునే యన్నివిధముల ననుసరించుచున్నా రని తాత్పర్యము.

ఆ. ఈశ్వరుఁడు సర్వజంతువులకును మోక్షం బొసంగునేని మున్ను చెప్పి నవిశేషణములు ¶ వ్యర్థము లగును; ఇఁకఁ గొందఱకు మాత్రమే మోక్షం బిచ్చునేని అప్పు డతనికి రాగాదులు గల వని యేర్పడుటవలన అనీశ్వరత్వము § సంభవించును అని శంకించుచున్నాఁడు నీ కష్టుడు ఇత్యాదిగా. ఎవ్వరు ముముక్షువులో వారలకు మోక్షము నీశ్వరుఁడు జ్ఞానసాధనద్వారంబున నొసంగుచున్నాఁడు, ఇఁక ఫలాంతరము గోరువారలకును వానివానిసాధనముల ననుష్ఠించుటచే ఆయాఫలమునే యిచ్చుచున్నాఁడు; కావున లే వీతనికి రాగద్వేషములు అని పరిహరించుచున్నారు చెప్పెదము అని. ముముక్షువు లీశ్వరు ననుసరించినను ఫలాంతరము నర్థించువార లేల యతని ననుసరింపవలయు నని యాశంకించి "ఫల మత ఉపపత్తేః" * అనున్యాయమున ఆఫలము ఈశ్వరాధీనం బగుటవలన, వారలకును ఈశ్వరు ననుసరించుట యావశ్యక మని చెప్పుచున్నాఁడు ఉత్తరార్ధముచేత. భగవంతు నాశ్రయించువారల కందఱకును ఏకరూపమైన కైవల్య మెందువలన ననుగ్రహింపరాదు? అనఁగాఁ జెప్పుచున్నారు వారలు మోక్షము నపేక్షింపనివార లగుటవలన అని. ప్రార్థనము లనేకవిధము లగుటవలన అభ్యుదయమును నిశ్శ్రేయసమును రెంటిని అర్థించుట యొకనియందే యేల సంభవింపఁ గూడదు? అని యాశంకించి యేక కాలంబున నది యుపపన్నము గా దని సాధించుచున్నారు ఒక్కనికి ఇత్యాదిగా. ముముక్షువులకును ఫలార్థులకును విభాగ మేర్పడఁగా ఫలితమైన తత్తదనుగ్రహవిభా

♦ తత్ఫలజనకమైన కర్మమునందు.

¶ వీతరాగభయక్రోధా ఇత్యాదులు.

§ ఈశ్వరుఁడు కాకపోవుట.

* బ్ర. సూ. అధ్యా ౩. పా ౨. సూ ౩౮. ఫలమ్-కర్మఫలము, అతః-ఈ ఈశ్వరునివలననే కలుగుచున్నది, ఉపపత్తేః-ఉపపన్న మగుటవలన.

గమును జెప్పుచున్నారు కావున అని. నిత్యనైమిత్తికకర్మము లనుష్ఠించువారలే ఫలము నర్థింపనివారలై ముముక్షువు లయినయెడ ఎట్లు వారల ననుగ్రహించుట ? అనఁగాఁ జెప్పుచున్నారు ఇఁక నెవ్వరు ఫలము నర్థింపక ఇత్యాదిగా. కలరు కొందఱు సర్వధర్మముల విడిచినవారు జ్ఞానులు మోక్షమునే యపేక్షించువారు, వారల ననుగ్రహించువిధముఁ బ్రకటించుచున్నారు ఎవ్వరు జ్ఞానులై ఇత్యాదిగా. కొందఱు ఆర్తులై జ్ఞానాదిసాధనాంతరరహితులై తమయార్తిని ♦ దొలఁగించుటకు భగవంతునే ఆశ్రయించెదరు, వారలందు భగవంతుఁడు చేయు ననుగ్రహవిశేషముఁ జూపుచున్నారు అట్లు ఇత్యాదిగా. పూర్వార్ధవ్యాఖ్యానము నుపసంహరించుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. భగవంతునియనుగ్రహమునకు వేఱునిమిత్తము నివారించుచున్నారు కాని ఇత్యాదిగా. ఫలార్థులైనను ముముక్షువులైనను సర్వజంతువులకును భగవంతు ననుసరించుట యావశ్యకమేయని ప్రతిపాదించు నుత్తరార్ధమును విభజించుచున్నారు సర్వవిధంబులను ఇత్యాదిగా. సర్వావస్థుఁడను—ఆయారూపమున అవస్థితుండను. మార్గము—జ్ఞానకర్మరూపము. మనుష్య లని చెప్పుటవలన ఇతరులకు ఈశ్వరు ననుసరించుట యనావశ్యకం బని యేర్పడు నని యాశంకించి చెప్పుచున్నారు ఒకానొక ఫలము ఇత్యాదిగా. సర్వప్రకారములచేతను—నామార్గము ననుసరించుచున్నా రని ముందటి కన్వయము.

హ. మద్భాన మాగతాః అని విని, మోక్షమునే యిచ్చుచున్నాఁడు భగవంతుఁడు భక్తులకు, జ్ఞానైశ్వర్యాదిఫలము నియ్యఁడు. అని యర్జునుండు పలుకు నని యాశంకించి చెప్పు[చున్నాఁ]డు.—యే = ఏఫలముఁ గోరుపురుషులు; యథా = ఏవిధమున, సాత్త్విక [రాజ]స తామసభావంబున; మామ్ = నన్నుఁ; ప్రపద్యన్తే సేవించుచున్నారో; తాన్ [= వారిని]; అహమ్; తథైవ = ఆఫలము నిచ్చుటచేతనే, ఐశ్వర్యాది ఫలము గోరువారలను దాని నిచ్చుటచేతనే యని యభిప్రాయము. మమ=ఈశ్వరుఁడను నాయొక్క; వర్త్మ = మార్గమును, కోరినఫలము నిచ్చుటను; అనువర్తన్తే = అనుసరించుచున్నారు. ఏయేఫలము తమ కిష్టమో దానినే నన్నుఁ బ్రార్థించుచున్నా రని యభిప్రాయము.

శ ౦. ఓయీ ! సర్వప్రాణులును సుధాసముద్రమునందుంబోలె నీయందే యద్వితీయం బగు పరబ్రహ్మమునం దున్నారు. ఇట్లు నీయందుండుట సర్వసమంబై

♦ దుఃఖమును.

యుండఁగాఁ గొందఱకుమాత్రమే యందు ముక్తి నొసంగదవు కాని యందఱకు నొసంగవు. ఏమి నీ కీపక్షపాతము ? అని యాశంకింపఁగా. అట్లు కాదు. సుధాసముద్రవాసము సర్వసమంబైనను ఎట్లు సుధాపానము చేసినవారలకే యమరత్వము, ఇతరులకు లేదో, అట్లే నాయందునికి సర్వసమంబైనను నన్నెక్కనే నైక్యమున నెవరు భజింతురో వారలకే ముక్తి, ఇతరభావమును భజించువారలకు సకాములకు ముక్తి లేదు. అని « తం యథా యథోపాసతే తథైవ భవతి " అను నీశ్రుతితాత్పర్యముఁ జెప్పుచున్నాఁడు.—« ద్వే రూపే వాసుదేవస్య వ్యక్తం చా ఽవ్యక్త మేవచ । అవ్యక్తం బ్రహ్మణో రూపం వ్యక్త మేత చ్చరాచరమ్ ॥ ♦ అను స్మృతివలన, అవ్యక్తము నిర్విశేషపరబ్రహ్మము, వ్యక్తమో మాయోపాధిక మగు అపరబ్రహ్మము. కార్యసహితమైన నాతత్త్వం బిట్లు వ్యవస్థితము. శాస్త్రాచార్యోపదేశములచే సంస్కృతమగు తమతమబుద్ధి కనురూపముగా దానిం దెలిసి పరబ్రహ్మవిదులు కాని అపరబ్రహ్మవిదులు ఆయాఫలముఁ గోరువారలు కాని, యే = ఏజనులు; మామ్ = నన్ను; ఇట్లు రెండువిధములుగా నున్నపరమాత్మను; యథా ప్రపద్యన్తే = జ్ఞానయోగముచేఁ గాని కర్మయోగముచేఁ గాని మఱియొకవిధమునఁ గాని యేప్రకారముచేత నుపాసించుచున్నారో; తత్తత్సాధననిష్ఠు లగు, తాన్ = ఆ యుపాసకులను; తథైవ = ఏయేతత్త్వమునందు వారు పరినిష్ఠితు లగుదురో తత్తద్రూపముననే సాక్షాత్కరించి; భజామి = అనుగ్రహించుచున్నాను, తత్తద్వస్తువు నుపాసించుఫలము నొసంగుచున్నా నని యర్థము. « యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ ॥ * అను నియమమువలన తమతమబుద్ధిబలంబున గ్రహించినతత్త్వముయొక్క యుపాసనమున కనురూపముగనే వారికి ఫలము సిద్ధించుచున్నది, వేఱువిధమునఁ గాదు. అందువలన నాకేమియుఁ బక్షపాతము లే దని భావము. ఇట్లు జ్ఞానకర్మయోగఫలము నిచ్చుటయందు సమభావంబున నే నున్నను, శాస్త్రార్థము తెలిసినవారు ఆ శాస్త్రార్థము ననుసరించునట్టి యే మనుష్యులు బ్రాహ్మణాదులు ముముక్షువులు గలరో, వారలందఱును, మమ = ఈశ్వరుఁడను నాకు; అభిమత మగు శ్రుతిస్మృతివిహిత మయిన, వర్త్మ = కర్మమార్గమునే; అనువర్తన్తే. లేక. మమ = ఈశ్వరుఁడను నాయొక్క; కృత్యమునకు విషయమైన కర్మమార్గమును; అనువర్తన్తే—విశేషించి కర్మమునే చేయుచున్నా రని యర్థము.

♦ వాసుదేవునకు రెండురూపములు, వ్యక్తమనియు అవ్యక్తమనియు; అవ్యక్తము పరబ్రహ్మము, వ్యక్తం బీచరాచరము.

* ఎందు ఎట్టిభావన యగునో అందు సిద్ధి అట్టిదే యగును.

మ. ఓయీ! ఎవ్వరు జ్ఞానతపస్సుచేఁ బరిశుద్ధులై నిష్కాములో, వారు మద్భావమును ♦ బొందుచున్నారు, ఎవ్వరు అశుద్ధులు సకాములో వారు పొందరు, కావున ఫలప్రదాత వగు నీకు వైషమ్యనైర్ఘృణ్యములు * సంభవించుననఁగా, అట్లు సంభవింప వని చెప్పుచున్నాఁడు.—యే = ఆర్తులును అర్థార్థులును జిజ్ఞాసువులును జ్ఞానులును ఎవ్వరు; యథా = ఏవిధముచేత, సకాములై కాని నిష్కాములై కాని; మామ్ = నన్ను, ఈశ్వరుని సర్వఫలప్రదాతను; ప్రపద్యన్తే = భజించుచున్నారో; తాన్; తథైవ = వారుకోరినఫలము నిచ్చుటచేతనే; భజామి = అనుగ్రహించుచున్నాను; అహమ్ = నేను; వేఱువిధమునఁ గాదు. అందు, ముముక్షువులు కాని ఆర్తులను అర్థార్థులను ఆర్తిహారణముచేతను అర్థదానముచేతను అనుగ్రహించుచున్నాను. జిజ్ఞాసువులను "వివిదిషన్తి యజ్ఞేన" ఇత్యాదిశ్రుతిచే విహిత మయిన నిష్కామకర్మము ననుష్ఠించువారలను జ్ఞానదానముచేతను, ముముక్షువు లయిన జ్ఞానులను మోక్షదానముచేతను అనుగ్రహించుచున్నాను. కాని ఒకటి కోరువానికి మఱియొక్కటి యొసంగ నని యర్థము. ఓయీ! అట్లయినను నీభక్తులకే ఫలము నిత్తువు కాని ఇతరదేవతాభక్తులకు ఫల మియ్యవు కావున వైషమ్యము ఉండనే యున్నది యనఁగా, లేదని చెప్పుచున్నాఁడు—మమ = సర్వాత్ముఁడను వాసుదేవుఁడను నాయొక్క; వర్త్మ = భజనమార్గమును, కర్మజ్ఞానరూపమును; అనువర్తన్తే; ఓపార్థుఁడా! సర్వశః = సర్వప్రకారములచేతను, ఇంద్రాదుల ననువర్తించువారుగూడ; మనుష్యాః అని కర్మాధికారులు చెప్పఁబడుచున్నారు. "ఇన్ద్రం మిత్రం వరుణ మగ్ని మాహుః" ఇత్యాదిమంత్రవర్ణమువలనను, ఫల మత ఉపపత్తేః అనున్యాయమువలనను సర్వదేవతారూపంబునను ఫలప్రదాత భగవంతుఁ డొక్కఁడే యని యర్థము. అట్లు చెప్పఁబోవుచున్నాఁడు "యే ఽప్యన్యదేవతా భక్తాః" ఇత్యాదిగా.

శ్రీ. ఓయీ! అప్పుడు నీకుఁగూడ వైషమ్య మున్నదా యేమి? ఏల యనఁగా, ఇట్లు నిన్నే శరణు పొందినవారలకుమాత్రమే ఆత్మభావం బొసంగుచున్నావు, ఇతరులకు సకాముల కొసంగవు. అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.— యథా = ఏవిధముచేత, సకామతచేఁ గాని నిష్కామతచేఁ గాని; యే = ఎవ్వరు; మామ్; భజించుచున్నారో; తాన్ = వారలను; అహమ్; తథైవ = వారు కోరినఫలము నిచ్చుటచే; భజామి = అనుగ్రహించుచున్నాను. కాని ఎవ్వరు సకాములై

♦ నీవగుటను.

* పక్షపాతమును దయ లేకుండుటయు.

నన్ను విడిచి యింద్రాదులనే భజింతురో, వారల నే నుపేక్షింతు నని తలంపవలదు. ఎందువలన ననఁగా. సర్వశః= సర్వప్రకారములచేత; ఇంద్రాదుల సేవించువారు గూడ, మమవర్త్మ = నాయొక్క భజనమార్గమునే, అనువర్తన్తే. ఇంద్రాదిరూపమునఁ గూడ నేనే సేవ్యుఁడను.

ప. ఓయీ! అప్పుడు నీయొద్దఁగూడ వైషమ్యము గలదు. ఎందువలన ననఁగా, నిన్ను శరణు పొందినవారికిమాత్రమే ఆత్మభావము నిచ్చుచున్నావు, సకాములకీయ్యవు. అనఁగాఁ జెప్పుచున్నాఁడు — యే = ఏయుపాసకులు; యథా= దేని నుద్దేశించి; మామ్; ప్రపద్యన్తే=శరణుచొచ్చుచున్నారో; నేను గూడ, తాన్; తథైవభజామి = ఆయాయుద్దేశమునే పూర్ణము గావించుచున్నాను. అట్లు చెప్పఁ బడినది « సురద్రుమోయద్వదుపాశ్రితార్థదః ” ♦ అని. ఇఁక ఆయాయుద్దేశములఁ గలిగించువాఁడనుగూడ నేనే యని చెప్పుచున్నాఁడు—సర్వశః మనుష్యాః = సర్వ మనుష్యులును; మమవర్త్మ = నాయొక్క మార్గమును; అను = గుఱిచేసికొని; వర్తన్తే—సర్వాంతర్యామి నగుటచే ఆయాగుణములతోఁ గూడిన బుద్ధులను ప్రేరించువాఁడనుగూడ నేనే యగుచున్నాను.

రా. దేవమనుష్యాదిరూపంబున మత్సమాశ్రయణంబు గోరువారల పరిత్రాణము మాత్రమె కాదు నేను జేయుట. మఱేమి యనఁగా; యే=నన్నాశ్రయింపఁ గోరినవార లెవ్వరు; యథా = ఏవిధముచేత, తమయపేక్ష కనురూపునిఁగా నన్ను సంకల్పించి; ప్రపద్యన్తే = సమాశ్రయించుచున్నారో; తాన్ = వారలగుఱించి; తథైవ = వారికోరికచొప్పుననె; భజామి=నన్నుఁ జూపుచున్నాను. ఇట నధికమేల? మనుష్యాః= మనుష్యులందఱును; నన్ననువర్తించుటయందే కోరికగలవారలు; మమ వర్త్మ = నాయొక్కస్వభావమును; యోగులకు వాఙ్మనసముల కగోచరమైనను తమ నేత్రాదీంద్రియములచే; సర్వశః = తాము గోరిన సర్వవిధములచేతను; అనువర్తన్తే= అనుభవించియున్నారు.

నన్నాశ్రయింపఁ గోరెడివారు తమయిష్టముచొప్పున ఏరూపము గలవానిఁగా నన్ను సంకల్పించి యాశ్రయించుచున్నారో నేను వారు సంకల్పించినవిధంబున ఆరూపముతో వారికి దర్శనమిచ్చుచున్నాను. అధిక మేల? నన్నాశ్రయింపఁ గోరు మనుష్యులందఱును, నాస్వభావము యోగులకు నెఱుంగరాని దయ్యును,

♦ కల్పవృక్షం బెట్లు ఆశ్రితులకోరికల నిచ్చునదియో.

వారుకోరినట్లు పతిపుత్త్రాదిరూపంబున దర్శన మిచ్చుచున్న నన్ను తమనేత్త్రాదీంద్రియములచే ననుభవించుచున్నా రని తాత్పర్యము.

**మా.** అన్యదేవతారూపంబున నన్ను భజించినమాత్త్రాన ముక్తి యేమో కలుగదు. అయినను అందఱకును వారివారి కనురూపముగా ఫలము నొసంగుచున్నా నని చెప్పుచున్నాఁడు.—భజామి= సేవించుచున్నాను ఫలప్రదానముచేత, కాని గుణభావమునఁ గాదు ♦. ఎట్లీవిశేషము కావచ్చును ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఇతరదేవతల యజించువారుగూడ, మమవర్త్మ = నామార్గమునే; అనువర్తన్తే; సర్వకర్మములఁ జేయువార లగుటవలనను, నేనే భోక్త నగుటవలనను. “ యే ఽప్యన్యదేవతాభక్తాః ” అని చెప్పఁబోవుచున్నాఁడు. “ యో దేవానాం నామధా ఏక ఏవ ”* అని గదా శ్రుతి. భగవంతుఁడే ఆశ్రుతియందుఁ బ్రతిపాదింపఁబడువాఁడు. “ అజస్య నాభా వధ్యేక మర్పితమ్ ” అని భగవంతుని బోధించులింగమువలన.

ఇతరదేవతారూపంబున నన్ను సేవించువారలకు ముక్తి యొసంగను గాని వారివారిసేవ కనురూపముగా స్వర్గాదిఫలము నొసంగుదును. ఇతరఫలమునైనను ఎ[?]త్తు ననఁగా అన్యదేవతాభక్తులుగూడ నామార్గమునే యనువర్తించెదరు, వారలు సకలకర్మములను జేయుదురు, ఆయజ్ఞాదికర్మములందు భోక్తను నేనే గదా! అని తాత్పర్యము.

కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా. ౧౨

**భా.** ఈశ్వరుఁడవు నీకు రాగాదిదోషంబులు లేవేని, నీకు సర్వప్రాణులయందు ననుగ్రహేచ్ఛ సమంబై యుండఁగా, నీవును సర్వఫలంబుల నిచ్చుటకును సమర్థుండవై యుండఁగా, “ సర్వంబును వాసుదేవుండు ” అను జ్ఞానముచేతనే ముముక్షువులై యెందువలన నిన్నే యందఱుం బ్రపన్నులుకారు ? అందువేని. వినుమందుకుఁ గారణము.—కర్మణామ్= కర్మములయొక్క; సిద్ధిమ్ = ఫలనిష్పత్తిని; కాఙ్క్షన్తః = కోరుచున్న వారలై; ఇహ = ఈలోకమునందు; దేవతాః = ఇంద్రాగ్నిప్రభృతులను; యజన్తే=ఆరాధించుచున్నారు. “ అథ యో ఽన్యాం దేవతా ముపాస్తే

♦ భృత్యభావమునఁ గా దనుట.

* ఎవఁడు ఒకఁడే దేవతలనామములను ధరించువాఁడో.

అన్యోఽసా వన్యోఽహమస్మీతి నస వేద యథా పశు రేవం స దేవానామ్"♦
అను శ్రుతివలన. అట్టి భిన్నదేవతాయాజులకు ఫలకాములకు, క్షిప్రమ్= శీఘ్రముగా; హి= ఏకారణమువలన; మానుషేలోకే= మనుష్యలోకము నందు; మనుష్యలోకంబునందుఁగదా శాస్త్రాధికారము, "క్షిప్రం హి మానుషేలోకే" అని విశేషణమువలన ఇతరలోకములందును కర్మ ఫలసిద్ధిని జూపుచున్నాఁడు భగవంతుఁడు, మానుషలోకంబునందు వర్ణా శ్రమాదికర్మంబు లని విశేషము; అట్టి వర్ణాశ్రమాద్యధికారు లగుకర్మ లకు; కర్మజా = కర్మములవలనఁ గలిగిన; సిద్ధిః = ఫలసిద్ధి; క్షిప్రముగా, భవతి = అగుచున్నది.

కర్మఫలసిద్ధిని గోరి యీలోకంబున మనుష్యులు నానావిధదేవతల నారా ధించెదరు. ఏల యనఁగా కర్మఫలసిద్ధి మనుష్యలోకంబున శీఘ్రముగాఁ గలుగు నని తాత్పర్యము.

ఆ. అనుగ్రాహ్యు లగు * ప్రాణు లవలంబించు జ్ఞానకర్మముల ననుస రించి భగవంతుఁడు వారియెడ ననుగ్రహముసేయుటవలన భగవంతునకు రాగద్వేష ములు లే వను నెడ, అప్పు డతనికి రాగద్వేషంబులు లేకపోవుటవలన సర్వప్రాణులం దును అనుగ్రహేచ్ఛ సమానమై యుండవలయును, సమానమైన యనుగ్రహేచ్ఛ యుండఁగా భగవంతునకు స్వల్పఫలము నిచ్చుటకుమాత్రమే సామర్థ్యము గల దనియు మోక్షాఖ్య మగు మహాఫల మిచ్చుటకు సామర్థ్యము లే దనియుఁ జెప్పుట యుక్తము గాదు, అప్రతిహతము లైనజ్ఞానేచ్ఛాశక్తులు గలవాఁడ వగు నీవు సకల ఫలంబుల నొసంగుటకును సమర్థుఁడ వగుటవలన; అట్లు నీకు సమానమయిన యను గ్రహేచ్ఛ యుండఁగా నీవును సకలఫలంబుల నిచ్చుటకును సమర్థుఁడవై యుండఁగా సర్వప్రాణులును స్వల్పఫలం బయిన యభ్యుదయమును విడిచి మోక్షముసే యపేక్షిం చినవారలై జ్ఞానముచే నిన్నే యెందు కాశ్రయింపఁగూడ దని ప్రశ్న చేయుచున్నాఁడు ఈశ్వరుఁడవు ఇత్యాదిగా. వారలకు మోక్షాపేక్ష లేకుండుటయు మోక్షోపాయ భూతమైన జ్ఞానమునెడఁ గూడ విముఖతయు భగవత్ప్రాప్తి లేకపోవుటకు హేతు

♦ ఇఁక ఎవ్వఁడు ఇతరదేవతను ఉపాసించుచున్నాఁడో నాకన్న వేఱు ఇతఁడు నేను వేఱు అని, అతఁ డెఱుంగఁడు. మనకుఁ బశు వెట్లో అట్లు అతఁడు దేవతలకు.

* అనుగ్రహింపఁ దగిన.

వుగాఁ జెప్పువారలై సమాధానము నారంభించుచున్నారు వినుము ఇత్యాదిగా. కర్మఫలసిద్ధిని గోరువాఁడు ఎందుకు మానుషలోకంబున దేవతారాధనము చేయవలయును? అనఁగాఁ జెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత. కర్మఫలసిద్ధిఁ గోరి యష్టృయష్టవ్యభేదముఁ * జూచువారలకు అట్టిభేదదర్శనమునకుఁ గారణము ఆత్మా ఽజ్ఞానం బనుటకు బృహదారణ్యక శ్రుతి నుదాహరించుచున్నారు అథేత్యాదిగా. అవిద్యాప్రకరణము నుపక్రమించుటకై అథ అని చెప్పఁబడినది. ఉపాసనమును—భేదదర్శనమును అనువదించి అందుకుఁ గారణ మాత్మజ్ఞానము కా దని చూపుచున్నది నసవేద అని. ఎట్లు అస్మదాదులకు నాఁగేలులాగుట మొదలగువానిచేఁ బశు వుపకరించుచున్నదో అట్లు అజ్ఞుఁడు దేవతలకు యాగాదులచే నుపకరించుచున్నాఁ డని చెప్పుచున్నది యథా పశు రేవం సదేవానామ్ అని. ఎందువలన ఆఫలార్థులు భిన్నదేవతల యజించువారు జ్ఞానమార్గము నపేక్షింపరు? అనుప్రశ్నకు నుత్తరముగా నుత్తరార్ధమును వివరించుచున్నారు అట్టి భిన్నదేవతాయాజులకు ఇత్యాదిగా. ఎందువలన ఈకర్మాధికారులకుఁ గర్మప్రయుక్తమైనఫలము ఈలోకమున శీఘ్రమున సిద్ధించుచున్నదో అందువలన వారలకు మోక్షమార్గమునెడ విముఖత కలుగుచున్న దని యర్థము. మానుషేలోకే అనువిశేషణ మెందు కని యాశంకించి చెప్పుచున్నారు మనుష్యలోకమునందుఁ గదా ఇత్యాదిగా. ఇతరలోకములయం దప్పడు కర్మఫలసిద్ధి లే దని యాశంకించి క్షిప్రమ్ అనువిశేషణమునకుఁ దాత్పర్యము చెప్పుచున్నారు క్షిప్రం హి మానుషేలోకే ఇత్యాదిగా. మనుష్యలోకంబునఁ గర్మఫలసిద్ధి శీఘ్రంబుననగుచున్నది, ఇతరలోకంబుల విలంబముగా నగు నని విభాగము చేయుటకు ఏమి హేతు వని యాశంకించి సామగ్రియుండుటవలనను లేకపోవుటవలనను అని చెప్పుచున్నారు మానుషలోకమునందు ఇత్యాదిగా. మనుష్యలోకమునందుఁ గర్మఫలసిద్ధి శీఘ్రముగా నగుటవలన కర్మఫలాభిముఖు లగువారికి జ్ఞానమార్గవిముఖత ప్రాయికం బని యుపసంహరించుచున్నారు అట్టి ఇత్యాదిగా.

హ. మఱియును. కర్మణామ్ = యజ్ఞాదులయొక్క; సిద్ధిమ్ = స్వర్గాదిఫలమును; కాఙ్క్షన్తః = కోరినవారలై; ఇహ = ఈలోకమునందు; దేవతాః = ఇంద్రాదులను; యజన్తే = పూజించుచున్నారు. హి = ఎందువలన ననఁగా; క్షిప్రమ్= శీఘ్రముగా; మానుషేలోకే; కర్మజా సిద్ధిః = కర్మఫలము; భవతి=కలుగుచున్నది. అట్లు ఇతరలోకమునఁ గలుగదు, వర్ణాశ్రమాదివిశేషములు లేమివలన.

* నేను యజించువాఁడను, వీరు దేవతలు యజింపఁబడువారు అను భేదమును.

శం. ఓయీ! మోక్షమునకు సమీపకారణమును సర్వశ్రుతిప్రసిద్ధము నగు జ్ఞానయోగమును విడిచి పండితులుగూడ నెందుకుఁ గర్మమార్గము ననుష్ఠించెద రని యాశంకింపఁగా; అట్లు కాదు, జ్ఞానయోగము చిత్తశుద్ధిచేతనే పొందఁదగినది, చిత్తశుద్ధి లేక సర్వకర్మములను సన్న్యసించి జ్ఞానయోగమునందుఁ బ్రవర్తించినవానికి జ్ఞాననిష్ఠ సిద్ధింపదు, జ్ఞాననిష్ఠ సిద్ధింపనియెడ మోక్షము లభింపదు, అందుచే జ్ఞానకర్మఫలముల రెంటను జెడినవాఁ డగును. అందువలన మోక్షమునకు మొదటిది ముఖ్యకారణము చిత్తశుద్ధియే, అది కర్మములచేఁ బొందఁదగినది కావునఁ బండితులు కర్మమునే చేయుచున్నా రను నభిప్రాయముచేఁ జెప్పుచున్నాఁడు.—ఇహ = ఈలోకమునందు; దేవతాః = ఇంద్రాగ్న్యాది దేవతలను; తత్ప్రసాదము పొందుటకై, యజన్తః = ఆజ్యాదిహవిస్సులచే ఆరాధించుచున్న పండితులు; కర్మణామ్ = శ్రద్ధాభక్తులతో నియమంబున అనుష్ఠించిన శ్రౌతాదికర్మములయొక్క; అనుష్ఠానముచేఁ బొందఁబడిన, సిద్ధిమ్—సత్త్వశుద్ధిరూపమును; కాఙ్క్షన్తః = కోరుచున్నవారై; మనువర్త్మానువర్తన్తే అని పూర్వశ్లోకముతో నన్వయము. ఓయీ! హఠయోగము మొదలగు యోగములచేతఁ గూడ చిత్తశుద్ధి సంపాదింపవచ్చును, కర్మమేల? అనఁగా. అట్లు కాదు, అవి యవైదికము లగుటవలనను బ్రాహ్మణునకు విహితములు కాని వగుటవలనను వాని ననుష్ఠించుట అయోగ్య మగుటవలన, అవి యనుష్ఠించినను వానిచేఁ జిత్తశుద్ధి బహుకాలసాధ్య మగుటవలనఁగూడ, ముముక్షు వగు బ్రాహ్మణునకుఁ గర్మమే యవశ్య మనుష్ఠింపఁ దగిన దను నాశయముచేఁ జెప్పుచున్నాఁడు.—హి = ఏకారణమువలన; మానుషేలోకే = కర్మభూమియందు; కర్మజా = వైదికకర్మానుష్ఠానముచేఁ గలుగునట్టి; సిద్ధిః = చిత్తశుద్ధి; క్షిప్రమ్ = శీఘ్రమే; భవతి = అగుచున్నది, యజ్ఞములచే ఆరాధింపఁబడిన దేవతల ప్రసాదమువలన శీఘ్రముగనే మనస్సు ప్రసన్న మగుచున్న దని యర్థము. మానుషేలోకే సిద్ధిః అని చెప్పుటవలన, మనుష్యలోకమునందే నాలుగువర్ణములును నాలుగాశ్రమములును కర్మవిధియును, ఇతరలోకమునందు లేవు అని సూచిత మవుచున్నది.

మ. ఓయీ! భగవంతుని వాసుదేవుని నిన్నే యేల యందఱును బ్రపన్నులు కారు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు —కర్మణామ్; సిద్ధిమ్ = ఫలనిష్పత్తిని ♦; కాఙ్క్షన్తః; ఇహ = ఈలోకమునందు; దేవతాః = ఇంద్రాగ్న్యులు మొదలగు దేవత

♦ ఫలము కలుగుటను.

లను; యజన్తే = పూజించుచున్నారు, అజ్ఞానప్రతిహతు లగుటవలన; కాని నిష్కాములై నన్ను భగవంతుని వాసుదేవునిఁ బూజింప రని శేషము. ఎందువలన ? హి= ఎందువలన ననఁగా; ఇంద్రాది దేవతల యజించుచుఁ దత్ఫలముఁ గోరువారలకు, కర్మజాసిద్ధిః=కర్మజన్యమైనఫలము; క్షిప్రమ్ = శీఘ్రముగనే; భవతి, మానుషేలోకే. జ్ఞానఫలమో అంతఃకరణశుద్ధి నపేక్షించునది యగుటవలన శీఘ్రముగ సిద్ధింపదు. మానుషలోకమునందుఁ గర్మఫలము శీఘ్రముగాఁ గలుగు నను విశేషణమువలన ఇతరలోకమునందుఁగూడ వర్ణాశ్రమధర్మవ్యతిరిక్త కర్మఫలసిద్ధి ♦ భగవంతునిచే సూచింపఁబడినది. ఎందువలన ఆయాకర్మఫలములసిద్ధికొఱకు సకాములై మోక్షవిముఖులై ఇతరదేవతల నారాధించుచున్నారో అందువలన ముముక్షువులవలె నన్ను సాక్షాద్వాసుదేవుని వారు ప్రపన్నులు గా రని యర్థము.

శ్రీ. అప్పుడు మోక్షార్థమే యెందు కందఱును భజింపరు ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—కర్మణామ్, సిద్ధిమ్ = ఫలమును; కాఙ్క్షన్తః; ప్రాయికముగా, ఇహ = మనుష్యలోకమునందు; ఇంద్రాదిదేవతలనే; యజన్తే, కాని నన్నే యజింపరు. హి = ఎందువలన ననఁగా; కర్మజాసిద్ధిః = కర్మమువలనఁ గలుగు ఫలము; శీఘ్రముగాఁ గలుగుచున్నది. జ్ఞాన ఫల మగు కైవల్య మేమో అట్లు కాదు, జ్ఞానము దుర్లభం బగుటవలన.

ప. ఇఁక దానినే ప్రకటించి చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ఎవ్వరైనను; కర్మణామ్; సిద్ధిమ్; కాఙ్క్షన్తః=కోరుచున్నవారలై; దేవతాః=ఇంద్రాదులను; యజన్తే. వారలకు, హి = నిశ్చయముగా; కర్మజాసిద్ధిః; ఇచటనే మనుష్యలోకమునందు; క్షిప్రమ్ = శీఘ్రముగా; భవతి, కాని జన్మాంతరరూప విలంబముచేఁ గాదు. దేని ఏదేవతకు అర్పణము చేయుచున్నారో దానిచే ఆదేవతను తృప్తిఁ బొందించుచున్నాను, నేనే సంతర్పితుండనై ఆయాదేవతరూపంబునఁ గామితంబులఁ దీర్చెదనని యర్థము

రా. ఇప్పుడు ప్రసంగాగత మగుదాని ముగించి ప్రకృత మగు కర్మయోగము జ్ఞానాకార మగువిధముఁ జెప్పుటకై అట్టి కర్మయోగమునం దధికారి దుర్లభుం డని చెప్పుచున్నాఁడు.—సమస్తపురుషులును, కర్మణామ్; సిద్ధిమ్ = ఫలమును; కాఙ్క్షన్తః = కోరినవారలై; దేవతాః = ఇంద్రాదిదేవతలనే; యజన్తే = ఆరాధించుచు

♦ వర్ణాశ్రమధర్మములకంటె భిన్నము లయిన కర్మములఫలముయొక్క సిద్ధి.

న్నారు; కాని యెవ్వఁడును ఫలాభిసంధి లేనివాఁడై ఇంద్రాదిదేవతల కాత్మభూతుని సర్వయజ్ఞములకును భోక్తను నన్ను ఆరాధింపఁడు. ఎందువలన నిట్లు? హి= ఎందువలన ననఁగా; క్షిప్రమ్ = శీఘ్రముగా; మానుషేలోకే = ఈమనుష్యలోకమునందే; కర్మజా; సిద్ధిః = పుత్త్రిలు పశువులు అన్నము మొదలగువాని సిద్ధి; భవతి. మానుషలోకశబ్దము స్వర్గాదిఫలమునుగూడ సూచించుచున్నది. లౌకికు లగు పురుషులందఱును తుదఁగులేని యనాదికాలప్రవృత్త మగు అనంతపాపసంచయము గలవారలగుటచే అవివేకులై శీఘ్రఫలము గోరి పుత్త్రిపశ్వన్నాదులను స్వర్గాదులను గలిగించునట్టి సర్వకర్మములను ఇంద్రాదిదేవతారాధనమాత్రరూపములను జేయుచున్నారు. కాని యొకానొకండును సంసారమునుండి విసిగినహృదయము గలవాఁడై ముముక్షువై మదారాధనరూప మయిన కర్మయోగము నారంభింపఁ డని యర్థము.

**మా.** ఎందువలన నామార్గము ననువర్తించెదరు? ఇందుకుఁ జెప్పుచున్నాఁడు క్షిప్రం హీత్యాదిగా. వీనివలననే ♦ గదా ఫలప్రాప్తి. "తస్మాత్తే ధనసనయః" * అని శ్రుతి.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. ౧౩

**భా.** మానుషలోకమునందే వర్ణాశ్రమాదికర్మాధికారము, ఇతరలోకములందు లే దను నియమము దేనివలన? అందు వేని. లేక; వర్ణాశ్రమాదిప్రవిభాగముతోఁ గూడిన మనుష్యులు నామార్గము ననువర్తింతురు సర్వప్రకారముల నని చెప్పఁబడినది; ఏకారణమునవలన మఱి నియమంబున నీమార్గమునే యనువర్తింతురు? ఇతరునిమార్గము ననువర్తింపరు? అందు వేని. చెప్పెదము.—చాతుర్వర్ణ్యమ్=నాలుగువర్ణములు, మయా= ఈశ్వరుఁడ నగు నాచేత; సృష్టమ్ = పుట్టింపఁబడినవి, "బ్రాహ్మణో ఽస్య ముఖ మాసీత్" ఇత్యాది శ్రుతివలన; గుణకర్మవిభాగశః = గుణవిభాగముచేతను కర్మవిభాగముచేతను; గుణములు సత్త్వరజస్తమములు, అందు సాత్త్వికుఁడు సత్త్వప్రధానుఁ డగు బ్రాహ్మణునకు శమము దమము తపస్సు మొదలగునవి కర్మములు, సత్త్వోపసర్జనం ♦ బగు రజోగుణము

♦ భగవంతునివలననే.

* వానివలన వారు ధనలాభము గలవారు.

♦ సత్త్వము అముఖ్యముగా—కొంచెముగాఁ గలది.

ప్రధానముగాఁ గల క్షత్త్రియునకు శౌర్యము తేజస్సు మొదలగునవి కర్మములు, తమోగుణోపసర్జనం బగు రజస్సు ప్రధానముగాఁ గల వైశ్యునకుఁ గృషి మొదలగునవి కర్మములు, రజోగుణోపసర్జనం బగు తమస్సు ప్రధానముగాఁ గల శూద్రునకు శుశ్రూషమాత్రమే కర్మము, ఇట్లు గుణకర్మవిభాగముచే చాతుర్వర్ణ్యము నాచే సృజింపఁబడినది యని యర్థము. అట్టి యీచాతుర్వర్ణ్యము లే దితరలోకములందు, అందువలన మానుషే లోకే అని విశేషణము. అకటా ! అప్పుడు చాతుర్వర్ణ్యసృష్టి మొదలగు కర్మమునకుఁ గర్త వగుటవలనఁ దత్ఫలములందుఁ దగులు చున్నాఁడవు, కావునఁ గావు నీవు నిత్యముక్తుఁడవు నిత్యేశ్వరుఁడవు అందు వేని. చెప్పెదము.—సరే మాయాసంవ్యవహారముచే, తస్య= ఆకర్మము యొక్క, కర్తార మపి = కర్తనైనను; అట్లయినను; మామ్ = నన్ను; పరమార్థమున, అకర్తారమ్= కర్తనుగాని వానిఁగా; ఇందువలననే, అవ్య యమ్ = నిర్వికారునిఁగాను, అసంసారినిగాను; విద్ధి = ఎఱుంగుము.

బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రు లను నాలుగువర్ణములను వారివారి గుణములను బట్టి తత్తత్కర్మములను విభాగించి, నేనే సృజించితిని. అయినను ఆ సృష్టిరూప కర్మమునకు నేను మాయాసంబంధమునఁ గర్తను గాని పరమార్థమున కర్తను గా ననియు నిత్యేశ్వరుఁడ ననియు నెఱుంగుము అని తా.

**ఆ.** మనుష్యలోకమునందే నాలుగువర్ణములును నాలుగాశ్రమంబులును గల వను హేతువుచేఁ గర్మాధికారము నియమించుటకుఁ గారణము నడుగుచున్నాఁడు మానుషలోకమునందే ఇత్యాదిగా. వర్ణాశ్రమాది అనుచోటి యాదిశబ్దముచే అవ స్థావిశేషములు చెప్పఁబడుచున్నవి. మఱియొక ప్రకారమునఁ గడచినవిషయము ననువ దించియాక్షేపము దీయుచున్నాఁడు లేక ఇత్యాదిగా. రెండుప్రశ్నలను బరిహరించుచు న్నారు చెప్పెదము అని. అప్పుడు నీకుఁ గర్తృత్వ భోక్తృత్వములు సంభవించుట వలన అస్మదాదులతోఁ దుల్యుఁడ వగుటచే అనీశ్వరత్వము వచ్చు నని యాశంకించి చెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత. విషమసృష్టిని జేయునట్టి యీశ్వరునకు సృష్టివై షమ్యమును నిర్వహించుదానిం జెప్పుచున్నారు గుణకర్మవిభాగశః అని. గుణవిభాగ ముచేతను గర్మవిభాగము చేతను చెప్పిన చాతుర్వర్ణ్యసృష్టినే స్పష్టీకరించుచు న్నారు అందు ఇత్యాదిగా. ప్రకృతమైన ప్రశ్నద్వయ సమాధానము నుపసంహరించు

చున్నారు అట్టి యీ ఇత్యాదిగా. మనుష్యలోకమునందే వర్ణాశ్రమాదికము గలుగుటవలనఁ గర్మమునం దధికారము, అందే వర్ణాదికము నీశ్వరుఁడు సృజించుట వలన. ఇతరలోకములయందుఁ గర్మాధికారము లేదు, అట వర్ణాదికము లేక పోవుటవలన. చాతుర్వర్ణ్యచాతురాశ్రమ్యాది విభాగము వహించునట్టి యధికారులు ఈశ్వరునే యనువర్తింతురు, ఈశ్వరుఁడే వర్ణాదికమును వానివ్యాపారమును సృజించినవాఁ డగుటవలన యుక్తము వా రతని ననువర్తించుట యని యర్థము. ఉక్తార్థముచేఁ బరిహరింపఁదగిన యాక్షేపమును దీయుచున్నారు అకటా ఇత్యాదిగా. ఈశ్వరుఁడు చాతుర్వర్ణ్యాదికమునకుఁ గర్త యను కారణమువలన మున్ను చెప్పిన నియమము అభిమతం బగునేని, తత్స్రష్ట్యాదికమునకును తన్నిష్ఠవ్యాపారము ధర్మాదికమునకును నిర్వర్తకుఁడ వగుటవలన, తత్ఫలము కర్తను బొందునది యగుట వలన, కర్తృత్వభోక్తృత్వములు నీయందుఁ బ్రసక్తించుటవలన నిత్యముక్తత్వాదికము నీకు లేకపోవు నని యర్థము. మాయచేఁ గర్తృత్వంబును బరమార్థముచే అకర్తృత్వంబును అని యంగీకరించుటవలన నిత్యముక్తత్వాదికము సిద్ధించుచున్నది యని యుత్తరముఁ జెప్పుచున్నారు చెప్పెదము అని. మాయాప్రవృత్త మగు వ్యవహారముచేఁ జాతుర్వర్ణ్యాదికమునకును తత్కర్మమునకును నేను కర్త ననుట సరే, అట్లయినను, అట్టి నన్నుఁ బరమార్థమున అకర్తనుగా నెఱుంగు మని సంబంధము. అకర్త నగుటవలననె అభోక్త ననుటయు సిద్ధించుచున్న దని చెప్పుచున్నారు ఇందువలనని ఇత్యాదిగా.

హ. అందువలననే.—చాతుర్వర్ణ్యమ్ = నాలుగువర్ణములు; మయా = ఈశ్వరుఁడ నగు నాచేత; సృష్టమ్. గుణాదులు సత్త్వాదులు, వాని విభాగముచేతః అందు సాత్త్వికుఁ డగు బ్రాహ్మణునకు శమము దమము తపస్సు మొదలగునవి కర్మములు, సత్త్వోపసర్జనుఁడు రజఃప్రధానుఁ డగు క్షత్త్రియునకు శౌర్యతేజః ప్రభృతులు కర్మములు, రజఃప్రధానుఁ డగు వైశ్యునకుఁ గృష్యాదులు కర్మములు, తామసుఁ డగు శూద్రునకు శుశ్రూషమాత్రమే కర్మము, ఇట్లు గుణకర్మవిభాగమున చాతుర్వర్ణ్యము నాచే సృజింపఁబడిన దని యర్థము. తస్య = ఆచాతుర్వర్ణ్యమునకును శమాదిక మగు తత్కర్మమునకును; కర్తారమ్; మామ్=నన్ను ఈశ్వరునిగా; విద్ధి = ఎఱుంగుము. వాస్తవముగ, అకర్తారమ్, అవ్యయమ్ = అవికారినిగా; విద్ధి = ఎఱుంగుము.

శం. మమ వర్త్మానువర్తన్తే అనుచో నాకృత్యమునకు విషయభూతమయిన కర్మమార్గము ననువర్తించుచున్నా రని యేది చెప్పఁబడినదో దాని స్పష్టీకరించుచున్నాఁడు.—గుణకర్మవిభాగశః = సత్త్వాదిగుణములయొక్కయు శమాదికర్మములయొక్కయు విభాగముచేత, రజోగుణోపసర్జన మైన సత్త్వము ప్రధానముగాఁ గల బ్రాహ్మణునకు శమదమాదులు కర్మములు, సత్త్వోపసర్జనం బగురజస్సు ప్రధానముగాఁ గల క్షత్రియునకు శౌర్యతేజోధృతిప్రభృతులు కర్మములు, తమోగుణోపసర్జనం బగురజస్సు ప్రధానముగాఁ గలవైశ్యునకుఁ గృష్యాదులు కర్మములు, రజోగుణోపసర్జనం బగు తమస్సు ప్రధానముగాఁ గల శూద్రునకుఁ గర్మము పరిచర్య, ఇట్లు గుణకర్మవిభాగముచే, చాతుర్వర్ణ్యమ్= నాలుగువర్ణములును, నాలుగాశ్రమములును; సర్గాదిని, మయా, సృష్టమ్. అందువలననే « మమవర్త్మానువర్తన్తే మనుష్యాః » అని యేది చెప్పఁబడినదో అది సిద్ధము. « యత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే యత్కర్మ కురుతే తదభి సంపద్యతే » ♦ అను శ్రుతివలన, నీకును అప్పుడు చాతుర్వర్ణ్యసృష్టికర్మకర్త యైనవానికిఁ దత్ఫల మైనజన్మాదికముతో సంబంధము సంభవించుటవలన నిత్యేశ్వరత్వాదికము సిద్ధింపదు, అందువేని. అట్లు గాదు, « వికల్పో నహివస్తు, మాయామాత్ర మిదం ద్వైతమ్ » అను శ్రుతివలన స్రష్టృస్రష్టవ్యాదికము * మాయికం బగుటచే మిథ్య యగుటవలన నిష్కలుండను నిష్క్రియుండను అవిక్రియుండను నాకు సృష్ట్యాదిక్రియ సంభవింపదు; కావున వాస్తవముగ నన్ను అకర్తనుగానే యెఱుంగు మని చెప్పుచున్నాఁడు.—తస్య=ఆచాతుర్వర్ణ్యమునకును బ్రపంచకమునకును; మాయామోహితచిత్తులకు కర్తగాఁ దోఁచుచున్నవానినైనను; మామ్=నన్నుఁ బరమాత్మను; అకర్తారమ్= నిర్గుణుండ నగుటవలనఁ బరమార్థముచేఁ గర్తృత్వాదిధర్మములు లేని వానిఁగానే; విద్ధి. కర్తృత్వము లేనియప్పుడు కర్మమును లేకపోవుటచేఁ దత్ఫల మయిన జన్మాదికము సంభవింపమివలన, అవ్యయమ్=నాశరహితునిఁగా, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావునిఁగానే యెఱుంగు మని యర్థము.

మ. శరీరమునకుఁ గారణ మయిన గుణములయొక్క వైషమ్యమువలనఁ గూడ అందఱును సమానస్వభావులు కా రని చెప్పుచున్నాఁడు.—చాతుర్వర్ణ్యమ్ = నాలుగువర్ణములు; మయా = ఈశ్వరుఁ డను నాచేత; సృష్టమ్=పుట్టింపఁ

♦ ఎట్టిసంకల్పము గలవాఁ డగుచున్నాఁడో, అట్టి కర్మము జేయుచున్నాఁడు, ఎట్టి కర్మము చేయుచున్నాఁడో అట్టి ఫలమును బొందుచున్నాఁడు.

* సృజించువాఁడును సృజింపఁబడినదియు మొదలగునది.

బడినది; గుణకర్మవిభాగశః = గుణవిభాగముచేతను కర్మవిభాగముచేతను. ఎట్లనఁగా. సత్త్వగుణప్రధానులు బ్రాహ్మణులు, వారలకు సాత్త్వికము లగు శమదమాదులు కర్మములు; సత్త్వోపసర్జనరజఃప్రధానులు క్షత్త్రియులు; వారలకు అట్టివైన శౌర్యతేజఃప్రభృతులు కర్మములు; తమఉపసర్జనరజఃప్రధానులు వైశ్యులు, వారికి అట్టివైన కృష్యాదులు కర్మములు; తమఃప్రధానులు శూద్రులు, వారలకుఁ దామసము లగు త్రైవర్ణికశుశ్రూషాదులు కర్మములు, ఇట్లు మానుషలోకమునందు వ్యవస్థితములు. ఇట్లయినచో; విషమస్వభావ మగు చాతుర్వర్ణ్యము సృజించిన వాఁడ వగుటచే నీకు వైషమ్యము వారింప నశక్య మని యాశంకించి యట్లు కాదని చెప్పుచున్నాఁడు.—తస్య = ఆవిషమస్వభావ మగు చాతుర్వర్ణ్యమునకు; వ్యవహారదృష్టిచే, కర్తార మపి; మామ్; పరమార్థదృష్టిచే, అకర్తారమ్, అవ్యయమ్ = నిరహంకారుఁడ నగుటచే తఱుఁగు లేని మహిమ లేనివానిఁగా; విద్ధి.

శ్రీ. కొందఱు సకాములై కొందఱు నిష్కాములై ప్రవర్తించుచున్నారు కావునఁ గర్మవైచిత్ర్యమును అట్టికర్మము చేయునట్టి బ్రాహ్మణాదులకు ఉత్తమమధ్యమాది వైచిత్ర్యమును § చేయునట్టి నీ కెట్లు వైషమ్యము లేదు? అని యాశంకించి చెప్పుచున్నాఁడు.—చాతుర్వర్ణ్యమ్ = నాలుగువర్ణములు, స్వార్థమున ష్యఞ్ ప్రత్యయము. ఇది యర్థము—సత్త్వప్రధానులు బ్రాహ్మణులు, వారలకు శమదమాదికర్మములు; సత్త్వరజఃప్రధానులు క్షత్త్రియులు, వారలకు శౌర్యయుద్ధాదికర్మములు; రజస్తమఃప్రధానులు వైశ్యులు, వారలకుఁ గృషివాణిజ్యాదికర్మములు; తమఃప్రధానులు శూద్రులు, వారలకు త్రైవర్ణికశుశ్రూషాదికర్మములు; ఇట్లు గుణములయుఁ గర్మములయు విభాగములచే చాతుర్వర్ణ్యము నాచేతనే సృజింపఁబడినది యనుట సత్యము. అట్లయినను, దాని చేసిన వాఁడనైనను, ఫలముచే అకర్తనుగా నన్నెఱుంగుము. అందుకు హేతువు—అవ్యయమ్ = ఆసక్తి లేనివాఁడ నగుటచే శ్రమము లేనివాఁడను నాశాదిరహితుఁడను ఐనవానిని.

ప. ఇఁక వైషమ్యముఁ బరిహరించుటకై చెప్పుచున్నాఁడు.—నాలుగు వర్ణములభావము చాతుర్వర్ణ్యము బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్రరూపము, గుణకర్మవిభాగశః, నాచేతనే సృజింపఁబడినది; గుణములు సత్త్వాదులు, కర్మము ఆయావర్ణాశ్రమములకుఁ దగినది, ఆయావర్ణములకుఁ దగిన ఆగుణకర్మముల విభాగముచేత

§ ఉత్తమత్వము మధ్యమత్వము మొదలగు విచిత్రతను.

విరాడ్రూపుఁడ నగు నాచే నిర్మింపఁబడినది. తస్య = ఆ చాతుర్వర్ణ్యమునకు; విరాడ్రూపంబుననే, కర్తారమ్, మామ్, విద్ధి = ఎఱుంగుము. అట్లు, అవ్యయమ్ = అక్షరుని శుద్ధస్వరూపుని అనంగుని; అకర్తారమ్, విద్ధి. ఇట శాతపథశ్రుతి «త దేత ద్బ్రహ్మవిట్ శూద్ర స్త దగ్ని నైవ దేవేషు బ్రహ్మ ఉభవ ద్బ్రాహ్మణో మనుష్యేషు క్షత్త్రియేణ క్షత్త్రియో వైశ్యేన వైశ్య శ్శూద్రేన శూద్రః" అని. భాష్యము.—బ్రహ్మక్షత్త్రవిట్ఛూద్రు లని యేచాతుర్వర్ణ్యము గలదో, తదేతత్ = అది యిది. అది యేది ? తత్ = అది. వారియందు, అగ్నినా = వైశ్వానరుఁ డను నామాంతరము గల సమష్టి యగు విరాడ్రూపముచేత, దేవేషు = దేవతలయందు, బ్రహ్మ అభవత్. అతఁడే మనుష్యులందు బ్రాహ్మణుఁడు. క్షత్త్రియునిచే క్షత్త్రియుఁ డయ్యెను. అట్లు, దేవతలయందు వసురుద్రాదిత్యాది పద్విధవైశ్యునిచే, మనుష్యులందు వైశ్యుఁ డయ్యెను. అట్లు, దేవతలందు అనేకవిధుండు పూషాఖ్యుం డగు శూద్రునిచే మనుష్యులందు శూద్రుఁ డయ్యెను. అట్లు, «బ్రాహ్మణో ఉస్య ముఖమాసీత్, బాహూ రాజన్యః కృతః" అనియును.

రా. ఈచెప్పిన కర్మయోగము నారంభించుటకు విరోధి యగు పాపము క్షయించుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—చాతుర్వర్ణ్యము మొదలుగాఁ గల బ్రహ్మాదిస్తంబపర్యంత మైన సర్వజగత్తును సత్త్వాదిగుణవిభాగముచేతను తదనుగుణ మగు శమాదికర్మముల విభాగముచేతను విభజించి నాచే సృజింపఁబడినది. సృష్టిగ్రహణము రక్షాదిప్రదర్శనార్థము. నాచేతనే రక్షింపఁబడుచున్నది, నాచేతనే యుపసంహరింపఁబడుచున్నది. తస్య = అవిచిత్రసృష్ట్యాదికమునకు; కర్తార మపి= కర్త నగువానినైనను; అకర్తారమ్ = కర్త కానివానిఁగా; మామ్; విద్ధి.

మా. నేనే గదా కర్త నని చెప్పుచున్నాఁడు.—చాతుర్వర్ణ్యమ్ = నాలుగువర్ణముల సమూహము. సాత్త్వికుఁడు బ్రాహ్మణుఁడు, సాత్త్వికరాజసుఁడు క్షత్త్రియుఁడు, రాజసతామసుఁడు వైశ్యుఁడు, తామసుఁడు శూద్రుఁడు అని గుణవిభాగము; కర్మవిభాగమో «శమోదమః» ఇత్యాదిగ్రంథముచేఁ జెప్పఁబోవుచున్నాఁడు. క్రియయందలి వైలక్షణ్యమువలనఁ గర్తయైనను అకర్త యగుచున్నాఁడు. అట్లు శ్రుతి—«విశ్వకర్మా విమనాః» * ఇత్యాదికము. «తను ర్విద్యా క్రియాకృతిః» అనియును. సాధింపఁబడినదిగూడ పూర్వాధ్యాయమునందు.

* సమస్తమును జేయువాఁడైనను అభినివేశము లేనివాఁడు.

న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా
ఇతి మాం యో ఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే.    ౧౪

భా. ఏకర్మములకు మఱి కర్తనుగా నన్నుఁ దలంచుచున్నావో, పరమార్థంబున ఆకర్మములకుఁ గర్తనే కాను నేను. ఎందువలన ననఁగా.— మామ్ = నన్ను; కర్మాణి = ఆకర్మములు; నలిమ్పన్తి = అంటవు దేహాది కారణములై, అహంకారము లేకపోవుటవలన. కర్మఫలే = ఆకర్మముల ఫలమునందు; స్పృహా చ = ఆశయును; న = లేదు. ఇఁక నెవ్వరికి సంసారులకుఁ గర్మములందు నేను కర్త నను నభిమానము గలదో, తత్ఫలంబులందును స్పృహా గలదో, వారిని కర్మము లంటుచున్నవి యనుట యుక్తము. అవి లేకుండుటవలన నన్నుఁ గర్మము లంటవు. ఇతి = ఇట్లు, యః = ఇతరుఁడును ఎవ్వఁడు; మామ్ = నన్ను; ఆత్మగా, అభిజానాతి = గుర్తించుచున్నాఁడో, కాను నేను కర్తను, లేదు నాకుఁ గర్మఫలమునందు స్పృహా యని; సః = అతఁడు; కర్మభిః = కర్మములచేత; నబధ్యతే = బంధింపఁబడఁడు, వానికిని దేహాదికారణములు కావు కర్మము లని యర్థము.

నేను కర్త నను నభిమానము లేకుండుటవలనను కర్మఫలమునందు స్పృహా లేకుండుటవలనను నన్నుఁ గర్మములు అంటవు. ఇట్టి నన్ను ఆత్మగాఁ దెలిసి యెవ్వఁడు కర్తృత్వాభిమానంబును గర్మఫలమునందు స్పృహయు లేక యుండునో అతనిఁగూడ కర్మము లంట వని తాత్పర్యము.

ఆ. ఈశ్వరునకుఁ గర్తృత్వభోక్తృత్వములు పరమార్థమున లేకుండుటచేఁ గర్మమునందును తత్ఫలమునందును సంబంధాభావము ఫలితం బగుచున్నది యని చెప్పుచున్నారు ఏకర్మములకు ఇత్యాదిగా. కర్మతత్ఫలములస్పర్శ లేని యీశ్వరుని నన్నుఁ దెలిసినవానికి దర్శనామరూప మయిన ఫలమును దెలుపుచున్నారు మామ్ ఇత్యాదిగా. ఆకర్మములు—ఏకర్మములకు నేను కర్త నని నీవు దలఁతువో ఆకర్మము లని యర్థము. దేహేంద్రియాదిహేతువులై ఆకర్మము లీశ్వరుని స్పృశింపకుండుటకు అవి చేయునపుడు అహంకారము లేకపోవుట హేతు వని చెప్పుచున్నారు అహంకారము లేకపోవుటవలన నని. కర్మఫలమునందు తృష్ణ లేకుండుటవలనఁగూడ ఈశ్వరునిఁ గర్మము లంట వని చెప్పుచున్నారు కర్మఫలే ఇత్యాదిగా. చెప్పినదానినే

విస్తరించుచున్నారు ఇఁక నెవ్వఁడి ఇత్యాదిగా. అవి లేకుండుటవలన—కర్మములందు నేను కర్త నను నభిమానంబును తత్ఫలములందు స్పృహయును లేకుండుటవలన నని యర్థము. ఈశ్వరునకుఁ గర్మలేపము లేకున్నను జీవున కేమి వచ్చె నని యాశంకించి యుత్తరార్థము వ్యాఖ్యానము చేయుచున్నారు ఇతి ఇత్యాదిగా. అభిజ్ఞానప్రకార మును వివరించుచున్నారు కాను నేను ఇత్యాదిగా. జ్ఞానఫలము చెప్పుచున్నారు నః ఇత్యాదిగా. విద్వాంసునకుఁ గర్మములసంబంధము లేకుండుటను విశదీకరించుచు న్నారు వానికిని ఇత్యాదిగా.

హ. కర్తవైనచోఁ గర్మఫలసంబంధము గలుగుటవలన నీకు అనీశ్వ రత్వము వచ్చు నని యాశంకించి చెప్పుచున్నాఁడు.—మామ్, కర్మాణి—యజ్ఞాదులు; నలిమ్పన్తి = అంటవు దేహాదులఁ గిలిగించుటచే, అహంకారము లేమివలన. మే, కర్మఫలే, స్పృహా, న. ఈకారణమువలన, ఆత్మ అకర్త యని తెలియుటవలన నేను కర్మముచే అలిప్తుఁడ నని; ఇతి; మామ్ = నన్ను, పరమాత్మను; అభిజానాతి = ఎఱుంగుచున్నాఁడో; నః; కర్మభిః. నబధ్యతే = లిప్తుఁడు కాఁడు.

౪౦. పరబ్రహ్మను నగు నాకు రెండుపాధులు, మాయయు దానికార్య మును. నేను అసంగచిద్రూపుఁడ నగుటచే మాయాతత్కార్యములతో సంబంధము లేమివలన మాయాకృతంబు లగు జగత్సృష్ట్యాదికర్మములతో సంబంధము నా కెట్లు లేదో, అట్లే ప్రత్యగ్రూపుఁడ నగు నాకు అసంగుఁడనగుటచే దేహేంద్రియాదులచేఁ జేయఁబడుకర్మములతోఁగూడ సంబంధము లేదు. ఇట్లుకర్తృత్వభోక్తృత్వాదిధర్మశూ న్యుఁడ నగునన్నుఁబరమాత్మను శ్రవణమననాదిజన్యవిజ్ఞానబలముచే నెవ్వఁడుతనయాత్మ నుగాఁదెలిసి కర్మమునందుఁ బ్రవర్తించుచున్నాఁడో అతఁడు కర్మములచే బద్ధుఁడు కాఁ డనిచెప్పుచున్నాఁడు.—కూటస్థాసంగచిద్రూపుఁడ నగుటచే బుద్ధ్యాదిసంబంధరహి తుండ నగు, మే= నాకు, ప్రత్యగాత్మకు; కర్మఫలే=కర్మములందును వానిచేఁ గలుగు ఫలములందును; స్పృహా నాస్తి, స్పృహ బుద్ధి ధర్మ మగుటవలన బుద్ధ్యాదులకు సాక్షినై యవికారి నగు నాకు బుద్ధిధర్మము సంభవింపమివలన కర్మఫలేచ్ఛ లేదు. ఇందువలననే, న మాం కర్మాణి లిమ్పన్తి, « స యథా కామో భవతి తత్క్రతు ర్భవతి య త్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే » ♦ అని శ్రుతి కామవంతునకే కర్మ

♦ అతఁడు ఎట్టి కోరికగలవాఁ డగుచున్నాఁడో అట్టి సంకల్పము గలవాఁ డగుచున్నాఁడు, ఎట్టిసంకల్పము గలవాఁ డగుచున్నాఁడో, అట్టికర్మము చేయుచున్నాఁడు.

సంకల్పమును తదారంభమును జెప్పుటవలన కర్మఫలము గోరునట్టి విజ్ఞానాత్మ చేతనే ♦ కర్మములు చేయఁబడుచున్నవి, కాని కామరహితుఁడను అవిక్రియుఁడ నగు నాచేతం జేయఁబడవు. అందువలన, బుద్ధ్యాదులచేఁ జేయఁబడిన, కర్మాణి=కర్మములు, మామ్= అకర్తను కర్మములకును తత్కర్తకును సాక్షినైన నన్ను; నలిమ్పన్తి = స్పృశింపవు; ఎవ్వనిచే ఫలము గోరి యేకర్మము చేయఁబడుచున్నదో అతఁడు ఆకర్మముచే తైలము చేతంబోలె లిప్తుఁ డగును, ఇతరుఁడు కాఁడు. ఆకర్మకర్తయగు బుద్ధ్యాదికముకన్న భిన్నుఁ డగువానికి బుద్ధ్యాదికము చేసినకర్మములు లేపము చేయఁజాలవు, ఇతి = ఇట్లు; కర్మఫలేచ్ఛారహితుని అకర్తను అభోక్తను ఆకాశమువలె సర్వగతుని అసంగుని అవిక్రియుని బుద్ధికిని తద్ధర్మములకును తత్కర్మములకును తదవస్థలకు సాక్షిని, మామ్ = నన్నుఁ బరమాత్మను; తనతత్త్వమును, యః = ఎవ్వఁడు; అభిజానాతి = చక్కఁగా అభిముఖుఁడై ఇతఁడే నేనని అపరోక్షముగాఁ దానే యని యెఱుంగుచున్నాఁడో, సః = అవిద్వాంసుఁడైన అధికారికుఁడు; లోకసంగ్రహార్థము చేయఁబడిన, కర్మభిః = కర్మములచే; నబధ్యతే—చేసినకర్మము లితనికి దేహజనకములు కాఁజాల వని యర్థము.

మ. కర్మాణి—జగత్సృష్ట్యాదులు; మామ్ = అహంకారము లేనివాఁడ నగుటచే కర్తృత్వాభిమానరహితుఁడ నగు భగవంతుని; నలిమ్పన్తి = దేహజనకము లగుటచే బంధింపవు. ఇట్లు కర్తృత్వము నిరాకరించి భోక్తృత్వము నిరాకరించుచున్నాఁడు.—మే= ఆప్తకాముఁడ నగు నాకు; కర్మఫలే; స్పృహా= తృష్ణ; న = లేదు; “ఆప్తకామస్య కా స్పృహా” అను శ్రుతివలన. కర్తృత్వాభిమానంబును ఫలస్పృహాయు నున్నం గదా కర్మములు బంధించును, అవి లేకుండుటవలన నన్నుఁ గర్మములు బంధింపవు. ఇతి = ఇట్లు; యః= ఎవఁడు, ఇతరుఁడైనను; మామ్ = అకర్తను అభోక్త నగు నన్ను; తన్నుఁగా, అభిజానాతి = గుర్తించుచున్నాఁడో; కర్మభిర్న నబధ్యతే—అకర్త్రాత్మజ్ఞానముచే * ముక్తుఁ డగుచున్నాఁ డని యర్థము.

శ్రీ. దానినే తెలుపుటకై చెప్పుచున్నాఁడు.—కర్మాణి= ప్రపంచసృష్ట్యాదులుగూడ; మామ్; నలిమ్పన్తి = ఆసక్తునిఁగాఁ జేయవు, అహంకారము లేనివాఁడ నగుటవలనను ఆప్తకాముఁడ నగుటచేఁ గర్మఫలమునందు స్పృహ లేనివాఁడ నగు

♦ బుద్ధిచేతనే.

* అకర్త యని తెలియుటచే.

టవలనను; నన్ను అంట వని చెప్పెడి దేమి? ఏల యనఁగా కర్మఫలమునందు స్పృహ లేనివాఁడ నని; మామ్ = నన్ను; యః, అభిజానాతి; సః = అతఁడుగూడ; కర్మభిః నబధ్యతే, నాకుఁ గర్మలేపము లేక యుండుటకుఁ గారణము నిరహంకారతయు నిస్స్పృహతయు నని యెఱింగినట్టి యతఁడుగూడ అహంకారాదులను విడుచుటవలన.

ప. ఇఁక « విద్ధ్యకర్తార మవ్యయమ్ » అని చెప్పినదానినే వివరించి చెప్పుచున్నాఁడు.—మామ్; కర్మాణి—సృష్ట్యాదికర్తృత్వరూపములు; నలిమ్పన్తి, అసంగుఁడ నగుటవలన. అందువలననే, మే; కర్మఫలే; స్పృహా = వాంఛకూడ; న = లేదు, అవాప్తసకలకాముఁడ నగు నేను దేని నుద్దేశించి యీకర్మము చేయవలయు నని యర్థము, ఎట్లు సూర్యుఁడు జగద్వ్యాపారమునకు హేతువైనను తత్కర్మముచే లిప్తుఁడు కాఁడో అట్లు. ఇతి = ఈచెప్పినవిధమున; యః, మామ్, అభిజానాతి; అతఁడుగూడ, కర్మభిః నబధ్యతే. ఇఁక నేను బద్ధుఁడఁగా నని చెప్పెడి దేమి? అని యర్థము.

రా. ఎట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఎందువలన ననఁగా, కర్మాణి = ఈవిచిత్రసృష్ట్యాదికర్మములు; మామ్ = నన్ను; నలిమ్పన్తి = సంబంధింపవు, నావలన వచ్చినవి కావు ఆదేవమనుష్యాదివైచిత్ర్యములు, సృజ్యుల • పుణ్యపాపరూపకర్మవిశేషములచే వచ్చినవి యని యర్థము. కావునఁ బ్రాప్తాప్రాప్తవివేకముచే ‖ విచిత్రసృష్ట్యాదికమునకు నేను కర్త గాను. మఱియు నెందువలన ననఁగా—సృజింపఁబడిన క్షేత్రజ్ఞులు సృష్టిచేఁ గరణకళేబరములు పొందినవారై సృష్టిచేఁ బొందఁబడిన భోగ్యసమూహమును ఫలాసక్తిపూర్వకముగాఁ జేసిన స్వకర్మమునకు అనుగుణమయినదాని భుజించుచున్నారు. సృష్ట్యాదిఫలమునందును కర్మఫలమునందును వారికే స్పృహ కావున, మే = నాకు; స్పృహా=తృష్ణ; న= లేదు. అట్లు సూత్రకారుఁడు « వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్ » * అని. అట్లు భగవంతుఁ డగు పరాశరుఁడుగూడ « నిమిత్తమాత్రమే వాయం సృజ్యానాం సర్గకర్మణి । ప్రధానకారణీభూతా యతో

---

• సృజింపఁ దగిన వానియొక్క.

‖ ప్రాప్తమును అప్రాప్తము నగు కర్తృత్వముయొక్క విమర్శముచేత.

* బ్ర. సూ. అ ౨. పా ౧. సూ ౩౪. విషమసృష్టిచేయుటచేతను సుఖదుఃఖాము లొసంగుటచేతను ఈశ్వరునకు వైషమ్యనైర్ఘృణ్యములు—పక్షపాతమును దయారహితతయుఁ బ్రసక్తింపవు. ఏల యనఁగా, సాపేక్షత్వాత్ = ధర్మాధర్మముల యపేక్ష గలవాఁ డగుటవలన—ప్రాణుల ధర్మాధర్మముల ననుసరించి సృష్ట్యాదుల నీశ్వరుఁడు చేయువాఁ డగుటవలన.

వై సృజ్య శక్తయః ॥ నిమిత్తమాత్రం ముక్త్వైదం నాన్య త్కించి దపేక్షతే । నీయతే తపతాం శ్రేష్ఠ స్వశక్త్యా వస్తు వస్తుతామ్ ” అని. సృజ్యానామ్—సృజింపఁ దగిన దేవాదిక్షేత్రజ్ఞులయొక్క, సర్గకర్మణి—సృష్టికర్మమునందు, కారణమాత్రమే యీ పరమపురుషుఁడు; దేవాది వైచిత్ర్యము నందో సృజ్య లగు దేవాదిక్షేత్రజ్ఞుల ప్రాచీనకర్మశక్తులే ప్రధానకారణము; అందువలన, నిమిత్తమాత్రం ముక్త్వా — సృష్టికర్త యగు పరమపురుషుని విడిచి, ఈ క్షేత్రజ్ఞుఁ డను వస్తువు దేవాదివిచిత్రత్వమునం దితరము నపేక్షింపదు, తనయం దున్న ప్రాచీన కర్మశక్తిచేతనే గదా దేవాదివస్తుత్వమును బొందింపఁబడుచున్న దని యర్థము. ఇతి = ఇట్లు చెప్పినవిధంబున సృష్ట్యాదికమునకుఁ గర్తనైనను అకర్తనుగాను సృష్ట్యాదికర్మఫలసంగరహితునిఁగాను, మామ్ = నన్ను; యః = ఎవ్వఁడు; అభిజానాతి = ఎఱుంగుచున్నాఁడో; సః = అతఁడు; ఫలాసక్త్యాదిపూర్వకముగాఁ జేయఁబడినవై కర్మయోగారంభమునకు విరోధులైన, కర్మభిః = ప్రాచీనకర్మములచే; నబధ్యతే = సంబంధింపఁబడఁడు, విడువఁబడుచున్నాఁ డని యర్థము.

మా. అందువలననే, నమాం కర్మాణి లిమ్పన్తి. ఇందువలనఁగూడ నన్నంటవని చెప్పుచున్నాఁడు.—నమే కర్మఫలే స్పృహా అని. ఇచ్ఛమాత్రము కలదు, కాని అభినివేశము లేదు. అట్లు చెప్పఁబడినది “ఆకాఙ్క్షన్నపి దేవోఽసౌ నేచ్ఛతే లోకవ త్పరః । నహ్యాగ్రహ స్తస్య విష్ణో ర్జ్ఞానం కామో హి తస్య తు” • అని. కొందఱు ముక్తు లగుచున్నా రని క్రమంబున అందఱకును ముక్తి యని చెప్పఁదగదు. * ఏల యనఁగా, శ్రుతి “జ్ఞాత్వా తమేవం మనసా హృదాచ భూయో న మృత్యు ముపయాతి విద్వాన్” “కథంవా ఇ త్యనన్తావే త్యన స్తవ దితిహోవాచ” ¶ అని.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః
కురు కర్మైవ తస్మా త్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. ౧౫

• ఈశ్వరుఁడు ఇచ్ఛించినను లోకమువలె నిచ్ఛింపఁడు. ఆవిష్ణువునకు అగ్రహము—అభినివేశము లేదు. అతనికి కామముగూడ జ్ఞానమువంటిది.

* ఏకజీవవాదమున ఒకఁడు ముక్తుఁడైనచో సర్వముక్తి చెప్పవలయును. అది యుచితముగాదు.

¶ మనస్సుచేతను బుద్ధిచేతను అతని నిట్లు తెలిసి విద్వాంసుఁడు ఇఁక మృత్యువుఁ బొందఁడు. ఇది యెట్లు? అనఁగా అనన్తులు జీవులు, అనంతు లివలె—ఈశ్వరుఁ డెట్లనంతుఁడో అట్లు అని చెప్పెను.

భా. కర్తను గాను నేను కర్మఫలమునందు, స్పృహా లేదు నాకు అని, ఏవమ్ = ఇట్లు; జ్ఞాత్వా = ఎఱింగి; పూర్వైరపి = పూర్వకాలమునందుండిన ముముక్షువులచేతఁగూడ; కర్మ = కర్మము; కృతమ్ = చేయఁబడినది. అందుచే, కురు = చేయుము, కర్మైవ = కర్మమునే, ఊరకుండుటయుఁ జేయఁగూడదు, సన్న్యాసంబునుం జేయఁగూడదు; త్వమ్ = నీవు; తస్మాత్ = పూర్వకాలమువారిచేతఁగూడ అనుష్ఠితం బగుటవలన; నీ వనాత్మజ్ఞుఁడవేని అప్పుడు చిత్తశుద్ధికొఱకును, తత్త్వవిదుఁడవేని లోకసంగ్రహముకొఱకును జేయుము కర్మమును; పూర్వైః—జనకాదులచేత; కృతమ్ = చేయఁబడినదానిని; పూర్వతరమ్ = వారికన్నను బురాతనమైనదానిని; ఇప్పు డేర్పడినదానిఁగాదు. ♦

కర్తృత్వాభిమానమును ఫలస్పృహాయును తమకు లే దని యెఱింగి పూర్వకాలపుముముక్షువులుగూడఁ గర్మములు చేసిరి. అందువలన నీవును గర్మముఁ జేయుము. ఈకర్మమును వారికన్నను బూర్వు లగు జనకాదులుగూడఁ జేసిరి. ఇది వారికన్నను బురాతనకాలమునుండి పరంపరగా ననుష్ఠింపఁబడుచు వచ్చినది కాని యిప్పటిది కా దని తాత్పర్యము.

ఆ. నీకుఁ గర్మముతోను తత్ఫలముతోను సంబంధము లేనియెడ జ్ఞానవంతునకును వానితో సంబంధము లేనియెడ నాకును గర్మ మేల? అని యాశంకించి, కర్మమునందుఁ గర్తృత్వాభిమానమును తత్ఫలమునందు స్పృహాను వహింపక ముముక్షువువలె నీవు కర్మము చేయవలసినదియే యని చెప్పుచున్నారు కర్తను ఇత్యాదిగా. ఏవమ్ = అనుటచే కర్తను గాను నేను ఇత్యాదికము పరామర్శింపఁబడుచున్నది. అందుచే—పూర్వు లగు ముముక్షువులచే ననుష్ఠింపఁబడిన దన్న హేతువుచేత నని యర్థము. కర్మైవ అనుచోటి యేవకారమునర్థము చెప్పుచున్నారు ఊరకుండుటయు ఇత్యాదిగా. తస్మాత్ అని చెప్పినదానినే స్ఫుటీకరించుచున్నారు పూర్వైః ఇత్యాదిగా. నాకును గర్మ మేల యని యేది చెప్పఁబడినదో అందు నీవు అజ్ఞుఁడవా? తత్త్వజ్ఞుఁడవా? అని వికల్పించి అజ్ఞుఁడవేని అప్పుడు చిత్తశుద్ధికొఱకుఁ జేయుము కర్మము నని చెప్పుచున్నారు నీవు ఇత్యాదిగా. రెండవపక్షమునఁ జెప్పుచున్నారు తత్త్వవిదుఁడవేని ఇత్యాదిగా. పూర్వులు సూాధు లాచరించి రన్నమాత్రాన ఎందుకు వివేకిని నేను దానిఁ జేయవలయు?

♦ కర్మమునకు విశేషణములు. అట్టికర్మమును జేయు మని యన్వయము.

అని యాశంకించి చెప్పుచున్నారు జనకాదులచేత నని. వా రప్పుడే కల్పించికొని కర్మముఁ జేసిరి, అది యిప్పుడు అప్రామాణికం బగుటవలన అనుష్ఠింపవలసినది లే దని యాశంకించి చెప్పుచున్నారు పూర్వతరమ్ అని.

హ. నేనే ఈశ్వరుఁడను కర్మము సృజించినవాఁడను, నేనే కర్త నని తెలిసి, పూర్వు లగు పురుషులచేత, పూర్వతరమే యగుకర్మము చేయఁబడినది, నీవు ఆకారణమువలననే జేయుము.

శం. విద్వాంసునకు ఉపాధికృతంబు లగు కర్మములు బంధకములు కా వని తెలియుటయె పరులకొఱకుఁ గర్మానుష్ఠానమునందుఁ బ్రబలసాధనం బని సూచించి పూర్వులుగూడ అబంధక మని తెలిసియె పరార్థము ప్రవర్తించి రని శిష్టాచారమును బ్రమాణీకరించి నీవుగూడ నిట్లే ప్రవర్తింపవలయు నని చెప్పుచున్నాఁడు.—ఏవం జ్ఞాత్వా—నేను బుద్ధ్యాదులకు సాక్షిని బ్రత్యగాత్మనే యగుదును, దేహేంద్రియాదులకంటె భిన్నుఁడ నగుటచే దేహేంద్రియాదికృతము లగుకర్మములచే బద్ధుఁడను గాను అని యాత్మ దేహేంద్రియాదులకన్న భిన్నుఁ డనియు దేహేంద్రియాదికృతకర్మములు ఆత్మను బంధింపఁజాల వనియుఁ జెప్పినవిధంబునఁ దెలిసి; ముముక్షుభిః = ముక్తులై ఇతరుల ముక్తులుగాఁ జేయఁగోరినవార లగు, ఇది గర్భితణిజంతరూపము, ఇతరులను అవిద్యాబంధములనుండి విడిపింపఁగోరినట్టి; పూర్వైరపి—జనకాదులచేతఁగూడ; లోకహితార్థము, కర్మ; కృతమ్. తస్మాత్ = అందువలన; త్వమ్= నీవు; పూర్వైః కృతమ్ = జ్ఞానవృద్ధు లగుసత్పురుషులచే ననుష్ఠింపఁబడినదియు; పూర్వతరమ్ = అనాదికాలమునుండి ప్రవర్తించినదియు నగు; కర్మైవ = కర్మమునే; లోకహితార్థము, కురు = చేయుము, కాని సన్న్యాసము చేయకు మని యర్థము.

మ. ఎందువలన, « నేను గర్తఁ గాను, నాకుఁ గర్మఫలస్పృహ లేదు " అని తెలియుటవలన కర్మములచే బంధింపఁబడఁడో, అందువలన.—ఏవమ్—అకర్త యగు ఆత్మకుఁ గర్మలేపము లే దని; జ్ఞాత్వా; కర్మ, కృతమ్; పూర్వైరపి = కడచినవారిచేతఁ గూడ; ఈయుగమునందు; ముముక్షుభిః = యయాతియదువు మొదలగు ముముక్షువులచేత. తస్మాత్ = అందువలన; త్వమ్= నీవుగూడ; కర్మైవ, కురు, ఊరకుండుటను గాని సన్న్యాసమును గాని చేయకు. తత్త్వవిదుఁడవు కావేని చిత్తశుద్ధ్యర్థము, తత్త్వవిదుఁడవేని లోకసంగ్రహార్థము ♦. పూర్వైః—జనకాదులచేత; పూర్వతరమ్ = మిక్కిలి పూర్వము, యుగాంతరమునందుఁగూడ;

♦ కర్మమునే చేయు మని పూర్వమున కన్వయము.

కృతమ్ = చేయఁబడినదాని. ఇందుచే ఈయుగమునందును బూర్వయుగములందును బూర్వులచేతను బూర్వతరులచేతను జేయఁబడిన దగుటవలన నవశ్యము నీవు చేయ వలయుఁ గర్మము నని చూపుచున్నాఁడు.

శ్రీ. యే యథా మాం ప్రపద్యన్త ఇత్యాదు లగు నాలుగుశ్లోకములచేఁ బ్రసంగప్రాప్త మగు నీశ్వరునియందలి వైషమ్యముఁ బరిహరించి పూర్వోక్త మగు కర్మయోగమునే విస్తరించుటకై స్మృతికిఁ దెచ్చుచున్నాఁడు.—ఏవం జ్ఞాత్వా = అహంకారము విడిచి చేసినకర్మము బంధకము కా దని తెలిసి; పూర్వై రపి— జన కాదులచేతఁగూడ; ముముక్షుభిః; సత్త్వశుద్ధికొఱకు, పూర్వతరమ్ = యుగాంతర ములందుఁగూడ; కృతమ్. తస్మాత్; నీవుగూడ మొదట, కర్మైవ కురు.

ప. ఇఁకఁ బ్రకృత మనుసరించుచున్నాఁడు.—ఏవమ్ = ఈవిధమున, నేను కర్తృత్వాద్యభిమానము లేనివాఁడ నని; జ్ఞాత్వా; ముముక్షుభిః= మోక్షము గోరువార లగు; పూర్వై రపి = పూర్వకాలమువారిచేతఁ గూడ; కర్మ, కృతమ్. తస్మాత్, నీవు గూడ ప్రస్తుతము, కర్మైవ కురు. ఎందువలన ననఁగా. పూర్వైః, పూర్వతరమ్= అనాదిసిద్ధము; కృతమ్. ఇందుచే శిష్టాచారప్రమాణముగూడఁ గల దని సూచింపఁబడినది.

రా. ఏవమ్ = ఇట్లు; నన్ను, జ్ఞాత్వా = తెలిసి, విడువఁబడిన పాపము గల, పూర్వై రపి ముముక్షుభిః; కర్మ = చెప్పినచొప్పునఁ గర్మము; కృతమ్; తస్మాత్; త్వమ్, చెప్పినవిధమున నన్నుఁ దెలియుటచేఁ పాపములు వీడినవాఁడవై. పూర్వైః—సూర్యుఁడు మనువు మొదలగువారలచేత; కృతమ్ = చేయఁబడిన; పూర్వతరమ్ = పురాతనమైన, అప్పుడే నాచేఁ జెప్పఁబడిన దగు; వక్ష్యమాణవిధ మయిన, కర్మైవ = కర్మమునే; కురు = చేయుము.

ఈవిధమున నన్నుఁ దెలిసి పాపములు వీడినవారలై పూర్వకాలపుముముక్షువులు గూడఁ గర్మమునే చేసిరి. అందువలన నీవు మున్ను చెప్పినవిధంబున నన్నెఱుంగుటచేఁ బాపములు వీడినవాఁడవై సూర్యుఁడు మొదలగువా రనుష్ఠించిన దియు సృష్ట్యాదియందే నేను వారి కుపదేశించినదియు నగు కర్మమునే చెప్పఁబోవు విధంబున ననుష్ఠింపు మని తాత్పర్యము.

మా. ఇట్లు తెలిసి కర్మము ననుష్ఠించుటయం దాచారముగూడఁ గల దని చెప్పుచున్నాఁడు.—పూర్వతరం కర్మ = పూర్వము ఉండిన కర్మమును ♦.

♦ అపూర్వులకంటెఁ బూర్వము గూడ ఆచరింపఁబడుచుండినదానిని.

కిం కర్మ కిమకర్మేతి కవయో ఽ ప్యత్ర మోహితాః
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్.౧౬.

భా. అందు, కర్మము చేయవలసినయెడ నీమాటవలననే చేసెదను నేను, ఏల "పూర్వైః పూర్వతరం కృతమ్" అని యింత విశేషించి చెప్పవలయును ? అందువేని, చెప్పెదము. ఎందువలన ననఁగా, కర్మము విషయమున గొప్పవైషమ్యము కలదు. ఎట్లు ?—కిమ్ = ఏది; కర్మ = కర్మము ? కిమ్= ఏది; అకర్మ= అకర్మము; ఇతి= అను; అత్ర= ఈకర్మాది విషయమునందు; కవయో ఽపి = బుద్ధిమంతులుగూడ; మోహితాః = మోహముఁ బొందినారు. తత్=దాని; అందువలన; తే=నీకొఱకు; నేను, కర్మ = కర్మమును; అకర్మ = అకర్మమును *; ప్రవక్ష్యామి = చెప్పెదను. యత్ = ఏకర్మాదికమును; జ్ఞాత్వా = ఎఱింగి; అశుభాత్ = సంసారమునుండి; మోక్ష్యసే = విడివడుదువో.

కర్మ మనఁగా నేమి ? అకర్మ మనఁగా నేమి ? అనువిషయమునందు బుద్ధిమంతులుగూడఁ దెలియఁజాలక మోహపడిరి. కావున దేనిఁ దెలియుదువేని నీవు సంసారమునుండి విముక్తుఁ డగుదువో అట్టి కర్మమును అకర్మమును నీకుఁ జెప్పెద నని తాత్పర్యము.

ఆ. కర్మమును విశేషించి చెప్పుట నాక్షేపించుచున్నాఁడు అందు ఇత్యాదిగా. అందు—మనుష్యలోకమునందు. కర్మమునందు గొప్పవైషమ్య ముండుట వలన నది పూర్వులచే ననుష్ఠితం బనియుఁ బూర్వతరం బనియు విశేషించి చెప్పుటచే దానియందు నీకు సులభముగాఁ బ్రవృత్తి కలుగుం గావున యుక్తము విశేషణము అని పరిహరించుచున్నారు చెప్పెదము అని. లోకప్రసిద్ధ మగు దేహాదిచేష్టారూప కర్మమువిషయమునందు లేదు వైషమ్యం బని శంకించుచున్నాఁడు ఎట్లు అని. విజ్ఞానవంతులకుఁగూడఁ గర్మాదివిషయమునందు వ్యామోహము కలుగుచుండఁగా నిఁక నీకు దాని విషయమున మఱియు వ్యామోహము సంభవించుం గావున దానిఁ దొలఁగించుట కాప్తవాక్య మపేక్షిత మగుటవలనఁ గలదు కర్మమునందు వైషమ్య మని యుత్తరము చెప్పుచున్నాఁడు కిమ్ ఇత్యాదిగా. తత్తే కర్మ అనుచో కర్మ అనియు అకర్మ యనియుఁ బదము భేదింపవలయును. కర్మాదికము చెప్పుటకుఁ బ్రయో

* తత్తేకర్మ—అనుచో తే కర్మ అనియు తే అకర్మ అని రెండువిధములవిభాగము తెలియుచున్నది.

జనముఁ జెప్పుచున్నాఁడు యత్ ఇత్యాదిగా. దాని—అట్టి కర్మమును అకర్మమును అని యన్వయము. అందువలన—మేధావులకుఁ గూడ ఈవిషయమున వ్యామోహము కలుగుటవలన నని యర్థము.

తా. అధ్యాత్మజ్ఞానముచే కర్మఫలము సిద్ధ మని తలఁచినవాఁడై తానే కర్మముచే నాధ్యాత్మికస్వరూపము నావిష్కరించుటకై చెప్పుచున్నాఁడు.—కర్మాకర్మముల స్వరూపము నెఱుంగనివారై; కవయో ఽపి; మోహితాః = మిక్కిలిమూఢులు. తత్త్వముగా, తత్తే కర్మ ప్రవక్ష్యామి; యత్ =ఏకర్మస్వరూపమును; జ్ఞాత్వా; అశుభాత్ = సంసారమునుండి; మోక్ష్యసే.

శం. ఓయీ! కర్మములు బంధకములే యగును, «కర్మణా బధ్యతే జన్తుః" అనుస్మృతి కర్మములు బంధకము లని చెప్పుటవలన అని యాశంకింతువేని; అట్లు కాదు, ఆస్మృతికి అవిద్వాంసుఁడు చేయుకర్మము విషయ మగుటవల్లన. «తం విదిత్వా నలిప్యతే కర్మణా పాపకేన» ♦ అనుశ్రుతి విద్వాంసునకుఁ గర్మలేపము లే దని చెప్పుటవలన, కర్మాకర్మముల తత్త్వము చక్కఁగా నెఱింగి విద్వాంసుఁడు చేయు కర్మము అకర్మమే, అది బంధకము కాదు. అవిద్వాంసుఁడు చేయు నకర్మము గూడ కర్మమె, అది బంధజనక మగుచున్నది. అప్పుడు కర్మాకర్మముల లక్షణ మేమి యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—శ్రుతిస్మృతులచే నేది విధింపఁబడినదో అది కర్మము, ఏది విహితము గాదో అది యకర్మము అని కొందఱుపండితులు చెప్పెదరు. శ్రౌతము స్మార్తమును ఏది గలదో అది యంతయుఁ గర్మము, తత్సన్న్యాసము అకర్మ మని కొందఱు. చలనరూపము కర్మము, చలింపమి—ఊరకుండుట అకర్మ మని మఱికొందఱు. ఇఁకఁ గొందఱు, కిం కర్మ కిమ్ అకర్మ ఇతి—కర్మశబ్దముచేఁ జెప్పఁబడున దేది? అకర్మశబ్దముచేఁ జెప్పఁబడున దేది? అని; కవయో ఽపి = సర్వశాస్త్రజ్ఞులు గూడ; అత్ర = ఈకర్మాకర్మతత్త్వ నిశ్చయమునందు; మోహితాః = మోహముఁ బొందిరి, వాని తత్త్వము నిశ్చయించుట కసమర్థులైరి యని యర్థము. అందువలన, కర్మాఽకర్మముల స్వరూపము తెలియనేరని, తే= నీకొఱకు; కర్మ, అకర్మ; ప్రవక్ష్యామి = వానిలక్షణము నుపదేశించెదను. యత్ జ్ఞాత్వా = వేని తత్త్వమును దెలిసి; అశుభాత్ = సంసారమునుండి; మోక్ష్యసే, కర్మాఽకర్మములతత్త్వమును జక్కఁగా నెఱింగినచో ముక్తుఁడ వగుదు వని యర్థము.

♦ అతనిఁ దెలిసి పాప మయినకర్మముచే లిప్తుఁడు కాఁడు.

**మ.** ఓయీ! కర్మవిషయమున నేమేని సంశయము గూడ నున్నదా? సంశయ మున్నం గదా "పూర్వైః పూర్వతరం కృతమ్" అని యింత నిర్బంధము చేయవలయును. అనఁగా నుండనే యున్నది సంశయ మని చెప్పుచున్నాఁడు.—ఓడలో నుండువానికిఁ గ్రియారహితము లయినవానియందుఁగూడ తీరము నందలి వృక్షములందు గమనభ్రమ కనఁబడుటవలనను, అట్లు దూరమునఁ గంటికిఁ గనఁబడుపురుషులయందు నడచుచున్నవారియందుఁగూడ అగమనభ్రమ ♦ కనఁబడుటవలనను, పరమార్థమున ఏది కర్మము? మఱియు ఏది పరమార్థమున అకర్మము? అని; కవయో ఽపి = మేధావులుగూడ; అత్ర = ఈవిషయమునందు; మోహితాః = మోహమును—నిర్ణయించుటకు సామర్థ్యము లేమిని పొందినారు, మిక్కిలి దుర్నిరూపము ✱ లగుటవలన నని యర్థము. తత్ = అందువలన; తే = నీకొఱకు; నేను, కర్మ = కర్మమును; అకారముతో పదవిభాగము చేయుటవలన, అకర్మ = అకర్మమును; ప్రవక్ష్యామి = చక్కగా—సందేహములు తీర్చి చెప్పెదను. యత్ = ఏకర్మా ఽకర్మముల స్వరూపమును; జ్ఞాత్వా; అశుభాత్ = సంసారము నుండి; మోక్ష్యసే = ముక్తుఁడ వగుదువో.

**శ్రీ.** అదియును దత్త్వవిదులతో విచారించి చేయవలయును కాని, జనపరంపరనుమాత్రమే చూచి చేయఁగూడ దని చెప్పుచున్నాఁడు.—కర్మ = కర్మము చేయుట, కిమ్ = ఎట్టిది? అకర్మ; కిమ్ = ఎట్టిది? ఇతి అత్ర = అను నీవిషయమునందు; కవయో ఽపి = వివేకులుగూడ; మోహితాః. అందువలన; యత్, జ్ఞాత్వా, అనుష్ఠించి; అశుభాత్ = సంసారమునుండి; మోక్ష్యసే = ముక్తుఁడ వగుదువో; తత్ = ఆకర్మమును; అకర్మమును నీకు నేను జెప్పెదను. వినుము.

**ప.** ఇఁకఁ గర్మస్వరూపముఁ దెలియుట కష్టం బని చెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—కర్మ = వేదములచే బోధింపఁబడిన కర్మ; కిమ్ = ఎట్టిది? అకర్మ = కర్మసమాప్తిరూప మయిన నైష్కర్మ్యము; కిమ్ = ఎట్టిది? ఇత్యత్ర = అను నీయర్థమునందు; కవయో ఽపి = పండితులుగూడ; మోహితాః. ఇఁక నీయట్టి వానిసంగతి చెప్ప నేల? అందువలన, తే = ముముక్షు వగు నీకొఱకు; కర్మ = అనుష్ఠింపవలసిన కర్మమును; ప్రవక్ష్యామి. అది యెట్టిది యనఁగా. యత్, జ్ఞాత్వా, అశుభాత్ = సంసారమునుండి; మోక్ష్యసే.

---

♦ నిలిచియున్నా రను భ్రమ.

✱ నిరూపింప నలవిగానివి.

రా. చెప్పఁబోవుకర్మము దుర్జ్ఞేయం బని చెప్పుచున్నాఁడు.—ముముక్షువు అనుష్ఠింపవలసిన, కర్మ = కర్మము; కిమ్ = ఎట్టిది? అకర్మ కిమ్ = అకర్మముగూడ ఎట్టిది? అకర్మము అనుటచే కర్తకుఁ దనయాత్మయొక్క స్వరూపజ్ఞానము చెప్పఁబడుచున్నది, అనుష్ఠింపవలసినకర్మమును తదంతర్గతం బగు జ్ఞానమును ఎట్టి స్వరూపము గలవి? అను రెండువిషములయందును; కవయోఽపి=విద్వాంసులుగూడ; మోహితాః—వస్తుస్థితి నెఱుంగరు. ఇట్టి అంతర్గతజ్ఞానం * బగు కర్మ మేది గలదో, తత్ = దాని; తే ప్రవక్ష్యామి. యత్, జ్ఞాత్వా = తెలిసి; అనుష్ఠించి; అశుభాత్ = సంసారబంధమునుండి; మోక్ష్యసే. చేయవలసినకర్మము నెఱుంగుటకు అనుష్ఠానము గదా ఫలము.

ముముక్షువు అనుష్ఠింపవలసిన కర్మంబును తదంతర్గతం బగు నాత్మజ్ఞానంబును ఇట్టి వని పండితులుగూడ నెఱుంగఁ జాలరు. అట్టి అంతర్గత జ్ఞానసహితమైన కర్మమును నీకుఁ జెప్పెదను. దానిం దెలిసి యనుష్ఠింతువేని సంసారబంధమునుండి విడివడుదు వని తాత్పర్యము.

మా. కర్మమును జేయు మని చెప్పఁబడినది. ఆకర్మము దుర్విజ్ఞేయం బని చెప్పుచున్నాఁడు చక్కఁగాఁ జెప్పుటకై కిం కర్మేత్యాదిగా.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. ౧౭

భా. ఇది నీవు తలంపవలదు. కర్మ మనఁగా దేహాదిచేష్ట లోకప్రసిద్ధము, అకర్మ మనఁగా దానిఁ జేయమి ఊరకుండుట, ఏమి యందుఁ దెలియవలయును? అని. ఎందువలస నందువేని. చెప్పెదము. హి = ఎందువలస ననఁగా. కర్మణో ఽపి = శాస్త్రవిహిత మయిన కర్మము యొక్క గూడ; బోద్ధవ్యమ్= తెలియవలసినది ♦, ఉన్నది. వికర్మణశ్చ= నిషిద్ధకర్మము యొక్కగూడ; బోద్ధవ్యమ్ = తెలియవలసినది; ఉండనే యున్నది. అట్లు, అకర్మణశ్చ = ఊరకుండుటయొక్కయు; బోద్ధవ్యమ్ = తెలియవలసినది; ఉన్నది. ఉన్నది యని మూఁడుస్థలములందు నధ్యాహారము చేయవలయును. ఎందువలన ననఁగా. గహనా = విషమము,

---

* అంతర్గతమైన జ్ఞానము గల.

♦ తెలియవలసిన తత్త్వము.

ఎఱుంగ నశక్యము; కర్మణః = ఇది కర్మాదుల కుపలక్షణార్థము, కర్మాకర్మవికర్మములయొక్క; గతిః=యథార్థస్వరూపము, తత్త్వ మని యర్థము.

శాస్త్రవిహిత మైన కర్మముయొక్క తత్త్వమునుగూడఁ దెలియవలసినది యున్నది, శాస్త్ర నిషిద్ధ మయిన వికర్మముయొక్క తత్త్వముగూడఁ దెలియవలసినది యున్నది, కర్మాభావముయొక్క తత్త్వముగూడఁ దెలియవలసినది కలదు. ఏల యనఁగా, ఈకర్మాకర్మవికర్మములతత్త్వము తెలియుట మిక్కిలి కష్టము అని తా.

హ. కర్మ మనఁగా శరీరేంద్రియవ్యాపారము, అది లేకుండుట అకర్మము; ఎట్లు ఈవిషయమందుఁ గవులుగూడ మోహితులు? అందువేని చెప్పెదము.— కర్మణో హ్యపి బోద్ధవ్యమ్—శరీరేంద్రియవ్యాపారముచే నెఱవేర్పఁ దగినరూపము ఎఱుంగవలసినది యొకటి కలదు. అట్లు, వికర్మణః = నిషిద్ధకర్మముయొక్కగూడ; బోద్ధవ్యమ్; నిషేధింపఁ దగినరూపము కలదు. అట్లు, అకర్మణః = కర్మాభావముయొక్కగూడ; తెలియవలసినరూపము కలదు. ఎందువలన ననఁగా; కర్మణో గతిః; గహనా = తెలియ నలవి గానిది.

శం. ఓయీ! కర్మాకర్మముల రెంటితత్త్వమును ఆరురుక్షు వెఱుంగవలయునా? లేక ఆరూఢుఁడుమాత్రమె యెఱుంగవలయునా? అని యాశంకింపఁగా, ఆరురుక్షువే కర్మాకర్మవికర్మములతత్త్వముఁ జక్కఁగా నెఱుంగవలయును; వాని నెఱుంగుటయె వానికి పుష్కరం బగుటవలన వానికే ప్రయత్నంబున నెఱుంగవలయును. అతనికి దానియందె యధికారము. ఇతరమునందు లే దను నభిప్రాయముచేఁ జెప్పుచున్నాఁడు.—ముముక్షువునకు ఆరోహింపఁ గోరువానికి, కర్మణః— వర్ణాశ్రమాదులకు ననుష్ఠింపవలసిన కర్మముయొక్క; బోద్ధవ్యమ్, కలదు. తెలిసినం గదా కర్మస్వరూపమును యథాశాస్త్రముగాఁ గర్మ మనుష్ఠింప శక్య మగును, తెలియ కున్నం గాదు. శాస్త్రములు అనేకము లగుటవలనను శాస్త్రప్రవర్తకులు బహువిధంబులవా రగుటవలనను, దేశకాలములు యుగము అధికారి వర్ణాశ్రమములు వయోవస్థలు మొదలగువానిం బట్టి సంకోచవిస్తరంబులచేఁ గర్మవిధి బహువిధం బగుటవలనను చేయవలసిన కర్మముయొక్క తత్త్వముఁ జక్కఁగా నెఱుంగవలయు నని యర్థము. వికర్మణః=అనర్థసంబంధము గల దగుటవలన విధికి విహితము నకు విపరీతముగా * విధింపఁబడునది యగుటవలన వికర్మ మనఁగా నిషిద్ధము నిందితము

---

* చేయఁగూడ దని.

అగు కర్మము, అవికర్మముయొక్కగూడ, బోద్ధవ్యమ్, కలదు; నిషిద్ధాంశము తెలిసినం గదా యేది నిషిద్ధమో దానిఁ బరిహరింప శక్య మగును, అందువలన మీఁదఁ జెప్పిన దేశకాలాదిభేదముచే నిషిద్ధముగూడ బహువిధం బగుటవలన నెఱుంగవలసినది కల దని యర్థము. అట్లే, అకర్మణో౽పి—కర్మము గానిది అకర్మము కర్మాభావము, లేక, దేనివలనఁ గర్మము సంభవింపదో అది యకర్మము కర్మసన్న్యాసము, దానికిఁగూడ బోద్ధవ్యము కలదు; కామ్యకర్మత్యాగము నిషిద్ధత్యాగము కర్మఫలత్యాగము సర్వకర్మపరిత్యాగము కర్మమాత్రపరిత్యాగము మొదలగుభేదములచే సన్న్యాసముగూడ బహువిధములు కలది, కావున దానియందును తెలియవలసినది కల దని యర్థము. హి = ఏకారణమువలన; కర్మణః—కర్మణః అనునది వికర్మాకర్మములకుఁగూడ నుపలక్షణము, కర్మాకర్మవికర్మములు మూటియొక్కయు; గతిః = ఇట్లు చేయవలయు నను నిశ్చయము; గహనా = పండితులకుఁగూడఁ దెలియ నలవిగానిది. అందువలన ఆరురుక్షువు కర్మాకర్మవికర్మములస్వరూపమును శాస్త్రమువలనను ఆచార్యునివలనను లక్షణసహితముగాను రహస్యసహితముగాను జక్కగా నెఱుంగవలయు నని యర్థము.

మ. ఓయీ! సర్వలోకప్రసిద్ధ మగుటవలన నేనే దీని నెఱుంగుదును—దేహేంద్రియాదివ్యాపారము కర్మము, ఊరకయుండుట యకర్మము అని. అందు నీవు చెప్పవలసిన దేమి? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—హి = ఎందువలన ననఁగా. కర్మణో౽పి = శాస్త్రవిహితముయొక్కగూడ; తత్త్వము, బోద్ధవ్యమ్, అస్తి. వికర్మణశ్చ = నిషిద్ధకర్మముయొక్కగూడ; అకర్మణశ్చ = ఊరకుండుటయొక్కగూడ. ఇట మూఁడువాక్యములయందును «తత్త్వమ్ అస్తి» అని యధ్యాహార్యము. ఎందువలన ననఁగా. గహనా = తెలియ రానిది; కర్మణః అనునది కర్మాకర్మవికర్మములకు ఉపలక్షణము; గతిః—తత్త్వ మని యర్థము.

శ్రీ. ఓయీ! లోకప్రసిద్ధంబే గదా కర్మము దేహాదివ్యాపారరూపము, అకర్మము ఆదేహాదులకు వ్యాపారము లేకయుండుట, కావున ఎట్లు చెప్పితివి కవులుగూడ నిందు మోహము పొందుదు రని? అందుకుఁ జెప్పుచున్నాఁడు.—కర్మణో౽పి = విహితమైన వ్యాపారముయొక్కగూడ; తత్త్వము, బోద్ధవ్యమ్; కలదు, కాని లోకప్రసిద్ధము మాత్రమే కాదు. అకర్మణః = వ్యాపారము లేకయుండుటయొక్కగూడ; తత్త్వము, బోద్ధవ్యమ్, కలదు. వికర్మణశ్చ = నిషిద్ధవ్యాపారము

యొక్క-గూడ; తత్త్వము ఎఱుంగవలసినది కలదు. ఎందువలన ననఁగా. 'కర్మణో గతిః గహనా'-కర్మణః అనునది యుపలక్షణము, కర్మాకర్మవికర్మములతత్త్వము నెఱుంగుట కష్ట మని యర్థము.

ప. ఇఁక గహనం బనుటనే చెప్పుచున్నాఁడు.—మోక్షనిరూపణము నందుఁ గర్మమే చేయని యప్పుడు వికర్మము ఆరబ్ధము గామింజేసి-కర్మణః = వేద విహిత మగు కర్మమువలన; ఏమి యగు నని, బోద్ధవ్యమ్ = తత్త్వముగాఁ దెలియ వలయును. ఆకర్మమును జెప్పఁబోవువిధంబున రెండువిధములుగాఁ దెలియుటవలన, నశించుఫలము గల కర్మము వికర్మము, దానివలన నేమి యగు నని, బోద్ధవ్యమ్. అట్లు, అకర్మణః = కర్మసమాప్తిరూప మయిన నైష్కర్మ్యమువలన, ఏమి యగు నని, బోద్ధవ్యమ్. ఎందువలన ననఁగా. కర్మణో గతి ర్గహనా. అట్లు చెప్పఁబడినది టిప్పణికలయందు—“కర్మాకర్మవికర్మమర్మ సుధియా బోద్ధవ్య మేవాఽఽదితః, కర్మ స్యా ద్విధిపూర్వకం తు మనసా సర్వేన్ద్రియ వ్యాపృతిః । త ద్ద్వేధా సఫలం ఫలేన రహితం త్వాద్యం వికర్మ స్మృతం, బన్ధా దస్య దకర్మ శుద్ధికరణా నైష్కర్మ్య తా మాగతమ్” అని. దీని కర్థము.—సుధియా = పండితుఁ డగు పురుషునిచేత; ఆదితః = మొదట; కర్మాకర్మవికర్మమర్మ = కర్మాఽకర్మవికర్మములయొక్క రహస్యము; బోద్ధవ్య మేవ = ఎఱుంగఁబడవలసినదియే. అందు కర్మ మనఁగా నేమి యనఁగాఁ జెప్పుచున్నాఁడు—విధిపూర్వకమ్ = యథావిధిగా; మనసా = మనస్సుతోఁ; సర్వేన్ద్రియవ్యాపృతిః = సమస్తము లయిన యింద్రియములవ్యాపారము; కర్మము. సత్త్వయుక్త మైనమనస్సుతోఁ గూడ సమస్తము లయిన జ్ఞానకర్మేంద్రియవ్యాపార మేది గలదో అది కర్మ మని చెప్పఁబడినది; యజ్ఞోపకరణములఁ జూచుట, యజ్ఞముఁ బ్రతిపాదించువేదము వినుట, హోమధూమము నాఘ్రాణించుట, యజ్ఞపాత్రల స్పృశించుట, పురోడాశము నాస్వాదించుట, యజ్ఞసామగ్రి సంపాదించుకొఱకు హస్తపాదవ్యాపారము, ఋతుకాలమున భార్యాభిగమనము, దక్షిణదిక్కునందు మలోత్సర్గము మొదలగు విధ్యుక్త మయిన యింద్రియవ్యాపారము కర్మశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది. ఇఁక, తత్ = ఆకర్మము; ద్వేధా= రెండువిధములు. సఫలమ్ = స్వర్గము పొందించునది; ఫలేన రహితమ్ = ఫలముచే విడువఁబడినది, మోక్షము నొందించునది యని. రెంటియందును విధి సమానము, మ తే మనఁగా, సంకల్పముచే భేదము. అందు; ఆద్యమ్ = మొదటిది, స్వర్గఫలం బగు కర్మము; వికర్మ = నశించుఫలము గలది యని; స్మృతమ్. ఎందువలన ననఁగా, బన్ధాత్ = బంధహేతు

వగుటవలన. అన్యత్ = ఇతరమైన మోక్షప్రాపక మగు కర్మము; అకర్మ = అకర్మ మని చెప్పఁబడును. ఎందువలన ననఁగా. శుద్ధికరణాత్ = చిత్తశుద్ధి చేసిన పిమ్మట; తాను ఉపరతిఁ బొందినదై, నైష్కర్మ్యతామ్ ఆగతమ్ = జ్ఞాననిష్ఠానమును బొందినది యని యర్థము.

రా. ఎందువలన నిది దెలియ నలవి గాదనఁగాఁ జెప్పుచున్నాఁడు.— హి = ఏకారణమువలన; కర్మణోఽపి = మోక్షసాధనభూత మయిన కర్మస్వరూపము నందును ♦ బోద్ధవ్యమ్: కలదు. వికర్మణశ్చ = వికర్మమునందును; నిత్యనైమిత్తిక కామ్యరూపంబునను తత్సాధనము లయిన ద్రవ్యార్జనాదులరూపంబునను వివిధతను బొందినకర్మము వికర్మము. దానియందును, బోద్ధవ్యమ్, కలదు. అకర్మణశ్చ = జ్ఞానమునందును; బోద్ధవ్యమ్, కలదు. గహనా = దెలియ నలవి గానిది; ముముక్షు వునకు, కర్మణో గతిః. వికర్మమునందు బోద్ధవ్య మేమనఁగా, నిత్యనైమిత్తికకామ్య రూపమును ద్రవ్యార్జనాదిరూపము నగు కర్మమునందు ఫలభేదహేతు వైన వివిధ తను విడిచి మోక్షైకఫలముగా నేకశాస్త్రార్థాభిప్రాయముగా ననుసంధించుట. ఈవిష యము "వ్యవసాయాత్మికా బుద్ధిరేకా" అనుస్థలమునందే చెప్పఁబడినది, కావున నిట విస్తరింప లేదు.

మోక్షసాధన మయిన కర్మమునందుఁ దెలియవలసినది గలదు, నిత్య నైమిత్తికకామ్యరూపముగాను తదర్థద్రవ్యార్జనాదిరూపముగాను బహువిధమయిన వికర్మమునందును దెలియవలసినది గలదు. జ్ఞానమునందును దెలియవలసినది గలదు. ఏల యనఁగా ముముక్షువునకుఁ గర్మతత్త్వము దెలియుట కష్ట మని తాత్పర్యము.

మా. దానిఁ దెలిసినచో ముక్తుఁడ నగుదును అని మాత్రమే గాదు, దానిఁ దెలిసిననే ముక్తుఁడ నగుదు ననునభిప్రాయము గలవాఁడై చెప్పుచున్నాఁడు. కర్మణ ఇత్యాదిగా. అట్లు చెప్పఁబడినది "అజ్ఞాత్వా భగవాన్ కస్య కర్మాకర్మవికర్మకమ్। దర్శనం యాతి హే మునే కుతో ముక్తిశ్చ తద్వినా" ✱ అని. అకర్మ = కర్మము చేయకుండుట. కర్మాకర్మములకంటె ఇతరమైనది, వికర్మ—నిషిద్ధకర్మము, బంధకమగు టవలన. అందు పిమర్శించి కర్మాదికము బోద్ధవ్యము. శాపాదికముచేఁ గవులుగూడ

♦ సంబంధసామాన్యమున షష్ఠి.

✱ కర్మాకర్మవికర్మములను దెలియకున్నచో భగవంతుఁ డెవ్వనికి దర్శన మిచ్చును! మునీం ద్రుఁడా! అది లేక ముక్తి యొక్కడిది?

నీవిషయమునందు మోహింప లసఁ దగదు. అశక్యము దీనిఁ దెలియుట యని చెప్పు చున్నాఁడు గహనా కర్మణో గతిః అని.

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. ౧౮

**భా.** ఏది యెఱుంగవలయును, చెప్పెదను అని ప్రతిజ్ఞ చేసితివో ఆకర్మాకులతత్త్వము మాతి యెట్టిది? చెప్పెదము.—కర్మణి = చేయఁబడునది అను వ్యుత్పత్తిచే కర్మమనఁగా వ్యాపారమాత్రము, అట్టి కర్మమునందు; అకర్మ = కర్మాభావమును; యః పశ్యేత్ = ఎవఁడు చూచునో; అకర్మణిచ = కర్మాభావమునందును; కర్మ = కర్మమును; యః పశ్యేత్ = ఎవ్వఁడు చూచునో, ప్రవృత్తినివృత్తులు కర్త్రధీనములగుటవలన *, వస్తువు స్వ్రకీయకరణ గదా సకల క్రియాకారకాదివ్యవహారము అవిద్యాభూమియందే యగుచున్నది, సః = అతఁడు; మనుష్యేషు=మనుష్యులయందు; బుద్ధిమాన్ = జ్ఞానవంతుఁడు. సః = అతఁడు; యుక్తః = యోగియు. సః = అతఁడు; కృత్స్నకర్మకృత్ = సమస్తకర్మములను జేసినవాఁడును. అని కర్మాకర్మములయందు దీతచేతము జూచువాఁడు ♦ స్తుతింపఁబడుచున్నాఁడు.

ఎచటఁ గర్మము కల దని జనులు సాధారణముగాఁ దలఁచుచున్నారో అచటఁ గర్మము లే దనియు ఎచటఁ గర్మము లే దని తలఁచుచున్నారో అచట కర్మ మున్న దనియు ఎవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడు జ్ఞానియు యోగియు సర్వకర్మము లాచరించువాఁడును అగు నని తాత్పర్యము.

**ఆ.** మీఁదిశ్లోకము నాకాంక్షాపూర్వకముగాఁ దీయుచున్నారు ఏది ఇత్యాదిగా. ప్రథమపాదమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు కర్మణి ఇత్యాదిగా. ద్వితీయపాదమునకుఁ గూడ వ్యాఖ్యానము చేయుచున్నారు అకర్మణిచ ఇత్యాదిగా. ప్రవృత్తియే కర్మ మగుటవలన నివృత్తి కర్మాభావ మగుటవలన దానియందుఁ గర్మదృష్టి యెట్లని యాశంకించి ప్రవృత్తినివృత్తులు రెండును కారకాధీనంబు లగుటవలన వానియందు విశేషము లే దని యభిప్రాయపడి చెప్పుచున్నారు

* కర్త అధీనము అగుటవలన.
♦ కర్మమునందు అకర్మమును అకర్మమునందుఁ గర్మమును జూచువాఁడు.

ప్రవృత్తినివృత్తులు కర్తృతంత్రము లగుటవలన అని. ప్రవృత్తియందుంబోలె నివృత్తియందును కర్మదృష్టి విరుద్ధము గా దని శేషము. ఓయీ! నివృత్తి వస్త్వధీనం బగుటచే గారకనిర్వర్త్యము గామివలన దానియందుఁ గర్మదృష్టి యుక్తము గాదు. అనఁగా అందుకుఁ జెప్పుచున్నారు. వస్తువు ఇత్యాదిగా. క్రియాకారకఫలవ్యవహారము సమస్తమును అవిద్యావస్థయందే ప్రవర్తించుటవలన దానికి వస్తుస్పర్శము సంభవింపదు, కావునఁ బ్రవృత్తియందుంబోలె నివృత్తియందును ఎవ్వఁడు కర్మము చూచుచున్నాఁడో అతఁడు మనుష్యులయందు బుద్ధిమంతుఁ డని సంబంధము. కర్మమునం దకర్మమును అకర్మమునందుఁ గర్మమును జూచువానికి బుద్ధిమత్త్వమును యుక్తత్వమును కృత్స్నకర్మకృత్త్వంబును ఎట్లని యాశంకించి చెప్పుచున్నారు స్తుతింపఁబడుచున్నాఁడు అని.

భా. ఓయీ! ఏమి యిది విరుద్ధము చెప్పెదవు కర్మణ్యకర్మయః పశ్యేత్ అనియు అకర్మణిచ కర్మయః అనియు? కర్మం బకర్మము కాదు గదా! అకర్మముగాని కర్మము గాదు గదా! దానియందు విరుద్ధము నెట్లు చూచును జూచువాఁడు. ఓయీ! పరమార్థమున అకర్మమే యగునది కర్మమువలెఁ గాన్పించుచున్నది మూఢదృష్టి యగు లోకమునకు. అట్లు కర్మమే అకర్మమువలెఁ గాన్పించుచున్నది. అందుఁ బరమార్థదర్శనార్థము చెప్పుచున్నాఁడు భగవంతుఁడు కర్మ ణ్యకర్మయః పశ్యే దిత్యాదిగా. కావునఁ గాదు విరుద్ధము. బుద్ధిమత్త్వాదుల యుపపత్తివలనఁగూడ. బోద్ధవ్య మని గూడ యథార్థం బగు దర్శనము చెప్పఁబడుచున్నది. విపరీతజ్ఞానమువలననోయశుభమునుండి మోక్షణము సంభవింపదు. యద్జ్ఞాత్వామోక్ష్యసే ఽశుభాత్ అనియుఁ జెప్పఁబడినది. అందువలనఁ గర్మాకర్మములు విపరీతముగా గ్రహింపఁబడినవి ప్రాణులచేత. వారివిపరీతగ్రహణము నివర్తింపుటకై భగవంతునివచనము కర్మణ్య కర్మయ ఇత్యాది. ఇందు కర్మాధికరణ మైన అకర్మము లేదు, కుండలో బదరంబులు * వోలె. అకర్మాధికరణంబునుం గాదు కర్మము, అకర్మము కర్మాభావం బగుటవలన. కావున లౌకికులచే విపరీతముగా గ్రహింపఁబడినవే కర్మాకర్మములు, మృగతృష్ణికయందు జలమువలె, శుక్తియందు రజతమువలె.

---

* రేఁగుపండ్లు.

ఓయీ! కర్మము కర్మమే యందఱకును, ఎచ్చటను వ్యభిచరింపదు. వ్యభిచరించుచున్నది. నావలో నున్నవానికి నావ నడచుచుండఁగా తీర మందున్న గమనరహితము లయిన వృక్షములందుఁ బ్రతికూలగమనము కనఁబడుటవలన, మఱియు దూరముననుండి నేత్రములకు అసన్నికృష్టు లయినవారు నడచుచున్నను వారియందు గత్యభావము కనఁబడుట వలన. ఇట్లిచోఁ గూడ, అకర్మమునందు నేను చేయుచున్నా నని కర్మదర్శనంబును కర్మమునందు అకర్మదర్శనంబును విపరీతదర్శనము. అందుచే దాని నిరాకరించుటకై చెప్పుచున్నాఁడు కర్మ ణ్యకర్మయః పశ్యే దిత్యాదిగా.

ఈవిషయముగుఱించి పలుమాఱు సమాధానము చెప్పఁబడినను గాఢమైన విపరీతదర్శనముచే భావితం బగుటంజేసి మిక్కిలి మోహితం బగులోకము పలుమాఱు విన్నను తత్త్వంబు మఱచి మిథ్యాప్రసంగము దీసి తీసి శంకించుచున్నది యని మాటిమాటికి నుత్తరము చెప్పుచున్నాఁడు భగవంతుఁడు, దుర్విజ్ఞేయము వస్తు వనియుం దలఁచి.

"అవ్యక్తో ఽయ మచిన్త్యో ఽయమ్, నజాయతే మ్రియతే" ఇత్యాదిగా ఆత్మయందుఁ గర్మాభావము శ్రుతిస్మృతిన్యాయప్రసిద్ధము ప్రతిపాదింపఁబడినది, ప్రతిపాదింపఁబోవుచున్నాఁడుగూడ. అట్టి ఆత్మయందు కర్మాభావమునందు అకర్మమునందు కర్మరూపవిపరీతదృష్టి మిక్కిలి పాదుకొనియున్నది, అందువలన కిం కర్మ కిమ కర్మేతి కవయో ఽప్యత్ర మోహితాః. దేహాద్యాశ్రయం బగు కర్మము నాత్మయం దధ్యారోపించి "నేను కర్తను, నాది యీకర్మము, నే నీకర్మము ఫలమును భుజింపవలయును" అనియును, అట్లు "నేను ఊరక యున్నాను, అందుచే నే నాయాసము లేనివాఁడనై కర్మము లేనివాఁడనై సుఖ నగుచున్నాను" అని కార్యకరణాశ్రయం బగు వ్యాపారోపరతిని తత్కృతం బగు సుఖిత్వమును ఆత్మయం దధ్యారోపించి, "ఏమియుఁ జేయకున్నాను ఊరక సుఖముగా నున్నాను" అనియు నభిమానించుచున్నది లోకము. అట్టి లోకముయొక్క విపరీతదర్శనము నపనయించుటకై యిది చెప్పుచున్నాఁడు భగవంతుఁడు కర్మణ్యకర్మయః పశ్యే దిత్యాదిగా.

ఇందు కార్యకరణాశ్రయం బగు కర్మను కర్మంబెనై కర్మరహితుఁడు అవిక్రియుం డగు నాత్మయందు నందఱిచే నధ్యసింపఁబడినది. అందువలనఁ బండితుఁడుగూడ నేను జేయుచున్నానని తలంచుచున్నాఁడు. కావున ఆత్మసంబంధి యని సర్వలోకప్రసిద్ధము కర్మను, నదీతీరస్థంబులగు వృక్షములందుఁ బ్రతిలోమగతివలె ♦. అట్టి కర్మమునందు, అకర్మ = కర్మాభావమును, యథాభూతముగా, వృక్షములందు గత్యభావమునుంబోలె; యః పశ్యేత్. అకర్మణిచ = కార్యకరణవ్యాపారోపరతియందు, కర్మమువలె ఆత్మయం దధ్యారోపింపఁబడిన దానియందు, ఊరకయుండి కర్మము చేయక సుఖముగ నున్నాను అని అహంకారాభిసంధి హేతు వగుటవలన, అట్టి యకర్మమునందును; కర్మ యః పశ్యేత్, ఎవ్వఁ డిట్లు కర్మాకర్మములవిభాగము దెలియునో, సః = అతఁడు; మనుష్యేషు, బుద్ధిమాన్ = పండితుఁడు. సః = అతఁడు; యుక్తః = యోగి; కృత్స్నకర్మకృత్ = సమస్తకర్మము చేసినవాఁడును. అతఁడు అసుభము నుండి విడిపడినవాఁడై కృతకృత్యుఁ డగుచున్నాఁ డని యర్థము.

**ఆ.** శ్లోకముశబ్దార్థము తెలుపఁగా తాత్పర్యార్థము తెలియక పరస్పరవిరోధము శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. ఎట్లిది విరుద్ధ మని యాశంకించి చెప్పుచున్నాఁడు కర్మణీత్యాదిగా. విషయసప్తమియా? లేక అధికరణసప్తమియా? అని వికల్పించి మొదటిపక్షమునందు అన్యాకార మయిన జ్ఞానము అన్యావలంబనము * అగుటచే స్పష్టము విరోధ మని చెప్పుచున్నాఁడు, కర్మంబు ఇత్యాదిగా. ఒకటి మఱియొకటి యగుట యసంభవ మగుటవలన కర్మాకర్మములకు అభేదము సంభవింపమివలన అకర్మాకారము కర్మావలంబన మగుజ్ఞాన మయుక్త మని యర్థము. రెండవపక్షము దూషించుచున్నాఁడు దానియందు ఇత్యాదిగా. అధికరణమయిన అకర్మమునందు దానికి విరుద్ధ మయిన యాధేయమును కర్మమును ఎట్లు ద్రష్టఁ జూడఁగలఁడు, ఏలయనఁగా పరస్పరవిరుద్ధము లయిన కర్మాకర్మములకు ఆధారాధేయభావము సంభవింప దని యర్థము. విషయసప్తమి నంగీకరించి సిద్ధాంతి పరిహరించుచున్నాఁడు ఓయీ పరమార్థమున ఇత్యాదిగా. మూఢదృష్టి—వివేకహీన

---

♦ ఎదురునడకవలె.

* ఒక ఆకారము—స్వరూపము గల జ్ఞానము మఱియొకటి విషయముగాఁ గలది.

మగులోకమునకుఁ బరమార్థంబున బ్రహ్మము అకర్మము-క్రియారహితమే యయ్యు
భ్రాంతిచే కర్మవంతమునలె-క్రియాసహితమువలెఁ దోఁచుచున్న దని శబ్దార్థము.
పరస్పరాధ్యాసము నవలంబించి చెప్పఁబడినది అట్లు ఇత్యాదిగా. ఎట్లు అకర్మ మగు
బ్రహ్మము కర్మవంతముగాఁ గనఁబడుచున్నదో, అట్లు కర్మ-క్రియాసహితమే యగు
ద్వైతప్రపంచము అధిష్ఠాన మగు క్రియారహిత మయిన బ్రహ్మమునందు సంసృ
ష్టమై దానియట్లు ♦ తోఁచుచున్నది యని శబ్దార్థము. కర్మాకర్మములయందుఁ బర
స్పరాధ్యాసము సిద్ధ మగుటచే సమ్యగ్దర్శనము సిద్ధించుకొఱకు భగవంతునివచనము
ఉచితం బని చెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. ఎట్లు ఏది "ఇది రజత" మని
తెలియఁబడినదో అది యిప్పుడు శుక్తిఖండము చూడు మని భ్రాంతి సిద్ధ మగు రజ
తరూపవిషయము ననువదించి దాని యధిష్ఠాన మగు శుక్తిమాత్ర ముపదేశింపఁబడు
చున్నదో, అట్లు భ్రాంతిసిద్ధ మయిన కర్మాదిరూపవిషయము ననువదించి దాని యధి
ష్ఠానం బగు కర్మాదిరహితమైన కూటస్థబ్రహ్మము భగవంతునిచేఁ జూపఁబడుచున్నది.
అందువలన భగవద్వచనము విరుద్ధము గా దని చెప్పుచున్నారు కావున ఇత్యా
దిగా. ఇందువలనఁ గూడ, అధ్యారోపింపఁబడిన కర్మాదికము ననువదించి తదధిష్ఠా
నము కర్మాదిరహితము నిర్విశేష మయిన బ్రహ్మమును భగవంతుఁడు బోధించుటవలన
లే దందు విరోధశంక కవకాశం బని చెప్పుచున్నారు బుద్ధిమత్త్వాదుల ఇత్యాదిగా.
కూటస్థ మయిన బ్రహ్మముకంటె నితరము సర్వంబును మాయామాత్రం బగుటవ
లన ఇతరము తెలియుటచే బుద్ధిమత్త్వము యుక్తత్వము సర్వకర్మకృత్త్వము అను
పపన్నంబు లగుటవలన ఇందో బుద్ధిమా నిత్యాదిగా బుద్ధిమత్త్వాదులు నిర్దేశించుటం
జేసి బ్రహ్మజ్ఞానంబుననే అవి యుపపన్నంబు లగుట వలన సర్వక్రియారహిత బ్రహ్మ
జ్ఞానమే వివక్షితం బని యర్థము. బోధశబ్దమునకు సమ్యగ్జ్ఞాన మర్థ మగుటవలన కర్మా
కర్మవికర్మముల స్వరూపము బోద్ధవ్యము కల దని చెప్పుచున్న భగవంతునకు సమ్యక్
జ్ఞానోపదేశమే వివక్షితం బగుటవలనఁగూడ కూటస్థ మగు బ్రహ్మమే యిట నభిప్రేతం
బని చెప్పుచున్నారు బోద్ధవ్యమ్ ఇత్యాదిగా. ఫలవాక్యమును బర్యాలోచించినం
గూడ కూటస్థ మగుబ్రహ్మమే యిట నభిప్రేతం బని చెప్పవలయు నని చెప్పుచున్నారు
విపరీతజ్ఞానమువలననో ఇత్యాదిగా. సమ్యక్ జ్ఞానసాధ్య మయిన ఫల మిటఁ జెప్ప లే
దని యాశంకించి చెప్పుచున్నారు యద్ జ్ఞాత్వా ఇత్యాదిగా. అధ్యారోపాపవా

♦ క్రియారహిత మయినట్లు.

దార్థం ♦ బగు భగవద్వచనము అవిరుద్ధం బని యుపపాదించిన దాని నుపసంహరించుచున్నారు అందువలన ఇత్యాదిగా. వారి విపరీతగ్రహణము—వారి=అప్రాజ్ఞులయొక్క. విషయసప్తమిఁబరిగ్రహించి సమాధానము చెప్పి యధికరణసప్తమీపక్షమునందుఁ జూపినదోషము నంగీకరించి పరిహరించుచున్నారు ఇందు ఇత్యాదిగా. ఇందు = వ్యవహారభూమియందు. కర్మాధికరణము = కర్మము అధికరణముగాఁ గలది, కర్మమునం దుండునది. యోగ్యంబై కనఁబడ కుండుటవలన నని యర్థము. అకర్మాధికరణము కర్మము సంభవింప దనుటకు మఱియొకహేతువుఁ జెప్పుచున్నారు అకర్మము కర్మాభావం బగుటవలన అని. తుచ్ఛము * అధికరణం బగుట యెచ్చటనుం జూచినదియు సమ్మతమునుం గాదు గదా! చక్కఁగా విచారించినప్పుడు కర్మాకర్మములకు ఆధారాధేయభావము సంభవింపమిచే ఫలితము చెప్పుచున్నారు కావున ఇత్యాదిగా. శాస్త్రపరిచయము లేనివారికై యధ్యారోపము నుదాహరించుచున్నారు మృగతృష్ణికయందు ఇత్యాదిగా.

కర్మాకర్మములు ఆరోపితంబు లని చెప్పినదాని సహింపక శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. కర్మము కర్మమే అనుచోట అకర్మమును అకర్మమే యని గ్రహింపవలయును. విమతము § సత్యము అవ్యభిచారి యగుటవలన బ్రహ్మమువలె నని యర్థము. అందు, కర్మము వాస్తవముగా అవ్యభిచారి కాదు, కర్మమగుటవలన, నావలో నున్నవానికి తీరమునందలి వృక్షములగమనమువలె అని అవ్యభిచారిత్వము కర్మమునందు అసిద్ధ మని పరిహరించుచున్నారు వ్యభిచరించుచున్నది ఇత్యాదిగా. అకర్మముగూడ వాస్తవముగ అవ్యభిచారి కాదు, కర్మాభావం బగుటవలన, దూరప్రదేశమున నడచుచునే యుండు చైత్రమైత్రాదులందు నేత్రసామీప్యము లేనియప్పుడు కనఁబడుగమనాభావమువలె నని చెప్పుచున్నారు మఱియు దూరమున ఇత్యాదిగా. దూరస్థు లగుటవలననే విశేషసన్నికర్షము లేక స్వరూపమాత్రంబున నేత్రసన్నికర్షము గలవారియందు నేత్రమునకు గమనాభావము కనఁబడుటవలన నని యర్థము. గమనరహితము లగు వృక్షములందు గమనదర్శనమువలెఁ బ్రకృతమునందు అవిక్రియబ్రహ్మమునందుఁ గర్మదర్శనంబును, క్రియాసహిత మయిన ద్వైతప్రపంచమునందు గమనవంతు లగు చైత్రాదులందు గమనాభావదర్శనమువలె విప

♦ అధ్యారోపమును నిరాకరించుట ప్రయోజనముగాఁ గలది.

* శూన్యము.

§ కర్మాదిస్వరూపము.

రీతముగాఁ గర్మాభావదర్శనంబును ఏకారణముచే సంభవించుచున్నదో ఆకారణముచే ఆవిపరీతదర్శనము నిరసించుటకై భగవద్వచనం బని దార్ష్టాంతికము నిగమనము చేయుచున్నారు ఇ ట్లిచ్చోఁగూడ ఇత్యాదిగా.

ఓయీ! కర్మమును కర్మాభావంబును ఆరోపితము లగుటవలన అవిక్రియ బ్రహ్మజ్ఞానమమాత్రమే యభిప్రేతం బగునేని « అవ్యక్తో ఒయ మచిన్త్యో ఒయమ్, నజాయతే మ్రియతే వా " ఇత్యాదికముచే పునరుక్తి ప్రాప్తించుచున్నది, అచటనే బ్రహ్మాత్మ నిర్వికారుం డని ప్రతిపాదితం బగుటవలన. అనఁగా అందుకుఁ జెప్పుచు న్నారు ఈవిషయము గుఱించి ఇత్యాదిగా. ఆత్మయందు శంకితం బగు ఈసక్రియత్వ మును గుఱించి పలుమాఱు సమాధానము చెప్పఁబడినను, నిర్వికారాత్మవస్తువు నపే క్షించి, గాఢమైన విపరీతదర్శనము.—మిక్కిలి యధికమయిన మిథ్యాజ్ఞానము, దానిచే భావితంబు—దాని సంస్కారము అధికముగాఁ గలది, అగుటచే అధికమో హము నొందింపఁబడిన లోకము విన్నను తత్త్వమును మఱచి మరల నేదేని ప్రసం గము కలిగించుకొని ఆత్మ సక్రియుఁ డనుటనే శంకించుచున్నది, కావునఁ బలుమాఱు తత్త్వరూప మయిన యుత్తరమును భగవంతుఁడు చెప్పుచున్నాఁడు; వస్తువు దుర్వి జ్ఞేయం బగుటవలనఁ గూడ మాటిమాటికిఁ బ్రతిపాదించుట తత్త్వభ్రమల నివారిం చుట కుపయోగించుచున్నది; కావున లేదు పునరుక్తి యని యర్థము.

పలుమాఱు సమాధానము చెప్పటనే యనువదించుచున్నారు అవ్యక్తో ఒయ మిత్యాదిగా. చెప్పినది « నజాయతే మ్రియతే వా విపశ్చిత్ » ఇత్యాది శ్రుతియందును బ్రకృతస్మృతియందును ♦ అసంగత్వన్యాయంబునను బ్రసిద్ధ మని చెప్పుచున్నారు శ్రుతీత్యాదిగా. చెప్పఁబడినది మాత్రమె కాదు కర్మాభావము, మ ఱేమనఁగా « సర్వకర్మాణిమనసా " ఇత్యాది స్థలమున చెప్పఁబోవుచున్నాఁడు గూడ నని చెప్పుచున్నారు చెప్పఁబోవుచున్నాఁడు గూడ అని. ఓయీ! కర్మములు దేహా దినిష్పాద్యములయి * త్రివిధము లగుటవలన కూటస్థస్వభావుఁడగు నాత్మ అసంగుఁ డవుటవలన ఆత్మవ్యాపారరూప మయిన కర్మము అప్రసిద్ధ మగుటవలన అకర్మాత్మ యందు విపరీత మగు కర్మముయొక్క దర్శనము సిద్ధింప దని యాశంకించి చెప్పుచు న్నారు అట్టి ఆత్మయందు ఇత్యాదిగా. కర్మరూపవిపరీత దృష్టి = విపరీత మగు కర్మ ముయొక్క దర్శన మని యర్థము. నేను జేయుచున్నాను అని ఆత్మసమానాధికరణ

♦ గీతావాక్యమునందును.

* ఆదిశబ్దముచే వాక్కు మనస్సు గ్రహింపఁబడును.

భ్యాపారము ప్రత్యక్ష మగుటవలన కర్మభ్రమ యాత్మయందు మిక్కిలి పాదుకొని యున్న దని యర్థము. ఆత్మయందు కర్మభ్రమ కల దనుటకు హేతువుఁ జెప్పుచున్నారు అందువలన ఇత్యాదిగా. ఆత్మనిష్క్రియుఁడయినను ఎట్లతనియం దిట్టి భ్రమ సంభవించు నని యాశంకించి చెప్పుచున్నారు దేహాద్యాశ్రయంబు ఇత్యాదిగా. ఇప్పు డాత్మయందు అకర్మభ్రమ నుదాహరించుచున్నారు అట్లు ఇత్యాదిగా. ఎట్లు, శుక్తియందు స్వాభావికము అరజతత్వము, రజతత్వమారోపితము, రజతత్వాభావము గూడ ఆరోప్యాభావ • మగుటవలన ఆరోపపక్షమునం దే చేరునో; అట్లు ఆత్మయందుఁగూడ స్వాభావికము అవిక్రియత్వము, కర్మమో అధ్యస్తము, అధ్యస్తాభావం బగుటవలన కర్మాభావముగూడ అధ్యస్తమే యని తలంచి యుపసంహరించుచున్నారు అట్టి ఇత్యాదిగా. ఆత్మయందు లౌకికం బగు కర్మాదిభ్రాంతి సిద్ధ మగుటచే దానిఁ బరిహరించుటకు భగవంతుఁడు ఈ కర్మణ్యకర్మేత్యాది వచనము చెప్పె నని యర్థము.

ఇఁకఁ జెప్పిన యర్థమునందు శ్లోకాక్షరసమన్వయముఁజూపుటకై కర్మణీత్యాదికము వ్యాఖ్యానము చేయఁగోరినవారై భూమిక చేయుచున్నారు ఇందు ఇత్యాదిగా. వ్యవహారభూమియందు కార్యకరణ నిష్ఠం బగు కర్మము నిజరూపంబుననే యున్నదయ్యు అవిక్రియాత్మయందుఁ గార్యకరణంబుల యారోపము ద్వారంబున అందఱిచేతను ఆరోపింపఁబడుచున్నది. ఇందుకు హేతువుఁ * జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. ఇఁక అవివేకులకో కర్తృత్వాభిమానము మఱియు నధిక మని చెప్పుటకై కూడ అను నప్యర్థకము. కర్మరహితుఁడైన ఆత్మయందుఁ గర్మారోపమ్మునకు దృష్టాంతముఁ జెప్పుచున్నారు నదీ తీరే త్యాదిగా. ఇట్లు ఆత్మయందుఁ గర్మాధ్యాసము నుపపాదించి ప్రథమపాదమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు కావున ఇత్యాదిగా. అధ్యాసవశమున ఆత్మనిష్ఠముగా సర్వలోకప్రసిద్ధం బగు కర్మమునందు కర్మాభావము నెవ్వఁడు చూచునో అతఁడు బుద్ధిమంతుఁ డని సంబంధము. యథాభూతముగా – చక్కఁగా. అందుకు దృష్టాంతము చెప్పుచున్నారు వృక్షములందు ఇత్యాదిగా. ద్వితీయపాదమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు అకర్మణిచ ఇత్యాదిగా. అధ్యారోపముఁ జూపుచున్నారు ఊరక ఇత్యాదిగా. అకర్మమునందుఁ గర్మదృష్టికి యుక్తి చెప్పుచున్నారు అహంకా రేత్యాదిగా. పూర్వార్థ

• ఆరోప్య మగు రజతత్వముయొక్క అభావము.

* కార్యరూప హేతువును.

ముచేఁ జెప్పిన దాని ననువదించి యుక్తార్థము విభజించుచున్నారు పిన్వఁ డిట్లు ఇత్యాదిగా. శుక్తికయందు రజతమువలె ఆత్మయందు కార్యకరణ సంఘాతారోప ద్వారంబున ఆరోపిత మయిన కార్యకరణసంఘాతవ్యాపారమాత్రం బగు కర్మము విషయమునందు తదభావమును అకర్మమును వాస్తవముగ రజతాభావమునుం బోలె నెవ్వఁ డనుభవించుచున్నాఁడో, కార్యకరణసంఘాత వ్యాపారోపరతి రూపం బును కార్యకరణ ద్వారంబున ఆత్మయందు "ఊరకయున్నాను సుఖముగా" అని యారోపితంబు నగు అకర్మము విషయమునందును అహంకార హేతుకం ♦ బగు కర్మమును ఎవ్వఁడు వాస్తవముగ నెఱుఁగుచున్నాఁడో, అతఁడు రూప్యత్వా రూప్యత్వాభావ విభాగవిహీనం బగు శుక్తిమాత్రంబునుం బోలె కర్మము కర్మాభా వము అను విభాగము లేని కూటస్థునిఁ బరమార్థంబునఁ దెలిసినవాఁ డగుటచే బుద్ధి మాన్ ఇత్యాదిస్తోత్రమునకుఁ బాత్ర మగుచున్నాఁడు అని యర్థము.

భా. ఈశ్లోకమునకు వేఱువిధముగా వ్యాఖ్యానము చేసిరి కొందఱు. ఎట్లు? ఈశ్వరార్థం బనుష్ఠింపఁబడునిత్యకర్మములకు ఫలము లే దఁట. అందువలన నవి యకర్మము లని చెప్పఁబడుచున్నవి గౌణవృత్తిచేత ✱. ఆనిత్యకర్మములఁ జేయకుండుట అకర్మము, అది ప్రత్యవాయరూపఫలము గలది యగుటవలన కర్మ మని చెప్పఁబడుచున్నది గౌణవృత్తిచేతనే. అందు, నిత్య మయిన, కర్మణి = కర్మమునందు; అకర్మ యః పశ్యేత్ — ఫలము లేకపోవుటవలన, ఎట్లు ధేనువైనను $ గోవు అగోవు అని చెప్పఁ బడుచున్నదో క్షీరం బను ఫలము నియ్య లే దని, అట్లు. అట్లు నిత్యా కరణమైన § అకర్మమునందును, కర్మ యః పశ్యేత్, నరకాది ప్రత్య వాయఫలము నిచ్చుచున్నది యని.

యుక్తముగా దీవ్యాఖ్యానము. ఇట్లు తెలియుటచే అశుభమునుండి మోక్షము అనుపపన్న మగుటవలన, "యద్జ్ఞాత్వా మోక్ష్యసే ఽశు భాత్" అని భగవంతుఁడు చెప్పినవచనము బాధితం బగును. ఎట్లు? నిత్యకర్మముల యనుష్ఠానమువలనఁ గలుగుఁ గాక యశుభమునుండి

♦ అహంకారమే కారణముగాఁ గలది.

✱ అకర్మములవంటి వనుట.

$ గొడ్డుగా ఈనిన దైనను.

§ నిత్యకర్మము చేయకుండుట యయిన.

మోక్షము. కాని, కాదు వానికి ఫలము లే దను జ్ఞానమువలన. ఏల యనఁగా, నిత్యములకు ఫలము లే దనుజ్ఞానము అశుభమోక్షఫలముగా † విహితము గాదు; నిత్యకర్మజ్ఞానము గాని యట్లు విహితమయినది కాదు; భగవంతుఁడు గాని యిట్లు చెప్ప లేదు. ఇందుచే అకర్మమునందుఁ గర్మదర్శనమును నిరాకరింపఁబడినది. అకర్మమునందుఁ గర్మదర్శనము కర్తవ్య మని యిట విధింపలేదు గదా! నిత్యకర్మమే కర్తవ్య మని మాత్రమె గదా యిట విధింపఁబడినది. మఱియు నిత్యాకరణమువలనఁ బ్రత్యవాయము కలుగు నని తెలియుటవలన నేమియు ఫలము లేదు. నిత్యాకరణముగాని జ్ఞేయం బని * విహితము గాదు. అకర్మము కర్మము అను మిథ్యాదృష్టివలనఁగూడ అశుభమునుండి మోక్షణంబు సిద్ధింపదు, బుద్ధిమత్త్వము యుక్తత కృత్స్నకర్మ కర్తృత్వము మొదలగు ఫలమునుం గాని యుపపన్నము గాదు. స్తుతియుం గాని సంభవింపదు. మిథ్యాజ్ఞానమే గదా సాక్షా దశుభము. దానివలన నితరమైన యశుభమునుండి మోక్షణం బెక్కడిది? తమస్సు తమస్సునకు నివర్తకము కాదు గదా!

ఓయీ! కర్మమునందు అకర్మదర్శనము అకర్మమునందుఁ గాని కర్మదర్శనం బేది గలదో అది మిథ్యాజ్ఞానము కాదు; మఱేమనఁగా, గౌణము ఫలాభావభావనిమిత్తము. అట్లు కాదు, గౌణ మగు కర్మాకర్మవిజ్ఞానమువలనఁగూడ ఫలము చెప్పమివలన ఇట్లు శ్రుతహాన్యశ్రుతకల్పనములచే విశేషముగూడ నేమియుం గాన రాదు. స్వశబ్దముచేతనే చెప్పవచ్చును—నిత్యకర్మములకు ఫలము లేదు, వానిం జేయకుండుటవలన మాత్రము నరకపాతము కలుగు నని. అందు కర్మణ్యకర్మ యః పశ్యే దిత్యాది వ్యాజవాక్యము ♦ పరవ్యామోహకం బేల ప్రయోగింపవలయును? అందిట్లు చెప్పిన భగవంతునివాక్యము లోకవ్యామోహార్థం బని స్పష్టముగాఁ గల్పింపవలసి వచ్చును. మఱియు వ్యాజరూప మయిన వాక్యముచే దాఁచఁదగిన వస్తువు గా దిది. శబ్దాంతరముచే మాటిమాటికిఁ జెప్పినచో

† అశుభమునుండి మోక్షము ఫలముగాఁ గలది.

* తెలియఁదగినది.

♦ మోసపు మాట.

వస్తువు సుఖముగా నెఱుంగఁ దగు ననియు వచియింపఁ దగదు. కర్మ జ్యేవాధికారః అనుచోట స్పష్టతరముగఁ గదా చెప్పఁబడినది యీ యర్థము, మరలఁ జెప్పవలసినది కాదు. అంతటను బ్రశస్తంబగు కర్తవ్యమ్మనే బోద్ధవ్య మ్మని చెప్పఁబడుచున్నది; నిష్ప్రయోజన మగునది బోద్ధవ్య మ్మని చెప్పఁబడదు. మిథ్యాజ్ఞానమో బోద్ధవ్యము గాదు, తత్ప్రత్యుపస్థాపితం బగు ‡ వస్త్వాభాసము • గూడ బోద్ధవ్యము గాదు.

మఱియు నిత్యాకరణమువలన నభావమువలనఁ బ్రత్యవాయ ముత్పన్నము కాఁ జాలదు, « నాసతో విద్యతే భావః » అనియు « కథ మసతః సజ్జాయేత " అనియు అసత్తువలన సజ్జన్మము ప్రతిషేధించుట వలన *. అసత్తువలన సత్తు పుట్టు నని చెప్పువాఁడు «అసత్తే సత్తగును సత్తుగూడ అసత్తగును " అని చెప్పినవాఁ డగుచున్నాఁడు. అదియో అయుక్తము, సర్వప్రమాణములకును విరుద్ధ మగుటవలన. మఱియు నిష్ఫల మయిన కర్మమును విధింపదు శాస్త్రము, దుఃఖరూపం బగుట వలన, దుఃఖమో బుద్ధిపూర్వకముగాఁ గార్యం బనుట యనుపపన్న మగుటవలన. ఇఁక దానిం జేయకుంటవలన నరకపాతము నంగీకరించినచో అనర్థముకొఱకే రెండువిధములను జేసినను జేయకున్నను శాస్త్రము నిష్ఫలం బని కల్పింపవలసివచ్చును. స్వమతవిరోధముగూడ నిత్యకర్మము నిష్ఫలం బని యంగీకరించి మోక్షఫలముకొఱకుఁ జేయవలయు నని చెప్పువానికి. అందువలన యథాశ్రుత మైనయర్థమే యుక్తము కర్మణ్యకర్మేత్యాది శ్లోకమునకు. అట్లు మాచే వ్యాఖ్యానము చేయఁబడినది శ్లోకము.

ఆ. ఇట్లు స్వాభిప్రాయముచే శ్లోకమునకు వ్యాఖ్యానము చేసి యిట వృత్తికారుల వ్యాఖ్యానము నెత్తుచున్నారు ఈశ్లోకము ఇత్యాదిగా. వేఱువిధపు వ్యాఖ్యానమునే ప్రశ్నద్వారమునఁ బ్రకటించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. ఈశ్వరార్థము అనుష్ఠింపఁబడుపక్షమున ఫలము లే దనుట విరుద్ధం బని సూచించుచున్నారు అంట అని. నిత్యకర్మములు అకర్మము లనుట అప్రసిద్ధం బని యాశంకించి

‡ దానిచేఁ గలిగింపఁబడిన దగు.

• అసత్య మయిన వస్తువు.

* అసత్తువలన—లేనిదానివలన సత్తు—ఉండునది పుట్టఁజాల దని చెప్పుటవలన.

ఫలాభావరూప మయిన గుణము * కలుగుటవలన వానియందు అకర్మత్వ వ్యవహారము సిద్ధించుచున్న దని చెప్పుచున్నాఁడు గౌణవృత్తిచేత నని. నిత్యముల చేయకుండుట ముఖ్య వృత్తిచేతనే అకర్మ మని చెప్పవలయు నని చెప్పుచున్నాఁడు అనిత్యకర్మముల నిత్యాదిగా. ఆయకర్మమునందుఁ బ్రత్యవాయఫలహేతు వగుట యనుగుణము గలుగుటవలనఁ గర్మశబ్దము గౌణవృత్తిచేతనే ప్రవర్తించుచున్న దని చెప్పుచున్నాఁడు అది ఇత్యాదిగా. ఇట్లుపోద్ఘాతము చేసి శ్లోకము వివరించుచున్నారు అందు ఇత్యాదిగా. ద్వితీయపాదమును వివరించుచున్నారు అట్లు ఇత్యాదిగా. ఉత్తరార్ధమునకుఁ బూర్వమువలెనే వ్యాఖ్యానము.

పరకీయవ్యాఖ్యానమును నిరాకరించుచున్నారు యుక్తము గాదు ఇత్యాదిగా. నిత్యకర్మము అకర్మము నిత్యాకరణము కర్మము అని తెలియుటవలన పాపనివృత్తి యనుపపన్న మగుటవలన భగవద్వచనము వృత్తికారమతమునందు బాధిత మగు నని యర్థము. « ధర్మేణ పాప మపనుదతి » ♦ అను శ్రుతివలన, నిత్యకర్మానుష్ఠానంబుచే పాపక్షయము ప్రసిద్ధ మగుటవలన అనిత్యకర్మానుష్ఠానమునకు ఫలాంతరము లేకుండుటవలన నిత్యకర్మము అకర్మ మని యెఱింగి యనుష్ఠానము చేసిన యెడ ఎట్లు అశుభక్షయము కలుగ దని శంకించుచున్నాఁడు ఎట్లు అని. « క్షేత్రజ్ఞస్యేశ్వరజ్ఞానా ద్విశుద్ధిః పరమా మతా » ** అను స్మృతివలన కర్మముచే ఆత్యంతిక మగు అశుభక్షయము లేకయున్నను అంగీకరించి పరిహరించుచున్నారు నిత్యకర్మముల ఇత్యాదిగా. నిత్యానుష్ఠానమువలన అశుభక్షయము కలుగునప్పటికిని ఈప్రకరణమునం దది వివక్షితము గాదు, యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ అని జ్ఞానమువలన అశుభక్షయ మగు నని ప్రతిజ్ఞ చేయుటవలన. ఆజ్ఞానము నిత్యకర్మములకు ఫలము లే దని యెఱుంగుట యనియుఁ జెప్ప నలవిగా దని చెప్పుచున్నారు కాదు ఇత్యాదిగా. అశుభము ఫలాభావముయొక్క అజ్ఞానముచేఁ గలిగినది కాదు కావున ఫలాభావజ్ఞానమువలన అశుభక్షయము సిద్ధింప దని యర్థము. మఱియును అతీంద్రియ మగునవిషయము శాస్త్రమువలన నిశ్చయింపఁబడుచున్నది, నిత్యకర్మములవలన ఫలము లే దని జ్ఞానమువలన అశుభనివృత్తి యగు ననుటకో శాస్త్రము లే దని చెప్పుచున్నారు నిత్యములకు ఇత్యాదిగా. నిత్యకర్మములఁ

* సాదృశ్యము.

♦ ధర్మముచేఁ బాపముఁ బోఁగొట్టుచున్నాఁడు.

** జీవునకు ఈశ్వరుఁ దెలియుటవలన పరమ మగు విశుద్ధి యగు నని చెప్పఁబడినది.

చేయుట అకర్మ మని జ్ఞానముగూడ అశుభనివృత్తి ఫలముగా విహితము గా దని చెప్పుచున్నారు నిత్యకర్మజ్ఞానము ఇత్యాదిగా. భగవద్వచనమే యిటఁ బ్రమాణ మని యాశంకించి చెప్పుచున్నారు భగవంతుఁడు ఇత్యాదిగా. యద్జ్ఞాత్వేత్యాది భగవ ద్వచనము సాధారణజ్ఞానమునే వచించుచున్నది గాని నిత్యకర్మమునకు ఫలాభావము నెఱింగి యని జ్ఞానవిశేషమును వచింప దని యర్థము. అశుభమోక్షణము సంభవింప దను హేతువుచే కర్మమునందు అకర్మదర్శనము నిరాకరించిన న్యాయమున అకర్మ మునందుఁ గర్మదర్శనమును నిరాకరించుచున్నారు ఇందుచే నిత్యాదిగా. నామాదు లందు ఫలవిశేషముకొఱకు బ్రహ్మదృష్టివలె అకర్మమునందు ఫలవిశేషముకొఱకుఁ గర్మదృష్టి విధించుటవలన అశుభమోక్షణానుపపత్తి లే దని యాశంకించి చెప్పుచు న్నారు అకర్మమునందు ఇత్యాదిగా. ఈశ్లోకమునందు నిత్యకర్మము కర్తవ్య మ్మనుట మాత్రమె వివక్షితం బని వృత్తికారమతము, కావున "అకర్మమునందు కర్మదర్శ నము విధింపఁబడుచున్నది అది ఫలముకొఱకు" అని కల్పించుట వారికి స్వసిద్ధాం తవిరుద్ధ మని చెప్పుచున్నారు నిత్యకర్మమే ఇత్యాదిగా. వృత్తికారుల మతమునందును నిత్యము కర్తవ్య మనుటమాత్రమె యిట వివక్షితము గాదు, మ రేమనఁగా నిత్యా నుష్ఠానమునందుఁ బ్రవృత్తి సిద్ధించుటకై నిత్యము చేయనిచోఁ బ్రత్యవాయ మగు నని జ్ఞానముగూడ కర్తవ్య మని యిట వివక్షితమే యగు నని యాశంకించి చెప్పు చున్నారు మఱియు ఇత్యాదిగా. ప్రవృత్తియేమో యీజ్ఞానమునకు * ఫలం బనఁ దగదు విధివలననె ప్రవృత్తి యుపపన్న మగుటవలన; ఇతరఫలం బనుటయు నుచి తము గాదు, కనఁబడకుండుటవలన; కావున నిష్ఫలం బగుటవలన చేయకుండుటచేఁ బ్రత్యవాయ మగు నని జ్ఞానం బిట వివక్షితము కా దని యర్థము. మఱియు అకర ణమునందు కర్మదర్శనము విధించుచో అకరణము ఆలంబన మగుటచే ప్రధాన మగు టవలన అది శ్రేయం బని చెప్పవలయును, అదియో తుచ్ఛం బగుటవలన ఉపప న్నము కా దని చెప్పుచున్నారు నిత్యాకరణము గాని ఇత్యాదిగా. అసత్తైన అకర ణము నామాదులవలె ఆశ్రయ మయి దర్శనము సంభవింపకున్నను సామానాధి కరణ్యముచే "ఇది రజతము" అను నట్లు దర్శనము సంభవించుచున్నది ♦ యని యాశంకించి చెప్పుచున్నారు అకర్మము ఇత్యాదిగా. మొదలగు అనుటచే సర్వో త్కర్షాదులు గ్రహింపఁబడుచున్నవి. సఫలత్వము గాని స్తుతి గాని సమ్యక్ జ్ఞానమునకు

* నిత్యము చేయనిచో ప్రత్యవాయ మగు నని జ్ఞానమునకు.

♦ అకర్మము కర్మ మని దర్శనము సంభవించుచున్నది.

యు క్తమే కాని మిథ్యాజ్ఞానమునకుఁ గాదు అనుపపన్న మగుటవలన నని యర్థము. స్వప్నమునందు మిథ్యాజ్ఞానముగూడ ఫలవంత మగుట దృష్టము § అని యాశంకించి మిథ్యాజ్ఞానము అశుభవిరోధి కాకుండుటవలన దానిచే అశుభనివృత్తి కా దని చెప్పుచున్నారు మిథ్యాజ్ఞానమే ఇత్యాదిగా. అశుభమువలననే అశుభము నివర్తిల్ల దనుటకు దృష్టాంతము చెప్పుచున్నారు తమస్సు ఇత్యాదిగా.

అవివేకముచే « ఇది రజతము » అని సదసత్తుల ¶ సామానాధికరణ్యముచే మిథ్యాజ్ఞానము గావచ్చును, కర్మాకర్మములలో వివేకమునఁ దెలియవచ్చునవి కావున వానిసామానాధికరణ్యముచేఁ గలుగు జ్ఞానము సింహ దేవదత్త సామానాధికరణ్యమునం బోలె గౌణము, మిథ్యాజ్ఞానము కా దని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. కర్మము అకర్మము అనుదృష్టియందు ఫలాభావము గుణము, అకర్మము కర్మము అను దృష్టియందో ఫలసద్భావము గుణము, అందుచేఁ గలుగు నీజ్ఞానము గౌణ మని చెప్పుచున్నాఁడు ఫలాభా వేత్యాదిగా. ఇట్టి జ్ఞానము గౌణమైనను ప్రామాణికం బగు ఫలము లేకుండుటవలన అది గౌణం బనుట యుచితము గా దని చెప్పుచున్నారు అట్లు కాదు ఇత్యాదిగా. కర్మము అకర్మ మని గౌణజ్ఞానము నుపన్యసించు వ్యాజమున నిత్యకర్మము కర్తవ్య మని వివక్షిత మగుటవలన గౌణజ్ఞానమునకు ఫలరాహిత్యము దోషము గా దని యాశంకించి చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. శ్రుతహాని= శ్రుతము—చెప్పఁబడినది జ్ఞానమువలన అశుభమోక్షణము, దాని విడుచుట; అశ్రుతకల్పనము = శ్రుతము కానిది—చెప్పఁబడనిది నిత్యానుష్ఠానము, దానిఁ గల్పించుట. ఇట్టి యధికప్రయాసచేతనుం గూడ విశేష మేమియు సిద్ధింప దని యర్థము. చెప్పిన దానినే విస్తరించుచున్నారు స్వశబ్దముచేతనే ఇత్యాదిగా. స్వశబ్దముచేతనే = నిత్యానుష్ఠానమునకు సాక్షాద్వాచక మగు శబ్దముచేతనే. విధివలననే అవి యనుష్ఠేయంబు లని శేషము. ఇట్లు వాచకశబ్దము ప్రయోగించుటవలననే యపేక్షించిన యర్థము సంభవించుచుండఁగా భగవంతుఁడు వ్యాజవాక్యము చెప్పె నని కల్పించుట యనుచిత మని చెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. ఈశ్లోకమునందు వృత్తికారులవ్యాఖ్యానముచేఁ బరమాప్తుఁ డగు భగవంతునియందు విప్రలంభకత * ఆపాదింపఁబడినది, కావున వారి వ్యాఖ్యానము గ్రాహ్యము కా దని

§ స్వప్నము మిథ్య యయినను దానివలన శుభాఽశుభఫలము కలుగుచున్నది.

¶ . శుక్తిరజతముల.

* మోసకారితనము.

చెప్పుచున్నారు అం దిట్లు ఇత్యాదిగా. నిత్యకర్మానుష్ఠానము సిద్ధించుటకై వ్యాజ రూప మగు నీభగవద్వాక్యం బని యాశంకించి యట్లు కా దని చెప్పుచున్నారు మఱియు ఇత్యాదిగా. వస్తువు = నిత్యానుష్ఠానము. ఎట్లు ఆత్మతత్త్వప్రతిపాదనము సుబోధ మగుటకై మాటిమాటికిఁ జేయఁబడుచున్నదో అట్లు నిత్యకర్మముల యను ష్ఠానముగూడ కర్మణ్యక ర్మేత్యాది శబ్దాంతరముచేఁ జెప్పఁబడినదై సుబోధం బగును కావున భగవంతుఁడు శబ్దాంతరము ప్రయోగించుట యుచిత మని యాశంకించి యది నిత్యానుష్ఠానవాచకము కాకుండుటవలన నట్లు కా దని చెప్పుచున్నారు శబ్దాం తరముచే ఇత్యాదిగా. మఱియు, మున్నే నిత్యానుష్ఠానము స్పష్టముగా నుపదేశింపఁ బడినది కావున దానిఁ జక్కగా బోధించుటకై శబ్దాంతరము కావలసినది లే దని చెప్పుచున్నారు కర్మణ్యే వాధికారః ఇత్యాదిగా. కర్మాకర్మాదులఁ దెలుపు వ్యాజ మున నిత్యకర్మము కర్తవ్య మనుటయందుఁ దాత్పర్యము అను వాదము నిరాకరించి కర్మాకర్మదర్శనము గౌణ మను పక్షమున మఱియుక దోషముఁ జెప్పుచున్నారు అం తటను ఇత్యాదిగా. లోకమునందును వేదమునందును ప్రశస్త మగు దేవతాదితత్త్వ మేది గలదో కర్తవ్యము—అనుష్ఠానార్హ మయిన అగ్నిహోత్రాదిక మేది గలదో అదియే బోద్ధవ్య మని చెప్పఁబడుచున్నది, కాని నిష్ఫల మగు కాకదంతాదికము * కాదు; కర్మమునం దకర్మదర్శనంబును అకర్మమునందుఁ గర్మదర్శనంబును గౌణ మగుటవలననే అప్రశస్తము అకర్తవ్యమును, కావున నది బోద్ధవ్య మని చెప్పుటకుఁ దగ దని యర్థము. మఱియు కర్మాదికము మాయామాత్రం బగుటవలన గౌణమై నను తద్జ్ఞానము మిథ్యాజ్ఞానమే కావున నది బోద్ధవ్యము కాఁ జాల దని చెప్పుచు న్నారు మిథ్యాజ్ఞానమో ఇత్యాదిగా. మిథ్యాజ్ఞానము బోద్ధవ్యము కాక పోయినను దాని విషయము బోద్ధవ్యము కావచ్చు నని యాశంకించి వస్త్వాభాసం బగుటవ లన నట్లు గా దని చెప్పుచున్నారు తత్ప్రత్యుపస్థాపితంబు ఇత్యాదిగా.

ఇఁక అకరణము ప్రత్యవాయజనక మగుటచే అకరణమునందు గౌణవృ త్తిచేఁ గర్మశబ్దప్రయోగము చేయఁబడినది యని యేది చెప్పఁబడినదో దాని దూషిం చుచున్నారు మఱియు ఇత్యాదిగా. అకరణమువలనఁ బ్రత్యవాయము పుట్టుననుట యందు శ్రుతిస్మృతివిరోధముం బ్రతిపాదించి యుక్తివిరోధముఁ బ్రతిపాదించుచున్నారు అసత్తువలన నిత్యాదిగా. అసత్తు సద్రూపంబున నగుటయుఁ గాకుండుటయు నిస్స్వరూ పంబగుటవలన అనుపపన్నము, ఏతత్త్వమును లేనిదానికిఁ నేదో యొకతత్త్వము నంగీ

* కాకి పండ్లు యెందలగునది.

కరించునెడ సమస్తప్రమాణంబులకును అప్రామాణ్యము ప్రసక్తించు నని చెప్పుచున్నారు అదియో ఇత్యాదిగా. ఇఁక నిత్యకర్మములకు ఫలము లేకుండుట వానియందు అకర్మశబ్దప్రయోగమునకు హేతు వని యేది చెప్పఁబడినదో దాని నిరసించుచున్నారు మఱియు నిత్యాదిగా. విధ్యుద్దేశమునందుఁ దమకు ఫలము లేకుండుటవలననే గాదు నిత్యకర్మములకు విధి యనుపపన్న మగుట, మఱేమనఁగా కర్మను దుఃఖాత్మకమగుటవలనఁ గూడ అందుకు ఫలము లేనియెడ విధి యనుపపన్న మని చెప్పుచున్నారు దుఃఖరూప మగుటవలన అని. కర్మము దుఃఖరూప మయినను దాని సాధించుటకై యనుష్ఠింపవలసిన దగుటవలన కర్మవిషయ మయిన విధి సంభవించు ననఁగా నట్లుగా దని చెప్పుచున్నారు దుఃఖమో ఇత్యాదిగా. నిత్యములకు స్వర్గాదిఫలము లేకున్నను అకరణముచేఁ గలుగు నరకము దొలఁగించుటకై అవి దుఃఖరూపము లైనను యనుష్ఠేయము లని యాశంకించి చెప్పుచున్నారు ఇఁక ఇత్యాదిగా. ఇతరఫలము లేకున్నను మోక్షసాధనంబు లగుటవలన నిత్యకర్మములను ముముక్షు వనుష్ఠింపవలయు నని యాశంకించి చెప్పుచున్నారు స్వమతవిరోధము ఇత్యాదిగా. వృత్తికారులవ్యాఖ్యానము అయుక్త మని యేర్పడఁగా ఫలితము నుపసంహరించుచున్నారు అందువలన ఇత్యాదిగా. ఏది యా యథాశ్రుతార్థము ? అని యాశంకించి చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా.

హ. ఇప్పుడు కర్మాకర్మవికర్మములరూపమును బోద్ధవ్య మయినదానిఁ జూపుటకై చెప్పుచున్నాఁడు.—కర్మణి = శరీరేంద్రియవ్యాపారరూప మయిన కర్మమునందు; అకర్మ = నిత్యసిద్ధ మగుటవలన ఆత్మస్వరూపము. చూడవలయు నని శేషము; ఎట్లు మృగతృష్ణికాజలస్థలమునందు జలమునకు స్వరూపమైనమృగతృష్ణికగలదో, మృగతృష్ణిక లేదేని జలమునకు నిస్స్వరూపత ప్రసక్తించుటవలన, అట్లు కర్మమునందు అకర్మాత్మస్వరూపము గలదు. అట్లు, అకర్మణి = నిశ్చల మయిన వస్తువునందు; కర్మస్వరూపము చూడఁబడుచున్నది, ఎట్లు నావలో నున్నవానికి నిశ్చల మయిన తీరస్థవృక్షమునందు భ్రమమునఁ గర్మము గనఁబడుచున్నదో అట్లు. అందువలననే, ఎవ్వఁడు కర్మమునం దకర్మస్వరూపమును అకర్మమునందుఁ గర్మస్వరూపమును జూచుచున్నాఁడో, సః; మనుష్యేషు = అధికారులయందు; బుద్ధిమాన్. సః, యుక్తః = యోగి. అతఁడు, కృత్స్నకర్మకృత్ = సకలకర్మములఁ జేసినవాఁ డని యర్థము. అందువలనఁ గర్మాకర్మముల యథార్థస్వరూపముఁ దెలిసి కర్మములు చేయు మని యర్థము.

టీ౦. అరూఢున కేమో యివి బోద్ధవ్యములు కావు, మఱేమనఁగా అరురుక్షువకు మాత్రమే కర్మాకర్మములతత్త్వము అశుభమోక్షముకొఱకు బోద్ధవ్యం బని అధికారికిఁ జెప్పెద నని మున్ను ఏది ప్రతిజ్ఞ చేయఁబడినదో దాని నిప్పు డుపదేశించుచున్నాఁడు.— దేహేంద్రియములచే చేయఁబడుచున్నది—నెఱవేర్పఁబడుచున్నది కావున లౌకికమునగాని వైదికము గాని సమస్తవ్యాపారమును కర్మమని చెప్పఁబడుచున్నది, కర్మణి= అట్టిసోపాధిక మగు వ్యాపారమాత్రమునందు; ఆత్మతత్త్వజ్ఞుఁ డగు విద్వాంసుఁడు, అకర్మ = కర్మాభావమును; యః పశ్యేత్. అట్లే, అకర్మణి = దేహేంద్రియముల వ్యాపారోపరమరూప మయిన యూరకుండుటయందు; కర్మ = క్రియనే; యః పశ్యేత్. ఓయీ! కర్మమునందు అకర్మదర్శనంబును అకర్మమునందు కర్మదర్శనంబును రెండును సంభవింపవు, ప్రత్యక్షవిరుద్ధ మగుటవలన; కర్మము అకర్మము కాదు గదా! వ్యాపారము కనఁబడుటవలన; అకర్మంబునుం గర్మము కాఁజాలదు, స్తంభమువలె నూరక యుండుట కనఁబడుటవలన; భావంబునం దభావదర్శనంబును అభావమునందు భావదర్శనంబును అతివిరుద్ధము అప్రామాణికముగూడ, భావమునకు అభావత్వమును అభావమునకు భావత్వమును సంభవింపమివలన. అందు వేని, అట్లు కాదు. తాను కర్మరహితుఁడే యయినను పురుషుఁడు ఇతరకర్మముచేఁ గర్మము గలవాఁ డగుచున్నాఁడు; ఎట్లు; మేఘవ్యాపారముచేఁ జంద్రుఁడు కర్మము గలవాఁ డగుచున్నాఁడో, జల్లెడయొక్క క్రియచే ఆతపము[1] క్రియావంత మగుచున్నదో, అట్లు దేహాదితాదాత్మ్యమునం జేసి దేహాదిక్రియచేఁ దాను క్రియారహితుఁడైనను క్రియావంతుఁ డగుచున్నాఁడు సర్వప్రాణియును. అయినను బ్రహ్మవిదుఁడు బ్రహ్మమే నే నని తాను బ్రహ్మమే యని తెలియుటం జేసి తనకు దేహాదిసంబంధము లేమివలన దేహాదికృత మయిన కర్మమును అకర్మమునుగానే చూచుచున్నాఁడు, దానియందు నేను నాది యన్ని స్వత్వము లేకుండుటవలన; ఒకఁడు చేసినకర్మమునందు మఱియొకనికి స్వత్వము పపన్నము గాదు గదా! స్వత్వము లేకపోవుటవలన దేహాదికర్తృకం బగు కర్మము వీనికి అకర్మమే యగుచున్నది, బంధకము కామిం జేసి యకర్మతుల్యం బగుటవలనను అందువలన అకర్మమునే చూచుచున్నాఁ డని యర్థము. కాని, స్వగత మయిన కర్మమును గాదు అకర్మముగాఁ జూచుట, తనకు నిరవయవుం డగుటచేఁ గర్మసంబంధము అనుపపన్న మగుటవలన; ఎట్లు వృక్షము చలించుచుండఁగా దానియందున్న యాకాశమును నిష్క్రియమునుగాఁ జూచుచున్నాఁడో, ఎట్లు మేఘ

---

[1] వెలుఁగు.

ములు నడచుచుండఁగా జంద్రుని నిష్క్రియునిఁగాఁ జూచుచున్నాఁడో, అట్లు దేహేంద్రియాదులు స్వేచ్ఛను విషయములం బ్రవర్తించుచుండఁగా తన్ను నిష్క్రియునిఁగానే చూచుచున్నాఁడు విద్వాంసుఁడు; అందువలన «నిష్కలం నిష్క్రియమ్» ఇత్యాదిశ్రుతి ప్రమాణమువలన కూటస్థాసంగ చిద్రూపుఁ డగు నాత్మయే తా నని యెఱింగినట్టి విద్వాంసునకు దేహేంద్రియాదికర్తృకం బగు కర్మమునందు అకర్మదర్శనము ఉపపన్నమే యగును, ఈదర్శనము విద్వాంసులకుఁ బ్రత్యక్షమగుటవలనను «అకర్తారం నపశ్యతి» ♦ ఇత్యాదిస్మృతి సిద్ధం బగుటవలనను. మఱియును, అజ్ఞాని తనయందు దేహాదుల నధ్యసించికొని యవి వ్యాపారము లేక యుండునపుడు «నేను ఊరక సుఖముగ నున్నాను దుఃఖకర మగు కర్మము ఏమియుఁ జేయకున్నాను" అని అసుఖ మయిన దేహేంద్రియనిరోధమునందు సుఖబుద్ధి గలవాఁడై వానికిఁ గ్రియ లేమిచే తన్ను అక్రియునిఁగాఁ జూచుచున్నాఁడు; ఎట్లు గుఱ్ఱము నెక్కినవాఁడు గుఱ్ఱము నిలుచుటచేఁ దన్ను నిలిచినవానిఁగాఁ దలంచుచున్నాఁడో, ఎట్లు నడచుచునే యుండు సూర్యుని నిలిచియున్నవానిఁగాఁ దలంచుచున్నాఁడో అట్లు. అట్లు చూడఁడు విద్వాంసుఁడు; మ ఱేమనఁగా, ఆదేహాదివ్యాపారోపరతిరూప మయిన అకర్మమునందును కర్మమునే చూచుచున్నాఁడు; ఎట్లు దృఢముగా వ్రేళ్లను బిగికిలించినపుడు * వెలుపలఁ గ్రియ లేకయున్నను లోపల వ్రేళ్లకు ముకుళీభావము ‡ సిద్ధించుటకుఁ గారణ భూత మయిన అంగుళినిరోధన క్రియ యున్నదో, ఎట్లు కన్నుమూసినపుడు వెలుపల దర్శనక్రియ లేకున్నను ఱెప్పల నిరోధించుట యను క్రియ యున్నదో, «అట్లు నే నేమియుఁ జేయను" అని యూరకయుండునపుడును వెలుపల దేహేంద్రియాదుల చలనక్రియ లేకున్నను లోపల నేనేమియుఁ జేయను అను ఆగ్రహరూప మయిన మానసక్రియ కర్తకు ఉండనే యున్నది, లోపల ఆగ్రహ § రూపక్రియ లేనిచో పాణి మొదలగు నవయవముల నిరోధము సంభవింపదు, సర్వేంద్రియవ్యాపారములకును మనోవ్యాపారమే మూల మగుటవలన. ఇంద్రియ నిగ్రహరూప క్రియచేతనే దేహము నిశ్చలముగా నున్నది. ఇంద్రియ నిగ్రహము లేనిచో దేహమునకుఁ గాని యింద్రియములకుఁ గాని చలనము సంభవిం

♦ చేయునివాని నితఁడు చూచుచున్నాఁడు.

* ముష్టి పట్టినపుడు.

‡ ముడుఁగుట.

§ పట్టుదల.

పకమానదు; అందువలన మూఢదృష్టిచే అకర్మ మయిన యూరకుండుటయందును కర్మదర్శనము న్యాయముచేతను దృష్టాంతములచేతను అనుభవముచేతను సిద్ధ మగుటవలన అకర్మమునందుఁ గర్మదర్శనము అవిరుద్ధమును ప్రమాణసిద్ధంబును అగుచున్నది. ఇఁక భావమునందు అభావదర్శనంబును అభావమునందు భావదర్శనంబును అయుక్త మని యేది చెప్పఁబడినదో అది సరికాదు; దేహవ్యాపారము భావ మయినను బంధకము కాకుండుటచే అభావతుల్యం బగుటవలన దానియందు కర్మాభావదర్శనము యుక్త మగుటవలన భావమునం దభావదర్శన ముపపన్న మగుచున్నది; ఊరకుండుట యను నకర్మమునందును చెప్పిన విధంబునఁ గర్మము కనఁబడుటవలన అకర్మమునందుఁ గర్మదర్శనంబును మఱియు నుపపన్నమే యగుచున్నది, కావున నే విరోధంబును లేదు. ఓయీ! విద్వాంసునకుఁ గర్మమునం దకర్మదర్శనము అతీతానాగతవర్తమానసర్వకర్మములనుండియు మోక్షణమునకు హేతు వగుటచే జన్మాదిబంధనివర్తకం బగుటవలనఁ గర్తవ్యమే యగుచున్నది; అకర్మమునందుఁ గర్మదర్శనమున కో ప్రయోజనము లేదు, కావున "అకర్మణిచ కర్మయః" అనువిధి నిరర్థకమే యగును. అనఁగా; అట్లు కాదు, అదియును అకర్మమై యస్పష్ట మయిన ఆత్మయొక్క దర్శనంబునకు సాధనం బగుటచే సఫలం బగుటవలన. "నిష్క్రియం శాన్తమ్" అని నిష్క్రియత్వశాంతత్వములు బ్రహ్మలక్షణముగాఁ జెప్పుటవలన ఇటుఁగూడ నిష్క్రియత్వశాంతత్వధర్మములు గల దేహేంద్రియవ్యాపారోపరతిరూప మైన తూష్ణీ మవస్థానమునందు * స్వరూపభ్రమ కలుగును. అట్లు కలుగకుండుటకై యుపదేశించుచున్నాఁడు అకర్మణిచ కర్మయః అని. కర్మమువలె అకర్మముగూడ ఔపాధికం బగుటవలనను పురుషాధీనం బగుటవలనను దృశ్యం బగుటవలనను విచారింపఁగా క్రియాసహితం బగుటవలనను అనాత్మయె యగుచున్నది. దాని నెఱుంగువాఁ డెవ్వఁడో, అతఁడె యాత్మ యని తెలియవలయు నని సూచించుటకై యుపదేశించుచున్నాఁడు అకర్మణిచ కర్మయః అని. మఱియును, అకర్మముగూడ కర్మమువలె కర్మమే యనియెఱుంగుటచే కర్మాకర్మములు రెండును అనాత్మయే యని సిద్ధ మగుటం జేసి తూష్ణీమవస్థానరూప మయిన అకర్మము నిష్ఫలం బగుటవలన దానికంటె లోకోపకారకం బగుటవలనఁ గర్మమునందు విద్వాంసుఁడు ప్రవర్తించుట సఫలం బనియును సూచించుచున్నాఁడు అకర్మణిచ కర్మయః అని. అందువలన విధి సర్వథా సఫలమే యగుచున్నది. ఓయీ! కర్మమునం దకర్మదర్శనంబును అక

* ఊరకుండుటయందు.

ర్మమునందుఁ గర్మదర్శనంబును ఏకపురుషునకు సంభవింపదు, పరస్పరవిరుద్ధము లగు టచే వానికి ఒకచో నునికి యనుపపన్న మగుటవలన; "వికల్పో నహి వస్తు" అని ద్వైతము సమస్తంబును మిథ్యయే యని చూచునట్టి విద్వాంసునకు దేహేం ద్రియాదికము మిథ్య యగుటవలన తత్కార్యమునందుఁ గూడ మిథ్యాత్వదర్శ నము యుక్తము; కాని అకర్మమునందుఁ గర్మదర్శనము యుక్తము గాదు, అది దేహేంద్రియాదులు సత్య మను జ్ఞానముచేతనే సాధ్య మగుటవలన; దే హేంద్రియాదులు సత్యమయినం గదా తదాశ్రిత మగు అకర్మమునకు సత్యత్వమును కర్మత్వమును సిద్ధించును; అది సిద్ధించినచో కర్మమునం దకర్మదర్శనము సిద్ధింపదు, అది మిథ్యాత్వజ్ఞానముచేతనే కలుగునది యగుటవలన; ఇట్లు పరస్పరవిరుద్ధ ము లయిన ఆ రెండును ఒక పురుషునియం దుండుట సంభవింపదు; "కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః" అని రెండు యచ్ఛబ్దములు $ ప్రయోగించుటవలనఁగూడ; అందువలన ఆ రెంటును భిన్నపురు షులకే సంభవించును. అనఁగా, కాదు, విద్వాంసునకు రెంటియందును మిథ్యాత్వ దర్శనమే వివక్షితం బగుటవలన. ఎట్లు దేహేంద్రియాదులును తత్కార్యమును మిథ్య యని చూడవలయునో అట్లు దేహేంద్రియాదుల వ్యాపారోపరతిగూడ మిథ్య యనియే చూడవలయును, రెండును అవిద్యాకార్యభూత దేహాద్యాశ్రయంబు లగు టచే అవస్తువు లనుట సమానమగుటవలన, కానిచో భేదదృష్టి యుండుటచే అశుభ మోక్షము సంభవింపమివలన. ఎవ్వఁడు కర్మాకర్మంబులు రెండును వానియాశ్రయమైన దేహేంద్రియాదిసంఘము మిథ్యయే యని నిశ్చయించి వాని కధిష్ఠానంబును నిష్కలము నిష్క్రియము శాంతము అనంతము అఖండానందైకరసము నగు పరబ్రహ్మమును ఇదియే నే నని తానుగా నెఱింగి తద్రూపంబున నున్నాఁడో అతఁడే యశుభమునుండి ముక్తుం డగును, అట్లు గాక పెయివిధముగా అద్వైతజ్ఞానము దలఁచినవానికి ముక్తి సిద్ధింపదు. అందువలన అవి రెండును ఏకపురుషాశ్రయంబులే కాని భిన్నపురుషా శ్రయంబులు కావు. యచ్ఛబ్దద్వయము "యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి" ఇత్యాది స్థలంబునందువలె బోధసౌకర్యార్థమే కాని పురుష భేద సిద్ధికొఱకుఁ గాదు, స బుద్ధిమాన్ అని యొకటే తచ్ఛబ్దముతో నుపసంహరించుట వలన. ఇట్లు కర్మమునం దకర్మదర్శనంబును అకర్మమునందుఁ గర్మదర్శనంబును ఎవ్వఁడు శాస్త్రమువలనను ఆచార్యునివలనను యుక్తివలనను అనుభవమువలనను చే

$ యః అను రెండుశబ్దములు.

యుచున్నాఁడో. మనుష్యులలో అధికారియగు వఁడే సర్వశాస్త్రములందును బుద్ధిమంతుఁడు—ఆత్మతత్త్వజ్ఞుఁడు, అతఁడే యుక్తుఁడును—యోగియును, అతఁడే కృత్స్నకర్మకృత్తు—సమస్తము లయిన శ్రౌతస్మార్తకర్మములను ఇతరము లయిన పుణ్యకర్మములను జేసినవాఁడును అగుచున్నాఁడు; "ఏనగ్ం సర్వం త దభిసమేతి యత్కించ ప్రజా స్సాధు కుర్వన్తి" $ అను శ్రుతివలన సర్వప్రాణులచేతనుం జేయఁబడిన పుణ్యకర్మములు సమస్తములును వీనిచేఁ జేయఁబడినవి యగు నని యర్థము.

లేక •. కిం కర్మ కి మకర్మేతి అనుశ్లోకముయొక్క శేష మిచట వ్రాయఁబడుచున్నది.—అశుభాత్ = సంసారమునుండి; మోక్ష్యసే= విడివడుదువు. కర్మాకర్మముల తత్త్వము చక్కగా నెఱింగి ముక్తుఁడ వగుదు వని యర్థము. ఓయీ! "త మేవ విదిత్వా ఽతి మృత్యు మేతి" అని యాత్మతత్త్వజ్ఞానమువలననే ముక్తి కలుగు నని శ్రుతి చెప్పుచున్నది, కాని కర్మాకర్మముల తత్త్వము నెఱుంగుటవలన నని కాదు. అనఁగా; సత్యము ఆత్మజ్ఞానమువలననే ముక్తి. అయినను "తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ" అని పుణ్యపాపముల ధ్వంసము చేసినట్టి విద్వాంసునకే ముక్తి యని శ్రుతి యుపదేశించుచున్నది; కావున ముముక్షువు కర్మాదులతత్త్వము నెఱిఁగి జన్మాదిహేతువు లగు కర్మములనుండి విడివడవలయును, అందుకొఱకుఁ గర్మాదులతత్త్వము దెలియవలయు నని చెప్పుచున్నాఁడు.—కర్మణోఽపి = కర్తవ్య మని శాస్త్రమునందుఁ జెప్పఁబడిన స్వర్గాదిహేతు వగు కర్మముయొక్కగూడ, తత్త్వము; ముముక్షువునకు, బోద్ధవ్యమ్. దానికి విపరీతమగు నరకాది హేతువైన, వికర్మణశ్చ = నిషిద్ధకర్మముయొక్క గూడ, తత్త్వము; బోద్ధవ్యమ్. అట్లే అనర్థహేతువైన, అకర్మణో ఽపి = అశ్రద్ధచే విహితమును జేయకుండుట యను అకర్మముయొక్కగూడ, తత్త్వము; బోద్ధవ్యమ్, సద్గురువువలన. ఓయీ! చలనాత్మకం కర్మ అని చెప్పఁబడుటవలన చలనమే కర్మస్వరూపము, అం దేమి బోద్ధవ్యము గలదు? అని శంకింపఁగా, అట్లు కాదు, కర్మాకర్మవికర్మముల తత్త్వము మూఢులకుఁ దెలియ నలవి గా దని చెప్పుచున్నాఁడు గహనా కర్మణో గతిః అని. ఏకారణమువలన ననఁగా, కర్మణః—కర్మణః అనునది తక్కినవానికిని ఉపలక్షణము—కర్మాకర్మవికర్మములయొక్క; గతిః = తత్త్వజ్ఞానము, యథార్థముగా

$ జనులు సత్కర్మము ఏదేది చేయుచున్నారో అది యంతయు వీనిఁ బొందుచున్నది.

• ౧౬-౧౭-౧౮-శ్లోకములకు అర్థాంతరము.

నెఱుంగుట; సద్గురూపదేశముచేతనే గాని, గహనా = దుర్ఘటము, దుర్లభ మని యర్థము. అప్పుడు వానితత్త్వమును జగద్గురుఁడవు నీవే యుపదేశింపవలయు నని యాకాంక్షింపఁగా. కర్మాకర్మవికర్మములయొక్కయు ఆకాశాదిప్రపంచము సమస్తముయొక్కయు తత్త్వము బ్రహ్మమే. ఆబ్రహ్మము విదితం బగునేని సమస్తముయొక్కయుఁ దత్త్వము విదితం బగును. అని "సర్వభూతస్థ మాత్మానం సర్వ భూతాని చాత్మని । సంపశ్య న్బ్రహ్మ పరమమ్" అను శ్రుతిచేఁ బ్రతిపాదితం బగు నిశ్శేష సంసారభ్రమ వినాశనం బయిన పరావరైక్య దర్శనము నుపదేశించుచున్నాఁడు.— కర్మణి = చేయఁబడుచున్నది–సృజింపఁబడుచున్నది కావున కర్మ మనఁగా మహత్తు మొదలుకొని స్థూలమువఱకుఁ గల బ్రహ్మకార్యం బగు జగత్తు, దానియందు, సమస్తజగత్తునందును; అకర్మ = దేనియందు కర్మము లేదో అది అకర్మము, "నిష్కలం నిష్క్రియమ్" అను శ్రుతివలన నిష్క్రియ మగు పరబ్రహ్మమును; యః పశ్యేత్ — కనఁబడుచున్న ప్రపంచము సమస్తమును బ్రహ్మముగానే యెవఁడు చూచుచున్నాఁడో అని యర్థము. ఓయీ! సవిశేషము జగత్తు, నిర్విశేషము పరబ్రహ్మము, కావున ఎద్దును గుఱ్ఱమునుంబోలె ఈరెండును బరస్పరవిలక్షణము లగుచున్నవి; ఇట్లు బ్రహ్మముకంటె విలక్షణ మయిన ప్రపంచమును ఎట్లు బ్రహ్మముగాఁ జూచును విద్వాంసుఁడు? అనఁగా, అట్లు గాదు, అవి కార్యకారణము లగుటచే వైలక్షణ్య మనుపపన్న మగుటవలన. గవాశ్వములకో కార్యకారణభావము లేకుండుటవలనను జాతిభేదమువలనను వైలక్షణ్యము కలుగుచున్నది; జగద్బ్రహ్మములకు అట్లు గాదు. ఓయీ! నామముచేతను రూపముచేతను గుణముచేతను జాతిచేతను జగత్తు భిన్న మగుచున్నది, ఈభేదములు ప్రత్యక్ష మగుటవలన; ఇట్లు బహువిధభేదములచే భిన్న మగుజగత్తునెట్లు బ్రహ్మముగాఁ జూచును? అనఁగా అట్లు కాదు, నామరూపాదిభేదములు అధిష్ఠానము తెలియమిచేఁ గల్పితము లగుటవలన. ఎట్లు ఒకటే జలమునందు తరంగ ఫేన బుద్బుదాది భేదకల్పనంబును *, ఎట్లు ఒకటే భూమియందు గృహక్షేత్రాదిభేదకల్పనంబును భ్రమమూలకంబులో, అట్లే ఒకటే బ్రహ్మమునందు నామరూపాదిభేదకల్పనంబును భ్రమమూలకంబే కాని వాస్తవముగాదు. ఎట్లు ద్రవత్వ శీతత్వ శుక్లత్వ మధురత్వములు మొదలగు జలధర్మములు తరంగాదులందు లోపలను వెలుపలను అనుస్యూతములై యుండుటవలనను జలసత్తకంటె వేఱుసత్త లేకుండుటవలనను తరంగాదికము సమస్తమును జలమే యగుచున్నదో, అట్లు జగత్తునందుఁగూడ

* అలలు నురుఁగు బుడగలు మొదలగు భేదములఁ గల్పించుటయు.

వెలుపలను లోపలను అంతటను అవిచ్ఛిన్నముగా సచ్చిదానందములు బ్రహ్మధర్మములు అనుస్యూతము లయి కనఁబడుటవలనను, బ్రహ్మసత్తకంటె వేఱుసత్త లేకుండుటవలనను "చిద్ధీదం సర్వమ్, సద్ధీదం సర్వమ్, సర్వం ఖల్విదం బ్రహ్మ, బ్రహ్మైవేదం సర్వమ్" ఇత్యాదిశ్రుతులవలనను, "ఇది యంతయు బ్రహ్మమే, బ్రహ్మకార్యం బగుటవలన, మృత్కార్య మగు ఘటము మృత్తగునట్లు. ఇది యంతయు బ్రహ్మమే, బ్రహ్మమునం దారోపిత మగుటవలన, శుక్తిరజతమువలె ♦" ఇత్యాది యుక్తులవలనను మృత్తుమొదలగు దృష్టాంతములవలనను, చక్కఁగా విచారింపఁగా జగత్తు సమస్తమును బ్రహ్మమే యగుచున్నది. కావుననే శుద్ధాత్ముం డగు బ్రహ్మవిదుఁడు సమస్తమయిన జగత్తును బ్రహ్మముగానే చూచుచున్నాఁడని యర్థము. వాస్తవమే—శ్రుతి యుక్తి దృష్టాంతానుభవములచే జగత్తు బ్రహ్మమాత్ర మని సిద్ధ మగుటవలన జగత్తునకు కార్యత్వము నివర్తిల్లినది; అది నివర్తిల్లుటచే బ్రహ్మమునకుఁ గూడ "నిమిత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయః" ♪ అను న్యాయముచే కారణత్వము నివర్తిల్లుచున్నది; కారణత్వము కార్యత్వము నపేక్షించునది యగుటవలన కార్యత్వనివృత్తిచే కారణత్వమునకును నివృత్తి యగును; ఇట్లు రెండును నివర్తిల్లుటచే కార్యకారణభావము నివర్తిల్లి "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అనునట్లు బ్రహ్మమున కద్వితీయత్వము సిద్ధ మగుచున్నది. అట్లయినను, ఇప్పుడు విచారించిన పిదప అద్వితీయత్వము బ్రహ్మమునకు సిద్ధ మగుచున్నది, పూర్వమో జగత్తనియు బ్రహ్మమనియు ద్వైత ముండనే యున్నది యని యాశంకింపఁగా; అట్లు కాదు. పూర్వము గూడ ఎట్లు రజ్జువే సర్పము దానిశిరస్సు తోఁక మొదలగువానిరూపంబునఁ దోఁచెనో, ఎట్లు మరువే * జలతరంగ ఫేనాదిరూపమునఁ దోఁచెనో అట్లు బ్రహ్మమే భ్రాంతిచే ద్రవ్యగుణకర్మాదిభేదభిన్నం బగు జగద్రూపంబునఁ దోఁచినది, కాని వాస్తవమున జగత్తు లేదు. కావున ముముక్షువు బ్రహ్మము కాలత్రయమునందు అద్వితీయం బని నిశ్చయము గలుగుటకొఱకు బ్రహ్మమునందు తద్వివర్తముగా జగత్తున్న దని చూడవలయు నని వ్యతిహారముఖంబున § చెప్పిన దర్శనమునే మరల దృఢీకరించుచున్నాఁడు జగత్తు బ్రహ్మమే యనుట నిస్సంశయ మగు కొఱకు అకర్మణి చ కర్మ యః

♦ శుక్తియందు ఆరోపింపఁబడిన రజతము శుక్తియే యగునట్లు.

♪ నిమిత్తము నశించినపుడు నైమిత్తికమునకును నాశ మగును.

* నిర్జలభూమియే.

§ వ్యతిహార మనఁగా పరస్పర విశేషణవిశేష్యభావము—బ్రహ్మము జగత్తు, జగత్తు బ్రహ్మము అని స్పష్టార్థము పరస్పరమునకు విశేషణవిశేష్యభావములు కల్పించి చెప్పుట.

అని. అకర్మణి = ఈచెప్పినలక్షణము గల బ్రహ్మమునందు; కర్మ చ = చెప్పినలక్షణము గల జగత్తును; యః పశ్యేత్—బ్రహ్మవివర్త మగుటచే తనకు వేఱుసత్త లేమివలన రజతమును శుక్తిగాను జలమును మరుభూమిగాను జూచునట్లు జగత్తు సమస్తమును బ్రహ్మముగానే యెవ్వఁడు చూచుచున్నాఁడో యని యర్థము. సర్వాం తం పరాదాద్యో ఽన్యత్రాత్మనః సర్వాం వేద ” అనుశ్రుతి బ్రహ్మముకంటె వేఱు సత్త గలదిగా నామరూపాదిభేదభిన్న మగుజగత్తును జూచునట్టి యవిద్వాంసున కనర్థము చెప్పుచున్నది, కావున భ్రమకల్పితం బగు నామరూపాది ద్వైతదర్శనమును విడిచి నిశ్శ్రేయసముఁ * గోరువాఁడు సంశయవిపర్యయములు నిశ్శేషముగా నశించునట్లు నామమును రూపమును గుణమును కర్మమును సమస్తమును బ్రత్యగ్దృష్టిచే బ్రహ్మమునుగానే యెవఁడు చూచుచున్నాఁడో; సః = అతఁడే; బుద్ధిమాన్ = బ్రహ్మవేత్త. సః = అతఁడే; యుక్తః = బ్రహ్మనిష్ఠుఁడు. అతఁడే, కృత్స్నకర్మకృత్ = సమస్తము లయిన అనేకకల్పసంపాదితము లగు సంచితకర్మములను ఇప్పుడు చేసిన కర్మములను ఇట్లు అనారబ్ధఫలంబు ♦ లగు నానాయోనిప్రాపకంబు లయిన సర్వకర్మంబులను స్వస్వరూపజ్ఞానం బను ఖడ్గముచే, కృన్తతి—ఛేదించుచున్నాఁడు కావున కృత్స్నకర్మకృత్, ‘సర్వం పాప్మానం తరతి’ అను శ్రుతివలన; ఇట్లు చూచువాఁ డెవఁడో అతఁడు అశుభమునుండి ముక్తుఁ డగు నని యర్థము.

మ. అప్పుడు ఎట్టిది కర్మాదులతత్త్వము ? అనఁగా దానిఁ జెప్పుచున్నాఁడు.—కర్మణి = దేహేంద్రియాదివ్యాపారమునందు విహితమునందును నిషిద్ధమునందును, నావలో నున్నవానిచే తీరస్థవృక్షాదులందు ఆరోపింపఁబడిన చలనమువలె, నేను జేయుచున్నా నని ధర్మాధ్యాసముచే ఆత్మయం దారోపింపఁబడిన దానియందు; అకర్త యగు ఆత్మయొక్కతత్త్వము పర్యాలోచించుటచే వాస్తవమున, అకర్మ = కర్మాభావమును; తీరస్థవృక్షాదులందు చలనాభావమునుంబోలె; యః; పశ్యేత్ = చూచుచున్నాఁడో. అట్లు, దేహేంద్రియాదులు త్రిగుణసహిత మగు మాయయొక్క పరిణామము లగుటచే సర్వదా వ్యాపారసహితము లయి యుండఁగా, వ్యాపారరహితుఁడనై యూరక సుఖముగా నున్నా నను నభిమానముచే, దూరస్థులై నేత్రసన్నికృష్టు లగు పురుషులయందు నడచుచున్నవారియందు గమనాభావమువలె ఆరోపింపఁబడిన, అకర్మణి = వ్యాపారోపరతియందు; సర్వదా వ్యాపా

* మోక్షమును.

♦ ఫలము ననుభవించుటకు ఆరంభింపనివి.

రసహితము లగు దేహేంద్రియాదులస్వరూపమును బర్యాలోచించుటచే వాస్తవమున, కర్మ = నివృత్తిప్రయత్నరూపమైన వ్యాపారమును; యః పశ్యేత్, మీఁద నుదాహరించిన పురుషులందు గమనమునుంబోలె. ఔదాసీన్యావస్థయందును * ఉదాసీనుఁడనై నేనున్నా నను నభిమానమే కర్మము. ఇట్టి పరమార్థదర్శి యగు పురుషుఁడు సబుద్ధిమా నిత్యాదిగా బుద్ధిమత్త్వము యోగయుక్తత్వము కృత్స్నకర్మకృత్త్వము అను మూఁడుధర్మములచే స్తుతింపఁబడుచున్నాఁడు. ఇటఁ బ్రథమ పాదముచేఁ కర్మవికర్మములతత్త్వము దర్శిత మయ్యెను, కర్మశబ్దము విహితకర్మమును నిషిద్ధకర్మమును బోధించునది యగుటవలన; ద్వితీయపాదముచే అకర్మముయొక్క తత్త్వము దర్శితము అని యెఱుంగవలయును. అందు నీ వేమి తలఁచుచున్నావో— కర్మము బంధహేతు వగుటవలన ఊరకయే నేను సుఖముగా నుండవలయు ననిః అది యసంగతము, కర్తృత్వాభిమానము లేనిచో కర్మము విహితము కాని ప్రతిషిద్ధముగాని బంధహేతువు కాకపోవుటవలన; అట్లు చెప్పఁబడినది « న మాం కర్మాణి లిమ్పన్తి " ఇత్యాదిగా. కర్తృత్వాభిమానము కలదేని, ఊరక నేనున్నాను అను ఔదాసీన్యాభిమానాత్మక మగు కర్మ మేది గలదో అదిగూడ బంధహేతువే యగును, వస్తుతత్త్వము తెలియమివలన. అందువలన కర్మవికర్మాఽకర్మములతత్త్వ మిట్టిది యెఱింగి వికర్మాఽకర్మములను విడిచి కర్తృత్వాభిమానమును ఫలాభిసంధియును లేనివాఁడవై విహితకర్మమునే చేయు మని యభిప్రాయము. మఱియొక వ్యాఖ్యానము.—కర్మణి = జ్ఞానమునకు కర్మమునందు ♦, దృశ్యము జడ మయినదానియందు; సద్రూపంబునను స్ఫురణరూపంబునను అనుస్యూతమై సర్వభ్రమంబులకును అధిష్ఠాన మైన, అకర్మ = కర్మము కానిదానిని, జ్ఞేయము కానిదానిని, స్వప్రకాశచైతన్యమును; పరమార్థదృష్టిచే; యః పశ్యేత్. అట్లు, అకర్మణిచ = స్వప్రకాశమగు దృగ్వస్తువునందు; కల్పిత మగు, కర్మ = దృశ్యమును, మాయామయము కాని పరమార్థ సత్తు కా దని, దృక్కునకును దృశ్యమునకును సంబంధము ⟆ అనుపపన్న మగుటవలన, « యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవాఽనుపశ్యతి । సర్వభూతేషు చాఽఽత్మానం తతో నవి జుగుప్సతే " § అను శ్రుతివలన. ఇట్లు పరస్పరము

* ఊరకుండునప్పుడును.

♦ జ్ఞానక్రియకు కర్మ మయినదానియందు—తెలియఁ దగిన దానియందు—జ్ఞేయమునం దనుట.

⟆ వాస్తవసంబంధము.

§ ఎవ్వఁడు అవ్యక్తాదిస్థావరాంతము లగు సమస్తభూతములను ఆత్మయందే చూచుచున్నాఁడో—ఆత్మ వ్యతిరిక్తముగాఁ జూడఁడో, అసమస్తభూతములందును ఆత్మను చూచుచున్నాఁడో—అభూతములకుఁ దానే ఆత్మయని చూచుచున్నాఁడో, అతఁడు అందువలన జుగుప్స నొందఁడు.

అధ్యస్తమై యున్నను, శుద్ధమైన వస్తువును ఎవ్వఁడు చూచుచున్నాఁడో; మనుష్యులలో, సః = అతఁడే; బుద్ధిమాన్ - జ్ఞానము గలవాఁడు, ఇతరుఁడు కాఁడు, ఇతఁడు పరమార్థదర్శి యగుటవలనను ఇతరుఁడు పరమార్థదర్శి కాకుండుటవలనను. అతఁడే, యుక్తః = జ్ఞానసాధన మయిన యోగముతోఁ గూడినవాఁడు — అంతఃకరణశుద్ధిచే ఏకాగ్రచిత్తుఁడు. అందువలన అతఁడే, కృత్స్నకర్మకృత్ = అంతఃకరణశుద్ధిసాధనములయిన సమస్తకర్మములను జేసినవాఁడు; అని వాస్తవధర్మములచేతనే స్తుతింపఁబడుచున్నాఁడు. అందువలన నీవును బరమార్థదర్శి వగుము, అంతమాత్రముననే సమస్తకర్మకర్తృత్వము సిద్ధించుటవలన నని యభిప్రాయము. అందువలన, "యద్ జ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్" అని యేది చెప్పఁబడినదో, మఱియు కర్మాదులతత్త్వము బోద్ధవ్యము కల దనియు సబుద్ధిమా నిత్యాదిస్తుతియు నేది చెప్పఁబడినదో అది యంతయుఁ బరమార్థదర్శనంబున సంగత మగుచున్నది. ఇతరము తెలియుటవలన అశుభసంసారమునుండి మోక్షణ మనుపపన్న మగుటవలన; ఇతరము అతత్త్వము కావున నది బోద్ధవ్యము కాదు, దానిజ్ఞానముచేఁ గాని బుద్ధిమత్త్వము సిద్ధింపదు. కావున యుక్తమే పరమార్థదర్శులవ్యాఖ్యానము. ఇఁక, కర్మణి = పరమేశ్వరార్థము అనుష్ఠింపఁబడు నిత్యకర్మమునందు, బంధహేతువు కాకుండుటవలన, అకర్మ - అకర్మ మిది యని, యః పశ్యేత్; అట్లు, అకర్మణిచ = నిత్యకర్మము చేయకుండుటయందు, ప్రత్యవాయహేతు వగుటవలన, కర్మ మిది యని, యః పశ్యేత్; సబుద్ధిమాన్ ఇత్యాది. అనువ్యాఖ్యానము ఏది గలదో; అది యసంగతమే, నిత్యకర్మమునందు అకర్మ మిది యనుజ్ఞానము అశుభమోక్షహేతువు కాకుండుటవలనను, మిథ్యాజ్ఞాన మగుటచే అదియే యశుభ మగుటవలనను. ఇట్టి మిథ్యాజ్ఞానము బోద్ధవ్య మగు తత్త్వమునుం గాదు, ఇట్టి జ్ఞానము గలవానికి బుద్ధిమత్త్వాదిస్తుతియు నుపపన్నము గాదు, భ్రాంతుఁ డగుటవలన. నిత్యకర్మానుష్ఠానము గదా స్వరూపముచే • అంతఃకరణశుద్ధిద్వారమున నుపయుక్త మగుచున్నది; దానియందు అకర్మబుద్ధి యెందును ఉపయుక్తము గాదు, శాస్త్రముచే నామాదులందు బ్రహ్మదృష్టివలె అట్లు * విహితము కాకుండుటవలన. ఈవాక్యమే దానికి విధాయకం బనుటయుం జెల్లదు, ఉపక్రమాదులు విరోధించు నని చెప్పియున్నారము. ఇట్లు నిత్యకర్మము చేయకుండుటయు స్వరూపముచే నిత్యకర్మవిరుద్ధ మగుకర్మమునకు లక్షక మగుటచే నుపయుక్త మగు

• తానుగానే.

* నిత్యానుష్ఠానమునందు అకర్మదృష్టి.

చున్నది, కాని అందు కర్మదృష్టి యెచటను ఉపయుక్తము కాదు. మఱియును నిత్యాఽకరణమువలనఁ బ్రత్యవాయ మనుటయు సరి కాదు, అభావమునుండి భావము పుట్టుట సంభవింపమివలన, అట్లు కానిచో అభావము ఎప్పుడు నుండుటచే సర్వదా కార్యోత్పత్తి ప్రసక్తించుటవలన; « భావార్థాః కర్మశబ్దాః తేభ్యః క్రియా ప్రతీయేత ఏష హ్యర్థో విధీయతే » * అను న్యాయంబున భావార్థమే యపూర్వజనకం బగుట వలన; « అతిరాత్రే షోడశినం న గృహ్ణాతి » ♦ ఇత్యాదిస్థలమునందుఁగూడ సంకల్ప విశేషమే ❡ అపూర్వజనకం బని యంగీకరించుటవలన, « నేక్షేతోద్యన్తమా దిత్యమ్ " § ఇత్యాది ప్రజాపతివ్రతమునందుఁబోలె **. అందువలన, నిత్యకర్మము ననుష్ఠింపవలసినకాలమునందు దానికి విరుద్ధముగా చేయఁబడునది కూర్చుండియుండుట లోనగు కర్మమేది గలదో అదియే నిత్యకర్మాఽకరణముచే ఉపలక్షితమై ప్రత్య వాయహేతు వని వైదికులసిద్ధాంతము. కావుననే « అకుర్వన్విహితం కర్మ " అను చో కుర్వన్ అనుపదమునందలి శతృప్రత్యయమునకు లక్షణ మర్థ మని వ్యాఖ్యానము చేయఁబడినది, « లక్షణహేత్వోః క్రియాయాః " అని లక్షణమును హేతువును అర్థ మని చెప్పఁబడినను ఇట హేత్వర్థము అనుపపన్న మగుటవలన. అందువలన మిథ్యా దర్శననివారణము ప్రస్తుతమై యుండఁగా మిథ్యాదర్శనవ్యాఖ్యానము ఎంతమాత్ర మును శోభింపదు. నిత్యానుష్ఠానము విధించుట యీవాక్యమున కభిప్రాయ మని యుఁ జెప్పఁ దగదు, నిత్యములను జేయవలయు ననునర్థమునందు దాని బోధింపని దానిని కర్మణ్యకర్మయః పశ్యేత్ అనువాక్యమును బ్రయోగించిన భగవంతునకు వంచకత్వ మాపాదిల్లుటవలన. ఇత్యాదివిషయము భాష్యమునందే విస్తరించి ప్రతి పాదింపఁబడినది, కావున నుపరమించుచున్నారము.

శ్రీ. కర్మాదులయొక్క దుర్విజ్ఞేయ మగు తత్త్వము తెలుపుటకై చెప్పు చున్నాఁడు.—కర్మణి= పరమేశ్వరారాధనరూప మయిన కర్మమువిషయమునందు;

* కర్మవాచకశబ్దములు— ధాతువులు భావార్థకములు, వానివలనఁ గ్రియ ప్రతీత మగును, ఈ యర్థము గదా విధింపఁబడుచున్నది.

♦ అతిరాత్ర మను యాగమునందు షోడశిని — సోమరసస్థాపనపాత్రను గ్రహింపఁ గూడదు.

❡ షోడశిని గ్రహింపను అను సంకల్పమే.

§ ఉదయించుచున్న సూర్యునిఁ జూడఁ గూడదు.

** ప్రజాపతివ్రతమునందుఁ జెప్పఁబడిన నేక్షేతోద్యన్తమాదిత్యమ్ అనుటకు సూర్యునిఁ జూడఁ గూడదు అను సంకల్పరూపక్రియ అర్థ మగునట్లు అనుట.

అకర్మ = కర్మ మిది కా దని; యః పశ్యేత్, అది జ్ఞానహేతు వగుటచే బంధకము కాకుండుటవలన. అకర్మణి = విహితమును జేయకుండుట విషయమునందు; కర్మ యః పశ్యేత్, అది ప్రత్యవాయము కలిగించునది యగుటచే బంధహేతు వగుటవలన, మనుష్యేషు = కర్మము చేయువారియందు; సః, బుద్ధిమాన్ = వ్యవసాయాత్మకబుద్ధి గలవాఁ డగుటవలన శ్రేష్ఠుఁడు. అతని స్తుతించుచున్నాఁడు—సః, యుక్తః=యోగి; అకర్మముచే జ్ఞానయోగము లభించుటవలన. అతఁడే కృత్స్నకర్మ కర్తయును, సర్వ తస్సంప్లుతోదకస్థానీయ మగు అకర్మమునందు సర్వకర్మముల ఫలంబులును అంతర్భూతంబు లగుటవలన. ఇట్లు ఆరురుక్షువునకుఁ గర్మయోగాధికారావస్థయందు "నకర్మణా మనారమ్భాత్" ఇత్యాదిగాఁ జెప్పఁబడిన కర్మయోగమే స్పష్టముగాఁ దెలుపఁబడినది. ఈప్రకరణము దానినే విస్తరించునది కావునఁ బౌనరుక్త్యదోషము లేదు. యోగారూఢావస్థయందు "యస్త్వాత్మరతి రేవ స్యాత్" ఇత్యాదిగా కర్మముతోఁ బని లే దని యేది చెప్పఁబడినదో అందుకుఁగూడ ఈశ్లోకముచేతనే ఆర్థికముగా వివరణము చేయఁబడినది యని తెలియవలయును. ఎప్పుడు ఆరురుక్షువునకుఁగూడ కర్మము బంధకము కాదో అప్పుడు ఆరూఢునకు ఏల బంధకం బగును? ఈవిషయంబునఁ గూడ శ్లోకము యోజింపఁబడుచున్నది.—కర్మణి= దేహేంద్రియాది వ్యాపారము వర్తించుచున్నను; తాను దేహేంద్రియాది భిన్నుఁడై తెలియవచ్చుటవలన, తనకు స్వాభావిక మయిన, అకర్మ=నైష్కర్మ్యమునే; యః పశ్యేత్. అట్లు, అకర్మణి = జ్ఞానము లేక కర్మము దుఃఖకరము అను బుద్ధిచే కర్మముల విడుచుటయందు; కర్మ యః పశ్యేత్, అది బంధక మగుటచే మిథ్యాచార మగుటవలన; అట్లు చెప్పఁబడినది "కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్" అని. ఎవ్వఁ డిట్టివాఁడో వాఁడు, సమస్తమనుష్యులయందును; బుద్ధిమాన్ = పండితుఁడు. అందుకు హేతువు—ఎందువలన ననఁగా, కృత్స్నకర్మకృత్ = సమస్తము లయిన కర్మములను అప్రయత్నముగా లభించినవానిని ఆహారాదులను చేయుచున్నవాఁడైనను; సః, యుక్తః—అకర్మాశ్రిత జ్ఞానముచే సమాధియం దున్నవాఁడే యని యర్థము. ఇందుచేతనే "జ్ఞానికి స్వభావంబున ♦ సంభవించిన కలంజభక్షణాదిక * మగు కర్మము దోషము గాదు; అజ్ఞునకో రాగముచేఁ జేయఁబడినదియై దోష మగుచున్నది" అని వికర్మముయొక్క తత్త్వముగూడ నిరూపితం బయ్యె నని యెఱుంగునది.

---

♦ అప్రయత్నముగా.

* బంగియాకు దినుట లోనగునది.

ప. ఇఁక దీనినే వివేచించి చెప్పుచున్నాఁడు.—కర్మణి = వేదవిహిత మగు కర్మమునందు; అకర్మ = నైష్కర్మ్యమును; యః పశ్యేత్. అట్లు, అకర్మణి= నైష్కర్మ్యమునందు; నిమిత్తమునుగా, కర్మ = కర్మమునే; యః పశ్యేత్; ఇట్లు ఒండొంటిని గార్యకారణరూపములనుగా చూచుచున్నాఁడో అతఁడే వ్యవసాయాత్మక మగు బుద్ధి గలవాఁడు. అతఁడే, కృత్స్నకర్మకృత్—ముక్తియందు సర్వకర్మ ఫలములును అంతర్భూతము లగుటవలన.

రా. కర్మాకర్మములయందు బోద్ధవ్యమును జెప్పుచున్నాఁడు.—కర్మశబ్దముచే నిట కర్మముకంటె ఇతరము ప్రస్తుత మగుజ్ఞానము చెప్పఁబడుచున్నది. కర్మణి = చేయుచున్న కర్మమునందే; అకర్మ = ఆత్మజ్ఞానమును; యః పశ్యేత్. అకర్మణి—వర్తమాన మయిన ఆత్మజ్ఞానమునందే; కర్మ, యః పశ్యేత్. ఏమి చెప్పఁబడినది ? చేయుచున్న కర్మమునే ఆత్మతత్త్వము ననుసంధించుటచే జ్ఞానాకారమునుగా నెవ్వఁడు చూచునో, ఆజ్ఞానమును కర్మయోగాంతర్గత మగుటచే కర్మాకారమునుగా నెవ్వఁడు చూచునో అని చెప్పఁబడినది. కర్మము చేయునప్పుడు కర్త యగు ఆత్మయొక్క తత్త్వము ననుసంధించుటచే అవిరెండును ♦ సిద్ధించుం గదా! ఇట్లు ఆత్మతత్త్వానుసంధానగర్భమునుగా కర్మము నెవ్వఁడు చూచునో, సః = అతఁడు; బుద్ధిమాన్ = సర్వశాస్త్రార్థమును దెలిసినవాఁడు. మనుష్యేషు = మనుష్యులయందు, సః = అతఁడే, యుక్తః = మోక్షమునకుఁ దగినవాఁడు. అతఁడే, కృత్స్నకర్మకృత్ = సర్వశాస్త్రార్థమును జేయువాఁడు.

ఎవ్వఁడు కర్మముఁ జేయుచునే ఆత్మతత్త్వము ననుసంధించునో ఆత్మతత్త్వము ననుసంధించుచునే కర్మము చేయునో ఇట్లు జ్ఞానాకారముగా కర్మమును కర్మాకారముగా జ్ఞానమును దెలిసి యెవ్వఁ డనుష్ఠించునో అతఁడే సర్వశాస్త్రార్థము దెలిసినవాఁడు, అతఁడే మోక్షమున కధికారి, అతఁడే సర్వశాస్త్రార్థము ననుష్ఠించినవాఁ డని తాత్పర్యము.

మా. కర్మాదిస్వరూపముఁ జెప్పుచున్నాఁడు.—కర్మణి—కర్మము చేయుచుండునపుడు; అకర్మ యః పశ్యేత్—విష్ణువుడే కర్మము, నేను చిత్ప్రతిబింబమను ఏమియుఁ జేయువాఁడఁ గా నని. అకర్మణి = సుషుప్తిమొదలగు దానియందు, కర్మము చేయని యవస్థయందు; పరమేశ్వరునియొక్క, కర్మ యః పశ్యేత్ —ఈపర

♦ జ్ఞానాకారకర్మమును కర్మాకారజ్ఞానమును.

మేశ్వరుఁడే సర్వదా సర్వసృష్టి మొదలగుదానిని జేయుచున్నాఁ డని. సః, బుద్ధిమాన్ = జ్ఞాని. అతఁడే, యుక్తః = యోగయుక్తుఁడు. సర్వకర్మములను జేయుచుండుటవలన అతఁడే, కృత్స్నకర్మకృత్—సర్వకర్మఫలము గలవాఁ డగుటవలన.

తాను వర్ణాశ్రమోచిత మగు కర్మమును జేయుచుఁ దాను కర్తగాఁ డనియు పరమేశ్వరుఁడే కర్త యనియు నెవ్వఁడు చూచుచున్నాఁడో, తాను కర్మము చేయని యప్పుడు నిద్రాదులయందును పరమేశ్వరుఁడు ప్రపంచసృష్టిని స్వప్నగజాది సృష్టిని జేయుచున్నాఁ డని యెవ్వఁడు చూచుచున్నాఁడో, ఇట్లు తనకు వ్యాపారము కలిగినప్పుడును లేని యప్పుడును పరమేశ్వరుఁడు సర్వసృష్టిని జేయుచున్నాఁ డనియు పరమేశ్వరుఁడే ముఖ్యకర్త తాను తదధీనకర్త యనియుఁ దెలిసి విహితము ననుష్ఠించుట కర్మ మని యెవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడు జ్ఞాని, అతఁడే యోగి, సమస్తకర్మములను జేయనివాఁ డయినను అతఁడు సర్వకర్మఫలములఁ బొందువాఁ డని తాత్పర్యము.

యస్య సర్వే సమారమ్భాః కామసఙ్కల్పవర్జితాః
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పణ్డితం బుధాః. ౧౯

భా. ఆ యీ కర్మ ణ్యకర్మేత్యాది ప్రతిపాదిత మగు పరమార్థదర్శనము స్తుతింపఁబడుచున్నది.—యస్య=పైఁ జెప్పినట్లు చూచునట్టి యెవ్వని యొక్క; సర్వే=సమస్తము లయిన; సమారమ్భాః= ఆరంభింపఁబడునవి కావున సమారంభంబు లనఁగా కర్మములు. కామసఙ్కల్పవర్జితాః = కామములచేతను తత్కారణము లయిన సంకల్పములచేతను విడువఁబడినవో, వట్టి చేష్టామాత్రములుగా ననుష్ఠింపఁబడుచున్నవో, ప్రవృత్తుఁడైనచో లోకసంగ్రహముకొఱకు, నివృత్తుఁడైనచో జీవనమాత్రముకొఱకు; జ్ఞానాగ్నిదగ్ధకర్మాణమ్ = కర్మాదులందు అకర్మాదిదర్శనము జ్ఞానము, అజ్ఞాన మను అగ్నిచేత దహింపఁబడిన శుభాశుభకర్మములు గలవాఁ డగు; తమ్= వానిని; పణ్డితమ్= పరమార్థముగఁ బండితునిఁగా; బుధాః = బ్రహ్మవిదులు; ఆహుః = చెప్పెదరు.

ఇట్లు తెలిసినట్టి యెవ్వని సమస్తకర్మములును కామసంకల్పప్రయుక్తములు గాక వ్యర్థచేష్టలుగాఁ బ్రవర్తించుచుండునో, కర్మాదులందు అకర్మాదిదృష్టియను జ్ఞానముచే దగ్ధము లయిన సమస్తకర్మములును గల అట్టి పురుషుని బ్రహ్మవేత్తలు పరమార్థపండితునిఁగాఁ జెప్పుదు రని తాత్పర్యము.

ఆ. కర్మమునందకర్మదర్శనమును పూర్వోక్తమును స్తుతించుటకై యీ(ది శ్లోకమును ప్రస్తావించుచున్నారు ఆయీ ఇత్యాదిగా. పైచెప్పినట్లు చూచునట్టి— పూర్వశ్లోకమునఁ జెప్పఁబడిన దర్శనముతోఁ గూడినట్టి. సమారంభశబ్దమునకుఁ గర్మమనునర్థము రూఢిచేతఁ గాదు, మ జేమనఁగా వ్యుత్పత్తిచే నని చెప్పుచున్నారు ఆరంభింపఁబడుచున్నవి అని. కామసంకల్పవర్జితము లయినచో నెట్లు కర్మముల ననుష్ఠించుట ? అని యాశంకించి చెప్పుచున్నారు వట్టి ఇత్యాదిగా. ఉద్దేశమును ఫలమును లేనియెడ కర్మానుష్ఠానము యాదృచ్ఛికం ♦ బగు నని యాశంకించి ప్రవృత్తునిదా నివృత్తునిదా ? కర్మానుష్ఠానము యాదృచ్ఛికము ? అని వికల్పించి క్రమంబున నిరాకరించుచున్నారు ప్రవృత్తుఁ డైనచో ఇత్యాదిగా. ఉత్తరార్ధము విభజించుచున్నారు కర్మాదులందు ఇత్యాదిగా. ఈజ్ఞానము యోగ్యమే దహించును అయోగ్యమైనచో దహింప దని * వివక్షిత మగుటవలన దానియం దగ్నిపదము. ఇట్టి విజ్ఞానము లేనివారలకుం గూడ వైశేషికాదులకు పండితు లను ప్రసిద్ధి నాశంకించి వారు పండితాభాసు లని చెప్పఁ దలంచినవారై విశేషణము చేయుచున్నారు పరమార్థమున అని.

హ. అందువలన. యస్య = కర్మాకర్మములు తెలిసిన యెవ్వనియొక్క; సర్వే సమారమ్భాః = సమస్తక్రియలును; కామసఙ్కల్పవర్జితాః = ఫలసంకల్పరహితములో; తమ్; జ్ఞానాగ్నిదగ్ధకర్మాణమ్ = కర్మాకర్మతత్త్వజ్ఞాన మను అగ్నిచే దహింపఁబడిన కర్మములు గలవానిని; బుధాః = బ్రహ్మవిదులు; పణ్డితమ్, ఆహుః.

శం. «యథా పుష్కరపలాశ ఆపో న శిష్యన్తే § అను శ్రుతి చెప్పినట్లు, కర్మమునందకర్మదర్శనముచే శరీరయాత్రార్థములు జ్ఞానసమకాలము ¶ లగు కర్మముల నెవ్వఁడు అంటించుకొనఁడో అతఁడే పండితుఁ డని చెప్పుచున్నాఁడు.— సమారమ్భాః= చక్కఁగా దేహేంద్రియాదులచే నారంభింపఁబడుచున్నవి—చేయఁబడుచున్నవి కావున సమారంభంబు లనఁగా ప్రాణరక్షణార్థము లగు దేహేంద్రియాది వ్యాపారములు; సర్వే = సమస్తములును; యస్య = ఏబ్రహ్మవిదునకు; కామసంకల్పవర్జితాః= కామ మనఁగా ఇది కావలయు నని యిచ్ఛావేగము, సంకల్ప మనఁగా దాని

♦ యథేచ్ఛగా వచ్చినది.

* పరిపుష్టమైన—సమ్యక్ జ్ఞానమే దహించును దృఢము కానిచో దహింపఁ జాల దని.

§ ఎట్లు తామరాకున జలములు అంటవో.

¶ జ్ఞానము కలిగినపుడు చేయఁబడునవి.

కారణము మంచిది యను బుద్ధి, ఆ రెంటిచే విడువఁబడినవో, ఆఁకలి మొదలగువానివలెఁ దాత్కాలికము లగుచున్నవో; తం జ్ఞానాగ్నిదగ్ధకర్మాణమ్ = కూటస్థాసంగచిద్రూపుఁడనే నేను, కాని కర్తను భోక్తను శ్రోతను ద్రష్టను వక్తను కాను అని ఆత్మయే తానగుటచే దేహమునందును తద్ధర్మములందును తత్కార్యములందును దనకు సంబంధము లేదను జ్ఞానము అను అగ్నిచేత దగ్ధము లయిన—నిర్మూలింపఁబడిన సమస్తము లగు విహితప్రతిషిద్ధాదు లౌపాధికకర్మములు గలవానిని; అట్టి జీవన్ముక్తుఁడగు మహాపురుషునే, బుధాః= శాస్త్రజ్ఞులు; పణ్డితమ్; ఆహుః, పండ—శుభను సర్వత్ర బ్రహ్మమాత్రగ్రాహి యగు అఖండవృత్తి, అది గలవాఁడు కావునఁ బండితుఁడు, వానినే పండితునిఁగాఁ జెప్పుదురు గాని ఇతరునిఁ గా దని యర్థము. ఇట, కామసంకల్పవర్జితాః అనుటచే “యద్యద్ధి కురుతే జన్తుస్తత్తత్కామస్య చేష్టితమ్” * అను న్యాయమువలన కర్మములందుఁ బ్రవృత్తికిఁ గారణము కామము, దానికిఁ గారణము సంకల్పమే యగుచున్నది; ఆరంభములకు అవి లేనిచో, స్వార్థము గాని పరార్థము గాని విద్వాంసునకుఁ బ్రవృత్తి యనుపపన్నమై శరీరయాత్రామాత్రమునందే నిలుచును, అదియు తాత్కాలికముమాత్రమే యగును, అందుఁగూడ కామాదులు లేకుండుటవలన అభినివేశము లేనిదియు జ్ఞానాగ్నినిర్దగ్ధమునై యుండు నని సూచితం బగుచున్నది.

మ. ఈపరమార్థము నెఱింగినవాఁడు కర్తృత్వాభిమానము లేకుండుటచే కర్మములతో నంటఁ డనుటను విస్తరించుచున్నాఁడు బ్రహ్మకర్మసమాధినా అనువఱకుఁ గల ఆఱుశ్లోకములచేత.—యస్య = మున్ను చెప్పిన పరమార్థదర్శనము గల యొవనియొక్క; సర్వే = సమస్తము లయిన, వైదికములు కాని లౌకికములు గాని; సమారమ్భాః = చక్కఁగా ఆరంభింపఁబడుచున్న వను వ్యుత్పత్తిచే కర్మములు; కామసంకల్పవర్జితాః = కామ మనఁగా ఫలతృష్ణ, సంకల్ప మనఁగా నేను జేయుచున్నా నని కర్తృత్వాభిమానము, ఆ రెంటిచే విడువఁబడినవో, లోకసంగ్రహార్థము గాని జీవనమాత్రార్థము గాని ప్రారబ్ధకర్మవేగవశంబున వ్యర్థచేష్టారూపంబు లగుచున్నవో, తమ్, కర్మాదులయం దకర్మాదిదర్శనము జ్ఞానము, అది యను అగ్నిచేత దగ్ధము లయిన శుభాశుభరూపము లగు కర్మములుగలవానిని, “తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్” ♦ అనున్యాయంబువలన జ్ఞానాగ్ని

* దేని దేనిఁ బ్రాణి చేయుచున్నాఁడో అది యది కామముయొక్క వ్యాపారము.

♦ బ్ర-సూ-అ. ౪. పా. ౧. సూ. ౧౩. తదధిగమే = బ్రహ్మజ్ఞానము కలిగిన పిదప, ఉత్తర

దగ్ధకర్మాణ మగు నతని; బుధాః = బ్రహ్మవిదులు; పణ్డితమ్ = పరమార్థంబునఁ బండితుఁ
డనఁగా; ఆహుః, సమ్యక్ జ్ఞానము గలవాఁడు గదా పండితుఁ డని చెప్పఁబడును కాని
భ్రాంతుఁడు కాఁ డని యర్థము.

శ్రీ. కర్మణ్యకర్మయః పశ్యేత్ అనుశ్లోకమున శబ్దముచేతను అర్థముచే
తను అర్థద్వాయ మేది చెప్పఁబడినదో దానినే స్పష్టీకరించుచున్నాఁడు యస్యేత్యాది
శ్లోకపంచకముచేత —చక్కఁగా నారంభింపఁబడునవి కావున సమారంభము లనఁగా
కర్మములు, కామసంకల్పవర్జితాః = కామ మనఁగా కామింపఁబడుచున్నది కావున
ఫలము, ఫలసంకల్పముచే విడువఁబడినవి; యస్య = ఎవనికి; అగునో; తం పణ్డిత
మాహుః. అందుకు హేతువు—ఎందువలన ననఁగా. ఆకర్మములచే చిత్తము శుద్ధ
మై పుట్టిన జ్ఞానాగ్నిచే దగ్ధములు—అకర్మత్వము పొందింపఁబడిన కర్మములు గలవా
నిని. ఆరూఢావస్థయందో—కామము ఫలవిషయము ౧, దానికొఱకు ఇది చేయ
వలయు నని కర్మవిషయ మయిన సంకల్పము, వానిచే విడువఁబడినవి. శేషము
స్పష్టము.

ప. ఇఁక నిట్టిదర్శనము గల పురుషునిస్వరూపముఁ జెప్పుచున్నాఁడు
ఐదు శ్లోకములచేత.—యస్య = ఏపురుషునియొక్క, సమారమ్భాః = కర్మములు;
కామసంకల్పవర్జితాః = ఫలసంకల్పముచే విడువఁబడినవో; తం పణ్డిత మాహుః;
ఎట్టివానిని—జ్ఞానాగ్నిదగ్ధకర్మాణమ్ = జ్ఞాన మను నగ్నిచే దగ్ధబీజము లయిన కర్మ
ములు గలవానిని.

రా. ప్రత్యక్షముగాఁ జేయఁబడు కర్మము జ్ఞానాకారం బెట్లగును? అనఁ
గాఁ జెప్పుచున్నాఁడు.—యస్య=ఏముముక్షువుయొక్క; సర్వే ఆరమ్భాః=సమస్తము
లయిన—ద్రవ్యార్జనాది లౌకికకర్మములయొక్కయు నిత్యనైమిత్తికకామ్యకర్మముల
యొక్కయు ఆరంభములు; కామసంకల్పవర్జితాః=కామముచేతను సంకల్పముచేతను
విడువఁబడినవో, కామ మనఁగా ఫలాసక్తి, సంకల్ప మనఁగా ప్రకృతితోను తద్గుణ
ములతోను తన్ను ఒకటిగాఁ జేసికొని యనుసంధించుట, ఫలాసక్తి లేక యుండునో,
ప్రకృతిసంబంధము లేనియాత్మస్వరూపమును అనుసంధించుచుండుటచే మున్ను చెప్పిన

---

పూర్వాఘయోః=ఆగామిసంచిత పాపకర్మములకును, అశ్లేష వినాశౌ=సంబంధములేకుండుటయు నాశ
మును అగును, ఆగామికర్మముతో సంబంధము లేదు సంచితకర్మము నశించు ననుట, తద్వ్యపదేశాత్=
అట్లు చెప్పఁబడుట వలన.

౧ ఫలాపేక్ష.

సంకల్పము లేకయుండునో; తమ్—ఇట్లు కర్మము చేయుచున్న; పణ్డితమ్; జ్ఞానాగ్ని దగ్ధకర్మాణమ్=కర్మాంతర్గతమైన ఆత్మతత్త్వజ్ఞానమను అగ్నిచే దహింపఁబడిన ప్రాచీన కర్మములు గలవానిఁగా; బుధాః=తత్త్వజ్ఞులు; ఆహుః=చెప్పుచున్నారు; కావునఁ గర్మమునకు జ్ఞానాకారత యుపపన్నము.

ఎవ్వఁడు ఫలాసక్తి లేనివాఁడై ప్రకృతితోను తద్గుణములతోను దనకు సంబంధము లేదని యనుసంధించుచు ద్రవ్యార్జనాదిలౌకికకర్మములను నిత్యనైమిత్తికాది వైదికకర్మములను జేయునో అట్టి పండితునిపూర్వకర్మము లన్నియు నతఁడు చేయుకర్మమునం దంతర్గతమైనజ్ఞానముచే నశింపఁ జేయఁబడు నని తత్త్వవిదులు చెప్పెద రని తాత్పర్యము.

మూ॰ దీనినే విస్తరించుచున్నాఁడు య స్త్యక్త్వాది శ్లోకపంచకముచేత.— చెప్పిన విధంబున, జ్ఞానాగ్ని దగ్ధకర్మాణమ్ •.

త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మ ణ్యభిప్రవృత్తో౽పి నైవ కించి త్కరోతి సః. ౨౦

భా॰ ఎవ్వఁడు మఱి కర్మాదులం దకర్మాదిదర్శనము గలవాఁడో అతఁడు అకర్మాదిదర్శనము వలనను నిష్కర్ముఁడు సన్న్యాసియై జీవనమాత్రార్థము చేష్టించును, కర్మమునందుఁ బ్రవర్తింపఁడు, వివేకమునకు మున్ను ప్రవృత్తుఁడై యుండినను. ఇఁక నెవ్వఁడు కర్మముఁ జేయుచుండి పిమ్మట ఆత్మసమ్యక్ జ్ఞానము నొందునో వాఁడును కర్మమునందుఁ బ్రయోజనము లేదని తెలిసి సాధనసహితముగాఁ గర్మమును విడువనే విడుచుచున్నాఁడు. అతఁడు, ఒకానొకనిమిత్తంబునఁ గర్మపరిత్యాగము సంభవింపనిచోఁ గర్మమునందును దత్ఫలమునందును సంగము లేమింజేసి తనకుఁ బ్రయోజనము లేకుండుటవలన లోకసంగ్రహార్థము మునుపటి యట్లు కర్మమునందుఁ బ్రవర్తించినను, ఏమియుఁ జేయనే చేయఁడు, జ్ఞానాగ్నిదగ్ధకర్ముఁ డగుటవలన అతనికర్మము అకర్మమే యగును. అను నీ యర్థముఁ దెలుపుటకై చెప్పుచున్నాఁడు.—కర్మఫలాసఙ్గమ్=కర్మము లందు అభిమానమును ఫలమునం దాసక్తిని; త్యక్త్వా=విడిచి; ఈ చెప్పిన

• పరమేశ్వరునిది కర్తృత్వము అని తెలిసి తనకు స్వాతంత్ర్యమున కర్మము లేదని తెలియుటయే జ్ఞానాగ్ని దగ్ధకర్ముఁ డగుట.

జ్ఞానముచే, నిత్యతృప్తః—విషయములందుఁ గాంక్ష లేనివాఁ డని యర్థము; నిరాశ్రయః = ఆశ్రయము లేనివాఁడు, ఆశ్రయ మనఁగా దేని నాశ్రయించి పురుషార్థము సాధించుచున్నాఁడో అది యాశ్రయము, దృష్టాదృష్టము లగు ఇష్టఫలములకు సాధన మయిన ఆశ్రయము విడిచినవాఁ డని యర్థము. ఇట్టివాఁడు దనకుఁ బ్రయోజనము లేమివలన సాధన సహిత మయిన కర్మమును విడువవలసినదే యని ప్రాప్తింపఁగా; దాని నుండి విడివడుట సంభవింపక పోవుటవలన లోకసంగ్రహము చేయఁ గోరి గాని శిష్టజనులనిందను బరిహరింపఁ గోరి గాని పూర్వమువలె, కర్మణి = కర్మమునందు; అభిప్రవృత్తో ఽపి = అంతటను బ్రవర్తించినవాఁడైనను; నిష్క్రియాఽఽత్మదర్శనము గలవాఁ డగుటవలన; సః = అతఁడు; కించిత్ = దేనినిగూడ; నైవ కరోతి = చేయనే చేయఁడు.

కర్మమునందుఁ గర్తృత్వాభిమానమును తత్ఫలమునం దాసక్తిని విడిచి మీఁదు చెప్పిన జ్ఞానముచే నిత్యానందము గలవాఁ డగుటచే దృష్టాదృష్టవిషయములందును తత్సాధనములందును అపేక్ష లేనివాఁడై మునుపటియట్లు కర్మము చేసినను, అతఁడు లోకదృష్టిచేఁ జేయుచున్నాఁడే కాని తనదృష్టిచే నెంతమాత్రము చేయువాఁడు కాఁ డని తాత్పర్యము.

ఆ. వివేకము గలుగుటకు మున్ను కర్మమునందుఁ బ్రవృత్తి కలిగినను వివేకము కలిగిన పిమ్మట నందుఁ బ్రవృత్తి సంభవింప దని యాశంకించి యంగీకరించుచున్నారు ఎవ్వఁడు మఱి ఇత్యాదిగా. వివేకమునకుఁ బూర్వము అభినివేశముచేఁ బ్రవర్తించినవానికి వివేకము కలిగిన పిమ్మట అభినివేశము లేకుండుటవలనఁ బ్రవృత్తి సంభవింపకపోయినను జీవనము నుద్దేశించి మాత్రము ప్రవృత్తి యనువర్తించు నని యర్థము. వివేక మున్నను తత్త్వసాక్షాత్కారము లేకుండుటవలన కర్మమునందుఁ బ్రవర్తించినవాఁడు ఎట్లు దాని విడుచును? అని యాశంకించి చెప్పుచున్నారు ఇఁక నెవ్వఁడు ఇత్యాదిగా. మీఁదిశ్లోకము దించుటకై భూమిక చేసి తదవతారికాప్రకారముఁ జూపుచున్నారు అతఁడు ఒకానొక ఇత్యాదిగా. నిమిత్తము లోకసంగ్రహాదికము వివక్షితము. కర్మమునందుఁ బ్రవర్తించినవాఁడు కర్మమును జేయఁ డనియెట్లు చెప్పవచ్చును? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు తనకుఁ బ్రయోజనము లేకుండుట వలన నని. అప్పుడు ఎట్లు కర్మమునందుఁ బ్రవర్తించుచున్నాఁడు? అనఁగాఁ జెప్పుచున్నారు లోకసంగ్రహార్థము అని. ప్రవృత్తి యక్షక్రియాకారి కా దనుటను ఇవక్యా

దిభి శ్చా ఒవిశేషాత్ " అను న్యాయమునే నివారించుచున్నారు ♦ తునుపటి యట్లు అని. అప్పుడు వివేకులకును అవివేకులకును ఏమి విశేషము ? అని యాశంకించి కర్మతత్ఫలములందు ఆసక్త్యనాసక్తులచేత విశేషము కల దని చెప్పుచున్నారు కర్మమునందును ఇత్యాదిగా. చెప్పిన యర్థమునందు మీఁదిశ్లోకము దీయుచున్నారు జ్ఞానాగ్నీత్యాదిగా. ఇప్పుడు చెప్పిన కూటస్థాత్మదర్శనముచే స్వరూపభూతం బగు సుఖమును అపరోక్షముగా ననుభవించి కర్మమునందును తత్ఫలమునందును సంగము విడిచి విషయములం దపేక్ష లేనివాఁడై చేష్టించుచుండును విద్వాంసుఁ డని చెప్పుచున్నాఁడు ఈశ్లోకముచేత. దృష్టము లయిన సాధనముల నపేక్షించువానికి ఎక్కడిది నిరపేక్షత యని యాశంకించి విశేషణము చేయుచున్నారు నిరాశ్రయః అని. దేని నాశ్రయించి అనుచో దేని అనుటచే ఫలసాధనము చెప్పఁబడుచున్నది. ఆశ్రయము లేనివాఁడు అను దాని యర్థము స్పష్టీకరించుచున్నారు దృష్టాదృష్టములు ఇత్యాదిగా. ఇట్టివాఁడు—త్యక్త్వాకర్మఫలాసంగ మ్మనుశ్లోకముచే విశేషితుఁ డగువాఁడు. దాననుండి—సాధన సహిత మయిన కర్మమునుండి యని యర్థము. విడివడుట సంభవింపక పోవుటకు హేతువుఁ జెప్పుచున్నారు లోకసంగ్రహము ఇత్యాదిగా. పూర్వమువలె—జ్ఞానము కలుగుటకు ము న్నున్న యవస్థయందుంబోలె నని యర్థము. అంతటను బ్రవర్తించినవాఁ డైనను—లోకదృష్టిచే నని శేషము. చేయనే చేయఁడు—తనదృష్టిచేత నని యెఱుంగునది.

హ. సః = ఆపండితుఁడు; కర్మఫలాసఙ్గమ్; త్యక్త్వా; నిరాశ్రయః = ఆశ్రయింపవలసినది లేనివాఁడై; కర్మణి; అభిప్రవృత్తోఽపి నైవ కించిత్ కరోతి—అతఁడు కర్మబద్ధుఁడు కాకుండుటవలన నని యభిప్రాయము.

శం. సమస్తమును బ్రహ్మమునుగానే చూచెడువిద్వాంసునకు స్వార్థముగాని పరార్థముగాని ప్రవృత్తి సంభవింపదు, ఒకానొకప్పుడు వాసనావశంబున ఆహారాది కర్మమునందుఁ బ్రవృత్తుఁ డైనను అతఁడు అకర్ముఁడుగానే యున్నాఁ డని చెప్పుచున్నాఁడు.—బ్రహ్మవిదుఁడు తాను, నిత్యతృప్తః = తానే యని సాక్షాత్కృతమగు నిత్యము ఆనందైకరసం బైన బ్రహ్మముచేతఁ దృప్తిఁ బొందినవాఁడు, స్వరూపసుఖము ననుభవించువాఁడు; కావుననే, నిరాశ్రయః = దేనిచే సాధనసహిత మయిన

---

♦ పశుత్రులం బెంటదలగువానితో సాదృశ్యమువలన, పశ్వాదుల—అవివేకుల వ్యవహారమువంటిదా ఇతని వ్యవహారమును కావున దానివలె నిదియు అర్థక్రియాకారి యగును.

కర్మమును బురుషుఁ డాశ్రయించుచున్నాఁడో అది ఆశ్రయము కామము, అది లేని వాఁడు, నిష్కాముఁడు, అందువలననే కర్మములందుఁ బ్రవర్తింపఁడు, ప్రవృత్తి కామ మూలకం బగుటవలన కామము లేమింజేసి ప్రవృత్తి లేకుండుట యుక్తము. ఇఁక వాసనావశంబున భిక్షాటనాదికమునం దొకానొకప్పుడు ప్రవర్తించునేని, అప్పుడు, కర్మఫలాసఙ్గమ్= కర్మములు దేనియందు ఫలించునో అది కర్మఫలము, లేక, కర్మములను ఫలింపఁ జేయుచున్నది కావున కర్మఫలము, లేక, కర్మములయొక్క ఫలము కావున కర్మఫలము—దేహము, దానియందు ఆసంగమును—కర్తను భోక్తను వక్తను శ్రోతను ద్రష్టను నే నని ఆదేహముతో తాదాత్మ్యమును; త్యక్త్వా=విడిచి; కర్మణి= తనకుఁ దగిన కర్మమునందు; అభిప్రవృత్తో ఽపి; సః=ఆవిద్వాంసుఁడు; పరులదృష్టికిఁ జేయుచున్నను దనదృష్టికి, కించిత్ = దేనినిగూడ; నకరోత్యేవ = చేయనే చేయఁడు, కర్మమునం దకర్మదర్శనముచే ఉపాధికృతంబు లగు కర్మములతో సంటఁ డని యర్థము.

మ. కానిమ్ము జ్ఞానాగ్నిచే అనారబ్ధఫలంబు లగు ప్రాచీనకర్మంబులకు దహనమును ఆగామికర్మములకు అనుత్పత్తియు *. జ్ఞానోత్పత్తి కాలమునందుఁ జేయుకర్మము మాత్రము పూర్వోత్తరములందు ♦ అంతర్భవింప కుండుట వలన ఫలము నొసంగు నని కావచ్చును ఒకానొకని కాశంక. దానిఁ బరిహరించుచున్నాఁడు.— కర్మఫలాసఙ్గమ్ = కర్మమునందును ఫలమునందును ఆసంగమును, కర్తృత్వాభిమానమును భోగాభిలాషను; త్యక్త్వా = విడిచి, అకర్త అభోక్త యగు ఆత్మయొక్క సమ్యగ్దర్శనముచే బాధించి; నిత్యతృప్తః = పరమానందస్వరూప లాభముచే అంతటను అపేక్ష లేనివాఁడును; నిరాశ్రయః = ఆశ్రయము దేహేంద్రియాదికము అద్వైతదర్శనముచే ఎవ్వని వలననుండి తొలఁగినదో అతఁడు నిరాశ్రయుఁడు—దేహేంద్రియాదులం దభిమానము లేనివాఁడును; ఫలకామనానివృత్తికిని కర్తృత్వాభిమాననివృత్తికిని క్రమంబున హేతుగర్భములు ఈ రెండు విశేషణములు ‡; ఇట్టివాఁ డగు జీవన్ముక్తుఁడు వ్యుత్థానదశయందు $, కర్మణి= వైదికము

* ఉత్పత్తి లేకపోవుటయు.

♦ పూర్వశ్లోకవ్యాఖ్యానమున నుదాహరించి బ్రహ్మసూత్రమునందుఁ జెప్పిన "ఉత్తరపూర్వాఘయోః" అనువానియందు, ఆగామిసంచితములందు.

‡ నిత్యతృప్తుఁ డగుటవలన ఫలకామన లేనివాఁ డనియు, నిరాశ్రయుఁ డగుటవలన—దేహాదులం దభిమానము లేనివాఁ డగుటవలనఁ గర్తృత్వాభిమానము లేనివాఁ డనియు భావము.

$ సమాధినుండి లేచినపుడు.

నందుఁ గాని లౌకికమునందుఁ గాని; అభిప్రవృత్తో౽పి = ప్రారబ్ధకర్మమువలన లోక దృష్టిచే అభి—అంతటను—సాంగోపాంగా నుష్ఠానముకొఱకు ప్రవృత్తుఁడైనను; స్వదృష్టిచేత, నైవ కించి త్కరోతిసః, నిష్క్రియాత్మదర్శనముచే బాధిత మగుటవలన నని యర్థము.

శ్రీ. మఱియు.—కర్మమునందును తత్ఫలమునందును ఆసక్తిని విడిచి, నిత్య మయిన నిజస్వరూపానందముచే దృప్తుఁడు, కావుననే యోగక్షేమార్థము ఆశ్రయింపవలసినది లేనివాఁడు; ఇట్టివాఁ డెవఁడో అతఁడు స్వాభావికకర్మమునందుఁ ♦ గాని విహితకర్మమునందుఁ గాని అంతటను ప్రవృత్తుఁడైనను, నైవకరోతి—వాని కర్మము అకర్మ మగు నని యర్థము.

ప. మఱియు.—కర్మఫలములయొక్క ఆసంగమును—అంతట సంగమును విడిచి, నిజానందముచే నిత్యతృప్తుఁడు, కావుననే ఆశ్రయింపవలసినది లేనివాఁడు; ఇట్టివాఁ డెవ్వఁడో అతఁడు, అభిప్రవృత్తో౽పి = సర్వకర్మములందుఁ బ్రవర్తించినవాఁ డైనను; నైవ కించి త్కరోతి--కర్తృత్వాభిమానము లేనివాఁ డగుటవలన వాని కర్మము అకర్మ మగుచున్నది.

రా. దీనినే వివరించుచున్నాఁడు.—కర్మఫలాసఙ్గమ్ = కర్మఫలమునం దాసక్తిని; త్యక్త్వా; నిత్యతృప్తః = నిత్యుఁ డగు స్వాత్మయందే తృప్తుఁడై; నిరాశ్రయః = అస్థిర మగు ప్రకృతియందు ఆశ్రయబుద్ధి లేనివాఁడై; ఎవ్వఁడు కర్మములను చేయుచున్నాఁడో, సః = అతఁడు; కర్మణి; అభిప్రవృత్తో౽పి = అభిముఖుఁడై ప్రవర్తించినవాఁ డైనను; కించిత్ = ఏకర్మమును గూడ; నైవ కరోతి = చేయనే చేయఁడు, కర్మము చేయువ్యాజమున జ్ఞానాభ్యాసమునే చేయుచున్నాఁ డని యర్థము.

కర్మఫలమునం దాసక్తి విడిచి నిత్య మగు స్వస్వరూపమునందే తృప్తుఁడై యస్థిర మగు ప్రకృతి నాశ్రయింపక యెవ్వఁడు కర్మములఁ జేయునో అతఁడు శ్రద్ధాపూర్వకముగాఁ గర్మములు చేయుచున్నను కర్మము చేయువ్యాజమున జ్ఞానాభ్యాసము చేయువాఁడే కాని కర్మము చేయువాఁడు కాఁ డని తా.

మా. కామసంకల్పవర్జనము మాత్రమె చాలదు. అసఙ్గమ్ = స్నేహమును గూడ; త్యక్త్వా. జ్ఞానస్వరూపముఁ జెప్పుచున్నాఁడు మరల నిత్యతృప్త ఇత్యాదిగా.

---

♦ భిక్షాటనాది కర్మమునందు.

నిత్యతృప్తుఁడు నిరాశ్రయుఁడు అగు ఈశ్వరునితో సమానమైన రూపము గలవాఁడను నేనని తెలిసి యట్టివాఁడై.

> నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః
>
> శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. ౨౧

భా. ఇఁక నెవ్వఁడు మున్ను చెప్పినవానికి విపరీతుఁడు కర్మారంభమునకుఁ బూర్వమే సర్వాంతర మగు బ్రహ్మమునందు నిష్క్రియ మగు ప్రత్యగాత్మయందు ఆత్మదృష్టి నొందినవాఁడో, అతఁడు, దృష్టాదృష్టేష్ట విషయము లగు ♦ కోర్కులులేనివాఁ డగుటచే, దృష్టాదృష్టప్రయోజన మగు కర్మమునందుఁ బ్రయోజనము కాననివాఁడై సాధనసహితం బగు కర్మమును సన్న్యసించి శరీరయాత్రామాత్రవ్యాపారుఁడైన యతి జ్ఞాననిష్ఠుఁడు, ముక్తుఁ డగుచున్నాఁడు. అను నీయర్థమును దెలుపుటకై చెప్పుచున్నాఁడు:—నిరాశీః = నిర్గతములు ఆశీస్సులు ¶ ఎవ్వని వలననుండియో అతఁడు నిరాశీస్సు, కోర్కులు లేనివాఁడు; యతచిత్తాత్మా = చిత్తము అంతఃకరణము, ఆత్మ—బాహ్య మగు కార్యకరణసంఘాతము §, ఆ రెండును యతములు—నిగ్రహింపఁబడినవి ఎవ్వనిచేతనో అతఁడు యతచిత్తాత్ముఁడు; త్యక్తసర్వపరిగ్రహః = త్యక్తము—విడువఁబడినది సమస్తమైన పరిగ్రహము * ఎవ్వనిచేతనో అతఁడు త్యక్తసర్వపరిగ్రహుఁడు; శారీరమ్ = శరీరస్థితిమాత్రమె ప్రయోజనముగాఁ గలదగు; కేవలమ్ = అందును అభిమానము లేని దగు; కర్మ = కర్మమును; కుర్వన్ = చేయుచు; న ఆప్నోతి = పొందఁడు; కిల్బిషమ్ = అనిష్టరూపమయిన పాపమును ధర్మమును గూడ, ధర్మము గూడ ముముక్షువునకు అనిష్టరూప మగుటవలన కిల్బిషమే, బంధజనక మగుటవలన; సంసారమును పొందఁ డని యర్థము.

ఆశలు విడిచినవాఁడై మనస్సును దేహమును నిగ్రహించి సర్వవిషయములను బరిత్యజించి యుండు సన్న్యాసి శరీరస్థితికై కావలసిన కర్మమును అభిమా

♦ దృష్టములు—పుత్రాదులు, అదృష్టములు—స్వర్గాదు లగు ఇష్టములు విషయములుగాఁ గలవగు.

¶ ఆశలు.

§ దేహము.

* విషయము, సొత్తు.

నశూన్య మయినదానిఁ జేయుచుండుటచే ధర్మాధర్మరూప మగు పాపమును సంసారమును ఎంతమాత్రము పొందఁ డని తాత్పర్యము.

ఆ. విక్షేపము కలిగించు కర్మ మున్నను కూటస్థాత్మానుసంధానముచేఁ గైవల్యము సిద్ధించుచుండఁగా విక్షేపము లేనియప్పుడు మఱియుఁ జక్కఁగా సిద్ధించు నను నభిప్రాయముచేఁ జెప్పుచున్నారు ఇఁక నెవ్వఁడు ఇత్యాదిగా. మున్ను చెప్పినవానికి విపరీతుఁడు = లోకసంగ్రహాద్యపేక్ష లేనివాఁడు. ఆ వైపరీత్యమునే తెల్లము సేయుచున్నారు కర్మారంభమునకు ఇత్యాదిగా. సాధనసహితసర్వకర్మముల సన్న్యసించినయెడ శరీరస్థితిగూడ నెట్లు సిద్ధించు నని యాశంకించి చెప్పుచున్నారు శరీరయాత్రామాత్రవ్యాపారుఁడు అని. అప్పుడు అట్టి వ్యాపారమునందు లగ్న మయిన మనస్సు గలవాఁ డగుటచే సమ్యక్ జ్ఞానమునకు విముఖుండైన యతనికి ఎక్కడిది ముక్తి యని యాశంకించి ఆవ్యాపారమునం దాదరము లేమివలన నట్లు కా దని చెప్పుచున్నారు జ్ఞాననిష్ఠుఁడు అని. ఆశీస్సులు-ప్రార్థనాభేదముచే తృష్ణావిశేషములు. విద్వాంసునకు ఆశీస్సులు నిర్గతంబు లగుటకు హేతువుఁ జెప్పుచున్నారు యతచిత్తాత్మా అని. మనస్సునువలె ఆత్మను నిగ్రహించుట యెట్లని యాశంకించి చెప్పుచున్నారు బాహ్య మగు ఇత్యాదిగా. రెంటిని నిగ్రహించుటచే అర్థసిద్ధ మగు దానిఁ జెప్పుచున్నారు త్యక్తేత్యాదిగా. సర్వపరిగ్రహమును బరిత్యజించినచో దేహస్థితిగూడ దుర్లభ మగు నని యాశంకించి చెప్పుచున్నారు శారీరమ్ ఇత్యాదిగా. మాత్రశబ్దముచే ♦ పునరుక్త మగుటవలన నిరర్థకము కేవలశబ్ద మని యాశంకించి చెప్పుచున్నారు అందును ఇత్యాదిగా.

భా. శారీరం కేవలం కర్మ అనుచో, ఏమి శరీరనిర్వర్త్యము § శారీరకర్మ మని యర్థమా? లేక, శరీరమాత్రప్రయోజన మగు కర్మము శారీరకర్మ మనియా? ఇం దేమి శరీరనిర్వర్త్యము శారీరము అన్నను? లేక, శరీరస్థితిమాత్రప్రయోజనము శారీరము అన్నను? చెప్పెదము. శరీరనిర్వర్త్యము శారీరము అని యర్థ మగునేని, అప్పుడు దృష్టాదృష్టప్రయోజన మగు కర్మమును నిషిద్ధమునుగూడఁ జేయుచుఁ బొందఁడు కిల్బిషమును అని అభిప్రాయ మన్నచో విరుద్ధప్రతిపాదనము * ప్రస

♦ శరీరస్థితిమాత్రమే అనుచోటి మాత్రశబ్దముచే.

§ శరీరముచే నెఱవేర్పఁ దగినది.

* ధర్మశాస్త్రమునకు విరుద్ధ మయిన యర్థము చెప్పుట.

క్తించును; శాస్త్రీయ మయిన ♦ కర్మమునే దృష్టాదృష్టప్రయోజనమును శరీరముచేఁ జేయుచుఁ బొందఁడు కిల్బిషమును అని యభిప్రాయ మన్నను అప్రాప్తప్రతిషేధము ♦♦ ప్రసక్తించును. శారీరం కర్మ కుర్వన్ అని శారీరత్వవిశేషణమువలనను కేవలశబ్దప్రయోగమువలనను వాఙ్మనసనిర్వర్త్యమయిన కర్మమును, ధర్మాఖ్యమైన విహితమును అధర్మాఖ్య మైన ప్రతిషిద్ధమును, జేయుచుఁ బొందును గిల్బిషము నని చెప్పినట్లగును. అందును వాఙ్మానసములచే విహితము ననుష్ఠించుపక్షమునఁ గిల్బిషప్రాప్తి చెప్పుట విరుద్ధం బగుచున్నది; ప్రతిషిద్ధము సేవించుపక్షమునందు సిద్ధార్థానువాదమాత్రంబై నిరర్థకం బగును *. ఇఁక శరీరస్థితిమాత్రప్రయోజనమే శారీరకర్మ మని యభిప్రాయ మన్ననో.—అప్పుడు దృష్టాదృష్టప్రయోజనమగు కర్మము విహితమును గాని ప్రతిషిద్ధమును గాని శరీరవాఙ్మనస్సులచే నిర్వర్త్య మగుదాని యితరమును జేయనివాఁడై ఆశరీరాదులచేతనే శరీరస్థితిమాత్రప్రయోజనమైన శరీరచేష్టామాత్రమును, కేవలశబ్ద ప్రయోగమువలన నేను జేయుచున్నా నను నభిమానము లేనివాఁడై, లోకదృష్టిచేఁ జేయుచున్నవాఁడై పొందఁడు కిల్బిషమును. ఇట్టివానికి పాపశబ్దవాచ్య మగు కిల్బిషము అసంభవ మగుటవలన, కిల్బిషమును—సంసారమును పొందఁడు, జ్ఞానాగ్నిదగ్ధకర్ముఁ డగుటవలన అప్రతిబంధముగా ముక్తినే పొందును. అని మున్ను చెప్పినసమ్యగ్దర్శనఫలమున కనువాదమే యిది. ఇట్లు శారీరం కేవలం కర్మ అనుట కీయర్థము గ్రహించినచో నిరవద్యం § బగుచున్నది.

ఆ. శారీరం కేవలం కర్మ అనుచో శారీరపదార్థమును స్ఫుటీకరించుటకై రెండువిధముల వికల్పించుచున్నారు శారీర మిత్యాదిగా. శరీరనిర్వర్త్యము శారీర మనుపక్షమునం దేమిదోషము? శరీరస్థితిమాత్రప్రయోజనము శారీరము అను

♦ విహితమైన.

♦♦ ప్రసక్తింపని దాని నిషేధించుట—విహితకర్మము చేయుటచేఁ గిల్బిషము పొందు నని యెవ్వఁడైనను జెప్పినం గదా అట్లు పొందఁ డని నిషేధింపవలయును. ప్రసక్తింపనిదాని నిషేధించుట యుచితము గా దనుట.

* ఇతరము దేనిచేతను దెలియని యర్థమునే శాస్త్రి ముపదేశించును. తెలిసినదాని నుపదేశించుచో శాస్త్రం బనర్థకం బగు నని భావము.

§ నిర్దోషము.

పక్షమునందుఁ గాని ఏమి ఫలము ? అని పూర్వపక్షి యడుగుచున్నాఁడు ఇం దేమి ఇత్యాదిగా. శరీరనిర్వర్త్యము శారీరము అనుపక్షమునందు దోషముఁ జెప్పు చున్నారు చెప్పెదము అని. శరీరముచే నేది నిర్వర్త్యమో అది ప్రతిషిద్ధమా? విహితమా? మొదటిపక్షమునందు విరోధ మగు నని చెప్పుచున్నారు శరీరనిర్వ ర్త్యము ఇత్యాదిగా. ప్రతిషిద్ధము నాచరించినను అనిష్టప్రాప్తి లే దన్నచో నిషేధ శాస్త్రవిరోధ మగు నని యర్థము. రెండవపక్షమునందు విహితము నాచరించినచో అనిష్టప్రాప్తి లేమింజేసి అప్రాప్తప్రతిషేధం బగు నని చెప్పుచున్నారు శాస్త్రీయ మయిన ఇత్యాదిగా. దృష్టాదృష్టప్రయోజనము—దృష్టప్రయోజనము—కారీర్యాది కర్మము ♦, అదృష్టప్రయోజనము—స్వర్గసాధనం బగు జ్యోతిష్టోమాదికర్మము అని విభాగము. శరీరనిర్వర్త్యము శారీర మ్మనుమతమునందు మఱియొకదోషము చెప్పుచున్నారు శారీరం కర్మ ఇత్యాదిగా. వాక్కుచేతను మనస్సుచేతను కర్మము ననుష్ఠించినచో సన్న్యాసికిఁ గిల్బిషము కలుగనే కలుగు నని యాశంకించి చెప్పు చున్నాఁడు అందును ఇత్యాదిగా. వాఙ్మానసములచే విహితము చేయుటచేతనా నిషి ద్ధముచేయుటచేతనా సన్న్యాసికిఁ గిల్బిషప్రాప్తి యగునని వికల్పించి మొదటిపక్షము నందు జపాధ్యయనవిధివిరోధ మగు నని ప్రతిపాదించి రెండవపక్షమును దూషించు చున్నారు ప్రతిషిద్ధము ఇత్యాదిగా. శరీరనిర్వర్త్యము శారీరము అనుపక్షమును ఇట్లు నిరాకరించి రెండవపక్షమునందు లాభముఁ జూపుచున్నారు ఇఁక ఇత్యాదిగా. ఇతరమును—శరీరస్థితిమాత్రప్రయోజన మగు కర్మముకంటె ఇతరము నని యర్థము. అందుఁగూడ విద్వాంసునకు స్వదృష్టిచేఁ బ్రవృత్తి సంభవింప దని సూచించు చున్నారు లోకదృష్టిచేత నని. విద్వాంసుఁ డీవిధమున వర్తించినవాఁడై పొందఁడు కిల్బిషమును అనుచో వివక్షిత మయిన యర్థముఁ జెప్పుచున్నారు ఇట్టివానికి ఇత్యా దిగా. ఇట్టివానికి—దేహస్థితిహేతుభిన్న మగు విధినిషేధవిషయ మయినకర్మమును చేయకున్నవాని కని యర్థము. శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ అను దానికిఁ జెప్పినవిధంబున నర్థము గ్రహించినయెడ శారీరం కేవలమ్ అను రెండువిశే షణములును నిర్దోషముగా సిద్ధించు నని ఫలితముఁ జెప్పుచున్నారు ఇఁట్లు ఇత్యాదిగా.

హ. నిరాశీః = కోరికలు లేనివాఁడై. యతచిత్తాత్మా = నిగ్రహింపఁబడిన యంతఃకరణము గలవాఁడై. త్యక్తసర్వపరిగ్రహః. శారీరం కేవలం కర్మ = శరీర స్థితిసాధన మయిన కర్మమును; కుర్వన్, నాప్నోతి; కిల్బిషమ్ = పాపమును.

♦ కారీరి యనఁగా వర్ష ఫలం బగు యాగవిశేషము.

౪౦. ఇఁక నెవ్వఁడు వివేకవైరాగ్యశమదమాదిసాధనసంపన్నుండై సమస్తకర్మములను సన్న్యసించి శ్రవణమననంబులచే ఆత్మతత్త్వముఁ దెలిసినవాఁడై నిదిధ్యాసనపరుం డగుచున్నాఁడో అట్టి సన్న్యాసి శరీరయాత్రామాత్రరూప మయిన కర్మము చేయుచుండి బ్రహ్మనిష్ఠచే నిర్మూలితబంధుండై ముక్తుఁ డగుచున్నాఁ డని చెప్పుచున్నాఁడు.—నిరాశీః = నిశ్శేషముగా నిర్గతములు ఆశీస్సులు—విషయకామనలు ఎవనివలన నుండియో అతఁడు నిరాశీస్సు, సర్వకామరహితుఁ డని యర్థము; అందువలననే, త్యక్తసర్వపరిగ్రహః = విడువఁబడినవి కౌపీనము కంథ ♦ తక్కఁ దక్కిన సర్వపరిగ్రహములును ఎవ్వనిచేతనో అతఁడు త్యక్త సర్వపరిగ్రహుఁడు, యోగనిష్ఠాపరుం డగు యతి, తాను, యతచిత్తాత్మా = ఆత్మ యనఁగా దేహము, యతములు—నిరోధింపఁబడినవి మనోదేహములు ఎవ్వనిచేతనో అతఁడు యతచిత్తాత్ముఁడు; లేక, యతము = నిలుపఁబడినది చిత్తము ఆత్మయందే, కా దెచ్చటను అనాత్మయందు, ఎవ్వనిచేతనో అతఁడు యతచిత్తాత్ముఁడు, అట్టివాఁడై; శారీరమ్ = శరీరస్థితిహేతు వయిన, ప్రాణరక్షణమే ప్రయోజనముగాఁ గల; అందును, కేవలమ్ = తాను యతి జ్ఞాని కర్త యను నభిమానము లేనట్టి; కర్మ = కర్మమును; కుర్వన్; కిల్బిషమ్; నాప్నోతి. ఓయీ! « వ్యుత్థాయాఽథ భిక్షాచర్యం చరన్తి ” అని ప్రాణరక్షణహేతు వగు భిక్ష యతికి విహితం బగుటవలన విహితము ననుష్ఠించుటచేఁ గిల్బిషము సంభవింపమివలన అప్రాప్త మగు కిల్బిషప్రాప్తిని బ్రతిషేధించుట యుచితము కాదు. అనఁగా, అది సరికాదు, ఒకానొకచో కిల్బిషప్రాప్తి సంభవించుట వలన. యతచిత్తాత్ముఁడని చెప్పుటచే వాక్కుఁగూడ నిరుద్ధ మగుటవలన మౌని యగు యతికి ఒకానొకప్పుడు అభిశస్తాదులయొద్దఁగూడ * భిక్షాగ్రహణము ప్రసక్తించుటవలన « అభిశస్త పతిత వర్జమ్ ” § అని శాస్త్రప్రతిషిద్ధము నాచరించుటచే కిల్బిషము సంభవింపనే సంభవించుచున్నది. సమ్యక్ జ్ఞానమునకుఁ బ్రతిబంధక మగు అట్టి కిల్బిషమునే కర్మమునం దకర్మదర్శనము అనునగ్నిచే నిగ్రహించి ముక్తిఁ బొందుచున్నాఁ డనునాశయమునం జెప్పుచున్నాఁడు కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ అని. లేక; మధు మాంసంచ మద్యంచ తామ్బూలం తైల మౌషధమ్। త్యాజ్యా న్యష్టౌ యతే

♦ బొంత.

* అభిశస్తుఁడు—పాపము చేసినవాఁ డని యపవాదము నొందినవాఁడు.

§ అభిశస్తుని పతితుని విడిచి తక్కినవారియొద్ద భిక్ష గొనవలయును.

ర్దారా స్తథా కాన్తాచ కాఞ్చనమ్ » ♦ అని మిక్కిలి నిషిద్ధము లైనను, శారీరమ్ శరీరస్థితికారణమును; ఏది లేనిచో శరీరము పోవునో శ్రవణాదికము సిద్ధింపదో అది శారీరము, సర్పదంశము నేత్రరోగము ఉదరశూలము మొదలగు మహోపద్రవములందు « ఔషధవ దాశమన మాచరేత్ » * అనుశాస్త్రమువలన ఔషధసేవారూప మయిన శారీరకర్మమును, కేవలమ్—అప్రయత్నసిద్ధమును, కుర్వన్, శ్రవణాది తత్పరుం డగు యతి, కిల్బిషం న ఆప్నోతి. లేక; నిరాశీః = నిత్యానిత్యవివేకముచేతను వైరాగ్యముచేతను తీవ్రమోక్షేచ్ఛచేతను ఆశీస్సులనుండి—తుచ్ఛవిషయము లయిన ఐహికాముష్మిక సుఖముల మీఁది యాశలనుండి విడివడినవాఁడై; కావునను; త్యక్తసర్వపరిగ్రహః = ధర్మప్రజాసంపత్తికొఱకు పరిగ్రహింపఁబడుచున్నది కావునఁ బరిగ్రహ మనఁగా భార్యాదికము, భార్యాదిపరిగ్రహము లన్నియు మోక్షేచ్ఛచే నెవ్వనిచేత విడువఁబడినవో అట్టివాఁడు సమస్తము లయిన కర్మములను తత్సాధనములను సన్న్యసించినవాఁడు, యతి; తాను, యతచిత్తాత్మా = యతములు—బాహ్యవ్యాపారములనుండి మరలింపఁబడినవి చిత్తమును కార్యకరణసంఘాతమును ♦♦ ఎవ్వనిచేతనో, అట్టివాఁడై; శారీరమ్ = శరీరోపాధికుఁ డగుటవలన శారీరుఁ డనఁగా ఆత్మ, ఆత్మను బొందెఁచు శ్రవణాదికర్మముగూడ శారీరమే యగును, బాహ్య మగు జపాదికర్మము సమస్తమును విడిచి, ఆంతర మయిన శ్రవణాదికర్మమును; కేవలమ్ = దానినిమాత్రమే; కుర్వన్; కిల్బిషమ్ = దుఃఖ జనక మగు సంసారబంధమును; నాప్నోతి. కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ అని వచియించు భగవంతునిచే జపాదికర్మముతోఁగూడ శ్రవణాదికము చేసినను శ్రవణాదికమును విడిచి తద్వ్యతిరిక్త మైన కర్మమునే చేసినను యతి కిల్బిషమునే పొందు నని సూచిత మవుచున్నది. అందుచే సన్న్యాసిచే శ్రవణాదికమే సర్వదా కర్తవ్యము, ఇతరము స్తోత్ర మంత్రజపాదికము కర్తవ్యము గా దని సిద్ధము. అట్లు స్మృతి « యమా నభీక్ష్ణం సేవేత నియమా న్పరత స్త్యజేత్ । జిజ్ఞాసాయాం సంప్రవృత్తో నాద్రియే త్కర్మచోదనామ్ " అనియు « సన్న్యస్య శ్రవణం కుర్యా న్నాఽన్య త్కుర్యా ద్యతిః క్వచిత్ » అనియు.

---

♦ తేనె మాంసము మద్యము తాంబూలము నూనె యౌషధము స్త్రీ స్వర్ణము — ఈ యెనిమిదియు యతికి దూరమున వర్జింపవలసినవి.

* ఔషధమువలె బాధ శమించువఱకు ఆచరించునది.

♦♦ దేహమును.

మ. ఎప్పుడు మిక్కిలి విక్షేపహేతు వగు జ్యోతిష్టోమాదికముగూడ సమ్యక్ జ్ఞానవశంబున ఫలజనకంబు కాఁజాలదో అప్పుడు విక్షేపజనకము కానట్టి శరీరస్థితిమాత్రనిమిత్త మగు భిక్షాటనాదికము బంధహేతు కానేకా దని కైముతికన్యాయముచేఁ జెప్పుచున్నాఁడు.—నిరాశీః=తృష్ణ లేనివాఁడును; యతచిత్తాత్మా= ప్రత్యాహారముచే ♦ నిగ్రహింపఁబడిన అంతఃకరణమును బాహ్యేంద్రియసహితమగు దేహమును గలవాఁడును; ఇట్లు జితేంద్రియుఁ డగుటచే తృష్ణారహితుఁ డగుటవలన, త్యక్తసర్వపరిగ్రహః = విడువఁబడిన సమస్తములైన పరిగ్రహములును—భోగోపకరణములును గలవాఁడును; ఇట్టివాఁ డైనను ప్రారబ్ధకర్మవశమువలన, శారీరమ్=శరీరస్థితిమాత్రప్రయోజన మగు; కర్మ=కౌపీనాచ్ఛాదనాదిగ్రహణము * భిక్షాటనము మొదలగు కర్మమును, యతికి శాస్త్రముచే అభ్యనుజ్ఞ చేయఁబడిన దానిని, కాయికమును వాచికమును మానసమును; దీనినిగూడ, కేవలమ్ = కర్తృత్వాభిమానశూన్యమైనదానిని; పరులచే ఆరోపింపఁబడిన కర్తృత్వముచే §, కుర్వన్= చేయుచున్నవాఁడై; పరమార్థంబున అకర్త్రాత్మదర్శనము గలవాఁ డగుటవలన, నాప్నోతి; కిల్బిషమ్ = ధర్మాఽధర్మఫలభూత మయిన యనిష్టమును, సంసారమును; పాపమువలెఁ బుణ్యముగూడ అనిష్టఫలజనకం బగుటచేఁ గిల్బిషం బగుటవలన. ఇఁక నెవ్వరు శరీరనిర్వర్త్యము శారీర మ్మని వ్యాఖ్యానము చేసెదరో వారిమతమునందు కేవలం కర్మ కుర్వన్ అనుటకంటె నధికార్థము లేకుండుటవలన అవ్యావర్తకం బగుటచే శారీరపదము వ్యర్థ మగును. వాచికమానసికవ్యావర్తనార్థ మని చెప్పుదు రేని, అప్పుడు కర్మపదము విహితకర్మమాత్రపరం బన్నచో « శారీర మయిన విహితకర్మమును జేయుచున్నవాఁడై పొందఁడు కిల్బిషమును ’’ అని అప్రసక్తప్రతిషేధము నిరర్థకం బగును; « వాచికము మానసికము నగు విహితకర్మమును చేయుచున్నవాఁడై పొందుచున్నాఁడు కిల్బిషమును ’’ అని విరుద్ధార్థము చెప్పిన ట్లగును. కర్మపదము విహితమును ప్రతిషిద్ధమునుగూడ బోధించు నన్నను ఇట్లే వ్యాఘాతము $. అని భాష్యమునందే విస్తరింపఁబడినది.

---

♦ ఇంద్రియములను విషయములనుండి మరలించుట ప్రత్యాహార మనఁబడును.

* ఆచ్ఛాదనము—దుప్పటి.

§ తాను కర్త యను బుద్ధి లేనివాఁ[illegible] యనుట.

$ విరోధము—విహితపక్షమున అప్రసక్తప్ర[illegible]ధమును నిషిద్ధపక్షమున ధర్మశాస్త్రవిరోధమును ఇత్యాది.

శ్రీ. మఱియును.—నిరాశీః = కామనలు లేనివాఁడును; యతచిత్తాత్మా = నిగ్రహింపఁబడిన చిత్తమును దేహమును గలవాఁడును; శారీరమ్ = శరీరమాత్రముచే నెఱవేర్పఁ దగిన, కర్తృత్వాభిమానరహిత మగు కర్మమును; కుర్వన్ = చేయుచున్నను; కిల్బిషమ్ = బంధమును; నాప్నోతి. యోగారూఢునిపక్షమునందు.—శరీరనిర్వాహమునకుమాత్ర ముపయోగించునట్టి స్వాభావిక మగు భిక్షాటనాదికర్మమును జేయుచున్నను, కిల్బిషమ్ = విహితకర్మమును జేయకుండుటచేఁ గలుగు దోషమును, పొందఁడు.

ప. మఱియును.—నిరాశీః = ఇది నాకుఁ గావలయు నని కోరికలేనివాఁడును; యతచిత్తాత్మా = నిగ్రహింపఁబడిన మనశ్శరీరములు గలవాఁడును; త్యక్తసర్వపరిగ్రహః = విడువఁబడిన సమస్తము లయిన బంధహేతువులును గలవాఁడును; కేవలమ్; శారీరమ్ = శరీరనిర్వాహప్రయోజన మగు; కర్మ; కుర్వన్; కిల్బిషమ్ = పరిగ్రహాదిదోషమును, నాప్నోతి.

రా. మరలఁ గర్మము జ్ఞానాకార మగుటనే వివరించుచున్నాఁడు — నిరాశీః = ఫలాభిసంధి లేనివాఁడును; యతచిత్తాత్మా = నిగ్రహింపఁబడిన చిత్తమును మనస్సును గలవాఁడును; త్యక్తసర్వపరిగ్రహః—ఆత్మయె ప్రయోజనముగాఁ గలవాఁ డగుటచే ప్రకృతియందును ప్రాకృతవస్తువునందును మమత లేనివాఁడునై; యావజ్జీవము, కేవలమ్, శారీరం కర్మ = శారీర మగు కర్మమునే ♦; కుర్వన్, కిల్బిషమ్ = సంసారమును; నాప్నోతి = పొందఁడు. ఇట్లు జ్ఞాననిష్ఠచే అవ్యవహిత మయిన * కేవలకర్మయోగము ననుష్ఠించుటచే ఆత్మను జూచుచున్నాఁ డని యర్థము.

ఫలాభిసంధి లేనివాఁడై మనస్సును మనోవృత్తులను నిగ్రహించి ప్రకృతియందును ప్రాకృతము లగు సకలభోగ్యపదార్థములందును మమత లేనివాఁడై శారీర మగు కర్మమును మాత్రమే చేయుచున్నచో ఆత్మదర్శనము నొంది సంసారమునుండి ముక్తుఁ డగు నని తాత్పర్యము.

మా. కామాదుల విడుచు నుపాయముఁ జెప్పుచున్నాఁడు.—యతచిత్తాత్ముఁడై నిరాశీస్సు అని యర్థము. ఆత్మ యనఁగా మనస్సు. పరిగ్రహంబుల విడు

♦ శారీర మనఁగా శరీరసంబంధి, శరీరమునకు విడువరానిది యనుట, లేక, ఫలాభిసంధి లేనిచే బుద్ధివ్యాపారము లేనిది; లేక, శరీరధారణాద్యర్థము స్వర్గాద్యర్థము కా దనుట.

* జ్ఞాననిష్ఠ లేకయే.

చుట యనఁగా అభిమానము లేకుండుట. నైవ కించి త్కరోతి అనుదాని యభిప్రాయముఁ జెప్పుచున్నాఁడు—నాప్నోతి కిల్బిషమ్ అని ♦.

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః
సమ స్సిద్ధా వసిద్ధౌచ కృత్వా ఽపి న నిబధ్యతే. ౨౨

భా. సర్వపరిగ్రహంబులను విడిచిన యతికి శరీరస్థితిసాధన మగు అన్నాదిపరిగ్రహము లేకపోవుటవలన, యాచనాదికముచే శరీరస్థితి చేయవలసినట్లు ప్రాప్తింపఁగా «అయాచిత మసంక్లృప్త ముపపన్నం యదృచ్ఛయా» $ ఇత్యాదివచనముచే అనుజ్ఞాత మయినదాని యతికి శరీరస్థితిహేతు వగు అన్నాదికము లభించుద్వారమును వెల్లడించుటకై చెప్పుచున్నాఁడు.—యదృచ్ఛాలాభసంతుష్టః = ప్రార్థింపక లభించిన లాభము యదృచ్ఛాలాభము, దానిచే సంతోషించినవాఁడు, అలంప్రత్యయమును * పొందినవాఁడు; ద్వన్ద్వాతీతః = ద్వంద్వములచే-శీతోష్ణాదులచేఁ బీడింపఁబడుచున్నవాఁ డైనను అవిషణ్ణచిత్తుఁడు ‖ ద్వంద్వాతీతుఁ డని చెప్పఁబడును; విమత్సరః = మత్సరము లేనివాఁడు, వైరబుద్ధి లేనివాఁడు; యదృచ్ఛాలాభముగూడ, సిద్ధౌ = సిద్ధించినను; అసిద్ధౌచ= సిద్ధింపకపోయినను; సమః=తుల్యుఁడు. ఇట్టివాఁడు ఎవ్వఁడు శరీరస్థితిహేతు వగు అన్నాదికము లభించినను లభింపకున్నను సముఁడు హర్షవిషాదములు లేనివాఁడును కర్మాదులందు అకర్మాదిదర్శియును ఆత్మతత్త్వజ్ఞాననిష్ఠుఁడును శరీరస్థితిమాత్రప్రయోజనము శరీరనిర్వర్త్య మగు భిక్షాటనాదికర్మమునందు, "నే నేమియుఁ జేయకయే యున్నాను గుణాగుణేషు వర్తన్తే" అని సదా నిశ్చయము గలవాఁడునై తాను కర్తగాఁ డని యెఱింగినవాఁడు కావున భిక్షాటనాదికర్మ మేదియుఁ జేయనే చేయఁడో, లోకవ్యవహారసదృశ మయిన వ్యవహారము కనఁబడుటంజేసి లౌకికులచే నారోపితం బగు కర్తృత్వంబున భిక్షాటనాదికర్మంబునందుఁ గర్త యగు

♦ ఏమియుఁ జేయఁ డనఁగా పాపము నేమియుఁ జేయుఁ డని తాత్పర్యము.

$ యాచింపఁబడనిదియు సంకల్పింపఁబడనిదియు అప్రయత్నముగాఁ బొందఁబడినదియు.

* చాలు ననుబుద్ధిని.

‖ దుఃఖితము గాని మనస్సు గలవాఁడు.

చున్నాఁడు కాని శాస్త్రప్రమాణజనితం బగు స్వానుభవంబుననో అక ర్తయే యగుచున్నాఁడో, అట్టి యతి యిట్లు పరులచే అధ్యారోపింపఁ బడిన కర్తృత్వంబున శరీరస్థితిమాత్రప్రయోజనం బగుభిక్షాటనాదికర్మము ను, కృత్వాఽపి = చేసియును; ననిబధ్యతే = బంధింపఁబడఁడు, బంధ హేతు వగు కర్మము నహేతుకముగా జ్ఞానాగ్నిచే దగ్ధ మగుటవలన అని అనువాదమే యిది.

ప్రయత్నము లేక లభించిన యాహారాదికమునకుఁ దృప్తిఁ బొందుచు శీతోష్ణాదిద్వంద్వములు బాధించినను వైకల్యము నొందక సర్వభూతములందును వైరము లేనివాఁడై తాను దేనికిని బ్రయత్నము చేయక భిక్షాదికము అప్ర యత్నముగా లభించునదిగూడ లభించినను లభింపకపోయినను హర్షవిషాదములు పొందనివాఁడై యిట్లు తాను అకర్త యని తెలిసి కొంచె మయినను కర్తృ త్వాభిమానము లేనివాఁడై భిక్షాటనాదికర్మమును శరీరస్థితినిమిత్తము చేసినను అతఁడు బంధము నొందఁ డని తాత్పర్యము.

ఆ. పూర్వశ్లోకముతో సంగతిని జూపుచు నుత్తరశ్లోకము నెత్తుచున్నారు పర్వేత్యాదిగా. అన్నాది అనుచోటి ఆదిశబ్దముచే పాదుకలు ఆచ్ఛాదనము మొద లగునవి గ్రహింపఁబడుచున్నవి. యాచనాదికముచే అనుచోటి యాదిశబ్దముచే సేవ కృషి మొదలగునవి గ్రహింపఁబడుచున్నది. అయాచితమ్ = భిక్షాటనమునకుఁ బ్రయత్నించుటకు మున్ను ఎవ్వఁడేని యోగ్యునిచే నివేదింపఁబడిన భైక్ష్యము. అసంక్ల ప్తమ్ = అపవాదము గలవానిని బతితుని విడిచి సంకల్పము లేకయే ఐదుగాని యేడుగాని గృహములనుండి తెచ్చుకొన్న భైక్ష్యము. యదృచ్ఛయా ఉపపన్నమ్= భక్తజనులు తనసమీపమునకుఁ దెచ్చి యిచ్చిన సిద్ధాన్నము, యదృచ్ఛయా అనఁగా స్వప్రయత్నము లేకయే యని యర్థము. ఇత్యాదివచనముచే అనుచోటి ఆదిశబ్ద ముచే « మాధూకర మసంక్లప్తం ప్రాక్ప్రణీత మయాచితమ్ । తత్కాలోపప న్నంచ భైక్ష్యం పఞ్చవిధం స్మృతమ్ '' ఇత్యాదులు గ్రహింపఁబడుచున్నవి. పరుల యుత్కర్షము నోర్వమితోఁ గూడినస్వోత్కర్షాభిలాష తొలఁగినది యెవ్వనివలన నుండియో అనువృత్తి నాశ్రయించి వివక్షిత మయిన యర్థము చెప్పుచున్నారు వైరబుద్ధి లేనివాఁడు అని. సంక్షేపముగాఁ జెప్పిన యర్థము విశదీకరించుచున్నారు ఇట్టివాఁ డెవ్వఁడు ఇత్యాదిగా. అ ట్లయినను ప్రకృత యతికి భిక్షాటనాదికము నందుఁ గర్తృత్వము కలదు, కర్తృత్వము లేనిచో భిక్షాటనాదులు సంభవింపమివలన

జీవనాభావము ప్రసక్తించుటవలన నని యాశంకించి చెప్పుచున్నారు లోకవ్యవహా రేత్యాదిగా. లౌకికులతో—అవివేకులతోఁ గూడ వ్యవహారము స్నానాచమనభోజ నాదిరూపము విద్వాంసునకుఁగూడ సదృశముగాఁ గనఁబడుటవలన దాని ననుసరించి లౌకికులు వానియందు కర్తృత్వము నారోపించుటవలన విద్వాంసుఁడుగూడ లోక దృష్టిచే భిక్షాటనాది కర్మమునందుఁ గర్తృత్వము ననుభవించుచున్నాఁ డని యర్థము. అప్పు డతఁడు అకర్త యెట్లగును? అనఁగాఁ జెప్పుచున్నారు శాస్త్రప్రమాణేత్యా దిగా. మొదటి మూఁడుపాదములకును వ్యాఖ్యానము చేసి నాలవపాదమునకు వ్యాఖ్య చేయుచున్నారు అట్టి యతి ఇత్యాదిగా. ప్రాతిభాసికం ♦ బగు భిక్షాట నాదికర్మముచే విద్వాంసుఁడు బద్ధుఁడు గా కున్నను ఇతరకర్మముచే బద్ధుఁ డగు నని యాశంకించి చెప్పుచున్నారు బంధహేతువు ఇత్యాదిగా. జ్ఞానాగ్నిచే దగ్ధ మగుటవలన ననునది « శారీరం కేవలం కర్మ » ఇత్యాదిగాఁ జెప్పిన యర్థము యొక్క యనువాద మని యన్వయము. కర్మము ముక్తికి మహావిరోధం బని స్వాభిప్రాయము సూచించుచున్నది కృత్వాఽపి యనుస్థలమునందలి అపిశబ్దము.

హ. యదృచ్ఛాలాభసంతుష్టః = అప్రార్థిత మయిన లాభముచే సంతో షముఁ బొందినవాఁడు. ద్వన్ద్వాతీతః = శీతోష్ణాదులచే సుఖదుఃఖాదులు లేనివాఁడు. విమత్సరః = క్రోధము లేనివాఁడు. కర్మములఫలము సిద్ధించినను సిద్ధింపకున్నను సమ మయిన చిత్తము గలవాఁడు. ఇట్టివాఁడు, కృత్వాఽపి, ననిబధ్యతే = కర్మఫల మయిన శరీరాదికమును బొందఁడు.

శం. పరావరైక్యజ్ఞానాగ్నిచే నిర్దగ్ధ మయిన అవిద్యాతత్కార్యగ్రంథి గల జీవన్ముక్తుఁ డగు విద్వాంసుఁడు శరీరయాత్ర దక్క మఱి యేకర్మమునుం జేయవలసి నది లే దని ప్రతిపాదించి, నిదిధ్యాసనపరుం డగు మౌని యయినయతి అన్నమును తద్దాతను విచారింపకయే దేహయాత్ర చేసినను ముక్తిప్రతిబంధము లే దని వచి యించి, అజగరవృత్తియై ✱ యాదృచ్ఛికముగా లభించినదానిచే జీవనము చేయు జీవన్ముక్తయతి యేవృత్తియం దుండునో అదియు నతనికి ముక్తిప్రతిబంధకము గా దని యిప్పు డుపదేశించుచున్నాఁడు శ్రీభగవంతుఁడు.—ద్వన్ద్వాతీతః = ద్వంద్వ ములు—నీవు నేను అనియు ఇది యది అనియు ఇష్టము అనిష్టము అనియు శుద్ధము

♦ భ్రాంతిచేఁ బ్రతీతము.

✱ కొండచిలువవలె పడియుండునట్టివాఁడై.

అశుద్ధము అనియు ద్వైతము అద్వైతము అనియు మొదలగు విపరీతజ్ఞానములు, వానిని అతీతుఁడు, సర్వత్ర బ్రహ్మదృష్టిచే విపరీతజ్ఞానములు లేనివాఁడు; కావుననే, విమత్సరః = నేనే యిది యంతయు నని సమస్తమును దా నని తెలిసినవాఁడు, కావున, ఉత్కర్షాపకర్ష బుద్ధిలేక సర్వత్రాత్మ బుద్ధి గలవాఁడు; కావుననే, యదృచ్ఛా లాభసన్తుష్టః = ప్రయత్నము లేక లభించినలాభము యదృచ్ఛాలాభము, ప్రారబ్ధ వశమునఁ దనయంతనె లభించినది--సత్పురుషునిచేత నియ్యఁబడినది అసత్పురుషునిచేత నియ్యఁబడినదిగాని, శుద్ధము అశుద్ధము గాని, కొంచెము ఎక్కువగాని అన్నాదికము, దానిచేతనే సంతుష్టుఁడు—సంతృప్తిపొందినవాఁడునై; సిద్ధావసిద్ధౌ చ=ఆహారము సిద్ధించినను సిద్ధింపకున్నను; సమః=బ్రహ్మానందానుభవముచేఁ దాను హర్షవిషాదములు వివర్ణత మొదలగునవి లేనివాఁడై; ఇట్లు శరీరయాత్రను, కృత్వాఽపి; అజగరమువలె నుండు బ్రహ్మవిదుఁ డగు యతి, ననిబధ్యతే= ముక్తికిఁ బ్రతిబంధమునొందఁడు. లోక దృష్టికి ఆహారాదినైషమ్యముచేఁ బ్రతిబంధకదోషము కలవాఁడపోలెఁ గనఁబడి నను, విద్వాంసుఁడు, ఇది సమస్తమును నేనును బ్రహ్మమే యనుజ్ఞానముచే భోక్త భోగ్యము దాత దేయము మొదలగు సర్వదృశ్యములును బ్రహ్మమాత్రముగాఁ బ్రవిలాపితంబు లగుటవలన, అద్వితీయం బగు పరబ్రహ్మమునందుఁ బ్రతిబంధ హేతు వగు నితరవస్తువు సంభవింపకపోవుటవలన, ఈవిద్వద్దేహము పడినవెంటనె విదేహముక్తిని బొందుచున్నాఁ డని యర్థము.

మ. సర్వపరిగ్రహములను బరిత్యజించినయతికి శరీరస్థితిమాత్రప్రయోజన మగు కర్మము అనుమతింపఁబడినది. అందు, అన్నాచ్ఛాదనాదులు లేక శరీరస్థితి సంభవింపమివలన యాచనము మొదలగు స్వప్రయత్నముచేతఁ గూడ అన్నాదికము సంపాదించుకోవలయు నని ప్రాప్తింపఁగా నియమము చేయుకొఱకుఁ జెప్పుచు న్నాఁడు.——శాస్త్రము అనుమతింపని ప్రయత్నము లేక యుండుట యదృచ్ఛ, దానిచేతనే శాస్త్రానుమత మగు అన్నాచ్ఛాదనాదికముయొక్క లాభ మేది కలుగునో అది యదృచ్ఛాలాభము, దానిచే సంతుష్టుఁడు, దానికంటె నధికము కావలయు నని తృష్ణ లేనివాఁడు; అట్లు శాస్త్రము, "భైక్షంచరేత్" అని ప్రకరణము నారంభించి "అయాచిత మసంక్లృప్త ముపపన్నం యదృచ్ఛయా" అని యాచనము సంకల్పము మొదలగు ప్రయత్నమును నిషేధించుచున్నది. మనువుగూడ "న చోత్పాత నిమిత్తాభ్యాం న నక్షత్రాఙ్గవిద్యయా । నానుశాసన వాదాభ్యాం

భిక్షాం లిప్సేత కర్హిచిత్ » ♦ అని. « యతయో భిక్షార్థం గ్రామం ప్రవిశన్తి » § ఇత్యాదిశాస్త్రముచే ననుమతింపఁబడిన ప్రయత్నము మాత్రము చేయవలసినదియే. ఇట్లు యతి సంపాదింపవలసిన ఆచ్ఛాదనాదికముగూడ శాస్త్రముచే నియతమైయే యున్నది « కౌపీనయుగలం వాసః కన్థాం శీతనివారిణీమ్ । పాదుకే చా ఒపి గృహ్ణీయా త్కుర్యా న్నా ఒన్యస్య సంగ్రహమ్ " * ఇత్యాదిగా. ఇట్లు మఱియు విధినిషేధశాస్త్రము నూహించునది. ఓయీ! స్వప్రయత్నము లేక లభింపని చో శీతోష్ణాది పీడితుఁడై యెట్లు జీవించును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ద్వన్ద్వాతీతః= ద్వంద్వములను—క్షుత్పిపాసలు శీతోష్ణములు వర్షాతపములు మొదలగువాని, అతీతుఁడు—అతిక్రమించినవాఁడు, సమాధిదశ యందవి స్ఫురింప కుండుటవలన, సమాధి నుండి లేచినప్పుడు స్ఫురించినను, తాను బరమానందరూపుఁడు అద్వితీయుఁడు అకర్త అభోక్త అను జ్ఞానముచేత బాధితము లగుటవలన, ఆద్వంద్వములచే నుపహతుఁడైనను క్షోభింపని మనస్సు గలవాఁడు; కావుననే పరునకు లాభము కలిగినను దనకుఁ గలుగకపోయినను, విమత్సరః = పరుని యుత్కర్ష నోర్వలేమింగోఁ గూడిన స్వోత్కర్షయందలి కోరిక మత్సరము, అది లేనివాఁడు, అద్వితీయాత్మజ్ఞానముచే వైరబుద్ధి లేనివాఁడు; అందువలననే, సమః = ఒకటేవిధ మయినవాఁడు, యదృచ్ఛాలాభము సిద్ధించినను సిద్ధింపకపోయినను, సిద్ధించినపుడు హర్షము నొందఁడు, సిద్ధింపని యప్పుడు విషాదము నొందఁడు; అతఁడు స్వానుభవంబున ‖ అకర్తయే యగుచు, పరు లారోపించిన కర్తృత్వము గలవాఁడై శరీరస్థితిమాత్రప్రయోజన మగు భిక్షాటనాదిరూప కర్మమును, కృత్వా ఒపి; నవిబధ్యతే, బంధహేతు వగు కర్మము సహేతుకముగా జ్ఞానాగ్నిచే దగ్ధ మగుటవలన నని మున్ను చెప్పినదానియనువాదము.

శ్రీ. మఱియును.—అపేక్షింపక కలిగినలాభము యదృచ్ఛాలాభము, దానిచే సంతుష్టిఁ బొందినవాఁడు; ద్వన్ద్వాతీతః = శీతోష్ణాదిద్వంద్వములను అతిక్రమించినవాఁడు, వాని సహించువాఁ డని యర్థము; విమత్సరః = వైరము లేనివాఁడు;

---

♦ ఉత్పాతనిమిత్తములఫలము చెప్పుటచేతను జ్యోతిషము చెప్పుటచేతను ఉపదేశముచేతను శాస్త్రివాదముచేతను భిక్షను ఎప్పుడును పొందఁ గోరఁగూడదు.

§ యతులు భిక్షముకొఱకు గ్రామముఁ బ్రవేశింపవలయును.

* గోఁచులురెండును వస్త్రమును చలిని బోఁగొట్టునట్టి బొంతను పాదుకలను గ్రహింపవలయును. ఇతరసంగ్రహము చేయఁగూడదు.

‖ తనదృష్టిచే.

యదృచ్ఛాలాభముయొక్క-గూడ, సిద్ధౌ, అసిద్ధౌచ; సమః = హర్ష విషాదములు పొందనివాఁడు; ఇట్టివాఁ డెవ్వఁడో అతఁడు, పూర్వభూమికయందుఁ గాని ఉత్తరభూమికయందుఁ గాని §, విహితమునుగాని స్వాభావికమునుగాని కర్మమును, కృత్వాఽపి; ననిబధ్యతే = బంధము నొందఁడు.

ప. మఱియును.—ప్రార్థింపక లభించిన లాభము యదృచ్ఛాలాభము, దానిచే సంతుష్టుఁడు, అదియును శరీరనిర్వాహమునకుమాత్రము చాలినది "మా గృధః కస్య స్విద్ధనమ్" ♦ అను శ్రుతివలన. ద్వన్ద్వములను శీతోష్ణాదులను అతీతుఁడు. విమత్సరః = ఇతరుల మేలునందు ద్వేషము లేనివాఁడు. సిద్ధౌ, అసిద్ధౌచ, సమః = హర్షవిషాదములు లేనివాఁడు; అట్టివాఁడు పూర్వోత్తరదశలయందు యథాసంభవము కర్మమును చేయుటచే బంధము నొందఁడు.

రా. యదృచ్ఛాలాభసంతుష్టః = యదృచ్ఛాప్రాప్త మైన శరీరధారణ హేతు వగు వస్తువుచే సంతుష్టిఁ బొందినవాఁడు; ద్వన్ద్వాతీతః=సాధనసమాప్తి యగువఱకును * అనివార్యము లగు శీతోష్ణాదుల సహించువాఁడు. విమత్సరః = అనిష్టప్రాప్తిహేతు వయిన తనకర్మమును నిరూపించికొని ↿ పరులయందు మత్సరము లేనివాఁడు; సిద్ధౌ అసిద్ధౌచ సమః = యుద్ధాదికర్మములయందు జయాదులు సిద్ధించినను సిద్ధింపకున్నను ఒకటేవిధ మయిన మనస్సు గలవాఁడు; కర్మమునే, కృత్వాఽపి = చేసియును, జ్ఞాననిష్ఠ లేకయున్నను; ననిబధ్యతే = సంసారమును పొందఁడు.

యదృచ్ఛాలబ్ధ మగు ఆహారాదికముచే సంతుష్టుఁడై శాస్త్రీయ మగు కర్మము నారంభించినదాని సాధించువఱకు అనివార్యముగా సంభవించునట్టి శీతోష్ణాది ద్వంద్వముల సహించుచు, ఎవ్వరైనను దనకుఁ గష్టము గలిగించినను దనపూర్వకర్మమె ఆకష్టమునకుఁ గారణ మని నిశ్చయించి వారిమీఁద మాత్సర్యము లేనివాఁడై యుద్ధాదికర్మములఫలము జయాదికము లభించినను లభింపకపోయినను ఏకవిధ మయిన చిత్తము గలవాఁడై, కర్మమునే చేయుచుండునేని అతఁడు జ్ఞాననిష్ఠ నభ్యసింప కున్నను, సంసారము నొందఁ డని తాత్పర్యము.

---

§ జ్ఞానమునకు ముందు జిజ్ఞాసావస్థయందుఁ గాని జ్ఞానమునకుఁ బిమ్మట జీవన్ముక్త్యవస్థయందుఁ గాని.

♦ ఎవ్వనిధనమును ఆశింపకుము.

* ఆరంభించిన కర్మమును బూర్తిగా సాధించువఱకును.

↿ తనకర్మమువలననె అనిష్టము గలిగిన దని నిశ్చయించుకొని.

మా. యతిచిత్తాత్మనిలక్షణముఁ జెప్పుచున్నాఁడు—యదృచ్ఛాలాభతుష్టః
టీగా. ఎట్లు ద్వంద్వాతీతత్వ మనఁగాఁ జెప్పుచున్నాఁడు సమస్సిద్ధావసిద్ధౌచ అని.

గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః
యజ్ఞాయా౽౽చరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. ౨౩

భా. త్యక్త్వా కర్మ ఫలాసఙ్గ మ్మను శ్లోకముచే, ఎవ్వఁడు కర్మము చేయుచుండి యెప్పుడు నిష్క్రియాత్మదర్శనము నొందునో అప్పుడతఁడు తనకుఁ గర్తృకర్మప్రయోజనములు లేవని యెఱింగినవాఁడు కర్మపరిత్యాగము చేయవలసి యుండఁగా ఏదో యొకనిమిత్తంబున నది సంభవింపక పూర్వమువలె నాకర్మమునం దభిప్రవృత్తుఁడైనను, « నైవ కించిత్కరోతి సః » అని యతనికిఁ గర్మాభావము ప్రతిపాదింపఁబడినది. ఎవ్వనికిట్లు కర్మాభావము ప్రతిపాదింపఁబడినదో అట్టి—గతసఙ్గస్య = అన్నిటినుండియుఁ బోయిన ఆసక్తి గలవాఁడును; ముక్తస్య = ధర్మాధర్మాదిబంధము వీడినవాఁడును; జ్ఞానావస్థితచేతసః = జ్ఞానమునందే నిలిచిన మనస్సు గలవాఁడును; యజ్ఞాయ = యజ్ఞనిర్వృత్తికొఱకు; ఆచరతః = నెఱవేర్చుచున్నవాఁడును అగువానియొక్క; సమగ్రమ్=అగ్రముతో—ఫలముతోఁ గూడినది సమగ్రము, అట్టి; కర్మ = కర్మము; ప్రవిలీయతే = నశించుచున్నది యని యర్థము.

సమస్తదృశ్యప్రపంచమునందును ఆసక్తి లేనివాఁడై ధర్మాధర్మాదిబంధము నుండి విముక్తుండై జ్ఞానమునందే మనస్సు నిలిపి యుండువాఁడు పరమేశ్వరప్రీతికొఱకుఁ గర్మము నాచరించినను అట్టివాని కర్మము ఫలసహితముగా నాశము నొందు నని తాత్పర్యము.

ఆ. గతసఙ్గస్య అనుశ్లోకమునకు వ్యవహితశ్లోకముతో సంబంధము చెప్పుటకై జరగినవిషయముఁ జెప్పుచున్నారు త్యక్త్వా ఇత్యాదిగా. ఆశ్లోకముచే నైవ కించిత్కరోతి సః అనుచోటఁ గర్మాభావము ప్రతిపాదింపఁబడినది యని యన్వయము. ఎవ్వనికిఁ గర్మాభావము ప్రతిపాదింపఁబడినది యనఁగాఁ జెప్పుచున్నారు ఎవ్వఁడు ఇత్యాదిగా. ఎవఁడు కర్మము చేయుచుండునో అతనికిఁ గర్మాభావము ప్రతిపాదించినచో విరోధం బగు నని యాశంకించి యవస్థావిశేషమునందు అట్లు ప్రతిపాదింపుట

వలన విరోధము లేదని చెప్పుచున్నారు ఎవ్వఁడు ఇత్యాదిగా. ఓయీ! జ్ఞాని క్రియాకారకఫలములు లేవని యెఱింగినవాఁడు కర్మపరిత్యాగము చేయుట నిశ్చితం బగుటవలన నతనికిఁ గర్మాభావము ప్రతిపాదించుట అప్రాప్తప్రతిషేధం బగు నని యాశంకించి చెప్పుచున్నారు తనకు ఇత్యాదిగా. లోకసంగ్రహాదినిమిత్తము మున్నే చెప్పఁబడినది. పూర్వమువలె = అవిద్యావస్థయందువలె. ఇట్లు కడచినదాని నను వదించి మీఁదిశ్లోకము దించుచున్నారు ఎవ్వనికి ఇత్యాదిగా. ఇట్లు జ్ఞానవంతుఁడగు ముక్తుఁడుగూడ భగవత్ప్రీతికొఱకుఁ గర్మము ననుష్ఠించుట కనఁబడుటవలన, అందుచే నతనికి మరల బంధము సంభవించు నని యాశంకించి చెప్పుచున్నాఁడు యజ్ఞాయేత్యాదిగా. ధర్మాధర్మాది అనుచోటి యాదిశబ్దముచే రాగద్వేషాదులు సంగ్రహింపఁబడుచున్నవి. యజ్ఞనిర్వృత్తికొఱకు = యజ్ఞశబ్దవాచ్యుఁ డగు భగవంతుఁడు విష్ణువు నారాయణుని ప్రీతి కలుగుటకొఱకని యర్థము. జ్ఞానమునే కోరు వానికి జ్ఞానమునకుఁ బ్రతిబంధకము కర్మము అను నాశంకను బరిహరించుచున్నాఁడు క ర్మేత్యాదిగా. సహాగ్రేణ అను వ్యుత్పత్తి యంగీకరించి వ్యాఖ్యానము చేయుచున్నారు అగ్రముతో ఇత్యాదిగా.

హ. గతసఙ్గస్య=ఫలసంకల్పము లేనివాఁడును. జ్ఞానావస్థితచేతసః=పరమాత్మయందే అవస్థిత మయిన బుద్ధి గలవాఁడును. యజ్ఞాయ= ఈశ్వరారాధనముకొఱకు; ఆచరతః = చేయువాఁడును అగువానియొక్క; కర్మ = అట్లనుష్ఠించువాని కర్మము; సమగ్రం ప్రవిలీయతే = ఫలప్రదము కాదు, బంధకము కాఁ జాలదు.

శం. ఓయీ! ఇది యంతయు నేనును బ్రహ్మమే యని సమస్తప్రపంచమును దానును బ్రహ్మమే యని ప్రత్యగ్దృష్టిచే సర్వదాఁ జూచుచుండు బ్రహ్మవిదు లగు జీవన్ముక్తులశరీరయాత్రారూప మగుకర్మము బ్రహ్మదృష్టిచేఁ బ్రవిలాపితం బగుటం జేసి పత్తారహిత మగుటవలన వారికి ముక్తిప్రతిబంధకము గాకపోవు; లోకానుగ్రహేచ్ఛచేఁ గర్మమునందుఁ బ్రవృత్తుఁ డగు విద్వాంసుఁడు, అధికారికుఁడు గాని యితరుఁడు కాని, నేను గర్తను నే నిది చేయవలయును అని క్రియాకారకభేదదృష్టి నవలంబించి చేయుకర్మము అతనికి ముక్తిప్రతిబంధకము కానే యగును, "నా ఽభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతై రపి" * ఇత్యాది స్మృతినియమము వలన. అని యాశంకింపఁగా, అట్లు కాదు. బ్రహ్మవిదు లగు మహాపురుషులచేఁ జేయఁబడు

* ఎన్నికల్పకోటులకైనను అనుభవింపక కర్మము నశింపదు.

కర్మము లౌకికముగాని వైదికముగాని, అది క్రియాకారకభేదభిన్నమైనను, సర్వము బ్రహ్మమే యని సర్వత్ర బ్రహ్మదృష్టిచేతనే చేయఁబడుచున్నది కాని నే నిది చేయవలయు నని భేదదృష్టిచేఁ జేయఁబడదు. కావున వారిచేఁ జేయఁబడు కర్మము అకర్మమే యగుటవలన వారిముక్తిని ప్రతిబంధించుటకు సమర్థము కాదు. అను నభిప్రాయముచేఁ జెప్పుచున్నాఁడు.—ముక్తస్య = బ్రహ్మమునందే ఆత్మభావము కలుగుటచే నేను నాది యను నభినివేశముచే విడువఁబడినవాఁడును, అహంకారరహితుఁడును; కావుననే, గతసఙ్గస్య = పురుషుఁడు దీనిచేఁ గర్మములందు ఆసక్తుఁ డగుచున్నాఁ డను వ్యుత్పత్తిచే సంగ మనఁగా కామము, పోయినకామము గలవాఁడును, నిష్కాముఁడును; కావుననే, జ్ఞానావస్థితచేతసః = సర్వత్ర బ్రహ్మదర్శనము జ్ఞానము, దానియందే నిలిచిన యంతఃకరణము గలవాఁడును, దృశ్యావగాహి యగు వృత్తిని ♦ సదా బ్రహ్మాకారతను పొందించుచున్నవాఁడును; యజ్ఞాయ = విష్ణుప్రీతికొఱకు; లేక, శ్రౌతస్మార్తకర్మములచే దేవతలను యజించుచున్నా రను వ్యుత్పత్తిచే యజ్ఞులనఁగా బ్రాహ్మణాదులు, వారికొఱకు, జాతియం దేకవచనము, లోకహితముకొఱకు; ఆచరతః = కర్మములను చేయుచున్నవాఁడు నగు అధికారికునియొక్క; కర్మ = నిత్యము అనుష్ఠింపఁబడుచున్న కర్మము; సమగ్రమ్ = మనోవాక్కాయములచేఁ జేయఁబడునది సమస్తమును; లేక, కర్త్రాది రూపము సమస్తమును; ప్రవిలీయతే—బ్రహ్మబుద్ధిచేఁ బ్రవిలాపితమయి సమూలముగా నశించుచున్నది, జన్మాదిఫలమునకు సమర్థము కా దని యర్థము.

మ. సర్వపరిగ్రహంబులును విడిచినవాఁడును యదృచ్ఛాలాభసంతుష్టుఁడు నగు యతికి శరీరయాత్రామాత్రప్రయోజన మగు భిక్షాటనాది కర్మ మేది గలదో అది యనుష్ఠించి బద్ధుఁడుగాఁ డని చెప్పఁగా, ఇఁక బ్రహ్మవిదుఁ డగు జనకాదిగృహస్థునకు యజ్ఞాదిరూప మగుకర్మ మేది గలదో అది బంధజనక మగు నని యొకానొకని కాశంక కావచ్చును. దానిఁ బరిహరించుటకై త్యక్త్వా కర్మ ఫలాసంగ మ్మను శ్లోకముచేఁ జెప్పినదాని వివరించుచున్నాఁడు.—గతసఙ్గస్య = ఫలాసక్తి లేనివాఁడును; ముక్తస్య = కర్తృత్వభోక్తృత్వములు మొదలగు అధ్యాసము లేనివాఁడును; జ్ఞానావస్థితచేతసః = నిర్వికల్పకబ్రహ్మాత్మైక్యజ్ఞానమునందే యుండు నంతఃకరణము గలవాఁడును, స్థితప్రజ్ఞుఁడును అని యర్థము; ఉత్తరోత్తరవిశేషణము పూర్వపూర్వవిశేషణమునకు హేతువుగా నన్వయించునది—ఎందువలన గతసంగుఁడు? అధ్యాసము

♦ దృశ్యమును గ్రహించు అంతఃకరణవృత్తిని.

లేనివాఁ డగుటవలన; ఎందువలన అధ్యాసహీనుఁడు? స్థితప్రజ్ఞుఁ డగుటవలన అని; ఇట్టివాఁ డైనను ప్రారబ్ధకర్మవశమువలన, యజ్ఞాయ = యజ్ఞసంరక్షణముకొఱకు, జ్యోతిష్టోమాదియజ్ఞమునందు శ్రేష్ఠుని యాచారం బని లోకము ప్రవర్తించుకొఱకు; లేక, యజ్ఞాయ= విష్ణువుకొఱకు, విష్ణుప్రీతికొఱకు; ఆచరతః=ఆచరించువానియొక్క; కర్మ = యజ్ఞదానాదికము, సమగ్రమ్ = అగ్రముతో—ఫలముతోఁ గూడ నున్నది కావున సమగ్రము; ప్రవిలీయతే = చక్కగా—తత్త్వదర్శనమువలన కారణము నశించుటచే విలీయతే—వినాశము నొందుచున్న దని యర్థము.

శ్రీ. మఱియును.—గతసఙ్గస్య = నిష్కాముఁడును; ముక్తస్య = రాగాదులచే విడువఁబడినవాఁడును; జ్ఞానమునందు నిలిచిన మనస్సు గలవాఁడును; యజ్ఞాయ = పరమేశ్వరునికొఱకు; కర్మమును, ఆచరతః = చేయుచున్నవానియొక్క; సమగ్రమ్ = వాసనాసహిత మయిన; కర్మ = కర్మము; ప్రవిలీయతే = కర్మాభావతను బొందుచున్నది. ఆరూఢునిపక్షమందు.—యజ్ఞాయ = యజ్ఞసంరక్షణముకొఱకు, లోకసంగ్రహార్థము; కర్మముచేయువానియొక్క యని యర్థము.

ప. మఱియును.—గతసఙ్గస్య. ముక్తస్య = రాగాదులచే విడువఁబడినవాఁడును. జ్ఞానావస్థితచేతసః = ఆత్మజ్ఞానైకనిష్ఠ మగు మనస్సు గలవాఁడును; ఇట్టివాఁడై, యజ్ఞాయ = పరమేశ్వరునికొఱకు, లేక యాగముకొఱకు; ఆచరతః; కర్మ; సమగ్రమ్= వాసనాసహితముగా; ప్రవిలీయతే = అకర్మతను నొందుచున్నది.

రా. ఆత్మవిషయ జ్ఞానమునందే యుండు మనస్సు గలవాఁ డగుటచే తదితరమునం దాసక్తి లేనివాఁడు కావుననే సర్వపరిగ్రహములచేతను విముక్తుఁడై మీఁదఁ జెప్పినలక్షణము గల యజ్ఞాదికర్మము నిర్వర్తించుకొఱకుఁ బ్రవర్తించుచున్నవానియొక్క బంధహేతు వగు ప్రాచీనకర్మము, సమగ్రముగా—నిశ్శేషముగా క్షయించుచున్నది.

మా. ఉపసంహరించుచున్నాఁడు.—గతసఙ్గస్య = ఫలస్నేహము లేనివాఁడు. ముక్తస్య = శరీరాదులం దభిమానము లేనివాఁడు. జ్ఞానావస్థితచేతసః = పరమేశ్వరజ్ఞానము గలవాఁడు.

బ్రహ్మార్పణం బ్రహ్మ హవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా. ౨౪

భా. ఏకారణమువలన మఱి చేసినకర్మము స్వకార్యము కల్గింపకయె సమగ్రముగాఁ బ్రవిలయము నొందుచున్నది? చెప్పెదము. ఏకారణమువలన ననఁగా.—బ్రహ్మార్పణమ్—ఏకరణముచే * బ్రహ్మవిదుఁడు హవిస్సు నగ్నియం దర్పించుచున్నాఁడో అది బ్రహ్మమే యని చూచుచున్నాఁడు, దానికి ఆత్మవ్యతిరేకమున అభావము చూచుచున్నాఁడు §, ఎట్లు శుక్తియందు రజతాభావముఁ జూచుచున్నాఁడో అట్లు; కావునఁ జెప్పఁబడుచున్నది బ్రహ్మమే అర్పణం బని, ఏది రజతమో అది శుక్తియే అనునట్లు. బ్రహ్మ అర్పణమ్ అని వ్యస్తపదములు. ఏది లోకమునం దర్పణబుద్ధిచే గ్రహింపఁబడుచున్నదో అది యీబ్రహ్మవిదునకు బ్రహ్మమే యని యర్థము. బ్రహ్మ హవిః—అట్లు ఏది హవిస్సు అను బుద్ధిచే గ్రహింపఁబడుచున్నదో అది బ్రహ్మమే వీనికి. అట్లు, బ్రహ్మాగ్నౌ—ఇది సమస్తపదము. అగ్నియును బ్రహ్మమే, దేనియందు హోమము చేయఁబడునో; బ్రహ్మణా=కర్త యగు బ్రహ్మముచేత; ఆహోమకర్తయును బ్రహ్మమే యని యర్థము. ఏది యతనిచే, హుతమ్ = హవనక్రియ గలదో ♦ అది బ్రహ్మమే. బ్రహ్మైవ తేన గన్తవ్యమ్—ఏది వానిచే గంతవ్య మగుఫలమో అదియును బ్రహ్మమే. బ్రహ్మకర్మసమాధినా = బ్రహ్మమే కర్మము బ్రహ్మకర్మము దానియందు సమాధి యెవ్వనికో అతఁడు బ్రహ్మకర్మసమాధి, అట్టి బ్రహ్మకర్మసమాధిచే బ్రహ్మమే గంతవ్యము ‡.

బ్రహ్మవిదుఁడు యజ్ఞాదికర్మము ననుష్ఠించునపుడు, వానికి హోమసాధనమయిన స్రుక్స్రువాదులు బ్రహ్మముగానే కనఁబడును, హోమము చేయు హవిస్సు గూడ బ్రహ్మముగానే కనఁబడును, దేనియందు హోమము చేయుచున్నాఁడో ఆ యగ్నియును బ్రహ్మముగానే కనఁబడును, హోమము చేయువాఁడును బ్రహ్మముగానే కనఁబడును, హోమక్రియయును బ్రహ్మముగానే కనఁబడును. అట్లు సమస్తకర్మతత్సాధనములను బ్రహ్మముగాఁ జూచుచున్నయతఁడు పొందవలసిన ఫలముగూడ బ్రహ్మమే యని తాత్పర్యము.

---

* స్రుక్స్రువాదిసాధనముచే.

§ అది తనకు వ్యతిరిక్తముగా లే దని చూచుచున్నాఁడు.

♦ అతనిచే చేయఁబడు వేల్చుట యను క్రియ యేది గలదో.

‡ పొందఁబడవలసినది.

ఆ. « నా ఽభుక్తం క్షీయతే కర్మ » అను స్మృతి నాశ్రయించి శంకించుచున్నాఁడు ఏకారణమువలన నిత్యాదిగా. క్రియాకారకఫలాత్మకం బగు సమస్తద్వైతంబును బ్రహ్మమాత్రం బగుటచే బాధితం బగుటవలన బ్రహ్మమాత్రుం డగు బ్రహ్మవిదునిసర్వకర్మమును బ్రవిలయము నొందు ననుట యుక్తమని చెప్పుచున్నారు చెప్పెదము అని. బ్రహ్మవిదునకుఁ గ్రియాకారకఫలాత్మక మగుద్వైతమంతయు బ్రహ్మమే యనుటకు హేతువుగా నీయీశ్లోకము దీయుచున్నారు ఏకారణమువలన ననఁగా అని. అర్పణశబ్దము కరణవాచకం బని దెలుపుచు అర్పణం బ్రహ్మ అని రెండుపదములకు సామానాధికరణ్యము సాధించుచున్నారు ఏకరణముచే ఇత్యాదిగా. ఏది రజతమో అది శుక్తి యనునట్లు బాధచే నీసామానాధికరణ్యం బని చెప్పుచున్నారు దానికి ఇత్యాదిగా. అందుకు దృష్టాంతము చెప్పుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. చెప్పినయర్థమునందు రెండుపదములఁ దీయుచున్నారు కావున ఇత్యాదిగా. చెప్పినయర్థమునే స్పష్టీకరించుచున్నారు ఏది ఇత్యాదిగా. సమానపదమనుశంకను బరిహరించుచున్నారు బ్రహ్మ ఇత్యాదిగా. పదద్వయపక్షమునందు వివక్షితార్థమును బ్రతిపాదించుచున్నారు ఏది లోకమునందు ఇత్యాదిగా. బ్రహ్మ హవిః అను రెండుపదములను దీసి వ్యాఖ్యానముచేయుచున్నారు బ్రహ్మ ఇత్యాదిగా. ఏది యర్పణబుద్ధిచేఁ గ్రహింపఁబడుచున్నదో అది బ్రహ్మవిదునకు బ్రహ్మమేయని యెట్లు చెప్పఁబడినదో అట్లు ఇచటఁగూడ నని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. దీనికి—ఈబ్రహ్మవిదునకు పూర్వమునలె న్యస్తపదం బని యాశంకించి పరిహరించుచు పదాంతరము దీసి వ్యాఖ్యానముచేయుచున్నారు అట్లు ఇత్యాదిగా. పూర్వమువలె-న్యస్తమైనట్లని వ్యతిరేకదృష్టాంతము. అందు వివక్షిత మయిన యర్థముఁ జెప్పుచున్నారు అగ్నియును ఇత్యాదిగా. బ్రహ్మణా అనుపదమునకు తమ యభిమత మయిన యర్థముఁ జెప్పుచున్నారు కర్త యగు ఇత్యాదిగా. కర్త బ్రహ్మముకంటె భిన్నుఁడు లేఁడు అని యభిప్రాయ మని జెప్పుచున్నారు ఆహోమకర్తయును ఇత్యాదిగా. హుతమ్ అనుదానికి వివక్షిత మయినయర్థముఁ జెప్పుచున్నారు ఏది యతనిచే ఇత్యాదిగా. ఉత్తరార్థము విభజించుచున్నారు బ్రహ్మైవేత్యాదిగా. బ్రహ్మకర్మసమాధినా అనుపదమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు బ్రహ్మేత్యాదిగా. బ్రహ్మమునకుఁ గర్మత్వము జ్ఞేయుం బగుటవలనను బ్రాప్యం బగుటవలనను నని యెఱుంగునది.

భా. ఇట్లు లోకసంగ్రహము చేయఁ గోరువాఁడు చేయు కర్మము గూడఁ బరమార్థమున అకర్మ మగుచున్నది బ్రహ్మబుద్ధిచే నుపమృదితం

బగుటవలన ♦. నివృత్తకర్ముఁ డగు సర్వకర్మ సన్న్యాసియొక్క సమ్యగ్దర్శనము స్తుతించుకొఱకై జ్ఞానమునకు యజ్ఞత్వసంపాదనము * గూడ మఱియు నుపపన్న మగును.—అర్పణాదికం బేది యధియజ్ఞము నందుఁ బ్రసిద్ధమో అధ్యాత్మమం దది బ్రహ్మమే బ్రహ్మవిదునకు అని. కానిచో సమస్తమును బ్రహ్మమై యుండఁగా అర్పణాదులకు మాత్రమే విశేషించి బ్రహ్మత్వముఁ బ్రతిపాదించుట యనర్థకం బగును. అందువలన బ్రహ్మమే యిది యంతయు నని యెఱింగినవిద్వాంసునకు సర్వకర్మాభావము కారకబుద్ధి లేమివలనఁ గూడ. కారకబుద్ధిరహితం బగు యజ్ఞాఖ్యకర్మము కానఁబడదు గదా! అగ్నిహోత్రాదికర్మము సమస్తంబును శబ్దసమర్పితదేవతావిశేషసంప్రదానాదికారకబుద్ధి మంతం బును కర్త్రభిమానఫలాభిసంధిమంతంబునై కానంబడుచున్నది. ఉపమృదితక్రియాకారకఫలభేదబుద్ధిగాని కర్తృత్వాభిమానఫలాభిసంధిరహితము గాని కానంబడదు. ఇదియో బ్రహ్మబుద్ధిచే నుపమృదితమైన అర్పణాదికారకక్రియాఫలభేదబుద్ధి గల కర్మము. అందువలన అకర్మమే అది. అట్లు ప్రదర్శింపఁబడినది. "కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నైవ కించి త్కరోతి సః। గుణాగుణేషు వర్తన్తే। నైవ కించి త్కరో మీతి యుక్తో మన్యేత తత్త్వవిత్" ఇత్యాదివచనములచేత. అట్లు ప్రదర్శించుచు నచ్చటచ్చటఁ గ్రియాకారకఫలభేదబుద్ధ్యుపమర్దము ¶ చేయుచున్నాఁడు. దృష్టము గూడ కామ్యాగ్నిహోత్రాదికమునందుఁ గామోపమర్దముచేఁ గామ్యాగ్నిహోత్రాదిహాని. మఱియు బుద్ధిపూర్వకములు అబుద్ధిపూర్వకములు మొదలగు కర్మములు కార్యవిశేషజనకంబు లగుటయు దృష్టము. అట్లు ఇచటఁ గూడ బ్రహ్మబుద్ధిచే నుపమృదితమైన అర్పణాదికారకక్రియాఫల భేదబుద్ధి గల విద్వాంసుఁడు బాహ్యచేష్టామాత్రంబునఁ జేయుకర్మము గూడ అకర్మమే యగుచున్నది. అందువలనఁ జెప్పఁబడినది సమగ్రం ప్రవిలీయతే అని.

---

♦ విశారితం బగుటవలన.

* యజ్ఞత్వము నారోపించుట.

¶ భేదబుద్ధియొక్క నాశమును.

ఆ. ఇట్లు బ్రహ్మార్పణమంత్రమునకుఁ బదార్థము చెప్పి తాత్పర్యార్థము చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. నివృత్తకర్ముఁ డగు సన్న్యాసివిషయంబున ఈ మంత్రమునకుఁ బ్రవృత్తి యెట్లు? అని యాశంకించి చెప్పుచున్నారు నివృత్తకర్ముఁడు ఇత్యాదిగా. ఎట్లు బాహ్యయజ్ఞము ననుష్ఠించుట కసమర్థుం డగు అజ్ఞునకు సంకల్పరూప మయిన యజ్ఞము దృష్టమో, అట్లు జ్ఞానమునకు యజ్ఞత్వసంపాదనము స్తుత్యర్థము మిక్కిలి యుపపన్నము, ఆందుచే స్తుతి లభించుటవలనను కల్పనము స్వాధీన మగుటవలనను అని యర్థము. జ్ఞానమునకు యజ్ఞత్వసంపాదనమును వర్ణించుచున్నారు అర్పణాదికంబు ఇత్యాదిగా. ఏప్రమాణముచే నిట యజ్ఞత్వసంపాదనము తెలియవచ్చినది? అని యాశంకించి యర్పణాదులకు విశేషించి బ్రహ్మత్వము ప్రతిపాదించుట అనుపపన్న మగుటచే • నని చెప్పుచున్నారు కానిచో ఇత్యాదిగా. జ్ఞానమునకు యజ్ఞత్వము సంపాదించుటచే ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన ఇత్యాదిగా. తానే యిది యంతయు నని తాను దక్కఁ దక్కిన సమస్తమును అవస్తువని తెలిసినవానికిఁ గర్మము లే దనుటకు మఱియొక హేతువుఁ జెప్పుచున్నారు కారకేత్యాదిగా. కారకబుద్ధి—వానియం దభిమానము లేకున్నను ఎందువలనఁ గర్మము కాదు? అని యాశంకించి చెప్పుచున్నారు కారకబుద్ధిరహితంబు ఇత్యాదిగా. చెప్పినదానినే యన్వయవ్యతిరేకముల దృఢీకరించుచున్నారు అగ్నిహోత్రేత్యాదిగా. ఇన్ద్రాయ * ఇత్యాదిశబ్దముచే బోధితం బగు దేవతావిశేషము సంప్రదానకారకము ǂ, ఆదిశబ్దముచే వ్రీహ్యాదికరణకారకము, తద్విషయ మయిన బుద్ధి గలది. నేను కర్తను అని యభిమానపూర్వకం బగు § దీని ఫలము భుజింపఁగలను అని ఫలాభిసంధి గలది. అన్వయముఁ జెప్పి వ్యతిరేకముఁ జెప్పుచున్నారు ఉపమృదిత ఇత్యాదిగా. ఉపమృదిత మయిన క్రియాకారకఫలభేదవిషయబుద్ధి గలది. కర్తృత్వాభిమానపూర్వక మగు ¶ ఈకర్మయొక్క ఫలమును భుజింపఁగలను అను నభిసంధిచేతను

---

• యజ్ఞత్వసంపాదనము లేనియెడ అర్పణాదులకు విశేషించి బ్రహ్మత్వప్రతిపాదనము అనుపపన్న మగును, కావున అన్యథానుపపత్తి యను అర్థాపత్తిప్రమాణముచేత.

* ఇంద్రునికొఱకు.

ǂ ఎవ్వనికొఱకు దానము చేయఁబడుచున్నదో అతఁడు సంప్రదానకారక మని వ్యాకరణసంకేతము, ఈకారకములు మధుసూదనసరస్వతీవ్యాఖ్యానమునందు వివరింపఁబడినవి.

§ ఫలాభిసంధికి విశేషణము.

¶ అభిసంధివిశేషణము.

విషువఁబడినది. అట్లయినను బ్రహ్మవిదునకు దృశ్యమానం బగు * కర్మము లే దనుట కేమి వచ్చినది ? అని యాశంకించి చెప్పుచున్నారు ఇదియో ఇత్యాదిగా. బ్రహ్మవిదునికర్మము ఏది కనఁబడుచున్నదో అది నేను బ్రహ్మమను అను బుద్ధిచే నిరాకరింపఁబడిన కారకాదిభేదవిషయబుద్ధి గలది, కావున కర్మమే కాదు; తత్త్వజ్ఞానము కలుగఁగానే వ్యాపక మగు కారకాదికము తొలఁగుచు వ్యాప్య మగు కర్మమునుగూడఁ దొలఁగించుచున్నది; తత్త్వవిదునిశరీరాదిచేష్ట కర్మాభాసము §, కర్మవ్యాపకము ♦ లేకుండుటవలన, నిద్రించువానిచేష్టవలె నని యర్థము. జ్ఞానవంతునందు దృష్ట మగు కర్మము అకర్మమే అనుటకు భగవంతుని సమ్మతిఁ జెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. బ్రహ్మవిదునకు ఇప్పుడు కనఁబడుకర్మము లే దని చెప్పినను దానికారణము ఉపపాదితము కాకుండుటవలనఁ బిమ్మట కలుగవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు అట్లు ప్రదర్శించుచు ఇత్యాదిగా. అవిద్వాంసునివలె విద్వాంసుఁడును కర్మమునందుఁ బ్రవర్తించునట్లు కనఁబడుచున్నాఁడు, అయినను విద్వాంసుని కర్మముఅకర్మమే యనుటకు దృష్టాంతముఁ జెప్పుచున్నారు దృష్టముగూడ ఇత్యాదిగా. విద్వాంసునికర్మముగూడ కర్మత్వము సమాన మగుటవలన ఇతరకర్మమువలె ఫలజనకం బగు ననుశంకగూడ యుక్తము గా దని చెప్పుచున్నారు మఱియు ఇత్యాదిగా. ఈకర్మము నిట్లు చేయవలయును దీని ఫలమును భుజింపవలయును అనునది బుద్ధి, తత్పూర్వకంబులును తత్పూర్వకంబులు కానివియు నగు కర్మములు, వాని యవాంతరభేదము గ్రహించుటకై మొదలగు అనుపదము. దార్ష్టాంతికము చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. ఇచట—విద్వత్ప్రకరణమునందు. చెప్పిన యర్థమునందుఁ బూర్వవాక్యము అనుకూల మని జూపుచున్నారు అందువలన ఇత్యాదిగా.

భా. ఇటఁ గొందఱు చెప్పుచున్నారు.—బ్రహ్మ మేది గలదో అది యర్పణాదులు. బ్రహ్మమే యఁట అర్పణాదు లగు పంచవిధకారకంబుల

---

* కనఁబడుచున్న.

§ కర్మాభావము అని పాఠాంతరము.

♦ కారకాదికము. ఏది, ఏది యున్నచోటఁ దప్పకయుండి లేనిచోటఁ గూడ నుండునో అది దానికి వ్యాపకము. ఏది ఏది యున్నచోటమాత్రమే యుండునో అది దానికి వ్యాప్యము. అగ్ని ధూమమునకు వ్యాపకము, ధూమము లేనిచోటఁగూడ తప్తాయఃపిండాదులందు అగ్ని యుండుటవలన. ధూమము అగ్నికి వ్యాప్యము, అగ్ని యున్నచోటమాత్రమే ధూమ ముండుటవలన. ఇట్లే కారకాదికము కర్మవ్యాపకము, కర్మము కారకాదివ్యాప్యము.

రూపంబున వ్యవస్థితంబై యదియే కర్మము చేయుచున్నది. అందు అర్ప ణాదిబుద్ధి నివర్తింపఁబడదు. మ తేమనఁగా అర్పణాదులందు బ్రహ్మబుద్ధి యుంపఁబడుచున్నది. ఎట్లు ప్రతిమాదులందు విష్ణ్వాదిబుద్ధి, మఱియు నామాదులందు బ్రహ్మబుద్ధి యుంపఁబడుచున్నదో అట్లు అని.

సత్యము. ఇట్లును గావచ్చును, జ్ఞానయజ్ఞస్తుత్యర్థము ప్రకరణము కాఁ బేని. ఇందో, జ్ఞానయజ్ఞశబ్దవాచ్య మగు సమ్యగ్దర్శనంబును అనే కము లగు యజ్ఞశబ్దవాచ్యము లయిన క్రియావిశేషములను ఉపన్యసించి "శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః" అని జ్ఞానమును స్తుతిం చుచున్నాఁడు. ఇందు సమర్థం బీబ్రహ్మార్పణ మిత్యాదివచనము జ్ఞానము నకు యజ్ఞత్వము సంపాదించుటయం దని చెప్పియున్నారము. కానిచో సమస్తమును బ్రహ్మమై యుండఁగా అర్పణాదులుమాత్రము విశేషించి బ్రహ్మ మని చెప్పుట యనర్థకం బగును. ఇంక నెవ్వరు ప్రతిమయందు విష్ణుదృష్టివలె అర్పణాదులందు బ్రహ్మదృష్టి విధింపఁబడుచున్నది నామాదు లయందుంబోలె నని చెప్పుచున్నారో వారిమతమున నిటఁ జెప్పఁబడిన బ్రహ్మవిద్య వివక్షితము కాకపోవును, జ్ఞానము అర్పణాదివిషయం బగుట వలన. దృష్టివిధానజ్ఞానముచేత మోక్షఫలము లభింపదు. "బ్రహ్మైవ తేన గన్తవ్యమ్" అనియో చెప్పఁబడుచున్నది. సమ్యగ్దర్శనము లేక మోక్షఫలము పొందఁబడు ననుటయో విరుద్ధము. ప్రకృతవిరోధము గూడ. ప్రకృతము సమ్యగ్దర్శనము "కర్మణ్యకర్మ యః పశ్యేత్" అనుచోట. అంతమునందును సమ్యగ్దర్శనమే, అదియె యుపసంహరింపఁ బడుటవలన. "శ్రేయాన్ ద్రవ్య మయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః, జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమ్" ఇత్యాదిగా సమ్యగ్దర్శనస్తుతినే చేయుచు ముగిసినది యధ్యాయము. అందు నిష్కారణముగా అర్పణాదులందు బ్రహ్మదృష్టి ప్రకరణవిరుద్ధముగాఁ బ్రతిమయందు విష్ణుదృష్టివలెఁ జెప్పఁ బడుచున్న దనుట యనుపపన్నము. అందువలన మేము వ్యాఖ్యానము చేసినట్లే యర్థం బీశ్లోకమునకు.

ఆ. బ్రహ్మార్పణమంత్రమునకుఁ దమవ్యాఖ్యానముఁ జెప్పి స్వయూథ్య వ్యాఖ్యానము ననువదించుచున్నారు ఇట ఇత్యాదిగా. ప్రసిద్ధము నుద్దేశించి యప్ర సిద్ధము విధించుట న్యాయ్యము గాని అప్రసిద్ధము నుద్దేశించి ప్రసిద్ధము విధించుట

యెట్లు ? ♦ అని యాశంకించి చెప్పుచున్నాఁడు బ్రహ్మమే ఇత్యాదిగా. అఁట అను నది యీవ్యాఖ్యానమునం దాచార్యులకు అరుచిని సూచించుచున్నది. కర్త కర్మ కరణము సంప్రదానము అధికరణము అను నైదువిధము లగు కారకములరూప మున బ్రహ్మమే వ్యవస్థితమై కర్మము చేయుచున్న దని యంగీకరించుటవలన బ్రహ్మము అప్రసిద్ధము కాదు, కావున బ్రహ్మము నుద్దేశించి యర్పణాదులందు తద్దృష్టివిధి విరుద్ధముగా దని యర్థము. దృష్టివిధిపక్షమున సిద్ధాంతముకంటె విశేషముఁ జూపు చున్నాఁడు అందు ఇత్యాదిగా. అర్పణాదులందుఁ జేయవలసిన బ్రహ్మబుద్ధిని రెండుదృష్టాంతములచే స్పష్టీకరించుచున్నాఁడు ఎట్లు ఇత్యాదిగా.

దృష్టి విధించుపక్షమున విధేయం బగుదృష్టి మానసిక్రియ యగుటం జేసి సమ్యక్జ్ఞానము కాదు, కావునఁ బ్రకరణభంగం బగు నను నభిప్రాయముచేఁ బరిహరించుచున్నారు సత్యము ఇత్యాదిగా. విధింపఁదలఁచిన దృష్టిని స్తుతించుటయే ప్రకరణమునకు విషయము, జ్ఞానస్తుతి కా దని యాశంకించి ప్రకరణము పర్యాలో చించినచో జ్ఞానస్తుతియే ప్రకరణవిషయం బని తెలియుచున్న దని ప్రతిపాదించు చున్నారు ఇందో ఇత్యాదిగా. మఱియు బ్రహ్మార్పణమంత్రమునకుఁగూడ జ్ఞానస్తుతి యందు సామర్థ్యము తోఁచుచున్న దని చెప్పుచున్నారు ఇందు ఇత్యాదిగా. ఓయీ! అర్పణాదులందు బ్రహ్మదృష్టిఁ జేయువారి మతమునందుఁ గూడ బ్రహ్మ విద్యయే యిట వివక్షితము కావునఁ బక్షభేదము లే దనఁగాఁ జెప్పుచున్నారు ఇఁక నెవ్వరు ఇత్యాదిగా. ఎట్లు బ్రహ్మదృష్టిచే నామాదికము ఉపాసింపవలయునో అట్లు అర్పణాదులందు బ్రహ్మదృష్టి చేయుపక్షమున అర్పణాదికమే ప్రధానముగాఁ దెలియ వలసినది యగుం గావున ఈవాక్యముచే బ్రహ్మవిద్య వివక్షితము కాకపోవు నని యర్థము. మఱియు బ్రహ్మైవ తేన గన్తవ్య మ్మని బ్రహ్మప్రాప్తిఫలము చెప్పుటవలనఁ గూడ దృష్టివిధి యయుక్త మని చెప్పుచున్నారు దృష్టివిధా నేత్యాదిగా. అర్పణా ద్యాలంబన మగు దృష్టియేమో బ్రహ్మము నొందింపఁ జాలదు "అప్రతీకాలమ్బనా న్నయతి" అనున్యాయము విరోధించుటవలన నని భావము *. దృష్టివిధానపక్ష

---

♦ అప్రసిద్ధ మయినబ్రహ్మము నుద్దేశించి ప్రసిద్ధ మగు అర్పణాదిభావము విధించుట యన్యాయ్య మని భావము.

* బ్ర. సూ. అ ౪. పా 3. సూ. ౧౫. అప్రతీకాలమ్బనా న్నయ తీతి బాదరాయణ ఉభయథా చ దోషా త్తత్క్రతుశ్చ—అప్రతీకాలమ్బనాన్ = ప్రతీకోపాసకులు కాని వార లగు ఉపాసకులను, నయతి = అమానవపురుషుఁడు బ్రహ్మలోకమునకుఁ గొని పోవును. ఇతి = అని, బాద

మునందును శాస్త్రనియోగబలమువలనని స్వర్గమువలె అదృష్టము మోక్షము లభించు నని యాశంకించి చెప్పుచున్నారు సమ్యగ్దర్శనము ఇత్యాదిగా. జ్ఞానమువల ననే కైవల్యము గలుగు నని చెప్పి మార్గాంతరము నిషేధించునట్టి శ్రుతికి అవిద్యాని వృత్తిరూపము దృష్ట మగు మోక్షము నియోగమువలన లభించు ననుట విరుద్ధ మని యర్థము. దృష్టినియోగమువలన మోక్షము లభించు ననుట ప్రకరణవిరు ద్ధముగూడ నని చెప్పుచున్నారు ప్రకృ తేత్యాదిగా. దానినే విస్తరించుచున్నారు ప్రకృతము ఇత్యాదిగా. అంతిమునందును సమ్యగ్దర్శనమే ప్రకృత మని సంబంధము. అందుకు హేతువు అదియే ఇత్యాదిగా. సమ్యక్ జ్ఞానముతో నారంభించి దానితోనే యుపసంహరించినను నడుమ నితర మేదో చెప్పఁబడి యుంటుటచేఁ బ్రకరణము సమ్యక్ జ్ఞానవిషయము కా దని యాశంకించి చెప్పుచున్నారు శ్రేయా నిత్యాదిగా. ప్రకరణము జ్ఞానవిషయ మయి యుండఁగా దృష్టివిధానం బనుపపన్నం బని ఫలితము చెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. బ్రహ్మార్పణమంత్రమునకుఁ బరకీయవ్యాఖ్యానం బయుక్త మగుటచేఁ దమవ్యాఖ్యానమే నిశ్చితం బని యుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా.

హ. ఇది మఱియొకయోగము—బ్రహ్మ = పరమాత్మ. అర్పణమ్ = అర్పింపఁబడుచున్నది—వేల్వఁబడుచున్నది దీనిచేత అను వ్యుత్పత్తిచే స్రువాదికము; అదియే బ్రహ్మము. ఆబ్రహ్మమే, హవిః = చరుపురోడాశాదికము. ఆబ్రహ్మమే యగ్ని, ఆయగ్నియందు బ్రహ్మముచే, హుతమ్ = హోమము చేయఁబడినది. ఇది యంతయుఁ నెవనికిఁ గలదో, తేన = ఆపురుషునిచే; బ్రహ్మైవ గన్తవ్యమ్. ఎట్టి పురుషునిచేత ?—బ్రహ్మకర్మసమాధినా = బ్రహ్మముచే కర్మమునందు సమాధి గలవానిచేత. ఈశ్లోకమునందు అజ్ఞానిచే అర్పణాదు లయిదింటియందును బ్రహ్మదృష్టి కర్తవ్య మని యుపదేశింపఁబడుచున్నది. జ్ఞానులకు ఆత్మయే యిది యంతయు నని సిద్ధమగు పరమార్థరూపము ఉపదేశింపఁబడుచున్నది.

శం. ప్రవిలాపనవిధము నే చెప్పుచున్నాఁడు.—అర్పణమ్= హవిస్సు దీనిచే నర్పింపఁబడుచున్నది కావున అర్పణ మనఁగా చమసము స్రుక్కు స్రువము మొదల

రాయణః = బాదరాయణుఁడు చెప్పుచున్నాఁడు. ఉభయథా = రెండువిధములుగా—ఉపాసకులకుఁ గొందఱికి బ్రహ్మలోకప్రాప్తి కల దనియు కొందఱకు లే దనియు రెండువిధము లయినను, అదోషాత్ = దోషము లేమివలన. తత్క్రతుశ్చ=ప్రతీకోపాసకుఁడు కాని యుపాసకుఁడు బ్రహ్మక్రతువుగూడ—బ్రహ్మము నే యుపాసించువాఁడు అనుట రెండువిధము లగుటకు హేతువు.

అగునది, సమస్తమును; బ్రహ్మ = బ్రహ్మమే అని బ్రహ్మవిదుఁడు చూచుచున్నాఁడు. మూఢదృష్టిచే నేది రజతమో అదియే వివేకిదృష్టిచే శుక్తి యెట్లగునో అట్లు అజ్ఞానిదృష్టిచే నేది చమసాదియజ్ఞసాధన మగునో అదియే బ్రహ్మవిదుని దృష్టిచే బ్రహ్మమే యగుచున్నది యని యర్థము. బ్రహ్మ హవిః—యజ్ఞార్హ మయిన హవిస్సు, చరుపురోడాశాదికము హోమము చేయఁదగిన ద్రవ్యము సమస్తమును బ్రహ్మమునుగానే చూచుచున్నాఁడు. బ్రహ్మణా= హోమకర్త యగు బ్రహ్మముచేత, కర్తయును బ్రహ్మమే యని యజమానుఁ డగు తన్ను బ్రహ్మవిదుఁడు బ్రహ్మముగానే చూచుచున్నాఁడు. బ్రహ్మాగ్నౌ = బ్రహ్మమే యగ్ని, హోమమున కధికరణ మగు అగ్నిని బ్రహ్మమునుగానే చూచుచున్నాఁడు. అట్టి బ్రహ్మాగ్నియందు, హుతమ్— హవనక్రియ ఏది గలదో అదియు బ్రహ్మమునుగానే చూచుచున్నాఁడు. బ్రహ్మకర్మసమాధినా = సమస్తమును బ్రహ్మమాత్ర మని చూచుట యేది గలదో అది బ్రహ్మకర్మము, ఆబ్రహ్మకర్మమునందు సమాధి—చిత్తమును స్థాపించుట గలవాఁడు బ్రహ్మకర్మసమాధి, అట్టివానిచేత; ఇట్లు బ్రహ్మమునె చూచునట్టి బ్రహ్మవిదునిచే నేది గంతవ్యమో—ఇట్టి దర్శనమునకు ఫలముగాఁ బొందఁబడవలసినదో ఇదియే నే నని, అది బ్రహ్మమే యగుచున్నది ఇట్లు లోకహితార్థము ప్రవర్తించునట్టి అధికారిఁ డగు బ్రహ్మవిదునకు సాధనసహిత మయిన సమస్తకర్మమును బ్రహ్మవృత్తిచే బ్రహ్మమాత్రంబుగాఁ బ్రవిలాపితం బగుటవలన సత్తాహీన మగుటచే అకర్మమే యగుటంజేసి అట్టికర్మముతో నతనికి సంబంధము లే దని సిద్ధించుచున్నది. ఇందుచే చలనాత్మక మగు క్రియను నిరోధించుట యశక్యం బగుటవలన విద్వాంసునకుఁగూడ సదా క్రియ చేయవలసి రాఁగా వివేకి యగువానికి వ్యర్థవ్యాపారముకంటె వైదికకర్మమునందుఁ బ్రవృత్తి భూషణంబును మనస్సంతోషకరంబును లోకహితార్థంబు నగుం గాని బంధజనకము కాఁ జాలదు. అందువలన అట్టి దృష్టిచేతనే బ్రహ్మవిదు లగు సత్పురుషులు ప్రవర్తింపవలయు నని సూచితం బగుచున్నది.

అ. ఓయీ! చేయఁబడుచున్నకర్మము ఫలము కల్గింపక యెందువలన నశించును? అనఁగా బ్రహ్మజ్ఞానము కలుగఁగానే దానికారణము * నశించుటవలన నని చెప్పుచున్నాఁడు.—యజ్ఞాదిక్రియ అనేకకారకసాధ్యము గదా! దేవత నుద్దేశించి ద్రవ్యము విడుచుట గదా యాగము. అదియే విడువఁబడుద్రవ్యము నగ్నియందు వేల్చుటవలన హోమ మని చెప్పఁబడుచున్నది. అందు ఉద్దేశ్య మగుదేవత

* ఫలము గలిగించుకారణము.

సంప్రదానకారకము. విడువఁబడుద్రవ్యము హవి స్సనుపేరు గలది ధాత్వర్థమునకుఁ సాక్షాత్కర్మము. తత్ఫల మగు స్వర్గాదికమో వ్యవహిత మగుటచే భావనాకర్మము. ఇట్లు హవిస్సును ధరించి యగ్నియందు వేల్చుటకు సాధకతమం బగుటచే జుహువు మొదలగునది కరణము, ప్రకాశక మగుటచే ♦ మంత్రాదికము కరణము, ఇట్లు కారకము జ్ఞాపకము అను భేదముచే కరణముగూడ రెండువిధములు. ఇట్లు త్యాగమును అగ్నియందుఁ బ్రక్షేపంబును రెండుక్రియలు. అందు మొదటిదానియందు యజమానుఁడు కర్త. ప్రక్షేపమునందో యజమాన నియుక్తుఁడగు నధ్వర్యువు కర్త. ప్రక్షేపమున కధికరణము అగ్ని. ఇట్లు దేశకాలాదికముగూడ సర్వక్రియాసాధారణ మయిన * యధికరణ మని తెలియవలయును. ఈక్రియాకారకాదివ్యవహారములన్నియు బ్రహ్మాఽజ్ఞానకల్పితము లగుటవలన రజ్జ్వజ్ఞానకల్పితము లగు సర్పధారాదండాదులు రజ్జుతత్త్వజ్ఞానముచే బాధితము లగునట్లు బ్రహ్మతత్త్వజ్ఞానముచే బాధితంబులు గాఁగా బాధితానువృత్తిచే క్రియాకారకాదుల వ్యవహారాభాసము కనఁబడుచున్నను దగ్ధపటన్యాయంబున ♦♦ ఫలము కలిగింపఁజాలదు అని యీశ్లోకముచేఁ బ్రతిపాదింపఁబడుచున్నది. బ్రహ్మదర్శనమే సర్వయజ్ఞాత్మకం బని స్తుతింపఁబడుచున్నది గూడ. ఎట్లనఁగా. అర్పింపఁబడుచున్నది దీనిచేత ననుకరణవ్యుత్పత్తిచేత అర్పణ మనఁగా జుహువు మొదలగునదియు మంత్రాదికమును, ఇట్లు అర్పింపఁబడుచున్నది యితనికొఱకు అనువ్యుత్పత్తిచే అర్పణ మనఁగా దేవతారూప మయిన సంప్రదానము, ఇట్లు అర్పింపఁబడుచున్నది దీనియందు అనువ్యుత్పత్తిచే అర్పణ మనఁగా అధికరణ మైన దేశకాలాదికము; అది యంతయు బ్రహ్మమునందుఁ గల్పింపఁబడినది యగుటవలన బ్రహ్మమే, రజ్జువునందుఁ గల్పిత మగు సర్పమువలె అధిష్ఠానముకంటె వేఱుగా లేనిది యని యర్థము. ఇట్లు, హవిః--త్యాగప్రక్షేపక్రియలకు సాక్షాత్కర్మకారకము, అదియు బ్రహ్మమే. ఇట్లు ఏయగ్నియందు ప్రక్షేపము చేయఁబడుచున్నదో ఆయగ్నియును బ్రహ్మమే. బ్రహ్మాగ్నౌ అని సమస్తపదము. అట్లు, కర్త యగు నెవ్వనిచే యజమానునిచేతఁ గాని యధ్వర్యువుచేతఁ గాని విడువఁబడుచున్నదో ప్రక్షేపింపఁబడుచున్నదో ఆరెండు కర్తృకార్యములును, కర్త్రర్థ

♦ తెలుపునది యగుటచే.

* అన్నిక్రియలందును అధికరణ మయిన.

♦♦ దహింపఁబడినవస్త్రము వస్త్రాభాసముగాఁ గనఁబడుచున్నను ధరించుటకు సమర్థము కాని యట్లు.

మందు విహిత మయిన తృతీయచే అనువదించి, బ్రహ్మమే యని విధింపఁబడుచున్నది బ్రహ్మణా అనుటచేత. ఇట్లు, హుతమ్—హవనము, త్యాగక్రియయును ప్రక్షేపక్రియయును; అదియును బ్రహ్మమే. అట్లు, తేన = ఆహవనముచేత; ఏది స్వర్గాదికము వ్యవహితకర్మము గంతవ్యమో, అదియును బ్రహ్మమే. ఇచటనుండు ఏవకారము అంతటను అన్వయించుచున్నది. హుతమ్మను స్థలమునకుఁ గూడ ఇటనుండియే § బ్రహ్మ అనుపదము వచ్చుచున్నది, వ్యవధానము లేకుండుటవలనను ఆకాంక్షాసహిత మగుటవలను, « చిత్పతి స్త్వా పునాతు " ఇత్యాదిస్థలమున « అచ్ఛిద్రేణ » ఇత్యాదికము మీఁదివాక్యమునుండి యన్వయించునట్లు. ఈవిధమున, కర్మమునందు సమాధి—బ్రహ్మజ్ఞానము గలవాఁడు కర్మసమాధి, అట్టి బ్రహ్మవిదునిచేత, కర్మము ననుష్ఠించినను, బ్రహ్మ = పరమానందాద్వయ మగు బ్రహ్మము; గన్తవ్యమ్ అని యనువర్తించుచున్నది, ఆకాంక్షాసహిత మగుటవలనను వ్యవధానము లేమివలనను, « యా తే అగ్నే రజాశయా » ఇత్యాదిస్థలమున, « తనూ ర్వర్షిష్ఠా » ఇత్యాదికము పూర్వవాక్యమునుండి యన్వయించునట్లు *. లేక. అర్పింపఁబడుచున్నది యీఫలముకొఱకు అను వ్యుత్పత్తిచే అర్పణపదముచేతనే స్వర్గాదిఫలముగూడ గ్రహించునది. అప్పుడు, « బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా " అనుటచే జ్ఞానఫలమే చెప్పఁబడుచున్నది యనుట సమంజసము. ఈపక్షమున బ్రహ్మకర్మసమాధినా అని యేకపదమైనను గావచ్చును. మొదటిబ్రహ్మపదము హుతమ్మనుదానితోను రెండవబ్రహ్మపదము గన్తవ్యమ్మనుదానితోను అన్వయించు నని భిన్నపదమైనను గావచ్చును ♦♦ ఈపక్షమున రెండు అనుషంగములు ♦ చేయుక్లేశము లేదని తెలియునది. బ్రహ్మము గంతవ్య మనుట అభేదముననే. తత్ప్రాప్తివచనము ఉపచారమువలన **. కావుననే, స్వర్గాదితుచ్ఛఫలము వానికి గంతవ్యము కాదు, విద్యచే అవిద్యాకల్పిత మయిన కారకవ్యవహారము నశించుటవలన. అటు చెప్పఁబడినది

§ బ్రహ్మైవ తేన గన్తవ్యమ్ అనుచోటనుండియే.

* వీరి మతమునందు—హుతం బ్రహ్మైవ, బ్రహ్మైవ తేన గన్తవ్యం, కర్మసమాధినా గన్తవ్యం బ్రహ్మ అని యధ్యాహారముచే అన్వయము.

♦♦ హుతం బ్రహ్మైవ, కర్మసమాధినా తేన గన్తవ్యం బ్రహ్మ అని యన్వయము.

♦ ఒకవాక్యమునుండి మఱియొక వాక్యమునకుఁ బదము అధ్యాహరించుకొనుట యనుషంగ మనఁబడుచున్నది.

** అతఁడు బ్రహ్మమే యగుచున్నాఁడని భావము, తత్ప్రాప్తివచనము—బ్రహ్మమును బొందునట్లు చెప్పుట యౌపచారికము.

వార్తికకారులచేత "కారకవ్యవహారే హి శుద్ధం వస్తు న వీక్ష్యతే । శుద్ధే వస్తుని సిద్ధే చ కారకవ్యాపృతిః కుతః" * అని. అర్పణాదికారకస్వరూపమును నిషేధింపక యే వానియందు బ్రహ్మదృష్టి విధింపఁబడుచున్నది, సంపన్మాత్రంబున ఫలవిశేషము కొఱకు అను కొందఱివ్యాఖ్యానము భాష్యకారులచేతనే నిరాకరింపఁబడినది, ఉపక్రమాదివిరుద్ధం బగుటవలన, బ్రహ్మవిద్యాప్రకరణమునందు సంపన్మాత్రము అప్రసక్తం బగుటవలన—ఇత్యాదియుక్తులచేత.

శ్రీ. ఇట్లు పరమేశ్వరారాధనరూప మయినకర్మము జ్ఞానహేతు వగుటం జేసి బంధకము కాదు, కావున అకర్మమే యగును. ఆరూఢావస్థయందో అకర్త్రాత్మజ్ఞానముచే బాధిత మగుటవలన స్వాభావికకర్మముగూడ అకర్మమే యని కర్మణ్యకర్మ యః పశ్యేత్ అనుశ్లోకముచేఁ జెప్పఁబడిన కర్మప్రవిలాపము విస్తరింపఁబడినది. ఇప్పుడు కర్మమునందును దానియంగములందును బ్రహ్మమునే యనుస్యూతముగాఁ జూచువానికిఁ గర్మప్రవిలాపనము చెప్పుచున్నాఁడు.—అర్పింపఁబడుచున్నది దీనిచేత నని యర్పణ మనఁగా స్రుపాదికము, అదియును బ్రహ్మమే. అర్పింపఁబడుచున్న, హవిః = ఘృతాదికముగూడ, బ్రహ్మమే. బ్రహ్మమే యగ్ని, దానియందు, బ్రహ్మముచే—కర్తచే, హుతమ్= హోమము. అగ్నియును కర్తయును క్రియయును బ్రహ్మమే యని యర్థము. ఇట్లు, బ్రహ్మమునందే కర్మాత్మకమునందు సమాధి—చిత్తైకాగ్ర్యము గలవానిచేత, బ్రహ్మమే గన్తవ్యమ్=పొందఁబడవలసినది, కాని ఫలాంతరము కాదని యర్థము.

ప. ఇఁక నుపక్రమించినవిషయము నుపసంహరించుచుఁ జెప్పుచున్నాఁడు.—అర్పణమ్ = మనస్సునందలి దానసంకల్పము, అది బ్రహ్మరూప మగుటవలన బ్రహ్మమే. అట్లు, హవిః = సమిత్తు తిలలు ఆజ్యము మొదలగునది, విరాడ్బ్రహ్మముయొక్క వ్యష్టిరూప మగుటవలన బ్రహ్మమే. అగ్నియును వైశ్వానరుఁ డను నామాంతరము గలది బ్రహ్మమే. అగ్నియందు ఏపురుషునిచే, హుతమ్=హోమము చేయఁబడినదో, అతఁడును బ్రహ్మమే. ఇట్లు తెలిసి యెవ్వనిచేఁ జేయఁబడుచున్నదో, తేన = వానిచేత, బ్రహ్మమే, గన్తవ్యమ్ = పొందఁబడవలయును. ఎట్టివాని

* కారకవ్యవహారము ఉండునపుడు శుద్ధ మగువస్తువు తెలియ రాదు గదా! శుద్ధవస్తువు సిద్ధమైనపుడు—తెలిసినపుడు కారకవ్యాపారము ఎట్లు సంభవించును?

చేత ? బ్రహ్మకర్మసమాధినా = బ్రహ్మార్పణ మగు కర్మము బ్రహ్మకర్మము, దాని యందు సమాధి—చిత్తైకాగ్ర్యము గలవానిచేత.

రా. ప్రకృతిసంబంధము లేని ఆత్మస్వరూపముయొక్క యనుసంధాన ముతోఁ గూడిన దగుటచేఁ గర్మము జ్ఞానాకార మని చెప్పఁబడినది. ఇప్పుడు సమస్త మయిన పరికరసహిత మగుకర్మము పరబ్రహ్మభూత పరమపురుషాత్మకం బను ననుసంధానముతోఁ గూడిన దగుటచే జ్ఞానాకారం బని చెప్పుచున్నాఁడు.—బ్రహ్మార్పణ మ్మనునది హవిస్సునకు విశేషణము, అర్పింపఁబడుచున్నది దీనిచేత నని అర్పణ మనఁగా స్రుగాదికము. అది బ్రహ్మకార్య మగుటవలన బ్రహ్మము, ఏహవిస్సుయొక్క అర్పణము బ్రహ్మమో అది బ్రహ్మార్పణము. అట్టి బ్రహ్మార్పణ మయిన, హవిః = హవిస్సు. తానును; బ్రహ్మ = బ్రహ్మభూతము. బ్రహ్మాగ్నౌ = బ్రహ్మభూత మయిన యగ్నియందు; బ్రహ్మణా = బ్రహ్మభూతుఁ డయిన కర్తచేత; హుతమ్. ఇట్లు సమస్త కర్మమును బ్రహ్మాత్మక మగుటచే బ్రహ్మమయం బని యెవ్వఁడు సమాధిఁ బొందుచున్నాఁడో అతఁడు బ్రహ్మకర్మసమాధి, అట్టివానిచేత; బ్రహ్మైనగన్తవ్యమ్—బ్రహ్మాత్మక మగుటచే బ్రహ్మభూత మగు ఆత్మస్వరూపము గన్తవ్యము. ముముక్షువుచేఁ జేయఁబడుకర్మము పరబ్రహ్మాత్మకమే యను ననుసంధానముతోఁ గూడిన దగుటచే జ్ఞానాకారమై సాక్షాదాత్మావలోకనసాధనం ♦ బగుచున్నది, జ్ఞాననిష్ఠావ్యవధానముచేతఁ గాదు *.

ముముక్షువు కర్మము ననుష్ఠించునపుడు స్రుగాదిసాధనములను కర్త యగు తన్నును బ్రహ్మమయముగాఁ దలఁచి సమస్తకర్మమును బ్రహ్మాత్మకముగా ననుసంధించుం గావున వాఁడు బ్రహ్మభూత మయిన ఆత్మస్వరూపము నెఱుంగుచున్నాఁ డని తాత్పర్యము.

మా. జ్ఞానావస్థితచేతసుం డనుటను స్పష్టీకరించుచున్నాఁడు —అర్పణాదిక మంతయు బ్రహ్మ మని చెప్పఁబడుచున్నది, బ్రహ్మాధీనము లయిన సత్తయుఁ బ్రవృత్తియుఁ గల వగుటవలన. కాని బ్రహ్మస్వరూపం బగుటవలనఁ గాదు. చెప్పఁబడినది గదా. «త్వ దధీనం యత స్సర్వ మత స్సర్వో భవా నితి। వద న్తి మునయ స్సర్వే

♦ సాక్షాత్తుగనే—ఇతరసహాయము నపేక్షింపక, తానే.

* వేఱుగా జ్ఞాననిష్ఠ ననుష్ఠింపవలసినది లే దని భావము.

సతు సర్వ స్స్వరూపతః » ♦ అని పాద్మమునందు. « సర్వాంతత్వాత్ప్రజ్ఞానేత్రమ్ » * అనియును. « ఏతం హ్యేవ బహ్వృచాః » ‡ అని మొదలుగాఁగూడ. బ్రహ్మకర్మ సమాధినా—సమాధితోఁగూడ కర్మము బ్రహ్మమే ♦♦.

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి. ౨౫

భా. అం దిప్పుడు సమ్యగ్దర్శనమునకు యజ్ఞత్వము సంపాదించి దాని స్తుతించుకొఱకు ఇతరయజ్ఞంబులు నుపక్షేపింపఁబడుచున్నవి § దైవమేవేత్యాదిగా.—దైవమేవ = దేవతలు ఏయజ్ఞముచే యజింపఁబడుచున్నారో అది దైవము, అట్టి; యజ్ఞమేవ = యజ్ఞమునే; అపరే = ఇతరులగు; యోగినః = కర్ములు; ఉపాసతే = ఉపాసించుచున్నారు, చేయుచున్నారని యర్థము. బ్రహ్మాగ్నౌ = « సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ, విజ్ఞానమానన్దం బ్రహ్మ, యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ, య ఆత్మా సర్వాన్తరః » ఇత్యాదివచనములచేఁ జెప్పఁబడినది అశనాయాది ** సర్వసంసారధర్మవర్జితము నేతి నేతి యని నిరసింపఁబడిన సమస్తవిశేషములు గలది బ్రహ్మశబ్దముచేఁ చెప్పఁబడుచున్నది, బ్రహ్మమయినయగ్ని బ్రహ్మాగ్ని హోమమున కధికరణముగా వివక్షించుటచేత, అట్టి బ్రహ్మాగ్నియందు; అపరే= ఇతరులు బ్రహ్మవిదులు; యజ్ఞమ్= యజ్ఞశబ్దమునకు ఆత్మ యని యర్థము, ఆత్మపర్యాయములందు యజ్ఞశబ్దము పఠితంబగుటవలన $, అట్టి యాత్మను పరమార్థంబునఁ బరబ్రహ్మముగానే యున్నవానిని బుద్ధ్యాద్యుపాధులతోఁ గూడినవాఁడై సమస్తమైన యుపాధిధర్మముల నధ్యసించి యున్నవానిని ఆహుతిరూపుని; యజ్ఞేనైవ = చెప్పిన లక్షణము గల యాత్మచేతనే; ఉపజుహ్వతి = వేల్చుచున్నారు, ఉపాధిసహితుఁడగు

♦ ఎందువలన సమస్తమును నీయధీనమో అందువలన సమస్తమును నీవని మునులందఱుఁ జెప్పుచున్నారు, కాని సమస్తరూపుఁడ వగుటవలనఁ గాదు.

* అది సమస్తమును బ్రహ్మము నేత—నాయకుఁడుగాఁ గలది.

‡ ఏతమ్ = సర్వాంతర్యామి యగు వీనిని.

♦♦ సమాధియును బ్రహ్మమే యని యర్థము.

§ ఉదాహరింపఁబడుచున్నవి.

** అశనాయా = ఆకలి, ఆది = మొదలుగాఁగల.

$ నిఘంటువులందు.

నాత్మను ఉపాధిరహిత మగు పరబ్రహ్మరూపమునసే చూచుట యేది గలదో అది దానియందు హోమము, దానిఁ జేయుచున్నాడు బ్రహ్మైకత్వదర్శననిష్ఠు లగుసన్న్యాసు లని యర్థము. అట్టి యీసమ్యగ్దర్శనరూపం బగుయజ్ఞము దైవయజ్ఞము మొదలగుయజ్ఞములం దుపక్షేపింపఁబడుచున్నది బ్రహ్మార్పణ మిత్యాదిశ్లోకములచేత, « శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః" ఇత్యాదిగా స్తుతింపఁబోలును.

కొందఱు కర్మపరులు దేవతలగుఱించి చేయు యజ్ఞమునే చేయుచున్నారు. ఇతరులు బ్రహ్మవిదులు బ్రహ్మాత్మైక్యము నెఱింగినట్టి సన్న్యాసులు ఉపాధిసహితుఁడైనయాత్మను ఉపాధిరహితశుద్ధస్వరూపంబున బ్రహ్మాగ్నియందు హోమము చేయుచున్నారు—ఉపాధులను విడఁదిసి యాత్మయే బ్రహ్మ మని యెఱుంగుచున్నా రని తాత్పర్యము.

ఆ. పూర్వశ్లోకముచే జ్ఞానమునకు యజ్ఞత్వము సంపాదిత మయినది. ఇప్పుడు జ్ఞానయజ్ఞమునే స్తుతించుటకై యితరయజ్ఞముల నుదాహరించుటకు మీఁదిగ్రంథము ప్రవర్తించుచున్న దని చెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. శ్రేయస్సాధనము సమస్తమును ముఖ్యవృత్తిచేతను గౌణవృత్తిచేతను యజ్ఞం బని తెలుపుచు మొదట రెండుయజ్ఞముల నుదాహరించుచున్నాఁడు దైవమే వేత్యాదిగా. దైవమేవ అని ప్రతీకముగ్రహించి దైవయజ్ఞమును వివరించుచున్నారు దేవతలు ఇత్యాదిగా. సమ్యక్ జ్ఞానరూప మయిన యజ్ఞమును విభజించుచున్నారు బ్రహ్మాగ్నా ఇత్యాదిగా. అందు బ్రహ్మశబ్దార్థమును శ్రుతిబలముచే స్పష్టీకరించుచున్నారు సత్యమ్ ఇత్యాదిగా. ఏది అనృతము కాదో జడము కాదో పరిచ్ఛిన్నము కాదో అట్టిబ్రహ్మము పరమానంద మగుటచేఁ బరమపురుషార్థం బని చెప్పుచున్నది విజ్ఞాన మిత్యాదిగా. అది జ్ఞానాధికరణము ♦ అగుటచే దానికి జ్ఞానత్వము ఔపచారికం బని యాశంకించి చెప్పుచున్నది య త్సాక్షా దిత్యాదిగా. జీవునకును బ్రహ్మమునకును భేద ముండఁగా అపరిచ్ఛిన్నం బెట్లగు నని యాశంకించి విశేషణము చేయుచున్నది య ఆత్మా అని. పరుఁడే ఆత్మ యని దేహము మొదలు అవ్యాకృతమువఱకుఁ గల సర్వప్రపంచమునకు అంతరుఁ డగుటచే సాధించుచున్నది సర్వాన్తరః అని. విధిముఖ మయిన బ్రహ్మవిషయవేదాంతవాక్యము సమస్తమును ఇత్యాదివచనముచే అనుచోటి ఆదిశబ్ద

♦ జ్ఞానము గలది.

ముచే గ్రహింపఁబడుచున్నది. నిషేధముఖమైన బ్రహ్మవిషయవేదాంతవాక్యము సమ స్తమును అర్థముచేఁ జెప్పుచున్నారు అశనా యేత్యాదిగా. బ్రహ్మమునం దగ్నిశబ్ద ప్రయోగమునకు నిమిత్తముఁ జెప్పుచున్నారు హోమమునకు ఇత్యాదిగా. బుద్ధ్యా రూఢమై సమస్తమును దహించునది యగుటవలన, లేక, సమస్తముయొక్క విలయము నకు హేతు వగుటవలన నని యెఱుంగునది. యజ్ఞశబ్దమును త్వంపదార్థ మయిన ఆత్మయందుఁ బ్రయోగించుటకు హేతువుఁ జెప్పుచున్నారు ఆత్మపర్యాయములందు ఇత్యాదిగా. ఆధారాధేయభావంబున బ్రహ్మాత్మలకు వాస్తవభేదము గల దనుటను నిషేధించుచున్నారు పరమార్థంబున ఇత్యాదిగా. అప్పుడు ఎట్లు హోమము? వానినే వానియందు హోమము సేయుట సంభవింపదు గదా యని యాశంకించి చెప్పుచున్నారు బుద్ధ్యా దీత్యాదిగా. ఉపాధులతోఁ గూడినందుకు ఫలముఁ జెప్పు చున్నారు సమస్తమైన ఇత్యాదిగా. ఉపాధుల నధ్యసించుద్వారమున తద్ధర్మముల నధ్యసించుటచే సిద్ధ మయినయర్థము నిర్దేశించుచున్నారు ఆహుతిరూపుని అని. ఇత్థం భూత ♦ మనునర్థము గల తృతీయనే వివరించుచున్నారు చెప్పినలక్షణము గల అని. అశనాయాదిసర్వసంసారధర్మవర్జిత మయిన నిర్విశేషస్వరూపముచేత నని యర్థము. ఆత్మను బ్రహ్మమును హోమము చేయుటనే ప్రకటించుచున్నారు ఉపాధి సహితుఁడు ఇత్యాదిగా. అపరే అనుపదముయొక్క యర్థమును వివరించుచున్నారు బ్రహ్మాత్మైక త్వేత్యాదిగా. ఈచెప్పిన జ్ఞానయజ్ఞము దైవయజ్ఞాదులందు బ్రహ్మార్పణ మిత్యాదిశ్లోకములచే నుపక్షేపింపఁబడుచున్న దనుటను జూపుచున్నారు అట్టి యీ ఇత్యాదిగా. ఉపక్షేపించుటకుఁ బ్రయోజనముఁ జెప్పుచున్నారు శ్రేయా నిత్యాదిగా.

హ. ఇప్పుడు బ్రహ్మోపాసనాప్రసంగమున ఇతరోపాసనములను చిత్తశుద్ధి కొఱకు అవిద్వాంసులకుఁ జెప్పుచున్నాఁడు.—దైవమ్= దేవతలు ఇంద్రాదులు వారి సంబంధి దైవము, సోమయాగాదికము; అపరే యోగినః, అనుష్ఠానము లేకయే దైవయజ్ఞమునే ధ్యానముచే నెఱవేర్చుచున్నారు సత్త్వశుద్ధికొఱకు. బ్రహ్మాగ్నౌ = అగ్నిరూపమున ఉపాస్య మగుబ్రహ్మము బ్రహ్మాగ్ని, దానియందు. అపరే = ఇత రులు; యజ్ఞమ్ = పరమాత్మను; యజ్ఞేన = సోమయాగాదికముచేత; ఉపజుహ్వతి— ధ్యానముచే హోమము సంపాదించుచున్నా రని యర్థము.

శం. పూర్వము బ్రహ్మార్పణం బ్రహ్మహవిః అనుమంత్రముచే చమసాదు లందు బ్రహ్మమాత్రత్వదర్శనరూప మయిన జ్ఞానమును యజ్ఞరూపమునఁ బ్రతిపాదించి

♦ ఇట్టిరూపమున.

జ్ఞానయజ్ఞమే సాక్షాన్మోక్షసాధనం బగుటచే దేవాదియజ్ఞంబులకంటె సర్వోత్తమం బని తెలుపుటకును మోక్షమునకు వ్యవహితసాధనము లగు దైవాదియజ్ఞములను ముముక్షువులు తమతమ యధికారము ననుసరించి చిత్తశుద్ధికొఱకు అనుష్ఠింపవలయు నని సూచించుటకును దైవాదియజ్ఞములను నిరూపించుచున్నాఁడు.—దేవతలను-- ఇంద్రాదుల నుద్దేశించి ప్రవర్తించినయజ్ఞము దైవము, అట్టి దైవయజ్ఞమునే, శ్రౌతమును స్మార్తమును; అపరే = మోక్షము గోరునట్టి; యోగినః = కర్మయోగులు గృహస్థులు; చిత్తశుద్ధికొఱకు, పర్యుపాసతే = అనుష్ఠించుచున్నారు. ఇట్లు వైదిక మగు దైవయజ్ఞమునే గృహస్థులు చేయువలయు నని సూచించి బ్రహ్మవిదు లగు యతులుమాత్రము ఈయజ్ఞమునే చేయవలయును ముక్తికొఱకు అని చెప్పిన జ్ఞానయజ్ఞమునే ప్రకారాంతరంబున వర్ణించుచున్నాఁడు.—అపరే = గృహస్థులకంటె భిన్ను లగు యతులు, శ్రవణాదులచే ఆత్మతత్త్వము దెలిసినవారలై తాము; బ్రహ్మాగ్నౌ= «సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ, ఆనన్దో బ్రహ్మ, త దేత ద్బ్రహ్మా ఽపూర్వ మనపరమ్» ఇత్యాదిశ్రుతిప్రసిద్ధము నిర్విశేషము సచ్చిదానందఘన మగు పరబ్రహ్మ మేది గలదో అదియే యగ్ని, అవిద్యాతత్కార్యములు అను వనమును దహించు నది యగుటవలనను సోపాధికాత్మ యను ఆహుతిని ప్రక్షేపించుట కధికరణ మగుట వలనను పరబ్రహ్మము అగ్ని యని చెప్పఁబడుచున్నది, ఆబ్రహ్మాగ్నియందు; యజ్ఞమ్ = పామరులచే నేను భోక్త నని విశేషోపభోగములచే యజింపఁబడుచున్నాఁడు కావున యజ్ఞుఁ డనఁగా సోపాధికుఁ డగు ఆత్మ, అట్టి యాత్మను; యజ్ఞేనైవ = ఆత్మచే, నిర్విశేషస్వరూపునిచేతనే; ఉపజుహ్వతి—నేను బ్రహ్మ మను అని సోపాధిక మయినట్లు తోఁచుచున్న నేను అను అహంపదార్థమును వివేకముచే నిర్విశేషునిగా నిశ్చయించి బ్రహ్మముకంటె అభిన్నునిఁగా ననుభవించుచున్నా రని యర్థము. లేక. యజ్ఞమ్= ఆత్మను; యజ్ఞేనైవ= «యజ్ఞో వై విష్ణుః» అను శ్రుతివలన సోపాధికుఁడగు నీశ్వరుతోఁ గూడనే; ఉపజుహ్వతి—సోపాధికుఁ డగు నీశ్వరుని సోపాధికుఁ డగు నాత్మను ఇద్దఱిని ఆయాయుపాధినినుండి విడఁదీసి యిద్దఱికును అధిష్ఠానభూతము తురీయము నిర్విశేష మగు బ్రహ్మముతో అభిన్నులనుగాఁ జూచుచున్నారు, ఎట్లు తరంగబుద్బుదములను వానినామరూపములనుండి విడఁదీసి వానియాధార మయిన సముద్రముతో అభిన్నములనుగాఁ జూతురో అట్లు అని యర్థము.

మ. బ్రహ్మార్పణమంత్రముచే సమ్యగ్దర్శనము యజ్ఞరూపంబున స్తుతింపఁబడినది. ఇప్పుడు వెండియు దాని స్తుతించుకొఱకు ఇతరము లగు యజ్ఞముల నుప

న్యసించుచున్నాఁడు.—ఇంద్రాగ్న్యాదిదేవతలు దేనిచే యజింపఁబడుచున్నారో అది దైవము, అట్టి దైవయజ్ఞమునే దర్శపూర్ణమాసజ్యోతిష్టోమములు మొదలగు దాని; అపరే యోగినః = కర్ములు; పర్యుపాసతే = ఎల్లప్పుడు చేయుచున్నారు, కాని జ్ఞానయజ్ఞమును కాదు. ఇట్లు కర్మయజ్ఞముఁ జెప్పి చిత్తశుద్ధిద్వారమున వానికి ఫలభూతమయిన జ్ఞానయజ్ఞముఁ జెప్పుచున్నాఁడు.—బ్రహ్మాగ్నౌ = సత్యజ్ఞానానంతానందరూపము నిర్విశేష మగు బ్రహ్మము తత్పదార్థము, అట్టిబ్రహ్మము అను అగ్నియందు; యజ్ఞమ్ = ప్రత్యగాత్మను త్వంపదార్థమును; యజ్ఞేనైవ = యజ్ఞశబ్దము ఆత్మపర్యాయములందు యాస్కునిచేఁ బఠింపఁబడినది, ఇత్థం భూతలక్షణమందుఁ దృతీయ, ఏవకారము భేదవ్యావృత్తిని దెలుపుచున్నది, త్వంపదార్థముతో అభేదముతోనే, ఉపజుహ్వతి—తత్స్వరూపమే యని చూచుచున్నా రని యర్థము; అపరే—మునుపటి వారికన్న విలక్షణులు తత్త్వజ్ఞాననిష్ఠు లగుసన్న్యాసు లని యర్థము. జీవబ్రహ్మముల యభేదదర్శనమును యజ్ఞముగాఁ బ్రతిపాదించి యది దానికిసాధనము లయిన యజ్ఞముల నడుమఁ బఠింపఁబడుచున్నది, శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞ ఇత్యాదిగా స్తుతించుకొఱకు.

**శ్రీ.** యజ్ఞత్వము పొందింపఁబడిన సర్వత్రబ్రహ్మదర్శనరూపమైన యాజ్ఞానమే సమస్తయజ్ఞోపాయములచేఁ బొందఁదగిన దగుటవలన సమస్తయజ్ఞములకంటె శ్రేష్ఠం బని స్తుతించుటకై అధికారిభేదమున జ్ఞానసాధనభూతము లయిన యనేకయజ్ఞములం జెప్పుచున్నాఁడు దైవమే వేత్యాదు లగు నెనిమిదిశ్లోకములచేత.—దైవమ్ = ఇంద్రవరుణాదులు దేవతలు దేనియందు యజింపఁబడుదురో అది దైవము; ఏవకారముచే ఇంద్రాదులందు బ్రహ్మబుద్ధి లేకుండుట తెలుపఁబడినది; అట్టి దైవయజ్ఞమును; అపరే = కర్మయోగులు; పర్యుపాసతే = శ్రద్ధతో అనుష్ఠించుచున్నారు. అపరే = ఇతరు లయిన జ్ఞానయోగులో; బ్రహ్మాగ్నౌ = బ్రహ్మరూపమయిన యగ్నియందు; యజ్ఞేనైవ = ఉపాయభూత మయిన యజ్ఞముచేతనే; బ్రహ్మార్పణ మ్మని చెప్పినవిధమున, యజ్ఞమ్ ఉపజుహ్వతి—యజ్ఞాదిసర్వకర్మములను ప్రవిలాపన మొందఁ ♦ జేయుచున్నా రని యర్థము. అది యాజ్ఞానయజ్ఞము.

**ప.** ఇఁక దేనియందు యజింపఁబడునో అది యజ్ఞ మనువ్యుత్పత్తిచే యజ్ఞముగా నుపపాదింపఁబడినది బ్రహ్మానుభవరూప మైనజ్ఞానము, అది సర్వయజ్ఞముల

♦ లయింప.

కన్న శ్రేష్ఠ మని చూపుటకును ఆయజ్ఞములు అధికారిభేదమునుబట్టి బహువిధంబు లని ప్రతిపాదించుటకును పదిరెండుయజ్ఞములను జెప్పుచున్నాఁడు దైవమేవ యను శ్లోకము మొదలుగా సెనిమిదింటిచేత.—అపరే యోగినః = కర్మకుశలులు; దైవమ్ = దేవసంబంధి దైవము, దేవతలు ఇంద్రసూర్యవరుణాదులు దేనియందు యజింపఁ బడుదురో అది దైవము, అట్టి యజ్ఞమును; పర్యుపాసతే—అంతటను దేవతల యందు బ్రహ్మబుద్ధి లేక యుపాసించుచున్నా రని యర్థము. అపరే=జ్ఞానయోగులో; యజ్ఞేన = జ్ఞానయజ్ఞముచేత; యజ్ఞమ్ = కర్మరూప మైనయజ్ఞమును; బ్రహ్మరూప మయిన యగ్నియందు; ఉపజుహ్వతి—ప్రవిలాపనము చేయుచున్నా రని యర్థము.

రా. ఇట్లు కర్మములు జ్ఞానాకారము లగుటం బ్రతిపాదించి కర్మయోగ భేదములం జెప్పుచున్నాఁడు.—దైవమ్ = దేవతార్చనరూప మయిన, యజ్ఞమేవ = యజ్ఞమునే; అపరే యోగినః = కర్మయోగులు; పర్యుపాసతే = సేవించుచున్నారు, దానియందే నిష్ఠను చేయుచున్నా రని యర్థము. అపరే; బ్రహ్మాగ్నౌ = బ్రహ్మ మైనయగ్నియందు; యజ్ఞమ్ = హవిస్సును; యజ్ఞేన = స్రుగాదులచేత; ఉపజుహ్వతి, బ్రహ్మార్పణం బ్రహ్మహవిః అనున్యాయమున యాగహోమములందు నిష్ఠ చేయు చున్నారు.

కొందఱు కర్మయోగులు దేవతార్చనరూప మైనయజ్ఞము నాచరించుచు న్నారు. కొందఱు బ్రహ్మార్పణ మనుమంత్రముచేఁ జెప్పఁబడినట్లు యాగహోమముల నాచరించుచున్నా రని తాత్పర్యము.

మా. యజ్ఞభేదములఁ జెప్పుచున్నాఁడు దైవ మిత్యాదిగా. దైవమ్ = భగవంతుని. అదియే వారలకు యజ్ఞము, భగవదుపాసనము. యజ్ఞమునుగా నని క్రియావిశేషణము. ఆయతులకుఁ గొందఱకు ఇతరము లేదు. యజ్ఞమ్ = భగవం తుని, « యజ్ఞేనయజ్ఞమ్, యజ్ఞో విష్ణుర్దేవతా » ఇత్యాదిశ్రుతివలన. యజ్ఞేన= ప్రసిద్ధ మయినయాగముచేత. యజ్ఞునిగూర్చి వేల్చుచున్నా రని యంతటను సమానము, « తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ » ఇత్యాదులందు. చెప్పఁబడినదిగూడ « విష్ణుం రుద్రేణ పశునా బ్రహ్మా జ్యేష్ఠేన సూనునా। అయజత్ మానసే యజ్ఞే పితరం ప్రపితా మహః » ♦ అని.

♦ ప్రపితామహుఁ డగు బ్రహ్మదేవుఁడు మానసయజ్ఞమునందు తనజ్యేష్ఠపుత్రుఁ డగురుద్రుఁడు అను పశువుచేత తనతండ్రి యగువిష్ణువును గూర్చి యాగము చేసెను.

శ్రోత్రాదీ నీన్ద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీ న్విషయా నన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి. ౨౬

భా. శ్రోత్రాదీని=శ్రోత్రము మొదలుగాఁగల; ఇన్ద్రియాణి= ఇన్ద్రియములను; అన్యే= ఇతరు లగుయోగులు; సంయమాగ్నిషు=ప్రతీంద్రియము సంయమము వేఱగుటంగావున బహువచనము, సంయమములు* అను అగ్నులయందు; జుహ్వతి– ఇంద్రియనిగ్రహమునే చేయుచున్నా రని యర్థము. శబ్దాదీన్ = శబ్దము మొదలగు; విషయాన్ = విషయములను; అన్యే = ఇతరులు; ఇన్ద్రియాగ్నిషు = ఇంద్రియములు అను నగ్నులందు; జుహ్వతి–శ్రోత్రాదులచే అవిరుద్ధ మగు † విషయముల గ్రహించుటను హోమమునుగాఁ దలంచుచున్నారు.

కొందఱు యోగులు శ్రోత్రాదు లగు నింద్రియములను నిగ్రహించుటయను నగ్నియందు హోమముచేయుచున్నారు, మఱికొందఱు శబ్దాదివిషయములను ఇంద్రియము లను నగ్నులందు హోమము చేయుచున్నా రని తా.

ఆ. ఇప్పుడు రెండుయజ్ఞముల నుపన్యసించుచున్నారు.— బాహ్యము లగు నింద్రియములను మనస్సునందు సంయమించుట యొక్కటే గావున నెట్లు సంయమాగ్నిషు అని బహువచనం బని యాశంకించి చెప్పుచున్నారు ప్రతీంద్రియము ఇత్యాదిగా. ప్రత్యాహారమున కధికరణములుగా వ్యవస్థితము లగు మనోరూపము లయిన సంయమములు హోమాధార మగుటవలన వానికి అగ్నిత్వముఁ జెప్పుచున్నారు సంయమములు ఇత్యాదిగా. విషయములనుండి అంతరింద్రియములను బాహ్యేంద్రియములను ప్రత్యాహరించుచున్నా రని సంయమయజ్ఞమును సంక్షేపించి చూపుచున్నారు ఇంద్రియనిగ్రహమునే ఇత్యాదిగా. ఆయాయింద్రియములచే తత్తద్విషయోపభోగరూపము శ్రోత్రాదీంద్రియము లను నగ్నులందు శబ్దాదివిషయహోమము సర్వసాధారణం బని యాశంకించి నిషిద్ధములను విడిచి రాగద్వేషరహితులై ప్రాప్తము లగు విషయములను నుపభోగించుచున్నారు ఆయాయింద్రియములచేత నని వివక్షించినహోమమును విశదీకరించుచున్నారు శ్రోత్రాదులచే ఇత్యాదిగా.

* నిగ్రహములు.

† నిషిద్ధము కానట్టి.

హ°. శ్రోత్రాదీని = శ్రోత్రము మొదలుగాఁ గల; ఇన్ద్రియాణి = ఇంద్రియములను; అన్యే = ఇతరు లగు బ్రహ్మవిదులు; సంయమాగ్నిషు= చిత్తనిరోధము లను నగ్నులందు; జుహ్వతి—ధ్యానముచే హోమము చేయుచున్నారు. అన్యే = ఇతరు లగుయోగులు; శబ్దాదీన్విషయాన్ = శబ్దస్పర్శరూపరసగంధము లను విషయములను; ఇన్ద్రియాగ్నిషు = శ్రోత్రాదు లగు నింద్రియము లను నగ్నులందు; జుహ్వతి.

శ౦. ఇట్లు బ్రహ్మవిదులు చేయవలసిన జ్ఞానయజ్ఞముఁ బ్రతిపాదించి బ్రహ్మవిదులు కానివారు చేయవలసిన యితరయజ్ఞములం జెప్పుచున్నాఁడు.—అన్యే = చెప్పఁబడినవారికంటె నితరులు, బ్రహ్మవిదులు కానిముముక్షువులు నైష్ఠికబ్రహ్మచారి ప్రముఖులు; ఇన్ద్రియాణి--శ్రోత్రాదిజ్ఞానేంద్రియములను, వాగాదికర్మేంద్రియములను గూడ; సంయమాగ్నిషు = సంయమ మనఁగా ఆయాయింద్రియమును దాని దాని విషయమునుండి మరలించి తత్తత్స్థానమున నిగ్రహించుట, ఇంద్రియము లనేకములు కావున సంయమములకు బహువచనము, సంయమములు అను నగ్నులందు; శ్రోత్రాదీంద్రియాహుతులను, జుహ్వతి—ఇంద్రియనిగ్రహరూప మయిన యజ్ఞముఁ జేయుచున్నా రని యర్థము. అన్యే = వీరికంటె ఇతరు లగు ముముక్షులు, గృహస్థులు; స్వధర్మమునం దున్నవారలై శబ్దాదివిషయములను నిషిద్ధములు కానివానిని యోగ్యకాలమునందే, ఇన్ద్రియాగ్నిషు = వానిఁ బ్రవేశించుట కధికరణము లగుటవలన ఇంద్రియము లను నగ్నులందు; జుహ్వతి. విషయానుభవమునకు నియమమే వారికి యజ్ఞ మని యర్థము.

మ°. ఇట్లిందుచే ముఖ్యము గౌణము అని రెండుయజ్ఞములు తెలుపఁబడినవి. ఇఁక వైదిక మగుశ్రేయస్సాధనం బేదేది గలదో అది యంతయు యజ్ఞముగాఁ జెప్పఁబడుచున్నది. అందు.—శ్రోత్రాదీని = శ్రోత్రము మొదలగు జ్ఞానేంద్రియములను; శబ్దాదివిషయములనుండి ప్రత్యాహరించి *, అన్యే = ప్రత్యాహారపరులు; సంయమాగ్నిషు—ధారణ ధ్యానము సమాధి యీమూఁడును ఏకవిషయమై సంయమశబ్దముచేఁ జెప్పఁబడుచున్నవి. అట్లు భగవంతుఁడు పతంజలి చెప్పుచున్నాఁడు « త్రయ మేకత్ర సంయమః » ♦ అని. అందు, హృత్పుండరీకాదికమునందు మనస్సునెక్కువకాలము నిలుపుట ధారణ, ఇట్లు ఒకచో నిలుపఁబడిన చిత్తముయొక్క—

* మరలించి.

♦ మూఁడును ఒకటేవిషయ మయినచో సంయమము.

భగవదాకారవృత్తిప్రవాహము నడుమనడుమ ఇతరాకారవృత్తిచే వ్యవహితమైనది ధ్యాన మనఁబడును, కొంచెమైనను విజాతీయప్రత్యయముచే అవ్యవహితమైన సజాతీయప్రత్యయప్రవాహము సమాధి. ఆసమాధి చిత్తభూమిభేదమునం జేసి రెండువిధములు సంప్రజ్ఞాతము అసంప్రజ్ఞాతము అని. చిత్తమునకు అయిదుభూములు కలవు, క్షిప్తము మూఢము విక్షిప్తము ఏకాగ్రము నిరుద్ధము అని. అందు రాగద్వేషాది వశమువలన విషయములం దభినివేశము గలది క్షిప్తము, నిద్ర మొదలగువానికి లోనైనది మూఢము, సర్వదా విషయాసక్త మయ్యును ఒకానొకప్పుడు ధ్యాననిష్ఠ మగునది విక్షిప్తము, అందు క్షిప్తమూఢములకు సమాధి కవకాశమే లేదు. విక్షిప్త చిత్తంబునందును ఒకానొకప్పుడు గలుగు సమాధి విక్షేపప్రాధాన్యంబున యోగ పక్షమునం జేరదు, మ తేమనఁగా పెనుగాలికిఁ జల్లాఱుదీపమువలెఁ దనయంతనే నశించును, ఇఁక నేకాగ్రమో ఏకవిషయకధారావాహికవృత్తికి సమర్థమై సత్త్వోద్రేకముచేఁ దమోగుణమునం గలుగు నిద్రాదిరూప మయిన లయము లేకపోవుటవలన ఆత్మాకార మగువృత్తి యగుచున్నది, అది రజోగుణముచేఁ గలుగు చాంచల్యరూపమైనవిక్షేపము లేకపోవుటవలన ఏకవిషయమే యగును, ఇట్లు సత్త్వము శుద్ధమైననే చిత్త మేకాగ్ర మగును, ఈభూమియందు సంప్రజ్ఞాతసమాధి యగును, అందు ధ్యేయాకార మగు ♦ వృత్తిగూడ భాసిల్లును, దానినిగూడ నిరోధించినపుడు నిరుద్ధ మగుచిత్తము అసంప్రజ్ఞాతభూమి యగును. అట్లు చెప్పఁబడినవి, « తస్యా అపి నిరోధే సర్వవృత్తినిరోధా న్నిర్బీజ స్సమాధిః » § అని. ఇదియే యంతటనుండియు విరక్తుఁడై సమాధిఫల మగుసుఖమునుగూడ నపేక్షింపనియోగికి దృఢభూమిగ్నైనె ధర్మమేఘం బనఁబడుచున్నది. అట్లు చెప్పఁబడినది « ప్రసఙ్ఖ్యానే ఽప్యకుసీదస్య సర్వథా వివేకఖ్యాతే ర్ధర్మమేఘస్సమాధిః, తతః క్లేశకర్మనివృత్తిః » * అని. అనేకరూపం బగుటచే సంయమములు భిన్నము లగుటవలన అగ్నిషు అని బహువచనము, అట్టి సంయమములు అను నగ్నులయందు; ఇన్ద్రియములను, జుహ్వతి—ధారణాధ్యాన సమాధులు సిద్ధించుటకై సర్వేంద్రియములను తత్తద్విషయములనుండి ప్రత్యాహరించుచున్నా రని యర్థము. అట్లు చెప్పఁబడినది « స్వస్వవిషయా సంప్రయోగే

♦ ధ్యానింపఁబడు దానియొక్క ఆకారము గల.

§ దానినిగూడ నిరోధించినపుడు సర్వవృత్తులును నిరుద్ధము లగుటవలన నిర్బీజ మయిన సమాధి యగును.

* సమాధియందును సుఖాపేక్ష లేనివానికి అన్నివిధములను వివేకము స్థిర మగుటవలన ధర్మమేఘం బనుసమాధి యగును, అంతఁ గ్లేశకర్మ నివృత్తి యగును.

చిత్తరూపానుకార ఏవేన్ద్రియాణాం ప్రత్యాహారః" ♦ అని. విషయములనుండి నిగ్రహింపఁబడినయింద్రియములు చిత్తరూపములే యగుచున్నవి, అందువలన విక్షేపము లేకపోవుటవలన చిత్తము ధారణాదికము చేయ సమర్థ మగు నని యర్థము. ఇట్లిందుచే ప్రత్యాహారము ధారణ ధ్యానము సమాధి యని యోగాంగములు నాలుగు చెప్పఁబడినవి. ఇట్లు సమాధ్యవస్థయందు సర్వేంద్రియవృత్తినిరోధము యజ్ఞముగాఁ జెప్పఁబడినది. ఇప్పుడు సమాధినుండి లేచినపుడు రాగ ద్వేషములు లేక విషయములభోగము ఏది గలదో అదిగూడ మఱియొకయజ్ఞ మని చెప్పుచున్నాఁడు ఉత్తరార్ధముచేత — అన్యే = ఇతరులు, సమాధినుండి లేచినయవస్థలో నుండువారు; శ్రోత్రాదులచే అవిరుద్ధము లయిన విషయముల గ్రహించుటను స్పృహాశూన్య మగుటచే ఇతరసాధారణము కానిదానిని జేయుచున్నారు. అదియే వారికి హోమము.

శ్రీ. అన్యే—నైష్ఠికబ్రహ్మచారులు; సంయమాగ్నిషు = తత్తదింద్రియసంయమరూపము లయిన యగ్నులందు; శ్రోత్రాదీని; జుహ్వతి = ప్రవిలాపనము చేయుచున్నారు, ఇంద్రియముల నిరోధించి సంయమపరులై యుందు రని యర్థము. ఇన్ద్రియాగ్నిషు = ఇంద్రియము లను నగ్నులందు; శబ్దాదీన్; అన్యే = గృహస్థులు; జుహ్వతి—విషయభోగ సమయమునందుఁగూడ ఆసక్తిలేనివారలై అగ్నులుగా భావింపఁబడిన యింద్రియములందు హవిస్సుగా భావింపఁబడిన శబ్దాదులను వేల్చుచున్నా రని యర్థము.

ప. దీనియర్థము స్పష్టము.

రా. అన్యే = ఇతరులు; శ్రోత్రాదు లగు నింద్రియముల సంయమించుటయందుఁ బ్రయత్నించుచున్నారు. అన్యే = ఇతరు లగుయోగులు; ఇంద్రియములను శబ్దాదివిషయముల యందలి యాసక్తినుండి నివారించుటయందుఁ బ్రయత్నించుచున్నారు.

మా. *

సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాఽపరే
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే. ౨౭

---

♦ తమతమవిషయములఁ జేరనియప్పుడు చిత్తరూపమును బొందుటయే యింద్రియములకుఁ బ్రత్యాహారము.

* దీనికి మాధ్వభాష్యము లేదు.

భా. మఱియును. సర్వాణి = సమస్తము లయిన; ఇన్ద్రియకర్మాణి= ఇంద్రియములయొక్క కార్యములను; ప్రాణకర్మాణిచ = ప్రాణ మనఁగా ఆధ్యాత్మిక మయిన వాయువు దానియొక్క కార్యములను, ఆకుంచన ప్రసారణాదులను *; అపరే = ఇతరులు; ఆత్మసంయమ యోగాఽగ్నౌ= ఆత్మయందు సంయమము—ఆత్మసంయమము, అది యను యోగాగ్ని యందు; జ్ఞానదీపితే = జ్ఞాన మను నగ్నిచే వెలిఁగింపఁబడినదానియందు, తైలముచే దీపమువలె వివేకవిజ్ఞానముచే ఉజ్జ్వలత్వము నొందింపఁబడిన ఆత్మసంయమయోగాగ్నియందు; జుహ్వతి = వేల్చుచున్నారు, ప్రవిలాపనము చేయుచున్నా రని యర్థము.

మఱికొందఱు సమస్తము లయిన యింద్రియకర్మములను ప్రాణకర్మములను వివేకవిజ్ఞానముచే జ్వలించునట్లు చేయఁబడినయాత్మసంయమయోగాగ్ని యందు హోమము చేయుచున్నా రని యర్థము.

ఆ. మఱియొకయజ్ఞము చెప్పుచున్నారు మఱియును అని. ఇంద్రియములయొక్క కార్యములను—శ్రవణమననాదులను. ఆత్మయందు సంయమము—ధారణాధ్యానసమాధిరూపము. సమస్త మయిన వ్యాపారమును నిరోధించి యాత్మయందుఁ జిత్తసమాధిని జేయుచున్నా రని చెప్పుచున్నారు వివేకేత్యాదిగా.

హ. ఇంద్రియముల కర్మములను—చూచుట మొదలగువానిని; అట్లు, ప్రాణకర్మములను—నిట్టూర్పు మొదలగువానిని; అపరే = ఇతరు లగుయోగులు; ఆత్మసంయమయోగాగ్నౌ = ఆత్మయొక్క—అంతఃకరణముయొక్క సంయమము, ఆత్మసంయమము, అదియే యోగము, ఆత్మ సంయమయోగం బను నగ్నియందు; జ్ఞానదీపితే = వివేకవిజ్ఞానముచే జ్వలించుచున్నదానియందు; జుహ్వతి—ఇట్లు హోమము సంపాదించుచున్నా రని యర్థము.

శం. మఱియును.—అపరే = చెప్పినవారికంటె ఇతరులు కొందఱు యతులు ధ్యాననిష్ఠులు; ఇన్ద్రియకర్మాణి = జ్ఞానేంద్రియములయొక్కయుఁ గర్మేంద్రియములయొక్కయుఁ గర్మములను, శ్రవణదర్శనాది జ్ఞానేంద్రియకర్మములను వచనాదానాది కర్మేంద్రియకర్మములను; ప్రాణకర్మాణిచ = అపానవ్యానాదిభేదముచే భిన్న మగుప్రాణముయొక్క కర్మములను ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములు నిమేషోన్మే

* ముడుఁచుట చాఁచుట మొదలయినవానిని.

షములు ఆవులింత త్రేఁపు మొదలగువానిని; సర్వాణి = సమస్తకర్మములను; జ్ఞాన దీపితే = ఆత్మవిషయజ్ఞానముచే చక్కఁగా పొందింపఁబడిన; ఆత్మసంయమయోగాగ్నౌ = ఆత్మయందు-స్వస్వరూపమునందు సంయమయోగము-మనోనిరోధము సమాధి, అదియే యగ్ని, దానియందు; ప్రాణకర్మములను ఇంద్రియకర్మములను గూడ, జుహ్వతి-ప్రాణవ్యాపారమును ఇంద్రియవ్యాపారమును నిరోధించి యెల్లప్పుడును ఆత్మనే యనుభవించుచున్నా రని యర్థము.

మ. ఇట్లు పాతంజలమతము ననుసరించి లయపూర్వక మైనసమాధిని దానినుండి వ్యుత్థానమును రెండుయజ్ఞములుగాఁ బ్రతిపాదించి యిఁక బ్రహ్మవాదిమతంబు ననుసరించి సమస్తమునకును ఫలభూత మయిన బాధపూర్వకసమాధిని కారణనాశముచే వ్యుత్థానము లేనిదానిని యజ్ఞాంతరముగాఁ జెప్పుచున్నాఁడు.—సమాధి రెండువిధములు గదా! లయపూర్వక మనియు బాధపూర్వక మనియు. అందు «తదనన్యత్వ మారమ్భణ శబ్దాదిభ్యః» § అనున్యాయముచే కారణమునకు భిన్నముగాఁ గార్యము లేకుండుటవలన, వ్యష్టిరూప మయిన పంచీకృతపంచభూతకార్యము సమష్టిరూపవిరాట్టుయొక్క కార్య మగుటవలన ఆవిరాట్టునకు భిన్నముగా నున్నది కాదు ♦; అట్లు పంచీకృతపంచభూతాత్మకసమష్టికార్యముగూడ అపంచీకృతపంచమహాభూతకార్యం బగుటవలన దానికి భిన్నము గాదు; అందును శబ్దస్పర్శరూపరసగంధము లను నైదుగుణములు గల పృథివి గంధము దక్కఁ దక్కిన నాలుగుగుణములు గల జలముయొక్క కార్య మగుటవలన జలముకంటె వేఱు గాదు; నాలుగుగుణములు గల యాజలంబును గంధరసంబులు దక్కఁ దక్కినమూఁడుగుణములు గల తేజస్సుయొక్కకార్య మగుటవలనఁ దేజస్సునకు భిన్నము గాదు; మూఁడుగుణములు గల ఆతేజస్సుగూడ గంధరసరూపంబులు తక్కఁ దక్కినరెండుగుణములు గల

§ బ్ర. సూ-అ ౨. పా ౧. సూ ౧౪. ఆకాశాదిప్రపంచరూపకార్యమునకు, తదనన్యత్వమ్-కారణ మయిన బ్రహ్మముకంటె అభిన్న మగుట, తెలియవచ్చుచున్నది. ఆరమ్భణశబ్దాదిభ్యః = ఆరంభణశ్రుతి మొదలగువానివలన-యథా.సో మ్యైకేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యా ద్వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికే త్యేవ సత్యమ్-ఎట్లు సౌమ్యుఁడా! ఒకమట్టిముద్దచే మృద్వికారము సమస్తము తెలియఁబడిన దగునో, ఎందువలన ననఁగా, నోటిచేతమాత్రమె చెప్పఁబడుచున్నది వికారము, నామధేయమాత్రమే అది, వస్తువేమో వేఱుగా లేదు. మృత్తిక యనునది మాత్రమే సత్యము, ఇత్యాదిశ్రుతులచేత. ఆత్మను దెలియుటచే సమస్తమును దెలియఁబడిన దగును అనుటకు మృత్తికాదృష్టాంతము చెప్పుటచేత నని భావము.

♦ విరాట్టే యగును.

వాయువుయొక్క కార్యం బగుటవలన వాయువుకంటె వేఱు గాదు; రెండుగుణములు గల యావాయువుగూడ శబ్దమాత్రగుణం బగు నాకాశముయొక్క కార్యం బగుటవలన ఆకాశమునకు భిన్నము గాదు; శబ్దగుణంబుగల యాయాకాశముగూడ బహుస్యామ్ * అను పరమేశ్వరుని సంకల్పరూప మయిన యహంకారముయొక్క కార్యం బగుటవలన ఆయహంకారమునకు వేఱు గాదు; సంకల్పాత్మకం బగు నాయహంకారముగూడ మాయేక్షణరూప మైన మహత్తత్త్వముయొక్క కార్య మగుటవలన మహత్తత్త్వముకన్న భిన్నము గాదు; ఈక్షణరూపం బగు నామహత్తత్త్వముగూడ మాయాపరిణామం బగుటవలన దానికన్న భిన్నము గాదు; మాయాఖ్యం బగు నాకారముగూడ జడం బగుటచేఁ జైతన్యమునం దధ్యస్త మగుటవలనఁ జైతన్యముకన్న భిన్నము గాదు; ఇట్లు అనుసంధించుటచేఁ గార్యకారణాత్మకం బగు ప్రపంచము ఉన్నను జైతన్యమాత్రవిషయం బగు నేసమాధి గలదో అది లయపూర్వకం బని చెప్పఁబడును, అందు తత్త్వమస్యాదిమహావాక్యార్థజ్ఞానము లేకుండుటచే అవిద్యా తత్కార్యకర్మములు నశింప కుండుటవలన; ఇట్లు లయచింతనము కలిగినను కారణ ముండుటచే మరల సమస్తప్రపంచము తోఁచుటవలన ఇది సుషుప్తివలె సబీజసమాధి, కాని ముఖ్యము కాదు. ఇఁక ముఖ్య మే మనఁగా—తత్త్వమస్యాది మహావాక్యార్థసాక్షాత్కారముచే అవిద్యానివృత్తి యగుటచే సృష్టిక్రమంబునఁ దత్కార్యముగూడ నివర్తిల్లుటవలన అనాద్యవిద్యకు మరల నుత్థానము లేమిం జేసి తత్కార్యమునకుఁ గూడ మరల నుత్థానము లేకుండుటవలన నిర్బీజం బగు బాధపూర్వకసమాధి ముఖ్యము. అదియే యీశ్లోకముచేఁ దెలుపఁబడుచున్నది.—

సర్వాణి = సమస్తములను, స్థూలరూపములను సంస్కారరూపములను; ఇన్ద్రియకర్మాణి = శ్రోత్ర త్వ క్చక్షు ర్జిహ్వాఘ్రాణంబు లను నైదు జ్ఞానేంద్రియములయొక్కయు వాక్పాణిపాదపాయూపస్థంబు లను నైదుకర్మేంద్రియములయొక్కయు— బాహ్యము లయిన వీనియొక్కయు ఆంతరము లయిన మనోబుద్ధులయొక్కయు కర్మములను, శబ్దశ్రవణస్పర్శగ్రహణరూపదర్శనరసగ్రహణగంధగ్రహణములను వచనాదానగమన విసర్గానందములను సంకల్పాధ్యవసాయములను ♦; ఇట్లు, ప్రాణకర్మాణిచ = ప్రాణాపానవ్యానోదాన సమానంబులను నైదుప్రాణములయొక్క కర్మ

* అనేక మయ్యెదను.

♦ వీనికి జ్ఞానేంద్రియములతోను కర్మేంద్రియములతోను మనోబుద్ధులతోను క్రమముగా అన్వయము.

ములను; వెలికిఁ బుచ్చుట క్రిందికిఁ బుచ్చుట ముడుఁచుట చాఁచుట మొదలగునది ఊర్ధ్వముగాఁ బుచ్చుట భక్షింపఁబడినదాని త్రాగఁబడినదాని సమీకరించుట ఇత్యాదులను; ఇందుచే, నైదుజ్ఞానేంద్రియములు ఐదుకర్మేంద్రియములు ఐదుప్రాణములు మనస్సు బుద్ధి అని పదునే డగులింగము చెప్పఁబడినది, అది సూక్ష్మభూత సమష్టి రూపం బగుహిరణ్యగర్భాఖ్యము ఇట వివక్షితం బని తెలుపుటకై సర్వాణి అనువిశేషణము; ఆత్మసంయమయోగాగ్నౌ=ఆత్మవిషయక మయిన సంయమము—ధారణాధ్యానసంప్రజ్ఞాతసమాధి, అది పరిపక్వముకాఁగా యోగము నిరోధ సమాధి, దానిని బతంజలి సూత్రించెను "వ్యుత్థాన నిరోధ సంస్కారయో రభిభవ ప్రాదుర్భావౌ నిరోధక్షణచిత్తాన్వయో నిరోధపరిణామః" అని—వ్యుత్థాన మనఁగా క్షిప్త మూఢ విక్షిప్తము లను మూఁడుభూములు, వానిసంస్కారములు సమాధివిరోధులు, అవి యోగియొక్క ప్రయత్నముచేఁ బ్రతిదినమును బ్రతిక్షణమును అభిభవింపఁబడును *, ఆసంస్కారములకు విరోధు లయిన నిరోధసంస్కారములు ప్రాదుర్భవించును, అందువలన నిరోధమాత్రక్షణంబునఁ జిత్తాన్వయము ♦ నిరోధపరిణామము, దానికి ఫలము చెప్పుచున్నాఁడు "తతః ప్రశాన్తవాహితా సంస్కారాత్" అని—తమోరజస్సులు క్షయించుటవలన లయవిక్షేపశూన్యం బగుటచే శుద్ధసత్త్వరూపం బగు చిత్తము ప్రశాంత మని చెప్పఁబడును, పూర్వపూర్వము పొందఁబడు ప్రశమము యొక్క దార్ఢ్యముచేఁ గలుగుప్రశమాతిశయము ప్రశాంతవాహిత యనఁబడును, దానికిఁ గారణముగూడ సూత్రించెను "విరామ ప్రత్యయాభ్యాస పూర్వస్సంస్కార విశేషో ఽన్యః" అని—విరామ మనఁగా వృత్త్యుపరతి ❧, దానికిఁ బ్రత్యయ మనఁగా కారణము వృత్త్యుపరతికొఱకుఁ జేయఁబడు పురుషప్రయత్నము, దానియొక్క అభ్యాస మనఁగా మాటిమాటికి సంపాదించుట, అది పూర్వముగాఁ గలది—దానిచేఁ బుట్టునది, అన్యము—సంప్రజ్ఞాతముకంటె విలక్షణము, అసంప్రజ్ఞాత మని యర్థము. ఇట్టి ఆత్మసంయమయోగ మేది గలదో, అదియే అగ్ని, దానియందు; జ్ఞానదీపితే=జ్ఞానము వేదాంతవాక్యజన్య మయిన బ్రహ్మాత్మైక్యసాక్షాత్కారము, దానిచే అవిద్యను దత్కార్యమును నశింపఁజేయుద్వారమున దీపితము—మిక్కిలి ప్రజ్వలిత మయినదానియందు, బాధపూర్వక మయినసమాధియందు; సమష్టిలింగశరీరమును,

* జయింపఁబడును.

♦ చిత్తముయొక్క ఐక్యము.

❧ వృత్తినాశము.

అపరే= ఇతరులు; జుహ్వతి—ప్రవిలాపనము చేయుచున్నారని యర్థము. ఈశ్లోకమునందు, సర్వాణిఅనియు ఆత్మ అనియు జ్ఞానదీపితేఅనియు విశేషణములచేతను అగ్నౌ అను నేకవచనముచేతను బూర్వశ్లోకార్థము కన్న వైలక్షణ్యము సూచింపఁబడినది. కావునఁ బునరుక్తత లేదు.

శ్రీ. అపరే = ధ్యాననిష్ఠులు, శ్రోత్రాదిజ్ఞానేంద్రియములయొక్క శ్రవణదర్శనాదికర్మములను వాక్పాణ్యాదికర్మేంద్రియములయొక్క వచనాదానాదికర్మములను, ప్రాణములపదింటియొక్క కర్మములను, ప్రాణమునకు బహిర్నయనము, అపానమునకు అధోనయనము, వ్యానమునకు వ్యానయనము * ఆకుంచనప్రసారణాదికము, సమానమునకు భక్షితపీతాదులసమ్యఙ్నయనము ♦, ఉదానమునకు ఊర్ధ్వనయనము, మఱియు "ఉద్గారే నాగ ఆఖ్యాతః కూర్మ ఉన్మీలనే స్మృతః। కృకరః క్షుతకృత్ జ్ఞేయో దేవదత్తో విజృమ్భణే॥ నజహాతి మృతంవాఽపి సర్వవ్యాపీ ధనఞ్జయః" ❡ అని చెప్పఁబడిన కర్మములను; జుహ్వతి. దేనియందు? ఆత్మసంయమయోగాగ్నౌ= ఆత్మయందు సంయమము—ధ్యానైకాగ్రత, తద్రూప మయిన యోగము అను నగ్నియందు; జ్ఞానదీపితే = ధ్యేయవిషయ మయిన జ్ఞానముచే ప్రజ్వలిత మయినదానియందు; ధ్యేయమును § చక్కఁగాఁ దెలిసి దానియందు మనస్సును సంయమించి ఆకర్మముల నన్నిటిని ఉపరతి నొందించుచున్నారని యర్థము.

ప. అపరే = ధ్యాననిష్ఠులు; ఇన్ద్రియకర్మాణి= శ్రోత్రాదిజ్ఞానేంద్రియముల కర్మములను శ్రవణాదులను వాగాదికర్మేంద్రియములకర్మములను వచనాదులను; అట్లు, ప్రాణకర్మాణి = ముఖ్యప్రాణముల నైదింటికర్మములను బహిర్నయనాదులను నాగాదు లగు నుపప్రాణముల నైదింటికర్మములను ఉద్గారాదులను, ఈకర్మముల నన్నిటిని; ఆత్మసంయమయోగాగ్నౌ = ఆత్మయొక్క—మనస్సుయొక్క—సంయమరూప మయినయోగము—ధ్యానైకాగ్రత యను నగ్నియందు; జ్ఞానదీపితే=జ్ఞానమనఁగా స్వానుభవము దానిచే ప్రజ్వలిత మయినదానియందు; జుహ్వతి—ధ్యేయమును జక్కఁగా నెఱింగి దానియందు సర్వకర్మములను ఉపరతి నొందించుచున్నారని యర్థము.

---

* అంతటను ప్రసరింపఁజేయుట.

♦ సమీకరణము.

❡ ఉద్గారమునందు—త్రేఁపునందు నాగము చెప్పఁబడినది, ఉన్మీలనమునందు — దేహము విఱచుటయందుఁ గూర్మము చెప్పఁబడినది, కృకరము తుమ్ము చేయునదిగా నెఱుంగునది, దేవదత్తము ఆవులింతయందుఁ జెప్పఁబడినది, సర్వవ్యాపి యగు ధనంజయము మృతునిఁ గూడ విడువదు.

§ ధ్యానింపఁ దగినదానిని.

టీ. అపరే - ఇతరులు; జ్ఞానదీపితే; ఆత్మసంయమయోగాఽగ్నౌ - మనస్సంయమరూపమయినయోగము అను నగ్నియందు; సర్వాణి; ఇన్ద్రియకర్మాణి; ప్రాణకర్మాణిచ; జుహ్వతి—మనస్సును ఇంద్రియకర్మములందును ప్రాణకర్మములయందును ఆసక్తము కానియట్లు చేయుటయందుఁ బ్రయత్నించుచున్నా రని యర్థము.

పూ. ఆత్మసంయమయోగాఽగ్నౌ = ఆత్మసంయమ * రూప మయిన యుపాయం బను నగ్నియందు.

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథా ఽపరే
స్వాధ్యాయజ్ఞానయజ్ఞా శ్చ యతయ స్సంశితవ్రతాః. ౨౮

టీ. ద్రవ్యయజ్ఞాః=తీర్థములందు ద్రవ్యవినియోగమును ఎవ్వరు యజ్ఞబుద్ధిచేఁ జేయుచున్నారో వారు ద్రవ్యయజ్ఞులు. తపోయజ్ఞాః = తపస్వులగు నెవరికి తపస్సే యజ్ఞమో వారు తపోయజ్ఞులు. యోగయజ్ఞాః = ప్రాణాయామప్రత్యాహారాదిరూప మయిన యోగము యజ్ఞముగాఁ గలవారు యోగయజ్ఞులు. అట్లు; అపరే = ఇతరులు; స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ = స్వాధ్యాయము అనఁగా యథావిధి ఋగాదివేదాభ్యాసము యజ్ఞముగాఁ గలవారు స్వాధ్యాయయజ్ఞులు, జ్ఞాన మనఁగా శాస్త్రార్థము దెలియుట, అది యజ్ఞముగాఁ గలవారు జ్ఞానయజ్ఞులు, ఇట్లు స్వాధ్యాయయజ్ఞులును జ్ఞానయజ్ఞులును. యతయః = యత్నము చేయువారు; సంశితవ్రతాః = చక్కఁగా శితములు—తనూకృతములు § తీక్ష్ణీకృతములు ♦ అగు వ్రతములు గలవారు సంశితవ్రతులు.

కొందఱు తీర్థాదులందు ద్రవ్యవినియోగము చేయుటయె యజ్ఞముగా ననుష్ఠింతురు; కొందఱు కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సునే యజ్ఞముగా నవలంబింతురు; కొందఱు యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణా సమాధు లను నెనిమిది యంగములు గల యోగమునే యజ్ఞముగా నుపాసింతురు; మఱికొందఱు యథావిధిగా వేదపఠనము చేయుటయే యజ్ఞముగా నాచరింతురు; ఇఁకఁ గొందఱు శాస్త్రార్థపరిజ్ఞానమునే యజ్ఞముగా గ్రహింతురు; ఇతరులు కొందఱు

* మనస్సంయమ.

§ సూక్ష్మముగాఁ జేయఁబడినవి.

♦ తీక్ష్ణములుగాఁ జేయఁబడినవి.

నిరంతరయత్నము చేయువారు దృఢ మయిన మహావ్రతమునే యజ్ఞముగాఁ దలఁచి యనుష్ఠింతు రని తాత్పర్యము.

ఆ. ఆయాయజ్ఞములఁ జెప్పుచున్నారు.—అందు ద్రవ్యయజ్ఞు లగు పురుషుల గ్రహించి విభజించుచున్నారు తీర్థములందు ఇత్యాదిగా. తపస్వులు—యజ్ఞబుద్ధిచేతఁ దపస్సు ననుష్ఠించువారు నియమవంతు లని యర్థము. ప్రత్యాహారాది అనుచోటి యాదిశబ్దముచే యమనియమాసనధ్యానధారణాసమాధులు గ్రహింపఁబడుచున్నవి. యథావిధి—తూర్పుమొగం బగుట పవిత్రపాణి యగుట మొద లయిన యంగములవిధి నతిక్రమింపక యని యర్థము. వ్రతములకు తీక్ష్ణీకరణం బనఁగా అతిదృఢత్వము.

హ. ద్రవ్యములు—హిరణ్యము గోవు మొదలగునది, వానియొక్క దానమె యజ్ఞముగాఁ గలవారు ద్రవ్యయజ్ఞులు, దానమునే యజ్ఞమునుగా నుపాసించుచున్నా రని యర్థము. ఇతరులు, తపోయజ్ఞాః—తప స్సనఁగా కృఛ్రచాంద్రాయణాదికము, దానినే యజ్ఞబుద్ధిచేఁ జేయుచున్నారు. యోగయజ్ఞాః = యోగ మనఁగా చిత్తవృత్తినిరోధము, అదియే యజ్ఞముగాఁ గలవారు, యజ్ఞబుద్ధిచేఁ జిత్తవృత్తినిరోధమునే చేయుచున్నా రని యర్థము. స్వాధ్యాయజ్ఞానయజ్ఞాః—యజ్ఞశబ్దము రెంటికిని సంబంధించుచున్నది, స్వాధ్యాయము—వేదపాఠము అదియే యజ్ఞముగాఁ గలవారు స్వాధ్యాయయజ్ఞులు, జ్ఞానము—శాస్త్రపరిజ్ఞానము అదియే యజ్ఞముగాఁ గలవారు జ్ఞానయజ్ఞులు, యజ్ఞబుద్ధిచే జ్ఞానము సంపాదించుచున్నా రని యర్థము, అందుఁగూడ, యతయః= యత్నస్వభావము గలవారు; సంశితవ్రతాః = తీక్ష్ణముగాఁ జేయఁబడినవ్రతము గలవారు.

శం. వీనినిగూడ ముముక్షువులు చేయవలయు నని సూచించుటకై వెండియు యజ్ఞాంతరములనుగూడఁ జెప్పుచున్నాఁడు.—చెప్పినవారికంటె, అపరే = ఇతరులు కొందఱు ముముక్షువులు; ద్రవ్యయజ్ఞాః = సత్పాత్రములందు నియమంబున శ్రద్ధతో ద్రవ్యము వినియోగించుటను ఇదియే మాకు యజ్ఞ మని ఎవ్వరు చేయుచున్నారో వారు ద్రవ్యయజ్ఞులు. కొందఱు, తపోయజ్ఞాః = తపస్సును చాంద్రాయణ ప్రాజాపత్యకృచ్ఛ్రాదిరూపమును, లేక, ఉపవాసాదిరూపమును, ఇదియె మాకు యజ్ఞ మని యెవరు చేయుచున్నారో వారు తపోయజ్ఞులు. కొందఱు, యోగయజ్ఞాః = యోగ మనఁగా ఆసనప్రాణాయామా ద్యంగములతోఁ గూడినది లక్ష్య

మునందుఁ జిత్తస్థైర్యరూపము, అదియే యజ్ఞముగాఁ గలవారు యోగయజ్ఞులు. అట్లు కొందఱు, స్వాధ్యాయజ్ఞానయజ్ఞాః = ద్వంద్వసమాసాంతమున నుండు యజ్ఞశబ్దము స్వాధ్యాయజ్ఞానములకు రెంటికిఁ బ్రత్యేకము సంబంధించుచున్నది, అందుచే స్వాధ్యాయయజ్ఞులు జ్ఞానయజ్ఞులు అని యేర్పడుచున్నది, "తస్యవా ఏతస్య యజ్ఞస్య ద్వావనధ్యాయౌ యదాత్మా௨శుచి ర్యద్దేశః" ♦ అను శ్రుతియందుఁ జెప్పఁబడిన రెండనధ్యాయములను విడిచి సదా వేదపారాయణమే మాకు యజ్ఞం బని యధ్యయనమును నియమంబున నెవ్వరు చేయుచున్నారో వారు స్వాధ్యాయయజ్ఞులు, అట్లు కొందఱు జ్ఞానయజ్ఞులు—జ్ఞాన మనఁగా జ్ఞానశాస్త్రపరిశీలనము, ఇదియె మాకు యజ్ఞ మని సదా యెవ్వరు చేయుచున్నారో వారు జ్ఞానయజ్ఞులు. ఇట్లు మోక్షముకొఱకు, యతయః = యత్నము చేయువారు; సంశితవ్రతాః = ఆయా తమతమ నిష్ఠయందు సంశితము—మిక్కిలి తీక్ష్ణ మయిన వ్రతము—నియమము గలవారు, పెక్కండ్రు గలరు. ఇట్లు ద్రవ్యత్యాగము తపస్సు యోగము స్వాధ్యాయపారాయణము శాస్త్రపరిశీలనము—ఇవి యజ్ఞము లని సూచితం బగుచున్నది.

మ. ఇట్లు మూఁడుశ్లోకములచే నైదుయజ్ఞములం జెప్పి యిప్పు డొక్కశ్లోకముచే నాలుయజ్ఞములం జెప్పుచున్నాఁడు.—యథాశాస్త్రము ద్రవ్యత్యాగమే యజ్ఞముగాఁ గలవారు ద్రవ్యయజ్ఞులు—పూర్తము దత్తము అను పేరు గల స్మార్తకర్మములు చేయువారు, అట్లు స్మృతి "వాపీకూపతటాగాది దేవతాయతనాని చ। అన్నప్రదాన మారామః పూర్త మి త్యభిధీయతే॥ శరణాగత సంత్రాణం భూతానాం చా௨ప్యహింసనమ్। బహి ర్వేదిచ యద్దానం దత్తమి త్యభిధీయతే" § అని. ఇష్ట మనుపేరు గల శ్రౌతకర్మమో దైవమేవా௨పరే యజ్ఞ మ్మనుశ్లోకమునఁ జెప్పఁబడినది. అంత ర్వేది ⁋ దానముగూడ దానియందే యంతర్భూతము. అట్లు, కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సే యజ్ఞముగాఁ గలవారు తపోయజ్ఞులు—తపస్వులు. అట్లు, యోగ మనఁగా చిత్తవృత్తినిరోధము ఎనిమిది యంగములు గలది, అదియే యజ్ఞ

♦ అట్టి యీయజ్ఞమునకు తాను అశుచి యగుటయు దేశము అశుచి యగుటయు నను నివి రెండనధ్యాయములు—తాను అశుచిగా నుండునప్పుడును తా నుండుచోటు అశుచిగా నుండునప్పుడును మాత్రమే యీయజ్ఞము చేయరాదు.

§ నడబావి బావి చెఱువు మొదలగునదియు దేవాలయములును అన్నదానమును ఉపవనంబును పూర్త మని చెప్పఁబడును. శరణాగతరక్షణంబును భూతముల హింసింపకుండుటయు వేదికి వెలుపలఁ జేయు దానంబును—యజ్ఞమునకు సంబంధింపని దానంబును దత్త మనఁబడును.

⁋ వేదిలోపలఁ జేయునట్టి—యజ్ఞసంబంధి యగు.

ముగాఁ గలవారు యోగయజ్ఞులు, యమనియమాసనాదియోగాంగముల ననుష్ఠించువారు. యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధులు గదా యోగమున కెనిమిది యంగములు. అందుఁ బ్రత్యాహారము శ్రోత్రాదీ నీన్ద్రియా ణ్యన్యే యనుశ్లోకంబునఁ జెప్పఁబడినది. ధారణాధ్యానసమాధులు ఆత్మసంయమయోగాగ్నౌ అనుచోఁ జెప్పఁబడినవి. ప్రాణాయామము అపానే జుహ్వతి ప్రాణ మ్మను మీఁదిశ్లోకంబునఁ జెప్పఁబడును. యమనియమాసనంబు లీశ్లోకమునఁ జెప్పఁబడుచున్నవి. అందు, అహింస సత్యము అస్తేయము * బ్రహ్మచర్యము అపరిగ్రహము ♦ అని యమము లైదు. శౌచము సంతోషము తపస్సు స్వాధ్యాయము ఈశ్వరప్రణిధానము అని నియమము లైదు. స్థిరసుఖ మైనది యాసనము పద్మకస్వస్తికాదిభేదంబున అనేకవిధము. హింస యనఁగా శాస్త్రీయము కాని ప్రాణివధము, అది కృతము కారితము అనుమోదితము ♦♦ అని మూఁడువిధములు, ఇట్లు అయథార్థభాషణమును అవధ్యప్రాణిహింసాసంబంధి ‡ యగు యథార్థభాషణంబును అనృతము, శాస్త్రవిరుద్ధ మగుమార్గంబునఁ బరుల ద్రవ్యము గ్రహించుట స్తేయము, అశాస్త్రీయ మగు స్త్రీపురుషసంగమము మైథునము, శాస్త్రనిషిద్ధము కానిమార్గంబున దేహయాత్రకుఁ గావలసినందు కధికముగా భోగసాధనముల స్వీకరించుట పరిగ్రహము, ఏతన్నివృత్తిలక్షణము § లగు నుపరమములు యమములు, «యమ ఉపరమే» అని ధాత్వర్థ మగుటవలన. అట్లు, శౌచము రెండువిధములు, బాహ్యము ఆభ్యంతరము అని, మృత్తిక జలము మొదలగువానిచే దేహాదులఁ గడుగుట బాహ్యము, మైత్రి ముదిత మొదలగువానిచే మదము మానము మొదలగు చిత్తమలములఁ గడుగుట యాభ్యంతరము, కలిగిన భోగసాధనముకంటె నధికము వల దను చిత్తవృత్తి సంతోషము, క్షుత్పిపాసలు శీతోష్ణములు మొదలగు ద్వంద్వముల సహించుటయు కాష్ఠమౌనము ఆకారమౌనము మొదలగు వ్రతంబులును తపస్సు, ఇంగితముచేతఁ గూడ స్వాభిప్రాయము దెలుపకుండుట కాష్ఠమౌనము మాటలాడకుండుట మాత్రము ఆకారమౌనము అని భేదము, మోక్షశాస్త్రముల యధ్యయనము గాని ప్రణవజపము

* దొంగతము చేయకుండుట.

♦ పరిగ్రహము చేయకుండుట.

♦♦ చేయఁబడినది చేయింపఁబడినది అనుమోదింపఁబడినది.

‡ వధింపరాని ప్రాణియొక్క హింసకు సహాయ మగునది.

§ వీనినుండి నివర్తిల్లుట లక్షణముగాఁ గలవి.

గాని స్వాధ్యాయము, సర్వకర్మములను బరమగురు వగు నీశ్వరునందు ఫలాపేక్ష లేక యర్పించుట యీశ్వరప్రణిధానము, ఇవి విధిరూపములు నియమములు ♦. పురాణములం దధికముగాఁ జెప్పఁబడినవానికిని ఈయమనియమములందే యంత ర్భావము, ఇట్టి యమనియమాదుల నభ్యసించువారు యోగయజ్ఞులు. స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ—యథావిధి వేదాభ్యాసపరులు స్వాధ్యాయయజ్ఞులు, న్యాయముచే వేదార్థము నిశ్చయించుటయం దాసక్తులు జ్ఞానయజ్ఞులు. మఱియొకయజ్ఞము చెప్పు చున్నాఁడు.—యతయః = యత్నస్వభావము గలవారు, సంశితవ్రతాః = మిక్కిలి శితములు—తీక్ష్ణముగాఁ జేయఁబడినవి—అతిదృఢము లయినవ్రతములు గలవారు సంశితవ్రతులు, వ్రతయజ్ఞు లని యర్థము. అట్లు భగవంతుఁడు పతంజలి చెప్పు చున్నాఁడు. « తే జాతిదేశకాలసమయా నవచ్ఛిన్నా స్సార్వభౌమా మహావ్రతమ్ » అని. మున్ను అహింసాదు లైదు యమము లేవి చెప్పఁబడినవో అవి జాతి మొద లగువాని యవచ్ఛేదము * లేక దృఢభూము లైనచో మహావ్రతం బని పేర్కొనఁ బడును. అందు జాత్యవచ్ఛిన్న మయిన యహింస—మృగయువునకు ♦♦ « నేను మృగ వ్యతిరిక్తముల వధింప " ననుట. దేశావచ్ఛిన్నము—తీర్థమునందు వధింప ననుట. కాలావచ్ఛిన్నము—చతుర్దశినాఁడు వధింపను పుణ్యదినమునందు వధింప ననుట. ప్రయోజనవిశేషరూపము సమయము, సమయావచ్ఛిన్నము—క్షత్త్రియునకు « దేవ బ్రాహ్మణులకుఁ బ్రయోజనము లేనిచో వధింపను, యుద్ధము లేనిచో వధింపను " అనుట, ఇట్లు, వివాహాది ప్రయోజనము లేనిచో అనృతం బాడ నని, ఇట్లు ఆప త్కాలము కానిచో రెండుచెఱకుగడల కధికము దొంగిల నని, ఇట్లు ఋతుకాలము కానిచో భార్యాగమనము చేయ నని, ఇట్లు గురువు మొదలగువారికిఁ బ్రయోజనము లేనిచో పరిగ్రహము చేయ నని యథాయోగ్యముగా సత్యాఽస్తేయ బ్రహ్మచర్యా ఽపరిగ్రహములం దవచ్ఛేదము నూహించునది. ఇట్టి యవచ్ఛేదము లేకయే యెప్పుడు సార్వభౌమములు సర్వజాతి సర్వదేశ సర్వకాల సర్వప్రయోజనములందును కలుగునవి యహింసాదు లగుచున్నవో మహాప్రయత్నముచేఁ బరిపాలితంబు లగుట వలన, అప్పు డవి మహావ్రతశబ్దముచేఁ జెప్పఁబడుచున్నవి. ఇట్లు కాష్ఠమౌనాదివ్రత

---

♦ హింసాది నివృత్తిరూపములు యమము లనియు శౌచాద్యనుష్ఠానరూపములు నియమము లనియు భేదము.

* నియమము.

♦♦ మృగముల వేఁటాడువానికి.

మనుగూడ నెఱుంగునది. ఇట్లు వ్రతము దృఢమైనపుడు నరకద్వారభూతము లయిన కామక్రోధలోభమోహములు నాలుగింటికిని నివృత్తి యగుచున్నది. అందు అహింసచే క్షమచేఁ గ్రోధమునకును, బ్రహ్మచర్యముచే వస్తువిచారముచేఁ గామమునకును, అస్తేయాఽపరిగ్రహరూప మయిన సంతోషముచే లోభమునకును, సత్యముచే యథార్థజ్ఞానరూప మగు వివేకముచే మోహమునకును, ఇట్లు తన్మూలంబు లగు వన్నిటికిని నివృత్తి యగు నని యెఱుంగవలయును. సకాములకు ఇతరఫలములు యోగశాస్త్రంబునం బ్రతిపాదింపఁబడినవి.

శ్రీ. మఱియును.—ద్రవ్యదానమే యజ్ఞముగాఁ గలవాడు ద్రవ్యయజ్ఞులు. కృచ్ఛ్రచాంద్రాయణాది * తపస్సే యజ్ఞముగాఁ గలవారు తపోయజ్ఞులు. యోగ మనఁగా చిత్తవృత్తినిరోధరూప మయిన సమాధి, అదియే యజ్ఞముగాఁ గలవారు యోగయజ్ఞులు. స్వాధ్యాయముచే—వేదముచే శ్రవణమననాదికంబున తదర్థజ్ఞానం బేది గలదో అదియే యజ్ఞముగాఁ గలవారు స్వాధ్యాయజ్ఞానయజ్ఞులు. లేక వేదపాఠయజ్ఞులును, వేదార్థజ్ఞానయజ్ఞులును అని ద్వివిధులు. యతయః = ప్రయత్నస్వభావులు; సంశితవ్రతాః = మిక్కిలి శితము—నిశితము—తీక్ష్ణముగాఁ జేయఁబడిన దగు వ్రతము గలవారు.

ప. ఇఁక మఱియు నైదుయజ్ఞములఁ జెప్పుచున్నాఁడు.—ద్రవ్యము నిచ్చుటయె యజ్ఞముగాఁ గలవారు ద్రవ్యయజ్ఞులు. కొందఱు, తపస్సులే—కృచ్ఛ్రచాంద్రాయణాదులే యజ్ఞముగాఁ గలవారు తపోయజ్ఞులు. కొందఱు యోగయజ్ఞులు. కొందఱు, స్వాధ్యాయమె—వేదపాఠమే యజ్ఞముగాఁ గలవారు, అట్లు జ్ఞానమే—శాస్త్రశ్రవణమే యజ్ఞముగాఁ గలవారు. ఇట్లు ఐదుగురు యాజ్ఞికులు. వార లెట్టివారు? యతయః = ప్రయత్నస్వభావులు; సంశితవ్రతాః = మిక్కిలి తీక్ష్ణములుగాఁ జేయఁబడిన వ్రతములు గలవారు. ఇట్లు తొమ్మిదియజ్ఞములు చెప్పఁబడినవి.

రా. కొందఱు కర్మయోగులు, ద్రవ్యయజ్ఞాః—న్యాయంబున ద్రవ్యముల సంపాదించి దేవతార్చనమునందుఁ బ్రయత్నించుచున్నారు, కొందఱు దానముల యందును గొందఱు యాగములందును గొందఱు హోమములందును బ్రయత్నించుచున్నారు, వీర లందఱు ద్రవ్యయజ్ఞులు. కొందఱు, తపోయజ్ఞాః—కృచ్ఛ్రచాంద్రాయణోపవాసాదులందు నిష్ఠ చేయుచున్నారు. అపరే= మఱికొందఱు; యోగయజ్ఞాః—

* కృచ్ఛ్రము—ప్రాజాపత్యకృచ్ఛ్రము చాంద్రాయణకృచ్ఛ్రము మొదలుగాఁ గల.

పుణ్యతీర్థ పుణ్యక్షేత్రప్రాప్తులందు నిష్ఠ చేయుచున్నారు, ఇట కర్మనిష్ఠాభేదప్రకరణం బగుటవలన యోగశబ్దము కర్మనిష్ఠాభేదవిషయము. స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ--కొందఱు స్వాధ్యాయాభ్యాసపరులు కొందఱు తదర్థజ్ఞానము నభ్యసించువారు. యతయః=యత్నస్వభావులు; సంశితవ్రతాః= దృఢమైన సంకల్పము గలవారు.

మోక్షార్థము యత్నించువారు దృఢసంకల్పులై కొందఱు ద్రవ్యయజ్ఞులుగాను గొందఱు తపోయజ్ఞులుగాను గొందఱు పుణ్యతీర్థాదులకుఁ బోవుటయె యజ్ఞముగాఁ గలవారుగాను గొందఱు వేదాభ్యాసయజ్ఞులుగాను గొందఱు వేదార్థజ్ఞానయజ్ఞులుగాను నుందు రని తాత్పర్యము.

**మా.** ద్రవ్యమును వేల్చుచున్నారు కావున ద్రవ్యయజ్ఞులు, తపస్సును బరమేశ్వరార్పణబుద్ధిచేఁ బరమేశ్వరునియందు వేల్చుచున్నారు కావునఁ దపోయజ్ఞులు. ఇట్లు ఇతరస్థలంబులందును. ఈతపస్సే హవిస్సు, దీనిని బ్రహ్మాగ్నియందు వేల్చుచున్నాను తత్పూజార్థం బని హోమము. బ్రహ్మార్పణమే హోమబుద్ధి.

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణే ఽపానం తథా ఽపరే
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః.
అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి. ౨౯

**భా.** మఱియును.—అపానే= అపానవృత్తియందు; ప్రాణమ్ = ప్రాణవృత్తిని; జుహ్వతి=వేల్చుచున్నారు, పూరకాఖ్యం బగు ప్రాణాయామము చేయుచున్నా రని యర్థము. తథా = అట్లు; అపరే= ఇతరులు; ప్రాణే= ప్రాణవృత్తియందు; అపానమ్ = అపానవృత్తిని; జుహ్వతి = వేల్చుచున్నారు, రేచకాఖ్యం బగు ప్రాణాయామము చేయుచున్నా రని యర్థము. ప్రాణాపానగతీ = నోటనుండియు ముక్కునుండియు వాయువు విడలుట ప్రాణగతి, దానికి విపరీతముగా లోపలికిఁ బోవుట యపానగతి, ఈప్రాణాఽపానగతులను; రుద్ధ్వా = నిరోధించి; ప్రాణాయామపరాయణాః = ప్రాణాయామమునందుఁ దత్పరులు, కుంభకాఖ్యం బగు ప్రాణాయామము చేయుచున్నా రని యర్థము. మఱియును.—అపరే = కొందఱు; నియతాహారాః = పరిమిత మయిన యాహారము గలవారలై; ప్రాణాన్ — వాయుభేదములను; ప్రాణేషు = ప్రాణభేదములయందే;

జుహ్వతి = ఏయేవాయువును జయింతురో ఇతరము లయిన వాయుభేద ములను ఆయావాయువునందు వేల్చుచున్నారు, ఆవాయువులు దాని యందుఁ బ్రవేశించిన ట్లగుచున్నవి.

ప్రాణాయామపరులై కొందఱు పూరకము చేయుచున్నారు, కొందఱు రేచకము చేయుచున్నారు, కొందఱు ప్రాణాపానగతులను నిరోధించి కుంభకము చేయుచున్నారు, మఱికొందఱు నియత మయిన యాహారము గొనుచు, ఒక్కొక ప్రాణవాయువును జయించి దానిదానియందు ఇతరవాయువులను బ్రవేశింపఁజేసి జయించుచున్నా రని తాత్పర్యము.

ఆ. ప్రాణాయామం బను యజ్ఞము నుదాహరించుచున్నారు మఱియును అని. ప్రాణాయామపరాయణులై రేచకంబును బూరకంబును జేసి కుంభకము చేయుచున్నా రని చెప్పుచున్నాఁడు రెండవయర్థముచేత. ప్రాణాఽపానగతులను శ్వాస ప్రశ్వాసములను నిరోధించి యేమి చేయుచున్నా రనఁగాఁ జెప్పుచున్నారు మఱి యును అని. ప్రాణాపానగతినిరోధరూప మయిన కుంభకము చేసి మాటిమాటికి వాయుజయము చేయుచున్నా రని యర్థము. ఆహారము పరిమితం బనుట హితము మేధ్యము * అని యుపలక్షించుటకొఱకు. ప్రాణములను బ్రాణములందు హోమము చేయుటనే విభజించుచున్నారు ఏయేవాయువును ఇత్యాదిగా. జయింపఁబడినవాయు భేదములందు జయింపఁబడనివాయుభేదములను వేల్చువిధమును బ్రకటించుచున్నారు ఆవాయువులు ఇత్యాదిగా.

హ. అపానే=అపానవాయువునందు; ప్రాణం జుహ్వతి—ఉపాసనచేఁ బ్రాణ హోమము సంపాదించుచున్నా రని యర్థము. ప్రాణే = ప్రాణవాయువునందు; అపానం జుహ్వతి—అగ్నియందు నేయి మొదలగువానికిం బోలె ధ్యానముచే హోమ మును సంపాదించుచున్నా రని యర్థము. ఎట్టివారలై ? ప్రాణాపానగతీ = ప్రాణా పానములగతులను; రుద్ధ్వా = నిరోధించి; ప్రాణాయామపరాయణాః = ప్రాణా యామమే ముఖ్య మయిన స్థితిగాఁ గలవారలై. అపరే = ఇతరు లగు యోగులు; నియతాహారాః = సంకుచితమైన యాహారము గలవారలై, ఆహారము లేకుండుట యును తపస్సునం దున్నవారలై యని యర్థము; ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి—ప్రాణ హోమమును ధ్యానముచే సంపాదించుచున్నా రని యర్థము.

---

* శుద్ధము.

శ్రీం. ప్రాణాయామముగూడఁ బాపక్షయార్థి యగు ముముక్షువునకు యజ్ఞమే యగును, దానిం జేయవలయు నని సూచించుటకై చెప్పుచున్నాఁడు.— కొందఱు ముముక్షువులు, అపానే = అపానవృత్తియందు, వాయువు ప్రవేశించు నాడియందు; ప్రాణమ్ = ప్రాణవృత్తిని; జుహ్వతి–నాసికాద్వయమునందు ఆయా కాలము నెఱింగి పూరకాఖ్యం బగు ప్రాణాయామము చేయుచున్నా రని యర్థము. అట్లు కొందఱు, ప్రాణే = ప్రాణవృత్తియందు, వాయువు వెడలునట్టి నాడియందు; అపానమ్ = అపానవృత్తిని; జుహ్వతి—రేచకప్రాణాయామమునే చేయుచున్నా రని యర్థము. కొందఱు, ప్రాణాయామగతీ = ముఖనాసికలనుండి వెలుపలికి వాయువు వెడలుట ప్రాణగతి, వానినుండి లోపలికి వాయువు ప్రవేశించుట అపానగతి, ఈప్రాణాపానగతులను; రుద్ధ్వా = నిరోధించి; ప్రాణాయామనిరతు లగుచున్నారు, కుంభకాఖ్య మగు ప్రాణాయామమునే చేయుచున్నా రని యర్థము. లేక. ఇతరులు కొందఱు ప్రాణాయామపరాయణు లగు ముముక్షువులు, ప్రాణాపానములయొక్క గతులను—వాయువుయొక్క నిర్గమప్రవేశములను; త్రికూటమునందు నిరోధించి, యంత, హృదయమునందుఁ బ్రాణమునం దపానమును అపానమునందుఁ బ్రాణమును వేల్చుచున్నారు, ప్రాణముతో నపానమును అపానముతోఁ బ్రాణమును జేర్చుచున్నారు, ఒకటి చేయుచున్నారు. అందుచే సమస్తనాడులందు నున్న పాపము సమస్తమును భస్మం బగుచున్న దని యర్థము. లేక. ప్రాణే అపానంజుహ్వతి = పూరకము చేయుచున్నారు; అంత, ప్రాణాపానగతీరుద్ధ్వా = కుంభకము చేసి; అట్లు, అపానే ప్రాణం జుహ్వతి=రేచకము చేయుచున్నారు. మఱియును. అపరే= ఇతరులు కొందఱు ముముక్షువులు, నియతాహారాః = స్వల్ప మయిన యాహారము గలవారలై, క్షీరము మొదలగు అల్పాహారము గలవారలై, అంతర్వాయువులు వశ మగుటకొఱకు; ప్రాణాన్ = అంతర్వాయువులను, ప్రాణేషు = ఆవాయుభేదము లందు; జుహ్వతి–వస్తి ధౌతి మొదలగు క్రియలచే అంతశ్శోధనము చేయుచున్నా రని యర్థము.

మ. ప్రాణాయామయజ్ఞముఁ జెప్పుచున్నాఁడు ఒకటియు సరశ్లోకము చేత.—అపానే = అపానవృత్తియందు; ప్రాణమ్ = ప్రాణవృత్తిని; జుహ్వతి= వేల్చు చున్నారు, బాహ్యవాయువును దేహములోనికిఁ జొరనిచ్చి పూరకాఖ్యప్రాణాయా మము చేయుచున్నా రని యర్థము. తథా; అపరే; ప్రాణే అపానం జుహ్వతి.. దేహమునందలి వాయువును వెలుపలికి వెడలించి రేచకాఖ్యప్రాణాయామము చేయు

చున్నా రని యర్థము. పూరక రేచకములఁ జెప్పుటచే వానితో విడువక యుండు ద్వివిధం బగు కుంభకము గూడఁ జెప్పఁబడినదే యగును. యథాశక్తి వాయువును బూరించి శ్వాసప్రశ్వాసముల నిరోధముచేయుట యంతఃకుంభకము, యథాశక్తివాయువునంతయు వెడలించి యటులిస్సుటఁ జేయునది బహిష్కుంభకము. ఈమూఁడు ప్రాణాయామముల ననువదించి నాలవది యగుకుంభకము చెప్పుచున్నాఁడు.——ప్రాణాపానగతీ = ముఖనాసికలనుండి లోపలివాయువు బైటికివెడలుట—శ్వాసము ప్రాణము యొక్క గతి, బైటికి వెడలినవాయువు లోపలికిఁ బ్రవేశించుట—ప్రశ్వాసము అపానముయొక్కగతి, అందుఁ బూరకమునందుఁ బ్రాణగతినిరోధము, రేచకమునం దపానగతినిరోధము, కుంభకమునందు రెండుగతులకును నిరోధము, ఇట్లు క్రమంబునను ఏకకాలమునను శ్వాసప్రశ్వాసంబు లను పేరులు గల ప్రాణాపానగతులను; రుద్ధ్వా; ప్రాణాయామపరాయణులై, అపరే = మునుపు చెప్పినవారికి విలక్షణు లయినవారు; నియతాహారాః= ఆహారనియమము మొదలుగాఁ గల యోగసాధనములతోఁ గూడినవారలై; ప్రాణేషు = బాహ్యాంతర కుంభకముల యభ్యాసముచే నిగ్రహింపఁబడిన ప్రాణములందు; ప్రాణాన్—జ్ఞానేంద్రియ కర్మేంద్రియరూపములను; జుహ్వతి—నాలుగవకుంభకము నభ్యసించుటచేఁ బ్రవిలాపనము చేయుచున్నా రని యర్థము. ఈవిషయ మంతయు భగవంతుఁ డగు పతంజలిచే సంక్షేపముగాను విస్తరముగాను సూత్రింపఁబడెను. అందు సంక్షేపసూత్రము.——“ తస్మిన్ సతి శ్వాసప్రశ్వాసయోర్గతివిచ్ఛేదలక్షణః ప్రాణాయామః ” అనునది. తస్మిన్ సతి= ఆయాసనము స్థిరము కాఁగా, ప్రాణాయామము అనుష్ఠింపవలయును, ఎట్టి ప్రాణాయామము? శ్వాసప్రశ్వాసయోః గతివిచ్ఛేదలక్షణః = ప్రాణాపానధర్మము లయిన శ్వాసప్రశ్వాసముల యొక్క గతి—పురుషప్రయత్నము లేక స్వాభావిక మయినసంచారము, క్రమంబునను ఏకకాలంబునను బురుషప్రయత్నవిశేషముచే దానియొక్కవిచ్ఛేదమే నిరోధమే లక్షణముగా స్వరూపముగాఁ గలది. దీనినే వివరించుచున్నాఁడు.——“ బాహ్యాభ్యన్తరస్తమ్భవృత్తి ర్దేశకాలసఙ్ఖ్యాభిః పరిదృష్టో దీర్ఘ సూక్ష్మః ” అని. బాహ్యగతినిరోధరూపం బగుటవలన బాహ్యవృత్తి పూరకము, ఆభ్యంతరగతి నిరోధరూపం బగుటవలన ఆభ్యంతరవృత్తి రేచకము, కొందఱు బాహ్యశబ్దమునకు రేచక మనియు ఆభ్యంతరశబ్దమునకుఁ బూరక మనియు వ్యాఖ్యానము చేసిరి, ఏకకాలమున ఉభయగతినిరోధము స్తంభము, స్తంభవృత్తి కుంభకము. అట్లు చెప్పఁబడినది ♦ “ య

♦ పాతంజలయోగసూత్రవ్యాఖ్యానమునందు.

త్రోభయోః శ్వాసప్రశ్వాసయోః సకృదేవ విధారకాత్ప్రయత్నా దభావో భవతి। న పునః పూర్వవదాపూరణప్రయత్నౌఘవిధారణమ్। నాపి రేచనప్రయత్నౌఘవిధారణమ్। కింతు యథా తప్త ఉపలే నిహితం జలం పరిశుష్య త్సర్వత స్సంకోచ మాపద్యతే ఏవ మయ మపి మారుతో వహనశీలో బలవ ద్విధారకప్రయత్నా వరుద్ధక్రియః శరీర ఏవ సూక్ష్మీభూతో ఽవతిష్ఠతే। సతు పూరయతి యేన పూరకః। నతు రేచయతి యేన రేచకః" ♦ అని. మూఁడువిధము లగు నీప్రాణాయామము దేశముచేతను కాలముచేతను సంఖ్యచేతను బరీక్షింపఁబడినదై దీర్ఘసూక్ష్మం బను పేరు గల దగుచున్నది. ఎట్లు ఘనముగా నుండు తూలపిండము * వదుకఁబడినదై విరళం బగుటచే దీర్ఘము సూక్ష్మము నగుచున్నదో అట్లు ప్రాణము గూడ దేశకాలసంఖ్యాదికమున నభ్యసింపఁబడినదై దీర్ఘంబును దుర్లక్షం బగుటచే సూక్ష్మంబు నగుచున్నది. ఎట్లనఁగా.—హృదయమునుండి వెడలి నాసాగ్రసమ్ముఖంబునఁ బండ్రెండంగుళములదూరము గలప్రదేశమునందు శ్వాసము నిలుచుచున్నది. అచటనుండి మరల హృదయపర్యంతము లోనికిఁ బోవుచున్నది. ఇది స్వాభావికం బగు ప్రాణాపానంబులగతి. అభ్యాసముచేతనో క్రమంబున నాభినుండిగాని మూలాధారమునుండిగాని వెడలును. నాసికనుండి యిరువదినాలుగంగుళములదూరమునందుఁగాని ముప్పదియాఱంగుళములదూరమునందుఁ గాని సమాప్తిఁ బొందును. ఇట్లు లోనికిఁ బ్రవేశంబును అంతమాత్రముగా నెఱుంగునది. అందు బాహ్యదేశవ్యాప్తి ఱెల్లుమొదలగువాని సూక్ష్మతూలముయొక్క చలనముచే నూహింపవలయును. ఆంతరదేశవ్యాప్తియుం చీమతాఁకుడుతో సమాన మయినస్పర్శముచే నూహింపవలయును. ఇది దేశపరీక్ష. అట్లు, ఱెప్పపాటుకాలమునకు నాలవభాగము క్షణము, ఆక్షణము లెన్ని యగునో తెలియవలయును. తనమోఁకాలియెముకఁగూఁడను ముమ్మాఱు చుట్టి చిటికవ్రేయు నంతటికాలము మాత్ర యనఁబడును. అట్టి మాత్రలు ముప్పదియాఱు గల యుద్ఘా

---

♦ దేనియందు శ్వాసప్రశ్వాసలరెంటికిని ఏకకాలమునందే విధారకమగు—నిలుపునట్టి ప్రయత్నము వలన అభావం బగునో, వెండియు మునుపటియట్లు ఆపూరణప్రయత్నప్రవాహమునునిలుపుట కలుగదో రేచనప్రయత్నప్రవాహము నిలుపుటయుఁ గలుగదో, మఱేమనఁగా ఎట్లు తప్తశిలయం దుంపఁబడిన జలము ఎండుచు అన్నివైపులను సంకోచముఁ బొందునో అట్లు వహనస్వభావము గల యీవాయువు గూడ బలవత్తర మగు విధారకప్రయత్నముచే నిరోధింపఁబడినక్రియ గలదై శరీరమునందే సూక్ష్మమై నిలుచున్నూ, పూరణము లేమిం జేసి పూరకము కాదో, రేచనము లేమిం జేసి రేచకమును గాదో— అది కుంభకము.

* దూదిముద్ద.

తము మొదటిది మందము, అదియే రెండింతలు చేయఁబడినది రెండవది మధ్యము, అదియే మూఁడింతలు చేయఁబడినది మూఁడవది తీవ్రము, నాభిమూలమునుండి వెడలింపఁబడువాయువు శిరస్సునఁ దాఁకుట యుద్ఘాతం బనఁబడును. ఇది కాలపరీక్ష. సంఖ్యాపరీక్షయుఁ బ్రణవజపావృత్తిభేదంబునఁ గాని శ్వాసప్రవేశకాలగణనంబునఁ గాని తెలియునది. కాలసంఖ్య లెట్లయినను భిన్నములుగా వివక్షించి వేఱుగాఁ జెప్పఁబడినవి. కుంభకమునందు దేశవ్యాప్తి తెలియకున్నను గాలసంఖ్యావ్యాప్తి తెలియనే తెలియుచున్నది. అట్టియీప్రాణాయామము ప్రతిదినము నభ్యసింపఁబడినదై దివసము పక్షము మాసము ఇత్యాదిక్రమంబున దేశకాలాధిక్యమును వ్యాపించు నదియై దీర్ఘమును నైపుణ్యముచే నెఱుంగఁ దగుటంచేసి సూక్ష్మమును అగుచున్నది. ఇట్లు త్రివిధం బగు ప్రాణాయామము నిరూపింపఁబడినది. ఇఁక ఫలభూత మగు నాల్గవదానినూత్రించుచున్నాఁడు «బాహ్యాభ్యన్తరవిషయాక్షేపీ చతుర్థః» అని. బాహ్యవిషయము శ్వాసము రేచకము, అభ్యంతరవిషయము ప్రశ్వాసము పూరకము. లేక. బాహ్యవిషయము ప్రశ్వాసము పూరకము, అభ్యంతరవిషయము శ్వాసము రేచకము అనియుం గావచ్చును. ఆరెంటి నపేక్షించి యొకమాఱు బలవత్తరం బగు విధారకప్రయత్నమువలన బాహ్యాభ్యంతరభేదముచే ద్వివిధం బగు తృతీయ కుంభకము సిద్ధించును. ఆరెంటి నపేక్షింపకయే కేవలకుంభకాభ్యాసాతిశయముచేఁ బలుమాఱు తత్తత్ప్రయత్నవశమువలన చతుర్థకుంభకం బగును. కావున, బాహ్యాభ్యన్తరవిషయాక్షేపి యనఁగా ఆబాహ్యవిషయాభ్యంతరవిషయముల నపేక్షింపనిది యని యర్థము. మఱియొకవ్యాఖ్యానము.—బాహ్యవిషయ మనఁగా ద్వాదశాంతాదికము, అభ్యంతరవిషయం బనఁగా హృదయనాభిచక్రాదికము. ఆరెండువిషయములను ఆక్షేపించి—పర్యాలోచించి స్తంభరూప మయినగతి విచ్ఛేద మేది గలదో అది నాలుగవప్రాణాయామము అని. మూఁడవదియో బాహ్యాభ్యంతరము లగువిషయములను బర్యాలోచింపకయె హఠంబున నగుచున్నది యని విశేషము. ఇట్టి చతుర్విధ మగు ప్రాణాయామము అపానే జుహ్వతి ప్రాణ మిత్యాదిగా సార్ధశ్లోకముచేఁ దెలుపఁబడినది.

శ్రీ. అపానే = అధోవృత్తి యగు వాయువునందు; ప్రాణమ్ = ఊర్ధ్వవృత్తిని; పూరకముచేత, జుహ్వతి—పూరకకాలమునందుఁ బ్రాణాపానముల నొకటిగాఁ జేయుచున్నారు. అట్లు కుంభకముచేఁ బ్రాణాపానముల యూర్ధ్వాధోగతులను నిరోధించి రేచకకాలమునందు, అపానమ్; ప్రాణే జుహ్వతి. ఇట్లు పూరకకుంభకరే

చకములచేఁ బ్రాణాయామపరాయణు లగుదురు మఱికొందఱని యర్థము. అపరే= ఇఁకఁ గొందఱో; ఆహారము తగ్గించుటను అభ్యసించుచున్నవారై, ప్రాణేషు = తమ యంతనే జీర్ణము లగుచున్న యింద్రియములందు; ప్రాణాన్ జుహ్వతి—ఆయాయింద్రియములయొక్క వ్యాపారమును వేల్చునట్లు భావన చేయుచున్నా రని యర్థము. లేక.—అపానే జుహ్వతి ప్రాణం ప్రాణే౽పానం తథా౽పరే యనుటచేఁ బూరక రేచకములు తిరుగుచుండునపుడు "హంసః సో౽హమ్" అని యనులోమముగాను ప్రతిలోమముగాను దెలియవచ్చునట్టి యజపామంత్రముచే తత్త్వంపదార్థముల నైక్యమును వ్యతిహారంబుగ ♦ భావన చేయుచున్నా రని యర్థము. అట్లు చెప్పఁబడినది యోగశాస్త్రమునందు "సకారేణ బహిర్యాతి హాకారేణ విశేత్పునః । ప్రాణస్తత్ర సఏవా౽హం హంస ఇత్యనుచిన్తయేత్" * అని. ప్రాణా౽పానగతీ రుద్ధ్వా అనుదాని చేతనో ప్రాణాయామమె యజ్ఞముగాఁ గలవారు మఱికొందఱు చెప్పఁబడుచున్నారు. అం దిది యర్థము.—"ద్వౌ భాగౌ పూరయే దన్నై స్తోయే నైకం ప్రపూరయేత్ । మారుతస్య ప్రచారార్థం చతుర్థ మవశేషయేత్" ♦♦ ఇత్యాదివచనములచేఁ జెప్పఁబడిన నియత మయిన యాహారము గలవారు కుంభకముచేఁ బ్రాణాపానగతుల నిరోధించి ప్రాణాయామ పరాయణులై, ప్రాణాన్ = ఇంద్రియములను, ప్రాణేషు జుహ్వతి—కుంభకమునందు సమస్తప్రాణంబులు నొక్కటి యగును గావున నందే లయము నొందుచున్న యింద్రియములందు హోమభావన చేయుచున్నా రని యర్థము. అట్లు యోగశాస్త్రమునందుఁ జెప్పఁబడినది "యథా యథా సదాభ్యాసా న్మనసః స్థిరతా భవేత్ । వాయు వాక్కాయ దృష్టీనాం స్థిరతా చ తథా తథా" అని.

ప. ఇఁక నితరము లయిన మూఁడుయజ్ఞములఁ జెప్పుచున్నాఁడు.—

అపానే= అధోవృత్తియందు; ప్రాణమ్ = ఊర్ధ్వవృత్తిని; పూరకముచేత, జుహ్వతి—పూరకకాలమునందుఁ బ్రాణమును అపానముతో నేకముగాఁ జేయుచున్నారు.

♦ పరస్పరవిశేషణవిశేష్యభావంబున—తత్పదార్థమునకుఁ ద్వంపదార్థము విశేష్యముగాను ద్వంపదార్థమునకుఁ దత్పదార్థము విశేష్యముగాను.

* ప్రాణము సకారముచే వెలుపలికి వెడలును హాకారముచే మరల లోనికిఁ జొచ్చును—ప్రాణము వెడలునప్పుడు స అనుధ్వనియుఁ జొచ్చునపుడు హ అనుధ్వనియును పుట్టును. అందు సో౽హం హంసః హంసస్సో౽హమ్—అతఁడే నేను నేనే అతఁడు అని భావన చేయవలయును.

♦♦ రెండుభాగములను అన్నములచే నిండించునది, జలముచే నొకభాగము నిండించునది, వాయుసంచారార్థము నాలవభాగము మిగత పెట్టవలయును.

అట్లు కుంభకముచేఁ బ్రాణాపానముల యూర్ధ్వాధోగతులను నిరోధించి రేచకకాల మునందు, ప్రాణే అపానం జుహ్వతి. ఇట్లు రేచకపూరక కుంభకములచేఁ బ్రాణ వాయువును వశీకరించి, ప్రాణాయామపరాయణాః = ప్రాణాయామమే ముఖ్య మయిన గతిగాఁ గలవారు. అట్లు చెప్పఁబడినది "యథా యథా సదాభ్యాసా న్మనసః స్థిరతా భవేత్ । వాయు వాక్కాయ దృష్టీనాం స్థిరతా చ తథా తథా"§ అని. అథర్వనల్లియందు శ్రుతియును "ఆత్మా దేవానాం భువనస్య గర్భో యథా వశం చర త్యేష దేవః । ఘోషా ఇదం యస్య శృణ్వేత రూపం తస్మై వాతాయ హవిషా విధేమ" అని. ఇందుకు భాష్యము.—తస్మై = అట్టి; వాతాయ = ప్రాణ ముఖ్యునికొఱకు, "వాయు ర్వై గౌతమసూత్రమ్, వాయు ర్వై క్షేపిష్ఠా దేవతా, వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి" ♦ ఇత్యాది శ్రుతులవలన, ప్రాణముఖ్యుఁ డనఁగా హిరణ్యగర్భునికొఱకు; హవిషా = యథోచితాహారరూప మగు హవిస్సు చేత; విధేమ = పరిచరించుచున్నాము *; ఎట్టి హిరణ్యగర్భునికొఱ కనఁగా.— యస్య = ఎవ్వనియొక్క; ఇదమ్ = ఈ అనుభవింపఁబడుచున్న; రూపమ్ = రూపము; ఘోషాః = అనాహతధ్వనులో; అట్లు శృణ్వేత = వినవలయును. ఎట్లనఁగా.— ఎట్లు, ఏషః దేవః= ఈ ప్రాణరూపుఁ డైన దేవుఁడు; వశం చరతి = వశవర్తి యగునో. ఎట్టి దేవుఁ డనఁగా.— దేవానామ్ = దేవతలకు; ఆత్మా = అంతర్యామి. దేవతలకు అంతర్యామి మాత్రమే కాఁడు, మ ఱేమనఁగా, భువనస్య=ప్రపంచమునకు; గర్భః= బీజరూపుఁడు. అపరే; ఆహారము సంకోచపఱచుటను అభ్యసించుచున్నవారై; తమయంతనే జీర్ణము లగుచున్న, ప్రాణేషు = ఇంద్రియములందు; ప్రాణాన్ = ఆ యాయింద్రియములను; జుహ్వతి.

రా. అపరే = ఇతరు లగు కర్మయోగులు; ప్రాణాయామములందు నిష్ఠ చేయుచున్నారు. ఆప్రాణాయామములు పూరక రేచక కుంభకభేదముచే మూఁడు విధములు. అపానే జుహ్వతి ప్రాణ మ్మనుటచే పూరకము చెప్పఁబడినది. ప్రాణే ఽపాన మ్మనుటచే రేచకము, ప్రాణాపానగతీః రుద్ధ్వా ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి

§ ఎట్లు ఎట్లు ఎల్లప్పుడు అభ్యాసము చేయుటవలన మనస్సునకు స్థైర్యము గలుగుచున్నదో, అట్లు అట్లు వాయువునకును దేహమునకును దృష్టికిని స్థైర్య మగును.

♦ గౌతముఁడా! వాయువే సూత్రాత్మ, వాయువే మిక్కిలి వేగము గల దేవత, వాయుదేవుఁడా! నీవే ప్రత్యక్షమయిన బ్రహ్మ మగుచున్నావు.

* సేవ చేయుచున్నాము.

యనుటచే కుంభకము చెప్పఁబడినవి. నియతాహారాః అనునది ఈముప్వురు ప్రాణాయామపరులందును అన్వయించుచున్నది.

ప్రాణాయామమునందు నిష్ఠ గలిగి ఆహారనియమము గలవారై కొందఱు పూరకప్రాణాయామమును కొందఱు రేచకమును గొందఱు కుంభకమును జేయుచున్నారని తాత్పర్యము.

**మూ.** అపరే; ప్రాణాయామపరాయణాః; ప్రాణమ్ అపానే జుహ్వతి. అపానమును, ప్రాణే = ప్రాణమునందు. కుంభకస్థులే యగుచున్నారని యర్థము. నియతాహారాః—నియతాహారు లగుటచే, ప్రాణశోషమువలన ♦, ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి. «యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞః» ‖ అని శ్రుతియందుఁ జెప్పినవిధమునఁ గాని, ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి. పూర్వము చెప్పిన యర్థముగూడ గ్రంథాంతరమున సిద్ధించుచున్నది. «యదస్యాల్పాశనం తేన ప్రాణాః ప్రాణేషు నైహుతాః»§ అని.

సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః.
యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్. 3౦౫

**భా.** సర్వేఽపి = అందఱును; ఏతే = ఈ, యజ్ఞవిదః *; యజ్ఞక్షపితకల్మషాః = ఈచెప్పిన యజ్ఞములచే నశింపఁజేయఁబడిన కల్మషము గలవారలు. ఇట్లు ఈ చెప్పఁబడిన యజ్ఞముల నిర్వర్తించి, యజ్ఞశిష్టామృతభుజః = యజ్ఞముల మిగత యజ్ఞశిష్టము, యజ్ఞశిష్ట మయిన అమృతము యజ్ఞశిష్టామృతము, దాని భుజించువారలు, పైచెప్పిన యజ్ఞముల ననుష్ఠించి దాన మిగిలిన కాలమున యథావిధిగా విహిత మగు అన్నమును అమృత మనుపేరు గలదాని భుజించువారు యజ్ఞశిష్టామృతభుజులు; యాన్తి = పొందుచున్నారు; బ్రహ్మ; సనాతనమ్ = చిరంతనమును, ముముక్షువులైనచో కాలాతిక్రమాపేక్షచే ♦♦ నని శబ్దసామర్థ్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

---

♦ ఇంద్రియవృత్తు లను ఇంద్రియములంటే అడంచుటవలన.

‖ ప్రాజ్ఞుఁడు వాక్కును మనస్సును నియమింపవలయును.

§ పురుషుని యల్పాహార మేది గలదో దానిచే ప్రాణములు ప్రాణములందు హోమము అగుచున్నవి.

* యజ్ఞము నెఱింగినవారు, లేక, యజ్ఞముఁ బొందినవారు.

♦♦ కొంతకాలము దాటినపిమట.

ఈయజ్ఞములఁ జేయువార లందఱును యజ్ఞానుష్ఠానముచేఁ బాపక్షయము నొందుదురు. ఇట్లు యజ్ఞముల నెఱవేర్చి యందు మిగిలిన కాలంబున అమృతాఖ్యమగు నన్నమును భుజించువారు క్రమముగా సనాతన మగుబ్రహ్మము నొందుదురని తాత్పర్యము.

ఆ. ప్రకృతము లయిన యజ్ఞముల నుపసంహరించుచున్నాఁడు సర్వేఽపీత్యాదిగా. ఈయజ్ఞముల నెఱవేర్చిన పిదపఁ గల్మషము క్షీణించినప్పు డేమి యగునని యాశంకించి చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. ఎట్లు ఈయజ్ఞముల ననుష్ఠించుచు మిగిలినకాలమున విహిత మయినయన్నమును భుజించువారలకు బ్రహ్మప్రాప్తి యగును ? అని యాశంకించి మోక్షేచ్ఛ కలదేని చిత్తశుద్ధిద్వారమున నని చెప్పుచున్నారు ముముక్షువులైనచో ఇత్యాదిగా. అందు ఏమి యిప్పుడు సాక్షాన్మోక్షమే ♦ వివక్షింపఁబడినదా ? అట్లయినచో గతిశ్రుతి విరోధించును, అని యాశంకించి గతినిర్దేశముయొక్క * సామర్థ్యమువలనఁ గ్రమముక్తి యిట సభిప్రేతం బని చెప్పుచున్నారు కా లేత్యాదిగా.

హ. సర్వేఽపి, ఏతే, యజ్ఞవిదః = యజ్ఞోపాసకులు. యజ్ఞముయొక్క శిష్టము యజ్ఞశిష్టము, యజ్ఞశిష్టమే యమృతము, "యజ్ఞశిష్టం తథా ఽమృతమ్" అనుశ్రుతివలన, యజ్ఞవిదులు యజ్ఞముల ననుష్ఠించి పరిశ్రాంతులై శరీరయాత్రకొఱకు దేని భుజించుచున్నారో అది యజ్ఞశిష్టామృతము, దాని భుజించువారు యజ్ఞశిష్టామృతభుజులు; యాన్తి = పొందుచున్నారు; బ్రహ్మ; సనాతనమ్= నిత్య మైనదానిని.

శం. ఇట్లు ద్రైవాదియజ్ఞములను నియమంబునఁ జేయువారలకు యజ్ఞానుష్ఠానఫలముఁ జెప్పుచున్నాఁడు.—యజ్ఞవిదః = యజ్ఞములను బొందువారలు అనుష్ఠించువారలు కావున యజ్ఞవిదు లనఁగా ద్రైవాదియజ్ఞముల ననుష్ఠించువారు; ఏతే= ఈ చెప్పఁబడినవారు; సర్వేఽపి = అందఱును; యజ్ఞశిష్టా ఽమృతభుజః—యజ్ఞానుష్ఠానానంతరము కలుగునది యగుటవలన వీరియన్నము యజ్ఞశిష్టము, యజ్ఞశిష్టమే అమృతము, దాని భుజించువారలు కావున యజ్ఞశిష్టామృతభుజులు; లేక; యజ్ఞానుష్ఠానముచే మిగిలినది యజ్ఞశిష్టము, నిత్య మగుటవలన అమృత మనఁగా కాలము, భోజనసంబంధి యగుటవలన అమృతశబ్దముచేఁ గాలము చెప్పఁబడుచున్నది, యజ్ఞ

♦ చిత్తశుద్ధిద్వారము లేకయే మోక్షము.

* యాన్తి = పొందుచున్నారు అని చెప్పుటయొక్క.

శిష్టమైన యమృతము—కాలమేది గలదో దానియందు భుజించువారలు కావున యజ్ఞశిష్టామృతభుజులు, అట్టివారలై; యజ్ఞక్షపితకల్మషాః= నియమముచే అనుష్ఠింపఁబడిన యజ్ఞములచే నశింపఁజేయఁబడిన కల్మషము గలవారలై, యజ్ఞానుష్ఠానముచే నిశ్శేషముగా నశించిన జ్ఞానప్రతిబంధకము గలవారలై; ఒక్కమాఱు ఉపదేశించినమాత్రముననే సద్గురువువలన నాత్మజ్ఞానము నొంది, సనాతనమ్ = నిత్యమగు; బ్రహ్మ = సచ్చిదానందైకరస మయిన బ్రహ్మమును; యాన్తి. జ్ఞానము పుట్టినియెడఁ గ్రమంబున ముక్తు లగుదు రని యభిప్రాయము.

మ. ఇట్లు చెప్పఁబడిన ద్వాదశవిధు లగు యజ్ఞవిదులకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.—యజ్ఞములను విదన్తి—ఎఱుంగుచున్నారు, లేక, విన్దన్తి—పొందుచున్నారు అనువృత్త్యర్తిచే యజ్ఞవిదు లనఁగా యజ్ఞములఁ దెలిసినవారును జేయువారును జెప్పఁబడుచున్నారు; యజ్ఞక్షపితకల్మషాః = మున్ను చెప్పిన యజ్ఞములచే నశింపఁజేయఁబడిన పాపము గలవారు; యజ్ఞములను జేసి మిగిలిన కాలమునందు అమృతంబను పేరు గల అన్నమును భుజించువారు యజ్ఞశిష్టామృతభుజులు, వార లందఱును సత్త్వశుద్ధిజ్ఞానప్రాప్తిద్వారంబున, సనాతనమ్ = నిత్య మగు; బ్రహ్మ, యాన్తి—ముక్తు లగుదు రని యర్థము.

శ్రీ. ఇట్లు చెప్పిన పండ్రెండుగు రగు యజ్ఞవిదులకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.—యజ్ఞములను పొందువారు, లేక, యజ్ఞములఁ దెలిసినవారు యజ్ఞవిదులు. యజ్ఞక్షపితకల్మషాః = యజ్ఞములచే నాశిత మగు పాపము గలవారు. యజ్ఞశిష్టామృతభుజః = యజ్ఞములను జేసి మిగిలినకాలమునందు నిషిద్ధము గాని యన్నమును అమృతరూపమును భుజించువారు. సనాతనమ్ = నిత్య మగు; బ్రహ్మ = బ్రహ్మమును; యాన్తి = జ్ఞానద్వారమునఁ బొందుచున్నారు.

ప. ఇఁక నుపసంహరించుచున్నాఁడు.—సర్వే ఽపి, ఏతే = నిరూపింపఁబడినవారు, యజ్ఞవిదః = యాజ్ఞికులే యగుచున్నారు. ఎట్టివారు ? యజ్ఞక్షపితకల్మషాః = యజ్ఞములచే నశింపఁజేయఁబడిన కల్మషము మనోవేగరూప మైనపాపము గలవారు. ఇఁక పండ్రెండుయజ్ఞములకును ఫలముఁ జెప్పుచున్నాఁడు.—యజ్ఞానంతరము శిష్ట మయినది యజ్ఞశిష్టము, అట్టి అమృతమును—సమస్తఫలముల కంటెను త్తమ మయినదాని, లేక, సోమచక్రమునుండి గళితం బగు నాత్మసుఖమును, భుజించువారు యజ్ఞశిష్టామృతభుజులు; అట్టివారలై; సనాతనమ్ = నిత్య మయిన బ్రహ్మ యాన్తి. అది దక్కఁ దక్కినసమస్తఫలంబును నశ్వరం బని యర్థము.

రా. ద్రవ్యయజ్ఞము మొదలుగాఁ బ్రాణాయామమువఱకుఁ గల కర్మయోగభేదములందుఁ దమకిష్టము లైనవానియందుఁ బ్రవర్తించినట్టి, ఏతే సర్వే ఽపి = వీరందఱును; యజ్ఞవిదః = "సహయజ్ఞైః ప్రజాః సృష్ట్వా" అని చెప్పఁబడిన మహాయజ్ఞపూర్వక నిత్యనైమిత్తికకర్మరూప యజ్ఞములను బొందువారలు, వానియందు నిష్ఠ గలవారలు; కావుననే, యజ్ఞక్షపితకల్మషాః=యజ్ఞములచే నశింపఁ జేయఁబడిన పాపము గలవారలై; యజ్ఞశిష్టామృతభుజః = యజ్ఞశిష్ట మగు నమృతముచే శరీరధారణము చేయుచున్నవారైయే; కర్మయోగమునందుఁ బ్రవృత్తులై, సనాతనం బ్రహ్మ యాన్తి.

ద్రవ్యయజ్ఞము మొదలుగాఁ బ్రాణాయామమువఱకుఁ జెప్పిన యీయజ్ఞములలో దేని నైనను అనుష్ఠించువార లందఱును "సహయజ్ఞైః ప్రజాః సృష్ట్వా" అని మున్ను విధించిన యజ్ఞముల ననుష్ఠించినవార లగుచున్నారు, వీర లందఱు యజ్ఞానుష్ఠానముచేఁ బాపక్షయము నొంది యజ్ఞశిష్ట మయిన యమృతముచేతనే శరీరధారణము చేయుచుఁ గర్మయోగమునఁ బ్రవృత్తులైనచో సనాతనం బగు బ్రహ్మము నొందుదు రని తాత్పర్యము.

మూ. ♦

నా ఽయం లోకో ఽ స్త్యయజ్ఞస్య కుతో ఽన్యః కురుసత్తమ. ౩౧

భా. అయమ్ = ఈ; లోకః = సర్వప్రాణులకును సాధారణమయిన లోకము గూడ; నాస్తి = లేదు; అయజ్ఞస్య = ఈ చెప్పఁబడిన యజ్ఞములలో నొకయజ్ఞమైనను ఎవ్వనికి లేదో అతఁడు అయజ్ఞుఁడు, వానికి. అన్యః = ఇతరలోకము, విశిష్టసాధనములచే సాధింపఁదగినది; కుతః = ఎక్కడిది ? కురుసత్తమ = అర్జునుఁడా !

ఈయజ్ఞములలో నొకటియు నాచరింపని వానికి జంతుసామాన్యమునకు సహజమయి యున్న యీలోకముగూడ లేదు. ఇఁక శాస్త్రోక్తసాధనంబులచే సాధింపవలసిన పరలోకము లే దని చెప్పవలయునా ? అని తాత్పర్యము.

ఆ. మీఁదఁ జెప్పఁబడిన యజ్ఞములలో నొకానొకటియు లేనిపురుషునకుఁ బ్రత్యవాయము చెప్పుచున్నాఁడు ఈయర్ధశ్లోకముచేత. చెప్పఁదలచిన దైము

♦ దీనికి మాధ్వభాష్యము లేదు.

తికన్యాయముఁ జెప్పుచున్నారు అన్యః ఇత్యాదిగా. సాధారణలోకమే లేనియప్పుడు మఱి యసాధారణలోకప్రాప్తి దూరమునసే నిరాకరింపఁబడినది యర్థము. ఈయర్థము నందు బుద్ధికి సమాధానము కురుకులశ్రేష్ఠుఁ డగు నర్జునునకు అనాయాసముగా లభించు నని సూచించుటకై కురుసత్తమ యని సంబోధనము.

**హ.** అయజ్ఞస్య = యజ్ఞము లేనిపురుషునకు; ఈలోకము గూడ లేదు, శిష్టులచే నిందితుఁ డగుటవలన. కుతః = ఎక్కడిది; అన్యః = పరలోకము, అనేక సాధనములచే సాధ్య మయిన యజ్ఞముచే సాధింపఁ దగినది ? అందువలనఁ బ్రయత్నంబున యజ్ఞము చేయవలయు నని యర్థము.

**శం.** చెప్పఁబడిన యజ్ఞములందు నొకానొకటిగూడ చేయని దుష్టస్వభావుఁ డగు దౌర్భాగ్యవంతునకు అననుష్ఠానఫలముఁ జెప్పుచున్నాఁడు.—అయజ్ఞస్య = ఎవ్వనికి మీఁదఁ జెప్పిన యజ్ఞములం దొకటి గూడ మోక్షసాధన మగు యజ్ఞము లేదో అతఁడు అయజ్ఞుఁడు, అట్టి మోక్షధర్మశూన్యుఁ డగు దుర్బుద్ధికి; అయమ్, లోకః = లోక్యతే చూడఁబడుచున్నది కావున లోక మనఁగా దేహము, ముక్తిసంపాదనమునకు యోగ్య మయిన యీమనుష్యదేహమే; నాస్తి = లేదు; దీనికంటె, అన్యః = ఇతర మగు, దైవము గాని బ్రాహ్మము గాని శైవము గాని ♦. కుతః = ఏకారణమువలన ? అధర్మనిష్ఠునకు అసాధారణ కారణసాధ్యమైన యుత్తమశరీరము ఎట్లు సిద్ధించు నని యర్థము.

**మ.** ఇట్లన్వయంబున § గుణముఁ జెప్పి వ్యతిరేకంబున * దోషముఁ జెప్పుచున్నాఁడు.—చెప్పఁబడిన యజ్ఞములలోపల నొకానొకయజ్ఞమైనను ఎవనికి లేదో అతం డయజ్ఞుఁడు, వానికి; అయం లోకః = అల్పసుఖ మయిన యీమనుష్య లోకము గూడ; నాస్తి, సమస్తజనులచేతను నిందితుఁ డగుటవలన. ఇఁక, అన్యః = విశిష్టసాధనసాధ్య మగు పరలోకము; కుతః = ఎక్కడిది ? కురుసత్తమ = ఓకురు శ్రేష్ఠుఁడా !

**శ్రీ.** ఆయజ్ఞములం జేయనియెడ దోషముఁ జెప్పుచున్నాఁడు —అయమ్= ఈయల్పసుఖ మయిన; లోకః = మనుష్యలోకముగూడ; అయజ్ఞస్య = యజ్ఞాను

---

♦ దేవతాశరీరము గాని బ్రహ్మశరీరము గాని శివశరీరము గాని.

§ అనుష్ఠించినయెడ.

* అనుష్ఠింపనియెడ.

స్థానము లేనివానికిః నాస్తి. ఇఁక, అన్యః = పరలోకముః కుతః = ఎక్కడిది? కావున యజ్ఞముల నన్నివిధములం జేయవలయు నని యర్థము.

ప. ఇఁక నీచెప్పినయజ్ఞములఁ జేయనిచో దోషము చెప్పుచున్నాఁడు.— అయజ్ఞస్య = ఈ చెప్పినయజ్ఞములం దొకటినైనను జేయనివానికి; అయం లోకః = ఈ మనుష్యలోకము గూడ; నాస్తి. కుతోఽన్యః = ఇఁక నెక్కడిది యుత్తమలోకము? అధమయోనులందుఁ బడుచున్నాఁ డని యర్థము.

రా. అయజ్ఞస్య = మహాయజ్ఞాది పూర్వక నిత్యనైమిత్తిక కర్మములు లేని వానికిః అయం లోకః = ఈప్రాకృతలోకముః నాస్తి = లేదు, ప్రాకృతలోక సంబంధి యగు ధర్మార్థకామంబు లను పురుషార్థము గూడ సిద్ధింపదు. కుతః = ఎక్కడిది; అన్యః = దీనికంటె నితర మగు మోక్షం బను పురుషార్థము? పరమపురుషార్థముగా మోక్షము ప్రస్తుతం బగుటవలనఁ దదితర మగు పురుషార్థము "అయం లోకః" అనుటచే నిర్దేశింపఁబడుచున్నది. అది గదా ప్రాకృతము.

మహాయజ్ఞా ద్యనుష్ఠానపూర్వకముగా నిత్యనైమిత్తిక కర్మము లనుష్ఠింపనివానికిఁ బ్రాకృతము లగు ధర్మార్థకామంబు లను పురుషార్థములుగూడ లభింప నేరవు. ఇఁక మోక్షరూపపరమపురుషార్థం బెట్లు లభించును? అని తాత్పర్యము.

మా. ♦

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే
కర్మజాన్ విద్ధి తాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. 32

భా. ఏవమ్ = ఇట్లుః బహువిధాః= బహుప్రకారములు గలః యజ్ఞాః= యజ్ఞములుః వితతాః = విస్తీర్ణములుః బ్రహ్మణః = వేదముయొక్క; ముఖే = ద్వారమునందు. వేదద్వారమున నెఱుంగఁబడునవి యగుటచే బ్రహ్మణోముఖే వితతాః అని చెప్పఁబడుచున్నవి, "వాచి హి ప్రాణం జుహుమః" * ఇత్యాదిగా. కర్మజాన్ = కాయికవాచిక మానసము లగు కర్మములవలనఁ బుట్టినవానిఁగాః విద్ధి = ఎఱుంగుముః తాన్ సర్వాన్ = వాని నన్నిటిని. ఆత్మవలనఁ బుట్టనివానిఁగా నెఱుంగుము.

♦ ఇందుకు మాధ్వభాష్యము లేదు.

* వాక్కునందు గదా ప్రాణమును వేల్చుచున్నాము.

నిర్వ్యాపారుఁడు గదా ఆత్మ. కావున, ఏవమ్=ఇట్లు; జ్ఞాత్వా = ఎఱింగి; మోక్ష్యసే = విడివడుదువు, అశుభమునుండి. కావు నావ్యాపారము లివి, నిర్వ్యాపారుఁ డను నే నుదాసీనుఁడ నని యిట్లు తెలిసి యీసమ్యగ్దర్శనమువలన సంసారబంధమునుండి ముక్తుఁడ వగుదు వని యర్థము.

ఇట్లు బహువిధము లయిన యజ్ఞములు వేదమునందుఁ జెప్పఁబడి యున్నవి. అవి యన్నియుఁ గర్మజంబులే కాని యాత్మజంబులు కావు, ఇట్లు నీవు ఇవి దేహాదివ్యాపారంబులే కాని నేను నిర్వ్యాపారుఁడ నగుటచే నావ్యాపారములు కా వీయజ్ఞంబు లని యెఱుంగుదువేని సంసారమునుండి ముక్తుఁడ వగుదు వని తా.

ఆ. చెప్పఁబడిన యజ్ఞములు వేదమూలకంబు లగుటచేఁ బురుషబుద్ధికల్పితంబు లను శంకను నిరసించుచున్నాఁడు పూర్వార్ధముచేత. ఈకర్మములు ఆత్మవ్యాపారసాధ్యము లని యాశంకించి నిరాకరించుచున్నాఁడు కర్మజా నిత్యాదిగా. ఆత్మ నిర్వ్యాపారుం డని తెలియుటకు ఫలముఁ జెప్పుచున్నాఁడు ఏవ మిత్యాదిగా. ఎట్లు ఈయజ్ఞములు వేదముయొక్క ముఖంబున విస్తీర్ణములు ? అని యాశంకించి చెప్పుచున్నారు వేదద్వారమున నిత్యాదిగా. వేదద్వారంబున నెఱుంగఁబడుటనే యుదాహరించుచున్నారు వాచిహి ఇత్యాదిగా. « ఏతద్ధస్మవై తత్పూర్వే విద్వాంస ఆహుః » ♦ అని యారంభించి యధ్యయనాదికము నాక్షేపించి యందుకు హేతువుగా వాచిహి అనువాక్యము చెప్పఁబడినది. జ్ఞానశక్తిమద్విషయమునందు క్రియాశక్తిమద్విషయముయొక్క యుపసంహారం బిట వివక్షితము. « ప్రాణో వా వాచం యో హ్యేవ ప్రభవ స్స ఏవా ఒప్యయః » * అనువాక్యము ఇత్యాదిగా అను చోటి యాదిశబ్దముయొక్క యర్థము. జ్ఞానశక్తిగలవియుఁ గ్రియాశక్తిగలవియుఁ దమ యొండొంటికిఁ దా ముత్పత్తిప్రలయస్థానము లగుటవలన నవి లేనియప్పుడు అధ్యయనాదికము సిద్ధింప దని యర్థము. కర్మములు ఆత్మవ్యాపారజన్మములు కా వనుటకుఁ హేతువుఁ జెప్పుచున్నారు నిర్వ్యాపారుఁడు గదా ఇత్యాదిగా. ఆత్మ నిర్వ్యాపారుండనుట ఫలవంత మగుటవలన యెఱుంగవలసిన దని చెప్పుచున్నారు కావున ఇత్యాదిగా. ఈ జ్ఞానమునే తెలుపుచుఁ జెప్పినదాని స్పష్టీకరించుచున్నారు కావు ఇత్యాదిగా.

---

♦ అట్టి దీనినిగదా పూర్వవిద్వాంసులు చెప్పెదరు.

* ప్రాణము గదా వాక్కునకు లయస్థానము. ఏది యుత్పత్తిస్థానమో అదియే లయస్థానము.

హా. ఏవమ్ = మీఁదఁ జెప్పినవిధముగా; బహువిధాః = పెక్కుప్రకారములు గల; యజ్ఞాః; వితతాః = విస్తీర్ణములు; బ్రహ్మణః = పరమాత్మయొక్క; ముఖే = ముఖమునందు, ఈయజ్ఞములు పరమాత్మకు సమీపము లగు ఆరాధనములని యర్థము. ఆయజ్ఞముల నన్నిటని, కర్మజాన్ = వాఙ్మనః కాయకర్మాత్మకములనుగా, విద్ధి. స్వరూపభూతుఁ డయిన యాత్మ శుద్ధకూటస్థరూపుఁ డగుటవలన.

శం. నీచేఁ గల్పింపఁబడినవి యీయజ్ఞములు శాస్త్రీయములు కావని యాశంకింపఁగా; కల్పితములు కావు, అవి వేదమూలకంబు లని చెప్పుచున్నాఁడు.— ఏవమ్ = దైవ మేవేత్యాదిగా, బహువిధాః = బహుప్రకారము లగు; యజ్ఞాః = ఈ చెప్పఁబడిన యజ్ఞములు; బ్రహ్మణః = వేదముయొక్క; ముఖే = ముఖముచేత నే; వితతాః=విస్తరింపఁబడినవి, ప్రతిపాదింపఁబడినవి యని యర్థము. ఓయీ! యజ్ఞవిదో యాన్తి బ్రహ్మసనాతనమ్మనుటచే యజ్ఞములుగూడ సాక్షా న్మోక్షసాధనంబు లని తెలియవచ్చుచున్నది, జ్ఞానప్రయాస యేల? అని యాశంకింపఁగా; అట్లు కాదు అవియుఁ గర్మములే యగుటవలన « నకర్మణాన ప్రజయా " ఇత్యాదిబహుశ్రుతివిరోధమువలన నిత్యఫలము నియ్యఁ జాలవు అనిత్యఫలమునే యిచ్చు నని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—కర్మజాన్ = « క్రియాం కుర్వద్ధి కారకమ్» * అని చెప్పఁబడుటవలన, కర్మకారకంబులవలనఁ బుట్టినవి కర్మజములు, వాగాదీంద్రియములవలనఁ బుట్టినవి, అట్టివానిని గానే, కర్మములనుగానే యనుట; తాన్ సర్వాన్ = ఆయజ్ఞముల నన్నిటిని; విద్ధి. ఓయీ! అపూర్వములుగదా ఆయజ్ఞములు వాగాదీంద్రియవ్యాపారజన్యంబులే యయినను; అందు వేని అపూర్వములైనను అవి కర్మములు గాక తప్పదు, అందువలననే యవి యనిత్యఫలముల నిచ్చునవి. ఏవంజ్ఞాత్వా = ఇట్లు తెలిసి, నిత్యఫల మొసంగునట్టి జ్ఞానము నొంది సంసారమునుండి, విమోక్ష్యసే, కాని యనిత్యఫలదంబు లగు యజ్ఞములనే పొందినచో ముక్తుఁడవు కాఁ జాల వని యర్థము.

మ. ఏమి నీవు స్వబుద్ధికల్పనచేతనే యిట్లుచెప్పుచున్నావా? అనఁగా కాదు, వేదమే యిందుకుఁ బ్రమాణం బని చెప్పుచున్నాఁడు.—ఏవమ్ = ఇట్లు చెప్పఁబడిన; బహువిధాః = బహుప్రకారము లగు; యజ్ఞాః = సమస్తవేదోక్తశ్రేయస్సాధనరూపము లగు యజ్ఞములు; బ్రహ్మణః = వేదముయొక్క; ముఖే = ద్వారమునందు; వితతాః=విస్తరింపఁబడినవి, వేదమూలంబుననే యివి తెలియఁబడినవి యని యర్థము.

* క్రియను జేయునది గదా కారకము.

ఇటువేఱువేఱుగా వేదవాక్యములు విస్తరభయంబున నుదాహరింపఁబడినవి కావు. కర్మజాన్ = కాయిక వాచిక మానసకర్మములవలనఁ బుట్టినవానిఁగా; విద్ధి = ఎఱుఁగుము; తాన్ సర్వాన్ = ఆయజ్ఞముల నన్నిటిని. ఆత్మజములనుగా నెఱుఁగ వలదు. నిర్వ్యాపారుఁడు గదా ఆత్మ, కావున నివి యాత్మవ్యాపారములు కావు, మఱేమనఁగా నిర్వ్యాపారుఁ డను ఉదాసీనుఁడను నేను, ఏవమ్ = అని యీవిధముగా; జ్ఞాత్వా, విమోక్ష్యసే, ఈసంసారబంధమునుండి యని శేషము.

శ్రీ. జ్ఞానయజ్ఞమును స్తుతించుటకై మీఁదఁజెప్పిన యజ్ఞముల నుపసంహరించుచున్నాఁడు.—బ్రహ్మణః=వేదముయొక్క; ముఖే, వితతాః—వేదముచేత నే విధింపఁబడినవి యని యర్థము. అట్లయినను; తాన్ సర్వాన్; కర్మజాన్ = వాఙ్మనఃకాయకర్మములవలనఁ బుట్టువానిఁగా, ఆత్మస్వరూపముతో సంబంధము లేనివానిఁగా; విద్ధి= తెలియుము. ఆత్మ కర్మగోచరుఁడు కాకుండుటవలన. ఏవం జ్ఞాత్వా—జ్ఞాననిష్ఠుఁడవై; సంసారమునుండి, విమోక్ష్యసే = విముక్తుఁడవు కాఁ గలవు.

ప. ఇక జ్ఞానయోగమును స్తుతించుటకై యితరయజ్ఞముల నుపసంహరించుచున్నాఁడు.—ఏవమ్ = ఈవిధమున; బ్రహ్మణో ముఖే = బ్రహ్మమునుండి వెడలిన వేదమునందు; బహువిధాః యజ్ఞాః; వితతాః—విస్తరంబునఁ జెప్పఁబడియున్నవి. తాన్ సర్వాన్; కర్మజాన్ = కర్మమువలన నిష్పన్నము లగువానిఁగా; విద్ధి = తెలియుము. అందువలనఁ గర్మము చేయవలసినదియే. ఏవమ్=ఇట్లుకర్మము చేసి; జ్ఞాత్వా= చిత్తశుద్ధిద్వారమున జ్ఞానము నొంది; విమోక్ష్యసే = మోక్షము నొందఁ గలవు.

రా. ఏవమ్ = ఇట్లు; బహువిధాః = బహుప్రకారము లగు; యజ్ఞాః = కర్మయోగములు; బ్రహ్మణో ముఖే వితతాః — ఆత్మతత్త్వప్రాప్తికి సాధనము లయియున్నవి ♦. తాన్ సర్వాన్ = చెప్పఁబడిన లక్షణములు గలవియుఁ జెప్పఁబడిన భేదములు గలవియు నగు ఆకర్మయోగముల నన్నిటిని; కర్మజాన్ = ప్రతిదినమును అనుష్ఠించు నిత్యనైమిత్తికకర్మములవలనఁ బుట్టినవానిఁగా; విద్ధి. ఏవం జ్ఞాత్వా—చెప్పిన విధంబున ననుష్ఠించి; విమోక్ష్యసే.

ఇట్లు పలువిధము లగు కర్మయోగములు ఆత్మతత్త్వప్రాప్తికి సాధనము లయి యున్నవి. అవి యన్నియుఁ బ్రతిదినము ననుష్ఠించునట్టి నిత్యనైమిత్తికకర్మములవలననేఁ గలుగుచున్నవి. కావున నీవు మీఁదఁ జెప్పినవాని ననుష్ఠించినచో ముక్తి బొందఁ గల వని తాత్పర్యము.

---

♦ బ్రహ్మణః = ఆత్మయొక్క, ముఖే = తత్త్వప్రాప్త్యుపాయమయిన కర్మయోగమునందు; వితతాః.

మా. బ్రహ్మణః = పరమాత్మయొక్క, ముఖే « అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభు రేవచ » అని చెప్పఁబోవుచున్నాఁడు. ఏవం జ్ఞాత్వా = ఇట్లు తెలిసి వాని నన్నిటిని జేసి; విమోక్ష్యసే. యుద్ధమును విడిచి దేని మోక్షార్థము చేయుదువో అదియును గర్మమే, కావున విహిత మైనదాని విడువఁగూడ దని భావము.

శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప
సర్వం కర్మా ఽఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే. 33

భా. బ్రహ్మార్పణ మిత్యాదిశ్లోకముచే సమ్యగ్దర్శనమునకు యజ్ఞత్వము సంపాదింపఁబడినది. యజ్ఞములును అనేకవిధము లుపదేశింపఁ బడినవి. సిద్ధపురుషార్థప్రయోజనము లగునాయజ్ఞములచే జ్ఞానము స్తుతింపఁబడుచున్నది. ఎట్లు ?—శ్రేయాన్ = శ్రేష్ఠము; ద్రవ్యమయాత్ = ద్రవ్యసాధనసాధ్య మయిన; యజ్ఞాత్ = యజ్ఞముకంటె; జ్ఞానయజ్ఞః = సమ్యగ్దర్శనరూప మగుయజ్ఞము. పరన్తప = ఓశత్రువుల వధించువాఁడా ! ద్రవ్యమయ మయిన యజ్ఞము ఫలముగలిగించునది గదా ! జ్ఞానయజ్ఞమో ఫలము గలిగించునది గాదు. కావున శ్రేష్ఠము. ఎందువలన ననఁగా.— సర్వమ్ = సమస్త మయిన; అఖిలమ్ = నిశ్శేష మయినది; కర్మ = కర్మము; అప్రతిబద్ధముగా, పార్థ = పృథాపుత్త్రుఁడా ! జ్ఞానే = మోక్షసాధనము సర్వతః సంప్లుతోదక స్థానీయ మగు జ్ఞానమునందు; పరిసమాప్యతే—అంతర్భవించుచున్నది యని యర్థము. « యథా కృతాయ విజితా ఽధరేయా స్సంయ న్త్యేవ మేనం సర్వం త దభిసమేతి య త్కించిత్ప్రజా స్సాధు కుర్వన్తి య స్త ద్వేద య త్సవేద » ◆ అను శ్రుతివలన.

అర్జునా ! ద్రవ్యసాధ్య మయినయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠము. ఏల యనగా నిశ్శేషముగా సమస్తకర్మమును జ్ఞానమునం దంతర్భావము నొందుచున్నది యని తాత్పర్యము.

ఆ. కర్మయోగము బహువిధముగాఁ బ్రతిపాదింపఁ బడుటవలన శ్రేయస్సాధనం బంతయుఁ గర్మాత్మకమే యని తలఁచి యర్జునుండు కేవలజ్ఞానము నాదరింపఁ

◆ ఎట్లు జయింపఁబడిన కృతంబునకుఁ దక్కువ యగు నితరములైన యాయములుం జేరుచున్నవో, అట్లు వీని అది యంతయుఁ బొందుచున్నది—ఏసాధుకర్మమును బ్రజలు చేయుదురో అది, ఎవ్వఁడు దాని నెఱుంగునో వానిని, దేని నతఁ డెఱుంగునో దానిని.

డని యెంచి పూర్వవృత్తము ననువదించుచు మీఁది శ్లోకమునకుఁ దాత్పర్యము చెప్పుచున్నారు బ్రహ్మార్పణ మిత్యాదిగా. సిద్ధపురుషార్థప్రయోజనములు = సిద్ధమయిన పురుషార్థము—పురుషునిచే నపేక్షింపఁబడునది ప్రయోజనముగాఁ గలవి. ఆయజ్ఞములచేత—ఇంతకు మున్నుపదేశింపఁబడినవానిచేత నని యర్థము. ప్రశ్న పూర్వకముగా స్తుతించువిధముఁ బ్రకటించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. జ్ఞానయజ్ఞము ద్రవ్యయజ్ఞమునకన్న శ్రేయం బనుటకు హేతువుఁ జెప్పుచున్నారు శ్రేయానిత్యాదిగా. ద్రవ్యసాధనసాధ్యం బనుట స్వాధ్యాయాదికమునకుఁగూడ నుపలక్షణము, వానికన్నను జ్ఞానయజ్ఞము శ్రేయం బనుట సమాన మగుటవలన. ద్రవ్యమయాదియజ్ఞములకన్నను జ్ఞానయజ్ఞను శ్రేయం బనుటను బ్రపంచించుచున్నారు ద్రవ్యమయము ఇత్యాదిగా. ఫలముక్—అభ్యుదయము నని యర్థము. ఫలము గలిగించునది కాదు—ఒకానొకఫలమును బుట్టించునది గాదు, మ ఱేమనఁగా నిత్యసిద్ధమగు మోక్షము నభివ్యంజించునది యని యర్థము. అది శ్రేయంబనుటకు మఱియొక హేతువుఃజెప్పుచున్నారు ఎందువలన ననఁగా అని. సమస్తమయిన యనుటచే అగ్నిహోత్రాదికము చెప్పఁబడుచున్నది. అఖిలమ్—ఖలము అనఁగా శేషము, అది లేనిది, మిక్కిలి గొప్పది యని యర్థము. సర్వమ్ అఖిలమ్ అని రెండుపదములు చెప్పుట సంకోచము లేక యని తెలుపుటకొఱకు. సర్వకర్మమును జ్ఞానమునం దంతర్భవించుచున్న దనువిషయమునందు ఛాందోగ్యశ్రుతిని బ్రమాణముగాఁ జూపుచున్నారు యథేత్యాదిగా. నాలుగాయములు గల జూదమునందు నాలుగంగములు గలది యొకటి కృత మని చెప్పఁబడును, అట్టి, విజితాయ = జయింపఁబడిన, కృతాయ = కృతముకొఱకు; తదర్థము లగుటచే, అధరేయాః = దానికంటెఁ గ్రిందివి, మూఁడంగములు రెండంగములు ఒకయంగము గల త్రేతాద్వాపరకలినామకంబు లగు ఆయములు; యథా = ఎట్లు, సంయన్తి= చేరుచున్నవో. చతురంగ మగు నాయమునందుఁ ద్రిద్వ్యేకాంగము లగు నాయము లంతర్భవించును గదా! మహాసంఖ్యయందుఁ దక్కువసంఖ్య కంతర్భాన మావశ్యక మగుటవలన. ఏవమ్ = ఇట్లు; ఏనమ్ = విద్యావంతుఁ డగుపురుషుని; సర్వం తత్ = అది యంతయు; అభిసమేతి = అభిముఖముగాఁ జేరుచున్నది. విద్వాంసుఁ డగు పురుషునియందు ఏది యంతయు నంతర్భవించునో అది యేది యనఁగాఁ జెప్పఁబడుచున్నది.—ప్రజాః = ప్రజలందఱు; యత్ కించిత్ = దేనిదేని; సాధు = మంచికర్మమును; కుర్వన్తి = చేయుచున్నారో; అది యంతయు నని యర్థము. ఏన మభిసమేతి యని చెప్పఁబడిన యావిద్యావిత్పురుషునకు విశేషణము

చేయుచున్నది యత్తద్వేద అని. ఎవ్వఁడు దాని నెఱుంగునో అని యర్థము. అది యేది యనఁగా దానినే విశదీకరించుచున్నది యత్సవేద అని. దేనిని అతఁడు ఎఱుంగుచున్నాఁడో అని యర్థము. ఆయొక్కఁడు ఏతత్త్వము నెఱుంగుచున్నాఁడో ఆతత్త్వమును ఇతరుఁడును ఎవ్వఁ డెఱుంగుచున్నాఁడో అట్టి పురుషునిఁగూడ సమస్తసాధుకర్మమును అభిముఖముగాఁ జేయుచున్నది యని యన్వయము.

హ. జ్ఞానముచేఁ గలుగుయజ్ఞము జ్ఞానయజ్ఞము, మనోనియమరూప మగుటచేఁ బరమాత్మబోధమునకు సమీప మగుటవలన. సర్వమ్—క్రియారూపమును ఉపాసనారూపమును. జ్ఞానే = పరమాత్మబోధమునందు; పరిసమాప్యతే= లయము నొందుచున్న దని యర్థము.

శం. అందువలననే బ్రహ్మార్పణ మనుమంత్రముచేఁ బ్రతిపాదింపఁబడిన జ్ఞానయజ్ఞము సాక్షాన్మోక్షైకసాధనం బగుటవలన వ్యవహితసాధనము లగు దైవాదియజ్ఞములకన్న నుత్కృష్టమని చెప్పుచున్నాఁడు.—ద్రవ్యమయాత్ = ద్రవ్యమంత్రతంత్రక్రియాదిసాధ్య మయిన; అనిత్యము అల్పము నగు స్వర్గాదిఫలమునకు హేతు వగు, యజ్ఞాత్ = మీఁదఁ జెప్పిన సమస్తయజ్ఞసమూహముకంటె; నిత్యనిరతిశయానందమోక్షైకఫలద మగు, జ్ఞానయజ్ఞః = జ్ఞాన మనుయజ్ఞము; శ్రేయాన్ = మిక్కిలి శ్రేష్ఠము. ఎందువలన ననఁగా. జ్ఞానే; పురుషునకుఁ గర్తవ్యమగు శ్రౌతస్మార్తలౌకికకర్మ మేదేది యెంతెంత గలదో అది, సర్వమ్ = సమస్తమును; అఖిలమ్ = నిశ్శేషముగా, పరిసమాప్యతే = సమాప్త మగుచున్నది. ఎట్లు గట్టెక్కినవానికి మరలఁ బోవలసినది లేదో అట్లు జ్ఞానము పొందినవానికిఁ జేయవలసిన దేదియు లే దని యర్థము. లేక. జ్ఞానే = జ్ఞానముఁ బొందఁబడఁగా; కర్మ = అనేకబ్రహ్మకల్పములు చేసిన సంచితమును ఆగామియు; సర్వమ్ = సమస్తమును; అఖిలమ్ = నిశ్శేషముగా; పరిసమాప్యతే—సూర్యప్రకాశముచేఁ జీఁకటివలెఁ గర్మము సమస్తమును నిర్మూలింపఁబడు నని యర్థము. లేక. “యథాకృతాయ విజితా యాధరేయా స్సంయన్తి” అనుశ్రుతిచేఁ జెప్పఁబడిన విధమున, లోకమున నంతటను బుణ్యవంతు లగువారు యజ్ఞదానతపోవ్రతాది పుణ్యకర్మ మేమేమి చేయుదురో, అపుణ్యకర్మ మంతయును; జ్ఞానే = జ్ఞానము పొందఁబడఁగానే; విద్వాంసునిచే, పరిసమాప్యతే = ప్రాప్త మగుచున్నది. జ్ఞానము పొందుటచే విద్వాంసుఁడు సర్వకర్మముల ననుష్ఠించినవాఁ డగుచున్నాఁ డని యర్థము.

మ. అన్నిటిని సమానములవలెఁ జెప్పుటవలనఁ గర్మజ్ఞానములకు సామ్యము ప్రాప్తింపఁగాఁ జెప్పుచున్నాఁడు.—ద్రవ్యమయాత్ = ద్రవ్యోపలక్షిత మయిన, జ్ఞాన

శూన్యమయిన; యజ్ఞాత్ = సంసారమే ఫలముగాఁ గల సమస్తయజ్ఞముకంటె; జ్ఞానయజ్ఞః = జ్ఞానయజ్ఞ మొకటియే; శ్రేయాన్ = మిక్కిలి శ్రేష్ఠము, సాక్షాన్మోక్షఫలం బగుటవలన. ఓ పరంతపుఁడా! ఎందువలన ననఁగా. సర్వం కర్మ = సమస్త మయిన యిష్టిపశుసోమచయనరూపమగు శ్రౌతకర్మమును; అఖిలమ్ = నిశ్శేషము, స్మార్తమగు ఉపాసనాదిరూపకర్మ మేది గలదో అదియును; జ్ఞానే = బ్రహ్మాత్మైక్య సాక్షాత్కారమునందు; పరిసమాప్యతే = ప్రతిబంధనాశనద్వారంబునఁ బర్యవసానము పొందుచున్నది, “త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసా ऽనాశకేన, ధర్మేణ పాప మపనుదతి” * అను శ్రుతివలనను, “సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతే రశ్వవత్” † అను న్యాయంబువలనను అని యర్థము.

శ్రీ. కర్మయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞ మే శ్రేష్ఠ మని చెప్పుచున్నాఁడు.—ద్రవ్యమయాత్ యజ్ఞాత్ = అనాత్మవ్యాపారజన్య మయిన దైవాదియజ్ఞముకంటె; జ్ఞానయజ్ఞః; శ్రేయాన్ = శ్రేష్ఠము. జ్ఞానయజ్ఞముకూడ మనోవ్యాపారాధీనమే యగును, అయినను ఆత్మస్వరూప మగుజ్ఞానము మనోవృత్తియందు అభివ్యక్తము మాత్రమే యగుం గాని తజ్జన్యము కాదు. కావున ద్రవ్యమయముకంటె విశేషము గలదు. శ్రేష్ఠం బనుటకు హేతువు.—సర్వమ్ కర్మ; అఖిలమ్ = ఫలసహితముగా; జ్ఞానే; పరిసమాప్యతే—అంతర్భవించుచున్న దని యర్థము. “సర్వం త దభిసమేతి యత్కించి త్ప్రజా స్సాధు కుర్వన్తి” అను శ్రుతివలన.

ప. జ్ఞానయోగమును స్తుతించుచున్నాఁడు.—ద్రవ్యమయాత్ యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః శ్రేయాన్—ద్రవ్య మనఁగా స్వర్గాదివిషయభోగము, తన్మయం బనఁగా దానిని బొందించునది, అట్టి ద్రవ్యమయయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము, శ్రేయాన్ = అతిశయముచే శ్రేయస్సాధకము, పరమసుఖము నొందించునది. ఇఁక దీనినే వివేచించి చెప్పుచున్నాఁడు.—కర్మము రెండువిధములు ఖిలము అఖిలం బని. అందు

* అట్టి యీయాత్మను బ్రాహ్మణులు ఎఱుంగఁ గోరుచున్నారు యజ్ఞముచేతను దానముచేతను అనశనాదితపస్సుచేతను, ధర్మముచేఁ బాపమును బరిహరించుకొనుచున్నాఁడు.

† బ్ర-సూ. అ-3. పా-౪. సూ-౨౬. జ్ఞానమునకు యజ్ఞాదికర్మము అనావశ్యకమా? అవశ్యకమా? అనఁగాఁ జెప్పుచున్నారు. సర్వాపేక్షా చ = సర్వకర్మములయపేక్షయుఁ గలదు, యజ్ఞాదిశ్రుతేః = తమేత మిత్యాదిశ్రుతిచే యజ్ఞాదులచే వివిదిష గలుగు నని చెప్పుటవలన. అశ్వవత్—ఎట్లు యోగ్యతావశమున గుఱ్ఱము నాఁగేటికి ఉపయోగింపక రథమునకుమాత్రమే యుపయోగపడుచున్నదో అట్లు యజ్ఞాదికర్మము జ్ఞానఫలమునం దుపయోగింపను, జ్ఞానోత్పత్తియందుమాత్రమే ముపయోగించును.

ఖలము దుష్టమైనఫలము గలిగించునది, అఖలము జ్ఞానము గలిగించునది. ఇట్లు, సమస్తమయిన, అఖిలం కర్మ, జ్ఞానే; పరిసమాప్యతే = జ్ఞానమునందుఁ బర్యవసానము నొందుచున్నది, ఖలమో తద్విపరీతముగాఁ అజ్ఞానమునందుఁ బర్యవసానము నొందు నని యర్థము.

రా. అంతర్గతజ్ఞానం బగుటచేఁ గర్మము జ్ఞానాకారం బని చెప్పఁబడినది. అట్లంతర్గతజ్ఞానం బగుకర్మమునందు జ్ఞానాంశమే ప్రధానం బని చెప్పుచున్నాఁడు — ఉభయాకార మయినకర్మమునందు ద్రవ్యమయ మయిన యంశముకంటె జ్ఞానమయమైన యంశము శ్రేయము. ఏల యనఁగా. సర్వం కర్మ = సమస్త మయిన కర్మమును; అఖిలమ్=తదితర మయినయుపాదేయము సమస్తమును; జ్ఞానే, పరిసమాప్యతే—సమస్తసాధనములచేతనుం బ్రాప్య మయిన యాజ్ఞానమే కర్మాంతర్గతముగా నభ్యసింపఁబడుచున్నది. అదియే యభ్యసింపఁబడుచుఁ గ్రమంబునఁ బ్రాప్యదశను * బొందుచున్నది.

మా. అఖిలమ్ = ఉపాసనాదు లగు అంగములతోఁ గూడిన. సర్వకర్మమునకును జ్ఞానమే ఫల మని యర్థము.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః. 34

భా. అట్టి యీ యుత్తమ మయినజ్ఞానము నప్పుడు దేనిచేఁ బొంద నగును? చెప్పెదము.—తత్ = దానిని; విద్ధి = ఎఱుంగుము, ఏవిధిచేఁ బొంద నగునో అట్లు. ఆచార్యులయొద్దకుఁ బోయి, ప్రణిపాతేన= మిక్కిలి నీచముగాఁబడుట ప్రణిపాతము—దీర్ఘ మయిననమస్కారము, దానిచేతను; ఎట్లు బంధము? ఎట్లు మోక్షము? ఎట్లు విద్య? ఎట్లు మఱి యవిద్య? అని, పరిప్రశ్నేన = అన్నివిధముల నడుగుటచేతను; సేవయా = గురుశుశ్రూషచేతను; ఇవి మొదలగువానిచేత. ప్రశ్రయముచే ఆవర్జితులైన † ఆచార్యులు, ఉపదేక్ష్యన్తి = చెప్పుదురు; తే = నీకొఱకు; జ్ఞానమ్ = చెప్పిన విశేషణము గల జ్ఞానమును; జ్ఞానినః= జ్ఞానము గలవారు; జ్ఞానము గలవా

---

* ప్రాప్యమయిన జ్ఞానముయొక్క యవస్థను.

† వశీకరింపఁబడిన.

లైనను గొందఱు చక్కగాఁ దత్త్వదర్శనము గలవారు కారు, కొందఱు మాత్రమే యగుదురు, కావున విశేషణము తత్త్వదర్శినః అని. ఎవ్వరు సమ్యగ్దర్శనము గలవారో వార లుపదేశించినజ్ఞానము కార్యసమర్థం బగును, ఇతరము గాఁ జాల దని భగవంతుని యభిప్రాయము.

ఆచార్యులయొద్దకుఁ బోయి వారలకు నమస్కరించి నీసంశయములు దీఱునట్లు వారల నన్నివిషయముల నడిగి వారికి శుశ్రూష చేయుట మొదలగు నుపాయంబుల నాజ్ఞానము నెఱుంగుము. తత్త్వసాక్షాత్కారము గల జ్ఞానులు నీయం దనుగ్రహము గలవారలై నీ కట్టిజ్ఞానము నుపదేశింతు రని తాత్పర్యము.

ఆ. ఇట్టిజ్ఞానమే శ్రేష్ఠ మయినచో అప్పుడు దీని నేయుపాయంబునఁ బొంద వచ్చును? అని యడుగుచున్నాఁడు అట్టి యీ ఇత్యాదిగా. జ్ఞానము నొందుటకు సమీప మయిన యుపాయము నుపదేశించుచున్నారు చెప్పెదము అని. ఆవి జ్ఞానమును గురువులవలన నెఱుంగుము, గురువులును బ్రణిపాతాదు లగు నుపాయములచేత నీయం దనుగ్రహము గలవారై చెప్పుదు రని చెప్పుచున్నాఁడు పూర్వార్థముచేత. ఉపదేశము చేయుట పరోక్షజ్ఞానము కలిగినమాత్రమున సంభవింప దని చెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత. ఏవిధిచేత.—ఆచార్యులయనుగ్రహము పొందుట మొదలగు నేవిధిచేత వారి యుపదేశమువలన జ్ఞానము పొంద నగునో అట్లు ఆజ్ఞానమును ఆచార్యులవలనఁ బొందు మని యర్థము దానినే స్పష్టీకరించుచున్నారు ఆచార్యులయొద్దకు ఇత్యాదిగా. ఇవి మొదలగు వానిచేత—ఇట మొదలుశబ్దముచే శమాదులు గ్రహింపఁబడుచున్నవి. ఇవి మొదలగువానిచే నెఱుంగు మని పూర్వమున కన్వయము. ఉత్తరార్థము వివరించుచున్నారు ప్రశ్రయముచే నిత్యాదిగా. ప్రశ్రయం బనఁగా భక్తిశ్రద్ధాపూర్వక మగు నిరతిశయమైన నమ్రత. చెప్పినవిశేషణము గల—మున్ను చెప్పినచొప్పున శ్రేష్ఠ మయిన యని యర్థము. విశేషణమునకుఁ బునరుక్తతను బరిహరించుటకై వేఱు అర్థమును జెప్పుచున్నారు జ్ఞానము గలవారైనను ఇత్యాదిగా. జ్ఞానినః అని చెప్పి మరల తత్త్వదర్శినః అని చెప్పుచున్న భగవంతునియభిప్రాయముఁ జెప్పుచున్నారు ఎవ్వరు ఇత్యాదిగా. ఆచార్యవిషయ మయిన యీబహువచనము «బహుభ్యశ్శ్రోతవ్యం బహుధాచ" * అను సామాన్యన్యాయము ననుసరించి, కాని ఆత్మజ్ఞానము నుద్దేశించి యాచార్యు లనేకులు కావలయు నని వివక్షి

* అనేకులవలన శ్రవణము చేయవలయును అనేకవిధములుగాఁ గూడ శ్రవణము చేయవలయును.

తము కాదు, ఆత్మజ్ఞానము తత్త్వసాక్షాత్కారము గల యాచార్యుని యొకని యుప దేశమునసే యుదయించుట సంభవించుటవలన.

హ. ఇట్టి పరమాత్మను ఎట్లు నేనెఱుంగుదును? అనఁగాఁ జెప్పుచు న్నాఁడు.—తత్ = అజ్ఞానరూప మగు బ్రహ్మమును; విద్ధి = ఎఱుంగుము. ప్రణిపా తేన = ప్రకర్షంబున నీచముగాఁ దండవత్పతనము ప్రణిపాతము నమస్కారవిశేషము, దానిచేత; పరిప్రశ్నేన = అంతటనుం జూచి గురువుమనస్సునందలి ప్రసాదము నిరీ క్షించి ప్రశ్న చేయుటచేత, సేవయా = గురువు నిచ్ఛ ననువర్తించుటచేత. ఇట్లు చేసినచో, ఉపదేక్ష్యన్తి; తే = నీకు; జ్ఞానమ్ = పరమార్థజ్ఞానస్వరూప మగు బ్రహ్మ మును; జ్ఞానినః = జ్ఞానము గలవారు; తత్త్వదర్శినః = సాక్షాత్కరింపఁబడినపరమా ర్థము గలవారు.

శ్రీ. ఇట్టి యతిశయము గల జ్ఞానము నా కెట్లు సిద్ధించు ననఁగాఁ జెప్పు చున్నాఁడు.—ఏది మఱి ద్రవ్యయజ్ఞాదులకంటెఁ బ్రశస్తతరము సాక్షాన్మోక్షఫలప్ర దము నగునో, తత్ = అజ్ఞానమును. గురువులవలన, విద్ధి—గురువులను బ్రసన్ను లుగాఁ జేసికొని వారివలన నెఱుంగు మని యర్థము. దేనిచేఁ బ్రసన్నులయి గురువు లత్యంతరహస్యమయిన యీజ్ఞానమును నా కుపదేశింతు రనఁగా జెప్పుచున్నాఁడు.— ప్రణిపాతేన = ప్రణిపాత మనఁగా సాష్టాంగనమస్కారము, దానిచేతను; సేవయా = ఆయాకాలమునందు శ్రద్ధాభక్తులతోఁ జేయు శుశ్రూషచేతను; పరిప్రశ్నేన = సమ యంబున వినయముతో సమీపించి చేయు పరిప్రశ్నముచేతను, ఎట్లు బంధము? ఎట్లు మోక్షము? విద్యా అవిద్యలు రెండును ఎట్టివి? ఎవ్వఁ డాత్మ? పరమాత్మ యెవ్వఁడు? వారలయైక్యం బెట్లు? చెప్పుము ఇత్యాదిగా వివేకించి యడుగుట చేతను; ఇట్లు ప్రణిపాతశుశ్రూషావివేకప్రశ్నములచేత నీయందు శ్రద్ధాభక్తులను పాండిత్యమును ఉపదేశయోగ్యతను జూచి ప్రసన్నులయి; జ్ఞానినః = శాస్త్రజన్యజ్ఞా నము గలవారు; తత్త్వదర్శినః = సాక్షాత్కారజన్య మగు వస్తుయాథాత్మ్యజ్ఞానము గలవారు; ఈరెండువిశేషణములతోఁ గూడినవా రుపదేశించినజ్ఞానమే సంసారనివ ర్తకం బగును, కావున గురువునందు రెండువిశేషణంబు లుండవలయును; ఇట్టి లక్షణ ములతోఁ గూడినగురువులు, తే = శమదమాదిసాధనసంపన్నుఁడ వగు నీకొఱకు; జ్ఞానమ్ = బ్రహ్మాత్మైకత్వబోధకము నిశ్శేషముగా సంసారభ్రమము నశింపఁజేయునది యగు జ్ఞానమును; ఉపదేక్ష్యన్తి—దయచే ననుగ్రహింతు రని యర్థము. « శ్రోత్రియం

బ్రహ్మనిష్ఠమ్" అనుశ్రుతి చెప్పుటవలన, జ్ఞానినః అనుటచే తత్త్వము బోధించుటయందు గురువులకు సర్వశాస్త్రార్థపరిజ్ఞానంబును తత్త్వదర్శినః అనుటచే వస్తువిషయంబున అప్రతిబద్ధ మగు ననుభవంబును ఉండవలయు నను నభిప్రాయముచే రెండువిశేషణములు చెప్పఁబడినవి. ఇఁక బహువచనమో, "బహుభ్యశ్శ్రోతవ్యం బహుధా" అనున్యాయము ననుసరించి బహుగురువు లున్నయెడ వారిలో నొకఁడు బ్రహ్మవిత్తముఁడు లభించును, వానివలన సంసారభ్రమనాశకం బగు సమ్యక్ జ్ఞానము సలక్షణముగా లభించు ననునభిప్రాయంబునఁ జెప్పఁబడినది; కాని అనేకులవలన జ్ఞానము సంపాదింపవలయు నని కాదు, శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ అని యేకవచనమునే శ్రుతి వచియించుటవలన, "ఉపసీదే దేక మేవ సద్గురుం బ్రహ్మవిత్తమమ్" * అను వచనమువలనఁ గూడ. అందువలన శాస్త్రజ్ఞుఁడును తత్త్వజ్ఞుఁడు నగు గురువు నాశ్రయింపవలయు నని సిద్ధము.

మ. ఇట్టి జ్ఞాన మెందుట కేది మిక్కిలి సమీపమయిన యుపాయం బనఁగాఁ జెప్పుచున్నాఁడు.—తత్ = సర్వకర్మఫలభూత మయిన యాజ్ఞానమును; విద్ధి = పొందుము; ఆచార్యులయొద్దకుఁ బోయి వారలకు, ప్రణిపాతేన = మిక్కిలి నీచముగాఁ బడుట ప్రణిపాతము, దీర్ఘనమస్కారము, దానిచేత; ఎవ్వఁడ నేను? ఎట్లు బద్ధుఁడ నైతిని? ఏయుపాయముచే ముక్తుఁడ నగుదు? ఇత్యాదిగా, పరిప్రశ్నేన = బహువిషయములఁ బ్రశ్న సేయుటచేత; సేవయా = అన్నివిధంబులను వారికనుకూలముఁ జేయుటచేత. ఇట్లు భక్తిశ్రద్ధాపూర్వక మగు నమ్రతాతిశయముచే నభిముఖులై, ఉపదేక్ష్యన్తి = ఉపదేశముచేఁ గలిగింతురు; తే = నీకు; జ్ఞానమ్ = సాక్షాన్మోక్షఫలం బగు పరమాత్మవిషయజ్ఞానమును; జ్ఞానినః= పదవాక్యన్యాయాదులగు శాస్త్రములందు సమర్థులు ♦, తత్త్వదర్శినః=తత్త్వసాక్షాత్కారము గలవారుపదేశించిన జ్ఞానమే ఫలప్రద మగును గాని సాక్షాత్కారము లేని పదవాక్యాదిశాస్త్రజ్ఞు లుపదేశించినది కా దని భగవంతుని మతము "తద్విజ్ఞానార్థం సగురు మేవాభిగచ్ఛే త్సమిత్పాణిం శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" అను శ్రుతికిని సమ్మతము, అందును శ్రోత్రియమ్—వేదాధ్యయనము చేసినవానిని బ్రహ్మనిష్ఠమ్—బ్రహ్మసాక్షాత్కారము గలవానిని అని వాఖ్యానము చేయుటవలన. ఇఁక ఆచార్యవిషయకం

* బ్రహ్మవిత్తముం డగు సద్గురువు నొక్కనినే యాశ్రయింపవలయును.

♦ పదము—వ్యాకరణము, వాక్యము—తర్కము, న్యాయము—మీమాంస.

బయిన యీబహువచనమో ఒకనియందే గౌరవాతిశయము కొఱకు, కాని బహుత్వము వివక్షించి కాదు, తత్త్వసాక్షాత్కారము గల యాచార్యుఁ డొక్కనివలననె తత్త్వజ్ఞానము గలిగిన పిమ్మట దాని కొఱకు మఱియొక యాచార్యునియొద్దకుఁ బోవుట సంభవింపమివలన నని యెఱుంగునది.

శ్రీ. ఇట్టి యాత్మజ్ఞానమునకు సాధనముఁ జెప్పుచున్నాఁడు.—తత్ = అజ్ఞానమును; విద్ధి = పొందుము. జ్ఞానులకు, ప్రణిపాతేన = దండాకారముగా నమస్కరించుటచేతను; అంత, పరిప్రశ్నేన = ఏందువలన నాకీ సంసారము వచ్చెను? ఎట్లు నివర్తిల్లును? అని ప్రశ్నచేతను; సేవయా=శుశ్రూషచేతను. జ్ఞానినః=శాస్త్రజ్ఞులును; తత్త్వదర్శినః = అపరోక్షానుభవము గలవారు నగువారు; తే = నీకు; జ్ఞానమ్; ఉపదేక్ష్యన్తి = ఉపదేశముచేఁ గలిగింతురు.

ప. ఇట్టి యాత్మజ్ఞానమునకు సాధనముఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకముల చేత.—తత్త్వదర్శినః జ్ఞానినః = అపరోక్షానుభవము గల జ్ఞానులు; తే = నీకు; జ్ఞానమ్; ఉపదేక్ష్యన్తి, తత్ విద్ధి = అట్టి జ్ఞానము నెఱుంగుము.

రా. తత్ = ఆయాత్మవిషయ మగుజ్ఞానమును, అవినాశితు తద్విద్ధి యని యారంభించి ఏషాతే ఽభిహితా అనునదివఱకు నాచే నుపదేశింపఁబడినదానిని; అజ్ఞానముతోఁ గూడినకర్మమునం దున్నవాఁడవై నీవు పరిపాకమున కనుగుణముగా నాయాకాలమునందుఁ బ్రణిపాతపరిప్రశ్నసేవాదులచే విశదాకారముగా * జ్ఞానుల వలన నెఱుంగుము. సాక్షాత్కృత మయిన యాత్మస్వరూపము గల జ్ఞానులును బ్రణిపాతాదులచే సేవింపఁబడినవారై జ్ఞానమునందలి జిజ్ఞాసచే నాయావిషయము నడుగుచున్న నీయభిప్రాయము నెఱింగి నీకు జ్ఞానము నుపదేశింతురు.

మా. ఇప్పుడును జ్ఞానియే యర్జునుఁడు, అయినను అభిభవమువలన మోహము. ప్రమాణమో చెప్పఁబడినది.

యద్ జ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాణ్డవ
యేన భూతా న్యశేషాణి ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి. 35

భా. అట్లయిననే యీవాక్యముగూడ సమర్థం బగును.—యత్ = ఏజ్ఞానమును, వారలచే నుపదేశింపఁబడినదాని; జ్ఞాత్వా = అధిగమించి,

* స్పష్టముగా.

పొంది; పునః = మరల; మోహమ్ = మోహమును; ఏవమ్ = ఎట్లిపుడు మోహమునొందితివో మరల నిట్లు; నయాస్యసి = పొందవు. పాణ్డవ= ఓపాండుపుత్త్రుఁడా! మఱియును, యేన = ఏజ్ఞానముచేత; అశేషేణ = సాకల్యమున; భూతాని = బ్రహ్మాది స్తంబపర్యంతము లయినభూతములను; ద్రక్ష్యసి = చూడఁగలవో; ఆత్మని=సాక్షాత్ప్రత్యగాత్మయందు, నాయం దున్నవి యీభూతంబు లని. అథో= మఱియు; మయి= వాసుదేవుఁడను బరమేశ్వరుఁడ నగు నాయందును; పరమేశ్వరునందు నున్నవి యీభూతంబు లని, ద్రక్ష్యసి—క్షేత్రజ్ఞేశ్వరుల యేకత్వమును సర్వోపనిషత్ప్రసిద్ధమును జూడఁగలవో యని యర్థము. ♦

అజ్ఞానము నొందుదువేని నీవు మరల నిట్లు మోహము నొందవు. ఆజ్ఞానముచే నీవు బ్రహ్మాది స్తంబపర్యంతము లగు సర్వభూతములు నీప్రత్యగాత్మయందే యుండుటం జూతువు, అట్లు నాయందు నుండుటం జూతువు అని తాత్పర్యము.

ఆ. ఉత్తము లయిన యాచార్యులచే నుపదేశింపఁబడినజ్ఞానమే కార్యసమర్థం బని సిద్ధించిననే మీఁదివాక్యముగూడ యోగ్యవిషయమై యర్థవంత మగు నని చెప్పుచున్నారు అట్లయిననే ఇత్యాదిగా. అందువలన నీమోహము నశించుటకుఁ గారణము ఉత్తమ మయిన యాజ్ఞానమునందు నీవు నిష్ఠ గలవాఁడవు కావలయు నని శేషము. అందు నిష్ఠ స్థిర మగుటకై ఆజ్ఞానమునకే విశేషణము చేయుచున్నాఁడు త్తరార్ధముచేత. యత్ జ్ఞాత్వా అని చెప్పఁబడినది, జ్ఞానవిషయకజ్ఞానము సంభవింపదని యాశంకించి అధిపూర్వక మయిన గమిధాతువునకుఁ బ్రాప్త్యర్థము నంగీకరించి వ్యాఖ్యానము చేయుచున్నారు అధిగమించి అని. ఇందువలనఁ గూడ ఆచార్యోపదేశమువలన లభ్య మగు ఫలవంత మైన జ్ఞానమునందు నీవు స్థిర మయిన నిష్ఠ గలవాఁడవు కావలయు నని చెప్పుచున్నారు మఱియును అని. జీవునియందును ఈశ్వరునియందును ఇద్దఱియందును బ్రతిష్ఠితంబు లని చెప్పుటచే భేదవాదము నను మతించిన ట్లగు నని యాశంకించి చెప్పుచున్నారు క్షేత్రజ్ఞేశ్వరులయేకత్వము నని. మూలప్రమాణము లేనియెడ నెట్లు క్షేత్రజ్ఞేశ్వరైకత్వదర్శనం బగు నని యాశంకించి చెప్పుచున్నారు సర్వోపనిషత్ప్రసిద్ధము నని.

హ. అజ్ఞానమునకు విశేషణము చేయుచున్నాఁడు.—యత్ = ఏజ్ఞానరూప మయిన బ్రహ్మమును; జ్ఞాత్వా; పునః = పిమ్మట; ఏవమ్; మోహమ్ =

♦ అట్టి జ్ఞానమును నీ కుపదేశింతు రని పూర్వశ్లోకముతో నన్వయము.

వ్యామోహమును. నయాస్యసి = పొందవు. అట్టి జ్ఞానము నుపదేశింతు రని యర్థము. మరల విశేషణము చేయుచున్నారు—యేన = ఏజ్ఞానముచేత; భూతాని = కార్యకరణసంఘాతాత్మకములయినభూతములను; అశేషేణ; ద్రక్ష్యసి=ఉపలక్షింపఁగలవో; ఆత్మని = ప్రత్యగాత్మయందు; మయి = వాసుదేవుఁడనైన యీశ్వరునందు.

శం. సద్గురూపదేశముచే జ్ఞానము నొందినవానికి ఫలముఁ జెప్పుచున్నాఁడు.—ప్రసన్నులగు బ్రహ్మవిదులచే నుపదేశింపఁబడిన, యత్ = ఏజ్ఞానమును; జ్ఞాత్వా = తదేకనిష్ఠచే పొంది; నీవు, ఏవమ్ = ఇప్పుడెట్లో అట్లు; పునః = మరల; మోహమ్ = నేను వీరు నావారు అని అద్వితీయుఁడగు నాత్మయందు అనేకత్వభ్రమను; నయాస్యసి—నీవు నేను ఇది అది ఇత్యాదిమిథ్యాజ్ఞానమును విడుతు వని యర్థము. ఓయీ! ద్వైతజ్ఞానహేతు వగు భూతజాత ముండునప్పుడు ఎట్లాత్మ యద్వితీయుఁడగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—« ఆత్మై వేదం సర్వమ్ » అని సమస్త భూతజాతంబును ఆత్మమాత్రమే యను నిశ్చయము కలిగించునట్టి, యేన = మాత్మబుద్ధిచేఁ బొందఁబడిన యేజ్ఞానముచేత; భూతాని—బ్రహ్మాదిస్తంబపర్యంతములను; అశేషేణ = సమస్తమును; ప్రత్యక్షముగా నేనే యిది యంతయు నని నీకు అభిన్నములనుగా, ద్రక్ష్యసి—ఘటకలశశరావాదికము సమస్తమును సూక్ష్మబుద్ధిచే మృత్తికామాత్రముగాను, చిత్రము భిత్తి * మాత్రముగాను ఎట్లో అట్లు భూతజాతము సమస్తమును ఆత్మమాత్రమునుగానే చూతు వని యర్థము. ఓయీ! అట్లయినను బ్రహ్మము ఆత్మ యను భేద ముండనే యున్నది, ఎట్లు అద్వైతము సిద్ధించును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అథోమయి అని. ఆభూతములను, మయి = నిర్విశేషపరబ్రహ్మము నగు నాయందు; అథో = వెంటనే; చూతువు గూడ. ఇట్లు నీవును నేనును సర్వాత్మకుం డగుటను జూచి యిద్దఱకును ఏకత్వము నెఱుఁగుదు వని యర్థము, “తత్త్వమసి” అను శ్రుతివలన. లేక. సర్వభూతాత్మకునిఁగా ఆత్మను ఎఱింగి, ఆయాత్మను నిర్విశేషము సర్వాధిష్ఠానము పరబ్రహ్మము నగు, మయి = నాయందు; ద్రక్ష్యసి—బ్రహ్మముకంటె అభిన్నునిఁగా ఆత్మను జూతు వని యర్థము.

మ. ఇట్లతినిర్బంధమున జ్ఞానము కలిగించుకొన్నయెడ నేమి యగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—యత్ = పూర్వోక్త మయిన యేజ్ఞానమును ఆచార్యులచే నుపదేశింపఁబడినదానిని; జ్ఞాత్వా = పొంది, ఓదనపాకం పచతి ♦ అనునట్లు

---

* గోడ.

♦ అన్నమువంట వండుచున్నాఁడు.

అధాతువే*సామాన్యవివక్షచే ప్రయోగింపఁబడినది; పునః=పిమ్మట; ఏవమ్, మోహమ్=బంధువధాదినిమిత్తమగుభ్రమను; నయాస్యసి=పొందవో. ఓపాండవుఁడా! ఎందువలన ననఁగా. యేన = ఏజ్ఞానముచేతనే; భూతాని = పితృపుత్త్రాదులను; అశేషేణ = బ్రహ్మాదిస్తంబపర్యంతము లగు సమస్తమును, స్వావిద్యావిజృంభితము లైనవాని; ఆత్మని = త్వంపదార్థ మయిన నీయందును; అథో = మఱియు; మయి = నాయందును, తత్పదార్థ మయిన భగవంతుఁ డగు వాసుదేవునియందును, పరమార్థంబున భేదరహితుఁడై యధిష్ఠానభూతుఁ డైనవానియందును; ద్రక్ష్యసి = అభేదముననే చూతువో, అధిష్ఠానమునకు వేఱుగాఁ గల్పితము లేకుండుటవలన; భగవంతుని వాసుదేవుని నన్నుఁ దానుగా సాక్షాత్కరించుటవలన సర్వాజ్ఞానము నశింపఁగా ఆయజ్ఞానముయొక్క కార్యము లయిన భూతములు నిలువఁ జాల వని భావము.

శ్రీ. జ్ఞానఫలముఁ జెప్పుచున్నాఁడు మూఁడునరశ్లోకములచేత.—యత్ = ఏజ్ఞానమును; జ్ఞాత్వా = పొంది; పునః; బంధువధాదినిమిత్త మయిన, మోహమ్ = భ్రమను; నయాస్యసి = పొందవో. అందుకు హేతువు—యేన = ఏజ్ఞానముచేత; భూతాని = పితృపుత్త్రాదులను, స్వావిద్యాకల్పితములను; ఆత్మని = నీయందే; అభేదంబున, ద్రక్ష్యసి. అథో= పిమ్మట; నిన్ను, మయి = నాయందు, పరమాత్మయందు, అభేదంబునఁ జూడఁ గలవో యని యర్థము.

ప. ఎట్టి జ్ఞానము ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఏవమ్ = ఇట్లు చెప్పిన విధంబున; యత్ = దేని; జ్ఞాత్వా = పొంది; పునః; మోహమ్ = బంధాదిదుఃఖరూప మయిన మోహమును; నయాస్యసి. ఇఁక నాజ్ఞానము మోహనివర్తకం బనుటను జెప్పుచున్నాఁడు.—యేన = సర్వాత్మకత్వరూపం బయిన యేజ్ఞానముచేత; భూతాని = పితృపుత్త్రసుహృద్బంధువులు మొదలగువానిని; మయి = వ్యాపకుఁడైన పరమాత్మ నగు నాయందు, సమష్టిరూపంబునఁ జూతువో.

రా. ఆత్మస్వరూపవిషయ మయిన సాక్షాత్కారరూపజ్ఞానమునకు లక్షణముఁ జెప్పుచున్నాఁడు.—యత్ = ఏజ్ఞానమును; జ్ఞాత్వా; పునః = మరల; ఏవమ్= ఇట్టి, దేహాద్యాత్మాభిమానరూప మయిన; మోహమ్ = దానిచేఁ గలుగు మమతాదిహేతు వగు మోహమును; నయాస్యసి. యేన= ఏజ్ఞానముచే; అశేషేణ=దేవమనుష్యాద్యాకారంబునఁ దలంపఁబడునట్టి సమస్తము లయిన; భూతాని = భూత

* జ్ఞాధాతువే.

ములను; ఆత్మని = నీయాత్మయందే; ద్రక్ష్యసి. ఎందువలన ననఁగా—నీకును ఇతర భూతములకును ప్రకృతివియుక్తు లయినప్పుడు సామ్య మగును. ప్రకృతిసంసర్గ దోష వినిర్ముక్త మయిన ఆత్మస్వరూప మంతయు సమ మనియుం జెప్పఁ బోవుచున్నాఁడు « నిర్దోషం హి సమం బ్రహ్మ, తస్మాద్బ్రహ్మణి తే స్థితాః » అని. అథో, మయి, సర్వ భూతంబులను అశేషములను జూతువు. పరిశుద్ధ మయినయాత్మవస్తువంతయు నాస్వరూపముతో సమాన మగుటవలన. «ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః» అని గదా చెప్పఁబోవుచున్నాఁడు. అట్లు « తదా విద్వాన్పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్య ముపైతి " ♦ ఇత్యాదిశ్రుతులందును నామరూపవినిర్ముక్త మయిన యాత్మవస్తువు పరమాత్మస్వరూపముతో సమం బని తెలియుచున్నది. అందు వలనఁ బ్రకృతివినిర్ముక్తు లయిన యాత్మలు పరస్పరసములు, సర్వేశ్వరునితోను సములు.

అట్టి జ్ఞానము నొందుదువేని మరల నిట్టి మోహము పొందవు. అట్టి జ్ఞానము నొందినయెడ దేవమనుష్యాది సర్వభూతంబులును బ్రకృతివియుక్తు లయి నచో నీయట్టివారలే యగుటవలన వారలనందఱను నీస్వరూపమునందే చూతువు— నీస్వరూపముతోసమానులనుగా నెఱుంగుదువు. మఱియు సర్వేశ్వరుఁ డనగు నాస్వ రూపముతోను వారలును నీవును సమానులే యని తెలియుదు వని తాత్పర్యము.

**రా.** యేన=ఏజ్ఞానముచే; ఆత్మని= ఆత్మభూతుఁడ నగు; మయి=నాయందు; అథో = ఆమోహనాశమువలననే; ద్రక్ష్యసి = చూతువో.

> అపి చేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః
> సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి. ౩౬

**భా.** మఱియు నీజ్ఞానముయొక్క మాహాత్మ్యము —పాపేభ్యః = పాపము చేయువారలకంటె; సర్వేభ్యః = అందఱికంటె; పాపకృత్తమః= అధికముగాఁ బాపములు చేసినవాఁడవు; అసిచేత్ = అగుదువేని; అపి= అట్లయినను; సర్వమ్ = సమస్తమయిన; వృజినమ్ = పాప మను సముద్ర మును; జ్ఞానప్లవేనైవ=జ్ఞానము అను నోడచేతనే; సంతరిష్యసి = చక్కఁగా

---

♦ అప్పుడు విద్వాంసుఁడు పుణ్యపాపములను వదలించుకొని నిరంజనుఁడై పరమసామ్యమును బొందుచున్నాఁడు.

దాఁటఁ గలవు. ధర్మము గూడ నిట ముముక్షువునకుఁ బాప మని చెప్పఁ బడుచున్నది.

నీవు లోకమునందుఁ బాపము చేసినవారి యందఱికన్నను అధికపాపము చేసినవాఁడ వైనను ఆసమస్తపాపములును నీ ఈజ్ఞానముచేతనే నాశము నొందు నని తాత్పర్యము.

అ. జ్ఞానమును మఱియొకవిధంబునఁ బ్రశంసించుచున్నారు మఱియును ఇత్యాదిగా. పాపకర్తల యందఱికన్నను అధికముగాఁ బాపము చేయుట యొక్కని యందు అసంభావిత మయినను జ్ఞానమాహాత్మ్యప్రసిద్ధికొఱ కంగీకరించి చెప్పుచున్నాఁడు పూర్వార్థముచేత. సర్వపాపనివర్తకం బగు బ్రహ్మాత్మైక్య జ్ఞానముయొక్క మాహాత్మ్యము నిపుడు ప్రకటించుచున్నాఁడు ఉత్తరార్థముచేత. అధర్మము నివర్తిల్లినను ధర్మరూపప్రతిబంధ ముండు నెడ జ్ఞానవంతున కైనను ఎట్లు మోక్షము సంభవించును? అని యాశంకించి చెప్పుచున్నారు ధర్మముగూడ నిత్యాదిగా. ఇటక్ = ఈయధ్యాత్మశాస్త్రమందు.

ప. ఆత్మవిషయమున జ్ఞానఫలముఁ జెప్పుచున్నాఁడు.—సర్వేభ్యః పాపేభ్యః = పాపము గలవారి యందఱికన్నను; పాపకృత్తమః = అధికముగాఁ బాపము చేసినవాఁడవు; అపిచేదసి = అయినను. సర్వంవృజినమ్ = సమస్త మయినపాపమును; జ్ఞానప్లవే నైవ = దాఁటుచున్నాఁడు దీనిచేత నను వ్యుత్పత్తిచే ప్లవ మనఁగా జలము దాఁటు సాధనము, జ్ఞానము అను ప్లవముచేతనే; సంతరిష్యసి.

శం. ఇట్టి జ్ఞానమును బొందియు భీష్మద్రోణాదిగురువులను బంధువులను వధించుటచేఁ గలుగుపాపమునుండి ముక్తుఁడఁ గాఁ జాల నని యాశంకించువానిఁగా నర్జునుం జూచి చెప్పుచున్నాఁడు.—మహాపాతకము ఉపపాతకము తత్సమానపాపము సంకరీకరణము మలినీకరణము మొదలగు పాపములను జెప్పినవానిని జెప్పనివానిని అన్నిటిని సమస్తముగాఁ గాని యొక్కొకటిగాఁ గాని యెవ్వరు చేయుచున్నారో వారు పాపులు—పాపకారులు ముల్లోకములయం దుండువారు భూతకాలమునను భవిత్కాలమునను వర్తమానకాలమునను నుండువారు ఎవ్వరు గలరో, అట్టి పాపుల యందఱికన్ననుగూడ; నీవు, పాపకృత్తమః అసిచేదపి=వారలందఱుఁ జేసినపాపమును నీవొక్కఁడవే చేసినవాఁడ వగుదు వేని అప్పుడు నీవు పాపకృత్తముఁడ వగుదువు, ఇట్లు నీవు పాపకృత్తముఁడ వైనను; సర్వమ్ = సమస్త మయిన; వృజినమ్ = పాప

సముద్రమును; జ్ఞానప్లవే నైవ = నేను కూటస్థాసంగచిద్రూపుఁడ నగుటచే వికారము లేనివాఁడ నగుటవలన నేను గర్మములఁ జేయువాఁడఁ గాను ఎల్లప్పుడును నిష్క్రియుఁడనై తమే యున్నాను అని ఆత్మ యవిక్రియుఁ డను జ్ఞాన మేది గలదో అదియే ప్లవము—ఓడ, దానిచేతనే; సంతరిష్యసి. ఇఁకఁ జెప్పవలసిన దేమి భీష్మాదివధముచేఁ గలుగుపాపమును దరింతు వని.

మ. మఱియు వినుము జ్ఞానముయొక్క మాహాత్మ్యమును.—అపిచేత్ అను నీరెండు నిపాతములు అసంభావిత మయినదాని నంగీకరించుటను సూచించుచున్నవి. నీవు అంతటి పాపకృత్తముఁడ వగుట సంభవింపనే సంభవింపదు, అయినను జ్ఞానఫలము చెప్పుటకై యంగీకరించి చెప్పుచున్నాను. నీవు పాపకారులయందఱికన్నను అధికముగాఁ బాపము చేసినవాఁడవై పాపకృత్తముఁడవే యగుదువు గాక, అట్లయినను; సర్వమ్, వృజినమ్ = పాపమును, మిక్కిలి దుస్తర మగుటచే సముద్రతుల్య మయినదానిని; జ్ఞానప్లవే నైవ = జ్ఞానప్లవముచేతనే; ఇతరము చేతఁ గాదు, జ్ఞానమునే యోడనుగాఁ జేసికొని; సంతరిష్యసి=చక్కఁగా—అనాయాసముగాఁ బునరావృత్తి లేనియట్లుగా దాఁటఁ గలవు. వృజినశబ్దముచే నిట సంసారహేతు వగు ధర్మాధర్మరూపకర్మము చెప్పఁబడుచున్నది, ముముక్షువునకుఁ బాపమువలెఁ బుణ్యముగూడ అనిష్ట మగుటవలన.

శ్రీ. మఱియును.—పాపకారుల యందఱికన్నను నీవు అతిశయించి పాపము చేసినవాఁడ వగుదువు గాక. అట్లయినను సమస్త మయిన పాపసముద్రమును జ్ఞానము అను నోడచేతనే చక్కగా అనాయాసంబునఁ దరింపఁ గలవు.

ప. ఓయీ! ఉపదేశమువలన జ్ఞానము నొందినపుడు మోహనివృత్తి యగును, అంతకు మున్ను మోహ ముండనే యున్నది. అని యాశంకించి చెప్పుచున్నాఁడు.—నీవు, పాపేభ్యః = హింస చేయువారికంటె; సర్వేభ్యః; పాపకృత్తమో ఽసిచేత్ = అతిశయించి పాపము చేసినవాఁడ వగుదువు. అపి=అట్లయినను; సర్వమ్, వృజినమ్ = పాపసముద్రమును; జ్ఞానప్లవేన= జ్ఞాననౌకచేత; చక్కఁగా దాఁటఁ గలవు. ఇది యభిప్రాయము.—“సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ” అను శ్రుతివలన జ్ఞానము గదా పరమాత్మస్వరూపము, అది సత్యము, తక్కినది యసత్యము. ఇట్లు పితృపుత్రసుహృద్బంధువులు మొదలగు సమస్తప్రపంచంబును మిథ్య

యగుటవలన జ్ఞానమువలననే నాశము నొందును. ఎట్లు స్వప్నమునందు బ్రహ్మహత్య చేసినవానికి జాగరంబునఁ బ్రాయశ్చిత్తము లేదో అట్లు. ♦

రా. నీవు సర్వపాపులకన్నను అధికముగాఁ బాపము చేసినవాఁడవే యగుదువు గాక, అట్లయినను సమస్తమయిన పూర్వార్జిత మగు వృజినరూపసముద్రమును ఆత్మవిషయజ్ఞానరూపం బగు నోడచేతనే దాఁటఁ గలవు.

మా. కారణభూత మగు జ్ఞానమును స్తుతించుచున్నాఁడు మరల మూఁడు శ్లోకములచేత.

యథైధాంసి సమిద్ధో ఽగ్ని ర్భస్మసా త్కురుతే ఽర్జున
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా. 37

భా. ఎట్లు జ్ఞానము పాపమును నశింపఁ జేయును? అనఁగా దృష్టాంతసహితముగాఁ జెప్పుచున్నాఁడు.—యథా = ఎట్లు; ఏధాంసి = కట్టెలను; సమిద్ధః = చక్కఁగా జ్వలించుచున్న; అగ్నిః = నిప్పు; భస్మసాత్ = భస్మముగా; కురుతే = చేయుచున్నదో; అర్జున = అర్జునా! తథా = అట్లు; జ్ఞానాగ్నిః = జ్ఞానం బనునగ్ని; సర్వకర్మాణి = సమస్తకర్మములను; భస్మసాత్ = భస్మముగా; కురుతే = చేయుచున్నది. నిర్బీజముగాఁ జేయుచున్న దని యర్థము. ప్రత్యక్షముగానే జ్ఞానాగ్ని యాకర్మములను గట్టెలంబోలె భస్మీకరింప సమర్థము గాదు గదా! అందువలన సమ్యగ్దర్శనము సర్వకర్మములను నిర్బీజము లగుటకుఁ గారణం బని యభిప్రాయము. సామర్థ్యమువలన, ఏకర్మముచే శరీర మారభింపఁబడినదో అది ప్రవృత్తఫలం § బగుటవలన నుపభోగముచేతనే క్షయించుచున్నది. కావున, ఏవి యప్రవృత్తఫలంబులు * జ్ఞానోత్పత్తికి మున్ను చేయఁబడినవియు జ్ఞానకాలంబునఁ గలుగునవియు నతీతానేకజన్మంబులఁ జేయఁబడినవియుఁ గలవో ఆకర్మము లన్నిటిని జ్ఞానాగ్ని భస్మీకరించుచున్నది.

ఎట్లు చక్కఁగా మండుచున్ననిప్పు కట్టెలను బూడిదగాఁ జేయునో అట్లు జ్ఞానము సమస్తకర్మంబులను నిర్బీజంబులుగాఁ జేయు నని తాత్పర్యము.

♦ మోహావస్థయందుఁ జేసినది జ్ఞానము కలిగిన పిమ్మట బాధితం బగును.

§ ఆరంభించిన ఫలము గలది.

* ఆరంభింపని ఫలము గలది.

ఆ. జ్ఞానము కలిగినప్పుడును ధర్మాఽధర్మములు కనఁబడుటవలన నెట్లు వానికి జ్ఞానమువలన నివృత్తి యగును? అని యాశంకించి జ్ఞానము ధర్మాఽధర్మ నివర్తకం బనుటను దృష్టాంతముచేఁ దెలుపుటకై మీఁదిశ్లోకమున కవతారిక చేయుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. యోగ్యాఽయోగ్యవిభాగముచే నివర్తకత్వాఽనివర్తకత్వముల విభాగము ♦ నుదాహరించుచున్నాఁడు పూర్వార్ధముచేత. దృష్టాంతమున కనురూపముగా దార్ష్టాంతికము చెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత. యోగ్యవిషయంబునఁ గూడ దాహకం బగుట యగ్నికిఁ బ్రతిబంధము లేమిచేత నని వివక్షించి విశేషణము చేయుచున్నారు చక్కఁగా అని. దార్ష్టాంతికమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు జ్ఞానం బనునగ్ని ఇత్యాదిగా. ఓయీ! జ్ఞానము ప్రత్యక్షముగనే కర్మదాహకం బని యెందువలనఁ జెప్పఁ గూడదు? నిర్బీజముగాఁ జేయుచున్న దని యర్థ మని యేల వ్యాఖ్యానము సేయవలయును? అని యాశంకించి చెప్పుచున్నారు ప్రత్యక్షముగానే ఇత్యాదిగా. జ్ఞానమునకు స్వవిషయమున కావరణ మయిన యజ్ఞానమును దొలఁగించుటయందే సామర్థ్యము లోకమునందు దృష్ట మగుటవలన అవిక్రియబ్రహ్మాత్మజ్ఞానము గూడ బ్రహ్మాత్మాఽజ్ఞానమును నివర్తించుచు ఆయజ్ఞానముచేఁ గలుగు కర్తృత్వభ్రమమును గర్మమునకు బీజమయినదానిని నివర్తించుచున్నది, అది నివర్తిల్లినపుడు కర్మములు నిలువఁ జాలవు. కాని, సాక్షాత్కర్మనివర్తకము కాదు జ్ఞానము, అజ్ఞానమునకే నివర్తకం బని వ్యాప్తి సిద్ధించుటవలన. కర్మమే నివర్తిల్లి యజ్ఞానము నివర్తిల్లనిచో మరలఁ గర్మము సంభవించుటవలన నని యర్థము. జ్ఞానము సాక్షాత్కర్మనివర్తకము కా దని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. సమ్యక్జ్ఞానము మూలభూత మయిన యజ్ఞానము నివర్తించుటచేఁ గర్మనివర్తకం బనుట యిష్టంబైనయెడ ఆరబ్ధఫలం బగు కర్మమునకుఁ గూడ నివృత్తి ప్రసక్తం బగుటవలన జ్ఞానోదయ మైనప్పుడే దేహపాతము కావలయు నని యాశంకించి చెప్పుచున్నారు సామర్థ్యమువలన నని. జ్ఞానోదయ మయినపుడే దేహము పడు నన్నపక్షమునఁ దత్త్వదర్శులచే నుపదేశింపఁబడినజ్ఞానమే ఫలవంత మగు నను భగవదభిప్రాయము బాధిత మగుం గావున నాచార్యలాభాన్యథానుపపత్తిచే ♦ నార

---

♦ యోగ్యమును—శక్య మయినదాని నివర్తిల్లఁ జేయు ననియు అయోగ్యమును నివర్తిల్లఁ జేయ దనియు విభాగమును.

♦ అన్యథా—జ్ఞానము కలుగునపుడే శరీరము పడుపక్షమున ఆచార్యలాభము అనుపపన్న మగుటచే.

బ్ధఫల మగు కర్మమునకు సంపాదక మయిన యజ్ఞానలేశమును నశింపఁ జేయదు జ్ఞానం బని యర్థము. ఆపక్షమున నెట్లు ప్రారబ్ధఫలం బగు కర్మము నశించును? అని యాశంకించి చెప్పుచున్నారు ఏకర్మముచే నిత్యాదిగా. అప్పుడు ఎట్లు జ్ఞానాగ్ని సర్వకర్మంబులను భస్మీకరించుచున్న దని చెప్పఁబడినది? అనఁగా నందుకుఁ జెప్పు చున్నారు కావున నిత్యాదిగా. జ్ఞానమువలన ఆరబ్ధఫలంబులగు కర్మములకు నివృత్తి యనుపపన్నం బగుటం జేసి, అనారబ్ధఫలము లగు కర్మములు ఏవి జ్ఞానోదయము నకు మున్ను ఈజన్మమునందే చేయఁబడినవియు జ్ఞానోదయమైన పిమ్మటఁ జేయఁబడు నవియుఁ బ్రాచీనము లయిన యనేకజన్మములందుఁ జేయఁబడినవియుఁ గలవో ఆకర్మ ముల నన్నిటిని జ్ఞానము కారణమును నివర్తించుటచే నివర్తించుచున్నది యని యర్థము.

హ. బ్రహ్మజ్ఞానము సకలపాపముల నుండి తరింపఁజేయునది యని చెప్పు చున్నాఁడు.—యథా అని దృష్టాంతము, యథా = ఎట్లు; ఏధాంసి = కట్టెలను; సమిద్ధః = మండుచున్న; అగ్నిః = భస్మసాత్ = సమస్తమును భస్మముగా; కురుతే. అర్జున! తథా; జ్ఞానాగ్నిః = జ్ఞాన మను నగ్ని; సర్వకర్మాణి—నిత్యనైమిత్తిక కామ్య నిషిద్ధరూపములను; భస్మసాత్ కురుతే.

శం. మహామేరుపర్వతమును దాఁటువానికి సికతాకణమును దాఁటు టయుం బోలె నపార మయిన పాపసముద్రమును దరించునట్టి నీకు భీష్మాదివధజన్య మగు పాపం బనునదియు విచారణీయమే కాదు. కావున ధర్మాఽధర్మతత్కార్య మహాసముద్రమును దరింపఁగోరువాఁడు జ్ఞానమునే సంపాదింపవలయును. దానిచేతనే విద్వాంసుఁడు శతకోటికల్పములు సంపాదించినపాపమును దరించుచున్నాఁడు. అట్లు శ్రుతి « నైనం పాప్మా తరతి సర్వం పాప్మానం తరతి »♦ అని. సముద్రతరణము నందు నోడవలె జ్ఞానము పాపనాశనమునందు బహుకాలము నపేక్షింపదు, మ రేమ నఁగా క్షణముననే సమస్తపాపమును నశింపఁజేయు నని దృష్టాంతముతోఁ నుప పాదించుచున్నాఁడు.—సమిద్ధః = చిదుగులతోఁ జక్కఁగా మండించుటచే వృద్ధినొం దిన; అగ్నిః; ఏధాంసి = కట్టెలను; యథా = ఎట్లు; క్షణమున, భస్మసాత్ కురుతే. తథా = అట్లు, సమిద్ధః= నిరంతరధ్యాన ధారణాసమాధులచే వృద్ధి నొందింపఁబడిన; జ్ఞానాగ్నిః = మీఁదఁ జెప్పిన లక్షణముగల జ్ఞాన మను నగ్నిః సర్వకర్మాణి = సమ

♦ ఇతనిఁ పాపము దాఁటదు, ఇతఁడే పాపమునంతయు దాఁటుచున్నాఁడు.

స్తము లయిన పుణ్యపాప మిశ్రరూపము లగు కర్మములను; లేక, ప్రారబ్ధకర్మము భోగముచేతనే నశింపఁజేయఁదగిన దగుటవలన అది తక్కఁ దక్కినవానిని, జ్ఞానోత్పత్తికి ముందు గలుగునవియు వెనుకఁ గలుగునవియు బహుజన్మసంచితములు నగునట్టి సమస్తకర్మములను; భస్మసాత్ కురుతే = క్షణమున భస్మముగాఁ జేయుచున్నది. ఎట్లు, స్థాణుజ్ఞానము స్థాణుస్వరూపము నావరించిన యజ్ఞానమును నివర్తించి యప్పుడే చోరభూతాది భ్రమను నశింపఁజేసి భ్రమకార్యమును గూడ నశింపఁజేయునో అట్లు నిష్క్రియ బ్రహ్మాత్మజ్ఞానము గూడ స్వరూపము నావరించిన యజ్ఞానము నివర్తించి తత్సమకాలమునందే విద్వాంసున కాయజ్ఞానముచేఁ గలిగిన కర్తృత్వభ్రమను నశింపఁజేసి యాభ్రమచేఁ గలిగింపఁబడిన సర్వకర్మములను దక్షణముననే నిర్మూలించుచున్నది, సర్వదా నిష్క్రియుఁడనై యున్నా నను జ్ఞానము గలవానిఁగా విద్వాంసునిఁ జేయుచున్నది నిష్క్రియ బ్రహ్మాత్మజ్ఞానం బని యర్థము. ఓయీ! జ్ఞానమున కజ్ఞాననివృత్తియే కార్యము అందువేని, అట్లు కాదు, భ్రమాదినివృత్తిగూడ జ్ఞానకార్యముగా నేర్పడుటవలన, ఒకకార్యము అనేకకార్యములఁ జేయుట కనఁబడుటవలన, ఎట్లు బ్రహ్మాస్త్రపాతమునకు రావణుని ఱొమ్మును భేదించుటయు వాని ప్రాణములు వెడలుటయు దేహముపడుటయుఁ గార్యము లగునో అట్లు. ఓయీ! కర్మమంతయు నజ్ఞానకార్యం బని సిద్ధింపఁగాఁ గారణనాశమువలనఁ బ్రారబ్ధకర్మమునకుఁ గూడ సంచితాదులకుం బోలె నివృత్తి కానేకావలయును, అందువేని; అట్లుకాదు, ప్రవృత్తఫలం బగుటవలన దానికి నివృత్తి యనుపపన్న మగుటవలన, ఎట్లు భోజనమునకు ముందున్నదియుఁ బిమ్మట నున్నదియు నగు నన్నమునకుఁ ద్యాగము ఉపపన్నమగునో అట్లు భుజింపఁబడిన యన్నమునకుఁ ద్యాగ ముపపన్నము గాదు, ప్రవృత్తఫలం బగుటవలన, అట్లే యారబ్ధకర్మమునకుఁ ద్యాగ ముపపన్నము గాదు. ఓయీ! కార్య మున్నయెడఁ గారణముగూడ నున్న దని యంగీకరింపవలయును అందువేని; అట్లు కాదు, కారణము లేనియప్పుడుగూడఁ గార్యాభాసము కనఁబడుటచే నట్టి నియమం బవ్యవస్థిత మగుటవలన, జలబుద్ధి నశించినను మరుభూమియందు మరల జలాభాసము తోఁచుటవలన, సత్యత్వ బుద్ధి లేకున్నను బ్రతిబింబాదికమునందు వ్యవహారము కనఁబడుటవలన, అట్లు దేహాత్మత్వ సత్యత్వ మమత్వబుద్ధి లేకున్నను విద్వాంసునకుఁ గర్త్రాభాసము తత్ఫలాభాసము ఉపపన్న మగుటవలన. కావున సమాధిచే నప్రతిబద్ధముగాఁ జేయఁబడిన నిష్క్రియబ్రహ్మాత్మజ్ఞానము నిశ్శేషముగా నవిద్యను నిర్మూలించు ననుట యుక్తము. కానిచో ఇది ఘటము అన్నమాత్రముననే బ్రహ్మావరక మయిన

యజ్ఞాన మున్న దనుట ప్రసక్తించును. అందువలన, ఇదియంతయు నేనును బ్రహ్మమే యనుజ్ఞానము అజ్ఞానమునంతయుఁ గార్యసహితముగా నిర్మూలింపనే నిర్మూలించు నని సిద్ధము.

వ్య. ఓయీ! సముద్రమునుంబోలెఁ దరించుటచేఁ గర్మములకు నాశము గలుగదు అని యాశంకించి మఱియొకదృష్టాంతము చెప్పుచున్నాఁడు.—యథా; ఏధాంసి = కాష్ఠములను; సమిద్ధః = ప్రజ్వలించుచున్న; అగ్నిః; భస్మసాత్కురుతే= భస్మీభావమును బొందించుచున్నదో. ఓ యర్జునా! తథా; జ్ఞానాగ్నిః; సర్వకర్మాణి= పాపములను బుణ్యములనుగూడ సమానముగాఁ బ్రారబ్ధఫలంబు లగు కర్మముల కంటె భిన్నము లయిన సర్వకర్మములను; భస్మసాత్కురుతే. తత్కారణ మయిన యజ్ఞానము నశింపఁజేయుటచే నశింపఁజేయుచున్నది యని యర్థము. అట్లు శ్రుతి «భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయన్తే చాఽస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" ♦ అని. «తదధిగమ ఉత్తర పూర్వాఘయో రశ్లేష వినాశౌ, ఇతరస్యాప్యేవ మసంశ్లేషః పాతేతు" * అని సూత్రములు గూడ. అనారబ్ధము లగు పుణ్యపాపములు నశింపనే నశించు ననుటయందు సూత్రము «అనారబ్ధకార్యే ఏవతు పూర్వే తదవధేః» § అని. జ్ఞానజనకమైన దేహమునకుఁ గారణము లగు కర్మములకో తద్దేహాంతమునందే నాశము «తస్య తావ దేవ చిరం యావన్న విమోక్ష్యే ఽథ సంపత్స్యే" ‖ అను శ్రుతివలనను, «భోగేన

♦ అపరావరుఁడు—పరమాత్మ తెలియఁబడఁగానే వీనికి హృదయగ్రంథి భేదింపఁబడుచున్నది. సమస్తసంశయములును ఛేదింపఁబడుచున్నవి, కర్మములు నశించుచున్నది

* బ్రహ్మసూ. అ-౪. పా-౧. సూ-౧౩. తదధిగమే = బ్రహ్మజ్ఞానము కలుగఁగానే, ఉత్తర పూర్వాఘయోః = ఆగామిసంచితపాపములకు, అశ్లేషవినాశౌ = సంబంధము లేకుండుటయు నాశమును, ఆగామి పాపముల సంబంధము లేకుండును సంచితములకు నాశ మగును. తద్వ్యపదేశాత్ = అట్లు శ్రుతిచెప్పుటవలన. బ్రహ్మసూ. అ-౪. పా-౧. -సూ౧౪. ఇతరస్యాపి = పుణ్యమునకుఁగూడ, ఏవమ్ = ఇట్లు, అసంశ్లేషః = సంబంధములేమి యగును. పాతేతు = శరీరపాత మయినంతనే ముక్తి యగును.

§ బ్రహ్మసూ. అ-౪. పా-౧. సూ-౧౫. అనారబ్ధకార్యేఏవతు = అప్రవృత్తఫలము లయిన విమాత్రమే, పూర్వే= సంచితము లగు పుణ్యపాపములు జ్ఞానమువలన క్షయించుచున్నవి. తదవధేః= మోక్షమునకు శరీరపాత మవధిగాఁ జెప్పుటవలన.

‖ జ్ఞానికి ఎంతవఱకు దేహము విడువనో అంతవఱకే బహుకాలము. శరీరము విడిచినంతనే మోక్షము నొందుదును అని యుండును.

త్వితరే క్షపయిత్వా సంపద్యతే » ♦ అను సూత్రమువలనను. ఇఁక నాధికారికులకో జ్ఞానజనక మగు దేహమున కారంభకము లగు కర్మము లేవో అవియే దేహాంతరమునకుఁ గూడ నారంభకములు *, వసిష్ఠుఁడు అపాంతరతముఁడు మొదలగువారికింబోలె. అట్లు సూత్రము «యావదధికార మవస్థితి రాధికారికాణామ్» § అని. అధికార మనఁగా అనేకదేహారంభక మగు బలవత్తరమైన ప్రారబ్ధఫలము. అది యుపాసకులే కాని యితరులకు లేదు. అనారబ్ధఫలము లగు కర్మములు నశించును, ఆరబ్ధఫలములు మాత్రము భోగసమాప్తి యగువఱకు నుండును. భోగము ఏకదేహముచేతనా యనేకదేహములచేతనా యనువిశేషము లేదు. ఆకరమునం దీవిషయము విస్తరించి ప్రతిపాదింపఁబడినది.

శ్రీ. సముద్రమువలె నుండుపాపమును దాఁటుటయె యగుంగాని దానికి నాశము కలుగ దను భ్రాంతిని దృష్టాంతముచే నివారించుచుఁ జెప్పుచున్నాఁడు.—ఏధాంసి = కట్టెలను; చక్కఁగా మండుచున్న యగ్ని యెట్లు భస్మీభావముఁ బొందించునో అట్లు ఆత్మజ్ఞానరూప మయినయగ్ని ప్రారబ్ధవ్యతిరిక్తములగు సర్వకర్మములను భస్మీభావముఁ బొందించుచున్నది యని యర్థము.

ప. ఇఁకఁ జెప్పినవిషయమును లౌకికదృష్టాంతముచే దృఢీకరించుచున్నాఁడు.—యథా, సమిద్ధః = ప్రజ్వలిత మయిన, అగ్నిః, ఏధాంసి = కాష్ఠములను, భస్మసాత్ కురుతే; తథా, జ్ఞానాగ్నిః, సర్వకర్మాణి= ప్రారబ్ధవ్యతిరిక్తము లగు సర్వకర్మములను, భస్మసాత్ కురుతే. సమిద్ధః అనుపదముచే, జ్ఞానాగ్ని మాటిమాటికి బుద్ధిని బొందింపఁబడినదై భస్మీకరించుచున్నది.

రా. చక్కఁగా వృద్ధినొందిన యగ్ని కట్టెలసమూహమును భస్మీకరించునట్లు, ఆత్మతత్త్వజ్ఞానరూప మయిన యగ్ని జీవాత్మయం దనాదికాలప్రవృత్తమై యుండు ననంతకర్మసంచయమును భస్మీకరించుచున్నది.

---

♦ బ్రహ్మసూ. అ-౪. పా-౧. సూ-౧౯. ఇతరే=ఆరబ్ధకార్యము లగు పుణ్యపాపములను, భోగేన తు = భోగముచేతనే, క్షపయిత్వా = నశింపఁజేసి, సంపద్యతే = ముక్తిఁ బొందుచున్నాఁడు.

* కారణములు.

§ బ్రహ్మసూ. అ-3. పా-3. సూ-32. అధికారికాణామ్ = వసిష్ఠుఁడు మొదలగు నాధికారికులకు, జ్ఞాను లయినను, యావదధికారమ్ = అధికార ముండువరకు, అవస్థితిః = శరీరధారణము కలదు, అనేకశరీరములనుగూడ ధరించుట యగును.

మూ. *

నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాఽఽత్మని విన్దతి. ౩౮

భా. అట్లు కావున.—జ్ఞానేన= జ్ఞానముతో; సదృశమ్=తుల్యమయిన; పవిత్రమ్ = పావనము, శుద్ధికలిగించునది; ఇహ = ఇందు; నవిద్యతే = లేదు. హి= ఎందువలననో, అందువలన; తత్ =అజ్ఞానమును; స్వయమ్ = తానే; యోగసంసిద్ధః = యోగముచేత—కర్మయోగముచేతను సమాధియోగముచేతను సంసిద్ధుఁడు—సంస్కారము నొందినవాఁడు యోగ్యతను బొందినవాఁ డగు ముముక్షువు; కాలేన = పెద్దకాలముచేత; ఆత్మని = అంతఃకరణమునందు; విన్దతి = పొందుచున్నాఁడు.

అందువలన, జ్ఞానమువంటి పవిత్రవస్తు వెందును లేదు, కావునఁ గర్మయోగమును సమాధియోగమును బహుకాలము చేయుటచేఁ జిత్తశుద్ధి నొంది యధికారియగు ముముక్షువు మాత్రమే యాజ్ఞానమును దనయంతఃకరణమునందు లభించు నని తాత్పర్యము.

ఆ. ఓయీ! పరమశుద్ధి కలిగించునట్టి యశ్వమేథాదిక మగు నొకానొక యితరోపాయముచేతనే పరమపురుషార్థము సిద్ధించుటవలన, ఆత్మజ్ఞానం బేల? అని యాశంకించి చెప్పుచున్నారు అట్లు కావున నని. మున్ను చెప్పినవిధంబున జ్ఞానమాహాత్మ్యము సిద్ధించుటవలన నట్టిజ్ఞానముతో సదృశమయిన పరిశుద్ధికరం బగు పరమపురుషార్థోపాయము ఈవ్యవహారభూమియందు లేదని యర్థము. అట్టియాత్మవిషయజ్ఞానము సర్వజనులకును నెందువలన శీఘ్రముగాఁ బుట్టదు? అనఁగాఁ జెప్పుచున్నారు అజ్ఞానము ఇత్యాదిగా. పెద్దకాలంబునఁ జెప్పినట్టిసాధనముచే యోగ్యతఁ బొందినవాఁడు—దానియం దధికారియయినవాఁడు తానుమాత్రమే యాజ్ఞానమును ఆత్మయందుఁ బొందుచున్నాఁ డని యన్వయము. సర్వజనులకు శీఘ్రమున జ్ఞాన ముదయింపకుండుట వారలకు యోగ్యత లేమివలన నని భావము.

హ. అందువలన.—జ్ఞానేన = తత్త్వబోధముతో; సదృశమ్; పవిత్రమ్ = పావనము; ఇహ = ఈలోకమునందే; నవిద్యతే. తత్ =అజ్ఞానమును; యోగసంసిద్ధః = యోగానుష్ఠానముచే సంస్కృతమయిన యంతఃకరణము గలవాఁడు; కాలేన—పరిపా

* దీనికిని ఉత్తరశ్లోకమునకును మాధ్వభాష్యము లేదు.

కముచేత; ఆత్మని = అంతఃకరణమునందు; విన్దతి = పొందుచున్నాఁడు; స్వయమ్ = అట్టివాఁడుమాత్రమే.

శ్లో ౦. ఓయీ! రాజసూయాశ్వమేధాది క్రతువులచేతను గన్యాది దానములచేతను గృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సుఁచేతను సర్వపాపనివృత్తి సంభవించుచుండఁగా సర్వపరిగ్రహంబులను బరిత్యజించి శమదమాది సాధనపూర్వకముగా సన్న్యాసాశ్రమము సంపాదించి యాత్మజ్ఞానమునకై యేల శ్రమపడవలయును? అని యాశంకింపఁగా. అట్లు కాదు, ఔషధమువలె దేని నుద్దేశించి యీ రాజసూయాదులు చేయఁబడుచున్నవో ఆయుద్దేశించిన పాపమును మాత్రమే యివి నివర్తించుం గాని యనేకములై యనేకరూపము లగు సంచితాగామివర్తమానసర్వపాపములను నివర్తింపంజాలవు. అందును పాపమునుమాత్రమే నివర్తించుంగాని బహుజన్మములు గలిగించు పుణ్యముల నివర్తింపంజాలవు. ఈజ్ఞానమో పుణ్యములు పాపములు మిశ్రములగు సంచితాది సమస్తకర్మముల నశింపఁజేయుటకుఁ బరమకారణము, కావున నిదియే పవిత్రతమము, ఇట్టిది మఱియొకటి యుండనేయుండదు. అందువలన ముముక్షువు ప్రయత్నంబున జ్ఞానము సంపాదింపవలయు నని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—హి = ఏకారణమువలన, నానాయోనులందు నానావిధజన్మములు మరణములు మొదలగు మహాదుఃఖములపరంపరను బొందించునట్టి యనేకకల్పశతసంపాదితంబులగు పుణ్యపాపమిశ్రరూపము లయిన యశేషకర్మములను అవిక్రియాత్మజ్ఞానమే సమూలముగా నున్మూలించుచున్నదో, ఆకారణమువలన; జ్ఞానేన = జ్ఞానముతో; సదృశమ్ = చెప్పినధర్మములచే సమానమయిన; పవిత్రమ్ = అత్యంతశుద్ధికరమగు పరమపురుషార్థ సాధనతమము; ఇహ = ఈలోకమునందును, శాస్త్రమునందును; నవిద్యతే = లేదు, ఇట్టిశుద్ధి కారణంబును మోక్షకారణంబును ఇహలోకమునందును బరలోకమునందును సంభవింప దని యర్థము. తత్ = అట్టి యనాద్యవిద్యాతత్కార్య వినాశకమయిన జ్ఞానమును; శ్రవణాదులు చేసినట్టి యధికారి యగుయతి, కాలేన = దీర్ఘకాలముచేత; యోగసంసిద్ధః = యోగముచేత—జ్ఞానయోగముచేఁ దత్పరుఁడై చేసిన నిరంతర సమాధినిష్ఠచే సంసిద్ధుఁడై, సంసిద్ధి యనఁగా నిశ్శేషముగా నశించిన బాహ్యవాసనలుగలవాఁ డగుట, దానిఁ బొందినవాఁడై, చక్కఁగా నిర్మూలింపఁబడిన ప్రతిబంధము గలవాఁడై; స్వయమ్ = తనయొక్క; ఆత్మని = తనయంతఃకరణమునందే; విన్దతి = పొందుచున్నాఁడు. ఇది యంతయు నేనును బ్రహ్మమే యను నప్రతిబద్ధమయిన బ్రహ్మాకారవృత్తి యతనికి స్వబుద్ధియందే యుదయించు నని యర్థము.

మ. అట్లు కావున.—జ్ఞానేన; సదృశమ్; పవిత్రమ్= పావనము, శుద్ధిని జేయునది; ఇహ = వేదమునందుఁగాని లోకవ్యవహారమునందుఁగాని; నవిద్యతే, జ్ఞానముకంటె భిన్న మగునది యజ్ఞాననివర్తకము కాకుండుటచే సమూలముగాఁ బాపనివర్తకము కాకపోవుటవలనను గారణ ముండునేని మరలఁ బాపము సంభవించుటవలనను; జ్ఞానముచేతనో అజ్ఞాననివృత్తిచే సమూలపాపనివృత్తి యగుం గావున దానికి సమానము మఱియొకటి లేదు. అట్టి యాత్మవిషయజ్ఞానము అందఱకును శీఘ్రంబున నేల జనియింపదు ? అందుకుఁ జెప్పుచున్నాఁడు —తత్ = అజ్ఞానమును; కాలేన = పెద్దకాలముచేత; యోగసంసిద్ధః = మున్ను చెప్పిన కర్మయోగముచేత సంసిద్ధుఁడు—సంస్కృతుఁడు యోగ్యతను బొందినవాఁడు; స్వయమ్= తాను; ఆత్మని= అంతఃకరణమునందు; విన్దతి= పొందుచున్నాఁడు. కాని, యోగ్యతఁ బొందినవాఁడు పడునిచే నియ్యఁబడినదాని స్వనిష్ఠముగాఁ గాని పరనిష్ఠ మగుదానిఁ దనదిగాఁ గాని పొందఁ డని యర్థము. *

శ్రీ. అందుకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—పవిత్రమ్ = శుద్ధిచేయునది; ఇహ=తపోయోగాదులయందు; జ్ఞానముతో సమానము; లేదు. అట్లయిన నందఱు నాత్మజ్ఞానమునే యేల యభ్యసింపరు ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు ఒకటియు నరశ్లోకముచేత.—ఆత్మని = ఆత్మవిషయమునందు; తత్ = అజ్ఞానమును; కాలేన = దీర్ఘకాలముచేత; యోగసంసిద్ధః = కర్మయోగముచే యోగ్యతను బొందినవాఁడు; స్వయమ్ = తానే; అనాయాసముగా; విన్దతి = పొందుచున్నాఁడు. కాని కర్మయోగము లేక పొందఁజాలఁ డని యర్థము.

వ. అందువలననే జ్ఞానమున కసాధ్య మేదియు లే దని చెప్పుచున్నాఁడు.—ఇహ = ఈతపోయోగాదులలో; జ్ఞానముతో సమాన మయిన; పవిత్రమ్ = శోధకము; మఱియొకటి, నవిద్యతే. దానిఁ జెప్పుచున్నాఁ డొకటియు నరశ్లోకముచేత ♦.— తత్ = అజ్ఞానమును; యోగసంసిద్ధః = కర్మయోగముచే యోగ్యతను బొందినవాఁడు; కాలేన = పరిపక్వావస్థ కలిగినపుడు; స్వయమ్= తానే, అనాయాసముగా; ఆత్మని = శుద్ధమయిన మనస్సునందే; విన్దతి = పొందుచున్నాఁడు. కాని మఱియొకచోట నుండి తేఁబడునది కాదు. శ్రుతియును “ మనసైవా ఽను ద్రష్టవ్య మేత దప్రమేయం ధ్రువమ్, మనసైవా ఽఽప్తవ్యమ్ ” అని. ఇందుకు

---

* ఈజ్ఞానము ఒకనివలనఁ బుచ్చుకొనునది కాదు, ఒకనియొద్దనుండి తెచ్చుకొనునది కాదు.

♦ అజ్ఞానము నేల యందఱును బొంద రనఁగా.

భాష్యము.—ఏతత్ = ఈయాత్మవస్తువు; అప్రమేయమ్ = అతర్క్యమైనను—ఊహింపరానిదైనను; మనసైవ = మనస్సుచేతనే; ధ్రువమ్ = స్థిర మగునట్లుగా; అనుద్రష్టవ్యమ్ = మిక్కిలి తెలియఁబడవలయును, ఇతరముచేతఁ గాదు. అట్లు చెప్పఁబడినది పంచాశీతియందు "రాహు రదృశ్యో ఽపి సదా శశిబిమ్బస్థః ప్రకాశ తే జగతి। తద్వ ద్విశుద్ధచిత్తే ప్రకాశ మేతి స్వయం హ్యాత్మా" ♦ అని.

రా. హి = ఏకారణమువలన; జ్ఞానేన = ఆత్మజ్ఞానముతో; సదృశమ్; పవిత్రమ్ = శుద్ధిచేయునది; ఇహ = ఈలోకమునందు; మఱియొక వస్తువు, నవిద్య తే = లేదో; ఆకారణమువలన ఆత్మజ్ఞానము సమస్తపాపమును నశింపఁజేయుచున్నది యని యర్థము. తత్ = అట్టిజ్ఞానమును; ఉపదేశించిన విధమునఁ బ్రతిదినము అనుష్ఠించు జ్ఞానాకారకర్మయోగముచే సంసిద్ధుఁ డగువాఁడు; కాలేన; తనయాత్మయందు; స్వయమ్ = తానే; పొందుచున్నాఁడు.

ఆత్మజ్ఞానముతో సమానమయిన పవిత్రవస్తువు మఱియొకటి యేదియు లోకమున లేదు కావున ఆత్మజ్ఞానమే సమస్తపాపమును నశింపఁజేయును. ఇదివఱకుపదేశించినవిధమున జ్ఞానాకార మగు కర్మయోగము ననుష్ఠించి సంసిద్ధిఁ బొందినవాని కాయాత్మజ్ఞానము కాలక్రమమునఁ దనయంతనే లభించు నని తాత్పర్యము.

> శ్రద్ధావా౯ లభతే జ్ఞానం తత్పర స్సంయ తేన్ద్రియః
> జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరేణా ఽధిగచ్ఛతి. 39

భా. దేనిచే నేకాంతంబున * జ్ఞానప్రాప్తియగునో ఆయుపాయము నుపదేశించుచున్నాఁడు.—శ్రద్ధావా౯ = శ్రద్ధగలవాఁడు; లభతే = పొందుచున్నాఁడు; జ్ఞానమ్ = జ్ఞానమును. శ్రద్ధావంతుఁడైనను ఒకానొకఁడు మందప్రస్థానుఁడు § కావచ్చును, కావునఁ జెప్పుచున్నాఁడు.—తత్పరః=జ్ఞానలాభోపాయమయిన గురూపాసనాదులందు అభియుక్తుఁడు ¶.

---

♦ రాహువు ఎల్లప్పుడును అదృశ్యుఁడైనను చంద్రబింబమున నున్నవాఁడై లోకమునందుఁ బ్రకాశించుచున్నాఁడు—దృశ్యుఁ డగుచున్నాఁడు. అట్లు శుద్ధమయిన మనస్సునందు ఆత్మ తనయంతనే ప్రకాశము నొందుచున్నాఁడు.

* అవ్యభిచారముగా—తప్పక—నిశ్చయంబున.

§ తక్కువప్రయత్నము గలవాఁడు.

¶ పట్టుదల గలవాఁడు.

శ్రద్ధావంతుఁడును దత్పరుఁడునైనను జితేంద్రియుఁడు కాఁకపోవచ్చు నని చెప్పుచున్నాఁడు.—సంయతేన్ద్రియః= సంయతములు—విషయములనుండి మరలింపఁబడిన యింద్రియములు గలవాఁడు, యోగి. ఎవ్వఁ డిట్టివాఁడు, శ్రద్ధావంతుఁడును దత్పరుఁడును సంయతేంద్రియుఁడు నగుచున్నాఁడో అతఁడు తప్పక జ్ఞానము నొందుచున్నాఁడు. ప్రణిపాతాదికమో బాహ్యము అనైకాంతికము ♦ గూడ నగుచున్నది, మాయావిత్వాదికము సంభవించుటవలన. అట్లది శ్రద్ధావత్త్వాదికమునందు సంభవింపదు. కావున నిది యేకాంతంబున జ్ఞానప్రాప్త్యుపాయము. ఏమిమఱి జ్ఞానప్రాప్తివలనఁ గలుగును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—జ్ఞానమ్ = జ్ఞానమును; లబ్ధ్వా= పొంది; పరామ్ = ఉత్తమ మయిన, మోక్షం బనియెడు. శాన్తిమ్ = ఉపరతిని; అచిరేణ = శీఘ్రముగనే; అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు. సమ్యగ్దర్శనముననే మోక్షం బగు ననుట సర్వశాస్త్రన్యాయ ప్రసిద్ధమై సునిశ్చితమైన విషయము.

శ్రద్ధ * గలవాఁడును గురూపాసన శ్రవణాదులందుఁ బట్టుదల గల వాఁడును జితేంద్రియుఁడు నగువాఁడు తప్పక జ్ఞానము నొందుచున్నాఁడు. జ్ఞానము నొందినచో వెంటనే మోక్షము నొందు నని తాత్పర్యము.

ఆ. కర్మయోగముతోను సమాధియోగముతోను గూడినవానికి జ్ఞాన ప్రాప్తియం దంతరంగసాధనము చెప్పుచున్నాఁడు పూర్వార్ధముచేత. జ్ఞానము పొందిన యెడఁ బ్రయోజనము చెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత. శ్రద్ధ గలుగుటమాత్రమే జ్ఞానప్రాప్తియందు హేతువు గాదు, మఱి యే మనఁగా తత్పరతగూడఁ గావలయు నని చెప్పుచున్నారు శ్రద్ధావంతుఁడైనను ఇత్యాదిగా. మందప్రస్థానుఁడు—తత్పరత లేని వాఁడు, వానికి నుపదేశించినను జ్ఞానము పుట్టఁ జాలదు, అందుచేఁ దత్పరతగూడ జ్ఞానప్రాప్తికిఁ గారణ మని చెప్పుచున్నారు కావునఁ జెప్పుచున్నాఁడు అని. అభియుక్తుఁడు—నిష్ఠ § గలవాఁడు, గురూపాసనాదులందు అనుచోటి యాదిశబ్దముచే శ్రవణాదులు గ్రహింపఁబడుచున్నవి. శ్రద్ధ తత్పరత యీరెండుమాత్రమే కావు

♦ వ్యభిచారి—అనిశ్చితము—జ్ఞానము కలిగింపనిది.

* నమ్మకము.

§ స్థైర్యము.

జ్ఞానప్రాప్తియందుఁ గారణము, మఱేమనఁగా సంయతేంద్రియత్వముగూడఁ గారణము, అది లేనియెడ శ్రద్ధాదికము నిష్ప్రయోజన మగుటవలన అను నభిప్రాయముచేఁ జెప్పుచున్నారు శ్రద్ధావంతుఁడును ఇత్యాదిగా. చెప్పినసాధనములు జ్ఞానముతో నైకాంతికంబు ♦ లని చెప్పుచున్నారు ఎవ్వఁడిట్టివాఁడు ఇత్యాదిగా. తద్విద్ధి ప్రణిపాతే నేత్యాదిశ్లోకమున మున్నే ప్రణిపాతాదికము జ్ఞానహేతువుగాఁ జెప్పియుండి యిప్పు డేల మరల మఱియొక హేతువు చెప్పవలయును? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు ప్రణిపాతాదికమో ఇత్యాదిగా. అది బహిరంగము గదా! ఇదియో యంతరంగసాధనము, మఱియు దానికి జ్ఞానముతో నైకాంతికత § లేదు, మనస్సునందు వేఱు తలంచి బయిటికి వేఱుగాఁ బ్రవర్తించుట యను మాయావిత్వము సంభవించుటవలన, విప్రలంభకత్వాదికము * గూడ సంభావిత మగుటవలన నని యర్థము. మాయావిత్వాదికము శ్రద్ధాతత్పరతాజితేంద్రియత్వములందును సంభవించుటవలన వీనియందును అనైకాంతికత సమానం బని యాశంకించి చెప్పుచున్నారు అట్లది ఇత్యాదిగా. మాయచేతఁ గాని విప్రలంభముచేతఁ గాని శ్రద్ధాతాత్పర్యజితేంద్రియత్వములు ఇతరనియోగంబున ననుష్ఠింప శక్యములు గావు గదా యని యర్థము. ఉత్తరార్ధమునకుఁ బ్రశ్నపూర్వకముగా నవతారిక చేసి వ్యాఖ్యానము చేయుచున్నారు ఏమి మఱి ఇత్యాదిగా. సమ్యగ్దర్శనమువలన నభ్యాసాదిసాధనాపేక్ష లేకయే మోక్షం బగు ననుటకుఁ బ్రమాణము చెప్పుచున్నారు సమ్యగ్దర్శనమువలన నిత్యాదిగా. శాస్త్రశబ్దముచే “తమేవ విదిత్వా, జ్ఞానాదేవతు కైవల్యమ్” ఇత్యాదికము వివక్షింపఁబడినది. ఇఁక న్యాయము—జ్ఞానమువలన నజ్ఞాననివృత్తి రజ్జ్వాదులందుఁ బ్రసిద్ధ మగుటవలన ఆత్మజ్ఞానమువలనఁ గూడ నితరాపేక్ష లేకయే యజ్ఞానతత్కార్యనాశరూప మయిన మోక్షం బగును అనునది.

హ. ఇప్పుడు జ్ఞానప్రాప్తికి నుపాయము చెప్పుచున్నాఁడు.—శ్రద్ధావాన్ = నమ్మకము గలవాఁడు; తత్పరః = అదియే ప్రధానముగాఁ గలవాఁడు, జ్ఞాననిష్ఠుఁ డని యర్థము; సంయతేన్ద్రియః = నిగ్రహింపఁబడిన చక్షురాదీంద్రియములు గలవాఁడు; లభతే = పొందుచున్నాఁడు. ఈయుపాయముచే జ్ఞానముఁ బొందఁగా నేమి లభించును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—జ్ఞానమ్ = ఐక్యబోధమును; లబ్ధ్వా = పొంది;

---

♦ వ్యాప్తి గలవి, తప్పక జ్ఞానము గలిగించునవి.

§ జ్ఞానము గలిగించు ననునియమము.

* మోసకానితనము మొదలగునవి.

పరాంశాన్తిమ్ = మోక్షరూప మయిన శాంతిని; అచిరేణ = అల్పకాలమున; అధిగచ్ఛతి.

౪౦. ఇట్లు జ్ఞానమాహాత్మ్యమును అది సిద్ధించువిధమునుం బ్రతిపాదించి జ్ఞానయోగసిద్ధికి నంతరంగసాధనముఁ జెప్పుచున్నాఁడు.—శ్రద్ధావాన్ = తత్త్వమసి యనుశ్రుతిచే బ్రహ్మాత్మైక్యము చెప్పఁబడుచున్నది, అదియే గురువుచే నుపదేశింపఁబడు చున్నది, ఆశ్రుతివాక్యమునందును గురూపదేశమునందును సత్యత్వబుద్ధి శ్రద్ధ "అస్తీత్యే వోపలబ్ధవ్యః" ♦ అనుశ్రుతివలన, అట్టి యవ్యభిచారి యగు * శ్రద్ధ గలవాఁడు శ్రద్ధావంతుఁడు; ముముక్షు వవశ్యము శ్రద్ధావంతుఁడు కావలయును, శ్రద్ధ లేనియెడ నేమియుఁ గలుగదు కావున శ్రద్ధను బ్రయత్నంబున సంపాదింపవలయు నని యర్థము; శ్రద్ధ గలవాఁ డైనను బహిర్ముఖునకు జ్ఞానము సిద్ధింపదు, కావున బహిర్ముఖుఁడు గాక యుండవలయు నని చెప్పుచున్నాఁడు.—సంయతేన్ద్రియః = సంయతములు—తత్తద్విషయములందుఁ బ్రవర్తింపనియట్లు చేయఁబడిన జ్ఞానకర్మేంద్రియములు గలవాఁడు, యతికి సంయతేంద్రియత్వము సదా ముఖ్యధర్మము, బహిఃప్రవృత్తి లేనివానికే జ్ఞానము సిద్ధించును, సిద్ధించినను బహిఃప్రవృత్తిశూన్యతచేతనే రక్షితము కావలయును, కానిచో నిలువ దని యర్థము; ఇట్లు శ్రద్ధావంతుఁడు సంయతేంద్రియుఁడు నైనను లోపల విషయముల ధ్యానించుచుండుయతికి జ్ఞానము సిద్ధింపదు, కావున నది లేక యుండవలయు నని చెప్పుచున్నాఁడు —తత్పరః= ఎప్పుడును దానియందే—అంతర్వృత్తిని బహిర్వృత్తిని బ్రహ్మాకారముగాఁ జేయుటయందే పరుండు—ఆసక్తుఁ డైనవాఁడు, ఎల్లప్పుడు బ్రహ్మాకారవృత్తి కలిగి యుండుటే యసాధారణ కారణము, దానిచేతనే విపరీతప్రత్యయము లన్నియు నశించును, అనాత్మవాసన లన్నియు నశించును, జ్ఞానము అప్రతిబద్ధ మగుటయు సిద్ధించును, కావున మోక్షార్థి దానినే సంపాదింపవలయును; ఇట్లు నియతము లయినవిశేషణముల మూఁడింటితోఁ గూడిన యతి యెవ్వఁడు గలఁడో అతఁడే, జ్ఞానమ్ = బ్రహ్మమే నేనను నప్రతిబద్ధ మయిన జ్ఞానమును; లభతే, ఇతరుఁడు నూఱుమాఱులు వేదాంతశ్రవణశ్రావణములు ❦ చేసిన విద్వాంసుఁ డైనను బొందఁజాలఁ డని యర్థము. ఇట్లు దీర్ఘకాలము శ్రద్ధావత్త్వము సంయతేంద్రియత్వము తత్పరత్వము అను సాధనములసంపత్తిచే

♦ ఉన్నాఁ డనియే చూడఁబడవలయును.

* ఎప్పుడును తప్పనిది యగు.

❦ వేదాంతముల వినుటయువినిపించుటయు.

నిత్య నిరంతర బ్రహ్మనిష్ఠచే నిష్పన్నంబై జగత్తుం దానును బ్రహ్మాకారముగాఁ గనఁ బునట్లు చేయునట్టి, జ్ఞానమ్=జ్ఞానమును; లబ్ధ్వా; బ్రహ్మవిదుఁ డగు యతి, అచిరేణ=ఉత్తరక్షణముననే; పరామ్=సంశయవిపరీతభావనాదులు లేని జ్ఞానముచే భాసిత మగుటవలనను వస్తుస్వభావమువలనను అవిద్యాతత్కార్యాభాసశూన్యము నిరతిశయసుఖాత్మకము బ్రహ్మాత్మావస్థానరూపం బగు; శాన్తిమ్=విదేహముక్తిని; అధిగచ్ఛతి= పొందుచున్నాఁడు.

మ. దేనిచే నేకాంతంబున జ్ఞానప్రాప్తి యగునో ఆయుపాయంబును మున్ను చెప్పిన ప్రణిపాతాదికముకన్న నంతరంగమైనదానిఁ జెప్పుచున్నాఁడు.—శ్రద్ధావాన్= గురువాక్యమునందును వేదాంతవాక్యంబునందును ఇది యిట్లే సత్యం బను నాస్తిక్య బుద్ధి శ్రద్ధ యనఁబడును, అది గలపురుషుఁడు; జ్ఞానం లభతే. ఇట్టివాఁ డైనను ఒకానొకఁడు సోమరి యగును, కావునఁ జెప్పుచున్నాఁడు.—తత్పరః = జ్ఞానోపాయ మయిన గురుపాసనాదులందు మిక్కిలి యభియుక్తుఁడు. శ్రద్ధావంతుఁడును దత్పరుఁడు నైనను ఒకానొకఁడు అజితేంద్రియుఁడు కావచ్చును కావునఁ జెప్పుచున్నాఁడు.— సంయతేన్ద్రియః = విషయములనుండి మరలింపఁబడిన యింద్రియములు గలవాఁడు. ఎవ్వఁ డీవిశేషణములు మూఁడును గలవాఁడో అతం డవశ్యము జ్ఞానముఁ బొందుచున్నాఁడు. ప్రణిపాతాదికమో బాహ్యము, మాయావిత్వాదులు సంభవించుటవలన, అనైకాంతికముగూడ నగుచున్నది, శ్రద్ధావత్త్వాదికము ఐకాంతిక మగు నుపాయం బని యర్థము. ఇట్టి యుపాయముచే, జ్ఞానము నొంది; పరామ్ = ఉత్కృష్ట మయిన; శాన్తిమ్ = అవిద్యాతత్కార్యనివృత్తిరూప మయినముక్తిని; అచిరేణ = దానికి అవ్యవధానముగనే ♦; అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు. ఎట్లు దీపము తాను పుట్టినంతనే యంధకారనివృత్తిని జేయుచున్నదో, దేనిని సహాయము నపేక్షింపదో అట్లు జ్ఞానముగూడఁ దాను పుట్టినంతనే యజ్ఞాననివృత్తి చేయుచున్నది. దేనిని బ్రసంఖ్యానాదికము * నపేక్షింప దని భావము.

శ్రీ. మఱియును.—శ్రద్ధావాన్ = గురు వుపదేశించిన విషయమునందు ఆస్తిక్యబుద్ధి గలవాఁడు; తత్పరః = దానియందే నిష్ఠ గలవాఁడు; సంయతేన్ద్రియః= జితేంద్రియుఁడును; అట్టి, జ్ఞానమ్, లభతే. ఇతరుఁడు పొందఁ జాలఁడు. అందువలన

♦ జ్ఞానము నొందిన వెంటనే.

* అభ్యాసము మొదలగుదాని.

శ్రద్ధాదిసంపత్తిచే జ్ఞానమునొందుటకు మున్ను కర్మయోగమే శుద్ధికొఱకనుష్ఠింపవలయును. జ్ఞానము పొందిన పిమ్మట వానికిఁ జేయవలసినకార్య మేదియు లే దని చెప్పుచున్నాఁడు.—జ్ఞానం లబ్ధ్వా = జ్ఞానము నొందిన పిమ్మటనో; అచిరేణ = వెంటనే; పరాం శాన్తిమ్ = మోక్షమును; అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

ప. మఱియును —గురు వుపదేశించినయర్థమునందు ఆస్తిక్యము శ్రద్ధ, అదిగలవాఁడును; తత్పరః = దానియందే నిష్ఠ గలవాఁడును; సంయతేన్ద్రియుఁడును; జ్ఞానం లభతే. ఇతరుఁడు లభింపఁజాలఁడు ఇట్లు, జ్ఞానం లబ్ధ్వా; అచిరేణ; పరాం శాన్తిమ్ = మోక్షమును; అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

రా. దానినే స్పష్టముగాఁ జెప్పుచున్నాఁడు.—ఇట్లు ఉపదేశమువలన జ్ఞానము నొంది యుపదేశింపఁబడిన జ్ఞానముయొక్క వృద్ధియందు; శ్రద్ధావాన్=శ్రద్ధ గలవాఁడును; తత్పరః = దానియందే నియత మయిన మనస్సు గలవాఁడును; దానికంటె నితర మయిన విషయమునుండి, సంయతేన్ద్రియః = మరలింపఁబడిన యింద్రియములు గలవాఁడునై; శీఘ్రకాలంబున; జ్ఞానమ్ = మున్ను చెప్పిన పరిపాకావస్థను బొందిన జ్ఞానమును; లభతే = పొందున్నాఁడు. అట్టి, జ్ఞానమ్= జ్ఞానమును; లబ్ధ్వా= పొంది; పరాంశాన్తిమ్ = పరమనిర్వాణమును; అచిరేణ = శీఘ్రముగా; అధిగచ్ఛతి= పొందుచున్నాఁడు

ఇట్లు గురూపదేశమునలన జ్ఞానము నొంది యాజ్ఞానము వృద్ధిపఱచుకొనుటయందు శ్రద్ధయుఁ దత్పరతయుఁ గలవాఁడై తదితరవిషయంబులం దింద్రియములఁ బోనీయక యుండునేని అజ్ఞానము పరిపక్వ మగును. అట్టి పరిపక్వజ్ఞానమును బొందినచో శీఘ్రమున మోక్షము నొందఁ గలఁడు.

మా. అజ్ఞానమునకు సాధనంబును తద్విరోధి యగుదాని ♦ ఫలంబును ఉత్తరశ్లోకములం బ్రతిపాదించి యుపసంహరించుచున్నాఁడు.

> అజ్ఞశ్చా ఽశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి
> నా ఽయం లోకో ఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః. ౪౦

భా. ఇందు సంశయము సేయఁ గూడదు. పాపిష్ఠము గదా సంశయము. ఎట్లు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు —అజ్ఞశ్చ = అత్మజ్ఞుఁడు

♦ అజ్ఞానాదికముయొక్క.

కానివాఁడును; అశ్రద్దధానశ్చ = శ్రద్ధ లేనివాఁడును; సంశయాత్మా = సంశయము మనస్సునందుఁ గలవాఁడును; వినశ్యతి=నశించుచున్నాఁడు. అజ్ఞుఁడును అశ్రద్దధానుఁడును నశింతురు వాస్తవమే, అయినను సంశయాత్ముఁ డెట్లు నశించునో అట్లు కాదు. సంశయాత్ముఁడో పాపిష్ఠుం డందఱి లోను. ఎట్లు? సంశయాత్మనః= సందేహము మనస్సునందుఁ గలవానికి; అయంలోకః= ఈ సాధారణ మైనలోకము గూడ; నాస్తి=లేదు. పరః = పరలోకము; న = లేదు. సుఖమ్ = సుఖము; న = లేదు, వానియందును సంశయము పుట్టుటవలన. అందువలన సంశయము చేయఁ గూడదు.

అజ్ఞానియు శ్రద్ధ లేనివాఁడును సంశయాత్ముఁడును నాశ మొందుదురు. అందును సంశయాత్మున కంతటను సంశయము గలుగుటవలన నిహలోకము గాని పరలోకము గాని లేదు, ఎందును సుఖము గలుగ దని తాత్పర్యము.

**ఆ.** ఉత్తరశ్లోకమున కవతారిక చేయుచున్నారు ఇందు ఇత్యాదిగా. ఇందుకు—ఈ చెప్పినసాధనములు గలవాఁ డుపదేశము నొంది శీఘ్రమున బ్రహ్మమును సాక్షాత్కరించుచున్నాఁడు, బ్రహ్మమును సాక్షాత్కరించినంత వెంటనే మోక్షము నొందుచున్నాఁ డను నీయర్థమునందు. సంశయము చేయఁగూడ దనుటకు హేతువుఁ జెప్పుచున్నారు పాపిష్ఠము గదా యని. చెప్పినహేతువును ప్రశ్నపూర్వకముగా నుత్తరశ్లోకముచే సాధించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. అజ్ఞునికన్నను అశ్రద్దధానుని కన్నను సంశయచిత్తునకు విశేషముఁ జూపుచున్నాఁ డుత్తరార్ధముచేత. ఉత్తరార్ధ మును విభజించుకొనుటకు భూమికఁ జేయుచున్నారు అజ్ఞుఁడును ఇత్యాదిగా. అజ్ఞాదుల లోపల సంశయాత్ముఁడు పాపిష్ఠుఁ డనుట యేది గలదో దానిఁ బ్రశ్నద్వారంబునఁ బ్రకటించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. రెండులోకంబులును వానిచేఁ గలుగుసుఖం బును లేవనుటకు హేతువు చెప్పుచున్నారు వానియందును ఇత్యాదిగా. సంశయ చిత్తునకు నంతటను సంశయము ప్రవర్తించుటవలన నని యర్థము. సంశయం బనర్థ మూలం బని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

**హ.** ఇప్పుడు జ్ఞానప్రాప్తికి బాధకముఁ జెప్పుచున్నాఁడు.—అజ్ఞః = జ్ఞాన ప్రాప్తికి విముఖుఁ డైనవాఁడును; అశ్రద్దధానః= శ్రద్ధ లేనివాఁడును; సంశయాత్మా= సంశయ మనఁగా సంశయము గలది యని యర్థము, అర్శ ఆద్య చ్ప్రత్యయాంతము, అంతటను సందేహము గల మనస్సు గలవాఁడును; వినశ్యతి—జ్ఞానరూప మయిన

పురుషార్థమునుండి భ్రష్టుఁ డగుచున్నాఁ డని యర్థము. మఱియును. సంశయాత్మనః = సందేహము గల మనస్సు గల యతనికి; అయం లోకః = ఈసర్వసాధారణ మయిన లోకము గూడ; నాస్తి. పరః= స్వర్గాఖ్యలోకము గూడ. న. సుఖమ్= అన్నపానాదిసుఖముగూడ; న.

౪౦. «బ్రహ్మవి దాప్నోతి పరమ్, జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః, జ్ఞాత్వా శివం శాన్తి మత్యన్త మేతి, య ఏత ద్విదు రమృతాస్తే భవన్తి, యే విదు ర్యాన్తి తే పరమ్, తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్» ఇత్యాదిశ్రుతిస్మృతిశతములచేతను, «బ్రహ్మవిదుఁడు ముక్తుఁ డగును జ్ఞానము గలవాఁ డగుటవలన వామదేవాదులవలె» ఇత్యాదియుక్తులచేతను ప్రసిద్ధ మగుటవలన సమ్యగ్దర్శనమువలన మోక్షము కలుగు నను నీయర్థమునందు మోక్షకాముఁ డగు బ్రాహ్మణుఁడు, అశ్రద్ధను గాని సంశయమును గాని ఆత్మజ్ఞానసంపాదనమునందుఁ బ్రయత్నము లేమిని గాని చేయఁ గూడదు; చేసినయెడ మోక్షము లభింప దని చెప్పుచున్నాఁడు.——ఎవ్వఁడు సర్వకర్మములను మోక్షముకొఱకు సన్న్యసించి మోక్షకారణ మగు శ్రవణాదికమునందును దానికిఁ గారణ మగు గురుశుశ్రూషా శమ దమ తితిక్షా తత్పరత్వాదికమునందును బ్రయత్నము చేయక యాత్మజ్ఞానము సంపాదింపఁడో అతఁడే యీమోక్షశాస్త్రమునం దజ్ఞుఁ డని చెప్పఁబడుచున్నాఁడు, అట్టివాఁడును; ఎవ్వనికి సన్న్యాసమునందును వేదాంతశ్రవణాదులందును గురువునందును మోక్షమునందును జ్ఞానమువలన మోక్షము గలుగు నను నర్థమునందును నమ్మకము లేదో అతఁడు అశ్రద్దధానుఁడు—శ్రద్ధ లేనివాఁడు, అట్టివాఁడును; సంశయాత్మా= అపామ సోమ మమృతా అభూమ, దక్షిణావన్తో అమృతం భజన్తే * ఇత్యాదివాక్యములచేఁ గర్మము ముక్తిహేతు వని చెప్పఁబడుచున్నది, «తరతి శోక మాత్మవిత్, జ్ఞానా దేవతు కైవల్యమ్, కర్మణా బధ్యతే జన్తు ర్విద్యయా చ విముచ్యతే "♦ ఇత్యాది శ్రుతిస్మృతివాక్యములచే జ్ఞానమువలన ముక్తి యగు నని చెప్పఁబడుచున్నది, అందువలనఁ గర్మముచేతనా జ్ఞానముచేతనా ముక్తి యను సంశయము మనస్సునందుఁ గలవాఁడు సంశయాత్ముఁడు, చక్కఁగా శాస్త్రాధ్యయనము చేసినవాఁ డైనను ఎవ్వఁడు

---

* సోమమును ద్రాగితిమి అమృతుల మైతిమి, దక్షిణ యిచ్చినవారు అమృతమును బొందుచున్నారు.

♦ ఆత్మ నెఱింగినవాఁడు శోకమును దాఁటుచున్నాఁడు, జ్ఞానమువలననె కైవల్య మగును, ప్రాణి కర్మముచే బద్ధుఁ డగుచున్నాఁడు, జ్ఞానముచేతనో ముక్తుఁ డగుచున్నాఁడు.

సంశయ మనుగ్రహామునకు లోనగునో అతఁడును; వినశ్యతి = జ్ఞానఫలమునుండి భ్రష్టుఁ డగుచున్నాఁడు, ఎప్పటికిని ముక్తిఁ బొందఁ జాలఁ డని యర్థము. ఇట్లు జ్ఞాన శూన్యు లయిన యీముగ్గురికి ముక్తి కలుగ దని చెప్పి వారిలో అధికదోషము గలవాఁ డగుటవలన సంశయాత్మునకు విశేషముఁ బ్రతిపాదించుచున్నాఁడు.—సంశ యాత్మనః = సంశయచిత్తుఁ డగు పాపిష్ఠునకు; ముక్తిమాత్రమే లే దనుట కాదు, మ తేమనఁగా భవిష్యజ్జన్మమునందు; అయంలోకః = మనుష్యలోకము గూడ; నాస్తి. న పరః = స్వర్గముగూడ లేదు; పురుషునకు సంశయమే మహాపాపములకుఁ బుట్టినిల్లు, సర్వానర్థములకును బీజము, అందువలన « ఇది యవశ్యము చేయవలయును, దీనిచేఁ దరింపఁగలను » అని వైదికకర్మమున నంతటను వానికి శ్రద్ధ సంభవింపదు, శ్రద్ధ లేక చేసినకర్మములు యథోక్తఫలము నియ్యఁజాలవు, కావున నాయాలోక ముల నతఁడు పొందఁ జాలఁ డనుట యుపపన్నము. విషయసుఖముగూడ వానికి సంభవింపదు, అట్టివాని కాహారాదులందుఁగూడ సంశయము సంభవించుటవలన. అందువలన సంశయాత్ముఁడు నరలోకపరలోకములకును వానియందలి సుఖమునకును దూర మగుచున్నాఁ డని యర్థము. ఇందుచే ముముక్షు వగు యతి ప్రయత్నంబున నాత్మజ్ఞతను సన్న్యాసగురువేదాంతశ్రవణాదులందు శ్రద్ధను దదుక్తవిషయములందు సంశయము లేకుండుటను సంపాదింపవలయు నని సూచిత మగుచున్నది.

మ. ఈవిషయమునందు సంశయము సేయఁగూడదు. ఎందువలననఁగా.—అజ్ఞః = శాస్త్రాధ్యయనము చేయనివాఁ డగుటచే ఆత్మజ్ఞానము లేనివాఁడు; అశ్రద్ద ధానః = గురువేదాంతవాక్యములయర్థమునందు ఇది యిట్లు కానే కా దని విపరీత జ్ఞానరూప మయిన నాస్తిక్యబుద్ధి యశ్రద్ధ, అది కలవాఁడు అశ్రద్దధానుఁడు; సంశ యాత్మా = ఇది యిట్లగునో కాదో అని యంతటను సంశయముచే నాక్రాంత మయిన చిత్తము గలవాఁడు సంశయాత్ముఁడు; వినశ్యతి= స్వప్రయోజనమునుండి భ్రష్టుఁ డగు చున్నాఁడు. అజ్ఞశ్చా ఽశ్రద్దధానశ్చ అని సంశయాత్మునికంటె వీరిద్దఱికిని గల్గువి నాశము తక్కువ యని సూచించుటకై చకారముతో వారిద్దఱును బ్రయోగింపఁ బడిరి. ఎందువలన ననఁగా సంశయాత్ముఁడు అందఱికన్నను పాపిష్ఠుఁడు గదా! ఎందువలన ననఁగా.—సంశయాత్మనః = సంశయముచే నాక్రమింపఁబడిన మనస్సు గలవానికి; అయం లోకః = ఈమనుష్యలోకము గూడ; నాస్తి = లేదు, ధనార్జనా దులు లేకుండుటవలన, న పరః = స్వర్గము మోక్షము మొదలగు పరలోకము గూడ లేదు, ధర్మము జ్ఞానము మొదలగునవి లేమివలన. న సుఖమ్= భోజనాదులచేఁ గలుగు

సుఖముగూడ లేదు, అంతట సంశయము గలుగుటవలన. అజ్ఞునకును అశ్రద్ధధానున కును బరలోకము మాత్రము లేదు, మనుష్యలోకంబును భోజనాదిసుఖంబును గలవు, సంశయాత్ముఁడో మూఁడును లేనివాఁ డగుటచే నందఱికన్నను బాపిష్ఠుఁ డని యర్థము.

శ్రీ. జ్ఞానాధికారిని జెప్పి తద్విపరీతుఁ డైన యనధికారిని జెప్పుచు న్నాఁడు.—అజ్ఞః = గురు వుపదేశించినయర్థము దెలియనివాఁడు; ఎట్లో తెలిసినను అశ్రద్ధధానుఁడును, శ్రద్ధకలిగినను నా కిది సిద్ధించునో సిద్ధింపదో అని సంశయముచే నాక్రాంతమయిన మనస్సు గలవాఁడును; నశ్యతి = స్వప్రయోజనమునుండి భ్రష్టుఁ డగుచున్నాఁడు. ఈముగ్గురిలోను సంశయాత్ముఁడు అన్నివిధముల నశించుచు న్నాఁడు. ఎందువలన ననఁగా, వానికి, అయం లోకః నాస్తి—ధనార్జనము వివా హము మొదలగునవి లేక పోవుటవలన. పరలోకముగూడ లేదు, ధర్మము లేకపో వుటవలన. సుఖము గూడ లేదు, సంశయముచేతనే భోగముగూడ సంభవింపమివలన.

ప. ఇఁక జ్ఞానరహితుని నిందించుచున్నాఁడు —అజ్ఞః = గురువుచే నుప దేశింపఁబడిన యర్థమును దెలియనివాఁడును; అతిప్రయాసచే జ్ఞానము కలిగినను అశ్రద్ధధానుఁడు, నాస్తికుఁ డగుటవలన; ప్రయాసచే శ్రద్ధ కలిగినను నా కిది సిద్ధిం చునో సిద్ధింపదో అని సంశయాత్ముఁడు; ఇట్టి పురుషుఁడు, నశ్యతి. ఇఁక నాశము యొక్క స్వరూపముఁ జెప్పుచున్నాఁడు.—సంశయాత్మనః = సంశయరూప మయిన ఆత్మ—మనస్సు గలవానికి; అయం లోకో నాస్తి, అజ్ఞుఁ డగుటవలన. నపరః, అశ్ర ద్ధధానుఁ డగుటవలన. నసుఖమ్ = విశ్రాంతి లేదు, సంశయాత్ముఁ డగుటవలన.

రా. అజ్ఞశ్చ = ఇట్లుపదేశముచేఁ బొందఁబడిన జ్ఞానము లేనివాఁడును; అశ్రద్ధధానశ్చ = ఉపదిష్ట మయినజ్ఞానము వృద్ధిచేయు నుపాయమునందు త్వర లేని వాఁడును; ఉపదిష్ట మయినజ్ఞానమునందు, సంశయాత్మా= సంశయము మనస్సునందుఁ గలవాఁడును; వినశ్యతి= నశించినవాఁ డగుచున్నాఁడు. ఉపదిష్ట మగు నాత్మతత్త్వ విషయ మయిన యీజ్ఞానమునందు, సంశయాత్మనః = సంశయము మనస్సునఁ గల వానికి; అయం లోకః = ఈప్రాకృతలోకముగూడ; నాస్తి = లేదు. నపరః = ధర్మార్థ కామరూపపురుషార్థములు గూడ; న = లేవు. ఇఁక మోక్ష మెక్కడిది ? అని యర్థము. సర్వపురుషార్థములును శాస్త్రీయకర్మసిద్ధిరూపము లగుటవలన, శాస్త్రీ యకర్మసిద్ధియు దేహాతిరిక్తుఁడు ఆత్మ యను నిశ్చయముననే కలుగునది యగుటవలన.

కావున, నసుఖమ్—కొంచెమైనను సుఖము మనస్సునందు సంశయాత్మునకు సంభ వింపదు.

ఈ యుపదేశించినజ్ఞానము లేనివాఁడును దాని వృద్ధిచేయు నుపాయము నందుఁ ద్వర లేనివాఁడును ఈజ్ఞానమునందు సంశయము గలవాఁడును నాశము నొందుదురు. మఱియు, ఈయాత్మతత్త్వవిషయజ్ఞానమునందు సంశయము నొందు వానికి ఈప్రాకృతలోకముగూడ లేదు, ధర్మార్థకామములుగూడ సిద్ధింప నేరవు. ఇట్లు కొంచెమైనను ఎందును సుఖము గలుగ దని తాత్పర్యము.

మూ. ♦

యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ. ౪౧

భా. ఎందువలన? అనఁగా.—యోగసన్న్యస్తకర్మాణమ్=పరమార్థద ర్శనరూప మయినయోగముచే సన్న్యసింపఁబడినకర్మములుగలవానిని, పర మార్థదర్శియై ధర్మాఽధర్మాఖ్యకర్మములను సన్న్యసించినవానిని; ఎట్లుయోగ సన్న్యస్తకర్ముఁ డగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—జ్ఞానసంఛిన్నసంశ యమ్ = ఆత్మకును ఈశ్వరునకును ఏకత్వజ్ఞానం బను జ్ఞానముచే చక్కఁగా ఛేదింపఁబడినసందేహముగలవానిని; ఎవ్వఁ డిట్లు యోగసన్న్యస్తకర్ముఁ డగునో అట్టి, ఆత్మవన్తమ్ = అప్రమత్తుని *; గుణముల § చేష్టా రూపమునఁ గనఁబడునట్టి, కర్మాణి = కర్మములు; ననిబధ్నన్తి = బంధిం పవు, అనిష్టాదిరూప మయిన ఫలమును గలిగింపవు. ధనఞ్జయ = ఓ యర్జునుఁడా !

అర్జునా! జీవేశ్వరైకత్వజ్ఞానముచే సర్వసంశయంబులు వీడినవాఁడై పరమార్థజ్ఞాననిష్ఠ నొంది ధర్మాఽర్మాఖ్యసర్వకర్మములను సన్న్యసించి కొంచెమైనను ఏమఱుపాటు లేక యుండుపురుషుని వాని దేహేంద్రియాదులు చేయుకర్మములు బంధింప వని తాత్పర్యము.

---

♦ ఇఁక నధ్యాయము కడవఱకు మాధ్వభాష్యము లేదు.

* ప్రమాదము—ఏమఱుపాటు లేనివానిని.

§ దేహేంద్రియాదుల.

ఆ. సంశయము సర్వానర్థములకుఁ గారణం బగుటచేఁ జేయఁగూడదనుట వాస్తవమే యయినను దాని నివర్తించునది లేకుండునప్పుడు దానిఁ జేయకుండుట శక్యము గా దని యాశంకించుచున్నాఁడు ఎందువలన అని. శ్రుతియుక్తులచేఁ గలుగునట్టి యైక్యజ్ఞానము సంశయమును నివర్తించు నని చెప్పుచున్నాఁడు జ్ఞానసంఛిన్నసంశయమ్ అని. సంశయము లేనివానికిఁ గూడఁ గర్మము లనర్థము గలిగించు నని యాశంకించి చెప్పుచున్నాఁడు యోగసన్న్యస్తకర్మాణమ్ అని. విషయపరవశుం డగుపురుషునకు యోగము సంభవింపమివలన నతం డెట్లు యోగసన్న్యస్తకర్ముం డగు నని యాశంకించి చెప్పుచున్నాఁడు ఆత్మవన్తమ్ అని. పరమార్థదర్శనమువలన సంశయములు పీడఁగా నాసంశయంబులఁ బోఁగొట్టునట్టి జ్ఞానముయొక్క మాహాత్మ్యమువలననే కర్మములును నివర్తిల్లుం గావున నప్రమత్తునకుఁ బ్రాతిభాసికంబు లగుకర్మములు బంధహేతువులు కాఁ జాల వని చెప్పుచున్నాఁడు నకర్మాణీత్యాదిగా. కర్మయోగమువలననే కర్మసన్న్యాసం బనుపపన్న మని యాశంకించి మొదటిపాదమును విభజించుచున్నారు పరమార్థదర్శనరూపము ఇత్యాదిగా. అపరమార్థదర్శనము విధికృతసన్న్యాసపక్షమునఁ బరోక్ష మనియు ఫలరూపసన్న్యాసపక్షమున అపరోక్ష మనియుఁ దెలియునది. పై చెప్పిన జ్ఞానముచే సన్న్యస్తకర్ముఁ డగుటయు సంశయ ముండఁగా సిద్ధింపదు సంశయము గలవానికి కర్మసన్న్యాసము సంభవింపమివలన అని యాశంకించుచున్నాఁడు ఎట్లు ఇత్యాదిగా. రెండవపాదమునకు వ్యాఖ్యానము సేయుచు శంకను బరిహరించుచున్నారు చెప్పుచున్నాఁడు ఇత్యాదిగా. పాఠక్రమముకన్న నర్థక్రమము బలిష్ఠం బగుటవలన మొదట రెండవపాదమునకు వ్యాఖ్యానము చేసి వెనుక మొదటిపాదమునకు వ్యాఖ్యానము చేయవలయు నని చెప్పుచున్నారు ఎవ్వఁ డిట్లు ఇత్యాదిగా. ఇది యంతయుఁ బ్రమాదము గలవానికి విషయపరవశునకు సిద్ధింప దని యభిప్రాయము గలవారై ఆత్మవన్త మ్మనుపదమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు అప్రమత్తుని అని. నకర్మాణీత్యాదిఫలప్రతిపాదకభాగమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు గుణముల ఇత్యాదిగా. అనిష్టాది యనుచోటి యాదిశబ్దముచే ఇష్టఫలమును మిశ్రమును గ్రహింపఁబడుచున్నవి.

హ. అట్లు సంశయము లేనివాఁడై.—యోగసన్న్యస్తకర్మాణమ్= యోగముచే-ఫలత్యాగముచేత విడువఁబడినకర్మములు గలవానిని; జ్ఞానసంఛిన్నసంశయమ్ = పరమాత్మజ్ఞానముచేఁ జక్కఁగా ఛేదింపఁబడిన సందేహములు గలవానిని;

ఆత్మవన్తమ్ = జితేంద్రియుని; కర్మాణి = కర్మములు; బంధకము లైనను, నినిబధ్నన్తి—ఇష్టానిష్టశరీరేంద్రియవిషయములను బొందించునవి కాఁజాల వని యర్థము.

శ్లో ౦. అప్పుడు, ఈప్రకారముగా ననర్థహేతు వగు సంశయం బెట్లు నిశ్శేషముగా నివర్తిల్లు నని యాశంకింపఁగా; శ్రుతియుక్తులవలనఁ బుట్టినట్టి బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముచేతనే యది నివర్తిల్లు నని సూచించుటకై, పరావరైకత్వవిజ్ఞానముచే విచ్ఛిన్నము లయిన సర్వసంశయములు గలవాఁ డగుటవలననే బ్రహ్మవిదుఁడు కర్మములచే బంధింపఁబడఁ డని ప్రతిపాదించుచున్నాఁడు.—జ్ఞానసంఛిన్నసంశయమ్ = జ్ఞాన మనఁగా జీవపరమాత్మలను అఖండైకరసు లని తెలియుట, నిరంతరసమాధిచే అప్రతిబద్ధ మయిన అట్టిజ్ఞానముచే సంఛిన్నము లయిన—నిశ్శేషముగా నిర్మూలితము లైనసంశయములు—మోక్షము కర్మముచేతనా? జ్ఞానముచేతనా? జ్ఞానము పరోక్షమా? అపరోక్షమా? మోక్షము జ్ఞానముచే సిద్ధించునా? సిద్ధింపదా? ఇత్యాది సర్వసంశయములు గలవానిని; అందువలననే, యోగసన్న్యస్తకర్మాణమ్ = ఇది యంతయు నేనును బ్రహ్మమే యని సమస్తప్రపంచమును తన్నును బ్రహ్మమాత్రముగాఁ జూచుట యోగము, దానిచే సన్న్యస్త మయిన—సంబంధము లేనివిగాఁ జేయఁబడిన. లేక, చక్కఁగా మిక్కిలి యస్తములు—నశించినవి బ్రహ్మమునందు బ్రహ్మరూపంబున లయము నొందినవగు కర్మములు సంచితాగాములు సమస్తములును గలవానిని; ఆత్మవన్తమ్ = అప్రమత్తుని; లేక, ఆత్మయే వెలుపలను లోపలను అంతటను వృత్తికి విషయముగాఁ గలవానిని, ఇతరవృత్తి లేనివానిని, అట్టిబ్రహ్మవిదుని; కర్మాణి= స్వప్నమువలె నాభాసరూపము లయిన శరీరయాత్రామాత్రప్రయోజనము లగు దేహాదిచేష్టలు, యోగాగ్నిచే నిర్దగ్ధము లగుటవలన నిర్వీర్యములు; నినిబధ్నన్తి = బంధము కలిగింపఁ జాలవు, శుక్తిదర్శనముచే రజతబుద్ధి నశించునట్లు బ్రహ్మదర్శనముచే నశించుచున్నవి యని యర్థము. ఇందుచేఁ గర్మములు బంధకములు కాకుండుటకై బ్రహ్మవిదు లగుయతులు యోగముచేతనే సర్వకర్మసన్న్యాసము చేయవలయు నని సూచిత మగుచున్నది.

మ. ఇట్టి సర్వానర్థమూలం బగుసంశయమును నిరాకరించుట కాత్మనిశ్చయమే యుపాయం బని చెప్పుచు నీరెండధ్యాయములం జెప్పఁబడినదియుఁ బూర్వోత్తరభూమికాభేదంబున ద్వివిధంబు నగు కర్మజ్ఞానరూప మైనబ్రహ్మనిష్ఠ నుపసంహరించుచున్నాఁడు.—యోగసన్న్యస్తకర్మాణమ్ = యోగముచేత— భగవదారాధనరూప మయిన సమత్వబుద్ధిచేత, సన్న్యస్తములు—భగవంతునందు సమర్పింపఁబడి

నవి యగుకర్మములు గలవానిని; లేక, పరమార్థదర్శనరూప మయినయోగముచేత సన్న్యస్తములు—విడువఁబడినవి యగుకర్మములు గలవానిని; సంశయ ముండునేని యెట్లు యోగసన్న్యస్తకర్ముఁ డగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—జ్ఞానసంఛిన్నసంశయమ్ = ఆత్మ నిశ్చయరూప మయిన జ్ఞానముచే ఛేదింపఁబడిన సంశయము గలవానిని; విషయములకుఁ బరవశుం డగుట యనుప్రమాద ముండఁగా నెట్లు జ్ఞానోత్పత్తి యగు ననఁగా జెప్పుచున్నాఁడు.—ఆత్మవన్తమ్ = ప్రమాదము లేనివానిని, ఎల్లప్పుడు నెచ్చరిక గలవానిని; ఇట్లు అప్రమత్తుఁ డగుటచే జ్ఞానవంతుఁడును జ్ఞానసంఛిన్న సంశయుఁ డగుటచే యోగసన్న్యస్తకర్ముఁడు నగువానిని; కర్మాణి = లోకసంగ్రహార్థములు గాని వ్యర్థచేష్టారూపములు గాని కర్మములు; ననిబధ్నన్తి—ఇష్టమును గాని అనిష్టమును గాని మిశ్రమును గాని శరీరమును గలిగింపఁ జాలవు. ఓధనంజయుఁడా!

శ్రీ. రెం డధ్యాయములచేఁ జెప్పఁబడినదియుఁ బూర్వాఽపరభూమికా భేదంబున రెండువిధములు నగు కర్మజ్ఞానరూప మయిన బ్రహ్మనిష్ఠ నుపసంహరించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—యోగసన్న్యస్తకర్మాణమ్ = పరమేశ్వరారాధనరూపయోగముచేత నతనియందు సమర్పింపఁబడిన కర్మములు గలవానిని; కర్మాణి = కర్మములు; తమఫలములచే, ననిబధ్నన్తి. అందువలన, జ్ఞానసంఛిన్నసంశయమ్ = అకర్తయాత్మ యనుజ్ఞానముచే సంఛిన్న మయిన దేహాద్యభిమానరూప సంశయము గలవానిని గూడ; ఆత్మవన్తమ్ = అప్రమత్తుఁ డైనవానిని; కర్మాణి—లోకసంగ్రహార్థములు గాని స్వాభావికములు గాని; ననిబధ్నన్తి.

ప. ఇఁక పూర్వము చెప్పిన కర్మజ్ఞానరూప మగు ద్వివిధబ్రహ్మనిష్ఠ నుపసంహరించుచుఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—పరమేశ్వరారాధనరూపమైనయోగముచేత నతనియందు సన్న్యసింపఁబడిన కర్మములు గలవానిని; అట్లు, అకర్త్రాత్మజ్ఞానముచే సంఛిన్న మయిన దేహాభిమానరూపసంశయము గలవానిని; ఆత్మవన్తమ్ = ప్రమాదము లేనివానిని, ఎచ్చరిక గలవానిని; కర్మాణి = లోకసంగ్రహార్థము చేయఁబడినవి; ననిబధ్నన్తి. అట్లు చెప్పఁబడినది « యథా పర్వత మాదీప్తం నాశ్రయన్తి మృగద్విజాః । తద్వ ద్బ్రహ్మవిదం దోషా నాశ్రయన్తి కదాచన »* అని.

---

* ఎట్లు మండుచున్న పర్వతమును మృగపక్షులు చేరవో అట్లు బ్రహ్మవిదుని దోషము లెప్పుడునుం జేరవు.

రా॰ యోగసన్న్యస్తకర్మాణమ్ = ఉపదేశింపఁబడిన యోగముచే జ్ఞానాకారత నొందినకర్మములు గలవానిని; జ్ఞానసంఛిన్నసంశయమ్ = ఉపదేశింపఁబడిన యాత్మజ్ఞానముచేత ఆత్మవిషయమున సంఛిన్న మయిన సంశయము గలవానిని; ఆత్మవన్తమ్ = గొప్పమనస్సు గలవానిని, ఉపదేశించిన యర్థమునందు దృఢముగా నిలిచినమనస్సు గలవానిని; కర్మాణి = బంధహేతువు లయిన ప్రాచీనానంతకర్మములు; ననిబధ్నన్తి = బంధింపవు.

నే నిదివఱ కుపదేశించిన యోగము ననుష్ఠించుటచే జ్ఞానాకారత నొందిన కర్మములు గలవాఁడును అట్లు నే నుపదేశించిన యాత్మజ్ఞానముచే ఆత్మవిషయ సంశయము వీఁడినవాఁడును మఱియు నుపదిష్టార్థమునందు దృఢముగా నెలకొన్న మనస్సు గలవాఁడు నగు పురుషుని తత్ప్రాచీనానంతకర్మములు బంధింపఁజాల వని తాత్పర్యము.

తస్మా దజ్ఞానసమ్భూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత. ౪౨

భా॰ ఎందువలనఁ గర్మయోగానుష్ఠానముచేఁ గలుగు నశుద్ధిక్షయమువలనం బుట్టునట్టి జ్ఞానముచే సంఛిన్న మయిన సంశయము గలవాఁడు కర్మములచే బంధింపఁబడఁడో జ్ఞానాగ్ని దగ్ధకర్ముఁ డగుటవలననే, మఱియు నెందువలన జ్ఞానకర్మానుష్ఠానవిషయమున సంశయము గలఁవాఁడు నశించునో.—తస్మాత్ = అందువలన; పాపిష్ఠమును, అజ్ఞానసమ్భూతమ్ = అవివేకమువలనఁ బుట్టినదియు; హృత్స్థమ్ = బుద్ధియందున్నదియు నగు; ఆత్మనః = తనయొక్క ◆, సంశయం బాత్మవిషయం బగుటవలన, ఒకనిసంశయము మఱియొకనిచే ఛేత్తవ్యము § కాదు గదా! అందుచే తనయొక్క యనువిశేషణము; కావున ఆత్మవిషయం బగుసంశయముగూడఁ దనకే యగుచున్నది; ఏవం సంశయమ్ = ఇట్టి, స్వవినాశమునకు హేతుభూత మయినసంశయమును; జ్ఞానాసినా = శోకమోహాదిదోషహర మయిన సమ్యగ్దర్శనము జ్ఞానము, అట్టిజ్ఞానం బను ఖడ్గముచేత; ఛిత్త్వా = ఛేదించి; యోగమ్ = సమ్యగ్దర్శనమున కుపాయ

◆ నీయొక్క.

§ ఛేదింపవలసినది.

మయిన కర్మానుష్ఠానమును; ఆతిష్ఠ = అవలంబింపుము, చేయు మని యర్థము. ఉత్తిష్ఠ = లెమ్ము, ఇపుడు యుద్ధమునకు. భారత = అర్జునా!

అర్జునా! అందువలన నజ్ఞానము వలనం బుట్టినదియు హృదయంబున నెలకొన్నదియు నగు నీయాత్మవిషయసంశయమును నే నుపదేశించిన యాత్మతత్త్వనిశ్చయం బనుఖడ్గముచే ఛేదించి యాత్మజ్ఞానంబున కుపాయ మగు విహితకర్మానుష్ఠానము సేయుము, యుద్ధమునకు లెమ్ము అని తాత్పర్యము.

లా. మీఁదిశ్లోకమునందలి తస్మాత్తను తత్పదముచే నపేక్షిత మయిన యర్థముఁ జెప్పుచున్నారు ఎందువలన నిత్యాదిగా. చేయఁబడుచున్న కర్మములు అన్నాదులంవ ఫలజనకములుగాఁ గనఁబడుటవలన విద్వాంసునందును అవి యట్టివగుట యప్రతిహతం బని యాశంకించి చెప్పుచున్నారు జ్ఞానాగ్నీత్యాదిగా. ఓయీ! సందేహించువానికి సందేహరూపప్రతిబంధ ముండుటవలనఁ గర్మయోగానుష్ఠానము గాని దానిచేఁ గలుగు జ్ఞానము గాని సంభవింపదు, అందుఁ గూడ సందేహము వచ్చుటవలన, అని యాశంకించి చెప్పుచున్నారు మఱియు నెందువలన నిత్యాదిగా. శ్లోకాక్షరములకు వ్యాఖ్యానము చేయుచున్నారు తస్మాత్ ఇత్యాదిగా. పాపిష్ఠమును అనుటచే సంశయము సర్వానర్థమూల మగుటం జేసి పరిత్యాజ్యం బని సూచిత మగుచున్నది. వివేకము లేకుండుటచేఁ బుట్టిన దగుటవలనఁ గూడ సంశయము త్యాజ్యము అవివేక మనర్థకరం బనుట ప్రసిద్ధ మగుటవలన నని చెప్పుచున్నారు అవివేకమువలనఁ బుట్టినదియు నని. ఆసంశయము చైతన్యమువలె ఆత్మనిష్ఠం బగుటవలన నది త్యాజ్యము గా దని శంకింపవల దని చెప్పుచున్నారు బుద్ధియం దున్నదియు నని. స్వాశ్రయమగు సంశయమునకు స్వాశ్రయ మయినజ్ఞానముచేతనే ♦ ఛేదము సంభవించుటవలన తనయొక్క యనువిశేషణం బేల? అని యాశంకించి చెప్పుచున్నారు ఆత్మవిషయం* బగుటవలన నని. దేవదత్తునకుఁ గలిగిన స్థాణ్వాదివిషయం బగుసంశయము దేవదత్తునకుఁ గలిగినస్థాణ్వాదివిషయజ్ఞానముచే నివర్తింపఁబడును; ప్రకృతమునందో, సంశయమునకు విషయమును ఆశ్రయమును ఆత్మయే §, కావున ఆత్మవిషయంబును ఆత్మాశ్రయంబు నగు ❡ జ్ఞానముచే నివర్తింపఁబడుచున్నది.

---

♦ స్వాశ్రయము = తాను ఆశ్రయము—చోటుగాఁ గలది, తనయం దున్నది, తనకుఁ గలిగినది.

* ఆత్మవిషయంబు = ఆత్మ—తాను విషయముగాఁ గలది, ఆత్మను—తన్ను గుఱించి కలిగినది.

§ తానే.

❡ తానే విషయముగాఁ గలదియుఁ దనకుఁ గలిగినదియు నగు.

అందుచే విశేషణము సార్థకం బని యర్థము. దానినే ప్రపంచించుచున్నారు ఒకని సంశయము ఇత్యాదిగా. ప్రకృతసంశయము ఆత్మాశ్రయం బనుట సిద్ధ మగుటచే వివక్షితము గామివలన ఆత్మవిషయం బగుసంశయమునకు ఆత్మవిషయజ్ఞానముచే నివృత్తి వివక్షితం బని యుపసంహరించుచున్నారు కావున నిత్యాదిగా. సంశయచ్ఛేదానంతరము చేయవలసినదాని నుపదేశించుచున్నాఁ డుత్తరార్ధముచేత. అగ్నిహోత్రాదికర్మమును భగవదాజ్ఞచేఁ గ్రమంబున ననుష్ఠించెదను యుద్ధమునుండి మఱి యుపరమించెదను అని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు ఉత్తిష్ఠ అని. భరతాన్వయమునందు ఉత్తమక్షత్త్రియవంశమునందుఁ బుట్టినవాఁడవు నీకు యుద్ధము వచ్చినపుడు విముఖుం డగుట యుచితము గా దని యభిప్రాయము గలవాఁడై చెప్పుచున్నాఁడు భారత అని.

ఇట్లీయధ్యాయముచే యోగము కృత్రిమం ♦ బను శంకను భగవంతుఁ డీశ్వరుఁడు గాఁ డనుశంకను నిరాకరించి, బహిరంగసాధన మయిన ప్రణిపాతాదులవలనను అంతరంగసాధన మయిన శ్రద్ధాదులవలనను జనియించినదై కర్మాదికమునం దకర్మాదిదర్శనరూప మయిన యాత్మసమ్యగ్జ్ఞానమువలన నశేషానర్థనివృత్తియై బ్రహ్మభావం బగు నని ప్రతిపాదించి, సర్వోత్కృష్ట మగుదానియందు సంశయము లేనివానికే యధికార మగుటవలన నశేషదోషంబులకు నాలయ మగుసంశయంబును విడిచి యుత్తమాధికారి జ్ఞాననిష్ఠను ఇతరుఁడు కర్మనిష్ఠను అనుష్ఠింపవలయు నని స్థాపింపఁబడినది.

హ. ఇఁక నుపసంహరించుచున్నాఁడు.—ఎందువలన సంశయము సర్వానర్థములకును హేతువో, తస్మాత్ = అందువలన; అజ్ఞానసమ్భూతమ్ = అవిద్యవలనఁ బుట్టినదానిని; హృత్స్థమ్= హృదయమునం దున్నదానిని, జ్ఞానమునకు శత్రు వగుటచే జ్ఞానస్థాన మైన హృదయము నధిష్ఠించి యున్నదానిని; జ్ఞానాసినా = జ్ఞానం బనుఖడ్గముచేత; ఏనం సంశయమ్ = ఈ, పూర్వోక్తసంశయమును; ఛిత్త్వా = నశింపఁజేసి; యోగమ్= ఫలాసక్తి లేని కర్మానుష్ఠానమును; ఆతిష్ఠ=సేవింపుము. ఉత్తిష్ఠ—యుద్ధము చేయుము. ఓభారతుఁడా!

శ ం. ఎట్లు బ్రహ్మవిత్తముఁడు జ్ఞానసంఛిన్నసంశయుం డగుటవలన యోగసన్న్యస్తకర్ముఁడై కర్మబంధవినిర్ముక్తుం డగునో అట్లు నీవును జ్ఞానసంఛిన్నసంశయుండవై

♦ మనుష్యబుద్ధికల్పితము.

త్యాగసన్న్యస్తకర్ముఁడ వగుచుఁ గర్మనిష్ఠుండ వగు మని చెప్పుచున్నాఁడు.—ఎందు వలన సంశయము గలవాఁడు సంశయదోషముచేతనే కర్మజ్ఞానయోగంబులలో దేని యందును బ్రవృత్తి లభింపక యుభయభ్రష్టుం డగునో, తస్మాత్ = అందువలన; ఓభారతుఁడా! నీవు, అజ్ఞానసంభూతమ్ = తాను అవిక్రియబ్రహ్మస్వరూపుఁ డని తెలియకుంకుట యనునజ్ఞాన మేది గలదో దానివలననే పుట్టినదానిని; ఆత్మనః = నీయొక్క; హృత్స్థమ్= చిత్తమునం దున్నదానిని; ఏనం సంశయమ్= మోక్షసాధనము జ్ఞానమా? మఱియొకటియా? జ్ఞానమును పరోక్షమా? అపరోక్షమా? జ్ఞానముచే అవిద్యాతత్కార్యములకు నిశ్శేషనివృత్తి యగునా? కాదా? ఇత్యాదిరూప మయినసందేహమును, ఆత్మనాశక మైనదానిని; జ్ఞానాసినా = జ్ఞాన మనఁగా బ్రహ్మమే నే నని తాను నిర్వికారము అద్వితీయ మగుబ్రహ్మమే యను అప్రతిబద్ధ మైనతెలివి, అది యను ఖడ్గముచేత; ఛిత్త్వా, ఉత్తిష్ఠ = లెమ్ము, లేచి, యోగమ్ = కర్మయోగమును; ఆతిష్ఠ = ఆచరింపుము, యుద్ధము సేయు మని యర్థము.

మ. అట్లు కావున.—అజ్ఞానసంభూతమ్ = అవివేకమువలనఁ బుట్టినదానిని; హృత్స్థమ్ = బుద్ధియం దున్నదానిని, కారణంబును స్థానంబును దెలిసినయెడ శత్రువును సుఖంబున వధింప శక్య మగు నని రెండును జెప్పఁబడినవి; ఏనమ్ = ఇట్టి సర్వానర్థములకును మూలభూత మయిన; సంశయమ్; ఆత్మనః = ఆత్మయొక్క; జ్ఞానాసినా—ఆత్మవిషయకనిశ్చయం బనుఖడ్గముచేత; ఛిత్త్వా; యోగమ్ = సమ్యగ్దర్శనోపాయ మయిన నిష్కామకర్మమును; ఆతిష్ఠ=చేయుము. అందువలన నిప్పుడు యుద్ధమునకు, ఉత్తిష్ఠ. ఓ భారతుఁడా! భరతవంశమునఁ బుట్టినవానికి యుద్ధప్రయత్నము నిష్ఫలము గా దని భావము.

తా. ననీశ్వరుం డనుశంక తలఁగి శ్రద్ధ
భక్తియును దృఢీకృత మయ్యెఁ బరఁగ జ్ఞాన
హేతు వగుకర్మనిష్ఠయు నిందుఁ బొందు
పఱుపఁబడియెను శ్రీభగవంతుచేత.

శ్రీ. అట్లు కావున,—ఆత్మనః = ఆత్మయొక్క; అజ్ఞానసముత్థితమ్ = తెలియమిచేఁ బుట్టినదానిని; హృదయమునం దున్నదానిని; ఏనం సంశయమ్ = శోకాదిహేతు వగుసంశయమును; జ్ఞానాసినా = దేహాత్మవివేకజ్ఞాన మనుఖడ్గముచేత; ఛిత్త్వా; యోగమ్ = పరమాత్మజ్ఞానమున కుపాయభూత మయిన కర్మ

యోగమును; ఆతిష్ఠ = ఆశ్రయింపుము. అందు మొదటఁ బ్రస్తుత మయినయుద్ధము నకు, ఉత్తిష్ఠ. ఓభారతుఁడా! అనుటచే క్షత్త్రియుం డగుటం జేసి యుద్ధము ధర్మ్యం బని తెలుపఁబడినది.

జనునవస్థాదిభేదంబు ననుసరించి
కర్మమును జ్ఞాన మనురెండు క్రమముగాను
నిష్ఠ లెవఁ డుపదేశించె నిష్ఠతోడ
సంశయచ్ఛిదు మ్రొక్కెదు శౌరి నతని.

ప. తస్మాత్ = అందువలన; ఆత్మనః; అజ్ఞానసమ్భూతమ్; హృత్స్థమ్ = హృదయమునం దున్నదాని; సంశయమ్; జ్ఞానాసినా = ఆత్మజ్ఞాన మనుఖడ్గముచేత; ఛిత్త్వా, యోగమ్ = కర్మయోగమును, క్షత్త్రియధర్మమునకుఁ దగినదానిని; ఆతిష్ఠ = ఆశ్రయింపుము. అందుకొఱకు, ఉత్తిష్ఠ. భారత యని సంబోధనము ఉత్సాహమునకొఱకు.

అధ్యాయతాత్పర్యము.—వేదమునఁ జెప్పఁబడిన బాహ్యకర్మము రెండు విధములు. అందు నశించుఫలము గలది కర్మము. నిత్యమయిన ఫలము గలది యకర్మము. అందువలనఁ గర్మనైష్కర్మ్యములకుఁ బరస్పరము సాహచర్యము గలదు. అది యంతయు నీలోకమున న న్నుద్దేశించి చేయవలయును. అట్లు నానావిధము లుగా నన్ను యజించుటవలన నది బ్రహ్మార్పణం బగును. అని చతుర్థాధ్యాయంబున భగవంతుఁ డర్జునునకుఁ జెప్పెను.

రా. తస్మాత్ = అందువలన; అనాదియగునజ్ఞానమువలనఁ బుట్టినదియు హృదయస్థము నగు ఆత్మవిషయ మయిన సంశయమును నే నుపదేశించిన ఆత్మజ్ఞానం బనుఖడ్గముచే ఛేదించి నే నుపదేశించిన కర్మయోగము నాశ్రయింపుము. అందుకొఱకు లెమ్ము. ఓ భారతా!

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయా
సిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానకర్మసన్న్యాసయోగో నామ
చతుర్థో ఽధ్యాయః.

వ్యాసప్రోక్త మయిన శతసహస్ర గ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బనుసంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రం

బును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు జ్ఞాన కర్మసన్న్యాసయోగం బనంబరఁగు చతుర్థాధ్యాయము ముఁగిసెను.

ఇది శ్రీఘుక్షవాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవద్గీ
తాంధ్రవ్యాఖ్యానంబునందుఁ
జతుర్థాధ్యాయటీక.



అధ్యాయచతుష్టయ మివ కృత్స్నగీతార్థవివృతి రఖిలేయమ్
పరిపూర్తి మియా దచిరాత్ శ్రీమద్భగవత్ప్రసాదేన
ఘటయతు భాగవతీ మే దుర్ఘటఘటనాపటీయసీ కరుణా
సాధనవికలస్యాపిచ గీతాపరమార్థచన్ద్రికాపూర్తిమ్.



శ్రీ ర స్తు.

శ్రీవాసుదేవ పరబ్రహ్మణే నమః.

పరమార్థచంద్రికాసహిత

# శ్రీభగవద్గీత, పంచమాధ్యాయము.

సత్కర్మ భజనతో యాం ప్రాప్యా మాహు ర్విశుద్ధచిత్తస్య
నిరతిశయానన్దఘనాం తాం విద్యా మమ్బికాం వన్దే.

స్వభజనసక్త జనానాం సకలాన్ దోషా న్నిహన్తి కృపయా యః
కర్మా ఽఽత్మశుద్ధిహేతుం ప్రోచే తం నౌమి కృష్ణ మాత్మానమ్. ౧

అర్జున ఉవాచ.—

సన్న్యాసం కర్మణాం కృష్ణ పున ర్యోగం చ శంససి
య చ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితమ్.

శంకరభాష్యము.—

« కర్మణ్య కర్మయః పశ్యేత్ ” అని యారంభించి, « సయుక్తః కృత్స్న కర్మకృత్, జ్ఞానాగ్ని దగ్ధకర్మాణమ్, శారీరం కేవలం కర్మ కుర్వన్, యదృచ్ఛా లాభసంతుష్టః, బ్రహ్మార్పణం బ్రహ్మహవిః, కర్మజాన్ విద్ధి తాన్ సర్వాన్, సర్వం కర్మా ఽఖిలం పార్థ, జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి, యోగసన్న్యస్త కర్మాణమ్ ” అనుదానివఱకుం గల వచనములచే సర్వ కర్మసన్న్యాసమును వచియించెను భగవంతుఁడు. “ ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠ » అను వచనముచేఁ గర్మానుష్ఠానరూప మగు యోగ మునుగూడ ననుష్ఠింపు మని చెప్పెను. ఆకర్మానుష్ఠాన కర్మసన్న్యాస ములు రెండును స్థితిగతులుంబోలె ♦ బరస్పరవిరుద్ధంబు లగుటవలన నొక్కఁడ డేక కాలంబున ననుష్ఠింప నశక్యంబు లగుటవలనను గాలభేదం బున ననుష్ఠింపుమని విధింపకపోవుటవలనను, అర్థంబువలన * వీనిలో

♦ నిలుచుటయును నడచుటయును వలె.

* కంఠోక్తినట్లు చెప్పకున్నను అర్థమువలన.

నేదో నొకటి కర్తవ్య మని ప్రాప్తింపఁగా, ఈకర్మానుష్ఠాన కర్మసన్న్యాసములలో నేది ప్రశస్యతరమో అది కర్తవ్యము ఇతరము గా దని తలంచినవాఁడై ప్రశస్యతర మగుదానిఁ దెలియఁగోరి యర్జునుఁడు పలికెను సన్న్యాసం కర్మణాం కృష్ణేత్యాదిగా.

ఆనందగిరికృత టీక.—

పూర్వోత్తరా ధ్యాయములకు సంబంధము పచియించువారై కడచిన విషయము ననువదించుచు నర్జునుని ప్రశ్నకు నభిప్రాయము ప్రదర్శింప నుపక్రమించుచున్నారు కర్మణీత్యాదిగా. అని యారంభించి—కర్మమునం దకర్మదర్శనము ప్రతిపాదించి తత్ప్రశంస చేయఁబడినది యని చెప్పుచున్నారు సయుక్త ఇత్యాదిగా. జ్ఞానముగలవాఁడై సర్వకర్మములను లోకసంగ్రహార్థము చేయువానిని జ్ఞానరూప మయిన యగ్నిచే దగ్ధము లయిన సర్వకర్మములు గలవానినిగాను కర్మప్రయుక్త మగు బంధము లేనివానినిగాను వివేకవంతులు చెప్పుచున్నా రని జ్ఞానవంతునకు జ్ఞానఫలభూత మయిన సన్న్యాసమును వివక్షించినవాఁడై జిజ్ఞాసువునకు సాధనరూపమయిన సన్న్యాసమునుగూడ భగవంతుఁడు వివక్షించె నని చెప్పుచున్నారు జ్ఞానాగ్ని దగ్ధకర్మాణమ్ అని. నిరాశీః అని యారంభించి శరీరస్థితిమాత్రకారణమైన కర్మమును శరీర ముండునపుడుగూడ సంగరహితుఁడై యాచరించుచు ధర్మాఽధర్మఫలములను బొందఁ డనుటచేతఁగూడఁ బూర్వోత్తరాధ్యాయంబుల ద్వివిధమయిన సన్న్యాసమును సూచించెను భగవంతుం డని చెప్పుచున్నారు శారీరమిత్యాదిగా. యదృచ్ఛేత్యాది శ్లోకమునందుఁగూడ సన్న్యాసము సూచింపఁబడినది సన్న్యాసధర్మకలాపము నుపదేశించుటవలన నని చెప్పుచున్నారు యదృచ్ఛేత్యాదిగా. జ్ఞానమునకు యజ్ఞత్వము సంపాదించి ప్రశంస చేయుటవలనఁగూడ జ్ఞాననిష్ఠునకుఁ గర్మసన్న్యాసము తెలుపఁబడినది యని చెప్పుచున్నారు బ్రహ్మార్పణ మిత్యాదిగా. జ్ఞానయజ్ఞము స్తుతించుకొఱకు నానావిధము లయిన యజ్ఞముల ననువదించి యవి దేహాదివ్యాపారజన్యములని చెప్పుటచే ఆత్మ నిర్వ్యాపారుం డను జ్ఞానఫలమునందుఁ గోర్కి పుట్టించుటవలనఁగూడ అట్టియాత్మను దెలియఁగోరువానికి సర్వకర్మసన్న్యాసమునం దధికారము సూచింపఁబడె నని చెప్పుచున్నారు కర్మజా నిత్యాదిగా. సమస్తము నిశ్శేషమగు కర్మమునకు జ్ఞానమునందుఁ బర్యవసానము చెప్పుటవలనఁగూడ జిజ్ఞాసువునకు సర్వకర్మసన్న్యాసము సూచిత మయ్యె నని చెప్పుచున్నారు సర్వం కర్మేత్యాదిగా.

తద్విద్ధి ప్రణిపాతేనేత్యాదిగా జ్ఞానప్రాప్తి కుపాయమయిన ప్రణిపాతాదికమును దెలిపి జ్ఞానము పొందినపిమ్మట నిరతిశయమాహాత్మ్యము గల యాజ్ఞానముచే సర్వకర్మములకును నివృత్తి యగు నని చెప్పుటవలనఁగూడ జ్ఞానార్థికి సన్న్యాసమునందే యధికార మని భగవంతుఁడు చెప్పెనని చెప్పుచున్నారు జ్ఞానాగ్ని రిత్యాదిగా. జ్ఞానముచే సంఛిన్నసంశయుండై అజ్ఞానమువలననే కర్మములను సన్న్యసించి యప్రమత్తుఁడై కార్యకరణసంఘాతమును వశీకరించి యున్నవానిని ప్రాతిభాసికంబు లగు కర్మములు బంధింపఁజాల వని చెప్పుటచేతఁగూడ ద్వివిధ మగుసన్న్యాసమును భగవంతుఁడు ప్రతిపాదించె నని చెప్పుచున్నారు యోగసన్న్యస్తకర్మాణమ్ అని. కర్మణ్యకర్మయః పశ్యేత్ అని యారంభించి యోగసన్న్యస్తకర్మాణమ్ అనువఱకుఁ గల యుదాహృతవచనములచేఁ బ్రతిపాదింపఁబడిన సన్న్యాసము నుపసంహరించుచున్నారు అనుదానివఱకు నిత్యాదిగా. అప్పుడు కర్మసన్న్యాసమునే వివిదిషువును విద్వాంసుఁడును జేయవలసిన ట్లేర్పడుటవలనఁ గర్మానుష్ఠానం బనాదరణీయం బగు నని యాశంకించి, ప్రతిపాదిత మయిన, యర్థాంతర మనువదించుచున్నారు ఛిత్త్వైన మిత్యాదిగా. కర్మానుష్ఠానంబును గర్మత్యాగంబును ఒక్కపురుషుఁడే యనుష్ఠింపవచ్చుం గావున విరోధము లే దని యాశంకించి, ఏకకాలంబుననా? క్రమంబుననా? అనుష్ఠింపవచ్చు నని వికల్పించి ప్రథమపక్షమును దూషించుచున్నారు అకర్మానుష్ఠానకర్మసన్న్యాసములు రెండును ఇత్యాదిగా. రెండవపక్షముగూర్చి చెప్పుచున్నారు కాలభేదంబున నిత్యాదిగా. ఇవి రెండును ఒక్కపురుషున కనుష్ఠింప నశక్యంబు లయినచో నెట్లు వాని ననుష్ఠింపవలయును? అని యాశంకించి చెప్పుచున్నారు అర్థంబువలన నిత్యాదిగా. ప్రతిపాదితము లయిన రెండును ఒక్కఁడు నేకకాలంబునఁ గాని క్రమంబునఁగాని యనుష్ఠించుట యనుపపన్నం బగుటవలన నని యర్థము. రెంటిలో నొకటి చేయవలయు ననుటకును నిర్ణయం బె ట్లగును? రెండును సమానముగా సన్నిహితంబులై యుండుటవలన నని యాశంకించి చెప్పుచున్నారు ఈకర్మానుష్ఠానకర్మసన్న్యాసములలో నిత్యాదిగా. భగవంతునిచేఁ గర్మసన్న్యాసంబును గర్మయోగంబును జెప్పఁబడినవి, అవి సముచ్చయించి యనుష్ఠించుట సంభవింపదు, అందుచే రెంటిలోనొకటి శ్రేష్ఠ మగునది యనుష్ఠేయం బని సిద్ధించుచున్నది, అది దెలియుటకై ప్రశ్న ముపపన్న మని యుపసంహరించుచున్నారు అని తలంచినవాఁడై ఇత్యాదిగా.

**భా.** పూర్వపక్షము.—ఓయీ! ఆత్మవిదునకు జ్ఞానయోగనిష్ఠను జెప్పం దలచినవాఁడై పూర్వోదాహృతవచనములచే భగవంతుఁడు కర్మసన్న్యాసముఁ జెప్పెను. కాని అనాత్మవిదునకుఁ జెప్పినవాఁడు కాఁడు. కావునఁ గర్మానుష్ఠానకర్మయోగములు భిన్నపురుషవిషయంబు లగుట వలన రెంటిలోఁ బ్రశస్యతర మగుదానిఁ దెలియుటకై ప్రశ్న మనుపపన్నము.

సిద్ధాంతము —సత్యమే నీయభిప్రాయముచొప్పునఁ బ్రశ్న యుపపన్నముగాదు. ప్రశ్నము చేయువానియభిప్రాయమున మాత్రము ప్రశ్న ముపపన్న మని చెప్పుచున్నారము. ఎట్లు? పూర్వోదాహృతవచనములచే భగవంతుఁడు కర్మసన్న్యాసము కర్తవ్యం బని వివక్షించుటవలన, ప్రాధాన్యంబును గర్తయును లేనిచో నది కర్తవ్యం బనుట సంభవింపమివలన, అనాత్మవిదుఁడుగూడ కర్త యనుట పక్షంబునఁ బ్రాప్తించుటచే ననువదింపక తప్పదు; ఆత్మవిదుఁడు మాత్రమే కర్త సన్న్యాసమున కనుట వివక్షితము కాఁజాల దని. ఇట్లు తలంచునట్టి యర్జునునకు కర్మానుష్ఠానకర్మసన్న్యాసములకు నవిద్వత్పురుషుఁడుగూడ కర్త యని పూర్వోక్తప్రకారంబున నవి పరస్పరవిరుద్ధంబు లగుటవలన రెంటిలో నొకటి కర్తవ్యం బని ప్రాప్తించుచుండఁగా, ప్రశస్యతరము కర్తవ్యము ఇతరము గా దని ప్రశస్యతరమును దెలియుటకై ప్రశ్నం బనుపపన్నము గాదు.

**ఆ.** కాదిది పృచ్ఛించువాని యభిప్రాయము, కర్మసన్న్యాసకర్మయోగములు భిన్నపురుషానుష్ఠేయము లని చెప్పుటవలన ఒక్కపురుషునియందు రెంటికిని ప్రాప్తి లేమివలన నని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా.

పూర్వపక్షము నంగీకరించి పరిహరించుచున్నారు సత్యమే ఇత్యాదిగా. అప్పుడు పృచ్ఛించువాని యభిప్రాయం బెట్టిది? దానిం బట్టిగదా ప్రశ్నప్రవర్తింపవలయు నని యడుగుచున్నాఁడు ఎట్లు అని. ఒక్కపురుషునందుఁ గర్మానుష్ఠానకర్మత్యాగములకుఁ బ్రాప్తి కలదని పృచ్ఛించువానియభిప్రాయమును వక్కాణించుటకై ప్రారంభించుచున్నారు పూర్వోదాహృతవచనములచే ఇత్యాదిగా. "పూర్వ

కామోయజేత » ♦ అని స్వర్గకాము నుద్దేశించి యాగము విధింపఁబడుచున్నది, కాని వానికే యధికారము ఇతరునకు లే దని ప్రతిపాదింపఁబడదు వాక్యభేదము * ప్రసక్తించుటవలన; అట్లు అనాత్మవిదుఁడుకూడ సన్న్యాసమునకుఁ గర్తగాఁ బక్షంబునఁ బ్రాప్తించినవాఁ డనువదింపఁబడుచున్నాఁడు, కాని ఆత్మవిదుఁడే సన్న్యాసమునకుఁ గర్త యని నియమము చేయఁబడదు, వైరాగ్యమాత్రముచే నజ్ఞునకుఁగూడ సన్న్యాసవిధి కనఁబడుటవలన; అందువలనఁ గర్మతత్త్యాగములయందు అవిద్వాంసుఁడుకూడఁ గర్తకావచ్చు నని తలంచునట్టి యర్జునునకుఁ బ్రశ్న సంభవించుచున్నది యని భావము. సన్న్యాసము కర్తవ్యం బని వివక్షితం బగుఁగాక, అట్లయినను ఎట్లు ప్రశస్యతరముఁ దెలియుటకై ప్రశ్నము ప్రవర్తించును? అని యాశంకించి చెప్పుచున్నారు ప్రాధాన్యంబును ఇత్యాదిగా. అట్లయినను ఒక్కపురుషునియం దవి ప్రాప్తింపకుండఁగా నెట్లు మీరు చెప్పిన యభిప్రాయంబునఁ బ్రశ్నము కల్పింపవచ్చును? అనఁగాఁ జెప్పుచున్నారు అనాత్మవిదుఁడుగూడ ఇత్యాదిగా. ఆత్మవిదునకు జ్ఞానసామర్థ్యంబువలనఁ గర్మత్యాగము నిశ్చితం బగునట్లు, ఇతరునకుఁగూడ వైరాగ్యము కలిగినపుడు కర్మత్యాగం బావశ్యకం బగుటచే నం దతఁడు కర్తగాఁ బ్రాప్తుండగుటంజేసి యిట ననువదింపఁబడుచున్నాఁడు; అట్లు కర్మ తత్త్యాగములు రెండును ఒక్కయవిద్వాంసునందుఁ బ్రాప్తించుట స్పష్టం బగుటవలనఁ బై చెప్పినయభిప్రాయంబునఁ బ్రశ్నప్రవృత్తి యవిరుద్ధం బని యర్థము. సన్న్యాసమున కాత్మవిదుఁడే కర్త యని యేల యిట వివక్షితము కాఁ గూడదు? అసి యాశంకించి కర్త్రంతరనిషేధంబును సన్న్యాసవిధియు నని రెండర్థంబులు కల్పించినచో వాక్యభేదము ప్రసక్తించుటవలన నట్లు వివక్షితము కా దని చెప్పుచున్నారు ఆత్మవిదుఁడుమాత్రమే ఇత్యాదిగా. అని అనునది వాక్యభేద ప్రసక్తిరూప హేతువును దెలుపుచున్నది. అందువలన నేమి యని యాశంకించి ఫలితముఁ జెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. కర్మానుష్ఠానకర్మసన్న్యాసములకు నవిద్వత్పురుషుఁడు గూడ కర్త యని యిట్లు తలంచునట్టి యర్జునునకుఁ బ్రశస్యతరము దెలియుటకై ప్రశ్నం బనుపపన్నము కాదు అని యన్వయము. వాని సముచ్చయించి యనుష్ఠించుట సంభవించునపుడు ప్రశస్యతరము తెలియఁగోరుట యేల? అని యాశంకించి చెప్పుచున్నారు పూర్వోక్తప్రకారంబున

♦ స్వర్గముఁ గోరువాఁడు యాగము చేయవలయును.

* స్వర్గకాముఁడు చేయవలయును ఇతరుఁడు చేయఁగూడదు అని యొకవాక్యమునకు రెండు వాక్యములు.

నిత్యాదిగా. ఆకర్మానుష్ఠానకర్మసన్న్యాసంబులు రెండును ఇత్యాదిగాఁ ♦ జెప్పిన విధంబునఁ గర్మతత్త్యాగములు పరస్పరవిరుద్ధంబు లగుటవలన వానిని సముచ్చయించి యనుష్ఠించుట సంభవింప దని యర్థము. అప్పుడు రెంటిలో నేదో నొకటి యనుష్ఠేయం బగుఁ గాక, కావున మీరు చెప్పినయభిప్రాయంబున నేల ప్రశ్న ప్రవర్తింపవలయును? అని యాశంకించి చెప్పుచున్నారు రెంటిలో నొకటి ఇత్యాదిగా. రెండును ప్రాప్తింపఁగా సముచ్చయం బనుపపన్నము గాఁగా రెంటిలోనొకటి పరిగ్రహించునపుడు విశేషమును వెదకవలయుం గావునఁ బూర్వోక్తాభిప్రాయంబుచేఁ ప్రశ్న ముపపన్నం బని యర్థము.

**భా.** ప్రతివచనవాక్యార్థము నిరూపించినను బృచ్ఛించువానియభిప్రాయం బిట్లే యని తెలియుచున్నది. ఎట్లు? సన్న్యాసకర్మయోగములు నిశ్శ్రేయసకరంబులు, ఆరెంటిలోఁ గర్మసన్న్యాసముకంటెఁ గర్మయోగం బుత్తమము అని ప్రవచనము. ఇది నిరూపణీయము. ఏమి దీనిచే నాత్మవిత్కర్తృకంబు § లగు సన్న్యాస కర్మయోగంబులకు నిశ్శ్రేయసకరత్వము ప్రయోజనము ప్రతిపాదించి ఆరెంటిలోనే యేదో యొకవిశేషమువలనఁ గర్మసన్న్యాసముకంటెఁ గర్మయోగ ముత్తమ మని చెప్పఁబడుచున్నదా? లేక అనాత్మవిత్కర్తృకంబు * లగు సన్న్యాసకర్మయోగములకే యారెండును జెప్పఁబడుచున్నవా? అని.

పూర్వపక్షము.—ఏమి దీనియందు? ఆత్మవిత్కర్తృకము లగు సన్న్యాసకర్మయోగములకు నిశ్శ్రేయసకరత్వము వానిలోమాత్రము కర్మసన్న్యాసముకంటెఁ గర్మయోగమున కుత్తమత్వం బన్నను, లేక, అనాత్మవిత్కర్తృకంబు లగు సన్న్యాసకర్మయోగంబుల కా రెండును జెప్పఁబడుచున్న వన్నను.

సిద్ధాంతము.—ఇటఁ జెప్పెదము. ఆత్మవిత్కర్తృకంబు లగు సన్న్యాసకర్మయోగంబులు సంభవింపమివలన నవి నిశ్శ్రేయసకరంబు లనుటయుఁ దదీయమగు కర్మసన్న్యాసముకంటెఁ గర్మయోగం బుత్తమం బనుటయు నీరెండును అనుపపన్నములు. అనాత్మవిదునకుఁ గర్మస

---

♦ భాష్యమున.

§ ఆత్మవిదుఁడు కర్తగాఁ గలవి.

* అనాత్మవిదుఁడు కర్తగాఁ గలవి.

న్న్యాసంబును దత్ప్రతికూల మగు కర్మానుష్ఠానరూప మయిన కర్మ యోగమును సంభవించునేని, అప్పు డవి నిశ్శ్రేయసకరంబు లనుటయుఁ గర్మయోగము కర్మసన్న్యాసముకంటె విశిష్టం బనుటయు నీరెండు నుపపన్న మగుచున్నవి. ఆత్మవిదునకో సన్న్యాసకర్మయోగములు రెండును సంభవింపవు, కావున నవి నిశ్శ్రేయసకరంబు లనుటయుఁ గర్మసన్న్యాససముకంటెఁ గర్మయోగము విశిష్ట మనుటయు నుపపన్నము గాదు.

ఆ. ఇందువలనఁ గూడ నవిద్వత్కర్తృకము లగు సన్న్యాసకర్మయోగములలో నేది శ్రేయం బని యడుగువాని యభిప్రాయము తెలియుచున్న దని చెప్పుచున్నారు ప్రతివచ నేత్యాదిగా. ఏది యాప్రతివచనము? ఎట్లు తన్నిరూపణము? అని యడుగుచున్నాఁడు ఎట్లు అని. అందుఁ బ్రతివచనముఁ జూపుచున్నారు సన్న్యాసకర్మయోగములు ఇత్యాదిగా. తన్నిరూపణము చెప్పుచున్నారు ఇది ఇత్యాదిగా. ఆరెండును—నిశ్శ్రేయసకరంబు లనుటయుఁ గర్మయోగము శ్రేష్ఠం బనుటయు నని యర్థము.

గుణదోషవిభాగవివేకముకొఱకుఁ బ్రశ్న చేయుచున్నాఁడు ఏమి దీని యందు ఇత్యాదిగా. దీనియందు—ఈమొదటిపక్షమునం దేమి దోషము? ఈ రెండవపక్షమునందుఁ గాని యేమి ఫలము? అని ప్రశ్నార్థము.

అందుఁ బ్రథమపక్షమునందు దోషముఁ జూపుచున్నారు ఇట నిత్యాదిగా. ఆ యనుపపత్తినే వ్యతిరేకద్వారంబున వివరించుచున్నారు అనాత్మవిదునకు నిత్యాదిగా. నిశ్శ్రేయసకరంబు లనుటయు—ఇటఁ బారంపర్యమున నని గ్రహింపవలయును. విశిష్టం బనుటయు—కర్మసన్న్యాసము అసహాయ మగుటవలనను ఇది శుద్ధిద్వారంబున జ్ఞానహేతు వగుటవలనను అని యర్థము.

భా. ఇటఁ జెప్పుచున్నాఁడు — * ఏమి యాత్మవిదునకు సన్న్యాసకర్మయోగములు రెండును సంభవింపవా? లేక, ఒకటిమాత్రము సంభవింపదా? ఒకటిమాత్రము సంభవింప దన్నచో, ఏమి కర్మసన్న్యాసమా, లేక కర్మయోగమా సంభవింపదు? సంభవింపమికిఁ గారణము గూడఁ జెప్పవలయును. అని.

సిద్ధాంతము.—ఇందుకుఁ జెప్పెదము. ఆత్మవిదుఁడు మిథ్యాజ్ఞానము నివర్తించినవాఁ డగుటవలన విపరీతజ్ఞానమూలక మయిన కర్మ

* పూర్వపక్షము.

యోగము వానికి సంభవింపదు. జన్మాదిసర్వవిక్రియారహితంబై నిష్క్రియం బగునాత్మను తన్నుఁగా నెవ్వఁ డెఱుంగుచున్నాఁడో అట్టి యాత్మవిదునకు సమ్యగ్దర్శనముచే మిథ్యాఽజ్ఞానమును దొలఁగించుకొన్నవానికి నిష్క్రియాత్మస్వరూపావస్థానరూపం బగు సర్వకర్మసన్న్యాసముఁ జెప్పి తద్విపరీతము మిథ్యాజ్ఞానమూలక కర్తృత్వాభిమానపూర్వక మగు సక్రియాత్మస్వరూపావస్థానరూప మయిన కర్మయోగము, ఈశాస్త్రమున నచ్చటచ్చట నాత్మస్వరూపనిరూపణ ప్రదేశములందు సమ్యగ్దర్శన మిథ్యాఽజ్ఞానంబులకును దత్కార్యములకును బరస్పరవిరోధం బగుటవలన, లేదని ప్రతిపాదింపఁబడుచున్నది. అందువలన నివృత్తమిథ్యాఽజ్ఞానుం డగు నాత్మవిదునకు విపరీతజ్ఞానమూలకం బగు కర్మయోగము సంభవింపదనుట యుక్తము.

పూర్వపక్షము.—ఆత్మస్వరూప నిరూపణప్రదేశములం దెచ్చటెచ్చట మఱి యాత్మవిదునకుఁ గర్మాభావము ప్రతిపాదింపఁబడుచున్నది?

సిద్ధాంతము.—దీనికిఁ జెప్పెదము.—« అవినాశి తు తద్విద్ధి » యని ప్రకరణము నారంభించి « య ఏనం వేత్తిహన్తారమ్, వేదా ఽవినాశినం నిత్యమ్ » ఇత్యాదిప్రదేశములం దచ్చటచ్చట నాత్మవిదునకుఁ గర్మాభావము చెప్పఁబడుచున్నది.

**ఆ.** ఆత్మజ్ఞునకుఁ గర్మసన్న్యాసకర్మయోగములు సంభవింప వని నిరూపింపఁగా నాక్షేపించుచున్నాఁడు ఇట నిత్యాదిగా. పూర్వపక్షి నిర్ధారణముకొఱకు విమర్శించుచున్నాఁడు ఏమి ఇత్యాదిగా. రెంటిలో నొకటి సంభవింప దనునప్పుడు సందేహమువలనఁ బ్రశ్న వచ్చుచున్న దని చెప్పుచున్నాఁడు ఒకటిమాత్రము ఇత్యాదిగా. రెంటిలో నేదోయొకటి సంభవింపక పోవు నని యాశంకించి కారణము లేక సంభవింప దన్నచో నతిప్రసంగ మగు నని తలంచినవాఁడై చెప్పుచున్నాఁడు సంభవింపమికి ఇత్యాదిగా.

ఆత్మవిదునకుఁ గర్మయోగము సంభవింప దనుటను సకారణముగాఁ జూపుచున్నారు ఇందుకు ఇత్యాదిగా. సంగ్రహవాక్యమును వివరించుచు నాత్మవిదుఁ డనుట వివరించుచున్నారు జన్మా దీత్యాదిగా. మిథ్యాఽజ్ఞానమును నివర్తించినవాఁ డనుట నిప్పుడు స్పష్టీకరించుచున్నారు సమ్యగ్దర్శనముచే నిత్యాదిగా. విప

రీతజ్ఞానమూలకమైన ఇత్యాదిగాఁ జెప్పినదానిఁ బ్రపంచించుచున్నారు నిష్క్రియ యేత్యాదిగా. ఇట్టి లక్షణము గల సన్న్యాసముఁ జెప్పి దానికి విపరీత మయినకర్మయోగము లే దని ప్రతిపాదింపఁబడుచున్న దని సంబంధము. విపరీతత్వమును స్ఫురింపఁ జేయుచుఁ గర్మయోగమునకు విశేషణము చేయుచున్నారు మిథ్యాఽజ్ఞానమూలక కర్తృత్వాభిమానపూర్వకము అని. మిథ్య యయిన యజ్ఞానము—అనాదియు అనిర్వచనీయము నగు నజ్ఞానము, తన్మూలకము నేను కర్త యని యాత్మయందుఁ గర్తృత్వాభిమానము దానివలనఁ బుట్టిన దని యర్థము. ఇట్టి సన్న్యాసముఁ జెప్పి యిట్టి కర్మయోగము సంభవింప దని ప్రతిపాదించుటకు హేతువుఁ జెప్పుచున్నారు సమ్యగ్దర్శ నేత్యాదిగా. ఎచట నది లే దని చెప్పఁబడుచున్నది? అనఁగాఁ జెప్పుచున్నారు ఈశాస్త్రమున నని. చెప్పినహేతువుచే నాత్మజ్ఞునకుఁ గర్మయోగము సంభవింప దని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

ఈశాస్త్రమున నచ్చటచ్చట నని చెప్పినదానినే స్పష్టీకరించుటకై యడుగుచున్నాఁడు ఆత్మస్వరూ పేత్యాదిగా.

ఆప్రదేశములనే చూపుచున్నారు దీనికి ఇత్యాదిగా.

**భా.** పూర్వపక్షము.—ఓయీ! కర్మయోగముగూడ నాత్మస్వరూపనిరూపణప్రదేశములందుఁ బ్రతిపాదింపఁబడియే యున్నది. ఎచట ననఁగా—“తస్మా ద్యుధ్యస్వ భారత, స్వధర్మ మపి చావేక్ష్య, కర్మణ్యేవాధికార స్తే” ఇత్యాదిస్థలములందు. అందువలన నాత్మవిదునకుఁ గర్మయోగం బెట్లు సంభవింపదు?

సిద్ధాంతము.—ఇందుకుఁ జెప్పెదము. సంభవింపదు, సమ్యక్ జ్ఞాన మిథ్యాఽజ్ఞాన తత్కార్యములకు విరోధమువలన; జ్ఞానయోగేన సాఙ్ఖ్యానామ్ అని ఆత్మతత్త్వవిదు లగు సాంఖ్యులకు అనాత్మజ్ఞకర్తృక మగు కర్మయోగనిష్ఠనుండి నిష్క్రియాత్మస్వరూపావస్థానలక్షణ మగు జ్ఞానయోగనిష్ఠను బృథక్కరించుటవలన; కృతకృత్యుఁ డగుటచే నాత్మవిదునకుఁ బ్రయోజనాంతరము లేమివలన; తస్య కార్యం నవిద్యతే అని వేఱు కర్తవ్యము లే దని చెప్పుటవలనను; నకర్మణా మనారమ్భాత్, సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః ఇత్యాదివచనములచే ఆత్మజ్ఞానమున కంగముగాఁ గర్మయోగమును విధించుటవలనను;

యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే అనుటచే సమ్యగ్దర్శనము గలిగినవానికిఁ గర్మయోగము లే దని చెప్పుటవలన; శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ అనియు శరీరస్థితిసాధనమున కంటె వ్యతిరిక్త మయిన కర్మమును నివారించుటవలన; నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ అని శరీరస్థితిమాత్రప్రయుక్తము లయిన దర్శనశ్రవణాదికర్మములందుఁగూడ ఆత్మతత్త్వవిదుఁడు చేయుచున్నా ననువృత్తిని సమాహితచిత్తుఁ డగుటచే నెప్పుడును జేయఁగూడ దని యుపదేశించుటవలనను. ఆత్మతత్త్వవిదునకు సమ్యగ్దర్శనవిరుద్ధము మిథ్యాజ్ఞానమూలకం బగు కర్మయోగము స్వప్నమునందును సంభవించు నన నలవి గాదు.

అందువలన, అనాత్మవిత్కర్తృకంబు లగు సన్న్యాసకర్మయోగంబులకే నిశ్శ్రేయసకరత్వము చెప్పుటయు, పూర్వోక్త మయిన యాత్మవిత్కర్తృకసర్వకర్మసన్న్యాసము కంటె విలక్షణమై కర్తృత్వాభిమానము కలుగుటచేఁ గర్త్రేకదేశవిషయం బగు తదీయకర్మసన్న్యాసము కన్న ♦ నది యమనియమాదిసహితం బగుటచే దురనుష్ఠేయం బగుటవలనను గర్మయోగము సుకరం బగుటచేతను నది విశిష్టం బని చెప్పుటయు నని యిట్లు ప్రతివచనవాక్యార్థము నిరూపించుటచేఁ గూడ మున్ను చెప్పినదే పృచ్ఛించువానియభిప్రాయం బని నిశ్చిత మగుచున్న దని సిద్ధము.

ఆ. ఆత్మస్వరూపనిరూపణప్రదేశంబులందు సన్న్యాసముఁ బ్రతిపాదించుటవలన నాత్మవిదునకు సన్న్యాసము వివక్షితం బగునేని అప్పుడు కర్మయోగము గూడ నతని కెందువలన వివక్షితముగాఁ గూడదు ? ప్రకరణము సమాన మగుటవలన నని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. ఆత్మవిద్యాప్రకరణమునందుఁ గర్మయోగప్రతిపాదనము నుదాహరించుచున్నాఁడు ఎచట ననఁగా నిత్యాదిగా. ప్రకరణమువలన నాత్మవిదునకుఁ గూడఁ గర్మయోగము సంభవింపఁగా ఫలితము చెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా.

ఆత్మజ్ఞానమున కుపాయ మగుటచేఁ బ్రకరణమునందుఁ బఠించుట యుపపన్న మగుటవలన జ్ఞానము కలిగిన పిదప న్యాయవిరుద్ధముగాఁ గర్మము కల్పింప శక్యము గా దని పరిహరించుచున్నారు ఇందుకుఁ జెప్పెదము ఇత్యాదిగా. సమ్యగ్ద

♦ అనాత్మవిదుని కర్మసన్న్యాసముకన్న.

ర్శనమిథ్యాఽజ్ఞానములకును దత్కార్యము లయిన భ్రమనివృత్తి భ్రమసద్భావంబులకును * బరస్పరవిరోధం బగుటవలనఁ గర్తృత్వాదిభ్రమమూలకం బగు కర్మము సమ్యగ్దర్శనము కలిగిన పిమ్మట సంభవింప దని యర్థము. ఆత్మజ్ఞునకుఁ గర్మయోగము సంభవింప దనుటకు మఱియొక హేతువుఁ జెప్పుచున్నారు జ్ఞానయోగే నేత్యాదిగా. ఇందువలనఁగూడ నాత్మవిదునకు జ్ఞానానంతరము కర్మయోగము యుక్తము గా దని చెప్పుచున్నారు కృతకృత్యుఁ డగుటచే నిత్యాదిగా. జ్ఞానవంతునకు లేదు కర్మ మనుటకుఁ గారణాంతరముఁ జెప్పుచున్నారు తస్య కార్యమ్ ఇత్యాదిగా. అప్పుడు జ్ఞానవంతునకుఁ గర్మయోగము త్యాజ్యం బగునట్లు జిజ్ఞాసువునకుఁ గూడ నది త్యాజ్యం బగును, జ్ఞానప్రాప్తిచే వానికిఁ గూడఁ బురుషార్థము సిద్ధించుట వలన నని యాశంకించి జిజ్ఞాసువునకుఁ గలదు కర్మయోగాపేక్ష యని చెప్పుచున్నారు న కర్మణా మిత్యాదిగా. స్వరూపమున నుపకారి యగు సంగము లేక యంగిస్వరూపము సిద్ధింపమివలన జ్ఞానార్థికిఁ జిత్తశుద్ధ్యాదిద్వారమున జ్ఞానహేతు వగు కర్మయోగము అనుష్ఠేయం బని యర్థము. అప్పుడు జ్ఞానవంతునకుఁ గూడ జ్ఞానఫలమున నుపకారి యగుటచేఁ గర్మయోగం బావశ్యక మని యాశంకించి చెప్పుచున్నారు యోగారూఢ స్యేత్యాదిగా. సమ్యగ్దర్శనము గలిగినవానికిఁ గర్మము లేనిచో శరీరస్థితిహేతు వగుకర్మముగూడ సంభవింపమివలన వానికి శరీరము నిలువదు, శరీరము నిలువనిచో జీవన్ముక్తి సిద్ధింపదు, అది సిద్ధింపనియెడ నుపదేష్ట సంభవింపఁడు, ఉపదేశము లేనిచో జ్ఞానోదయం బెక్కడిది ? అని యాశంకించి చెప్పుచున్నారు శారీర మిత్యాదిగా. విద్వాంసునకుఁ గూడ శరీరస్థితి యంగీకరించునెడ శరీరస్థితిమాత్రప్రయుక్తము లైన దర్శన శ్రవణాదులందుఁ గర్తృత్వాభిమానముగూడ సంభవించు నని యాశంకించి చెప్పుచున్నారు నైవ కించి దిత్యాదిగా. తత్త్వవిత్ అనుటచే సమాహితచిత్తుఁ డగుటంజేసి చేయుచున్నా నను వృత్తిని ఎప్పుడును జేయఁగూడ దని యుపదేశించుటవలన గర్తృత్వాభిమానము సంభవింప దని యర్థము. ఈయుపదేశము ననుసంధింపని యప్పుడు విద్వాంసునకుఁ గూడ చేయుచున్నా నను స్వాభావికవృత్తి గలుగుటచేఁ గర్మయోగము సంభవించు నని యాశంకించి చెప్పుచున్నారు ఆత్మతత్త్వవిదునకు ఇత్యాదిగా. విద్వాంసుఁ డీయుపదేశము నొకవేళ ననుసంధింపఁ డని యనుకొందము, అట్లయినను దత్త్వజ్ఞానవిరుద్ధం బగుటవలన మిథ్యాఽజ్ఞానముగాని తజ్జన్య మగుకర్మముగాని వానికి సంభవించు నన శక్యము గా దని యర్థము.

* భ్రమసద్భావము—భ్రమము కలుగుట.

ఆత్మవిత్కర్తృకము లగు సన్న్యాసకర్మయోగములు సంభవింపమి వలన నవి నిశ్శ్రేయసకరంబు లనుటయు నం దొకటి విశిష్టం బనుటయు నయుక్త మని సిద్ధ మగుటవలన రెండవపక్షము నంగీకరించుచున్నారు అందువలన నిత్యాదిగా. తదీయకర్మసన్న్యాసముకన్నఁ గర్మయోగము విశిష్టం బని చెప్పుటయు నని సంబంధము. ఓయీ! సన్న్యాసము కర్మయోగముచే శుద్ధచిత్తునకు సిద్ధించునది యగుటచేఁ గర్మయోగముకంటె నుత్కృష్టం బగును, ఎట్లు సన్న్యాసముకంటెఁ గర్మయోగ ముత్కృష్టం బను ననుట యుక్త మగును? అనఁగాఁ జెప్పుచున్నారు పూర్వోక్తము ఇత్యాదిగా. విలక్షణతనే స్పష్టీకరించుచున్నారు కర్తృత్వాభిమానము ఇత్యాదిగా. సన్న్యాసాశ్రమమునకు విహిత మయిన శ్రవణాదికమునందుఁ గర్తృత్వాభిమాన ముండునప్పుడే పూర్వాశ్రమమునందుఁ ♦ గలిగిన కర్మైకదేశము విషయముగాఁ గల సన్న్యాసముకంటెఁ గర్మయోగము శ్రేష్ఠ మని చెప్పుట « నైతాదృశం బ్రాహ్మణ స్యాఽస్తి విత్తమ్ » * ఇత్యాదిస్మృతివిరుద్ధం బని యాశంకించి చెప్పుచున్నారు యమనియమా దీత్యాదిగా. « ఆనృశంస్యం క్షమా సత్య మహింసా దమ ఆర్జవమ్ । ప్రీతిః ప్రసాదో మాధుర్య మక్రోధశ్చ యమా దశ ॥ దాన మిజ్యా తపో ధ్యానం స్వాధ్యాయోపస్థనిగ్రహౌ । వ్రతోపవాసౌ మౌనంచ స్నానంచ నియమా దశ » ♦♦ అని చెప్పఁబడిన యమనియమములతోను ఇతరము లయిన యాశ్రమధర్మములతోను గూడిన దగుటచే ననుష్ఠింప నశక్యం బగుటవలన ఈ సన్న్యాసముకంటెఁ గర్మయోగం బుత్తమం బనుట యుక్తం బని యర్థము. « నహి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్ » అను న్యాయముచేఁ గర్మయోగము ఇతరాపేక్ష లేకయె సులువుగాఁ జేయుటకు శక్య మగుటచేతఁ గూడ నది యుత్తమ మని చెప్పుట యుచితం బని చెప్పుచున్నారు సుకరం బగుటచేతను నని. ప్రతివచనవాక్యార్థముఁ బర్యాలోచించుటచే సిద్ధ మగునర్థము నుపసంహరించుచున్నారు అని యిట్లు ఇత్యాదిగా. సన్న్యాసకర్మయోగములు పరస్పరవిరుద్ధములు, కావున

---

♦ గృహస్థాశ్రమమునందు, లేక బ్రహ్మచర్యాశ్రమమునందు.

* ఇట్టి—సన్న్యాసమువంటి విత్తము—ధనము బ్రాహ్మణునకు మఱియొకటి లేదు.

♦♦ దయయును ఓర్పును సత్యమును అహింసయును ఇంద్రియనిగ్రహమును ఋజుత్వమును—కపటము లేకుండుటయు ప్రీతియును ప్రసన్నతయు మాధుర్యమును—మధురవాక్యము చెప్పుటయును క్రోధము లేమియు అని యమములు పది. దానమును దేవపూజయును తపస్సును ధ్యానమును స్వాధ్యాయమును—ఉపనిషత్పఠనంబును ఉపస్థేంద్రియనిగ్రహమును వ్రతంబును ఉపవాసంబును మౌనమును స్నానమును అని నియమములు పది.

వాని సముచ్చయించి యనుష్ఠించుట శక్యము గాదు, రెంటిలో నొకటి కర్తవ్యం బన్నచోఁ బ్రశస్యతర మగునది కర్తవ్యం బగును, ప్రశస్యతరం బిది యని నిర్ధారితము కాలేదు, కావున దాని నిర్ధారించుకొనుటకై ప్రశ్నము చేసె నని ప్రశ్నవాక్యార్థము పర్యాలోచించి పృచ్ఛించినవాని యభిప్రాయం బెట్లు మున్ను వక్కాణింపఁబడినదో అట్లే ప్రతివచనవాక్యార్థము నిరూపించుటచేఁ గూడ నాయభిప్రాయమే నిశ్చితం బగుటవలనఁ బ్రశ్నమున కుపపత్తి సిద్ధ మని యర్థము.

భా. "జ్యాయసీ చే త్కర్మణ స్తే" అనుచోట ♦ జ్ఞానకర్మములు సమకాలమున సంభవింపమివలన వీనిలో నేది శ్రేయమో దాని నాకుఁ జెప్పు మని యర్జునునిచే నడుగంబడినవాఁడై భగవంతుఁడు సాంఖ్యులకు జ్ఞానయోగముచే నిష్ఠయు యోగులకుఁ గర్మయోగముచే నిష్ఠయుఁ జెప్పఁబడినది యని నిర్ణయము చేసెను. నచసన్న్యసనాదేవ—కేవలసన్న్యాసమువలననే *, సిద్ధిం సమధిగచ్ఛతి అని చెప్పుటవలన జ్ఞానసహిత మగు సన్న్యాసమే సిద్ధిసాధనం బనుట సమ్మతము. కర్మయోగమునుగూడ విధించుటవలన, జ్ఞానరహితసన్న్యాసము శ్రేయమా? లేక, కర్మయోగము శ్రేయమా? అని వీనిలో విశేషము తెలియఁగోరి యర్జునుఁడుపలికెను.—కర్మణామ్=కర్మములయొక్క; సన్న్యాసమ్ = పరిత్యాగమును, శాస్త్రీయములయిన యనుష్ఠానవిశేషములయొక్క పరిత్యాగమును; శంససి—చెప్పుచున్నా వనుట. కృష్ణ= ఓకృష్ణుఁడా! పునః=మరల; యోగంచ= ఆకర్మములయనుష్ఠానమునే; అవశ్య కర్తవ్య మని, శంససి = చెప్పుచున్నావు. అందువలన నాకు వీనిలో నేది శ్రేయం బని సంశయము. కర్మానుష్ఠానము శ్రేయమా? లేక, తత్పరిత్యాగము శ్రేయమా? అని. ప్రశస్యతర మగునది గదా యనుష్ఠేయము. కావున, యత్ = ఏది; ఏతయోః = ఈకర్మానుష్ఠానకర్మసన్న్యాసములలో; శ్రేయః = ప్రశస్యతరమో, దేని ననుష్ఠించుటవలన నాకు శ్రేయఃప్రాప్తి యగు నని తలంచుచున్నావో; తత్ = దానిని; ఏకమ్=రెంటిలో నొకదానిని; రెండును ఏకకాలమున నేకపురుషానుష్ఠేయంబు లనుట సంభవింపమివలన; మే =

♦ తృతీయాధ్యాయప్రారంభమునందు.

* జ్ఞానరహిత మగు సన్న్యాసమువలననే.

నాకొఱకు; సునిశ్చితమ్ = చక్కఁగా నిశ్చయ మగునట్లు, నీయభిప్రాయ మును; బ్రూహి = చెప్పుము.

కృష్ణా! కర్మసన్న్యాసము చేయవలయు నని చెప్పుచున్నావు, మరలఁ గర్మానుష్ఠానము చేయవలయుననియుఁ జెప్పుచున్నావు. ఈరెండును ఏకకాలమున నొక్కఁడు చేయుట శక్యము కాదు గదా! కావున నీరెంటిలో నా కేది శ్రేయమో దానిఁ జక్కఁగా నిశ్చయించి నాకుఁ జెప్పు మని తాత్పర్యము.

ఆ. ఓయీ! తృతీయాధ్యాయమునందు ఈప్రశ్నమును భగవంతుఁడు నిర్ణయించి యుండుటవలన నిటఁ బ్రశ్నప్రతివచనముల కవకాశము లేదు అని యాశంకించి విస్తరించి చెప్పినసంబంధమునే మరల సంక్షేపముగాఁ జూపుచున్నారు జ్యాయసీచే దిత్యాదిగా. సాంఖ్యయోగములు భిన్నపురుషులచే ననుష్ఠింపఁబడుట వలన నవి మరలఁ బ్రశ్నమునకు విషయము కాఁజాల వని యర్థము. ఇందువలనఁ గూడ నవి ప్రశ్నమునకు విషయములు కా వని చెప్పుచున్నారు నచ సన్న్యసనా దేవేత్యాదిగా. ఏవకారము చెప్పుటవలన జ్ఞానసహిత మగుసన్న్యాసము సిద్ధిసాధనం బని భగవంతున కభిమతము, భిక్తైవనం సంశయంయోగ మాతిష్ఠ అని కర్మయోగ మును గూడ విధించుటవలన నది గూడ సిద్ధికి సాధనం బని సమ్మతము, అందువలన నిర్ణయింపఁబడిన వగుటం జేసి ప్రశ్నము తద్విషయము కాఁజాల దని యర్థము. అప్పు డేయభిప్రాయంబునఁ బ్రశ్న కావచ్చు నని యాశంకించి జ్ఞానరహితసన్న్యాస సముకంటెఁ గర్మయోగము ప్రశస్యతర మని తెలియుటకై యని చెప్పుచున్నారు జ్ఞానరహితసన్న్యాసము ఇత్యాదిగా. పృచ్ఛించువానియభిప్రాయము నిట్లు ప్రద ర్శించి ప్రశ్నమున కుపపత్తిఁ జెప్పి ప్రశ్నము దియుచున్నారు కర్మణామ్ ఇత్యాదిగా. అప్పుడు రెండును నీ వనుష్ఠింపవలయు నని యాశంకించి యది యశక్య మని చెప్పఁ బడి యుండుటవలనఁ బ్రశస్యతర మగుదాని ననుష్ఠించుటకై అది యిది యని నిశ్చ యించి చెప్పవలయు నని చెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత. కామ్యకర్మములకును బ్రతిషిద్ధకర్మములకును బరిత్యాగము జెప్పుచున్నాను నేను సర్వకర్మములకును గా దని తలంచు నని యాశంకించి కర్మ ణ్యాక స్తేత్యాదిస్థలంబున నట్టివిశేషము చెప్పఁ బడమివలన నట్లు గా దని చెప్పుచున్నారు శాస్త్రీయము లయిన ఇత్యాదిగా. అప్పుడు శాస్త్రీయములు అశాస్త్రీయము లగు సర్వకర్మములకును త్యాగ మగుఁ గాక అనఁగా కా దని చెప్పుచున్నారు పునః ఇత్యాదిగా. అప్పుడు కర్మత్యాగమును కర్మయోగమును రెంటను గ్రహింపవలయు నని యాశంకించి విరోధమువలన నట్లు

గా దను నభిప్రాయముతోఁ జెప్పుచున్నారు అందువలన ననిః రెంటిని ఒకఁ డనుష్ఠింప నశక్యం బని చెప్పి యుండుటవలనను రెండును గర్తవ్యంబు లని చెప్పుటవలనను సంశయము గలుగుచున్నది, ఆసంశయమునే విశదీకరించుచున్నాఁడు కర్మానుష్ఠానము ఇత్యాదిగా. ప్రశస్యతరము నెఱుంగఁ గోరుట యెందు కని యాశంకించి చెప్పుచున్నారు ప్రశస్యతరము ఇత్యాదిగా. అది యనుష్ఠేయం బగు నెడఁ బ్రశ్నము సావకాశ మని చెప్పుచున్నారు కావున ననిః ఆప్రశస్యతరమునకే విశేషణము చేయుచున్నారు దేని ననుష్ఠించుటవలన నిత్యాదిగా. రెండును జెప్పి యుండఁగా నెందు కొకటి చెప్పవలయు నని నిర్బంధించుచున్నావు ? అనఁగాఁ జెప్పుచున్నారు రెండును ఇత్యాదిగా. కర్మత్త్యాగములు పరస్పరము విరుద్ధము లగుటవలన నని యర్థము.

హ. సన్న్యాసకర్మయోగములలో శ్రేష్ఠ మగుదానిఁ దెలియఁ గోరిన వాఁడై యర్జునుఁడు పలికెను.—సకలకర్మములను సన్న్యసించి శమదమాదిసాధనముల ననుష్ఠించుటచే బ్రహ్మముఁ దెలియఁ గోరువానికి బ్రహ్మజ్ఞానము తప్పక సిద్ధించును. అట్లు కామ్యనిషిద్ధకర్మములను సన్న్యసించి వాసుదేవపూజనబుద్ధిచేఁ గర్మముల ననుష్ఠించుచుండు ముముక్షువునకును జిత్తశుద్ధి యవశ్యము సిద్ధించుటచే జ్ఞానము తప్పక కలుగు నని యభిప్రాయము.

శం. కర్మణ్యకర్మ యః పశ్యేత్ అని యారంభించి కర్మసన్న్యాసము నుపక్రమించి, జ్ఞానాగ్ని దగ్ధకర్మాణమ్, శారీరం కేవలం కర్మ, యదృచ్ఛాలాభసంతుష్టః, సర్వం కర్మాఽఖిలం పార్థ, జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి, యోగసన్న్యస్తకర్మాణమ్ అనువాక్యములచే బ్రహ్మనిష్ఠుఁ డగు బ్రహ్మవిదునకుఁ గర్తవ్యము సర్వకర్మసన్న్యాసమే యని ప్రతిపాదించి, ఇప్పుడు కర్మసన్న్యాసకర్మయోగములు ఏకకాలంబున నేకపురుషుని కనుష్ఠింప శక్యములు గా వనియు, రెండును అవ్యవహితసాధనము వ్యవహితసాధనము ♦ అగుటచే నేకప్రయోజనసాధకంబు లనియు, ఫలమొక్కటి యయినను అవి యొకటి సాధ్యమును ఒకటి సాధనమును అగుటచేఁ బూర్వాఽపరభావు * లనియు, కర్మయోగరూపసాధనముచే సాధ్య మయినజ్ఞానముఁ బొందిన

---

♦ సన్న్యాసము అవ్యవహితసాధనము—సాక్షాత్సాధనము, కర్మయోగము వ్యవహితసాధనము—పరంపరగా సాధనము.

* కర్మయోగము పూర్వమునందుఁ గలుగునది, సన్న్యాసము అపరమున—పిమ్మటఁ గలుగునది.

పిమ్మట బ్రహ్మవిదునకు సర్వకర్మసన్న్యాసమే కర్తవ్యం బనియు—ఇవి మొదలగువిషయముల నిరూపించుటకై పంచమాధ్యాయము ప్రారంభింపఁబడుచున్నది. అందు మొదట, లోకసంగ్రహమేవాఽపి అని విద్వాంసుఁడు లోకహితార్థము కర్మము చేయవలయు నని కర్మయోగము నుపక్రమించి, అందు వర్తఏవచ కర్మణి అని తన దృష్టాంతముఁ బ్రతిపాదించి, గుణాగుణేషు వర్తన్తే అనున్యాయమున ననుష్ఠింపవలయు నని యనుష్ఠానప్రకారము సూచించి, ఇట్లు పూర్వైః పూర్వతరం కృతమ్ అని యది శిష్టాచారసమ్మతం బని ప్రదర్శించి, ఆకర్మయోగమునే కురుకర్మైవ తస్మాత్త్వమ్ అనియు యోగ మాతిష్ఠోత్తిష్ఠ అనియు సన్న్యాసముతోఁ గూడ నుపదేశించుటవలన, కర్మసన్న్యాసకర్మయోగములు రెండు నేకకాలమునఁ గర్తవ్యములుగాఁ బ్రాప్తించుటంజేసి, కన్నుదెఱచుటయును మూయుటయును వలె నవి పరస్పరవిరుద్ధము లగుటచే నొక్కం డేకకాలంబునఁ జేయ నశక్యంబు లగుటవలన, రెంటిలో నేదోయొకటి కర్తవ్యం బని ప్రాప్తింపఁగా, వానిలో నేది శ్రేష్ఠతరమైన పురుషార్థసాధకం బగునో దానిం దెలిసి యనుష్ఠింపవచ్చునని వానిలో శ్రేష్ఠ మగు దానిం దెలియఁగోరి యర్జునుండు పలికెను. ఓయీ! ఈకర్మసన్న్యాసకర్మయోగములలో నేది శ్రేష్ఠతరమో దాని నాకుఁ జెప్పు మని యర్జునుని ప్రశ్న. విద్వత్కర్తృక కర్మసన్న్యాసకర్మయోగములలోనా యేమి? అవిద్వత్కర్తృకకర్మసన్న్యాసకర్మయోగములలోనా యేమి? లేక, విద్వదవిద్వత్కర్తృకకర్మసన్న్యాసకర్మయోగములలోనా యేమి? అని యడుగుదు వేని; చెప్పెదము. మొదటిపక్షము కాదు. నిరంతర సమాధిచేఁ గలిగినసమ్యగ్దర్శనముచే బ్రహ్మమే నే నని నిష్క్రియ మగు పరబ్రహ్మము తా నని తెలిసి సదా బ్రహ్మరూపముననే యుండునట్టి బ్రహ్మవిదునకుఁ దద్విపరీతమయినయాత్మాజ్ఞానముచేఁ గలుగునట్టి యనాత్మతాదాత్మ్యము సంభవింపమివలన అహంకారముచేతనే కలుగు కర్మయోగం బెట్లును సిద్ధింపదు. తనకు విరోధి యగు సమ్యగ్దర్శనము విజృంభించి యుండునపుడు సూర్యునియెదుటఁ జీఁకటికింబోలె నజ్ఞానమునకు స్థితి యనుపపన్న మగుటవలన విద్వాంసున కనాత్మతాదాత్మ్యము సంభవింపనే సంభవింపదు. అది సంభవింపని యప్పుడు తజ్జన్య మగు నహంకారముగూడ సంభవింపదు. అందువలన నహంకారైకనిబంధన ♦ మగు కర్మయోగము స్వప్నమున నేనియు సంభవించు నన శక్యము గాదు. మేలుకొనియుండువానికి స్వప్నవిషయసంబంధ మెట్లు సంభవించును? అట్లు బ్రహ్మజ్ఞానమునందే మేలుకొనియుండు బ్రహ్మ

♦ అహంకారమే కారణముగాఁ గలది.

విదునకు అనాత్మతాదాత్మ్యముతోఁ గాని తత్కార్యముతోఁ గాని సంబంధము సంభవింపదు. సంభవించు నన్నచో నతఁడు కృతకృత్యుఁడు కాఁ డనుట ప్రసక్తించును. అప్పుడు, "తద్బ్రహ్మాఽహమస్మీతి కృతకృత్యో భవతి, నైవా ఽస్తి కించిత్కర్తవ్యమ్" ఇత్యాదిశ్రుతిస్మృతుల కప్రామాణ్యము ప్రసక్తించును. ప్రత్యక్షవిరోధంబును సంభవించును వక్రత్వమును తొఱ్ఱలు గలుగుటయును మొదలగు ధర్మములను జక్కగాఁ జూచినవానికి స్థాణువునందుఁ మరలఁ జోరుఁ డను బుద్ధియుఁ బరుగెత్తుటయును ఎట్లు సంభవింపవో, అట్లు బ్రహ్మమునే తన్నుగా నెఱింగి తదానందము ననుభవించుచు సర్వమును బ్రహ్మమునుగానే చూచుచుండు బ్రహ్మవిదునకు అనాత్మతాదాత్మ్యంబును గర్తృత్వబుద్ధియుఁ గామనయుఁ గర్మమునందుఁ బ్రవృత్తియు సంభవింపనే సంభవింపవు. అందువలన నీప్రశ్నము విద్వత్కర్తృకకర్మసన్న్యాసకర్మయోగవిషయము కాదు. తృతీయపక్షమును గాదు, పరస్పరవిరోధు లగు విద్వత్త్వాఽవిద్వత్త్వములు ఒకచో నుండుట యనుపపన్న మగుటచే నట్టిప్రశ్న సంభవింపమివలన. ఇఁకఁ బరిశేషమువలన, ♦ అవిద్వత్కర్తృకము లగు కర్మసన్న్యాస కర్మయోగములు రెండును ఏకకాలమునందే కర్తవ్యములుగాఁ బ్రాప్తింపఁగా నవి రెండును బరస్పరవిరుద్ధము లగుటచేఁ జేర్చిచేయుట సంభవింపమివలన, రెంటిలో నొకటి ప్రశస్యతర మని సిద్ధించినచో దాని ముముక్షువు చేయవచ్చు నని వానిలోఁ బ్రశస్యతర మగుదానిఁ దెలియఁ గోరినవాఁడై యర్జునుం డడుగుచున్నాఁడు —కృష్ణ = ఓకృష్ణుఁడా! సదానందరూపుఁ డగుటవలనఁ బరమాత్మ కృష్ణా యని సంబోధింపఁ బడుచున్నాఁడు. పూర్వోక్తవచనములచే; కర్మణామ్ = విధ్యుక్తము లయి యవశ్య మనుష్ఠింపవలసినకర్మములయొక్క; సన్న్యాసమ్ = విడుచుటను; శంససి = చెప్పుచున్నావు. పునః = మరల; కురు కర్మైవ తస్మాత్త్వమ్ అనియు యోగ మాతిష్ఠ యనియు, యోగంచ = కర్మయోగమునుగూడ; శంససి. క్రియచేతను అధికారముచేతను సాధనసంపత్తిచేతను ఆశ్రమముచేతను బరస్పరవిరుద్ధము లయిన సన్న్యాసకర్మయోగములు ఒక్కనిచే నేకకాలంబునఁ జేయ నశక్యములు, నాకు వానిని గర్తవ్యములనుగా విధించుచున్నావు. నా కిందు సంశయము, చేయవలసినది కర్మయోగమా? సన్న్యాసమా? అని, రెండును ఆశ్రమాదిభేదంబునం జేసి పరస్పరవిరుద్ధంబు లగుటచే నొక్కనిచేత నేకకాలంబునఁ జేయ నశక్యంబు లగుటవలన, ఏది శ్రేయస్సాధనం బగునో అదియే కర్తవ్యము, కాని రెండును కర్త

♦ మిగిలినది యగుటవలన.

వ్యములు గావని తోఁచుచున్నది. అందువలన, ఏతయోః = ఈరెంటిలో; యత్ ఏకమ్ = ఏది యొకటి; శ్రేయః = ప్రశస్యతర మని మోక్షసాధనముగా; నీచేత, సునిశ్చితమ్; దానినే నాకుఁ జెప్పు మని యర్థము.

మ. విధ్యుక్తకర్మబుద్ధుల
ైధ్యాయద్వయిని నిర్ణయము గావించెఁ
ద్వ్యధ్యాయి నిర్ణయించు శ్రీ
తథ్యేయుం డిఁకను గర్మతత్త్యాగముల౯.

తృతీయాధ్యాయంబున జ్యాయసీ చేత్కర్మణస్తే ఇత్యాదిగా నర్జునునిచే నడుగంబడినవాఁడై భగవంతుఁడు జ్ఞానకర్మములకు వికల్పసముచ్చయంబులు సంభవింపమిం జేసి యధికారిభేదవ్యవస్థచే లోకే௨స్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయా ఇత్యాదిగా నిర్ణయము గావించెను. అట్లు, అజ్ఞుఁ డధికారిగాఁ గలకర్మము జ్ఞానముతో సముచ్చయింపఁబడదు, తేజస్తిమిరంబులుంబోలె నేకకాలంబున సంభవింపమివలన, కర్మాధికారమునకు హేతు వైనభేదబుద్ధిని బోఁగొట్టునది యగుటచే జ్ఞానము కర్మవిరోధి యగుటవలన. వికల్పింపనుం బడదు, ఏకార్థములు ♦ గాకుండుటవలన, జ్ఞానకార్య మయిన యజ్ఞాననాశము కర్మముచేఁ గలిగింప నశక్య మగుటవలన, «తమేవ విదిత్వా௨తిమృత్యు మేతి నా௨న్యః పన్థా విద్యతే௨యనాయ" అనుశ్రుతివలన. జ్ఞానము కలిగిన పిమ్మటఁ గర్మకార్యాపేక్షయే లే దని చెప్పఁబడినది యావానర్థ ఉదపానే అనుస్థలమున. అట్లు జ్ఞానికిఁ గర్మమునం దధికారము లే దని నిశ్చితము కాఁగా, ప్రారబ్ధకర్మవశంబున వ్యర్థచేష్టగాఁ గర్మానుష్ఠానము గాని సర్వకర్మసన్న్యాసము గాని జ్ఞానికృత్యం బనుట నిర్వివాదం బని చతుర్థాధ్యాయంబున నిర్ణయింపఁబడినది. అజ్ఞునకో అంతఃకరణశుద్ధిద్వారమున జ్ఞానోత్పత్తికొఱకుఁ గర్మములనుష్ఠేయములు, «తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసా௨నాశకేన» అనుశ్రుతివలనను, «సర్వం కర్మా௨ఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే» అనుభగవద్వచనమువలనను. ఇట్లు సర్వకర్మములును జ్ఞానార్థములు. అట్లు సర్వకర్మసన్న్యాసముగూడ జ్ఞానార్థముగా శ్రుతి చెప్పుచున్నది «ఏతమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి, శాన్తో దాన్త ఉపరత స్తితిక్షు స్సమాహితో భూత్వా௨௨త్మన్యేవా௨௨త్మానం పశ్యేత్, త్యజతైవ హి తత్ జ్ఞేయం త్యక్తుః

♦ ఒక్కటే ఫలము గలవి.

ప్రత్యక్స్వరం పదమ్, సత్యానృతే సుఖదుఃఖే వేదా నిమం లోక మముంచ పరిత్యజ్యా ఽఽత్మాన మన్విచ్ఛేత్ » § ఇత్యాదిగా. అందు, ఆరా దుపకారకసన్నిపత్యోపకారకము ♦ లగుకర్మతత్త్యాగములకుఁ బ్రయాజావఘాతములకుంబోలె * సముచ్చయము సంభవింపదు, విరుద్ధము లగుటచే నేకకాలస్థితి సంభవింపమివలన. కర్మతత్త్యాగములకు ఆత్మజ్ఞానమే ఫల మగుటచే నేకార్థంబు లగుటవలన నతిరాత్రములందు షోడశిగ్రహణాగ్రహణములకుంబోలె ‖ వికల్పముగూడ సంభవింపదు, ద్వారభేదముచే నేకార్థములు గామివలన. కర్మమునకుఁ బాపక్షయరూప మైనయదృష్టమే గదా ద్వారము. సన్న్యాసమునకో సర్వవిక్షేపములును లేకుండుటచే విచారమున కవసరము గల్గించుట యనునది దృష్టమే ద్వారము; నియమాపూర్వమో $ దృష్టసంబంధి యగుటవలన నవఘాతాదికమునందువలెఁ బ్రయోజకము కాదు. అందువలన, అదృష్టార్థదృష్టార్థములయినయారాదుపకారకసన్నిపత్యోపకారకములకు ఒక్కటియే ప్రధానము ఫలమైనను వికల్పము సంభవింపనే సంభవింపదు, సంభవించు నన్నచో ప్రయాజావఘాతాదులకుఁగూడ వికల్పము ప్రసక్తించుటవలన. అందువలనఁగ్రమంబున రెండును అనుష్ఠేయములు. అందును సన్న్యాసానంతరము కర్మానుష్ఠానం బగుఁ గాక యనువెడ నప్పుడు విడిచినపూర్వాశ్రమమును స్వీకరించుటచే నారూఢపతితుఁడగుటవలనఁగర్మమునం దనధికారియగును. స్వీకరించినసన్న్యాసంబును వ్యర్థంబగును, అది యదృష్టార్థము గామివలన. మొదటఁ జేసినసన్న్యాసముచేతనే జ్ఞానాధికారము లభించుచుండఁగాఁ దదనంతరము కర్మానుష్ఠానముఁగూడ వ్యర్థమగును. అందువలన మొదట భగవదర్పణబుద్ధిచే నిష్కామకర్మానుష్ఠానము చేసి యందుచే నంతఃకరణశుద్ధిగలిగి తీవ్రమయిన వైరాగ్యముచే వివిదిష దృఢమయిన పిమ్మట సర్వకర్మసన్న్యాసము శ్రవణ

---

§ సన్న్యాసు లీలోకమునే—ఆత్మ యనులోకమునే కోరినవారలై సన్న్యసించుచున్నారు, శమము దమము ఉపరతి తితిక్ష సమాధి గలవాఁడై యాత్మ యందే యాత్మను జూడవలయును, విదుమవానియొక్క ప్రత్యక్స్వరూపము విదుచువానిచేతనే తెలియ నగును, సత్యానృతములను సుఖదుఃఖములను వేదములను ఇహపరలోకములను విడిచి యాత్మను గోరవలయును.

♦ ఆరాత్ ఉపకారకము—దూరముగా నుపకారము చేయునది, చిత్తశుద్ధిద్వారమున నుపకారము చేయునది యనుట. సన్నిపత్యోపకారకము—సమీపమున నుపకారము చేయునది.

* ప్రయాజము అవఘాతము అనునవి యజ్ఞాంగకర్మములు.

‖ షోడశి యనఁగా యజ్ఞమునందు సోమరసము నుంచుపాత్రము, దానిని గ్రహించుటయును గ్రహింపమికయును బోలె.

$ నియమముచేఁ గలుగు నపూర్వము.

మననాదిరూప మగు వేదాంతవాక్యవిచారముకొఱకుఁ గర్తవ్యం బని భగవంతునిమతము. అట్లు చెప్పఁబడినది «నకర్మణా మనారమ్భా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే» అని. చెప్పఁబడునుగూడ « ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే । యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే'' అని. యోగ మనఁగా నిటఁ దీవ్రవైరాగ్యపూర్వకమైన వివిదిష. అట్లు చెప్పఁబడినది వార్తికకారులచేత «ప్రత్యగ్వివిదిషా సిద్ధ్యై వేదానువచనాదయః। బ్రహ్మావాప్త్యైతు తత్త్యాగ ఈప్సన్తీతి శ్రుతే ర్బలాత్ »♦ అని. స్మృతియును « కషాయపక్తిః కర్మాణి జ్ఞానంతు పరమాగతిః । కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే '' * అని. మోక్షధర్మమునందును « కషాయం పాచయిత్వాతు శ్రేణీ స్థానేషుచ త్రిషు । ప్రవ్రజేచ్చ పరంస్థానం పారివ్రాజ్య మనుత్తమమ్ ॥ భావితైః కరణై శ్చాయం బహుసంసారయోనిషు । ఆసాదయతి శుద్ధాత్మా మోక్షంవై ప్రథమాశ్రమే॥ త మాసాద్యతు ముక్తస్య దృష్టార్థస్య విపశ్చితః। త్రిష్వాశ్రమేషు కోన్వర్థో భవేత్పరమ మీప్సతః '' ♦♦ అని. ఇట మోక్ష మనఁగా వైరాగ్యము. ఇందుచేఁ గ్రమాక్రమసన్న్యాసములు రెండును దెలుపఁబడినవి. అట్లు శ్రుతి "బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్ గృహాద్వనీ భూత్వా ప్రవ్రజేత్ యదివేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజే ద్గృహాద్వా వనాద్వా యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్ '' ❛ అని. అందువలన, అర్జునకు వైరాగ్యము లేని దశయందు,

---

♦ ప్రత్యగాత్మజ్ఞానేచ్ఛ సిద్ధించుకొఱకై వేదానువచనాదులు. బ్రహ్మప్రాప్తికొఱకో వేదానువచనాదిత్యాగము, ఈప్సన్తి-కోరుచున్నారు అను శ్రుతియొక్క బలమువలన.

* కర్మములు కషాయమును-చిత్తదోషమును పచనము చేయునవి జ్ఞానమో పరమగతి. కర్మములచేఁ గషాయము పక్వముగాఁగా నంత జ్ఞానము ప్రవర్తించుచున్నది.

♦♦ మూఁడాశ్రమములందును కషాయమును పరిపాకముఁ జేసికొని సర్వోత్తమ మయిన పరమస్థానమగు సన్న్యాసాశ్రమమును బొందవలయును. సంసారము నందలి పెక్కుజన్మములందు అభ్యసించిన సాధనములచే నితఁడు మొదటి యాశ్రమమునందే శుద్ధచిత్తుఁడై మోక్షమును-వైరాగ్యమును పొందుచున్నాఁడు. దానిం బొంది ముక్తుఁడై-విరక్తుఁడై దృష్టార్థుఁడై పరమ మగుజ్ఞానమును గోరునట్టి విద్వాంసునకు మూఁడాశ్రమములందును-బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థాశ్రమములందును ఏమిప్రయోజనము గలదు ?

❛ బ్రహ్మచర్యము సమాప్తిచేసి గృహస్థుఁడు కావలయును, గృహస్థాశ్రమమునుండి వనప్రస్థుఁడై సన్న్యసింపవలయును. వేఱువిధమునఁ గాని. బ్రహ్మచర్యమునుండియే సన్న్యసించునది, గృహస్థాశ్రమమునుండిగాని వనప్రస్థాశ్రమమునుండిగాని, ఏదినము విరక్తుఁ డగునో అదినముననే సన్న్యసింపవలయును.

కర్మానుష్ఠానమే, వానికే వైరాగ్యము గలిగిన దశయందు సన్న్యాసము శ్రవణాదుల కవసరము గల్గించుటచే జ్ఞానార్థం బని దశాభేదంబున అర్జు నధికరించియే కర్మతత్త్యాగముల వివరించుటకై పంచమ షష్ఠాధ్యాయము లారంభింపఁబడుచున్నవి. విద్వత్సన్న్యాసమో, జ్ఞానబలంబువలన నర్థసిద్ధమే యగుటచే సందేహము లేకుండుటవలన నిట విచారింపఁబడదు. అందు జిజ్ఞాసు నగు నర్జు నొక్కనినే యుద్దేశించి జ్ఞానార్థములుగాఁ గర్మతత్త్యాగములను విధించుటవలనను, అవి విరుద్ధము లగుటవలన నేకకాలమున ననుష్ఠింప నశక్యంబు లగుటవలనను, జిజ్ఞాసుఁ డను నేను దేని నిష్ఠ ననుష్ఠింపవలయు నని సందేహపడుచున్నవాఁడై యర్జునుఁడు పలికెను.—కృష్ణ = సదానందరూపుఁడా ! లేక, భక్తులదుఃఖమును ఆకర్షించువాఁడా ! కర్మణామ్ = యావజ్జీవాది శ్రుతివిహితము లగు నిత్యనైమిత్తికకర్మములయొక్క; త్యాగమ్ = సన్న్యాసమును; జిజ్ఞాసు వగు నర్జునునుద్దేశించి, శంససి = చెప్పుచున్నావు, వేదముఖంబున. పునః = మరల; యోగంచ = కర్మానుష్ఠానరూప మయిన యోగమునుగూడ; శంససి = చెప్పుచున్నావు, « ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి, త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి» అనుశ్రుతివాక్యద్వయము చేత, « నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః । శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్, ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ" అను గీతావాక్యద్వయముచేతఁ గాని. అందు, ఒకయర్జు నుద్దేశించియే కర్మతత్త్యాగముల విధించుటవలన, ఏకకాలంబున రెండును అనుష్ఠింప నశక్యంబు లగుటవలన; ఏతయోః= ఈకర్మతత్త్యాగములలోపల; యత్; ఏకమ్; శ్రేయః = ప్రశస్యతర మని తలంచుచున్నావో; కర్మముగాని తత్త్యాగముగాని, తత్; మే; బ్రూహి; సునిశ్చితమ్; నీమతము ననుష్ఠించుటకొఱకు.

శ్రీ. కర్మసన్న్యాసకర్మయోగములయందు
ఫల్గుననిసంశయంబును బరిహరించి
జితకరణసముదాయుఁ డౌయతికి ముక్తిఁ
బంచమాధ్యాయమునయందుఁ బలికెను హరి.

అజ్ఞానసంభూత మగు సంశయమును జ్ఞానాసిచే ఛేదించి కర్మయోగము నాశ్రయింపు మని చెప్పఁబడినది. అందుఁ బూర్వాపరవిరోధముఁ దలంచినవాఁడై యర్జునుఁడు పలికెను.—యస్త్వాత్మరతి రేవ స్యాత్ ఇత్యాదిగాను, సర్వం కర్మాఖిలం పార్థ ఇత్యాదిగాను, జ్ఞానికి సర్వకర్మసన్న్యాసముఁ జెప్పుచున్నావు. జ్ఞానాసిచే సంశయమును ఛేదించి యోగము నాశ్రయింపు మని మరల యోగమును

గూడఁ జెప్పుచున్నావు. కర్మసన్న్యాసంబును గర్మయోగంబును ఒక్కని కేకకాలంబునందే సంభవింపవు, విరుద్ధస్వభావంబు లగుటవలన. అందువలన, వీనిలోపల నొక్కటి యనుష్ఠింపవలయుం గావున నా కేది శ్రేయమో—శ్రేష్ఠమో, సునిశ్చితమయినదాని నొక్కటిం జెప్పుము.

ప. ఇట్లు బరస్పరవిరుద్ధంబు లగుకర్మసన్న్యాసకర్మయోగంబుల నేక కాలంబున నుపదేశించుటవలన సందేహము నొందినవాఁడై యర్జునుం డడుగుచున్నాఁడు.—ఓకృష్ణా! మొదట, కర్మణాం సన్న్యాసం శంససి. పునః= వెంటనే; యోగమ్; శంససి = ఉపదేశించుచున్నావు. అప్పుడు, ఏతయోః = ఈ రెంటిలోపల; యత్, శ్రేయః = శ్రేష్ఠమో; తత్; ఏకమ్; సునిశ్చిత మగునట్లు; బ్రూహి.

రా. చతుర్థాధ్యాయంబునఁ గర్మయోగమునకు జ్ఞానాకారతచేఁ గలుగు స్వరూపభేదంబును జ్ఞానాంశమునకే ప్రాధాన్యంబును జెప్పఁబడినది. జ్ఞానయోగమునం దధికారియైనవానికిఁ గూడఁ గర్మయోగమే యంతర్గతాత్మజ్ఞానం బగుటవలనను బ్రమాదరహితం బగుటవలనను సులభం బగుటవలనను ఇతరాపేక్ష లేనిది యగుటవలనను జ్యాయం బని తృతీయాధ్యాయంబునందే చెప్పఁబడినది. ఇప్పుడు ఆత్మప్రాప్తిసాధనం బనుట యందుఁ గర్మయోగము జ్ఞాననిష్ఠకంటె శీఘ్రం బనుటయుఁ గర్మయోగాంతర్గతం బగు నకర్తృత్వానుసంధానము యొక్కవిధంబును బ్రతిపాదించి తన్మూల మయిన జ్ఞానము గూడ శోధింపఁబడుచున్నది *.—కర్మణాం సన్న్యాసమ్ = జ్ఞానయోగమును; పునః; కర్మయోగంచ; శంససి. ఇది యభిప్రాయము—ద్వితీయాధ్యాయమునందు, ముముక్షువు మొదటఁ గర్మయోగమునే చేయవలయును, కర్మయోగముచే నంతఃకరణమునందలి కషాయము తొలంగిన పిదప జ్ఞానయోగముచే నాత్మదర్శనము చేయవలయు నని ప్రతిపాదించి, మరలఁ దృతీయచతుర్థాధ్యాయములందు, జ్ఞానయోగాధికారదశను బొందినవానికిఁ గూడఁ గర్మయోగనిష్ఠయే జ్యాయము, అదియే జ్ఞాననిష్ఠాపేక్ష లేకయే యాత్మప్రాప్తికి సాధనం బని కర్మనిష్ఠను బ్రశంసించుచున్నావు. అని. అందు, ఏతయోః = ఈజ్ఞానయోగకర్మయోగములలో; ఆత్మప్రాప్తి సాధనత్వమునందు, యత్ ఏకమ్ = ఏదియొక్కటి; సౌకర్యమువలనను శీఘ్రం బగుటవలనను; శ్రేయః = శ్రేష్ఠ మని; సునిశ్చితమ్ = చక్కఁగా నిశ్చయింపఁబడినదో; తత్ మే బ్రూహి.

* చక్కఁగాఁ బ్రతిపాదింపఁబడుచున్నది.

కృష్ణా! నీవు ద్వితీయాధ్యాయంబున ముముక్షువు మొదటఁ గర్మయోగము ననుష్ఠించి దానిచే నంతఃకరణశుద్ధి గలవాఁడైనపిమ్మట జ్ఞానయోగము ననుష్ఠింపవలయు నని చెప్పితివి. మరలఁ దృతీయచతుర్థాధ్యాయములందు జ్ఞానయోగముకంటెఁ గర్మయోగము శ్రేష్ఠ మని చెప్పుచున్నావు. కావున నీరెంటిలో నేది యుత్తమమో దాని నాకుం జెప్పు మని తాత్పర్యము.

మూ. తృతీయాధ్యాయమునఁ జెప్పినకర్మయోగమునే ప్రపంచించుచున్నాఁ డీయధ్యాయముచేత.—యదృచ్ఛాలాభసంతుష్టః ఇత్యాదిగా సన్న్యాసమును; కురు కర్మైవ ఇత్యాదిగా కర్మయోగమును. నియమనము మొదలగువానిచే సకలలోకముల నాకర్షించుటవలనఁ గృష్ణుఁడు. అట్లు చెప్పఁబడినది « యతః కర్షసి దేవేశ నియమ్య సకలం జగత్ । అతో వదన్తి మునయః కృష్ణం త్వాం బ్రహ్మవాదినః " ♦ అని మహాకావ్యమునందు. సన్న్యాసశబ్దార్థమును భగవంతుఁడే చెప్పఁబోవుచున్నాఁడు. ఇది ప్రశ్నాభిప్రాయము—సన్న్యాసము శ్రేయము—అధిక మగునేని, అప్పుడు సన్న్యాసమునకుఁ గొంచెము విరోధి యగుచున్నది యుద్ధము. అని.

శ్రీభగవానువాచ.—

సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే. ౨

భా. స్వాభిప్రాయముఁ జెప్పుచు నిర్ణయముకొఱకు శ్రీభగవంతుఁడు పలికెను.—సన్న్యాసః = కర్మములపరిత్యాగమును; కర్మయోగశ్చ = కర్మముల ననుష్ఠించుటయు; అవి, ఉభౌ = రెండును; నిశ్శ్రేయసకరౌ= మోక్షముఁ కలిగించునవి, జ్ఞానోత్పత్తిహేతువు లగుటచే. రెండును నిశ్శ్రేయసకరంబులే, అట్లయినను, తయోస్తు = నిశ్శ్రేయసహేతువు లయినయా రెంటిలో మాత్రము; కర్మసన్న్యాసాత్ = కేవల మయినకర్మసన్న్యాసముకంటె; కర్మయోగః= కర్మయోగము; విశిష్యతే=ఉత్తమము. అని, కర్మయోగమును స్తుతించుచున్నాఁడు.

♦ దేవేశ్వరుఁడా! ఎందువలన నీవు సకలజగత్తును నియమించి యాకర్షించుచున్నావో అందువలన బ్రహ్మవాదు లగుమునులు నిన్నుఁ గృష్ణునిఁగాఁ జెప్పుచున్నారు.

కర్మసన్న్యాసంబును గర్మయోగంబును ఈరెండును జ్ఞానోత్పత్తికి హేతువు లగుటచే మోక్షప్రదములే యగును. అయినను వానిరెంటిలోఁ గర్మసన్న్యాసముకంటెఁ గర్మయోగం బుత్తమ మని తాత్పర్యము.

**ఆ.** ప్రశ్నము నిట్లు ప్రకటించి యుత్తరముఁ బ్రకటించుచున్నారు స్వాభిప్రాయము నిత్యాదిగా. నిర్ణయముకొఱకు—దానిమూలంబున నర్జుననిసంశయము నివర్తించుట కని యర్థము. ఇట్లు ప్రశ్నము ప్రవర్తించినపిదపఁ గర్మయోగము సుకరం బని తలఁచి యందుచేఁ బ్రశస్యతరం బని చెప్పఁ గోరినవాఁడై భగవంతుఁడు ప్రతివచనం బేమి చెప్పె నని యాశంకించి చెప్పుచున్నారు సన్న్యాసః ఇత్యాదిగా. రెండును దుల్యము లనుశంకను వారించుచున్నాఁ డుత్తరార్ధముచేత. అప్పుడు జ్ఞానమే మోక్షోపాయం బని యెట్లు చెప్పవచ్చు ననఁగాఁ జెప్పుచున్నారు జ్ఞానోత్పత్తీత్యాదిగా. అప్పుడు రెంటికిని బ్రశస్యం బగుట గాని యప్రశస్యం బగుట గాని సమాన మని యాశంకించి చెప్పుచున్నారు రెండును ఇత్యాదిగా. జ్ఞానసహితమయినకర్మసన్న్యాసము కర్మయోగముకంటె నుత్తమం బని వివక్షించి విశేషణము చేయుచున్నారు కేవలమైన ♦ అని.

**హ.** భగవంతుం డర్జును నభిప్రాయము నెఱింగినవాఁడై యి ట్లనియె.—సన్న్యాసః; కర్మయోగశ్చ; ఉభౌ= రెండును; నిశ్శ్రేయసకరౌ = మోక్షకరంబులే. అప్పుడు వానిలో నేమి విశేషం బనఁగా—తయోస్తు; కర్మసన్న్యాసాత్ = కర్మత్యాగముకంటె; కర్మయోగః; ఉత్తమము. కర్మములు జ్ఞానఫలకంబు లని స్పష్టముగా విధించుటవలన, "స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" అను వచనముచేత.

**శం.** ఇట్లు కర్మసన్న్యాసకర్మయోగములు ఒక్కనిచే నేకకాలంబున ననుష్ఠింప నలవి గా వని సిద్ధింపఁగా వానిలో నొకటి శ్రేష్ఠం బగువాని నిర్ణయించుకొఱకు "దేశ కాల వయో ఽవస్థా బుద్ధి శక్త్యనురూపతః। ధర్మోపదేశో భైషజ్యం వక్తవ్యం ధర్మపారగైః" * అనున్యాయంబునఁ నధికారికిఁ దగినయుత్తరమును శ్రీభగవంతుఁడు పలికెను.—బ్రహ్మమునందుఁ జక్కగానుండుట సన్న్యా

---

♦ జ్ఞానరహితమైన అని యర్థము.

* దేశమునకును గాలమునకును వయస్సునకును అవస్థకును బుద్ధికిని శక్తికిని దగినట్లుగా ధర్మోపదేశమును ఔషధమును ధర్మపారగులు చెప్పవలయును.

సము, బాహ్యవిషయములను బొందక చిత్తము బ్రహ్మమునందు బ్రహ్మరూపంబున నుండుట యను నిర్వికల్పసమాధి; ప్రత్యగాత్మదృష్టి యుంచి యనాత్మప్రత్యయము నిరసించుట యను సవికల్పకసమాధియు నొకసన్న్యాసము; ఈరెండుసన్న్యాసములును బ్రధానములు. ఈరెంటికిని శ్రవణమననంబులకును అంగభూతము తత్ప్రతికూలము లయిన సర్వకర్మములను విడుచుటయును సన్న్యాసము; ఇట్లు సన్న్యాసశబ్దార్థము మూఁడువిధములు. ఇటఁ బ్రధానము లగుసన్న్యాసములు రెండును వివక్షితములు గావు. మఱి యే మనఁగా, అంగభూతమై శ్రవణాదిజన్యజ్ఞానద్వారమున మోక్షహేతు వగు సర్వకర్మసన్న్యాసమే యిట వివక్షితము; అట్టిది ఏది యవిద్వత్కర్తృకమో అదియు, మఱియు స్వానుష్ఠానప్రాప్తమైనచిత్తశుద్ధిచేఁ గలుగుజ్ఞానము ద్వారమున మోక్షహేతు వగు నవిద్వత్కర్తృక మైనకర్మయోగ మేది గలదో అదియు; అవి, ఉభౌ = రెండును; నిశ్శ్రేయసకరౌ = మోక్షమునకు సాధనములే యగును. అట్లయినను, అవిద్వాంసునకు నేకకాలమునఁ గర్తవ్యములుగాఁ బ్రాప్తము లయిన, తయోస్తు = ఆరెంటిలో మాత్రము; గుణదోషవిచారము చేసినచో, సదసద్వివేకముచేఁ గలుగు తీవ్రవైరాగ్యమును తీవ్రమోక్షేచ్ఛయును యమనియమశమదమాదు లగు నంతరంగసాధనంబులసమృద్ధియును లేని కేవలప్రేషమాత్రోచ్చారణరూప మైనసన్న్యాసముకంటె, కర్మయోగము శ్రద్ధచేఁ జక్కగా ననుష్ఠింపఁబడునది; విశిష్యతే = తన యనుష్ఠానముచేఁ గలుగు గుణంబులచే నుత్తమ మగుచున్నది. శ్రౌతస్మార్తాదిలక్షణ మగు కర్మమునే పరమేశ్వరప్రీతికొఱకు శ్రద్ధతోఁ జక్కఁగా ననుష్ఠించునట్టి యవిద్వాంసునకు ఋణత్రయనివృత్తియు నందుచే నింద్రాదిదేవతాప్రసాదంబును ఈశ్వరప్రసాదంబును ఇంద్రియప్రసాదంబును చిత్తశుద్ధియు ఇవి మొదలగు జ్ఞానసాధనములసంపత్తి సిద్ధించుచున్నది, అందువలనఁ గర్మయోగము మున్ను చెప్పినసన్న్యాసముకన్నను శ్రేష్ఠతరం బగుచున్నది, కావున సాధనశూన్యుం డగు నవిద్వాంసుఁడు సాహసంబున సన్న్యాసంబు సేయరాదు, కర్మమునే యీశ్వరార్పణబుద్ధిచేఁ జక్కఁగాఁ జేయవలయు నని సిద్ధము. ఓయీ! "న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః" § అని శ్రుతి సన్న్యాసమే యుత్కృష్ట మని చెప్పుచున్నది, అట్లుండఁగా భగవంతుఁడు సన్న్యాసమును దక్కువ చేసి కర్మయోగము నుత్కృష్టమునుగాఁ జెప్పుట యనుచితము అందువేని; అట్లు కాదు. భగవంతునిప్రవృత్తి సర్వలోకానుగ్రహార్థం బగుటవలన. మొదట

§ సన్న్యాసమును ఈతపస్సులలో నతిశయించినదానిఁగాఁ జెప్పుచున్నారు.

"నజాయతే మ్రియతేవా" ఇత్యాదివాక్యములచే మూఢులు కానివారికి ఆత్మత త్త్వమును దత్సాధనం బగుసన్న్యాసంబు నుపదేశించి, ఇప్పుడు తమవిద్యను బజ్జను బ్రకృతిని బరపారగమనశక్తిని * నొందక యజ్ఞానంబున నేదో యొకనిమిత్తం బున హఠముచే సన్న్యసించి మూఢులు పతితు లగుదు రని వారి నుద్ధరించుటకై యిట నప్రకృతమునైనను గర్మయోగము నెత్తి వారలకుఁ గర్మమునందే ప్రవృత్తి కలుగుటకై కర్మయోగమును స్తుతించుచున్నాఁడు కర్మయోగో విశిష్యతే అని. కాని సన్న్యాసమును నిరాకరించినవాఁడు కాఁడు, సన్న్యాసము స్వస్వరూపం బగు టవలనను సర్వోత్తమం బగుటవలనను, "న్యాస ఇతి బ్రహ్మ బ్రహ్మాహి పర ఇతి న్యాస ఏవా త్యరేచయత్" ♦ అని సన్న్యాసమే బ్రహ్మ మనియు సర్వోత్తమ మనియు శ్రుతి యుపదేశించుటవలన. అందువలనఁ గర్మయోగమును స్తుతించు టయే యేతద్వచనాభిప్రాయ మని నిశ్చయింపవలయును.

మ. ఇట్లర్జునుం డడుగఁగా నందు కుత్తరము శ్రీభగవంతుఁ డిట్లని యె.—నిశ్శ్రేయసకరౌ = జ్ఞానోత్పత్తికి హేతువు లగుటచే మోక్షమున కుపయోగిం చునవి. తయోస్తు; కర్మసన్న్యాసాత్ = అనధికారిచేఁ జేయఁబడు కర్మసన్న్యాసము కంటెను; కర్మయోగః; విశిష్యతే = శ్రేయము, అధికారము కలిగించుటచేత.

శ్రీ. ఇందు కుత్తరము శ్రీభగవంతుఁడు చెప్పెను.—ఇది భావము.— వేదాంతవేద్య మగునాత్మతత్త్వముం దెలిసినవాని నుద్దేశించి కర్మయోగమును నేను జెప్పినవాఁడఁ గాను. అట్లు చెప్పినం గదా పూర్వోక్తసన్న్యాసముతో విరోధం బగును. మ తేమనఁగా, దేహాత్మాభిమాని వగు నీకు బంధువధాదినిమిత్తమైన శోక మోహాదికముచేఁ గలిగిన యీసంశయమును దేహాత్మవివేకజ్ఞానం బనుఖడ్గముచే ఛేదించి పరమాత్మజ్ఞానోపాయ మగు కర్మయోగము నాశ్రయింపు మని చెప్పుచు న్నాను. కర్మయోగముచేఁ జిత్తశుద్ధి నొందినవానికి ఆత్మతత్త్వజ్ఞానము కలిగిన పిమ్మటఁ దత్పరిపాకముకొఱకు జ్ఞాననిష్ఠాంగముగా సన్న్యాసమును మున్ను చెప్పితిని. ఇట్లగుటవలన, అంగప్రధానములకు వికల్పము సంభవింపదుం జేసి సన్న్యాసంబును గర్మయోగంబును నీరెండును భూమికాభేదంబున సముచ్చితంబులై నిశ్శ్రేయసమును సాధించుచున్నవి. అట్లయినను, తయోః = వానిలోపల; కర్మసన్న్యాసముకంటెను; కర్మయోగము; విశిష్యతే = ఉత్తమ మగుచున్నది.

---

* అపలిగట్టును బొందుట యందలిశక్తిని.

♦ న్యాస మనునది బ్రహ్మము, బ్రహ్మమే గదా పరము కావున న్యాసమే అతిశయించినది.

ప. ఇందు రెండును శ్రేష్ఠం బనునప్పుడు వీనిలో శ్రేయం బగుదానిం జెప్పు మని యడుగంబడినవాఁడై భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—సన్న్యాసః, కర్మయోగశ్చ; అవి, ఉభౌ = రెండును; అధికారిభేదముచే నిశ్శ్రేయసకరంబు లగుచున్నవి. ఒకనికి రెండు నుపదేశింప లేదు. ఇది యర్థము.—ఆత్మతత్త్వజ్ఞునకుఁ గర్మయోగ ముపదేశింప లేదు, మ ఱేమనఁగా, దేహాత్మాభిమానివై బంధువధశోకాకులుం డగు నీయట్టివానికి యోగ మాతిష్ఠ యని చెప్పితిని, కర్మయోగ మనుష్ఠించుటచే శుద్ధచిత్తుఁ డైనవానికి ఆత్మతత్త్వజ్ఞానము కలిగిన పిదపఁ గర్మసన్న్యాసము సంభవింపక తప్పదు, ఇట్లు రెండును భూమికాభేదముచేత నిశ్శ్రేయసము సాధించుటయందు సముచ్చితంబులే యగుచున్నవి, అట్లయినను వానిలోపలఁ బ్రస్తుతమయినకర్మసన్న్యాసముకంటెఁ గర్మయోగ ముత్తమము.

రా. సన్న్యాసః = జ్ఞానయోగంబును; కర్మయోగశ్చ = కర్మయోగంబును; జ్ఞానయోగమునందు సమర్థుఁ డైనవానికిఁగూడ, ఉభౌ=రెండును; ఇతరాపేక్షలేనివై, నిశ్శ్రేయసకరౌ = మోక్షము కలిగించునవి. తయోస్తు = ఆరెంటిలో మాత్రము; కర్మసన్న్యాసాత్ = జ్ఞానయోగముకంటె; కర్మయోగః = కర్మయోగమే; విశిష్యతే = ఉత్తమ మగుచున్నది.

జ్ఞానయోగమునం దధికారము గలవానికిఁ గూడ జ్ఞానయోగంబును కర్మయోగంబును రెండును ఇతరము నపేక్షింపకయే మోక్షము కలిగించును. అయినను వానిలో జ్ఞానయోగముకంటెఁ గర్మయోగము శ్రేష్ఠము.

మా. ఈసన్న్యాసము ♦ యత్యాశ్రమము గాదు, «ద్వన్ద్వత్యాగా త్తు సన్న్యాసా న్మత్పూ జైవ గరీయసీ» ❡ అనువచనమువలన. «తాని వా ఏతాన్యవరాణి తపాంసి న్యాసఏవా త్యరేచయత్» * అనియునుం గలదు. «సన్న్యాసస్తు తురీయో యో నిష్క్రియాఖ్య స్సధర్మకః । న తస్మా దుత్తమో ధర్మో లోకే కశ్చన విద్యతే॥ తద్భక్తో ఽపి హి య ద్గచ్ఛే త్తద్గృహస్థో న ధార్మికః । మద్భక్తిశ్చ విరక్తిశ్చ తదధికారో నిగద్యతే । యదా ఽధికారో భవతి బ్రహ్మచార్యపి ప్రవ్ర

♦ ఉత్తరవాక్యమునందలి సన్న్యాసశబ్దము.

❡ ద్వంద్వత్యాగరూప మయినసన్న్యాసముకంటె మత్పూజనమే—ఈశ్వరార్పణబుద్ధిచేఁ గర్మానుష్ఠానమే యుత్తమము.

* అథానాదు లగు నీతపస్సులు అవరములు—తక్కువ యయినవి, సన్న్యాసమే యుత్తమ మయినది.

జేత్ " ‖ అని నారదీయమునందు. « బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజేత్, య దహ రేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్ » $ అనియు శ్రుతి గలదు. « సన్న్యాసేతు తురీయే వై ప్రీతిర్మమ గరీయసీ । యేషా మత్రాధికారో న తేషాం కర్మేతి నిశ్చయః " ♦ అని బ్రాహ్మమునందు. అందువలన * నిటఁ జెప్పఁబడినది యాశ్రమసన్న్యాసము గాదు.

జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి
నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధాత్ప్రముచ్యతే. 3

భా. ఎందువలన? అనఁగా నిట్లు చెప్పుచున్నాఁడు —సః = ఆకర్మయోగి; నిత్యసన్న్యాసీ = ఎల్లప్పుడు సన్న్యాసి యైనవాఁ డని; జ్ఞేయః = ఎఱుంగవలయును. యః = ఎవ్వఁడు; న ద్వేష్టి = ద్వేషింపఁడో దేనిని గూడ; న కాఙ్క్షతి = కోరఁడో, దుఃఖసుఖములను తత్సాధనములను గూడ; అతఁడు. ఇట్టివాఁ డెవ్వఁడో అతఁడు కర్మమునం దున్నవాఁడైనను నిత్యసన్న్యాసి యని యెఱుంగవలయు నని యర్థము. నిర్ద్వన్ద్వః = ద్వంద్వములచే విడువఁబడినవాఁడు; హి = ఏకారణమువలన; మహాబాహో = గొప్పచేతులు గల యర్జునుఁడా! బన్ధాత్ = బంధము నుండి; సుఖమ్ = అనాయాసముగా; ప్రముచ్యతే = విడివడుచున్నాఁడో.

దుఃఖమునందు ద్వేషమును సుఖమునందుఁ గాంక్షయును లేనివాఁడై కర్మయోగము ననుష్ఠించువాఁడు నిత్యసన్న్యాసి యని యెఱుంగవలయును. ఎందు

‖ ఏది తురీయము నిష్క్రియ మను పేరు గలది సధర్మకం బగు సన్న్యాసమా గలదో దాని కంటె నుత్తమ మయినధర్మము లోకమునం దేదియు లేదు. సన్న్యాసాశ్రమము గలవాఁడు దేనిఁ బొందునో దాని భక్తుఁడై ధార్మికుఁ డైనవాఁడు గూడ గృహస్థుఁడు పొందఁడు. నాయందు భక్తియు విరక్తియు సన్న్యాసమున కధికారముగాఁ జెప్పఁబడుచున్నది. ఎప్పు డధికారము గలుగునో అప్పుడు బ్రహ్మచారిగూడ సన్న్యసింపవలయును.

$ బ్రహ్మచర్యమునుండియే సన్న్యసింపవలయును, ఏదినమునందు విరక్తుఁ డగునో ఆదినమునందే సన్న్యసింపవలయును.

♦ తురీయ మయిన సన్న్యాసమునందు నాకుఁ బ్రీతి యధికము, ఎవరికిం దధికారము లేదో వారికిఁ గర్మ మని నిశ్చయము.

* ఆశ్రమసన్న్యాసము సర్వోత్తమ మని చెప్పఁబడుటవలన, ఇట సన్న్యాసముకంటెఁ గర్మయోగ ముత్తమ మనుటవలన.

వలన ననఁగా రాగద్వేషాదిద్వంద్వములు విడిచినవాఁడు సుఖముగా సంసారబంధము వీడి మోక్షము నొందు నని తాత్పర్యము.

అ. కర్మము బంధకారణం బని గదా ప్రసిద్ధము, అది యెట్లు నిశ్శ్రేయసకరం బగు నని శంకించుచున్నాఁడు ఎందువలన నని. ఎవ్వఁడు రాగద్వేషములను దేనియందును జేయఁడో అతఁడు అకర్త్రాత్మజ్ఞానమునకు మున్ను గూడ సదా సన్న్యాసి యని యెఱుంగవలయు నని చెప్పుచున్నారు ఇట్లు చెప్పుచున్నాఁ డని. ఎట్లు చేయఁబడనికర్మములు సన్న్యాసిని బంధింపవో చేయఁబడినవియు వైరాగ్యేంద్రియసంయమాదులచే నివర్తిల్లుచున్నవో అట్లే ఫలాభిసంధి లేక చేయఁబడుకర్మములు నిత్యనైమిత్తికములు కర్మయోగినిగూడ బంధింపవు, సంచితదురితమును గూడ నివర్తించు నని యభిప్రాయము గలవాఁడై చెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత. కర్మయోగి నిత్యసన్న్యాసి యనుజ్ఞానము విపరీతజ్ఞానం బగుటవలన మిథ్యాజ్ఞానం బని యాశంకించి చెప్పుచున్నారు ఇట్టివాఁ డెవ్వఁడో ఇత్యాదిగా. కర్మయోగిగూడ రాగద్వేషములు లేనివాఁ డగుటచే సన్న్యాసి యని యెఱుంగుట యుచితం బని యర్థము. రాగద్వేషరహితునకు అనాయాసంబున బంధనాశము సిద్ధించుటవలనఁ గూడ యుక్తం బతఁడు సన్న్యాసి యనుట యని చెప్పుచున్నారు నిర్ద్వన్ద్వః ఇత్యాదిగా.

హ. ఎట్లు శ్రేయం బందువేని.—జ్ఞేయః = ఎఱుంగవలయును, సః, నిత్యసన్న్యాసీ, యోనద్వేష్టి, నకాఙ్క్షతి. ఎట్లనఁగా. కామక్రోధాదులు ద్వంద్వములు అవి లేనివాఁడు నిర్ద్వన్ద్వుఁడు, హి = ఏకారణమువలన, మహాబాహో, సుఖమ్ = కష్టము లేక, బన్ధాత్ = సంసారమునుండి, ప్రముచ్యతే = ముక్తుఁ డగుచున్నాఁడు. కర్మయోగి రాగద్వేషములు విడుచుటవలన సకలకర్మసన్న్యాసము చేసినవాఁడే యని యభిప్రాయము.

శం. అందువలననే కర్మయోగిని స్తుతించుచున్నాఁడు.—యః= ఎవ్వఁడు, సుఖ మయినకర్మమును; నద్వేష్టి = దానియం దప్రీతిని జేయఁడో; మ తేమనఁగా, సుఖకరకర్మమైనను దుఃఖకరకర్మమైనను కర్మమే యను బుద్ధితోఁ జేయుచున్నాఁడో. లేక, నద్వేష్టి—ద్వేష మనఁగా అప్రీతి, దానిని ఏప్రాణియందును జేయఁడో. నకాఙ్క్షతి=కర్మమువలనఁ గలుగుఫలమును దేనిని గోరఁడో. లేక, ప్రాప్తమైనయనర్థముయొక్క—నివృత్తిని అప్రాప్తమయినయర్థముయొక్క—ప్రాప్తిని గోరఁడో. నిర్ద్వన్ద్వః =

ద్వంద్వములు శీతోష్ణసుఖదుఃఖలాభాఽలాభములు మొదలగునవి, వానినుండి సమబుద్ధిచే నిర్గతుఁడు ♦ నిర్ద్వన్ద్వుఁడు, ఎవ్వఁ డిట్టి లక్షణము గలవాఁడో, సః = అతఁడే; నిత్యసన్న్యాసీ = ఎల్లప్పుడును సన్న్యాసము గలవాఁ డని; పండితులచే, జ్ఞేయః = ఎఱుంగఁ దగినవాఁడు. హి = ఎందువలన; రాగాదిదోషరహితుఁడును బరిపక్వచిత్తుఁడును సమబుద్ధిత్వము మొదలగుగుణములు గలవాఁడు నగుచున్నాఁడో, అందువలన నీగృహస్థుఁడు కర్మనిష్ఠుఁడైనను, సుఖమ్ = పరిగ్రహత్యాగము * శీతవాతాద్యుపద్రవము భిక్షాటనము మొదలగుదుఃఖములు లేక యనాయాసంబున; బన్ధాత్ = సంసారమునుండి; ప్రముచ్యతే. చెప్పినవిధంబునఁ గర్మము ననుష్ఠించుటచేఁ జిత్తశుద్ధిని జ్ఞానంబునుం బొంది కాలాంతరంబున ముక్తుఁ డగుచున్నాఁడు, అపక్వచిత్తుఁడు యతి యయినను ముక్తుఁడు కాఁజాలఁ డని యర్థము. ఇందుచేఁ గర్మోపాసనంబులచేఁ బరిపక్వ మయినచిత్తము గలవానికే సన్న్యాసమునం దధికారం బని సూచిత మగుచున్నది.

మ. ఆకర్మయోగమునే స్తుతించుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.— సః=అతఁడు; కర్మమునందుఁ బ్రవర్తించినవాఁ డైనను ఎల్లప్పుడు సన్న్యాసి యని తెలియఁ దగును. అతఁ డెవ్వఁడు? యః, న ద్వేష్టి—భగవదర్పణబుద్ధిచేఁ జేయుకర్మమును నిష్ఫలం బనుశంకచే ద్వేషింపఁడో. న కాఙ్క్షతి, స్వర్గాదికమును. నిర్ద్వన్ద్వః= రాగద్వేషరహితుఁడు, హి = ఏకారణమువలన; సుఖమ్ = అనాయాసముగా; ఓమహాబాహుఁడా! బన్ధాత్ = అంతఃకరణదోషరూప మయినజ్ఞానప్రతిబంధమునుండి; ప్రముచ్యతే = నిత్యాఽనిత్యవస్తువివేకాదులు గలుగుటవలన చక్కఁగా ముక్తుఁ డగుచున్నాఁడు.

శ్రీ. ఎందువలన ననఁగా, కర్మయోగిని సన్న్యాసినిగా స్తుతించుచు నతఁడు శ్రేష్ఠుఁ డనుటను జూపుచున్నాఁడు.—రాగద్వేషములు లేక పరమేశ్వరునికొఱకుఁ గర్మముల నెవ్వఁ డనుష్ఠించుచున్నాఁడో అతఁడు ఎల్లప్పుడును—కర్మానుష్ఠానసమయమునందును సన్న్యాసియనియే యెఱుంగఁదగును. అందుకు హేతువు.—నిర్ద్వన్ద్వో హి= రాగద్వేషాదిద్వంద్వములు లేనివాఁడు గదా! శుద్ధచిత్తుఁడై జ్ఞానద్వారమున, సుఖమ్= అనాయాసముగానే; బన్ధాత్ = సంసారమునుండి; ప్రముచ్యతే.

♦ వెడలినవాఁడు.

* భార్యాదుల విడుచుట.

ప. ఇఁకఁ గర్మకుశలుం డగువానికి రెంటియొక్క-యనుష్ఠానంబును సమకాలంబుననే సంభవించు నని చెప్పుచున్నాఁడు.—సః = ఆపురుషుఁడు, కర్మము చేయుచున్న వాఁ డైనను నిత్యసన్న్యాసి యని యెఱుంగఁదగును. అతఁ డెవఁడు? యో న ద్వేష్టి న కాఙ్క్షతి. రాగద్వేషంబులు లేక చేయు కర్మయోగం బేది గలదో అదియే కర్మసన్న్యాసంబుగాఁ దగును. హి = ఎందువలన ననఁగా. నిర్ద్వన్ద్వః = నిర్గతములు రాగద్వేషసుఖదుఃఖజయాపజయాదిద్వంద్వములు ఎవ్వనివలననుండి యో అట్టివాఁడు; సుఖముగా, బన్ధాత్ ప్రముచ్యతే. ఇప్పుడు ప్రస్తుత మయినక్షత్త్రి ధర్మ మగు యుద్ధమునందు శత్రుద్వేషమునను రాజ్యలోభంబునను ప్రవర్తించిన వానికి బంధంబగును, శత్రుద్వేష రాజ్యలోభములు లేక ప్రవర్తించినవానికి బంధము కలుగదు, అట్లు తనయంతనే యది సన్న్యాసముగాఁ బరిణమించుచున్న దని యర్థము.

రా. ఎందువలన ననఁగా సమాధానము చెప్పుచున్నాఁడు.—యః = ఏకర్మయోగి; కర్మయోగాంతర్గత మైన యాత్మానుభవముచేఁ దృప్తుఁడై తద్వ్యతిరిక్తమును దేనినిగూడ, న కాఙ్క్షతి. అందువలననే దేనినిగూడ, న ద్వేష్టి. అందువలననే, నిర్ద్వన్ద్వః = ద్వంద్వములసహించువాఁడు నగుచున్నాఁడో. సః; నిత్యసన్న్యాసీ = నిత్యజ్ఞాననిష్ఠుఁ డని; జ్ఞేయః. అతఁడు గదా సుకర మయిన కర్మయోగమునం దున్న వాఁ డగుటచే, సుఖం బన్ధాత్ప్రముచ్యతే.

ఎవఁడు కర్మయోగాంతర్గత మైనయాత్మానుభవమువలననే తృప్తి నొందిన వాఁడై దేనియందును గాంక్షయును దేనియందును ద్వేషంబును లేనివాఁడై శీతోష్ణాదిద్వంద్వముల సహించుచుఁ గర్మయోగము ననుష్ఠించునో అతఁడు నిత్యము జ్ఞాననిష్ఠుఁ డని యెఱుఁగవలయును. సుకర మైనకర్మయోగము నవలంబించినవాఁ డగుటచే నతఁడే సుఖముగా బంధమునుండి విముక్తుఁ డగుచున్నాఁ డని తా.

మా. సన్న్యాసశబ్దార్థముఁ జెప్పుచున్నాఁ డీశ్లోకముచేత. సన్న్యాసము నిశ్శ్రేయసకరం బనుటను దెలుపుటకై సన్న్యాసశబ్దార్థమును స్మృతికిఁ దెచ్చుచున్నాఁడు జ్ఞేయః అని.

సాఙ్ఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః
ఏక మప్యాస్థిత స్సమ్య గుభయో ర్విన్దతే ఫలమ్. ౪

భా. భిన్నపురుషానుష్ఠేయములై విరుద్ధము లైనసన్న్యాసకర్మయోగములకు ఫలమునందును విరోధము యుక్తము, కాని రెండును నిశ్శ్రేయ

సకరంబు లనుట యుక్తము గాదు. అని ప్రాప్తింపఁగా నిది చెప్పుచున్నాఁడు.—సాఙ్ఖ్యయోగౌ=కర్మసన్న్యాసకర్మయోగములను, పృథక్ = విరుద్ధములు భిన్నములైనఫలములు గలవానిఁగా; బాలాః = తెలియనివారు; ప్రవదన్తి = చెప్పుచున్నారు. నపణ్డితాః = పండితులు చెప్పరు. పండితులో జ్ఞానులు ఒకటెఫలం బవిరుద్ధం బని చెప్పుదురు. ఎట్లు? ఏకమపి = సాంఖ్యయోగములలో నొకదానినైనను; సమ్యక్ = చక్కఁగా; ఆస్థితః—అనుష్ఠించినవాఁ డని యర్థము; ఉభయోః = రెంటియొక్క; ఫలమ్=ఫలమును; విన్దతే = పొందుచున్నాఁడు. రెంటికిని అదియే గదా నిశ్శ్రేయసము ఫలము, కావున ఫలమునందు విరోధము లేదు.

ఓయీ! సన్న్యాసకర్మయోగశబ్దముచే నారంభించి సాంఖ్యయోగశబ్దములకు ♦ ఒక్కటె ఫలం బని యెట్లిచట నప్రకృతమును జెప్పుచున్నాఁడు?

లే దీదోషము. అర్జునుఁడు నకే సన్న్యాసమును గర్మయోగంబును గేవలము నుద్దేశించి ప్రశ్నము గావించెను. భగవంతుఁడో వానిఁ బరిత్యజింపకయె శబ్దాంతరములచే స్వాభిప్రేత మగు విశేషంబునుం జేర్చి ప్రతివచనము నొసంగెను సాఙ్ఖ్యయోగా విత్యాదిగా. ఆసన్న్యాసకర్మయోగంబులే జ్ఞానతదుపాయసమబుద్ధిత్వాదిసంయుక్తంబులై సాంఖ్యయోగశబ్దవాచ్యము లగు నని భగవంతునిమతము. కావున, లే దప్రకృతప్రక్రియ.

సన్న్యాసంబును గర్మయోగంబును భిన్నఫలములు గల వని యవివేకులు చెప్పెదరు. పండితులో రెంటికిని మోక్ష మొక్కటె ఫల మని చెప్పుచున్నారు. ఏల యనఁగా, రెంటిలో నేదైన నొక్కటి చక్కఁగా ననుష్ఠించినను రెంటియొక్క ఫలమునుం బొందుచున్నాఁ డని తాత్పర్యము.

అ౦. సన్న్యాసకర్మయోగంబులు నిశ్శ్రేయసకరంబు లని యేది చెప్పఁబడినదో దాని నాక్షేపించుచున్నాఁడు భిన్నపురుషేత్యాదిగా. అందు కుత్తరముగా మీఁదిశ్లోకముఁ దీయుచున్నారు అని ప్రాప్తింపఁగా ననిః వివేకు లప్పు డెట్లు చెప్పుచున్నా రనఁగాఁ జెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత. సంఖ్యకు ఆత్మదర్శనము

♦ సాంఖ్యయోగశబ్దవాచ్యములకు.

నగుఁ దగినది యని సాంఖ్య మనఁగా సన్న్యాసము, యోగము కర్మయోగము, అవి రెండును. పృథక్ అనుదాని యర్థముఁ జెప్పుచున్నారు విరుద్ధములు ఇత్యాదిగా. ఇట బాలు రనఁగా శాస్త్రార్థవివేకము లేనివారు. ఉత్తరార్థము దీయుటకై భూమిక చేయుచున్నారు పండితుఁలో ఇత్యాదిగా. జ్ఞానులు—యోగులును అని శేషము. రెండును అవిరుద్ధ మయినఫలము గల వనుటనే ప్రశ్నపూర్వకముగాఁ బ్రకటించు చున్నారు ఎట్లు ఇత్యాదిగా. ఒక్కసాధనము ననుష్ఠించినవానికి రెంటిఫలమును సిద్ధించు ననుట విరుద్ధ మని యాశంకించి చెప్పుచున్నారు రెంటికిని ఇత్యాదిగా. సాంఖ్యయోగములకు — సన్న్యాసకర్మానుష్ఠానములకుఁ దత్త్వజ్ఞానద్వారమున నిశ్శ్రేయసమే ఫలంబగుటవలన ఫలము విరుద్ధం బని శంకింపరా దని యర్థము.

సాంఖ్యయోగములకు ఒక్కటేఫలం బనుట ప్రకరణానుగుణము కా దని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా.

అప్రకృతం బనుట యసిద్ధం బని పరిహరించుచున్నారు లే దీదోష మని. సన్న్యాసం కర్మణా మిత్యాదిగా సన్న్యాసంబును గర్మయోగంబు నుద్దేశించి ప్రశ్నంబును సన్న్యాసః కర్మయోగ శ్చేత్యాదిగా నట్లే ప్రతివచనంబును బ్రవర్తించి యుండఁగనపుడు ఎట్లు సాంఖ్యయోగంబులకు నేకఫలత్వము చెప్పుట యప్రకృతము కా దని చెప్పవచ్చును? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు అర్జునుఁడు సరే ఇత్యాదిగా. ప్రతివచనముగూడ దాని కనురూపముగనే భగవంతునిచేఁ జెప్పఁబడి నది కావున విశేషం బుపపన్నము కా దని యాశంకించి చెప్పుచున్నారు భగవం తుఁడో ఇత్యాదిగా. వానిఁ బరిత్యజింపకయే అనుచో వానిఁ—పృచ్ఛించువానిచే నిర్దేశింపఁబడినకర్మసన్న్యాసకర్మయోగంబుల నని యర్థము. స్వాభిప్రేత మగువిశే షంబునుం జేర్చి యని చెప్పినదాని స్పష్టీకరించుచున్నారు ఆసన్న్యాసకర్మయోగం బులే యిత్యాదిగా. జ్ఞానతదుపాయసమబుద్ధిత్వాదిసంయుక్తంబులై—ఇట నాదిశబ్ద ముచే జ్ఞానోపాయ మయిన శమాదికము గ్రహింపఁబడుచున్నది *. ప్రకృతము లయినసన్న్యాసకర్మయోగంబులే చెప్పఁబడినవి యని సిద్ధింపఁగా ఫలితముఁ జెప్పు చున్నారు కావున నిత్యాదిగా.

హ. ఇప్పుడు యోగము సన్న్యాసయోగం బగుటవలన స్వరూపం బొక్కటి యగుటచే ఫలము నొక్కటియే యని చూపుచున్నాఁడు.—సాంఖ్య

* జ్ఞానముతోను తదుపాయ మయిన సమబుద్ధిత్వముతోను శమాదికముతోను గూడినవై యని యర్థము, ఇట శమాదికము సన్న్యాసముతోను సమబుద్ధిత్వము కర్మయోగముతోను సంబంధించును.

యోగౌ; పృథక్ = భిన్నములనుగా; బాలాః = మూఢులు; ప్రవదన్తి = చెప్పుచున్నారు. పణ్డితాః = బుద్ధిమంతులు; న. ఎందువలన ననఁగా. ఏక మప్యాస్థితః = సేవించువాఁడు; సమ్యక్ = సంపూర్ణముగా; ఉభయోః=సాంఖ్యయోగములయొక్క; ఫలమ్; విన్దతే = పొందుచున్నాఁడు.

శ౦. ఓయీ! «కర్మణా పితృలోకః» అని కర్మలకుఁ బితృలోకప్రాప్తిని శ్రుతి చెప్పుచున్నది, ఎట్లు «సుఖం బన్ధాత్ప్రముచ్యతే» అని కర్మఫలము సంసారబంధమోక్షణం బని శాస్త్రవిరుద్ధముగాఁ జెప్పనగును? అని యాశంకించు వేసి అది సరిగాదు. కామసహితులకే కర్మఫలము పితృలోకము, కాని నిష్కాములకుఁ గాదు. అని విరుద్ధఫలము చెప్పువారిమతమును బరిహరించి సన్న్యాసకర్మయోగములకు ఫలం బొక్కటియే యని నిశ్చయించి వానిలో నొకదాని నాశ్రయించుటచే రెంటికి నేది ఫలమో దానిఁ బొందుచున్నాఁ డని చెప్పుచున్నాఁడు.—బాలాః = వేదాంతశాస్త్రరహస్యము నెఱుఁగనివారు కొందఱు విద్వాంసులు; సాఙ్ఖ్యయోగౌ = సర్వవేదాంతముల చేతను సమ్యక్—చక్కగా తాత్పర్యముచే ఖ్యాయతే—చెప్పఁబడుచున్నది కావున సాంఖ్య మనఁగా పరబ్రహ్మము, తత్ప్రాప్తికిఁ బరమకారణ మగుటవలన సాంఖ్య మనఁగా జ్ఞాననిష్ఠాంగభూత మగుసన్న్యాసయోగము, యోగ మనఁగాఁ గర్మయోగము, అదియును కర్మయోగమును సాంఖ్యయోగములు; క్రియచేతను అధికారముచేతను ఆశ్రమముచేతను, పృథక్—ఎట్లు భిన్నములో అట్లు ఫలముచేతను భిన్నములు, అని సాధనముచేతను ఫలముచేతను భేదము చెప్పుచున్నారు. «కర్మణా పితృలోకః, స్వర్గం వా ఏతే లోకం యన్తి» ♦ ఇత్యాది వాక్యముల చేతను, «సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః, నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసే నాఽధిగచ్ఛతి» ♦♦ ఇత్యాదివాక్యములచేతను సన్న్యాసకర్మయోగములకు సాధనభేదంబును ఫలభేదంబును ప్రతిపాదించుచున్నా రని యర్థము. శ్రుతిస్మృతిప్రామాణ్యంబువలన వానికి ఫలభేదము యుక్తమే యనఁగాఁ జెప్పుచున్నాఁడు —పణ్డితాః = వేదాంతశాస్త్రపారగులు దానిరహస్యము నెఱింగినవారు బ్రహ్మవిదులో; న—వానికి ఫలం బొక్కటే యని చెప్పుచున్నారు. అది యెట్లనఁగాఁ జెప్పెదము.—తత్త్వమస్యాదిమహావాక్యము పురుషునకుఁ జిత్తశుద్ధి లేని

♦ కర్మముచేఁ బితృలోకము కలుగును, స్వర్గలోకమునే వీరు పొందుచున్నారు.

♦♦ సన్న్యాసయోగమువలన యతులు సత్త్వశుద్ధి నొందినవారై, పరమం బగు నైష్కర్మ్యసిద్ధిని సన్న్యాసముచేఁ బొందుచున్నాఁడు.

యెడ బ్రహ్మతత్త్వము బోధింపఁ జాలవు, చిత్తశుద్ధియో కర్మోపాసనంబులచేఁ గాని సిద్ధింపదు, కర్మోపాసనంబులందుఁ బ్రవృత్తియు కర్మము గొప్పది ఈశ్వరుఁడు గొప్పవాఁడు అని కర్మేశ్వరులను స్తుతింపనిచో సిద్ధింపదు, కావున శ్రుతము లయిన «పశ్యతి పుత్రిమ్» ♦ ఇత్యాద్యర్థవాక్యములచేతను «ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞః» ఇత్యాదివాక్యములచేతను కర్మేశ్వరులమాహాత్మ్యము ప్రతిపాదింపఁబడఁగా, ఫలానుషంగంబునఁ గర్మమునందును ఉపాసనమునందును బ్రవర్తించి వానిచే శుద్ధ మయిన చిత్తము గలవానికే యుపదేశించిన తత్త్వజ్ఞానము ఫలించును. అందువలన జ్ఞానసిద్ధికిఁ గారణము చిత్తశుద్ధి, దానికిఁ గారణము కర్మము, కావునఁ గర్మమునకు మోక్షమే ఫలము, జ్ఞానసాధనం బగుటవలన. సన్న్యాసమునకును అట్లే. «విద్యాం చా ఽవిద్యాంచ య స్తద్వేదో భయం సహ । అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా ఽమృత మశ్నుతే» * అను శ్రుతివలన, అవిద్యచే § మృత్యువును-జ్ఞానప్రతిబంధమును దాఁటి విద్యచే-జ్ఞానముచే అమృతమును-మోక్షమును బొందుచున్నాఁ డని జ్ఞానకర్మయోగములకును జ్ఞానసన్న్యాసంబులకును సాధ్యసాధనభావము ‖ నిశ్చిత మగుటవలన, జ్ఞానఫలము వాని ఫలమే యని సాంఖ్యయోగములకు నొక్కటే ఫలము మోక్ష మని పండితు లెఱుంగుదురు. అందువలనఁ గారకాదులవలననే భేదము గాని వానికి ఫలమువలన భేదము లే దని సిద్ధము. అందువలన సాంఖ్యయోగములలో, ఏక మపి=అపి శబ్దము వా అనుదానియర్థము గలది, రెంటిలోపల సాంఖ్యమును గాని కర్మయోగమును గాని; సమ్యక్; ఆస్థితః = అనుష్ఠించునట్టి ముముక్షువు; ఉభయోః = రెంటియొక్కయు; ఫలమ్ = మోక్షాఖ్యఫలమును; విన్దతే = పొందుచున్నాఁడు. అని, సాంఖ్యకర్మయోగములకు, మోక్షమును గూర్చి యంతరంగబహిరంగభావముచేతను కాలంబునను అల్పత్వదీర్ఘత్వములచేతను $ సాధ్యసాధనభావముచేతను రెంటికిని దారతమ్యము గజాశ్వములకుం బోలెఁ గలిగియే యున్నను, అవి సమంబు లని ప్రతిపా

♦ పుత్త్రినిఁ జూచుచున్నాఁడు.

* విద్యను అవిద్యను రెంటిని ఎవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడు అవిద్యచే మృత్యువును దాఁటి విద్యచే మోక్షము నొందుచున్నాఁడు.

§ కర్మముచే.

‖ జ్ఞానము సాధ్యము, ఇందుకు సాధనము కర్మయోగము. జ్ఞానము సాధ్యము, ఇందుకు సాధనము సన్న్యాసము అని.

$ అల్పకాలమున ఫలప్రద మగుటచేతను దీర్ఘకాలమున ఫలప్రద మగుటచేతను.

దించుట, అనధికారి కర్మమునే చేయువలయును సన్న్యాసమును జేయఁగూడ దని సూచించుకొనుటకు.

మ. ఓయీ! ఎవ్వఁడు కర్మమునందుఁ బ్రవర్తించినాఁడో అతఁడు సన్న్యాసి యని యెట్లు బలుకఁగనచ్చును? కర్మతత్త్యాగములు స్వరూపవిరుద్ధంబు లగుటవలన, ఫలం బొక్కటి యగుటవలన నట్లు కావచ్చునందువేని; అది సరిగాదు, స్వరూపముచే విరుద్ధము లగువానికి ఫలముచేతఁ గూడ విరోధము ఉచితం బగుటవలన. కావున నిశ్శ్రేయసకరా వుభౌ అనుట యనుపపన్నము. అని యాశంకించి చెప్పుచున్నాఁడు.—సఙ్ఖ్యా—చక్కని యాత్మజ్ఞానము, దాని వహించుచున్నది జ్ఞానమున కంతరంగసాధన మగుటచే, కావున సాంఖ్య మనఁగా సన్న్యాసము; యోగమనఁగా మున్ను చెప్పినకర్మయోగము, వానిని; పృథక్ = విరుద్ధఫలములనుగా; బాలాః = శాస్త్రార్థవివేకశూన్యులు; ప్రవదన్తి. న పణ్డితాః. అప్పుడు పండితుల మత మేది? చెప్పుచున్నాఁడు.—ఏక మపి = సన్న్యాసకర్మయోగములలోపల నొకదాని నైనను; సమ్యక్ ఆస్థితః = తనయధికారమున కనురూపముగా చక్కగా—యథాశాస్త్రముగా చేసినవాఁడై; ఉభయోః; ఫలమ్ = జ్ఞానోత్పత్తిద్వారమున నిశ్శ్రేయసము నొక్కటినే; విన్దతే.

శ్రీ. ఎందువలన నిట్లు అంగప్రధానము లగుటచే రెంటికిని అవస్థాభేదంబునఁ గ్రమముగా సముచ్చయమే సిద్ధించుచున్నదో, అందువలన వికల్పము నంగీకరించి రెంటిలో నేది శ్రేష్ఠ మనుప్రశ్నం బజ్ఞానులకే తగుం గాని వివేకులకుఁ దగ దని చెప్పుచున్నాఁడు.—జ్ఞాననిష్ఠావాచక మైన సాంఖ్యశబ్దముచే జ్ఞాననిష్ఠాంగ మగు సన్న్యాసము లక్షిత మగుచున్నది. సాఙ్ఖ్యయోగౌ = సన్న్యాసకర్మయోగములు; ఒకటేఫలము గలవై, పృథక్=స్వతంత్రములు అని; బాలాః=అజ్ఞానులు; ప్రవదన్తి. పండితులు మాత్ర మట్లు చెప్పరు. అందుకు హేతువు.—వీనిలో, ఏకమపి, సమ్యక్; ఆస్థితః = ఆశ్రయించినవాఁడు. ఉభయోః=రెంటియొక్కయు; ఫలం విన్దతే. ఎట్లనఁగా.—కర్మయోగమును జక్కగా ననుష్ఠించి శుద్ధచిత్తుఁడై జ్ఞానద్వారంబున రెంటియొక్క ఫలము మోక్ష మేది గలదో దానిఁ బొందుచున్నాఁడు. సన్న్యాసమును జక్కగా ననుష్ఠించినవాఁడు గూడ మున్ననుష్ఠించిన కర్మయోగమునకుఁ బరమ్పరాఫల మగు జ్ఞానముద్వారంబున, రెంటియొక్క ఫలము మోక్ష మేది గలదో దానిఁ బొందుచున్నాఁడు. కావున నివి విరుద్ధఫలంబులు గా వని యర్థము.

ప. ఇఁకఁ బూర్వప్రశ్నం బజ్ఞానమువలన నని చూపుచున్నాఁడు.—సాఙ్ఖ్యయోగౌ = సాఙ్ఖ్య మనఁగా జ్ఞాననిష్ఠానిమిత్త మయిన కర్మసన్న్యాసము, యోగము కర్మయోగము, అవి; పృథక్ = స్వతంత్రఫలంబు లని; బాలాః = అజ్ఞులే; ప్రవదన్తి. కాని, పణ్డితాః = తెలిసినవారు, న = చెప్ప రని యర్థము. ఏల యనఁగా, వానిలో, ఏక మపి; సమ్యక్, ఆస్థితః; ఉభయోః ఫలమ్; పొందు చున్నాఁడు. ఫలాసక్తి లేక కర్మయోగము ననుష్ఠించి శుద్ధచిత్తుఁడై జ్ఞానద్వార మున రెంటియొక్క ఫల మయిన కైవల్యమునే పొందుచున్నాఁడు. కావున నవి పృథ క్ఫలములు కా వని యర్థము.

రా. జ్ఞానయోగకర్మయోగములు ఆత్మప్రాప్తిసాధనం బగుటయందుఁ బరస్పరాపేక్ష లేని వని చెప్పుచున్నాఁడు.—సాఙ్ఖ్యయోగౌ = జ్ఞానయోగకర్మ యోగములు; ఫలభేదమువలన, పృథక్ = భిన్నము లని; ఎవ్వరు, ప్రవదన్తి = చెప్పుచున్నారో; వారు, బాలాః = జ్ఞానము లేనివారు. పణ్డితాః = కృత్స్నవిదులు; న= కారు. కర్మయోగము జ్ఞానయోగమునే సాధించుచున్నది, జ్ఞానయోగ మొక్క టియే యాత్మావలోకనము సాధించు నని వానికి ఫలభేదముచే భేదము చెప్పువారు పండితులు కా రని యర్థము. రెండును ఆత్మావలోకన మొక్కటియే ఫలము గలవి యగుటవలన నేకఫలంబు లగుటచే, ఉభయోః = ఆరెంటిలో, ఏక మపి; ఆస్థితః; ఫలమ్ = ఆఫలమునే; విన్దతే = పొందుచున్నాఁడు.

జ్ఞానయోగకర్మయోగములకు వేఱువేఱు ఫలము చెప్పువారు మూఢులే కాని పండితులు కారు. వానిరెంటికిని ఆత్మావలోకన మొక్కటె ఫల మగుట వలన, వానిలో నొక్కటి నాశ్రయించినను ఆత్మావలోకనముఁ బొందుచున్నాఁ డని తాత్పర్యము.

మా. సన్న్యాసము జ్ఞానాంతరంగముగాఁ జెప్పఁబడినది గదా! న తస్య తత్త్వగ్రహణాయ ఇత్యాదిస్థలమునందు. కావున నది యోట్లు తక్కువ యన వచ్చును ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు —రెండును అంతరంగము లగుటచే విరోధము లేదు. « అగ్ని ముగ్ధో హా వై ధూమతాన్త స్స్వం లోకం నాభిజానాతి । మావః పదవ్యః పిత రస్మదా స్థితా యా యజ్ఞశాలా సనధూమవర్త్మనామ్ » ౧ ఇత్యా

౧ అగ్నికార్యమునందును మూఢుఁడై—అదియే శ్రేయస్కరం బని భ్రాంతుఁడై ధూమముచేత దస్సినవాఁడై తనయాశ్రయ మయిన పరమాత్మను గుర్తింపఁజాలఁడు. తండ్రీ! యజ్ఞశాలయందుండి ధూమోపలక్షిత మార్గము గల మీయొక్క పదవు లేవి గలవో అవి మాకాశ్రితములు కావు.

దికము * కామ్యకర్మవిషయ మని భావము. ఇఁక నెవ్వరు వేఱువిధముగాఁ జెప్పుచున్నారో వారు బాలురు.

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి. ౫

భా. ఒకటినైనను జక్కఁగా ననుష్ఠించుటవలన నెట్లు రెంటిఫలమును బొందవచ్చును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—యత్ = ఏది; సాంఖ్యైః = జ్ఞాననిష్ఠు లగు సన్న్యాసులచేత; స్థానమ్ = మోక్ష మనుస్థానము; ప్రాప్యతే = పొందఁబడుచున్నదో; తత్ = అది; యోగైరపి = జ్ఞానప్రాప్తికి నుపాయం బగుటచే నీశ్వరునందు సమర్పించి కర్మములను దమకు ఫలము నభిసంధింపక యెవ్వ రనుష్ఠించుచున్నారో వారు యోగులు, వారిచేతఁ గూడ; గమ్యతే = పొందఁబడుచున్నది, పరమార్థజ్ఞానసన్న్యాసప్రాప్తిద్వారమునఁ బొందఁబడు చున్న దని యభిప్రాయము. అందువలన, సాంఖ్యంచ = సన్న్యాసమును; యోగంచ = కర్మయోగమును; ఏకమ్ = ఒక్కటిగా, ఫలము ఒక్కటియే యగుటవలన; యః = ఎవ్వఁడు; పశ్యతి = ఎఱుంగునో; సః పశ్యతి—అతఁడు చక్కఁగా నెఱింగినవాఁ డని యర్థము.

జ్ఞాననిష్ఠు లగు సన్న్యాసులు ఏమోక్షమును బొందుదురో ఫలాభిసంధి లేక కర్మము లనుష్ఠించునట్టి కర్మయోగులు గూడ పరమార్థజ్ఞానద్వారమున నామోక్షమును బొందుదురు. కావున సాంఖ్యమును కర్మయోగమును ఒక్కటేఫలము గలవి యని యెవ్వ రెఱుంగుదురో వారు సమ్యగ్దర్శు లని తాత్పర్యము.

శ్రీ. ప్రశ్నపూర్వకముగా శ్లోకాంతరమున కవతారిక చేయుచున్నారు ఒక్కటినైనను ఇత్యాదిగా. కొందఱుమాత్రమే యవి యేకఫలంబు లని చెప్పుదు రని యాశంకించి వారే సమ్యగ్దర్శులు ఇతరులు గా రని చెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత. నిలుచుచున్నాఁడు దీనియందు భ్రంశము నొందఁడు మరల ననువృత్త్యుత్తి* నాశ్రయించి చెప్పుచున్నారు మోక్ష మనుస్థాన మని. యోగశబ్దార్థము చెప్పుచున్నారు జ్ఞానప్రాప్తికి నిత్యాదిగా. ఎవ్వరు జిజ్ఞాసువులు సర్వకర్మములను భగవత్ప్రీ

* అని కర్మము జ్ఞానవిరోధి యని చెప్పుట.
* పానశబ్దమునకు

త్యర్థముగా తత్ఫలము నభిలషింపక జ్ఞానప్రాప్తికిఁ జిత్తశుద్ధిద్వారంబున నుపాయం బగుటచే ననుష్ఠించుచున్నారో వారిట యోగు లని వివక్షింపఁబడుచున్నారు, యోగైః—మత్స్వార్థ మైనయచ్ప్రీత్యయము గ్రహించి యోగము గలవారిచేత నని యర్థము. సమస్త మైనద్వైతప్రపంచము వస్తుభూతము గాదు మాయావిలాసం బగుటవలన, ఆత్మయో అవిక్రియుఁడు అద్వితీయుఁడు వస్తువు సత్తు అనుప్రయోజక జ్ఞానము ♦ పరమార్థజ్ఞానము, దానిచేఁ గలుగుసన్న్యాసముద్వారంబునఁ గర్మలకుఁ గూడ నాస్థానమే ప్రాప్యంబు గావున నేకఫలకత్వము సన్న్యాసకర్మయోగముల కవిరుద్ధం బని చెప్పుచున్నారు వారిచేతఁ గూడ నిత్యాదిగా. ఏకఫలంబు లని సిద్ధింపఁగా ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

హ. యత్; సాఙ్ఖ్యైః = జ్ఞాననిష్ఠులచేత; ప్రాప్యతే; స్థానమ్ = మోక్షాఖ్యము. తత్; యోగైరపి = కర్మలచేతఁ గూడ; గమ్యతే. అందువలననే; ఏకమ్= అభిన్నమునుగా; సాఙ్ఖ్యంచ; యోగంచ; యః పశ్యతి; సపశ్యతి—అతఁడు సమ్యగ్దర్శి యని యర్థము.

శ౦. సాంఖ్యయోగంబు లేకఫలంబు లని యేది చెప్పఁబడినదో వెండియు దానినే స్పష్టీకరించుచు సాంఖ్యయోగముల యేకత్వజ్ఞానమును స్తుతించుచున్నాఁడు.—సాఙ్ఖ్యైః = సాంఖ్య మనఁగాఁ బరబ్రహ్మము, అది యాత్మ యని యెవ్వ రెఱుంగుదురో వారు సాంఖ్యులు, అట్టి బ్రహ్మనిష్ఠు లగుయతులచేత; యత్ = ఏ; స్థానమ్ = సదా ఏకరూపముననే యున్నది, ఒకప్పుడును గొంచెమైనను వికారము నొందదు, కావున స్థాన మనఁగా స్వరూపము, కేవలభావరూపము; ప్రాప్యతే = తా నని యెఱుంగఁబడుచున్నదో; యోగై రపి = ఫలాభిసంధి విడిచి యీశ్వరప్రీతి కొఱకుఁ జేయఁబడుకర్మము మోక్షోపాయం బగుటవలన యోగ మని చెప్పఁబడుచున్నది, ఆయోగము గలవారు యోగులు, మత్స్వార్థమునం దచ్ప్రీత్యయం బిట గ్రహించునది, అట్టియోగు లగు కర్మనిష్ఠులచేతఁ గూడ; తత్ = ఆస్థానమే మోక్షాఖ్యము; గమ్యతే—నిరంతరము శ్రద్ధతో ననుష్ఠించుకర్మములచే నొందినచిత్తశుద్ధిచేఁ గలుగుజ్ఞానమును జ్ఞానయోగంబునుం బొంది వారలుగూడ స్వాత్మస్వరూపము నెఱుంగ సమర్థు లగుచున్నా రని యర్థము. «ఏష పన్థా ఏతత్కర్మైతద్బ్రహ్మ" * అను

---

♦ హేతుభూత మయినజ్ఞానము.

* ఇది మార్గము ఇది కర్మము ఇది బ్రహ్మము.

శ్రుతివలన. ఇట్లు సాంఖ్యయోగములకు ఫలైకత్వము ప్రమాణసిద్ధం బగుటవలన, సాఙ్ఖ్యంచ = జ్ఞానయోగమును; యోగంచ = కర్మయోగమును; ఏకం యః పశ్యతి = రెంటికి నొక్కటే మోక్షము ఫల మగుటవలన మోక్షసాధనము లయిన యీరెండును, ఏకము—ఏకార్థకం బని యెవ్వఁ డెఱుంగుచున్నాఁడో; సపశ్యతి— అతఁడే సమ్యగ్దర్శి, ఇతరుఁడు గాఁ డని యర్థము.

మ. ఒకదాని ననుష్ఠించుటవలన నెట్లు రెంటిఫలముఁ బొందుచున్నాఁడు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—సాఙ్ఖ్యైః=జ్ఞాననిష్ఠు లగుసన్న్యాసులచేత, ఇప్పుడు కర్మాను ష్ఠానము లేనివారలైనను బూర్వజన్మమునందలికర్మములచేతనే సంస్కృతమయినయుం తఃకరణము గలవారిచేత; శ్రవణాదిపూర్వక మయినజ్ఞాననిష్ఠచే; యత్ = ఏప్రసిద్ధ మయిన; స్థానమ్=ఉండనే యున్నాఁడు దీనియందు ఒకప్పుడును చ్యుతి నొందఁడు అనువ్యుత్పత్తిచే మోక్షాఖ్యస్థానము; ప్రాప్యతే= ఆవరణభంగమాత్రముచేఁ బొందఁ బడిన ట్లగుచున్నదో, నిత్యప్రాప్త మగుటవలన. యోగై రపి = భగవదర్పణబుద్ధిచే ఫలాభిసంధి లేక చేయఁబడినశాస్త్రీయకర్మములు యోగములు, అవి యెవరికిఁ గలవో వారు యోగులు, అర్శఆది యగుటవలన మత్వర్థీయ మయిన అచ్ప్రత్యయము, అట్టి యోగులచేతఁ గూడ; సత్త్వశుద్ధి నొంది, సన్న్యాసపూర్వకశ్రవ ణాదిజన్య మయినజ్ఞాననిష్ఠచే వర్తమానజన్మమునందుఁ గాని భవిష్యజ్జన్మమునందుఁ గాని కలుగఁబోవుదానిచే, తత్ = ఆస్థానము; గమ్యతే. కావున ఏకఫలంబు లగుట వలన, ఏకమ్; సాఙ్ఖ్యంచ; యోగంచ; యః పశ్యతి; సః = అతఁడే; పశ్యతి = చక్కగా నెఱింగినవాఁడు. ఇతరుఁడు కాఁడు. ఇది భావము.—ఎవరికి సన్న్యాస పూర్వక మగుజ్ఞాననిష్ఠ కనఁబడుచున్నదో, వారికి ఆహేతువుచేతనే పూర్వజన్మము లందు భగవదర్పితకర్మనిష్ఠ* యనుమానింపఁబడుచున్నది, కారణము లేక కార్యో త్పత్తి సంభవింపమివలన. అట్లు చెప్పఁబడినది. “యా న్యతో ఽన్యాని జన్మాని తేషు నూనం కృతం భవేత్। సత్కృత్యం పురుషే. ణేహ నా ఽన్యథా బ్రహ్మణి స్థితిః” * అని. ఇట్లెవ్వరికి భగవదర్పితకర్మనిష్ఠ కనఁబడుచున్నదో వారి కాహేతువుచే కలుగఁ బోవుసన్న్యాసపూర్వకజ్ఞాననిష్ఠ యనుమానింపఁబడుచున్నది. సామగ్రి** కార్యోత్పాదనమునం దవ్యభిచారి యగుటవలన. అందువలన నజ్ఞుఁ డగుముముక్షు

---

* ఇందుకు మున్ను ఇతరజన్మము లేవి గలదో వానియందుఁ బురుషునిచే సత్కర్మము నిశ్చయ ముగాఁ జేయఁబడి యుండవలయును. లేనిచో బ్రహ్మనిష్ఠ సిద్ధింపదు.

** కారణము.

వంతఃకరణశుద్ధికొఱకు మొదటఁ గర్మయోగము ననుష్ఠింపవలయును. సన్న్యాసము ననుష్ఠింపఁ గూడదు. ఆసన్న్యాసమో వైరాగ్యము తీవ్ర మయినపుడు తనయంత నే కాఁ గలదు. అని.

**శ్రీ.** దీనినే స్పష్టీకరించుచున్నాఁడు.—సాఙ్ఖ్యైః = జ్ఞాననిష్ఠు లగుసన్న్యాసులచేత; యత్; స్థానమ్ = మోక్షము; ప్రాప్యతే = ప్రకర్షముగ — అపరోక్షముగాఁ బొందఁబడుచున్నదో. కర్మయోగులచేతఁ గూడ, అదియే జ్ఞానద్వారంబున, గమ్యతే — పొందఁబడుచున్న దని యర్థము. అందువలన, సాఙ్ఖ్యంచ; యోగంచ; ఏకఫలంబు లగుటచే, ఏకమ్; యః పశ్యతి; అతఁడే చక్కఁగాఁ దెలిసినవాఁడు.

**ప.** సాఙ్ఖ్యైః = జ్ఞాననిష్ఠు లగుసన్న్యాసులచేత; యత్; స్థానమ్ = కైవల్యము; ప్రాప్యతే= ప్రకర్షముగా—అపరోక్షముగా పొందఁబడుచున్నదో; తత్ = అదియే; యోగైః = కర్మయోగులచేత; జ్ఞానద్వారంబున, పొందఁబడుచున్నది. అందువలన, సాఙ్ఖ్యంచ; యోగంచ; ఏకమ్ = ఫలముచే నొక్కటిగానే; యః; పశ్యతి; సః = అతఁడే, పశ్యతి = పరమార్థము చూచినవాఁడు, ఇతరుఁడు కాఁడు.

**రా.** దీనినే వివరించుచున్నాఁడు.—సాఙ్ఖ్యైః = జ్ఞాననిష్ఠులచేత; యత్ స్థానమ్ = ఏయాత్మావలోకనరూప మయినఫలము; ప్రాప్యతే=పొందఁబడుచున్నదో; తత్ = అదియే; యోగైరపి = కర్మయోగనిష్ఠులచేతఁ గూడ; గమ్యతే = పొందఁబడుచున్నది. ఇట్లు ఏకఫలంబు లగుటచే, ఏకమ్ = వైకల్పికమనుగా; సాఙ్ఖ్యంచ; యోగంచ. యః పశ్యతి = ఎవఁ డెఱుంగుచున్నాఁడో; సః పశ్యతి — అతఁడే పండితుఁ డని యర్థము.

జ్ఞాననిష్ఠులు పొందునట్టియాత్మావలోకనరూపఫలమునే కర్మయోగనిష్ఠులు గూడఁ బొందుచున్నారు, ఇట్లు రెంటికిని ఫలం బొక్కటియే యగుటచే సాఙ్ఖ్యయోగంబులు వైకల్పికంబు లని యెఱింగినవాఁడే పండితుఁ డని యర్థము.

**మా.** ఏక మప్యాస్థితస్సమ్యక్ అనుదాని యభిప్రాయముఁ జెప్పుచున్నాఁడు —యోగులచేతఁ గూడ జ్ఞానద్వారంబున జ్ఞానఫలము పొందఁబడుచున్నది యని యర్థము.

సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః
యోగయుక్తో ముని ర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి. ౬

భా. ఇట్టియెడ యోగముకన్న సన్న్యాసమే యుత్తమ మగుచున్నది. అప్పుడు, ఎట్లు చెప్పవచ్చును తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే అని? వినుము అందుకుఁ గారణము. నీ వడిగితివి కేవల మైన కర్మసన్న్యాసంబును గర్మయోగంబు నుద్దేశించి వానిలో నొకటి యేది శ్రేయము? అని. దాని కనురూప మయిన ప్రతివచనమును నేను జెప్పితిని కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే అని, జ్ఞానము నపేక్షింపక. జ్ఞానాపేక్ష మయిన సన్న్యాసమో సాంఖ్యం బని నాయభిప్రాయము. పరమార్థయోగము గూడ నదియే. ఇఁకఁ గర్మయోగము వైదికం బేది గలదో అదియుఁ దదర్థం బగుటవలన ♦ యోగ మనియు సన్న్యాసం బనియు నుపచరింపఁబడుచున్నది. ఎట్లు తదర్థం బది? అందు వేని చెప్పుచున్నారు.— సన్న్యాసస్తు = పారమార్థిక మయిన సన్న్యాసమో; మహాబాహో = ఓ మహాబాహుఁడా! అయోగతః = యోగము లేక; ఆప్తుమ్ = పొందుటకు; దుఃఖమ్ = కష్టము. యోగయుక్తః = వైదిక మగుకర్మయోగముతో — ఈశ్వరసమర్పిత మయి ఫలనిరపేక్షముగా ననుష్ఠింపఁబడుదానితోఁ గూడిన; మునిః = ఈశ్వరస్వరూపమును మననము చేయువాఁడు; బ్రహ్మ = ప్రకృతసన్న్యాసము పరమాత్మజ్ఞాననిష్ఠాలక్షణం బగుటవలన బ్రహ్మ మని చెప్పఁబడుచున్నది, « న్యాస ఇతి బ్రహ్మ బ్రహ్మాహి పరః » అను శ్రుతివలన, బ్రహ్మమును — పరమాత్మజ్ఞాననిష్ఠాలక్షణ మయిన పరమార్థసన్న్యాసమును; నచిరేణ = శీఘ్రముగనే; అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు. అందువలన నేను జెప్పితిని కర్మయోగో విశిష్యతే అని.

మహాబాహుఁడ వగు నర్జునా! కర్మయోగము లేనియెడఁ బరమార్థసన్న్యాసము నొందుట యశక్యము. ఈశ్వరార్పణబుద్ధితో ఫలాపేక్ష లేక కర్మయోగము ననుష్ఠించుచు నీశ్వరస్వరూపమును మననము చేయుచుండుపురుషుఁడు పరమాత్మజ్ఞాననిష్ఠారూప మయిన పరమార్థసన్న్యాసమును శీఘ్రముగా నొందఁ గలఁడని తాత్పర్యము.

అ. యథోక్తజ్ఞానపూర్వకసన్న్యాసద్వారంబునఁ గర్మయోగులకుఁ గూడ శ్రేయఃప్రాప్తి యగు నన్నచో నప్పుడు సన్న్యాసమే యుత్తమం బని ప్రాప్తించు

♦ పరమార్థసన్న్యాసము ప్రయోజనముగాఁ గలది యగుటవలన.

చున్న దని యాక్షేపించుచున్నాఁడు ఇట్లయినయెడ నిత్యాదిగా. సన్న్యాసమే శ్రేష్ఠ మగునప్పుడు కర్మయోగము శ్రేష్ఠం బనుట యనుచితం బని చెప్పుచున్నాఁడు అప్పుడు ఇత్యాదిగా. మున్ను చెప్పినయభిప్రాయమునే స్మృతికిఁ దెచ్చుచు సమాధానము చెప్పుచున్నారు వినుము ఇత్యాదిగా. అందుకుఁ — కర్మయోగ ముత్తమం బనుటకు. ఆ కారణమునే చెప్పుచున్నాఁడు నీవు ఇత్యాదిగా. కేవలమైన—జ్ఞానరహితమైన. నీప్రశ్నము ననుసరించి దాని కనుగుణముగా నుత్తరమును జ్ఞానము నపేక్షింపక యది లేని కేవలమైనసన్న్యాసముకన్న నే కర్మయోగ ముత్తమ మని నేను జెప్పితి నని చెప్పుచున్నాఁడు దాని కనురూపము ఇత్యాదిగా. అప్పుడు జ్ఞానాపేక్షసన్న్యాసం బెట్టిది యని యాశంకించి చెప్పుచున్నారు జ్ఞానాపేక్షము ఇత్యాదిగా. అప్పుడు కర్మయోగమునం దెట్లు యోగశబ్దము గాని సన్న్యాసశబ్దము గాని ప్రయోగింపవచ్చును ? అనఁగాఁ జెప్పుచున్నారు ఇఁక నిత్యాదిగా. తదర్థం బగుటవలన—పరమార్థజ్ఞానశేషం బగుటవలన ♦ నని యర్థము. అతదర్థతనే ప్రశ్నపూర్వకముగా సాధించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. కర్మానుష్ఠానము లేనియెడఁ జిత్తశుద్ధి కలుగమివలన సమ్యగ్దర్శనరూప మయినపరమార్థసన్న్యాసము సిద్ధింప దని వ్యతిరేకము నుపన్యసించి యన్వయము నుపన్యసించుచున్నాఁ డుత్తరార్ధముచేత. పారమార్థికము—సమ్యగ్దర్శనరూపము. సామగ్రి లేనియప్పుడు కార్యము సిద్ధింప దని చెప్పుచున్నారు దుఃఖ మ్మని. యోగయుక్తః అను దానికి వ్యాఖ్యానము చేయుచున్నారు వైదికము ఇత్యాదిగా. ఈశ్వరస్వరూపము—సవిశేషము నని శేషము. బ్రహ్మ అనుపదము నెత్తి వ్యాఖ్యానము చేయుచున్నారు ప్రకృతము ఇత్యాదిగా. అందు బ్రహ్మశబ్దప్రయోగమునకు హేతువుఁ జెప్పుచున్నారు పరమాత్మేత్యాదిగా. లక్షణం బనుటకు గమక † మని యర్థము. సన్న్యాసమునందు బ్రహ్మశబ్దప్రయోగమునకుఁ దైత్తిరీయశ్రుతిం బ్రమాణీకరించుచున్నాడు న్యాస ఇత్యాదిగా. ఎట్లు హిరణ్యగర్భవాచక మగు బ్రహ్మశబ్దమును సన్న్యాసమునందుఁ బ్రయోగింపవచ్చును ? అని యాశంకించి ద్వయమునందును * బరత్వము సమాన మగుటవలన నని చెప్పుచున్నది బ్రహ్మే హీత్యాదిగా. బ్రహ్మశబ్దము సన్న్యాసవిషయం బని సిద్ధింపఁగా ఫలిత మగు వ్యాఖ్యార్థముఁ జెప్పుచున్నారు

♦ పరమార్థజ్ఞానమునకు అంగము—సాధన మగుటవలన.

† తెలుపునది.

* హిరణ్యగర్భునియందును సన్న్యాసమునందును.

బ్రహ్మమును ఇత్యాదిగా. ఎట్లు నదీప్రవాహములు పల్లమునకుఁ బోవుటయందే యాసక్తంబు లగునో అట్లు కర్మములచేఁ జక్కఁగాఁ బరిపక్వకషాయుం డగువానికరణంబులు అన్నింటినుండియు వ్యావృత్తంబులై ♦ నిరస్తాశేషవిశేషకూటస్థప్రత్యగాత్మాన్వేషణమునందే యాసక్తంబు లగుచున్నవి. కావునఁ గర్మయోగము పరమార్థసన్న్యాసప్రాప్తి కుపాయం బని సిద్ధింపఁగా ఫలితము చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

హా. కర్మసన్న్యాసముకంటెఁ గర్మయోగం బుత్తమ మని చెప్పఁబడినది. ఎట్లుత్తమం బనఁగాఁ జెప్పుచున్నాఁడు —సన్న్యాసః = జ్ఞాననిష్ఠ; ఓమహాబాహుఁడా! కర్మయోగులు కానివారిచే దుఃఖంబునఁ బొందఁబడుచున్నది, కర్మయోగులచేతనో సుఖంబున సత్త్వశుద్ధిద్వారంబునఁ బొందఁబడుచున్నది, అందువలనఁ గర్మయోగము విశిష్టం బని చెప్పఁబడినది. ఎందువలన ననఁగా, యోగయుక్తః; మునిః = జ్ఞానియై; బ్రహ్మ; శీఘ్రముగా, అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

శం. ఎందువలన సన్న్యాసకర్మయోగంబులు మోక్షైకఫలకంబు లని ప్రదర్శించినన్యాయముచే సిద్ధించుచున్నదో అందువలన అపక్వచిత్తుం డగుమోక్షార్థి కర్మమునే చేయవలయును, కాని సన్న్యాసముఁ జేయఁ గూడదు. అపక్వచిత్తునకు సన్న్యాసము దుర్ఘటం బని యుపదేశించుచు, కర్మముచేఁ బక్వకషాయుం డగు వాఁడే సన్న్యాసము చేయవలయు నని యుపదేశించుచున్నాఁడు.—అయోగతస్తు= యోగము లేని యప్పుడో, కర్మయోగానుష్ఠానజన్య మగుచిత్తశుద్ధి లేనియప్పుడో; సన్న్యాసః= జ్ఞాననిష్ఠాలక్షణ మగుసన్న్యాసము; ఆప్తుమ్ = పొందుటకు; దుఃఖమ్ = దుర్ఘటము. జ్ఞాననిష్ఠాలక్షణసన్న్యాసము చిత్తశుద్ధిచేతనే సాధ్య మగుటవలన « కారణము లేనిచో కార్యము సంభవింపదు » అనున్యాయంబునఁ గర్మముచేఁ గలుగుచిత్తశుద్ధి లేనియెడ సన్న్యాసము సిద్ధింప దని యర్థము. ఇట్లు సన్న్యాసము కర్మయోగానుష్ఠానముచే సంభవించునట్టి చిత్తప్రసాదముచేతనే పొందఁ దగినది యని నిశ్చయించి, ఇప్పుడు కర్మయోగముచేఁ జక్కఁగాఁ బక్వ మయినయంతఃకరణము గల ముముక్షువుమాత్రము సన్న్యాసము చేయవలయు ననునభిప్రాయముతోఁ జెప్పుచున్నాఁడు.—యోగయుక్తః = యోగముతో — కర్మయోగానుష్ఠానముచేఁ గలుగుచిత్తప్రసాదముతోఁ గూడిన; మునిః = గృహస్థుఁడు; బ్రహ్మ—బ్రహ్మశబ్దముచే

♦ మరలినవై.

నిట సన్న్యాసము చెప్పఁబడుచున్నది, « న్యాస ఇతి బ్రహ్మా బ్రహ్మా హి పరః » అను శ్రుతివలన; బ్రహ్మ = బ్రహ్మస్వరూపమున నుండుట యను లక్షణము గల ప్రధాన సన్న్యాసమును; పరిపక్వాంతఃకరణుం డగుటవలన నధికారి యగు ముముక్షువు నచిరేణ = శీఘ్రముగనే; అధిగచ్ఛతి — పొందుచున్నాఁ డని యర్థము. లేక, యోగయుక్తః = యోగముచేఁ గలుగుచిత్తశుద్ధితోఁ గూడినముముక్షువు; ముని-సన్న్యాసియై, ఉక్తలక్షణ మగుసన్న్యాసము గలవాఁడై; తన్నిష్ఠచే, నచిరేణ = శీఘ్రముగనే; బ్రహ్మ = బ్రహ్మమును; అధిగచ్ఛతి—బ్రహ్మమే నేను అను నప్రతిబద్ధమైనవృత్తిచే తన్ను బ్రహ్మముగానే యెఱుంగుచున్నాఁ డని యర్థము. ఇందుచే, అపక్వాంతఃకరణుఁడు కర్మసన్న్యాసము చేసినను వానికి ముఖ్యసన్న్యాసము సిద్ధింపదు, పరిపక్వాంతఃకరణునకో బాహ్యసన్న్యాసమును ఆంతరసన్న్యాసమును సిద్ధించుచున్నది, తత్ఫలము సర్వాత్మభావంబును సిద్ధించుచున్నది యని సూచితం బగుచున్నది.

మ. అశుద్ధచిత్తుఁడు గూడ సన్న్యాసమునే యేల మొదటనే చేయఁ గూడదు? జ్ఞాననిష్ఠాహేతు వగుటచే నది యావశ్యకంబు గదా! అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—అయోగతః = యోగము—అంతఃకరణశోధక మయినశాస్త్రీయకర్మము లేక; హఠంబువలననే యేది చేయఁబడునన్నదో అట్టి, సన్న్యాసస్తు = సన్న్యాసమో; దుఃఖమ్ = దుఃఖమును; ఆప్తుమ్ = పొందుటకే యగుచున్నది, అశుద్ధచిత్తుం డగుటచేఁ దత్ఫల మయినజ్ఞాననిష్ఠ సంభవింపమివలనను చిత్తశుద్ధి కలిగించుకర్మమునం దధికారము లేకుండుటవలనను గర్మబ్రహ్మోభయభ్రష్టుఁ డగుటచేతఁ ♦ బరమసంకటము సంభవించుటవలన. కర్మయోగయుక్తుఁడో శుద్ధాంతఃకరణుం డగుటవలన, మునిః = మననశీలుఁడు సన్న్యాసియై; బ్రహ్మ = సత్యజ్ఞానాది లక్షణం బగు ఆత్మను; నచిరేణ = శీఘ్రముగనే; అధిగచ్ఛతి = సాక్షాత్కరించుచున్నాఁడు, ప్రతిబంధకము లేమివలన. ఇది మున్నే చెప్పఁబడినది « న కర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే। నచ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి » అని. అందువలన నేకఫలంబులైనను « కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే » అని యేది మున్ను చెప్పఁబడినదో యది యుపపన్నము.

శ్రీ. కర్మయోగికిఁ గూడ నంతంబున సన్న్యాసముచేతనే జ్ఞాననిష్ఠ యగు ననుపక్షమున, నప్పుడు మొదటనే సన్న్యాసము చేయుట యుక్తం బని తలం

♦ కర్మమునుండియు బ్రహ్మమునుండియు రెండింటినుండియు భ్రష్టుఁ డగుటచేత

చువానిం గూర్చి చెప్పుచున్నాఁడు.—అయోగతః = కర్మయోగము లేక; సన్న్యాసః, ఆప్తుమ్, దుఃఖమ్ = దుఃఖహేతువు, అశక్య మని యర్థము, చిత్తశుద్ధి లేకుండుటచే జ్ఞాననిష్ఠ సంభవింపమివలన. యోగయుక్తుఁడో శుద్ధచిత్తుఁ డగుటచేత, మునిః = సన్న్యాసియై; నచిరేణ = శీఘ్రముగనే; బ్రహ్మ; అధిగచ్ఛతి = అపరోక్షముగా నెఱుఁగుచున్నాఁడు. అందువలనఁ జిత్తశుద్ధి కలుగుటకు మున్ను కర్మయోగమే సన్న్యాసముకంటె నుత్తమం బని మున్ను చెప్పినది సిద్ధము. అట్లు చెప్పఁబడినది వార్తికకారులచేత "ప్రమాదినో బహి శ్చిత్తాః పిశునాః కలహోత్సుకాః। సన్న్యాసినో ఽపి దృశ్యన్తే దైవసందూషితాశయాః" ♦ అని.

ప. కర్మయోగికిఁ గూడఁ దుదను సన్న్యాసముచేతనే జ్ఞాననిష్ఠ యగునేని, అప్పుడు మొదటనే సన్న్యాసము సేయుట యుచితం బనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఓమహాబాహుఁడా! అయోగతః= కర్మయోగము లేక; సన్న్యాసః; పొందుట దుఃఖహేతువు—అశక్యము. అందువలన; యోగయుక్తుఁడై; మునిః= మననశీలుం డగువాఁడు; నచిరేణ = శీఘ్రముగనే; బ్రహ్మ; అధిగచ్ఛతి= అపరోక్షముగా నెఱుంగుచున్నాఁడు. కర్మయోగము లేనివాఁ డెఱుంగఁజాలఁడు.

రా. ఇంతమాత్రము విశేషం బని చెప్పుచున్నాఁడు.—సన్న్యాసస్తు = జ్ఞానయోగమో; అయోగతః = కర్మయోగము లేక; ఆప్తుమ్ = పొందుటకు; దుఃఖమ్ = అశక్యము. యోగయుక్తః = కర్మయోగముతోఁ గూడినవాఁడు; తనయంతనే, మునిః = ఆత్మమననశీలుండై; సుఖముగాఁ గర్మయోగమును సాధించి, నచిరేణ = అల్పకాలముననే; బ్రహ్మ అధిగచ్ఛతి = ఆత్మను బొందుచున్నాఁడు. జ్ఞానయోగయుక్తుఁ డైననో మహాదుఃఖంబున జ్ఞానయోగమును సాధించుచున్నాఁడు, దుఃఖసాధ్యత్వం బగుటవలన ఆత్మను బహుకాలమునకుఁ బొందుచున్నాఁ డని యర్థము.

కర్మయోగము నభ్యసించినం గాని జ్ఞానయోగము నొంద శక్యము గాదు. కర్మయోగము నవలంబించిననో ఆత్మమననము చేయుచుఁ గర్మయోగము సాధించి శీఘ్రకాలముననే బ్రహ్మమును బొందుచున్నాఁడు. జ్ఞానయోగము నవలంబించువాఁడు బహుకష్టంబున బహుకాలమునకు బ్రహ్మము నొందుచున్నాఁ డని తాత్పర్యము.

---

♦ ప్రమాదము—స్వనిష్ఠయం దేమఱుపాటు గలవారును బహిర్విషయములందు మనస్సు గలవారును గ్రూరులును గలహప్రియులును దైవముచే దూషితమయిన చిత్తము గలవారునగు సన్న్యాసులు గూడఁ గనఁబడుచున్నారు.

పూ. ఇందువలనఁ గూడ సన్న్యాసముకంటె యోగం బుత్తమం బని చెప్పుచున్నాఁడు.—యోగము లేనియెడ మోక్షాదిఫలము సిద్ధింపదు. అందువలనఁ గామజయాదిదుఃఖమే వానికిఁ * గలుగును. మోక్షాదికమే గదా ఫలము. ఇతర మేమిఫలము గలిగినను అది యల్పం బగుటవలన ఫలము గా దని యాశయము. అట్లు చెప్పఁబడినది «వినా మోక్షఫలం యత్తు న తత్ఫల ముదీర్యతే» ♦ అని పాద్మమునందు. ఏది మహాఫలము గలిగించుటకు యోగ్యమో దానికి అల్పఫలము ఫలమే గాదు. ఎట్లు పద్మరాగమణికిఁ బిడికెఁడుబియ్యము ఫలముగాదో అట్లు. యోగయుక్త మయినచో సన్న్యాసము మహాఫలం బని చెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత. మునిః = సన్న్యాసి. అట్లు చెప్పఁబడినది «సహి లోకే ముని ర్నామ యః కామక్రోధవర్జితః» ❡ అని.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః
సర్వభూతాత్మభూతాత్మా కుర్వ న్నపి న లిప్యతే. ౭

భా. ఎప్పుడు మఱి యతఁడు సమ్యగ్దర్శనప్రాప్తి కుపాయం బగుటచే; యోగయుక్తః = యోగముతోఁ గూడినవాఁడై; విశుద్ధాత్మా = పరిశుద్ధ మయిన సత్త్వము గలవాఁడై; విజితాత్మా = జయింపఁబడిన దేహము గలవాఁడై; జితేన్ద్రియః = జయింపఁబడిన యింద్రియములు గలవాఁడునై; సర్వభూతాత్మభూతాత్మా = బ్రహ్మాదిస్తంబపర్యంతము లైన సర్వభూతంబులకును ఆత్మ యయిన ప్రత్యగాత్మ గలవాఁడు, సమ్యగ్దర్శి యని యర్థము, అగునో; అప్పుడు, అతఁడు దానియందు నీప్రకారముగా నున్న వాఁడై లోకసంగ్రహముకొఱకుఁ గర్మమును, కుర్వన్నపి = చేయుచున్న వాఁ డైనను; నలిప్యతే—కర్మములచే బంధింపఁబడ డని యర్థము.

ముముక్షు వగువాఁడు కర్మయోగము ననుష్ఠించుచుండి దానిచే సత్త్వశుద్ధి నొంది దేహేంద్రియముల జయించినవాఁడై సర్వభూతంబులకును ఆత్మ తానే యని సమ్యగ్జ్ఞానము నొంది యట్టి జ్ఞాననిష్ఠయం దున్నవాఁడై లోకసంగ్రహము కొఱకుఁ గర్మము చేయుచున్నను వానిని గర్మములు బంధింపఁజాల వని తాత్పర్యము.

* కేవలసన్న్యాసికి.

♦ మోక్షఫలము దక్క నితరఫల మేది గలదో అది ఫల మని చెప్పఁబడదు.

❡ ఎవ్వఁడు కామక్రోధవర్జితుఁడో వాఁడు గదా లోకమునందు ముని యని చెప్పఁబడును.

ఆ. ఓయీ! సన్న్యాసముఁ బరిగ్రహించి శ్రవణాదిసాధనములను బలుమా ఱనుష్ఠించి సమత్వబుద్ధి నొందినవానికిఁ గూడ మునుపటివలెఁ గర్మములు కనఁబడుచున్నవి, అవి బంధహేతువు లగు నని యాశంకించి మీఁదిశ్లోకమున కవ తారిక చేయుచున్నారు ఎప్పుడు మఱి ఇత్యాదిగా. సమ్యగ్దర్శనప్రాప్తి కుపాయం బగుటచే నెప్పుడు మఱి యీపురుషుఁడు యోగయుక్తత్వాదులు గలవాఁడై సమ్య గ్దర్శి యగుచున్నాఁడో అప్పుడు ప్రాతిభాసికవృత్తి ననుసరించి చేయుచున్నను లేపము నొందఁ డని యన్వయము. యోగముతో—నిత్యనైమిత్తికకర్మానుష్ఠాన ముతో నని యర్థము. మొదట నిత్యాదికర్మానుష్ఠానము గలవానికి రజస్తమోమలం బులచే నకలుషితం బగు సత్త్వము సిద్ధించుచున్న దని చెప్పుచున్నారు విశుద్ధాత్మా అని. బుద్ధి శుద్ధ మయినపుడు కార్యకరణసంఘాతముగూడ స్వాధీనం బగు నని చెప్పుచున్నారు విజితాత్మా ఇత్యాదిగా. ఈచెప్పినవిశేషణములు గలవాఁడు సమ్యగ్దర్శి యగు నని చెప్పుచున్నారు సర్వభూతాత్మభూతాత్మా అని. సమ్యగ్దర్శి కప్పుడు కర్మాను ష్ఠానం బెక్కడిది ? తదనుష్ఠానమునందుఁ గాని యెట్లు బంధనాశము సిద్ధించును ? అని యాశంకించి చెప్పుచున్నారు అతఁడు దానియందు ఇత్యాదిగా. దానియందు— అసమ్యగ్దర్శనమునం దని యర్థము.

హ. అందువలన.—యోగయుక్తః; విశుద్ధాత్మా = సత్త్వశుద్ధి నొందిన వాఁడై; విజితాత్మా—రాగద్వేషములచే నాకర్షింపఁబడనివాఁడై; జితేన్ద్రియః; సర్వ భూతాత్మభూతాత్మా—సర్వభూతంబులందును ఆత్మైక్యము నెఱింగినవాఁడు; కర్మము లను, కుర్వన్నపి; వానిఫలములచే, న లిప్యతే = అంటఁబడఁడు.

శం. ఎవ్వఁడు కర్మానుష్ఠానముచేఁ బొందఁబడిన చిత్తశుద్ధి గలవాఁడై జితేంద్రియుఁడై సర్వాత్మభావమును బొందిన బ్రహ్మవిత్తముఁడు గలఁడో అతఁడు శారీరకర్మ మేదేని చేయుచున్నను లేపము నొందఁ డని చెప్పుచున్నాఁడు.— యోగయుక్తః = కర్మయోగముతోఁ గూడినవాఁడై, బహుకాలము కర్మయోగ మనుష్ఠించినవాఁడై యని యర్థము; లేక; ముని ర్బ్రహ్మ నచిరే ణాధిగచ్ఛతి యని ముఖ్యసన్న్యాసప్రాప్తి చెప్పుటవలన, యోగయుక్తః = బ్రహ్మనిష్ఠాలక్షణ మగు సన్న్యాసయోగముతోఁ గూడినవాఁడై, బహుకాలము సమాధియోగము నను ష్ఠించినవాఁడై యని యర్థము; అందువలననే, విశుద్ధాత్మా= విశుద్ధము—రాగద్వేషాది దోషములచే నిశ్శేషముగా విడువఁబడినది యగు ఆత్మ—మనస్సు గలవాఁడై; అందు

వలననే, జితేన్ద్రియః = జయింపఁబడినవి—విషయగ్రహణవిముఖతను బొందింపఁబడినవి యగు జ్ఞానకర్మేంద్రియములు గలవాఁడై; విజితాత్మతయును జితేంద్రియతయును జిరకాలము సమాధి ననుష్ఠించుటచేతనే పొంద శక్య మగును; కావుననే, విజితాత్మా = «ఆత్మా యత్న ధృతి స్స్వాన్త స్వభావ పరమాత్మసు» అను నిఘంటువువలన, విజితము—జయింపఁబడినది—తొలఁగింపఁబడినది యగు ఆత్మ—స్వభావము బాహ్యవాసనారూపము గలవాఁడై, సమాధిచే నిర్మూలింపఁబడిన యనాత్మవాసన గలవాఁడై యని యర్థము; అందువలననే, సర్వభూతాత్మభూతాత్మా = బ్రహ్మాదిస్తంబపర్యంతములగుసర్వభూతములకును—సర్వప్రాణులకును ఆత్మభూతము—స్వరూపభూతమగు ఆత్మ—ప్రత్యగ్లక్షణం బగుస్వాత్మ * గలవాఁడై; «ప్రాణో హ్యేష సర్వభూతై ర్విభాతి; అహ మే వేదం సర్వమ్" ¶ ఇత్యాదిశ్రుతులయర్థము దెలియుటచేతను స్వానుభవముచేతను సర్వాత్మభావము నొందినబ్రహ్మవిత్తముఁ డెవ్వఁడు గలఁడో, అతఁడు శరీరయాత్రకొఱకు నేదేని విహితము గాని యవిహితము గాని కర్మమును, కుర్వన్నపి; ఆకర్మముచేఁ బుణ్యకర్మముచేఁ గాని పాపకర్మముచేఁ గాని, నలిప్యతే—కర్మమునం దకర్తృత్వదృష్టిచే నంటఁబడఁ డని యర్థము. ఓయీ! లోకసంగ్రహ మిత్యాదిశాస్త్రముచేఁ ♦ గర్తవ్యములుగాఁ బ్రాప్తించినశాస్త్రీయకర్మములే వీనికిఁ గర్తవ్యము లని యేర్పడి యుండఁగా శరీరయాత్రకొఱకు నేదేని కర్మము నని శాస్త్రవిరుద్ధము చెప్పుచున్నావు, అందు వేని; అట్లు గాదు, బ్రహ్మవిదునకుఁ గర్మమే యనుపపన్న మగుటవలన, బ్రహ్మ మే నేనని తాను అవిక్రియ బ్రహ్మరూపుఁ డని తెలియుటచే నిశ్శేషముగా వినష్ట మయిన మిథ్యాజ్ఞానము గలవాఁ డగుటవలనఁ దద్విపరీతజ్ఞానముచేత నే కలుగునట్టి కర్మయోగము వానికి సంభవింపమివలన, సమ్యక్జ్ఞానమునకును మిథ్యాజ్ఞానతత్కార్యములకును విరోధ మగుటవలన. అధిష్ఠానజ్ఞానము కలిగినపిమ్మటఁ దద్విపరీతజ్ఞానంబును దత్కార్యంబును సంభవింపనేరదు గదా! స్థాణుజ్ఞానము కలిగినపిమ్మటఁ జోరజ్ఞానము తత్కార్యములు కనఁబడుచున్నవా? కూటస్థాసంగచిద్రూపునిగానే తన్ను నప్రతిహతవృత్తిచేఁ జూచుచుండు విద్వాంసునకు ననాత్మతాదాత్మ్యం బనుపపన్న మగుటవలన ననాత్మతాదాత్మ్యాభినివేశముచేతనే

---

* తాను.

¶ ఈప్రాణము—ఆత్మ గదా సర్వభూతములచేతను—తద్రూపములచేఁ బ్రకాశించుచున్నది, నేనే యిది యంతయును.

♦ లోకసంగ్రహ మే వా ౽పి సంపశ్యన్ కర్తుమర్హసి అనువచనముచేత.

నెఱవేర్పఁ దగినకర్మయోగము స్వప్నమునందేనియు సంభవింపదు, విధి విధానము మొదలగు సమస్తదృశ్యమును మిథ్యయే యని యెఱింగినవానికి విధేయత్వము సంభవింపమివలనను, యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణా ఽధిగచ్ఛతి యని సర్వకర్మసన్న్యాసము బోధించుటవలనను. మఱియు, పశ్యఞ్ శృణ్వఞ్ అనుచోటఁ ♦ బదుమూఁడువిధములుగాఁ గర్మము చెప్పఁబడుచున్నది. ఈపదుమూఁడువిధములు వైదికక్రియకు సంభవింపవు, విద్వాంసునకో ఆహారాదులందుఁ బదుమూఁడువిధముల శరీరచేష్ట సంభవించుచున్నది. కావున నన్నివిధంబులను బ్రహ్మవిదుఁడగుజీవన్ముక్తునకు విహితకర్మము లేశంబును సంభవించు నన శక్యము గాదు. అందువలననే చెప్పఁబడుచున్నది తస్య కార్యం నవిద్యతే అని.

వ్య. ఓయీ! కర్మము బంధహేతు వగుటవలన యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణా ఽధిగచ్ఛతి యనుట యనుపపన్నము. అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—భగవదర్పణము ఫలాభిసంధిరహితత మొదలగుగుణములతోఁ గూడిన శాస్త్రీయకర్మము యోగమని చెప్పఁబడుచున్నది. అట్టియోగముతోఁ గూడినపురుషుఁడు; మొదట, విశుద్ధాత్మా=విశుద్ధము—రజస్తమస్సులచే అకలుషిత మగు ఆత్మ—అంతఃకరణరూప మయినసత్త్వము గలవాఁడై, నిర్మల మయినయంతఃకరణము గలవాఁడై; విజితాత్మా = స్వాధీనముగాఁ జేయఁబడినదేహము గలవాఁడై; అంత, జితేన్ద్రియః = స్వాధీనములుగాఁ జేయఁబడిన సమస్తబాహ్యేంద్రియములు గలవాఁడై; ఇందుచే మనువు చెప్పిన త్రిదండి చెప్పఁబడెను " వాగ్దణ్డో ఽథ మనోదణ్డః కాయదణ్డ స్తథైవచ, య స్యైతే నియతా దణ్డా స త్రిదణ్డీతి కథ్యతే " * అని. వాక్ అనునది బాహ్యేంద్రియముల కుపలక్షణము; ఇట్టివానికిఁ దత్త్వజ్ఞాన మవశ్యము సిద్ధించు నని చెప్పుచున్నాఁడు.—సర్వభూతాత్మభూతాత్మా = సర్వభూతంబును ఆత్మభూతంబు నగు ఆత్మ—స్వరూపము గలవాఁడు, జడప్రపంచమును అజడప్రపంచమును సమస్తమును తన్నుఁగానే చూచుచుండువాఁ డని యని యర్థము; సమస్తము లయిన భూతములకు ఆత్మభూత మయినఆత్మ గలవాఁడుఅనువ్యాఖ్యానమునందో, సర్వభూతాత్మా యన్నమాత్రముచేతనే యర్థము సిద్ధించుటవలన ఆత్మభూత యనునది యధికం బగుచున్నది; సర్వపదము జడపరముగాను ఆత్మపదము అజడపరముగాను

---

♦ మీఁదిశ్లోకమునందు.

* వాగ్దండము, మనోదండము, కాయదండము ఈ మూఁడుదండములు నెవ్వనికి నియతములై యుండునో అతఁడు త్రిదండి యని చెప్పఁబడుచున్నాఁడు. దండ మనఁగా నిగ్రహము.

వ్యాఖ్యానము చేయుట సమంజసము; ఇట్టి పరమార్థదర్శి; కుర్వన్నపి = ఇతరులదృష్టిచేఁ గర్మములఁ జేయుచున్నను; నలిప్యతే, ఆకర్మములచేత. తనదృష్టిచే నాకర్మములు లేమివలన నని యర్థము.

శ్రీ. కర్మయోగాదిక్రమంబున బ్రహ్మజ్ఞానము కలిగినను ఆసిమ్మటఁ జేయు కర్మముచే బంధము కానే యగు నని యాశంకించి చెప్పుచున్నాఁడు — యోగయుక్తః = యోగముతోఁ గూడినవాఁడు; అందువలన, విశుద్ధాత్మా = విశుద్ధ మయిన చిత్తము గలవాఁడై; అందువలననే, జితేన్ద్రియః = జయింపఁబడినయింద్రియములు గలవాఁడై; అందువలన, సర్వభూతాత్మభూతాత్మా = సర్వభూతంబులకును ఆత్మభూత మయిన ఆత్మ గలవాఁడు; అతఁడు లోకసంగ్రహముకొఱకుఁ గాని స్వాభావికముగఁ గాని కర్మములను, కుర్వన్నపి; నలిప్యతే = వానిచే బంధింపఁబడఁడు.

ప. ఇఁకఁ జెప్పినవిషయమును దృఢము చేయుచుఁ గర్మలేపము లేకపోవు క్రమముఁ జెప్పుచున్నాఁడు. — యోగయుక్తః = కర్మయోగముచే నేర్పడినవాఁడు; అందువలననే విశుద్ధ మయిన చిత్తము గలవాఁడు, అందువలననే విజిత మయిన — తద్వశవర్తి ♦ యగు దేహము గలవాఁడు, అందువలననే జితము లయిన తత్సంసక్తము లగు ‡ నింద్రియములు గలవాఁడు, సర్వభూతములకును ఆత్మభూత మయిన ఆత్మ గలవాఁడు — సమస్తభూతములందును సమత్వముఁ జూచువాఁడు, అట్టి పురుషుఁడు కర్మమును, కుర్వన్నపి; నలిప్యతే = బంధింపఁబడఁడు.

రా. యోగయుక్తః = కర్మయోగయుక్తుఁడో, శాస్త్రీయ మగుపరమపురుషారాధనరూప మయిన విశుద్ధకర్మమునం దున్నవాఁడై; అందుచే, విశుద్ధాత్మా=విశుద్ధ మయినమనస్సు గలవాఁడై; విజితాత్మా = తా నభ్యసించుకర్మమునందు వ్యాపృత మగు మనస్సు గలవాఁ డగుటచే సుఖంబున జయింపఁబడిన మనస్సు గలవాఁడై; అందువలననే, జితేన్ద్రియః; కర్త యగు నాత్మయొక్క తత్త్వము ననుసంధించునిష్ఠ గలవాఁ డగుటచే, సర్వభూతాత్మభూతాత్మా = సమస్తము లయిన దేవాదిభూతములకు ఆత్మభూతమయిన ఆత్మ గలవాఁడు సర్వభూతాత్మభూతాత్ముఁడు, ఆత్మతత్త్వము ననుసంధించుచుండువానికి దేవాదులకును దనకును ఏకాకారమే గదా ఆత్మ, దేవాదిభేదములు ప్రకృతిపరిణామ విశేషరూపము లగు

♦ ఆచిత్తమునకు వశవర్తి.

‡ ఆదేహమునకు సంబంధించిన.

టచే ఆత్మాకారము లగుట సంభవింపమివలన. ప్రకృతివియుక్తాత్మ అంతటను దేవాది దేహములందు జ్ఞానైకాకారుం డగుటచే సమాన మయిన యాకారము గలవాఁ డని "నిర్దోషం హి సమం బ్రహ్మ" అని వెంటనే చెప్పఁబోవుచున్నాఁడు; ఇట్టి లక్షణము గల యతఁడు, కర్మము; కుర్వన్నపి; అనాత్మయం దాత్మాభిమానము చేయుట యందు, నలిప్యతే = సంబంధింపఁడు. కావున శీఘ్రముగ నాత్మను బొందుచున్నాఁ డని యర్థము.

కర్మయోగము ననుష్ఠించువాఁడు శుద్ధమైనమనస్సు గలవాఁడై సుఖంబున మనోజయంబునొంది జితేంద్రియుండై, యాత్మతత్త్వము ననుసంధించువాఁ డగుటచే సర్వభూతంబులందును ఆత్మాకారము ఒక్కటెవిధముగ నున్న దని యెఱింగి యట్లను సంధించుటం జేసి, కర్మము చేయుచున్నను, అందుచే అతండనాత్మయం దాత్మాభిమానము నొందఁ డని తాత్పర్యము.

**మా.** దీనినే ప్రపంచించుచున్నాఁడు.—సర్వభూతాత్మభూతుఁడు పరమేశ్వరుఁడు, యచ్చాప్నోతీత్యాదికమువలన. సర్వభూతాత్మభూతుఁడు తనసమీపమునకు గ్రహించుట మొదలగునవి చేయువాఁడుగాఁ గలవాఁడు ♦ సర్వభూతాత్మభూతాత్ముఁడు.

నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్. ౮
ప్రలపన్విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్. ౯

**భా.** ఇతఁ డేమో పరమార్థంబునఁ జేయువాఁడు కాఁడు. అందువలన, కించిత్=దేనిని; నైవకరోమి=చేయనేచేయను. ఇతి=అని; యుక్తః = సమాహితుఁడై *; మన్యేత=చింతించును; తత్త్వవిత్=ఆత్మయొక్క తత్త్వమును—యాథాత్మ్యమును ఎఱుంగువాఁడు, పరమార్థదర్శి యనియర్థము. ఎప్పుడు ఎట్లు తత్త్వము నిశ్చయించినవాఁడై చింతించును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—పశ్యన్=చూచుచు; శృణ్వన్= వినుచు; స్పృశన్ =

♦ తనసమీపమునకు ఇత్యాదిగా ద్వితీయాత్మశబ్దార్థము. పరమేశ్వరుఁడు తన్ను గ్రహించువాఁడుగాఁ గలవాఁ డని భావము.

* ఎచ్చరిక గలవాఁడై.

స్పృశించుచు; జిఘ్రన్ = మూర్కొనుచు; అశ్నన్ = భుజించుచు; గచ్ఛన్ = నడచుచు; స్వపన్ = నిద్రించుచు; శ్వసన్ = ఊపిరులువిడుచుచు; ప్రలపన్ = పలుకుచు; విసృజన్ = విసర్జించుచు ♦; గృహ్ణన్ = గ్రహించుచు; ఉన్మిషన్ = కన్నుదెఱచుచు; నిమిషన్ అపి = కన్నుమూయుచును; ఇన్ద్రియాణి = ఇంద్రియములు; ఇన్ద్రియార్థేషు = ఇంద్రియముల విషయములయందు; వర్తన్తే = ఉన్నవి. ఇతి = అని; ధారయన్ = నిశ్చయించినవాఁడై; మన్యేత అనిపూర్వముతో సంబంధము. ఇట్లు తత్త్వవిదుఁడు సమ్యగ్దర్శి యెవఁడు సర్వకార్యకరణ చేష్ట లయిన కర్మముల యందు అకర్మమునే చూచునో వానికి సర్వకర్మసన్న్యాసమునందే యధికారము, కర్మము లేదని యెఱుంగుటవలన. మృగతృష్ణికయందు జలబుద్ధిచేఁ బానంబునకుఁ బ్రవర్తించినవాఁడు జలము లేదని యెఱింగిన పిమ్మటఁ గూడ నందే పానప్రయోజనమునకుఁ బ్రవర్తింపఁడు గదా!

పరమార్థదర్శి యగువాఁడు తాను జూచునపుడు గాని వినునపుడు గాని స్పృశించునపుడుగాని మూర్కొనునపుడుగాని భుజించునపుడుగాని నడచునపుడుగాని నిద్రించునపుడు గాని శ్వాసము విడుచునపుడు గాని పలుకునప్పుడు గాని విసర్జించునపుడుగాని గ్రహించునపుడుగాని కన్నుదెఱచునపుడుగాని మూయునపుడుగాని ఆయాయింద్రియములు తమతమవిషయములందు వర్తించుచున్నవి గాని తా నేమియుఁ జేయుట లేదని సమాహితుఁడై యెఱింగి యున్నాఁడని తాత్పర్యము.

అ. కర్మముల నంగీకరించి వానిచే నీవిద్వాంసునకు బంధము లేదని చెప్పఁబడినది. ఇప్పుడు వాస్తవమున వీనికిఁ గర్మములే లేవని చెప్పుచున్నారు ఇతఁడేమో ఇత్యాదిగా. లోకదృష్టిచే విద్వాంసునకుఁగూడఁ గర్మములు కలవని యాశంకించి తనదృష్టిచే కర్మములు లేవను నభిప్రాయముతోఁ జెప్పుచున్నారు నైవేత్యాదిగా. పైసార్ధశ్లోకము నాకాంక్షాపూర్వకముగాఁ దీయుచున్నారు ఎప్పుడు ఇత్యాదిగా. చక్షురాదిజ్ఞానేంద్రియంబులును వాగాదికర్మేంద్రియంబులును బ్రాణాదివాయుభేదములును అంతఃకరణచతుష్టయంబును దమతమవ్యాపారముల నెఱవేర్చునప్పుడు తత్తద్విషయంబులం దింద్రియంబులే ప్రవర్తించుచున్నవని యనుసంధించుచు నైవ కించిత్కరోమి యని విద్వాంసుండు ప్రతిపన్నుం* డగుచున్నాఁడని యర్థము. ఇట్టి విద్వాంసునకు విధి లేక యున్నను విద్యాసామర్థ్యంబువలనఁ బ్రతిపత్తి కర్మ

♦ మూత్రాదికమును.

* ఎఱింగినవాఁడు.

భూతం ♦ బగుఫలరూపకర్మసన్న్యాసము నుద్దేశించుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. అజ్ఞానకుం బోలె విద్వాంసునకుఁ గర్మములందుఁ బ్రవృత్తి సంభవించుటవలన నెట్లు సన్న్యాసంబునం దధికారం బగు నని యాశంకించి చెప్పుచున్నారు మృగతృష్ణిక యందు ఇత్యాదిగా.

హ. అందువలన.—ఆత్మ యకర్త యగుటవలన, కించిత్ నైవ కరోమి= కొంచెమైనను నేను జేయనే చేయను; ఇతి; మన్యేత, వానిదర్శనాదులందుఁ గర్తృత్వము అవిద్యవలన నితరులకుఁ దోఁచుచున్నను. పశ్యన్ = రూపమును జూచుచు; శృణ్వన్ = శబ్దమును వినుచు; స్పృశన్ = స్పర్శము గ్రహించుచు; జిఘ్రన్ = గంధమునూర్కొనుచు; అశ్నన్ = అన్నము భుజించుచు; గచ్ఛన్ = పాదములచే విహరించుచు; స్వపన్= నిద్రించుచు; శ్వసన్ = శ్వాసము విడుచుచు; అట్లు; ప్రలపన్ = మాటలాడుచు; విసృజన్ = మూత్రపురీషములను విడుచుచు; గృహ్ణన్ = చేతిచేఁ దీసికొనుచు; ఉన్మిషన్ = కన్నుదెఱచుచు; నిమిషన్నపి = కన్నుమూయుచును; ఇన్ద్రియాణి = చక్షురాదులు; ఇన్ద్రియార్థేషు — విషయాభిముఖముగా; వర్తన్తే; ఇతి; ధారయన్ = తలంచుచు; నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ అని పూర్వముతో సంబంధము. అట్లు సర్వకాన్యకరణచేష్టారూపము లగుకర్మములందు అకర్మమునే చూచుచుండు సమ్యగ్దర్శి యగు తత్త్వవిదునకు సర్వకర్మసన్న్యాసమునందే యధికారము, తత్కర్మము లే దని యెఱుంగుటవలన. మృగతృష్ణికయందు జలము గల దనుబుద్ధిచే త్రాగుటకు ప్రవర్తించినను జలము లే దని యెఱింగినపిదప నందే త్రాగుటకుఁ బ్రవర్తింపరు గదా!

శం. యోగయుక్తత్వాదు లగు విద్వల్లక్షణము లయిదింటితోనుం గూడిన బ్రహ్మవిదుఁడు తానాహారాదులందుఁ బ్రవర్తించినపుడు దర్శనాదీంద్రియవ్యాపారములందు నేను జేయుట లేదు అను బుద్ధి గలిగి యుండు నని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—తత్త్వవిత్ = ఆత్మయాథాత్మ్యము నెఱింగినవాఁడు బ్రహ్మవిదుఁడు యతి; యుక్తః = తాను కూటస్థాసంగుఁడు, లోపలను వెలుపలను బరిపూర్ణుఁడు అను ప్రజ్ఞతోఁ గూడినవాఁడై; తాను వెలుపల, పశ్యన్; అశ్నన్=భక్షణము చేయుచు; స్వపన్ = నిద్రను జేయుచు; శ్వసన్ = ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములు చేయుచు; ఉన్మిషన్నిమిషన్నపి = కన్ను దెఱచుట మూయుటలను జేయుచున్నను; ఇన్ద్రియార్థేషు = శబ్దాదివిషయములందు; ఇన్ద్రియాణి = శ్రోత్రాదీంద్రియములే;

♦ జ్ఞానమునకు—నేఁ జేయుట లే దను నెఱుకకు కర్మమైనది.

వర్తనే. నేను జూచువాఁడను గాను వినువాఁడను గాను స్పృశించువాఁడను గాను మూర్కొనువాఁడను గాను భుజించువాఁడను గాను నడచువాఁడను గాను అనువృత్తినే సదా; ధారయన్; ఆయాకర్మముల నింద్రియములే చేయుచున్నవి, నేనో అవిక్రియుండ నగుటవలన దేనినిం జేయను, మఱేమనఁగా నాయాకర్మములకు సాక్షినై నిష్క్రియుండనై యూరకయే యున్నాను అని యిట్లు, మన్యేత—తన్ను ఆకార్యములందు నిష్క్రియునిగానే చూచుచుండును, దేహేంద్రియములందును తద్వ్యాపారంబు లందును నేను నాది యను భావనను విడిచి విద్వాంసుం డూరకయే యుండును. ఇట్లు తన్ను బ్రహ్మమును గానే చూచుచుండునట్టి బ్రహ్మవిదునకు దుష్టాన్నము స్వీకరించినను అదుష్టాన్నము స్వీకరించినను బాపలేపము గాని పుణ్యలేపము గాని లే దని సిద్ధం బని రెంటికి నర్థము.

**మ.** దీనినే వివరించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—చక్షురాదిజ్ఞానేంద్రియంబులును వాగాదికర్మేంద్రియంబులును బ్రాణాదివాయువులును అంతఃకరణచతుష్టయంబును వానివానిచేష్టలను జేయుచుండఁగా, ఇన్ద్రియాణి = ఇన్ద్రియాదులే; ఇన్ద్రియార్థేషు = తమతమవిషయములందు; వర్తన్తే = ప్రవర్తించుచున్నవి, నేనో ప్రవర్తింపను ఇతి = అని; ధారయన్ = నిశ్చయించుచు; నైవ కించిత్కరోమీతి; మన్యేత = ఎఱుంగుచున్నాఁడు; తత్త్వవిత్ = పరమార్థదర్శి; యుక్తః = సమాహిత మగు చిత్తము గలవాఁడై. లేక. మొదట, యుక్తః = కర్మయోగముతోఁ గూడినవాఁడై; పిమ్మట, అంతఃకరణశుద్ధిద్వారంబున, తత్త్వవిత్ = పరమార్థదర్శియై; నైవ కించిత్కరోమీతి మన్యేత అని యన్వయము. అందు, దర్శన శ్రవణ స్పర్శన ఘ్రాణా శనంబులు * జ్ఞానేంద్రియంబు లగు చక్షుశ్శ్రోత్ర త్వక్ ఘ్రాణరసనలు ఐదింటి వ్యాపారములు పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ అని చెప్పఁబడినవి. పాదములకు గతి, వాక్కునకుఁ బ్రలాపము, పాయూపస్థములకు విసర్గము, హస్తములకు గ్రహణము కావునఁ గర్మేంద్రియములనైదింటివ్యాపారములు గచ్ఛన్ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ అని చెప్పఁబడినవి. శ్వసన్ అనునది ప్రాణాదిపంచకవ్యాపారోపలక్షణము. అట్లు ఉన్మిషన్ నిమిషన్ అనుట నాగకూర్మాదిపంచకవ్యాపారములకును స్వపన్ అనుట యంతఃకరణచతుష్టయవ్యాపారములకు నుపలక్షణము. అర్థక్రమమును బట్టి పాఠక్రమమును దప్పించి వ్యాఖ్యానము చేయఁబడియె. ఎందువలన సర్వవ్యాపారంబులందును దాను అకర్త యనియే చూచుచున్నాఁడో అందువలన కుర్వన్నపి నలిప్యతే అని యుక్తమే చెప్పఁబడినది యని భావము.

* అశనము—భక్షించుట.

శ్రీ. కర్మమును జేయుచున్నను లేపము నొందఁ డనుట విరుద్ధం బని యాశంకించి కర్తృత్వాభిమానము లేమివలన విరుద్ధము కా దని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—కర్మయోగముతోఁ గూడినవాఁడై క్రమంబున తత్త్వవిదుండైనవాఁడు దర్శనశ్రవణాదులం జేయుచున్నను, ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి, ధారయన్ = బుద్ధిచే నిశ్చయించినవాఁడై; కించి దపి = దేనిని గూడ; నేను, నకరోమి; ఇతి; మన్యేత = తలంచుచున్నాఁడు. అందు, దర్శనశ్రవణస్పర్శనఘ్రాణాశనంబులు చక్షురాది జ్ఞానేంద్రియవ్యాపారములు, గమనము పాదములకు, స్వాపము బుద్ధికి, శ్వాసము ప్రాణమునకు, ప్రలపనము వాక్కునకు, విసర్జనము పాయూపస్థములకు, గ్రహణము హస్తములకు, ఉన్మేషనిమేషములు కూర్మాఖ్య మగు నుపప్రాణమునకు వ్యాపారము లని వివేకము. ఈకర్మములను జేయుచున్నవాఁ డయ్యును అభిమానము లేమివలన బ్రహ్మవిదుఁడు లేపము నొందఁడు. అట్లు పరమర్షికృత మగు సూత్రము «తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్» ♦ అని.

వ. ఇఁక «కుర్వన్నపి నలిప్యతే» అనుటచేఁ గర్తృత్వాభిమానశూన్యుఁ డని చెప్పఁబడినది యని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—యుక్తః = కర్మయోగముతోఁ గూడినవాఁడై; శుద్ధచిత్తుఁడై క్రమంబున, తత్త్వవిత్ = తత్త్వము నెఱింగినవాఁడై; జ్ఞానేంద్రియంబులయుఁ గర్మేంద్రియంబులయు ప్రాణములయు వ్యాపారం బగు కర్మమును, నేను దేనిని జేయుట లే దని యెఱుంగును. ఇఁక దానినే చెప్పుచున్నాఁడు.—పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ అని జ్ఞానేంద్రియవ్యాపారము. అట్లు, గచ్ఛన్ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ అని కర్మేంద్రియవ్యాపారము. అట్లు, స్వపన్ శ్వసన్ ఉన్మిషన్ నిమిషన్ అని ప్రాణవ్యాపారము. దీనినంతయు నేను దేనిని జేయ నని యెఱుంగుచున్నాఁడు. ఓయీ! చేయుచున్నకార్యమును దీనిని నేను జేయుచున్నానని యెవ్వఁడును దెలియనే తెలియుచున్నాఁడు, అతఁ డెట్లు నేను జేయ నని యెఱుంగుచున్నాఁ డని యాశంకించి చెప్పుచున్నాఁడు.—ఇన్దతి—ఎఱుంగుచున్నాఁడు అనువ్యుత్పత్తిచే ఇంద్రుఁ డనఁగాఁ బరమాత్మ, తత్సంబంధు లింద్రియములు—చక్షురాదులు; ఇన్ద్రియార్థేషు = రూపరసాదులందు, వర్తన్తే = ప్రవర్తించుచున్నవి, లేక, వృత్తిరూపంబున నున్నవి; అని, ధారయన్ = స్థిరీకరించుచు.

♦ బ్రహ్మము దెలిసిన పిమ్మట భవిష్యత్పాపములకు అంటకుండుటయును బూర్వపాపములకు నాశము అగును, అట్లు చెప్పఁబడుటవలన, బ్రహ్మసూత్రము. అ ౪. పా ౧. సూ ౧౩.

రా. ఇట్లు సౌకర్యంబువలనను శీఘ్రము మగుటవలనను గర్మయోగమే శ్రేయం బగుటవలన దానికిఁ గావలసినదాని వినుము.—ఇట్లు ఆత్మతత్త్వవిదుఁడు శ్రోత్రాదిజ్ఞానేంద్రియములును వాగాదికర్మేంద్రియంబులును బ్రాణంబులును తమవిషయంబులందు వర్తించుచున్న వని, ధారయన్ = అనుసంధించుచు, నేను, న కించిత్కరోమి—దేనినిం జేయను అని తలంపవలయును, జ్ఞానైకస్వభావుండ నగు నాకుఁ గర్మమూలంబు లగు నింద్రియప్రాణములసంబంధముచేఁ గలుగునట్టి యిట్టి కర్తృత్వము స్వరూపప్రయుక్తము కా దని తలంపవలయు నని యర్థము.

మా. సన్న్యాసమును స్పష్టీకరించుచున్నాఁడు మరల రెండుశ్లోకములచేత.

బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః
లిప్యతే న స పాపేన పద్మపత్త్రి మివా ఽమ్భసా.   ౧౦

భా. ఎవ్వఁడు మఱి యతత్త్వవిదుఁడు కర్మయోగమునందుఁ బ్రవృత్తుఁడై.—బ్రహ్మణి = ఈశ్వరునందు; ఆధాయ = ఉంచి, ఈశ్వరార్థము కర్మము చేయుచున్నా నని స్వామికొఱకు భృత్యునివలె; కర్మాణి = సర్వకర్మములను; మోక్షమునందుఁగూడ ఫలమునందు, సఙ్గమ్ = ఆసక్తిని; త్యక్త్వా = విడిచి; యః = ఎవ్వఁడు; కరోతి = చేయుచున్నాఁడో సర్వకర్మములను. సః = అతఁడు; పాపేన = పాపముచేత; నలిప్యతే = సంబంధింపఁబడఁడు. పద్మపత్త్రిమివ = తామరాకువలె; అమ్భసా = ఉదకముచేత.

తత్త్వము నెఱుంగనివాఁ డెవ్వఁడు కర్మయోగమునందుఁ బ్రవర్తించినవాఁడై తాను జేయుకర్మముల నీశ్వరునకు సమర్పించి యేఫలము నపేక్షింపక సర్వకర్మములనుం జేయుచున్నాఁడో, తామరాకు నీటిలో నున్నను నీటితో నంటని యట్లు అతఁడు కర్మముఁ జేయుచున్నను దత్కర్మముతో నంటఁ డని తాత్పర్యము.

ఆ. అప్పుడు విద్వాంసునివలె నవిద్వాంసుఁడును గర్మమునందుఁ బ్రవర్తింపఁగూడదు, పాపము సంభవించుటవలన. అని యాశంకించి చెప్పుచున్నారు. ఎవ్వఁడు మఱి ఇత్యాదిగా. ఎట్లు భృత్యుఁడు స్వామికొఱకుఁ గర్మములను జేయుచున్నాఁడో తనకు ఫలము నపేక్షింపఁడో, అట్లే యవిద్వాంసుఁ డెవ్వఁడు మోక్షమునందుఁగూడ నపేక్ష విడిచి భగవదర్థముగనే కర్మములను జేయుచున్నాఁడో అతఁడు తాఁ

కేయు కర్మముచే బద్ధుఁడు కాఁడు. ఎట్లు తామరాకు జలముతో నంటదో అట్లు. అని యర్థము.

హ. ♦. ఆకర్మములకుఁ గేవలము సత్త్వశుద్ధిమాత్రమే ఫలం బగును. *

శ్లో. ఓయీ! తన్ను అవిక్రియ మగు పరబ్రహ్మమును గానే యెఱుంగు నట్టి బ్రహ్మవిదుఁ డగుమహాత్మునకుఁ గర్మలేపము లేక పోవుఁ గాక. కర్మములందుఁ బ్రవృత్తుఁడై ముముక్షు వగునవిద్వాంసునకో కర్మలేపము కానే యగును. వాని కేమి గతి? అని యాశంకింపఁగా, వానికిని నిష్కాముఁడై నాభక్తుఁడై నాయందు సర్వకర్మములు సమర్పించినవానికిఁ గర్మలేపము లే దని చెప్పుచున్నాఁడు.—యః = ఎవ్వఁడు మఱి ముముక్షువు అనాత్మజ్ఞుఁడు; సఙ్గమ్ = సంగ మనఁగా ఫలమునం దపేక్ష, దానిని; త్యక్త్వా = విడిచి, కర్మఫలమునందు దేనియందును అపేక్ష చేయక దుఃఖము ప్రాప్తించినను దానికి నివృత్తి నపేక్షింపనివాఁడై; బ్రహ్మణి = సగుణుఁ డను పరమేశ్వరుఁడ నగు నాయందు; కర్మాణి = సమస్తకర్మములను; ఆధాయ = ఉంచి, కర్తృత్వమును కారయితృత్వమును § భోక్తృత్వమును భోజయితృత్వమును ❡ స్థాపించి; నాకు అర్పించుబుద్ధిచే శ్రద్ధతోను భక్తితోను నిత్యనైమిత్తికకర్మములను, కరోతి = చేయుచున్నాఁడో; సః = నాభక్తుఁడైన యతఁడుగూడ; పాపేన = బంధ జనకమగు కర్మముచే, ఎట్లు పాపము జన్మాదిబంధమునకుఁ గారణమో అట్లు పుణ్యము గూడ జన్మాదిబంధకారణమే యగుచున్నది, కావున వైదికకర్మము జన్మాదిబంధ హేతు వగుటవలనఁ బాప మని చెప్పఁబడుచున్నది, అట్టి పాపముచే; నలిప్యతే. పద్మపత్త్రము ఎట్లు జలముచే లిప్తము గాదో అట్లు నాభక్తుఁడు కర్మముచే లిప్తుఁడు గాఁ డని యర్థము.

మ. అప్పుడు అవిద్వాంసుఁడు కర్తృత్వాభిమానము గలవాఁ డగుట వలన లిప్తుఁడే యగును, ఇఁక నెట్లతనికి సన్న్యాసపూర్వక మగుజ్ఞాననిష్ఠ సిద్ధించును? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—బ్రహ్మణి = పరమేశ్వరునందు; ఆధాయ = సమర్పించి; సఙ్గమ్ = ఫలాభిలాషను; త్యక్త్వా = విడిచి, స్వామికొఱకు భృత్యునివలె నాఫలముకొఱకుఁ గాదు చేయుట యనునభిప్రాయముచే; కర్మాణి=

♦ శంకరభాష్యముతో సమానము.

* అని విశేషము.

§ చేయించుటను.

❡ భుజింపఁజేయుటను.

లౌకికకర్మములను వైదికకర్మములను, యః కరోతి=ఎవ్వఁడు చేయుచున్నాఁడో, సః= అతఁడు; పాపేన—పాపపుణ్యాత్మక మయినకర్మముచేత నని యర్థము; నలిప్యతే. ఎట్లు పద్మపత్త్రము దానిమీఁద నుంచినజలముచే లిప్తము గాదో అట్లు. భగవ దర్పణబుద్ధిచే ననుష్ఠించుకర్మమునకుఁ జిత్తశుద్ధియే ఫలం బగును.

శ్రీ. అప్పుడు, ఎవ్వనికిఁ జేయుచున్నా నను నభిమానము గలదో వానికిఁ గర్మలేపము నివారింప శక్యము గాదు. చిత్తశుద్ధి లేనివాఁ డగుటవలన సన్న్యాసం బును సిద్ధింపదు. కావున నతనికి గొప్పసంకటము సంభవించె నని యాశంకించి చెప్పుచున్నాఁడు.—బ్రహ్మణి ఆధాయ = పరమేశ్వరునందుసమర్పించి; దానిఫలము నందును, సఙ్గం త్యక్త్వా; యః కర్మాణి కరోతి=ఎవఁడు కర్మములను జేయుచున్నాఁడో; సః = అతఁడు; పాపేన = బంధహేతు వగుటచేఁ బాపిష్ఠ మైన పుణ్యాపాపాత్మక మగు కర్మముచేత; నలిప్యతే. ఎట్లు పద్మపత్త్రము జలమునం దున్నను జలముచే లిప్తము గాదో అట్లు.

ప. బ్రహ్మణి = అర్థప్రతీతిరూప మయిన బ్రహ్మమునందు; కర్మాణి= దర్శన శ్రవణాదులను; ఆధాయ = ఆరోపించి; సఙ్గమ్= కర్తృత్వాభిమానమును; త్యక్త్వా= విడిచి; యఃకరోతి; సః; పాపేన=బంధహేతు వగుకర్మముచే; నలిప్యతే. శాతపథశ్రుతి యును « వదన్ వాక్పశ్యన్ చక్షుః శృణ్వన్ శ్రోత్రం మన్వానో మనస్తాన్యస్యైతాని కర్మనామాని, ఆత్మైవాస్య కర్మాత్మనా హి కర్మ కరోతి» అని. స్పష్టము. అట్లు బృహదారణ్యకమునందును « కో ఽయమాత్మేతి వయ ముపాస్మహే కతరః స ఆత్మా యేన వా పశ్యతి యేనవా శృణోతి యేనవా గన్ధా నాజిఘ్రతి యేన వాచం వ్యాకరోతి యేన వా స్వాదుచా ఽస్వాదు విజానాతి యచ్చేతద్ధృదయం మనశ్చైతత్సంజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేధా ధృతి ర్మనీషా జూతి స్స్మృతి స్సంకల్పః క్రతు రసుః కామో వశ ఇతి సర్వాణ్యేతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవన్తి" అని. ఈశ్రుతికర్థము స్పష్టము. ఇట నిది యభిప్రాయము—పశ్యన్ శృణ్వ న్నిత్యాదులందు బుద్ధిప్రాణకర్మములు కర్తృత్వాభిమానము లేకుండుటయందు దృష్టాంతముగాఁ జెప్పఁబడినవి. ఎట్లనఁగా స్వపన్ = నిద్రను జేయుచు, నిద్ర యనఁగా మనస్సు నిరింద్రియప్రదేశమున నుండుట, అది సంకల్పము లేకయె కలుగుచున్నది. అట్లే శ్వాసోచ్ఛ్వాసనిమేషోన్మేషములుగూడ సంకల్పము లేక కలుగుచున్నవి. వానివలె దర్శనాదికర్మములనుగూడఁ జెప్పినవిధంబున నిశ్చయించుచు. అందువలననే

తత్త్వవిత్ అని విశేషణము. ఇట్లు కర్మమునందుఁ బ్రవర్తించుచున్నను కర్మములచే లిప్తుఁడు గాఁ డనుటకు దృష్టాంతము చెప్పుచున్నాఁడు పద్మపత్త్రమివ అని. అట్లు చెప్పఁబడినది «స్ఫటికః ప్రతిబిమ్బేన యథా నాయాతి రఞ్జనమ్ । తత్త్వజ్ఞః కర్మఫలే నాస్త స్తథా నాయాతి రఞ్జనమ్ ''♦ అని.

రా. బ్రహ్మశబ్దముచే నిటఁ బ్రకృతి చెప్పఁబడుచున్నది. «మమ యోనిర్మహద్బ్రహ్మ» అని గదా చెప్పఁబోవుచున్నాఁడు. ఇంద్రియములు ప్రకృతిపరిణామవిశేషరూపంబు లగుటచే నింద్రియాకారంబున నున్న, బ్రహ్మణి = ప్రకృతియందు; పశ్యఞ్ శృణ్వ న్నిత్యాదిశ్లోకమునందుఁ జెప్పఁబడినవిధంబునఁ గర్మమును బ్రహ్మమునందు—ప్రకృతియందు, ఆధాయ = ఉంచి, సఙ్గమ్ త్యక్త్వా = ఫలాసక్తిని విడిచి, నైవ కించి త్కరోమి అని, యః కర్మాణి కరోతి=ఎవఁడు కర్మములను జేయుచున్నాఁడో; సః=అతఁడు ప్రకృతిసంసృష్టుఁడై యున్నను; ప్రకృతియం దాత్మాభిమానరూప మయిన, పాపేన=బంధహేతు వగుపాపముచేత; నలిప్యతే. పద్మపత్త్రమివామ్భసా—ఎట్లు తామరాకుజలముతో సంసృష్టమైయున్నను జలముచే లిప్తము గాదో అట్లు లిప్తుఁడు గాఁ డని యర్థము.

ఇంద్రియాకారంబున నున్నప్రకృతియే సర్వకర్మములను జేయుచున్న దని నిశ్చయించి ఫలాసక్తిని విడిచి నేను దేనిని జేయుట లే దను నిశ్చయముతో నెవఁడు కర్మములను జేయుచున్నాఁడో అతఁడు ప్రకృతిసంసృష్టుఁ డయియున్నను, జలముతోఁ గూడియున్నను పద్మపత్త్రము జలముతో నంటనియట్లు, ప్రకృతియందు ఆత్మాభిమానముతో నంటఁ డని తాత్పర్యము.

మహా సన్న్యాసముతోను యోగముతోను గూడినవాఁడే కర్మముచే లిప్తుఁడు గాఁ డని చెప్పుచున్నాఁడు.—సాధననియమమును చెప్పుట * ఉపచారం బను తలంపు గలుగ కుండుటకై మాటిమాటికి ఫలము చెప్పుట.

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రిన్ద్రియై రపి ।
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాఽఽత్మశుద్ధయే. ౧౧

---

♦ స్ఫటికము ప్రతిబింబముచే నెట్లు రంజనము—రక్తతను బొందదో, అట్లు ఆకర్మమునం దున్న వాఁడై కర్మఫలముచే లోపల రంజనము నొందఁడు.

* సన్న్యాసయోగములే సాధనము లని నియమించుట.

**భా.** కేవలము సత్త్వశుద్ధిమాత్రమే యాకర్మమునకు ఫలము. ఎందు వలన ననఁగా.—కాయేన = దేహముచేతను; మనసా = మనస్సుచేతను; బుద్ధ్యా = బుద్ధిచేతను; కేవలైః = మమత్వము లేనట్టి, ఈశ్వరునికొఱకే కర్మము చేయుచున్నాను, నాకు ఫలముకొఱకుఁ గాదు అని మమత్వ బుద్ధి లేని యిట్టి; ఇన్ద్రియైరపి = ఇంద్రియములచేతను; కేవలశబ్దము కాయాదులతోఁ గూడ ప్రత్యేకము సంబంధించుచున్నది, సర్వవ్యాపారంబులందును మమత్వవర్జనముకొఱకు; యోగినః = కర్మయోగులు; కర్మ = కర్మమును; కుర్వన్తి = చేయుచున్నారు; సఙ్గమ్ = ఫలవిషయమయినయాసక్తిని; త్యక్త్వా = విడిచి; ఆత్మశుద్ధయే—సత్త్వశుద్ధికొఱకని యర్థము. అందువలన దానియందే నీ కధికారము కావునఁ గర్మమునే చేయుము.

మమత్వబుద్ధి వర్జించి దేహముచేతను మనస్సుచేతను బుద్ధిచేతను ఇంద్రియములచేతను గర్మయోగనిష్ఠులు ఫలాసక్తి లేనివారై సత్త్వశుద్ధికొఱకుఁ గర్మము చేయుచున్నారు. అందువలన నట్లు చేయుకర్మమునకు సత్త్వశుద్ధియే ఫల మని తా.

**ఆ.** అప్పు డవిద్వాంసునకుఁ జేసినకర్మముచే నేమి కలుగును? అని యాశంకించి చెప్పుచున్నారు కేవలము ఇత్యాదిగా. అజ్ఞునకు ఈశ్వరార్పణబుద్ధిచే ననుష్ఠించినకర్మము చిత్తశుద్ధిని గలిగించు ననుటకే హేతువు చెప్పుచున్నారు ఎందు వలన ననఁగా అని. కేవలశబ్దమును బ్రత్యేకముగా నన్వయించుటకుఁ బ్రయోజనము చెప్పుచున్నారు సర్వవ్యాపారంబులందును ఇత్యాదిగా. కర్మమునకుఁ జిత్తశుద్ధి ఫలంబగుటచేఁ జిత్తశుద్ధికొఱకుఁ గర్మానుష్ఠానమునే నీవు చేయువలయు నని ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

**హ.** *

**శం.** ఓయీ! కామన లేక కర్మములఁ జేయువారి కేమి ఫలము? అని యాశంకించి, ఆత్యంతికసంసారదుఃఖవిధ్వంసకమయినవిజ్ఞానమును గలిగించునట్టి చిత్తశుద్ధియే ఫలం బని తెలుపుటకై ముముక్షువులు చిత్తశుద్ధికొఱకే కర్మము చేయుచున్నా రని చెప్పుచున్నాఁడు.—యోగినః = కర్మయోగులు ముముక్షువులు; సఙ్గమ్ = దీనిచే పురుషుఁడు కర్మఫలములందు సక్తుఁ డగుచున్నాఁడు అనువ్యుత్ప

* శంకరభాష్యముతో సమానము.

త్తిచే సంగ మనఁగా ఫలవిషయక మయినకామము, దానిని; త్యక్త్వా = విడిచి, ఫలాపేక్షను నిశ్శేషముగాఁ బరిత్యజించి; పరమేశ్వరప్రీతికొఱకే, కాయేన; మనసా; బుద్ధ్యా, కేవలైః ఇన్ద్రియైరపి; ఆత్మశుద్ధయే = సత్త్వశుద్ధికొఱకే. కర్మ = వైదిక కర్మమును; నియమంబున, కుర్వన్తి లేక. ఏదేని చేయవలసినది మనస్సుచే సంకల్పించి దానినే బుద్ధిచే నిశ్చయించి దానినే, కేవలైః = రాగద్వేషవర్జితము లగు; ఇన్ద్రియైః=ఇంద్రియములచేతను; కాయేన=దేహముచేతను, కర్మ, కుర్వన్తి. కాయేన ఇన్ద్రియైశ్చ=దేహముచేతను ఇంద్రియములచేతను, వైదికకర్మమును, బుద్ధిచే నిశ్చితమగువిష్ణ్వాదిరూపమును మనస్సుచే ధ్యానించుటను, కేవల మయిన శ్రోత్రముచేతఁ గథాశ్రవణమును, కేవల మైనచక్షుస్సుచే మహాత్ములదర్శనంబును, కేవల మయిన వాక్కుచే వేదాధ్యయనాదికమును, పాదములచేఁ దీర్థయాత్రాదికమును ఈశ్వర ప్రీతికొఱకుఁ జేయుచున్నా రని యర్థము.

మ. దానినే వివరించుచున్నాఁడు.—కాయేన మనసా, బుద్ధ్యా, ఇన్ద్రియైరపి, యోగినః = కర్ములు; ఫలసంగమును విడిచి, కర్మమును జేయుచున్నారు. కాయాదుల కన్నిటికి విశేషణము కేవలైః అనునది. ఈశ్వరునికొఱకే చేయుచున్నాను నాఫలము కొఱకుఁ గాదు అని మమత లేనట్టి కాయాదులచేత నని యర్థము. ఆత్మశుద్ధయే = చిత్తశుద్ధికొఱకు.

శ్రీ. కర్మము బంధకము కా దని చెప్పి మోక్షహేతు వనుటను సదాచారముచేఁ జూపుచున్నాఁడు.—కాయేన — దేహముచే స్నానాదికమును, మనసా—మనస్సుచే ధ్యానాదికమును, బుద్ధ్యా—బుద్ధిచేఁ దత్త్వనిశ్చయాదికమును, కేవలైః= కర్త్రాభినివేశము లేనట్టి, ఇన్ద్రియైః—ఇంద్రియములచే శ్రవణకీర్తనాదికమును, కర్మ = ఇట్టికర్మమును; ఫలాసక్తిని విడిచి చిత్తశుద్ధికొఱకుఁ గర్మయోగులు చేయుచున్నారు.

ప. *

రా. కాయమనోబుద్ధీంద్రియములచే సాధ్య మయినకర్మమును స్వర్గాదిఫలాసక్తిని విడిచి యోగులు, ఆత్మశుద్ధయే కుర్వన్తి—ఆత్మగత మైన ప్రాచీనకర్మబంధము నశించుటకొఱకుఁ జేయుచున్నా రని యర్థము.

మా. ఇట్టి యాచారముగూడ నని చెప్పుచున్నాఁడు కాయే నేత్యాదిగా.

* శ్రీధరీయముతో సమానము.

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే. ౧౨

భా. మఱియును.—యుక్తః = ఈశ్వరునికొఱకుఁ గర్మములు నాఫలము కొఱకుఁ గాదు అని సమాహితుఁడై ; కర్మఫలమ్= కర్మముయొక్క ఫలమును; త్యక్త్వా = విడిచి; నైష్ఠికీమ్ = నిష్ఠయందుఁ గలుగునట్టి; శాన్తిమ్= మోక్షమును; ఆప్నోతి= పొందుచున్నాఁడు. సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి సర్వకర్మసన్న్యాసము జ్ఞాననిష్ఠ—వీని క్రమంబున నని శేషము. ఇఁక ఎవ్వఁడు మఱి, అయుక్తః = సమాహితుఁడు కానివాఁడో అతఁడు; కామకారేణ=కార మనఁగా కరణము ♦ కామముయొక్క చేయుటచేత, కామముచేఁ బ్రేరితుఁ డగుటచేత నని యర్థము; నాకు ఫలముకొఱకు దీనిఁ జేయుచున్నానని, ఫలే = ఫలమునందు; సక్తః = ఆసక్తి గలవాఁడై; నిబధ్యతే=బంధింపఁబడుచున్నాఁడు. అందువలన నీవుయుక్తుఁడవుక మ్మని యర్థము.

ఈశ్వరార్థము కర్మము చేయుచున్నాను, నాకు ఫలముకొఱకుఁ గా దని నిశ్చయము గలవాఁడై ఫలమును విడిచి కర్మము చేయుటవలన సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి సర్వకర్మసన్న్యాసపూర్వకముగా జ్ఞాననిష్ఠ నొంది మోక్షము నొందుచున్నాఁడు. అట్టి నిశ్చయము లేనివాఁడో కామప్రేరితుఁడై ఫలాసక్తి నొంది బంధము నొందుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. ఇందువలనఁ గూడ సంగము విడిచి కర్మానుష్ఠానమును నీవు చేయవలయు నని చెప్పుచున్నారు మఱియును అని. యుక్తుఁడై ఫలము విడిచి కర్మము చేయువాఁడు మోక్షాఖ్యశాంతిని పొందుచున్నాఁడు కావున నీవు సంగము విడిచి కర్మము చేయనలయునని యాశయము. అట్లుకానిచో దోషము చెప్పుచున్నాఁడు త్తరార్ధముచేత. యుక్తః అనుదానికి వ్యాఖ్యానము చేయుచున్నారు ఈశ్వరునికొఱకు ఇత్యాదిగా. కర్మముయొక్క ఫలమును విడిచి—కర్మమును చేయుచు నని శేషము. నైష్ఠికశాంతినే వివరించుచున్నారు సత్త్వశు ద్ధిత్యాదిగా. ఉత్తరార్ధమును విభజించుచున్నాను ఇఁక నెవ్వఁడు ఇత్యాదిగా. సమాహితుఁడు కానిచో దోషము కలుగుటవలన అర్జునుని నియోగించుచున్నారు అందువలన నిత్యాదిగా.

---

♦ చేయుట.

హ. ♦.

౧౨. శ్రద్ధతోను భక్తితోను ఈశ్వరప్రీతికొఱకే కామన లేక కర్మము చేయువారలకును వేఱువిధంబునఁ జేయువారలకును ఫలము చెప్పుచున్నాఁడు.—ఎవ్వఁడు సదసద్వివేకి మోక్షేచ్ఛచే, కర్మఫలమ్ త్యక్త్వా = తా ననుష్ఠించు కర్మముల ఫలమును అపేక్షింపక; యుక్తః = యుక్తుఁ డగుచున్నాఁడో, లాభాఽలాభములందును సిద్ధ్యసిద్ధులందును సముఁడై పరమేశ్వరప్రీతికొఱకే యెవ్వఁడు కర్మముఁ జేయుచున్నాఁడో; వాఁడే, నైష్ఠికీమ్ = కర్మనిష్ఠచేఁ గలుగునట్టి; శాన్తిమ్ = చిత్తశుద్ధిని; అప్నోతి = పొందుచున్నాఁడు. లేక, నైష్ఠికీమ్ = కర్మనిష్ఠాజన్య మగుచిత్తశుద్ధిచేఁ బుట్టింపఁబడునట్టి జ్ఞానముచేఁ బ్రకాశిత మగు; శాన్తిమ్ = మోక్షమును; ఆప్నోతి. ఇఁక నెవ్వఁడు అవివేకి, కామకారేణ = కామనచేత; ఫలే = కర్మఫలమునందు; సక్తః = ఆసక్తి గలవాఁడై; అయుక్తః= మీఁదఁ జెప్పినలక్షణము గల కర్మానుష్ఠానము చేయువాఁడు కాఁడో; అతఁడు, నిబధ్యతే = జ్ఞానము కలుగ కుంటచే జన్మాదిబంధము గలవాఁ డగుచున్నాఁడు. అందువలన నీ వట్టియోగముతోఁ గూడినవాఁడ వగు మని యర్థము. ఇందుచే, నిష్కాముఁడు చేయుకర్మము మోక్షము కలిగించును, సకాముఁడు చేయుకర్మము బంధము కలిగించు నని సూచిత మగుచున్నది.

మ. కర్తృత్వాభిమానము సమముగా నున్నను ఆకర్మముచేతనే నొకఁడు ముక్తుఁ డగును, ఒకఁడుమాత్రము బద్ధుఁ డగును అని వైషమ్యమున కేమి హేతు వనఁగాఁ జెప్పుచున్నాఁడు.—యుక్తః = ఈశ్వరునికే యీకర్మములు నాకు ఫలము కొఱకుఁ గావు అనునభిప్రాయము గలవాఁడు; కర్మఫలం త్యక్త్వా; కర్మములను జేయుచు; నైష్ఠికీమ్—సత్త్వశుద్ధి నిత్యానిత్యవస్తువివేకము సన్న్యాసము జ్ఞాననిష్ఠ—వీనిక్రమంబునఁ బుట్టిన యని యర్థము; శాన్తిమ్ = మోక్షమును; ఆప్నోతి = పొందుచున్నాఁడు. ఇఁక నెవ్వఁడు, అయుక్తః = ఈశ్వరునికే యీకర్మములు నాకు ఫలము కొఱకుఁ గావు అను నభిప్రాయము లేనివాఁడో, అతఁడు; కామకారేణ = కామము వలనఁ బ్రవర్తించుటచే; నాకు ఫలముకొఱకే యీకర్మమును జేయుచున్నా నని, ఫలేసక్తః; నిబధ్యతే = కర్మముచే మిక్కిలి సంసారబంధముఁ బొందుచున్నాఁడు. అందువలన నీవును యుక్తుఁడవై కర్మములను జేయు మని వాక్యశేషము.

♦ శంకరభాష్యముతో సమానము.

శ్రీ. ఓయీ! ఆ కర్మముచేతనే యొక్కఁడు ముక్తుఁ డగుచున్నాఁడు, ఒకఁడు బద్ధుఁ డగుచున్నాఁ డని వ్యవస్థ యెట్లు కానచ్చును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—యుక్తః = పరమేశ్వరునందే నిష్ఠ గలవాఁడై, కర్మముల ఫలమును విడిచి; కర్మములను జేయుచు, ఆత్యంతిక మయినశాంతిని—మోక్షమును పొందుచున్నాఁడు. అయుక్తః = బహిర్ముఖుఁడో; కామకారేణ = కామమువలనఁ బ్రవర్తించుటచేఁ; ఫలమునం దాసక్తుఁడై మిక్కిలి బంధమును బొందుచున్నాఁడు.

ప. ఇఁకఁ జిత్తశుద్ధికి ఫలముఁ జెప్పుచున్నాఁడు.—కర్మఫలం త్యక్త్వా; యుక్తః = చిత్తశుద్ధి నొందినవాఁడు; నైష్ఠికీమ్ = ఆత్యన్తిక మయిన ♦; శాన్తిమ్ = మోక్షమును; ఆప్నోతి. ఇఁక నయుక్తునిగతిఁ జెప్పుచున్నాఁడు.—అయుక్తః = బహిర్ముఖుఁడు; కామకారేణ = కామముచేఁ బ్రవర్తించుటచేత; ఫలే; సక్తః = ఆసక్తి నొందినవాఁడై; నిబధ్యతే.

రా. యుక్తః = ఆత్మవ్యతిరిక్తఫలములందు చాపలము లేనివాఁడై, ఆత్మయందే యాసక్తి గలవాఁడై; కర్మఫలం త్యక్త్వా—కేవలము ఆత్మశుద్ధికే కర్మముల ననుష్ఠించి; నైష్ఠికీమ్ = స్థిర మయిన; శాన్తిమ్ = ఆత్మానుభవరూప మయిన నిర్వృతిని; ఆప్నోతి = పొందుచున్నాఁడు. అయుక్తః = ఆత్మవ్యతిరిక్తఫలములందుఁ జాపలము గలవాఁడై, ఆత్మావలోకనమునందు విముఖుండై; కామకారేణ = కామప్రేరణచేత; ఫలేసక్తః; కర్మములను జేయుచు; నిబధ్యతే = నిత్యము కర్మములచే బంధింపఁబడుచున్నాఁడు, నిత్యసంసారి యగుచున్నాఁడు. అందువలన, ఫలాసక్తి లేనివాఁడై యింద్రియాకారంబునఁ బరిణతం బగుప్రకృతియందుఁ గర్మములను సన్న్యసించి ఆత్మబంధమోచనముకొఱకే కర్మములను జేయవలయు నని యభిప్రాయము.

ఆత్మవ్యతిరిక్తఫలములం దపేక్ష లేనివాఁడై కర్మఫలమును గోరక యాత్మశుద్ధి కొఱకు మాత్రమే కర్మములఁ జేయువాఁడు స్థిర మయిన యాత్మానుభవము నొందుచున్నాఁడు. ఆత్మవ్యతిరిక్తఫలములం దపేక్ష గలవాఁడో కామప్రేరితుఁడై ఫలాసక్తుఁడై కర్మముల ననుష్ఠించి నిత్యసంసారి యగు నని తాత్పర్యము.

మా. మరల యోగాదిసాధనము నియమించుటకై యుక్తాయుక్తులఫలము చెప్పుచున్నాఁడు.—యుక్తః = యోగముతోఁ గూడినవాఁడు.

---

♦ తిరుగుపాటు లేనట్టి.

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽఽస్తే సుఖం వశీ
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్. ౧౩

భా. ఇట్టి నెవ్వఁడు పరమార్థదర్శియో యతఁడు —సర్వకర్మాణి = సమస్తము లయిన కర్మములను; మనసా= మనస్సుచే; సన్న్యస్య=విడిచి; నిత్యమును నైమిత్తికమును కామ్యమును ప్రతిషిద్ధమును, ఈసర్వకర్మములను మనస్సుచే—వివేకబుద్ధిచేఁ గర్మాదికమునం దకర్మదృష్టిచే విడిచి యని యర్థము; సుఖమ్ = సుఖముగా; ఆస్తే = ఉన్నాఁడు; వాఙ్మనః కాయచేష్టలు విడిచినవాఁడై నిరాయాసుఁడై ప్రసన్నచిత్తుఁడై సర్వబాహ్యప్రయోజనములనూడినివర్తిల్లినవాఁడై యున్నాఁడు, కావున సుఖముగా నున్నాఁడని చెప్పఁబడుచున్నది; వశీ = జితేంద్రియుఁడై యని యర్థము. ఎచ్చట నెట్లున్నాఁడు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—నవద్వారే = ఏడు శీర్షణ్యములు ఆత్మ కుపలబ్ధిద్వారములు, క్రింద రెండు మూత్రపురీష ♦ విసర్గార్థములు, ఆద్వారములచేఁ దొమ్మిదిద్వారములు గలది యగు; పురే = పట్టనమునందిది యని శరీరము పట్టనముగాఁ జెప్పఁబడుచున్నది, ఆత్మయె ప్రభువుగాఁ గలదై తదర్థప్రయోజనంబులు * అనేకఫలవిజ్ఞానోత్పాదకంబు లగు నింద్రియమనోబుద్ధివిషయంబులచేఁ బౌరులచేతంబోలె నధిష్ఠితమై యుండునది, అట్టి నవద్వార మగుపురమునందు; దేహీ **; సర్వకర్మమును సన్న్యసించి యున్నాఁడు.

విశేషణముచే నేమి ప్రయోజనము? సర్వదేహియును గదా సన్న్యాసిగాని అసన్న్యాసి గాని దేహమునందే యున్నాఁడు. కావున నిరర్థకము విశేషణము ¶.

చెప్పెదము. ఎవ్వఁడజ్ఞుఁడు దేహేంద్రియసంఘాతమాత్రాత్మదర్శి§ యగు దేహి గలఁడో అట్టిసర్వదేహియును గృహమునందు భూమియందు ఆసనమునందుఁగాని యున్నాననితలంచును. దేహమాత్రాత్మదర్శికి గృహమునందువలె దేహమునం దున్నా ననుప్రత్యయము సంభవింపదు గదా!

---

♦ మలం.

* ఆత్మయొక్క—కార్యమె ప్రయోజనముగాఁ గలవి.

** దేహము గలవాఁడు—దేహముకంటెఁ దాను వేఱు అని యెఱింగినవాఁడై.

¶ నవద్వారే పురే అనునది.

§ దేహేంద్రియ సంఘాతమే యాత్మ యని యెఱింగినవాఁడు.

దేహాదిసంఘాతవ్యతిరిక్తుఁడు ఆత్మ యని యెఱింగినవానికి దేహమునం దున్నా ననుప్రత్యయ ముపపన్న మగుచున్నది. పరుఁ డయిన యాత్మ యం దవిద్యచే నధ్యారోపితము లగు పరకర్మములను ♦ విద్యచే వివేక జ్ఞానంబున మనస్సుచే సన్న్యసించుటయు నుపపన్నమగుచున్నది. వివేక జ్ఞానము నొందిన సర్వకర్మసన్న్యాసికిఁ గూడ గృహమునందువలె నవ ద్వారపుర మగు దేహమునం దే యుండుట, ప్రారబ్ధఫలకర్మసంస్కార శేషం బనువర్తించుటచే దేహమునందే విశేష విజ్ఞానము * కలుగుట వలన సంభవించుచున్నది. దేహమునందే యున్నాఁడు అను విశేషణఫల ముండనే యున్నది, విద్వదవిద్వత్ప్రత్యయభేదాపేక్షం బగుటవలన.

కార్యకరణకర్మములను అవిద్యచే నాత్మయం దధ్యారోపితము లయినవాని సన్న్యసించి యున్నాఁడని చెప్పఁబడినది సరే. అట్లయి నను కర్తృత్వమును గారయితృత్వమును ఆత్మ సమవాయి ♦♦ యగు నని యాశంకించి చెప్పుచున్నాఁడు.—నైవకుర్వన్ = తాను జేయనివాఁడై యే; నకారయన్ = చేయింపనివాఁడై, కార్యకరణంబులను గర్మములయందుఁ బ్రవర్తింపఁ జేయనివాఁడై యే **.

కర్తృత్వమును గారయితృత్వము: ఏది గలదో అది యేమి స్వాత్మ సమవాయియై సన్న్యాసమువలన లేకపోవుచున్నదా? ఎట్లు నడచుచున్న వానిగమనము గమనవ్యాపారము విడుచుటవలన లేకపోవుచున్నదో అట్లు. లేక. ఏమి యాత్మకే యది లేదా ?

ఇందుకుఁ జెప్పెదము. లే దాత్మకుఁ దనకుఁ గర్తృత్వంబును గార యితృత్వంబును. చెప్పఁబడినది గదా « అవికార్యోఽయ ముచ్యతే, శరీ రస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే ” అని. « ధ్యాయతీవ లేలాయ తీవ » అనుశ్రుతివలనఁ గూడ.

పరమార్థదర్శి యగువాఁడో, సమస్తకర్మంబులను వివేకబుద్ధిచే సన్న్యసించి జితేంద్రియుండై తొమ్మిదిద్వారములు గలిగి తానుబ్రభువుగాఁ గలదై ఇంద్రియాదిపౌరు

♦ దేహేంద్రియాదికర్మములను.

* దేహమునం దున్నా నను జ్ఞానము.

♦♦ ఆత్మయం దుండునది.

** నవద్వారపురమునం దున్నాఁ డని యన్వయము.

లతోఁ గూడినదై పురమువలె నుండు దేహమునందుఁ దాను జేయకయు నింద్రియాదులచేఁ గూడఁ జేయింపకయు బాహ్యాపేక్ష లన్నియు లేనివాఁ డగుటచే సుఖముగా నున్నాఁ డని తాత్పర్యము.

ఆ. అప్పుడు ఫలాసక్తిని విడిచి యందఱును గర్మను చేయవలయును, కావునఁ గర్మసన్న్యాసము నిరవకాశం బగు నని యాశంకించి యవిద్వాంసునికంటె విద్వాంసునకు విశేషముఁ జెప్పుచున్నారు ఇఁక నెవ్వఁడు ఇత్యాదిగా. సర్వకర్మములను విడువఁగా మరణమే యగు ననుటను నిరాకరించుచున్నాఁడు ఆస్తే అని; జీవించియున్నవాఁడైనను ఆధ్యాత్మికాదిశరీరతాపముచేఁ దపించుచున్నాఁ డనఁగా నట్లు కా దని చెప్పుచున్నాఁడు సుఖమ్ అని. కార్యకరణసంఘాతమునకుఁ బరవశుం డనుటను నివారించుచున్నాఁడు వశీ అని. ఉండుటకు అపేక్షిత మయినయధికరణమును జూపుచున్నాఁడు నవద్వారే పురే అని. దేహసంబంధాభిమానాభాసము గలవాఁడని చెప్పుచున్నాఁడు దేహీ అని. మనస్సుచే సర్వకర్మసన్న్యాసము చేసినను లోకసంగ్రహార్థము వెలుపలికి సర్వకర్మములను జేయవలయు ననుటను నిరాకరించుచున్నాఁడు నైవకుర్వన్న కారయన్ అని. అపరిత్యాజ్యము-లైనసర్వకర్మములనే విశేషించుచున్నారు నిత్యమును ఇత్యాదిగా. వాని విడుచుటకు హేతువుఁ జెప్పుచున్నారు ఈసర్వకర్మములను ఇత్యాదిగా. సుఖమ్ ఆస్తే యని చెప్పినదానినే యుపపాదించుచున్నారు వాఙ్మనః కా యేత్యాదిగా. జితేంద్రియుఁడై—ఇది శరీరవశీకరణమునకును ఉపలక్షణము. రెండుశ్రోత్రములు రెండునేత్రములు రెండునాసికలు వాక్కు—ఒకటి ఇవి యేడు శీర్షణ్యములు—శిరోగతము లైనశబ్దాద్యుపలబ్ధిద్వారములు. అయినను నవద్వారం బెట్లనఁగా అధోగతములయినపాయూపస్థములతోఁ గూడ నని చెప్పుచున్నారు క్రింది నిత్యాదిగా. శరీరమునకుఁ బురసామ్యము ప్రభువుచేతను పౌరులచేతను అధిష్ఠితం బగుటచే నని చూపుచున్నారు ఆత్మయె ఇత్యాదిగా. దేహమునందు జీవించి యుండుటవలన దేహసంబంధాభిమానాభాసము గలవాఁడై యున్నను బరగృహమునందుఁ బ్రవాసివలె ♦ తత్సమ్మానావమానములచే సంతోషింపకయు దుఃఖింపకయు వ్యామోహాదులు లేకయు నున్నాఁ డనునభిప్రాయముతోఁ జెప్పుచున్నారు అట్టి నవద్వార మగు పురమునందు ఇత్యాదిగా.

విశేషణము నాక్షేపించుచున్నాఁడు విశేషణముచే నిత్యాదిగా. అది యనుపపన్నం బనుటనే యుపపాదించుచున్నాఁడు సర్వదేహీయు నిత్యాదిగా. దేహ

♦ దేశాంతరమున నున్న వానివలె.

మునం దుండుట సర్వసాధారణంబై యుండఁగా సన్న్యసించి దేహమునం దున్నాఁడు విద్వాంసుం డనువిశేషణము నిష్ప్రయోజన మని ఫలితముఁ జెప్పుచున్నాఁడు కావున నిత్యాదిగా.

విశేషణఫలము చూపుచు నుత్తరముఁ జెప్పుచున్నారు చెప్పెదము అని. విశేషణం బవివేకివిషయంబున సనర్థకమా? వివేకివిషయమున సనర్థకమా? అని వికల్పించి మొదటిపక్షము నంగీకరించుచున్నారు ఎవ్వండు ఇత్యాదిగా. అజ్ఞత్వము దేహిత్వమునకు హేతువు. ఆదేహిత్వము నే స్ఫుటీకరించుచున్నారు దేహేంద్రి యేత్యాదిగా. దేహాదిసంఘాతమే యాత్మ యని తలంచువానికిఁ గూడ దేహమున నున్నా నని తోఁపవచ్చు ననఁగా నట్లుగా దని చెప్పుచున్నారు దేహమా త్రేత్యాదిగా. రెండవపక్షము దూషించుచున్నారు దేహాదిసంఘా తేత్యాదిగా. గృహాదులందు దేహ ముండుటచే ఆత్మ యున్నాఁ డనుభ్రమను నివర్తించుటకై « దేహమునం దున్నాఁడు విద్వాంసుఁడు » అను విశేషణ ముపపన్నము, వివేకవంతునకు దేహమున నున్నా ననుతలంపు సంభవించుటవలన నని యర్థము. వివేకికి దేహమునం దున్నా నని తోఁచినను వాఙ్మనోదేహవ్యాపారము లగుకర్మములకు వానియందుఁ బ్రసక్తి లేకుండుటవలన నాకర్మముల విడిచి యె ట్లతఁడు దేహమున నున్నాఁ డని చెప్పవచ్చును? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు పరుఁ డయిన ఇత్యాదిగా. ఓయీ! దేశాదిపరిచ్ఛేదశూన్యమును బాహ్యాభ్యంతరా ఽవిక్రియంబు నగు బ్రహ్మమే నే నని యెఱుంగునట్టి వివేకి దేహమునం దున్నాఁ డని యె ట్లంగీకరింపవచ్చును? అందుకుఁ జెప్పుచున్నారు వివేకవిజ్ఞానము ఇత్యాదిగా. అందుకు హేతువు చెప్పుచున్నారు ప్రారబ్ధేత్యాదిగా. ప్రారబ్ధఫలం బగు ధర్మాధర్మాత్మకకర్మం బేది గలదో దాని యొక్క ఉపభోగింపఁబడినదానియొక్క శేషమువలన—ఉపభోగింపఁబడనిదానివలన దేహాదిసంస్కార మనువర్తించుచున్నది, అది యనువర్తించుటచే నాదేహమునందే విశేషవిజ్ఞానము దేహమునం దున్నా నను నది యుపపన్న మగుచున్నది. కావున వివేకవంతుఁ డగుసన్న్యాసిని గుఱించి దేహమునం దున్నాఁ డని చెప్పుట సంభవించు చున్నది యని యర్థము. అవిద్వాంసునిప్రత్యయము నపేక్షించి విశేషణము సంభవింపకున్నను విద్వాంసునిప్రత్యయము నపేక్షించి విశేషణము సార్థకం బని యుప సంహరించుచున్నారు దేహమునందే ఇత్యాదిగా. దేహమునందుఁ దా నున్నా నను నది విద్వాంసునిప్రత్యయము, అట్టిది కానిది యవిద్వాంసునిప్రత్యయము, ఆరెంటి కిని ఇట్టిభేదమును అపేక్షించిన దగుటవలన—ఇట్లు భేదము స్పష్టము గాఁగా విద్వ

త్పరిత్యాగము నపేక్షించిన దగుటవలన విశేషణ ముపపన్నం బని చెప్పిన హేతువునే విశదీకరించుచున్నారు విద్వా దవిద్వా దిత్యాదిగా.

ఆరోపిత మయి కర్తృత్వాదికము లేకున్నను స్వగత మగుకర్తృత్వాదికము తప్ప దని యాశంక ననువదించి నిరాకరించుచున్నారు కార్యకర ణేత్యాదిగా. నైవ కుర్వ న్నకారయన్—దీనికి ఆస్తే అని పూర్వముతో సంబంధము.

కర్తృత్వమును గారయితృత్వమును ఆత్మకు లేదనువిషయమునందు విచారించుచున్నారు కర్తృత్వమును ఇత్యాదిగా. కర్తృత్వమును గారయితృత్వమును ఏది గలదో అది దేహికి స్వాత్మయం దున్నదైయే సన్న్యాసమువలన లేక పోవుచున్న దని చెప్పఁబడుచున్నదా? ఎట్లు నడచుచున్న దేవదత్తునిస్వగత మైనగమనము, అతఁడు నిలిచి దాని విడుచుటవలన లేక పోవునో అట్లు. లేక, స్వరసముగనే కర్తృత్వమును గారయితృత్వమును ఆత్మకు లే దని చెప్పఁబడుచున్నదా? మొదటిపక్షమునందు సక్రియత్వము రెండవదానియందుఁ గూటస్థత్వము అని యర్థము.

రెండవపక్షము నాశ్రయించి యుత్తరము చెప్పుచున్నారు ఇందుకుఁ జెప్పెదము ఇత్యాదిగా. ఉక్తార్థమునందు వాక్యోపక్రమము అనుకూలం బని చూపుచున్నారు చెప్పఁబడినదిగదా ఇత్యాదిగా. అందే వాక్యశేషము గూడ ఏకాభిప్రాయ మని చెప్పుచున్నారు శరీరస్థో ఽపీత్యాదిగా. స్మృతి ప్రతిపాదిత మయిన యర్థమునందు శ్రుతిని జూపుచున్నారు ధ్యాయతీ వేత్యాదిగా. ఉపాధిగతమే సమస్తవిక్రియయును, ఆత్మకు స్వభావంబున లే దని యర్థము.

హ. *

శం. ఓయీ! అకామునకుఁ గర్మయోగముచేతనే ముక్తి యగునేని, అప్పు డందఱును అకామనచేఁ గర్మమునే చేయవలయును, సన్న్యాసము చేయరాదు. అని యాశంకింపఁగా; అట్లు కాదు, నిత్యనైమిత్తికై రేవ అనున్యాయంబున అకామనచేఁ గర్మము ననుష్ఠించినవారికిఁ జిత్తశుద్ధి ఫలము, చిత్తశుద్ధికి జ్ఞానము ఫలము, జ్ఞానమునకు సర్వకర్మసన్న్యాసంబును బ్రహ్మరూపంబున నుండుటయు ఫలము. "నిత్యనైమిత్తికై రేవ కుర్వాణో దురితక్షయమ్। జ్ఞానంచ విమలీ కుర్వ న్నభ్యాసేన చ వాసయేత్॥ అభ్యాసా త్పక్వవిజ్ఞానః కైవల్యం లభతే నరః" • అని చెప్పఁ

* శంకరభాష్యముతో సమానము.

• మనుష్యుఁడు నిత్యనైమిత్తికకర్మములచేతనే పాపక్షయము చేసికొన్నవాఁడై జ్ఞానమును నిర్మలముగాఁ జేయుటకై యభ్యాసముచే వాసింపవలయును. అభ్యాసమువలనఁ బరిపక్వ మయిన జ్ఞానము గలవాఁడై కైవల్యము నొందును.

బడిన్వి. అందువలన బహుజన్మకృతపుణ్యపరిపాకమువలనఁ జిత్తశుద్ధి నొంది యాచిత్తశుద్ధిచేఁ బరావరైక్యజ్ఞానము నొందినట్టి సర్వాత్మదర్శి యగుబ్రహ్మవిదునకుఁ గర్మము గొంచెమేనియు సంభవింపదు, కారణము లేకుండుటవలన. మఱేమనఁగా, బ్రహ్మవిద్వర్యుఁడు సర్వకర్మములను సన్న్యసించి తానవిక్రియబ్రహ్మరూపంబున నూరక యుండు నని చెప్పుచున్నాఁడు —నిత్యనిరంతరసమాధినిష్ఠచే నిర్మూలింపఁ బడిన సర్వవాసనాసమూహము గలవాఁ డగుటచే సుప్రసన్నము లయిన బాహ్యాభ్యంతరకరణములు గలవాఁ డగుటవలన, వశీ = వశీకృత మయిన సర్వేంద్రియగ్రామము గలవాఁడు, శుద్ధాత్ముఁడు, బ్రహ్మవిదుఁడు; సర్వకర్మాణి = నిత్యనైమిత్తిక కామ్యనిషిద్ధరూపములను శాస్త్రీయములును అశాస్త్రీయములు నగు సమస్తకర్మములను; మనసా = అధిష్ఠానతత్త్వము తెలియుటచే నారోపితములయిన సర్వదృశ్యవస్తువులును మిథ్య యను ప్రత్యయము గల మనస్సుచేత; సన్న్యస్య-కర్మమును దత్కర్తయును దత్సాధనంబును దత్ఫలంబును సమస్తంబును అసత్తే యను విజ్ఞానముచే విడిచి యని యర్థము. ఓయీ! మనసా యని చెప్పుటవలన సర్వకర్మములకును మనస్సుచేతనే త్యాగము చెప్పఁబడినది, కాని వెలుపలికిఁ జేయక విడుచుట గాదు, విధింపఁబడినకర్మములను విడుచుట యశక్య మగుటవలన. అందు వేని, అట్లు కాదు, «వికల్పో నహి వస్తు, మాయామాత్ర మిదం ద్వైతమ్" అని సర్వంబును మిథ్యయనిచూచునట్టివిద్వాంసునిగుఱించి విధి యనుపపన్న మగుటవలన, విధియును దృశ్యములలోనే చేరుటవలన. ఎట్లు మరుభూమియొక్క స్వరూపము చూచినవానికి జలపానవిధి జలమువలె మిథ్యయగునో, అట్లు అధిష్ఠాన మయిన బ్రహ్మము నెఱింగినవానికిఁ గర్మవిధియును గర్మమువలెను గారకములవలెను మిథ్యయే యగుచున్నది. సర్వప్రమాణంబులచేతను సర్వంబును మిథ్యగానే చూచునట్టి బ్రహ్మవిదునకుఁ గర్మమునందుఁ బ్రవృత్తికూడ సంభవింపనే సంభవింపదు. ఓయీ! సర్వమును మిథ్యయే యని ప్రవర్తించుఁగాక. అందు వేని, అదియుఁగాదు, మిథ్యాత్వబుద్ధియుఁ బ్రవృత్తియుఁ బరస్పరవిరుద్ధంబు లగుటవలన రెండు నొకచో నుండుట సంభవింపమివలన. ఓయీ! లోపల మిథ్యాత్వబుద్ధితోను వెలుపల సత్యత్వబుద్ధితోను జేయుఁగాక కర్మమును. అందు వేని, అదియు సంభవింపదు, ఒక్కవస్తువునందు రెండుబుద్ధులు సంభవింపమివలన. మరుభూమిని జూచినవానికి జలము మిథ్య యనుబుద్ధియు అది సత్యం బనుబుద్ధియు నుపపన్నము గాదు గదా! అట్లు దృష్టమునుం గాదు గదా! అవ్విధంబున సర్వదృశ్యంబును మిథ్య యను జ్ఞానంబును అది సత్యం బను

జ్ఞానంబును దానియందుఁ బ్రవృత్తియు నొక్కని కెప్పుడును ఉపపన్నము గాదు, ప్రవృత్తి పదార్థసత్యత్వజ్ఞానముచేఁ గలుగునది యగుటవలన. విద్వాంసుఁడు మనస్సునందు సర్వదృశ్యములు మిథ్య యను దృఢప్రత్యయము గలవాఁడై యుండఁగా ఎట్లు వానికి వెలుపలఁ బ్రవృత్తి ఘటిల్లును ? « యద్ధి మనసా ధ్యాయతి తద్వాచా వదతి తత్కర్మణా కరోతి » • అని వాగాదిప్రవృత్తి మనోవ్యాపారముచేతనే కలుగునది యని శ్రుతి చెప్పుటవలన. అందువలన వెలుపలికిఁ జేయుటయు మనస్సున సన్న్యసించును అనుట నిరాకరింపఁబడినది. అందువలన, సర్వదృశ్యములును మిథ్య యను నిశ్చయము గలవాఁడై సర్వకర్మములను మనస్సుచే సన్న్యసించి బ్రహ్మవిద్వర్యుఁడు అవిక్రియబ్రహ్మాత్ముఁడై యూరక, ఆస్తే = ఉన్నాఁడు. ఎక్కడ నున్నాఁ డనఁగాఁ జెప్పుచున్నాఁడు.—నవద్వారే = రెండుచక్షువులు రెండుశ్రోత్రములు రెండునాసికలు ముఖమును బాయూపస్థములును జేరి తొమ్మిదిద్వారములు సూర్యుఁడు మొదలగు నధిదేవతలచే రక్షింపఁబడినవి దేనికిఁ గలవో అది నవద్వారము, ప్రత్యగాత్మ రాజుగాఁ గలదియు బుద్ధి మంత్రిగాఁ గలదియు మనస్సు మొదలగు సమస్తకరణంబులును బరిచారకులుగాఁగలదియుఁ బ్రాణాదిదశవాయువులు గ్రామపాలకులుగాఁ గలదియు బ్రహ్మవిష్ణ్వాదిసర్వదేవతల యాలయములు గలదియు నగునట్టి నవద్వారమయిన; పురే = నగరరూపమయిన; దేహే = దేహమునందు §; సుఖమ్ = ఆత్మసుఖావిర్భావ మగునట్లు; ఆస్తే, సుఖరూపమున నున్నాఁ డని యర్థము. ఓయీ ! విద్వాంసుఁడు దేహమునం దున్నాఁ డనుట యనుపపన్నము, విద్వాంసుఁడును అవిద్వాంసుఁడును సన్న్యాసియు అసన్న్యాసియు నందఱును దేహమునందే యున్నారు, నే నిం దున్నా నను ననుభవంబువలన. అందు వేని, అట్లు గాదు, దేహాత్మబుద్ధి యగు మూఢతమునకు విపరీతదృష్టి కనఁబడుటవలన. ఎవ్వఁడు దేహమాత్రాత్మదర్శి యగుమూఢతముఁడు గలదో వానికి గృహమునందు దేహాలియందు * నున్నా నను ప్రత్యయము కలుగుం గాని నేను దేహమునం దున్నా నను ప్రత్యయము సంభవింపదు, బ్రహ్మవిదునకుంబోలె. అందువలన, బ్రహ్మాండమునందుఁ జరాచరసమస్త వస్తుజాతంబును బ్రకాశింపఁ జేయు సూర్యునివలె అనాత్మకం బగు బుద్ధ్యాది సర్వదృశ్యజాతంబును స్వప్రకాశముచేఁ బ్రకాశింపఁజేయువాఁడును

• దేనిని మనస్సుచేఁ దలఁచుచున్నాఁడో దాని వాక్కుచేఁ జెప్పుచున్నాఁడు దానిఁ గర్మముచేఁ జేయుచున్నాఁడు.

§ వీరిమతమున దేహే అని పాఠము తోఁచుచున్నది.

* వడపయందు.

స్వప్రకాశుండును జిదేకరసుండును సర్వసాక్షియును అసంగోదాసీనుండును నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావుండును ఆనందఘనుండు నగు నాత్మను స్వస్వరూపంబున నపరోక్షముగా నితఁడే నే నని యెవ్వఁ డెఱుంగుచున్నాఁడో, అట్టి దేహవ్యతిరిక్తాత్మదర్శియగువిద్వాంసుఁడే గృహమునందు దేవదత్తుం డుండునట్లు దేహమునందు నిష్క్రియబ్రహ్మరూపంబున సుఖముగా నుండుటకు సమర్థుం డగుచున్నాఁడు, ఇతరుఁడు కాఁడు. అందువలననే చెప్పుచున్నాఁడు భగవంతుఁడు సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽఽస్తే సుఖం వశీ నవద్వారే పురే దేహీ అని. టీక. వశీ = నిత్యనిరంతరబ్రహ్మనిష్ఠచే వశీకరింపఁబడిన యాంతర బాహ్యకరణంబులుగల నిశ్చలాత్ముం డగు బ్రహ్మవిద్వర్యుఁడు; సర్వకర్మాణి = విహితములును నిషిద్ధములును ఉభయవిలక్షణంబులు నగు దేహచేష్టారూపము లయిన సర్వకర్మములను; అతీతానేక కల్పములందును ఇప్పుడును సర్వావస్థలందును సదా దేహేంద్రియ వ్యాపారరూపంబునఁ బరిణత మయిన ప్రకృతిచేతనే చేయఁబడినవి, కూటస్థాసంగ చిద్రూపుండ నగు నాచేఁ జేయఁబడినవి కావు, అని యాత్మానాత్మస్వరూపముయొక్క వివేకజ్ఞానము గల మనస్సుచే, నవద్వారే–స్థూలముచేతను పుర్యష్టకముచేతను తొమ్మిదిద్వారములు గల; పురే = పురసమాన మగు, లేక పూర్ణ మగుటవలనఁ బుర మగు; దేహే = దేహశబ్దముచే నుపలక్షిత మగు కారణ మయినప్రకృతియందే; సన్న్యస్య=జననమరణాదివికారంబులును కర్తృత్వభోక్తృత్వసుఖిత్వదుఃఖిత్వాదిధర్మంబులును జాగ్రదాద్యవస్థలును అన్నియుం బ్రకృతికే, కాని కూటస్థాసంగచిద్రూపుండ నగు నాకు లేవు అని చక్కఁగా అనాత్మతాదాత్మ్యాధ్యాసమును బరిత్యజించి; తాను నిష్కల నిష్క్రియ నిత్యశుద్ధబుద్ధ నిరంతరానందైకరసాఽద్వితీయబ్రహ్మరూపంబున స్వాత్మయందేయారక, సుఖమ్ ఆస్తే–ఏదియుఁ జేయఁడనియర్థము. ఓయీ? జపాకుసుమ * సాన్నిధ్యంబువలన స్ఫటికమునందు రక్తత్వమువలె అనాత్మసాన్నిధ్యమువలన ఆత్మయందుఁ దోఁచుచున్న యనాత్మకృత్యంబు లగు సర్వకర్మంబులను బ్రకృతియే చేయుచున్నది నేను జేయ నని విద్యచేఁ దాను బ్రహ్మభావంబు నొంది విద్వాంసుం డుండుఁ గాక; అయినను నిష్క్రియరూపంబున నుండఁ జాలఁడు, బ్రహ్మరూపంబున నుండునట్టి యావిద్వాంసునకు అన్యకృతము లగుక్రియలతో సంబంధము లేకున్నను స్వాశ్రయక్రియ ♦ యుండుటవలన; ఎట్లు అంతర్గృహములో నుండుదీపమునకు వాయువు మొదలగు నితరములచేఁ జేయఁబడు చలనాదిక్రియ

---

* దాసానిపువ్వు.

♦ తనయందున్నక్రియ.

లేక యున్నను తాను చేయునట్టి తైలాదానక్రియ♦ యున్నదో, మఱియు నెట్లు ఏనుఁగు నెక్కి పోవునట్టి రాజునకు ఏనుఁగు చేయు గమనక్రియ లేక యున్నను దనయం దుండు చలనక్రియయును గజముతోలుక్రియయును ఉన్నదో, అట్లు పరమాత్మకుఁ గూడ కర్తృత్వమును కారయితృత్వమును ఉండనే యున్నది. అందువేని; లేదు, నిరవయవుం డగుటవలనఁ బరమాత్మకుఁ గ్రియాశ్రయత్వము సంభవింపమివలన, "నిష్కలం నిష్క్రియమ్" అని యాత్మ నిరవయవుఁడు నిష్క్రియుం డని శ్రుతి చెప్పుటవలన. ఆత్మ క్రియావంతుం డైనయెడ సావయవుం డగుటవలన అనిత్యుం డగును. అది సర్వవాదులకును అనిష్టము. శ్రుతివిరోధముగూడఁ గలుగును. రాజు అవయవి యగుటవలన వానికిఁ గర్తృత్వాదిక ముపపన్నము, అట్లు ఆత్మకుఁ గా దని బోధించుటకై చెప్పుచున్నాఁడు నైన కుర్వన్న కారయన్ అని. నిరవయవుం డగుటవలనఁ బరమాత్మ తాను దేనిని జేయనే చేయఁడు, ఇతరములచేతనుం గూడఁ గొంచెమేని చేయింపఁ డని యర్థము. నిరవయవము పరిపూర్ణ మగువస్తువునందుఁ జలనక్రియ కల దనఁ శక్యము గాదు గదా! ప్రమాణవిరుద్ధం బగుటవలన. నిరవయవము పూర్ణమగు నాకాశమునందుఁ జలనము సంభవించుచున్నదా? అట్లు ఆత్మయందును జలనము సంభవింపదు, నిత్యస్సర్వగతః స్థాణుః అని ఆత్మ పూర్ణుం డనియు నిష్క్రియుం డనియుఁ బ్రతిపాదించుటవలన. ఓయీ! నిరవయవుఁడు నిష్క్రియుఁ డగు పరమాత్మకుఁ గర్తృత్వకారయితృత్వములు సంభవింపనియెడ "సర్వాధిపత్యం కురుతే మహాత్మా। ఏష ఏవ సాధుకర్మ కారయతి, ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః" ఇత్యాది శ్రుతులకు ఆత్మకుఁ గర్తృత్వకారయితృత్వములను బ్రతిపాదించువానికి అప్రామాణ్యం బగును. అందువేని; కాదు, సన్నిధిమాత్రమున ఆత్మకు అట్లగుట సంభవించుటవలన. ఎట్లు సూర్యునిసాన్నిధ్యమువలనఁ దమోనివృత్తి యగుచుండఁగాఁ దమోనివృత్తిని సూర్యుఁడు చేయుచున్నాఁ డని యుపచరింపఁబడుచున్నదో, ఎట్లు చుంబక * సాన్నిధ్యంబువలన ఇనుము చలించుచుండఁగా చుంబకము ఇనుమును జలింపఁ జేయుచున్న దని తచ్చలనము చుంబకమునం దుపచరింపఁబడుచున్నదో, అట్లు ఆత్మసాన్నిధ్యంబువలనఁ బ్రకృతి విజృంభించుచుండఁగాఁ దద్విజృంభణం బగు సర్వాధిపత్యము సర్వకారుండై యే యుండు పరమాత్మయం దుపచరింపఁబడుచున్నది; అట్లే ఆత్మసాన్నిధ్యంబువలన బుద్ధ్యాదులకుఁ బ్రవృత్తి కలుగుచుండఁగా బుద్ధ్యాదులను ఆత్మ ప్రవర్తింపఁ జేయుచున్నాఁ డని తత్ప్రవృత్తి యవిక్రియుఁ డయ్యే యుండు నాత్మయం

♦ నూనెను బీల్చుట యనుక్రియ.

* సూదంటురాయి.

దుపచరింపఁబడుచున్నది, పరమాత్మ చేయుచున్నాఁడు చేయించుచున్నాఁడు అని. « ధ్యాయతీవ లేలాయతీవ » అను శ్రుతివలన ఆత్మకు ఇట్టి కర్తృత్వకారయితృత్వములు సంభవించుటవలన, ఈయర్థము నవలంబించి ప్రాణులకు అస్వాతంత్ర్యము సిద్ధించుటకై పరమాత్మకుఁ గర్తృత్వంబును గారయితృత్వంబును శ్రుతులు చెప్పుచున్నవి. ఇప్పుడు చెప్పినరీతిని బరమాత్మకు సృష్ట్యాదికర్తృత్వమును బ్రతిపాదించుశ్రుతులకును ఈశ్రుతులకును బ్రామాణ్యమంగీకార్యము. కానిచో, « నిష్కలం నిష్క్రియం శాన్తమ్, న త దశ్నాతి కించన నత దశ్నాతి కశ్చన » ♦ ఇత్యాదిశ్రుతులకు ఆత్మ నిర్వికారుం డని ప్రతిపాదించువానికి విరోధం బగును. ఎందువలన నిట్లు పరమాత్మకు అవిక్రియత్వము బహుశ్రుతిప్రమాణసిద్ధమో, అందువలన ఆత్మ దేనిని జేయఁడు చేయింపఁడు అని సిద్ధము.

మ. చిత్తశుద్ధి లేనివానికిఁ గేవలమైనసన్న్యాసముకంటెఁ గర్మయోగము శ్రేయం బని మున్ను చెప్పినదానిఁ బ్రపంచించి యిప్పుడు చిత్తశుద్ధి గలవానికి సర్వకర్మసన్న్యాసమే శ్రేయం బని చెప్పుచున్నాఁడు.—సర్వకర్మాణి = నిత్యము నైమిత్తికము కామ్యము ప్రతిషిద్ధము అను సమస్తకర్మములను; మనసా = కర్మణ్యకర్మ యః పశ్యేత్ అనుచోటఁ జెప్పిన అకర్త్రాత్మస్వరూపసమ్యగ్దర్శనముచేత; సన్న్యస్య = విడిచి; ప్రారబ్ధకర్మవశమువలన, ఆస్తే = ఉండనే యున్నాఁడు. ఏమి దుఃఖముతోనా? అనఁగా కా దని చెప్పుచున్నాడు —సుఖమ్ = అనాయాసముగా, ఆయాసహేతువులగు కాయవాఙ్మనోవ్యాపారములు లేనివాఁ డగుటవలన. కాయవాఙ్మనస్సులు తమ యిచ్చచొప్పున నెందుకు చేష్టింపవు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—వశీ = తనకు వశముగాఁ జేయఁబడినకార్యకరణసంఘాతము గలవాఁడు. ఎచట నున్నాఁడు? నవద్వారే పురే = రెండుశ్రోత్రములు రెండునేత్రములు రెండునాసికలు ఒకటివాక్కు ఇట్లు శిరస్సునందు ఏడు, అధోభాగమునఁ బాయూపస్థములు రెండు, ఇట్లు తొమ్మిదిద్వారములు గల దేహమునందు, దేహీ—దేహభిన్నుఁడు ఆత్మ యని యెఱిఁగినవాఁడు; ఇతరునిగృహమునందుఁ బరదేశివలె ఆదేహమును బూజించినను బరిభవించినను హర్షింపక విషాదింపక అహంకారమమకారశూన్యుండై యున్నాఁడు. అజ్ఞుఁడు దేహతాదాత్మ్యాభిమానము గలవాఁ డగుటవలన దేహమే గదా యతఁడు, దేహి కాఁడు. వాఁడు దేహాధికరణమునే * తనకు అధికరణముగాఁ దలంచినవాఁడై

♦ అది దేనిని భుజింపదు, దానిని ఎవ్వఁడును భుజింపఁడు.

* దేహమున కాధారమైనదానినే.

గృహమునందు భూమియందు ఆసనమందుఁ గాని నే నున్నా నని యభిమానించుచు న్నాఁడు, కాని దేహమునందు నే నున్నా నని యభిమానింపఁడు భేదదర్శనము * లేనివాఁ డగుటవలన. దేహాదిసంఘాతవ్యతిరిక్తుఁడు ఆత్మ యని యెఱింగినట్టి సర్వకర్మ సన్న్యాసియో భేదదర్శనము గలవాఁడగుటవలన దేహమునందు నే నున్నా నని తెలి యుచున్నాఁడు. అందువలననే, అక్రియుఁ డైనయాత్మయందు అవిద్యచే నారోపింపఁ బడినదేహాదివ్యాపారములకు విద్యచే బాధమే సర్వకర్మసన్న్యాసం బని చెప్పఁబ డుచున్నది. అజ్ఞునకును విద్వాంసునకును గల యీవైలక్షణ్యమువలననే నవద్వారే పురే ఆస్తే అనువిశేషణము యుక్తము. తీరస్థవృక్షమునం దారోపింపఁబడిననౌకా వ్యాపారములకుంబోలె ఆత్మయం దారోపింపఁబడిన దేహాదివ్యాపారములకు విద్యచే బాధ కలిగినను, స్వవ్యాపారముచే నాత్మకుఁ గర్తృత్వమును దేహాదివ్యాపారముల యందుఁ గారయితృత్వంబును గావచ్చును. అనఁగాఁ గా దనిచెప్పుచున్నాఁడు.— నైవ కుర్వ న్నకారయన్. ఆస్తే అని యన్వయము.

శ్రీ. ఇట్లంతయుఁ జిత్తశుద్ధిశూన్యునకు సన్న్యాసముకంటెఁ గర్మయోగం బుత్తమం బని ప్రపంచింపఁబడినది. ఇప్పుడు చిత్తశుద్ధి గలవానికి సన్న్యాసము శ్రేష్ఠ మని చెప్పుచున్నాఁడు.—వశీ = మనోనిగ్రహము గలవాఁడు; సర్వకర్మాణి— విక్షేపజనకంబు లగుసర్వకర్మములను; మనసా = వివేకయుక్త మగుమనస్సుచేత; సన్న్యస్య = సుఖముగా, జ్ఞాననిష్ఠుఁడై, ఆస్తే. ఎం దున్నాఁడు? అనఁగాఁ జెప్పుచు న్నాఁడు.—నవద్వారే = నేత్రములు నాసికలు కర్ణములు ముఖమును జేరి యేడు శిరోగతములు, అధోగతములు పాయూపస్థములు రెండు ఇట్లు తొమ్మిదిద్వారములు గల; పురే = పురమువలె అహంభావశూన్య మయినదేహమునందు. దేహీ; ఉన్నాఁడు. అహంకారములేమివలననే తా నాదేహముచే, నైవ కుర్వన్; మమ కారము లేమివలన, నకారయన్; అని చిత్తశుద్ధి లేనివానికి వ్యావృత్తి చెప్పఁబ డినది. చిత్తశుద్ధి లేనివాఁడు సన్న్యసించి మరలఁ జేయుచున్నాఁడు చేయించుచు న్నాఁడు గూడ, వీఁడో అట్టివాఁడు కాఁడు. అందువలన సుఖముగా నున్నాఁ డని యర్థము.

ప. ఇట్లంతయుఁ జిత్తశుద్ధి నుపన్యసించి కర్మసన్న్యాసము కన్నఁ గర్మ యోగ ముత్తమ మని చెప్పఁబడినది. ఇప్పుడు శుద్ధచిత్తునకు సన్న్యాస ముత్తమ

* ఆత్మకును దేహమునకును.

మని చెప్పుచున్నాఁడు.—వశీ = మనోజయము గలవాఁడు: సర్వకర్మాణి; వివేకయుక్త మయినమనస్సుచే, సన్న్యస్య = తనయంతనే యుపరమించినవానిఁగాఁ జేసి; సుఖముగా, ఆస్తే = ఉన్నాఁడు. ఎందున్నాఁ డనఁగాఁ జెప్పుచున్నాఁడు.—నవద్వారే= నేత్రములు కర్ణములు నాసికలు—వీనిజంటలును ముఖమును ఏడు, పాయూపస్థములు రెండు, ఇట్లు తొమ్మిది ద్వారములు గల; పురే = పురమువలె అహంభావశూన్య మైనదేహమునందు; దేహీ = దేహము గలవాఁడుపోలె; ఉన్నాఁడు. ఎట్లు ఒకానొకఁడు నవద్వార మగు నగరమునం దున్నను నగరధర్మములను స్పృశింపఁడో అట్లు. అహంకారము లేకుండుటవలన శుద్ధచిత్తుఁడు, నకుర్వన్; మమకారము లేకుండుటవలన, నకారయన్; ఉన్నాఁడు. అశుద్ధచిత్తుఁడో చేయుచున్నాఁడు చేయించుచున్నాఁడు గూడ.

రా. ఇఁక దేహాకారంబునఁ బరిణత మయినప్రకృతియందుఁ గర్తృత్వమును సన్న్యసించుట చెప్పఁబడుచున్నది.—ఆత్మకుఁ బ్రాచీనకర్మమూలకం బగు దేహసంబంధముచేఁ గలిగినది యీకర్మకర్తృత్వము, స్వరూపప్రయుక్తము గాదని వివేకము గల మనస్సుచే సర్వకర్మములను నవద్వారం బగుపురమునందు, సన్న్యసించి, దేహి తాను వశియై దేహము నధిష్ఠించుప్రయత్నముఁ జేయనివాఁడై దేహమును గూడ జేయింపకయె యున్నవాఁడై సుఖముగా నున్నాఁడు.

మా. మరల సన్న్యాసశబ్దార్థము స్పష్టీకరించుచున్నాఁడు.—మనసా అని విశేషణముచే అభిమానము విడుచుట చెప్పఁబడినది.

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే. ౧౪

భా. కర్తృత్వమ్ = కర్తృత్వమును; నీవు చేయు మని; లోకస్య = లోకమునకు; నసృజతి = పుట్టింపఁడు. కర్మాణి = రథఘటప్రాసాదాదులను ఈప్సితతమములను *; నసృజతి = పుట్టింపఁడు; ప్రభుః = ఆత్మ. రథాదికము చేసినవానికి, కర్మఫలసంయోగమ్ = కర్మఫలముతో సంబంధమును గూడ; న సృజతి = పుట్టింపఁడు. తా నేమియుఁ జేయఁడు చేయింపను జేయింపఁడు అనుచో, అప్పుడు ఏది చేయుచును జేయించుచును బ్రవర్తించుచున్నది? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—స్వభావస్తు

* క్రియకు కర్మ మయినవానిని.

తనదైనభావము స్వభావము అవిద్యాలక్షణ మయిన ప్రకృతి మాయ, అది యో; ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది, దైవీ హ్యేషా గుణమయీ అని చెప్పఁబోవునది.

ఆత్మ ఎవ్వరిచేతను నేమియుఁ జేయింపఁడు. తానును జేయఁడు. చేసినవానికి ఫలము నిచ్చువాఁడును గాఁడు. మఱి యేమనఁగా అవిద్యాలక్షణమ యిన ప్రకృతియే యీసర్వకార్యములను జేయుచున్న దని తాత్పర్యము.

ఆ. ఆత్మకుఁ గారయితృత్వము లే దని యేది చెప్పఁబడినదో దాని వివరించుచున్నాఁడు నకర్తృత్వమ్ అని. లోకమునకుఁ గర్తృత్వము సృజింపఁడు కావునఁ గారయితృత్వము లేదు సరే, అయినను రథశకటాదులను జేయుచుఁ గర్త యగు నని యాశంకించి చెప్పుచున్నాఁడు నకర్మాణి అని. అట్లయినను భోజయిత ♦ యగుటచే వికారిత్వము పరిహరింప శక్యము గా దని యాశంకించి చెప్పుచున్నాఁడు న కర్మఫలసంయోగమ్ అని. అప్పు డేది ప్రవర్తకం బనఁగా దానిఁ జెప్పుచున్నాఁడు స్వభావస్తు ఇత్యాదిగా. చేయు మని కర్తృత్వమును ఆత్మ లోకమునకుఁ బుట్టింపఁడని సంబంధము, రథాదులకుఁ గర్తృత్వమును సాధించుచున్నారు ఈప్సితతమములను అని. ఆత్మ దేహాదులకు స్వామి యగుటచేఁ బ్రభువు. రథాదులను జేసినవానికి రథాదిఫలముతో సంబంధమును గూడ ఆత్మ పుట్టింపఁ డని యాత్మకు భోజయితృత్వమును నివారించుచున్నారు రథాదికము ఇత్యాదిగా. నాలవపాదమును ఆశంక కుత్తరముగా దించుచున్నారు తా నేమియు నిత్యాదిగా. అప్పుడు స్వభావవాదం బగు నని యాశంకించి వ్యాఖ్యానము చేయుచున్నారు అవిద్యాలక్షణము అని. ప్రకృతి విద్యయొక్క యభావ మనుటను నిరాకరించుటకై చెప్పుచున్నారు మాయ యని. దాని సప్తమాధ్యాయంబునఁ జెప్పఁబోవుచున్నాఁడు, అందుచే నది ప్రధానము గా దని చెప్పుచున్నారు దైవీ హీత్యాదిగా.

హ. *

శం. ఓయీ! ఆత్మ నిరవయవుం డగుటచేఁ గ్రియాశ్రయత్వము అనుపపన్నం బగుటవలన స్వతఃకర్తృత్వము సంభవింపకున్నను, ఎట్లు అయస్కాంతమునకు అయశ్చాలకత్వము ⸿ గలదో అట్లు కారయితృత్వము గల దని యాశంకింపఁగా. అట్లు

---

♦ భుజింపఁ జేయువాఁడు.

* శంకరభాష్యముతో సమానము.

⸿ అయస్సును జలింపఁజేయుట.

లేను, కల దనునెడఁ బ్రాణులకు ఆత్మసాన్నిధ్యము నిత్యమగుటవలన నెల్లప్పుడు నెల్లవారికిఁ బ్రవృత్తియే కలుగవలసి వచ్చును; అట్లు కనఁబడదు; అందువలన ఆత్మకుఁ గారయితృత్వము అప్రామాణికం బనునభిప్రాయముచేఁ జెప్పుచున్నాఁడు.—ప్రకర్షంబునఁ దనయంతనే యుంతటను బ్రకాశించుచున్నాఁడు, లేక, సర్వమును బ్రకాశింపఁ జేయుచున్నాఁడు, లేక, సర్వాత్ముఁడై తనయంతనే ప్రకాశించుచున్నాఁడు అనువ్యుత్పత్తిచే ప్రభు వనఁగా ఆత్మ; తాను, లోకస్య = ప్రాణికి; కర్తృత్వమ్= నీవు దీనిఁ జేయు మని కర్మమునందుఁ బ్రవృత్తిని; నసృజతి—ఏజంతువును గాని ప్రవర్తింపఁ జేయఁ డని యర్థము. అట్లు, కర్మాణి—“ కర్తురీప్సితతమం కర్మ ” అను పాణినిసూత్రమువలనఁ గ్రియచేఁ బొందుటకు మిక్కిలి యిష్టము లగునవి కర్మము లనఁబడును, వానిని; నసృజతి = పుట్టింపఁడు. ఇష్టప్రదమును గాని అనిష్టప్రదమును గాని క్రియచేఁ బొందఁ దగినవస్తువును గలిగింపఁ డని యర్థము. కర్మఫలసంయోగమ్ నసృజతి—ఆయాప్రాణిని తత్తత్కృత మైన పాపపుణ్యములఫలముతోఁ గూర్పఁడు, ప్రాణులను సుఖదుఃఖముల ననుభవింపఁ జేయఁ డని యర్థము. ఆత్మకుఁ గారయితృత్వము ప్రాపయితృత్వము * భోజయితృత్వము మొదలగునవి లేనియెడ, నప్పుడు కారయితయు ప్రాపయితయు భోజయితయు నేది ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—స్వభావస్తు=తానే సమస్తమును బుట్టించుచున్నది, లేక, తన్నుఁ దానేఁ బుట్టించుచున్నది అని స్వభావ మనఁగా వాసనామయ మయినప్రకృతి, అదియే; ప్రవర్తయతి—కర్మరూప మయిన ప్రకృతియే యిష్టానిష్టములను గలిగించి సుఖదుఃఖములను గూడ అనుభవింపఁ జేయుచున్నది ప్రాణులను, స్వాత్మయో అవిక్రియుఁడై తచ్చేష్ట తత్సుఖదుఃఖానుభవము మొదలగువానికి సాక్షియే యగుచున్నాఁ డని యర్థము.

మ. ఎట్లు దేవదత్తునకు స్వగత మే యగుగమనము నిలిచి యుండునపుడు లేక పోవు చున్నదో, అట్లు ఆత్మకుఁ గూడ కర్తృత్వమును కారయితృత్వమును స్వగతముగానే యుండి సన్న్యసింపఁగా లేక పోవుచున్నదా ? లేక, ఆకాశమునందు తలమలినతాదులవలె వస్తువృత్తిచేతనే కర్తృత్వకారయితృత్వములు ఆత్మకు లేవా ? అనుసందేహము నివారించుటకై చెప్పుచున్నాఁడు —లోకస్య = దేహాదికమునకు; కర్తృత్వమ్; ప్రభుః = స్వామి యగునాత్మ; నసృజతి, నీవు చేయు మని నియోగించుటచేత. దేహాదికమునకుఁ గారయిత కాఁ డని యర్థము. లోకస్యః కర్మాణి = ఈప్సితతమములను ఘటాదులను గూడ; తాను, నసృజతి. కర్తగూడ

* పొందించువాఁ డగుట.

కాఁ డని యర్థము. లోకస్య; కర్మఫలసంబన్ధమ్ = కర్మఫలముతో సంబంధమును గూడ; నసృజతి. భోజయితయును గాఁడు భోక్తయునుగాఁ డని యర్థము «స సమాన స్సన్నుభౌ లోకా వనుసంచరతి ధ్యాయతీవ లేలాయతీవ సధీః" ♦ ఇత్యాదిశ్రుతివలన, ఇచటఁ «గూడ శరీరస్థో ఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే" అని చెప్పుటవలన. ఆత్మ తా నేదియుఁ జేయింపఁడు చేయఁ డను నెడ నప్పు డేది చేయించుచుఁ జేయుచుఁ బ్రవర్తించుచున్నది? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—స్వభావస్తు = అజ్ఞానాత్మకమయినదైవమాయయే; ప్రవర్తతే.

శ్రీ. ఓయీ! «ఏష ఏవ సాధు కర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతే, ఏష ఏవా ఽసాధుకర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్యో ఽధో నినీషతే» * ఇత్యాదిశ్రుతివలన, పరమేశ్వరునిచేతనే శుభాఽశుభకర్మములందుఁ గర్తయగునట్లు బ్రేరింపఁబడుచున్న యస్వతంత్రుఁ డగుపురుషుం డెట్టు లాకర్మములను విడుచును? ఈశ్వరునిచేతనే జ్ఞానమార్గమునందుఁ బ్రేరింపఁబడుచున్నవాఁడై విడువఁ గలఁ డన్నచో నప్పుడు వైషమ్యనైర్ఘృణ్యములచేఁ ♦♦ బ్రయోజకకర్త ‖ యగుట వలన ఈశ్వరునకుఁ గూడఁ బుణ్యపాపసంబంధం బగును, అని యాశంకించి చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ప్రభుః = పరమేశ్వరుఁడు; లోకస్య = జీవలోకమునకు; కర్తృత్వాదికమును, నసృజతి. మ తేమనఁగా జీవునియొక్క, స్వభావస్తు= అవిద్యయే; కర్తృత్వాదిరూపమున, ప్రవర్తతే. అనాద్యవిద్యాకామవశమువలనఁ బ్రవృత్తిస్వభావము గల జీవలోకమును ఈశ్వరుఁడు కర్మములందు నియోగించుచున్నాఁడు, కాని తానే కర్తృత్వాదికమును గలిగింపఁ డని యర్థము.

ప. ఓయీ! «జానామి ధర్మం నచ మే ప్రవృత్తిః» | ఇత్యాదివాక్యములచే నస్వతంత్రుఁ డైనపురుషునకు «నైవకుర్వన్న కారయన్» అని స్వాతంత్ర్యత్వ మెట్లు చెప్పవచ్చును? ఇఁక ఈశ్వరుఁడే ప్రేరకుఁ డని యంగీకరించినచో, అప్పుడు

---

♦ అతఁడు సమానుఁడై రెండులోకములను అనుసరించి వర్తించుచున్నాఁడు, ధ్యానించువాఁడు పోలె చలించువాఁడు పోలె బుద్ధితోఁ గూడినవాఁడై.

* ఇతఁడే యెవనిని ఈలోకములకంటె మీఁదికిఁ గొనిపోవఁ దలంచుచున్నాఁడో అతనిని సాధుకర్మముఁ జేయించుచున్నాఁడు ఇతఁడే యెవ్వని ఈలోకములకంటెఁ గ్రిందికిఁ గొనిపోఁ దలంచుచున్నాఁడో అతనిని అసాధుకర్మముఁ జేయించుచున్నాఁడు.

♦♦ పక్షపాతములోను నిర్దయతతోను.

‖ చేయించువాఁడు.

| ధర్మము నెఱుఁగుచున్నాను. నాకు దానియందుఁ బ్రవృత్తిలేదు.

సత్కార్యములందును అసత్కార్యములందుఁ బ్రేరకుం డగుటవలన, అస్మదాదులకుంబోలె నతనికిని వైషమ్యము సంభవించును. అని యాశంకించి చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ప్రభుః = ఈశ్వరుఁడు గూడ; లోకస్య = జీవలోకమునకుఁ; కర్తృత్వమ్, కర్మాణి, కర్మఫలసంయోగమ్; నసృజతి = కలిగింపఁడు. అప్పుడు పురుషుఁడు స్వతంత్రుం డగును అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—స్వభావస్తు = అనాద్యవిద్యాగుణములచేఁ గలిగిన సదసత్సంస్కారము స్వభావము, అదియే; ప్రవర్తతే = ప్రవృత్తి కలిగించుచున్నది. అదియే యీశ్వరానుగ్రహము నిగ్రహము అని కల్పింపఁబడుచున్నది. •

రా. సాక్షా దాత్మయొక్క స్వాభావికస్వరూపమును జెప్పుచున్నాఁడు.—లోకస్య = దేవతిర్యఙ్మనుష్యస్థావరరూపంబునఁ బ్రకృతిసంసృష్టమై యుండునట్టి యీ లోకమునకు; కర్తృత్వమ్ = దేవాదుల కసాధారణమైన ‖ కర్తృత్వమును; కర్మాణి = ఆయాజాతికి అసాధారణము లయిన కర్మములను; కర్మఫలసంయోగమ్ = ఆయాకర్మములచేఁ గలుగు దేవాదిఫలసంబంధమును; ఈ, ప్రభుః = కర్మవశ్యుఁడు గాక స్వాభావిక స్వరూపంబున నుండునట్టి యాత్మ; నసృజతి = పుట్టింపఁడు. అప్పుడేది పుట్టించుచున్నది? స్వభావస్తు ప్రవర్తతే—స్వభావ మనఁగాఁ బ్రకృతివాసన, అనాదికాలప్రవృత్తము లగు పూర్వపూర్వకర్మములచేఁ బుట్టింపఁబడిన దేవాద్యాకారప్రకృతిసంసర్గముచేఁ గలిగిన తత్తదాత్మాభిమానమువలన § జనిత మయిన వాసనచేఁ గలిగినది యిట్టి కర్తృత్వాదికము సమస్తమును, స్వరూపప్రయుక్తము గా దని యర్థము.

మా. వాస్తవముగఁ జేయనుం జేయఁ డని చెప్పుచున్నాఁడు.—ప్రభుః = జీవుఁడు. ప్రభువు గదా జీవుఁడు జడము నపేక్షించి.

నాఽఽదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః
అజ్ఞానే నాఽఽవృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః. ౧౫

భా. పరమార్థమునన్.—నాదత్తే = గ్రహింపఁడు; భక్తునియొక్క గూడ, కస్యచిత్ = ఒకానొకనియొక్కయు, పాపమ్ = పాపమును. సుకృతం చైవ = పుణ్య

• సత్సంస్కారముచేఁ గలుగుసత్ప్రవృత్తి ఈశ్వరానుగ్రహ మనియు అసత్సంస్కారముచేఁ గలుగు నసత్ప్రవృత్తి నిగ్రహ మనియుఁ జెప్పుదురు.

‖ ఆయాజాతికిఁ దగిన.

§ ఆయాయాకారములందు ఆత్మాభిమానమువలన.

మును గూడ, భక్తులచేఁ జేయఁబడినదాని; నాదత్తే = గ్రహింపఁడు; విభుః = ఈశ్వరుఁడు. అప్పుడు, ఎందుకొఱకు భక్తులు పూజాదిలక్షణమును యాగదానహోమాదికమును సుకృతముఁ జేయుచున్నారు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అజ్ఞానేన = అజ్ఞానముచేత; జ్ఞానమ్ = వివేకవిజ్ఞానము; ఆవృతమ్ = కప్పఁబడినది. తేన = దానిచేత; ముహ్యన్తి = చేయుచున్నాను చేయించుచున్నాను భుజించుచున్నాను భుజింపఁజేయుచున్నా నని మోహమును బొందుచున్నారు; జన్తవః = అవివేకులు సంసారులు.

పరమార్థమున నీశ్వరుఁ గూడ నెవ్వనిదియుఁ బాపము గాని పుణ్యము గాని గ్రహింపఁడు. అజ్ఞానముచే జ్ఞాన మావరింపఁ బడి యుండుటవలన అవివేకు లగు సంసారులు మోహము నొందినవారై తా మీశ్వరు నారాధించుచున్నాము ఈశ్వరుఁ డనుగ్రహించుచున్నాఁ డని తలంచుచున్నా రని తాత్పర్యము.

ఆ. కర్తృత్వభోక్తృత్వైశ్వర్యములు ఆత్మకు అవిద్యాకృతము లని చెప్పఁబడినది. ఇప్పుడు, ఈశ్వరునియందు సన్న్యసింపఁబడిన సమస్తవ్యాపారములు గలవాఁడై తదేకశరణుండై యుండువాని పాపమును గాని పుణ్యమును గాని వాని నను గ్రహించుటకై భగవంతుఁడు గ్రహించుచున్నాఁడు, నన్నే శరణు పొంది నాప్రీతికొఱకుఁ గర్మము చేయువానిని తత్పాపాదికము నను మోదించుటచే ననుగ్రహింపవలయును నేను అనుప్రత్యయము గలవాఁ డగుటవలన. అని యాశంకించి, అదియుఁ బరమార్థంబున లే దితనికి, అవిక్రియుఁ డగుటవలన నని చెప్పుచున్నారు పరమార్థమునఁనో అని. పూర్వార్ధమునకు వ్యాఖ్యానము చేసి యాకాంక్షాపూర్వకముగా నుత్తరార్ధము దీసి వ్యాఖ్యానము చేయుచున్నారు అప్పుడు ఇత్యాదిగా. అప్పుడు, ఎట్లు భక్తు లనుగ్రాహ్యు లనియు నీశ్వరుం డనుగ్రాహకుఁ డనియుఁ బ్రసిద్ధి యుపపన్న మగును? అనఁగాఁ జెప్పుచున్నారు అజ్ఞానే నేత్యాదిగా.

హ. ♦.

శం. ఓయీ! "ఏష ఏవ సాధుకర్మ కారయతి, సత్త్వస్యైష ప్రవర్తకః, ఈశ్వరః సర్వభూతానామ్, సర్వాధిపత్యం కురుతే మహాత్మా, ధర్మావహం పాపనుదం భగేశం వరదం దేవ మీడ్యమ్ ♦♦, ప్రభుః ప్రీణాతి విశ్వభుక్" * ఇత్యాది

♦ శంకరభాష్యముతో సమానము.

♦♦ ధర్మమును గలిగించువానిని పాపముఁ బోఁగొట్టువానిని భగములకు—సమగ్రైశ్వర్యాదులకు ఈశ్వరుని వరముల నిచ్చువాని స్తుతింపఁ దగినవానిని దేవుని.

* సమస్తమును భుజించునట్టి ప్రభువు ప్రీతిఁ బొందుచున్నాఁడు.

శ్రుతులచేతను స్మృతులచేతను బరమాత్మకుఁ గర్తృత్వమును గారయితృత్వమును ధర్మానహాత్వమును బాపహారత్వమును భక్తులు సమర్పించుపూజాదులచేఁబరితోష్టృత్వమును మొదలగునది ప్రతిపాదింపఁబడుచున్నది. ఎట్లు "న కర్తృత్వం న కర్మాణి" అని ఆత్మకు శ్రుతి స్మృత్యుక్తధర్మములు లే వని చెప్ప వచ్చును? అని యాశంకింపఁగా. కాదు. శ్రుతిస్మృతులచేతను బురాణములచేతను ఆత్మయం దుపాధికృతధర్మము నారోపించి యట్లు ప్రతిపాదింపఁబడుచున్నది, ముముక్షువులకు సత్త్వశుద్ధికొఱకై ఈశ్వరోపాసనమునందుఁ బ్రవృత్తి గలుగుకొఱకు. కాని, అది తాత్త్వికము గాదు. వాస్తవముననో కూటస్థాసంగచిద్రూపుఁ డగుటవలన ఆత్మ తానేమియుఁ జేయఁడు చేయింపఁడు గ్రహింపఁడు. అని చెప్పుచున్నాఁడు.—నిరవయవుం డగుటవలనను నిష్క్రియుం డగుటవలనను, విభుః = వ్యాపకుఁ డయినయాత్మ, తాను; భక్తుని యొక్కగాని యితరునియొక్కగాని ఎవ్వనియొక్కయు, పాపమ్ = పాపమును; నాదత్తే = బ్రాహ్మణుఁడు హిరణ్యగర్భదానమును వలె గ్రహింపఁడు. ఓయీ! "హరి ర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః, అనేకజన్మార్జితపాపసంచయం హరత్యశేషం స్మృతమాత్ర ఏవ" ♦ ఇత్యాదివాక్యములచే భక్తకృతపాపమును భగవంతుఁడు గ్రహించుచున్నాఁ డని ప్రతిపాదింపఁబడుచున్నది. అందువేని, సత్యము ప్రతిపాదింపఁబడుచున్నది. అట్లు ప్రతిపాదించుటకు నామకీర్తనరూపప్రాయశ్చిత్తముచేత అనాత్మజ్ఞుని వానిపాపమునుండి విడిపించుటయే యభిప్రాయము, కాని పరమాత్మ వికారి యనియు నతఁడు పాపముల గ్రహించు ననియు బోధించుట యభిప్రాయము కాదు. ఇట్లు "తస్మా త్సంకీర్తనం విష్ణో ర్జగన్మఙ్గల మంహసామ్। మహతామపి కౌరవ్య విద్ధ్యైకాన్తికనిష్కృతిమ్॥ఏకావినిష్కృతిశ్శమ్భో స్సకృదేవహికీర్తనమ్* ఇత్యాదివచనములవలనఁ దెలియవచ్చుచున్నది. అట్లు కా దనునెడ నిర్వికారత్వప్రతిపాదకము లగుబహుశ్రుతులకు విరోధము ప్రసక్తించును. మఱియును, భక్తునియొక్కగాని ఇతరునియొక్కగాని ఎవ్వనియొక్కయు, భక్తిచే సమర్పింపఁబడిన శ్రౌతస్మార్తకర్మానుష్ఠానజన్య మగు, సుకృతంచ = పుణ్యమును గూడ; నైవాదత్తే = వెలుపలి

♦ విష్ణువు దుష్టచిత్తులచే స్మరింపఁబడినను వారిపాపములనుహరించుచున్నాఁడు, స్మరింపఁబడిన మాత్రముననే అనేకజన్మార్జిత మయినపాపరాశిని నిశ్శేషముగా హరించుచున్నాఁడు.

* అందువలన, కౌరవుఁడా! విష్ణుసంకీర్తనము జగన్మంగళము. మహాపాపములకుఁ గూడ విహిత మయినప్రాయశ్చిత్తము అని యెఱుంగుము. శివుని ఒకమాఱు కీర్తించుటయే ముఖ్య మయిన ప్రాయశ్చిత్తము.

యాహుతినివలెఁ గొంచె మయినను గ్రహింపఁడు. ఓయీ! అట్లయిన, «ధర్మావహం పాపనుదం వరదం దేవ మీడ్యమ్, ప్రభుః ప్రీణాతి, పత్రం పుష్పం ఫలం తోయమ్» ఇత్యాది శ్రుతిస్మృతివాక్యములకు అప్రామాణ్యము సంభవించును అందువేని; కాదు, సత్త్వశుద్ధికాముఁ డగు ముముక్షువునకుఁ బరమేశ్వరోపాసనమునందుఁ దన్మహత్త్వము ప్రతిపాదించుటచే రుచిఁ బుట్టించు నుద్దేశము గల వగుటవలన «వాయుర్వై క్షేపిష్ఠా దేవతా» ఇత్యాదివాక్యములకుం బోలె నా వాక్యములకుఁ బ్రామాణ్య ముపపన్న మగుటవలన. ఓయీ! పండితులును అపండితులును అందఱును స్నాన సంధ్యానుష్ఠాన యజ్ఞ దానాదులు చేసి తత్ఫలమును ఈశ్వరునకే సమర్పించుచున్నారు, గ్రహించుచున్నాఁ డీశ్వరుం డను నభిప్రాయమున. అది యెట్లని యాశంకింపఁగా, వారు వేదాంతవిచారజన్యజ్ఞానము లేమివలననే యట్లు చేయుచున్నా రను నాశయముతోఁ జెప్పుచున్నాఁడు.—అజ్ఞానేన = ఆత్మ దేహేంద్రియాదులకంటె భిన్నుఁడు అవిక్రియుఁడు చిద్రూపుఁడు పరిపూర్ణుఁడు అఖండానందైకరసుఁడు అని తెలియుట జ్ఞానము, దానికి విపరీతము అజ్ఞానము, అట్టి యజ్ఞానముచేత; జ్ఞానమ్ = ఈ చెప్పినజ్ఞానము; ఆవృతమ్ = రాహువుచే సూర్యబింబమువలెఁ గప్పఁబడినది. తేన = ఆపరమాత్మతత్త్వము తెలియమిచేతనే; జన్తవః = ప్రాణులు అందఱును; నేను నాది యని ఈకర్మముచే నీశ్వరుఁడు ప్రీతిఁ బొందుచున్నాఁడు నాకు అభీష్టము నిచ్చును భుజింతును భుజింపఁ జేయుదును అని, ముహ్యన్తి—పరతత్త్వము తెలియనివారై సంసారము నొందుచున్నా రని యర్థము.

మ. ఓయీ! ఈశ్వరుఁడు కారయిత, జీవుఁడు కర్త. అట్లు శ్రుతి «ఏష ఆ హ్యేవ సాధు కర్మ కారయతి తం య మున్ని నీషతే ఏష ఉ ఏవా ఽసాధు కర్మ కారయతి తం యమధో ని నీషతే» ఇత్యాదిగా. స్మృతియును «అజ్ఞో జన్తు రనీశో ఽయ మాత్మన స్సుఖదుఃఖయోః । ఈశ్వరప్రేరితో గచ్ఛే త్స్వర్గం వా శ్వభ్రమేవ వా» ♦ అని. ఇట్లు జీవేశ్వరులు కర్తృత్వకారయితృత్వములును భోక్తృత్వభోజయితృత్వములును గలవా రగుటచే వారికిఁ బాపపుణ్య లేపము సంభవించుటవలన, ఎట్లు చెప్పవచ్చును స్వభావస్తు ప్రవర్తతే అని? ఇందుకుఁ జెప్పుచున్నాఁడు.—పరమార్థంబున, విభుః = పరమేశ్వరుఁడు; కస్యచిత్ = ఒకానొకజీవుని యొక్కయు; పాపమ్; సుకృతంచ; నైవా ఽఽదత్తే = గ్రహింపనే గ్రహింపఁడు, పర

♦ అజ్ఞుఁ డగుప్రాణి యితఁడు, తనసుఖదుఃఖములయందు అస్వతంత్రుఁడు, ఈశ్వరప్రేరితుఁడై స్వర్గమును గాని గోతినిగాని పొందుచున్నాఁడు.

మార్గమున జీవునకుఁ గర్తృత్వము లేమివలనను బరమేశ్వరునకును గారయితృత్వము లేమివలనను. అప్పుడు, ఎట్లు శ్రుతియును స్మృతియును లోకవ్యవహారమును ? అందుకుఁ జెప్పుచున్నాఁడు.—అజ్ఞానేన=ఆవరణవిక్షేపశక్తులు గలదియు మాయ యను పేరు గలదియు అసత్యము నగు తమస్సుచేత; ఆవృతమ్ = ఆచ్ఛాదింపఁబడినది; జ్ఞానమ్ = జీవేశ్వరజగద్భేదభ్రమమున కధిష్ఠానభూతము నిత్యము స్వప్రకాశము సచ్చిదానందరూపము అద్వితీయ మగు పరమార్థసత్యము. తేన = ఆస్వరూపావరణముచేత; ముహ్యన్తి= ప్రమాత ప్రమేయము ప్రమాణము కర్త కర్మము కరణము భోక్త భోగ్యము భోగము అను తొమ్మిదివిధము లయినసంసారరూపమోహమును—అది కానిదానియం దది తోఁచుట యను విక్షేపమును పొందుచున్నారు; జన్తవః = జననశీలు రయినసంసారులు, వస్తుస్వరూపము నెఱుంగనినారు. అకర్తృభోక్తృపరమానందాద్వితీయాత్మస్వరూపము నెఱుంగమిచేఁ గలుగునది యీజీవేశ్వరజగద్భేదభ్రమము మూఢులకుఁ బ్రతీయమాన మగుచున్నది. ఆయవస్థయందు మూఢులప్రత్యయము ననువదించునవి యీశ్రుతిస్మృతులు వాస్తవ మయిన యద్వైతము బోధించువాక్యములకు శేషభూతములు *. కావున లేదు దోషము.

శ్రీ. అందువలన.—ప్రేరకుఁ డైనను, కస్యచిత్ ; పాపం సుకృతంచ; నైవాదత్తే=పొందనే పొందఁడు. అందుకు హేతువు —విభుః=పరిపూర్ణుఁడు, అవాప్తసమస్తకాముఁ డని యర్థము. స్వార్థమునం దలి కామునచేఁ జేయించునేని అప్పు డట్లగును; ఇదియో లేదు, అవాప్తకాముఁడైయే అచింత్య మగు నిజమాయచే వారివారిపూర్వకర్మము ననుసరించి ప్రవర్తకుఁ డగుటవలన. ఓయీ ! భక్తుల ననుగ్రహించుచు అభక్తుల నిగ్రహించుచు వైషమ్యము గలవాఁడై యుండఁగా నెట్లు ఆప్తకాముఁ డనవచ్చును ? ఇందుకుఁ జెప్పుచున్నాఁడు—అజ్ఞానేన = నిగ్రహము గూడ దండ ♦ రూప మయినయనుగ్రహమే యని యిట్లు తెలియమిచేత; జ్ఞానమ్=సర్వప్రసముఁడు పరమేశ్వరుఁ డనుజ్ఞానము; ఆవృతమ్. తేన = ఆకారణముచేత; జన్తవః = జీవులు; ముహ్యన్తి—భగవంతునియందె వైషమ్యముఁ దలంచుచున్నా రని యర్థము.

ప. అందువలననే చెప్పుచున్నాఁడు.—విభుః = ఆకాశమువలెవ్యాపకుఁడు సర్వసముఁ డగుపరమేశ్వరుఁడు; కస్యచిత్ ; పాపమ్; సుకృతంచ; నాదత్తే = గ్రహిం

* అద్వైతబోధకవాక్యములకు అంగములు—అప్రధానములు.

♦ శిక్షా.

కఁడు, పరిపూర్ణుఁ డగుటవలన. మ తేమనఁగా. అజ్ఞానేన; జ్ఞానమ్; అవృతమ్. తేన= ఆకారణముచేత; జన్తవః = అజ్ఞు లగుజీవులు; ముహ్యన్తి. అందువలన సత్కర్మమును అసత్కర్మమును గాని చేయుచున్నా రని యర్థము.

రా. కస్యచిత్ = తనకు సంబంధి యని సమ్మతుఁ డైనపుత్త్రుడు మొదలగు నొకానొకనియొక్క; పాపమ్ = దుఃఖమును; నా దత్తే = పోఁగొట్టఁడు. కస్యచిత్ = తనకుఁ బ్రతికూలుఁ డని సమ్మతుఁ డైన యొకానొకనియొక్క; సుకృతంచ = సుఖమును గూడ; నాదత్తే = పోఁగొట్టఁడు. ఎందువలన ననఁగా. ఇతఁడు, విభుః—ఒకానొకచోట నుండువాఁడు కాఁడు, దేవాదిదేహములు మాత్రమే యసాధారణమయిన దేశముగాఁ * గలవాఁడు కాఁడు, అందువలననే ఎవ్వనికిని సంబంధి కాఁడు, ఎవ్వనికిని బ్రతికూలుఁడును గాఁడు. అంతయునిది వాసనాకృతము. ఇట్టిస్వభావము గల యితనికి ఎట్లీవిపరీతవాసన పుట్టుచున్నది ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—— అజ్ఞానేన అవృతం జ్ఞానమ్—అజ్ఞానేన = జ్ఞానవిరోధి యగు పూర్వాపూర్వకర్మముచేత; తనఫలము ననుభవింపయోగ్యుఁ డగుకొఱకు; వీనియొక్క, జ్ఞానమ్; అవృతమ్ = సంకుచిత మయ్యెను. తేన = జ్ఞానావరణరూపమయినకర్మముచే, దేవాదిదేహసంయోగమును ఆయాదేహమునందు ఆత్మాభిమానరూపమోహంబును కలుగుచున్నది. అంత, అట్టి దానియం దాత్మాభిమానవాసనయు దానికిఁ దగినకర్మవాసనయుఁ గలుగుచున్నది. ఆవాసనవలన విపరీతాత్మాభిమానంబును గర్మారంభంబును ఉపపన్న మగుచున్నది.

ఈయాత్మ ఒక నియత మైనదేహమున నుండువాఁడు కాఁడు, కావున నితఁడు తన కనుకూలుని దుఃఖమును గాని ప్రతికూలుని సుఖమును గాని పోఁగొట్టఁడు. ఏల యనఁగా నితని కనుకూలుఁడును లేఁడు, ప్రతికూలుఁడును లేఁడు. జ్ఞానవిరోధి యగుపూర్వాపూర్వకర్మము వీని జ్ఞానము నావరించుటచే నితనికి మోహము గలిగి యందుచేఁ గర్మములు చేసి నానావిధ దేహములు పొందుచున్నాఁ డని తా.

మా. ♦

జ్ఞానేన తు త దజ్ఞానం యేషాం నాశిత మాత్మనః
తేషా మాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతి త త్పరమ్. ౧౬

భా. ఏయజ్ఞానముచే నావృతులై జంతువులు మోహము నొందుచున్నారో, తత్ =అట్టి; ఆత్మనః=ఆత్మయొక్క; అజ్ఞానమ్ = అజ్ఞానము; యే

* స్థలముగా.

♦ దీనికి మాధ్వభాష్యము లేదు.

షామ్ = ఏజంతువులకు; జ్ఞానేన = ఆత్మవిషయ మగు వివేకజ్ఞానముచేత; నాశితమ్ = నశింపఁజేయఁబడినది యగుచున్నదో; తేషామ్=ఆజంతువులకు; ఆదిత్యవత్ = సూర్యునివలె, ఎట్లుసూర్యుఁడు సమస్త మయినరూపజాలమును ప్రకాశింపఁ జేయుచున్నాఁడో అట్లు; జ్ఞానమ్=జ్ఞానము; జ్ఞేయ మయినవస్తువును సర్వమును, తత్ =ఆ; పరమ్ = పరమార్థతత్త్వమును; ప్రకాశయతి = వెల్లడిచేయుచున్నది.

అట్టి యాత్మాఽజ్ఞాన మెవ్వరికి జ్ఞానముచే నాశము నొందునో వారికి మాత్రము ఆజ్ఞానము సూర్యుఁడు సర్వప్రపంచమును ప్రకాశింపఁజేయునట్లు పరమార్థతత్త్వము సర్వమును ప్రకాశింపఁజేయు చున్న దని తా.

ఆ. అప్పుడు అందఱు ననాద్యజ్ఞానముచే నావృతమైనజ్ఞానముగలవా రగుట వలనవ్యామోహము నశింపకపోవుటవలన నెట్లు సంసారనివృత్తి యగును? అనఁగాఁ జెప్పుచున్నారుఏయజ్ఞానముచే నిత్యాదిగా. సర్వమును—పూర్ణము నని యర్థము. తత్ పరమ్—అనుట జ్ఞేయం బగువస్తువునకే విశేషణము. దానికి వ్యాఖ్యానము చేయుచున్నారు పరమార్థతత్త్వము నని.

హ. ♦

శం. ఓయీ! అందఱును అజ్ఞానముచే నావరింపఁబడినజ్ఞానము గలవారగుదు రేని ఎట్లు ముముక్షువుల కాత్మజ్ఞానము కలుగును? ఎట్లు వారికి ముక్తి సిద్ధించును? అని యాశంకింపఁగాఁ; ఈశ్వరప్రీతికొఱకు నిత్యనైమిత్తికకర్మములనుష్ఠించుటచేత నెప్పుడు సమ్యక్జ్ఞాన ముదయించి యజ్ఞానమును నశింపఁజేసి పరతత్త్వమును ప్రకాశింపఁ జేయుచున్నదో, అప్పుడు వారు ముక్తిని బొందుచున్నా రనునాశయముతోఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత—తు అనునది జ్ఞానము దక్క మఱి యేదియు నజ్ఞానమును నశింపఁజేయఁజాల దని తెలుపుటకొఱకు. కర్మోపాసనములచేఁ బరిపక్వ మయినచిత్తము గలవారికి, యేషామ్= ఎవరికి; జ్ఞానేన తు= శ్రవణాదులచేఁ గలిగిన యాత్మవిషయకజ్ఞానముచేతనే. ఆత్మనః=బుద్ధియొక్క, బుద్ధిసంబంధి యయిన, బుద్ధియం దున్న దగు అనుట, జ్ఞానా ఽజ్ఞానంబులు బుద్ధిధర్మం బగుటవలన, ఆవరణంబును అనావరణంబును పటలముచే నేత్రమునకే గాని ఘటమునకుఁ ♦♦ గాదు

♦ శంకరభాష్యముతో సమానము.

♦♦ విషయమునకు.

గదా! అట్లు అజ్ఞానంబును జ్ఞానంబును బుద్ధికే యగును ఆత్మకు లేదు, అట్లు కానిచో
నే ననుప్రత్యయం బనుపపన్న మగుటవలన; అందువలన బుద్ధి నిష్ఠమే యజ్ఞానము;
దీనిచే మోహితు లయి యేప్రాణులు సంసరించుచున్నారో ఏది సర్వానర్థములకును
బీజమో, తత్ అజ్ఞానమ్ = అట్టియజ్ఞానము; నాశితమ్ = సూర్యోదయముచే నంధకా
రమువలె నశింపం జేయఁబడిన దగునో; తేషామ్=అట్టిశుద్ధాత్ములకు; పుట్టిన, జ్ఞానమ్=
ఆజ్ఞానము; ఆదిత్యవత్ = ఎట్లు ఉదయించినసూర్యుఁడు పదార్థజాతమును ప్రకాశింపఁ
జేయుచున్నాఁడో అట్లు; తత్ =సర్వవేదాంతప్రసిద్ధము సత్యజ్ఞానాదిలక్షణము ప్రత్య
గభిన్న మగు; పరమ్ = బ్రహ్మమును; ప్రకాశయతి. సూర్యప్రకాశముచే స్థాణువే
యిది యని యెఱుంగుచున్నారో అట్లు జ్ఞానప్రకాశముచే బ్రహ్మమే నే నని తన్ను
బ్రహ్మముగానే యెఱుంగుచున్నా రని యర్థము.

మ. అప్పుడు, అందఱును అనాద్యజ్ఞానావృతు లగుటవలన నెట్లు సంసార
నివృత్తి యగును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—తత్ = అట్టి, ఆవరణవిక్షేపశ
క్తులు గలదియు అనాదియు అనిర్వచనీయంబును అనృతంబును అనర్థసమూహమునకు
మూలంబు నగు; అజ్ఞానమ్= ఆత్మ యాశ్రయముగాను విషయముగాను గలదియు అవి
ద్య మాయ మొదలగు నామములు గలదియు నగు నజ్ఞానము; ఆత్మనః; జ్ఞానేన=గురూప
దిష్టవేదాంతమహావాక్యజన్యంబును శ్రవణమనననిదిధ్యాసనపరిపాకముచే నిర్మలమయి
నయంతఃకరణముయొక్క వృత్తిరూపమును శోధితములగు తత్త్వంపదార్థముల యభేద
రూప మయినశుద్ధసచ్చిదానందాఖండైకరసవస్తుమాత్రమె విషయముగాఁ గలదియు
నగు నిర్వికల్పకసాక్షాత్కారముచేత; నాశితమ్ = కాలత్రయమునందును బాధిత
మైనది; శుక్తిజ్ఞానముచే శుక్తియందు రజతమువలె అసత్తే యసత్తుగా నెఱుంగఁ
బడి యధిష్ఠానచైతన్యమాత్రతను బొందింపఁబడినది; యేషామ్ = శ్రవణమననాది
సాధనసంపన్నులును భగవదనుగ్రహము గలవారును నగు ఏముముక్షువులకో; తేషామ్=
వారికి; తత్ జ్ఞానమ్= ఆజ్ఞానము; ఆదిత్యవత్ = ఎట్లు సూర్యుఁడు తా నుదయించుట
మాత్రముననె చీఁకటిని నిశ్శేషముగా నివర్తించుచున్నాఁడో, దేనిని సహాయము
నపేక్షింపఁడో, అట్లు బ్రహ్మజ్ఞానము గూడ శుద్ధసత్త్వపరిణామం బగుటవలన వ్యాప
కప్రకాశరూపమగుటచేఁ దానుబుట్టుటమాత్రముననె యితరసహకారము నపేక్షింప
కయె కార్యసహిత మగునజ్ఞానమును నివర్తించుచు; పరమ్ = సత్యజ్ఞానానంతానంద
రూపము ఏకమే అద్వితీయ మగుపరమాత్మతత్త్వమును; ప్రకాశయతి = ప్రతిభా

యాగ్రహణమాత్రంబుననే కర్తృత్వము † లేకయె యభివ్యంజించుచున్నది. ఇచట "అజ్ఞానే నాఽఽవృతమ్, జ్ఞానేన నాశితమ్" అనియజ్ఞానము ఆవరణం బనియు జ్ఞాననాశ్యం బనియుఁ జెప్పుటవలన అజ్ఞానము జ్ఞానాభావరూపం బనుట నిరాకరింపఁబడినది. అభావము దేనిని ఆవరింపఁజాలదు గదా! జ్ఞానాభావము గాని జ్ఞానముచే నాశ్యము గాదు, స్వభావంబుననే అది నాశరూపం బగుటవలన††. అందువలన "నేను అజ్ఞుఁడను నన్ను ఇతరునిఁ దెలియకున్నాఁడను" ఇత్యాదిగా సాక్షిప్రత్యక్షసిద్ధము భావరూపమే యజ్ఞానం బని భగవంతునిమతము. విస్తరం బద్వైతసిద్ధియందుఁ జూచునది. "యేషా మ్మని" బహువచనముచే అనియమము తెలుపఁబడినది. అట్లు శ్రుతి "తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవ త్తథర్షీణాం తథా మనుష్యాణాం త దిద మప్యేతర్హి య ఏవం వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి" * ఇత్యాదిగా ఏది విషయము ఏది యాశ్రయము అజ్ఞానమున కగునో తద్విషయతదాశ్రయప్రమాణజ్ఞానమువలన ఆయజ్ఞానమునకు నివృత్తి యగు నను న్యాయముచే సిద్ధ మయిన యనియమముఁ దెలుపుచున్నది, అందు అజ్ఞానగత మయినయావరణము రెండువిధములు. ఒకటి సత్తునకును § అసత్త్వాపాదకము, రెండవది భానము గలదానికిఁ గూడ అభానాపాదకము. అందు మొదటిది పరోక్షాఽపరోక్షసాధారణ ప్రమాణజ్ఞానమాత్రమున ‖ నివర్తిల్లుచున్నది, వహ్న్యాదికము అనుమితం బయినను ** పర్వతంబున వహ్ని లే దను భ్రమ నశించుటవలన. అట్లు "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మేతి" అనువాక్యమువలనఁ బరోక్షనిశ్చయం బైనను బ్రహ్మము లే దను భ్రమము నివర్తిల్లనే నివర్తిల్లుచున్నది. ఉండనే యున్నది బ్రహ్మము, అయినను నాకుఁ దెలియదు అను భ్రమను కలిగించునట్టి రెండవది యగు నభానావరణము సాక్షాత్కారమువలననే నివర్తిల్లుచున్నది. అట్టి నిర్వికల్పకసాక్షాత్కారము వేదాంతవాక్యమువలననే కలుగుచున్నది. ఇత్యాదికం బద్వైతసిద్ధియందుఁ దెలియునది.

---

† జ్ఞేయత్వమనుట.

†† అది స్వాభావముచే-తనయభావముచే నాశ్యం బగుటవలన. అనిపాఠాంతరము.

* బ్రహ్మమును దేవతలలో నెవ్వఁ డెవ్వఁ డెఱింగెనో అతఁడే బ్రహ్మ మయ్యెను. అట్లుఋషులలోను. అట్లు మనుష్యులలోను ఇప్పుడు దాని నెవ్వఁ డిట్లు నేను బ్రహ్మ మగుచున్నా నని యెఱుంగుచున్నాఁడో అతఁ డిది సర్వము నగుచున్నాఁడు.

§ ఉన్నదానికిని.

‖ పరోక్షజ్ఞానమునఁ గాని అపరోక్షజ్ఞానమునఁ గాని.

** అపరోక్షముగాఁ జూడ కున్నను.

శ్రీ॥ జ్ఞానులు మాత్రము మోహము నొందరని చెప్పుచున్నాఁడు.—— ఆత్మనః= భగవంతునియొక్క; జ్ఞానేన; యేషామ్; తత్ = అట్టిదైనమ్మయము దోఁపిం చునట్టి; అజ్ఞానమ్; నాశితమ్; జ్ఞానమ్; తేషామ్; అజ్ఞానమును నశింపఁజేసి, తత్; పరమ్ = పరిపూర్ణ మయినయీశ్వరస్వరూపమును; ప్రకాశయతి; ఎట్లు ఆదిత్యుఁడు చీఁకటిని దొలఁగించి వస్తుజాతమును బ్రకాశింపఁ జేయుచున్నాఁడో అట్లు.

ప॥ జ్ఞానులు మాత్రము మోహము నొందరని చెప్పుచున్నాఁడు.—— తత్ = మున్ను చెప్పిన జ్ఞానావరక మైన; అజ్ఞానమ్ = అజ్ఞానము; యేషామ్ = ఎవ్వరికి; ఆత్మనః = ఈశ్వరునియొక్క; జ్ఞానేన; నాశితమ్ = తేజస్సుచేఁ జీఁక టివలె అభిభవింపఁ బడిన దగునో; తేషామ్; జ్ఞానమ్; తత్; పరమ్ = పరమేశ్వ రుని. ప్రకాశయతి. దేనివలె ? ఆదిత్యవత్ = ఎట్లు ఆదిత్యుని తేజస్సు చీఁకటి నెల్ల తిరస్కరించి యాదిత్యునిఁ బ్రకాశింపఁజేయు చున్నదో అట్లు. లేక. ఇట నాదిత్య దృష్టాంతముచే నిది చెప్పఁబడినది——ఎట్లు సూర్యకిరణములే మేఘత్వము నవలంబించి సూర్యునే కప్పుచున్నవి గాని దినమునకు ♦ దినత్వమును పోఁగొట్టవో—అట్లు చెప్పఁ బడినది « ఘనచ్ఛన్నదృష్టిర్ఘనచ్ఛన్న మర్కం యథా నిష్ప్రభం మన్యతే చాఽతి మూఢః ” ♦♦ అని ఇదియే యజ్ఞానము నావరణశక్తికి నుదాహరణము—అట్లు ఆత్మ విషయక మయినయజ్ఞానము ఆత్మనే యావరించుచున్నది గాని యనుభవింపఁబడు చున్న చిత్సుఖరూపత్వము నాచ్ఛాదింపదు. ఇదియే జ్ఞానోపాయ మని యర్థము. శ్రుతియును వాజసనేయసంహితయందు « ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్। తేన త్యక్తేన భుఞ్జీథా మాగృధః కస్య స్విద్ధనమ్ ॥ అని. ఇందుకు భాష్యము——జగత్యామ్ = పృథివియందు, ఇదమ్ = శుక్తి రజతమువలె నెదుటఁ గనఁబడుచున్న; యత్ కించిత్ సర్వమ్ = ఏదినామరూపకర్మాత్మకము గలదో అట్టి సమస్త మయిన; జగత్ = గచ్ఛతి—పోవుచున్నది కావున నశ్వరము అసత్యమయిన పదార్థము; ఈశా = సత్యాద్యైశ్వర్యవంతుఁ డగు పరమేశ్వరునిచే; వాస్యమ్= ఆచ్ఛాదింపఁ దగినది, తిరస్కరింపఁ దగినది. ఇటఁ దిరస్కరించు సామర్థ్యము ఈశా అనుపదముచేఁ దెలుపఁబడినది, ఎట్లు దీపముచేఁ జీఁకటి తిరస్కరింపఁ బడుచున్నదో, కాని చీఁకటిచే దీపము తిరస్కరింపఁబడదో అట్లు అనియర్థము.

---

♦ పగటికి.

♦♦ ఎట్లు అతిమూఢుఁడు మేఘముచేఁ గప్పఁబడిన దృష్టిగలవాఁడై మేఘముచేఁ గప్పఁబడిన సూర్యునిఁ బ్రకాశము లేనివానిఁగాఁ దలంచుచున్నాఁడో.

అందువలన, తేన = ఆజగరాభాసముచేత, త్యక్తేన= విడువఁబడినదానిచేత, జగదాభాసమును విడిచి యనుట, మిగిలిన, కస్య= బ్రహ్మముయొక్క, ధనమ్ = సుఖమును, భుఞ్జీథాః= అనుభవింపుము. స్విత్ =మరేమనఁగా. విషయసుఖమును, మాగృధః= కోరకుము.

రా. « సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి, జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా, నహి జ్ఞానేనసదృశమ్ » అని మున్ను చెప్పినదానిని స్వశాలము నందుఁ జేర్చుచున్నాఁడు.—— ఇట్లువర్తించుచున్న యాత్మలయందతి యందు, యేషామ్= ఏయాత్మలకు; జ్ఞానేన= చెప్పినలక్షణము గలదియు ఆత్మతత్త్వోపదేశముచేఁ గలిగినదియు ప్రతిదినము అభ్యాసముచే నతిశయము నొందినదియు నిరతిశయపవిత్రము నగు ఆత్మవిషయజ్ఞానముచేత; తత్ = అనాదికాలప్రవృత్తానంతకర్మసంచయరూప మయినజ్ఞానావరణ మగునాయజ్ఞానము; నాశితమ్; తేషామ్ = వారలకు; తత్ = అస్వాభావిక మగు; పరమ్ =అపరిమితము అసంకుచితము నగుజ్ఞానము; ఆదిత్యవత్ =సూర్యునివలె; సమస్తమును యథావస్థితముగా ♦, ప్రకాశయతి. తేషామ్ అని అజ్ఞానము నశించినవారివిషయమున బహువచనము ప్రయోగించుటవలన ఆత్మలు అనేకు లని చెప్పఁబడినది. « నత్వేవాహం జాతునాసమ్ » అని యుపక్రమముచే సూచింపఁబడినది, ఇట స్పష్టతరముగాఁ జెప్పఁబడినది. ఈబహువచనము ఉపాధికృతం బన వలను గాదు, అజ్ఞానము నశించినవారికి ఉపాధిలేశ మయినను లేమివలన. « తేషామాదిత్యవత్ జ్ఞానమ్ » అని భేదము నిర్దేశించుటవలన జ్ఞానము స్వరూపానుబంధి యగుధర్మంబని చెప్పఁబడినది. ఆదిత్యదృష్టాంతముచే జ్ఞాతృజ్ఞానములస్థితి ప్రకాశవత్ప్రకాశములస్థితివంటి దనియుఁ బ్రతిపాదింపఁబడినది. అందువలననే సంసారావస్థయందు జ్ఞానమునకుఁ గర్మముచే సంకోచమును మోక్షావస్థయందు వికాసమును ఉపపన్నము.

ఇట్టియాత్మలలో నెవ్వరి కాత్మతత్త్వజ్ఞానముచే నాయజ్ఞానము నశింపఁ జేయఁబడినదో వారికి ఉత్తమమగునాజ్ఞానము సూర్యునివలె సమస్తంబును వస్తుస్థితిగాఁ బ్రకాశింపఁజేయుచున్న దని తాత్పర్యము.

పూ. జ్ఞానమే యజ్ఞానమును నశింపఁజేయు నని చెప్పుచున్నాఁడు.—మొదటిజ్ఞానము పరోక్షము.

♦ ఉన్నది యున్నట్లుగా.

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః
గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. ౧౭

భా. ఏవరమార్థత త్త్వము జ్ఞానముచేఁ బ్రకాశిత మగునో.— తద్బుద్ధయః = దానియందుఁ బొందినబుద్ధి గలవారును; తదాత్మానః = ఆవరబ్రహ్మమే యాత్మగాఁ గలవారును; తన్నిష్ఠాః = నిష్ఠ యనఁగా అభి నివేశము తత్పరత, సర్వకర్మములనుసన్న్యసించి బ్రహ్మమునందేయవస్థాన ముగలవారును; తత్పరాయణాః=అదియే ముఖ్య మయినగతిగాఁ గలవా రును, కేవల మాత్మయందే రతి గలవారు నని యర్థము; ఎవ్వరికి జ్ఞాన ముచే ఆత్మయొక్కయజ్ఞానము నాశిత మయ్యెనో అట్టి వీరు, గచ్ఛన్తి= పొందుచున్నారు; అపునరావృత్తిమ్ = మరల దేహసంబంధము లేమిని; జ్ఞాననిర్ధూతకల్మషాః=చెప్పినజ్ఞానముచేత నాశితమయినకల్మషము—పాపాది సంసారకారణదోషము గలవారు, యతు లని యర్థము.

అట్టి జ్ఞానముచేఁ బ్రకాశిత మయినపరబ్రహ్మమునందే బుద్ధి గలవార లయి అపరబ్రహ్మమే తానయినవారై దానియందే తత్పరులైయదియే పరమగతిగాఁ గలవారైన యతులు, జ్ఞానముచే నాశిత మయినసంసారకారణమగుకర్మము గలవా రగుటవలన మరల జన్మము నొంద రని తాత్పర్యము.

ఆ. విద్వాంసులకును వివిదిషులకును అంతరంగము లయినవిద్యాపరిపాక సాధనముల నుపదేశింపఁ గోరినవారై మీఁదిశ్లోకమున కాకాంక్షాపూరణము చేయు చున్నారు ఏవరమార్థత త్త్వము ఇత్యాదిగా. దానియందు—అపరమార్థత త్త్వము నందుఁ బరబ్రహ్మమునందు, బాహ్యవిషయమును విడిచి పొందిన—ప్రవర్తించిన, శ్రవ ణమననవనిదిధ్యాసనములచేఁ బలుమా అనుష్ఠింపఁబడినవానిచే, బుద్ధి—సాక్షాత్కా రము గలవారు నని మొదటివిశేషణమును విభజించుచున్నారు దానియందు ఇత్యా దిగా. అప్పుడు జ్ఞాత జీవుఁడు జ్ఞేయము బ్రహ్మం బని జీవబ్రహ్మభేదము నంగీకరించిన ట్లగును అనఁగాఁ జెప్పుచున్నారు తదాత్మానః అని. జ్ఞాతృత్వమును జ్ఞేయత్వమును కల్పితము, వాస్తవమునకో లేదు భేదం బని యంగీకరించి వ్యాఖ్యానము చేయు చున్నారు అపరబ్రహ్మమే ఇత్యాదిగా. ఓయీ! దేహాదికమునందు ఆత్మాభిమాన మును విడిచి బ్రహ్మమునందే నేనే యది యని యుండుట, ఆదేహాదికముచేఁ జేయఁ బడుకర్మముయొక్కప్రతిబంధమువలన సిద్ధింప దని యాశంకించి విశేషణాంతరము

దీయుచున్నారు తన్నిష్ఠాః అని. అందు నిష్ఠాశబ్దార్థముఁ జూపుచు వివక్షితార్థముఁ జెప్పుచున్నారు నిష్ఠ యనఁగా ఇత్యాదిగా. అట్లయినను ఇతరపురుషార్థాపేక్ష ప్రతిబంధించుటవలన బ్రహ్మమునం దవస్థానము ఎట్లు సిద్ధింపఁ గల దని యాశంకించి చెప్పుచున్నారు తత్పరాయణాః అని. ఈచెప్పిన యధికారులకుఁ బరమపురుషార్థము ఈబ్రహ్మముకన్న భిన్నము కాదు కావున వారి కితరమునం దాసక్తి లే దని తాత్పర్యార్థము చెప్పుచున్నారు కేవలము ఇత్యాదిగా. ఓయీ! ఈవిశేషణములు గలవారికి ఇప్పటిదేహము పడినను దేహాంతరపరిగ్రహమున కధీను లగుటచే నెట్లు బ్రహ్మమునం దవస్థానము చెప్పనచ్చును? అనఁగాఁ జెప్పుచున్నారు ఎవ్వరికి ఇత్యాదిగా. సంసారకారణ మయినపాపాదిక ముండునప్పుడు సంసారము ప్రవర్తింపక తప్పదు కావున అపునరావృత్తి సిద్ధింప దని యాశంకించి చెప్పుచున్నారు జ్ఞా నేత్యాదిగా. ఈవిశేషణములు గలిగి చెప్పినఫలము నొందుట యతిరాశ్రమములం దసంభావితం బని తలంచినవారై విశేషణము చేయుచున్నారు యతులు అని.

హ. ♦

శం. « తేన త్యక్తేన భుఞ్జీథా మాగృధః కస్య స్విద్ధనమ్ » ఇత్యాదిశ్రుతులందుఁ జెప్పినవిధంబున విదేహకైవల్యార్థులు కలిగినజ్ఞానమును సదా ఆత్మనిష్ఠయందే యుంచి రక్షించుకొనవలయును, బాహ్యము ను దేనిని జూడఁ గూడ దని బోధించుటకై చెప్పుచున్నాఁడు.—తద్బుద్ధయః = ఆదిత్యునిచే రూపమువలె శ్రవణాదిజన్యమగు జ్ఞానముచేఁ బ్రకాశింపఁజేయఁబడినదియు సర్వవేదాంతప్రసిద్ధంబును సచ్చిదానందైకరసంబును సర్వాత్మకము నైన యేపరబ్రహ్మము గలదో దానియందె బుద్ధి గలవారలు, అంతటను బ్రహ్మమునే చూచువారు; ముముక్షువులు కల్పితభేదము గ్రహింపక నేత్రముచే రూపమునుంబోలెఁ బ్రత్యగ్దృష్టిచే సదా సర్వత్ర బ్రహ్మమునే చూడవలయు నని యర్థము. సమస్తమును బ్రహ్మమే యని సర్వత్ర బ్రహ్మమునే గ్రహించుచుండినను గ్రహించువాఁడు గ్రాహ్యము అని భేదం బగును, అప్పుడు « ఏ తస్మిన్నుదర మన్తరం కురుతే, అథ తస్య భయం భవతి » * అని భేదదృష్టి గలవానికి భయము కలుగు నని శ్రుతి చెప్పుటవలన అభేదముగాఁ జూడవలయు నని చెప్పుచున్నాఁడు—తదాత్మానః = ఆబ్రహ్మమే ఆత్మగా—అహంప్రత్యయార్థముగాఁ గలవారు, బ్రహ్మమే నే నని స్వస్వరూపముగా సాక్షాత్కరింపఁబడిన బ్రహ్మమునందే అహంప్రత్య

♦ శంకరభాష్యముతో సమానము.

* దీనియందుఁ గొంచెము భేదము చూచినచో నప్పు డంత వానికి భయ మగును.

యము గలవారు, దేహమునందుఁ గాదని యర్థము. సమాధిదశయందు బ్రహ్మము నందే యహంప్రత్యయ మున్నను విద్వాంసున కాహారాదికమునందు దేహమున నహంప్రత్యయ మగును, అట్లు చిరకాలికమయి ప్రబలమయి స్థూలమయిన దేహాత్మ ప్రత్యయముచే బ్రహ్మాత్మప్రత్యయము బాహ్యధ్వనిచే నాదధ్వనివలె నశించును, అందు వలన బాహ్యకర్మము సమస్తమును సన్న్యసించి ఆహారాదిసర్వావస్థలందును దృశ్యము గ్రహింపక బ్రహ్మమే తానను బుద్ధితో నుండవలయు నని చెప్పుచున్నాఁడు.—తన్నిష్ఠాః=ఆబ్రహ్మమునందు ఆత్మాకారప్రత్యయము ♦ చేయుటయే నిష్ఠ—అహంబుద్ధి నిశ్చయముగాఁ జేయుట, అది గలవారు, తాను బ్రహ్మముగా నున్నా నని యెఱింగినవారు, ఇట్టివృత్తి స్థిరముగాఁ గల వా రని యర్థము. బ్రహ్మాత్మత్వదర్శనమునందు స్థిరమయినచిత్తవృత్తి గలవారికిఁగూడ ఒకానొక ప్రయోజనాంతరమునందు అపేక్ష యుండునేని దానిచేత అనిష్ఠ ప్రతిబద్ధం బగును, బాహ్యదిత్తతగూడ సంభవించును, అందువలన బాహ్య మయినకార్యాంతరము దేనిని అపేక్షింపక ముముక్షువు సదా తదేకపరుండై యుండవలయు నని చెప్పుచున్నాఁడు—తత్పరాయణాః = అదియే—సచ్చిదానందైకరసమును అద్వితీయంబును స్వస్వరూప మని తెలియఁబడినది యగుపరబ్రహ్మమే వెలుపలను లోపలను బుద్ధివృత్తికి నేత్రమునకు రూపమువలె పరము—నియతమయిన అయనము—గతిగాఁ గలవారు; ఆహారవిహారాదికమునందును సదా సర్వత్ర బ్రహ్మదర్శనంబును బ్రహ్మమునందే యాత్మదర్శనంబును చిదేకవృత్తిచే నెవ్వరు విడువరో వారు తత్పరాయణులు, సదా ఆత్మారాము లని యర్థము. ఇట్లు సర్వత్ర బ్రహ్మదర్శనంబును బ్రహ్మమునం దాత్మత్వదర్శనంబును తన్నిష్ఠతయు తత్పరాయణతయు నను దేహముక్తికసాధారణకారణ మయిన యీ నాలుగింటిని ఏబ్రహ్మవిదు లనుష్ఠించుచున్నారో అట్టివారే, జ్ఞాననిర్ధూతకల్మషాః = జ్ఞానముచేత, చెప్పినయంతరంగసాధనముల నాలుగింటి ననుష్ఠించుటచే అప్రతిబద్ధతను బొందినదానిచేత, నిర్ధూతము—నిశ్శేషముగాఁ గడుగఁబడిన దగు కల్మషము—బుద్ధిగతమయిన దోషము జగద్బ్రహ్మములకును బ్రహ్మాత్మలకును భేదగ్రహణరూపము గలవారై; తమయంతనే, అపునరావృత్తిమ్=మరల దేహసంబంధమునొందుట పునరావృత్తి, అది లేకుండుట అపునరావృత్తి, దానిని, దేహసంబంధరహితమయిన ముక్తిని; గచ్ఛన్తి, బ్రహ్మరూపంబును మందునవస్థయందు ఈదేహము గళితముగాఁగా బ్రహ్మమునందు వృత్తి లీన మగుటచే తాము బ్రహ్మాకారంబుననే యుందు రని యర్థము.

---

♦ నే నను ప్రత్యయము.

వ. జ్ఞానముచేఁ బరమాత్మతత్త్వము ప్రకాశితముకాఁగా.—తద్బుద్ధయః= ఆజ్ఞానప్రకాశితమయిన సచ్చిదానందఘనపరమాత్మతత్త్వమునందే బాహ్యసర్వవిషయములను బరిత్యజించి సాధనపరిపాకమువలనఁ బర్యవసానమునొందిన బుద్ధి—సాక్షాత్కారరూపమయిన యంతఃకరణవృత్తి గలవారు తద్బుద్ధులు, సర్వదా నిర్బీజసమాధిఁ బొందినవా రని యర్థము. అప్పుడు, జ్ఞాతలు జీవులు జ్ఞేయము బ్రహ్మతత్త్వము అని జ్ఞాతృజ్ఞేయలక్షణమైన భేదముగలదా యేమి? అనఁగా లేదని చెప్పుచున్నారు—తదాత్మానః=ఆ పరబ్రహ్మమే ఆత్మగాఁగలవారు; జ్ఞాతృజ్ఞేయభానము మాయావిజృంభితం బగుటవలన వాస్తవమయిన యభేదమునకు విరోధి కాదని భావము. ఓయీ! తదాత్మానః అను విశేషణము వ్యర్థము, విద్వాంసునివిశేషణము అవిద్వద్వ్యావర్తకము కదా కావలయును, అవిద్వాంసులుగూడ వస్తుగతిచేఁ దదాత్ములే యగుదురు కావున నెట్లు విశేషణము అవిద్వద్వ్యావర్తకం బగును? అనఁగా నట్లు కాదు, ఇతరాత్మత్వవ్యావృత్తియందు * తాత్పర్య మగుటవలన. అవిద్వాంసులు అనాత్మభూతమయిన దేహాదికమునందు ఆత్మాభిమానము గలవారు కావున తదాత్ము లని వ్యపదేశింపఁబడరు, విద్వాంసులో దేహాద్యభిమానము నివర్తిల్లినవా రగుటవలన విరోధినివృత్తిచే తదాత్ము లని వ్యపదేశింపఁబడుచున్నారు. కావున యుక్తము విశేషణము. ఓయీ! కర్మానుష్ఠానముచే విక్షేపము కలుగుచుండఁగా నెట్లు దేహాద్యభిమాననివృత్తి యగును? అందుకుఁ జెప్పుచున్నాఁడు.—తన్నిష్ఠాః = ఆ బ్రహ్మమునందే సర్వకర్మానుష్ఠానవిక్షేపము నివర్తించి నిష్ఠ—స్థితిగలవారు తన్నిష్ఠులు, సర్వకర్మములను సన్న్యసించి తదేకవిచారపరులని యర్థము. ఫలమునందు రాగ ముండఁగా నెట్లు తత్సాధనభూతమయిన కర్మమును సన్న్యసింతురు? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—తత్పరాయణాః = అదియే ముఖ్యమయిన అయనము—పొందవలసినదిగాఁ గలవారు తత్పరాయణులు, సమస్తమునుండియు విరక్తు లని యర్థము. ఇట తద్బుద్ధయః అనుటచే సాక్షాత్కారము చెప్పఁబడినది, తదాత్మానః అనుటచే అనాత్మాభిమానరూపమయిన విపరీతభావనయొక్క నివృత్తిని గలిగించు నిదిధ్యాసనము చెప్పఁబడినది, తన్నిష్ఠాః అనుటచే ప్రమాణప్రమేయగతమయిన యసంభావనయొక్క నివృత్తినిగలిగించునట్టి శ్రవణమననపరిపాకరూపమయిన సర్వకర్మసన్న్యాసపూర్వక వేదాంతవిచారము ప్రతిపాదింపఁబడినది, తత్పరాయణాః అనుటచే వైరాగ్యాతిశయము చెప్పఁబడినది. ఇట్టి

* విద్వాంసులు తదాత్ములే కాని యితరాత్ములు కారనుటయందు.

ఉత్తరోత్తరము పూర్వపూర్వమునకు * హేతువుగా నెఱుంగునది. ఈ విశేషణములు గల యతులు, అపునరావృత్తిం గచ్ఛన్తి = మరల దేహసంబంధము లేకుండుట యను ముక్తిని పొందుచున్నారు. ఒకమాఱు ముక్తు లయినవారికిఁగూడ దేహసంబంధ మెందువలనఁ గలుగదు ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—జ్ఞాననిర్ధూతకల్మషాః= జ్ఞానముచేత నిర్ధూతమైన—సమూలముగా ఉన్మూలింపఁబడిన పునర్దేహసంబంధ కారణ మగు కల్మషము—పుణ్యపాపరూపకర్మము గలవారు, జ్ఞానముచే అనాద్యజ్ఞానము నివర్తిల్లుటంజేసి తత్కార్య మగుకర్మము క్షయించుటవలన కర్మమూలక మగుపునర్దేహసంబంధ మెట్లు కలుగును ? అని భావము.

శ్రీ. ఇట్టి యీశ్వరోపాసకులకు ఫలము చెప్పుచున్నాఁడు.—తద్బుద్ధయః = వానియందే నిశ్చయాత్మకబుద్ధి గలవారు; తదాత్మానః=వానియందే ఆత్మ—మనస్సుగలవారు; తన్నిష్ఠాః=వానియందే నిష్ఠ—తత్పరతగలవారు; తత్పరాయణాః = అదియే ముఖ్య మయినయాశ్రయముగాఁ గలవారు; జ్ఞాననిర్ధూతకల్మషాః = అంత తత్ప్రసాదంబుచే లబ్ధమయిన ఆత్మజ్ఞానముచే పోఁగొట్టఁబడిన కల్మషముగలవారై; అపునరావృత్తిమ్ = ముక్తిని; గచ్ఛన్తి.

ప. ఇఁక నీశ్వరోపాసనచే మోక్షాధికారులనిష్ఠను జెప్పుచున్నాఁడు.—ఆయీశ్వరునందే నిశ్చయాత్మకమయినబుద్ధి గలవారును, తద్విషయమునందు ఆత్మ—ప్రయత్నముగలవారును, అట్లు, వానియందే నిష్ఠ—పర్యవసానముగలవారును, అదియే పరాయణము—ఆశ్రయముగాఁ గలవారును, అట్టివారు జ్ఞాననిర్ధూతకల్మషులై యపునరావృత్తిని బొందుచున్నారు.

రా. తద్బుద్ధయః = అట్టి యాత్మయొక్క దర్శనమునం దధ్యవసాయము ♦ గలవారును; తదాత్మానః = తద్విషయమయిన మనస్సు గలవారును; తన్నిష్ఠాః = దాని యభ్యాసమునందు ఆసక్తులును; తత్పరాయణాః = అదియే పరమప్రయోజన మని తలంచువారును; జ్ఞాననిర్ధూతకల్మషాః= ఇట్లు అభ్యసింపఁబడుచున్న జ్ఞానముచేఁ బోఁగొట్టఁబడినప్రాచీనకల్మషము గలవారును; అట్టియాత్మను, అపునరావృత్తిమ్ = అపునరావృత్తి యయినవానిని; గచ్ఛన్తి = పొందుచున్నారు. ఏయవస్థగల యాత్మ

* వెనుకఁ జెప్పినవి ముందుచెప్పినవానికిఁ గ్రమముగా.

♦ నిశ్చయము.

నుండి * పునరావృత్తి కలుగదో ఆయాత్మ యపునరావృత్తి, తనదైనరూపమున నున్న యాత్మను బొందుచున్నా రని యర్థము.

ఆయాత్మదర్శనమునందే నిశ్చయంబును దానియందే మనస్సును గలిగి దాని నెల్లప్పు డభ్యసించుచు నదియె పరమప్రయోజనముగాఁ దలఁచి యుండువారు, బహుకాలాభ్యస్తమయిన జ్ఞానముచేఁ బ్రాచీనానంతకర్మసంచయము నశించినవారై యాత్మయొక్క పునరావృత్తిరహిత మైన యథార్థస్వరూపము నొందుదు రని తా.

మ. అపరోక్షజ్ఞానమున కవ్యవహితసాధనము చెప్పుచున్నాఁడు తద్బుద్ధయ ఇత్యాదిగా.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవ శ్వపాకేచ పణ్డితా స్సమదర్శినః. ౧౮

భా. ఎవ్వరికి జ్ఞానముచే నాత్మా ఽజ్ఞానము నాశిత మయ్యెనో అట్టి పండితు లెట్లు తత్త్వముఁ జూతురు? చెప్పెదము.—విద్యావినయసంపన్నే= విద్యతోను వినయముతోను—ఉపశమముతోను గూడిన; బ్రాహ్మణే = బ్రాహ్మణునియందును, విద్వాంసుఁడును వినీతుఁడు నగు బ్రాహ్మణుఁ డెవ్వఁడు గలఁడో అట్టి బ్రాహ్మణునియందును; గవి = గోవునందును; హస్తిని= ఏనుఁగునందును; శునిచైవ = కుక్కయందును; శ్వపాకేచ = చండాలుని యందును; పణ్డితాః = పండితులు; సమదర్శినః = సమదర్శులు—విద్యావినయసంపన్నుఁడును ఉత్తమసంస్కారవంతుఁ డగు సాత్త్వికుఁ డైన బ్రాహ్మణునియందును, మధ్యమమై రాజసిమైన సంస్కారహీనయగు గోవునందును, అత్యంతమును తామస మగుహస్త్యాదికమునందును, సత్త్వాది గుణములచేతను సత్త్వజన్యము లగుసంస్కారములచేతను అట్లు రాజసములు అట్లు తామసము లగుసంస్కారములచేతను అత్యంతమును స్పృశింపఁబడనిది యగు సమమును—ఒక్కటి యవిక్రియ మగుబ్రహ్మమును చూచుట శీలముగాఁ ♦ గలవారు పండితులు.

జ్ఞానవంతులగు పండితులు విద్యావినయసంపన్నుఁ డగు నుత్తమబ్రాహ్మణునియందును మధ్యమయగు గోవునందును అధములగు గజ శునక చండాలుర యందును కేవల బ్రహ్మదృష్టియే గలిగి యుందు రని తాత్పర్యము.

---

* ఆత్మస్వరూపమునుండి యనుట.

♦ స్వభావముగా.

ఆ. అపునరావృత్తిసాధన మగుతత్త్వజ్ఞాన మేది గలదో దానినే ప్రశ్న ద్వారంబున వివరించుచున్నారు ఎవ్వరికి ఇత్యాదిగా. విద్య యనఁగా వేదార్థవిజ్ఞానం బని యంగీకరించి వినయమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు ఉపశమముతో నని. ఉపశమ మనఁగా అహంకారము లేమి ఉద్ధతిలేమి. ఇట్లుపదార్థముఁ జెప్పి వాక్యార్థముఁ జెప్పుచున్నారు విద్వాంసుఁడును ఇత్యాదిగా. గవి ఇత్యాదిక మనువదించి వాక్యార్థము చూపుచున్నారు విద్యావినయసంపన్నుఁడు ఇత్యాదిగా. ఆయాప్రాణి భేదములందు ఆయాగుణముల చేతను తత్తద్గుణజన్య సంస్కారముల చేతను బ్రహ్మము స్పృశింపఁబడినది యగుటవలన సమం బెట్లగును? అని యాశంకించి చెప్పుచున్నారు సత్త్వాదిగుణముల చేతను ఇత్యాదిగా. సాత్త్వికసంస్కారము చేతం బోలె రాజససంస్కారముల చేతఁగూడ సర్వథా అసంస్పృష్టము బ్రహ్మ మని చెప్పుచున్నారు అట్లు రాజసము లని. రాజసముల చేతంబోలె తామస సంస్కారముల చేతఁ గూడ బ్రహ్మ మత్యంతంబును అసంస్పృష్టం బని చెప్పుచున్నారు అట్లు తామసము లని. బ్రహ్మమునకు అద్వితీయత్వంబును కూటస్థత్వంబును అసంగత్వమును ఉక్తార్థమునందు హేతు వని యభిప్రాయపడి సమశబ్దార్థము చెప్పుచున్నారు ఒక్కటి ఇత్యాదిగా. సమదర్శిత్వమే పాండిత్యము, దాని వివరించుచున్నారు బ్రహ్మమును ఇత్యాదిగా.

హ. విద్యావినయసంపన్నే = ఉత్తమసంస్కారముగల; బ్రాహ్మణే = సాత్త్వికుఁడగు బ్రాహ్మణునియందును; గవి = మధ్యమమై సంస్కారహీన యగు రాజసియగు గోవునందును; అత్యంతము కేవలతామస మగుహస్త్యాదికమునందును, సత్త్వగుణము చేతను తజ్జన్యము లగుసంస్కారముల చేతను రజోగుణము చేతను రాజస సంస్కారముల చేతను తమోగుణము చేతను తామససంస్కారముల చేతను అత్యంతము అస్పృష్ట మగుసమము నే-అవిక్రియబ్రహ్మము నే చూచుట స్వభావముగాఁ గలవారు సమదర్శులు, పండితులు

శం. తద్బుద్ధయః అనుటచే బ్రహ్మవిద్యతులకు సదా కర్తవ్యముగా నేది కల్పితనామరూపాదికము గ్రహింపక సర్వత్రబ్రహ్మదర్శనము విధింపఁబడినదో దానిని విశదీకరించుచున్నాఁడు —విద్యావినయసంపన్నే=విద్యయనఁగా సర్వవేదశాస్త్రాధ్యయనము తదర్థజ్ఞానము, వినయమనఁగా నమ్రత, లేక, ఉపశాంతి. వానితోను ఇతరములైన స్వధర్మపరత ప్రతిగ్రహవిముఖత సత్యము శౌచము దయ మొదలగు సుగుణ

ములతోను సంపన్నుఁ డగు; బ్రాహ్మణే= జగత్పూజ్యుఁ డగు బ్రాహ్మణునందును; జాతిచేతను గుణముచేతను ధర్మముచేతను బరమనికృష్టుఁ డైన, శ్వపాకే= తనప్రాణస్థితికొఱకు కుక్కనుగూడ పచించుచున్నాఁడు, లేక, తేపటికి ఉండనీయని పచించుచున్నాఁ డనువ్యుత్పత్తిచే శ్వపాకుఁ డనఁగా చండాలుఁడు, వానియందును; జాతిచేతను సంచారముచేతను క్షీరాదులచేతను జగత్పావనియగు, గవి=ధేనువునందును; జాత్యాదులచే అతినికృష్టమై తుచ్ఛమును తినునట్టి, శునిచైవ = కుక్కయందును; రాజపూజ్యమయిన, హస్తిని = భద్రగజమునందును; చకారమువలన లోష్టాశ్మకాంచనాదులందును అంతటను; తత్తద్వ్యక్తిత్తద్గుణతత్తద్ధర్మతత్తత్కర్మములచే స్పృశింపఁబడనిదియై సదా ఆకాశమువలె నేకరూపమై సమరసముగా నుండునది కావునఁ బరబ్రహ్మము సమ మని చెప్పఁబడుచున్నది, ఆరోపిత నామరూపాదుల గ్రహింపకయె సర్వత్ర అధిష్ఠానభూత బ్రహ్మమాత్రమును చూచువారలు పండితు లని యర్థము. పుష్కలమయిన పరానద్వైకత్వవిజ్ఞానము గలవారు పండితులు సదా సమదర్శులే యగుచున్నారు, ఒకానొకప్పుడును విషమదర్శులుకారు, కావున సమదర్శిత్వము పండితుల ధర్మ మని సూచిత మగుచున్నది.

మ. దేహపాత మయిన వెనుక విదేహముక్తిరూప మయినజ్ఞానఫలముఁ జెప్పి ప్రారబ్ధకర్మవశంబున దేహముండినను జీవన్ముక్తిరూప మయిన జ్ఞానఫలముఁ జెప్పుచున్నాఁడు.—విద్యయనఁగా వేదార్థపరిజ్ఞానము, లేక, బ్రహ్మవిద్య, వినయము—నిరహంకారత, ఉద్ధతిలేకుండుట యని యర్థము, వానితోఁగూడిన బ్రహ్మవిదుఁడును వినీతుండు నగు బ్రాహ్మణునియందును, సాత్త్వికుఁడు సర్వోత్తముఁ డగువానియందును; అట్లు, గవి=సంస్కారహీనయయి రాజసియై మధ్యమ యగు ధేనువునందును; అట్లు; హస్తిని, శుని, శ్వపాకేచ—అత్యంతతామసమయి సర్వాధమ మయినవానియందును; సత్త్వాదిగుణములచేతను తజ్జన్యము లగు సంస్కారములచేతను స్పృశింపఁబడకయే యుండునట్టి సమమును—బ్రహ్మమును చూచుట స్వభావముగాఁ గలవారు సమదర్శులు; పణ్డితాః = జ్ఞానులు. ఎట్లు గంగాజలమునందును తటాకమునందును సురయందును మూత్రమునందును బ్రతిబింబితుఁ డగు సూర్యునకుఁ దద్గుణదోషసంబంధము లేదో అట్లు చిదాభాసద్వారమునఁ బ్రతిబింబిత మగు బ్రహ్మమునకుఁగూడ నుపాధిగతగుణదోషసంబంధము లే దని యనుసంధించుచు సమదృష్టిచే తనే రాగద్వేషములు లేనివారై పరమానందస్ఫూర్తిచే జీవన్ముక్తి ననుభవించుచున్నా రని యర్థము.

శ్రీ. ఎవ్వరు అపునరావృత్తిని బొందుదురో ఆజ్ఞాను లెట్టివారు ? అనఁగాఁ జెప్పుచున్నారు.—విషమములయందును సమమును—బ్రహ్మమునే చూచుట స్వభావముగాఁ గలవారు; పణ్డితాః = జ్ఞానులు. అందు, విద్యావినయములతోఁ గూడిన బ్రాహ్మణునియందును కుక్కల నెవ్వఁడు వండుచున్నాఁడో అట్టి శ్వపాకునియందును అని కర్మముచే వైషమ్యమును, గవి హస్తిని శుని అని జాతిచే వైషమ్యంబును జూపఁబడెను.

ప. ఇఁక సదాచారముగా నేర్పడిన సమదర్శిత్వమును జెప్పుచున్నాఁడు.—పణ్డితాః = జ్ఞానులు; బ్రాహ్మణాదులందు సమదర్శు లగుచున్నారు. సర్వత్ర ఆత్మనే చూచుచు బాహ్యాకారమును గణియింప రని యర్థము.

రా. విద్యావినయసంపన్నే = విద్యతోను వినయముతోను గూడినవానియందును; బ్రాహ్మణే= కేవలబ్రాహ్మణునందును; గోవు హస్తి శునకము శ్వపాకుఁడు మొదలగువారియందును, అత్యంతవిషమాకారంబునఁ గనఁబడుచున్న యాత్మలయందు; పణ్డితాః=ఆత్మతత్త్వవిదులు; అంతటను, సమదర్శినః—విషమాకారము ప్రకృతిది, ఆత్మది కాదు, ఆత్మయో సర్వత్ర జ్ఞానైకాకారము గలవాఁడై సముఁడుగా నున్నాఁ డని చూచుచుందు రని యర్థము.

మా. పరమేశ్వరస్వరూపములను సర్వత్రసమముగాఁ జూచుటయును అపరోక్షజ్ఞానమునకు సాధనం బను నాశయము గలవాఁడై చెప్పుచున్నాఁడు. విద్యేత్యాదిగా.

ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః. ౧౯

భా. ఓయీ! అభోజ్యాన్నులు ♦ వారు దోషులు « సమాఽసమాభ్యాం విషమసమే పూజాతః » అనుస్మృతివలన. కారు వారు దోషులు. ఎట్లు ?— ఇహైవ = ఇందే; జీవించియున్న వారిచేతనే; తైః = ఆసమదర్శు లగుపండితులచేత; సర్గః = జన్మము; జితః = వశీకరింపఁబడినది. యేషామ్ = ఎవ్వరియొక్క; మనః = అంతఃకరణము; సామ్యే=సర్వభూతములందును సమభావమునందు, బ్రహ్మమునందు; స్థితమ్ = నిశ్చల మగుచున్నదో ✱. హి = ఎందువలన ననఁగా; నిర్దోషమ్ = దోష

---

♦ భుజింపఁదగనియన్నము గలవారు—వారియన్నము భుజింపఁ దగ దనుట.

✱ వారిచేత ననుట.

వంతు లగు శ్వపాకాదులందు మూఢులు వారి * దోషములచే దోషవంతముపోలె విభావించుచున్నను వారిదోషములచే అస్పృష్టము కావున నిర్దోషము—దోషవర్జితము; స్వగుణభేదములచే భిన్నమునుం గాదు, చైతన్యము నిర్గుణ మగుటవలన; చెప్పఁబోవుచున్నాఁడు గూడ భగవంతుఁడు ఇచ్ఛాదులు క్షేత్రధర్మం బని, అనాదిత్వాన్నిర్గుణత్వాత్ అని; అంత్యవిశేషములు † గూడ ఆత్మకు భేదజనకములు లేవు, ప్రతి శరీరంబును అవి యున్న వనుటకుఁ బ్రమాణం బనుపపన్న మగుటవలన; అందువలన, సమమ్ = ఒక్కటియును; బ్రహ్మ = బ్రహ్మము. తస్మాత్ = అందువలన; బ్రహ్మణి = బ్రహ్మమునందే; తే = వారు; స్థితాః=ఉన్నవారు. అందువలన దోషలేశముగూడ వారిని స్పృశింపదు, దేహాదిసంఘాతము నందు ఆత్మదర్శనాభిమానము లేనివా రగుటవలన. ఆసూత్రమో « సమాఽసమాభ్యాం విషమసమే పూజాతః » అనునది దేహాదిసంఘాతమునం దాత్మదర్శనాభిమానము గలవారివిషయము, పూజాతః అని పూజావిషయత్వవిశేషణమువలన. చూచుచున్నారము గదా, బ్రహ్మవిదుఁడు షడంగవిదుఁడు చతుర్వేదవిదుఁడు అని పూజాదానాదికమునందు గుణవిశేషసంబంధము కారణము. బ్రహ్మమో సర్వగుణదోషసంబంధవర్జితము. కావున బ్రహ్మణి తే స్థితాః అనుట యుక్తము. మఱియు సమాసమాభ్యా మిత్యాది సూత్రము కర్మివిషయము, ఇదియో సర్వకర్మసన్న్యాసివిషయము ప్రస్తుతము, సర్వకర్మాణి మనసా అనునది మొదలుగా నధ్యాయపరిసమాప్తి వఱకు.

ఎవ్వారిమనస్సు సర్వభూతంబులందును సమభావమున నున్నదో వార లీదేహమునుండియె జన్మమును జయించిరి. ఎందువలన ననఁగా బ్రహ్మము నిర్దోషమును ఒక్కటియును, వా రట్టి బ్రహ్మమున నున్నారు, కావున వారు జన్మము జయించినవారు. అట్టివారిని దోష మేమియు స్పృశింప దని తాత్పర్యము.

ఆ. సాత్త్వికములు రాజసములు తామసము లగు సత్త్వములందు సమత్వదర్శనం బనుచిత మని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. వారు—సర్వత్ర

* ఆ శ్వపాకాదుల.

† వైశేషికులు, నిత్యవస్తువులకుఁ బరస్పరభేదము నిరూపించునవి యని చెప్పునట్టి విశేషములు అనుపపన్నము,

సమదర్శులు. వారు దోషు లగుటవలన అభోజ్యాన్న లనుటకుఁ బ్రమాణము చెప్పు చున్నాఁడు సమాసమాభ్యా మిత్యాదిగా. సములకు—అధ్యయనాదులచే సమానగుణము గలవారికి, వస్త్రాలంకారాదిపూజచే విషమ మయిన యుపచారము చేసినను, అసములకు—సమానము కాని గుణము గలవారికి, ఒకఁడు ఒకవేదము దెలిసినవాఁడు ఇతరుఁడు రెండువేదములు తెలిసినవాఁడు ఇత్యాదిగా భేదధర్మము గలవారికి, వస్త్రాలంకారాదిపూజచేత సమ మయినయుపచారము చేసినను, పూజించువాఁడు పురుషవిశేషము నెఱింగి యుపచారము చేయక పోవుటవలన, ధనమువలనను ధర్మమువలనను హీనుఁ డగుచున్నాఁడు; అందుచే సాత్త్వికునియందు రాజసతామసులందును సమబుద్ధి చేయువాఁడు ప్రత్యవాయము నొందుచున్నాఁ డని యర్థము. ఆశంకకు త్తరముగా నుత్తరశ్లోకము దీయుచున్నారు కారు వారు దోషు లని. స్మృతిబలముచే సర్వభూతములందు సమత్వము చూచువారు దోషు లని చెప్పఁబడినది, ఎట్లు కా రనుట ప్రతిజ్ఞామాత్రమున సిద్ధించునని శంకించుచున్నాఁడు ఎట్లు అని. స్మృతికి గతిని ముందు చెప్పఁబోవువారై సమత్వదర్శులు నిర్దోషు లనుటను విశదీకరించుచున్నారు ఇహైవ ఇత్యాదిగా. సర్వచేతనులందును సామ్యమునందు నక్తమయిన మనస్సు గలవారలును బ్రహ్మలోకగమనము లేకయే యీదేహమునందే జన్మమును జయించినవారు నగువారు అశేషదోషరహితు లనుటకు హేతువు చెప్పుచున్నాఁడు నిర్దోషం హీత్యాదిగా. ఇహైవ—ఇందే, వర్తమానదేహమునం దని యర్థము. ఆ సమదర్శులకే విశేషణము చేయుచున్నారు యేషా మిత్యాదిగా. ఓయీ! బ్రహ్మమునకు నిర్దోషత్వ మసిద్ధము, దోషవంతు లగు శ్వపాకాదులందు వారిదోషములచే దోషవంతముగాఁ గనఁబడుటవలన. అందుకుఁ జెప్పుచున్నారు దోషవంతులు ఇత్యాదిగా. ఎందువలన నది నిర్దోషమో అందువలన ఆబ్రహ్మమునందున్నవారలై నిర్దోషు లగువారిచే సర్గము జిత మని సంబంధము. బ్రహ్మమునందు గుణము లధికము లగుటవలన స్వల్ప మగుదోషముగూడఁ గల దని యాశంకించి చెప్పుచున్నారు స్వగుణములచే నిత్యాదిగా. నిర్గుణం డని శ్రుతి చెప్పుటవలనఁ జేతనుఁడు స్వగుణవిశేషవిశిష్టుం డనుట యిష్టము గా దనుట యయుక్తము, ఇచ్ఛాదులు పరిశేషమువలన ♦ ఆత్మధర్మం బని కొందఱిచే నిశ్చయింపఁబడుటవలన నని యాశంకించి చెప్పుచున్నారు చెప్పఁబోవుచున్నాఁడు ఇత్యాదిగా. ఆత్మనిర్గుణం డనుటకు వాక్యశేషమును బ్రమాణీకరించుచున్నారు అనాదిత్వా దిత్యాదిగా. గుణదోషవశము

♦ ఇతరధర్మము గాక యాత్మధర్మ మనుటయు శేషించుటవలన.

వలన నాత్మకు భేదము లేకున్నను అంత్యవిశేషములవలన భేదము కాఁగల దని యాశంకించి పరిహరించుచున్నారు అంత్యవిశేషములు ఇత్యాదిగా. ప్రతిశరీరమును ఆత్మభేదము సిద్ధించినయెడ దానికి హేతువుగా నావిశేషములకు సత్త్వము ** సిద్ధించును, వానికి సత్త్వము సిద్ధించినయెడ దానిచేఁ బ్రతిశరీరమును ఆత్మకు భేదము సిద్ధించును, ఇట్లు అన్యోన్యాశ్రయత్వదోషము కలుగుచున్న దను నభిప్రాయముతో హేతువు చెప్పుచున్నారు ప్రతిశరీరంబును ఇత్యాదిగా. ఆత్మకు భేదనిరూపకము లేకుండుటచే ఫలితము చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. సమమ్ అనుదానికే వ్యాఖ్యానము చేయుచున్నారు ఒక్కటియును యని. బ్రహ్మము నిర్విశేషం బగుటచే నొక్కటియె, జీవులుగూడ భేదనిరూపకము లేకుండుటచే ఒక్కటియె యని చెప్పఁబడినది, ఇట్లు ఏకలక్షణము లగుటవలన జీవబ్రహ్మములకు ఏకత్వం బంగీకరింపవలయు నని చెప్పుచున్నారు తస్మాత్ ఇత్యాదిగా. జీవబ్రహ్మములకు ఏకత్వము సిద్ధించుట వలన జీవులకుఁ గూడ బ్రహ్మమునకుం బోలె నిర్దోషత్వము సిద్ధించుచున్న దని చెప్పుచున్నారు అందువలన దోషలేశము ఇత్యాదిగా. వారిని అను తచ్ఛబ్దమునర్థమునే వివరించుచున్నారు దేహాదిసంఘాతమునందు ఇత్యాదిగా. సర్వభూతములయందును సమత్వదర్శనము నిర్దోష మని సమ్మత మగునేని అప్పు డెట్లు గౌతమసూత్రమున కుపపత్తి యని యాశంకించి చెప్పుచున్నారు దేహా దీత్యాదిగా. సూత్రము దేహాదిసంఘాతమునం దాత్మాభిమానము గలవారివిషయ మనుటకు గమకమును జెప్పుచున్నారు పూజాతః ఇత్యాదిగా. చతుర్వేదులుగా నుండువారికే పూజయందు వైషమ్యంబుగాని, చతుర్వేదులకు షడంగవిదులకు బ్రహ్మవిదులకుఁ బూజయందు సామ్యము గాని యగునేని, అప్పుడు వారికి అట్లు పూజింపఁబడుటచే మనోవికారము సంభవించుం గావునఁ బూజచేయువాడు ప్రత్యవాయము నొందు నని సూత్రము అవిద్వద్విషయముగాఁ గనఁబడుచున్న ది యనియర్థము. అందే యనుభవం బనుకూలం బని యుదాహరించుచున్నారు చూచుచున్నారము గదా ఇత్యాదిగా. దేహాదిసంఘాతమునం దాత్మాభిమానము గలవారలకు గుణదోషసంబంధము సంభవించుటవలనఁ దద్విషయము సూత్రం బని చెప్పఁబడినది. ఇప్పుడు బ్రహ్మాత్మదర్శనాభిమానము గలవారలకు గుణదోషసంబంధము లేమివలనఁ దద్విషయము కాదు సూత్రం బని యభిప్రాయముతోఁ జెప్పుచున్నారు బ్రహ్మమో ఇత్యాదిగా. ఇందువలనను గూడ నీసూత్రము బ్రహ్మవిద్విషయము గా దని చెప్పుచున్నారు మఱియు నిత్యా

** ఉండుట.

దిగా. ఓయీ! ఎవ్వరియందు సమత్వదర్శనము గలదో వారివిషయమే యీసూత్రము, కాని కర్మివిషయము అకర్మివిషయము అను విభాగము లేదు. అనఁగా నంమునకుఁ జెప్పుచున్నారు ఇదిమో ఇత్యాదిగా. సమత్వదర్శనము సన్న్యాసివిషయము ప్రస్తుతం బనుటకు హేతువుఁ జెప్పుచున్నారు సర్వకర్మాణీత్యాదిగా. అధ్యాయపరిసమాప్తివఱకు సర్వకర్మాణి అని యారంభించి యచ్చటచ్చట సర్వకర్మసన్న్యాసము చెప్పుటవలనఁ దద్విషయం బీసమత్వదర్శనం బని తెలియవచ్చుచున్నది, నిరహంకారుఁ డగుసన్న్యాసియం దీసూత్రమున కవకాశము లే దని యర్థము.

హ. ♦

శ్లో. సదా సర్వత్ర బ్రహ్మమునే చూచుచున్నవారలై యెవ్వరు బ్రహ్మాత్ములై యున్నారో వారలకే విదేహముక్తి, ఇతరులకు లేదు. అని సూచించుటకై బ్రహ్మనిష్ఠు లగు యతులకు జీవద్దశయందే ముక్తిని జూపుచున్నాఁడు.—యేషామ్= పరావరైకత్వవిజ్ఞానము గలవారును తద్బుద్ధిత్వము మొదలగు నంతరంగసాధనము గలవారలును సర్వకర్మసన్న్యాసులు నగు నేబ్రహ్మవిదులయొక్క; మనః= మనస్సు; సదా, సామ్యే = సమమేసామ్యము, స్వార్థమున ష్యఞ్ప్రత్యయము, సమమునందే—స్థితమ్ = నిశ్చలముగా నున్నదో; ఎవ్వరు సర్వత్ర బ్రహ్మమునే చూచుచున్నారో, తదాత్మతనే పొందుచున్నారో, అందే నిష్ఠను జేయుచున్నారో, తదాత్మతను బొందినవృత్తిచేతనే కాలముఁ గడపుచున్నారో, తైః = అట్టిలక్షణము గల బ్రహ్మవిదులచే; ఇహైవ = జీవద్దశయందే; సర్గః = జన్మము, భవిష్యద్దేహసంబంధము; జితః = నిర్జింపఁబడినది, పోఁగొట్టఁబడినది యని యర్థము. అవిద్యాకామకర్మములు గదా శరీరము కలిగించునవి, అద్వితీయబ్రహ్మమునందు జగద్బుద్ధిని కలిగించునదియు దేహాదికమునం దహంమమబుద్ధిని గలిగించునదియు నగువాసన అవిద్య, అవిద్యామూలకములు కామములు, కామములకార్యములు కర్మములు. అట్టి యవిద్యాకామకర్మములకు నిత్యనిరంతరబ్రహ్మనిష్ఠచే నిశ్శేషనాశము కాఁగాఁ దత్కార్యభూత మయిన భవిష్యద్దేహసంబంధమునకుఁ గూడ నాశము కానే యగుచున్నది. అందువలననే చెప్పుచున్నాఁడు ఇహైవ తై ర్జిత స్సర్గః అని. ఓయీ! బ్రహ్మవిదులకు ఒకప్పుడైనను బాహ్యాలంబనము లేక సర్వదా బ్రహ్మమునందే బ్రహ్మరూపంబున నుండుట యెట్లుపపన్న మగును? అందువేని, అట్లనఁ గూడదు. వారలకు మన స్సతినిర్మలం బగుటవలనను బ్రహ్మసుఖానుభవరసికు లగుటవలనను అట్టి బ్రహ్మనిష్ఠను కలిగించుపుణ్య

శంకరభాష్యముతో సమానము.

సంపత్తి గలుగుటవలనను సదానందైకరసమగు బ్రహ్మమునందే స్థితి సంభవించుచున్న దని సూచించుటకై బ్రహ్మ మానందరూపం బనుటను బ్రతిపాదించుచున్నాఁడు.— హి = ఏకారణమువలన; బ్రహ్మ; నిర్దోషమ్ = దోషశబ్దముచే నిట దోషకార్య మయినదుఃఖము లక్షితమగుచున్నది, నిర్దోష మనఁగా దుఃఖరహితము దుఃఖలేశము గూడ లేనిది, ఆనందరూప మని యర్థము, « ఆనన్దో బ్రహ్మ, విజ్ఞాన మానన్దం బ్రహ్మ, స్వప్రకాశే మానన్దఘనమ్ " ఇత్యాదిశ్రుతివలన. ఓయీ! బ్రహ్మము తా నానంద రూప మయినను అనృతజడదుఃఖాత్మక మగుప్రపంచముతో సంబంధము సంభవించు టవలన దుఃఖలేశసంబంధము సంభవించు నని యాశంకింపఁగా; సంభవింపదు, « మాయామాత్ర మిదం ద్వైతమ్, అసత్త్వా దన్యస్య ౹, న హ్యస్తి ద్వైతసిద్ధి రా త్మైవ సిద్ధో ఽద్వితీయః ♦, ఏక మేవా ఽద్వితీయమ్, అద్వయో హ్యయ మాత్మైకల ఏవ § » ఇత్యాదిశ్రుతులచే జగత్తునకు స్వరూపముచే అసత్త్వంబును బ్రహ్మమున కద్వి తీయత్వంబును నియమంబునఁ బ్రతిపాదింపఁబడుచున్నది, అందువలన మరుభూమికి జలసంబంధమువలె బ్రహ్మమునకు మిథ్యాభూతప్రపంచసంబంధము సంభవింపమివలన సదా సర్వత్ర యేకరసమే బ్రహ్మ మని బోధించుటకై చెప్పుచున్నాఁడు.—సమమ్ = సర్వత్ర సమమే పరబ్రహ్మము సచ్చిదానందమాత్రము ఏకరసము, « సఘనో ఽయం చిద్ఘన ఆనన్దఘన ఏకరసః » ఇత్యాదిశ్రుతులచేతను, « బ్రహ్మము సదా యేకస్వభా వమే యగును సమరసం బగుటవలన లవణపిండము ✻ వలె " ఇత్యాది యుక్తులచేతను సజాతీయవిజాతీయాదిభేదములు లేని దనియే ప్రతిపాదింపఁబడుచున్నది. అందువలన సదానందైకరసమే పరబ్రహ్మము, కాని యవిద్యాతత్కార్యతద్ధర్మ తత్కర్మముల లేశముగూడఁ గలది కాదు. అందువలననే బ్రహ్మవిదులమనస్సు బ్రహ్మానందామృత రసాస్వాదాసక్తమై బ్రహ్మమునందే యుండును. సదా యిట్లే యానందఘన మగు బ్రహ్మమునందే యేబ్రహ్మవిదు లగుయతులమన స్సుండునో అట్టివారే విదేహముక్తిని బొందుచున్నా రని సిద్ధము.

మం. ఓయీ! సాత్త్వికరాజసతామసులై స్వభావముచేతనే విషము లగు ప్రాణులందు సమత్వదర్శనము ధర్మశాస్త్రనిషిద్ధము. అట్లు « తస్యా ఽన్న మ

---

౹ ఇతరము అసత్తగుటవలన.

♦ ద్వైతసిద్ధి లేదు ఆత్మయే యద్వితీయుఁడు సిద్ధించుచున్నాఁడు.

§ అద్వితీయుఁడు గదా యీయాత్మయొక్కఁడే.

✻ ఉప్పుగడ్డ.

భోజ్యమ్ ॥ * అని యుపక్రమించి గౌతముఁడు చెప్పుచున్నాఁడు "సమా ఽసమా భ్యాం విషమసమే పూజాతః" అని. సమాసమాభ్యామ్ అనునది చతుర్థీద్వివచనము, విషమసమే అనునది ద్వంద్వైకవద్భావముచే సప్తమ్యేకవచనము. చతుర్వేదపారగులు అత్యంతసదాచారు లగువారికి వస్త్రాలంకారాన్నదానపూర్వకమయినపూజ యెట్టిది చేయఁబడుచున్నదో తత్సమునకే మఱియొకనికిఁ జతుర్వేదపారగుఁడు సదాచారుఁ డైనవానికి విషమము—అపూజకంటెఁ దక్కువ యగు పూజాప్రకారము చేయఁబడినను, అట్లు స్వల్పవేదాధ్యయనము గలవారలు హీన మయిన యాచారము గలవార లగువారికి ఎట్టిపూజాప్రకారము చేయఁబడుచున్నదో అట్టి వానికే అసమునకు—మున్ను చెప్పిన వేదపారగసదాచారబ్రాహ్మణునికంటె హీనుఁ డైనవానికి అట్టిహీనపూజకంటె నధికమైన ఉత్తమపూజానమ మయిన పూజాప్రకారము చేయఁబడినను, ఉత్తమునకు హీనముగను హీనున కుత్తమముగను, పూజాతః—పూజచేయుటవలన, అట్లు పూజచేసినవానియన్నము అభోజ్యమగుచున్న దని యర్థము. అట్లు పూజచేయువాఁడు ప్రతిపత్తివిశేషమును ♦ జేయమివలన ధనమునుండియు ధర్మమునుండియు హీనుఁ డగుచున్నాఁ డని మఱియొకదోషము. యతులకు నిష్పరిగ్రహులైనవారికిఁ బాకము § లేకుండుటవలనను ధనము లేకుండుటవలనను అభోజ్యాన్నతయు ధనహీనతయు స్వతస్సిద్ధముగనే యన్నది వాస్తవమే, అయినను ధర్మహానిరూపదోష ముండనే యున్నది. అభోజ్యాన్నతయు అశుచి యగుటచేఁ బాపోత్పత్తికి నుపలక్షణము. తపోధనులకుఁ దప స్సే ధనము కావున ధనహానిరూపదోషము గూడఁ గానే యగుచున్నది. ఇట్లుండఁగా, ఎట్లు సమదర్శు లగుపండితులు జీవన్ముక్తులు ? అని ప్రాప్తింపఁగాఁ బరిహరించుచున్నాఁడు.—తైః = ఆసమదర్శు లగు పండితులచేత; ఇహైవ = జీవనదశయందే; సర్గః = సృజింపఁబడుచున్న దనువ్యుత్పత్తిచే ద్వైతప్రపంచము; జితః = అతిక్రమింపఁబడినది ¶. ఇఁక దేహపాత మైన వెనుక నతిక్రమింపఁబడు నని చెప్పవలయునా ? ఎవ్వరిచేత ? యేషామ్ = ఎవ్వరియొక్క; మనః = మనస్సు; సామ్యే = సర్వభూతంబులు విషమంబు లైనను వానియందున్న బ్రహ్మమయొక్క సమభావమునందు; స్థితమ్ = నిశ్చలమో; అట్టివారిచేత. హి - ఎందువలన; బ్రహ్మ; నిర్దోషమ్; సమమ్ = సర్వవికారశూన్యమును కూట

* వానియన్నము భుజింపఁ దగనిది.

♦ గౌరవవిశేషమును.

§ వంట.

¶ దాఁటఁబడినది.

ష్టనిత్యమును ఏకమునో. తస్మాత్ = అందువలన; తే = ఆసమదర్శులు; బ్రహ్మణి = బ్రహ్మమునందే; స్థితాః = ఉన్నారు. ఇది భావము —దుష్టత్వము రెండువిధములు అదుష్టమునకును దుష్టములో సంబంధమువలనను తానే దుష్టమగుటవలనను. ఎట్లు గంగాజలము మాత్రము గల పల్లమునఁబడుటచే దుష్ట మగునో, ఎట్లు మాత్రము తనయంతనే దుష్ట మగునో అట్లు అందు, దోషవంతు లగుశ్వపాకాదులయం దున్న బ్రహ్మము తద్దోషములచే దుష్ట మని మూఢులు తలంచుచున్నను సర్వదోషములచే అసంస్పృష్టమే బ్రహ్మము, ఆకాశమువలె అసంగ మగుటవలన, « అసఙ్గో హ్యయం పురుషః, సూర్యో యథా సర్వలోకస్య చక్షు ర్న లిప్యతే చాక్షుషై ర్బాహ్య దోషైః । ఏక స్తథా సర్వభూతా న్తరాత్మా నలిప్యతే లోకదుఃఖేన బాహ్యః » * అను శ్రుతివలన. కామాదిధర్మములు గలది యగుటచేఁ జనయంతనే దుష్టమునుం గాదు, కామాదు లంతఃకరణధర్మం బని శ్రుతిస్మృతిప్రసిద్ధ మగుటవలన. అందువలన నిర్దోషబ్రహ్మరూపు లగుయతులు జీవన్ముక్తులును అభోజ్యాన్నత్వాదిదోషము గలవారును అనుట విరుద్ధము. గౌతమస్మృతియో అవిద్వద్గృహస్థవిషయమే యగును, «తస్యాన్న మభోజ్యమ్ » అని యుపక్రమించుటవలనను, పూజాతః అని నడుమ నిర్దేశించుటవలనను, ధనా ద్ధర్మా చ్చ హీయతే అని యుపసంహరించుటవలనను. అని యెఱుంగునది.

శ్రీ. ఓయీ! విషమములయందు సమదర్శనమును నిషిద్ధ మైనదానిని జేయువారలు వా రెట్లు పండితు లనవచ్చును? అట్లు గౌతముఁడు చెప్పుచున్నాఁడు « సమాऽసమాభ్యాం విషమసమే పూజాతః » అని. దీని కర్థము.—సమునికొఱకుఁ బూజచే విషమమయినప్రకారము చేయఁబడినను, విషమునికొఱకు సమమయినవిధము చేయఁబడినను బూజకుఁడు ఇహలోకమునుండియుఁ బరలోకమునుండియు హీనుఁ డగుచున్నాఁ డని. అందుకుఁ జెప్పుచున్నాఁడు—ఇహైవ = జీవించి యున్నవారి చేతనే; తైః; సర్గః=సృజింపఁబడుచున్నది కావున సంసారము; జితః=నిరసింపఁబడినది. ఎవ్వరిచేత? యేషామ్; మనః; సామ్యే=సమత్వమునందు; స్థితమ్. అందుకు హేతువు.—హి=ఎందువలన ననఁగా; బ్రహ్మ; సమమ్; నిర్దోషమ్=దోషవర్జితముగూడ. తస్మాత్ =అందువలన; తే=ఆసమదర్శులు; బ్రహ్మణి = బ్రహ్మమునందే; స్థితాః—బ్రహ్మభావ

* ఎట్లు సర్వలోకమునకును నేత్రరూపుఁ డగుసూర్యుఁడు నేత్రసంబంధి బాహ్యదోషములచే లిప్తుఁడు కాఁడో, అట్లు ఒక్కఁడైన సర్వభూతాంతరాత్మ బాహ్య మగు లోకదుఃఖముచే లిప్తుఁడు కాఁడు.

మును బొందినారని యర్థము. గౌతముఁడు చెప్పినదోషమా బ్రహ్మభావప్రాప్తికిఁ బూర్వమే యగును, పూజాతః అని పూజకావస్థను నిర్దేశించుటవలన.

ప. ఇఁక వారలకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.—యేషామ్=ఏపురుషుల యొక్క; మనః; సామ్యే=సమత్వమునందు; స్థితమ్=స్థిర మయ్యెనో; తైః=ఆసమదర్శుల చేత; ఇహైవ = ఈదేహమునందే, జీవించి యున్నవారిచేత; సర్గః = సంసారము; జితః. హి=ఏకారణమువలన; బ్రహ్మ; సమమ్ = విషమము కానిదో; అట్లు, నిర్దోషమ్ = వైషమ్యదోషహేతువు లగుతత్తద్దేహాద్యుపాధులచే స్పృశింపఁబడనిదో; లేక, బాధ లేనిదో; తస్మాత్; తే; బ్రహ్మణి; స్థితాః. “సమో మశకేన సమో నాగేన” * అను శ్రుతివలన.

రా. ఇహైవ= సాధనము ననుష్ఠించునవస్థయందే; తైః=వారిచేత; సర్గః= సంసారము; జితః = జయింపఁబడినది. యేషామ్ = ఎవరికి, మనః; చెప్పినవిధంబున సర్వాత్మలయందును, సామ్యే = సమభావమునందు; స్థితమ్ = ఉన్నదో వారిచేత. నిర్దోషమ్ = ప్రకృతిసంసర్గదోషము వీడినది కావుననే; సమమ్ = సమ మయినయాత్మ వస్తువు; బ్రహ్మహి=బ్రహ్మమే గదా! తస్మాత్=అందువలన, ఆత్మసామ్యమునం దుండు రేని, తే=వారు; బ్రహ్మణి= బ్రహ్మమునందు, స్థితాః=ఉన్నవారలే. బ్రహ్మమునం దుండుటయే గదా సంసారజయము. ఆత్మలయందు జ్ఞానైకాకారంబున సమత్వమునే యనుసంధించుచుండువారలు ముక్తులే యని యర్థము.

మా. దానినే స్తుతించుచున్నాఁడు ఇహైవేత్యాదిగా.

న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నో ద్విజే త్ప్రాప్య చా ఽప్రియమ్
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః. ౨౦

భా. ఎందువలన నిర్దోషము సమ మగుబ్రహ్మమే ఆత్మ యగునో; అందువలన.—ప్రియమ్ = ఇష్టమును; ప్రాప్య=పొంది; నప్రహృష్యేత్= హర్షము చేయఁడు. అప్రియమ్ = అనిష్టమును; ప్రాప్యచ = పొందియు; నోద్విజేత్=విషాదము చేయఁడు. దేహమాత్రాత్మదర్శికే గదా ప్రియాప్రియప్రాప్తులు హర్షవిషాదములను గలిగించును, కేవలాత్మదర్శికిఁ గలిగింపవు, వానికిఁ బ్రియాప్రియప్రాప్తులు సంభవింపమివలన, మఱియును. స్థిరబుద్ధిః = సర్వభూతములందును ఒక్కఁడే నిర్దోషుఁడు సముఁడు ఆత్మ

* దోమతోను సమానము ఏనుఁగుతోను సమానము.

యని స్థిర మయిన—నిస్సందేహ మయిన బుద్ధి గలవాఁడును; అసమ్మూఢః = సమ్మోహవర్జితుండును, అగును; బ్రహ్మవిత్ = ఈచెప్పిన బ్రహ్మ విదుఁడు; బ్రహ్మణి=బ్రహ్మమునందు; స్థితః=ఉన్న వాఁడు, కర్మముఁ జేయని వాఁడు సర్వకర్మసన్న్యాసి యని యర్థము.

ఈబ్రహ్మవిదుఁడు ప్రియము నొందినపుడు హర్షము నొందఁడు, అప్రియము నొందినపుడు విషాదము నొందఁడు, తాను సర్వభూతంబులందు సముఁడను స్థిరమయిన బుద్ధి గలవాఁడై హర్షవిషాదహేతు వగుసమ్మోహము లేనివాఁడై బ్రహ్మరూపుఁడై యే యుండు నని తాత్పర్యము.

ఆ॰ ఓయీ! విద్వాంసునకుఁ గూడ నిష్టానిష్టప్రాప్తులచే హర్షవిషాదములం గలుగుచుండఁగా నిర్దోష మగుబ్రహ్మమునం దెట్లు స్థితి లభించును? అని యాశంకించి యాకాంక్షాపూరణము చేయుచు నుత్తరశ్లోకము నెత్తుచున్నారు ఎందువలన నిత్యాదిగా. ఆత్మజ్ఞాననిష్ఠ గల విద్వాంసునకు హర్షవిషాదములనిమిత్తము లేకుండుటవలన నవి సంభవింప వని చెప్పుచున్నాఁడు స్థిరబుద్ధిః ఇత్యాదిగా. ఓయీ! ప్రియాప్రియములు హర్షవిషాదములకు నిమిత్త మని యేర్పడఁగా నెట్లవి ప్రాప్తించినపుడు హర్షోద్వేగములఁ జేయఁగూడ దని నియోగింపవచ్చును? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు దేహమాత్రేత్యాదిగా. విద్వాంసునకుఁగూడఁ బ్రియాప్రియప్రాప్తులు సంభవించుటవలననే హర్షావిషాదములు నివారింప శక్యము గా వని యాశంకించి చెప్పుచున్నారు కేవలేత్యాదిగా. అద్వితీయాత్మదర్శనశీలునకు ఆత్మవ్యతిరిక్త మయినప్రియాప్రియములప్రాప్తి సంభవింపమివలనఁ దన్నిమిత్తము లగుహర్షవిషాదములు సంభవింప వని యర్థము. ఇందువలనఁ గూడ విద్వాంసునకు హర్షవిషాదములు సంభావితములు కా వని చెప్పుచున్నారు మఱియును అని. మున్ను చెప్పిన నిర్దోషబ్రహ్మమునందు దృఢ మయినబుద్ధి గలవాఁడును హర్షాదిహేతు వగు సమ్మోహము లేనివాఁడును యథోక్త మయినసర్వదోషరహిత మగుబ్రహ్మమునందు నేనేయది యనుజ్ఞానము గలవాఁడును అశేషదోషవర్జిత మగునాబ్రహ్మమునందే నిలుకడ గలవాఁడును దదనుసారముగాఁ గర్మమునందుఁ బ్రవృత్తి లేనివాఁడు నగు వాఁడు హర్షవిషాదములఁ బొందనే పొందఁ డని యర్థము.

హ॰ *

---

* శంకరభాష్యముతో సమానము.

౨౦. విదేహకైవల్యముఁ గోరువాఁడు బ్రహ్మవిదుఁడు సర్వమును సన్న్యసించి సదా బ్రహ్మమునందే బ్రహ్మరూపుఁడై యుండువాఁ డగుయతికి సర్వవాసనాక్షయంబును సర్వకామవినాశంబును సర్వకర్మప్రవిలయంబును అను మూఁడును సిద్ధించుచున్నవి, అనఁగా భావిజన్మహేతు వగు ననిష్టము నివర్తిల్లుచున్నది, అట్లు జీవద్దశయందు దృష్టదుఃఖసంబంధము లేకుండుటయు సదానందానుభవంబును విదేహకైవల్యప్రాప్తియును మూఁడును ఇష్టము ప్రాప్తించుచున్నది, ఇట్లు పురుషార్థము సిద్ధించుచున్నది. అందువలన ముముక్షువు శ్రవణాదికముచే నాత్మతత్త్వము చక్కఁగాఁ దెలిసినవాఁడు యతి బ్రహ్మనిష్ఠ నవశ్యము చేయవలయు నని సూచించుటకై బ్రహ్మయోగము చేయువాఁడు చేయవలసినది చెప్పుచున్నాఁడు —బ్రహ్మణి = సర్వత్రబ్రహ్మదర్శనసమాధియందు; స్థితః=ప్రవర్తించినట్టి; బ్రహ్మవిత్ =బ్రహ్మము నెఱింగిన యతి; తాను భిక్షాటనాదికమునందు యదృచ్ఛచేఁ * ప్రారబ్ధవశంబునఁ బ్రాప్తమయిన, ప్రియమ్=ఇష్ట మగువస్తువును గాని వాక్యమును గాని పూజాదిరూప మగు కర్మమును గాని; ప్రాప్య—విని గాని చూచి గాని స్పృశించి గాని; రమ్యమని గాని ఇష్ట మని గాని తలంచి, నప్రహృష్యేత్ =హర్షింపఁ గూడదు. ప్రహర్షము అనాత్మధర్మము, అది చేసినచోఁ దన కనాత్మతాదాత్మ్యమే సంభవించి తనయందు అనదారోపముసంభవించును; నామరూపగుణవిశేషంబులచే వస్తువిమర్శము లేక రమ్యం బనుబుద్ధి గాని యిష్టం బనుబుద్ధిగాని పుట్టదు, రమ్యత్వాదిబుద్ధి లేక ప్రహర్షంబును జనియింపదు, హర్షోత్పత్తియును ద్రష్టయందు భోక్తయందు ఆత్మత్వాభినివేశంబు లేక సంభవింపదు, ఇట్లు వస్తువిమర్శనంబును ఆవస్తువునందు రమ్యతాబుద్ధియు ఇష్టతాబుద్ధియు అనర్థహేతు వగుచున్నది. అందువలనఁ బ్రత్యగ్దృష్టిని విడిచి వస్తువిమర్శనంబును రమ్యత్వబుద్ధిని ఇష్టత్వబుద్ధిని బ్రహర్షమును బ్రహ్మవిదుఁడు చేయఁ గూడదు, మఱేమనఁగా సర్వత్ర ప్రత్యగ్దృష్టితోనే యుండవలయునని యర్థము. మఱియును. అప్రియమ్=అనిష్టమును, ఆధ్యాత్మిక మయినజ్వరాదికమును ఆధిభౌతికమైన చోరవ్యాఘ్రాదికమును ఆధిదైవికమయిన వర్షవాతాదికమును, ఇట్టి యనర్థకారణమును. ప్రాప్య=పొంది; నోద్విజేత్ =ఉద్వేగమనఁగా చలనముఅధైర్యముభయము, దానివహింపఁగూడదు, అయ్యో! హతుఁడనైతి నని యౌపాధిక మయినయనర్థమును తనమీఁదఁ బెట్టుకోఁ గూడదు, ఆయనర్థమునకుఁ దాను విషయము గాఁ గూడదు, మఱే మనఁగా, కావలసినది కానే యగు నని దృఢమయినబుద్ధితో నుపాధిని బ్రారబ్ధమునకు సమర్పించి తాను

* అప్రయత్నంబున.

దానికి విషయము కానట్టినిర్విశేషబ్రహ్మముగానే యుండవలయును, ఆత్మదృష్టిచే నుండువానికి ముక్తి గలుగక తప్పదు, బాహ్యదృష్టిచే నుండువానికో ఉపాధి నశింప కుండుటయు ముక్తి నశించుటయు సంభవించును, అందువలనఁ బ్రత్యగ్దృష్టిని విడిచి బాహ్యములను గ్రహించుటయు అందు అనిష్టతాబుద్ధియుఁ దాను వాని యనర్థంబులకు విషయం బని తలంచుకొనుటయు నుద్వేగంబును విద్వాంసుడు చేయఁ గూడ దని యర్థము. ఇష్టానిష్టములు ప్రాప్తించినపుడు ప్రహర్షోద్వేగములు చేయక యె ట్లుండవలయును ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అసమ్మూఢః = సమ్మూఢుఁ డనఁగా విపరీతముగాఁ గ్రహించువాఁడు, తద్విలక్షణుఁ డగునమదర్శియే యసమ్మూఢుఁడు, అట్టివాఁడై ; బ్రహ్మమునందే ఆత్మప్రత్యయము చేయుటయందు, స్థిరబుద్ధిః = స్థిర మయిన—తనయొక్క బ్రహ్మాకారతను విడువనిదియై నిశ్చల మయినబుద్ధి గలవాఁడై ; బ్రహ్మణి = బ్రహ్మమునందే; స్థితః = ఉన్నవాఁడు కావలయును, తాను సర్వమును బ్రహ్మమాత్రమే యని చూచుటయందే యుండవలయు నని యర్థము.

మ. ఎందువలన బ్రహ్మము నిర్దోషము సమమునో అందువలనఁ దద్రూపుఁ డైనయాత్మను సాక్షాత్కరించుచున్నవాఁడు.—“ దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ” అను చోటఁ బూర్వార్థము వ్యాఖ్యానము చేయఁబడినది. జీవన్ముక్తులస్వాభావికం బగు నడవడినే ముముక్షువులు ప్రయత్నపూర్వకముగా ననుష్ఠింపవలయు నని చెప్పుటకై లిఙ్ప్రత్యయములు *. అద్వితీయాత్మదర్శనశీలునకు ఆత్మవ్యతిరిక్తము లయిన ప్రియాప్రియముల ప్రాప్తి సంభవింపమివలనఁ దజ్జన్యములగు హర్షవిషాదములు సంభవింప వని యర్థము. అద్వితీయాత్మదర్శనమునే వివరించుచున్నాఁడు.—స్థిరబుద్ధిః = స్థిరము—నిశ్చలము సన్న్యాసపూర్వక వేదాంతవాక్యవిచారముయొక్క పరిపాకముచే సర్వసంశయశూన్య మగుటంజేసి నిస్సందేహముగా నిశ్చిత మయిన బ్రహ్మమునందలి బుద్ధి గలవాఁడు, శ్రవణమననముల ఫలమును బొందినవాఁ డనుట. ఇట్టివానికి నమస్త మయిన యసంభావన లేక పోయినను విపరీతభావనారూప మయిన ప్రతిబంధ ముండుటవలన సాక్షాత్కార ముదయింపదు, కావున నిదిధ్యాసనము చెప్పుచున్నాఁడు.— అసమ్మూఢః = విజాతీయప్రత్యయానంతరిత † సజాతీయప్రత్యయ ప్రవాహరూప మయిన నిదిధ్యాసనముయొక్క పరిపాకమువలన విపరీతభావన యను పేరు గల సమ్మోహము లేనివాఁడు; అంత సర్వప్రతి

* ప్రహృష్యేత్ ఉద్విజేత్ అనుపదములయందు విధిని బోధించునట్టి లిఙ్ప్రత్యయములు.

† నడుమ విజాతీయప్రత్యయము కొంచె మయినను లేనట్టి.

బంధములను దొలఁగుటవలన, బ్రహ్మవిత్ = బ్రహ్మ సాక్షాత్కారము గలవాఁడు. అందువలన, బ్రహ్మణి స్థితః = సమాధి పరిపాకముచే నిర్దోషము సమ మయిన బ్రహ్మమునందే యున్నవాఁడు, ఇతరమున నున్నవాఁడు కాఁడు, జీవన్ముక్తుఁడు స్థితప్రజ్ఞుఁడని యర్థము. ఇట్టివానికి ద్వైతదర్శనము లేకుండుటవలనఁ బ్రహర్షోద్వేగములు సంభవింప వనుట యుచితమే. సాధకుఁడో ద్వైతదర్శన మున్నను విషయదోష దర్శనాదికముచేఁ బ్రహర్షవిషాదంబుల విడువవలయు నని యభిప్రాయము.

శ్రీ. బ్రహ్మముఁ బొందిన వానిలక్షణము చెప్పుచున్నాఁడు.—ఎవఁడు బ్రహ్మవిదుఁడై బ్రహ్మమునందే యున్నాఁడో అతఁడు, ప్రియం ప్రాప్య; న ప్రహృష్యేత్ = హర్షింపఁడు. అప్రియంచ ప్రాప్య; న ఉద్విజేత్ – విషాదింపఁ డని యర్థము. ఎందువలన ననఁగా.—స్థిరబుద్ధిః = నిశ్చల మయిన బుద్ధి గలవాఁడు. అది యెందువలనఁ గలుగు ననఁగా—అసమ్మూఢః = నివర్తిల్లిన మోహము గలవాఁడు.

ప. ఇఁక బ్రహ్మమునందు స్థిరుఁడైనవాని పరీక్షను ♦ జెప్పుచున్నాఁడు.—అతఁడే బ్రహ్మవిదుఁడై బ్రహ్మమునం దున్నవాఁడు, ఎవ్వఁడు, ప్రియం ప్రాప్య, న ప్రహృష్యేత్ = హర్షమును బొందఁడో; అట్లు, అప్రియం ప్రాప్య, నోద్విజేత్ = ఉద్వేగమును బొందఁడో; అందువలననే, స్థిరబుద్ధిః, అసమ్మూఢః—ప్రియాప్రియములు లేనివాఁడో.

రా. ఏ ప్రకారమున నున్నచోఁ గర్మయోగికి సమదర్శనరూప మయిన జ్ఞానపరిపాకం బగునో ఆప్రకారము నుపదేశించుచున్నాఁడు.—ఎట్టి దేహమునందు వయవస్థయం దున్నవానికిఁ బ్రాచీనకర్మవాసనచే నేది ప్రియం బగునో ఏది యప్రియం బగునో ఆరెంటిని బొంది హర్షోద్వేగములను జేయఁ గూడదు. అది యెట్లు? స్థిరబుద్ధిః = స్థిరుఁడైనయాత్మయందు బుద్ధి గలవాఁడు; అసమ్మోహః = అస్థిరమయిన శరీరముతో స్థిరుఁ డగు నాత్మను ఒకటిగాఁ జేసి మోహించుట సమ్మోహము, అది లేనివాఁడు. అదియు నెట్లు? బ్రహ్మవిత్ బ్రహ్మణి స్థితః = ఉపదేశము వలన బ్రహ్మము నెఱింగినవాఁడై ఆబ్రహ్మమునం దభ్యాసముతోఁ గూడినవాఁడు. ఇది యభిప్రాయము.—తత్త్వవిదుల యుపదేశముచే ఆత్మయాథాత్మ్యము దెలిసినవాఁడై అందే యత్నము గలవాఁడై దేహాత్మాభిమానమును బరిత్యజించి స్థిరరూపాత్మాపలో

♦ తెలిసికొనులక్షణమును.

కనం బనుప్రియము ననుభవించుటయందు నిలుకడ గలవాఁడై యస్థిరములు ప్రాకృతము లగు ప్రియాప్రియములు పొందినపుడు హర్షోద్వేగములను జేయఁ గూడదు అని.

మా. సన్న్యాసయోగజ్ఞానంబులను జెప్పి ప్రవచించుచున్నాఁడు అధ్యాయశేషముచేత.

బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విన్ద త్యాత్మని య త్సుఖమ్
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే. ౨౧

భా. మఱియు బ్రహ్మమునం దున్నవాఁడు.—బాహ్యస్పర్శేషు = స్పృశింపఁబడుచున్నవి కావున స్పర్శము లనఁగా శబ్దాదివిషయములు, బాహ్యము లయిన విషయములయందు; అసక్తాత్మా = సక్తము కాని యంతఃకరణము గలవాఁడై, విషయములందుఁ బ్రీతి లేనివాఁడై; ఆత్మని = ఆత్మయందు; యత్ సుఖమ్ = ఏయానందము గలదో, దానిఁ; విన్దతి = పొందుచున్నాఁడు. సః = అతఁడు; బ్రహ్మయోగయుక్తాత్మా = బ్రహ్మమునందు యోగముతో—సమాధితో యుక్త మయిన—సమాహిత మయిన—దానియందుఁ బ్రవర్తించిన యంతఃకరణము గలవాఁడై; అక్షయమ్ = నాశము లేనట్టి; సుఖమ్ = ఆనందమును; అశ్నుతే = పొందుచున్నాఁడు. అందువలన క్షణిక మయిన బాహ్యవిషయప్రీతినుండి యింద్రియములను మరలింపవలయును ఆత్మయందలియక్షయసుఖముఁ గోరువాఁ డని యర్థము.

బ్రహ్మనిష్ఠుఁడు బాహ్యవిషయములందుఁ బ్రీతి లేనివాఁడు కావున నాత్మానందమును బొందుచున్నాఁడు. అట్లతండు బ్రహ్మమునందే సమాధి చేయుచు అక్షయం బగు స్వస్వరూపానందము ననుభవించుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. శబ్దాదివిషయంబులందలి ప్రీతి ప్రతిబంధించుటవలన నెవ్వనికిని బ్రహ్మమునందు స్థితి సిద్ధింప దని యాశంకించి చెప్పుచున్నారు మఱియు నిత్యాదిగా. పూర్వోక్తరీతిని మాత్రమే కాదు బ్రహ్మమునం దున్నవాఁడు హర్షవిషాదరహితుఁ డగుట, మఱి యే మనఁగాఁ బ్రకారాంతరాంతరముచేతఁ గూడ హర్షవిషాదరహితుఁ డగుచున్నాఁ డని యర్థము. ఎంతెంత విషయరాగరూప మైన యావరణము నివర్తిల్లుచున్నదో అంతంత యాత్మస్వరూపసుఖం బభివ్యక్త మగుచున్న దని చెప్పుచున్నాఁడు పూర్వార్ధముచేత. అసక్తాత్ముఁడు శమమువలన మాత్రమే కాఁడు

సుఖము పొందువాఁడు, మఱి యే మనఁగా బ్రహ్మసమాధిచే సమాహిత మగు నంతః కరణము గలవాఁడై యనంత మగు సుఖమును బొందుచున్నాఁ డని చెప్పుచున్నాఁ డు త్తరార్ధముచేత. అంతఃబూర్వార్ధమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు బాహ్యేత్యాదిగా. సమాధిచేఁ గలుగు సమ్యక్జ్ఞానముద్వారమున నిరతిశయసుఖముఁ బ్రాపించు నని యుత్తరార్ధవ్యాఖ్యానముచేఁ జెప్పుచున్నారు సః ఇత్యాదిగా. శబ్దాది విషయవిముఖున కనంతసుఖప్రాప్తి సంభవించుటవలన దానిఁ గోరువాఁడు విషయ విముఖతను సంపాదింపవలయు నని శిష్యశిక్షార్థము చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

హ. *

శ౦. «న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య» అని చెప్పి విషయసుఖమును విడువవలయు నని సూచింపఁబడినది, విషయసుఖము విడిచినయెడ బ్రహ్మవిదునకు సుఖము లేక పోవుటవలన మన్మత్తునిస్థితివలె వీనిస్థితి నిష్ఫలమే యగు నని యాశంకించి, అట్లు కాదు «రసం హ్యే వాయం లబ్ధ్వా నన్దీ భవతి» అను శ్రుతివలన నిత్యనిరంతర నిరతిశయ మగు బ్రహ్మసుఖము బ్రహ్మనిష్ఠయం దున్నవీనికిఁ గల దని చెప్పుచున్నాఁడు.—ఎవ్వఁడు ఆత్మతత్త్వజ్ఞుఁడు తాను, బాహ్యస్పర్శేషు = మూఢులచే ఆత్మకు వెలుపలనే కల్పితములు బాహ్యములు, ఇంద్రియములచే స్పృశింపఁబడుచున్నవి—గ్రహింపఁబడుచున్నవి స్పర్శములు, అట్టి బాహ్యస్పర్శములందు—శబ్దాది విషయములందును వానిచేఁ గలుగు సుఖములయందును; అసక్తాత్మా = తుచ్ఛములను బుద్ధిచేతను బంధకము లను బుద్ధిచేతను అసక్తము—ప్రవర్తింపని దగు ఆత్మ—మనస్సు గలవాఁడై, తీవ్రవైరాగ్యముచే మనస్సున విషయగ్రహణము చేయక గుహయందుఁ గాని మఱియొక యేకాంతస్థలమునందుఁ గాని సమాహితుఁడై; ఆత్మని = బుద్ధ్యాదిసాక్షి యగు ప్రత్యగాత్మ సాక్షాత్కృతుఁడు కాఁగా; యత్ = ఏః సుఖమ్ = స్వాత్మసాక్షాత్కారజన్య మగు సుఖమును; విన్దతి = అనుభవించుచున్నాఁడో; సః = ఆ బ్రహ్మవిదుఁడే; బ్రహ్మయోగయుక్తాత్మా = నామరూపగ్రహణము చేయక చిదాకారవృత్తిచే వెలుపలను లోపలను సర్వత్ర బ్రహ్మమాత్రదర్శనము బ్రహ్మయోగము, అట్టి సర్వత్రసదాబ్రహ్మదర్శనమునందే యుక్తము—నియమింపఁబడిన ఆత్మ—మనస్సు గలవాఁడై, వ్యుత్థానమునందును అవ్యుత్థానమునం

* శంకరభాష్యములో సమానము.

దును * సదా సర్వత్ర ఆనందైకరసము పరిపూర్ణ మగు బ్రహ్మమునే చూచుచున్న వాఁడై; అంతఃకన్నను అధికతర మయిన, అక్షయమ్ = సదా సర్వత్ర ఆనందైకరసం బగు బ్రహ్మమే బుద్ధివృత్తికి విషయం బగుటవలన విచ్ఛిత్తిరహిత మయినసుఖమును—స్వరూపానందమును; అశ్నుతే = పొందుచున్నాఁడు, సర్వత్ర బ్రహ్మమాత్రదర్శనపరుం డగు బ్రహ్మవిదుం డైనయతి సదానందుఁ డగుచున్నాఁ డని యర్థము. ఇచట నిది యభిప్రాయము—గుహాది రహస్యస్థలమునందు సమాధిఁ జేయువానికి సమాధికాలమునందే యాత్మానందానుభవం బగును, కాని సదా సర్వత్ర కలుగదు. బ్రహ్మయోగయుక్తాత్మునకో వెలుపలను లోపలను సదా సర్వత్ర బ్రహ్మానందానుభవము నిరర్గలముగాఁ గలిగి యుండు నని.

మ. ఓయీ! బాహ్యవిషయప్రీతి బహుజన్మములుగా ననుభవింపఁబడిన దగుటచే నతిప్రబల మగుటవలన, దానియం దాసక్త మయిన చిత్తము గలవానికి ఎట్లు దృష్టసర్వసుఖరహితము అలౌకిక మగు బ్రహ్మమునందు స్థితి సంభవించును? పరమానందరూప మగుటవలన నని యన్నచో, కాదు. ఆయానందము ఇదివఱకనుభవింపఁబడినది కాకుండుటచేఁ జిత్తస్థితికి హేతువు గాఁజాలదు. అది చెప్పఁబడినది వార్తికమునందు « అప్యానన్ద శ్శ్రుత స్సాక్షాన్మానే నా ఽవిషయీ కృతః । దృష్టానన్దాభిలాషం స న మన్దీకర్తు మప్యలమ్ » § అని. ఇందుకుఁ జెప్పుచున్నాఁడు.—బాహ్యస్పర్శేషు = ఇంద్రియములచే స్పృశింపఁబడుచున్నవి కావున స్పర్శములనఁగా శబ్దాదివిషయములు, అవియు బాహ్యములు అనాత్మధర్మం బగుటవలన, వానియందు; అసక్తాత్మా = అసక్తము గాని చిత్తము గలవాఁడు, తృష్ణాశూన్యుఁ డగుటచే విరక్తుఁడై; ఆత్మని= అంతఃకరణమునందే; బాహ్యవిషయాపేక్ష లేని యుపశమాత్మక మగు, యత్ సుఖమ్ = ఏసుఖము గలదో; తత్ = దానిని; విన్దతి = పొందుచున్నాఁడు నిర్మలసత్త్వవృత్తిచేత. అట్లు చెప్పఁబడినది భారతమునందు « యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహ త్సుఖమ్ । తృష్ణాక్షయసుఖ స్యైతే నార్హతః షోడశీం కలామ్ » ¶ అని. లేక. ప్రత్యగాత్మ యందు త్వంపదార్థమునందు

* సమాధినుండి లేచినప్పుడును సమాధిలో నుండినప్పుడును.

§ శ్రుతియందుఁ జెప్పఁబడినదైనను ఆనందము—బ్రహ్మానందము సాక్షాత్ప్రమాణముచే విషయీకరింపఁబడినది—అనుభవింపఁబడినది కానియెడ దృష్టానందమునందలియభిలాషను దక్కువపఱచుటకుఁ గూడ సమర్థము కాదు.

¶ లోకమునందుఁ గామసుఖ మేది గలదో దివ్యమగు—స్వర్గాది జన్యమగుసుఖ మేది గలదో—ఇవి రెండును తృష్ణానాశసుఖమునకుఁ బదునాఱవపాలుగూడఁ బోలదు.

స్వరూపభూత మయినసుఖము, సుషుప్తి యందనుభవింపఁబడునదియు బాహ్యవిషయప్రతిబంధమువలనఁ బొందఁబడనిదియు నగునది యేసుఖము గలదో, దానినే బాహ్యవిషయప్రతిబంధము లేమివలనఁ బొందుచున్నాఁడు. త్వంపదార్థసుఖమును మాత్రమే కాదు పొందుట, మ ఱే మనఁగా తత్పదార్థైక్యము ననుభవించుటచేఁ బూర్ణసుఖము నుగూడ ననుభవించుచున్నాఁ డని చెప్పుచున్నాఁడు.—సః = తృష్ణాశూన్యుఁ డగు నతఁడు; బ్రహ్మయోగయుక్తాత్మా=బ్రహ్మమునందు—పరమాత్మయందు యోగముతో—సమాధితో యుక్తము—దానియందు వ్యాపృత మగు ఆత్మ—అంతఃకరణము గలవాఁడు; లేక, బ్రహ్మమునందు—తత్పదార్థమునందు యోగముచేత—వాక్యార్థానుభవరూప మయినసమాధిచేత, యుక్తము—ఐక్యముఁ బొందినదగు ఆత్మ—త్వంపదార్థము గలవాఁడు, అట్టివాఁడై; సుఖమ్; అక్షయమ్ = అనంతమును స్వస్వరూపసుఖమును; అశ్నుతే = వ్యాపించుచున్నాఁడు, సుఖానుభవరూపుఁడే సర్వదా అగుచున్నాఁ డని యర్థము. వస్తువు నిత్యమయినను అవిద్యానివృత్త్యభిప్రాయంబున ధాత్వర్థయోగము• ఔపచారికము. అందువలన, ఆత్మయందు అక్షయసుఖము ననుభవింపఁ గోరువాఁడు క్షణికము మహానరకహేతు వగు బాహ్యవిషయప్రీతినుండి యింద్రియంబుల మరలింపవలయును, అంతమాత్రముననే బ్రహ్మమునందు స్థితి యగుచున్నదని యభిప్రాయము.

శ్రీ. మోహనివృత్తిచే బుద్ధి స్థిరం బగుననుటకు హేతువు చెప్పుచున్నాఁడు.—ఇంద్రియములచే స్పృశింపఁబడుచున్నవి కావున స్పర్శములు—విషయములు, బాహ్యేంద్రియవిషయములందు, అసక్తాత్మా = అనాసక్త మయినచిత్తము గలవాఁడు; ఆత్మని = అంతఃకరణమునందు; యత్ సుఖమ్ = ఉపశమాత్మక మగు సాత్త్విక మైనసుఖ మేది గలదో; దాని; విన్దతి = లభించుచున్నాఁడు. అటఁ దట్లు ఉపశమాత్మక మగుసుఖమును బొంది, బ్రహ్మమునందు యోగముచే సమాధిచే యుక్తము—దానితో నైక్యము నొందిన దగు ఆత్మ గలవాఁడై; అక్షయం సుఖమ్; అశ్నుతే = పొందుచున్నాఁడు.

ప. ❡

రా. మున్ను చెప్పినవిధంబున, బాహ్యస్పర్శేషు = ఆత్మవ్యతిరిక్తానుభవములయందు; అసక్తాత్మా = సక్తము కాని మనస్సు గలవాఁడై; యః = ఎవ్వఁడు *;

• వ్యాపించుచున్నాఁ డనుట.

❡ శ్రీధరీయముతో సమానము.

* వీరిమతమున య స్సుఖమ్ అని పాఠము.

ఆత్మని = అంతరాత్మయందే; సుఖమ్ = సుఖమును; విన్దతి = పొందుచున్నాఁడో. సః= అతఁడు, ప్రకృత్యభ్యాసమును విడిచి, బ్రహ్మయోగయుక్తాత్మా = బ్రహ్మాభ్యాసము నందు యుక్త మయినమనస్సు గలవాఁడై; బ్రహ్మానుభవరూప మయిన, అక్షయం సుఖమ్; అశ్నుతే = పొందుచున్నాఁడు.

మున్ను చెప్పినప్రకారమున ఆత్మవ్యతిరిక్తవిషయముల ననుభవించుట యందు మనస్సును బోనియ్యక యెవ్వఁడు అంతరాత్మయందే సుఖమును బొందు చున్నాఁడో అతఁడు ప్రకృత్యభ్యాసమును విడిచి బ్రహ్మాభ్యాసమునందే మనస్సును నిలిపినవాఁడై బ్రహ్మానుభవరూప మయినయక్షయసుఖమును బొందఁ గలఁ డని తా.

మూ. మనల యోగము అధికం బనుటను స్పష్టీకరించుచున్నాఁడు.— కామరహితుఁడు ఆత్మయందు ఏసుఖమును బొందుచున్నాఁడో అతఁడే బ్రహ్మయోగ యుక్తాత్ముఁ డగు నేని ఆసుఖమునే అక్షయమును బొందుచున్నాఁడు. బ్రహ్మవిషయ మయిన యోగము బ్రహ్మయోగము. ధ్యానాదియుక్తునకే యాత్మసుఖ మక్షయ మగును, కానిచోఁ గా దని యర్థము.

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే
ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః. ౨౨

భా. ఇందువలనఁ గూడ మరలింపవలయును.—హి = ఎందువలన; యే = ఏవి; సంస్పర్శజాః = విషయేంద్రియసంయోగమువలనఁ గలుగు నట్టి; భోగాః = భోగములు గలవో; దుఃఖయోనయ ఏవ = దుఃఖ హేతువులే; తే = అవి, అవిద్యాకృతంబు లగుటవలన. కనఁబడుచున్నవి గదా యాధ్యాత్మికాదిదుఃఖములు వానిచేతనే కలుగునవి. ఎట్లు ఈలోక మునందో అట్లే పరలోకమునందును అని తెలియుచున్నది ఏవశబ్దము వలన ♦. సంసారమునందు సుఖము లేశమాత్రము గూడ లేదని యెఱింగి విషయమృగతృష్ణికనుండి యింద్రియముల మరలింపవలయును. దుఃఖ హేతువులు మాత్రమే కావు, ఆద్యన్తవన్తః = మొదలును తుదయును గలవి గూడ, మొదలు భోగములకు విషయేంద్రియసంయోగము, తద్వి యోగమే యంతము, కావున ఆద్యంతవంతములు—అనిత్యములు మధ్య

♦ దుఃఖయోనయ ఏవ—దుఃఖహేతువులే యనుటవలన.

క్షణభావు లగుటవలన * నని యర్థము. కౌన్తేయ = అర్జునా! తేషు = ఆభోగములందు; బుధః = వివేకి, పరమార్థతత్త్వము తెలిసినవాఁడు; నరమతే = రమింపఁడు. అత్యంతమూఢులకే కదా విషయములందుఁ బ్రీతి కలుగును బశుప్రభృతులకుం బోలె.

విషయేంద్రియసంయోగమువలనఁ గలుగుభోగము లేవి కలవో అవి యీలోకమునందుఁ గాని బరలోకమునందుఁ గాని దుఃఖమునే కలిగించును, ఆదియు అంతమును గల వగుటచే అనిత్యములు గూడ. కావున అర్జునా! వివేకి యగువాఁ డట్టిభోగములందుఁ బ్రీతి వహింపఁ డని తాత్పర్యము.

**రా.** అందే మఱియొక హేతువు బోధించునదిగా నుత్తరశ్లోకము దించుచున్నారు ఇందువలనఁ గూడ నిత్యాదిగా. విషయములనుండి యింద్రియంబుల కని యధ్యాహార్యము. వైరాగ్యముకొఱకే వైషయికసుఖముల దూషించుచున్నాఁడను యే హీత్యాదిగా. ఓయీ! విషయేంద్రియసంయోగజన్యంబు లగుభోగములందు జంతువుల కభిరుచి కనఁబడుటవలన ఎట్లవి దుఃఖయోను లనవచ్చు నని యాశంకించి యవివేకులకు వానియం దభిరుచియున్నను వివేకులకు లే దని చెప్పుచున్నాఁ డుత్తరార్థముచేత. ఎందువలన ఆధివ్యాధిజరామరణసహితములును సమాగమనాదిక్లేశరూపమును బొందునవియు ♦ నగు విషయేంద్రియసంయోగములవలన భోగములు—సుఖలేశానుభవములు కలుగుచున్నవో అందువలన నవి దుఃఖహేతువు లగుచున్నవి యని యన్వయము. దుఃఖము లవిద్యాకార్యము లగుచుండఁగా నెట్లవి భోగజన్యము లనవచ్చు నని యాశంకించి భోగములు అవిద్యాప్రయుక్తము లగుటవలన దుఃఖములు భోగజన్యము లనుట యుక్తమను నభిప్రాయముతోఁ జెప్పుచున్నారు అవిద్యాకృతంబు లగుటవలన నని. భోగములు దుఃఖయోను లనుటకుఁ బ్రమాణముగా ననుభవము నుపన్యసించుచున్నారు కనఁబడుచున్నవి గదా ఇత్యాదిగా. ఐహికభోగములు దుఃఖయోను లైనను ఆముష్మికము లట్టివి కావు అనుభవము లేకుండుటవలన అని యాశంకి యుపధారణసామర్థ్యముచే ♦♦ సిద్ధ మయినయర్థముఁ జెప్పుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. పూర్వార్ధమున కక్షరార్థముఁ జెప్పి తాత్పర్యార్థముఁ జెప్పుచున్నారు

* పూర్వక్షణమునను ఉత్తరక్షణమునను లేనివై మధ్యక్షణమునందుమాత్ర ముండునవి యగుటవలన.

♦ సమాగమనము—చేర్చుట, ఆదిశబ్దముచే విశ్లేషణము—విడఁదీయుట గ్రహింపఁబడుచున్నది.

♦♦ ఏవశబ్దార్థ సామర్థ్యముచే.

సంసారమునందు ఇత్యాదిగా. ఇందువలనఁగూడ విషయములనుండి యింద్రియముల మరలింపవలయు నని చెప్పుచున్నారు దుఃఖేత్యాదిగా. ఆద్యంతవంతము లగునప్పుడు మధ్యక్షణవర్తు లగుటచే క్షణభంగురము లగుటవలన భోగము లుపేక్షణీయంబు లని సిద్ధించుచున్నది. కలదు కదా వానికి క్షణభంగురత్వము క్షణిక మగువిషయాకార మయినమనోవృత్తిచేఁ దోఁచునవి యగుటవలన నని తలంచి చెప్పుచున్నారు కావున నిత్యాదిగా. బుద్ధిపూర్వకముగాఁ * జేయునట్టి వివేకులకు భోగములయం దుపేక్ష కనఁబడుటవలనఁ గూడ నవి యాభాసంబు లని తెలియుచున్న దని చెప్పుచున్నారు తేషు ఇత్యాదిగా. ఓయీ! కొందఱకు భోగములయం దభిరుచి కనఁబడుచున్నది అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు అత్యంతేత్యాదిగా.

హ. ••

శం. ఓయీ! “బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా” అని చెప్పుట వ్యర్థము, బ్రహ్మవిదునకు నొకానొకకాలమున విషయసుఖముగూడ నుండుఁ గాక, బ్రహ్మానందము గూడఁ గలదు అని యాశంకించి, అట్లు కాదు, విషయసుఖము ఆద్యంతవంత మగుటచే దుఃఖసహితం బగుటవలనను అల్పం బగుటవలనను తుచ్ఛం బగుటవలనను దానియం దాత్మతత్త్వజ్ఞుఁడు ప్రవర్తింపఁ డని చెప్పుచున్నాఁడు.—హి=ఏకారణము వలన; సంస్పర్శజాః = సంస్పర్శమనఁగా ఇంద్రియములకును విషయములకును బరస్పరసంయోగము, దానివలనఁ బుట్టినవి కావున సంస్పర్శజములు, ఇంద్రియములకును అర్థములకును సంయోగము వలనఁ గలుగునట్టి; యే భోగాః = ఏవిషయసుఖములు గలవో; తే = అవి; ఆద్యన్తవన్తః = ఉత్పత్తివినాశములు గలవి, అందువలననె క్షణికములు అనిత్యము లని యర్థము. సంస్పర్శజాః అని పుట్టినవనుటచేతనే అనిత్యము లని సిద్ధించుటవలన మరల ఆద్యంతవంతము లని చెప్పుట నిరర్థకం బని తలంపఁ గూడదు, తార్కికులు ప్రధ్వంసాభావము జన్యము నిత్యము నని యంగీకరించుచున్నారు, మీమాంసకులును “అక్షయ్యం హవై చాతుర్మాస్యయాజిన స్సుకృతమ్” ♦ అనుశ్రుతిచే తజ్జన్య మగుసుఖముగూడ నక్షయ్య మని యంగీకరించెదరు, తన్మతము నిరసించుటకై యాద్యంతవంతము లని చెప్పఁబడినది. అందుచే విషయసుఖము క్షణికం బనియు అల్పం బనియుఁ బ్రత్యక్షాది ప్రమాణములచే సిద్ధించినది,

* తెలిసి.

•• శంకరభాష్యముతో సమానము.

♦ చాతుర్మాస్యయాగము చేసినవానికి అక్షయ్య మగుసుకృతము కలుగును.

విషయేంద్రియసంయోగమునకు ముందును తద్వియోగమునకుఁ బిమ్మటను సుఖము కనఁబడమివలన. అట్టి యాద్యంతవంతము లగుభోగము లేవి గలవో, తే = అవి. దుఃఖయోనయఏవ = దుఃఖహేతువులే యగుచున్నవి, స్వకారణము నశించినపుడు అవి నశించుటచేతను స్వకారణము సిద్ధింపనియప్పు డవి సిద్ధింపమిచేతను దుఃఖమునే కల్గించుచున్నవి. ఇది సర్వలోకప్రసిద్ధము. అందువలన, విషయసుఖము సాపేక్షం బనియు క్షణికం బనియు అల్పం బనియు దుఃఖప్రదం బనియుఁ దెలిసి, బుధః=బ్రహ్మవిదుఁడు; తేషు = ఆవిషయసుఖములందు; నరమతే = రతిని జేయఁడు. భోగావస్థయందుఁ గూడఁ దాను ఆత్మదృష్టిచే బ్రహ్మానందామృతరసమునే పానము చేయుచుండును, బాహ్యము ననుసంధింపఁ డని యర్థము.

మ. ఓయీ! బాహ్యవిషయప్రీతినివృత్తి కలిగినయెడ ఆత్మయం దక్షయసుఖానుభవము కలుగును, ఆత్మయం దక్షయసుఖానుభవము కలిగినయెడ తత్ప్రసాదమువలననే బాహ్యవిషయప్రీతినివృత్తి కలుగును, ఇట్లు అన్యోన్యాశ్రయము లగుటవలన నొక్కటియు సిద్ధింప దని యాశంకించి విషయములందు దోషదర్శనాభ్యాసముచేతనే తత్ప్రీతినివృత్తి కలుగుచున్న దని సమాధానము చెప్పుచున్నాఁడు.—హి = ఎందువలన; సంస్పర్శజాః = విషయేంద్రియసంబంధజన్యము లగు; యే భోగాః=క్షుద్రసుఖలేశానుభవము లేవి గలవో; ఇహలోకమునందుఁ గాని పరలోకమునందుఁ గాని; రాగద్వేషాదివ్యాప్తము లగుటచే, తే దుఃఖయోనయ ఏవ—బ్రహ్మలోకపర్యంతము అవి యన్నియు దుఃఖహేతువులే యగుచున్నవి. అట్లు చెప్పఁబడినది విష్ణుపురాణమునందు «యావతః కురుతే జన్తుస్సంబన్ధా న్మనసః ప్రియా౯। తావన్తోఽస్య నిఖన్యన్తే హృదయే శోకశఙ్కవః» * అని. ఇట్టి వయినను స్థిరములు గావు, మఱేమనఁగా, ఆద్యన్తవన్తః = ఆది విషయేంద్రియసంయోగము అంతము తద్వియోగమే, అవి గలవి, పూర్వాఽపరకాలములందు లేని వగుటవలన మధ్యకాలమున స్వప్నమువలె నావిర్భవించినవి క్షణికములు మిథ్యాభూతములు. అట్లు చెప్పఁబడినది గౌడపాదాచార్యులచేత «ఆదావన్తేచ యన్నాఽస్తి వర్తమానేఽపి తత్తథా» ♦ అని. అందువలన, తేషు = వానియందు; బుధః = వివేకి; నరమతే = ప్రతికూలవేదనీయంబు లగుటవలనఁ బ్రీతి ననుభవింపఁడు. అట్లు చెప్పఁబడినది

* ప్రాణి యాసక్తివలన ఎన్నింటిని మనస్సునకుఁ బ్రియములనుగాఁ జేసికొనుచున్నాఁడో అన్ని శోకశంకువులు — దుఃఖపుమేకులు వీనిహృదయంబునందు నాటఁబడుచున్నవి.

♦ ఆదియందును అంతమునందును ఏది లేదో వర్తమానమునందును అది యట్లే.

భగవంతుఁ డగు పతంజలిచేత «పరిణామతాపసంస్కారదుఃఖై ర్గుణవృత్తివిరోధాచ్చ దుఃఖమేవ సర్వం వివేకినః» అని. సర్వమ్ = విషయసుఖము సమస్తమును దృష్టమును ఆనుశ్రవికమును ♦♦ దుఃఖమే యగుచున్నది ప్రతికూలవేదనీయ మగుటవలన, వివేకినః = క్లేశాదిస్వరూపము తెలిసినవానికి, కాని అవివేకికిఁ గాదు. అక్షిపాత్రము ♦ వంటివాఁడు గదా విద్వాంసుఁడు మిక్కిలి కొంచెమయిన దుఃఖలేశముచేతఁ గూడ నుద్వేగము నొందుచున్నాఁడు. ఎట్లు ఊర్ణాతంతువు § మిక్కిలి సుకుమారమయినది గూడ కంటిగ్రుడ్డునకుఁ దగిలినదై స్పర్శముచే దుఃఖము కలిగించుచున్నదో ఇతరము లయినయంగములకుఁ గలిగింపదో అట్లు వివేకికే మధువిషసంపృక్తాన్నభోజనమువలె ⸸ సమస్తభోగసాధనంబును గాలత్రయమునందును క్లేశానువిద్ధం బగుటవలన దుఃఖమగుచున్నది, బహువిధదుఃఖములసహించునట్టి మూఢునకు దుఃఖము కాదనియర్థము. అంతు, పరిణామతాపసంస్కారదుఃఖైః అనుటచే భూతవర్తమానభవిష్యత్కాలములయందును దుఃఖానువిద్ధం బగుటవలన నౌపాధికదుఃఖత్వము విషయసుఖమునకుఁ జెప్పఁబడినది. అందు, పరిణామమును తాపమును సంస్కారము నని పరిణామతాపసంస్కారములు అవియే దుఃఖములు పరిణామతాపసంస్కారదుఃఖములు, వానిచేత, ఇత్థం భూతలక్షణమునందుఁ దృతీయ $. ఎట్లనఁగా. రాగానువిద్ధమే గదా సర్వసుఖానుభవమును. దానియందు రాగము గలవాఁడు కాఁడు దానిచే సుఖము నొందుచున్నాఁ డనుట సంభవింపదు గదా! రాగమే పూర్వ ముద్భూతమై విషయప్రాప్తిచేత సుఖరూపంబునఁ బరిణమించుచున్నది. అదియుఁ బ్రతిక్షణము వృద్ధిఁ బొందునది యగుటచే స్వవిషయము లభింపమిచేఁ గలుగుదుఃఖము అనివార్యం బగుటవలన దుఃఖరూపమే యగుచున్నది. భోగములయందుఁ బరితృప్తము లగుటవలన నింద్రియముల కుపశాంతి యేది గలదో అది గదా సుఖము. లోలము లగుటవలన అనుపశాంతి యేది గలదో అదియే దుఃఖము. ఇంద్రియములకు భోగాభ్యాసముచే ❦ వితృష్ణత * కలిగింప శక్యము గాదు. ఏల యనఁగా భోగా

♦♦ ఆనుశ్రవ మనఁగా వేదము దానిచే విహితమయిన పరలోకసుఖము.

♦ కనుగ్రుడ్డు.

§ మేఁక మొదలగువానిరోమము.

⸸ తేనెయు విషమును గలిసిన యన్నముయొక్క భోజనము వలె.

$ అవి లక్షణముగా-గుణముగాఁ గలుగుటచేత నని యర్థము.

❦ పలుమాఱు భోగముచేయుటచే.

* తృష్ణ లేకుండుట.

భ్యాసము చేయఁ జేయ రాగమును ఇంద్రియములకుఁ గౌశలములును వృద్ధిఁ బొందును. అట్లు స్మృతియును « నజాతు కామః " ఇత్యాదిగా •. అందువలన దుఃఖాత్మక మగు రాగముయొక్క పరిణామం బగుటవలన విషయసుఖముగూడ దుఃఖమే, కార్యకారణముల కభేదమువలన. ఇట్లు పరిణామదుఃఖత చెప్పఁబడినది. అట్లు సుఖానుభవకాలమునందు దానికిఁ బ్రతికూలము లయిన దుఃఖసాధనములను ద్వేషించుచున్నాఁడు. భూతముల బాధింపక యుపభోగము సంభవింపదు కావున భూతంబులను హింసించుచున్నాఁడు. ద్వేష మనఁగా సర్వదుఃఖసాధనములును నాకుఁ గలుగఁ గూడ దను సంకల్పవిశేషము. వాని నన్నిటిని ఎవ్వఁడును బరిహరింపఁ జాలఁడు. అందువలన సుఖానుభవకాలమునందుఁ గూడఁ దత్ప్రతికూలము మీఁది ద్వేషము సర్వదా యుండుటవలన తాపదుఃఖము పరిహరింప శక్యమే కాదు. తాపమే గదా ద్వేషము. ఇట్లు దుఃఖసాధనములను బరిహరింప నశక్తుఁడై మోహమునుం బొందుచున్నాఁడు. కావున మోహదుఃఖత గూడ చెప్పఁబడినది. అట్లు చెప్పఁబడినది యోగభాష్యకారులచేత « సర్వత్ర ద్వేషానువిద్ధశ్చేతనాఽచేతనసాధనాధీన స్తాపానుభవః " § అని. అందు ద్వేషజన్య మగు కర్మాశయము * కలుగుచున్నది. సుఖసాధనములను బ్రార్థించుచున్నవాఁడై కాయముచేతను వాక్కుచేతను మనస్సుచేతను చేష్ట నొందుచున్నాఁడు. దానంజేసి పరుని అనుగ్రహించును బీడించును గూడ. కావునఁ బరానుగ్రహముచేతను బరపీడనముచేతను ధర్మాఽధర్మముల నుపచయించుకొనుచున్నాఁడు. ఆకర్మాశయము లోభమువలనను మోహమువలనను గలుగుచున్నది. ఇది తాపదుఃఖత యని చెప్పఁబడినది. అట్లు వర్తమాన మగు సుఖానుభవము తాను నశించునప్పుడు సంస్కారము కలిగించుచున్నది. ఆ సంస్కారము సుఖస్మరణమును, అది రాగమును, అది మనోవాక్కాయచేష్టను, అది పుణ్యాపాపకర్మాశయములను, అవి జన్మాదికమును గలిగించుచున్నవి. ఇట్లు సంస్కారదుఃఖత చెప్పఁబడినది. ఇట్లు తాపమోహములకును సంస్కారములు చెప్పవలయును. ఇట్లు కాలత్రయమునందును దుఃఖానువిద్ధ మగుటవలన విషయసుఖము దుఃఖమేయని ప్రతిపాదించి యిఁక స్వరూపముచేతఁ గూడ నది దుఃఖమని

• నజాతు కామః కామానా ముపభోగేన శామ్యతి। హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాఽభివర్ధతే—ఎప్పుడును కామములయుపభోగముచేఁ గామము శమింపదు, హవిస్సుచే నగ్నివలె మఱిమఱి వృద్ధిఁ బొందును. అనునది.

§ అంతటను ద్వేషానువిద్ధము చేతనాఽచేతనరూపసాధనముల కధీనము తాపానుభవము.

* కర్మవాసన.

చెప్పుచున్నాఁడు గుణవృత్తివిరోధాచ్చ అని. గుణములు సత్త్వరజస్తమస్సులు సుఖదుఃఖమోహాత్మకములు. అవి పరస్పరవిరుద్ధస్వభావము లయినను నూనెవత్తులయందలి యగ్నులు దీపమునుంబోలెఁ బురుషభోగమున కుపయోగించునట్లు త్రయాత్మకమైన స్థౌల్య-కార్యమును బుట్టించుచున్నవి. అందు ఒక్కటి ప్రధానమయి తక్కిన రెండు అప్రధానము లగుటవలనఁ బ్రధానమును మాత్రమే గ్రహించి కార్యము త్రిగుణాత్మమైనను సాత్త్వికము రాజసము తామసం బని యొక్కగుణముచే వ్యపదేశింపఁబడుచున్నది. అందు సుఖోపభోగరూపప్రత్యయముగూడ ఉద్భూత § సత్త్వకార్య మయినను అనుద్భూతము లగు రజస్తమస్సులకుఁ గూడఁ గార్య మగుటవలనఁ ద్రిగుణాత్మకమే యగును. అందువలన సుఖాత్మకత్వం బెట్లో అట్లు దుఃఖాత్మకత్వమును విషాదాత్మకత్వమును దానికిఁ దప్పదు కావున వివేకికి సర్వంబును దుఃఖమే యగుచున్నది. ఇట్టి ప్రత్యయముగూడ స్థిరము కాదు. ఎందువలన ననఁగా "చలం గుణవృత్తమ్" ♦ అని చిత్తము క్షిప్రపరిణామి ❡ యని చెప్పఁబడినది. ఓయీ! ఒక్కటేప్రత్యయం బెట్లు పరస్పరవిరుద్ధము లయినసుఖదుఃఖమోహాత్వముల నేకకాలంబునఁ బొందఁగలదు? అనఁగా నట్లనఁ గూడదు, ఉద్భూతానుద్భూతములకు విరోధము లేమి వలన ♦♦. సమవృత్తికము లగుగుణములకే గదా యేకకాలవిరోధము, విషమవృత్తికములకు లేదు. ఎట్లు ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యములు లబ్ధవృత్తికములు లబ్ధవృత్తికము లయిన * యధర్మాఽజ్ఞానాఽవైరాగ్యాఽనైశ్వర్యములతోనే విరోధించుచున్నవో, వృత్తినిబొందక స్వరూపంబున నున్నవానితో విరోధింపవో అట్లు. ప్రధానమునకుఁ బ్రధానముతోనే విరోధము కాని దుర్బల మయినదానితో విరోధము లేదని గదా న్యాయము. ఇట్లు సత్త్వరజస్తమోగుణములు గూడ నొండొంటితోఁ బ్రాధాన్యమును మాత్రమె సహింపవు. కాని సద్భావమును గూడ సహింప వని తలంపఁగూడదు. ఇందుచేఁ బరిణామతాపసంస్కారదుఃఖములందుఁ గూడ రాగద్వేషమోహంబులకు సమకాలంబున సద్భావము కల దని నిరూపింపఁబడినది, ప్రసుప్తతను విచ్ఛేదోదారంబు లని క్లేశములు నాలు గవస్థలు గల వగుటవలన. ఎట్లనఁగా.

§ ఉద్రేకించిన.

♦ గుణములవ్యాపారము చంచలము.

❡ శీఘ్రముగా—మాటిమాటికిఁ బరిణమించుస్వభావము గలది.

♦♦ ఉద్భూతము—ప్రత్యక్షయోగ్యము—బయటికి వచ్చినది. అనుద్భూతము—అట్టిది గానిది—అడఁగి యుండునది.

* లబ్ధవృత్తికములు—పొందఁబడినవ్యాపారము—బయలుపడుట గలవి.

« అవిద్యాఽస్మితా రాగద్వేషాఽభినివేశాః పఞ్చక్లేశాః, అవిద్యాక్షేత్రముత్తరేషాం ప్రసుప్తతను విచ్ఛిన్నోదారాణామ్, అనిత్యాఽశుచి దుఃఖాఽనాత్మసు నిత్యశుచి దుఃఖాఽఽత్మఖ్యాతి రవిద్యా, దృగ్దర్శనశక్త్యో రేకాత్మతైవాఽస్మితా, సుఖానుశయీ రాగః, దుఃఖానుశయీ ద్వేషః, స్వరసవాహీ విదుషోఽపి తథా రూఢోఽభినివేశః, తే ప్రతిప్రసవహేయాః సూక్ష్మాః, ధ్యానహేయా స్తద్వృత్తయః, క్లేశమూలః కర్మాశయో దృష్టాఽదృష్ట జన్మవేదనీయః, సతి మూలే తద్విపాకో జాత్యాయు ర్భోగాః » అని పాతంజలసూత్రములు. అందు, అది గాని దాని యందు అది యనుబుద్ధియు విపర్యయంబును మిథ్యాజ్ఞానంబును అవిద్యయు ననునవి పర్యాయపదములు. దానియొక్క విశేషమే సంసారమునకు మూలకారణము. అందు, అనిత్యమునందు నిత్యబుద్ధి యెట్లనఁగా. భూమి స్థిరము, చంద్రతారకాసహిత మగు నాకాశము స్థిరము, దేవతలు మరణము లేనివారు అని. అశుచి యైనదానియందు మిక్కిలిరోఁత యగుశరీరమునందు శుచిబుద్ధి యెట్లనఁగా, నూతనచంద్రరేఖవలె రమణీయ యగు నీకన్య తేనియతోను అమృతముతోను నిర్మింపఁబడినదా చంద్రుని భేదించి వెడలివచ్చినదా యనునట్లు తోఁచుచున్నది, నీలోత్పలదళంబులవంటి కన్నులుగల యిది హావగర్భము లయినచూపులచే జీవలోకము నాశ్వాసించుచున్నట్లున్నది అని. ఇందు దేనికి దేనితో సంబంధము ? « స్థానా ద్బీజా దుపష్టమ్భాన్నిష్యన్దా న్నిధనా దపి । కాయ మాధేయశౌచత్వా త్పణ్డితా హ్యశుచిం విదుః » ♦ అని వ్యాసునిచేఁ జెప్పఁబడినది. ఇందుచేతనే యపుణ్యమునందుఁ బుణ్యబుద్ధియు అనర్థమునం దర్థబుద్ధియు నిరూపింపఁబడినది. దుఃఖమునందు సుఖబుద్ధి చెప్పఁబడినది పరిణామతాపసంస్కారదుఃఖై ర్గుణవృత్తి విరోధాచ్చ దుఃఖ మేవ సర్వం వివేకినః » అని. అనాత్మయం దాత్మబుద్ధి యెట్లనఁగా, శరీరమునందు మనుష్యుఁడను నేను ఇత్యాదికము. సర్వక్లేశములకు మూలభూత మయినయీయవిద్య తమస్సని చెప్పఁబడును. బుద్ధికిని బురుషునకును అభేదాభిమానము అస్మిత, అది మోహము. సుఖసాధనము లేకున్నను నాకు సమస్తమును సుఖమే కావలయు ననువిపర్యయవిశేషము రాగము, అదియే మహామోహము. దుఃఖసాధన మున్నను నాకేమియుఁ దుఃఖము కలుగఁ గూడ దనువిపర్యయవిశేషము ద్వేషము, అది తామిస్ర మనంబడును. ఆయుస్సు

♦ స్థానమువలనను బీజమువలనను ఉపష్టంభమువలనను—సహకారమువలనను నిష్యందమువలన—కాఱుటవలనను నిధనమువలనను—మరణమువలనను శౌచము కలిగింపవలసినది యగుటవలనను దేహమును అశుచినిగాఁ బండితులు తెలియుచున్నారు.

లేకున్నను శరీరేంద్రియాదు లనిత్యము లయినను వీనితో నాకెడఁబాటు కలుగఁ గూడ దని విద్వాంసుఁడు మొదలుగా క్రీబాలురవఱకు స్వాభావికమయి సర్వప్రాణి సాధారణ మయిన మరణభయరూప విపర్యయవిశేషము అభినివేశము, అది యంధతామిస్ర మనఁబడును. అట్లు చెప్పఁబడినది పురాణమునందు "తమో మోహో మహామోహ స్తామిస్రో హ్యంధ సంజ్ఞితః । అవిద్యా పఞ్చపర్వైషా ప్రాదుర్భూతా మహాత్మనః" ♦ అని. ఈక్లేశములు నాలు గవస్థలు గలవి. అందు, లేనిదానికిఁ బుట్టుక సంభవింపదు కావున అనభివ్యక్తరూపంబున నుండుట సుప్తావస్థ. అభివ్యక్తమయినను సహకారి లేకుండుటవలనఁ గార్యము కలిగింప కుండుట తన్వవస్థ. అభివ్యక్తమయి కార్యము పుట్టించిన దైనను బలవంత మగు మఱియొకదానిచేఁ దిరస్కరింపఁబడుట విచ్ఛేదావస్థ. అభివ్యక్తమై సహకారిసంపత్తి కలిగి ప్రతిబంధము లేక స్వకార్యమును బుట్టించుట యుదారావస్థ. ఇట్టి నాలుగవస్థలు గల విపర్యయరూపములయినయస్మితాది క్లేశములకు నాలుగింటికిని సామాన్యరూప యగు నవిద్యయే క్షేత్రము—ఉత్పత్తిస్థానము, అన్నియు విపర్యయరూపము లని ప్రదర్శిత మగుటవలన. అందుచే నవిద్యానివృత్తిచేతనే క్లేశములకు నివృత్తి యగు నని యర్థము. ఆక్లేశములు ప్రసుప్తములు ప్రకృతిలీనులకుం బోలె. తనువులు ప్రతిపక్షభావనచే * తనువులుగాఁ § జేయఁబడినవి యోగులకుఁ బోలె. అవి రెండును సూక్ష్మములు, ప్రతిప్రసవముచే—మనోనిరోధముచే నిర్బీజసమాధిచేత హేయములు—విడువఁ దగినవి. ఇఁక ఆసూక్ష్మములయొక్క వృత్తులు—తత్కార్యభూతములు విచ్ఛిన్నములును ఉదారములును—విచ్ఛేదము పొంది పొంది యాయారూపంబున మరలఁ బ్రాదుర్భవించుచున్నవి కావున విచ్ఛిన్నములు, ఎట్లనఁగా రాగకాలమునందుఁ గ్రోధము ఉన్నదైనను బ్రాదుర్భవించినది కాదు కావున విచ్ఛిన్న మనఁబడుచున్నది, ఇట్లు ఒకానొకస్త్రీయందుఁ జైత్రుం డనురక్తుఁ డగుటచే నితరస్త్రీలయందు విరక్తుఁడు కాఁడు, మ తేమనఁగా, ఒక్కస్త్రీయందు రాగము లబ్ధవృత్తికము ఇతరస్త్రీలయందు భవిష్యద్వృత్తికము ¶, అది యప్పు డితరలయందు విచ్ఛిన్న మని చెప్పఁబడుచున్నది; ఏవి యెప్పుడు విషయములందు లబ్ధవృత్తు లగునో అవి యప్పుడు సాకల్యంబునఁ

---

♦ తమస్సు మోహము మహామోహము తామిస్రము అంధతామిస్రము అను నైదుపర్వములు—గనుపులు గల యవిద్య మహాత్మునివలన నుండి ప్రాదుర్భవించినది.

* విరుద్ధములయిన వాని భావనచేయుటచే.

§ సూక్ష్మములు.

¶ కలుగఁబోవు వృత్తిగలది.

ప్రాదుర్భవించినవై యుదారంబు లని చెప్పఁబడుచున్నవి. అవి రెండును అతిస్థూలము లగుటవలన శుద్ధసత్త్వభవ మగు భగవద్ధ్యానముచే హేయములు, మనోనిరోధము నపేక్షింపవు. సూక్ష్మములు మాత్రమే మనోనిరోధముచే హేయములు. ఇట్లు పరిణామతాపసంస్కారదుఃఖములందుఁ బ్రసుప్తతనువిచ్ఛేదరూపంబున సర్వక్లేశంబులు సర్వదా యున్నవి. ఉదారావస్థమాత్రము ఒకానొకప్పుడు ఒకానొకదాని కని విశేషము. ఇవి బాధనారూప మయినదుఃఖము కలిగించునవి యగుటచేఁ గ్లేశము లనఁబడుచున్నవి. ఎందువలన ననఁగా ధర్మాఽధర్మాఖ్య మగు కర్మాశయము క్లేశములవలననే కలుగుచున్నది. మూలభూత మయిన క్లేశ ముండుటచేతనే ఆకర్మాశయముయొక్క విపాకము—ఫలము జన్మమును ఆయువును భోగమును అనునది సంభవించుచున్నది. ఆకర్మాశయము ఇహలోకమునందును బరలోకమునందును స్వవిపాకమును బుట్టించునది యగుటచే దృష్టాఽదృష్టజన్మవేదనీయము ‡. ఇట్లు క్లేశపరంపర ఘటీయంత్రమువలె నెల్లప్పుడును దిరుగుచుండును. అందువలన యుక్తము చెప్పఁబడినది « యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే। ఆద్యన్తవన్తః ” అని. దుఃఖయోనులు పరిణామాదులచేతను గుణవృత్తివిరోధము వలనను, ఆద్యంతవంతములు గుణవృత్తి చంచలం బగుటవలన, అని యోగమతమునందు వ్యాఖ్యానము. ఇఁక నౌపనిషదుల ♦ మతమునందో—అనాదిభావరూపమైన యజ్ఞానము అవిద్య, అహంకారధర్మ్యధ్యాసము అస్మిత, రాగద్వేషాభినివేశములు తద్వృత్తి విశేషములు, ఇట్లు అన్నియు నవిద్యామూలకంబు లగుటవలన అవిద్యాత్మకంబు లగుటచే మిథ్యాభూతములు రజ్జుసర్పాధ్యాసమువలె, మిథ్యాభూతము లైనను దుఃఖయోనులు స్వప్నాదులవలె, దృష్టిసృష్టిమాత్రంబు లగుటచే ఆద్యంతవంతములు అని. కావున, బుధః = అధిష్ఠానసాక్షాత్కారముచే భ్రమ నివర్తిల్లినవాఁడు; తేషు; నరమతే—మృగతృష్ణికాస్వరూపము దెలిసిన యుదకార్థివలె నందుఁ బ్రవర్తింపఁడు. సంసారమునందు సుఖము లేశమాత్ర మయినను లే దని తెలిసి యందువలననుండి సర్వేంద్రియములను మరలింపవలయు నని యర్థము.

శ్రీ. ఓయీ! ప్రియము లగువిషయభోగములు గూడ నివర్తిల్లిన పిదప నెట్లు మోక్షము పురుషార్థం బగును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—సంస్ప

‡ దృష్టములు—ఇహలోకమునందలివి అదృష్టములు—పరలోకమునందలివి జన్మములు వేదనీయములు—అనుభవింపఁదగినవి దేనివలననో అట్టిది, దృష్టాఽదృష్టజన్మహేతు వనుట.

♦ వేదాంతుల.

ర్శజాః= చక్కఁగా స్పృశింపఁబడుచున్నవి కావున సంస్పర్శము లనఁగా విషయములు, వానివలనఁ గలుగునవి భోగములు—సుఖములు; యే = ఏవి గలవో; తే= అవి; వర్తమానకాలమునందుఁ గూడ స్పర్ధ అసూయ మొదలగువానిచే వ్యాప్తము లగుటవలన, దుఃఖయోనయ ఏవ= దుఃఖమునకే కారణములు. ఆదిమంతములును అంతవంతములును. అందువలన, వివేకి వానియందు రమింపఁడు.

ప. ఇఁక, ఇదియే సుఖశబ్దముచేఁ జెప్పఁదగినది, ఇతరము కాదని చెప్పుచున్నాఁడు —చక్కఁగా స్పృశింపఁబడుచున్నవి కావున సంస్పర్శములు విషయములు, వానివలనఁ బుట్టిన యేభోగములు—విషయసుఖభోగములు గలవో, అవి, దుఃఖయోనయఏవ = దుఃఖమునకు కారణములే, పరిణామవిరసంబు లగుటవలన; లేక, దుఃఖము కారణముగాఁ గలవి, అర్జునునియందుఁ గూడ దుఃఖరూప మగుట వలన. అందువలననే, ఆద్యన్తవన్తః = ఉత్పత్తివినాశములు గలవి, అందువలన దుఃఖరూపములే యగుచున్నవి. కావున, తేషు, బుధః = తెలిసినవాఁడు; నరమతే— విషము కలసిన యన్నమునువలె విడుచుచున్నాఁడు. అట్లు చెప్పఁబడినది “లోకఏష విషయానురఞ్జనం దుఃఖగర్భ మపి మన్యతే సుఖమ్ । ఆమిషం బడిశగర్భమ ప్యహో మోహతో గ్రసతి యద్వ దణ్డజః” * అని.

రా. ప్రాకృత మయినభోగమును సులువుగా విడువవచ్చు నని చెప్పుచున్నాఁడు.—సంస్పర్శజాః = విషయేంద్రియస్పర్శములవలనఁ గలిగినట్టి; యేభోగాః = ఏభోగములు గలవో; తే; దుఃఖయోనయ ఏవ = దుఃఖోదర్కములే ♦. ఆద్యన్తవన్తః—స్వల్పకాల ముండునవిగా గదా యవి కనఁబడుచున్నవి. తేషు; బుధః = వానితత్త్వము తెలిసినవాఁడు; నరమతే = ప్రీతి వహింపఁడు.

మ. సన్న్యాసముకొఱకుఁ గామభోగమును నిందించుచున్నాఁడు యే హీత్యాదిగా.

శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః ౨౩

* ఈలోకము విషయసుఖమును దుఃఖగర్భమునుగూడ సుఖముగాఁ దలంచుచున్నది. ఎట్లు మాంసమును బడిశగర్భమును—గాలములోపలఁ గలదానినిగూడ మోహమువలన మత్స్యము మ్రింగుచున్నదో అట్లు.

♦ దుఃఖరూప మయినయుత్తరకాలఫలము గలవియే.

భా. ఇదియు శ్రేయోమార్గమునకు శత్రువు కష్టతమ మయిన దోషము సర్వానర్థప్రాప్తికి హేతువు దుర్నివారము, కావునదీనిఁ బరిహరించుటయం దధికయత్నము చేయవలయు నని చెప్పుచున్నాఁడు భగవంతుఁడు.—ఇహైవ = జీవించియుండునప్పుడే; యః = ఎవ్వఁడు; ప్రాక్ = పూర్వము, శరీరవిమోక్షణాత్ = మరణముకంటె—మరణము వఱకు ననియర్థము; మరణము సనధిగాఁ జేయుటవలన, జీవించియుండువానికి అవశ్యము గలుగునది గదా కామక్రోధోద్భవ మయిన వేగము, అనంతనిమిత్తములు గలది గదా యది, కావున మరణ మగువఱకు నది నమ్మఁ దగినది కా దని యర్థము. కామక్రోధోద్భవం వేగమ్ = అనుభూతం బయిన సుఖహేతు వగునిష్టవిషయమునందు అది యింద్రియగోచరమగు నప్పుడు—కనఁబడినను వినఁబడినను స్మరింపఁబడినను, గర్ధి—తృష్ణ యేది గలదో అది కామము, క్రోధంబును—తనకుఁ బ్రతికూలములు దుఃఖహేతువు లగువిషయములందు అవి కనఁబడినప్పుడు వినఁబడినప్పుడు స్మరింపఁబడినప్పుడు ద్వేష మేది గలదో అది క్రోధము, ఆకామక్రోధములు ఉద్భవము—కారణము ఏ వేగమునకో అది కామక్రోధోద్భవ మయినవేగము, రోమాంచము ♦ సంతుష్టము లయిననేత్రవదనాదులు లింగముగాఁ * గల యంతఃకరణప్రక్షోభము కామోద్భవవేగము, దేహమునకు వణఁకు చెమట పెదవులఁ గొఱుకుట కన్ను లెఱ్ఱనగుట మొదలగునవి లింగముగాఁ గలవి క్రోధోద్భవవేగము, అట్టి కామక్రోధోద్భవ మయినవేగమును; సోఢుమ్=జయించుటకు; శక్నోతి = సమర్థుఁ డగుచున్నాఁడో; సః=అట్టి; నరః=మనుష్యుఁడు; యుక్తః= యోగియు. సః = అతఁడు; సుఖీ = సుఖము గలవాఁడును, ఈలోకమునందు.

ఎవ్వఁడు తాను జీవించి యుండునప్పుడే యనుకూలవిషయములందలి కామముచేఁ గలుగు వేగంబును బ్రతికూలవిషయములందలి ద్వేషముచేఁ గలుగువేగంబును మరణము నొందువఱకు జయించి వానికి లోఁబడక యుండునో అతఁడే యోగి, అతఁడే యీలోకమున సుఖము గలవాఁ డని తాత్పర్యము.

ఆ. మీఁదిశ్లోకమునకుఁ దాత్పర్యము చెప్పుచున్నారు ఇదియు నిత్యాదిగా. శ్రేయోమార్గమునకు శత్రు వగుట కష్టతమత్వమునకు హేతువు. మఱి

♦ గగుర్పాటు.

* చిహ్నముగా.

యొకహేతువుఁ జెప్పుచున్నారు సర్వావ స్థేత్యాదిగా. అధికయత్నము చేయ వలయు ననుటకు హేతువును సూచించుచున్నారు దుర్నివార మని. ప్రసిద్ధముగదా కామక్రోధోద్భవవేగము దుర్నివారం బనుట, దానిచేఁ దల్లినిగూడ నధిరోహించు చున్నాఁడు తండ్రినిగూడ వధించుచున్నాఁడు, కావున నది యవశ్యము పరిహరింప వలసినది యని ప్రదర్శించుచున్నాఁడు శక్నో తీత్యాదిగా. ఈవేగమును వెలుపలికి అసద్రూపంబునఁ బరిణమించుటకు ముందే దేహములోపలఁ బుట్టిన దాని నెవ్వఁడు జయింప సమర్థుఁ డగుచున్నాఁడో వాని స్తుతించుచున్నాఁడు సయుక్త ఇత్యాదిగా. మరణము నవధిగాఁ జేయుటకుఁ దాత్పర్యము చెప్పుచున్నారు మరణము నిత్యాదిగా. అందుకు హేతువుఁ జెప్పుచున్నారు అనం తేత్యాదిగా. వ్యాధిగ్రస్తునకును వృద్ధుల కును గామాదివేగము లే దని యాశంకించి చెప్పుచున్నారు మరణ మగువఱకు నిత్యాదిగా. కామక్రోధోద్భవవేగము వ్యాఖ్యానము చేయుటకై మొదటఁ గామ మును మనోవికారవిశేష మని వ్యాఖ్యానము చేయుచున్నారు అనుభూతంబు ఇత్యా దిగా. ఇది యెట్లు మనోవికారవిశేషం బగు ననఁగాఁ జెప్పుచున్నారు ఇంద్రియేత్యా దిగా. కామము గర్ధి తృష్ణ యనునీశబ్దములు పర్యాయము లగుటచే మనోవికార విశేషమునే బోధించుచున్న వని యర్థము. క్రోధంబును అట్లు మనోవికారవిశేషమే యని చెప్పుచున్నారు క్రోధంబును అని. ఆక్రోధమునే స్పష్టీకరించుచున్నారు తనకు ఇత్యాదిగా, ఇట్లు కామక్రోధముల వివరించి తదుత్కటావస్థారూప మగు వేగ మున కవి యుత్పత్తికారణ మని యుపన్యసించుచున్నారు ఆకామక్రోధములు ఇత్యా దిగా. ఆవేగమును దెలియునుపాయము నుపదేశించుచున్నారు రోమాంచము ఇత్యా దిగా. రెండువిధము లయినవేగము నెవ్వఁడు జీవించి యున్నప్పుడే జయింప సమర్థుఁ డగుచున్నాఁడో అతనిఁ బురుషధౌరేయునిఁగా స్తుతించుచున్నారు అట్టి ఇత్యాదిగా.

హ. ♦♦

శం. ఓయీ! సర్వమును బ్రహ్మమునుగానే చూచుచున్నవాఁడును బ్రహ్మ నిష్ఠచే నిర్ధూత మయినకషాయము గలవాఁడును ఆత్మారాముఁడు నగు సిద్ధునకు సుఖే చ్ఛచే విషయములందుఁ బ్రవృత్తి లేకపోవుఁ గాక. అభ్యాసికో యిష్టములందును అనిష్టములందును కామమును క్రోధమును వానిచేఁ బ్రవృత్తియును నివృత్తియును కానే యగు నని యాశంకింపఁగా. అట్లు కాదు, అభ్యాసి యగుముముక్షువుగూడ ప్రయత్నంబున వానిని బరిహరింపవలసినదియే, కామక్రోధముల జయించిననే శమా

♦♦ శంకరభాష్యముతో సమానము.

దులును శ్రవణంబును జ్ఞానంబును మోక్షంబును దత్సుఖంబును సిద్ధించును, వేఱు విధంబున సిద్ధింప దనునాశయముతోఁ జెప్పుచున్నాఁడు —భోగ్యపదార్థము స్మరింపఁబడినను వినఁబడినను గనఁబడినను బొందఁబడినను దానియందు సత్వరమయిన భోగేచ్ఛ యేది గలదో అది కామము, ఏది శిష్టునిఁగూడ భ్రష్టునిం జేయునో, వృద్ధునిఁ గూడఁ గాముకునిం జేయునో, ఉపతాపము లేనివానింగూడ సంతాపవంతునిం జేయునో అది కామము. అప్రియవస్తువు స్మరింపఁబడినను వినఁబడినను గనఁబడినను బొందఁబడినను మనస్సునకు క్షోభజనక మయినద్వేషపరిపాక మేది గలదో అది క్రోధము, ఏది తనకాశ్రయ మయినవానిని అగ్నివలె దహించుచున్నదో, గురువును గూడ హింసించుచున్నదో అది క్రోధము. అట్టికామక్రోధములవలన ఉద్భవము—ఉత్పత్తి గలది కామక్రోధోద్భవము; అట్టి, వేగమ్=కామక్రోధములయుద్రేకమును; శరీరవిమోక్షణాత్ =ఇప్పు డున్న దేహము పడుటకంటె; ప్రాక్ =పూర్వమే, యౌవన కాలమునందే యని యర్థము; యః = ఏముముక్షువు; తీవ్రమోక్షేచ్ఛచేఁ బుట్టినతితిక్షచే, సోఢుంశక్నోతి— కామక్రోధముల నిగ్రహించి శాంతుఁడు దాంతుఁడునగుచున్నాఁడో యని యర్థము. సః నరః=ఆమోక్షార్థి యగునరుఁడు; శ్రవణాదికముచే జ్ఞానము సంపాదించి, యుక్తః = యోగియు; సుఖీ = బ్రహ్మానందము గలవాఁడును, కాఁజాలు నని యర్థము. ఇచట నిదియభిప్రాయము—« దుర్లభో మానుషో దేహో బ్రాహ్మో దేహ స్సు దుర్లభః । బ్రాహ్మం దేహం సమాసాద్య యేన ముక్త్యై నయత్యతే॥ సుమేరోరగ్ర మాసాద్య స్వదేహం పాతయత్యధః।త మేవ పతితం విద్యా ద్జాతిభ్రష్టం మహర్షయః॥ » * అనున్యాయంబున మోక్షసంపాదనయోగ్యం బగు బ్రాహ్మణదేహము నొంది కామక్రోధములకుఁ బరవశుండై పతితుం డగునేని మరల నిట్టిదేహము పొంద శక్యము కాదు, కావున ముముక్షువై వివేకవైరాగ్యములచే యౌవనమునందుఁ బూర్వవయస్సునందే కామాదిశత్రువులను జయించి ప్రయత్నంబున నిప్పుడే మోక్షము సంపాదింపవలయు నని. లేక. ఇహైవ = ఈజన్మమునందే; మోక్షమును బొందు నిచ్ఛచే, శరీరవిమోక్షణాత్ = ఇట శరీరపదముచే తదాశ్రితము గార్హస్థ్యము లక్షిత మగుచున్నది, దానియొక్క విమోక్షణముకంటె—సన్న్యసించుటకంటె; ప్రాక్ = ముందే, యః = ఏముముక్షు వగుమనుష్యుఁడు; వివేక

* మనుష్యదేహము దుర్లభము, బ్రాహ్మణదేహము మఱియు దుర్లభము, బ్రాహ్మణదేహము నొంది యెవ్వఁడు ముక్తికొఱకు యత్నింపఁడో అతఁడు మేరుపర్వతశిఖరము చేరి దనదేహమును గ్రిందికిఁ ద్రోసికొన్నవాఁ డగుచున్నాఁడు. వానినే పతితునిఁగాను జాతిభ్రష్టునిఁగాను మహర్షులు గ్రహించుచున్నారు.

వైరాగ్యములచే, కామక్రోధోద్భవం వేగమ్; సోఢుమ్ = శమింపఁ జేయుటకు; శక్నోతి. సః = అతఁడే; శమదమాదిసాధనసంపన్నుఁడై శ్రవణమననములచే జ్ఞానము సంపాదించి, యుక్తః = బ్రహ్మయోగయుక్తుఁ డగుటకును; సుఖీ = బ్రహ్మానందము గలవాఁ డగుటకును, సమర్థుఁ డగుచున్నాఁడు. కాని, కామక్రోధములను జయింపక సన్న్యసించునెడ, శ్రవణాదులచే జ్ఞానంబును తత్ఫలమైన బ్రహ్మాత్మభావంబును మోక్షసుఖంబును బొందఁ జాలఁ డని యర్థము.

**ము.** సర్వానర్థప్రాప్తిహేతువును దుర్నివారంబును శ్రేయోమార్గప్రతిపక్షంబు నగు కష్టతమ మయిన యీదోషమును మహాప్రయత్నంబున ముముక్షువు నివారించుకొనవలయు నని యధికయత్నము విధించుటకై మరలఁ జెప్పుచున్నాఁడు.—తన కనుకూలములు సుఖహేతువు లగువిషయములు కనఁబడినను వినఁబడినను స్మరింపఁబడినను వానియందు గుణము ననుసంధించు నభ్యాసముచే నేది రత్యాత్మక మయిన గర్ధము అభిలాషము తృష్ణ లోభము గలదో అది కామము. స్త్రీపురుషుల పరస్పరవిషయ మైన యభిలాషయం దత్యంతనిరూఢము కామశబ్దము, ఈయభిప్రాయముచే "కామః క్రోధ స్తథా లోభః" అనుచోట ధనతృష్ణ లోభ మనియు స్త్రీవిషయతృష్ణ కామ మనియు కామలోభములు వేఱుగాఁ జెప్పఁబడినవి. ఇచటనో తృష్ణాసామాన్యాభిప్రాయంబునఁ గామశబ్దము ప్రయోగింపఁబడినది; కావున లోభము వేఱుగాఁ జెప్పలేదు. ఇట్లు తనకుఁ బ్రతికూలములు దుఃఖహేతువు లగు విషయములు కనఁబడినను వినఁబడినను స్మరింపఁబడినను వానియందలిదోషము ననుసంధించునభ్యాసముచే నేది ప్రజ్వలనాత్మక మగుద్వేషము మన్యువు గలదో అది క్రోధము. ఆ కామక్రోధములయుత్కటావస్థ లోకవేదవిరోధము ననుసంధించుటకుఁ బ్రతిబంధక మయి లోకవేదవిరుద్ధ విషయములందుఁ బ్రవర్తించుట కున్ముఖత్వరూప మయినది నదీవేగసామ్యముచే వేగ మని చెప్పఁబడుచున్నది. ఎట్లు నదీవేగము వర్షర్తువునం దతిప్రబలమై లోకవేదవిరోధము ననుసంధించుటచే ఇచ్ఛింపనివానినిగూడ సుడిలోఁ బడఁద్రోసి ముంచి క్రిందికిఁ గొనిపోవుచున్నదో, అట్లు కామక్రోధములవేగముగూడ వర్షాకాలస్థానీయ మైనవిషయాభిధ్యానాభ్యాసముచేత నతిప్రబలమై లోకవేదవిరోధానుసంధానముచే ఇచ్ఛింపనివానిఁగూడ విషయం బనుసుడియందుఁ బడఁద్రోసి సంసారసముద్రమునందు ముంచి క్రిందికి మహానరకమునకుఁ గొనిపోవుచున్నది యని వేగపదప్రయోగముచే సూచింపఁబడినది. ఇది "అథ కేన ప్రయుక్తో ఽయమ్" అనుచోట వివరింపఁబడినది.

అట్టి యీ కామక్రోధోద్భవ మయిన వేగమును అంతఃకరణప్రక్షోభరూపమును స్తంభము స్వేదము మొదలగు ననేకబాహ్యవికారములు లింగముగాఁ గలదానిని; ప్రాక్ శరీర విమోక్షణాత్ = శరీరవిమోక్షణమువఱకు; అనేకనిమిత్తములవలన సర్వదా సంభావిత మగుటచే నప్పుడగనిదానిని లోపలఁ బుట్టినంతనె, ఇహైవ— బహిరింద్రియవ్యాపారరూప మయినగర్తపతనమునకు ♦ మున్నే; యః = ఏధీరుఁ డైనయతి; నదీవేగమును తిమింగిలమువలె విషయదోషదర్శనాభ్యాసజన్య మగునశీకార మనుపేరుగల వైరాగ్యముచేత, సోఢుమ్ = దాని కనురూప మయినకార్యమును సంపాదింపక నిరర్థకముగా చేయుటకు; శక్నోతి=సమర్థుఁ డగుచున్నాఁడో; సః=అతఁడే; యుక్తః = యోగి; సః = అతఁడే; సుఖీ = సుఖము గలవాఁడు; అతఁడే, నరః= పురుషుఁడు, పురుషార్థము సంపాదించుటవలన. తదితరుఁడో ఆహారనిద్రాభయమైథునాది పశుధర్మమాత్రరతుఁ డగుటచే మనుష్యాకారము గలపశువే యని భావము. ప్రాక్ శరీరవిమోక్షణాత్ అనుటకు మఱియొకవ్యాఖ్యానము.—ఎట్లు మరణానంతరము విలపించుచున్నస్త్రీలచేఁ గౌఁగిలింపఁబడినను బుత్త్రాదులచే దహింపఁబడినను బ్రాణశూన్యుఁ డగుటవలనఁ గామక్రోధవేగమును సహించుచున్నాఁడో అట్లు, మరణము కంటె, ప్రాక్ = ముందుగూడ, జీవించియుండియే యెవ్వఁడు. సహించుచున్నాఁడో అతఁడు యుక్తుఁడు ఇత్యాదిగా. ఇందు, మరణమునందువలె జీవించి యున్నపుడును కామక్రోధములయనుత్పత్తి * మాత్రమె చెప్పుపక్షమున ఈవ్యాఖ్యానము యుక్త మగును, « ప్రాణే గతే యథా దేహః సుఖం దుఃఖం న విన్దతి । తథాచే త్ప్రాణయుక్తోఽపి స కైవల్యాశ్రమే వసేత్ » ❡ అని వసిష్ఠుఁడు చెప్పినట్లు. ఇచటనో ఉత్పన్నములయిన కామక్రోధములను సహించుట ప్రస్తుతముగా నుండుటచే నవి పుట్టకయే యుండుట విషయము గాదు.

శ్రీ. ఎందువలన మోక్షమే పరమపురుషార్థమో, దానికిఁ గామక్రోధవేగము అతిప్రబల మయిన ప్రతిపక్షమో, అందువలన దాని సహించుటయందు సమర్థుఁ డగువాఁడే మోక్షము నొందువాఁ డని చెప్పుచున్నాఁడు.—కామమువలనను క్రోధమువలనను ఏవేగ ముద్భవించుచున్నదో మనోనేత్రాది క్షోభలక్షణము,

♦ గుడిలోఁ బడుటకు.

* పుట్టకుండుట.

❡ ప్రాణము పోయినపుడు దేహము ఎట్లు సుఖమును దుఃఖమును బొందదో అట్లు ప్రాణముతోఁ గూడినదైనను అగుచో అతఁడు కైవల్యాశ్రమమునందు వసింపవలయును.

దానిని; ఇహైవ = అది యుద్భవించుసమయమునందే; యః నరః = ఏపురుషుఁడుః; సోఢుమ్ = నిరోధించుటకు; శక్నోతి; అదియును క్షణమాత్రము కాదు, మ రేమ నఁగా, శరీరవిమోక్షణాత్ ప్రాక్—దేహపాతము వఱ కని యర్థము. ఎవ్వఁ డిట్టి వాఁడో, సః = అతఁడే; యుక్తః= సమాహితుఁడును; సుఖీ = సుఖము గలవాఁడును అగుచున్నాఁడు. ఇతరుఁడు కాఁడు. లేక. మరణమునకుఁ బిమ్మట రోదనము సేయుచున్న స్త్రీలచేఁ గౌఁగిలింపఁబడుచున్నను బుత్త్రాదులచే దహింపఁబడుచున్నను ఎట్లు ప్రాణశూన్యుఁ డగుటచేఁ గామక్రోధవేగమును సహించుచున్నాఁడో, అట్లు మరణమునకు ముందుగూడ జీవించియుండియే యెవ్వఁడు సహించుచున్నాఁడో వాఁడే యుక్తుఁడును సుఖియు నని యర్థము. అట్లు చెప్పఁబడినది వసిష్ఠునిచేత « ప్రాణే గతే యథా దేహః సుఖం దుఃఖంచ విన్దతి। తథా చే త్ప్రాణయుక్తో ఽపి స కైవ ల్యాశ్రమే వసేత్ » అని.

ప. ఇఁక సుఖప్రాప్తికి అభివ్యంజకమయినసామగ్రిఁ జెప్పుచున్నాఁడు.— యః = ఏపురుషుఁడు; ఇహైవ = ఈవర్తమానదేహమునందే; కామక్రోధోద్భవం వేగం సోఢుం శక్నోతి—కామక్రోధములవలనఁ బుట్టునట్టిమనోవేగమును సహింపఁ జాలునో యని యర్థము. అదియు నిరంతరముగా నని చెప్పుచున్నాఁడు.—శరీర విమోక్షణాత్ ప్రాక్—దేహపాత మగువఱకు నని యర్థము. ఎవ్వఁ డిట్టివాఁ డగునో, సః= అతఁడే; యుక్తః; అతఁడే, నరః సుఖీ—పురుషార్థము గలవాఁడును సుఖియు నగు చున్నాఁడు.

రా. శరీరవిమోక్షణాత్ ప్రాక్ = దేహపాతమునకు మున్ను; ఇహైవ = సాధనానుష్ఠానావస్థయందే; ఆత్మానుభవప్రీతిచేత, కామక్రోధోద్భవం వేగమ్; సోఢుమ్ = నిరోధించుటకు; యః శక్నోతి = ఎవ్వఁడు సమర్థుఁ డగుచున్నాఁడో. సః = అతఁడు; యుక్తః = ఆత్మానుభవమునకుఁ దగినవాఁడు. సః = అతఁడే; సుఖీ = శరీరమోక్ష మయిన పిమ్మట ఆత్మానుభవసుఖమునందే యుండువాఁడు కాఁ గలఁడు.

మా. తత్పరిత్యాగమును బ్రశంసించుచున్నాఁడు.— కామక్రోధోద్భవం వేగం సోఢుం శక్నోతి; శరీరవిమోక్షణాత్ప్రాక్—ఎట్లు మనుష్యశరీరమునందు సహించుట సులభం బగునో అట్లితరశరీరంబులందుఁ గా దని భావము. బ్రహ్మలో కాదికమో కామజయము గలవారికే కలుగును.

యో ఽ న్తస్సుఖో ఽ న్తరారామ స్తథా ఽ న్తర్జ్యోతి రేవ యః
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతో ఽధిగచ్ఛతి. ౨౪

భా. ఎట్టివాఁడై బ్రహ్మమునం దున్నవాఁడు బ్రహ్మము నొందుచున్నాఁడు ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు భగవంతుఁడు.—యః = ఎవ్వఁడు; అన్తస్సుఖః = లోపలనే—ఆత్మయందే సుఖము గలవాఁడును; అన్తరారామః = లోపలనే—ఆత్మయందే క్రీడ గలవాఁడును అగునో; తథా = అట్లు; యః = ఎవ్వఁడు; అన్తర్జ్యోతి రేవ = ఆత్మయే ప్రకాశముగాఁ గలవాఁడే యగునో; ఎవ్వఁ డిట్టివాఁడో, సః యోగీ = ఆయోగి; బ్రహ్మనిర్వాణమ్ = బ్రహ్మమునందు నిర్వృతిని—మోక్షమును; ఇట జీవించి యున్నపుడే, బ్రహ్మభూతస్సన్ = బ్రహ్మమే యయినవాఁడై; అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

ఎవ్వఁడు ఆత్మయందే యానందించుచు ఆత్మయందే క్రీడించుచు ఆత్మప్రకాశమునే యనుభవించు చుండునో అట్టియోగి బ్రహ్మభూతుఁడై బ్రహ్మమునందే నిర్వృతిరూప మయినమోక్షమును జీవించి యున్నప్పుడే పొందు నని తాత్పర్యము.

ఆ. జ్ఞానమున కత్యంతాంతరంగ మయిన యాత్మమాత్రనిరతతను జూపుచుఁ బ్రకృతుఁడైనబ్రహ్మవిదునే విశేషించుచున్నారు ఎట్టివాఁడై ఇత్యాదిగా. ఎట్లు లోపలనే సుఖము బాహ్యవిషయములచేతఁ గాదో అట్లు లోపలనే జ్యోతిస్సు శ్రోత్రాదులచేతఁ గాదు, కావున విషయాంతరవిజ్ఞానరహితుఁ డని చెప్పుచున్నాఁడు ద్వితీయపాదముచేత. ఇట్టి విశేషణములతోఁ గూడినసమాధి గలవాఁడు జీవించి యుండియె ముక్తిని బొందుచున్నాఁ డని చెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత. ఆత్మయందే సుఖము గలవాఁ డనుటచే బాహ్యవిషయాపేక్ష లేకుండుట వివక్షితము. ఆత్మయందే క్రీడ గలవాఁ డనుటచే స్త్రీ మొదలగువిషయముల యపేక్ష లేకయె క్రీడచేఁ గలుగుఫలము నొందుట వివక్షితము. ఆత్మయే ప్రకాశముగాఁ గలవాఁ డనుటచే నింద్రియాదిజన్యప్రకాశము లేనివాఁ డనుట వివక్షితము. ఇట్టి విశేషణములతోఁ గూడి సమాహితుఁడై యుండువాఁడు జీవించియుండినప్పుడే బ్రహ్మభావమును బొందుచున్నాఁడు—బ్రహ్మమునందుఁ బరిపూర్ణ మయిన సర్వానర్థనివృత్త్యుపలక్షిత మగునిర్వృతిని నిరతిశయానందావిర్భావలక్షణ మయిన స్థితిని బొందుచున్నాఁ డని చెప్పుచున్నారు ఎవ్వఁ డిట్టివాఁడో ఇత్యాదిగా.

హ. ♦♦

♦♦ శంకరభాష్యముతో సమానము.

తా. నిత్యానిత్యవివేక వైరాగ్య తీవ్రమోక్షేచ్ఛలచే సర్వంబును సన్న్యసించి శమాద్యంతరంగసాధనముల సంపాదించి శ్రవణమననములు చేసి వానిచే నాత్మవిజ్ఞానము నొందినట్టి యతి యెవ్వఁడు గలఁడో, అతఁడు విదేహకైవల్యార్థియే యగుచు బ్రహ్మనిష్ఠచే నుండినచే ముక్తిం జెందుచున్నాఁడు, వేఱువిధమునఁ జెందఁజాలఁ డని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—యోగీ = శ్రవణమననములచేఁ బొందినయాత్మజ్ఞానముయొక్క పరిపాకముకొఱకు సమాధినిష్ఠయందుఁ బ్రవర్తించినట్టి; యః = ఏబ్రహ్మవిదుఁ డగుయతి గలఁడో. సః = అతఁడు; సదా, అన్తర్జ్యోతి రేవ = అంతర్జ్యోతియే కావలయును, ఏవకారము అన్నిటితోను సంబంధించుచున్నది, "సర్వస్మా దన్తరతరం య దయమాత్మా" ♦ అనుశ్రుతివలన, అంతశ్శబ్దముచే నిట సర్వాంతరుం డగుటవలన ఆత్మ చెప్పఁబడుచున్నాఁడు, "మనో జ్యోతిః" అనుశ్రుతివలన జ్యోతిశ్శబ్దముచే మనస్సు చెప్పఁబడుచున్నది, ఆత్మయందే మనస్సు గలవాఁడే కావలయును, ఎప్పుడును బాహ్యజ్యోతి కాఁగూడదు, సదా సర్వత్ర ఆత్మనే చూడవలయును ఎప్పుడును బాహ్యమును జూడఁగూడ దని యర్థము. అన్తరారామః = అంతః—ఆత్మయందే ఆరమణము—అహంబుద్ధికిఁ గ్రీడ గలవాఁడు కావలయును, ఎప్పుడును అనాత్మరాముఁడు కాఁగూడదు, ఎల్లప్పుడును ఆత్మయందే యహంబుద్ధి గలవాఁడు కావలయును ఎప్పుడును అనాత్మయం దహంబుద్ధి గలవాఁడు కాఁ గూడ దని యర్థము. అన్తస్సుఖః = ఎల్లప్పుడును ఆత్మయందే సాధనాపేక్ష లేని యాత్మీయసుఖము గలవాఁడు, సదా ఆత్మచేతనే సంతోషము నొందవలయు నని యర్థము. సః యోగీ, తానే నిరంతరబ్రహ్మనిష్ఠచే, బ్రహ్మభూతః= నిశ్శేషముగా దేహాత్మభావమును విడిచి బ్రహ్మమునందే యాత్మభావమును బొందినవాఁడై; బ్రహ్మనిర్వాణమ్ = విదేహకైవల్యసుఖమును; అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు. ఈచెప్పినలక్షణము గలవాఁడే విదేహముక్తిని బొందు నని యర్థము.

మ. కామక్రోధవేగమును సహించుటచేతమాత్రమె ముక్తుఁ డగు నను నది లేదు. మ తేమనఁగా.—అన్తః—బాహ్యవిషయాపేక్ష లేకయే స్వరూపభూత మయిన సుఖ మెవ్వనికిఁ గలదో అతఁ డంతస్సుఖుఁడు—బాహ్యవిషయములచేఁ గలుగుసుఖము లేనివాఁ డని యర్థము. ఎట్లు బాహ్యసుఖము లేక పోవును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—అన్తః—ఆత్మయందే కాని బాహ్యసుఖసాధన మయినస్త్ర్యాదివిషయమునందుఁ గాదు, ఆరామము—ఆరమణము క్రీడ యెవ్వనికో అతఁ డంతరారాముఁడు—

♦ ఈయాత్మ యనునది యేది గలదో అది యన్నిటికన్నను మిక్కిలి అంతరము.

సర్వపరిగ్రహములను విడిచినవాఁ డగుటచే బాహ్యసుఖసాధనములు లేనివాఁ డని యర్థము. ఓయీ! సర్వపరిగ్రహములను విడిచిన యతికిఁ గూడ యదృచ్ఛాప్రాప్తము లగుకోకిలాదిమధురశ్రవణంబును మందమారుతస్పర్శంబును చంద్రోదయమయూరనృత్యాదిదర్శనంబును అతిమధురశీతలగంగోదకాదిపానంబును కేతకకుసుమసౌరభాద్యాఘ్రాణంబును మొదలగుగ్రామ్యములచే సుఖోత్పత్తి సంభవించుటవలన, ఎట్లు బాహ్యసుఖములును తత్సాధనంబులును లేనివాఁ డనవచ్చును? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—తథా అన్తర్జ్యోతి రేవ యః—ఎట్లు అంతరమునందే సుఖమో బాహ్యవిషయములచే లేదో, అట్లు, అన్తః—ఆత్మయందే జ్యోతిః—విజ్ఞానము, బాహ్యము లగునింద్రియములచేఁ గాదు, ఎవ్వనికో అతఁ డంతర్జ్యోతి, శ్రోత్రాదిజన్యమయిన శబ్దాదివిషయవిజ్ఞానము లేనివాఁడు; ఏవకారము మూఁడువిశేషణములందును అన్వయించుచున్నది; సమాధికాలమునందు శబ్దాదిప్రతిభాసము లేమివలనను ఉత్థానకాలమునందుఁ దత్ప్రతిభాసము కలిగినను మిథ్యాత్వనిశ్చయంబువలనను బాహ్యవిషయములచే నతనికి సుఖోత్పత్తి సంభవింప దని యర్థము. యః = ఇట్టివిశేషణములతోఁ గూడినవాఁ డెవ్వఁడో; సః = అట్టి, యోగీ= సమాహితుఁడు; బ్రహ్మనిర్వాణమ్= బ్రహ్మము పరమానందరూపము, కల్పితద్వైతోపశమరూపం బగుటచే నదియే నిర్వాణము, కల్పిత మయినభావము అధిష్ఠానాత్మక మగుటవలన, దానిని, అవిద్యాఽఽవరణనివృత్తిచే, అధిగచ్ఛతి = నిత్యప్రాప్తమునే పొందుచున్నాఁడు. ఎందువలన ననఁగా, ఎల్లప్పుడునే బ్రహ్మభూతుఁడు, ఇతరుఁడు గాఁడు, "బ్రహ్మైవసన్ బ్రహ్మాఽప్యేతి" ♦ అనుశ్రుతివలనను, "అవస్థితే రితి కాశకృత్స్నః" అనున్యాయమువలనను *.

శ్రీ. కామక్రోధవేగమును సంహరించు మాత్రముననే మోక్షముఁ బొందఁడు, మ రేమనఁగా.—అన్తః—ఆత్మయందు సుఖ మెవ్వనికో విషయములందు లేదో అతఁ డంతస్సుఖుఁడు. ఆత్మయందే క్రీడ యెవనికో వెలుపల లేదో వాఁ డంతరారాముఁడు. ఆత్మయందే జ్యోతిస్సు—దృష్టి యెవ్వనికో గీతనృత్యాదులందు లేదో అతఁ డంతర్జ్యోతి. అట్టివాఁడు, ఇట్లు, బ్రహ్మభూతః = బ్రహ్మమునం దున్నవాఁడై; బ్రహ్మనిర్వాణమ్ = బ్రహ్మమునందు లయమును; అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

♦ బ్రహ్మమే యయినవాఁడు కావున బ్రహ్మమును బొందుచున్నాఁడు.

* బ్రహ్మసూ. అ ౧. పా ౪. సూ ౨౨.—అవస్థితేః—బ్రహ్మమే జీవరూపమున నుండుటవలన అభేదముగా నుపక్రమించుట యుక్త మని కాశకృత్స్నాచార్యులు చెప్పెదరు.

ప. ¶

రా. యః=ఎవఁడు; బాహ్యవిషయానుభవమును సమస్తమును విడిచి, అన్తస్సుఖః = ఆత్మానుభవమే సుఖముగాఁ గలవాఁడును. అన్తరారామః = ఆత్మయే యుద్యానవనముగాఁ గలవాఁడును, స్వగుణములచే ఆత్మయే తనకు సుఖవర్ధకముగాఁ గలవాఁడును; తథా=అట్లు; అన్తర్జ్యోతిః = ఆత్మైకజ్ఞానుఁడును *; యః=ఎవ్వఁడెట్టివాఁడుగా నున్నాఁడో; సః=అట్టి; బ్రహ్మభూతః యోగీ; బ్రహ్మనిర్వాణమ్=ఆత్మానుభవసుఖమును; అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

ఎవ్వఁడు బాహ్యవిషయానుభవమును విడిచి యాత్మానుభవమునే చేయుచు ఆత్మవలననే సుఖాభివృద్ధి నొందుచు ఆత్మనే యనుసంధించుచుండునో అట్టియోగి అసంకుచితజ్ఞానాదిలక్షణం బగునాత్మస్వరూపంబున నుండునట్టివాఁడు, ఆత్మానుభవసుఖమును బొందుచున్నాఁ డని తాత్పర్యము.

మా. జ్ఞానిలక్షణమును బ్రపంచించుచున్నాఁ డుత్తరశ్లోకములచేత.—ఆరామ మనఁగాఁ బరదర్శనాదులచేఁ గలుగుసుఖము, ఇచటనో పరమాత్మదర్శనాదికముచేఁ గలుగుసుఖము ఆరామ మనఁబడుచున్నది. సుఖ మనఁగా నుపద్రవము క్షయించినపుడు అభివ్యక్త మగునది, ఇచటనో కామాదిక్షయమునందు వ్యక్తమయినయాత్మసుఖము. స్వయంజ్యోతి యగుటవలన భగవంతుఁడు జ్యోతిశ్శబ్దముచేఁ జెప్పఁబడుచున్నాఁడు, హృదయమునందు భగవంతుఁ డభివ్యక్తుఁ డగుటవలన అన్తర్జ్యోతిః ♦♦. అందఱు నంతర్జ్యోతు లయినను అభివ్యక్తివలన విశేషము. అసంప్రజ్ఞాతసమాధినిష్ఠులకు బాహ్యము కనఁబడమివలన, కనఁబడినను అకించిత్కరం బగుటవలన ఏవశబ్దము. అట్లు చెప్పఁబడినది « దర్శన స్పర్శ సంభాషా ద్య త్సుఖం జాయతే నృణామ్ । ఆరామ స్తతువిజ్ఞేయ స్సుఖం కామక్షయోదితమ్ » § అని నారదీయమునందు. « స్వజ్యోతిష్ట్వా న్మహావిష్ణో ర న్తర్జ్యోతి స్తు తత్స్థితః » ♦ అనియును.

---

¶ శ్రీధరీయముతో సమానము.

* ఆత్మవిషయమునసే జ్ఞానము గలవాఁడును.

♦♦ హృదయమునందు భగవంతుండు గలవాఁడు.

§ దర్శనస్పర్శసంభాషణములచే నేసుఖము మనుష్యులకుఁ బుట్టుచున్నదో అది యారామము, కామక్షయముచేఁ గలుగునది సుఖము.

♦ మహావిష్ణువు స్వయంజ్యోతి యగుటవలన అమ్మహావిష్ణువునం దున్నవాఁడు అంతర్జ్యోతి యనఁబడును.

అంత స్సుఖత్వాదికమునకుఁ గారణము చెప్పుచున్నాఁడు—బ్రహ్మభూతః=బ్రహ్మమునం దున్న వాఁడు.

లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితే రతాః. —౨౫

భా. మఱియును. లభన్తే=పొందుచున్నారు; బ్రహ్మనిర్వాణమ్ = మోక్షమును; ఋషయః=సమ్యగ్దర్శనము గలవారు, సన్న్యాసులు; క్షీణకల్మషాః=నశించిన పాపాదిదోషములుగలవారలు; ఛిన్నద్వైధాః= పోఁగొట్టఁబడినసంశయముగలవారలు; యతాత్మానః=నిగ్రహింపఁబడినయింద్రియములు గలవారలు; సర్వభూతహితే రతాః—సర్వభూతహితే=సమస్తభూతములకును అనుకూలభావమునందు; రతాః=ఆసక్తులు; హింస చేయనివారని యర్థము.

యజ్ఞాదినిత్యకర్మానుష్ఠానమువలనఁ బాపక్షయము నొంది శ్రవణాదులచే సంశయనివృత్తి గలవారై జితేంద్రియులై భూతహింస విడిచి సమ్యక్ జ్ఞానము నొందినట్టిసన్న్యాసులు మోక్షము నొందుచున్నా రని తాత్పర్యము.

ఆ. ముక్తిహేతు వగుజ్ఞానమునకు సాధనాంతరముఁ జెప్పుచున్నారు మఱియును అని. యజ్ఞాదినిత్యకర్మానుష్ఠానమువలనఁ బాపాదిరూప మయినకల్మషము క్షయించుచున్నది, అంత శ్రవణాదులు పలుమాఱు చేయుటవలన సమ్యగ్దర్శనము కలుగుచున్నది, అందువలన ముక్తి యప్రయత్నంబున సిద్ధించుచున్న దని చెప్పుచున్నాఁడు లభన్తే ఇత్యాదిగా. జ్ఞానప్రాప్తికి నుపాయాంతరము చూపుచున్నాఁడు ఛిన్నేత్యాదిగా. శ్రవణాదులచే సంశయములఁ బోఁగొట్టుకొనుటయుఁ గార్యకరణముల * నియమించుటయు దయాలువై హింసింపకుండుటయు—అనునిది గూడ సమ్యక్ జ్ఞానప్రాప్తికిఁ గారణ మని యర్థము. ప్రతిపదవ్యాఖ్యానము స్పష్ట మగుట వలన వివరింపఁబడదయ్యె.

హ. ♦

శం. క్షీణకల్మషత్వము ఛిన్నద్వైధత్వము యతాత్మత్వము మొదలగు ధర్మములతోఁ గూడినవారై సదా యాత్మయందే యెవరు రమించుచున్నారో

* దేహేంద్రియముల.

♦ శంకరభాష్యముతో సమానము.

అట్టి వారలే విదేహముక్తిని బొందుదు రని చెప్పుచున్నాఁడు.—యతాత్మానః = యతము—చక్కఁగా నిగ్రహింపఁబడినది బాహ్యసక్తినుండి మరలింపఁబడినది, ఆత్మ—మనస్సు ఎవ్వరికో వారలు యతాత్ములు, అన్నిటినుండియు నిరుద్ధ మయినయంతరంగము గలవారై; సర్వభూతహితే = త దేత త్ప్రేయః పుత్రాత్ ప్రేయో విత్తా త్ప్రేయో ఽన్యస్మా త్సర్వస్మా దన్తరతరం యదయమాత్మా ♦ అను శ్రుతివలనను ఆనందరూపుఁ డగుటవలనను, బ్రహ్మాది స్తంబపర్యంతము లగు సర్వభూతములకును ఆత్మయె హితుఁడు—ప్రియుఁడు, అట్టి సర్వభూతంబులకును ఆత్మ యగు స్వాత్మయందు బ్రహ్మమునందే; రతాః = నిరతులు; ఋషయః = ఏయతు లగుచున్నారో, ఎవ్వరు సదా ఆత్మయందే రమించుచున్నారో వారు; సదా ఆత్మనిష్ఠచే, క్షీణకల్మషాః=నిశ్శేషముగా క్షయించినవాసనాఖ్య మగుమనఃకషాయరూప మయినకల్మషము గలవారలై, బ్రహ్మయోగనిష్ఠు లగుటచే నంతఃకరణదోషము నశించినవారలై; అందువలననే పుట్టినయాత్మతత్త్వజ్ఞానముచే, ఛిన్నద్వైధాః—అర్థద్వైధాత్వము * నవలంబించి కలుగుచున్నవి కావున ద్వైధము లనఁగా సంశయములు, స్థాణుత్వపురుషత్వబుద్ధు లొకటిగా సమావేశము నొందినంగదా సంశయము పుట్టుచున్నది, స్థాణువో పురుషుఁడో యని, ఇట్లే యిందుఁగూడ అర్థజ్ఞానద్వివిధత్వము నవలంబించి సంశయములు పుట్టుచున్నవి, అది యెట్లనఁగాఁ జెప్పెదము.—ఆత్మ చిద్రూపుఁడో అచిద్రూపుఁడో, చిద్రూపుఁడైనను నిత్యుఁడో అనిత్యుఁడో, నిత్యుఁడైనను దేహేంద్రియాదులకంటె భిన్నుఁడో అభిన్నుఁడో, భిన్నుఁడైనను దేహాదులతో సంస్పృష్టుఁడో అసంస్పృష్టుఁడో, అసంస్పృష్టుఁడైనను కర్తృత్వాదిధర్మవిశిష్టుఁడో కాఁడో, కర్తృత్వాదిధర్మములు లేనివాఁడైనను అసంగుఁడో కాఁడో, అసంగుఁడైనను దేహేంద్రియాదికర్మలేపము గలవాఁడో కాఁడో, కర్మలేపము లేనివాఁడైనను బ్రహ్మముకంటె అభిన్నుఁడో కాఁడో, బ్రహ్మముకంటె నభిన్నుఁడైనను బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము నాకుఁ గలిగినదో లేదో, కలిగినను ఆజ్ఞానము యథార్థమో అయథార్థమో, యథార్థమైనను ముక్తికి సాధకమో కాదో, ముక్తిసాధకమైనను నాకు జీవన్ముక్తి కలదో లేదో, జీవన్ముక్తి యున్నను విదేహముక్తి సిద్ధించునో సిద్ధింపదో—ఇవి మొదలగునవి సంశయములు; పూర్వోక్తజ్ఞానముచే, ఛిన్నములు—నశించినవి యగుసంశయములు

---

♦ అట్టి యిది పుత్త్రునికంటెఁ బ్రియము, విత్తముకంటెఁ బ్రియము, ఇతరముకంటెఁ బ్రియము, అన్నిటికంటె అంతరము, ఏదో అది యీయాత్మ.

* రెండువిధము లగుటను.

గలవారు ఛిన్నద్వైధులు. అట్టివారలై; బ్రహ్మనిర్వాణమ్=విదేహముక్తిని; లభన్తే=పొందుచున్నారు.

మ. ముక్తిహేతువగుజ్ఞానమునకు సాధనాంతరములను వివరించుటకై చెప్పుచున్నాఁడు.—మొదట యజ్ఞాదులచే, క్షీణకల్మషాః; అంత నంతఃకరణశుద్ధిచే, ఋషయః=సూక్ష్మవస్తువును వివేచింప సమర్థులు, సన్న్యాసులు; అంత శ్రవణాదిపరిపాకముచే, ఛిన్నద్వైధాః=సర్వసంశయములును నివర్తిల్లినవారు; అంత నిదిధ్యాసన పరిపాకముచే, యతాత్మానః = పరమాత్మయందే యేకాగ్రచిత్తులు; ఇట్టివారలును, ద్వైతము చూడనివారగుటచే, సర్వభూతహితే రతాః—హింస లేనివారు, అట్టి బ్రహ్మవిదులు; బ్రహ్మనిర్వాణం లభన్తే, «యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాఽభూ ద్విజానతః। తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః" * అను శ్రుతివలన. బహువచనము «తద్యో యో దేవానామ్" ఇత్యాదిశ్రుతిచేఁ జెప్పఁబడిన యనియమమును ** ప్రదర్శించుటకొఱకు. †

శ్రీ. ఋషయః=సమ్యగ్దర్శులు; క్షీణ మయినకల్మషము గలవారు; ఛిన్నమైనద్వైధము—సంశయము గలవారు; ఎందువలన ననఁగా, యతాత్మానః = నిగ్రహింపఁబడినచిత్తము గలవారు; సర్వభూతములకును హితమునందు రతులు—దయాళువులు; అట్టివారు, బ్రహ్మనిర్వాణమ్=మోక్షమును; లభన్తే=పొందుచున్నారు.

మ. ఇం దధికారులఁ జెప్పుచున్నాఁడు.—ఋషయః=సమ్యక్ జ్ఞానము గలవారు; క్షీణకల్మషాః=శుద్ధచిత్తులు; ఛిన్నద్వైధాః=నఱుకఁబడిన ద్వైధము—సంశయము గలవారు; యతాత్మానః = సంయత మయినమనస్సు గలవారు; సర్వభూతహితే= నానావిధరూపము లయినసర్వభూతములకును దారతమ్యము విడిచి హితమునందు, రతాః; ఇట్టివారలు, బ్రహ్మనిర్వాణం లభన్తే.

రా. ఛిన్నద్వైధాః=శీతోష్ణాదిద్వంద్వములచే విడువఁబడినవారు; యతాత్మానః = ఆత్మయందె నియమింపఁబడినమనస్సు గలవారు; సర్వభూతహితే రతాః=

* దేనియందు జ్ఞానికి సర్వభూతములును ఆత్మయే—తానే యయ్యెనో, అందు—ఆయవస్థయందు ఏకత్వముఁ జూచువానికి మోహ మేది ? శోక మేది ?

** ఎవ్వఁ డెఱుంగునో వానికి ముక్తి యగును గాని, ఇట్టివానికే యగు ననునియమము లే దనుటను.

† జ్ఞానము నొందినవారలందఱు ముక్తిని బొందుదురు. అందు జాత్యాదినియమము లే దని తెల్పుటకొఱకు.

తనకువలె సర్వభూతములకును హితమునంటే నిరతులు; ఋషయః = ద్రష్టలు ●● ఆత్మావలోకనపరులు; ఇట్టివార లెవ్వరో వారు, క్షీణకల్మషాః=నశించినయాత్మప్రాప్తి విరోధు లగుకల్మషములు సమస్తములును గలవారలై; బ్రహ్మనిర్వాణం లభన్తే.

మా. పాపక్షయంబువలన నిది సిద్ధించుచున్న దని చెప్పుచున్నాఁడు.— క్షీణకల్మషు లయి, ఛిన్నద్వైధాయతాత్ములు, ద్వైధ మనఁగా ద్వైధాభావము, సంశయము గాని విపర్యయము గాని; అట్లు చెప్పఁబడినది. « విపర్యయ స్సంశయో వా య ద్దైధం త్వకృతాత్మనామ్ । జ్ఞానాసినా తు త చ్ఛిత్త్వా ముక్తసఙ్గః పరివ్రజేత్ » ● అని. ఛిన్నద్వైధులును ఆయతాత్ములును ఛిన్నద్వైధాయతాత్ములు, ఆయతాత్ములు = దీర్ఘ మయిన మనస్సు గలవారు, సర్వజ్ఞు లని యర్థము. అందు వలననే ఛిన్నద్వైధులు. అట్లు చెప్పఁబడినది « క్షీణపాపా మహాజ్ఞానా జాయన్తే గతసంశయాః » * అని. ఛిన్నద్వైధులు, యతాత్ములు అని భిన్నపదము లైనను గావచ్చును.

కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్. ౨౬

భా. మఱియును.— కామక్రోధవియుక్తానామ్ = కామముచేతను క్రోధముచేతను విడువఁబడినవారును; యత చేతసామ్=నిగ్రహింపఁబడిన యంతఃకరణము గలవారలును; యతీనామ్ = సన్న్యాసులును; విదితాత్మనామ్ = తెలియఁబడిన యాత్మ గలవారలును; సమ్యగ్దర్శు లనుట, అట్టివారికి; అభితః = రెండువైపులను—జీవించియున్నపుడును, మృతులైనపుడును; బ్రహ్మనిర్వాణమ్ = మోక్షము; వర్తతే = ఉన్నది.

కామక్రోధములను విడిచి సన్న్యాసులై మనస్సును నిగ్రహించి సమ్యగ్దర్శనము నొందినవారికి జీవించి యున్నపుడు జీవన్ముక్తియు మృతిఁ బొందినపుడు విదేహముక్తియు, నిట్లు రెండువైపులను ముక్తి గల దని తాత్పర్యము.

ఆ. మున్ను కామక్రోధములవేగమును సహింపవలయు నని తెలుపఁబడినది, ఇప్పుడు వానినే విడువవలయునని చెప్పుచున్నారు మఱియును అని. ఓయీ! ఈ

●● చూచువారు.

● అపండితులకుఁ గల్గు విపర్యయముగాని సంశయము గాని ద్వైధ మనఁబడుచున్నది. దాని జ్ఞానఖడ్గముచే భేదించి విడువఁబడిన సంగము గలవాఁడై సన్న్యసింపవలయును.

* క్షీణించినపాపము గలవారై గొప్పజ్ఞానము గలవారు నిస్సంశయు లగుచున్నారు.

చెప్పఁబడిన విశేషములు గలవారికి మృతిఁ బొందిన పిమ్మటనే మోక్షము జీవించి యున్నప్పుడు లేదనఁగా; అట్లుగాదని చెప్పుచున్నాఁడు అభితో బ్రహ్మనిర్వాణమ్ అని. అప్పుడు అస్మదాదులకుఁ గూడ అధికకామాదిప్రభావము లేనివారికి ఎందువలన మోక్షము సిద్ధింపదు? అని యాశంకించి సమ్యగ్దర్శనము లేకుండుటవలన నని చెప్పుచున్నాఁడు విదితాత్మనామ్ అని. చెప్పినయర్థమునందు శ్లోకాక్షరముల కన్వయముఁ జెప్పుచున్నారు కామక్రోధవియుక్తానామ్ ఇత్యాదిగా.

హ. ♦

శం. కామక్రోధములు విడిచి సదా యాత్మనిష్ఠచే నుండునట్టియతులకే జీవన్ముక్తిసుఖంబును విదేహముక్తిసుఖంబును సిద్ధించును, ఇతరులకు సిద్ధింప దను నాశయముతోఁ జెప్పుచున్నాఁడు.—కామమనఁగా వస్తువులం దిష్టతాబుద్ధిచే మనస్సునకు బహిఃప్రవృత్తికి హేతు వగు నిచ్ఛావిశేషము. కామమునకు విఘాతము కల్గినపుడు వస్తువునం దనిష్టతాబుద్ధిచే మనస్సునకు బహిఃప్రవృత్తికే హేతువగుబుద్ధివృత్తిశేషము క్రోధము. ఈరెండే శ్రవణమననసమాధులవిచ్ఛిత్తికిఁ బరమకారణము. ఇవిగలవానికి జ్ఞానము సిద్ధింపదు, సమాధియు సిద్ధింపదు. వీనిచే సమాధి విచ్ఛిన్న మగుచుండునపుడు నూఱువిధముల శ్రవణము చేసినవానికిఁ గూడ సమ్యక్ జ్ఞానము సంభవింపదు. అది లేనప్పుడు మోక్షము లేదు. అందువలన ముముక్షువై సమాధి చేయఁ గోరునట్టి యతి యవశ్యము కామక్రోధములు లేనివాఁడు కావలయును. అని సూచించుటకై పలుమాఱు చెప్పి యున్నను గామక్రోధపరిత్యాగమును మఱవకుండుటకై మరల స్మృతికిఁ దెచ్చుచున్నాఁడు. కామక్రోధవియుక్తానామ్ = మీఁదలక్షణము గల కామక్రోధములచే విడువఁబడినవారలే యయినవారును; యతీనామ్ = సన్న్యసించి శాంతు లయిన వారును; యతచేతసామ్ = ప్రత్యగభిన్న మగుబ్రహ్మమునందే యతము—నియమంబున స్థాపిత మగుచిత్తము గలవారును, సర్వదా బ్రహ్మమునందే యుండువారును; అందువలననే, విదితాత్మనామ్ = ఇతఁడే నేనని స్వాత్మగానే తెలియఁబడిన సర్వాత్మకుఁ డగు ఆత్మ—నిర్విశేషుఁడగు పరమాత్మ గలవారును, అట్లు చక్కఁగా ఆత్మతత్త్వము దెలిసినట్టి బ్రహ్మవిదులకే; అభితః = రెండువైపులను—జీవద్దశయందును విదేహదశయందును; బ్రహ్మనిర్వాణమ్ = బ్రహ్మానందానుభవము; వర్తతే—సిద్ధించుచున్న దని యర్థము. ఇందుచే విక్షేపకారణ మగు కామక్రోధాదికమును దూరమున విడిచి సమాధినిష్ఠయందే యుండు

♦ శంకరభాష్యములో సమానము.

నట్టియతికే సమ్యక్ జ్ఞానంబును దత్ఫల మయినమోక్షమును సిద్ధించు నని సూచితం బగుచున్నది.

మ. ఇట్లు కామక్రోధము లుత్పన్నములైనను వానివేగమును సహింపవలయు నని చెప్పఁబడినది. ఇప్పుడో వానియుత్పత్తికే ప్రతిబంధము చేయవలయు నని చెప్పుచున్నాఁడు.—కామక్రోధవియుక్తానామ్=కామక్రోధములవియోగము—అవి పుట్టకయుండుట, దానితోఁ గూడినవారును; కావుననే, యతచేతసామ్ = సంయత మయినచిత్తము గలవారలును; యతీనామ్ = యత్నము చేయునట్టి సన్న్యాసులును; విదితాత్మనామ్ = సాక్షాత్కరింపఁబడినపరమాత్మ గల వారను అట్టివారలకు, అభితః= రెండువిధము లయినవారికిని, జీవించి యున్న వారికిని మృతు లయిన వారికిని; బ్రహ్మనిర్వాణమ్ = మోక్షము; వర్తతే = ఉన్నది నిత్య మగుట వలన, కాని కలుగఁబోవునది కాదు సాధ్యము కామివలన.

శ్రీ. మఱియును.—కామక్రోధములచే విడువఁబడినవారలును, యతీనామ్ = సన్న్యాసులును; సంయత మయినచిత్తము గలవారలును, తెలియఁబడిన యాత్మతత్త్వము గలవారలు నగువారలకు; అభితః = రెండువిధము లయినవారికిని, మృతులకును జీవించి యుండువారికిని. దేహాంతమందే వారలకు బ్రహ్మమునందు లయ మని కాదు, మ ఱేమనఁగా, జీవించి యున్నవారికిఁ గూడఁ గల దని యర్థము.

ప. మఱియును.—పరమవైర మగుకామక్రోధములచే వియుక్తులును; యతచేతసామ్ = నియమింపఁబడినమనస్సు గలవారలును; యతీనామ్ = సన్న్యాసులును; విదితాత్మనామ్ = తెలియఁబడినయాత్మతత్త్వము గలవారలును, అట్టి వారలకు; అభితః—జీవించి యున్నవారలకును మృతు లయినవారికిని; బ్రహ్మనిర్వాణం వర్తతే.

రా. ఈ చెప్పినలక్షణము గలవారలకు బ్రహ్మము అత్యంతసులభం బని చెప్పుచున్నాఁడు.—కామక్రోధవియుక్తానామ్; యతీనామ్ = యత్నించుస్వభావము గలవారలును; యతచేతసామ్ = నియమింపఁబడినమనస్సు గలవారలును; విజితాత్మనామ్ = జయింపఁబడినమనస్సు గలవారలును *; అట్టివారలకు; బ్రహ్మ

* వీరిమతమునందుఁ జతుర్థపాదమున విజితాత్మనామ్ అని పాఠము.

నిర్వాణమ్, అభితః *, వర్తతే—ఇట్టివారలకుఁ జేతికో నున్నది బ్రహ్మనిర్వాణం బని యర్థము.

**మూ.** సులభముగూడ వారలకు బ్రహ్మ మని చెప్పుచున్నాఁడు.—అభితః = అంతటను.

స్పర్శాన్ కృత్వా బహి ర్బాహ్యాం శ్చక్షు శ్చైవా ఽన్తరే భ్రువోః
ప్రాణా ఽపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ. ౨౭

యతేన్ద్రియమనోబుద్ధి ర్ముని ర్మోక్షపరాయణః
విగతేచ్ఛాభయక్రోధో య స్సదా ముక్త ఏవ సః. ౨౮

**భా.** సమ్యగ్దర్శననిష్ఠు లగు సన్న్యాసులకు సద్యోముక్తి చెప్పఁబడినది. కర్మయోగంబును ఈశ్వరార్పితసర్వభావంబున ఈశ్వరునందు బ్రహ్మమునం దుంచి చేయఁబడుచున్నదై సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి సర్వసన్న్యాసక్రమంబున మోక్షము కలిగించు నని భగవంతుఁడు పలుమాఱు వచియించెను. వచియింపఁ బోవుచున్నాఁడు గూడ. ఇఁక నిప్పుడు సమ్యగ్దర్శనమున కంతరంగ మయిన ధ్యానయోగమును విస్తరంబునఁ జెప్పఁదలఁచినవాఁడై దానికి సూత్రస్థానీయము లగుశ్లోకముల నుపదేశించుచున్నాఁడు.—స్పర్శాన్ = శబ్దాదులను; బాహ్యాన్ = వెలుపలివానిని; బహిః = వెలుపలనే; కృత్వా = చేసి, శ్రోత్రాదిద్వారమున లోపలికి బుద్ధియందుఁ బ్రవేశింపఁజేయఁబడుచున్నవి శబ్దాదు లగువిషయములు, వానిఁ జింతింప కున్నయెడ వెలుపలనుండునవి వెలుపలనే చేయఁబడిన వగుచున్నవి, వానిని అట్లు వెలుపలచేసి; చక్షుశ్చైవ=నేత్రమును గూడ; భ్రువోః = కనుబొమలయొక్క; అన్తరే = నడుమ; కృత్వా = చేసి; అట్లు, ప్రాణాఽపానౌ= ప్రాణాపానములను; నాసాభ్యన్తరచారిణౌ= నాసికలోపలఁ దిరుగువానిని; సమౌ = సమములనుగా; కృత్వా = చేసి; యతేన్ద్రియమనోబుద్ధిః = సంయతము లయిన యింద్రియములును మనస్సును బుద్ధియును గలవాఁడును; మునిః = మననమువలన మునియును, సన్న్యాసియును; ఇట్టి దేహసంస్థానము • గలవాఁడై, మోక్షపరాయణః=

* అంతటను.

• దేహస్థితి.

మోక్షమే పరమగతిగాఁ గలవాఁడును కావలయును. విగతేచ్ఛాభయక్రోధః=ఇచ్ఛయును భయమును క్రోధమును పోయినవిగాఁ గలవాఁడు; యః = ఎవ్వఁడు ఈ ట్లున్నాఁడో; సః = ఆసన్న్యాసి; సదా = ఎల్లప్పుడును; ముక్తఏవ = ముక్తుఁడే యగుచున్నాఁడు. వానికి మోక్షము మఱి యొకటి చేయవలసినది లేదు.

బాహ్యము లగు శబ్దాదివిషయములను మనసులోనికిఁ జొరనీయక వెలిగానే యొనరించి భ్రూమధ్యమున దృష్టి నిలిపి నాసాభ్యంతరమున సంచరించునట్టి ప్రాణాపానములను కుంభకముచే సమములనుగా నిరోధించి యింద్రియములను మనస్సును బుద్ధిని నిగ్రహించినవాఁడై మోక్షపరాయణుండై ఇచ్ఛాభయక్రోధములు లేనివాఁడై యే సన్న్యాసి యున్నాఁడో అతఁడు సర్వదా ముక్తుఁడుగానే యున్నాఁడని తాత్పర్యము.

ఆ. కడచినదాని ననువదించి మీఁది మూఁడుశ్లోకములకుఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు సమ్యగ్దర్శననిష్ఠులు ఇత్యాదిగా. ఈశ్వరార్పితసర్వభావంబునన్—భగవంతుఁ డగు పరమేశ్వరునియందు సమర్పింపఁబడిన సమస్తము లయిన దేహేంద్రియమనస్సులయొక్క భావము—చేష్టావిశేషము, ఎప్పుడును వానికి బహిర్వ్యాపారము లేదు, దానిచేత నని యర్థము. ఇఁకన్—కర్మయోగమును దత్ఫలంబును జెప్పిన పిమ్మట. తమయంతనే బాహ్యము లయినవిషయముల నెందువలన బహిష్కరించుట? అని యాశంకించి చెప్పుచున్నారు శ్రోత్రాదిద్వారమున నిత్యాదిగా. వాని బహిష్కరించుట యెట్టి దని యాశంకించి చెప్పుచున్నారు వాని ఇత్యాదిగా. విషయప్రవణతను బరిత్యజించి దృష్టిఁగూడ విక్షేపపరిహారార్థము భ్రూమధ్యమునఁ జేసి, నాసాభ్యంతరమున సంచరించుస్వభావము గలప్రాణాపానములను, సమములనుగా—న్యూనాధికములు లేనివానిఁగా కుంభకముచే నిరుద్ధములనుగాఁ జేసి కరణంబుల నన్నింటి నిట్లు సంయమనము చేసి ప్రాణాయామపరుండై యేమి చేయవలయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు—యతేన్ద్రియమనోబుద్ధిః ఇత్యాదిగా. ఇంద్రియాదుల సంయమము చేసి మోక్షమునే కోరుచు మునిః—మననశీలుండు కావలయు నని యర్థము. జ్ఞానాతిశయనిష్ఠుండును ఎల్లప్పుడును ఇచ్ఛాదిశూన్యుండు నగు సన్న్యాసికి ముక్తి యనాయాసముగా సిద్ధ మగుటవలన వాని కేమియుఁ గర్తవ్యము లే దని చెప్పుచున్నాఁడు—విగతే చ్ఛేత్యాదిగా. రెండవశ్లోకము పూర్వార్ధాక్షరముల

వ్యాఖ్యానము చేయుచున్నారు యతేన్ద్రియే త్యాదిగా. ఉత్తరార్ధాంశముల వ్యాఖ్యానము చేయుచున్నారు విగ తేత్యాదిగా.

హ. • వానికి మోక్షముకంటె నితరము కర్తవ్యము లేదు. *

శం. యతచేతసామ్ అని సమ్యక్ జ్ఞానసిద్ధికిని దత్ఫలసిద్ధికిని సమాధి పరమ కారణం బని సూచించి యాసమాధియోగమునే సాధనసహితముగా నుపదేశింపఁ గోరినవాఁడై దానికి సూత్రభూతము లయిన మూఁడుశ్లోకముల నుపదేశించుచు న్నాఁడు అందు మొదట రెండుశ్లోకములచే నిదిధ్యాసనము చేయువానికి అంతరంగ సాధనము లాఱు కర్తవ్యము లని యుపదేశించుచున్నాఁడు.— బాహ్యాన్ = తనకు వెలుపలనే భ్రాంతిచేఁ గల్పితములు బాహ్యములు, అట్టి; స్పర్శాన్ = శబ్దాదివిషయ ములను; బహిఃకృత్వా = బహిర్దేశమునందే నిలిపి, మనస్సుచే దేనిని స్మరింపక యని యర్థము; ఇటు అటు దృష్టి పాఱకుండునట్లు, భ్రువోః అన్తరే = భ్రూమధ్యము నందు; చక్షుః = దృష్టిని; ఉంచి; అట్లు; నాసాభ్యన్తరచారిణౌ; ప్రాణాపానౌ; సమౌ = సామ్యావస్థను బొందినవానిఁగా; హృదయంబునందు; కృత్వా = నిలిపి, కేవలకుంభకముఁ జేసి యని యర్థము; పాపక్షయార్థమును మనస్సు నిశ్చల మగుట కును కేవలకుంభకమును ముముక్షువు చేయవలయును; యతేన్ద్రియమనోబుద్ధిః = యతములు—సంయతములు తమతమవిషయములనుండి మరలింపఁబడినవి యగు ఇంద్రియములును మనస్సును బుద్ధియును గలవాఁడై, ఇంద్రియములచే విషయ గ్రహణంబును మనస్సుచే విషయచింతనమును బుద్ధిచే అవశముగాఁ బ్రాప్తించి విషయమునైనను గ్రహించుటను జేయనివాఁడై యని యర్థము; విగతేచ్ఛాభయ క్రోధః = ఇచ్ఛయును భయమును క్రోధమును బుద్ధియు మిక్కిలి విడిచిపోయినవి యెవ్వనికో అట్టివాఁడై, ఏవిషయమునందైనను ఇచ్ఛయుండునపుడు సమాధి సిద్ధిం పదు, పగలుగాని రాత్రిగాని యరణ్యమునందు గుహాదులందు జంతువులవలని భయ ముండునేని సమాధి సిద్ధింపదు, అపకారు లగు మశకపిపీలికాదులందుఁ గ్రోధము మనస్సునఁ గలదేనియు సమాధి సిద్ధింపదు, అందువలననే యామూఁటిని నిదిధ్యా సువు పరిత్యజింపవలయు నని యర్థము; మఱియు, మోక్షపరాయణః = ప్రయత్నం బునఁ గర్తవ్య మగుకార్యమును సమస్తమును బరిత్యజించి తీవ్రమోక్షేచ్ఛచే మోక్ష సాధనమునందే నిష్ఠ గలవాఁడై; యః = ఏముముక్షువు; సర్వమును సన్న్యసించి,

• శంకరభాష్యములో సమానము.

* అని విశేషము.

నదా; మునిః=మననశీలుఁడు, మనన మనఁగా వస్తుధ్యానమే, నియమంబున దానినే చేయువాఁడు ముని యనఁబడుచున్నాఁడు, ఎవ్వఁడు సదామునియే యగుచున్నాఁడో; సః ఏవ = అతఁడే; ముక్తః = ముక్తుఁ డగుచున్నాఁడు ఇతరుఁడు కాఁడు నానావిధముల శ్రవణము చేసినవాఁ డైనను. అని రెండుశ్లోకములకు నర్థము.

మ. ముందు ఈశ్వరార్పితసర్వభావునకుఁ § కర్మయోగంబున నంతఃకరణశుద్ధియు దానివలన సర్వకర్మసన్న్యాసంబును దానివలన శ్రవణాదితత్పరునకు మోక్షసాధనం బగు తత్త్వజ్ఞానంబును ఉదయించు నని చెప్పఁబడినది. ఇప్పుడు « స యోగీ బ్రహ్మనిర్వాణమ్ » అనుచోట సూచిత మగుధ్యానయోగమును సమ్యగ్దర్శనమున కంతరంగసాధన మయినదాని విస్తరించి చెప్పుటకై సూత్రస్థానీయము లగుమూఁడుశ్లోకములఁ జెప్పుచున్నాఁడు భగవంతుఁడు వీనికే వృత్తి ❡ స్థానీయము షష్ఠాధ్యాయము సర్వంబును గాఁ గలదు. అందు రెండుశ్లోకములచే సంక్షేపంబున యోగము చెప్పఁబడుచున్నది. మూఁడవశ్లోకముచేఁ దత్ఫల మగుపరమాత్మజ్ఞానమని తెలియునది.—స్పర్శాన్ = శబ్దాదివిషయములను; బాహ్యాన్ = వెలుపలఁ గలుగు నవియైనను, శ్రోత్రాదిద్వారంబున నాయాయాకారముగల యంతఃకరణవృత్తులచే లోపలఁ బ్రవేశించినవానిని; మరల, బహిః కృత్వా = వెలుపలనే యుంచి, పరమవైరాగ్యవశంబునఁ దత్తదాకారవృత్తిని బుట్టింపక యనియర్థము; విషయము లాంతరములే యగునేని అప్పుడు వేయియుపాయలచేతఁ గూడ వీనిని వెలుపలచేయుట శక్యము గాదు, స్వభావభంగము ప్రసక్తించుటవలన ♦, బాహ్యము లయిననో రాగవశంబున నంతఃప్రవిష్టము లైనవాని వైరాగ్యంబున వెలివుచ్చుట సంభవించు నని చెప్పుటకై బాహ్యాన్ అనువిశేషణము. ఇట్లిందుచే వైరాగ్యముఁ జెప్పి యభ్యాసము చెప్పుచున్నాఁడు.—చక్షుశ్చైవాన్తరే భ్రువోః, కృత్వా యని యనువర్తించుచున్నది, కన్నుచక్కఁగా మూసినచో నిద్రాఖ్య మగులయాత్మకవృత్తి కలుగును గదా! చక్కఁగాఁ దెఱచిననో ప్రమాణవిపర్యయవికల్పస్మృతు లనువిక్షేపాత్మకము లగు నాలుగువృత్తులు గలుగును, ఈయయిదువృత్తులను నిరోధింపవలయు నని యర్ధనిమీలనముచే ✱ భ్రూమధ్యమున నేత్రము నుంచుట చెప్పఁబడినది అట్లు

§ ఈశ్వరార్పితము లయినసర్వేంద్రియవ్యాపారము గలవానికి.

❡ వ్యాఖ్యాన.

♦ తప్పింప శక్యము కాని స్వభావమును దప్పింపవచ్చు నని లోకన్యాయ విరోధము సంభవించుటవలన.

✱ సగము మూయుటచే.

ప్రాణాపానౌ; సమౌ = తుల్యములనుగా, ఊర్ధ్వాధోగతుల నిరోధించుటచే, నాసాభ్యన్తరచారిణౌ, కుంభకముగఁ జేసి; ఈయుపాయంబున, యతేన్ద్రియమనోబుద్ధిః సంయతము లయినయింద్రియమనోబుద్ధులు గలవాఁడై; మోక్షపరాయణః—సర్వవిషయములనుండియు విరక్తుండై; మునిః = మననశీలుఁడు కావలయును. విగతేచ్ఛాభయక్రోధః అనునది వీతరాగభయక్రోధః అనుచో వ్యాఖ్యాత మయ్యెను. ఏసన్న్యాసి యిట్టివాఁడుగా నున్నాఁడో, అతఁడు సదా ముక్తుఁడై యే యున్నాఁడు, వానికి మోక్షము కర్తవ్యము లేదు. లేక, ఎవ్వఁ డిట్టివాఁడో, వాఁడు, సదా—జీవించి యున్నపుడును; ముక్తఏవ = ముక్తుఁడే.

శ్రీ. సయోగీ బ్రహ్మనిర్వాణమ్ ఇత్యాదిస్థలములందు యోగి మోక్షము నొందుచున్నాఁ డని చెప్పఁబడినది. ఆయోగమునే సంక్షేపమునఁ దెలుపుటకై చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—బాహ్యములే యగు స్పర్శములు—రూపరసాదు లగు విషయములు చింతింపఁబడినవై లోపలఁ బ్రవేశించుచున్నవి, వానిని, చింతాత్యాగముచే వెలుపలనే యుంచి; చక్షుః; భ్రువోః అన్తరే = భ్రూమధ్యమునందే; ఉంచి, మిక్కిలి నేత్రములను మూసినచో నిద్రచే మనస్సు లయించుచున్నది తెఱచినచో వెలుపలికిఁ బాఱును, ఆరెండుదోషములను బరిహరించుటకై యర్ధనిమీలనముచే భ్రూమధ్యంబున దృష్టి నుంచి యని యర్థము; ఉచ్ఛ్వాసనిశ్వాసరూపంబున నాసాభ్యంతరంబునఁ జరించుచున్న, ప్రాణాపానౌ, ఊర్ధ్వాధోగతినిరోధముచే, సమౌకృత్వా—కుంభకము చేసి యని యర్థము; లేక, ఎట్లు ప్రాణము వెలికి వెడలదో అపానము లోపలికిఁ జొరదో, మ తేమనఁగా, రెండును నాసామధ్యముననే చరించుచుండునో, అట్లు తిన్నని యుచ్ఛ్వాసనిశ్వాసములచే, సమములనుగాఁ జేసి యని యర్థము; ఈయుపాయముచే, యతేన్ద్రియ మనోబుద్ధిః = సంయతము లయిన యింద్రియమనోబుద్ధులు గలవాఁడు; మోక్షపరాయణః = మోక్షమే పర మయిన అయనము—ప్రాప్యముగాఁ గలవాఁడు; అందువలననే, విగతము లయిన—పోయిన ఇచ్ఛాభయక్రోధములు గలవాఁడు; ఎవ్వఁడు ఇట్టివాఁ డగుముని గలఁడో, అతఁడు, సదా—జీవించియున్నపుడును, ముక్తుఁడే యని యర్థము.

ప. ఇఁక నాయోగమునే సంక్షేపమునఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—బాహ్యాన్; స్పర్శాన్ = రూపరసాదివిషయములను; బహిః—స్మరణమునకు అవిషయములనుగా; కృత్వా—దూరంబున విసర్జించి; అట్లు, భ్రువోః అన్తరే =

భ్రూమధ్యమునందు; చక్షుః, కృత్వా—చక్కగా కన్ను మూయుటచే నిద్రకలుగును, తెఱచుటచే వెలుపలికిఁ బ్రసరించును, ఆ రెండు దోషములను తొలఁగించుటకై యర్ధనిమీలనముచే భ్రూమధ్యమున దృష్టి నుంచి యని యర్థము; అట్లు చెప్పఁబడినది యోగమార్తాండమునందు "భ్రువో రన్తర్గతా దృష్టి ర్ముద్రా భవతి ఖేచరీ। నరోగో మరణం తస్య న నిద్రా న క్షుధా తృషా। న చ మూర్ఛా భవే త్తస్య యో ముద్రాం వేత్తి ఖేచరీమ్।।"* అని; అట్లు, నాసాభ్యన్తరచారిణౌ, ప్రాణాపానౌ, సమౌ కృత్వా—కుంభకము చేసి యని యర్థము; ఈయుపాయముచే, యతేన్ద్రియమనోబుద్ధిః, మునిః = మననశీలుఁడు; మోక్షపరాయణః = మోక్షమే పరమగతిగాఁ గలవాఁడు; యః = ఎవ్వఁడో; సః = అతఁడు; సదైవ = జీవించియున్నవాఁడు గాని మృతుఁడు గాని; ముక్తః—ముక్తుఁడగు నని యర్థము. అట్లు చెప్పఁబడినది టిప్పణికలయందు "పరావృత్తం చిత్తం యదిభవతి బాహ్యావ్యవహృతే రసత్యాయా స్సత్యం కలయతి తదా ఽభ్యాసవశతః। క్షుధార్త స్సంవిష్టః క్షణ మనుభవ న్స్వాప్న మశనం మృషా మత్వా బోధే పునరపిచ భోక్తుం ప్రయతతే" § అని. ఇఁక ఈనిరూపించినయర్థమునందు సర్వశాఖాపఠితంబు లగుశ్రుతులును—"తద్విష్ణోః పరమంపదం సదా పశ్యన్తి సూరయః। దివీవచక్షు రాతతమ్। తద్విప్రాసో విపన్యవో జాగృవాంస స్సమిన్ధతే। విష్ణో ర్య త్పరమంపదమ్" అని. ఇందుకు రావణభాష్యము.—విష్ణోః = వ్యాపనశీలుండైనను పరమాత్మయొక్క, తత్, పరమమ్ = పారమార్థిక మయిన, పదమ్ = అభివ్యక్తిస్థానము, దివి = శిరస్సునందు, భ్రూమధ్యంబున, ఉన్నది "త్రిపాద స్యామృతం దివి" అనుశ్రుతివలన. సచ్చిదానందాత్మక మగువిష్ణుపదం బది యేదిగలదో దానిని; సూరయః = సుజ్ఞానులు, చక్షుః = దృష్టిని, ఆతతమ్ = విస్తృతమునుగాఁ జేసి, సదా = వ్యవధానము లేక, పశ్యన్తి = నిరంతరము సాక్షాత్కరించుచున్నారు. లేక. చక్షుః = అర్థప్రకాశకమును, ఇవ అనునది యేవకారార్థము గలది, ఆతతే దివ = అభిరిచ్చిన్నమే యెట్లగునో అట్లు, పశ్యన్తి. తత్ = అందువలన. విప్రాసః = విప్రులు శ్రేష్ఠ మయిన బుద్ధి గలవారు, విపన్యవః = మేధావులు, జాగృవాంసః—దృశ్యప్రపంచమును అను

* భ్రూమధ్యగత మయిన దృష్టి ఖేచరి యనుముద్ర యగును, దానివలన రోగము గలుగదు, మరణమును గలుగదు, నిద్ర ఆఁకలి దప్పి మొదలగునవియుఁ గలుగవు.

§ అసత్య మయిన బాహ్యవ్యవహారమునుండి చిత్తము మరలినది యగునేని, అప్పుడు అభ్యాస వశంబున సత్యమును గ్రహించుచున్నది. ఎట్లనఁగా—ఆఁకలిగొన్నవాఁడు పరుండి క్షణము [illegible]ము వంటలిభోజనము ననుభవించినవాఁడై మేలుకొనినప్పుడు అది మిథ్య యని తెలిసికొని [illegible] టకుఁ బ్రయత్నించుచున్నాఁడు.

దీర్ఘస్వప్నమునుండి జాగరమును—మేలుకొనుటను బొందినవా రని యర్థము, చెప్పి నట్లు అనుభవింపఁబడుచున్న పదమును, సమిద్ధతే - సమృద్ధిని బొందించుచున్నారు, సర్వాత్మకముగాఁ జూచుచున్నారు. ఇట నిది యభిప్రాయము—అభ్యాసదశయందు సుషుమ్నావివరముచే భ్రూమధ్యముఁ బొందింపఁబడినదృష్టిచేఁ జూచుచున్నారు, వ్యవహారదశయందో సకలవిషయప్రతీతిరూపంబున దానినే చూచుచున్నారు అని. ఇఁక నీయర్థమునందు సామారణ్యకంబున మఱియొకశ్రుతియును "చిత్రం దేవానా ముదగా దనీకం చక్షు ర్మిత్రస్య వరుణ స్యాగ్నేః । ఆప్రాద్యావాపృథివీ అన్తరిక్షం సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ" అని. దీపికిభాష్యము—అర్థములను ద్యోతయన్తి—ప్రకాశింపఁజేయుచున్నవి యనువ్యుత్పత్తిచే, దేవానామ్ = చక్షురాదులలోపల, చిత్రమ్ = విచిత్ర మయిన, అనీకమ్ = రూపరసగంధస్పర్శశబ్దములను గ్రహించునట్టి తేజస్సులసమూహము, ఉదగాత్ = ఉదయము నొందినది అది యెట్టిది ? మిత్రస్య= చక్షుస్సున కధిదైవత మయినసూర్యునకును, అట్లు, వరుణస్య = రసనకు అధిదైవత మయినవరుణునకును, అగ్నేః = వాక్కున కధిదైవత*మయినయగ్నికిని, చక్షుః=ప్రకాశకము, ఆయాశక్తి నిచ్చునది యని యర్థము. ఇఁక నిట్టివాఁ డైనను జీవత్వరూపమునఁ బరిచ్ఛిన్నుఁడు గాఁడు, మ తేమనఁగా; ద్యావాపృథివీ = స్వర్గమును భూమిని, అన్తరిక్షమ్ = ఆకాశమును, ఆప్రా = చక్కగాఁ బూరించినవాఁడు, వ్యాపించినవాఁడని యర్థము. అట్లు, సూర్యః—తత్ప్రకాశము జ్ఞాపకము. ఎందువలన ననఁగా, జగతః = జంగమమునకును, తస్థుషః = స్థావరమునకును, ఆత్మా = అంతర్యామి. ఇఁక ప్రాణాపానౌ అనునర్థమునందు శాతపథశ్రుతి "తస్మాదేక మేవ వ్రతంచరేత్ప్రాణ్యాచ్చైవా ఽపాన్యాచ్చ । నేన్మా పాప్మా మృత్యురాప్నువదితి । యద్యు చరేత్సమాపయిషే న్నో ఏతస్యై దేవతాయై సాయుజ్యం సలోకతాం జయతి య ఏవం వేద " అని. భాష్యము—అథాతో వ్రతమీమాంసేత్యాదిగా చక్షురాదివ్రతము ఆత్మజ్ఞానోపయోగి కా దని యుపక్రమించి తస్మాత్ అని యుపసంహరించుచున్నాఁడు.—తస్మాత్ = ఆకారణముచేత. ఏకమేవ వ్రతమ్ = ఒక్కవ్రతమునే, చరేత్ = ఆచరింపవలయును. అది యేది ? ప్రాణ్యాచ్చైవా ఽపాన్యాచ్చ—ప్రాణమువలనఁ బుట్టినయభ్యాసము ప్రాణ్యము, అపానమువలనఁ బుట్టినది యపాన్యము, అట్టి యభ్యాసమువలన, ప్రాణాయామవ్రతము నాచరింపవలయు నని యర్థము. ఇఁక నది యెందువలన ననఁగాఁ జెప్పుచున్నాఁడు—నేత్ అనునది నిషేధార్థకము. పాప్మా= ఘాతుకమయిన, మృత్యుః = మృత్యువు, మా = నన్ను, నేత్ ఆప్నువత్ = పొందఁగూడదు, ఇతి=

అని నిశ్చయించి, యద్వ్రతంచరేత్ = ఈ వ్రతమును ఆచరించునేని, అప్పుడు, సమాప్నుయాత్ = సమాప్తిం బొందింపవలయును, ప్రాణాయామము సిద్ధించుపఱకు విడువం గూడ దని యర్థము. తేన = ఆ వ్రతముచేత, ఉ= నిశ్చయముగా, ఏతస్యై= చతుర్థికిం బంచమ్యర్థము, ఈముఖ్యప్రాణదేవతవలన, సాయుజ్యం సలోకతామ్= సాయుజ్యమును సలోకతను, జయతి = పొందుచున్నాఁడు. య ఏవం వేద = ఎవ్వఁ డి ట్లెఱుంగునో వాఁడు. అట్లు “అన్తశ్చరతి రోచనాస్య ప్రాణా దపానతి” ఇత్యాది సామారణ్యకము గూడఁ జూచుకొనునది.

రా. స్వలక్ష్యభూతయోగశిరస్కం ♦ బగు కర్మయోగము నుపసంహరించుచున్నాఁడు.—బాహ్యాన్; స్పర్శాన్ = విషయస్పర్శములను; బహిః కృత్వా= బాహ్యేంద్రియవ్యాపారమును సర్వమును ఉపసంహరించి; యోగయోగ్య మయిన యాసనమునందు ఋజుకాయుఁడై * కూర్చుండి, చక్షుః=కన్నులను; భ్రువోరన్తరే=నాసాగ్రమునందు; ఉంచి; నాసాభ్యన్తరచారిణౌ; ప్రాణాపానౌ; సమౌ కృత్వా = ఉచ్ఛ్వాసనిశ్వాసములను సమగతులనుగాఁ జేసి; ఆత్మావలోకనముకంటె నితరమునందు, యతేన్ద్రియమనోబుద్ధిః=ప్రవర్తించుటకు యోగ్యము గాని యింద్రియమనోబుద్ధులు గలవాఁడై; అందువలననే, విగతేచ్ఛాభయక్రోధః; మోక్షపరాయణః=మోక్షమే ముఖ్యప్రయోజనముగాఁ గలవాఁడై; మునిః=ఆత్మావలోకనశీలుండు; యః = ఎవ్వఁడు గలఁడో; సః = అతఁడు; సదా ముక్తఏవ—సాధ్యదశయందుంబోలె సాధనదశయందును ముక్తుఁడే యతఁ డని యర్థము.

బాహ్యేంద్రియవ్యాపారమును బరిత్యజించి యాసనమునందుఁ జక్కఁగాఁ గూర్చుండి నాసాగ్రమునందు దృష్టి యుంచి ఉచ్ఛ్వాసనిశ్వాసములను సమగతియందు నిలిపి యాత్మావలోకనము దక్కఁ దక్కినవానినుండి నివర్తిల్లిన యింద్రియమనోబుద్ధులు గలవాఁడై ఇచ్ఛాభయక్రోధములు లేనివాఁడై మోక్షమునే కోరుచు ఆత్మావలోకనైకనిష్ఠుం డగువాఁడు సాధనావస్థయందుఁ గూడ ముక్తుఁడే, ఇఁక సాధ్యావస్థయందు ముక్తుఁ డని చెప్పవలయునా ? అని తాత్పర్యము.

మా. ధ్యానప్రకారముఁ జెప్పుచున్నాఁడు.—బాహ్యాన్ స్పర్శాన్ బహిః కృత్వా—శ్రోత్రాదులను యోగముచే నియమించి యని యర్థము. చక్షు ర్భ్రువో

♦ తన కుద్దేశ్య భూతమయినయోగము ప్రధానముగాఁ గలది, యోగ మనఁగా ఇట సాక్షాత్కారము కొఱకుఁ జిత్తసమాధానవిశేషరూప మగువ్యాపారము.

* సమమయిన దేహము గలవాఁడై.

రన్తరే కృత్వా—భ్రూమధ్యమును జూచుచు నని యర్థము. చెప్పఁబడినది గూడ “నాసాగ్రేవా భ్రువో ర్మధ్యే ధ్యాయీ చక్షు ర్నిధాపయేత్” * అని. ప్రాణాపానౌ సమౌ కృత్వా—కుంభకమునం దుండి యని యర్థము.

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి. ౨౯

**భా.** ఇట్లు సమాహితచిత్తుఁడై దేని నెఱుంగవలయును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—యజ్ఞతపసామ్ = యజ్ఞములయొక్కయుఁ దపస్సులయొక్కయు; భోక్తారమ్=భుజించువానిని, కర్తృరూపంబునను దేవతారూపంబునను; సర్వలోకమహేశ్వరమ్=సర్వలోకంబులకును గొప్పయీశ్వరుని; సర్వభూతానామ్ = సర్వప్రాణులకును; సుహృదమ్ = ప్రత్యుపకారము నపేక్షింపక యుపకారము చేయువానిని; సర్వభూతంబులకును హృదయేశయుని ♦ సర్వకర్మఫలములకు నధ్యక్షుని సర్వప్రత్యయములకును సాక్షిని; మామ్=నన్ను, నారాయణుని; జ్ఞాత్వా=ఎఱింగి; శాన్తిమ్= సర్వసంసారోపరతిని; ఋచ్ఛతి=పొందుచున్నాఁడు.

యజ్ఞంబులను తపస్సులను కర్తృరూపుఁడై దేవతారూపుఁడై భుజించువాఁడను సర్వలోకములకును మహేశ్వరుఁడను సర్వప్రాణులకును బ్రత్యుపకారము నపేక్షింపక యుపకారము చేయువాఁడను, ఇట్లు సర్వభూతంబులకును హృదయగతుండనై సర్వకర్మఫలంబులకు నధ్యక్షుండనై సర్వప్రత్యయములకును ‡ సాక్షినైన నన్ను నారాయణుని నెఱింగినచో సర్వసంసారమునుండి ముక్తుఁ డగుచున్నాఁ డని తా.

**ఆ.** ఈ చెప్పినయధికారికిఁ జేయవలసినది లేని యప్పుడు ఎఱుంగవలసినదియు లే దని యాశంకించి పరిహరించుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. ప్రసిద్ధుఁ డగు భోక్తను § వ్యావర్తించుచున్నాఁడు సర్వలోకమహేశ్వరమ్ అని. “తతో హ్యస్య బన్ధ విపర్యయౌ” ¶ అనున్యాయంబున సర్వఫలప్రదాత యని చూపుచున్నాఁడు

* నాసాగ్రమునందుఁ గాని భ్రూమధ్యమునందుఁ గాని ధ్యానము చేయువాఁడు దృష్టి నుంపవలయును.

♦ హృదయమున నున్నవానిని.

‡ అంతఃకరణవృత్తులకును.

§ జీవుని.

¶ వానివలనఁ గదా వీనికి—జీవునికి బంధమోక్షములు.

సుహృదం సర్వభూతానామ్ అని. ఇట్టి యీశ్వరు నెఱుంగుటకు ఫలము చెప్పుచున్నాఁడు జ్ఞాత్వేత్యాదిగా. యజ్ఞములందును దపస్సులయందును రెండువిధముల భోక్తృత్వమును దెలుపుచున్నారు కర్తృరూపంబునను దేవతారూపంబునను అని. హిరణ్యగర్భాదివ్యావృత్తికొఱకు విశేషించుచున్నారు గొప్ప అని. తనపరివారమున కుపకారి యగురాజును వ్యావర్తించుచున్నారు ప్రత్యుపకారము నిత్యాదిగా. ఈశ్వరుఁడు తటస్థుఁ డగుటను నిరాకరించుచున్నారు సర్వభూతంబులకు నిత్యాదిగా. అప్పుడు అచ్చటచ్చట వ్యవస్థిత మయినకర్మముతోను దత్ఫలముతోను సంబంధమగు నని యాశంకించి చెప్పుచున్నారు సర్వకర్మఫలంబులకు నిత్యాదిగా. వానికి బుద్ధి తద్వృత్తిసంబంధము గూడ వాస్తవమున లే దని చెప్పుచున్నారు సర్వప్రత్యయంబులకు నిత్యాదిగా. యథోక్తేశ్వరపరిజ్ఞానఫలముఁ జెప్పుచున్నారు నన్ను నారాయణుని ఇత్యాదిగా.

ఇట్లు కర్మయోగము అముఖ్యసన్న్యాసముకంటెఁ బ్రశస్త మయినను దానికంటె ముఖ్యసన్న్యాసం బధికం బగుటవలన, అట్టి ముఖ్యసన్న్యాసము నొంది చిత్తశుద్ధి మొదలగువానితోఁ గూడినవాఁడై కామక్రోధోద్భవ మగువేగము నిందే సహింప సమర్థుండై శమదమాదిమంతుఁడై యోగమునం దధికృతుండై త్వంపదార్థము నెఱింగినవాఁడై పరమాత్మను బ్రత్యగాత్మునుగా నెఱింగిన వానికి ముక్తి యగు నని యధ్యాయాభిప్రాయము సిద్ధము.

హ. ♦ సర్వప్రత్యయములకు సాక్షినై – సకలలోకబీజ భూతుండనై సదా శుద్ధరూపుండనై జ్యోతులలో నత్యంతవిమలజ్యోతినై పరమాత్మ నగు; మామ్ = నన్ను నారాయణుని. ✱

శం. రెండుశ్లోకములచే ధ్యానమునకు సాధనమును ధ్యానించువానిని నిరూపించి యిప్పుడు మూఁడవశ్లోకముచే ధ్యేయమును నిరూపించుచున్నాఁడు.— ఈ చెప్పిన సాధనములతోఁ గూడిన నిదిధ్యాసు వగు యతి, యజ్ఞతపసామ్ = శ్రౌతములగు యజ్ఞములయొక్కయు స్మార్తము లయిన సత్యము శాంతి మొదలగు తపస్సులయొక్కయు, ఇతరకర్మములయొక్కయు; ఫల మేది గలదో దానియొక్క, భోక్తారమ్ = భుజించువానిని, ఆత్మను ఉపాధితోను తద్ధర్మములతోను సంబంధము లేనివానిని తన్ను; సర్వభూతానామ్ = బ్రహ్మాదిస్తంబపర్యంతము లగు సర్వభూతములకును;

♦ శంకరభాష్యములో సమానము.

✱ అని విశేషము.

ఆత్మ యగుటవలన, సుహృదమ్ = మిక్కిలి ప్రియుఁడను, లేక, సర్వభూతముల యొక్క, సుహృదమ్ = మంచిహృదయము ఉపలబ్ధిస్థానముగాఁ గలవాఁడను; లేక, సర్వభూతములయొక్క హృదయమునందు ఆత్మ యయి యున్నవాఁడను; సర్వలోక మహేశ్వరమ్ = లోక్యన్తే—చూడఁబడుచున్నవి కావున లోకములు—అవ్యక్తాది స్థూలాంతములు, సర్వలోకములుఁ గంటె, మహత్—గొప్పవాఁడను సన్నిధిమాత్రమున సర్వమును ఈష్టే—చేష్టింపించువాఁడను గావున ఈశ్వరుఁడను, అట్టి సర్వలోకమహేశ్వరుఁడను; సర్వాత్మకుఁడను సచ్చిదానందైకరసుండ నగు; మామ్ = నన్నుఁగా; పరమాత్మనుగా; జ్ఞాత్వా = ప్రత్యగాత్మ యగు తన్ను నన్నుఁ గానే పరబ్రహ్మము గానే యెఱింగి, ప్రత్యగభిన్నుఁడ నగు పరబ్రహ్మమును నన్ను ఎఱింగియు ధ్యానించియు; శాన్తిమ్ = సర్వసంసారోపశమమును, పరబ్రహ్మభావమును; ఋచ్ఛతి = పొందుచున్నాఁ డని యర్థము. లేక. యజ్ఞతపసామ్ భోక్తారమ్ = కార్యోపాధికుఁ డగు త్వంపదార్థ మయినయాత్మను, సర్వభూతసుహృదుఁడును సర్వలోకమహేశ్వరుండు నగు కారణోపాధికుని తత్పదార్థమును, "అథాత ఆదేశో నేతి నేతి" ఇత్యాదిశ్రుతి ననుసరించి ఉపాధిద్వయమును నిరసించి కేవలచైతన్యమాత్రము లైన యాతత్త్వంపదార్థముల రెంటిని వాని కధిష్ఠానభూతుఁడను సత్యజ్ఞానానంతానందైకరసుఁడను నిర్విశేషుఁడను నన్నుఁ గా—పరబ్రహ్మమునుగా నెఱింగి—ఇదియే నే నని నన్ను—పరబ్రహ్మమునే తన్నుఁగా నెల్లప్పుడు తెలిసియు ధ్యానించియు, శాన్తి మృచ్ఛతి—విదేహకైవల్యమును బొందుచున్నాఁ డని యర్థము.

మ. ఇట్లు యోగయుక్తుఁడై దేని నెఱింగి ముక్తుఁ డగుచున్నాఁడు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—సమస్తము లయినయజ్ఞములయు తపస్సులయు కర్తృరూపంబునను దేవతారూపంబునను భోగకర్తను, లేక, పాలకుఁడను, భుజపాలనాభ్యవహారయోః అని ధాతువు; సమస్తలోకములకును మహేశ్వరుఁడను= గొప్పయీశ్వరుఁడను హిరణ్యగర్భాదులకుఁ గూడ నియంతను; సర్వప్రాణులకును సుహృదుఁడను—ప్రత్యుపకారము నపేక్షింపక యుపకారము చేయువాఁడను, సర్వాంతర్యామిని సర్వావభాసకుఁడను బరిపూర్ణసచ్చిదానందైకరసుండను బరమార్థసత్యభూతుండను సర్వాత్మ నగునారాయణుని, మామ్=నన్ను, జ్ఞాత్వా = ఆత్మభావంబున సాక్షాత్కరించి, శాన్తిమ్=సర్వసంసారోపరతిని ముక్తిని, ఋచ్ఛతి = పొందుచున్నాఁ డని యర్థము. నిన్నుఁ జూచుచున్నను నే నెందువలన ముక్తుఁడను గాకున్నాను? అను నాశంకను నివారించుటకై విశేషణములు. చెప్పినవిధంబుననే నన్నెఱుంగుట ముక్తికారణ మని భావము.

బహువులసాధనాభ్యాసనిష్పన్నమైన, స్వస్వరూపవిజ్ఞానంబు సర్వజనుల
కమృతదం బంచుఁ బంచమాధ్యాయమందుఁ, బరమకారుణికుం డగుహరి వచించె.

శ్రీ. ఓయీ! ఇట్లింద్రియాదుల నియమించినమాత్రమున నెట్లు ముక్తుం డగును? అనఁగా, అంతమాత్రముననఁ గాఁడు. మ తేమనఁగా జ్ఞానద్వారంబున ముక్తుఁ డగుచున్నాఁ డని చెప్పుచున్నాఁడు.—భక్తులచే సమర్పితము లయిన యజ్ఞములయొక్కయు తపస్సులయొక్కయు వారిప్రార్థనచే భోక్తను, లేక, పాలకుఁడను, సర్వలోకములకును గొప్పయీశ్వరుండను, సర్వభూతములకును సుహృదుఁడను—అపేక్షలేక యుపకారము చేయువాఁడను, అంతర్యామి నగు, మామ్=నన్ను, జ్ఞాత్వా= ఎఱింగి, నాప్రసాదముచే, శాన్తిమ్=మోక్షమును; ఋచ్ఛతి=పొందుచున్నాఁడు.

హరి వికల్పశంకఁ బోనాడి సాంఖ్యయోగంబులకు సముచ్చయంబు నిట్లు
క్రమముచేత నుడివె కరుణ నెవ్వాఁ డట్టి, సర్వవిదుని హరిని సంస్తుతింతు.

ప. ఇఁక గొప్పకార్యమునకు విఘ్నములు మెండగుటవలన మనోబుద్ధీంద్రియనిగ్రహము గూడ ఆశ్రయము లేనిచోఁ జేయ నశక్యం బనఁగాఁ జెప్పుచున్నాఁడు.—సర్వభూతానామ్, సుహృదమ్=పరప్రేమాస్పదుఁడను, అంతర్యామిని; మామ్=నన్ను; జ్ఞాత్వా= ఎఱింగి; శాన్తిమ్ = మోక్షమును; ఋచ్ఛతి = పొందుచున్నాఁడు. ఎట్టివానిని? సమస్తములైన యజ్ఞములకును తపస్సులకును భోక్తను సర్వదేవాంతర్యామి నగుటవలన, సర్వలోకములకును భూర్భువస్స్వరాదులకు మహేశ్వరుని నిరతిశయ మయినయైశ్వర్యము గలవానిని, అట్టి నన్ను ఎఱింగి యనుట.

ఇఁక నధ్యాయతాత్పర్యము.—సమ్యగ్జ్ఞానమును సంపాదించి క్రమముగా నుపరతిఁ బొందినవానికిఁ గర్మసమాప్తి యేది గలదో అది సన్న్యాసము. శుద్ధచిత్తునకుఁ గర్మకౌశల మేది గలదో అది కర్మయోగము. ఆరెంటిచే బహుపుణ్యశాలి సర్వేంద్రియజన్యం బగుకర్మంబును జిత్తంబునఁ బ్రాణాయామముచే బ్రహ్మమునం దుంచుట యేది గలదో అందువలన నతఁడు పరమపదమును బొందుచున్నాఁడు. అని పంచమాధ్యాయమునందుఁ జెప్పఁబడినది.

రా. ఇప్పుడు చెప్పిన యోగశిరస్క మగునిత్యనైమిత్తికకర్మానుష్ఠానరూపమయిన కర్మయోగము సుశకంబని* చెప్పుచున్నాఁడు.—యజ్ఞతపసాంభోక్తారమ్; సర్వలోకమహేశ్వరమ్; సర్వభూతానాం సుహృదమ్; మామ్; జ్ఞాత్వా, శాన్తిమృచ్ఛతి—కర్మయోగము చేయుటయందే సుఖమును బొందుచున్నాఁడు. సర్వలోకమహేశ్వ

* సులభముగా సాధ్యం బని.

రమ్ = ఎల్లలోకేశ్వరులకును ఈశ్వరుని "తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్" అని గదా శ్రుతి చెప్పుచున్నది. సర్వలోకమహేశ్వరుఁడు గాను సర్వసుహృదుఁడు గాను నన్నుఁ దెలిసి నన్నారాధించుట కర్మయోగం బని దానియందు సుఖంబునఁ బ్రవర్తించుచున్నాఁ డని యర్థము. సుహృదుని నారాధించుట కెవ్వఁడును బ్రయత్నింతురు గదా!

నేను యజ్ఞంబులను దపస్సులను భుజించువాఁడను సర్వలోకమహేశ్వరుఁడను సర్వభూతంబులకు సుహృదుండను అని యెఱింగి, కర్మయోగానుష్ఠానమునఁ గాన న్నారాధించుటయె యగుటవలన దానియందు సుఖంబునఁ బ్రవర్తించుచున్నాఁ డని తాత్పర్యము.

మూ. ధ్యేయమును జెప్పుచున్నాఁడు భోక్తార మిత్యాదిగా.

---

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సన్న్యాసయోగో నామ పఞ్చమో ఽధ్యాయః.

వ్యాసప్రోక్త మయిన శతసహస్రగ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రంబును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు సన్న్యాసయోగం బనంబరఁగు పంచమాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమత్పవాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవద్గీ
తాంధ్రవ్యాఖ్యానంబునందుఁ
బంచమాధ్యాయ టీక.

---

పఞ్చాధ్యాయీ వైషా కృతాన్న గీతార్థవివృతి రఖిలేయమ్
పరిపూర్తి మియాయ దయితాత్ శ్రీమద్భగవత్ప్రసాదేన
ఘటయతు భాగవతీ మే ఝుగ్ఘటఘటనాపటీయసీ కరుణా
సాధనవికలస్యాపి చ గీతాపరమార్థచన్ద్రికాపూర్తిమ్.

శ్రీ

శ్రీ కృష్ణాయ నమః.

---

# శ్రీమద్భగవద్గీత

## చదలువాడ సుందరరామశాస్త్రులచే

వ్రాయఁబడిన గీతార్థసర్వస్వరూపమగు

## పరమార్థచంద్రిక

యను నాంధ్రవ్యాఖ్యానముతోఁ గూడినది.

సప్తమ అష్టాదశాధ్యాయములు

సంపుటము ౬.

---

చెన్నపురి

శారదాంబావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రితమయి ప్రకటింపఁబడెను.

శ్రీ రస్తు.

# అకారాది శ్లోకానుక్రమణిక.

## సప్తదశాధ్యాయము.



## అష్టదశాధ్యాయము.

# శుద్ధాశుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 10 | 18 | వాత్త్వికం | సాత్త్వికం |
| 28 | 8 | పురుషునని | పురుషునకు |
| 29 | 16 | ఆవలు | ఆవాలు |
| 34 | 22 | యొఱుంగు | యొఱుంగ |
| 36 | 16 | రహీనంబు | రహితంబు |
| 55 | 28 | ఓలిమి | ఓమితి |
| 68 | 8 | సంపిండి | సపిండి |
| 74 | 9 | షోడసా | సప్తదశా |
| 77 | 9 | బ్రహ్మ | బ్రహ్మ |
| 92 | 9 | నసుష్ఠింప | ననుష్ఠింప |
| 119 | 9 | పలము | ఫలము |
| 141 | 23 | నారకిత్త్వమ | నారకత్వము |
| 144 | 23 | సాంఖ్యాః | సాంఖ్య |
| 148 | 7 | కలేబర | కళేబర |
| 165 | 21 | ఏవనికి | ఎవనికి |
| 176 | 9 | పములు | త్తాపములు |
| 191 | 24 | పాధన | సాధన |
| 203 | 1 | శ్లో-౧౮ | శ్లో-౨౨ |
| 241 | 23 | వేల | వేళ |
| 242 | 7 | భోగోంతము | భోగాంతము |
| 243 | 26 | వేల | వేళ |
| 265 | 15 | జ్ఞానవిష్ఠా | జ్ఞాననిష్ఠా |
| ,, | 18 | దత్పురుఁడు | దత్పరుఁడు |
| 265 | 24 | పర్గ | వర్గ |
| 272 | 8 | బని | డని |
| 279 | 25 | నిఃమ | మని |
| 303 | 18 | సిద్ద | సిద్ధ |
| 305 | 28 | ఆత్మ | ఆత్మ |
| 310 | 5 | సిద్దించును? | సిద్ధించును? |
| 311 | 18 | దేనతల | దేవతల |
| 323 | 1 | శ్లో-౫౭ | శ్లో-౫౨ |
| 324 | 17 | వుండ | నుండ |
| 326 | 11 | వృతియి | వృత్తియు |
| 333 | 28 | జ్ఞాము | జ్ఞానము |
| 338 | ,, | ఆతను | ఆత్మను |
| 339 | 11 | వత్రిలు | వర్తిల్లు |
| 340 | 21 | న్వార్గమునఁ | స్వార్గమునఁ |
| 341 | 28 | బండోటి | బండోంటి |
| 351 | 22 | దానిసే | దానిసే |
| 369 | 18 | శుద్ధాతుఁడవు | శుద్ధాత్ముఁడవు |
| 395 | 28 | ఆత్మె | ఆత్మే |
| 396 | 9 | యథోకు | యథోక్తు |
| 397 | 6 | వృతి | వృత్తి |
| 400 | 28 | అతిత | అతీత |
| 426 | 6 | భత్రం | భక్తం |
| 429 | 28 | కొంజడి | కొంబడి |
| ,, | ,, | విడుమద | విడుమర |

# సంకేతాక్షరవివరణము.

భా. శంకరభాష్యము.

ఆ. ఆనందగిరికృత శంకరభాష్య టీక.

హ. హనుమద్విరచిత పైశాచభాష్యము.

శం. శంకరానందీయ గీతా తాత్పర్యబోధిని.

మ. మధుసూదనసరస్వతీరచిత గూఢార్థదీపిక.

శ్రీ. శ్రీధరస్వామిప్రణీత సుబోధిని.

ప. పరమార్థప్రపప, దైవజ్ఞసూర్యపండిత ప్రణీతము.

రా. రామానుజభాష్యము.

మా. మాధ్వభాష్యము.

శ్రీ ర స్తు.

శ్రీ గణేశ శారదా గురుభ్యో నమః.

పరమార్థచంద్రికాసహిత

# శ్రీ భగవద్గీత, సప్తదశాధ్యాయము.

కామక్రోధవిలోభవిహీనై స్సంప్రాప్యతే త్యహీనై ర్యా
నిజకర్మచరణనిపుణై స్తాం విద్యా మమ్బికాం వన్దే.
శాస్త్రపరతా తు దైవీ తద్విపరీతా ఽఽసురీచ సంపదితి
ఊచే సమాసతో యస్తం వన్దే కృష్ణ మాత్మానమ్.

అర్జున ఉవాచ.—

యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయా ఽన్వితాః
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వ మాహో రజ స్తమః. ౧

శంకరభాష్యము.—

తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే అను భగవద్వాక్యమువలనఁ బ్రశ్నబీజము నొందినవాఁడై యర్జునుఁ డి ట్లనియె.—యే = ఎవ్వరు, కొందఱు అవిశేషితులు *; శాస్త్రవిధిమ్ = శాస్త్రముయొక్క విధానమును, శ్రుతిస్మృతిశాస్త్రచోదనను; ఉత్సృజ్య=పరిత్యజించి; యజన్తే= దేవాదులఁ బూజించుచున్నారో; శ్రద్ధయా=ఆస్తిక్యబుద్ధితో; అన్వితాః= కూడినవారై. శ్రుతిరూపమును గాని స్మృతిరూపమును గాని యొకానొకశాస్త్రవిధి నెఱుంగక వృద్ధవ్యవహారమును మాత్రమే చూచి శ్రద్ధ గలవారై యెవ్వరు దేవాదులఁ బూజించుచున్నారో వా రిట "యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయా ఽన్వితాః" అనుచో గ్రహింపఁ బడుచున్నారు. ఎవరు మఱి యొకానొకశాస్త్రవిధి నెఱింగినవా రయ్యు దానిఁ బరిత్యజించి అయథావిధిగా దేవాదులఁ బూజించుచున్నారో వా రిక్కడ "యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే" అనువాక్యముచేఁ

* ఇట్టివా రని వేఱుగాఁ జెప్పనివారు, ఎవరైనను అనుట.

బరిగృహీతులు కారు. ఎందువలన? శ్రద్ధయా ఽన్వితాః అను విశేష్య ణము వలన. దేవాదిపూజావిధిపర మగు నొకానొకశాస్త్రము నెఱింగినవా రయ్యు శ్రద్ధ లేమిచే దాని విడిచి తద్విహిత మయిన దేవాది పూజయందు శ్రద్ధాన్వితులై ప్రవర్తింతు రని కల్పింప శక్యము కాదు ఎందువలననో అందువలనఁ బూర్వోక్తులే యేశాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయా ఽన్వితాః అనుచో గ్రహింపఁబడుచున్నారు. తేషామ్ = అట్టివారియొక్క; నిష్ఠాతు=అవస్థానమో *; కా = ఎట్టిది? కృష్ణ=కృష్ణా! సత్త్వమ్=సత్త్వమా? ఆహో=లేక; రజః=రజస్సా? లేక, తమః = తమస్సా? ఇది యభిప్రాయము. వారి దేవాదివిషయ మయిన పూజ యేది గలదో అది సాత్త్వికమా? లేక, రాజసమా? లేక, తామసమా? అని.

అర్జునుఁ డి ట్లనియె.—

కృష్ణా! ఎవరు శాస్త్రవిధానము నెఱుంగనివారై దాని విడిచి శ్రద్ధతో యజనము చేయుచున్నారో వారి యజనప్రకారము సాత్త్వికమా రాజసమా తామసమా? చెప్పు మని తాత్పర్యము.

ఆనందగిరికృత టీక.—

ఆస్తికులయు నాస్తికులయు శాస్త్రజ్ఞానము గలవారిగతి చెప్పఁబడినది. ఇప్పు డాస్తికు లయ్యు శాస్త్రానభిజ్ఞు లగువారిగతి నెఱుంగఁ గోరి యడుగుచున్నాఁ డని చెప్పుచున్నారు తస్మా దిత్యాదిగా. యజన్తే—యాగగ్రహణము దానాదుల కుపలక్షణము. వేదోక్త మగు విధి నెఱుంగక దాని విడుతు రేని ఎట్లు శ్రద్ధతో యాగాదికముఁ జేయఁగలరు? ప్రమాణముచేతనే గాని శ్రద్ధతో యాగాదికము చేయ శక్యము కాదు గదా యని యాశంకించి చెప్పుచున్నారు శ్రుతీత్యాదిగా. ఓయీ! శాస్త్రీయవిధి నెఱింగినవా రయ్యుఁ గొందఱు దాని నుపేక్షించి స్వేచ్ఛచొప్పున యాగాదులఁ జేయువారు కలరు, వారినే యిట యేశాస్త్రవిధి ముత్సృజ్య అనుచో గ్రహింపవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు ఎవరు· మఱి ఇత్యాదిగా. వారి నిట గ్రహింపరా దనుటకుఁ బ్రశ్నపూర్వకముగా హేతువుఁ జెప్పుచున్నారు ఎందువలన నిత్యాదిగా. శాస్త్రజ్ఞులై దాని నుపేక్షించువారి నిట

* ఉనికి.

గ్రహించినను విశేషణ మవిరుద్ధ మనఁగా వ్యాఘాతమువలన నట్లు శా దని చెప్పుచున్నారు దేవా దీత్యాదిగా. శాస్త్రోక్త మగు విధి నెఱింగియు దాని నిరాకరించి స్వేచ్ఛ మెయి దేవపూజాదులందుఁ బ్రవృత్తు లైనవారి కాసురులయందే యంతర్భావ మెందువలనఁ గడచినయధ్యాయమున సిద్ధ మయ్యెనో అందువలన ఆస్తికాధికారము నందువారికిఁ బ్రసక్తి సంభవింప దని చెప్పుచున్నారు ఎందువలననో ఇత్యాదిగా. పూర్వోక్తులు—శాస్త్రానభిజ్ఞులై వృద్ధవ్యవహారము ననుసరించువా రని యర్థము. వారిచే శ్రద్ధతోఁ జేయఁబడుకర్మము దేనియందుఁ జేరు నని యడుగుచున్నాఁడు తేషా మిత్యాదిగా. కానిష్ఠా యనుటను వివరించుచున్నారు సత్త్వమ్ ఇత్యాదిగా. కార్యములకుఁ గారణశబ్దములచే వ్యపదేశము నాశ్రయించి తాత్పర్యముఁ జెప్పుచున్నారు ఇది ఇత్యాదిగా.

హనుమద్విరచిత పైశాచభాష్యము.—

"జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి" అను భగవద్వచనమును విని యర్జునుఁ డి ట్లనియె.— శాస్త్రవిధానములఁ జూడక యెవ్వరు దేవతలఁ బూజించుచున్నారో వారి నిష్ఠ—స్థితి సత్త్వమా? రజమా? తమమా? అని యర్జునుని ప్రశ్నము.

శంకరానందీయ గీతాతాత్పర్యబోధిని.—

ఇట్లు దైవాసురసంపద్విభాగంబును దత్స్వరూపమును దత్ఫలంబును ఆసురులకు జ్ఞానమునం దధికారము లే దని బోధించుటకై యాసురసంపద గలవారి కామసంకల్పగుణకర్మములను తత్ఫలమును విశేషించి ప్రతిపాదించి ముముక్షువు శాస్త్రంబు నెఱింగి తదనుసారంబున నే కర్మము ననుష్ఠింపవలయు నని నిరూపించి యిప్పుడు శాస్త్రార్థానభిజ్ఞు లయ్యుఁ గామకారంబు విడిచి శాస్త్రీయ మగు కర్మమునే శ్రద్ధతో ననుష్ఠించునట్టి ముముక్షువులకును సాత్త్వికము లగు నాహారయజ్ఞతపోదానాదులయందే ప్రతిష్ఠితు లగువారలకు జ్ఞానాధికారంబును శమదమాది షట్కసంపత్తిచే సంప్రాప్త మగు జ్ఞానముచే మోక్షాధికారంబును యుక్తం బని బోధించుటకై సప్తదశాధ్యాయ మారంభింపఁబడుచున్నది. అందు మొదట "యశ్శాస్త్రవిధి ముత్సృజ్య" అనియు "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే" అనియు శాస్త్రవిధి నెఱింగియు దానిఁ ద్యజించి కామకారంబున నెవఁడు ప్రవర్తించుచున్నాఁడో యతం డాసురుఁడు వానికిఁ జిత్తశుద్ధి గాని జ్ఞానము గాని తత్ఫలము గాని

సిద్ధింప దని విని శాస్త్రార్థము నెఱుంగనివారై కామకారంబు విడిచి శ్రద్ధతోఁ గర్మములఁ జేయుచుండు పురుషులసంపద దైవమా ఆసురమా వారి కేమి గతి యని యెఱుంగఁగోరినవాఁడై యర్జునుఁ డి ట్లనియె.—యే = ఎవరు సామాన్యపురుషులు; శాస్త్రవిధిమ్ = శ్రుతిస్మృతిరూపము శాస్త్రము, దానియొక్కవిధిని – శ్రౌతస్మార్త సూత్రాధ్యయనంబును తదర్థజ్ఞానంబును లేమివలన అనుష్ఠానవిధిని; ఉత్సృజ్య – ఎఱుంగక; శ్రద్ధయా = వృద్ధవ్యవహారదర్శనమువలనఁ బుట్టినట్టి యాస్తిక్యబుద్ధిచేఁ గామకారము లేకయే నియతము లగు వైదికకర్మములయందు మిక్కిలి నమ్మకముతో; అన్వితాః = కూడినవార లగుచు; వైదికకర్మముచే దేవతలను; యజన్తే – శాస్త్రార్థము నెఱుంగకున్నను శ్రద్ధతోను భక్తితోను శ్రౌతస్మార్తకర్మముల నెవరు చేయుచున్నారో యని యర్థము తేషామ్ = శ్రద్ధతో వైదికకర్మమునందుఁ బ్రవృత్తు లగు నాపురుషులయొక్క; నిష్ఠా=స్థితి; కా=ఎట్టిది ? సత్త్వమ్, ఆహో రజః, తమః– కారణముచేఁ గార్యము గ్రహింపఁబడుచున్నది, తుశబ్దము పూర్వవ్యావృత్త్యర్థము, వారినిష్ఠ—వృత్తి మఱి సాత్త్వికమా ? రాజసమా ? లేక తామసమా ? చెప్పుము. ఇట సత్త్వశబ్దముచే దైవసంపదయు రజస్తమశ్శబ్దములచే నాసురసంపదయు వివక్షితములు, దైవాసురసంపదలయధికారవిచారమునం దారబ్ధ మగుటవలన. వారి సంపద దైవమా ఆసురమా అని ప్రశ్నార్థము. ఓయీ! యశ్శాస్త్రవిధి ముత్సృజ్య యను నీవచనముచేతనే శాస్త్రవిధి నుత్సర్జించి యెవఁడు ప్రవర్తించుచున్నాఁడో యతఁ డాసురుం డని వీరికిని ఆసురత్వము చెప్పఁబడియే యున్నది, నెండియు తేషాం నిష్ఠాతు కా కృష్ణ యని యర్జునుని ప్రశ్న మనుపపన్న మే యగు నందు వేని; సత్యము, శాస్త్రవిధ్యుత్సర్జనము వారికిని వీరికిని సమానమే యయినను వీరు శ్రద్ధాన్వితు లను విశేషణము గలవా రగుటవలన వారికిని వీరికిని విశేషము గలదు. కామకారతః అని వారియందుఁ గామకారవిశేషణంబును శాస్త్రవిధి ముత్సృజ్య అని యెఱింగియు శాస్త్రోల్లంఘనదోషవిశేషంబును జెప్పఁబడినందువలన వారికిని వారికిని భేదముండనే యున్నది. ఓయీ! శాస్త్రవిధ్యుత్సర్జనము వీరియందును ఉండనే యున్నది. లేదు. శాస్త్రవిధ్యుత్సర్జనపదముచే నిట శాస్త్రార్థాఽపరిజ్ఞానము వివక్షింపఁబడినది కాని యెఱింగి విధ్యుల్లంఘనము కాదు. ఓయీ! శాస్త్రార్థాఽనభిజ్ఞులై మూఢు లైనవారి కెట్లు వైదికకర్మమునందుఁ బ్రవృత్తి యగును? అనఁగాఁ జెప్పెదము: "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దే వేతరోజనః" అను న్యాయంబున జ్ఞానకర్మవృద్ధులప్రవృత్తిని జూచుటచే మూఢు లైనను శ్రద్ధావంతులై సద్బుద్ధు లగువారికి

వైదికకర్మమునందుఁ బ్రవృత్తి యుపపన్నము. యతులకు వృద్ధులు నమస్కరించుచుండఁగాఁ జూచి బాలురును నమస్కరింతురు గదా! అట్లు. అందువలన వారికిని వీరికిని విశేషణభేదమువలన భేదము సిద్ధించుచున్నది. అందువలననే యర్జునుచే నడుగంబడినది తేషాం నిష్ఠాతు కా కృష్ణ యని. కావున ననుపపత్తి యేదియు లేదు.

మధుసూదనసరస్వతీరచిత గూఢార్థదీపిక.—

కర్మానుష్ఠాతలు మూఁడువిధములై యున్నారు. కొందఱు శాస్త్రవిధి నెఱింగియు నశ్రద్ధచే దానిఁ బరిత్యజించి కామకారమాత్రంబున నేదో యొకటి యనుష్ఠింతురు. వారు సర్వపురుషార్థాయోగ్యు లగుటవలన నసురులు. కొందఱో శాస్త్రవిధి నెఱింగి శ్రద్ధ గలవారై తదనుసారంబుననే నిషిద్ధమును వర్జించుచు విహితము ననుష్ఠింతురు. వారు సర్వపురుషార్థములకును యోగ్యు లగుటవలన దేవశబ్దవాచ్యు లని పూర్వాధ్యాయాంతమున సిద్ధము. ఎవరు మఱి శాస్త్రీయవిధి నాలస్యాదివశంబున నుపేక్షించి శ్రద్ధతోనే వృద్ధవ్యవహారమాత్రంబున నిషిద్ధమును వర్జించుచు విహితము ననుష్ఠింతురో వారు శాస్త్రీయవిధ్యుపేక్షారూప మగు నాసురసాధర్మ్యముతోను శ్రద్ధాపూర్వకానుష్ఠానరూప మగు దేవసాధర్మ్యముతోను గూడినవా రగుటచే నసురులయం దంతర్భవింతురా? లేక, దేవతలయం దంతర్భవింతురా? అని యుభయధర్మములును గనఁబడుటవలనను ఏకకోటినిశ్చాయకము * కనఁబడమివలనను సందేహించుచున్నవాఁడై యర్జును డిట్లనియె.—యే=ఎవరు పూర్వాధ్యాయమున నిశ్చితులు గారో, దేవతలవలె శాస్త్రానుసారులు కారో; మఱే మనఁగా, శాస్త్రవిధిమ్=శ్రుతిస్మృతిచోదనను; ఉత్సృజ్య=ఆలస్యాదివశమువలన ఆదరింపక; అసురులవలె శ్రద్ధ లేక కాదు, మఱే మనఁగా వృద్ధవ్యవహారము ననుసరించి, శ్రద్ధయా అన్వితాః; యజన్తే=దేవపూజాదికముఁ జేయుచున్నారో; తేషాం నిష్ఠాతు=శాస్త్రవిధ్యుపేక్షచేతను శ్రద్ధచేతను బూర్వనిశ్చితు లైన దేవాసురులకంటె విలక్షణు లగు వారియొక్క నిష్ఠయో; కా=ఎట్టిది? వారి శాస్త్రవిధ్యనపేక్షంబును శ్రద్ధాపూర్వకంబు నగు నాయజనాదిక్రియావ్యవస్థితి, కృష్ణ = భక్తులపాపములను కర్షించువాఁడా! సత్త్వమ్=సాత్త్వికమా? ఆపక్షమున వారు సాత్త్వికు లగుటవలన దేవకోటిలోఁ జేరినవా రగుదురా? ఆహో — పక్షాంతరమునందు; రజఃతమః = రాజసమా? తామసమా? ఆపక్షమున రాజసతామసు లగుటవలన వా రసురు లగు

* ఒకపక్షమువారే యని నిశ్చయించుటకు హేతువు.

దురా? సత్త్వమ్మనునది యొకకోటి, రజస్తమః అనునది మఱియొకకోటి యని విభాగముఁ దెలుపుటకై ఆహో అనుశబ్దము.

శ్రీధరస్వామిప్రణీత సుబోధిని.—

ఇందు నుడివిన యధికారహేతువులను
సాత్త్వికశ్రద్ధ ముఖ్యమై శస్త మగుటఁ
బ్రభుఁడు తెలిపెడు శ్రద్ధ సప్తదశమందు
గుణములం ద్రివిధంబుగా గణన చేసి.

పూర్వాధ్యాయాంతమున "యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః । న స సిద్ధి మవాప్నోతి" అనువచనముచే శాస్త్రోక్తవిధి నుత్సర్జించి కామకారంబున వర్తించువానికి జ్ఞానమునం దధికారము లే దని చెప్పఁబడినది. అందు శాస్త్రవిధి నుత్సర్జించి కామకారము లేక శ్రద్ధతో వర్తించువారలకు నధికారము కలదా? లేదా? అని యెఱుంగఁగోరి యర్జును డిట్లనియె.—ఇట "శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే" అనుటచే శాస్త్రార్థము నెఱింగి దాని నుల్లంఘించి వర్తించువారు గ్రహింపఁబడరు, వారికి శ్రద్ధతో యజన మనుపపన్న మగుటవలన. ఆస్తిక్యబుద్ధి గదా శ్రద్ధ. అది శాస్త్రజ్ఞానవంతులకు శాస్త్రవిరుద్ధ మగు నర్థము నందు సంభవింపదు. వారినే యుద్దేశించి "త్రివిధా భవతి శ్రద్ధా, యజన్తే సాత్త్వికా దేవాన్" ఇత్యాదిగా నుత్తరముగూడ ననుపపన్నము. అందువలన నిట శాస్త్రోల్లంఘులు గ్రహింపఁబడరు. మ ఱే మనఁగా, క్లేశబుద్ధిచేఁ గాని యాలస్యమునఁ గాని శాస్త్రార్థజ్ఞానమునందు యత్నము చేయక కేవల మాచారపరంపరావశంబున శ్రద్ధతో నానాదేవతారాధనాదికర్మమునందుఁ బ్రవర్తించినవారు గ్రహింపఁబడుచున్నారు. కావున నిది యర్థము.—యే; శాస్త్రవిధిమ్; ఉత్సృజ్య = దుఃఖబుద్ధిచేఁ గాని ఆలస్యమునఁ గాని ఆదరింపక; కేవల మాచారప్రామాణ్యముచే శ్రద్ధతోఁ గూడినవారై, యజన్తే. తేషాంతు; నిష్ఠా = స్థితి యేది? ఆశ్రయ మేది? దానినే విశేషించి యడుగుచున్నాఁడు. — సత్త్వమ్ = సత్త్వమా? ఆహో = లేక; రజః = రజస్సా? లేక, తమః = తమస్సా? వారల తాదృశ మయిన దేవపూజాదిప్రవృత్తి సత్త్వసంశ్రితమా? రజస్సంశ్రితమా? తమస్సంశ్రితమా? అని యర్థము. శ్రద్ధ సాత్త్విక మగుటవలనను క్లేశబుద్ధిచేతఁ గాని యాలస్యముచేతఁ గాని శాస్త్రానాదరము రాజసతామసం బగుటవలనను మూఁడువిధ

ములస్వదేహము. వారు సత్త్వభావసంశ్రితు లగుదురేని అప్పుడు సాత్త్వికు లగుట వలన వారికిని యథోక్తాత్మజ్ఞానమునం దధికారము కలుగును. కాదేని కలుగ దని ప్రశ్నతాత్పర్యార్థము.

పరమార్థప్రప దైవజ్ఞసూర్యపండితప్రణీతము.—

పూర్వాధ్యాయాంతమున "యశ్శాస్త్ర విధి ముత్సృజ్య" ఇత్యాది వచనముచే శాస్త్రవిధి నుల్లంఘించి ప్రవృత్తుఁ డగువానికి సిద్ధి కలుగ దని చెప్పఁబడినది. అందువలన నిట్లు ప్రశ్న సేయుచు నర్జునుం డిట్లనియె.— యే; శాస్త్ర విధిమ్ = విధినిషేధాత్మకమును; ఉత్సృజ్య = దుఃఖబుద్ధివలనఁ గాని ఆలస్యము వలనఁ గాని ఆదరింపక; కేవలము లోకికాచారపరంపరచేత, శ్రద్ధాన్వితులై, యజన్తే. తేషామ్; కా నిష్ఠా=ఏది యాశ్రయము? సత్త్వమా రజమా తమమా? "యజన్తే సాత్త్వికా దేవాన్" ఇత్యాదిప్రకారము ఫలము కలదా లేదా యని ప్రశ్నార్థము.

రామానుజభాష్యము.—

దేవాసుర సంప ద్విభాగకథనద్వారమునఁ బ్రాప్యతత్త్వజ్ఞానంబును దత్ప్రాప్త్యుపాయజ్ఞానమును వేదైకమూలం బని ప్రతిపాదింపఁబడినది. ఇప్పుడు అశాస్త్రవిహితం బాసుర మగుటచే నిష్ఫలం బనియు, శాస్త్రవిహితము గుణములచేఁ ద్రివిధం బనియు శాస్త్రసిద్ధముయొక్కలక్షణంబును జెప్పఁబడుచున్నది. అందు అశాస్త్రవిహితము నిష్ఫలం బని యెఱుంగనివాఁడై యశాస్త్రవిహితంబును శ్రద్ధాసంయుక్తము నగు యాగాదికమునందు సత్త్వాదినిమిత్తఫలభేదము నెఱుంగఁగోరి యర్జునుం డడుగుచున్నాఁడు.—శాస్త్రవిధి ముత్సృజ్య, శ్రద్ధయా అన్వితాః, యే యజన్తే. తేషాం నిష్ఠా కా? ఏమి సత్త్వమా? లేక రజస్సా? కాదేని తమమా? నిష్ఠ యనఁగా స్థితి. స్థీయతే అస్మిన్ — దీనియం దుండుట యగుచున్నది కావున సత్త్వాదికమే నిష్ఠ యని చెప్పఁబడుచున్నది. వారిస్థితి సత్త్వమునందా? రజమునందా? లేక తమమునందా? అని యర్థము.

మాధ్వభాష్యము.—

సర్వగుణపూర్ణాయ నమః॥ ఓం॥ శ్రీః॥ గుణభేదములను బ్రపంచించుచున్నాఁ డీయధ్యాయముచేత. శాస్త్రవిధిమ్; ఉత్సృజ్య = ఎఱుంగక; "వేదః

కృత్స్నో ఽధిగన్తవ్య స్సరహస్యో ద్విజన్మనా" * అను విధి యుత్సృష్టము గదా వారిచేత. "యే వై వేదం న పఠన్తే నచార్థం వేదో ఽజ్ఞాం స్తాన్విద్ధి సామాన బుద్ధీన్" ◆ అని మాధుచ్ఛందసశ్రుతి. కాదేని తామసు లనియే చెప్పఁబడును. మఱి విభజించి చెప్పఁబడదు. వారు సాత్త్వికు లగుదురేని యుత్సృష్టశాస్త్రులు కారు. వేదవిరుద్ధము ధర్మము కాదు గదా! "వేదో ఽఖిలో ధర్మమూలం స్మృతిశీలే చ తద్విదామ్" § అని గదా స్మృతి. "వేదప్రణిహితో ధర్మో హ్యధర్మ స్తద్విపర్యయః" † అనియు భాగవతమునందు.

శ్రీ భగవానువాచ.—

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. ౨

**భా.** సామాన్యవిషయంబీప్రశ్నము విభజింపక ప్రతివచనంబున కర్హము కాదని శ్రీభగవంతుఁ డిట్లనియె.—త్రివిధా=మూఁడువిధములు గలది; భవతి=అగుచున్నది; శ్రద్ధా = ఏనిష్ఠవిషయ మయి నీ వడుగుచున్నావో ఆశ్రద్ధ. దేహినామ్=ప్రాణులకు; సా=ఆశ్రద్ధ; స్వభావజా=జన్మాంతరకృతం బగు ధర్మాదిసంస్కారము మరణకాలమునం దభివ్యక్త మగునది స్వభావ మనఁబడుచున్నది, దానివలనఁ బుట్టినది స్వభావజము. సాత్త్వికీ=సత్త్వనిర్వృత్తము దేవపూజాదివిషయము; రాజసీచైవ=రజోనిర్వృత్తము యక్షరాక్షసపూజాదివిషయము; తామసీచ=తమోనిర్వృత్తము ప్రేతపిశాచాదిపూజావిషయము; ఇతి=ఇట్లు, త్రివిధము. తామ్=దాని, నాచేఁ జెప్పఁబడుదాని; శృణు = వినుము.

శ్రద్ధ మూఁడువిధములు గలది, అది దేహులకుఁ బూర్వజన్మమందలి ధర్మాదిసంస్కారరూప మగు వాసనవలనఁ బుట్టునది. సాత్త్విక మనియు రాజస మనియుఁ దామస మనియు నామూఁడువిధములం జెప్పెద విను మని తాత్పర్యము.

---

* బ్రాహ్మణుఁడు సమస్తవేదమును సరహస్యముగా నధ్యయనము చేయవలయును.

◆ ఎవరు వేదమును బఠింపరో దానియర్థము నెఱుంగరో వారు గొప్పబుద్ధి గలవారలైనను వేదపరిత్యాగు లని యెఱుంగుము.

§ వేద మఖిలంబును వేదవిదులస్మృతిశీలంబులును ధర్మమూలములు.

† వేదవిహితము ధర్మము, తద్విపరీత మధర్మము.

ప్ర. వానికిఁ బ్రతివచనము శ్రీభగవంతుఁ డిట్లనియె.—శ్రద్ధా = ఆస్తిక్య బుద్ధి. స్వభావజా — జన్మాంతరానుష్ఠిత పుణ్యాపాపసంస్కారము మరణకాలమునం దభివ్యక్త మగునది స్వభావ మని చెప్పఁబడుచున్నది. సాత్త్వికీ — సత్త్వమునందుఁ బుట్టినది.

శం. కారణ మెఱిఁగినయెడఁ గార్యముఁ దెలుప శక్య మగుం గాని కారణము దెలియకున్నపుడు శక్యము కాదు. కావునఁ గారణ మగు శ్రద్ధాభేదముఁ దెలిపి నిష్ఠాభేదముఁ దెలుపుటకై శ్రీభగవంతుఁ డిట్లనియె.—దేహినామ్=ప్రాణుల యొక్క; శ్రద్ధా; సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి; త్రివిధా=మూఁడువిధములు గలది, మూఁడువిధములు గానే భిన్నమగుచున్న దని యర్థము. శ్రద్ధ మూఁడు విధము లగుటకుఁ గారణముఁ జెప్పుచున్నాఁడు.—స్వభావజా = "ఆయుః కర్మచ విత్తంచ విద్యా నిధన మేవచ। పఞ్చైతాని విలిఖ్యన్తే గర్భ స్థస్యైవ దేహినః" * అనువచనముచేఁ బూర్వజన్మకృతపుణ్యాపుణ్యాదిసంస్కారము స్వభావము, తనతోఁగూడఁ బుట్టునది కావున స్వభావము, దానివలనఁ బుట్టినది స్వభావజము. లేక, స్వభావ మనఁగా సత్త్వరజస్తమోగుణాత్మక మగు ప్రకృతి, దానివలనఁ బుట్టినది స్వభావజము. అందువలననే సత్త్వాదిగుణభేదమువలన శ్రద్ధయును సాత్త్వికము రాజసము తామసము అని భేద ముపపన్న మని యర్థము. ఏది ప్రధానముగాఁ గల క్రియయందు వర్తించుపురుషులనిష్ఠను ఏ వడుగుచున్నావో; తామ్=ఆశ్రద్ధను; నాచేఁ జెప్పఁబడుచున్నదాని, శృణు—శ్రద్ధాసంభవప్రకారమును విను మని యర్థము.

మ. ఎవరు శాస్త్రవిధి నుత్సర్జించి శ్రద్ధతో యజించుచున్నారో వారు శ్రద్ధాభేదమువలన భిన్ను లగుచున్నారు. అందు ఎవరు సాత్త్వికశ్రద్ధ గలవా రగుదురో వారు దేవతలు, శాస్త్రోక్తసాధనముసం దధికృతు లగుదురు, తత్ఫలంబునుం బడయుదురు. ఎవరు మఱి రాజసము గాని తామసము గాని శ్రద్ధ గలవారలో వార లసురులు, శాస్త్రీయసాధనమునం దధికృతులు గారు, తత్ఫలంబును గాని పొందరు. అని వివేచించి యర్జునుని సందేహముఁ దొలఁగింపఁ దలఁచినవాఁడై శ్రీభగవంతుఁ డిట్లనియె.—యశ్రద్ధతోఁ గూడినవారై శాస్త్రవిధి నుత్సర్జించి యజించుచున్నారో, సా = ఆశ్రద్ధ; దేహినాం స్వభావజా—జన్మాంతరకృత మగు ధర్మాధర్మాది

* ఆయువును కర్మమును చిత్తమును విద్యయు మరణమును—ఈ యైదును గర్భమున నున్నపుడే దేహికి వ్రాయఁబడుచున్నవి.

శుభాశుభసంస్కార మిప్పటిజన్మమున కారంభక మగునది స్వభావము, అది మూఁడువిధములు సాత్త్వికమును రాజసమును తామసము నని; దానిచేఁ బుట్టిన శ్రద్ధ; త్రివిధా భవతి—మూఁడువిధములు గలది యగుచున్నది సాత్త్వికియు రాజసియుఁ దామసియు నని, కార్యము కారణానురూప మగుటవలన. ఏది మఱి జన్మారబ్ధ మయినపుడు విద్వాంసులకు శాస్త్రసంస్కారమాత్రమునఁ బుట్టినశ్రద్ధ గలదో అది కారణ మేకరూప మగుటవలన నేకరూపము సాత్త్వికమే యగును, రాజసి గాని తామసి గాని కానేర దని మొదటిచకారమున కర్థము. శాస్త్రనిరపేక్షమై ప్రాణిమాత్రసాధారణ మగునది స్వభావజము, అదియే స్వభావము మూఁడువిధము లగుటవలన మూఁడువిధము లని యేవకారమున కర్థము. చెప్పిన మూఁడువిధములను సముచ్చయించుచున్నది రెండవచకారము. ఎందువలనఁ బ్రాగ్జన్మకృతవాసన యనఁబడు స్వభావము నభిభవించునట్టి శాస్త్రీయవివేకజ్ఞానము శాస్త్రము నాదరింపనిదేహులకు లేదో అందువలన వారికి స్వభావవశమువలన మూఁడువిధము లగుచున్న, తామ్ = ఆశ్రద్ధను; శృణు = వినుము. విని దేవాసుర భావమును నీవే నిశ్చయించుకొను మని యర్థము.

శ్రీ. అందుల కుత్తరమును శ్రీభగవంతుఁ డి ట్లనియె.—ఇది యర్థము. శాస్త్రతత్త్వజ్ఞానమువలనఁ బ్రవర్తించువారలకుఁ బరమేశ్వరపూజావిషయ మగు శ్రద్ధ సాత్త్వికం బొక్కటేవిధం బగును. లోకాచారమాత్రంబునఁ బ్రవర్తించు దేహుల కేశ్రద్ధ గలదో అది మాత్రము సాత్త్వికి రాజసి తామసి యని త్రివిధ మగుచున్నది. అందులకు హేతువు.—స్వభావజా = స్వభావము పూర్వజన్మసంస్కారము, దానివలనఁ బుట్టినది స్వభావజము. స్వభావమును మార్చుటకు శాస్త్రోక్త వివేకజ్ఞానము గదా సమర్థము, అదియో వారికి లేదు. అందువలనఁ గేవలము పూర్వస్వభావముచేతనే కలుగునది కావున వారిశ్రద్ధ త్రివిధ మగుచున్నది. తామ్= ఆ మూఁడువిధము లయిన శ్రద్ధను; శృణు. అది చెప్పఁబడినది " వ్యవసాయాత్మికా బుద్ధి రేకైవ కురునన్దన " ఇత్యాదిగా.

ప. ఓయీ! శాస్త్రవిధి నుల్లంఘించుట శాస్త్రార్థము నెఱుంగకయా? ఎఱింగియా? మొదటిపక్షము కాదు, అప్పుడు యజనము సంభవింపమివలన. రెండవదియుఁ గాదు, అప్పుడు శ్రద్ధ సంభవింపమివలన. ఆస్తిక్యబుద్ధి గదా శ్రద్ధ. అది శాస్త్రజ్ఞానవంతులకు శాస్త్రవిరుద్ధమునందు సంభవింపదు. అని పర్యాలోచించి శ్రీభగవంతుఁ డి ట్లనియె.—దేహినామ్=మనుష్యులకు; స్వభావజా శ్రద్ధా త్రివిధా

భవతి — ప్రాచీనసంస్కారము స్వభావము, అందువలనఁ బుట్టినది స్వభావజము, స్వభావము మార్చుటకు సమర్థము శాస్త్రజన్యజ్ఞానము, అదియో వారికి లేదు కావునఁ గేవలము సత్త్వ రజ స్తమః ప్రధానం బగు ప్రాచీనసంస్కారముచేఁ బుట్టినశ్రద్ధ త్రివిధ మగుచున్నది. తాం శృణు.

**రా.** ఇట్లనుగంబడినవారికై భగవంతుఁ డశాస్త్రవిహితశ్రద్ధయుఁ దస్వార్థక మగు యాగాదికంబును నిష్ఫలంబు లని హృదయంబున నుంచికొని శాస్త్రీయ మగు యాగాదికమే గుణములవలనఁ ద్రివిధం బని ప్రతిపాదించుటకై శాస్త్రీయశ్రద్ధ త్రివిధం బని చెప్పుచున్నాఁడు.—సర్వదేహులకును శ్రద్ధ త్రివిధ మగుచున్నది. అదియు, స్వభావజా = స్వభావము—తన కసాధారణ మైన భావము ప్రాచీనవాసనాజన్య మగు తత్తద్రుచివిశేషము, ఎచ్చట రుచి యున్నదో అచ్చట శ్రద్ధ పుట్టుచున్నది, శ్రద్ధ యనఁగాఁ దన యభిమతంబు నిది సాధించు నని విశ్వాసపూర్వక మగు తత్సాధనమునందలి త్వర, వాసనయు రుచియు శ్రద్ధయు ఆత్మధర్మములు గుణసంసర్గజన్యములు, ఆయాత్మధర్మము లగు వాసనాదులకు జనకములు దేహేంద్రియాంతఃకరణవిషయగతము లగు ధర్మములును కార్యముచేతమాత్రమే నిరూపణీయములు నగు సత్త్వాదిగుణములు, సత్త్వాదిగుణయుక్తదేహాద్యనుభవజన్యంబు లని యర్థము. అందువలన నాశ్రద్ధ సాత్త్వికియు రాజసియు తామసియు నని త్రివిధము. తామ్=ఆయా శ్రద్ధను; శృణు—ఆ శ్రద్ధ యేస్వభావము గలదో ఆస్వభావమును వినుము సి యర్థము.

**మూ.** అందువలన విభజించి చెప్పుచున్నాఁడు త్రివి ధేత్యాదిగా.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః. 3

**భా.** ఇట్లు త్రివిధంబై యది.— సత్త్వానురూపా = విశిష్టసంస్కారయుక్త మైన యంతఃకరణమున కనురూపము; సర్వస్య = సమస్త మైన ప్రాణిజాతమునకు; శ్రద్ధా = శ్రద్ధ; భవతి = అగుచున్నది. భారత = అర్జునా! ఐన నేమి? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—శ్రద్ధామయః=శ్రద్ధాప్రాయుఁడు; అయం పురుషః = ఈ సంసారి యగు జీవుఁడు. ఎట్లు? యః = ఎవఁడు; య చ్ఛ్రద్ధః = ఏశ్రద్ధ యేజీవునకుఁ గలదో వాఁడు యచ్ఛ్రద్ధుఁడు, ఎట్టి శ్రద్ధ గలవాఁడో; సః = ఆ జీవుఁడు; స ఏవ — ఆశ్రద్ధ కనురూపుఁడే యగుచున్నాఁడు.

ప్రాణుల కంతఃకరణ మెట్టి సంస్కారము గలిగి యుండునో అట్టి సంస్కారముతోఁ గూడిన యంతఃకరణమున కనురూపముగా * శ్రద్ధ యుండును. అర్జునా! అందువలన నెవని కెట్టి శ్రద్ధ యుండునో ఆశ్రద్ధయె వాని స్వరూపము, అనఁగా వానిప్రవృత్తి యంతయు నాశ్రద్ధ కనురూప మగు నని తాత్పర్యము.

ఆ. ప్రాచీనకర్మముచే నుద్బోధిత మగు త్రివిధవాసన స్వభావ మనంబడు నది త్రివిధ మగు శ్రద్ధకు నిమిత్త మని చెప్పఁబడినది. ఇప్పు డాశ్రద్ధకు నుపాదాన కారణముఁ దెలుపుచున్నారు సత్త్వేత్యాదిగా. విశిష్టచిత్త ముపాదానముగాఁ గలది శ్రద్ధ, ఆచిత్తము త్రివిధ మగుటచేఁ ద్రివిధ మని పూర్వార్థమున కర్థము. నిష్ఠయొక్క సత్త్వాదిభేదము నడుగఁగా శ్రద్ధ మూఁడువిధము లని నిరూపించుట యె ట్లుపయోగించు నని తలంచి శంకించుచున్నాఁడు ఐన నేమి యని. శ్రద్ధేయ మగు విషయము నభిధ్యానించుచు దానిచే దానియందే ప్రవర్తించు నని తలఁచి పరిహరించుచున్నారు చెప్పుచున్నాఁడు అని. శ్రద్ధామయత్వమును బ్రశ్నపూర్వకముగా నిరూపించుచున్నారు ఎట్లు అని. శ్రద్ధయే గదా యధికారిపురుషునందుఁ బ్రాచుర్యమునఁ బ్రకృతము, కావున వాఁడు శ్రద్ధామయుం డనుట సిద్ధ మని యర్థము.

హ. సత్త్వానురూపా = స్వభావానురూపము. శ్రద్ధ ప్రాచుర్యంబున నేపురుషునందుఁ గలదో అతఁడు శ్రద్ధామయుఁడు. ధర్మాదులందు కల దనుబుద్ధి యేది కలదో అది శ్రద్ధ. ఏశ్రద్ధ సాత్త్వికము గాని రాజసము గాని తామసము గాని యెవ్వనికిఁ గలదో అతఁడు యచ్ఛ్రద్ధుఁడు. సః=ఆ పురుషుఁడు; స ఏవ=ఆశ్రద్ధయే; ఆశ్రద్ధ కనురూపము లయిన కర్మఫలముల నొందువాఁడు. ఓయీ! శ్రద్ధాశబ్దము స్త్రీలింగమై యుండఁగా స ఏవ అని పుల్లింగముగా నెట్లు ప్రయోగింపవచ్చును? అందు వేసి, ఇది దోషము కాదు, సర్వనామం బభిధేయపరం బగుటచే నభిధేయము యొక్కలింగమునే పొందుటవలన.

శం. దానిఁ జెప్పుచున్నాఁడు.—సత్త్వానురూపా = సత్త్వ మనునది రజస్తమములకు నుపలక్షణము, సత్త్వరజస్తమోగుణముల కనురూపము, గుణత్రయ భేదము ననువర్తించినది; సర్వస్య = సమస్తప్రాణిజాతమునకు; శ్రద్ధా; భవతి. పుణ్యాపుణ్యకర్మవశమువలన నంతఃకరణమునందు విజృంభిత మగు సత్త్వాదిగుణ భేదము నాశ్రయించియే పురుషులకు శ్రద్ధ యుండును గాని పురుషభేదము నాశ్రయించి కా దని యర్థము. ఓయీ! సత్త్వాదిగుణానుగుణమే శ్రద్ధ యగుఁగాక,

* అంతఃకరణసంస్కారమున కనురూపముగా ననుట.

ప్రకృతమున నేమి వచ్చె ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—అయమ్ = ఇందుచే దృష్ట వ్యవహారుఁ డగు * పురుషుఁడు గ్రహింపఁబడుచున్నాఁడు, ఈ ప్రత్యక్షుఁడై వ్యవహారవిషయ మగు పురుషుఁడు; శ్రద్ధామయః = అధికారిపురుషునియందు శ్రద్ధ ప్రాచుర్యంబునఁ గన బడుచున్నది కావున నితఁడు శ్రద్ధామయుఁడు, శ్రద్ధాప్రధానుఁ డగుటవలన శ్రద్ధామయుఁ డని చెప్పఁబడుచున్నాఁ డని యర్థము. ఓయీ! పురుషుఁడు శ్రద్ధామయుం డనుట సిద్ధమైనను కా నిష్ఠా యను ప్రశ్న కేమి యుత్తర మనఁగాఁ జెప్పుచున్నాఁడు.—యః=ఏయధికారి యగు పురుషుఁడు, స్వధర్మనిష్ఠుఁడు; యచ్ఛ్రద్ధః = ఏగుణముచే సంభావిత మగు శ్రద్ధ గలవాఁడో; సః = ఆ పురుషుఁడు; స ఏవ = ఆ గుణమే యగుచున్నాఁడు. సత్త్వగుణసంభావిత మగు శ్రద్ధ గలవాఁడు సాత్త్వికుఁడును రజోగుణసంభావిత మగు శ్రద్ధ గలవాఁడు రాజసుఁడును తమోగుణసంభావిత మగు శ్రద్ధ గలవాఁడు తామసుఁడును అగుచున్నాఁ డని యర్థము. శ్రద్ధ సత్త్వధర్మమే గాని రజస్తమోగుణధర్మము కాదు సత్యమే, అయినను రజస్తమంబులు ప్రధానంబులై యున్నను అట సత్త్వ ముపసర్జనముగా సంభవించుటవలన నవి గలవారియందును తద్ధర్మాభాసము శ్రద్ధాభాసకమ్ము సంభవించుచున్నది. అందువలననే చెప్పఁబడినది యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః అని. ఇందుచేత సత్త్వరజస్తమోగుణసంభావితము లగు శ్రద్ధలు గలవారలనిష్ఠ క్రమంబున సాత్త్వికి రాజసి తామసి యని యుత్తరము సూచిత మగుచున్నది. అందువలన సాత్త్వికులకు దైవసంపదయు రాజసతామసుల కాసురసంపదయు నని సిద్ధము.

మ. పూర్వజన్మప్రాప్తమై యంతఃకరణగత మగు వాసన యను నిమిత్తకారణముయొక్క వైచిత్ర్యముచేత శ్రద్ధావైచిత్ర్యముఁ జెప్పి తదుపాదానకారణ మగు నంతఃకరణముయొక్క వైచిత్ర్యముచేతఁగూడ దానివైచిత్ర్యముఁ జెప్పుచున్నాఁడు.—సత్త్వము—ప్రకాశశీల మగుటవలన సత్త్వప్రధానములై త్రిగుణములగు నపంచీకృతపంచభూతముల కార్య మగు నంతఃకరణము. అది యొకచో నుద్రిక్తసత్త్వమే యగును దేవతలకుఁబోలె. ఒకచో రజోగుణముచే నభిభూత మగు సత్త్వము గలది యగును యక్షాదులకుఁబోలె. ఒకచో తమముచే నభిభూత మగు సత్త్వము గలది యగును ప్రేతభూతాదులకుఁబోలె. మనుష్యులకో ప్రాయికముగా వ్యామిశ్రమే యగును. అదియు శాస్త్రీయవిజ్ఞానముచే రజస్తమముల నభిభవించి యుద్భూతసత్త్వముగాఁ జేయఁబడుచున్నది. శాస్త్రీయవివేకవిజ్ఞానశూన్యమువకో,

* చూడఁబడిన వ్యవహారము గలవాఁడు, అనఁగఁ గనఁబడువ్యవహారమునకు విషయమైన వాఁడనుట.

సర్వస్య = సమస్తప్రాణిజాతమునకు; సత్త్వానురూపా శ్రద్ధా భవతి—అంతఃకరణము సత్త్వప్రధాన మైనయెడ సాత్త్వికియు రజఃప్రధాన మైనయెడ రాజసియు తమఃప్రధాన మైనయెడ తామసియు నగుచున్నది. భారత = ఓ మహాకులప్రసూతుఁడా! లేక, జ్ఞాననిరతుఁడా! అని శుద్ధసాత్త్వికత్వమును సూచించుచున్నాఁడు. ఏది నీ వడిగితివో తేషాం నిష్ఠాతు కా అని, దాని కుత్తరము వినుము. అయమ్ = శాస్త్రీయజ్ఞానశూన్యుఁ డగు కర్మాధికృతుఁ డైన యీపురుషుఁడు, త్రిగుణాంతఃకరణ సంపిండితుఁడు; శ్రద్ధామయః — ప్రాచుర్యంబున వీనియందు శ్రద్ధ ప్రకృతం బని తత్ప్రకృతవచనంబునందు మయట్ప్రత్యయము, అన్నమయము యజ్ఞం బనునట్లు. అందువలన, యః = ఎవఁడు; యత్ శ్రద్ధః = ఏశ్రద్ధ సాత్త్వికము గాని రాజసము గాని తామసము గాని గలవాఁడో, స ఏవ = శ్రద్ధానురూపుఁడే; సః—సాత్త్వికుఁడు గాని రాజసుఁడు గాని తామసుఁడు గాని యగుచున్నాఁడు. శ్రద్ధచేతనే నిష్ఠ వ్యాఖ్యాత మని యభిప్రాయము.

శ్రీ. ఓయీ! శ్రద్ధ సాత్త్వికమే, సత్త్వకార్యం బని నీవే భగవంతుఁడ వుద్ధవునకుఁ జెప్పుటవలన, ఎట్లనఁగా "శమో దమ స్తితి క్షేక్షా తప స్సత్యం దయా స్మృతిః। తుష్టి స్త్యాగో ఽస్పృహా శ్రద్ధా హ్రీ ర్దయాది స్స్వనిర్వృతిః" ఇవి సత్త్వముయొక్కవృత్తు లని. అందువలన నె ట్లది త్రివిధ మని చెప్పవచ్చును? సత్యము. ఐనను రజస్తమోయుక్తపురుషాశ్రయం బగుటచే రజస్తమోమిశ్రమై సత్త్వము త్రివిధం బగుటవలన శ్రద్ధకును త్రైవిధ్యము ఘటిల్లుచున్న దని చెప్పుచున్నాఁడు.—సత్త్వానురూపా = సత్త్వతారతమ్యము ననుసరించునది; సర్వస్య — వివేకికిఁ గాని అవివేకికిఁ గాని లోకమునకు; శ్రద్ధా భవతి. అందువలన, అయమ్ = ఈ లౌకికపురుషుఁడు; శ్రద్ధామయః = శ్రద్ధావికారుఁడు, త్రివిధ మయిన శ్రద్ధచే వికారము నొందుచున్నాఁ డని యర్థము. దానినే చెప్పుచున్నాఁడు.—యో యత్ శ్రద్ధః—ఎవని కెట్టి శ్రద్ధగలదో; స ఏవ సః—అట్టి శ్రద్ధతోఁ గూడినవాఁడే యతఁడు. ఎవఁడు మున్ను సత్త్వోత్కర్షముచే సాత్త్వికశ్రద్ధతోఁ గూడినవాఁ డగునో అతఁడు మఱి యట్టివాఁడు — తనసంస్కారముచే సాత్త్వికశ్రద్ధతోఁ గూడినవాఁడే యగుచున్నాఁడు, ఎవఁడు రజోగుణోత్కర్షముచే రాజసశ్రద్ధ గలవాఁ డగునో వాఁ డట్టివాఁడే యగుచున్నాఁడు, ఎవఁడు తమోగుణోత్కర్షముచే తామసశ్రద్ధతోఁ గూడినవాఁడో అతఁడు నట్టివాఁడే యగుచున్నాఁడు. లోకాచారమాత్రంబునఁ బ్రవర్తించువారల కీవిధము సాత్త్విక రాజస తామస శ్రద్ధావ్యవస్థ. శాస్త్రజనిత

వివేకజ్ఞానముగలవారికో స్వభావనిగ్రహముచే సాత్త్వికి యొక్క టే శ్రద్ధ యని ప్రకరణార్థము.

ప. దానినే చెప్పుచున్నాఁడు.——సర్వస్య = సమస్తప్రాణికిని; శ్రద్ధా; సత్త్వానురూపా — విశిష్టసంస్కారోపస్కృత మయిన యంతఃకరణమున కనురూప మని చెప్పవలయును. ఎందువలన ననఁగా ఆస్తిక్యబుద్ధి సత్త్వము లేక యుత్ప న్నము గాదు. అయినను గుణప్రాధాన్యవశమువలనఁ త్రివిధ మగుచున్నది. ఇట్లు, అయమ్ — సంసారిపురుషుఁడు; శ్రద్ధామయః = త్రివిధ మగు శ్రద్ధచే వివిక్తుఁడు. దానిఁ జెప్పుచున్నాఁడు.—యో య చ్ఛ్రద్ధః—ఎవ్వఁ డెట్టి శ్రద్ధ గలవాఁడో; స ఏవ సః — అట్టి శ్రద్ధతోఁ గూడినవాఁడే యాతఁడు.

రా. సత్త్వము——అంతఃకరణము. పురుషుల కందఱకును అంతఃకరణాను రూపము శ్రద్ధ యగుచున్నది. అంతఃకరణ మెట్టి గుణముతోఁ గూడినదో తద్విషయ మయిన శ్రద్ధ పుట్టుచున్న దని యర్థము. సత్త్వశబ్దము పూర్వోక్తదేహేంద్రియాది ప్రదర్శనార్థము. శ్రద్ధామయో ఽయం పురుషః—శ్రద్ధామయః=శ్రద్ధాపరిణామము. యో య చ్ఛ్రద్ధః—ఏపురుషుఁ డెట్టి శ్రద్ధతోఁ గూడినవాఁడో; స ఏవ సః = అతం డట్టి శ్రద్ధయొక్క పరిణామము. పుణ్యకర్మవిషయంబున శ్రద్ధాయుక్తుఁ డగునేని పుణ్యకర్మఫలసంయుక్తుఁ డగుచున్నాఁడు. ఇట్లు శ్రద్ధాప్రధానము ఫలసంయోగ మని ప్రతిపాదిత మగుచున్నది.

మా. సత్త్వానురూపా = చిత్తమున కనురూపము. యో య చ్ఛ్రద్ధ స్స ఏవ సః — సాత్త్వికశ్రద్ధుఁడు సాత్త్వికుఁడు — ఇత్యాదిగా.

> యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః
>
> ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజన్తే తామసా జనాః. ౪

భా. అందువలనఁ గార్యమును హేతువుగా గ్రహించి దేవాదిపూజచే సత్త్వాదినిష్ఠ ననుమానింప వలయు నని చెప్పుచున్నాఁడు.——సాత్త్వికాః = సత్త్వనిష్ఠులు; దేవాన్ = దేవతలను; యజన్తే = పూజింతురు. రాజసాః = రజోనిష్ఠులు; యక్షరక్షాంసి = యక్షులను రాక్షసులను; యజన్తే * = పూజింతురు. అన్యే = ఇతరులు; తామసాః = తమో*

---

* అధ్యాహార్యము.

**నిష్ఠ లగు; జనాః=జనులు; ప్రేతాన్=ప్రేతులను; భూతగణాంశ్చ=భూతములసమూహములను సప్తమాతృకాదులను; యజన్తే = పూజింతురు.**

సత్త్వనిష్ఠులు దేవతలఁ బూజింతురు. రజోనిష్ఠులు యక్షరాక్షసులఁ బూజింతురు, తమోనిష్ఠులు భూతప్రేతగణములఁ బూజింతు రని తా. వీరిపూజను బట్టి వీరిసత్త్వాదినిష్ఠ నూహింపవలయు నని భావము.

**ఆ.** అట్లయినను యథోక్తపురుషునిసత్త్వాదినిష్ఠ నెఱుంగ నెట్లు శక్యమగు నని యాశంకించి చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. అధికృతుఁ డగు పురుషుఁడు శ్రద్ధాప్రధానుఁ డగుటవలన నని యర్థము. దేవతలు — వస్వాదులు. యక్షులు—కుబేరాదులు. రాక్షసులు — నైరృతాదులు. స్వధర్మమునుండి భ్రష్టులైన విప్రాదులు మరణమునకుఁ బిదప వాయుదేహము నొందినవారు ప్రేతులు. వీరికి ఆరాధితు లగు దేవాదులు క్రమమున సాత్త్వికరాజసతామసకామంబుల నిత్తు రని సామర్థ్యంబువలన నెఱుంగవలయును.

**హ.** దానినే ప్రదర్శించుచున్నాఁడు.—యజన్తే = పూజించుచున్నారు. సాత్త్వికాః = సత్త్వగుణము గలవారు.

**శం.** ఇట్లు సత్త్వరజస్తమస్సంభావితము లగు శ్రద్ధలు గల పురుషులకు క్రమమున సాత్త్వికరాజసతామసప్రకృతు లగు నని సూచించి వారి ప్రకృత్యను రూపము లగు కర్మములను జెప్పుచున్నాఁడు, కర్మరూప మయిన లింగము * చేత వారిస్వభావము నెఱుంగవలయు నని సూచించుటకై.—సాత్త్వికాః=శ్రోత్రియులు దేవసంపద గలవారు; దేవాన్ — అగ్న్యాదులను; వైదిక మగు కర్మము చేత, యజన్తే = పూజింతురు సాత్త్విక మగు శ్రద్ధతో. ఇంక నితరు లైన రాజసులును తామసులును ఆసురసంపద గలవారు రాజసశ్రద్ధతోను తామసశ్రద్ధతోను యక్షరాక్షసులను పిశాచభూతగణములను యజింతు రని యర్థము.

**మ.** శ్రద్ధ నెఱింగినయెడ నది నిష్ఠను దెలుపఁగలదు. ఏయుపాయంబున నాశ్రద్ధ నెఱుంగవచ్చు నని యపేక్ష కలుగఁగా దేవపూజాదికార్యలింగముచే నది యనుమేయం బని చెప్పుచున్నాఁడు. —జనాః = శాస్త్రీయవివేకహీను లగువారు; ఎవరు స్వాభావిక మగు శ్రద్ధచే, దేవాన్ — వసురుద్రాదులను సాత్త్వికులను;

---

* హేతువు.

యజన్తే = పూజింతురో; వారు, అన్యే = వేఱు; సాత్త్వికాః = సాత్త్వికు లని
తెలియంగవలయును. ఎవ్వరు మఱి, యక్షులను కుబేరాదులను, రాక్షసులను నిరృతి
ప్రభృతులను, రాజసు లైనవారిని, యజన్తే. వారు, అన్యే = వేఱు; రాజసాః =
రాజసు లని తెలియంగవలయు. ఇంక నెవ్వరు, ప్రేతాన్ = స్వధర్మభ్రష్టులై మర
ణము నొందినపిదప వాయవీయదేహము పొందిన విప్రాదులు ఉల్కాముఖశకట
పూతనాదినామములు గల ప్రేతు లగుదు రని మనువుచేఁ జెప్పఁబడినవారు, వారిని,
లేక పిశాచవిశేషములను; భూతగణాంశ్చ—సప్తమాతృకాదులను; యజన్తే. వారు,
అన్యే = వేఱు; తామసాః = తామసు లని తెలియంగవలయును. అన్యే అనుపదము
మూఁడుపక్షములందును వైలక్షణ్యద్యోతనముకొఱకు సంబంధించుచున్నది.

శ్రీ. సాత్త్వికాదిభేదమునే కార్యభేదముచేఁ బ్రపంచించుచున్నాఁడు.—
సాత్త్వికు లగు జనులు సత్త్వప్రకృతు లైన దేవతలనే, యజన్తే = పూజించుచు
న్నారు. రాజసులో రజఃప్రకృతు లగు యక్షులను రాక్షసులను యజింతురు. వీరి
కంటె, అన్యే = విలక్షణు లయిన, తామసాః జనాః; తామసులే యగు, ప్రేతాన్
భూతగణాంశ్చ; యజన్తే. సత్త్వాదిప్రకృతు లగు దేవాదులపూజయందలి రుచినిబట్టి
సాత్త్వికత్వాదికము నెఱుంగవలయు నని యర్థము.

ప. స్పష్టము.

రా. దానినే వివరించుచున్నాఁడు.—సాత్త్వికాః=సత్త్వగుణప్రచురులు,
సాత్త్విక మగు శ్రద్ధతోఁ గూడినవారు; దేవాన్ యజన్తే. దుఃఖములో సంభి
న్నము * కాని యుత్కృష్టసుఖమునకు హేతు వగు దేవయాగము విషయముగాఁ
గలశ్రద్ధ సాత్త్విక మని ప్రతిపాదిత మగుచున్నది. రాజసా యక్షరక్షాంసి యజన్తే.
ఇతరు లైన తామసజనులో, ప్రేతాన్ భూతగణాంశ్చ యజన్తే. దుఃఖసంభిన్న మైన
యల్పసుఖము గలిగించునది రాజసశ్రద్ధ, దుఃఖప్రాయ మయిన యత్యల్పసుఖమును
గలిగించునది తామసశ్రద్ధ యని యర్థము.

మా. ఎవఁడు సాత్త్వికశ్రద్ధుఁడు? ఇత్యాదికమును విభజించి చెప్పుచు
న్నాఁడు యజన్త ఇత్యాదిగా.

అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః
దమ్భాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః. ౫

* కూడినది.

కర్శయన్త శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః
మాం చైవాఽన్తశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్. ౬

**భా.** ఇట్లు శాస్త్రవిధి నుత్సర్జించినచోఁ గార్యమువలన నిర్ణీతము లగుచున్నవి సత్త్వాదినిష్ఠలు. అం దొకానొకఁడే సహస్రములందు దేవపూజాతత్పరుఁడై సత్త్వనిష్ఠుం డగుచున్నాఁడు. బాహుల్యంబుననో రజోనిష్ఠులును తమోనిష్ఠులునుగానే ప్రాణు లుందురు. ఎట్లు? —అశాస్త్రవిహితమ్=శాస్త్రముచే విధింపఁబడినది కాని దాని, అశాస్త్రవిహితమును; ఘోరమ్ = పీడాకరంబును, ప్రాణులకును తనకును; అట్టి, తపః = తపస్సును; యే జనాః=ఏజనులు; తప్యన్తే=చేయుచున్నారో; వారు, దమ్భాహంకారసంయుక్తాః = దంభముతోను అహంకారముతోను గూడినవారు. కామరాగబలాన్వితాః = కామముచేతను రాగముచేతను గలిగిన బలముతోఁ గూడినవారు. లేక, కామముతోను రాగముతోను బలముతోను గూడినవారు; శరీరస్థమ్ = దేహమునం దున్న; భూతగ్రామమ్ = కరణసమూహమును; కర్శయన్తః=కృశింపఁ జేయువారు. అచేతసః = అవివేకులు. అన్త శ్శరీరస్థమ్ = తత్కార్యబుద్ధులకు సాక్షిభూతుఁడను అంతశ్శరీరంబునం దున్నవానిని; మాం చైవ = నన్నును; కర్శయన్తః=కృశింపఁజేయువారు, నన్నుఁ గృశింపఁజేయుట యనఁగా నా యనుశాసనముఁ జేయకుండుటయే. తాన్ = అట్టి జనులను; ఆసురనిశ్చయాన్=ఆసుర మైన నిశ్చయము గలవారలనుగా; విద్ధి = ఎఱుంగుము, పరిహరించుకొనఁ దెలియుము ... 

శాస్త్రవిహితము కానిదియుఁ దనకును ఇతరులకును బీడాకరంబు నగు తపస్సు నెవరు చేయుచున్నారో, దంభాహంకారములును కామరాగబలములును గలవారై శరీరమునందలి యింద్రియసమూహమును కృశింపఁజేయుచు తత్కార్యబుద్ధులకు సాక్షిభూతుఁడనై యంతర్యామినై యున్ననన్నును నాయాజ్ఞను అతిక్రమించుటచేఁ గృశింపఁజేయుచు నవివేకు లగునట్టివారి నెల్ల నాసురనిష్ఠ గలవారిఁగా నెఱింగి వర్జింపు మని తాత్పర్యము.

**అ.** ఓయీ! సత్త్వాదినిష్ఠలను శాస్త్రముచే నెఱుంగవచ్చును, కార్యలింగకానుమాన మేల? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఇట్లు ఇత్యాదిగా. సత్త్వాది

నిష్ఠు లగు ప్రాణులలో ప్రచురత్వాప్రచురత్వరూప మగు నవాంతరవిశేషమును జూపుచున్నారు అందు ఇత్యాదిగా. రాజసతామసులప్రాచుర్యమును ప్రశ్నద్వార మున వివరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. కామము—కామింపఁబడువిషయము, రాగము — తద్విషయభోగాభిలాష, దానిచేఁ గలిగినబలము—తత్ప్రియుక్తి మయిన బలము, అవి కారణముగాఁ గలబల మనుట. రజోనిష్ఠులను ప్రాధాన్యమునఁ బ్రద ర్శించి తమోనిష్ఠులను ప్రాధాన్యమునఁ బ్రదర్శించుచున్నారు కర్శయంత ఇత్యాదిగా. ఎట్లు శరీరాదిసాక్షి యగు నీశ్వరునిఁ బ్రాణులు కృశింపఁజేయుదురు ? అనఁగాఁ జెప్పు చున్నారు నాయనుశాసనము నిత్యాదిగా. విపరీతనిశ్చయము గలవారిపరిజ్ఞానము దేనియం దుపయుక్త మగు ననఁగాఁ జెప్పుచున్నారు పరిహరించుకొఱకని.

హా. కర్శయన్తః = సన్నగిల్లఁజేయుచు. అన్తశ్శరీరస్థమ్ = శరీరాంతర స్థుని. ఆసుర మయిన నిశ్చయము గలవా రాసురనిశ్చయులు, తామసు లని యర్థము.

శం. రాజసులకును దామసులకును ఆసురధర్మమే యని ప్రతిపాదించు చున్నారు.—దంభ మనఁగా మంత్రతంత్రవేషభాషాదిబాహ్యపరికరములయాటోప ము, అహంకారము—కులశీలవిద్యాఽఽశ్రమాదులచే నుత్కృష్టుఁడను నే నని యం తఃకరణముయొక్కయాటోపము, ఆరెంటితోఁ గూడినవారు; కామరాగబలాన్వితాః= కామములు—ఐహికాముష్మికభోగ్యపదార్థములు, రాగము—వానియం దుపభోగేచ్ఛ, బలము—ఆయిచ్ఛయొక్క వేగము, వానితోఁ జక్కగాఁ గూడినవారు; అందువలననే, అచేతసః = అవివేకులు నగు; పమూఢులు, శరీరస్థమ్ = స్థూలశరీరమునందు ఉదర మునందును ఇతరస్థలమునందును ఉన్నట్టి; భూతగ్రామమ్=స్థూలసూక్ష్మరూపప్రాణి సముదాయమును, లేక, ప్రాణేంద్రియసమూహమును; కర్శయన్తః = అన్నరసా దులు లేమిచే శోషిల్లఁ జేయుచు; మాం చైవ = నన్నును; అన్తశ్శరీరస్థమ్ = అంత శ్శరీరము—బుద్ధి, దానియందు సర్వప్రకాశకుఁడనై యున్నవానిని, ప్రత్యగ్రూపుని; కర్శయన్తః = మనోబుద్ధీంద్రియములకు నుపవాసకృత మయిన యతిశ్రమముచే ప్రవృత్తియుపరత మైనపుడు ఆత్మచైతన్యమునకు స్ఫురణము కాదు,అస్ఫురణాభావమే ప్రత్యగాత్మను గృశింపఁజేయుట, దానిఁ జేయుచు; యే జనాః=ఏజనులు; అశాస్త్ర విహితమ్=శాస్త్రవిహితము కానిదియు; ఘోరమ్ = పీడాకరము నగు; తపః = తప స్సును; తప్యన్తే = ఉపవాసవ్రతాదులచేఁ గాయశోషణమును గామరాగబలాను రూప మయిన శ్రద్ధతో నెవ్వరు చేయుచున్నారో అని యర్థము. తాన్=వారలను;

ఆసురనిశ్చయాన్ = అసురుల నిశ్చయము గలవారినిగా; విద్ధి=ఎఱుంగుము, దుష్కర మయినవ్రతము ననుసరించువారినిగా నెఱుంగు మని యర్థము. ఇందుచే, ఆభాస శ్రద్ధ గల రాజసులకును దామసులకును ఆసురసంపదయే సూచింపఁబడినది. అందుచే సాత్త్వికులకు దైవసంపదయే యని సిద్ధము.

వ్యా. ఇట్లు శాస్త్రము నాదరింపనివారి సత్త్వాదినిష్ఠ కార్యమువలన నిర్ణయింపఁబడినది. అందుఁ గొందఱు రాజసతామసులుగూడఁ బూర్వపుణ్యపరిపాకమువలన సాత్త్వికులై శాస్త్రీయసాధనమునం దధికృతు లగుచున్నారు. ఎవరు మఱి దురాగ్రహమునను దుర్దైవపరిపాకప్రాప్త మగు దుర్జనసంగాదిదోషంబునను రాజసతామసతను విడువరో వారు శాస్త్రీయమార్గమునుండి భ్రష్టులై యసన్మార్గము ననుసరించుటచే నీలోకమునందును బరలోకమునందును దుఃఖభాగులే యగుదురని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—అశాస్త్రవిహితమ్ = శాస్త్రముచేత ప్రత్యక్షమైన దానిచేతఁ గాని యనుమిత మైనదానిచేతఁ గాని విధింపఁబడినది కానిది, లేక, అశాస్త్రముచేత — బుద్ధాద్యాగమముచేత బోధింపఁబడినది; ఘోరమ్ = పరునకుఁ దనకుఁ బీడాకరము, అట్టి; తపః—తప్తశిలారోహణాదికమును *;తప్యన్తే=చేయుచున్నారో; యే జనాః=ఏజనులు; దంభము—ధార్మికత్వఖ్యాపనము, అహంకారము—నేనే శ్రేష్ఠుఁడ నను దురభిమానము, ఆ రెంటితోఁ జక్కఁగాఁగూడినవారలై. చక్కఁగాఁ గూడినవా రనఁగా అనాయాసమున వాని విడువఁజాలనివా రనుట. కామమునందు—కామింపఁబడువిషయమునందు రాగ మేది గలదో దానివలనఁ గలుగు బలము — మిక్కిలి యుగ్ర మైనదుఃఖమును సహించుసామర్థ్యము, దానితోఁ గూడినవారలై; లేక, కామము—విషయమునం దభిలాష, రాగము — ఎల్లప్పుడును దానియం దభినివేశము కలిగియుండుట అభిష్వంగము, బలము—అవశ్యము దీని సాధింపవలయు నను న్యాగ్రహము, వానితోఁ గూడినవారై; అందువలననే మహాదుఃఖము వచ్చినను నివర్తిల్లనివారై, కర్శయన్తః = కృశింపఁజేయుచు, వ్యర్థోపవాసాదులచే; శరీరస్థం భూతగ్రామమ్ = దేహేంద్రియసంఘాతాకారమునఁ బరిణత మగు పృథివ్యాదిభూతసముదాయమును; అచేతసః = వివేకశూన్యులు; అన్తశ్శరీరస్థం మాం చైవ=భోక్తృరూపమున నున్న నన్నును భోగ్య మగు శరీరమును గృశింపఁజేయుటచేఁ గృశింపఁజేయువార లయ్యె, లేక, అంతర్యామినై శరీరాంతఃస్థితుని బుద్ధితద్వృత్తిసాక్షిభూతు నీశ్వరుని నన్నును నాయాజ్ఞ నుల్లఘించుటచేఁ గృశింపఁజేయుచు. తాన్ = అట్టి

* కాలినఱాతి నెక్కుట మొదలగుదాని.

నైహికసర్వభోగవిముఖులను బరలోకమునందును అధమగతి నొందువారలను సర్వ పురుషార్థభ్రష్టులను; ఆసురనిశ్చయాన్ =ఆసురము – విపర్యాసరూపము వేదార్థవిరోధి యగు నిశ్చయము గలవారలనుగా, మనుష్యులుగాఁ గనఁబడుచున్నను అసుర కార్యము చేయువార లగుటవలన అసురులనుగా; విద్ధి=ఎఱుంగుము, పరిహారణము కొఱకు. నిశ్చయం బాసుర మగుటవలనఁ దత్పూర్వక ము లగు నంతఃకరణవృత్తు లన్నియు నాసురంబు లనియు అసురత్వజాతిరహితు లగు మనుష్యులు కర్మముచేతనే యసురు లగుటవలన వారల నసురులనుగా నెఱుంగు మని సాక్షాత్తుగాఁ జెప్ప లే దనియు నెఱుంగునది.

శ్రీ. రాజసతామసులయందు మఱియు విశేషాంతరముఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—శాస్త్రవిధి నెఱుంగనివా రయ్యును గొందఱు ప్రాచీనపుణ్యసంస్కారముచే సాత్త్వికులే యగుచున్నారు. కొందఱు మాత్రము మధ్యములు రాజసు లగుచున్నారు. అధములో తామసు లగుదురు. ఎవ్వరు మఱి మిక్కిలి మందభాగ్యులు గతానుగతిచేఁ బాషండసంగమునఁ దదాచారము ననువర్తించుచు, అశాస్త్రవిహితమ్; ఘోరమ్ = భూతభయంకరమును; తపః; తప్యన్తే = చేయుచున్నారో; అందులకు హేతువులు – దంభాహంకారములతో సంయుక్తులు; అట్లు, కామము – అభిలాష, రాగము – ఆసక్తి, బలము—ఆగ్రహము, వానితోఁ గూడినవారు; మఱియును, శరీరస్థమ్=ప్రారంభకము లగుటచే దేహమున నున్న పృథివ్యాది భూతములసమూహమును; కర్శయన్తః = వ్యర్థముగా నుపవాసాదులచేఁ గృశముగాఁ జేయుచు; అచేతసః = అవివేకులు; మాం చ = నన్నును; అంతర్యామినై, అన్తశ్శరీరస్థమ్ = దేహమధ్యమున నున్నవాని; నాయాజ్ఞ నుల్లంఘించుటచేఁ గృశునిగాఁ జేయుచు. ఇట్లెవరు తపస్సు చేయుచున్నారో, తాన్ = వారలను; ఆసురనిశ్చయాన్ = ఆసురము—అతిక్రూర మయిన నిశ్చయము గలవారలనుగా; విద్ధి = ఎఱుంగుము.

**ప.** ఇఁక అవిహిత మగు కర్మమును దెలుపుచున్నాఁడు రెండుశ్లోకముల చేత.—అశాస్త్రవిహితమ్ = శాస్త్రముచే అనుజ్ఞాతము కానిది; ఘోరమ్=భయంకరము, శ్మశానమునందు నగ్నులై చేయు ఘోరసాధనాదికము; అట్టి తపస్సును; యే జనాః; తప్యన్తే = అనుష్ఠించుచున్నారో; దంభము – ధర్మధ్వజిత్వము, అహంకారము – గర్వము, వీనితో సంయుక్తులు; కామము – అభిలాష, రాగము – ఆసక్తి, బలము – పట్టుదల, వీనితోఁ గూడినవారలు. దాని నుదాహరించు

చున్నాఁడు.—శరీరస్థమ్ = శరీరాంతర్గత మగు; భూతగ్రామమ్ = పృథివ్యాదిభూత సమూహమును; ప్రాణాచారము ఉపవాసము మొదలగువానిచే, కర్శయన్తః = కృశముగాఁ జేయుచు; మాం చ = నన్నును; అంతర్యామినై యున్నవానిని; దుఃఖ సాక్షినిగాఁ జేయుచు; అందువలననే, అచేతసః—దైవప్రాప్య మని యెఱుంగనివారు. తాన్; ఆసురనిశ్చయాన్=ఆసురము—అతిక్రూర మైన నిశ్చయము గలవారినిగా; విద్ధి.

రా. ఇట్లు శాస్త్రీయము లయిన యాగాదులయందే శ్రద్ధాయుక్తము లైనవానియందు గుణములవలన ఫలవిశేషము. అశాస్త్రీయము లగు తపోయోగ ప్రభృతులు నాయాజ్ఞకు విపరీతము లగుటచే వానియందు సుఖలేశ మేనియు లేదు. [illegible] యనర్థమే యని హృదయంబున నున్నదానిఁ దెలుపుటకై చెప్పుచున్నాఁడు.— అశాస్త్రవిహితమును అతిఘోరము నైనను; తపః యే జనాః తప్యన్తే — ప్రదర్శ నార్థ మిది, అశాస్త్రవిహితమును అధికాయాసము నగు యాగాదికమును ఏజనులు చేయుచున్నారో; దమ్భాహంకారసంయుక్తాః; కామరాగబలాన్వితాః; శరీరస్థ మగు పృథివ్యాదిభూతసమూహమును గృశింపఁజేయుచు, మదంశభూతుఁ డగు జీవుని అంతశ్శరీరస్థునిఁ గృశింపఁజేయుచు నెవరు తపస్సు చేయుచున్నారో యాగాదిక మును గూడఁ జేయుచున్నారో, తాన్ ఆసురనిశ్చయాన్ విద్ధి—అసురుల నిశ్చయము ఆసుర మగు నిశ్చయము, అసురులు నాయాజ్ఞకు విపరీతముగాఁ జేయువారలు గదా! మదాజ్ఞకు విపరీతము చేయువార లగుటవలన వారికి సుఖలవసంబంధ మేనియుఁ గలుగదు, మఱి యే మనఁగా అనర్థవ్రాతమునఁ బడుదు రని మున్నే చెప్పఁబడినది "పతన్తి నరకే ఽశుచౌ" అని.

మా. భగవత్కర్శన మనఁగా అల్పదృష్టియే * "యో వై మహాన్తం పరమం పుమాంసం నైవం ద్రష్టా కర్శకః సో ఽతిపాపీ" † అని యనభిమాన శ్రుతి. ఆసుర మైన నిశ్చయము గలవారు ఆసురనిశ్చయులు. "దేవాస్తు సాత్త్వికాః ప్రోక్తా దైత్యా రాజసతామసాః" అని యగ్నివేశ్యశ్రుతి.

ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేద మిమం శృణు. ౭

---

* భగవంతుఁ డల్పుఁ డను దృష్టియే.

† ఎవ్వఁడు పరముఁ డగుమహాపురుషుని తదవిధముగాఁ జూడఁడో అతఁడు కర్శకుఁడు అతిపాపి.

**భా.** ఆహారములును రస్యస్నిగ్ధాదివర్గత్రయరూపంబున భిన్నములు యథాక్రమముగా సాత్త్వికరాజసతామసపురుషులకుఁ బ్రియంబులని యిటఁ బ్రదర్శింపఁబడుచున్నది, రస్యస్నిగ్ధాదు లగు నాహారవిశేషముల యందుఁ దనకుఁ బ్రీత్యతిశయము కలిమి యను లింగముచేఁ దనసాత్త్విక రాజసతామసభావముల నెఱింగి రజస్తమోలింగము లగు నాహారములఁ బరివర్జించుటకును సత్త్వలింగము లగువాని గ్రహించుటకును. అట్లు యజ్ఞాదులు గూడ సత్త్వాదిగుణభేదమునఁ ద్రివిధం బని యిటఁ బ్రతిపాదింపఁబడుచున్నది, రాజసతామసముల నెఱింగి యొల్లని వాని విడుచునని యు సాత్త్వికములనే యనుష్ఠించుననియు.—ఆహార స్త్వపి = ఆహారము గూడ; సర్వస్య = సమస్తభోక్తకును; త్రివిధః=మూఁడువిధములు గలది; ప్రియః = ఇష్టము; భవతి = అగుచున్నది. అట్లు, యజ్ఞః = యజ్ఞమును; తపః = తపస్సును; మఱియు, దానమ్=దానమును; త్రివిధము ప్రియ మగుచున్నది. తేషామ్=ఆయాహారాదులయొక్క; భేదమ్= భేదమును; ఇమమ్ = ఈ చెప్పఁబోవుదాని; శృణు = వినుము.

ఆహారముగూడ మూఁడువిధములు గలది; అందు ఒక్కొక్కటి సాత్త్విక రాజసతామసులకుఁ గ్రమంబునఁ బ్రియమై యుండును. అట్లు యజ్ఞతపోదానములును త్రివిధములై సాత్త్వికాదులచేఁ గ్రమంబున ననుష్ఠింపఁబడును. వానిభేదములఁ జెప్పెద వినుమని తాత్పర్యము.

**శ్రీ.** మీఁదిశ్లోకమునందలి పూర్వార్ధతాత్పర్యముఁ జెప్పుచున్నారు ఆహారములును ఇత్యాదిగా రస్యాదివర్గము సాత్త్వికపురుషప్రియం బనియు కట్వాది వర్గము రాజసప్రియ మనియు యాతయామాదివర్గము తామసప్రియ మనియుఁ బ్రదర్శనము దేనియం దుపయోగించు ననఁగాఁ జెప్పుచున్నారు రస్యస్నిగ్ధాదులు ఇత్యాదిగా. శ్లోకము నుత్తరార్ధమునకు తాత్పర్యముఁ జెప్పుచున్నారు అట్లు అని. ఆహారము త్రివిధ మయిన ట్లనుట. వీనికిఁ బ్రత్యేకము త్రైవిధ్య మెట్లనఁగాఁ జెప్పుచున్నారు తేషా మిత్యాదిగా.

**హ.** ఇప్పుడు సాత్త్వికరాజసతామసు లగు ప్రాణులయాహారాదికముఁ దెలుపుటకై చెప్పుచున్నాఁడు.—ఆహరింపఁబడుచున్నది కావున ఆహార మనఁగా అన్నము; సర్వస్య – సాత్త్వికరాజసతామసప్రాణికి; త్రివిధః =మూఁడువిధములు

గలది, సాత్త్వికమును రాజసమును తామసమును అని; ప్రియః = అభిమతము; భవతి = అగుచున్నది. తథా = అట్లు; త్రివిధ మయిన ప్రాణికి సాత్త్వికము రాజసము తామసము అని త్రివిధ మయిన యజ్ఞము ప్రియ మగుచున్నది. అట్లు తపస్సును అట్లు దానము గూడ. తేషామ్ = ఆ యాహారయజ్ఞతపోదానములయొక్క; భేదమ్ — సాత్త్వికరాజసతామసరూపమును; శృణు = ఆకర్ణింపుము.

శ౦. ఇట్లు శ్రద్ధాభేదమునను దేవాదియజనభేదమునను శాస్త్రీయాశాస్త్రీయకర్మానుష్ఠానమునను సాత్త్వికులను రాజసులను తామసులను ఎఱుంగవలయు నని సూచించి యిప్పుడు ఆహారముచేతను యజ్ఞతపోదానములచేతను వారి నెఱుంగవలయు నని సూచించుట కాహారయజ్ఞతపోదానాదులకు సత్త్వాది గుణభేదమునఁ ద్రైవిధ్యముఁ బ్రతిపాదించుచున్నాఁడు, సాత్త్వికు లగు ముముక్షువులు సాత్త్వికము లగు నాహారాదులనే చిత్తశుద్ధికొఱకు గ్రహింపవలయును గాని యితరములను గ్రహింపఁగూడ దని తెలుపుటకొఱకును.—అర్థము స్పష్టము.

మ. ఎవరు సాత్త్వికులో వారు దేవతలు, ఎవరు మఱి రాజసులు తామసులో వారు విపర్యస్తు లగుటవలన నసురులు అని నిశ్చితము కాఁగా, సాత్త్వికములను గ్రహించుటకును రాజసతామసముల విడుచుటకును ఆహారయజ్ఞతపోదానముల త్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు.—శ్రద్ధమాత్రమే కాదు త్రివిధము, ఆహారము గూడ సర్వప్రాణికిని బ్రియము త్రివిధమే యగుచున్నది, సర్వమును త్రిగుణాత్మక మగుటచే నాలుగవవిధము సంభవింపమివలన. ఎట్లు దృష్టార్థ మగు నాహారము త్రివిధమో అట్లు యజ్ఞతపోదానము లదృష్టార్థములు గూడ త్రివిధములు. అందు, "యజ్ఞం వ్యాఖ్యాస్యామో ద్రవ్య దేవతాత్యాగః" అని కల్పసూత్రకారులచే దేవత నుద్దేశించి ద్రవ్యత్యాగము యజ్ఞ మని నిర్వచింపఁబడినది. అది యజతిచేతను జుహోతిచేతను * చోదిత మగుటచే యాగము హోమము నని ద్వివిధము, ఉత్తిష్ఠద్ధోమములును † వషట్కారప్రయోగాంతములును యాజ్యాపురోనువాక్యావంతములును యజతులు. ఉపవిష్టహోమములును ‡ స్వాహాకారప్రయోగాంతములును యాజ్యాపురోనువాక్యారహితములును జుహోతులు అని కల్పకారులచే వ్యాఖ్యాతము యజ్ఞశబ్దముచేఁ జెప్పఁబడినది. తపః — కాయేంద్రియశోషణము,

---

* యజతి జుహోతి అని.

† నిలిచి హోమము చేయఁబడునవి.

‡ కూర్చుండి హోమము చేయఁబడునవి.

కృచ్ఛ్రచాంద్రాయణాదికము. దానమ్—తనస్వత్వము దొలఁగించి పరునకు స్వత్వము గలిగించుట. తేషామ్ = ఆ యాహారయజ్ఞతపోదానములయొక్క; సాత్త్విక రాజస తామసభేదమును; నాచేఁ జెప్పఁబడుదాని, ఇమమ్ = దీని; శృణు.

శ్రీ. ఆహారాదిభేదమువలనఁగూడ సాత్త్వికాదిభేదమును దెలుపుటకై చెప్పుచున్నాఁడు పదునూఁడుశ్లోకములచేత.—సర్వస్య = సమస్తమైన జనముయొక్కయు; ఆహారః—అన్నాదిక మేది గలదో అది; యథాక్రమముగా, త్రివిధః; ప్రియో భవతి. అట్లు, యజ్ఞతపోదానములు గూడ త్రివిధములగుచున్నవి. తేషామ్ = వానియొక్క; ఇమం భేదమ్ = ఈ చెప్పఁబోవుభేదమును; శృణు. ఇదియు రాజసతామసాహారయజ్ఞాదులఁ బరిత్యజించి సాత్త్వికాహారయజ్ఞాదుల సేవచే సత్త్వవృద్ధి కుఁగా యత్నము చేయవలయు నను నేతదర్థము ప్రతిపాదింపఁబడుచున్నది,

ప. *

రా. ఇఁకఁ బ్రకృతమునే శాస్త్రీయములగు యజ్ఞాదులందు గుణముల వలని విశేషమును బ్రపంచించుచున్నాఁడు.—అందు సత్త్వాదివృద్ధి యాహారమూలమగుటవలన నాహారత్రైవిధ్యము మొదటఁ జెప్పఁబడుచున్నది. "అన్నమయం హి సోమ్య మనః, ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః" అని గదా శ్రుతి.—ఆహారము గూడ, సర్వస్య = సమస్తప్రాణిజాతమునకును; సత్త్వాదిగుణత్రయాన్వయముచే, త్రివిధః ప్రియో భవతి. అట్లే యజ్ఞముగూడ త్రివిధము, అట్లు తపస్సును దానమును. తేషాం భేద మిమం శృణు—ఆ యాహారయజ్ఞతపోదానములకు సత్త్వాదిభేదముచేఁ గలుగునట్టి యీ చెప్పఁబడుభేదమును వినుము.

మా. ♦

ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః. ౮

భా. ఆయుఃసత్త్వబలఆరోగ్యసుఖప్రీతివివర్ధనాః=ఆయుస్సును సత్త్వమును బలమును ఆరోగ్యమును సుఖమును ప్రీతియు—వీని వృద్ధినొందించు

* శ్రీధరీయములో సమానము.
♦ దీని కిభాష్యము లేదు.

నవియు; రస్యాః = రసముతోఁ గూడినవియు; స్నిగ్ధాః = స్నేహము గల వియు; స్థిరాః=దేహమునందుఁ జిరకాలము నిలుచునవియు; హృద్యాః= *హృదయప్రియములు నగు; ఆహారాః = ఆహారములు; సాత్త్వికప్రియాః = సాత్త్వికున కిష్టములు.

ఆయుస్సు మొదలగువాని వృద్ధినొందించునవియు రసయుక్తములును స్నేహవంతములును * దేహమున నధికకాలము నిలుచునవియు హృదయప్రియములు నగు నాహారములు సాత్త్వికున కిష్టములై యుండు నని తా. ఇవి యిష్టములయినపుడు పురుషుఁడు తనకు సత్త్వగుణ మధికముగా నున్న దని యెఱింగి వానినే విడువక భుజించుచుండవలయు నని భావము.

ఆ. సాత్త్వికునకుఁ బ్రియ మగు నాహారము నుదాహరించుచున్నారు.—ఆయుస్సు—దీర్ఘకాలజీవనము. సత్త్వము—చిత్తస్థైర్యము, లేక, వీర్యము. బలము—కార్యము చేయుటయందు సామర్థ్యము. ఆరోగ్యము — రోగము లేకుండుట. సుఖము — హృదయాహ్లాదము. ప్రీతి — సంపన్ను లగు పరులు చూచినను వారికి హర్షము. రసముతోఁ గూడినవి—రసనీయములు. దేహము నందుఁ జిరకాలము నిలుచుట — అధికకాలము శరీరమున కుపకరించుట.

హ. ఆయుష్షు—జీవనకాలము, సత్త్వము — ప్రకృతి పూర్వసంస్కారము, బలము—ప్రాణవాయువునకు స్థైర్యము, సుఖము—ఆనందము, ప్రీతి—సంతోషము—వీని వృద్ధినొందించు నవి; రస్యాః = మధురములు; స్నిగ్ధాః = స్నేహవంతములు; స్థిరాః = దీర్ఘకాలమునకు జీర్ణించునవి. హృద్యాః = చూచినమాత్రముననఁ బ్రీతి గలిగించునవి. ఇట్టి యాహారములు సాత్త్వికములు సాత్త్వికునకుఁ బ్రియము లగుచున్నవి.

శం. ఆయువునకును — చిరజీవనమునకును సత్త్వమునకును—అంతఃకరణస్ఫూర్తికిని బలమునకును — దేహేంద్రియశక్తికిని ఆరోగ్యమునకును — రోగము కలుగకుండుటకును సుఖమునకును — సంతోషమునకును ప్రీతికిని — చక్షుఃప్రీతికిని వృద్ధి గలిగించునవియు; రస్యాః = రసయుక్తములు, మధురములు; స్నిగ్ధాః=స్నేహయుక్తములు; స్థిరాః=మిక్కిలి సారవంతములు; హృద్యాః = మనోహరములు; ఇట్టి, ఆహారాః సాత్త్వికప్రియాః.

---

* ఁద్ద గలవియు.

మ. ఆహారయజ్ఞతపోదానముల భేదము పదునైదుశ్లోకములచేఁ బ్రతిపాదింపఁబడుచున్నది. అం దాహారభేదము మూఁడింటిచేఁ జెప్పఁబడుచున్నది.—ఆయువు – చిరజీవనము, సత్త్వము – చిత్తధైర్యము బలవద్దుఃఖమునందును నిర్వికారత కలిగించునది, బలము – శరీరసామర్థ్యము చేయవలసినకార్యమునందు శ్రమ లేనట్లు చేయునది, ఆరోగ్యము–వ్యాధి లేమి, సుఖము–భోజనానంతరము ఆహ్లాదము, తృప్తి, ప్రీతి–భోజనకాలమున అనభిరుచి లేకుండుట ఇచ్ఛాతిశయము, వీని విశేషించి వృద్ధిపొందించునవి; రస్యాః = ఆస్వాదింపఁదగినవి, మధురరసప్రధానములు; స్నిగ్ధాః=సహజము లేక ఆగంతుక మగు స్నేహముతోఁ గూడినవి; స్థిరాః=రసాద్యంశముచే శరీరమునందుఁ జిరకాల ముండునవి; హృద్యాః = మనోహరములు, దుర్గంధము అశుచిత్వము మొదలగు దృష్టాదృష్టదోషములు లేనివి; ఆహారాః – చర్వ్య చోష్య లేహ్య పేయములు; సాత్త్వికులకుఁ బ్రియములు. ఈ లింగములచే సాత్త్వికుల నెఱుంగవలయును, సాత్త్వికత్వముఁ గోరువారు వీనినే సేవింపవలయు నని యర్థము.

శ్రీ. ఆ దాహారత్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు మూఁడింటిచేత.—ఆయుస్సు – జీవితము సత్త్వము – ఉత్సాహము బలము – శక్తి ఆరోగ్యము – రోగరాహిత్యము సుఖము = చిత్తప్రసాదము ప్రీతి–అభిరుచి–ఈ యాయువు మొదలగువాని విశేషించి వృద్ధి చేయునవి; రస్యాః = రసవంతములు; స్నిగ్ధాః = స్నేహయుక్తములు; స్థిరాః = దేహమున సారాంశముచేఁ జిరకాలస్థాయులు; హృద్యాః = చూచినమాత్రముననే మనోహరములు; ఇట్టి, ఆహారాః–భక్ష్యభోజ్యాదులు; సాత్త్వికప్రియములు.

ప. అది రాజస తామ సాహారాదులఁ బరిత్యజించి సాత్త్వికాహారాదుల సేవించుచు సత్త్వవృద్ధికి యత్నము చేయవలయు నను నేతదర్థమై నిరూపింపఁబడుచున్నది. అం దాహారత్రైవిధ్యమును మూఁడింటిచేఁ జెప్పుచున్నాఁడు.—*

రా. సత్త్వగుణయుక్తునకు సత్త్వమయము లగు నాహారములు ప్రియములగుచున్నవి. సత్త్వమయాహారము లేవి యనఁగా. ఆయుర్వివర్ధనములు, వెండియు సత్త్వవివర్ధనములు, సత్త్వ మనఁగా అంతఃకరణము అంతఃకరణకార్య మగు జ్ఞానమిట సత్త్వశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది, " సత్త్వా త్సంజాయతే జ్ఞానమ్ " అని

* తక్కినది శ్రీధరీయముతో సమానము.

స్సత్త్వము జ్ఞానవృద్ధిహేతు వగుటవలన సత్త్వమయ మగు నాహారముగూడ జ్ఞానవృద్ధి హేతువు, అట్లు బలారోగ్యములకుఁగూడ వివర్ధనములు, సుఖప్రీతులకుఁగూడ వివర్ధనములు, పరిణామకాలమునందుఁ దమయంతనే సుఖమునకు వివర్ధనములు, అట్లు ప్రీతిహేతుభూతకర్మారంభద్వారమునఁ బ్రీతివివర్ధనములు;రస్యాః=మధురరసయుక్తములు; స్నిగ్ధాః=స్నేహయుక్తములు; స్థిరాః = స్థిర మయినపరిణామము గలవి; హృద్యాః= రమణీయమైనవేషము గలవి. ఈవిధము లైన సత్త్వమయాహారములు సాత్త్వికుఁడగు పురుషున కుఁ బ్రియములు.

మా. ప్రీతి – వెంటనే కలుగునది. హృద్యము—అనుభవించినపిదపఁగూడ మనోహరము. స్థిరములు – అప్పుడే పక్వము లగునవి కావు. అట్టివి గదా ఆజ్యాదులు.

కట్వమ్లలవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః.

భా. కటు అమ్ల లవణ అత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః = కటువును పులుసును ఉప్పును మిక్కిలి తీక్ష్ణమును రూక్షమును విదాహము గలిగించునవియు, అత్యుష్ణ అనుచోటి అతిశబ్దము సర్వత్ర యోజనీయము, మిక్కిలి చేఁదు మిక్కిలి పులుసు మిక్కిలి యుప్పు మిక్కిలి వేఁడి మిక్కిలి తీక్ష్ణము మిక్కిలి రూక్షము మిక్కిలి విదాహి—ఇట్టివి; దుఃఖశోకఆమయప్రదాః= దుఃఖమును శోకమును రోగమును ఇచ్చునవి యగు; ఆహారాః=ఆహారములు; రాజసస్య = రాజసునకు; ఇష్టాః = ప్రియములు.

మిక్కిలి చేఁదును పులుసును ఉప్పును వేఁడియు కారమును స్నేహవర్జితములును సంతాపము కలిగించునవియునై దుఃఖమును శోకమును రోగమును ఒసంగు నాహారములు రాజసున కిష్టము లని తాత్పర్యము.*

శ్రీ. రాజసున కిష్ట మగు నాహారవిశేషముఁ దెలుపుచున్నారు.—కటు వనఁగా చేఁదు, కటుకము తీక్ష్ణశబ్దముచేఁ జెప్పఁబడుటవలన. రూక్షము = స్నేహవివర్జితము. విదాహము – సంతాపము. దుఃఖము—తాత్కాలిక మగు పీడ. ఇష్టవియోగజ మగు దుఃఖము శోకము.

హ°	కట్వమ్లలవణములు రసవిశేషములు. అతిశబ్దము ఉష్ణాదులతో ప్రత్యేకము సంబంధించుచున్నది. ఈ కట్వాదులగు నాహారములు దుఃఖశోకామయప్రదములు, రాజసస్య = రాజసపురుషునకు; ఇష్టాః = అభిమతములు, అవియు రాజసములు.

శ్రీ°	అతిశబ్దము కట్వాదులతో ప్రత్యేకము సంబంధించుచున్నది; అతికటువు—మిక్కిలి చేదు, వేము మొదలగునది; కటుకము తీక్ష్ణశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది; అత్యమ్లము అతిలవణము అత్యుష్ణము, అతితీక్ష్ణము — మిరెపకాయ, రూక్షము — స్నేహరహితము కొఱ్ఱలు మొదలగునది, విదాహి — ఆవాలు మొదలగునది. వెంటనే దుఃఖప్రదములును పిమ్మట శోకరోగప్రదములు నగు నాహారములు రాజసున కిష్టములు.

మ.	అతిశబ్దము కట్వాదు లేడింటియందును యోజనీయము. కటువు — తిక్తము, కటురసము తీక్ష్ణశబ్దముచేఁ జెప్పఁబడినందువలన, అందు అతికటువు=వేము మొదలగునది, అత్యమ్లము అతిలవణము అత్యుష్ణము—ప్రసిద్ధములు, అతితీక్ష్ణము—మిరియము మొదలగునది, అతిరూక్షము — స్నేహశూన్యము కొఱ్ఱలు అల్లి మొదలగునది, అతివిదాహి—సంతాపము చేయునది ఆవలు మొదలగునది. దుఃఖమును—తాత్కాలిక మయిన పీడను శోకమును — పిమ్మటఁ గూడ దౌర్మనస్యమును ఆమయమును — రోగమును మిక్కిలి యిచ్చునవి. అట్టి యాహారములు రాజసున కిష్టములు. ఈ లింగములచే రాజసుల నెఱుఁగవలయును, సాత్త్వికులు వీని నుపేక్షింపవలయు నని యర్థము.

శ్రీ.	మఱియును.—అతిశబ్దము కట్వాదులు ఏడింటియందును సంబంధించుచున్నది. అతికటువు — నింబాదికము, అత్యమ్లము అతిలవణము అత్యుష్ణము—ప్రసిద్ధములు, అతితీక్ష్ణము—మరీచాదికము, అతిరూక్షము—కొఱ్ఱలు అల్లి మొదలగునది, అతివిదాహి — సర్షపాదికము. అతికట్వాదు లగు నాహారములు రాజసున కిష్టములు — ప్రియములు; దుఃఖము — తాత్కాలిక మగు హృదయసంతాపాదికము, శోకము—ఆవలఁ గూడ దౌర్మనస్యము, ఆమయము — రోగము, వీని నిచ్చునవి.

ప.	*

* శ్రీధరీయములో సమానము.

రా. కటురసములు అమ్లరసములు లవణోత్కటములు అత్యుష్ణములు అతితీక్ష్ణములు రూక్షములు విదాహులును — కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహులు, అతిశైత్యము అతితైక్ష్ణ్యము మొదలగువానిచేత నుపయోగింప శక్యముగానివి తీక్ష్ణములు, శోష చేయునవి రూక్షములు, తాపము చేయునవి విదాహులు, ఇట్టి యాహారములు రాజసున కిష్టములు. అవి రజోమయము లగుటవలన దుఃఖశోకామయవర్ధనములు, రజోవర్ధనములును.

మా. *

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్
ఉచ్ఛిష్ట మపి చా ఽ మేధ్యం భోజనం తామసప్రియమ్. ౧౦

భా. యాతయామమ్=సగము పక్వ మైనదియు, నిర్వీర్యము గతరస శబ్దముచేఁ జెప్పఁబడుటవలన; గతరసమ్ = పోయినరసము గలదియు; పూతి = దుర్గంధమును; పర్యుషితంచ యత్ = పక్వ మైనపిదప రాత్రి గడచిన దేది గలదో అదియు; ఉచ్ఛిష్ట మపిచ=తినఁగా మిగిలినదియు; అమేధ్యమ్ = యజ్ఞార్హము కానిదియు; ఇట్టి, భోజనమ్ = ఆహారము; తామసప్రియమ్ = తామసున కిష్టము.

చక్కఁగాఁ బక్వము కానిదియు గతరసంబును దుర్గంధమును పక్వమై రాత్రి గడచినదియు భుక్తశేషంబును అమేధ్యము నగు నాహారము తామసునకుఁ బ్రియ మని తాత్పర్యము.

ఆ. తామసప్రియం బగు నాహారము నుదాహరించుచున్నారు.— ఓయీ! యాతయామ మనఁగా నిర్వీర్య మని యర్థము అనఁగాఁ జెప్పుచున్నారు నిర్వీర్యము ఇత్యాదిగా.

హ. గతరసమ్=గతవీర్యము; పూతి = తడిసి విరస మైనది; పర్యుషితమ్= పక్వమై యుమఃకాలము దాఁటినది; ఉచ్ఛిష్టమ్ = భుక్తశిష్టము; అపిచ — సముచ్చయార్థకము; అమేధ్యమ్=అయజ్ఞార్హము; తామసప్రియమ్=తామసులకుఁ బ్రియము. ఇదియును దామసము.

---

* ఇది మొదలు ౧౮ వ శ్లోకమువఱకు భాష్యము లేదు.

౧౦.* యాతయామమ్ = కొంచెముగాఁ బక్వము; గతరసమ్ = అతిపక్వము; పూతి = దుర్గంధి; పర్యుషితమ్ = పూరాతనము; ఉచ్ఛిష్టమ్=భోజనశేషము; అమేధ్యమ్ = యజ్ఞశేషము కానిది; ఇట్టి భోజనము తామసప్రియము.

మ. యాతయామ మనఁగా అర్ధపక్వము, నిర్వీర్యము గతరసపదముచేఁ జెప్పఁబడుటవలన నని భాష్యము. గతరసమ్ = విరసతను బొందినది, శుష్కము. యాతయామమ్ = పక్వమై జాము దాఁటిన యోదనాదికము, చల్లఁబడినది; గతరసమ్ = ఎత్తఁబడినసారము గలది, చిలికినపాలు మొదలగునది యని కొందఱు; పూతి=దుర్గంధము; పర్యుషితమ్=పక్వమై రాత్రి దాఁటినది; చకారముచే తత్కాలము ననే యున్మాదము చేయునట్టి ధుత్తూరాదికము * సముచ్చిత మగుచున్నది; యత్ = ఏది దుష్ట మని యతిప్రసిద్ధమో అట్టిది; ఉచ్ఛిష్టమ్ = భుక్తావశిష్టము; అమేధ్యమ్ = అయజ్ఞార్హము, అశుచి యగు మాంసాదికము; అపిచ అనుటచే వైద్యకశాస్త్రోక్త మగు నపథ్యము సముచ్చిత మగుచున్నది; ఇట్టి భోజనము — భోజ్య మేది గలదో అది తామసునకుఁ బ్రియము, సాత్త్వికులచే నతిదూరమునుండియే యుపేక్షింపఁదగిన దని యర్థము. ఇట్టి భోజనము దుఃఖశోకామయప్రద మనుట యతిప్రసిద్ధము కావునఁ గంఠముచేఁ జెప్పఁబడినది కాదు. ఇటుఁ గ్రమంబున, రస్యాదివర్గము సాత్త్వికము, కట్వాదివర్గము రాజసము, యాతయామాదివర్గము తామస మని యాహారవర్గత్రయము చెప్పఁబడినది. అందు సాత్త్వికవర్గవిరోధి యితరవర్గద్వయం బని యెఱుంగవలయును. ఎట్లనఁగా, అతికటువు మొదలగునది రస్యత్వమునకు విరోధి, అట్టిది యాస్వాద్యము కానందువలన. రూక్షత స్నిగ్ధత్వమునకు విరోధి. తీక్ష్ణత్వ విదాహిత్వములు ధాతుపోషణవిరోధు లగుటవలన స్థిరత్వమునకు విరోధులు. అత్యుష్ణత్వాదికము హృద్యత్వమునకు విరోధి. ఆమయప్రదత్వము ఆయుస్సత్త్వబలారోగ్యములకు విరోధి. దుఃఖశోకప్రదత్వము సుఖప్రీతులకు విరోధి. ఇట్లు రాజసవర్గము సాత్త్వికవిరోధి యనుట స్పష్టము. అట్లు తామసవర్గమునందును గతరసత్వమును యాతయామత్వమును బర్యుషితత్వమును యథాసంభవముగా రస్యత్వ స్నిగ్ధత్వ స్థిరత్వవిరోధులు. పూతిత్వమును ఉచ్ఛిష్టత్వమును అమేధ్యత్వమును హృద్యత్వమునకు విరోధులు. ఆయుస్సత్త్వాదివిరోధిత్వమో స్పష్టమే. రాజసవర్గమునందు దృష్టవిరోధముమాత్రమే, తామసవర్గమునందో దృష్టాదృష్టవిరోధం బని యతిశయము.

* ఉన్మత్త మొదలగునది.

శ్రీ. మఱియును.—యాతము = కడచినది యామము – జాము. పక్వమైన యేయన్నాదికమునకో అది యాతయామము, శైత్యావస్థను బొందిన దని యర్థము; గతరసమ్ = పిండఁబడినరసము గలది; పూతి=దుర్గంధము; పర్యుషితమ్ = పూర్వదినమందుఁ బక్వము; ఉచ్ఛిష్టమ్ = ఇతరులు భుజింపఁగా మిగిలినది. అమేధ్యమ్ = అభక్ష్యము; కలంజాదికము; ఇట్టి భోజనము–భోజ్యము తామసప్రియము.

ప. *

రా. యాతయామమ్ = చిరకాలావస్థితము. గతరసమ్=పోయిన స్వాభావికరసము గలది; పూతి = దుర్గంధము గలది; పర్యుషితమ్ = కాలము గడచుటచే రసాంతరము నొందినది; ఉచ్ఛిష్టమ్=గుర్వాదులకంటె నితరుల భుక్తశేషము; అమేధ్యమ్ = యజ్ఞార్హము కానిది, యజ్ఞశిష్టము కానిది యని యర్థము; ఇట్టి తమోమయ మగు భోజనము తామసప్రియ మగుచున్నది. భుజ్యతే – భుజింపఁబడుచున్నది కావున ఆహారమే భోజనము. అందువలన హితము గోరువారు సత్త్వవృద్ధి కొఱకు సాత్త్వికాహారమునే సేవింపవలయును.

అఫలాకాఙ్క్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే
యష్టవ్య మే వేతి మనః సమాధాయ స సాత్త్వికః. ౧౧

భా. ఇఁక నిప్పుడు యజ్ఞము త్రివిధము చెప్పఁబడుచున్నది.—అఫలాకాఙ్క్షిభిః=ఫలముకోరనివారిచేత;విధిదృష్టః=శాస్త్రచోదనాదృష్టమగు; యః యజ్ఞః=ఏయజ్ఞము; యష్టవ్య మేవేతి=యజ్ఞస్వరూపమునుమాత్రమే నెఱవేర్పవలయు నని; మనః = మనస్సును; సమాధాయ=దీనిచే నాకుఁ బురుషార్థము వల దని నిశ్చయించి; ఇజ్యతే = నెఱవేర్పఁబడుచున్నదో; సః = ఆ యజ్ఞము; సాత్త్వికః=సాత్త్విక మని చెప్పఁబడును.

ఫలాభిసంధి లేనివారు యజ్ఞము చేయవలసినది మాత్రమే కాని తత్ఫలమేమియు వలఁ దని నిశ్చయించుకొని శాస్త్రచోదిత మగు నేయజ్ఞముఁ జేయుచున్నారో అది సాత్త్వికయజ్ఞ మని తాత్పర్యము.

ఆ. హానాఽఽదానార్థం బిట్లు త్రివిధాహారమును విభజించి క్రమప్రాప్త మగు త్రివిధయజ్ఞముఁ జెప్పుచున్నారు ఇఁక నిత్యాదిగా. అందు సాత్త్విక

* శ్రీధరీయవ్యాఖ్యతో సమానము.

యజ్ఞమును దెలుపుచున్నారు అఫ లేత్యాదిగా. ఫలాభిసంధి లేక యజ్ఞస్వరూపము మాత్రమే భావ్యం బను బుద్ధితో శాస్త్రవిధిచోదితమైన ననుష్ఠించుయజ్ఞము సాత్త్విక మని యర్థము.

హ. యజ్ఞము చేయవలసినది మాత్రమే యని మనస్సు చేసికొని చేయు యజ్ఞము సాత్త్వికము.

శం యష్టవ్య మేవ; ఇందుచే నాకుఁ బరమేశ్వరప్రీతిరూప మగు పురుషార్థము సిద్ధించు నని, మనః సమాధాయ=మనస్సు నిశ్చలము గావించుకొని. శ్రద్ధాభక్తులతో, అఫలాకాఙ్క్షిభిః = నిష్కాములచేత, తంత్రమంత్రార్థవేదు లగు శ్రోత్రియులచేత; విధిదృష్టః=విధ్యుక్తనియమములతోఁ గూడిన దగు; యో యజ్ఞః ఇజ్యతే= ఏయజ్ఞము చేయఁబడుచున్నదో; అది సాత్త్వికయజ్ఞ మని యర్థము.

మ. ఇప్పుడు క్రమప్రాప్త మగు త్రివిధయజ్ఞముఁ జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—అగ్నిహోత్ర దర్శపూర్ణమాస చాతుర్మాస్య పశుబంధ జ్యోతిష్టోమాదిక మగు యజ్ఞము రెండువిధములు, కామ్య మని నిత్య మని. ఫలసంయోగముచేఁ జోదితము కామ్యము, అది సర్వాంగోపసంహారముచేతనే * ముఖ్యకల్పముచే ననుష్ఠేయము. ఫలసంయోగము లేక జీవనాదినిమిత్తసంయోగముచేఁ ♦ జోదితమై సర్వాంగోపసంహారము సంభవింపనియప్పుడు ప్రతినిధ్యాదుల గ్రహించి యముఖ్యకల్పముచే నైనను ననుష్ఠేయం బగునది నిత్యము. అందు సర్వాంగోపసంహారము సంభవింప కున్నను బ్రతినిధ్యాదుల గ్రహించి యవశ్యము, యష్టవ్యమేవేతి; ప్రత్యవాయపరిహారముకొఱకు ఆవశ్యకజీవనాదినిమిత్తంబునఁ జోదిత మగుటవలన నని; మనః; సమాధాయ=నిశ్చయించి; అఫలాకాఙ్క్షిభిః = అంతఃకరణశుద్ధిఁ గోరువార లగుటచే కామ్యప్రయోగవిముఖు లగువారిచేత; విధిదృష్టః = యథాశాస్త్రము నిశ్చిత మగు; యః యజ్ఞః = ఏయజ్ఞము; ఇజ్యతే = అనుష్ఠింపఁబడుచున్నదో; సః = యథాశాస్త్రముగా నంతఃకరణశుద్ధికొఱకు ననుష్ఠించునిత్యప్రయోగ మగు నాయజ్ఞము; సాత్త్వికః = సాత్త్విక మని తెలియంగవలయును.

శ్రీ. యజ్ఞముగూడ త్రివిధము. అందు సాత్త్వికయజ్ఞమును జెప్పుచున్నాఁడు.—ఫలాకాంక్ష లేనిపురుషులచేత, విధిచేత దృష్టము—ఆవశ్యక మని విహిత

* అంగలోపము లేక.

♦ యావజ్జీవము చేయవలయు నని.

మగు; యో యజ్ఞః; ఇజ్యతే = అనుష్ఠింపఁబడుచున్నదో; సః సాత్త్వికః = అది సాత్త్వికయజ్ఞము. ఎట్లనుష్ఠింపఁబడుచున్నది? యష్టవ్యమేవేతి=యజ్ఞానుష్ఠానము మాత్రమే చేయవలయును, ఇతరము ఫల మేదియు వల దని; మనః సమాధాయ— ఏకాగ్రముగాఁ జేసి యని యర్థము.

ప. యజ్ఞంబును త్రివిధము. అందు సోపాధిక మగు యజ్ఞముఁ జెప్పుచున్నాఁడు మూఁడింటిచేత.— "కుర్వ న్నేవేహ కర్మాణి" ఇత్యాది విధిచే, యష్టవ్యమేవేతి; విధిదృష్ట మగు యజ్ఞము ఫలకాంక్షారహితు లగు పురుషులచేత, మనః; సమాధాయ = శుద్ధముగాఁ జేసికొని; ఏది, ఇజ్యతే = అనుష్ఠింపఁబడుచున్నదో; అది సాత్త్వికము.

రా. ఫలాకాంక్షారహితు లగు పురుషులచేత, విధిదృష్టః=శాస్త్రదృష్టము మంత్రద్రవ్యక్రియాదులతోఁ గూడినది; యష్టవ్య మేవేతి — భగవదారాధనముగా యజ్ఞము చేయుటయే ప్రయోజన మని; మనస్సమాధాయ యో యజ్ఞ ఇజ్యతే, అది సాత్త్వికము.

అభిసంధాయ తు ఫలం దమ్భార్థ మపి చైవ యత్
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్. ౧౨

భా. ఫలమ్=ఫలమును; అభిసంధాయతు=ఉద్దేశించియో; దమ్భార్థ మపి చైవ = ధార్మికత్వఖ్యాపనముకొఱకును; యత్ = ఏది; ఇజ్యతే= చేయఁబడుచున్నదో; భరతశ్రేష్ఠ = భరతవంశజులయం దుత్తముఁడా! తం యజ్ఞమ్=ఆ యజ్ఞమును. రాజసమ్ = రాజసమునుగా; విద్ధి = ఎఱుంగుము.

అర్జునా! ఫలముకొఱకును దాను ధార్మికుఁ డని ప్రకటించుటకొఱకును చేయుయజ్ఞము రాజస మని యెంఱుగు మని తాత్పర్యము.

అ. రాజసయజ్ఞమును హానార్థము ప్రదర్శించుచున్నారు ఫల మిత్యాదిగా. స్వర్గాదిఫలము నుద్దేశించియు ధార్మికత్వఖ్యాపనార్థంబును యజన మేది చేయఁబడుచున్నదో ఆయజ్ఞము రజోగుణముచే నిర్వర్తితము త్యాజ్య మని యెఱుంగు మని యర్థము.

హ. అభిసంధాయతుఫలమ్ = ఈ ఫలము నాకుఁ గలుగవలయు నని సం కల్పించి; దమ్భార్థ మపి చైవ = ధార్మికత్వఖ్యాపనార్థమే; ఏయజ్ఞము, ఇజ్యతే = నెఱవేర్పఁబడుచున్నదో. తం యజ్ఞం రాజసం విద్ధి.

శం. స్వర్గాదిఫలార్థముగాని దంభార్థము గాని చేయుయజ్ఞము రాజస మని యర్థము.

మ. ఫలమ్=కామ్య మగు స్వర్గాదిఫలమును; అభిసంధాయ = ఉద్దేశించి, అంతఃకరణశుద్ధిని కాదు; తు కారము నిత్యప్రయోగముకంటె వైలక్షణ్యము సూచించుచున్నది; దంభము — లోకమునందుఁ దాను ధార్మికుం డని ప్రకటించుట, దానికొఱకును; అపిచైవ అనుట వికల్పసముచ్చయములచేఁ ద్రివిధం బని సూచ నార్థము; దంభార్థము గాక పారలౌకికఫలమునే యభిసంధించి, పారలౌకికఫలము నభి సంధింపక దంభార్థమే యని వికల్పముచే రెండుపక్షములు, పారలౌకికఫలార్థంబును ఇహలోకదంభార్థమును అని సముచ్చయముచే నొకపక్షము; ఇట్లు దృష్టాదృష్టఫలాభి సంధిగలవానిచే అంతఃకరణశుద్ధి నుద్దేశింపక, యదిజ్యతే = యథాశాస్త్రముగా నేయజ్ఞ మనుష్ఠింపఁబడుచున్నదో; తం యజ్ఞం రాజసం విద్ధి, హానముకొఱకు. భరత శ్రేష్ఠ అని యోగ్యతాసూచనము.

శ్రీ. రాజసయజ్ఞముఁ జెప్పుచున్నాఁడు.—ఫలమ్; అభిసంధాయతు=ఉద్దే శించియు; యదిజ్యతే = ఏయజ్ఞము చేయఁబడుచున్నదో; దమ్భార్థంచ = మహా త్త్వఖ్యాపనముకొఱకుఁగూడ. తం యజ్ఞం రాజసం విద్ధి.

ప. *

రా. ఫలాభిసంధియుక్తులచే దంభగర్భమును యశఃఫలము • నగు నేయ జ్ఞము చేయఁబడుచున్నదో ఆయజ్ఞమును రాజసమునుగా నెఱుంగుము.

విధిహీన మసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణమ్
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. ౧౩

భా. విధిహీనమ్=యథాచోదితమునకు విపరీతము, యథాశాస్త్రము గానిది; అసృష్టాన్నమ్ = బ్రాహ్మణులకు సృష్టము గాదు—దత్తము గాదు

* శ్రీధరీయముతో సమానము.

• యశస్సు ఫలముగాఁ గలది.

అన్నము ఏయజ్ఞమునందో అది యసృష్టాన్నము; మన్త్రహీనమ్=మంత్రముచేతను స్వరముచేతను వర్ణముచేతను హీనము మంత్రహీనము; అదక్షిణమ్=చెప్పిన దక్షిణ లేనిది; శ్రద్ధారహితమ్=శ్రద్ధచే విడువఁబడినది; అట్టి, యజ్ఞమ్ = యజ్ఞమును; తామసమ్ = తమోగుణముచే నిర్వృత్తమునుగా; పరిచక్షతే = చెప్పుచున్నారు.

శాస్త్రవిధిరహితంబును అన్నదానము లేనిదియు మంత్రవర్జితమును దక్షిణారహితంబును శ్రద్ధారహితంబు నగు యజ్ఞము తామస మని చెప్పుచున్నారని తాత్పర్యము.

**ఆ.** తామసయజ్ఞమును హానార్థమే యుదాహరించుచున్నారు వి ధీత్యాదిగా.

**హ.** విధిహీనమ్ = శాస్త్రచోదితము కానిది; అసృష్టాన్నమ్=అన్నదానరహితంబును; మన్త్రహీనమ్=మంత్రవర్జితంబును; అదక్షిణమ్=దక్షిణావిరహితంబును; అట్టి యజ్ఞమును, తామసం పరిచక్షతే=తామసమునుగాఁ జెప్పుచున్నారు.

**శం.** అర్థము స్పష్టము.

**మ.** యథాశాస్త్రబోధితమునకు విపరీతంబును అన్నదానరహితంబును స్వరమునను వర్ణమునను మంత్రహీనంబును యథోక్తదక్షిణ లేనిదియు ఋత్విజులతో ద్వేషాదులచే శ్రద్ధావిరహితంబు నగు యజ్ఞమును దామసమునుగాఁ జెప్పుచున్నారు శిష్టులు. తామసయజ్ఞము విధిహీనత్వాదు లొక్కొక్కవిశేషణము గలది యైదువిధములు, సర్వవిశేషణసముచ్చయంబున నొకవిధము, చేరి యాఱువిధములు. మఱియు రెండు మూఁడు నాలుగు విశేషణములసముచ్చయముచే బహుభేదములు తామసయజ్ఞమున కెఱుంగవలయును. రాజసయజ్ఞమున నంతఃకరణశుద్ధి లేకున్నను ఫలోత్పాదక మగు నపూర్వము కలదు, యథాశాస్త్ర మనుష్ఠించుటవలన. తామసమునందో అయథాశాస్త్రముగా ననుష్ఠించుటవలన నపూర్వ మేదియుఁ గలుగదని యతిశయము.

**శ్రీ.** తామసయజ్ఞముఁ జెప్పుచున్నాఁడు.—విధిహీనమ్ = శాస్త్రోక్తవిధిశూన్యము; అసృష్టాన్నమ్ = బ్రాహ్మణాదులకు అసృష్టము – ఇయ్యఁబడినది కాదు అన్నము దేనియందో అట్టిది; మంత్రములు లేనిది, యథోక్తదక్షిణ లేనిది, శ్రద్ధాశూన్యము నగు యజ్ఞమును తామసమునుగా, పరిచక్షతే=చెప్పుచున్నారు శిష్టులు.

ప. మన్త్రహీనమ్ = స్వశాఖోక్తమంత్రములచే హీనము. *

రా. విధిహీనమ్ = బ్రాహ్మణవాక్యముచే హీనము, సదాచారయుక్తులును విద్వాంసులు నగు బ్రాహ్మణులవలన యజింపు మని వాక్యము నొందక చేయఁబడు నది యని యర్థము; అసృష్టాన్నమ్=శాస్త్రచోదితము గాని ద్రవ్యము గలది; మంత్ర హీనమును దక్షిణారహితమును శ్రద్ధావిరహితము నగు యజ్ఞమును దామసము నుగాఁ జెప్పుచున్నారు.

దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే. ౧౪.

భా. ఇంక నిప్పుడు త్రివిధ మగు తపస్సును జెప్పుచున్నాఁడు.—దేవద్విజగురుప్రాజ్ఞపూజనమ్ = దేవతలయు ద్విజులయు గురువులయుఁ బ్రాజ్ఞులయుఁ బూజించుటయు; శౌచమ్=శౌచమును; ఆర్జవమ్=ఋజుత్వ మును; బ్రహ్మచర్యమ్ = బ్రహ్మచర్యమును; అహింసాచ = అహింసయు; శారీరమ్ = శరీరముచే నిర్వర్తింపఁదగినది శారీరము, శరీరప్రధానము లగు సమస్తము లైన కార్యకరణములచేఁ గర్తృలచే సాధ్యము, శారీర మగు; తపః=తప స్సని; ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. "పఞ్చైతే తస్య హేతవః" అని గదా చెప్పఁబోవుచున్నాఁడు.

దేవతలను బ్రాహ్మణులను గురువులను బ్రాజ్ఞులను బూజించుటయు శౌచం బును ఆర్జవంబును బ్రహ్మచర్యమును అహింసయు — ఇవి శారీర మగు తప స్సని చెప్పఁబడు నని తాత్పర్యము.

ఆ. సాత్త్వికాదిభావమును నిరూపించుటకై సమస్త తపస్సుయొక్క స్వరూపమును నిరూపించుచున్నారు ఇంక నిత్యాదిగా. అందు శారీరతపస్సును నిర్దేశించుచున్నారు దే వేత్యాదిగా. దేవతలు — బ్రహ్మ విష్ణు శివాదులు, ద్విజులు— పూజ్యులకుఁ బూజ్యు లగుటవలన బ్రాహ్మణోత్తములు, గురువులు—తండ్రి మొదలగు వారు, ప్రాజ్ఞులు — పండితులు విదితవేదితవ్యులు ♦. పూజించుట — నమస్కారము

* తక్కినది శ్రీధరీయముతో సమానము.

♦ ఎఱుంగవలసినదాని నెఱింగినవారు.

శుశ్రూష మొదలగునది. శౌచము — మృత్తికాజలములచే శరీరశోధనము. ఋజుత్వము — విహితమునందుఁ బ్రవృత్తియు నిషిద్ధమునుండి నివృత్తియు నేకరూపముగాఁ గలిగి యుండుట. బ్రహ్మచర్యము—మైథునము లేమి. అహింస—ప్రాణులఁ బీడింపమి. ఈ తపస్సు శరీరమాత్రనిర్వర్త్యం బనుట సంభవింప దని తలఁచి విశేషణము చేయుచున్నారు శరీరప్రధానములు ఇత్యాదిగా. ఎట్లు కర్త్రాదిసాధ్య మయినపుడు తపస్సు శారీరం బగును ? శారీరం బయినపు డెట్లు కర్త్రాదిసాధ్య మగును ? అని యాశంకించి చెప్పుచున్నారు ప ఇత్యాదిగా.

హ. ఇపుడు త్రివిధ మైన కాయికాదితపస్సును దెలుపుటకై చెప్పుచున్నాఁడు.——దేవతలు — అగ్న్యాదులు, ప్రాజ్ఞులు — తత్త్వవిదులు, వారి పూజించుట. శౌచమ్—మృత్తికాజలాదిసాధ్యము. ఆర్జ[illegible]=అవక్ర మయిన చిత్తము గలుగుట. బ్రహ్మచర్యమ్ = స్త్రీభోగవర్జనము. అ[illegible]ంసా = ప్రాణుల[illegible]పకుండుట. ఇది శరీరసాధ్య మగు తప స్సని విధింపఁబడుచున్నది.

శం. శారీరాదిభేదముచేఁ ద్రివిధ మైన తపస్సును జెప్పుచున్నాఁడు మూఁడు శ్లోకములచేత.——దేవ—అగ్న్యాదులు, ద్విజ — శ్రోత్రియులు, గురు—తండ్రి యాచార్యుఁడు ఉపాధ్యాయుఁడు మొదలగువారు, ప్రాజ్ఞ—బ్రహ్మవిదులు, ప్రాజ్ఞులను ద్విజుల కంటె వేఱుగా గ్రహించుట "ప్రాజ్ఞత్వము శతకోటిజన్మార్జితపుణ్యవిశేషాతిశయలబ్ధ మగు పరమేశ్వరప్రసాదాతిశయముచే జాత్యంతరజులకుఁ గూడ సంభవించుచున్నది, ధర్మవ్యాధాదులయం దట్లు కనఁబడుటవలన; అందువలన జాత్యంతరీయులయినను వారిని భక్తితో నారాధింపవలయు" నని బోధించుటకొఱకు, వారి పూజించుట—ప్రణామశుశ్రూషాన్నాదులచే నారాధించుట; శౌచమ్=బాహ్యాభ్యంతరశుద్ధి; ఆర్జవమ్ = కర్తవ్య మగు కర్మమునందును సాధువులయందును సర్వదా మనోవాక్కాయకర్మముల నేకరూపత; బ్రహ్మచర్యమ్=నిషిద్ధకాలమునందు రతివర్జనము; అహింసా = ప్రాణులను బీడింపమి; చకారము సముచ్చయార్థము; ఇది యంతయు శరీరనిర్వర్త్య మగుటవలన శారీరతప స్సని చెప్పఁబడుచున్నది.

మ. క్రమప్రాప్త మగు తపస్సుయొక్క సాత్త్వికాదిభేదమును బ్రతిపాదించుటకై శారీరవాచికమానసత్వములచే దానిత్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు మూఁడింటిచేత ——దేవ—బ్రహ్మవిష్ణుశివసూర్యాగ్నిదుర్గాదులు, — ద్విజద్విజాతు లగు బ్రాహ్మణులు, గురు—పితృమాతాచార్యాదులు, ప్రాజ్ఞ—పండితులు వేదములను తదుపకరణములను తదర్థములను దెలిసినవారు, వారిపూజనము—యథాశాస్త్ర మైన ప్రణామశు

శ్రూషాదికము; శౌచమ్ = మృజ్జలములచే శరీరశోధనము; ఆర్జవమ్=అకౌటిల్యమును భావసంశుద్ధిశబ్దముచే మానసతపస్సునందుఁ జెప్పఁబోవుచున్నాఁడు, శారీరమైన యార్జవమో విహితనిషిద్ధములయందు ఏకరూపముగాఁ బ్రవృత్తినివృత్తులు గలిగి యుండుట; బ్రహ్మచర్యమ్=నిషిద్ధమైథునము విడుచుట; అహింసా=అశాస్త్రీయప్రాణిపీడ చేయకుండుట; చకారమువలన అస్తేయమును అపరిగ్రహమును; శారీరమ్ = శరీరప్రధానకర్త్రాదులచే సాధ్యము, కాని కేవలశరీరముచేతఁ గాదు, "పఞ్చైతే తస్య హేతవః" అని గదా చెప్పఁబోవుచున్నాఁడు. ఇది శారీరతపస్సని చెప్పఁబడుచున్నది.

శ్రీ. తపస్సుయొక్క సాత్త్వికాదిభేదమును దెలుపుటకై మొదట శారీరాదిభేదముచే దాని త్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు మూఁడింటిచేత.—ప్రాజ్ఞులు—గురువ్యతిరిక్తులు, ఇతరులగు తత్త్వవిదులుగూడ. దేవబ్రాహ్మణాదిపూజనంబును శౌచాదికంబును, శారీరమ్ = శరీరనిర్వర్త్యము, తపస్సని చెప్పఁబడుచున్నది.

ప. *

రా. ఇఁక గుణములవలనఁ దపస్సుయొక్క త్రైవిధ్యముఁ జెప్పుటకై యది శరీరవాఙ్మనోనిష్పాద్యమగుటచే దానిస్వరూపభేదము మొదటఁ జెప్పుచున్నాఁడు.—దేవద్విజగురుప్రాజ్ఞలపూజనమును, శౌచమ్ — తీర్థస్నానాదికమును, ఆర్జవమ్ = మనస్సున నున్నట్లు శరీరవ్యాపారంబును, బ్రహ్మచర్యమ్—స్త్రీలయందు భోగ్యతాబుద్ధితో వీక్షణము మొదలగునది లేకుండుటయు, అహింసా—ప్రాణిపీడ చేయకుండుట, ఇది శారీరతపస్సని చెప్పఁబడును.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. ౧౫

భా. అనుద్వేగకరమ్ = ప్రాణులకు దుఃఖకరము కాని; వాక్యమ్ = వచనము; సత్యమ్ = యథార్థమును; ప్రియహితంచ = ప్రియమును హితమును ♦, ప్రియము—దృష్టార్థము, హితము — అదృష్టార్థము; యత్ = ఏది గలదో, అట్టి వాక్యము; అనుద్వేగకరత్వాదులగు ధర్మములచే వాక్యము విశేషింపఁబడుచున్నది, విశేషణధర్మసముచ్చయార్థము చశబ్దము, పరబోధనముకొఱకుఁ బ్రయుక్తమగు వాక్యము సత్యత్వమును

* శ్రీధరీయముతో సమానము.

♦ సంతోషము గలిగించునది ప్రియము, మేలు గలిగించునది హితము.

ప్రియత్వమును హితత్వమును అనుద్వేగకరత్వమును అను ధర్మములలో నొకదానిచే గాని రెంటిచే గాని మూఁటిచే గాని హీన మగునేని అది వాఙ్మయ మగు తపస్సు కాదు, సత్యవాక్యం బితరధర్మములలో నొక దానిచే గాని రెంటిచే గాని మూఁటిచే గాని హీన మగుపక్షమున నది వాఙ్మయతపస్సు కానేరదు, అట్లు ప్రియవాక్యముగూడ నితరములలో నొకటిగాని రెండుగాని మూఁడుగాని లేని దగునెడ నది వాఙ్మయతప స్సనఁబడదు, అట్లు హితవాక్యముగూడ నితరములలో నొకటి గాని రెండు గాని మూఁడు గాని లేనియెడ నదియు వాఙ్మయతపస్సు కాదు. మఱి యెట్టిది వాఙ్మయతపస్సు? ఏది సత్యంబును అనుద్వేగకరంబును బ్రియహితంబు నగు వాక్యము గలదో అది పరమం బగు తపస్సు వాఙ్మయము. ఎట్టి దనఁగా "శాంతుఁడ వగుము నాయనా! స్వాధ్యాయంబును యోగంబు ననుష్ఠింపుము, నీకు శ్రేయము కలుగును" ఇత్యాదికము. స్వాధ్యాయాభ్యసనం చైవ = యథావిధి వేదపారాయణముగూడ; వాఙ్మయమ్ = వాఙ్మయ మగు; తపః = తప స్సని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

పరులకు దుఃఖము గలిగింపనిదియు సత్యమును బ్రియమును హితము నగు వాక్యంబును యథావిధి వేదపారాయణంబును వాఙ్మయతప స్సని చెప్పఁబడు నని తాత్పర్యము.

టీ. ఇప్పుడు వాఙ్మయతపస్సును వ్యపదేశించుచున్నారు అనుద్వే గేత్యాదిగా. సత్యము — యథాదృష్టార్థవచనము. ప్రియము — శ్రుతిసుఖము. హితము — పరిణామమునఁ బథ్యము. ప్రియహితములను మఱియొకవిధమున విభజించు చున్నారు ప్రియము ఇత్యాదిగా. ఇట విశేషణవిశేష్యత్వ మెట్లనఁగాఁ జెప్పు చున్నారు అనుద్వేగకరత్వాదులు ఇత్యాదిగా. విశేషణధర్మము లగు ననుద్వేగకర త్వాదులకు విశేష్య మగు వాక్యముతో సముదితము లైనవానికిఁ బరస్పరముగూడ సముచ్చయముఁ దెలుపుచున్నది చకారం బని చెప్పుచున్నారు విశేష ణేత్యాదిగా. ఏల వాక్యము వీనిచే విశేషింపఁబడుచున్నది? ఏల మఱి యీవిశేషణములకుఁ బర స్పరసముచ్చయము? అనఁగాఁ జెప్పుచున్నారు ప రేత్యాదిగా. అవిశేషిత మగు వాక్యమాత్రము వాఙ్మయతపస్సు కానేరకున్నను సత్యవాక్యము విశేషణాంతరము

లేకున్నను వాఙ్మయతపస్సు కావచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు సత్య వాక్యంబు ఇత్యాదిగా. అట్లయినను ప్రియవాక్యముమాత్రము కావచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు అట్లు ప్రి యేత్యాదిగా. అయినను పరిణామపథ్యం బట్టిది యగు నని యాశంకించి చెప్పుచున్నారు అట్లు హి తేత్యాదిగా. అప్పుడు ఎట్టిది వాఙ్మయతపస్సు ? అనఁగా ప్రశ్నపూర్వకముగా విశదీకరించుచున్నారు మఱి యెట్టిది ఇత్యాదిగా. విశేషణసముచ్చయముివిషయమున వాఙ్మయతపస్సు నకు దృష్టాంతముఁ జెప్పుచున్నారు ఎట్టి దనఁగా ఇత్యాదిగా. ప్రాఙ్ముఖత్వము పవిత్ర పాణిత్వము మొదలగు విధానము నతిక్రమింపక వేదము నావర్తించుటయు వాఙ్మయ తపస్సునం దంతర్భవించు నని చెప్పుచున్నారు స్వాధ్యా యేత్యాదిగా. వాక్కు ప్రాచుర్యమునదీని యందుఁ బ్రవర్తించినది కావున వాఙ్మయము—వాక్కు ప్రధాన ముగాఁ గలది యని యర్థము.

హ. ఉద్వేగము — దుఃఖము, దుఃఖకరము కానిది. సత్యము — వితథము కానిది. స్వాధ్యాయము — వేదము, దాని నెల్లప్పుడు పఠించుట స్వాధ్యాయాభ్యస నము. ఇది; వాఙ్మయమ్ = వాక్కుచేత నిర్వర్త్య మగు; తపస్సు.

శ౦. అనుద్వేగకరమ్ = పరుషము కానిది; సత్యమ్ = యథార్థము; ప్రియ హితంచ=మనస్సునకును శ్రవణమునకును ఆనందము గలిగించునదియు పురుషార్థము కలిగించునదియు; ఇట్టి వాక్యము; అనుద్వేగకరంబును సత్యంబును ప్రియంబును హితంబు నని వాక్యచతుర్విధవిశేషణసముచ్చయార్థము చకారము. అనుద్వేగ కరత్వమును సత్యత్వమును ప్రియత్వమును హితత్వము నను విశేషణచతుష్టయ ముతోఁ గూడినవాక్యమే యుచ్చారితమై వాఙ్మయతప స్సగును. ఎట్లు ఉదాత్తాది స్వరచతుష్టయముతోఁ గూడిన వేదమే వేద మగునో అట్లు. అది యొకదానిచేఁ గాని రెంటిచేఁ గాని మూఁటిచేఁ గాని విశేషణములచే వియుక్తమైనయెడ వాఙ్మయ తపస్సు కానేరదు. అందువలన ముముక్షువు విశేషణచతుష్టయవిశిష్టమైనవాక్య మునే పలుకవలయు నని సిద్ధము. బ్రహ్మయజ్ఞముగూడ వాఙ్మయతపస్సునం దంత ర్భవించు నని చెప్పుచున్నాఁడు.—స్వాధ్యాయాభ్యసనం చైవ—ప్రాఙ్ముఖత్వ పవిత్ర పాణిత్వాదినియమములతో స్వాధ్యాయముయొక్క — వేదముయొక్క అభ్యసనము— ఆవృత్తియు వాఙ్మయతపస్సే యని యర్థము. వాఙ్మయమ్—వాక్కుచే నిర్వర్తింపఁ బడుటవలన వాఙ్మయతప స్సనఁబడుచున్నది. చకారమువలన స్తోత్రపాఠాదికము గూడ వాఙ్మయతపస్సే యగు నని యర్థము.

మ. అనుద్వేగకరమ్=ఎవ్వనికిని దుఃఖకరము కానిది; సత్యమ్=ప్రమాణము గలదియు అబాధిత మయిన యర్థము గలదియు; ప్రియము – వినువానికి దత్కాలమున శ్రుతి సుఖము, హితము—పరిణామమునందు సుఖకరము; చ కారము విశేషణములకు సముచ్చయార్థము; అనుద్వేగకరత్వాదివిశేషణచతుష్టయముతోఁ గూడినది, ఒకవిశేషణముచేనేనియు న్యూనము కానిది, ఏవాక్యము గలదో, "శాంతుఁడ వగుము నాయనా! స్వాధ్యాయమును యోగమును అనుష్ఠింపుము, నీకు శ్రేయము కలుగును" ఈ వాక్యమువంటిది, అది; వాఙ్మయమ్=వాచిక మగు, తపః=తపస్సు, శారీరమువలె. స్వాధ్యాయాభ్యసనంచ=యథావిధి వేదాభ్యాసము గూడ; వాఙ్మయతప స్సని చెప్పఁబడుచున్నది. ఏవకారము పూర్వవిశేషణసముచ్చయావధారణార్థకము.

శ్రీ. వాచిక మగు తపస్సును జెప్పుచున్నాఁడు.—ఉద్వేగమును – భయమును జేయదు కావున అనుద్వేగకరమును సత్యమును శ్రోతకుఁ బ్రియంబును హితమును – పరిణామమున సుఖకరంబును; స్వాధ్యాయాభ్యసనంచ=వేదాభ్యాసంబును; వాఙ్మయమ్ = వాక్కుచే నిర్వర్త్య మగు; తపః.

ప. ఇఁక వాఙ్మయం బగు తపమును జెప్పుచున్నాఁడు.—పరున కుద్వేగముఁ బుట్టించునది కానిది, అట్టి వాక్యము; సత్యమ్=యథార్థము; అదియు దుఃఖపర్యవసాయి కా దని చెప్పుచున్నాఁడు.—ప్రియహితమ్ = ప్రియము – సుఖముగా వినఁదగినది, పరిణామమున హితముగూడ. అట్లు మనువు "సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయా న్న బ్రూయా త్సత్య మప్రియమ్ । ప్రియంచ నానృతం బ్రూయా దేష ధర్మ స్సనాతనః" * అని. స్వాధ్యాయాభ్యనమ్ = స్వశాఖాధ్యయనాభ్యాసము. ఇది వాఙ్మయ మగు తప స్సని చెప్పఁబడుచున్నది.

రా. పరున కుద్వేగకరము కానిదియు సత్యమును బ్రియహితము నగు వాక్య మేది గలదో అదియు స్వాధ్యాయాభ్యసనంబును అనునిది వాఙ్మయ మగు తప స్సని చెప్పఁబడుచున్నది.

మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే. ౧౬

---

* సత్యముఁ బలుకవలయును, ప్రియముఁ బలుకవలయును, సత్యమైనను అప్రియముఁ బలుకరాదు, ప్రియమైనను అసత్యముఁ బలుకరాదు. ఇది సనాతన మగుధర్మము.

**భా.** మనఃప్రసాదః = మనస్సుయొక్క ప్రశాంతి, మనస్సునకు స్వచ్ఛతను గలిగించుట ప్రసాదము; సౌమ్యత్వమ్=దేని సౌమనస్య మందురో అది, ముఖాదిప్రసాదము కార్యముగాఁ గల యంతఃకరణవృత్తి; మౌనమ్= వాక్సంయమము * గూడ మనస్సంయమమువలనఁ గలుగునది యగుట వలనఁ గార్యముచేఁ గారణము చెప్పఁబడుచున్నది మనస్సంయమము మౌన మని; ఆత్మవినిగ్రహః=మనస్సుయొక్క నిరోధము, అన్నిటనుండియు సామాన్యరూపం బాత్మవినిగ్రహము, వాగ్విషయముమాత్రమే యగు మనస్సుయొక్క సంయమము మౌన మని విశేషము; భావసంశుద్ధిః = పరులతో వ్యవహరించునపుడు మాయావిత్వము లేకుండుట; ఇతి ఏతత్ = అనునిది; మానసమ్ = మానస మగు; తపః = తప స్సని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

మనస్సును బ్రసన్నముగా నుంచుకొనుటయు సౌమ్యతయు మౌనంబును మనోనిరోధంబును బరులతో వ్యవహరించునపుడు కపటము లేకుండుటయు — ఇది మానసతప స్సనఁబడును అని తాత్పర్యము.

**ఆ.** మానసతపస్సును సంక్షేపించుచున్నారు.—ప్రశాంతిఫలమునే విశద పఱచుచున్నారు స్వచ్ఛతను ఇత్యాదిగా. మనస్సుయొక్క స్వచ్ఛత యనఁగా అనాకులత నిశ్చింతత యని యర్థము. సౌమనస్యము — అందఱకును మేలు కోరుటయుఁ గీడు కోర కుండుటయు. అది యెట్లు తెలియవచ్చు ననఁగాఁ జెప్పుచున్నారు ముఖాదీత్యాదిగా. దానిస్వరూపముఁ జెప్పుచున్నారు అంతకరణవృత్తి యని. ఓయీ! మౌన మనఁగా వాఙ్నియమనము, అది వాఙ్మయతపస్సునం దంతర్భవించునది, దాని నెట్లు మానసతపస్సనందు వ్యపదేశింపవచ్చును? అనఁగా వాక్సంయమము కార్యమగుటవలనను మనస్సంయమము కారణ మగుటవలనను కార్యముచేఁ గారణమును గ్రహించి మానసతపస్సునందు మౌనము చెప్పఁబడిన దని చెప్పుచున్నారు వాక్సంయమము ఇత్యాదిగా. లేక, మౌనమ్—మునిభావము, మననము. ఓయీ! ఇట్లు మౌనమును మనోనిరోధంబును మనస్సంయమమే యగుటచే నొక్కటియె యగుట వలనఁ బౌనరుక్త్యం బనఁగా లే దని చెప్పుచున్నారు అన్నిటనుండియు నిత్యాదిగా. భావముయొక్క—హృదయముయొక్క సంశుద్ధి—రాగాదిమలహీనత యని వ్యాఖ్యా

* వాక్కుయొక్క నిగ్రహము—మాటలాడకుండుట.

నము చేయుచున్నారు పరులతో నిత్యాదిగా. మానసము — మనస్సుచే ప్రధాన మయినదానిచే నిర్వర్త్య మని యర్థము.

హ. మనఃప్రసాదః = మనసుయొక్క స్వచ్ఛత; సౌమ్యత్వమ్ = సౌమనస్యము, ముఖాదిప్రసాదము కలిగించునట్టి యంతఃకరణవృత్తి; మౌనమ్ = వాక్సంయమము; ఆత్మవినిగ్రహః = మనస్సుయొక్క నిరోధము; భావసంశుద్ధిః = వంచన లేకుండుట; ఇత్యేతత్; మానసం తపః ఉచ్యతే.

శం. మనఃప్రసాదః = విషయములనుండి తొలఁగి యవికారరూపమున నొక్కచో నిలుచుట, మనస్సుయొక్క ప్రసాదము; సౌమ్యత్వమ్=ఉపకారియందును అపకారియందును ఇష్టునియందును అనిష్టునియందును పక్షపాతము లేక మనస్సుండుట, లేక, అక్రూరత; మౌనమ్ = మునియొక్క భావము, సగుణమునుగాని నిర్గుణమునుగాని యనుసంధించుచుండుట మౌనము; ధ్యానపరాయణుఁడే ముని, తద్భావమే మౌనము, కాని వాఙ్మాత్రనిరోధము కాదు, అట్లు కాదేని పశ్వాదులకుఁ గూడ మౌనము గల దనవలసివచ్చును; ఆత్మవినిగ్రహః = ఆత్మయొక్క—మనస్సుయొక్క వినిగ్రహము — విషయములయందుఁ బ్రవృత్తినిరోధనము; భావసంశుద్ధిః = భావింపఁబడుచున్నది యర్థము దీనిచేతఁ గావున భావ మనఁగా అంతఃకరణము, దానికి రాగద్వేషాదిదోషసంబంధము లేనట్లు చేయుట భావసంశుద్ధి; ఇత్యేతత్ = అనునిది; సర్వంబును మనస్సే ప్రధానముగాఁ గల దగుటవలన, మానసం తపః = మానస మగు తప స్సని; ఉచ్యతే=చెప్పఁబడుచున్నది, మహర్షులచేత నని యర్థము.

మ. మనస్సుయొక్క ప్రసాదము — స్వచ్ఛత, విషయచింతచే వ్యాకులత లేకుండుట; సౌమ్యత్వమ్ = సౌమనస్యము, సర్వలోకములకు హితము గోరుటయు నిషిద్ధము తలఁప కుండుటయు; మౌనమ్ = మునిభావము, ఏకాగ్రతతో ఆత్మచింతనము నిదిధ్యాసనం బనునది; వాక్సంయమహేతు వగు మనస్సంయమము మౌనమని భాష్యము; ఆత్మవినిగ్రహః = ఆత్మయొక్క—మనస్సుయొక్క విశేషంబున సర్వవృత్తినిగ్రహము, నిరోధసమాధి అసంప్రజ్ఞాతము; భావముయొక్క — హృదయముయొక్క శుద్ధి కామక్రోధలోభాదిమలనివృత్తి, సంశుద్ధి — వెండియు నశుద్ధి పుట్టకుండునట్లు సమీచీన మయినది; పరులతో వ్యవహరించునపుడు మాయ లేకుండుట భావసంశుద్ధి యని భాష్యము. ఇత్యేతత్ =ఈవిధ మయిన; తపః; మానస ముచ్యతే.

**శ్రీ.** మానసం బగు తపముఁ జెప్పుచున్నాఁడు.—మనస్సుయొక్క ప్రసాదము – స్వస్థత; సౌమ్యత్వమ్ = అక్రూరత; మౌనమ్ = మునియొక్క భావము, మననం బని యర్థము; ఆత్మయొక్క – మనస్సుయొక్క వినిగ్రహము – విషయముల నుండి ప్రత్యాహారము; భావసంశుద్ధిః = వ్యవహారమునందు మాయ లేకుండుట; ఇత్యేతత్ మానసం తపః.

**ప.** * శ్రుతియును.—"త మేతం వేదానువచనేన వివిదిషన్తి బ్రహ్మచర్యేణ తపసా శ్రద్ధయా యజ్ఞేనా ఽనాశకేన" అని. భాష్యము.—త మేతమ్ – అట్టి యీయాత్మను, వేదానువచనేన – ఉపనిషద్భాగముచేతను, వివిదిషన్తి – ఎఱుంగఁగోరుచున్నారు. అట్లు, బ్రహ్మచర్యేణ—శారీరముచేతను, తపసా, శ్రద్ధయా— ఆస్తిక్యబుద్ధిచేతను, యజ్ఞేన – సాత్త్వికమగుదానిచేతను, కావుననే, అనాశకేన – నశ్వరఫలాభిసంధిరహిత మైనదానిచేత.

**రా.** మనఃప్రసాదః=మనసునకుఁ గ్రోధాదులు లేకుండుట; సౌమ్యత్వమ్= మనసునకుఁ బరులయభ్యుదయమం దాసక్తి కలుగుట; మౌనమ్ = మనస్సుచే వాక్కుయొక్క ప్రవృత్తిని నిగ్రహించుట; ఆత్మవినిగ్రహః = మనోవృత్తిని ధ్యేయ విషయమందు నిలుపుట; భావసంశుద్ధిః = ఆత్మవ్యతిరిక్తవిషయచింత లేకుండుట; ఏతత్ మానసం తపః

**మా.** సౌమ్యత్వమ్ = అక్రౌర్యము, "అక్రూర స్సౌమ్య ఉచ్యతే" అని యభిధానము. మౌనమ్ = మననశీలత్వము, "బాల్యంచ పాణ్డిత్యంచ నిర్విద్యా ఽథ మునిః" అని గదా శ్రుతి. "ఏతేన హీదం సర్వం మతం యదనేన హీదం సర్వం మతం తస్మా న్ముని స్తస్మా న్ముని రిత్యాచక్షతే" ♦ అని భాల్లవేయశ్రుతి. కాదేని యెట్లు మానసతప స్సగును?

శ్రద్ధయా పరయా త ప్తం తప స్త త్త్రివిధం నరైః
అఫలాకాఙ్క్షిభి ర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే. ౧౭

**భా.** యథోక్తం బగు కాయికవాచికమానసతపస్సు నరులచే ననుష్ఠితంబై సత్త్వాదిభేదమున నెట్లు త్రివిధం బగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—

---

* పదయోజన శ్రీధరీయముతో సమానము.

♦ వీనిచేతఁ గదా యిది యంతయు మతము; వీనిచేత నిది యంతయు మత మనుట యేది గలదో ంధువలన ముని. అందువలన ముని యని చెప్పుచున్నారు.

త్రివిధమ్=మూఁడువిధము లైన యధిష్ఠానము గల దగు; తత్=ఆ ప్రకృత మయిన; తపః = తపస్సును; పరయా=ప్రకృష్ట మగు; శ్రద్ధయా=ఆస్తిక్య బుద్ధితోఁ; అఫలాకాఙ్క్షిభిః = ఫలాకాంక్షారహితులును; యుక్తైః=సమాహితులు నగు; నరైః = అనుష్ఠాత లగు మనుష్యులచేత; తప్తమ్ = అనుష్ఠింపఁబడినదాని; ఇట్టితప స్సేది గలదో దాని, సాత్త్వికమ్ = సత్త్వ నిర్వృత్తమునుగా; పరిచక్షతే = చెప్పుచున్నారు, శిష్టులు.

ఆ త్రివిధ మైనతపస్సును ఉత్కృష్ట మయినశ్రద్ధతోఁ గూడినవారై ఫలాసంధి లేక సిద్ధ్యసిద్ధులయందు సము లై యనుష్ఠించినయెడ నది సాత్త్విక మని చెప్పుచున్నా రని తాత్పర్యము.

శ్రీ. త్రివిధ మైనతపస్సునకు యథాసంభవముగా సాత్త్వికాదిభేదముచేఁ ద్రైవిధ్యము నాకాంక్షాద్వారమునఁ జెప్ప నారంభించుచున్నారు యథోక్తము ఇత్యాదిగా. అధిష్ఠానము గలది—దేహవాఙ్మనోనిర్వర్త్యం బని యర్థము. సమాహితులు—సిద్ధ్యసిద్ధులయందు నిర్వికారు లనుట.

హ. *

శం. చెప్పిన త్రివిధతపస్సునకే సత్త్వాదిగుణభేదముచేఁ ద్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు.—యుక్తైః = ఏకాగ్రచిత్తులును, పరమేశ్వరభక్తియుక్తులును; కావుననే, అఫలాకాఙ్క్షిభిః; నరైః; పరయా శ్రద్ధయా; తప్తమ్; తత్; త్రివిధం తపః = మూఁడుప్రకారములు గల తపస్సును; సాత్త్వికమ్ = సత్త్వగుణముచే సంభావిత మగు నతిశ్రద్ధచే నిష్పాదిత మగుటవలన సాత్త్వికమునుగా; పరిచక్షతే = చెప్పుచున్నారు.

మ. శారీర వాచిక మానసభేదంబునఁ ద్రివిధ మని చెప్పిన తపస్సునకు సాత్త్వికాదిభేదంబునఁ ద్రైవిధ్యము నిప్పుడు ప్రదర్శించుచున్నాఁడు మూఁడింటిచేత.—తత్—పూర్వోక్త మైన; త్రివిధమ్ — శారీరమును వాచికమును మానసము నగు; తపః; పరయా శ్రద్ధయా = ప్రకృష్ట మయిన యాస్తిక్యబుద్ధితోఁ, అప్రామాణ్యశంకాకలంకము లేని శ్రద్ధతోఁ; ఫలాభిసంధిశూన్యులును, యుక్తైః = సమాహితులును — సిద్ధ్యసిద్ధులందు నిర్వికారులు నగు; నరైః—అధికారులచేత; తప్తమ్ = అనుష్ఠిత మగుదాని; సాత్త్వికమునుగా, పరిచక్షతే = చెప్పుచున్నారు శిష్టులు.

* శంకరభాష్యముతో సమానము.

శ్రీ. ఇట్లు శరీరవాఙ్మనోనిర్వర్త్యము త్రివిధ మగు తపస్సు దర్శితము; ఆ త్రివిధతపస్సునకును సాత్త్వికాదిభేదంబునఁ ద్త్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—త్రివిధ మగు తపస్సుగూడ; పరయా = శ్రేష్ఠ మయిన; శ్రద్ధయా; ఫలాకాంక్షాశూన్యులును, యుక్తైః = ఏకాగ్రచిత్తులు నగు; నరైః; తప్తమ్; తత్ — దాని; సాత్త్వికమునుగాఁ జెప్పుచున్నారు.

ప. ఇఁక సాత్త్వికాదిభేదముచే వెండియుఁ ద్రివిధం బని చెప్పుచున్నాఁడు.—తత్; త్రివిధమ్ = శరీరవాఙ్మనోవిభాగముచేతఁ జెప్పఁబడిన దగు; తపః; అఫలాకాంక్షులును, అట్లు, యుక్తైః = ఏకాగ్రచిత్తులు నగు; నరైః; తప్తమ్=అను ష్ఠితమును; సాత్త్వికం పరిచక్షతే.

రా. అఫలాకాఙ్క్షిభిః = ఫలాకాంక్షారహితులును; యుక్తైః=పరమపురుషారాధనరూపం బిది యనుతలంపుతోఁ గూడినవారు నగు; నరైః; పరయా శ్రద్ధయా; ఏది, త్రివిధం తపః; కాయవాఙ్మనస్సులచే, తప్తమ్; దాని సాత్త్వికమునుగాఁ జెప్పుచున్నారు.

మూ. *

సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్
క్రియతే త దిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్. ౧౮

భా. సత్కారమానపూజార్థమ్ = సత్కారము — సాధుకారము, సాధు వితఁడు తపస్సంపన్నుఁ డగు బ్రాహ్మణుఁ డనుట, దీనికొఱకును, మానము — మాననము, ఎదుర్కొనుట నమస్కరించుట మొదలగునది, దానికొఱకును, పూజ — పాదప్రక్షాలనము అర్చించుట భోజనము పెట్టుట మొదలగునది, దానికొఱకును; దమ్భేన చైవ=దంభముచేతను గూడ; యత్ తపః = ఏతపస్సు; క్రియతే=చేయఁబడుచున్నదో; తత్ = ఆతపస్సు; ఇహ = ఇందు; ప్రోక్తమ్ = చెప్పఁబడినది; రాజసమ్ = రజోనిర్వృత్త మనియు; చలమ్ = కాదాచిత్కఫలం బగుటచే చల మనియు; అధ్రువమ్ = అస్థిర మనియు.

తన్ను జనులు సత్పురుషుఁ డనవలయు ననియు సమ్మానింపవలయు ననియు పూజింపవలయు ననియుఁ గోరియు దంభముతోను ఏతపస్సు చేయఁబడునో,

---

* ఇది మొదలుగా నిరువదిరెండవశ్లోకమువఱకు శ్రీశాంకరభాష్యము లేదు.

అది రాజసము, ఈలోకమునందుమాత్రమే ఒకానొకప్పుడు కలుగునట్టి ఛంచలమును అస్థిరము నగు ఫలము గలదియు నని చెప్పఁబడిన దని తాత్పర్యము.

**రా.** రాజసతపస్సును నిర్దేశించుచున్నారు సత్కార త్యాదిగా. సాధు కారమునే వివరించుచున్నారు సాధుపు ఇత్యాదిగా. ఇందు చెప్పఁబడినది — ఈ లోకమునందుమాత్రమే ఫలప్రద మని యర్థము. కాదాచిత్కఫలంబు — క్షణిక మగు ఫలము గలది. అస్థిరము — నియతము గాని ఫలము గలది యని యర్థము.

**హ.** *

**శం.** సత్కారమానపూజార్థమ్ = సత్కారార్థమును మానార్థమును పూజార్థమును, సత్కారము — సాధు వీవిద్వాంసుఁడు బ్రాహ్మణుం డని స్తుతి, దాని కొఱకును, మానము — బహుమానము ప్రత్యుత్థానాదికము, దానికొఱకును, పూజ — గంధపుష్పదక్షిణలచేఁ బూజించుట, దానికొఱకును; దమ్భేన = వేష భాషాదిప్రకాశనముచేత; దాంభికులచే, యత్ తపః క్రియతే = ఏ తపస్సు చేయఁ బడుచున్నదో; తత్ = ఆతపస్సు; ఇహ = ఈలోకమునందుమాత్రమే ఫలప్రద మగుచున్నది. అదియు; అధ్రువమ్ = దేహమాత్రమునకే యుపయోగి యగుట వలన అస్థిరము; అందును, చలమ్=తాత్కాలికఫలము, క్షణిక మైనఫలము గలది; ఇట్టి తప స్సేది గలదో అది, రాజసమ్ = రాజస మని; ప్రోక్తమ్ = మహార్షులచేఁ జెప్పఁబడినది.

**మ.** సత్కారము — సాధు వీతఁడు తపస్వి బ్రాహ్మణుఁ డని యవివేకులు చేయుస్తుతి, మానము—ప్రత్యుత్థానాభివాదనాదికము, పూజ—పాదప్రక్షాలనార్చన ధనదానాదికము, వానికొఱకు; దమ్భేనైవచ=కేవలము ధర్మధ్వజిత్వముచేతనే, కాని యాస్తిక్యబుద్ధిచేఁ గాదు; యత్ తపః క్రియతే; తత్—అది; రాజసమ్=రాజస మని; ప్రోక్తమ్ = చెప్పఁబడినది శిష్టులచేత; ఇహ = ఈ లోకమునందుమాత్రమే ఫలప్రదము, పారలౌకికము కాదు; చలమ్ = మిక్కిలి యల్పకాల ముండుఫలము గలది; అధ్రువమ్ = ఫలము నొసంగు నను నియమము లేనిది.

**శ్రీ.** రాజసతపస్సును జెప్పుచున్నాఁడు.—సత్కారము — సాధు వితఁ డనియు తపస్వి యనియు మొదలుగా వాక్పూజ, మానము — ప్రత్యుత్థానాభివాద నాదిదేహకృతపూజ, పూజ—అర్ఘలాభాదికము, వీనికొఱకు; దమ్భేనచ; యత్ తపః

---

* శంకరభాష్యమతో సమానము.

క్రియతే; కావుననే, చలమ్ = అనియతము; అధ్రువమ్=క్షణికము; ఇట్టి తప స్సెది గలదో అది యిందు రాజస మని చెప్పఁబడినది,

ప. *

రా. మనస్సుచే నాదరించుట సత్కారము, వాక్కుచేఁ బ్రశంసించుట మానము, శారీర మగు నమస్కారాదికము పూజ, ఫలాభిసంధిపూర్వకముగా సత్కారాదులకొఱకును దంభముచేత నేతపము చేయఁబడుచున్నదో; అది యిక్కడ రాజస మని చెప్పఁబడినది. స్వర్గాదిఫలసాధన మగుటచే నస్థిర మగుటవలన చలము అధ్రువము. చలము — పాతభయముచేఁ జలనహేతువు; అధ్రువము — నశించునది.

మూఢగ్రాహేణా ఽఽత్మనో యత్పీడయా క్రియతే తపః
పరస్యోత్సాదనార్థం వా త త్తామస ముదాహృతమ్. ౧౯

భా. మూఢగ్రాహేణ=అవివేకనిశ్చయముచే; ఆత్మనః=తనయొక్క; పీడయా = పీడించుటచేత; యత్ = ఏ; తపః = తపస్సు; క్రియతే = చేయఁబడుచున్నదో; పరస్య = ఇతరునియొక్క; ఉత్సాదనార్థం వా = వినాశముకొఱకుఁ గాని; తత్ = అది; తామసమ్ = తమోనిర్వృత్త మగుతప స్సని. ఉదాహృతమ్ = చెప్పఁబడినది.

మూఢపుఁబట్టుదలచేఁ దనదేహాదులఁ బీడించుకొనుచు నేతపస్సు చేయఁబడునో, మఱియుఁ బరునివినాశము నుద్దేశించి యేది చేయఁబడునో అది తామస తప స్సనఁబడు నని తాత్పర్యము.

ఆ. తామసతపస్సును సంగ్రహించుచున్నారు.—మూఢుఁడు — అత్యంతము అవివేకి, వానిగ్రాహము అనఁగా ఆగ్రహము అభినివేశము; దానిచేత నని చెప్పుచున్నారు అవివే కేత్యాదిగా. తనయొక్క—తనదేహాదులయొక్కయని యర్థము.

హ. •

శం. మూఢగ్రాహేణ = అర్థానర్థముల స్వరూపము నెఱుంగనివాఁడు మూఢుఁడు, వానిగ్రాహము — నేనే బుద్ధిమంతుఁడ నను నభినివేశము, దానిచేత — అత్యంతమూఢబుద్ధిచేత; ఆత్మనః పీడయా=కాయక్లేశముచేత; యత్ = ఏ; తపః =

* శ్రీధరీయముతో సమానము.

• శంకరభాష్యముతో సమానము.

చెప్పినత్రివిధ మగు తపస్సు; క్రియతే = చేయఁబడుచున్నదో, కాయక్లేశ మొక్కటె ప్రయోజనము గలది; లేక; పరస్య ఉత్సాదనార్థంవా = అభిచారికక్రియచే శత్రు వినాశముకొఱకుఁ గాని; ఏతపస్సు చేయఁబడుచున్నదో; తత్ = అది; తామసమ్ = తమస్సంభావిత మైనశ్రద్ధచే నిష్పాదిత మగుటవలన తామస మని; ఉదాహృతమ్ = చెప్పఁబడినది మునులచేత.

మ॰ మూఢగ్రాహేణ = అవివేకాతిశయముచేఁ గలుగు దురాగ్రహము చేత; ఆత్మనః = దేహేంద్రియసంఘాతముయొక్క; పీడయా; య త్తపః క్రియతే. పరస్య ఉత్సాదనార్థంవా = ఇతరుని వినాశముకొఱకు అభిచారరూపము గాని; త త్తామస ముదాహృతమ్, శిష్టులచేత.

శ్రీ॰ తామసతపస్సును జెప్పుచున్నాఁడు.—మూఢగ్రాహేణ = అవివేక కృత మగు దురాగ్రహముచేత; ఆత్మనః పీడయా॰ య త్తపః క్రియతే; పరస్య ఉత్సాద నార్థంవా = ఇతరవినాశముకొఱకు నభిచారము గాని; తత్ తామసమ్; ఉదా హృతమ్ = చెప్పఁబడినది.

ప॰ మూఢగ్రాహేణ = మూఢత్వముతోఁ గూడిన యాగ్రహముచేత; ఆత్మనః పీడయా॰ = శరీరమునకు నుపవాసాదిపీడచేత. పరస్య; ఉత్సాదనార్థంవా — మారణోచ్చాటనాద్యాభిచారికము గాని; త త్తామసమ్.

రా॰ మూఢులు — అవివేకులు. మూఢగ్రాహేణ = మూఢులచేఁ జేయఁ బడిన యభినివేశముచేత; తనశక్త్యాదికము నాలోచింపక యాత్మపీడచేత య త్తపః క్రియతే; పరుని యుత్సాదనార్థముగూడ ఏది చేయఁబడుచున్నదో, తత్ తామస ముదాహృతమ్.

దాతవ్య మితి య ద్దానం దీయతే ఽనుపకారిణే
దేశే కాలేచ పాత్రేచ త ద్దానం సాత్త్వికం స్మృతమ్. ౨౦॰

భా॰ ఇపుడు దానభేదము చెప్పఁబడుచున్నది.—దాతవ్య మితి = ఇయ్యవలసినది యని, మనస్సుచేసి; యత్ = ఏ; దానమ్ = దానము; దీయతే = చేయఁబడుచున్నదో; అనుపకారిణే = ప్రత్యుపకారము చేయనివానికొఱకు, అనఁగా ప్రత్యుపకారము చేయ సమర్థుఁడు కాని వానికొఱకు, సమర్థుఁ డైనను బ్రత్యుపకారము నపేక్షింపక; దేశే =

కురుక్షేత్రాదిపుణ్యదేశమునందును; కాలేచ = సంక్రాంత్యాది పుణ్యకాలమునందును; పాత్రేచ = షడంగవిదుఁడు వేదపారగుఁడు ఇత్యాదిగా యోగ్యునియందు. తత్ = ఆ; దానమ్ = దానము; సాత్త్వికమ్= సత్త్వనిర్వృత్త మని; స్మృతమ్ = చెప్పఁబడినది.

దానము చేయవలయు నని విధి యుండుటవలన నే నియ్యవలసినదే గాని ఫలము నాకు వల దని నిశ్చయముతోఁ బుణ్యదేశమునందును బుణ్యకాలమునందును బాత్రభూతుఁ డైనవానికిఁ బ్రత్యుపకారము చేయనివాని కేదానము చేయఁబడుచున్నదో అది సాత్త్వికదాన మనఁబడు నని తాత్పర్యము.

ఆ. క్రమప్రాప్త మగు దానముయొక్క గుణనిమిత్తభేదముఁ జెప్పుచున్నారు ఇపుడు ఇత్యాదిగా. ఇయ్యవలసినది యని మనస్సు చేసి — దానమే నాచేత భావ్యము ఫలము కాదని యభిసంధించి యని యర్థము.

హ. దాతవ్య మితి యద్దానం దీయతే, హిరణ్యాదికము; అనుపకారిణే = ఉపకారము చేయనివానికొఱకు; దేశే = పుణ్యదేశమునందు; కాలే — అయన సంక్రాంత్యాదియందు; పాత్రే=షడంగవేదవిదుఁడు మొదలగువానియందు. తద్దానం సాత్త్వికం స్మృతమ్.

శం. దానముయొక్క త్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకముల చేత.—అర్థము స్పష్టము.

మ. ఇపుడు క్రమప్రాప్త మగు దానముయొక్క త్రైవిధ్యమును దెలుపుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—ఇయ్యవలసినదియే శాస్త్రవిధివశమువలన నను నిశ్చయముచేత, కాని ఫలాభిసంధిచేతఁ గాదు, యత్; దానమ్ — తులాపురుషాదికము; దీయతే; అనుపకారిణే = ప్రత్యుపకారము చేయనివానికొఱకు; దేశే = కురుక్షేత్రాదిపుణ్యదేశమునందును; కాలేచ = సూర్యోపరాగాదిపుణ్యకాలమునందును; పాత్రేచ—చతుర్థ్యర్థమున సప్తమి, ఎట్టి యనుపకారికొఱ కియ్యఁబడుచున్నది? పాత్రభూతుఁ డైన విద్యాతపోయుక్తునికొఱకు; లేక, పాత్రే = రక్షకునికొఱకు, విద్యాతపస్సులవలనఁ దన్నును దాతను రక్షింప సమర్థుఁడే ప్రతిగ్రహింపవలయు నని శాస్త్రమువలన; అట్టి దానము; సాత్త్వికం స్మృతమ్.

శ్రీ. మున్ను ప్రతిజ్ఞాతమునే దానముయొక్క త్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు.—దాతవ్య మను నిశ్చయముచే, యద్దానం దీయతే, అనుపకారిణే = ప్రత్యుప

కారమునం దసమర్థునికొఱకు; కురుక్షేత్రాదిదేశమునందును గ్రహణాదికాలము నందును, పాత్రేచ = ఇట దేశకాలసాహచర్యమువలన సప్తమి ప్రయోగింపఁబడినది, పాత్రభూతుఁడై తపశ్శ్రుతాదిసంపన్నుఁ డగు బ్రాహ్మణుని కొఱకని యర్థము; లేక, పాత్రే అని చతుర్థియే కావచ్చును, రక్షకుని కొఱకని యర్థము, వాఁడు గదా సర్వాపదలనుండి దాతను రక్షించుచున్నాఁడు. ఇట్టి దాన మేది గలదో అది సాత్త్వికము.

ప. ఇఁకఁ ద్రివిధ మగు దానమును జెప్పుచున్నాఁడు మూఁడింటిచేత.— అవశ్య మియ్యవలసినదే యను నియమముచే, యత్ దీయతే, అనుపకారిణే = ప్రత్యుపకారాసమర్థునికొఱకు; కురుక్షేత్రాదిదేశమునందును గ్రహణాదికాలము నందును, పాత్రే — షడంగవేదపారగునియందు, ఇట సప్తమిచే చతుర్థి గ్రహింపవలయును, తపశ్శ్రుతసంపన్నుఁ డగు బ్రాహ్మణుని కొఱకని యర్థము. ఇట్టి దాన మేది గలదో అది సాత్త్వికము.

రా. ఫలాభిసంధిరహితముగా దాతవ్య మని దేశమునందును కాలము నందును పాత్రమునందును అనుపకారికొఱకే దాన మియ్యఁబడుచున్నదో, తద్దానం సాత్త్వికం స్మృతమ్.

యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్. ౨౧

భా. యత్తు = ఏది మఱి; ప్రత్యుపకారార్థమ్ = ప్రత్యుపకారము కొఱకు, కాలమున నితఁడు నాకుఁ బ్రత్యుపకారము చేయఁ గలఁ డని; పునః — ఇంకను; ఫలమ్ = ఫలమును; ఉద్దిశ్యవా = ఉద్దేశించి గాని, ఈ దానమునకు నాకదృష్టఫలము కలుగు నని; పరిక్లిష్టంచ = ఖేద యుక్తముగాఁ గూడ; దీయతే = ఇయ్యఁబడుచున్నదో. తత్ దానమ్ = ఆదానము; రాజసమ్ = రజోనిర్వృత్త మని; స్మృతమ్=తలంపఁబడినది.

ప్రత్యుపకారము నపేక్షించి గాని స్వర్గాదిఫలము నపేక్షించి గాని యింత యియ్యవలసివచ్చెనే యని ఖేదముతోఁ గాని యేదాన మియ్యఁబడుచున్నదో అది రాజస మని చెప్పఁబడిన దని తాత్పర్యము.

హ. ప్రత్యుపకారార్థమ్ = ఇతఁడు నా కుపకరించెను నేండియు నుపకరింపఁగలఁ డని ప్రత్యుపకారముకొఱకు; ఫలమ్ = స్వర్గాదిఫలమును; ఉద్దిశ్యవా = ఉద్దేశించి గాని; పరిక్లిష్టంచ = క్లేశయుక్తముగాఁ గూడ. తద్దానం రాజసం స్మృతమ్.

శం. పరిక్లిష్టంచ = లోభాతిశయముచే మనఃక్లేశముతోను. తద్దానం రాజసమ్.

మ. ప్రత్యుపకారార్థమ్ = కాలాంతరమున నితఁ డుపకరించు నని దృష్టార్థముగాను; ఫలంవా = స్వర్గాదిఫలమును గాని. యత్ దానం పునః = ఏదానము మఱి; దీయతే = ఇయ్యఁబడుచున్నదో; పరిక్లిష్టంచ = ఇంతివ్యయ మయ్యెనే యని పశ్చాత్తాపయుక్తముగాను; యద్దీయతే; తద్దానం రాజసం స్మృతమ్.

శ్రీ. రాజసదానముఁ జెప్పుచున్నాఁడు.—కాలాంతరమున నితఁడు నా కుపకారము చేయు నని దానికొఱకును; ఫల ముద్దిశ్యవా = స్వర్గాదిఫలము నుద్దేశించి గాని; యత్పున ర్దానం దీయతే; పరిక్లిష్టంచ = చిత్తక్లేశయుక్తముగాను. తద్దానం రాజసం స్మృతమ్.

ప. రాజసమును జెప్పుచున్నాఁడు.— మఱియొకకాలమున నితఁడు ప్రత్యుపకారము చేయు నని గాని; స్వర్గాదిలోకము నుద్దేశించి గాని, పరిక్లిష్టమ్ = క్లేశయుక్తముగాఁ గాని, యద్దీయతే తద్రాజసం స్మృతమ్.

రా. ప్రత్యుపకారాభిప్రాయపూర్వకముగాను ఫలము నుద్దేశించియు, పరిక్లిష్టమ్ — అమంగళద్రవ్యము గలది; యద్దానం దీయతే తద్రాజస ముదాహృతమ్. *

అదేశకాలే య ద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతం త త్తామస ముదాహృతమ్. ౨౨

భా. అదేశకాలే = అదేశమునందు పుణ్యముకాని దేశమునందును—మ్లేచ్ఛులు అశుచులు మొదలగువారు నిండిన దేశమునందును అకాలమునందును పుణ్యహేతు వని చెప్పఁబడనికాలమునందును—సంక్రాంత్యాది విశేషవిరహితమునందును; అపాత్రేభ్యశ్చ = పాత్రులు కానివారికొఱకును, మూర్ఖతస్కరాదులకొఱకును; పుణ్యదేశాదులు సంభవించి

* తద్రాజస ముదాహృతమ్ అని రామానుజీయపాఠము.

నపుడో, అసత్కృతమ్=ప్రియవచనము పాదప్రక్షాలనము పూజ మొదలగునవి లేనియట్లుగాను; అవజ్ఞాతమ్=పాత్రపరిభవయుక్తముగాను *; యత్ = ఏ; దానమ్=దానము; దీయతే=ఇయ్యఁబడుచున్నదో; తత్ = ఆదానము; తామసమ్ = తమోనిర్వృత్తమని; ఉదాహృతమ్=చెప్పఁబడినది.

దానము చేయుటకుఁ యోగ్యము కాని దేశకాలములయందుఁ దద్దేశకాలదోషమును లెక్కింపక యేదానము చేయఁబడుచున్నదో అపాత్రులగు నటవిటాదుల కేదానము చేయఁబడుచున్నదో దేశకాలపాత్రములు కుదిరినపుడును పాత్రమును సత్కరింపక తిరస్కరించుచు నేదానము చేయఁబడుచున్నదో ఆదానము తామస మని తాత్పర్యము.

ఆ. రాజస తామసదానవ్యాఖ్యానము స్పష్టార్థము.

హ. అదేశకాలే – పుణ్యము లగు దేశకాలముల నపేక్షింపక; అపాత్రేభ్యశ్చ దీయతే, అపాత్రమైన పుచ్చుకొనువానికి, అసత్కృతమ్=ప్రియవచనమును బూజయు లేనట్లును; అవజ్ఞాతమ్ = పుచ్చువానికిని ఇచ్చుద్రవ్యమునకును అవజ్ఞాయుక్తముగాను. ఇట్టిదాన మేది గలదో, తత్తామస ముదాహృతమ్.

శం. అసత్కృతమ్=అర్ఘ్యపాద్యాద్యర్చన లేనియట్లుగాను; అవజ్ఞాతమ్=అవమానయుక్తముగాను. ఇట్టి దేదానము గలదో, అది తామస మని మునులచే నుదాహరింపఁబడినది.

మ. అదేశమునందు – స్వభావమువలనఁ గాని దుర్జనసంసర్గమువలనఁ గాని పాపహేతువైన యశుచిస్థానమునందును, అకాలమునందు – పుణ్యహేతువని ప్రసిద్ధము కాని యేకాలమునందైనను, అశౌచకాలమునందుఁ గాని; అపాత్రేభ్యశ్చ = విద్యాతపోరహితులైన నటవిటాదులకొఱకును; యద్దానం దీయతే. దేశకాలపాత్రములు సంభవించినపుడును, అసత్కృతమ్ = ప్రియభాషణ పాదప్రక్షాలన పూజాదిసత్కారశూన్యముగాను; అవజ్ఞాతమ్=పుచ్చుకొనువాని నవమానించుచును. తత్ – ఆదానము; తామస ముదాహృతమ్.

శ్రీ. తామసదానమును జెప్పుచున్నాఁడు.— అదేశమునందు—అశుచిస్థానమునందు, అకాలమునందు – అశుచిసమయమునందు, అపాత్రములకొఱకు—నట

* పుచ్చుకొనువానిఁ బరిభవించియు.

విటనర్తకాదులకొఱకు; యద్దానం దీయతే; దేశకాలపాత్రములు కలిగినపుడు, అసత్కృతమ్ = పాదప్రక్షాలనాదిసత్కారశూన్యముగాను; అవజ్ఞాతమ్ = తిరస్కారయుక్తముగాను. ఇట్టిదానము, తామస ముదాహృతమ్.

ప. అదేశమునందు — అశుచిస్థలమునందు, అకాలమునందు—సూతకాది సమయమందు, అపాత్రములకు — విటనర్తకులకు, యద్దీయతే; అసత్కృతమ్ = సత్కారరహితముగా; అవజ్ఞాతమ్ — పాదప్రక్షాలనాదిరహితముగా; తత్తామసమ్.

రా. అదేశకాలే, అపాత్రేభ్యశ్చ, యద్దానం దీయతే; అసత్కృతమ్ — పాదప్రక్షాలనాది గౌరవరహితముగా; అవజ్ఞాతమ్—అవజ్ఞతోఁ గూడ, ఉపచారము లేక; యద్దీయతే, తత్తామస ముదాహృతమ్.

ఓం తత్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. ౨౩

భా. యజ్ఞదానతపఃప్రభృతులకు సాద్గుణ్యము కలిగించుటకై యీ యుపదేశము చేయఁబడుచున్నది —ఓమ్=ఓమ్మనియు; తత్ =తత్తనియు; సత్ =సత్తనియు; ఈ, నిర్దేశః=నిర్దేశింపఁబడుచున్నది దీనిచేత నామము గావున నిర్దేశ మనఁగా నామముయొక్క నిర్దేశము; త్రివిధః = మూఁడు విధములు గలది; బ్రహ్మణః=బ్రహ్మమునకు, స్మృతః = చింతింపఁబడినది, వేదాంతములయందు బ్రహ్మవిదులచేత. తేన=ఆత్రివిధ మయిన నామనిర్దేశముచేత; బ్రాహ్మణాః = బ్రాహ్మణులును; వేదాశ్చ = వేదములును; యజ్ఞాశ్చ = యజ్ఞములును; విహితాః = నిర్మింపఁబడిరి; పురా = పూర్వము. అని నిర్దేశస్తుతికొఱకుఁ జెప్పఁబడుచున్నది.

ఓం తత్సత్ అను మూఁడునామములచే వేదాంతములందు బ్రహ్మవిదులు బ్రహ్మమును స్మరించిరి. ఈ త్రివిధనామముచేతనే పూర్వము బ్రాహ్మణులును వేదములును యజ్ఞములును నిర్మింపఁబడిరి అని తా. అందువలన సర్వకర్మములును ఈనామములలో దేని స్మరించినను సాద్గుణ్యము నొందు నని భావము.

ఆ. విహితము లగు కర్మములకుఁ బ్రమాదవశమున వైగుణ్యము కలిగిన యెడ నెట్లు తత్పరిహారం బగు నని యాశంకించి చెప్పుచున్నారు యజ్ఞేత్యాదిగా. "ఓ మితి బ్రహ్మ" ఇత్యాదిశ్రుతివలన ఓమ్మని బ్రహ్మమునకు నామనిర్దేశము, "తత్త్వ

మసి ” అను శ్రుతివలన తత్తనియు బ్రహ్మమునకు నామనిర్దేశము, స దేవ సో మ్యేదమ్ “ అను శ్రుతివలన సత్తనియు బ్రహ్మమునకు నామము, అని తలఁచి చెప్పు చున్నారు ఓ మిత్యాదిగా. ఎట్లు నిర్దేశముచే నానామముల విధాన మని యాశం కించి చెప్పుచున్నారు నిర్దేశింపఁబడుచున్నది ఇత్యాదిగా. యజ్ఞాదులకు వైగుణ్యము తోఁచునపుడు ఈ నామములలో నొకదాని నుచ్చరించుటవలన వైగుణ్యపరిహారము సిద్ధించు నని భావము. కర్మ సాద్గుణ్య కారణం బగు త్రివిధనామమును స్తుతించుచు న్నారు తేన ఇత్యాదిగా. పూర్వము — సర్గాదియందు ప్రజాపతిచే నిర్మింపఁబడి రనుట.

హ. నిర్దేశింపఁబడుచున్నది దీనిచేతఁ గావున నిర్దేశము; బ్రహ్మణః=పరమా త్మకు; స్మృతః, బ్రహ్మవిదులచేత. ఓ మ్మని తత్తని సత్తని త్రివిధము బ్రహ్మము యొక్క—నిర్దేశము — నామము స్మరింపఁబడిన దని యర్థము. తేన = ఆ త్రివిధ నిర్దే శముచేత; బ్రాహ్మణాః, వేదాశ్చ, యజ్ఞాశ్చ; విహితాః = సృజింపఁబడిరి; పురా = పూర్వకాలమందు, సృష్టికాలమందు సకలజగత్స్రష్ట యగు హిరణ్యగర్భునిచేత.

శం. ఓయీ! దేశకాలపాత్రద్రవ్యమంత్రతంత్రాదులస్వరూపము నెఱింగి యథాశాస్త్రముగా వేదోక్తకర్మమును భక్తిశ్రద్ధావినయంబులతోఁ జేయుట శక్యము గాదు, అందుచే వైదికకర్మము దేనిఁ జేసినను దానికి వైగుణ్యమే ప్రసక్తించును. అందుల కెట్లని యాశంక గలుగఁగా — “ విద్వాన్ యజతే ” అను శ్రుతివలన దేశకాలాదిస్వరూపముఁ దెలిసిన విద్వాంసుఁడే సర్వకర్మము నెఱింగి శ్రద్ధతోఁ జేయ వలయును, అయినను యజ్ఞదానతపోవ్రతాదులతత్త్వము నెఱుంగనివాఁడు చేయున పుడు శ్రద్ధాహీనతచేఁ గాని భ్రమప్రమాదాదులచేఁ గాని యొకానొకప్పుడు తంత్ర మంత్రస్వరవర్ణాదిలోపముచే వైగుణ్యము ప్రాప్తించినయెడ “ ఓం తత్సత్ ” అని యుచ్చరించినచో సర్వంబును సగుణమై సఫలం బగు నని బోధించుటకై యీ యుప దేశము చేయఁబడుచున్నది.—“ ఓ మితి బ్రహ్మ, తత్త్వ మసి, స దేవ సోమ్య ” అను శ్రుతులవలన, ఓ మ్మనియు తత్తనియు సత్తనియు, బ్రహ్మణః = పరబ్రహ్మమునకు; నిర్దేశః = నిర్దేశింపఁబడుచున్నది వస్తువు దీనిచేతఁ గావున నిర్దేశ మనఁగా నామము; త్రివిధః = త్రిప్రకారము; స్మృతః, వేదాంతవిదు లగు నుద్దాలకాదులచేత. ఓం త త్సత్ అను నీమూఁడు బ్రహ్మమునకు నామములు చెప్పఁబడిన వని యర్థము. ఇట్లు నామ నిర్దేశము చేసి నామములమహత్త్వము చెప్పుచున్నాఁడు.—పురా = సర్గాదియందు; తేన — ఆ నామత్రియముచేత; బ్రాహ్మణాః = బ్రాహ్మణులును; వేదాశ్చ = ఋగాది

వేదములును; యజ్ఞాశ్చ = శ్రౌతస్మార్తము లగు సర్వయజ్ఞములును; విహితాః = నిర్మింపఁబడిరి, ఆ నామములవలనఁ బుట్టిరని యర్థము. ఇందుచేఁ బావనంబు లగు వేదాదులకును జన్మహేతువు లగుటవలన నీనామములమూఁడింటిపవిత్రత యింత యని చెప్ప శక్యము గాదని సూచిత మగుచున్నది. అందువలన వానియుచ్చారణము సర్వపాపములకును నుత్తమప్రాయశ్చిత్త మని సిద్ధము.

మం॥ ఇట్లు ఆహారయజ్ఞతపోదానములకుఁ ద్వైవిధ్యము చెప్పుటచే నవి సాత్త్వికములే గ్రహింపఁదగిన వనియు రాజసతామసములు పరిహరింపవలయు ననియుఁ బ్రతిపాదింపఁబడినది. అందాహారము దృష్టార్థం బగుటచే దాని కంగ వైగుణ్యంబున ఫలాభావశంక సంభవింపదు. అదృష్టార్థము లగు యజ్ఞతపోదానములకో అంగవైగుణ్యమువలన నపూర్వము పుట్టనియపుడు ఫలము లేకపోవును. అందువలన సాత్త్వికము లగువానికిఁ గూడ నానర్థక్యము ప్రాప్తించును, అనుష్ఠాతలు ప్రమాదభూయిష్ఠు లగుటవలన. ఇందువలనఁ దద్వైగుణ్యపరిహారముకొఱకు ఓం తత్సత్ అను భగవన్నామమును భజించుట యనుసామాన్యప్రాయశ్చిత్తమును బరమకారుణికుం డగుటచే నుపదేశించుచున్నాఁడు భగవంతుఁడు. — ఓం తత్సత్ అనునది; బ్రహ్మణః = పరమాత్మయొక్క; నిర్దేశః = నిర్దేశింపఁబడుచున్నది దీనిచేత, నిర్దేశ మనఁగా వాచకశబ్దము, నామ మనుట; త్రివిధః = మూఁడువిధములు — అవయవములు గలది; స్మృతః=స్మరింపఁబడినది వేదాంతవిదులచేత. ఏకవచనమువలన మూఁడవయవములు గలది యొక్కటే నామము, ప్రణవమువలె. ఎందువలనఁ బూర్వు లగు మహర్షులచేత నీబ్రహ్మముయొక్క నిర్దేశము స్మరింపఁబడినదో అందువలన నిప్పటివారిచేతఁ గూడ స్మర్తవ్య మని విధి యిటఁ గల్పింపఁబడుచున్నది, వషట్కర్తుః ప్రథమభక్షః ఇత్యాదులయందువలె “ వచనాని త్వపూర్వత్వాత్ ” * అను న్యాయమువలన. మఱియు యజ్ఞదానతపఃక్రియాసంయోగమువలన దీనికి వాని వైగుణ్యపరిహారమే ఫలం బని నష్టాశ్వదగ్ధరథవాక్యంబునం † బోలెఁ బరస్పరాకాంక్షచేఁ గల్పిత మగుచున్నది, “ ప్రమాదాత్కుర్వతాం కర్మ ప్రచ్యవేతాధ్వరేషు యత్ । స్మరణాదేవ తద్విష్ణోః సంపూర్ణం స్యాదితి శ్రుతిః ” ‡ అను స్మృతివలనను, అట్లే శిష్టాచారమువలనను. బ్రహ్మముయొక్క నిర్దేశము స్తుతింపఁబడుచున్నది కర్మవైగుణ్యమును బరిహరింప సమర్థం బని తెలుపుటకై.—బ్రాహ్మణాః—ఇది త్రైవర్ణికుల కుప

* అపూర్వ మగుటను వచనములు విధిపరములు. † ఇది ముందు వివరింపఁబడు.

‡ ప్రమాదమువలనఁ జేయువారి కేకర్మము యజ్ఞములయందుఁ జెడునో అది విష్ణుని స్మరించుట వలననే సంపూర్ణ మగు నని శ్రుతి.

లక్షణము, బ్రాహ్మణాదులు కర్తలును; వేదాశ్చ — కరణము లైన వేదములును; యజ్ఞాశ్చ=కర్మము లైన యజ్ఞములును; తేన = ఆ బ్రహ్మముయొక్క నిర్దేశముచేత, కరణభూత మయినదానిచేత; పురా; విహితాః, ప్రజాపతిచేత. అందువలన యజ్ఞాది సృష్టిహేతు వగుటచేఁ దద్వైగుణ్యపరిహారసమర్థము మహాప్రభావం బీనిర్దేశ మని యర్థము.

శ్రీ. ఓయీ! విచారింపఁగా యజ్ఞతపోదానాదికము సర్వంబును రాజస తామసప్రాయము కావున వ్యర్థము యజ్ఞాదిప్రయాస మని యాశంకించి యట్టి దానినిగూడ సాత్త్వికముగాఁ జేయునుపాయముఁ దెలుపుటకై చెప్పుచున్నాఁడు.—ఓం తత్సత్ అని; త్రివిధః; బ్రహ్మణః=పరమాత్మయొక్క; నిర్దేశః = నామవ్యపదేశము; స్మృతః, శిష్టులచేత. అందు "ఓమితి బ్రహ్మ" ఇత్యాది శ్రుతిప్రసిద్ధివలన ఓ మ్మనునది బ్రహ్మముయొక్క నామము, జగత్కారణ మ్మగుము. కెతిప్రసిద్ధ మగుటవల నను అవిద్వాంసులకుఁ బరోక్ష మగుటవలనను తత్, = సృజించు బ్రహ్మమునకు నామము, పరమార్థసత్త్వ సాధుత్వ ప్రశస్తత్వాదులచే సత్ అనెడిది బ్రహ్మమునకు నామము. ఈ నామనిర్దేశము త్రివిధమును విగుణములనైనను సగుణములుగాఁ జేయ సమర్థం బగు నను నభిప్రాయముచే స్తుతించుచున్నాఁడు.— తేన = ఆ త్రివిధ మైన బ్రహ్మముయొక్క నామనిర్దేశముచే; బ్రాహ్మణాః వేదాశ్చ యజ్ఞాశ్చ; పురా = పూర్వము సృష్ట్యాదియందు; విహితాః=విధాతచే నిర్మింపఁబడిరి, లేక సగుణులుగాఁ జేయఁబడిరి. లేక; ఎవ్వని దీత్రివిధనిర్దేశమో, తేన=అట్టి పరమాత్మచేత; బ్రాహ్మణా దులు అత్యంతపవిత్రులు సృజింపఁబడిరి. అందువలన నాపరమాత్మయొక్క యీత్రివిధనిర్దేశం బతిప్రశస్త మని యర్థము.

ప. ఓయీ! విచారించినయెడ యజ్ఞతపోదానాదికము సర్వమును రాజ సమో తామసమో మాత్రమే యగును, అట్లు విగుణ మగుటవలనఁ జేయఁబడినను వ్యర్థ మని యాశంకించి యది విగుణ మైనను దాని సగుణముగాఁ జేయువిధముఁ దెలుపుటకై చెప్పుచున్నాఁడు.—బ్రహ్మణః = పరమాత్మయొక్క; నిర్దేశః = నామ వ్యపదేశము; త్రివిధః స్మృతః. అది యేది? ఓం తత్ సత్ అని. ఇట్లు త్రివిధ మైన యానిర్దేశముచే, బ్రాహ్మణాః — యజ్ఞకర్తలును; వేదాశ్చ — విధిమార్గప్రవ ర్తకములును; యజ్ఞాశ్చ — కర్మరూపములును; పురా — సృష్ట్యాదియందు; విహి తాః = నిర్మింపఁబడిరి. అందు ఓ మ్మనునది బ్రహ్మమునకు నామము. అది చెప్పఁ బడినది ఛాందోగ్యోపనిషత్తులయందు "అథ ఖలు య ఉద్గీథ స్స ప్రణవో యః

ప్రణవ స్స ఉద్గీథః" అని. మఱియు "ఓ మిత్యేతదక్షర ముపాసీతోమ్" అనియు. అట్లు చెప్పఁబడినది "నో ద్గీథేన సమం కించి చ్ఛోధకం జగతి స్మృతమ్। యం వినా ఽఽమ్నాయవర్గో ఽపి స్వకార్యే న ప్రవర్తతే" * అని. మఱియు సర్వానుక్రమకారుఁ డగు శాకలుఁడుగూడ "ప్రజాపతి రోఙ్కారః పారమేష్ఠ్యో బ్రాహ్మో దైవ ఆధ్యాత్మికః" అని. భాష్యము.— ప్రజాపతి దేవత, ఓ మ్మనుశబ్దము సర్వదేవతలందును వాచక మగుటచే సర్వదైవత్యము, పరమోత్కృష్ట స్థానమునం దున్నది కావున పారమేష్ఠ్యము, బ్రాహ్మము—బ్రహ్మదైవత్యము, ఆధ్యాత్మికః — శరీరవర్తి ప్రత్యగాత్మకును వాచకము అని. అట్లు బ్రాహ్మణమందును "తాని శుక్రా ణ్యభ్యతప న్తేభ్యో ఽభితప్తే భ్యస్త్రయో వర్ణా అజాయన్తా ఽకార ఉకారో మకార ఇతి తా నేకధా సమభర న్త దేతదోమ్" అని. భాష్యము.— తదేవ శుక్రం త దృబ్రహ్మ, ఇత్యాది శ్రుతివలన, శుక్రాణి — హిరణ్యగర్భాది శబల బ్రహ్మములు, అభ్యతపన్ — అంతటను దపస్సు చేసిరి, తేభ్యః అభితప్తేభ్యః=తపస్సు చేయుచున్నవారివలన, త్రయః వర్ణా అజాయన్త — మూఁడువర్ణములు పుట్టెను, అకారోకార మకారములు, ఆవర్ణములను జేర్చిరి, అది ఓ మ్మనునది అని. ఇందు ఓ మ్మను నామనిర్దేశముచే వేదములు విహితములు, తత్తనుదానిచేత బ్రాహ్మణులు నిర్మింపఁబడిరి, సత్తను దానిచే యజ్ఞములు.

రా. ఇట్లు వైదికము లగు యజ్ఞతపోదానములకు సత్త్వాదిగుణభేదముచే భేదము ప్రతిపాదింపఁబడినది. ఇప్పుడు వైదిక మగు నాయజ్ఞాదికమునకే ప్రణవసంయోగముచేతను త త్స చ్ఛబ్దవ్యపదేశ్యతచేతను లక్షణము చెప్పఁబడుచున్నది.— ఓం తత్ సత్ అని త్రివిధ మైన నిర్దేశము — శబ్దము, బ్రహ్మణః స్మృతః — బ్రహ్మముయొక్క అన్వయి యగుచున్నది. బ్రహ్మ మనఁగా వేదము, వేదశబ్దముచే వైదిక కర్మము చెప్పఁబడుచున్నది. వైదికము—యజ్ఞాదికము. యజ్ఞాదికర్మము ఓం తత్సత్ అనుశబ్దములతో నన్విత మగుచున్నది. వైదికకర్మాంగముగాఁ బ్రయోగాదికమునందుఁ బ్రయుజ్యమాన మగుటచే ఓ మ్మనుశబ్దమున కన్వయము. పూజ్యత్వముకొఱకు వాచకము లగుటచే త త్సచ్ఛబ్దముల కన్వయము. తేన=ఆ త్రివిధశబ్దముతో, అన్వితులు, బ్రాహ్మణాః = వేదాన్వయు లగు త్రైవర్ణికులును, వేదాశ్చ యజ్ఞాశ్చ పురా, విహితాః — నాచేతనే నిర్మింపఁబడిరి.

* జగత్తునందు ఉద్గీథముతో—ప్రణవముతో సమాన మైన శోధకము—శుద్ధి చేయునది యేదియు లేదు, అది లేక వేదములసమూహముకూడ స్వకార్యమునందుఁ బ్రవర్తింపఁజాలదు.

వ్యా. మఱియుఁ గర్మాదుల నిట్లు చేయవలయు నని ప్రతిపాదించుటకై యర్థవాదముఁ జెప్పుచున్నాఁడు.—పరబ్రహ్మమునకుఁ గదా యివి నామములు "ఓతం జగ ద్యత్ర స్వయం చ పూర్ణో వేదోక్తరూపో హ్యుపచారత శ్చ। సర్వైశ్చ శబ్దై శ్చాభియుతో న చాన్యైః ఓం త త్స దిత్యేత మతో వదన్తి" అని గదా ఋగ్వేదఖిలములయందు. ద్వితీయపాదార్థము * తచ్ఛబ్దార్థము. "స దేవ సోమ్యే దమగ్ర ఆసీత్" అనియు. "ఓ మితి బ్రహ్మ" అనియు. తేన = ఆబ్రహ్మముచేత; ఆత్మపూజార్థము. వేదవిషయంబున విధాన మనఁగా ప్రకాశనము. ప్రమాణము పూర్వము చెప్పఁబడినది.

తస్మా దో మి త్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ ॥ ౨౪

భా. తస్మాత్ =అందువలన; ఓ మితి=ఓమ్మని; ఉదాహృత్య = ఉచ్చరించి; విధానోక్తాః = శాస్త్రచోదితములు; బ్రహ్మవాదినామ్ = బ్రహ్మమును బఠించు స్వభావము గలవారియొక్క; యజ్ఞదానతపఃక్రియాః = యజ్ఞములును దానములును తపస్సులును అను కర్మములు; సతతమ్= ఎల్లప్పుడును; ప్రవర్తన్తే = ప్రవర్తించుచున్నవి.

అందువలన వేదాధ్యయనసంపన్ను లగు వారు తాము చేయునట్టి శాస్త్రవిహితము లయిన యజ్ఞములు దానములు తపస్సులు మొదలగుకర్మములను ఎల్లప్పుడును ఓమ్మను బ్రహ్మనామము నుచ్చరించియే చేయుదు రని తాత్పర్యము.

రా. ఎందువలన బ్రాహ్మణాదులకుఁ గారణమో మఱియు నెందువలన బ్రహ్మమునకు నిర్దేశమో అందువలన నని యుపసంహరించుచున్నారు తస్మా దిత్యాదిగా. బ్రహ్మవాదినా మ్మనుచోట బ్రహ్మ మనఁగా వేదము.

హా. ప్రవర్తన్తే—ఓ మ్మని యుదాహరించి ప్రవర్తయితవ్యములు కర్తవ్యములని యర్థము. విధానోక్తాః = శాస్త్రోక్తములు. బ్రహ్మవాదినామ్ – బ్రహ్మవాదుల చేత నని యర్థము.

శం ఈ యర్థమునే ప్రతిపాదించువాఁడై మొదటఁ బ్రణవమునకు వినియోగముఁ జెప్పుచున్నాఁడు.—ఎందువలన నీనామత్రయము బ్రహ్మవాచక మగుట

* వేదోక్తరూపః అనునది.

చేతను వేదాదిజనక మగుటచేతను బవిత్రతమం బని సిద్ధమో, తస్మాత్ =అందువలన; ఓ మితి ఉదాహృత్య=కర్మముయొక్క-యారంభమునందును అంతమునందును ఓం కారము నుచ్చరించి; బ్రహ్మవాదినామ్=బ్రహ్మ మనఁగా వేదము, వేదమును తదర్థ మును జెప్పుట స్వభావముగాఁ గలవారు బ్రహ్మవాదులు, వేదవేదార్థపారగు లగు బ్రాహ్మణులు, వారియొక్క-; విధానోక్తాః=విధ్యుక్తము లగు; యజ్ఞదానతపఃక్రియాః; అన్నియు ఒకనానొకప్పుడు అశ్రద్ధాదులచే నంగవైకల్యము కలిగినను ఆద్యంతముల నోంకారోచ్చారణముచే, సతతమ్ = ఎల్లప్పుడును; యథోక్తలక్షణములచే సంపూర్ణ ములుగా, ప్రవర్తన్తే = ప్రకర్షమున వర్తించుచున్నవి, ప్రకృష్టములు—సాంగములు సాత్త్వికము లగుచున్నవి యని యర్థము.

మ. ఇప్పుడు అకారోకారమకార వ్యాఖ్యానముచేఁ దత్సముదాయ మైన యోంకారముయొక్క-వ్యాఖ్యానము చేయునట్లు ఓంకారతచ్ఛబ్దసచ్ఛబ్దవ్యాఖ్యాన ముచేఁ దత్సముదాయరూప మగు బ్రహ్మనిర్దేశముయొక్క-వ్యాఖ్యానమును స్తుత్యతిశ యముకొఱకు నారంభించుచున్నాఁడు నాలుగుశ్లోకములచేత. అందు మొదట నోంకారముఁ జెప్పుచున్నాఁడు.—ఎందువలన "ఓ మితి బ్రహ్మ" ఇత్యాదిశ్రుతుల యందు ఓ మ్మను బ్రహ్మనామము ప్రసిద్ధమో, తస్మాత్ = అందువలన; ఓ మితి ఉదా హృత్య = ఓ మ్మని యుచ్చరించినయనంతరము; విధానోక్తాః = విధిశాస్త్రచోదితము లయిన; బ్రహ్మవాదినామ్ = వేదవాదులయొక్క-; యజ్ఞదానతపః క్రియాః; సతతమ్; ప్రవర్తన్తే = ప్రకృష్టములై — వైగుణ్యరహితములై వర్తించుచున్నవి. దేని యేకా వయవము నుచ్చరించుటవలననే యవైగుణ్యము సిద్ధించునో దాని సర్వము నుచ్చరిం చుటవలనఁ జెప్పెడి దేమి ? అని స్తుత్యతిశయము.

శ్రీ. ఇప్పుడు ప్రత్యేక మోంకారాదులప్రాశస్త్యముఁ దెలుపుటకై యోంకారమునకు మొదటఁ జెప్పుచున్నాఁడు.—ఎందువలన నిట్లు బ్రహ్మముయొక్క- నిర్దేశము ప్రశస్తమో, తస్మాత్, ఓ మితి, ఉదాహృత్య = ఉచ్చరించి, చేయఁబడు వేదవాదులయజ్ఞాదిశాస్త్రోక్తక్రియలు, సతతమ్ = ఎల్లప్పుడు, అంగవైకల్యము కలిగి నను ప్రకర్షమున వర్తించుచున్నవి — సగుణము లగుచున్నవి యని యర్థము.

వ. ఇఁక నుపక్రాంత మైనయర్థముఁ జెప్పుచున్నాఁడు.—ఎందువలన నిది బ్రహ్మముయొక్క-నిర్దేశమో, తస్మాత్ = ఆ కారణమువలన; ఓ మితి; ఉదాహృత్య= ఉచ్చరించి; విధానోక్తాః; బ్రహ్మవాదినామ్ = మోక్షార్థులయొక్క-; యజ్ఞదానతపః క్రియాః; సతతమ్ = నిరంతరముగా; ప్రవర్తన్తే.

రా. ఓం తత్ సత్ అను మూఁడుశబ్దములకును అన్వయప్రకారముఁ వర్ణింపఁబడుచున్నది. మొదట ఓ మ్మను శబ్దముయొక్క యన్వయప్రకారముఁ జెప్పుచున్నాఁడు.—తస్మాత్; బ్రహ్మవాదినామ్=వేదవాదులయొక్క, త్రైవర్ణికులయొక్క; యజ్ఞదానతపఃక్రియాః; విధానోక్తాః = వేదవిధానోక్తములు; ఆదియందు, ఓ మి త్యుదాహృత్య; సతతమ్ = సర్వదా; ప్రవర్తన్తే. వేదములును ఓ మ్మని యుదాహరించి యారంభింపఁబడుచున్నవి. ఇట్లు వేదములకును వైదికము లగు యజ్ఞాదికర్మములకును ఓ మ్మను శబ్దముయొక్క యన్వయము వర్ణింపఁబడినది. ఓ మ్మను శబ్దముతో నన్వితము లగు వేదముల ధరించుటవలనను తదన్వితము లయిన యజ్ఞాదికర్మములఁ జేయుటవలనను బ్రాహ్మణశబ్దనిర్దిష్టు లగు త్రైవర్ణికులకును ఓ మ్మను శబ్దముతో నన్వయము వర్ణింపఁబడినది.

మా. *

త దిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః. ౨౫

భా. తత్ ఇతి=తత్తను బ్రహ్మనామమును; ఉదాహృత్య † = ఉచ్చరించి; ఫలమ్=కర్మముయొక్క ఫలమును; అనభిసంధాయ=అపేక్షింపక; వివిధాః = నానావిధము లయిన; యజ్ఞతపఃక్రియాః = యజ్ఞక్రియలును తపఃక్రియలును; దానక్రియాశ్చ = క్షేత్రహిరణ్యాదానాదిరూపము లగు దాన కర్మములును; మోక్షకాఙ్క్షిభిః = మోక్షార్థులచేత; క్రియన్తే=నెఱవేర్పఁబడుచున్నవి.

తత్తను బ్రహ్మనామము నుచ్చరించి ముముక్షువులు ఫలాభిసంధి విడిచి పలువిధములైన యజ్ఞములను తపస్సులను దానములను చేయుదు రని తాత్పర్యము.

శ్రీ. ఓం శబ్దమునకు వినియోగముఁ బ్రతిపాదించి తచ్ఛబ్దమునకు వినియోగముఁ జెప్పుచున్నారు త దిత్యాదిగా.

హ. క్రియన్తే—చేయఁబడుచున్నవి కర్తచేత కావునఁ గ్రియ లనఁగా కర్మములు. తత్ — ఇది ఓం తత్సత్ అనుదాని కుపలక్షణము. ఓం తత్సత్ అను

* దీనికి మాధ్వభాష్యము లేదు.

† ఇది పూర్వశ్లోకమునుండి యనువర్తించుచున్నది.

బ్రహ్మనామమును బలికి యజ్ఞదానతపఃక్రియలఫలము నభిసంధింపక యీశ్వరార్పణ బుద్ధిచే యజ్ఞములు తపములు దానములు ముముక్షువులచేఁ జేయఁబడుచున్నవి. దానక్రియాః — గో భూ హిరణ్యాదివిషయములు. దానక్రియాశ్చ వివిధాః అని వెండియు క్రియాశబ్దగ్రహణము మోక్షమునకు దానము అధికోపకారకం బని తెలుపుటకొఱకు.

శం. ఇట్లోంకారమునకుఁ గర్మసాద్గుణ్యసంపాదనమునందు వినియోగముఁ దెలిపి తత్పదమునకు వినియోగముఁ జెప్పుచున్నాఁడు.—ఉదాహృత్య అని పూర్వ శ్లోకమునుండి యనువర్తించుచున్నది. మోక్షకాఙ్క్షిభిః = మోక్షైకకాము లగువారి చేత, ఇందుచేఁ బూర్వోక్తులకుఁ గామిత్వము సూచితము, ముముక్షువు లగు బ్రాహ్మణులచేత; ఫలమ్ = కర్మజన్యఫలమును; అనభిసంధాయ = సంకల్పింపక, ఈశ్వరార్పణబుద్ధిచేఁ జిత్తశుద్ధికొఱకు; కర్మారంభాదియందు, తదితి = తత్తనుపదమును; ఉదాహృత్య = ఉచ్చరించి; యజ్ఞతపఃక్రియాః = శ్రౌతాదు లగు యజ్ఞక్రియలును శారీరాదితపఃక్రియలును; కన్యాగవాదిభేదమున, వివిధాః దానక్రియాశ్చ; క్రియన్తే— శ్రద్ధాద్యంగలోపము కలిగినపుడు తత్పదప్రయోగముచేత సగుణములుగాఁ జేయఁబడుచున్నవి యని యర్థము.

మ. రెండవది యగు తచ్ఛబ్దమును వివరించుచున్నాఁడు.— "తత్త్వమసి" ఇత్యాది శ్రుతిప్రసిద్ధ మగు బ్రహ్మనామమును తత్ అనుదాని నుదాహరించి, ఫల మనభిసంధాయ — అంతఃకరణశుద్ధికొఱకు; యజ్ఞతపఃక్రియాః దానక్రియాశ్చ వివిధాః మోక్షకాఙ్క్షిభిః క్రియన్తే. అందువలన నతిప్రశస్తం బిది.

శ్రీ. రెండవనామమును బ్రస్తుతించుచున్నాఁడు.—తదితి, ఉదాహృత్య అని పూర్వానుషంగము, తత్తని యుదాహరించి శుద్ధచిత్తు లగు మోక్షకాంక్షి పురుషులచే ఫలాభిసంధి చేయక యజ్ఞాదిక్రియలు చేయఁబడుచున్నవి. అందువలనఁ జిత్తశోధనద్వారముసను ఫలాభిసంధి విడిపించుటచేతను ముముక్షుత్వము కలిగించునది యగుటవలనఁ దచ్ఛబ్దనిర్దేశము ప్రశస్తం బని యర్థము.

ప. ఇఁక ద్వితీయనామనిర్దేశమును స్తుతించుచున్నాఁడు.—ఉదాహృత్య అని పూర్వమునుండి యనుషంగము. తత్తను నామనిర్దేశము నుచ్చరించి చిత్తశుద్ధి కొఱకుఁ బ్రవృత్తు లగు, మోక్షకాఙ్క్షిభిః ఫల మనభిసంధాయ యజ్ఞతపఃక్రియాః దానక్రియాశ్చ క్రియన్తే.

**రా.** ఇఁక నీయజ్ఞాదులకుఁ దచ్ఛబ్దాన్వయప్రకారముఁ జెప్పుచున్నాఁడు.—ఫల మనభిసంధాయ, వేదాధ్యయనయజ్ఞతపోదానక్రియలు మోక్షకాంక్షులగు త్రైవర్ణికులచే నేవి చేయఁబడుచున్నవో అవి బ్రహ్మప్రాప్త్యుపాయం బగుటచే బ్రహ్మవాచి యగు త త్తనుశబ్దముచే నిర్దేశ్యములు. "స వః కః కిం య త్త త్పద మను త్తమమ్" అని తచ్ఛబ్దము బ్రహ్మవాచక మని గదా ప్రసిద్ధము. ఇట్లు వేదాధ్యయనయజ్ఞాదులకు మోక్షసాధనభూతములకుఁ దచ్ఛబ్దనిర్దేశ్యతచే తచ్ఛబ్దాన్వయము చెప్పఁబడినది. త్రైవర్ణికులకును అట్టి వేదాధ్యయనాదుల ననుష్ఠించుటవలననే తచ్ఛబ్దాన్వయం బుపపన్నము.

**మా.** తత్ ఫలమ్ = ఆ వేదోక్త మగు స్వర్గాదిఫలము, నాకుఁ గావలయు నని, అనభిసంధాయ = అభిసంధింపక.

సద్భావే సాధుభావేచ స దిత్యేత త్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే. ౨౬

**భా.** ఓం తచ్ఛబ్దములకు వినియోగము చెప్పఁబడినది. ఇంక నిప్పుడు సచ్ఛబ్దమునకు వినియోగము చెప్పఁబడుచున్నది.—సద్భావే = ఉండుటయందును, లే దని శంక గలిగినపుడు ఉన్న దనుటయందును, అట్లు పుత్త్రుఁడు లేనపుడు పుత్త్రజన్మమందును; మఱియు, సాధుభావేచ=అసద్వృత్తుఁడు—అసాధు వైనవాఁడు అను శంక గలిగినపుడు సద్వృత్తుఁడు—సాధు వనుటయందును; సత్ ఇతి = స త్తను; ఏతత్ = ఈ బ్రహ్మనామము; ప్రయుజ్యతే = ప్రయోగింపఁబడుచున్నది, చెప్పఁబడుచున్నది. తథా = అట్లు; ప్రశస్తే = ఉత్తమ మయిన; కర్మణి = వివాహాదికర్మమునందును; సచ్ఛబ్దః = స త్తనుశబ్దము; పార్థ = అర్జునా ! యుజ్యతే = ప్రయోగింపఁబడుచున్నది.

అర్జునా ! లే దని శంక గలిగినపుడు కల దనుటయందును అసాధు వను శంక గలిగినపుడు సాధు వనుటయందును స త్తను నీబ్రహ్మనామము ప్రయోగింపఁబడుచున్నది, అట్లు ప్రశస్త మైన వివాహాదికర్మమునందును సచ్ఛబ్దము ప్రయోగింపఁబడుచున్న దని తాత్పర్యము.

ఆ. కడచినదాని ననువదించి యనంతరశ్లోకతాత్పర్యముఁ జెప్పుచున్నారు ఓం తచ్ఛబ్దములకు ఇత్యాదిగా.

హ. మఱియును.—సద్భావే=లేనిపుత్త్రాదులయుత్పాదనము చేయవలసినపుడును; సాధుభావేచ = అసద్వృత్తునకు సద్వృత్తత కలిగింపవలసినపుడును; సదిత్యేతత్ — ఓం తత్సను బ్రహ్మముయొక్క నిర్దేశత్రయము; ప్రయుజ్యతే—ప్రయోగింపవలయు నని యర్థము. తథా; ప్రశస్తే కర్మణి = మంగళకర్మమునందు, పురుషార్థరూపమునందు; ఆపదత్రయము బ్రహ్మధ్యానసాధనముగాఁ బ్రయోగింపవలయు నని యర్థము.

శం. ఇట్లోం తచ్ఛబ్దముల వినియోగముఁ జెప్పి యిఁక సచ్ఛబ్దమునకు వినియోగముఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—సద్భావే = ఉన్నవస్తువుయొక్క యునికి సద్భావము, దానియందు, దేవదత్తునకుఁ బుత్త్రుఁ డున్నాఁ డను నర్థమునందు; పండితులచే, స దిత్యేతత్ = సత్తను నీపదము; ప్రయుజ్యతే. లేక; సత్తుయొక్క — బ్రహ్మముయొక్క భావము సద్భావము, దానియందు; సర్వమునకును బ్రహ్మభావము వివక్షిత మైనపుడు స త్తిది యని సచ్ఛబ్దము ప్రయోగింపఁబడుచున్నది. సాధుభావేచ = సద్వృత్తత సాధుభావము, దానియందును; సాధువుయొక్క సాధుభావము వివక్షిత మైనపుడు పండితులచే సత్పురుషుఁ డితఁ డని సచ్ఛబ్దము ప్రయోగింపఁబడుచున్నది. అట్లు కర్మముయొక్క ప్రశస్తత్వము వివక్షిత మైనపుడు స త్కర్మ మని సచ్ఛబ్దము ప్రయోగింపఁబడుచున్నది యని యర్థము.

మ. తృతీయ మగు సచ్ఛబ్దముఁ బ్రతిపాదించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.— "స దేవ సో మ్యేద మగ్ర ఆసీత్" ఇత్యాది శ్రుతిప్రసిద్ధ మగు, స దిత్యేతత్ = సత్తను నీబ్రహ్మనామము; సద్భావే = లే దను శంక కలిగినపు డున్న దనుటయందును; సాధుభావేచ = అసాధు వను శంక కలిగినపుడు సాధు వనుటయందును; ప్రయుజ్యతే, శిష్టులచేత. అందువలన వైగుణ్యపరిహారముచేత యజ్ఞాదికమునకు సాధుత్వంబును తత్ఫలమునకు విద్యమానత్వంబును సంపాదింప సమర్థం బిది యని యర్థము. తథా = అట్లు, సద్భావసాధుభావములయందువలె; ప్రశస్తే = ప్రతిబంధములేక శీఘ్రముగా సుఖజనకము మాంగళిక మగు; కర్మణి=వివాహాదియందును; సచ్ఛబ్దః; ఓపార్థా! యుజ్యతే = ప్రయోగింపఁబడుచున్నది. అందువలన యజ్ఞాదులకు వైగుణ్యముఁ బరిహరించి యప్రతిబంధంబున ఆశుఫలజనకత్వము సంపాదింప సమర్థం బీనామము కావునఁ బ్రశస్తతర మిది యని యర్థము.

**శ్రీ.** సచ్ఛబ్దముయొక్క ప్రాశస్త్యముఁ జెప్పుచున్నాఁడు శ్లోకద్వయము చేత.—సద్భావే=అస్తిత్వమునందును, దేవదత్తునకుఁ బుత్త్రాదు లున్నా రను నర్థము నందును; సాధుభావేచ = సాధుత్వమునందును, దేవదత్తునిపుత్త్రాదులు సాధువు లను నర్థమునందును; స దిత్యేతత్=సత్తను నీపదము; ప్రయుజ్యతే. ప్రశస్తే = మాంగ లిక మగు; వివాహాదికర్మమునందు సత్తీకర్మ మని, యుజ్యతే = ప్రయోగింపఁబడు చున్నది, లేక, సంగత మగుచున్నది.

**ప.** *

**రా.** ఇంక నీవేదాదులకు సచ్ఛబ్దాన్వయప్రకారమును జెప్పుటకై లోకము నందు సచ్ఛబ్దముయొక్క వ్యుత్పత్తిప్రకారముఁ జెప్పుచున్నాఁడు.—సద్భావే = అస్తి త్వమునందును; సాధుభావేచ = కల్యాణత్వమునందును; సర్వవస్తువులందు సత్తను నీపదము, ప్రయుజ్యతే = ప్రయోగింపఁబడుచున్నది లోకవేదములందు. అట్లు ఒకానొకపురుషుఁ డనుష్ఠించిన లౌకిక మగు, ప్రశస్తే కర్మణి = కల్యాణ మయిన కర్మమునందు; సచ్ఛబ్దము, యుజ్యతే — ప్రయోగింపఁబడుచున్న దని యర్థము.

**మా.** సద్భావశబ్దముచే ప్రజననము ♦ సూచితము. ఓ మ్మని పలికి ఫలము నభిసంధింపక అతిప్రీతివలన యజ్ఞము దానము తపస్సు మొదలగునవి చేయువారిచే నామసామ్యమువలన బ్రహ్మమే నిష్పాదిత మగుచున్న దని యాశయము.

యజ్ఞే తపసి దానేచ స్థితి స్స దితి చోద్యతే
కర్మ చైవ తదర్థీయం స దిత్యేవా ఽభిధీయతే. ౨౭

**భా.** యజ్ఞే = యజ్ఞకర్మమునందు; ఏస్థితి గలదో; తపసి = తపస్సు నందు, ఏస్థితి గలదో; దానేచ = దానమునందును, ఏస్థితి గలదో; అట్టి, స్థితిశ్చ = స్థితియును; స దితి = సత్తని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. తదర్థీయమ్ = ఆ యజ్ఞదానతపస్సు లనెడు ప్రయోజనములకొఱకుఁ జేయఁబడునట్టి; లేక, ఎవ్వని నామ్రితయము ప్రకృతమో అట్టి యీశ్వరుఁ డను ప్రయోజనముకొఱకుఁ జేయఁబడునట్టి; కర్మ చైవ=కర్మము గూడ; స దిత్యేవ = సత్తనియే; అభిధీయతే = చెప్పఁబడుచున్నది. అందువలన

* శ్రీధరీయముతో సమానము.

♦ సృష్టి.

నీయజ్ఞతపోదానాదికర్మ మసాత్త్వికము విగుణం బైనను శ్రద్ధాపూర్వక ముగా బ్రహ్మముయొక్కనామత్రయము నుచ్చరించుటచే సగుణమును సాత్త్వికమునుగా సంపాదితం బగుచున్నది.

యజ్ఞతపోదానములందు నిష్ఠ యేది గలదో అదియు సత్తని చెప్పఁబడు చున్నది. ఆ యజ్ఞతపోదానముల నెఱవేర్పుటకుఁ జేయు కర్మముగూడ, లేక, ఈశ్వ రార్పణబుద్ధితోఁ జేయుకర్మముగూడ సత్తనియే చెప్పఁబడుచున్న దని తాత్పర్యము.

ఆ. ప్రకారాంతరముచే సచ్ఛబ్దమునకు వినియోగముఁ జెప్పుచున్నారు యజ్ఞ ఇత్యాదిగా. నామత్రయముఁ బ్రయోగించుటచే సాద్గుణ్యము సిద్ధించు నను ప్రకరణార్థము నుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా.

హ. మఱియును.—యజ్ఞే తపసి దానేచ; స్థితిః=నిరంతరముగాఁ బ్రవృత్తిః అది యెప్పుడు సాధ్య మగునో అప్పుడు, స దితి — ఓం తత్సత్తను పదత్రయముచే; బ్రహ్మము, ఉచ్యతే — నిరంతరముగా నిర్దేశింపవలయు నని యర్థము. తదర్థీయమ్ = తదర్థమే తదర్థీయము స్వార్థమందు ఈయప్రత్యయము, యజ్ఞదానతపస్స్వాధ్యాయ రూప మైన; కర్మచైవ = కర్మముగూడ; ఎప్పుడు చేయఁబడునో అప్పు డీపదత్రయ ముచే బ్రహ్మము, అభిధీయతే = చెప్పఁబడుచున్నది, చెప్పవలయు నని యర్థము.

శం. మఱియును —యజ్ఞే= శ్రౌతాదియజ్ఞమునందును; తపసి=శారీరాది తపస్సునందును; దానేచ = కన్యాదానాదిదానమునందును; స్థితిః = అవస్థాన మేది గలదో అదియు; విద్వాంసులచే; స దితి; ఉచ్యతే—యజ్ఞాదులం దశ్రద్ధాదిదోషము సంభవించినపుడు సాధుత్వము సిద్ధించుటకై సచ్ఛబ్దము ప్రయోగింపఁబడుచున్న దని యర్థము. తదర్థీయమ్—ఇట తచ్ఛబ్దముచే లోకశాస్త్రప్రసిద్ధుఁ డగు పరమేశ్వరుఁడు గ్రహింపఁబడుచున్నాఁడు, పరమేశ్వరార్థక మని యర్థము; కర్మచైవ = అట్టి కర్మము గూడ; స దిత్యేవ; అభిధీయతే. అశ్రద్ధాదిదోషములు ప్రాప్తించినపుడు యజ్ఞాదుల సాద్గుణ్యముకొఱకు ఓం తత్సత్తను నామత్రయము ప్రయోగింపఁబడుచున్న దని చెప్పుటచే సాత్త్విక మగు శ్రద్ధతో ముముక్షువులు యజ్ఞదానాదికర్మములను నియ మమున ననుష్ఠింపవలయును, వేఱువిధమునఁ గాదని సిద్ధ మగుచున్నది.

మ. యజ్ఞే, తపసి, దానేచ, స్థితిః = తత్పరతచే నవస్థానము, నిష్ఠ యేది గలదో; అదియును, స దిత్యుచ్యతే, విద్వాంసులచేత. తదర్థీయమ్ = ఆ యజ్ఞదాన తపోరూపము లైన యర్థములందుఁ బుట్టినది, తదనుకూల మైనది, అగు; కర్మచైవ =

కర్మముగూడ; లేక, తదర్థీయమ్ = ఏబ్రహ్మముయొక్క నామ మిట ప్రస్తుతమో ఆబ్రహ్మమే అర్థము — విషయముగాఁ గలది తదర్థము, శుద్ధబ్రహ్మజ్ఞానము, తదను కూలమైన కర్మము తదర్థీయము; లేక, భగవదర్పణబుద్ధితోఁ జేయఁబడుకర్మము తదర్థీయము; స దిత్యేవ అభిధీయతే. అందువలన సత్తను నామము కర్మవైగుణ్యముఁ బరిహరించుటయందు సమర్థము ప్రశస్తతరము. దేనియొక్క యేకైకావయవము గూడ నిట్టిదో తత్సముదాయ మయిన యోం తత్సత్తను నిర్దేశముయొక్క మాహాత్మ్యము చెప్పెడి దేమి? అని సంపిండితార్థము.

శ్రీ. మఱియును.—యజ్ఞాదులందును ఏస్థితి — తత్పరతతో నవస్థానము గలదో అదియు, స ది త్యుచ్యతే. నామత్రయ మెవ్వనిదో ఆ పరమాత్మయే యర్థము—ఫలముగాఁ గలది తదర్థ మగు కర్మము, పూజ యుపహారము గృహాంగణ పరిమార్జనము అలుకుట ముగ్గుపెట్టుట మాల్యములు కట్టుట మొదలగు కార్యము, తత్సిద్ధికొఱకు ఏ యితరకర్మము చేయఁబడుచున్నదో ఉద్యానశాలిక్షేత్రధనార్జనాది విషయము, ఆకర్మము తదర్థీయము, అదియు మిక్కిలి వ్యవహిత మైనను, స దిత్యేవ అభిధీయతే. ఎందువలన నీనామత్రయం బిట్లతిప్రశస్తమో అందువలన దీని సర్వ కర్మసాద్గుణ్యార్థము కీర్తింపవలయు నని తాత్పర్యార్థము. ఇట, అర్థవాదానుపపత్తిచే విధి కల్పిత మగుచున్నది "విధేయం స్తూయతే వస్తు" * అను న్యాయమువలన. కొందఱుమాత్రము "ప్రవర్తన్తే విధానోక్తాః క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః" ఇత్యాది వర్తమానోపదేశమును సమిధో యజ తీత్యాదిస్థలమునందువలె విధిగాఁ బరిణమింపఁ జేయఁ దగు నందురు. అది సద్భావే సాధుభావే చేత్యాదులందుఁ బ్రాప్తార్థం బగుట వలన సంగతము కాదు. కావునఁ బూర్వోక్తక్రమమున విధికల్పనమే యుక్తతరము.

ప. మఱియును.—యజ్ఞే తపసి దానేచ, స్థితిః = తత్పరతచే నునికి, అదియు; స దిత్యుచ్యతే. ఈ నామత్రయము ఎవ్వనిదో ఆ పరమాత్మయే యర్థముగాఁ గలది తదర్థీయము, యజ్ఞదానతపోనిమిత్తమై పూజోపహారగృహాంగణపరిమార్జనోపలేపనధ్వజపతాకాదికమును మఱియు నుద్యానక్షేత్రధనార్జనాదికము నగు నేకర్మము చేయఁబడుచున్నదో అదియు, స దిత్యేవ అభిధీయతే. ఎందువలన నిట్లీనామత్రయ మతిప్రశస్తమో అందువలన దీని సర్వకర్మసాద్గుణ్యముకొఱకుఁ గీర్తింపవలయు నని తాత్పర్యార్థము. ఇది యర్థవాదము కాదు, మఱి యే మనఁగా, బ్రహ్మముయొక్క నామనిర్దేశం బతిప్రశస్త మగుటవలన విధియే కల్పిత మగుచున్నది.

---

* విధింపఁదగినవస్తువు స్తుతింపఁబడుచున్నది.

రా. అందువలన వైదికు లగు త్రైవర్ణికులయొక్క, యజ్ఞే తపసి దానేచ స్థితిః, కల్యాణ మగుటచే, స దిత్యుచ్యతే. కర్మ చ తదర్థీయమ్—త్రైవర్ణికార్థీయ మగు యజ్ఞదానాదికర్మముగూడ, స దిత్యే వాభిధీయతే. అందువలన వేదములును వైదికకర్మములును బ్రాహ్మణశబ్దసన్నిదిష్టు లగు త్రైవర్ణికులును ఓం తత్స దితి శబ్దాన్వయరూపలక్షణముచే అవేదములనుండియు అవైదికులనుండియు వ్యావృత్తు లని యెఱుంగవలయును.

మా. అట్లు ఋగ్వేదఖిలములయందు "ఓం యజ్ఞాద్యా నిష్ఫలం కర్మ తత్స్యాత్స ద్వై తదర్థం కర్మేతి వదన్తి దేవాః। తచ్ఛబ్దానాం సన్నిధే ర్బ్రహ్మ ప్రీతే స్తద్రూపత్వా జ్జనితం బ్రహ్మ తస్య" * అని.

> అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్
> అస దిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ. ౨౮

భా. ఆ యజ్ఞాదు లంతటను శ్రద్ధయే ప్రధానము, ఎందువలన శ్రద్ధచేతనే సర్వంబును సంపాదిత మగునో అందువలన.—అశ్రద్ధయా=శ్రద్ధ లేమిచే; హుతమ్=చేయఁబడినహోమము; దత్తమ్=అశ్రద్ధచేత బ్రాహ్మణుల కియ్యఁబడిన దానమును; తపః = తపస్సును; తప్తమ్ = అనుష్ఠింపఁబడినది అశ్రద్ధచేత; అట్లు అశ్రద్ధచేతనే, కృతంచ = చేయఁబడినది స్తుతి నమస్కారాదికమును; యత్ = ఏది గలదో; అది అంతయు, అసత్ ఇతి = అసత్తని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నది, నాప్రాప్తికి సాధనమైన మార్గమునకు బాహ్య మగుటవలన. పార్థ = అర్జునా! తత్ = అది, మిక్కిలి కష్టముచేఁ జేయఁబడినను; ప్రేత్యచ = పరలోకఫలము కొఱకును; న=కాదు. ఇహ = ఇహలోకఫలముకొఱకును, నో=కాదు, సాధువులచే నిందిత మగుటవలన.

అర్జునా! శ్రద్ధ లేక చేసిన హోమమును దానమును తపస్సును ఇతర కర్మమును ఏది గలదో అది యంతయు నసత్తని చెప్పఁబడును. అది పరలోకమునను ఫలింపదు, ఈ లోకమునను ఫలింపదని తాత్పర్యము.

---

* యజ్ఞాదికర్మము ఫలోద్దేశరహితము బ్రహ్మవిషయ మగుచున్నది, దాని సత్తని దేవతలు చెప్పుదురు, బ్రహ్మశబ్దముచే యజ్ఞాదులందు సన్నిహితము లగుటవలనను బ్రహ్మప్రీతివలనను బ్రహ్మరూపము లగుటవలనను వాని ననుష్ఠించువానికి బ్రహ్మము నిష్పాదిత మగుచున్నది.

**ఆ.** శ్రద్ధ లేనివానికర్మమునకును నామత్రయోచ్చారణమువలన అవైగుణ్యము కలుగునెడ శ్రద్ధకుఁ బ్రాధాన్యము లేకపోవు నని యాశంకించి చెప్పుచున్నారు ఆ యజ్ఞాదు లంతటను ఇత్యాదిగా. సర్వంబును — యజ్ఞాదికము సగుణముగా నని శేషము. దాని యసత్త్వమును సాధించుచున్నారు నాప్రాప్తికి ఇత్యాదిగా. శ్రద్ధ లేక చేసినకర్మమునకును ఐహికాముష్మికఫలము సిద్ధించును, ఎందువలన నది యసత్తు? అని యాశంకించి చెప్పుచున్నారు తత్ ఇత్యాదిగా. దానికి రెండువిధము లయిన ఫలములును లే వనుటకు హేతువుఁ జెప్పుచున్నారు సాధువులచే నిత్యాదిగా. నిందింతురు గదా సాధువులు శ్రద్ధారహిత మైన కర్మమును, కావున నది యుభయలోకములందును ఫలప్రదము కా దని యర్థము. ఈ యధ్యాయముచే శాస్త్రానభిజ్ఞు లైనను శ్రద్ధావంతు లై శ్రద్ధచే సాత్త్వికాదిత్రైవిధ్యము నొందినవారుగూడ రాజసతామసాహారాదులఁ ద్యజించి సాత్త్వికాహారాదుల సేవించుటచే సత్త్వైకశరణులై యజ్ఞాదివైగుణ్యము ప్రాప్తించినను దాని బ్రహ్మనామనిర్దేశముచేఁ బరిహరించుచుఁ బరిశుద్ధబుద్ధులై శ్రవణాదిసామగ్రిచే తత్త్వసాక్షాత్కారము నొంది మోక్షమున కధికారు లగుదు రని సిద్ధము.

**హ.** అశ్రద్ధయా = నాస్తికబుద్ధిచేత; హుతమ్; దత్తమ్; తప్తం తపః; కృతంచ = చేయఁబడిన స్వాధ్యాయాదికర్మమును; యత్ = ఏది గలదో; అది; అసత్ ఇతి ఉచ్యతే — తదారాధనముగూడ అసత్తు, సత్తు కానిది అసత్తు, తదారాధనము దానిచేతఁ గా దని చెప్పఁబడుచున్నది బ్రహ్మవాదులచేత. ఎందువలన ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—నచ తత్ ప్రేత్య—పరలోకమునం దున్నవాని కది యుపకారకము గాదు గదా. నో ఇహ. అందువలన అదృష్ట మగు దానతపస్స్వాధ్యాయాదికర్మము ఫలసంగము విడిచి యీపదత్రియనిర్దేశముచేత బ్రహ్మస్వరూపము ధ్యానించుచు మహాశ్రద్ధతోఁ దదారాధనముగాఁ జేయవలయు మోక్షార్థు లని యర్థము.

**శం.** శ్రద్ధావిహీనం బగు కర్మము నిష్ఫల మని చెప్పుచున్నాఁడు.—అశ్రద్ధయా; శ్రౌతస్మార్తకర్మమునందు అగ్నియందు, హుతమ్ = వేల్వఁబడిన దేది గలదో; బ్రాహ్మణుల కన్నోదకాదికము, దత్తమ్ = ఇయ్యఁబడిన దేది గలదో; శారీరాది లక్షణ మగు, తపః తప్తమ్ = తపస్సు అనుష్ఠింపఁబడిన దేది గలదో; ఇతర మయిన స్తోత్రమంత్రజపాదికర్మము, కృతమ్ = చేయఁబడిన దేది గలదో; తత్ = అది

యంతయు; అసత్ ఇతి = నిష్ఫలమే యని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. దానినే స్పష్టీకరించుచున్నాఁడు.—తత్ = శరీరాదిబహుప్రయాసముచేతఁ జేయఁబడిన శ్రద్ధాభక్తివిహీనకర్మమంతయు; ప్రేత్య = పరలోకసుఖముకొఱకును; న = కాదు. నో ఇహ=ఐహికసుఖముకొఱకును కాదు. శ్రద్ధావిహీనతవలనను మంత్రాదిలోపము వలనను ఆకర్మము దేవతలును అంగీకరింపరు, శిష్టులు నంగీకరింపరు, కావున శ్రద్ధాశూన్య మగుకర్మము నిష్ఫలమే యని యర్థము. ఓయీ ! "అశ్రద్ధయా దేయమ్" అను విధిబలమువలన నశ్రద్ధతోఁ జేయఁబడిన దైనను దానాదికర్మము ఫలవంతమే యగును, అందువేని; సత్యము. "అశ్రద్ధయా దేయమ్" అని శ్రుతి యున్నను, "కేవలాఘో భవతి కేవలాదీ" * అను శ్రుతిచేఁ గేవలాదికి మహాపాపిష్ఠతమత్వము ప్రాప్తింపఁగాఁ దన్నివృత్తికొఱకు అశ్రద్ధయా దేయమ్మని దయతో శ్రుతి చెప్పుచున్నది, కాని విధింపదు. "యతిశ్చ బ్రహ్మచారీచ విద్యార్థీ గురుపోషకః। అధ్వగః క్షీణవృత్తిశ్చ" ఇత్యాది భిక్షుకులును మఱియు నన్యులును దోషవంతులై యుండఁగా వారియందు శ్రోత్రియునకు శ్రద్ధ పుట్టదు. గృహస్థైకశరణు లగు నాభిక్షులకు గత్యంతరము లేమివలన నశ్రద్ధతో నైనను వారి కియ్యవలయు నని శ్రుతి చెప్పుచున్నది "అశ్రద్ధయా దేయమ్, హ్రియా దేయమ్" అని. "యథా మాతర మాశ్రిత్య సర్వే జీవన్తి జన్తవః। వర్తన్తే గృహిణం తద్వ దాశ్రిత్యేతర ఆశ్రమాః" ♦ అనున్యాయమున సర్వాశ్రమములకును గృహస్థుఁడే శరణ మగుటవలన నెట్లయినను యాచకులకు అశ్రద్ధచే గాని హ్రీచేతఁ గాని భయము చేతఁ గాని యవశ్య మియ్యవలయు నని దాన మవశ్యకరణీయ మనుట సూచింపఁబడుచున్నది అశ్రద్ధయా దేయ మిత్యాదివాక్యముచేత. అందువలన నిది విధి కాదు. విధిరేు యనుపక్షమున "శ్రద్ధయా దేయమ్, శ్రద్ధయా ఽగ్ని స్సమిధ్యతే, శ్రద్ధయా హూయతే హవిః, శ్రద్ధాం కామస్య మాతరమ్" అని సర్వకర్మములును శ్రద్ధాప్రధానము లనువిధికి వైయర్థ్యము ప్రసక్తించును. అందువలన శ్రౌతస్మార్తకర్మము సర్వంబును శ్రద్ధతోనే చేయవలయు నని సిద్ధము.

మం. ఆలస్యాదికముచే శాస్త్రీయవిధి నుత్సర్జించి శ్రద్ధతోనే వృద్ధవ్యవహారమాత్రమునుబట్టి యజ్ఞతపోదానాదికముఁ జేయువారలకుఁ బ్రమాదమువలన

---

* ఒంటరిగా భుజించువాఁడు కేవలపాపుఁ డగుచున్నాఁడు.

♦ ఎట్లు సర్వజంతువులును తల్లి నాశ్రయించి జీవించుచున్నవో అట్లు ఇతరము లయిన యాశ్రమములు గృహస్థు నాశ్రయించి జీవించుచున్నవి.

వైగుణ్యము ప్రాప్తించినపుడు ఓం తత్సత్తను బ్రహ్మనిర్దేశముచేఁ దత్పరిహారం బగు నేని, అప్పు డశ్రద్ధచే శాస్త్రీయవిధి నుత్సర్జించి కామకారంబున యత్కించిద్యజ్ఞాదికముఁ జేయునట్టి యసురులకుఁగూడ దానిచేతనే వైగుణ్యపరిహారం బగును, ఇఁక, సాత్త్వికత్వహేతుభూత మగు శ్రద్ధ యేల? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అశ్రద్ధచే, హుతమ్ = అగ్నియందు హవన మేది చేయఁబడినదో; దత్తమ్ = బ్రాహ్మణుల కేది యియ్యఁబడినదో; తపస్తప్తమ్ = ఏతపస్సు చేయఁబడినదో; మఱియు నేయితర కర్మము, కృతమ్ = చేయఁబడినదో, స్తుతినమస్కారాదికము; అది యంతయు నశ్రద్ధచేఁ జేయఁబడినది, అస దితి=అసాధు వని; ఉచ్యతే. కావున ఓం తత్స దితి నిర్దేశముచే దానికి సాధుభావము కలిగింప శక్యము గాదు, అన్నివిధంబులను దాని కయోగ్య మగుటవలన, శిలకు నంకురమువలె. అది యెందువలన నసత్తని చెప్పఁబడుచున్నది? వినుము ఓపార్థా! చకారము హేత్వర్థకము. ఎందువలన ననఁగా. తత్ = అశ్రద్ధాకృత మయిన యాకర్మము; న ప్రేత్య = పరలోకమునందు ఫలింపదు, విగుణం బగుటచే నపూర్వజనకము కామివలన. నో ఇహ = ఈ లోకమునందును యశము కలిగింపదు, సాధువులచే నిందితం బగుటవలన. అందువలన అశ్రద్ధాకృతము ఐహికాముష్మికఫలవిహీన మగుటవలన సాత్త్విక మగు శ్రద్ధతోనే సాత్త్వికం బగు యజ్ఞాదికము నంతఃకరణశుద్ధికొఱకుఁ జేయవలయును. అట్టి శ్రద్ధాపూర్వక మగు సాత్త్విక మయిన యజ్ఞాదికమునకే దైవవశంబున వైగుణ్యశంక గలిగినపుడు బ్రహ్మముయొక్క నామనిర్దేశముచే సాద్గుణ్యము సంపాదనీయ మని పరమార్థము. "శ్రద్ధాపూర్వక మగు యజ్ఞాదికం బసాత్త్వికము విగుణ మైనను బ్రహ్మముయొక్క నామత్రయము నుచ్చరించుటచే సగుణమును సాత్త్వికమునుగా సంపాదితం బగుచున్నది" అని భాష్యము. ఇట్లీయధ్యాయమునందు, ఆలస్యాదికముచే శాస్త్రము నాదరింపక శ్రద్ధాపూర్వకముగా వృద్ధవ్యవహారమాత్రమును బట్టి ప్రవర్తించువారివిషయమున, శాస్త్రానాదరరూపం బగు నసురసాధర్మ్యముచేతను శ్రద్ధాపూర్వకానుష్ఠానరూప మయిన దేవసాధర్మ్యముచేతను వీ రసురులా? దేవతలా? అని యర్జునుఁడు సంశయింప, "రాజస తామస శ్రద్ధాపూర్వకముగా రాజసతామస యజ్ఞాదులఁ జేయువా రసురులు, వారు శాస్త్రీయజ్ఞానసాధనముపం దనధికారులు; సాత్త్వికశ్రద్ధాపూర్వకముగా సాత్త్వికయజ్ఞాదులఁ జేయువారుమాత్రము దేవతలు, వారు శాస్త్రీయజ్ఞానసాధనమునం దధికారులు" అని శ్రద్ధాత్రైవిధ్యప్రదర్శనముఖంబున నాహారాదిత్రైవిధ్యమునుం బ్రదర్శించి భగవంతునిచే నిర్ణయము చేయఁబడిన దని సిద్ధము.

శ్రీ. ఇప్పుడు సర్వకర్మములందును శ్రద్ధతోనే ప్రవర్తింపవలయు నని యశ్రద్ధాకృతం బగు సర్వంబును నిందించుచున్నాఁడు.— అశ్రద్ధయా; హుతమ్ = హావనమును; దత్తమ్ = దానమును; తప్తమ్ = చేయఁబడిన; తపః = తపస్సును; యత్ — ఏది యితరము; కృతమ్ = కర్మము చేయఁబడినదో, అది యంతయు; అస దిత్యుచ్యతే. ఎందువలన ననఁగా. తత్ = అది; ప్రేత్య = లోకాంతరమునందు; న = ఫలింపదు, విగుణ మగుటవలన. నో ఇహ = ఈ లోకమునందును ఫలింపదు, అయశస్కర మగుటవలన.

రాజసము తామసం బగు శ్రద్ధ విడిచి
సత్త్వమయ మగు శ్రద్ధతో సహితుఁ డైన
యతఁడు తత్త్వవిజ్ఞానమం దధికృతుఁ డని
సప్తదశమందు వచియించె శౌరి కృపను. అ

ప. * అందువలన రజస్తమఃప్రధానమైన శ్రద్ధను విడిచి సత్త్వమయ మగు శ్రద్ధ నాశ్రయింపవలయును. అధ్యాయతాత్పర్యము.— శాస్త్రవిధానముఁ దెలియనివారు పూర్వసంస్కారానురూపముగా శ్రద్ధతో దేవపూజాదికముఁ జేయుదురు, వారు త్రివిధగుణవశమువలన ఆహారయజ్ఞతపోదానములు చేయుదురు, కావున దదనురూపఫలమును బొందుదురు, వారికర్మములవైగుణ్యమును ఓం తత్సత్తను పదత్రయము పరిహరింప సమర్థము, దానిచే వారు చేయునది బ్రహ్మార్పణ మగు నని సప్తదశాధ్యాయమందుఁ బ్రతిపాదింపఁబడినది.

రా. అశ్రద్ధచేఁ జేయఁబడినది శాస్త్రీయహోమాదికముగూడ అసత్తని చెప్పఁబడుచున్నది. ఎందువలన ? న చ తత్ ప్రేత్య, నో ఇహ — అది మోక్షము కొఱకును గాదు, సాంసారిక మగు ఫలముకొఱకును గాదు.

మా. ♦

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయవిభాగయోగో నామ సప్తదశోఽధ్యాయః.

* పదయోజన శ్రీధరీయముతో సమానము.

♦ దీని కిభాష్యము లేదు.

వ్యాసప్రోక్త మయిన శతసహస్రగ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రంబును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు శ్రద్ధాత్రయవిభాగయోగం బనం బరఁగు షోడశాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమ త్ఖవాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవ
ద్గీతాంధ్ర వ్యాఖ్యానంబునందు
సప్తదశాధ్యాయటీక.

సప్తదశాధ్యాయీావత్ కృత్వా౽౽ గీతార్థవివృతి రఖిలేయమ్
పరిపూర్తి మియా దచిరాత్ శ్రీమ ద్భగవ త్ప్రసాదేన.

ఘటయతు భాగవతీ మే దుర్ఘటఘటనాపటీయసీ కరుణా
సాధనవికలస్యా ౽పిచ గీతాపరమార్థచన్ద్రికాపూర్తిమ్.

శ్రీరస్తు.



శ్రీ గణేశ శారదా గురుభ్యో నమః.

పరమార్థచంద్రికాసహిత

# శ్రీభగవద్గీత, అష్టాదశాధ్యాయము.

విమలశ్రద్ధాగమ్యా సాత్త్వికయజ్ఞాదికర్మఫలభూతా
యా సర్వదోషశమనీ తాం విద్యా మమ్బికాం వన్దే.
అజ్ఞానజనితదోషాన్ పరిహృత్య దదాతి కర్మసాద్గుణ్యమ్.
యన్నామ తచ్చ వాచ్యం కృష్ణం కలయామి చాఽఽత్మానమ్.

అర్జున ఉవాచ.—

సన్న్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుమ్
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన. ౧

శ్రీ శంకరభాష్యము.—

సమస్తమైన గీతాశాస్త్రమునకును అర్థం బీయధ్యాయమున నుపసంహరించి సమస్తవేదార్థంబును వక్తవ్యం బని యీయధ్యాయ మారంభింపఁబడుచున్నది. అతీతము లగు నధ్యాయము లన్నిటియందును బ్రతిపాదిత మగునర్థము గదా యీయధ్యాయమునందుఁ గానవచ్చుచున్నది. అర్జునుఁడో సన్న్యాసత్యాగశబ్దార్థములకే విశేషము నెఱుంగఁ గోరినవాఁడై యిట్లనియె.—సన్న్యాసస్య=సన్న్యాసశబ్దార్థముయొక్కయు; మహాబాహో = గొప్పబాహువులు గలవాఁడా! త్యాగస్యచ = త్యాగశబ్దార్థముయొక్కయు; హృషీకేశ = ఇంద్రియములకు నియామకుఁడా! తత్త్వమ్ = తద్భావమును, యాథాత్మ్యము ననుట; పృథక్ = ఒండొంటివిభాగముతో, వేఱువేఱుగా; వేదితుమ్ = ఎఱుంగుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను. కేశినిషూదన=కేశియనువాఁడు అశ్వవేషము గల యసురుఁడు, వాని వధించినవాఁడు భగవంతుఁ డగువాసుదేవుఁడు, అందుచేత ఆనామమున సంబోధింపఁబడుచున్నాఁ డర్జునునిచేత.

అర్జునుఁ డిట్లనియె.—మహాబాహూ! హృషీకేశా! కేశినిషూదనా! సన్న్యాసశబ్దార్థమునకును త్యాగశబ్దార్థమునకును వేఱువేఱుగాఁ దత్త్వము నెఱుంగఁ గోరుచున్నాను. చెప్పు మని తాత్పర్యము.

ఆనందగిరికృత టీక.—

పూర్వాధ్యాయములచే విస్తరంబున నక్కడ నక్కడ విక్షిప్తముగాఁ బ్రతిపాదింపఁబడినయర్థమును సుఖబోధార్థము సంక్షేపమున నుపసంహరించి ప్రతిపాదించుటకై యధ్యాయాంతరము నవతరింపఁ జేయుచున్నారు సమస్తము ఇత్యాదిగా. మఱియును ఉపనిషదలయం దక్కడక్కడ విస్తరింపఁబడినయర్థమును బుద్ధిసౌకర్యముకొఱకు నీయధ్యాయంబున సంక్షేపించి ప్రతిపాదింపవలయును, ఉపనిషదలును గీతలును సమానార్థము లగుటవలన నని చెప్పుచున్నారు సమస్తేత్యాదిగా. ఎట్లు శాస్త్రార్థమంతయు నీయధ్యాయమందు సంక్షేపమున నుపసంహరింపఁబడుచున్నది? అనఁగాఁ జెప్పుచున్నారు అతీతములు ఇత్యాదిగా. ఓయీ! వేదార్థం బశేషమిట నుపసంహరింప నిష్టం బగునేని అప్పుడు "త్యాగే నైకే, సన్న్యాసయోగాత్" అను వేదార్థైకదేశమునుగుఱించి ప్రశ్నప్రతివచనం బెట్లు కావచ్చును? అనఁగాఁ జెప్పుచున్నారు అర్జునుఁడో ఇత్యాదిగా. వేఱువేఱుగా సన్న్యాసత్యాగములతత్త్వము నెఱుంగఁగోరుచున్నా నని విశేషించుటవలన వాని కపృథగర్థము కల దని యేర్పడుచున్నది. జిజ్ఞాస గలవిషయము ప్రష్టవ్య మగుటవలన నేకదేశమునందు జిజ్ఞాస కలుగుటఁ జేసి తత్ప్రశ్నం బుపపన్న మని భావము.

హనుమద్విరచిత పైశాచభాష్యము.—

అతీతము లగు నధ్యాయంబులందు భగవంతునిచేఁ బెక్కుమార్లు సన్న్యాసంబును త్యాగంబును నిర్దేశింపఁబడినవి, కావున వివేకమున వానిస్వరూపము నెఱుంగఁగోరి యర్జునుం డిట్లనియె.—సన్న్యాసస్య = సన్న్యాసశబ్దార్థముయొక్క; తత్త్వమ్ = తద్భావమును; వేదితు మిచ్ఛామి; పృథక్ — త్యాగస్వరూపమునుండి వ్యావృత్తమునుగా. త్యాగస్వరూపమునుగూడ, వేదితు మిచ్ఛామి. కేశి యను నశ్వవేషుఁ డగు నసురునిఁ జంపినవాఁడు వాసుదేవుఁడు, తత్సంబోధనము.

శంకరానందీయ గీతా తాత్పర్యబోధని.—

సాత్త్వికశ్రద్ధ గలవారై సాత్త్వికము లగు యజ్ఞతపోదానాదులచేఁ బరిశుద్ధాత్ము లగు బ్రాహ్మణాదులకు జ్ఞానాధికారం బని సూచించుటకై శ్రద్ధచే యజ్ఞ

తపోదానాదుల హేయత్వము నుపాదేయత్వమును దెలియుటకొఱకు వాని సాత్త్వికత్వాదిభేదమును విభజించి చక్కఁగాఁ బ్రదర్శించి, ఇప్పుడు, సన్న్యాసత్యాగశబ్దము లేకార్థము లనియు, కామ్యనిషిద్ధములే త్యాజ్యము లనియు, నిత్యము లగు యజ్ఞదానాదులు నియమంబునఁ గర్తవ్యము లనియు, త్యాగమునకు సాత్త్వికత్వాదిభేదంబును, నైష్కర్మ్యసిద్ధిలక్షణజ్ఞానమునకును కర్మమునకును కర్తకును బుద్ధికిని ధృతికిని సుఖమునకును సాత్త్వికత్వరాజసత్వతామసత్వభేదములను, బ్రాహ్మణాదివర్ణకర్మంబులను, వానిచేఁ బ్రసన్నాంతఃకరణునకు జ్ఞానంబును, జ్ఞానవంతుఁ డగు యతికి జ్ఞాననిష్ఠయు, పరమాత్మస్వరూపవేదనప్రకారంబును, బ్రహ్మప్రాప్తియు—ఇవి మొదలగు సమస్తగీతాశాస్త్రార్థంబును సనుస్తోపనిషదర్థంబును సర్వంబును సంగ్రహించి యొక్కచోటఁ బ్రతిపాదించుటకై యష్టాదశాధ్యాయ మారంభింపఁబడుచున్నది. అందు మొదట "మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యా ఽధ్యాత్మచేతసా" అనియు, "యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః" అనియు, "సన్న్యాసయోగయుక్తాత్మా" అనియు, "త్యక్త్వా కర్మఫలాసఙ్గమ్" అనియు, "సర్వకర్మఫలత్యాగమ్" అనియు నచ్చటచ్చటఁ గర్మసన్న్యాసకర్మఫలత్యాగములు ప్రతిపాదింపఁబడినవి. కర్మఫలత్యాగముచేఁ గర్మానుష్ఠానంబును గర్మసన్న్యాసంబును జెప్పఁబడినదానిఁగా స్మరించి యొక్కయాశ్రమమునందే యవి రెండు ననుష్ఠించుట యనుపపన్నమని తలంచినవాఁడై తదనుష్ఠానప్రకారముఁ దెలియఁగోరి యర్జునుఁ డిట్లనియె.—

సన్న్యాసస్య = సన్న్యాసశబ్దార్థముయొక్కయు; త్యాగస్యచ = త్యాగశబ్దార్థముయొక్కయు; చ కారము సముచ్చయార్థము; పృథక్ =విభజించి; తత్త్వమ్=యాథార్థ్యమును, నిశ్చితాభిప్రాయిమును; నీవలన, వేదితు మిచ్ఛామి — "మయి సర్వాణి కర్మాణి సన్న్యస్య, యోగసన్న్యస్తకర్మాణమ్" అనియు, "సర్వకర్మఫలత్యాగమ్" అనియు నచ్చటచ్చట నీవు చెప్పిన సన్న్యాసత్యాగశబ్దములకుఁ బ్రత్యేకముగా సర్వవిశేషముఁ దెలియఁగోరుచున్నాను. కేశినిషూదన — కేశియను దైత్యుని వధించినవాఁడు కావున ఓ కేశినిషూదన అని సంబుద్ధి. గృహస్థునివిషయమున నెట్లు బ్రహ్మచర్యశబ్దమునకును మఱియు నెట్లహింసాశబ్దమునకును అర్థవిశేషము చెప్పఁబడునో అట్లు సన్న్యాసశబ్దమునకును త్యాగశబ్దమునకును అర్థవిశేషము చెప్పవలయు నని యర్థము.

మధుసూదనసరస్వతీరచిత గూఢార్థదీపిక.—

పూర్వాధ్యాయంబున శ్రద్ధాత్రైవిధ్యముచేతను ఆహారయజ్ఞతపోదానత్రైవిధ్యముచేతను గర్మములకుఁ ద్రైవిధ్యము చెప్పఁబడినది, సాత్త్వికముల

గ్రహింపవలయు ననియు రాజసతామసములఁ బరిత్యజింపవలయు ననియును. ఇప్పు డింక సన్న్యాసత్రైవిధ్యముఁ బ్రతిపాదించి సన్న్యాసులకుఁ ద్రైవిధ్యము ప్రతిపాదింప వలయును. అందుఁ దత్త్వావబోధానంతర మేది ఫలభూత మగు సర్వకర్మసన్న్యాసము గలదో అది చతుర్దశాధ్యాయంబునందు గుణాతీత మని వ్యాఖ్యాత మగుట వలన దానియందు సాత్త్వికరాజసతామసభేదము సంభవింపదు. మఱియు నేది తత్త్వబోధమునకు మున్ను తదర్థము సర్వకర్మసన్న్యాసము తత్త్వజిజ్ఞాసచే వేదాంత వాక్యవిచారముకొఱకు నగుచున్నదో అదియు "త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవా ఽర్జున" ఇత్యాదికముచే నిర్గుణం బని వ్యాఖ్యాతము. ఇఁక నేది తత్త్వబోధము నొందనివారికిని తత్త్వజిజ్ఞాస పుట్టనివారికిని కర్మసన్న్యాసము "ససన్న్యాసీచ యోగీచ" ఇత్యాదికముచే గౌణము జెప్పఁబడినదో దానికిఁ ద్రైవిధ్యము సంభవించుటవలనఁ దద్విశేషము నెఱుంగఁగోరినవాఁడై యర్జునుఁ డి ట్లనియె.—అవిద్వాంసులును వివిదిష లేనివారలును గర్మాధికృతులే కించిత్కర్మపరిగ్రహముచేఁ జేయుకించిత్కర్మపరిత్యాగ మేది గలదో అది త్యాగాంశగుణము గల దగుటవలన సన్న్యాసశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది. ఇట్టి—అంతఃకరణశుద్ధ్యర్థము అవిద్వాంసుఁ డగు కర్మాధికారి చేయునట్టి, సన్న్యాసస్య—ఏకానేకరూపంబునఁ గర్మత్యాగ మైన దానియొక్క; తత్త్వమ్ = స్వరూపమును; పృథక్ = సాత్త్వికరాజసతామసభేదమున; వేదితు మిచ్ఛామి. త్యాగముయొక్క తత్త్వమునుగూడ, వేదితు మిచ్ఛామి. సన్న్యాసత్యాగశబ్దములు ఘటపటములవలె భిన్నజాతీయ మయిన యర్థము గలవా? లేక, బ్రాహ్మణపరివ్రాజకశబ్దములవలె నేకజాతీయ మయిన యర్థము గలవా? మొదటిపక్షమున త్యాగముయొక్క తత్త్వమును సన్న్యాసమునుండి విభజించి తెలియఁగోరుచున్నాను. రెండవపక్షంబున అవాంతరోపాధిభేదమాత్రము చెప్పవలయును. ఏకవ్యాఖ్యానముచేతనే రెండును వ్యాఖ్యాతము లగును. మహాబాహో కేశినిషూదన అను సంబోధనములచే బాహ్యోపద్రవనివారణమందు స్వరూపయోగ్యతయుఁ దత్ఫలోపధానంబును బ్రదర్శితము లగుచున్నవి. హృషీకేశ యని యంతరుపద్రవ నివారణసామర్థ్య మని భేదము. అత్యనురాగమువలన మూఁడుసంబోధనములు. ఇట నర్జునుని ప్రశ్నలు రెండు. కర్మాధికారి చేయునది యగుటచేఁ బూర్వోక్తయజ్ఞాది సాధర్మ్యంబునను సన్న్యాసశబ్దప్రతిపాద్య మగుటచే గుణాతీతసన్న్యాససాధర్మ్యంబునను త్రైగుణ్యము సంభవించునో సంభవింపదో అను సంశయము మొదటి ప్రశ్నమునకు బీజము. రెండవదానికి సన్న్యాసత్యాగశబ్దములు పర్యాయము లగుటవలనను గర్మఫలత్యాగరూపంబున వైలక్షణ్యముఁ జెప్పుటవలనను సంశయము బీజము.

శ్రీధరస్వామిప్రణీత సుబోధిని.——

అమర విభజించి త్యాగసన్న్యాసములను
సర్వగీతార్థమును దెల్పు సంగ్రహించి
స్పష్టముగఁ బరమార్థనిశ్చయముపొంట
యదుకులేశుఁ డష్టాదశాధ్యాయమందు.

ఇందు "సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽఽస్తే సుఖం వశీ, సన్న్యాసయోగయుక్తాత్మా" ఇత్యాదులయందు సర్వకర్మసన్న్యాస ముపదిష్టము. అట్లు "త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః, సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్" ఇత్యాదిగా ఫలమాత్రత్యాగముచేఁ గర్మానుష్ఠాన ముపదిష్టము. పరస్పరవిరుద్ధము నేమో సర్వజ్ఞుఁడు పరమకారుణికుఁ డగు భగవంతుఁ డుపదేశింపఁడు. అందువలనఁ గర్మసన్న్యాసమునకును తదనుష్ఠానమునకును అవిరోధప్రకారముఁ దెలియఁగోరినవాఁడై యర్జునుఁ డిట్లనియె.—ఓ హృషీకేశ – సర్వేంద్రియములకును నియామకుఁడా! ఓ కేశినిషూదనా! అశ్వాకారుఁ డగు కేశియను మహారాక్షసుఁడు యుద్ధమున నోరు దెఱచి భక్షింపరాఁగా మిక్కిలి విస్తీర్ణ మగువాని నోట భగవంతుఁడు తనవామబాహువుఁ జొనిపి యాక్షణము వృద్ధిఁ బొందిన యాబాహువుచేతనే దోసపండునుంబోలె వాని విదారించి వధించెను గదా! కావుననే మహాబాహో అది సంబోధనము. సన్న్యాసముయొక్కయు త్యాగముయొక్కయు తత్త్వమును, పృథక్ = వివేకంబున, వేదితు మిచ్ఛామి.

పరమార్థప్రప, దైవజ్ఞసూర్యపండితప్రణీతము.—

అంతర్యామిత గురువై
యంతరమున నెవఁడు దెలిపె నర్థిలిఁ దనరూ
పంతరహితు నజు నద్వయు
శాంతుని గోవిందుఁ దలఁతు స్వాంతమునందున్.

పూర్వము పంచమాధ్యాయమున "సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే" అని మఱియు "సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి" * అనియు మొదలగువాక్యములచేఁ గర్మసన్న్యాసము ప్రశంసింపఁబడినది. పిమ్మట "సర్వకర్మఫలత్యాగం తతః కురు" • ఇత్యాదిగా ఫలమాత్రత్యాగముచేఁ గర్మానుష్ఠాన ముప

* ౫ అధ్యాయము.
* ౧౨ అధ్యాయము.

దిష్టము. అది పరస్పరవిరుద్ధం బని సందేహించి యారెంటితత్త్వము నెఱుంగఁగో యర్జునుఁడు వెండియు నడిగెను.—హృషీకేశ = సర్వేంద్రియములకును ఈశుఁడా—స్వామీ! సన్న్యాసస్య; త్యాగస్య చ=ఫలత్యాగముయొక్కయు; తత్త్వమ్=రహస్యమును; పృథక్ = పృథక్ప్రకారమున; వేదితుమ్ = ఎఱుంగుటకు; ఇచ్ఛామి. కేశి యను నశ్వాకారుఁ డగు దైత్యుని యుద్ధంబునఁ దనవామబాహువును జాఁచి వాని నోటం జొనిపి వధించెను భగవంతుఁడు! కావుననే మహాబాహో అనియు సంబుద్ధి. కేశి మొదలగు మహాదైత్యుల విదారింప సమర్థుఁడ వగు నీకు నాసందేహము దీర్చుట యెంతమాత్రము? అని యర్థము.

రామానుజభాష్యము.—

అతీత మగు నధ్యాయద్వయముచే "మోక్షైకసాధన భూతము వైదిక మయిన యజ్ఞతపోదానాదికర్మము గాని యితరము కాదు, వైదిక మగు కర్మమునకు సామాన్యలక్షణము ప్రణవాన్వయము, అందు తత్సచ్ఛబ్దనిర్దేశ్యత్వంబున మోక్షాభ్యుదయసాధనములకు భేదము, మోక్షసాధన మగు కర్మము ఫలాభిసంధిరహిత మగు యజ్ఞాదికము, తదారంభము సత్త్వోద్రేకమువలన నగు చున్నది, సత్త్వవృద్ధియు సాత్త్వికాహారసేవచేఁ గలుగును" అని చెప్పఁబడినది. ఇఁక మోక్షసాధనము లని నిర్దిష్టము లైన త్యాగసన్న్యాసముల యైక్యంబును, త్యాగస్వరూపంబును, భగవంతుఁ డగు సర్వేశ్వరునందు సర్వకర్మములకును కర్తృత్వానుసంధానంబును, సత్త్వరజస్తముల కార్యము వర్ణించుటచే సత్త్వగుణమే యవశ్యోపాదేయం బనియు, పరమపురుషారాధనభూతము లగు స్వవర్ణోచితకర్మములు పరమపురుషప్రాప్తిని సంఘటించువిధంబును, సమస్తగీతాశాస్త్రంబునకు సారార్థము భక్తియోగ మనియు నీవిషయములు ప్రతిపాదింపఁబడుచున్నవి. అందు త్యాగసన్న్యాసముల పృథక్త్వైకత్వనిర్ణయముకొఱకును స్వరూపనిర్ణయముకొఱకును అర్జును డడుగుచున్నాఁడు.—త్యాగసన్న్యాసములు గదా మోక్షసాధనము లని విధింపఁబడినవి. "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వమానశుః......వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః। తే బ్రహ్మలోకేతు పరాన్తకాలే పరామృతా త్పరిముచ్యన్తి సర్వే" ఇత్యాదులందు. ఈ సన్న్యాసముయొక్కయు త్యాగముయొక్కయు, తత్త్వమ్ = యాథాత్మ్యమును; పృథక్ వేదితు మిచ్ఛామి. ఇది యభిప్రాయము — ఈ సన్న్యాసత్యాగశబ్దములు పృథగర్థములా? లేక, ఏకార్థములే యగునా? పృథగర్థము లగు పక్షమున పృథ

క్త్వంబున వీనిస్వరూపము నెఱుంగఁగోరుచున్నాను, పృథక్త్వమైనను దానిస్వరూపము చెప్పవలయును. అని.

మాధ్వభాష్యము.—

అనన్తగుణపూర్ణాయనమః. పూర్వోక్తమగు సాధనమును సర్వంబును సంక్షేపించి యుపసంహరించుచున్నాఁ డీయధ్యాయముచేత.

శ్రీభగవా నువాచ.—

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః
సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః. ౨

భా. అక్కడక్కడ నిర్దిష్టము లయిన సన్న్యాసత్యాగశబ్దములు నిష్కృష్టార్థములు కావు పూర్వాధ్యాయములయందు. అందువలనఁ బ్రశ్న చేసినట్టి యర్జునునకు శ్రీభగవంతుఁ డి ట్లనియె.—కామ్యానామ్= కామ్యము లయిన, అశ్వమేధాదు లగు; కర్మణామ్ = కర్మములయొక్క; న్యాసమ్ = పరిత్యాగమును; సన్న్యాసమ్ = సన్న్యాసశబ్దార్థమునుగా; అనుష్ఠేయముగాఁ బ్రాప్త మయినదాని ననుష్ఠింప కుండుటనుగా, కవయః = పండితులు, కొందఱు; విదుః = ఎఱుఁగుచున్నారు. సర్వకర్మఫలత్యాగమ్ = అనుష్ఠింపఁబడుచున్న నిత్యనైమిత్తికము లగు సర్వకర్మములయొక్క ఫలమును తనదిగాఁ బ్రాప్త మైనదాని పరిత్యజించుట సర్వకర్మఫలత్యాగము, దాని; త్యాగమ్ = త్యాగశబ్దార్థమునుగా; విచక్షణాః=పండితులు; ప్రాహుః=చెప్పుచున్నారు. కామ్యకర్మపరిత్యాగము గాని ఫలపరిత్యాగము గాని యర్థము వక్తవ్యం బగు నేని ఎట్లయినను త్యాగమే సన్న్యాసత్యాగశబ్దముల కొక్కటే యర్థము, అవి ఘటపటములవలె జాత్యంతరభూత మయిన యర్థము గలవి కావు. ఓయీ! నిత్యనైమిత్తికకర్మములకు ఫలమే లే దని చెప్పెదరు, ఎట్లు తత్ఫలత్యాగ మని చెప్ప వచ్చును వంధ్యాపుత్త్రత్యాగమువలె? కా దిది దోషము, నిత్యకర్మములకుఁ గూడ ఫలవత్త్వము భగవంతున కిష్టం బగుటవలన. చెప్పఁబోవుచున్నాఁడు గదా భగవంతుఁడు, "అనిష్ట మిష్టమ్" అనియు "నతు సన్న్యాసినామ్" అనియును. సన్న్యాసులకుమాత్రమే గదా కర్మఫలా

సంబంధముఁ దెలుపుచు అసన్న్యాసులకు నిత్యకర్మఫలప్రాప్తిని "భవత్యత్యాగినాం ప్రేత్య" అని తెలుపుచున్నాఁడు.

శ్రీభగవంతుఁ డిట్లనియె.—అశ్వమేధాది కామ్యకర్మముల ననుష్ఠింపక విడుచుట సన్న్యాసశబ్దార్థ మని కొందఱు పండితులయభిప్రాయము. నిత్యనైమిత్తిక కర్మముల ననుష్ఠించి తత్ఫలమును విడుచుట త్యాగశబ్దార్థ మని కొందఱు పండితులు చెప్పుచున్నా రని తాత్పర్యము.

ఆ. ఓయీ! పూర్వాధ్యాయములం దక్కడక్కడ సన్న్యాసత్యాగములు చెప్పఁబడి యుండఁగా వెండియు వాని నడుగనేల? ఎఱింగినదాని నడుగుట సంభవింపదు గదా! అనఁగాఁ జెప్పుచున్నారు అక్కడక్కడ ఇత్యాదిగా. నిష్కృష్టార్థములు — వివేచించి చెప్పఁబడినయర్థము గలవి. జిజ్ఞాసచేఁ బ్రశ్న ప్రవర్తించుట వలనఁ బృచ్ఛించువానియభిప్రాయమును బ్రశ్నచే నెఱింగి భగవంతుఁ డుత్తరముఁ జెప్పె నని చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. పక్షద్వయోపన్యాసముచే సన్న్యాసత్యాగశబ్దముల కర్థభేదముఁ జెప్పుచున్నారు కామ్యానా మిత్యాదిగా. ఏమి యిప్పుడు సన్న్యాసత్యాగశబ్దార్థము లత్యంతభిన్నార్థములా? అట్లయినయెడఁ బ్రసిద్ధివిరోధం బగు నని యాశంకించి యవాంతరభేద మున్నను ఆత్యంతికభేదము లేదని చెప్పుచున్నారు కామ్యక ర్మేత్యాదిగా. పుత్త్రుఁడు లేమివలన వంధ్యకుఁ బుత్త్రిత్యాగము సంభవింపనియట్లు నిత్య నైమిత్తికకర్మములకు ఫలరహితములకు ఫలత్యాగ మనుపపన్న మగుటవలన నీచెప్పినత్యాగశబ్దార్థము సిద్ధింప దని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. నిత్యనైమిత్తికకర్మఫలమునకు వంధ్యాపుత్త్రసాదృశ్యము లేమివలనఁ దత్త్యాగము సంభవించుటం జేసి చెప్పినత్యాగశబ్దార్థము సంభవించుచున్న దని సమాధానము చెప్పుచున్నారు కా దిది దోషము ఇత్యాదిగా. వానికి ఫలవత్త్వము భగవంతునకిష్టం బనుటకు వాక్యశేషముఁ జూపుచున్నారు చెప్పఁబోవుచున్నాఁడు ఇత్యాదిగా. అప్పుడు సన్న్యాసులకును అసన్న్యాసులకును నిత్యాద్యనుష్ఠానముఁ జేయువారి కవిశేషంబునఁ దత్ఫల మగు ననఁగా కా దని చెప్పుచున్నారు నతు ఇత్యాదిగా. ప్రసక్త మగు వాక్యముయొక్క యర్థమును బ్రకృతోపయోగి యగుటవలన సంగ్రహించి స్మృతికిఁ దెచ్చుచున్నారు సన్న్యాసులకు ఇత్యాదిగా.

హ. అర్జునుం డెఱుంగఁ గోరినయర్థమును జక్కగాఁ దెలుపఁ దలఁచినవాఁడై శ్రీభగవంతుఁ డిట్లనియె.—కామ్యానామ్ = కమనీయఫలము లగు *; కర్మణామ్ =

* కోరఁదగినఫలము గలవి యగు.

కర్మములయొక్క, శాస్త్రమువలనఁ గాని రాగమువలనఁ గాని కర్తవ్యములుగాఁ బ్రాప్తము లయినవానియొక్క; న్యాసమ్ = విడుచుటను; సన్న్యాసమ్=సన్న్యాసమునుగా; విదుః = ఎఱుంగుచున్నారు; కవయః=పండితులు. ఓయీ! కామ్యానామను విశేషణ మనర్థకము, అందువలన "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" ఇత్యాది శ్రుత్యుక్తకర్మములవ్యావృత్త్యర్థ మనవలయును. అందువేని, అట్లు కాదు, అవియును గమనీయఫలము లగుటచేఁ గామ్యంబు లగుటవలన, "అథ త్రయో లోకా వై లోకానాం శ్రేష్ఠా శ్శ్రేష్ఠతమా స్తస్మా ద్విద్యాం ప్రశంసన్తి" అను శ్రుతి వలనను, అట్లు "సర్వవర్ణానాం స్వధర్మే వర్తమానానాం పర మితి శ్రుతం సుఖమ్" అను స్మృతివలనను. ఆ ట్లెక్కుడను జెప్పఁబోవుచున్నాఁడు భగవంతుఁడు "అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్" అని. అందువలనఁ గమనీయఫలము లగుటవలనఁ గర్తవ్యములుగాఁ బ్రాప్తము లగు నిత్యనైమిత్తికకామ్యప్రతిషిద్ధకర్మము లన్నియుఁ గామ్యములే. అందువలనఁ గర్తవ్యములుగాఁ బ్రాప్తము లగు కామ్యము లైన కర్మములయొక్క యని స్వరూపానువాదము. సర్వకర్మఫలత్యాగమ్=సమస్తము లయినకర్మములు నిత్యనైమిత్తికము లనునవి, వానిఫలముయొక్కత్యాగమును - ఈఫలము నాకుఁ గలుగు నను సంకల్పమును విడుచుటను; త్యాగమ్; ప్రాహుః; విచక్షణాః = పండితులు. సర్వగ్రహణముచేఁ గామ్యకర్మగ్రహణ మెందువలనఁ గాదు? కామ్యకర్మత్యాగముచేతనే తత్ఫలత్యాగము సిద్ధ మగుటవలనను త్యాగసన్న్యాసములకు సాంకర్యము ప్రసక్తించుటవలనను. అందువలన సర్వశబ్దముచే నిత్యనైమిత్తికములు మాత్రమే గ్రహింపఁబడుచున్నవి.

శ్రీ౦ ఇట్టి యర్జునునిప్రశ్నతాత్పర్యము నెఱింగి, "సన్న్యాసయోగా ద్యతయః" అనియు "త్యాగే నైకే అమృతత్వమ్" అనియు శ్రుతివలనను "నాచే నిది సన్న్యస్తము త్యక్తము" అను వ్యవహారములవలనను సన్న్యాసత్యాగశబ్దములకు వేదమునందును లోకమునందును విడుచుట యొక్కటియే యర్థము గాని యర్థాంతరము లేకున్నను, గృహస్థునివిషయంబున వాని కర్థము వేఱువిధముగాఁ గొందఱు వర్ణించెదరు వారిమతం బిది చెప్పెద విను మని శ్రీభగవంతుఁ డిట్లనియె:—"పుత్రకామో యజేత, స్వర్గకామో యజేత, పశుకామో యజేత" ఇత్యాదిగాఁ గామసంయోగముచే విహితము లగు, కామ్యానాం కర్మణామ్=కామ్యము లయిన జ్యోతిష్టోమాదికర్మములయొక్క; న్యాసమ్=పరిత్యాగమునే; గృహస్థునకు, సన్న్యాసమ్=సన్న్యాసమునుగా; కొందఱు, కవయః = విద్వాంసులు; విదుః = ఎఱుంగుచున్నారు.

త్కామ్యపరిత్యాగమే ముముక్షు వగు గృహస్థునకు సన్న్యాసమని చెప్పుచున్నా రని యర్థము. కొందఱు, విచక్షణాః = పండితులు; సర్వకర్మఫలత్యాగమ్ = సమస్తము లైన — కామ్యములును అకామ్యము లయిన నిత్యనైమిత్తికములు నగు కర్మముల యొక్క ఫలత్యాగమును — ఫలమాత్రముయొక్క పరిత్యాగమును; త్యాగమ్=సన్న్యాసమునుగా; ప్రాహుః —— కామమునఁ గాని యకామమునఁ గాని విధిచేఁ గర్తవ్యములుగాఁ బ్రాప్తము లగు వైదికకర్మముల ననుష్ఠించి యీశ్వరార్పణబుద్ధిచేఁ దత్ఫలపరిత్యాగమే యధికృతుఁ డగు గృహస్థునకు సన్న్యాసము గాని కర్మత్యాగము కా దని కొందఱు చెప్పుచున్నా రని యర్థము. ఓయీ! "యః పశుకామస్స్యాత్స ఏతం ప్రాజాపత్య మజంతూవర మాలభేత సవా ఏతస్మై ప్రజాం పశూన్ ప్రజనయతి" అని కామ్యకర్మముల కెట్లు ఫలము చెప్పఁబడుచున్నదో అట్లు "అహరహ స్సంధ్యా ముపాసీత, సాయం ప్రాత రగ్నిహోత్రం జుహోతి, అహరహ ర్యజమాన స్స్వయ మేవా ఽగ్నిహోత్రం జుహోతి" ఇత్యాదులయందు నిత్యకర్మములకు ఫలము చెప్పఁబడదు, ఎట్లు లేనిఫలమునకుఁ ద్యాగ ముపపన్న మగును బ్రహ్మచారికి భార్యాత్యాగమువలె? అందు వేని అట్లు చెప్పఁదగదు; "కర్మణా పితృలోకః, ధర్మేణ పాప మపనుదతి, సర్వ ఏతే పుణ్యలోకా భవన్తి, అగ్నే ర్హుత్వా విధానేన య త్పుణ్యం ఫల మాప్నుయాత్" ఇత్యాదిగా నిత్యములకును ఫలము చెప్పఁబడుటవలన. "అనిష్ట మిష్టం మిశ్రంచ" అని భగవంతుఁడును నిత్యములకు ఫలముఁ జెప్పఁబోవుచున్నాఁడు. అందువలన నిత్యములకును ఫలము కల దనియే యంగీకరింపవలయును, కాదేని ఫలత్యాగవిధానం బనుపపన్న మగుటవలన. అందువలన యుక్తమే చెప్పఁబడినది "సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః" అని. అందువలన సిద్ధము గృహస్థులకుఁ గర్మఫలత్యాగమే సన్న్యాసము కాని సర్వకర్మత్యాగము కా దని.

౨. అందు రెండవదాని సూచీకటాహన్యాయంబునఁ బరిహరించుటకై యుత్తరమును శ్రీభగవంతుఁ డి ట్లనియె.——కామ్యానామ్ = ఫలకామనచేఁ జోదితములు అంతఃకరణశుద్ధికుపయుక్తములు కానివి యగు; కర్మణామ్ = ఇష్టిపశుసోమాదికర్మములయొక్క; న్యాసమ్ = త్యాగమును; సన్న్యాసమ్; విదుః=ఎఱుంగుచున్నారు; కవయః = సూక్ష్మదర్శులు కొందఱు. "త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసా ఽనాశకేన" అను వాక్యముచే, వేదానువచనశబ్దముచే నుపలక్షిత మగు బ్రహ్మచారిధర్మము, యజ్ఞదానశబ్దములచే

నుపలక్షిత మగుగృహస్థధర్మము, తపోఽనాశకశబ్దములచే నుపలక్షిత మగువానప్రస్థ ధర్మము — నిత్య మగునిది నిత్యప్రార్థిత మగు పాపక్షయ మనుద్వారంబున ఆత్మ జ్ఞానార్థం బని బోధింపఁబడుచున్నది. ఈ వినియోగము వ్యర్థము, "జ్ఞాన ముత్ప ద్యతే పుంసాం క్షయా త్పాపస్య కర్మణః" * అను వాక్యముచేతనే లబ్ధ మగుట వలన" అనఁ దగదు, వినియోగము చెప్పనియెడ నిత్యకర్మానుష్ఠాన మున్నను జ్ఞానము కలుగునో కలుగదో అని గదా యేర్పడును, వినియోగ మున్ననో జ్ఞాన మవశ్యము కలుగు నని నియమము సిద్ధించును. అందువలన నిత్యకర్మములకే వేదనమునందుఁ గాని వివిదిషయందుఁగాని వినియోగము చెప్పఁబడుటవలన సత్త్వశుద్ధి వివిదిషోత్పత్తి పూర్వకం బగు వేదనము గోరువాఁడు నిత్యకర్మములనే భగవదర్పణబుద్ధితో ననుష్ఠింపవలయును. కామ్యములో సర్వంబులును ఫలసహితముగాఁ బరిత్యాజ్యము లని యొకమతము. మఱియొకమతము.—సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః — కామ్యములయొక్కయు నిత్యములయొక్కయు సర్వకర్మములయొక్కయు ఉక్తఫలత్యాగంబును — సత్త్వశుద్ధిఁ గోరి వివిదిషాసంయోగంబున ననుష్ఠించుటను విచక్షణులు—విచారకుశలులు త్యాగమునుగాఁ జెప్పుచున్నారు. "ఖాదిరో యూపో భవతి, ఖాదిరం వీర్య కామస్య యూపం కరోతి" అనుచోట నెట్లొక్కఖాదిరత్వమునకు క్రతుప్రకరణమునఁ బఠిత మగుటవలనను ఫలసంయోగమువలనను క్రత్వర్థత్వంబును బురుషార్థత్వంబును ప్రమాణభేదమువలన సిద్ధించుచున్నదో అట్లు అగ్నిహోత్రేష్టిపశుసోమాదు లన్నిటికిని శతపథపఠితములకు స్వోత్పత్తివిధిసిద్ధములకు ప్రత్యేకవాక్యముచేఁ దత్తత్ఫలసంయోగంబును యజ్ఞాదివాక్యముచే వివిదిషాసంయోగంబును సిద్ధం బనుట యుపపన్నము, "ఏకస్య తూభయత్వే సంయోగపృథక్త్వమ్" ♦ అను న్యాయమువలన. అది చెప్పఁబడినది సంక్షేపశారీరకమునందు "యజ్ఞే నేత్యాదివాక్యం శతపథవిహితం కర్మబృన్దం గృహీత్వా స్వోత్ప త్త్యామ్నానసిద్ధం పురుషవివిదిషామాత్రసాధ్యే యునక్తి" ❙ అని. అందువలనఁ గామ్యములు కూడ ఫలాభిసంధి విడిచి యంతఃకరణశుద్ధికొఱకుఁ గర్తవ్యములు, అగ్నిహోత్రాది కర్మములకు స్వభావంబునఁ గామ్యత్వనిత్యత్వరూప మగు విశేషము లేదు గదా!

* పురుషులకుఁ బాపకర్మక్షయమువలన జ్ఞానము పుట్టుచున్నది.

♦ ఒకటి రెండువిధము లయినపుడు సంయోగమునకు — ఫలసంబంధమునకు భేదము.

❙ యజ్ఞేనేత్యాదివాక్యము — త మేతం వేదానువచనేన నేత్యాదివాక్యము శతపథపఠితంబును స్వోత్పత్తివిధిసిద్ధంబు నగు కర్మసమూహమును గ్రహించి పురుషునకు వివిదిష యనుసాధ్యమునందు మాత్రమే చేర్చుచున్నది — అదియే ఫల మని బోధించుచున్నది.

పురుషాభిప్రాయకృత మగు విశేషమో ఫలాభిసంధి విడిచినప్పు డెక్కడిది? నిత్యకర్మములకును ప్రాతిస్వికౕ* ఫలము గల దని " అనిష్టమిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్ " అనుచోటఁ జెప్పఁబోవుచున్నాఁడు. నిత్యములకుమాత్రమే వివిదిషాసంయోగము సిద్ధించుటచేఁ గామ్యకర్మములను సఫలముగా స్వరూపముచేఁగూడ విడుచుట పూర్వార్ధార్థము. కామ్యములకును నిత్యములకును సంయోగపృథక్త్వమున వివిదిషాసంయోగము గలుగుటవలనఁ దదర్థము స్వరూపముచే ననుష్ఠించుచున్నను ప్రాతిస్వికఫలాభిసంధిమాత్రపరిత్యాగ మని యుత్తరార్ధార్థము. దీనిని వార్తికకారులు వచియించిరి " వేదానువచనాదీనా మైకాత్మ్యజ్ఞానజన్మనే । త మేత మితి వాక్యేన నిత్యానాం వక్ష్యతే విధిః ॥ యద్వా వివిదిషార్థత్వం సర్వేషా మపి కర్మణామ్ । త మేత మితి వాక్యేన సంయోగస్య పృథక్త్వతః " ♦ అని. అందువలన నిట్లు ఫలసహితముగాఁ గామ్యకర్మములత్యాగము సన్న్యాసశబ్దార్థము, సర్వకర్మములకును ఫలాభిసంధిత్యాగము త్యాగశబ్దార్థము, కావున ఘటపటశబ్దములవలె సన్న్యాసత్యాగశబ్దములు భిన్నజాతీయార్థములు కావు, మఱే మనఁగా అంతఃకరణశుద్ధ్యర్థము కర్మానుష్ఠానమునందు ఫలాభిసంధిత్యాగ మనునది యొక్కటే యర్థము రెంటికి నని యర్జునుని ప్రశ్న మొక్కటి నిర్ణయింపఁబడినది.

శ్రీ. అందుల కుత్తరము శ్రీభగవంతుఁ డిట్లనియె.— " పుత్త్రకామో యజేత, పశుకామో యజేత " ఇత్యాదిగాఁ గామోపబంధముచే విహితము లగు, కామ్యానాం కర్మణామ్ = కామ్యకర్మములయొక్క; న్యాసమ్ = పరిత్యాగమును; సన్న్యాసమ్ = చక్కఁగా ఫలములతోఁ గూడ సర్వకర్మములయొక్క న్యాసమును, సన్న్యాసమునుగా; కవయః = పండితులు; విదుః = ఎఱుంగుచున్నారు. సర్వకర్మఫలత్యాగమ్ = సమస్తము లయిన కర్మములయొక్క — కామ్యములయొక్కయు నిత్యనైమిత్తికములయొక్కయు ఫలమునుమాత్రమే విడుచుటను; ప్రాహుః త్యాగమ్; విచక్షణాః = నిపుణులు. కాని స్వరూపముచేఁ గర్మత్యాగమును కాదు. ఓయీ! నిత్యనైమిత్తికములకు ఫలము చెప్పకుండుటవలన లేనిఫలమున కెట్లు త్యాగము కావచ్చును? వంధ్యకుఁ బుత్త్రత్యాగము సంభవింపదు గదా. చెప్పెదము. " స్వర్గ

---

* ప్రత్యేక.

♦ త మేత మిత్యాదివాక్యముచే నిత్యము లగు వేదానువచనాదులకు ఐకాత్మ్యజ్ఞానోత్పత్తికొఱకు విధి వివక్షితము. లేక. త మేత మిత్యాదివాక్యముచే సంయోగపృథక్త్వంబున సర్వకర్మములకును వివిదిషార్థత వివక్షితము.

కామః పశుకామః" ఇత్యాదులయందువలె "అహ రహ స్సంధ్యా ముపాసీత, యావ జ్జీవ మగ్నిహోత్రం జుహోతి" ఇత్యాదులందు ఫలవిశేషము శ్రుతము కాకున్నను, విధి యపురుషార్థ మగువ్యాపారమునందుఁ బ్రేక్షావంతునిఁ బ్రవర్తింపఁ జేయ నశక్తము కావున నట్టి విధిచే "విశ్వజితా యజేత" ఇత్యాదులయందువలె సామాన్యమున నొకానొకఫల మాక్షిప్తము గాక తప్పదు. ముదిరిన గురుమత శ్రద్ధచే స్వసిద్ధియే విధికిఁ బ్రయోజన మని తలంప రాదు, పురుషప్రవృత్త్యనుపపత్తి దుష్పరిహారం బగుటవలన. శ్రుతముగూడ నిత్యాదులయందును ఫలము "సర్వ ఏతే పుణ్యాలోకా భవన్తి, కర్మణా పితృలోకః, ధర్మేణ పాప మపనుదతి" ఇత్యాదులయందు. అందువలన యుక్త ముక్తము సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః అని. ఓయీ! ఫలత్యాగముచే వెండియు నిష్ఫలము లయినకర్మములం దప్రవృత్తిదోషి యగును. కాదు, సర్వకర్మములకును సంయోగపృథక్త్వమున వివిదిషార్థతచే వినియోగ మగుటవలన. అట్లు శ్రుతి "త మేత మాత్మానం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన" అని. అందువలనఁ బ్రతిపదోక్త మగు సర్వఫలంబును బంధకం బని విడిచి వివిదిషార్థము సర్వకర్మానుష్ఠానము సంభవింపనే సంభవించుచున్నది. వివిదిష యనఁగా నిత్యానిత్యవస్తువివేకంబుచే దేహాభిమానము నివర్తిల్లి బుద్ధి ప్రత్యక్ప్రవణ మగుట. అంతవఱకును సత్త్వశుద్ధికొఱకు జ్ఞానావిరుద్ధము యథోచిత మగు నావశ్యకకర్మముఁ జేయుచుండువానికిఁ దత్ఫలత్యాగమే కర్మత్యాగము, స్వరూపమునఁ గాదు. అట్లు శ్రుతి "కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః" అని. అటుపిమ్మటనో సర్వకర్మనివృత్తి స్వభావముననే యగుచున్నది. అది చెప్పఁబడినది నైష్కర్మ్యసిద్ధియందు "ప్రత్యక్ప్రవణతాం బుద్ధేః కర్మాణ్యుత్పాద్య శుద్ధితః। కృతార్థా న్యస్త మాయాన్తి ప్రావృడన్తే ఘనా ఇవ" * అని. చెప్పఁబడినది గూడ భగవంతునిచేత "య స్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః। ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే" అని. వసిష్ఠునిచేతనుం జెప్పఁబడినది "న కర్మాణి త్యజే ద్యోగీ కర్మభి స్త్యజ్యతే హ్యసౌ। కర్మణో మూలభూతస్య సంకల్ప స్యైవ నాశతః" ♦ అని. జ్ఞాననిష్ఠకు విక్షేపము గలిగించు నని విడుచునుం

* కర్మములు శుద్ధిచే బుద్ధికిఁ బ్రత్యక్ప్రవణతను బుట్టించి కృతార్థములై వర్షాంతమున మేఘములవలె నస్తమయము నొందుచున్నవి.

♦ యోగి కర్మముల విడువ వలదు, కర్మమునకు మూలభూత మైన సంకల్పముయొక్క నాశమువలననే కర్మములచేత నితఁడు గదా త్యజింపఁబడుచున్నాఁడు.

గాక. అది చెప్పఁబడినది శ్రీభగవంతునిచే భాగవతమునందు. "తావత్కర్మాణి కుర్వీత ననిర్విద్యేత యావతా। మత్కథా శ్రవణాదౌ వా శ్రద్ధా యావన్న జాయతే॥ జ్ఞాననిష్ఠో విరక్తో వా మద్భక్తో వా ఒనపేక్షకః। సలిఙ్గా నాశ్రమాం స్త్యక్త్వా చరే దవిధిగోచరః" * అని. చాలు నతిప్రసంగము. ప్రకృత మనుసరింతము.

ప. ఈప్రశ్నల కుత్తరమును శ్రీభగవంతుఁ డిట్లనియె.—కామ్యములు—ఇష్టసాధనము లగు జ్యోతిష్టోమాదులు, వానియొక్క, చక్కగా ఫలములతోఁ గూడ న్యాసము—పరిత్యాగము, దానిని; కవయః=పండితులు; సన్న్యాసమునుగా, విదుః=ఎఱుంగుచున్నారు. అట్లు కామ్యాతిరిక్తము లగు సర్వకర్మములయొక్క — నిత్యనైమిత్తికములయొక్క అవాంతరఫలత్యాగమును, విచక్షణాః = కుశలులు; త్యాగం ప్రాహుః. ఇట నిది యభిప్రాయము — నిత్యములు చేయనిచోఁ బ్రత్యవాయజనకములు, నైమిత్తికములు పుత్త్రజన్మాద్యనుబంధమునఁ జేయఁబడునవి జాతేష్ట్యాదులు, ప్రాయశ్చిత్తములు పాపక్షయసాధనము లగు చాంద్రాయణాదులు, ఉపాసనంబులు సగుణబ్రహ్మవిషయమానసవ్యాపారము లగు శాండిల్యవిద్యాదులు. ఈ నిత్యాదులకు బుద్ధిశుద్ధి పరమప్రయోజనము, ఉపాసనలకో బుద్ధ్యైకాగ్రత, వివిదిషన్తి యజ్ఞేనేత్యాదిశ్రుతివలనను తపసా కల్మషం హం స్తీత్యాదిస్మృతివలనను నిత్యనైమిత్తికములకును ఉపాసనలకును అవాంతగఫలము పితృలోక సత్యలోకప్రాప్తి, "కర్మణా పితృలోకో విద్యయా దేవలోకో దేవలోకో వై లోకానాం శ్రేష్ఠః" ఇత్యాది శ్రుతి సర్వకర్మఫలత్యాగం ప్రాహుః.

రా. ఇఁక రెంటికి నొక్కటే రూపము, అదియు నిట్టి దని నిర్ణయించుటకై వాదివిప్రతిపత్తిని బ్రదర్శించుచు శ్రీభగవంతుఁ డిట్లనియె.—కొందఱు విద్వాంసులు. కామ్యానాం కర్మణామ్, న్యాసమ్=స్వరూపత్యాగమును, సన్న్యాసం విదుః. కొందఱు మఱి విచక్షణులు నిత్యములయొక్కయు నైమిత్తికములయొక్కయు కామ్యములయొక్కయు — సర్వకర్మములయొక్కయు ఫలత్యాగమే మోక్షశాస్త్రములయందుఁ ద్యాగశబ్దార్థ మని చెప్పెదరు. అందు శాస్త్రీయత్యాగము కామ్యకర్మస్వరూపవిషయము సర్వకర్మఫలవిషయ మని వివాదమును బ్రదర్శించుచు

---

* ఎంతవఱకు నిర్వేదము పొందఁడో మత్కథాశ్రవణాదులయందుఁ గాని యెంతవఱకు శ్రద్ధ పుట్టదో అంతవఱకు కర్మములను జేయవలయును. జ్ఞాననిష్ఠుఁడు గాని విరక్తుఁడు గాని అనపేక్షుఁడు, దగు నాభక్తుఁడు గాని యెవ్వఁ డగుచున్నాఁడో అతఁడు లింగయుక్తము లయిన యాశ్రమముల విడిచి విధికి గోచరుఁడుఁ గాక చరింపవలయును

నొకచోట సన్న్యాసశబ్దమును మఱియొకచో త్యాగశబ్దమును బ్రయోగించెను. ఇందు వలన త్యాగసన్న్యాసశబ్దముల కేకార్థత్వ మంగీకృత మని తెలియుచున్నది. అట్లు " నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ " అని త్యాగశబ్దముచే తనే నిర్ణయము చెప్పుటవలనను " నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే। మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః॥ అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్ । భవ త్యత్యాగినాం ప్రేత్య నతుసన్న్యాసినాం క్వచిత్ " అను స్థలమునందుం బరస్పరపర్యాయత కనంబడుటవలనను సన్న్యాసత్యాగశబ్దముల కేకార్థత్వము ప్రతీత మని నిశ్చయింపంబడుచున్నది.

**మా.** ఫలమునం దిచ్ఛ లేమిచేం గాని చేయమిచేం గాని కామ్యకర్మము నొక్క-న్యాసము. త్యాగముమాత్రము ఫలత్యాగమే. అట్లు ప్రాచీనశాలశ్రుతి " అనిచ్ఛయా ఽకర్మణా వా కామ్యకర్మన్యాసో న్యాసః ఫలత్యాగస్తు త్యాగః " అని.

త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః
యజ్ఞదానతపః కర్మ నత్యాజ్య మితి చా ఽపరే. 3

**భా.** త్యాజ్యమ్ = విడువందగినది; దోషవత్ =దోషము గలది; ఏది యది ? కర్మ=కర్మము, బంధహేతు వగుటవలన సర్వంబునుగూడ. లేక; దోషవత్ = దోషమువలె, రాగాదిదోష మెట్లు విడువంబడుచున్నదో అట్లు త్యాజ్యము. ఇతి = అని; ఏకే = కొందఱు; ప్రాహుః = చెప్పుచు న్నారు; మనీషిణః = పండితులు, సాంఖ్యాదిదృష్టి నాశ్రయించినవారు, అధికృతు లయిన కర్ములుగూడ విడువవలయు నని చెప్పుచున్నారు. అందే, యజ్ఞదానతపః=యజ్ఞమును దానమును తపస్సును అను; కర్మ= కర్మము; న త్యాజ్యమ్ = విడువందగినది కాదు. ఇతిచ=అనియు; అప రే = మఱికొందఱు చెప్పుచున్నారు.

కొందఱు పండితులు సాంఖ్యాదిమతము నవలంబించినవారు కర్మము బంధక మగుటచే దోషము గలది కావునం గర్మాధికృతులు గూడ సర్వకర్మమును విడువవలయు నని చెప్పుచున్నారు, లేక, రాగాదిదోషము నెట్లు విడువవలయునో అట్లు సర్వకర్మమును విడువవలయు. నని చెప్పుచున్నారు. మఱి కొందఱు పండితులు యజ్ఞదానతపస్సుల విడువంగూడ దని చెప్పుదు రని తాత్పర్యము.

టీ. కామ్యముల వర్జించి నిత్యనైమిత్తికములు ఫలాభిలాష లేక కర్తవ్యము లని చెప్పఁబడినపక్షమును ప్రతిపక్షనిరాసముచే దృఢీకరించుటకై విప్రతిపత్తిఁ జెప్పుచున్నారు త్యాజ్య మిత్యాదిగా. సర్వకర్మంబును దోషవంత మగుటకు హేతువు చెప్పుచున్నారు బం ధేత్యాదిగా. దోషవత్ అనుదాని దృష్టాంతముగా వివరించుచున్నారు లేక ఇత్యాదిగా. కర్మమునం దనధికృతు లగు నకర్ములే కర్మము విడువవలయును, అధికృతులు విడిచినయెడఁ బ్రత్యవాయము గలుగుటవలన నని యాశంకించి చెప్పుచున్నారు అధికృతులు ఇత్యాదిగా. వారికిని గర్మమును విడుచుటవలనఁ బ్రత్యవాయము కలుగదు గదా, హింసాదియుక్త మగు కర్మము ననుష్ఠించుటవలననే ప్రత్యవాయము గలుగుటవలన నని భావము. మీమాంసకపక్షముఁ జెప్పుచున్నారు అందే ఇత్యాదిగా. అందే—కర్మాధికృతులయందే యనుట. కర్మము—నిత్యమును నైమిత్తికమును.

భా. కర్మలనే యధికృతుల నపేక్షించి యీవికల్పములు, కాని జ్ఞాననిష్ఠులయి వ్యుత్థితు లగు సన్న్యాసుల నపేక్షించి కాదు. "జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం నిష్ఠా మయా పురా ప్రోక్తా" అని యెవ్వరు కర్మాధికారమునుండి తొలఁగింపఁబడిరో వారినిగుఱించి లేదు చింత. ఓయీ! "కర్మయోగేన యోగినామ్" అని యధికృతులు పూర్వము విభక్తమైననిష్ఠ గలవార లయ్యు నిట సర్వశాస్త్రోపసంహారప్రకరణంబున నెట్లు విచారింపఁబడుచున్నారో అట్లు సాంఖ్యులుగూడ జ్ఞాననిష్ఠులు విచారింపఁబడుదురనుట యుపపన్నము. కాదు, వారికి మోహదుఃఖనిమిత్త మగు త్యాగమనుపపన్న మగుటవలన. కాయక్లేశనిమిత్తము లగు దుఃఖములను సాంఖ్యు లాత్మయందుఁ దలంపరు, ఇచ్ఛాదులు క్షేత్రధర్మములే యని దర్శితం బగుటవలన. అందువలన వారు కాయక్లేశదుఃఖభయమువలనఁ గర్మముఁ బరిత్యజింపరు. కర్మములను గూడ వారాత్మయందుఁ దలంపరు, అట్లు తలంచినం గదా నియత మగు కర్మమును మోహమువలనఁ బరిత్యజింతురు. గుణములకుఁ గర్మము, నే నేమియుఁ జేయనే చేయ నని గదా వారు సన్న్యసించుచున్నారు. సర్వకర్మాణి మనసా సన్న్యస్యేత్యాదులచేతఁ గదా తత్త్వవిదునిసన్న్యాసప్రకారము చెప్పఁబడినది.

టీ. కామ్యానాం కర్మణా మ్మని యారంభించి రెండుశ్లోకములచేఁ జెప్పఁబడినవికల్పములు కర్మలను అకర్మలను అధికృతులను అనధికృతులను గూడ నపేక్షించి

ప్రవర్తించు నని యాశంకించి చెప్పుచున్నారు కర్ములనే ఇత్యాదిగా. ఏవకారవ్యవచ్ఛేద్యముఁ జెప్పుచున్నారు కాని ఇత్యాదిగా. దానినే స్ఫుటీకరించుచున్నారు జ్ఞానయోగే నేత్యాదిగా. కర్మాధికృతులకుఁ బూర్వముజ్ఞాననిష్ఠనుండి నిష్ఠ విభజించి చెప్పఁబడినను వారు శాస్త్రార్థోపసంహారంబున వెండియు విచారణీయు లగునట్లు జ్ఞాననిష్ఠులును విచారణీయు లనుట యవిరుద్ధ మని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. సాంఖ్యులు పరమార్థజ్ఞాననిష్ఠు లిట విచారణీయులు కారని యుత్తరముఁ జెప్పుచున్నారు కాదు ఇత్యాదిగా. ఓయీ ! వారును స్వాత్మయందుఁ గ్లేశదుఃఖాదులఁ దలంచువారు కావునఁ దదనురోధంబున రాజసతామసత్యాగము సంభవించుటవలన విచారణీయులు కావచ్చు ననఁగా కారని చెప్పుచున్నారు కాయేత్యాదికొ. అందు క్షేత్రాధ్యాయోక్తమును హేతువుగాఁ బ్రదర్శించుచున్నారు ఇచ్ఛాదులు ఇత్యాదిగా. స్వాత్మయందు సాంఖ్యాదులకుఁ గ్లేశాదులు ప్రతీతములు కా వనుటచే ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. ఓయీ ! వారు క్లేశాదులఁ దలంపకున్నను స్వాత్మయందుఁ గర్మములఁ దలంతురు కావునఁ దత్త్యాగము యుక్తము, అవి కాయక్లేశకరము లగుటవలన ననఁగా కా దని చెప్పుచున్నారు కర్మములను గూడ ఇత్యాదిగా. అజ్ఞులకు మోహమాహాత్మ్యమువలన నియతమునైనను గర్మమును విడువ శక్యమగును గాని తత్త్వవిదులకుఁ గాదు, వారు స్వాత్మయందుఁ గర్మప్రతీతి లేనివా రగుటచేఁ దత్త్యాగమునకు హేతువు లేమివలన నని తలంచి చెప్పుచున్నారు మోహామువలన నని. వారి కాత్మయందుఁ గర్మప్రతీతి లేనియెడఁ గర్మములకుఁ బ్రాప్తియే లేకుండఁగా ఎట్లు తత్త్యాగరూపమైన సన్న్యాసము ? అనఁగాఁ జెప్పుచున్నారు గుణములకు ఇత్యాదిగా. అవివేకప్రాప్తము లగు కర్మములత్యాగము తత్త్వవిదుల కని చెప్పఁబడినదాని స్మృతికిఁ దెచ్చుచు అప్రాప్తప్రతిషేధమును నివారించుచున్నారు సత్త్వేత్యాదిగా.

భా. అందువలన నెవ రితరులు కర్మమునం దధికృతు లనాత్మవిదులు గలరో యెవ్వరికి మోహమువలనను గాయక్లేశభయంబువలనను ద్యాగము సంభవించునో వారలుమాత్రమే తామసత్యాగులు రాజసత్యాగులని నిందింపఁబడుచున్నారు, కర్ము లగు ననాత్మజ్ఞుల కర్మఫలత్యాగము స్తుతించుకొఱకు, " సర్వారమ్భపరిత్యాగీ, మౌనీ, సంతుష్టో యేన కేనచిత్, అనికేతః స్థిరమతిః " అని గుణాతీతలక్షణమందును బరమార్థసన్న్యాసి విశేషితుం డగుటవలన చెప్పఁబోవుచున్నాఁడు గూడ " జ్ఞానస్య యా

పరా నిష్ఠా అని. అందువలన జ్ఞాననిష్ఠు లగు సన్న్యాసు లిట వివక్షితులు కారు. కర్మఫలత్యాగమే సాత్త్వికత్వం బనుగుణముచే తామసత్వాదుల నపేక్షించి సన్న్యాసం బని చెప్పఁబడుచున్నది, ముఖ్య మగు సర్వకర్మ సన్న్యాస మని కాదు. సర్వకర్మసన్న్యాసము సంభవింప దనుటకు నహి దేహభృతా యని హేతువు చెప్పుటవలన ముఖ్యమే యందు వేని, కాదు, హేతువచనము స్తుత్యర్థ మగుటవలన. ఎట్లు త్యాగాచ్ఛాన్తి రన న్తర మ్మనునది కర్మఫలత్యాగస్తుతియే యగునో, యథోక్తము లగు ననేకపక్షముల ననుష్ఠింప నశక్తుం డగు నజ్ఞుని నర్జునుని గూర్చి విధించుటవలన, అట్లు నహి దేహభృతా శక్య మ్మనునదియు కర్మఫలత్యాగ స్తుత్యర్థ మగువచనము. సర్వకర్మాణి మనసా సన్న్యస్య నైవ కుర్వ న్న కారయ న్నాస్తే యన్న పక్షమున కపవాద మెవ్వనిచేతనుం బ్రదర్శింప శక్యము గాదు. అందువలనఁ గర్మమునం దధికృతులగుఱించియే యీ సన్న్యాసత్యాగవికల్పము. ఎవరు మఱి పరమార్థదర్శులు సాంఖ్యులు గలరో వారికి సర్వకర్మసన్న్యాసలక్షణం బగు జ్ఞాననిష్ఠయందే యధికారము, లే దితరమునందు, కావున వారు కారు వికల్పార్హులు. అట్లుపపాదించి యున్నారము వేదా ఽవినాశిన మ్మను ప్రదేశమునందును దృతీయాదియందును.

ఆ. తత్త్వవిదు లిట విచారణీయులు కా రనుటకు ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. కర్మమునం దధికృతు లగు ననాత్మవిదులకుఁ గర్మత్యాగసంభావనను జూపుచున్నారు ఎవ్వరికి నిత్యాదిగా. వారి నిందించుట దేనియందుపయుక్త మని యాశంకించి చెప్పుచున్నారు కర్ములు ఇత్యాదిగా. మఱియుఁ బరమార్థసన్న్యాసులు ప్రశస్యులుగాఁ జెప్పఁబడుటవలన నిందావిషయము కా రని చెప్పుచున్నారు స త్త్వేత్యాదిగా. మఱియు నిందుఁ గూడ సిద్ధిం ప్రాప్తో య థేత్యాదికముచే జ్ఞాననిష్ఠ వక్ష్యమాణ మగుటవలన జ్ఞాననిష్ఠావంతు లిట విచారణీయులు కా రని చెప్పుచున్నారు చెప్పఁబోవుచున్నాఁడు ఇత్యాదిగా. కర్మాధికృతులే యిట వివక్షితులు, జ్ఞాననిష్ఠులు కా రని యుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా. ఓయీ! సన్న్యాసశబ్దముచే సర్వకర్మసన్న్యాసము గ్రాహ్య మగుటవలన నట్టిసన్న్యాసులే యిట వివక్షితు లని తోఁచుచున్నది యనఁగాఁ జెప్పుచున్నారు క ర్తేత్యాదిగా. సన్న్యాసశబ్దముచే ముఖ్యసన్న్యాసగ్రహణమే యుచితము, గౌణముఖ్యములయందు

ముఖ్యమే ప్రబల మగుటవలన, కాదేని ముఖ్యసన్న్యాసము సంభవింపనియెడ హేతువచనము వ్యర్థ మగును అప్రాప్తప్రతిషేధమువలన నని శంకించుచున్నాఁడు సర్వకర్మేత్యాదిగా. ఈ హేతువచనము సర్వకర్మసన్న్యాసాసంభవమును సాధించునది కాదు, కర్మఫలత్యాగస్తుతిపరం బగుటవలన నని పరిహరించుచున్నారు కాదు ఇత్యాదిగా. దీనినే దృష్టాంతముచే స్పష్టీకరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. దృష్టాంతముగూడ యథాశ్రుతార్థం బేల కా దని యాశంకించి చెప్పుచున్నారు యథోక్తములు ఇత్యాదిగా. జ్ఞానము లేక ఫలత్యాగమువలననె ముక్తి యుక్తము గాదు గదా! ముక్తి జ్ఞానైకాధీనం బని సాధించునట్టి శ్రుతిస్మృతులు విరోధించుటవలన, అనంతరమే అద్వేష్టేత్యాదికముచే జ్ఞానసాధనవిధాన మనర్థక మగుటవలన; అందువలన త్యాగస్తుతియే యిట గ్రాహ్య మని యర్థము. దృష్టాంతగత మయినయర్థమును దార్ష్టాంతికమునం దన్వయించుచున్నారు అట్లు ఇత్యాదిగా. పూర్వోక్తపక్షమున కపవాదవివక్షచే హేతువుఁ జెప్పుటవలన ముఖ్యార్థమే యేల కా దని యాశంకించి తదపవాదమునందు హేతువు లేమివలన నట్లు కా దని చెప్పుచున్నారు సర్వకర్మేత్యాదిగా. ఈ హేతువే దాని కపవాదకం బనఁదగదు, ఇది యన్యథాసిద్ధం బని ప్రతిపాదిత మగుటవలన నని భావము. ముఖ్యసన్న్యాసమున కపవాదము సంభవింపనియప్పుడు సన్న్యాసత్యాగవికల్పం బెట్లు సావకాశం బగు నని యాశంకించి చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. జ్ఞాననిష్ఠులయెడ నీవికల్ప మనుపపన్నమనునెడ దేనియందు వారి కధికార మనఁగాఁ జెప్పుచున్నారు ఎవ్వరు మఱి ఇత్యాదిగా. సన్న్యాసులు వికల్పానర్హు లగుటచే వారికి జ్ఞాననిష్ఠయందే యధికారమని యనేకప్రదేశములయందు సాధిత మగుటవలన సాధనీయత్వాపేక్ష దానికి లేదని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా.

హ. త్యాజ్యమ్=త్యక్తవ్యము; దోషవత్=దోషము గలది; కర్మ; అందువలన బంధహేతు వగుటవలనఁ ద్యాజ్య మని కొందఱు మనీషులు చెప్పుచున్నారు. లేక. దోషశబ్దముచే రాగద్వేషాదులు చెప్పఁబడుచున్నవి, దోషవత్ = రాగద్వేషాదిదోషతుల్య మగు; కర్మము త్యాజ్యము భేదబంధక మగుటవలన నని కొందఱు పండితులు చెప్పుచున్నారు. నిత్య మగు, యజ్ఞదానతపః కర్మ; న త్యాజ్య మితి— "స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" అను వచనమువలన మోక్షార్థులకుఁ గూడ త్యాజ్యము కా దని; మఱికొందఱును.

౩౦. ఇట్లు సన్న్యాసత్యాగశబ్దము లేకార్థము లైనను మతభేదముచేఁ గామ్యకర్మత్యాగంబును సర్వకర్మఫలత్యాగంబును సన్న్యాసశబ్దార్థం బని ప్రతిపాదించి వెండియును ద్యాగశబ్దమునకు మతాంతరముచే నర్థాంతరము వర్ణించుచున్నాఁడు.—ఏకే = కొందఱు; మనీషిణః = విద్వాంసులు; దోషవత్ = దోషమనఁగా నిషేధలక్షణ మగు దూషణము, అది గలది దోషయుక్తము, "న కలఞ్జం భక్షయేత్, న సురాం పిబేత్" ఇత్యాది శాస్త్రనిషిద్ధము దుర్గతిని దుర్యోనిని బొందించునట్టి కలంజభక్షణాదిపాతకకర్మ మేది గలదో అట్టి; కర్మ = కర్మము; త్యాజ్యమ్ = త్యక్తవ్యము; ఇతి = అని; ప్రాహుః—దోషవత్కర్మమును విడుచుటయే త్యాగము, కామ్యత్యాగము కాని కర్మఫలత్యాగము గాని త్యాగశబ్దార్థము కాదు, అవి దుర్గతి దుర్యోనిప్రాపకంబులు కామివలనను ఫలము లేనియెడఁ బ్రేక్షావంతులకుఁ బ్రవృత్తి సంభవింపమివలనను, "యత్కర్మ కురుతే తదభిసంపద్యతే" * ఇత్యాది శ్రుతివిరోధప్రసంగమువలనను "యా న్యనవద్యాని కర్మాణి, తాని సేవితవ్యాని" ♦ అని యదుష్టకర్మములను వైదికులు చేయవలయు నని శ్రుతి విధించుటవలనను. అందువలన దుష్టకర్మత్యాగమే త్యాగము సన్న్యాస మని కొందఱు చెప్పుచున్నా రని యర్థము. లేక. మనీషిణః = ప్రకృతివికృతివిలక్షణుఁ డయిన యాత్మ నసంగచిద్రూపు నెఱుంగు స్వభావము గలవారు, పండితులు కొందఱు, సాంఖ్యులు; దోషవత్—"నహింస్యా త్సర్వాభూతాని" ❘ అని ప్రాణిమాత్రహింసను నిషేధించునట్టి శ్రుతివచనము జాగరూకమై యుండఁగా "బ్రాహ్మణో నహన్తవ్యః" అను విశేషనిషేధమునకు బుద్ధిపూర్వక మగు హింస యధికదోషము గలది యనునర్థమే చెప్పవలయును, బుద్ధిపూర్వక మగు భూతహింస దోషహేతువు కావున దానిఁ జేయఁగూడ దని దానియర్థము కాదు, అట్లయినయెడ నబుద్ధిపూర్వక మగు హింసకు దోషము లే దని యేర్పడును, విశేషవిధియు ననర్థకం బగును, అందువలన దోషాధికత్వబోధకమే విశేషవిధి యని యంగీకరింపవలయును, అందుచే నగ్నీషోమీయపశుహింసయు బుద్ధిపూర్వక మగుటచే దోషాధికమే యగుచున్నదీ, ఉభయస్థలములయందును బుద్ధిపూర్వకత్వము సమాన మగుటవలన. అప్పుడు "అగ్నీషోమీయం పశు మాలభేత" అను విధి వ్యర్థమే యగు నందువేని, కాదు,

* ఏకర్మమును జేయుచున్నాఁడో దానిఁ బొందుచున్నాఁడు.

♦ ఏవి నిందితములు కాని కర్మములు గలవో వాని సేవింపవలయును.

❘ సర్వభూతములను హింసింపఁగూడదు.

ప్రకారాంతరముచే దానికి సార్థకత సిద్ధించుటవలన. రాగమువలనఁ బ్రాప్త మగు మాంసభక్షణమునకు నగ్నీషోమీయయజనవ్యాజంబున నవకాశప్రదానపరం బగుట వలన విధి సార్థకమే యగుచున్నది, ఎట్లు రాగమువలనఁ బ్రాప్త మగు మైథునము నకు "ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియ ముద్వహేత్" అను సీక్షిత కర్మాంగముగా స్త్రీ పరిగ్రహమును విధించువ్యాజంబున నవకాశం బొసంగుటచే నర్థవంత మగునో అట్లు. అందువలన "సర్వారమ్భాహి దోషేణ ధూమే నాగ్ని రివావృతాః" అనున్యాయం బున సర్వకర్మంబును ద్రవ్యసాధ్య మగుటచే హింసాప్రధాన మగుటవలన దోష వంతమే యగుచున్నది; దోషవంత మగుటచే బాధక మగుటవలన శ్రౌతము గాని స్మార్తము గాని వైదిక మగు కర్మము సర్వమును ద్యాజ్యమే యని సర్వకర్మత్యాగ మునే త్యాగమునుగాఁ జెప్పుచున్నా రని యర్థము. ఒయీ! విహితకర్మముఁ జేయనియెడఁ బ్రత్యవాయం బగు నందువేని, కాదు, దోషవంత మగు కర్మము నను ష్ఠించినయెడ దానికంటె నధికతరం బగు ప్రత్యవాయము కలుగు నని చెప్పుచున్నారు. అందువలనఁ గలంజభక్షణమువలె సర్వకర్మంబును దోషవంత మగుటచేఁ దత్త్యా గము దోషావహము కా దని వారు తలంచుచున్నా రని యభిప్రాయము. ఇట్లు సాంఖ్యమతభేదముచేఁ ద్యాగశబ్దమున కర్థభేదముఁ బ్రతిపాదించి మీమాంసకమత భేదముచేతఁగూడ నర్థభేదముఁ దెలుపుటకై చెప్పుచున్నాఁడు.—"అకృత్వా వైదికం నిత్యం ప్రత్యవాయీ భవేన్నరః * యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి, కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః, సత్యంవద ధర్మంచర, సత్యాన్నప్రమది తవ్యం ధర్మాన్నప్రమదితవ్యమ్ ♦", ఇత్యాది శ్రుతులచేతను, "శ్రౌతం చాపి తథా స్మార్తం కర్మాలమ్బ్య వసేద్ద్విజః। త ద్విహీనః పతత్యేవ హ్యాలమ్బ రహితాన్ధవత్ ॥" ఇత్యాది స్మృతులచేతను నిత్య మగు వైదికకర్మ మవశ్యకర్తవ్యం బని విహిత మగుటవలనను చేయనియెడఁ బ్రత్యవాయము విహితం బగుటవలనను బ్రాహ్మణునకు, యజ్ఞదానతపః = యజ్ఞమును దానమును తపస్సును అను; కర్మ = వైదికకర్మము; నత్యాజ్యమ్ = ఎప్పుడును ద్యక్తవ్యము కాదు, మతే మనఁగా ఉక్తశ్రుతిస్మృతి బలమువలన యావజ్జీవము కర్తవ్యమే యగును, "ఏకాహం జపహీనస్తు సంధ్యా హీనో దినత్రయమ్। ద్వాదశాహ మనగ్నిశ్చ శూద్ర ఏవ నసంశయః ॥ త్ర్యహం

* వేదోక్త మగు నిత్యకర్మము చేయనియెడ మనుజుఁడు ప్రత్యవాయవంతుఁ డగును.

♦ సత్యమునుండి దొలఁగఁగూడదు, ధర్మమునుండి దొలఁగఁగూడదు.

॥ ద్విజుఁడు శ్రౌతస్మార్తకర్మముల నవలంబించియే యుండవలయును, వాని విడిచినయెడ ఆలం బము విడిచిన యంధునివలెఁ బతనమునే పొందును.

సంధ్యా విరహితో ద్వాదశాహం నిరగ్నికః । చతుర్వేదధరో విప్ర శ్శూద్రఏవ నసంశయః॥ తస్మాన్నలఙ్ఘయే త్సంధ్యాం సాయంప్రాతస్సమాహితః । ఉల్లఙ్ఘయతి యో మోహాత్స యాతి నరకం ధ్రువమ్" *. ఇట సంధ్యాపదము ఔపాసనాగ్నిహోత్రాదుల కుపలక్షణము, "వీరహావా ఏష దేవానాం యోగ్ని ముద్వాసయతే" ♦ ఇత్యాది శ్రుతిస్మృతులవలన నగ్నిహోత్రాదికర్మము పరిత్యజించినయెడ ప్రత్యవాయాధిక్యము తెలియుటవలన బ్రాహ్మణాదులకు యజ్ఞదానాదివైదికకర్మము నిత్యము నియమంబునఁ గర్తవ్యమే యగును. ఓయీ! ద్రవ్యసాధ్య మగుటవలన దోషయుక్తకర్మానుష్ఠాన మెట్లుపపన్న మగు నందువేని, చెప్పెదము. "బ్రాహ్మణో న హన్తవ్యః" అను నీవచనము క్రోధమువలనఁ బ్రాప్త మగు బ్రాహ్మణవధమును దోషాధికత్వము బోధించుచు నిషేధించు చున్నది కాని బుద్ధిపూర్వకహింసామాత్రమున నంతటను దోషాధికత్వము బోధింపఁజాలదు, విశేషవిధికి స్వవిధేయముమాత్రమే విషయ మగుటవలన. బ్రాహ్మణులందఱకు భోజనము పెట్టఁదలయును దేవదత్తునకు వలదు,అను నిషేధమునకు స్వవిధేయమాత్రవిషయత్వము దృష్ట మగుటవలన. అందువలన నది యగ్నిషోమీయ పశుహింసాదికమునందు దోషాధికత్వము బోధింప సమర్థము కాదు, విశేషము స్వవిధేయమునందే యుపక్షీణ మగుటవలన. "న హింస్యాత్సర్వాభూతాని" అను నీనిషేధముగూడ యాగీయపశుహింసయందు సామాన్యమున నైనను దోష మాపాదింపఁజాలదు, సామాన్యముకంటె విశేషము బలీయంబగుటవలన, "అన్నం న ప్రతిగృహ్ణీయా త్ప్రాణైః కణ్ఠగతై రపి" ∤ అను నీనిషేధముకన్నను "యాచయే చ్ఛ్రోత్రియ స్యాన్నమ్" అను విధి బలీయముగాఁ దెలియుటవలన. బ్రాహ్మణులనందఱ వారింపుము దేవదత్తుని భుజింపఁజేయుము, అను చోటఁ గూడ విశేషమునకే బలీయస్త్వము కనఁబడుటవలన, సామాన్యము తృణగుల్మచ్ఛేదాదికమునందు సావకాశం బగుటవలనను, "సావకాశ నిరవకాశయో ర్నిరవకాశం బలీయః" అని నిరవకాశమునకు బలీయస్త్వము చెప్పఁబడుటవలనను.

---

* ఒకదినము జపము విడిచినవాఁడు మూఁడుదినములు సంధ్యవిడిచినవాఁడు పంద్రెండుదినము లగ్నివేల్వనివాఁడు నాలుగువేదముల ధరించువాఁడైనను బ్రాహ్మణుఁడు శూద్రుఁడే యగును. అందువలన సాయంప్రాతఃకాలములయందు సంధ్యను విడువక సమాహితుఁడై చేయవలయును, ఎవ్వఁడు మోహమువలనఁ జేయఁడో అతఁడు శాశ్వత మగు నరకము నొందుచున్నాఁడు.

♦ ఎవ్వఁ డగ్నిని విడుచుచున్నాఁడో అతఁడు దేవతలకు వీరహత్య చేసినవాఁ డగుచున్నాఁడు, వీర మనఁగా యజ్ఞాగ్ని దానిఁ జంపినవాఁ డగుచున్నాఁ డనుట.

∤ ప్రాణములు కంఠగతము లైనను అన్నముఁ బ్రతిగ్రహింపఁ గూడదు.

అందువలన యాగీయపశుహింసకు సామాన్యమునఁ గాని విశేషమునఁ గాని దోష గంధ మాపాదింప శక్యము గాదు. మఱియు, "మధుపర్కేచ యజ్ఞేచ పిత్ర్యే దైవేచ కర్మణి। అత్రైవ పశవో హింస్యా నాన్యత్రే త్యబ్రవీ న్మనుః" * అనియు "అహింసన్ సర్వభూతా న్యన్యత్ర తీర్థేభ్యః"—తీర్థేభ్యః – యజ్ఞాదులకంటె, అన్యత్ర—ఇతర కాలమునందు, సర్వభూతములను, అహింసన్—హింసింపనివాఁ డని భూత హింసానిషేధమునకు యాగీయవ్యతిరిక్తహింసావిషయత్వము చెప్పఁబడుటవలన నిషేధమునకు వ్యాప్తి లేమివలన. "యాచయే చ్ఛ్రోత్రియ స్యాన్నం తదభావే జలం పిబేత్" ♦ అని విధ్యుక్త మగు శ్రోత్రియాన్నభక్షణమునకు నిర్దుష్టత్వమును బవిత్రత్వము నెట్లు సిద్ధమో అట్లు యాగీయపశుహింసకును విధ్యుక్తమునకు నిర్దుష్టత్వమును బావనత్వము నని తెలియుచున్నది. అట్లే శ్రుతియు "ధర్మేణ పాప మపనుదతి, తస్మా ద్ధర్మం పరమం వదన్తి, తపసా కల్మషం హన్తి, బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసా" అని. అందువలన బ్రాహ్మణాదులకు యజ్ఞాదిలక్షణ మగు వేదోక్త మయిన నిత్యకర్మ మవశ్య మనుష్ఠాతవ్యమే, ఎప్పుడును త్యాజ్యము కాదు. మ ఱే మనఁగా "నతు కామ్యం సమాచరేత్, న కలఞ్జం భక్షయేత్" అను వచనముల వలనఁ గామ్యమును నిషిద్ధమును నీరెండే త్యాజ్యములు. కావునఁ గామ్యనిషిద్ధ త్యాగమే త్యాగము కాని కర్మఫలత్యాగము త్యాగము కా దని, అపరే = మఱికొందఱు మనీషులు వైదికశిరోమణు లగు మీమాంసకులు చెప్పుచున్నా రని యర్థము. ఇట "సన్న్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుమ్" అని యర్జునుం డడిగిన ప్రశ్నకు విషయము ముఖ్యసన్న్యాసమా? లేక, గౌణ సన్న్యాసమా? మొదటిపక్షమున నది విద్వత్సన్న్యాసమా? వివిదిషాసన్న్యాసమా? ఇందు మొదటిది కాదు, విద్వత్సన్న్యాసమున కుక్తవికల్పములు సంభవింపమివలనను తామసః పరికీర్తితః అని వక్ష్యమాణము లగు తామసాదిభేదము లనుపపన్నము లగుటవలనను. విద్వాంసునకుఁ గర్తవ్య మగు కర్మ మున్నయెడఁ దత్సన్న్యాసమునకు వికల్పములు సంభవించును, లేకున్నప్పు డెట్లు సంభవించును? "తస్య కార్యం నవిద్యతే, నైవాస్తి కించి త్కర్తవ్యమ్" అని విద్వాంసునకు సర్వకర్మాభావము చెప్పఁబడుటవలన. "జ్ఞానయోగేన సాఙ్ఖ్యానా

* మధుపర్కమందును యజ్ఞమందును పితృకర్మమునందును దైవకర్మమునందును — వీనియందు మాత్రమె పశుహింస చేయవచ్చును. ఒండుచోటఁ గూడ దని మనువు పలికెను.

♦ శ్రోత్రియునియన్నము యాచింపవలయును, అది దొరకనియెడ నీరు త్రావువది.

ష్ఠని బ్రహ్మవిదు లగు యతులకు జ్ఞాననిష్ఠాపరత్వము విధించుటవలనను లేదు వికల్పమున కనకాశము. ఓయీ! యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతీత్యాదివిధిబలమువలన విద్వాంసునకును గర్మము కర్తవ్యమే యందువేని, కాదు, విధికి మిథ్యాత్వము సంభవించుటవలన. మాయామాత్ర మిదం ద్వైత మ్మని ద్వైతము సర్వంబు మాయామాత్రం బగుటచే మిథ్య యని సిద్ధ మైనపుడు తదంతర్భూత మగు కర్మ విధియును శుక్తిరజతమువలె మిథ్య యని యేర్పడుటచే బలహీన మగుటవలనఁ దన మిథ్యాత్వము నెఱింగినవాని నియోగింప సమర్థము కాదు. మిథ్యాభూతం బగు రజతము తనతత్త్వము నెఱింగినపురుషుని గ్రహణాదిక్రియయందుఁ బ్రవర్తింపఁజేయ సమర్థము కాదు గదా! అట్లు మిథ్యాభూత మగు కర్మవిధియును విద్వాంసునిఁ బ్రవర్తింపఁజేయ శక్తము కాదు. రెండవదియుఁ గాదు, సర్వమునుండి విరక్తుఁడై కర్మముచే సాధ్యము లే దని యెఱింగినట్టి వివిదిషువునకుఁ గామ్యకర్మపరిత్యాగముచేఁ గాని కర్మఫలపరిత్యాగముచేఁ గాని కర్మానుష్ఠాన మనుపపన్న మగుటవలన. చిత్తశుద్ధి కొఱకుఁ గర్మము కర్తవ్యమే యందువేని కాదు, సర్వమునుండి విరక్తికన్నను మఱి చిత్తశుద్ధి లేమివలన. విధిబలమువలన నీశ్వరప్రీతికొఱకుఁ గర్మము కర్తవ్యమే యందువేని కాదు, "య దహరేవ విరజే త్తదహరేవ ప్రవ్రజేత్" అను త్యాగవిధి దానికంటెఁ బ్రబల మగుటవలన. "తావ త్కర్మాణి కుర్వీత న నిర్విద్యేత యావతా। మత్కథా శ్రవణాదౌ వా శ్రద్ధా యావ న్నజాయతే॥ జిజ్ఞాసాయాం సంప్రవృత్తో నాద్రియే త్కర్మచోదనామ్"* అని యీశ్వరుఁడే జిజ్ఞాసువునకు విధ్యపేక్షను విధించెను. "దూరేణ హ్యవరం కర్మ" అని విరక్తుఁ డగు ముముక్షువునకుఁ గర్మనిందాపూర్వకముగా శ్రవణపరత్వము విధింపఁబడినది. "ఆత్మ న్యగ్నీన్ సమారోప్య బ్రాహ్మణః ప్రవ్రజే ద్గృహాత్"♦ అని వివిదిషువునకు సర్వకర్మసన్న్యాసము స్మృత్యంతరమునందునుం జెప్పఁబడినది. అందువలన వివిదిషువునకును గర్మసంబంధము లేమిచే నీవికల్పముల కవకాశము సంభవింపదు. అందువలన గృహస్థనిష్ఠ మగు గౌణసన్న్యాసమే ప్రశ్నమునకు విషయము కాని ముఖ్యము కా దని సిద్ధము. గౌణసన్న్యాసమే జిజ్ఞాసితం బగుటకుఁ బూర్వోక్తగీతావచనములే ప్రమాణ మని యెఱుంగునది.

---

* జిజ్ఞాసయందుఁ జక్కగాఁ బ్రవర్తించినవాఁడు కర్మవిధి నాదరింపఁగూడదు.

♦ అగ్నుల నాత్మారోపణము చేసి బ్రాహ్మణుఁడు గృహస్థాశ్రమమునుండి సన్న్యసింపవలయును.

వ్య. ఇప్పుడు ద్వితీయప్రశ్నమునకు * నుత్తరముఁ జెప్పుటకొఱకు సన్న్యాస త్యాగశబ్దార్థమునకుఁ ద్వైవిధ్యము నిరూపించుటకై యందు విప్రతిపత్తిఁ జెప్పుచున్నాఁడు.—సమస్తమైన, కర్మ=కర్మము; బంధహేతు వగుటవలన; దోషవత్= దుష్టము; కావున కర్మాధికారులచేతఁ గూడ కర్మము త్యాజ్యమే యని, ఏకే మనీషిణః ప్రాహుః. లేక, దోషవత్=దోషమువలె, ఎట్లు రాగాదిదోషము త్యజింపఁ బడుచున్నదో అట్లు కర్మము త్యాజ్యము జ్ఞానము నొందనివారిచేతఁ గాని వివిదిష నొందనివారిచేతఁ గాని కర్మాధికారులచేతఁ గూడ. ఇది యొకపక్షము. ఇందు రెండవపక్షము.—కర్మాధికారులచే నంతఃకరణశుద్ధిద్వారమున వివిదిషోత్పత్తికొఱకు, యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యమ్. అనియు, అపరే – మఱికొందఱు పండితులు చెప్పుచున్నారు.

శ్రీ. అవిద్వాంసునకు ఫలత్యాగమాత్రమే త్యాగశబ్దార్థము కాని కర్మత్యాగము కా దను సీవిషయమునే మతాంతరనిరాసముచే దృఢీకరించుటకై మతభేదముఁ జూపుచున్నాఁడు —దోషవత్ = హింసాదిదోషము గలది; కేవలము బంధకమే యనుకారణమువలన సర్వకర్మంబును త్యాజ్య మని, ఏకే మనీషిణః ప్రాహుః. దీని కిది భావము.—"న హింస్యా త్సర్వా భూతాని" అను నిషేధము పురుషున కనర్థహేతువు హింస యని బోధించుచున్నది. "అగ్నీషోమీయం పశు మాలభేత" ఇత్యాది ప్రకరణోక్తవిధియో హింస క్రతువున కుపకారకం బని చెప్పు చున్నది. అందువలన విభిన్నవిషయము లగుటచే సామాన్యవిశేషన్యాయమున కగోచరము లగుటవలన వీనికి బాధ్యబాధకత లేదు. కావున ద్రవ్యసాధ్యము లయిన సర్వకర్మములయందును హింసాదికము సంభవించుటవలన కర్మము సర్వంబును త్యాజ్యమే అని. అది చెప్పఁబడినది "దృష్టవదానుశ్రవిక స్స హ్యవిశుద్ధిక్షయాతిశయ యుక్తః ♦" అని. దీనికర్థము.—ఉపాయము జ్యోతిష్టోమాదికము, అదియు దృష్టోపాయమువంటిది, గురుపాఠమువలన ననుసరించి వినఁబడుచున్నది కావున అనుశ్రవ మ్మనఁగా వేదము, దానిచే బోధితము ఆనుశ్రవికము జ్యోతిష్టోమాదికము, అందు అవిశుద్ధి – హింస, దానిచే క్షయము – వినాశము, అగ్నిహోత్రజ్యోతిష్టోమాదులచేఁ గలుగు స్వర్గములయందును దారతమ్యము కలదు, పరోత్కర్షమో యందఱకును దుఃఖజనకము. అపరే = ఇతరు లగు మీమాంసకులు, యజ్ఞాదిక మగు కర్మము

* ప్రథమశ్లోకవ్యాఖ్యానమున గణింపఁబడిన మొదటిప్రశ్నమున కనుట.

♦ వేదబోధిత మగు నుపాయముగూడ దృష్టోపాయమువంటిది, అదియు హింసతోను వినాశముతోను తారతమ్యముతోను గూడినది గదా.

త్యాజ్యము కా దని చెప్పుచున్నారు. ఇది భావము. క్రత్వర్థ మైనను ఈ హింస పురుషునిచేతనే కర్తవ్యము, అదియు నన్యోద్దేశమునఁ గూడఁ జేయఁబడినయెడఁ బ్రత్యవాయ హేతు వే యగును, విధి విధేయమునకుఁ దదుద్దేశంబున ననుష్ఠానమును విధించుచున్నది శేషత్వము తాదర్థ్యలక్షణం బగుటవలన, అట్లు నిషేధము నిషేధ్యమునకుఁ దాదర్థ్యము నపేక్షింపదు ప్రాప్తిమాత్రమే యపేక్షితం బగుటవలన, కానియెడ నజ్ఞానప్రమాదాదికృతమునందు దోషాభావము ప్రసక్తించును, ఇట్లు సమానవిషయము లగుటచే సామాన్యశాస్త్రమునకు విశేషముచే బాధ గలుగుటవలన లేదు దోషవత్త్వము, అందువలన నిత్య మగు యజ్ఞాదికర్మము త్యాజ్యము కా దని. ఇందుచే విధినిషేధములకు సమానబలత్వము వారింపఁబడుచున్నది సామాన్యవిశేష న్యాయమును సంపాదించుటకు.

ప. ఇఁక నీపక్షమునందు మతాంతరము నుపన్యసించుచున్నాఁడు.—హింసాదిదోషయుక్త మగు, కర్మ = కర్మము; బంధక మగుఁ గావున, త్యాజ్య మని, ఏకే మనీషిణః = సాంఖ్యులు, చెప్పుచున్నారు. అపరే—మీమాంసకులు, "అగ్నీషోమీయం పశు మాలభేత" ఇత్యాదిశ్రుతిబలమువలన, యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యమ్. అని చెప్పుచున్నారు.

రా. ఏకే = కొందఱు, మనీషిణః—కాపిలులును తదనుసారు లగు వైదికులును, రాగాదిదోషమువలె బంధక మగుటవలన యజ్ఞాదికము కర్మము సర్వంబును ముముక్షువుచే త్యాజ్య మని చెప్పుచున్నారు. అపరే — ఇతరులు కొందఱు పండితులు, యజ్ఞాదికర్మము త్యాజ్యము కా దని చెప్పుచున్నారు.

మా. మనీషిణః అని చెప్పుటవలన మొదటిపక్షము గ్రాహ్యమే. ఫలత్యాగముచే యజ్ఞాదికమునకుఁ ద్యాగము వివక్షితము. తత్పక్షమును "యస్తు కర్మ ఫలత్యాగీ" అనియుఁ జెప్పఁబోవుచున్నాఁడు. అందువలన నిది యొక్కటే పక్షము.

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః. ౪

భా. అం దీవికల్పభేదములయందు.—తత్ర=ఆ; త్యాగే = దర్శిత మగు త్యాగసన్న్యాసవికల్పమునందు; మే=నాయొక్క; వచనమువలన, నిశ్చయమ్=నిశ్చయమును; శృణు=వినుము. భరతసత్తమ=భరతులయం

దుత్తముఁడా! త్యాగోహి — త్యాగసన్న్యాసశబ్దములచే వాచ్య మగు నేయర్థము గలదో అది యొక్కటే యను నభిప్రాయముతోఁ జెప్పు చున్నాఁడు త్యాగోహి యని, త్యాగము గదా! పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుఁడా! త్రివిధః = మూఁడుప్రకారములు గలది, తామసాది ప్రకారములచే; సంప్రకీర్తితః = శాస్త్రములయందుఁ జక్కఁగాఁ జెప్పఁ బడినది. ఎందువలన, "దామసాదిభేదముచేఁ ద్యాగసన్న్యాసవాచ్య మగు నర్థం బధికృతుఁ డగు కర్తృక నాత్మజ్ఞునకుఁ ద్రివిధము సంభవించు చున్నది కాని పరమార్థదర్శికి సంభవింప" దను నీయర్థము దుర్జ్ఞేయమో అందువలన నిందుఁ దత్త్వము నితరుఁడు వచింప సమర్థుఁడు కాఁడు. అందువలనఁ బరమార్థశాస్త్రార్థవిషయ మగు నిశ్చయమును—ఈశ్వరుఁడ నగు నాయధ్యవసాయమును వినుము.

అర్జునా! ఈ చెప్పినపక్షములయందు నానిశ్చయము చెప్పెద వినుము. త్యాగసన్న్యాసశబ్దముల కొక్కటి యర్థము కాని భిన్నముగాఁ దలంపకుము. త్యాగము తామసాదిభేదములచే మూఁడువిధము లని శాస్త్రములందుఁ జెప్పఁబడి నది యని తాత్పర్యము.

ఆ. కర్త్రాధికృతులగుఱించియే యీవికల్పములు ప్రవర్తించినను ఎట్లు నిర్ధారణము సిద్ధించు ననఁగాఁ జెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. ఆ నిశ్చయమునే దెలుపుటకై మొదటఁ ద్యాగముయొక్కయవాంతరవిభాగముఁ జెప్పుచున్నాఁ డుత్తరార్థముచేత. ఓయీ! త్యాగసన్న్యాసములు రెండును బ్రకృతములై యుండఁగా త్యాగమునకుమాత్ర మవాంతరవిభాగము చెప్పుటచే సన్న్యాస ముపేక్షిత మగు ననఁగా కా దని చెప్పుచున్నారు త్యాగోహి ఇత్యాదిగా. సాత్త్వికము రాజసము తామసము అని త్రివిధ మనునీయర్థమునందుఁ దనయంతనె నిశ్చయము సంభవించుట వలన భగవంతునినిశ్చయముతో నేమి యని యాశంకించి చెప్పుచున్నారు ఎందు వలన నిత్యాదిగా. భగవంతునికంటె నితరునకు నీవిభాగమునందుఁ దత్త్వము నిశ్చ యింప శక్యము కామివలన భగవంతునినిశ్చయము శ్రోతవ్య మని యుపసంహరిం చుచున్నాడు అందువలన నిత్యాదిగా.

హ. అందువలన నట్లు త్యాగమునందు ద్వివిధమతభేద ముండుటవలన.—

తత్ర త్యాగే, మమ నిశ్చయం శృణు.

శం. త్యాగగుణముచే ముఖ్యసన్న్యాసముతో సాదృశ్యము సంభవించుటవలన, కామ్యకర్మత్యాగమే సన్న్యాస మనియు, సర్వకర్మఫలత్యాగమే సన్న్యాస మనియు దోషవత్కర్మత్యాగమే సన్న్యాస మనియు, కామ్యనిషిద్ధకర్మపరిత్యాగమే సన్న్యాస మనియు త్యాగశబ్దార్థ మగు సన్న్యాసమును బండితులు స్వస్వమతానుసారమున బహువిధములు వర్ణించుచున్నా రని యిట్లు మతభేదముచే త్యాగశబ్దమున కర్థభేదముఁ బ్రతిపాదించి తనయభిమతం బగు నర్థముఁ జెప్పుటకై స్వమతసిద్ధ మగు త్యాగమున కధికారిభేదమున ద్వైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు.— ఉక్తరీతిని బహువిధములు వికల్పిత మగు, తత్ర = ఆ నీప్రశ్నకు విషయభూత మైన; త్యాగే = త్యాగశబ్దార్థ మగు సన్న్యాసమునందు; మే నిశ్చయమ్ = నాచే నిశ్చయింపఁబడినయర్థమును; నావలన, శృణు = వినుము. శ్రోతార్థమునందుఁ బ్రవృత్తి కలుగుటకై శ్రోత నభిముఖీకరించుచున్నాఁడు భరతసత్తమ పురుషవ్యాఘ్ర అనిసంబోధనములచేత. హి — ఏకారణమువలనఁ ద్యాగమును బండితులుగూడ బహువిధముగా వర్ణించుచున్నారో అందువలనఁ ద్యాగము బుద్ధిమంతులకుఁగూడ దుర్విజ్ఞేయము. సర్వకర్మఫలత్యాగం తతః కురు అనుచోట సమస్తము లైన నిత్యనైమిత్తికకర్మములఫలమాత్రత్యాగమే యెట్లు వివక్షితమో, అట్లు మయి సర్వాణి కర్మాణి సన్న్యస్య, యోగసన్న్యస్తకర్మాణ మిత్యాదులయందును గర్మసన్న్యాసపదమునకుఁ గర్మఫలత్యాగమే యర్థము వివక్షిత మగుచున్నది, కాని కర్మసన్న్యాసము కాదు కర్మాధికారమునఁ గర్మసన్న్యాసవిధి యనుపపన్న మగుటవలన. ఉక్తలక్షణం బగు, త్యాగః = త్యాగ మేది గలదో అది; త్రివిధః = తామసాదిభేదమున మూఁడువిధములు గలది యని; మునులచే, సంప్రకీర్తితః. దానినే చెప్పెద విను మని యర్థము.

మ. ఇట్లు విప్రతిపత్తి కలుగుటవలన.—తత్ర — నే వడిగిన కర్మాధికారికర్తృక మగు సన్న్యాసత్యాగశబ్దములచేఁ బ్రతిపాదిత మైన; త్యాగే = ఫలాభిసంధిపూర్వకకర్మత్యాగమునందు; మే=నాయొక్కవచనమువలన; నిశ్చయమ్ = పూర్వాచార్యులు చేసిన నిశ్చయమును; శృణు. ఓ భరతసత్తమా! ఏమి యందు దుర్జ్ఞేయము కల దనఁగాఁ జెప్పుచున్నాఁడు.—పురుషవ్యాఘ్ర = ఓ పురుషశ్రేష్ఠా! హి—ఎందువలన ననఁగా. త్యాగః = కర్మాధికృతుఁడు చేయునట్టి ఫలాభిసంధిపూర్వకకర్మత్యాగము; త్రివిధః=మూఁడుప్రకారములు గలది తామసాదిభేదముచేత నని, సంప్రకీర్తితః. లేక. విశిష్టాభావరూప మగు త్యాగము విశేషణాభావమువలనను విశేష్యా

భావమువలనను ఉభయాభావమువలనను త్రివిధ మని సంప్రకీర్తితము. ఎట్లనఁగా. ఫలాభిసంధిపూర్వకకర్మత్యాగము కర్మ మున్నను ఫలాభిసంధిత్యాగమువలన నొకటి, ఫలాభిసంధి యున్నను కర్మత్యాగమువలన రెండవది, ఫలాభిసంధియొక్కయుఁ గర్మము యొక్కయు త్యాగము తృతీయము. అందు మొదటిది సాత్త్విక మాదేయము. రెండవదియో హేయము ద్వివిధము, దుఃఖబుద్ధిచేఁ గృతము రాజసము, విపర్యాసముచేఁ గృతము తామసము. ఇంతమాత్రమె కర్మాధికారి చేయుత్యాగము అర్జునుని ప్రశ్నకు విషయము. తృతీయము కర్మానధికారి చేయునది నైర్గుణ్యరూపము అర్జునునిప్రశ్నకు విషయము కాదు. అదియు సాధనఫలభేదమున ద్వివిధము. అందు సాత్త్విక మగు ఫలాభిసంధిత్యాగపూర్వకకర్మానుష్ఠానరూప మయిన త్యాగముచే శుద్ధాంతఃకరణుఁడు వివిదిష నొంది యాత్మజ్ఞానసాధన మగు శ్రవణాఖ్యవేదాంత విచారముకొఱకు ఫలాభిసంధిరహితుఁడై యంతఃకరణశుద్ధి గలవాఁ డగుటవలనఁ దత్సాధన మగు కర్మమును పొట్టు వోయినపిదప నవఘాతము * నుం బోలెఁ ద్యజించుట యొకటి. అది సాధనభూతము వివిదిషాసన్న్యాస మని చెప్పఁబడుచున్నది. దానిముందు నైష్కర్మ్యసిద్ధిం పరమా మ్మని చెప్పఁబోవుచున్నాఁడు. రెండవదియో జన్మాంతరకృత మగు సాధనాభ్యాసముయొక్క పరిపాకమువలన నీజన్మమునందు మొదటనే యాత్మబోధము నొంది కృతకృత్యుఁ డగు వానికి స్వతస్సిద్ధం బగు ఫలాభిసంధికర్మములపరిత్యాగము ఫలభూతము. అది విద్వత్సన్న్యాసం బని చెప్పఁబడుచున్నది. అదియో యస్త్వాత్మరతి రేవస్యా దిత్యాది శ్లోకద్వయముచే మున్ను వ్యాఖ్యాతము, స్థితప్రజ్ఞలక్షణాదులచేతనుంగూడ బహువిధములఁ బ్రపంచింపఁబడినది. ఎందువలన నిట్లు త్యాగతత్త్వము దుర్జ్ఞేయమో నీవును దత్త్వము నెఱుంగఁగోరుచున్నా నని యడిగితివో, అందువలన సర్వజ్ఞుఁడ నగు నావచనమువలన నెఱుంగు మని యభిప్రాయము. సంబోధనద్వయముచేఁ గులనిమిత్తోత్కర్షంబును పౌరుషనిమిత్తోత్కర్షంబును యోగ్యతాతిశయము సూచించుటకై చెప్పఁబడియె.

శ్రీ. ఇట్లు మతభేదము నుపన్యసించి స్వమతముఁ దెలుపుటకై చెప్పుచున్నాఁడు.—తత్ర త్యాగే=ఇట్లు విప్రతిపన్న మగు నాత్యాగమునందు; నిశ్చయమ్; మే—నావచనమువలన; శృణు. త్యాగము లోకప్రసిద్ధ మగుటవలన నిందు వినవలసిన దేమి యున్న దని చులుకనగాఁ దలంపకు మని చెప్పుచున్నాఁడు.—పురుషవ్యాఘ్ర = ఓ పురుషశ్రేష్ఠా! ఈ త్యాగము దుర్బోధము. హి—ఎందువలన ననఁగా.

* దంచుట.

ఈ కర్మత్యాగము తత్త్వవిదులచేఁ దామసాదిభేదమున, త్రివిధః=మూఁడువిధములు గలది యని; సంప్రకీర్తితః = చక్కగా—వివేకమునఁ బ్రకీర్తితము. త్రైవిధ్యమును నియతస్య తు సన్న్యాసః కర్మణ ఇత్యాదిగాఁ జెప్పఁబోవుచున్నాఁడు.

ప. పురుషవ్యాఘ్ర = పురుషార్థసాధనశీలుఁడా! హి — అనునది నిశ్చయార్థకము. త్యాగము త్రివిధం బని తామసాదిభేదముచే, సంప్రకీర్తితః = సమ్యక్ప్రకారంబున ముందు నిరూపితమై యున్నది. *

రా. తత్ర — అట్లు వాదివిప్రతిపన్న మగు; త్యాగే—త్యాగవిషయ మగు; నిశ్చయమ్; నావలన వినుము. త్యాగము చేయఁబడుచున్న కర్మములందే ఫలవిషయతచేతను కర్మవిషయతచేతను కర్తృవిషయతచేతను బూర్వమే నాచేత త్రివిధ మని సంప్రకీర్తితము గదా! "మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా। నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః" అని. కర్మజన్య మగు స్వర్గాది ఫలము నాకు వల దనుట ఫలత్యాగము. మదీయఫలమునకు సాధనము మదీయం బీకర్మ మని కర్మమునందు మమతాపరిత్యాగము కర్మవిషయ మగు త్యాగము. సర్వేశ్వరునియందుఁ గర్తృత్వము ననుసంధించి తనకుఁ గర్తృత్వము త్యజించుట కర్తృత్వవిషయ మగు త్యాగము.

మా. తత్ప్రకారమునుం జెప్పుచున్నాఁడు.—యజ్ఞభేదము చెప్పఁబడినది ద్రవ్యయజ్ఞా ఇత్యాదిగా. దానమునందో అభయదాన మంతర్భవించుచున్నది. వీనిలో నేదేని యజ్ఞాదికము కర్తవ్యమే యని యర్థము. కాదేని, "బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థో యతి స్తథా। య దిచ్ఛే న్మోక్షం మాస్థాతు ముత్తమాశ్రమ మాశ్రయేత్" ♦ ఇత్యాది వ్యాసస్మృతి విరోధ మగును. ఆ పరమహంసలు జ్ఞానయజ్ఞంబును విద్యాఽభయదానంబును బ్రహ్మచర్యాదితపస్సును గలవారు గదా! అందువలన నేవాక్య మన్యథాప్రతీత మగునో అది యధికారిభేదముచే యోజనీయము, కాదేని యితరములకు గతి లేమివలన.

యజ్ఞో దానం తపః కర్మ ❡ న త్యాజ్యం కార్య మేవ తత్
యజ్ఞో దానం తప శ్చైవ పావనాని మనీషిణామ్. ౫

* పూర్వార్థవ్యాఖ్య శ్రీధరీయముతో సమము.

♦ బ్రహ్మచారిగాని గృహస్థుఁడుగాని వానప్రస్థుఁడుగాని యతి — హంసగాని మోక్షము నొందఁ గోరుచేని ఉత్తమాశ్రమమును — పరమహంసాశ్రమము నాశ్రయింపవలయును.

❡ యజ్ఞదానతపః కర్మ అని పాఠాంతరము.

**భా.** ఏది మఱి యానిశ్చయ మనఁగాఁ జెప్పుచున్నాఁడు.— యజ్ఞః = యజ్ఞము; దానమ్ = దానము; తపః=తపస్సు; అను నీత్రివిధమైన, కర్మ = కర్మము; నత్యాజ్యమ్ = విడువఁగూడదు. తత్ = అది; కార్యమేవ = చేయవలసినదియే. ఎందువలన ? యజ్ఞః = యజ్ఞమును; దానమ్=దానమును; తపశ్చైవ = తపస్సును; పావనాని = విశుద్ధికారణములు; మనీషిణామ్ — ఫలాభిసంధి లేనివారల కనుట.

యజ్ఞము దానము తపస్సు అను నీకర్మములను విడువఁగూడదు. వీని నవశ్యము చేయవలయును. ఏల యనఁగా, ఇవి ఫలాభిసంధి లేనివారి కంతఃకరణశుద్ధి కలిగించునవి యని తాత్పర్యము.

**ఆ.** ఆ భగవంతుని నిశ్చయమునే విశేషించి నిర్ధారించుటకై ప్రశ్నపూర్వకముగా మీఁదిశ్లోకము తాత్పర్యముఁ జూపుచున్నారు ఏది మఱి ఇత్యాదిగా. యజ్ఞాదులు కర్తవ్యము లనుటకు హేతువుఁ జెప్పుచున్నాఁ దుత్తరార్ధముచేత. అత్యాజ్యము మాత్రమే కాదు మఱే మనఁగా కర్తవ్యమే యని చెప్పుచున్నారు కార్యమేవ అని. ఇట్లు ప్రతిజ్ఞాతమును విభజించి హేతువును విభజించుచున్నారు ఎందువలన నిత్యాదిగా.

**హ.** యజ్ఞదానతపస్సు అనుకర్మము, న త్యాజ్యమ్. సత్త్వశుద్ధ్యర్థమును ఈశ్వరారాధనార్థమును, తత్ కార్యమేవ. యజ్ఞో దానం తపశ్చైవ; పావనాని= ఉపాత్తదురితక్షయార్థములు; మనీషిణామ్ = జ్ఞానులకు. ఎందువలన నిత్యము లగు యజ్ఞదానతపస్సులు ఉపాత్తదురితక్షయార్థములో అందువలనఁ గార్యములే యని యభిప్రాయము.

**శం.** నిశ్చయం శృణు మే యని యేది ప్రతిజ్ఞాతమో ఆతనినిశ్చయమును ప్రతిపాదించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—యజ్ఞః — శ్రౌతమును స్మార్తమును; దానమ్=పాత్రములయం దర్థమును సమర్పించుట; తపః=స్వాధ్యాయము; "త్రయో ధర్మస్కన్ధాః యజ్ఞో ఽధ్యయనం దాన మితి * అని యధ్యయనము ధర్మస్కంధ మనియు గృహస్థధర్మ మనియు శ్రుత మగుటవలనను "తపో హి స్వాధ్యాయః" అని స్వాధ్యాయము తప స్సని శ్రుతం బగుటవలనను తపశ్శబ్దముచే అధ్యయనము

* యజ్ఞము అధ్యయనము దానము అని మూఁడు ధర్మస్కంధములు.

చెప్పఁబడుచున్నది; ఇట్లు యజ్ఞదానతపోలక్షణము త్రివిధము నిత్యము వైదికము నగు; కర్మ = కర్మము; ముముక్షువు అవిరక్తుఁ డగు గృహస్థునకు, న త్యాజ్యమ్ = ఎప్పుడును విడువఁదగినది కాదు. మ తే మనఁగా నిత్య మగుటవలనను బురుషార్థ హేతు వగుటవలనను చేయనియెడఁ బ్రత్యవాయమువలనను, యజ్ఞము అధ్యయనము దానము అనుసట్టి, " అహ రహ స్సంధ్యా ముపాసీత, ఉది తే సూర్యే ప్రాత ర్జుహోతి " ఇత్యాది శ్రుత్యుక్త మయిన కర్మము నిత్యమును ముముక్షువుచే, కార్యమ్—శ్రద్ధా భక్తులతో నియమంబునఁ గర్తవ్య మని యర్థము. ఈ కర్మమునందుఁ బ్రవృత్తి సిద్ధించుటకై ఫలముఁ జెప్పుచున్నాఁడు.—మనీషిణామ్ = వేదాధ్యయనము చేసి తదర్థము నెఱింగినవారు సదసద్వివేకవంతులు నగు ముముక్షువులకు, పరమేశ్వరార్పణబుద్ధితోఁ జేయఁబడిన వగు, యజ్ఞో దానం తపః, చకార మిటఁ జెప్పినవియుఁ జెప్పనివియు నగు శ్రౌతస్మార్తయజ్ఞదానాదికర్మములకు సముచ్చయార్థము, ఏవకారము వర్ణాశ్రములకు విహిత మైన వైదిక మగు యజ్ఞదానాదికర్మమునకే పావనత్వనిర్ధారణార్థము, యజ్ఞదానతపోలక్షణము లగు శ్రౌతస్మార్తకర్మము లే; పావనాని = ఉపాత్తసర్వదురిత క్షయకరములు సత్త్వశోధకములు; తద్ద్వారంబున జ్ఞానమునకును తత్ఫలంబునకును గారణము లని యర్థము.

మ. ఏది యానిశ్చయము ? విప్రతిపత్తికోటిభూతము లగు రెండుపక్షములయందును రెండవపక్ష మని చెప్పుచున్నాఁడు.—చకారము హేత్వర్థకము. ఎందువలన యజ్ఞదానతపస్సులు, మనీషిణామ్ = ఫలాభిసంధి చేయనివారికి; పావనాని = జ్ఞానప్రతిబంధక మగు పాపమలముఁ గడుగుటచేతను జ్ఞానోత్పత్తియోగ్యత యను పుణ్యాగణము నొందించుటచేతను శోధకములో, ఫలాభిసంధి చేయనివారికే యజ్ఞదానతపస్సులే శోధకములు కానే యగుచున్నవో; ఉపాధిశుద్ధిచేతనే యుపాహితశుద్ధి యిట నభిప్రేతము; అందువలన నంతఃకరణశుద్ధ్యర్థు లగు కర్మాధికృతులచే యజ్ఞము దానము తపస్సు అను ఫలాభిసంధిరహిత మగు కర్మ మేది గలదో అది, న త్యాజ్యమ్. మ తే మనఁగా, కార్య మేవ తత్. అత్యాజ్య మనుటచేఁ గార్యత్వము లబ్ధ మైనను ఆదరార్థము వెండియు కార్య మేవ అని చెప్పఁబడినది. లేక. ఎందువలన, కార్యమ్ = కర్తవ్య మని విహితమో; అందువలన, త్యాజ్య మేవ.

శ్రీ. మొదట నిశ్చయము చెప్పుచున్నాఁడు రెంటిచేత.—మనీషిణామ్= వివేకులకు; పావనాని = చిత్తశుద్ధికరములు.

ప. అందు మొదటఁ ద్యాగస్వరూపమును జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—యజ్ఞదానతపోరూప మగు కర్మము త్యాజ్యము కాదు, మ త్తే మనఁగా; కార్యమే. ఎందువలన? యజ్ఞో దానం తప శ్చైవ; మనీషిణామ్=జ్ఞానవంతులకు, పావనాని = చిత్తశోధకములు.

రా. యజ్ఞదానతపఃప్రభృతిక మగు వైదికకర్మము ముముక్షుచే నొకానొకప్పుడును త్యాజ్యము కాదు. మ త్తే మనఁగా, మరణపర్యంతమును ప్రతిదినము కార్యమే. యజ్ఞదానతపః ప్రభృతు లగు వర్ణాశ్రమసంబంధు లైనకర్మములు, మనీషిణామ్ = మననశీలురకు; పావనాని. మనన మనఁగా నుపాసనము, ముముక్షువులకు యావజ్జీవము ముపాసనము చేయువారి కుపాసననిష్పత్తివిరోధి యగు ప్రాచీనకర్మమును నశింపఁజేయునవి యని యర్థము.

మా. *

ఏతా న్యపితు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలానిచ
కర్తవ్యా నీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమమ్. ౬

భా. ఏతాని = ఈ; కర్మా ణ్యపితు = పావనము లని చెప్పఁబడిన యజ్ఞదానతపఃకర్మములును గూడ; సఙ్గమ్=వానియందు ఆసక్తిని; ఫలానిచ = వానిఫలము లను; త్యక్త్వా=పరిత్యజించి; కర్తవ్యాని = అనుష్ఠేయములు; ఇతి = అని; పార్థ = అర్జునా! మే = నాయొక్క; నిశ్చితమ్ = నిశ్చయింపఁబడిన; ఉత్తమమ్=శ్రేష్ఠ మగు; మతమ్=మతము. నిశ్చయం శృణు మే తత్ర యని ప్రతిజ్ఞ చేసి పావనత్వమును హేతువును గూడఁ జెప్పి ఏతా న్యపి కర్మాణి కర్తవ్యా నీతి నిశ్చితం మత మ్మనుట ప్రతిజ్ఞాతార్థోపసంహారమే కాని యపూర్వార్థవచనము కాదు, ఏతా న్యపి యని ప్రకృతసన్నికృష్టార్థత యుపపన్న మగుటవలన. సాసంగుఁడును ఫలార్థియు నగు వానికి బంధహేతువు లగు నీకర్మములు గూడ ముముక్షువునకుఁ గర్తవ్యము లని యపిశబ్దమున కర్థము. కాని యన్యకర్మముల నపేక్షించి ఏతా న్యపి యని చెప్పఁబడినది కాదు †. ఇతరులు వర్ణించుచున్నారు.—నిత్యకర్మములకు ఫలము లేమివలన సఙ్గం త్యక్త్వా ఫలా

* ఇది మొదలు లాఱుశ్లోకముల కీభాష్యము లేదు.

† ఇతరకర్మములును ఇవియుఁ గర్తవ్యము లని యభిప్రాయము కా దనుట.

నిచ అనుట యుపపన్నము కాదు. ఏతాన్యపి యనఁగా కామ్యకర్మములు నిత్యములకంటె భిన్నము లేవి కలవో అట్టి యీకామ్యములును గర్తవ్యములు, ఇఁక నిత్యములు యజ్ఞదానతపస్సులు కర్తవ్యము లని చెప్పవలయునా? అని. అది యుక్తము కాదు, నిత్యకర్మములకును ఫలవత్త్వ ముపపాదిత మగుటవలన, యజ్ఞో దానం తపశ్చైవ పావనానీత్యాదివచనముచేత. నిత్యము లగు కర్మములను గూడ బంధహేతువు లని విడువఁగోరు ముముక్షువునకుఁ గామ్యములందుఁ బ్రసక్తి యెక్కడిది? దూరేణ హ్యవరం కర్మ అనియు నిందిత మగుటవలన, యజ్ఞార్థాత్కర్మణో ఽన్యత్ర యనుచోటఁ గామ్యకర్మములు బంధహేతువు లని నిశ్చిత మగుటవలన, త్రైగుణ్యవిషయా వేదాః, త్రైవిద్యా మాం సోమపాః, క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి అనియును. దూరవ్యవహిత మగుటవలనఁ గూడ ఏతాన్యపి యను వ్యపదేశము కామ్యవిషయము కాదు.

అర్జునా! యజ్ఞమును దానమును తపస్సును అను నీ నిత్యకర్మములను వానియందు సంగమును తత్ఫలములను విడిచి ముముక్షువు చేయవలయు నని నానిశ్చయము, ఇది యుత్తమ మయిన మతము, ఇట్లనుష్ఠింపు మని తాత్పర్యము.

ఆ. ప్రతిజ్ఞాతార్థము నుపసంహరించుచున్నాఁడు ఏతాన్యపీత్యాదిగా. ఉపసంహారశ్లోకాక్షరములకు వ్యాఖ్యానము చేయుచున్నారు ఏతాని ఇత్యాదిగా. అక్షరార్థముఁ జెప్పి తాత్పర్యముఁ జెప్పుచున్నారు నిశ్చయ మిత్యాదిగా. ప్రకృతార్థోపసంహారమునందు గమకముఁ జెప్పుచున్నారు ఏతాన్యపి కర్మాణి ఇత్యాదిగా. అపిశబ్దముచే వివక్షితార్థము దెలుపుచున్నారు సాసంగుఁడును ఇత్యాదిగా. వ్యావర్త్యముఁ జెప్పుచున్నారు కాని ఇత్యాదిగా. ఏతాన్యపీత్యాదివాక్యము నిత్యకర్మవిషయము కా దను మతము నుపన్యసించుచున్నారు ఇతరులు ఇత్యాదిగా. ఇది నిత్యకర్మవిషయము కాదేని మఱి యేది దీనికి విషయ మని యాశంకించి వాక్యమునెత్తి వ్యాఖ్యానముఁ జేయుచున్నాఁడు ఏతాన్యపి ఇత్యాదిగా. నిత్యములు ఫలరహితము లని యంగీకరించి చేయుచోద్య మయుక్త మని దూషించుచున్నారు అది యుక్తము కాదు ఇత్యాదిగా. కామ్యములును గర్తవ్యము లని యేది చెప్పఁబడినదో దాని నిరసించుచున్నారు నిత్యములు ఇత్యాదిగా. మఱియుఁ గామ్యములు భగవంతునిచే నిందితము లగుటవలన వానియందు ముముక్షువునకుఁ బ్రవృత్తి కలుగ దని చెప్పుచున్నారు దూరే ణేత్యాదిగా. మఱియును ముముక్షున కపేక్షిత మగు మోక్ష

మునకుఁ గామ్యకర్మములు విరుద్ధఫలము లగుటవలన వానియందు వాని కనుష్ఠానము కలుగ దని చెప్పుచున్నారు యజ్ఞార్థా దిత్యాదిగా. కామ్యములు బంధహేతువు లని నిశ్చిత మనుటకే పూర్వోత్తరవాక్యముల యానుకూల్యముఁ జూపుచున్నారు త్రైగు ణ్యేత్యాదిగా. మఱియును బూర్వశ్లోకమునందు యజ్ఞాదినిత్యకర్మములు ప్రకృతము లగుటవలన సన్నిహితవాచక మగు నేతచ్ఛబ్దము వానినే పరామర్శించుటవలనను కామ్యకర్మములు కామ్యానాం కర్మణా మని స్యవహితము లగుటచే సన్నిహిత పరామర్శకం బగు నేతచ్ఛబ్దమునకు విషయము కాఁజాలమివలనను ఏతా న్యపి యను టచేఁ గామ్యకర్మములు చెప్పఁబడ వని చెప్పుచున్నారు దూ రేత్యాదిగా.

హ. ఇట్లు మఱి కర్తవ్యములు. ఎట్లు ?.—ఏతా న్యపి; కర్మాణి – యజ్ఞా దులు; సఙ్గమ్=ఫలస్పృహను; ఫలానిచ; త్యక్త్వా; కర్తవ్యానీతి; నిశ్చితమ్ = నిస్సం శయము; ఉత్తమమ్ = శ్రేష్ఠము.

శం. యజ్ఞదానాదినిత్యకర్మములు నియమంబున నవశ్యకర్తవ్యము లనియు శోధకము లనియుఁ బ్రతిపాదించి వాని ననుష్ఠించుప్రకారముఁ జెప్పుచున్నాఁడు.— ఏతా న్యపితు కర్మాణి సఙ్గం త్యక్త్వా కర్తవ్యాని అనుచోట, “ త్వన్తాథాది న పూర్వ భాక్ ” * అను న్యాయంబున తుశబ్దయోగమువలనను అపిశబ్దయోగమువలనను ఉక్తవ్యతిరిక్తము లగు కామ్యకర్మములు గూడ కామము విడిచి కర్తవ్యములే, కాదేని అపితు శబ్దప్రయోగము వ్యర్థ మగు నని విద్వాంసులు తలంపఁగూడదు, అపక్షమున భగవద్వచనమునకు వైలక్షణ్యాభావము ప్రసక్తించుటవలన. సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః అనుస్థలమున సర్వపదముచేఁ బూర్వోక్తకామ్యకర్మ ములను గ్రహించి కామ్యములును అకామ్యములు నగు సమస్తకర్మములయొక్క ఫలమాత్రపరిత్యాగమును త్యాగ మని చెప్పెద రని చెప్పఁబడినమతభేదమే యిచ్చటఁ గూడ నుపన్యస్త మగును. భగవంతుఁడును తన్మతానుసారి యనునెడ స్వాతంత్ర్యా భావము ప్రసక్తించుటవలనను, నిశ్చయం శృణు మే తత్ర యనువచనమునకు వ్యాఘాతము సంభవించుటవలనను, యజ్ఞార్థా త్కర్మణో ఽన్యత్ర యని అయజ్ఞార్థ మగు కర్మము బంధక మని చెప్పుటవలనను, కృపణాః ఫలహేతవః అని కామ్యకర్మ ము నిందిత మగుటవలనను కామ్యకర్మముల కిటఁ బ్రసక్తియే లేదు. అప్పుడు అపి

* తుకార మంతమందుఁ గలదియు అథ యనునది యాదియందుఁ గలదియు పూర్వముతో నన్వ యించునది కాదు.

శబ్దతుశబ్దములు వ్యర్థము లగు నందువేని, చెప్పెదము. తుశబ్దము నిత్యములు కామ్య వ్యతిరిక్తము లని బోధనార్థము. అపిశబ్దమో సంభావనార్థము. ఏతచ్ఛబ్దము సన్నిహితపరామర్శార్థము. అందువలన, ఏతానితు = ఈ పూర్వోక్తము లయిన యజ్ఞదానాదులుమాత్రము నిత్యములు, కాని కామ్యములు కావు, అయినను కామ్యములవలె ఫలాభిసంధియుక్తము లైనయెడ బంధముకొఱకే యగును గాని ముక్తికొఱకుఁ గావు, అందువలన నట్టి యీయజ్ఞదానాదులు నిత్యములును, సఙ్గమ్ = దీనిచే సక్తుఁడగుచున్నాఁడు కావున సంగ మనఁగా కామము, దానిని; ఫలానిచ =చెప్పినవానిని జెప్పఁబోవువానినిఁగూడ అనిష్టాదులను; త్యక్త్వా; ముముక్షువులచే నీశ్వరార్పణబుద్ధితో, కర్తవ్యానీతి; నిశ్చితమ్=శ్రుతియుక్తులచేత నిర్ధారిత మగు; మే=నాయొక్క—ఈశ్వరునియొక్క; మతమ్ = సిద్ధాంతము; ఉత్తమమ్ = చెప్పిన యామతముల కంటె నుత్కృష్టతమము, ప్రత్యవాయరహిత మగుటచే నరకాద్యనిష్టనివృత్తికి హేతువగుటవలనను స్వర్గగతాగతక్లేశము నివర్తించునది యగుటవలనను చిత్తశుద్ధిద్వారమున నభీష్ట మగు ముక్తికి హేతు వగుటవలనను ఆమతములకంటె శ్రేష్ఠతమ మని యర్థము.

౭. యజ్ఞదానతపస్సుల కంతఃకరణశోధనమునందు సామర్థ్యము కలదేని అప్పుడు ఫలాభిసంధితోఁ జేయఁబడినను అవి యంతఃకరణశోధకములు కాఁగలవు, ఇఁక ఫలాభిసంధత్యాగ మేల? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—తుశబ్దము శంకానిరాకరణార్థము. కామ్యములుగూడ ధర్మస్వాభావ్యమువలన శుద్ధిని గలిగించునవైనను ఆశుద్ధి తత్ఫలోపభోగోపయుక్తమే కాని జ్ఞానోపయుక్తము కాదు. అది చెప్పఁబడినది వార్తికకారులచేత " కామ్యేపి శుద్ధి రస్త్యేవ భోగసిద్ధ్యర్థ మేవ సా। వి డ్వరాహాది దేహేన నహ్యైన్ద్రం భుజ్యతే ఫలమ్ "* అని. మఱి జ్ఞానోపయుక్త మగు శుద్ధిని గలిగించునట్టి యజ్ఞాదికర్మము లేవి గలవో అట్టి, ఏతాని = ఈ యజ్ఞాదులు ఫలాభిసంధిపూర్వకములై బంధనహేతుభూతము లైనను; ముముక్షువులచే సఙ్గమ్ = నే నిట్లు చేయుచున్నా నను కర్తృత్వాభినివేశమును; ఫలానిచ — అభిసంధింపఁబడువానిని; త్యక్త్వా; అంతఃకరణశుద్ధికొఱకు, కర్తవ్యానీతి; మే=నాయొక్క; నిశ్చితమ్. అందువలననే, ఓపార్థా! కర్మాధికృతులచేఁ గర్మములు త్యాజ్యములా? కావా? అను రెండుమతములలో త్యాజ్యములు కా వని నాయొక్క—నిశ్చిత మయిన

---

* కామ్యమునందును శుద్ధి కలుగనే కలుగుచున్నది, ఆశుద్ధి భోగసిద్ధికొఱకే. గ్రామ్యసూకరాదిదేహముచే ఇంద్రభోగము ననుభవింప శక్యము కాదు గదా.

మతము; ఉత్తమమ్ = శ్రేష్ఠము. నిశ్చయం శృణు మే తత్ర యని యేది చెప్పఁబడినదో ఆ యీ నిశ్చయ ముపసంహరింపఁబడినది.

భగవత్పాదుల మత మిది
నిగదితము గభీరభాష్యనిర్ణీతార్థా
వగమాసమర్థజనులకు
సుగమం బగుపొంటె నిచటఁ జొప్పడ నాచే.

శ్రీ. ఏప్రకారమునఁ జేయఁబడినయెడ నివి పావనము లగునో ఆప్రకారమును దెలుపుటకై చెప్పుచున్నాఁడు.—ఏ యజ్ఞాదికర్మములు నాచేఁ బావనము లని చెప్పఁబడినవో, ఏతానితు – అట్టి యీయజ్ఞాదులే; కర్తవ్యాని. ఎట్లు? సఙ్గమ్ = కర్తృత్వాభినివేశమును; త్యక్త్వా; ఫలానిచ. కేవల మీశ్వరారాధనరూపమునఁ గర్తవ్యము లనియు, ఫలములను గూడ విడిచి కర్తవ్యము లనియు నిశ్చితమ్; మే = నాయొక్క; మతమ్; కావుననే, ఉత్తమమ్.

ప. ఏవిధమునఁ జేసినయెడఁ బావనము లగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఏతాని = ఈ యజ్ఞదానతపోరూపము లగు; కర్మాణి; సఙ్గమ్; ఫలానిచ = ఐహికాముష్మికఫలములను గూడ; త్యక్త్వా; కేవల మీశ్వరార్పణముగా, కర్తవ్యానీతి; మే; మతమ్; నిశ్చితమ్ = నిస్సంశయము. ఉత్తమ మగుటవలన నిదియె యాదరణీయ మని యర్థము.

రా. ఎందువలన మనీషులకు యజ్ఞదానతపఃప్రభృతులు పావనములో, అందువలన నుపాసనమువలె, ఏతా న్యపి = ఈ యజ్ఞాదికర్మములు గూడ, మదారాధనరూపములుగా; సఙ్గమ్ = కర్మమునందు మమతను; ఫలానిచ; త్యక్త్వా; ప్రతిదినమును మరణపర్యంతము ఉపాసనసిద్ధికొఱకు ముముక్షువుచే, కర్తవ్యానీతి; నాయొక్క, నిశ్చితమ్, ఉత్తమం మతమ్.

నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే
మోహా త్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః. ౭

భా. అందువలన నజ్ఞుండును అధికృతుండు నగు ముముక్షువునకు.—నియతస్య = నిత్య మగు; కర్మణస్తు = కర్మముయొక్కమాత్రము; సన్న్యాసః=పరిత్యాగము; నోపపద్యతే=యుక్తము కాదు. మోహాత్ =

అజ్ఞానమువలన; తస్య = ఆ నియతకర్మముయొక్క; పరిత్యాగః = విడుచుట; నియతము గూడ—అవశ్యము కర్తవ్యము గూడ విడువఁబడుచున్నదియు నని విప్రతిషిద్ధము కావున నది మోహనిమిత్త మగు త్యాగము, తామసః = తామస మని; పరికీర్తితః = చెప్పఁబడినది. మోహామే తమము కావున.

నిత్య మైనకర్మమును విడుచుట యుక్తము గాదు. అజ్ఞానమువలన దాని విడుచుట యేది గలదో అది తామసత్యాగమని చెప్పఁబడు నని తాత్పర్యము.

హ. నియతస్య = నిత్య మగు; కర్మణః; త్యాగః; నోపపద్యతే. సత్త్వశుద్ధ్యర్థము దాని ముముక్షువులు చేయవలయును. మోహాత్ = అజ్ఞానమువలన; తస్య = ఆ నిత్యకర్మముయొక్క; పరిత్యాగః; తామసః పరికీర్తితః.

శ౦. నిశ్చయం శృణు మే తత్రే యని యుపక్రమించి స్వసిద్ధాంతమును బ్రతిపాదించి యిప్పుడు ముముక్షువునకు విరక్తుఁడు కానివానికిఁ గర్మసన్న్యాసమును నిషేధించుచు "త్రివిధ స్సంప్రకీర్తితః" అని చెప్పిన త్యాగత్రైవిధ్యమును జెప్పుచున్నాఁడు.—నియతస్య = శ్రుతిస్మృతివిహిత మగు; కర్మణః = సంధ్యోపాసనాగ్నిహోత్రాది కర్మముయొక్క; సన్న్యాసః = కామ్యకర్మమును వలె విడుచుట; అశుద్ధచిత్తుం డగు ముముక్షువునకు, నోపపద్యతే—నిత్యకర్మము సత్త్వశోధక మగుట వలనను అనుష్ఠింపనిచోఁ బ్రత్యవాయము గలుగుటవలనను అజ్ఞునకుఁ గర్మసన్న్యాసము కర్తవ్యము కా దని యర్థము. కర్మతత్త్వముఁ దెలియక యాపాతదృష్టిచే దోషమని తత్త్యాగము నవివేకమునఁ జేసినయెడ నెట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు.—కృత్యాకృత్యజ్ఞానము లేమి మోహము—అవివేకము, అట్టి మోహమువలన, తస్య = నియతమును స్వానుష్ఠానముచేఁ జిత్తశుద్ధిద్వారమున మోక్షహేతు వగుటచే నుపాదేయ మగు నానిత్యకర్మముయొక్క; పరిత్యాగః; తామసః = తమోగుణకార్య మగుట వలనఁ దామస మని; సత్పురుషులచే, పరికీర్తితః. తమోగుణమువలననే మోహము—విచిత్తత అనిష్టాదికర్మఫలముయొక్క యజ్ఞానము, దానివలననే యుపాదేయమునైనను నిత్యకర్మమును విడుచుచున్నాఁడు, విడిచి నిత్యకర్మాననుష్ఠానదోషమువలనఁ గలుగు ఫలమును నరకమునుం బొందుచున్నాఁ డని యర్థము. ఇందుచే నవిరక్తుఁ డగు నజ్ఞుఁడు కర్మత్యాగము చేయఁగూడ దని సూచిత మగుచున్నది.

మ॰ ఇట్లు యజ్ఞదానతపః కర్మ నత్యాజ్య మితి చాపరే అను స్వపక్షము స్థాపింపఁబడినది. ఇప్పుడు త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః అన్న పరపక్షమును బూర్వోక్తమగు త్యాగత్రైవిధ్యము వివరించుటచే నిరాకరింప నారంభించుచున్నాఁడు.—కామ్యకర్మము అంతఃకరణశుద్ధిహేతువు కామిచేతను బంధహేతు వగుటచేతను దోషవంత మగుటవలన బంధనివృత్తిహేతు వగు జ్ఞానముఁ గోరువాఁడు చేయు తత్త్యాగం బుపపన్నమే. నియతస్యతు కర్మణః=నిత్యకర్మముయొక్క-మాత్రము శుద్ధిహేతు వగుటచే దోషరహిత మయినదానియొక్క-; సన్న్యాసః = త్యాగము; ముముక్షుల కంతఃకరణశుద్ధిఁ గోరువారికి; నోపపద్యతే, శాస్త్రయుక్తులచే, అది యంతఃకరణశుద్ధికొఱకవశ్యానుష్ఠేయం బగుటవలన. అట్లు చెప్పఁబడినది పూర్వము ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణ ముచ్యతే అని. ఓయీ! కామ్యమునకుం బోలె దర్శపూర్ణమాసజ్యోతిష్టోమాదినిత్యకర్మమునకును వ్రీహిపశ్వాదిహింసాశ్రిత మగుటచే దోషవత్త్వము సాంఖ్యులు చెప్పెదరు. క్రత్వంగభూత మగు హింస "వ్రీహీ నవహన్తి, అగ్నీషోమీయం పశుమాలభేత" ఇత్యాది విశేషవిధిసిద్ధం బగుటవలన "న హింస్యా త్సర్వా భూతాని" అను సామాన్యనిషేధము తదితరపరం బనుట యుక్తము గాదు, భిన్నవిషయంబు లగుటచే విధినిషేధములకు బాధ లేకయే సమావేశము సంభవించుటవలన. ఎట్లనఁగా. నిషేధముచేఁ బురుషున కనర్థహేతువు హింస యని చెప్పఁబడినది, కాని క్రత్వర్థము కానట్టి హింస యని చెప్పఁబడినది కాదు. విధిచేతను క్రత్వర్థహింస చేయవలయు నని చెప్పఁబడినది, కాని యది యనర్థహేతువు కా దని చెప్పఁబడినది కాదు. అందువలనఁ గ్రతూపకారకత్వమును అనర్థహేతుత్వమును ఒక్కచో సంభవించుటవలనఁ గ్రత్వర్థ మైన హింసయును నిషిద్ధమే కావున హింసాయుక్త మగు దర్శపూర్ణమాసజ్యోతిష్టోమాదికము సర్వంబును దుష్టమే. విహితమునకును నిషిద్ధత్వంబును నిషిద్ధమునకును విహితత్వంబును శ్యేనాదికమునకుం బోలె నుపపన్నమే యగును. ఎట్లు "శ్యేనేనాభిచరన్ యజేత" * ఇత్యాద్యభిచారవిధిచే విహితం బయ్యును శ్యేనాదికము నహింస్యా త్సర్వా భూతాని అను నిషేధమునకు విషయ మగుటవలన ననర్థహేతువే యగునో తద్దోషము. సహించువానికే రాగద్వేషాదివశీకృతునకు దానియం దధికారమో అట్లు జ్యోతిష్టోమాదివిషయమందును. అట్లు చెప్పఁబడినది మహాభారతమునందు "జపస్తు సర్వధర్మేభ్యః పరమో ధర్మ ఉచ్యతే। అహింసయా

* శత్రువును జంపఁ దలఁచువాఁడు శ్యేనయాగముచే యజింపవలయును.

హి భూతానాం జపయజ్ఞః ప్రవర్తతే" * అని. మనువును "జప్యే నైవతు సంసిద్ధ్యే ద్బ్రాహ్మణో నాత్ర సంశయః। కుర్యా దన్య న్నవా కుర్యా న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే" ♦ అని చెప్పుచు మైత్త్రిని—అహింసను బ్రశంసించి హింస దుష్టమే యని ప్రతిపాదించెను. అంతఃకరణశుద్ధియు నిట్టి గాయత్త్రీజపాదులచే మిక్కిలి యుపపన్నము కాఁగలదు. కావున హింసాదిదోషదుష్ట మగు జ్యోతిష్టోమాదినిత్యకర్మమును దోషాసహిష్ణు వగువాఁడు శ్యేనాదికమునుంబోలె నధికారి యైనను విడువవలయును. అని. ఇందులకుఁ జెప్పెదము. క్రత్వర్థ మగు హింస యనర్థహేతువు కాదు, విధిస్పృష్టమునందు నిషేధమున కవకాశము లేమివలన. ఎట్లనఁగా. విధి బలవదిచ్ఛావిషయసాధనతాబోధరూప మయిన ♦ ప్రవర్తనఁ † జేయునది కావున అనర్థసాధనమునం దది యనుపపన్న మగుటవలనఁ బ్రవర్తనాగోచర మగు తనవిషయము * అనర్థసాధనము కా దనుటను దానే యార్థికముగా సిద్ధింపఁజేయుచున్నది. అందుచే విధివిషయ మనర్థహేతు వనుట యుక్తము కాదు. సాక్షాద్విధ్యర్థము క్రత్వర్థత్వము కాదు కదా! అట్లయినఁగదా విరోధము లేకుండును. మ తే మనఁగా ప్రవర్తనయే విధ్యర్థము. ప్రవర్తనకుఁ గర్మభూత మయిన పురుషప్రవృత్తియో పురుషార్థమునే విషయీకరించును. అది యొకానొకప్పుడు పురుషార్థహేతు వగుటచేఁ బురుషార్థభావము నొందిన క్రతువునుగూడ విషయీకరించుచున్న దనుట వేఱువిషయము. పురుషప్రవృత్తియు బలవదిచ్ఛాప్రధానదశయందుఁ బుట్టినది, అది భావ్యమున కర్థహేతుతను సిద్ధింపఁజేయదు, అనర్థహేతుతనుం దొలఁగింపదు. మ తే మనఁగా యథాప్రాప్తమునే యవలంబించును, బలవదిచ్ఛావిషయమునందుఁ దనయంతనే ప్రవృత్తి కలుగుటవలన, స్వర్గాదికమునందు విధ్యపేక్ష లేమివలన. అందువలననే విహితశ్యేనఫలమునకును శత్రువధరూప మగు నభిచారమున కనర్థహేతుత్వ ముపపన్నమే యగుచున్నది, ఫలము విధిజన్యప్రవృత్తివిషయము కామివలన. విధిజన్యప్రవృత్తి విషయ మగు ధాత్వర్థరూప మయినకరణమునే ♦ ప్రవర్తన యవలంబించు

* జపమమాత్రము సర్వధర్మములకన్నను బరమధర్మ మని చెప్పఁబడుచున్నది. ఏల యనఁగా, భూతహింస లేక జపయజ్ఞము ప్రవర్తించుచున్నది.

♦ బ్రాహ్మణుఁడు జపముచేతనే సిద్ధిమంతుఁ డగును. ఇందు సందేహము లేదు. ఇతరమును జేయనీ, విడువనీ. ఆ బ్రాహ్మణుఁడు మైత్త్రుఁడు — మిత్త్రుఁ డని చెప్పఁబడుచున్నాఁడు.

♦ ఇది యిష్టసాధనము అని తెలుపుట యనునట్టి.

† బ్రవర్తింపఁజేయుటను.

* తాను దేనియందుఁ బ్రవర్తింపఁజేయు చున్నదో ఆవిషయము.

♦ చేయుటనే.

చున్నది. ఆ ప్రవర్తన యనర్థహేతువును విషయీకరింపదు. కావున విశేషవిధిచే బాధిత మగు సామాన్యనిషేధశాస్త్రమునకు రాగద్వేషాదిమూలక మగు నక్రత్వర్థమైనలౌకికహింస విషయము మని చెప్పవలయును. అందుచే శ్యేనాగ్నీషోమీయాదులకు వైషమ్యము గలుగుటవలన జ్యోతిష్టోమాదుల కదుష్టత యుపపన్నము. విధిస్పృష్టము నిషేధవిషయం బనునెడ షోడశిగ్రహణంబునకును అనర్థహేతుత యాపాదిల్లును, నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి యని నిషేధమువలన. అందువలన నిది యకించిత్కర * మని భాట్టదర్శనము. ఇఁకఁ బ్రాభాకరదర్శనము. ఫలసాధనమునందు రాగముచే తనే ప్రవృత్తి సిద్ధించుటవలన నందు నియోగము ప్రవర్తకము కాదు. అందుచే శ్యేనము రాగజన్యప్రవృత్తివిషయం బగుటచే విధియం దుదాసీన మగుటవలన దాని యనర్థహేతుత్వమును దొలఁగింపదు. క్రత్వంగభూత మగు నగ్నీషోమీయహింస యందో ఫలసాధనత లేమిచే రాగము సంభవింపమివలన విధియే ప్రవర్తకము అది స్వవిషయమున కనర్థహేతుతను దొలఁగించుచున్నది. కావునఁ బ్రధానభూత మగు హింసయే యనర్థముఁ బుట్టించును, క్రత్వర్థహింస పుట్టింపదు. అందువలన హింసామిశ్ర మగుటచే జ్యోతిష్టోమాదికము దుష్టము కాదు. అని. రెండును సమానము లే. ఇంతమాత్రమే విశేషము. చోదనాలక్షణో ఽర్థో ధర్మః అనుచోట అర్థపదవ్యావర్త్య మగుటచే శ్యేనాదికి మధర్మ మని ప్రాభాకరమతము. భాట్టమతమునందో, శ్యేనఫల మయిన యభిచారమే యనర్థహేతు వగుటవలన నధర్మము, శ్యేనమో విహితమైన సమీహితసాధన మగునది ధర్మమే. అర్థపదవ్యావర్త్యము నిషిద్ధకలంజభక్షణాదికమే యని. ఫలమువలన ననర్థహేతు వగుటచేతనే శిష్టులు శ్యేనాదికము ధర్మ మని వ్యవహరింపరు. అది చెప్పఁబడినది "ఫలతో ఽపి చ యత్కర్మ నా ఽనర్థేనా ఽనుబధ్యతే । కేవలప్రీతిహేతుత్వా త్తద్ధర్మ ఇతి కథ్యతే" ♦ అని. ఇఁకఁ దార్కికుల దర్శనము.—కృతిసాధ్యత్వమును అర్థహేతుత్వమును అనర్థాహేతుత్వము నను నీమూఁడును విధ్యర్థము. అందుఁ గ్రత్వర్థహింసయందు సాక్షాన్నిషేధము లేమివలనను బ్రాయశ్చిత్తముఁ జెప్పమివలనను కృతిసాధ్యత్వార్థహేతుత్వములవలె ననర్థాహేతుత్వముగూడ విధిచే బోధింపఁబడుచున్నది కావున నది యనర్థహేతువు కాదు. శ్యేనాద్యభిచారమునకో సాక్షాత్తుగానే నిషేధము కలిమివలనను బ్రాయశ్చిత్తము

* సాంఖ్యులయాక్షేపము బాధింపదు.

♦ ఏకర్మము ఫలముచేతనుగూడ అనర్థము కలిగింపదో కేవలప్రీతిహేతు వగుటవలన ఆ కర్మము ధర్మ మని చెప్పఁబడుచున్నది.

చెప్పుటవలనను అనర్థహేతుత్వము తెలియుటవలన ననర్థాహేతుత్వముమాత్ర మందు విధిచే బోధింపఁబడదు. కావున నుపపన్నము శ్యేనాగ్నీషోమీయములకు వైలక్షణ్యము. ఔపనిషదులచేతనో భాట్టదర్శనమే వ్యవహారమునందుఁ బ్రాయికముగా నవలంబింపఁబడినది. అట్లు భగవద్బాదరాయణప్రణీత మగు సూత్రము—"అశుద్ధ మితి చే న్న శబ్దాత్" అని. అశుద్ధ మితిచేత్ — జ్యోతిష్టోమాదికర్మము అగ్నీషోమీయహింసామిశ్రిత మగుటచే దుష్టమందువేని, న—కాదు, శబ్దాత్—"అగ్నీషోమీయం పశు మాలభేత" ఇత్యాది విధిశబ్దమువలన నని యక్షరార్థము. జప ప్రశంసాపర మగు వాక్యమో క్రత్వర్థమున కధర్మత్వబోధకము కాదు, దాని కందుఁ దాత్పర్యము లేమివలన. అందువలన సాంఖ్యులకు విహితమునందు నిషిద్ధత్వజ్ఞానమును అనర్థాహేతువునం దనర్థహేతుత్వజ్ఞానమును ధర్మమునం దధర్మత్వజ్ఞానమును అనుష్ఠేయమునం దననుష్ఠేయత్వజ్ఞానంబును ఏది గలదో అది విపర్యాసరూప మగుమోహము, అట్టి మోహమువలన; తస్య = ఆ నిత్యకర్మముయొక్క; పరిత్యాగః = పరిత్యాగ మేది గలదో అది; తామసః పరికీర్తితః. మోహము గదా తమస్సు.

శ్రీ. ప్రతిజ్ఞాత మగు త్యాగత్రైవిధ్యము నిప్పుడు ప్రదర్శించుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—కామ్యకర్మము బంధక మగుటవలనఁ దత్సన్న్యాసము యుక్తము. నియతస్య కర్మణస్తు=నిత్య మయినకర్మమునకు మాత్రము; సన్న్యాసః= త్యాగము; నోపపద్యతే, సత్త్వశుద్ధిద్వారమున మోక్షహేతు వగుటవలన. అందువలన దానిపరిత్యాగము ఉపాదేయమునందును త్యాజ్య మిద యనునట్టి మోహమువలననే యగును. అది మోహము తామస మగుటవలనఁ దామస మని పరికీర్తితము.

ప. *

రా. నియతస్య = నిత్యనైమిత్తిక మగు; కర్మణః=మహాయజ్ఞాదికర్మముయొక్క; సన్న్యాసః=త్యాగము; నోపపద్యతే, "శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః" అనుటచే శరీరయాత్రయే సిద్ధింపమివలన. శరీరయాత్ర యజ్ఞశిష్టాన్నముచే నిర్వర్తింపఁబడుచున్నం గదా సమ్యగ్జ్ఞానమునకు సమర్థ మగును. కాదేని "తే త్వఘం భుఞ్జతే పాపాః" అనుటచే నఘరూప మగు నయజ్ఞశిష్టాన్నాశనముచే మనస్సుయొక్క యాప్యాయనము విపరీతజ్ఞానమునకే యగును. "అన్నమయం

* శ్రీధరీయముతో సమానము.

హి సోమ్యమనః" అని యన్నముచేఁగదా మన స్సాప్యాయిత మగుచున్నది. "ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధి స్సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః। స్మృతిలమ్భే సర్వగ్రన్థీనాం విప్రమోక్షః" అని బ్రహ్మసాక్షాత్కారరూప మగు జ్ఞానము ఆహారశుద్ధి కధీన మని శ్రుతి చెప్పుచున్నది. అందువలన మహాయజ్ఞాదినిత్యనైమిత్తికకర్మము మరణపర్యంతము బ్రహ్మజ్ఞానముకొఱకే యుపాదేయము. కావున దానిత్యాగ ముపపన్నము కాదు. ఇట్లు జ్ఞానజనక మగు కర్మమును బంధకం బను మోహామువలనఁ బరిత్యజించుట, తామసః పరికీర్తితః. తమోమూల మగు త్యాగము తామసము, తమఃకార్యాజ్ఞానమూలం బగుటచే త్యాగమునకుఁ దమోమూలత్వము, తమము గదా యజ్ఞానమూల మని, "ప్రమాదమోహౌ తమసో భవతో ఽజ్ఞాన మేవచ" అనుచోటఁ జెప్పఁబడినది. అజ్ఞానమో జ్ఞానవిరోధి యగు విపరీతజ్ఞానము. అట్లు చెప్పఁబోవుచున్నాఁడు "అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసా వృతా। సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ తామసీ" అని. అందువలన నిత్యనైమిత్తికాదికర్మత్యాగము విపరీతజ్ఞానమూలమే యని యర్థము.

దుఃఖ మి త్యేవ య త్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. ౮

భా. మఱియును.— దుఃఖమిత్యేవ = దుఃఖాత్మకమే యని; కర్మ = కర్మమును; కాయక్లేశభయాత్ = దేహకష్టము కలుగు నను భయమువలన; త్యజేత్ ఇతియత్ = విడుచు ననుట యేది గలదో; అట్టి, రాజసమ్ = రజోనిర్వృత్త మగు; త్యాగమ్ = త్యాగమును; కృత్వా = చేసి; సః = ఆ పురుషుఁడు; త్యాగఫలమ్ = జ్ఞానపూర్వక మగు సర్వకర్మత్యాగము యొక్కఫలమును; నైవ లభేత్ = పొందనే పొందఁడు.

కర్మము దుఃఖాత్మక మని దేహకష్టమున కోడక దాని విడుచుట యేది కలదో అది రాజసత్యాగము, అట్టి త్యాగముఁ జేసినపురుషునకు జ్ఞానపూర్వకసన్న్యాసఫలము కలుగనే కలుగ దని తాత్పర్యము.

ఆ. ఇందువలనఁగూడ నిత్యకర్మత్యాగ మజ్ఞునకు సంభవింప దని చెప్పుచున్నాడు మఱియును అని. ఓయీ! మోహము లేకయె దుఃఖాత్మక మగు కర్మమును గాయక్లేశభయమువలన విడుచుచున్నాఁడు, కరణములు గదా కర్మముఁ జేయుచున్నవి శ్రమపడుచున్నవియు, కావున నాత్యాగము తామస మనుట

యుక్తము కా దనఁగాఁ జెప్పుచున్నాఁడు దుఃఖ మి త్యే వేత్యాదిగా. కర్మము దుఃఖాత్మకము—అశక్యసాధ్యమే యని యాలోచించి దానినుండి నివర్తిల్లుచున్నాఁడు దేహేంద్రియములకుఁ గ్లేశము గలుగు నను భయమువలన దాని విడుచుచున్నాఁడు, వాఁ డట్లు విడిచి రజోనిమిత్త మగు త్యాగమును జేసియును దత్ఫలమును మోక్షమును బొందఁడు, మ ఱే మనఁగాఁ దాను జేసిన రాజసత్యాగముచేఁ దదనురూప మగు నరకముఁ బొందుచున్నాఁ డని భావము.

హ॰ య త్కర్మ; కాయక్లేశభయాత్; దుఃఖమ్=దుఃఖకర మని; త్యజేత్; సః; రాజసమ్ = రజోభవ మగు; త్యాగమ్; కృత్వా, జ్ఞానపూర్వకత్యాగఫలమును మోక్షమును, నైవ లభేత్.

శ౦ రాజసత్యాగలక్షణమును ఫలమును జెప్పుచున్నాఁడు.—యథోక్తి నియమంబున, యత్ — ఏది నిత్యమును జేయవలయునో అట్టి; కర్మ = కర్మమును; శ్రమసాధ్య మగుటవలన, దుఃఖమ్ = దుఃఖాత్మకము ఆయాససాధ్యము; ఇత్యేవ = అనియే నిశ్చయించి; ఆలస్యదోషముచేఁ గర్మము కర్తవ్యం బని యెఱింగినవాఁ డయ్యును ఎవఁడు, కాయక్లేశభయాత్ =దీని ననుష్ఠించుటచే దేహేంద్రియాదిక్లేశము గలుగుచున్న దను భయమువలన; త్యజేత్ = విడుచునో; సః = ఆ పురుషుఁడు, దేహానుగతరాగవిశిష్టుఁ డగుటవలన, రాజసమ్ = రజోదోషదూషిత మగు బుద్ధి యొక్క దోషమువలనఁ గలిగిన, రాజస మగు; త్యాగమ్ = కర్మసన్న్యాసమును; కృత్వా=చేసియును; త్యాగఫలమ్ = త్యాగముయొక్క ఫలమును, చిత్తశుద్ధిని తజ్జన్య జ్ఞానమును తత్ఫల మగు మోక్షమును; న లభేత్ = పొందఁడు, మ ఱే మనఁగా స్వవంచనాత్మక మగు రాజసత్యాగమున కనురూపమును విహితాకరణప్రత్యవాయమువలనఁ బ్రాప్త మగు ఫలమును నరకమునే పొందుచున్నాఁ డని యర్థము. ఇందుచే "న సుఖా ల్లభతే సుఖమ్" * అను న్యాయముచే స్వధర్మానుష్ఠానక్లేశము సహించువానికే పురుషార్థము సిద్ధించు నని సూచితము.

మ॰ అట్టి మోహము లే కున్నను.—అంతఃకరణశుద్ధి నొందనివాఁ డగుటచేఁ గర్మాధికృతుఁ డైనను, దుఃఖమే యిది యని తలఁచి కాయక్లేశభయమువలన నిత్య మగు కర్మమును, త్యజేత్ యత్ = విడుచు ననుట యేది గలదో; ఆ త్యాగము రాజసము, దుఃఖము రజస్సు గదా! అందువలన, సః = మోహరహితుఁ డైనను

---

* సుఖమువలన సుఖమును బొందఁడు.

రాజసుఁ డగు నాపురుషుఁడు; అట్టి, రాజసం త్యాగం కృత్వా; త్యాగఫలమ్ = సాత్త్వికత్యాగముయొక్క-ఫలమును జ్ఞాననిష్ఠారూపమును; నైవ లభేత్ = పొందనే పొందఁడు.

**శ్రీ.** రాజసత్యాగముఁ జెప్పుచున్నాఁడు.—అకర్త్రాత్మజ్ఞానము లేకయే దుఃఖ మనియే తలంచి శరీరాయాసభయమువలన నిత్య మగు కర్మమును విడుచుట యేది గలదో అట్టి త్యాగము రాజసము, దుఃఖము రాజస మగుటవలన. అందువలన నారాజసత్యాగముఁ గావించి రాజసుఁ డగు పురుషుఁడు త్యాగముయొక్క-ఫలమును జ్ఞాననిష్ఠాలక్షణమును బొందనే పొందఁ డని యర్థము.

**ప.** *

**రా.** కర్మము పరంపరచే మోక్షసాధనభూతమే యైనను దుఃఖాత్మకద్రవ్యార్జనసాధ్య మగుటవలనను అధికాయాసరూప మగుటచేఁ గాయక్లేశకరం బగుటవలనను మనస్సున కప్రసాదము కలిగించునది యని తద్భయముచే యోగసిద్ధికొఱకు జ్ఞానాభ్యాసమే చేయవలయు నని యెవఁడు మహాయజ్ఞాద్యాశ్రమకర్మముఁ బరిత్యజించునో, అతఁడు, రాజసమ్—రజోమూల మగు త్యాగము చేసి, అది అయథావస్థిత • శాస్త్రార్థరూపము కావున, జ్ఞానోత్పత్తిరూప మగు త్యాగఫలమును బొందఁడు. "అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ" అని గదా చెప్పఁ బోవుచున్నాఁడు. కర్మము దృష్టద్వారంబునఁ గాదు గదా మనఃప్రసాదహేతువు, మఱి యే మనఁగా భగవత్ప్రసాదద్వారమున.

కార్య మి త్యేవ య త్కర్మ నియతం క్రియ తే ఽర్జున
సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః.

**భా.** ఏది మఱి సాత్త్వికం బగు త్యాగము? .—కార్యమిత్యేవ = కర్తవ్య మనియే; నియతమ్ = నిత్య మగు; కర్మ = కర్మము; సఙ్గమ్ = ఆసక్తిని; ఫలంచైవ = ఫలమును గూడ; త్యక్త్వా = విడిచి; క్రియతే యత్ = చేయఁబడుచున్న దనుట యేది గలదో. అర్జున = అర్జునా! నిత్యము లగు కర్మములు ఫలవంతము లనుటకు భగవద్వచనము ప్రమాణముఁ జెప్పినారము. అటు గాదేనియు, నిత్యకర్మమునకు ఫలమః

* శ్రీధరీయముతో సమానము.
• సిద్ధాంతము కానట్టి.

శ్రుతము కాకున్నను నిత్యకర్మము చేయఁబడినదై యాత్మసంస్కారమును గాని ప్రత్యవాయపరిహారమును గాని ఫలముఁ దనకుఁ గలిగించు నని కల్పింపనే కల్పించుచున్నాఁ డజ్ఞుఁడు. అందు ఆకల్పననుగూడ నివారించుచున్నాఁడు ఫలం త్యక్త్వా యనుటచేత. అందువలన యుక్తము చెప్పఁబడినది సఙ్గం త్యక్త్వా ఫలంచ అని. సః = అట్టి; త్యాగః=నిత్యకర్మములందు సంగఫలపరిత్యాగము; సాత్త్వికః = సత్త్వనిర్వృత్త మని; మతః = అభిమతము. ఓయీ ! కర్మపరిత్యాగము సన్న్యాసము త్రివిధ మనియో ప్రకృతము, అందుఁ దామసమును రాజసము నగు త్యాగము చెప్పఁబడినది, ఎట్లిక్కడ సంగఫలత్యాగము మూఁడవదిగాఁ జెప్పవచ్చును ? ముగ్వురు బ్రాహ్మణులు వచ్చిరి, అందు షడంగవిదు లిర్వురు క్షత్త్రియుఁడు మూఁడవవాఁ డన్నట్లు. కాదిది దోషము, త్యాగసామాన్యముచే స్తుత్యర్థ మగుటవలన. కలదు కదా కర్మసన్న్యాసమునకును ఫలాభిసంధిత్యాగమునకును త్యాగత్వసామాన్యము. అందు రాజసతామసం బని కర్మత్యాగమును నిందించుటచేఁ గర్మఫలాభిసంధిత్యాగము సాత్త్వికం బని స్తుతింపఁబడుచున్నది స త్యాగ స్సాత్త్వికో మతః అని.

నిత్యకర్మము కర్తవ్య మనియే యను నిశ్చయమున దానిఁ జేయుచునందలి ఆసక్తిని ఫలమును విడుచుట యేది కలదో, ఆ సంగఫలత్యాగము సాత్త్వికత్యాగం బని చెప్పఁబడిన దని తాత్పర్యము.

ఆ. కర్మత్యాగము తామసమును రాజసమును ద్వివిధము చెప్పఁబడినది. ఇప్పుడు సాత్త్విక మగు త్యాగమును ప్రశ్నపూర్వకముగా వర్ణించుచున్నారు ఏది మఱి ఇత్యాదిగా. కర్తవ్య మనియే అను నేవకారముచే నిత్యములను భావ్యాంతరము నిషేధింపఁబడుచున్నది. నిత్యములకు విధ్యుద్దేశమున ఫలము శ్రుతము కామి వలన వానిఫలమును విడిచి యనుట యనుచిత మని యాశంకించి చెప్పుచున్నారు నిత్యములు ఇత్యాదిగా. ఫలం త్యక్త్వా యనుటకు మఱియొకవిధమునఁ దాత్పర్యము చెప్పుచున్నారు అటు గాదేనియు నిత్యాదిగా. విధినిబట్టి చేయఁబడినకర్మ మనర్థకము కాదు గదా ! విధి యనర్థకం బగుటవలన. అందుచే శ్రుత్యుక్తఫలము లేకున్నను నిత్యకర్మము యథావిధి ననుష్ఠించువాఁ డనాత్మజ్ఞుఁడు అనుపహతమనస్త్వము చెప్పుటచే ఆకర్మమునం దాత్మసంస్కారమును ఫలమునుగాఁ గల్పించుచున్నాఁడు; నిత్యాకరణంబునఁ బ్రత్యవాయము కలుగు నని చెప్పఁబడుటచే తత్కారణము తనకుఁ

ప్రత్యవాయనివృత్తిని జేయు నని కాని కల్పించుచున్నాఁడు; నిత్యకర్మమునం దీకల్ప నను దానివెంబడిఁ జేయుఫలకల్పనను ఫలం త్యక్త్వా యనుటచే భగవంతుఁడు నివారించుచున్నాఁ డని యర్థము. నిత్యకర్మములందు ఫలత్యాగవచనము సంభవించుటచే ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. కర్మతత్ఫలత్యాగమునకు త్యాగ సన్న్యాసశబ్దములచేఁ బ్రకృత మయినదానికి త్యాగోహి యని త్రైవిధ్యము ప్రతిజ్ఞ చేసి ప్రతిజ్ఞానురోధంబున రెండువిధంబులను వ్యుత్పాదించి తృతీయవిధమును దద్విరోధమున వ్యుత్పాదించుటచే భగవంతున కకౌశలము సంభవించిన దని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. ప్రక్రమమునకుఁ బ్రతికూల మగు నుపసంహార వచన మనుచిత మనుటకు దృష్టాంతము చెప్పుచున్నాఁడు ముప్పురు ఇత్యాదిగా. పూర్వోత్తరవిరోధముచేఁ బ్రాప్త మగు నకౌశలమును నిరాకరించుచున్నారు కా దిది దోషము ఇత్యాదిగా. కర్మత్యాగఫలత్యాగములకుఁ ద్యాగత్వముచే సాదృశ్యమువలనఁ గర్మత్యాగనిందచేఁ దత్ఫలత్యాగస్తుత్యర్థం బీవచన మని యంగీకరించుట వలన విరోధము లే దని చెప్పినదానినే స్పష్టీకరించుటకై మొదట త్యాగసామాన్యమును విశదీకరించుచున్నారు కలదు కదా ఇత్యాదిగా. సామాన్య ముండునపుడు నిర్దేశము స్తుత్యర్థ మని సమర్థించుచున్నారు అందు ఇత్యాదిగా.

**హా.** కార్యమిత్యేవ = కర్మము కర్తవ్య మనియే; నియతం కర్మ=యజ్ఞాది నిత్యకర్మము; క్రియతే=ఎప్పుడు చేయఁబడుచున్నదో. సఙ్గమ్ = ఫలేచ్ఛను. అప్పుడు విద్యమానము లగు సంగఫలములత్యాగము; సాత్త్వికః = సత్త్వనిర్వృత్తము. నిత్యకర్మము సంగమును ఫలమును విడిచి యెప్పుడు చేయఁబడుచున్నదో అని యీశ్వరుఁడు చెప్పుటవలన నిత్యకర్మములకు సఫలత్వము సిద్ధము.

**శం.** ఫలమును ముందు చెప్పఁదలఁచినవాఁడై సాత్త్వికత్యాగమును జెప్పుచున్నాఁడు.—విధి నుల్లంఘించుటవలని భయముచేతను ముముక్షుచేతను, కార్యమ్= నా కిది యవశ్యము కర్తవ్యము; ఇత్యేవ = అనియే, కర్తవ్యతాబుద్ధియందు వికల్పాంతరనిషేధార్థం బేవకారము; నాచేత నీకర్మము పరమేశ్వరప్రీతికొఱకుఁ గర్తవ్యమే యని దృఢనిశ్చయము గల ముముక్షువుచేత, నియతమ్=విధ్యుక్త మగు; యత్కర్మ= ఏ నిత్యకర్మము కలదో అది; సఙ్గమ్ = కర్తృత్వాభినివేశమును కామమును గాని; ఫలంచ = ఫలమును గూడ, చకారము సముచ్చయార్థము. స్వర్గకామః పశుకామ ఇత్యాదికమునకుం బోలె నిత్యకర్మమునకు ఫలము శ్రుతము కాదు వాస్తవమే, అయినను ఫలము లేకున్నయెడ "అహ రహ స్సంధ్యా ముపాసీత" ఇత్యాది కర్మ

విధి కున్నత్తవాక్యమునకుంబోలె నానర్థక్యము సంభవించును, కావున యత్నించి త్ఫలము ఉపాత్తదురితక్షయరూపము కల్పనీయము; అట్టి ఫలమును ఫలకామనను, త్యక్త్వా—విడువవలయు నని యర్థము. ఓయీ! ఫలాపేక్ష లేనియెడఁ బురుషునకుఁ బ్రవృత్తియే కలుగ దందువేని, అట్లనఁ దగదు, సత్పురుషునకు విధ్యుల్లంఘన భయముచేతనే ప్రవృత్తి సంభవించుటవలన. "శ్రుతిస్మృతిభ్యాం సుజనో నియమ్యతే" * అను స్మృతివలన. విధ్యుక్త మగు దంతధావనము చేసినయెడ ముఖ శుద్ధి యెట్లు కలుగునో అట్లు ఫలకామన విడిచి కర్మములఁ జేసినయెడఁ జేయువానికి "ఆపన్నుద్ధస్తు మైనసః, పాపేభ్యో రక్షన్తామ్" ఇత్యాది మంత్రక్రియాశక్తిబలముచేత సత్త్వశుద్ధిలక్షణ మగు ఫలము తనకుఁ దాన సిద్ధించుచున్నది, తత్ఫలము మోక్షము గూడ సిద్ధించుచున్నది. అందువలన నందుఁ గామసంకల్పాదికముఁ జేయఁగూడదు, మ జ్ఞే మనఁగా సంగమును ఫలమును విడిచి, ఇట్లు నిత్య మగు నేకర్మముఁ జేయు చున్నాఁడో, స త్యాగః = ఆ త్యాగము; సాత్త్వికః = సత్త్వగుణనిష్పన్న మగుట వలన సాత్త్విక మని; మతః=సత్పురుషుల కిష్టముగా నభిమతము. కర్మఫలభ్రంశము లేమివలనను బ్రత్యవాయకృత మగు నసర్థము లేమివలనను బూర్వోక్తము లగు రెండుత్యాగములకంటె సాత్త్వికకర్మఫలత్యాగము శ్రేష్ఠ మని యర్థము.

మ. కర్మత్యాగము తామసంబును రాజసంబును హేయము నిరూపింపఁబడి నది. ఎట్టిది మఱి యుపాదేయ మగు సాత్త్వికత్యాగ మనఁగాఁ జెప్పుచున్నాఁడు.—విధ్యుద్దేశమునందు ఫలము శ్రుతము గాక యున్నను, కార్య మేవేతి = కర్తవ్యమే యని యెఱింగి; నియతం కర్మ = నిత్య మగు కర్మమును; సఙ్గమ్ = కర్తృత్వాభి నివేశమును; ఫలంచ; త్యక్త్వా = విడిచియే; యత్ క్రియతే = చేయఁబడుచున్న దనుట యేది గలదో, అంతఃకరణశుద్ధిపర్యంతము; స త్యాగః = ఆ త్యాగము; సాత్త్వికః = సత్త్వనిర్వృత్తము; మతః = ఉపాదేయ మని సమ్మతము, శిష్టులకు. ఓయీ! నిత్యకర్మములకు ఫలమే లేదు, ఎట్లు ఫలము విడిచి యని చెప్పవచ్చును? చెప్పెదము. ఈ భగవద్వచనమువలననే నిత్యములకు ఫలము కల దని యేర్పడు చున్నది, నిష్ఫలమున కనుష్ఠానము సంభవింపమివలన. అట్లు ఆపస్తంబుఁడు "తద్యథా ఽఽమ్రే ఫలార్థే నిమితే ఛాయాగన్ధా వనూత్పద్యేతే ఏవం ధర్మం చర్యమాణ మర్థా అనూత్పద్యన్తే" • అని యానుషంగికఫలమును నిత్యములకుఁ బ్రదర్శించు

* సుజనుఁడు శ్రుతిస్మృతులచే నియమింపఁబడుచున్నాఁడు.

• అందువలన నెట్లు మామిడిచెట్టును ఫలార్థము నాటఁగా వెంబడి ఛాయాగంధములు పుట్టు చున్నవో అట్లు ధర్మము నాచరింపఁగా దాని వెంబడి నర్థములు పుట్టుచున్నవి.

చున్నాఁడు. చేయనియెడఁ బ్రత్యవాయము కలుగు నను స్మృతియు నిత్యములకుఁ బ్రత్యవాయ పరిహారరూపమును ఫలమును దెలుపుచున్నది. "ధర్మేణ పాప మపను దతి, తస్మా ద్ధర్మం పరమం వదన్తి, యేన కేన చ యజేతాపి వా దర్వీహోమే నానుపహతమనా ఏవ భవతి *, తదాహు ర్దేవయాజీ శ్రేయా నాత్మయాజీ త్యాత్మ యాజీ తిహ బ్రూ త్సహ వా ఆత్మయాజీ యో వే దేదం మే ఒనే నాఙ్గం సంస్క్రి యత ఇదం మే ఒనేనాఙ్గ ముపధీయతే •" ఇత్యాదిశ్రుతులును జ్ఞానప్రతిబంధక పాపక్షయలక్షణంబును జ్ఞానయోగ్యతారూపపుణ్యోత్పత్తిలక్షణంబు నగు నాత్మ సంస్కారమును నిత్యకర్మములకు ఫలముగాఁ బ్రదర్శించుచున్నవి. తదభిసంధిని విడిచి వాని ననుష్ఠింపవలయు నని యర్థము. త్యాగసన్న్యాసశబ్దములు ఘట పటశబ్దములవలె భిన్నజాతీయార్థములు కావు, మఱి మనఁగా ఫలాభిసంధిపూర్వక కర్మత్యాగమే వాని కర్థము — అని యేది చెప్పఁబడినదో దాని మఱవవలదు. అందు ఫలాభిసంధియున్నను మోహమువలనఁ గాని కాయక్లేశభయమువలనఁ గాని కర్మత్యాగ మేది గలదో, అది విశేష్యాభావకృతం బగు విశిష్టాభావము తామసం బనియు రాజసం బనియు నిందింపఁబడినది. ఏది మఱి కర్మమున్నను ఫలా భిసంధిత్యాగము గలదో అది విశేషణాభావకృత మగు విశిష్టాభావము సాత్త్వికం బని స్తుతింపఁబడుచున్నది. కావున విశేష్యాభావకృతమునందును విశేషణాభావకృ తమునందును విశిష్టాభావత్వము సమాన మగుటవలనఁ బూర్వాపరవిరోధము లేదు. ఉభయాభావకృతమో నిర్గుణ మగుటవలనఁ ద్రివిధత్యాగమధ్యమున గణనీయము కా దని చెప్పి యున్నారము. ఇందుచే "త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్ర కీర్తితః అని ప్రతిజ్ఞచేసి కర్మత్యాగరూపము లయిన రెండువిధములఁ బ్రదర్శించి ప్రతిజ్ఞ కననురూప మయిన కర్మానుష్ఠానలక్షణ మగు మూఁడవవిధమును బ్రదర్శిం చుటచే భగవంతుని యకౌశలము ప్రకటము. ముువ్వురు బ్రాహ్మణులను భోజనము చేయింపవలయు నం దిద్దఱు కఠకౌండిన్యులు మూఁడవవాఁడు క్షత్త్రియుఁ డనుట యెప్పుడు గదా! అట్లు." అను దురాక్షేపము నిరాకరింపఁబడినది, మూఁడువిధ ములు విశిష్టాభావరూప మగు త్యాగసామాన్యముచే నేకజాతీయము లసి మున్ను

---

* దేనిచేతనైనను యజించుఁగాక, దర్వీహోమముచే అనుపహతమనుఁడే — నిర్దోష మయిన మనస్సు గలవాఁడే యగుచున్నాఁడు.

• అందువలనఁ జెప్పుచున్నారు—దేవయాజి శ్రేష్ఠుఁ డాత్మయాజి యని, ఆత్మయాజి యని గదా చెప్పవలయును, అతఁడుగదా యాత్మయాజి, ఎవఁడు దీనిచే నాయీయంగము సంస్కరింపఁబడుచున్నది దీనిచే నాయీయంగ ముపహిత మగుచున్నది యని యెఱుఁగుచున్నాఁడో వాఁడు.

వ్యాఖ్యాత మగుటవలన. అందువలన భగవంతున కకౌశలము నుద్భావించుటయె గొప్పయకౌశల మని యెఱుంగునది.

శ్రీ. సాత్త్వికత్యాగముఁ జెప్పుచున్నాఁడు.—కార్యమిత్యేవ—కర్తవ్యమే యని యెఱింగి; నియతమ్ = అవశ్యకర్తవ్య మని విహిత మగు; కర్మ; సఙ్గం ఫలంచ త్యక్త్వా; క్రియతే యత్ = చేయఁబడుట యేది గలదో; అట్టి త్యాగము, సాత్త్వికో మతః.

ప. * ఇట నిది ప్రతిపాదిత మగుచున్నది. వేదబోధిత మగు కర్మమునకు రెండుప్రయోజనములు స్వర్గాదీష్టప్రాప్తియు సంసారాద్యనర్థపరిహారమును. అం దిష్టప్రాప్తి మత్స్యమునకు బడిశామిషమువలె దుఃఖగర్భము, సుఖంబున నవస్థా పమే యనర్థపరిహారము. ఆరెంటిలో నవశ్యము దేని ననుష్ఠింపవలయు నని విచారిం పఁగా ననర్థపరిహారమునే యనుష్ఠించుట శ్రేయం బని భగవంతుని యాశయము.

రా. నిత్యనైమిత్తికమహాయజ్ఞాదిక మగు వర్ణాశ్రమవిహిత మైన కర్మము మదారాధనరూప మగుటచే, కార్యమ్ — తానే ప్రయోజనముగాఁ గలది, అని తలంచి, సఙ్గమ్ = కర్మమునందు మమతను; ఫలంచ; త్యక్త్వా; య త్క్రియతే; స త్యాగ స్సాత్త్వికో మతః. అది సత్త్వమూలము, యథావస్థితశాస్త్రార్థజ్ఞాన మూలము. సత్త్వము గదా యథావస్థితవస్తుజ్ఞానముఁ బుట్టించు నని చెప్పఁబడినది, సత్త్వా త్సంజాయతే జ్ఞానమ్ అని. చెప్పఁగలఁడు గూడ "ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే । బన్ధం మోక్షంచ యా వేత్తి బుద్ధి స్సా పార్థ సాత్త్వికీ" అని.

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నా ఽనుషజ్జతే
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. ౧౦

భా. ఎవఁడు మఱి సంగమును ఫలాభిసంధిని త్యజించి నిత్య మగు కర్మము ననుష్ఠించుచున్నాఁడో వానియంతఃకరణము ఫలరాగాదిక ముచే నకలుషీక్రియమాణం బై నిత్యము లగు కర్మములచే సంస్క్రియ మాణంబునై విశుద్ధ మగుచున్నది. విశుద్ధము ప్రసన్నమై యాత్మాలోక క్షమం బగుచున్నది. వానికే నిత్యకర్మానుష్ఠానముచే విశుద్ధాంతఃకర

* పదయోజన శ్రీధరీయముతో సమానము.

ణుఁడై యాత్మజ్ఞానాభిముఖుఁ డైనవానికిఁ గ్రమంబున నెట్లు తన్నిష్ఠ కలుగునో అది వక్తవ్య మని చెప్పుచున్నాఁడు.—నద్వేష్టి = ద్వేషింపఁడు; అకుశలమ్=అశుభ మైన, కామ్యమైన; కర్మ=కర్మమును, శరీరారంభద్వారమున సంసారకారణమును; ఇది యేల? అని. కుశలే = శుభ మైన నిత్యకర్మమునందు; సత్త్వశుద్ధికిని జ్ఞానోత్పత్తికిని తన్నిష్ఠకును హేతు వగుటచే మోక్షకారణం బిది యని, నానుషజ్జతే = దానియందును బ్రయోజనము కానివాఁడై యనుషంగమును—ప్రీతిని చేయఁడు. ఎవ్వఁడు మఱి యీతఁడు? త్యాగీ = పూర్వోక్త మగు సంగఫలపరిత్యాగముచే త్యాగము గలవాఁడు, ఎవ్వఁడు కర్మమునందు సంగమును దత్ఫలమును ద్యజించి నిత్యకర్మానుష్ఠాతి యగుచున్నాఁడో అట్టి త్యాగి. ఎప్పుడు మఱి యితఁడు అకుశల మగు కర్మమును ద్వేషింపఁడు? కుశలమునందును అనుషక్తుఁడు కాఁడు? అనఁగాఁ జెప్పెదము. ఎప్పుడు, సత్త్వసమావిష్టః=సత్త్వముచే ఆత్మానాత్మవివేకవిజ్ఞానహేతువుచే సమావిష్టుఁడు—సంవ్యాప్తుఁడు దానితో సంయుక్తు డగునో; అందువలననే, మేధావీ = ఆత్మజ్ఞానలక్షణ మగు మేధ—ప్రజ్ఞ గలవాఁడును; మేధావి యగుటవలననే, ఛిన్నసంశయః=ఛిన్న మగు అవిద్యాకృత మయిన సంశయము గలవాఁడును, ఆత్మస్వరూపావస్థానమే పరం బగు నిశ్శ్రేయససాధనము ఇతర మేదియు లే దను సునిశ్చయముచే ఛిన్నసంశయుఁడు నగునో, అప్పుడు. ఎవఁ డధకృతుఁ డగు పురుషుఁడు పూర్వోక్తప్రకారమునఁ గర్మయోగానుష్ఠానముచే సంస్కృతాత్ముఁడై క్రమంబున జన్మాదివిక్రియారహితుఁ డగుటచే నవిక్రియుఁ డగు నాత్మను దా నని యెఱుంగుచున్నాఁడో అతఁడు సర్వకర్మములను మనస్సుచే సన్న్యసించి చేయకయే చేయింపకయే యాసీనుఁడై నైష్కర్మ్యలక్షణ మగు జ్ఞాననిష్ఠను బొందుచున్నాఁ డనునిది పూర్వోక్త మగు కర్మయోగమునకుఁ బ్రయోజన మీశ్లోకముచేఁ బ్రతిపాదింపఁబడినది.

ఇట్లు సంగఫలముల వదలి నిత్యకర్మముల ననుష్ఠించుట యను సాత్త్వికత్యాగము — కర్మయోగము ననుష్ఠించి చిత్తశుద్ధి నొందినవాఁడై క్రమంబున ఆత్మజ్ఞానలక్షణ మగు ప్రజ్ఞను బ్రాపించి యందుచే నవిద్యాకృతము లగు సర్వసంశయముల వీడినవాఁ డెవ్వఁ డగునో ఆతఁడు అశుభ మగు కామ్యకర్మమునందు ద్వేషమును

వహింపఁడు, కుశల మగు నిత్యకర్మమునందును బూర్ణకాముఁ డగుటచేఁ బ్రీతి వహింపఁ డని తాత్పర్యము.

**ఆ.** ఇట్లుపూర్వాపరవిరోధమును నిరాకరించి యనంతరశ్లోకతాత్పర్యముఁ జెప్పుచున్నారు ఎవఁడు మఱి ఇత్యాదిగా. ఫలరాగాదికముచే నను నాది శబ్దముచే కర్తృత్వరూపసంగము గ్రహింపఁబడుచున్నది. అంతఃకరణము విశుద్ధమైనయెడ నేమి యగు ననఁగాఁ జెప్పుచున్నారు విశుద్ధము ఇత్యాదిగా. విశుద్ధము — మలహీనము, ప్రసన్నము — సంస్కారవంతము అని భేదము. క్రమంబున — శ్రవణాద్యావృత్తి ద్వారంబున నని యర్థము. తన్నిష్ఠ — ఆత్మజ్ఞాననిష్ఠ. కామ్యకర్మమునం దది త్యాజ్య మగుటచేఁ గలుగు ద్వేషమును జూపుచున్నారు ఇది యేల యని. రెంటి యందును ద్వేషమును బ్రీతిని వహింపఁ డని సామాన్యమునఁ జెప్పినకర్తను బ్రశ్న పూర్వకముగా విశేషించి నిర్దేశించుచున్నారు ఎవ్వఁడు ఇత్యాదిగా, త్యాగిని వివరించుచున్నారు పూర్వోక్తము ఇత్యాదిగా. త్యాగశబ్దార్థమునే స్పష్టీకరించుచున్నారు ఎవ్వఁడు కర్మమునందు ఇత్యాదిగా. అతఁడు కామ్యనిషిద్ధకర్మములందు బంధహేతువు లని ద్వేషింపఁడు నిత్యనైమిత్తికములందు మోక్షహేతువు లని ప్రీతుఁడును గాఁడు అనఁగా నందులకుఁ గాలవిశేషము నడుగుచున్నాఁడు ఎప్పుడు ఇత్యాదిగా. ఫలాభిసంధివర్జిత మగు నిత్యాదికర్మముచే క్షపితకల్మషునకు సత్త్వము యథార్థగ్రహణసమర్థమై యుద్బుద్ధ మగుచున్నది, దానితో సమావేశము నొందినపుడు ఈప్రీతిద్వేషములయభావము కలుగుచున్న దని చెప్పుచున్నారు చెప్పెదము ఇత్యాదిగా. అందువలననే — సముద్బుద్ధ మగు యథార్థగ్రహణసమర్థసత్త్వముచే సమావిష్టుఁ డగుటవలననే యని యర్థము. ఛిన్నసంశయత్వమునే విశదీకరించుచున్నారు ఆత్మేత్యాదిగా. పరం బగు నిశ్శ్రేయసము, దానికి సాధనము సమ్యగ్జ్ఞానమే యని యర్థము. శ్లోకార్థమును సంక్షేపించి యనువదించుచున్నారు ఎవఁ డధికృతుఁడు ఇత్యాదిగా. పూర్వోక్తప్రకారంబున — కర్మమునందును దత్ఫలమునందును సంగత్యాగముచేత నని యర్థము. కర్మాత్మక మగు యోగము ననుష్ఠించుటచే సంస్కృతాత్ముఁడై క్రమంబున — శ్రవణాద్యనుష్ఠానద్వారంబునఁ గూటస్థం బగు బ్రహ్మమును బ్రత్యగాత్మనుగా నెఱుంగుచున్నాఁడో అని సంబంధము. పరుఁడు నిష్క్రియుఁ డనుటకు హేతువుఁ జెప్పుచున్నారు జన్మాదీత్యాదిగా ఇట్టి జ్ఞానము గలవాఁడు సర్వకర్మత్యాగద్వారమున ముక్తుఁ డగు నని తెలుపుచున్నారు అతఁడు ఇత్యాదిగా.

హ. నద్వేష్టి = కోపింపఁడు; అకుశలమ్ = దుఃఖసాధన మగు; కర్మ — హేమంతమునఁ బ్రాతస్స్నానాదికమును గూర్చి. కుశలే = సుఖసాధన మగు కర్మమునందు, ఆ కాలమునందే యగ్నిసేవాదికమునందు; నానుషజ్జతే. త్యాగీ=కర్మఫలత్యాగి; సత్త్వసమావిష్టః = సాత్త్వికుఁడు; మేధావీ = వివేకి; అందువలననే, ఛిన్నసంశయః, సత్త్వశుద్ధ్యర్థము నిత్యములు కర్తవ్యము లను నిశ్చయమువలన.

శం. ఇట్లు తామసాదిత్యాగత్రయస్వరూపముఁ బ్రతిపాదించి బహుజన్మముల నీశ్వరార్పణబుద్ధిచే ఫలాభిసంధిరహితుఁడై సాత్త్వికత్యాగనిష్ఠుఁడై సమగ్రముగా ననుష్ఠించిన యజ్ఞదానాదికర్మములచే సమ్యక్సంస్కృతుఁడై విశుద్ధాంతఃకరణుఁడై శమదమాదిసత్త్వగుణసంపన్నుఁడైనవానికి సాత్త్వికత్యాగముచేఁ గలుగు నంతఃకరణపరిపాకసిద్ధికి ఫలముఁ జెప్పుచున్నాఁడు.——సాత్త్వికత్యాగనిష్ఠచే భక్తితో ననేకజన్మములు పరమేశ్వరు నారాధించి తత్ప్రసాదసంపన్నుఁ డగు, త్యాగీ = సాత్త్వికత్యాగనిష్ఠుఁ డగు పురుషుఁడు; సత్త్వసమావిష్టః = సత్త్వము — రజస్తమస్తత్కార్యనిర్ముక్త మగుటచే ఆత్మానాత్మస్వరూపనిర్ధారణసమర్థ మగు నంతఃకరణపరిపాకవిశేషము, దానితో సమావిష్టుఁడై — చక్కఁగాఁ గూడినవాఁడై; అందువలననే, మేధావీ=బ్రహ్మవిద్గురువు ఒక్కమా ఉపదేశించినమాత్రముననే బ్రహ్మమే నేనని యాత్మతత్త్వవిజ్ఞానము నొందినవాఁడై; అందువలననే, ఛిన్నసంశయః = ఛిన్నములు—తాను కూటస్థాసంగచిదాత్ముఁ డను జ్ఞానముచే విచ్ఛిన్నములు, సంచితాగామివర్తమానకర్మములచే నాకు లేపము కలదా లేదా? కర్తృత్వభోక్తృత్వాదిలక్షణం బగు సంసార మాత్మకా అనాత్మకా? మోక్షకారణము యోగమా? ఉపాసనమా? కర్మమా? జ్ఞానమా? తన్నిష్ఠయా? మోక్షము సాలోక్యాదికమా నిర్విశేషాత్మత నవస్థానమా ఇతరమా? ఇత్యాది సంశయము లెవ్వనికో అతఁడు ఛిన్నసంశయుఁడు. అందువలననే, అకుశలమ్ = పొందఁబడదు కుశలము — నిశ్శ్రేయసము దేనిచేతనో అది యకుశలము, అట్టి కర్మమును, శరీరారంభక మగుటచే నిది సంసారలక్షణము బంధక మని కామ్యకర్మమును గాని, నరకహేతు వగుటచే నిది దుఃఖకారణ మని నిషిద్ధకర్మమును గాని; ఏల యిది యని; న ద్వేష్టి=ద్వేష మనఁగా అప్రీతి, దాని నాకర్మమునందుఁ జేయఁడు. తమఃకృతమోహము లేమివలన నిది దుష్టము బంధకము కావునఁ గర్తవ్యము కా దనుబుద్ధిని జేయఁ డని యర్థము. కుశలే=కుశలసాధన మగు యజ్ఞదానాదినిత్యకర్మమునందు; మోక్షకారణం బని, నానుషజ్జతే= అనుషంగము — ప్రీతి, దానిఁ జేయఁడు, ముక్తునకు మోక్షేచ్ఛ సంభవింపమిచే

సాధనాపేక్ష లేమివలన దానియందుఁ గర్తవ్యబుద్ధిని జేయఁడు. మఱే మనఁగా "ద్వేషబుద్ధ్యాభయాత్తో నిషేధాన్న నివర్తతే। గుణబుద్ధ్యాచ విహితం న కరోతి య థార్మికః" * అను న్యాయంబునఁ గుశలంబు నకుశలంబు నగు సర్వ కర్మంబును సన్న్యసించి బ్రహ్మరూపమున నుండు నని యర్థము. ఇందుచే, సర్వకర్మ ఫలకామనాత్యాగపూర్వకముగా నీశ్వరార్పణబుద్ధితో సమ్యగనుష్ఠితము లైన యజ్ఞదానాదులచేతనే సత్త్వశుద్ధి కలుగు ననియు శుద్ధసత్త్వునకే బ్రహ్మైకత్వవిషయ మగు నప్రతిబద్ధమైన సమ్యక్ జ్ఞానము కలుగు ననియు సమ్యక్ జ్ఞానవంతునకే సంశ యాదివిచ్ఛిత్తియు సర్వకర్మసన్న్యాసమును సమ్యక్ జ్ఞాననిష్ఠయు సిద్ధించు ననియు బోధిత మగుచున్నది. అందువలన జ్ఞానకర్మములకు సాధ్యసాధనభావం బని సిద్ధము. సమస్తమైన గీతాశాస్త్రమునకును సమస్తమైన వేదమునకును ఏది తాత్పర్యమో అదియు నావిష్కృత మగుచున్నది యని యెఱుంగవలయును.

మం॥ సాత్త్వికత్యాగమే యాదేయ మనుటకై తత్ఫలమును సత్త్వశుద్ధి ద్వారంబున జ్ఞాననిష్ఠను జెప్పుచున్నాఁడు.—త్యాగీ = సాత్త్విక మగు త్యాగ ముతోఁ గూడినవాఁడు, పూర్వోక్తప్రకారమునఁ గర్తృత్వాభినివేశమును ఫలాభి సంధిని బరిత్యజించి యంతఃకరణశుద్ధ్యర్థమై విహితకర్మము ననుష్ఠించుచుండువాఁ డెవ్వఁడు గలఁడో అతఁడు; ఎప్పుడు, సత్త్వసమావిష్టః = సత్త్వముచేత—ఆత్మానా త్మవివేకజ్ఞానహేతువైన చిత్తగత మగు నతిశయముచేత; సమ్ — జ్ఞానప్రతిబంధక రజస్తమోమలరహితముగా ఆ—అంతట ఫలావ్యభిచారమున • ఆవిష్టుఁడు—వ్యాప్తుఁ డగుచున్నాఁడో, భగవదర్పిత నిత్యకర్మానుష్ఠానమువలనఁ బాపమలక్షాలనలక్షణంబును జ్ఞానోత్పత్తియోగ్యతారూపపుణ్యగుణాధానలక్షణంబు నగు సంస్కారముచే వాని యంతఃకరణ మెప్పుడు సంస్కృత మగుచున్నదో యని యర్థము. అప్పుడు, మేధావీ = శమ దమ సర్వకర్మోపరతి గురూపసదనాది, సామవాయికాంగయుక్తం బును ‖ మనననిదిధ్యాసనాఖ్యఫలోపకార్యంగయుక్తంబు నగు శ్రవణాఖ్యవేదాంత వాక్యవిచారముచేఁ బరినిష్పన్నమును వేదాంతమహావాక్యముచేఁ బుట్టినదియు సమ స్తాప్రామాణ్యశంకలును వీడినదియుఁ జిదేకవిషయము నగు నహం బ్రహ్మాస్మి యను

* నిషిద్ధవిహితకర్మములు రెంటికి నతీతుఁడై శిశువువలె ద్వేషబుద్ధిచే నిషిద్ధమునుండి నివర్తిల్లఁడు గుణబుద్ధిచే విహితముఁ జేయఁడు.

• ఫలము తప్పనియట్లు.

‖ సామవాయిక — చేరి యుండునవి.

బ్రహ్మాత్మైక్యజ్ఞానమే మేధ, దానితో నిత్యమును గూడినవాఁడు మేధావి — స్థితప్రజ్ఞుఁడగుచున్నాఁడు. అప్పుడు, ఛిన్నసంశయః = అహం బ్రహ్మాస్మి యను విద్యారూపయగు మేధచే తదవిద్య యుచ్ఛిన్నమగుటచే తత్కార్యము లగు సంశయవిపర్యయములు లేనివాఁ డగుచున్నాఁడు. మఱియు నప్పుడు, క్షీణకర్ముఁ డగుటవలన, నద్వేష్టి అకుశలం కర్మ = అశోభన మగు కర్మమును కామ్యమును గాని నిషిద్ధమును గాని ప్రతికూల మని తలంపఁడు. కుశలే = శోభన మగు నిత్యకర్మమునందు; నానుషజ్జతే=ప్రీతిని జేయఁడు, కర్తృత్వాద్యభిమానరహితుఁ డగుటచేఁ గృతకృత్యుఁ డగుటవలన. అట్లు శ్రుతి "భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయన్తే చా ఽస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" అని. ఎందువలన సాత్త్వికమగు త్యాగ మట్టి ఫలము గలదో అందువలన మహాప్రయత్నముచేత నైనను అదియే యుపాదేయ మని యర్థము.

శ్రీ. ఇట్టి సాత్త్వికత్యాగమునందుఁ బరినిష్ఠితుఁ డైనవానిలక్షణముఁ జెప్పుచున్నాఁడు.—సత్త్వసమావిష్టః = సత్త్వముచేఁ జక్కఁగా వ్యాప్తుఁడు, సాత్త్వికుఁ డగు; త్యాగీ; అకుశలమ్ = దుఃఖజనక మగు; కర్మ = శిశిరర్తువునందుఁ బ్రాతస్స్నానము మొదలగు కర్మమును; నద్వేష్టి. కుశలే = సుఖకర మగు కర్మమునందు, గ్రీష్మర్తువున మధ్యాహ్నస్నానము మొదలగుదానియందు; నానుషజ్జతే=ప్రీతిఁ జేయఁడు. అందులకు హేతువు. — మేధావీ = స్థిర మైనబుద్ధి గలవాఁడు, గొప్పదైన పరపరిభవాదిదుఃఖమునుగూడ సహించుచుండఁగా స్వర్గాదిసుఖమును గూడ విడుచుచుండఁగాఁ దాత్కాలిక మగు నీసుఖము గాని దుఃఖము గాని యొంతమాత్ర మను ననుసంధానము గలవాఁ డని యర్థము. అందువలననే, ఛిన్నసంశయః = ఛిన్న మగు సంశయము — మిథ్యాజ్ఞానము — దేహమునకుఁ గలుగు సుఖదుఃఖముల నొందను విడువనుం గోరుట యనునది గలవాఁడు.

ప. ఇఁక నిట్టి సాత్త్వికత్యాగమునందుఁ బరినిష్ఠితునిలక్షణము చెప్పుచున్నాఁడు.—రజస్తమములు వీడి, సత్త్వసమావిష్టః = సత్త్వముచేఁ బొందఁబడినవాఁడు; ఇట్టి, త్యాగీ; అకుశలమ్ = దేహపీడాకర మగు; కర్మ; నద్వేష్టి — ఇది యకార్య మని తలంపఁడు. అట్లు, కుశలే = గ్రీష్మర్తువున మధ్యాహ్నస్నానమువలె దేహసుఖకర మగు కర్మమునందు; నానుషజ్జతే = ఇది సుఖకర మని ప్రీతిని వహింపఁడు. ఇందుచే కాయక్లేశభయాత్త్యజేత్ అన్నట్లు రజము లే దని తెలుపఁబడినది,

ఎందువలన ననఁగా, మేధావీ = బుద్ధిమంతుఁడు, గైహికసుఖదుఃఖములఁ దలంపని వాఁడు. అందువలననే నామతము నవలంబించుటచే, ఛిన్నసంశయుఁడు.

రా. ఇట్లు, సత్త్వసమావిష్టః; మేధావీ=యథావస్థిత మగు తత్త్వజ్ఞానము గలవాఁడు; అందువలననే, ఛిన్నసంశయః; త్యాగీ = కర్మమునందు సంగఫలకర్తృత్వ ముల విడిచినవాఁడు; అకుశలం కర్మ నద్వేష్టి, కుశలే నానుషజ్జతే—అకుశలకర్మము అనిష్ట మగు ఫలము గలది, కుశలకర్మము ఇష్టము లగు స్వర్గపుత్త్రపశ్వన్నాదిఫల ములు గలది, సర్వకర్మమునందును మమత విడుచుటవలనను బ్రహ్మవ్యతిరిక్తసర్వ ఫలమునుం బరిత్యజించుటవలనను కర్తృత్వమును వదలుటవలనను వానిఁ జేయు నపుడు ప్రీతిద్వేషముల వహింపఁడు. అనిష్టఫలం బగు పాపకర్మం బిట ప్రామాదికం బభిప్రేతము, "నా విరతో దుశ్చరితా న్నాశాన్తో నా సమాహితః । నాశాన్త మానసో వా ఽపి ప్రజ్ఞానే నైన మాప్నుయాత్" * అని దుశ్చరితావిరతి జ్ఞానో త్పత్తివిరోధి యని శ్రుత మగుటవలన. అందువలనఁ గర్మమునందుఁ గర్తృత్వసంగ ఫలములత్యాగము శాస్త్రీయత్యాగము, కర్మస్వరూపత్యాగము కాదు.

నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే. ౧౧

భా. ఎవ్వఁడు మఱి యధికృతుఁడై దేహాత్మాభిమానము గలవాఁ డగుటచే దేహభృత్తు అజ్ఞుఁడు ఆత్మకర్తృత్వవిజ్ఞానం బబాధిత మగుటవలన నేను గర్త నని నిశ్చితబుద్ధి యగునో అతని కశేషకర్మపరిత్యాగ మశక్య మగుటవలనఁ గర్మఫలత్యాగముచే విహితకర్మానుష్ఠానమునందే యధి కారము కాని తత్త్యాగమునందు లే దని తెలుపుటకై చెప్పుచున్నాఁడు.— హి = ఎందువలన; దేహభృతా=దేహమును భరించుచున్నాఁడు కావున దేహాత్మాభిమానము గలవాఁడు దేహభృత్తని చెప్పఁబడుచున్నాఁడు, వివేకి కాఁడు గదా, అతఁడు వేదావినాశిన మిత్యాదికముచేఁ గర్తృ త్వాధికారమునుండి నివర్తితుఁడు గదా! అందువలన ఆదేహభృత్తు చేత, అజ్ఞునిచేత; అశేషతః = నిశ్శేషముగా; కర్మాణి = కర్మములను;

* దుశ్చరితమునుండి విరమింపనివాఁడు గాని శాంతుఁడు కానివాఁడు గాని సమాహితుఁడు కానివాఁడు కాని శాంతమానసుఁడు కానివాఁడు కాని ప్రజ్ఞానముచే — ఉపాసనముచే వీనిఁ బొందఁ జాలఁడు.

త్యక్తుమ్ = సన్న్యసించుటకు; నశక్యమ్ = శక్యము కాదో. అందువలన, యస్తు = ఎవ్వఁడు మఱి యధికృతుం డగు నజ్ఞుఁడు; నిత్యము లగు కర్మములను జేయుచు, కర్మఫలత్యాగీ = కర్మములఫలాభిసంధిమాత్రమును సన్న్యసించినవాఁడో; సః = అతఁడు; త్యాగీతి = సన్న్యాసి యని; అభిధీయతే=చెప్పఁబడుచున్నాఁడు, కర్మియై యున్నను అని స్తుత్యభిప్రాయము చేత. అందువలనఁ బరమార్థదర్శికి అదేహభృత్తునకు దేహాత్మభావరహితునకే యశేషకర్మసన్న్యాసముఁ జేయ శక్య మగును.

దేహమునం దాత్మాభిమానము గలిగి తాను కర్త యని తలంచువాఁడు సర్వకర్మములను సన్న్యసింప శక్తుఁడు కాఁడు, కావున నతఁడు నిత్యకర్మముల ననుష్ఠించుచుఁ దత్ఫలములయం దభిసంధిమాత్రము విడువవలయును. అట్టివాఁడు కర్మములు చేయుచున్నను సన్న్యాసి యని స్తుతింపఁబడు నని తాత్పర్యము.

ఆ. ఆత్మజ్ఞానవంతునకు సర్వకర్మత్యాగసంభావనను బ్రతిపాదించి తద్విహీనున కది సంభవింప దనుటకు హేతువచనముగా ననంతరశ్లోకము దించుచున్నారు ఎవ్వఁడు మఱి ఇత్యాదిగా. ఈ యర్థమును దెలుపుటకై యజ్ఞునకు సర్వకర్మసన్న్యాసము సంభవింప దనుటను హేతువుగాఁ జెప్పుచున్నాఁ డని యన్వయము. ఎందువలన ననుదానికి అందువలన ననుదానితో ముందటికి సంబంధము. వివేకికిని దేహధారి యగుటచే దేహభృత్త్వము సమాన మగుటవలనఁ గర్మాధికారము కల దని యాశంకించి చెప్పుచున్నారు వివేకి ఇత్యాదిగా. కర్తృత్వాధికారమునుండి — కర్మానుష్ఠానమునుండి. అందువలన—జ్ఞానవంతునకు దేహధారణ మున్నను దేహాభిమానిత్వము లేమివలన నని యర్థము. అజ్ఞునకు సర్వకర్మత్యాగము సంభవింప దని చెప్పినదాని హేతువుగా గ్రహించి ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. కర్మానుష్ఠాయిని త్యాగి యనుట యయుక్త మని యాశంకించి చెప్పుచున్నారు కర్మియై ఇత్యాదిగా. కర్మినిగూడ ఫలత్యాగముచే త్యాగి యని చెప్పుట ఫలత్యాగస్తుత్యర్థ మని యర్థము. ఎవ్వని కప్పుడు సర్వకర్మత్యాగము సంభవించు నని యాశంకించి వివేకవైరాగ్యాదిమంతుఁడై దేహాభిమానరహితుఁ డైనవాని కని చెప్పినదాని నిగమనము చేయుచున్నారు అందువలన నిత్యాదిగా.

హ. దేహమును భరించుచున్నాఁడు కావున దేహభృత్తు అనఁగా అవిద్యావంతుఁ డగు దేహాత్మదర్శి, అట్టి దేహభృత్తుచేత, కర్మాణి అశేషతః త్యక్తుం నశక్యమ్.

ఎవ్వఁడు మఱి సత్త్వశుద్ధికొఱకుఁ గర్మములఁ జేయుచుఁ గర్మఫలత్యాగి యగునో అతఁడు కర్మసన్న్యాసి యని స్తుతింపఁబడుచున్నాఁడు.

౧౧. ఇప్పుడు నిత్యనైమిత్తికకర్మానుష్ఠానములయం దధికృతుఁడు దేహాత్మబుద్ధి యగుపురుషుఁ డెవ్వఁడు గలఁడో అతని కశేషకర్మత్యాగ మశక్య మగుటవలనఁ గర్మఫలత్యాగముచేఁ గర్మానుష్ఠానమునందే యధికారము కాని కర్మత్యాగమునందు లే దని ప్రతిపాదించుచున్నాఁడు.—హి = ఏకారణమువలన; దేహభృతా = దేహము నిదియే నే నని స్వస్వరూపమున భరించుచున్నాఁడు కావున దేహభృత్తనఁగా దేహాత్మబుద్ధి యజ్ఞుఁడే యగు కర్మాధికారి కాని యాత్మజ్ఞుఁడు కాఁడు, వానికి సర్వదృశ్యవిలక్షణుం డగు కూటస్థుఁడు తా నని యెఱింగిన విద్వాంసునకు దేహాత్మత్వబుద్ధి లేమివలనఁ గర్మాధికారము సంభవింపమివలన నేను కర్త నని కర్తృత్వాభిమాని యగు దేహాద్యహంబుద్ధికే కర్మమునం దధికారము, అందువలన దేహభృత్తుచేత – అనాత్మజ్ఞునిచేత; అశేషతః = నిశ్శేషము లయిన; కర్మాణి = నిత్యనైమిత్తికకామ్యప్రతిషిద్ధకర్మములను ఇతరములను గూడ; త్యక్తుమ్ = సన్న్యసించుటకు; నశక్యమ్, వానికి కర్త్రాత్మజ్ఞానము లేమివలన. ఎవ్వఁ డకర్త్రాత్మజ్ఞానవంతుఁ డగుచున్నాఁడో వానికే యశేషకర్మసన్న్యాస ముపపన్నము కాని యితరునకుఁ గాదు. అందువలన, యస్తు = అనాత్మజ్ఞుఁడు ఎవఁడు మఱి; కర్మమునం దధికృతుఁడై, సర్వకర్మఫలత్యాగి యగుచున్నాఁడో, అతఁడే త్యాగీ – సర్వకర్మసన్న్యాసి నిష్కాముఁ డని, అభిధీయతే = చెప్పఁబడుచున్నాఁడు. సమస్తకర్మములును దత్ఫలములును బరమేశ్వరార్పితము లైనపుడు అకర్మసాదృశ్యము సంభవించుటవలనఁ దాను నిత్యకర్మి యయ్యును అకర్మి యని స్తుతింపఁబడుచున్నాఁడు, ముముక్షువుల కీసాత్త్వికత్యాగమునందే ప్రవృత్తి సిద్ధించుటకై. లేక. సాత్త్వికత్యాగస్వరూపమును సాత్త్వికత్యాగనిష్ఠునకుఁ దన్నిష్ఠవలన సత్త్వశుద్ధిని తత్సంభావితజ్ఞానంబును తత్ఫల మగు నైష్కర్మ్యసిద్ధినిం బ్రతిపాదించి యిఁక సదసద్వివేకశూన్యు లగు పూర్వోక్తు లయిన రాజసతామసత్యాగులకు ఆభాసత్యాగిత్వంబును వాస్తవంబునఁ గర్మిత్వంబును అనిష్టాదిఫలయుక్తత్వంబును బోధించుటకై యజ్ఞో ఽధ్యయనం దాన మిత్యాదిశ్రుత్యుక్తములగు నిత్యనైమిత్తికకర్మముల నీశ్వరార్పణబుద్ధితో ననుష్ఠించునట్టి సాత్త్వికత్యాగికే స్వధర్మానుష్ఠానసముత్పన్న మగు చిత్తశుద్ధిచే నాత్మయాథాత్మ్యవిజ్ఞానము నొందినవానికిఁ గుశలాదిసర్వకర్మసన్న్యాసికి అకర్మిత్వంబును అనిష్టాదిఫలరహితత్వంబును బ్రతిపాదించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—కొందఱు పండితులే బౌద్ధస్వభావులు మోహాత్మక

తమోదూషితబుద్ధిచే కర్మము చేయ నేల యని యశ్రద్ధచే సర్వకర్మత్యాగమును శ్రుతివిహితము కానిదానిఁ జేయుచున్నారు. అట్లు మఱికొందఱు పండితులె యల సులు దేహసౌఖ్యముఁ గోరి దేహాయాససాధ్యం బగు సర్వకర్మంబును దుఃఖమే యని రజోదోషదూషితబుద్ధిచే సర్వకర్మత్యాగమును శ్రుతివిహితము కానిదానినే రాజస మును జేయుచున్నారు. ఆ రాజస తామసత్యాగుల కర్మత్యాగం బాభాసికమె కాని క్రియచే సిద్ధించునది కాదు. హి = ఏకారణమువలన; దేహభృతా = దేహమును స్వభావమువలననే క్రియావంత మగు ప్రాణేంద్రియమనోబుద్ధ్యాదికరణసంఘాత ముతోఁ గూడినదాని నిదియె నే నని స్వస్వరూపముగా ధరించుచున్నాఁడు కాన దేహ భృత్తనఁగా దేహాత్మబుద్ధి యగు పురుషుఁడు, వానిచేత; కర్మాణి=ఆయాకాలమందుఁ గర్తవ్యములుగా నప్రయత్నమునఁ బ్రాప్తము లగు పుణ్యాపుణ్యకర్మములను తదితర ములనుగూడ; అశేషతః = నిశ్శేషముగా; త్యక్తుమ్ = సన్న్యసించుటకు; నశక్యమ్, కర్మము త్యజించితి నని యాభాసమాత్రమే కర్మత్యాగము కాని వాస్తవకర్మత్యాగము సిద్ధింపదు, కర్మకర్తృకారకవ్యతిరిక్తాత్మజ్ఞానము లేమివలనను స్వభావముననే చేష్టావంత మగు దేహమే యాత్మ యనుబుద్ధి గలవాఁ డగుటవలనను బుద్ధిపూర్వక ముగఁ గాని యబుద్ధిపూర్వకముగఁ గాని పుణ్యాపుణ్యాచరణము తప్పదు. అందు వలన నట్టి త్యాగులు సర్వకర్మసన్న్యాసులు కా రని యర్థము. అప్పు డెవ్వఁడు సన్న్యాసి యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—తుశబ్దము పీనికిఁ దామసాదివైలక్షణ్యము బోధించుచున్నది. యస్తు; కర్మఫలత్యాగీ=యజ్ఞాదికర్మములను జేయుచుఁ బూర్వోక్త రీతిని సర్వకర్మఫలత్యాగమును జేయుచున్నాఁడో; సః=అతఁడే; త్యాగీతి=సన్న్యాసి యని; అభిధీయతే — నిష్కర్తృత్వము సిద్ధించువిధము నెఱింగిన పండితులచే నతఁడే సర్వకర్మసన్న్యాసి యని చెప్పఁబడుచున్నాఁడు, కాని యితరు లగు తామసరాజస త్యాగులు కారు. ఆపాతదృష్టిచేఁ దాము కర్మసన్న్యాసులుగాఁ గానవచ్చినను జక్కగా విచారించినచోఁ గర్మ్ములే యగుచున్నారు. విహితాకరణప్రత్యవాయము గలవా రగుటవలనను భ్రమప్రమాదాదులయందుఁ బుణ్యాపుణ్యకర్మములు గలవా రగుట వలనను వారి కశేషకర్మసన్న్యాసము సంభవింపదు. అందువలన సర్వకర్మముల ననుష్ఠించి వానిని వానిఫలములను బరమేశ్వరునం దర్పించి కామసంకల్పాదిదోష శూన్యుఁడై చిత్తశుద్ధినొంది కూటస్థాత్మస్వరూపము నెఱింగినవాఁడై సర్వకర్మాణి మనసా యని చెప్పినప్రకారంబునఁ గుశలాకుశలసర్వకర్మంబులను సన్న్యసించి నిష్క్రియాత్ముఁడై యెవఁ డున్నాఁడో యతనికే సర్వకర్మసన్న్యాసము సిద్ధించు

చున్నది, కూటస్థాసంగచిదాత్మస్వరూపవిజ్ఞానము కలవానికే సర్వకర్మసన్న్యాసము సంభవించుటవలనను బహుజన్మములు సాత్త్వికకర్మానుష్ఠానముచే సత్త్వసమావిష్టుఁడై మేధావియై ఛిన్నసంశయుం డైన విద్వాంసునకుఁ గుశలాకుశలాది సర్వకర్మసన్న్యాసము ప్రతిపాదితం బగుటవలనను. అందువలనఁ బ్రకృతుం డగు కర్మఫలత్యాగికి స్వధర్మానుష్ఠానముచే జనిత మగు చిత్తశుద్ధిమూలంబున విజ్ఞానము నొందినవానికి సర్వకర్మసన్న్యాసిత్వము ప్రతిపాదించుట యిట యుక్తము. అట్లు ప్రతిపాదించినయెడ, అశ్రద్ధాదుర్బుద్ధులచే నీశ్వరార్పణబుద్ధిమెయి నెవ్వరు కర్మము చేయరో వారికిఁ గోటికల్పములకైనను జిత్తశుద్ధిగాని జ్ఞానముగాని మోక్షముగాని సిద్ధింప దనియు నెవ్వరు మఱి కామన లేక శ్రద్ధాభక్తులతో నీశ్వరప్రీతికొఱకు వైదికం బగు కర్మము నాచరింతురో వారికి సత్త్వశుద్ధియు జ్ఞానంబును నైష్కర్మ్యంబును మోక్షంబును సిద్ధించు ననియు నందువలన మోక్షైకకాము లగు విచక్షణులు సాత్త్వికత్యాగనిష్ఠచే స్వధర్మము ననుష్ఠింపవలయు ననియు నుపదేశము సిద్ధించు చున్నది.

మ. ఇట్లాత్మజ్ఞానవంతునకు సర్వకర్మత్యాగము సంభవించుచున్నది, కర్మప్రవృత్తిహేతువు లగు రాగద్వేషములు లేమివలన నని చెప్పఁబడినది. ఇప్పు డజ్ఞునకుఁ గర్మత్యాగము సంభవింపమికి హేతువు చెప్పఁబడుచున్నది.—మనుష్యుఁడ నేను బ్రాహ్మణుఁడ నేను గృహస్థుఁడ నేను ఇత్యాదిక మగు నబాధిత మైన యభిమానముచే దేహమును – కర్మాధికారహేతువర్ణాశ్రమాదిరూపంబును గర్తృత్వభోక్తృత్వాదుల కాశ్రయంబు నగు స్థూలసూక్ష్మశరీరేంద్రియసంఘాతమును బిభర్తి– అనాద్యవిద్యావాసనావశమువలన వ్యవహారయోగ్యత్వంబునఁ గల్పితము నసత్యము నైనను సత్యమునుగాను దనకు భిన్నమునైనను దన కభిన్నమునుగాను జూచుచు ధరించుచున్నాఁడు పోషించుచున్నాఁడు కావున దేహభృత్తనఁగా అబాధిత మగు కర్మాధికారహేతువు దేహాభిమానము గలవాఁడు, అట్టి వివేకజ్ఞానశూన్యుం డగు దేహభృత్తుచేత, కర్మమునందుఁ బ్రవృత్తికి హేతువు లగు రాగద్వేషములసమృద్ధిచే నెల్లప్పుడును గర్మములయందు బ్రవర్తించుచున్నవానిచేత; కర్మాణి; అశేషతః = నిశ్శేషముగా; త్యక్తుమ్ = విడుచుటకు; హి = ఎందువలన; నశక్యమ్ = శక్యములు కావో, కారణసామగ్రి యున్నపుడు కార్యత్యాగ మశక్య మగుటవలన. అందువలన, యస్తు = ఎవ్వఁ డజ్ఞుఁ డగు నధికారి; సత్త్వశుద్ధికొఱకుఁ గర్మములఁ జేయుచున్నను భగవత్కృపచేఁ దత్ఫలత్యాగి యగునో, తుశబ్ద మట్టివాఁడు దుర్లభుఁ డని

బోధనార్థము; సత్యాగీతి అభిధీయతే = అతఁడు త్యాగి యని చెప్పఁబడుచున్నాఁడు, గౌణవృత్తిచే స్తుత్యర్థము త్యాగి కాకున్నను. అశేషకర్మసన్న్యాసమో పరమార్థదర్శి యగు నదేహభృత్తుచేతనే చేయ శక్య మగుం గావున నతఁడే ముఖ్యవృత్తిచేఁ ద్యాగి యని యభిప్రాయము.

**శ్రీ.** ఓయీ! ఇట్టి కర్మఫలత్యాగముకన్నను సర్వకర్మత్యాగము మేలు, అట్లయినయెడఁ గర్మవిక్షేపము లేక జ్ఞాననిష్ఠాసుఖము సిద్ధించు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—దేహభృతా = దేహాత్మాభిమానవంతునిచేత; నిశ్శేషముగా సర్వకర్మములను ద్యజించుటకు శక్యము గాదు గదా! అది చెప్పఁబడినది "నహి కశ్చిత్క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్" అని. అందువలన నెవఁడు కర్మములఁ జేయుచునే కర్మఫలత్యాగియో అతఁడే ముఖ్యుఁ డగు త్యాగి యని చెప్పఁబడుచున్నాఁడు.

**ప.** దానినే చెప్పుచున్నాఁడు.—దేహభృతా=దేహాభిమానవంతునిచేత; దైహికవ్యవహారముకొఱకుఁ గరచరణవ్యాపారము చేయుచుండువానిచేత; అశేషతః కర్మాణి త్యక్తుం నహి శక్యమ్. కాయక్లేశభయమువలన నెట్లు త్యజింప శక్య మగు నని యర్థము. నహి కశ్చిత్క్షణ మపి యని పూర్వమే చెప్పఁబడినది.

**రా.** దానిఁ జెప్పుచున్నాఁడు.—దేహభృతా — ధరింపఁబడుచున్న శరీరము గలవానిచేత; కర్మాణి అశేషత స్త్యక్తుం నహి శక్యమ్, దేహధారణార్థము లగు నశనపానాదులును తదనుబంధు లగు కర్మములును అనివార్యము లగుటవలన. దానికొఱకు మహాయజ్ఞాద్యనుష్ఠాన మనివార్యము. యస్తు; ఆ మహాయజ్ఞాదికర్మము లందు ఫలత్యాగియో అతఁడే "త్యాగే నైకే అమృతత్వ మానశుః" ఇత్యాది శాస్త్రములయందుఁ ద్యాగి యని చెప్పఁబడుచున్నాఁడు. ఫలత్యాగి యనుట ఫల కర్తృత్వకర్మసంగములత్యాగి యని ప్రదర్శనార్థము, త్రివిధ స్సంప్రకీర్తితః అని ప్రక్రమించుటవలన.

**మా.** ఇతర మైన త్యాగశబ్దార్థము యుక్తము కా దని చెప్పుచున్నాఁడు నహీత్యాదిగా.

అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్
భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్. ౧౨

భా. ఏది సర్వకర్మపరిత్యాగమువలనఁ గలుగునో ఆ ప్రయోజనం బేది? చెప్పెదము.—అనిష్టమ్ = నరకతిర్యగాదిలక్షణమును; ఇష్టమ్ = దేవాదిలక్షణమును; మిశ్రంచ = ఇష్టానిష్టసంయుక్తము మనుష్యలక్షణమును; ఇట్లు, త్రివిధమ్ = మూఁడువిధములు గలది; కర్మణః = ధర్మాధర్మలక్షణ మగు కర్మముయొక్క; ఫలమ్ = బాహ్యము లగు ననేకకారకములవ్యాపారముచే నిష్పన్న మగుచు అవిద్యాకృతము ఇంద్రజాలమాయోపమము మహామోహాకరము ప్రత్యగాత్మ నుపసర్పించునదియుం బోలె ఫల్గు * వగుటచే లయమును — అదర్శనమును బొందుచున్నది కావున ఫల మని ఫలనిర్వచనము, ఇట్టి ఫలము; భవతి = అగుచున్నది; అత్యాగినామ్ = అజ్ఞు లగు కర్ములకు, అపరమార్థసన్న్యాసులకు; ప్రేత్య= శరీరపాతమున కనంతరము. సన్న్యాసినాం = పరమార్థసన్న్యాసులకు పరమహంసపరివ్రాజకులకు కేవలజ్ఞాననిష్ఠులకు; క్వచిత్ = ఒకానొకప్పుడును; నతు = కానేకాదు. కేవలసమ్యగ్దర్శననిష్ఠ అవిద్యాదిసంసారబీజము నొకానొకప్పుడు నున్మూలింపక తప్పదు గదా యని యర్థము.

నరకమును తిర్యగ్యోనిని బ్రాపించుట మొదలగు ననిష్టమును దేవశరీరప్రాప్తి మొదలగు నిష్టమును మనుష్యత్వప్రాప్తిరూప మగు మిశ్రమును అను నీత్రివిధ మయిన కర్మఫలము పరమార్థసన్న్యాసులు కానికర్ములకు దేహము విడిచినపిమ్మటఁ గలుగక తప్పదు. పరమార్థసన్న్యాసులకుమాత్ర మెప్పుడునుం గలుగనేర దని తాత్పర్యము.

ఆ. చెప్పిన యధికారికి సర్వకర్మసన్న్యాసము సంభవింప కున్నను ఫలము లేనపుడు దానినేల చేయవలయు నని శంకించుచున్నాఁడు.—ఏది ఇత్యాదిగా. గౌణసన్న్యాసమునకా ముఖ్యసన్న్యాసమునకా ఫల మడిగెద వని వికల్పించుచున్నారు చెప్పెదము అని. సర్వకర్మత్యాగ మనఁగా కర్మము ననుష్ఠించినను తత్ఫలాభిసంధిత్యాగము. అది గౌణసన్న్యాసము. దానిఫలముఁ జెప్పుచున్నాఁడు అనిష్ట మిత్యాది పాదత్రయముచేత. ముఖ్యసన్న్యాస మగు సర్వకర్మత్యాగమునందో సమ్యగ్దర్శనద్వారమున సర్వసంసారోచ్ఛేదమే ఫల మని చెప్పుచున్నాఁడు న త్వి త్యాదిగా. మొదటిపాదత్రయమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు అనిష్ట

* నిస్సారము.

మిత్యాదిగా. తిర్యగాది యను నాదిపదము తక్కిన నీచయోనులసంగ్రహించు కొఱకు, దేవాది యను నాదిపదము తక్కిన యుత్కృష్టయోనుల గ్రహించుట కొఱకని విభాగము. ఫలశబ్దవ్యుత్పత్తి చెప్పుచున్నారు భాష్యాములు ఇత్యాదిగా. కారణద్వారమునఁ గల్గిన యనేకవిధత్వముఁ జెప్పి మిథ్యాత్వముఁ జెప్పుచున్నారు అవిద్యాకృతము అని. తత్కృతంబై దృష్టిమాత్రాకారం బనుటకు దృష్టాంతముఁ జెప్పుచున్నారు ఇంద్రేత్యాదిగా. ప్రతీతికి రమణీయం బని సూచించుచున్నారు మహామోహాకరము అని. అవిద్యాజన్య మవిద్యాశ్రిత మగుటవలన వాస్తవంబున నాత్మాశ్రితము కాదని చెప్పుచున్నారు ప్రత్యగాత్మ నిత్యాదిగా. ఇట్టి ఫలము కర్ములకగు ననునెడఁ బాదత్రయము గౌణసన్న్యాసఫలప్రతిపాదనపరం బనుట యెట్లని యాశంకించి చెప్పుచున్నారు అపరమార్థేత్యాదిగా. ఫలాభిసంధిరహితు లగు కర్ములకు దేహపాతానంతరము కర్మానురోధి ఫలప్రాప్తి దప్ప దని యర్థము. కర్ములే యగుచు ఫలాభిసంధిరహితు లగువారు గౌణసన్న్యాసు లగుటవలన వారి గౌణసన్న్యాసమునకు ఫలముఁ బ్రతిపాదించి చతుర్థపాదమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు సన్న్యాసినా మిత్యాదిగా. పూర్వప్రకృత మగు గౌణసన్న్యాసమును వ్యవచ్ఛేదించుచున్నారు పరమార్థ యని. వారిప్రధానధర్మము నుపదేశించుచున్నారు కేవ లేత్యాదిగా. ఒకానొకప్పుడును — ఏదేశమందును ఏకాలమందును. అప్పుడు పరమార్థసన్న్యాసము ఫలరహిత మగుటవలన ననుష్ఠింపవలసినది లేదని యాశంకించి యది మోక్షపర్యవసాయి యగుటవలన నట్లనవల దని చెప్పుచున్నారు కేవ లేత్యాదిగా.

హ॰ అనిష్టమ్ = అప్రియమును; ఇష్టమ్ = కోరఁబడునదియు; మిశ్రమ్ = ఉభయాత్మకమును; ఇట్టి, ఇష్టానిష్టకర్మముయొక్క, ఫలమ్ = ఫల్గు వగుటచే లీనమగుచున్నది కావున ఫల మనఁబడుచున్నది; అదియు, త్రివిధమ్ = మూఁడువిధములు గలది; భవతి = కలుగుచున్నది; అత్యాగినామ్ = అజ్ఞ లగు కర్ములకు. పరమార్థసన్న్యాసు లగు కేవలజ్ఞాననిష్ఠులకో సర్వకర్మసన్న్యాసము చేసినవా రగుటవలన, నతు = కలుగనే కలుగదు. ఇందుచే ఫలాభిసంధిరహిత మగు కర్మానుష్ఠానముచే సత్త్వశుద్ధి నొందినవారికి సకలకర్మసన్న్యాసము విధింపఁబడుచున్నది.

శ౦. ఇట్లు తామసాదిత్యాగము గలవా రాపాతంబున నకర్ములైనను గర్ములే యనియు సాత్త్వికత్యాగు లకర్ము లనియుఁ బ్రతిపాదించి కర్ములకుఁ గర్మఫలంబును అకర్ములకుఁ దదభావంబును జెప్పుచున్నారు.—అనిష్టమ్ = పాపకర్మఫలము, నరకము గాని తిర్యగ్యోని గాని; ఇష్టమ్ = పుణ్యకర్మఫలము, దేవత్వము; మిశ్రమ్ =

ఉభయమిశ్రఫలము, మనుష్యత్వము; "పుణ్యేన పుణ్యలోకం నయతి" ఇత్యాది శ్రుతిప్రసిద్ధ మగు, త్రివిధం ఫలమ్ = మూఁడువిధము లైన కర్మఫలము గూడ; అత్యాగినామ్ = కర్మతత్ఫలత్యాగము చేయనివారికి, తామసాదిత్యాగులకు; ప్రేత్య=మరణానంతరము; భవతి = కానే యగును. శబ్దముచేఁ ద్యాగ మున్నను క్రియచే కర్మత్యాగము లేమివలనను జేసినకర్మములకు ఫల మవశ్యము కలుగుటవలనను త్రివిధ మగు కర్మఫలము అత్యాగులకుఁ దప్పదు. నతుసన్న్యాసినామ్ = కర్మఫలత్యాగజన్య మగు సత్త్వశుద్ధిచేఁ గలుగునట్టి యాత్మజ్ఞానముచేత నకుశలాదిసర్వకర్మముల సన్న్యసించినట్టి యతులకు; క్వచిత్—కొంచె మైనను సంచితమునకుఁ గాని యాగామికిఁ గాని యన్యమునకుఁ గాని పుణ్యాపుణ్యకర్మమునకు జ్ఞానాగ్నినిర్దగ్ధస్వరూపమునకు ఫలము కలుగదు. "సతి కుడ్యే చిత్రకర్మ" * అను న్యాయంబునఁ దనకే యునికి లేనపుడు ఫలదానము సంభవింపమివలన నకర్మ లగు విద్వాంసులకు విదేహ ముక్తియే యని సిద్ధము.

మ. ఓయీ! దేహభృత్తును బరమాత్మజ్ఞానశూన్యుఁడునై కర్మి యయ్యును గర్మఫలాభిసంధిత్యాగము చేసిన గౌణసన్న్యాసికిని బరమాత్మజ్ఞానవంతుఁడై దేహాభిమానరహితుఁడై సర్వకర్మత్యాగి యగు ముఖ్యసన్న్యాసికిని ఫలమునందు విశేష మేమి? ఏది లభింపమిచే నొకటి గౌణ మగునో ఏది లభించుటచే రెండవది ముఖ్య మగునో ఆ విశేష మేమి? కర్మఫలత్యాగిత్వమో యిద్దఱయందును సమానము. కావున మఱి యొకవిశేషము చెప్పవలయును. చెప్పెదము.—అత్యాగినామ్ = కర్మఫలత్యాగు లైనను కర్మానుష్ఠాయు లగు నజ్ఞులకు, గౌణసన్న్యాసులకు; ప్రేత్య= వివిదిషాపర్యంత సత్త్వశుద్ధికి మున్నే మృతు లైనవారికి; పూర్వకృత మగు, కర్మణః= కర్మముయొక్క; ఫలమ్ = శరీరగ్రహణము; భవతి = కలుగుచున్నది, మాయామయము ఫల్గు నగుటచే లయమును — అదర్శనము నొందునది యని ఫలశబ్దనిర్వచనము. కర్మణః అని జాత్యభిప్రాయమున నేకవచనము, ఏకమునకుఁ ద్రివిధఫలత్వ మనుపపన్న మగుటవలన. ఆఫలము కర్మము త్రివిధ మగుటవలనఁ ద్రివిధము. పాపమునకు, ఇష్టమ్ = ప్రతికూలవేదనీయము నరకతిర్యగాదిలక్షణము; పుణ్యమునకు, ఇష్టమ్ = అనుకూలవేదనీయము దేవాదిలక్షణము; మిశ్ర మగు పాపపుణ్యద్వయమునకో, మిశ్రమ్ = ఇష్టానిష్టసంయుక్తము మనుష్యలక్షణము; ఇట్లు త్రివిధం బని యనువాదము హేయ మని తెలుపుటకొఱకు. ఇట్లు గౌణసన్న్యాసులకు శరీర

---

* గోడ యున్నయెడఁ జిత్తరువు వ్రాత.

పాతానంతరము శరీరాంతరగ్రహణ మావశ్యక మని చెప్పి ముఖ్యసన్న్యాసులకుఁ బరమాత్మసాక్షాత్కారముచే నవిద్యాతత్కార్యనివృత్తి యగుటవలన విదేహకైవల్యమే యని చెప్పుచున్నాఁడు.—నతు సన్న్యాసినాం క్వచిత్ =పరమాత్మజ్ఞానవంతులకు ముఖ్యసన్న్యాసు లగు పరమహంసపరివ్రాజకులకు; ప్రేత్య; కర్మణః ఫలమ్ = శరీరగ్రహణము, అనిష్టము గాని యిష్టము గాని మిశ్రము గాని, క్వచిత్—ఒకానొక దేశమునందుఁ గాని కాలమునందుఁ గాని, నతు—కలుగనే కలుగదు, తుశబ్ద మవధారణార్థము. జ్ఞానముచే నజ్ఞాన ముచ్ఛిన్న మగుటచేఁ దత్కార్యము లగు కర్మములుచ్ఛిన్నము లగుటవలన. అట్లు శ్రుతి "భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః । క్షీయన్తే చా ఽస్య కర్మాణి తస్మి న్దృష్టే పరావరే" అని. పారమర్షమగుసూత్రము గూడ "తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేష వినాశౌ" * అని పరమాత్మజ్ఞానమువలన నశేషకర్మక్షయమును దెలుపుచున్నవి. అందుచే గౌణసన్న్యాసులకు వెండియు సంసారము కలుగు ననియు ముఖ్యసన్న్యాసులకుమాత్రము మోక్షము కలుగు ననియు ఫలమునందు విశేషము చెప్పఁబడినది. ఇట నొకఁడు చెప్పుచున్నాఁడు.—"అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః । స సన్న్యాసీచ" ఇత్యాదిస్థలమునఁ గర్మఫలత్యాగులందు సన్న్యాసిశబ్దము ప్రయోగింపఁబడి యుండుటవలనఁ గర్షు లే యిట ఫలత్యాగసామ్యమువలన సన్న్యాసిశబ్దముచే గ్రహింపఁబడుచున్నారు. వారికిని సాత్త్వికులకు నిత్యకర్మానుష్ఠానముచేతను నిషిద్ధకర్మాననుష్ఠానముచేతను బాపము సంభవింపమివలన నిష్ట మగు ఫలము సంభవింపదు; కామ్యాననుష్ఠానమువలన ఇష్టముగూడ సంభవింపదు, ఈశ్వరార్పణముచే ఫలము విడుచుటవలనఁ గూడ; అందువలననే మిశ్రముగూడ సంభవింపదు. ఇట్లు త్రివిధకర్మఫలము సంభవింపదు. ఇందువలననే చెప్పఁబడినది "మోక్షార్థీ న ప్రవర్తేత తత్ర కామ్యనిషిద్ధయోః । నిత్యనైమిత్తికే కుర్యా త్ప్రత్యవాయజిహాసయా" ♦ అని. ఆతని కిట్లు చెప్పవలయును. శబ్దార్థములమర్యాదను నిపు నిశ్చయించికొన్నవాఁడవు కా వని. ఎట్లనఁగా. "గౌణముఖ్యయో ర్ముఖ్యే కార్యసంప్రత్యయః" ¶ అని శబ్దమర్యాద. "అమావాస్యాయా మపరాహ్ణే పిణ్డపితృయజ్ఞేన చరన్తి"

---

* బ్ర౦. సూ. బ్రహ్మజ్ఞానము కలిగిన పిదప ఆగామికర్మమునకు సంబంధము లేదు. పూర్వసంచితమునకు నాశ మగును.

♦ అందు మోక్షార్థి కామ్యనిషిద్ధములయందుఁ బ్రవర్తింపఁగూడదు. ప్రత్యవాయముఁ బరిహరించుటకై నిత్యనైమిత్తికములఁ జేయవలయును.

¶ గౌణముఖ్యములలో ముఖ్యమునందుఁ గార్యవ్యవహారము

అనుచోట సమావాస్యాశబ్దము కాలమునందు ముఖ్యము. తత్కాలోత్పన్న మగు కర్మమునందో గౌణము "య ఏవం విద్వా నమావాస్యాం యజతే" ఇత్యాదికము నందు. అట నమావాస్యాయా మ్మనుటచేఁ గర్మము గ్రహింపఁబడినయెడఁ బితృయజ్ఞమునకుఁ దదంగ మగుటవలన ఫలము కల్పింపవలసినది లేదు కావున విధికి లాఘవం బగు నని పూర్వపక్షితము కాత్యాయనునిచేత. "అఙ్గం వా సమభివ్యాహారాత్" అని. గౌణార్థము ముఖ్యార్థోపస్థితిపూర్వకం బగుటవలన ముఖ్యార్థమో యిట నబాధిత మగుటవలన నమావాస్యాశబ్దముచేఁ గాలమే గ్రహింపఁబడుచున్నది. అయినఁదవచ్చు ఫలకల్పనాగౌరవమో ప్రమాణవంత మగుటవలన నంగీకార్యమని సిద్ధాంతింపఁబడియె జైమినిచేత "పితృయజ్ఞ స్స్వకాలత్వా దనఙ్గం స్యాత్" అని. ఇట్లుండుటవలన సన్న్యాసిశబ్దము సర్వకర్మత్యాగియందు ముఖ్య మగుటవలనను గర్మియందు ఫలత్యాగసామ్యముచే గౌణ మగుటవలనను ముఖ్యార్థ మిట నబాధిత మగుటవలన నదియె సన్న్యాసిశబ్దముచే గ్రహింపవలయు నని శబ్దమర్యాదచే సిద్ధము. కారణసామగ్రి యున్నపుడు కార్యోత్పత్తి యని యర్థమర్యాద. ఎట్లనఁగా. ఈశ్వరార్పణముచేఁ గర్మఫలము విడిచినవానికిని సత్త్వశుద్ధ్యర్థము నిత్యకర్మముల ననుష్ఠించుచు నంతరాలమున మృతుఁడైనవానికిఁ బూర్వార్జితము లగు కర్మములచేఁ ద్రివిధ మగు శరీరగ్రహణము నేది వారింపఁగలదు? "యో వా ఏత దక్షరం గార్గ్యవిదిత్వా ఽస్మా ల్లోకా త్ప్రైతి స కృపణః" అను శ్రుతివలన. తుదకు సత్త్వశుద్ధి ఫలజ్ఞానోత్పత్తికొఱకుఁ దదధికారిశరీర మైనను వాని కావశ్యకమే. అందువలననే వివిదిషాసన్న్యాసికి శ్రవణాదికముఁ జేయుచు నంతరాలమున మృతుఁడైన వానికి యోగభ్రష్టశబ్దవాచ్యునకు "శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టో ఽభిజాయతే" ఇత్యాదిగా జ్ఞానాధికారిశరీరప్రాప్తి యవశ్యము కలుగు నని షష్ఠాధ్యాయమున నిర్ణయింపఁబడినది. సర్వకర్మత్యాగికిఁగూడ నజ్ఞునకు శరీరగ్రహణ మావశ్యక మైనపుడు అజ్ఞునకుఁ గర్మి కావశ్యక మని చెప్పవలయునా? అందువలన నజ్ఞునకవశ్యము శరీరగ్రహణ మని యర్థమర్యాదచే సిద్ధము. పరాక్రమించియు నున్నానేకభవికపక్షనిరాకరణమందు నూరులు. అందువలన యథోక్త మగు భగవత్పూజ్యపాదభాష్యకృతవ్యాఖ్యానమే యుత్తమము. అందువలన నిది యిట నిష్కర్షము. అకర్త్రభోక్తృపరమానందాద్వితీయ సత్య స్వప్రకాశ బ్రహ్మాత్మసాక్షాత్కారముచే నిర్వికల్పమును వేదాంతవాక్యజన్యమును విచారమునలన నిశ్చితప్రామాణ్యమును సర్వప్రకారము లైన యప్రామాణ్యాశంకలు వీడినదియు నగు బ్రహ్మాత్మజ్ఞానముచేత

నాత్మాఽజ్ఞాననివృత్తి యగుటచేఁ దత్కార్యకర్తృత్వాద్యభిమానరహితుఁ డగు పరమార్థసన్న్యాసి సర్వకర్మోచ్ఛేదమువలన శుద్ధుఁడు కేవలుఁడై యావిద్యక కర్మాదినిమిత్తమగు శరీరగ్రహణమును వెండియు ననుభవింపఁడు, సర్వభ్రమలును గారణోచ్ఛేదముచే నుచ్ఛిన్నము లగుటవలన. ఎవ్వఁడు మఱి యవిద్యావంతుఁడు కర్తృత్వాద్యభిమాని యగు దేహభృత్తు కలఁడో అతఁడు త్రివిధుఁడు. రాగాదిదోషప్రాబల్యమువలనఁ గామ్యనిషిద్ధాదియథేష్టకర్మముల ననుష్ఠించువాఁడు మోక్షశాస్త్రమునం దనధికారి యొకఁడు. ఎవఁడు పూర్వకృతసుకృతవశమువలనఁ గొంచెము ప్రక్షీణమగు రాగాదిదోషము గలవాఁడై సర్వకర్మంబుల ద్యజింపనేరక కామ్యనిషిద్ధములఁ బరిత్యజించి నిత్యనైమిత్తికముల ఫలాభిసంధిత్యాగముచే సత్త్వశుద్ధికొఱకు ననుష్ఠించునో అతఁడు రెండవవాఁడు మోక్షశాస్త్రమునం దధికారి గౌణసన్న్యాసి యనఁబడియె. అంత నిత్యనైమిత్తికకర్మానుష్ఠానముచే నంతఃకరణశుద్ధి గలిగి వివిదిష నొందినవాఁడై శ్రవణాదికముచే మోక్షసాధన మగు జ్ఞానము సంపాదింపఁగోరి సర్వకర్మములను యథావిధిఁ బరిత్యజించి బ్రహ్మనిష్ఠుఁ డగు గురువు నుపసర్పించువాఁడు తృతీయుఁడు వివిదిషాసన్న్యాసి యనంబరఁగు. అందు మొదటివానికి సంసారిత్వము సర్వప్రసిద్ధము. రెండవవానికో అనిష్ట మిత్యాదిచే వ్యాఖ్యాతము. తృతీయునకును అయతి శ్శ్రద్ధయోపేతః అని ప్రశ్నద్వారమున షష్ఠమునందు నిర్ణీతము. అజ్ఞునకు సంసారిత్వము తప్పదు కారణసామగ్రి యుండుటవలన. అదియు నొకనికి జ్ఞానమున కననుగుణము, ఒకనికి జ్ఞానానుగుణం బని విశేషము. విజ్ఞునకో సంసారకారణము లేమివలన స్వభావముననే కైవల్యము. ఇట్లు రెండుపదార్థములు సూత్రింపఁబడిన వీశ్లోకమునందు.

శ్రీ. ఇట్టి కర్మఫలత్యాగమునకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.—అనిష్టమ్= నారకిత్వము; ఇష్టమ్ = దేవత్వము; మిశ్రమ్ = మనుష్యత్వము; ఇట్లు, త్రివిధమ్, పాపమును పుణ్యమును ఉభయమిశ్రము నగు, కర్మణః ఫలమ్ = కర్మముయొక్క ఫల మేది ప్రసిద్ధమో; అది యంతయు, అత్యాగినామ్ = సకాములకే; ప్రేత్య = పరమునందు; భవతి, వారికిఁ ద్రివిధకర్మము సంభవించుటవలన. నతు సన్న్యాసినాం క్వచిత్ — సన్న్యాసులకో యెకప్పుడును గలుగదు. సన్న్యాసిశబ్దముచే నిట ఫలత్యాగసామ్యమువలనఁ బ్రకృతు లగు కర్మఫలత్యాగులు గ్రహింపఁబడుచున్నాడు, "అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః । స సన్న్యాసీచ యోగీచ" ఇత్యాదులయందును గర్మఫలత్యాగివిషయముగా సన్న్యాసిశబ్దప్రయోగము కనఁ

బడుటవలన. వారికి సాత్త్వికులకుఁ బాపము సంభవింపమివలనను ఈశ్వరార్పణముచేఁ బుణ్యఫలము త్యక్త మగుటవలనను ద్రివిధంబును గర్మఫలము కలుగ దని యర్థము.

ప. *

రా. ఓయీ! కర్మము లగ్నిహోత్రదర్శపూర్ణమాసజ్యోతిష్టోమాదులును మహాయజ్ఞాదులును స్వర్గాదిఫలసంబంధముతో శాస్త్రములచే విధింపఁబడుచున్నవి. నిత్యనైమిత్తికములకుఁ గూడ "ప్రాజాపత్యం గృహస్థానామ్" అని ఫలసంబంధితతోనే గదా విధి. అందువలనఁ దత్తత్ఫలసంబంధస్వభావము లని యేర్పడు కర్మముల యనుష్ఠానంబున బీజావాపాదులంబోలె ఫలాభిసంధి లేనివానికిఁ గూడ నిష్టానిష్టరూపఫలసంబంధం బనివార్యము. అందువలన మోక్షవిరోధి యగు ఫలము గలది యగుటచే కర్మము ముముక్షువున కనుష్ఠేయము గాదు. అనఁగా నందుల కుత్తరముఁ జెప్పుచున్నాఁడు.—అనిష్టమ్ = నరకాదికము; ఇష్టమ్ = స్వర్గాదికము; మిశ్రమ్ = అనిష్టయుక్తము పుత్త్రపశ్వన్నాదికము; ఇట్టి, త్రివిధం కర్మణః ఫలమ్; అత్యాగినామ్ = కర్తృత్వ మమతాఫలత్యాగరహితులకు; ప్రేత్య భవతి. ప్రేత్య — కర్మానుష్ఠానమున కుత్తరకాలమం దని యర్థము. నతు సన్న్యాసినాం క్వచిత్ = కర్తృత్వాదిపరిత్యాగము చేసినవారికి ఎందును మోక్షవిరోధి యగు ఫలము గలుగదు. ఇది యభిప్రాయము. అగ్నిహోత్రమహాయజ్ఞాదులు నిత్యములే కాని, అయినను జీవనాధికార కామనాధికారములయందువలె మోక్షాధికారమునందును వినియోగపృథక్త్వముచేతఁ బరిహృత మగుచున్నది విరోధిఫలము కలుగు నను నాక్షేపము. మోక్షవినియోగమో "త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసా ఽనాశకేన" ఇత్యాదులచేత. ఇట్లు కర్మములఁ జేయుచునే కర్తృత్వాదులఁ బరిత్యజించుట శాస్త్రసిద్ధ మగు సన్న్యాసము. అదియే త్యాగ మని చెప్పఁబడినది.

మా. త్యాగమును స్తుతించుచున్నాఁడు అనిష్ట మిత్యాదిగా.

పఞ్చైతాని మహాబాహో కారణాని నిబోధ మే
సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. ౧౩

భా. అందువలనఁ బరమార్థదర్శికే యశేషకర్మసన్న్యాసిత్వము సంభవించును క్రియాకారకఫలము లాత్మయం దవిద్యాధ్యారోపితంబు

---

* శ్రీధరీయముతో సమానము.

లగుటవలన. కాని యజ్ఞున కధిష్ఠానాదులఁ గ్రియాకర్త లగుకారకంబుల నాత్మత్వంబునఁ జూచువాని కశేషకర్మసన్న్యాసము సంభవింపదు. ఆ యీ యర్థము నుత్తరశ్లోకములచేఁ దెలుపుచున్నాఁడు.—పఞ్చ = ఐదింటిని; ఇమాని = ఈ చెప్పఁ బోవువానిని; మహాబాహో = గొప్ప చేతులు గలవాఁడా! కారణాని=నిర్వర్తకములను; నిబోధ=ఎఱుంగుము; మే — నావాక్యమువలన. అని చెప్పఁబోవువిషయంబున మనస్సమాధానముకొఱకును వస్తువైషమ్యప్రదర్శనముకొఱకును ఆకారణములు జ్ఞాతవ్యము లని స్తుతించుచున్నాఁడు. సాంఖ్యే = జ్ఞాతవ్యము లగు పదార్థము లేశాస్త్రమునందు సంఖ్యాయన్తే — చక్కఁగాఁ జెప్పఁబడుచున్నవో అది సాంఖ్యము వేదాంతము, దానియందు; కృతాన్తే = ఇది దానికే విశేషణము, కృత మనఁగా కర్మము, దానియొక్కయంతము — పరిసమాప్తి దేనియందో అది కృతాంతము, కర్మాంత మనుట, "యావానర్థ ఉదపానే, సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే" అని యాత్మజ్ఞానము కలిగిన సర్వకర్మములనివృత్తిని దెలుపుచున్నాఁడు; అందువలన నట్టి యాత్మజ్ఞానార్థ మగు కృతాంత మైన సాంఖ్యమునందు వేదాంతమునందు; ప్రోక్తాని = చెప్పఁబడినవానిని; సర్వకర్మణామ్=ఎల్ల కర్మములయొక్క; సిద్ధయే = నివృత్తికొఱకు.

అర్జునా! సర్వకర్మములును సిద్ధించుటకుఁ గారణము లని కర్మపరిసమాప్తి హేతు వగు నాత్మజ్ఞానము బోధించునట్టి వేదాంతమునందుఁ జెప్పఁబడిన యీ యైదింటినిం జెప్పెద విను మని తాత్పర్యము.

ఆ. ఓయీ! అపరమార్థసన్న్యాసమువలె భేదము లేమివలన నజ్ఞులకుఁ బరమార్థసన్న్యాసముగూడ నేల సిద్ధింపదు? త్యాగము సుకరం బగుటవలన. అనఁగాఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. వానికి సమ్యగ్దర్శనమువలన నవిద్యానివృత్తిచేఁ దదారోపితక్రియాకారకాదినివృత్తి యగుటవలన నని హేతువున కర్థము. విద్యావంతునకు సర్వకర్మసన్న్యాసిత్వమున కుపపత్తిని బ్రతిపాదించి యేవకార * వ్యావర్త్యముఁ జూపుచున్నారు కాని ఇత్యాదిగా. అజ్ఞునకు అశేషకర్మములను తద్ధేతువు లగు రాగాదులను త్యజించుట సంభవింప దనుటకు అధిష్ఠానాదికారకములయం దాత్మత్వదృష్టి హేతు వని చెప్పుచున్నారు క్రి యేత్యాదిగా. అధిష్ఠానాదులు క్రియా

---

* పరమార్థదర్శికే అనుచోటి యేకారముచే.

కర్త లెట్లగును? ఎట్లు మఱి యజ్ఞునకు వానియం దాత్మత్వబుద్ధి? అని యాశంకించి మీఁదిశ్లోకచతుష్టయముయొక్క తాత్పర్యముఁ జెప్పుచున్నారు ఆయీ ఇత్యాదిగా. కర్త్రార్థము లగు నధిష్ఠానాదు లప్రామాణికము లను నాశంకను మొదటఁ దొలఁగించుచున్నారు పం చేత్యాదిగా. చెప్పఁబోవువిషయంబున—అధిష్ఠానాదులం దని యర్థము. ఆ వస్తువులకే వైషమ్యము దెలుపనలయును, మనస్సమాధానము లేక దాని నెఱుంగ శక్యము గాదు గదా! సాంఖ్యశబ్దమునకు వ్యుత్పత్తిఁ జెప్పుచున్నారు జ్ఞాతవ్యములు ఇత్యాదిగా. ఆత్మ త్వంపదార్థము, తత్పదార్థము బ్రహ్మము, రెంటియొక్క యైక్యజ్ఞానము, తదుపయోగు లగు శ్రవణాదులును బదార్థములు. కృతాంత శబ్దమును వేదాంతవిషయముగా విభజించుచున్నారు కృతము ఇత్యాదిగా. వేదాంతము తత్త్వజ్ఞానద్వారమునఁ గర్త్రావసానస్థాన మనుటకు వాక్యోపక్రమ మనుకూల మని ప్రదర్శించుచున్నారు యావా నిత్యాదిగా. ఉదపానమునందు — కూపాదికము నందు యావానర్థః — స్నానాదిక మగు నెంతప్రయోజనము కలదో అంత యర్థము సముద్రమునందు సంపన్న మగుచున్నది, అందువలన నెట్లు కూపాదికృత మగు కార్యము సర్వంబును సముద్రమునం దంతర్భవించుచున్నదో అట్లు కర్త్రార్థము లగు సర్వవేదములందును ఎంతఫలము గలదో అంతఫలంబును జ్ఞానవంతుఁ డగు బ్రాహ్మణునకు జ్ఞానమునం దంతర్భవించుచున్నది, జ్ఞానము నొందినవానికిఁ గర్తవ్యము శేషింపమివలన నని యర్థము. అందే వాక్యాంతరమును బ్రమాణముగాఁ జూపుచున్నారు సర్వ మిత్యాదిగా. ఉదాహరించినవాక్యములతాత్పర్యముఁ జెప్పుచున్నారు అని యాత్మ ఇత్యాదిగా. ఆత్మజ్ఞానము కలిగినపుడు సర్వకర్మనివృత్తి యైనను ఎట్లు వేదాంతము కృతాంత మగు నని యాశంకించి చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. వాని నావాక్యమువలన నెఱుఁగు మని పూర్వముతో సంబంధము.

**హ.** సాంఖ్యః మనఁగా వేదము, అదియే సాంఖ్యము, స్వార్థమున నణ్ప్రత్యయము చేయఁబడినది. కృతము అంతము—నిశ్చయము దేనియందో అది కృతాంతము, అట్టి కృతాంత మగు సాంఖ్యమునందు, ప్రోక్తాని — నిశ్చయమునఁ జెప్పఁబడినవాని. నిశ్చితార్థ మగు వేదమునందుఁ జెప్పఁబడినవాని నని యర్థము. సిద్ధయే = నిష్పత్తి కొఱకు; సర్వకర్మణామ్ — శారీరాదికర్మములయొక్క.

శం. ఓయీ! విద్వాంసు లగు సన్న్యాసులకును అకర్తృత్వము సంభవింపదు. శిష్యాదులకుఁ దత్త్వోపదేశముచే గాని హితోపదేశముచే గాని పుణ్యక్రియ సంభవించుటవలనను మఱియు నాహారాదులం దొకానొకప్పుడు దుష్టాన్న

భక్షణముచేఁ గాని సంచారాదులయందుఁ బ్రాణిపీడచేఁ గాని మఱి యొకవిధంబునఁ గాని పాపక్రియ సంభవించుటవలనను ఇష్టానిష్టలక్షణం బగు తత్తత్క్రియాఫలము కలుగనే కలుగు నందు వేని, సత్యము. మహాపురుషు లగు బ్రహ్మవిదులు జీవన్ముక్తులు శిష్యులకును ఇతరు లగు సాధువులకును బ్రహ్మతత్త్వమును హితము నుపదేశింతురు. వారి కొకానొకపు డాహారాదులందు దుష్టాన్న సేవయు భ్రమప్రమాదాదులచే నొక ప్పుడు ప్రాణిపీడయు సంభవించును. అయినను నిరంతరబ్రహ్మనిష్ఠాసంపన్న మగు సమ్యగ్జ్ఞానముచే నిష్కలము నిష్క్రియము నిత్యకూటస్థాసంగచిద్రూపం బగు పర బ్రహ్మము నిదియే నే నని స్వస్వరూపంబున సాక్షాత్కరించినవారికి సదా తత్స్వ రూపంబుననే యుండువారికి అధిష్ఠానాదు లగు క్రియాకర్తృకారకాదులకంటె భిన్నుఁడే తా నని యకర్త అభోక్త యాకాశమువలె నక్రియుఁడు పరిపూర్ణుఁ డగు నాత్మనే సర్వదా చూచుచుండువారికిఁ బరమహంసపరివ్రాజకులకు స్వభిన్నములే యగు నధిష్ఠానాదులు చేయు పుణ్యపాపాదిక్రియలసంబంధలేశ మేనియు సంభవింపమి వలనఁ దన్నిమిత్త మగు నిష్టానిష్టఫలము కల్పింప శక్యము గాదు. ఇది బోధించుటకై మొదటఁ గర్మనివృత్తికిఁ గారణములఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—

సాంఖ్యే = సమ్యక్ ఖ్యాయతే — చక్కఁగాఁ జెప్పఁబడుచున్నది తెలుపఁబడుచున్నది ఆత్మానాత్మలతత్త్వము దీనిచేతఁ గావున సాంఖ్య మనఁగా వేదాంతశాస్త్రము, దాని యందు; కృతాన్తే = "నిష్కలం నిష్క్రియమ్, ఉపశాన్తోయమాత్మా, శివం శాన్తమ్, స్వాభావికీ జ్ఞాన బలక్రియాచ, నవద్వారే పురే దేహే నైవ కుర్వ న్నకా రయన్, నిత్య స్సర్వగత స్థాణుః, ప్రకృత్యైవచ కర్మాణి, ప్రకృతేః క్రియమాణాని, స్వభావస్తు ప్రవర్తతే" ఇత్యాదిగా కృతము—స్పష్టీకృతము ఆత్మానాత్మలయంతము— తత్త్వనిశ్చయము దేనియందో అది కృతాంతము, లేక, క్రియతే—చేయఁబడుచున్నది కావున కృత మనఁగా విహితనిషిద్ధాత్మక మగు కర్మము దానియొక్క అంతము — సమాప్తి "న తేషాం ధర్మాధర్మౌ, త్యజ ధర్మ మధర్మంచ" ఇత్యాదిక మగు నేశాస్త్రముచేతనో అది కృతాంతము, లేక, కృతముయొక్క — వైదిక మగు నిత్య నైమిత్తికాదికర్మముయొక్క, "సన్న్యస్య శ్రవణం కుర్యాత్" అనుటచే అంతము— సమాప్తి దేనియొక్క శ్రవణమునిమిత్తమో అది కృతాంతము, అట్టికృతాంత మగు, సర్వకర్మసమాప్తికారణ మగు; సాంఖ్యమునందు — వేదాంతమునందు; సర్వకర్మ ణాం సిద్ధయే = చలనాత్మకము లగు కర్మము లెన్ని గలవో ఆ కర్మము లన్నిటి యొక్కయు నివృత్తికొఱకు, క్రియామాత్రము సిద్ధించుకొఱ కనుట; ఇమాని = ఈ

వక్ష్యమాణములను; పఞ్చకారణాని; ప్రోక్తాని = క్రియాసంభవప్రకారము నెఱింగిన ఋషులచేతఁ జెప్పఁబడినవాని; చెప్పెదను; మే—నాయొక్క వచనమువలన; నిబోధ= అధిష్ఠానాదిస్వరూపమును క్రియానివృత్తివిధమును ఆత్మయొక్క యకర్తృత్వమును బండితులకును దుర్జ్ఞేయ మగుదాని నావచనమువలనఁ జక్కఁగా నెఱుంగుము, క్రియా నివృత్తికారణసామగ్రి నెఱింగి కర్మము తత్కృతం బని నిశ్చయించికొని యాత్మ యందుఁ గర్తృత్వభ్రమను బరిత్యజింపు మని యర్థము.

మ. అం దాత్మజ్ఞానరహితునకు సంసారిత్వమునకు హేతువు కర్మత్యాగా సంభవ మని చెప్పఁబడినది, నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః అని. అం దజ్ఞునకుఁ గర్మత్యాగాసంభవమునం దేమి హేతువు? కర్మహేతు వగు నధిష్ఠానాదిపంచకమునందుఁ దాదాత్మ్యాభిమానమే. అను నీయర్థమును నాలుగు శ్లోకములచేఁ బ్రపంచించుచున్నాఁడు. అందు మొదటిశ్లోకముచే నధిష్ఠానాదు లైదింటిని వేదాంతప్రమాణగమ్యములను హేయము లని తెలియుటకొఱకు నవశ్య మెఱుంగవలయు నని చెప్పుచున్నాఁడు.—ఇమాని — వక్ష్యమాణములను; పఞ్చ; సర్వకర్మణామ్; సిద్ధయే = నివృత్తికొఱకు; కారణాని = నిర్వర్తకములను; ఓ మహా బాహూ! మే=పరమాప్తుఁడను సర్వజ్ఞుఁడను నాయొక్క, వచనమువలన; నిబోధ = ఎఱుంగుటకు సావధానుఁడ వగుము. అత్యంతదుర్జ్ఞేయంబు లగునివి యవహితచిత్తుఁడు కానియెడ నెఱుంగ శక్యము గావు గదా యని చిత్తసమాధానము విధించుటచే వాని స్తుతించుచున్నాఁడు. మహాబాహు వనుటచే సత్పురుషుఁడై యెఱుంగఁజాలు వని సూచించుచున్నాఁడు స్తుత్యర్థమే. ఏమి యివి ప్రమాణరహితములా? నీవచన ముచేనేత నెఱుంగవలయునా? కా వని చెప్పుచున్నాఁడు.—సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని. నిరతిశయపురుషార్థప్రాప్తికొఱకును సర్వానర్థనివృత్తికొఱకును జ్ఞాతవ్యము లగు పదార్థములు—జీవుఁడు బ్రహ్మము తదైక్యము తద్బోధోపయోగిశ్రవణాదులును సంఖ్యాయన్తే — వ్యుత్పాదింపఁబడుచున్నవి దీనియందుఁ గావున సాంఖ్య మనఁగా వేదాంతశాస్త్రము, దానియందు. ఆత్మవస్తుమాత్రప్రతిపాదక మగు దానియందు అనాత్మభూతములును అవస్తువులును లోకసిద్ధములు నగు కర్మకారణము లైదు ఏల ప్రతిపాదింపఁబడుచున్నవి? అనఁగా నందులకై శాస్త్రమునకు విశేషణము కృతాన్తే అని. కృత మనఁగా కర్మము, దానియంతము — పరిసమాప్తి తత్త్వజ్ఞానోత్పత్తిచే దేనియందో అట్టి కృతాంత మగు వేదాంతశాస్త్రమునందు ప్రోక్తాని — లోకము నందుఁ బ్రసిద్ధములే. యనాత్మభూతములే యాత్మరూపంబున మిథ్యాజ్ఞానారోప

ముచే గ్రహింపఁబడినవి ఆత్మతత్త్వజ్ఞానముచే బాధ సిద్ధించుటకై హేయంబు లని చెప్పఁబడినవి. అన్యధర్మమే యగు కర్మ మాత్మయం దవిద్యాధ్యారోపితం బని చెప్పినం గదా శుద్ధాత్మజ్ఞానముచే నది బాధితమై కర్మమున కంతము కృతం బగును. అందువలన నాత్మకుఁ గర్మాసంబంధముఁ బ్రతిపాదించుటకై యనాత్మభూతములే యైదు కర్మకారణములు వేదాంతశాస్త్రమునందు మా.కూకల్పితము లనువదింపఁ బడినవి కావున నద్వైతాత్మమాత్రతాత్పర్యమునకు హాని లేదు, అవి తదంగములు గానే యితరస్థలమునందుఁ బ్రతిపాదితము లగుటవలన. ఇందును సర్వకర్మాంతత్వము జ్ఞానమునకుఁ బ్రతిపాదింపఁబడినది " సర్వం కర్మా ఽఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే " అని. అందువలన జ్ఞానశాస్త్రమునకుఁ గర్మాంతత్వ ముపపన్నము.

శ్రీ. ఓయీ! కర్మము చేయువానికిఁ గర్మఫలం బెట్లు లే కుండు నని యాశంకించి సంగత్యాగియు నిరహంకారుఁడునై యున్నవానికిఁ గర్మఫలముతో లేపము లే దని యుపపాదించుటకై చెప్పుచున్నాఁడు ఐదుశ్లోకములచేత.—సర్వకర్మణామ్; సిద్ధయే = నిష్పత్తికొఱకు; ఇమాని — వక్ష్యమాణము లగు; పఞ్చ; కారణాని; మే — నావచనమువలన; నిబోధ = ఎఱుంగుము. ఆత్మకుఁ గర్తృత్వాభిమాననివృత్తికొఱకు నవశ్యము వీని నెఱుంగవలయు నని వాని స్తుతించుటకై చెప్పుచున్నాఁడు. — సాంఖ్యే = సంఖ్యాయతే — ఎఱుంగఁబడుచున్నాఁడు పరమాత్మ దీనిచేతఁ గావున సాంఖ్య మనఁగా తత్త్వజ్ఞానము, దానియందు; కృత మనఁగా కర్మము, దానియంతము — పరిసమాప్తి దీనియందుఁ గావున కృతాంత మనఁగా వేదాంతసిద్ధాంత మని యర్థము, దానియందు; లేక, సంఖ్యాయన్తే — గణింపఁబడుచున్నవి తత్త్వములు దేనియందో అది సాంఖ్యము, కృతము — చేయఁబడినది అంతము — నిర్ణయము దేనియందో అది కృతాంతము, సాంఖ్యశాస్త్రమే, దానియందు; ప్రోక్తాని. అందువలనఁ జక్కగా నెఱుంగు మని యర్థము.

ప. ఓయీ! భోజనము చేయువానికిఁ దృప్తి కలుగుట ప్రత్యక్షమై యుండఁగా కర్మము చేయువానికి ఫలం బెట్లు లే కుండు నని యాశంకించి సంగత్యాగివై నిరహంకారుఁడై యుండువానికిఁ గర్మలేపము లే దని యుపపాదించుటకై చెప్పుచున్నాఁడు.—సర్వకర్మణామ్; సిద్ధయే = నిష్పత్తికొఱకు; ఇమాని — వక్ష్యమాణములను; పఞ్చకారణములను; మే — నావలననుండి; నిబోధ = ఎఱుంగుము. ఆత్మకుఁ గర్తృత్వాభిమానము నివర్తిల్లుటకై వీని నెఱుంగవలయు నని వాని స్తుతించుటకై చెప్పుచున్నాఁడు. — ఎట్టివాని? సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని. సంఖ్యా

యన్తే — పరిగణింపఁబడుచున్నవి తత్త్వములు దేనియందో అది సాంఖ్యము, కృతాంత మనఁగా సిద్ధాంతము దానియందు, వేదాంతసిద్ధాంతమునం దని యర్థము.

రా. ఇప్పుడు భగవంతుఁ డగు పురుషోత్తమునియందు అంతర్యామి యైన వానియందుఁ గర్తృత్వానుసంధానముచే నాత్మయం దకర్తృత్వానుసంధానప్రకారముఁ జెప్పుచున్నాఁడు దానివలననే ఫలకర్మములయందును మమతాపరిత్యాగం బగు నని. పరమపురుషుఁడు గదా తనజీవాత్మచేతను దనకరణకళేబరప్రాణముల చేతను తనలీలాప్రయోజనముకొఱకుఁ గర్మముల నారంభించుచున్నాఁడు. అందు వలన జీవాత్మగత మగు ఛున్నివృత్తి మొదలగు ఫలమును తత్సాధనభూత మగు కర్మమును బరమపురుషునికే. సంఖ్య యనఁగా బుద్ధి. సాంఖ్యే కృతాన్తే=యథావస్థితముగాఁ దత్త్వమును గ్రహించునట్టి వైదికబుద్ధిచే ననుసంధింపఁబడిననిర్ణయము నందు; సర్వకర్మణామ్; సిద్ధయే = ఉత్పత్తికొఱకు; ప్రోక్తాని; పఞ్చఏతాని * కారణాని; నిబోధమే = నావలననుండి యనుసంధింపుము. వైదిక మగుబుద్ధి శరీరేంద్రియప్రాణజీవాత్మ లుపకరణములుగాఁ గల పరమాత్మనే గదా కర్తనుగా నిశ్చయించుచున్నది, "య ఆత్మని తిష్ఠ న్నాత్మనో உన్తరో య మాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమయతి స త ఆత్మా உన్తర్యా మ్యమృతః, అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా" ఇత్యాదులందు.

మా. వెండియు సన్న్యాసమును బ్రపంచించుటకై కర్మకారణములఁ జెప్పుచున్నాఁడు పం చేత్యాదిగా. సాంఖ్యే కృతాన్తే = జ్ఞానసిద్ధాంతమునందు.

అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధమ్
వివిధా శ్చ పృథ క్చేష్టా దైవం చైవా உత్ర పఞ్చమమ్. ౧౪

భా. ఏవి యవి యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అధిష్ఠానమ్=ఇచ్ఛాద్వేషసుఖదుఃఖజ్ఞానాదులయభివ్యక్తి కాశ్రయము అధిష్ఠానము—శరీరము; తథా = అట్లు; కర్తా = ఉపాధిలక్షణుఁ డగుభోక్త; కరణంచ = శ్రోత్రాదికమును, శబ్దాద్యుపలబ్ధికొఱకు; పృథగ్విధమ్=నానాప్రకారము, పదిరెండుసంఖ్య గలది; వివిధాః = నానావిధము లయిన; పృథక్చేష్టాశ్చ = వేఱువేఱుచేష్టలును, వాయవీయము లగు ప్రాణాపానాదులును; దైవం

* పఞ్చైతాని యని కొంద ఱపాఠము.

చైవ = దైవమును గూడ; అత్ర=ఈ నాలుగింటియందు; పఞ్చమమ్ = ఐదవది, చక్షురాద్యనుగ్రాహక మగు నాదిత్యాదికము దైవము.

శరీరమును, బుద్ధ్యాద్యుపాధివిశిష్టుఁ డగుభోక్తయు, శ్రోత్రాదీంద్రియములు పండ్రెండును, ప్రాణాదిపంచవాయువులును, ఐదవది చక్షురాద్యనుగ్రాహక మగు నాదిత్యాదిదైవమును — ఈ యైదును కర్మకారణము లని తాత్పర్యము.

**ఆ.** కర్మార్థము లగు నధిష్ఠానాదులు ప్రమాణమూలకంబు లగుటవలన జ్ఞాతవ్యము లని చెప్పఁబడినది. ఇప్పుడు ప్రశ్నపూర్వకముగా విశేషించి వాని నిర్దేశించుచున్నారు ఏవి ఇత్యాదిగా. ఉపాధిలక్షణుఁడు — బుద్ధ్యాదిక ముపాధి, తల్లక్షణుఁడు — తత్స్వభావుఁడు, బుద్ధ్యాదుల ననుసరించువాఁడు తద్ధర్మములఁ దనయందుఁ జూచుచు నుపహితుఁడు బుద్ధ్యాదిప్రధానుఁ డని యర్థము. అందు కార్యలింగక మగు ననుమానమును సూచించుచున్నారు శబ్దా దీత్యాదిగా. జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు, మనస్సును బుద్ధియు నని పదిరెండు. చేష్టలవివిధత్వమునే స్పష్టీకరించుచున్నారు వాయవీయములు ఇత్యాదిగా. పృథక్ అనఁగా అసంకీర్ణము లని యర్థము, ప్రాణాపానాదిచేష్టలు పరస్పరసంకీర్ణములు కావు గదా! దైవమును విశదీకరించుచున్నారు చక్షురా దీత్యాదిగా.

**హ.** అవి యేవి యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అధిష్ఠానమ్ = శరీరము; తథా; కర్తా = ఎవ్వఁడ నే నింకుల కీశ్వరుఁడ నని తలంచుచున్నాఁడో అతఁడు; కరణంచ = శ్రోత్రాదికమును; పృథగ్విధమ్ — అయిదు విధములు; వివిధాః = నానా ప్రకారము లగు; పృథక్ చేష్టాః = ప్రాణాదివాయువులప్రవృత్తులు; అత్ర=ఈ కారణ వర్గమునందు; ఐదవది దైవము.

**శం.** అవి యేవి యని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు.—అధిష్ఠానమ్= సుఖదుఃఖభోగాయతనము, లేక, కరణముల కాశ్రయము, శరీరము; తథాశబ్దము చేకారార్థము గలది; కర్తా = కర్త భోక్త యని తలంచువాఁడు సాభాసాహంకారము విజ్ఞానాత్మయును; పృథగ్విధమ్ = బాహ్యాంతరభేదమున రెండువిధములుగా విభక్త మగు; కరణంచ — జ్ఞానేంద్రియము లైదు కర్మేంద్రియము లైదు మనోబుద్ధులు నని ద్వాదశవిధ మగు కరణంబును; పృథక్=పదివిధములుగా భిన్నమయిన; ఊర్ధ్వాదిగతిభేదమున, వివిధా = నానాప్రకార మగు; చేష్టాచ = వాయుచేష్టావిశేషము, ప్రాణాదులును నాగాదులును పది; అత్ర = క్రియానిష్పత్తికారణము లని

చెప్పఁబడిన యీ యధిష్ఠానాదులు నాలుగింటియందు; చకారము తు శబ్దార్థము; ఏవ కారము అతిరిక్తమును వ్యవచ్ఛేదించుచున్నది, పఞ్చమంచ = ఐదవదియో; దైవ మేవ = శ్రోత్రాదీంద్రియప్రవర్తక మగు దిగ్వాతార్కాదిరూపము సర్వకరణసిద్ధి కారణము దైవమే ఇతరము లేదని యర్థము. పఞ్చైతాని యని పంచత్వసంఖ్య చేతనే కారణాంతరము లేదని సిద్ధించుచున్నను వెండియు నేవకారము పురుషునకు నేను దీనిఁ జేయుచున్నా నని దుష్టాదుష్టకర్మమునందుఁ గర్తృత్వభ్రమను దొలఁ గించుటకు. ఓయీ! అదృష్టేశ్వరాదులకుఁ గూడఁ గ్రియాసిద్ధికారణత్వము సంభ వించుటవలనఁ బంచసంఖ్యావధారణముచే నతిరిక్తవ్యవచ్ఛేద మనుపపన్నమే యగు నందువేని సత్యము. "బలా ద్దైవేన నీయతే, ఏష ఏవ సాధు కర్మ కారయతి" అని శ్రుత మగుటవలన నదృష్టేశ్వరాదులకును గారణత్వ ముండనేయున్నది. అయినను, "యో దిక్షు తిష్ఠ న్దిగ్భ్యో ఽ న్తరః" అని యీశ్వరునకు దిగాద్యంతర్యామిత్వము శ్రుత మగుటవలనఁ దదంతస్థుఁ డగుటచే నాదిగాద్యధిదైవతములయందే యంత ర్భావము. కర్త్రాశ్రయం బగుటవలన నదృష్టమునకుఁ గర్తయం దంతర్భావము. కావున ననుపపత్తి యేదియు లేదు. అందువలన నధిష్ఠానాదు లైదే సర్వకర్మనిష్పత్తి కారణంబు లని సిద్ధము.

మ. ప్రమాణమూలకంబు లగు కర్మకారణంబుల నైదింటిని ఆత్మ కకర్తృ త్వము సిద్ధించుటకై యెఱుంగవలయు నని చెప్పిన పిమ్మట నేవి యవి యని యపేక్ష కలుగుటచేఁ దత్స్వరూపముఁ జెప్పుచున్నాఁడు రెండవశ్లోకముచేత.—ఇచ్ఛాద్వేష సుఖదుఃఖచేతనాద్యభివ్యక్తి కాశ్రయము, అధిష్ఠాన మనఁగా శరీరము; తథా కర్తా—ఎట్లు అధిష్ఠానము అనాత్మయు భౌతికంబును స్వప్నమునందలి గృహరథాదికమువలె మాయాకల్పితంబు నగుచున్నదో అట్లు కర్తయు — నేను జేయుచున్నా నను నభి మానము గలవాఁడు జ్ఞానశక్తిప్రధానాఽపంచీకృతపంచభూతకార్యభూతుఁడు అం తఃకరణము బుద్ధి విజ్ఞానము ఇత్యాదిపర్యాయశబ్దవాచ్యుఁడు తాదాత్మ్యాధ్యాసముచే ఆత్మయందుఁ గర్తృత్వాదిధర్మాధ్యారోపహేతువు అనాత్మయు భౌతికుండును మాయాకల్పితుండు నని తథాశబ్దార్థము. స్థూలశరీరమును లోకాయతికు లాత్మ యని పరిగ్రహించినను ఇతరు లగు పరీక్షకు లనాత్మ యని నిశ్చయించుటవలనఁ దద్దృ ష్టాంతమునఁ దార్కికాదులచే నాత్మయని పరిగ్రహింపఁబడినకర్తనుగూడ అనాత్మ యని నిశ్చయించుట సుకరం బని యర్థము. కరణంచ=శ్రోత్రాదికము శబ్దాద్యుపలబ్ధి సాధనము, చశబ్దము తథాశబ్దము ననుకర్షించుచున్నది; పృథగ్విధమ్ = నానాప్రకా

రము, ఐదు జ్ఞానేంద్రియములు ఐదు కర్మేంద్రియములు మనసును బుద్ధియు నని పది రెండు. కరణవర్గమునందు మనస్సును బుద్ధియు ననునవి వృత్తివిశేషములు, వృత్తి మంతమో అహంకారము కర్తయే; చిదాభాసుఁడో సర్వత్ర సమానుఁడు. వివిధాః= నానాప్రకారములు, ఐదువిధము లనికాని పదివిధము లనికాని ప్రసిద్ధములు; చశబ్దము తథా అని యనుకర్షార్థము; పృథక్=అసంకీర్ణములు; చేష్టాః=క్రియారూప ములు క్రియాశక్తి ప్రధానాఽపంచీకృత పంచమహాభూతకార్యములు, క్రియాప్రా ధాన్యంబున వాయవీయంబు లని వ్యపదేశింపఁబడునవి ప్రాణాపానవ్యానోదానసమా నములు, నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయాఖ్యములును తదంతర్భూతములే, ఇట సుషుప్తియందుఁ గర్త కంతఃకరణమునకు లయము కలిగినను ప్రాణవ్యాపారము కనఁబడుటవలనను భేదము చెప్పఁబడుటవలనను అంతఃకరణముకంటె నత్యంతభిన్నమే ప్రాణ మని కొందఱు. క్రియాశక్తి జ్ఞానశక్తిమంత మొక్కటియే జీవత్వోపాధి భూతం బపంచీకృతపంచమహాభూతకార్యము, క్రియాశక్తి ప్రాధాన్యముచేఁ బ్రాణ మనియు జ్ఞానశక్తిప్రాధాన్యముచే నంతఃకరణ మనియు వ్యపదేశింపఁబడు నని యభి యుక్తులు. "స ఈక్షాం చక్రే కస్మి న్నహ ముత్క్రాన్త ఉత్క్రాన్తో భవిష్యామి కస్మి న్వా ప్రతిష్ఠితే ప్రతిష్ఠాస్యా మీతి స ప్రాణ మసృజత "* అనుశ్రుతియం దుత్క్రాంత్యాద్యుపాధిత్వము ప్రాణమునకుఁ జెప్పఁబడినది. "సధీః స్వప్నో భూ త్వేమం లోక మతిక్రామతి మృత్యోరూపాణి ధ్యాయతీవ లేలాయతీవ" • ఇత్యాది శ్రుతియం దుత్క్రాంత్యాద్యుపాధిత్వము బుద్ధికిఁ జెప్పఁబడినది. స్వతంత్ర ముపాధిభేద మున్ననో జీవభేదము ప్రసక్తించును. అందువలన బుద్ధిప్రాణంబుల కేకత్వంబుననే యుత్క్రాంత్యాద్యుపాధిత్వము యుక్తము. భేదవ్యపదేశమో శక్తి భేదమువలన నుపపన్నము. సుషుప్తియందును జ్ఞానశక్తిభాగమునకు లయము కలిగి నను క్రియాశక్తిభాగము కనఁబడుట యేకత్వమునందును విరుద్ధము కాదు, అను భవసిద్ధ మగుటవలనను, దృష్టిసృష్టినయమునందు సర్వాలయము కలిగినను ప్రాణ వ్యాపారమువలె శరీరము సుషుప్తుం డితఁ డని పరులచేఁ గల్పితం బగుటవలనను. అందువలన రెండువిధంబులను వ్యపదేశభేదం బుపపన్నము. దైవమ్=అనుగ్రాహక దేవతాసమూహము; చశబ్దము తథా యనుట ననుకర్షించుచున్నది; అత్ర = ఈ

* అతఁ డాలోచించెను — ఏది యుత్క్రమించినప్పుడు నే నుత్క్రమింతును? ఏది ప్రతిష్ఠిత మైన ప్పుడు నేను బ్రతిష్ఠితుఁడ నగుదు నని, అతఁడు ప్రాణమును సృజించెను.

• అతఁడు బుద్ధిరూపుఁడై స్వప్నమై యీలోకము నతిక్రమించుచున్నాఁడు మృత్యురూపములను ధ్యానించుచున్నాఁడో ఆశపడుచున్నాఁడో అనునట్లు.

కారణవర్గమునందు; పఞ్చమమ్ = ఐదవది, ఏవశబ్దము తథాశబ్దముతో సంబంధించి యైదింటికిని అనాత్మత్వ భౌతికత్వ కల్పితత్వా ద్యవధారణార్థము. అందుఁ గర్తృ కరణక్రియాధిష్ఠాన మగు శరీరమునకు దేవత పృథివి, "యత్రాస్య పురుషస్య మృత స్యాగ్నిం వా గప్యేతి వాతం ప్రాణ శ్చక్షు రాదిత్యం దిశ శ్శ్రోత్రం మన శ్చన్ద్రం పృథివీం శరీరమ్" అను శ్రుతి వాగాద్యధిష్ఠాత లగు నగ్న్యాదులతోఁ గూడ శరీరా ధిష్ఠాత్రిగాఁ బృథివి పఠిత యగుటవలన. కర్త యగు నహంకారమున కధిష్ఠాతృదేవత రుద్రుఁడు పురాణాదిప్రసిద్ధుఁడు. కరణంబుల యధిష్ఠాతృదేవతలును సుప్రసిద్ధులు, శ్రోత్రత్వక్చక్షూరసనఘ్రాణంబులకు దిగ్వాతార్కప్రచేతో౽శ్వులు, వాక్పాణిపాద పాయూపస్థంబులకు అగ్నీంద్రోపేంద్రమిత్రప్రజాపతులు, మనోబుద్ధులకుఁ జంద్ర బృహస్పతులు, క్రియారూపము లగు పంచప్రాణములకు సద్యోజాతవామదేవా ఘోరతత్పురుషేశానులు పురాణప్రసిద్ధులు. భాష్యమునందు "దైవ మాదిత్యాది చక్షురా ద్యనుగ్రాహక" మ్మనుట యధిష్ఠానాదిదేవతలకు నుపలక్షణము.

శ్రీ. వానినే చెప్పుచున్నాఁడు.—అధిష్ఠానమ్ = శరీరము; కర్తా = చిజ్జడ గ్రంథి యగు నహంకారము; పృథగ్విధమ్ = అనేకప్రకార మగు; కరణమ్ = చక్షు శ్శ్రోత్రాదికము; వివిధాశ్చ; కార్యమువలనను స్వరూపమువలనను పృథగ్భూతము లగు, చేష్టాః = ప్రాణాపానాదులవ్యాపారము; అత్రైవ = వీనియందే; దైవంచ; పఞ్చమమ్ = ఐదవకారణము. దైవము – చక్షురాద్యనుగ్రాహక మగు నాదిత్యాది కము, లేక, సర్వప్రేరకుఁ డగు నంతర్యామి.

ప. *

రా. ♦

మా. అధిష్ఠానమ్ = దేహాదికము; కర్తా = విష్ణువు, అతఁడు సర్వకర్త యని గదా చెప్పఁబడినది. జీవుఁ డకర్త యనుటకుఁ బ్రమాణము చెప్పఁబడినది. కరణంచ = ఇంద్రియాదికమును; చేష్టాః = క్రియలు, హస్తాదిక్రియలచే హోమాదికర్మము లగుచున్నవి. ధ్యానాదులకును మానసచేష్ట కారణము. పూర్వతనం బగుచేష్టయు సంస్కారకారణముగా నున్నది. దైవమ్=అదృష్టము. అట్లాయాస్యశ్రుతి "దేహో బ్రహ్మో త్వేన్ద్రియాద్యాః క్రియాశ్చ తథా ఽదృష్టం పఞ్చమం కర్మహేతుః" అని.

* శ్రీధరీయముతో సమానము.

♦ ఈ భాష్యమున నీశ్లోకమునకుఁ బైశ్లోకముతోఁ జేర్చి వ్యాఖ్యానము చేయఁబడినది.

శరీరవాఙ్మనోభి ర్య త్కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః. ౧౫

**భా.** శరీరవాఙ్మనోభిః = దేహముచేతను వాక్కుచేతను మనస్సుచేతను, ఈ మూఁడింటిచేతను; యత్ = ఏ; కర్మ=కర్మమును; నరః=మనుష్యుఁడు; ప్రారభతే = నిర్వర్తించుచున్నాఁడో; న్యాయ్యంవా = ధర్మ్యమును గాని, శాస్త్రీయమును గాని; విపరీతంవా = అధర్మ్యమును అశాస్త్రీయమును గాని; మఱియు నేది నిమేషచేష్టాదికము జీవనహేతువు కలదో అదియుఁ బూర్వకృత ధర్మాధర్మములకార్యమే కావున న్యాయ్యవిపరీతగ్రహణముచేతనే గ్రహింపఁబడినది; ఏతే = పూర్వోక్తములు; పఞ్చ = అయిదు; తస్య = ఆ సర్వకర్మమునకు; హేతవః=కారణములు. ఓయీ! అధిష్ఠానాదులు సర్వకర్మములకును గారణములు, శరీరవాఙ్మనోభిః కర్మ ప్రారభతే అని యెట్లు చెప్పవచ్చును? ఇది దోషము కాదు. విధిప్రతిషేధరూప మయిన సర్వకర్మమును శరీరాదిత్రయప్రధానము, జీవనలక్షణ మగు దర్శనశ్రవణాదికంబును తదంగము లగుటచే మూఁడే రాసులుగాఁ జేసి చెప్పఁబడినది శరీరవాఙ్మనోభిః ప్రారభతే అని. ఫలకాలమునందును తత్ప్రధానములచేతనే * భుజింపఁబడుచున్నవి కావున నైదే హేతువు లనుట విరుద్ధము కాదు.

మనుష్యుఁడు వాఙ్మనఃకాయములమూఁటిచే నేకర్మము చేయుచున్నాఁడో అది ధర్మ్య మైనను అధర్మ్య మైనను ఆ సర్వకర్మమునకును ఈ యధిష్ఠానాదు లైదే కారణము లని తాత్పర్యము.

**శ్రీ.** ఈ చెప్పిన యధిష్ఠానాదు లైదును సర్వకర్మసిద్ధ్యర్థము లనుటను స్ఫుటీకరించుచున్నారు శరీరేత్యాదిగా. ఓయీ! జీవనకృత మగు నిమేషోన్మేషాదికము కర్మాంతరము సాధారణము కలదు, ఎట్లు రెండురాసులే యనవచ్చును? అనఁగాఁ జెప్పుచున్నారు మఱియు నిత్యాదిగా. అధిష్ఠానాదులు కర్మమాత్రమునకు హేతువు లనుట నంగీకరించి కర్మహేతువులు శరీరాదిత్రివిధంబు లనుట యయుక్తమని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. పూర్వాపరవిరోధమును బరిహరించుచున్నారు ఇది దోషము కా దని. ఓయీ! జీవనకృతంబు లగు స్వాభావికకర్మ

* అధిష్ఠానాదిప్రధానములచేతనే.

ములు దర్శనాదులు విధినిషేధబాహ్యంబు లగుటవలన దేహాదినిర్వర్త్యములు కావని యాశంకించి చెప్పుచున్నారు తదంగములు ఇత్యాదిగా. ఆ దేహాదిత్రయమునకుఁ బ్రధానమున కంగములు చక్షురాదులు, తన్నిష్పాద్య మగుటచే జీవనకృత మగు దర్శనాదికము ప్రధానకర్మమునం దంతర్భూతము కావునఁ ద్వైవిధ్య మవిరుద్ధ మని యర్థము. దేహాద్యారబ్ధ మగు త్రివిధ మైనకర్మమునందు సర్వకర్మములకు నంతర్భావ మైనను ఎట్లు అధిష్ఠానాదు లైదింటికే తద్ధేతుత్వ మగును? ఫలోపభోగకాలమునందుఁ గారణాంతరాపేక్ష సంభవించుటవలన నని యాశంకించి జన్మకాలభావియు భోగకాలభావియు నగు సర్వకారణంబును వానియందే యంతర్భవించుటవలన నట్లు కా దని చెప్పుచున్నారు ఫ లేత్యాదిగా.

హ. శరీరవాఙ్మనోభిః = శరీరముచేతను వాక్కుచేతను మనస్సుచేతను; యత్; కర్మ — క్రియారూపమును; ప్రారభతే నరః; న్యాయ్యంవా = శాస్త్రీయమును గాని; విపరీతంవా = అశాస్త్రీయమును గాని; తస్య = ఆ కర్మమునకు; ఏతే పఞ్చ హేతవః.

శం. చెప్పినయర్థమునే స్పష్టీకరించుచున్నాఁడు.—నరః=బాహ్యదృష్టిచేఁ గర్మము చేయునట్టి పురుషుఁడు; శరీరవాఙ్మనోభిః = తత్కర్మణా కరోతి యనుశ్రుతివలన నిట శరీరపదముచే వాగ్వ్యతిరిక్తము లగు నింద్రియములు గ్రహింపఁబడుచున్నవి, శరీరముచేతను — ఇంద్రియములచేతను వాక్కుచేతను మనస్సుచేతను; బుద్ధిపూర్వకముగా, న్యాయ్యంవా = శాస్త్రీయమును గాని; విపరీతంవా = నిషిద్ధమును గాని; యత్కర్మ; ప్రారభతే=చేయుచున్నాఁడో; తస్య = ఆ కరణత్రయనిర్వర్త్య మగు కర్మమునకు విహితమునకుఁ గాని నిషిద్ధమునకుఁ గాని యితరమునకుఁ గాని సర్వమునకును; ఏతే = ఈ యధిష్ఠానాదులు; పఞ్చ; హేతవః = కారణము లగుచున్నవి. ఓయీ! సర్వకర్మమును గరణసాధ్య మని సిద్ధ మైనపుడు అధిష్ఠానాదులు కారణము లని చెప్పుట వ్యర్థమే యగు నందువేని. సత్యము. విహితము గాని ప్రతిషిద్ధము గాని యేది పురుషునిచేతఁ జేయఁబడుచున్నదో అదియుం తయుఁ గరణత్రయముచేతనే సిద్ధించుచున్నది. అయినను "యద్ధి మనసా ధ్యాయతి తద్వాచా వదతి తత్కర్మణా కరోతి" అను న్యాయంబున బుద్ధిపూర్వక మగు కర్మమే కరణత్రయసాధ్యం బగుఁగాని యబుద్ధిపూర్వకకర్మము కాదు. క్షుతజృంభణాదులును * మఱియు నుచ్ఛ్వాసనిశ్శ్వాసోన్మేషాదులును స్వాభావికక్రియ లగుటవలనఁ గరణ

* తుమ్ము ఆవులింత మొదలగునవి.

త్రయసాధ్యములు కామివలనను గర్త్రైకసాధ్య మగు ఫలానుభవక్రియయుఁ దత్సాధ్యము కామివలనను గరణత్రయమునకుఁ జేష్టామాత్రకారణత్వము సంభవింపదు. అందువలననే చెప్పఁబడినది "శరీరవాఙ్మనోభి ర్యత్కర్మ ప్రారభతే నరః । పఞ్చైతే తస్య హేతవః" అని. అందుచే శరీరాదులకుఁ బృథక్కారణత్వము లేమివలనఁ దత్కృతకర్మమునకును ఇవియే కారణంబు లని సూచితం బగుచున్నది. అందువలనఁ బురుషాదృష్టానురూపముగా సర్వకర్మనిష్పాదకంబులును బుణ్యాపుణ్యకర్మఫలానుభావకంబులును దదనుభవితలును అధిష్ఠానాదులే యని సిద్ధము.

మ. స్వరూపముఁ జెప్పి యా యైదింటికిని గర్మహేతుత్వముఁ జెప్పుచున్నాఁడు తృతీయశ్లోకముచేత.—శారీరము వాచికము మానసిక మని విధిప్రతిషేధలక్షణ మగు కర్మము త్రివిధం బని ధర్మశాస్త్రములయందుఁ బ్రసిద్ధము. అక్షపాదునిచేతనుం జెప్పఁబడినది "ప్రవృత్తి ర్వాగ్బుద్ధి శరీరారమ్భః" * అని. బుద్ధి — మనస్సు. అందువలనఁ బ్రాధాన్యాభిప్రాయమునఁ జెప్పఁబడుచున్నది. శరీరముచేతఁ గాని వాక్కుచేతఁ గాని మనస్సుచేతఁ గాని, యత్కర్మ; ప్రారభతే = నిర్వర్తించుచున్నాఁడో; నరః = మనుష్యుఁడు, శాస్త్రము మనుష్యాధికారికం బగుటవలన. ఎట్టి కర్మమును? న్యాయ్యంవా = శాస్త్రీయమును ధర్మమును గాని; విపరీతంవా = అశాస్త్రీయమును అధర్మమును గాని; నిమేషచేష్టాదికము జీవనహేతు వేది గలదో మఱియు నితరము విహితప్రతిషిద్ధసమం బేది గలదో అది యంతయుఁ బూర్వకృతధర్మాధర్మములకార్యమే కావున న్యాయ్యవిపరీతములయందే యంతర్భూతము. పఞ్చ; ఏతే — యథోక్తము లగు నీయధిష్ఠానాదులు; తస్య = ఆసర్వకర్మమునకును; హేతవః — కారణములు.

శ్రీ. ఇవియే సర్వకర్మహేతువు లని చెప్పుచున్నాఁడు.—యథోక్తము లగు నైదింటిచేఁ బ్రారంభింపఁబడుకర్మమునకు మూఁటియందే యంతర్భావము చేసి శరీరవాఙ్మనోభిః అని చెప్పఁబడినది, శారీరమును వాచికమును మానసమును త్రివిధము కర్మ మని ప్రసిద్ధ మగుటవలన. శరీరాదులచే నేకర్మమును ధర్మ్యమును గాని యధర్మ్యమును గాని నరుఁడు చేయుచున్నాఁడో ఆ సర్వకర్మమునకును ఇవి యైదు హేతువులు.

ప. ♦

---

* వాక్కుయొక్కయు బుద్ధియొక్కయు శరీరముయొక్కయు నారంభము ప్రవృత్తి.

♦ విశేషము లేదు.

రా. అట్టి దీనిఁ జెప్పుచున్నాఁడు.—న్యాయ్యమునందు – శాస్త్రసిద్ధమునందుఁ గాని, విపరీతమునందు – ప్రతిషిద్ధమునందుఁ గాని, సర్వకర్మమునందును శారీరమునందును వాచికమునందును మానసమునందును ఇవి యైదుహేతువులు. అధిష్ఠానమ్ = శరీరము, అధిష్ఠీయతే – అధిష్ఠింపఁబడుచున్నది జీవాత్మచేతఁ గావున మహాభూతసంఘాతరూప మగు శరీర మధిష్ఠానము; తథా; కర్తా = జీవాత్మ, ఈ జీవాత్మకు జ్ఞాతృత్వమును కర్తృత్వమును "జ్ఞో ఽత ఏవ, కర్తా శాస్త్రార్థవత్త్వాత్" అను సూత్రములచే నుపపాదింపఁబడినవి. కరణంచ పృథగ్విధమ్ – వాక్పాణిపాదాదిపంచకము కర్మేంద్రియము మనస్సహితము, పృథగ్విధము – కర్మనిష్పత్తియందుఁ బృథగ్వ్యాపారములు గలది. వివిధాచ పృథక్చేష్టా – చేష్టాశబ్దముచేఁ బంచాత్మక మగు వాయువు చెప్పఁబడుచున్నది, చేష్టాశబ్దము తద్వృత్తివాచక మగుటచేత, శరీరేంద్రియధారణంబును ప్రాణాపానాదిభేదభిన్నంబు నగు పంచాత్మకమైనవాయువుయొక్క-వివిధచేష్ట – వివిధవృత్తి; దైవం చై వాత్ర పఞ్చమమ్ – ఈ కర్మహేతుకలాపమునందు దైవము పంచమము, అంతర్యామి యగు పరమాత్మ కర్మనిష్పత్తియందుఁ బ్రధానహేతు వని యర్థము. చెప్పఁబడినది గదా! "సర్వస్యచా ఽహం హృది సన్నివిష్టో మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనంచ" అని. చెప్పఁబోవుచున్నాఁడు గూడ "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి। భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా" అని. జీవాత్మయొక్క-కర్తృత్వంబును బరమాత్మాధీనం బను "పరా త్తు త చ్ఛ్రుతేః" అను సూత్రముచే నుపపాదింపఁబడినది. ఓయీ! ఇట్లు జీవాత్మకర్తృత్వము పరమాత్మాధీన మనునెడ జీవాత్మ కర్మమునం దనియోజ్యుఁ డగును గావున విధినిషేధశాస్త్రము లనర్థకములగును. ఈ చోద్యము గూడ సూత్రకారునిచేఁ బరిహరింపఁబడినది "కృతప్రయత్నాపేక్షస్తు విహిత ప్రతిషిద్ధవై యర్థ్యాదిభ్యః" అని. ఇది యభిప్రాయము. పరమాత్మచే దత్తములును తదాధారంబులును తదాహితశక్తులు నగు కరణకళేబరాదులచేఁ దానును జీవాత్మ తదాధారుఁడు తదాహితశక్తియునై కర్మనిష్పత్తికొఱకు స్వేచ్ఛచేఁ గరణాద్యధిష్ఠానాకారం బగు ప్రయత్నమును జేయుచున్నాఁడు. తదంతరవస్థితుఁ డగు పరమాత్మ తదనుమతిదానముచే వానిఁ బ్రవర్తింపఁజేయుచున్నాఁడు. కావున జీవునకును స్వబుద్ధిచేతనే ప్రవృత్తిహేతుత్వము కలదు. ఎట్లు మహత్తరములగు శిలావృక్షాదులఁ గదలించుట మొదలగు ప్రవృత్తులయందుఁ బెక్కండ్రకు హేతుత్వమును విధినిషేధభాగిత్వంబును సంభవించుచున్నదో అట్లు.

మూ. *

తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః
పశ్య త్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః. ౧౬

భా. తత్ర — ఇది ప్రకృతమునకు సంబంధించుచున్నది. తత్ర = ఆ సర్వకర్మము; ఏవమ్=యథోక్తము లగు నైదింటిచే నిర్వర్త్యము; సతి= అగుచుండఁగా; తత్రైవం సతి యని దుర్మతిత్వమునకు హేతువై సంబంధించుచున్నది; వానియందు ఆత్మను అనన్యునిఁగా నవిద్యచేఁ బరికల్పించి వానిచేఁ జేయఁబడుకర్మమునకు నేనే కర్త నని, కర్తారమ్ = కర్తనుగా; ఆత్మానమ్ = తన్ను; కేవలంతు = శుద్ధుఁ డైనవానినే; యః = ఎవఁడు; పశ్యతి=చూచుచున్నాఁడో, అవిద్వాంసుఁడు; ఎందువలన? వేదాంతాచార్యోపదేశన్యాయములచేత, అకృతబుద్ధిత్వాత్ = అసంస్కృత మైన బుద్ధి గలవాఁ డగుటవలన; మఱియు నెవఁడు దేహాదివ్యతిరిక్తాత్మవాది యన్యుం డగు నాత్మనే కేవలునిఁ గర్తనుగాఁ జూచుచున్నాఁడో, అతండును అకృతబుద్ధియే. అందువలన అకృతబుద్ధి యగుటవలన, సః=అతఁడు; నపశ్యతి = చూడఁడు, ఆత్మతత్త్వమును గాని కర్మతత్త్వమును గాని యని యర్థము. అందువలన, దుర్మతిః = దుష్టము — కుత్సితము విపరీతము ఎల్లప్పుడును జననమరణప్రాప్తిహేతుభూత మగు మతి గలవాఁ డతఁడు. చూచుచున్నను జూడఁడు — ఎట్లు తైమిరికుఁ డనేకుఁ డగుచంద్రుని, ఎట్లు మఱిమేఘంబులు పరువిడుచుండఁగాఁ బరువిడుచంద్రుని, మఱియు వాహనంబునఁ గూర్చున్నవాఁడు అన్యులు పరువిడుచుండఁగాఁ దాను బరువిడుచున్నాఁ డని.

ఇట్లు సమస్తకర్మమునకు నధిష్ఠానాదులే కర్తలై యుండఁగా శాస్త్రాచార్యోపదేశమువలన సంస్కారము నొందని వాఁ డగుటచే నెవఁడు ఆ యధిష్ఠానాదులయందుఁ దన్నభేదంబునఁ గల్పించికొని యవి చేయుకర్మములఁ దాను జేయుచున్నా నని శుద్ధుఁ డైనయాత్మనే కర్తనుగాఁ దలంచుచున్నాఁడో అతం డాత్మతత్త్వమును గాని కర్మతత్త్వమును గాని యెఱుంగఁడు, ఎల్లప్పుడు జననమరణప్రాప్తిహేతు వగు బుద్ధిగలవాఁ డగుటవలన దుర్మతి యతం డని తాత్పర్యము.

* ఈ శ్లోకమునకు శ్రీభాష్యము లేదు

ఆ. క్రియాకర్తృత్వము నధిష్ఠానాదులకుఁ బ్రతిపాదించి యవిద్వాంసు నకు వానియం దాత్మదృష్టి ననువదించుచున్నారు త త్రేత్యాదిగా. తత్పదపరా మర్శయోగ్యము ప్రకృతము. ప్రతీకమును గ్రహించి పూర్వముతోఁగూడ నక్షరార్థము చెప్పుచున్నారు ఏవ మిత్యాదిగా. ఉక్తరీతిచే నధిష్ఠానాదులకే కర్తృత్వముండఁగా అన్యగత మగు కర్తృత్వము నెందువలన నాత్మయం దధ్యారోపించి చూచుచున్నాఁడో అందువలన నాత్మయందుఁ గర్తృత్వముఁ జూచువాఁడు దుర్మతి యని చెప్పుచున్నారు త త్రైవ మిత్యాదిగా. కర్తార మిత్యాదికమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు వానియందు ఇత్యాదిగా. వానియందు—ఆ యధిష్ఠానాదుల యందు. వానిచే — ఆరోపితాత్మభావము లగు నాయధిష్ఠానాదులచే నని యర్థము. అకర్త యగు నాత్మను కర్తనుగాఁ జూచుటకుఁ బ్రశ్నద్వారమున హేతువుఁ జెప్పుచున్నారు ఎందువలన నిత్యాదిగా. ఓయీ! శాస్త్రసంస్కృతబుద్ధియే యతిరిక్తాత్మవాది కర్తృత్వము నాత్మ కంగీకరించుచున్నాఁడు, ఇతఁడు కర్తృత్వము నాత్మయందుఁ జూచువాఁ డయ్యు నసంస్కృతబుద్ధి కాఁడు అనఁగాఁ జెప్పుచున్నారు మఱియు నెవఁడు ఇత్యాదిగా. వాఁడును శాస్త్రపూర్వకముగా నాచార్యోపదేశము చేతను దదనుసారిన్యాయములచేతను అనాహితబుద్ధి యగుటవలన నకృతబుద్ధియే యనుట సిద్ధ మని యర్థము. ఆత్మతత్త్వమును — యాథాత్మ్యమును, కూటస్థతను. కర్మతత్త్వమును — అవిద్యాకల్పితాధిష్ఠానాదికృతం బగుటచే ఆత్మసంబంధి కాకుండుటను. అందువలన — ఆత్మకర్మములతత్త్వము నెఱుంగమివలన. దుష్టత్వమును స్పష్టీకరించుటకై దుర్మతిత్వమును వివరించుచున్నారు జన నేత్యాదిగా. నేను గర్త నని యాత్మను జూచుచున్నను అవిద్వాంసున కాత్మదర్శనము లే దనుటకు దృష్టాంతముఁ జెప్పుచున్నారు ఎట్లు అని. తిమిరోపహతచక్షువు అనేకుఁ డగు చంద్రునిఁ జూచుచున్నను తత్త్వంబునఁ జంద్రునిఁ జూడఁడు, అట్లు అవిద్వాంసుఁ డాత్మను గర్తనుగాఁ జూచుచున్నను దత్త్వమున నాత్మను జూడఁ డని యర్థము. అధిష్ఠానాదులం దవిద్యచే సంబద్ధాత్ముఁడు స్వాత్మయం దధిష్ఠానాదిగతం బగు క్రియ నారోపించుటకు దృష్టాంతముఁ జెప్పుచున్నారు ఎట్లు మఱి ఇత్యాదిగా. అన్యు లగు వాహకపురుషులు ధావనము చేయుచుండఁగా వాహనంబున నున్నవాఁడు ఎట్లు స్వాత్మను ధావనకర్తనుగా నవివేకమువలనఁ దలంచుచున్నాఁడో అట్లధిష్ఠానాదులు క్రియాకర్త లగుచుండఁగా లిద్గతుం డగు స్వాత్మను గర్తనుగాఁ దలంచువాఁడు దుర్మతి యని యర్థము.

హ॰ తత్ర ఏవం సతి = కర్మ మిట్టిదై యుండఁగా; కర్తారమ్ = క్రియానిష్పత్తికారణమునుగా; ఆత్మానమ్ = ప్రత్యగ్బోధరూపుని; కేవలంతు — అసహాయుఁడే యైనవాని; యః పశ్యతి = ఎవఁ డెఱుంగుచున్నాఁడో; అకృతబుద్ధిత్వాత్ = శాస్త్రాచార్యోపదేశములచే నసంస్కృత మైనబుద్ధి గలవాఁ డగుటవలన. న స పశ్యతి = అతం డెఱుంగఁడు; దుర్మతిః. ఆత్మకుఁ గర్తృత్వ మవిద్యాకృతము, వాస్తవ మగు కర్తృత్వ మాత్మకు లే దని యాత్మను నిత్యశుద్ధబుద్ధముక్తస్వరూపునిఁగా నెఱుంగునట్టి సాంఖ్యజ్ఞాననిష్ఠుఁ డగు యోగికి సకలకర్మసన్న్యాసమే యని యభిప్రాయము.

శం. ప్రకృత్యైవచ కర్మాణి యను న్యాయముచేతఁ బ్రాకృతం బగు నధిష్ఠానాదిపంచకమునకే క్రియామాత్రకారణత్వము సిద్ధము కాఁగా ఫలితముఁ జెప్పుచున్నాఁడు.—ఇ ట్లధిష్ఠానాదు లైదింటికే సర్వకర్మనిర్వర్తకత్వము నిశ్చితమై యుండఁగా, యః = అకృతాత్ముఁడు ఆత్మానాత్మతత్త్వవిచారశూన్యుఁ డగుపురుషుఁ డెవ్వఁడు; తత్ర — ప్రాకృతము లయిన యధిష్ఠానాదులచేతనే చేయఁబడినకర్మమునందు విహితమునందుఁ గాని నిషిద్ధమునందుఁ గాని; నేనీకర్మమునకుఁ గర్త నని యకర్తయే యగు, ఆత్మానమ్ = ఆత్మను; కేవలంతు = ఒక్కని ఏకరసుని నిష్క్రియుని నిర్విశేషుని; కర్తారం పశ్యతి — నేను స్నానము చేసితిని భుజించితిని వచ్చితిని పోయితిని దుష్టాదుష్టకర్మము చేసితి నని శ్రవణాదులు చేయనివాఁ డెవఁడు ఆత్మను ఆయాకర్మములకుఁ గర్తనుగానే తలంచుచున్నాఁడో అని యర్థము. సః — ఇట్లు కూటస్థాసంగచిద్రూపుఁడై యకర్తయై నిష్క్రియుఁ డయ్యె యున్న స్వాత్మయందుఁ గర్తృత్వభోక్తృత్వా ద్యన్యధర్మముల నారోపించునట్టి పురుషుఁడు; అకృతబుద్ధిత్వాత్ — నిత్యనిరంతరశ్రవణమననాదిసంస్కారములచేఁ జక్కఁగా సంస్కరింపఁబడినది — నిష్క్రియుఁడు నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁ డీయాత్మ యహంపదార్థ మని చక్కఁగా విషయీకరింపఁబడిన యాత్మతత్త్వము గలబుద్ధి యెవనికో అతఁడు కృతబుద్ధి ఆత్మతత్త్వము నెఱింగినవాఁడు, తద్విపరీతుఁడు అకృతబుద్ధి, అట్లు శ్రవణము చేసినవాఁ డయ్యు నాత్మస్వరూపము నపరోక్షముగాఁ జేసికొననివాఁడును అకృతబుద్ధి, వానిభావము అకృతబుద్ధిత్వము, దానివలన; అందువలననే, దుర్మతిః=అవిద్యాకార్య మగుటచే దుష్ట మైన దేహేంద్రియాదికమునందే నేననుమతి యెవనికో అతఁడు దుర్మతి, లేక, రజస్తమోవాసనాత్మక మగు నవిద్యచే దూషిత మయినమతి యెవ్వనికో అతఁడు దుర్మతి, పసువువలె దేహాత్మబుద్ధియే యగు చున్నాఁడు,

ఎందువలన నగా అనాత్మయే యగు సక్రియమును అధిష్ఠానాదికమును ఆత్మనుగాఁ జూచుచున్నాఁడు, నేను గర్తను భోక్తను పోవుచున్నాను వచ్చుచున్నాను జేయుచున్నాను భుజించుచున్నా నని. ఎట్లు మేఘములు పరువిడుచుండఁగాఁ బరువిడకున్న చంద్రునిఁ బరువిడువానిఁగాఁ జూచుచున్నాఁడో, ఎట్లు ఓడ పోవుచుండఁగా కదలకున్న వృక్షమును పోవుదానిఁగాఁ జూచుచున్నాఁడో మూఢుఁడు వృక్ష మక్రియ మని యెఱింగియు నెట్లు సక్రియమునుగానే చూచుచున్నాఁడో, అట్లితఁ డాత్మ యకర్తయే యని వినియు నెఱింగియు వెండియుఁ గర్తను భోక్తనుగానే చూచుచున్నాఁడు, కావున నతఁ డాత్మతత్త్వమును నిష్కలము నిష్క్రియము శాంతం బని నిత్యము శుద్ధము బుద్ధము ముక్తము సత్యము సూక్ష్మము పరిపూర్ణ మద్వయము సదానందచిన్మాత్రం బని "నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః" ఇత్యాది శ్రుతిస్మృత్యాచార్యబోధితమును, న పశ్యతి – ఎఱుంగఁ డని యర్థము. ఓయీ ! ఈ పురుషుఁడు వాస్తవంబున నకర్తయే యగు నాత్మను గర్తనుగాఁ జూచుచున్నాఁ డని యేది చెప్పఁబడినదో అది యనుపపన్నమే, సర్వప్రమాణవిరోధమువలన, నేను జేయుచున్నా నని యహంభావము కర్తృధర్మము ప్రత్యక్ష మగుటవలన. ఇది దేహధర్మ మేమో కాదు; మృతదేహమున కహంభావము లేమివలనను గమనాదిక్రియ లేమివలనను, దేహచేష్ట సర్వంబును ఆత్మకర్తృకము ఆత్మ యున్నపుడు కనఁబడుటవలన వాయు వున్నపుడు వృక్షచేష్ట వలె అని సర్వకర్మమునకును ఆత్మకర్తృకత్వమే యనుమానింపఁబడుచున్నది. "స ఏవ మాయాపరిమోహితాత్మా శరీర మాస్థాయ కరోతి సర్వమ్" అని శ్రుతియుఁ జెప్పుచున్నది. అందువలనఁ గర్తృధర్మమే యందు వేని, సత్యము. ఆత్మకుఁ గర్తృత్వమును. శ్రుతి చెప్పుచున్నది, మృతదేహమునందును అది కనఁబడదు, అయినను శ్రుతి యుక్తులచే విచారింపఁగా నిరవయవుండును ఆకాశమువలె నవిక్రియుండు నగు నాత్మకుఁ జలనక్రియ సంభవింపమివలనఁ గర్తృత్వము సిద్ధింపదు, సుషుప్తియం దాత్మకుఁ గర్తృత్వాభావము సర్వప్రత్యక్ష మగుటవలన. ఓయీ ! సుషుప్తియం దాత్మోపలంభము లేమివలన ఆత్మ లేనపుడు తత్కర్తృత్వము లేమి యుక్తమే యందు వేని, కాదు, సుఖముగా నేను నిద్రించితిని ఏమియు నెఱుఁగ నైతిని అని సుషుప్తియం దాత్మసద్భావము ప్రత్యభిజ్ఞాయమాన మగుటవలన ఆత్మ లేమి సిద్ధింపమివలన. నేను స్వప్నముగంటి నని తనకు స్వప్నదర్శనమువలె సుషుప్తిసుఖం బనుభవింపఁబడుటవలన స్వప్నమునందుంబోలె సుషుప్తియందును అహంప్రత్యయార్థ

మగు నాత్మ యుండనేయున్నాఁడు. లేనియెడ సుషుప్తి తత్సుఖజ్ఞానములే లేకపోవలసి వచ్చును. అందువలన సుషుప్తిని దత్సుఖమును ఎఱుంగునట్టి తనయునికిని సుషుప్తి యం దంగీకరింపక తప్పదు. అం దాత్మ యున్నను ఆత్మకుఁ గర్తృత్వము కనఁబడదు. ఓయీ! సుషుప్తియందును సుఖముగా నిద్రించితి నని యాత్మ కాస్వాపక్రియాకర్తృత్వము కలదు అందువేని, లేదు. నిరవయవునకుఁ గ్రియ యనుపపన్న మగుటవలన. ఉన్నాఁ డనునట్లు నిద్రించుచున్నాఁ డనుట వ్యపదేశమాత్రమే కాని యిందుఁ బురుష వ్యాపారము సంభవింపదు, ఆత్మ నిరవయవుఁ డగుటవలనను కరణము లేమివలనను. మఱియును "స్వ మపీతో భవతి" * అను శ్రుతివలన అం దాత్మ తననిరుపాధిక స్వరూపప్రాప్తి వెల్లడించుచున్నాఁడు నిద్రించితిని అని. కాని బుద్ధ్యాదికమువలె నిద్రింపఁడు "అసుప్త స్సుప్తా నభిచాకశీతి, ఏష సుప్తేషు జాగర్తి" † అను శ్రుతుల వలన. అందువలనఁ గర్తృత్వ మన్యధర్మమే కాని యాత్మధర్మము కాదు. "నిష్కలం నిష్క్రియమ్, నాయం హన్తి న హన్యతే, అనన్త శ్చాత్మా విశ్వరూపో హ్యకర్తా, వృక్ష ఇవ స్తబ్ధః, నిత్య స్సర్వగతః స్థాణుః, ఇత్యాది శ్రుతిస్మృతిశతము ఆత్మకుఁ గర్తృత్వ లే దని బోధించుచున్నది. ఆత్మ కొంచెమేనియు చేష్టింపఁడు నిరవయుం డగుటవలనను బరిపూర్ణుఁ డగుటవలనను ఇత్యాదియుక్తులును అక్రియత్వమునే సాధించుచున్నవి. అప్పుడు దేనిధర్మము కర్తృత్వము? అని యడుగుదేని చెప్పెదము వెండియును ముముక్షువు లగు సత్పురుషుల కాత్మయందుఁ గర్తృత్వభ్రమ తొలంగుటకొఱకు. జాగ్రత్స్వప్నంబుల దేహమునందును ఇతరములయందును అహంమమాభిమానవంతుఁ డగు విజ్ఞానాత్మకే సాభాసునకుఁ గర్తృత్వమును భోక్తృత్వమును. జాగ్రత్స్వప్నములయందుఁ గదా అహంమమ యను నభిమానము గల విజ్ఞానాత్మ కర్మములఁ జేయుచున్నాఁడు. రెండింటియందును వానికే కర్తృత్వము విద్వత్ప్రత్యక్షము. సుషుప్తియందు విజ్ఞానాత్మ లేమివలనఁ గర్తృత్వధర్మప్రతీతి లేదు. అందువలన నన్వయవ్యతిరేకములవలన విజ్ఞానాత్మకే కర్తృత్వము, దీని నేను జేయుచున్నా నని యభిమానముచే సామాన్యమును విశేషము నగు కర్మము చేయుటవలన. అట్లు శ్రుతి "విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతే ఽపిచ, మన్తా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః" అని. సర్వప్రమాణములచేతను విజ్ఞానాత్మకే కర్తృత్వము నిశ్చిత

---

* తన్నుఁ బొందినవాఁ డగుచున్నాఁడు.

† నిద్రింపనివాఁడై నిద్రించువాని నభిలక్షించి ప్రకాశించుచున్నాఁడు, ఇతఁడు సుప్తములయందు మేల్కొని యున్నాఁడు.

మగుటవల[illegible]ఆత్మ కర్త భోక్త కానేకాఁ డని సిద్ధము. శరీర మాస్థాయ కరోతి సర్వ మనుచోట మాయాపరిమోహితాత్మా యను లింగమువలన మాయచే నితరమువలె "స ఏష ఆత్మా, ధ్యాయతీవ లేలాయతీవ" అను శ్రుతులవలన గజారూఢుం డగురాజు నందు ఈరాజు పోవుచున్నాఁ డని గమనక్రియాకర్తృత్వ మెట్లారోపింపఁబడునో అట్లు మాయచే — అవిద్యచే మూఢు లాత్మయం దారోపించుకర్మమును జేయుచున్నాఁడు వోలె నని యనువదించుచున్నది శ్రుతి కరోతి సర్వ మ్మని, కాని సత్య మని వచింపదు. సత్య మైనయెడ సంసారి యగుటవలన మోక్షాభావము ప్రసక్తించును, స్వవచనవ్యాఘాతముగూడ సంభవించును. తానే మోక్షముఁ జెప్పుచున్నది శ్రుతి విముక్తశ్చ విముచ్యతే" అని. అందువలన నాత్మకుఁ గర్తృత్వము లే దని సిద్ధము. ఓయీ ! "తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు" అని తుశబ్ద యోగమువలనను కేవలశబ్దస్వారస్యమువలనను ఆత్మకుఁ గేవలునకుమాత్రము కర్తృత్వము లే కున్నను ఉపాధివిశిష్టునకుఁ గర్తృత్వ ముండనే యున్నది యని యందు వేని, నిన్నిట నడుగవలయును. ఆత్మకు నుపాధివైశిష్ట్యసిద్ధికి సంబంధము సంయోగమా ? సమవాయమా ? మొదటిపక్షమున సంయోగము సర్వముతోనా? ఏకదేశముతోనా ? రెండవది కాదు, నిరవయవునకు దేశకల్పన సంభవింపమి వలన. రెండవది కాదు, పరిచ్ఛిన్న మగు నుపాధికిఁ బూర్ణునితోఁ గూడ సర్వత స్సంయోగము సంభవింపమివలనను నిరవయసావయవములకు సంయోగ మశక్య మగుటవలనను. సర్వత స్సంయోగసంబంధ మున్నయెడ ఆత్మకును జడత్వంబును జగదాంధ్యంబును సంభవించును. సమవాయము కాదు, సమవాయసమవాయుల రెంటికి సంబంధము సిద్ధించుటకై సమవాయాంతరాపేక్ష కలుగుటచే ననవస్థాప్రసంగమువలన. ఆ రెంటికి నయుతసిద్ధత్వము లేమివలనఁ గూడ సమవాయము సిద్ధింపదు. "కర్మానుగా న్యనుక్రమేణ దేహీ" అని యాత్మకు దేహిత్వము శ్రుత మగుటవలన దేహదేహుల కిద్దఱకు నవయవావయవిభావము సంభవించుటవలన నయుతసిద్ధత్వ మగు నందు వేని, కాదు, ఎక్కడ నవయవియో అక్కడ నవయవము అన్నట్లు ఎక్కడ ఆత్మయో అక్కడ దేహము అని వ్యాప్తి లేమివలన నయుతసిద్ధత్వము సిద్ధింపమివలన. అప్పుడు దేహి యనుట యెట్లనఁగా, అవిద్యాదశయందధ్యాససంబంధముచే నాత్మకు దేహిత్వము సంభవించుటవలన దేహి యని చెప్పుట యాధ్యాసికము కాని వాస్తవము కాదు. సంయోగసమవాయములలో నేసంబంధ మంగీకరించినను "విశేషణనాశమువలన విశిష్టమునకును నాశము" అను న్యాయ

ముచే నుపాధినాశముచే నాత్మకును నాశము ప్రసక్త మగును, ఆత్మ నిత్యుఁ డని ప్రతిపాదించుశ్రుతులకు విరోధము ప్రసక్తించును, సంసారిత్వము మోక్షరహితత్వము మొదలగు ననర్థములు ప్రసక్తించును. "న త దశ్నాతి కించన, అసఙ్గో హ్యయం పురుషః" అను శ్రుతులవలన నసంగుఁడు నిరవయవుఁడు నిర్విశేషుఁ డగు నాత్మకు నుపాధితోఁ గాని తద్ధర్మములతోఁ గాని తత్కార్యములతోఁ గాని సంబంధము కల్పింప నెవ్వనిచేతను శక్యము కాదు. అందువలన నాత్మకుఁ గ్రియగాని క్రియాశ్రయత్వముగాని క్రియావిషయత్వముగాని యెందును ఎప్పుడును ఎంతమాత్రమును సంభవింపదు. అందువలననే చెప్పుచున్నాఁడు భగవంతుఁడు అవిద్యను దత్కార్యమును దొలఁగించి భక్తుల రక్షింపఁ దలఁచినవాఁడు సర్వజ్ఞుఁడు ఆత్మానం కేవలం తు అని. తుశబ్ద మాత్మకు నుపాధిభిన్నత్వమును దృఢీకరించుచున్నది. సావయవంబును సక్రియంబు నగు నుపాధిని కర్తనుగాను భోక్తనుగాను జూచుఁ గాక, కేవలుండును నిష్కలుండును నిష్క్రియుండు నగు నాత్మను బ్రమాదముననేనియుఁ గర్తనుగా నెంతమాత్రము చూడఁగూడదు, నిరవయవుఁడు అసంగుఁ డగు నాత్మకుఁ గ్రియాశ్రయత్వాదికము సంభవింపమివలన. ఎవ్వఁ డిట్టి యాత్మతత్త్వమును సద్గురువునొద్దఁ బలుమాఱు వినియు మననము చేసియు నాత్మను బుణ్యాకర్మకర్తనుగాను భోక్తనుగాను జూచుచున్నాఁడో అతఁడే దుర్మతి అవివేకి, కాని గొల్లఁడు కాఁ డని యర్థము.

వ్యా. ఇప్పు డివియె కర్మకర్త లగుటవలన ఆత్మకుఁ గర్తృత్వము లే దని యధిష్ఠానాదినిరూపణఫలముఁ జెప్పుచున్నాఁడు.—తత్ర = పూర్వోక్త మగు నాకర్మము సర్వంబును; ఏవం, సతి = అధిష్ఠానాదిపంచకము హేతువుగాఁ గలది యగుచుండఁగా, వానిచే నిర్వర్తింపఁబడునది యగు చుండఁగా; ఆత్మానమ్=సర్వజడప్రపంచమునకు భాసకుని సత్తాస్ఫూర్తిరూపుని స్వప్రకాశపరమానందుని అబాధ్యుని; కేవలంతు = అసంగోదాసీనుఁడును అకర్తయు నవిక్రియుఁడును అద్వితీయుఁడు నయ్యెయున్నవానిఁ బరమార్థమున; అవిద్యచేతనో అధిష్ఠానాదికమునందుఁ బ్రతిబింబితుఁడై జలమునందు సూర్యునివలెఁ దద్భాసకుఁడై యున్నవాని అనన్యత్వంబునఁ బరికల్పించి జలచలనముచే సూర్యుఁడు చలించుచున్నాఁ డనునట్లు అధిష్ఠానాదికర్మమునకు నేనే కర్త నని సాక్షియై యున్నవానిఁ గూడ; కర్తారమ్ = క్రియాశ్రయునిఁగా; యః పశ్యతి — ఎవఁ డవిద్యచేఁ గల్పించుచున్నాఁడో రజ్జువునుబోలె సర్పమునుగా; సః — అతఁ డిట్లు చూచుచున్నను; న పశ్యతి = చూడఁ డాత్మను తత్త్వముచేత,

అధ్యాసము స్వరూపాజ్ఞానకృతం బగుటవలన. అతఁడు భ్రాంతిచే విపరీతముగానే చూచుచున్నాఁడు కాని యథాతత్త్వముగాఁ జూడఁడు. ఇందుల కేమి హేతు వనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అకృతబుద్ధిత్వాత్ = శాస్త్రాచార్యోపదేశన్యాయములచేఁ గలుగు వివేకబుద్ధి లేనివాఁ డగుటవలన. రజ్జుతత్త్వసాక్షాత్కారము లేనియెడ సర్పభ్రమ నెవ్వఁడును బాధింపఁజాలఁడు గదా! అట్లు శాస్త్రాచార్యోపదేశన్యాయములచే సత్యము జ్ఞాన మనంత మకర్త యభోక్త పరమానంద మనవస్థ మద్వయ మగు బ్రహ్మము నే నని పరినిష్ఠిత మయిన సాక్షాత్కారము కలుగనియెడ మిథ్యాజ్ఞాన తత్కార్యములకు బాధ యెట్లగును? ఇట్టి సాక్షాత్కారమునే గురువు నుపసర్పించి వేదాంతవాక్యవిచారముచే నేల సంపాదింపఁడు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—దుర్మతిః = దుష్టము — వివేకప్రతిబంధకపాపముచే మలిన మగు మతి గలవాఁడు. అందువలన నశుద్ధబుద్ధి యగుటవలన నిత్యానిత్యవస్తువివేకాదిశూన్యుఁ డగుటచేఁ దత్త్వజ్ఞానమున కయోగ్యుఁ డగుటవలన అకర్తనుగూడఁ గర్తనుగా కేవలునిఁగూడ నకేవలునిగా నాత్మ నవిద్యచేఁ గల్పించు సంసారి కర్త్రాధికారి దేహభృత్తు అకృతబుద్ధి కర్మకర్తలయందుఁ దాదాత్మ్యాభిమానమువలనఁ గర్మత్యాగమునం దసమర్థుఁడు సదా జననమరణప్రబంధముచే ననిష్టమును ఇష్టమును మిశ్రమును గర్మఫలము ననుభవించుచున్నాఁడు. ఇందుచేఁ దార్కికుఁ డెవఁడు దేహాదివ్యతిరిక్తుఁ డగు నాత్మనే కేవలునిఁ గర్తనుగాఁ దలంచుచున్నాఁడో అతఁడును అకృతబుద్ధియని వ్యాఖ్యాతము. మఱియొకఁడు చెప్పుచున్నాఁడు.—ఆత్మ కర్త కేవలుఁడు కాఁడు, మ ఱే మనఁగా అధిష్ఠానాదులచే సంహతుఁడై పరమార్థంబుననే కర్త, కర్తార మాత్మానం కేవల మ్మని కేవలశబ్దప్రయోగమువలన నని. అది కాదు, పరమార్థంబున సర్వక్రియాశూన్యుఁ డసంగుఁ డగునాత్మ కధిష్ఠానాదులతో సంహతత్వ మనుపపన్న మగుటవలన. జలసూర్యకాదికమువలె నావిద్యక మగు సంహతత్వముచేతనో కర్తృత్వంబును నట్టిదే, అధిష్ఠానాదులును నావిద్యకము లగుటవలనఁ గూడ. కేవలశబ్దమో స్వభావసిద్ధ మగు నాత్మయొక్కయసంగాద్వితీయరూపత్వము ననువదించుచున్నది, కర్తృత్వదర్శి దుర్మతి యనుటకు హేతువుగా. కావున దోషము లేదు.

శ్రీ. అందువలన నేమి? అనఁగాఁ జెప్పుచున్నాఁడు,—తత్ర = ఆ సర్వకర్మమునందు; ఈ యైదును హేతువు లని సిద్ధమై యుండఁగా; కేవలమ్=నిరుపాధికుఁడు అసంగుఁ డగు; ఆత్మానం తు; ఎవఁడు, కర్తారం పశ్యతి, శాస్త్రాచార్యోపదేశముల

వలన అసంస్కృత మగుబుద్ధి గలవాఁ డగుటవలన; అతఁడు దుర్మతి చక్కఁగాఁ జూడఁడు.

ప. *

రా. జీవాత్మకుఁ గర్తృత్వము పరమాత్మానుమతిపూర్వకమై యుండఁగా. తత్ర — కర్మమునందు; కేవల మాత్మానమ్ = ఆత్మను మాత్రమే; కర్తారం యః పశ్యతి. సః; దుర్మతిః = విపరీతమతి; అకృతబుద్ధిత్వాత్ = అనిష్పన్న మగు యథావస్థితబుద్ధి గలవాఁ డగుటవలన; నపశ్యతి = యథావస్థితముగా కర్తను జూడఁడు.

మా. కేవలమ్ = నిష్క్రియుని. "ఏనం కేవల మాత్మానం నిష్క్రియత్వాద్వదన్తి హి" అని దానియందే.

> యస్య నాఽహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే
> హత్వాఽపి స ఇమాఁ ల్లోకా న్న హన్తి న నిబధ్యతే. ౧౭

భా. ఎవ్వఁడు మఱి సుమతి చక్కఁగాఁ జూచువాఁడు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.— యస్య = శాస్త్రాచార్యోపదేశన్యాయములచే సంస్కృత మైనబుద్ధి గల యెవ్వనికి; అహం కృతః = నేను కర్తను అను నట్టిది; భావః = భావన, ప్రత్యయము; న = లేదో, ఇవి యైదే యధిష్ఠానాదు లవిద్యచే నాత్మయందుఁ గల్పితములు సర్వకర్మములకుఁ గర్తలు, నేను గాను, నేనో తద్వ్యాపారములకు సాక్షిభూతుఁడను "అప్రాణో హ్యమనా శ్శుభ్రో ఽక్షరా త్పరతః పరః, కేవలో ఽవిక్రియః" అని చెప్పఁబడినవాఁడ నని చూచుచున్నాఁడో అనుట. బుద్ధిః = అంతఃకరణము; యస్య = ఏవనికి, ఆత్మకు ఉపాధిభూతము; నలిప్యతే = అనుశయవంతము కాదో, దీని నేఁ జేసితిని దానిచే నేను నరకము పొందఁగల నని; అతఁడు సుమతి, అతఁడు చక్కఁగాఁ జూచుచున్నాఁడు. సః = అతఁడు; ఇమాఁల్లోకాన్ = ఈ లోకములను, సర్వప్రాణుల నని యర్థము; హత్వాఽపి = వధించియు; నహన్తి = హననక్రియను జేయఁడు. న నిబధ్యతే = తత్కార్య మగు నధర్మఫలముతోనుంగూడ సంబంధింపఁడు. ఓయీ! హత్వాఽపి న హన్తి యనుట విప్రషిద్ధము, స్తుతియైనను గూడ. కా దిది దోషము, లౌకిక పారమార్థిక దృష్ట్యపేక్షచే నది యుప

* శ్రీధరీయముతో సమానము.

పన్న మగుటవలన. దేహాద్యాత్మబుద్ధిచే నహంతను నే నను లౌకికదృష్టి నాశ్రయించి హత్వాఽపి యని చెప్పుచున్నాఁడు. యథాదర్శితం బగు పారమార్థికదృష్టి నాశ్రయించి నహన్తి ననిబధ్యతే అని చెప్పుచున్నాఁడు. అందువలన రెండు నుపపన్నములే యగును.

ఎవ్వనికి నేను గర్త నను నహంకారము లేదో మఱియు నెవ్వనియంతఃకరణమునందు నేను కర్మము చేసితి నను లేపము కలుగదో అట్టివాఁడు సర్వప్రాణుల వధించినను వధించినవాఁడు కాఁడు, తత్ఫలముతోను సంబంధింపఁ డని తాత్పర్యము.

టీ. విపరీతదృష్టి దుర్మతి యని ప్రతిపాదించి సమ్యగ్దృష్టి సుమతి యని ప్రశ్నపూర్వకముగాఁ జెప్పుచున్నారు ఎవ్వఁడు మఱి ఇత్యాదిగా. నేను గర్త నని యాత్మయందుఁ గర్తృత్వప్రత్యయము లేనియెడ దేనియందుఁ గర్తృత్వబుద్ధి? అని యాశంకించి చెప్పుచున్నారు ఇవి ఇత్యాదిగా. అప్పు డాత్మయందుఁ గర్తృత్వబుద్ధి యెట్లు? అని యాశంకించి యధిష్ఠానాదులకును దద్వ్యాపారములకును సాక్షియగుట వలన నని చెప్పుచున్నారు నేనో ఇత్యాదిగా. ఆత్మకు స్వభావంబునఁ గ్రియాశక్తిమత్త్వము లే దనుటకుఁ బ్రమాణము చెప్పుచున్నారు అప్రాణోహి అని. జ్ఞానశక్తిమత్త్వముగూడ నతనికి స్వభావంబున లే దని చెప్పుచున్నారు అమనాః అని. ఉపాధిద్వయముతోను సంబంధము సంభవింపమిచే ఫలితము శుద్ధత్వముఁ జెప్పుచున్నారు శుభ్రః అని. కారణసంబంధమువలన నశుద్ధి నాశంకించి చెప్పఁబడినది అక్షరాత్పరతః పరః అని. కార్యకారణము లాత్మను స్పృశింపని వగుటచే భిన్నము లగుట వలన సద్వితీయత్వము నాశంకించి యవి యవస్తువు లగుటవలన నట్లు కా దని చెప్పుచున్నారు కేవలః అని. జన్మాదిసర్వవికారరహితుం డగుటచేఁ గూటస్థుం డని చెప్పుచున్నారు అవిక్రియః అని. ద్వితీయపాదమును వివరించుచున్నారు బుద్ధి రిత్యాదిగా. అనుశయవంతము కాదో — క్లేశయుక్తము కాదో యని యర్థము. ద్వితీయపాదమున కక్షరార్థముఁ జెప్పి వాక్యార్థముఁ జెప్పుచున్నారు దీని నిత్యాదిగా. దీని — ఈ పాపకర్మమును. లోకములకుఁ బ్రాణసంబంధము లేనపుడు హింస యెట్లని యాశంకించి చెప్పుచున్నారు సర్వప్రాణుల నని. విరుద్ధార్థము చెప్పుటచే స్తుతియును యుక్తము కా దని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. విరోధముఁ బరిహరించుచున్నారు కా దిది దోష మని. లౌకికదృష్టి నవలంబించి హత్వాపి యన్న నిర్దేశమును విశదీకరించుచున్నారు దేహా దీత్యాదిగా. తాత్త్వికదృష్టి నవలంబించి నహన్తీత్యాదినిర్దేశము నుపపాదించుచున్నారు యథాదర్శితంబు ఇత్యా

దిగా. నేను కర్తం గాను, మ తే మనఁగా కర్తృత్వవ్యాపారములకు సాక్షిని క్రియాజ్ఞానశక్తిమదుపాధిద్వయవినిర్ముక్తుఁడను సత్తామాత్రుఁడను గార్యకారణ సంబంధశూన్యుఁడను అద్వితీయుఁడను అవిక్రియుఁడను అను నీపారమార్థికదృష్టి యథాదర్శితం బని యెఱుంగునది. హత్వాపి యనుటయు నహ స్త్రీత్యాదికములు రెండును దృష్టిద్వయావష్టంభమువలన నుపపన్నము లని యుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా.

**భా.** ఓయీ! అధిష్ఠానాదులతోఁ గలసి చేయువాఁడే యాత్మ, కర్తార మాత్మానం కేవలంతు అని కేవలశబ్దప్రయోగమువలన. కా దిది దోషము, ఆత్మ యవిక్రియస్వభావుఁ డైనపుడు వాని కధిష్ఠానాదులతో సంహతత్వ మనుపపన్న మగుటవలన. విక్రియావంతునకుఁ గదా యన్యములతో సంహనన మగును, సంహత్యకర్తృత్వము * గాని సంభవించును. కాని యవిక్రియుం డగు నాత్మకు దేనితోను సంహననము లేదు. కావున సంభూయకర్తృత్వ ముపపన్నము కాదు. అందువలనఁ గేవలత్వ మాత్మకు స్వాభావికము కావునఁ గేవలశబ్ద మనువాదమాత్రము.

**ఆ.** కేవలునే యాత్మను గర్తనుగాఁ జూచువాఁడు దుర్మతి యనుచోట ఆత్మవిశేషణసమర్పక మగు కేవలశబ్దముయొక్క సామర్థ్యమువలన విశిష్టుఁ డగు నాత్మకుఁ గర్తృత్వ మని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. ఆత్మకు వైశిష్ట్యము సంభవింపమివలన విశిష్టునకుఁ గూడఁ గర్తృత్వము లే దని దూషించుచున్నారు కా దిది దోష మని. అవిక్రియస్వభావుం డైనను ఆత్మకసంహతత్వ మెట్లని యాశంకించి చెప్పుచున్నారు విక్రియావంతునకు ఇత్యాదిగా. అధిష్ఠానాదులచే నాత్మకు సంహనన మున్నను కర్తృత్వము లేదు, అవిక్రియునకుఁ గ్రియాన్వయవ్యాఘాతము వలన నని చెప్పుచున్నారు సంహ త్యేత్యాదిగా. సంహతత్వానుపపత్తిని స్పష్టీకరించుచున్నారు కాని ఇత్యాదిగా. అసంహతుం డని సిద్ధ మగుటచే ఫలితముఁ జెప్పుచున్నారు కావున నిత్యాదిగా. అప్పు డాత్మయందుఁ గేవలశబ్దమువలనఁ గేవలత్వ మెట్లు చెప్పఁబడినది ? అనఁగాఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

**భా.** అవిక్రియత్వమో ఆత్మకు శ్రుతిస్మృతిన్యాయప్రసిద్ధము. "అవికార్యోయ ముచ్యతే, గుణై రేవ కర్మాణి క్రియన్తే, శరీరస్థోపి

* కలసి చేయువాఁ డగుట.

కౌన్తేయ నకరోతి" ఇత్యాదిగాఁ బలుమా ఱుపపాదింపఁబడినది గీతల యందే యంతటను. శ్రుతులయందును "ధ్యాయతీవ లేలాయతీవ" ఇత్యాదులందు. న్యాయమువలనఁగూడ. నిరవయవ మపరతంత్ర మవిక్రియ మాత్మతత్త్వ మని రాజమార్గము. విక్రియావత్త్వము నంగీకరించినను ఆత్మకుఁ దనవిక్రియయే తనకుఁ గాఁగలదు. అధిష్ఠానాదుల కర్మము లాత్మకర్తృకములు కాఁజాలవు. పరునికర్మము పరునకుఁ దాఁ జేయనిది రానేరదు గదా! ఏది మఱి యవిద్యచేఁ బొందింపఁబడినదో అది యాత్మకు లేదు. ఎట్లు రజతత్వము శుక్తికకు లేదో మఱియు నెట్లు బాలురచేత నవిద్యచేఁ బొందింపఁబడినతలమలవత్త్వ మాకాశమునకు లేదో అట్లు అధిష్ఠానాదులవిక్రియయు వానికే కాని యాత్మకు లేదు. అందువలన యుక్తము చెప్పఁబడినది యహంకృతత్వబుద్ధిలేపములు లేమి వలన విద్వాంసుఁడు నహన్తి ననిబధ్యతే అని. నాయం హన్తి నహన్యతే అని ప్రతిజ్ఞచేసి నజాయత ఇత్యాది హేతువచనముచే నవిక్రియత్వము నాత్మకుఁ బ్రతిపాదించి వేదావినాశిన మ్మని విద్వాంసునకుఁ గర్మాధికార నివృత్తిని శాస్త్రాదియందు సంక్షేపమునం జెప్పి మధ్యమున నచ్చటచ్చటఁ బ్రసంగము చేసి ప్రసారిత మయినదానినే యిట నుపసంహరించు చున్నాఁడు శాస్త్రార్థపిండీకరణముకొఱకు విద్వాంసుఁడు నహన్తి నని బధ్యతే అని. ఇట్లగుటవలన దేహభృత్త్వాభిమానము సంభవింపమిచే నవిద్యాకృతాశేషకర్మసన్న్యాసము సిద్ధించుటవలన సన్న్యాసుల కనిష్టాదిత్రివిధకర్మఫలము లే దనుట యుపపన్నము, తద్విపర్యయమువలన నితరులకుఁ గల దనుటయు నపరిహార్యము. అను నిది గీతాశాస్త్రార్థ ముపసంహరింపఁబడినది. అదియే సర్వవేదార్థసారము. నిపుణమతు లగు పండితులు విచారించి యెఱుంగవలయు నని యచ్చటచ్చటఁ బ్రకరణవిభాగంబున శాస్త్రన్యాయానుసారముచేఁ బ్రదర్శించినారము.

ఆ. ఆత్మ కకర్తృత్వ మంగీకరింపఁబడినది అవిక్రియత్వము సిద్ధింప దని యాశంకించి చెప్పుచున్నారు అవిక్రియత్వమో ఇత్యాదిగా. అందు స్మృతివాక్యముల నుదాహరించుచున్నారు అవికార్యోయ మిత్యాదిగా. నాయం హన్తి నహన్యతే ఇత్యాదివాక్య మాదిశబ్దార్థము. చెప్పినవాక్యముల కాత్మ యవిక్రియుఁ డనుట యందుఁ దాత్పర్యము సూచించుచున్నారు పలుమాఱు ఇత్యాదిగా. ఇత్యాదులందు

–నిష్కలం నిష్క్రియం శాన్త మిత్యాదివాక్య మాదిశబ్దార్థము. ఇవి మొదలగు వాక్యములయం దాత్మ కవిక్రియత్వ ముపపాదింపఁబడినది యని యన్వయము. న్యాయములనఁగూడ – అని యుపపాదింపఁబడినది యని పూర్వముతో సంబంధము. న్యాయమునే చూపుచున్నారు నిరవయవము ఇత్యాదిగా. ఆత్మ తనవలన విక్రియ నొందఁడు నిరవయవుఁ డగుటవలన ఆకాశమువలె, ఇతరమువలనను విక్రియ నొందఁడు అసంగుఁడును అకార్యము నైనవానికిఁ బరాధీనత సంభవింపమివలన నని యర్థము. మఱియు నాత్మకు విక్రియ స్వనిష్ఠమా? అధిష్ఠానాదినిష్ఠమా? మొదటిది కాదు, ఆత్మకు స్వనిష్ఠవిక్రియ యనుపపన్న మని దర్శితం బగుటవలన నను నభిప్రాయముతోఁ జెప్పుచున్నారు విక్రియావత్త్వము నిత్యాదిగా. అదియో అయుక్త మని చెప్పఁబడిన దని శేషము. రెండవపక్షమును దూషించుచున్నారు అధిష్ఠానాదుల ఇత్యాదిగా. అధిష్ఠానాదికృత మగు కర్మంబును అధిష్ఠానాదియోగమువలన నాత్మకు రావచ్చు నని యాశంకించి తదాగమనము వాస్తవమా? ఆవిద్యకమా? అని వికల్పించి మొదటిదాని దూషించుచున్నారు పరునికర్మము ఇత్యాదిగా. రెండవదాని నిరసించుచున్నారు ఏది మఱి ఇత్యాదిగా. ఆత్మయందవిద్యచేఁ బ్రాపితం బగు కర్మ మాత్మీయము కా దనుటను రెండు దృష్టాంతములచే నుపపాదించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. ఆత్మ కవిక్రియత్వముచేఁ గర్తృత్వము లేమివలన ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. ఓయీ! పూర్వమే యాత్మ కవిక్రియత్వము ప్రతిపాదింపఁబడినది, దాని నిచ్చట నేల చెప్పవలయును? అనఁగాఁ జెప్పుచున్నారు నాయ మిత్యాదిగా. ప్రసారింపఁబడినదానినే – ప్రస్తావింపఁబడిన యాకర్మాధికారనివృత్తినే. ప్రతిజ్ఞాతమై హేతువుచే నుపపాదిత మయినదాని కంఠమున నిగమనం బేల యని యాశంకించి చెప్పుచున్నారు శాస్త్రార్థేత్యాదిగా. కర్మాధికారము విద్వాంసునకు లే దని యేర్పడుటవలన నతనికి దేహాభిమానాభావంబును అందుచే నావిద్యకసర్వకర్మత్యాగంబును సిద్ధించుటవలన ననిష్టమును ఇష్టమును మిశ్రము నను త్రివిధకర్మఫలము సన్న్యాసులకు లే దని పూర్వోక్తము యుక్తం బని పరమప్రకృతము నుపసంహరించుచున్నారు ఇట్లగుటవలన నిత్యాదిగా. ఎవ్వరు మఱి యవిద్వాంసులు దేహాభిమానులో వారికిఁ ద్రివిధకర్మఫలము కలుగనే కలుగు నని హేతువచనసిద్ధ మగు నర్థమును నిగమనము చేయుచున్నారు తద్విపర్యయమువలన నిత్యాదిగా. అధిష్ఠానాదికృత మగు కర్మ మాత్మకృతము కాదు, అవిద్వాంసులకే కర్మాధికారము

దేహాభిమాను లగుటచేఁ దత్త్యాగ మశక్య మగుటవలన, విద్వాంసులకో దేహాభిమానము లేమివలనఁ గర్మాధికారనివృత్తి యని యుపసంహృత మైనయర్థమును సంక్షేపించి చెప్పుచున్నారు అనునిది ఇత్యాదిగా. ఈ చెప్పిన గీతార్థమే వేదార్థ మగుటవలన నుపాదేయ మని చెప్పుచున్నారు అదియే ఇత్యాదిగా. ఇది వేదార్థ మైనను ఎల్లెఱుంగ శక్య మగు ననఁగాఁ జెప్పుచున్నారు నిపుణమతులు ఇత్యాదిగా. భాష్యకారులు ప్రమాణయుక్తులచే విభజించి వచియింపమివలన నీయర్థ ముపాదేయము కా దని యాశంకించి చెప్పుచున్నారు అచ్చటచ్చట ఇత్యాదిగా.

హ. అట్టి యోగికి సకలకర్మసన్న్యాసము మాత్రమే కాదు.—యస్య=శాస్త్రాచార్యోపదేశన్యాయములచే సంస్కృత మైనబుద్ధి గల యెవ్వనికి; అహంకృతః = నేను గర్త ననునట్టి; భావః = ప్రత్యయము; న = లేదో. ఈ యధిష్ఠానకర్తృకరణచేష్టాదైవము లైదే సర్వకర్మములకును గారణములు, అవిద్యచేఁ గల్పితము లైన యివియే సర్వకర్మములకును గర్తలు, నేను గర్తఁ గాను, మఱి యేమనఁగాఁ దద్వ్యాపారములకు సాక్షిభూతుఁడ నని చూచుచున్నాఁడో యనుట. బుద్ధిః = నిశ్చయము; యస్య = ఎవనికి; న లిప్యతే = దాని నేఁ జేసితిని, దానిచే నరకము నొందుదు నని యనుశోకింపదో. సః; ఇమాన్; లోకాన్ = ప్రాణులను; హత్వాపి; నహన్తి. హననకర్మచేతనుగూడ, న నిబధ్యతే. ఓయీ! హత్వాపి నహన్తి ననిబధ్యతే అని చెప్పుట విరుద్ధము. ఇది దోషము కాదు, లౌకికపారమార్థికదృష్టులఁబట్టి యది యుపపన్న మగుటవలన. అందువలన యుక్తము నహన్తి ననిబధ్యతే యనుట.

శం. ఇట్లనాత్మకర్తృక మగు కర్మమునం దకర్త యయ్యు యున్నయాత్మను సాచే నిది చేయఁబడిన దని యెవఁ డాత్మను గర్తనుగాఁ జూచుచున్నాఁడో అతఁడు శతవిధంబుల వేదాంతము విన్నవాఁడు వినిపించినవాఁ డైనను ఆత్మస్వరూపము నెఱుంగనివాఁ డగుటచే దుర్మతి యని ప్రతిపాదించి, ఎవ్వఁడు మఱి శ్రుత్యాచార్యేశ్వరప్రసాదసంపన్నుఁడు సతతశ్రవణమనననిదిధ్యాసనాదులచేఁ బుట్టినజ్ఞానంబున నాత్మయాథాత్మ్యదర్శి యగు విద్వాంసుఁడు అనాత్మకర్తృకం బగు దుష్టాదుష్టకర్మమునం దాత్మ నకర్తనుగానే చూచుచున్నాఁడో అతఁడే సుమతి పండితోత్తముఁడు శరీరయాత్రాదిలక్షణమును గాని యితరమును గాని దుష్టాదుష్టకర్మముఁ జేసియు తా నకర్తయే యగును కొంచెమేనియు నుపాధికృతం బగు కర్మముచే లిప్తుఁడు కాఁ డని చెప్పుచున్నాఁడు.—బ్రహ్మవిదుం డగునాచార్యునిప్రసాదమువలనఁ

పాత్రభూతుండును వైదికము లగు సాత్త్వికకర్మములచే బహుజన్మములు పరమేశ్వరు నారాధించి తదనుగ్రహము నొందినవాఁడును శుద్ధాత్ముండును శ్రవణాదిజన్యజ్ఞానముచే క్షీరనీరములవలె నున్న యాత్మానాత్మలస్వరూపమును జ్ఞాతృజ్ఞేయలక్షణమును జక్కఁగా విభజించి యం దాత్మయందే యాత్మభావము నొంది సదా తద్రూపంబుననే యున్నట్టి, యస్య = ఏ మహాత్ముఁ డగు బ్రహ్మవిదునకు; స్వవేద్యములు అవిద్యకము లగు నధిష్ఠానాదులచేతనే విహితము గాని నిషిద్ధము గాని యితరము గాని కర్మము చేయఁబడుచుండఁగా, భావః = భావ్యతే — నే నని గ్రహింపఁబడుచున్నది దీనిచేతఁ గావున భావ మనఁగా అంతఃకరణము, బ్రహ్మమే నే నని స్వస్వరూప మగు బ్రహ్మమునందే యహంభావము నొంది సదా తద్రూపంబుననే వర్తమాన మగు నహ మాత్మకబుద్ధి విశేషము; నాహంకృతః = కర్మ కర్త యగు నుపాధియం దహంకృత మనఁగా నహంకరణము — బ్రహ్మాకారతను విడిచి కర్త్రాకారంబున నే నని యునికి లేదు ఏభావమునకో అట్టి నాహంకృతమో, అధిష్ఠానాది లక్షణం బగు నుపాధియే స్వవాసనానురూపంబుగ నీకర్మముఁ జేయుచున్నది యని యు నేనో యుపాధితత్కర్మముల రెంటికిని సాక్షిని దటస్థుఁడను నిష్క్రియుఁడనే యగుచున్నా ననియు బ్రహ్మరూపముననే యున్నవాఁడై చిరకాలము నిత్యనిరంతర సమాధ్యభ్యాసబలమున నాహారాదికర్మకలాపమునందును గర్తయం దహంభావ రహితుఁ డని యర్థము. అట్లు, యస్య=ఉక్తలక్షణుఁ డగు నే బ్రహ్మవిదునకు; బుద్ధిః— వృత్తిరూపము; నలిప్యతే = నాచే నీశుభకర్మ మీదుష్టకర్మము చేయఁబడినది యను భావన గలది కాదో, ధర్మశీలునిబుద్ధి నాచే నీధర్మము చేయఁబడినది యీయధర్మము చేయఁబడినది యని యాకర్మముచే నెట్లు లిప్తం బగునో—ధర్మాధర్మసంస్కారవంత మగునో అట్లు నాచే నిది దుష్ట మిది యదుష్టము చేయఁబడినది యని సామాన్యమునఁ గాని విశేషమునఁ గాని తత్సంస్కారవంతము కాదో. ప్రతిచ్ఛాయవలె స్వభిన్నమే యగు నుపాధిచేఁ జేయఁబడినకర్మమునందు నేను దీనిఁ జేయుచున్నాను నాచే నిది చేయఁబడినది యను ప్రత్యయము బ్రహ్మవిదునిబుద్ధి కుదయింపదు, కర్తృతత్కర్మములతోఁ దాదాత్మ్యసంబంధము లేమివలన. ఎవ్వనిచే నేను దీనిఁ జేయుచున్నా నని యేకర్మము చేయఁబడుచున్నదో వానిబుద్ధికే నాచే నిది చేయఁబడినది యని కృతత్వభావనాలేపం బగును గాని యితరునిబుద్ధికిఁ గాదు. ఎట్లు నేను స్నానముఁ జేయుచున్నా నని స్నానము చేసిన దేవదత్తునిబుద్ధికే నాచే స్నానము చేయఁబడిన దని కృతత్వభావనయుఁ దత్కర్మముతో లేపంబు నగుం గాని తటస్థుఁ డగుయజ్ఞదత్తుని

బుద్ధికిఁ గాదో అట్లు. ఓయీ! అననురూపదృష్టాంతోపన్యాసముచే బ్రహ్మవిదునకు స్వదేహమునందును దత్కృత మగు కర్మమునందును నే ననియు నాచేఁ జేయఁబడిన దనియుఁ బ్రత్యయము జనియింప దని విపరీతము చెప్పుచున్నావు, విద్వాంసునకును నిజదేహము స్నాత మైనపుడు నే ననియు నాచే స్నానము చేయఁబడిన దనియుఁ బ్రత్యయము జనియింపక తప్పదు, విద్వాంసునకును దచ్ఛరీరమునకును బరస్పర విభాగము లేమివలన నని యందువేని, అది కాదు, విద్వత్తచ్ఛరీరములు జ్ఞాతృత్వ జ్ఞేయత్వలక్షణం బగు పరస్పరభిన్నస్వభావము గలవి యగుటవలన వాని కేకత్వ మనుపపన్న మగుటవలన. ఏకత్వము కలదేని యట్టి ప్రత్యయము ప్రసక్తించును. దేహమే విద్వాంసుఁడు కాఁడు గదా! విద్వాంసుఁడే దేహమునుం గాదు గదా! అవి జ్ఞాతృజ్ఞేయత్వధర్మముచే ఘటతజ్జ్ఞాతలుంబోలె భిన్నస్వభావము లగుటవలన వానికి విభక్తత్వమే యుక్తము కాని యేకత్వము కాదు, ప్రత్యక్షాదిప్రమాణ విరోధమువలన. అందువలన నధిష్ఠానాదిలక్షణం బగు నుపాధి వాసనావశంబున నయ్యై కర్మమునందుఁ బ్రవృత్త మగుచుండఁగా నందు నేను జేయుచున్నా నని యహంప్రత్యయ ముదయింపదు కర్తృతాదాత్మ్యము లేమివలన. అందువలననే నాచే నిది చేయఁబడినది యని తద్బుద్ధికిఁ గృతత్వభావనయుఁ దత్కర్మలేపంబును సంభవింపదు. అందువలననే చెప్పఁబడినది యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య నలిప్యతే అని. అననురూపదృష్టాంతోపన్యాసముచే నని యేది చెప్పితివో అది యుక్తము గాదు. విద్వత్తచ్ఛరీరములకు జ్ఞాతృజ్ఞేయత్వ ధర్మంబున విలక్షణతచేఁ బరస్పరభిన్నత్వము సిద్ధ మగుటవలన శరీరమునందును దత్కృతకర్మమునందును దద్భిన్నుం డగు విద్వాంసునకు నే నని నాచే నిది చేయఁబడినది యని ప్రత్యయం బనుపపన్న మనుట యందు యుక్తమే దృష్టాంతము. ఇట్లు బ్రహ్మవిదునకుఁ దన కుపాధితోను తద్ధర్మతత్కర్మములతోను సంబంధలేశము లే దను నప్రతిబద్ధ మగు జ్ఞానమే నైష్కర్మ్యసిద్ధికిఁ బరమకారణం బని సూచించి తాదృశజ్ఞానసిద్ధికి ఫలముఁ జెప్పుచున్నాఁడు.—ఎవ్వఁ డిట్లధిష్ఠానాదు లైదింటిచేతనే యనాత్మభూతములు దృశ్యము లగువానిచేఁ జేయఁబడుచున్నకర్మమునందుఁ జేష్టామాత్రమునందుఁ గానీ యహంకారమమకారశూన్యుఁ డగుచున్నాఁడో, సః=అట్టి విద్వాంసుఁడు; ఇమాన్ లోకాన్=ఈ మూఁడులోకములను, లోకస్థు లయిన దేవర్షిబ్రాహ్మణాదులను సర్వప్రాణులను; హత్వాపి=తనహస్తముచే సర్వసంహారము చేసియును; నహన్తి=దేనినిగూడ హింసింపఁడు, తాను తద్ధనన క్రియకుఁ గర్త కాఁ డని యర్థము. ఓయీ! బ్రహ్మవిదుఁడు తాను లోకత్రయమును

వధించినను వధింపఁడని యతివిరుద్ధం బిది చెప్పఁబడినది. ఎవ్వనిచే నేకర్మము చేయఁబడుచున్నదో అతఁడాకర్మమునకుఁ గర్తగానే కనఁబడుచున్నాఁడు కులాలుఁడు మొదలుగా. ఎట్లు బ్రహ్మవిదుఁడు తాను సర్వప్రపంచసంహారముఁ జేసియు నకర్తయే యగును? ఇతరునిచేఁ జేయించుచున్నాఁడా? తానే చేయుచున్నాఁడా? మొదటిది కాదు, ఇతరునిచేఁ జేయించినను రాజునకుఁబోలె వీనికిని హననక్రియ సంభవించుటవలన. రెండవదియుఁ గాదు, హత్వాపి యను వచనమునకు విరోధము ప్రసక్తించుటవలన. అందువలన విద్వాంసునకును హననక్రియాకర్తృత్వము కలుగక తప్పదు. అందు వేని సత్యము, ఎవ్వఁ డేకర్మమును జేయుచున్నాఁడో చేయించుచున్నాఁడో అతఁ డాకర్మమునకు సాక్షాత్తుగాఁ గాని క్రమంబునఁ గాని కర్తయే యగుచున్నాఁడు. అట్లీవిద్వాంసుఁడు తనకంటె భిన్న మయినకరణజాలముచేఁ జేయింపఁడు, తానునుం జేయఁడు. మేఘస్థుం డగు చంద్రుఁడు మేఘకర్మమునందుం బోలె దేహస్థుం డగు విద్వాంసుఁడు దేహేంద్రియాదులచేఁ జేయఁబడినకర్మమునందుఁ గర్తవలెఁ గనఁబడుచున్నాఁడు. చక్కని బుద్ధితో విచారింపఁగా మేఘములకే ధావనక్రియాకర్తృత్వము గాని యెట్లు చంద్రునకు లేదో అట్లు దేహేంద్రియాద్యభిమాని యగు విజ్ఞానాత్మకే హననక్రియాకర్తృత్వము కాని విద్వాంసునకు లేదు. కూటస్థాసంగచిద్రూపంబుననే యున్న విద్వాంసున కధిష్ఠానాదులతో సంయోగము గాని సమవాయము గాని సంబంధము సంభావింప శక్యము గాదు కదా! అది సంభవింపనియపుడు తత్కర్తృకం బగు కర్మమునందుఁ గర్తృత్వంబును సంభవింపదు. అందువలననే చెప్పుచున్నాఁడు పరమేశ్వరుఁడు హత్వాపి స ఇమాఀల్లోకా న్నహన్తి యని. మూఢదృష్టికిఁ జంద్రునివలె వెలుపలఁ గ్రియావంతునియట్లు కానఁబడుచున్నను వాస్తవంబున బ్రహ్మవిదుఁడు బ్రహ్మభావము నొందినవాఁ డగుటవలనఁ గ్రియామాత్రమునకునుం గర్త కాఁడు. అందువలననే యకర్త యగు బ్రహ్మవిదునకుఁ దత్కర్మఫలసంబంధమును నిషేధించుచున్నాఁడు న నిబధ్యతే అని. ఎందువలన నిష్క్రియబ్రహ్మభావాపన్నుఁ డగు బ్రహ్మవిత్తముఁ డుపాధిసంబంధరహితుం డగుటచేఁ దా నుపాధికృత మగు కర్మమునకుఁ బుణ్యమునకుఁ గాని పాపమునకుఁ గాని కర్త కాఁడో అందువలననే, ననిబధ్యతే = తత్కార్య మగు ఫలముతో దుష్టముతోఁ గాని యదుష్టముతోఁ గాని సంయుక్తుఁడు కాఁడు, కర్మము లన్యకృతము లగుటవలన. అన్యకృతకర్మం బన్యునకు లేపమును గాని ఫలమును గాని యెంతమాత్రము కలిగింపఁజాలదు. దేవదత్తకృత మగు కర్మముచే యజ్ఞదత్తుఁడు లిప్తుఁడు

కాని బద్ధుఁడు కాని కాఁడు గదా! అట్లు నాచే నిది చేయఁబడిన దని యాత్మయం దవిద్యచే నధ్యస్తము పూర్వము గాని యిప్పుడు గాని యేకర్మము కలదో అది యాత్మ కవిక్రియున కాకాశకల్పునకు ఫలమును గాని లేపమును గాని కలిగింపఁ జాలదు. నీల మాకాశ మని యజ్ఞులచే నారోపితం బగు నైల్యముచే నాకాశము లిప్తము కాదు గదా! నీలంబునుం గాదు కదా! మఱియు నిది జల మని యధ్యస్త మగు జలముచే మరుభూమి జలవంతము కాదు గదా! ఆర్ద్రంబునుం గాదు గదా! అట్లారోపితం బగు కర్మముచే దుష్టముచేతఁ గాని యదుష్టముచేతఁ గాని నిరవయ వుఁడు కూటస్థుఁ డగు నాత్మ క్రియావంతుఁడు కాఁడు, తత్ఫలవంతుఁడునుం గాఁడు. అందువలన ఆత్మయందే యాత్మత నొందిన యాత్మవిదుఁ డగు యతి తా నవిక్రియా త్మం డనుదృష్టిచేఁ గూటస్థుఁడను నేను బూర్వము గాని యిప్పుడు గాని దేనినిం జేసినవాఁడఁ గా నని మాటిమాటికి స్వయాథాత్మ్యవిషయీకరణముచేఁ బుట్టిన విజ్ఞానంబుబలిమివలన సంచితాదిసర్వకర్మంబులనుండియు నిష్క్రమించి తత్ఫలం బగు జన్మాదికముచేఁ గాని దుఃఖాదికముచేఁ గాని యించుకేని స్పృశింపఁబడఁ డని యర్థ ము. ఇందుచే లోకత్రయమున నుండున శేషప్రాణిసంఘాతము వధించినను బ్రహ్మ విదునకుఁ దద్వధక్రియయును తత్కృతప్రత్యవాయలేశంబును సంభవింపదు కావున నిట్టిది బ్రహ్మజ్ఞానమహిమ మహాద్భుతము సంసారబంధవిచ్ఛేదహేతు వని జ్ఞాన మాహాత్మ్యము స్వాభావికమే స్తుతింపఁబడుచున్నది హత్వాపి స ఇమాం ల్లోకా న్నహన్తి న నిబధ్యతే అని. కాని నిత్యనిరంతరసమాధినిష్ఠచే నిర్దగ్ధం బగు సర్వ వాసనాగ్రంథి గల మహాత్మునకు స్వాత్మారామునకు స్వానందామృతరసపానరసికు నకు నిత్యతృప్తునకు సర్వాత్మదర్శికి విద్వాంసునకుఁ బ్రవృత్తి కల దని కా దభి ప్రాయము, ప్రవృత్తిహేతు వగు నవిద్యాకామాదికము సమాధిచే నిర్మూలితం బగుట వలన. మ తే మనఁగా, పరావరైకత్వవిజ్ఞానముచే నిర్దగ్ధ మగు ద్వైతదర్శనము గల బ్రహ్మవిద్యతి కొకానొకప్పుడును ఆహారవిహారాదిలక్షణ మైన శరీరయాత్రామాత్ర ప్రయోజన మగు కర్మముతో దుష్టముతోఁ గాని యదుష్టముతోఁ గాని శ్లేషము లే దని చెప్పఁబడుచున్నది. అట్లే శ్రుతియు "తం విదిత్వా నలిప్యతే కర్మణా పాప కేన, యథా పుష్కరపలాశ ఆపో నశ్లిష్యన్త ఏవ మేవంవిది పాపం కర్మ నశ్లి ష్యతే" * అని.

---

* అతని నెఱింగి పాపకర్మముచే లిప్తుఁడు కాఁడు, ఎట్లు తామరాకునందు జలము అంటదో అట్లు ఇట్టి విద్వాంసునందుఁ బాపం బగు కర్మ మంటదు.

మ॰ ఇట్లు నాలుగుశ్లోకములచే " అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్ । భవ త్యత్యాగినాం ప్రేత్య " అను చరణత్రయము వ్యాఖ్యాతము. ఇప్పుడు " నతు సన్న్యాసినాం క్వచిత్ " అను చతుర్థచరణమున కొకశ్లోకముచే వ్యాఖ్యానము చేయుచున్నాఁడు.—యస్య = పూర్వోక్తునికంటె విపరీతుఁడైన యెవ్వనికి, పుణ్యకర్మములచే వివేకవిరోధిపాపంబులు వినాశితంబులై నిత్యానిత్యవస్తువివేకాది సాధనచతుష్టయముఁ బ్రాపించి శాస్త్రాచార్యోపదేశన్యాయములచే నకర్త్రభోక్త్రస్వప్రకాశ పరమానందాద్వితీయబ్రహ్మసాక్షాత్కారము నొందినవానికి; సకార్యం బగు నజ్ఞానము బాధిత మగుటచే, అహంకృతః = నేను కర్త ననునట్టి; భావః = ప్రత్యయము; న = లేదో; లేక, యస్య భావః = ఎవ్వనియొక్కసద్భావము *; అహం కృతిః=నే నను వ్యపదేశమున కర్హము, న=కాదో, అహంకారము బాధితమై శుద్ధస్వరూపమాత్రమే పరిశిష్ట మగుటవలన; లేక, అహంకృతః = అహంకారము యొక్క, భావః=తత్తాదాత్మ్యము, ఎవ్వనికి లేదో, వివేకముచే బాధిత మగుటవలన; బాధితానువృత్తియందును ఇవియే యై యధిష్ఠానాదులు మాయచే సర్వాత్మ నగు నాయందుఁ గల్పితంబులు సర్వకర్మములకును గర్తలు స్వప్రకాశచైతన్యానందరూపుఁడ నగు నాచేఁ గల్పితసంబంధముచేతఁ బ్రకాశింపఁజేయఁబడుచున్నవి, నేనో కర్తగాను, మ త్తే మనఁగా, కర్తృతద్వ్యాపారములకు సాక్షిభూతుఁడను క్రియాజ్ఞానశక్తిమదుపాధిద్వయనిర్ముక్తుఁడను శుద్ధుఁడను సర్వకార్యకారణాసంబద్ధుఁడను కూటస్థ నిత్యుఁడను నిర్ద్వయుఁడను సర్వవికారశూన్యుఁడను " అసఙ్గో హ్యయం పురుషః, సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ, అప్రాణో హ్యమనా శుభ్రః అక్షరాత్పరతః పరః, అజ ఆత్మా మహాన్ ధ్రువ స్సలిల ఏకో ద్రష్టా ఽద్వైతః, అజో నిత్య శ్శాశ్వతో ఽయం పురాణః, నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరఞ్జనమ్ " ఇత్యాది శ్రుతులవలనను, " అవికార్యో ఽయ ముచ్యతే, ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః । అహంకారవిమూఢాత్మా కర్తాహ మితి మన్యతే, తత్త్వవిత్తు నసజ్జతే, శరీరస్థో ఽపి కౌన్తేయ నకరోతి నలిప్యతే " ఇత్యాది స్మృతులవలనను. అందువలన, నేను గర్తఁ గా నను పరమార్థదృష్టివలన, బుద్ధిః = అంతఃకరణము; యస్య; నలిప్యతే=అనుశయవంతము కాదో, దీని నేఁ జేసితిని దీనిఫలము భుజింపఁగలను అని యనుసంధానము కర్తృత్వవాసనచేఁ గలుగునది లేప మని యనుశయ మని చెప్పఁబడును, అది పుణ్యకర్మమునందు హర్షరూపము,

* ఉనికి.

పాపమందుఁ బశ్చాత్తాపరూపము, ఇట్టి ద్వివిధ మగు లేపముతోను బుద్ధి సంయుక్తము గాదో, కర్తృత్వాభిమానము లేమివలన, అట్లు జ్ఞాని నుద్దేశించి శ్రుతి " ఏత ముహైవైతే న తరత ఇత్యతః పాప మకరవ మిత్యతః కల్యాణ మకరవ మిత్యుభే ఉహైవైష ఏతే తరతి నైనం కృతాకృతే తపతః, తదేత దృచా౽భ్యుక్తమ్, ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య న వర్ధతే కర్మణా నోకనీయాన్। తస్యైవ స్యాత్పదవిత్తం విదిత్వా నలిప్యతే కర్మణా పాపకేన " * అని. పాపకేన అని పుణ్యమునకు నుపలక్షణము. వర్ధతే కనీయాన్ అని పుణ్యాపాపములయందుఁ బరితోషపశ్చాపములఁ దెలుపుచున్నవి, ఇట్లెవ్వని కహంకృతభావము లేదో యెవ్వనిబుద్ధి లిప్తము గాదో అతఁడు పూర్వోక్తదుర్మతివిలక్షణుఁడు సుమతి పరమార్థదర్శి ఆత్మను గేవలుని అకర్తనుగాఁ జూచుచున్నాఁడు, అతఁడు కర్తృత్వాభిమానము లేమివలన ననిష్టాదిత్రివిధకర్మఫలము నొందఁడు. ఇంతమాత్రమే శాస్త్రార్థము. ఇఁక నహంకారాభావ బుద్ధిలేపాభావములను స్తుతించుటకై చెప్పుచున్నాఁడు. — హత్వాపి = హింసించియును; సః = అతఁడు; ఇమాన్ లోకాన్ — సర్వప్రాణులను; నహన్తి = హననక్రియకుఁ గర్త కాఁడు, అకర్తృస్వరూపసాక్షాత్కారమువలన. న నిబధ్యతే= తత్కార్య మగు నధర్మఫలముతోనుం గూడ సంబంధింపఁడు. ఇట నాహంకృతో భావః అనుదానిఫలము నహన్తి అనునది. బుద్ధిర్నలిప్యతే అనుదానిఫలము న నిబధ్యతే అనునది. ఇందుచేఁ గర్మలేపము లే దనుట యం దతిశయమాత్రమే చెప్పఁబడినది కాని సర్వప్రాణిహననము సంభవించునని కాదు. హత్వాపి యని కర్తృత్వాభ్యనుజ్ఞ లౌకిక మగు బాధితకర్తృత్వదృష్టిచేత. నహన్తి యని కర్తృత్వనిషేధము శాస్త్రీయ మగు పరమార్థదృష్టిచేత. కావున విరోధము లేదు. శాస్త్రాదియందు నాయం హన్తి నహన్యతే యని యాత్మకు సర్వకర్మస్పర్శము లే దని ప్రతిజ్ఞ చేసి న జాయతే ఇత్యాదిహేతువచనముచే దాని సాధించి వేదావినాశిన మిత్యాదికముచే విద్వాంసునకు సర్వకర్మాధికారనివృత్తి సంక్షేపమునఁ బ్రతిపాదింపఁబడినది. మధ్యమునందును నయ్యైప్రసంగమునఁ బ్రవర్తితంబై యిట శాస్త్రార్థం బింతమాత్రమే యని ప్రదర్శించుకొఱకు కుపసంహరింపఁబడినది నహన్తి ననిబధ్యతే అని. ఇందువలన నవిద్యాకల్పితములై యధిష్ఠానాద్యనాత్మకృతము లగు సర్వకర్మములకును ఆత్మవిద్యచే

* వీని నివి రెండును తరింపఁజాలవు పాపము చేసితిని పుణ్యము చేసితిని అనునది. ఇతఁడే యీ రెంటిని దరించుచున్నాఁడు. వీనిఁ గృతాకృతములు తపింపఁజేయవు. అది యీఋక్కుచేఁ జెప్పఁబడినది. బ్రాహ్మణునిమహిమ యిది నిత్యము, కర్మముచే వర్ధిల్లదు, తగ్గునది కాదు. ఆ యాత్మస్వరూపము నెఱింగి పాప మగు కర్మముచే లిప్తుఁడు కాఁడు.

సముచ్ఛేద ముపపన్న మగుటవలనఁ బరమార్థసన్న్యాసుల కనిష్టాదిత్రివిధకర్మఫల ము లే దనుట యుపపన్నము. పరమార్థసన్న్యాస మనఁగా అకర్త్రాత్మసాక్షాత్కారమే. జనకాదు లిట్టి సన్న్యాసిత్వ మున్నను బలవత్ప్రారబ్ధవశమువలన బాధితానువృత్తిచేఁ గాని పరపరికల్పనచేఁ గాని వారియందు కర్మదర్శనము విరుద్ధము కాదు, ఇట్టివారలే యగు పరమహంసలయందు భిక్షాటనాదికమువలె. అందువలననే జ్ఞానఫలభూత మగు విద్వత్సన్న్యాసము చెప్పఁబడినది. సాధనభూత మగు వివిదిషాసన్న్యాసమో మొదట నిట్టిది కాకున్నను ఉత్తరకాలమున జ్ఞాన ముత్పన్న మైనపు డిట్టిదే యగు నని ముందు చెప్పఁబడును.

శ్రీ. ఎవ్వనికిఁ గర్మలేపము లే దని చెప్పఁబడినదో అట్టి సుమతి యెవ్వఁడు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అహం కృతః = నే నని చేయఁబడినది, నేను కర్తను అనునట్టిది; భావః = అభిప్రాయము; యస్య = ఎవనికి; న = లేదో. లేక, అహంకృతః = అహంకారముయొక్క; భావః = స్వభావము, కర్తృత్వాభినివేశము; ఎవనికి లేదో, శరీరాదులే కర్మకర్త లని తలంచుటవలన నని యర్థము. అందువలననే, యస్య బుద్ధిః; నలిప్యతే = ఇష్టానిష్టబుద్ధిచే కర్మములయందు సక్తము కాదో; సః = అట్టివాఁడు, దేహాదివ్యతిరిక్తాత్మదర్శి; ఇమాన్ లోకాన్ – సర్వప్రాణులనుగూడ; లోకదృష్టిచే, హత్వాఽపి; వివేకయుక్త మయిన స్వదృష్టిచేత, నహన్తి. తత్ఫలముల చేతనుగూడ, నని బధ్యతే = బంధము నొందఁడు. ఇఁక సత్త్వశుద్ధిద్వారమున నపరోక్షజ్ఞానోత్పత్తికి హేతువు లగు కర్మములచే నతనికి బంధము కలుగు ననుశంక యెక్కడిది ? అని యర్థము. అది చెప్పఁబడినది “బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః। లిప్యతే న స పాపేన ” అని.

ప. *

రా. పరమపురుషుఁడు కర్త యని యనుసంధించుటచే, యస్య = ఎవని యొక్క; భావః = కర్తృత్వవిషయ మగు మనోవృత్తివిశేషము; నాహంకృతః = అహ మభిమానముచేఁ జేయఁబడినది కాదో, నేను జేయుచున్నా నను జ్ఞాన మెవ్వనికి లేదో యని యర్థము. బుద్ధి ర్యస్య నలిప్యతే—ఈ కర్మమునందు నాకుఁ గర్తృత్వము లేమివలన దీనిఫలము నాకు సంబంధింపదు, ఇది మదీయకర్మమునుం గాదు అని యెవ్వనికి బుద్ధి కలుగుచున్నదో అని యర్థము. సః ఇమాన్ లోకాన్; యుద్ధ

* శ్రీశరీయముతో సమానము.

మునందు, హత్వాపి; వాని, నహన్తి. భీష్మాదులమాత్రమే కా దని యర్థము. అందు వలన నాయుద్ధాఖ్యకర్మముచే, న నిబధ్యతే — తత్ఫలము నొందఁ డని యర్థము.

మూ. ఆ జ్ఞానమును స్తుతించుచున్నాఁడు.——ఎవఁడు కొంచెము బద్ధుఁడగునో అతఁడు కొంచె మహంకారము గలవాఁడుగూడ.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః. ౧౮

భా. ఇఁక నిప్పుడు కర్మములకుఁ బ్రవర్తకము చెప్పఁబడుచున్నది.——జ్ఞానమ్ = జ్ఞాయతే—ఎఱుంగఁబడుచున్నది దీనిచేతఁ గావున సర్వవిషయ మగు జ్ఞానము చెప్పఁబడుచున్నది; అట్లు, జ్ఞేయమ్ = ఎఱుంగవలసినది, అదియు సామాన్యమున సర్వంబును జెప్పఁబడుచున్నది; అట్లు, పరిజ్ఞాతా=ఉపాధిలక్షణుఁడు అవిద్యాకల్పితుఁ డగు భోక్త; అను నీత్రయము ఈ సర్వకర్మముల కవిశేషంబునఁ బ్రవర్తకము; ప్రవర్తకము, త్రివిధా= మూఁడుప్రకారములు గలది; కర్మచోదనా=కర్మములయొక్క ప్రవర్తకము. జ్ఞానాదులమూఁడింటిసన్నిపాతమునం * గదా హానోపాదానాదిప్రయోజనం బగు సర్వకర్మారంభ మగును. అందునలన నధిష్ఠానాము లైదింటిచే నారబ్ధమును వాఙ్మనఃకాయాశ్రయభేదముచే మూఁడువిధముల రాశీభూతము నగు కర్మము కరణాదులు మూఁడింటియందు సంగ్రహింపఁబడుచున్న దను నీయర్థము చెప్పఁబడుచున్నది.——కరణమ్ = క్రియతే— చేయఁబడుచున్నది దీనిచేతఁ గావున బాహ్య మగు శ్రోత్రాదికమును ఆంతర మగు బుద్ధ్యాదికమును; కర్మ=కర్తకు ఈప్సితతమము, క్రియచే వ్యాపింపఁబడునది; కర్తా = కరణములఁ బ్రవర్తింపఁజేయువాఁడు, ఉపాధి లక్షణుఁడు; ఇతి=అని; త్రివిధః=మూఁడువిధములు గలది; కర్మసంగ్రహః= సంగ్రహింపఁబడుచున్నది దీనియందుఁ గావున సంగ్రహ మనఁగా ఆశ్రయము, కర్మముయొక్క సంగ్రహము కర్మసంగ్రహము. ఈ మూఁటియందుఁ గదా కర్మము సమవేతము. కావునఁ ద్రివిధము కర్మసంగ్రహము.

జ్ఞానము — ఎఱుఁగుట, జ్ఞేయము — ఎఱుంగవలసినది, పరిజ్ఞాత—ఎఱుంగు వాఁడు అవిద్యాకల్పితుఁ డయిన భోక్త అని మూఁడువిధములు కర్మములకుఁ బ్రవ

* చేరికయందు.

ర్తకము. కరణమును—బాహ్యశ్రోత్రాదికమును ఆంతరబుద్ధ్యాదికమును, కర్మమును—కర్త కీప్సితతమమును చేయఁబడునదియు, కర్తయు — చేయువాఁడును ఉపాధిలక్షణుఁడును అని మూఁడువిధములు కర్మసంగ్రహము, సర్వకర్మములును ఈ మూఁటినే యాశ్రయించి ప్రవర్తించు నని తాత్పర్యము.

ఆ. ఇక—శాస్త్రార్థోపసంహారానంతర మని యర్థము. ఇప్పుడు—ప్రవర్తకోపదేశము నపేక్షించునవస్థయం దని యర్థము. కర్మములకు—వేనియందు విద్వాంసుల కధికారము లేదో అవిద్వాంసులకే యధికారమో వాని కని యర్థము. జ్ఞానశబ్దమునకుఁ గరణవ్యుత్పత్తిచే జ్ఞానమాత్రమర్థ మని చెప్పుచున్నారు జ్ఞాన మిత్యాదిగా. జ్ఞేయశబ్దమునకును అట్లే జ్ఞాతవ్యమాత్ర మని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. ఉపాధిలక్షణుఁడు—ఉపాధిప్రధానుఁడు, ఉపహితుఁడు. అతఁ డవస్తు వనుటకై అవిద్యాకల్పితుఁ డని విశేషణము. ఈ మూఁడే సర్వకర్మప్రవర్తకము లని చెప్పుచున్నారు అను నీత్రయము ఇత్యాదిగా. " చోదనేతి క్రియాయాః ప్రవర్తకం వచనమ్ " అను భాష్యము ననుసరించి చోదనాశబ్దార్థముఁ జెప్పుచున్నారు ప్రవర్తకము ఇత్యాదిగా. మూఁడుప్రకారములు జ్ఞానాదులచేత. కర్మములయొక్క—చోదన యని విగ్రహము. అవి సర్వకర్మప్రవర్తకము లనుట ననుభవముచే సాధించుచున్నారు జ్ఞానాదుల ఇత్యాదిగా. హానోపానా నిత్యాదిశబ్దముచే నుపేక్ష వివక్షితము. కరణ మిత్యాద్యర్థమునకుఁ దాత్పర్యము చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. జ్ఞానాదులు ప్రవర్తకము లగుటవలన నని యర్థము. బాహ్యము ఆంతరము అని ద్వివిధ మైన కరణమును కరణవ్యుత్పత్తిచేఁ జెప్పుచున్నారు కరణ మిత్యాదిగా. ఉక్తలక్షణ మగు కర్మమునే స్ఫుటీకరించుచున్నారు క్రియచే నిత్యాదిగా. స్వతంత్రుఁడు గదా కర్త, స్వాతంత్ర్య మనఁగా కారకములచే నప్రయోజ్యుఁడై కారకప్రయోక్త యగుట యని చెప్పుచున్నారు కర్తా ఇత్యాదిగా. ఎట్లీ చెప్పిన త్రివిధమునందుఁ గర్మము సంగ్రహింపఁబడుచున్నది యనఁగాఁ జెప్పుచున్నారు కర్త్రేత్యాదిగా. కర్మము కారకాశ్రయం బనుట ప్రసిద్ధము గదా యని భావము.

హ. జ్ఞానమ్ = జ్ఞాయతే — ఎఱుంగఁబడుచున్నది దీనిచేతఁ గావున ప్రకాశనము; జ్ఞేయమ్ = ఎఱుంగఁబడుచున్నది కావున జ్ఞానక్రియకుఁ గర్మభూతము; పరిజ్ఞాతా = జ్ఞానక్రియకుఁ గర్త యవిద్యాకల్పితుఁడు; అని, త్రివిధము, కర్మచోదనా= కర్మమునకు — క్రియకు చోదన — ప్రవర్తకము. ఈ మూఁటిసన్నిధియందే ప్రవృత్తి కనఁబడుచున్నది కావున కర్మచోదన జ్ఞానజ్ఞేయపరిజ్ఞాత్రాత్మకము. చేయఁబడుచున్నది

దీనిచేతఁ గావున, కరణమ్=శ్రోత్రాదిజ్ఞానేంద్రియమును వాగాదికర్మేంద్రియమును; కర్మ = కర్తకు క్రియచేఁ బొందఁగోరఁబడునది. కర్తా = ఎవఁడు నేను కర్త నని ప్రతీతుఁ డగుచున్నాఁడో అతఁడు; ఈ మూఁడును, కర్మసంగ్రహః = క్రియాలక్షణ మగు కర్మము సంగ్రహింపఁబడుచున్నది — ఆత్మయందు వ్యవస్థాపిత మగుచున్నది దీనిచేతఁ గావున కర్మసంగ్రహము. కరణకర్మకర్తలయందుఁ గదా సర్వకర్మమును సమవేతము, అందువలన త్రివిధః కర్మసంగ్రహః అని చెప్పఁబడుచున్నది.

శ్లో. ఇట్లు విహితప్రతిషిద్ధాదికర్మము లన్నియు నధిష్ఠానాదిపంచకము చేతనే నిర్వర్త్యము లనియు, తత్కృత మగు కర్మమునందుఁ గర్తృత్వాభిమాని యగు దుర్మతి కర్మబద్ధుఁ డగు ననియు, కృతబుద్ధి యగు విద్వాంసుఁ డకర్తయే తద్ర హితుం డనియుఁ బ్రతిపాదించి యిఁక నిరుక్తలక్షణం బగు నిష్కర్తృత్వజ్ఞానమే య ప్రతిబద్ధమై కైవల్యసిద్ధికిఁ బరమకారణము కావున నారురుక్షుం డగు మోక్షైక కామునకుఁ దాదృశజ్ఞానసిద్ధికిఁ గారణము సత్త్వశుద్ధి తత్సిద్ధికిఁ గారణము సాత్త్వి కం బగు కర్మమే యగుటవలన నదియే కర్తవ్య మని బోధించుటకై కర్మప్రవృత్తి హేతువును గర్మాశ్రయమును జ్ఞానకర్మకర్తృబుద్ధ్యాదుల సాత్త్వికత్వరాజసత్వాది భేదమునుం బ్రతిపాదించుకొఱకు నుత్తరగ్రంథ మారంభింపఁబడుచున్నది. సప్తదశా ధ్యాయంబున నాహారాదుల సాత్త్వికాదిభేదము ప్రతిపాదింపఁబడినను అందుఁ శ్రద్ధాదు లైదింటికే సాత్త్వికాదిభేదము ప్రతిపాదిత మయ్యెఁ గాని జ్ఞానాదులకుఁ బ్రతిపాదింపఁబడినది కాదు. వానికిని సాత్త్వికాదిభేదము దెలిసినయెడ హేయాంశ మగు రాజసమును దామసమును ద్యజించి సాత్త్విక మగు జ్ఞానాదికమునందుఁ బ్రవర్తించువానికి సత్త్వము శుద్ధ మగును. అందుచే జ్ఞానంబును దత్ఫలంబును సిద్ధించును. తదర్థం బిటఁ జోదనకును గర్మాశ్రయమునకును స్వరూపంబును జ్ఞానా దులకు గుణభేదంబున భేదంబును బ్రతిపాదించుచున్నాఁ డిరువదిరెండుశ్లోకములచేత, జ్ఞానకర్మములకు సాధ్యసాధనభావమే సర్వవేదార్థంబును గీతార్థంబు నని దృఢీకరిం చుటకై.—జ్ఞానమ్ = ఇష్టానిష్టాదిరూప మగు ద్రవ్యగుణకర్మాదిపదార్థసమూహము జ్ఞాయతే — ఎఱుంగఁబడుచున్నది దీనిచేతఁ గావున జ్ఞాన మనఁగా సాధారణ మైన సర్వపదార్థవిషయక మగు బోధము; జ్ఞాతవ్యం బగు ద్రవ్యగుణాదిపదార్థజాతము సర్వంబును జ్ఞేయ మని చెప్పఁబడుచున్నది; పరిజ్ఞాతా = జ్ఞేయంబును జ్ఞానంబును ఎఱుంగువాఁడు ప్రమాత, సాభాసుఁ డగు విజ్ఞానాత్మ; ఈ ప్రకారంబున, చోదనా= చోద్యతే — ప్రవర్తింపఁజేయఁబడుచున్నాఁడు దీనిచేతఁ గావున చోదన యనఁగా

సామాన్యంబున సర్వపదార్థవిషయంబునను హానోపాదానాదిక్రియాహేతువు; త్రివిధా = మూఁడువిధములు గలది, ప్రమాణప్రమేయప్రమాతృలక్షణం బగు దేనియొక్క సన్నిధిమాత్రమున హానాదిక్రియ కలుగుచున్నదో అట్టి చోదన త్రివిధ మని యర్థము. ఇట్లు ప్రవృత్తికిఁ గారణము త్రివిధ మని చెప్పి కర్మాశ్రయము గూడ త్రివిధ మని చెప్పుచున్నాఁడు.—కరణమ్ = క్రియతే – చేయఁబడుచున్నది దీనిచేతఁ గావున బాహ్యమును ఆభ్యంతరమును శ్రోత్రాది వాగాది బుద్ధ్యాదిద్వాదశవిధము; కర్మ = ఈప్సితతమము; కర్తకుఁ బొందుట యనుక్రియకు విషయభూతము ద్వితీయాంత మగు నేవస్తువు గలదో అది కర్మ మని యర్థము; కర్తా = కరణములఁ బ్రయోగించువాఁడు కాని తాను వానిచేఁ బ్రయోగింపఁబడువాఁడు కాఁడు స్వతంత్రుఁడు, విజ్ఞానాత్మ; ఇట్లు, కర్మసంగ్రహః = కర్మము చక్కఁగా గ్రహింపఁబడుచున్నది దీనియందుఁ గావున క్రియాశ్రయ మగుకరణాదికము; త్రివిధః = త్రిప్రకారము. ఓయీ! సంప్రదానాదులుకూడఁ గ్రియాశ్రయము లుండునపుడు క్రియాశ్రయము త్రివిధ మని యెట్లు చెప్పవచ్చును? అందు వేని యది దోషము కాదు, సంప్రదానాదులకుఁ బరంపరచేతనే కాని సాక్షాత్తుగాఁ గ్రియాశ్రయత్వము సంభవింపమివలన. ఎట్లు కర్మము సాక్షాత్తుగాఁ గ్రియాశ్రయం బగునో అట్లు సంప్రదానాదులు కాఁ జాలవు. అందువలన యుక్తము క్రియాశ్రయము త్రివిధం బనుట.

మ॰ పూర్వ మధిష్ఠానాదిపంచకమే క్రియాహేతు వగుటచే ఆత్మ సర్వకర్మాఽసంస్పర్శి యని చెప్పఁబడినది. ఇప్పు డాయర్థమునే జ్ఞానజ్ఞేయాది ప్రక్రియారచనచేతను త్రైగుణ్యభేదవ్యాఖ్యానముచేతను వివరింప నుపక్రమించుచున్నాఁడు.—జ్ఞానమ్ = విషయప్రకాశక్రియ; జ్ఞేయమ్ = అజ్ఞానముయొక్క కర్మము; పరిజ్ఞాతా = అజ్ఞానముయొక్కయాశ్రయ మగు భోక్త, అంతఃకరణోపాధిపరికల్పితుఁడు; ఈ మూఁడింటి సన్నిపాతము కలిగినం గదా హానోపాదానాది సర్వకర్మారంభ మగును; అందువలన నీత్రయము సర్వకర్మములకును బ్రవర్తకము, దానినే చెప్పుచున్నాఁడు.—త్రివిధా కర్మచోదనా—చోదన యని ప్రవర్తకము చెప్పఁబడుచున్నది, "చోదనేతి క్రియాయాః ప్రవర్తకం వచన మాహుః" అని శాబరభాష్యమునందును "చోదనా చోపదేశశ్చ విధిశ్చైకార్థవాచినః" అను భాట్టవచనమునందును క్రియాప్రవర్తకవచనత్వము చోదనాపదార్థముగాఁ బ్రతీత మగుచున్నను వచనత్వమును విడిచి ప్రవర్తకమాత్ర మిట లక్షిత మగు మన్నది, జ్ఞానాదులందు వచనత్వము లేమి

వలన. ఇట్లు ప్రేరణీయత్వంబును ప్రేరకత్వంబును అనాత్మకే కాని యాత్మకు లే దని యభిప్రాయము. అట్లు, కరణమ్=సాధకతమము, బాహ్య మగు శ్రోత్రాదియు నాంతర మగు బుద్ధ్యాదియు; కర్మ=కర్తకు ఈప్సితతమము, క్రియచే వ్యాపింపఁబడునది, ఉత్పాద్యమును ఆప్యమును వికార్యమును సంస్కార్యమును; కర్తా = ఇతరకారకములచే నప్రయోజ్యుండై సకలకారకములఁ బ్రయోగించువాఁడు, క్రియను నిర్వర్తించువాఁడు చిజ్జడగ్రంథిరూపుఁడు. అని, త్రివిధః=త్రిప్రకారము; కర్మము సంగ్రహింపఁబడుచున్నది – సమవేత మగుచున్నది దీనియందుఁ గావున కర్మసంగ్రహ మనఁగా కర్త్రాశ్రయము. చకారార్థకం బగు నితిశబ్దమువలన సంప్రదానమును అపాదానమును అధికరణమును రాశిత్రయమునందే యంతర్భవించుచున్నవి. ఇట్లు కారకషట్కమే త్రివిధము క్రియ కాశ్రయము గాని కూటస్థుఁ డగు నాత్మ కాఁ డని యర్థము. కర్మప్రేరకంబును కర్త్రాశ్రయమును కారకరూపం బగుటవలనను త్రైగుణ్యాత్మకం బగుటవలనను అకారకస్వభావుండును గుణాతీతుండు నగు నాత్మ సర్వకర్మాఽసంస్పర్శి యని యభిప్రాయము. లేక. జ్ఞానమ్=ప్రేరణారూపము, లిఙాదిశబ్దజన్యము; జ్ఞేయం = ఆజ్ఞానమునకు విషయము లిఙాదిశబ్దస్వరూప మగు ప్రేరకము; పరిజ్ఞాతా = ఆజ్ఞానమున కాశ్రయము, ప్రేరణీయుఁడు అని; త్రివిధా కర్మచోదనా – కర్మ మనఁగా క్రియ పురుషవ్యాపారరూప మగు ఆర్థభావన, తద్విషయ మగు చోదన – ప్రేరణా, విధిరూపమగు శాబ్దభావన యని యర్థము. అట్లు, కరణమ్ = ఇతి కర్తవ్యతాసహిత మగు సాధనము, ధాత్వర్థము; కర్మ = భావ్య మగు స్వర్గాదిఫలము; కర్తా = ఫలకామనావంతుఁ డగు పురుషుఁడు, క్రియానిర్వర్తకుఁడు; అని, త్రివిధః; కర్మసంగ్రహః = పురుషవ్యాపారరూప మగు కర్మముయొక్క సంగ్రహము – సంక్షేపము. ఇట్లర్థభావనారూపపురుషప్రయత్నము విధేయము లేమివలన శబ్దభావనారూప మగు విధి శుద్ధుఁ డగు నాత్మను విషయీకరింపదు, విధివిధేయములు కారకాశ్రయము లగుటవలన. అది చెప్పఁబడినది "త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భ వార్జున" అని. కారకములు త్రైగుణ్యరూపము లని యనంతరమె వ్యాఖ్యాతము కాఁ గల దని యభిప్రాయము.

ఇటఁ బ్రసంగమువలన విధిని విచారించెదము. ప్రవృత్తిహేతు వని ప్రేరణ సర్వలోకానుభవసిద్ధము. రాజుచేఁ బ్రేరితుఁడను బాలునిచేఁ బ్రేరితుఁడను బ్రాహ్మణునిచేఁ బ్రేరితుఁడను నే నని గదా ప్రవర్తించువారు చెప్పుదురు. ఆ ప్రవర్తన * ప్రవర్తకరాజాదినిష్ఠము. అందు నికృష్టునిగూర్చి యుత్కృష్టుని ప్రవర్తన

---

* ప్రవర్తింపఁజేయుట.

ఆజ్ఞ యనియు ప్రేషణ యనియుఁ జెప్పఁబడును. ఉత్కృష్టునిగూర్చి నికృష్టుని ప్రవర్తన యాచన యనియు అధ్యేషణ * అనియుఁ జెప్పఁబడును. ఉత్కర్షము గాని నికర్షము గాని లేక సమునిగూర్చి సమునిప్రవర్తన అనుజ్ఞ యనియు ననుమతి యనియుఁ జెప్పఁబడును. ఆ యాజ్ఞాదులు జ్ఞానవిశేషములు గాని యిచ్ఛావిశేషములు గాని చేతనధర్మములే లోకమునఁ బ్రసిద్ధములు. వేదమునందో విధిచే నేను బ్రేరితుఁడనై చేయుచున్నా నని వ్యవహరించెదరు. అందుఁ దానచేతన మగుటవలనను అపౌరుషేయ మగుటవలనను వైదిక మగువిధికిఁ జేతనధర్మ మగు నాజ్ఞాదికముచేఁ బ్రేరకత సంభవింపదు. అందువలన స్వధర్మముచేతనే ప్రేరకత యని యంగీకరింపవలయును, గత్యంతరము లేమివలన. ఆధర్మమే చోదన యనియుఁ బ్రవర్తన యనియుఁ బ్రేరణ యనియు విధి యనియు నుపదేశ మనియు శబ్దభావన యనియుఁ జెప్పఁబడుచున్నది. అందుఁ గొంద రలౌకికమునే శబ్దవ్యాపారమును గల్పించెదరు. ఇతరులో క్లృప్తముచేతనే యుపపత్తి గలుగుటవలన నలౌకికకల్పనను సహింపరు. ప్రవర్తన యనఁగాఁ బ్రవృత్తి హేతు వగు వ్యాపారము గదా! విధిశబ్దమునకు దశలకారసాధారణం బగు నాఖ్యాతత్వరూపోపాధిచేఁ బురుషప్రవృత్తిరూపార్థభావననుగూర్చి వాచకత్వము, తద్జ్ఞానహేతుత్వ మనుట. అది జ్ఞాత మైననే యనుష్ఠింప శక్య మగుఁ గావునఁ దద్జ్ఞానహేతు వైనను శబ్దమునకుఁ దద్ధేతుత్వము తప్పక కలుగుచున్నది. అందు విధిశబ్దముయొక్క పురుషప్రవృత్తిరూపభావనాజ్ఞానహేతు వగు వ్యాపారము తద్వాచకశక్తిమంత మని విధిశబ్దముయొక్క జ్ఞానము. అదియే దానిప్రవృత్తిహేతువ్యాపారము కావునఁ బ్రవర్తనాభిధానీయకము నొందుచున్నది, జ్ఞానద్వారముననే శబ్దము ప్రవృత్తిజనకం బగుటవలన, జ్ఞానజనకవ్యాపారముకంటె నతిరిక్త మగు వ్యాపారము కల్పించుటకుఁ బ్రమాణము లేమివలన. జ్ఞానజనకవ్యాపారమో దానిస్వజ్ఞానంబును శక్తిజ్ఞానంబును శక్తివిశిష్టస్వజ్ఞానంబును. అందుఁ బ్రథమద్వితీయములలో నొకటి శబ్దభావనయుఁ దృతీయమో దానికిఁ గరణంబు నని వివేకము. ఇది స్థితి. ఇందు నిష్కర్షము. విధిచే స్వజ్ఞానము జనిత మగుచున్నది ప్రవర్తనాత్వంబున నభిహిత మగుచున్నదియుఁ గావున విధిజ్ఞానమే శబ్దభావన. దానియందుఁ బురుషప్రవృత్తిరూపార్థభావనయే భావ్యతచే నన్వయించుచున్నది. కరణతచేఁ బ్రవృత్తివాచకశక్తి విశిష్టవిధిజ్ఞానమే యన్వయించును. భావనాసాధ్యమునకును ఫలావచ్ఛిన్న మగు భావననుగూర్చి కరణత్వము ఫలకరణ మగుట

---

* వేఁడుట.

వలననే స్వర్గభావనను గూర్చి యాగమునకుంబోలె విరుద్ధము కాదు. అందువలన పురుషుఁడు తనప్రవృత్తిని భావింపవలయును. దేనిచేత ననఁగా పురుషప్రవృత్తివాచకశక్తివిశిష్ట మని జ్ఞాత మయిన విధిశబ్దముచేత నని కరణాంశపూరణము. ఎట్లు అనఁగా అర్థవాదములచే స్తుతించి యని యితికర్తవ్యతాంశపూరణము, ఈ గోవు క్రేతవ్య మను లౌకికవిధియందు బహుక్షీర జీవద్వత్స ప్రస్త్ర్యపత్య * సమాంసమీన ♦ ఇత్యాది లౌకికార్థవాదముచేతవలె. ఓయీ! ఆఖ్యాతత్వముచే విధిశబ్దమువలన నుపస్థిత మైనపురుషప్రవృత్తి భావ్యతచే నన్వయించుఁగాక. కరణమో యనుపస్థితం బె ట్లన్వయించును? చెప్పెదము. విధిశబ్దమేమో శ్రవణముచే నుపస్థాపితము, దాని యొక్క-పురుషప్రవృత్తివాచకశక్తియు స్మరణముచే నుపస్థాపితము, తదుభయవైశిష్ట్యమును తన్నిష్ఠ మగు జ్ఞాతతయు మనస్సుచే నుపస్థాపితము, కావున వాచకశక్తివిశిష్ట మని జ్ఞాత మగు విధిశబ్ద ముపస్థిత మయ్యే యున్నది. ఇందుచే నేది శక్య మగునో దాని భావింపవలయు నని ప్రతిశబ్దమును స్వాధ్యాయవిధితాత్పర్యమువలన శబ్దాతిరిక్తముచే నుపస్థిత మగు నదియు శాబ్దబోధమందు భాసిల్లవచ్చును; జ్యోతిష్టోమాదినామమును లింగవినియోజ్య మగు మంత్రమును ఎట్లో అట్లు. అది చెప్పఁబడినది యాచార్యులచే నుద్భిదధికరణమునందు "అనుపస్థిత విశేషణా విశిష్టబుద్ధిర్న భవతి నత్వనభిహితవిశేషణా" ‡ అని. అందువలన నర్థవాదముల కుపస్థితి శ్రోత్రముచేతను ప్రాశస్త్యమునకో యాయర్థవాదములచేతనే లక్షణచేతను తదుభయనిష్ఠజ్ఞాతతకో మనస్సుచేతను గలుగుటవలన నర్థవాదములచేఁ బ్రశస్తత్వంబున నెఱింగి యని యితికర్తవ్యతాంశాన్వయముగూడ నుపపన్నమే. ఓయీ! ప్రాశస్త్య మేమి? ఫలసాధనత్వమేమో కాదు, అది యాగముచే స్వర్గమును భావింపవలయు నని యర్థభావనాన్వయవశమున విధివాక్యమువలననే లబ్ధ మగుటవలన. ఇతరము లేదు, ప్రవృత్తియం దుపయోగింపమివలన. చెప్పెదము. బలవదనిష్టాననుబంధిత్వము ప్రాశస్త్యము. అది యిష్టహేతుత్వజ్ఞానమువలన లభింపదు, ఇష్టహేతువునందును గలంజభక్షణాదికమునం దనిష్టహేతుత్వముగూడఁ గనఁబడుటవలన. విహితశ్యేనఫల మగు శత్రువధమునను అనిష్టా

* ఆఁడుదూడలు వేయునది.

♦ ఏఁటేఁట ఈనునది.

‡ అనుపస్థిత మగు విశేషణము గల విశిష్టబుద్ధి కలుగదు కాని యనభిహిత మగు-శబ్దముచేఁ జెప్పఁబడని విశేషణము గల విశిష్టబుద్ధి కలుగుచున్నది.

నుబంధిత్వము దృష్టము. అందువలన నెంతవఱకు సాధనమును ఫలమును అనిష్టమున కహేతువు లని చెప్పఁబడదో అంతవఱ కిష్టహేతు వని యెఱింగినను దానియందుఁ బురుషుఁడు ప్రవర్తింపఁడు. కావుననే చెప్పఁబడినది "ఫలతో ఽపిచ యత్కర్మ నానర్థే నానుబధ్యతే। కేవలప్రీతిహేతుత్వా త్తద్ధర్మ ఇతి కథ్యతే" అని. అందువలనఁ దనచేఁ గాని ఫలముచేఁ గాని యనర్థాననుబంధిత్వరూప మగు ప్రాశస్త్యమును బోధించుటచే నర్థవాదములు విధిశక్తి నుత్తంభించుచున్నవి. ఉత్తంభ మన నేమి? తనచేఁ గాని ఫలముచేఁ గాని యనర్థానుబంధి యనుశంక ప్రవృత్తిప్రతిబంధక మైనది నశించుట. విధికిఁ బ్రవృత్తిజననమునం దీసాహాయ్యమే యర్థవాదములచేఁ జేయఁబడుచున్నది. కావున విధి యర్థవాదసాకాంక్షము. ఇట్లర్థవాదములును అభిధచేఁ గాని గౌణవృత్తిచేఁ గాని భూత మగు నర్థమును జెప్పుచున్నవి యయ్యును స్వాధ్యాయవిధిచే నాపాదిత మగు ప్రయోజనవత్త్వముఁ బ్రాపించుటకై విధిసాకాంక్షములు. నష్టాశ్వదగ్ధరథులకుం బోలె నీసంప్రయోగము. ఒకరథము దగ్ధ మయ్యెను దానియశ్వములున్నవి, మఱియొకరథమున కశ్వములు పోయినవి రథముమాత్ర మున్నది, ఆయశ్వములతో ఈరథమున కెట్లు పరస్పర మర్థవంత మగుకొఱకు సంప్రయోగ మగునో, అట్లు అర్థవాదముల ప్రయోజనాంశము విధిచేఁ బూరింపఁబడుచున్నది, విధికిని శబ్దభావనయొక్క యితికర్తవ్యతాంశ మర్థవాదములచేఁ బూరింపఁబడుచున్నది. కావున నీరెండును శ్రుతము లైనపుడు పూర్ణమే వాక్యము. ఒకటిమాత్రమే శ్రుత మయిన యెడ నితరమును గల్పించి పూరింపవలయును. ఎట్లనఁగా "వసన్తాయ కపిఞ్జలానాలభేత" అను విధియం దర్థవాదాంశ మశ్రుత మైనను గల్పింపఁబడుచున్నది, "ప్రతితిష్ఠన్తి హవా య ఏతా రాత్రీ రుపయన్తి" ఇత్యా ద్యర్థవాదమునందు విధ్యంశము కల్పించి పూరింపఁబడుచున్నది. అట్లు సూత్రము "విధినా త్వేకవాక్యత్వాత్ స్తుత్యర్థేన విధీనాం స్యుః" అని. స్తుతిసాకాంక్ష మగు విధిచే ప్రయోజనసాకాంక్షము లగు నర్థవాదము లేకవాక్యము లగుటవలన విధులకు — విధేయములకు స్తుత్యర్థముచేత — స్తుతిప్రయోజనముచేత — లేక — స్తుతిరూప మగు ప్రయోజనసాకాంక్ష మైన లాక్షణికార్థముచేత ఆనర్థక్యము లేమివలన నర్థవాదములు ధర్మమునందుఁ బ్రమాణము లగు నని యర్థము. ఓయీ! "య ఏవ లౌకికా శ్శబ్దా స్త ఏవ వైదికా స్త ఏవ చామీషా మర్థాః" * అను న్యాయమువలన విధిశబ్దమునకు లోకమున దేనియందు

* లౌకికము లగు శబ్దము లేవి గలవో అవియే వైదికశబ్దములు వీని కర్థములును అలౌకిక శబ్దార్థములే.

శక్తి గ్రహింపఁబడినదో వేదమునందును ఆయర్థము గలదియే యది కావలయును. లోకముననో ప్రేషణాదులందుఁ బురుషధర్మవాచిత్వము క్లృప్తమై యుండఁగా వేదమునందు శబ్దభావనావాచిత్వ మెట్లుపపన్న మగును? చెప్పెదము. లోకవేదములం దేకరూపతయే. ఎట్లనఁగా. లోకమునందుఁ బ్రేషణాదికము ఆయారూపమున విధిపదవాచ్యము కాదు, అననుగమముచే నానార్థత్వము ప్రసక్తించుటవలనను అట్లే భావనావాచిత్వ ముపపన్న మగుటవలనను. మ తే మనఁగా ప్రేషణాధ్యేషణానుజ్ఞలందుఁ గలదు ప్రవర్తనాత్వ మొక్కటి. అదియో శబ్దవ్యాపారమునందును దుల్యము. అదియే లిఙాదిపదవాచ్యము. లౌకికశబ్దమునందో అది లేదు, అందు రాజాదులే ప్రవర్తకు లగుటవలన. ప్రవర్తకవ్యాపారమే గదా ప్రవర్తన. ప్రవర్తకత్వమో రాజాదులకువలె వేదమునకును అనుభవసిద్ధము. ఓయీ! వేదమునందును బ్రవర్తనావంతుఁ డీశ్వరుఁడు కల్పింపఁబడుఁ గాక, లోకమునందు రాజాదులవలె. అది చెప్పఁబడినది "విధి రేవ తావ ద్గర్భ ఇవ శ్రుతికుమార్యాః పుంయోగే మానమ్" * అని. కాదు, వేద మపౌరుషేయ మగుటవలన. వేదమునకుఁ గర్త యగు పురుషుఁడు లోకమునఁ గాని వేదమునఁ గాని ప్రసిద్ధుఁడు కాఁడు గదా! కర్తను గల్పించినయెడ తజ్జ్ఞానప్రామాణ్యాపేక్షచే వేదప్రామాణ్య మగును. అపుడు నిరపేక్షత్వంబున నున్న స్వతఃప్రామాణ్యము భగ్నం బగును. బుద్ధవాక్యమునందును బ్రామాణ్యము సంభవించును. ఈశ్వరవచనత్వము సమానమైనను బుద్ధవాక్యము ప్రమాణము కాదు వేదవాక్యమే ప్రమాణ మనిన సుభగాభిక్షుకన్యాయము ప్రసక్తించును. మహాజను లుభయసిద్ధులు ♦ కామిచేఁ దత్పరిగ్రహాపరిగ్రహమువలన విశేషము లభింపదు. ఈశ్వరప్రేరణ లోకవేదసాధారణం బగుటచే లోకమునందును రాజాదులకుఁ బ్రేరకత్వము లేకపోవును. ఈశ్వరప్రేరణ యుండఁగానే రాజాదులును అసాధరణతచేఁ బ్రేరకు లందువేని, ఆ! ఈశ్వరప్రేరణ యుండనీ లేకపోనీ, ఇందును అసాధారణప్రేరకము వేదమే రాజాదిస్థానీయ మని వచ్చితివి మార్గమునకు, ఈశ్వరప్రేరణ సాధారణము అసాధారణప్రేరణాసహకారమునసే ప్రవర్తక మగుటవలన. మఱియును ఈశ్వరప్రేరణయం దందఱును విహితము చేయనే చేయుదురు, కాని యొకఁడును దాఁటఁడు. నిషిద్ధమునందునుం గూడ నీశ్వరప్రేరణ యుండనే యున్నది, లేదేని యెవ్వఁడును దానియందుఁ బ్రవ

* విధియే గర్భమువలె శ్రుతికుమారికిఁ బురుషయోగమునందుఁ బ్రమాణము.

♦ రెండుపక్షములకును సమ్మతులు.

ర్తింపఁడు, కావున నదియు విహితము కావలయును. అట్లు చెప్పఁబడినది " అజ్ఞో జన్తు రనీశో ఽయ మాత్మన స్సుఖదుఃఖయోః । ఈశ్వర ప్రేరితో గచ్ఛే త్స్వర్గం వా శ్వభ్ర మేవ వా "* అని. అందువలన రాజాజ్ఞలవలె వేదంబును స్వప్రవర్తనను దెలుపుచు ఇచ్ఛోపహారముఖంబునఁ బ్రవర్తింపఁజేయుచున్న దని సిద్ధము లోకవేదముల కైకరూప్యము. పూర్వమీమాంసకులకు స్వతంత్రము వేద మని బ్రహ్మమీమాంసకులకో బ్రహ్మవివర్తము పరతంత్రము వేద మని విశేష మున్నను శ్వసితతుల్యత్వంబున వేదమున కపౌరుషేయత్వ ముభయవాదులకును సమానము. ఇట ప్రవృత్త్యనుకూలవ్యాపారత్వము ప్రవర్తనాత్వము సఖండము గాని యఖండము గాని యుపాధి; అది విధిపదశక్య మైనను తదాశ్రయవిశేషోపస్థితి గవాదితుల్యమే. లేక, అనుకూలవ్యాపారత్వము శక్యము, ప్రవృత్త్యంశమో ఆఖ్యాతత్వముచే శక్త్యంతరలభ్యమే, దండి యనుచోట సంబంధి యగు మతుబర్థమునందుఁ బ్రకృత్యర్థదండాంశమువలె. ఫలసాధనతాబోధమే ప్రేరణ, దానినే చేయుచుఁ బ్రేరక మగుచున్నది విధి, కావున ఫలసాధనతయో ప్రేరణాత్వమున విధిపదశక్యం బని మండనాచార్యులు. ఫలసాధనత యర్థభావనాన్వయలభ్యం బని చెప్పఁబడినది మున్ను. ఈ పక్షమునే పార్థసారథి ప్రభృతు లగు పండితు లంగీకరించిరి. ఔపనిషదులకుఁగూడఁ గొందఱ కిష్టసాధనతావాద మీమతముచేతనే యుపపాదనీయము. ఇష్టసాధనత్వము స్వరూపముచేతనే లిఙాదిపదశక్యము, ప్రేరణాత్వముచేఁ గా దని తార్కికులు. అది యుక్తము కాదు, గౌరవమువలనను అన్యలభ్య మగుటవలనను అన్వయాయోగ్య మగుటవలనను. ఇచ్ఛావిషయసాధనత్వముకంటె ప్రవర్తనాత్వము మిక్కిలి లఘువు, ఇచ్ఛాతద్విషయములకుఁ బ్రవేశము లేమివలన, ఇచ్ఛాజ్ఞానమునకును బ్రవృత్తిజ్ఞానమునకు వలెఁ బ్రవృత్తిహేతుత్వము ప్రసక్తించుటవలన, వస్తుగతిచే నేది యిచ్ఛావిషయమో తత్సాధనం బని శబ్దముచేఁ బ్రతిపాదింప నశక్య మగుటవలన. సాధనత్వమాత్రమే శక్య మగునేని ఆప్రత్యయముచేతనే యుపస్థాపిత మగు ప్రవృత్తితోఁ గూడ శ్రుతిచేఁ దదన్వయము సంభవించుటచే పదాంతరోపస్థాపితస్వర్గముతోఁగూడ వాక్యముచేఁ దదన్వయము సంభవింపమివలనఁ బ్రవర్తనాత్వమునందే పర్యవసాన మగుచున్నది, శ్రుతిచే వాక్యమునకు బాధ కలుగుటవలన. ప్రత్యయశ్రుతి పదశ్రుతికంటె బలీయం బగుటచే " పశునా యజేత " అనుచోటఁ బ్రకృత్యర్థ మగు పశువును విడిచి

* అజ్ఞుఁడు జీవుఁడు తనసుఖదుఃఖములందు స్వతంత్రుఁడు కాఁడు, ఈశ్వరప్రేరితుఁడై స్వర్గమునే గాని గోతినే గాని పొందును.

ప్రత్యయార్థ మగు కరణముతోఁ గూడ నేకత్వ మన్వయించుటవలన ఏకము కరణము పశు వని వచనవ్యక్తిచే నేకత్వమునకుఁ గ్రత్వంగత్వము కలిగినది. ఇఁకఁ బదాంతరస మభివ్యాహారరూపం బగు వాక్యముకంటె బలీయం బని చెప్పెడి దేమి? వాక్యార్థాన్వయలభ్యం బగుటవలనఁగూడ నిష్టసాధనత్వము పదార్థము కాదు. ఎట్లనఁగా. ప్రవర్తనాకర్మభూత మగు పురుషప్రవృత్తిరూపార్థభావన దేని దేనిచేత ఎట్లు అను నంశత్రయముగలది విధిచే నాలంబత్వంబునఁ బ్రతిపాదింపఁబడుచున్నది యని చెప్పఁబడినది పూర్వము. అపురుషార్థకర్తృకం బగుదానియందుఁ బ్రవర్తన యనుపపన్న మగుటవలన నేకపదోపస్థాపితమునుగూడ నపురుషార్థ మగు ధాత్వర్థమును విడిచి భిన్నపదోపాత్తమును అన్యవిశేషణమును నైనను కమిపదసంబంధముచే * సాధ్యతాన్వయయోగ్య మగుస్వర్గమునే పురుషార్థమును భావ్యమునుగా నాలంబించుచున్నది, ఇచ్ఛావిషయమే కృతివిషయం బను నియమమువలన, స్వర్గం కామయతే స్వర్గకామః అనుటచే కర్త్రర్థం బగు ద్వితీయ యంతర్భూతం బగుటవలన, యజధాతు వకర్మకమగుటచే స్వర్గమ్ అన్నయెడ నన్వయము లేమివలనను. ఇందువలననే యెచటఁ గమిపదము శ్రుతము కాదో అచటఁగూడ నది కల్పింపఁబడుచున్నది. "ప్రతితిష్ఠన్తి హవా య ఏతా రాత్రీ రుపయన్తి" ఇత్యాదిస్థలమున "ప్రతిష్ఠాకామా రాత్రిసత్రి ముపేయుః" ఇత్యాదికమునఁ బెట్లు లబ్ధభావ్యం బగుడు దానియందు సమానపదోపస్థాపితం బగు ధాత్వర్థమే కరణత్వంబున నన్వయించుచున్నది, భావ్యాంశము కమివిషయమున నకరుద్ధం బగుటవలన, సుబ్విభక్తియోగ్య మగు ధాత్వర్థనామధేయ మయిన జ్యోతిష్టోమాదికమునందుఁ దృతీయ శ్రుత మగుటవలన, ఎచట నామధేయమునందు ద్వితీయ శ్రుతమో యచటఁ గూడ వ్యత్యయానుశాసనముచేఁ దృతీయ కల్పించుటవలన. అది చెప్పఁబడినది మహాభాష్యకారులచేత "అగ్నిహోత్రం జుహోతీతి తృతీయార్థే ద్వితీయా" అని. ఇందువలననే వారిచేత ప్రకృతిప్రత్యయములు ప్రత్యయార్థమును సమముగా వచించుచున్నవి అందుఁ బ్రత్యయార్థము ప్రధానమును ధాత్వర్థము గుణమును కావునఁ బ్రత్యయార్థభావననుగూర్చి ధాత్వర్థము గుణ మగుటచేఁ గరణం బని చెప్పఁబడినది. "ఆఖ్యాతం క్రియాప్రధానమ్" అను వచించిన నిరుక్తకారులుగూడ నీయర్థమునే ప్రతిపాదించిరి. భావార్థాధికరణమునందును నట్లే యున్నది. అందుచే నంతటను బ్రత్యయార్థమును గూర్చి ధాత్వర్థమునకుఁ గరణత్వంబుననే యన్వయనియమము. అందువలననే గుణవిశిష్టధాత్వర్థవిధియందును

* స్వర్గకామః అనుచోట కామశబ్దసంబంధముచే.

ధాత్వర్థానువాదముచే కేవలగుణవిధియందును మత్వర్థలక్షణయును విధికి విప్రకృష్టవిషయత్వంబును. ఎట్లనఁగా, సోమేన యజేత అను విశిష్టవిధియందు సోమవంత మగు యాగముచే ననియు దధ్నా జుహోతి అను గుణవిధియందు దధిమంత మగు హోమముచే ననియు. నామధేయాన్వయమునందో సామానాధికరణ్యోపపత్తివలనను ధాత్వర్థమాత్ర విధానమువలనను మత్వర్థలక్షణ గాని విధివిప్రకర్షము గాని లేదు. అందువలన జ్యోతిష్టోమేన యజేత స్వర్గకామః అనుచోట ఆఖ్యాతార్థము భావింపవలయు నని, దేనిని అను నాకాంక్ష కలుగఁగా కామివిషయ మగు స్వర్గము నని, విధిశ్రుతి బలీయ మగుటవలనను ఆకాంక్ష యుత్కట మగుటవలనను. అట్లే యున్నది షష్ఠమునందు. అంత దేనిచేత ననఁగా యాగముచేత నని తృతీయాంతపదసమానాధికరణ మగుటవలనను కరణత్వముచేతనే యన్వయనియమమువలనను. ఏనామము గల దానిచేత నని యపేక్ష కలుగఁగా జ్యోతిష్టోమముచేత నని తన్నామముచేత నని యర్థము. శబ్దమువలన ననుపస్థిత మైనను జ్యోతిష్టోమశబ్దము శాబ్దబోధమందు శ్రవణముచే నుపస్థాపితమై తప్పక భాసిల్లుచున్నది తాత్పర్యవశము వలన. నామధేయాన్వయమందును విభక్త్యర్థము ద్వారము కాదు నఞ్వాద్యర్థాన్వయమునందువలె. అందుచే మత్వర్థలక్షణ లేకయే జ్యోతిష్టోమశబ్దవంతముచేత నని యన్వయము లభించుచున్నది. అట్లు కవిప్రయోగము "హిమాలయో నామ నగాధిరాజః" అని. హిమాలయనామవంత మని యర్థము. ఇట్లక్కడ "ప్రభిన్నకమలోదరే మధూని మధుకరః పిబతి" ఇత్యాదిక మగు నగృహీతసంగతి కైకపదవంత మయిన వాక్యమునందు మధుకరాదిపదము స్వరూపముచేతనే భాసిల్లుచున్నది, నామధేయమువలె నర్థము నుపస్థితముఁ జేయదు, పూర్వ మగృహీతసంగతిక మగుట వలన. కావుననే మధుకరశబ్దవాచ్య మనియు లక్షణచే నన్వయము కాదు, లక్ష్యజ్ఞానము శక్యజ్ఞానపూర్వక మగుటవలన. స్వరూపముచేత శబ్దము భాసిల్లినచో వాచ్యవాచకసంబంధము పిమ్మటఁ గల్పింపఁబడుచున్నది సంసర్గనిర్వాహము కొఱకు. అందువలన నిది వాక్యార్థము. జ్యోతిష్టోమనామం బగు యాగముచే స్వర్గము నిష్టమును భావింపవలయు నని. ఎట్లని యపేక్షింపఁగా శ్రుతిలింగవాక్యప్రకరణస్థానసమాఖ్యలచే సామవాయికారాదుపకారకాంగగ్రామపూర్తిచే నని వికృతియందుఁ బ్రకృతివలె నని యుపబంధముచేతను నిత్యమునందు యథాశక్తి నని యుపబంధముచేతను ముఖ్యాలాభంబునం బ్రతినిధి చేసి యేని యనియు యంవన్యాయలభ్యము తత్పూరణము. ఇట్లు యాగము స్వర్గావచ్ఛిన్నభావనాకర

ణం బగుటచే దానికి స్వర్గకరణత్వంబును కరణత్వముచే సాక్షాత్కర్తృవ్యాపారవిష యత్వరూపం బగు కృతిసాధ్యత్వంబును శ్రుతివలనను అర్థమువలనను లభించుచున్నవి కావున నారెండును లిఙాదిపదవాచ్యములు కావు, "అప్రాప్తే శాస్త్ర మర్థవత్" * అనున్యాయమువలన. అనన్వయమువలనఁ గూడ. ఇష్టసాధన మను సమాసమునందు గుణభూత మగు నిష్టపదము స్వర్గకామః అను సమాసాంతరమునందు గుణభూత మగు స్వర్గపదముతో ఇష్టస్వర్గసాధన మని యెట్లన్వయించును ? రాజపురుషో వీరపుత్త్రః అనుచోట రాజపదవీరపదముల కన్వయము లేదు గదా, "పదార్థః పదార్థే నాన్వేతి నతు పదార్థైకదేశేన" • అనున్యాయమువలన. కరణవిభక్త్యంతజ్యోతి ష్టోమాది నామధేయానన్వయప్రసంగాదిదోషములుగూడ నీపక్షమందు ద్రష్టవ్యములు. ఇందుచే ఇష్టసాధనత్వము అనిష్టాసాధనత్వము కృతిసాధ్యత్వము అనుత్రయము విధ్యర్థ మను వాదము నిరాకృతము, అతిగౌరవమువలనను అర్థవాదములకు సర్వథా వైయర్థ్యము సంభవించుటవలనను. అందువలననే కృతి సాధ్యత్వమాత్రమె విధ్యర్థ మనుటయుఁ గాదు, అది భావనాకరణ మగుటచే నర్థలభ్యం బని చెప్పి యుండుటవలన. అలౌకిక మగు నియోగమో అలౌకిక మగుటవలననే విధ్యర్థము కాదు. ఇటుఁ బరాక్రమించి యున్నారు సూరులు. అందువలన, అనన్యలభ్యమును లఘుభూతంబు నగు ప్రేరణయే లిఙాదిపదవాచ్య మని సిద్ధము. ప్రవర్తక మగు జ్ఞానమో వాక్యార్థ మర్యాదాలభ్యము అన్యమే సర్వవాదులకును. ఆఖ్యాతార్థమే విశేష్యతచే భాసిల్లుఁగాని ధాత్వర్థమును నామార్థమును స్వర్గకామశబ్దవాచ్యమును భాసిల్ల వనియు నుక్తప్రాయమే. అందుచే యాగానుకూలకృతిమంతుఁడు స్వర్గకాముఁ డని తార్కికమతం బగు పురుషవిశేష్యకవాక్యార్థజ్ఞానం బపాస్తము.

భాట్టమత మిది యిట నుపపాదితంబు
సంగ్రహంబున నిందు జిజ్ఞాసితంబు
కలదయేనియు నింక సాకల్యముననను
నాకరంబున నది యారయంగ నొప్పు. ౧౫

శ్రీ. హత్వాపి నహన్తి ననిబధ్యతే యన్నదానినే యుపపాదించుటకై కర్మచోదనయుఁ గర్మాశ్రయంబును గర్మఫలంబులును త్రిగుణాత్మకము లగుటవలన

* అప్రాప్తమునందు శాస్త్ర మర్థవంతము.

• పదార్థము పదార్థముతో నన్వయించును గాని పదార్థైకదేశముతో నన్వయింపదు.

నిర్గుణుఁ డగు నాత్మకుఁ దత్సంబంధము లే దను నభిప్రాయంబునఁ గర్మచోదనను గర్మాశ్రయమునుం జెప్పుచున్నాఁడు.—జ్ఞానమ్ = ఇష్టసాధన మిది యను బోధము; జ్ఞేయమ్ = ఇష్టసాధన మగు కర్మము; పరిజ్ఞాతా = ఇట్టి జ్ఞానమున కాశ్రయ మైన పురుషుఁడు; ఇట్లు, త్రివిధా కర్మచోదనా – చోద్యతే – ప్రవర్తింపఁ జేయఁబడు చున్నాఁడు దీనిచేతఁ గావున చోదన, జ్ఞానాదిత్రయము కర్మప్రవృత్తిహేతు వని యర్థము. లేక, చోదన యనఁగా విధి, అది చెప్పఁబడినది భట్టులచేత "చోదనా చోపదేశశ్చ విధి శ్చైకార్థ వాచినః" అని. అందువలన నిది యర్థము. ఉక్తలక్షణం బగు త్రిగుణాత్మక మైన జ్ఞానాదిత్రయము నవలంబించి కర్మవిధి ప్రవర్తించు చున్నది యని. అది చెప్పఁబడినది "త్రైగుణ్యవిషయా వేదాః" అని. మఱియు, కరణమ్ = సాధకతమము; కర్మ = కర్తకు ఈప్సితతమము; కర్తా = క్రియానిర్వర్తకుఁడు; కర్మము సంగ్రహింపఁబడుచున్నది దీనియందుఁ గావున కర్మసంగ్రహము, కరణాది త్రివిధ మైనకారకము క్రియాశ్రయ మని యర్థము. సంప్రదానాదికారకత్రయమో పరంపరచేఁ గ్రియానిర్వర్తకమే కాని సాక్షాత్క్రియాశ్రయము కాదు, కావునఁ గరణాదిత్రయమే క్రియాశ్రయ మని చెప్పఁబడినది.

ప. *

రా. ఈ యకర్తృత్వా ద్యనుసంధాన మంతయు సత్త్వగుణవృద్ధిచేతనే సిద్ధించుఁ గావున సత్త్వం బుపాదేయ మని తెలుపుటకై కర్మమునందు సత్త్వాదిగుణకృత మగు వైషమ్యముఁ బ్రపంచించువాఁడై మొదటఁ గర్మచోదనాదిప్రకారముఁ జెప్పుచున్నాఁడు.—జ్ఞానమ్ = కర్తవ్యకర్మవిషయజ్ఞానము; జ్ఞేయమ్ = కర్తవ్య మగు కర్మము; పరిజ్ఞాతా దాని నెఱుంగువాఁడు. అని, త్రివిధా కర్మచోదనా— బోధబోధ్యబోద్ధృయుక్తము జ్యోతిష్టోమాదికర్మవిధి యని యర్థము. అందు బోద్ధవ్యరూప మగు కర్మము త్రివిధము సంగ్రహింపఁబడుచున్నది — కరణం కర్మ కర్తేతి. కరణమ్ — సాధనభూత మగు ద్రవ్యాదికము; కర్మ — యాగాదికము, కర్తా — అనుష్ఠాత అని.

మా. ఇట్లయినయెడఁ బురుషు నపేక్షించి కర్మవిధి లేదు, అకర్త యగుట వలన. అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—త్రివిధా కర్మచోదనా — ఈ త్రివిధము నపేక్షించి కర్మవిధి కావున త్రివిధా యని చెప్పఁబడుచున్నది. కారణములను సంక్షేపించి చెప్పుచున్నాఁడు.—కర్మసంగ్రహః=కర్మకారణసంగ్రహము. అధిష్ఠానాదికము కరణ

* శ్రీధరీయముతో సమానము.

మునందే యంతర్భూతము. అట్లు ఋగ్వేదఖిలములందు "జ్ఞానం జ్ఞేయం జ్ఞానినం చాపేక్ష్య విధి రుత్థితః। కరణం చైవ కర్తాచ కర్మ కారణసంగ్రహః" అని. అకర్తయైనను విధిద్వారంబున నీశ్వరప్రసాదమువలన నిచ్ఛ పుట్టుటచే నుక్తకారణముల చేతఁ గర్మద్వారంబునఁ బురుషార్థము కలుగుచున్నది యని. ఈశ్వరాధీనుఁ డైనను విధిద్వారమున వానిచేతనే నియతుఁడై యిచ్ఛాప్రయత్నములఁ జేయుచున్నాఁడు. ఇచ్ఛాదికము కలుగునేని అప్పుడు ఈశ్వరునిచేతనే కర్మము కారితం బగును. ఫలము గూడ నియతం బీశ్వరునిచేతనే. వాస్తవంబున అకర్తయైనను ఆభిమానికం బగు కర్తృత్వము జీవున కుండనే యున్నది, స్వాతంత్ర్యముగూడ జడము నపేక్షించి. కావునఁ బ్రవృత్తి వైయర్థ్యము లేదు. ఇది సర్వంబును అనుభవముచేతను ఉక్త ప్రమాణములచేతను సిద్ధము గావున వేఱుప్రమాణము చెప్ప లేదు.

జ్ఞానం కర్మ చ కర్తాచ త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి. ౧౯

భా. ఇఁక నిపుడు క్రియాకారకఫలము లన్నియు గుణాత్మకము లగుటవలన సత్త్వరజస్తమోగుణభేదమున వానికిఁ ద్రివిధం బగు భేదము వక్తవ్యం బని యారంభించుచున్నాఁడు — జ్ఞానమ్=జ్ఞానమును; కర్మ చ= క్రియయును, కారకము పారిభాషికము ఈప్సితతమం బగు కర్మము కాదు; కర్తాచ=క్రియల నిర్వర్తించువాఁడును; త్రిధైవ=మూఁడువిధములుగానే, అవధారణము గుణవ్యతిరిక్తజాత్యంతరము లే దని ప్రదర్శించుటకొఱకు; గుణభేదతః = సత్త్వాదిగుణభేదముచేత; ప్రోచ్యతే = చెప్పఁబడుచున్నది; గుణసంఖ్యానే=కాపిలశాస్త్రమునందు; ఆగుణసంఖ్యానశాస్త్రముగూడ గుణభోక్తృవిషయంబునఁ బ్రమాణమే పరమార్థ బ్రహ్మైకత్వవిషయంబున విరుద్ధ మయినను, కాపిలులు గుణగౌణవ్యాపారనిరూపణమునం దభియుక్తులు గదా! అందువలనఁ దచ్ఛాస్త్రంబును వక్ష్యమాణార్థస్తుత్యర్థమై గ్రహింపఁబడుచున్నది, కావున విరోధము లేదు; యథావత్ = యథాన్యాయముగా, యథాశాస్త్రముగా; తాన్యపి = ఆ జ్ఞానాదులను గుణభేదకృతములగు వానిభేదజాతములను గూడ; శృణు=వినుము, వక్ష్యమాణార్థమునందు మనస్సమాధానము చేయు మని యర్థము.

జ్ఞానమును కర్మమును కర్తయును సత్త్వరజస్తమోగుణభేదమున మూఁడు విధములే యని కపిలమునిప్రణీత మగు సాంఖ్యశాస్త్రమునందుఁ జెప్పఁబడినది. ఆ జ్ఞానాదులను గుణకృతము లగు వానిభేదములనుగూడ యథాశాస్త్రముగఁ జెప్పెద విను మని తాత్పర్యము.

శ్రీ. మీఁదిశ్లోకములు పదింటికిఁ దాత్పర్యము చెప్పుచున్నారు ఇఁక నిత్యాదిగా. ఇఁక — జ్ఞానాదిప్రస్తావానంతరము. ఇపుడు—ప్రస్తుతజ్ఞానాద్యవాంతరభేదముల యపేక్షయందు, వానికి గుణభేదమువలనఁ ద్రైవిధ్యము కలుగుటకు హేతువుఁ జెప్పుచున్నారు గుణాత్మకము లగుటవలన నని. వక్తవ్యంబు — వక్ష్యమాణశ్లోకములు తొమ్మిదింటిచే నని శేషము. ఇట్లుండఁగా మొదట నవాంతరభేదప్రతిజ్ఞ చేయఁబడు చున్నది యని చెప్పుచున్నారు ఆరంభించుచున్నాఁ డని. కర్తకు ఈప్సితతమము కర్మ మని యేది పారిభాషికమో అది యిటఁ గర్మశబ్దవాచ్యము కా దని చెప్పుచున్నారు కారకము ఇత్యాదిగా. గుణములచేతనే గాని వేఱుభేదము జ్ఞానాదుల యందు లే దని నిర్ధారించుటకై యవధారణ మని చెప్పుచున్నారు అవధారణము ఇత్యాదిగా. జ్ఞానాదులకుఁ బ్రత్యేకంబును గుణభేదప్రయుక్త మగు త్రైవిధ్యము కల దనుటకుఁ బ్రమాణముఁ జెప్పుచున్నారు ప్రోచ్యతే అని. ఓయీ! కాపిలము పాతంజలము మొదలగుశాస్త్రము విరుద్ధార్థ మగుటవలన నప్రమాణము, ఎట్లిట దానిఁ బ్రమాణీకరింపవచ్చును? అనఁగాఁ జెప్పుచున్నారు ఆగుణసంఖ్యా నేత్యాదిగా. విషయవిశేషమునందు విరోధ మున్నను బ్రకృతార్థమునందుఁ బ్రామాణ్య మవిరుద్ధ మని యర్థము. కాపిలాదులు గుణవృత్తివిచారమునందును గౌణవ్యాపార మగు భోగాదికము నిరూపించుటయందును నిపుణులే యయినను ఎట్లు తదీయశాస్త్ర మిటఁ బ్రమాణీకరింపఁబడినది యని యాశంకించి చెప్పుచున్నారు కాపిలులు ఇత్యాదిగా. జ్ఞానాదులందుఁ బ్రత్యేక మవాంతరభేదము వక్ష్యమాణము, అది తంత్రాంతరమునందును బ్రసిద్ధ మనుట దానికి స్తుతి, తదర్థమై కాపిలాదిమతోపాదాన మిట నుపయోగించుచున్న దని యర్థము. తృతీయపాద మవిరుద్ధార్థం బనుటను నిగమనము చేయుచున్నారు కావున నిత్యాదిగా.

హ. ఇఁక నిప్పుడు క్రియాకారకఫలము లన్నిటికి సత్త్వరజస్తమోగుణాత్మకము లగుటవలనఁ ద్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు.—జ్ఞానమ్ — పూర్వోక్తము; కర్మ — క్రియారూపము; కర్తా — జ్ఞాతయు నిర్వర్తించువాఁడును; త్రిధా = మూఁడు

విధములుగా; గుణభేదతః; ప్రోచ్యతే=చెప్పఁబడుచున్నది; గుణసంఖ్యానే=గుణప్రతిపాదక మగు శాస్త్రమునందు. యథావత్=యథాన్యాయముగా; తాన్యపి = ఆ జ్ఞానాదులను గూడ.

౯౦. సత్త్వాదిగుణభేదముచే జ్ఞానాదుల త్రైవిధ్యమును వివక్షితమనే విశదీకరించుచున్నాఁడు.—గుణసంఖ్యానే = గుణములు – సత్త్వాదులును తత్కార్యములును జక్కఁగా ఖ్యాయన్తే–ప్రతిపాదింపఁబడుచున్నవి దేనియందో అది గుణసంఖ్యానము సాంఖ్యశాస్త్రము, ఆ గుణసంఖ్యానమందు – కాపిల మగు శాస్త్రమునందు; జ్ఞానమ్ – ఉక్తలక్షణ మగు పదార్థబోధము; కర్మచ – శ్రౌతస్మార్తాదిలక్షణమును; కర్తాచ = కర్మనిర్వర్తకుఁడును; అను నీత్రయము, గుణభేదతః = సత్త్వాదిగుణభేదముచేత; త్రిధైవ = మూఁడువిధములే యగును, జ్ఞానాదులకు సత్త్వాదిగుణకృత త్రైవిధ్యము దక్క వేఱుభేదము లేమివలన, నిర్ధారణార్థ మేవకారము; చకారములు సముచ్చయార్థములు; ఘటము పటము ఇత్యాది జ్ఞానము తామసజ్ఞానము నందే యంతర్భవించుటవలన; జ్ఞాయతే – ఎఱుంగఁబడుచున్నది దీనిచేతఁ గావున సాధారణజ్ఞానము సత్త్వాదిగుణభేదమున మూఁడువిధములే యగు చున్నది; అట్లే కర్మమును కర్తయును మూఁడువిధములే యగు నని కపిలాదులచేఁ జెప్పఁబడుచున్న దని యర్థము. యథావత్ = యథాశాస్త్రముగా, సాంఖ్యశాస్త్రమునం దెట్లు చెప్పఁబడినదో అట్లు, గుణభేదమున భిన్నము లగు జ్ఞానాదులను గూడ నాచేత వక్ష్యమాణములను; శృణు. విని సారగ్రహణమునందు మిక్కిలి తత్పరుఁడ వగు మని యర్థము.

౯౧. ఇప్పుడు జ్ఞానజ్ఞేయజ్ఞాతృరూపంబును కరణకర్మకర్తృరూపంబు నగు త్రికద్వయమునకుఁ ద్రిగుణాత్మకత్వము వక్తవ్య మని యారెంటిని సంక్షేపించి త్రిగుణాత్మకత్వమును ప్రతిజ్ఞ సేయుచున్నాఁడు.—జ్ఞానమ్ – పూర్వము వ్యాఖ్యాతము, జ్ఞేయమును దీనియందే యంతర్భూతము, జ్ఞేయత్వము జ్ఞానోపాధిక మగుటవలన; కర్మ=క్రియ, త్రివిధః కర్మసంగ్రహః అనుచోటఁ జెప్పఁబడినది, చకారమువలన కరణకర్మకారకములకు దీనియందే యంతర్భావము, కారకత్వము క్రియోపాధిక మగుట వలన; కర్తా=క్రియానిర్వర్తకుఁడు, చకారమువలన జ్ఞాతయును; కర్తయు క్రియోపాధికుఁ డైనను వేఱుగా త్రైగుణ్యకథనము కుతార్కికులచే భ్రమకల్పిత మైన యాత్మత్వము నివారించుటకొఱకు, వారు కర్తయే యాత్మ యని తలంతురు గదా! గుణములు – సత్త్వరజస్తమములు చక్కఁగా – కార్యభేదమున ఖ్యాయ

స్తే — ప్రతిపాదింపఁబడుచున్నవి దీనియందు కావున గుణసంఖ్యాన మనఁగా కాపిలము, దానియందు; జ్ఞానమును క్రియయును కర్తయును, గుణభేదతః = సత్త్వరజస్తమోభేదముచేత; త్రిధైవ ప్రోచ్యతే. ఏవకారము భేదాంతరనివారణార్థము. కాపిలశాస్త్రము పరమార్థబ్రహ్మైకత్వవిషయంబునఁ బ్రమాణము కాకున్నను, అపరమార్థగుణగౌణభేదనిరూపణమునందు వ్యావహారిక మగు ప్రామాణ్యము గలిగి యున్నది కావున వక్ష్యమాణార్థస్తుతికొఱకు గుణసంఖ్యానే ప్రోచ్యతే అని చెప్పఁబడుచున్నది. తంత్రాంతరమునందును బ్రసిద్ధం బిది యీ తంత్రమున మాత్రమే కా దని స్తుతి. యథావత్ = యథాశాస్త్రముగా; శృణు = వినుటకు సావధానుఁడ వగుము. తాని = ఆజ్ఞానాదులను, అపిశబ్దమువలన గుణభేదకృతము లగు తద్భేదజాతములను గూడ. ఇట నీవిధంబున నపౌనరుక్త్యము దెలియవలయును. చతుర్దశాధ్యాయమునందు తత్ర సత్త్వం నిర్మలత్వాదిత్యాదికముచే గుణముల బంధహేతుత్వప్రకారము నిరూపింపఁబడినది, గుణాతీతునకు జీవన్ముక్తత్వము నిరూపించుటకై. సప్తదశంబున మఱి యజన్తే సాత్త్వికా దేవా నిత్యాదికముచే గుణకృతం బగు త్రివిధస్వభావము నిరూపించుటచే నాసురం బగురజస్తమస్స్వభావముఁ బరిత్యజించి సాత్త్వికాహారాదిసేవచే దైవంబగు సాత్త్వికస్వభావము సంపాదనీయం బని చెప్పఁబడినది. ఇక్కడనో స్వభావంబున గుణాతీతుఁ డైనయాత్మకుఁ గ్రియాకారకఫలసంబంధము లే దని తెలుపుటకై వాని కన్నిటికిని గుణాత్మకత్వమే కాని రూపాంతరము లేదు కావున నాత్మసంబంధిత సంభవింప దని చెప్పఁబడుచున్న దని విశేషము.

శ్రీ. అందువలన నేమి ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—గుణములు చక్కగా — కార్యభేదముచే ఖ్యాయన్తే — ప్రతిపాదింపఁబడుచున్నవి దీనియందుఁ గావున గుణసంఖ్యాన మనఁగా సాంఖ్యశాస్త్రము, దానియందు; జ్ఞానమ్; కర్మ చ = క్రియయును; కర్తాచ; ప్రత్యేకమును, సత్త్వాది గుణభేదమున, త్రిధైవ ప్రోచ్యతే. తాన్యపి= ఆ జ్ఞానాదులనుగూడ, వక్ష్యమాణములను; యథావత్; శృణు. త్రిధైవ అని యేవకారము గుణత్రయోపాధిచేతనే కాని యాత్మకు స్వభావమునఁ గర్త్రాదులు లే వనుటకొఱకు. చతుర్దశాధ్యాయమున తత్ర సత్త్వం నిర్మలత్వా దిత్యాదికముచే గుణములబంధకత్వప్రకారము నిరూపితము. సప్తదశమునందు యజన్తే సాత్త్వికా దేవా నిత్యాదికముచే గుణకృతత్రివిధస్వభావనిరూపణంబున రజస్తమస్స్వభావముఁ బరిత్యజించి సాత్త్వికాహారాదిసేవచే సాత్త్విక మగు స్వభావము సంపాదనీయ

మని ప్రతిపాదింపఁబడినది. ఇందో క్రియాకారకఫలాదుల కాత్మసంబంధము లే దని తెలుపుటకై వానియన్నిటికిఁ ద్రిగుణాత్మకత్వము చెప్పఁబడుచున్న దని విశేష మెఱుంగునది.

ప. *

రా. కర్తవ్యకర్మవిషయం బగు జ్ఞానంబును అనుష్ఠింపఁబడుకర్మమును తద నుష్ఠాతయును సత్త్వాదిగుణభేదముచే, త్రిధైవోచ్యతే, గుణసంఖ్యానే = గుణకార్య గణనమునందు, యథావత్ శృణు తాన్యపి — గుణములచే భిన్నము లయిన యాజ్ఞా నాదులను, యథావత్ శృణు.

మా. వెండియు సాధనప్రశంసకొఱకు గుణభేదములఁ జెప్పుచున్నాఁడు జ్ఞాన మిత్యాదిగా. గుణసంఖ్యానే = గుణగణనప్రకరణమునందు.

సర్వభూతేషు యే నైకం భావ మవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు త జ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. ౨౦

భా. అందు మొదట జ్ఞానమునకుఁ ద్త్రైవిధ్యము చెప్పఁబడు చున్నది.—సర్వభూతేషు=సమస్తము లయిన అవ్యక్తాదిస్థావరాంతము లగు భూతములయందు; యేన=ఏజ్ఞానముచేత; ఏకమ్ = ఒక్కటైన; భావమ్ = వస్తువును; భావశబ్దము వస్తువాచకము, ఒక్కటైన యాత్మ వస్తువు నని యర్థము; అవ్యయమ్ = వ్యయము లేనిదానిని, స్వరూప ముచేఁ గాని ధర్మములచేతఁ గాని, కూటస్థనిత్యము నని యర్థము; ఈక్షతే = ఏ జ్ఞానముచేఁ జూచుచున్నాఁడో. విభక్తేషు = విభక్తము లయిన దేహభేదములయందు; ప్రతిదేహమును, అవిభక్తమ్=విభక్తము కానిదానిని, అట్టి యాత్మవస్తువును, ఆకాశమువలె నిరంతరము నని యర్థము. తత్=అట్టి జ్ఞానమును, అద్వైతాత్మదర్శనమును; సాత్త్వికమ్= సాత్త్వికమునుగా, సమ్యగ్దర్శనమునుగా; విద్ధి=ఎఱుంగుము, ద్వైతదర్శ నము లేవి గలవో అవి యసమ్యగ్దర్శనములు రాజసములును దామసము లును గావున సాక్షాత్సంసారచ్ఛేదముఁ గలిగింపఁజాలవు.

అవ్యక్తాదిస్థావరాంతము లగు సర్వభూతములయందును అవి ప్రతిదేహ మును విభక్తములై యున్నను ఆకాశమువలె నిరంతరమై యవిభక్తమై వ్యయ

* శ్రీధరీయమతో సమానము.

రహితమై యున్న యాత్మవస్తువు నొక్కదానినే యేజ్ఞానముచే నెఱుంగుచున్నాఁడో అట్టి యద్వైతాత్మజ్ఞానము సాత్త్విక మని యెఱుంగుము, దానినే సంపాదింపవలయు నని తాత్పర్యము.

ఆ. జ్ఞానాదులకుఁ బ్రత్యేకమును త్రైవిధ్యము నెఱుంగవలయు నని ప్రతిజ్ఞ చేసి జ్ఞానత్రైవిధ్యము కొఱకు మూఁడుశ్లోకముల కవతారిక చేయుచున్నారు అందు ఇత్యాదిగా. అందు సాత్త్విక మగు జ్ఞానము నుపన్యసించుచున్నారు సర్వేత్యాదిగా. భూతములు—కార్యకారణాత్మకములు ఉపాధిజాతములు. అద్వితీయమును అఖండైకరసమును ప్రత్యగాత్మభూతమును అబాధితము నగు తత్త్వము జ్ఞేయ మని వివక్షిత మని చెప్పుచున్నారు ఏక మ్మని. వివక్షిత మగు నవ్యయత్వమును సంక్షేపించుచున్నారు కూట స్థేత్యాదిగా. చతుర్థపాదమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు అద్వై తేత్యాదిగా. ద్వైతదర్శనములునుం గొన్నికలవు సత్త్వనిర్వృత్తములును సమీచీనములు నని యాశంకించి చెప్పుచున్నారు ద్వైతేత్యాదిగా. అవి సమ్యగ్దర్శనములు కా వనుటకు హేతువుఁ జెప్పుచున్నారు రాజసములును ఇత్యాదిగా.

హ. అవ్యక్తాది స్థావరాంత సర్వభూతములయందును, యేన = ఏజ్ఞానముచేత; ఏకంభావమ్ — భావశబ్దము వస్తువాచకము, ఒక్కటే యాత్మతత్త్వము నని యర్థము; ఈక్షతే=చూచుచున్నాఁడో; ఎట్టి భావమును? అవిభక్తమ్=అభిన్నమును; భిన్నము లైన బ్రహ్మాదిస్థావరాంతదేహభేదములందు ఆకాశమువలె నిరంతరమైనదానిని. ఆజ్ఞానమును, సాత్త్వికమ్ = సత్త్వనిర్వృత్తమునుగా, సాధుజ్ఞానమునుగా; విద్ధి.

శం అందు జ్ఞానత్రైవిధ్యముఁ బ్రతిపాదించువాఁడై మొదట బహుజన్మముల సత్త్వవృత్తిచే సర్వకర్మఫలపరిత్యాగపూర్వకముగా నీశ్వరార్పణబుద్ధితో ననుష్ఠించిన సాత్త్వికకర్మములచే జనితం బగు శుద్ధసత్త్వ మేది గలదో నొకమాఱు విన్నమాత్రంబునఁ దత్త్వావధారణసమర్థము, దానివలన నుత్పన్న మైన యా త్మైకత్వదర్శనలక్షణ మగు సాత్త్వికజ్ఞానముయొక్కలక్షణముఁ జెప్పుచున్నాఁడు.—విభక్తేషు= అవిద్యకము లగు నామరూపజాతిగుణక్రియావిశేషములచేతఁ బరస్పరభిన్నము లయిన; సర్వభూతేషు=సమస్తము లైన యవ్యక్తాదిస్థూలాంతములగు భూతములందు—శరీరములందు స్థావరములందును జంగమములందును అంతటను; ఘటమఠాదులం దా

కాశమువలె, అవిభక్తమ్=నిరవయవ మగుటవలనను నిర్విశేష మగుటవలనను విభాగము లేనివానిని, అఖండరూపమున నంతటను బరిపూర్ణ మయినదానిని; అందువలన, ఏకమ్=ఏకరూపమును, తదీయధర్మకర్మాదులచే నస్పృష్టమై యత్యంతవిశుద్ధమై చిదేకరసమై యున్నదానిని; అవ్యయమ్ = భూతములు నశించుచుండఁగాఁ దాను నాశము లేక యున్నదానిని, భూతముల యావిర్భావతిరోభావాగమనిర్గమాదులయందుఁదా నావిర్భావతిరోభావాగమనిర్గమాదిధర్మనిర్ముక్తమై యవిక్రియాత్మనేకరూపంబున సర్వదా యున్నదాని నిత్యమును శాశ్వతము నని యర్థము; ఇట్టి, భావమ్ = నామరూపాదికము సర్వంబును భావ్యతే — భావింపఁబడుచున్నది దేనియందో లేక దేనిచేతనో అది భావము — ప్రత్యగాత్మ, అట్టి సచ్చిదానందరస మగు స్వాత్మను; యేన = ఏ, శుద్ధసత్త్వ సంభావితమై " దివ్యోహ్యమూర్తః పురుషః, అశరీరం శరీరేషు " ఇత్యాది శ్రుతిశ్రవణమాత్రమువలన సముత్పన్న మగు అఖండాకారవృత్తిచేత; కృతబుద్ధి యగు విద్వాంసుఁడు, ఈక్షతే = చూచుచున్నాఁడో, ఇది యంతయు నేనును బ్రహ్మమే యని తన్నును సర్వంబును బ్రహ్మమునుగానే చూచుచున్నాఁడో; తత్ జ్ఞానమ్ = ఆ యద్వైతాత్మవిషయక మగు జ్ఞానమును, ద్వైతభ్రమ విధ్వంసక మైనదాని; సాత్త్వికమ్ = బహుజన్మార్జితపుణ్యపుంజపరిపాకమువలన సముదిత మగు శుద్ధసత్త్వముచే సముత్పన్న మగుటవలన సాత్త్వికమునుగా; విద్ధి — అదియే విదేహముక్తికిఁ గారణ మని యెఱుంగు మని యర్థము.

మం॰ ఇట్లు జ్ఞానమునకును కర్మమునకును కర్తకును త్రైవిధ్యము జ్ఞాతవ్యంబని ప్రతిజ్ఞచేసి మొదట జ్ఞానత్రైవిధ్యము నిరూపించుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత. అందదద్వైతవాదులసాత్త్వికజ్ఞానముఁ జెప్పుచున్నాఁడు.—సర్వభూతేషు = అవ్యాకృతహిరణ్యగర్భవిరాట్సంజ్ఞములు బీజసూక్ష్మస్థూలరూపములు సమష్టివ్యష్ట్యాత్మకములైనవానియందు, సర్వశబ్దముచేతనే నిర్వాహమగుచుండఁగా భూతేషు అనుటచే భవనధర్మకత్వము చెప్పఁబడుచున్నది, అందుచే ఉత్పత్తివినాశస్వభావము లగు దృశ్యవర్గములందు; విభక్తేషు = పరస్పరవ్యావృత్తములై నానారసము లయినవానియందు; అవ్యయమ్=ఉత్పత్తివినాశాది సర్వవికారశూన్యమును అదృశ్యమును; అవిభక్తమ్ = అవ్యావృత్తమును; సర్వత్ర అనుస్యూత మైనదానిని అధిష్ఠానమై బాధావధియునై; ఏకమ్ = అద్వితీయమును; భావమ్=పరమార్థసత్తారూపమును స్వప్రకాశానందము నగు నాత్మను; యేన = ఏ అంతఃకరణపరిణామవిశేషముచే వేదాంతవాక్యవిచారసముత్పన్న మగుదానిచే; ఈక్షతే = సాక్షాత్కరించుచున్నాఁడో; తత్ = ఆ

మిథ్యాప్రపంచబాధక మగు నద్వైతాత్మదర్శనమును; సాత్త్వికం జ్ఞానమ్=సర్వసంసారోచ్ఛిత్తికారణ మగు జ్ఞానమునుగా; విద్ధి. ద్వైతదర్శనమో రాజసంబును దామసంబును సంసారకారణము, సాత్త్వికము కా దని యభిప్రాయము.

శ్రీ. అందు జ్ఞానమునకు సాత్త్వికాదిత్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—సర్వభూతేషు=బ్రహ్మాదిస్థావరాంతములయందు; విభక్తేషు=పరస్పరము భిన్నము లైనవానియందు; అవిభక్తమ్=అనుస్యూతమును; ఏకమ్; అవ్యయమ్ = నిర్వికారమును; భావమ్ = పరమాత్మతత్త్వమును; ఏ జ్ఞానముచేత; ఈక్షతే = ఆలోచించుచున్నాఁడో; తత్ జ్ఞానం సాత్త్వికం విద్ధి.

ప. ఇఁక సాత్త్వికజ్ఞానముఁ జెప్పుచున్నాఁడు.—సర్వభూతేషు = బ్రహ్మాది స్థావరాంతములయందు; విభక్తేషు = నామరూపకర్మములచేఁ బరస్పరము భిన్నము లైనవానియందు; అవిభక్తమ్ = అనుస్యూత మైనదాని ఘటమఠాదులం దాకాశమువలె; ఏకమ్ = అద్వితీయమును; అవ్యయమ్ = నిర్వికారమును; భావమ్=స్వరూప మయినపరమాత్మతత్త్వమును; యేన=ఏజ్ఞానముచేఁ; ఈక్షతే = ఆలోచించు చున్నాఁడో; తత్ జ్ఞానం సాత్త్వికం విద్ధి. సాత్త్వికత్వాదిసంపాదకం బగు నాహారాదికము మున్ను చెప్పఁబడియే యున్నది. శ్రుతియును శాతపథము.—"యద్వైత న్నపశ్యతి పశ్యన్వైత ద్ద్రష్టవ్యం నపశ్యతి నహిద్రష్టు ర్దృష్టే ర్విపరిలోపో విద్యతే ౽వినాశిత్వా న్నతు తద్ద్వితీయ మస్తి తతో ౽న్య ద్విభక్తం యత్పశ్యేత్" అని. భాష్యము. అవినాశీ అరే వా ౽యమాత్మా నుచ్ఛిత్తి ధర్మా మాత్రాసంసర్గ స్త్వస్య భవతి యని పూర్వశ్రుతిచే నాత్మ కవినాశిత్వంబును వృత్తులకు తదాశ్రయవర్తిత్వంబును జెప్పఁబడినది. దానినే దృఢీకరించుచున్నది. ఏతమ్ = ఈయాత్మను; యద్వా=ప్రకారాంతరమున, ఇంద్రియాదికముచేఁ; నపశ్యతి = చూడఁడు, మతే మనఁగా ఆత్మచేతనే యాత్మను జూచుచున్నాఁడు. అప్పుడు ఆత్మను, పశ్యన్ = చూచుచున్నను; ఏతత్ = పురోవర్తిపదార్థమువలె, ద్రష్టవ్య మని, నపశ్యతి = చూడఁడు. హి=ఏకారణమువలన ననఁగా; ద్రష్టుః = ఆత్మద్రష్ట యగు పురుషునకు; దృష్టేః = దృష్టికి; విపరిలోపః = విపర్యాసము; నవిద్యతే=లేదు. ఎందువలన? అవినాశిత్వాత్=ఆత్మ యవినాశి యగుటవలన. ఏకపదార్థజ్ఞానము నష్ట మైనపుడుగదా పదార్థాంతరజ్ఞానము కలుగుచున్నది. ప్రకృతమందు ద్వితీయము లేమివలన దృష్టికి విపరిలోపము సంభవింపదు. ఎందువలన ననఁగా, త

ద్వితీయమ్ = దానికంటె రెండవది; నాస్తి = లేదు. తతః = ఆ యాత్మకంటె; అన్యత్ = ఇతరమును; విభక్తమ్ = భిన్నమును; యత్ = దేని; పశ్యేత్ = చూచునో అట్టిది రెండవది లేదు. అందువలన నాత్మాతిరిక్త మని దేనిని జూడఁగూడ దని భావము.

రా. బ్రాహ్మణక్షత్రియబ్రహ్మచారిగృహస్థాదిరూపమున విభక్తము లయిన సర్వభూతములందును కర్మాధికారులందు, యేన=జ్ఞానముతచే, ఏకమ్, భావమ్=ఆత్మ యను భావమును; అందును, అవిభక్తమ్=ఆభూతములు బ్రాహ్మణాద్యనేకాకారములై సితదీర్ఘాదివిభాగములు గల వైనను జ్ఞానాకారస్వరూపమునందు విభాగము లేనిదాని, అవ్యయమ్ = బ్రాహ్మణాదిశరీరములు వ్యయస్వభావము లైనను అవికృతమును ఫలాదిసంగమున కనర్హమును; కర్మాధికారవేళలయందు; ఈక్షతే. తత్ జ్ఞానం సాత్త్వికం విద్ధి.

మా. ఏకం భావమ్ = విష్ణువును.

పృథక్త్వేన తు య జ్జ్ఞానం నానాభావా న్పృథగ్విధా న్
వేత్తి సర్వేషు భూతేషు త జ్జ్ఞానం విద్ధి రాజసమ్. ౨౧

భా. పృథక్త్వేనతు=భేదముచేతనో; ప్రతిశరీరమును వేఱువే అని; నానాభావా న్ = భిన్ను లయిన యాత్మలను; పృథగ్విధా న్ = పృథక్ప్రకారులను, భిన్నలక్షణుల నని యర్థము; సర్వేషు=సమస్తము లయిన; భూతేషు = భూతములయందును; యత్ = ఏ; జ్ఞానమ్ = జ్ఞానము; జ్ఞానమునకుఁ గర్తృత్వము సంభవింపమిపలన జ్ఞానముచేత నని యర్థము; వేత్తి=ఎఱుంగుచున్నాఁడో; తత్ జ్ఞానమ్=ఆ జ్ఞానమును; రాజసమ్=రజోనిర్వృత్తమునుగా; విద్ధి = ఎఱుంగుము.

ఇఁక సర్వభూతములందును ఆభూతముల భిన్నలక్షణములనుబట్టి ఆత్మలును నానావిధములుగా భిన్నములుగా నున్న వని భేదంబున నేజ్ఞానముచే నెఱుంగుచున్నాఁడో ఆ జ్ఞానము రాజస మని యెఱుంగు మని తాత్పర్యము.

ఆ. ప్రతిదేహమును భేదంబున భిన్నాత్మలను ఏజ్ఞానముచే నెఱుంగుచున్నాఁడో అజ్ఞానము రాజస మని చెప్పుచున్నారు భేదముచేతనో ఇత్యాదిగా.

పృథక్త్వమును పృథగ్విధత్వమును పునరుక్తమని యాశంకించి హేతుహేతుమద్భావంబున విభాగము వివక్షించి చెప్పుచున్నారు భిన్నలక్షణుల నని. జ్ఞానమునకు జ్ఞానకర్తృత్వ మయుక్త మని యాశంకించి చెప్పుచున్నారు జ్ఞానమునకు ఇత్యాదిగా.

హ. పృథక్త్వేన = భేదముచేత; నానాభావాన్ = పృథక్ప్రకారములను; వేత్తి = ఎఱుంగుచున్నదో, జ్ఞానము కరణము కర్తృత్వంబున నుపచరింపఁబడుచున్నది; సర్వేషు భూతేషు; తత్ జ్ఞానం రాజసం విద్ధి.

శం. దేనిచే నాత్మల కనేకత్వముఁ జూచుచున్నాఁడో అజ్ఞానము రాజసం బని చెప్పుచున్నాఁడు.—తుశబ్దము సాత్త్వికజ్ఞానముకంటె దీనికి వైలక్షణ్యము దెలుపుచున్నది; నానావిధమలినవాసనతోఁ గూడినపురుషుఁడు, సర్వేషు భూతేషు—దేవర్షిమనుష్యాదిశరీరములయందు; పృథక్త్వేన = ప్రతిశరీరమును భిన్నత్వముచేత, స్వభావముచేతనే; నానాభావాన్ = అనేకక్షేత్రజ్ఞులను; పృథగ్విధాన్ = సుఖదుఃఖాదిభేదమునఁ బరస్పరవిలక్షణులనుగా; ఇట జ్ఞానమునకుఁ గరణత్వమే కాని కర్తృత్వము సంభవింపదు కావున, యత్ జ్ఞానమ్ = ఏజ్ఞానముచేత; వేత్తి = చూచుచున్నాఁడో, ఘటమఠాదులయం దున్నయాకాశముల కనేకత్వమును తదీయవక్రత్వాదిధర్మములచే వక్రత్వాదిమత్త్వంబును ఎట్లు చూచునో అట్లు దేవమనుష్యాదిశరీరములందు స్వభావముననే జీవాత్మల కనేకత్వంబును జన్మమరణాదివికారవిశిష్టత్వంబును సుఖాదియుక్తత్వమును దేనిచే నెఱుంగుచున్నాఁడో; తత్ జ్ఞానమ్ = ఆ జ్ఞానము; అయథార్థగ్రాహకమగుటవలన, రాజసమ్—రాజసయజ్ఞదానాదికర్మసంభావిత మగు రజోదోషముతోఁ గూడిన యంతఃకరణముయొక్క వృత్తి యగుటవలన రాజసము. బంధమునకే కారణము గాని ముక్తికిఁ గా దని యర్థము.

మ. తుశబ్దము పూర్వోక్తసాత్త్వికవ్యతిరేకము దెలుపుచున్నది. పృథక్త్వేన = భేదముచేత; ఉన్నట్టి, సర్వభూతములందు—దేహాదులయందు; నానాభావాన్ = ప్రతిదేహమును భిన్నులయినయాత్మలను; పృథగ్విధాన్ = సుఖదుఃఖిత్వాదిరూపమునఁ బరస్పరవిలక్షణులనుగా; యేన జ్ఞానేన వేత్తి అని చెప్పవలసి యుండఁగా యత్ జ్ఞానం వేత్తి యనుట కరణమునందుఁ గర్తృత్వోపచారమువలన ఏధాంసి పచన్తి యనునట్లు, లేక, కర్త యగు నహంకారమునకు వృత్త్యభేదమువలన; తత్ జ్ఞానం విద్ధి రాజసమ్ అని వెండియు జ్ఞానపదము ఆత్మభేదజ్ఞానమును అనాత్మభేదజ్ఞానమును బరామర్శించుచున్నది. అందుచే, ఆత్మలకుఁ బరస్పరము భేదము ఆత్మల కీశ్వరునికి

భేదము ఆత్మలకు నచేతనములకు భేదము అచేతనములకును ఈశ్వరునికిని భేదము అచేతనములకుఁ బరస్పరము భేదము అని కుతార్కికులయనౌపాధిక భేదపంచక జ్ఞానము రాజసమే యని యభిప్రాయము.

**శ్రీ.** రాజస మగుజ్ఞానముఁ జెప్పుచున్నాఁడు.—పృథక్త్వేనతు యత్ జ్ఞాన మ్మనుదానికే వివరణము—సర్వేషు, భూతేషు=దేహములందు; నానాభావాన్= వాస్తవంబుననే యనేకాత్మలను; పృథగ్విధాన్ = సుఖిత్వదుఃఖిత్వాదిరూపంబున విలక్షణులనుగా; ఏజ్ఞానముచేత నెఱుంగుచున్నాఁడో. తత్ జ్ఞానం రాజసం విద్ధి.

**ప.** *

**రా.** సర్వేషు భూతేషు – బ్రాహ్మణాదులందు, బ్రాహ్మణాద్యాకారపృథక్త్వముచేత ఆత్మాఖ్యభావములనుగూడ నానాభూతములనుగాను సితదీర్ఘాదిపృథక్త్వముచేఁ బృథగ్విధములనుగాను ఫలాదిసంయోగయోగ్యములనుగాను కర్మాధికారవేల యందు, యత్ జ్ఞానం వేత్తి తత్ జ్ఞానం రాజసం విద్ధి.

**మా.** ♦

> యత్తు కృత్స్నవ దేకస్మిన్ కార్యే సక్త మహేతుకమ్
> అతత్త్వార్థవ దల్పంచ త త్తామస ముదాహృతమ్. ౨౨

**భా.** యత్తు = ఏజ్ఞానము మఱి; కృత్స్నవత్ =సమస్తమునందువలె, సమస్తవిషయమునందువలె; ఏకస్మిన్=ఒకటైన; కార్యే = దేహమునం దుఁగాని ప్రతిమాదికమునందుఁగాని; సక్తమ్=ఆసక్తము, ఇంతమాత్రమే ఆత్మగాని యీశ్వరుఁడుగాని ఇంతకన్న నధికము లేద ని, ఎట్లనఁగా, నగ్న క్షపణకాదులకు శరీరానువర్తి దేహపరిమాణుఁడు జీవుఁడు, పాషాణదార్వాదిమాత్రుం డీశ్వరుఁడు, ఇట్లు ఒకకార్యమునం దాసక్తము; అహేతుకమ్ = హేతువర్జితము, యుక్తిహీనము; అతత్త్వార్థవత్ = యథాభూతమైనయర్థము తత్త్వార్థము అది దీనికి జ్ఞేయభూతమై ❡ కలదు కావున తత్త్వార్థవంతము, అది కానిది అతత్త్వార్థవంతము; అహేతుక మగుట వలననే; అల్పంచ = అల్పవిషయం బగుటవలనఁగాని అల్పఫల మగుట

---

* శ్రీధరీయముతో సమానము.

♦ ఇది మొదలు శ్లోకస ప్తకమున కీభాష్యము లేదు.

❡ ఎఱుంగఁదగినదియై.

వలనఁగాని అల్పమును, అగుచున్నదో; తత్ = ఆజ్ఞానము; తామసమ్= తమోగుణనిర్వృత్త మని; ఉదాహృతమ్ = చెప్పఁబడినది. తామసులు అవివేకు లగు ప్రాణులకుఁ గదా యిట్టి జ్ఞానము కనఁబడుచున్నది.

దేహమును గాని ప్రతిమాదికమును గాని యొక్క-కార్యమునే పరిపూర్ణముగాఁ దలఁచి దేహమే యాత్మ యని ప్రతిమాదికమే యీశ్వరుఁ డని యంతకన్న నధికము లే దని దానియందే యాసక్తము నుయుక్తివిహీనమును పరమార్థము లేనిదియు అల్పంబు నగు నేజ్ఞానము గలదో అది తామస మని చెప్పఁబడినది యని తాత్పర్యము.

ఆ. సక్తత్వమునే వ్యక్తీకరించుచున్నారు ఇంతమాత్రమే ఇత్యాదిగా. ఒకటేకార్యమునందు జ్ఞానము సక్త మగుటనే దృష్టాంతముచే సాధించుచున్నారు ఎట్లనఁగా నిత్యాదిగా. యుక్తివిహీనత్వ మేది గలదో అదియే జ్ఞాన మాభాస మనుటకుఁ గారణ మని చెప్పుచున్నారు అహేతుకము ఇత్యాదిగా. స్వరూపమువలనను విషయమువలనను ఆభాసత్వము, ఫలమువలనఁగూడ నని చెప్పుచున్నారు అల్పంచ అని. తామసజ్ఞాన మిట్టి దనుట కనుభవమును ప్రమాణీకరించుచున్నారు తామసులు ఇత్యాదిగా.

హ. యత్ = ఏజ్ఞానము; కృత్స్నవత్ =సమస్తములయందువలె; ఏకస్మిన్ కార్యే – దేహమునందుఁ గాని ప్రతిమాదికమునందుఁ గాని; సక్తమ్ = తగిలినది; ఇంతకుమీఁద లే దని; అహేతుకమ్ = యుక్తిసిద్ధము కానిది; అతత్త్వార్థవత్ = పరమార్థవిషయము కానిది; అల్పంచ –అల్పవిషయ మగుటవలన, లేక, అల్పమయినఫలము గలది; తత్ = ఆ జ్ఞానము; తామసమ్=తమోగుణమువలనఁ బుట్టినది యని; ఉదాహృతమ్ = చెప్పఁబడినది. తామసు లగు ప్రాణుల కవివేకులకుఁ గదా యిట్టిజ్ఞానము దృష్టము.

శం. తామసజ్ఞానలక్షణముఁ జెప్పుచున్నాఁడు.—తుశబ్దము ఈ జ్ఞానముభయవిలక్షణం బని ద్యోతనార్థము; ఏకస్మిన్ కార్యే = భూతకార్య మగు దేహమునందుఁ గాని ప్రతిమాదికమునందుఁ గాని; కృత్స్నవత్ =పరిపూర్ణమునందువలె; సక్తమ్ = ఆత్మగాని పరమేశ్వరుఁడుఁగాని స్వరూపమున నింతమాత్రమే, దేహపరిమాణుఁడే యాత్మ ప్రతిమాపరిమాణుఁడే యీశ్వరుఁడు, ఇంత కధికము లే దని

నిశ్చయము గలది; లేక, కృత్స్నవత్ = ఇది ఘటము ఇది పటము అని యెట్లు కృత్స్నపదార్థనిశ్చయ మగునో అట్లు కార్య మగు దేహమునందుఁగాని ప్రతిమాది యందుఁగాని; సక్తమ్ = ఈ దేహమే యాత్మను నేను ఈ ప్రతిమయే యీశ్వరుఁడు అను నిశ్చయము గలది; అహేతుకమ్ = దేహమే యాత్మ యని నిశ్చయించుటకును ప్రతిమయే యీశ్వరుఁ డని నిర్ధారించుటకును హేతువు లేమివలన అహేతుకము; ఓయీ! దేహమే యాత్మ అహ మర్థ మగుటవలన నిత్యాదియుక్తి లేక పోలేదు, అం దువేని, కాదు, స్వప్నమును నేను గంటిని ఇత్యాదికమునందు వ్యభిచారము కనఁబడు టవలనను దేహదాహమునం దాత్మదాహప్రసంగమువలనను; కావున దేహమున కాత్మత్వసాధక మగు హేతువు లేదు. అట్లు ప్రతిమాదికి నీశ్వరత్వసాధక మగు హేతువును లేదు. ఓయీ! ప్రతిమాద్యాకారుఁ డగు నీశ్వరుఁడు కామముల నిచ్చుచున్నాఁడు, కావునఁ బ్రతిమాదియే యీశ్వరుఁడు కామప్రదం బగుట వలన నిత్యాదియుక్తి కలదు అందు వేని, కాదు. అశ్వత్థమునకుఁగూడ ఆరోగ్య ప్రదత్వము కనఁబడుటవలన దానియం దతివ్యాప్తి యగును. మ తే మనఁగా, దానియందు భక్తిచే నారాధింపఁబడిన సర్వగతుఁ డగు పరమేశ్వరుఁడే దాని యం దున్నవాఁడై కామముల నిచ్చుచున్నాఁడు కాని ప్రతిమాదిక మిచ్చుట లేదు, ప్రతిమాదినాశంబున నీశ్వరునకును నాశప్రసంగమువలన. అందువలన దేహ ప్రతిమాదుల కాత్మేశ్వరత్వసాధక మగు యుక్తి లేదు. అందువలననే, అతత్త్వార్థ వత్ = అబాధితార్థము తత్త్వార్థము, అది యేజ్ఞానమునకు లేదో అది యతత్త్వా ర్థవంతము, అయథార్థవిషయకము; అందువలననే, అల్పమ్ = అల్పవిషయ మగుట చేతను అల్పఫల మగుటచేతను అల్పము, నికృష్ట మని యర్థము; ఇట్టి జ్ఞాన మేది గల దో, తత్ = అది; తామసమ్ =బహుజన్మములఁ దామసయజ్ఞదానాదికర్మానుష్ఠాన ముచే సంప్రాప్త మగు తమోగుణముయొక్క కార్య మగుటవలన తామస మని; ఉదాహృతమ్ — కపిలాదులచేఁ జెప్పఁబడిన దని యర్థము. అనేకశతజన్మముల సమనుష్ఠితము లగు సాత్త్వికయజ్ఞదానాదిసత్కర్మముల పరిపాకమువలన సము త్పన్న మగు సాత్త్వికజ్ఞానము మోక్షహేతు వగుచున్నది, రాజసమో స్వర్గా ద్యభ్యుదయహేతు వగును, ఉక్తలక్షణ మగు తామసజ్ఞానమో కేవలము మూఢ వ్యవహారగోచరము జననమరణదుఃఖప్రవాహమునకే కారణ మగు నని సూచిత మగుచున్నది.

మ. తుశబ్దము రాజసమునుండి వ్యావర్తించుచున్నది. పెక్కులు భూతకార్యము లుండఁగా, ఏకస్మిన్ భూతకార్యే = ఒకభూతవికారమునందు, దేహమునందుఁ గాని ప్రతిమాదికమునందుఁ గాని; అహేతుకమ్ = హేతువు — ఉపపత్తి లేనిది, ఇతరము లగు భూతకార్యముల కాత్మత్వము లేనపుడు ఒకభూతకార్యమునకుమాత్ర మాత్మత్వమెట్లను విచారము లేనిది; కృత్స్నవత్ = పరిపూర్ణమునందువలెఁ; సక్తమ్ = ఇంతమాత్రమే దేహము గాని యీశ్వరుఁడు గాని యింతకుఁ బరము లే దని యభినివేశముచే లగ్నము, ఎట్లనఁగా దిగంబరులకు సావయవుఁడు దేహపరిమాణుఁ డాత్మ, చార్వాకులకు దేహమే యాత్మ, పాషాణదార్వాదిమాత్రుఁడే యీశ్వరుఁడు, అట్లు ఒకకార్యమునందు సక్తము; అహేతుకం బగుటవలననే, అతత్త్వార్థవత్ = తత్త్వార్థాలంబనము కానిది; అల్పంచ, నిత్యత్వమును విభుత్వమును అవలంబింపమివలన; ఇట్టిది — నిత్యవిభుదేహాదివ్యతిరిక్తాత్మను గ్రహించునదియు తద్వ్యతిరిక్తేశ్వరుని గ్రహించునదియు నగు తార్కికజ్ఞానమునకు విలక్షణము, నిత్యపరిచ్ఛిన్న దేహాద్యాత్మాభిమానరూప మగు చార్వాకాదులజ్ఞానమేది గలదో, తత్ తామస ముదాహృతమ్, ప్రాకృతు లగుతామసులయిట్టిజ్ఞానము నెఱింగినవారిచేత.

శ్రీ. తామసజ్ఞానముఁ జెప్పుచున్నాఁడు.—ఏకస్మిన్ కార్యే — దేహమునందుఁ గాని ప్రతిమాదియందుఁ గాని; కృత్స్నవత్ = పరిపూర్ణమునందువలెఁ; సక్తమ్ = ఇంతమాత్రమే యాత్మ యీశ్వరుఁడు గాని యని యభినివేశము గలది; అహేతుకమ్ = ఉపపత్తిరహితము; అతత్త్వార్థవత్ = పరమార్థావలంబనము లేనిది; కావుననే, అల్పమ్ = తుచ్ఛము, అల్పవిషయ మగుటవలనను అల్పఫల మగుటవలనను; ఇట్టి జ్ఞాన మేది గలదో, తత్తామస ముదాహృతమ్.

ప. *

రా. యత్తు = ఏజ్ఞానము; ఏకస్మిన్కార్యే = కర్తవ్య మగు నొకకర్మమునందు ప్రేతభూతగణాద్యారాధనరూపమునందు అత్యల్పఫలమునందు; కృత్స్నఫలమునందువలె, సక్తమ్; అహేతుకమ్ = వాస్తవంబున అకృత్స్నఫలవంత మగుటచే నట్టి సంగమునకు హేతువు లేనిది; అతత్త్వార్థవత్ = పూర్వమువలె నాత్మయందుఁ బృథక్త్వాదియుక్త మగుటచే మిథ్యాభూతార్థము విషయముగా గలది; అల్పఫలమును ప్రేతభూతాద్యారాధనవిషయ మగుటవలన అల్పమును; తత్ = అట్టి జ్ఞానము; తామస ముదాహృతమ్.

---

* శ్రీధరీయముతో సమానము.

నియతం సఙ్గరహిత మరాగద్వేషతః కృతమ్
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే. ౨౩

భా॰ ఇఁకఁ గర్మమునకుఁ ద్రైవిధ్యము చెప్పఁబడుచున్నది.—నియతమ్ = నిత్యమును; సఙ్గరహితమ్ = ఆసక్తివర్జితమును; అరాగద్వేషతః కృతమ్ = రాగప్రయుక్తునిచేతను ద్వేషప్రయుక్తునిచేతను జేయఁబడినది రాగద్వేషతః కృతము, తద్విపరీతముగాఁ జేయఁబడినది, అరాగద్వేషతః కృతమును; అఫలప్రేప్సునా = ఫలముఁ గోరువాఁడు ఫలప్రేప్సువు, ఫలతృష్ణుఁడు, తద్విపరీతుఁ డగు అఫలప్రేప్సువుచే—కర్తచేఁ జేయఁబడినదియునగు; కర్మ = కర్మము; యత్ = ఏది గలదో; తత్=అది; సాత్త్వికమ్= సత్త్వనిర్వృత్త మని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

ఆసక్తియు రాగద్వేషములును లేక ఫలాభిసంధి లేనిపురుషుఁడు చేయు నిత్యకర్మము సాత్త్విక మనఁబడు నని తాత్పర్యము.

ఆ॰ త్రివిధకర్మముఁ జెప్పుటకై మీఁది శ్లోకత్రయ మని చెప్పుచున్నారు ఇఁక నిత్యాదిగా. అందు సాత్త్విక మగు కర్మమును నిరూపించుచున్నారు నియత మిత్యాదిగా.

హ॰ నియతమ్ = నిత్యము; సఙ్గరహితమ్ = ఫలేచ్ఛావర్జితము; అరాగద్వేషతః కృతమ్ — శాస్త్రచోదిత మని యర్థము; అఫలప్రేప్సునా—అట్టి కర్తచేత; చేయఁబడినది; కర్మ యత్ తత్ సాత్త్విక ముచ్యతే.

శం॰ సత్త్వాదిగుణభేదమువలనఁ గర్మత్రైవిధ్యముఁ బ్రతిపాదించుచు మొదట ముముక్షువుల కనుష్ఠేయం బగు సాత్త్వికకర్మముఁ జెప్పుచున్నాఁడు.—నియతమ్= శ్రుతిస్మృతులచే నవశ్యకర్తవ్య మని విహితము యజ్ఞతపోదానలక్షణము; సఙ్గరహితమ్ = సంగ మనఁగా కర్తృత్వాభినివేశము అహంకారము, తద్రహితము, అహంకారము లేనిది; అరాగద్వేషతః = సుఖసాధ్యమును తత్ఫలసాధనమును నగు కర్మమునందు రాగమును దుఃఖసాధ్యమును దుఃఖఫలసాధనము నగుకర్మమునందు ద్వేషమును గలుగును, ఆ రాగద్వేషములు ఎవ్వనికి ఇష్టానిష్టకర్మములందు సమబుద్ధి యగువానికి లేవో అతఁడు అరాగద్వేషుఁడు, తృతీయార్థమున తసిప్రత్యయము, అట్టి రాగద్వేషరహితునిచేత, సాత్త్వికునిచేత;అఫలప్రేప్సునా=నిష్కా-

మునిచేత; కృతమ్ = చేయఁబడినది; యత్; తత్ కర్మ = ఆకర్మము; సాత్త్వికమ్= సత్త్వశుద్ధికారణ మని; మహర్షులచేత, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

మ. ఇట్లు ఔపనిషదులయద్వైతాత్మదర్శనము సాత్త్వికము ముముక్షువులచే నుపాదేయ మనియు ద్వైతదర్శులనిత్యవిభుపరస్పరభిన్నాత్మదర్శనము రాజసంబును అనిత్యపరిచ్ఛిన్నాత్మదర్శనము తామసంబును హేయ మనియుఁ జెప్పఁబడినది. ఇప్పుడు త్రివిధ మగు కర్మము చెప్పఁబడుచున్నది.—నియతమ్ = యావదంగోపసంహారాసమర్థులకుఁ గూడ ఫలావశ్యంభావవ్యాప్తము * నిత్య మని యర్థము; సంగ మనఁగా నేనే మహాయాజ్ఞికుఁడను ఇత్యాద్యభిమానము అహంకారాపరపర్యాయము, రాజసం బగు గర్వవిశేషము, అది లేనిది సంగరహితము; అజ్ఞాన ముండువఱకుఁ గర్తృత్వభోక్తృత్వప్రవర్తకం బగు నహంకార మనువర్తించియే యుండును సాత్త్వికునకుఁ గూడ, అది లేని తత్త్వవిదునకో కర్త్రాధికారము లే దని చెప్పఁబడినది పలుమాఱు; రాగ మనఁగా రాజసమ్మానాదికము దీనిచేఁ బొందఁగల నను నభిప్రాయము, ద్వేష మనఁగా శత్రువును దీనిచే జయింపఁగల నను నభిప్రాయము, ఆ రెంటిచేఁ జేయఁబడినది కాదు కావున అరాగద్వేషతః కృతము; అఫలప్రేప్సునా = ఫలాభిలాషరహితుఁ డగు కర్తచేత చేయఁబడినది, యత్ కర్మ = ఏకర్మము గలదో యాగదానహోమానాదికము; తత్ సాత్త్విక ముచ్యతే.

శ్రీ. ఇఁకఁ ద్రివిధ మగుకర్మము చెప్పఁబడుచున్నది మూఁడుశ్లోకముల చేత.—నియతమ్ = నిత్య మని విహితము; సఙ్గరహితమ్ = అభినివేశశూన్యము; అరాగద్వేషతః కృతమ్ = పుత్త్రాదిప్రీతిచేతఁ గాని శత్రుద్వేషముచేఁ గాని చేయఁబడినది కానిది; ఫలము నొందుటకుఁ గోరువాఁడు ఫలప్రేప్సువు, తద్విలక్షణుఁ డగు నిష్కామునిచేతఁ జేయఁబడినది యేకర్మము గలదో, తత్సాత్త్విక ముచ్యతే.

ప. ♦

రా. ఇట్లు కర్తవ్యకర్మవిషయజ్ఞానమునకు అధికారవేలయం దధికార్యాంశముచే గుణములవలనఁ ద్రైవిధ్యముఁ బ్రతిపాదించి యనుష్ఠేయ మగు కర్మమునకు గుణములవలనఁ ద్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు.—నియతమ్ = స్వవర్ణాశ్రమముల

* సర్వాంగయుక్తముగాఁ జేయుటకు శక్తిలేక యథాశక్తిఁ జేసినవారికిఁగూడ నవశ్యము ఫలము గలిగించునది.

♦ శ్రీధరీయముతో సమానము.

కుచితము; సఙ్గరహితమ్=కర్తృత్వాదిసంగము లేనిది; అరాగద్వేషతః కృతమ్=కీర్తి యందు రాగమువలనను అపకీర్తియందలి ద్వేషమువలనను జేయఁబడినది కానిది, అదంభమునఁ జేయఁబడినది యని యర్థము; అఫలప్రేప్సునా=ఫలాభిసంధి లేనివాని చేత; కార్య మనియే చేయఁబడినది; యత్ కర్మ; తత్సాత్త్విక ముచ్యతే.

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్. ౨౪

భా. యత్తు = ఏది మఱి; కర్మ = కర్మము; కామేప్సునా = ఫలాభిలాష గలవానిచేతను; సాహంకారేణవా = అహంకారముతోఁ గూడిన వానిచేతను; సాహంకారేణ అనుట తత్త్వజ్ఞానాపేక్షచేఁ గాదు, మ తే మనఁగా, లౌకికశ్రోత్రియనిరహంకారాపేక్షచేత, ఎవఁడు పరమార్థనిరహంకారుఁడు ఆత్మవిదుఁడో అతనికి కామేప్సుత్వంబును బహులాయాసకర్తృత్వమును ప్రాప్తింపవు గదా! సాత్త్వికకర్మమునకును అనాత్మవిదుఁడు సాహంకారుఁడు కర్త, ఇఁక రాజసతామసములకుఁ జెప్పెడి దేమి? లోకమున అనాత్మవిదుఁడును శ్రోత్రియుఁడు నిరహంకారుఁ డని చెప్పఁబడుచున్నాఁడు నిరహంకారుఁ డీబ్రాహ్మణుం డని, అందువలనఁ దదపేక్షచేతనే సాహంకారేణ వా యని చెప్పఁబడినది; పునశ్శబ్దము పాదపూరణార్థము; బహులాయాసమ్ = అధికమైన యాయాసము గలుగునట్లుగా; క్రియతే= చేయబడుచున్నదో, కర్తచే బహుల మయిన యాయాసంబున నిర్వర్తింపఁబడుచున్నదో; తత్ = ఆ కర్మము; రాజసమ్ = రాజస మని; ఉదాహృతమ్ = చెప్పఁబడినది.

ఫలాపేక్షయు నేను సత్కర్మపరుండను నహంకారమును గలవాఁడు మిక్కిలి యాయాసముతోఁ జేయుకర్మ మేది గలదో అది రాజస మనఁబడు నని తాత్పర్యము.

ఆ. రాజసకర్మమును నిర్దేశించుచున్నారు య త్త్విత్యాదిగా. తత్త్వజ్ఞానవంతునిచే నిరహంకారునిచేతను అజ్ఞునిచే సాహంకారునిచేతను గర్మము చేయఁబడుచున్న దను వివక్షను వారించుచున్నారు సాహంకారేణ ఇత్యాదిగా. తత్త్వజ్ఞానవంతునిచే నిరహంకారునిచేఁ గృత మగు కర్మము నపేక్షించి సాహంకారునిచే నజ్ఞునిచేఁ గృత మీకర్మ మని వివక్షితము కాదేని అప్పు డేమి యిట వివక్షిత మని యడుగు

చున్నాఁడు మఱేమి అని. ఎవ్వఁడు దురితరహితుఁడు శ్రోత్రియుఁడు లోకమునుండి తొలఁగనివాఁడు గలఁడో వానియొక్క యహంకారవర్జిత మగు కర్మ మేది గలదో దాని నపేక్షించి సాహంకారునిచేఁ గృతం బీకర్మ మని చెప్పఁబడిన దని చెప్పుచున్నారు లౌకికేత్యాదిగా. ఓయీ! తత్త్వజ్ఞానవంతుఁడే నిరహంకారుఁడై చేయు కర్మము నపేక్షించి సాహంకారేణేత్యాదిక మేల యిష్టము కాదు? అనఁగాఁ జెప్పుచున్నారు ఎవఁడు ఇత్యాదిగా. విశేషణాంతరవశమువలననే తత్త్వవిదుఁడు వ్యావర్తితుఁ డగుటవలన తదపేక్షము కాదీవిశేషణ మని యర్థము. సాహంకారునకే రాజసకర్మమునందుఁ గర్తృత్వ మనుదానిఁ గైముతికన్యాయముచే సాధించుచున్నారు సాత్త్వికకర్మమునకును ఇత్యాదిగా. ఓయీ! ఆత్మవిదునికంటె నితరునకు నిరహంకారత్వము సంభవింపమివలన నెట్లయ్యితరు నపేక్షించి సాహంకారేణ అని చెప్పవచ్చును? అనఁగాఁ జెప్పుచున్నారు లోకమున నిత్యాదిగా.

హ. యత్తు; కామేప్సునా = ఫలార్థిచేత; సాహంకారేణ = ఆత్మస్తుతి చేయువానిచేత; అపరమార్థజ్ఞానంబును; బహులాయాసమ్. తత్ రాజసమ్.

శం. రాజసకర్మముఁ జెప్పుచున్నాఁడు.—తుశబ్దము వైలక్షణ్యార్థము. వాకారము చార్థకము. పునః అనునది అప్యర్థకము. కామేప్సునా = కామ్యతే — కామింపఁబడుచున్నది కావున కామ మనఁగా కర్మఫలము, దానిఁ బొందఁగోరినవానిచేత; సాహంకారేణాపిచ = నే నీకర్మమును జేయుచున్నాను ఫలముకొఱకు నభినివేశ మహంకారము, తద్రహితుఁడు పూర్వోక్తుఁడు సాత్త్వికుఁడు, ఇతఁడో రాజసుఁడు దానితోనుంగూడ యుక్తుఁ డగుటవలన సాహంకారుఁడు, నేను దీనిఁ జేయుచున్నా నని యభిమానాడంబరము గలవాఁడు, అట్టి సాహంకారుఁడు నగువానిచేత; బహులాయాసమ్ = బాహువులచే నదీతరణమునం దెట్లో అట్లు గొప్ప యాయాసము — శ్రమ యేకర్మమునం దాచమనాదికమునందును కలదో అది బహులాయాసము; యత్ కర్మ క్రియతే; తత్ = ఆకర్మము; రాజసమ్ — ఫలకామనతోను అహంకారముతోను రజఃకార్యముతోఁ గూడిన యధికారిచేఁ జేయఁబడినది యగుటవలన రాజసం బాకర్మ మని మునులచే నుదాహరింపఁబడిన దని యర్థము.

మ. తుశబ్దము సాత్త్వికమునుండి వ్యావర్తించుచున్నది. కామేప్సునా = ఫలకామునిచేతను; సాహంకారేణవా = పూర్వము చెప్పిన సంగాత్మకగర్వము గలవానిచేత; వాశబ్దము సముచ్చయార్థకము; పునః = అనియతము, కామన యున్న

వఱకుఁ గామ్యమున కావృత్తి కలుగుటవలన; బహులాయాసమ్ = సర్వాంగోపసంహారముచేఁ గ్లేశావహము; యత్ కర్మ = ఏ కామ్యకర్మము; క్రియతే; తత్ రాజస ముదాహృతమ్. ఇట సర్వవిశేషణములచేతను సాత్త్వికసర్వవిశేషణవ్యతిరేకము దర్శితము.

శ్రీ. రాజసకర్మముఁ జెప్పుచున్నాఁడు.—యత్తు కర్మ; కామేప్సునా = ఫలము నొందఁగోరువానిచేత; సాహంకారేణవా = నాకు సమానుఁడు మఱియొక శ్రోత్రియుఁ డెవఁ డున్నాఁ డని నిరూఢ మయిన యహంకారము గలవానిచేతను; క్రియతే. మఱియు నేది, బహులాయాసమ్=అతిక్లేశయుక్తమో; తత్=ఆ కర్మము; రాజస ముదాహృతమ్.

ప. రాజసముఁ జెప్పుచున్నాఁడు.—కామేప్సునా = ఫలప్రాప్తిని గోరువానిచేతను; సాహంకారేణ = నాతోఁ సమానుఁ డే శ్రోత్రియుఁ డని గర్వము గలవానిచేతను; బహులాయాసమ్=అతిక్లేశ మగునట్లు; యత్ క్రియతే. తత్ రాజసమ్.

రా. యత్తు పునః; కామేప్సునా=ఫలము నొందఁగోరువానిచేతను; సాహంకారేణవా = వా శబ్దము చార్థకము, కర్తృత్వాభిమానము గలవానిచేతను; బహులాయాసం యత్కర్మ క్రియతే తద్రాజసమ్ – బహులాయాస మగు నేకర్మము నాచేతనే చేయఁబడుచున్న దను నభిమానము గలవానిచే నేకర్మము చేయఁబడుచున్నదో అది రాజస మని యర్థము.

అనుబన్ధం క్షయం హింసా మనపేక్ష్యచ పౌరుషమ్
మోహా దారభ్యతే కర్మ య త్త త్తామస ముచ్యతే. ౨౫

భా. అనుబన్ధమ్ = పిమ్మటఁ గలుగునట్టి వస్తువు * ఏదో అది యనుబంధ మనఁబడును, ఆ యనుబంధమును; క్షయమ్=ఏకర్మము చేసినయెడ శక్తిక్షయము గాని యర్థక్షయము గాని కలుగునో, అట్టి క్షయమును; హింసామ్–ప్రాణిపీడనమును; పౌరుషంచ=పురుషకారమును, ఈ కర్మమును సమగ్రముగాఁ జేయ శక్తుఁడ నని తనసామర్థ్యమును; ఈ యనుబంధాదులను పౌరుషాంతములను; అనపేక్ష్య=విచారింపక; మోహాత్ = అవివేకమువలన; యత్ కర్మ=ఏకర్మము; ఆరభ్యతే=చేయఁబడుచున్నదో;

* అశుభ మనుట.

తత్ = అది; తామసమ్ = తమోనిర్వృత్తమని; ఉచ్యతే=చెప్పఁబడు చున్నది.

పిమ్మటఁ గలుగఁబోవుకష్టమును ఆ కర్మమువలనఁ గలుగు శక్తిక్షయమును అర్థక్షయమును ప్రాణిహింసను తనశక్తిని ఆలోచింపక యవివేకమువలన నేకర్మము చేయఁబడునో అది తామస మనఁబడు నని తాత్పర్యము.

ఆ. ఇప్పుడు తామసకర్మ ముదాహరించుచున్నారు అనుబన్ధ మిత్యాదిగా.

హ. అనుబధ్యతే—అనుబంధింపఁబడుచున్నాఁడు కర్తని చేతఁ గావున అనుబంధము, కర్మము చేసినపిమ్మట దేనిఁ బొందుచున్నాఁడో అది యనుబంధము, దాని, కర్మనిమిత్తమయినహింసను పురుషకారమును, అనపేక్ష్య, మోహాత్ = అజ్ఞానము వలన; యత్ ఆరభ్యతే; త త్తామసమ్.

శం. తామసకర్మముఁ జెప్పుచున్నాఁడు.—అనుబన్ధమ్=ఉత్తరకాలమునఁ గలుగు ననర్థము ఆకర్మమునకు ఫలభూతము అనుబంధము, ఆ యనుబంధమును, కర్మము చేసినపిమ్మటఁ గలుగు ననర్థమును; క్షయమ్ = కర్మము చేయునపుడు కలుగు ధనక్షయమును బలక్షయమును పుణ్యక్షయమును ఆయుఃక్షయమును ఇతరక్షయ మును గాని; హింసామ్ = ప్రాణిపీడను; పౌరుషంచ = కర్మనిర్వాహమునందుఁ దన సామర్థ్యమును; వాని నన్నిఁటిని, అనవేక్ష్య * = బుద్ధిబలంబున విచారింపక; బల వంత మగు, మోహాత్ =అవివేకమువలన; య త్కర్మ ఆరభ్యతే. తత్ =ఆ కర్మము; సమ్మోహము వివేకాభావము తమోగుణము, దానిచేఁ జేయింపఁబడుచున్నది కావునఁ దామస మనఁబడుచున్నది యని యర్థము.

మ. అనుబన్ధమ్ = పిమ్మటఁ గలుగు నశుభమును; క్షయమ్ = శరీరసామ ర్థ్యమునకును ధనమునకును సేనకును నాశమును; హింసామ్ = ప్రాణిపీడను; పౌరు షంచ = తనసామర్థ్యమును; అనపేక్ష్య = పర్యాలోచింపక; మోహాత్ = కేవలము అవివేకమువలననే; య త్కర్మ ఆరభ్యతే, దుర్యోధనునిచే యుద్ధమువలె; త త్తామస ముచ్యతే.

శ్రీ. తామసకర్మముఁ జెప్పుచున్నాఁడు.—అనుబధ్యతే కావున ననుబం ధము, పశ్చాద్భావి శుభాశుభము, దాని; క్షయమ్ =ధనవ్యయమును; హింసామ్=

* అనవేక్ష్య అని కొందఱు వ్యాఖ్యాతలపాఠము.

పరపీడను; పౌరుషంచ = స్వసామర్థ్యమును; అనవేక్ష్య = పర్యాలోచింపక; కేవలము మోహామువలననే, యత్కర్మ ఆరభ్యతే, తత్తామస ముచ్యతే.

ప. క్షయమ్ = వ్యయమును, హింసామ్ = స్వపరపీడను, అనపేక్ష్య = గణింపక. *

రా. కర్మము చేసినపిమ్మట అనుబధ్యమాన మగు దుఃఖము అనుబంధము, కర్మము చేయునపుడు అర్థనాశము క్షయము, కర్మమునందుఁ బ్రాణిపీడ హింస, కర్మసమాపనమునందుఁ దనసామర్థ్యము పౌరుషము; వీని, అనవేక్ష్య = విమర్శింపక; మోహాత్=పరమపురుషుఁడే కర్త యను జ్ఞానము లేమివలన; యత్క ర్మారభ్యతే తత్తామస ముచ్యతే.

ముక్తసఙ్గో ఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. ౨౬

భా. ముక్తసఙ్గః = ముక్తము — పరిత్యక్తము సంగము ఎవనిచేతనో అతఁడు ముక్తసంగుఁడు; అనహంవాదీ=నేను కర్త నని చెప్పుస్వభావము గలవాఁడు కాఁడు; ధృతి ఉత్సాహసమన్వితః = ధృతి యనఁగా ధారణము, ఉత్సాహము—ఉద్యమము ఆ రెంటితోను గూడినవాఁడు; సిద్ధ్యసిద్ధ్యోః = చేయునట్టి కర్మమునకు ఫలము సిద్ధించినను సిద్ధింపకున్నను — సిద్ధ్యసిద్ధులయందు; నిర్వికారః=వికారము లేనివాఁడు, కేవలము శాస్త్రప్రమాణముచేతనే ప్రయుక్తుఁడు కాన ఫలరాగాదికముతో యుక్తుఁడు కాఁ డెవ్వఁడో అతఁడు నిర్వికారుఁ డనఁబడుచున్నాఁడు; ఇట్టి, కర్తా = చేయువాఁడు ఎవ్వఁడో, అతఁడు; సాత్త్వికః=సాత్త్వికుఁ డని; ఉచ్యతే= చెప్పఁబడుచున్నాఁడు.

సంగము విడిచినవాఁడును నేను కర్త నని వ్యవహరింపనివాఁడును ధైర్యమును ఉత్సాహమును గలవాఁడును ఫలము సిద్ధించినను సిద్ధింపకున్నను వికారము నొందనివాఁడు నగు కర్త సాత్త్వికుఁ డనఁబడు నని తాత్పర్యము.

రా. ఇప్పుడు కర్తృత్రైవిధ్యముఁ బ్రతిపాదించువారై మొదట సాత్త్వికకర్తను దెలుపుచున్నారు ముక్తేత్యాదిగా. సంగము — ఫలాభిసంధి గాని కర్తృ

* తక్కినది శ్రీధరీయముతో సమానము.

త్వాభిమానము గాని. ధారణము—ధైర్యము. చేయుకర్మమునందు ఫలాభిసంధి లేని యెడ చేయుటకే నమ్మిక కలుగ దని యాశంకించి చెప్పుచున్నారు కేవలము ఇత్యాదిగా. ఫలరాగాదికముతో — ఆదిశబ్దముచే కర్మరాగము గ్రహింపఁబడుచున్నది.

హ॰ ముక్తసఙ్గః = విడువఁబడిన ఫలతృష్ణ గలవాఁడు; అనహంవాదీ = ఎవఁడు తన్ను సంభావితునిఁగాఁ జెప్పుకొనఁడో అతఁడు; ధృతి—ఆత్మయొక్క-సంధారణము, ఉత్సాహము — ప్రయత్నము, వానితోఁ గూడినవాఁడు; సిద్ధ్యసిద్ధ్యోః; నిర్వికారః = హర్షవిషాదములు లేనివాఁడు; కర్తా; సాత్త్వికః.

శం॰ గుణభేదంబునఁ గర్తృభేదముఁ జెప్పుటకై సాత్త్వికకర్తను జెప్పుచున్నాఁడు.—ముక్తసఙ్గః=ముక్తము—మనస్సుచే విడువఁబడినది ఫలాభిసంధిలక్షణంబగు కామ మెవ్వనిచేతనో అతఁడు ముక్తసంగుఁడు, నిష్కాముఁ డని యర్థము; అనహంవాదీ=సంకల్పమునందును నేను దీనిఁ జేయుచున్నా నని చెప్పుస్వభావము గలవాఁడు కాఁడు కావున అనహంవాది, అనహంమాని యనుటకును ఇది యుపలక్షణము; ధృత్యుత్సాహసమన్వితః=ధృతి — అర్థవ్యయదేహాయాసాదులందు ధైర్యము, ఉత్సాహము—కర్మము చేయుటం దిచ్ఛావేగము, ఆ రెంటితోను జక్కఁగాఁ గూడినవాఁడు; సిద్ధ్యసిద్ధ్యోః=ఆరంభించినకర్మముయొక్క-సిద్ధియందును అసిద్ధియందును; నిర్వికారః = ఈశ్వరుఁడే నియంత యని దృఢనిశ్చయము గలవాఁ డగుటవలన ఈశ్వరేచ్ఛ యని హర్షవిషాదము లొందనివాఁ డని యర్థము; ఇట్లు సత్త్వగుణసంపన్నుఁడై కర్మములఁ జేయువాఁ డెవ్వఁడో అతఁడు సాత్త్వికకర్త యని ఋషులచేఁ జెప్పఁబడుచున్నాఁ డని యర్థము. ఇట్టిగుణములు కలుగుట సాత్త్వికునిలక్షణ మని సూచిత మగుచున్నది.

మ॰ ఇఁకఁ ద్రివిధకర్తను జెప్పుచున్నాఁడు.—ముక్తసఙ్గః = విడువఁబడిన ఫలాభిసంధి గలఁవాఁడు; అనహంవాదీ = కర్తను నే నని చెప్పుస్వభావము లేనివాఁడు, లేక, తనగుణముల శ్లాఘించుకొనుట లేనివాఁడు; ధృతి — విఘ్నాదులు కలిగినను ఆరంభించినదాని విడువకుండుటకు హేతు వగు నంతఃకరణవృత్తివిశేషము ధైర్యము, ఉత్సాహము—దీని నేను తప్పక చేయుదు నను నిశ్చయాత్మక మగు బుద్ధి ధృతికి హేతుభూతము, ఆ రెంటితోఁ గూడినవాఁడు ధృత్యుత్సాహసమన్వితుఁడు; చేయునట్టి కర్మమునకు ఫలము సిద్ధించినను సిద్ధింపకున్నను హర్షశోకములవలనఁ గలుగునట్టి వికారము—ముఖమునకు వికాసము మ్లానత మొదలగునది యేది గలదో అది లేనివాఁడు సిద్ధ్యసిద్ధులయందు నిర్వికారుఁడు, కేవలశాస్త్రప్రమాణముచేఁ బ్రయు

క్తుఁడు కాని ఫలరాగముచేఁ బ్రయుక్తుఁడు కాఁడు; అందువలన నిట్టి కర్త సాత్త్వికుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్రీ. త్రివిధకర్తను జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—ముక్తసఙ్గః= విడువఁబడిన యభినివేశము గలవాఁడు; అనహంవాదీ = గర్వవాక్యము లేనివాఁడు; ధృతి — ధైర్యము, ఉత్సాహము = ఉద్యమము, వానితోఁ గూడినవాఁడు; ఆరంభించినకర్మముయొక్క సిద్ధియందును అసిద్ధియందును, నిర్వికారః=హర్షవిషాదశూన్యుఁడు; ఇట్టి కర్త సాత్త్వికుఁ డనఁబడును.

ప. ఉత్సాహము — ఉద్వేగము లేకుండుట. *

రా. ముక్తసఙ్గః = ఫలసంగరహితుఁడు; అనహంవాదీ = కర్తృత్వాభిమానరహితుఁడు; ధృత్యుత్సాహసమన్వితః=ఆరంభించినకర్మమునందుఁ గర్మసమాప్తి యగువఱకు అనివార్యమైన దుఃఖమును ధరించుట ధృతి, ఉద్యుక్తమయినమనస్సు గలుగుట యుత్సాహము, వానితో సమన్వితుఁడు; సిద్ధ్యసిద్ధ్యోః నిర్వికారః=యుద్ధాదికర్మమునందును తదుపకరణద్రవ్యార్జనాదులందును సిద్ధ్యసిద్ధుల, వికృతము కాని చిత్తము గలవాఁడు; కర్తా సాత్త్విక ఉచ్యతే.

రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకో ఽశుచిః
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. ౨౭

భా. రాగీ = రాగము గలవాఁడు; కర్మఫలప్రేప్సుః = కర్మఫలము నొందఁ గోరువాఁడు; లుబ్ధః = పరద్రవ్యములందుఁ దృష్ణ గలవాఁడు, తీర్థాదులందును దనద్రవ్యము నియ్యనివాఁడు; హింసాత్మకః = పరులఁ బీడించుట స్వభావముగాఁ గలవాఁడు; అశుచిః = బాహ్యాంతశ్శౌచములు లేనివాఁడు; హర్షశోకాన్వితః=ఇష్టప్రాప్తియందు హర్షముతోను అనిష్టప్రాప్తియందును ఇష్టవియోగమునందును శోకముతోను గూడినవాఁడు, ఆకర్మమే సంపన్నమైనయెడ హర్షమును విపన్నమైనయెడ శోకమును గలుగును, ఆరెంటితోఁ గూడినవాఁడు; ఇట్టి, కర్తా = కర్త యెవఁడుగలఁడో, అతఁడు; రాజసః = రాజసుఁ డని; పరికీర్తితః = చెప్పఁబడియె.

---

* తక్కినది శ్రీధరీయముతో సమానము.

కర్మమునందు రాగము గలవాఁడును తత్ఫలము గోరువాఁడును బరద్రవ్యమునం దాశ గలిగి తనద్రవ్యమును తీర్థాదులందును విడువనొల్లనివాఁడును బరులఁ బీడించువాఁడును శౌచము లేనివాఁడును ఇష్టానిష్టప్రాప్తులందును కర్మసిద్ధ్యసిద్ధులందును హర్షశోకము లొందువాఁడు నగు కర్త రాజసుఁ డనఁబడె నని తాత్పర్యము.

**ఆ.** రాజసకర్తను జెప్పుచున్నాఁడు.—రాగము కర్మవిషయము, కర్మఫలప్రేప్సుః అని ఫలరాగమును వేఱుగాఁ జెప్పుటవలన. స్వాభిప్రాయమును బ్రకటింపక పరులఁ బీడించుట — వారిఁ జెఱచుట, దానిచే స్వార్థపరుఁ డని యర్థము.

**హ.** రాగీ = రాగము గలవాఁడు, లుబ్ధః = దక్షిణగూడ నియ్యనివాఁడు. హర్షశోకములతోఁ గూడినవాఁడు. ఇట్టి కర్త రాజసుఁడు.

**శం.** రాజసకర్తను జెప్పుచున్నాఁడు.—రాగీ = కర్మఫలము నపేక్షించువాఁ డగుటవలన తత్సాధనము లయినకర్మములందు రాగము గలవాఁడు, లేక, రాగము — విషయభోగేచ్ఛ అది గలవాఁడు రాగి; అందువలనే, కర్మఫలప్రేప్సుః = కర్మములయొక్క ఫలమును పుత్రకలత్రధనాదిసంపదను స్వర్గమును పొందఁగోరినవాఁడు, తనయింద్రియములఁ దనుపుటయె స్వభావముగాఁ గలవాఁ డగుటవలన; లుబ్ధః=పరస్వముఁ గోరువాఁడు, లేక, దేవపితృయజ్ఞాదులందును ధనత్యాగము సహింపనివాఁడు; హింసాత్మకః=పరపీడనము స్వభావముగాఁ గలవాఁడు; అశుచిః=శాస్త్రోక్త శౌచము లేనివాఁడు; కర్మముయొక్క సిద్ధ్యసిద్ధులయందుఁ గాని లాభాలాభములయందుఁ గాని, హర్షశోకాన్వితః; ఇట్టి కర్మకర్త యెవ్వఁడు గలఁడో అతఁడు రాజసుఁడు, ఉక్తలక్షణము లగు రజోగుణములతోఁ గూడినవాఁ డగుటవలన రాజసుఁ డని మునులచేఁ బరికీర్తితుఁ డని యర్థము. రాగిత్వాదికము రాజసునిలక్షణ మని సూచితమగుచున్నది.

**మ.** రాగీ=కామాదులచే నాకుల మయినచిత్తము గలవాఁడు; అందువలననే, కర్మఫలప్రేప్సుః = కర్మఫలార్థి; లుబ్ధః = పరద్రవ్యాభిలాషి, ధర్మార్థము స్వద్రవ్యము విడువఁజాలనివాఁడును; స్వాభిప్రాయము ప్రకటించి పరులవృత్తిని ఛేదించుట హింస, తదాత్మకుఁడు—తత్స్వభావుఁడు; స్వాభిప్రాయము ప్రకటింపనియెడ నైష్కృతికుఁ డని భేదము; అశుచిః=శాస్త్రోక్తశౌచము లేనివాఁడు; కర్మఫలము సిద్ధించినపుడును సిద్ధింపనప్పుడును హర్షశోకముల నొందువాఁడు; ఇట్టి కర్త, రాజసః పరికీర్తితః.

శ్రీ. రాజసకర్తను జెప్పుచున్నాఁడు.—రాగీ=పుత్త్రాదులందు ప్రీతి గల వాఁడు; కర్మఫలప్రేప్సుః=కర్మఫలముఁ గామించు వాఁడు; లుబ్ధః = పరస్వాభిలాషి; హింసాత్మకః=చంపుస్వభావము గలవాఁడు; అశుచిః = విహిత మగు శౌచము లేని వాఁడు; లాభాలాభములయందు హర్షశోకములతోఁ గూడినవాఁడు; కర్తా రాజసః పరికీర్తితః.

ప. లుబ్ధః = ఇంద్రియసుఖలంపటుఁడు; హింసాత్మకః = హింసయందు మనస్సు గలవాఁడు. *

రా. రాగీ=యశస్సుఁ గోరువాఁడు; కర్మఫలప్రేప్సుః=కర్మఫలార్థి; లుబ్ధః= కర్మమునకు వలసినద్రవ్యవ్యయము చేయస్వభావము లేనివాఁడు; హింసాత్మకః = పరులఁ బీడించి వారిఁ గొని కర్మము చేయువాఁడు; అశుచిః = కర్మమున కపేక్షిత మగు శుద్ధి లేనివాఁడు; హర్షశోకాన్వితః=యుద్ధాదికర్మమునందు జయాదికము సిద్ధించి నపుడు హర్షముతోను అది సిద్ధింపనపుడు శోకముతోను కూడినవాఁడు; కర్తా రాజసః పరికీర్తితః.

అయుక్తః ప్రాకృతః స్తబ్ధశ్శఠో నైష్కృతికో ఽలసః
విషాదీ దీర్ఘసూత్రీచ కర్తా తామస ఉచ్యతే. ౨౮

భా. అయుక్తః=సమాహితుఁడు కాని వాఁడు •; ప్రాకృతః=అత్యంతము అసంస్కృత మైనబుద్ధి గలవాఁడు, బాలునితో సమానుఁడు; స్తబ్ధః = ఎవ్వనికిని దండమువలె నమస్కరింపనివాఁడు; శఠః=మాయావి, తనశక్తిని మఱుఁగుపఱుచువాఁడు; నైష్కృతికః ‡ = పరవృత్తిని ఛేదించుటయే ప్రధానముగాఁ గలవాఁడు; అలసః=కర్తవ్యములందును ప్రవృత్త్యభావము స్వభావముగాఁ గలవాఁడు; విషాదీ=సదా దుఃఖించుస్వభావము గలవాఁడు; దీర్ఘసూత్రీచ = కర్తవ్యములను దీర్ఘకాలము జరపువాఁడు, నేఁడో రేపో చేయవలసినదానిని మాసమునకును జేయనివాఁడు; ఇట్టి, కర్తా = కర్త యెవఁడు గలఁడో అతఁడు; తామసః = తామసుఁ డని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

* తక్కినది శ్రీధరీయముతో సమానము.

• ఎచ్చరిక లేనివాఁడు.

‡ నైకృతికః అని పాఠాంతరము.

చేయవలసినకార్యములం దెచ్చరిక లేనివాఁడును శాస్త్రసంస్కారము కొంచమేని లేనివాఁడును ఎట్టివారికిని మ్రొక్కనివాఁడును వంచకుఁడును బరుల వృత్తిని జెఱచువాఁడును సోమరియు ఎల్లప్పుడు దుఃఖస్వభావుఁడును నేఁడు చేయ వలసినకార్యము నిఁక మాసమునకును జేయక జగపువాఁడు నగు కర్త తామసుఁ డనఁబడు నని తాత్పర్యము.

ఆ. దీర్ఘముగా సూత్రించు స్వభావము గలవాఁ డనువ్యుత్పత్తిని గ్రహించి వివక్షితార్థముఁ జెప్పుచున్నారు కర్తవ్యములను ఇత్యాదిగా. ఇట్లు చేసినయెడ ఈ యనిష్ట మొల్లెనను కలుగును, ఈవిధముఁ జేసినన్ అనిష్టమే సంభవించు నని చింతా పరంపర గలవాఁడై మందప్రవృత్తి యని యర్థము. దానినే స్పష్టీకరించుచున్నారు నేఁడో ఇత్యాదిగా.

హ. అయుక్తః=అసమాహితుఁడు; ప్రాకృతః=అసంస్కృతబుద్ధి; స్తబ్ధః= నమస్కరింపనివాఁడు; శఠః = వంచకుఁడు; నైష్కృతికః = నిష్కృతిచేఁ జరించు వాఁడు కావున నైష్కృతికుఁడు, క్రూరుఁడు; అలసః = ప్రవర్తింపనివాఁడు; విషాదీ; దీర్ఘసూత్రీ = చిరకారి, అప్పుడే చేయవలసినకర్మమును దీర్ఘకాలమునకుఁ జేయు వాఁడు; కర్తా తామస ఉచ్యతే.

శం. తామసకర్తను జెప్పుచున్నాఁడు.—అయుక్తః = అస్థిరచిత్తుఁడు, చంచలుఁ డని యర్థము; ప్రాకృతః = పామరుఁడు, కార్యాకార్యజ్ఞానము లేనివాఁ డని యర్థము; స్తబ్ధః = నమ్రత లేనివాఁడు, పెద్దలయందు వినయము లేనివాఁ డని యర్థము; శఠః=గూఢముగా విప్రియముఁ జేయువాఁడు, సర్వవంచకుఁ డని యర్థము; నైకృతికః = నికృతి — మనోవాక్కాయములచేఁ బరులఁ దిరస్కరించుట, దాని యందు ఆసక్తుఁడు నైకృతికుఁడు, పరుల నవమానించువాఁ డని యర్థము. అలసః = మందుఁడు అవశ్యకర్తవ్యము లగు కార్యములందును ప్రవృత్తి లేనివాఁడు, శ్రద్ధా శూన్యుఁ డని యర్థము; విషాదీ = దుఃఖిత మయినచిత్తము గలవాఁడు, ఇష్టవస్తువు లబ్ధమైనను దృప్తి నొందమివలన నించుకయు సంతోషము లేనివాఁ డని యర్థము; దీర్ఘసూత్రీచ = అప్పుడే చేయవలసినకార్యమును గూడ పక్షమునకుఁ గాని మాస మునకుఁ గాని యెవఁడు చేయునో అతఁడు దీర్ఘసూత్రి, చిరకారి యని యర్థము; ఇట్టి లక్షణము గల కర్మకర్త యెవఁడు గలఁడో అతఁడు, తామసః = తమోదోష ముచే జడబుద్ధి యగుటవలన తామసుఁ డని; ఉచ్యతే. అయుక్తత్వాదికము తామసుని లక్షణ మని సూచిత మగుచున్నది.

మ. అయుక్తః = సదావిషయవశ మయిన మనస్సు గలవాఁ డగుటచేఁ గర్తవ్యములయం దవధానము లేనివాఁడు; ప్రాకృతః = శాస్త్రసంస్కారము లేని బుద్ధి గలవాఁడు, బాలసమానుఁడు; స్తబ్ధః = గురుదేవతాదులయెడఁ గూడ నమ్రత లేనివాఁడు; శఠః = పరుల వంచించుకొఱకుఁ దన యెఱింగినదాని వేఱువిధముగాఁ జెప్పువాఁడు; నైష్కృతికః = తా నుపకారి యను భ్రమఁ బుట్టించి పరవృత్తులఁ జెఱచుటచే స్వార్థపరుఁడు; అలసః = అవశ్యకర్తవ్యములయందును అప్రవృత్తిస్వభావము గలవాఁడు; విషాదీ = ఎల్లప్పుడును సంతోషము లేక దుఃఖించుస్వభావము గలవాఁడు; దీర్ఘసూత్రీచ = నిరంతరశంకాసహస్రములచేఁ బరవశ మయినయంతఃకరణము గలవాఁ డగుటచే మిక్కిలి మంద మయిన ప్రవృత్తి గలవాఁడు, ఏది నేఁడు చేయవలయునో దాని మాసమునకైనను జేయునో చేయఁడో అను స్వభావము గలవాఁడు; కర్తా; తామస ఉచ్యతే.

శ్రీ. తామసకర్తను జెప్పుచున్నాఁడు.—అయుక్తః = అవధానము లేనివాఁడు; ప్రాకృతః = వివేకశూన్యుఁడు; స్తబ్ధః = నమ్రత లేనివాఁడు; శఠః = శక్తిని మఱుఁగుపఱుచువాఁడు; నైష్కృతికః = పరుల నవమానించువాఁడు; అలస = అప్రయత్నస్వభావుఁడు; విషాదీ = శోకస్వభావుఁడు; దేని నేఁడో ఱేపో చేయవలయునో దాని మాసమునకుఁగూడఁ జేయనివాఁడు దీర్ఘసూత్రి; ఇట్టి కర్త; తామస ఉచ్యతే. కర్తృత్రైవిధ్యముచే జ్ఞాతకును త్రైవిధ్యము ప్రతిపాదిత మగుచున్నది. కర్మత్రైవిధ్యముచేత జ్ఞేయమునకును ద్రైవిధ్యము చెప్పఁబడినది యని యెఱుఁగునది. ఇఁక బుద్ధి త్రైవిధ్యముచేఁ గరణమునకును ద్రైవిధ్యము ప్రతిపాదితము కాఁగలదు.

ప. తామసునిఁ జెప్పుచున్నాఁడు.—అయుక్తః = నియమరహితుఁడు; ప్రాకృతః = వివేకహీనుఁడు; స్తబ్ధః = వినయము లేనివాఁడు; శఠః = మాయావి; నైష్కృతికః = పరరంధ్రములఁ దెలుపువాఁడు; అలసః = ఏమియుఁ జేయనివాఁడు; విషాదీ=క్లేశవ్యయాదులచేఁ బశ్చాత్తాపము నొందువాఁడు; సూచించుటవలన సూత్ర మనఁబడును, దీర్ఘ మగు సూత్ర మెవ్వనియందో అతఁడు దీర్ఘసూత్రి, దేశకాలాద్యనేకవిధసూచనలు చేయుచు నేఁడు ఱేపు ఎల్లుండి యని చేయక విలంబపఱుచువాఁడు; అతఁడు, తామసః కర్తా.

రా. అయుక్తః = శాస్త్రీయకర్మమున కయోగ్యుఁడు, వికర్మమున నుండువాఁడు; ప్రాకృతః = విద్య లేనివాఁడు; స్తబ్ధః = అనారంభస్వభావుఁడు; శఠః = అభి

చారాదికర్మములందు రుచి గలవాఁడు; నైకృతికః = వంచనపరుఁడు; అలసః=ఆరంభించిన కర్మములయందును మందమైనప్రవృత్తి గలవాఁడు; విషాదీ = మిక్కిలి విషాదస్వభావుఁడు; దీర్ఘసూత్రీ=అభిచారాదికర్మముఁ జేయుచుఁ బరులకు దీర్ఘకాలమనర్థము కలుగవలయు నని పర్యాలోచించుస్వభావము గలవాఁడు; ఇట్టి కర్త యెవఁడు కలఁడో అతఁడు, తామసః.

**మా.** పరకృతమైనదోషమును దీర్ఘకాలమునకు మున్ను చేయఁబడినదానినిగూడ అనుచితమగుదాని ఎవ్వఁడు సూచించునో అతఁడు దీర్ఘసూత్రి, "పరేణ యః కృతో దోషో దీర్ఘకాల కృతోఽపివా। య స్తస్య సూచకో దోషా దీర్ఘసూత్రీ స ఉచ్యతే" అను నిఘంటువువలన.

బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ. ౨౯

**భా.** బుద్ధేః = బుద్ధియొక్కయు; ధృతేశ్చైవ=ధైర్యముయొక్కయు; భేదమ్ = భేదమును; గుణతః = సత్త్వాదిగుణములవలన; త్రివిధమ్ = మూఁడువిధములు గలదాని; శృణు=వినుము. అని సూత్రోపన్యాసము. అశేషేణ = నిరవశేషముగా, సమగ్రముగా; పృథక్త్వేన = వివేకముచేత; ప్రోచ్యమానమ్ = నాచేఁ జెప్పఁబడుచున్నదాని. ధనంజయ = అర్జునా! దిగ్విజయమునందు మానుషమును దైవము నగు ప్రభూతధనమును జయించెను, అందుచే ధనంజయుఁ డర్జునుఁడు.

ధనంజయా! ఇఁక సత్త్వాదిగుణములవలనఁ ద్రివిధ మగు బుద్ధిభేదమును ధృతిభేదమును సాకల్యమున విభజించి చెప్పెదను విను మని తాత్పర్యము.

**ఆ.** జ్ఞానాదులకుఁ బ్రత్యేకము త్రైవిధ్యముఁ బ్రతిపాదించి వృత్తిమంతమగుబుద్ధికిని ధృతి యను పేరు గల తద్వృత్తికిని త్రైవిధ్యము సూచించుచున్నాఁడు బుద్ధే రిత్యాదిగా. సూత్రవివరణమునకుఁ బ్రతిజ్ఞ చేయుచున్నా రుత్తరార్ధముచేత. అర్జునునకు ధనంజయత్వము వివరించుచున్నారు దిగ్విజయమునందు ఇత్యాదిగా.

**హ.** బుద్ధేః; ధృతేశ్చైవ = ధైర్యముయొక్కయు; గుణతః=గుణములచేత, పృథక్త్వేన = వివేకముచేత, సంకరము లేనియట్లు.

శ్లో౦. కర్తకువలెఁ గరణమునకును ద్రైవిధ్యము సూచించుటకై బుద్ధ్యాదులకుఁ ద్రైవిధ్యము బోధించుచున్నాఁడు.—దేనిచేఁ బదార్థతత్త్వమును నిశ్చయించి కార్యమునందుఁ బురుషుఁడు ప్రవర్తించుచున్నాఁడో అట్టి, బుద్ధేః=అంతఃకరణవృత్తి విశేషమునకును; ధృతేశ్చ—వృత్తివిశేషమునకును; చకారము సముచ్చయార్థము, ఏవకార మన్యయోగవ్యవచ్ఛేదార్థము; పృథక్త్వేన = ప్రత్యేకముగా; గుణతః = సత్త్వాదిగుణములచేత; త్రివిధం భేదమ్; అశేషేణ=సాకల్యముచేత; నాచేత; ప్రోచ్యమానమ్ = చెప్పఁబడుచున్నదాని; శృణు. పూర్వము జ్ఞానమునకుఁ ద్రైవిధ్యము ప్రతిపాదితమై యున్నను, జ్ఞానము వృత్తిసామాన్యము బుద్ధియో వృత్తివిశేషము ధృతియు వృత్తివిశేషమే, కావున లేదు పునరుక్తిప్రసంగము.

మ౦. ఇట్లు జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః అన్నది వ్యాఖ్యాతము. ఇప్పుడు ధృత్యుత్సాహసమన్వితః అనుచోట సూచితము లైన బుద్ధిధృతులకుఁ ద్రైవిధ్యము ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు.—బుద్ధేః=అధ్యవసాయాదివృత్తిమంత మగు దానికిని; ధృతేశ్చ = దానివృత్తికిని; సత్త్వాదిగుణములవలన, త్రివిధమేవ = త్రివిధమే యగు; భేదమ్; నాచే నీకు అలసత విడిచి పరమాప్తతతో, ప్రోచ్యమానమ్; అశేషేణ = నిరవశేషముగా; పృథక్త్వేన = ఇది హేయము ఇది యుపాదేయము అను వివేకముచేత; శృణు = వినుటకు సావధానుఁడ వగుము. ఇట నిది విచారణీయము. ఏమి యిట బుద్ధిశబ్దముచే వృత్తిమాత్రమా యభిప్రేతము? లేక వృత్తిమదంతఃకరణమా? మొదటిపక్షమున జ్ఞానము వేఱుగా వక్తవ్యము గాదు. రెండవపక్షమునఁ గర్త వేఱుగా వక్తవ్యుఁడు కాఁడు, వృత్తిమదంతఃకరణమే కర్త యగుటవలన. జ్ఞానధృతుల వేఱుగాఁ జెప్పుటయు వ్యర్థము. అది యిచ్ఛాదిపరిసంఖ్యార్థ మనుటయుఁ దగదు, వృత్తిమదంతఃకరణమునకుఁ ద్రైవిధ్యము చెప్పుటచేఁ దద్వృత్తుల కన్నిటికిని ద్రైవిధ్యము వివక్షిత మగుటవలన. చెప్పెదము. అంతఃకరణోపహిత మగు చిదాభాసము కర్త. ఇక్కడనో యుపహితమునుండి వేఱుపఱిచి యుపాధిమాత్రము కరణత్వమున వివక్షితము, అంతటను గరణోపహితమే కర్త యగుటవలన. "కామస్సంకల్పో విచికిత్సా శ్రద్ధా౽శ్రద్ధా ధృతి ధృతి ర్హీర్ధీ ర్భీ రిత్యేత త్సర్వం మనఏవ" అను శ్రుతిచే ననువదింపఁబడినవృత్తు లన్నిటికిని ద్రైవిధ్యము వివక్షితమే, అయినను ధీధృతులకుఁ ద్రైవిధ్యము వేఱుగాఁ జెప్పఁబడినది జ్ఞానశక్తిక్రియాశక్త్యుపలక్షణార్థము, కాని పరిసంఖ్యార్థము గా దని రహస్యము.

శ్రీ. ఇప్పుడు బుద్ధికిని ధృతికిని త్రైవిధ్య మని ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు బుద్ధే రిత్యాదిగా. అర్థము స్పష్టము.

ప. *

రా. ఇట్లు కర్తవ్య కర్మవిషయజ్ఞానమునందును కర్తవ్యం బగు కర్మమునందును అనుష్ఠాతయందును గుణములచేఁ త్రైవిధ్యము చెప్పఁబడినది. ఇపుడు సర్వతత్త్వ సర్వపురుషార్థనిశ్చయరూప మగు బుద్ధికిని ధృతికిని గుణములచేఁ త్రైవిధ్యము చెప్పుచున్నాఁడు.—బుద్ధి – వివేకపూర్వకముగా నిశ్చయరూప మగు జ్ఞానము, ధృతి – విఘ్నము కలిగినను ఆరంభించిన కర్మముయొక్క ధారణము ♦, ఆరెంటికిని సత్త్వాదిగుణములవలనఁ త్రివిధ మగు భేదమును బృథక్త్వమునఁ బ్రోచ్యమానమును జక్కగా వినుము.

మా. ɩ

> ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే
> బన్ధం మోక్షంచ యా వేత్తి బుద్ధి స్సా పార్థ సాత్త్వికీ. 30

భా. ప్రవృత్తించ = ప్రవృత్తి యనఁగా ప్రవర్తనము బాధహేతు వగు కర్మమార్గము, దానిని; నివృత్తించ = మోక్షహేతు వగు సన్న్యాసమార్గమును; బంధమోక్షసమానవాక్యము లగుటవలనఁ బ్రవృత్తినివృత్తులు కర్మసన్న్యాసమార్గము లని తెలియుచున్నది; కార్యాకార్యే = విహితప్రతిషిద్ధములను కర్తవ్యాకర్తవ్యములను, కరణాకరణముల * ననుట, వేనియొక్క ? దేశకాలాద్యపేక్షచే దృష్టాదృష్టార్థము లగు కర్మములయొక్క; భయాభయే = భయపడుచున్నాఁడు దీనివలనఁ గావున భయము, తద్విపరీతము అభయము, వాని రెంటిని, దృష్టాదృష్టవిషయము లగు భయాభయముల కారణముల నని యర్థము; బన్ధమ్=సంసారమును సహేతుకమును; మోక్షంచ = మోక్షమును సహేతుకమును; యా = ఏది; వేత్తి = ఎఱుఁగుచున్నదో; సా బుద్ధిః=ఆబుద్ధి; సాత్త్వికీ=

* శ్రీధరీయముతో సమానము.

♦ విశువమి.

ɩ ఈ రెండుశ్లోకముల కీభాష్యము లేదు.

* చేయుటను చేయమిని.

సాత్త్వికము. పార్థ = అర్జునా! అక్కడ జ్ఞానము బుద్ధియొక్కవృత్తి. బుద్ధియో వృత్తిమంతము. ధృతియును బుద్ధియొక్కవృత్తివిశేషము.

అర్జునా! బంధహేతు వగు కర్మమార్గమును, మోక్షహేతు వగు సన్న్యాసమార్గమును, దేశకాలాదులఁబట్టి కార్యాకార్యములఁ జేయుటను జేయకుండుటను, భయకారణమును, అభయకారణమును, సహేతుక మగుబంధమును, సహేతుక మగుమోక్షమును ఏబుద్ధిచే నెఱుంగునో ఆబుద్ధి సాత్త్విక మనఁబడును.

ఆ. అందు మొదట సాత్త్వికబుద్ధిని నిర్దేశించుచున్నారు.—ప్రవృత్తి యనఁగా ఆచరణమాత్ర మనియు అనాచరణమాత్రము నివృత్తియనియు నేల చెప్పరాదు? అనఁగాఁ జెప్పుచున్నారు బం ధేత్యాదిగా. ఏవాక్యమునందు బంధమోక్షములు చెప్పఁబడుచున్నవో ఆవాక్యమునందే ప్రవృత్తినివృత్తులు చెప్పఁబడిన వగుట వలన కర్మమార్గము బంధహేతు వగుటవలనను సన్న్యాసమార్గము మోక్షహేతు వగుటవలనను అవియే యిట గ్రాహ్యము లని యర్థము. కరణాకరణములు నిర్విషయంబులు కాఁజాలవు కావున విషయాపేక్షఁ జూపి యోగ్య మగు విషయమును నిర్దేశించుచున్నారు వేనియొక్క ఇత్యాదిగా. అనిష్టసాధనము భయ మనియు నిష్టసాధన మభయ మనియు విభజించుచున్నారు భ యేత్యాదిగా. బంధమోక్షజ్ఞానము ఇతర బుద్ధియందును సంభవించుటవలన సహేతుక మనువిశేషణము. ఓయీ! బుద్ధిశబ్దవాచ్య మయిన జ్ఞానమునకుఁ బూర్వమే ప్రతిపాదింపఁబడి యుండఁగా నిప్పు డేల బుద్ధికిఁ ద్వైవిధ్యము చెప్పఁబడుచున్నది? అందులకుఁ జెప్పుచున్నారు అక్కడ నిత్యాదిగా. అప్పుడు జ్ఞానముచే గతార్థ మగుటవలన వెండియు ధృతి వ్యుత్పాదనీయము కాదని యాశంకించి చెప్పుచున్నారు ధృతియును ఇత్యాదిగా. విశేషశబ్దముచే జ్ఞానముకంటె భిన్నత చెప్పఁబడుచున్నది.

హ. ప్రవృత్తించ=మోక్షార్థము ప్రవర్తించుటను; నివృత్తించ = సన్న్యాసమును; కార్యాకార్యే = కార్యమును — చేయవలసినదాని అకార్యమును — తదభావమును; భయాభయే = భయమును — సంసారమును అభయమును — తదభావరూప మగు మోక్షమును; బన్ధమ్ = బంధనమును; మోక్షంచ = ముక్తిని; వీని నన్నిటిని, ఏబుద్ధి యెఱుంగుచున్నదో, అది సాత్త్వికము.

శం. సాత్త్వికబుద్ధికి లక్షణముఁ జెప్పుచున్నాఁడు.—ప్రవృత్తించ=శ్రుతి స్మృతులచే విహిత మగు ధర్మమును; నివృత్తించ = వానిచేతనే నిషిద్ధ మగు నధ

ర్థమును; కార్యాకార్యే=కార్యమును— దేశకాలములయానుకూల్యమునుబట్టి చేయవలసినదాని అకార్యమును—తత్ప్రాతికూల్యమునుబట్టి విడువవలసినదాని; భయాభయే = భయమును—భయకారణమయిన యనర్థమును అభయమును — భయాభావకారణ మగు ననర్థాభావమును; బన్ధమ్ = బంధహేతువును; మోక్షంచ = మోక్షహేతువును; బుద్ధికి జ్ఞానకర్తృత్వము సంభవింపమివలన కరణార్థత గ్రహింపవలయును, పదార్థతత్త్వనిశ్చయకారిణి యగు నేబుద్ధిచే ధర్మాధర్మాదికమును అధికారి యగు పురుషుఁ డెఱుంగుచున్నాఁడో ఆబుద్ధి సాత్త్వికము. లేక. బన్ధం మోక్షంచ యని యిట బంధమోక్షములే ప్రతిపాద్యము లగుటచేఁ బ్రవృత్త్యాదిపదములను తద్విశేషణత్వంబున నన్వయించుట యుక్తము. ప్రవృత్తిమ్ = ప్రవృత్తి యనఁగా సత్త్వశుద్ధికిఁ గారణభూత మగు కర్మమార్గము, దేనియందుఁ బ్రవృత్తుఁడు శుద్ధాత్ముఁడై మోక్షమునకు యోగ్యుఁ డగుచున్నాఁడో ఆప్రవృత్తిని; నివృత్తించ = నివృత్తి యనఁగా నైష్కర్మ్యమార్గము సన్న్యాసము, దేనియందుఁ బ్రవృత్తుఁడు సంసారబంధమునుండి ముక్తుఁ డగుచున్నాఁడో ఆ నివృత్తిని; చకారత్రయము సముచ్చయార్థము; కార్యాకార్యే = ఆరురుక్షువునకుఁ గర్మవిషయంబున నాయాకాలమునం దేది కర్తవ్యమో అది కార్యము, అట్లారూఢున కేది యకర్తవ్యమో — త్యక్తవ్యమో అది యకార్యము, ఆ కార్యాకార్యముల రెంటిని; భయాభయే = దేనివలన భయపడుచున్నాఁడో అది భయము అజ్ఞానము సంసారకారణము, దేనివలన అభయము — భయాభావము సిద్ధించుచున్నదో అది యభయము మోక్షకారణ మగు జ్ఞానము, ఆ రెంటిని భయాభయములను; బన్ధమ్ = అధ్యాసలక్షణమును అజ్ఞానకార్యమును; మోక్షంచ =అధ్యాసాభావలక్షణమును జ్ఞానకార్యమును; ఏబుద్ధిచేత శుద్ధాత్ముఁ డగు విచక్షణుఁడు ఈసమస్తంబును క్షీరనీరములనువలె విభజించి యెఱుంగుచున్నాఁడో, అజ్ఞున కిది సాధనము తజ్జ్ఞున కిది సాధనము ఆరురుక్షువున కిది కర్తవ్య మారూఢున కిది త్యక్తవ్యము ఇది యజ్ఞానం బిది జ్ఞాన మిది బంధ మిది మోక్ష మని స్వాధికారానురూపముగా సాధ్యసాధనభేదమును బంధమును మోక్షమును జక్కఁగా దేనిచేఁ బురుషుఁ డెఱుంగుచున్నాఁడో ఆ బుద్ధి సాత్త్వికము — బహుజన్మసుకృతపరిపాకమువలనఁ బుట్టిన శుద్ధసత్త్వముయొక్క కార్య మగుటవలన సాత్త్విక మని బుధులచేఁ జెప్పఁబడుచున్నది యని యర్థము. ఇందుచే సాత్త్వికబుద్ధినే ముముక్షువు ప్రయత్నంబున సంపాదింపవలయు నని సూచిత మగుచున్నది.

మ. అందు బుద్ధిత్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—ప్రవృత్తించ = కర్మమార్గమును; నివృత్తించ=సన్న్యాసమార్గమును; కార్యమును—ప్రవృత్తిమార్గమునందుఁగర్మములఁ జేయుటను,అకార్యమును=నివృత్తిమార్గమునందు కర్మములఁ జేయమిని; భయమును – ప్రవృత్తిమార్గమున గర్భవాసాదిదుఃఖమును, అభయమును – నివృత్తిమార్గమునఁ దదభావమును; బంధమును – ప్రవృత్తిమార్గమున మిథ్యాజ్ఞానకృత మగు కర్తృత్వాద్యభిమానమును, మోక్షమును – నివృత్తిమార్గమునఁ దత్త్వజ్ఞానకృత మగు నజ్ఞానతత్కార్యాభావమును; యా వేత్తి = కరణమునందుఁ గర్తృత్వోపజారము, దేనిచేఁ గర్త యెఱుంగుచున్నాఁడో; బుద్ధిఃసా= ఆబుద్ధి, ప్రమాణజనితనిశ్చయముగలది; పార్థా ! సాత్త్వికీ. బంధమోక్షముల నంతమునఁ జెప్పుటవలనఁ దద్విషయముగానే ప్రవృత్త్యాదికము వ్యాఖ్యాతము.

శ్రీ. అందు బుద్ధికిఁ ద్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు మూఁడింటిచేత.—ధర్మమునందుఁ బ్రవృత్తిని, అధర్మమునుండి నివృత్తిని, ఏదేశమునం దేకాలమునం దేది కార్యమో యేది అకార్యమో దానిని; భయాభయే = కార్యాకార్యముల వలనఁ గలుగు నర్థానర్థములను; ఎట్టిది బంధము ? ఎట్టిది మోక్షము ? అనియును; యా; బుద్ధిః=అంతఃకరణము; వేత్తి; సా సాత్త్వికీ. దేనిచేఁ బురుషుఁ డెఱుంగుచున్నాఁడని చెప్పవలసియుండఁగా కరణమునందుఁ గర్తృత్వోపచారము, కాష్ఠాని పచన్తి యనునట్లు.

ప. అందు మొదట బుద్ధిత్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు మూఁడింటిచేత.—శాస్త్రవిహితవిషయమై దేశకాలోచిత మయిన ధర్మమందలి ప్రవృత్తిని, అధర్మమునందు నివృత్తిని, దేశకాలానుసారముగాఁ గాని వయోవృత్త్యానుసారముగాఁ గాని ఇది కార్యము ఇది యకార్య మనియు, అకార్యమునందు భయమును కార్యమునందు అభయమును, బంధమును – సంసారబంధమును, మోక్షమును – తదుద్ధారప్రకారమును, యా వేత్తి సా బుద్ధిః సాత్త్వికీ.

రా. ప్రవృత్తి – అభ్యుదయసాధనభూత మగు ధర్మము, నివృత్తి—మోక్షసాధనభూతము, ఆరెంటిని యథావస్థితముగా నేబుద్ధి యెఱుంగుచున్నదో; కార్యాకార్యే – ప్రవృత్తి నివృత్తి ధర్మములలో నొకదాని నాచరించునట్టి సర్వవర్ణములకును దేశకాలావస్థావిశేషములయందు ఇది కార్యము ఇది యకార్య మని యేది యెఱుంగుచున్నదో; భయాభయే – శాస్త్రాతిక్రమము భయస్థానము, తదనువృత్తి

అభయస్థానము; బన్ధం మోక్షంచ — సంసారయాథాత్మ్యమును తన్నివృత్తియాథాత్మ్యమును ఏది యెఱుంగుచున్నదో, సా సాత్త్వికీ బుద్ధిః.

యయా ధర్మ మధర్మంచ కార్యం చా ఽకార్య మేవచ
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ రాజసీ. ౩౧

**భా.** యయా = ఏబుద్ధిచేత; ధర్మమ్ = శాస్త్రచోదిత మగు ధర్మమును; అధర్మంచ = తత్ప్రతిషిద్ధ మగు నధర్మమును; కార్యంచ = కార్యమును; అకార్యమేవచ = అకార్యమును, పూర్వోక్తములనే కార్యాకార్యములను; అయథావత్ = యథావత్తు కాదు, సాకల్యమున నిర్ణయించి కాదు; ప్రజానాతి=ఎఱుంగుచున్నాఁడో; సా బుద్ధిః=ఆబుద్ధి; రాజసీ = రాజసము. పార్థ = అర్జునా!

అర్జునా! ధర్మాధర్మములను వానిఁ జేయుటను జేయమిని సాకల్యమున ననిశ్చితముగా నేబుద్ధిచేతఁ బురుషుఁ డెఱుంగుచున్నాఁడో అది రాజస మని తాత్పర్యము.

**ఆ.** కార్యాకార్యములకు ధర్మాధర్మములచేఁ బౌనరుక్త్యమును బరిహరించుచున్నారు పూర్వోక్తములనే ఇత్యాదిగా. పూర్వశ్లోకమునందుఁ గార్యాకార్యశబ్దములచే దృష్టాదృష్టార్థము లగు కర్మముల కరణాకరణములు నిర్దేశింపఁబడినవి, అవియే యిందును గ్రహింపఁబడుటవలన అపూర్వపర్యాయము లగు ధర్మాధర్మములచే గతార్థములు కా వని యర్థము. ఆబుద్ధి — ఏబుద్ధిచే బోద్ధ నిర్ణయింబున నెఱుంగఁజాలఁడో ఆబుద్ధి యని యర్థము.

**హ.** యయా = ఏబుద్ధిచేత; ధర్మమ్=శ్రేయస్సాధనమును, కార్యమును; అధర్మమును అకార్యమును; అయథావత్ = వేఱువిధమున; ప్రజానాతి = ఎఱుంగుచున్నాఁడో; సా బుద్ధిః రాజసీ.

**శం.** రాజసబుద్ధిని జెప్పుచున్నాఁడు.—ధర్మమ్=విహితమును; అధర్మంచ=నిషిద్ధమును; కార్యంచ అకార్యమేవచ = దేశకాలాదు లనుకూలము లైనపుడును బ్రతికూలము లైనపుడును కర్తవ్యాకర్తవ్యము లగు కర్మములను; చకారమువలన అర్థానర్థములను; వీని నన్నిటిని, అయథావత్ = యథార్థముగాఁ గాక, యావదర్థనిశ్చయము లేక, అసాకల్యమున, సందేహమున; యయా = ఏబుద్ధిచేత; ప్రజానాతి=

పురుషుఁ డెఱుంగుచున్నాఁడో; సా బుద్ధిః; రాజసీ = రజోగుణసంపన్న మగుటవలన రాజస మని చెప్పఁబడుచున్నది.

మ. ధర్మమ్ = శాస్త్రవిహితమును, అధర్మమ్ = శాస్త్రప్రతిషిద్ధమును, అదృష్టార్థము లగు నీరెంటిని; కార్యంచ అకార్యంచ — దృష్టార్థము లగు నీరెంటిని; అయథావ దేవ ప్రజానాతి—యథావత్తుగా నెఱుంగఁడు, ఇది యి ట్లగునా కాదా అని యనిశ్చయమును సంశయమును గాని పొందుచున్నాఁడు; యయా=ఏబుద్ధిచేతనో; సా రాజసీ బుద్ధిః. ఇటఁ దృతీయానిర్దేశమువలన నితరస్థలములందును కరణత్వమే యెఱుంగవలయును.

శ్రీ. రాజసబుద్ధిని జెప్పుచున్నాఁడు.—అయథావత్ — సందేహాస్పద ముగా నని యర్థము. ఇతరము స్పష్టము.

ప. *

రా. దేనిచేతఁ బూర్వోక్త మగు ద్వివిధధర్మమును తద్విపరీత మగు నధర్మమును తన్నిష్ఠునకు దేశకాలావస్థాదులందుఁ గార్యమును అకార్యమును యథావత్తుగా నెఱుంగఁడో, సా రాజసీ బుద్ధిః.

మా. యథార్థత్వనియమము లేదు రాజసికి. కాదేని తామసికంటె భేదము లేమివలన.

అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసా ఽఽవృతా
సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ తామసీ. ౩౨

భా. అధర్మమ్—ప్రతిషిద్ధమును;ధర్మమితి—విహిత మని; సర్వార్థాన్ = సమస్తము లయిన జ్ఞేయపదార్థములను గూడ; విపరీతాంశ్చ = విపరీత ములనుగానే; యా = ఏబుద్ధి; తమసా = అవివేకముచే; ఆవృతా=చుట్టఁ బడినదై; మన్యతే = ఎఱుంగుచున్నదో; సా = ఆ; బుద్ధిః = బుద్ధి; తామసీ = తామసము. పార్థ = అర్జునా!

అర్జునా! అవివేకావృత మగు నేబుద్ధిచేత అధర్మమును ధర్మముగాను అట్లు జ్ఞేయపదార్థము లన్నిటినిగూడ విపరీతవిధములుగానే పురుషుఁ డెఱుంగుచు న్నాఁడో ఆబుద్ధి తామస మని తాత్పర్యము.

---

* శ్రీధరీయతుల్యము.

ఆ. ధర్మశబ్దము నపుంసకలింగముగూడఁ గల దను నభిప్రాయమున ధర్మ మితి యని చెప్పఁబడినది. కార్యాకార్యాదులను జెప్పినవానిని జెప్పనివాననిగూడ సంగ్రహించుటకై సర్వార్థాన్ అని చెప్పఁబడినది, దాని వివరించుచున్నారు సమస్తములు ఇత్యాదిగా. విపరీతాంశ్చ అను చకారము నవధారణార్థముగా గ్రహించి విపరీతములనుగానే యని చెప్పఁబడినది.

హ. అధర్మమ్ — అశ్రేయస్కరమును; ధర్మ మితి=ధర్మస్వరూపముచేత. విపరీతాన్ = విపర్యస్తములనుగా. సా తామసీ.

శం. తామసబుద్ధిని జెప్పుచున్నాఁడు.—ధర్మము నధర్మముగాను కార్యము నకార్యముగాను అర్థము ననర్థముగాను తమోగుణముచే నావృతమై యస్పష్టప్రకాశమైన యేబుద్ధిచేత సర్వార్థములను వైపరీత్యమున గ్రహించుచున్నాఁడో పురుషుఁడు, అది తామసబుద్ధి యని యర్థము.

మ. తమసా = విశేషజ్ఞానమునకు విరోధి యగు దోషముచే; ఆవృతా = ఆవరింపఁబడినట్టి; యా = ఏబుద్ధి; అధర్మం ధర్మ మితి మన్యతే — అదృష్టార్థమునందంతటను విపర్యాసము నొందుచున్నదో; అట్లు, సర్వార్థాన్ = సమస్తము లయిన దృష్టార్థము లగు జ్ఞేయపదార్థములను గూడ; విపరీతములనుగానే యెఱుంగుచున్నదో, సా = అట్టి విపర్యయవంత మగు; బుద్ధిః; తామసీ.

శ్రీ. తామసబుద్ధిని జెప్పుచున్నాఁడు.—విపరీతముగా గ్రహించినట్టి బుద్ధి తామస మని యర్థము. బుద్ధి యంతఃకరణ మని పూర్వము చెప్పఁబడినది. జ్ఞానము దానివృత్తి. ధృతియును దానివృత్తియే. లేక. ధర్మి యగు నంతఃకరణమునకు బుద్ధియు నధ్యవసాయలక్షణ మగు వృత్తియే. ఇచ్ఛాద్వేషాదు లంతఃకరణవృత్తులు పెక్కు లున్నను ధర్మాధర్మోభయసాధనంబు లగుటచేఁ బ్రధానము లగుటవలన వీనికి * త్రైవిధ్యము చెప్పఁబడినది. ఇది యితరవృత్తులకును నుపలక్షణము.

ప. తామసిని జెప్పుచున్నాఁడు.—యా; తమసా = అజ్ఞానముచే; ఆవృతా = కప్పఁబడినదై; అధర్మమునే ధర్మమునుగాఁ జూచునో, లక్షగోవులను ఈఁగలను జంపినయెడ నొకయశ్వము సుఖము నొందును, పౌంశ్చల్యముచేఁ బరులకు సంతోష మగుఁ గావున ధర్మము — ఇత్యాదిగాఁ దలంచుచున్నదో; సర్వార్థాన్ —

* జ్ఞానబుద్ధి ధృతులకు.

పుత్త్రమిత్త్రాదులను; విపరీతాన్—ప్రతికూలము చేయువానిఁగా, తలంచుచున్నదో. సా తామసీ; బుద్ధి యధ్యవసాయాత్మక మగు నంతఃకరణవృత్తి, కాని నిశ్చయాత్మకము గాదు, నిశ్చయాత్మకము ఏకవిధమె కాని త్రివిధము కాదు, అది చెప్పఁబడినది "వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన" అని. అప్పుడు ఇతరము లైన యిచ్ఛాద్వేషముల నె ట్లుద్దేశింప లేదు? సత్యము, ధర్మాధర్మప్రవృత్తియందు బుద్ధిధృతులకుఁ బ్రాధాన్య మని యెఱుంగవలయును.

రా. తామసబుద్ధియో తమస్సుచే నావరింపఁబడినదై, సర్వార్థాన్ విపరీతాన్ మన్యతే. అధర్మమును ధర్మముగాను ధర్మము నధర్మముగాను సదర్థము నసదర్థముగాను అసదర్థమును సదర్థముగాను పరతత్త్వము నపరముగాను అపరతత్త్వమును బరముగాను ఇట్లు సర్వమును విపరీతముగా గ్రహించు నని యర్థము.

మూ. *

ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేన్ద్రియక్రియాః
యోగేనాఽవ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ సాత్త్వికీ. 33

భా. యయా ధృత్యా = ఏధృతిచే; అవ్యభిచారిణ్యా అని వ్యవహితముతో సంబంధము; ధారయతే=ధరించుచున్నాఁడో; వేనిని? మనఃప్రాణేన్ద్రియక్రియాః =మనస్సును ప్రాణములును ఇంద్రియములు మనఃప్రాణేన్ద్రియములు, వానియొక్క—క్రియలను — చేష్టలను; వాని నుచ్ఛాస్త్రమార్గప్రవృత్తినుండి నిలుపుచున్నాఁడో; ధృతిచే నిలుపఁబడినవైగదా యవి యుచ్ఛాస్త్రవిషయములు కావు; యోగేన = సమాధితో; అవ్యభిచారిణ్యా = అవినాభూత మైనదానిచేత, నిత్యసమాధ్యనుగత మయినదానిచేత నని యర్థము; ఇది యభిప్రాయము, ధృతిచే మనఃప్రాణేంద్రియక్రియల ధరించువాఁడు యోగముతో నవ్యభిచారి యగు ధృతిచే ధరించుచున్నాఁ డని. ఇట్టి ధృతి యేది గలదో, సా ధృతిః = ఆ ధృతి; సాత్త్వికీ=సాత్త్వికము. పార్థ = అర్జునా!

అర్జునా! ఎప్పుడును బ్రహ్మవిషయ మయిన యేకాగ్రతతోఁ గూడియుండునట్టి యేధృతిచే మనోవ్యాపారములను ప్రాణవ్యాపారములను ఇంద్రియవ్యాపార

* ఇఁకఁ బదునేడుశ్లోకముల కేభాష్యము లేదు.

ములను శాస్త్రీయమార్గము నతిక్రమింపనీయక నిలుపుచున్నాఁడో ఆధృతి సాత్త్వికమని తాత్పర్యము.

**ఆ.** ఇపుడు ధృతిత్రైవిధ్యము చెప్పఁగోరినవారై మొదట సాత్త్వికధృతిని దెలుపుచున్నారు యయా ఇత్యాదిగా. ఈ చేష్టలను ధృతిచే ధరించుట యెట్లు? అనఁగాఁ జెప్పుచున్నారు వాని నిత్యాదిగా. దానినే యనుభవముచే సాధించుచున్నారు ధృతిచే నిత్యాదిగా. ధ్రియతే — ధరింపఁబడుచున్నది దీనిచేతఁ గావున ధృతి యనఁగా యత్నవిశేషము, ఆ ధృతిచే ధరింపఁబడుచున్నవై యీచేష్టలు శాస్త్రము నతిక్రమించి యర్థాంతరము నొందవని యర్థము. ధృతినే సమాధ్యవినాభూత మని విశేషించుచున్నారు యోగే నేత్యాదిగా. ధృతికి నియమంబున సమాధ్యనుగతత్వమె ట్లుక్తచేష్టాధారణమునం దుపయోగించు నని యాశంకించి చెప్పుచున్నారు ఇది ఇత్యాదిగా. ఉక్తక్రియల ధరించువాఁడు యోగముతో — బ్రహ్మమునందు సమాధితో ఏకాగ్రతతో అవ్యభిచారి — అవినాభూత మగు ధృతిచే ధరించుచున్నాఁడు, అట్లు కాక ధృతికి సమాధ్యవినాభావము లేనియెడ నియమంబున తద్ధారణము సిద్ధింపదని యర్థము.

**హ.** ధృత్యా = ధైర్యముచేత. ధారయతే=ధరించుచున్నాఁడో. క్రియాః= వ్యాపారములను. యోగేన=సమాధిచేత; అవ్యభిచారిణ్యా=నిత్య మయినదానిచేత. సా ధృతిః సాత్త్వికీ.

**శం.** ధృతికిని త్రైవిధ్యముఁ బ్రతిపాదించువాఁడై సాత్త్వికధృతిని జెప్పుచున్నాఁడు.—యోగేన = బ్రహ్మమునందు చిత్తైకాగ్రతాలక్షణ మగు సమాధితో; అవ్యభిచారిణ్యా = అవినాభూత మగు; ధృత్యా =ధారణాత్మక మగు బుద్ధివృత్తిచేత; యయా=దేనిచేత; మనః ప్రాణేన్ద్రియక్రియాః=మనస్సుయొక్కయు బ్రాణములయొక్కయుఁ జక్షురాదీంద్రియములయొక్కయు బహిఃప్రవృత్తిరూపము లగు చేష్టలేవి గలవో వాని నన్నిటిని; ధారయతే=బ్రహ్మనిష్ఠుఁడు నిలుపుచున్నాఁడో. బ్రహ్మమునందుఁ జిత్తైకాగ్రత స్థిర మైనపుడు మనఃప్రాణేంద్రియక్రియ లన్నియుఁ దమయంతనే స్థిరము లగుచున్నవి, అందుచే నేకాగ్రతాధారణాశక్తికి యోగావ్యభిచారిత్వంబును మనఃప్రాణేంద్రియక్రియాధారకత్వంబును ఏకకాలమునందే సిద్ధించును కావుననే చెప్పఁబడినది యోగే నావ్యభిచారిణ్యా అని. యోగావ్యభిచారి యగు నేధృతిచే మనః ప్రాణేంద్రియక్రియల ధరించుచున్నాఁడో, సాధృతిః=ఆ ధారణా శక్తి; సాత్త్వికీ=

శుద్ధసత్త్వగుణసంభూత మగుటవలన సాత్త్వికమని చెప్పఁబడుచున్నది మునులచేత నని యర్థము. పుణ్యకర్మపరిపాకవశమువలన శుద్ధసత్త్వము నొందినపురుషునకు జ్ఞానమును సాత్త్వికము, బుద్ధియు సాత్త్వికము, ధృతియు సాత్త్వికము, మనఃప్రాణేంద్రియవృత్తులును సాత్త్వికములే యగుచున్నవి. జ్ఞానాదులకు సాత్త్వికత్వ మనఁగా బాహ్యానాలంబనమే. అందువలన సత్త్వశుద్ధియే సంపాదనీయ మని సిద్ధము.

మ. ఇపుడు ధృతిత్రైవిధ్యముఁ జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకముల చేత.—యోగేన = సమాధిచే; అవ్యభిచారిణ్యా = అవినాభూత మగు, సమాధివ్యాప్త మగు; యయా ధృత్యా = ఏప్రయత్నముచేత; మనస్సుయొక్కయు ప్రాణములయొక్కయు ఇంద్రియములయొక్కయు క్రియలను — చేష్టలను. ధారయతే = ఉచ్ఛాస్త్రప్రవృత్తినుండి నిరోధించుచున్నాఁడో; ఏధృతి యున్నయెడ నవశ్యము సమాధి సిద్ధించునో దేనిచే ధార్యమాణము లగు మననాదిక్రియలు శాస్త్రము నతిక్రమించి యర్థాంతరము నవగాహింపవో, ధృతిః సా పార్థ సాత్త్వికీ.

శ్రీ. ఇప్పుడు ధృతిత్రైవిధ్యముఁ బ్రతిపాదించుచున్నాఁడు మూఁడింటిచేత.—యోగేన = చిత్తైకాగ్ర్యముచే, ఈ హేతువుచేత; అవ్యభిచారిణ్యా = విషయాంతరమును ధరింపనియట్టి; యయా ధృత్యా; మనస్సుయొక్కయు ప్రాణముయొక్కయు ఇంద్రియములయొక్కయు క్రియలను, ధారయతే= నిరోధించుచున్నాఁడో; సా ధృతిః సాత్త్వికీ.

ప. *

రా. యయా ధృత్యా యోగేన అవ్యభిచారిణ్యా, మనఃప్రాణేంద్రియముల క్రియలను బురుషుఁడు ధరించుచున్నాఁడో. యోగము—మోక్షసాధనభూత మగు భగవదుపాసనము. ప్రయోజనభూతమగు నాయోగముతో అవ్యభిచారిణియైన దాని చేత. యోగోద్దేశముచేఁ బ్రవృత్తములై తత్సాధనభూతములైన మనఃప్రభృతుల క్రియలను ఏధృతిచే ధారణ చేయుచున్నాఁడో అది సాత్త్వికి యని యర్థము.

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతే ఽర్జున
ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ ధృతి స్సా పార్థ రాజసీ. 34

* శ్రీధరీయముతో సమానము.

**భా.** యయా తు=ఇఁక ఏ; ధృత్యా=ధృతిచేత, ధర్మకామార్థాన్=ధర్మమును కామమును అర్థమును; ధారయతే=మనస్సునందు నిత్యకర్తవ్యములనుగా అవధారణ * చేయుచున్నాఁడో. అర్జున! ప్రసఙ్గేన=ధర్మాదులలో దేనిదేనికి ప్రసక్తి కలుగుచున్నదో ఆయాప్రసంగముచేత; ఫలాకాఙ్క్షీ=ఫలము గోరువాఁడును అగుచున్నాఁడో పురుషుఁడు; వాని ధృతి యేదో; సా ధృతిః=ఆ ధృతి; పార్థ=అర్జునా! రాజసీ=రాజసము.

అర్జునా! ఏధృతిచే ధర్మకామార్థములను తత్తద్ధారణాప్రసంగమున తత్ఫలము కోరినవాఁడై మనస్సునందుఁ బురుషుఁడు నిత్యకర్తవ్యములనుగా నిశ్చయించుచున్నాఁడో ఆధృతి రాజస మని తాత్పర్యము.

**ఆ.** రాజసధృతిని దెలుపుచున్నారు యయా ఇత్యాదిగా. వానియొక్క—ధారణాప్రకారమునే యభినయించుచున్నారు మనస్సునందు ఇత్యాదిగా. ఫలాకాంక్షీ అనునది యెవ్వనికి విశేషణ మనఁగాఁ జెప్పుచున్నారు పురుషుఁ డని.

**హ.** యయాతు; ధర్మకామార్థాన్; ధారయతే = ధరించుచున్నాఁడో; ప్రసఙ్గేన = ప్రసక్తిచేత, నిత్యముగాఁ గా దని యర్థము.

**శం.** రాజస మగు ధృతిని జెప్పుచున్నాఁడు.—తుశబ్ద మన్యవ్యావృత్త్యర్థము. యయాతు = ఏధృతిచే; పురుషుఁడు, ధర్మకామార్థాన్ = ధర్మమును అర్థమును కామమును; ప్రాధాన్యమున, ధారయతే=ధరించుచున్నాఁడో, విడువఁడో; ప్రసఙ్గేన = ధర్మాదులప్రసక్తిచే, తత్సంపాదనకాలమునం దనుట; ఫలాకాంక్షీ యగుచున్నాఁడో; సా = ఆ; ధర్మాదులను ధరించునట్టి; ధృతిః; రాజసీ.

**మ.** తుశబ్దము సాత్త్వికధృతిభేదార్థము; ప్రసఙ్గేన = కర్తృత్వాద్యభినివేశముచేత; ఫలాకాంక్షియై, యయా = ఏధృతిచేత; ధర్మమును కామమును అర్థమును, ధారయతే = నిత్యమును కర్తవ్యము లని యవధరించుచున్నాఁడో, ఒకప్పుడును మోక్షమును కాదు; సా ధృతిః పార్థ రాజసీ.

**శ్రీ.** రాజసధృతిని జెప్పుచున్నాఁడు.—యయా తు=ఏధృతిచేతనైననో; ధర్మార్థకామములను ప్రాధాన్యమున ధరించుచున్నాఁడో — విడువఁడో, తత్ప్రసంగముచే ఫలాకాంక్షియు నగుచున్నాఁడో, సా రాజసీ ధృతిః.

* నిశ్చయమును.

ప. *

రా. ఫలాకాంక్షి యగు పురుషుఁడు ప్రకృష్టసంగముచే ధర్మకామార్థములను ఏధృతిచే ధరించుచున్నాఁడో, ఆధృతి రాజసము. ధర్మకామార్థశబ్దముచేతఁ దత్సాధనభూతము లగు మనఃప్రాణేంద్రియక్రియలు లక్షితము లగుచున్నవి. ఫలాకాంక్షి అనుచోటను ఫల శబ్దముచే రాజసము లగుటవలన ధర్మకామార్థములే వివక్షితములు. అందువలన ధర్మకామార్థాపేక్షచే మనఃప్రభృతులక్రియలను ఏధృతిచే ధరించుచున్నాఁడో అది రాజస మని ప్రతిపాదిత మగుచున్నది.

యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవచ
న విముఞ్చతి దుర్మేధా ధృతి స్సా తామసీ మతా. 35

భా. యయా = ఏధృతిచేత; స్వప్నమ్ = నిద్రను; భయమ్=త్రాసమును; శోకమ్ = శోకమును; విషాదమ్ = అవసాదమును, విషణ్ణతను; మద మేవచ=విషయసేవనుగూడ, మత్తునివలె మదమును; తనకు ముఖ్యముగాఁ దలంచినవాఁడై మనస్సునందును నిత్యంబును గర్తవ్యరూపమున నిశ్చయించి, నవిముఞ్చతి = విడువఁడో, ధరించుచునే యుండునో; దుర్మేధాః=కుత్సిత మయినబుద్ధి గలపురుషుఁడు. వాని ధృతి యేది గలదో, సా ధృతిః = ఆధృతి; తామసీ = తామస మని; మతా = తలంపఁబడినది.

నిద్రను భయమును శోకమును విషాదమును మదమును ఏధృతిచే దుష్టబుద్ధి యగుపురుషుఁడు విడువక ధరించునో ఆధృతి తామస మని తాత్పర్యము.

శ్రీ. తామసధృతిని వివరించుచున్నారు య యేత్యాదిగా. శోకము — ప్రియవియోగమువలనఁ గలుగుసంతాపము. విషణ్ణత — ఇంద్రియముల కలఁత. విషయసేవ కుమార్గప్రవృత్తి కుపలక్షణము. స్వప్నాదిమదాంతమును సర్వంబును కర్తవ్యము లని తనకు ముఖ్యములుగాఁ దలఁచినవాఁడై మనస్సున నిత్యమును నిశ్చయించి దుర్మేధసుఁడు విడువఁడో మ తే మనఁగా ధరించుచునే యుండునో అని యన్వయము.

హ. తామసీ = తమస్సు కారణముగాఁ గలది.

శం. తామసధృతిఁ జెప్పుచున్నాఁడు.—దుర్మేధాః = దుష్టము—తమోదోషదూషిత మగు మేధ—బుద్ధి యెవ్వనికో అతఁడు, దుర్భగుఁ డగుపురుషుఁడు;

* శ్రీధరీయముతో సమానము.

యయా = ఏధృతిచేత; స్వప్నమ్ = నిద్రను; భయమ్ = భయమును; శోకమ్ = శోకమును; విషాదంచ = విషాదమును; మదమేవచ=మదమునే; ఎల్లప్పుడును ధరించును గాని యెుకప్పుడును, నవిముఞ్చతి = విడువఁడో; సా = ఆ, నిద్రాదుల ధరించునట్టి; ధృతిః; తామసీ = తామసి యని చెప్పఁబడుచున్నది. సర్వవ్యవహార హేతు వగు బుద్ధికిఁ ద్వైవిధ్యము సిద్ధ మగుటచే తద్ద్వారభూతము లగు శ్రోత్రాది కరణములకును సాత్త్వికత్వాదిభేదము కలిమి సూచితము.

మ. స్వప్నమ్ = నిద్రను; భయమ్ = త్రాసమును; శోకమ్ = ఇష్ట వియోగజన్య మగు సంతాపమును; విషాదమ్=ఇంద్రియములయలఁతను; మదంచ= అశాస్త్రీయవిషయసేవోన్ముఖతను; యయా = దేనిచేత; నవిముఞ్చత్యేవ = విడువనే విడువఁడో, మ తే మనఁగా సదా కర్తవ్యము లనియే తలంచునో, దుర్మేధాః=వివేకమునం దసమర్థుఁ డగువాఁడు; ధృతిః సా పార్థ తామసీ.

శ్రీ. తామసధృతిఁ జెప్పుచున్నాఁడు.—దుష్టము — అవివేకబహుల మగు మేధ — బుద్ధి గలవాఁడు దుర్మేధసుఁడు, అట్టి పురుషుఁడు; ఏధృతిచే స్వప్నాదులను విడువఁడో మాటిమాటి కావర్తించునో, ఇట స్వప్న మనఁగా నిద్ర, సా ధృతిః తామసీ.

ఫ. తామసిని జెప్పుచున్నాఁడు.—దుష్టమ — అవివేకబహుల మగు మేధ గలపురుషుఁడు ఏధృతిచే స్వప్నమ్ — స్వప్నస్థపదార్థదర్శనముచే భవిష్యదర్థమును జింతించునో, అట్లు, భయం శోకం విషాదం మదంచ, నవిముఞ్చతి — స్థిరీకరించునో, సా తామసీ ధృతిః.

రా. యయా = ఏధృతిచేత; స్వప్నమ్ = నిద్రను; మదమ్ = విషయానుభవజనిత మగు మదమును; స్వప్నమదముల నుద్దేశించి ప్రవృత్తము లగు మనః ప్రాణాదిక్రియలను దుర్మేధసుఁడు, నవిముఞ్చతి = ధరించుచుండునో. భయశోకవిషాదశబ్దములును భయశోకాదిప్రదవిషయపరములు, తత్సాధనభూతము లైన మనః ప్రాణాదిక్రియలనుగూడ దేనిచే ధరించుచున్నాఁడో, సా ధృతిః తామసీ.

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి. ౩౬

భా. గుణభేదంబునఁ గ్రియలకును గారకములకును మూఁడువిధముల భేదము చెప్పఁబడినది. ఇంక నిప్పుడు ఫల మగు సుఖమునకును మూఁడు విధములభేదము చెప్పఁబడుచున్నది.—సుఖంతు = సుఖమునుగూడ; ఇదానీమ్ = ఇప్పుడు; త్రివిధమ్ = మూఁడువిధములు గలదాని; శృణు— వినుటకు సమాధానము చేయు మనుట; మే = నావాక్యమువలన. భరతర్షభ = భరతశ్రేష్ఠుఁడా! యత్ర = ఏసుఖానుభవమందు; అభ్యాసాత్ = పరిచయమువలన; ఆవృత్తమునందు *, రమతే = రతిని బొందుచున్నాఁడో; దుఃఖాన్తంచ = దుఃఖావసానమునుగూడ, దుఃఖోపశమమునుగూడ; నిగచ్ఛతి = నిశ్చయమునఁ బొందుచున్నాఁడో.

అర్జునా! ఇప్పుడు గుణభేదముచే మూఁడువిధము లయిన సుఖముఁ జెప్పెదను, సావధానముగా వినుము. ఒకమా అనుభవించినసుఖమును వెడియుఁ బొందినపుడు పురుషునకు సంతోషంబును దుఃఖశాంతియుఁ గలుగును. కావున, సర్వవ్యవహారములకు ఫలభూతమైన సుఖముయొక్క భేదముల నవశ్య మెఱుంగవలయు నని తాత్పర్యము.

ఆ. వృత్తము ననువదించి యనంతరశ్లోకతాత్పర్యముఁ జెప్పుచున్నారు గుణేత్యాదిగా. క్రియాకారకములకు గుణములచేఁ ద్రైవిధ్యము చెప్పినయనంతరము ఫల మగు సుఖమునకుఁ ద్రైవిధ్యము చెప్పవలసినయవసరము గలుగుటవలన నని చెప్పుచున్నారు ఇంక నిప్పుడు ఇత్యాదిగా. హేయోపాదేయభేదార్థము త్రైవిధ్యము. సమాధానము — ఏకాగ్రతను. యత్ర అనునది యుత్తరార్ధమునందలి రెండువాక్యములతోను సంబంధించుచున్నది. అట్టి త్రివిధ మగు సుఖము నని పూర్వార్ధముతో సంబంధము.

హ. సుఖమ్ = శర్మము. అభ్యాసాత్ = ఆవృత్తివలన. రమతే = రతిని బొందుచున్నాఁడో. దుఃఖాన్తమ్ = దుఃఖావసానమును; నిగచ్ఛతి = పొందుచున్నాఁడో.

శం. ఇట్లు గుణభేదముచేఁ గర్తలకును గారణములకును గర్మములకును ద్రైవిధ్యమును బ్రతిపాదించి కర్మఫల మగు సుఖమునకును ద్రైవిధ్యము చెప్ప

* మరలఁ గలిగినదానియందు.

నారంభించి సాత్త్వికసుఖస్వరూపముఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత. * అర్థము స్పష్టము.

**మ.** ఇట్లు క్రియలకును గారకములకును గుణములచేఁ ద్రైవిధ్యముఁ జెప్పి తత్ఫల మగు సుఖమునకును ద్రైవిధ్యముఁ బ్రతిపాదింపఁ బ్రతిజ్ఞ చేయుచున్నాఁడర్ధశ్లోకముచేత.—మే=నాయొక్క వచనమువలన; శృణు=హేయోపాదేయవివేకార్థమితరవ్యాసంగము విడిచి మనస్సును స్థిరీకరింపుము. భరతర్షభ అని యోగ్యత సూచితము.

**శ్రీ.** సుఖమునకుఁ ద్రైవిధ్యము చెప్ప నారంభించుచున్నాఁ డర్ధశ్లోకము చేత.—అర్థము స్పష్టము.

**ప.** ఇఁకఁ ద్రివిధసుఖమును జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.— ఇదానీం త్రివిధం సుఖమ్, మే — నావలన; శృణు.

**రా.** పూర్వోక్తము లగు జ్ఞానకర్మకర్త్రాదులు దేనికి శేషభూతములో, ఆ సుఖమునుగూడ గుణములచేఁ ద్రివిధము నిప్పుడు వినుము.

యత్త దగ్రే విష మివ పరిణామే ఽమృతోపమమ్
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధి ప్రసాదజమ్. 32

**భా.** యత్ = ఏ; తత్ = ప్రసిద్ధ మయినసుఖము; అగ్రే=మొదట; ప్రథమసన్నిపాతమునందు; జ్ఞానవైరాగ్యధ్యానసమాధ్యభ్యాసమునందు అత్యంతాయాసపూర్వక మగుటవలన, విషమివ = విషమువలె, దుఃఖాత్మక మగుచున్నదో; పరిణామే = పరిపాకమునందు; జ్ఞానవైరాగ్యాది పరిపాకజం బగు నేసుఖము, అమృతోపమమ్ = అమృతముతో సమాన మగుచున్నదో; తత్ సుఖమ్ = అట్టి సుఖము; సాత్త్వికమ్ = సాత్త్విక మని; ప్రోక్తమ్=చెప్పఁబడినది విద్వాంసులచేత. ఆత్మబుద్ధిప్రసాదజమ్= తనయొక్క బుద్ధి యాత్మబుద్ధి, దానియొక్క ప్రసాదము — నైర్మల్యము జలమునకువలె స్వచ్ఛత, దానివలనఁ బుట్టినది యాత్మబుద్ధి ప్రసాదజము. లేక, ఆత్మవిషయము ఆత్మావలంబన మగుబుద్ధి — జ్ఞానము ఆత్మబుద్ధి,

* శంకరానందాదివ్యాఖ్యాతలు ఈ శ్లోకమునందలి యత్తదర్థమును సాత్త్వికసుఖపరముగ విభజించిరి.

దానియొక్క ప్రసాదమువలన — ప్రకర్షమువలనఁ బుట్టినది యనుట. అందువలన నాసుఖము సాత్త్వికము.

ఏసుఖము మొదట జ్ఞానవైరాగ్యాదులయభ్యాసకాలమునందు విషము వలె దుఃఖాత్మక మగునో, వెనుకఁ దత్పరిపాకావస్థయందు అమృతతుల్య మగుచున్నదో ఆసుఖము అంతఃకరణనైర్మల్యమువలన, లేక, ఆత్మజ్ఞానప్రకర్షమువలనఁ గలుగునది కావున సాత్త్విక మని చెప్పఁబడిన దని తాత్పర్యము.

**ఆ.** అందు సాత్త్వికసుఖము నాదేయముగాఁ దెలుపుచున్నారు.— ప్రథమసన్నిపాతమును వివరించుచున్నారు జ్ఞా నేత్యాదిగా. దేనివలన నది దుఃఖాత్మకము? అనఁగాఁ జెప్పుచున్నారు అత్యం తేత్యాదిగా. దుఃఖాత్మకత్వమునందు దృష్టాంతముఁ జెప్పుచున్నారు విషమువలె నని. దానికే హేత్వంతరముఁ జెప్పుచున్నారు ఆత్మేత్యాదిగా. దాని కర్థాంతరముఁ జెప్పుచున్నారు ఆత్మవిషయము ఇత్యాదిగా. అందువలన — అంతఃకరణనైర్మల్యమువలనఁ గాని సమ్యగ్జ్ఞానప్రకర్షము వలనఁ గాని పుట్టిన దగుటవలన.

**హ.** యత్ తత్ — ఏసుఖము; అగ్రే = ప్రథమమందు. పరిణామే = ఉత్తర కాలమందు; అమృతోపమమ్; ఆత్మబుద్ధిప్రసాదజమ్ = తనబుద్ధిప్రసాదమువలన — అంతఃకరణప్రసాదమువలనఁ బుట్టినది. తత్ సాత్త్వికమ్.

**శం.** యత్ = ఏప్రాప్యసుఖము; నిరంతరమును నిత్యప్రాప్తము నయ్యును, అగ్రే = స్వసిద్ధికిఁ బూర్వము; స్వసిద్ధిసాధనము, విషమివ = విషమువలె, స్వీకరింప నశక్య మగుటవలనఁ దానును విషమువలెఁ బ్రాపించుటకు అనుభవించుట కశక్యమే యగుచున్నదో. ఎందువలన ననఁగా, స్వసాధన మగు సదసద్వివేకము దుర్లభము, ముముక్షుత్వము దానికన్న దుర్లభము, వైరాగ్య మంతకన్న దుర్లభము, శమాది సంపద దానికంటె దుర్లభము, దానికన్నను సన్న్యాసము దుర్లభము, శ్రద్ధైకమూల మగు శ్రవణాదిక మంతకంటె దుర్లభము, ముక్తి కసాధారణకారణ మగు తజ్జన్య మైన యపరోక్షజ్ఞానము మఱి మఱి దుర్లభతరము, తత్పరిపాకహేతు వగు సమాధి దుర్లభతమము, అందువలననే స్వసిద్ధిసాధనము సమాధ్యేకమూల మగు జ్ఞానము తీవ్రమోక్షేచ్ఛైకలభ్యంబు లగు పూర్వోత్తరాంగములతో దుష్ప్రాపం బగుటవలనఁ దానును దానివలె దుష్ప్రాపంబును అనుభవింప నశక్యంబు నగుచున్నది యని

యర్థము. ఓయీ! ఇట్లగునేని మోక్షసుఖాపేక్ష గల యతులగతి యేమి? అని యాశంకించి చెప్పుచున్నారు. సద్గుర్వనుగ్రహమువలనను ఈశ్వరానుగ్రహమువలనను తత్ప్రాప్తిసాధన మగు జ్ఞానమునకు నిత్యనిరంతరసమాధిచే, పరిణామే=పరిపక్వత సిద్ధ మగుచుండఁగా; అమృతోపమ మగునో. ఎట్లు కాలకూటము తొలఁగుటచే ప్రాప్త మగు నమృతము జరామృత్యునివర్తక మయ్యెనో, అట్లు కరణదోషము తొలఁగుటచే ప్రాప్త మగు నాత్మసుఖంబును మహాత్ము లగు యతులకు జన్మమరణదుఃఖప్రవాహవిధ్వంసం బగుటవలన అమృతతుల్యంబును బరమానందకరంబు నగుచున్నది. అందువలన బ్రహ్మవిదులు మోక్షసుఖానుభవకాము లగు పరమహంసలచే సాధనశుద్ధిసిద్ధికొఱకే ప్రయత్నము కర్తవ్యము, కాని సాధ్యసిద్ధికి వలదు. సాధనము సిద్ధమైనయెడ సాధ్యము తనయంతనె సిద్ధించును. ఎట్లు చక్షురింద్రియసౌష్ఠవము సిద్ధించినయెడఁ బూర్ణచంద్రదర్శనాహ్లాదము సిద్ధించునో అట్లు. ఏసుఖము, ఆత్మబుద్ధిప్రసాదజమ్=ఏబుద్ధిచే — జ్ఞానముచే సచ్చిదానందైకలక్షణుఁ డగు నాత్మ ఇతఁడే నేనని సాక్షాత్కరింపఁబడుచున్నాఁడో, ఆబుద్ధియొక్క యేప్రసాదము చిరకాల నిత్యనిరంతర సవికల్పక నిర్వికల్పక సమాధ్యభ్యాసాతిశయముచే రజస్సునకును రజఃకార్యము లగు రాగద్వేషలోభమోహదంభదర్పహర్షవిషాదాసూయాహంకారాదులకును తమస్సునకును దమఃకార్యము లగు సంశయాసంభావనావిపరీతభావనాజాడ్యాలస్యప్రమాదాదులకును నిశ్శేషనివృత్తిచే సముత్పన్నము శుద్ధస్ఫటికమువలె దర్పణమువలె అవభాసమానము ఏస్వచ్ఛత్వగుణము శుద్ధసత్త్వాభిధానము గలదో, దానివలనఁ బుట్టినదో, చక్షురింద్రియమునకు దోషనివృత్తిచేఁ బూర్ణచంద్రికవలె బుద్ధివృత్తికిఁ దనయంతనె యావిర్భవించుచున్నది, కావున ఆత్మబుద్ధిప్రసాదజ మ్మనఁబడుచున్నది, కాని విషయసుఖమువలెఁ బుట్టునది కాదు, జన్యమన్ననో అనిత్యత్వ పరిచ్ఛిన్నత్వ సాతిశయత్వాదిదోషములు ప్రసక్తించుటవలనను ముముక్షువుల కనపేక్ష్య మగుట వలనను. చక్షువు నిర్మలము కాఁగానే రూపమువలె బుద్ధివృత్తి శుద్ధసత్త్వము కాఁగానే యప్రయత్నంబునఁ దనయంతనే విషయీభవించుచున్నది స్వరూపసుఖము, నిత్యసిద్ధ మగుటవలన. ఓయీ! బ్రహ్మవిదులకు బ్రాహ్మసుఖము బుద్ధిక్లేశసాధ్యము, విషయసుఖమో అతిసులభము, కావున సుఖార్థులకె దదియే యనుభోక్తవ్యము. అందువేని, నిన్నిట నడుగవలయును. వైషయికసుఖము విషయధర్మమా? కరణధర్మమా? కర్తృధర్మమా? భోక్తృధర్మమా? దేశధర్మమా? కాలధర్మమా? అజ్ఞానధర్మమా? జ్ఞానధర్మమా? ఆత్మధర్మమా? అది వ్యాపారా

భావస్వరూపమా? దుఃఖాభావస్వరూపమా? అని. మొదటిది కాదు, విషయసన్ని
ధానంబునఁ బూర్వక్షణమునందువలె నుత్తరక్షణమునందు సుఖము కనఁబడమివలన.
వ్యంజకము లేమివలన వ్యంగ్య ముదయింపలే దనఁ దగదు, దూరదృష్ట మైనపుడు
పూర్వక్షణ మందును సుఖానుదయము ప్రసక్తించుటవలనను అట్టి యిష్టవిషయము
సిద్ధింపమివలనను. రెండవది కాదు, విషయవ్యవధానమందు సుఖము కనఁబడమివలన.
మూఁడవదియుఁ గాదు, సుఖము పుణ్యకర్మకార్య మగుటవలన అది తద్ధర్మ మనుట
యనుపపన్న మగుటవలన, అది తద్ధర్మ మగునేని ధర్మి పుట్టిన యుత్తరక్షణమందే
సుఖోదయము ప్రసక్తించుటవలన. నాలవది కాదు, భోక్తకు సదా విక్షేపము కనఁ
బడుటవలన. ఐదవదియుఁ గాదు, సుఖార్థికి స్వర్గగమనాభావము ప్రసక్తించుటవలనను
స్వర్గస్థులకును దుఃఖము వినఁబడుటవలనను. ఆఱవదియుఁ గాదు, శీతాతపములవలె
సార్వత్రికత్వము సంభవించుటవలన. అజ్ఞానధర్మమునుం గాదు, వస్తువు భోగ్యం బను
జ్ఞానము లేనపుడు సుఖము కనఁబడమివలన. జ్ఞానధర్మమునుం గాదు, వస్తువు రమ్యం
బను జ్ఞాన మున్నను విరక్తునకు సుఖము కలుగమివలన. సుఖము కరణవ్యాపారా
భావస్వరూపము కాదు, స్వప్నమునందు సుఖము కనఁబడమివలనను కరణవ్యాపార
వంత మగు భోజనాదికమునందు సుఖము కనఁబడుటవలనను. దుఃఖాభావస్వరూప
మునుం గాదు, దుఃఖాభావవంత మగు మృత్పిండమునందు సుఖము కనఁబడమివలన.
అచేతన మగుటవలన దానియందు సుఖ మభివ్యక్తము గా దందువేని అది చెల్లదు,
దుఃఖాభావవంత మగు బుద్ధ్యస్ఫూర్తియందు సుఖము కనఁబడమివలన. ఈ మూఢత
మునిచే దుఃఖాభావము సుఖ మని యేది చెప్పఁబడినదో అది యసంగతము, సుఖము
భావరూప మగుటచే నభావరూప మనుట యనుపపన్న మగుటవలన. పశుకల్పుఁ
డీతఁపు డీతఁడు నిర్విషయ మగు సౌషుప్తికసుఖము ననుభవించినవాఁడే కాఁడు,
కావుననే చెప్పుచున్నాఁడు దుఃఖాభావము సుఖ మని. అప్పుడు సుఖ మాత్మ
ధర్మమేయందువేని అదియుఁ గాదు. సుఖ మాత్మస్వరూపము కాని యాత్మధర్మము
కాదు, ధర్మ మనునెడ ధర్మనాశమువలన ఆత్మకును నాశము ప్రసక్తించును. ఓయీ!
స్వరూప మన్నను సుఖము క్షణిక మగుటవలన స్వరూపభూతసుఖనాశ మైనపు
డాత్మకును నాశమే యగు నందువేని, కాదు, "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః" అని
యాత్మకు నిత్యత్వము శ్రుత మగుటవలన తత్స్వరూపభూతసుఖమునకును నిత్య
త్వము సిద్ధించుటవలన. ఓయీ! సుఖ మెట్లాత్మకు స్వరూపమో అట్లు దుఃఖమును
ఆత్మకు స్వరూపము కావలయును, సుఖని నేను దుఃఖని నేను అని సుఖదుఃఖప్రత్య

యము లేకవిషయములుగాఁ గనఁబడుటవలన. అందువేని కాదు, చచ్చితి నే నను ప్రత్యయమునకువలె దుఃఖిని నే నను ప్రత్యయమునకు సమ్మోహకార్య మగుటచే మిథ్యాత్వ ముపపన్న మగుటవలన. పుత్త్రుఁడు మృతుఁ డైనపుడు చచ్చితి నే నని పలుకువానికి మరణము లేదు గదా! మోహమువలన నారోపణమె కాక. అట్లు దుఃఖి నే నని దుఃఖిత్వప్రత్యయంబును ఆత్మయందు మోహమువలన నారోపిత మగుటవలన మిథ్యయే యగును. దుఃఖ మాత్మకు స్వరూప మగునేని సుషుప్తియం దుపలబ్ధము గావలయు, సుఖముగా నేను నిద్రించితి నని సుఖ ముపలబ్ధమైన యట్లు· అట్లుపలబ్ధము కానందువలన దుఃఖ మాత్మకు స్వరూపము కానేరదు. సుఖమే యాత్మస్వరూపము. సుఖమే యాత్మస్వరూప మనుటకు సుఖముగా నేను నిద్రించితి నను ప్రత్యక్షము ప్రమాణము. "ఆత్మ సుఖస్వరూపుఁడు సుషుప్తియందు సుఖ మాత్రోపలంభమునలన సమాధియందువలె" అను ననుమానంబును ప్రమాణము. "సచ్చిదానన్ద మాత్ర మేకరసమ్, బుద్ధ సుఖస్వరూప ఆత్మా, సద్ఘనో ఽయం చిద్ఘన ఆనన్దఘనః" ఇత్యాది శ్రుతియును బ్రమాణము. ముముక్షుప్రవృత్త్యన్యథా నుపపత్తిచేఁ గలుగు నర్థాపత్తియుఁ బ్రమాణము. అప్పుడు దుఃఖము దేనిస్వరూప మని యడుగుదువేని, అనాత్మకే స్వరూప మని చెప్పెదము, అనాత్మకు అనృత జడదుఃఖాత్మకత్వము సర్వప్రసిద్ధ మగుటవలనను "అతో ఽన్యదార్తమ్, నాల్పే సుఖ మస్తి, తదేత జ్జడం మోహాత్మక మనృతవత్తుచ్ఛమ్" ఇత్యాది శ్రుతిప్రసిద్ధ మగు టవలనను. ఓయీ! సుఖ మాత్మ స్వరూప మని సిద్ధ మైనపుడు విషయసుఖం బని వ్యపదేశ మెట్లు కావచ్చును? చెప్పెదము. పుణ్యకర్మవశమువలనఁ బురుషున కిష్ట పదార్థసాన్నిధ్యము కలిగినపు డంతఃకరణమునందు సత్త్వ మావిర్భవించుచున్నది, దానియం దానందస్వరూపుఁ డగు నాత్మ ప్రతిబింబించుచున్నాఁడు, ప్రతిబింబాత్మా నందస్ఫూర్తియే విషయసాన్నిధ్యమువలన విషయసుఖ మని చెప్పఁబడుచున్నది. పుణ్యతారతమ్యమువలన సత్త్వతారతమ్యము, సత్త్వతారతమ్యమువలనఁ బ్రతి బింబస్ఫూర్తికిఁ దారతమ్యము, అందుచే సుఖమునకును దారతమ్యము. అందువల ననే శ్రుతి "ఏత స్యైవానన్ద స్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి" అని. అందువలన విషయసుఖమును ఆభాసికమును పూర్ణానందరసపాయు లగు మహా పురుషులు బ్రహ్మవిదు లపేక్షింపరు. ఓయీ! ఆత్మ యానందస్వరూపుఁ డగుటవల నను బరిపూర్ణుఁ డగుటవలనను సదా సర్వత్ర యందఱకు సుఖానుభవము తన యంతనే కావలయు నందువేని, కాదు, ఆత్మస్వరూపోపలబ్ధి వృత్తిశుద్ధిసాపేక్ష

మగుటవలన. ఎట్లు రాకాచంద్రచంద్రిక పరిపూర్ణ మైనను తద్దర్శనాహ్లాదము చక్షురింద్రియసౌష్ఠవము నపేక్షించుచున్నదో అట్లు ఆత్మానందానుభవముగూడ బుద్ధిప్రసాదము నపేక్షించుచున్నది. అందువలననే చెప్పుచున్నాఁడు భగవంతుఁడుగూడ ఆత్మబుద్ధిప్రసాదజ మ్మని. ఇట్లాత్మబుద్ధిప్రసాదజం బగు నిత్యము నిరంతరము నిరపేక్షము నిరతిశయము నిరవధిక మైన యే బ్రాహ్మసుఖము గలదో అది సాత్త్వికము. సత్త్వావిర్భావముచే నావిర్భూతం బగుటవలన సాత్త్విక మని మహర్షులచేఁ జెప్పఁబడినది యని యర్థము.

మ. సాత్త్వికసుఖముఁ జెప్పుచున్నాఁడు సార్ధశ్లోకముచేత.— యత్ర= ఏసమాధిసుఖమునందు; అభ్యాసాత్ =అతిపరిచయమునవలన; రమతే = పరితృప్తుఁడగు చున్నాఁడో; కాని విషయసుఖము నందుఁబోలెఁ దత్క్షణముమాత్రమే కాదు; దేని రమించుచున్న వాఁడై, దుఃఖాన్తమ్ = సర్వము దుఃఖము యొక్కయు అంతమును—అవసానమును; నిగచ్ఛతి = మిక్కిలి పొందుచున్నాఁడో, కాని విషయసుఖమునందువలె నంతమును మహాదుఃఖము నొందఁడు. దానినే వివరించుచున్నాఁడు.—యత్ = ఏది; అగ్రే = జ్ఞానవైరాగ్యధ్యాన సమాధ్యారంభమునందు; అత్యంతాయాసముచే నిర్వహింపవలయుటవలన, విషమివ = విషమువలె ద్వేషవిశేషము గలిగించునది యగుచున్నదో; పరిణామే = జ్ఞానవైరాగ్యాదిపరిపాకమునందో; అమృతోపమమ్—ప్రీత్యతిశయాస్పద మగుచున్నదో; ఆత్మబుద్ధిప్రసాదజమ్=ఆత్మవిషయ మగుబుద్ధి ఆత్మబుద్ధి, దానియొక్క ప్రసాదము—నిద్రాలస్యాదులు లేక స్వచ్ఛమై నిలుచుట, దానివలనఁ బుట్టినది; కాని రాజసమువలె విషయేంద్రియసంయోగజము కాదు, తామసమువలె నిద్రాలస్యాదిజంబునుం గాదు; ఇట్టిది యేది యనాత్మబుద్ధినివృత్తిచే ఆత్మబుద్ధిప్రసాదజ మగు సమాధిసుఖము గలదో, తత్ సుఖమ్ = ఆ సుఖము; సాత్త్విక మని, ప్రోక్తమ్ = చెప్పఁబడినది యోగులచేత. మఱి యొక వ్యాఖ్యానము. — అభ్యాసాత్ =ఆవృత్తివలన; యత్ర; రమతే = ప్రీతిఁ బొందుచున్నాఁడో; దుఃఖాన్తంచ = దుఃఖావసానమును గూడ; నిగచ్ఛతి = పొందుచున్నాఁడో; తత్ సుఖమ్; గుణభేదమున త్రివిధ మైనదాని వినుమని తత్పదాధ్యాహారముచేఁ బూర్వార్ధముతో నన్వయము. యత్ర దగ్ర ఇత్యాది శ్లోకముచే సాత్త్వికసుఖలక్షణము. భాష్యకారులయభిప్రాయము నిట్లు.

శ్రీ. అందు సాత్త్వికసుఖముఁ జెప్పుచున్నాఁడు సార్ధముచేత.—యత్ర = ఏసుఖమునందు; అభ్యాసాత్ =అతిపరిచయమువలన; రమతే—కాని, విషయసుఖము నందువలె తత్క్షణమే రతి నొందఁడో; దేనియందు రమించుచుండువాఁడు, దుఃఖాన్తం చ = దుఃఖముయొక్క-యవసానమును; నిగచ్ఛతి= మిక్కిలి పొందుచున్నాఁడో. ఎట్టిది యది? యత్ = ఏది; తత్ — అనిర్వాచ్యము; అగ్రే = మొదట; విషమివ=మనస్సంయమాధీన మగుటవలన దుఃఖావహమువలె నుండునో; పరిణామమునందో, అమృతోపమమ్ = అమృతసదృశమో. ఆత్మవిషయ మగుబుద్ధి ఆత్మబుద్ధి, దానియొక్క-ప్రసాదము — రజస్తమోమలత్యాగముచే స్వచ్ఛమై నిలుచుట, దానివలనఁ బుట్టినది; అట్టి యేసుఖము గలదో, తత్ సాత్త్వికం ప్రోక్తమ్, యోగులచేత.

ప. అందు సాత్త్వికసుఖముఁ జెప్పుచున్నాఁడు.—యత్ర = ఏసుఖమునందు; అభ్యాసాత్ = నిరంతరానుసంధానమువలన; రమతే. రమించుచు, దుఃఖాన్తమ్ = దుఃఖావసానమును; నిగచ్ఛతి = మిక్కిలి పొందుచున్నాఁడో. అట్లు, యత్ = ఏది; అగ్రే = ప్రారంభమునందు; మనఃప్రత్యాహారము చేయుటచే, విషమివ — దుఃఖమువలె నుండునో; పరిణామమునందో, అమృతోపమమ్ =పరమానంద సదృశ మగునో; మఱియు నేది, ఆత్మబుద్ధిప్రసాదజమ్ = ఆత్మవిషయ మగు వ్యవసాయాత్మకబుద్ధి ఆత్మబుద్ధి, దానిచే ప్రసాదము — ప్రసన్నత యేది గలదో దానివలనఁ బుట్టినదో; తత్ సాత్త్వికం సుఖమ్.

రా. ఏసుఖమునందుఁ జిరకాలాభ్యాసమువలనఁ గ్రమంబున నిరతిశయమైనరతిని బొందుచున్నాఁడో, దుఃఖాన్తంచ నిగచ్ఛతి — సమస్తమైన సాంసారిక దుఃఖముయొక్క-యంతమును బొందుచున్నాఁడో. దానినే విశేషించుచున్నాఁడు.— యత్తత్ = ఏసుఖము; అగ్రే = యోగోపక్రమవేలయందు; అధికాయాససాధ్య మగుటవలనను వివిక్తస్వరూప మనుభూతము కామివలనను, విషమివ – దుఃఖము వంటి దగునో; పరిణామే = పరిపాకమునందు, అభ్యాసవశమున వివిక్తస్వరూప మావిర్భవించినపుడు; అమృతోపమ మగునో; అదియు, ఆత్మబుద్ధిప్రసాదజమ్ — ఆత్మవిషయ మగుబుద్ధి ఆత్మబుద్ధి, దానియొక్క-సకలేతరవిషయనివృత్తి ప్రసాదము, నివృత్తసకలేతరవిషయ మగుబుద్ధిచే వివిక్తస్వభావాత్మానుభవజనిత మగుసుఖ మమృతోపమ మగుచున్నది, తత్ సుఖమ్ సాత్త్వికం ప్రోక్తమ్.

విషయేన్ద్రియసంయోగా ద్య త్త దగ్రే ఽమృతోపమమ్
పరిణామే విష మివ త త్సుఖం రాజసం స్మృతమ్. ౩౮

**భా.** విషయేన్ద్రియసంయోగాత్ =విషయేంద్రియముల సంబంధము వలన; యత్ = ఏది; తత్ = ప్రసిద్ధ మగు సుఖము; కలుగుచున్నదో; అగ్రే = ప్రథమక్షణమందు; అమృతోపమమ్ = అమృతతుల్యము; పరిణామే = విపరిణామమునందు, తదుపభోగాంతమునందు; విషమివ = విషతుల్యము, బలవీర్యరూపప్రజ్ఞామేధాధనోత్సాహహానిహేతు వగుట వలనను అధర్మమునకును తత్ఫలనరకాదులకును హేతు వగుటవలనను; తత్ సుఖమ్ = ఆ సుఖము; రాజసమ్ = రాజస మని; స్మృతమ్=చెప్పఁ బడినది.

విషయోపభోగమువలనఁ బ్రసిద్ధ మయిన యేసుఖముఁ గలుగుచున్నదో అది యుపభోగకాలమం దమృతతుల్యమై యుపభోగాంతమున బలవీర్యాది హానికి హేతు వగుటవలనను అధర్మనరకాదిప్రాప్తికి హేతు వగుటవలనను విష తుల్య మగును గావున నాసుఖము రాజస మని తాత్పర్యము.

**ఆ.** రాజససుఖమును హేయం బని తెలియుటకై చెప్పుచున్నారు విష యేత్యాదిగా. బలము – దేహసామర్థ్యము. వీర్యము–పరాక్రమకృత మగుయశస్సు. రూపము – దేహసౌందర్యము. ప్రజ్ఞ – శ్రుతార్థమును గ్రహించుసామర్థ్యము. మేధ – గ్రహించినయర్థమును మఱవక ధరించుశక్తి. ధనము – గోహిరణ్యాదికము. ఉత్సాహమో కార్యము నుపక్రమించుట మొదలగునది. వీని నశింపఁజేయునది యగుటవలన వైషయికసుఖము విషతుల్య మని యర్థము. దానికే హేత్వంతరముఁ జెప్పుచున్నారు అధ ర్మేత్యాదిగా.

**హ.** విషయేన్ద్రియసంయోగాత్ = శ్రోత్రాదీంద్రియములకు శబ్దాదివిష యములతో సంయోగమువలన; ఏసుఖము, అగ్రే అమృతోపమమ్; పరిణామే = కాలాంతరమునందు; విషమివ. తత్ రాజసమ్.

**శ౦.** రాజససుఖముఁ జెప్పుచున్నాఁడు.—విషయేన్ద్రియసంయోగాత్ = విషయములకును ఇంద్రియములకు సంసర్గమువలన; పుట్టునట్టి; యత్ = ఏవైష

యికసుఖము; అగ్రే = పూర్వము, స్వానుభవసమయమందు; తను సేవించునట్టి పురుషునకు, అమృతోపమమ్ = అమృతసమాన మగుచు; "భూయోభూయో వివర్థతే" అను న్యాయముచే స్వవిషయము లయిన యవిద్యాకామకర్మములనే వృద్ధి నొందించుచున్నది. పరిణామే = స్వకార్యఫలకాలమునందు; తినయం దాసక్తుఁడయినపురుషుని, విషమివ = విషమువలెఁ జంపుచున్నది, స్వకార్యముతోఁ గూర్చి "స కామభి ర్జాయతే తత్ర తత్ర" అను న్యాయంబున నానాయోనులందుఁ బడఁద్రోసి మాటిమాటికి మృత్యువు నొందించుచున్నది యని యర్థము. ఇట్టి లక్షణము గల వైషయికసుఖ మేది గలదో, తత్ సుఖమ్ = ఆ సుఖము; రాజసమ్ = రజోగుణ మగు కామముచేత సంభావిత మగుటవలన రాజస మని; మునులచే, స్మృతమ్ = చెప్పఁబడినది.

మ. విషయములకును ఇంద్రియములకును సంయోగమువలనఁ బుట్టినది, కాని యాత్మబుద్ధిప్రసాదజము కాదు; యత్ = ఏది; తత్ = అతిప్రసిద్ధ మైన స్రక్చందనవనితాసంగాదిసుఖము; అగ్రే = ప్రథమప్రారంభమునందు; మనస్సంయమాది క్లేశము లేమివలన, అమృతోపమమ్; పరిణామమందో ఐహికపారత్రికదుఃఖావహ మగుటవలన, విష మివ. తత్ సుఖం రాజసం స్మృతమ్.

శ్రీ. రాజససుఖముఁ జెప్పుచున్నాఁడు.—విషయములకును ఇంద్రియములకును సంయోగమువలన, యత్ = ఏది; తత్ = ప్రసిద్ధ మగు స్త్రీసంగాదిసుఖము; అమృతము ఉపమ దేనికో అట్టిది యగుచున్నదో, అగ్రే = ప్రథమమందు. పరిణామమందో విషతుల్యము, ఇహమునందును బరమునందును దుఃఖహేతు వగుటవలన. తత్సుఖం రాజసం స్మృతమ్.

ప. యత్ = ఏది; రాజససుఖముఁ జెప్పుచున్నాఁడు.—విషయేన్ద్రియసంయోగాత్ రాజససుఖముఁ జెప్పుచున్నాఁడు.—యత్ =ఏది; అగ్రే=ప్రారంభమునందు; అమృతోపమమ్; పరిణామే; విరస మగుటవలన విషతుల్యము చేఁప ప్రమింగినబడిశముతోఁడి యామిషమువలె. తత్సుఖం రాజసమ్.

రా. అగ్రే=అనుభవవేలయందు; విషయేన్ద్రియసంయోగాత్; యత్తత్; అమృతమువలె నుండునో; పరిణామే = విపాకమునందు, విషయములకు సుఖతకు హేతువు లగు క్షుదాదులు నివృత్తము లైనపుడు; ఆసుఖము నిరయాదినిమిత్త

మగుటవలన, విష మివ = త్రాగినవిషమువలె నగునో. తత్ సుఖం రాజసం స్మృతమ్.

యదగ్రే చానుబన్ధేచ సుఖం మోహన మాత్మనః
నిద్రాలస్యప్రమాదోత్థం త త్తామస ముదాహృతమ్. ౩౯

భా. యత్=ఏ; సుఖమ్=సుఖము; అగ్రేచ=ప్రథమమందును; అనుబన్ధేచ=అవసానోత్తర కాల మందును; ఆత్మనః=ఆత్మకు; మోహనమ్ = మోహాకరమో; నిద్రాలస్య ప్రమాద ఉత్థమ్ = నిద్రవలనను ఆలస్యము వలనను ప్రమాదమువలననుఁ బుట్టినదో; తత్ =ఆ సుఖము; తామసమ్ = తామస మని; ఉదాహృతమ్=చెప్పఁబడినది.

తత్కాలమునందును ఉత్తర కాలమునందును బురుషునకు మోహము కలిగించునదియు నిద్రాలస్యప్రమాదములవలనఁ బుట్టినదియు నగు సుఖ మేది గలదో అది తామస మని తాత్పర్యము.

ఆ. తామససుఖమును విశదీకరించుటకై యే యుదాహరించుచున్నారు యదిత్యాదిగా. అనుబంధశబ్దార్థముఁ జెప్పుచున్నారు అవసానేత్యాదిగా. త దుత్పత్తి హేతువుఁ జెప్పుచున్నారు నిద్రేత్యాదిగా.

హ. ఏది యగ్రమునందును అవసానమునందును మోహాకరమో; నిద్రాలస్యప్రమాదోత్థమ్; తత్ =ఆ సుఖము; తామసమ్.

శం. తామసం బగు సుఖముఁ జెప్పుచున్నాఁడు.—అగ్రేచ=తన యుత్పత్తి కాలమునందును; అనుబన్ధేచ=పరిణామ కాలమునందును, అవసానమందును; ఆత్మనః= సదసద్వివేక హేతు వగు బుద్ధికి; మోహనమ్ = మోహకారకము, వివేకశక్తిని గప్పునది; నిద్రాలస్యప్రమాదోత్థమ్ = నిద్ర ఆలస్యము — బుద్ధి జాడ్యము, ప్రమాదము — బుద్ధిపారవశ్యము వీనివలనఁ బుట్టినది; యత్ సుఖమ్=ఏసుఖము గలదో; తత్ ; తామసమ్=తమోగుణనిష్పన్న మగుటవలన తామస మని; ఋషులచే నుదాహరింపఁబడినదని యర్థము.

మ. అగ్రేచ=ప్రథమారంభమందును; అనుబన్ధేచ=పరిణామమందును; యత్ సుఖమ్=ఏసుఖము; ఆత్మకు మోహాకరమో; నిద్రయు ఆలస్యమును ప్రసిద్ధ

ములు, ప్రమాదము — కర్తవ్యార్థమునం దవధానము లేక మనోరాజ్యమాత్రము, వానివలనఁ బుట్టినది, కాని సాత్త్వికమునవలె బుద్ధిప్రసాదజము కాదు, రాజసమువలె విషయేంద్రియసంయోగజమునుం గాదు. అట్టి నిద్రాలస్యప్రమాదోత్థ మగు సుఖము, తామస ముదాహృతమ్.

శ్రీ. తామససుఖముఁ జెప్పుచున్నాఁడు.—అగ్రేచ=ప్రథమక్షణమందును; అనుబన్ధేచ=వెనుకఁగూడ; య త్సుఖమ్; ఆత్మనః; మోహాకరమో; దానినే చెప్పుచున్నాఁడు.—నిద్రయు ఆలస్యమును ప్రమాదమును—కర్తవ్యార్థమునం దవధానము లేని మనోరాజ్యమును, వీనివలనఁ బుట్టునది; య త్సుఖమ్; తత్తామస ముదాహృతమ్.

ప. తామసముఁ జెప్పుచున్నాఁడు.—అగ్రేచ=ప్రథమక్షణమునందును; అనుబద్ధ మగుచున్నది దీనిచేతం గావున అనుబంధము=పరిణామము, దానియందును; ఆత్మనః = అంతఃకరణమునకు; మోహనమ్ = వ్యామోహకము; దాని కవస్థానియమముఁ జెప్పుచున్నాఁడు.—నిద్ర ఆలస్యము ప్రమాదము—అనవధానత. నిద్రయందు సుషుప్తిసుఖము, లేక, స్వాప్నవిషయభోగసుఖము, ఆలస్యమందు అంగమర్దనమువలనఁ గలుగు సుఖము, ప్రమాదము — ఉన్మత్తావస్థ, దానియందుఁ బుట్టిన సుఖము. ఇట్టి యేసుఖము గలదో, త త్తామస ముదాహృతమ్ — ఉదాహరణముగా నిరూపింపఁబడినది.

రా. యత్ సుఖమ్; అగ్రేచ అనుబన్ధేచ=అనుభవవేలయందును విపాకమునందును; ఆత్మనః; మోహనమ్=మోహహేతు వగునో, మోహ మిట యథావస్థితవస్తువున కప్రకాశ మభిప్రేతము; నిద్రాలస్యప్రమాదోత్థమ్ = నిద్రాలస్యప్రమాదములవలనఁ బుట్టినది; "నిద్రాదు లనుభవవేలయందును మోహహేతువులు గదా! నిద్ర మోహహేతు వనుట స్పష్టము; ఆలస్యము ఇంద్రియవ్యాపారమాంద్య మగుట, ఇంద్రియవ్యాపారమాంద్యము కలిగినపుడు జ్ఞానమాంద్యము కానే యగును; ప్రమాదము కృత్యములయం దనవధానము కావున దానియందును జ్ఞానమాంద్య మగుచున్నది; అందువలన నవియు మోహహేతువులు. తత్=అట్టి సుఖము; తామస ముదాహృతమ్. అందువలన ముముక్షువుచే రజస్తమముల నభిభవించి సత్త్వమే యుపాదేయ మని ప్రతిపాదిత మగుచున్నది.

న త దస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం య దేభి స్స్యా త్త్రిభి ర్గుణైః. ౪౦

**భా.** ఇంక నిపుడు ప్రకరణోపసంహారార్థ మగు శ్లోక మారంభింపఁబడుచున్నది.—తత్=అది; నాస్తి=లేదు; పృథివ్యాంవా=భూమియందుఁగాని, మనుష్యాదికము గాని; దివి=స్వర్గమునందు; దేవేషు వా పునః=దేవతలయందుఁ గాని; సత్త్వమ్ = ప్రాణిజాతము గాని, ఇతర మైన యప్రాణిజాతము గాని; ప్రకృతిజైః = ప్రకృతివలనఁ బుట్టిన వగు; ఏభిః = ఈ; త్రిభిః=మూఁడైన; గుణైః =సత్త్వాదిగుణములచేత; ముక్తమ్=విడువఁబడినది; యత్=ఏది; స్యాత్=అగునో. అది లే దని పూర్వముతో సంబంధము.

భూలోకమున మనుష్యాదులయందుఁ గాని దేవలోకమున దేవతలయందుఁ గాని ప్రకృతిసంభవము లగు నీసత్త్వాదిగుణములు మూఁటిచే విరహిత మయిన వస్తువు జంగమము గాని స్థావరము గాని యేదియు లే దని తాత్పర్యము.

**ఆ.** క్రియాకారకఫలాత్మక మగు సంసారమునకుఁ బ్రత్యేకము సాత్త్వికాదిభేదముచేఁ ద్రైవిధ్యముఁ బ్రతిపాదించి సంసారాంతర్భూతమే యేదేని గుణత్రయస్పర్శము లేనిదియు నెక్కడనేని యుండవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు ఇంక నిత్యాదిగా. సంసారము సర్వంబును గుణత్రయస్పృష్టం బనుట ప్రకరణము. ఇతర మైన యప్రాణిజాతము గాని—అప్రాణిశబ్దముచేఁ బ్రసిద్ధినిబట్టి స్థావరాదికము గ్రహింపఁబడుచున్నది.

**హ.** తత్; నాస్తి. పృథివ్యాంవా; దివి=అంతరిక్షమునందుఁ గాని; దేవేషువా=ఇంద్రాదిదేవతలచే నుపలక్షిత మయిన స్వర్గమునందుఁగాని; సత్త్వమ్=వస్తువు; ఏభిః ప్రకృతిజైః; గుణైః=సత్త్వరజస్తమోగుణములచే; ముక్తం య త్స్యాత్. సమస్త మయిన వస్తుజాతంబును సత్త్వరజస్తమోగుణమయమే యని యర్థము.

**శ్రీ.** క్రియాకారకఫలములను విభజించి యవి త్రిగుణాత్మకము లని ప్రతిపాదించి యవిభాగంబున సర్వమును త్రిగుణాత్మకమే యని ప్రతిపాదించుచున్నాఁడు.—పృథివ్యామ్=భూలోకమునందును; వాశబ్దమువలన పాతాలమునందును; దివి వా=స్వర్గమునందుఁ గాని; దేవేషు పునః=బ్రహ్మాదులయందుఁ గాని; ప్రకృతిజైః =

ప్రకృతిసముత్పన్నము లగు; ఏభిః=ఉక్తలక్షణము లగు; త్రిభిః=త్రివిధము లైన; గుణైః=సత్త్వాదులచేత; ముక్తమ్=పరిత్యక్తము, స్పృష్టము కానిది; యత్ స్యాత్ = ఏది యగునో; తత్=అట్టి; సత్త్వమ్=ద్రవ్యము, ప్రాణిగాని అప్రాణిగాని మూఁడు లోకములయందును, నాస్తి. త్రిగుణాత్మకమాయాకార మగుటవలన జగము సర్వం బును త్రిగుణాత్మకమే యని యర్థము.

మ. ఇప్పు డనుక్తమునుగూడ సంగ్రహించుచుఁ బ్రకరణార్థము నుపసం హరించుచున్నాఁడు భగవంతుఁడు.—సత్త్వరజస్తమముల సామ్యావస్థ ప్రకృతి, దానివలనఁ బుట్టినవి—వైషమ్యావస్థను బొందినవి ప్రకృతిజములు, కాని సాక్షాత్తుగా గుణములు ప్రకృతిజములు కావు, ప్రకృతిరూపము లగుటవలన; అందువలన వైష మ్యావస్థయే తదుత్పత్తి, ఉపచారమువలన; లేక, ప్రకృతి యనఁగా మాయ, దాని వలనఁ బుట్టినవి—తత్కల్పితములు ప్రకృతిజములు; ప్రకృతిజము లగు, ఏభిః త్రిభిః; గుణైః=బంధనహేతువు లగు సత్త్వాదులచేత; ముక్తమ్=హీన మయిన; సత్త్వమ్— ప్రాణిజాతము కాని అప్రాణికాని; య త్స్యాత్=ఏది యగునో; త త్పునః = అది మఱి; పృథివ్యాం వా = భూమియందు, మనుష్యాదులందుఁ గాని; దివి; దేవేషువా; నాస్తి. ఎందును గుణత్రయరహిత మగు ననాత్మవస్తువు లే దని యర్థము.

శ్రీ. అనుక్తమునుగూడ సంగ్రహించుచుఁ బ్రకరణార్థము నుపసంహరించు చున్నాఁడు.—ఏభిః = ఈ; ప్రకృతిసంభవము లయిన సత్త్వాదులగు మూఁడుగుణ ములచేత, ముక్తమ్ = హీన మగు; సత్త్వమ్=ప్రాణిజాతము కాని యితరము కాని; యత్ స్యాత్. తత్ = అది; పృథివ్యామ్ = మనుష్యలోకాదులందును; దివి; దేవత లందును; ఎందును లే దని యర్థము.

ప. ఇఁక ననుక్తమును గూడ సంగ్రహించుచుఁ బ్రకరణార్థ ముపసంహ రించుచున్నాఁడు.—యత్ = ఏది; త్రిభిః గుణైః = సత్త్వాదు లగు మూఁడుగుణము లచేత; ముక్తమ్; సత్త్వమ్ = ప్రాణిజాతము గలదో; తత్ = అట్టిది; పృథివ్యామ్= మనుష్యులయందు లేదు. దివి, దేవతలయందును లేదు. శరీరజాత మంతయుఁ ద్రిగు ణాత్మక మయ్యే యున్న దని యర్థము.

రా. పృథివ్యామ్, మనుష్యాదులందుఁ గాని, దివి, దేవతలయందుఁ గాని, ప్రకృతిసంస్పృష్టము లగు బ్రహ్మాదిస్థావరాంతములందు, ప్రకృతిజైః ఏభిః త్రిభిః గుణైః ముక్తమ్; యత్ సత్త్వమ్ = ఏప్రాణిజాతమో; తత్ నాస్తి.

బ్రాహ్మణ క్షత్త్రియ విశాం శూద్రాణాంచ పరన్తప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః. ౪౧

**భా.** సర్వం బగు సంసారము క్రియాకారకఫలలక్షణము సత్త్వరజస్తమోగుణాత్మకము అవిద్యాకల్పితము సమూలం బనర్థ మని చెప్పఁబడినది, వృక్షరూపకల్పనచే నూర్ధ్వమూలమధశ్శాఖ మిత్యాదిగ్రంథముచేతఁ గూడ. దాని దృఢం బగు నసంగశస్త్రముచే ఛేదించి తతఃపదం తత్పరిమార్గితవ్య మ్మనియుఁ బ్రతిపాదింపఁబడినది. అందును సర్వంబును త్రిగుణాత్మక మగుటవలన సంసారకారణనివృత్తి యనుపపన్న మని యేర్పడుటచే ఎట్లు తన్నివృత్తి యగునో అట్లు చెప్పవలయును. సర్వం బగు గీతాశాస్త్రార్థము నుపసంహరింపవలయును. ఇంతమాత్రమే సమస్తమైన వేదస్మృత్యర్థము పురుషార్థముఁ గోరువారిచే ననుష్ఠేయం బను నేతదర్థంబును బ్రాహ్మణక్షత్త్రియవిశా మిత్యాదిగ్రంథ మారంభింపఁబడుచున్నది.—బ్రాహ్మణక్షత్త్రియవిశామ్ = బ్రాహ్మణులకును క్షత్త్రియులకును వైశ్యులకును; శూద్రాణాంచ = శూద్రులకును; శూద్రులను సమాసమునఁ జేర్పమి వా రేకజాతులును వేదమునం దనధికృతులు నగుటవలన; పరంతప = శత్రువులఁ దపింపఁజేయువాఁడా! కర్మాణి=కర్మములు; ప్రవిభక్తాని=ఒక్కొక్కరికి విభాగముచే వ్యవస్థాపింపఁబడినవి. దేనిచేత ? స్వభావప్రభవైః గుణైః = స్వభావము ఈశ్వరునిప్రకృతి త్రిగుణాత్మకము మాయ, అది ప్రభవము—కారణము ఏగుణములకో అవి స్వభావప్రభవములు; అట్టి గుణములచేత శమాదు లగుకర్మములు ప్రవిభక్తములు బ్రాహ్మణాదులకు. లేక. బ్రాహ్మణస్వభావమునకు సత్త్వగుణము ప్రభవము—కారణము, అట్లు క్షత్త్రియస్వభావమునకు సత్త్వోపసర్జన మగురజము ప్రభవము, వైశ్యస్వభావమునకుఁ దమఉపసర్జనం బగురజము ప్రభవము, శూద్రస్వభావమునకు రజఉపసర్జన మగుతమము ప్రభవము, ప్రశాంతి యైశ్వర్యము ఈహా * మూఢత యనుస్వభావములు కనఁబడుటవలన నలువురియందును. లేక. జన్మాంతరకృతసంస్కారము ప్రాణులకు వర్తమానజన్మమున స్వకార్యాభిముఖంబై యభివ్యక్త మగునది స్వభా

* ఆశ.

వము, అది ప్రభవము—కారణము ఏగుణములకో అవి స్వభావప్రభవము లగుగుణములు. గుణప్రాదుర్భావమునకు నిష్కారణత్వ మనుపపన్న మగుటవలన స్వభావము కారణం బనికారణ విశేషోపాదానము. ఇట్లు స్వభావప్రభవములు—ప్రకృతిప్రభవము లగు సత్త్వరజస్తమోగుణములచే స్వకార్యానురూపమున శమాదికర్మములు ప్రవిభక్తములు. ఓయీ! శాస్త్రప్రవిభక్తములు శాస్త్రముచే విహితములు బ్రాహ్మణాదులకు శమాదికర్మములు, ఎట్లు చెప్పవచ్చును సత్త్వాదిగుణప్రవిభక్తము లని? కా దిది దోషము. శాస్త్రముచేతఁగూడ బ్రాహ్మణాదులకు సత్త్వాదిగుణ విశేషాపేక్షచేతనే శమాదికర్మములు ప్రవిభక్తములు, గుణానపేక్షచేఁ గాదు, కావున శాస్త్రప్రవిభక్తము లైనను గర్మములు గుణప్రవిభక్తము లని చెప్పఁబడుచున్నవి.

అర్జునా! బ్రాహ్మణక్షత్రియవైశ్యులకును శూద్రులకును వారివారి స్వభావముచేఁ గలిగిన సత్త్వాదిగుణములనుబట్టి వేఱువేఱుగాఁ గర్మములు శాస్త్రముచే విధింపఁబడిన వని తాత్పర్యము.

**ఆ.** ఉపసంహృత మగు ప్రకరణార్థము ననువదించుచున్నారు సర్వంబు ఇత్యాదిగా. అది యనేకాత్మక మగుటచే హేయం బని సూచించుచున్నారు క్రియేత్యాదిగా. నిర్గుణుం డగు నాత్మకంటె విలక్షణ మగుటవలనఁగూడ నది హేయ మని చెప్పుచున్నారు సత్త్వేత్యాదిగా. అనర్థం బగుటవలనఁ గూడ నది త్యాజ్యము, అవిద్యాకల్పిత మగుటచే అవస్తువు వస్తువువలెఁ దోఁచుటవలన నది యనర్థ మని చెప్పుచున్నారు అవి ద్యేత్యాదిగా. అష్టాదశమునమాత్రమె కాదు సంసారము దర్శితము, మఱే మనఁగా పంచదశమునందును గూడ నని చెప్పుచున్నారు వృక్షేత్యాదిగా. గ్రంథముచేతఁ గూడ—సంసారము చెప్పఁబడినది యని యనువర్తించుచున్నది. సంసారధ్వంససాధన మగు సమ్యగ్జ్ఞానముగూడ దానియందే ప్రతిపాదింపఁబడిన దని చెప్పుచున్నారు దాని ఇత్యాదిగా. వృత్తము ననువదించి యనంతరసందర్భ తాత్పర్యముఁ జెప్పుచున్నారు అందును ఇత్యాదిగా. అందును—సంసారము నివర్తింపవలయు ననుటయందును. గుణత్రయాత్మకము గదా సర్వసంసారంబును, ప్రకృత్యాత్మకంబులు సంసారకారణీభూతంబు లగు గుణములకు నివృత్తి సంభవింపదు, ప్రకృతి నిత్య మగుటవలన నని యాశంక కలుగఁగా స్వధర్మానుష్ఠానమువలనఁ దత్త్వజ్ఞానో

త్పత్తిచే నజ్ఞానాత్మకము లగు గుణములకు నివృత్తి యె ట్లగునో అట్లు స్వధర్మజాతము వక్తవ్య మని యుత్తరగ్రంథప్రవృత్తి యని యర్థము. ఆయావర్ణముల ధర్మజాతము నుపదేశింపనియెడ నుపసంహారప్రకరణము సమగ్రము కాఁజాల దని చెప్పుచున్నారు సర్వంబు ఇత్యాదిగా. గీతాశాస్త్రార్థ ముపసంహృత మయినపుడు దాని చేతనే సమస్త మగు వేదార్థమును స్మృత్యర్థమును ఉపసంహృత మైనను ముముక్షువుల కనుష్ఠేయ మగునది యింక నవశిష్టము వక్తవ్యము కల దని యాశంకించి చెప్పుచున్నారు ఇంతమాత్రమే ఇత్యాదిగా. ఏతదర్థంబును — అనుష్ఠేయ పరిమాణ నిర్ధారణమువలె నుక్తశంకానివారణంబును శాస్త్రార్థోపసంహారము నను నీరెండును సముచ్చయమున కర్థము. ఇప్పుడు వర్ణచతుష్టయమున కనుష్ఠేయ మగు ధర్మజాత మసంకీర్ణ మని సూత్రము నుపన్యసించుచున్నారు బ్రాహ్మ ణేత్యాదిగా. ఉపనయనసంస్కారమును వేదాధికారమును సమాన మగుటచే బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు సమాసము. ఇతరులను సమాసములోఁ జేర్పమికి హేతువుఁ జెప్పుచున్నారు శూద్రులను ఇత్యాదిగా. ఏకజాతులు—ఉపనయనము లేనివారు. కర్మముల నసంకీర్ణముగా వ్యవస్థాపించుదానిఁ బ్రశ్నపూర్వకముగాఁ బ్రకటించుచున్నారు దేనిచేత నిత్యాదిగా. స్వభావప్రభవై ర్గుణైః అనుదాని కర్థాంతరముఁ జెప్పుచున్నారు లేక ఇత్యాదిగా. చెప్పిన వ్యవస్థకుఁ గార్యదర్శనమును బ్రమాణముగాఁ జూపుచున్నారు ప్రశాంతి ఇత్యాదిగా. స్వభావశబ్దమున కర్థాంతరముఁ జెప్పుచున్నారు లేక ఇత్యాదిగా. ఎందువలన గుణాభివ్యక్తి వాసనాధీనము ? అనఁగాఁ జెప్పుచున్నారు గుణేత్యాదిగా. ఓయీ ! లేదు గుణప్రాదుర్భావమునకు నిష్కారణత్వము, ప్రకృతిజైర్గుణైః అని ప్రకృతిని గుణకారణముగాఁ జెప్పుటవలన. అనఁగాఁ జెప్పుచున్నారు స్వభావము కారణంబు అని. స్వభావము—వాసన గుణవ్యక్తికి నిమిత్తకారణ మని వివక్షితము, ప్రకృతియె యుపాదానకారణ మని భావము. చెప్పినదాని నుపసంహరించుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. స్వభావప్రభవము లగు సత్త్వాదిగుణములచే బ్రాహ్మణాదులకుఁ గర్మములు ప్రవిభక్తము లని చెప్పినదాని నాక్షేపించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. ధర్మవిభాగహేతు వగు శాస్త్రము సత్త్వాదివిశేషాపేక్షచేతనే విభాగజ్ఞాపక మగుటవలన రెంటికి విభాగహేతుత్వము చెప్పుట యవిరుద్ధ మని పరిహరించుచున్నారు కా దిది దోషము ఇత్యాదిగా.

హ. బ్రాహ్మణుఁడును క్షత్రియుఁడును విట్టును బ్రాహ్మణక్షత్రియవిశులు, వారికిని; శూద్రాణాంచ; కర్తవ్యములగు కర్మములు ప్రవిభక్తములు; స్వభావము—ప్రకృతి, తద్భవంబు లగు సత్త్వరజస్తమము లను గుణములచేత.

శ౦. ఇట్లు సర్వజగంబును గుణత్రయాత్మకం బని సిద్ధ మైనపుడు గుణత్రయము నతిక్రమించినవానికే ముక్తి కావున గుణముల నతిక్రమింపఁ గోరునట్టి ముముక్షువునకుఁ దదతిక్రమసిద్ధికిఁ బరమకారణము జ్ఞానము, తత్సిద్ధికిఁ గారణము సత్త్వశుద్ధి, తత్కారణమో కర్మమే, కావున నదియె యవశ్యము కర్తవ్య మగుటవలన వైదికము లగు కర్మము లన్నియుఁ గర్తవ్యములై ప్రాప్తింపఁగా, బ్రాహ్మణాదు లగు ముముక్షువుల కెవ్వరెవ్వరికి స్వస్వగుణానురూపంబున నేయేకర్మములు విభక్తములై యున్నవో వారివారిచే నయ్యవియె కర్తవ్యములు కాని యితరములు కా వని నియమముఁ దెలుపుచున్నాఁడు.—బ్రాహ్మణక్షత్త్రియ విశామ్=బ్రాహ్మణులకును క్షత్త్రియులకును వైశ్యులకును, ఇట జాతిచే విషము లైనను ఉపనయనాధ్యయనయజనాదికర్మములచేతను ఆశ్రమముచేతను సము లగుటవలన ధర్మముచే సమాను లగు వారి సమాసముగాఁ జెప్పుట యవిరుద్ధము; శూద్రాణాంచ అని పృథక్కరణము జాతిచేతను ధర్మముచేతను క్రియచేతను విషము లగుటవలన విరుద్ధము కాదు; ఇట్లు ఆబ్రాహ్మణాదులకును శూద్రులకును నియమంబునఁ గర్తవ్యము లగు, కర్మాణి=కర్మములు; స్వభావప్రభవైః=స్వభావ మనఁగా ప్రకృతి, తత్ప్రభవము లగు; గుణైః=సత్త్వాదిగుణములచేత; ప్రవిభక్తాని=ప్రకర్షంబున విభక్తములు, గుణవంతుల గుణభేదముచేతఁ గర్మములుగూడ భిన్నములుగా గుణములచే నసంకీర్ణములుగా వ్యవస్థాపితము లగుచున్నవి యని యర్థము. లేక. స్వభావప్రభవైః—బ్రాహ్మణస్వభావము కేవలసత్త్వగుణప్రభవము, క్షత్త్రియస్వభావము సత్త్వమిశ్రరజఃప్రభవము, వైశ్యస్వభావము రజోమిశ్రతమఃప్రభవము, శూద్రస్వభావము కేవలతమఃప్రభవము, ఇట్లు సత్త్వాదిగుణభేదముచేఁ దత్తద్గుణవంతు లగు బ్రాహ్మణాదులకును శూద్రులకును గర్తవ్యము లగు కర్మములును భేదిల్లుచున్న వని యర్థము. లేక. "బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్" అను శ్రుతి చెప్పినప్రకారముచేతను "చత్వారో వర్ణా బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రా స్తేషాం పూర్వః పూర్వో జన్మత శ్శ్రేయాన్" అను న్యాయముచేతను, భవమే భావము—జననము, తనదైనభావము స్వభావము; లేక, తనయొక్క భావము స్వభావము—ముఖబాహ్వాదులవలన జననము, అది ప్రభవము—కారణము వేనికో అవి స్వభావప్రభవములు, స్వజన్మనిమిత్తకము లగు గుణములచేత—ఉత్తమత్వ మధ్యమత్వ నికృష్ట త్వాతినికృష్టత్వములచేత నుపలక్షితు లగు బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రులకు నియమంబునఁ గర్తవ్యము లేకర్మములు గలవో అవి జన్మమునుబట్టి యుత్కృష్టత్వాదిభేదమున విభక్తములు—శాస్త్రముచే విభజించి విహితము లని యర్థము.

మ. ఇట్లు సత్త్వరజస్తమోగుణాత్మకము క్రియాకారకఫలలక్షణ మగు సర్వసంసారంబును మిథ్యాజ్ఞానకల్పితం బనర్థ మని చతుర్దశాధ్యాయోక్త ముపసంహరింపఁబడినది. పంచదశమునందును వృక్షరూపకకల్పనచే దానిఁ బ్రతిపాదించి "అశ్వత్థ మేనం సువిరూఢమూల మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా, తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా ననివర్తన్తి భూయః" అని యసంగశస్త్రముచే విషయవైరాగ్యముచే దాని ఛేదించి పరమాత్మ యన్వేష్టవ్యుఁ డని చెప్పఁబడినది. అందు సర్వంబును త్రిగుణాత్మకమై యుండఁగా త్రిగుణాత్మక మగు సంసారవృక్ష మెట్లు ఛేదింప నగును? అసంగశస్త్రమే యనుపపన్న మగుటవలన నని యాశంక కలుగఁగా, స్వస్వాధికారవిహితంబు లగు వర్ణాశ్రమధర్మములచే నారాధింపఁబడుచున్న పరమేశ్వరునివలన నసంగశస్త్రము లభించు నని ప్రతిపాదించుటకును, ఇంతమాత్రమే సర్వవేదార్థము పరమపురుషార్థముఁ గోరువారిచే ననుష్ఠేయం బనియు గీతాశాస్త్రార్థం బుపసంహరింపవలయు ననియు నేతదర్థమై యుత్తరప్రకరణ మారంభింపంబడుచున్నది. అం దిది సూత్రము.—ముగ్వురను సమాసముగాఁ జెప్పుట ద్విజు లగుటచే వేదాధ్యయనాదితుల్యధర్ము లని తెలుపుటకొఱకు. శూద్రులను వేఱుగాఁ జెప్పుట యేకజాతు లగుటచే వేదానధికారు లని తెలుపుట కొఱకు. అట్లు వసిష్ఠుఁడు "చత్వారో వర్ణా బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రా స్తేషాం త్రయో వర్ణా ద్విజాతయో బ్రాహ్మణక్షత్త్రియవైశ్యా స్తేషామ్ – మాతు రగ్రే ఽధిజననం ద్వితీయం మౌఞ్జిబన్ధనమ్, అత్రా ఽస్య మాతా సావిత్రీ పితా త్వాచార్య ఉచ్యతే" * అని. అట్లు ప్రతివిశిష్టము • చాతుర్వర్ణ్యము. స్థానవిశేషమువలనఁ గూడ "బ్రాహ్మణో ఽస్య ముఖ మాసీత్, బాహూ రాజన్యః కృతః, ఊరూ త దస్య యద్వైశ్యః, పద్భ్యాం శూద్రో అజాయత" అని శ్రుతి. "గాయత్త్ర్యా బ్రాహ్మణ మసృజత త్రిష్టుభా రాజన్యం జగత్యా వైశ్యం న కేనచి చ్ఛన్దసా శూద్ర మిత్య సంస్కారో విజ్ఞాయతే, శూద్రశ్చతుర్థో వర్ణ ఏకజాతిః" ❛ అని గౌతముఁడు. పరంతప=శత్రుతాపనుఁడా! ఆనాలుగు

* బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రు లని నాలుగువర్ణములు, అందు బ్రాహ్మణక్షత్త్రియవైశ్యు లను మూఁడువర్ణములు ద్విజాతులు. తల్లివలన జన్మము మొదటిది, రెండవది యుపనయనము. అందు వీనికిఁ దల్లి సావిత్రి, తండ్రి యాచార్యుఁ డని చెప్పఁబడుచున్నది.

• పరస్పరభిన్నలక్షణము గలది.

❛ గాయత్త్రిచే బ్రాహ్మణుని సృజించెను. త్రిష్టుప్పుచే క్షత్త్రియుని జగతిచే వైశ్యుని సృజించెను. శూద్రు నేఛందస్సుచేతను సృజింప లేదు. కావున నతఁడు సంస్కారహీనుఁ డని తెలియుచున్నది. శూద్రుఁడు నాలవవర్ణము ఏకజాతి.

వర్ణములకును కర్మములు ప్రకర్షమున విభక్తములు—ఇతరేతరవిభాగముచే వ్యవస్థితములు. వేనిచేత? స్వభావప్రభవైః గుణైః=బ్రాహ్మణ్యాదిస్వభావము లగు సత్త్వాది గుణములచేత. అది యెట్లనఁగా. బ్రాహ్మణస్వభావమునకు సత్త్వగుణమే కారణము ప్రశాంతతవలన, క్షత్త్రియస్వభావమునకు సత్త్వోపసర్జన మగురజము ఈశ్వరత్వము వలన, వైశ్యస్వభావమునకు తమ ఉపసర్జన మగురజము ఈహాస్వభావ మగుటవలన, శూద్రస్వభావమునకు రజఉపసర్జన మగు తమము మూఢస్వభావ మగుటవలన. లేక. మాయాఖ్య మగు ప్రకృతి స్వభావము, దానివలన ఉపాదానమువలన ప్రభవము—ఉత్పత్తి వేనికో అట్టి గుణములచేత. లేక. పూర్వజన్మకృత మగు సంస్కారము వర్తమానజన్మమునందు స్వఫలాభిముఖంబై యభివ్యక్తము స్వభావము, అది నిమిత్త మగుటచే ప్రభవము—కారణము వేనికో అట్టి గుణములచేత. శాస్త్రముగూడ పురుషస్వభావసాపేక్ష మగుటవలన శాస్త్రముచేఁ ప్రవిభక్తము లైనను గుణములచేఁ ప్రవిభక్తము లని చెప్పఁబడుచున్నవి, "ఆఖ్యాతానా మర్థం బోధయతా మధికారిశక్తి స్సహకారిణీ" * అను న్యాయమువలన. అట్లు గౌతముఁడు "ద్విజాతీనా మధ్యయన మిజ్యా దానమ్, బ్రాహ్మణ స్యాధికాః ప్రవచన యాజన ప్రతిగ్రహాః, పూర్వేషు నియమస్తు, రాజ్ఞో ఽధికం రక్షణం సర్వభూతానాం న్యాయదణ్డత్వమ్, వైశ్య స్యాధికం కృషి వణి క్పాశుపాల్యం కుసీదంచ, శూద్ర శ్చతుర్థో వర్ణ ఏకజాతి స్తస్యాపి సత్య మక్రోధ శ్శౌచ మాచమనార్థే పాణి పాద ప్రక్షాలన మేవైకే శ్రాద్ధకర్మ భృత్యభరణం స్వదారవృత్తిః పరిచర్యోత్తరేషామ్" అని. ఇందు సాధారణములును అసాధారణములు నగు ధర్మములు చెప్పఁబడినవి. పూర్వములయందు — అధ్యయనేజ్యాదానములందు నియమము—అవశ్యకర్తవ్యత, లేదు ప్రవచన యాజన ప్రతిగ్రహము లందు, వృత్త్యర్థము లగుటవలన నని యర్థము. వణిక్—వాణిజ్యము, కుసీదమ్—వడ్డికి ధనవ్యాపారము. ఉత్తరేషామ్—శ్రేష్ఠు లగు ద్విజాతుల కని యర్థము. వసిష్ఠుఁడును "షట్కర్మాణి బ్రాహ్మణ స్యాధ్యయన మధ్యాపనం యజ్ఞో యాజనం దానం ప్రతిగ్రహ శ్చేతి, త్రీణి రాజన్య స్యాధ్యయనం యజ్ఞో దానంచ శస్త్రేణచ ప్రజాపాలనం స్వధర్మ స్తేన జీవేత్, ఏతా న్యేవ త్రీణి వైశ్యస్య కృషి వణి క్పాశుపాల్యం కుసీదంచ, తేషాం పరిచర్యా శూద్రస్య" అని. ఆపస్తంబుఁడును "చత్వారో వర్ణా బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రా స్తేషాం పూర్వః పూర్వో జన్మత శ్శ్రేయాన్, స్వకర్మ బ్రాహ్మణ స్యాధ్యయన మధ్యాపనం యజ్ఞో యాజనం దానం ప్రతిగ్రహణం దాయాద్యం

* అర్థమును బోధించునట్టి యాఖ్యాతములకు అధికారిశక్తి సహకారిణి.

శిలోఞ్ఛా ద్యన్యచ్చా పరిగృహీతమ్, ఏతా న్యేవ క్షత్త్రియ స్యాధ్యాపన యాజన ప్రతిగ్రహాణానీతి పరిహాయ యుద్ధదణ్డాధికాని, క్షత్త్రియవ ద్వైశ్యస్య దణ్డ యుద్ధ వర్జం కృషి గౌరక్ష్య వాణిజ్యాధికమ్, పరిచర్యా శూద్ర స్యేత రేషాం వర్ణానామ్ " అని. మనువును "అధ్యాపన మధ్యయనం యజనం యాజనం తథా। దానం ప్రతి గ్రహం చైవ బ్రాహ్మణానా మకల్పయత్॥ ప్రజానాం రక్షణం దాన మిజ్యా ఽధ్య యన మేవచ। విషయే ష్వప్రస క్తించ క్షత్త్రియస్య సమాదిశత్॥ పశూనాం రక్షణం దాన మిజ్యా ఽధ్యయన మేవచ। వణిక్పథం కుసీదంచ వైశ్యస్య కృషి మేవచ॥ ఏక మేవతు శూద్రస్య ప్రభుః కర్మ సమాదిశత్। ఏతేషా మేవ వర్ణానాం శుశ్రూషా మనసూయయా." అని. ఇట్లు నాలుగువర్ణములకును గుణభేదముచేఁ గర్మములు ప్రవిభక్తములు.

శ్రీ. ఓయీ! ఇట్లు క్రియాకారకఫలాదికము సర్వంబును ప్రాణిజాతం బును త్రిగుణాత్మకమే యగునేని, ఎట్లు మఱి వీనికి మోక్షము? అని యపేక్ష కలు గఁగా, స్వస్వాధికారవిహితము లగు కర్మములచేఁ బరమేశ్వరు నారాధించుటవలనఁ దత్ప్రసాదలబ్ధం బగు జ్ఞానముచేత నని సర్వగీతార్థసారంబును సంగ్రహించి ప్రదర్శిం చుటకై ప్రకరణాంతరము నారంభించుచున్నాఁడు ఇది మొదలధ్యాయసమాప్తి వఱకు.—పరంతప=శత్రుతాపనుఁడా! బ్రాహ్మణులకును క్షత్త్రియులకును వైశ్యుల కును శూద్రులకును, కర్మాణి; ప్రవిభక్తాని=ప్రకర్షంబున విహితములు. శూద్రులను సమాసమునుండి వేఱు చేయుట ద్విజత్వము లేమింజేసి విలక్షణు లగుటవలన. విభా గోపలక్షణముఁ జెప్పుచున్నాఁడు. — స్వభావము—సాత్త్వికాదికము ప్రభవతి—ప్రా దుర్భవించుచున్నది యేగుణమువలననో ఆగుణములచేత ఉపలక్షణభూతములచేత. లేక. స్వభావము—పూర్వజన్మసంస్కారము, దానివలనఁ ప్రాదుర్భూతము లయిన గుణములచేత నని యర్థము. అందు సత్త్వప్రధానులు బ్రాహ్మణులు, సత్త్వోపసర్జన రజఃప్రధానులు క్షత్త్రియులు, తమఉపసర్జనరజఃప్రధానులు వైశ్యులు, రజఉపసర్జన తమఃప్రధానులు శూద్రులు.

ప. * అది చెప్పఁబడినది "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభా గశః" అని.

---

* శ్రీధరీయముతో సమానము.

రా. "త్యాగే నైకే అమృతత్వ మానశుః" ఇత్యాదులందు మోక్షసాధనం బని నిర్దిష్ట మగు త్యాగము సన్న్యాసశబ్దార్థముకంటె భిన్నము కాదు. అదియు ననుష్ఠించుచునే యున్నకర్మములందుఁ గర్తృత్వత్యాగమూలము. ఫలకర్మములత్యాగంబును కర్తృత్వత్యాగంబును బరమపురుషునియందుఁ గర్తృత్వానుసంధానముచే నని చెప్పఁబడినది. ఇది యంతయు సత్త్వగుణవృద్ధికార్యము కావున సత్త్వం బుపాదేయ మని తెలుపుటకై సత్త్వరజస్తమములకార్యభేదములు ప్రపంచింపఁబడినవి. ఇప్పు డేవం భూతమై మోక్షసాధనముగా ననుష్ఠింపఁబడునది యగు కర్మమునకుఁ బరమపురుషారాధనవేషతను, అట్లనుష్ఠిత మగు కర్మమునకుఁ దత్ప్రాప్తిలక్షణ మగుఫలంబును బ్రతిపాదించుటకై బ్రాహ్మణాద్యధికారులకు స్వభావానుబంధు లగు సత్త్వాదిగుణములభేదముచే భిన్నమును వృత్తితోఁగూడఁ గర్తవ్యకర్మస్వరూపమును జెప్పుచున్నాఁడు.—బ్రాహ్మణక్షత్రియవిశామ్; స్వకీయ మైన భావము, బ్రాహ్మణాదిజన్మహేతుభూత మగు ప్రాచీనకర్మ మని యర్థము, తత్ప్రభవములు సత్త్వాదిగుణములు, బ్రాహ్మణునకు స్వభావప్రభవము రజస్తమోభిభవముచే నుద్భూత మగు సత్త్వగుణము. క్షత్రియునకు స్వభావప్రభవము తమస్సత్త్వాభిభవముచే నుద్భూత మగు రజోగుణము. వైశ్యునకు స్వభావప్రభవము సత్త్వరజోభిభవముచే నల్పోద్రిక్త మగు తమోగుణము. శూద్రునకు స్వభావప్రభవమో రజస్సత్త్వాభిభవముచే నత్యుద్రిక్త మగు తమోగుణము. ఈ స్వభావప్రభవము లగు గుణములతోఁ గూడ, కర్మాణి ప్రవిభక్తాని—శాస్త్రములచేఁ బ్రతిపాదింపఁబడినవి, బ్రాహ్మణాదు లిట్టి గుణము గలవారు వారికిఁ గర్మము లివి వృత్తులును ఇవి అని గదా విభజించి ప్రతిపాదించుచున్నవి శాస్త్రములు.

శమో దమ స్తప శ్శౌచం క్షాన్తి రార్జవ మేవచ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్. ౪౨

భా. ఏవి మఱి యవి ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—శమః = శమమును, దమః=దమమును — యథావ్యాఖ్యాత మయిన యర్థము గలవి; తపః = యథోక్తము శారీరాదికము; శౌచమ్ — మున్ను చెప్పఁబడినది; క్షాన్తిః = క్షమయును; ఆర్జవమేవచ = ఋజుత్వమును; జ్ఞానమ్ = జ్ఞానమును; విజ్ఞానమ్=విజ్ఞానమును; ఆస్తిక్యమ్= కల దనుట, వేదార్థములందు శ్రద్ధ గలుగుట; బ్రహ్మకర్మ=బ్రాహ్మణజాతియొక్క కర్మము; స్వభావజమ్=

స్వభావప్రభవై ర్గుణైః ప్రవిభక్తాని యని యేస్వభావము చెప్పఁబడినదో ఆస్వభావమువలనఁ బుట్టినది.

శమదమములును శారీరాదిత్రివిధతపస్సును బాహ్యాంతరశౌచమును క్షమయును ఋజుత్వమును — కపటము లేమియు జ్ఞానవిజ్ఞానములును ఆస్తికతయు ఇవి బ్రాహ్మణులకు స్వభావజము లయిన కర్మము లని తాత్పర్యము.

**ఆ.** ప్రవిభక్తము లయిన కర్మములనే ప్రశ్న ద్వారమున వివేచించి చూపుచున్నారు ఏవి ఇత్యాదిగా. అంతఃకరణోపశమము శమము, బాహ్యకరణోపరతి దమ మని చెప్పినయర్థమును స్మరణకుఁ దెచ్చుచున్నారు యా తేత్యాదిగా. త్రివిధ మగు తపస్సు సప్తదశమునందుఁ బ్రదర్శిత మని చెప్పుచున్నారు తపః ఇత్యాదిగా. శౌచముగూడ బాహ్యాంతరభేదమున మున్నే చెప్పఁబడినది యని చెప్పుచున్నారు శౌచ మిత్యాదిగా. క్షమ యనఁగా తిట్టఁబడినవానికిఁ గాని కొట్టఁబడినవానికిఁ గాని మనస్సునందు వికారము లేకుండుట. జ్ఞానము — శాస్త్రీయపదార్థజ్ఞానము. విజ్ఞానము — శాస్త్రార్థమును దనయనుభవమునకుఁ దెచ్చుకొనుట. మూఁడువిధముల వ్యాఖ్యాత మగు స్వభావపదార్థము నవలంబించి చెప్పుచున్నారు స్వభా వేత్యాదిగా.

**హ.** తపః = స్వధర్మవృత్తి; శౌచమ్ = శుచిభావము; క్షాన్తిః = క్షమ; ఆర్జవమ్ = ఋజుభావము; జ్ఞానమ్ = ఆత్మప్రబోధము; విజ్ఞానమ్ = అనుభవాంతజ్ఞానము; ఆస్తిక్యమ్ = వేదార్థమునం దస్తిత్వబుద్ధి; బ్రహ్మకర్మ=బ్రాహ్మణునికర్మము; స్వభావజమ్ = ప్రకృతిభవము.

**శ౦.** వారికి వర్ణనియమంబున విభక్తము లగు నాకర్మము లేవి యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—శమః = చిత్తముయొక్కయుపరమము, దృష్టాదృష్టవిషయము నం దెల్ల నిశ్శేషముగా భోగాశానివృత్తి; దమః=ఇంద్రియములయుపరమము, బాహ్యార్థములయందుఁ బ్రవృత్తి లేకుండుట; తపః=సప్తదశమునఁ జెప్పఁబడినది శారీరాది త్రివిధతపస్సు; శౌచమ్=బాహ్యము అభ్యంతరము నగుశుద్ధి, అనృతమును బరాన్నమును విడుచుటచే ముఖమునకును జిహ్వకును శుద్ధి, ప్రతిగ్రహత్యాగముచే హస్తశుద్ధి, విహితబ్రహ్మచర్యముచేఁ గచ్ఛశుద్ధి, రాగద్వేషాదిదోషత్యాగముచే మనశ్శుద్ధి, విహితాచరణముచేఁ గ్రియాశుద్ధి యని యాఱువిధములు శౌచము; క్షాన్తిః=నింద ఆక్రోశము తాడనము మొదలగునది సంభవించినను చిత్తమున వికారము పుట్టకుండుట; ఆర్జవమ్ = సదా కరణత్రయంబును ఏకరూపముగా నుండుట; జ్ఞానమ్=

చక్కఁగా నధ్యయనము చేసిన వేదశాస్త్రములయొక్క పదవాక్యార్థజ్ఞానము; విజ్ఞానమ్=అనుష్ఠానమునకును అనుష్ఠాపనమునకును సమర్థ మగు నిరంకుశ మైనశాస్త్రార్థతత్త్వనిశ్చయము; ఆస్తిక్యమ్=ఆస్తికత్వము, ఇది యవశ్యము కర్తవ్యము దీనిచే నీశ్వరుఁడు ప్రీతుఁ డగు నని కర్మమునందును కర్మఫలమునందును శ్రద్ధ; చకార మనుక్తము లగు నాచార్యవేదేశ్వరులందలి భయభక్తులసముచ్చయార్థము; ఏవకార మిదియే ముముక్షు వగు బ్రాహ్మణునకుఁ గర్తవ్య మగు కర్మ మని యవధారణార్థము; స్వభావజమ్=కేవలసత్త్వప్రకృతివలన, లేక, ముఖమునుండి యుత్పత్తివలనఁ బ్రాప్తము; బ్రాహ్మమ్ *—బ్రాహ్మణజాతి కర్మము—కర్తవ్య మగు; కర్మ—ఈ కర్మము శాస్త్రముచే విహిత మని యర్థము. ముముక్షువులగు త్రైవర్ణికుల కందఱకు శమాద్యాస్తిక్యాంతకర్మము మోక్షసాధనం బగుటచే సమానమే యగుచున్నది, ఐనను కేవలము సత్త్వప్రభవు లగు బ్రాహ్మణులకు గుడమునకు మాధుర్యమువలె నీచెప్పిన కర్మము స్వాభావికమును నియతంబు నగుచున్నది,ఇతరులకో యత్నసాధ్యం బని బోధించుటకై బ్రాహ్మం కర్మ యని చెప్పఁబడినది. అందుచే బ్రాహ్మణులకే సత్త్వాధిక్యమువలన శమాదిసంపత్తిచేఁ దదేకసాధ్యం బగు జ్ఞానమునందును దత్ఫల మగు మోక్షమునందును సులభం బధికారము, తదితరులకుఁ గష్టసాధ్య మని సూచితం బగుచున్నది. అందువలన మోక్షమునకు,సమీప మగు బ్రాహ్మణజన్మము నొందిన పండితులు శీఘ్రంబున మోక్షముకొఱకు యత్నింపవలయు నని సిద్ధము.

మ॰ అందు బ్రాహ్మణునకు స్వాభావికగుణకృతము లగు కర్మములఁ జెప్పుచున్నాఁడు.—శమః=అంతఃకరణోపశమము; దమః=బాహ్యకరణోపరమము; తపః-శారీరాదికము దేవద్విజగురుప్రాజ్ఞేత్యాదిగాఁ జెప్పఁబడినది; క్షాన్తిః=క్షమ, తిట్టఁబడినను కొట్టఁబడినను మనస్సున వికారము లేక యుండుట. మున్ను వ్యాఖ్యాతము; ఆర్జవమ్=అకౌటిల్యము, పూర్వము వ్యాఖ్యాతము; జ్ఞానమ్=సాంగవేదతదర్థజ్ఞానము; విజ్ఞానమ్=కర్మకాండమునందు యజ్ఞాదికర్మకౌశల్యమును బ్రహ్మకాండమునందు బ్రహ్మాత్మైక్యానుభవమును; ఆస్తిక్యమ్—సాత్త్వికశ్రద్ధ మున్ను చెప్పఁబడినది; ఈ శమాది నవకము, స్వభావజమ్ = సత్త్వగుణస్వభావకృతము; బ్రహ్మకర్మ=బ్రాహ్మణజాతియొక్క కర్మము. నాలుగువర్ణములకును సాత్త్వికావస్థయం దీధర్మములు సంభవించుచున్నవి కాని బాహుల్యంబున బ్రాహ్మణునియం దున్నవి, అతఁడు సత్త్వస్వభావుఁ

* బ్రాహ్మం కర్మ స్వభావజమ్ అని పాఠాంతరము.

డగుటవలన. సత్త్వోద్రేకవశంబున నితరులయందును నొకానొకప్పుడు సంభవించు నని శాస్త్రాంతరమున సాధారణధర్మము లని చెప్పఁబడినవి. అట్లు విష్ణువు.—"క్షమా సత్యం దమ శ్శౌచం దాన మిన్ద్రియసంయమః। అహింసా గురుశుశ్రూషా తీర్థానుసరణం దయా॥ ఆర్జవం లోభశూన్యత్వం దేవబ్రాహ్మణపూజనమ్। అనభ్యసూయా చ తథా ధర్మ స్సామాన్య ఉచ్యతే" అని. సామాన్యము – నాలుగు వర్ణములకును అట్లు ప్రాయికముగా నాలుగాశ్రమములకును నని యర్థము. అట్లు బృహస్పతి.— "దయా క్షమా ఽనసూయా చ శౌచా ఽనాయాస మఙ్గలమ్। అకార్పణ్య మస్పృహత్వం సర్వసాధారణాని చ ॥ పరే వా బన్ధువర్గే వా మిత్రే ద్వేష్టరి వా సదా। ఆపన్నే రక్షితవ్యం తు దయైషా పరికీర్తితా॥ బాహ్యే చా ఽఽధ్యాత్మికే చైవ దుఃఖే చోత్పాదితే క్వచిత్। న కుప్యతి నవా హన్తి సా క్షమా పరికీర్తితా॥ నగుణాన్ గుణినో హన్తి స్తౌతి మన్దగుణా నపి। నా ఽన్యదోషేషు రమతే సా ఽనసూయా ప్రకీర్తితా॥ అభక్ష్య పరిహారశ్చ సంసర్గ శ్చా ఽప్య నిర్గుణైః। స్వధర్మే చ వ్యవస్థానం శౌచ మేత త్ప్రకీర్తితమ్ ॥ శరీరం పీడ్యతే యేన సుశుభే నా ఽపి కర్మణా। అత్యన్తం త న్నకర్తవ్య మనాయాస స్స ఉచ్యతే ॥ ప్రశస్తాచరణం నిత్య మప్రశస్త విసర్జనమ్। ఏతద్ధి మఙ్గలం ప్రోక్తం మునిభి స్తత్త్వదర్శిభిః ॥ స్తోకా దపి ప్రదాతవ్య మదీనేనా ఽన్తరాత్మనా। అహ న్యహని య త్కించి దకార్పణ్యం హి తత్ స్మృతమ్॥ య థోత్పన్నేన సంతోషః కర్తవ్యో హ్యర్థ వస్తునా। పరస్యా ఽచిన్తయిత్వా ఽర్థం సా ఽస్పృహా పరికీర్తితా." అని. ఇవియే యెనిమిది యాత్మగుణము లని గౌతమునిచేఁ బఠింపఁబడినవి "అథా ఽష్టా వాత్మగుణా దయా సర్వభూతేషు క్షాన్తి రనసూయా శౌచ మనాయాసో మఙ్గల మకార్పణ్య మస్పృహా" అని. అట్లు మహాభారతమునందు.—"సత్యం దమ స్తప శ్శౌచం సంతోషో హ్రీః క్షమా ఽఽర్జవమ్। జ్ఞానం శమో దయా ధ్యాన మేష ధర్మ స్సనాతనః॥ సత్యం భూతహితం ప్రోక్తం మనసో దమనం దమః। తప స్స్వధర్మ వర్తిత్వం శౌచం సంకరవర్జనమ్॥ సంతోషో విషయత్యాగో హ్రీ రకార్య నివర్తనమ్। క్షమా ద్వన్ద్వసహిష్ణుత్వ మార్జవం సమచిత్తతా॥ జ్ఞానం తత్త్వార్థసంబోధ శ్శమ శ్చిత్త ప్రశాన్తతా। దయా భూత హితైషిత్వం ధ్యానం నిర్విషయం మనః" అని. దేవలుఁడు.—"శౌచం దానం తప శ్శ్రద్ధా గురుసేవా క్షమా దయా। విజ్ఞానం వినయ స్సత్య మితి ధర్మసముచ్చయః" అని. మఱియును "వ్రతోపవాసనియమై శ్శరీరో త్తాపనం తపః। ప్రత్యయో ధర్మకార్యేషు తథా శ్రద్ధే త్యుదాహృతా॥ నాస్తి హ్య శ్రద్దధానస్య కర్మకృత్య

ప్రయోజనమ్ । యత్పున ర్వైదికీనాం చ లౌకికీనా చ సర్వశః॥ ధారణం సర్వవిద్యా నాం విజ్ఞాన మితి కీర్త్యతే। వినయం ద్వివిధం ప్రాహు శ్శశ్వ ద్దమ శమావితి" అని. శేషము వ్యాఖ్యాతప్రాయము కావున వచనములు వ్రాయఁబడినవి కావు. యాజ్ఞ వల్క్యుఁడును "ఇజ్యాచార దమా ఽహింసా దాన స్వాధ్యాయకర్మణామ్ । అయం తు పరమో ధర్మో య ద్యోగే నాత్మచిన్తనమ్॥" అని. ఇది సర్వంబును దైవసంపద పూర్వము వ్యాఖ్యాతము. బ్రాహ్మణులకు స్వాభావికము, ఇతరులకు నైమిత్తికము కావున విరోధము లేదు.

శ్రీ. అందు బ్రాహ్మణునకు స్వాభావికము లగు కర్మములను జెప్పుచు న్నాఁడు.—శమః=చిత్తోపరమము; దమః=బాహ్యేంద్రియములయుపరమము; తపః— పూర్వోక్తము శారీరాదికము; శౌచమ్—బాహ్యమును ఆభ్యంతరమును; క్షాన్తిః= క్షమ; ఆర్జవమ్=అవక్రత; జ్ఞానమ్—శాస్త్రీయము; విజ్ఞానమ్—అనుభవము; ఆస్తి క్యమ్=కలదు పరలోక మను నిశ్చయము; ఈ శమాదికము బ్రాహ్మణునకు స్వభావము వలనఁ గలిగిన కర్మము.

ప. *

రా. శమః=బాహ్యేంద్రియనిగ్రహము; దమః = అంతఃకరణనిగ్రహము; తపః=భోగనియమనరూపము, శాస్త్రసిద్ధ మగు కాయక్లేశము; శౌచమ్—శాస్త్రీయ కర్మయోగ్యత; క్షాన్తిః = పరులు తన్నుఁ బీడించు చున్నను అవికృతచిత్తుఁ డగుట; ఆర్జవమ్=పరులకు మనోనురూపముగా బాహ్యచేష్టలఁ గనఁబఱచుట; జ్ఞానమ్=పరా వరతత్త్వయాథాత్మ్యజ్ఞానము;విజ్ఞానమ్=పరతత్త్వగతాసాధారణవిశేషవిషయ మగు జ్ఞానము; ఆస్తిక్యమ్=వైదికార్థము సర్వంబును సత్య మను నిశ్చయము ప్రకృష్టము, ఏ హేతువుచేతఁ గూడఁ ద్రిప్ప నశక్య మని యర్థము, భగవంతుఁడు పురుషోత్తముఁడు వాసుదేవుఁడు పరబ్రహ్మశబ్దవాచ్యుఁడు నిరస్తనిఖిలదోషగంధుఁడు స్వాభావికానవధి కాతిశయజ్ఞానశక్త్యాద్యసఙ్ఖ్యేయ కల్యాణగుణగణుఁడు నిఖిలవేదవేదాంతవేద్యుఁడు, అతఁడే నిఖిలజగదేకకారణము నిఖిలజగదాధారభూతుఁడు, సర్వంబునకును అతండే ప్రవర్తయిత, తదారాధనభూతము వైదికసర్వకర్మమును, ఆయాకర్మముచే నారాధి తుఁడై ధర్మార్థకామమోక్షాఖ్య మగు ఫలము నిచ్చుచున్నాఁడు—ఈ యర్థము సత్య మను నిశ్చయ మాస్తిక్యము. "వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః, అహం సర్వస్య

* శ్రీధరీయసమానము.

ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే, మయి సర్వ మిదం ప్రోతమ్, భోక్తారం యజ్ఞ తపసామ్......జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి, మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనఞ్జయ, యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్, స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః, యో మా మజ మనాదించ వేత్తి లోక మహేశ్వరమ్" అని గదా చెప్పఁబడుచున్నది. ఇది బ్రాహ్మణునకు స్వభావజ మగు కర్మము.

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చా ఽప్యపలాయనమ్
దాన మీశ్వరభావశ్చ క్షాత్త్రం కర్మ స్వభావజమ్. ४३

భా. శౌర్యమ్=శూరత్వమును; తేజః=ప్రగల్భతయును; ధృతిః=ధారణము, ఏధృతిచే నుత్తంభితుం డైనవానికి సర్వావస్థలయందును అనవసాద మగునో* అది; దాక్ష్యమ్=దక్షభావము, తటాలునఁ గలిగిన కార్యములం దవ్యామోహంబునఁ బ్రవృత్తి; యుద్ధేచాఽపి=యుద్ధమునందును; అపలాయనమ్ = శత్రువులకుఁ బరాఙ్ముఖుఁడు కాకుండుటయు; దానమ్= దేయములందు చేతివిడుపును; ఈశ్వరభావశ్చ=ఈశ్వరునితనమును, ఈశితవ్యులయెడఁ బ్రభుశక్తి ప్రకటీకరణమును; క్షాత్త్రకర్మ=క్షత్త్రియజాతికి విహిత మగు కర్మము; స్వభావజమ్=స్వభావమువలనఁ బుట్టినది.

పరాక్రమంబును ప్రగల్భతము ధైర్యమును దక్షతయు యుద్ధమున శత్రువులకు వెనుదీయ కుండుటయు దానమును బ్రభుత్వంబును—ఇవి క్షత్త్రియజాతికి స్వభావజకర్మము లని తాత్పర్యము.

ఆ. శూరత్వము—పరాక్రమము, బలవంతులను గూడఁ బ్రహరించుటకుఁ బ్రవర్తించుట. ప్రగల్భత—పరులచే నెదిరింప నలవి గాకుండుట. గొప్పయాపదయందును దేహేంద్రియముల నుత్తంభించు చిత్తవృత్తి ధృతి యని వ్యాఖ్యానముఁ జేయుచున్నారు ఏధృతిచే నిత్యాదిగా. దక్షభావమునే వివరించుచున్నారు తటాలున ఇత్యాదిగా. స్వభావము పూర్వము చెప్పఁబడినది.

హ. శౌర్యమ్=మరణభయము లేకుండుట; తేజః=ప్రతాపము; ధృతిః= ధైర్యము; దాక్ష్యమ్=నిపుణత; అపలాయనమ్=శత్రువుల కెదురై నిలుచుట; దానమ్=

* కష్టము తోఁచదో.

హిరణ్యాదికమును బ్రాహ్మణులకు దర్పించుట. క్షత్రియునిది యిది కావున క్షాత్త్ర
ము*; స్వభావజమ్=ప్రకృతిభవము.

శం. ఇట్లు బ్రాహ్మకర్మముఁ జెప్పి క్షాత్త్రకర్మముఁ జెప్పుచున్నాఁడు.—
శూరునిభావము శౌర్యము, పరాక్రమము, వీరులను గూడ సంహరించుసామర్థ్యము;
తేజః=ప్రగల్భత, బలవంతులకును దుర్ధర్షుఁ డగుట; ధృతిః=విపత్తునందు చిత్తమునకు
వికలత లేకుండుట, ధైర్యము; దాక్ష్యమ్=దక్షభావము, నూఱు ప్రతికూలము
లున్నను స్వకార్యము నిర్వహించుసామర్థ్యము; యుద్ధేచ=యుద్ధమునందో; అపలా
యనమ్ = ప్రాణాంతమునందును పరాఙ్ముఖుఁడు కాకుండుట; దానమ్=పాత్రములకు
ధనము నర్పించుట; ఈశ్వరభావశ్చ = ఐశ్వర్యము, ప్రభావాతిశయముచే నెల్లరను
నియమించుట, ధర్మమునఁ బ్రజాపాలన మని యర్థము; చకారమును అపియును
ఉక్తసముచ్చయార్థములు, శౌర్యాద్యైశ్వర్యాంత మగు సర్వకర్మమును, స్వభావ
జమ్ = సత్త్వమిశ్ర రజఃప్రకృతివలన, లేక, బాహువులనుండి యుత్పత్తివలనఁ
బ్రాప్తము; క్షాత్త్రమ్=క్షత్రియజాతికి అర్హము కర్తవ్య మని శాస్త్రముచే విహిత
మని యర్థము.

మ. క్షత్త్రియునకు గుణస్వభావకృతము లగు కర్మములఁ జెప్పుచున్నా
డు.—శౌర్యమ్=విక్రమము, బలవంతులనుగూడఁ బ్రహరించుటకుఁ బ్రవృత్తి; తేజః=
ప్రాగల్భ్యము, పరులకు ధర్షింప నలవి కామి; ధృతిః = గొప్పయాపదయందును
దేహేంద్రియసంఘాతమున కనవసాదము; దాక్ష్యమ్ = దక్షభావము, తటాలునఁ
బ్రత్యుత్పన్నము లయిన కార్యములందు వ్యామోహము లేక ప్రవృత్తి; యుద్ధేచ;
అపలాయనమ్=అపరాఙ్ముఖత; దానమ్=సంకోచము లేక ధనములందు స్వస్వత్వము
పరిత్యజించి పరస్వత్వాపాదనము; ఈశ్వరభావశ్చ=ప్రజాపాలనార్థము ఈశితవ్యుల
యందుఁ బ్రభుశక్తి ప్రకటీకరణమును; క్షత్త్రకర్మ=క్షత్త్రియజాతికి విహిత మగు
కర్మము; స్వభావజమ్=సత్త్వోపసర్జన రజోగుణస్వభావజము.

శ్రీ. క్షత్త్రియునకు స్వాభావికకర్మములఁ జెప్పుచున్నాఁడు.—శౌర్యమ్=
పరాక్రమము; తేజః = ప్రాగల్భ్యము; ధృతిః=ధైర్యము; దాక్ష్యమ్=కౌశలము;
యుద్ధేచ, అపలాయనమ్=అపరాఙ్ముఖత; దానమ్=ఔదార్యము; ఈశ్వరభావః=నియ
మించుశక్తి. ఇది క్షత్త్రియునకు స్వభావజ మగు కర్మము.

---

* క్షాత్త్రం కర్మ స్వభావజమ్ అని పాఠాంతరము.

ప. *

రా. శౌర్యమ్ = యుద్ధమునందు నిర్భయముగాఁ బ్రవేశించుసామర్థ్యము; తేజః=పరులకుఁ దిరస్కరింప శక్యము కామి; ధృతిః=ఆరంభించినకర్మమును విఘ్నములు వచ్చినను సమాప్తి నొందించుసామర్థ్యము; దాక్ష్యమ్=సర్వకార్యములను నెఱవేర్పుశక్తి; యుద్ధేచ, అపలాయనమ్ = తనకు మరణము నిశ్చితమైనను మరలకుండుట; దానమ్=తనధనమును పరస్వత్వాపాదనపర్యంత మగు విడుచుట; ఈశ్వరభావః=స్వవ్యతిరిక్తు లగు సకలజనుల నియమించుసామర్థ్యము. ఇది క్షత్త్రియునకు స్వభావజ మైనకర్మము.

కృషిగౌరక్ష్యవాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యా ఽపి స్వభావజమ్. ౪౪

భా. కృషిగౌరక్ష్యవాణిజ్యమ్=కృషి—భూమిని దున్నుట, గౌరక్ష్యము—గోవుల రక్షించువాఁడు గోరక్షుఁడు వానిభావము గౌరక్ష్యము పాశుపాల్యము, వాణిజ్యము—వణిజునికర్మము, క్రయవిక్రయాదిలక్షణము; వైశ్యకర్మ = వైశ్యజాతికర్మము; స్వభావజమ్=స్వభావమువలనఁ బుట్టినది. పరిచర్యాత్మకమ్ = శుశ్రూషాస్వభావ మగు; కర్మ=కర్మము; శూద్రస్యాపి=శూద్రునకును; స్వభావజమ్=స్వభావమువలనఁ బుట్టినది.

కృషియును బశుపాలనమును క్రయవిక్రయాదికమును వైశ్యునకు స్వభావజకర్మము, శూద్రునకును శుశ్రూష స్వాభావిక మగు కర్మమని తాత్పర్యము.

ఆ. ♦

హ. గోవుల రక్షించుట గౌరక్ష్యము; వణిక్కనఁగా క్రయవిక్రయములు చేయువాఁడు, వానిభావము వాణిజ్యము. ఇది వైశ్యునకు స్వభావజము.

శం. వైశ్యశూద్రులకుఁ గర్మములం జెప్పుచున్నాఁడు.—కృషి—దున్నుట, గౌరక్ష్యము—గోవుల రక్షించువాఁడు గోరక్షుఁడు తద్భావము గౌరక్ష్యము పశుపాలనము, వాణిజ్యమ్—వణిజునికర్మము, క్రయవిక్రయలక్షణము; ఈ మూఁడువిధము లగు

* శ్రీధరీయతుల్యము.

♦ ఇంతకు తానందగిరీయము లేదు.

కర్మము, స్వభావజమ్=రజోమిశ్రితతమఃప్రకృతివలన, లేక, ఊరువులయందుత్పత్తి వలనఁ బ్రాప్తము; వైశ్యకర్మ=వైశ్యజాతికర్తవ్య మగు కర్మము శాస్త్రముచే విహిత మని యర్థము. పరిచర్యాత్మకమ్=త్రైవర్ణికులకు శుశ్రూషారూపము; స్వభావజమ్=కేవలతమఃప్రకృతివలన, లేక, పాదములందు జన్మమువలనఁ బ్రాప్తము; శూద్రస్య=శూద్రునకు; కర్తవ్య మగు, కర్మ=కర్మము; "శుశ్రూషా శూద్రస్య" అను శాస్త్రముచే విహిత మని యర్థము. ఓయీ! బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు నియమంబునఁ గర్తవ్యము లగు కర్మములఁ జెప్పెద నని యుపక్రమించి శమము దమ మని శౌర్యము తేజ మని ప్రాకృత మయిన ధర్మమే యుపదేశింపఁబడినది కాని నియమంబునఁ గర్తవ్య మగు వైదికకర్మ ముపదేశింపఁబడినది కాదు. వైదికకర్మానుష్ఠానముచేఁ గదా యీశ్వరుఁడు ప్రీతుం డగును! శమశౌర్యకృష్యాదికర్మము ననుష్ఠించుటచే నీశ్వరుఁడు ప్రీతుఁడు కాఁడు గదా! ఎట్లీవిపరీతకర్మ ముపదేశింపఁబడినది? అందు వేని, సత్యము. శమాదికమును శౌర్యాదికమును సంధ్యాదికర్మము వలె ననుష్ఠేయము కాదు, ఇది యీశ్వరప్రీతికొఱకునుం గాదు. అయినను విశేషముఁ జెప్పెదము. "అహరహ స్సంధ్యా ముపాసీత, సాయం ప్రాత రగ్నిహోత్రం జుహోతి, యజ్ఞో ఽధ్యయనం దానమ్, ద్విజాతీనా మధ్యయన మిజ్యా దానమ్" ఇత్యాదిగా బ్రాహ్మణాదులకు నియమమున నిత్యము కర్తవ్య మగు కర్మ మెట్లు శాస్త్రముచేతనే చెప్పఁబడినదో; అట్లు "శమేన శాన్తా శ్శివ మాచరన్తి, దమేన దాన్తాః కిల్బిష మవధున్వన్తి, తపసా కిల్బిషం హన్తి, రాజ్ఞో ఽధికం రక్షణం సర్వభూతానాం న్యాయదణ్డత్వం బిభృయా త్సంగ్రామే సంస్థాన మనివృత్తి శ్చేతి, కృషి వాణిజ్యే చ స్వయంకృతే కుసీదం చేతి, శూద్ర శ్చతుర్థో వర్ణ ఏకజాతి స్త స్యాపి సత్య మక్రోధః పరిచర్యా చేత రేషామ్" అని యీకర్మములు గూడ ననుష్ఠేయములని శాస్త్రముచేతనే చెప్పఁబడి యున్నవి. ఇది యిట విశేషము. బ్రాహ్మణాదులకు సంధ్యోపాసనాగ్నిహోత్రాదికం బవిభక్త మగు వర్ణాశ్రమధర్మము. శమ శౌర్య కృష్యాదికమో ప్రత్యేకము విభక్తం బగు జాతిధర్మము. అందువలన జాతి వర్ణాశ్రమనిమిత్తకము లగు నీరెండుధర్మములు గూడ నిత్యములు శ్రౌతస్మార్తకర్మములవలెఁ బ్రధానములే యగుచున్నవి, కాని వాని కంగాంగిభావము సిద్ధింపదు. రెండును శాస్త్రముచేతనే నియతము లగుటవలన ముముక్షువులకు నియమంబున ననుష్ఠాతవ్యములే యగుచున్నవి. ఇం దేమియు విపరీతము బోధించుటకుఁ గాని గ్రహించుటకుఁ గాని లేదు. అందువలన జాతిధర్మంబునందు నియమమ్మున వర్తించుచు బ్రాహ్మ

ణాదులు స్వస్వవర్ణాశ్రమార్హ మగు కర్మమును వైదికమును నిత్య మనుష్ఠింపవల యును. వేఱువిధమునఁ గాదు. ప్రధానకర్మమునం దేకదేశము ననుష్ఠించుటచే సాక ల్యము సంభవింపమివలనఁ దత్ఫలము సిద్ధింపదు. శ్రౌతస్మార్తములయం దొకటి యను ష్ఠించుటచే సంస్కారసాకల్యము సిద్ధింపదు గదా! అట్లు. అందువలన స్వధర్మ మగు శమాదికమునందును శౌర్యాదికమునందును సదా వర్తించుచునే బ్రాహ్మణ క్షత్త్రియాదులు సంధ్యాగ్నిహోత్రాదిక మగు నిత్యకర్మమును నియమమునఁ జేయ వలయు నని సిద్ధము.

మ. కృషి—అన్నోత్పత్తికొఱకు భూమి దున్నుట, గోరక్షుని భావము గోరక్ష్యము పాశుపాల్యము, వాణిజ్యము—వణిజునికర్మము క్రయవిక్రయాదిలక్షణము, కుసీదము గూడ ఇం దంతర్భవించుచున్నది; వైశ్యకర్మ=వైశ్యజాతియొక్క కర్మము; స్వభావజమ్=తమ ఉపసర్జనరజోగుణస్వభావజము, పరిచర్యాత్మకమ్ = ద్విజశుశ్రూ షారూపమగు; కర్మ=కర్మము; స్వభావజమ్=రజ ఉపసర్జన తమోగుణస్వభావజము.

శ్రీ. వైశ్యశూద్రులకుఁ గర్మముఁ జెప్పుచున్నాఁడు.—కృషి = దున్నుట, గోవుల రక్షించువాఁడు గోరక్షుఁడు, వానిభావము గోరక్ష్యము పాశుపాల్య మని యర్థము, వాణిజ్యమ్ — క్రయవిక్రయాదికము; ఇది వైశ్యునికి స్వభావజం బగు కర్మము. త్రైవర్ణికపరిచర్యాత్మకము శూద్రునకును స్వభావజ మగు కర్మము.

ప. *

రా. కృషి — సస్యోత్పాదన మగు కర్షణము, గోరక్ష్యము — పశుపాలన మని యర్థము, వాణిజ్యము—ధనసంచయహేతు వగు క్రయవిక్రయాత్మక మయిన కర్మము, ఇది వైశ్యునికి స్వభావజ మగు కర్మము. పూర్వవర్ణత్రయమునకుఁ బరిచర్య శూద్రునకు స్వభావజ మగు కర్మము. ఇది నాలుగు వర్ణములకును వృత్తులతోఁ గూడఁ గర్తవ్యము లగు శాస్త్రవిహితము లైన యజ్ఞాదికర్మ ముల ప్రదర్శనార్థము చెప్పఁబడినది. యజ్ఞాదులు మూఁడువర్ణములకు సాధారణ ములు గదా! శమాదులును మూఁడువర్ణములకు ముముక్షువులకు సాధారణములు. బ్రాహ్మణునకో సత్త్వోద్రేకము స్వాభావిక మగుటచే శమదమాదులు సుఖోపా దానంబు లని తలఁచి వానికి శమాదులు స్వభావజకర్మ మని చెప్పఁబడినది. క్షత్త్రి యవైశ్యులకో స్వభావంబున రజస్తమఃప్రధాను లగుటచే శమదమాదులు దుఃఖో

* శ్రీధరీయమున నవిశిష్టము.

పాదానంబు లని తలంచి తత్కార్య మని చెప్పఁబడ దయ్యె. బ్రాహ్మణునకుమాత్రము వృత్తి యాజనాధ్యాపనప్రతిగ్రహములు. క్షత్త్రియునకు జనపదపరిపాలనము. వైశ్యునకును కృష్యాదులు యథోక్తములు. శూద్రునకు వర్ణత్రయపరిచర్యయే.

స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విన్దతి త చ్ఛృణు. ౪౫

భా. ఈ జాతివిహితకర్మములకు సమ్యగనుష్ఠితములకు స్వభావమున స్వర్గప్రాప్తి ఫలము, "వర్ణా ఆశ్రమా శ్చ స్వకర్మనిష్ఠాః ప్రేత్య కర్మ ఫల మనుభూయ తత శ్శేషేణ విశిష్ట దేశ జాతి కులధర్మాయు శ్శ్రుత వృత్త విత్త సుఖ మేధసో జన్మ ప్రతిపద్యన్తే" * ఇత్యాది స్మృతులవలన, పురాణమునందును వర్ణులకును ఆశ్రములకును లోకఫలభేదము చెప్పఁబడుటవలన. కారణాంతరమువలననో యీవక్ష్యమాణ మగుఫలము.— స్వే స్వే=తన తనదైన, యథోక్తలక్షణభేదముగల; కర్మణి=కర్మమునందు; అభిరతః=తత్పరుఁ డగు; నరః=అధికృతుఁడైనపురుషుఁడు; సంసిద్ధిమ్=స్వకర్మానుష్ఠానమువలన నశుద్ధి నశించుటచేఁ గాయేంద్రియములకు జ్ఞాననిష్ఠాయోగ్యతాలక్షణ మగు సిద్ధిని; లభతే=పొందుచున్నాఁడు. ఏమి స్వకర్మానుష్ఠానమువలననే సాక్షాత్సంసిద్ధి? కాదు. ఎట్లు మఱి? స్వకర్మ నిరతః= స్వకర్మమునందుఁ దత్పురుఁడు; సిద్ధిమ్=సిద్ధిని; యథా=ఏప్రకారముచేత; విన్దతి=పొందుచున్నాఁడో; తత్=దాని; శృణు=వినుము.

తన తనవర్ణాశ్రమములకు విహిత మగుకర్మముఁ దప్పక ఫలాభిసంధి లేక యనుష్ఠించు పురుషుఁడు శుద్ధచిత్తుఁడై జ్ఞాననిష్ఠకు యోగ్యత నొందును. అతఁడు స్వకర్మానుష్ఠానముచే నెట్లు సిద్ధి నొందునో ఆవిధముఁ జెప్పెద వినుమని తాత్పర్యము.

అ. శమాదిపరిచర్యాంతము లగు కర్మములకు విభజించి చెప్పఁబడిన వాని కభ్యుదయఫలమును మొదట నుపన్యసించుచున్నారు ఈ జాతి ఇత్యాదిగా.

* వర్ణులును ఆశ్రములును స్వకర్మనిష్ఠులై మరణము నొంది కర్మఫలము ననుభవించి యట నుండి శేషకర్మముచే నుత్తమ మయిన దేశమును జాతియును కులమును ధర్మమును ఆయువును విద్యయు ఆచారమును ధనమును సుఖమును బుద్ధియుఁ గలవారై జన్మము నొందుచున్నారు.

స్వభావమున—విహితము లగుటవలననే మోక్షాపేక్ష లేక యనుష్ఠించుటవలన నని యర్థము. అందుఁ బ్రమాణముఁ జెప్పుచున్నారు వర్ణా ఇత్యాదిగా. శేష మనుటచే భుక్తకర్మముకంటె నతిరిక్త మగు కర్మము అనుశయం బను పేరు గలది చెప్పఁబడు చున్నది. ప్రత్యేకమును దేశాదులతో విశిష్టశబ్ద మన్వయించుచున్నది. ఆదిశబ్దముచే "తద్యథా ఽఽమ్రే ఫలార్థే నిమితే ఛాయాగన్ధా వనూత్పద్యేతే ఏవం ధర్మం చర్యమాణ మర్థా అనూత్పద్యన్తే నోచే దనూత్పద్యన్తే న ధర్మహాని ర్భవతి" అను స్మృతి గ్రహింపఁబడుచున్నది. ఇందువలనఁ గూడ నీకర్మములకు స్వర్గఫలత్వము యుక్తం బని చెప్పుచున్నారు పురాణమునందును ఇత్యాదిగా. చెప్పఁబడినది గదా! "యస్తు సమ్యక్కరో త్యేవం గృహస్థః పరమం విధిమ్। తద్వర్ణబన్ధముక్తో ఽసౌ లోకా నాప్నో త్యనుత్తమాన్" * అనియు, "య స్త్వేతాం నియత శ్చర్యాం వానప్రస్థ శ్చరే న్మునిః। స దహ త్యగ్నివ ద్దోషాన్ జయే ల్లోకాంశ్చ శాశ్వతాన్" ♦ అనియు, "మోక్షాశ్రమో య శ్చరతే యథోక్తం శుచి స్సుసంకల్పిత బుద్ధియుక్తః। అనిన్ధనజ్యోతి రివ ప్రశాన్తం స బ్రహ్మలోకం శ్రయతే ద్విజాతిః" ‡ అనియు, పురాణమునందును అనుసముచ్చయముచే "సర్వ ఏతే పుణ్యలోకా భవన్తి" అను శ్రుతి గ్రహింపఁబడినది. మోక్షాపేక్షచే నీకర్మముల ననుష్ఠించునెడ వీనికి మోక్షఫలత్వము సిద్ధించు నని చెప్పుచున్నారు కారణాంతరమువలననో ఇత్యాదిగా. మోక్షాపేక్షచే వాని ననుష్ఠించుటయే కారణాంతరము. మోక్షోపాయము లగు శమాదులందు సాత్త్వికము లైన బ్రాహ్మణధర్మములందు క్షత్త్రియాదుల కధికారము లేమివలన బ్రాహ్మణులకే మోక్షము క్షత్త్రియాదులకు లే దని యాశంకించి చెప్పుచున్నాఁడు స్వే స్వే అను శ్లోకముచేత. యథోక్త మగు స్వకర్మమునం దభిరతునకు బుద్ధిశుద్ధిద్వారమున జ్ఞాననిష్ఠాయోగ్యతకలుగును, దానిచే జ్ఞానము నొందినవానికి మోక్ష ముపపన్న మగుటవలన బ్రాహ్మణాతిరిక్తునకును జ్ఞానవంతునకు మోక్ష మగు నను నభిప్రాయమువలనఁ బూర్వార్థము వివరించుచున్నారు స్వేస్వే

* ఏగృహస్థుఁడు ఉత్తమ మగు నీవిధిని జక్కఁగా ననుష్ఠించుచున్నాఁడో అతఁడు తద్వర్ణబంధ విముక్తుఁడై యుత్తమలోకముల నొందుచున్నాఁడు.

♦ వానప్రస్థుఁ డగు నేముని నియతుఁడై యీచర్య నాచరించుచున్నాఁడో అతం డగ్నివలె దోషముల దహించి శాశ్వతము లగు లోకముల జయించుచున్నాఁడు.

‡ సన్న్యాసాశ్రమి యగు నేద్విజుఁడు శుచియై చక్కనిసంకల్పము గల బుద్ధితోఁ గూడినవాఁడై యథోక్త మగు నియమము ననుష్ఠించుచున్నాఁడో అతఁడు నిరింధనజ్యోతివలెఁ బ్రశాంత మగు బ్రహ్మలోకము నొందుచున్నాఁడు.

ఇత్యాదిగా. సంసిద్ధిశబ్దము మోక్షార్థ మని గ్రహించి స్వధర్మనిష్ఠత్వమాత్రంబున నది లభించునెడఁ దదర్థమై సన్న్యాసాదివిధానం బనర్థకం బగు నని తలంచి శంకించుచున్నాఁడు ఏమి ఇత్యాదిగా. తావన్మాత్రమున సాక్షాన్మోక్షముగాని జ్ఞాననిష్ఠాయోగ్యత గాని లే దని పరిహరించుచున్నారు కా దని. అప్పు డెట్లు స్వధర్మనిష్ఠునకు సంసిద్ధి యని యడుగుచున్నాఁడు ఎట్లు మఱి అని. ఉత్తరార్ధముచే నుత్తరముఁ జెప్పుచున్నారు స్వక ర్మేత్యాదిగా. దాని వినుము—ఆప్రకారము నేకాగ్రచిత్తుఁడవై విని నిశ్చయించుకొను మని యర్థము.

హ. *

శం. ఇట్లు బ్రాహ్మణాదులకు నియమంబునఁ గర్తవ్యము లగు శమాదికర్మములను తదుపలక్షితములును " యజ్ఞో దానం తపః కర్మ న త్యాజ్యం కార్య మేవ తత్ " అని చెప్పఁబడినవియు నగు శ్రౌతస్మార్తములను ఉపదేశించి సత్త్వశుద్ధికొఱకవి యీశ్వరార్పణబుద్ధిచేఁ గర్తవ్యము లని బోధించుటకై ప్రవృత్తి గలుగుటకు ఫలమును వర్ణించుచున్నాఁడు.—నరః=ముముక్షువు అధికారి యగు బ్రాహ్మణాది పురుషుఁడు; స్వేస్వేకర్మణి=శమోదమ ఇత్యాదిగా విభజించి ప్రదర్శిత మగు తనతన కర్మమునందు, శమాదికమునందును శ్రౌతస్మార్తమునందును; అభిరతః=నియమముచేఁ బరినిష్ఠితుఁడై; యథావిధి నాకర్మముల ననుష్ఠించుటచేఁ గడుగఁబడిన విరోధిపాపమలము గలవాఁ డగుచు, సంసిద్ధిమ్ = సత్త్వశుద్ధిని, సకృదుపదేశమాత్రముచేతనే ఆత్మతత్త్వావగతి గలుగు యోగ్యత యనెడుదాని; లభతే = పొందుచున్నాఁడు. ఓయీ! పెక్కండ్రు బ్రాహ్మణాదులు నిత్యమును గర్మములఁ జేయుచున్నారు, వారికిఁ దత్కర్మానుష్ఠానముచే నీవు చెప్పిన సత్త్వశుద్ధి కనఁబడదు. ఎట్లు కర్మమునం దభిరతుఁడు సత్త్వశుద్ధి నొందును? అని యాశంకింపఁగా, " యో వా ఏత దక్షరం గార్గ్య విదిత్వా అస్మిఁ ల్లోకే జుహోతి యజతే తప స్తప్యతే బహూని వర్షసహస్రా ణ్యన్తవ దేవాస్య త ద్భవతి" • అను న్యాయమువలనఁ బూర్వోక్త శమదమాదులు లేక కామసంకల్పాహంకారాభినివేశమునఁ గర్మములఁ జేయువానికి సత్త్వశుద్ధి సిద్ధింప దని బోధించుటకై చెప్పుచున్నాఁడు.—ముముక్షువు బ్రాహ్మణాది చెప్పిన శమదమాదులతోఁ గూడినవాఁడై, స్వకర్మనిరతః = తనకు

* దీని కీవ్యాఖ్యానము లేదు.

• గార్గీ! ఎవఁ డీయక్షరముఁ దెలియక పెక్కేలయేండ్లు హోమములు యజ్ఞములు తపస్సులు చేయునో వాని కది యంతవంతమే యగును.

శ్రుతిస్మృతులచే విహితం బగు వైదికకర్మమునందు నిరతుఁడు — నిష్ఠితుఁడు; సిద్ధిమ్=సత్త్వశుద్ధిని; యథా=ఏప్రకారముచేత; విన్దతి=పొందుచున్నాఁడో; తచ్ఛృణు=ఆప్రకారమును వినుము; విని యట్లనుష్ఠింప యత్నింపు మని యర్థము.

మ. ఇట్లు వర్ణములకు స్వభావజము లైన గౌణాఖ్యధర్మములు చెప్పఁబడినవి. ఇతరము లగు ధర్మములు గూడ శాస్త్రములం దుపదిష్టములు. అది చెప్పఁబడినది భవిష్యపురాణమునందు "ధర్మ శ్శ్రేయ స్సముద్దిష్టం శ్రేయో ఽభ్యుదయ లక్షణమ్। స తు పఞ్చవిధః ప్రోక్తో వేదమూల స్సనాతనః॥ వర్ణధర్మః స్మృత స్త్వేక ఆశ్రమాణాం తతః పరమ్। వర్ణాశ్రమ స్తృతీయస్తు గౌణో నైమిత్తిక స్తథా॥ వర్ణత్వ మేక మాశ్రిత్య యో ధర్మ స్సం ప్రవర్తతే। వర్ణధర్మ స్స ఉక్తస్తు మౌఞ్జ్యాద్యా మేఖలా యథా॥ యో గుణేన ప్రవర్తేత గుణధర్మ స్స ఉచ్యతే। యథా మూర్ధాభిషిక్తస్య ప్రజానాం పరిపాలనమ్॥ నిమిత్త మేక మాశ్రిత్య యో ధర్మ స్సం ప్రవర్తతే। నైమిత్తిక స్స విజ్ఞేయః ప్రాయశ్చిత్త విధి ర్యథా" * అని. ఇట నధికారము ధర్మము. చతుర్విధధర్మముఁ జెప్పుచున్నాఁడు హారీతుఁడు. "అథా ఽఽశ్రమిణాం పృథ గ్ధర్మో విశేషధర్మ స్సమానధర్మః కృత్స్నధర్మశ్చ, పృథ గాశ్రమానుష్ఠానా త్పృథ గ్ధర్మో యథా చాతుర్వర్ణ్యధర్మః, స్వాశ్రమవిశేషానుష్ఠానా ద్విశేష ధర్మో యథా నైష్ఠికయాయావరా ఽనుజ్ఞాయికచాతురాశ్రమ్యసిద్ధానామ్। సర్వేషాం య స్సమానో ధర్మ స్స సమానధర్మో నైష్ఠికః కృత్స్నధర్మః" అని. నైష్ఠికుఁడు—బ్రహ్మచారివిశేషము. యాయావరుఁడు—గృహస్థవిశేషము. అనుజ్ఞాయికుఁడు—వానప్రస్థవిశేషము. చాతురాశ్రమ్యసిద్ధుఁడు—యతివిశేషము. సర్వేషామ్—సర్వవర్ణములకును సర్వాశ్రమములకును. అందు మొదటిది ♦ మహాభారతమునందుఁ జెప్పఁబడినది. "ఆనృశంస్య మహింసాచా ఽప్రమాద స్సంవిభాగితా। శ్రాద్ధకర్మా ఽఽతిథేయంచ

---

* ధర్మము శ్రేయ మని చెప్పఁబడినది. శ్రేయ మభ్యుదయరూపము. వేదమూలము సనాతన మగు నాధర్మ మైదువిధములు. వర్ణధర్మము ఆశ్రమధర్మము వర్ణాశ్రమధర్మము గౌణము నైమిత్తికము అని. ఒకవర్ణమును మాత్రమే యాశ్రయించి యేధర్మము ప్రవర్తించుచున్నదో అది వర్ణధర్మము, ఉపనయనమువలె. ఏది యాశ్రమము నాశ్రయించి ప్రవర్తించుచున్నదో అది యాశ్రమధర్మము, భిక్షాదండాదులవలె. వర్ణమును ఆశ్రమమును ఆశ్రయించి యేది ప్రవర్తించునో అది వర్ణాశ్రమధర్మము, మౌంజి మొదలగు భిన్నము లయిన మేఖలలువలె. గుణమును బట్టి యేది ప్రవర్తించుచున్నదో అది గుణధర్మము, మూర్ధాభిషిక్తునకుఁ బ్రజాపాలనమువలె. ఒకానొకనిమిత్తము నాశ్రయించి ప్రవర్తించునది నైమిత్తికము, ప్రాయశ్చిత్తమువలె.

♦ సమానధర్మము.

సత్య మక్రోధ ఏవచ॥ స్వేషు దారేషు సంతోష శ్శౌచం నిత్యానసూయతా। ఆత్మ జ్ఞానం తితిక్షాచ ధర్మ స్సాధారణో నృప.* ” అని. సర్వాశ్రమసాధారణమో ము న్నుదాహరింపఁబడినది. నిష్ఠ యనఁగా సంసారసమాప్తి, తత్ప్రయోజనము నైష్ఠి కము, మోక్షహేతు వగు నాత్మజ్ఞానోత్పత్తికిఁ బ్రతిబంధకము లగు ప్రత్యవాయముల పరిహారముకొఱకు నిష్కామకర్మానుష్ఠానము కృత్స్నధర్మ మని యర్థము. ఆశ్రమ ములును శాస్త్రములందు నాలుగు చెప్పఁబడినవి. అట్లు గౌతముఁడు—త స్యాశ్రమ వికల్ప మేకే బ్రువతే బ్రహ్మచారీ గృహస్థో భిక్షు ర్వైఖానసః” అని. ఆపస్తం బుఁడు.—“చత్వార ఆశ్రమా గార్హస్థ్య మాచార్య కులం మౌనం వానప్రస్థ మితి తేషు సర్వేషు యథోపదేశ మవ్యగ్రో వర్తమానః క్షేమం గచ్ఛతి” అని. వసి ష్ఠుఁడు.—“చత్వార ఆశ్రమా బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ పరివ్రాజకా స్తేషాం వేద మధీత్య వేదౌ వేదాన్వా ఽవిశీర్ణ బ్రహ్మచర్యో యమిచ్ఛే త్తమావసేత్” అని. ఇట్లు వారికిఁ బృథగ్ధర్మములును ఉపదేశింపఁబడినవి. అట్లు ఫలము గూడ అజ్ఞు లకుఁ జెప్పఁబడినది. అట్లు మనువు.—“ శ్రుతిస్మృత్యుదితం ధర్మ మనుతిష్ఠ న్హి మా నవః। ఇహ కీర్తి మవాప్నోతి ప్రేత్య చా ఽను త్తమం సుఖమ్ ” అని. అను త్తమం సుఖ మ్మనుట యథాప్రాప్త తత్తత్ఫలోపలక్షణార్థము. ఆపస్తంబుఁడు.—“ సర్వవర్ణానాం స్వధర్మానుష్ఠానే పర మపరిమితం సుఖం తతః పరివృత్తౌ కర్మఫలశేషేణ జాతిం రూపం వర్ణం బలం వృత్తం మేధాం ప్రజ్ఞాం ద్రవ్యాణి ధర్మానుష్ఠాన మితి ప్రతిప ద్యన్తే ” అని. గౌతముఁడు.—“ వర్ణా ఆశ్రమాశ్చ స్వధర్మనిష్ఠాః ప్రేత్య కర్మఫల మనుభూయ తత శ్శేషేణ విశిష్ట దేశజాతి కులరూపాయు శ్శ్రుత వృత్తవిత్త సుఖ మేధసో జన్మ ప్రతిపద్యన్తే విష్వఞ్చో విపరీతా వినశ్యన్తి ” అని. ఇట శేషశబ్దముచే భుక్త మగు జ్యోతిష్టోమాదికర్మముకంటె నతిరిక్త మగు చిత్రాదికర్మము అనుశయ మను పేరు గలది చెప్పఁబడుచున్నది, కాని పూర్వకర్మమున నేకదేశము కా దని సిద్ధాంతితము “ కృతా త్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేత మనేవంచ”♦ అను స్థలమున. భట్టులచేతనుం జెప్పఁబడినది “గౌతమీయే ఽపి త చ్ఛేష స్తస్మా చ్చిత్రా ద్యపేక్షయా” ⁋ అని. విష్వఞ్చః—సర్వతోగాములు యథేష్టచేష్టులు విపరీతాః

---

* అక్రూరతయు అహింసయు ప్రమాదము లేకుండుటయు దానమును శ్రాద్ధమును అతిథిసత్కార మును సత్యమును క్రోధము లేమియు స్వభార్యయందుఁ దృప్తియు శౌచమును అసూయలేమియు ఆత్మ జ్ఞానంబును తితిక్షయు—ఇది సర్వవర్ణములకును సాధారణము లైన ధర్మములు.

♦ చేసినకర్మము క్షయించునపుడు అనుశయము గలవాఁడై జన్మమునకు వచ్చుచున్నాఁడు, శ్రుతి స్మృతులవలన ఎట్లు పోయెనో అందులకు విపరీతముగా బ్ర. సూ. అ. ౩. పా. ౧. సూ. ౮.

⁋ గౌతమ వాక్యమునందును శేష మనఁగా చిత్రాదికర్మాపేక్షచేతనే శేష మని యర్థము.

నరకాదులందు జన్మమునొంది వినశ్యన్తి—కృమికీటాదిభావమున సర్వపురుషార్థముల నుండి భ్రష్టు లగుచున్నా రని యర్థము. హారీతుఁడు.—"కామ్యైః కేచి ద్యజ్ఞదానై స్తపోభి ర్లబ్ధ్వా లోకాన్ పునరాయాన్తి జన్మ। కామై ర్ముక్తా స్సత్య యజ్ఞస్సుదానా స్తపో నిష్ఠా అక్షయా న్యాన్తి లోకాన్" అని. ఇటఁ గామనాసదసద్భావమువలనఁ గలుగు ఫలభేద ముచూపఁబడినది భవిష్యపురాణమందు.—"ఫలం వినాప్యనుష్ఠానం నిత్యానా మిష్యతే స్ఫుటమ్। కామ్యానాం స్వఫలార్థం తు దోషఘాతార్థ మేవ తు॥ నైమిత్తికానాం కరణే త్రివిధం కర్మణాం ఫలమ్। క్షయం కేచి దుపాత్తస్య దురితస్య ప్రచక్షతే॥ అనుత్పత్తిం తథా చా న్యే ప్రత్యవాయస్య మన్వతే। నిత్యాం క్రియాం తథాచా ఽన్యే అనుషఙ్గఫలాం విదుః" అని. అన్యే—ఆపస్తంబాదులు తద్యథా ఽఽమ్రే ఫలార్థే నిమితే ఇత్యాదివచనములచే ఆనుషంగికఫలము నిత్యకర్మ మని పలికిరి. శ్రుతియును.—"త్రయో ధర్మ స్కన్ధా యజ్ఞో ఽధ్యయనం దాన మితి ప్రథమ స్తప ఏవ ద్వితీయో బ్రహ్మచా ర్యాచార్యకులవాసీ తృతీయో ఽత్యన్త మాత్మాన మాచార్యకులే ఽవసాదయన్" అని గృహస్థ వానప్రస్థ బ్రహ్మచారులఁ బ్రతిపాదించి "సర్వ ఏతే పుణ్యలోకా భవన్తి" అని వారి కంతఃకరణశుద్ధి లేనపుడు మోక్షాభావముఁ జెప్పి శుద్ధాంతఃకరణు లగు వీరికే పరివ్రాజకభావంబున జ్ఞాననిష్ఠచే మోక్షముఁ జెప్పుచున్నది "బ్రహ్మసంస్థో ఽమృతత్వమేతి" అని. ఇట్లుండుటవలన బ్రహ్మచారిగాని గృహస్థుఁడు గాని వానప్రస్థుఁడు గాని ముముక్షువు ఫలాభిసంధిని ద్యజించి భగవదర్పణబుద్ధిచే.—స్వే స్వే—తనది తనది తత్తద్వర్ణాశ్రమవిహిత మైనది, కాని స్వేచ్ఛామాత్రకృతము కాదు, అట్టి; కర్మణి=శ్రుతిస్మృత్యుక్త మగు కర్మమునందు; అభిరతః=చక్కఁగా ననుష్ఠానపరుఁడు; సంసిద్ధిమ్=దేహేంద్రియసంఘాతమునకు అశుద్ధి నశించి సమ్యగ్జ్ఞానోత్పత్తియోగ్యతను; లభతే=పొందుచున్నాఁడు; నరః = వర్ణాశ్రమాభిమాని యగు మనుష్యుఁడు, కర్మకాండమునందు మనుష్యుఁడే యధికారి యగుటవలన, దేవాదులకు వర్ణాశ్రమాభిమానిత్వము లేమివలన యుక్తమే తద్ధర్మములం దనధికారము. వర్ణాశ్రమాభిమానాపేక్ష లేని యుపాసనాదులందో అధికారము వారికిని గల దని సాధింపఁబడినది దేవతాధికరణమునందు. ఓయీ! బంధహేతువు లగు కర్మముల కెట్లు మోక్షహేతుత్వము? ఉపాయవిశేషమువలన నని చెప్పుచున్నాఁడు.—స్వకర్మనిరతః; సిద్ధిమ్—చెప్పినలక్షణము గలదాని; యథా=ఏప్రకారముచేత; విన్దతి=పొందుచున్నాఁడో; తత్ శృణు. విని యాప్రకారము నెఱుంగు మని యర్థము.

శ్రీ. ఇట్టి బ్రాహ్మణాదికర్మమునకు జ్ఞానహేతుత్వముఁ జెప్పుచున్నాఁడు.— స్వస్వాధికారవిహిత మగు కర్మమునందు, అభిరతః=పరినిష్ఠితుఁ డగు, నరుఁడు, సంసిద్ధిమ్=జ్ఞానయోగ్యతను; లభతే. కర్మములవలన జ్ఞానప్రాప్తిప్రకారముఁ జెప్పుచున్నాఁడు సార్ధశ్లోకముచేత.—స్వకర్మపరినిష్ఠితుఁడు, యథా = ఏప్రకారముచేత; తత్త్వజ్ఞానము నొందుచున్నాఁడో ఆప్రకారమును వినుము.

ప. ఇఁక బ్రాహ్మణాదికర్మము జ్ఞానహేతు వని చెప్పుచున్నాఁడు.—స్వే స్వే కర్మణి=తనతన వర్ణోచితకర్మమునందు; అభిరతః=శ్రద్ధచేఁ బ్రవృత్తుఁడై; నరః; సంసిద్ధిం లభతే. స్వకర్మనిరతుఁ డగు పురుషుఁడు; యథా=ఏప్రకారముచేత; సిద్ధి నొందునో దాని నాచే వక్ష్యమాణమును వినుము.

రా స్వే స్వే కర్మణి—యథోక్త మయిన కర్మమునందు; అభిరతో నరః; సంసిద్ధిమ్=పరమపదప్రాప్తిని; లభతే. స్వకర్మనిరతః; యథా; సిద్ధిం విన్దతి = పరమపదము నొందుచున్నాఁడో. అట్లు వినుము.

యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః. ४६

భా. యతః = ఎవ్వనివలన; ప్రవృత్తిః=ఉత్పత్తి, లేక, చేష్ట; అంతర్యామి యగు నేయీశ్వరునివలన, భూతానామ్=ప్రాణులకు; అగునో; యేన=ఏయీశ్వరునిచేత; సర్వమ్=సమస్త మయిన; ఇదమ్=ఈ జగత్తు; తతమ్=వ్యాపింపఁబడినదో; స్వకర్మణా=పూర్వోక్త మయిన స్వకర్మముచేత; ప్రతివర్ణమును, తమ్=ఆయీశ్వరుని; అభ్యర్చ్య=పూజించి, ఆరాధించి; కేవలము జ్ఞాననిష్ఠాయోగ్యతాలక్షణం బగు, సిద్ధిమ్=సిద్ధిని; విన్దతి=పొందుచున్నాఁడు; మానవః=మనుష్యుఁడు.

సర్వభూతములకు నుత్పత్తి యే యీశ్వరునివలనఁ గలుగుచున్నదో వానికి సర్వవ్యాపారములును అంతర్యామి యగు నెవ్వనివలనఁ గలుగుచున్నవో యీ సమస్తజగత్తును ఏయీశ్వరునిచే వ్యాపింపఁబడి యున్నదో అట్టి యీశ్వరుని స్వకర్మముచే నారాధించి మనుష్యుఁడు జ్ఞాననిష్ఠాయోగ్యత యను సిద్ధిని బొందుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. ఆప్రకారమునే స్ఫుటీకరించుచున్నారు యత ఇత్యాదిగా. యత శ్శబ్దార్థమును ఎవ్వనివలన అని చెప్పినదాని వ్యక్తీకరించుచున్నారు అంతర్యామి ఇత్యాదిగా. ప్రాణులయుత్పత్తి యేయీశ్వరునివలననో, వానిచేష్టయును ఏయంత ర్యామివలననో, ఎవ్వనిచే సర్వంబును వ్యాపింపఁబడినదో మృత్తుచే ఘటాదికమువలె, కార్యమునకుఁ గారణాతిరిక్తస్వరూపము లేమివలన, అట్టియీశ్వరుని స్వకర్మముచే నభ్యర్చించి మానవుఁడు సిద్ధినొందుచున్నాఁ డని సంబంధము. బ్రాహ్మణాదులకు యథోక్తకర్మనిష్ఠచే సాక్షాన్మోక్షము లభింపనేరదు కదా! అది జ్ఞానైకలభ్య మగుట వలన, మత్తే మనఁగా, తన్నిష్ఠు లయి శుద్ధబుద్ధులును కర్మములందు ఫలముఁ గాంచని వారును ఈశ్వరప్రసాదముచే వివేకవైరాగ్యము లొందినవారును సన్న్యాసులునై జ్ఞాననిష్ఠాయోగ్యతఁ జెందినవారికి జ్ఞానప్రాప్తిచే మోక్ష మగు నను నభిప్రాయము తోఁ జెప్పుచున్నారు కేవలము ఇత్యాదిగా.

హ. యతః=ఎవ్వనివలన; ప్రవృత్తిః=ఉత్పత్తి; భూతానామ్ = పృథివ్యాదు లకు. యేన సర్వ మిదమ్, తతమ్=వ్యాప్తమో. తన దైనకర్మముచేత, తమ్=ఆ యీ శ్వరుని; అభ్యర్చ్య=ఆరాధించి; సిద్ధిమ్=మోక్షమును; విన్దతి = పొందుచున్నాఁడు; మానవః=మనుష్యుఁడు.

శం. "బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః, కర్తా క్రియాణాం స సయుజ్యతే క్రతుః స ఏవ తత్కర్మ ఫలంచ తస్య। స్రుగాది యత్సాధన మప్యశేషం హరే ర్నకించి ద్వ్యతిరిక్త మస్తి" ఇత్యేత చ్ఛ్రుతిస్మృత్యుక్తరీతిచేఁ గర్తృకర్మ తత్సాధనస్రుక్స్రు వచరుపురోడాశాగ్న్యాదులం దవ్యాహత మగు బ్రహ్మదృష్టిచేఁ గర్మముల ననుష్ఠించు చుండు ముఖ్యాధికారి యగు విద్వాంసునకు ఇష్టానిష్టత్వ మిత్రామిత్రత్వ దుష్టా దుష్టత్వాదివిషమబుద్ధి క్రమంబున నశించును, తన్నాశమువలన రాగద్వేషాదిదోష ములు నశించును, తన్నాశమువలన అహం మమే త్యభిమానదోషములు నశిం చును, ఆ రజస్తమోదోషము లన్నియుఁ గ్రమంబున నిశ్శేషముగా నశించినపుడు సత్త్వము తనయంతనే ప్రసన్న మగు నని బోధించుటకై సర్వంబును సగుణ బ్రహ్మమాత్రం బను దృష్టి గల పండితునకు అట్లు తదారాధనముసే చేయువానికి సత్త్వశుద్ధి సిద్ధించు నని చెప్పుచున్నాఁడు.—"జన్మా ద్యస్య యతః, యతో వా ఇ మాని భూతాని జాయన్తే" అని చెప్పినప్రకారమున, యతః=ఏమాయోపాధికబ్రహ్మ మువలన; భూతానామ్=ఆకాశాదులకును తత్కార్యములకును; ప్రవృత్తిః=ఉత్ప

త్తిహో, మృత్తువలన ఘటాదులకువలె; దేనివలన నిది సర్వంబును సముత్పన్నమో యని యర్థము. మఱియును, యేన=కారణభూత మయిన యేబ్రహ్మముచేత; తత్కార్య మగు, ఇదం సర్వమ్=ఈ జగత్తు సర్వంబును; తతమ్=వ్యాప్తమో, మృత్తుచే ఘటమువలె వెలుపలను లోపలను బూర్ణమై యున్నదో. తమ్=ఆ సర్వాత్మకుఁ డగు పరమాత్మను; స్రుక్స్రు వాగ్నిహోత్ర మంత్రతంత్రాదులం దంతటను బ్రహ్మదృష్టి గలవాఁడై, మానవః—అధికారి యగు విద్వాంసుఁడు; స్వకర్మణా—శ్రౌతస్మార్తాదికర్మము చేత సాత్త్విక మగు దానిచేత; అభ్యర్చ్య=శ్రద్ధాభక్తులతో నియమమునఁ బూజించి; అంతటను బ్రహ్మదృష్టియుఁ గావించి; సిద్ధిమ్=సత్త్వశుద్ధిలక్షణ మైన సిద్ధిని; విన్దతి= పొందుచున్నాఁడు, సత్త్వశుద్ధిని తత్ఫలభూత మయిన జ్ఞానసిద్ధిని బొందుచున్నాఁ డని యర్థము. యతః ప్రవృత్తిః యేన సర్వ మ్మను విశేషణద్వయము సర్వత్ర బ్రహ్మదృష్టి కర్తవ్య మని బోధించుటకై యే యని తెలియుచున్నది. ఇఁక మధ్యమాద్యధికారుల విషయమున.—"య స్సర్వేషు భూతేషు తిష్ఠ న్సర్వేభ్యో భూతేభ్యో ఽన్తరః" ఇత్యాది శ్రుత్యుక్తరీతిచే, యతః=ఎవ్వనివలన; భూతానామ్=బ్రహ్మాది స్తంబపర్యంతములకు; ప్రవృత్తిః=చేష్ట; సిద్ధించుచున్నదో; ఎవ్వఁడు సర్వమును బ్రవర్తింపఁజేయుచున్నాఁడో యని యర్థము. సర్వ మిదమ్ = సమస్త మయిన యీజగత్తు; యేన= ఎవ్వనిచేత; తతమ్=వ్యాపింపఁబడినదో, ఎవ్వఁడు సర్వాత్మకుఁడో యని యర్థము. తమ్=అగ్నీంద్రాదిత్యాది దేవతారూపమున నున్న సర్వనియంతను ఆపరమేశ్వరుని; స్వకర్మణా; అభ్యర్చ్య=శ్రద్ధాభక్తులతో నగ్న్యాదిదేవతల నందఱను బరమేశ్వర బుద్ధిచేఁ బూజించి; తదనుగ్రహమున, మానవః=ముముక్షు వగు బ్రాహ్మణా ద్యధికారి; సిద్ధిమ్ = సత్త్వశుద్ధిని తత్ఫలభూత మగు జ్ఞానసిద్ధిని గ్రమమున; విన్దతి. అని యర్థము.

మ. యతః = మాయోపాధికచైతన్యానందఘనుఁడు సర్వజ్ఞుఁడు సర్వశక్తి యీశ్వరుఁడు ఉపాదానమును నిమిత్తమును నగు నేయంతర్యామివలన; ప్రవృత్తిః= ఉత్పత్తి, మాయామయము; స్వప్నరథాదులకుం బోలె, భూతానామ్=భవనధర్మములయిన యాకాశాదులకు, అగుచున్నదో; యేన=సద్రూపుఁడును స్ఫురణరూపుఁడు నగు నెవనిచే నొక్కనిచేత; సర్వమ్ = సమస్తమైన; ఇదమ్—ఈ దృశ్యజాతము మూఁడుకాలములయందును,తతమ్=వ్యాప్తమో, స్వాత్మయందే యంతర్భావితమో, కల్పితము అధిష్ఠానముకంటె ననతిరిక్త మగుటవలన. అట్లు శ్రుతి.—"యతో వా ఇమాని భూతాని జాయన్తే। యేన జాతాని జీవన్తి। యత్ప్రయ న్త్యభిసంవిశన్తి।

త ద్విజిజ్ఞాసస్వ । త ద్బ్రహ్మేతి " అని. ఇట యతః అని ప్రకృత్యర్థమునఁ బంచమి. యతః అనియు యేన అనియు నేకత్వము వివక్షితము. " ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్ । ఆనన్దా ద్ధ్యేవ ఖ ల్విమాని భూతాని జాయన్తే " అనునది దానికి నిర్ణయవాక్యము. " మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్ " ఇత్యాది శ్రుత్యంత రమువలన మాయోపాధి లభించుచున్నది. "య స్సర్వజ్ఞ స్సర్వవిత్" ఇత్యాది శ్రుత్యంతరమువలన సర్వజ్ఞత్వాదిలాభము. ఇట్లగుటవలన, శ్రౌతమే యీయర్థము భగవంతునిచేఁ బ్రకాశితము "యతః ప్రవ త్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్ " అని. తమ్ = అంతర్యామి యగు నాభగవంతుని; స్వకర్మణా—ప్రతివర్ణాశ్రమమును విహిత మగు దానిచేత; అభ్యర్చ్య=ఆరాధించి; తత్ప్రసాదముచే ఐకాత్మ్యజ్ఞాననిష్ఠా యోగ్యతాలక్షణం బగు, సిద్ధిమ్=అంతఃకరణశుద్ధిని; విన్దతి మానవః. దేవాదులో యుపాసనామాత్రముచే నని భావము.

శ్రీ. దానినే చెప్పుచున్నాఁడు.—యతః=అంతర్యామి యగు నేపరమేశ్వ రునివలన; భూతానామ్=ప్రాణులకు; ప్రవృత్తిః=చేష్ట; అగుచున్నదో. యేన=కారణ రూపుఁ డగు నెవనిచేత; సర్వ మిదమ్=ఈ ప్రపంచము; తతమ్=వ్యాప్తమో. తమ్= ఆ యీశ్వరుని; స్వకర్మణా; అభ్యర్చ్య = పూజించి; సిద్ధిని బొందుచున్నాఁడు మనుష్యుఁడు.

ప. యతః=అంతర్యామిరూపుఁ డగు నెవ్వనివలన; భూతానామ్=దేహు లకు; చేష్ట, కలుగుచున్నదో. యేన = కారణాత్ముఁ డగు నెవనిచే; ఇదమ్—దృశ్య మాన మగు; సర్వమ్; తతమ్=విస్తారితమో; తమ్ = ఆ యీశ్వరుని; స్వకర్మణా = స్వవర్ణాశ్రమోచిత మగు కర్మముచేత; అభ్యర్చ్య=ఆరాధించి; మానవః; సిద్ధిమ్; విన్దతి=పొందుచున్నాఁడు. ఈ యర్థమునందు మున్ను పెక్కు శ్రుతు లుపన్యసింపఁబడి యున్నవి.

రా. యతః; భూతానామ్; ఉత్పత్త్యాదిప్రవృత్తియో; మఱియు, యేన సర్వమిదం తతమ్. స్వకర్మణా; తమ్—అట్టి నన్ను ఇంద్రా ద్యంతరాత్మనై యున్నవాని; అభ్యర్చ్య; మత్ప్రసాదమునవలన మత్ప్రాప్తిరూప మగు సిద్ధిని; విన్దతి మానవః. నావలననే సర్వము నుత్పన్న మగుచున్నది, నాచేతనే యిది యంతయుఁ దత మని మున్నే చెప్పఁబడినది, " అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా, మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనఞ్జయ, మయా తత మిదం సర్వం జగ దవ్యక్త

మూ_ర్తినా । మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్, అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే” ఇత్యాదులందు.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్. ४८

భా. అందువలన.—శ్రేయాన్ = ప్రశస్యతరము; స్వధర్మః = తనదైనధర్మము; విగుణః = విగుణ మైనను, అని యపిశబ్దము ద్రష్టవ్యము; స్వనుష్ఠితాత్ = చక్కఁగా ననుష్ఠింపఁబడిన; పరధర్మాత్ = ఇతరునిధర్మముకంటె. స్వభావనియతమ్ = స్వభావముచే నియతము, స్వభావజ మని యేది చెప్పఁబడినదో అదియే స్వభావనియత మని చెప్పఁబడుచున్నది; ఎట్లు విషజాత మగు క్రిమి విషముచే దోషము నొందదో అట్లు స్వభావనియత మగు, కర్మ=కర్మమును; కుర్వన్=చేయుచు; కిల్బిషమ్=పాపమును; న ఆప్నోతి = పొందఁడు.

అందువలన యథావిధిగా ననుష్ఠించిన పరధర్మముకన్నను స్వధర్మము గుణహీన మైనను దాని యథాశక్తి ననుష్ఠించుటయే మేలు. స్వభావనియత మగు కర్మము ననుష్ఠించుటచేఁ బుణ్యముఁ కలుగుఁ గాని పాపము కలుగ దని తాత్పర్యము.

ఆ. స్వధర్మానుష్ఠానము బుద్ధిశుద్ధ్యాదిద్వారమున మోక్షపర్యవసాయి యగుటవలనఁ దదనుష్ఠాన మావశ్యక మని చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. ఓయీ! యుద్ధాదిరూప మగు స్వధర్మమునే యాచరించువాఁడును హింసాధీన మగు పాపము నొందుచున్నాఁడు, అందువలన నెట్లు స్వధర్మము శ్రేయము? అనఁగాఁ జెప్పుచున్నారు స్వభా వేత్యాదిగా. తన దైన వర్ణాశ్రమమును నిమిత్తీకరించి విహితము స్వభావజ మని క్రిందఁ జెప్పఁబడిన దని చెప్పుచున్నారు స్వభావజము ఇత్యాదిగా. యుద్ధాత్మకము నైనను విహితకర్మముఁ జేయువాఁడు పాపము నొందఁ డనుటకు దృష్టాంతము చెప్పుచున్నారు ఎట్లు ఇత్యాదిగా.

హ. శ్రేయాన్ = ప్రశస్యతరము; విగుణః = గుణరహిత మైనను; స్వనుష్ఠితాత్ = శోభనముగా — సమగ్రముగా అనుష్ఠిత మగు; పరధర్మముకన్నను స్వధర్మము విగుణ మైనను శ్రేయము. స్వభావనియతం కర్మ కుర్వన్ న ఆప్నోతి,

కిల్బిషమ్ = పాపమును. స్వధర్మము వానికి దోషము చేయదు. విషజాత మగు కృమికి సహజ మగు విషము మరణము కలిగింపదు.

శం. ఓయీ! "బ్రాహ్మణస్య భిక్షణే నిమిత్త మాచార్యో యజ్ఞో వివాహః" * అని చెప్పఁబడుటవలన, చిత్తశుద్ధిని తత్ఫలమును పొందఁ గోరునట్టి ముముక్షువునకు యజ్ఞాదికము ప్రతిగ్రహద్రవ్యైకసాధ్య మగుటవలన ప్రతిగ్రహము పాపహేతు వగుటవలన ప్రతిగ్రహద్రవ్యముచేఁ జేయఁబడు యజ్ఞాదులకంటె బ్రహ్మచారివలెఁ బ్రతిగ్రహము చేయక శుద్ధవృత్తి నునికియె శోధకము నిష్పాపంబు నగుచున్నది. అట్లు యుద్ధము హింసాప్రధాన మగుటవలన తత్సాధ్య మగు ద్రవ్యముచే రాజసూయాదియాగానుష్ఠానముకంటె శుద్ధికాముఁ డగు క్షత్త్రియునకుఁ బ్రతిగ్రహభీరు వగు బ్రాహ్మణునకువలె శుద్ధవృత్తి నునికియె శోధకము నిష్పాపంబు నగుచున్నది. అని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు.—పరధర్మాత్ = పరుఁడు—జాతిచేత వర్ణముచేత ఆశ్రమముచేతఁ గాని తనకంటె భిన్నుఁడు, తనకంటె విలక్షణుఁడు, వానియొక్క—ధర్మముకంటె — ఆచారముకంటె; స్వనుష్ఠితాత్ = అంగలోపరహితముగాఁ జక్కగా నాచరింపఁబడినదానికంటె; విగుణః = స్వలక్షణపుష్కలత లేనిదైనను, దోషవంతమైనను; బ్రాహ్మణునకుఁ గాని క్షత్త్రియునకుఁ గాని ఇతరునకుఁ గాని, స్వధర్మః = తనధర్మమే; శ్రేయాన్ = శ్రేష్ఠము, నిశ్శ్రేయసమునకు సాధన మగుచున్నది, కాని చక్కగా ననుష్ఠితమైనను బరధర్మము కాదు, అది తన కవిహిత మగుటవలన నని యర్థము. దానినే స్పష్టీకరించుచున్నాఁడు.— బ్రాహ్మణున కధికారము ప్రవచనయాజనప్రతిగ్రహములందు, క్షత్త్రియునకు యుద్ధమునందు, కాన వానియందుఁ గాని యుద్ధమునందు హింసయందుఁ గాని దోషము లేదు. కావున, స్వభావనియతమ్=స్వభావము— తత్తజ్జాతి, దాని నుద్దేశించి నియతము—శాస్త్రముచే విహితము, అట్టి; కర్మ — ప్రతిగ్రహమును తదుపార్జితద్రవ్యముచే యాగాద్యనుష్ఠానమును బ్రాహ్మణుఁడును, యుద్ధాదిలక్షణ మగు కర్మమును తదుపార్జితద్రవ్యముచే యాగాద్యనుష్ఠానమును క్షత్త్రియుఁడును; కుర్వన్; కిల్బిషమ్ = చిత్తశుద్ధిప్రతిబంధకమును; నాప్నోతి. తనజాతికిని దనవర్ణమునకును దనయాశ్రమమునకును విహిత మగు ధర్మము ననుష్ఠించుటచేఁ బురుషుఁడు పాపము నొందఁ డని యర్థము.

మ. ఎందువలన స్వధర్మమే మనుష్యులకు భగవత్ప్రసాదహేతువో అందువలన —పరధర్మాత్ = పరధర్మముకంటె; స్వనుష్ఠితాత్ = చక్కగా ననుష్ఠింపఁ

* బ్రాహ్మణునకు యాచించుటయందు నిమిత్తము ఆచార్యుఁడు యజ్ఞము వివాహము — అచార్యాదులకొఱకు యాచనము.

బడినదానికంటెను; శ్రేయాన్ = ప్రశస్యతరము; స్వధర్మః=తనధర్మము; విగుణః = చక్కఁగా ననుష్ఠింపఁబడినది కాని దైనను. అందువలన క్షత్త్రియుఁడ వగు నీకు స్వధర్మ మగు యుద్ధాదికమే యనుష్ఠేయము కాని పరధర్మ మగు భిక్షాటనాదికము కా దని యభిప్రాయము. ఓయీ! స్వధర్మ మైనను యుద్ధాదికము బంధువధాది ప్రత్యవాయ హేతు వగుటవలన ననుష్ఠేయము కా దనఁగా, అట్లు కా దని చెప్పుచున్నాఁడు. — స్వభావనియతమ్ = పూర్వోక్తము శౌర్యం తేజ ఇత్యాదిస్వభావజ మగు; కర్మ = యుద్ధాదికర్మమును; కుర్వన్; కిల్బిషమ్ = పాపమును బంధువధాది నిమిత్తమును; నాప్నోతి = పొందఁడు. అట్లు పూర్వము వ్యాఖ్యాతము " సుఖదుఃఖే సమే " అనుచోట, విహితజ్యోతిష్టోమాంగపశుహింసకుం బోలె విహితయుద్ధాంగ బంధుహింసకును ప్రత్యవాయహేతుత్వము లేమివలన. అట్లు చెప్పఁబడినది పూర్వము.

శ్రీ. స్వకర్మణా అను విశేషణమునకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.— విగుణ మైనను స్వధర్మము చక్కఁగా ననుష్ఠితముకన్నను గూడ పరధర్మముకంటె, శ్రేయాన్ = శ్రేష్ఠము. బంధువధాదియుక్త మగు యుద్ధాదిస్వధర్మముకంటె భిక్షాట నాదిపరధర్మము శ్రేష్ఠ మని తలంపవలదు. ఎందువలన ననఁగా, స్వభావనియతమ్= పూర్వోక్త మగు స్వభావముచే నియతము — నియమమునఁ జెప్పఁబడినట్టి; కర్మ; కుర్వన్; కిల్బిషం నాప్నోతి.

ప. ఇఁక స్వధర్మమును ప్రశంసించుటకై చెప్పుచున్నాఁడు.—సమ్యగను ష్ఠితముకన్నను గూడ పరధర్మముకన్నను, విగుణః = లౌకికదృష్టిచే గుణరహిత మై నను; స్వధర్మః; శ్రేయాన్ = శ్రేయస్కరము. అట్లు హింసాప్రధాన మగుటచే విగుణ మైనను క్షాత్త్రధర్మము, ఉత్కృష్ట మగు పరధర్మముకంటె బ్రాహ్మణధర్మము కంటె శ్రేయము. ఎందువలన ననఁగా. స్వభావముచే పూర్వోక్తముచే నియతము— నియమమున విహిత మగు కర్మమును జేయువాఁడు, కిల్బిషమ్ = పాతకమును; పొందఁడు.

రా. ఇట్లు కర్తృత్వాదికము విడువఁబడి మదారాధనరూప మగు, స్వధర్మః = తనచేతనే గ్రహించుటకు యోగ్య మగుధర్మము, ప్రకృతిసంసృష్టుఁడగు పురుషునకు ఇంద్రియవ్యాపారరూపము, కర్మయోగాత్మక మగు ధర్మము గదా సుక రం బగుచున్నది. అందువలన కర్మయోగాఖ్య మగు స్వధర్మము విగుణ మైనను, పర

ధర్మాత్ = ఇంద్రియజయమునందు నిపుణుఁడైనపురుషునిధర్మ మగు జ్ఞానయోగము కంటె, సకలేంద్రియనియమనరూప మగుటచే ప్రమాదసహితముకంటె; ఒకానొకప్పుడు స్వనుష్ఠిత మైనదానికంటె; శ్రేయాన్. దానినే యుపపాదించుచున్నాఁడు.— ప్రకృతిసంసృష్టునకు నింద్రియవ్యాపారరూప మగుటచే కర్మము స్వభావముననే నియత మగుటవలన, కర్మ కుర్వన్, కిల్బిషమ్ = సంసారమును; పొందఁడు, కర్మము ప్రమాదరహిత మగుటవలన. జ్ఞానయోగము సకలేంద్రియనియమనసాధ్య మగుటచేఁ బ్రమాదయుక్త మగుటవలనఁ దన్నిష్ఠుఁడుమాత్రము ప్రమాదమువలనఁ గిల్బిషము నొందినను బొందును. అందువలనఁ గర్మనిష్ఠయే జ్యాయం బని తృతీయాధ్యాయోక్తమును స్మరణకుఁ దెచ్చుచున్నాఁడు.

సహజం కర్మ కౌన్తేయ సదోష మపి న త్యజేత్
సర్వారమ్భా హి దోషేణ ధూమేనా ఽగ్ని రివా ఽఽవృతాః.

భా. స్వభావనియత మగు కర్మముఁ జేయువాఁడు విషజాత క్రిమివలెఁ గిల్బిషము నొందఁ డని చెప్పఁబడినది. పరధర్మో భయావహః అనియు, అనాత్మజ్ఞుఁడు నహి కశ్చిత్క్షణ మపి అకర్మకృత్తిష్ఠతి అనియుసు జెప్పఁబడినది. అందువలన.—సహజమ్ = సహ—జన్మముతోనే యుత్పన్నము; ఏది యది ? కర్మ = కర్మము, అట్టి సహజ మయినకర్మమును; కౌన్తేయ = అర్జునా! సదోష మపి = దోషయుక్తము నైనను, త్రిగుణాత్మక మగుటవలన; న త్యజేత్ = విడువఁగూడదు. సర్వారమ్భాః = ఆరంభింపఁబడుచున్నవి కావున ఆరంభములు, సర్వకర్మము లనుట, ప్రకరణమువలన; ఆరంభము లేవి గలవో స్వధర్మములును పరధర్మములును అవి యన్నియు; హి=ఏకారణమువలన, త్రిగుణాత్మకత్వ మిట కారణము, త్రిగుణాత్మకము లగుటవలన; దోషేణ = దోషముచేత; ధూమేన = సహజ మగు పొగచేత; అగ్ని రివ = నిప్పువలె; ఆవృతాః = ఆవరింపఁబడినవి. సహజం బగు కర్మమును స్వధర్మాఖ్యమును బరిత్యజించి పరధర్మము ననుష్ఠించినను దోషమునుండి ముక్తుఁడు కానే కానేరఁడు. భయావహముగూడ పరధర్మము. అజ్ఞునిచే నిశ్శేషముగాఁ గర్మము త్యజింపనుం దరము కాదు. అందువలన విడువఁగూడ దని యర్థము.

అర్జునా! స్వభావనియత మగు కర్మము దోషయుక్త మైనను దాని విడువఁగూడదు. ఏల యనఁగా త్రిగుణాత్మకము లగుటవలన సర్వకర్మములును స్వకర్మములును బరకర్మములును అగ్ని పొగతోఁ గూడియుండునట్లు దోషయుక్తము లయ్యే యున్నవి. కావున స్వధర్మమును విడిచి పరధర్మము ననుష్ఠించినను దోషము తప్పదు, అందువలన స్వధర్మమును విడువఁగూడ దని తాత్పర్యము.

శ్రీ. ఇందువలనఁ గూడ విహిత మగు కర్మము దోషవంత మైనను కర్తవ్యము ప్రకారాంతరము సంభవింపమివలన నని యుక్తానువాదపూర్వకముగాఁ జెప్పుచున్నారు స్వభా వేత్యాదిగా. విషజం బగు కృమి విషనిమిత్తంబున మరణము నొందదు కదా! అట్లధికృతుం డగు పురుషుఁడు దోషవంతము నైనను విహిత కర్మముఁ జేయుచుఁ బాపము నొందఁ డని చెప్పఁబడిన దని యర్థము. అప్పుడు దోషరహిత మైన భిక్షాటనాదికమునే యందఱు ననుష్ఠింతురు గాక, అందువలనఁ బాపము గలుగు నను శంక లే దని యాశంకించి చెప్పుచున్నారు ప రేత్యాదిగా. అప్పుడు పాపప్రాప్తిశంకఁ బరిహరించుటకై యందఱును గర్మనిష్ఠనే విడుతురు గాక యని యాశంకించి జ్ఞానము లేమివలన శక్యము గా దని చెప్పుచున్నారు అనాత్మజ్ఞుఁడు ఇత్యాదిగా. ప్రకారాంతరము సంభవింపమిచేఁ గలిగినఫలముఁ జెప్పుచున్నారు అందువలన నని. సహజాయ తే—కూడఁ బుట్టినది స్వభావనియత మగు నిత్యకర్మము, అది విహిత మగుటవలన నిర్దోష మైనను హింసాత్మక మగుటచే సదోష మనుటకు హేతువుఁ జెప్పుచున్నారు త్రిగు ణేత్యాదిగా. సత్త్వాదిగుణత్రయారబ్ధ మగుటచే హింసాదిదోషయుక్త మైనను విహితకర్మము త్యాజ్యము కా దని యర్థము. కర్మములు దోషవంతము లనుటను ప్రపంచించుచున్నారు స ర్వేత్యాదిగా. ఆరంభ శబ్దమునకుఁ గర్మవ్యుత్పత్తిచే స్వపర సర్వకర్మార్థత్వమునందుఁ గర్మములు ప్రకృతము లగుటను హేతువుగాఁ జెప్పుచున్నారు ప్రకరణమువలన నని. దోషే ణేత్యాదిభాగ మునకు వ్యాఖ్యానముఁ జేయుచున్నారు ఆరంభములు ఇత్యాదిగా. సర్వకర్మములును దోషావృతము లనుటకు హి శబ్దోపాత్త మగు హేతువుఁ జెప్పుచున్నారు త్రిగుణాత్మకత్వ సి .మ స్వభావనియత మగు కర్మము దోషవంత మగుటవలనఁ దత్త్యాగద్వారమునఁ బరధర్మము నవలంబించువానికిని దోషమునుండి విముక్తియే సంభవింపదు, పరధర్మము ననుష్ఠించుటయు శక్యము గాదు, భయావహ మగుటవలన. ఇఁకఁ గర్మము నిశ్శేషముగా విడుచుటయు నలవి కాదు, అజ్ఞన కశేషకర్మత్యాగ

మనుపపన్న మగుటవలన. అందువలన సహజం బగుకర్మము సదోష మైనను త్యాజ్యము కా దని వాక్యార్థముఁ జెప్పుచున్నారు సహజంబు ఇత్యాదిగా.

భా. ఏమి యశేషముగా విడువ శక్యము గాదు కర్మ మని విడువఁ గూడదా ? లేక, సహజ మగుకర్మమును త్యజించిన దోష మగు ననియా ? ఏమి దీనివలన ? అశేషముగా విడువ నశక్య మనియే సహజ మగుకర్మము త్యాజ్యము కాదేని అప్పుడు అశేషత్యాగమునందు గుణమే యగు నని సిద్ధ మగుచున్నది. సత్యము. ఇట్లశేషత్యాగమే యుపపన్నము కా దందు వేని. ఏమి నిత్యప్రచలితుఁ డాపురుషుఁడు ? సాంఖ్యులకు గుణములవలె. లేక, క్రియయే కారకమా ? బౌద్ధులకు క్షణప్రధ్వంసు లగు పంచస్కంధముల వలె. రెండుపక్షములందును గర్మమున కశేషత్యాగము సంభవింపదు.

ఆ. సహజ మగు కర్మమును సదోషము నైనను విడువఁగూడ దను విష యమునందు విచారము జరగించుచున్నారు ఏమి ఇత్యాదిగా. నహి కశ్చిత్ అను న్యాయమువలన నని శేషము. దోషము—విహితనిత్యత్యాగమునందుఁ బ్రత్యవాయము. సందిగ్ధ మగు ప్రయోజనము విచార్య మగుటవలన సందేహమునందుఁ బ్రయోజ నము నడుగుచున్నారు ఏమి దీనివలన నని. అందు మొదటిపక్షము ననువదించి ఫల ముఁ జూపుచున్నారు అశేషముగా నిత్యాదిగా. అశక్యార్థానుష్ఠానము గుణ మని ప్రసిద్ధ మగుటవలన, ప్రసిద్ధముగదా సముద్రమును బుడిసిటఁ బట్టి త్రాగిన యగస్త్యు నకు గుణవత్త్వము. దానిఁ జెప్పుచున్నారు అప్పుడు ఇత్యాదిగా. అశేషకర్మత్యా గము గుణవంత మైనను బూర్వోక్తన్యాయముచే నది సంభవింపమివలనఁ దదనుష్ఠాన మశక్య మని శంకించుచున్నాఁడు సత్యము ఇత్యాదిగా. చోద్యమునే విభజించి వివ రించుచున్నాఁడు ఏమి ఇత్యాదిగా. సత్త్వాదిగుణములవలె ఆత్మ నిత్యప్రచలితుఁ డగుటచే నతనిచేత నశేషముగాఁ గర్మము త్యజింప శక్యము గాదు, మఱియు రూపవిజ్ఞా నవేదనాసంజ్ఞాసంస్కారము లనఁబడు క్షణధ్వంసు లగు స్కంధములవలెఁ గ్రియా కారకభేదము లేమివలనఁ గారక మయిన యాత్మయే క్రియ యను పక్షమునందును గర్మ మశేషముగాఁ ద్యజింప శక్యము గాదు, ఉభయపక్షములందును స్వభావభం గమువలన నని చెప్పుచున్నాఁడు రెండు ఇత్యాదిగా.

భా. ఇఁకఁ దృతీయపక్షంబును.—ఎప్పుడు చేయుచున్నదో అప్పుడు సక్రియము వస్తువు, ఎప్పుడు చేయదో అప్పు డావస్తువే నిష్క్రియము.

ఇట్లయినపుడు శక్యము కర్మము నశేషముగా విడుచుటకు. ఇది మఱి యాత్మీయపక్షమునందు విశేషము. నిత్యప్రచలితము కాదు వస్తువు. క్రియయే కారకమునుం గాదు. మఱే మనఁగా, వ్యవస్థిత మగు ద్రవ్యమునం దవిద్యమాన మగు క్రియ యుత్పన్న మగుచున్నది, విద్యమాన మగునది నశించుచున్నది. శుద్ధ మగుద్రవ్యము శక్తిమంతమై యున్న దని చెప్పెదరు కాణాదులు, అదియే కారకం బనియు. ఈ పక్షమునం దేమి దోషము ?

ఆ. పక్షద్వయానురోధమున నశేషకర్మత్యాగము సంభవింప దనఁగా వైశేషికుఁడు చెప్పుచున్నాఁడు ఇఁక నిత్యాదిగా. ఒకానొకప్పు డాత్మ సక్రియుఁడు ఒకప్పుడు నిష్క్రియుఁడు అనఁగా ఫలితముఁ జెప్పుచున్నాఁడు ఇట్లు ఇత్యాదిగా. ఈ పక్షమునే పూర్వోక్తము లగు రెండుపక్షములకంటె విశేషప్రదర్శనముచే విశదీకరించుచున్నాఁడు ఇది మఱి ఇత్యాదిగా. క్రియ యాగమాపాయవంత మైనపుడు తద్వంత మగుద్రవ్య మెట్లు స్థాయి యగు నని యాశంకించి చెప్పుచున్నాఁడు శుద్ధము ఇత్యాదిగా. క్రియాశక్తిమంత మైనను క్రియావంతము కాదేని యెట్లు కారక మగును? క్రియను జేయుకారణము కారకం బని యంగీకరించుటవలన. అని యాశంకించి చెప్పుచున్నాఁడు అదియే ఇత్యాదిగా. క్రియాశక్తిమంతమే కారకము, క్రియాధికరణము కారకము కాదు అన్యోన్యాశ్రయమువలన నని యర్థము. వైశేషికపక్షమునందు దోషము లేమివలన నది యందఱకును స్వీకార్య మని యుపసంహరించుచున్నాఁడు ఈ పక్షమునందు ఇత్యాదిగా.

భా. ఇదియే దోషము. అభాగవతం బీమతము, ఎట్లు తెలియును? భగవంతుఁడు నాఽసతో విద్యతే భావ ఇత్యాదికము చెప్పి యుండుటవలన. అసత్తునకు భావంబును సత్తునకు నభావము నని గదా కాణాదులమతము. అభాగవతం బిది. అభాగవత మైనను న్యాయవంతమేని యేమి దోషము? చెప్పెదము. దోషవంతమే యిది, సర్వప్రమాణవిరోధమువలన, ఎట్లు? ద్వ్యణుకాదిద్రవ్యము ఉత్పత్తికిఁ బూర్వ మత్యంతమే యసత్తేని, ఉత్పన్నమై కొంతకాల ముండి వెండియు నత్యంతమే యసత్త్వము నొందునేని, అప్పుడు అసత్తే సత్తుగాఁ బుట్టుచున్నది సత్తే యసత్త్వము నొందుచున్నది, అభావము భావం బగును భావం

బభావ మగు నని వారిమతము. అందభావము జనించుచు నుత్పత్తికిఁ బూర్వము శశవిషాణకల్పమై సమవాయ్యసమాయినిమిత్తాఖ్య మగు కారణము నపేక్షించి జనించు చున్న దని చెప్పెదరు. ఇట్లభావ ముత్పన్న మగు నని కారణమును గాని యపేక్షించు నని చెప్ప శక్యము కాదు, అసత్తులైన శశవిషాణాదులందుఁ గనఁబడమివలన. భావాత్మకము లేని ఘటాదు లుత్పద్యమానములై యభివ్యక్తిమాత్రమునం దేదేని కారణ మపేక్షించి యుత్పన్నము లగు నని గ్రహింప శక్యం బగును. మఱియు నసత్తునకు సద్భావంబును సత్తున కసద్భావంబు నగునెడ యెందును బ్రమాణప్రమేయవ్యవహారమునందు విశ్వాస మెవ్వనికిని గలుగదు, సత్తు సత్తే అస త్తసత్తే యను నిశ్చయం బనుపపన్న మగుటవలన.

ఆ. భగవన్మతానుసారి కామివలన నీపక్షము త్యాజ్య మని దూషించుచున్నారు ఇదియే ఇత్యాదిగా. ఇది భగవన్మతానుసారి కా దనుట యప్రామాణిక మని శంకించుచున్నాఁడు ఎట్లు తెలియు నని. భగవద్వచనము నుదాహరించి పరపక్షము తదనుగుణము కా దని చెప్పుచున్నారు భగవంతుఁడు ఇత్యాదిగా. పరమతంబును దీని కనుగుణమే యేల కా దని యాశంకించి చెప్పుచున్నారు అసత్తునకు ఇత్యాదిగా. భగవన్మతానుగుణము గాకున్నను న్యాయానుగుణ మగుటచే దోషరహిత మగు కాణాదమతం బుపాదేయమే, కాణాదమత మితరమతవిరోధమువలన నుపేక్షణీయము కాదు గదా యని శంకించుచున్నాఁడు అభాగవతమైనను ఇత్యాదిగా న్యాయవత్త్వ మసిద్ధ మని దూషించుచున్నారు చెప్పెదము ఇత్యాదిగా. సర్వప్రమాణానుసారి యగుమతము తద్విరోధి యనుట తగ దని యాక్షేపించుచున్నాఁడు ఎట్లు అని. వైశేషికమతమునకు సర్వప్రమాణవిరోధమును బ్రకటించుటకై మొదటఁ దన్మతము ననువదించుచున్నారు ద్వ్యణు కేత్యాదిగా. అసత్తునకు జన్మము సత్తునకు నాశ మన్నపుడు ఫలితము చెప్పుచున్నారు అప్పుడు ఇత్యాదిగా. చెప్పినవాక్యమునే వివరించుచున్నారు అభావము ఇత్యాదిగా. సత్తే యసత్త్వము నొందుచున్నది యన్నవాక్యమును వివరించుచున్నారు భావంబు ఇత్యాదిగా. అందే వారియభ్యుగమాంతరముఁ జెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. అందు—ప్రకృతమతమునందు. పరులయభ్యుపగమమును దూషించుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. ఇట్లు — పరపరిభాషానుసారమున నని యర్థము. కనఁబడమివలన—ఉత్పత్తియును అపేక్షయు నని శేషము. ఎట్లు మఱి నీమతమునందును ఘటాదులకుఁ గారణాపేక్షముల కుత్పత్తి?

భావములకుఁ గారణాపేక్ష గాని యుత్పత్తి గాని యుక్తము కాదు గదా ! అనఁగాఁ జెప్పుచున్నారు భావాత్మకము లేని ఇత్యాదిగా. ఘటాదుల కస్తిత్వకమునకుఁ బూర్వమును గారణాత్మను సత్తులైనవానికే యవ్యక్తనామరూపములకు అభివ్యక్తి సామగ్రి నపేక్షించి పృథగభివ్యక్తి సంభవించుటవలన నేమియు దోషము లేదని యర్థము. అసత్కార్యవాదమునందు దోషాంతరముఁ జెప్పుచున్నారు మఱియు నిత్యాదిగా. పరమతమునఁ బ్రమాణప్రమేయవ్యవహారమం దెందును విశ్వాస మెవ్వనికిని గలుగ దనుటకు హేతువుఁ జెప్పుచున్నారు సత్తు సత్తే ఇత్యాదిగా. సత్తు సత్తే యని నిశ్చితము కాదు, అదియే వెండియు నసత్తగు నని యంగీకరించుటవలన; అసత్తును అసత్తే యను నిశ్చయము లేదు అదియే సత్త్వము నొందు నని యంగీకరించుటవలన; అందువలన ఏది ప్రమాణముచే సత్తని గాని యసత్తని గాని నిశ్చిత మగునో అది యట్లే యుండు నని విశ్వాసము లేమివలనఁ బ్రమాణవైయర్థ్య మని యర్థము.

**భా.** మఱియును. పుట్టుచున్నది యని ద్వ్యణుకాదిద్రవ్యమునకు స్వకారణసత్తాసంబంధముఁ జెప్పెదరు. ఉత్పత్తికిఁ బూర్వ మసత్తు, వెనుక స్వకారణవ్యాపారము నపేక్షించి స్వకారణము లగు పరమాణువులతోను సత్తతోను సమవాయలక్షణ మగు సంబంధముచే సంబద్ధ మగుచున్నది సంబద్ధమై కారణసమవేతమై సత్తగుచున్నది. అందు వక్తవ్యము. ఎట్లసత్తునకు సత్తు కారణ మగును? సంబంధము గాని దేనితోను సంభవించును? వంధ్యాపుత్త్రునకు సత్తుతో సంబంధము గాని కారణము గాని యెవ్వనిచేతను బ్రమాణమువలనఁ గల్పింప శక్యము కాదు గదా! ఓయీ! వైశేషికు లభావమునకు సంబంధముఁ గల్పించుటయే లేదు, ద్వ్యణుకాదిద్రవ్యములకు సత్తులైనవానికే కదా స్వకారణముతో సమవాయలక్షణ మగు సంబంధముఁ జెప్పెదరు. కాదు, సంబంధమునకుఁ బూర్వము సత్త్వము నంగీకరింపమివలన. వైశేషికులు కులాలదండచక్రాదివ్యాపారమునకుఁ బూర్వము ఘటాదుల కస్తిత్వము నంగీకరింపరు కదా! మృత్తునకే ఘటాద్యాకారప్రాప్తియు వారి కిష్టము కాదు. అందువలన నసత్తునకే సంబంధము పారిశేష్యమువలన నిష్ట మని యేర్పడుచున్నది. ఓయీ! అసత్తునకును సమవాయలక్షణ మగు సంబంధము విరుద్ధము కాదు. కాదు, వంధ్యాపుత్త్రాదులకుఁ గనఁబడమివలన. ఘటాదిప్రాగభావమునకే స్వకారణసంబంధ మగును, వంధ్యాపుత్త్రాదులకుఁ గాదు, అభా

వత్వము తుల్య మైనను, అనుటకు విశేషం బభావమునకుఁ జెప్పవలయును. ఒక్కదానియభావము రెంటియభావము సర్వాభావము ప్రాగభావము ప్రధ్వంసాభావము అన్యోన్యాభావము అత్యంతాభావ మని లక్షణము వలన నెవ్వనిచేతను విశేషముఁ జూప శక్యము కాదు. విశేషము లేన పుడు ఘటముయొక్క ప్రాగభావమే కులాలాదులచే ఘటభావము నొందుచున్నది. భావం బగు కపాలాఖ్యస్వకారణముతో సంబద్ధము నగుచున్నది, సర్వవ్యవహారయోగ్యము నగుచున్నది, కాని ఘట ముయొక్కయే ప్రధ్వంసాభావము కాదు అభావత్వ మున్నను అనుట యు, ప్రధ్వంసాద్యభావముల కెందును వ్యవహారయోగ్యత్వము లేదు, ప్రాగభావమునకే ద్వ్యణుకాదిద్రవ్యాఖ్యమున కుత్పత్త్యాదివ్యవహారార్హ త్వంబనుటయు నసమంజసము; అభావత్వము అవిశిష్ట మగుటవలన అత్యం త ప్రధ్వంసాభావములకువలె. ఓయీ! మేము ప్రాగభావమునకు భావా పత్తిని బ్రతిపాదించుటయే లేదు. అప్పుడు భావమునకే గదా భావాపత్తి, ఘటమునకు ఘటాపత్తి పటమునకుఁ బటాపత్తి యన్నట్లు. ఇదియు నభా వమునకు భావాపత్తివలెనే ప్రమాణవిరుద్ధము.

౦౨. ఇందువలనఁ గూడ నసత్కార్యవాదము యుక్తియుక్తము కా దని చెప్పుచున్నారు మఱియును అని. ఆ హేత్వంతరమునే తెలుపుటకై పరమతము నను వదించుచున్నారు పుట్టుచున్నది యని ఇత్యాదిగా. పరకీయవాక్యమునే వివరించు చున్నారు ఉత్పత్తికి ఇత్యాదిగా. సంబద్ధమై అనుటచేఁ గారణసంబంధము కలిగినపుడు కార్యమునకు సత్తాసంబంధ మగు నని చెప్పఁబడినది, దానినే స్ఫుటీక రించుచున్నారు కార ణేత్యాదిగా. పరమతము నెత్తి దూషించుచున్నారు అందు ఇత్యాదిగా. కార్య మస త్తైనను దానికిఁ గారణము సంభవించును, ఆకారణమున కును గార్యముతో సంబంధము సిద్ధించు నని యాశంకించి చెప్పుచున్నారు వం ధ్యేత్యాదిగా. అస త్తగుటవలననే యసత్తునకు సంబంధము లేనపుడు కారణ మగు సత్తునకును దానితో సంబంధము ననుమానింప శక్యము కాదు, సదసత్తులకు సంబం ధము సంభవింపమివలన నని యర్థము. కార్యమున కత్యంతాసత్త్వము నంగీకరింపమి వలనఁ గారణసంబంధ మగు నని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. సత్తులే యగు ద్వ్యణుకాదులకుఁ గారణసంబంధమును శంకిత మైనదాని దూషించుచున్నారు కాదు ఇత్యాదిగా. అనంగీకారమునే విశదీకరించుచున్నారు వైశేషికులు ఇత్యాదిగా.

సత్తగు కారణమే కార్యాకారము నొంది కార్యవ్యవహారమును నిర్వహించు చున్న దని యంగీకరించుటవలన లేదు సంబంధానుపపత్తి యని యాశంకించి యపసిద్ధాంత మగుటవలన నట్లు కా దని చెప్పుచున్నారు మృత్తున కే ఇత్యాదిగా. కార్యమునకుఁ గారణసంబంధమునకుఁ బూర్వము సత్త్వము లే నపుడు పరిశేషసిద్ధ మయిన యర్థముఁ జూపుచున్నారు అందువలన నిత్యాదిగా. అం దనుపపత్తి చెప్పఁబడినది యని శేషము. సంబంధు లగు సదసత్తులకు సంయోగము సంభవింప కున్నను సమవాయము సదసత్తులకు సంభవించును, దానికి నిత్య మగుటవలన నొకసంబంధ లే కున్నను స్థితి యావశ్యక మగుటవలన నని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. సదసత్తులకుఁ బరస్పరము సంబంధ మదృష్ట మగుటవలన సంభవింప దని నిరాకరించుచున్నారు కాదు వం ధ్యేత్యాదిగా. ఘటాదిప్రాగభావము అత్యంతాభావము కామివలన వంధ్యాపుత్త్రాదివిలక్షణ మగుటచే స్వకారణసంబంధము సిద్ధించు నని యాశంకించి చెప్పుచున్నారు ఘటా దీత్యాదిగా. రెండిటను అభావస్వభావము సమానమై యున్నను ఒకదానికిఁ గారణసంబంధము కలదు ఇతరమునకు లే దని విశేషమునకు హేతువు లేమివలనఁ బ్రాగభావమునకుఁ గారణసంబంధము సంభవింప దని యర్థము. ఘటాదిప్రాగభావము సప్రతియోగికము వంధ్యాపుత్త్రాదిక మట్లు కాదు అను విశేషము నాశంకించి దూషించుచున్నారు ఒక్కదాని ఇత్యాదిగా. ప్రాగభావమునకువలెఁ బ్రధ్వంసాభావాదికమునకును సప్రతియోగికత్వము సమాన మగుటచే స్వకారణముతో సంబంధమును సమానము కావలయు నని యర్థము. ప్రాగభావప్రధ్వంసాభావములకు విశేషము లేనపుడు ఫలితముఁ జెప్పుచున్నారు విశేషము ఇత్యాదిగా. కపాల మనఁగా ఘటకారణీభూత మగు మృత్తుయొక్క యవయవవిశేషము. సర్వవ్యవహారము—ఘటాశ్రిత మగు జన్మనాశాదివ్యవహారము. ప్రధ్వంసాభావమో ఘటముయొక్కయే యభావ మైనను ఘటత్వము నొందదు కారణముతోను సంబద్ధము కాదు ఉత్పత్త్యాదివ్యవహారయోగ్యమునుం గాదు అనుట యనుపపన్నము ప్రాగభావముతో దీనికి విశేషము లేమివలన నని చెప్పుచున్నారు కాని ఘటము ఇత్యాదిగా. అనుటయు—అసమంజస మని యన్వయము. మఱియొక యసమంజసముఁ జెప్పుచున్నారు ప్రధ్వంసా దీత్యాదిగా. అన్యోన్యాభావాత్యంతాభావము లాదిశబ్దార్థములు, ఎందును — ఏదేశమునందును ఏకాలమందును. వ్యవహారము — జన్మాదికమే. ప్రాగభావ ముత్పత్త్యాదివ్యవహార యోగ్యము కాదు, అభావ మగుటవలన, ప్రధ్వంసాదులవలె నని యర్థము. ప్రాగ

భానమునకు ఘటభావము నంగీకరింపమివలన ననుమానము సిద్ధసాధనం బని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. అభావమునకు భావాపత్తి నంగీకరింపనియెడ భావమునకే భావాపత్తి యని యనిష్ట మగు నని దూషించుచున్నారు అప్పుడు ఇత్యాదిగా. దానికిఁ దదాపత్తి అయోగ్యం బనుటకు దృష్టాంతముఁ జెప్పుచున్నారు ఘటమునకు ఇత్యాదిగా. భానమునకు భావాపత్తి యనిష్ట మను దార్ష్టాంతికమును స్పష్టీకరించుచున్నారు ఇదియును ఇత్యాదిగా.

భా. సాంఖ్యునిదియు నేపరిణామపక్షము గలదో అదియు నపూర్వధర్మోత్పత్తివినాశముల నంగీకరించుటవలన వైశేషికపక్షముకంటె విశిష్టము కాదు. అభివ్యక్తితిరోభావముల నంగీకరించినను అభివ్యక్తితిరోభావములకు విద్యమానత్వావిద్యమానత్వనిరూపణమునందుఁ బూర్వము వలెనే ప్రమాణవిరోధము. ఇందుచేఁ గారణముయొక్క సంస్థానమే యుత్పత్త్యాదిక మనుపక్షమును నిరాకృతము.

ఆ. ఆరంభవాదమునందుఁ జెప్పినదోషమును బరిణామవాదమునందును బరఁగించుచున్నారు సాంఖ్యునిదియు నిత్యాదిగా. ధర్మము—పరిణామము. అసత్తయిన యపూర్వపరిణామ ముత్పన్న మగుటవలనను సత్తయిన పూర్వపరిణామము నశించుటవలనను అసత్తసత్తే సత్తుసత్తే యను వ్యవస్థ యీమతమునందును దుర్లభ మని యర్థము. ఓయీ! కార్యము కారణాత్మను బూర్వమును సత్తే యవ్యక్తము, కారకవ్యాపారమువలన వ్యక్త మగుచున్నది, అందుచే వ్యక్త్యవ్యక్తులకు జన్మనాశవ్యవహారమువలన మతాంతరముకంటె విశేషము కలదు. అనఁగా నందులకుఁ జెప్పుచున్నారు అభివ్యక్తీత్యాదిగా. కారకవ్యాపారమునకుఁ బూర్వము అనభివ్యక్తికివలె నభివ్యక్తికి సత్త్వమా? అసత్త్వమా? సత్త్వ మనునెడఁ గారకవ్యాపారవైయర్థ్యమువలనఁ దద్విషయప్రమాణవిరోధము. అసత్త్వ మనునెడఁ బక్షాంతరమునందువలె నత్యంతాసత్తునకు తన్నిర్వర్త్యత్వం బనుపపన్న మగుటచే నదియే దోషము. కారకవ్యాపారమునకుఁ బిమ్మట వ్యక్తికివలె నవ్యక్తికిని సత్త్వం బనునెడ నదియే దోషము. అసత్త్వ మన్నను సత్తున కసత్త్వం బంగీకరించుటవలన మానమే యువ్యవహారమునం దెందును విశ్వాసము కలుగదు, సత్తు సత్తే యసత్తసత్తే యను నిర్ధారణము లేమివలన నని యర్థము. సాంఖ్యపక్షనిరాకరణన్యాయముచేఁ బక్షాంతరముగూడ నిరాకృత మని చెప్పుచున్నారు ఇందుచే నిత్యాదిగా.

కారణమునకే కార్యరూపాపత్తి యుత్పత్తి దానికే తద్రూపత్యాగమున స్వరూపాపత్తి నాశము అను నీపక్షముగూడ యుక్తము కాదు, పూర్వరూపము స్థిత మైనను నష్ట మయినను పరమునకుఁ బరరూపాపత్తి యనుపపన్న మగుటవలన. ప్రాప్త మగు రూపము స్థిత మైనదానిచేఁ గాని నష్ట మయినదానిచేఁ గాని త్యజింప శక్యము కా దని యర్థము.

భా. పారిశేష్యమువలన సత్తొక్కటియే వస్తు వవిద్యచే నుత్పత్తి వినాశాదిధర్మములచేత నటునివలె ననేకవిధంబుల వికల్పితం బగుచున్నది. ఇది భాగవతం బగుమతము చెప్పఁబడినది నా ఽసతో విద్యతే భావ ఇత్యాదిశ్లోకమునందు, సత్ప్రత్యయమున కవ్యభిచారమువలనను ఇతరములకు వ్యభిచారమువలనను అని.

ఆ. ఆరంభవాదమునందును బరిణామవాదమునందును ఉత్పత్త్యాదివ్యవహారం బనుపపన్న మగుటవలనఁ బరిశేషసిద్ధమును జూపుచున్నారు పారిశేష్యమువలన నిత్యాదిగా. ఒక్కవస్తువున కనేకవిధవికల్పానుపపత్తి నాశంకించి చెప్పుచున్నారు అవిద్యచే నని. ఈ మతంబును భగవన్మతానురోధి కామివలన దీనికిని త్యాజ్యత్వము సమాన మని యాశంకించి చెప్పుచున్నారు ఇది ఇత్యాదిగా. చెప్పిన భగవన్మతమునే విశదీకరించుచున్నారు సత్ప్రత్యయమునకు ఇత్యాదిగా. సత్తొక్కటియే వస్తు వని శేషము. ఇతరము లయిన వికారప్రత్యయములకు రజతాదిబుద్ధులకువలె నర్థవ్యభిచారమువలన నవిద్యచే నాసద్వస్తువే యనేకవిధముల వికల్పింపఁబడు చున్న దని చెప్పుచున్నారు ఇతరములకు నిత్యాదిగా. అని చెప్పఁబడినది యని సంబంధము.

భా. ఎట్లు మఱి యాత్మ యవిక్రియుఁ డైనపుడు అశేషకర్మత్యాగము పపన్నము కాదు? గుణములు వస్తుభూతము లైనను అవిద్యాకల్పితము లైనను వానిధర్మము కర్మము. అది యాత్మయం దవిద్యాధ్యాపితమే యగును. కావున నవిద్వాంసుఁడు నహి కశ్చిత్ క్షణ మపి యని యశేషముగాఁ ద్యజింప శక్తుఁడు కాఁ డని చెప్పఁబడినది. విద్వాంసుఁడో మఱి విద్యచే నవిద్య నివృత్త మైనపుడు శక్తుఁడే యగుచున్నాఁ డశేషముగాఁ గర్మముఁ బరిత్యజించుటకు, అవిద్యాధ్యారోపితమునకుఁ శేష మనుపపన్న మగుటవలన. తైమిరికదృష్టిచే నధ్యారోపిత

మగు ద్విచంద్రాదికమునకుఁ దిమిరము పోయినపుడు శేషము నిలువదు గదా! ఇట్లయినపు డీవచనం బుపపన్నము సర్వకర్మాణి మన సేత్యాదికము. స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః, స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః అనుటయును.

ఆ. ఆత్మ యవిక్రియుం డని భగవంతుని మతం బగునేని అప్పుడు స్వకర్మత్యాగం బుపపన్న మగుటవలన సహజకర్మత్యాగముగూడ సిద్ధించుచున్న దని శంకించుచున్నాఁడు ఎట్లు ఇత్యాదిగా. కార్యకారణాత్మకము లయిన గుణములధర్మము కర్మ మని యిష్టము, ఆ గుణములు అకల్పితములు గానీ కల్పితములు గానీ, రెండు విధములను గూడ నిశ్శేషకర్మత్యాగము అవిద్వాంసునకా విద్వాంసునకా? మొదటిది కా దని చెప్పుచున్నారు గుణములు ఇత్యాదిగా. అవిద్యాధ్యారోపితమే—గుణశబ్దితకార్యకారణారోపద్వారమునఁ గర్మమని శేషము. రెండవపక్షమును కూర్చి చెప్పుచున్నారు విద్వాంసుఁడో ఇత్యాదిగా. ఆరోపశేషవశమువలన విద్వాంసునకును అశేషకర్మత్యాగము సిద్ధింప దని యాశంకించి చెప్పుచున్నారు అవి ద్యేత్యాదిగా. ఆ యనుపపత్తినే దృష్టాంతముచే స్పష్టీకరించుచున్నారు తైమిరి కేత్యాదిగా. విద్వాంసున కశేషకర్మత్యాగమునందుఁ బంచమాధ్యాయవచనము గూడ ననుకూల మని చెప్పుచున్నారు ఇట్లయినపుడు ఇత్యాదిగా. అవిద్వాంసునకు సర్వకర్మత్యాగ మనుపపన్న మనుటయందు ప్రకృతాధ్యాయమునందే వాక్యం బనుగుణ మని చెప్పుచున్నారు స్వే స్వే ఇత్యాదిగా. వాక్యాంతరముగూడ నయ్యర్థమునందే యనుకూల మని చెప్పుచున్నారు స్వకర్మణేత్యాదిగా.

హ. మఱియు నొకటి.—ఆరంభింపఁబడుచున్నవి కావున ఆరంభములు, సర్వారమ్భాః=సర్వకర్మములును; హి = ఏకారణమువలన, త్రిగుణాత్మకము లగుటవలన; దోషేణ ఆవృతాః—ధూమదోషముచే అగ్నివలె నావరింపఁబడినవో. అందువలనఁ స్వధర్మమును విడిచి పరధర్మము ననుష్ఠించినను అయ్యనుష్ఠించుకర్మము తామసదోషయుక్త మగుటవలన దోషమునుండి ముక్తుఁడు కాఁడు.

శం. బ్రాహ్మణునకుఁ గాని క్షత్త్రియునకుఁ గాని స్వధర్మ మగ్నిష్టోమాదికము గాని యుద్ధము గాని బాహ్యదృష్టికి దోషవంతముగాఁ బ్రతీయమాన మైనను విధ్యుక్త మగుటచే నిర్దుష్ట మగుటవలన తదనుష్ఠానము ముక్తికొఱకే యగుఁ గాని బంధముకొఱకుఁ గా దని బోధించి వెండియును యాగము గాని యుద్ధము గాని

హింసాప్రధాన మగుటచే దోషవంతమే యగును గావున నెట్లు చేయవచ్చు నని యాశంక యెంతమాత్రము కూడ దని చెప్పినయర్థమునే దృఢీకరించుటకై చెప్పు చున్నాఁడు.—సహజమ్= "కర్మణా జాయతే ద్విజః" అను న్యాయముచే సహ- ద్వితీయ మగు జన్మముతో పుట్టినది కావున సహజము, జాతివలనఁ బ్రాప్తము, జాతిని వర్ణమును నిమిత్తీకరించి శాస్త్రముచే విహితము, అగు; కర్మ—స్వధర్మము నని యర్థము; సదోష మపి = ఉక్తరీతిచే దోషయుక్తము నైనను; ఆరురుక్షువు మోక్షేచ్ఛు వగు బ్రాహ్మణాది, న త్యజేత్—సన్న్యసింపఁగూడ దని యర్థము. ఓయీ! దోషవంత మగు కర్మము ననుష్ఠించుటకన్నను నిర్దుష్ట మగు పరధర్మము నాశ్రయించుట యుక్తమే యగు నందువేని, ని న్నిట నడుగవలయును. కర్తవ్యకర్మ త్యాగ మదుష్ట మను బుద్ధిచేతనా? అసాధనం బను బుద్ధిచేతనా? అనర్థ మను బుద్ధి చేతనా? పరధర్మ మదుష్టం బని యాశ్రయణీయ మను బుద్ధిచేతనా? మొదటిది కాదు; విహితమును బరిత్యజించినయెడఁ బ్రత్యవాయము గలుగుటవలన. రెండవది కాదు, అవిరక్తుని కసాధనం బనుబుద్ధి పుట్టమివలనను, విరక్తునకుఁ ద్యజించుకర్మము నందు గుణదోషవిచారము సంభవింపమివలనను. తృతీయము కాదు, అనాత్మజ్ఞునకుఁ గర్మతత్సాధనఫలములయందు అనర్థనుబుద్ధి పుట్టమివలన. నాలవదియుం గాదు, పరధర్మమునకును గర్మ మగుటచే దోషవత్త్వము తప్పమివలన. కావునఁ గుటీచకుం డును అవిరక్తుఁడు శిఖాయజ్ఞోపవీతాదియుక్తుఁ డగుటచేఁ గర్మి యగుటవలనఁ దత్కా- ర్యంబును సాధనసాధ్యం బగుటచే దోషవంత మనియే నిశ్చయించి, సర్వవర్ణాశ్రమము లును జేయుకర్మము దోషవంతమే, "న హింస్యాత్సర్వా భూతాని" అనుశ్రుతిచే భూతహింస నిషిద్ధ మగుటవలన సర్వకర్మంబును వైదికము కుశసమిదాదిద్రవ్యసాధ్య మగుటచే హింసాప్రధాన మగుటవలన సర్వవర్ణాశ్రమములును జేయుకర్మము సర్వం బును హింసాప్రధాన మగుటచే దోషయుక్తమే యగు నని సర్వకర్మమునకును దోషవత్త్వమును జూపుటకై చెప్పుచున్నాఁ డుత్తరార్థముచేత. లేక, "కామ ఏష క్రోధ ఏష ..." "యం పురుషః, య ద్వృద్ధి కురుతే జన్తు స్తత్త త్కామస్య చేష్టితమ్, రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సఙ్గ సముద్భవమ్, త న్నిబధ్నాతి కౌన్తేయ కర్మసఙ్గేన దేహినమ్" అను న్యాయముచేత, గర్మము సర్వంబును గామసంకల్పాదిరజోగుణ కార్యం బగుటచే దోషవంత మగుటవలన సర్వకర్మములును దోషవంతములే యని చెప్పుచున్నాఁడు.— హి=ఏకారణమువలన; సర్వారమ్భాః=ఆరంభింపఁబడుచున్న వి- ఏయఁబడుచున్నవి కావున ఆరంభములు, సర్వవర్ణాశ్రమములును జేయుసర్వకర్మ

ములును; హింసాదోషముచేతఁ గాని రజోదోషముచేఁ గాని, ఆవృతాః = వ్యాప్త ములు; ధూమేన అగ్నిరివ—ఎట్లగ్నికి స్వోత్పత్తికారణ మగు ధూమము లేక యు నికి సంభవింపదో అట్లు వైదికకర్మములకును హింస గాని కామము గాని లేక యునికి సంభవింపమివలన సర్వకర్మంబులు దోషవంతమే, అందువలనఁ బరధ ర్మంబును దోషవంతమే యగుచున్నది. పరధర్మము నాచరించుటచే స్వాభావిక మగు దోష మొక్కటి, స్వధర్మత్యాగకృత మగు దోషము రెండవది, అవిహితము నాచరించుట తృతీయము, ఈశ్వరాజ్ఞ నుల్లంఘించుట నాలవది, ఇన్ని దోషములు సంభవించు చున్నవి. అందువలన నారురుక్షు వవిరక్తుఁడు మోక్షైకకాముఁడు జాతిని వర్ణము నాశ్రమమును నిమిత్తీకరించి శ్రుతిస్మృతులచే విహిత మగు కర్మమును సదోషము నైనను సత్త్వశుద్ధికొఱకు కవశ్య మాచరింపవలయును, అట్లు స్మృతి "వేదోదితం స్వకం కర్మ నిత్యం కుర్యా దతన్ద్రితః। తద్ధి కుర్వ న్యథా శక్తి ప్రాప్నోతి పరమాం గతిమ్" * అని. అందువలన వర్ణాశ్రమ లగు ముముక్షు వులకు బంధముక్తికొఱకు స్వధర్మమే కర్తవ్య మని సిద్ధము.

వ్య. ఎందువలన నిట్లు విహిత మగు హింసాదికము ప్రత్యవాయహేతువు కాదో పరధర్మమును భయావహమో సామాన్యదోషమున సర్వకర్మములును దుష్ట ములో అందువలన అజ్ఞుఁడు వర్ణాశ్రమాభిమాని యగువాఁడు.—కౌన్తేయ = ఓ యర్జునా! సహజమ్=స్వభావజ మగు; కర్మ=కర్మమును; సదోష మపి=విహిత హింసాయుక్తము నైనను జ్యోతిష్టోమయుద్ధాదికమును; న త్యజేత్=విడువఁగూడదు, అంతఃకరణశుద్ధికిఁ బూర్వము నీవు గాని యన్యుఁడు గాని. అనాత్మజ్ఞుఁ డెవ్వఁడును క్షణమేనియుఁ గర్మములను జేయక యుండఁజాలఁడు గదా! పరధర్మముల నను ష్ఠించుచున్నను దోషమునుండి విముక్తుఁ డేమో కాఁడు. సర్వారమ్భాః = స్వధర్మ ములును బరధర్మములును అన్నియు; హి=ఎందువలన; దోషేణ = త్రిగుణాత్మకత్వం బను సామాన్యదోషముచే; ఆవృతాః=వ్యాప్తములు, సదోషములే,అట్లు పూర్వము వ్యాఖ్యాతము "పరిణామతాపసంస్కారై ర్గుణవృత్తివిరోధాచ్చ దుఃఖ మేవ సర్వం వివేకినః" అని. అందువలన నగలిచే ననాత్మజ్ఞుఁడు కర్మములను జేయుచుండువాఁడు విషజకృమి విషమునువలె సహజకర్మమును యుద్ధాదికమును త్రిగుణాత్మకత్వ మను సామాన్యదోషముచేతను బంధవధాదినిమిత్తత్వం బను విశేషదోషముచేతను

* వేదోక్త మగు స్వకర్మమును అలసుఁడు గాక నిత్యమును జేయవలయును. దానిఁ గదా యథాశక్తిఁ జేయుచుఁ బరమగతిని బొందుచున్నాఁడు.

సదోషము నైనను త్యజింపఁగూడదు, సర్వకర్మత్యాగమునకు దసమర్థుఁ డగుటవలన. సర్వకర్మత్యాగమునందు సమర్థుఁ డగు శుద్ధాంతఃకరణుఁడో త్యజింపవలసినదియే యని యభిప్రాయము.

శ్రీ. సాంఖ్యదృష్టిచే మఱి స్వధర్మమునందు హింసాలక్షణ మగు దోషము నెంచి పరధర్మమును శ్రేష్ఠమునుగాఁ దలంతువేని అప్పుడు సదోషత్వము పరధర్మమునందును సమాన మని చెప్పుచున్నాఁడు.—సహజమ్=స్వభావవిహిత మగు; కర్మమును; సదోష మపి; న త్యజేత్. హి=ఎందువలన ననఁగా. సర్వారమ్భాః=దృష్టాదృష్టార్థము లగు సర్వకర్మములును; దోషేణ—ఒకానొకదానిచేత; ఆవృతాః=వ్యాప్తములే. ఎట్లు సహజ మగు ధూమముచే నగ్ని యావృతమో అట్లు. అందువలన నెట్లు అగ్నియొక్క ధూమరూప మగు దోషమును బోలఁగొంచి ప్రతాపము మాత్రమే తమశ్శీతాదినివృత్తికొఱకు సేవింపఁబడునో అట్లు కర్మముయొక్కయు దోషాంశమును విడిచి గుణాంశముమాత్రమే సత్త్వశుద్ధికొఱకు సేవింపఁబడుచున్నది యని యర్థము.

ప. దానినే చెప్పుచున్నాఁడు.—ఓ కౌంతేయా ! సహజం కర్మ=స్వభావవిహిత మగు కర్మమును; సదోష మపి న త్యజేత్. హి=ప్రకాశనమువలన ననఁగా, సర్వారమ్భాః=సర్వకర్మములును; దోషేణ=లౌకికదోషముచేత; ఆవృతాః=వ్యాప్తములై యున్నవి. ఇందు దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు.— ఎట్లు ప్రకాశకము హవిర్మార్గ మగు నగ్నియందు ధూమరూప మగు దోషము కలదో, అయినను "అగ్నిమీళే" ఇత్యాది శ్రుతులచే స్తుతింపఁబడుచు నగ్ని సేవింపఁబడుచునే యున్నాఁడో, అట్లే బ్రాహ్మణాదిధర్మములందు నైస్యనిష్క్రియత్వగోపీడనాదికార్యరూపము లగు దోషములు కలవు, అయినను శాస్త్రవిహితము లగుటవలన నవియే యనుష్ఠేయములు గాని యన్యములు కా వని యర్థము.

రా. అందువలన, సహజ మగుటచే సుకరమును అప్రమాదము నగు కర్మమును, సదోష మపి=దుఃఖసహితము నైనను; నత్యజేత్, జ్ఞానయోగయోగ్యుఁ డైనను కర్మయోగమునే చేయవలయు నని యర్థము. సర్వారమ్భాః—కర్మారంభములును జ్ఞానారంభములును; హి; దోషేణ=దుఃఖముచేత; ధూమే నాగ్ని రి వావృతాః. ఇదిమాత్రము విశేషము—కర్మయోగము సుకరమును అప్రమాదమును, జ్ఞానయోగము తద్విపరీతము.

అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనా ఽధిగచ్ఛతి. ౪౯

భా. కర్మజ మగు సిద్ధి యేది చెప్పఁబడినదో జ్ఞాననిష్ఠాయోగ్యతాలక్షణము, దానికి ఫలభూత మగు నైష్కర్మ్యసిద్ధియు జ్ఞాననిష్ఠాలక్షణము వక్తవ్యమే యని శ్లోక మారంభింపఁబడుచున్నది.—అసక్తబుద్ధిః=అసక్తము—సంగరహితము బుద్ధి—అంతఃకరణము ఎవ్వనికో అతఁ డసక్తబుద్ధి; సర్వత్ర=అంతటను ఆసక్తినిమిత్తములందు పుత్త్రదారాదులందు; జితాత్మా=జితము—వశీకృతము ఆత్మ—అంతఃకరణము ఎవ్వనికో అతఁడు జితాత్ముఁడు; విగతస్పృహః=విగతము—పోయినది స్పృహ—తృష్ణ దేహజీవితభోగములందు ఎవ్వని నుండియో అతఁడు విగతస్పృహుఁడు. ఇట్టివాఁ డెవ్వఁడు గలఁడో ఆట్టియాత్మజ్ఞుఁడు, నైష్కర్మ్యసిద్ధిమ్=నిర్గతములు కర్మము లెవ్వని నుండియో నిష్క్రియబ్రహ్మాత్మబోధమువలన, అతఁడు నిష్కర్మ, వాని భావము నైష్కర్మ్య మగు సిద్ధి * నైష్కర్మ్యసిద్ధి, లేక, నైష్కర్మ్యముయొక్క సిద్ధి, నిష్క్రియాత్మస్వరూపావస్థానలక్షణముయొక్క సిద్ధి—నిష్పత్తి, దాని నైష్కర్మ్యసిద్ధిని; పరమామ్=ప్రకృష్టమును, కర్మజసిద్ధివిలక్షణమును సద్యోముక్త్యవస్థానరూపమును; సన్న్యాసేన=సమ్యగ్దర్శనముచేత, తత్పూర్వక మగు సర్వకర్మసన్న్యాసముచేతఁ గాని; అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు. అట్లు చెప్పఁబడినది "సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽఽస్తే నైవ కుర్వ న్నకారయన్" అని.

ఇట్లు స్వకర్మాచరణముచేఁ బరమేశ్వరు నారాధించుచుండి తత్ప్రసాదమువలన నంతఃకరణశుద్ధి నొంది పుత్త్రదారాదులందు సంగము లేనివాఁడును వశీకృతమయిన యంతఃకరణము గలవాఁడును దేహజీవితభోగములందు స్పృహ లేనివాఁడు నగు నాత్మజ్ఞుఁడు సర్వకర్మసన్న్యాసముచే సద్యోముక్తిరూప మగు నైష్కర్మ్యసిద్ధిని బొందుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. విద్వాంసునకు సర్వకర్మత్యాగము సంభవించుం గాని యవిద్వాంసునకు సంభవింప దని చెప్పఁబడినది. ఇప్పుడు చెప్పినయర్థము ననువదించి యనంతర

* నైష్కర్మ్యరూప మగు సిద్ధి.

శ్లోకతాత్పర్యముఁ జెప్పుచున్నారు కర్మజము ఇత్యాదిగా. సాధనముల నుపదేశించుచు నైష్కర్మ్యసిద్ధిని నిరూపించుచున్నారు అస క్తేత్యాదిగా. పుత్రాదివిషయమందుఁ జిత్తమునకు సంగము లేకున్నను అది యస్వాధీనము కావచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు జితాత్మా అని. అసక్తిని జెప్పి స్పృహ లేమిని జెప్పుటచే బునరుక్తి యగు నని యాశంకించి చెప్పుచున్నారు దే హేత్యాదిగా. చెప్పిన దాని ననువదించి తత్ఫలమును పొందించుచున్నారు ఇట్టివాఁడు ఇత్యాదిగా. కర్మముల నిర్గతికి హేతువుఁ జెప్పుచున్నారు నిష్క్రి యేత్యాదిగా. సమ్యగ్జ్ఞానార్థకముగా నైష్కర్మ్యసిద్ధిని వివరించి యర్థాంతరముఁ జెప్పుచున్నారు లేక ఇత్యాదిగా. ప్రకర్షమునే ప్రకటించుచున్నారు కర్మ జేత్యాదిగా. సన్న్యాసము శ్రుతిస్మృతులయందు సమ్యగ్దర్శనసాధనం బని ప్రసిద్ధ మగుటవలన దానినే సమ్యగ్దర్శన మనుట యయుక్త మని యాశంకించి పక్షాంతరముఁ జెప్పుచున్నారు తత్పూర్వకము ఇత్యాదిగా. సన్న్యాసమువలన నైష్కర్మ్యప్రాప్తి యనుటకు వాక్యోక్రమం బనుకూల మని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా.

హా. ఇది సష్ట మగునేని నేను నష్టుఁడ నని సక్తము—తగులము గల బుద్ధి యెవ్వనికి లేదో అతఁ డసక్తబుద్ధి, అంతటను కర్మములయందును తత్ఫలములందును అసక్తబుద్ధి, మాయామరీచిజలగంధర్వనగరద్విచన్ద్రదిగ్భ్రమాదులందువలె; నిర్గతములు కర్మములు ఎవ్వనినుండియో శుద్ధబుద్ధముక్తస్వభావపరమాత్మస్వరూపలాభమువలన, అతఁడు నిష్కర్ముఁడు, వానిభావము నైష్కర్మ్యము, దానియొక్క— నిష్క్రియాత్మస్వరూపావస్థానలక్షణముయొక్క సిద్ధిని—నిష్పత్తిని; పరమామ్=ప్రకృష్టమును, పుత్ర మిత్ర కలత్రాది బాహ్యవస్తువుల విడిచి; అట్లు శ్రుతి "ఆత్మానం చే ద్విజానీయా దయ మస్మీతి పూరుషః। కి మిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్" అని, "ఆత్మలాభా న్నపరం విద్యతే" అని స్మృతియును; అందువలన నట్టి సిద్ధిని, సన్న్యాసే నాధిగచ్ఛతి.

శం. జ్ఞానకర్మములకు సాధ్యసాధనభావమును సర్వశాస్త్రప్రసిద్ధమును బోధించుట కయ్యే యూరురుక్షువునకు మోక్షైకకామునకుఁ గర్తవ్య మగు కర్మము దోషవంత మైనను చిత్తశుద్ధి యన్యసాధ్యము కానందున నవశ్యకరణీయం బనియు శ్రుతిస్మృతులచే విహితం బగుటను నిర్దుష్టం బనియు శ్రేయస్సాధనం బనియు ఆసాత్త్వికకర్మముచే బహుజన్మములు పరమేశ్వరు నారాధించుటచే దత్ప్రసాదమువలనఁ

జిత్తశుద్ధి గలుగు ననియుఁ బ్రతిపాదించి, సాత్త్వికమగు బుద్ధితోనే సాత్త్వికకర్మముచేఁ బరమేశ్వరు నారాధించి తత్ప్రసాదముచేఁ జక్కనిసత్త్వశుద్ధి నొందినవాఁడును సద్గురువువలన సకృదుపదేశమాత్రమున నాత్మజ్ఞానము నొందినవాఁడు నగు నారూఢునకు సన్న్యాసయోగముచే బ్రహ్మప్రాప్తిని నిర్దేశించుచున్నాఁడు.—అసక్తబుద్ధిః=సర్వమునందును విషయాంతరమునందు కర్మాంతరమునందు దేశాంతరమునందు లోకాంతరమునందు దేవతాంతరమునందు భుజించుటకును చేయుటకును ఉండుటకును పొందుటకును ఉపాసించుటకును అసక్తము--అనురాగము లేనిది తత్తద్విషయములచే ఫలసంబంధము లేనిది బుద్ధి యెవ్వనికో అతఁ డసక్తబుద్ధి, సర్వదృశ్యమును మిథ్య యని నిశ్చయించి విషయమాత్రమం దంతటను జక్కఁగా విరక్తుఁ డని యర్థము; సర్వమిథ్యాత్వనిశ్చయముచే విషయములందు అసక్తబుద్ధి యైనను చలచిత్తునకు జ్ఞాననిష్ఠ సంభవింపదు, కావున విద్వాంసుఁడు వశ్యాత్ముఁడు కావలయు నని చెప్పుచున్నాఁడు.—జితాత్మా = జితము—తీవ్రవైరాగ్యమున శ్రద్ధాపూర్వకముగా చిరకాలము నిత్యము నిరంతరము సత్ప్రత్యయావృత్తి నభ్యసించుటచే నిర్జితము బ్రహ్మమునందే స్థైర్యము నొందింపఁబడినది ఆత్మ—మనస్సు ఎవ్వనికో అతఁడు జితాత్ముఁడు, వశీకృతచిత్తుఁ డని యర్థము; అసక్తబుద్ధిత్వమును జితాత్మత్వమును సిద్ధించినను శరీరసౌఖ్యము నపేక్షించువాఁడును బరిగ్రహవంతుఁడు నగు యోగికి జ్ఞాననిష్ఠ సిద్ధింపదు కావునఁ దద్రహితుఁడు కావలయు నని చెప్పుచున్నాఁడు.—విగతస్పృహః= దేహమునుండియు పరిగ్రహమునుండియు విశేషించి గతము— విగతము దేహపరిగ్రహక్షేమవిషయ మగు స్పృహ యెవ్వనికో అతఁడు విగతస్పృహుఁడు, కాలమునందుఁ బ్రారబ్ధ మొసంగిన యన్నమును భుజించువాఁడును కౌపీనకంథాదండకుండికామాత్రధారియుఁ గావలయు నని యర్థము; ఇట్టి సాధనములు గలవాఁడు ఆత్మతత్త్వము చక్కఁగా నెఱింగినవాఁడు తీవ్రముముక్షు వారూఢుఁడు, సన్న్యాసేన= సత్తునందు—బ్రహ్మమునందు స్వస్వరూపంబున విదిత మైన దానియందు మిక్కిలి ఆసము—ఉనికి సన్న్యాసము సమాధి నిరంతరబ్రహ్మనిష్ఠ, అట్టి సన్న్యాసముచేత— నిరంతర జ్ఞాననిష్ఠచేత; లేక; “ సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ ” అని చెప్పిన లక్షణము గల బ్రహ్మమే నే నని బ్రహ్మాకారమున మిక్కిలి—ఇతరభావాపత్తిరహితముగా అవస్థానము దేనిచే సిద్ధించునో అది సన్న్యాసము, సమ్యగ్జ్ఞానము, నేనే క్రిందను నేనే మీఁదను నేనే యీసర్వంబును నను లక్షణము గలది, అట్టి సన్న్యాసముచేత ఆత్మయాథాత్మ్యజ్ఞానముచేత; నైష్కర్మ్యసిద్ధిమ్=లేదు కర్మము దేనియందో అది నిష్క-

ర్మము, నిష్క్రియ మగు పరబ్రహ్మము, "నిష్కలం నిష్క్రియం శాన్తమ్" అను శ్రుతివలన, నిష్కర్మముయొక్క భావము నైష్కర్మ్యము బ్రహ్మభావము, తత్ప్రాప్తి నైష్కర్మ్యసిద్ధి నిర్విశేషబ్రహ్మస్వరూపమున నవస్థానము, అట్టి నైష్కర్మ్యసిద్ధిని; పరమామ్=బ్రహ్మభావాపత్తికన్న నుత్తమసిద్ధి మఱియొకటి లేమివలన అనుత్తమమును, సర్వసిద్ధులును అణిమాదులు గాని సాలోక్యాదులు గాని భేదప్రత్యయ హేతువు లగుటచే మోహకంబులై పురుషుని సంసరింపఁజేయు చున్నవి, నైష్కర్మ్యసిద్ధియో స్వసిద్ధికారణం బగు సమ్యగ్దర్శనముచే ద్వైతతత్ప్రత్యయ హేతుభూతాజ్ఞానధ్వాంతధ్వంసము చేయించి సంసారమునుండి నివర్తించి బ్రహ్మవిదుని స్వారాజ్యసామ్రాజ్యసుఖమునందు సంస్థాపించు చున్నది, అందువలనఁ బరమత్వము యుక్తము నైష్కర్మ్యసిద్ధికి, అట్టి నైష్కర్మ్యసిద్ధిని; బ్రహ్మవిదుఁ డగు యతి సన్న్యాసముచేతనే—నిరంతరబ్రహ్మనిష్ఠాసంభావితసమ్యగ్దర్శనముచేతనే, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు, ఇతరముచేఁ బొంద నేరఁ డని సిద్ధము. లేక, నైష్కర్మ్యము—నిర్విశేషభావము, తత్ప్రాప్తి నైష్కర్మ్యసిద్ధి దాని, సన్న్యాసేన—అహంకారం బలం దర్ప మని వక్ష్యమాణలక్షణ మగు నహంకారాదిత్యాగముచేత, అధిగచ్ఛతి. లేక, స్వకర్మణా తమభ్యర్చ్య అను న్యాయముచేత, ముముక్షువును సాత్త్వికుఁడును సాత్త్వికము లగు బుద్ధిశ్రద్ధాదులతోఁ గూడినవాఁడును సాత్త్వికమే యగు వైదికకర్మముచేత అనేకజన్మములు పరమేశ్వరు నారాధించి తదనుగ్రహము వలన సత్త్వశుద్ధిఁ జెందినవాఁడును అంత సకృదుపదేశమాత్రమున ఆత్మతత్త్వవిజ్ఞానము నొందినవాఁడు నగు పండితునకుమాత్రము "తేహ స్మ పుత్రైషణా యాశ్చ" అని చెప్పినప్రకారమున సర్వకర్మసన్న్యాసమునందే యధికారము, కొంచెమేని కర్మమునందు లే దని బోధించుటకై యిట్టి లక్షణము గలవాఁడే సన్న్యాసయోగ్యుఁ డని యధికారిలక్షణములను జెప్పుచుఁ బరిపక్వాంతఃకరణునకు నైష్కర్మ్యసిద్ధిని ప్రతిపాదించుచున్నాఁడు.— అసక్తబుద్ధిః సర్వత్ర = పుత్రమిత్రధనాదులందు ఆసక్తము—సక్తి మోహమువలన ననురాగము అది లేమివలన అసక్తము రాగమమతాదిదోషరహితము బుద్ధి యెవనికో అతఁ డసక్తబుద్ధి, అన్నిటినుండియు మిక్కిలియు విరక్తుఁ డని యర్థము. తాత్కాలిక మగు వైరాగ్యమున్నను అస్థిరచిత్తునకు వెండియు రాగాదులును విషయప్రవృత్తియు నందుచేఁ బాతిత్యమును సంభవించును గావున నది లేక యుండవలయు నని చెప్పుచున్నాఁడు.—జితాత్మా = జితము నిర్జితము — తీవ్రముముక్షుచేతను మాటిమాటికి విష

యుద్దోషసందర్శనముచేతను దానివలనఁ గలుగు తీవ్రవైరాగ్యముచేతను అవి బంధకములను బుద్ధిచేతను భయముచేతను అసత్త్వజ్ఞానముచేతను చక్కఁగా విషయవైముఖ్యమును పొందింపఁబడినది ఆత్మ—మనస్సు ఎవనికో అతఁడు జితాత్ముఁడు, వశీకృతచిత్తుఁడనియర్థము. తీవ్రమోక్షేచ్ఛాదులచే జితాత్మత్వము సిద్ధమైనను "కౌపీన దశన మాచరేత్" * అను లక్షణము లేనియెడ దేహసౌఖ్యాపేక్ష గలవానికి జ్ఞానతత్త్వలములు సంభవింపమివలన సన్న్యాసమునం దధికారము కలుగదు, కావున నది లేక యుండవలయు నని చెప్పుచున్నాఁడు.—విగతస్పృహః = దేహసౌఖ్యమునుండియు పరిగ్రహసౌఖ్యమునుండియు విశేషించి గతము స్పృహ—ఆశ ఎవనికో అతఁడు విగతస్పృహుఁడు, దేహభరణాపేక్ష లేనివాఁ డని యర్థము. ఇట్టి లక్షణము గలవాఁడు శుద్ధాత్ముఁడు సద్గురుప్రసాదమువలన ఆత్మస్వరూపము నెఱింగినవాఁడు ముముక్షువు విద్వాంసుఁడు, నైష్కర్మ్యసిద్ధిమ్ = శ్రౌతస్మార్తాదిసర్వకర్మములనుండియు నిర్గతుఁ డెవ్వఁడో అతఁడు నిష్కర్ముఁడు, వానిభావము నైష్కర్మ్యము, విహితప్రతిషిద్ధాదిసర్వకర్మసంబంధరహితమైన యవస్థానము, కర్మ తద్విధుల కవిషయమగుట, దానియొక్కప్రాప్తి నైష్కర్మ్యసిద్ధి, దాని; పరమామ్=పరమపురుషార్థమగు మోక్షమునకు హేతుభూత మగు జ్ఞాననిష్ఠకు సాధన మగుటవలనఁ బరమమైనదాని; సన్న్యాసేన=విహితకర్మములను సాధనసహితముగా విధిచేఁ బరిత్యజించుట సన్న్యాసము, అట్టి సన్న్యాసాశ్రమముచేత, యతిధర్మముచేతనే; అధిగచ్ఛతి. బ్రహ్మచర్యాశ్రమముచేఁ గాని గార్హస్థ్యముచేఁ గాని వానప్రస్థాశ్రమముచేఁ గాని నైష్కర్మ్యము సిద్ధింపదు. అందువలన బ్రహ్మవిదుఁడు నైష్కర్మ్యమును సన్న్యాసముచేతనే పొందవలయు నని సిద్ధము.

ము. ఎవ్వఁడు మఱి సర్వకర్మత్యాగమునందు సమర్థుఁడు? ఎవఁడు నిత్యానిత్యవివేకజన్య మగు నిహాముత్రార్థభోగవైరాగ్యంబుచే శమదమాదిసంపన్నుఁడై కర్మజం బగు సిద్ధిని అశుద్ధిపరిక్షయద్వారంబున శుద్ధబ్రహ్మైక్యజిజ్ఞాస నొందినముముక్షువు గలఁడో అతఁడు తనయిష్ట మగు మోక్షమునకు హేతువగు బ్రహ్మైక్యజ్ఞానమునకు సాధన మగు వేదాంతవాక్యశ్రవణాదికమును జేయుచు సర్వవిక్షేపనివృత్తికొఱకుఁ దచ్ఛేషభూత మగు సర్వకర్మసన్న్యాసమును శ్రుతిస్మృతివిహితమును జేయనే చేయును, "తస్మా దేవంవి చ్ఛాన్తో దాన్త ఉపరత స్తితిక్షు స్సమా-

* కౌపీనమును కట్టుకొనుట కొఱకు వస్త్రము చినగులవాడుము.

హితో భూత్వా త్మన్యే వాత్మానం పశ్యేత్" అను శ్రుతివలనను, "సత్యానృతే సుఖ దుఃఖే వేదా నిమం లోక మముంచ పరిత్య జ్యాత్మాన మన్విచ్ఛేత్" అను స్మృతి వలనను. ఉపరతో భూత్వా—సర్వకర్మముల విడిచినవాఁడై ఆత్మానం పశ్యేత్—ఆత్మ దర్శనము కొఱకు వేదాంతవాక్యముల విచారింపవలయు నని శ్రుత్యర్థము. ఇట్టి వాఁడే "బ్రహ్మసంస్థో ఽమృతత్వ మేతి" అను శ్రుతిచే ధర్మస్కంధత్రయవిలక్షణ త్వంబునఁ బ్రతిపాదితుఁడు పరమహంసపరివ్రాజకుఁడు పరమహంసపరివ్రాజకునిఁ గృతకృత్యుఁ డగు గురుని నాశ్రయించి వేదాంతవిచారము చేయ సమర్థుఁడు, ఎవని నుద్దేశించి బ్రహ్మజిజ్ఞా సేత్యాది చతుర్లక్షణ * మీమాంస భగవంతుఁ డగు బాద రాయణునిచే నిర్మింపఁబడెనో అతఁడు. ఎట్టివాఁ డతఁ డనఁగాఁ జెప్పుచున్నాఁడు.— సర్వత్ర — పుత్త్రదారాదులందు సక్తినిమిత్తములయందును; అసక్తబుద్ధిః = నేను వీరివాఁడను వీరు నావారలు అను నభిష్వంగము లేనిబుద్ధి గలవాఁడు; ఎందువలన ననఁగా, జితాత్మా=విషయములనుండి ప్రత్యాహరించి వశీకృత మయిన యంతఃకర ణము గలవాఁడు; విషయములందు రాగ ముండునపు డెట్లు ప్రత్యాహరణం బనఁగాఁ జెప్పుచున్నాఁడు.— విగతస్పృహః = దేహజీవితభోగములయందును వాంఛ లేని వాఁడు, సర్వదృశ్యములయందును దోషదర్శనముచేతను నిత్యబోధపర మానందరూపమోక్షమునందు గుణదర్శనముచేతను సర్వమునుండి విరక్తుఁ డని యర్థము, ఎవ్వఁ డట్లు శుద్ధాంతఃకరణుఁడై "స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" అనువచనముచేఁ బ్రతిపాదింపఁబడిన కర్మజం బగు నపరమసిద్ధిని జ్ఞాన సాధన వేదాంతవిచారాధికారరూపమును జ్ఞాననిష్ఠాయోగ్యతను పొందినవాఁడో అతఁడు; సన్న్యాసేన = శిఖాయజ్ఞోపవీతాదిసహితముగా సర్వకర్మత్యాగముచేత, హేతు విధి, తత్పూర్వక మగు విచారముచేత నని యర్థము; నైష్కర్మ్యసిద్ధిమ్= నిష్కర్మము బ్రహ్మము, తద్విషయ మయిన విచారపరినిష్పన్న మగు జ్ఞానము నైష్క ర్మ్యము, తద్రూప మగు సిద్ధిని; పరమామ్ = కర్మజ మగు నపరమసిద్ధికి ఫలభూత మును; అధిగచ్ఛతి = సాధనపరిపాకమునఁ బొందుచున్నాఁడు. లేక, సన్న్యాసేన అని యిత్థం భూతలక్షణమునఁ దృతీయ, సర్వకర్మసన్న్యాసరూప మగు నైష్కర్మ్య సిద్ధిని — బ్రహ్మసాక్షాత్కారయోగ్యతను నైర్గుణ్యలక్షణ మగు సిద్ధిని, పరమమును— సాత్త్వికమగు పూర్వసిద్ధికి ఫలభూతమును బొందుచున్నాఁ డని యర్థము.

---

* నాలుగధ్యాయములు గలది.

శ్రీ. ఓయీ! ఎట్లు కర్మముఁ జేయునపుడు దోషాంశము లేక గుణాంశ మమాత్రమే సిద్ధించును ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అసక్తబుద్ధిః=సంగశూన్య మగు బుద్ధి గలవాఁడు; జితాత్మా=అహంకారము లేనివాఁడు; విగతస్పృహః=ఫలవిష యేచ్ఛ లేనివాఁడు; అతఁడు ఈవిధమున "స త్యాగ స్సాత్త్వికో మతః" అని పూర్వోక్త మయిన కర్మాఽసక్తితత్ఫలత్యాగలక్షణ మగు, సన్న్యాసేన; నైష్కర్మ్య సిద్ధిమ్=సర్వకర్మనివృత్తిలక్షణ మగు సత్త్వశుద్ధిని; అధిగచ్ఛతి. సంగఫలముల విడిచి కర్మము ననుష్ఠించుటయు నైష్కర్మ్యమే యనుట వాస్తవమే, కర్తృత్వాభినివేశము లేమివలన, అది చెప్పఁబడినది "నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వ విత్" అని. అయినను ఉక్తలక్షణ మగు నీసన్న్యాసముచే పరమం బగు నైష్క ర్మ్యసిద్ధిని— "సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ" అను లక్షణము గల దానిఁ బారమహంస్యాపరపర్యాయ మగుదానిఁ బొందుచున్నాఁడు.

ప. ఇఁక స్వధర్మాచరణమునందును గుణదోషవివేకముఁ జెప్పుచున్నాఁడు.—అసక్తబుద్ధిః సర్వత్ర=గృహాదు లంతటను సంగశూన్య మగు బుద్ధి గలవాఁడు; జితాత్మా=నిరహంకారుఁడు; విగతస్పృహః = కర్మఫలము నపేక్షింపనివాఁడు; ఇట్టి పురుషుఁడు, పూర్వోక్త మగు కర్మాఽసక్తి సాత్త్వికత్యాగలక్షణ మయిన సన్న్యాసముచేత, నైష్కర్మ్యసిద్ధిమ్=సర్వకర్మనివృత్తిలక్షణ మగు సత్త్వశుద్ధిని; అధిగచ్ఛతి.

రా. సర్వత్ర — ఫలాదులందు; అసక్తబుద్ధిః; జితాత్మా = జయింపఁబడిన మనస్సు గలవాఁడు; పరమపురుషునియందుఁ గర్తృత్వానుసంధానముచే ఆత్మకర్తృత్వమునందు, విగతస్పృహః; ఇట్లు త్యాగముకంటె భిన్నము కా దని నిర్ణీత మగు సన్న్యాసముతోఁ గూడినవాఁడై కర్మముఁ జేయుచు, పరమాం నైష్కర్మ్య సిద్ధి మధిగచ్ఛతి—పరమం బగు ధ్యాననిష్ఠను జ్ఞానయోగమునకును ఫలభూతమును పొందుచున్నాఁ డని యర్థము. చెప్పఁబోవుధ్యానయోగముయొక్క ప్రాప్తిని సర్వేంద్రియకర్మోపరతిరూపము నొందుచున్నాఁడు.

మా. నైష్కర్మ్యసిద్ధిమ్=నైష్కర్మ్యఫలం బగు యోగసిద్ధిని.

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే
సమాసేనైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా. ౫౦

భా. పూర్వోక్త మగు నీశ్వరాభ్యర్చనరూప మయిన స్వకర్మానుష్ఠానముచే జనితమును పూర్వోక్తలక్షణ మగు సిద్ధి నొందినవాఁడై

యాత్మవివేకవిజ్ఞానముఁ బ్రాపించినవానికిఁ గేవలాత్మజ్ఞాననిష్ఠారూపము నైష్కర్మ్యలక్షణ మగు సిద్ధి యేక్రమముచేఁ గలుగునో అది వక్తవ్య మని చెప్పుచున్నాఁడు.—సిద్ధిమ్=స్వకర్మముచే నీశ్వరు నభ్యర్చించి తత్ప్రసాదజం బయినదానిఁ గాయేంద్రియములకు జ్ఞాననిష్ఠాయోగ్యత యను సిద్ధిని; ప్రాప్తః = పొందినవాఁడు; సిద్ధిం ప్రాప్తః అని తదనువాద ముత్తరార్థము; యదర్థం బనువాదమో ఏమి యాయుత్తరము? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—యథా=ఏప్రకారముచేత, జ్ఞాననిష్ఠారూపముచేత; బ్రహ్మ=పరమాత్మను; ఆప్నోతి=పొందుచున్నాఁడో; తథా=ఆప్రకారమును, జ్ఞాననిష్ఠాప్రాప్తిక్రమమును; మే—నావచనమువలన; నిబోధ=ఎఱుంగుము, నీవు నిశ్చయంబున నవధరింపు మనుట. ఏమి విస్తరముననా? కా దని చెప్పుచున్నాఁడు.—సమాసే నైవ = సంక్షేపముచేతనే; కౌన్తేయ = ఓయర్జునా! యథా బ్రహ్మ ప్రాప్నోతి తథా నిబోధ అను వచనముచే నేబ్రహ్మప్రాప్తి ప్రతిజ్ఞాతమో దాని ఇది యని చూపుటకై చెప్పుచున్నాఁడు.—నిష్ఠా జ్ఞానస్య యా పరా—పరా=అత్యంతిక మయిన; నిష్ఠా=పర్యవసానమో, పరిసమాప్తియో యనుట. దేనియొక్క నిష? జ్ఞానస్య=బ్రహ్మజ్ఞానముయొక్క. ఎట్టిది యానిష్ఠ? ఎట్టిది యాత్మజ్ఞానమో అట్టిది. ఆత్మజ్ఞాన మెట్టిది? ఆత్మ యెట్టివాఁడో అట్టిది. అతఁ డెట్టివాఁడు? ఎట్టివాఁ డని భగవంతునిచేఁ జెప్పఁబడెనో యుపనిషద్వాక్యములచేతను న్యాయముచేతను, అట్టివాఁడు.

అర్జునా! స్వకర్మముచేఁ బరమేశ్వరు నారాధించి తత్ప్రసాదంబున జ్ఞాననిష్ఠాయోగ్యతారూపసిద్ధి నొందినవాఁ డేక్రమంబున బ్రహ్మమును బ్రాపించుచున్నాఁడో ఆక్రమంబును సంక్షేపమునఁ జెప్పెద వినుము. ఆ బ్రహ్మప్రాప్తియె జ్ఞానమున కాత్యంతిక మగు పరిసమాప్తి కావున దాని నవశ్యము నీవు నిశ్చయంబునఁ దెలిసికొనవలయు నని తాత్పర్యము.

టీ. జ్ఞానప్రాప్తియోగ్యత గలిగి సమ్యగ్దర్శనము నొందినవానికిఁ దత్ఫలప్రాప్తి యగు ముక్తి చెప్పఁబడిన పిమ్మట వక్తవ్య శేషము లే దని యాశంకించి చెప్పుచున్నారు పూర్వోక్తము ఇత్యాదిగా. అది—క్రమము. సిద్ధిం ప్రాప్తః అని చెప్పిన దానికే యేల యనువాదము? అనఁగాఁ జెప్పుచున్నారు తదనువాదము ఇత్యాదిగా.

ఉత్తరమునే ప్రశ్నపూర్వకముగాఁ దెలుపుచున్నారు యదర్థంబు ఇత్యాదిగా, జ్ఞాననిష్ఠాప్రాప్తిక్రమమును విస్తరమునఁ జెప్పనెడ దుర్బోధ మగు నని యాశంకించి పరిహరించుచున్నారు ఏమి విస్తరముననా ఇత్యాదిగా. చతుర్థపాదమునకుఁ బూర్వముతో సంగతి లే దని యాశంకించి చెప్పుచున్నారు య థేత్యాదిగా. నిష్ఠ సాపేక్ష మగుట వలన ప్రతిసంబంధిని జెప్పవలయు నని యడుగుచున్నాఁడు దేనియొక్క ఇత్యాదిగా. ఏది బ్రహ్మజ్ఞానమునకుఁ బరమనిష్ఠయో అది ప్రకృతజ్ఞానమునకు నిష్ఠ యని చెప్పుచున్నారు బ్ర హ్మేత్యాదిగా. దానిపరమనిష్ఠ యప్రసిద్ధం బని సాధనానుష్ఠానాధీన మగుటచే సాధ్య మని తలఁచి యడుగుచున్నాఁడు ఎట్టిది ఇత్యాదిగా. ప్రసిద్ధ మగు నాత్మజ్ఞానము ననురోధించి బ్రహ్మజ్ఞాననిష్ఠ సుజ్ఞేయం బని చెప్పుచున్నారు ఎట్టిది యాత్మ ఇత్యాదిగా. అదియును బ్రసిద్ధము కా దని శంకించుచున్నాఁడు ఆ త్మేత్యాదిగా. అర్థే నైవ విశేషో౽స్తి యను న్యాయంబున నుత్తరముఁ జెప్పుచున్నారు ఆత్మ ఇత్యాదిగా. ఆత్మయందును విప్రతిపత్తి యుండుటవలన నప్రసిద్ధిఁ దలఁచి యడుగుచున్నాఁడు అతఁడు ఇత్యాదిగా. భగవద్వాక్యములను ఉపనిషద్వాక్యములను ఆశ్రయించి పరిహరించుచున్నారు ఎట్టివాఁడు ఇత్యాదిగా. న జాయతే మ్రియతే వేత్యాదులు వాక్యములు, కూటస్థత్వము అసంగత్వము ఇత్యాదికము న్యాయము.

భా. ఓయీ! విషయాకారము జ్ఞానము. ఆత్మ విషయ మని కాని యాకారవంతుఁ డని కాని యెందును ఇష్టము కాదు. ఓయీ! "ఆదిత్యవర్ణమ్, భారూపః స్వయంజ్యోతిః" అని యాకారవత్త్వ మాత్మకు శ్రుత మగుచున్నది. కాదు, ఆ వాక్యములు తమోరూపత్వప్రతిషేధార్థము లగుటవలన. ద్రవ్యగుణాద్యాకారప్రతిషేధమువలన నాత్మకుఁ దమోరూపత్వము ప్రాప్తము కాఁగాఁ దత్ప్రతిషేధార్థము లాదిత్యవర్ణమిత్యాదివాక్యములు. "అరూపమ్" అనియు విశేషించి రూపప్రతిషేధమువలనను, అవిషయ మగుటవలనను, "న సందృశే తిష్ఠతి రూపమస్య నచక్షుషా పశ్యతి కశ్చ నైనమ్, అశబ్దమస్పర్శమ్" ఇత్యాది శ్రుతులచేత. అందువలన నాత్మాకారము జ్ఞానం బనుట యనుపపన్నము. ఎట్లిప్పుడు ఆత్మయొక్క జ్ఞానము? సర్వంబును జ్ఞాన మేది యద్విషయమో ఆజ్ఞానము తద్విషయము గదా యగుచున్నది. నిరాకారుండుగూడ ఆత్మ యని చెప్పఁబడినది. జ్ఞానాత్మలు రెండును నిరాకారము లైనపుడు ఎట్లు తద్భావనానిష్ఠ యుపపన్న మగును?

ఆ. జ్ఞానము విషయాకార మగుటవలనను ఆత్మయు నవిషయ మగుట వలనను అనాకారుఁ డగుటవలనను తదాకారజ్ఞానం బనుపపన్న మగుటవలన నాత్మ ప్రసిద్ధుఁ డైనను ఆత్మజ్ఞానమునకుఁ బ్రసిద్ధి ఘటిల్ల దని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. ఆకారవత్త్వ మాత్మకు శ్రుతిసిద్ధ మని సిద్ధాంతి శంకించుచున్నాఁడు ఓయీ ఆది త్యేత్యాదిగా. ఉక్తవాక్యము లన్యార్థము లని తెలియుటచేఁ బూర్వవాది పరిహరించుచున్నాఁడు కాదు ఇత్యాదిగా. సంగ్రహవాక్యమును విస్తరించుచున్నాఁడు ద్ర వ్యేత్యాదిగా. ఇందువలనఁ గూడ ఆకారవత్త్వ మాత్మకు లే దని చెప్పుచున్నాఁడు అరూప మిత్యాదిగా. ఆత్మకు విషయత్వము లేమివలనఁ దద్విషయ మగు జ్ఞానము సంభవింప దని యేది చెప్పఁబడినదో దాని నుపపాదించుచున్నాఁడు అవిషయ మగుటవలనను అని. ఆత్మ యవిషయ మనుటకు శ్రుతి నుదాహరించుచున్నాఁడు నసందృశే ఇత్యాదిగా. సందృశే — సమ్యగ్దర్శనవిషయ మగుటకొఱకు, అస్య—ఈ యాత్మకు, రూపం న తిష్ఠతి—రూపము లే దని యర్థము. దానినే కరణముల కగోచరుం డనుటచే నుపపాదించుచున్నది నచక్షు షేత్యాదిగా. శబ్దాదిశూన్యుఁ డగుటవలనఁ గూడ ఆత్మ విషయము కాఁ డని చెప్పుచున్నది అశబ్ద మిత్యాదిగా. ఆత్మకు విషయత్వమును ఆకారవత్త్వమును లే వని యేర్పడినపుడు ఫలితముఁ జెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా. జ్ఞానమున కాత్మాకారత్వము లేనియెడ ఆత్మజ్ఞాన మను వ్యపదేశ మసిద్ధ మగు నని యేకదేశి శంకించుచున్నాఁడు ఎట్లు ఇత్యాదిగా. ఇం దేమి యనుపపత్తి యని యాశంకించి చెప్పుచున్నాఁడు సర్వంబును ఇత్యాదిగా. అప్పుడు ఆత్మయును విషయ మగుటచే జ్ఞానమునకుఁ దదాకారత్వ మగు నని యాశంకించి చెప్పుచున్నాఁడు నిరాకారుండు గూడ ఇత్యాదిగా. అవిషయమును అని సముచ్చయమున కర్థము. అప్పుడు ఆత్మకువలెఁ దజ్జ్ఞానమునకును నిరాకారత్వము కాఁగల దనఁగాఁ జెప్పుచున్నాఁడు జ్ఞానేత్యాదిగా. తద్భావనానిష్ఠ — తత్ =ఆ యాత్మజ్ఞానముయొక్క—భావనా—మాటిమాటి కనుసంధానము, ధానియొక్క—నిష్ఠ—సమాప్తి, ఆత్మసాక్షాత్కారదార్ఢ్యము. ఇది యంతయు ఆత్మకుఁ గాని జ్ఞానమునకుఁ గాని నిరాకారత్వ మేర్పడినపుడు సిద్ధింప దని యర్థము.

భా. అట్లు కాదు, ఆత్మ కత్యంతనిర్మలత్వస్వచ్ఛత్వసూక్ష్మత్వము లుపపన్నము లగుటవలన బుద్ధికి ఆత్మసమనైర్మల్యాదు లుపపన్నము లగుటవలన ఆత్మచైతన్యాకారాభాసత్వ ముపపన్నము. బుద్ధ్యాభాసము మనస్సు, తదాభాసము లింద్రియములు, ఇంద్రియాభాసము

దేహము. అందువలననే లౌకికులచే దేహమాత్రమునందే యాత్మదృష్టి చేయఁబడుచున్నది. దేహచైతన్యవాదులు లోకాయతికులును "చైతన్యవిశిష్టః కాయః పురుషః" అని చెప్పిదరు. అట్లే కొంద ఱింద్రియచైతన్యవాదులు. కొందఱు మనశ్చైతన్యవాదులు. కొందఱు బుద్ధిచైతన్యవాదులు. అంతకన్నను అంతర మైనయవ్యక్తము నవ్యాకృతాఖ్యము నవిద్యావస్థము నాత్మ యని గ్రహించిరి కొందఱు *. బుద్ధ్యాది దేహాంతమునం దంతటను ఆత్మచైతన్యాభాసత గదా ఆత్మభ్రాంతికిఁ గారణము. అందువలన నాత్మవిషయ మగు జ్ఞానము విధాతవ్యము కాదు. మ ఱే మనఁగా నామరూపాద్యనాత్మాధ్యారోపణనివృత్తియే కార్యము. ఆత్మ చైతన్యవిజ్ఞానము కార్యము కాదు, అవిద్యాధ్యారోపితసర్వపదార్థములతోనే విశిష్టముగా గ్రహింపఁబడు చుండుటవలన. అందువలననే విజ్ఞానవాదులు బౌద్ధులు విజ్ఞానవ్యతిరేకంబున వస్తువే లే దని పలికెదరు, ప్రమాణాంతరనిరపేక్షం బనియు, స్వసంవిదితం బని యంగీకరించుటచేత. అందువలన నవిద్యాధ్యారోపణనిరాకరణంబే బ్రహ్మమునందుఁ గర్తవ్యము, కాని బ్రహ్మజ్ఞానమునందు యత్నము వలదు, అత్యంతప్రసిద్ధ మగుటవలన. అవిద్యాకల్పితనామరూపవిశేషాకారములచే నపహృతబుద్ధు లగుటవలన అత్యంతప్రసిద్ధంబును సువిజ్ఞేయంబును ఆసన్నతరంబును ఆత్మభూతంబు నైనను అప్రసిద్ధమును దుర్విజ్ఞేయమును అతిదూరమును అన్యమునుం బోలెఁ దోఁచుచున్నది యవివేకులకు. బాహ్యాకారములనుండి నివృత్తబుద్ధులై గుర్వాత్మప్రసాదసంపన్ను లగు వారికో దీని కన్న మఱియొకటి సుఖంబును సుప్రసిద్ధంబును సువిజ్ఞేయంబును స్వాసన్నంబును లేదు. అట్లు చెప్పఁబడినది "ప్రత్యక్షావగమం ధర్మ్యమ్" ఇత్యాది.

ఆ. జ్ఞానాత్మలకు సామ్యము నుపన్యసించుటచే సిద్ధాంతి సమాధానము చెప్పుచున్నాడు అట్లు కాదు ఇత్యాదిగా. యథోక్తసామ్యానుసారంబున ఆత్మచైతన్యాభాసవ్యాప్తా ఽజ్ఞానపరిణామవంతము బుద్ధి సాభాసబుద్ధి, సాభాసబుద్ధివ్యాప్తము మనస్సు, సాభాసమనోవ్యాప్తము లింద్రియములు, సాభాసేంద్రియవ్యాప్తము స్థూలదేహము. అందు లౌకికభ్రాంతిని బ్రమాణీకరించుచున్నాఁడు అందువలననే ఇత్యాదిగా.

* ప్రకృతి చైతన్యవాదులు.

ఆత్మదృష్టి దేహమాత్రమునందు దృష్ట మగుటవలన అందు చైతన్యాభాసవ్యాప్తి యింద్రియద్వారమునఁ గల్పింపఁబడుచున్నది, ఇంద్రియములయందును ఆత్మదృష్టి కనఁబడుటవలన వానికి చైతన్యాభాసవత్త్వము మనోద్వారమున సిద్ధించుచున్నది, మనస్సునందును ఆత్మదృష్టివలనఁ జైతన్యాభాసవత్త్వము బుద్ధిద్వారమున లభించుచున్నది, బుద్ధియందును ఆత్మదృష్టివలనఁ జైతన్యాభాసవత్త్వ మజ్ఞానద్వారమున సిద్ధించుచున్న దని యర్థము. దేహమునందు లౌకిక మగు నాత్మత్వదృష్టి న్యాయము లేమివలన నుపేక్షణీయ మని యాశంకించి చెప్పుచున్నాఁడు దే హేత్యాదిగా. అట్లయినను ఇంద్రియముల కాత్మత్వము న్యాయహీనం బెట్లిష్ట మగు నని యాశంకించి చెప్పుచున్నారు అట్లే ఇత్యాదిగా. అయినను మనస్సున కాత్మత్వము న్యాయశూన్య మని యాశంకించి చెప్పుచున్నాఁడు కొందఱు ఇత్యాదిగా. బుద్ధికిని ఆత్మత్వము న్యాయయుక్త మని సూచించుచున్నాఁడు కొందఱు బుద్ధి ఇత్యాదిగా. దేహాది బుద్ధ్యంతమునందే యాత్మత్వదృష్టి యితరమునందు లే దను నియమమును వారించుచున్నాఁడు అంతకన్నను ఇత్యాదిగా. సాభాసం బగు దానియందు అంతర్యామి యందు కారణోపాసకుల కాత్మదృష్టి కలదు గదా యని యర్థము. బుద్ధ్యాది దేహాంతమునందు లౌకికపరీక్షకుల కాత్మత్వభ్రాంతికి సాధారణ మగు కారణముఁ జెప్పుచుచున్నాఁడు బుద్ధ్యా దీత్యాదిగా. ఆత్మజ్ఞానము లౌకికపరీక్షకులకుఁ గూడఁ బ్రసిద్ధ మగుటవలననే అది విధివిషయం బను పరుల యభిమతము నిరాకృత మని చెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా. జ్ఞానము విధేయము కాదేని ద్రష్టవ్యాదివాక్యములచే నేమి కర్తవ్య మని యాశంకించి చెప్పుచున్నాఁడు మ తే మనఁగా నిత్యాదిగా. ఆత్మజ్ఞానము విధేయము కా దనుటకుఁ బూర్వోక్త మగు అందువలన నను హేతువును వివరించుచున్నాఁడు అవి ద్యేత్యాదిగా. ఉపలభ్యమానము లగు దేహేంద్రియమనోబుద్ధ్యవ్యక్తములతో సహితముగా నుపలబ్ధ మగుచున్నది చైతన్యము, వేఱువిధమున నా దేహాదులయుపలబ్ధి సంభవింపదు జడము లగుటవలన అనువిషయమున విజ్ఞానవాదిభ్రాంతిని బ్రమాణీకరించుచున్నాఁడు అందువలననే ఇత్యాదిగా. సర్వంబును జ్ఞేయము జ్ఞానవ్యాప్త మయ్యే జ్ఞాత మగుచున్నది, అందుచే జ్ఞానాతిరిక్త మగు వస్తువే లేదు, స్వప్నదృష్ట మగు వస్తువు జ్ఞానాతిరిక్తము లే దనుట సమ్మతము గదా అని వారు భ్రమించుచున్నా రని యర్థము. జ్ఞానము గూడ జ్ఞేయ మగుటవలన జ్ఞాతను వస్త్వంతరము నంగీకరింపవలయు నని యాశంకించి చెప్పుచున్నాఁడు ప్రమాణాంత రేత్యాదిగా. జ్ఞానము తనచేతనే

జ్ఞేయ మని యంగీకరించుటచే నతిరిక్తప్రమాణనిరపేక్ష మనియు పలికెద రని యన్వయము. బ్రహ్మాత్మయందు జ్ఞానము సిద్ధ మగుటచే విధేయము కా దని తేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా. యత్నము—భావన. బ్రహ్మమును తజ్జానమును అత్యంతప్రసిద్ధము లైనయెడ బ్రహ్మమునం దన్యథాజ్ఞానము లౌకికుల కెట్లు కలుగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు అవిద్యాకల్పి తేత్యాదిగా. వారికిఁ దోఁచు నట్లే దుర్విజ్ఞేయత్వాదిరూపమే బ్రహ్మ మేల కాదు ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు శా హ్యేత్యాదిగా. గురుప్రసాదము—శుశ్రూషచే సంతోషితుఁ డైన యాచార్యునకుఁ గరుణాతిశయమువలననే తత్త్వము తెలియుఁ గాక యని శిష్యునియందుఁ గలుగు నిరవగ్రహ మగు ననుగ్రహము, ఆత్మప్రసాదము — పదార్థవాక్యార్థముల గ్రహించినపురుషునియాత్మకు—మనస్సునకు శ్రుత్యుక్త యుక్త్యనుసంధానము వలన విషయవ్యావృత్తతచేతను ఏకాగ్రతచేతను ప్రత్యక్ప్రవణత యని వివేకము. ఆత్మజ్ఞానము ఆత్మద్వారమునఁ బ్రసిద్ధం బనుటకు వాక్యోపక్రమమును బ్రమాణముగాఁ జూపుచున్నాఁడు అట్లు ఇత్యాదిగా.

భా. కొందఱో పండితమ్మన్యులు నిరాకారం బగుటవలన నాత్మవస్తువును బుద్ధి గ్రహింపనేరదు. కావున నసాధ్యము సమ్యగ్జ్ఞాననిష్ఠ యని చెప్పెదరు. సత్య మిది గురుసంప్రదాయరహితులకును వేదాంతశ్రవణము లేనివారలకును అత్యంతబహిర్విషయాసక్తబుద్ధులకును జక్కఁగాఁ బ్రమాణములయం దకృతశ్రములకును. తద్విపరీతులకో లౌకికగ్రాహ్యగ్రాహకద్వైతవస్తువునందు సద్బుద్ధి యెంతయు దుర్లభము, ఆత్మ చైతన్యవ్యతిరేకమున వస్త్వంతర మనుపలబ్ధ మగుటవలన. ఇది యిట్లే వేఱువిధము కా దని చెప్పియున్నారము. భగవంతునిచేతనుం జెప్పఁబడినది “యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః” అని. అందువలన బాహ్యాకారభేదబుద్ధినివృత్తియే యాత్మస్వరూపాలంబనమునందుఁ గారణము. ఆత్మ యనఁగా నొకని కొకప్పు డప్రసిద్ధుఁడు ప్రాప్యుఁడు హేయుఁడుపాదేయుఁడు గాని కాఁడు గదా ! అయ్యాత్మ యప్రసిద్ధుఁ డైనయెడ సర్వప్రవృత్తులును అస్వార్థము లగును గదా ! అవి దేహాద్యచేతనార్థము లని కల్పింప శక్యము కాదు. సుఖార్థము సుఖము దుఃఖార్థము దుఃఖం

● జ్ఞానము.

బనుటయుఁ జెల్లదు. సర్వవ్యవహారంబును ఆత్మావగత్యవసానార్థ మగుట వలనఁ గూడ. అందువలన స్వదేహపరిచ్ఛేదము కొఱకెట్లు ప్రమాణాంతరాపేక్ష లేదో అట్లు దానికన్నను ఆత్మ యంతరతముఁ డగుటవలన తదవగతినిగూర్చి ప్రమాణాంతరాపేక్ష లేదు. కావున నాత్మజ్ఞాననిష్ఠ వివేకులకు సుప్రసిద్ధ మని సిద్ధము.

ఎవ్వరికి నిరాకారము జ్ఞాన మప్రత్యక్షమో వారికిని జ్ఞానవశమే జ్ఞేయావగతి కావున జ్ఞాన మత్యంతము ప్రసిద్ధమే, సుఖాదికమువలె నని యంగీకరింపవలయును. జిజ్ఞాస యనుపపన్న మగుటవలనఁ గూడ. జ్ఞాన మప్రసిద్ధ మగునేని జ్ఞేయమువలె జిజ్ఞాసితం బగును. ఎట్లు ఘటాది విషయమును జ్ఞానముచే జ్ఞాత వ్యాపింపఁ గోరునో అట్లు జ్ఞానమును గూడ జ్ఞాత జ్ఞానాంతరముచే వ్యాపింపఁ గోరును. ఇదియో లేదు. అందువలన నత్యంతప్రసిద్ధము జ్ఞానము. జ్ఞాతయు నందువలననే ప్రసిద్ధుఁడు. అందువలన జ్ఞానమునందు యత్నము కర్తవ్యము కాదు, మఱేమనఁగా అనాత్మబుద్ధినివృత్తియందే. అందువలన జ్ఞాననిష్ఠ సుసంపాదము.

ట౹. ఆత్మ నిరాకారుఁ డగుటవలనఁ దద్విషయంబున బుద్ధి ప్రవర్తింపదు కావున సమ్యగ్జ్ఞాననిష్ఠ దుర్లభం బను మతము నెత్తుచున్నాఁడు కొందఱో ఇత్యాదిగా. బహిర్ముఖులకా అంతర్ముఖులకా బ్రహ్మమునందు సమ్యగ్జ్ఞాననిష్ఠ దుర్లభ మని వికల్పించి మొదటిపక్షము నంగీకరించుచున్నాఁడు సత్యము ఇత్యాదిగా. పూర్వవిశేషణ ముత్తరవిశేషణమునకు హేతువుగా గ్రహింపవలయును. రెండవ పక్షమును దూషించుచున్నాఁడు తద్విపరీతులకో ఇత్యాదిగా. అద్వైతనిష్ఠులకు ద్వైతవిషయమున సద్బుద్ధియెంతయు దుర్లభ మనుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు ఆత్మేత్యాదిగా. ఆత్మ వ్యతిరేకమున వస్త్వంతరము లే దనుట యెట్లని యాశంకించి చెప్పుచున్నాఁడు ఇది ఇత్యాదిగా. అద్వైతమే వస్తువు, ద్వైత మావిద్యకము, వేఱు విధము కాదు—తాత్త్వికము కాదు, అని యచ్చటచ్చట నధ్యాయములందు మేము చెప్పి యున్నార మని యన్వయము. అంతర్నిష్ఠు లగు నద్వైతదర్శులకు ద్వైతమునందు సద్బుద్ధి సంభవింప దనుటయందు భగవంతునిసమ్మతిని గూడఁ జూపుచున్నాఁడు భగవంతుని ఇత్యాదిగా. పరమతమును నిరాకరించి ప్రకృత ముపసంహరించుచు ఆత్మ

నిరాకారుఁ డైనపుడు జ్ఞానము తదాలంబన మగుట కేమి కారణ మని యాశంకించి చెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా. ఓయీ! ఆత్మ యెట్లయినను సమ్యగ్జ్ఞానక్రియచే సాధ్యుం డగునేని అతఁడు హేయుఁడో ఉపాదేయుఁడో కావలయును, అప్పుడు స్వర్గాదికమువలెఁ గ్రియాసాధ్యుం డగుటచే నతఁ డసిద్ధుఁ డగును. అనఁగా కాఁడని చెప్పుచున్నాఁడు ఆత్మ యనఁగా నిత్యాదిగా. ఆత్మ యగుటవలననే ప్రసిద్ధుఁ డగుటచే ప్రాప్తుఁ డగుటవలన అనాత్మకువలె నతనికి హేయత్వము గాని యుపాదేయత్వము గాని సంభవింపమివలన లేదు క్రియాసాధ్యత యని యర్థము. క్రియచేతనే గాని యాత్మ యసిద్ధుఁ డనునెడ సప్తు డభ్యుదయని శ్శ్రేయసార్థము లగు సర్వప్రవృత్తులకును ఆత్మార్థత్వము సంభవింపమివలన అర్థి లేనపుడు స్వార్థత్వ మప్రామాణికంబగు నని చెప్పుచున్నాఁడు అయ్యాత్మ ఇత్యాదిగా. ఓయీ! ప్రవృత్తులకు స్వార్థత్వము దేహాదులయం దే దేని యర్థి యగుటచేఁ దదర్థత్వమువలన నని యాశంకించి ఘటాదులకువలె నచేతనములన కర్థిత్వము సంభవింపమివలన నట్లు కా దని చెప్పుచున్నాఁడు అవి ఇత్యాదిగా. ఓయీ! ప్రవృత్తులు ఫలావసాయు లగుటచే వానికి సుఖదుఃఖములలో నొకటి యర్థ మగుటవలన స్వార్థత్వము లేదు అనఁగాఁ జెప్పుచున్నాఁడు సుఖార్థము ఇత్యాదిగా. ప్రవృత్తులు సుఖదుఃఖార్థము లైనను ఆ సుఖదుఃఖములకు స్వార్థత్వము సిద్ధింపమివలనఁ దదర్థి యగుటచే ఆత్మ సిద్ధుఁ డని యర్థము. మఱియును, సర్వాపేక్షాన్యాయమువలన ఆత్మావగతియే యంతముగాఁ గలది సర్వవ్యవహారంబును, ఆత్మ యప్రసిద్ధుఁ డైనయెడ యజ్ఞాదివ్యవహారమునకు తజ్ఞానార్థత్వము సంభవింపదు, కావున ఆత్మప్రసిద్ధి నంగీకరింపవలయు నని చెప్పుచున్నాఁడు సర్వేత్యాదిగా. ఆత్మ ప్రసిద్ధుఁ డైనను ప్రమాణద్వారమునఁ బ్రసిద్ధుఁడు కావలయు నని య త్సిధ్యతి తత్ప్రమాణా దేవ " * అను న్యాయమువలన అనఁగా చెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా. మానమేయాదిసర్వవ్యవహారంబును ఆత్మావగత్యంత మని యేర్పడుటవలనఁ బ్రమాణప్రవృత్తికి మున్నే యాత్మప్రసిద్ధి యంగీకరింపవలయుటవలన నని యర్థము. ఇట్లాత్మావగతి స్వాభావిక మగునపుడు వివేకవంతుల కారోపనివృత్తిచే జ్ఞాననిష్ఠ సుప్రసిద్ధ మని యుపసంహరించుచున్నాఁడు కావున నిత్యాదిగా.

ఓయీ! అనాకారమునే బుద్ధి ననుమానించెద మని చెప్పుచు ననాకారమప్రత్యక్ష మని తలంచువారికి నర్థావగతికి మున్ను అప్రసిద్ధమే జ్ఞానము, అనఁగా

* ఏది సిద్ధించునో అది ప్రమాణమువలననే సిద్ధించుచున్నది.

కా దని చెప్పుచున్నాఁడు ఎవ్వరికి ఇత్యాదిగా. సుఖాదికమువలె నిత్యానుభవగమ్యమగు జ్ఞానం బనుమేయము కాదు, విషయోపగతిచే దాని ననుమానించునెడ నన్యోన్యాశ్రయ మగుటవలన నని భావము. ఇందువలనఁ గూడ జ్ఞానము ప్రసిద్ధము, కాదేని దానియెడ జిజ్ఞాస కలుగును, జిజ్ఞాసయో జ్ఞానమందుఁ బ్రసిద్ధము కాదు, ప్రసిద్ధమునం దది సంభవింపమినలన నని చెప్పుచున్నాఁడు జిజ్ఞాస ఇత్యాదిగా. దానినే ప్రపంచించుచున్నాఁడు జ్ఞానము ఇత్యాదిగా. దృష్టాంతమునే వివరించుచున్నాఁడు ఎట్లు ఇత్యాదిగా. దార్ష్టాంతికమును వివరించుచున్నాఁడు అట్లు ఇత్యాదిగా. ఇష్టాపత్తిని నిరాకరించుచున్నాఁడు ఇదియో లేదు అని. ఇదియో—జ్ఞానమునకు జ్ఞానాంతరముచే జ్ఞేయత్వము, అనవస్థ సంభవించుటవలన నని యర్థము. జ్ఞానమునందు జిజ్ఞాసయనుపపన్న మగుటచే ఫలితముఁ జెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా. జ్ఞానము ప్రసిద్ధ మైనను జ్ఞాత కేమివచ్చెను? అనఁగాఁ జెప్పుచున్నాఁడు జ్ఞాతయు నిత్యాదిగా. జ్ఞాత లేక జ్ఞానమునకుఁ బర్యవసానము ఘటిల్లమివలన నని యర్థము. జ్ఞానము ప్రసిద్ధ మయినపుడు దానియందు భావన యనఁబడు విధి లే దని చెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా. అప్పుడు దేనియందుఁ బ్రయత్నాఖ్య మగు భావన? అని యాశంకించి చెప్పుచున్నాఁడు మ తే మనఁగా నిత్యాదిగా. అవిషయమును నిరాకారుఁడు నగు నాత్మయందు జ్ఞాననిష్ఠ యసాధ్యము కానియప్పుడు ఫలితమును నిగమనము చేయుచున్నాఁడు అందువలన నిత్యాదిగా.

హ. యథా; సిద్ధిం ప్రాప్తః; బ్రహ్మ=నైష్కర్మ్యము; ఆప్నోతి. తథా; నిబోధ=ఎఱుంగుము; మే=నాయొక్క యీశ్వరునియొక్కమతమును; సమాసేనైవ=సంక్షేపముచేతనే. అట్లు, నిష్ఠా=స్థితి; జ్ఞానస్య; యా పరా=ఏది ప్రకృష్టమో దానిని ఎఱుంగు మని యర్థము.

శం. జ్ఞానకర్మములకు సాధ్యసాధనభావముఁ దెలుపుటకై సాత్త్వికకర్మానుష్ఠానసంభావిత మగు సత్త్వశుద్ధి చెప్పఁబడినది. అందువలనఁ దత్త్వవివేకజ్ఞానము నొందినట్టి యారూఢుం డగు యతికి విదేహకైవల్యసిద్ధికారణ మగు జ్ఞానమునకు ప్రతిబద్ధత్వము సిద్ధించుట కొఱకు నియమంబునఁ గ్రమంబునఁ గర్తవ్య మగు సప్రకారమయిన జ్ఞాననిష్ఠను జ్ఞానఫలమును నిరూపించుటకై చెప్పుచున్నాఁడు.—సత్త్వశుద్ధిచే నాత్మతత్త్వముఁ జక్కఁగా నెఱింగినట్టి ముముక్షు వారూఢుఁడు సన్న్యాసముచేత, సిద్ధిమ్ = నైష్కర్మ్యసిద్ధిని; ప్రాప్తః = పొందినవాఁడై; యథా=ఏప్ర

కారముచేత; తత్తత్సాధనానుష్ఠానపూర్వకముగా జ్ఞాననిష్ఠాసిద్ధిక్రమంబునఁ బరిపక్వ మగు జ్ఞానముచే, బ్రహ్మ ఆప్నోతి = బ్రహ్మభావము నొందుచున్నాఁడో. విద్వాంసునకు బ్రహ్మప్రాప్తి యనఁగా సంశయాసంభావనావిపరీతభావనాదివికల్పములు లేక చక్కఁగా నపరోక్షీకరింపఁబడిన స్వాత్మ నిత్యశుద్ధబుద్ధముక్తచిదేకరసము నిర్విశేష మద్వితీయ మగు పరబ్రహ్మమునందు ఇదియే నే నని యాత్మత్వబుద్ధి చేయుటయే. ఎట్లు ఆరోపితదోషముచేతఁ దన్ను అన్యథాగ్రహించి యున్న దేవదత్తుఁడు తద్దోష నివృత్తిచే దేవదత్తుఁడే నే నని స్వాత్మయందు స్వబుద్ధిని జేయునో అట్లు స్వాజ్ఞానముచే బ్రహ్మ మనుటను విస్మరించి యున్నవాఁడు గురుప్రసాదమువలనఁ గలిగిన విజ్ఞానముచే నజ్ఞాననివృత్తియై స్వాత్మ యగు బ్రహ్మమునందు స్వబుద్ధిని చేయుచున్నాఁడు. అందు స్వబుద్ధికరణమే విద్వాంసునకు బ్రహ్మప్రాప్తి కాని ధనప్రాప్తివలెఁ బ్రాప్తి కాదు, దేశమునను కాలమునను స్వరూపమునను బ్రాప్తవ్య మగు వ్యవధానము లేమివలన, "అయ మాత్మా బ్రహ్మ" అను న్యాయముచేతఁ బొందువాఁ డగు విద్వాంసునకు స్వరూప మగుటవలన నిత్యప్రాప్త మగు వస్తువునకుఁ బునః ప్రాప్తి కల్పింప శక్యము కామివలన. అందువలన విస్మృత మగు కంఠాభరణమునకుఁ దడవుకొనుటచే నున్న దను నిశ్చయం బెట్లు ప్రాప్తి యనఁబడునో అట్లజ్ఞానముచే నన్యథాగృహీత మైన స్వాత్మ యగు బ్రహ్మమునందు విచారజన్యజ్ఞానముచే పొందియు స్వత్వనిశ్చయమే ప్రాప్తి. ఇట్లు బ్రహ్మవిదుఁడు యథా—ఏ బ్రహ్మనిష్ఠాసిద్ధి ప్రకారముచే విశుద్ధ మగు బుద్ధిచే బ్రహ్మము నొందుచున్నాఁడో తథా—ఆ జ్ఞాననిష్ఠాసిద్ధి ప్రకారమును, సమాసే నైవ—సంక్షేపముననే విస్తరమునఁ గాదు, విశుద్ధబుద్ధికి సూక్ష్మగ్రాహికి బహుగాథ లుపయోగింపమివలన స్వల్పగ్రంథముచే నాప్రకారమును, మే—నావలన, నిబోధ=చక్కఁగా నెఱుంగుము, ఎఱింగి తదనుష్ఠానపరుండ వగుము, శ్రవణమునకు బోధమునకును ఫల మనుష్ఠానమే; అనుష్ఠానము లేనియెడ నంగడిమాట వలె నుపదేశము నిరర్థక మగు నని యర్థము. ఆ సమ్యగ్జ్ఞానము గదా విదేహముక్తికిఁ బరమకారణము, యా=ఏది; పరా = నిరతిశయపరిపాకలక్షణ మగు; నిష్ఠా=పరిసమాప్తియో, వికారరహితమై నిశ్చల మైన స్థితియో; దేనియొక్క నిష్ఠ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—జ్ఞానస్య—"న జాయతే మ్రియతే" అని యారంభించి "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః, ప్రథితః పురుషోత్తమః" అనువఱకుఁ గల నిర్విశేషవిషయక మగు గ్రంథముచేత ఎట్టివాఁ డాత్మ నిర్విశేషుఁడు నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడు పరుఁడు ప్రత్యగేకరసుఁడు అద్వితీయుఁడు చక్కఁగా నిరూ

పింపఁబడెనో, తద్విషయ మగు జ్ఞాన మెట్టిదో, ఎట్టి జ్ఞానముచే నేనే యిది యంతయు నిది యంతయు నేనే యని బ్రహ్మవిదుఁ డగు యతి సర్వాత్మకుఁడును దృశ్యసంబంధరహితుఁడును చిదేకరసుఁడును ఆకాశమువలెఁ బరిపూర్ణుఁడును అద్వితీయుఁడు నగు నాత్మను చూచుచున్నాఁడో, అట్టి జ్ఞానము సిద్ధించుకొఱకు ఏ పర నిష్ఠ చేయవలయునో, అది యేప్రకారముచే సిద్ధించునో, ఆప్రకారమును నావలన నెఱుంగు మని యర్థము.

ఓయీ! ముముక్షువున కాత్మజ్ఞానమే సిద్ధింపదు, ఇఁకఁ దన్నిష్ఠ పర మెట్లు సిద్ధించును? ఎట్లు జ్ఞానము సిద్ధింప దనఁగాఁ జెప్పెదము. యదాకారము జ్ఞేయమో తదాకారమే యగును తద్జ్ఞానము. నరుఁడు జ్ఞేయుఁడగునేని తద్జ్ఞానము నరాకారమే యగుచున్నది. పశు వగునేని పశ్వాకార మగును, వేఱువిధము కాదు. ఆత్మయో నిరాకారుఁడు, ఆత్మ కాకారము లేదు గదా! నస త్తన్నాసదుచ్యతే అని దృశ్యత్వము నిషిద్ధ మగుటవలనను సదసద్విలక్షణ మగు వస్తు వప్రసిద్ధ మగుటవలనను విషయత్వ ముపపన్నము కాదు. ఆత్మ యుష్మత్ప్రత్యయార్థ మగునేని అప్పుడాకారవత్త్వ మాత్మకు సిద్ధించును. ఆత్మ యుష్మత్ప్రత్యయార్థము కాఁడు గదా! “అస్థూల మన ణ్వహ్రస్వమ్” అని యాత్మకు సర్వదృశ్యవైలక్షణ్యము శ్రుతం బగుటవలన. ఓయీ! “తం దేవా జ్యోతిషాం జ్యోతిః, అత్రాయం పురుషః స్వయం జ్యోతిః” అని యాత్మకు జ్యోతిస్స్వరూపము శ్రుతము. ఎట్లు రూపరహితుఁడు? అని యందువేని, కాదు, “అస్థూలమ్, యత్త దద్రేశ్యమ్” అని రూపవత్ప్రత్యత్వము నిషిద్ధమగుటవలన అరూపవత్ప్రత్యత్వాపత్తిచే జడత్వము ప్రాప్తింపఁగా శ్రుతి ప్రకాశస్వరూపుఁ డాత్మ యని దాని నిరసించుచున్నది. కాని సూర్యాదులవలె జ్యోతిస్స్వరూపుఁ డాత్మ యని చెప్పదు. అట్లయినయెడ నాత్మకు భౌతికత్వము జ్ఞేయత్వము జడత్వము అనిత్యత్వము మొదలగు దోషములు ప్రసక్తించును, సూర్యాదులకువలె నప్రయత్నంబున విషయత్వంబును సంభవించును. అది యయుక్తము, “దివ్యోహ్యమూర్తః పురుషః” అని యమూర్తత్వము శ్రుత మగుటవలన. “న సందృశే తిష్ఠతి రూప మస్య” అని యాత్మకు నవిషయత్వమే శ్రుతము. విషయభూత మగు వస్తువునందుఁ గదా జ్ఞానమునకుఁ దదాకారమునఁ బరిణామ మగును. అవిషయమునందో పరిణామము సంభవింపదు. ఓయీ! “స ఆత్మా స విజ్ఞేయః” అని నిర్విశేషాత్మను శ్రుతి చెప్పుచున్నది. శ్రుతార్థాకారమున జ్ఞానమునకుఁ బరిణామ ముపపన్నమే యగు నందువేని, కాదు, “ఏషన ధ్యాసుతో యాతి” ఇత్యాది శ్రుతార్థాకారజ్ఞానము ప్రసక్తించుటవలనను అట్టి జ్ఞానము మనోరాజ్యమువలె మిథ్య

యగుటవలనను. శ్రుతము శ్రావితము మనస్సుచే భావిత మగు వస్తువుగాని తద్విషయక మగు జ్ఞానము గాని సత్యమును ప్రమాణాంతరముచే నబాధితమునుం గాదు గదా! అందువలన నాత్మవిషయక మగు జ్ఞానమే సంభవింపదు. అది సంభ వింపనియపుడు ఎట్లు తన్నిష్ఠ సిద్ధించును ?

అది యుక్తము కాదు, ఆత్మసత్త ప్రత్యక్షాదిప్రమాణగమ్యం బగుటవలనఁ దద్జ్ఞానాసంభవము సిద్ధింపమివలన. ఒకవిషయమునందుఁ బ్రత్యక్షం బొకవిషయము నం దనుమాన మొకవిషయమునందు శాస్త్రం బొకవిషయమునం దర్థాపత్తియుఁ బ్రమాణములు. ఆత్మవిషయము నందో యివి యన్నియుఁ బ్రమాణములు. అది చెప్పెదము. దేహేంద్రియాదు లధిష్ఠాత కలవి, స్వభావమున జడములై యిష్టానిష్ట ప్రవృత్తినివృత్తులు గలవి యగుటవలన, ఏది యధిష్ఠాత కలది కాదో ఆ జడము ప్రవృత్తినివృత్తులు గలది కాదు, శకటమువలె; తదధిష్ఠాత యగు నాత్మ దేహాదుల కంటె భిన్నుఁడు, నియామకుఁ డగుటవలన, రథికునివలె. ఇత్యాద్యనుమాన ముచేతను "నాన్తః ప్రజ్ఞం న బహిః ప్రజ్ఞమ్" ఇత్యాది శాస్త్రముచేతను ఆత్మను దెలియ శక్య మగును బండితులకు. మఱియు నెట్లు నేఁ డేకాదశి శివరాత్రి యని శాస్త్రోక్తము నంగీకరించి యుపవాసము చేయుదురో అట్లు "నాన్తః ప్రజ్ఞ" మిత్యా దిగా "ప్రప ఞ్చోపశమం శాన్తం శివ మద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా" అను వఱకుఁ గల శాస్త్రముచే సకలదృశ్యసంబంధము నిషేధించి యర్పిత మగు నాత్మ తత్త్వమును విద్వాంసుఁ డెఱుంగవలయును, రెంటికిని శాస్త్రప్రతిపాద్యత్వము సమాన మగుటవలన. ఓయీ! నాన్తః ప్రజ్ఞ మిత్యాది శ్రుత్యుక్తార్థము నిర్విశేష మగుటచే నుపలబ్ధము కామివలన వంధ్యాపుత్త్రునివలె నసత్యమే యందువేని, ఏకా దశికిని స్వరూపమున విశేషాకార ముపలబ్ధము కామివలనఁ దత్తుల్య మగుటవలనఁ అననుష్ఠేయత్వము ప్రసక్తించును. అందువలన రెంటికిని శాస్త్రైకగమ్యత్వమును శాస్త్రోక్త మగుటచే నంగీకార్యత్వమును సమానమే. ఓయీ! ఏకాదశివలె నాత్మ సద్భావముగూడ శాస్త్రముచే నంగీకరించెదము.అప్పుడు దానియం దెట్లు నిశ్చయత బునఁ బ్రవర్తింతువో అట్లు నేను దేహాదికము కా నని నిశ్చయమున ననాత్మయం దహంభావముఁ బరిత్యజించి బ్రహ్మమే నే నని యూరక యుండుము. మఱి వికల్ప ములు చేయకుము. ఇదియే ప్రామాణికతకును బ్రమాణమునకును ఫలము. ఓయీ! మాకు శాస్త్రము ప్రమాణమే, అయినను ఆత్మ యవిషయ మగుట వలనఁ దదనుభవము లేమివలన మాకుఁ బ్రవృత్తి లేదు. అందువేని, అప్పు డేకాదశి

ప్రత్యక్షమనియుఁ దదనుభవముచే నందుఁ బ్రవృత్తి కల దని చెప్పుటచే నీయజ్ఞతమత్వము ప్రకటించితివి. పండితులకు శుద్ధబుద్ధులకే ముముక్షువులకు మోక్షశాస్త్రమునందును దత్ప్రతిపాదితార్థమునందును విశ్వాసమును దృఢప్రత్యయమును బ్రవృత్తియును సహస్రకోటిజన్మార్జిత పుణ్యపుంజపరిపాకవశమువలన నీశ్వరప్రసాదముననే సిద్ధించును, వేఱువిధమున యుక్తికోటులచేనేనియు నశుద్ధబుద్ధులకు సిద్ధింపదు ఆత్మ యవిషయ మగుటవలనను అప్రసిద్ధుఁ డగుటవలనను తదనుభవము లేమివలనఁ బ్రవృత్తి లే దని చెప్పితివి కావున దానికిఁ జెప్పెదము. ఆత్మ యెంతమాత్రమును ఏకాదశివలె నేకాంతమున నవిషయము కాఁడు, అస్మత్ప్రత్యయార్థమగుటచే నిత్యాపరోక్షుఁ డగుటవలనను బ్రకాశస్వరూపుఁ డగుటవలనను సర్వప్రకాశకుఁ డగుటవలనను బ్రత్యగాత్మ ప్రసిద్ధుఁ డగుటవలన. ఆత్మ యెవ్వనికిని ఎప్పుడును అప్రసిద్ధుఁడు కాని జ్ఞాతవ్యుఁడు ప్రాప్తవ్యుఁడు కాని కాఁడు. ఆత్మ యప్రసిద్ధుఁ డైనయెడ లౌకిక వైదిక వ్యవహారము నీకు సిద్ధింపదు. అందఱకును ఆత్మ నుద్దేశించియే యిష్టానిష్టములందుఁ బ్రవృత్తినివృత్తులు కలుగుచున్నవి కాని యనాత్మ యగు దేహమును బ్రాణమును బుద్ధిని ఇతరమును గాని యుద్దేశించి కాదు. మనుష్యుఁ డాత్మసుఖముకొఱకే కదా దేహారోగ్యమును బుద్ధిసౌష్ఠవమును ఆహారసౌగుణ్యమును గోరుచున్నాఁడు, ఉపశమమును బ్రాణనిరోధమును యోగమునుం జేయుచున్నాఁడు, భార్యను బెండ్లియాడుచున్నాఁడు, దేవతలయజించుచున్నాఁడు హరిని భజించుచున్నాఁడు. అందువలన దేహాదివిలక్షణుఁ డగు నాత్మ యహంప్రత్యయార్థము ప్రసిద్ధుఁడే. నేను లే నని యెప్పుడు గాని యెవ్వనికిఁ గాని జ్ఞానము కలుగదు గదా! నేను స్వప్నము గంటిని, సుఖముగా నిద్రించితిని, మేలుకొని యున్నా నని యవస్థాత్రయమునందును అందఱిచేతను నేనున్నా ననియే యాత్మసత్త సదా యనుభవింపఁబడు చుండుటవలన. ఆత్మకు జ్ఞేయత్వం బనుపపన్న మగుటవలనను సర్వదృశ్యభిన్నత్వము ప్రసిద్ధ మగుటవలనను. తన్నొక్కని సాక్షాత్తుగా ననుభవించుచున్న పండితునకు స్వసత్తాసిద్ధికిఁ బ్రమాణాపేక్ష లేదు గదా! సర్వప్రమాణములకును బ్రామాణ్య మెవ్వనివలన సిద్ధించు చున్నదో అట్టి సర్వప్రమాణప్రామాణ్యసిద్ధికారణ మైన స్వప్రకాశుఁ డగు నాత్మ నేది ప్రకాశింపఁ జేయును? అచేతనము చేతనమును దెలుపఁజాలదు గదా! తనసత్త తనకే ప్రత్యక్షము కావునఁ బ్రత్యక్షము ప్రమాణము. వ్యవహారాన్యథానుపపత్తిచేఁ గలుగు నర్థాపత్తియుఁ బ్రమాణము. ఇట్లు ప్రత్యక్షాది ప్రమాణసిద్ధుఁ డయిన యాత్మ వంధ్యాపుత్త్రునివలె నసత్తనియు తద్జ్ఞానము మనోరాజ్యమువలె నగుణధ్యా

నమువలె మిథ్యావిషయ మనియుఁ బ్రమాణాంతరబాధ్య మనియు సంభావింప శక్యము కాదు, అట్లయినయెడ నీకు నీజ్ఞానము లేక పోవలయును. అందువలన జ్ఞాతయగుటచేతను అస్మత్ప్రత్యయార్థ మగుటచేతను సర్వవ్యవహారకారణ మగుటచేతను బరమప్రేమాస్పదం బగుటచేతను బ్రసిద్ధుఁ డగుటవలన నీయాత్మ అత్యంతము అవిషయము కాఁడు. మఱే మనఁగా, స్వచ్ఛత వలనను నిర్మలత వలనను సూక్ష్మతవలనను ఆత్మచైతన్యవ్యాప్తిచే బుద్ధి సూర్యప్రకాశవ్యాప్తిచే స్ఫటికం బెట్లు సూర్యునివలె నవభాసిల్లునో అట్లాత్మవలె నవభాసిల్లు చున్నది. తాదృశబుద్ధివ్యాప్తిచే మన ఆది స్థూలాంతము సర్వంబును ఆత్మవలె నవభాసిల్లు చున్నది. అందుచే దేహేంద్రియప్రాణ మనోబుద్ధ్యాదులయం దనాత్మలయందు నే నని యాత్మబుద్ధి యెల్లరకును నేను మనుష్యుఁడను బ్రాహ్మణుఁడను యతి ననియు నేను బ్రష్టుఁడ శ్రోత్రియను కాణుఁడను ఖంజుఁడ ననియు నేను క్షుధితుఁడను పిపాసితుఁడ ననియు నేను కర్తను భోక్త ననియు నేను సుఖిని దుఃఖి ననియుఁ గలుగు చున్నది. ఇట్లారోపితము లగు ననాత్మతత్ప్రత్యయములచే నాచులచే జలమువలె మేఘపటలములచేఁ జంద్రునివలెఁ దిరోహితుం డగుటచే నాత్మ స్పష్టముగాఁ బ్రకాశింపకున్నాఁడు. నూఱుపథముల శ్రవణము చేసినను మననము చేసినను అనాద్యవిద్యావాసనచేఁ బండితులు గూడ వెలుపలను లోపలను బరిపూర్ణుఁడై యున్నను సూక్ష్ముఁడును అతీంద్రియుఁడు నగుటచే నాత్మ నవగాహింపక జడము స్థూల మగు నారోపిత మయిన యనాత్మనే యాత్మనుగా గ్రహించుచున్నారు. కాని యాత్మను గ్రహింపఁజాలరు. అందువలన ననాద్యవిద్యారోపితంబు లగు లోపలి బుద్ధ్యాదులను వెలుపలి ఘటపటాదులను దత్ప్రత్యయంబులను ఇది యంతయు నేనును బ్రహ్మమే యని సర్వత్ర బ్రహ్మైకవిషయ మగు ప్రత్యగ్దృష్టిచే నిరసించుటయె కర్తవ్యము. సంతత బ్రహ్మప్రత్యయావృత్తిచే విపరీతప్రత్యయములు నిశ్శేషముగా నివర్తిల్లినపుడు శైవాల నివృత్తియందు స్వచ్ఛము సుఖకరం బగు జలమువలె మేఘాపాయమునందు పూర్ణుఁ డానందకరుం డగు చంద్రునివలె స్వచ్ఛుఁడు శాంతుఁడు చిద్ఘనుఁ డానందఘనుఁ డయిన యాత్మ జ్ఞానచక్షువునకుఁ జక్కఁగా విషయుం డగుచున్నాఁడు. అందువలన నాత్మావరకము లైన యనాత్మప్రత్యయముల నిరసించుటయందే యత్నము కర్తవ్యము తీవ్రముముక్షుచే విద్వాంసునకు, కాని యాత్మ యెట్టివాఁ డేమిలక్షణము గలవాఁ డెట్లున్నాఁ డెక్కడ నున్నాఁ డెట్లతనిఁ బొంద నగు నని యాత్మ సద్భావ తత్ప్రతిపత్తిజ్ఞానమునం దేమియుఁ జేయవలసినది లేదు, ఆత్మ యహమర్థ మగుటచే

స్వతస్సిద్ధుఁ డగుటవలనను నిత్యప్రాప్తుఁ డగుటవలనను. నిరాకారము లైనను కాల దేశాదులజ్ఞానము శాస్త్రాచార్యోపదేశముచే సిద్ధించుచున్నది. నేఁ డేకాదశి యిది తూర్పని. ఇంక స్వస్వరూపముగానే సిద్ధుఁ డైన యాత్మ యొక్క జ్ఞానము శాస్త్రాచార్యోపదేశముచే సిద్ధించు నని చెప్పవలయునా? ఆత్మజ్ఞానముచేతనే గదా తన్నును బరుని నెఱుంగుచున్నాఁడు నేను నాది యిది యని. ఎవ్వఁడను స్వప్నము గంటినో యెవ్వఁడను సుఖముగా నిద్రించితినో అతఁడే నేను మేలుకొని యున్నా నని యనుభూయమానుఁ డగు తాను స్వప్నమున దేహేంద్రియాదిభిన్నుం డనియు సుషుప్తియందు బుద్ధ్యాదిభిన్నుఁ డనియు సర్వత్ర జ్ఞాత యనియు నెఱింగియు ఆత్మ యెవ్వఁడు తజ్జ్ఞానం బెట్టిది యని పలుకుట పండితునకు యుక్తము గాదు. దేనిప్రకాశముచే దీని సర్వంబును వెలుపల లోపల నెఱుంగుచున్నాఁడో తజ్జ్ఞానము సిద్ధింప దనుట యతిసాహసము. "ఏత ద్యోవేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞః" అని క్షేత్రమును క్షేత్రధర్మజాతమును సర్వంబును నెవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడను నే నాత్మ నని యాత్మజ్ఞానము యతికి శుద్ధాత్మునకుఁ బరమేశ్వరప్రసాదమువలన సులభతమమే యగును. అందువలన ఆత్మ సుప్రసిద్ధుఁడు తజ్జ్ఞానంబును సులభతమమే యగు ననియే శుద్ధాత్ముం డగు యతికి సద్గురూపదేశమువలన సంప్రాప్త మయిన యాత్మజ్ఞానమునకే యనాత్మవాసనాకృతంబు లగు విపరీతప్రత్యయముల నిశ్శేష నివృత్తిచే నప్రతిబద్ధత్వము సిద్ధించుటకై ముముక్షువునకు జ్ఞాననిష్ఠ సంపాదనీయ మని చెప్పఁబడుచున్నది భగవంతునిచేత "నిష్ఠా జ్ఞానస్య యా పరా" అని.

ఓయీ! ముముక్షువుచే జ్ఞాననిష్ఠ సంపాదనీయ మని చెప్పఁబడినది. జ్ఞాననిష్ఠ యనఁగా జ్ఞానమునందు—జ్ఞానస్వరూప మగు బ్రహ్మమునందు చిత్తమునందు నైశ్చల్యమునకు స్థితియా? లేక జ్ఞానాభ్యాససమాప్తియా? మొదటిది కాదు, చంచల మగుటవలన మనస్సునకు బ్రహ్మమునందు స్థితి సంభవింపమివలన. రెండవ పక్షమునందు జ్ఞానమున కనఁగా జ్ఞానహేతు వగు వేదాంతశాస్త్రాభ్యాసమునకుఁ బరిసమాప్తియా? లేక జ్ఞానముయొక్క ప్రత్యయావృత్తికిఁ బరిసమాప్తియా? మొదటి పక్షము కాదు, కేవలగ్రంథమును శుష్కతర్కమునువలె నావర్తించుటచే క్లేశమే కాని ప్రయోజనము లేమివలన. రెండవదియుఁ గాదు, తత్త్వ మసి యని తత్త్వంపదార్థశోధనపూర్వకముగా వాక్యార్థశ్రవణమాత్రముచేతనే నేను బ్రహ్మ నని విద్వాంసునకు బ్రహ్మాత్మప్రత్యయము సంపన్న మయినపుడు మాటిమాటికిఁ దదా

వృత్తివలన ఫలము లేమివలన. నేను బ్రహ్మమ నని సంపన్న మగు జ్ఞానమునకే బ్రహ్మత్వ ప్రత్యయమునకు దార్ఢ్యముకొఱకుఁ బునఃపునరావృత్తి కర్తవ్య మందువేని, కాదు, పట్టాభిషేకముచేతనే రాజత్వము నొందిన నరపతికి మాటికి మాటికి నేను రాజ నని యావృత్తిచేతవలె శ్రుతియుక్తులచేత శోధితము లైన తత్త్వంపదార్థముల యేకత్వావబోధక మగు వాక్యార్థము వినికిమాత్రమున నేను బ్రహ్మమే యని బ్రహ్మత్వభావము నొందినయతికి మాటిమాటికి బ్రహ్మమే నే నని ప్రత్యయావృత్తిచే వెండియు నుపాధికృతపరిచ్ఛేదము దక్క ఫలాంతరము లేమివలన. మఱియును అరాజున కావృత్తిక్రియచే రాజత్వమువలె అబ్రహ్మమునకు బ్రహ్మత్వ మావృత్తిక్రియచేఁ గల్పింపవలసి వచ్చును. ఘట మిది యని యుపదేశమాత్రముచే ఘటవిషయక మగు జ్ఞానము తత్క్షణమ యెట్లు జనించునో అట్లే తత్త్వ మసి యని యుపదేశమాత్రమున నేను బ్రహ్మను నని బ్రహ్మత్వాపాదక మగు జ్ఞానము శుద్ధాత్మునకు జనియింపక తప్పదు. ఇందు మాటిమాటికిఁ బ్రత్యయావృత్తి యపేక్షితము కాదు. చక్షుస్సన్నికర్షమాత్రంబున ఘటజ్ఞానము కలిగినపుడు ఘట మిది ఘట మిది యని తద్జ్ఞానదార్ఢ్యముకొఱకుఁ బలుమాఱు తదావృత్తి యపేక్షితము కాదు గదా! ప్రమ ప్రమాణప్రమేయసంబంధమాత్రసాధ్యము కాని యావృత్తిసాధ్యము కాదు. జ్ఞానము వస్తుతంత్రము, పురుషతంత్రము కాదు. అందువలన జ్ఞానాభ్యాసము నిష్ప్రయోజనమే యగును.

సత్యము ప్రమాణప్రమేయసంబంధమాత్రజన్యమే జ్ఞానము, అది వస్తుతంత్రమే కాని పురుషతంత్రము కాదు, క్రియాతంత్రమునుం గాదు. అయినను స్వోత్పత్తికిఁ బ్రమాణసౌష్ఠవము నపేక్షించుచున్నది. వాస్తవ మగు జ్ఞానము గూడఁ బ్రమాణసౌష్ఠవ మున్ననే సమీచీనముగా జనించుం గాని సౌష్ఠవము లేనియెడ నట్లు జనింపదు. నేత్రమునకుఁ గాచకామిలాదిదోషమునఁ దిమిరము కలిగినపుడు అనేకచంద్రజ్ఞాన మవాస్తవమే జనించుచు వస్తువు స్పష్టమై యున్నను, అదియే నిరంతరౌషధసేవచేఁ దద్దోషము నివృత్తమై నిర్మల మైనపుడు స్పష్టముగా వాస్తవమయిన చంద్రజ్ఞానంబును తద్దర్శనాహ్లాదంబును సిద్ధించును. అట్లే యనాద్యవిద్యావాసనాకృతము లగు సత్త్వరజస్తమోదోషములచే నంతఃకరణము దూషితమై యున్నపుడు సముత్పన్నము లగు చున్న "నేను ఇది అది" ఇత్యాద్యనాత్మప్రత్యయములచే వ్యవహిత మగుటంజేసి యాత్మతత్త్వము స్పష్టముగా భాసిల్లదు. ఆ యంతఃకరణమే చిరకాలము నిత్యనిరంతరము సమనుష్ఠితం బగు సజాతీయప్రత్యయావృత్తి

లక్షణ మైన సమాధియోగముచే నాదోషములును దత్కార్యములును నిశ్శేషముగా నివర్తిల్లి కేవలశుద్ధసత్త్వభావము కలిగినపుడు ఇది యంతయు నేనును బ్రహ్మమే యను నద్వైతాత్మవిజ్ఞానము సర్వదృశ్యసంబంధరహితము అప్రతిబద్ధముగా జనియించును. అందువలనఁ బ్రత్యయావృత్తికి జ్ఞానపరిపాకమే ప్రయోజనము. జ్ఞానపరిపాకము సిద్ధించిననే యుక్తలక్షణ మగు సమ్యగ్జ్ఞానము కైవల్యపదావసానము అఖండానందజనకము సిద్ధించును. అట్లు శ్రుతి “ సమాధి నిర్ధూత మలస్య చేతసో నివేశిత స్యాత్మని య త్సుఖం భవేత్, ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః, అభ్యాసా త్పక్వవిజ్ఞానః కైవల్యం లభతే నరః, నాస్తి జ్ఞానా త్పరం కించి త్పవిత్రం పాపనాశనమ్ । త దభ్యాసా దృతే నాస్తి సంసారో చ్ఛేదకారణమ్” అని. జ్ఞానమునకుఁ బరిపాక మనఁగా, చిరకాలము నిత్యనిరంతరముగా నభ్యసింపఁబడిన సజాతీయప్రత్యయావృత్తిచే సమ్యగ్జ్ఞానోత్పత్తిప్రతిబంధకము లగు సత్త్వరజస్తమోగుణంబులకును తత్కార్యము లగు “ నేను ఇది అది ఇష్టము అనిష్టము ” ఇత్యాది విపరీతప్రత్యయములకును రాగద్వేషాదివికారములకును నిశ్శేషనివృత్తిచేఁ బుట్టునది యంతఃకరణప్రసాదలక్షణ మగు కేవలశుద్ధసత్త్వభావమే. అది కలిగిననే ఇది యంతయు నేనును బ్రహ్మమే యని తనయందును సర్వమునందును బ్రహ్మత్వబుద్ధివ్యవస్థాపక మగు పరావరైకత్వవిజ్ఞానము వృత్తివ్యాపారసమాప్తిలక్షణము వికల్పరహితముగా సంభవించును. అట్టి యీజ్ఞానము నిత్యనిరంతరసజాతీయప్రత్యయావృత్తిచేతనే లభించునది కాని యిది ఘట మను జ్ఞానమువలె సకృదుపదేశమాత్రమున లభించునది కాదు. రాజత్వజ్ఞానమువలెఁ బట్టబంధక్రియామాత్రమున లభించునదియుఁ గాదు. అందు జ్ఞేయము స్థూల మగుటచేత జ్ఞానంబును స్థూల మగుటవలనను బ్రతియోగిరహిత మగుటవలనను లౌకిక మగుటవలనను బ్రత్యయావృత్తి యపేక్షితము కాదు. “ సూక్ష్మా త్సూక్ష్మతరం నిత్యమ్, తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్ ” అను శ్రుతులవలన, ఇట జ్ఞేయ మగు నాత్మవస్తువు పరమసూక్ష్మమును అలౌకికమును శైవాలపటలములచే జలమువలె నవిద్యాతత్కార్యములచేఁ దిరోహితమునై యున్నది. అందువలనఁ దజ్జ్ఞానము నేత్రము సూర్యప్రకాశమునుంబోలె స్వవిషయావరణవారణమునుసత్ప్రత్యయావృత్తి లక్షణము నపేక్షించు చున్నది. ఇందుచే బ్రహ్మభావము కల్పితము కాదు. నేను మనుష్యుఁడఁ గాను అనునపుడు ఆత్మకు మనుష్యత్వము నిషేధింపఁబడుచున్నది కాని అహ

మర్త్యత్వము కల్పింపఁబడను, అట్లు బ్రహ్మభావంబును కల్పింపఁబడదు, అహం మర్త్యత్వము స్వతస్సిద్ధ మగుటవలన, "అయ మాత్మా బ్రహ్మ, క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని బ్రహ్మభావము శ్రుతిస్మృతిప్రసిద్ధ మగుటవలన. బ్రహ్మాత్మలకు భేద మున్నయెడ నెట్లద్వైతము సిద్ధించును? "ఏక మేవా ఽద్వితీయం బ్రహ్మ నేహ నానాస్తి కించన, ఏకో రుద్రో న ద్వితీయాయ తస్థే" ఇత్యాది శ్రుతులచే నద్వైతమే ప్రతిపాదింపఁబడు చున్నది. అందువలన ఘటాకాశమహాకాశములకుంబోలె బ్రహ్మాత్మల కభిన్నత్వము స్వతస్సిద్ధము కాని క్రియచేఁ గల్పింప శక్యము కాదు. మ తే మనఁగా, సత్ప్రత్యయావృత్తిచే ననాదివాసనవలనఁ బ్రతీయమానము లగు విపరీతప్రత్యయములనిరాసముమాత్రమే చేయఁబడుచున్నది బ్రహ్మవిదునిచేఁ దనకుఁ బ్రహ్మాత్వజ్ఞాన దార్ఢ్యముకొఱకు. ఎట్లు స్థూల మైనను రత్నజ్ఞానము స్వదార్ఢ్యముకొఱకు నిత్య పరిశీలనము నపేక్షించు చున్నదో, ఎట్లు స్థూల మైనను రవిబింబజ్ఞానము అందఱకు నపరోక్ష మగుకొఱకుఁ జిరకాలనిత్యనిరంతరాభ్యాసము నపేక్షించు చున్నదో, అట్లే బ్రహ్మాభిన్నత్వజ్ఞానం బతిసూక్ష్మము ప్రతిపక్షసహితము తన కప్రతిబద్ధత్వము సిద్ధించుకొఱకు సత్ప్రత్యయావృత్తి నపేక్షించు నని చెప్పెడి దేమి? "త స్యాభిధ్యానా ద్యోనా త్తత్త్వభావాత్, త స్యాభిధ్యానా త్తృతీయం దేహభేదః, నిష్కలం ధ్యాయమానః, ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూతయోనిమ్" ఇత్యాది శ్రుతులచే నుత్పన్న మగు నాత్మజ్ఞానమునకు అప్రతిబద్ధత్వము సిద్ధించుటకై సజాతీయ ప్రత్యయావృత్తిలక్షణం బగు సమాధి కర్తవ్యం బని యుపదేశింపఁబడుచున్నది, "త మేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః" అనియును. అందువలన సర్వాత్మత్వసిద్ధికొఱకు ద్వైతప్రత్యయనిరసనం బగు సత్ప్రత్యయావృత్తిరూపజ్ఞానాభ్యాసమును శ్రవణము చేసి యాత్మతత్త్వము నెఱింగినవాఁడును ముముక్షువు నగు యతి సహకారిసాధనము లగు తద్బుద్ధిత్వాదులతోను అద్వేష్టృత్వాదులతోను వక్ష్యమాణములతోను సంపన్నుఁడై చేయవలయు నని షష్ఠాధ్యాయమునందు నిరూపిత మైన యర్థమునే వెండియు దృఢీకరించుటకై చెప్పుచున్నాఁడు భగవంతుఁడు "నిబోధమే నిష్ఠా జ్ఞానస్యయా పరా" అని. ఇఁక జ్ఞానహేతు వగు వేదాంతశాస్త్రమును శుష్కతర్కమునుం బోలె నావర్తించుటచేఁ గ్లేశమే గాని ప్రయోజనము లేదని యేది చెప్పఁబడినదో అది యుక్తము గాదు, ఆత్మజ్ఞానము వేదాంతావృత్తి చేతనే లభ్య మగుటవలనఁ దదావృత్తి సఫల మగుటవలన. ముముక్షు వగు యతికి స్తోత్రమంత్రజపాదులచే నాత్మజ్ఞానము సిద్ధింపదు గదా! నిరంతర వేదాంతవిచారము

చేతనే కాని. "సన్న్యస్య శ్రవణం కుర్యాత్, శ్రోతవ్యో మన్తవ్యః, ఉపనిషద మావర్తయేత్" అని నిరంతరవిచారమే కర్తవ్య మని శ్రుతులు చెప్పుచున్నవి. "ఆవృత్తి రసకృ దుపదేశాత్, శమాదిసహితస్తావదభ్యసే చ్ఛ్రవణాదికమ్, ఆసుప్తే రామృతేః కాలం నయే ద్వేదాన్తచిన్తయా, తత్త్యాగీ పతితో భవేత్" అని విచారము నియమమునఁ గర్తవ్య మనియు దాని విడిచినయెడఁ బ్రత్యవాయ మగు ననియు స్మృతులు చెప్పుచున్నవి. అందువలనఁ బ్రణవజపాదికము నంగముగాను విచారము నంగిని * గాను జేసికొని సమ్యగాత్మవిజ్ఞాన ముదయింపకుండువఱకు నెల్లప్పుడును వేదాంతావృత్తి నియమమునఁ జేయుచునే యుండవలయును. ఇదియే ప్రయోజనము సన్న్యాసమునకు. జ్ఞానవిజ్ఞానములు సిద్ధించిన పిమ్మట నావృత్తిని విడువవలయును. అట్లు "గ్రన్థ మభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః । పలాల మివ ధాన్యార్థీ త్యజే ద్గ్రన్థ మశేషతః" అని చెప్పఁబడినది. అందువలన జిజ్ఞాసువునకు నిరంతరావృత్తి కర్తవ్య మని సిద్ధము. మఱియు, చంచల మగుటవలన మనస్సునకు జ్ఞానస్వరూప మగు బ్రహ్మమునందు స్థితి సంభవింప దని యేది చెప్పఁబడినదో అదియు యుక్తము కాదు, ఆత్మ యాథాత్మ్యావధారణము దానిచేతనే సాధ్య మగుటవలన. నిశ్చలబుద్ధివృత్తికిఁ జక్కఁగా విషయభూత మైననే మణ్యాదికముయొక్క స్వరూపావధారణము శక్యమగును గాని చంచలవృత్తికి విషయభూత మైనయెడఁ గానేరదు. అట్లు సమాహిత మైన బుద్ధిచేఁ జక్కఁగా విషయీకృత మైననే బ్రహ్మముయొక్క యాథాత్మ్యావధారణంబును దానియం దాత్మబుద్ధికరణంబును తత్ఫలంబును సిద్ధించును. వేఱు విధమున సిద్ధింపదు. అందువలన ముముక్షువై తత్త్వజ్ఞుం డగు యతి సమాధిచేఁ బ్రయత్నంబున మనస్సునకు స్థైర్యము సంపాదింపవలయును. "సమాహితో భూత్వాత్మన్యే వాత్మానం పశ్యతి సర్వ మాత్మానం పశ్యతి" అని సమాహితబుద్ధికే యాత్మ యాథాత్మ్యజ్ఞానంబును ఆత్మ యం దాత్మబుద్ధికరణంబును సర్వాత్మత్వదర్శనంబును సిద్ధించు నని శ్రుతి చెప్పుచున్నది. అందువలనఁ గేవలశ్రవణమాత్రంబున యతి కాత్మయందే యాత్మత్వబుద్ధియు సర్వాత్మత్వసిద్ధియు సిద్ధింపను. అందువలనఁ దదర్థమే యీ జ్ఞాననిష్ఠ కృతశ్రవణునకు సర్వజ్ఞుఁ డగు నీశ్వరునిచేఁ జెప్పఁబడుచున్నది నిష్ఠా జ్ఞానస్య అని.

మ. పూర్వోక్తసాధనసంపన్నుఁ డగు సర్వకర్మసన్న్యాసికి బ్రహ్మజ్ఞానోత్పత్తియందు సాధనక్రమముఁ జెప్పుచున్నాఁడు.—స్వకర్మముచేఁ బరమేశ్వరు

* ప్రధానమును.

నారాధించి తత్ప్రసాదజం బగు సర్వకర్మత్యాగపర్యంత మైన జ్ఞానోత్పత్తియోగ్యతారూపమును, సిద్ధిమ్ = అంతఃకరణశుద్ధిని; ప్రాప్తః = పొందినవాఁడు; యథా బ్రహ్మ ఆప్నోతి = ఏప్రకారముచే శుద్ధుఁడైన యాత్మను సాక్షాత్కరించుచున్నాఁడో; తథా = ఆప్రకారమును, మే నిబోధ = నావచనమువలన నవధరింపుము అనుష్ఠించుటకై. అతివిస్తరమునను నాయేమి? కా దని చెప్పుచున్నాఁడు.—సమాసేనైవ = సంక్షేపముచేతనే. ఓ కౌంతేయా! దాని నవధరించినయెడ నేమి యగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—నిష్ఠా జ్ఞానస్య యా పరా—జ్ఞానస్య—విచారపరినిష్పన్నమైన దానియొక్క, నిష్ఠా = పరిసమాప్తి, దేనియనంతరము అనుష్ఠింపనలసినసాధనం బేదియు లేదో అట్టిది, పరా—శ్రేష్ఠము, లేక సర్వమునకును కడపటిది, సాక్షాన్మోక్షహేతు వగుటవలన. అట్టి సిద్ధిని బొందినవాని బ్రహ్మప్రాప్తిరూప మగు జ్ఞాననిష్ఠను బరిమును సంక్షేపమునఁ దెలిసికొను మని యర్థము.

శ్రీ. ఇట్టి పరమహంసకు జ్ఞాననిష్ఠచే బ్రహ్మభావప్రకారముఁ జెప్పుచున్నాఁ డాఱుశ్లోకములచేత.—నైష్కర్మ్యసిద్ధి నొందినవాఁడై, యథా — ఏప్రకారముచేత, బ్రహ్మముఁ బ్రాపించుచున్నాఁడో, తథా — ఆప్రకారమును, సంక్షేపముననే నావచనమువలన నెఱుంగుము.

ప. ......బ్రహ్మభావనాప్రకారమును జెప్పుచున్నాఁడు.——......యా= వక్ష్యమాణ మగునేది; జ్ఞానస్య; పరా = సర్వోత్కృష్ట మగు; నిష్ఠా = మర్యాదయో. *

రా. సిద్ధిం ప్రాప్తః = ప్రయాణపర్యంతము ప్రతిదినమును అనుష్ఠించు కర్మయోగముచే నిష్పాద్య మయిన ధ్యానసిద్ధి నొందినవాఁడు; యథా = ఏప్రకారమున వర్తించు చున్నవాఁడై; బ్రహ్మము నొందుచున్నాఁడో, తథా సమాసేన మే నిబోధ. ఆబ్రహ్మమే విశేషింపఁబడుచున్నది.——నిష్ఠా జ్ఞానస్య యా పరా—జ్ఞానస్య= ధ్యానాత్మకమునకు; యా పరా నిష్ఠా — ఏది పరమప్రాప్యమో యని యర్థము.

మా. యథా = ఏ యుపాయముచేత. దేనిచేత, సిద్ధిం ప్రాప్తః బ్రహ్మ ఆప్నోతి, తథా నిబోధ. యా = ఏసిద్ధి; జ్ఞానస్య పరా నిష్ఠా.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ
శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. ౫౧

---

* లక్ష్మీనది శ్రీసరీయముతో సమానము.

భా. పరం బగు నీజ్ఞాననిష్ఠ కార్యం బని చెప్పఁబడినది. ఎట్లు?—
బుద్ధ్యా = అధ్యవసాయాత్మక మగు దానితో; విశుద్ధయా = మాయా
రహిత మైనదానితో; యుక్తః = సంపన్నుఁడై; ధృత్యా = ధైర్యముచే;
ఆత్మానమ్ = కార్యకరణసంఘాతమును *; నియమ్యచ = నియమనము
చేసియు, వశీకరించియు; శబ్దాదీన్ = శబ్దము మొదలుగాఁ గల వగు;
విషయాన్ = విషయములను; త్యక్త్వా = విడిచి, సామర్థ్యమువలన కేవ
లము లయిన శరీరస్థితిమాత్రములు దక్క నంత కధికము లను సుఖార్థ
ములను విడిచి యని యర్థము; శరీరస్థిత్యర్థమై ప్రాప్తము లైనవాని
యందును, రాగద్వేషౌ = రాగమును ద్వేషమును; వ్యుదస్యచ = పరిత్య
జించియు.

సంశయవిపర్యయరహిత మగు బ్రహ్మాత్మత్వనిశ్చయము గలవాఁడై ధైర్య
ముచే దేహాదికమును వశీకరించి శరీరస్థితికిఁ గావలసినవి దక్కఁ దక్కిన శబ్దాదివిష
యముల నన్నిటిని విడిచి శరీరస్థితికి లభించినవానియందును రాగద్వేషములు వహిం
పక యని తాత్పర్యము.

ఆ. పూర్వశ్లోకమునఁ బ్రతిష్ఠాపిత మగు బ్రహ్మజ్ఞానపరనిష్ఠ ననువదించి
శ్లోకాంతరము దించుటకై యడుగుచున్నాఁడు పరంబు ఇత్యాదిగా. బ్రహ్మజ్ఞానము
యొక్క పరనిష్ఠ సమారోపితము లగు నతద్ధర్మముల నివృత్తిద్వారమున బ్రహ్మము
నందుఁ బరిసమాప్తి జ్ఞానసంతానరూపము చెప్పఁబడినది అది కార్యము సుసంపాద
మని. అది యెట్లు — ఏయుపాయముచేత నని ప్రశ్నార్థము. అడిగిన యుపాయ
భేదము నుదాహరించుచున్నారు బుద్ధ్యేత్యాదిగా. అధ్యవసాయము — బ్రహ్మాత్మత్వ
నిశ్చయము. మాయారహితము—సంశయవిపర్యయశూన్యము. శబ్దాదిసర్వవిషయ
ములఁ ద్యజించినయెడ శరీరస్థితియును దుర్ఘట మగు నని యాశంకించి చెప్పుచున్నారు
సామర్థ్యమువలన నిత్యాదిగా. విషయము లన్నిటిని విడిచినయెడ దేహస్థితి యనుపప
న్నమగుటవలన జ్ఞాననిష్ఠాసిద్ధియే లేక పోవుటవలన నని యర్థము. దేహస్థితినిమిత్తమై
యనుజ్ఞాతము లగు నర్థములయందుఁ బ్రాప్త మగు రాగాదికమును జ్ఞాననిష్ఠాప్రతి
బంధకమును నిషేధించుచున్నారు శరీ రేత్యాదిగా. పరిత్యజించి వివిక్తసేవి కావల
యు నని యుత్తరముతో సంబంధము.

* దేహమును.

ప్ర. బుద్ధ్యా = అధ్యవసాయాత్మక మగు దానిచే; విశుద్ధయా=సాత్త్విక ముతో; యుక్తః; ధృత్యా = ధైర్యముచే, సాత్త్విక మయినదానిచే; ఆత్మానమ్ – కార్యకరణసంఘాతమును; నియమ్య = నిలిపి; శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా; రాగ ద్వేషౌ; వ్యుదస్య = తొలఁగించి.

తా. ఆయానియతసాధనముల ననుష్ఠించుచు నిష్ఠను జేయునట్టి బ్రహ్మవిదు నకు బ్రహ్మప్రాప్తిఁ జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—బుద్ధి యధ్యవసా యాత్మకము, అధ్యవసాయమో "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ, అయ మాత్మా బ్రహ్మ" అన్న న్యాయముచే బ్రహ్మము సత్యజ్ఞానానందస్వరూపం బని నిశ్చయము, ఆత్మ బ్రహ్మములకు అభిన్నుఁడని నిశ్చయము, "వికల్పో నహి వస్తు" అన్నన్యాయ ముచేఁ బ్రత్యగభిన్న మగు పరబ్రహ్మమునందు మరుభూమియందు జలమువలెను ఆకాశమునందు నైల్యమువలెను దేహాదిసర్వదృశ్యప్రపంచంబును గల్పితం బని నిశ్చ యము, ఇట్టి యధ్యవసాయము గల బుద్ధి యిట వివక్షితము, విద్వాంసుఁడు స్వాత్మ యగు బ్రహ్మమునం దారోపితము లగు ననాత్మప్రత్యయముల నిరసించుటయందుఁ బ్రవృత్తుఁ డగుటవలన; అదియు విశుద్ధము – శ్రుతియుక్తులచే నిశ్చితార్థ మగుటచే సంశయవిపర్యయరహితము. అట్టి విశుద్ధ మయినబుద్ధితో; యుక్తః = చక్కఁగా అవినాభూతుఁడై; బ్రహ్మనిష్ఠయందుఁ బ్రవృత్తుఁడు బ్రహ్మవిదుఁ డగు యతి, ధృత్యా= పూర్వోక్త మగు సాత్త్వికధైర్యముచే; ఆత్మానమ్=చిత్తమును, బహిఃప్రవృత్తినుండి; నియమ్య = చిత్తమునకు బహిఃప్రవణతను నిరోధించి; చకారమువలన ప్రాణేంద్రియ క్రియలనుగూడ చక్కఁగా నిరోధించి; శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా=శబ్దస్పర్శరూపరస గంధము లనువిషయములను విడిచి, విషయానుసంధానము చేయక యని యర్థము, బహిరంతఃకరణనిరోధము చేసినపుడు విద్వాంసునకుఁ దనంత విషయసంబంధము సంభవింప కున్నను అవశము గాఁ బ్రాప్తము లైనవానిని గూడ అనుసంధింపక యని యర్థము; రాగద్వేషౌ = భిక్షాకాలమునందును బ్రాప్తము లైన యర్థములందు ఇష్టములందు రాగమును అనిష్టములందు ద్వేషమును; వ్యుదస్య = విడిచి; లేక, వ్యుత్థానదశయందు దృష్టు లగు శ్రోత్రియులందుఁ గాని తనకు హితకారు లగు సాధు వులందుఁ గాని రాగమును తద్విపరీతులందు ద్వేషమును విడిచి; చకారమువలన సమాధివిఘ్నకరంబు లగు మోహమును ఆలస్యమును జాడ్యమును ప్రమాదమును విడిచి యని యర్థము.

మ. ఆ జ్ఞాననిష్ఠ సప్రకారముగాఁ జెప్పఁబడుచున్నది.—విశుద్ధయా = సర్వసంశయవిపర్యయశూన్య మగు; బుద్ధ్యా = నేను బ్రహ్మమను అను వేదాంత వాక్యజన్య మగు బుద్ధివృత్తితో; యుక్తః = ఎల్లప్పుడును కూడినవాఁడై; ధృత్యా= ధైర్యముచేత; ఆత్మానమ్ = శరీరేంద్రియసంఘాతమును; నియమ్య=ఉన్మార్గప్రవృత్తి నుండి నివారించి యాత్మప్రవణముగాఁ జేసి; చకారముచే యోగశాస్త్రోక్త మగు సాధనాంతరము సముచ్చిత మగుచున్నది; శబ్దాదీన్ = శబ్దస్పర్శరూపరసగంధము లను; విషయాన్ — భోగముచే బంధహేతువు లైనవాని, సామర్థ్యమువలన జ్ఞాన నిష్ఠార్థ శరీరస్థితిమాత్రప్రయోజనమున కనుపయుక్తము లైనవానిని, అనిషిద్ధములను గూడ; త్యక్త్వా = విడిచి; శరీరస్థితిమాత్రార్థము లయినవానియందును, రాగ ద్వేషౌ = రాగమును ద్వేషమును; వ్యుదస్య = పరిత్యజించి; చకారమువలన ఇతర మయిన జ్ఞానవిక్షేపకమును గూడ పరిత్యజించి. వివిక్తసేవీ అనుచోట నధ్యాహృత మగు స్యాత్ అనుదానితోఁ గాని బ్రహ్మభూయాయ కల్పతే అనుదానితోఁ గాని యన్వయము.

శ్రీ. దానినే చెప్పుచున్నాఁడు.—చెప్పినవిధమున, విశుద్ధయా=పూర్వోక్త మగు సాత్త్వికమైన; బుద్ధ్యా; యుక్తః; ధృత్యా = సాత్త్వికధృతిచే; ఆత్మానమ్— బుద్ధినే; నియమ్య = నిశ్చలముగాఁ జేసి; శబ్దాదీన్విషయాన్త్యక్త్వా; తద్విషయము లగు, రాగద్వేషౌచ వ్యుదస్య. బుద్ధ్యా విశుద్ధయా యుక్త ఇత్యాదులకు బ్రహ్మభూ యాయ కల్పతే యని తృతీయశ్లోకముతో నన్వయము.

ప. ఆ నిష్ఠనే చెప్పుచున్నాఁడు.—ఇట్టి పురుషుఁడు బ్రహ్మభూయాయ కల్పతే అని తృతీయముతో నన్వయము. ఎట్టివాఁడు? విశుద్ధ మగు అధ్యవసా యాత్మకమైన బుద్ధితోఁ గూడినవాఁడై, ధృత్యా = సాత్త్వికధృతిచే; ఆత్మానమ్ = బుద్ధిని; నియమ్య = నిశ్చలముఁ జేసి; శబ్దాదీన్విషయాన్ — పరగోష్ఠులఁ జూచుట మొదలగువాని; త్యక్త్వా; తద్విషయము లయిన రాగద్వేషములను స్వస్తుతి నిందా ప్రయుక్తములను; వ్యుదస్య = విడిచి.

రా. బుద్ధ్యా విశుద్ధయా—యథావస్థితాత్మతత్త్వవిషయ మయినదానితో; యుక్తః; ధృత్యా ఆత్మానం నియమ్యచ — విషయవిముఖముగాఁ జేయుటచే యోగ యోగ్యముగా మనస్సును జేసి; శబ్దాదీన్ విషయాన్త్యక్త్వా — సన్నిహితములు కానియట్లు కావించి; తన్నిమిత్తము లయిన రాగద్వేషములను గూడ, వ్యుదస్య.

మూ. *

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. ౫౨

భా. అంత.—వివిక్తసేవీ = అరణ్యము నదీపులినము • పర్వతగుహ మొదలగు వివిక్తము లయిన ప్రదేశములను సేవించుట స్వభావముగాఁ గలవాఁడు; లఘ్వాశీ=లఘువును భుజించు స్వభావము గలవాఁడు, వివిక్తసేవాలఘ్వాశనములు నిద్రాదిదోషనివర్తకము లయి చిత్తప్రసాదహేతువు లగుటవలన గ్రహింపఁబడినవి; యతవాక్కాయమానసః = వాక్కును కాయమును మనస్సును సంయతము లే జ్ఞాననిష్ఠునకో అట్టి జ్ఞాననిష్ఠుఁడు యతవాక్కాయమానసుఁడు; కావలయును. ఇట్లు ఉపరతము లైన సర్వకరణములును గలవాఁడై, ధ్యానయోగపరః=ధ్యానము — ఆత్మస్వరూపచింతనము, యోగము — ఆత్మవిషయమునందే యేకాగ్రీకరణము, ఆ ధ్యానయోగములు పరత్వమున ⁋ కర్తవ్యము లెవనికో అతఁడు ధ్యానయోగపరుఁడు; నిత్యమ్ = ఎల్లప్పుడును, నిత్యగ్రహణము మంత్రజపాద్యితరములు కర్తవ్యములు కావని తెలుపుటకొఱకు; వైరాగ్యమ్ = విరాగభావమును, దృష్టాదృష్టము లగు విషయములందు తృష్ణ లేమిని; సముపాశ్రితః = చక్కఁగా నాశ్రయించినవాఁడు, నిత్యముగానే యని యర్థము.

ఏకాంతములును బవిత్రములు నగు నరణ్యాదిప్రదేశముల నాశ్రయించి లఘు వైన యాహారము గలవాఁడై వాక్కును కాయమును మనస్సును నియమించి కొని యెల్లప్పుడును ముఖ్యముగా ఆత్మస్వరూపచింతనమును ఆత్మవిషయమునందే యేకాగ్రతయునే చేయుచుఁ దీవ్రవైరాగ్యము గలవాఁడై యని తాత్పర్యము.

టీ. బుద్ధిశుద్ధియు యత్నముచేఁ గార్యకరణనియమనంబును దేహస్థితికిఁ గావలసినవి దక్కఁ దక్కినవిషయముల విడుచుటయు దేహస్థిత్యర్థములందును రాగద్వేషవర్జనంబును నను నుపాయము సిద్ధించినవెనుక నుపాయాంతరములను యత్న

* ఈ శ్లోకమునకును మీఁది శ్లోకమునకును ఈ భాష్యము లేదు.

• ఏటిదిబ్బ.

⁋ ముఖ్యత్వమున.

ముచే సాధింపవలయు నని చెప్పుచున్నారు. అంత నని. చిత్తమున కేకాగ్రతయు ప్రసాదమును గలుగుటకై వివిక్తసేవిత్వమును వివరించుచున్నారు అరణ్యము ఇత్యాదిగా. నిద్రాదిదోషనివృత్తికొఱకు లఘ్వాశిత్వమును విశదీకరించుచున్నారు లఘువును ఇత్యాదిగా. లఘువును— పరిమితమును హితమును మేధ్యము నగు నాహారమును. విశేషణములతాత్పర్యమును వివరించుచున్నారు వివిక్తేత్యాదిగా. నిద్రాదియను నాదిశబ్దముచే ఆలస్యప్రమాదాదులు బుద్ధివిక్షేపకములు వివక్షితములు. చెప్పఁబోవుధ్యానయోగముల కుపాయముగా విశేషణాంతరమును విభజించుచున్నారు వాక్కును ఇత్యాదిగా. వాగాదిసంయమన మావశ్యక మని తెలుపుటకై కావలయు నని చెప్పఁబడినది. వాగాదికరణగ్రామము సంయతముగాఁ జేసికొనిన వాని కనాయాసమునఁ గర్తవ్యము నుపదేశించుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. మంత్రజపాదు లనునాదిపదముచేఁ బ్రదక్షిణప్రణామాదులు ధ్యానయోగప్రతిబంధకములు గ్రహింపఁబడినవి. ఈ చెప్పిన ధ్యానయోగములకే యుపాయముగాఁ జెప్పఁబడిన విరాగభావమును విభజించుచున్నారు దృష్టేత్యాదిగా. చక్కనసే స్పష్టీకరించుచున్నారు నిత్యము ఇత్యాదిగా.

హ॰. వివిక్తము — యోగమునకు విరోధి యగు వస్తువు లేనిస్థానము, దాని సేవించుస్వభావము గలవాఁడు వివిక్తసేవి; లఘువును—హితమును మితమును పథ్యమును భుజించు స్వభావము గలవాఁడు లఘ్వాశి; ధ్యానయోగపరః నిత్యమ్ = ధ్యానము — చిత్తైకాగ్రత, యోగము — చిత్తము నాత్మయందు నిలుపుట, ధ్యానయోగములే, పరము — నిష్ఠ యెవ్వనికో అతఁడు ధ్యానయోగపరుఁడు, నిత్యమ్— సర్వకాలమును; వైరాగ్యమ్ = విగతము రాగము ఎవ్వనినుండియో అతఁడు విరాగుఁడు, వానిభావమును వైరాగ్యమును; సముపాశ్రితః — రాగద్వేషరహితుఁ డని యర్థము.

శ౦. మఱియును.—వివిక్తసేవీ = వివిక్తములు — విజనము లైన దేశములనే యరణ్యనదీపులినగిరిగుహాదులను చిత్తప్రసాదమును తదేకాగ్రతయు సిద్ధించుటకై సేవించు స్వభావము గలవాఁడు వివిక్తసేవి, సర్వదా వివిక్తసేవి కావలయును నిదిధ్యాసనము చేయుయతి; అట్లు, లఘ్వాశియుఁ గావలయును, లఘువుగా భుజించు స్వభావము గలవాఁడు లఘ్వాశి, లఘువుగా భుజించువానికే నిశ్చలముగా సమాధివిఘ్న సంభవించుటవలన, లేక, లఘువును—గురుత్వాదులు లేని ద్రవ్యమును భుజించు

వాఁడు లఘ్వాశీ, లఘుపదము హితమితమేధ్యములకు నుపలక్షణము, అందుచే లఘువును హితమును మితమును మేధ్యము నగు నన్నమును భుజింపవలయును నిదిధ్యాసుయతి యని సిద్ధము. యతవాక్కాయమానసుఁడును కావలయును, యతములు—సంయతములు చక్కఁగా నిరుద్ధములు బాహ్యప్రవృత్తికి చక్కఁగా విముఖములు చేయఁబడినవి వాక్కాయమానసము లెవ్వనిచేతనో అతఁడు యతవాక్కాయమానసుఁడు; విషయచింతనముచే మనస్సు స్థూలమే యగును, సూక్ష్మము కాఁజాలదు, వాసనయు వృద్ధి నొందును, మనోనాశముకొఱకును వాసనాక్షయముకొఱకును జేయఁబడు సమాధి గజస్నానమువలె నిష్ఫలమే యగును; అందువలన సదా విషయచింతనరహితుఁడై యుండవలయును; అటు వాక్ప్రచార మున్నయెడ నీవు నేను ఇది అది ఇత్యాది విపరీతప్రత్యయములు నశింపవు, ద్వైతమే వృద్ధి నొందును రోగి కపథ్యముచే రోగవృద్ధివలె, అందువలన సదా మౌనము వహింపవలయును; కాయము కర్మములందుఁ బ్రవర్తించునెడ కర్తృతాదాత్మ్యమును కర్మవాసనయును సమాధికాలమునందుఁ గాయచలనముచే మనస్సునకును ఇంద్రియములకును జలనంబును సమాధివిఘ్నంబును సంభవించును; అందువలన వాసనాక్షయముకొఱకును మనోనాశముకొఱకును బ్రవర్తించిన యతికి విషయానుసంధానరహితతయు మౌనంబును నైష్కర్మ్యంబును వుండవలయు నని చెప్పుచున్నాఁడు యతవాక్కాయమానసః అని. ఇది సిద్ధించుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—వైరాగ్యమ్ = దృశ్యమునందు మిథ్యాత్వబుద్ధిచేతను తుచ్ఛత్వబుద్ధిచేతను భుజించుటకును అనుసంధించుటకును విషయములనుండి విగతము — నిర్గతము రాగము — ఇచ్ఛ యెవ్వనికో అతఁడు విరాగుఁడు, వానిభావము వైరాగ్యము, సర్వత్ర యిచ్ఛ లేకుండుటను; నిత్యమ్ = అవిచ్ఛిన్నముగా; సముపాశ్రితః = ఆశ్రయించినవాఁడై; ఇట్లు శుద్ధబుద్ధిత్వాదిసాధనయుక్తుం డగు బ్రహ్మవిద్యతి, నిత్యమ్ = నిరంతరముగా; నిత్య మను విశేషణము దేహలీదీపన్యాయముచే రెండుస్థలములయందును అన్వయించుచున్నది; నిత్యపదము నిదిధ్యాసువున కనుష్ఠానాంతరము లే దని సూచించుకొఱకు; అందువలన సదా, ధ్యానయోగపరః = ధ్యానమును యోగమును ధ్యానయోగములు, వానియందుఁ బరుఁడు — ఆసక్తుఁడు ధ్యానయోగపరుఁడు, ప్రత్యగభిన్నంబును సచ్చిదానందైకరసమును నిర్విశేషమును అద్వితీయము నగు పరబ్రహ్మమునందు అధిష్ఠానమైన దాని యందు ఆరోపితము లగు నామరూపాదివిజాతీయప్రత్యయములఁ దిరస్కరించి వెలుపలను లోపలను అంతటను బ్రహ్మమాత్రైకవిషయమును లగు సత్ప్రత్యయములను

ప్రత్యగ్భావము నొందిన వృత్తిచే నిరంతర తైలధారవలె నపరిచ్ఛిన్న మైనదానిచే ప్రవాహముగాఁ జేయుట యేది గలదో అది ధ్యానము, విజాతీయప్రత్యయములచే ననంతరితము లగు కేవలసత్ప్రత్యయములనే చిరకాలము నిత్యనిరంతరముగా నభ్యసించుటవలన విక్షేపకము లగు వాసనలు క్షయించి తనుత్వము నొందిన బుద్ధివృత్తికి బ్రహ్మమునందు బ్రహ్మాకారమున నివాతస్థలదీపమువలె నిశ్చలభావ మేది గలదో అదియే యోగము, ఉక్తలక్షణము లగు నాధ్యానయోగములయందు నిత్యమును బరుఁడై తద్ధ్యానయోగనిష్ఠాసంపన్నుం డగు యతియే పరిపక్వ మగు జ్ఞానము గలవాఁ డగు నని యర్థము.

మ. వివిక్తమును — జనసమ్మర్దము లేనిదియు పవిత్రము నగు నరణ్యగిరిగుహాదిప్రదేశ మేది గలదో దాని సేవించుస్వభావము గలవాఁడు, చిత్తైకాగ్రత సిద్ధించుటకై తద్విక్షేపకారుల విడిచినవాఁ డని యర్థము; లఘ్వాశీ = లఘువును — పరిమితమును హితమును మేధ్యమును భుజించుస్వభావము గలవాఁడు, నిద్ర యాలస్యము మొదలగు చిత్తలయకారుల విడిచినవాఁ డని యర్థము; యతములు—సంయతములు వాక్కాయమానసములు ఎవ్వనిచేతనో అట్టివాఁడు, యమనియమాసనాది సాధనసంపన్నుఁ డని యర్థము; ధ్యానయోగపరో నిత్యమ్ — చిత్తముయొక్క యాత్మాకారప్రత్యయావృత్తి ధ్యానము, ఆత్మాకారప్రత్యయముచే చిత్తము నిర్వృత్తికముగాఁ జేయుట యోగము, నిత్యము — ఎల్లప్పుడును తత్పరుఁడు — ఆ ధ్యానయోగముల ననుష్ఠించుటయందే ఆసక్తుఁడు, కాని యొకప్పుడును మంత్రజపతీర్థయాత్రాదిపరుఁడు కాఁ డని యర్థము; వైరాగ్యమ్ = దృష్టాదృష్టవిషయములందు స్పృహారు విరోధి యగు చిత్తపరిణామమును; సముపాశ్రితః = చక్కఁగా — నిశ్చలముగా నిత్యమును ఆశ్రయించినవాఁడు.

శ్రీ. మఱియును.—వివిక్తసేవీ = శుద్ధప్రదేశమునం దుండువాఁడు; లఘ్వాశీ = మితముగా భుజించువాఁడు; ఈ యుపాయములచే, యతవాక్కాయమానసః=సంయతము లైన వాక్కును దేహమును చిత్తమును గలవాఁడై; నిత్యమ్= ఎల్లప్పుడును; ధ్యానయోగపరః = ధ్యానముచే — యోగము — బ్రహ్మసంస్పర్శము ఏది గలదో తత్పరుఁ డగుచు; ధ్యానాదులకు విచ్ఛేదము లేమికొఱకు, మాటిమాటికి దృఢ మైన వైరాగ్యము నాశ్రయించినవాఁడై.

ప. వివిక్తమును — వివేకమునకు హేతుభూత మయిన యేకాంతస్థలమును సేవించువాఁడును; అట్లు, లఘ్వాశీ = సాత్త్వికమును బరిమితము నగు నన్నమును భుజించువాఁడును; ఈ యుపాయములచేత, యతవాక్కాయమానసః = సంయతము లైన వాగ్దేహచిత్తములు గలవాఁడై; ధ్యానముచేత—చిత్తైకాగ్రతచేత తాదాత్మ్యమున జీవబ్రహ్మైక్యయోగ మేది గలదో తత్పరుఁడై; వైరాగ్యమ్ = వెండియు విశేషవిహితతను; చక్కఁగా — నియమముచే నుపాశ్రితుఁడై.

టీ. వివిక్తసేవీ = సమస్తము లయిన ధ్యానవిరోధులచేతను వర్జిత మగు దేశమునందు వర్తించువాఁడును; లఘ్వాశీ = అతిభోజనమును అభోజనమును విడిచినవాఁడు; యతవాక్కాయమానసః = ధ్యానమున కభిముఖముగాఁ జేయఁబడిన వాక్కును దేహమును మనోవృత్తియుఁ గలవాఁడు; ధ్యానయోగపరః నిత్యమ్ = ఇట్టివాఁడై ప్రత్యహమును మరణపర్యంతము ధ్యానయోగపరుఁడు; వైరాగ్యం సముపాశ్రితః = ధ్యేయ మగు తత్త్వముకంటె భిన్నము లైన విషయములందు దోషదృష్టిచే నందందు విరాగతను వృద్ధి పఱుచుచు.

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమ శ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే. ౫౩

భా. మఱియును.—అహంకారమ్ = అహంకరించుట * యహంకారము దేహేంద్రియాదులందు, దాని; బలమ్ = సామర్థ్యమును కామరాగాదియుక్తమును, ఇతర మయిన శరీరాదిసామర్థ్యమును కాదు, స్వాభావిక మగుటచేఁ దత్త్యాగ మశక్య మగుటవలన; దర్పమ్ = దర్ప మనునది హర్షానంతరము కలుగునది ధర్మాతిక్రమమునకు హేతువు, "హృష్టో దృప్యతి దృప్తో ధర్మ మతిక్రామతి" ♦ అను స్మృతివలన, దానిని; కామమ్ = ఇచ్ఛను; క్రోధమ్ = ద్వేషమును; పరిగ్రహమ్ = ఇంద్రియమనోగతము లగు దోషములఁ బరిత్యజించినను శరీరధారణప్రసంగమునఁ గాని ధర్మానుష్ఠాననిమిత్తమునఁ గాని బాహ్య మగు పరిగ్రహము ప్రాప్త మగుచున్నది, దానిని; విముచ్య = పరిత్యజించి; పరమహంసపరివ్రాజ

* నే నని తలఁచుట.

♦ హర్షము నొందినవాఁడు దర్పము నొందుచున్నాఁడు, దర్పము నొందినవాఁడు ధర్మము నతిక్రమించుచున్నాఁడు.

కుఁడై; నిర్మమః = దేహజీవనమాత్రమునందుఁ గూడ నిర్గత మైన మమభావము గలవాఁడు నిర్మముఁడు; అందువలననే, శాన్తః = ఉపరతుఁడు సంహృతాయాసుఁ * డగు యతి జ్ఞాననిష్ఠుఁ డెవ్వఁడు గలఁడో అతఁడు; బ్రహ్మభూయాయ = బ్రహ్మభవనముకొఱకు; కల్పతే = సమర్థుఁ డగుచున్నాఁడు.

దేహేంద్రియాదులం దహంకారమును కామరాగాదియుక్త మగు బలమును దర్పమును కామక్రోధములను ఏపదార్థము నేనియు స్వీకరించుటను విడిచి దేహజీవనాదులందును మమకారము లేనివాఁడై యెట్టి యాయాసమును లేక యుపరతుఁడై నిత్యమును ధ్యానయోగపరుండగు యతి బ్రహ్మభావమునకు యోగ్యుఁ డగుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. జ్ఞాననిష్ఠుఁ డగుయతికి విశేషణాంతరములు సముచ్చయించుచున్నారు మఱియును అని. నిత్యమును ధ్యానయోగపరత్వమునకు సముచ్చిత మగు కారణాంతరములు వివరించుచున్నారు అహంకరించుట ఇత్యాదిగా. సామర్థ్యమాత్రము బలశబ్దార్థమై యుండఁగా విశేషముఁ జెప్ప నేల యని యాశంకించి చెప్పుచున్నారు స్వాభావికము ఇత్యాదిగా. చెప్పినయర్థమునందుఁ బ్రమాణము చెప్పుచున్నారు హృష్ట ఇత్యాదిగా. వైరాగ్యశబ్దముచే లబ్ధము నైనను కామత్యాగమును వెండియుఁ జెప్పుట ప్రకృష్ట మని తెలుపుటకొఱకు. అహంకారాదుల విడిచినపుడు పరిగ్రహమునకుఁ బ్రాప్తి లేమివలనఁ దత్త్యాగవచన మయుక్త మని యాశంకించి చెప్పుచున్నారు ఇంద్రియేత్యాదిగా. పరిగ్రహము లేనపుడు మమత్వమునకు విషయము లేమివలన నిర్మమత్వం బెట్లని యాశంకించి చెప్పుచున్నారు దేహేత్యాదిగా. అహంకారమమకారములు లేమిచేఁ బ్రాప్త మగు నంతఃకరణోపరతి ననువదించుచున్నారు అందువలననే ఇత్యాదిగా. చెప్పినయర్థము ననువదించి జీవించి యున్నవాఁ డయ్యు బ్రహ్మీభూతుఁ డగుచున్నాఁ డని ఫలితముఁ జెప్పుచున్నారు సంహృతేత్యాదిగా. బ్రహ్మముయొక్క భవనము — అనుసంధానపరిపాకపర్యంత మగు సాక్షాత్కరణము, దానికొఱ కని యర్థము.

హ. దేహాదులయం దాత్మబుద్ధి యహంకారము, బలము — కామరాగసంయుక్త మగు సామర్థ్యము, ఇతర మగు దేహాదిసామర్థ్యము కాదు, అది స్వాభా

* ఆయాసమును విడిచినవాఁడు.

విక మగుటచే విమన నశక్య మగుటవలన, దర్పము—హర్షము, కామము—రాగము, క్రోధము — ద్వేషము, పరిగ్రహము — నాకు ఇది యని యర్థముల స్వీకరించుట, ఈ యహంకారాదులను, విముచ్య = విడిచి; నిర్మమః = శరీరస్థితిసాధన మయిన వస్తువునందును మమత్వబుద్ధి లేనివాఁడు; కావుననే, శాన్తః = ఉపరత మయిన యంతఃకరణము గలవాఁడు; బ్రహ్మభూయాయ కల్పతే.

శ్రీం: ఇట్లు బహుకాలము నిరంతరముగా సమాధినిష్ఠనే చేయుచు సమాధి యను నగ్నిచే నిర్దగ్ధ మగు నశేషవాసనాగ్రంథి గలవాఁడును నిశ్శేషనివృత్త మైన విపరీతభావన గలవాఁడు నగు యతికి సమ్యక్పరిపక్వ మైన జ్ఞానసిద్ధిఫలముఁ జెప్పు చున్నాఁడు.—చిరకాలము నిత్యనిరంతరముగా ననుష్ఠింపఁబడిన సమాధిచే నిష్పన్న మగు సమ్యక్జ్ఞానముచేత దేహాదిద్వైతప్రపంచము స్వవ్యతిరిక్త మనియు ఆభాస మనియు అసత్తనియు దృఢనిశ్చయపూర్వకముగా అధిష్ఠాన మైన స్వాత్మ యగు బ్రహ్మము ఇదియే నేనని విదిత మైనపుడు బ్రహ్మమునందే యాత్మత్వవాసన దృఢ మగుటవలన అనాత్మ యగు దేహాదికమునందు, అహంకారమ్ = అహంకరణమును, అనాత్మ యందు నేనను బుద్ధిని, విడుచుచున్నాఁడు బ్రహ్మవిదుఁ డగు యతి. ఆత్మ తత్త్వజ్ఞుఁడు సర్వాధిష్ఠానము నిత్యము శుద్ధము బుద్ధము ముక్తము చిదేకరసము పరి పూర్ణ మగు పరబ్రహ్మమును స్వస్వరూపముగా నెఱింగి యారోపితంబును అసత్తును తుచ్ఛము నగుదాని అజ్ఞునివలె నే నని యవలంబింపఁడు గదా! మఱే మనఁగా ప్రతిచ్ఛాయవలె నాభాసరూపమున నీదేహము దోఁచు చున్నను దీనియం దహం భావమును బరిత్యజించుచున్నాఁడు. దానియం దాత్మత్వబుద్ధిహేతు వగు నజ్ఞాన మధిష్ఠానయాథాత్మ్యసందర్శనముచే నష్ట మగుటవలన "కారణనాశమువలనఁ గార్య నాశము" అను న్యాయముచే బ్రహ్మవిదుఁడు దానియం దహంభావముఁ జేయఁ డని యర్థము. మఱియును, బలమ్ = నీవు నేను ఇది యని ఆరోపితపదార్థగ్రహణకారణ మును అవిద్యావాసనాకృత మగు వృత్తిరూప మైన బలమును, విడుచుచున్నాఁడు, నిత్యనిరంతరసమాధినిష్ఠచే అనాద్యవిద్యావాసనాక్షయ మైనపుడు తత్కృత మగు బలమును వేగరూపమును అంతఃకరణమున నుండుదాని విడుచుచున్నాఁడు, పూర్వము వాసనాబలమువలన నంతఃకరణము పరిపూర్ణము నైనను బ్రహ్మస్వరూపము నతిక్ర మించి యెట్లు ప్రపంచమును గ్రహించెనో అట్లు సమాధిచే వాసనాక్షయ మగుట వలన విశేషించి నామరూపాదిగ్రహణమును జేయదు, ఆభాసప్రపంచమును విడిచి సర్వత్ర బ్రహ్మమునే చూచును. వ్యుత్థానమునందును సమాధియందును సర్వదా

బ్రహ్మమునందే యుండు నని యర్థము. ఇందుచే విద్వాంసునకు అహమ్మను భావము లేమిచే నిది ఇత్యాదివాసన లే దని సూచితము. దర్పమ్ = కృతార్థుఁడను నేను బ్రహ్మవిదుఁడను నేను అను నభినివేశలక్షణ మగు నంతఃకరణవికారము దర్పము, దానిఁగూడ విడుచుచున్నాఁడు, స్వకారణ మగు నజ్ఞానమును అహంకారమును సమాధిచే వినష్ట మగు చుండఁగా "కారణనాశమువలనఁ గార్యనాశము" అను న్యాయంబునఁ దనకుఁ దానే దర్పము నశించుచున్నది యని యర్థము. అట్లే, కామ౦ క్రోధమ్ = కామమును క్రోధమును విడుచుచున్నాఁడు, సంప్రాప్తపదార్థభోగేచ్ఛ కామము, తన కపకారము చేసినవాని కొట్టుటకుఁ బూనుట క్రోధము, ఆ రెంటిని బరిత్యజించుచున్నాఁడు, స్వకారణ మగు రజము సమాధిచే నిర్మూలిత మగుటవలన నంతఃకరణము నిర్మల మగుటచేఁ బక్కని యప్రతిబద్ధ మగు నాత్మవిజ్ఞానముచే నేనే యిది యంతయు నని సర్వాత్మభావము నొందినవానికి నేను భోక్త నిది భోగ్య మనియు నితఁడు హంత నేను హతుఁడ ననియు విపరీతభావన లేమివలన స్వమాత్ర మగుటచే సర్వమునందును రాగద్వేషముల కవకాశము లేమివలన "నిమిత్తాపాయంబు గలుగ నైమిత్తికమునకును అపాయము" అను న్యాయముచేఁ గామక్రోధములు తను దుంతనే వినాశము నొందు నని యర్థము. అందువలననే, పరిగ్రహమ్=శరీరరక్షణార్థము ప్రాప్తమైన యేపరిగ్రహము కౌపీన కాషాయ కంథాదికము గలదో దానినిగూడ విడుచుచున్నాఁడు. ఇట్లు అహంకారమును బలమును దర్పమును కామమును క్రోధమును పరిగ్రహమును ఏ దేది వెలుపలను లోపలను వికల్పకారణమో దాని నెల్లను, విముచ్య = విడిచి, "న దణ్డం న కమణ్డలుం న శిఖాం న యజ్ఞోపవీతం నాచ్ఛాదనం చరతి పరమహంసః" * అని చెప్పినరీతిని దేహమాత్రావశిష్టుఁ డగు పరమహంసయై; ఓయీ ! శరీరస్థితిహేతు వగు కాషాయకంథాదికమును విడిచినయెడ శీతవాతాదులచే వికల్పమే సంభవించును, ఎట్లు నిర్వికల్పుఁ డగును బ్రహ్మవిదుత్తముఁ డగు పరమహంస? అని యాశంకింపఁగా, దేహాదులయందు నేను నాది యను నభిమానము గలవానికే శీతాదికృతవిక్షేపము కాని యభిమానము లేనివానికిఁ గా దని యది సంభవింపమికి హేతువుఁ జెప్పుచున్నాఁడు.—నిర్మమః = స్వకారణ మగు నహంకారము వినష్ట మగుటవలన నిశ్శేషముగా గతము నిర్గతము దేహమునందు మమభావ మెవ్వనికో అతఁడు నిర్మ

* దండమును గాని కమండలువును గాని శిఖాయజ్ఞోపవీతములను గాని వస్త్రమును గాని ధరింపఁడు పరమహంస.

ముఁడు, పరదేహమునందువలె స్వదేహమునందు మమత లేనివాఁ డని యర్థము, "స్వ వపుః కుణప ః దృశ్యతే యత స్త ద్వపు రపధ్వ సమ్" * అను శ్రుతి వలన బ్రహ్మమునందే యాత్మప్రత్యయము గల మహాత్ముఁ డగు బ్రహ్మవిదుఁడు అనాత్మత్వంబునఁ ద్యక్తమై కల్ప మగు శరీరమునం దహంభావమును మమ భావమునుం జేయఁడు, సర్వవికల్పంబును తన్నిమిత్తకం బగుటవలన విద్వాంసున కది లేమివలన నది లే దని సూచించుట కయ్యే నిర్మమః అని చెప్పఁబడినది. ఎందు వలన నిట్లు చిరకాలనిత్యనిరంతరసమాధియోగముచే సిద్ధమైన యహంకార మమకారాద్యవిద్యావాసనాప్రపంచము గల బ్రహ్మవిద్యతి యెవ్వఁడు గలఁడో అతఁడు సమస్తము లైన గుహాగ్రంథులనుండియు విముక్తుఁ డగుచున్నాఁడో; అందు వలననే, శాన్తః = నిరింధనాగ్ని వలె నుపశాంతము లయిన యంతఃకరణసర్వవికార ములునుం గలవాఁడు; అందువలననే ప్రసన్నాంతఃకరణుఁ డగుటచే ఆత్మయాథా త్మ్యవిజ్ఞానము నొందినవాఁడై, బ్రహ్మభూయాయ = బ్రహ్మభావముకొఱకు, బ్రహ్మ భావ మనఁగా సచ్చిదానందైకరసబ్రహ్మరూపమున నుండుట, దానికొఱకు; కల్పతే— బ్రహ్మాకారమున నిలుచుచున్నాఁ డని యర్థము. ఇందుచే, అత్యంతశ్రద్ధతోఁ జిర కాలము నిత్యనిరంతరముగా సమాధినిష్ఠ యొకటే నియమంబున ననుష్ఠించిన వాఁడును తన్నిష్ఠచే నహమాదిసర్వవాసనాగ్రంథివిచ్ఛేదమును జక్కఁగాఁ జేసినవాఁ డును తద్విచ్ఛేదముచేఁ జక్కని యాత్మప్రసాదము నొందినవాఁడును తల్లాభముచే సిద్ధ మయిన యాత్మయాథాత్మ్యవిజ్ఞానముచే నేనే యిది యంతయు నని సర్వంబును ఆత్మనుగానే చూచువాఁడు నగు బ్రహ్మవిదునకు బ్రహ్మభావము సిద్ధించు నని సూచి తము.

వ. అహంకారమ్ = మహాకులప్రసూతుఁడను నేను మహాత్ములకు శిష్యుఁడను మిక్కిలివిరక్తుఁడను నాకు సముఁడు మఱియొకఁడు లేఁడు అనునభిమాన మును, బలమ్=అసదాగ్రహమును, కాని శారీరమును కాదు, అది స్వాభావిక మగు టచే విడువ నశక్య మగుటవలన; దర్పమ్ = హర్షజన్య మగు మదమును ధర్మాతి క్రమమునకుఁ గారణ మైనదాని, "హృష్టో దృప్యతి దృప్తో ధర్మ మతిక్రామతి" అను స్మృతివలన; కామమ్ = విషయాభిలాషను, వైరాగ్యం సముపాశ్రితః అను టచేఁ జెప్పఁబడినను మెండియుఁ జెప్పుట యత్నాధిక్యసూచనార్థము; క్రోధమ్ = ద్వేషమును; పరిగ్రహమ్ — శరీరధారణార్థమును, అస్పృహుఁ డైనను బరులచే

* తనదేహము పీనుగులవలెఁ గనఁబడును. అందువలన నాదేహము నశించినది—లేనట్లే.

నియ్యఁబడిన బాహ్యోపకరణములను; విముచ్య=విడిచి, శిఖాయజ్ఞోపవీతాదికమును గూడ; ఒకదండమును కమండలువును కౌపీనాచ్ఛాదనమును శాస్త్రముచే నభ్యను జ్ఞాతమయినదాని శరీరయాత్రార్థము గ్రహించి పరమహంసపరివ్రాజకుఁడై, నిర్మమః = దేహజీవనమాత్రమునందును మమకారము లేనివాఁడు; అందువలననే అహంకారమమకారములు లేమివలన హర్షవిషాదరహితుఁ డగుటవలన, శాన్తః = చిత్తవిక్షేపరహితుఁ డగు యతి; జ్ఞానసాధనపరిపాకక్రమంబున, బ్రహ్మభూయాయ = బ్రహ్మసాక్షాత్కారముకొఱకు; కల్పతే = సమర్థుఁ డగుచున్నాఁడు.

శ్రీ. మఱియును.—అంత, విరక్తుఁడ నేనను నహంకారమును బలమును—దురాగ్రహమును దర్పమును — యోగబలమువలన నున్మార్గప్రవృత్తిరూపమును ప్రారబ్ధవశంబునఁ బ్రాప్తము లగు విషయములందుఁ గామమును గ్రోధమును బరిగ్రహమును, విముచ్య = విశేషించి విడిచి, బలాత్కారమున సంభవించినవాని యందు నిర్మముఁ డగుచు, శాన్తః = ఉత్తము మయిన యుపశాంతిని బొందినవాఁడు; బ్రహ్మభూయాయ = బ్రహ్మము నేనని నిశ్చలముగా నుండుటకొఱకు; కల్పతే = యోగ్యుఁ డగుచున్నాఁడు.

ప. ఇఁక విక్షేపకారణముల నున్మూలించుప్రకారముఁ జెప్పుచున్నాఁడు.— *

రా. అహంకారమ్ = అనాత్మయం దాత్మాభిమానమును; బలమ్=తద్వృద్ధిహేతుభూతమైన వాసనాబలమును; తన్నిమిత్తమైన దర్పమును; కామం క్రోధం పరిగ్రహం విముచ్య; నిర్మమః = అనాత్మీయములం దెల్లను ఆత్మీయబుద్ధి లేనివాఁడు, శాన్తః = ఆత్మానుభవైకసుఖుఁడు; ఇట్టివాఁడై ధ్యానయోగముఁ జేయుచు, బ్రహ్మభూయాయ కల్పతే = బ్రహ్మభావముకొఱకు సమర్థుఁ డగుచున్నాఁడు, సర్వబంధనిర్ముక్తుఁడై యథావస్థితుఁ డగు నాత్మ ననుభవించుచున్నాఁ డని యర్థము.

మా. బ్రహ్మభూయాయ కల్పతే — బ్రహ్మమునందు భవనము బ్రహ్మభూయము, బ్రహ్మమునందు స్థితి, సర్వదా తన్నిష్ఠత యని యర్థము.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాఙ్క్షతి
సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. ౫౪

* పదయోజన శ్రీధరీయముతో సమానము.

భా. ఈ క్రమముచేత.—బ్రహ్మభూతః = బ్రహ్మప్రాప్తుఁడు; ప్రసన్నాత్మా = అధ్యాత్మప్రసాదము నొందినవాఁడు; నశోచతి = తన కొకానొకయర్థవైకల్యమును వైగుణ్యమును ఉద్దేశించి సంతాపము నొందఁడు. నకాఙ్క్షతి = కోరఁడు. బ్రహ్మభూతునిస్వభావం బిది యనువదింపఁ బడు చున్నది నశోచతి నకాఙ్క్షతి యని. అప్రాప్తవిషయమునం దాకాఙ్క్ష బ్రహ్మవిదున కుపపన్నము కాదు గదా! నహృష్యతి * అని గాని పాఠము. సర్వేషు భూతేషు=సమస్తభూతములయందు; సమః=సముఁడు, ఆత్మౌపమ్యముచే సర్వభూతములయందును సుఖమును దుఃఖమును గాని సమముగానే చూచువాఁ డని యర్థము, ఆత్మసముదర్శనము కాదిక్కడ, దానిఁ జెప్పఁబోవుటవలన భక్త్యా మా మభిజానాతి యని; ఇట్టివాఁ డగు జ్ఞాననిష్ఠుఁడు, మద్భక్తిమ్ = నాయందు పరమేశ్వరునియందు భక్తిని — భజనమును; పరామ్ = ఉత్తమమును జ్ఞానలక్షణ మైన చతుర్థభక్తిని; లభతే = పొందుచున్నాఁడు. "చతుర్విధా భజన్తే మామ్" అని చెప్పఁబడినది.

ఈ క్రమంబున బ్రహ్మమే నేనని పరమానందావిర్భావము నొందినవాఁ డెట్టి యాపద గలిగినను సంతాపము నొందఁడు, ఎట్టి యుత్తమవస్తువునుం గోరఁడు, సర్వభూతంబులయందును దనయందుబలె సుఖదుఃఖముల సమదృష్టి గలిగి యుండును, అట్టి జ్ఞాననిష్ఠుఁడు సమాధిపరిపాకమునం జేసి జ్ఞానలక్షణ మైన మద్భక్తిని నాలుగవదిగాఁ జెప్పఁబడినదానిఁ బొందుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. అపేక్షితమును బూరించుచు మీఁది శ్లోకమును దించుచున్నారు ఈక్రమముచేత నని. బుద్ధ్యా విశుద్ధయా ఇత్యాదిక మిటఁ గ్రమము. బ్రహ్మప్రాప్తుఁడు — జీవించి యున్నవాఁ డయ్యే యశేషానర్థములును నివర్తిల్లి నిరతిశయానంద మగు బ్రహ్మమును దా నని యనుభవించువాఁ డని యర్థము. అధ్యాత్మము ప్రత్యాగాత్మ, దానియందుఁ బ్రసాదము — సర్వానర్థనివృత్తిచే బరమానందావిర్భావము, దాని నొందినవాఁడు — జీవన్ముక్తుఁ డనుట. నశోచ తీత్యాదికమునకుఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు బ్రహ్మభూతుని ఇత్యాదిగా. ప్రాప్తవ్యమును బరిహార్యమును లే దను నిశ్చయమువలన నని యర్థము. స్వభావానువాదము నుపపాదించు

* హర్షింపఁడు.

చున్నారు అప్రా ప్యేత్యాదిగా. అతని కప్రాప్తవిషయము లేమివలన. పరిహార్యా పరిహారముచేఁ గలుగు శోకము గూడ సంభవింపదు పరిహార్యమే లేమివలన నని యర్థము. పాఠాంతరము వందో రమణీయము నొంది హర్షింపఁడు రమణీయమే లేమివలన నని యర్థము. వివక్షిత మగు సమదర్శనమును విశదీకరించుచున్నారు ఆ త్మేత్యాదిగా. ఓయీ! సర్వభూతములయందు సముఁడు నిర్విశేషుఁ డగు నాత్మను జూచుటయే యిట నభిప్రేత మేల కారాదు? అనఁగాఁ జెప్పుచున్నారు ఆత్మ ప మేత్యాదిగా. ఉక్తవిశేషణయుక్తుఁ డగు జీవన్ముక్తునకు జ్ఞాననిష్ఠ పూర్వోక్తక్రమంబునఁ బ్రాప్తమై సుప్రతిష్ఠిత మగుచున్నది యని చెప్పుచున్నారు ఇట్టివాఁడు ఇత్యాదిగా. శ్రవణమనననిదిధ్యాసనవంతుఁడు శమాదియుక్తుఁ డగువానికి అభ్యస్తములగు శ్రవణాదులచే బ్రహ్మాత్మయం దపరోక్షము మోక్షఫల మగు జ్ఞానము సిద్ధించుచున్నది యని యర్థము. ఆర్తాదిభక్తిత్రయము నపేక్షించి జ్ఞానలక్షణ మగు భక్తి చతుర్థ మని చెప్పఁబడినది. అందు సప్తమాధ్యాయవాక్యముఁ బ్రమాణముగాఁ జూపుచున్నారు చతుర్విధా ఇత్యాదిగా.

హ. ఇప్పుడు బ్రహ్మభూతునిలక్షణము చెప్పఁబడుచున్నది.—బ్రహ్మమే యైనవాఁడు బ్రహ్మభూతుఁడు; ప్రసన్నము—స్వచ్ఛ మగు ఆత్మ గలవాఁడు ప్రసన్నాత్ముఁడు, రాగద్వేషములచే నాక్రమింపఁబడని హృదయము గలవాఁ డని యర్థము. నశోచతి నకాఙ్క్షతి. సమః సర్వేషు భూతేషు = ప్రాణులయందు ఒక్కనినే పరమాత్మను ఆత్మయై యున్నవానిఁ జూచును; ఇట్టివాఁడు, మద్భక్తిమ్ = ఈశ్వరభక్తిని భజనమును తాదాత్మ్యమును; పరామ్ = ఉత్కృష్ట మైనదాని; లభతే.

శం. ఇట్లు విశుద్ధబుద్ధిత్యాది సహకారిసాధనములతోఁ జక్కగా ననుష్ఠించిన ధ్యానయోగనిష్ఠచే సముత్పన్న మగు సమ్యక్జ్ఞానముచేత బ్రహ్మభావము నొందినట్టి మహాత్ముఁడు జీవన్ముక్తుఁడు కృతార్థుఁ డగు యతియొక్కస్థితిని జెప్పుచున్నాఁ డరశ్లోకముచేత.—ఉక్తసాధనసంపత్తితో సమనుష్ఠితం బగు సమాధినిష్ఠచే రజస్తమస్తత్కార్యరాగద్వేషాదులును అహంకారమమకారాదులు నగు నశేషమలంబులును విధ్వస్తము లగుటచేత ప్రసన్నము — కేవలశుద్ధసత్త్వభావము నొందినది, సర్వత్రబ్రహ్మమాత్రగ్రహణముచేఁ బ్రశాంతము విపరీతప్రత్యయరహిత మగు ఆత్మ—అంతఃకరణము ఎవ్వనికో అతఁడు ప్రసన్నాత్ముఁడు, సమాధినిష్ఠచేఁ బరిపక్వమయిన జ్ఞానము గలవాఁడు; అందువలననే దృశ్యసంబంధమును బరిత్యజించి, బ్రహ్మభూతః =

సద్ఘనము చిద్ఘనము ఆనందఘన మగు నేపరబ్రహ్మము గలదో అదియే నే నని తద్భావమునొందినవాఁడు, జీవన్ముక్తుఁ డగు బ్రహ్మవిత్తముఁడు; నశోచతి = శోకమును జేయఁడు, శోకహేతు వగు ననర్థము లేమివలన; లోకమునందుఁ దన కొకానొక యనర్థముఁ దలఁచి మూఢుఁడు శోకించుచున్నాఁడు, అది లేమివలన నితఁడు శోకింపఁడు, సర్వంబును దానే యని చూచునట్టి విద్వాంసుని కనర్థముకొఱకర్థాంతరము సంభవింపదు గదా! అది యున్నఁ గదా దానిఁ గని యితఁడు శోకించుచు, "ద్వితీయాద్వై భయం భవతి" అని ద్వైతమే భయహేతు వని శ్రుతి చెప్పుచున్నది, స్వాన్యతిరిక్తమే భయకారణంబును దుఃఖకారణంబు ననుట దృష్టము గూడ, అందువలనఁ దన్నే సర్వత్ర చిదేకరసునిఁ బ్రశాంతుని వృద్ధిక్షయాదివర్జితు నానందఘను సర్వత్రియుఁ జూచుచున్న వాని కనర్థహేతు వగు నితరము కనఁబడమివలన బ్రహ్మవిత్తముఁడు శోకనిమిత్తము లేమివలన శోకింపఁ డని యర్థము. ఓయీ! ఆభాసరూపంబున విద్వాంసునకును ఉపాధి యుండనే యున్నది, అందువలన వైకల్యవైగుణ్యములు శోకనిమిత్తములు సంభవించుటవలన నెట్లు విద్వాంసుఁడు శోకింపఁడు? అందు వేని చెప్పెదము, దేహమునందు మమత్వాభావము ప్రతిపాదితం బగుటవలన. దేహమునందు నేను నాది యను నభిమానము గలవానికే తద్వైకల్యవైగుణ్యములయందు శోకము సంభవించును. మఱి బ్రహ్మమే నేను దేహము కా నని నిరభిమానుఁడును సర్వాత్మకమును వాని కవిషయంబు నగు బ్రహ్మమునం దాత్మభావము నొంది తద్రూపంబున నిరూఢ మగు వృత్తి గలవాఁడు నగు విద్వాంసునకుఁ బ్రతిచ్ఛాయవలె నుపాధి యసత్తగుటవలనఁ దన్నిమిత్తం బగు శోకము సంభవింపదు. అట్లు శ్రుతి "కి మిచ్ఛన్ కస్య కామాయ, మత్వా ధీరో హర్షశోకౌ జహాతి, క శ్శోక ఏకత్వమనుపశ్యతః" ఇత్యాదికము. నకాఙ్క్షతి = ఇట్టి లక్షణము గల బ్రహ్మవిదుఁ డగు యతి ఏయర్థమునం గోరఁడు. ఎల్లరును అప్రాప్త మగు నర్థమును గదా కోరుదురు అట్టి బ్రహ్మవిదునకుఁ బ్రాప్తవ్య మగు నర్థము లేదు నా కిది కావలయు నని కోరుటకు, "అహ మన్న మహ మన్న మహ మన్న మహ మన్నాదో ఽహ మన్నాదో ఽహ మన్నాదః, అహం మను రభవం సూర్యశ్చ" అను న్యాయముచే తానే భోక్తృభోగ్యరూపంబున నున్నవాఁ డగుటవలనను దనకంటె భిన్న మయిన వస్త్వంతరము లేమివలనను. నేనే యిది యంతయు నని సర్వాత్మభావము నొందుటచే సర్వవస్తువును స్వాత్మ యగుటచేఁ బ్రాప్త మగుటవలనఁ గామనయే సంభవింపదు, అందువలననే కాంక్షింపఁడు. "సో ఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా

విపశ్చితా ” అని బ్రహ్మభావాపన్నుఁ డగు యతికి సర్వకామప్రాప్తి శ్రుతం బగుటవలనను అవాప్తసర్వకామునకు కామయితృత్వము సంభవింపమివలనను కామం క్రోధ మ్మని కామము పరిత్యక్త మగుటవలనను బ్రహ్మవిదుఁ డెప్పుడును ఎందును దేనిని గాంక్షింపఁ డని యర్థము. జ్ఞానమునకు సమ్యక్త్వము సిద్ధించుటకై విశుద్ధబుద్ధిత్వాదిసాధనసంపన్నుఁడై జ్ఞాననిష్ఠ చేయువానికి అతత్త్యాగపూర్వక * మగు బ్రహ్మప్రాప్తియే సూచితము, కాని నిష్ఠచే సంప్రాప్త మగు జ్ఞానముయొక్క స్వరూపము తెలుపఁబడినది కాదు. అందుచే వసుతత్త్వనిర్ధారిణప్రకారంబును నిర్ధారితవస్తుప్రాప్తియు జిజ్ఞాసువునకుఁ దెలియవలయును. ఇది యంతయు సంక్షేపమునఁ బ్రతిపాదించుచున్నాఁడు సార్ధశ్లోకముచేత.—సమః = విశుద్ధబుద్ధిత్వాదులును తద్బద్ధిత్వాదులు నగు జ్ఞాననిష్ఠాసహకారిసాధనములతోఁ జక్కఁగా సంపన్నుండును సమదర్శనపరుండును సమ్యక్జ్ఞానసిద్ధికొఱకు జ్ఞాననిష్ఠయందుఁ బ్రవృత్తుఁ డగు బ్రహ్మవిద్యతి; “ అశరీరం శరీరే ష్వనవస్థే ష్వవస్థితమ్, సర్వభూతేషు యే నైకమ్ ” అని చెప్పినప్రకారంబున, భూతేషు = ఆకాశాదిస్థూలాంతములందును భూతకార్యములగు బ్రహ్మాదిస్తంబాంతశరీరములయందును; సర్వేషు = సమస్తములయందును; పరామ్ = జ్ఞాననిష్ఠాపరిపాకజన్యం బగుటవలనను సంశయవిపర్యయాదిదోషవిరహితం బగుటవలనను అప్రతిబద్ధం బగుటవలనను పరమార్థబోధకం బగుటవలనను ప్రకృష్ట మయినదాని; అట్టి, మద్భక్తిమ్ = విషయాకారమును భజించుచున్నది కావున భక్తి యనఁగా జ్ఞానము నిష్ఠాపరిపాకమువలనఁ బుట్టినది, నాయొక్క — సర్వభూతాత్మభూతంబును నిర్విశేషంబును అపరిచ్ఛిన్నంబును సర్వోపాధివివర్జితంబును చిదేకరసంబు నగు పరబ్రహ్మముయొక్క భక్తి మద్భక్తి, దాని; లభతే — నిత్యనిరంతరసమాధినిష్ఠచే నంతఃకరణము శుద్ధసత్త్వభావము నొందఁగా సర్వత్ర మత్స్వరూపగ్రాహక మగు నద్వైతవిషయ మైన జ్ఞానమును బ్రహ్మవిదుఁడు పొందుచున్నాఁ డని యర్థము.

• వ్యా॰ ఏక్రమముచే బ్రహ్మభూయమునకు సమర్థుఁ డగుచున్నాఁడు? అనఁగా దానిఁ జెప్పుచున్నాఁడు.—బ్రహ్మభూతః = నేను బ్రహ్మము నను దృఢనిశ్చయము గలవాఁడు, శ్రవణమననాభ్యాసమువలన; ప్రసన్నాత్మా=శుద్ధచిత్తుఁడు, శమదమాద్యభ్యాసమువలన; అందువలననే, నశోచతి, నష్టమును గూర్చి. న కాఙ్క్షతి, అప్రాప్తమును. అందువలననే నిగ్రహానుగ్రహములు పుట్టమివలన, సమః సర్వేషు భూతేషు—

---

* జ్ఞాననిష్ఠను విడువ కుండుటవలనఁ గలుగునట్టిది.

ఆత్మౌపమ్యమున సర్వత్ర సుఖమును దుఃఖమును సమముగాఁ జూచుచున్నాఁ డని యర్థము. ఇట్టి జ్ఞాననిష్ఠుఁ డగు యతి, మద్భక్తిమ్ = నాయందు భగవంతునియందు శుద్ధునియందు పరమాత్మయందు భక్తిని — ఉపాసనను మదాకారచిత్తవృత్త్యావృత్తి రూపమును పరిపక్వనిదిధ్యాసనం బను పేరు గలదానిని శ్రవణమననాభ్యాసమునకు ఫలభూత మైనదానిని; లభతే; పరామ్ = శ్రేష్ఠమును, వ్యవధానము లేక సాక్షాత్కారము ఫలముగాఁ గలదానిని. లేక, చతుర్విధా భజన్తే మామ్ అనుచోటఁ జెప్పఁ బడిన నాలుగుభక్తులలోఁ గడపటి దైన జ్ఞానలక్షణ మగు భక్తిని.

శ్రీ. బ్రహ్మము నేనని నిశ్చలముగా నుండుటకు ఫలమును జెప్పుచున్నాఁడు.—బ్రహ్మభూతః = బ్రహ్మమునం దున్నవాఁడు; ప్రసన్నచిత్తుఁడు, నష్టమును గూర్చి శోకింపఁడు. అప్రాప్తమునుం గాంక్షింపఁడు, దేహాద్యభిమానము లేమివలన. అందువలననే, సర్వభూతములందును సముఁడై రాగద్వేషాదికృత విక్షేపములు లేమి వలన సర్వభూతములయందును మద్భావనాలక్షణ మగు పర మయిన మద్భక్తిని పొందుచున్నాఁడు.

మ. సర్వభూతేషు సమః — తారతమ్యవర్జితుఁడు మాత్రమే కాఁడు, మత్తే మనఁగా, మద్భక్తిం లభతే — సర్వభూతములయందు మద్భావనను బొందుచున్నాఁడు. *

రా. బ్రహ్మభూతః = ఆవిర్భూత మయిన యపరిచ్ఛిన్నజ్ఞానైకాకారమును మచ్ఛేషత్వైకస్వభావము నగు నాత్మస్వరూపము గలవాఁడు, "ఇత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్" అని స్వశేషత గదా చెప్పఁబడినది; ప్రసన్నాత్మా = క్లేశకర్మాదులచేఁ గలుషము గాని స్వరూపము గలవాఁడు; నాకంటె వ్యతిరిక్త మైన భూతవిశేషము దేనిని గూర్చి, నశోచతి. దేనిని, నకాఙ్క్షతి. మత్తే మనఁగా, మద్వ్యతిరిక్తము లగు సర్వభూతములయెడ అనాదరణీయతయందు సముఁడు, నిఖిల మగు వస్తుజాతమును దృణమువలెఁ దలంచుచు; మద్భక్తిం లభతే పరామ్ — నాయందు సర్వేశ్వరునియందు నిఖిలజగదుత్పత్తిస్థితిప్రలయలీలునియందు నిరస్తసమస్తహేయగంధునియందు అనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణగణైకతానునియందు లావణ్యామృతసాగరునందు శ్రీమంతునందుఁ బుండరీకాక్షునియందు స్వస్వామియందు అత్యంతప్రియానుభవరూప మగు పర మైన భక్తిని బ్రాపించుచున్నాఁడు.

---

* శక్తినది శ్రీగరీయుటుల్యము.

మూ. *

భక్త్యా మా మభిజానాతి యావా న్యశ్చాఽస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్. ౫౫

భా. అంత జ్ఞానలక్షణ మగు.—భక్త్యా = భక్తిచేత; మామ్ = నన్ను, బ్రహ్మమును; అభిజానాతి = గుర్తించి యెఱుంగుచున్నాఁడు; యావాన్ = నేను ఉపాధికృతవివిధభేదములు గలవాఁడ నెంతవాఁడను; యశ్చ = నేను సర్వోపాధివర్జితుఁడను ఉత్తమపురుషుఁడను ఆకాశకల్పుఁడను ఎట్టివాఁడను; అస్మి = అగుచున్నానో; అట్టి నన్ను అద్వైతునిఁ జైతన్యమాత్రైకరసుని అజుని అజరుని అమరుని అభయుని అనిధనుని ♦ తత్త్వతః = వాస్తవంబున; అభిజానాతి. తతః = అంత; మామ్=నన్ను; ఇట్లు, తత్త్వతః = వాస్తవమున; జ్ఞాత్వా=ఎఱింగి; తదనన్తరమ్=వెంటనే; విశతే = ప్రవేశించుచున్నాఁడు నన్నే. ఇట జ్ఞానంబును తదనంతరప్రవేశక్రియయును భిన్నము లని వివక్షితములు కావు "జ్ఞాత్వా విశతే తదనన్తరమ్" అని. ఏమి మఱి? ఫలాంతరము లేమివలన జ్ఞానమాత్రమే ప్రవేశము, "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని చెప్పఁబడి యుండుట వలన.

అట్లు జ్ఞానలక్షణ మగు భక్తిచే సోపాధికుఁడ నైన నే నెంతవాఁడనో నిరుపాధికుఁడ నగు నే నెట్టివాఁడనో నాదు వాస్తవం బగు చైతన్యమాత్రైకరసస్వరూపము నెఱుంగుచున్నాఁడు, ఇ ట్లెఱింగి నేనే యగుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. ఓయీ! సమాధిసాధ్యమును బరభక్త్యాత్మకము నగు జ్ఞానముచే నేమి యపూర్వము పొందఁబడును? అనఁగాఁ జెప్పుచున్నారు అంత నిత్యాదిగా. భక్తిచేత సమాధిలభ్యముచేత నన్ను బ్రహ్మమును అభిజానాతి = అభిముఖ్యంబున — ప్రత్యక్త్వమున వ్యాపించుచున్నాఁ డని యర్థము. ఆ భక్తిపరాధీన మగు జ్ఞానమునే వివరించుచున్నారు యావా నిత్యాదిగా. ఆకాశకల్పుఁడను — అనవచ్ఛిన్నుఁడను అసంగుఁడను. చైతన్యమునకు విషయసాపేక్షత్వమును బరిహరించుచున్నారు అద్వైతుని అని. ఎవరు ద్రవ్యబోధాత్మకుఁ డాత్మ యని చెప్పుదురో వారిని గూర్చి

* ఈ శ్లోకమునకును మీఁది శ్లోకమునకును ఈ భాష్యము లేదు.

♦ మరణము లేనివానిని.

 

చెప్పఁబడినది చైతన్యమాత్ర యని. చైతన్యమాత్రుఁ డైనను ఆత్మయందు ధర్మాంతరముచేఁ గలుగు ధర్మిత్వమును నిషేధించుచున్నారు ఏకరసుఁ డని. సర్వక్రియారహితత్వము చెప్పుటచే ఆత్మకుఁ గూటస్థతను వ్యవస్థాపించుచున్నారు అజుని అని. ఈ వికారములు లేమికి తద్ధేతు వగు నజ్ఞానముతో నసంబంధమును హేతువునుగాఁ జెప్పుచున్నారు అభయుని. తత్త్వజ్ఞానము ననువదించి తత్ఫల మగు విదేహకైవల్యమును పొందించుచున్నారు తత ఇత్యాదిగా. తత్త్వజ్ఞానమునకును తదనంతరప్రవేశక్రియకును ప్రాప్త మగు భిన్నత్వమును నిరాకరించుచున్నారు ఇట నిత్యాదిగా. భిన్నములు కానియెడ భేదోక్తి కేమి గతి యని యాశంకించి యది యౌపచారిక మని చెప్పుచున్నారు ఏమి మఱి ఇత్యాదిగా. బ్రహ్మప్రాప్తియే ఫలాంతర మని యాశంకించి బ్రహ్మాత్మలకు భేదము లేమివలనఁ దత్ప్రాప్తి జ్ఞానముకంటె నతిరిక్తము కా దని చెప్పుచున్నారు క్షేత్రజ్ఞ మిత్యాదిగా.

భా. ఓయీ! విరుద్ధ మిది చెప్పఁబడినది— జ్ఞానముయొక్క పరం బగు నిష్ఠ యేది గలదో దానిచే నన్ను గుర్తించి యెఱుంగుచున్నాఁ డని. ఎట్లు విరుద్ధ మనఁగాఁ జెప్పెదను. ఎప్పు డేవిషయమునందు జ్ఞానము జ్ఞాతకుఁ బుట్టుచున్నదో అప్పుడే యావిషయమును గుర్తించి యెఱుంగుచున్నాఁడు జ్ఞాత, జ్ఞానావృత్తిలక్షణం బగు జ్ఞాననిష్ఠ నపేక్షింపఁడు. అందువలన జ్ఞానముచే గుర్తించి యెఱుంగఁడు జ్ఞానావృత్తిరూప మైన జ్ఞాననిష్ఠచే మాత్ర మెఱుంగుచున్నాఁ డనుట విరుద్ధము.

ఆ. జ్ఞాననిష్ఠచేఁ బరభక్తిచే నన్ను గుర్తించి యెఱుంగుచున్నాఁ డని చెప్పినదాని నాక్షేపించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. విరుద్ధత్వమును వివరించుటకై ప్రశ్న చేయుచున్నాఁడు ఎట్లు ఇత్యాదిగా. విరోధమును స్ఫుటీకరింపఁ బ్రతిజ్ఞ చేయుచున్నాఁడు చెప్పెదను అని. అందు జ్ఞానము పుట్టుటవలననే విషయాభివ్యక్తి యగు నని చెప్పుచున్నాఁడు ఎప్పుడు ఇత్యాదిగా. అప్పుడే యను నేవకారముచే నివార్యమును జూపుచున్నాఁడు జ్ఞా నేత్యాదిగా ఇది మన కిద్దఱకును సమ్మత మని శేషము. జ్ఞానముయొక్కయుత్పత్తివలననే విషయ మభివ్యక్త మైనను ఎట్లు ప్రకృతమందు విరోధము? అని యాశంకించి చెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా.

భా. కా దిది దోషము, జ్ఞానమునకు స్వోత్పత్తి పరిపాక హేతువులతోఁ గూడినదానికిఁ బ్రతిపక్షవిహీనంబునకు ఆత్మానుభవనిశ్చయావసానత్వ *

* నిశ్చయపర్యన్తత్వము.

మేది గలదో అది నిష్ఠాశబ్దముచేఁ జెప్పఁబడుటవలన. శాస్త్రాచార్యోపదేశముచే జ్ఞానోత్పత్తిపరిపాకములకు హేతువై సహకారికారణ మగు బుద్ధివిశుద్ధ్యాదికమును అమానిత్వాదికమును అపేక్షించి జనిత మైన క్షేత్రజ్ఞపరమాత్మతత్త్వజ్ఞానమునకుఁ గర్త్రాదికారకభేదబుద్ధినిబంధనసర్వకర్మసన్న్యాససహితమునకు స్వాత్మానుభవనిశ్చయరూపమున నవస్థానం బేది గలదో అది పర మగు జ్ఞాననిష్ఠ యని చెప్పఁబడుచున్నది. ఆ యీ జ్ఞాననిష్ఠ ఆర్తాదిభక్తిత్రయాపేక్షచేఁ బరం బగు చతుర్థభక్తి యని చెప్పఁబడినది. ఆ పరభక్తిచే భగవంతుని దత్త్వమునఁ గుఱించి యెఱుంగుచున్నాఁడు. తదనంతరమే యీశ్వరక్షేత్రజ్ఞభేదబుద్ధి యశేషము నివర్తిలుచున్నది. అందువలన జ్ఞాననిష్ఠాలక్షణ మగు భక్తిచే మా మభిజానాతి యను వచనము విరుద్ధము కాదు.

టీ. శంకిత మగు విరోధమును నిరసించుచున్నారు కాదిది దోషము అని. చెప్పిన హేతువునే వివరించుచున్నారు శాస్త్రేత్యాదిగా. శాస్త్రానుసారి యగు నాచార్యోపదేశ మేది గలదో దానిచే జ్ఞానోత్పత్తి "ఆచార్యవాన్ పురుషో వేద" అను శ్రుతివలన, ఆ జ్ఞానోత్పత్తియొక్క పరిపాకము — సంశయాది ప్రతిబంధనాశము, దానియందు హేతువును ఆ యుపదేశమునకే సహకారికారణము నగు బుద్ధిశుద్ధ్యాదిక మేది కలదో దాని నపేక్షించి ఆ యుపదేశమువలననే జనిత మయిన యే యైక్యజ్ఞానము కలదో దానియొక్క, కారకభేదబుద్ధినిబంధనము లగు సర్వకర్మము లేవి గలవో వానిసన్న్యాసముతోఁ గూడినదానియొక్క, ఫలరూపంబున సర్వకల్పనారహిత మగు స్వాత్మయందే యవస్థానము — నిలుకడ యేది గలదో అది జ్ఞానముయొక్క పర మైన నిష్ఠ యని వ్యవహరింపఁబడుచున్నది ప్రామాణికులచేత నని యర్థము. పర మగు జ్ఞాననిష్ఠ యిట్టి దగునేని యెట్లు మఱి యది చతుర్థభక్తి యని చెప్పఁబడినది? అనఁగాఁ జెప్పుచున్నారు ఆ యీ జ్ఞాననిష్ఠ ఇత్యాదిగా. యథోక్త మగు భక్తిచే భగవంతునితత్త్వజ్ఞానము సిద్ధించుచున్నది యని చెప్పుచున్నారు ఆ పరభక్తిచే నిత్యాదిగా. తత్త్వజ్ఞానమునకు ఫలముఁ జెప్పుచున్నారు తదనంతరమే ఇత్యాదిగా. జ్ఞాననిష్ఠారూప మగు భగవద్భక్తి తత్త్వజ్ఞానముకన్న అతిరిక్తము కామివలనను దత్ఫల మగు నజ్ఞాననివృత్తియుఁ దన్మాత్రమే యగుటవలనను భేదోక్తి యౌపచారిక మగుటవలనను ప్రకృతవాక్యం బవిరుద్ధ మని యుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా.

భా. ఇందు సర్వంబును నివృత్తిప్రధానక మగు శాస్త్రము వేదాంతేతిహాసపురాణస్మృతిలక్షణం బగ్రపంత మగుచున్నది.— "విదిత్వా వ్యుత్థాయాథ భిక్షాచర్యాం చరన్తి, తస్మా న్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః, న్యాస ఏవాత్యరేచయత్" ఇత్యాది, "సన్న్యాసః కర్మణాం న్యాసః, వేదా నిమంచ లోక మముంచ పరిత్యజ్య, త్యజ ధర్మ మధర్మంచ" ఇత్యాదులును. ఇందును బ్రదర్శితంబులు వాక్యములు. ఆ వాక్యముల కనర్థకత యుక్తము కాదు. అర్థవాదత్వంబును దగదు, స్వప్రకరణస్థము లగుటవలన. మోక్షము ప్రత్యగాత్మావిక్రియస్వరూపనిష్ఠం * బగుటవలనను. పూర్వసముద్రమునకుఁ బోవఁ గోరువానికిఁ బ్రతిలోమముగాఁ బశ్చిమసముద్రమునకుఁ బోఁ గోరువానితో సమానమార్గత సంభవింపదు గదా! ప్రత్యగాత్మవిషయప్రత్యయసంతానకరణాభినివేశము † గదా జ్ఞాననిష్ఠ. దానికిఁ బశ్చిమసముద్రగమనముతోఁ బోలెఁ గర్మముతో సహభావము విరుద్ధము. పర్వతసర్షపములకుం ‡ బోలె నంతరము గలది విరోధ మని ప్రమాణవిదులనిశ్చయము. అందువలన సర్వకర్మసన్న్యాసముచేతనే జ్ఞాననిష్ఠ కార్యం బని సిద్ధము.

ఆ. ఉపదేశజనితం బగు జ్ఞానము సర్వకర్మసన్న్యాససహితము స్వరూపావస్థానాత్మకమే పరమపురుషార్థోపాయం బను నీయర్థమునందుఁ బ్రమాణముఁ జెప్పుచున్నారు ఇందు ఇత్యాదిగా. ఆ శాస్త్రమునే యుదాహరించుచున్నారు విదిత్వేత్యాదిగా. ప్రదర్శితంబులు వాక్యములు సర్వకర్మాశ మున సేత్యాదులు ఓయీ! ఈ వాక్యము లవివక్షితార్థము లగుటవలన వీనికి స్వార్థమునఁ బ్రామాణ్యము లేదని యాశంకించి వేదవాక్యము లధ్యయనవిధిచే నుపాత్తము లగుటవలనను ఇతరములు తదనుసారు లగుటవలనను అట్లు చెప్పఁ దగ దని చెప్పుచున్నారు ఆ వాక్యములకు ఇత్యాదిగా. అట్లయినను సోగోదీ దిత్యాదివాక్యములువలె స్వార్థమునందుఁ బ్రమాణములు కా వని యాశంకించి చెప్పుచున్నారు అర్థవాదత్వంబును దగ దని. ఇందువలనఁ గూడ ముముక్షువునకు మోక్షోపాయ మగు జ్ఞాననిష్ఠ నపేక్షించు

* ప్రత్యగాత్మయొక్క నిర్వికారస్వరూపమునందు నిష్ఠ గలది.

† ప్రత్యగాత్మవిషయ మగు జ్ఞానముయొక్క ధారను జేయుటయందుఁ బూనిక — దాని నెడతెగక చేయుట.

‡ కొండకును ఆవగింజకును.

వానికి సన్న్యాసమునం దధికారము, కర్మనిష్ఠయందు లేదని చెప్పుచున్నారు ప్రత్యగిత్యాదిగా. జ్ఞాననిష్ఠునకుఁ గర్మనిష్ఠ విరుద్ధ మనుటకు దృష్టాంతముఁ జెప్పుచున్నారు పూర్వేత్యాదిగా. జ్ఞాననిష్ఠాస్వరూపము ననువదించుచు కర్మనిష్ఠతో దానికి సహాభావము విరుద్ధ మని దార్ష్టాంతికముఁ జెప్పుచున్నారు ప్రత్యగాత్మ విష యేత్యాదిగా. జ్ఞానకర్మములకు విరోధ మెట్లని యాశంకించి కర్మములు జ్ఞానసివ ర్త్యంబు లనుట శ్రుతిస్మృతిసిద్ధ మగుటవలన నని చెప్పుచున్నారు పర్వ తేత్యా దిగా. అంతరముగలది — రెండును ఒకధర్మియం దునికికి సాంకర్యాభావసంపాదక* మగు భేదము గలది యని యర్థము. జ్ఞానకర్మములకు సముచ్చయము లేనపుడు ఫలితము నుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా.

హ°. ఇప్పుడు బ్రహ్మస్వరూపావగతికిఁ బ్రత్యాసన్న మగు కారణముఁ జెప్పుచున్నాఁడు—భక్త్యా = భజనముచేత; మామ్ — సర్వేశ్వరుని; అభిజానాతి = ఎఱుంగుచున్నాఁడు. యావాన్ = నే నెంతవాఁడనో యుపాధికృతభిన్నప్రపంచ స్వరూపముచేత; యశ్చ అస్మి — నిరస్త సమస్తోపాధిక మగు స్వరూపము చేత; తత్త్వతః = పరమార్థముచేత. ఇట్లు, తతః మాం తత్త్వతో జ్ఞాత్వా తదనన్తరమ్, విశతే — ప్రవేశించుచున్నాఁడు, బ్రహ్మమే సర్వ మని యెఱుఁగుచున్నాఁ డని యర్థము, "ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అని చెప్పి యుండుటవలన.

శ౦. ఇట్లు చిరకాలము నిత్యమును నిరంతరముగా సమభ్యసింపఁబడు జ్ఞాన యోగముచేత విపరీతప్రత్యయహేతువు లగు ననాద్యవిద్యావాసనలకును దత్కా ర్యము లగు విపరీతప్రత్యయములకును సశ్శేషవినాశము కాఁగా వికల్పమును సర్వం బును బరిత్యజించి సర్వత్ర సమదర్శనలక్షణ మగు జ్ఞానము నొందినట్టి బ్రహ్మవిద్య తికి తద్జ్ఞానోత్పన్న మగు వస్తుతత్త్వనిశ్చయమును బ్రతిపాదించుచు నట్టినిశ్చయము గలవానికి బ్రహ్మప్రాప్తిని దెలుపుచున్నాఁడు.—భక్త్యా = వెలుపలను లోపలను వస్తుమాత్రావగాహి యగు నిర్వికల్ప మైన ప్రత్యగ్దృష్టిచే సమ్యగధిష్ఠానసందర్శన జన్య మగు జ్ఞానముచే; బ్రహ్మవిద్యతి, మామ్=నన్ను। పరబ్రహ్మమును; అభిజానాతి= అభి — అంతటను అభిముఖ్యంబున వికల్పరహితముగా సాక్షాత్కృత మగు వస్తువు యొక్క తత్త్వమును నిశ్చయించుచున్నాఁడు, సామాన్యంబునను విశేషంబునను

* బండొంటితోఁ గలియుటను గలిగించునట్టి.

అధిగతం బగు నన్నుయొక్క తత్త్వనిర్ధారణము చేయు చున్నాఁ డని యర్థము. నిర్ధారణప్రకారము నే చెప్పుచున్నాఁడు.—అవ్యక్తమహదాదితత్త్వకార్యోపాధియోగమువలన నేను, యావాన్ = మాయాకల్పితము లగు నుపాధిభేదములచే నే నెట్టివాఁడ నగుచున్నానో, సమష్టిస్థూలసూక్ష్మకారణోపాధులచే విరాట్టు హిరణ్యగర్భుఁ డీశ్వరుఁ డనియు వ్యష్టిస్థూలసూక్ష్మకారణోపాధులచే విశ్వుఁడు తైజసుఁడు ప్రాజ్ఞుఁ డనియు గుణత్రయోపాధులచే బ్రహ్మ విష్ణు మహేశ్వరుఁ డనియు నవాంతరవృత్తులచే దేవతలు తిర్యగ్జంతువులు మనుష్యు లనియు నెట్టివాఁడనై ప్రతీతుఁడ నగుచున్నానో యని యర్థము. తా నవికృతమే యగుచు నధిష్ఠాన మారోపిత నానారూపముల ననుకరించుచు, ఎట్లు రజ్జువు తా నవికృత మయ్యు నారోపిత మగు సర్పముయొక్క శిరఃపుచ్ఛాద్యాకారంబునఁ దోఁచు చున్నదో గ్రహించువాని గ్రహణదోషముచేత, మరువే నారోపితజలప్రవాహతరంగాదిరూపంబునఁ బ్రతీత మగుచున్నదో, అట్లధిష్ఠానభూత మవిక్రియమే యగు పరబ్రహ్మము నారోపితనానారూపముల ననుకరించుచు నానావిధమువలెఁ బ్రతీత మగుచున్నది. అట్లే శ్రుతులు స్మృతులును.-“ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయతే, ఏక స్సన్ బహుధా విచారః, ఏక ఏవహి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః, స ఏకధా భవతి త్రిధా భవతి పఞ్చధా సప్తధా భవతి నవధా చైవ పున శ్చైకాదశపి స్మృతః” అనియు, “బహురూప ఇవా ఽఽభాతి మాయయా బహురూపయా। నిత్య స్సర్వగతో ఽప్యాత్మా కూటస్థో దోషవర్జితః। ఏక స్సన్ భిద్యతే భ్రాన్త్యా మాయయా నతు తత్త్వతః” అనియును. ఎవఁడ నిట్లు మాయాపరికల్పితము లగు నుపాధివిశేషములచేఁ బరిచ్ఛిన్నునివలె ధర్మివలెఁ గర్తవలె గుణివలెఁ బ్రతీతుఁడ నగుచున్నానో అట్టివాఁడనే నేను శ్రుత్యనుసారి యగు యుక్తిచేతను సమాహిత మగు బుద్ధిచేతను బరిశీలించునెడ నుపాధి తద్ధర్మ తత్కార్య తద్గుణ తద్వికారరహితుఁడ నపరిచ్ఛిన్నుఁడను నిత్యుఁడను నిర్విశేషుఁడను మోక్షస్వరూపుఁడను అవిక్రియుఁడ నొక్కఁడనే యగుచున్నా నని చెప్పుచున్నాఁడు. —యశ్చాస్మి తత్త్వతః — “అథా ఽత ఆదేశో నేతి నేతి, యత్ర నా ఽన్య త్పశ్యతి, య త్త దద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుశ్శ్రోత్రమ్, అస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘమ్” ఇత్యాది శ్రుత్యనుకూలము లగు నేతినేతివాక్యములచే నారోపితనామరూపాదులనిషేధము చేయఁగాఁ దన్నిషేధమున కవధిభూతము యుక్తిశతములచేతనేనియు ననిషేధ్యము నిషేధించువాని కాత్మభూతము అహేయ మనుపాదేయము నిర్విశేషము నిరాభాసము నిరా

ధారము నిరాకారము నిరవద్యము నిరంజనము నిష్కలము నిష్క్రియము శాంత మనంత మనాద్యంతము నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము అఖండానందైకరసము నగు తత్త్వ మేది గలదో దానిచేత — పారమార్థికస్వరూపముచే కాలత్రయము నందును బ్రమాణాంతరాబాధిత మగు సత్త గలదానిచే స్థితుఁడను నిత్యుఁడను శాశ్వ తుఁడ నగు నే నెవ్వఁడను ఒక్కఁడనే యద్వితీయుఁడను సచ్చిదానందైకలక్షణుఁడ నున్నానో అట్టి; మామ్ — నన్ను పరబ్రహ్మమును; అభిజానాతి — "సర్వాత్మాయం హి సర్వం నైవోఽతో ఽద్వయో హ్యయ మాత్మైవ కేవల ఏవ, నహ్యయమాత్మా నాఽనుజ్ఞాతాఽసఙ్గత్వా దవికారిత్వా దసత్త్వా దన్యస్య, ఏక మేవాఽద్వితీయం బ్రహ్మ, నేహ నానాఽస్తి కించన, సర్వం యదయ మాత్మా, భోక్తా భోగ్యం ప్రేరితారంచ మత్వా సర్వం ప్రోక్తం వివిధం బ్రహ్మ మే తత్, జ్ఞానం విశుద్ధం విమలం విశోక మశేషతో భాతి నిరస్త సఙ్గమ్, ఇది సర్వంబును బ్రహ్మమాత్రము బ్రహ్మమునం దారోపిత మగుటవలన శుక్తిరజతమువలె" ఇత్యాది శ్రుతిస్మృతియుక్తులచేతను సమాహితబుద్ధిచేతను జక్కఁగాఁ బరిశీలించి భ్రమకృత మగు వికల్పమును బరిత్య జించి ఇది యంతయు నేనును బ్రహ్మమే యని, అభిజానాతి — నిశ్చయించుచున్నాఁ డని యర్థము. శ్రుతియుక్తిగురువచన స్వానుభవములచేఁ బూర్వ మేది యనేకవిధ ములఁ దోఁచెనో అది కేవల మవిక్రియము నిర్విశేష మగు పరబ్రహ్మమే యని సామాన్యవిశేషములచే సవికల్పక నిర్వికల్పకములచే నవగతస్వరూప మగు వస్తు వొక్కటియే నిర్విశేషమే యితరము లే దని, తత్త్వతః = పరమార్థస్వరూపముచే చిన్మాత్రకముచేత; మామ్ = నన్ను పరబ్రహ్మమును; ఇట్లు ప్రత్యగ్దృష్టిచేఁ జక్కఁగా విషయీకరింపఁబడినవాని సదేకరసునిఁగా, జ్ఞాత్వా = నిశ్చయించి, రజ్జుస్వరూప సందర్శనముచే నేది సర్పరూపమునఁ దోఁచెనో అది రజ్జువే కేవలం బని చేతఁ బట్టిన రజ్జువుయొక్క కైవల్యమునువలె "బ్రహ్మైవేద మమృతం పురస్తా ద్బ్రహ్మ పశ్చా ద్బ్రహ్మ దక్షిణత శ్చోత్తరేణ। అధ శ్చోర్ధ్వం చ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వ మిదం వరిష్ఠమ్" అను నీదృష్టిచే జ్ఞాననిష్ఠాపరిపక్వ మైనదానిచే సర్వమును బ్రహ్మమే కేవలం బని బ్రహ్మముయొక్క కైవల్యమును నిశ్చయించి, ఇది యంతయు నేనును బ్రహ్మమే యని సర్వంబును దానును బ్రహ్మమాత్రం బనుటను జక్కఁగా ననుభవించి యని యర్థము; "జ్ఞానా దేవతు కైవల్యమ్, నాన్యః పన్థా విద్యతేఽయనాయ" అని చెప్పినరీతిని జ్ఞానమువలననే ముక్తి గాని యితరమునఁ గా దను శ్రుత్యనుగత మగు స్వనిశ్చయముఁ జెప్పుచున్నాఁడు.—తదనన్తరమ్=ఎప్పుడు వస్తుతత్త్వనిశ్చయాత్మక

మగు నీవిజ్ఞానము నిరూఢముగా నప్రతిబద్ధమ్ముగా జనించుచున్నదో ఆవెంటనే ప్రబోధమునకును స్థూలదేహప్రాప్తికిని బోలె బ్రహ్మజ్ఞానమునకును దత్ప్రాప్తికిని అంతరాలము లేమివలన సమ్యగ్జ్ఞానమున కుత్తరక్షణమునందే; బ్రహ్మనిష్ఠుఁడగు యతి, తతః = ఆ బ్రహ్మతత్త్వజ్ఞానముచేతనే; విశతే = నేను బ్రహ్మను నని సాక్షాత్కృతము నిర్విశేషము చిదేకరసము ఆనందాత్మక మగు పరబ్రహ్మమునందు ఇదియే నేనని యహంబుద్ధిని జొప్పించుచున్నాఁడు. స్థూల మగు స్వస్వరూపమునందు నిద్రచే నన్యథాభావము నొంది యుండిన పురుషుఁడు ప్రబోధముచే నది నివర్తిల్లఁగా నా స్థూలదేహమునం దెట్లహంబుద్ధిని జేయుచున్నాఁడో అట్లు స్వాజ్ఞానముచే విపరీత భానము నొంది యుండిన విద్వాంసుఁడు వివేకవిజ్ఞానముచే నయ్యజ్ఞానము నివర్తిల్లఁగా స్వాత్మయే యగు బ్రహ్మమునం దిదియే నేనని యహంబుద్ధిని జేయుచున్నాఁడు కాని దేవదత్తుఁడు గృహమునందువలె బ్రహ్మమునందుఁ బ్రవేశింపఁడు, బ్రహ్మము పరిపూర్ణ మగుటవలనను నిరవయవ మగుటచే సంకోచవికాసశూన్య మగుటవలనను పొందు వాని స్వరూపమే యగుటవలనను నిత్యప్రాప్త మగుటవలనను ప్రవేశ్యము కామి వలన. “న తస్య ప్రాణా ఉత్క్రామ న్త్యత్రైవ సమవలీయన్తే, బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి, బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి, త మేవం విద్వా నమృత ఇహ భవతి” అని విద్వాంసున కుత్క్రమణరాహిత్యంబును బ్రహ్మరూపమున నున్నవాని కిహమునందే బ్రహ్మప్రాప్తియు శ్రూయమాణం బగుటవలన గంతృత్వమును గంతవ్యత్వమును గమన క్రియయును సంభవింపవు. మ త్తే మనఁగా “ ఏతస్మి న్నదృశ్యే ఉనాత్మ్యే ఉనిరుక్తే ఉనిలయనే ఉభయం ప్రతిష్ఠాం విన్దతే” అను శ్రుతివలన అదృశ్యత్వాదిలక్షణలక్షితము నిరస్తాశేషవిశేషము అజరం బమృత మభయ మపూర్వ మనపర మనంతర మబాహ్యము నిత్యానందాఖండైకరసం బద్వితీయ మగు పరబ్రహ్మమునం దహం బుద్ధిని నెలకొలుపుచున్నాఁడు, శ్రుత్యాచార్యేశ్వరాత్మప్రసాదసంపత్తిచే గృతార్థుఁడైన బ్రహ్మవిత్తముఁ డగు యతి సవిశేషమును బరిత్యజించి నిర్విశేషబ్రహ్మరూపంబున సుఖముగా నుండు నని యర్థము.

మం. అంగ.—భక్త్యా = నిదిధ్యాసనాత్మక మగు జ్ఞాననిష్ఠచేత; మామ్ = అద్వితీయుఁడను ఆత్మ నగు నన్ను; అభిజానాతి = సాక్షాత్కరించుచున్నాఁడు; యావాన్ = ఎంతవాఁడనో, విభుఁడను నిత్యుఁడను; యశ్చ = ఎవ్వఁడనో, పరిపూర్ణ సత్యజ్ఞానానందఘనుఁడను సదా సర్వోపాధివర్జితుఁడను అఖండైకరసుఁడను ఒక్కఁ

డను; అట్టివానినిగా సాక్షాత్కరించుచున్నాఁడు. తతః; మామ్; ఇట్లు, తత్త్వతో జ్ఞాత్వా = నేనే యఖండానందాద్వితీయంబగు బ్రహ్మమని సాక్షాత్కరించి; విశతే= అజ్ఞానతత్కార్యములు నివర్తిల్లఁగా సర్వోపాధిశూన్యుఁ డగుటచే మద్రూపుఁడే యగుచున్నాఁడు; తదనన్తరమ్=బలవత్ప్రారబ్ధకర్మభోగముచే శరీరపాతానంతరము, కాని జ్ఞానసమనంతరమే కాదు, జ్ఞాత్వా యను క్త్వాప్రత్యయముచే జ్ఞానానంతర మనుట లభించుచుండఁగా తదనన్తర మనుటకు వ్యర్థత సంభవించుటవలన. అందువలన "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే ఽథ సంపత్స్యే" ఏతచ్ఛ్రుత్యర్థమె యిట దర్శితము భగవంతునిచేత. జ్ఞానముచే నజ్ఞానము నివర్తితమే యగును సరే దీపముచేఁ జీఁకటివలె అది తద్విరోధిస్వభావం బగుటవలన; అయినను తదుపాదేయము * అహంకారదేహాదికము ఉపాదానరహిత మయ్యు ప్రారబ్ధకర్మభోగము వఱకు ననువర్తించుచున్నది, దృష్ట మగుటవలననే. దృష్టమునం దనుపపన్న మను నది లేదు గదా. తార్కికులు కూడ సమవాయికారణనాశమువలన ద్రవ్యనాశము నంగీకరించువారు నిరుపాదాన మగు ద్రవ్యము క్షణమాత్ర ముండు నని యంగీకరించెదరు. నిత్యపరమాణుసమవేత మగు ద్వ్యణుకముయొక్క నాశమునందో అసమవాయికారణనాశమువలననె ద్రవ్యనాశము, సమవాయినిరూపిత కారణనాశత్వము ఉభయస్థలములందును అనుగతము కావున అననుగమము లేదు. ఎవరు మఱి యసమవాయికారణనాశమువలననే సర్వత్ర కార్యద్రవ్యనాశం బగు నని చెప్పెదరో వారిమతమునందు ఆశ్రయనాశస్థలంబున క్షణద్వయము నిరుపాదాన మగు కార్య ముండును. ఇట్లుండఁగా నందే ప్రతిబంధకము కలుగునెడ బహుకాలావస్థాన మేల కలుగరాదు? ప్రారబ్ధకర్మమునకో ప్రతిబంధకత్వము శ్రుతిసిద్ధంబును అంతఃకరణదేహాద్యవస్థిత్యన్యథానుపపత్తిసిద్ధంబును •. ఇట్లు శిష్యసేనకాదుల యదృష్టమును గూడ తత్ప్రతిబంధకము. తదభావము ❡ నపేక్షించి పూర్వసిద్ధ మయిన యజ్ఞాననాశమే తత్కార్య మగు నంతఃకరణాదికమును నశింపఁజేయుచున్నది కావున వెండియు జ్ఞానాపేక్ష లేదు. అది చెప్పఁబడినది "తీర్థే శ్వపచగృహే వా నష్టస్మృతి రపి పరిత్యజ న్దేహమ్। జ్ఞానసమకాలముక్తః కైవల్యం యాతి హతశోకః" † అని [illegible]

* ఆ యజ్ఞానముయొక్క కార్యము.

• అంతఃకరణంబును దేహాదికమును ఉండుట వేఱువిధమున అనుపపన్నము కావున, సిద్ధంబు[illegible]

❡ ఆప్రతిబంధకముయొక్క నాశమును.

† పుణ్యతీర్థమునందుఁ గాని చండాలగృహమునందుఁ గాని స్మృతి నశించి గాని దేహమును విడిచి జ్ఞానము కలిగినపుడే ముక్తుఁడు కావున విగతశోకుఁడై కైవల్యము నొందును.

నెఱుంగను ఇత్యాదిప్రత్యయముమాత్రము వాని కజ్ఞానము నివర్తిల్లినను అజ్ఞాననాశ జనితం బై యనుపాదానం బైన సాక్షాదాత్మాశ్రయమే యగు నజ్ఞానసంస్కారము వలననే తత్త్వజ్ఞానసంస్కారనివర్త్యమువలన నంతఃకరణ ముండుదనుక నుండు నని వివరణకారులు. నేను బ్రహ్మమను అను చరమసాక్షాత్కారము గలిగినపిమ్మట నేను బ్రహ్మము కాను బ్రహ్మము నెఱుంగను ఇత్యాదిప్రత్యయము కలుగనే కలుగదు. ఇఁక ఘటము నెఱుగను ఇత్యాదిప్రత్యయ మగునేని తదుపపాదనము కొఱకీసంస్కారకల్పన యనుట యనుపపన్నము కాదు. అజ్ఞానలేశపదముచేతఁ గూడ నీసంస్కారమే వివక్షితము. సావయవము కాదు గదా యజ్ఞానము. అట్లయిన కొంచెము నశించును గొంచెము నిలుచు ననవచ్చును. అనిర్వచనీయ మగుట నజ్ఞానము సావయవ మనఁ దగదు. ఏకదేశము నంగీకరించిననో తన్నివృత్తికొఱకు రెండియుఁ జరమజ్ఞాన మపేక్షితమే యగును. అదియు మృతికాలమునందు దుర్ఘటము కావున తత్త్వజ్ఞానసంస్కారనాశ్యం బది యని యంగీకరింపవలయును. అందువలన సంస్కారపక్షమువలన విశేష మేమియు లేదు. కావునఁ బూర్వోక్త మగు కల్పనమే శ్రేయము. ఇట్టి జీవన్ముక్తి నపేక్షించియే పూర్వము భగవంతునిచేఁ జెప్పఁబడినది “ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః” అని. స్థితప్రజ్ఞలక్షణంబులును వ్యాఖ్యాతములు. అందువలన సమీచీనమే చెప్పఁబడినది విశతే తదనన్తర మ్మని.

శ్రీ. అంత.—ఆ పర మయినభక్తిచే, తత్త్వతో మా మభిజానాతి. ఎట్టివాని ? యావాన్ — సర్వవ్యాపిని, యశ్చాస్మి — సచ్చిదానందఘనుఁడను, అట్టివాని. తతః మామ్, ఇట్లు, తత్త్వతో జ్ఞాత్వా, తదనన్తరమ్=అజ్ఞానముగూడ ఉపరమింపఁగా; నన్ను, విశతే — పరమానందరూపుఁ డగుచున్నాఁ డని యర్థము.

ప. అంత.—ఆ సర్వాత్మకత్వ భావనారూపం బగు భక్తిచే నేను, యావాన్ = విశ్వవ్యాపిని, యశ్చ — పరమానందస్వరూపుఁడను, ఇట్టి నన్ను, అభిజానాతి = అభితః — స్థావరజంగమములయందు న న్నెఱుంగుచున్నాఁడు. తతో మామ్, తత్త్వతః = చిత్సంవిద్రూపమున; జ్ఞాత్వా; తదనన్తరమ్ = తత్త్వజ్ఞానోపరమమువ; మాం విశతే — మదాకారుఁ డగుచున్నాఁడు.

రా. తత్ఫలముఁ జెప్పుచున్నాఁడు.—స్వరూపముచేతను స్వభావముచేత మ ఱే నవ్వాఁడనో, గుణములచేతను విభూతులచేతను నే నెంతవాఁడనో, అట్టి నన్ను

ఇట్టివిధ మయిన భక్తిచే, తత్త్వతః అభిజానాతి. మాం తత్త్వతో జ్ఞాత్వా, తదనన్తరమ్ = తత్త్వజ్ఞానానంతరము; తతః = ఆ భక్తిచేత; మాం విశతే — తత్త్వమున స్వరూపస్వభావగుణవిభూతిదర్శనమున కుత్తరకాలమునఁ గలుగునట్టి యనవధికాతిశయభక్తిచే నన్నుఁ బొందుచున్నాఁ డని యర్థము. ఇట తతః అని ప్రాప్తిహేతువుగా నిర్దిష్టమై భక్తియే చెప్పఁబడుచున్నది, "భక్త్యా త్వనన్యయా శక్యః" అని యదియే తత్త్వాంబునఁ బ్రవేశహేతు వని చెప్పఁబడుటవలన.

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్. ౫౬

**భా.** స్వకర్మముచే భగవంతు నభ్యర్చించు టను భక్తియోగమునకు ఫలము సిద్ధిప్రాప్తి జ్ఞాననిష్ఠాయోగ్యత. దానివలనఁ గలుగు జ్ఞాననిష్ఠ మోక్షఫలావసాన మగుచున్నది. ఆభగవద్భక్తియోగం బిప్పుడు స్తుతింపఁబడుచున్నది శాస్త్రార్థోపసంహారప్రకరణమునందు శాస్త్రార్థనిశ్చయదార్ఢ్యముకొఱకు.—సర్వకర్మాణ్యపి — నిషిద్ధకర్మములను గూడ. సదా = ఎల్లప్పుడు; కుర్వాణః = అనుష్ఠించుచు; మద్వ్యపాశ్రయః = నేను వాసుదేవుఁడను ఈశ్వరుఁడను వ్యపాశ్రయం బెవ్వనికో అతఁడు మద్వ్యపాశ్రయుఁడు, నాయం దర్పిత మగు సర్వాత్మభావము గలవాఁడని యర్థము; అతఁడు గూడ, మత్ప్రసాదాత్ =నాయొక్క — ఈశ్వరుని యొక్క ప్రసాదమువలన; అవాప్నోతి=పొందుచున్నాఁడు; శాశ్వతమ్= నిత్యమును; పదమ్ = వైష్ణవ మగు పదమును; అవ్యయమ్ = అపక్షయరహితమును.

నిత్యనైమిత్తికములనే గాక నిషిద్ధకర్మములను గూడ నెల్లప్పుడును జేయుచున్నను నాయందు సర్వాత్మభావము నర్పించి యుండు నాభక్తుఁడు నాప్రసాదమువలన నిత్యమును అపక్షయరహితము నగు వైష్ణవపదము నొందుచున్నాఁడని తాత్పర్యము.

**ఆ.** అప్పుడు జ్ఞాననిష్ఠచేత మోక్షము కలుగుటవలనఁ గర్మానుష్ఠానము సిద్ధింప దని యాశంకించి చెప్పుచున్నారు స్వకర్మముచే నత్యాదిగా. ఆ సిద్ధిప్రాప్తినే విశేషించుచున్నారు జ్ఞా నేత్యాదిగా. జ్ఞాననిష్ఠాయోగ్యతకొఱకు స్వకర్మానుష్ఠానము.

భగవదర్చనరూపము కర్తవ్య మని యర్థము. జ్ఞాననిష్ఠాయోగ్యతయు దేనికొఱకని యాశంకించి జ్ఞాననిష్ఠాసిద్ధికొఱ కని చెప్పుచున్నారు దానివలన నిత్యాదిగా. జ్ఞాననిష్ఠయును దేనియం దుపయోగించు ననఁగాఁ జెప్పుచున్నారు మోక్షేత్యాదిగా. స్వకర్మముచే భగవదర్చనరూప మగు భక్తియోగము పరంపరచే మోక్షఫలకము కర్తవ్యం బని విధేయ మగుటవలన విధ్యపేక్షిత మగు స్తుతిని దించుచున్నారు ఆ భగవద్భక్తీత్యాదిగా. జ్ఞాననిష్ఠ కర్మనిష్ఠ యను నీరెంటను బ్రతిజ్ఞాపూర్వకముగా నచ్చటచ్చట విభజించి ప్రతిపాదింపఁబడినవి, ఇప్పు డేల కర్మనిష్ఠను పొడియు స్తుతించి కర్తవ్యం బని చెప్పవలయును? అనఁగాఁ జెప్పుచున్నారు శాస్త్రస్థేత్యాదిగా. అచ్చటచ్చటఁ జెప్పఁబడిన కర్మానుష్ఠానమే ప్రకరణవశమువలన నిటనుపసంహరింపఁబడినది. ఇది శాస్త్రార్థనిశ్చయమునకు దృఢతను గల్గించుచున్నది యని యర్థము. ఒకానొక కర్మానుష్ఠాయికి బుద్ధిశుద్ధిద్వారంబునఁ గైవల్యము సిద్ధించినను పాపబాహుల్యమువలనఁ గర్మానుష్ఠాయి కే యొకానొకనికి బుద్ధిశుద్ధి కలుగనియప్పుడు కైవల్యము సిద్ధింపదని యాశంకించి చెప్పుచున్నారు సర్వకర్మాణీ యని. సర్వశబ్దానురోధమువలన ఈశ్వరారాధనస్తుతిపరముగా వ్యాఖ్యానము చేయుచున్నారు నిషిద్ధకర్మములను గూడ నని. నిత్యనైమిత్తికములనువలె నని యపిశబ్దమున కర్థము. నిషిద్ధాచరణమునకుఁ బ్రామాదికత్వమును వ్యావర్తించుచున్నారు సదా అని. పాపకర్మకారికిని యథోక్తపదము ప్రాప్తించునెడ పాపమునకును మోక్షఫలకత్వమంగీకృతం బగు నని యాశంకించి చెప్పుచున్నారు మద్వ్యపాశ్రయః అని. దానికే తాత్పర్యముఁ జెప్పుచున్నారు నాయందు ఇత్యాదిగా. అప్పుడు జ్ఞానమే మోక్షహేతు వనుట యుపేక్షితం బగు ననఁగాఁ జెప్పుచున్నారు అతఁడు గూడ నిత్యాదిగా. ప్రసాదము — అనుగ్రహము సమ్యక్జ్ఞానోదయము. పదము — పదనీయము ఉపనిషత్తాత్పర్యగమ్యము.

టీ. సర్వకర్మాణ్యపి = సమస్తము లయిన కర్మములను నిషిద్ధములను గూడ; సదా కుర్వాణః; నేను ఆత్మను వ్యపాశ్రయముగాఁ గలవాఁడు మద్వ్యపాశ్రయుఁడు, ఈశ్వరునే నేను శరణముగాఁ బొందినాఁడను అతఁడే నాకు యోగక్షేమనిర్వాహకుఁ డనునభినివేశము గలవాఁ డని యర్థము. మత్ప్రసాదా దవాప్నోతి, శాశ్వతమ్ = అనాదిని; అవ్యయమ్ = అనంతమును; పదమ్ = విష్ణువుయొక్క పదమును, పొందుచున్నాఁ డని యర్థము.

శం. స్వకర్మణా తమభ్యర్చ్య అని యారంభించి, యిక తెలుపఁబడఁగల వఱకుఁ గల గ్రంథముచేత ముముక్షువున కీశ్వరార్పణబుద్ధితోఁ ననుష్ఠించినకర్మముల చేతనే సత్త్వశుద్ధియు శుద్ధాత్మునకే జ్ఞానంబును జ్ఞానవంతునకే మోక్షము నని జ్ఞానకర్మములకు సాధ్యసాధనభావమును సర్వశాస్త్రప్రసిద్ధమును నిర్ధారించుటకై కర్మములచేఁ జిత్తశుద్ధిని శుద్ధాత్మునకు జ్ఞానంబును దానికి ఫలము మోక్షంబును గ్రమంబునఁ బ్రతిపాదించి, ఇప్పు డారురుక్షు వగు గృహస్థునకును ఆరూఢుఁ డగు యోగికిని మోక్షైకకాము లగు నీయిద్దఱకును నిత్యమును నియమంబునఁ గర్తవ్య మగు నర్థము నిర్ణయించుకొఱకు నుత్తరగ్రంథ మారంభింపఁబడుచున్నది. అందు మొదట, మోక్షఫలకం బగు జ్ఞానము చిత్తశుద్ధి లేక సిద్ధింపదు, చిత్తశుద్ధియో స్వకర్మములచే నీశ్వరార్పణబుద్ధితోఁ జేసిన వానిచేతనే సిద్ధించుం గాని కామనతోఁ జేసినవానిచే సిద్ధింపదు, కావున నారురుక్షు వీశ్వరప్రీతికొఱకుఁ గర్మమె యవశ్యము చేయవలయు నని బోధించుటకై మత్ప్రీతికొఱకుఁ గర్మములఁ జేయువాఁడు మత్ప్రసాదమువలన ముక్తి నొందు నని చెప్పుచున్నాఁడు.—మద్వ్యపాశ్రయః=ఏ నేను "అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ" అను లక్షణము గలవాఁడను సర్వభూతాత్మభూతుఁడను సర్వాత్మకుఁడను బరమేశ్వరుఁడఁ గలనో అతఁడే వ్యపాశ్రయుఁడు – సంసారమోక్షముకొఱకు స్వకర్మములచే నారాధనీయుఁ డెవ్వనికో అతఁడు మద్వ్యపాశ్రయుఁడు, యాగమునఁ దా నారాధించు నగ్న్యాదిదేవతలయందును యాగీయము లగు చరుపురోడాశస్రుగాదులయందును సర్వత్ర మద్భావనాయుక్తుఁడై; ముముక్షువు, సర్వకర్మాణ్యపి = సమస్తము లయిన శ్రౌతస్మార్తములును నిత్యనైమిత్తికములు నగు కర్మములను విధ్యుక్తములను; మత్ప్రీతికొఱకు శ్రద్ధతోను భక్తితోను, కుర్వాణః = చేయుచు; మత్ప్రసాదాత్ = నాయొక్క — భక్తితో ననేకజన్మములు చక్కఁగా ననుష్ఠించిన కర్మములచే సంతర్పితుఁడ నగు పరమేశ్వరునియొక్క ప్రసాదము—అనుగ్రహము, దానివలన; సత్త్వశుద్ధిని జ్ఞానసిద్ధిని బొంది, అవ్యయమ్ = వృద్ధిక్షయవర్జితమును ఎక్కువతక్కువలు లేనిదాని సదా యేకరూప మైనదాని; శాశ్వతమ్ = నిత్యమును; పదమ్ = మోక్షమును; పొందుచున్నాఁడు. కర్మములచే సంతుష్టుఁ డగు నీశ్వరుని యనుగ్రహమువలన ముక్తిని జెందుచున్నాఁ డని యర్థము.

మ. ఓయీ! ఎవ్వఁ డనాత్మజ్ఞుఁ డశుద్ధాంతఃకరణుఁడో అతఁ డంతఃకరణశుద్ధిపర్యంతము సహజ మగు కర్మము విడువఁగూడదు, ఎవ్వఁడు మఱి శుద్ధాంతఃకరణుఁడో అతఁడు నైష్కర్మ్యసిద్ధిని సన్న్యాసముచేఁ బొందుచున్నాఁడు – అని

చెప్పఁబడినది. సన్న్యాసమో బ్రాహ్మణునిచేతనే కర్తవ్యము గాని క్షత్త్రియాదులచేఁ గాదని పూర్వము చెప్పఁబడినది భగవంతునిచేత "కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః" అనుచోట. అందు శుద్ధాంతఃకరణుఁ డగు క్షత్త్రియాదిచే నేమి కర్మమే యనుష్ఠేయమా? సన్న్యాసము కర్తవ్యమా? మొదటిది కాదు, "ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే। యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే" ఇత్యాదికముచే యోగమును — అంతఃకరణశుద్ధిని ఆరూఢునకుఁ గర్మానుష్ఠానము నిషిద్ధ మగుటవలన. రెండవదియుఁ గాదు. "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" ఇత్యాదికముచే బ్రాహ్మణధర్మ మగు సర్వకర్మసన్న్యాసము క్షత్త్రియాదులకు నిషిద్ధ మగుటవలన. కర్మానుష్ఠానమో కర్మత్యాగమో యొక్కటయే దక్క తృతీయమార్గము లేదు. అందువలన రెండును బ్రతిషిద్ధము లగుటచేతను గత్యంతరము లేమిచేతను బ్రతిషేధాతిక్రమము తప్పని యప్పుడు కర్మత్యాగమే మేలు, బంధహేతుత్యాగముచే మోక్షసాధనము పుష్కలం బగుటవలన. కర్మానుష్ఠానము మేలు కాదు, చిత్తవిక్షేపహేతు వగుటచే మోక్షసాధన మగు జ్ఞానమునకుఁ బ్రతిబంధక మగుటవలన — అను నర్జును నభిప్రాయము నూహించి చెప్పుచున్నాఁడు భగవంతుఁడు.—ఎవ్వఁడు పూర్వోక్తము లగు కర్మములచే శుద్ధాంతఃకరణుఁడో అతఁ డవశ్యము భగవదేకశరణుం డగుచున్నాఁడు, అంతఃకరణశుద్ధి భగవదేకశరణతాపర్యంతం బగుటవలన. ఇట్టివాఁడు బ్రాహ్మణుఁ డగునేని సన్న్యాసమునకుఁ బ్రతిబంధము లేనివాఁడు కావున సర్వకర్మములను సన్న్యసించుఁ గాక. సంసారవిమోక్షమో యతనికి భగవదేకశరణునకు భగవత్ప్రసాదమువలననే. ఇట్టివాఁడు క్షత్త్రియాది యగునేని సన్న్యాసమునం దనధికారి కావున నతఁడు కర్మములను జేయుఁ గాక. మ త్తే మనఁగా, మద్వ్యపాశ్రయః = నేను భగవంతుఁడ వాసుదేవుండనే వ్యపాశ్రయము — శరణ మెవ్వనికో అట్టి మదేకశరణుఁ డై, నాయం దర్పిత మగు సర్వాత్మభావము గలవాఁడై; సన్న్యాసమునం దధికారము లేమివలన, సర్వకర్మా ణ్యపి = సమస్తము లయిన కర్మములను, వర్ణాశ్రమధర్మరూపములను లౌకికములను నిషిద్ధములను గూడ; సదా కుర్వాణః; మత్ప్రసాదాత్ = నాయొక్క — ఈశ్వరునియొక్క యనుగ్రహమువలన; అవాప్నోతి = పొందుచున్నాఁడు, హిరణ్యగర్భునివలె విజ్ఞానోత్పత్తిచే; శాశ్వతమ్ = నిత్యమును; అవ్యయమ్ = పరిణామరహితము నగు; పదమ్ = వైష్ణవపదమును. ఇట్టి భగవదేకశరణుఁడు చేయునే చేయుఁడు నిషిద్ధకర్మములను. చేసినను మత్ప్రసాదమువలనఁ

ప్రత్యవాయము నొందక నద్విజ్ఞానముచే మోక్షము నొందుచున్నాఁ డని భగవదేక శరణతను స్తుతించుటకై సర్వకర్మాణ్యపి యని యనువదింపఁబడుచున్నది.

శ్రీ. స్వకర్మములచేఁ బరమేశ్వరారాధనమువలనఁ జెప్పఁబడిన మోక్ష ప్రకారము నుపసంహరించుచున్నాఁడు — సర్వకర్మాణ్యపి = నిత్యనైమిత్తికములను కామ్యములను గూడ; పూర్వోక్తక్రమంబున, మద్వ్యపాశ్రయః = కుర్వాణః, నేనే వ్యపాశ్రయము — ఆశ్రయణీయుఁడను స్వర్గాదిఫలము కాదు ఎవ్వనికో అతఁడు; మత్ప్రసాదాత్; శాశ్వతమ్ = అనాదిని; అవ్యయమ్ = నిత్యమును; సర్వోత్కృష్ట మగు వైష్ణవపదము నొందుచున్నాఁడు.

ప. ఇఁక బుద్ధ్యావిశుద్ధ యేత్యాదిగాఁ జెప్పిన మోక్షప్రకార మతి ప్రయాససాధ్య మగుటవలన సులభ మగు ప్రకారముఁ జెప్పుచున్నాఁడు.—సదా= నిరంతరముగా; మద్వ్యపాశ్రయః = నేనే వ్యపాశ్రయము — ఆశ్రయణీయుఁడను స్వర్గాదిఫలము కాదు ఎవ్వనికో అట్టివాఁడు; సర్వకర్మాణి — నిత్యనైమిత్తికాదులను; కుర్వాణో౽పి = చేయుచున్నను; మత్ప్రసాదాత్; నిత్యమును సర్వోత్కృష్టము నగు పదమును — స్థానమును; అవాప్నోతి. శ్రుతియును ఋక్సంహితలయందు "అహ మేవ స్వయ మిదం వదామి జుష్టం దేవేభి రుతమానుషేభిః। యం కామం కామయే తం త ముగ్రం కృణోమి తం బ్రహ్మాణం త మృషిం తం సుమేధామ్" అని. భాష్యము — అహ మేవ = నేనే; స్వయ మిదమ్ ఈ బ్రహ్మాఖ్య మగు వస్తువు; వదామి = చెప్పుచున్నాను, ఈ బ్రహ్మము నేనే యని చెప్పుచున్నా నని యర్థము. దేవేభిః = ఇంద్రాదిదేవతలచేతను; ఉత = మఱియు, మానుషేభిః = మనుష్యుల చేతను; జుష్టమ్=సేవితము, అట్టి బ్రహ్మము నేనే యనుట. ఇఁక దానినే ప్రకటించు చున్నది. — ఇట్టి బ్రహ్మాత్మకుఁ డగు నేను న్మాయా నధిష్ఠించి మానుషవేషము ధరించినవాఁడనై, యం కామం కామయేయమ్ = ఏ పురుషుని రక్షించుటకుఁ గోరుచున్నానో; తమ్ = ఆ పురుషుని; ఉగ్రం కృణోమి = అందఱకన్న నధికుఁ డగు రుద్రునిఁగాఁ జేయుచున్నాను, రుద్రపదవిని పొందించుచున్నాను. తం బ్రహ్మాణమ్= వానినే చతుర్ముఖునిఁగాఁ జేయుచున్నాను. త మృషిమ్ = వానినే యతీంద్రియద్రష్ట నుగా చేయుచున్నాను. తం సుమేధామ్ = మంచిబుద్ధి గలవానినిగా — జ్ఞానినిగాఁ జేయుచున్నాను.

రా. ఇట్లు ఫలాదికముల విడిచి పరమపురుషారాధనరూపమున ననుష్ఠితము లగు వర్ణాశ్రమోచిత నిత్యనైమిత్తికకర్మముల విపాకము చెప్పఁబడినది. ఇప్పుడు ఈ ప్రకారముననే యనుష్ఠితము లగు కామ్యకర్మములకును అట్టిదే విపాక మని చెప్పుచున్నాఁడు.—నిత్యనైమిత్తికము లగు కర్మములను మాత్రమె కాదు, మఱే మనఁగా, సర్వకర్మాణ్యపి—కామ్యకర్మములను గూడ; మద్వ్యపాశ్రయః=నాయందు సన్న్యసింపఁబడిన కర్తృత్వాదికము గలవాఁడు; కుర్వాణః; మత్ప్రసాదాత్ శాశ్వతం పదమ్, అవ్యయమ్ = అవికలమును; అవాప్నోతి. పద్యతే — పొందఁబడు చున్నది కావున పదమును — నన్ను పొందుచున్నాఁ డని యర్థము.

మా. వెండియు నంతరంగసాధనములఁ బ్రతిపాదించి యుపసంహరించు చున్నాఁడు సర్వకర్మాణీత్యాదిగా.

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ. ౫౭

భా. అందువలన.—చేతసా = వివేకబుద్ధిచేత; సర్వకర్మాణి=దృష్టాదృష్టము లగు సమస్తకర్మములను; మయి=ఈశ్వరుఁడ నగు నాయందు; సన్న్యస్య=యత్కరోషి యదశ్నాసి అని చెప్పిన న్యాయమున అర్పించి; మత్పరః=నేను వాసుదేవుఁడనే పరుఁడుగాఁ గలవాఁడవై; బుద్ధియోగమ్=నాయందు సమాహిత మయినబుద్ధి గలవాఁ డగుట బుద్ధియోగము, దాని; ఉపాశ్రిత్య—ఆశ్రయించి, ఆశ్రయమే యనన్యశరణత; మచ్చిత్తః=నాయందే చిత్తము గలవాఁడవు; సతతమ్=ఎల్లప్పుడును; భవ =అగుము.

అందువలన వివేకమున సర్వకర్మములను నాయం దర్పించి నన్నే పరమప్రాప్యునిగా నాశ్రయించినవాఁడవై యీయనన్యశరణతయను బుద్ధియోగము నవలంబించి యెల్లప్పుడును నాయందే చిత్తము నిలిపి యుండుమని తాత్పర్యము.

శ్రీ. పరమేశ్వరప్రసాదమున కిట్టి మాహాత్మ్య మెందువలన సిద్ధమో అందువలనఁ దత్ప్రసాదముకొఱకు నీవు యత్నింపవలయు నని చెప్పుచున్నారు అందువలన నని. భగవత్ప్రసాదముచేఁ బొందఁబడిన సమ్యగ్జ్ఞానమువలననే ముక్తి గాని కర్మమాత్రమువలనఁ గాదను జ్ఞానము వివేకబుద్ధి. ఆశ్రయశబ్దార్థము చెప్పుచున్నారు అనన్యశరణత యని.

హ॰ సర్వలోకాధ్యక్షుఁడు సర్వకర్మఫలభోక్తయు నగు వాసుదేవుఁడే నాకు శరణం బను నీబుద్ధిచే సర్వకర్మములను నాకు ఈశ్వరున కారాధన మని, మయి = నాయందు; సన్న్యస్య = సమర్పించి; మత్పరః = నేను వాసుదేవుఁడనే పరుఁడు - ప్రధానముగాఁ గలవాఁడవై; బుద్ధియోగ ముపాశ్రిత్య=చెప్పిన బుద్ధిచే యోగమును పొంది; మచ్చిత్తః = నాయందు ఈశ్వరునియందు చిత్తము గలవాఁడవు; సతతమ్ = సర్వకాలమునను; భవ = అగుము.

శం॰ "తేషా మేవా ఽనుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః। నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా" అని చెప్పఁబడినది బుద్ధి కాత్మతత్త్వ ప్రకాశనరూప మయిన మత్ప్రసాద మేది గలదో దానిచేతనే లభ్యము మోక్ష మెందువలననో అందువలన మత్పరుఁడ వగు మని చెప్పుచున్నాఁడు.—కర్మముచే సంతుష్టుఁ డగు నీశ్వరుని యనుగ్రహామువలననే ముక్తి యను జ్ఞానము చేతస్సు, చేతసా = అట్టి వివేకబుద్ధిచేత; నీవు, మత్పరః = నేనే పరము - పరమపురుషార్థము ప్రాప్య మగు వస్తువు అను బుద్ధి గలవాఁడవై, తీవ్రముముక్షువై యని యర్థము; మత్ప్రసాదసిద్ధికొఱకు "కర్తా భోక్తా జనార్దనః" అను న్యాయంబున, సర్వకర్మాణి= శ్రౌతస్మార్తము లగు సర్వకర్మములను గూడ నీవు చేయువానిని; మయి - పర మేశ్వరునందు; సన్న్యస్య - కర్మములను కర్మఫలములను నాయందు సమర్పించి యని యర్థము; బుద్ధియోగమ్ = బుద్ధికి నాయందే యోగము - స్థితి దాని; ఉపా శ్రిత్య - ఎల్లప్పుడును మద్భజనపరుఁడవై యని యర్థము; లేక; "భూతాని విష్ణు ర్భువనాని విష్ణుః" అను న్యాయమున సర్వత్ర పరమేశ్వరత్వబుద్ధి బుద్ధియోగము, దాని నెల్లప్పుడు నాశ్రయించి; లేక; "న్యాయార్జితధన స్తత్త్వజ్ఞాననిష్ఠో ఽతిథి ప్రియః" అని గృహస్థునకును వేదాంతవిచారము కర్తవ్య మను స్మృతివలనఁ గర్మ ములను జేయుచు, బుద్ధియోగమ్ = జ్ఞానసిద్ధిహేతు వగు శ్రవణమననాదికమును, ఉపాశ్రిత్య - సర్వదా వేదాంతవిచారపరుఁడ వై; సతతమ్; మచ్చిత్తః=నాయందే సర్వమయుఁ డైన పరమాత్మయందే చిత్తము గలవాఁడవు, జ్ఞానసిద్ధికొఱకును తత్ఫల సిద్ధికొఱకును సర్వదా మదేకశరణుఁడ వగు మని యర్థము.

మ॰ ఎందువలన మదేకశరణతామాత్రమే మోక్షసాధనమో కర్మానుష్ఠా నము గాని కర్మసన్న్యాసము గాని కాదో, అందువలన క్షత్రియుఁడవు నీవు.— చేతసా = వివేకబుద్ధిచే; సర్వకర్మాణి - దృష్టాదృష్టార్థము లగువాని; మయి = నా

యందు ఈశ్వరునియందు; సన్న్యస్య = "యత్కరోషి యదశ్నాసి" అని చెప్పిన న్యాయమున సమర్పించి; మత్పరః = నేను భగవంతుఁడ వాసుదేవుఁడనే పరుఁడు-ప్రియతముఁడుగాఁ గలవాఁడవై; బుద్ధియోగమ్ = పూర్వోక్త సమత్వ బుద్ధిలక్షణ మయిన యోగమును బంధహేతు వైన కర్మమునకును మోక్షహేతుత్వము కలిగించుదానిని; ఉపాశ్రిత్య = అనన్యశరణతచే స్వీకరించి; మచ్చిత్తః = నాయందు భగవంతుఁడ నగు వాసుదేవునందే చిత్త మెవ్వనికో, లేమ రాజునందుఁ గాని కామిని యందుఁ గాని, అట్టివాఁడవు మచ్చిత్తుఁడవు; సతతం భవ.

శ్రీ. అందువలన.—సర్వకర్మాణి చేతసా మయి, సన్న్యస్య=సమర్పించి; మత్పరః = నేనే పరము — ప్రాప్య మగు పురుషార్థము ఎవ్వనికో అట్టివాఁడవై; వ్యవసాయాత్మక మగు బుద్ధిచే యోగము నాశ్రయించి, సతతమ్ — కర్మానుష్ఠాన కాలమునందును; "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః" అను న్యాయమున నాయందే చిత్తము గలవాఁడ వగుము.

ప. అందువలన నీవు నట్టివాఁడ వగు మని చెప్పుచున్నాఁడు.—చేతసా= మనస్సుతోఁ గూడ; సర్వకర్మాణి; మయి; సన్న్యస్య = సమర్పించి; మత్పరః = నేను బరముఁడుగా గలవాఁడవు; సతతం భవ. అంత, వ్యవసాయాత్మక బుద్ధి యోగము నాశ్రయించి; మచ్చిత్తః = మదాకార మగు చిత్తము గలవాఁడవు; అగుము. ఇందుచే విశతే తదనన్తర మ్మనునదియే మఱియొకవిధమునఁ జెప్పఁబడిన దని యెఱుంగ నగును.

రా. అందువలన.—చేతసా = ఆత్మ మదీయుఁడును మన్నియామ్యుఁడు నను బుద్ధిచేత, చెప్పఁబడినది గదా "మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా" అని; సర్వకర్మాణి — కర్తృసహితముగాను ఆరాధ్యసహితముగాను; మయి సన్న్యస్య; మత్పరః = నేనే ఫలముగాఁ బ్రాప్యుఁడ నని యనుసంధించుచున్న వాఁడవై; కర్మములను జేయుచు దీనినే బుద్ధియోగము నుపాశ్రయించి, సతతం మచ్చిత్తో భవ.

మా. *

మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి
అథచే త్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి. ౫౮

* ఇది వైదుశ్లోకములు శ్రీభాష్య ముద్రితము.

భా. మచ్చిత్తః=నాయందే చిత్తము గలవాఁడవై; మత్ప్రసాదాత్=నాయనుగ్రహమువలన; సర్వదుర్గాణి=సమస్తరము లయిన సంసారహేతుజాతముల నెల్లను; తరిష్యసి = అతిక్రమింపఁగలవు. అథ = ఇఁక; త్వమ్=నీవు; నేను చెప్పినదానిని; అహంకారాత్ = నేను బండితుఁడ ననునహంకారమువలన; న శ్రోష్యసి చేత్ = గ్రహింపవేని; అందువలన నీవు, వినఙ్క్ష్యసి = వినాశము నొందుదువు.

అట్లు నాయందే చిత్తము గలవాఁడవై యుందువేని, నాయనుగ్రహమువలన నవిద్యాకామకర్మాదు లగు సమస్తరము లైన సంసారకారణముల నెల్ల దాఁటఁ గలవు. అటుగాక నీవు నాకుఁ దెలియని దే మున్న దని నేను జెప్పినదాని వినవేని వినాశము నొందుదు వని తాత్పర్యము.

ఆ. ఇందువలన నేమి యగు ననఁగాఁ జెప్పుచున్నారు మచ్చిత్త ఇత్యాదిగా. భయముచేత నైనను బ్రవర్తించు నని తలఁచి గ్రహింపనియెడ దోషముఁ జెప్పుచున్నారు అ థేత్యాదిగా.

హ. సర్వదుర్గాణి = సమస్తము లైన దుఃఖములను; మత్ప్రసాదాత్ = నాయొక్క ప్రసాదమువలన; తరిష్యసి. అథ; త్వమ్; అహంకారాత్ = నేనే సర్వశాస్త్రముల నెఱింగినవాఁడ నను బుద్ధివలన; న శ్రోష్యసి చేత్ = ఆకర్ణింపవేని; వినఙ్క్ష్యసి = వినాశము నొందఁగలవు.

శం. వేదాంతవిచారపరత్వమునకు త్వదేకశరణత్వమున కేమి ఫల మందువేని చెప్పెద వినుము — మచ్చిత్తః = సర్వదా ధ్యేయరూపంబున లేక సర్వత్ర విషయరూపంబున నేనే పరమాత్మను జిత్తమునందుఁ గలవాఁడవై; లేక, సర్వాత్మ నగు నాయందే చిత్తము గలవాఁడవై, సదా మదేకచిత్తుఁడవై; నీవు, మత్ప్రసాదాత్ = నా యనుగ్రహముచేఁ బ్రాప్త మగు నాత్మవిజ్ఞానమువలన; సర్వదుర్గాణి= సమస్తము లయిన దుర్గములను — దుఃఖముచేతఁ గూడ నతిక్రమింప శక్యములు కాని వగు నవిద్యాకామకర్మములను; లేక, సత్త్వరజస్తమోగుణములను గార్యసహితములను జన్మజరామృత్యుదుఃఖప్రవాహమునకుఁ గారణము లైనవానిని; తరిష్యసి. వానిఁ దరించి విదేహముక్తిసుఖమును బ్రాపింతు వని యర్థము. ఇందుచే నీశ్వరార్థము కర్మము చేయువాఁడే తరించుఁ గాని చేయనివాఁడు తరింపఁ డని సూచిత మగుచున్నది. కర్మములు ద్రవ్యసాధ్యము లగుటచే హింసాప్రధానము

లగుటవలన హింసాప్రధానం బగు కర్మముఁ జేయ సాధువులకు శక్యము కాదు అందును స్వజనవధలక్షణ మగు యుద్ధము నెంతమాత్రము చేయ శక్యమే కా దని సాంఖ్యమతము ననుసరించి యహంకారముచే స్వధర్మవిముఖత వహింపఁగూడ దని ముముక్షువునకు స్వధర్మప్రవృత్తినే దృఢీకరించుటకై యాక్షేపపూర్వకముగా స్వధర్మనిష్ఠనే యర్జును నొప్పించుచున్నాఁడు సార్ధశ్లోకద్వయముచేత.—అథ శబ్దము పక్షాంతరారంభార్థము. త్వమ్; అహంకారాత్ = శాస్త్రాంతరజ్ఞానముచేఁ గలిగిన యభినివేశమువలన; చేతసా సర్వకర్మాణి ఇత్యాదిగాఁ జెప్పిన నావచనమును, నశ్రోష్యసిచేత్ — కర్మము చేయక విధి నుల్లంఘింతువేని యని యర్థము; అందువలన, వినఙ్క్ష్యసి = వినాశము నొందుదువు, "అకృత్వా వైదికం కర్మ ద్విజః పతన మృచ్ఛతి" అను న్యాయంబున స్వధర్మత్యాగమువలనఁ బతితుఁడ వగుదువు. విధ్యుల్లంఘన మొకదోషము, స్వధర్మత్యాగము రెండవది, పరధర్మాశ్రయణము మూఁడవది, పురుషార్థభ్రంశము నాలవది, ఇట్లనర్థపరంపర యగు నని యర్థము.

మ. అందువలన నే మగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—మచ్చిత్తః, నీవు, సర్వదుర్గాణి — దుస్తరము లయిన కామక్రోధాదులను సంసారదుఃఖసాధనములను; మత్ప్రసాదాత్; నీప్రయత్నము లేకయే, తరిష్యసి = అనాయాసముననే యతిక్రమింతువు. అథ; త్వమ్ = నీవు; నేను జెప్పినదానియందు విశ్వాస ముంపక, అహంకారాత్ = పండితుఁడ నే నను గర్వమునలన; నశ్రోష్యసిచేత్ = నావచనాభిప్రాయమును జేయవేని; అందువలన, వినఙ్క్ష్యసి = పురుషార్థభ్రష్టుఁడ వయ్యెదవు, కామకారంబున సన్న్యాసాదుల నాచరించుటవలన.

శ్రీ. అందువలన నేమి కలుగునో దాని వినుము.—మచ్చిత్తః; మత్ప్రసాదాత్; సమస్తము లయిన దుర్గములను గూడ — దుస్తరము లైన సాంసారికదుఃఖములను, తరిష్యసి. విపక్షమునందు దోషముఁ జెప్పుచున్నాఁడు.—అథ; త్వమ్; అహంకారాత్ = తెలిసినవాఁడ నను నభిమానమువలన; నేను జెప్పిన యీయర్థమును, నశ్రోష్యసిచేత్; వినఙ్క్ష్యసి — పురుషార్థమునుండి భ్రష్టుఁడ వగుదువు.

ప. అందువలన నేమి కలుగునో దాని వినుము.—పూర్వోక్తరీతిని మచ్చిత్తుఁడ వగు నీవు, మత్ప్రసాదాత్; సర్వదుర్గాణి = ఆధిదైవికాదు లగు సర్వదుఃఖములను; తరిష్యసి. ఇఁక విపక్షమందు దోషముఁ జెప్పుచున్నాఁడు.—అథ; త్వమ్; అహంకారాత్ = నేను జ్ఞాత నను నభిమానమువలన; మదుక్తమును దీని,

నశ్రోష్యసిచేత్; అప్పుడు, వినఙ్క్ష్యసి = పురుషార్థమునుండి భ్రష్టుఁడ వగుదువు; అధమ మగు యోనిని బ్రాపింతువు.

రా. ఇట్లు మచ్చిత్తుఁడవై సర్వకర్మములఁ జేయుచు, సర్వదుర్గాణి = సమస్తము లైన సాంసారికము లగు దుర్గములను; మత్ప్రసాదమువలననే, తరిష్యసి. అథ, త్వమ్, అహంకారాత్ = నేనే కృత్యాకృత్యవిషయము నెల్లను ఎఱుంగుదు నని; మదుక్తమును, నశ్రోష్యసిచేత్; వినఙ్క్ష్యసి = వినష్టుఁ డగుదువు. నేను దక్క మఱి యొక్కఁడు సర్వప్రాణిజాతమునకును కృత్యాకృత్యముల నెఱింగినవాఁడు గాని శాసించువాఁడు గాని లేఁడు గదా!

> య దహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే
> మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి. గీ-

భా. స్వతంత్రుఁడ నేను, పరుఁడు చెప్పిన నేల చేయుదును? అనియు నీవు తలంపఁ దగదు.—నీవు, అహంకారమ్ = అహంకారమును; ఆశ్రిత్య = అవలంబించి; నయోత్స్యే = యుద్ధము చేయను. ఇతి మన్యసే యత్ = అని యేమి తలంచుచున్నావో, నిశ్చయము చేయుచున్నావో; అట్టి, తే = నీయొక్క; ఏషః = ఈ; వ్యవసాయః=నిశ్చయము; మిథ్యా= వ్యర్థము. ఎందువలన ననఁగా, ప్రకృతిః=క్షత్త్రియస్వభావము; త్వామ్= నిన్ను; నియోక్ష్యతి = ప్రేరింపఁ గలదు.

నీ విప్పు డహంకారముచేత యుద్ధము చేయ నని యేనిశ్చయము చేయుచున్నావో ఆనిశ్చయము సాగ నేరదు; ఏల యనఁగా నీక్షత్త్రియస్వభావము నీచే యుద్ధము తప్పక చేయించు నని తాత్పర్యము.

ఆ. స్వాతంత్ర్య ముండఁగా భయమున కవకాశము లే దని యాశంకించి చెప్పుచున్నారు స్వతంత్రుఁడ నిత్యాదిగా.

హ. అహంకార మాశ్రిత్య — నావచనము సరకు గొనక నేనే సర్వశాస్త్రవిదుఁడ నని తలఁచి; న యోత్స్య ఇతి మన్యసే యత్. తే ఏష వ్యవసాయః = నీ యీ నిశ్చయము; మిథ్య = వ్యర్థము. ఎందువలన ననఁగా, ప్రకృతిః త్వాం నియోక్ష్యతి.

శం. అట్లయినను నేను యుద్ధము చేయ నందువేని అది చెల్లదు. నీ సంకల్పము వ్యర్థమే యగును. స్వభావమువలనఁ గూడ కర్మము కర్తవ్యమే యగు

నని తానును సాంఖ్యమతము నిరసించి కర్మ మవశ్యకర్తవ్యం బని ప్రతిపాదించుచున్నాఁడు.—దోషవంత మగు కర్మము కర్తవ్యమే కా దని, అహంకారమ్ = అవివేకకృత మగు పాండిత్యాభిమానమును; ఆశ్రిత్య — "యే యుధ్యన్తే ప్రధనేషు" అని వేదోక్త మగు ధర్మము నవమానించి యవైదికమతము నాశ్రయించి; న యోత్స్య ఇతి; మన్యసే యత్ = తలంతు వేని; అట్టి, ఏషః = ఈ; తే=నీయొక్క; వ్యవసాయః = నిశ్చయము, శాస్త్రవిరుద్ధము; మిథ్యా = ఆకాశగమనేచ్ఛవలె నిరర్థకమే యగును. ఎట్లు నాసంకల్పము నిరర్థక మగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—తేజము శౌర్యము ధైర్యము దక్షత్వము అభిమానము మొద లగు గుణములయుత్పత్తికి హేతువు క్షత్త్రియయోని రజోగుణమయము కావున, ప్రకృతిః = క్షత్త్రియస్వభావము; త్వామ్ = నిన్ను అస్వతంత్రుని అస్వాధీనుని; నియోక్ష్యతి — అధర్షోపాసహాన మను గుణమును బుట్టించి యుద్ధము చేయించు నని యర్థము.

మ. నీవును.—అహంకారమ్ = ధార్మికుఁ డను నేను క్రూర మగు కర్మము చేయ నను మిథ్యాభిమానమును; ఆశ్రిత్య; న యోత్స్యే=యుద్ధము చేయను; ఇతి మన్యసేయత్ = అని యేమి తలంచుచున్నావో; తే; ఏషః; వ్యవసాయః=నిశ్చయము; మిథ్యా = నిష్ఫలము. ఎందువలన ననఁగా, ప్రకృతిః = క్షత్త్రియజాతికిఁ గారణ మైన రజోగుణస్వభావము; త్వామ్; నియోక్ష్యతి=యుద్ధమునకుఁ బ్రేరింపఁ గలదు.

శ్రీ. వినాశము నైనను బొందెదఁ గాని బంధువులతోఁ బోరు గావింప ననఁగా నందులకుఁ జెప్పుచున్నాఁడు.—నేను జెప్పినదాని నాదరింపక కేవల మహంకార మవలంబించి యుద్ధము చేయ నని నీవు, యత్ మన్యసే = దేని నిశ్చయించుచున్నావో; ఏషః తే, అధ్యవసాయః = నిశ్చయము; మిథ్యయే, నీ వస్వతంత్రుఁడ వగుటవలన. దానినే చెప్పుచున్నాఁడు.—ప్రకృతిః, రజోగుణరూపమునఁ బరిణమించినదై; త్వామ్ = నిన్ను; నియోక్ష్యతి=తప్పక ప్రవర్తింపఁ జేయఁగలదు.

ప. ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి — ప్రకృతి నాయధీన మగుటవలన నని భావము. *

రా. అహంకారమ్ = ఆత్మవిషయమున హితాహితజ్ఞానమునందు నేను స్వతంత్రుఁడ నను నభిమానమును; ఆశ్రిత్య; నానియోగము నాదరింపక; నయోత్స్య

* తక్కినది శ్రీనరీయముతో సమానము.

ఇతి; మన్యసే యది * = తలంతువేని; ఏషః తే; వ్యవసాయః = స్వాతంత్ర్యవ్యవసాయము; మిథ్య కాఁగలదు. ఎందువలన ననఁగా, ప్రకృతిః త్వామ్, యుద్ధమునందు, నియోక్ష్యతి = నాస్వాతంత్ర్యము నొల్లని నిన్ను అజ్ఞాని ప్రకృతి నియోగింపఁగలదు.

స్వభావజేన కౌన్తేయ నిబద్ధ స్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి య న్మోహా త్కరిష్య స్యవశో ఽపి తత్. ౬౦

భా. మఱియు నెందువలన ననఁగా.—కౌన్తేయ=అర్జునా! స్వభావజేన = స్వభావమువలనఁ బుట్టినట్టి; స్వేన = నీ దైన; కర్మణా=యథోక్తమగు శౌర్యాదికర్మముచేత; నిబద్ధః=నిశ్చయముగ బంధింపఁబడినవాఁడవు నీవు; కావున, మోహాత్ = అవివేకమువలన; యత్ = ఏ కర్మమును; కర్తుమ్ = చేయుటకు; నేచ్ఛసి = ఒల్లవో; తత్ =ఆ కర్మమును; అవశో ఽపి = పరవశుఁడ వయ్యే; కరిష్యసి = చేయుదువు.

అర్జునా! నీ క్షత్రియజాతికి స్వాభావిక మయిన శౌర్యాదికర్మము నిన్ను దృఢముగా బంధించి యున్నది, నీవు దాని నతిక్రమింపఁజాలవు, కావున నీ వవివేకమున యుద్ధము సేయ నొల్లకున్నను, ఆ కర్మమునకుఁ బరవశుఁడవై యుద్ధము చేసెద వని తాత్పర్యము.

ఆ. ఇందువలన నీకు యుద్ధమునుండి వైముఖ్యము సేయ శక్యము కాదని చెప్పుచున్నారు మఱియు నిత్యాదిగా.

హ. స్వభావజేన = స్వభావసిద్ధ మగు; స్వేన=ఆత్మీయ మగు; కర్మణా= కర్మముచే; నిబద్ధః = నియోగముచే బద్ధుఁడవు; యత్ =ఏ స్వభావసిద్ధ మగు కర్మమును; మోహాత్ ; కర్తుమ్ = నెఱవేర్చుటకు; నేచ్ఛసి; తత్ ; అవశోఽపి; కరిష్యసి.

శం. నేను జేయుచున్నా ననియు నేను జేయ ననియు నభిమానము గల వాఁడు బద్ధుఁడే యగుం గాని ముక్తుఁడు కాఁజాలఁడు, ముక్తుఁడు కానివాని కశేష కర్మత్యాగము సంభవింపమివలన. అందువలన స్వాభావిక మగు కర్మముచే నిబద్ధుఁడ వగు నీకుఁ గర్మత్యాగము చేయ శక్యము కాదు. దేసి నవివేకమువలన విడువఁ

* వీరిమతమున యద్యహంకార మాశ్రిత్య అని పాఠము.

గోరు చున్నావో దానినే ప్రకృతివశుండవై చేసెదవు. అందువలనఁ బ్రకృతిబద్ధునకుఁ బ్రాప్తం బగు కర్మము కర్తవ్యమేయను నభిప్రాయముతోఁ జెప్పుచున్నాఁడు.—జన్మాంతరీయపుణ్యాపుణ్యకర్మసంస్కారము వర్తమానజన్మమునందుఁ బ్రవృత్తినివృత్తి సుఖదుఃఖాదులకు హేతు వగునది స్వభావ మని చెప్పఁబడును, ప్రకృతిగుణవిశేషము, దానివలనఁ బుట్టినది స్వభావజము, అట్టి స్వాభావిక మగు; స్వేన = స్వకీయ మైన, క్షాత్త్ర మైన; కర్మణా = శౌర్యం తేజో ధృతిః" అని చెప్పఁబడిన కర్మముచేత; నిబద్ధః = సంసృష్టుఁడ వగు నీవు; మోహాత్ =యుద్ధాదికము స్వధర్మ మను జ్ఞానము లేమివలన; యత్ = స్వజాతిని బట్టి ప్రాప్త మగు నేకర్మమును; కర్తుం నేచ్ఛసి — నా కిది కర్తవ్యము కాదని త్యజింపఁ గోరుచున్నావో; తత్ = ఆ కర్మమునే; అవశః = నీప్రకృతికి వశుండవై; కరిష్యసి = అస్వతంత్రుఁడ వగుటవలన ప్రకృతిచే బలాత్కారమునఁ బ్రేరితుఁడవై చేయనే చేయుదువు గాని త్యజింపఁ జాలవు. అందువలనఁ గర్తవ్యమై ప్రాప్త మగు స్వకీయ మయిన శాస్త్రీయకర్మము విద్వాంసునిచే నవశ్యము కర్తవ్య మని యర్థము.

మ. ప్రకృతిని వివరించుచున్నాఁడు.—స్వభావజేన=పూర్వోక్తక్షత్త్రియస్వభావజ మైన శౌర్యాదిక మగు; స్వేన — ఆగంతుకము కాని; కర్మణా; నిబద్ధః = వశీకృతుఁడ వగు నీవు; కౌన్తేయ = ఓ యర్జునా! యత్ = బంధువధాదినిమిత్త మగు నేయుద్ధమును; మోహాత్ =స్వతంత్రుఁడ నేను ఎట్లు తలఁతునో అట్లు చేయుదు నను భ్రమవలన; కర్తుం నేచ్ఛసి; తత్; అవశోపి — ఇచ్ఛింపనివాఁడ వయ్యును, స్వాభావికకర్మపరతంత్రుఁడవు పరమేశ్వరపరతంత్రుఁడవు నై; కరిష్యసి = చేయనే చేయుదువు.

శ్రీ. మఱియును.—స్వభావము క్షత్త్రియత్వమునకు హేతు వగు పూర్వజన్మసంస్కారము, దానివలనఁ బుట్టిన స్వకీయ మగు కర్మముచే — పూర్వోక్తశౌర్యాదికముచేత, నిబద్ధః = యంత్రితుఁడ వగు నీవు; మోహాత్; యత్ =ఏ యుద్ధకర్మమును; కర్తుం నేచ్ఛసి; అవశోపి; తత్ = ఆ కర్మమును; చేయనే చేయుదువు.

ప. * ప్రాక్సంస్కారపరంపరాపరిణతం ప్రాయో మనః ప్రాణినాం కర్తస్య ప్రకృతిం నిరస్య సహజాం కర్తా ఽన్యథా స్యాన్నరః। దౌర్గన్ధ్యం లశునాదికస్య సహజం యత్నాత్సముత్సారయన్ సౌరభ్యం వితనోతి కో ఽసురభితాం

* పదయోజన శ్రీధరీయతుల్యము.

కర్పూరముఖ్యస్య వా” * ఇట్లు సాంఖ్యమీమాంసకాదిమతముచేఁ బ్రకృతిపారతంత్ర్యమును స్వభావపారతంత్ర్యమును నిరూపించి యుద్ధమునం దనాదరము నిషేధింపఁబడినది.

టీ. దాని నుపపాదించుచున్నాఁడు.—స్వభావజము గదా క్షత్రియునకు శౌర్యకర్మము. స్వభావజ మగు శౌర్యాఖ్య మయిన స్వకర్మముచే, నిబద్ధః; అందువలననే, అవశః — శత్రువులు చేయు తిరస్కారము సహింపనివాఁడ వయి; నీవే, తత్ = ఆ యుద్ధమును; కరిష్యసి; యత్ = దేని; ఇపుడు, మోహాత్ = అజ్ఞానమువలన; కర్తుం నేచ్ఛసి.

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా. ౬౧

టీ. మఱియును.—ఈశ్వరః = ఈశనశీలుఁ డగు నారాయణుఁడు; సర్వభూతానామ్ = సర్వప్రాణులయొక్కయు; హృద్దేశే = హృదయదేశమునందు; అర్జున—శుక్ల మయిన యంతరాత్మస్వభావము గలవాఁడు విశుద్ధాంతఃకరణుఁ డను నభిప్రాయమున అర్జునా యని సంబోధనము, “అహశ్చ కృష్ణ మహ రర్జునంచ” అని కనఁబడుటవలన; తిష్ఠతి = స్థితిని బొందుచున్నాఁడు. అతఁ డెట్లున్నాఁడు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.— భ్రామయన్ = భ్రమణముఁ జేయించుచు; సర్వభూతాని = సర్వప్రాణులను; యన్త్రారూఢాని = యంత్రముల నారూఢములను — అధిష్ఠించినవానివలె, ఇవశబ్ద మిట ద్రష్టవ్యము, దారుకృతపురుషాదులను యంత్రారూఢము లయినవానిఁబోలె; మాయయా=ఛద్మముచేత; భ్రామయన్ తిష్ఠతి యని సంబంధము.

అర్జునా! పరమేశ్వరుఁడు సర్వప్రాణుల హృదయమునం దంతర్యామియై యంత్రమునం జిక్కినట్లు పరవశములై యున్న సర్వభూతములను, యంత్రమునకుఁ దగిలించిన కొయ్యబొమ్మలను సూత్రధారుఁడు త్రిప్పునట్లు, మాయచేఁ దత్తత్స్వ

* ప్రాయికముగాఁ బ్రాణులమనస్సు పూర్వసంస్కారపరంపరచేఁ బరిణత మయి యున్నది, దాని సహజ మయిన ప్రకృతిని విడిచి వేఱువిధముగా నెవ్వఁడు చేయఁగలఁడు? లశునాదుల సహజదుర్గంధమును దొలఁగించి వానికి సౌరభ్యమును గాని కర్పూరాదులకు దుర్గంధమును గాని కలిగింప నెవ్వఁడు శక్తుఁ డగును?

భావికకర్మములందుఁ బ్రేరించుచున్నాఁడు. కావున నీవు యుద్ధము చేయక యుండఁ జాల వని తాత్పర్యము.

ఆ. ఇందువలనఁ గూడ నీకు యుద్ధము కర్తవ్యమే యని చెప్పుచున్నారు మఱియును అని. అర్జునశబ్దమునకుఁ జెప్పిన యర్థమునందు శ్రుతి నుదాహరించు చున్నారు అహ శ్చేత్యాదిగా. అహశ్చ కృష్ణ మహ రర్జునంచ వివర్తేతే రజసీ వేద్యాభిః అనుచోట ఒకానొక యహస్సు కృష్ణము — స్వచ్ఛము గాక కలుషితము వలెఁ గనఁబడు చున్నది, ఒకానొకయహస్సు మఱి అర్జునము — అతిస్వచ్ఛము శుద్ధ స్వభావముగాఁ గనఁబడు చున్నది అని యర్జునశబ్దము శుక్లశబ్దపర్యాయముగాఁ బ్రయోగింపఁబడి యుండుటవలనఁ జెప్పిన యర్థము యుక్త మని యర్థము. అధి ష్ఠించినవానివలె నని యెట్లు చెప్పవచ్చు ననఁగాఁ జెప్పుచున్నారు ఇవ శబ్దము ఇత్యా దిగా. దానినే వివరించుచున్నారు దారు ఇత్యాదిగా. దారుమయము లయిన ప్రతి మలను యంత్రారూఢములను ఎట్లు లౌకికుఁ డగు మాయావి మాయచేఁ ద్రిప్పు చుండునో అట్లు ఈశ్వరుఁడును సర్వభూతములను భ్రమింపఁ జేయుచునే హృదయ మున నున్నాఁ డని యర్థము.

హ. ఈశ్వరః = వాసుదేవుఁడు; సర్వభూతానామ్=సర్వప్రాణులయొక్క; హృద్దేశే = హృదయకమలమునందు; అర్జునము — శుక్లము నిర్మల మగు నంతఃకర ణము, అది కలవాఁడు, దానిసంబంధమువలన నర్జునుఁడు, ఓ యర్జునా! తిష్ఠతి = సన్నిహితుఁడై యున్నాఁడు. ఎట్లు ఒకానొకనేర్పరి దారుచక్రయంత్రము నెక్కిన వారిఁ ద్రిప్పునో అట్లు సర్వప్రాణులను నేను బరున్నాను నేను గూర్చున్నాను నేను నిలుచున్నాను ఇత్యాది ప్రత్యయములచే శరీరాఖ్యయంత్రము నారోహించినవారిని భ్రమింపఁ జేయుచు నున్నాఁ డని సంబంధము.

శ ౦. ప్రకృత్యధీనునకు స్వాతంత్ర్యము లేమివలన స్వాభావిక మగు కర్మము త్యజింప శక్యము కాదు, మఱి కర్తవ్యమే యని ప్రతిపాదించి, ఇప్పు డీశ్వరాధీను నకుఁ గర్మము త్యజింప శక్యము గాదు తత్ప్రేరణచే ప్రాప్త మగు కర్మము కర్త వ్యమే యని కర్మ మవశ్యకర్తవ్యం బనుటను బోధించుటకై చెప్పుచున్నాఁడు.— ఈశ్వరః = ఈశనశీలుఁడు, సర్వలోకనియంత యగు పరమేశ్వరుఁడు; సూత్రధారి యంత్రారూఢము లయిన దారుమయప్రతిమల నెట్లో అట్లు, సర్వభూతాని = బ్రహ్మా దిస్తంబపర్యంతములను; మాయయా = వాసనాత్మక మగు విక్షేపశక్తిచే; భ్రామ

యన్=స్వస్వకర్మములయందుఁ బ్రవర్తింపఁ జేయుచు; సర్వభూతానామ్; హృద్దేశే= హృదయమునందు, బుద్ధి గుహాయందు; తిష్ఠతి. లేక, "ఏష ఏవ సాధుకర్మ కార యతి, య స్సర్వేషు తిష్ఠన్ సర్వేభ్యో ఽన్తరో యం సర్వాణి భూతాని న వి దు ర్యస్య భూతాని శరీరం య స్సర్వాణి భూతా న్యన్తరో యమయతి"అను శ్రుతుల వలన, యన్త్రారూఢాని = యంత్రములను — శరీరములను వానియం దాత్మత్వాభి మానముచే నధిష్ఠించినట్టి; సర్వభూతాని = సర్వప్రాణులను; భ్రామయన్ = తత్త త్కర్మములందుఁ బ్రవర్తింపఁ జేయుచు; ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే తిష్ఠతి. అందువలనఁ దత్ప్రేరణచేఁ బ్రాప్త మగు కర్మము త్యజింపఁ దత్పరతంత్రునకు శక్య ము గాదు. కావున "యథా నియుక్తో ఽస్మి తథా కరోమి" అని ముముక్షువునకుఁ గర్తవ్యముగాఁ బ్రాప్త మగు కర్మము కర్తవ్యమే యని యర్థము.

మ. స్వభావాధీనతను బ్రతిపాదించి యీశ్వరాధీనతను వివరించుచు న్నాఁడు.—ఈశ్వరః = ఈశనశీలుఁడు నారాయణుఁడు సర్వాంతర్యామి, "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో ఽయం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీ మన్తరో యమయతి, యచ్చ కించి జగత్సర్వం దృశ్యతే శ్రూయతే ఽపివా। అన్త ర్బహిశ్చ త త్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" ఇత్యాది శ్రుతి ప్రసిద్ధుఁడు; సర్వభూతానామ్ = ఎల్లప్రాణులయొక్క; హృద్దేశే = అంతఃకరణము నందు; తిష్ఠతి — సర్వవ్యాపకుఁ డైనను అం దభివ్యక్తుఁ డగుచున్నాఁడు, సప్తద్వీపా ధిపతి యగు రాముఁ డయోధ్యయందువలె. అర్జున—శుక్లుఁడా, శుద్ధాంతఃకరణుఁడా! ఇట్టి యీశ్వరుని నీవు తెలియ సమర్థుఁడ వని తెలుపఁబడు చున్నది. ఏమి చేయు చున్నాఁడు? — భ్రామయన్ = ఆ వైపున కీవైపునకు చలింపఁజేయుచు; సర్వ భూతాని—పరతంత్రము లైనవాని; మాయయా = ఛద్మముచేత *; యన్త్రారూఢాని ఇవ — సూత్రసంచారాదియంత్రము నారూఢము లైన దారుమయపురుషాదిప్రతి మలను అత్యంతపరతంత్రములను ఎట్లు మాయావి త్రిప్పు చున్నాఁడో అట్లని యర్థము.

శ్రీ. ఇట్లు రెండుశ్లోకములచే సాంఖ్యాదిమతముచేఁ బ్రకృతిపారతంత్ర్య మును స్వభావపారతంత్ర్యమును గర్మపారతంత్ర్యమును జెప్పఁబడినది. ఇప్పుడు స్వమతముఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—సర్వభూతములయు హృదయ

* కపటముచేత.

మధ్యమునందు ఈశ్వరుఁ డంతర్యామియై యున్నాఁడు. ఏమి చేయుచు? సమస్తము లయిన భూతములను, మాయయా = తనశక్తిచేత; భ్రామయన్ = తత్తత్కర్మము లందుఁ బ్రవర్తింపఁ జేయుచు; ఎట్లు దారుయంత్రము నారూఢము లయిన కృత్రిమ భూతములను సూత్రధారుఁడు లోకమునందుఁ ద్రిప్పుచున్నాఁడో యట్లని యర్థము. లేక, యన్త్రారూఢములను — శరీరము నొందినట్టి, భూతములను — దేహాభిమాను లగు జీవులను, భ్రామయ న్నని యర్థము. అట్లు శ్వేతాశ్వతరమంత్రము "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా। కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అని. అంతర్యామిబ్రాహ్మణము గూడ "య ఆత్మని తిష్ఠ న్నాత్మాన మన్తరో యమయతి యమాత్మా న వేద యస్యా ఽఽత్మా శరీర మేష త అన్తర్యా మ్యమృతః" ఇత్యాదికము.

౬౧. ఇప్పుడు "మయా ఽధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాఽచరమ్" అన్న స్వమతము నుద్దేశించి స్వనియన్తృత్వముగూడఁ జెప్పుచున్నాఁడు.—ఓ యర్జునా! సర్వభూతానాం హృద్దేశే ఈశ్వరః, అంతర్యామియై యున్నాఁడు. ఏమి చేయుచు? సర్వభూతాని = జీవులను; యంత్రములను — శరీరములను ఆరూఢములను — అధిష్ఠించినవారిని, మాయయా = స్వశక్తిచే; భ్రామయన్ = సన్నిధిమాత్రమున వ్యాపృతులనుగాఁ జేయుచు, తా నేమియుఁ జేయక యని యర్థము. శ్రుతియును కణ్వశాఖారణ్యకమునందు "యో వై స సంవత్సరః ప్రజాపతి ష్షోడశకలో ఽయ మేవం వి త్పురుషస్య విత్త మేవ పఞ్చదశకలా ఆత్మైవా ఽస్య షోడశీకలా స విత్తే నైవా ఽథ పూర్యతే ఽపక్షీయతే త దే తన్నభ్యం య దయమాత్మా ప్రధి ర్విత్తం తస్మా త్సర్వజ్యానిం జీయత ఆత్మనాచే జ్జీవతి ప్రధినాగా దిత్యాహుః" అని. భాష్యము. యః—పూర్వోక్తము సంవత్సరము — కాలరూపుఁ డగు షోడశకలుఁడు ప్రజాపతి యెవఁడు గలఁడో, త న్నిదిధ్యాసనమువలన ఇతఁడును తద్రూపుఁడే పూర్వోక్తుఁడు ఇట్లెఱింగిన పురుషుఁడు. అతఁడును షోడశకలుఁ డగు ప్రజాపతి, వానియొక్క విత్తమ్ = ఐదుసూక్ష్మభూతములును అయిదు ఇంద్రియములు అయిదు ప్రాణములు నగు లింగదేహము, అవియే వానికిఁ బంచదశకలలు. ఆత్మయే యితనికి షోడశ మగు కల. అతఁడు పూర్వోక్త మగు విత్తముచేఁ బూరితుఁ డగుచున్నాఁడు అపక్షయము నొందుచున్నాఁడు, ప్రవృత్తిమార్గముచేఁ బూరితత్వమును నివృత్తిమార్గముచే అపక్షయమును — ఉపరమమును పొందుచున్నాఁడు. అప్పుడు షోడశ మగు కల యవశిష్టము. అందు అదియే నభ్యము — నాభియం దుండునది

నాభ్యము, నభ్యం బనుట ఛాందసము. లేక. మధ్యప్రదేశమునం దున్న స్థిర మైన వస్తువు వివక్షితము. అందుచే నభసి — హృదయాకాశమునం దుండునది నభ్యము. అది యేది? యదయ మాత్మా — ఈ యాత్మ యేదో అదియే, అజస్య నాభా వధ్యేక మర్పితమ్” అను శ్రుతివలన. ఇతి యర్థము. కులాలచక్రమునకు నడుమ ఛిద్రమునం దున్న కీలకము చక్రము చలించినను చలింపదు. అదియే నభ్యము. అట్లు వృత్తము — మున్ను నిరూపించిన లింగదేహము ప్రధి — చక్రపరిధివలె బాహ్య పరిధిస్థానీయము. అందువలన వృత్తముచే, సర్వాజ్యానిమ్ = సర్వ స్వహాని; జీయతే = పొందుచున్నాఁడు. అట్లయినను, ఆత్మనాచేత్ = ఆత్మచే సంపన్నుఁ డగునెడ, అప్పుడు, జీవతి = జీవన్ముక్తుఁ డగుచున్నాఁడు. ఇఁక ప్రధిచేత — శరీరముచే సంపన్నుఁ డగు నేని అప్పుడు, అగాత్ — గమనాగమనము చేయుచున్నాఁడు.

రా. సమస్తం బగు భూతజాతంబును సర్వేశ్వరుఁ డగు నాచేతఁ బూర్వ కర్మానుగుణంబుగాఁ బ్రకృత్యనువర్తనమునందు నియమితము గదా! దాని వినుము. ఈశ్వరః = సర్వభూతనియమనశీలుఁ డగు వాసుదేవుఁడు; సర్వభూతానామ్; హృద్దేశే — సకలప్రవృత్తినివృత్తులకు మూల మగు జ్ఞాన ముదయించు ప్రదేశమునందు; తిష్ఠతి. ఎట్లు ఏమి చేయుచు నున్నాఁడు. — యన్త్రారూఢాని సర్వభూతాని మాయయా భ్రామయన్ — తనచేతనే నిర్మింపఁబడిన దేహేంద్రియావస్థ మగు ప్రకృత్యాఖ్య మైన యంత్రము నారూఢము లగు సర్వభూతములను స్వకీయ మైన సత్త్వాదిగుణ మయ మగు మాయచేత గుణానుగుణముగాఁ బ్రవర్తింపఁ జేయుచు నున్నాఁ డని యర్థము. పూర్వముగూడ నిది చెప్పఁబడినది “సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం చ” అనియు, “మత్త స్సర్వం ప్రవర్తతే” అనియు. “య ఆత్మని తిష్ఠన్” ఇత్యాది శ్రుతియును.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. ౬౨

భా. తమేవ = ఆ యీశ్వరునే; శరణమ్ = ఆశ్రయమునుగా, సంసారార్తిహరణముకొఱకు; గచ్ఛ = ఆశ్రయింపుము; సర్వభావేన = సర్వాత్మచేత; భారత = ఓయర్జునా! అందువలన, తత్ప్రసాదాత్ = ఆ యీశ్వరుని యనుగ్రహమువలన; పరామ్ = ప్రకృష్ట మయిన; శాన్తిమ్ = ఉప

రతిని; స్థానమ్=నాయొక్క-విష్ణువుయొక్క- పరమం బగు పదమును గూడ; శాశ్వతమ్ = నిత్యమును; ప్రాప్స్యసి = పొందెదవు.

అర్జునా! నీ నీ సంసారార్తినాశమునకై యా యీశ్వరునే మనోవాక్కర్మములచే నాశ్రయముగా భజింపుము. ఆతనియనుగ్రహమువలన సంసారోపరతి నొందినవాఁడవై విష్ణువుయొక్క-నిత్య మగు స్థానమును పరమపదమును పొందెద వని తాత్పర్యము.

ఆ. ఈశ్వరుఁడు సర్వభూతములను ప్రేరించునేని కైవల్యము గోరు వానికిని పురుష కార మనర్థకం బగు నని యాశంకించి చెప్పుచున్నారు త మే వేత్యాదిగా. సర్వాత్మచేత - మనోవృత్తిచేతను వాక్కుచేతను కర్మముచేతను అని యర్థము. ఈశ్వరునియనుగ్రహమువలన - తత్త్వజ్ఞానోత్పత్తిపర్యంత, మగుదాని వలన నని శేషము. ముక్తులు దీనియం దుందురు కావున స్థాన మనఁబడు చున్నది.

హ. తమేవ; శరణమ్ = సకలదుఃఖనివారణ మయిన యాశ్రయమును; గచ్ఛ = భజింపుము; సర్వభావేన=సమస్తము లయిన సంకల్పములచేతను, ఇతఁడే నాకు స్వామి ఇతఁడే నాకుఁ బోషకుఁడు ఇతఁడే నాకు నాచార్యుఁడు ఇత్యాదుల చేత. తత్ప్రసాదాత్ = శరణాగతవత్సలుఁ డగు నాయీశ్వరుని యనుగ్రహము వలన; పరామ్ = ప్రకృష్టమైన; శాన్తిమ్ = ఉపరతిని; పొంది, స్థానమ్ = వైష్ణవ మగు పదమును; శాశ్వతమ్ = నిత్యమును; ప్రాప్స్యసి = పొందెదవు.

శం. ఆరురుక్షువునకుఁ జిత్తశుద్ధికొఱకుఁ గర్మమే కర్తవ్యం బని నిర్ధారించుటకై యిట్లు నయంబునను భయంబునను గర్మమునకుఁ గర్తవ్యత్వమును సాధించి యిప్పుడు అతనికే మోక్షైకకామునకు నీశ్వరైకశరణత్వంబున స్వకర్మముచేఁ దదారాధనము చేయువానికిఁ దత్ప్రసాదమువలన జ్ఞానంబును మోక్షంబును సిద్ధించుఁ గావునఁ దత్ప్రీతికొఱకుఁ గర్మము చేయుచు నయ్యీశ్వరునే శరణు పొందు మని చెప్పుచున్నాఁడు.—భారత = ఓ యర్జునా! స్వకర్మముచే నీశ్వరారాధనపరుఁడవై నీవు, సర్వభావేన= "నారాయణుఁడే యిది యంతయు" నని సర్వత్ర ఆత్మభావము సర్వభావము, అట్టి సర్వభావముచేత, సర్వత్ర పరమేశ్వరత్వబుద్ధిచేత; తమేవ = ఆపరమేశ్వరునే;శరణం గచ్ఛ= "సంసారసాగరే మగ్నం మా ముద్ధర జగత్ప్రభో" అని సంసారనివృత్తికొఱకు వానినే యాశ్రయింపుము తదేకశరణుఁడవై. తత్ప్ర

సాదాత్ = ఆ యీశ్వరుని యనుగ్రహమువలననే, సముత్పన్న మయిన యాత్మ విజ్ఞానమువలన; పరామ్ = దృశ్యాలంబనరహిత మగుటవలనఁ బ్రకృష్టమును; లేక, పరమానందానుభవహేతు వగుటవలనఁ బ్రకృష్టమును; శాన్తిమ్=వృత్త్యుపరతిని; లేక, సర్వత్ర సమదృష్టిని; ప్రాప్స్యసి=పొందఁగలవు. శాశ్వతమ్ = నిత్యమును; సర్వదా చిదానందైకరసరూపంబున నవిక్రియాత్మచేత ఉన్నది కావున స్థాన మనఁగా స్వస్వరూపము, దానిని కూటస్థాసంగచిదాత్మక మగు పరబ్రహ్మమును; ప్రాప్స్యసి— విదేహముక్తిసుఖమును బొందఁగల వని యర్థము.

మ. ఈశ్వరుఁడు సర్వభూతములను బరతంత్రములను బ్రేరించునేని విధి ప్రతిషేధశాస్త్రమునకు సమస్తపురుషకారమునకును ఆనర్థక్యము ప్రాప్తించు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—త మేవ=ఆ యీశ్వరునే; శరణమ్=ఆశ్రయమునుగా, సంసారసముద్రోత్తరణార్థము; గచ్ఛ = ఆశ్రయింపుము; సర్వభావేన = సర్వాత్మ చేత, మనస్సుచేతను వాక్కుచేతను కర్మముచేతను. ఓ భారతుఁడా ! తత్ప్రసాదాత్ =ఆ యీశ్వరు ననుగ్రహమువలననే తత్త్వజ్ఞానోత్పత్తిపర్యంత మగుదాని వలన; శాన్తిమ్ = కార్యసహిత మగు నవిద్యయొక్కనివృత్తిని; స్థానమ్=అద్వితీయ స్వప్రకాశపరమానందరూపముచే నవస్థానమును; శాశ్వతమ్=నిత్యమును; ప్రాప్స్యసి.

శ్రీ. ఎందువలన నిట్లు సర్వజీవులును బరమేశ్వరపరతంత్రులో అందువలన నహంకారముఁ బరిత్యజించి, సర్వభావేన = సర్వాత్మచేత; త మేవ=ఆ యీశ్వరునే; శరణం గచ్ఛ. అందువలన నయ్యీశ్వరుని ప్రసాదమువలననే పరమం బగు నుప శాంతిని పారమేశ్వరం బగు నిత్యమైనస్థానమును పొందఁగలవు.

ప. ఇట్లన్వయవ్యతిరేకములవలనఁ బ్రకృతియును దదనురూపసంస్కార ములును ఈశ్వరాధీనము లగుటవలన సర్వత్ర యతఁడే శరణ మని యెఱింగి నేను జెప్పినదాని ననుసరింపు మని చెప్పుచున్నాఁడు.—త మేవ = అట్టి నన్ను ఈశ్వరుని అంతర్యామినే; సర్వభావేన = సర్వాత్మచేత; శరణం గచ్ఛ. తత్ప్రసాదాత్; పరామ్ = ఉత్కృష్ట మయిన; శాన్తిమ్ = నిర్వృతిని; శాశ్వతమ్ = నిత్య మయిన; స్థానమ్ =స్థానమును; ప్రాప్స్యసి. అది చెప్పఁబడినది "స్థూలం వపుః పరిధి రాన్తర మస్య సూక్ష్మం దేవాలయం త దిహ దేవ గతిః పరాత్మా త త్పూజనోపకరణా న్యఖిలేన్ద్రియాణి కృత్వా త మేవ శరణం వ్రజ జీవనా ఽన్యమ్ " * అని.

* జీవా! స్థూలశరీరము చుట్టుప్రాకారము, సూక్ష్మశరీరము దీనిలోపలి దేవాలయము. దాని యం దుండు దేవుఁడు పరమాత్మ. ఆ దేవునిఁ బూజించు నుపకరణములు సకలేంద్రియములును. ఇట్లు భావించి యాపరమాత్మనే శరణు పొందుము. ఇతరమును విడువుము.

రా. ఈ మాయానివృత్తికి హేతువుఁ జెప్పుచున్నాఁడు.—అందువలన, త మేవ - సర్వమును ప్రకాశించువాఁడును ఆశ్రితవాత్సల్యముచే నీకు సారథిగా నున్నవాఁడును ఇట్లు చేయు మని నీకు బోధించువాఁడు నగు నయ్యీశ్వరునే; సర్వ భావేన = సర్వాత్మచేత; శరణం గచ్ఛ – సర్వాత్మచే ననువర్తింపుము. అట్లు కాకున్నను తన్మాయాప్రేరితుఁడవు అజ్ఞుఁడ వగు నీకు యుద్ధాదికము చేయుట తప్పదు, అప్పుడు నష్టుఁడ వగుదువు, అందువలనఁ దదుక్తప్రకారంబున యుద్ధాదికముఁ జేయు మని యర్థము. ఇట్లు చేయుదువేని, తత్ప్రసాదాత్; పరామ్; శాన్తిమ్ = సర్వకర్మబంధోపశమమును; శాశ్వత మగు స్థానమును గూడ, ప్రాప్స్యసి, ఏది శ్రుతశతములచేఁ బ్రతిపాదింపఁబడుచున్నదో అట్టి స్థానమును బొందఁగలవు, “త ద్విష్ణోః పరమంపదం సదా పశ్యన్తి సూరయః, తేహ నాకం మహిమాన స్సచన్తే। యత్ర పూర్వే సాధ్యా స్సన్తి దేవాః, యత్ర ఋషయః ప్రథమజా యే పురాణాః, పరేణ నాకం నిహితం గుహాయామ్, యో అ స్యాధ్యక్షః పరమే వ్యోమన్, అథ యదతః పరో దివో జ్యోతి ర్దీప్యతే, సో ఒధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్” ఇత్యాదులచేత.

మూ. పరోక్షవచనమో ద్రోణునిగూర్చి భీమునివచనమువలె.

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా
విమృశ్యైత దశేషేణ య థేచ్ఛసి తథా కురు. ౬3

భా. ఇతి = ఇది; జ్ఞానమ్ = జ్ఞానము; గుహ్యాత్ =గోప్యముకన్నను; గుహ్యతరమ్ = అతిశయమున గుహ్యము, రహస్య మని యర్థము; తే= నీకొఱకు; మయా = నాచేత, సర్వజ్ఞుఁడ నగు నీశ్వరునిచేత; ఆఖ్యాతమ్ = చెప్పఁబడినది. ఏతత్ = ఈ యథోక్త మగు శాస్త్రమును; అశేషేణ = సాకల్యముచేత; విమృశ్య = విమర్శనమును — ఆలోచనమును జేసి, యథోక్తమగు నర్థజాతమును; యథా=ఎట్లు; ఇచ్ఛసి=ఇచ్ఛించుచున్నావో; తథా = అట్లు; కురు = చేయుము.

ఇది రహస్యముకన్నను మహారహస్య మగు శాస్త్రము సర్వజ్ఞుఁడ నీశ్వరుఁడ నేను నీకుఁ జెప్పితిని. ఈ శాస్త్రమంతయు—నా చెప్పినయర్థ మంతయు సమగ్రముగా నాలోచించి నీకుఁ దోఁచినవిధం బనుష్ఠింపు మని తాత్పర్యము.

ఆ. శాస్త్రము నుపసంహరింపఁ దలఁచి చెప్పుచున్నాఁడు ఇతి తే ఇత్యాదిగా. జ్ఞానము.—కరణవ్యుత్పత్తిచే గీతాశాస్త్ర మని యర్థము. యథేచ్ఛసి తథా కురు— జ్ఞానము గాని కర్మము కాని యేది యిష్టమో దాని ననుష్ఠింపు మని యర్థము.

హ. ఇతి = ఇట్లు; తే = నీకు; జ్ఞానమ్ — బ్రహ్మబోధలక్షణము; ఆఖ్యాతమ్ = చెప్పఁబడినది; గుహ్యాతరమ్ = మిక్కిలి రహస్యము. విమృశ్య = విచారించి; ఏతత్; అశేషేణ = సాకల్యముచేత; యథేచ్ఛసి తథా కురు.

శం. "స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" అని యారంభించి "సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే" అనువఱకుఁ గల గ్రంథముచేతఁ గర్మములచే సమారాధితుం డగు నీశ్వరుని ప్రసాదమువలనఁ జిత్తశుద్ధియు దానివలన జ్ఞానంబును దానివలన మోక్షంబును నని చెప్పిన యర్థమునే దృఢీకరించుటకై వెండియు సంక్షేపంబున నుపన్యసించి యిప్పు డుపక్రమించిన శాస్త్రము నుపసంహరించుచున్నాఁడు.—"న త్వేవాహం జాతు నాసమ్" అని యారంభించి "స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్" అనునది యంతముగాఁ గల దగు, జ్ఞానమ్ = బ్రహ్మాత్మైకత్వజ్ఞానోత్పత్తికిఁ గారణ మగు నీగీతాశాస్త్రము; గుహ్యాత్ = గోపనీయ మగు మణిమంత్రాదికన్నను అణిమాదిసిద్ధిహేతు వైనదానికన్నను; ప్రయత్నంబున గోపనీయ మగుటవలన, గుహ్యాతరమ్ = పరమరహస్యము జ్ఞానశాస్త్రము; ముముక్షుఁడవు శుద్ధాత్ముఁడవు శరణాగతుఁడ వగు, తే = నీకొఱకు; మయా = సర్వజ్ఞుఁడను పరమకారుణికుఁడను అవాప్తసర్వకాముఁడను ఈశ్వరుఁడ నగు నాచేత; ఆఖ్యాతమ్ = జ్ఞానమును తత్సిద్ధికి సాధనమును దెలుపునట్టి మోక్షశాస్త్రము సమగ్రముగా నుపదేశింపఁబడినది. జ్ఞానమును తత్సాధనసంపత్తిని బోధించునట్టి యీ గీతాశాస్త్రమును పదవాక్యప్రమాణనిపుణుఁడ వగు నీవు, అశేషేణ — సర్వమును; విమృశ్య = సాధనమును తత్సిద్ధిప్రకారమును సాధ్యమును తత్సిద్ధిప్రకారమును నీ యధికారమును జక్కఁగా నాలోచించి సత్త్వశుద్ధి లేనియెడ సాధన మగు కర్మమునందును అది యున్నయెడ ఆత్మవిజ్ఞాననిష్ఠయందును నీయోగ్యతను నిశ్చయించుకొని; యథా ఇచ్ఛసి = ఎట్లు చేయఁగోరుచున్నావో; తథా కురు = అట్లు ప్రవర్తింపుము. స్వతృప్తివలె స్వాధికారము తనకే యెఱుంగ నగుటవలనను బరబుద్ధి యప్రత్యక్ష మగుటవలనను నీయధికారము నీవే నిశ్చయించికొని

కర్మమునందుఁ గాని జ్ఞానమునందుఁ గాని దేనియం దధికారమో దానియందుఁ బ్రవర్తింపు మని యర్థము.

మ. సర్వగీతార్థము నుపసంహరించుచుఁ జెప్పుచున్నాఁడు.—ఇతి = ఈ విధమున; తే = నీకొఱకు, అతిప్రియునికొఱకు; జ్ఞానమ్ = ఆత్మమాత్రవిషయ మగు మోక్షసాధనము; గుహ్యాత్ గుహ్యాతరమ్ = పరమరహస్య మైన సన్న్యాసాంత మగు కర్మయోగముకన్నను రహస్యతరము, తత్ఫలభూత మగుటవలన; ఆఖ్యాతమ్ = అంతయుఁ జెప్పఁబడినది; మయా = సర్వజ్ఞుఁడను బరమాప్తుఁడ నగు నాచేత. అందు వలన, విమృశ్య = పర్యాలోచించి; ఏతత్ = నాచే నుపదేశింపఁబడిన యీగీతా శాస్త్రమును; అశేషేణ = సాకల్యముచేత, సర్వమును ఏకవాక్యముగా నెఱింగి; నీ యధికారమున కనురూపముగా; యథేచ్ఛసి తథా కురు. మఱి దీని విమర్శింపక కామకారమున నేదియుఁ జేయువల దని యర్థము. ఇం దింత విషయము చెప్పఁబడి నది. అశుద్ధాంతఃకరణుఁ డగు ముముక్షువునకు మోక్షసాధనం బగు జ్ఞానం బుదయించుయోగ్యతకుఁ బ్రతిబంధకము లయిన పాపముల నాశముకొఱకు ఫలాభిసంధి పరిత్యాగముచే భగవదర్పణబుద్ధితో వర్ణాశ్రమధర్మానుష్ఠానము, అంత శుద్ధాంతః కరణునకు వివిదిష కలిగినప్పుడు గురువు నాశ్రయించి జ్ఞానసాధనం బగు వేదాంత వాక్యవిచారముకొఱకు బ్రాహ్మణునకు సర్వకర్మసన్న్యాసము, అంత భగవదేక శరణతచే వివిక్తదేశసేవాది జ్ఞానసాధనాభ్యాసమువలన శ్రవణ మనన నిదిధ్యాసనము లచే ఆత్మసాక్షాత్కార ముత్పన్న మైనపుడు మోక్షము. సన్న్యాసమునం దధికారము లేని క్షత్రియాదిముముక్షువునకో అంతఃకరణశుద్ధి కలిగిన పిదపఁ గూడ భగవదా జ్ఞాపాలనముకొఱకును లోకసంగ్రహముకొఱకును ఏవిధమున నైనను కర్మములు చేయు చున్నవానికిని భగవదేకశరణతచేఁ బూర్వజన్మకృత సన్న్యాసాది పరిపాకము వలనఁ గాని హిరణ్యగర్భునకువలె సన్న్యాసానపేక్షవలనఁ గాని భగవదనుగ్రహ మాత్రంబున నీజన్మమునందే తత్త్వజ్ఞానప్రాప్తిచేఁ గాని, భావిజన్మమునందు బ్రాహ్మణ జన్మలాభమునఁ జేసి సన్న్యాసాదిపూర్వకజ్ఞానప్రాప్తిచేఁ గాని మోక్షము. అని. ఇట్లు విచారించినయెడ లేదు మోహమున కవకాశ మని భావము.

శ్రీ. సర్వగీతార్థము నుపసంహరించుచుఁ జెప్పుచున్నాఁడు —ఇతి = ఈ ప్రకారమున; తే=నీకొఱకు; సర్వజ్ఞుఁడను బరమకారుణికుఁడ నగు నాచేత, జ్ఞానమ్; ఆఖ్యాతమ్ = ఉపదేశింపఁబడినది. ఎట్టిది? గుహ్యాత్ = గోప్య మగు రహస్యమంత్ర

యోగాది జ్ఞానముకన్నను; గుహ్యతరమ్. ఏతత్ = నాయుపదేశించిన యీగీతా శాస్త్రమును; అశేషముగా, విమృశ్య = పర్యాలోచించి; వెనుక, యథేచ్ఛసి తథా కురు. దీనిఁ బర్యాలోచించినయెడ నీమోహము నివర్తిల్లు నని భావము.

ప. జ్ఞానమ్ = ఆత్మవివేకరూపము. అశేషేణ — పూర్వాపరవాక్యాను సంధానపూర్వకముగా. ఇచ్ఛసి = ఏమోక్షమార్గము నపేక్షించుచున్నావో; తథా= అట్లే చెప్పిన యుపాయమును; కురు. *

రా. ఇతి = ఇట్లు; తే; ముముక్షువులు పొందవలసిన, జ్ఞానమ్; సర్వ గుహ్యముకన్నను, గుహ్యతరమ్; కర్మయోగవిషయమును జ్ఞానయోగవిషయమును భక్తియోగవిషయమును సర్వంబును, ఆఖ్యాతమ్. ఏతత్ అశేషేణ విమృశ్య, నీ యధికారమున కనురూపముఁగా, యథేచ్ఛసి తథా కురు — కర్మయోగమును గాని జ్ఞానయోగమును గాని భక్తియోగమును గాని యథేష్టముగా నవలంబింపు మని యర్థము.

మూ. ♦

సర్వగుహ్యతమం భూయ శ్శృణు మే పరమం వచః
ఇష్టో ఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్. ౬౪

భా. వెండియు నేను జెప్పునది వినుము.—సర్వగుహ్యతమమ్=సర్వ రహస్యములకన్నను అత్యంతరహస్యమును; పెక్కుమార్లు చెప్పిన దైనను, పునః = వెండియు; మే = నాయొక్క; పరమమ్ = ప్రకృష్ట మగు; వచః = వాక్యమును; శృణు = వినుము. భయమువలనఁ గాని యర్థకారణమువలనఁ గాని చెప్పుట కాదు, మ తే మనఁగా, మే=నాకు; దృఢమ్ = అవ్యభిచారమున; ఇష్టః = ప్రియుఁడవు; అసి=అగుచున్నావు; ఇతి = అని తలంచి; తతః = ఆ కారణముచేత; వక్ష్యామి = చెప్పెదను; తే = నీకు; హితమ్ = మేలును, పరమం బగు జ్ఞానప్రాప్తిసాధనమును. అది గదా సర్వహితములలోను హితతమము.

సర్వరహస్యములకన్నను రహస్యమును ఉత్తమ మగు నావాక్యమును, ఇదివఱకు నీకుఁ బెక్కుమార్లు చెప్పినదే యైనను, వెండియు వినుము. నీవు నాకు

* ఒక్కనది శ్రీధరీయముతో సమానము.
♦ ఇఁక మూఁడుశ్లోకముల కీభాష్యము లేదు.

మిక్కిలి ప్రియుఁడ వని యందుచేతనుఁ బరమహితం బగు జ్ఞానప్రాప్తిసాధనముఁ జెప్పెద నని తాత్పర్యము.

ఆ. గీతాశాస్త్రము నెల్లను పౌర్వాపర్యమును బట్టి విమర్శించి తాత్పర్యార్థము గ్రహింప నసమర్థునిగూర్చి చెప్పుచున్నారు వెండియు నిత్యాదిగా. ఏయర్థముఁ గోరి మాటిమాటికిఁ జెప్పెద నని యాశంకించి చెప్పుచున్నారు భయమువలన నిత్యాదిగా. హిత మని సాధారణముగా నిర్దేశించినపు డేల పరమంబు ఇత్యాది విశేషణ మని యాశంకించి చెప్పుచున్నారు అది ఇత్యాదిగా.

ప్ర. సర్వగుహ్యతమమ్ = సర్వరహస్యతమమును; భూయః=వెండియును; మే పరమం వచః శృణు. తతః = అందువలన. హితమ్ = కుశలమును.

శం. ఇక ముముక్షువునకును ఆరూఢునకును కర్తవ్యాంశమును నిర్ధారించి, "జ్ఞానసిద్ధి తత్ఫలసిద్ధికిఁ జిత్తశుద్ధియే యసాధారణకారణము, చిత్తశుద్ధి సిద్ధించిన యెడ జ్ఞానసిద్ధి సులభతరము, అది లేనియెడ జ్ఞానమును జ్ఞాననిష్ఠయు లభింపవు, సన్న్యాసంబును ఫలింపనేరదు, సాధనము దృఢముగా నుండ వలయును, కావునఁ జిత్తశుద్ధికొఱకుఁ గర్మమే యారురుక్షువున కీశ్వరార్పణబుద్ధిచేఁ జక్కఁగాఁ గర్తవ్యము" అని దృఢతరముగా నుపదేశించుటకై యుపదేశింపఁబోవు నంశమును స్తుతించుచున్నాఁడు.—సర్వగుహ్యతమమ్ = సమస్తము లయిన గుహ్యములు — గోప్యములు లేవి యణిమాదిసిద్ధిసాధనములు మణిమంత్రౌషధాదులు గలవో వానికన్నను మోక్షసుఖైకసాధన మగుటచే గుహ్యతమము, జ్ఞానతత్ఫలసిద్ధికిఁ గారణ మగుటవలన ఈశ్వరైకశరణత్వంబునఁ గర్మాచరణము గుహ్యతమము — అత్యంత గుహ్యము; తద్బోధకం బగు నావచనముగూడ సర్వగుహ్యతమమే; మఱియును, పరమమ్ = పరమపురుషార్థసాధన మగుటవలనఁ బరమము—ఉత్కృష్టము, అగు; మే = నాయొక్క; వచః = వచనమును; "మత్కర్మ పరమో భవ, మత్కర్మకృన్మత్పరమః" అని యచ్చటచ్చటఁ జెప్పఁబడిన దైనను, భూయః = వెండియు; నాచేఁ జెప్పఁబడుదాని, శృణు — శ్రద్ధతో విని తత్పరుఁడ వగు మని యర్థము. ఓయీ! ఈ వచనము సర్వగుహ్యతమ మైనయెడ ఎట్లుపదేశించెదవు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఎందువలన ననఁగా. తండ్రికిఁ గొడుకువలె నీవు నాయంశ మగుటవలన, మే = నాకు; ఇష్టోసి = ప్రియుఁడ వగుచున్నావు. తతః=ఆ కారణమువలననే; తే = నీకు; ఇతి — వక్ష్యమాణలక్షణ మగు; దృఢమ్ = ఫలావ్యభిచారి

దైవదాని; పూర్వోక్త మయినను దృఢ మగునట్లుగా; హితమ్ = హితసాధనమును; వక్ష్యామి = ఉపదేశించెదను. విను మని యర్థము.

మ. అతిగంభీర మగు గీతాశాస్త్రము నశేషముఁ బర్యాలోచించు క్లేశము లేకుండుటకై కృపచేఁ దానే దానిసారమును సంక్షేపించి చెప్పుచున్నాఁడు.——మున్ను గుహ్య మగు కర్మయోగముకన్నను గుహ్యతరం బగు జ్ఞానము చెప్పఁబడినది గదా! ఇప్పుడో కర్మయోగముకంటెను తత్ఫలభూత మగు జ్ఞానముకంటెను సర్వముకంటెను అతిశయమున గుహ్యమును రహస్యమును గుహ్యతమమును; పరమమ్ = సర్వము కంటెఁ బ్రకృష్టమును; మే = నాయొక్క; వచః = వాక్యమును; భూయః — అచ్చటచ్చటఁ జెప్పఁబడినను నిన్ననుగ్రహించుటకై వెండియుఁ జెప్పఁబడుదానిని; శృణు= వినుము. లాభపూజాఖ్యాతుల నపేక్షించి నీకుఁ జెప్పుట కాదు. మ త్తే మనఁగా, ఇష్టోఽసి = ప్రియుఁడ వగుచున్నావు; మే = నాకు; దృఢమ్ = మిక్కిలి; ఇతి, తతః= అనుకారణముచేత, ఆ యిష్టత్వముచేతనే; వక్ష్యామి=చెప్పెదను, అడుగంబడనివాఁడ వైనను నేను; తే = నీకు; హితమ్ = పరమ మగు శ్రేయస్సును.

శ్రీ. అతిగంభీర మగు గీతాశాస్త్రమును సాకల్యమునఁ బర్యాలోచింప నశక్తునకుఁ గృపచేఁ దానే దానిసారమును సంగ్రహించి చెప్పుచున్నాఁడు మూఁడు శ్లోకములచేత.——సమస్తము లయిన గుహ్యములకన్నను గుహ్యతమమును; మే = నాయొక్క; వచః; అచ్చటచ్చటఁ జెప్పిన దైనను, భూయః = వెండియు వక్ష్యమాణమును; శృణు. మాటిమాటికిఁ జెప్పుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.——దృఢమ్= అత్యంతము; మే = నాకు; నీవు, ఇష్టః = ప్రియుఁడ వని తలఁచి; తతః = ఆ హేతువు వలననే; తే హితం వక్ష్యామి. లేక. నీవు నా కిష్టుఁడవు, నేను జెప్పునదియు దృఢము — సర్వప్రమాణయుక్తము. అని నిశ్చయించి, తత స్తే వక్ష్యామి అని యర్థము. దృఢమతిః అని కొందఱుపాఠము.

ప. ఇఁక నుక్తప్రకారంబున నుపాయముఁ జేయ నశక్తుఁ డగు నర్జునునకుఁ బరమకారుణికుఁ డగు పరమాత్మ సంక్షేపంబున సర్వగీతార్థసారంబు నుపదేశింప నుపక్రమించుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.——సమస్తము లయిన గుహ్యములకన్నను పరమము గుహ్యతమము నాచెప్పఁబోవువాక్యము వినుము. అసంగోదాసీనుఁడవు పరమాత్మ వగు నీకు నాయం దింత మమకారం బెట్లు? అనఁగాఁ జెప్పు

చున్నాఁడు.—ఎందువలన నవఁగా. నీవు, దృఢమతి రితి = దృఢసంకల్పుఁడ వని; మే = నాకు; ఇష్టః = సమ్మతుఁడవు. తతః = ఆ కారణముచేత; తే; హితమ్ = ఉపకారమును; వక్ష్యామి.

టా. సమస్తము లైన యోగుహ్యములయందు భక్తియోగము శ్రేష్ఠమగుటవలన గుహ్యతమ మని పూర్వమే చెప్పఁబడినది "ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే" ఇత్యాది స్థలమున. మెండియు తద్విషయ మగు, పరమం మే వచః శృణు. ఇష్టో ఽసి మే దృఢ ఇతి * తత స్తే హితం వక్ష్యామి.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియో ఽసి మే. ౬౫

భా. ఏ మది? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—మన్మనాః = నాయందే చిత్తము గలవాఁడవు; భవ = అగుము. మద్భక్తః=నన్నే భజించువాఁడ వగుము. మద్యాజీ = నన్నే యజించుస్వభావము గలవాఁడ వగుము. మామ్ = నన్నే; నమస్కురు—నమస్కారమునుగూడ నాకే చేయుము. ఇట్లు వర్తించుచు వాసుదేవుఁడ నగు నాయందే సర్వసాధ్యసాధనప్రయోజనములను సమర్పించినవాఁడవై, మామేవ = నన్నే; ఏష్యసి = పొందెదవు. సత్యమ్ = సత్యమును; తే = నీకు; ప్రతిజానే—సత్య మయిన ప్రతిజ్ఞ చేయుచున్నా నీవిషయమునం దని యర్థము. ఎందువలన ననఁగా, మే = నాకు; ప్రియః = ఇష్టుఁడవు, అసి = అగుచున్నావు. ఇట్లు భగవంతుని సత్యప్రతిజ్ఞత్వము నెఱింగి భగవద్భక్తివలన మోక్షఫలం బవశ్యంభావి యని నిశ్చయించి భగవచ్ఛరణైకపరాయణుఁడు కావలయు నని వాక్యార్థము.

నీవు నాయందే చిత్తము నిలుపుము, నన్నే భజింపుము, నన్నే పూజింపుము, నాకే నమస్కారము చేయుము. ఇట్లు చేయుదువేని నన్నే పొందఁగలవు. నీవు నాకుఁ బ్రియుఁడవు కావున నీకు సత్యముగాఁ బ్రతిజ్ఞ చేయుచున్నా నని తాత్పర్యము.

ఆ. దానినే ప్రశ్నద్వారమున వివరించుచున్నారు ఏ మది ఇత్యాదిగా. ఉత్తరార్ధమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. సత్యప్రతిజ్ఞ

* వీరిదుపమున ఇష్టో ఽసి మే దృఢ ఇతి అని పాఠము.

చేయుటకు హేతువుఁ జెప్పుచున్నారు ఎందువలన నిత్యాదిగా ఇప్పుడు శ్రేయోర్థులకుఁ బ్రవృత్తి కలుగుటకై వాక్యార్థమును సంగ్రహించుచున్నారు ఇట్లు భగవంతుని ఇత్యాదిగా.

**హ.** మన్మనాః = మద్గత మయిన మనస్సు గలవాఁడవు. మద్యాజీ = నన్నుఁ బూజించువాఁడవు. మామ్ = నన్ను ఈశ్వరుని సకలగురుని; నమస్కురు. తత్ఫలముఁ జెప్పుచున్నాఁడు.—మామేవ = నన్ను వాసుదేవాఖ్యుఁ బరమేశ్వరునే; ఏష్యసి. ప్రతిజానే = ఉపదేశించుచున్నాను.

**శం.** వక్ష్యామి యని యేది ప్రతిజ్ఞాతమో దానినే గుహ్యతమము భాగవత మగు కర్మయోగమును సాంగము నుపదేశించుచున్నాఁడు.—మద్యాజీ= నన్ను యజించుస్వభావము గలవాఁడ వగుము. మన్మనాః = నాయందే మనస్సు ఎవ్వనికో అతఁడు మన్మనసుఁడు, మచ్చిత్తుఁడ వగుము. మద్భక్తః = నన్నే భజించువాఁడు మద్భక్తుఁడు, మద్భజనుండ వగుము. మాం నమస్కురు = నమస్కారమునుగూడ నాకే చేయుము. లేక. మద్యాజీ = వేదోక్తములే యగు స్వకర్మములచే సోపాసనాద్యశ్వమేధాంతములచే నన్నే పరమేశ్వరునే యజించుట ఆరాధించుట స్వభావముగాఁ గలవాఁడవు మద్యాజి వగుము, స్వకర్మములచే నన్నే యజింపుము. నా ప్రీతికొఱకు సర్వకర్మములను జేయు మని యర్థము. పుత్త్రాదికామనచేఁ బరమేశ్వరు నారాధించువానికిఁ బరమపురుషార్థము సంభవింపదు కావునఁ గామరహితుఁడవు కావలయు నని చెప్పుచున్నాఁడు.—మన్మనాః = నాయందు మోక్షస్వరూపుని యందే మనస్సు గలవాఁడవు, మోక్షైకకాముఁడ వగుము, పుత్త్రకాముఁడవు పశుకాముఁడవు కాని రాష్ట్రకాముఁడవు కాని స్వర్గకాముఁడవు కాని మల్లోకకాముఁడవు కాని కావల దని యర్థము. స్వకర్మములచేఁ బరమేశ్వరునే యారాధించువానికిఁ గ్రతువులయందు అగ్నయే స్వాహా అని యగ్న్యాదులయందు దేవతాంతరత్వబుద్ధి యున్నయెడఁ బరమేశ్వరభక్తి విచ్ఛిన్న మగును, అందువలన సర్వత్ర మద్బుద్ధి కర్తవ్య మను నభిప్రాయముచేఁ జెప్పుచున్నాఁడు.—మద్భక్తః = "బ్రహ్మ నారాయణః, శివశ్చ నారాయణః" అనియు "తదేవాగ్ని స్తద్వాయు స్తత్సూర్య స్తదు చన్ద్రమాః" అనియుఁ బరమేశ్వరుఁడే సర్వదేవతాత్మకుఁ డని శ్రుతు లుపదేశించుట వలన సర్వదేవతాత్మకుఁడ నగు నన్నొక్కనినే భజించువాఁడవు మద్భక్తుఁడ వగుము, అగ్న్యాదులయం దెల్లను మద్బుద్ధిచే సర్వాత్మకుని నన్ను ఒక్కనినే భజింపు మని

యర్థము. ఫలములయందుఁ గామత్యాగముచేతను అగ్న్యాదులయందు మదృద్ధిచేతను రాగద్వేషములు సంభవింపవు, అయినను నేను బ్రాహ్మణుఁడను యాజిని బండితుఁడను ఇత్యాద్యభిమానరూప మగు కాలుష్యమమాత్రము చిత్తప్రసాదప్రతిబంధకము కలుగును, దాని నివర్తించుటకై చెప్పుచున్నాఁడు.—మాం నమస్కురు = "ఈశ్వరో జీవకలయా ప్రవిష్టో భగవా నితి, వాసుదేవ స్సర్వమ్" అను న్యాయము చేత దేహాభిమాననివృత్తికొఱకు సర్వభూతాత్మకుఁడ నగు నన్ను సర్వత్ర నమస్కరింపుము, కాని కేవలదారుపాషాణాదిరూపునిఁ గా దని యర్థము. ఇట్లు సాధన సంపత్తిచే స్వకర్మమున మదారాధన తత్పరుఁడ వగు నీవు మత్ప్రసాదమువలనఁ జిత్త శుద్ధి నొంది యాత్మతత్త్వవిజ్ఞానముఁ బ్రాపించినవాఁడవై, మామేవ = నన్నే, త్రివిధ పరిచ్ఛేదశూన్యము సచ్చిదానందైకరస మగు పరబ్రహ్మమునే; ఏష్యసి=పొందుదువు, మద్భావముఁ బ్రాపింతువు, సత్యమ్=సత్యముఁ జెప్పుచున్నాను, ఇందు సందేహింప వలదు. తే = నీకు; నే నీయర్థమునందు, ప్రతిజానే=ప్రమాణము చేయుచున్నాను. ఎందువలన ననఁగా, మే = నాకు; నీవు ఉత్తమభక్తిచేత, ప్రియో౽సి. అందువలన నీకు మద్భావప్రాప్తివిషయమున సంశయము లే దని ప్రతిజ్ఞఁ జేయుచున్నా నని యర్థము. శ్రద్ధాభక్తులతో స్వకర్మములచే మదారాధనమునే చేయుచు నుక్తసాధన సంపన్నుఁ డగు ముముక్షువు సత్త్వశుద్ధి సంభావిత మగు నాత్మవిజ్ఞానముచే మద్భావము నొందు నిందు సంశయము లే దని భగవంతుఁడు ప్రతిజ్ఞ చేసి యుండఁగా ప్రామాణికున కెవ్వనికి యోనిబీజశుద్ధుఁ డగు బ్రాహ్మణునకు విశ్వాసము కలుగదు? అందువలన మోక్షైకకాముఁ డగు నారురుక్షువున కకామనచే నీశ్వరప్రీతికొఱకుఁ గర్మమే కర్తవ్య మని సిద్ధము.

౬౫. దానినే చెప్పుచున్నాఁడు.—నాయందు భగవంతుఁడ నగు వాసుదేవునియందు మనస్సు ఎవ్వనికో అట్టివాఁడవు మన్మనుఁడ వగుము, సదా నన్నుఁ జింతింపుము. ద్వేషముచేఁ గంసశిశుపాలాదులు గూడఁ జింతించి రనఁగాఁ జెప్పు చున్నాఁడు.—మద్భక్తః = ప్రేమచే నాయం దనురక్తుఁడవై, మద్విషయ మగు ననురాగముచే సదా మద్విషయముగా మనస్సును గావింపు మని విధింపఁబడుచున్నది. నీయం దయ్యనురాగమే దేనిచేఁ గలుగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు. — మద్యాజీ = నన్ను యజించుట — పూజించుట స్వభావముగాఁ గలవాఁడవు, మత్పూజనపరుఁడ వగుము. పూజోపకరణములు లేని యపుడో, మాం నమస్కురు=కాయమఞుచేతను

వాక్కుచేతను మనస్సుచేతను ప్రహ్వీభావనముచే * నారాధింపుము. ఈ యర్చనంబును వందనంబును ఇతరములకును భాగవతధర్మముల కుపలక్షణము. అట్లు చెప్పఁబడినది శ్రీభాగవతమునందు "శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ । అర్చనం వన్దనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్ ॥ ఇతి పుంసా ఽర్పితా విష్ణౌ భక్తిశ్చే న్నవలక్షణా । క్రియతే భగవ త్యద్ధా త న్మన్యే ఽధీత ముత్తమమ్." ♦ అని. ఇది భక్తిరసాయనమునందు విస్తరంబున వివరింపఁబడినది. ఇట్లు సదా భాగవతధర్మానుష్ఠానముచే నాయం దనురాగము పుట్టుటంజేసి మన్మనుఁడవై, మామేవ = నన్ను భగవంతుని వాసుదేవునే; ఏష్యసి = పొందెదవు, వేదాంతవాక్యజనితమగు మద్బోధముచేత. నీ విట సంశయము నొందవలదు. సత్యమ్ = యథార్థమును; తే = నీకొఱకు; ప్రతిజానే — సత్యమగు ప్రతిజ్ఞనే చేయుచున్నా నీయర్థమునందు. ఎందువలన ననఁగా. ప్రియోఽసి మే — ప్రియుని మోసపుచ్చుట యుచితమే కాదని భావము. లేక, సత్ప్రతిజానే = ప్రారబ్ధకర్మముయొక్కయంతము కలిగినపుడు, మామేవైష్యసి. ఈయర్థముకంటె విశ్వాసదార్ఢ్యప్రయోజన మగుపూర్వవ్యాఖ్యాతమే యుక్తిమము. ఇందుచే "యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్ । స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" అని పూర్వ మేది చెప్పఁబడినదో అది వ్యాఖ్యాతము, మచ్ఛబ్దముచే నీశ్వరత్వము ప్రకటించుటవలన.

శ్రీ. దానినే చెప్పుచున్నాఁడు.—మన్మనాభవ = మచ్చిత్తుఁడ వగుము. నాకే భక్తుఁడ వగుము. మద్యాజీ = నన్ను యజించుస్వభావము గలవాఁడ వగుము నన్నే నమస్కరింపుము. ఇట్లు వర్తించిన నీవు మత్ప్రసాదమువలన లబ్ధ మగుజ్ఞానముచే నన్నే, ఏష్యసి = పొందెదవు. ఇందు సంశయము చేయకుము. నీవు నాకు, ప్రియోఽసి = ప్రియుఁడవు గదా! అందువలన, సత్యమ్ = సత్యముగా; నీకు నేను; ప్రతిజానే = ప్రతిజ్ఞ చేయుచున్నాను.

• ప. అది యేమి యనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఎప్పు డంతర్దృష్టి వగుదువో అపుడు, మన్మనాః = నేనే మనస్సునందుఁ గలవాఁడవు, విషయాంతరము కాదు, చిత్రభిత్తియందుఁ జిత్ర ముంపఁబడినట్లు నన్నుఁ జేయు మని యర్థము

* వస్త్రమతచే.

♦ శ్రవణాదినవవిధ మైనభక్తి పురుషునిచే భగవంతుఁ డగువిష్ణువం దర్పిత మగునేని అపుడు చదివినపదువు ఉత్తమం బని తలంచెదను.

జ్ఞానాద్యదృష్టి వైనపుడు భక్తుఁడ వగుము, ననవిధభక్తి గలవాఁడవగుము. కర్మముఁ జేయునపుడు, మద్యాజీ = నన్ను యజించుస్వభావము గలవాఁడ వగుము. అపుడు కర్మాంగదేవతలయందు అంతర్యామినై యున్న నన్నే నమస్కరింపుము. ఈ యుపాయముచే, మామేవ ఏష్యసి = పొందఁగలవు. ఇది ప్రరోచనా * మాత్రమే కాదు, మ తే మనఁగా, సత్యమ్ = సత్యముగా; ప్రతిజానే = ప్రతిజ్ఞ చేసెదను. ఎందువలన ననఁగా. నీవు మద్రూపుఁడ వగుటవలన, మే = నాకు; ప్రియోఽసి=పరమప్రేమాస్పద మగుచున్నావు.

రా॰ "వేదాహ మేతం పురుషం మహాన్తమ్। ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, త మేవం విద్వా నమృత ఇహ భవతి। నాఽన్యః పన్థా విద్యతే ఽయనాయ" ఇత్యాదివేదాంతములందు విహితము వేదనధ్యానోపాసనాదిశబ్దవాచ్యము దర్శనసమాకార మత్యర్థప్రియ మిట మన్మనా భవ అని విధింపఁబడుచున్నది. మద్భక్తః = అత్యంతము నేను ప్రియుఁడుఁగాఁ గలవాఁడవు, అత్యంతమత్ప్రియుఁడవై నిరతిశయప్రియం బగు స్మృతిసంతతిని జేయు మని యర్థము. మద్యాజీ = ఇటఁగూడ మద్భక్తః అనునది యనువర్తించుచున్నది, యజనము — పూజనము, అత్యంతప్రియమదారాధనపరుఁడ వగుము. ఆరాధనము గదా పరిపూర్ణ మగు శేషభూతునివృత్తి. మాం నమస్కురు = నమః — నమనము, నాయం దత్యంత ప్రహ్వీభావమును ♦ అత్యంతప్రియమును జేయు మని యర్థము. ఇట్లు వర్తించుచు, మా మే వైష్యసి. ఇది సత్యము. తే ప్రతిజానే = నీకు ప్రతిజ్ఞ చేయుచున్నాను, ప్రరోచనమాత్రము కాదు. ఎందువలన ననఁగా నీవు, ప్రియో ఽసి మే. "ప్రియోహి జ్ఞానినో ఽత్యర్థ మహం సచ మమ ప్రియః" అని పూర్వమే చెప్పఁబడినది. ఎవ్వనికి నాయం దతిమాత్రప్రీతి యున్నదో నాకును వానియం దతిమాత్రప్రీతి కలుగుచున్నది కావునఁ దద్వియోగము సహింపనివాఁడనై నేను వాని నన్నుఁ బొందించుచున్నాను. అందువలన సత్య మే ప్రతిజ్ఞ "మా మే వైష్యసి" అని.

సర్వధర్మా న్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః. ౬౬

భా॰ కర్మయోగనిష్ఠకుఁ బరమరహస్యము నీశ్వరశరణత నుపసంహరించి యింక నిప్పుడు కర్మనిష్ఠాఫలం బగు సమ్యగ్దర్శనము సర్వవేదాంత

* రుచిఁ బుట్టించుట. ♦ నమ్రతను.

విహితము వ క్తవ్యం బని చెప్పుచున్నారు.—సర్వధర్మాన్ = సమస్తము లయినధర్మములను, ధర్మశబ్దముచే నిట నధర్మముగూడ గ్రహింపఁబడు చున్నది, నైష్కర్మ్యము వివక్షిత మగుటవలన, "నా ఽవిరతో దుశ్చరి తాత్, త్యజ ధర్మ మధర్మంచ" ఇత్యాది శ్రుతిస్మృతులవలన; సర్వ ధర్మములను, పరిత్యజ్య=విడిచి, సర్వకర్మములను సన్న్యసించి యనుట; మామ్ = నన్ను; ఏకమ్ = ఒక్కని, సర్వాత్మను సముని సర్వభూత స్థుని ఈశ్వరుని అచ్యుతుని గురుని జన్మజరామరణవివర్జితుని నేనే యని యొక్కని; శరణంవ్రజ = శరణుపొందుము, నాకంటె నితరము లే దని నిశ్చయింపు మని యర్థము. అహమ్ = నేను; త్వా = నిన్ను, ఇట్లు నిశ్చిత మైనబుద్ధి గలవానిని; సర్వపాపేభ్యః = సర్వధర్మాధర్మబంధన రూపము లైన యెల్లపాపములనుండి; మోక్షయిష్యామి = విడిపించెదను, స్వాత్మభావప్రకాశీకరణముచేత. చెప్పఁబడినది కూడ "నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా" అని. అందువలన, మాశుచః= శోకము చేయవల దని యర్థము.

ధర్మాధర్మముల నన్నిటిని విడిచి — సర్వకర్మముల సన్న్యసించి నన్ను సర్వాత్మను సర్వేశ్వరుని నే నొక్కఁడనే గాని వేఱువస్తువు లే దని నిశ్చయించి యాత్మాఽభేదమున శరణు పొందుము. నేను ఇట్లు నిశ్చితమైనబుద్ధి గల నిన్ను ధర్మా ధర్మబంధనరూపము లయినయెల్లపాపములనుండి ముక్తునిఁ గావించెదను. శోకింప వల దని తాత్పర్యము.

**ఆ.** వృత్తము ననువదించి యనంతరశ్లోకతాత్పర్యముఁ జెప్పుచున్నారు కర్మయోగేత్యాదిగా. ధర్మవిశేషణమువలన నధర్మానుజ్ఞను వారించుచున్నారు ధర్మే త్యాదిగా. జ్ఞాననిష్ఠుఁ డగు ముముక్షువు ధర్మాఽధర్మములఁ ద్యజింపవలయు ననుటకు శ్రుతిస్మృతుల నుదాహరించుచున్నారు నావిరతః ఇత్యాదిగా, మామేకమిత్యాదిక మునకుఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు నాకంటె నిత్యాదిగా. అర్జునుఁడు క్షత్త్రియుఁ డగుటవలన సన్న్యాసద్వారమున జ్ఞాననిష్ఠయం దతనికి ముఖ్యాధికారము లేకున్నను అతనిఁ బురస్కరించి యధికారులకు దాని నుపదేశించుట యిష్టం బగుటవలన విరోధము లే దనునభిప్రాయముతోఁ జెప్పుచున్నారు అహ మిత్యాదిగా. ఈ చెప్పిన యర్థమునందు దశమాధ్యాయవాక్యము ననుకూలముగాఁ జూపుచున్నారు చెప్పఁ

బడినదికూడ ఇత్యాదిగా. ఈశ్వరుఁడు నీబంధనంబులఁ దొలఁగించి నిన్నుఁ బాలించు వాఁడగుటవలన నీకు శోకావకాశము లేదని చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

## తాత్పర్యనిర్ణాయకభాష్యము.

భా. ఈ గీతాశాస్త్రమునందుఁ బరమం బగు నిశ్శ్రేయససాధనం బేది నిశ్చితము? జ్ఞానమా? కర్మమా? లేక యుభయమా? ఎందువలన సందేహము? "యజ్జ్ఞాత్వా ఒమృతమశ్నుతే, తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్" ఇత్యాదులు వాక్యంబులు కేవల మగు జ్ఞానమువలన నిశ్శ్రేయసప్రాప్తిం దెలుపుచున్నవి. "కర్మణ్యేవా ఒధికారస్తే, కురు కర్మైవ" ఇత్యాదులు కర్మంబు లవశ్యకర్తవ్యముల లని బోధించుచున్నవి. ఇట్లు జ్ఞానకర్మములు కర్తవ్యము లని యుపదేశించుట వలన సముచ్చితంబులు కూడ నిశ్శ్రేయసహేతు వగును. కావునఁ గలుగును సంశయము. ఏమి మఱి యిందు మీమాంసకు ఫలము? ఓయి! ఇదియే — వీనిలో నొకటి పరమనిశ్శ్రేయససాధనం బని యవధారణము. అందువలన విస్తీర్ణతరంబుగా విచారణీయం బిది.

టీ. పూర్వాపరాలోచనంబున గీతాశాస్త్రమునకు వ్యాఖ్యానము చేసి యుపసంహరించి తత్తాత్పర్యార్థము నిర్ధారిత మైనను విచారద్వారంబున నిర్ధారించుటకై విచారము నవతరింపఁజేయుచున్నారు ఈగీతాశాస్త్రమునందు ఇత్యాదిగా. ఏది యన్నదానినే మూఁడువిధములుగా విభజించుచున్నారు జ్ఞానమా ఇత్యాదిగా. నిమిత్తము లేని యెడ సంశయ మాభాస మగుటవలన నిరసనీయము కా దని తలఁచి యడుగుచున్నాఁడు ఎందువలన నిత్యాదిగా. తత్తద్బోధకములు కనఁబడుట సంశయమునకు నిమిత్తం బని చెప్పుచున్నారు యజ్జ్ఞాత్వేత్యాదిగా. కర్మములవశ్యకర్తవ్యము లని కనఁబడుటవలన వానివలనఁగూడ నిశ్శ్రేయసప్రాప్తి తోఁచుచున్న దని చెప్పుచున్నారు కర్మణ్యేవేత్యాదిగా. అయినను సముచ్చయమునకుఁ బ్రాపకము లే దని యాశంకించి చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. సామగ్రి యుండునపుడు కార్యమవశ్యము కలుగు నని యుపసంహరించుచున్నారు కావున నిత్యాదిగా. సందిగ్ధమును సఫలము నగునది విచారణీయ మను నియమమువలన ఫలము లేనియెడ సందిగ్ధమయ్యును విచారణీయము కా దని తలఁచి యడుగుచున్నాఁడు ఏమి మఱి యిత్యాదిగా.

ప్రత్యేకము జ్ఞానముగాని కర్మముగాని సముచ్చితములు గాని ముక్తికిఁ బరమసాధనం బనియవధారణమే విచారఫలం బని పరిహరించుచున్నారు ఓం ఇత్యాదిగా. విచార ప్రయోజకము లగు సందేహప్రయోజనములు కలుగుటవలన విచారద్వారంబున బరమముక్తిసాధనము నిర్ధారణీయం బని నిగమనము చేయుచున్నారు అందువలన నిత్యాదిగా.

భా. ఆత్మజ్ఞానముమాత్రమే కేవలము నిశ్శ్రేయసహేతువు, భేదప్రత్యయనివర్తక మగుటచేఁ గైవల్యఫలావసానం బగుటవలన. క్రియాకారకఫలభేదబుద్ధి యవిద్యచే నాత్మయందు నిత్యప్రవృత్తము. నాకుఁ గర్మము నేను గర్తను ఈ ఫలముకొఱకీ కర్మముఁ జేసెద నను నీయవిద్య యనాదికాలప్రవృత్తము. ఈ యవిద్యకు నివర్తకము ఇతఁడు నేను కేవలుఁడ నకర్త నక్రియుఁడ నఫలుఁడ నాకంటె వేఱొకఁడు లేఁ డను నీయాత్మవిషయం బగు జ్ఞానము ఉత్పద్యమానము, కర్మప్రవృత్తిహేతుభూత మగు భేదబుద్ధిని నివర్తించునది యగుటవలన. మాత్రమె యను శబ్దము పక్షద్వయవ్యావృత్త్యర్థము. కేవలంబు లగు కర్మములవలనం గాని సముచ్చితంబు లగు జ్ఞానకర్మములవలనఁ గాని కాదు నిశ్శ్రేయసప్రాప్తి యని పక్షద్వయమును నివర్తించుచున్నది. అకార్య మగుటవలనఁ గూడ నిశ్శ్రేయసము కర్మసాధనం * బనుట యనుపపన్నము. నిత్య మగు వస్తువు కర్మముచేఁ గాని జ్ఞానముచేఁ గాని చేయఁబడదు గదా.

టీ. ఇట్లు విచారము నవతరింపఁజేసి సిద్ధాంతమును సంగ్రహించుచున్నారు. ఆత్మేత్యాదిగా. సంగ్రహవాక్యమును వివరించుచు నాత్మజ్ఞాననివర్త్యం బగు నవిద్యను జూపుచున్నారు క్రియేత్యాదిగా. ఆశ్రయమును జెప్పుటచే నది యనాది యని చెప్పుచున్నారు ఆత్మయం దని. ఆ యవిద్యనే యనాద్యవిద్యాసంభవమును అనర్థాత్మకమును బ్రపంచించుచున్నారు నాకు ఇత్యాదిగా. అనాద్యవిద్యాకార్యం బగుటవలనఁ బ్రవాహరూపమున ననాది యిది యని వివక్షించి విశేషణము చేయుచున్నారు అనాదికాలప్రవృత్త మని. అందుఁ గారణావిద్యానివర్తకం బాత్మజ్ఞాన మని యుపన్యసించుచున్నారు ఈ యవిద్యకు నిత్యాదిగా. ఓయీ! ఈ జ్ఞానము ఉత్పన్న మైనది నివర్తింపదు అవిరోధమున నుత్పన్న మగుటవలన, అనుత్పన్న

* కర్మము సాధనముగాఁ గలది.

మగునదియు నివర్తింపదు అలక్షాత్మక మర్థక్రియాకారి కానందువలన. అనఁగాఁ జెప్పుచున్నారు ఉత్పద్యమాన మని. ఎట్లని కారణావిద్యానివర్తకం బని యాశంకించి దానికి కార్యావిద్యానివర్తకత్వము దృష్టం బగుటవలన నని చెప్పుచున్నారు కర్త్రేత్యాదిగా. ఆత్మజ్ఞానము మాత్రమే యను సంగ్రహవాక్యమునందు మాత్రమే యనుశబ్దముచే బోధ్య మగు విశేషము లేమివలన నదియనర్థకం బని యాశంకించి చెప్పుచున్నారు మాత్రమే ఇత్యాదిగా. పక్షద్వయవ్యావర్తకతనే స్ఫుటీకరించుచున్నారు కేవలంబులు ఇత్యాదిగా. ఇందువలనఁ గూడ కర్మసాధ్యము కాదు ముక్తి యని చెప్పుచున్నారు అకార్యము ఇత్యాదిగా. "ఏష నిత్యో మహిమా" అను శ్రుతివలన నిత్య మగుటచే మోక్ష మకార్య మగుటవలన దానికి హేత్వపేక్షలే దని యుపపాదించుచున్నారు నిత్యము ఇత్యాదిగా.

భా. కేవలజ్ఞానము గూడ అనర్థకం బప్పుడు. కాదు, అవిద్యానివర్తకం బై దృష్టకైవల్యఫలావసానం బగుటవలన. అవిద్యాతమోనివర్తకం బగు జ్ఞానమునకుఁ గైవల్యఫలావసానత్వము దృష్టము, రజ్జ్వాదివిషయమున సర్పాద్యజ్ఞానతమోనివర్తకం బగు ప్రదీపప్రకాశఫలమునకుం బోలె. సర్పవికల్పవినివృత్తిచే రజ్జుకైవల్యావసానము గదా ప్రకాశఫలము. అట్లు జ్ఞానము.

ఆ. జ్ఞానముచేతఁ గూడ మోక్షము చేయఁబడదేని అప్పుడు కేవలజ్ఞానము గూడ ముక్తి కనుపయుక్తము కావున నది ముక్తికి హేతు వనుట యెట్లు? అని యాశంకించుచున్నారు కేవ లేత్యాదిగా. జ్ఞాన మనర్థకం బనుటను నిరాకరించుచున్నారు కా దని. దానినే ప్రపంచించుచున్నారు అవి ద్యేత్యాదిగా. అవిద్యానివర్తక మగు జ్ఞానము కైవల్యఫలావసాయి యగుట దృష్టం బని యేది చెప్పఁబడినదో దానికి దృష్టాంతముఁ జెప్పుచున్నారు రజ్జ్వా దీత్యాదిగా. ఉక్తవిషయమునఁ దమోనివర్తక మగు ప్రకాశమునకు ఏఫలమునందుఁ బర్యవసానము? అనఁగాఁ జెప్పుచున్నారు స ర్పేత్యాదిగా. ప్రదీపప్రకాశమునకు సర్పభ్రమ నివృత్తిద్వారమున రజ్జుమాత్రమునందుఁ బర్యవసానం బగునట్లు ఆత్మజ్ఞానమునకును తదవిద్యానివృత్తిచే నాత్మకైవల్యమునం దవసానం బని దార్ష్టాంతికముఁ జెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా.

భా. దృష్టార్థము లగు ఛేదనక్రియాగ్నిమంథనాదులయందు వ్యాపృతము లగు కర్త్రాదికారకములకు ద్వైధీభావాగ్ని దర్శనాదిఫలంబుకంటె

నన్యఫలం బగు కర్మాంతరమునందు వ్యాపార మనుపపన్నం బెట్లో, అట్లు జ్ఞాననిష్ఠాక్రియయందు దృష్టార్థమునందు వ్యాపృతం బగు జ్ఞాత్రాదికారకమున కాత్మ కైవల్యఫలముకంటె నన్యఫలం బగు కర్మాంతరమునందుఁ బ్రవృత్తి యనుపపన్నము. కావున జ్ఞాననిష్ఠ కర్మసహితం బగుట యుపపన్నము కాదు. భోజనాగ్నిహోత్రాదిక్రియలకువలెనగు నందు వేని, కాదు, కైవల్యఫలం బగు జ్ఞానము కలుగునపుడు క్రియాఫలార్థిత్వం బనుపపన్న మగుటవలన. కైవల్యఫలం బగు జ్ఞానము ప్రాప్త మగుచుండఁగా సర్వతస్సంప్లుతోదకంబును దత్ఫలంబును ప్రాప్త మైనపుడు కూపతటాకాది క్రియాఫలార్థిత్వము సంభవింపని యట్లు ఫలాంతరమునందుం గాని తత్సాధనభూతం బగు క్రియయందుం గాని యర్థిత్వం బనుపపన్నము గదా! రాజ్యప్రాప్తిఫలం బగు కర్మమునం దగు వ్యాపృతునకు క్షేత్రప్రాప్తిఫలమునందు వ్యాపారము గాని తద్విషయముగ నర్థిత్వము గాని యుపపన్నము కాదు గదా! అందువలనఁ గర్మమునకు లేదు నిశ్శ్రేయససాధనత్వము. జ్ఞానకర్మములకు సముచ్చితములకును లేదు. కైవల్యఫలం బగు జ్ఞానమునకుఁ గర్మసాహాయ్యాపేక్షయును సంభవింపదు, అవిద్యానివర్తకం బగుటచే విరుద్ధ మగుటవలన. తమస్సు తమస్సును నివర్తింపదు గదా! అందువలనఁ గేవల మగు జ్ఞానమే నిశ్శ్రేయససాధనము.

అ. జ్ఞాననిష్ఠాహేతువు లగు జ్ఞాత్రాదులకుఁ గర్మాంతరమునందుఁ బ్రవృత్తి సంభవించుటవలనఁ గర్మసహిత మైన జ్ఞాననిష్ఠయే కైవల్యావసాయిని యనఁగాఁ జెప్పుచున్నారు దృష్టేత్యాదిగా. జ్ఞాననిష్ఠకుఁ గర్మసాహిత్యంబును దృష్టాంతముచే సాధించుచు నాశంకించుచున్నాఁడు భోజ నేత్యాదిగా. లౌకిక మగు భోజనక్రియకును వైదిక మగు నగ్నిహోత్రక్రియకును సహానుష్ఠానమువలె నగ్నిహోత్రక్రియకును జ్ఞాననిష్ఠకును సాహిత్య మని యర్థము. భోజనఫలము తృప్తిప్రాప్త మైనను స్వర్గాదికమునందును తద్ధేతు వగు నగ్నిహోత్రాదికమునందును అర్థిత్వము దృష్ట మగుటవలన యుక్తము వానికి సాహిత్యము, అట్లు ముక్తిఫలజ్ఞాననిష్ఠ లభించినపుడు స్వర్గాదికమునందుఁ గాని తద్ధేతు వగు కర్మమునందుఁ గాని యర్థిత్వము సంభవింపదు, అందుచే జ్ఞాననిష్ఠాకర్మములకు సాహిత్యము కా దని పరిహరించుచున్నారు కాదు ఇత్యాదిగా. సంగ్రహవాక్యమును వివరించుచున్నారు కైవ ల్యేత్యాదిగా. జ్ఞానము

ఫలవంతము లబ్ధమైనపుడు ఫలాంతరమునందును తద్ధేతువునందును అర్థిత్వము కలుగదనుటకు దృష్టాంతము చెప్పుచున్నారు సర్వత ఇత్యాదిగా. సర్వత్ర సంప్లుతము — వ్యాప్తము ఉదక మనుటచే సముద్రము చెప్పఁబడుచున్నది, తత్ఫలము స్నానాదికము, అది ప్రాప్త మయినపుడు తటాకాది నిర్మాణక్రియయందును తదధీన మగు స్నానాదికమునందును ఎవ్వనికిని యర్థిత్వ మెట్లు సంభవింపదో అట్లు ప్రకృతమునందును అని యర్థము. నిరతిశయఫలం బగు జ్ఞానము లబ్ధ మయినపుడు సాతిశయఫల మగు కర్మమునం దర్థిత్వము సంభవింప దనుటను దృష్టాంతముచే స్ఫుటీకరించుచున్నారు జ్యేత్యాదిగా. కర్మము సాతిశయఫల మని చెప్పినదానిఁ బట్టి ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. జ్ఞానకర్మములకు సాహిత్యము సంభవింప దనుటను గూడ పూర్వోక్తమును నిగమనము చేయుచున్నారు జ్ఞా నేత్యాదిగా. ప్రకాశతమంబులవలెఁ బరస్పరవిరుద్ధము లగువానికి సాక్షాత్తుగా నొక్కటే ఫలమునందు సాహిత్యము సంభవింపదు గదా యని యర్థము. ఓయీ! జ్ఞానమే మోక్షమును సాధించునది తనకు సహాయముగాఁ గర్మము నపేక్షించుచున్నది, కరణ ముపకరణాపేక్ష మగుటవలన. అనఁగాఁ జెప్పుచున్నారు కైవల్యేత్యాదిగా. జ్ఞానము స్వోత్పత్తియందు యజ్ఞాద్యపేక్ష మైనను ఉత్పన్న మైనపిదప ఫలమునందుఁ బరాపేక్షము కాదు, జ్ఞానోత్పత్తిచే నశ్యంభావి యగుటను ముక్తి జ్ఞానమాత్రాధీన మగుటవలన నని యర్థము. ఇతికర్తవ్య మగుటచే జ్ఞానము కర్మాపేక్ష మని యేది చెప్పఁబడినదో దానికిఁ జెప్పుచున్నారు అవి ద్యేత్యాదిగా. జ్ఞాన మజ్ఞాననివర్తక మగుటవలన దానికిఁ గర్మము విరుద్ధ మగుటచే సహకారి గానోపదు, కావున ఫలమునందుఁ గర్మాపేక్ష లే దని యర్థము. కర్మముఁగూడ జ్ఞానమువలె నజ్ఞాననివర్తక మైనపుడు ఎట్లు విరుద్ధ మగును? అని యాశంకించి చెప్పుచున్నారు తమస్సు ఇత్యాదిగా. కేవలమునకుఁ గాని సముచ్చితమునకుఁ గాని కర్మమునకు మోక్షమునందు సాక్షాదన్వయము లేనపుడు ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

భా. కాదు, నిత్యాకరణంబునఁ బ్రత్యవాయము ప్రాప్తించుటవలనను కైవల్యము నిత్య మగుటవలనను. కేవలజ్ఞానమువలనఁ గైవల్యప్రాప్తి యని యేది చెప్పఁబడినదో అది యసంగతము. ఎందువలన ననఁగా. శ్రుత్యుక్తము లగు నిత్యకర్మములఁ జేయనియెడ నరకాదిప్రాప్తిలక్షణ మగు ప్రత్యవాయం బగును. ఓయీ! అప్పుడు కర్మములవలన మోక్షము లేదు కావున అనిర్మోక్షమే. కా దిది దోషము, మోక్షము నిత్య మగుట

వలన. నిత్యము లగు కర్మముల ననుష్ఠించుటవలనఁ బ్రత్యవాయము ప్రాప్తింపదు. ప్రతిషిద్ధముఁ జేయమివలన ననిష్టశరీరము సంభవింపదు. కామ్యముల వర్జించుటవలన నిష్టశరీరము గూడ ననుపపన్నము. వర్తమానశరీరారంభక మగు కర్మము నను ఫలోపభోగముచే క్షయమై యీశరీరము పతిత మగుటయు దేహాంతరోత్పత్తికిఁ గారణము లేమివలనను రాగాదులను జేయమివలనను ఆత్మకు స్వరూపావస్థానమే కైవల్యము. ఇట్లయత్న సిద్ధము కైవల్యము. అతిక్రాంతానేకజన్మాంతరకృతము స్వర్గనరకాదిప్రాప్తి ఫలం బగు ననారబ్ధకార్యమునకు క్షయము సంభవింప దందువేని, అట్లు కాదు, నిత్యకర్మానుష్ఠానాయాసదుఃఖోపభోగమే తత్ఫలోపభోగం బనుట యుపపన్న మగుటవలన, లేక, ప్రాయశ్చిత్తములవలె నిత్యకర్మములు పూర్వోపాత్తదురితక్షయార్థము లగుటవలన. ఆరబ్ధము లగు కర్మము లుపభోగముచేతనే క్షీణము లగుటవలన అపూర్వము * లగు కర్మముల నారంభింపనియట్ల యయత్నసిద్ధము కైవల్యము.

ఆ. కేవల మగు జ్ఞానము ముక్తిసాధన మని చెప్పఁబడినది, దాని నిషేధించుటకై యాశంకించుచున్నాఁడు కాదు ఇత్యాదిగా. నిషేధ్యము ననువదించి నిషేధముఁ జెప్పుచున్నాఁడు కేవ లేత్యాదిగా. నిత్యాకరణంబునఁ బ్రత్యవాయము ప్రాప్తించుటవలన నని చెప్పిన హేతువును వివరించుచున్నాఁడు ఎందువలన నిత్యాదిగా. జ్ఞానవంతునకును నిత్యానుష్ఠానం బావశ్యక మగుటవలనఁ గేవలజ్ఞానము కైవల్యహేతువు కా దని యర్థము. కైవల్యము నిత్య మగుటవలన నను హేతువునకు వ్యావర్త్యముఁ జూపుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. శ్రౌతము లగు నిత్యనైమిత్తిక కర్మములు చేయనిచోఁ బ్రత్యవాయకరంబు లై యవశ్యానుష్ఠేయము లగునేని అప్పుడు వానివలన సముచ్చితంబులవలనఁ గాని యసముచ్చితంబులవలనఁ గాని మోక్షము కలుగ దని చెప్పఁబడుటవలనఁ గేవలజ్ఞానంబును తద్ధేతువు కామి వలన నిర్హేతుకం బగుటచే ముక్తియే సిద్ధింప దని యర్థము. కైవల్యము ఇత్యాది యగు నాహేతువునే వివరించుచు అనిర్మోక్షప్రసక్తిని నిరాకరించుచున్నాఁడు కా దిది దోషము ఇత్యాదిగా. ముక్తి నిత్య మగుటచే నయత్నసిద్ధము కావున తదభావ శంక వల దని చెప్పినదాని విస్తరించుచున్నాఁడు నిత్యములు ఇత్యాదిగా. కామ్య కర్మవశమువలన ఇష్టశరీరప్రాప్తి శంకించి చెప్పఁబడినది కామ్యముల నిత్యాదిగా.

* నూతనములు.

అప్పు డారబ్ధకర్మవశమువలన దేహాంతర మగు ననఁగా కా దని చెప్పుచున్నాఁడు వర్తమా నేత్యాదిగా. అప్పుడు దేహాంతరము శేషకర్మముచే నగు నని యాశంకించి కర్మాశయం హ్యైకభవికం * బగుటవలనఁ గా దని చెప్పుచున్నాఁడు ఈ శరీరము ఇత్యాదిగా. రాగాదికముచేఁ గర్మాంతరంబును దానిచే దేహాంతరమును గాఁ గల దని యాశంకించి చెప్పుచున్నాఁడు రాగాదుల నిత్యాదిగా. అతీతములును అసంఖ్యాములు నగు జన్మములం దార్జితం బగు కర్మమునకు నానాఫలమునకు అనారబ్ధమునకు భోగముచేతనే కాని క్షయము లేమివలన దానివలన దేహాంతరారంభ మగుటవలన ఐకభవికత్వ మప్రామాణిక మగుటవలన ముక్తి యయత్నసిద్ధము కా దని శంకించుచున్నాఁడు అతిక్రాం తేత్యాదిగా. ఉక్తకర్మమువలన దేహాంతరము శంకింపవల దని చెప్పుచున్నాఁడు అట్లు కా దని. నిత్యనైమిత్తికకర్మములు శ్రుత్యుక్తము లవశ్యమనుష్ఠేయములు, తదనుష్ఠానంబున గొప్ప యాయాసము, దానివలన దుఃఖోపభోగము, అదియే యనారబ్ధకర్మఫలోపభోగం బని యంగీకరించుటవలన దానివలన దేహాంతరము లే దని చెప్పుచున్నాఁడు ని త్యేత్యాదిగా. నిత్యాదికముచే దురితనివృత్తి యైనను విరోధము లేమివలన సుకృతనివృత్తి కాదు, దానివలన దేహాంతర మగు నని యాశంకించి, సుకృతము నిత్యాదికముకంటె అన్యమును అనారబ్ధమును అగునేని న్యాయవిరుద్ధం బగు నాసుకృతం బసిద్ధ మగుటవలన దానిచే దేహాంతరము సంభవింపదు, అది నిత్యాదికముకంటె అనన్య మగునేని దానికి ఫలాంతరము లే దని తలఁచి, ఎట్లు ప్రాయశ్చిత్త ముపాత్త దురితక్షయార్థమే కాని ఫలాంతరాపేక్షము కాదో అట్లే నిత్యాదికర్మము సర్వంబును ఉపాత్తపాపక్షయార్థము, అది దానియందే పర్యవసితం బై దేహాంతరారంభకము కా దని పక్షాంతరముఁ జెప్పుచున్నాఁడు లేక ఇత్యాదిగా. అట్లైనను ప్రారబ్ధవశమువలనని దేహాంతరము శంకింపఁబడు చున్నది నానాజన్మారంభకము లగు ప్రారబ్ధములు గూడ యావదధికారన్యాయముచే సంభవించుటవలన నని యాశంకించి చెప్పుచున్నాఁడు ఆరబ్ధములు ఇత్యాదిగా. పూర్వార్జితకర్మము లిట్లు క్షీణము లైనను కొన్ని యపూర్వకర్మములు దేహాంతరము నారంభించు నని యాశంకించి చెప్పుచున్నాఁడు అపూర్వములు ఇత్యాదిగా.

భా. కాదు, "త మేవ విదిత్వా ఽతి మృత్యు మేతి నాఽన్యః పన్థా విద్యతే ఽయనాయ" అని విద్యకంటె అన్య మగు పథము మోక్షము

* ఒకజన్మమునం దుండునది.

నకు లేదను శ్రుతివలనను, చర్మమువలె నాకాశవేష్టనము సంభవింపని యట్లువిద్వాంసునకు మోక్షము సంభవింప దని ప్రతిపాదించు శ్రుతివలనను. "జ్ఞానాత్కైవల్య మాప్నోతి" అను పురాణస్మృతివలనను, అనారబ్ధఫలంబు లగు పుణ్యకర్మములకు క్షయం బనుపపన్న మగుటవలనను. ఎట్లు పూర్వోపాత్తము లగు దురితము లనారబ్ధఫలములు సంభవించుచున్నవో అట్లు పుణ్యములును అనారబ్ధఫలములు సంభవించుచున్నవి. వానికిని దేహాంతరము పుట్టింపక క్షయం బనుపపన్న మగుటవలన మోక్ష మనుపపన్నము. ధర్మాఽధర్మహేతువు లగు రాగద్వేషమోహముల కాత్మజ్ఞానమువలనం దక్క నుచ్ఛేద మనుపపన్న మగుటవలన ధర్మాధర్మోచ్ఛేదం బనుపపన్నము. నిత్యము లగు కర్మములకును బుష్యాలోకఫలశ్రుతివలనను వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మనిష్ఠా ఇత్యాది స్మృతివలనను గర్మక్షయం బనుపపన్నము. మఱి చెప్పెదరు—నిత్యకర్మములు దుఃఖరూపము లగుటవలనం బూర్వకృత దురితకర్మముల ఫలమే యగుం గాని వానికి స్వరూపవ్యతిరేకంబున వేఱుఫలము లేదు, అశ్రుత మగుటవలనను జీవనాదినిమిత్తంబున విహితము లగుటవలనను—అని. అది కాదు, అప్రవృత్తములకు ఫలదానము సంభవింపమివలన. దుఃఖఫలవిశేషముగూడ ననుపపన్నము. పూర్వజన్మకృతదురితకర్మముల ఫలమే నిత్యకర్మానుష్ఠానాయాసదుఃఖము భుజింపంబడు చున్న దని యేది చెప్పంబడినదో, అది యసంగతము. మరణకాలమునందు ఫలదానముకొఱ కంకురీభవింపని కర్మముయొక్క ఫల మన్యకర్మారబ్ధ మగు జన్మమునం దుపభోగింపంబడు ననుట యుపపన్నము కాదు గదా! అటు కాదేని స్వర్గఫలోపభోగముకొఱ కగ్నిహోత్రాదికర్మారబ్ధ మగు జన్మమునందు నరకకర్మఫలోపభోగంబున కనుపపత్తి లేక పోవును. మఱియు దానికి దురితదుఃఖవిశేషఫలత్వం బనుపపన్నము. అనేకములు దురితములు భిన్నదుఃఖసాధనఫలంబులు సంభవించు చుండఁగా నవి యన్నియు నిత్యకర్మానుష్ఠానాయాసదుఃఖమాత్రఫలంబు లని కల్పించునెడ, ద్వంద్వరోగాదిబాధానిమిత్త మగు దుఃఖ మహేతుక మని గాని పుణ్యహేతుక మని గాని కల్ప్యం బగును. అదియో శక్యము గాదు. నిత్యకర్మానుష్ఠానా

యాసదుఃఖమే పూర్వకృతదురితఫలము గాని శిరస్ఛేదన పాషాణవహ
నము మొదలగువాని దుఃఖము కాదని కల్పింప శక్యము కాదు గదా!

టీ. జ్ఞానము లేక కర్మముచేతనే ముక్తి యనుపక్షమును శ్రుత్యవష్టంభ ముచే నిరాకరించుచున్నారు కాదు ఇత్యాదిగా. త మేవ యను నేవకారార్థమును వివరించుటకై నాన్యః అను భాగమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు అన్యము ఇత్యాదిగా. "యదా చర్మవ దాకాశం వేష్టయిష్యన్తి మానవాః। తదా దేవ మవిజ్ఞాయ దుఃఖ స్యాన్తో భవిష్యతి" అను శ్రుతి నర్థముచే ననువదించుచున్నారు చర్మమువలె నిత్యాదిగా. శ్రుత్యుక్తార్థమునందు స్మృతిసంవాదముఁ జూపుచున్నారు జ్ఞానాత్ ఇత్యాదిగా. మఱియు నీవు చెప్పిన న్యాయము అనుగ్రాహ్య ప్రమాణహీనం బగుట నా భాస మగుటచేఁ బుణ్యకర్మముల కనారబ్ధఫలములకు క్షయము లేనపుడు దేహాంతరా రంభము సంభవించుటవలన జ్ఞానముచేతనే గాని ముక్తి లేదని చెప్పుచున్నారు అనార బ్ధేత్యాదిగా. అట్టి కర్మములు సంభావితములు కావని యాశంకించి చెప్పుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. అనారబ్ధఫలము లగు పుణ్యకర్మము లున్నను మోక్షమున కనుప పత్తి యెట్లనఁగాఁ జెప్పుచున్నారు వానికిని ఇత్యాదిగా. ఇందువలనఁ గూడఁ గర్మ క్షయ మనుపపన్న మగుటచే మోక్ష మనుపపన్న మని చెప్పుచున్నారు ధ ర్మేత్యా దిగా. కర్మణా పితృలోకః అను శ్రుతి నాశ్రయించి కర్మాక్షయమునకు హేత్వంత రముఁ జెప్పుచున్నారు నిత్యములు ఇత్యాదిగా. స్మృతిచేతఁ గూడ నీయర్థమును సమర్థించుచున్నారు వర్ణా ఇత్యాదిగా. "ప్రేత్యకర్మఫల మనుభూయ తతశ్శేషేణ విశిష్ట జాత్యాదిభాజో జన్మ ప్రతిపద్యన్తే" అనునది యాదిపదార్థము. నిత్యా నుష్ఠానాయాసదుఃఖభోగమే తత్ఫలభోగ మని యేది చెప్పఁబడినదో దాని నిప్పు డనువదించుచున్నారు మఱి చెప్పెదరు ఇత్యాదిగా. నిత్యకర్మములు—ఆయాసపర్యంత మనుష్ఠీయమానము లని శేషము. అయినను నిత్యములకుఁ గామ్యములకువలె స్వరూ పాతిరిక్తం బగు ఫలము నాశంకించి విధ్యుద్దేశమునందు ఫల మశ్రుత మగుటవలన నట్లు కాదని చెప్పుచున్నాఁడు వానికి ఇత్యాదిగా. విధ్యుద్దేశమునందు ఫల మశ్రుతం బగుటచేఁ దత్కామనారూప నిమిత్తము లేమివలన నిత్యములకు విధియే సిద్ధింప దని యాశంకించి చెప్పుచున్నాఁడు జీవనా దీత్యాదిగా. నిత్యములకు విధ్యసిద్ధి లే దని శేషము అనువదించినదాని నిరాకరించు చున్నారు అది కాదు ఇత్యాదిగా. దానినే వివరించుచు నిషేధ్యము ననువదించి నిషేధించుచున్నారు పూర్వేత్యా దిగా. అప్రవృత్తములకు ఇత్యాది హేతువును విస్తరించుచున్నారు మర ణేత్యాదిగా.

కర్త్రాంతరారబ్ధ మైన దేహమునందుఁ గూడ దురితఫలము నిత్యానుష్ఠానాయాస దుఃఖ మనుభవింపవచ్చును, ఏమి యనుపపత్తి? అని యాశంకించి చెప్పుచున్నారు అటుకాదేని ఇత్యాదిగా. దుఃఖఫలవిశేషముఁగూడ ననుపపన్నము అని యేది చెప్పఁబడినదో దాని నుపపాదించుచున్నారు మఱియు నిత్యాదిగా. అనంతములు సంచితము లగు దురితములు సంభావితములు, అవియు నానాదుఃఖఫలములు, అవి నిత్యానుష్ఠానాయాసదుఃఖ మేది గలదో తన్మాత్రఫలము లని కల్పించునెడ, అప్పుడు అట్లు కల్పించినను అనుష్ఠితమై యాయాసము కలిగించునట్టి నిత్యకర్మమునకు దురితకృతదుఃఖవిశేషము ఫలము కానేరదు, దురితఫలము లగు దుఃఖము లనేకము లగుటవలన, అందువలన యథావిశేషితం బను నిత్యకర్మము దురితదుఃఖవిశేషఫలకం బనుట యనుపపన్న మని యర్థము. మఱియును దురితములు నిత్యానుష్ఠానాయాసదుఃఖమాత్రఫలము లని కల్పించునెడ నప్పుడు ద్వంద్వశబ్దవాచ్యము లగు రాగాదులబాధయును రోగాదిబాధయును దురితనిమిత్తము లనుట యనుపపన్న మగుటవలన సుకృతకృతము లనుటయు సంభవింపమివలన యాబాధల కుపపత్తియే లేక పోవు నని చెప్పుచున్నారు ద్వంద్వేత్యాదిగా. ఇందువలనఁ గూడ నిత్యానుష్ఠానాయాసదుఃఖమే దురితఫలం బనుట యసంగత మని చెప్పుచున్నారు నిత్యకర్మేత్యాదిగా. అదియే దురితఫలం బగునేని అప్పుడు శిరస్సుచేఁ బాషాణవహనము మొదలగువాని దుఃఖము దురితకృతము కాకపోవును, దానికారణము సుకృతము కాదు, దుఃఖము సుకృతకార్యము కామివలన, కావున నది యాకస్మికం బగు నని యర్థము.

భా. ఇది యప్రకృతము గూడ — నిత్యకర్మానుష్ఠానాయాసదుఃఖము పూర్వకృత దురితకర్మఫలం బగుట. ఎట్లు? అప్రసూతఫలం బగు పూర్వకృతదురితమునకు క్షయం బుపపన్నము కా దని ప్రకృతము. అందుఁ బ్రసూతఫలం బగు కర్మమునకు ఫలము నిత్యకర్మానుష్ఠానాయాసదుఃఖం బని చెప్పుచున్నావు నీవు, అప్రసూతఫలంబున కని కాదు. ఇఁక సర్వంబును బూర్వకృతదురితము ప్రసూతఫలమే యని తలంతువేని అప్పుడు నిత్యకర్మానుష్ఠానాయాసదుఃఖమే ఫల మని విశేషణ మయుక్తము, నిత్యకర్మ విధికానర్థక్యప్రసంగము గూడ, ఉపభోగముచేతనే ప్రసూతఫలమగు దురితకర్మమునకు క్షయం బుపపన్న మగుటవలన. మఱియును: శ్రుతం బగు నిత్యకర్మమునకు దుఃఖము ఫలం బగునేని నిత్యకర్మానుష్ఠానాయాసమువలననే యది కనఁబడుచున్నది వ్యాయామాదులవలనం బోలె,

కావున నది యన్యకర్మమున కని కల్పించుట యనుపపన్నము. జీవనాది నిమిత్తమునసో విధింపఁబడుచున్నవి నిత్యకర్మములు. వానికిఁ బ్రాయశ్చిత్తమునకువలెఁ బూర్వకృతదురితఫలత్వం బనుపపన్నము. పాపకర్మ నిమిత్తంబున సేప్రాయశ్చిత్తము విహితమో ఆపాపమున కేమో యది ఫలము కాదు. ఇఁక నాపాపమునకే నిమిత్తమునకుఁ బ్రాయశ్చిత్త దుఃఖము ఫల మందువేసి జీవనాదినిమిత్త మగు నానిత్యకర్మానుష్ఠానాయాసదుఃఖము గూడ జీవనాదినిమిత్తమునకే ఫలంబు కావలయును, నిత్యప్రాయశ్చిత్తములకు నైమిత్తికత్వము సమాన మగుటవలన.

ఆ॰ నిత్యానుష్ఠానాయాసదుఃఖ ముపాత్తదురితఫలం బనుట యప్రకృతం బగుటవలనఁ గూడ నయుక్త మని చెప్పుచున్నారు ఇది ఇత్యాదిగా. దానినే ప్రపంచించుటకై యడుగుచున్నాఁడు ఎట్లు అని. అందు మొదటఁ బ్రకృతముఁ జెప్పుచున్నారు అప్రసూ తేత్యాదిగా. అయినను మాకెట్లప్రకృతవాదిత్వ మనఁగాఁ జెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. ప్రసూతఫలము అప్రసూతఫల మని ప్రాచీనదురితమునందు విశేషము నంగీకరింపమివలన నవిశేషమున నది సర్వంబును బ్రసూతఫల మగుటవలన నిత్యానుష్ఠానాయాసదుఃఖఫలం బనుట సంభవించుటవలన నప్రకృతవాదిత్వము లే దని శంకించుచున్నాఁడు ఇఁక నిత్యాదిగా. పూర్వోపాత్తదురితం బవిశేషమున నారబ్ధఫలం బగునేని విశేషణం బనర్థక మని పరిహరించుచున్నారు అప్పుడు ఇత్యాదిగా. దురితమాత్రన నారబ్ధఫలం బగుటచే అనారబ్ధఫలం బగుదానికి నిత్యానుష్ఠానాయాసదుఃఖమే ఫలం బనుట యనుపపన్న మగుటవలన నని యర్థము. పూర్వోపాత్తదురిత మారబ్ధఫలం బగునేని భోగముచేతనే తత్క్షయము సంభవించుటవలనఁ దన్నివృత్త్యర్థము నిత్యకర్మమును విధింపవలసినది లే దని దోషాంతరముఁ జెప్పుచున్నారు నిత్యకర్మేత్యాదిగా. ఇందువలనఁగూడ నిత్యానుష్ఠానాయాసదుఃఖము ఉపాత్తదురితఫలము కా దని చెప్పుచున్నారు మఱియును అని. దానినే వెల్లడించుచున్నారు శ్రుతంబు ఇత్యాదిగా. ఎట్లు వ్యాయామగమనాదికృతం బగు దుఃఖ మితరదురితమునకు ఫల మనుట యిష్టము కాదో తత్ఫలం బనుట సంభవించుటవలన అట్లు శ్రుత్యుక్తమును ఆయాసపర్యంత మనుష్ఠితంబు నగు నిత్యమునకును ఫలాంతరము నంగీకరింపమివలన ననుష్ఠాయాసదుఃఖమే ఫల మగునేని అప్పుడు దానివలననే యిది కనఁబడుటవలన దానికి దురితఫలత్వము కల్పింపఁదగదు, నిత్యఫలత్వము సంభవించుటవలన నని యర్థము. నిత్యములు దుఃఖఫలంబు లగునపుడు తదనుష్ఠానమే

శ్రేయం బని యాశంకించి చెప్పుచున్నారు జీవనా దీత్యాదిగా. నిత్యములకు దురితఫలత్వం బనుపపన్న మనుటకు హేత్వంతరముఁ జెప్పుచున్నారు వానికి ఇత్యాదిగా. దృష్టాంతమును వివరించుచున్నారు ఏవా పేత్యాదిగా. అట్లు జీవనాదినిమిత్తమున విహితములకు దురితఫలత్వము సిద్ధింపదని శేషము. సత్యము, ప్రాయశ్చిత్తము నిమిత్త మగు పాపమునకు ఫలము కాదు, మ త్తే మనఁగా తదనుష్ఠానాయాసదుఃఖం బాపాపమునకు ఫల మని శంకించుచున్నాఁడు ఇఁక నాపాపమునకే ఇత్యాదిగా. ప్రాయశ్చిత్తానుష్ఠానాయాసదుఃఖము నిమిత్తభూతపాపఫలం బగునెడ జీవనాదినిమిత్త నిత్యానుష్ఠానాయాసదుఃఖముగూడ జీవనాదికే ఫలం బగును, ఉపాత్తదురితమునకుఁ గా దని పరిహరించుచున్నారు జీవనాదినిమిత్తము ఇత్యాదిగా. ప్రాయశ్చిత్తదుఃఖము తన్నిమిత్తపాపఫలం బగునట్లు జీవనాదినిమిత్తకర్మకృతదుఃఖంబును జీవనాదిఫలం బనుటకు హేతువుఁ జెప్పుచున్నారు ని త్యేత్యాదిగా.

భా. మఱియు నొకటి. నిత్యాగ్నిహోత్రమునకును కామ్యాగ్నిహోత్రమునకును అనుష్ఠానాయాసదుఃఖము తుల్యం బగుటవలన నిత్యానుష్ఠానాయాసదుఃఖమే పూర్వకృతదురితఫలము కాని కామ్యానుష్ఠానాయాసదుఃఖము కా దని విశేషము లేమి కావున నదియును బూర్వకృతదురితఫలం బగును. అట్లయినపుడు నిత్యములకు ఫలం బశ్రుత మగుటవలనను దద్విధానాన్యథానుపపత్తివలనను నిత్యానుష్ఠానాయాసదుఃఖము పూర్వకృతదురితఫలం బని యర్థాపత్తికల్పనం బనుపపన్న మగును. ఇట్లు విధానాన్యథానుపపత్తివలన నిత్యములకు అనుష్ఠానాయాసదుఃఖవ్యతిరిక్తఫలత్వ మనుమానింపఁబడుటవలనఁగూడ. విరోధము వలనఁ గూడ. విరుద్ధం బిది — నిత్యకర్మము ననుష్ఠించునపు డన్యకర్మఫలము భుజింపఁబడు చున్న దని యంగీకరించునపుడు అదియే నిత్యకర్మమునకు ఫలం బనుటయు నిత్యకర్మమునకు ఫలము లే దనుటయు విరుద్ధము.

టీ. ఇందువలనఁగూడ నిత్యానుష్ఠానాయాసదుఃఖమే యుపాత్తదురితఫలం బని చెప్ప నశక్య మని చెప్పుచున్నారు మఱియు నొకటి యని. కామ్యానుష్ఠానాయాసదుఃఖము గూడ దురితఫలం బను ప్రసంగ మిష్ట మని యాశంకించి చెప్పుచున్నారు అట్లయినపుడు ఇత్యాదిగా. విహితములు నిత్యములు, వానికి ఫలము శ్రుతము కాదు, ఫలము లేక విధి సంభవింపదు, అందుచే దురితక్షయార్థములు

నిత్యము లని యర్థాపత్తిచేఁ గల్పింపఁబడుచున్నది, ఆ యర్థాపత్తి యుక్తము కాదు, కామ్యానుష్ఠానమువలనఁ గూడ దురితనివృత్తి సంభవించుటవలన నని యర్థము. మఱియును నిత్యములు అనుష్ఠానాయాసదుఃఖవ్యతిరిక్త మగు ఫలము గలవి, విహితము లగుటవలన, కామ్యములవలె, అను ననుమానమువలన నవి దురితనివృత్త్యర్థములు కావని చెప్పుచున్నారు ఇటు ఇత్యాదిగా. కామ్యాదికర్మమును దృష్టాంతీకరించుటకై ఇట్లు అని చెప్పఁబడినది. స్వవచనవ్యాఘాతమువలనఁ గూడ నిత్యానుష్ఠానమువలన దురితఫలభోగము చెప్పుట యయుక్త మని చెప్పుచున్నారు విరోధమువలనఁ గూడ అని. దానినే ప్రపంచించుచున్నారు విరుద్ధం బది ఇత్యాదిగా. అన్యకర్మఫలము — ఇతర మగు దురితముయొక్క ఫల మనుట. అదియే — దేని యనంతర మేది కలుగుచున్నదో దాని కార్యం బది యను నియమమువలన నని యర్థము.

భా. మఱియును. కామ్యాగ్నిహోత్రాదికము ననుష్ఠించునపుడు నిత్య మగు నగ్నిహోత్రాదికము గూడఁ దంత్రముచేతనే * యనుష్ఠితం బగును గావునఁ దదాయాసదుఃఖముచేతనే కామ్యాగ్నిహోత్రాదిఫల ముపక్షీణం బగుచు, తత్తంత్ర మగుటవలన. ఇఁకఁ గామ్యాగ్నిహోత్రాదిఫలం బన్యమే స్వర్గాదికం బగు నేని తదనుష్ఠానాయాసదుఃఖము గూడ భిన్న మని చెప్పవలయును. అదియో లేదు, దృష్టవిరోధము వలన. కామ్యానుష్ఠానాయాసదుఃఖముకంటెఁ గేవలనిత్యానుష్ఠానాయాసదుఃఖము భిన్నము కాదు గదా! ఇం కొకటి. అవిహితంబును అప్రతిషిద్ధము నగు కర్మము తత్కాలఫలము. శాస్త్రచోదితము గాని ప్రతిషిద్ధము గాని మాత్రము తత్కాలఫలము కాదు. అగు నేని యప్పుడు స్వర్గాదులందును అదృష్టఫలశాసనంబున నుద్యమము సంభవింపదు. అగ్నిహోత్రాదులకే, కర్మస్వరూపము సమాన మైనను అనుష్ఠానాయాసదుఃఖమాత్రమున నుపక్షయము నిత్యములకు, కామ్యములకు స్వర్గాదిమహాఫలత్వము, అంగేతికర్తవ్యతాదులం దాధిక్యము లేకున్నను ఫలకామిత్వమాత్రమున—అని శక్యము కాదు కల్పించుటకు. అందువలన నిత్యము లగు కర్మముల కదృష్టఫలము లే దనుట యెప్పుడును ఉపపన్నము గాదు.

* ఒకటే ప్రయత్నముచేతనే యేకకాలముననే.

టీ. ఇందువలనఁ గూడ నిత్యానుష్ఠానమునందు దురితఫలోపభోగము సిద్ధింప దని చెప్పుచున్నారు మఱియును ఇత్యాదిగా. కామ్యానుష్ఠానమును నిత్యానుష్ఠానంబును ఏకకాలమునందుఁ జేయఁబడుటవలన నిత్యానుష్ఠానాయాసదుఃఖముచే దురితఫలభోగ మగునట్లు కామ్యఫలంబును దానిచేతనే భుక్త మని చెప్పవలయుట వలన నని హేతువుఁ జెప్పుచున్నారు తత్తంత్ర మగుటవలన నని. నిత్యకామ్యానుష్ఠానము లేకకాలికము లైనను నిత్యానుష్ఠానాయాసదుఃఖముకంటె అన్యమే కామ్యానుష్ఠానఫలము, శ్రుత మగుటవలన నని శంకించుచున్నాఁడు ఇఁక నిత్యాదిగా. కామ్యానుష్ఠానఫలము నిత్యానుష్ఠానాయాసదుఃఖముకంటె భిన్న మగునేని అప్పుడు కామ్యానుష్ఠానాయాసదుఃఖమును నిత్యానుష్ఠానాయాసదుఃఖమును బరస్పరభిన్నములు కావలయు నని చెప్పుచున్నారు తదనుష్ఠా నేత్యాదిగా. ప్రసక్తి యిష్ట మని యాశంకించి నిరాకరించుచున్నారు అదియో ఇత్యాదిగా. దృష్టవిరోధమునే స్పష్టీకరించుచున్నారు కా మ్యేత్యాదిగా. ఆత్మజ్ఞానమునకువలె నగ్నిహోత్రాదులకు మోక్షమునందు సాక్షాదన్వయము లే దనుట కితరము గూడ హేతువు కల దని చెప్పుచున్నారు ఇంకొకటి యని. ఆ హేతువునే వివరించుచున్నారు అవిహితంబును ఇత్యాదిగా. మర్దనభోజనాదిక మగు నేకర్మము గలదో అది శాస్త్రముచే విహితము గాని నిషిద్ధము కాని కాదు, అట్టిది యనంతరఫలము ఆట్లనుభవమువలన నని యర్థము. శాస్త్రీయకర్మమో యనంతరఫలము * కాదు, ఆనంతర్యము చోదితము కామివలన, అందువలన దృష్టఫల మగు జ్ఞానమునం దదృష్టఫల మగు కర్మము సహకారి కాఁజాలదు, అట్లు సాక్షాద్దృష్టఫల మగు మోక్షమునందును కర్మమునకుఁ బ్రవృత్తి సంభవింప దని వివక్షించి చెప్పుచున్నారు శాస్త్రేత్యాదిగా. శాస్త్రీయ మగు నగ్నిహోత్రాదికముగూడ ననంతరఫల మని చెప్పునెడ దాని ననుష్ఠించిన వెంబడి స్వర్గాదులు కనఁబడ కుండుట విరుద్ధ మగును, అందువలన నదృష్ట మగు తథావిధఫలము నపేక్షించి యయ్యగ్నిహోత్రాదులందుఁ బ్రవృత్తి లేక పోవు నని చెప్పుచున్నారు అగు నేని ఇత్యాదిగా. మఱియును నిత్యములగు నగ్నిహోత్రాదుల కదృష్టఫలము లేదు, వానికే కామ్యముల కదృష్టఫలము కల దను విభాగము హేతువు లేక సంభవింప దని చెప్పుచున్నారు అగ్నిహోత్రాదులకే ఇత్యాదిగా. నిత్యము లగు నగ్నిహోత్రాదు లేవి గలవో కామ్యము లగు నవి యేవి గలవో తదుభయములకును గర్మస్వరూపమునందు భేదము లే కున్నను

* వెంబడి ఫలము గలది.

నిత్యము లగువాని కనుష్ఠానాయాసదుఃఖమాత్రముచే క్షయము, ఫలాంతరము లేదు, వానికే కామ్యములకు అంగాదుల యాధిక్యము లేకున్నను అధికారికి ఫలకామన యున్న దన్నమాత్రమున స్వర్గాదిమహాఫలం బగు నను నీవిభాగము ప్రమాణవంతము కా దని యర్థము. ఇట్టి విభాగము సంభవించని యప్పుడు ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

భా. అందువలనఁ గూడ అవిద్యాపూర్వకమగు కర్మమునకు శుభమునకుఁ గాని యశుభమునకుఁ గాని యశేషమునకు విద్యయే క్షయకారణము, కాదు నిత్యకర్మానుష్ఠానము. అవిద్యాకామబీజము గదా సర్వకర్మంబును. అట్లుపపాదింపఁబడినది. అవిద్వద్విషయము కర్మము విద్వద్విషయ మోసర్వకర్మసన్న్యాసపూర్వక మగు జ్ఞాననిష్ఠ. ఉభౌ తౌ నవిజానీతః, వేదా ఽవినాశినం నిత్యమ్, జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్, అజ్ఞానాం కర్మసఙ్గినామ్, తత్త్వవిత్తు......గుణాగుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే, సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽఽస్తే, నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్, అర్థమువలన అజ్ఞుఁడు చేయుచున్నా నని తలంచుచున్నాఁడు అని, ఆరురుక్షువునకుం గర్మము కారణము, ఆరూఢునకు యోగస్థునకు శమమే కారణము, ఉదారులు మువ్వురును అజ్ఞులు, జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్, అజ్ఞ లగు కర్ములు గతాగతం కామకామా లభన్తే, అనన్యాశ్చిన్తయన్తో మామ్, యథోక్తనాత్మ నాకాశకల్పు నకల్మషు నన్ను నిత్యయుక్తా ఉపాసతే, దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే, అర్థమువలన కర్ము లగు నజ్ఞులు పొందరు, భగవత్కర్మకారు లెవ్వరు గలరో వారు యుక్తతములైనను కర్ములును అజ్ఞులును ఉత్తరోత్తరహీనము లగు ఫలత్యాగాంతములైన సాధనములు గలవారు, అనిర్దేశ్యాక్షరోపాసకులో అద్వేష్టా సర్వభూతానా మిత్యాదిగా నధ్యాయపరిసమాప్తివఱకుఁ జెప్పఁబడిన సాధనములు గలవారును క్షేత్రాధ్యాయము మొదలగు నధ్యాయత్రయమునందుఁ జెప్పఁబడిన జ్ఞానసాధనములు గలవారును, అధిష్ఠానాది పంచహేతుక సర్వకర్మసన్న్యాసులును ఆత్మైకత్వాకర్తృత్వజ్ఞానవంతులును బరం బగు జ్ఞాననిష్ఠయందు వర్తమానులును భగవత్తత్త్వవిదులును అభ్

భగవత్స్వరూపాత్మైకత్వశరణులును * నగు పరమహంసపరివ్రాజకులకు మాత్రమే యనిష్టాదికర్మఫలత్రయము లేదు, ఇతరుల కజ్ఞులకుఁ గర్మల కసన్న్యాసులకుఁ గలుగనే కలుగును—ఇది గీతాశాస్త్రోక్త మగు కర్తవ్యాకర్తవ్యార్థమునకు విభాగము.

ఆ. కామ్యములకుఁ బోలె నిత్యములకును బిత్రులోకాద్యదృష్టఫలము కల దని యేర్పడినపుడు దురితనివృత్త్యర్థత్వము సంభవింపదు కావున తదర్థము ఆత్మవిద్యయే యని యంగీకరింపవలయు నని చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. శుభాశుభాత్మక మగు కర్మము సర్వంబును అవిద్యాపూర్వక మగునేని అప్పుడు దాని కశేషంబునకు క్షయకారణము విద్య యనుట యుపపన్న మగును, సర్వకర్మ మవిద్యాపూర్వక మనుటయో సిద్ధము కా దని యాశంకించి చెప్పుచున్నారు అవిద్యేత్యాదిగా. అందు కదా యను శబ్దముచేఁ దెలుపఁబడిన యుక్తిని సూచించుచున్నారు అట్లు ఇత్యాదిగా. ఇందువలనఁ గూడ అవిద్యాపూర్వకము కర్మ మని చెప్పుచున్నారు. అవిద్వద్విషయము ఇత్యాదిగా. అధికారిభేదమున నిష్ఠాద్వయం బనుటయందు వాక్యోపక్రమముఁ జూపుచు ఆత్మయందుఁ గర్తృత్వమును గర్మత్వమును ఆరోపించువాఁడు ఆత్మ నెఱుఁగఁ డని చెప్పినట్టి భగవంతునిచేఁ గర్మం బవిద్యామూల మని ప్రదర్శింపఁబడిన దని! చెప్పుచున్నారు ఉభా ఇత్యాదిగా. ఆత్మను యాథాత్మ్యమున నెఱింగినవాఁడు కర్తృత్వాదిరహితుం డగుచున్నాఁ డని చెప్పుటచేఁ గర్మసన్న్యాసమునందు జ్ఞానవంతున కధికార మని సూచింపఁబడిన దని చెప్పుచున్నారు వేదేత్యాదిగా. నిష్ఠాద్వయము నధికారిభేదమున నెఱుంగవలయు ననుటకే వాక్యాంతరము నుదాహరించుచున్నారు జ్ఞానేత్యాదిగా. న బుద్ధిభేదం జనయేత్ అని కర్మం బవిద్యామూలం బని సూచించుటచే నవిద్వాంసులకుఁ గర్మనిష్ఠ యనుమోదింపఁబడినది భగవంతునిచే నని చెప్పుచున్నారు అజ్ఞానా మిత్యాదిగా. విద్వద్విషయము సన్న్యాసపూర్వక మగు జ్ఞాననిష్ఠయని యేది చెప్పఁబడినదో అందు తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయో రిత్యాదివాక్యము నుదాహరించుచున్నారు తత్త్వవిత్తు ఇత్యాదిగా. అందే వాక్యాంతరము పఠించుచున్నారు సర్వేత్యాదిగా. విద్వాంసునకు జ్ఞాననిష్ఠ యనుటకుఁ బంచమాధ్యాయమునందలి వాక్యాంతరముఁ జెప్పుచున్నారు నైవేత్యాదిగా. అందే యర్థసిద్ధ మగు నర్థముఁ జెప్పుచున్నారు అర్థమువలన నిత్యాదిగా. అజ్ఞునకుఁ

* పొందఁబడిన భగవత్స్వరూపముతో ఆత్మైకత్వమే శరణముగాఁ గలవారలును.

చిత్తశుద్ధ్యర్థము కర్మము, శుద్ధచిత్తునకుఁ గర్మసన్న్యాసము జ్ఞానప్రాప్తియందు హేతువు అనుటకు వాక్యాంతరము నర్థముచేఁ జెప్పుచున్నారు ఆరురుక్షుర్వనకు నిత్యాదిగా. యథోక్తవిభాగమునకు సప్తమాధ్యాయవాక్యం బనుగుణ మని చెప్పుచున్నారు ఉదారులు ఇత్యాదిగా. ఏవం త్రయీ ధర్మ మిత్యాది నవమాధ్యాయవాక్యమును అవిద్వద్విషయము కర్మం బనుటకుఁ బ్రమాణముగాఁ జూపుచున్నారు అజ్ఞాః ఇత్యాదిగా. విద్వాంసునకు సన్న్యాసపూర్వక మగు జ్ఞాననిష్ఠ యనుటకే నవమాధ్యాయమందలి వాక్యాంతరముఁ జెప్పుచున్నారు అనన్యా ఇత్యాదిగా. అందు మామ్ అను పదమునకు వ్యాఖ్యానముఁ జేయుచున్నారు యథోక్తు నిత్యాదిగా. తేషాం సతతయుక్తానా మిత్యాది దశమాధ్యాయవాక్యమును అందే ప్రమాణముగాఁ జూపుచున్నారు దదా మీత్యాదిగా. విద్యావంతులకే భగవత్ప్రాప్తిని నిర్దేశించుటవలన నితరులకుఁ దత్ప్రాప్తి లే దని సూచితం బని యర్థసిద్ధ మగు నర్థముఁ జెప్పుచున్నారు అర్థమువలన నిత్యాదిగా. ఓయీ! భగవత్కర్మకారులు యుక్తతము లగుటవలనఁ గర్ములు గూడ భగవంతునిఁ బ్రాపింతు రని యాశంకించి చెప్పుచున్నారు భగవత్కర్మకారులు ఇత్యాదిగా. ఎవరు మత్కర్మకృ దిత్యాదిన్యాయమున భగవత్కర్మకారులో వారు యుక్తతము లైనను గూడ కర్ములును అజ్ఞులును గావున భగవంతుని శీఘ్రమునఁ బొందఁజాల రని యర్థము. వార లజ్ఞు లనుటకు గమకముఁ జూపుచున్నారు ఉత్త రేత్యాదిగా. చిత్తసమాధానము నారంభించి ఫలత్యాగపర్యంతము పాఠక్రమంబున నుత్తరోత్తరము హీనము లగుసాధనముల గ్రహించుటవలన అభ్యాసమునం దసమర్థునకు భగవత్కర్మకారిత్వముఁ జెప్పుటవలన భగవత్కర్మకారు లజ్ఞాను లని విదిత మగుచున్న దని యర్థము. యే త్వక్షర మనిర్దేశ్య మిత్యాదివాక్యము నవలంబించి సన్న్యాసపూర్వక జ్ఞాననిష్ఠ విద్వద్విషయం బని నిర్ధారించు చున్నారు అనిర్దే శ్యేత్యాదిగా. అందుచే వారు సన్న్యాసపూర్వకజ్ఞాననిష్ఠయం దధికృతులు కావలయు నని శేషము. మఱియును త్రయోదశమునం దమానిత్వాదులును చతుర్దశమునందు ప్రకాశంచ ప్రవృత్తిం చేత్యాదులును పంచదశమునం దసంగత్వాదులును ఏవి చెప్పఁబడినవో ఆ సర్వసాధనములతోను గూడినవారు అనిర్దేశ్యాక్షరోపాసకులు. ఇందువలనఁ గూడ వారు జ్ఞాననిష్ఠయందే యధికృతులు కావలయు నని చెప్పుచున్నారు క్షే త్రేత్యాదిగా. నిష్ఠాద్వయము నధికారిభేదంబునఁ బ్రతిష్ఠాపించి జ్ఞాననిష్ఠులకు అనిష్టము ఇష్టము మిశ్రము అని త్రివిధ మైన కర్మఫలము లేదు, మఱే మనఁగా ముక్తియే, కర్మనిష్ఠులకో త్రివిధకర్మఫలము కలదు ముక్తి లే దని శాస్త్రార్థవిభాగమును వివక్షితము నుపసంహరించుచున్నారు అధిష్ఠానా దీత్యాదిగా.

భా. సర్వకర్మమునకును అవిద్యాపూర్వకత్వం బసిద్ధ మని యందు వేని; కాదు, బ్రహ్మహత్యాదివలె. శాస్త్రావగతమే యగును నిత్య మయిన కర్మము, అయినను అవిద్యావంతునికే యగుచున్నది. ఎట్లు ప్రతిషేధ శాస్త్రావగత మైనను బ్రహ్మహత్యాదిరూప మగు కర్మ మనర్థకారణము అవిద్యాకామాదిదోషవంతునకే యగు చున్నదో, కాదేని ప్రవృత్తి యనుపపన్న మగుటవలన, అట్లు నిత్యనైమిత్తికకామ్యములును. దేహాది వ్యతిరిక్తుం డాత్మ యని తెలియునియెడ నిత్యాదికర్మములయందుఁ బ్రవృత్తి యనుపపన్న మని యందు వేని, కాదు, చలనాత్మక మగు కర్మమునం దనాత్మకర్తృకమునందు నేను జేయు చున్నా నని ప్రవృత్తి కనఁబడుట వలన.

ఆ. అవిద్యాకామబీజము సర్వకర్మ మని యేది చెప్పఁబడినదో అది కాదు, శాస్త్రావగత మగు కర్మమున కవిద్యాపూర్వకత్వం బనుపపన్న మగుటవలన నని యాక్షేపించుచున్నాఁడు సర్వేత్యాదిగా. దృష్టాంతముచే సమాధానము చెప్పు చున్నారు కాదు ఇత్యాదిగా. అం దభిమత మైన ప్రతిజ్ఞను విభజించుచున్నారు శాస్త్రావగతమే ఇత్యాదిగా. చెప్పిన దృష్టాంతమును వివరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. అవిద్యాదిమంతునకే బ్రహ్మహత్యాదికర్మ మనుటకు హేతువుఁ జెప్పుచున్నారు కాదేని ఇత్యాదిగా. దార్ష్టాంతికమును గ్రహించుచున్నారు అట్లు ఇత్యాదిగా. అవి యును అవిద్యాదిమంతునకే యగుచున్నవి కావున వానికిని అవిద్యాదిపూర్వకత్వము నంగీకరింపవలయు నని యర్థము. పారలౌకికకర్మములందు దేహాద్యతిరిక్తాత్మజ్ఞాన మున్ననే కాని ప్రవృత్తి సంభవింపమివలన వాని కవిద్యాపూర్వకత్వము లే దని శంకించు చున్నాఁడు దేహా దీత్యాదిగా. వ్యతిరిక్తాత్మజ్ఞానం బున్నను పారమార్థికాత్మజ్ఞానము లేమివలన మిథ్యాజ్ఞానమువలననే నిత్యాదికర్మములందుఁ బ్రవృత్తి కలుగుటవలన వాని కవిద్యాపూర్వకత్వం బప్రతిహత మని పరిహరించుచున్నారు కాదు ఇత్యాదిగా. కర్మము చలనాత్మక మగుటవలన ఆత్మకర్తృకము కాదు, ఆత్మ నిష్క్రియుం డగుట వలన, దేహాదిసంఘాతమో సక్రియ మగుటవలనఁ దత్కర్తృకము కర్మ మనుట యుక్తము, అయినను సంఘాతమునం దహమభిమానద్వారమున నేను జేయు చున్నా నని కర్మమం దాత్మకు మిథ్యాజ్ఞానపూర్వక మైన ప్రవృత్తి దృష్టము, అందుచే దాని కవిద్యాపూర్వకత్వము యుక్త మని యర్థము.

భా. దేహాదిసంఘాతమునం దహంప్రత్యయము గౌణము మిథ్య కాదు. అంతు వేరి కాదు, తత్కార్యములందును గౌణత్వము సంభవించుటవలన. ఆత్మీయ మగు దేహాదిసంఘాతమునం దహంప్రత్యయము గౌణము, ఎట్లు ఆత్మీయుం డగు పుత్త్రునియందు "ఆత్మా వై పుత్త్రనామాసి" యని శ్రుతి యగుచున్నదో, లోకమునందును నాప్రాణమే యీగోవు అని చెప్పంబడునో, అట్లు. ఇది మిథ్యాప్రత్యయము కానేకాదు. మిథ్యాప్రత్యయమో అగృహ్యమాణవిశేషము లగు * స్థాణుపురుషులయందు.

ఆ. దేహాదిసంఘాతమునం దహ మభిమానము మిథ్యాజ్ఞాన మని యేది చెప్పంబడినదో దాని నాక్షేపించుచున్నాఁడు దేహా దీత్యాదిగా. అహంబుద్ధి గౌణ మగు నెడఁ దత్పూర్వకము లగు కర్మములును గౌణములే యని యేర్పడుటచే ఆత్మకనర్థము లేమివలనఁ దన్నివృత్తికొఱకు సాధనాన్వేషణము సంభవింప దని నిరాకరించుచున్నారు కాదు ఇత్యాదిగా. దీనిని ప్రపంచించుటకై మొదట నాక్షేపమును ప్రపంచించుచున్నారు ఆత్మీయము ఇత్యాదిగా. అందు శ్రుత్యవష్టంభముచే దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు ఎట్లు ఇత్యాదిగా. దర్శితశ్రుతివలన నాత్మీయుఁ డగు పుత్త్రునియం దహంప్రత్యయం బెట్లు గౌణమో అట్లాత్మీయమగు సంఘాతమునందును అహంప్రత్యయము గౌణ మనుట యుక్త మని యర్థము. గౌణబుద్ధికి భేదబుద్ధిపూర్వకత లోకమునందుఁ బ్రసిద్ధ మని చెప్పుచున్నాఁడు లోకమునందును ఇత్యాదిగా. లోకవేదానుసారంబున నాత్మీయసంఘాతమునం దహంబుద్ధియు గౌణమే యగు నని దార్ష్టాంతికముఁ జెప్పుచున్నాఁడు అట్లు అని. మిథ్యాబుద్ధికిని భేదబుద్ధిపూర్వకత్వము సంభవించుటవలన ఆత్మీయ మగు సంఘాతమునం దహంబుద్ధికి మిథ్యాత్వమే యేల కారా దని యాశంకించి చెప్పుచున్నాఁడు ఇది ఇత్యాదిగా. భేదబుద్ధిపూర్వకము కానప్పుడు ఎట్లు మిథ్యాబుద్ధి పుట్టుచున్న దని యాశంకించి చెప్పుచున్నాఁడు మిథ్యేత్యాదిగా. అధిష్ఠానారోప్యములందు వివేకగ్రహణము లేనప్పు డది పుట్టుచున్న దని యర్థము.

భా. కాదు గౌణప్రత్యయము ముఖ్యకార్యార్థము, లుప్తోపమాశబ్దముచే నధికరణస్తుత్యర్థ మగుటవలన. ఎట్లనఁగా. సింహము దేవదత్తుఁడు అగ్ని మాణవకుఁడు అనువాక్యములు సింహమువంటివాఁడు అగ్నివంటి

* విశేషగ్రహణము లేనట్టి.

వాఁడు క్రౌర్యపైంగల్యాదిసామాన్యము కలుగుటవలన నని క్రౌర్యపైంగల్యాద్యధికరణము లైన దేవదత్తమాణవకుల స్తుత్యర్థమే యగుచున్నవి, కాని సింహకార్యము గాని యగ్నికార్యము గాని గౌణశబ్దప్రత్యయనిమిత్తవాక్యములచే నేదియు సాధింపఁబడదు. మిథ్యాప్రత్యయకార్యమునో అనర్థము ననుభవించుచున్నాఁడు. గౌణప్రత్యయవిషయభూతుని నెఱుంగుచున్నాఁడు సింహము కాఁడీ దేవదత్తుఁడు అగ్ని కాఁడీమాణవకుఁ డని. మఱియును గౌణ మగు దేహాదిసంఘాతాత్మచేఁ జేయఁబడిన కార్యము ముఖ్యుఁ డగు నహంప్రత్యయవిషయ మైన యాత్మచేఁ జేయఁబడినది కాక పోవలయును. గౌణసింహాగ్నులచేఁ జేయఁబడినకార్యము ముఖ్యసింహాగ్నులచేఁ జేయఁబడినది కాఁజాలదు కదా! ఆ క్రౌర్యముచేఁ గాని పైంగల్యముచేఁ గాని ముఖ్యసింహాగ్నుల కార్యమేదియుఁ జేయఁబడదు, స్తుత్యర్థతచే నుపక్షీణము లగుటవలన. స్తుతింపఁబడువారును ఎఱుంగుచున్నారు నేను సింహము కాను నే నగ్ని కా నని, సింహకర్మము నాది కాదు అగ్నికర్మము నాది కా దని. అట్లు సంఘాతకర్మము ముఖ్యాత్మకు నాది కా దను ప్రత్యయము యుక్తతరము కావలయును, కాని నేను కర్తను నాది కర్మము అను ప్రత్యయము కలుగక పోవలయును.

అ. దేహాదికమునం దహంబుద్ధి గౌణం బని యాక్షేపమును వివరించి తత్కార్యములందును ఇత్యాదిపరిహారమును వివరించుచున్నారు కాదు ఇత్యాదిగా. హేతుభాగమును విభజించుచున్నారు ఎట్లనఁగా ఇత్యాదిగా. సింహము దేవదత్తుఁ డను వాక్యము దేవదత్తుఁడు సింహమువంటివాఁ డను నుపమచే క్రౌర్యమున కధికరణ మైన దేవదత్తుని స్తుతించుటకుఁ బ్రవృత్తము. అగ్ని మాణవకుఁ డను వాక్యము కూడ మాణవకుఁ డగ్నివంటివాఁ డను నుపమచేఁ బింగలవర్ణమున కధికరణ మైన మాణవకుని స్తుతించుటకే. అట్లు మనుష్యుఁడ నే నను వాక్యము స్తుత్యర్థము కా దని యర్థము. దేవదత్తమాణవకుల కధికరణత్వం బెట్లని యాశంకించి చెప్పుచున్నారు క్రౌర్యేత్యాదిగా. మఱియు గౌణశబ్దమును దత్ప్రత్యయంబును నిమిత్తముగాఁ గొని సింహకార్య మేదియు సాధింపఁబడదు, మాణవకునందును అగ్నికార్య మేదియు సాధింపఁబడదు, మిథ్యాబుద్ధికార్యమునో అనర్థము నాత్మ యనుభవించుచున్నాఁడు,

కావున దేహాదికమునం దహంబుద్ధి గౌణము కా దని చెప్పుచున్నారు కాని సింహేత్యాదిగా. ఇందువలనఁ గూడ దేహాదికమునం దహంప్రత్యయము గౌణము కా దని చెప్పుచున్నారు గౌణప్రత్య యేత్యాదిగా. దేవదత్తుఁడు గాని మాణవకుఁడు గాని గౌణప్రత్యయమున కెవ్వఁడు విషయమో అతని నితరుఁడు ఇతఁడు సింహముఁ గాఁ డితం డగ్ని కాఁ డని యెఱుంగుచున్నాఁడు, ఇట్లవిద్వాంసుఁ డాత్మకును సంఘాతమునకును భేద మున్నను సంఘాతం బనాత్మ యని యెఱుంగఁడు. కావున సంఘాతమునం దహంశబ్ద ప్రత్యయములు గౌణములు కా వని యర్థము. సంఘాతమునం దవి గౌణము లనుటయందు దోషాంతరముఁ జెప్పుచున్నారు మఱియును ఇత్యాదిగా. అట్లయినయెడ ఆత్మయందుఁ గర్తృత్వాదిప్రతిభాసమే సిద్ధింప దని శేషము. గౌణముచేఁ జేయఁబడినది ముఖ్యముచేఁ జేయఁబడినది కా దనుట నుదాహరణముచే స్ఫుటీకరించుచున్నారు గౌణసింహేత్యాదిగా. దేవదత్తమాణవకులచేఁ జేయఁబడిన కార్యము ముఖ్యసింహాగ్నులచేఁ జేయఁబడినది కాదు సరే యయినను దేవదత్తునియందలి క్రౌర్యముచే ముఖ్యసింహకార్యమును మాణవకునందలి పైంగల్యముచే ముఖ్యాగ్నికార్యమునుం బోలె సంఘాతగతముచే నైనను జడత్వముచేత ముఖ్యుఁ డగు నాత్మకార్య మేదేని కాఁగల దని యాశంకించి చెప్పుచున్నారు ఆక్రౌర్యముచే నిత్యాదిగా. దేహాదికమునం దహంబుద్ధి గౌణము కా దనుటకు హేత్వంతరముఁ జెప్పుచున్నారు స్తుతింపఁబడువారును ఇత్యాదిగా. దేవదత్తమాణవకులకు సింహాగ్నులకంటె భేదబుద్ధిపూర్వకముగా తద్వ్యాపారము తమది కా దను బుద్ధివలె ముఖ్యుఁ డగు నాత్మకును సంఘాతముకంటె భేదబుద్ధిద్వారమునఁ దదీయవ్యాపారము లేమి తనయందు దృష్టము కావలయు నని యర్థము. వ్యావర్త్యమును జూపుచున్నారు కాని ఇత్యాదిగా.

భా. మఱియుఁ జెప్పెదరు.—ఆత్మీయము లగు స్మృతీచ్ఛాప్రయత్నములచేఁ గర్మహేతువులచేత నాత్మ చేయుచున్నాఁ డని. అదియుఁ గాదు, అవి మిథ్యాప్రత్యయపూర్వకము లగుటవలన. మిథ్యాప్రత్యయ నిమిత్తేష్టానిష్టానుభూతక్రియాఫలజనిత సంస్కార పూర్వకములు గదా స్మృతీచ్ఛాప్రయత్నాదులు. ఎట్లీ జన్మమునందు దేహాదిసంఘాతాభిమాన రాగద్వేషాదికృతంబులగు ధర్మాధర్మములును తత్ఫలానుభవమును గలుగుచున్నవో అట్లతీతంబును అతీతతరము నగు జన్మమునందును అనాదియవిద్యాకృతం బగు సంసారము అతీతంబును అనాగతంబును అనుమే

యము. అందువలనను సర్వకర్మసన్న్యాసమువలన జ్ఞాననిష్ఠయం దాత్యంతికం బగు సంసారోపరమం బని సిద్ధము. దేహాభిమాన మవిద్యాత్మకమగుటవలనం గూడ నది నివృత్తమైనపుడు దేహ మనుపపన్న మగుటవలన సంసారం బనుపపన్నము. దేహాదిసంఘాతమునం దాత్మాభిమాన మవిద్యాత్మకము. లోకమునందు గవాదులకంటె నన్యుఁడను నేను నాకంటె నన్యములు గవాదు లని యెఱింగినవాఁ డెవ్వఁడును వానియందు నేను అను ప్రత్యయమును జేయఁడు గదా! ఎఱుంగనివాఁడో స్థాణువునందుఁ బురుషజ్ఞానమునువలె నవివేకంబున దేహాదిసంఘాతమునందు నేనను ప్రత్యయముఁ జేయుచున్నాఁడు, వివేకంబున నెఱుంగువాఁడు చేయఁడు. ఆత్మా వై పుత్త్రనామాసి యని పుత్త్రునియం దహంప్రత్యయ మేది గలదో అదిమాత్రము జన్యజనకసంబంధనిమిత్తము గౌణము. గౌణాత్మచేతనో భోజనాదికమువలెఁ బరమార్థకార్యము చేయ శక్యము కాదు, గౌణసింహాగ్నులచే ముఖ్యసింహాగ్నికార్యమువలె.

టీ. సంఘాతమునం దహంప్రత్యయము మిథ్యాజ్ఞాన మైనను తత్కృతముగా దాత్మయందుఁ గర్తృత్వము, మత్తే మనఁగా, ఆత్మీయము లగు జ్ఞానేచ్ఛాప్రయత్నములచే నాత్మకుఁ గర్తృత్వము వాస్తవం బను మతము ననువదించుచున్నారు మఱియు నిత్యాదిగా. జ్ఞానాదికృత మగు కర్తృత్వము గూడ మిథ్యాజ్ఞానకృతమే, జ్ఞానాదులు మిథ్యాజ్ఞానకార్యము లగుటవలన నని నిరాకరించుచున్నారు అదియుఁ గాదు ఇత్యాదిగా. దానినే వివరించుచున్నారు మిథ్యేత్యాదిగా. మిథ్యాజ్ఞానం బను నిమిత్తముచే నొకటి యిష్ట మనియు నొకటి యనిష్ట మనియు నారోపించి తద్ద్వారంబున ననుభూత మైనదానియందు ప్రేప్సాజిహాసలచే * క్రియను నెఱవేర్చి దానిచే నిష్టమును అనిష్టమును ఫలము భుజించుటవలన దానిచేఁ గలిగిన సంస్కారముచే తత్పూర్వకములు స్మృత్యాదులు స్వాత్మయందుఁ గ్రియను జేయుచున్నవి కావున యుక్తము కర్తృత్వమునకు మిథ్యాత్వం బని యర్థము. అతీతానాగతజన్మములయందువలె వర్తమానజన్మమునందును కర్తృత్వాదిసంసారము వాస్తవం బని యాశంకించి చెప్పుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. విమతము లగు కాలములు ◆ అవిద్యాకృతసంసారవిశిష్టములు, కాల మగుటవలన, వర్తమానకాలమువలె నని

* ఇష్టమును బొందఁ గోరికచే-ప్రేప్సచే అనిష్టమును విడువఁగోరికచే-జిహాసచే.

◆ అతీతానాగతములు.

యర్థము. సంసారం బవిద్యాకృత మైనపుడు ఫలితము జెప్పుచున్నారు అందువల నను ఇత్యాదిగా. అది యావిద్యక మగుటచే విద్యచే నశించు ననుటకు హేత్వం తరము జెప్పుచున్నారు దేహాభిమానము ఇత్యాదిగా. ఎట్లని యవిద్యాకృతం బగును, ధర్మాధర్మకృతం బని యేర్పడుచుండగా నని యాశంకించి చెప్పుచున్నారు దేహా దీత్యాదిగా. ఆత్మకు ధర్మాదికర్తృత్వ మావిద్యక మగుటవలన అవిద్యచేతనే గాని కర్తలకు దేహాభిమానము సంభవింపదు, అందువలన గూడ ఆత్మకు సంఘాత మునం దహమభిమాన ముండుట యావిద్యక మని యర్థము. ఆత్మకు దేహాద్యభి మాన మావిద్యక మనుట నన్వయవ్యతిరేకములచే సాధించుటకై వ్యతిరేకమును జూపుచున్నారు లోకమునందు ఇత్యాదిగా. అన్వయము జూపుచు వ్యతిరేకము ననువదించుచున్నారు ఎఱుంగనివాఁడో ఇత్యాదిగా. పుత్త్రునియందు దండ్రి కహం బుద్ధివలె నాత్మీయ మగు దేహాదికమునం దహంబుద్ధి గౌణ మని చెప్పినదాని ననువ దించుచున్నారు ఆత్మా నై ఇత్యాదిగా. అందు దృష్టాంతశ్రుతి గౌణాత్మవిషయం బని చెప్పినదాని నంగీకరించుచున్నారు అది మాత్రము ఇత్యాదిగా. అప్పుడు స్వకీయ మగు దేహాదికమునందును అట్లే యహంబుద్ధి గౌణం బగు నని యాశంకించి చెప్పుచున్నారు గౌ ణేత్యాదిగా. స్వకీయపుత్త్రాదిగౌణాత్మచే బితృభోజనాది కార్యము చేయఁబడదు గదా, అట్లు దేహాదికంబును గౌణాత్మ యగునేని దానిచే కర్తృత్వాదికార్య మాత్మకు వాస్తవము సిద్ధింప దనుటకు దృష్టాంతము జెప్పుచున్నారు గౌణసిం హేత్యాదిగా. గౌణసింహ మగు దేవదత్తునిచే ముఖ్య సింహకార్యము చేయఁబడదు గదా, గౌణాగ్ని యగు మాణవకునిచేతఁ గూడ ముఖ్యాగ్నికార్యము దాహపాకాదికము చేయఁబడదు గదా, అట్లు గౌణాత్మ యగు దేహాదికముచే ముఖ్యాత్మకార్యము వాస్తవం బగు కర్తృత్వాదికము చేయ శక్యము కా దని యర్థము.

భా. అదృష్టవిషయవిధిప్రామాణ్యమువలన నాత్మకర్తవ్య మగునది గౌణము లగు దేహేంద్రియాత్మలచే జేయఁబడుచున్నది. కాదు, అవి యవిద్యాకృతాత్మ లగుటవలన. దేహేంద్రియాదులు గౌణాత్మలు కావు. ఎట్లు మఱి? మిథ్యాప్రత్యయముచేతనే యసంగుఁ డగు నాత్మకు సంబం ధము కలిగించి యాత్మత్వ మాపాదింపఁబడు చున్నది *, అది యున్నపు

* మిథ్యాప్రత్యయముచేతనే యనాత్మ లగువాని కాత్మత్వ మాపాదింపఁబడుచున్నది. అని పాఠాంతరము.

డునికివలనను అది లేనపుడు లేమివలనను. అవివేకులకు బాలురకజ్ఞాన కాలమునందుఁ గదా నేను దీర్ఘుఁడను నేను గౌరుఁడను అని దేహాది సంఘాతమునం దహంప్రత్యయము కలుగుచున్నది. వివేకులకో దేహాది సంఘాతముకంటె నన్యుఁడ నే నను జ్ఞానము గలవారికిఁ దత్కాలమున దేహాదిసంఘాతమునం దహంప్రత్యయము కలుగదు. అందువలన మిథ్యాప్రత్యయము లేనపుడు లేమివలనఁ దత్కృతంబే యది, గౌణము కాదు. పృథగ్గృహ్యమాణవిశేషసామాన్యుల యందుఁ ◆ గదా సింహదేవదత్తుల యందుఁ గాని యగ్నిమాణవకులయందుఁ గాని గౌణ మగు ప్రత్యయమును శబ్దప్రయోగమును సంభవించును; అగృహ్యమాణసామాన్యవిశేషములకు సంభవింపదు శుక్తిరజతములకుం బోలె. ఏది మఱి చెప్పఁబడినదో శ్రుతిప్రామాణ్యమువలన నని, అది కాదు, తత్ప్రామాణ్యం బదృష్టవిషయ మగుటవలన. ప్రత్యక్షాదిప్రమాణములచే ననుపలబ్ధ మైన విషయమందుఁ గదా యగ్నిహోత్రాదిసాధ్యసాధనసంబంధమునందు శ్రుతికిఁ బ్రామాణ్యము, ప్రత్యక్షాదివిషయమునందుఁ గాదు, ప్రామాణ్యం బదృష్టదర్శనార్థ మగుటవలన. అందువలన దృష్టమిథ్యాజ్ఞాననిమిత్త మగు నహంప్రత్యయమునకు దేహాదిసంఘాతమునందు గౌణత్వము కల్పింప శక్యము కాదు. శ్రుతిశత మైనను శీతం బగ్ని యప్రకాశ మని చెప్పునేని ప్రామాణ్యము నొందదు గదా! శీతం బగ్ని యప్రకాశ మని చెప్పునేని, చెప్పినను శ్రుతి కర్థాంతరము వివక్షితం బని కల్పింపవలయును, ప్రామాణ్యాన్యథానుపపత్తివలన *, మఱి ప్రమాణాంతరవిరుద్ధము కాని స్వవచనవిరుద్ధము గాని కల్పింపఁ దగదు.

అ. స్వర్గకామాదివాక్యప్రామాణ్యమువలన ఆత్మ దేహాద్యతిరిక్తుఁ డను జ్ఞానమువలన అతఁడు కేవలుం డకర్త యగుటవలనఁ దత్కర్తవ్యం బగు కర్మము గౌణములే యగు దేహాద్యాత్మలచే నెఱవేర్పఁబడు చున్నది, శ్రుతివలన ఆత్మ దేహాద్యతిరిక్తుఁ డను జ్ఞాన ముండఁగానే యాత్మకు దేహాదికమునందు ముఖ్య మగు నాత్మత్వము యుక్తము కాదు గదా యని యాక్షేపించుచున్నాఁడు అదృష్టేత్యాదిగా.

---

◆ భేదమునఁ దెలియఁబడు చున్న విశేషంబును సామాన్యమును గలవారియందు—ఎవరి భేదమును సామ్యమును స్పష్టముగాఁ దెలియు చున్నదో అట్టివారియం దనుట.

* కాదేని ప్రామాణ్య మనుపపన్న మగుటవలన.

దేహాదుల కాత్మత్వము గౌణము కాదు, కానియాత్మత్వ మావిద్యక మగుటచే ముఖ్యం బగుటవలన, అందువలన గౌణాత్మలచే నాత్మకర్తవ్యం బగు కర్మము చేయఁబడదు, మ త్తే మనఁగా మిథ్యాత్మలచేఁ జేయఁబడు చున్నది యని పరిహరించుచున్నారు కాదు ఇత్యాదిగా. దాని వివరించుటకై కాదు అనుదాని యర్థమును స్ఫుటీకరించు చున్నారు దే హేత్యాదిగా. ఎట్లు మఱి దేహాదులయం దాత్మత్వ ప్రసిద్ధి? అని యాశంకించి యవిద్యాకృతాత్మ లని చెప్పిన హేతువును విభజించు చున్నారు ఎట్లు మఱి యిత్యాదిగా. దేహాదుల కనాత్మ లయినవానికే యాత్మత్వము మిథ్యాప్రత్యయం బనుటయం దన్వయవ్యతిరేకముల నుదాహరించుచున్నారు అది యున్నపుడు ఇత్యాదిగా. ఈ యన్వయమునందు శాస్త్రీయసంస్కారశూన్యు లగువారి యనుభవమును ప్రమాణముగాఁ జూపుచున్నారు అవివేకులకు ఇత్యాదిగా. వ్యతిరేకము నందును శాస్త్రాభిజ్ఞుల యనుభవమును జూపుచున్నారు వివేకులకో ఇత్యాదిగా. అనుభవానుసారు లగు నన్వయవ్యతిరేకములవలన సిద్ధ మగు నర్థము నుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా. తత్కృతంబే యది—దేహాదికమునం దాత్మప్రత్యయ మని యర్థము. మఱియును భేదజ్ఞానము గౌణత్వవ్యాపక మగుటవలన * అది ప్రకృతమునందు లేమివలన దేహాదికమునం దహంశబ్దప్రత్యయములు గౌణములు కావని చెప్పుచున్నారు పృథ గిత్యాదిగా. అదృష్టవిషయ విధిప్రామాణ్యమువలనఁ గర్త యగు నాత్మకు దేహాదివ్యతిరిక్తత నిశ్చితం బగుటవలన వానికి దేహాదులయం దహమభిమానము గౌణ మనుట యుక్త మని చెప్పినదాని ననువదించు చున్నారు ఏది మఱి యిత్యాదిగా. శ్రుతిప్రామాణ్య మజ్ఞాతార్థవిషయం బగుటవలనఁ బ్రమాణాంతరసిద్ధ మగు వ్యతిరిక్తాత్మయందు విధికిఁ బ్రామాణ్యము లేమివలన తదవష్టంభముచే దేహాదులయం దాత్మాభిమానము గౌణ మనం దగ దని యుత్తరము చెప్పుచున్నారు అది కాదు ఇత్యాదిగా. శ్రుతిప్రామాణ్య మదృష్టవిషయం బనుటను స్పష్టీకరించుచున్నారు ప్రత్యక్షా దిత్యాదిగా. అజ్ఞాతార్థజ్ఞాపకము ప్రమాణం బని సిద్ధాంత మగుటవలన జ్ఞాతార్థమునందు శ్రుతికిఁ బ్రామాణ్యము లే దని చెప్పుచున్నారు ప్రామాణ్యంబు ఇత్యాదిగా. అజ్ఞాతసాధ్యసాధనసంబంధబోధకం బగు శాస్త్రము వ్యతిరిక్తాత్మయం దుదాసీనం బని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. అన్వయవ్యతిరేకములవలన దృష్టము మిథ్యాజ్ఞాననిమిత్త మగు దేహాదులయందలి యహంప్రత్యయము, దానికంటె

---

* భేదజ్ఞాన మున్ననే కాని గౌణత్వవ్యవహారము సిద్ధింపమివలన నని యర్థము.

విధి యన్యవిషయ మగుటవలన నతిరిక్తాత్మవిషయము కా దని చెప్పఁబడినది, ఇపుడు తద్విషయమే యంగీకరించినను అది నిర్వహింప శక్యము గాదు ప్రత్యక్షవిరోధము వలన నని చెప్పుచున్నారు శ్రుతిశతము ఇత్యాదిగా. అపౌరుషేయము అసంభావిత దోష మగు శ్రుతికిఁ బ్రమాణాంతరవిరోధ మున్నను ప్రామాణ్యము నిరాకరింపఁ దగ దను నభిప్రాయమునోఁ జెప్పుచున్నారు శీతంబు ఇత్యాదిగా. స్వార్థమును బోధించునట్టి శ్రుతి కవిరోధం బావశ్యక మగుటవలన నది విరుద్ధార్థము చెప్పునప్పుడు తత్పరిహారముకొఱకు దాని కవిరుద్ధ మగు నర్థాంతరము వివక్షితముగా స్వీకరింపవలయును, విరోధ మున్నయెడఁ దత్ప్రామాణ్యం బనుపపన్న మగుట వలన నని చెప్పుచున్నారు చెప్పినను ఇత్యాదిగా. అవిరోధమును నిశ్చయింపక శ్రుత్యర్థకల్పన యుక్తము కా దని వ్యావర్త్యముఁ జెప్పుచున్నారు మఱి ఇత్యాదిగా.

**భా.** కర్మమునకు మిథ్యాప్రత్యయవంతుఁడు కర్త యగు నేని కర్త లేనపుడు శ్రుతి కప్రామాణ్య మగు నందు వేని, కాదు, బ్రహ్మవిద్యయం దర్థవత్త్వ ముపపన్న మగుటవలన. కర్మవిధి శ్రుతికివలె బ్రహ్మవిద్యావిధి శ్రుతికి నప్రామాణ్యప్రసంగ మందు వేని, కాదు, బాధకప్రత్యయము సంభవింపమివలన. ఎట్లు బ్రహ్మవిద్యావిధిశ్రుతిచే ఆత్మజ్ఞానము కలిగినపుడు దేహాదిసంఘాతమునం దహంప్రత్యయము బాధితం బగునో అట్లు ఆత్మయందే యాత్మావగతి యెప్పుడును ఎవ్వనిచేతను ఏవిధముచేతను దేహాది సంఘాతమునందువలె బాధింప శక్యము కాదు, అవగతి ఫలావ్యతిరిక్త* మగుటవలన, అగ్ని యుష్ణమును ప్రకాశమును అను నవగతివలె. కర్మ విధి శ్రుతికిని అప్రామాణ్యము లేదు, పూర్వపూర్వప్రవృత్తినిరోధంబున నుత్తరోత్తరాపూర్వప్రవృత్తిజననము ప్రత్యగాత్మాభిముఖ్యప్రవృత్త్యుత్పాదనార్థ మగుటవలన.

**ఆ.** అవిద్యావంతుఁడు కర్త కర్మమున కని నీ వంగీకరించుటవలన విద్య పుట్టినపు డవిద్య నశింపఁగాఁ దదధీనుఁ డగు కర్త లేమివలనఁ గర్త లేక యనుష్ఠానము సిద్ధింపమిచేఁ గర్మకాండమున కప్రామాణ్య మగుం గావున నధ్యయనవిధికి విరోధం బగు నని శంకించుచున్నాఁడు కర్మమునకు ఇత్యాదిగా. కర్మకాండశ్రుతికిఁ దాత్త్వికప్రామాణ్యము లే కున్నను విద్యోత్పత్తికిఁ బూర్వము వ్యావహారికప్రామా

---

* ఫలయుక్తము.

ణ్యము సంభవించుటవలనను బ్రహ్మకాండశ్రుతికిని బ్రహ్మవిద్యాజనక మగుటచే దార్ఢ్యాత్మకప్రామాణ్య ముపపన్న మగుటవలనను అధ్యయనవిధికి విరోధము లే దని పరిహరించుచున్నారు కాదు ఇత్యాదిగా. కర్మకాండశ్రుతికిఁ దార్ఢ్యాత్మకప్రామాణ్యము లేనియెడ బ్రహ్మకాండశ్రుతికిని అది సిద్ధింపదు విశేషము లేమివలన నని శంకించుచున్నాఁడు కర్మవి ధీత్యాదిగా. ఉత్పన్న మగు బ్రహ్మవిద్యకు బాధకము లేమిచే బ్రమాణ మగుటవలన తద్ధేతుశ్రుతికిఁ దార్ఢ్యాత్మకప్రామాణ్య మని నిరాకరించుచున్నారు కాదు బాధ కేత్యాదిగా. బ్రహ్మవిద్యకు బాధకాసంభవమును దృష్టాంతముచే సాధించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. ఫలము—అజ్ఞాననివృత్తి. లౌకికావగతికివలె ఆత్మావగతికిని ఫలావ్యతిరేకము నుదాహరణముచేఁ దెలుపుచున్నారు అగ్ని ఇత్యాదిగా. కర్మవిధిశ్రుతికివలె నని చెప్పిన దృష్టాంతమును విఘటించుచున్నారు కర్మవిధిశ్రుతికిని ఇత్యాదిగా. అనాదికాలప్రవృత్తులను విరోధించి యాగాద్యలౌకికప్రవృత్తులను జనింపఁజేయు చున్నది కర్మకాండశ్రుతి, తజ్జననము చిత్తశుద్ధిద్వారమునఁ బ్రత్యగాత్మాభిముఖ్యప్రవృత్తిని బుట్టించుచున్నది, అందువలనఁ గర్మవిధిశ్రుతులు పారంపర్యమునఁ బ్రత్యగాత్మజ్ఞానార్థంబు లగుటవలన వానికిఁ దార్ఢ్యాత్మకప్రామాణ్యము సిద్ధించు చున్న దని యర్థము.

భా. ఉపాయము మిథ్య యైనను ఉపేయము సత్యమగుటచే సత్యమే యగును, విధిశేషము లగు నర్థవాదములవలె, లోకమునందును బాలోన్మత్తాదులకు క్షీరాదికము త్రావింప వలసినపుడు చూడావర్ధనాదివచనమువలె * ప్రకారాంతరస్థులకో సాక్షాత్తుగానే ప్రామాణ్యము సిద్ధించుచున్నది, ఆత్మజ్ఞానమునకుఁ బూర్వము దేహాభిమాననిమిత్తప్రత్యక్షాది ప్రామాణ్యమువలె.

టీ. ఓయీ! ఇట్లయినను శ్రుతి మిథ్య యగుటవలన ధూమాభాసమువలె నప్రమాణ మనఁగా కా దని చెప్పుచున్నారు ఉపాయము ఇత్యాదిగా. స్వరూపంబున నసత్యమైనను ఉపేయద్వారంబునఁ బ్రమాణం బనుటకు దృష్టాంతముఁ జెప్పుచున్నారు వి ధీత్యాదిగా. మంత్రార్థవాదేతిహాసపురాణములకు శ్రుతార్థమునందుఁ బ్రామాణ్యము లే కున్నను శేషివిధ్యనురోధంబునఁ బ్రామాణ్య మున్నట్లు ప్రకృతమునందును స్వరూపముచే నసత్య మయిన శ్రుతికి విషయసత్యతచే సత్య

* జుట్టు పెరుఁగును—ఇత్యాది వాక్యములవలె.

త్వము కలదు. కావునఁ బ్రామాణ్య మవిరుద్ధ మని యర్థము. వాక్యమునకు శేషి విధ్యనురోధంబునఁ బ్రామాణ్యము లోకమునందును గల దని చెప్పుచున్నారు లోకమునందును ఇత్యాదిగా. కర్మకాండశ్రుతులకుక్తరీతిని బరంపరచేఁ బ్రామాణ్య మున్నను సాక్షాత్ప్రామాణ్య మపేక్షితం బయ్యె నని యాశంకించి చెప్పుచున్నారు ప్రకారాంత రేత్యాదిగా. ఆత్మజ్ఞానోదయమునకంటెఁ బూర్వావస్థ ప్రకారాంతరము, దానియం దున్నవారికిఁ గర్మవిధిశ్రుతు లజ్ఞాతసంబంధబోధకము లగుటచే సాక్షాత్తుగానే ప్రమాణము లనుట యిష్ట మని యర్థము. జ్ఞానమునకుఁ బూర్వము కర్మవిధిశ్రుతులకు వ్యావహారికప్రామాణ్యమునందు దృష్టాంతముఁ జెప్పుచున్నారు ఆత్మేత్యాదిగా.

భా. మఱి దలంచెదరు — తా నవ్యాపృతుం డైనను ఆత్మ సన్నిధిమాత్రమునఁ జేయు చున్నాఁడు, అదియే ముఖ్య మగు కర్తృత్వ మాత్మకు. రాజు యోధులు యుద్ధముఁ జేయు చుండఁగాఁ దాను యుద్ధముఁ జేయ కున్నను సన్నిధానమువలననే యుద్ధము చేయు చున్నాఁ డనియు గెలిచెను గెలువఁబడెను అనియుఁ బ్రసిద్ధము. సేనాపతి వాక్కుచేతనే చేయుచున్నాఁడు. క్రియాఫలసంబంధమో రాజునకును సేనాపతికిని దృష్టము. ఎట్లు ఋత్విక్కర్మము యజమానునకుఁ గలుగు చున్నదో, అట్లు దేహాదులకర్మ మాత్మకృతం బగుచున్నది, తత్ఫలం బాత్మగామి యగుటవలన. మఱియును అయస్కాంతము లోహమును భ్రమింపఁజేయుటవలనఁ దా నవ్యాపృతమే యయినను దానికి ముఖ్య కర్తృత్వమే కలదు. అట్లాత్మకును అని.

ఆ. ప్రాతీతిక మగు కర్తృత్వ మావిద్యక మైనను శ్రుతిప్రామాణ్యమునకు భంగము లే దని చెప్పఁబడినది. ఇప్పుడు కర్తృత్వము ప్రకారాంతరమునఁ బారమార్థిక మనుమతము నుద్ఘాటించు చున్నారు మఱి ఇత్యాదిగా. స్వవ్యాపారము లే కున్నను సన్నిధిమాత్రమున నెట్లు ముఖ్యకర్తృత్వ మని యాశంకించి దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు రాజు ఇత్యాదిగా. తాను యుద్ధము చేయనప్పుడు వాని కెట్లు తత్ఫలం బని యాశంకించి ప్రసిద్ధివశంబువలన నని చెప్పుచున్నాఁడు గెలిచెను ఇత్యాదిగా. కాయికవ్యాపారము లే కున్నను కర్తృత్వము ముఖ్యం బనుటకు దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు సేనాపతి ఇత్యాదిగా. వానికిని ఫలము రాజు

నకువలె సమాన మని చెప్పుచున్నాఁడు క్రి యేత్యాదిగా. ఇతరునికర్మముచే నితరు నకు సన్నిధానంబుచే ముఖ్యకర్తృత్వము కల దనుటకు వైదికం బగు నుదాహార ణము చెప్పుచున్నాఁడు ఋత్వి గిత్యాదిగా. ఎట్లు ఋత్విజులకర్మము యజమాను నిది యని యాశంకించి చెప్పుచున్నాఁడు తత్ఫలంబు ఇత్యాదిగా. స్వవ్యాపారము లేక సన్నిధివలననే యన్యవ్యాపారమునకు హేతు వగు దానికి ముఖ్యకర్తృత్వము కల దనుటకుఁ దృష్టాంతాంతరముఁ జెప్పుచున్నాఁడు మఱియును ఇత్యాదిగా.

భా॰ అది యసంగతము, కార్యము చేయనిదానికి కారకత్వము ప్రసక్తించుటవలన కారక మనేకప్రకార మందువేని, కాదు, రాజ ప్రభృతులకు ముఖ్య మైన కర్తృత్వము కనఁబడుటవలన. రాజు స్వవ్యా పారముచేతఁ గూడ యుద్ధము చేయుచున్నాఁడు, యోధులచే యుద్ధము చేయించుటచేతను వారికి ధనదానముచేతను రాజునకు యుద్ధమునందు ముఖ్య మైన కర్తృత్వమే కలదు, జయపరాజయఫలోపభోగమునందును. అట్లు యజమానునకును ప్రధానత్యాగముచేతను * దక్షిణాదానము చేతను ముఖ్యమే కర్తృత్వము. అందువలన అవ్యాపృతమునకుఁ గర్తృ త్వోపచార మేది గలదో యది గౌణ మని యేర్పడుచున్నది. స్వవ్యా పారలక్షణం బగు ముఖ్యకర్తృత్వము రాజయజమానప్రభృతులకుఁ గనఁబడదేని అప్పుడు సన్నిధిమాత్రముచేతఁ గూడ ముఖ్యకర్తృత్వము కల్పింపవలయును, లోహభ్రామణముచే నయస్కాంతమునకువలె. అట్లు రాజయజమానాదులకు స్వవ్యాపారము కనఁబడక పోలేదు. అందువలన సన్నిధిమాత్రముచేతఁ గర్తృత్వము గౌణమే. అప్పుడు తత్ఫలసంబంధం బును గౌణమే యగును. గౌణముచే ముఖ్యకార్యము నిర్వర్తింపఁ బడదు. అందువలన నసంగతమే యిది చెప్పఁబడుచున్నది — దేహాదుల వ్యాపారముచే నవ్యాపృతుఁ డగున యాత్మ కర్తయు భోక్తయు నగు నని.

ఆ॰ క్రియను జేయునట్టి కారణము కారకం బను సిద్ధాంతమునకు విరోధమువలన నది కా దని నిరాకరించుచున్నారు అది యసంగత మని. కారక విశేషవిషయ మగుటచే సిద్ధాంతమునకు విరోధము లే దని శంకించు చున్నాఁడు

* న మమ అని చెప్పుటచేతను.

కారకము ఇత్యాదిగా. స్వవ్యాపారము లేక యేదియుఁ గారకము కాదని పరిహరించుచున్నారు కాదు ఇత్యాదిగా. దానినే విశదీకరించుచున్నారు రాజు ఇత్యాదిగా. ఎట్లు రాజునకు యుద్ధమునందు యోధయితృత్వముచేతను ధనదానముచేతను ముఖ్యకర్తృత్వమో అట్లు ఫలభోగమునందును ముఖ్యమే యతనికిఁ గర్తృత్వ మని చెప్పుచున్నారు జ యేత్యాదిగా. ఋత్విక్కర్మము యజమానున కని యేది చెప్పఁబడినదో దానికిఁ జెప్పుచున్నారు అట్లు యజమానునకును ఇత్యాదిగా. స్వవ్యాపారమువలననే ముఖ్యకర్తృత్వ మని యేర్పడుటచే ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. దానినే విస్తరించుచున్నారు స్వవ్యాపా రేత్యాదిగా. అప్పుడు సన్నిధానమువలననే ముఖ్యకర్తృత్వము రాజాదుల కని యంగీకృతమా? అనఁగా కా దని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. రాజాదులకు స్వవ్యాపారము సిద్ధ మైనపుడు పూర్వోక్తము సిద్ధ మని చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. రాజాప్రభృతులకు సన్నిధివలననే కర్తృత్వము గౌణ మని యంగీకరించునెడ జయాదిఫలముగూడ గౌణ మని యేర్పడు నని చెప్పుచున్నారు అప్పుడు ఇత్యాదిగా. అందుఁ బూర్వోక్తమును హేతువుగా స్మృతికిఁ దెచ్చుచున్నారు గౌణముచే నిత్యాదిగా. అన్యవ్యాపారముచే నన్యమునకు ముఖ్యకర్తృత్వము లే దని యేర్పడుటచే ఫలితము నుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా.

భా. భ్రాంతినిమిత్తమో సర్వము నుపపన్న మగుచున్నది, స్వప్నమునందును మాయయందును ఎట్లో అట్లు. దేహాద్యాత్మప్రత్యయభ్రాంతిసంతానరహితము లగు సుషుప్తిసమాధ్యాదులయందో కర్తృత్వభోక్తృత్వాద్యనర్థం బుపలబ్ధము కాదు. అందువలన భ్రాంతిప్రత్యయనిమిత్తమే యీసంసారభ్రమము కాని పరమార్థము కాదు. కావున సమ్యగ్దర్శనమువలన నత్యంతమే యుపరమము దాని కని సిద్ధము.

ఆ. ఎట్లు మఱి నీచే నాత్మయందుఁ గర్తృత్వాదికము స్వీకరింపఁబడినది? బుద్ధికిఁ గర్తృత్వ మిష్టము కాదు గదా "కర్తా శాస్త్రార్థవత్త్వాత్" అను న్యాయమువలన. అందులకుఁ జెప్పుచున్నారు భ్రాం తీత్యాదిగా. కర్తృత్వాదిక మాత్మయందు భ్రాంత మనుట నుదాహరణముచేఁ దెలుపుచున్నారు స్వప్నమునందు ఇత్యాదిగా. ఆత్మయందుఁ గర్తృత్వాదికము మిథ్యాజ్ఞానకృతం బనుటకు వ్యతిరేకముఁ జూపుచున్నారు దేహా దీత్యాదిగా. చెప్పిన వ్యతిరేకముయొక్క ఫలముఁ

జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. సంసారభ్రమ యవిద్యాకృతం బని సిద్ధ మగుటచేఁ బరమప్రకృతము నుపసంహారించు చున్నారు కావున నిత్యాదిగా.

హా. సర్వధర్మాన్ – శ్రుతిస్మృత్యాచారసిద్ధములను; మామ్=నన్ను నారాయణుని; ఆశ్రయమునుగా, వ్రజ = పొందుము. అహమ్ = నేను సర్వజ్ఞుఁడను సర్వశక్తిని వాసుదేవుఁడను; త్వా = నిన్ను; సర్వపాపేభ్యః; మోక్షయిష్యామి. మా శుచః = శోకము నొందకుము.

శం. ఇట్లారురుక్షునకు మోక్షార్థం బీశ్వరైకశరణత్వంబునఁ గర్మయోగమే కర్తవ్యం బని నిర్ధారించి యారూఢున కావిర్భవించిన యాత్మజ్ఞానం బప్రతిబద్ధ మగుటకొఱకు సర్వకర్మసన్న్యాసపూర్వకముగా జ్ఞాననిష్ఠయే కర్తవ్య మని నిర్ధారించుటకై చెప్పుచున్నాఁడు.—ఓయీ! ఈ వచనము కర్మప్రకరణగతం బగుటవలనఁ గర్మపరమే కాని యకర్మపరముకా దందువేని, అట్లు కాదు, సర్వధర్మాన్పరిత్యజ్య అని సర్వకర్మసన్న్యాసము చెప్పుటవలన. ఆరురుక్షుం డగు ముముక్షువునకు గృహస్థునకు సర్వకర్మసన్న్యాస ముపయుక్తము కాదు గదా! "యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్। సర్వజ్ఞానవిమూఢాంస్తా న్విద్ధి నష్టానచేతసః" అని చెప్పుటవలనను, "సర్వకర్మబహిష్కృతః, తద్విహీనః పతత్యేవ హ్యాలమ్బరహితాన్ధవత్" అను స్మృతులవలనను సర్వకర్మములఁ బరిత్యజించిన యెడ మర్యాదాభ్రష్టత్వము పతితత్వము మొదలగు దోషములు సంభవించుటవలన, ఓయీ! మామేకం శరణం వ్రజ యని విహిత మైన యీశ్వరభజనాత్మక మగు కర్మమును విడువమివలన నట్టి దోషములు సంభవింప వని యందువేని, అది కాదు, "స్వకర్మణా త మభ్యర్చ్య" అని చెప్పఁబడుటవలన నామకీర్తనాదిలక్షణ మగు కర్మము శ్రుతిస్మృతులచే నవిహిత మగుటవలన స్వధర్మము కానందున విహితత్యాగంబును అవిహితాచరణంబునను దోషములు సంభవించును. "శ్రేయాన్ స్వధర్మో విగుణః" అని విగుణ మైనను స్వధర్మము శ్రేష్ఠం బని భగవంతుఁడు చెప్పుటవలనను, "నియతం కురు కర్మత్వం కర్మజ్యాయో హ్యకర్మణః, కర్మణ్యేవా ఽధికారస్తే, న కర్మణా మనారమ్భాత్, నహి సన్న్యసనా దేవ సిద్ధిం స మధిగచ్ఛతి, తస్మా దసక్తస్సతతం కార్యం కర్మ సమాచర, మత్కర్మ కృన్మత్పరమః, యజ్ఞదానతపః కర్మ నత్యాజ్యం కార్య మేవ తత్" అను భగవద్వాక్యములవలనను, "ఉపనయనం వేదాధ్యయనం ఫలవన్తిచ కర్మాణి, దారం కృత్వాగ్నీ నాధాయ కర్మాణ్యారభతే, పాణిగ్రహణాది గృహ్యాం పరిచరేత్, ఉదితే సూర్యే ప్రాత ర్జుహోతి, యావజ్జీవ

మగ్నిహోత్రం జుహోతి” ఇత్యాది శ్రుతిస్మృతికోటులచేతను బ్రాహ్మణాదులకు వైదిక మగు కర్మమే స్వధర్మత్వంబునఁ గర్తవ్య మని విహితం బగుటవలనను. ఓయీ ! సర్వధర్మాన్ పరిత్యజ్య అనుటచే లక్షణచేత సర్వకర్మఫలత్యాగమే చెప్పఁబడు చున్నది, కాని కర్మపరిత్యాగము కాదు, అందువలనఁ గర్మప్రకర ణాంగమే యీవచన మందువేని, కాదు, “సంబన్ధానుపపత్తిభ్యాం లక్షణా” అను న్యాయముచే నిట నర్థానుపపత్తి లేమివలన లక్షణ సంభవింపమివలన. ముఖ్యమునకు గత్యంతరము లేనపుడు గదా లక్షణ. గత్యంతరాభావము లేమివలన నిట లక్షణ ప్రసక్తింపదు. ఎట్లు గత్యంతర మందువేని చెప్పెదము. “లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయా ఽనఘ। జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్” అని యోగుల కారురుక్షువు లగు కర్మలకుఁ యోగముచే నిష్ఠయును సాంఖ్యుల కారూఢు లగు సన్న్యాసు లగు బ్రహ్మవిదులకు జ్ఞానయోగముచే నిష్ఠయు నని నిష్ఠాద్వయము నుపక్రమించి, “నియతం కురు కర్మ త్వమ్” అని యారంభించి “ప్రతిజానే ప్రియో ఽసి మే” అను వఱకుఁ గల గ్రంథముచే నారురుక్షువునకు నియమంబునఁ గర్తవ్యమునుగాఁ గర్మయోగ ములను సాంగమును సఫలమును నిరూపించి, సాంఖ్యులు బ్రహ్మవిదులు సర్వకర్మ సన్న్యాసు లగు నారూఢులకు “య స్త్వాత్మరతి రేవ స్యాత్” అని యారంభించి “సర్వకర్మాణి మనసా, యోగారూఢస్య త స్యైవ, యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః, ధ్యానయోగపరో నిత్యమ్, బ్రహ్మభూయాయ కల్పతే” అని యచ్చ టచ్చట ప్రసంగము గావించి “తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే త దన న్తరమ్” అనువఱకుఁ గల గ్రంథముచే సర్వకర్మసన్న్యాసపూర్వకముగా నియ మంబునఁ గర్తవ్యముగా జ్ఞాననిష్ఠను సఫలమును నిర్ధారించి యంతమునం దానిష్ఠనే యుక్తలక్షణమును సాంగమును సఫలము నుపసంహరించుచున్నాఁడు. సర్వధర్మా నిత్యాదిగా. అందువలన నీవచనమునకుఁ గర్మప్రకరణాంతర్గతత్వము గాని కర్మపర త్వము గాని సిద్ధింపదు. ఓయీ ! ఆరూఢుఁడైన యతికిఁ గూడ సర్వకర్మసన్న్యా సము యుక్తము కాదు, మతే మనఁగా ఏదేని స్మార్తకర్మము కర్తవ్య మందువేని, అట్లు శంకింపఁ దగదు. తృతీయాధ్యాయంబున శ్రీభాష్యకారులచేతనే యీశంక పరిహరింపఁబడినది. అందుఁ జూచుకొనునది. గ్రంథవిస్తరభయమువలన నిటఁ దన్మీమాంస గావింపము. జన్మాంతరానేకశతంబులు శ్రద్ధాభక్తులతో నీశ్వరప్రసాదమే ప్రయోజనముగాఁ గోరి యథావిధి ననుష్ఠించిన శ్రౌతస్మార్తకర్మములచే సర్వపాప

రాసులును నిశ్శేషముగా వినాశితము లగుటవలన శుద్ధాంతఃకరణుఁడవై నీవు చక్కఁగా నాత్మతత్త్వము నెఱింగి యుత్పన్న మగు నాత్మజ్ఞానమున కప్రతిబద్ధత్వము సిద్ధించుటకై జ్ఞాననిష్ఠఁ జేయవలయును, అందులకు మొదటి ప్రయోజనరహితములును అసద్విషయములును నిష్ఠాప్రతిబంధకము లగుటచే దుష్టములు నగు, సర్వధర్మాన్ = సమస్తము లైన ధర్మములను, శ్రౌతములు స్మార్తములు నగు సర్వకర్మములను సాధనసహితములను; పరిత్యజ్య. ఓయీ! శాస్త్రోక్తము లగు కర్మములను అసద్విషయములు ప్రయోజనరహితములు ననుట యనుపపన్నము, "బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన" అని. యజ్ఞదానాదులకు ఫలవత్త్వము శ్రుతం బగుటవలనను, "స్వకర్మణా తమభ్యర్చ్య" అనుటచేఁ గర్మము లీశ్వరారాధనాత్మకము లగుటవలనను కర్మములు సద్విషయములు ఫలవంతములే యగు నందువేని, సత్యము, కర్మము లీశ్వరారాధనాత్మకములును జిత్తశుద్ధ్యేకప్రయోజనంబులును. అయినను అది యనాత్మజ్ఞవిషయము, కర్తృత్వాది కారకభేదబుద్ధిసాధ్యంబు లగుటవలన. ఆత్మైకత్వదర్శి యగు విద్వాంసునకుఁ గర్మ ముపపన్నము కాదు, పరస్పరవిరోధు లగు జ్ఞానకర్మములకు సహస్థితి సంభవింపమివలన. చిత్తశుద్ధిని దత్ఫల మగు జ్ఞానమును బొందినవాఁడును ఆకర్మములచేఁ బ్రయోజనము లేదని యెఱింగినవాఁడు నగు బ్రహ్మవిదునకుఁ దత్పరిత్యాగము యుక్తమే యగును, "సత్యానృతే సుఖదుఃఖే వేదా నిమం లోక మముంచ పరిత్యజ్యాऽऽత్మాన మన్విచ్ఛేత్, స్వాధ్యాయంచ సర్వకర్మాణి సన్న్యస్య" అని విద్వాంసునకు సర్వకర్మపరిత్యాగము శ్రుతం బగుటవలన. ఓయీ! కర్మముచే నీశ్వరుఁడు ప్రీతుం డగును గావునఁ దత్ప్రీతికై కర్మము కర్తవ్యమే యందువేని, కాదు, బ్రహ్మనిష్ఠచేఁ బరమేశ్వరున కంతకన్న నధికతరం బగు ప్రీతి కలుగుటవలన. "జీవేశా వాభాసేన కరోతి" అను శ్రుతివలన నన్ను ఆభాసికుని మాయికుని అసత్యస్వరూపునిఁ బరిత్యజించి మాయాతత్కార్యసంబంధరహితుని నిత్యుని నిరంతరుని నిరాభాసుని నిష్కలుని నిష్క్రియుని శాంతుని, అనంతుని అనాద్యంతుని సచ్చిదానందైకరసుని ప్రమాణాంతరాబాధ్యుని పరిపూర్ణుని అద్వైతుని పరబ్రహ్మమును నన్నొక్కనినే యితఁ డుపాసించుచున్నాఁ డని యథార్థదర్శియు సత్యవాదియు సత్యనిష్ఠుఁడు నగు బ్రహ్మవిదునియందుఁ బరమేశ్వరున కధికతరప్రీతి సంభవించుచున్నది, నావైభవము నితఁడు నిర్వహించుచున్నాఁ డని రాజునకు శూరతమునియం దెట్లో అట్లు. "ప్రియో హి జ్ఞానినో ऽత్యర్థ మహం సచ మమ ప్రియః" అని చెప్పుటవలన బ్రహ్మవిదునియందుఁ బరమప్రీతి పరమేశ్వరునకు

యుక్తము, తండ్రికిఁ బుత్త్రాదులందు గుణాధిక్యము గలచోటఁ బ్రీత్యాధిక్య మెట్లో అట్లు అందువలన సిద్ధము పరమేశ్వరునకు నిర్గుణంబు నిత్యం బమాయిక మగు స్వస్వరూపముఁ బ్రాపింపఁ గోరి శ్రవణమనననిదిధ్యాసనాదులయందే శ్రద్ధతో నియమంబునఁ బ్రవృత్తులును సత్యనిష్ఠులును ముముక్షువులు నగు సత్పురుషుల యందుఁ బరమప్రీతి యని. ఓయీ! సర్వధర్మా న్పరిత్యజ్య యని ధర్మపరిత్యాగమే విహితము, అధర్మపరిత్యాగము విహితము కాదు, కావున నందుఁ బ్రవృత్తి ప్రసక్తించు నందువేని, కాదు, నకలఞ్జం భక్షయేత్ అని పూర్వమే పరిత్యక్తం బగు కలంజభక్షణాద్యధర్మమున కుత్తరకాలమునందుఁ బ్రసక్తి సంభవింపమివలన, బ్రహ్మచర్యమునందే విడిచిన పర్యుషితాన్నభోజనమునకు గార్హస్థ్యమునం దెట్లు ప్రసక్తి సంభవింపదో అట్లు. అయినను, "త్యజ ధర్మ మధర్మంచ, న తేషాం ధర్మాధర్మా" అను వచనమువలన సర్వధర్మపదముచే నధర్మముగూడ గ్రహింపఁబడు చున్నది, అందువలన ధర్మమును అధర్మమును బరిత్యజించి. అర్జునునకు సన్న్యాస ముప యుక్తము కాదు వాస్తవమే, అయినను ముముక్షు వగు బ్రాహ్మణుని విషయీకరించి చెప్పఁబడుచున్నది సర్వధర్మా న్పరిత్యజ్య యని, జ్ఞానకర్మములు తేజస్తమంబులుం బోలెఁ బరస్పరప్రతియోగు లగుటవలన వాని కేకాశ్రయత్వం బనుపపన్న మని నిర్ధారించి భగవంతునిచేత. సర్వధర్మాన్, పరిత్యజ్య = విధిచే సన్న్యసించి; మామేకమ్— "అయ మాత్మా బ్రహ్మ, త త్త్వ మసి" ఇత్యాది శ్రుతులచే బ్రహ్మాత్మల కేకత్వము ప్రతిపాదింపఁబడుటవలనను, "అస్థూల మనణ్వ హ్రస్వమ్, సర్వం హ్యేత ద్బ్రహ్మ" ఇత్యాది శ్రుతులచే ఆరోపితం బగు జగత్తు సర్వంబును అపవాద పూర్వకంబుగా బ్రహ్మమాత్రమే యని నిరూపింపఁబడుటవలనను "ఏక మేవా ఽద్వితీయం బ్రహ్మ, ఏక ఏవ హి భూతాత్మా, ఏక ఏవ రుద్రో న ద్వితీయాం యతస్థుః" ఇత్యాది శ్రుతులచే బ్రహ్మమున కేకత్వం బవధారితం బగుటవలనను, ఏకమ్ = సజాతీయ విజాతీయ స్వగతభేదరహితుని; నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుని అపూర్వుని అనపరుని అనంతరుని అబాహ్యుని అఖండుని చిదేకరసు నద్వితీయుని, మామ్ = నన్ను పరబ్రహ్మమును; శరణం వ్రజ = ఇది యంతయు నేనును బ్రహ్మమే యని ప్రత్యగ్దృష్టిచే ననుసంధింపుము. సాధకునకే యభ్యాసదశయందు "బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యా ఽఽత్మానం నియమ్యచ శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా" ఇత్యాది దేశకాలదృష్టిస్థాపనాదినియమము కాని ఇది యంతయు నేనును బ్రహ్మమే యని ప్రత్యగ్దృష్టిచే తన్నును సర్వంబును ఆరోపిత నామరూపాదిగ్రహణముచేయక

బ్రహ్మమును గానే చూచుచుండు బ్రహ్మవిత్తమునకు లేదు. ఇట్లు దృష్టమును స్పృష్టమును శ్రుతమును మతమును విజ్ఞాతమును సర్వంబును సర్వదా బ్రహ్మమును గానే చూచుచున్న నిన్ను, అహమ్ = పరమాత్మను నేను సాత్మత్వంబునఁ జక్కఁగా నెఱుంగఁబడినవాఁడను, చక్షువులకు రూపమువలె వృత్తికి వెలుపలను లోపలను సర్వత్ర యుపలభ్యమానుఁడ నగుచు, సర్వపాపేభ్యః—ఇట పాపశబ్దముచే పుణ్య పాపాత్మకము లగు కర్మములు గ్రహింపఁబడు చున్నవి, ఆ పాపములవలన, పాప కార్యము లగు జన్మజరామృత్యుబంధములవలన; మోక్షయిష్యామి — జన్మాది బంధ నిర్ముక్తునిఁగా జేసెద నని యర్థము, లేక. పాపములు కర్మములు, వానిచేఁ దత్కారణభూతము లగు నవిద్యాకామములును గ్రహింపఁబడు చున్నవి, సర్వపాపముల వలన — అవిద్యాకామకర్మములవలన సంతతజరాజన్మమృత్యుదుఃఖప్రవాహమునకు హేతువు లైన వానివలన చక్కఁగా నిర్ముక్తునిఁ గావించెదము. నిత్యుఁడను కూటస్థుఁడను అసంగచిద్రూపుఁడను బరిపూర్ణుఁడనే నే నని నిత్యకూటస్థాసంగచిన్మాత్ర స్వరూపుఁ డగు స్వాత్మయొక్కయాథాత్మ్యముఁ దెలియఁబఱచుటచే ఆరోపితము లగు దేహేంద్రియాది సర్వదృశ్యములచేతను తద్ధర్మ తత్కార్య తదవస్థాసంబంధము చేతను వర్జితునిఁ గానే యాత్మను ఆకాశమువలె నసంగు నవిక్రియుఁ బరిపూర్ణు నేకరసుఁ గానే సదా సర్వత్ర గ్రహింపఁజేసి, సర్వత్ర స్వమాత్రగ్రహణముచే వాసనాత్మక మగు నవిద్యను కామంబులను కర్మములను సమస్తంబులను నిర్మూలించి విపరీతభావమును నిశ్శేషముగాఁ దొలఁగించి పూర్ణుఁడఁ జిదానందుఁడ నొక్కఁడనే నే నను వృత్తి నప్రతిబద్ధముఁ గావించి, సర్వదా ముక్తుఁడ నే నని ముక్తునిఁగానే యాత్మను భావించునట్లు చేసెదను. ఇట్లాత్మను అవిద్యాతత్కార్యబంధనిర్ముక్తుని నిర్విశేషబ్రహ్మరూపమున నున్నవాని సాక్షాత్తుగా నపరోక్షీకరించి జీవనావస్థయందే ముక్తుఁడ వగు నీవు, మా శుచః = "తత్ర కో మోహః క శ్శోక ఏకత్వ మను పశ్యతః" అని స్వాత్మైకత్వదర్శి యగు విద్వాంసునకు శోకము లే దని శ్రుతి చెప్పుట వలన సర్వమును ఆత్మనుగానే చూచుచు ముక్తుఁడ వగు నీవు శోకము నొందకుము. తనకంటె నతిరిక్త మగు నర్థాంతర మనర్థకారణము కల దని తలంచు మూఢతము నకే శోకము, కాని నేనే యిది సర్వంబు నని తన్నుఁ దానే సర్వంబును జూచునట్టి విద్వాంసునకు శోకకారణము సంభవింపదు, అది లేమివలన నీవు శోకింపకు మని యర్థము. లేక. అశోచ్యా నన్వశోచ స్త్వ మ్మని యుపక్రాంత మయిన శోకపరి హారము నుపసంహరించుచున్నాఁడు భగవంతుఁడు మాశుచః అని. అద్వైతము

నెఱింగినవాఁడవు ఆత్మయు కర్త యనియు నెఱింగినవాఁడవు నీవు శోకించుట యుక్తము కా దని శోకపరిహారమే యనువదింపఁబడు చున్నది కాని విద్వాంసునకు శోకమును సంభావించి దానిపరిహారము చేయఁబడదు, "తత్ర కో మోహః కః శోకః" ఇత్యాది శ్రుతివిరోధప్రసంగమువలనను "న శోచతి న కాఙ్క్షతి" అని చెప్పిన స్వవచనంబునకును విరోధము ప్రసక్తించుటవలనను, ఉపసంహారార్థకంబే యీవచనం బనుట యుక్తము. ఇట్లు నిర్విశేష మగు పరబ్రహ్మమునే స్వస్వరూపముగా నెఱింగినదాని ననుసంధించు చుండు విద్వాంసునకుఁ దదనుసంధానఫలము సమ్యక్జ్ఞానంబును దత్ఫలము విదేహకైవల్యంబును "జ్ఞాత్వా విశతే త దనన్తరమ్" అని పూర్వము నిరూపితము. వెండియు నిట నిరూపింప వలసినది లేదు. ఇట్లు సర్వజ్ఞుం డగు నీశ్వరునిచే జ్ఞానకర్మములకు సాధ్యసాధనభావమే యిట నిశ్చయముగా నిరూపిత మయ్యెను. అందువలనఁ గర్మకాణ్డంబును బ్రహ్మకాండంబును మోక్షకారణ మని సిద్ధము.

మ॰ ఇప్పుడో "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి। త మేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత" అని యేది చెప్పఁబడినదో దాని వివరించు చున్నాఁడు. — కొన్నివర్ణధర్మములు కొన్నియాశ్రమధర్మములు కొన్నిసామాన్యధర్మములు అను నీ, సర్వధర్మాన్ = సమస్తము లయిన ధర్మములను గూడ; పరిత్యజ్య = ఉన్నవానిని గాని లేనివానిని గాని శరణ మని యాదరింపక; మామ్ = నన్ను ఈశ్వరుని; ఏకమ్ = అద్వితీయుని సర్వధర్మములకు నధిష్ఠాతను ఫలదాతను; శరణంవ్రజ — ధర్మము లుండనీ లేకపోనీ, అవి యేల యన్యసాపేక్షములు ? అన్యనిరపేక్ష మగు భగవదనుగ్రహమువలననే నేను గృతార్థుఁడ నగుదు నని నిశ్చయంబునఁ బరమానందఘనమూర్తిని అనంతుని శ్రీవాసుదేవునే భగవంతుని అనుక్షణభావనచే భజింపుము; ఇదియె పరమతత్త్వము, ఇంతకంటె నధికము లే దని విచారపూర్వక మగు ప్రేమాతిశయమున సమస్తము లయిన యనాత్మచింతలను విడిచి నదియుఁ దైలధారవలె నవిచ్ఛిన్నము నగు మనోవృత్తిచే నెల్లప్పుడును జింతింపుమని యర్థము. ఇట మా మేకం శరణం వ్రజ అనుటచేతనే సర్వధర్మశరణతాపరిత్యాగము లభించు చుండఁగా సర్వధర్మాన్ పరిత్యజ్య యను నిషేధానువాదము అందుచేఁ దత్కార్యము సిద్ధించు నని తెలుపుటకొఱకు, యజ్ఞాయజ్ఞీయ మగు సామమునందు "ఐదం కృత్స్నో ద్గేయమ్" అనుచోటి "నగిరా గిరేతి బ్రూయాత్" అనునట్లు. అందువలన నేనే సర్వధర్మకార్యము చేయువాఁడ నగుటవలన మదేక

శరణునకు ధర్మాపేక్ష లేదని యర్థము. ఇందుచే "సర్వధర్మాన్ పరిత్యజ్య" యనుటచే సధర్మపరిత్యాగము లభింపదు ధర్మపదము కర్మమాత్రపరము" అనుట నిరాకృతము. ఇటఁ గర్మత్యాగము విహితము కాదు గదా! మ తే మనఁగా, కర్మ మున్నను దానియం దనాదరముచే భగవదేకశరణతామాత్రము బ్రహ్మచారి గృహస్థ వాన ప్రస్థ సన్న్యాసులకు సాధారణముగా విహిత మగుచున్నది, అందు సర్వధర్మాన్ పరిత్యజ్య యని వారికి స్వధర్మమునం దాదరము సంభవించుటచేఁ దన్నివార ణార్థము. అనర్థఫల మగు నధర్మమునం దెవ్వనికిని ఆదరము లేమివలనఁ దత్పరిత్యా గవచన మనర్థకంబే, శాస్త్రాంతరప్రాప్త మగుటవలనఁగూడ. అందువలన వర్ణాశ్రమ ధర్మము లభ్యుదయహేతువు లని ప్రసిద్ధ మగుటవలన మోక్షహేతువులు గూడ నగు నను శంకను నివారించుకొఱకే యీవచనం బనుట న్యాయ్యము. సర్వధర్మాధర్మ పరిత్యాగము గూడ నిట విధింపఁబడను, సన్న్యాసశాస్త్రముచేతను నిషేధశాస్త్రము చేతను లబ్ధమే యగుటవలన. ఇదియు సన్న్యాసశాస్త్రం బనఁ దగదు, భగవదేక శరణతను విధించుట యిష్టం బనుటవలన. అందువలన సర్వధర్మాన్ పరిత్యజ్య యనుట యనువాదమే. సర్వశాస్త్రములయుఁ బరమరహస్యం బీశ్వరశరణతయే కావున దానియందే శాస్త్రపరిసమాప్తి భగవంతునిచేఁ జేయఁబడినది, అది లేని యెడ సన్న్యాసముగూడ స్వఫలపర్యవసాయి కామివలన. మఱియు సన్న్యాసము నం దనధికారి యగు క్షత్త్రియు నర్జునుని గూర్చి సన్న్యాసోపదేశము సంభవింపదు. అర్జునవ్యాజంబున నితరున కుపదేశం బన్ననో "వక్ష్యామి తే హితమ్, త్వా మోక్ష యిష్యామి సర్వపాపేభ్యః, మా శుచః" అని యుపక్రమోపసంహారము లుపపన్న ములు కావు. అందువలన సన్న్యాసధర్మములందును అనాదరముచే భగవదేకశర ణతామాత్రమునందుఁ దాత్పర్యము భగవంతునకు. ఎందువలన నీవు సర్వధర్మముల నాదరింపక మదేకశరణుఁడవో అందువలన, అహమ్ = నేను సర్వధర్మకార్యము చేయువాఁడను; త్వా = నిన్ను; సర్వపాపేభ్యః — బంధువధాదినిమిత్తములునగు సంసారహేతువులు నగు వానివలన; మోక్షయిష్యామి, ప్రాయశ్చిత్తము లేకయే, "ధర్మేణ పాప మపనుదతి" అను శ్రుతివలనను, నేను ధర్మస్థానీయుఁడ నగుట వలనను. అందువలన, మా శుచః = యుద్ధమునందుఁ బ్రవృత్తుఁడ నగు నాకు బంధు వధాదిజనితం బగు ప్రత్యవాయమునుండి యెట్లు విముక్తి యగు నని శోకము నొందకుము.

గీ. భాష్యకారులు దుర్మత ప్రకరము నిట
విదితముగ నిరసించిరి విస్తరమున
గ్రంథవివరణమాత్రార్థిఁ గాన నేను
దివిరి తాదర్థ్యమునఁ బ్రవర్తింప నైతి. ౧

వానివాఁడనె నేను నావాఁడె యాతఁ
డతఁడె నే నని త్రివిధ మహా హరిశరణత
సాధనాభ్యాసపాకవశంబువలనఁ
దద్విశేష మే మొల్ల విస్తరము గాఁగ. ౨

నమర భక్తిరసాయనం బనెడు గ్రంథ
మందు వివరించి యున్నార మిం దొకింత
గ్రంథవిస్తరభీతి దిఙ్మాత్రఫణితి
చెప్పెదము భక్తిలక్షణ మొప్పమీఱ. 3

అందు మొదటిది మృదువున కుదాహరణము.—"సత్యపి భేదాపగమే నాథ తవాఽహం నమామకీనస్త్వమ్ । సాముద్రోహితరఙ్గః క్వచనసముద్రో నతారఙ్గః" * అని. రెండవది మధ్యమునకు.—"హస్త ముత్క్షిప్య యాతోఽసి బలాత్కృష్ణ కి మద్భుతమ్ । హృదయా ద్యది నిర్యాసి పౌరుషం గణయామి తే" ♦ అని. తృతీయ మధిమాత్రమునకు.—"సకల మిద మహంచ వాసుదేవః పరమపుమాన్ పరమేశ్వర స్స ఏకః । ఇతి మతిరచలా భవ త్యనన్తే హృదయగతే వ్రజతాన్విహాయ దూరాత్" ❡ అని. ఇది దూతను గూర్చి యమునివాక్యము. అంబరీషుఁడు ప్రహ్లాదుఁడు గోపికలు మొదలగువారి నీభూమికయం దుదాహరణముగాఁ జెప్పనొప్పును. ఈ గీతాశాస్త్రమునందు సాధ్యసాధనభావాపన్న మగు నిష్ఠాత్రయము వివక్షితము, బహువిధంబులఁ బ్రతిపాదింపఁబడినది కూడ. అందుఁ గర్మ

* భేదము లేకున్నను నాథా! నీవాఁడనే నేను గాని నీవు నావాఁడవు గావు. తరంగము సముద్రునిది గాని యెప్పుడును సముద్రుఁడు తరంగమువాఁడు కాఁడు.

♦ చేయి విదలించికొని పోయితివి, కృష్ణా! ఏమి యాశ్చర్యము? హృదయమునుండి పోవుదు వేని అప్పుడు నీపౌరుషము నుతించెదను.

❡ ఇది యంతయు నేనును వాసుదేవుఁడే, పరమపురుషుఁడు పరమేశ్వరుఁ డతఁ డొక్కఁడె, అని హృదయగతుఁ డగు భగవంతునందు ఎవ్వరిబుద్ధి నిశ్చలముగా నుండునో వారి దూరమునుండి విడిచి పొమ్ము.

నిష్ఠ సర్వకర్మసన్న్యాసపర్యంతము "స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" అనుచోట నుపసంహరింపఁబడినది. సన్న్యాసపూర్వకశ్రవణాదిపరిపాక సహిత మగు జ్ఞాననిష్ఠ "తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే త దనన్తరమ్" అని యుపసంహరింపఁబడినది. భగవద్భక్తినిష్ఠయో యుభయసాధనభూతంబును ఉభయ ఫలభూతంబును గావున నంతమున నుపసంహరింపఁబడినది. "సర్వధర్మా న్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" అని. భాష్యకారులో సర్వధర్మాన్ పరిత్యజ్య యని సర్వ కర్మసన్న్యాసము ననువదించి మా మేకం శరణం వ్రజ యని జ్ఞాననిష్ఠ యుపసం హృత మని వక్కాణించిరి. భగవదభిప్రాయవర్ణనమునందు మే మెంతవార మల్పులము?

సీ. పరమపూరుషువాక్య మురుతరాగమరాశి పరమరహస్యంబు పావనంబు
నాతతార్థంబు నా గీతాఖ్యశాస్త్రంబునకు వ్యాఖ్య యొనరింప సకలవేది
గా కొరుఁడగు నెట్లు నాక యీ బాల్యచాపలము గావింపఁగాఁ దలఁచినాఁడ
నిర్హేతుకస్నేహనిరతు లైన మహాత్ములకు బాలభాషితం బొకవినోద

కరము గా కున్నె యని మదిఁ గరము నమ్మి
నెమ్మి భగవంతువచనామృతమ్ము తియ్యఁ
దనము చవిగొనఁ గోర్కె పెంపునను గాని
బుద్ధివిస్తారకృతగర్వమునను గాదు.

శ్రీ. దానికన్నను గుహ్యతమముఁ జెప్పుచున్నాఁడు.—నాభక్తునకే సర్వమును సిద్ధింపఁ గల దని దృఢవిశ్వాసముచేత విధికైంకర్యమును విడిచి మదేకశరణుఁడ వగుము. ఇట్లు వర్తించుచున్నవాఁడ వై కర్మత్యాగనిమిత్తం బగు పాపము కలుగు నని, మా శుచః = శోకము నొందకుము. ఎందువలన ననఁగా, త్వా = నిన్ను మదేకశరణుని; సర్వపాపేభ్యః అహం మోక్షయిష్యామి.

ప. దానికన్నను గుహ్యతమముఁ జెప్పుచున్నాఁడు.—మద్భక్తిచే సర్వమును గాఁ గల దని దృఢవిశ్వాసముచేత విధికైంకర్యము విడిచి, మామ్; ఏకమ్ — అద్వితీయుని; శరణం వ్రజ — మదేకశరణుఁడ వగుము. ఇట్లు వర్తించినయెడఁ గర్మత్యాగముచేఁ బాపము కలుగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు. — మాశుచః = శోకము నొందకుము. ఎందువలన ననఁగా. అహమ్; త్వా = మదేకశరణుండ వగు నిన్ను; సర్వపాపేభ్యో మోక్షయిష్యామి. మేఘమే శరణముగాఁ గల చాతకపక్షికి మేఘము

వలననే యభీష్ట మెట్లు సిద్ధించునో అట్లని యర్థము. ఇందుచేఁ దనసామర్థ్యాతిశయము దర్శితము. దీనియర్థము మాచేఁ బూర్వమే వ్యాఖ్యాతము. "అహమేవ స్వయ మిదం వదామి" అను శ్రుతియు దర్శితము. లేక, పూర్వశ్లోకమునందు సేవ్యసేవకభావంబున మన్మనాభవేత్యాదులు నన్నుఁ బొందించునవి నాలుగు ధర్మములు చెప్పఁబడినవి, ఆ సర్వధర్మములను, పరిత్యజ్య = విడిచి; యంత, మామేకమ్ — అఖండైకరసుని; శరణం వ్రజ—మజ్ఞానమువలన సకలవికారములను వీడి మదాకారత నొందుము. ఇట్లయినపుడు, అహమ్ = నే నాత్మనే; వీఁడు నే నను భేదభావనచేఁ బుట్టిన దుఃఖహేతువు లగు పాపములనుండి, మోక్షయిష్యామి. అని చెప్పఁబడినది. "దగ్ధాఖిలవికారశ్చేత్ బ్రహ్మజ్ఞానాగ్నినా మునిః । వర్తమాన శ్శ్రుతేర్మూర్ధ్ని నైవ స్యా ద్విధికిఙ్కరః" * అని. మాశుచః — పిమ్మట శోక మెక్కడిది? అని యర్థము. అది చెప్పఁబడినది "స్వాన్తైకాన్త ముపాగతే యదుపతౌ శాన్త్యా సమం క్రీడితుం నిర్యాతం బహిరన్తరఙ్గగతిభి స్సత్త్రాష్టభి స్సాత్త్వికైః । ప్రాణాపానగతీమనాగుపరతే స్వానన్దపూర్ణం మన శ్శ్రుత్వా గాన మనాహతధ్వనిభవం నత్వం న చాహం జగత్" ♦ అని. ఈ యర్థమునందు "యస్మిన్ సర్వాణి భూతా న్యాత్మైవాఽభూ ద్విజానతః" అను శ్రుతి భాష్యసహితము గాఁ బ్రదర్శింపఁబడినది.

రా. కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగరూపము లైన సమస్తధర్మములను బరమనిశ్శ్రేయససాధనభూతములను మదారాధనరూపంబున మిక్కిలి ప్రీతితో నధికారముచొప్పునఁ జేయు చున్నవాఁడవయ్యే చెప్పినరీతిని ఫలకర్మకర్తృత్వాది పరిత్యాగముచేఁ బరిత్యజించి, నన్నొక్కనినే కర్తనుగాను ఆరాధ్యునిఁగాను ప్రాప్యునిఁగాను ఉపాయునిఁగాను అనుసంధింపుము. ఇదియే సర్వధర్మముల శాస్త్రీయ పరిత్యాగం బని, "నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ । త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః" అని యారంభించి "సఙ్గం త్యక్త్వా ఫలం చైవ

* బ్రహ్మజ్ఞాన మను నగ్నిచే దహింపఁబడిన సర్వవికారములును గలవాఁ డగునేని అట్టి జ్ఞాని శ్రుతి శిరస్సునం దున్నవాఁడై విధికిఁ గింకరుఁడు కానే కాఁడు.

♦ పరమాత్మ హృదయ మను నేకాంతస్థలమును శాంతితో రమించుటకై చేరఁగానే బహిరంతరంగగతు లగు సాత్త్వికము లెనిమిదియు—యమనియమాదులు వెడలి పోవును. ప్రాణాపానగతులు తిన్నగా నుపరమించును. అనాహతధ్వనిభవం బగు గానము విని మనస్సు ఆత్మానందపూర్ణ మగును, అప్పుడు నీవును లేవు, నేనును లేను, జగత్తును లేదు.

సత్యాగ స్సాత్త్వికో మతః। నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః। యస్తు కర్మఫలత్యాగీ సత్యాగీ త్యభిధీయతే” అని యధ్యాయాదిని సుదృఢముగా నుపపాదింపఁబడినది. అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి — ఇట్లు వర్తించుచున్న నిన్ను మత్ప్రాప్తివిరోధులును అనాదికాలసంచితములును అనంతములును అకృత్యకరణకృత్యాకరణరూపములు నగు సర్వపాపములవలన నిర్ముక్తునిఁ గావించెదను. మా శుచః = శోకింపకుము. లేక. భక్తియోగము సర్వపాప నిర్ముక్తుఁడును అత్యంతభగవత్ప్రియుండు నగు పురుషునిచే సాధ్య మగుటవలన తదారంభవిరోధపాపము లనంతము లగుటవలన పరిమితకాలకృతము లగు తత్ప్రాయశ్చిత్తరూపధర్మములచే వానిఁ బరిహరింప నశక్య మగుటచే తాను భక్తియోగము నారంభింప ననర్హుం డని యాలోచించి శోకించు చున్న యర్జునుని శోకము దొలఁగించుటకై శ్రీభగవంతుఁ డిట్లనియె. సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ అని. భక్తియోగారంభవిరోధులు అనాదికాలసంచితములు నానావిధములు అనంతము లగు పాపముల కనుగుణంబులును తత్ప్రాయశ్చిత్తరూపంబులును కృచ్ఛ్రచాంద్రాయణ కూశ్మాండ వైశ్వానరవ్రాతపతిపవిత్రేష్టిత్రివృదగ్నిష్టోమాదికములును నానావిధంబులును అనంతములును బరిమితకాలవర్తి వగు నీచే ననుష్ఠింప నశక్యములు నగు సర్వధర్మములను బరిత్యజించి భక్తియోగారంభము సిద్ధించుటకై నన్నొక్కని పరమకారుణికుని విశేషము నాలోచింపక యశేషలోకములకు శరణ్యుఁడైనవాని ఆశ్రితవాత్సల్యజలధిని శరణముగా పొందుము. అహం త్వా సర్వపాపేభ్యః — ఉక్తస్వరూపము లగు భక్త్యారంభవిరోధు లైన సమస్తపాపముల నుండి, మోక్షయిష్యామి. మా శుచః.

**మా.** ధర్మత్యాగ మనఁగా ఫలత్యాగము. కాదేని యెట్లు యుద్ధవిధి? “యస్తు కర్మఫలత్యాగీ సత్యాగీ త్యభిధీయతే” అనియుఁ జెప్పఁబడినది.

పూర్ణాదోష మహావిష్ణో ర్గీతా మాశ్రిత్య లేశతః
నిరూపణం కృతం తేన ప్రీయతాం మే సదా విభుః.

శ్రీ మాధ్వభాష్యము సమాప్తము.

ఇదం తే నా ౽తపస్కాయ నా ౽భక్తాయ కదాచన
నచా ౽శుశ్రూషవే వాచ్యం నచ మాం యో ౽భ్యసూయతి.౬౭

**భా.** సర్వంబును గీతాశాస్త్రార్థము నీయధ్యాయమునం దుపసంహరించి విశేషించి యంతమునం దిట శాస్త్రార్థదార్ఢ్యముకొఱకు సంక్షేపమున నుపసంహారము గావించి యింక నిప్పుడు శాస్త్రవిధిసంప్రదాయముఁ జెప్పుచున్నాఁడు.— ఇదమ్ = ఈ శాస్త్రము; తే = నీకు; హితముకొఱకు సంసారవిచ్ఛిత్తికొఱకు నాచేఁ జెప్పఁబడినది; అతపస్కాయ = తపస్సు లేనివానికొఱకు; నవాచ్యమ్=చెప్పఁదగినది కాదు. అని వ్యవహితముతో సంబంధము. తపస్వియైనను, అభక్తాయ = గురువునందును దేవునియందును భక్తి లేనివానికొఱకు; కదాచన = ఏయవస్థయందును; నవాచ్యమ్. అశుశ్రూషవేచ = భక్తుఁడు తపస్వియునైనను శుశ్రూషు వెవ్వఁడు కాఁడో అతనికొఱకును * నవాచ్యమ్. యః = ఎవ్వఁడు; మామ్ = నన్ను వాసుదేవుని; ప్రాకృతమనుష్యునిఁగాఁ దలంచి, అభ్యసూయతి = ఆత్మప్రశంసాదిదోషముల నారోపించి నా యీశ్వరత్వము నెఱుంగక సహింపఁడో అతఁడును అయోగ్యుఁడు; తస్మైచ — వానికొఱకును; నవాచ్యమ్. భగవంతునియందు భక్తుఁడును తపస్వియు శుశ్రూషువును అనసూయువు నగువానికిఁ జెప్పనది యీ శాస్త్రము నని సామర్థ్యమువలనఁ దెలియవచ్చు చున్నది. అందు మేధావినే తపస్వినేవా ♦ అను నీయిద్దఱిలో వికల్పము కనఁబడుటవలన, శుశ్రూషాభక్తియుక్తుం డగు తపస్వికిఁ గాని తద్యుక్తుఁ డగు మేధావికిఁ గాని చెప్పనది. శుశ్రూషాభక్తులు లేనివానికి తపస్వికిఁ గాని మేధావికిఁ గాని చెప్పఁ దగదు. భగవంతునం దసూయ గలవానికి సర్వగుణసంపన్నునకును జెప్పఁదగదు. గురుశుశ్రూషా భక్తిమంతునకును జెప్పఁ దగు నని యిది శాస్త్రసంప్రదాయవిధి.

నే నిప్పుడు నీకుఁ జెప్పిన యీశాస్త్రమును దపస్సు లేనివానికిని భక్తుఁడు కానివానికిని శుశ్రూషువు కానివానికిని నాయం దసూయ గలవానికిని యెప్పుడును చెప్పఁదగ దని తాత్పర్యము.

---

* పనులు కవ్వు లేనివానికొఱకును లేక పరిచర్య చేయనివానికొఱకును.

♦ మేధావికొఱకు గాని తపస్వికొఱకుఁ గాని.

ఆ. శాస్త్రతాత్పర్యార్థమును విచారద్వారమున నిర్ణయించి మీఁదిశ్లోకమున కవతారిక చేయుచున్నారు సర్వంబును ఇత్యాదిగా. ప్రకృత మగు నష్టాదశాధ్యాయమునందు గీతాశాస్త్రార్థము సర్వంబును గ్రహణసౌకర్యముకొఱకు నుపసంహరించి యంతమునందు సర్వధర్మాన్పరిత్యజ్య యని విశేషించి దానికే సంక్షేపమున నుపసంహారము గావించి సంప్రదాయవిధి చెప్పవలసిన యవసరమునం దిప్పుడని యన్వయము. విస్తరమున నుపసంహృతి మగు శాస్త్రార్థమును సంక్షేపమున నేల యుపసంహరింపవలయు ననఁగాఁ జెప్పుచున్నారు శాస్త్రార్థదార్ఢ్యముకొఱకని. సంక్షేపవిస్తరంబులఁ జెప్పఁబడిన యర్థ మందఱకును దృఢముగా బుద్ధి కెక్కునని యర్థము. హితముకొఱకన్న దానినే వివరించుచున్నారు సంసారవిచ్ఛిత్తికొఱకని. కదాచన యనునది యన్నిటిలోను సంబంధించుచున్నది. ప్రతిషేధసామర్థ్యము వలన సిద్ధ మగు నర్థమును జెప్పుచున్నాఁడు భగవంతునియందు ఇత్యాదిగా. అర్థసిద్ధ మయిన యర్థమునందు స్మృత్యంతరము ననుసరించి మేధావిత్వమును గలుపుచున్నారు అందు ఇత్యాదిగా. వికల్పము కనఁబడుటవలన ఆ చెప్పినవిశేషణముల యందు మేధావిత్వముగూడఁ బ్రవేశించుచున్న దని యర్థము. వికల్పపక్షమునందు ఎట్లధికారినిశ్చయము? అనఁగాఁ జెప్పుచున్నారు శుశ్రూషేత్యాదిగా. శుశ్రూషాభక్తియుక్తుఁడై భగవంతునం దసూయ లేని తపస్వి కని యర్థము. తద్యుక్తుఁడు — శుశ్రూషతోను భక్తితోను అనసూయతోను గూడినవాని కని యర్థము. తపస్విత్వము గాని మేధావిత్వము గాని యితరనిరపేక్షం బగు నధికారివిశేషణ మను శంకను నిరాకరించుచున్నారు శుశ్రూషాభక్తులు ఇత్యాదిగా. భగవంతునియెడ నసూయ లేమియందుఁ దాత్పర్యము సూచించుచున్నారు భగవంతునందు ఇత్యాదిగా. ఎవ్వనికి మఱి చెప్పఁ దగు నని యాశంకించి పూర్వోక్తసర్వగుణసంపన్నున కని చెప్పుచున్నారు గురుశుశ్రూషేత్యాదిగా. అనుక్తము లగు నితరవిశేషణముల నుపలక్షించుటకై యుభయగ్రహణము. మేధావికిఁ దపస్విత్వము గాని తపస్వికి మేధావిత్వము గాని యంతగా నపేక్షితము గాదు, ఇతరము సర్వమును బాధకము లేమివలన నపేక్షితమే యని భావము.

హ. ఇదమ్ = ఈ శాస్త్రము; తే=నీకు; హితముకొఱకు సంసారవిచ్ఛిత్తికొఱకు నాచేఁ జెప్పఁబడినది; స్వధర్మవృత్తిలక్షణం బగు తప స్సెవ్వనికి లేదో అతఁ డతపస్కుఁడు, వానికొఱకు; నాయందు భక్తిభజన మెవ్వనికి లేదో అతఁ డభక్తుఁడు, వానికొఱకు, కదాచన = ఒకానొకప్పుడును; అశుశ్రూషవేచ = ఎవ్వఁడు గురువు

నకు శుశ్రూష చేయఁడో అతనికొఱకును; మామ్ = నన్ను ఈశ్వరుని సర్వప్రాణి సుహృదుని; యో ఽభ్యసూయతి = ఎవ్వఁడు ద్వేషించుచున్నాఁడో, వానికొఱకును; ఈ శాస్త్రమును నీచే అతపస్కునకును అశిష్యునకును జెప్పఁదగదు, అట్లు ఈశ్వరునందు భక్తి లేనివానికిని జెప్పఁదగదు, నన్నెవ్వఁడు ద్వేషించునో అతనికిని జెప్పఁదగదు.

శ్లో. ఇట్లాయుర్జునునకును ఆముముక్షునకును ఇద్దఱకును ఆత్యంతిక సంసార దుఃఖోపశాంతికొఱకు నియమంబునఁ గర్తవ్యాంశమును విభజించి తెలిపి తత్ఫలమును గూడ నుపపాదించి సర్వవేదంబులకును సర్వగీతాశాస్త్రంబునకును నిర్విశేష బ్రహ్మపరత్వమునే నిర్ణయించి "ఇతి తే జ్ఞానమ్" అని యుపక్రమించిన శాస్త్రము నుపసంహరించి యిప్పుడు శాస్త్రప్రవర్తకులకు ఈ మోక్షశాస్త్రముయొక్క సంప్రదాయము ప్రవర్తింపఁ జేయు నియమముఁ జెప్పుచున్నాఁడు.—ఇదమ్=ఈ మోక్షశాస్త్రము; తే = నీచేత; అతపస్కాయ = "ఋతం తపః సత్యం తపః" ఇత్యాది శ్రుత్యుక్త మగు తపస్సెవ్వనికి లేదో అతఁ డతపస్కుఁడు, వానికొఱకు, వేదోక్త కర్మానుష్ఠానము లేనివానికొఱకు; నవాచ్యం కదాచన — ఒకానొకప్పుడును ఉపదేశింపఁ దగ దని యర్థము. స్వధర్మనిష్ఠునికొఱకును, అభక్తాయ = "యస్యదేవే పరాభక్తిః" అను న్యాయముచే గురువునందును దేవునందును భక్తిలేనివాఁ డభక్తుఁడు, అట్టివానికొఱకును; కదాచన నవాచ్యమ్ = ఒకప్పుడును జెప్పఁ దగదు. తపస్వియు భక్తిమంతుఁడు నైనను, అశుశ్రూషవే = గురువునకు శుశ్రూష చేయనివానికొఱకు; కదాచన నవాచ్యమ్. ము త్తే మనఁగా తపస్వియు భక్తుఁడు నై గురువునకు శుశ్రూష చేయువానికే చెప్పఁదగును. చకారమువలన, మేధావినే — గ్రంథమును తదర్థమును గ్రహించుటకు శక్తి గలవానికొఱకే చెప్పఁదగును, కాని పూర్వోక్తవిశేషణములు గలవాఁ డైనను మేధాశూన్యున కెప్పుడును జెప్పఁదగదు. మఱియు, ఈ నాలుగువిశేషణములు గలవాఁ డైనను, యః = ఎవ్వఁడు; మామ్ = నన్ను వాసుదేవుని; ప్రాకృతమనుష్యునిఁగాఁ దలఁచి, అభ్యసూయతి = నిందించుచున్నాఁడో; వానికొఱకో కదాచన నవాచ్యమ్. లేక. మామ్ — నిర్విశేషపర బ్రహ్మమును; అభ్యసూయతి — బ్రహ్మమునకు నిర్విశేషత్వమును, కేవలత్వమును, సజాతీయాదిభేదరహితత్వమును అద్వితీయత్వమును అయుక్త మనియు విదేహకైవల్యము లోకశాస్త్రవిరుద్ధ మనియు జీవించి యున్నపుడే బ్రహ్మప్రాప్తి యయుక్త మనియు అద్వైతమును అద్వైతశాస్త్రమును విదేహకైవల్యమును సహింపనివాఁడై

కొనువాఁడు నిందించుచున్నాఁడో, వాఁడు చతుర్వేదవిదుఁడైనను నూఱుయజ్ఞములు చేసినవాఁడైనను సగుణభక్తి గలవాఁడైనను అట్టి యద్వైతద్వేషికి ఎప్పుడును ఏవిధమునను ఉపదేశింపఁ దగదు. ఉపదేశింపవలసినది* యద్వైతశాస్త్ర మగుట వలన అద్వైతమునందుఁ బ్రీతి గలవానికే యుపదేష్టవ్యము గాని జ్ఞానశాస్త్రమును తదర్థమును సహింపనివానికిఁ గా దని యర్థము. చకారమువలన ముముక్షువునకు, ఆరోగ్యముఁ గోరువానికే దివ్యౌషధ మెట్లియ్యఁ దగునో అట్లు మోక్షేచ్ఛ గల వానికే జ్ఞానశాస్త్ర ముపదేశింపఁ దగును గాని యితరునకుఁ గా దని సిద్ధము.

వ. సమాప్తము శాస్త్రార్థము. శాస్త్రసంప్రదాయవిధి నిప్పుడు చెప్పు చున్నాఁడు.—ఇదమ్ = ఈ గీతాఖ్య మగు సర్వశాస్త్రార్థరహస్యము; తే = నీకు; సంసారవిచ్ఛిత్తికొఱకు నాచేఁ జెప్పఁబడినది; అతపస్కాయ = సంయతేంద్రియుఁడు కానివానికొఱకు; నవాచ్యమ్ = చెప్పఁ దగదు, కదాచన = ఎట్టి యవస్థయందును, ఇది మూఁడుపర్యాయములయందును సంబంధించు చున్నది. తపస్వి యైనను, అభక్తాయ = గురువునందును దేవునియందును భక్తి లేనివానికొఱకు; నవాచ్యం కదాచన. చశబ్దము వాచ్యం కదాచన యను పదద్వయము నాకర్షించుకొఱకు. తపస్వియు భక్తుఁడు నైనను, అశుశ్రూషవే = పరిచర్యఁ జేయనివానికొఱకు; నవా చ్యం కదాచన. నచ మాం యో ఽభ్యసూయతి — నన్ను భగవంతుని వాసు దేవుని మనుష్యునిఁగాను సర్వజ్ఞత్వాదిగుణములు లేనివానిఁగాను దలఁచి, అభ్య సూయతి — ఆత్మప్రశంసాదిదోషముల నధ్యారోపించి యీశ్వరత్వమును సహింపని వాఁడై యెవఁడు ద్వేషించుచున్నాఁడో, అట్టి శ్రీకృష్ణోత్కర్షము సహింపనివాని కొఱకు అతఁడు తపస్వియు భక్తుఁడును శుశ్రూషువు నైనను చెప్పఁదగదు. నవా చ్యం కదాచన యని యనుకర్షణార్థము చకారము. తపస్వియు భక్తుఁడును శుశ్రూషువును శ్రీకృష్ణునం దనురక్తుఁడు నగువానికిఁ జెప్పఁ దగు నని యర్థము. ఒక్కొకవిశేషణము లే కున్నను అయోగ్యతను దెలుపుటకై నాలుగునకారములు. మేధావినే తపస్వినేవా అని మఱియొకచో వికల్పముఁ జెప్పుటవలన శుశ్రూషా గురుభక్తి భగవదనురక్తియుక్తుం డగు తపస్వికిఁ గాని తద్యుక్తుం డగు మేధావికిఁ గాని చెప్పఁ దగును. మేధాతపస్సులు పాక్షికము లైనను భగవదనురక్తి గురు భక్తి శుశ్రూషలకు నియమం బే యని భాష్యకారులు.

శ్రీ. ఇట్లు గీతార్థతత్త్వము నుపదేశించి తత్సంప్రదాయము ప్రవర్తింపఁ జేయుటయందు నియమమ్ముఁ జెప్పుచున్నాఁడు.—ఇదమ్=ఈగీతార్థతత్త్వము; తే—నీచేత; అతపస్కాయ = స్వధర్మానుష్ఠానహీనునికొఱకు; నవాచ్యమ్. అభక్తాయ = గురువునందును ఈశ్వరునియందును భక్తిశూన్యునికొఱకును; ఒకప్పుడును జెప్పఁదగదు. అశుశ్రూషవే = పరిచర్య చేయనివానికొఱకును, లేక, వినుట కిచ్ఛింపనివానికొఱకును; నవాచ్యమ్. మామ్ — పరమేశ్వరుని; యః అభ్యసూయతి = ఎవఁడు మనుష్యదృష్టిచే దోషము నారోపించి నిందించుచున్నాఁడో, వానికొఱకును; నవాచ్యమ్.

ప. * నైరుక్తశ్రుతియును.—విద్యావవై బ్రాహ్మణ మాజగామ గోపాయ మా శేవధిష్టే ఽహ మస్మి। అసూయకాయా ఽనృజవే ఽయతాయ న మా బ్రూయా అవీర్యవతీ స్యామ్. అని. భాష్యము.—విద్యా=ఔపనిషద మగు నధ్యాత్మవిద్య; దీనిఁ జెప్పుటకై, బ్రాహ్మణమ్ = బ్రహ్మనిష్ఠుని గూర్చి; ఆజగామ = ఆభిముఖ్యమున — సమక్షము వచ్చెను. ఏమి చెప్పుటకు ? మా = నన్ను; నీవు, గోపాయ — వక్ష్యమాణుం డగు పురుషునికొఱకు చతుర్థిచే ద్వితీయ చెప్పఁబడినది, అట్టి పురుషుని గూర్చి గుప్తముఁ జేయుము, చెప్పకు మని యర్థము. ఎందువలన ననఁగా, అహమ్ = నేను; తే = నీకు; శేవధిః = నిధిని; అస్మి = అగుచున్నాను, చతుర్విధపురుషార్థసాధన మగుటవలన, ఎట్లు నిధిని గుప్తముఁ జేయుదురో అట్లు నన్ను గుప్తముఁ జేయు మని యర్థము. ఎట్టివానికొఱకు ? అసూయకాయ = నిందించువానికొఱకు; అనృజవే = సదా వక్రుఁ డైనవానికొఱకు; అయతాయ = నియమము లేనివానికొఱకు. మా=నన్ను ఆత్మవిద్యను; న బ్రూయాః=చెప్పకుము. చెప్పుదువేని, అవీర్యవతీ స్యామ్ = వీర్యము లేనిదాన నగుదును, నీయందును సామర్థ్యము నశించు నని యర్థము.

రా. ఇదమ్ — ఈ పరమరహస్య మగు శాస్త్రము నీకు నాచేఁ జెప్పఁబడినది; అతపస్కాయ = తపస్సు చేయనివానికొఱకు; నీచేఁ జెప్పఁదగదు. చెప్పనట్టి నీయందును నాయందును, అభక్తాయ కదాచన నవాచ్యమ్ — తపస్సు చేసినవాఁ డయ్యు నభక్తునకుఁ జెప్పఁ దగ దని యర్థము. నచా ఽశుశ్రూషవే = భక్తుఁ డైనను శుశ్రూషువు కానివానికొఱకు; నవాచ్యమ్. నచ మాం యోఽభ్యసూయతి—

* పదరాజనాదికము శ్రీధరీయతుల్యము.

మత్స్వరూపమును మదైశ్వర్యంబును మద్గుణములును జెప్పఁబడినప్పుడు ఎవఁడు దోషము నావిష్కరించు చున్నాఁడో, వానికిఁ జెప్పఁ దగదు. విభక్తిభేదముచే నిర్దేశించుట యతఁ డత్యంతపరిహరణీయుం డని తెలుపుటకొఱకు.

యఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా మామే వైష్య త్యసంశయః. ౬౮

భా. సంప్రదాయముఁ జేయువానికి ఫలము నిప్పుడు చెప్పు చున్నాఁడు.—యః=ఎవఁడు; ఇమమ్=ఈ, యథోక్త మైన; పరమమ్=నిశ్శ్రేయసప్రయోజన మగు, కేశవార్జునులసంవాదరూప మగు గ్రంథమును; గుహ్యమ్ = గోప్య మైనదాని; మద్భక్తేషు = నాయందు భక్తి గలవారియందు; అభిధాస్యతి = చెప్పునో, గ్రంథమునను అర్థమునను నిలుపునో యని యర్థము. నీయందు నేనెట్లో అట్లు. భక్తిని పొందియు గ్రహించుటచే భగవద్భక్తిమాత్రముచేతనే శాస్త్రసంప్రదానమునందుఁ బాత్ర మగు నని తెలియ వచ్చుచున్నది. ఎట్లు చెప్పునో అనఁగాఁ జెప్పు చున్నాఁడు. — మయి = నాయందు; పరామ్=అధిక మయిన; భక్తిమ్= భక్తిని; కృత్వా = చేసి, పరమగురుం డగు భగవంతునకు శుశ్రూష నాచేఁ చేయఁబడు చున్న దని భావించి యని యర్థము. వాని కిది ఫలము. — మామే వైష్యతి=నన్నుఁ బొందనే పొందఁగలఁడు, ముక్తుఁడు కానే కాఁగలఁడు. అసంశయః = ఇందు సంశము చేయవలదు.

సాక్షాన్మోక్షసాధనమును బరమరహస్యము నగు నీసంవాదమును, దీని నాభక్తులకుఁ జెప్పుట పరమగురుం డగు భగవంతునిశుశ్రూష యని భావించి నా యందు భక్తిగలవాఁడై యెవఁడు నాభక్తుల కుపదేశించునో అతఁడు తప్పక ముక్తి నొందును. సంశయము లే దని తాత్పర్యము.

ఆ. శాస్త్రసంప్రదాయప్రవృత్తికొఱకు మీఁదిశ్లోకము నభిప్రాయ మని తెలుపుచున్నారు సంప్రదాయము నిత్యాదిగా. గ్రంథమునకుఁ బరమత్వము పరమ పురుషార్థసాధనత్వమని చెప్పుచున్నారు పరమమ్ ఇత్యాదిగా. గోప్యము — రహస్యార్థవిషయ మగుటవలన. ఈ సంవాదమును గ్రంథమునను అర్థమునను భక్తుల యందు నిలుపుటకు దృష్టాంతముఁ జెప్పుచున్నారు నీయందు ఇత్యాదిగా. నా

యందు భగవంతుడ నగు వాసుదేవునియందు అనన్యభక్తుఁడగు నీయందు నే నీ గ్రంథము నర్థముతో నిలిపితినో అట్లు మద్భక్తులయం దన్యులయందును ఎవఁ డీగ్రంథము నిలుపునో వాని కిది ఫల మని యుత్తరముతో నన్వయము. నాభక్తాయ యని భక్తియధికారివిశేషణముగాఁ జెప్పఁబడి యుండఁగా మద్భక్తేషు అని వెండియు భక్తిగ్రహణము వ్యర్థ మని యాశంకించి చెప్పుచున్నారు భక్తిని ఇత్యాదిగా. భగవద్భక్తిమాత్రముచేతనే — శుశ్రూషాదులు లే కున్నను అని యర్థము. ప్రశ్నపూర్వకముగాఁ జెప్పువిధమును జూపుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. భగవంతునియందు భక్తి చేయువిధముఁ బ్రకటించుచున్నారు పరమగురుండు ఇత్యాదిగా. ఏష్యత్యేవ అని యన్వయము గ్రహించి చెప్పుచున్నాడు పొందనే ఇత్యాదిగా.

హి. యః; ఇమమ్ = ఈ మనసంవాదమును; పరమమ్=ఉత్కృష్టమును, శ్రేయస్సాధన మగుటవలన; గోప్యమ్; మద్భక్తేషు = నాయందుఁ బరమేశ్వరుని యందు భక్తి గలవారియందు; అభిధాస్యతి = చెప్పునో; మయి — పరమేశ్వరుని యందు; పరాం భక్తిమ్; విధాయ=చేసినవాని కీఫలము చెప్పఁబడుచున్నది.—మామే వైష్య త్యసంశయ.

శం. తపస్విత్వమును భక్తిమత్త్వమును శుశ్రూషుత్వమును అద్వైతము నందుఁ బ్రీతిమత్త్వంబును ముముక్షుత్వంబును అధికారి శుద్ధాత్ముఁడును జ్ఞానశాస్త్రోపదేశయోగ్యుండు ననుటకుఁ జిహ్నం బని యధికారిలక్షణముఁ జెప్పి, ఇట్టి లక్షణము గల యధికారులకే జ్ఞానశాస్త్రము నుపదేశించువానికి ఫలముఁ జెప్పుచున్నాఁడు.— యః = శ్రోత్రియుఁడును బ్రహ్మనిష్ఠుఁడు నగు నేయతి; మద్భక్తేషు = నన్నే పరమేశ్వరుని సంసారమోక్షస్థితిబంధహేతువును మోక్షేచ్ఛచే స్వకర్మముల నారాధించుచు నెవరు భజించు చున్నారో వారు మద్భక్తులు, వారియందు; తపస్వికొఱకును భక్తునికొఱకు నని పూర్వము చెప్పి మద్భక్తేషు అని వెండియు భక్తిగ్రహణము "తంహ దేవ మాత్మబుద్ధి ప్రకాశం ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే, అమృత స్యైష సేతుః, శివప్రసాదేన వినా న సిద్ధిః" అని మోక్ష మీశ్వరప్రసాదైకలభ్య మని శ్రుతు లుపదేశించుటవలన ముముక్షువు లీశ్వరైకశరణులు కావలయును, ఈశ్వరైకశరణు లైననే వారు చేయు శ్రవణాదికము ఫలించును గావున నీశ్వరునియందే దృఢ మైన భక్తి కర్తవ్య మని తెలుపుటకొఱకు. మద్భక్తులయందు. మదేకశరణులయందును పూర్వోక్తవిశేషణములు గలవారియందును, ఇట విషయ

సప్తమి, మద్భక్తు లగు నాత్మతత్త్వజిజ్ఞాసువుల నుద్దేశించి యని యర్థము; పరమమ్= పరమపురుషార్థసాధనమును; గుహ్యమ్ = గోప్యమును, అయోగ్యులకుఁ జెప్పరాని దానిని; * ఇదమ్ = జ్ఞానమయ మగు నీ గీతాఖ్యశాస్త్రమును; అభిధాస్యతి = పరమకరుణచేతనే యుపదేశించునో, కాని శుశ్రూషాదికము నపేక్షించి కాదు, గ్రంథమును తదర్థమును వారికిఁ దెలియునట్లు బోధించునో యని యర్థము. ఓయీ! బ్రహ్మనిష్ఠునకు విదేహకైవల్యార్థికి శిష్యులకు గీతాశాస్త్రోపదేశము యుక్తము కాదు, జ్ఞాననిష్ఠాతత్ఫలప్రతిబంధకం బగుటవలన. "బ్రహ్మసంస్థో ఽమృతత్వ మేతి, ప్రమాదం వై మృత్యు మహం బ్రవీమి" అను శ్రుతిచేతను స్మృతిచేతను బ్రహ్మవిదునకు బహిర్ముఖత్వము ముక్తిప్రతిబంధక మని నిషేధింపఁబడు చున్నది యందువేని. ని న్నిట నడుగవలయును. తత్త్వోపదేష్ట సాధకుఁడా? సిద్ధుఁడా? సంసిద్ధుఁడా? అని. మొదటివాఁడు కాఁడు, సాధకున కాత్మయాథాత్మ్యజ్ఞానము లేమివలన వాక్యార్థోపదేశమాత్రమున వానిచే నిస్సంశయముగాఁ దత్త్వోపదేశము సంభవింపమివలన. ఎట్లు శాస్త్రముచేతను లక్షణముచేతను స్వరూపముచేతను వజ్రమణి నెఱింగినవానిచేతనే మణితత్త్వోపదేశము సంభవించునో, కాని శాస్త్రమాత్రము చదివినవానిచేఁ గాని లక్షణము విన్నవానిచేఁ గాని ఆపాతదర్శనము గలవానిచేఁ గాని సంభవింపదో అట్లు. తృతీయుఁడును కాఁడు, సప్తమభూమిక నధిరోహించి ప్రపంచము మఱచి పరప్రయత్నమువలన శారీరకర్మము చేయువానిచే నుపదేశము సంభవింపమివలన. పారిశేష్యమువలన సిద్ధుఁడే యుపదేశింప సమర్థుఁడు, ఓయీ! సిద్ధునకును బహిఃప్రవృత్తిచే జ్ఞానము ప్రతిబద్ధమే యగు నందువేని, కాదు. ముముక్షువు లగు శిష్యులకుఁ దత్త్వమస్యాది వాక్యార్థము నుపదేశించుటచే నాత్మజ్ఞానము దృఢమే యగుచున్నది. అందువలన శిష్యులకు ముముక్షువులకు సిద్ధుఁడే యుపదేశింపవలయును, అటు కాదేని ఆచార్యాభావప్రసంగమువలనను శాస్త్రానర్థక్యప్రసంగమువలనను ముముక్షువులకు గతిహీనతాప్రసంగమువలనను. అందువలన "స్వయం తీర్ణః పరాన్ తారయతి" అను న్యాయముచే సిద్ధుఁడు తాను ముక్తుఁడై ఇతరులను శరణాగతు లగు ముముక్షువులను బంధమునుండి ముక్తులఁ జేయు చున్నాఁడు. అదియే విద్వాంసున కైహికజ్ఞానసంపత్తికి ఫలము. ఓయీ! ఇది సత్యమె, అయినను మూఢుల కుపదేశింపఁ బ్రవర్తించినయెడ ద్వైతవాసన వృద్ధి నొందును. అందుచే విపరీతప్రత్యయములు పెచ్చుపెరుఁగును, అందుచే

* య ఇదం పరమ మ్మని కొందఱిపాఠము.

సర్వాత్మత్వజ్ఞానంబును దానిచే మోక్షంబును బ్రతిబద్ధం బగును. ఎట్లు విద్వాంసుఁ డాత్మహాని నంగీకరించి యుపదేశింపఁ జొచ్చును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.— "పుఙ్ఖానుపుఙ్ఖవిషయేషు చ తత్పరోపి బ్రహ్మావలోకన నిరూఢ మనాహి యోగీ। సంగీతతాలపరినృత్యవశం గతాపి మౌలిస్థ కుమ్భపరిరక్షణ ధీ ర్నటీవ" * అను న్యాయమునఁ బరోపదేశమునందుఁ బ్రవృత్తుఁ డైనను సిద్ధుం డగు యతి సర్వాత్మ నగు నాయందు అద్వితీయ మగు పరబ్రహ్మమునందు ఆరోపిత మగు సర్వదృశ్యమును జిరకాలనిత్యనిరంతరసమాధ్యభ్యాసబలముచేత సన్మాత్రముగా గ్రహించుచున్నది కావున, పరామ్ = ప్రకృష్ట మయిన, ఉత్తమ మయిన; భక్తిమ్ = సర్వత్ర సన్మాత్రమును గ్రహించునట్టి ప్రత్యగ్దృష్టిని; కృత్వా - సదా సర్వత్ర సర్వమును బ్రహ్మముగానే చూచుచు, నిశ్శేషముగా నశించిన ద్వైతభావము గల విద్వాంసుఁడు; మా మేవ = అద్వితీయమును నిర్విశేషము నగు పరబ్రహ్మమును నన్నే; ఏష్యతి = పొందును. కాని ఉత్క్రమణము నొందఁడు, లోకాంతరము నొందఁడు; దేశాంతరమునుం బొందఁడు, దేహాంతరము పొందనేపొందఁడు. ఇందు సంశయము చేయవలదు. బ్రహ్మవిదుఁడు సిద్ధుఁ డగుయతికి ఒకానొకప్పుడు పరోపదేశమునందుఁ బ్రవృత్తునకు బ్రహ్మప్రాప్తియందు సందేహము నేవకారముచేతనే నిరసించి దానికిని దార్ఢ్యముకొఱకు అసంశయః అని చెప్పఁబడినది. అందుచేత సిద్ధము, బ్రహ్మవిదుఁడు సిద్ధుఁ డగు యతి యొకప్పుడు పరోపదేశమునఁ బ్రవర్తించినను దాను సర్వత్ర బ్రహ్మదృష్టిని విడువనివాఁడై బ్రహ్మభావమునే పొందుచున్నాఁడు, ఇందు సందేహము లేదని.

మ. ఇట్లు సంప్రదాయవిధిఁ బ్రతిపాదించి దానిఁ జేయువానికి ఫలముఁ జెప్పుచున్నాఁడు.—యః = సంప్రదాయప్రవర్తకుఁ డెవ్వఁడు; ఇమమ్=మనయొక్క సంవాదరూప మైన యీగ్రంథమును; పరమమ్ = నిరతిశయపురుషార్థసాధనమును; గుహ్యమ్=రహస్యార్థ మగుటవలన అంతటను బ్రకటింపఁ దగనిదానిని; మద్భక్తేషు= నన్ను భగవంతుని వాసుదేవుని గూర్చి యనురక్తులయందు; అభిధాస్యతి = అభి — గ్రంథముచేతను అర్థముచేతను, ధాస్యతి — స్థాపించునో, వెండియు భక్తిగ్రహణము చేతఁ బూర్వోక్తవిశేషణత్రయము లేకున్నను భగవద్భక్తిమాత్రంబున నుపదేశ

* ఒకటివెంబడి నొకటిగా విడుపుద లేక వచ్చుచున్నవిషయములందుఁ దత్పరుఁ డైనను యోగి బ్రహ్మదృష్టియందే నిరూఢ మైన మనస్సు గలవాఁ డగును, సంగీతతాలనృత్యములవశము నొందిన డయ్యును శిరస్సున నున్న కుంభమును బడనీక రక్షించుటయందు బుద్ధి గల యాటకత్తెవలె.

యోగ్యత సూచితి మగుచున్నది. ఎట్లు అనఁగాఁ జెప్పుచున్నాఁడు. — భక్తిం మయిం పరాం కృత్వా — పరమగురుం డగు భగవంతుని శుశ్రూషనే దీని నేను జేయుచున్నా నని, కృత్వా — నిశ్చయించి; ఎవ్వఁడు స్థాపించుచున్నాఁడో అతఁడు మామే వైష్యతి — నన్ను భగవంతుని వాసుదేవుని; ఏష్య త్యేవ — శీఘ్రంబున సంసారమునుండి ముక్తుఁడు కానే యగును. ఇందు సంశయము నొందవలదు. లేక, మయి పరాం భక్తిం కృత్వా, అసంశయః = నిస్సంశయుఁడై, మా మేష్య త్యేవ. లేక, మామే వైష్యతి — నన్నే పొందుచున్నాఁడు, ఇతరుని పొందఁ డని యథా శ్రుతమే గ్రహింపనచ్చును.

శ్రీ. ఈ దోషములు లేనివారికొఱకు గీతాశాస్త్రము నుపదేశించువాని ఫలముఁ జెప్పుచున్నాఁడు.—మద్భక్తేషు — నాభక్తులకొఱకు, ఎవఁడు చెప్పునో అతఁడు నాయందుఁ బరం బగు భక్తిని జేయుచున్నాఁడు, అందుచే నిస్సంశయుండై నన్నే పొందుచున్నాఁ డని యర్థము.

ప. ఈ దోషములు లేని భక్తులకు గీతాశాస్త్రము నుపదేశించువానికి ఫలముఁ జెప్పుచున్నాఁడు.—యః = ఏ యాచార్యుఁడు; ఇదం పరమం గుహ్యమ్= గోప్య మగు నీగీతార్థతత్త్వమును; మద్భక్తేషు=నాభక్తులు జిజ్ఞాసతో వచ్చినపుడు; అభిధాస్యతి = చెప్పునో, అభిప్రాయసహితముగా నిరూపించునో. అతఁడు, మయి— పరమేశ్వరునియందు; పరామ్ = అవ్యభిచారిణి యగు; భక్తిమ్; కృత్వా; అసంశయుఁడై నన్నే పొందుచున్నాఁడు. ఆత్మాఖ్యదక్షిణ యిచ్చువానికి వేఱుఫల మేది చెప్పఁదగు నని యర్థము. శ్రుతియును ఋగ్వేదమందు. — ఆవిరభూ న్మహి మాఘోన మేషాం విశ్వం జీవఁ తమసో నిరమోచి। మహి జ్యోతిః పితృభి ర్దత్త మాగా దురుః పన్థా దక్షిణాయా అదర్శి. అని. దీనికి రావణభాష్యము:— ఏషామ్ = ఈ యాచార్యులకు; మాఘోనం మహి ఆవిరభూత్ — ఇన్గతి—ఎఱుంగు చున్నాఁ డను వ్యుత్పత్తిచే మఘోనః — ఇంద్రునిది పరమాత్మది యిది కావున మాఘోనము, మహి — మహత్త్వము, ఆవిరభూత్ — ఆవిర్భవించెను. ఎందువలన ననఁగాఁ జెప్పఁబడుచున్నది. — మహి = మహత్త్వమును; జ్యోతిః = జ్ఞానమును; పితృభిః — తండ్రు లగు మాచేత; దత్తమ్ = ఇయ్యఁబడినదై; ఆగాత్ = ప్రాప్తము, ఆ యాచార్యులయందుఁ బరిణతము. ఏజ్యోతిస్సు చేత, విశ్వంజీవమ్ = సర్వజగత్తును; తమసః = అజ్ఞానమునుండి; నిరమోచి = నిర్ముక్తము చేయఁబడెనో. ఇఁకఁ

నెట్లు మాచే వారికే యర్పింపఁబడినది? అనఁగాఁ జెప్పఁబడుచున్నది. — వారిచేత, ఉరుః = నిరవధికఫల మగు; దక్షిణాయాః = దక్షిణయొక్క; పన్థాః = మార్గము; అదర్శి = దృష్టము. మోక్షార్థులకొఱకిచ్చునట్టి యాత్మాఖ్యదక్షిణయొక్కఫలము నిరవధిక మని జ్ఞాతం బని యర్థము. అందువలననే సావధికఫల మగు దక్షిణ ఉచ్చావిలి యను నగ్రిమశ్రుతిచేఁ జెప్పఁబడుచున్నది.

**రా.** ఇదం పరమం గుహ్యం మద్భక్తేషు, యః అభిధాస్యతి = ఎవ్వఁడు వ్యాఖ్యానముఁ జేయుచున్నాఁడో, అతఁడు, మయి పరమాం భక్తిం కృత్వా మామే వైష్యతి. అందు సంశయము లేదు.

నచ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః
భవితా నచ మే తస్మా దన్యః ప్రియతరో భువి. ౬౯

**భా.** మఱియును.—తస్మాత్ = అట్టి శాస్త్రసంప్రదాయకర్తకంటె; మనుష్యేషు = మనుష్యులలోపల; కశ్చిత్ = ఒకానొకఁడును; మే = నాకు; ప్రియకృత్తమః = అతిశయంబునఁ బ్రియము చేయువాఁడు; నచ — వానికంటె నితరుఁడు ప్రియకృత్తముఁడు సంభవింపనే సంభవింపఁడు వర్తమానులలోపల నని యర్థము. నచ భవితా = కలుగఁబోఁడు గూడ; భవిష్యత్కాలమందును; తస్మాత్ = వానికంటె; అన్యః = రెండవవాఁడు; మే = నాకు; ప్రియతరః = అతిశయమునఁ బ్రియుఁడు; భువి — ఈ లోకమునందు.

ఈ శాస్త్రమును నాభక్తుల కుపదేశించువానికంటె వర్తమానకాలమున మనుష్యులలో నెవ్వఁడును నా కధికప్రియము చేయువాఁడు సంభవింపఁడు. ఇఁక భవిష్యత్కాలమునందును వానికంటె నాకధికప్రియుఁడు మఱియొకఁడు రెండవవాఁడు భూలోకంబుననే కలుగఁబోఁ డని తాత్పర్యము.

**రా.** ఓయీ! సర్వముక్తిసాధనములలోను ధ్యాన ముత్తమ మగుటవలనఁ దన్నిష్ఠుఁ డగు ముముక్షువునకు విద్యాసంప్రదానమునందుఁ బ్రవృత్తి కలుగ దనఁగాఁ జెప్పుచున్నారు మఱియును అని. ఇందువలనఁ గూడ ముముక్షువు విద్యాసంప్రదానమును యథోక్తవిశేషణవిశిష్టునకుఁ జేయవలయు నని యర్థము. వర్తమానుల లోపల వానికంటె నితరుఁడు ప్రియకృత్తముఁడు సంభవింపనే సంభవింపఁడు, అతీ

తులలోపలఁ గూడ అట్టివాఁ డెవ్వఁడును సంభవించి యుండ లే దని శేషము. ధ్యాన నిష్ఠుఁడు శ్రేష్ఠుఁ డైనను తనసంప్రదాయముఁ జేయువాఁడు శ్రేష్ఠతముఁ డగుటవలన విద్యాసంప్రదానమునందుఁ బ్రవృత్తి యుచిత మని భావము

హ. *

శ్రీ. ఇట్లు కరుణచేతనే ముముక్షువులకు గీతాశాస్త్రమును తదర్థము నుపదేశించువాని స్తుతించు చున్నాఁడు.— బ్రహ్మవిద్యతి యెవ్వఁడు ఉక్తవిశేషణములు గల ముముక్షువులకు గీతను తదర్థము నుపదేశించుచున్నాఁడో, తస్మాత్ = అట్టి గీతాశాస్త్రము నుపదేశించునట్టి యతికంటె; అన్యః; ప్రియకృత్తమః = నాకుఁ బ్రియమును – ఇష్టమును మత్ప్రాప్తి కంతరంగసాధన మగు శ్రవణ మనన ధ్యానాదికమును నిత్యము ప్రయత్నమున నెవరు చేయుదురో వారు ప్రియకృత్తులు, వారి యందఱికంటె నుత్తముఁ డగు ప్రియకృత్తు ప్రియకృత్తముఁడు; మనుష్యేషు – స్తోత్ర మంత్ర జప పూజాది బహిరంగసాధనపరులయందు; కశ్చిత్; న = లేఁడు. బహిరంగసాధనపరులకంటె అంతరంగసాధనపరులు నాకుఁ బ్రియులు, వారియందఱి కన్నను బ్రియుఁడు గీతార్థము నుపదేశించువాఁడు. ఎందువలన ననఁగా, ఇతఁడు తాను దరించినవాఁడై పరులనుగూడఁ దరింపఁజేయుటకుఁ బ్రవర్తించినవాఁడు, వారో తాము తరించుటకే ప్రవర్తించినవారు. అందువలన నితఁడే ప్రియకృత్తముఁడు, ఇతరుఁ డెవ్వఁడును కాఁ డిప్పు డని యర్థము. ఇఁకమీఁదఁ గూడ, మే = నాకు; తస్మాత్ – నాభక్తులకు గీతాశాస్త్రము నుపదేశించువానికంటె; అన్యః; ప్రియతరః= ప్రియకృత్తరుఁడు; భువి = భూలోకమునందు; న భవితాచ = కలుగఁబోఁడు కూడ. సంసారదుఃఖసాగరమగ్నులగు మద్భక్తులను ముముక్షువులను దయచేతనే జ్ఞానశాస్త్రోపదేశమున నే బ్రహ్మవిద్యతి యుద్ధరించుచున్నాఁడో అతఁడే కాలత్రయము నందును నాకుఁ బరమేశ్వరునకుఁ బ్రియకృత్తముఁ డని తాత్పర్యార్థము.

మ. మఱియును.—తస్మాత్ – మద్భక్తులయందు శాస్త్రసంప్రదాయముఁ జేయువానికంటె; అన్యః = ఇతరుఁడు; మనుష్యేషు = మనుష్యులయందు; ఒకానొకఁడును, మే = నాకు; ప్రియకృత్తమః = అతిశయమున ప్రియము చేయువాఁడు, నాయందు ప్రీత్యతిశయము గలవాఁడు; న = లేఁడు, వర్తమానకాలమునందు. పూర్వమును అట్టివాఁ డుండినవాఁడు కాఁడు. కాలాంతరమునందు, నభవితా=కలుగఁ

* భాష్యతుల్యము.

బోఁడు. మే = నాకును; తస్మాత్; అన్యః; ప్రియతరః = ప్రీత్యతిశయవిషయము; ఒకఁడును బూర్వము ఉండినవాఁడు కాఁడు. ఇపుడు, భువి = ఈలోకమునందు; లేఁడు. కాలాంతరమందును ఉండఁబోఁడు. అని యావృత్తిచే నన్వయింపవలయును.

శ్రీ. మఱియును.—తస్మాత్ = నాభక్తులకు గీతాశాస్త్రము నుపదేశించు వానికన్నను; అన్యః; మనుష్యేషు = మనుష్యులయందు; ఒకానొకఁడును నాకు, ప్రియకృత్తమః = అత్యంతము పరితోషము చేయువాఁడు; లేఁడు. నచ భవితా = కాలాంతరమునందును కలుగఁబోఁడు. నాకును వానికంటె ఇతరుఁడు ప్రియతరుఁడు ఇప్పుడు భూలోకమునందే లేఁడు, కాలాంతరమునందును కలుగఁబోఁడని యర్థము.

ప. ఇఁక నీయభిప్రాయమునే చెప్పుచున్నాఁడు.— తస్మాత్ = నేను జెప్పిన గుహ్యమగు నాత్మతత్త్వమును మద్భక్తుల కొసంగునట్టి పురుషునికంటె; అన్యుఁడెవ్వఁడును; మే ప్రియకృత్తమః; నచ = లేఁడు. కాలాంతరమునందును ఇట్టి ప్రియతరుఁడు భూలోకమునందుఁ గలుగనేరఁడు. బహుజన్మకృత సుకృతసంచయముచేతనే కాని ఇట్టి వక్త కలుగనేరఁడని వాని దుర్లభత్వము చెప్పఁబడినది. మఱియు, సర్వవిధభజనముకంటె ఈ భజనము నాకుఁ బరమప్రీతికరంబని యర్థము.

రా. మనుష్యులయందెల్లను వానికంటె నన్యుఁడగు మనుష్యుఁడు నాకెవ్వఁడును బ్రియకృత్తముఁడు కాఁడయ్యెను. ఇఁకమీఁదను కాఁబోఁడు. అయోగ్యులను మొదటఁ జెప్పుట యోగ్యులకుఁ జెప్పకుండుటకన్నను అయోగ్యులకుఁ జెప్పుట యనిష్టతమంబగుటవలన.

అధ్యేష్యతేచ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః
జ్ఞానయజ్ఞేన తేనా ఽహ మిష్టస్స్యా మితి మే మతిః. ౭౦

భా. మఱి యెవ్వఁడు.— యః=ఎవ్వఁడు; ఇమమ్=ఈ; ధర్మ్యమ్= ధర్మమునుండి తొలఁగనట్టి, ధర్మయుక్తమైన; ఆవయోః=నీయొక్కయు నాయొక్క; సంవాదమ్=సంవాదరూపమైన గ్రంథము; అధ్యేష్యతేచ= పఠించుచున్నాఁడో; వానిచే నిది చేయఁబడినదగును. జ్ఞానయజ్ఞేన = విధిజపోపాంశుమానసంబులగు యజ్ఞంబులలో జ్ఞానయజ్ఞము మానసంబగుటవలన నుత్తమము కావున నట్టి జ్ఞానయజ్ఞముచేత గీతాశాస్త్రాధ్యయనము స్తుతింపఁబడుచున్నది; లేక, ఫలవిధియే కావచ్చును, దేవ

తాదివిషయజ్ఞానయజ్ఞఫలతుల్యము దీనికి ఫలము కలుగు నని; తేన = వానిచేత; అధ్యయనముచేత, అహమ్; నేను; ఇష్టః = పూజింపఁబడిన వాఁడను; స్యామ్ = అగుదును; ఇతి = అని; మే = నాయొక్క; మతిః = నిశ్చయము.

మన సంవాదరూప మయిన ధర్మ్య మగు నీగ్రంథము నెవ్వఁడు పఠించునో అతఁడు జ్ఞానయజ్ఞముచేన న్నారాధించు చున్నాఁ డని నానిశ్చయ మని తాత్పర్యము.

ఆ. సంప్రదాయప్రవక్తకు సర్వాధిక మైనఫలమును "సవక్తా విష్ణురిత్యుక్తో న స విశ్వాధిదైవతమ్" * అను న్యాయముచేతఁ జెప్పి యిప్పుడు అధ్యేతకు వివక్షిత మగు ఫలముఁ జెప్పుచున్నారు మఱి యెవఁడు అని. ఈ శాస్త్రము నెవ్వఁ డధ్యయనము చేయుచున్నాఁడో వానిచే నిది చేయఁబడిన దగు నని సంబంధము. దానినే చెప్పుచున్నారు అధ్యేష్యతే ఇత్యాదిగా. వానిచే నిది చేయఁబడిన దగు నన్న యిది శబ్దముయొక్కయర్థమును విశదీకరించుచున్నారు జ్ఞా నేత్యాదిగా. తే నాహ మిష్టస్స్యా మ్ అని సంబంధము. చతుర్విధయజ్ఞములలో జ్ఞానయజ్ఞము "శ్రేయాం ద్రవ్యమయా ద్యజ్ఞా జ్ఞానయజ్ఞః" అని యుత్తమముగాఁ జెప్పుట వలన తే నాహ మిష్టస్స్యా మ్మని యధ్యయనస్తుతి యని చెప్పుచున్నారు వి ధీత్యాదిగా. పక్షాంతరముఁ జెప్పుచున్నారు లేక ఇత్యాదిగా. ఫలవిధినే ప్రకటించు చున్నారు దేవతా దీత్యాదిగా. ఏది జ్ఞానయజ్ఞమునకు ఫలము కైవల్యము గలదో దానితో తుల్యము దీనిఁ బఠించువానికి సిద్ధించును, అది దేవతాదాత్మ్య మని యర్థము. ఎట్లు అధ్యయనమువలననే సర్వాత్మ్యము ఫలము లభించును? "తస్మాత్తత్సర్వ మభవత్" అను శ్రుతివలన. అనఁగాఁ జెప్పుచున్నారు తే నేత్యాదిగా. వానిచేత — అధ్యేతచేత. జ్ఞానయజ్ఞతుల్య మగు నధ్యయనముచేత భగవంతుఁడు పూజితుఁ డగును, అందువలనఁ దజ్ఞానమువలన నుక్తఫలం బవిరుద్ధ మని యర్థము.

హ. యః; అధ్యేష్యతేచ = పఠించునో; ఆవయోః సంవాదమ్; ధర్మ్యమ్ = ధర్మానపేతమును; తేన = ఆ పఠించువానిచేత; జ్ఞానయజ్ఞేన = విధిజపోపాంశుయజ్ఞములకంటె ఫలములచే నొకటికంటె నొకటి సహస్రగుణము లైనవానికంటెను

* అవక్తయె విష్ణు వని చెప్పఁబడియె, విశ్వాధిదేవత యగువాఁడు విష్ణువు కాఁడు.

ఉత్తమ మయిన జ్ఞానయజ్ఞముచేత; అహమ్; ఇష్టః = పూజింపఁబడినవాఁడను; స్యామ్ = అగుదును; ఇతి = అని; మే; మతిః = నిశ్చయము.

శ౦. శ్రద్ధతోను భక్తితోను నిత్యమును ఏముముక్షువు గీతాపారాయణము చేయుచున్నాఁడో వానిఫలముఁ జెప్పుచున్నాఁడు.—నీయొక్కయు నాయొక్కయు, ఆవయోః = మనయొక్క; సంవాదమ్=సల్లాపరూపమును; ధర్మ్యమ్= ధర్మమునకు — మోక్షైకకారణ మగు జ్ఞానమునకు సిద్ధిహేతు వగుటవలన ధర్మము నుండి యనపేతమును ధర్మ్యమును; ఇమమ్ = గ్రంథమును గీతాశాస్త్రమును; యశ్చ = ఎవ్వఁడు మఱి బ్రాహ్మణాది ముముక్షువు; శ్రద్ధతోను భక్తితోను అర్థ జ్ఞానపూర్వకముగా, అధ్యేష్యతే — నిత్యమును నియమంబునఁ బఠించునో యని యర్థము. తేన = అర్థజ్ఞానపూర్వకముగా గీతాపారాయణము చేయు నాభక్తునిచేత; అహమ్ = నేను పరమేశ్వరుఁడను; ఎల్లప్పుడును, జ్ఞానయజ్ఞేన = జ్ఞానము — ఆత్మైకత్వవిషయము, జ్ఞానమే యజ్ఞము జ్ఞానయజ్ఞము, అట్టి జ్ఞానయజ్ఞముచేత; ఇష్టః = ఆరాధింపఁబడినవాఁడను; స్యామ్ = అగుదును, గీతాపఠనం బర్థజ్ఞానపూర్వక మగుట వలన బ్రహ్మమే తదర్థ మగుటవలనఁ దదనుసంధానముచేఁ గైవల్యలక్షణం బగు నేఫలము గలదో దానిఁ గ్రమంబున గీతాధ్యేత పొందుచున్నాఁ డని యర్థము.

మ. అధ్యాపకునకు ఫలముఁ జెప్పి యధ్యేతకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.—ఆవయోః; సంవాదమ్; ఇమమ్ = ఈ గ్రంథమును; ధర్మ్యమ్ = ధర్మము నుండి తొలఁగనిదానిని; యః; అధ్యేష్యతే = జపరూపమునఁ బఠించుచున్నాఁడో; జ్ఞానయజ్ఞేన = జ్ఞానాత్మక మగు యజ్ఞముచేత, చతుర్థాధ్యాయమున ద్రవ్యయజ్ఞాదుల కంటె శ్రేష్ఠ మని చెప్పఁబడినదానిచేత; తేన = ఆ పఠించువానిచేత; అహమ్ = సర్వేశ్వరుఁడను; ఇష్టః = పూజింపఁబడినవాఁడను; స్యా మితి; మే మతిః = నా యొక్క నిశ్చయము. ఇతఁడు గీతార్థముఁ దెలియకయే జపించు నన్నను, ఐనను దాని నాలకించునట్టి నాకు నన్నే యితఁడు ప్రకటించుచున్నాఁ డని తలంపు కలుగుచున్నది, అందువలన జపమాత్రమువలనఁ గూడ జ్ఞానయజ్ఞఫలమును మోక్షమును జెందుచున్నాఁడు సత్త్వశుద్ధి జ్ఞానోత్పత్తిద్వారమున. అర్థానుసంధానపూర్వకముగాఁ బఠించువానికో సాక్షాత్తుగానే మోక్ష మని చెప్పెడి దేమి? కావున ఫలవిధియే యిది, అర్థవాదము కాదు. "శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప" అని గదా పూర్వము చెప్పఁబడినది,

శ్రీ. పఠించువానికి ఫలముఁ జెప్పుచున్నాఁడు.—ఆవయోః — కృష్ణార్జునులయొక్క; ఇమమ్; ధర్మ్యమ్ = ధర్మానపేత మగు; సంవాదమ్; యః అధ్యేష్యతే = ఎవఁడు జపరూపమునఁ బఠించునో; తేన = ఆపురుషునిచేత; సర్వయజ్ఞములకంటె శ్రేష్ఠ మగు; జ్ఞానయజ్ఞేన; అహమ్; ఇష్టః; స్యామ్ = అగుదును; ఇతి మే మతిః. ఇతఁడు గీతార్థము నెఱుంగకయే పఠించినను సరే, అయినను నాకు దాని వినువానికి నన్నే యితఁడు ప్రకటించుచున్నాఁ డని బుద్ధి కలుగు చున్నది. ఎట్లు లోకమున నాకస్మికముగా నైనను ఒకఁ డొకప్పు డొకనిపే రుచ్చరించినపు డాపేరు గలవాఁడు నన్నే యతఁడు పిలుచుచున్నాఁ డని తలఁచి వానియొద్దకు వచ్చుచున్నాఁడో అట్లు నేను నాతనికి సన్నిహితుఁడ నగుదును. ఇందువలననే యజామిళక్షత్రబంధు ప్రముఖులకు ఏకారణముననో నామోచ్చారణమాత్రంబునఁ బ్రసన్నుఁడ నైతిని. అట్లే వీనికిని బ్రసన్నుఁడ నగుదు నని భావము.

ప. ఇఁక గీతాశాస్త్రమును బఠించుటకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.—ఆవయోః = కృష్ణార్జునులయొక్క; ఇమమ్; ధర్మ్యమ్ = ధర్మానపేతమును; సంవాదమ్; యః; అధ్యేష్యతే = జపరూపమునఁ బఠించునో. దానికి జపయజ్ఞఫలము కావలయును. మఱి దీనిచే, తేన = ఆపురుషునిచే; సర్వయజ్ఞములకన్నను శ్రేష్ఠ మగు జ్ఞానయజ్ఞేన అహ మిష్టః స్యామ్ = జ్ఞానయజ్ఞముచే సంతర్పితుఁడ నగుదును; ఇతి; మే మతిః=నాకు సమ్మతము. ఇది గీతార్థము దెలియక జపమాత్రకే యైనను దానిచే నాప్రసాదము కలుగుచున్నది. ఎందువలన ననఁగా, గీత ఛందస్సును ఋషియు దేవతయుఁ గల మాలామంత్రము. అందు ఛందస్సు లనుష్టు బాదులు, ఋషి వేదవ్యాసుఁడు, దేవత శ్రీకృష్ణుఁడు. మంత్రశబ్దార్థము—మన్త్రారం త్రాయతే—మననము చేయువాని రక్షించునది, అను వ్యుత్పత్తిచే జపమాత్రముచేతనే సిద్ధిప్రదము, అందు మంత్రార్థజ్ఞాన మావశ్యకము కాదుగదా! అందువలన ఏమంత్రమే దేవత గలదో ఆమంత్రముచే నాదేవత ప్రీతి నొందును. ప్రకృతమునందో చిత్తశుద్ధిద్వారమున నేను బ్రీతుఁడనై నాస్వరూపముఁ జూపుదు నని యర్థము.

రా. య ఇమ మావయో ర్ధర్మ్యం సంవాద మధ్యేష్యతే, తేన జ్ఞానయజ్ఞేనా ఽహ మిష్టస్స్యా మితి మే మతిః — ఇందు ఏజ్ఞానయజ్ఞము ప్రతిపాదింపఁబడు చున్నదో దానిచే నేను గీతాధ్యయనమాత్రమునఁ బూజితుఁ డగుదు నని యర్థము.

శ్రద్ధావా ననసూయశ్చ శృణుయా దపి యో నరః
సో ఽపి ముక్త శ్శుభాఁ ల్లోకాఁ ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్.

**భా.** ఇఁక శ్రోత కిది ఫలము.—శ్రద్ధావాఁ = నమ్మకము గలవాఁడును; అనసూయశ్చ = అసూయ లేనివాఁడు నై; యః = ఏ; నరః = మనుష్యుఁడు; శృణుయా దపి = శ్రవణము నైనను జేయునో, అపిశబ్దము వలన అర్థజ్ఞానవంతుఁడు పొందు నని చెప్పెడి దేమి? సో ఽపి=అతఁడు గూడ; పాపమునుండి, ముక్తః = విడువఁబడినవాఁడై; పుణ్యకర్మణామ్= అగ్నిహోత్రాదిపుణ్యకర్మములు గలవారియొక్క; శుభాఁ=ప్రశస్తము లగు; లోకాఁ = లోకములను, ప్రాప్నుయాత్ = పొందును.

శ్రద్ధ గలవాఁడై నాయం దసూయ లేనివాఁడై భక్తి నేమనుష్యుఁడు ఈ గీతాశాస్త్రమును వినునో, అట్లు శ్రవణమాత్రము చేయుపురుషుఁడు గూడ అగ్నిహోత్రాదిపుణ్యకర్మములు చేసినవారు పొందునట్టి పుణ్యలోకముల నొందు నని తాత్పర్యము.

**ఆ.** ప్రవక్తకును అధ్యేతకును ఫలముఁ జెప్పి శ్రోత కిప్పుడు ఫలము జెప్పుచున్నారు ఇఁక నిత్యాదిగా.

**హ.** శ్రద్ధావాఁ = కర్మశ్రద్ధ గలవాఁడు; అనసూయశ్చ = చదువువాని యం దసూయ లేనివాఁడు నై; శృణుయా దపి. ఇఁక నర్థము దెలిసినఁ జెప్పెడి దేమి? సోపి = ఆశ్రోతయును; ముక్తః = ఈ శరీరమునుండి నిర్గతుఁడై, మరణము నొంది యని యర్థము; పుణ్యకర్మణామ్; శుభాఁ = పుణ్యము లగు; లోకాఁ ప్రాప్నుయాత్.

**శం.** ప్రవక్తకును అధ్యేతకును ఫలముఁ జెప్పి యిప్పుడు శ్రోతకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.—విచారమునందును అధ్యయనమునందును అధికారము లేనట్టి, యోపి = ఎవ్వఁడేని; నరః = నరమాత్రాకారము గలవాఁడు, మూఢుఁడు గాని వృద్ధుఁడు గాని స్త్రీజనము గాని; శ్రద్ధావాఁ = చెప్పువానియందును గీతయందును బరమేశ్వరునందును శ్రద్ధాభక్తులు గలవాఁడై; అనసూయశ్చ = అసూయాదిదోషములు లేనివాఁడు నై; నిత్యమును ఈ గీతాశాస్త్రమును, శృణుయాత్. సోఽపి= ఆ శ్రోత గూడ; జ్ఞానాజ్ఞానకృతము లగు పాపములవలన ముక్తుఁడై, పుణ్యకర్మ

ణామ్ = అశ్వమేధాదియాగములు చేసినవారియొక్క; లోకము లేవి గలవో అట్టి లోకములను, శుభాన్ = మిక్కిలి సుఖకరములను; ప్రాప్నుయాత్. నిశ్యమును గీతాశ్రవణమాత్రంబున సత్యాదపుణ్యలోకముల నొందు నని యర్థము.

మ. ప్రవక్తకును అధ్యేతకును ఫలముఁ బ్రతిపాదించి శ్రోతకుఁ ఫలముఁ జెప్పుచున్నాఁడు.—యో నరః = ఏమనుష్యుఁడు, ఎవ్వఁడైనను; గట్టిగా జపించుచున్న కారుణికుఁ డగు మఱియొకని సకాశమున, శ్రద్ధావాన్ = శ్రద్ధాయుక్తుఁడై; అట్లు ఏల యితఁడు గట్టిగా జపించు చున్నాఁడు? అబద్ధము జపించు చున్నాఁడా? అను దోషదృష్టి యసూయ, అది లేనివాఁడై, అనసూయుఁడునై; కేవలము వినునో యీగ్రంథమును. అపిశబ్దమువలన అర్థజ్ఞానవంతునకుఁ జెప్పెడి దేమి? సోఽపి—కేవల మక్షరమాత్రము వినువాఁడు గూడ; ముక్తః = పాపములచే విడువఁబడినవాఁడై; పుణ్యకర్మణామ్ = అశ్వమేధాదులఁ జేసినవారియొక్క; శుభాన్ = ప్రశస్తము లైన; లోకాన్; ప్రాప్నుయాత్. జ్ఞానవంతునకుఁ జెప్పెడి దేమి? అని భావము.

శ్రీ. ఒకఁడు జపించు చుండఁగా మఱియొకఁ డెవ్వఁడు వినుచున్నాఁడో వానికిని ఫలమును జెప్పుచున్నాఁడు.—ఏనరుఁడు శ్రద్ధాయుక్తుఁడై కేవలము వినునో, శ్రద్ధావంతుఁ డైనను ఒకానొకఁడు ఎందులకు బిగ్గరగాఁ జపించుచున్నాఁడు? అబద్ధము జపించుచున్నాఁడా? అని దోషదృష్టిఁ జేయును, వాని వ్యావర్తించుటకై చెప్పుచున్నాఁడు.—అనసూయశ్చ = అసూయారహితుఁడు నై; ఎవ్వఁడు వినునో, సోఽపి; సర్వపాపములచేతను ముక్తుఁడై యశ్వమేధాదిపుణ్యములు చేసినవారికిఁ గలుగు లోకముల నొందును.

ప. ఇఁక శ్రవణఫలముఁ జెప్పుచున్నాఁడు.—*

రా. శ్రద్ధావాన్ అనసూయశ్చయో నరః శృణుయా దపి. ఆ శ్రవణ. మాత్రముచేత, సోఽపి, భక్తివిరోధిపాపములవలన ముక్తుఁడై, పుణ్యకర్మణామ్ = మద్భక్తులయొక్క; లోకాన్ = సమూహములను; ప్రాప్నుయాత్.

కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వ యైకాగ్రేణ చేతసా
కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రనష్ట స్తే ధనంజయ. ౭౨

* శ్రీధరీయముతో సమానము.

**భా.** శిష్యుఁడు శాస్త్రార్థమును గ్రహించుటను గ్రహింపమిని వివేకంబున నెఱుంగఁగోరి యడుగుచున్నాఁడు. గ్రహింపమి దెలిసినయెడ వెండియు నుపాయాంతరమున నైనను బోధించెద నని భగవంతు నభిప్రాయము. యత్నాంతరము నవలంబించి శిష్యునిం గృతార్థునిఁ జేయవలయు నని యాచార్యునిధర్మము ప్రదర్శితం బగుచున్నది.—ఏతత్ = నాచేఁ జెప్పఁబడినది యిది; త్వయా = నీచేత; ఏకాగ్రేణ = ఏకాగ్రమయిన; చేతసా = చిత్తముఁతో; పార్థ = అర్జునా! శ్రుతం కచ్చిత్ = శ్రవణముచే నవధరింపఁబడినదా యేమి? లేక, ఏమఱుపాటుచే గ్రహింపవైతివా? తే = నీయొక్క; అజ్ఞానసమ్మోహః = అజ్ఞానము వలనఁ గలిగిన విచిత్తత — అవివేకము స్వాభావికము; ప్రనష్టః కచ్చిత్ = చక్కఁగా నశించెనా యేమి? తదర్థము గదా యీశాస్త్రశ్రవణాయాసము నీకును ఉపదేశించు నాయాసము నాకును బ్రవృత్తము. ధనంజయ = అర్జునా!

అర్జునా! నేను జెప్పిన యీశాస్త్రమును నీ వేకాగ్రచిత్తంబున విని గ్రహించితివా? ఏమఱియుండి గ్రహింపవైతివా? నీకుఁ గలిగిన యజ్ఞానమోహము నశించెనా యేమి? అని తాత్పర్యము.

**ఆ.** ఆచార్యుఁడు శిష్యునకు అజ్ఞానసంశయము దీఱువఱకు ననేకవిధంబుల నుపదేశింపవలయు నని తెలుపుటకై భగవంతుఁ డర్జును నడిగె నని చెప్పుచున్నారు శిష్యుఁడు ఇత్యాదిగా. భగవంతు నభిప్రాయమును బ్రకటించుచున్నారు గ్రహింపమి ఇత్యాదిగా. శిష్యుఁడు చెప్పినదాని గ్రహింపఁజాలఁడేని అప్పుడు వానియెడ నాచార్యుఁ డుదాసీనత వహించుట యుచితము, అతఁడు మందబుద్ధి యగుట వలన నని యాశంకించి చెప్పుచున్నారు యత్నాంతరము నిత్యాదిగా. కచ్చిత్ అనునది కోమలప్రశ్నార్థకము. * శ్లోకమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు ఏతదిత్యాదిగా. ద్వితీయప్రశ్నమును విభజించుచున్నారు తే ఇత్యాదిగా. మోహప్రణాశమునకుఁ బ్రసంగముఁ జూపుచున్నారు తదర్థము ఇత్యాదిగా.

**హా.** కచ్చిత్తనునది ప్రశ్నార్థకము. యథోక్తము శ్రుత మయ్యెనా యని సంబంధము. అజ్ఞాన మనఁగా అనిశ్చయము, వానిచేఁ గలుగు సంశయము సమ్మోహము, అది ప్రనష్ట మయ్యెనా?

---

* కోమల మనఁగా తిన్నని.

శం. శాస్త్రార్థము చక్కఁగాఁ దెలిసినయెడ శిష్యుఁడు కృతార్థుఁడే యగును. తెలియనియెడ వానికిఁ బ్రకారాంతరమున బోధించి వాని యజ్ఞానము విపరీతగ్రహణము మొదలగు దోషములను దొలఁగించి కృతార్థత కలిగింపవలయును. ఇది యాచార్యునిధర్మ మని యుపదేష్టలకు సూచించుటకై యర్జునుఁడు తనబోధించిన యర్థమును గ్రహించినదియు గ్రహింపనిదియు నెఱుంగఁగోరి యడుగుచున్నాఁడు శ్రీభగవంతుఁడు.—ఓపార్థా! తత్త్వజిజ్ఞాసు వగు, త్వయా = నీచేత; ఏతత్ =నాచే నుపదేశింపఁబడిన యాత్మతత్త్వప్రకాశక మగు నీవాక్యజాతము; ఏకాగ్రేణ=సావధాన మగు; చేతసా; శ్రుతం కచ్చిత్ — ఏమి నేను జెప్పినదంతయు సావధానముగా గ్రహింపఁబడినదా ? లేదా ? చెప్పు మని యర్థము. ఇట్లుపదేశము నడిగి తత్కార్యము నడుగుచున్నాఁడు.— తే = నీయొక్క; అజ్ఞానసమ్మోహః = అజ్ఞాన మనఁగా ఆత్మతత్త్వము నావరించునది తిమిరమువలె ఆవరణరూపము, దానివలనఁ గలిగిన సమ్మోహము — విపరీతగ్రహణము; ప్రనష్టః కచ్చిత్=చక్కఁగా నాశము నొందెనా యేమి? నే నుపదేశించిన వాక్యములవలనఁ గలిగిన జ్ఞానముచే నీబుద్ధిభ్రమ నష్టమయ్యెనా లేదా? అని యర్థము.

మ. శిష్యునకు జ్ఞానోత్పత్తిపర్యంతము కారుణికుండై గురువు శ్రమ పడవలయు నని గురుధర్మమును బోధించుటకై సర్వజ్ఞుం డైనను వెండియు నుపదేశాపేక్ష లే దని తెలుపుటకై యడుగుచున్నాఁడు.—కచ్చిత్ =ప్రశ్నార్థకము. ఏతత్ = నేను జెప్పిన యీ గీతాశాస్త్రము; ఏకాగ్రేణ = వ్యాసంగరహిత మగు; చేతసా; ఓపార్థా! త్వయా; శ్రుతం కచ్చిత్ — అర్థముచే నవధరింపఁబడెనా యేమి? కచ్చిత్ = ఏమి; అజ్ఞానసమ్మోహః=అజ్ఞానజనిత మగు విపర్యయము; అజ్ఞాననాశము వలన, ప్రనష్టః = ప్రకర్షంబున — వెండియు నుత్పన్నము కానియట్లు నష్టమా? తే= నీకు; ధనంజయ = ఓ యర్జునా? కాదేని వెండియు నుపదేశము గావించెద నని యభిప్రాయము.

శ్రీ. సమ్యగ్జ్ఞానము కలుగనియెడ వెండియు నుపదేశించెద నను నభిప్రాయముచేఁ జెప్పుచున్నాఁడు.—కచ్చిత్ — ప్రశ్నార్థకము. అజ్ఞానసంమోహః= తత్త్వజ్ఞానముచేఁ గలుగు విపర్యయము. ఇతరము స్పష్టము.

ప. *

* శ్రీధరీయతుల్యము.

రా. నాచేఁ జెప్పఁబడిన యిది, పార్థా! నీచే నవహిత మగు చేతస్సుతో శ్రుతమా యేమి? నీ యజ్ఞానసమ్మోహము ప్రనష్టమా యేమి? అజ్ఞానముచేతఁ గదా మూఢుఁడవై యుద్ధము చేయ నని చెప్పితివి.

అర్జున ఉవాచ.—

నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయా ఽచ్యుత
స్థితో ఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ. ౭౩

భా. అర్జునుఁ డి ట్లనియె. నష్టః = నశించినది; మోహః = అజ్ఞానజము సమస్తసంసారానర్థహేతువు సాగరమువలె దుస్తరము. స్మృతిః= ఆత్మతత్త్వవిషయ మగు స్మృతియు; లబ్ధా = పొందఁబడినది, దేని లాభమువలన సర్వగ్రంథులయు విప్రమోక్షం బగునో అట్టిది; త్వత్ప్రసాదాత్ = నీయొక్క ప్రసాదమువలన; మయా = అప్రమాదము * నాశ్రయించిన నాచేత. అచ్యుత = కృష్ణా! ఈ మోహనాశప్రతివచనముచే సర్వశాస్త్రార్థజ్ఞానఫల మింతమాత్రమే యని దర్శితం బగుచున్నది= అజ్ఞానసంమోహనాశంబును ఆత్మస్మృతిలాభంబును ననునది యేది గలదో అంతమాత్రమే యని. అట్లు శ్రుతియందు "అనాత్మవి చ్ఛోచామి"♦ అని యుపన్యసించి ఆత్మజ్ఞానము కలిగినంతనే సర్వగ్రంథివిప్రమోక్షము చెప్పఁబడినది. "భిద్యతే హృదయగ్రన్థిః, తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః" అనియు మంత్రవర్ణము. ఇంక నిప్పుడు నీయాజ్ఞయందు, స్థితః అస్మి = నిలిచినవాఁడ నగుచున్నాను. గతసందేహః = ముక్తసంశయుఁడను, తవ = నీయొక్క; వచనమ్=వాక్యమును; కరిష్యే= చేసెదను. నేను నీప్రసాదమువలనఁ గృతార్థుఁడను, నాకుఁ గర్తవ్యము లే దని యభిప్రాయము.

అర్జునుఁ డి ట్లనియె.—కృష్ణా! నీప్రసాదమువలన నామోహము నశించెను. ఆత్మస్మృతి పొందినాఁడను. ఇఁక నీయాజ్ఞ దప్పను, నిస్సంశయుఁడ నైతిని. నీవు చెప్పునది చేసెదను ఇఁక నాకు వేఱు కర్తవ్యము లే దని తాత్పర్యము.

---

* ఏమఱుబాటు లేమిని.

♦ అనాత్మవిదుఁడనై శోకించుచున్నాను.

ఆ. ప్రేమముచే నుపదేశించిన యాత్మస్వరూపము అజ్ఞానసందేహావిపర్యాసములు లేక యవగత మయ్యెనా యని యడిగినందులకు భగవదనుగ్రహప్రాప్తిని జెప్పుటచే భగవంతునిఁ బరితోషపఱచుచు నర్జునుఁడు విజ్ఞాపనము చేసెనని చెప్పుచున్నాఁడు అర్జున ఉవాచ యని. అజ్ఞానజం బగు నవివేకము నష్ట మనుటనే స్పష్టీకరించుచున్నారు సమ స్తేత్యాదిగా. స్వయంజ్యోతియును బ్రత్యగ్రూపము నగు బ్రహ్మమునందు అవిద్యాభ్రమమును విద్య యపనయించుచున్నది, అజ్ఞాతమయినదానిఁ దెలుపునది కా దని తలఁచి చెప్పుచున్నారు స్మృతియు నని. స్మృతిలాభమున నే మగును? అనఁగాఁ జెప్పుచున్నారు దేనిలాభమువలన నిత్యాదిగా. మోహనాశమునకును స్మృతిలాభమునకును అసాధారణకారణముఁ జెప్పుచున్నారు త్వత్ప్రసాదాత్ అని. ప్రకృత మగు ప్రశ్న ప్రతివచనముచే లబ్ధ మగు నర్థముఁ జెప్పుచున్నారు ఈ మోహేత్యాదిగా. స్మృతిలాభమువలన నిశ్శేషముగా హృదయగ్రంథులవిప్రమోక్ష మగు నని యేది చెప్పఁబడినదో అందులకుఁ బ్రమాణముఁ జెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. జ్ఞానమువలన నజ్ఞానతత్కార్యనివృత్తి యగు ననుటకు శ్రుత్యంతరము గూడ సంవాదముగాఁ జూపుచున్నారు భిద్యతే ఇత్యాదిగా. భగవదనుగ్రహమువలన అజ్ఞానకృతమోహదాహ మైన యనంతరము ఆత్మజ్ఞానము లబ్ధ మయినపుడు త్వదాజ్ఞాప్రతీక్షుఁడ నే నను నుత్తరార్థమును వివరించుచున్నారు ఇంక నిత్యాదిగా. కరిష్యే వచనం తవ యనుటకుఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు నేను ఇత్యాదిగా.

హ. ఇట్లు భగవంతునిచే నడుగంబడినవాఁడై యర్జునుఁ డి ట్లనియె.— నష్టో మోహః = నష్టము సంశయము, గురుపుత్రమిత్రాదులు హంతవ్యులా? కారా? అని పూర్వ మేది యుండెనో అని, స్మృతిః = సమ్యక్జ్ఞానము; అదియు, లబ్ధా = పొందఁబడినది. త్వత్ప్రసాదాత్ మయా = నీప్రసాదము నాశ్రయించినట్టి నాచేత. అచ్యుత — స్వరూపమువలన నేవిధమువలన చ్యవనము నొందఁడు, అతని సంబుద్ధి. స్థితోఽస్మి = లేచినవాఁడ నగుచున్నాను. కరిష్యే; వచనమ్ = ఆజ్ఞను.

శం. ఇట్లు పృచ్ఛించిన భగవంతునిఁగూర్చి కార్యముఁ జెప్పుటచేఁ గారణసిద్ధి చెప్పిన ట్లగు నని తలఁచి భగవదుపదేశజనిత జ్ఞానఫలముఁ జెప్పుటకై యర్జునుఁ డి ట్లనియె.—జన్మజరామరణదుఃఖప్రవాహమునకుఁ గారణంబును సర్వానర్థములకు హేతువును దురంతము నగు, మోహః=స్వాజ్ఞానసంభవము, చీఁకటివంటిది, సమస్త

మును; ఓయచ్యుతా—కూటస్థా! భగవంతుఁడా! త్వత్ప్రసాదాత్—నీ యుపదేశము వలనఁ బుట్టిన జ్ఞానమువలన; నష్టః — స్వరూపముచే అదర్శనము నొందిన దని యర్థము. ఇట్లు భగవంతుఁ డుపదేశించిన వాక్యజాతమును తదర్థమును తాను గ్రహించుటను కార్యప్రకాశనముచేతనే తెలిపి తత్ప్రసాదసిద్ధ మగు స్వాజ్ఞానతత్కార్యనివృత్తియొక్క ఫలముఁ జెప్పుచున్నాఁడు. — అవిద్యాకృతకర్తృత్వభోక్తృత్వాది సర్వసంసారనిర్ముక్తుఁడు నిత్యకూటస్థుఁ డసంగచిద్రూపుఁడు నిష్కలుఁడు నిష్క్రియుఁడు శాంతుఁ డగు సర్వవేదాంతప్రసిద్ధుఁ డైన యేయాత్మ కలఁడో అతఁడే నేనని స్వాత్మతత్త్వవిషయ మగు, స్మృతిః; లబ్ధా. ఎట్లు ప్రమాదంబున నర్థము మఱచినవానికి ఆప్తవాక్యముచే స్మరణము కలుగునో అట్లు త్వత్ప్రసాదమువలన నా కాత్మస్మృతి సర్వహృదయగ్రంథులకును నిర్మూలనకారణము లభించెను. అందువలన, గతసందేహః = గతము — అభావము నొందినది సందేహము — స్వజనవధము దోషమా? చేయవచ్చునా కాదా? నా చేయుకర్మముచే లేపము కలుగునా కలుగదా? కర్తృత్వ మాత్మకుఁ గలదా లేదా? ఇవి మొదలయిన ద్వికోటికమగువృత్తి స్వతత్త్వనిర్ధారణవిషయమునం దెవ్వనికో అట్టివాఁడను గతసందేహుఁడను, గతసందేహః అనుటచే విపరీతభావమునకును దత్కారణమునకును నిశ్శేషనివృత్తి సూచింపఁబడినది, విపరీతభావంబును తత్కారణంబును ఉన్నపుడు సందేహనివృత్తి సంభవింపమివలన; అందువలన సందేహనాశమువలన సర్వవికల్పనాశము సిద్ధ మగుచున్నది; ఇట్లు త్వదుపదేశజనితం బగు విజ్ఞానముచే సర్వానర్థబీజ మగు మోహము కారణసహితముగా వినష్ట మగుటవలన ఆత్మయాథాత్మ్యవిజ్ఞానముఁ బ్రాపించినవాఁడనై యేను గతసందేహుఁడనై అక్షోభ్యస్వభావంబున * స్థితః అస్మి — అవిద్యాతత్కార్య తద్ధర్మ తదవస్థానిర్ముక్తం బగు నవిక్రియాత్మస్వరూపంబు ననే యున్నాను. ఇఁకమీఁద నాకు ఏదియుఁ దెలియవలసినది గాని పొందవలసినది గాని యించుకేనియు లేదు, అయినను మద్గురుఁడవు ఈశ్వరుఁడ వగు, తవ = నీ యొక్క; వచనం కరిష్యే. ఓయీ! అవిద్యాసంబంధనిర్ముక్తుఁ డగు నర్జునుఁడు కరిష్యే వచనం తవ యని చెప్పుట యుక్తము కానేకాదు, ముక్తునకుఁ గర్తవ్యము సంభవింపమివలన. నా కిది యీశ్వరునివచనము కర్తవ్య మని చేయుట యజ్ఞధర్మమే కాని తత్త్వజ్ఞధర్మము కాదు, తత్త్వజ్ఞున కితఁ డీశ్వరుఁడు నేను వీనివచనముఁ జేసెద నని భేదజ్ఞానము సంభవింపమివలన. నేనే యిది యంతయు నని సర్వంబు నాత్మ

* కలఁతపెట్టరాని స్వభావముచే.

గానే యెఱుంగునట్టి విద్వాంసునకు ఇతఁ డీశ్వరుఁడు ఈతనివాక్యమును దీని నేఁ జేసెద వని భేదజ్ఞానము సంభవించు నన శక్యము కాదు గదా! కార్యశేషము గాని, తస్య న కార్యం న విద్యతే అని విద్వాంసునకుఁ గార్యము నిషిద్ధ మగుటవలనను, "నైవాఽస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్" అని కార్యశేష మున్నయెడ నజ్ఞుం డను స్మృతివలనను. అందువలన జ్ఞానిత్వంబును కర్తృత్వంబును ఒక్కనికిఁ బరస్పరవిరుద్ధము సంభవింపదు, చక్రవర్తిత్వంబును భిక్షుకత్వంబును ఒక్కనికెట్లు సంభవింపదో అట్లు. అర్జునునకుఁ గర్తవ్యశేషము కలదేని అప్పు డాత్మజ్ఞత్వమే సంభవింపదు. ఓయీ! నష్టో మోహః స్మృతి ర్లబ్ధా అని యజ్ఞాననివృత్తియు జ్ఞానప్రాప్తియుఁ గంఠరవంబునఁ జెప్పఁబడినది, కావున జ్ఞానిత్వము కల దందు లేని, కాదు, కరిష్యే వచనం తవ యనియు, గంఠరవంబునఁ జెప్పుటవలన నజ్ఞత్వమును సంభవించుచున్నది. ఓయీ! ఇష్టో ఽసి మే దృఢ మితి యని హితబుద్ధిచేతను దయచేతను మద్యాజీ భవ యని భగవంతుఁడు చెప్పిన హితవచనముఁ జేయుట జ్ఞానియైనను అర్జునునకు యుక్తమే యందువేని కాదు, అది యారురుక్షువిషయం బగుటవలన నారూఢున కుపయుక్తము కామివలన. మద్యాజన మారురుక్షువునకుఁ గర్తవ్యం బని భగవంతుఁడు చెప్పిన కర్మాచరణం బారూఢుఁ డగు నర్జునున కుపయుక్తము కానేకాదు. అందువేని నీవు చెప్పినది సత్యము. బ్రహ్మవిదున కారూఢునకుఁ గర్మం బనుపయుక్తమే, అయినను ఆధికారికుఁ డగుటవలన నర్జునున కది యుపపన్న మగుచున్నది. ఎట్లు జనకాశ్వపతిప్రభృతులకు ముక్తులకును ఆధికారికులకు లోకసంగ్రహార్థము కర్మాచరణ ముండెనో అట్లర్జునునకును ఆధికారికునకు లోకహితార్థము కర్మాచరణం బవిరుద్ధమే. "లోకసంగ్రహ మేవాఽపి సంపశ్యన్ కర్తు మర్హసి, యద్య దాచరతి శ్రేష్ఠః" అని భగవంతునిచేఁ బూర్వ మేది చెప్పఁబడినదో దాని మనస్సున నుంచికొని చెప్పఁబడినది కరిష్యతే వచనం తవ అని. ఇంద్రాంశ మగుటవలన నర్జునునకు నింద్రాదులకుంబోలె నాధికారికత్వంబును ఆత్మజ్ఞత్వంబును లోకహితార్థము కర్తృత్వంబును అవిరుద్ధము. అందువలన యుక్తమే చెప్పఁబడినది కరిష్యే వచనం తవ యని. లేక, భగవత్ప్రసాదమువలన మోహము నిశ్శేషముగా నశించుటవలనను ఆత్మస్మృతి లభించుటవలనను ఆరూఢభావము నొందినవాఁడై యర్జునుఁడు తన కుత్పన్నం బగు జ్ఞానమునకుఁ బరిపాకము సిద్ధించుటకై సమాధిఁ జేయఁ గోరి భగవదుక్తమును బాహ్యము సర్వంబును బరిత్యజించి నన్నుఁ బరబ్రహ్మము నే యనవరతము ననుసంధింపు మను నర్థము గలదాని "సర్వ

ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" అను చరమవచనము హృదయస్థము ననువదించుచున్నాఁడు కరిష్యే వచనం తవ యని. సన్నిహిత మగుటవలనను ఈ యుపదేశము పరమసిద్ధాంత మగుటవలనను విద్వత్కర్తవ్యం బగుటవలన విద్వాంసుఁ డగు తన కీఁకఁ గర్తవ్యమును జెప్పుచున్నాఁడు కరిష్యే వచనం తవ యని. అందు వలన నిందు విరోధ మేదియు లే దని సిద్ధము.

మ. ఇట్లడుగఁబడినవాఁడై తాను కృతార్థుఁ డగుటచేఁ బునరుపదేశా పేక్ష లే దని తెలుపుచు నర్జునుం డి ట్లనియె.—నష్టః = ఉచ్ఛిన్నము; మోహః = అజ్ఞానకృత మగు విపర్యయము. తన్నాశకమును జెప్పుచున్నాఁడు.—స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదాత్ మయా — ఎందువలన నీ యుపదేశమువలన ఆత్మజ్ఞానము లబ్ధ మయ్యెనో సర్వసంశయములును నశించి ప్రాప్త మయ్యెనో అందువలన సర్వప్రతి బంధశూన్య మగు నాత్మజ్ఞానముచేత మోహము నష్టమని యర్థము. ఓ యచ్యుతా! ఆత్మయే యని నిశ్చితుండ వగుటవలన. ఎడఁబాటు సంభవింపని స్మృతి లభించుట వలన "సర్వగ్రన్థీనాం విప్రమోక్షః అను శ్రుత్యర్థము ననుభవించుచుఁ జెప్పు చున్నాఁడు — స్థితో ఽస్మి గతసందేహః = నివృత్తసర్వసందేహుఁడనై స్థితుఁడ నగు చున్నాను యుద్ధము కర్తవ్య మను నీశాసనమునందు. యావజ్జీవంబును, కరిష్యే వచనం తవ — పరమగురుం డగు భగవంతుని యాజ్ఞను బాలించెద నని ప్రయాస సాఫల్యముఁ జెప్పుటచే భగవంతు నర్జునుఁడు పరితోషపఱిచెను. ఇందుచే గీతా శాస్త్రాధ్యాయికి భగవత్ప్రసాదమువలన నవశ్యము మోక్షఫలపర్యంత మగు జ్ఞానము కలుగు నని శాస్త్రఫలము సంసూచితము, తద్దాస్యవజజ్ఞా అన్నట్లు.

శ్రీ. కృతార్థుఁడై యర్జునుం డి ట్లనియె.—ఆత్మవిషయం బగు, మోహః నష్టః. ఎందువలన ననఁగా, ఇతఁడు నే నని స్వరూపానుసంధానరూప మగు, స్మృతిః త్వత్ప్రసాదాత్ మయా లబ్ధా. అందువలన, స్థితోఽస్మి = యుద్ధమునకు లేచినవాఁ డను. గతసందేహః = పోయిన ధర్మవిషయ మగు సందేహము గలవాఁడను, నీయాజ్ఞఁ జేసెదను.

ప. *

రా. మోహః = విపరీతజ్ఞానము; త్వత్ప్రసాదమువలన నా కది నష్టము. స్మృతిః = యథావస్థిత తత్త్వజ్ఞానము. నీప్రసాదమువలననే యదియు లబ్ధము.

* శ్రీధరీయముతో సమానము.

అనాత్మ యగు ప్రకృతియందు ఆత్మాభిమానరూపంబును, పరమపురుషశరీరమై తదాత్మకం బగు సమస్తచిదచిద్వస్తువునందు అతద్రూపాభిమానరూపంబును, పరమ పురుషారాధనమై తత్ప్రాప్త్యుపాయభూత మగు నిత్యనైమిత్తికకర్మము బంధకం బను బుద్ధిరూపంబు నగు మోహము సర్వంబును వినష్టము, ఆత్మ ప్రకృతివిలక్షణుండును తత్స్వభావరహితుండును జ్ఞాతృత్వైకస్వభావుండును పరమపురుషశేషభూతుండును తన్నియామ్యత్వైకస్వరూపుండు నను జ్ఞానంబును, నిఖిలజగదుద్భవస్థితిప్రలయ లీలుండును అశేషదోషప్రత్యనీకకల్యాణైకస్వరూపుండును స్వాభావికానవధికాతిశయ జ్ఞానబలైశ్వర్యవీర్యశక్తితేజఃప్రభృతి సమస్తకల్యాణగుణమహార్ణవుండును పరబ్రహ్మ శబ్దాభిధేయుండును నగు పరమపురుషుని యాథాత్మ్యజ్ఞానంబును, ఇట్టి పరాపర తత్త్వయాథాత్మ్యవిజ్ఞానముచేతను తదభ్యాసముచేతను అనుదినము వృద్ధి నొందు చున్న పరమపురుషునందలి ప్రీతియే ఫలముగాఁ గల నిత్యనైమిత్తికకర్మములచేతను నిషిద్ధపరిహారముచేతను శమదమాద్యాత్మగుణములచేతను నిర్వర్త్యం బగు భక్తి రూపతాపన్న మయిన పరమపురుషోపాసనచేతమాత్రమే లభ్యుండవు వేదాంత వేద్యుండవు పరమపురుషుండవు వాసుదేవుఁడవు నీ వను జ్ఞానంబును లబ్ధము. అందు వలన బంధువులయందలి స్నేహకారుణ్యములచేఁ బ్రవృద్ధ మగు విపరీతజ్ఞానమువలనఁ గలిగిన సమస్త మైన శోకమునుండి విముక్తుఁడను, గతసందేహుఁడను స్వస్థుఁడనై, స్థితోఽస్మి. ఇప్పుడే యుద్ధాదికము కర్తవ్యం బను నివచనముఁ జేసెదను. యథోక్త మగు యుద్ధాదికముఁ జేసెద నని యర్థము.

సంజయ ఉవాచ.—

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్. ౭౪

**భా.** పరిసమాప్తము శాస్త్రార్థము. ఇఁక నిప్పుడు కథాసంబంధముఁ బ్రదర్శించుటకై సంజయుఁ డి ట్లనియె.—ఇతి = ఈప్రకారముగా; అహమ్ = నేను; వాసుదేవస్య = కృష్ణునియొక్కయు; మహాత్మనః = గొప్పబుద్ధి గల; పార్థస్య = అర్జునునియొక్కయు; సంవాదమ్ = సంవాద మును; ఇమమ్ = యథోక్తమును; అద్భుతమ్ = మిక్కిలి యాశ్చర్య కరమును; రోమహర్షణమ్ = రోమాంచము గలిగించుదానిని; అశ్రౌ షమ్ = వింటిని.

సంజయుఁడు ధృతరాష్ట్రునితో ని ట్లనియె. ఈవిధముగా కృష్ణార్జునుల సంవాదమును ఆశ్చర్యకరమును రోమాంచకరము నగుదాని నేను వింటి నని తాత్పర్యము.

**ఆ.** శాస్త్రార్థము పరిసమాప్తము గాఁగా నీయవస్థయందు సంజయు వచనము దేనియం దుపయుక్త మనఁగాఁ జెప్పుచున్నారు పరిసమాప్తము ఇత్యాదిగా.—సర్వజ్ఞుఁడు సర్వేశ్వరుఁడు కృతార్థుఁ డగు వాసుదేవునియొక్కయు పృథాసుతుఁడు మహాత్ముఁడు—అనల్పబుద్ధి సర్వాధికారి గుణసంపన్నుఁ డగు నర్జునునియొక్కయు సంవాదమును — సమీచీన మైనవాదమును గురుశిష్యభావమునఁ బ్రశ్న ప్రతివచనరూపమును ఉపక్రమించినదాని విస్మయకరమును రోమములు హృష్యన్తి—పులకీభవించుచున్నవి, దీనిచేతఁ గావున రోమహర్షణంబును ఆహ్లాదకరమును యథోక్తమును విన్నవాఁడ నైతి నని చెప్పె నని చెప్పుచున్నారు ఇ తీత్యాదిగా.

**హ.** ఇమమ్ = యథోక్తమును.

**శం.** ఇ ట్లర్జునున కవిద్యాతత్కార్యభ్రమములఁ దొలఁగింప నుపక్రమింపఁబడిన జ్ఞానశాస్త్రంబును దదర్థంబును బరిసమాప్తం బని యెఱింగి తచ్ఛ్రవణతదర్థానుభవంబులచేఁ గలిగిన యాత్మానందరసాతిరేకంబునఁ దనగురునియనుగ్రహంబును దన తృప్తిని వెల్లడించుటకును కథాసందర్భము ననువదించుటకును సంజయుఁ డి ట్లనియె.—"సర్వభూతాధివాసం య ద్భూతేషు చ వస త్యపి" అని ప్రసిద్ధం బగు లక్షణము గలవాఁ డగుటవలన వాసుదేవుఁడు సర్వజ్ఞుఁడు పరమేశ్వరుఁడు, అట్టి వాసుదేవుని యొక్కయు; మహాత్మనః = మహానుభావుఁ డగు; పార్థస్య చ=అర్జునునియొక్కయు; సంవాదమ్ = ప్రశ్నప్రతివచనరూపమును; ఇమమ్ = ఈ గీతాగ్రంథమును; అద్భుతమ్ = అత్యంతవిస్మయకరమును; రోమహర్షణమ్ = అశ్రుతపూర్వ మగుటచేతను అతిగంభీర మగుటచేతను అమేయార్థ మగుటచేతను అతిలోకం బగుటచేతను అద్భుతరసం బగుటచేతను రోమాంచము = గగుర్పాటు కలిగించుదానిని; వారిసంవాదమును; అహమ్ = నేను; అశ్రౌషమ్ = విన్నవాఁడ నైతిని.

**మ.** సమాప్తము శాస్త్రార్థము. కథాసంబంధము నిప్పు డనుసంధించి సంజయుఁ డి ట్లనియె —అద్భుతమ్ = చిత్తమునకు విస్మయం బను వికారము కలిగించుదానిని; లోకమునందు అసంభావితం బగుటవలన. రోమహర్షణమ్ = శరీర

మునకు రోమాంచ మను వికారము కలిగించుదానిని, అందుచే విస్మయము మిక్కిలి యధిక మని తెలుపఁబడినది. ఇతరము స్పష్టము.

శ్రీ. ఇట్లు ధృతరాష్ట్రునకు శ్రీకృష్ణార్జునసంవాదమును జెప్పి ప్రస్తుత మగు కథ ననుసంధించినవాఁడై సంజయుఁ డిట్లనియె.—రోమహర్షణమ్ = రోమాంచకర మగు; సంవాదమ్; అశ్రౌషమ్ = విన్నవాఁడ నైతిని. ఇతరము స్పష్టము.

ప. *

రా. ధృతరాష్ట్రునకుఁ దనపుత్త్రులును పాండవులును యుద్ధమున నేమి చేయఁబోయెద రని యడుగుచున్నవానికి సంజయుఁ డిట్లనియె.—ఇతి = ఇట్లు; వాసుదేవస్య = వసుదేవపుత్త్రునియొక్కయు; పార్థస్య = వాని మేనత్తకొడుకుయొక్కయు; మహాత్మనః = మహాబుద్ధియొక్కయు, తత్పదద్వంద్వము నాశ్రయించిన వారియొక్కయు, ఇమమ్; రోమహర్షణమ్; అద్భుతమ్; సంవాదమ్; అహమ్; యథోక్తముగా, అశ్రౌషమ్ = విన్నవాఁడ నైతిని.

వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేత ద్గుహ్య మహం పరమ్
యోగం యోగేశ్వరా త్కృష్ణా త్సాక్షా త్కథయత స్స్వయమ్.

భా. అట్టి దీనిని.—వ్యాసప్రసాదాత్ = వ్యాసులయనుగ్రహము వలన, దానివలన దివ్యదృష్టి లభించుటవలన; ఏతమ్=ఈ సంవాదమును; గుహ్యమ్ = రహస్యమును; పరమ్=ఉత్తమమును; యోగమ్=యోగార్థ మగుటవలన యోగమును; అట్టి యీసంవాదమును; యోగేశ్వరాత్ = యోగములకుఁ బ్రభు వైన; కృష్ణాత్ = కృష్ణునివలన; స్వయమ్ = తానే; కథయతః=చెప్పుచున్నవానివలన; సాక్షాత్=సాక్షాత్తుగా, పరం పరచేఁ గాదు; అహమ్ = నేను; శ్రుతవాన్ = విన్నవాఁడను.

వ్యాసులవారు నాకు దివ్యదృష్టి మొదలగువాని ననుగ్రహించుటవలన యోగేశ్వరుఁ డగు శ్రీకృష్ణుఁడు తనపరమేశ్వరరూపంబునఁ జెప్పుచుండఁగా పరమ రహస్యంబును యోగప్రతిపాదకంబు నగు నీసంవాదమును నేను సాక్షాత్తు విన్న వాఁడ నని తాత్పర్యము.

---

* శ్రీధరీయసమ్మతం.

ఆ. ఉత్తమ మైన సంవాదము నెట్లు వింటివి ? అనగాఁ జెప్పుచున్నారు. అట్టి దీనిని అని. "ఏతత్" అనునది సంవాదపరం బగుటచే పుంలింగముగా గ్రహింపవలయు నని చెప్పుచున్నారు. "ఏతమ్" అని, పరమపురుషార్థోపాయ మగుటవలనఁ బరమును, లేక పరంగుహ్యామ్ అతిశయమునగు రహస్యమును, యోగము-జ్ఞానమును కర్మమును, తదర్థమగుటవలన యోగ మని చెప్పఁబడినది. లేక, చిత్తవృత్తినిరోధ మగు యోగమున కంగ మగుటవలన నీసంవాదము యోగ మని చెప్పుచున్నారు. యోగ మిత్యాదిగా, యోగముల కీశ్వరుఁడు యోగేశ్వరుఁడు, యోగతత్ఫలములు తదనుగ్రహాలభ్యము లగుటవలన, అట్టి కృష్ణునివలన సాక్షాత్తుగా నవ్యవధానంబున విన్నవాఁడు, పరంపరచేఁ గా దని చెప్పుచున్నారు. యోగేశ్వరా దిత్యాదిగా స్వయమ్ తనపారమేశ్వరమగు అతిరస్కృతజ్ఞానైశ్వర్య మయినరూపమున.

హ. వ్యాసుఁడు భగవంతుఁ డగు కృష్ణద్వైపాయనునందు పరమ్=ప్రకృష్టమును, పరమాత్మవిషయ మగుటువలన, యోగమ్ = సమ్యగ్జ్ఞానమును, యోగేశ్వరాత్ = యోగుల కీశ్వరునివలన, సాక్షాత్=ప్రత్యక్షముగా, కథయతః "స్వయమ్" స్వముఖమున.

శ ౦. ఎట్లు వింటి వని యడుగఁగాఁ దనగురునిప్రసాదమువలన నని చెప్పుచున్నాఁడు.——వ్యాసప్రసాదాత్ = వేదములను శాస్త్రములను పురాణములను విరివి చేయుట వ్యాసుఁడు, అట్టి నాగురు వగు శ్రీకృష్ణద్వైపాయనునియొక్క ప్రసాదమువలన-అనుగ్రహమునవలన, దానిచేఁ గలిగిన జ్ఞానశక్తివలన; ఏతత్-దీనికి విధేయప్రాధాన్యంబున లింగనిర్దేశము,ఏతమ్; మోక్షైకసాధన మగుటవలన, పరమ్=అధికముగా;గుహ్యామ్=గోపనీయమును, రహస్యము నని యర్థము; యోగమ్=జ్ఞానయోగమును; అహమ్=నేను; శ్రుతవాన్=విన్నవాఁడను.ఎవనిముఖమునవలన వింటివనఁగాఁ జెప్పుచున్నాఁడు——యోగేశ్వరాత్=యోగములకును హఠాదులకును తత్ఫలసిద్ధికిని కారణమగుటవలన యోగేశ్వరుఁడు, లేక, యోగ మనఁగా మాయాయోగము సృష్ట్యాదికము. తత్కర్త యగుటవలన యోగేశ్వరుఁడు, లేక, యోగము-జ్ఞానయోగము ఆత్యంతికసంసారదుఃఖనివృత్తికిఁ గారణము. తత్సిద్ధి యెవ్వనిప్రసాదమువలననో అతఁడు యోగేశ్వరుఁడు, అట్టి యోగేశ్వరుఁ డగు; సాక్షాత్ కృష్ణాత్=సాక్షాత్తుగా శ్రీకృష్ణునివలననే; స్వయమ్=స్వముఖముచేతనే; కథయతః=చెప్పుచున్న వానివల

వనే; జ్ఞానయోగమును నేను విన్నవాఁడను. అహో నాభాగ్యము! అహో గురుప్రసాదము! అని తనతృప్తిని వెల్లడించె నని యర్థము.

మ. దూరమున నున్నవాఁ డైనను భగవదర్జునసంవాదమును విను యోగ్యత తనకుఁ గలుగుటను జెప్పుచున్నాఁడు వ్యాసులచేఁ దనకుదివ్యచక్షుశ్శ్రోత్రాదులియ్యఁబడుటవలన, తద్రూపమగు వ్యాసప్రసాదమువలన, ఇమమ్ * పరంగుహ్యమ్ యోగమ్ యోగమున కవ్యభిచారిహేతు వగు సంవాదమును; యోగేశ్వరాత్; కృష్ణాత్; స్వయమ్; తనపారమేశ్వరరూపమున; కథయతః; సాక్షాత్తుగానే నేను విన్నవాఁడను, పరంపరచేఁ గా దని తనభాగ్యము నభినందించుచున్నాఁడు. ఇట ఇమమ్ అను పుంలింగపాఠము భాష్యకారులచేవ్యాఖ్యాతము. ఏతత్ అను నపుంసకలింగపాఠమున కే యోగశబ్దసామానాధికరణ్యముచే వ్యాఖ్యానము ఏతమ్ అనునది యని భాష్య వ్యాఖ్యాతలు.

శ్రీ. తనకు దానివినికియందు సంభావనను జెప్పుచున్నాఁడు. "వ్యాసప్రసాదాత్"అని, భగవంతులైనవ్యాసులచే దివ్యచక్షుస్సు దివ్యమైన శ్రోత్రమును నాకీయఁబడినవి. కావుననే వ్యాసానుగ్రహమున దీనిని నే విన్నవాడను. "అది యేది?" అనుచోఁ జెప్పుచున్నాఁడు. పరమైనయోగమును, పరత్వమును దెలుపుచున్నాఁడు. యోగేశ్వరులైన శ్రీకృష్ణులవలన తానుగానే చెప్పుచున్నవానివలన వింటిని, అని.

ప. తరువాత తనకు నిటువంటిదానిని వినుటయందు గలసంభావనను జెప్పుచున్నాఁడు. "వ్యాస"ఇత్యాదిగా. నాసేవచేఁ బ్రసన్నుఁడైనభగవంతుఁ డగువ్యాసునివలన నాకు అలౌకిక మైనచూపు చెవి మొదలయినవి యీయఁబడినవి. దానిచేనే వినఁగలిగితిని. "అదియేది?" అనఁ జెప్పుచున్నాఁడు. పరమమైనయోగమును. పరత్వమునే చెప్పుచున్నాఁడు. యోగేశ్వరుడైన శ్రీకృష్ణునివలన తానుగానే అర్జునునకు చెప్పుచున్నవానివలన వింటిని. అది మహాభారతమున భీష్మపర్వమున సంజయునిచే ధృతరాష్ట్రునకు ఇట్లు చెప్పఁబడినది. "నమస్తస్మై భవత్విత్రే పారాశర్యాయ ధీమతే, యస్య ప్రసాదా ద్దివ్యం మే ప్రజ్ఞా విజ్ఞాన ముత్తమం. దృష్టిశ్చాతీన్ద్రియా రాజన్ దూరా చ్ఛ్రవణమేవ హి, పరచిత్తస్య విజ్ఞాన మతీతానాగతస్య చ. వ్యుత్థోపపత్తి ర్విజ్ఞాన మాకాశే చ గతిం సదా, శస్త్రై రసంగోయుద్ధేచ వరదానా న్మహాత్మనః.

* కొందఱు వ్యాఖ్యాతలపాఠము ఇమం గుహ్యమ్ అని.

ప్రత్యక్షం యన్మయాగృష్టం దృష్టం యోగబలేన చ, శ్రుణు తత్పృథివీపాల మా చ శోకే మనః కృథాః." మీతంర్రియగు బుద్ధిమంతుఁడైన ఆపారాశర్యులవారికి నమస్కారము. ఏవారియనుగ్రహమువలన నాకు దివ్యమగుప్రజ్ఞయు,నుత్తమమయినవిజ్ఞానము నయ్యెనో. రాజా! మఱియు అతీంద్రియమయినదృష్టియు, దూరశ్రవణమును, పరచిత్తవిజ్ఞానము, అతీతానాగతజ్ఞానము, చెప్పుటలో వదలిపోయినదాని నెఱుఁగు నేర్పును విజ్ఞానమును, ఆకాశసంచారము,యుద్ధమునందు శస్త్రములు ఎల్లప్పుడు నన్ను దాకకుండుటయు ఆమహాత్మునివరదానమువలన నాకుఁ గల్గినవి. రాజా! నేను ప్రత్యక్షముగాను, యోగబలమువలనను చూచినది యేది కలదో, అదియంతయు విను. చిత్తము శోకమువంకకు బోనీకుము.

రా. వ్యాసప్రసాదలబ్ధ మయిన దివ్యచక్షుశ్శ్రోత్రలాభమువలన ఈపరమైనయోగమనెడి గుహ్యమును యోగేశ్వరుఁడు అనఁగా జ్ఞానబలైశ్వర్యవీర్యశక్తి తేజస్సులకునిధి యగుభగవంతుడగు కృష్ణునివలన తానుగానే చెప్పుచున్నవానివలన సాక్షాత్తుగా నేను విన్నాను.

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతమ్,
కేశవార్జునయోః పుణ్యం హృష్యామిచ ముహుర్ముహుః. ౭౬

భా. ఓరాజా! ధృతరాష్ట్రా! పుణ్యం = శ్రవణమువలనఁగూడ పాపహరమును, అద్భుతము నైన యీ కేశవార్జునుల సంవాదమును విని, ముహుర్ముహుః=ప్రతిక్షణమును, హృష్యామి=సంతసించుచున్నాను.

ఆ. యథోక్త మయినసంవాదమును భగవంతునివలనవిని యేల యుపేక్షించెదవు? అనఁగా లేదనుచున్నాఁడు. "రాజన్" ఇత్యాదిగా. పుణ్యత్వమును సాధించుచున్నాఁడు. శ్రవణాదపి ఇత్యాదిగా.

హ. *

శం. విని యేమిజేసితివి? అనుచో మితిమీఱి సంతసించితిని అనుచున్నాడు. పుణ్యం=పుణ్యకరమైనదియు, పావనం శ్రవణపఠనములచేత జ్ఞానాజ్ఞానకృతసర్వపాపవిధ్వంసకమైన నేనువిన్న యీగీతాఖ్యగ్రంథమును తేపతేపకు తలచితలచి

* విశేషము లేదు.

సంతోషించుచున్నాను. నేను జన్మాంతరశతములయందు ఎట్టిపుణ్యము చేసితినో, ఎట్టి తపముచేసితినో, ఏమిదానముచేసితినో, ఏమి హోమమొనరించితినో, యేమి చూచితినో, యెఱుఁగను. ఆమహాపురుషుల యిట్టిసంవాద గ్రంథమగు గీతాశాస్త్రమును విన్నానే!

మ. శ్రవణముచేఁగూడ సర్వపాపహరమైన కేశవార్జునుల యీయద్భుతమగు సంవాదమును నేను వినుటమాత్రమా! మఱి తలఁచుకొని తలఁచుకొని తేపతేపకును హర్షముఁ జెందుచున్నాను. ప్రతిక్షణము రోమాంచితుండ నగుచున్నాను.

శ్రీ. *

ప. వ్యాసప్రసాదసామర్థ్యమునే అనువదించుచున్నాడు. రాజా! అద్భుతమైన యీ కేశవార్జునులసంవాదమును ఒక్కమారు విన్నవాడనైనను స్మరణారూఢము చేసికొని మఱల యథావత్తు జ్ఞాపకముచేసికొని, నాయందు ఇది యిట్లు నెలకొన్నదిగదా యని రోమాంచితుఁడనై కృతకృత్యుఁడ నైతిఁగదాయని హర్షము జెందుచున్నాను.

రా. †

తచ్చ సంస్మృత్యసంస్మృత్యరూపమత్యద్భుతం హరేః,
విస్మయోమే మహాన్ రాజన్ హృష్యామిచ పునఃపునః. ౭౭

భా. రాజా! భగవంతుని అత్యద్భుత మగు నావిశ్వరూపమును తలంచుకొన్నచో నాకు మహా దాశ్చర్యము కలుగుచున్నది. మాటిమాటికిని పొంగి పోవుచున్నాను.

ఆ. భగవంతుఁడు అర్జునునకుఁ జూపించిన యే సగుణమగువిశ్వరూపము కలదో ధ్యానముకొఱకు; దాని నిప్పుడు స్తుతించుచున్నాఁడు. "తచ్చ" ఇత్యాదిగా.

హ. ‡

శం. విశ్వరూపసందర్శనమువలన నైనతృప్తిని వర్ణించుచున్నాడు. హరేః=స్వసాక్షాత్కారమాత్రముచేతనే అవిద్యను తత్కార్యమును హరించును,

* మధుసూదనతుల్యము. † వివియు విశేషములేదు. ‡ విశేషమేమియులేదు.

తనయందే తిరోభావము చెందుచును గనుకహరి. సచ్చిదానందరూపుఁడు పరమేశ్వరుఁడు. ఆయనయొక్క "అనన్తబాహుం శశిసూర్యనేత్రం"అని ఉక్తలక్షణమైన ఆవిశ్వరూపమును, మహాశ్చర్యకరము. మాటిమాటికి దానిని తలఁచితలఁచి హర్షమునందుచున్నాను. ధన్యుఁడను ధన్యుఁడను. కృతకృత్యుఁడను అని సంతోషసముద్రములో నోలలాడుచున్నాను.

మ. *

శ్రీ. †

వ. కృష్ణార్జునుల పరస్పరసంభాషణమువలన నాహరియొక్క అద్భుతవిశ్వరూపమును వింటినేకాని కన్నులార చూచినవాఁడఁ గాను. అట్లయినను మొదట అక్షరాత్మకముగా స్మరణమునకు దెచ్చుకొని, పిదప నాయర్థమునైతము మననము జేయగా, రాజా! నాకు మిగుల నాశ్చర్యమగుచున్నది. ఆహా! యేమాయర్జునుని భాగ్యము? దేవతలకును చూడరానికృష్ణపరమాత్మయొక్క సమిష్టిరూపమును చూచినాఁడే! సకలాగమగోచరుఁడైనను పరమాత్మ కృపచే పారమార్థికమైనరూపమును చూపించెనే యని యాశ్చర్యపోయినవాఁడనగుటచే తేపతేపకు రోమహర్షము మున్నగు నీమిది సాత్త్వికభావముల యుద్రేకము గలవాడ నగుచున్నాను అట్లే విశ్వరూపసందర్శనకథ చెప్పునప్పుడు "ద్రోణంచ భీష్మంచ" ఇత్యాదిభగవద్వాక్యములను, అట్లే "అమీచ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః" ఇత్యాద్యర్జునవాక్యములను నీవు నావలన వినియే యుంటివి.

రా. ‡

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతిర్మతిర్మమ. ౭౮

భా. పెక్కుమాటలేల? యేపక్షమునందు సర్వయోగములకు నీశ్వరుఁడును ఆయనయందే పుట్టినవి గనుక సర్వయోగములకు బీజమును నగు శ్రీకృష్ణపరమాత్మయు, గాండీవధారియగు నర్జునుఁడును నుండిరో, అట్టిపాండవపక్షమందే శ్రీయు,విజయమును, అచ్చటనే భూతియు, అనఁగా

---

* ఆనందగిరివలె. † విశేషములేదు.

‡ విశేషములేదు.

శ్రీయొక్క విశేషవిస్తారమును అవ్యభిచారిణి యగు నీతియును నుండనాయె
నని నాయాశయము.

శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యకృత గీతాభాష్యము సమాప్తము.

---

**ఆ.** కృష్ణార్జును లిరువురును నరనారాయణులే కావున వారిసంవాదముయొక్క ప్రామాణ్యముకొఱకు ఉత్కర్షమును కనఁబఱచుచున్నాఁడు.-"కిం బహునా" ఇత్యాదిగా. ఎట్లు భగవంతుఁడు సర్వయోగములకు నీశ్వరుఁడగుట? అనుచోఁ జెప్పుచున్నాఁడు. "తత్ప్రభవత్వాత్" ఇత్యాదిగా. సర్వయోగము, జ్ఞానము దానికి బీజమైనశాస్త్రీయమగు జ్ఞానవైరాగ్యాదికము నివి భగవదధీనములే కావా? తదనుగ్రహము లేనివానికి అవి లేవు! కావున యోగము, తత్ఫలమును భగవదాయత్తములే. అగుటచే భగవంతునకు యోగేశ్వరత్వమని యర్థము. శ్రీః=లక్ష్మి, విజయః=పరమోత్కర్షము, ధృతరాష్ట్రమహారాజునకు తనకొడుకులు గెలువగలరనెడియాశను శిథిల పఱచి పాండవులకే తప్పక విజయమని ముగించుచున్నాఁడు "ఇత్యేవం"ఇత్యాదిగా. ఉపాయము, ఉపేయము నని రెండునిష్ఠలు చెప్పఁబడినవి. అందు కర్మనిష్ఠ పరంపరగా జ్ఞాననిష్ఠకు హేతువు. జ్ఞాననిష్ఠయో సాక్షాత్తుగానే మోక్షహేతువని శాస్త్రార్థమును ముగించుటకునై "ఇతి" అనిచెప్పఁబడినది.

భగవదానన్దగిరివిరచిత శ్రీగీతాభాష్యవివేచనము సమాప్తము.

**హ.** *

**శం.** యోగేశ్వరః = తేజోబలపౌరుష విద్యారాజ్యజయధనధాన్యపుత్రపౌత్రాద్యభ్యుదయములఘటనలు యోగములు, వానికి నీశ్వరుండు, ఒండె, "విద్యావిద్యేఈశతే యస్తు సోన్యః" † అనుదానివలన, వీనిచే కలియఁబడునుగనుక యోగములు. అనఁగా విద్యావిద్యలు, వీనిని ఏలఁగలవాఁడుగనుక యోగేశ్వరుఁడు, మఱియు, వీనిచేఁ జిత్తముసమాధానపడుచున్నది గనుక యోగములు, ఐహికాముష్మికసుఖవిశేషములు, కర్మసాధ్యములు ఉపాస్తిసాధ్యములు; వాని నీయఁగలవాఁడు కావున యోగేశ్వరుఁడు. కాదేని, యోగమనఁగా జ్ఞానయోగము గాని కర్మయోగముగాని, వానిఫలసిద్ధియు నీశ్వరాధీనమే కావున యోగీశ్వరు. "సంసారమోక్షస్థితి బంధహేతుః. శ్రుతి. ఇట్టివాఁడగు శ్రీకృష్ణపరమాత్మ

---

* భాష్యతుల్యము. † విద్యావిద్యలను పాలించువాఁడెవఁడో, వాఁడు పరుఁడు.

యేపక్షమందుండునో, ధనుర్విద్యాపారగుతుఁడును అతిరథుఁడును గాండీవధారి యర్జునుఁ డేపక్షమున నుండునో, అపక్షముననే తొలగనినీతి = శాస్త్రదృష్టమై మర్యాదనిలచును. ధర్మమచ్చటనే వసించునని యర్థము. "యతోధర్మ స్తతోజయః" అనున్యాయముచే విజయమును నచ్చటనే యుండునని యర్థము. నిశ్చలమైన రాజ్యలక్ష్మియు నచ్చటనే యుండును. భూతిః=గజతురగధనధాన్యాదిసంపత్తియు నచ్చటనే ధ్రువా=నిశ్చలమై యుండు నని నానిశ్చయము. కావున నీవుకొడుకులు గెలుతురను నాస వీడుమని యర్థము. గురువులు భ్రాతలుమున్నగువారిం జంపుటయను నీఘోరకర్మ నొనర్చి పాపినై నరకమునకుఁ బోవఁగలను అని యనాత్మకర్తృకమైన కర్మయం దకర్తయగుతనను కర్తగాను నభోక్తయగుతనను భోక్తగాను తలచుకొని మోహముచే శోకించుచు మోహసాగరములోఁ మునిఁగియున్నయర్జును నుద్ధరింప నాత్మయాథాత్మ్యవిజ్ఞానముకంటె వేఱొండుసాధనము లేదు. ఆయాత్మయాథాత్మ్యజ్ఞానమును తత్త్వంపదార్థశోధనచే నైన యేకత్వప్రతిపాదనముచేగాక వేఱొండు దానిచే సిద్ధింపనేరదు. ఇందువలన నీతత్త్వంపదములను శోధింపవలెనని "నత్వేవాహం జాతునాసం" అని తొడంగి మొదటి యారధ్యాయములచే త్వంపదార్థమును శోధించి, నడిమియారధ్యాయములచే తత్పదార్థమును శోధించి, కడపటియారధ్యాయములచేతను ఆరెంటికి నైక్యముప్రతిపాదించి, కర్తృత్వభోక్తృత్వాద్యవిద్యాతత్కార్యసంబంధరహితమును, సర్వసంసారధర్మ నిర్ముక్తమునగు నాత్మతత్త్వమును బోధించి ఆబోధమునకు నేవిధమైన ప్రతిబంధమును గలుగకుండుటకు జ్ఞాననిష్ఠ నుపదేశించి తత్పరిపక్వజ్ఞానముచేత, "భక్త్యామామభిజానాతి యావా న్యశ్చాస్మి తత్త్వతః, తతోమాం తత్త్వతోజ్ఞాత్వా విశతే తదనన్తరమ్." అని యాత్మయాథాత్మ్యావధారణమును దానిచే బ్రహ్మప్రాప్తియుఁ జెప్పఁబడినది. తర్వాత సర్వమయిన గీతాశాస్త్రమందును చెప్పఁబడినది ప్రత్యగభిన్నబ్రహ్మమే, తజ్జ్ఞానమే మోక్షసాధనమని ముగింపఁబడినది. అట్లే సంపూర్ణగీతాశాస్త్రము శ్రవణముచేసిన యర్జునుని యొక్క యనుభవాహ్లాదమయిన "నష్టోమోహః స్మృతిర్లబ్ధా" యనువచనమును, జ్ఞానముచే నజ్ఞాననివృత్తిని, తత్ఫలభూతమయినయాత్మలాభమును బోధించుచున్నది. ఇందుచే జ్ఞానమే మోక్షమునకు పరమకారణమని సిద్ధమైనది. అట్లే "జ్ఞానాదేవతుకైవల్యం" "తమేవవిదిత్వాతిమృత్యుమేతి నాన్యఃపన్థా విద్యతేఽయనాయ" అనిశ్రుతి. "ఏషాతేఽభిహితాసాంఖ్యే" అని జ్ఞానయోగ ముపదేశించి, తానుపదేశించినజ్ఞానము సంపాదించుటలోఁ బురుషుని ప్రజ్ఞామాంద్యమును కనిపెట్టి "బుద్ధి

ర్యోగే త్వమాం శ్రుణు" అని కర్మయోగము నుపక్రమించి "బుద్ధౌ శరణమన్విచ్ఛ, యోగః కర్మసు కౌశలం" అని జ్ఞానయోగమును గూడ మరల ప్రస్తుతించి "జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం" అని ఆ రెంటికి విషయభేదవ్యవస్థను చేసి, రాజస తామస త్యాగ నిందాపూర్వకముగా సాత్త్వికత్యాగమునకే శ్రేష్ఠత్వము చెప్పి, అదియు పరమేశ్వరప్రీతికే చేయఁదగినదని నిశ్చయించి, కర్మనిష్ఠచే పరిశుద్ధమైన చిత్తముగలవాఁడై, జ్ఞానమును పొందినవానికి జ్ఞాననిష్ఠ యేర్పఱుపఁబడినది. అందుచే కర్మయోగము జ్ఞానయోగమునకు సాధనమగునే కాని సాక్షాత్తుగా మోక్షకారణము కాదని ఇట్లే సిద్ధాంతము చేయఁబడినదై యున్నది. ఇచ్చట గీతలలో జ్ఞానకర్మయోగములు రెండుమాత్రమే ఉపక్రమోపసంహారములలో నుండుటవలన మఱియొక యోగమెద్దియు నిందు ప్రధానముగా నున్నట్లు తోఁచదు. అమానిత్వ అద్వేష్టృత్వ శుద్ధబుద్ధిత్వాదు లెల్లను జ్ఞానమునకును తత్ఫలసిద్ధికిని సాధనములో, అట్లే ముముక్షుత్వ నిష్ఠావత్త్వ సాత్త్వికశ్రద్ధా భక్తిమత్త్వాదులు కర్మఫలసిద్ధసాధనములు అని సిద్ధమయినది. సర్వమును అనవద్యము.

శ్రీశంకరానంద సరస్వతీ కృత గీతాతాత్పర్యబోధిని సమాప్తము.

---

మ. యే యుధిష్ఠిరపక్షమున సర్వయోగములకు నీశ్వరుఁడును, సర్వజ్ఞుఁడు సర్వశక్తియు భగవంతుఁడునగు కృష్ణుడు భక్తదుఃఖకర్షణుఁడు నారాయణుఁడు కలఁడో, యెచట గాండీవధన్వుఁడర్జునుఁ డుండెనో, ఆపక్షమునమాత్రమె రాజ్యలక్ష్మి విజయః=శత్రుపరాజయనిమిత్తమైన యుత్కర్షమును, భూతిః=రాజ్యలక్ష్మియొక్కయు, యుత్తరోత్తరవివృద్ధియును నవశ్యము నుండితీఱునని యంతటను అన్వయించుకొనునది. కావున వృథ యగునీపుత్రజయాశను విడిచి భగవత్ప్రదత్తములైన లక్ష్మీవిజయాదిసముపేతులయిన పాండుపుత్రులతోఁ నొడంబడి మనఁజెల్లుడని యభిప్రాయము.

శ్రీమధుసూదనసరస్వతీవిరచిత శ్రీభగవద్గీతాగూఢార్థదీపిక సమాప్తము.

---

శ్రీ. కావున నీవు నీకొడుకుల రాజ్యాదిశంకను వదులుకొమ్మను నభిప్రాయముతో జెప్పుచున్నాడు. యత్రేత్యాదిగా. ఇందువలన ఇంతటనైనను నీవు కుమారులతోఁ గూడినవాడవై కృష్ణపరమాత్మను శరణముపొంది పాండవులను

ప్రసన్నులను జేసికొని సర్వస్వమును వారలకు నివేదించి పుత్రుల ప్రాణరక్షణము చేయుము అని భావము.

భగవద్భక్తియుక్తస్య తత్ప్రసాదాత్మబోధతః,
సుఖంబంధవిముక్తిస్స్యా దితి గీతార్థసంగ్రహః.

అట్లే కదా!—"పురుషస్సపరః పార్థ భక్త్యాలభ్యస్త్వనన్యయా భక్త్యా త్వనన్యయా శక్యఅహహమేవం విధోఽర్జున" ఇటువంటిస్థలములలో భగవద్భక్తి మోక్షమునకు సాధకతమమని యుండుటవలన తదేకాంతభక్తియే తత్ప్రసాదోత్థ జ్ఞానావాంతరవ్యాపారమాత్రయుక్తమై మోక్షమునకు హేతువగునని స్ఫుటముగాఁ దోచుచున్నది. జ్ఞానమన భక్తియొక్కయవాంతవ్యాపారమనుటయే యుక్తము "తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తితే మద్భక్తఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే." ఇత్యాదివచనముల వలన జ్ఞానమే భక్తియనుట పొసంగదు. "సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరాం భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః" ఇటువంటిస్థలములలో వేఱుగా నిర్దేశించుటవలన. ఇట్లన్నందున "తమేవ విదిత్వాతిమృత్యుమేతి నాన్యః పంథావిద్యతే ఽయనాయ" ఇత్యాది శ్రుతివిరోధమని శంకింపరాదు. జ్ఞానమనునది భక్తియొక్క అవాంతరవ్యాపారము గనుక. "కట్టెలతో వంటచేయుచున్నాడు" అన్నప్పుడు జ్వాలలు సాధనములు కావని చెప్పుటకాదు. "యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ, తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశన్తేమహాత్మనః, "దేహాన్తే దేవః పరం బ్రహ్మ తారకం వ్యాచష్టే, యమేవైష వృణుతే తేన లభ్యః" ఇత్యాది శ్రుతిస్మృతిపురాణవచనములు ఇట్లు చెప్పిననే సమంజసములు కాఁగలవు. అందుచే భగవద్భక్తియే మోక్షహేతువని సిద్ధమైనది.

ఇది శ్రీధరస్వామివిరచిత సుబోధినీటీకయందు మోక్షయోగమనునది పదు *నెనిమిదవయధ్యాయము సర్వము సంపూర్ణము.

వ. *

రా. ఎచట యోగేశ్వరః = నానావిధరూపములచేనున్న చేతనములు నచేతనములు నైనసమస్తవస్తువులయొక్క స్వభావయోగము లేవి కలవో వానికన్నిటికి నీశ్వరుఁడు. స్వసంకల్పాయత్తములైన తనకంటెవేఱైన సమస్తవస్తుస్వరూప స్థితి

* విశేషము లేదు.

ప్రవృత్తి భేదములు కలవాఁడైన వసుదేవసూనుఁడైన కృష్ణుఁడుండునో, యెచట ఆయ నమేనత్తకొడుకును ధనుర్ధరుఁడును వారిపాదద్వంద్వములే ఆశ్రయముగాఁ గలవాఁడును నగుపార్థుఁడుండునో, అచట శ్రీయు, విజయము, భూతి, నీతియు, ధ్రువాః—నిశ్చలములని నాయభిప్రాయము.

ఇది శ్రీభగవద్రామానుజ విరచిత శ్రీమద్గీతాభాష్యమున అష్టాదశాధ్యాయము.

---

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే మోక్షయోగో నామాఽష్టాదశోఽధ్యాయః.

వ్యాసప్రోక్తమయిన శతసహస్రగ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రంబును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు సన్న్యాసయోగం బనంబరఁగు అష్టాదశాధ్యాయము ముగిసెను.

---

ఇది శ్రీమత్తవాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవద్గీ
తాంధ్రవ్యాఖ్యానంబునందుఁ
అష్టాదశాధ్యాయ టీక.

---

శ్రీ

శ్రీ కృష్ణాయ నమః.

# శ్రీమద్భగవద్గీత

చదలువాడ సుందరరామశాస్త్రులచే

వ్రాయఁబడిన గీతార్థసర్వస్వరూపమగు

## పరమార్థచంద్రిక

యను నాంధ్రవ్యాఖ్యానముతోఁ గూడినది.

త్రయోదశ చతుర్దశ పంచదశ షోడశాధ్యాయములు

సంపుటము ౫.

చెన్నపురి:

శారదాంబావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రితమయి ప్రకటింపఁబడెను.



1924

శ్రీ కృష్ణాయనమః.

# విజ్ఞాపిక.

---

దేయా ద్భద్రాణి వ శ్శ్రీమా న్మాయామానుష వేషభృత్
కిరిపద్మలసత్తోత్రః వరదః పార్థసారథిః.

శ్రీమ ద్భగవత్ప్రసాదమున నింతకాలమునకు వెండియుఁ బరమార్థచంద్రికా సహితంబగు నీ శ్రీమద్భగవద్గీతను బ్రకటించుభాగ్యంబు గంటిని. వెండియు నీ పరమపవిత్ర గ్రంథమును నిరీక్షించుచుండు పరమభాగవతులకు హృదయా నందము గలిగింప నవసరము లభించె నని పరమసంతోషము నొందుచున్నాను. శ్రేయాంసి బహు విఘ్నాని అను న్యాయంబున నా ప్రయత్నమున కెన్నియో విఘ్నములు నాకును ఎన్నియో కష్టములు సంభవించినవి. ఇల్లిదాఱు సంవత్సరములు బహువిధవిఘ్నములవలన నిమ్మహాకార్యము దుర్వహంబై యుండినను ఇప్పటికి నేతదారంభము సేయు మహాభాగ్యము కలిగెను. భావికల్యాణు లగు పుణ్యవంతుల సాహాయ్యమున త్రయోదశ చతుర్దశ పంచదశ షోడశాధ్యాయముల పూర్తి గావింపఁ జాలితిని.

ఇంతలకుఁ బాటిల్లిన మహావిఘ్నములు పెక్కండ్రకుఁ దెలియనివి కావు. పాశ్చాత్యమహాసమరసంరంభమువలనఁ గాగితములకును ఇతరములయిన ముద్రోపకరణములకును అశక్యక్రయణం బగు మూల్యము హెచ్చెను. కుటుంబమునందు నాకు దుస్సహము లయిన కష్టములు సంభవించెను. ఇన్నిటికిని దోడు నాకుఁ గన్నులు కానరాక రెండుసంవత్సరములు చేవ్రాలు సయితము చేయఁజాలక యుంటిని. ఇప్పు డితరకష్టము లనువర్తించుచునే యున్నను నయనంబులకు భగవదనుగృహీతం బగు చికిత్సచే దర్శనశక్తి లభించెను. మరల నయనానందముగా గ్రంథములు చదువను వ్రాయనుం జాలు సంపదను బ్రాపించితిని. ఈ భగవత్ప్రసాదంబునకు ముఖ్య ఫలముగా శ్రీమ ద్భగవద్గీత యవశిష్టాధ్యాయము లన్నిటికిఁ బూర్వ నియమంబునఁ బరమార్థచంద్రిక యను నాంధ్రవ్యాఖ్యానమును వ్రాసి సమగ్రముగా గ్రంథపూర్తి గావించితిని.

ఏతద్గ్రంథ ప్రకటనము [illegible]మొదటనుండి ద్వాదశాధ్యాయ పరిపూర్తివఱకు నిర్విఘ్నముగా జరగెను. [illegible]తఁ ద్రయోదశాధ్యాయము మొదటి సంచిక అనఁగా ౨౮ వ సంచికను [illegible]రించి చందాదారులకుఁ బం[illegible]. అటుపిమ్మటఁ

గాగితములు దొరకనందునఁ గార్యము నిలుపవలసి వచ్చెను. అప్పు డప్పుడు దొరకి నను మూల్యము కొన నశక్య మయ్యెను. కాలము జరిగెను. అంత మహారాజశ్రీ విడవలపాటి సుబ్బరామయ్యసెట్టిగారును తత్పౌత్రులగు తన్మిత్రులును అప్పటికిఁ బని జరగించుటకుఁ దగు ధనసాహాయ్యము గావించిరి. మఱియు వేలూరు జిల్లా వందవాసి తాలూకా మరుదాడు గ్రామ వాస్తవ్యులగు మహారాజశ్రీ దే - ఆదినారాయణరెడ్డిగారును పెల్లేటి కృష్ణారెడ్డిగారును నన్నుఁ దమగ్రామమునకుఁ దోడ్కొని పోయి యక్కడ సన్న్యాసనిష్ఠాపరినిష్ఠితులై యున్న శ్రీ గురుస్వామిగారును తాముసు స్వహస్త పరహస్తముల బహు ధనము సేకరించి యొసంగి బహువిధముల సంభావించిరి. వారిసాధుస్వభావ మసాధారణము. అయినను త్రయోదశాధ్యాయము మూఁడుభాగములకన్నను ఇంచుక యధికముగా ముద్రిత మయ్యెను గాని నాకు నానాఁటికి నేత్రమాంద్య మధికమగుటవలనఁ జేయునదిలేక కార్యము నిలుపవలసి వచ్చెను. ఇట్లు రవూరమి మూఁడుసంవత్సరములు చెల్లెను. అనంతరము భగవత్సంకల్ప మనుకూలించుటవలన నా నేత్రములు చికిత్సితములై సమగ్రదర్శన పాటవము నొందెను. అంతకుమున్నె నేను నామిత్రులగు బ్రహ్మశ్రీ కొండగుంట ఆదిశేష శాస్త్రుల వారిచే మూలగ్రంథములను వారిచేతనే చదివించి విని యందులకుఁ దెనుఁగు చెప్పి చతుర్దశ పంచదశాధ్యాయములకుఁ బరమార్థచంద్రిక వ్రాయించి యుంటిని. ఇందులకు నొకసంవత్సరము పట్టెను. భగవంతుఁడు నాకుఁ గన్నులొసంగిన పిదప వేంకటగిరినగరమున వసించి యుండి తక్కిన షోడశ సప్తదశ శాస్త్రాదశాధ్యాయముల కాంధ్రవ్యాఖ్యానము నేనే వ్రాసి యుమ్మహాగ్రంథము పరిపూర్తి గావించి ధన్యుఁడనైతిని. ఈ నాలుగుసంవత్సరములును నన్నును నాకుటుంబమును మహాధనవ్యయముచే నత్యంత సమ్మానపూర్వకముగాఁ బోషించి యాదరించిన వారును సౌశీల్యాది కల్యాణ గుణగణాలంకృతులు నగు వేంకటగిరి సంస్థానము కుమారరాజాగారైన మహారాజరాజశ్రీ శ్రీ రాజా వెలుగోటి సర్వజ్ఞకుమారకృష్ణయాచేంద్ర బహదరు వారే యేతచ్ఛ్రీయోమూలంబగు పరమేశ్వరప్రసాదమునకు ద్వారభూతులగుటవలన నక్కుమారరాజునందు నిరతిశయములగు సకల శ్రేయంబులును నిరపాయముగా నెలకొని యుండునట్లు ప్రసాదింపవలయునని యప్పరమేశ్వరునిఁ బ్రార్థించుచున్నాను.

ఎంత ధనమైనను సహస్రావధి గాని లక్షావధి గాని క్షణములోన లభింప వచ్చును. కాని మహాగ్రంథము సావధానబుద్ధితో విచారపూర్వకముగా విషయము పరిశీలించి రచియించినం గాని లభింపనేరదు గదా! కావున గ్రంథరచన పరిసమాప్తమయినంతనె పరమానందము నొందితిని. ఇఁక నేతత్ప్రకటనము సిద్ధప్రాయం బని చిత్తమున ధైర్యము కలిగెను. అ నేను చెన్నపట్టణమునకు వచ్చిన తరువాత న త్రులును వేదాంతశాస్త్రమ గాఢశ్రద్ధాభక్తి సమన్వితులు

నగు మహారాజశ్రీ నాతా నంబెరుమాళ్లుసెట్టిగారితో నేతద్విషయముఁ బ్రస్తావించు తఱి వారు గ్రంథమంతయు సమగ్రముగా సిద్ధమగుటకు నత్యంతసంతోషము నొంది యనుపదమే యేతన్ముద్రణము నారంభింప నుత్సుకులైరి. వారు పంచదశాధ్యాయ ముద్రణవ్యయము వహింప నిశ్చయించిరి. వారి ప్రేరణమువలన వారి యనుజులగు మహారాజశ్రీ నాతా ఆళ్వారుసెట్టిగారు చతుర్దశాధ్యాయముద్రణంబునకును తత్పితృవ్యపుత్త్రులగు మహారాజశ్రీ నాతా చెల్వపిళ్ళసెట్టిగారు షోడశాధ్యాయముద్రణంబునకును వలయు ధనం బొసంగిరి. ఇట్టి యసాధారణం బగు భగవత్ప్రసాదము నాతా వంశరత్నము లగు నీ ముగ్వురియందు సంక్రాంత మగుటవలన నేతద్ద్వారమునఁ ద్రయోదశాధ్యాయశేషమును జతుర్దశ పంచదశ షోడశాధ్యాయములను ముద్రించి యీ మహాగ్రంథమునభ్యుదయము నిరీక్షించుచుండు మహాభాగవతులకు నయన హృదయానందము గలిగించు భాగ్యము నాకుఁ బ్రాప్తించెను. ఏతాదృశులగు పరమేశ్వరానుగ్రహ భాజనభూతు లయిన మహాపురుషుల యాదరమునే నిరీక్షించి సప్తదశాధ్యాయము ముద్రింపించుచున్నాను.

త్రయోదశము మొదలు సప్తదశాంత మగు గ్రంథము జ్ఞానయోగం బనంబడుచున్నది. అందుఁ ద్రయోదశము ప్రకృతిపురుషు లనంబరఁగు క్షేత్ర క్షేత్రజ్ఞుల విభజించి క్షేత్రజ్ఞాత్మైక్యము బోధించునది యగుటవలన క్షేత్రక్షేత్రజ్ఞయోగం బనఁబడును. చతుర్దశము క్షేత్రజ్ఞాత్మైక్యజ్ఞానమునకు సాధనం బగు గుణాత్యయము బోధించునది యగుటవలన గుణత్రయవిభాగయోగం బని చెప్పఁబడుచున్నది. పంచదశము గుణాత్యయమునకు సంసారవృక్షచ్ఛేదంబునకు నుపాయ మగు వైరాగ్యమును బోధించి విభూతిసంక్షేపకథనపూర్వకముగా క్షరాక్షరపురుషుల విభజించి పురుషోత్తమ తత్త్వమును బ్రతిపాదించునది యగుటవలనఁ బురుషోత్తమయోగం బను నామము నొందెను. షోడశాధ్యాయము పురుషోత్తమప్రాప్తికి సాధనం బగు దైవసంపదను నిరూపించుచుఁ దత్ప్రతిబంధక మగు నాసురసంపదను బ్రతిపాదించి యాసురసంపత్పరిత్యాగపూర్వకముగా దైవసంపత్సంపాదనంబున కుపాయమును బోధించునది యగుటవలన దైవాసురసంపద్విభాగయోగం బనం బరఁగుచున్నది.

ఈ నాలుగధ్యాయములును సంపుటమునకుం దగు పరిమాణము గలవి యగుటవలన నివి యొకసంపుటముగాఁ గట్టింపఁబడెను. దీని క్రయము రు. ౫-౪-౦
వి. పి. రు. ౬-౮-౦

ఈ యారంభము నిర్విఘ్నమై సమగ్రగ్రంథ పరిసమాప్తి సిద్ధించునట్లు భగవంతుఁడును తద్రూపులగు భాగవతులును బ్రసాదింతురు గాత.

తేషాం సమ్మానా ది[illegible] మయతా మృద్ధిం కృతి ర్మోదారామ్
యేషాం దర్శనపథ [illegible] మేష్యతి భగవత్కృపాయోగాత్.

శ్రీరస్తు.

# అకారాదిశ్లోకానుక్రమణిక.

## త్రయోదశాధ్యాయము.



## చతుర్దశాధ్యాయము.

## పంచదశాధ్యాయము.



దీశికము. తనకం[illegible] [illegible]నితి

షోడశాధ్యాయము.

శ్రీరస్తు.
శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.

పరమార్థచంద్రికాసహిత

# శ్రీభగవద్గీత, త్రయోదశాధ్యాయము.

తత్త్వంపదార్థశోధనసిద్ధైక్యస్ఫూర్తిరూపిణీ సాక్షాత్
బన్ధచ్ఛేదఫలా యా తాం విద్యా మద్విబకాం వన్దే.
ఉపదిశ్య కర్మభక్తీ భక్తా న్నైష్కర్మ్యం తథా వివక్షు ర్యః
క్షేత్రజ్ఞతత్త్వ మూచే కృష్ణం వన్దే త మాత్మానమ్.

శ్రీభగవా నువాచ.—

ఇదం శరీరం కౌన్తేయ క్షేత్ర మి త్యభిధీయతే
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ మితి తద్విదః.

శంకరభాష్యము.—

సప్తమాధ్యాయంబున రెండుప్రకృతు లీశ్వరునివి సూచింపఁబడినవి. అందుఁ ద్రిగుణాత్మకమై యెనిమిదివిధంబుల భిన్న మయినది యపర ప్రకృతి, సంసారహేతు వగుటవలన; ఇతరము జీవభూతము క్షేత్రజ్ఞలక్షణం బీశ్వరాత్మకము పరప్రకృతి. ఆరెండుప్రకృతులచేతనే యీశ్వరుఁడు జగదుత్పత్తిస్థితిలయహేతుత్వము నొందుచున్నాఁడు. అట్లు కావున, క్షేత్రక్షేత్రజ్ఞలక్షణం బగు ప్రకృతిద్వయము నిరూపించుద్వారంబునఁ దద్విశిష్టుం డగునీశ్వరునితత్త్వము నిర్ధారించుకొఱకు క్షేత్రమ్ ఇత్యాది ప్రారంభింపఁబడుచున్నది. అతీతానంతరాధ్యాయమునయిన దేహమును సర్వభూతానా మిత్యాదిగా నధ్యాయపరిసమాప్తిదున్నారు ఏత దిత్యాదిగా. సన్న్యాసుల నిష్ఠ, వా రెట్లు వర్తించుచున్నా[illegible]దేశికము—దేహము ఆత్మ కాద[illegible]త్త్వజ్ఞానముతోఁ గూడినవారై వా[illegible]తనకంటె భిన్నముగా నని లక్షింతునకుఁ బ్రియు లగుచున్నారో దా[illegible]ద నితిశబ్దము క్షేత్రజ్ఞశబ్దవిషయ[illegible] మూతది

భింపఁబడుచున్నది. త్రిగుణాత్మక మగు ప్రకృతియును సర్వకార్యకరణ విషయాకారంబునఁ బరిణతమై పురుషునకు భోగాపవర్గముల సాధించుటకై దేహేంద్రియాద్యాకారంబున సంహత మగుచున్నది. ఆయీసంఘాతమే యీశరీరము; అదియే.—ఇదమ్ = ఇది; శరీరమ్ = శరీరము, ఇద మ్మని సర్వనామముచేఁ జెప్పఁబడినదానికి శరీర మ్మని విశేషణము చేయుచున్నాఁడు; కౌన్తేయ=ఓయర్జునా! క్షతత్రాణంబువలన * క్షయమునలన క్షరణమువలన, లేక, క్షేత్రమునందుంబోలె దీనియందుఁ గర్మ ఫలము నిర్వృత్త మగుటవలన, క్షేత్ర మితి=ఇతిశబ్ద మేవంశబ్దార్థకము, క్షేత్ర మని; అభిధీయతే=చెప్పఁబడుచున్నది. ఏతత్=ఈశరీరమును; యః= ఎవ్వఁడు; వేత్తి=ఎఱుంగుచున్నాఁడో, ఆపాదతలమస్తకమును స్వాభావిక మగుజ్ఞానముచే విషయీకరించు చున్నాఁడో, ఔపదేశిక మగుజ్ఞానముచేఁ గాని విభాగమున విషయీకరించుచున్నాఁడో; తమ్=అజ్ఞాతను; క్షేత్రజ్ఞ ఇతి=ఇతిశబ్ద మేవంశబ్దార్థకము పూర్వమునందువలె, క్షేత్రజ్ఞుఁడని; ప్రాహుః=చెప్పుచున్నారు. ఎవరు? తద్విదః=ఆక్షేత్రక్షేత్రజ్ఞులను ఎవ్వరు ఎఱుంగుదురో వారు.

శ్రీభగవంతుఁ డిట్లనియె.—అర్జునా! ఈశరీరము క్షేత్ర మని చెప్పఁబడుచున్నది, దీని నెవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడు క్షేత్రజ్ఞుఁ డని క్షేత్రక్షేత్రజ్ఞుల నెఱింగినవారు చెప్పుచున్నా రని తాత్పర్యము.

ఆనందగిరికృత టీక.—

ప్రథమమధ్యమషట్కములయందుఁ ద్వంతత్పదార్థములు నిరూపింపఁబడినవి. ఇఁక నంతిమం బగుషట్కము వాక్యార్థనిష్ఠము సమ్యగ్దర్శనప్రధానం బిప్పుడారంభింపఁబడుచున్నది. అందు అంతిమషట్కంబున మొదటి దగు క్షేత్రాధ్యాయమవతరింపఁజేయఁ ... ాగె వ్యవహిత మయినవృత్తమును గీర్తించుచున్నారు సప్తమాధ్యాయప్రముఖాష్టమాధ్యాయ... ప్రకృతిద్వయమునకు స్వాతంత్ర్యము నివారించుచున్నారు ద్వాదశమైకాదశద్వాదశస్య ... ఇత్యాదికముచేఁ జెప్పఁబడిన సత్త్వాదిరూపమయినప్రకృతి ... నిర్గు... ఆక్షేపించుచున్నారు సంసారహేతు వగుట వలన నని. ఇత ...ాదశ చతుర్దశ ... సంపుటము ...నప్రకృతి ననుక్రమించుచున్నారు

* క్షత్... సంస్కృతాంధ్రగ్రంథము...

ఇతరము ఇత్యాదిగా. అది పరం బనుటకు హేతువును సూచించుచున్నారు ఈశ్వ రాత్మకము అని. ఎందు కీశ్వరునకుఁ బ్రకృతిద్వయము? అని యాశంకించి కార ణత్వముకొఱ కని చెప్పుచున్నారు ఆరెండుప్రకృతులచేతనే ఇత్యాదిగా. వృత్తము ననువదించి వర్తిష్యమాణ మగునధ్యాయమున కారంభప్రకారముఁ జెప్పుచున్నారు అట్లు కావున నిత్యాదిగా. వ్యవహితముతో సంబంధముఁ బ్రతిపాదించి యవ్యవహిత ముతో సంబంధముఁ బ్రతిపాదింపఁ గోరినవారై యవ్యవహిత మగువృత్తము ననువ దించుచున్నారు అతీ తేత్యాదిగా. నిష్ఠ చెప్పఁబడినది యని యన్వయము. నిష్ఠనే వివరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. వర్తించుచున్నారో—ధర్మజాతము ననుష్ఠించు చున్నారో, అట్లు పూర్వోక్తప్రకారంబున సర్వంబును జెప్పఁబడిన దని యర్థము. ఇట్లు అవ్యవహితము ననువదించి దానితో నుత్తరాధ్యాయమునకు సంబంధముఁ జెప్పుచున్నారు ఎట్టి ఇత్యాదిగా. సుఖదుఃఖాదిభేదమునొంది ప్రతిక్షేత్రంబును భిన్ను లయిన జీవుల కక్షరముతో నైక్యము సంభవింప దని యాశంకించి సంసారమున కాత్మధర్మత్వము నిరాకరించి యది సంఘాతనిష్ఠం బని చెప్పుటకై సంఘాతోత్పత్తి ప్రకారముఁ జెప్పుచున్నారు త్రిగుణాత్మకము ఇత్యాదిగా. ఓయీ! మీఁదిశ్లోకము నందు శరీరము నిర్దిష్ట మగుటవలన దానియుత్పత్తి చెప్పవలయును, ఏల సంఘాతో త్పత్తిని జెప్పుచున్నా వనఁగా నందుకుఁ జెప్పుచున్నారు ఆయీ ఇత్యాదిగా. చెప్పిన యర్థమునందు భగవద్వచనము ను దించుచున్నారు అదియే ఇత్యాదిగా. అందు ద్రష్ట యగుటచే నాత్మకన్నను సంఘాతదృశ్యమును భిన్నముగా నిర్దేశించుచున్నారు ఇద మ్మని. చెప్పఁబడినదానికి—ప్రత్యక్షదృశ్య మయిన యొకానొకదాని కని శేషము. శరీరము ఆత్మకంటె అన్యం బనుటను క్షేత్రనామనిర్వచనముచేఁ జెప్పుచున్నారు క్ష తేత్యాదిగా. క్షయము—నాశము. క్షరణము—అపక్షయము. ఎట్లు క్షేత్రమునందుఁ నాటఁబడినబీజము ఫలించునో అట్లు అని చెప్పుచున్నారు క్షేత్రమునందుఁబోలె నిత్యాదిగా. క్షేత్రపదమునకు మీఁదనున్న యితిపదము క్షేత్రశబ్దవిషయము, లోక చో వ్యర్థ మగుటవలన నని చెప్పుచున్నారు ఇతిశబ్దము ఇత్యాదిగా. క్షేత్రమిత్తుగా చేఁ జెప్పఁబడుచున్న దని యర్థము. దృశ్య మయినదేహమును బ్రతిపాదిస్మ యని కన్న నతిరిక్తుం డగుద్రష్టను బ్రతిపాదించుచున్నారు ఏత దిత్యాదిగా. స్నారు. తేకః మనుష్యుఁడ నే నను జ్ఞానము. ఔపదేశికము—దేహము ఆత్మ కాదను, ప్రకాశ్యత్వ వలన నిత్యాదికము. విభాగము [illegible]తనకంటె భిన్నముగా నని గుణలక్షణములచే మ్మనుచోట నితిశబ్దమువలె నిట[illegible]డ నితిశబ్దము క్షేత్రజ్ఞశబ్దవిషయ[illegible] ఆత్మానాత్మ

చున్నారు. క్షేత్రజ్ఞశబ్దముచే నతనిఁ జెప్పుచున్నా రని యర్థము. చెప్పువారిని బ్రశ్న పూర్వకముగా నిర్దేశించుచున్నారు ఎవరు ఇత్యాదిగా.

వాసుమద్విరచిత పైశాచభాష్యము.—

మున్ను భూమి రాప ఇత్యాదిగ్రంథముచే భూమ్యాద్యష్టవిధమయిన యపరప్రకృతి యీశ్వరశక్తిరూపము ప్రతిపాదింపఁబడినది. అట్లు ఈశ్వరునకు స్వరూపభూతమై జీవభూత మయిన పరప్రకృతియుఁ బ్రతిపాదింపఁబడినది అపరేయ మిత స్త్వన్యా మిత్యాదిగ్రంథముచేత. కావున క్షేత్రక్షేత్రజ్ఞరూప మగు నాప్రకృతి ద్వయమును ఈశ్వరతత్త్వజ్ఞానార్థమే చక్కఁగా నర్జునునకుఁ జెప్పవలయు నని శ్రీ భగవంతుఁ డిట్లనియె ఇదంశరీర మిత్యాదిగా.

శంకరానందీయ గీతా తాత్పర్యబోధిని.—

ముముక్షువులు సత్త్వశుద్ధికొఱకు నీశ్వరోపాసనం బవశ్యము చేయవలయు నని మందాతిమందాత్యంతమందప్రజ్ఞు లగువారి యధికారిభేదము ననుసరించి యుపాసనభేదంబును, తదుపాసనముచేఁ బరిశుద్ధాత్ము లైనవార లక్షరోపాసనము విదేహముక్తికొఱకుఁ జేయవలయు నని సూచించుటకై శ్రవణాదుల కుత్తరోత్కర్షంబును బ్రతిపాదించి, బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానంబుచే ననాత్మబంధనిర్ముక్తులును జీవన్ముక్తులు నగు బ్రహ్మవిదులకు అద్వేష్టృత్వాదికము లక్షణం బనియు నదియె సాధకు లగువారి కనుష్ఠాతవ్యం బగుసాధనం బనియు బోధించి, ఇప్పుడు మోక్షైకకాముఁడై జిజ్ఞాసు వగువానికి "ఎట్లు బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము? ఏది బ్రహ్మము? ఎవ్వఁ డాత్మ? ఏది యనాత్మ? తత్కృత మైనబంధం బేది? అది యెట్లు జ్ఞానముచే నివర్తిల్లును? ఏది జ్ఞానము? జ్ఞానసాధనం బేది? జీవన్ముక్తి యెట్టిది?" అని యాకాంక్ష కలు

వ గా, ఆత్మానాత్మశబ్దార్థము లయిన క్షేత్రక్షేత్రజ్ఞరూపు లగుప్రకృతిపురుషుల వివే

డార ...బును, వివిక్తుఁ డైనయాత్మకు బ్రహ్మముతో నైక్యంబును, వివిక్తు లైనను క్షేత్ర

మవతరి ...వైలక్షణ్యజ్ఞానము దృఢం బగుటకై పునఃపునర్వివేచనంబును, ప్రకృతికి

వ_ప్తమాధ ...బును, ఆత్మకు బంధం బధ్యాసకృతం బని బోధించుటకై యాత్మ

రించుచున్నా ...డనుటయు, చక్కఁగాఁ బ్రతిపాదించుటకై త్రయోదశాధ్యాయం

మయినప్రకృతి ...న్నది. అందు మొదట ... తజ్ఞుని క్షేత్రమునుండి సంక్షే

వలన నని. ఇత ... వివిక్తుఁ డైనయాత్మకు బ్ర... ముతో నేకత్వంబు బోధించుటకై

---

* తృతీ... ట్లనియె.—సత్త్వాదిగుణత్రయ... యొక్క సామ్యావస్థాలక్షణ మైన

యపరప్రకృతి యేది గలదో అదియే భోక్త యగుపురుషునియదృష్టద్వారంబున నీశ్వరప్రేరణచే గుణవైషమ్యము నొంది సుఖదుఃఖానుభవంబునకును బంధమునకును మోక్షమునకును సాధనంబై తానె దేహేంద్రియప్రాణమనోబుద్ధ్యాదిరూపంబునను రాగద్వేషాదిరూపంబునను శమదమాదిరూపంబునను శబ్దాదివిషయరూపంబునను జాగ్రదాద్యాకారంబునను బహువిధంబులఁ బరిణమించుచున్నది. అదే, ఇదమ్= ఈ, కార్యకరణసంఘాతలక్షణంబై ప్రత్యక్షంబున ననుభవింపఁబడుచున్నట్టి; శరీరమ్= శరీరము; క్షేత్రమ్=రాగద్వేషాదిదోషవిశిష్టుం డగుపురుషుఁడు క్షయించుచున్నాఁడు దీనిచేత, లేక, క్షతివలననుండి—క్షయమువలననుండి—సంసారాత్మక మయిన యనర్థమునుండి శమాదియుక్తుం డగుపురుషుని త్రాయతే—రక్షించుచున్నది, లేక, సర్వదా దీపశిఖవలెఁ దనయంతన క్షిణోతి—హింసించుచున్నది, సుఖదుఃఖాదిఫలోత్పాదనమునందు క్షేత్రమువలె నాచరించుచున్నది, అనువ్యుత్పత్తిచే క్షేత్రము; ఇతి= అని—క్షేత్రశబ్దముచే; అభిధీయతే=చెప్పఁబడుచున్నది, విద్వాంసులచేత నని యర్థము. ప్రకృతియును బ్రాకృతంబును దృశ్యజాతము సర్వంబును క్షేత్రము, అదియే యీశరీరం బని క్షేత్రశబ్దముచే ననాత్మస్వరూపంబు నిరూపించి యిఁక నాత్మస్వరూపమును బోధించుటకై చెప్పుచున్నాఁడు.—ఏతత్ = ఈ యనుభవింపఁబడుచున్నశరీరలక్షణ మయినక్షేత్రమును; యో వేత్తి = స్వాభావికజ్ఞానముచే ఆపాదతలమస్తకమును నేనని విమర్శించి గురూపదేశజన్యజ్ఞానముచేఁ దనకు విషయభూతము బుద్ధ్యాదిస్థూలాంతం బిది శరీరము, ఇది చక్షువు, ఇది ప్రాణము, ఇది శబ్దము, ఇది గంధంబని యెవ్వఁడు ప్రత్యక్షమున ఇదంశబ్దప్రత్యయార్థ మయినసమస్తదృశ్యజాతమును ఎఱుంగుచున్నాఁడో; తమ్ = అతని, క్షేత్రమును—అనాత్మ యగుదృశ్యజాతమును ఎఱుంగుచున్నవానిని, అహంప్రత్యయార్థ మైనచేతనుం డగుపురుషుని; క్షేత్రజ్ఞ ఇతి=క్షేత్రమును—ప్రకృతిని బ్రాకృతమును సమస్తదృశ్యజాతంబును తనకన్నభిన్నమునుగా నెఱుంగుచున్నాఁడు కావున క్షేత్రజ్ఞుఁ డని ఆత్మ యని, వెలుపలను లోపలను సర్వత్ర దృశ్యము సమస్తంబును బ్రత్యక్షాదిప్రమాణంబులచే సాక్షాత్తుగా వ్యవధానము లేక యెవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడే క్షేత్రజ్ఞుఁడు ఆత్మ యని; తద్విదః = ఆత్మస్వరూపజ్ఞు లగుసత్పురుషులు; ప్రాహుః = చెప్పుచున్నారు. లేక; తద్విదః=ఆ క్షేత్రక్షేత్రజ్ఞులస్వరూపమును—జ్ఞేయత్వమును జ్ఞాతృత్వమును, ప్రకాశ్యత్వమును ప్రకాశకత్వమును, వికారిత్వమును అవికారిత్వమును మొదలగులక్షణములచే బరస్పరవిలక్షణమునుగా ఎవ్వ రెఱుంగుచున్నారో వారు తద్విదులు, అజ్ఞానాత్మ

స్వరూపజ్ఞు లగువసిష్ఠాదులు జ్ఞేయము సర్వంబును అనాత్మ యనియు, తజ్జ్ఞాత యగు నహంపదార్థమే యాత్మ యనియుఁ జెప్పుచున్నా రని యర్థము. ఓయీ! కార్య కరణసంఘాతవ్యతిరిక్తుఁ డెవ్వఁడును అహంపదార్థ మయినజ్ఞాత కనఁబడఁడు, ఎట్లు ఈశరీరము క్షేత్ర మనియు దీని నెవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడు క్షేత్రజ్ఞుఁ డనియుఁ జెప్పవచ్చును? ప్రత్యక్షాదిప్రమాణములు విరోధించుచున్నవి గదా! నేను నడచుచున్నాను నేను భుజించుచున్నా నని గంతవ్యభోక్తవ్యపదార్థజ్ఞాతృత్వంబును క్రియయుఁ గరణంబును సంఘాతమునకే కనఁబడుచున్నది. « ఈతం డతనిపుత్త్రుఁడు వీనికి సదృశుం డగుటవలన » నిత్యా ద్యనుమానంబుచేతను ఉపమానంబుచేతను ఇదంశబ్దార్థము సంఘాతమే యగుచున్నది. « ఆయు రాశాస్తే యజమానో ఽసౌ » * అని సంఘాతమునకే యాయురాద్యాశంసను శ్రుతి చెప్పుచున్నది, అసౌ అను నద శ్శబ్దము ప్రత్యక్షార్థవాచకం బగుటవలన. అందు వేని; ఇట ని న్నడుగవలయును. ఇట జ్ఞాత దేహమా? ఇంద్రియగణమా? ప్రాణమా? మనస్సా? బుద్ధియా? అహంకారమా? లేక, సముదాయమా? అని. మొదటిది కాదు, నిద్రాపారవశ్యా దులయందు దేహమునకు జ్ఞానము కనఁబడమివలనను, నాపాదమున నొప్పి నాశిరస్సు నందు సుఖం బని దేహముయొక్క సుఖదుఃఖముల నెఱుంగువాఁడు దేహముకన్న భిన్నుఁడుగాఁ దెలియవచ్చుటవలనను. రెండవది కాదు, నాదృష్టి మందము నావాక్కు స్పష్ట మని యింద్రియములసౌష్ఠవాస్వాస్థ్యములు నెఱుంగువాఁడు తద్భిన్నుఁడుగాఁ దెలియవచ్చుటవలన. మూఁడవది కాదు, నిద్రాదులయందు స్వపరజ్ఞానము కనఁబడమి వలన. అట్లు చతుర్థపంచమషష్ఠంబులును కావు, నామనస్సు వ్యాకులము నాబుద్ధి చపలము నాయహంకారము దుష్టం బని మనఆదులు తమకంటె నితరునిచే జ్ఞేయము లుగాఁ దెలియవచ్చుటవలన, ఏది జ్ఞేయమో అది జడం బని జ్ఞేయం బగు ఘటాదిక మునకు జడత్వము కనఁబడుటవలన జడము లగు మనఆదులకు జ్ఞాతృత్వము సంభవిం పమివలన. సంభవించు నన్నచో ఘటాదికమునకును జ్ఞాతృత్వము సంభవించును, జ్ఞేయత్వ ముభయసాధారణం బగుటవలన. సప్తమంబును గాదు, అవయవంబు లచేతనములై యుండఁగా నవయవియుఁ గట్టెలమోపువలె నచేతనం బగుటంజేసి దానికి జ్ఞాతృత్వం బనుపపన్నం బగుటవలన. అప్పుడు చైత్రునిచే జ్ఞాతుం డగు మైత్రు నకును అచేతనత్వము ప్రసక్తించునందు వేని, అ[illegible]మాక్షిప్తమే. చైత్రునిచే మైత్రుని

* ఈ [illegible] ఆయువును గోరుచున్నాఁ[illegible]

శరీరమే జ్ఞాత మగుటవలన శరీరాదుల కచేతనత్వము సాధిత మగుటంజేసి మాయు దీన హానిలేదు. మఱియును, « దేహాదికము నెఱుంగువాఁడు దేహాదికముకంటె భిన్నుఁడే యగుచున్నాఁడు, జ్ఞాత యగుటవలన, ఘటాదిజ్ఞాతవలె ” ఇత్యాది యుక్తుల చేతను, « చక్షుషో ద్రష్టా శ్రోత్రస్య ద్రష్టా వాచో ద్రష్టా మనసో ద్రష్టా బుద్ధేర్ద్రష్టా తమసో ద్రష్టా సర్వస్య ద్రష్టా » ఇత్యాది శ్రుతులచేతను జక్కఁగా విచారింపఁగా అనాత్మ యగుక్షేత్రమును తద్ధర్మములను తదవస్థలను నెఱుంగువాఁడు క్షేత్రముకన్న భిన్నుఁడే యగుచున్నాఁడు కాని క్షేత్రమునకేమో జ్ఞాతృత్వము లేదు. కలుగునెడ నాది యీశరీరము చక్షువు అని శరీరాదులయందు స్వభిన్నత్వజ్ఞానము సంభవింపదు. స్వభిన్నత్వజ్ఞానమో వివేకిప్రసిద్ధ మగుటవలన క్షేత్రముకన్న క్షేత్రజ్ఞుఁడు భిన్నుఁడే. అందువలననే చెప్పుచున్నాఁడు సర్వజ్ఞుఁ డగుభగవంతుఁడు, « ఈ శరీరము క్షేత్రము, దీని నెవ్వఁ డెఱుఁగుచున్నాఁడో అతఁడు క్షేత్రజ్ఞుఁడు ” అని. నీవు చెప్పిన ప్రత్యక్షాదిప్రమాణ మవివేకివిషయము కావున నిట విరోధమేమియు లేదు. ఓయీ! క్షేత్రముకన్న వ్యతిరిక్తుఁడు క్షేత్రజ్ఞుఁ డను క్షేత్రజ్ఞాత యితఁ డని యెవ్వఁడును గనఁబడఁడు, కనఁబడమివలన నతఁడు లేఁ డనియే చెప్పవలయు నందువేని; నిన్నిట నడుగవలయును, ఏమి క్షేత్రము లేదని చెప్పెదవా? లేక, క్షేత్రజ్ఞుఁడు లేఁ డని చెప్పెదవా? అని. మొదటిది సరికాదు, ప్రత్యక్షమునఁ గనఁబడుచున్నక్షేత్రము లేదనుట యసంగతంబగుటవలన. రెండవదియుఁ గాదు, క్షేత్రము నెఱుంగునట్టి క్షేత్రజ్ఞుఁడులేనిచో « ఇది శరీరము ఇది ఘటం బిది పటము » ఇత్యాది దృశ్యప్రత్యయములకే యభావము ప్రసక్తించుటవలన. సూర్యుఁడు లేకున్నంబోలె క్షేత్రజ్ఞుఁడు లేకున్నయెడ జగదాంధ్యము సంభవించును. క్షేత్రజ్ఞునిచేతఁ గదా సూర్యునిచేతంబోలె స్వతేజస్సుచే మహదాదిస్థూలాంత మగు నీదృశ్యజాతము సమస్తంబును వెలుపలను లోపలను వ్యాపించి భాసింపఁ జేయఁబడుచున్నది, ఇది యది యని సర్వంబు నెఱుంగబడుచున్నదియు. అట్లు కానిచో ఆంతరమహదాదులయు బాహ్యఘటాదిపదార్థములయు సుఖాదిప్రత్యయములయు జాగ్రదాద్యవస్థలయు స్వరూపవివేకవిజ్ఞానము సిద్ధింపకపోవును. ప్రత్యక్షాది సర్వప్రమాణంబులకును అహమాది సర్వప్రమేయంబులకును ప్రామాణ్య మెవ్వనివలన సిద్ధించుచున్నదో తదభావం బెవ్వఁడు సాధింపఁగలఁడు? అతఁడు లేఁ [illegible]నెడ తానే లేఁ డనుట సంభవించుటవలన. ఓయీ! చిదాభాసుఁ డుండనే [illegible]న్నాఁడు ప్రమాత సర్వప్రామాణ్యములకును ప్రామాణ్యము నిర్వహించువాఁ[illegible] అందువేని, అది యుక్తము గా[illegible] అతఁడును

వికార్యంతఃపాతి యగుటచే వానికి సర్వజ్ఞత్వ మనుపపన్న మగుటవలన, అంతఃకరణ వికారములతోఁగూడ క్షణక్షణమును వికారము నొందుచున్న చిదాభాసుండును వికారి యగుటవలనను తద్భావానుసారి యగుటవలనను అతనికి జాగ్రదాద్యవస్థల యందు సర్వవ్యవహారవిజ్ఞానము సంభవింపమివలన. ఓయీ! అవస్థావిజ్ఞాతలు విశ్వాదు లుండనేయున్నారు, అందువేని, అదియు యుక్తముకాదు, క్షేత్రజ్ఞు లనేకు లని ప్రసక్తించుటవలన, ఏతద్యోవేత్తి అని యేకవచనముచే క్షేత్రజ్ఞుఁ డొక్కఁడే యని చెప్పఁబడుటవలన, అభిమానము వికార మగుటచే జాగ్రదాద్యవస్థాభి మానవంతు లగువిశ్వాదులు వికారవంతు లగుటంజేసి వారలకు నిత్యత్వము సంభవింపమిచే నొక్కని కవస్థాత్రయజ్ఞాన మనుపపన్నం బగుటవలన, «ఎవ్వఁడను జాగర మనుభవించితినో ఎవ్వఁడను స్వప్నముఁ జూచితినో ఎవఁడను సుఖముగా నిద్రించితినో అట్టి నే నున్నాను" అని అవస్థల నెఱుంగువాఁడు విశ్వాదులకన్న భిన్నుఁడుగాఁ దెలియవచ్చుటవలన. విశ్వాదులకు అవికారిత్వమును నిత్యత్వంబును సిద్ధింపదు, అది సిద్ధింపనియప్పుడు అవస్థాత్రయవిజ్ఞానముగూడ సిద్ధింపదు. అందువలన వారలకన్న భిన్నుఁడు అవికారి నిత్యుఁడు ఒక్కఁడు చేతనుఁడు క్షేత్రము సమస్తంబును ఎఱుంగువాఁడు క్షేత్రజ్ఞుఁ డాత్మయే యని సిద్ధము. ఓయీ! ఆత్మకు క్షేత్రజ్ఞత్వ మగుఁగాక, అయినను ఇతఁ డని క్షేత్రజ్ఞుఁడు కనఁబడఁడు, అది యెట్లు? అందువేని చెప్పెదము. ఇతరుఁడు జ్ఞాత లేమివలన తదుపలంభము కలుగదు. ఇతరుఁడు జ్ఞాత కలఁ డని యంగీకరించునెడ ననవస్థ సంభవించును. క్షేత్రజ్ఞుఁడుగూడ ఇతఁ డని యెఱుంగఁబడునేని యతనికిని క్షేత్రత్వము సంభవించుటచే క్షేత్రజ్ఞత్వమే సిద్ధింపకపోవును. అనిత్యత్వాచేతనత్వాదిదోషంబులును సంభవించును. «ఏకో దేవః, ఏక ఏవ సాక్షీ స్వప్రకాశః, అజో నిత్య శ్శాశ్వతః» ఇత్యాది శ్రుతివిరోధముగూడ ప్రసక్తించును. అందువలన ఆత్మ ఘటాదికమువలె జ్ఞానవిషయము కాఁడు. ఓయీ! «తరతి శోక మాత్మవిత్» అని యాత్మజ్ఞానము గలవానికి శోకతరణమును శ్రుతి చెప్పుచున్నది, ఎట్లు ఇతఁడు నే నని యాత్మ యెఱుంగఁబడనియెడ విద్వాంసునకు శోకతరణము సిద్ధించును? అందువలన ఇతఁ డని యాత్మ యెట్లెఱుంగఁబడును? అందువేని, శ్రౌత మగుజ్ఞానముచేతనే యాత్మ యెఱుంగఁబడుచున్నాఁడు. అది యెట్లందువేని, చెప్పెదము. «నాన్తఃప్రజ్ఞం న బహిఃప్రజ్ఞం నోభయతఃప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నాప్రజ్ఞ మదృశ్య మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచిన్త్య మవ్యపదేశ్య మైకాత్మ్యప్రత్యయసారం ప్రపఞ్చోపశమం శివ మద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా

నవిజ్ఞేయః" అను శ్రుతిచేత, నాన్తః ప్రజ్ఞ మిత్యాదికముచే తైజసవిశ్వాదులకంటె భిన్నుఁ డనియు వార లనాత్మ లనియుఁ బ్రతిపాదించి, అదృశ్య మ్మనుటచే అహమాదిసర్వదృశ్యభిన్నత్వంబును, అవ్యవహార్య మ్మనుటచే కర్మేంద్రియావిషయత్వంబును, అగ్రాహ్య మ్మనుటచే జ్ఞానేంద్రియావిషయత్వంబును, అలక్షణ మ్మనుటచే అనుమానాగమ్యత్వంబును, అచిన్త్య మ్మనుటచే మనస్సునకును అగోచరత్వంబును, అవ్యపదేశ్య మ్మనుటచే వాక్కునకు అవిషయత్వంబును, ఏకాత్మప్రత్యయసార మ్మనుటచే చిదేకరసత్వంబును స్వగతభేదరహితత్వంబును, ప్రపంచోపశమ మ్మనుటచే విజాతీయభేదరహితత్వంబును, అద్వైత మ్మనుటచే సజాతీయభేదరహితత్వంబును, శివ మ్మనుటచే ఆనందఘనత్వంబును, చతుర్థ మ్మనుటచే స్వాభాసవిశ్వాదులు మువ్వర నపేక్షించి తుర్యత్వంబును సర్వదృశ్యవిలక్షణత్వంబును జక్కఁగా ఆత్మకుఁ బ్రతిపాదించి, ఎవ్వఁ డిట్లు సర్వదృశ్యవిలక్షణుఁడు చిదానందైకరసుఁడో అతఁడే యాత్మయనియు, స్వలక్షణలక్షితుఁ డగునతఁడే « ఇతఁడు నేనే » యని విద్వాంసులచే స్వస్వరూపంబున నెఱుంగవలసినవాఁ డనియు బోధింపఁబడుచున్నది. శ్రౌతం బగు నీజ్ఞానముచే అవిద్యాతత్కార్యసంబంధరహితుఁ డగునాత్మను తన్నుఁగా నెఱింగి విద్వాంసుఁడు సంసారమువలన ముక్తుఁ డగుచున్నాఁడు. అందువలన, సర్వదృశ్యవిలక్షణత్వంబును క్షేత్రజ్ఞత్వంబును ఆత్మకు లక్షణ మని సిద్ధము.

మధుసూదనసరస్వతీరచిత గూఢార్థదీపిక.—

ధ్యానాభ్యాసవశీకృతం బగువిశుద్ధాత్మంబుతో నిర్గుణం
బై నిష్కర్మము నైనజ్యోతి యతు లొయ్యన్గాంచిన న్గాంత్రు గా
కైన న్నాకుఁ గలిందజాపులినసమ్యగ్ధావనాత్యుత్సుకం
బానీలం బగు తేజమే చిరము నేత్రానందముం జేయుఁ గా.

ప్రథమమధ్యమషట్కములయందు తత్త్వంపదార్థములు చెప్పఁబడినవి. ఇఁక మీఁదిషట్కము వాక్యార్థనిష్ఠము సమ్యగ్ధీప్రధానం బిప్పు డారంభింపఁబడుచున్నది. అందు, « తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసారసాగరాత్, భవామి » అని మున్ను చెప్పఁబడినది. మఱి ఆత్మాజ్ఞానలక్షణ మయినమృత్యువునుండి యాత్మజ్ఞానముచేఁ దక్క నుద్ధరణము సంభవింపదు. అందువలన, ఎట్టి యాత్మజ్ఞానముచే మృత్యుసంసారమునుండి నివృత్తి [illegible]చునో, ఎట్టి తత్త్వజ్ఞానముతోఁ గూడినవారు అద్వేష్టృత్వాదిగుణసంపన్నులు [illegible]న్న్యాసులు మున్ను వక్కాణింపఁబడిరో. అట్టి

యాత్మతత్త్వజ్ఞానము వక్తవ్యము. అదియో యద్వితీయుఁ డగుపరమాత్మతోఁ గూడ జీవున కభేదమునే విషయీకరించుచున్నది, సర్వానర్థంబును తద్భేదభ్రమ హేతుకం బగుటవలన. అందు, సంసారులై ప్రతిక్షేత్రంబును భిన్ను లగుజీవులకు అసంసారియు నొక్కఁడు నగుపరమాత్మతో నెట్లభేదం బగు నని యాశంక కలుగుచున్నది. అందుకు, సంసారంబును భిన్నత్వంబును అవిద్యాకల్పితానాత్మధర్మము లగుటవలన జీవునకు సంసారిత్వంబును భిన్నత్వంబును లే వని వివేచింపవలయును. అందుకొఱకు దేహేంద్రియాంతఃకరణరూపము లైనక్షేత్రములనుండి వివేచించి క్షేత్రజ్ఞుఁ డగుపురుషుఁడు జీవుఁడు ప్రతిక్షేత్రము నొక్కఁడే నిర్వికారుం డని ప్రతిపాదించుటకై క్షేత్రక్షేత్రజ్ఞవివేకము చేయఁబడుచున్న దీయధ్యాయమునందు. అందు, ఏవి రెండుప్రకృతులు భూమ్యాదిక్షేత్రరూపంబును జీవలక్షణక్షేత్రజ్ఞరూపంబును బరాపరశబ్దవాచ్యంబులు సప్తమాధ్యాయంబున సూచింపఁబడినవో తద్వివేకంబునఁ దత్త్వంబు నిరూపింపఁ గోరినవాఁడై శ్రీభగవంతుఁ డి ట్లనియె.—ఇదమ్= ఈ యింద్రియాంతఃకరణసహితమై భోగాయతన మగు; శరీరమ్=శరీరము; కౌన్తేయుఁడా! క్షేత్రమిత్యభిధీయతే, దీనియందు మాటిమాటికి సస్యమునకుంబోలె కర్మమునకు ఫలము నిర్వృత్తం బగుటవలన. ఏతత్ యః; వేత్తి=నేను నాది యని యభిమానించుచున్నాఁడో; తం క్షేత్రజ్ఞ ఇతి ప్రాహుః, కృషీవలుఁడుంబోలెఁ దత్ఫల భోక్త యగుటవలన; తద్విదః=క్షేత్రక్షేత్రజ్ఞులవివేకము నెఱిఁగినవారు. ఇట, అభిధీయతే అని కర్మప్రయోగము చేయుటచే క్షేత్రమునకు జడ మగుటవలనఁ గర్మత్వంబును, క్షేత్రజ్ఞశబ్దమునందో ద్వితీయను బ్రయోగింపకయే యితిశబ్దమును బ్రయోగించుటచే స్వప్రకాశ మగుటవలనఁ గర్మత్వాభావంబును సూచించుచున్నాఁడు. అందును, « క్షేత్రము ఎవ్వరిచేనేని చెప్పఁబడుచున్నది, అందుఁ గర్తృగతవిశేషాపేక్ష లేదు, క్షేత్రజ్ఞునో కర్మత్వము లేకయే వివేకులే చెప్పుచున్నారు, స్థూలబుద్ధుల కగోచరుం డగుటవలన. » అని తెలుపుటకై విలక్షణవచనవ్యక్తిచేతను ఒక్కచోఁ గర్తృపదప్రయోగముచేతను నిర్దేశించుచున్నాఁడు భగవంతుఁడు.

శ్రీధరస్వామిప్రణీత సుబోధిని.—

భక్తగణముల సంసారవార్ధినుండి
యోడ యుద్ధరించెద నంచు యత[illegible]
దానిసిద్ధికై యుఁక[illegible]గ్రాహ్య[illegible]డు
[illegible]త్త్వవిజ్ఞానమ్ము[illegible]పదేశమం శివ[illegible]డు.

« తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసారసాగరాత్, భవామి » అని పూర్వము ప్రతిజ్ఞ చేయఁబడినది. తత్త్వజ్ఞానము లేక సంసారమునుండి యుద్ధరణము సంభవింప దని తత్త్వజ్ఞానోపదేశార్థమై ప్రకృతిపురుషవివేకాధ్యాయ మారంభింపఁ బడుచున్నది. అందు, సప్తమాధ్యాయంబున అపరయనియు పరయనియు రెండు ప్రకృతులు చెప్పఁబడినవి. ఆరెంటియవివేకమువలన జీవభావాపన్న మైనచిదంశ మున కీసంసారము. ఆప్రకృతులచేతనే జీవోపభోగార్థం బీశ్వరుఁడు సృష్ట్యాదుల యందుఁ బ్రవర్తించుచున్నాఁడు. క్షేత్రక్షేత్రజ్ఞశబ్దవాచ్యము లయిన యాప్రకృతు లనే యొండొంటిని వివేచించి తత్త్వంబున నిరూపింపఁ గోరినవాఁడై శ్రీభగవంతుం డిట్లనిరి.—ఇదమ్ = ఈభోగాయతన మయిన; శరీరమ్; క్షేత్రమి త్యభిధీయతే, సంసారమునకుఁ బ్రరోహభూమి యగుటవలన. ఏతత్; యః; వేత్తి=నేను నాది యని తెలఁచుచున్నాఁడో; తం క్షేత్రజ్ఞ ఇతి ప్రాహుః, కృషీవలునివలెఁ దత్ఫల భోక్త యగుటవలన; తద్విదః=క్షేత్రక్షేత్రజ్ఞులవివేకముఁ దెలిసినవారు.

పరమార్థప్రప న్నైనజ్ఞసూర్యపండిత ప్రణీతము.—

పూర్వాధ్యాయంబున సగుణనిర్గుణోపాసకభేదంబున బ్రహ్మప్రాప్తియందు అధికారిద్వయము చెప్పఁబడినది. అందు సగుణోపాసకునకు ముక్తి సుఖసాధ్యం బని యుఁ జెప్పఁబడినది. మఱియు సుఖరూపసాధనవంతుఁ డగు సగుణోపాసకునకు ధర్మ ములు ఎనిమిదిశ్లోకములచే నుపదేశింపఁబడినవి. ఇఁక, క్లేశరూపసాధనవంతుం డగు నిర్గుణోపాసకునకు బహుసామగ్రీసాధ్యతత్త్వజ్ఞానపూర్వకము బ్రహ్మప్రాప్తి యని ప్రదర్శించుటకై మొదట క్షేత్రక్షేత్రజ్ఞులస్వరూపమును భగవంతుఁ డుపదేశించు చున్నాఁడు.—ఇదమ్ = ఈ భోగాయతన మయిన; శరీరమ్; సంసారవృక్షప్రరోహ భూమి యగుటవలన, క్షేత్ర మితి; అభిధీయతే=నామనిర్దేశము చేయఁబడుచున్నది. ఇఁక సామాన్యముగా క్షేత్రజ్ఞస్వరూపముఁ జెప్పుచున్నాఁడు.—ఏతత్ = ఈక్షేత్ర మును; యః; వేత్తి = ఎఱుంగుచున్నాఁడో. తం క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ప్రాహుః. ఇందుచే దేహాతిరిక్తుఁడు క్షేత్రజ్ఞుఁ డొకం డున్నాఁ డని సూచితము. ఎందువలన ననఁగా. అన్వయవ్యతిరేకములవలన దేహము ఘటాదికమువలె జడం బని నిశ్చితం బగుటచే దానికి ద్రష్టృత్వము సంభవింపదు, మృతశరీరమునందు దాహదుఃఖ జ్ఞానము కనఁబడమివలన. ఎట్లు ఘట ద్రష్ట ఘటముకన్న భిన్నుఁ డగునో అట్లు దేహ ద్రష్టయు నని యర్థము.

రామానుజభాష్యము.—

పూర్వాధ్యాయషట్కమునందుఁ బరమప్రాప్యుఁడు పరబ్రహ్మ మగుభగవంతుఁడు వాసుదేవునిప్రాప్తి కుపాయభూత మగు న భక్తిరూపభగవదుపాసనమున కంగభూతంబును జ్ఞానయోగ కర్మయోగలక్షణనిష్ఠాద్వయసాధ్యంబు నగు ప్రాప్తృ ప్రత్యగాత్మయాథాత్మ్యదర్శనము ప్రతిపాదింపఁబడినది. మధ్యమషట్కమునందుఁ బరమప్రాప్యభూతభగవత్తత్త్వయాథాత్మ్యతన్మాహాత్మ్యజ్ఞానపూర్వక మగు నైకాంతికాత్యంతికభక్తియోగనిష్ఠ ప్రతిపాదింపఁబడినది. సమృద్ధైశ్వర్యకాములకును ఆత్మకైవల్యమాత్రకాములకును భక్తియోగము తత్తత్కామితంబులకు సాధన మనియుఁ జెప్పఁబడినది. ఇప్పు డుత్తరషట్కమునందుఁ బ్రకృతిపురుషులయుఁ దత్సంసర్గరూప ప్రపంచముయొక్కయు నీశ్వరునియొక్కయు యాథాత్మ్యంబును గర్మజ్ఞానభక్తిస్వరూపంబులును దదుపాదానప్రకారంబులును షట్కద్వయప్రతిపాదితములు పరిశోధింపఁబడుచున్నవి. అందుఁ ద్రయోదశంబున దేహాత్మలస్వరూపంబును దేహయాథాత్మ్యశోధనంబును దేహవియుక్తాత్మప్రాప్త్యుపాయంబును వివిక్తాత్మస్వరూపసంశోధనంబును అట్టియాత్మకు నచిత్సంబంధకారణంబును దానినుండి వివేకానుసంధానప్రకారంబును జెప్పఁబడుచున్నవి.—ఇదంశరీరమ్= దేవత నేను మనుష్యుఁడ నేను స్థూలుఁడ నేను కృశుఁడ నేను అని భోక్త యగునాత్మతోఁ గూడ సామానాధికరణ్యంబునఁ బ్రతీయమానం బగునీశరీరము; క్షేత్ర మితి = అర్థాంతరభూతుఁ డైనభోక్త యగు నాత్మయొక్కభోగక్షేత్ర మని; అభిధీయతే=శరీరయాథాత్మ్యవిదులచేఁ జెప్పఁబడుచున్నది. ఏతత్=దీనిని; అవయవరూపంబునను సంఘాతరూపంబునను "దీని నే నెఱుంగుచున్నా" నని, యో వేత్తి= ఎవ్వఁ డెఱుంగుచున్నాఁడో; తమ్=వానిని, వేద్యభూత మైన దీనికంటె వేదిత యగుటచే నర్థాంతరభూతుఁ డైనవానిని; క్షేత్రజ్ఞ ఇతి= క్షేత్రజ్ఞుఁ డని; తద్విదః=ఆత్మయాథాత్మ్యవిదులు; ప్రాహుః = చెప్పుచున్నారు. దేహవ్యతిరిక్తఘటాద్యర్థానుసంధానసమయమునందు "దేవత నేను మనుష్యుఁడ నేను ఘటాదికము నెఱుంగుచున్నా" నని దేహసామానాధికరణ్యంబున జ్ఞాత యగునాత్మ ననుసంధించుచున్నాఁడు వాస్తవమే. అయినను, దేహానుభవసమయమునందు దేహమును గూడ ఘటాదికమునుం బోలె "దీని నే నెఱుంగుచున్నా" నని వేద్యమును గా జ్ఞాత యనుభవించుచున్నాఁడు, కావున వేదిత యగునాత్మకు వేద్య మగుటచే శరీరము గూడ ఘటాదికమువలె నర్థాంతర మగుచున్నది. అట్లు ఘటాదికము కంటెం బోలె వేద్యభూత మయినశరీరముకంటె వేదిత యగుక్షేత్రజ్ఞుఁడు నర్థాంతర

మగుచున్నాఁడు. సామానాధికరణ్యంబునఁ బ్రతీతియో వాస్తవంబున శరీరము గోత్వాదికమువలె నాత్మవిశేషణతయే స్వభావముగాఁ గల దగుటచే నాత్మకంటె వేఱుగా నసిద్ధం బగుటవలన నుపపన్నము. అందు వేదితయొక్క యసాధారణా కారము చక్షురాదికరణముల కవిషయం బగుటవలనను యోగసంస్కృత మగు మనస్సునకే విషయం బగుటవలనను బ్రకృతిసన్నిధిచేతనే మూఢులు ప్రకృత్యా కారునిగానే వేదితను జూచుచున్నారు. అట్లు చెప్పఁబోవుచున్నాఁడు.—“ఉత్క్రామన్తం స్థితం వా ఽపి భుఞ్జానం వా గుణాన్వితమ్। విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః” అని.

మాధ్వభాష్యము.—

పూర్వోక్త జ్ఞానజ్ఞేయక్షేత్రపురుషులను బిండీకరించి వివేచించి ప్రదర్శించు చున్నాఁ డీయధ్యాయముచేత. •

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం య త్త జ్జ్ఞానం మతం మమ. ౨

భా. ఇట్లు క్షేత్రక్షేత్రజ్ఞులు ప్రతిపాదింపఁబడిరి. ఏమి యింతమాత్రపుజ్ఞానముచేతనే వారల నెఱుంగుట చాలునా? చాల దని చెప్పుచున్నాఁడు.—క్షేత్రజ్ఞమ్ = యథోక్తలక్షణుం డగుక్షేత్రజ్ఞుని; మాం చాపి=పరమేశ్వరుఁడను అసంసారి నగు నన్నుఁగాఁ గూడ; విద్ధి=ఎఱుంగుము; సర్వక్షేత్రేషు = సమస్తక్షేత్రములందును, ఎవ్వఁడు క్షేత్రజ్ఞుఁ డొక్కఁడే బ్రహ్మాదిస్తంబపర్యంతము లైన యనేకక్షేత్రోపాధులచేఁ బ్రవిభక్తుఁడుగాఁ దోఁచుచున్నాఁడో అతని నిరస్తసమస్తోపాధిభేదుని సదసదాదిశబ్దప్రత్యయాఽగోచరునిఁగా నెఱుంగు మని యభిప్రాయము. భారత=ఓభారతుఁడా! ఎందువలన క్షేత్రక్షేత్రజ్ఞేశ్వరుల యాథాత్మ్యము దక్క నింకొకటి జ్ఞానగోచరం బవశిష్టము లేదో అందువలన, క్షేత్రక్షేత్రజ్ఞయోః=జ్ఞేయభూతు లగు క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క; జ్ఞానం యత్=జ్ఞాన మేది గలదో, క్షేత్రక్షేత్రజ్ఞు లేజ్ఞానముచే విషయీకరింపఁబడుచున్నారో; తత్=అది; జ్ఞానమ్=సమ్యక్ జ్ఞాన మని; మమ=నాయొక్క ఈశ్వరునియొక్క విష్ణువుయొక్క; మతమ్=అభిప్రాయము.

• ౧-౨-౩ శ్లోకముల కీభాష్యము లేదు.

సర్వక్షేత్రంబుల నున్న క్షేత్రజ్ఞుఁడు నేనే యనియు నెఱుంగుము. క్షేత్రక్షేత్రజ్ఞులజ్ఞానం బేది గలదో అదియే సమ్యక్ జ్ఞాన మని నాయభిప్రాయ మని తా.

ఆ. భేదకంబులును యావద్దేహభావులు నగు దుఃఖాదిదృశ్యములు అనాత్మధర్మంబు లని సిద్ధించుటకై ద్రష్టను దేహముకంటె భిన్నునింగాఁ బ్రతిపాదించి, సాంఖ్యమతమునందుం బోలె సంతమాత్రనే ముక్తి యనుశంక నివర్తిల్లుటకై, ఆ ద్రష్టకు సర్వదేహములయందును ఐక్యంబును, పరమార్థభూతుఁడు అక్షరుఁ డగు తనతో నైక్యంబును చెప్పుచున్నాఁ డని, వృత్తము ననువదించి ప్రశ్నద్వారంబునఁ బ్రదర్శించుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. యథోక్తలక్షణుండు—దృశ్య మయిన దేహము నుండి నిష్కృష్టుఁ డైనద్రష్ట యని యర్థము. చ అపి అనునిపాతములు జీవుఁ డక్షరుం డనుజ్ఞానమునకు దేహముకంటె భిన్నుం డనుజ్ఞానముతో సముచ్చయము దెలుపుచున్నది. వీనికి మామ్ అనుదానితో నన్వయము. క్షేత్రజ్ఞుని సాంఖ్యులవలెఁ దృశ్యముకంటె భిన్నునింగామాత్రమె యెఱుంగకుము, మత్ తే మనఁగా, మాం చాపి—నన్నుఁగాఁ గూడ నెఱుంగుము, అని యర్థము. ఎవ్వఁడు సర్వక్షేత్రములయందును ఒక్కఁడే క్షేత్రజ్ఞుఁడు గలఁడో అతని నన్నుఁగానే యెఱుంగు మని సంబంధమును సూచించుచున్నారు సర్వక్షేత్రేషు ఇత్యాదిగా. తత్తత్క్షేత్రోపాధికభేదనిర్దిష్టుండై తత్తచ్ఛబ్దప్రత్యయగోచరుఁ* డైనవానికి. ఎట్లు తద్విపరీతబ్రహ్మత్వజ్ఞానము ? అని యాశంకించి చెప్పుచున్నారు బ్రహ్మే దీత్యాదిగా. ఉత్తరార్థమును విభజించుచున్నారు ఎందువలన నిత్యాదిగా. దానినే వివరించుచున్నారు క్షేత్రక్షేత్రజ్ఞయో రిత్యాదిగా. అది భేదవిషయం బగుటవలన సమ్యక్ జ్ఞానము కా దనుట యుక్తము గాదు, తద్వివేకజ్ఞానమునకు వాక్యార్థజ్ఞానద్వారంబున మోక్షోపాయత్వము కలుగుటచే సమ్యక్త్వము సిద్ధించుటవలన నని భావము.

భా. పూర్వపక్షము.—ఓయీ ! సర్వక్షేత్రములయందును ఒక్కఁడే యీశ్వరుఁడు, ఇతరుఁడు తద్వ్యతిరిక్తుఁ డైనభోక్త లేఁడేని, అప్పు డీశ్వరునకు సంసారిత్వము ప్రాప్తించుచున్నది. ఈశ్వరుఁడు దక్క సంసారి మఱియొకండు లేమివలన సంసారాభావముగాని ప్రసక్తించుచున్నది. ఆ రెండును ఇష్టములు గావు, బంధమోక్షతద్ధేతుశాస్త్రానర్థక్యము సంభవించుటవలనను ప్రత్యక్షాదిప్రమాణవిరోధమువలనను. ప్రత్యక్షంబున

---

* అర్థశబ్దములచే బోధింపఁబడువాఁ డని యర్థము.

సుఖదుఃఖతద్ధేతులక్షణ మయినసంసార ముపలబ్ధ మగుచున్నది. జగ ద్వైచిత్ర్యోపలబ్ధివలన ధర్మాధర్మనిమిత్త మగుసంసార మనుమానింపనుం బడుచున్నది. ఆత్మేశ్వరైకత్వపక్షంబున నిదియంతయు ననుపపన్నము.

సమాధానము.—కాదు. జ్ఞానాజ్ఞానంబు లన్యము లగుటచే నుప పన్నం బగుటవలన. « దూర మేతే విపరీతే విషూచీ అవిద్యా యాచ విద్యేతి జ్ఞాతా » అని శ్రుతి. అట్లు అవిద్యావిద్యావిషయములకు విరుద్ధ ఫలభేదంబును నిర్దేశింపఁ బడినది « శ్రేయశ్చ ప్రేయశ్చ » అని. విద్యా విషయము శ్రేయము, ప్రేయమో అవిద్యాకార్య మని. వ్యాసుఁడును చెప్పుచున్నాఁడు « ద్వా విమా వథ పన్థాసౌ » ఇత్యాదిగాను, « ఇమా ద్వావేవ పన్థానౌ » ఇత్యాదిగాను. ఇందును రెండునిష్ఠలు చెప్పఁబడినవి. అవిద్యను గార్యసహితముగా విద్యచేఁ దొలఁగింపవలయు ననియు శ్రుతి స్మృతిన్యాయములవలనఁ దెలియవచ్చుచున్నది. అందు శ్రుతులు.— « ఇహ చే దవేదీ దథ సత్య మస్తి, నచే దిహా వేదీ న్మహతీ వినష్టిః, త మేవం విద్వా నమృత ఇహ భవతి, నాన్యః పన్థా విద్యతే ఽయనాయ, విద్వా న్న బిభేతి కుతశ్చన; » ఇఁక నవిద్వాంసునకు « అథ తస్య భయం భవతి, అవిద్యాయా మన్తరే వర్తమానాః, బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి, అన్యో ఽసావన్యో ఽహ మస్మీతి న స వేద యథాపశు రేవం స దేవా నామ్, ఆత్మవిద్య స్స ఇదం సర్వం భవతి, యదాచర్మవత్ » ఇత్యా దులు వేనవేలు గలవు. స్మృతులును.—« అజ్ఞానేనా ఽఽవృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః, ఇహైవ తై ర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః, సమం పశ్యన్ హి సర్వత్ర » ఇత్యాదులు. న్యాయంబును. « సర్పాన్ కుశాగ్రాణి యథోదపానం జ్ఞాత్వా మనుష్యాః పరివర్జయన్తి, అజ్ఞానత స్తత్ర పతన్తి కేచిత్ జ్ఞానే ఫలం పశ్య యథా విశిష్టమ్ » అనియు. అట్లు దేహాదులయం దాత్మబుద్ధి గల యవిద్వాంసుఁడు రాగ ద్వేషాదిప్రయుక్తుఁడై ధర్మాధర్మముల ననుష్ఠించుచుఁ బుట్టుచున్నాఁడు గిట్టుచున్నాఁ డని తెలియుచున్నది. దేహాతివ్యతిరిక్తాత్మదర్శులు రాగద్వే షాదివినాశమువలన ధర్మాధర్మప్రవృత్తి యుపశాంత మగుటంజేసి ముక్తు లగుచున్నారు. ఇది యెవ్వనికిని నిరాకరింప శక్యము కాదు న్యాయము వలన, అట్లు కావున, క్షేత్రజ్ఞునకు ఈశ్వరుఁడై యున్నవానికే యవిద్యా

కృతోపాధిభేదమువలన సంసారిత్వముపోలెఁ గనఁబడుచున్నది. ఎట్లు ఆత్మకు దేహాద్యాత్మత్వమో అట్లు. ప్రసిద్ధము గదా సర్వజంతువులకును దేహాదులగుననాత్మలయం దాత్మభావము. అది యవిద్యాకృతం బని నిశ్చితము. స్థాణువునందుఁ బురుషనిశ్చయముపోలె. ఇంతమాత్రమునఁ బురుషధర్మము స్థాణువునకుఁ గాదు, స్థాణుధర్మంబును బురుషునకుఁ గాదు ఎట్లో అట్లు చైతన్యము దేహధర్మము గాదు, దేహధర్మంబును జేతనునకుఁ గాదు. ఇట్లు సుఖదుఃఖమోహాత్మకత్వాదికం బాత్మకు యుక్తము గాదు, అవిద్యాకృతత్వము సమానం బగుటవలన, జరామరణంబులుపోలె.

ఆ. జీవేశ్వరైక్యమును జెప్పినదాని నాక్షేపించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. జీవేశ్వరుల కేకత్వపక్షమున జీవున కీశ్వరునియం దంతర్భావమా? లేక యీశ్వరునకు జీవునం దంతర్భావమా? మొదటిది కాదు, జీవుం డీశ్వరునికంటె భిన్నుఁడు కానిచో సంసారము నిరాలంబ మనుట యనుపపన్న మగుటంజేసి యీశ్వరునికే సంసారాశ్రయత్వము ప్రసక్తించుటవలన నని యర్థము. "అనశ్నన్నన్యో అభిచాకశీతి" అనుశ్రుతివలన నీశ్వరునకు సంసారిత్వము లేదని యాశంకించి ద్వితీయమును దూషించుచున్నాఁడు ఈశ్వరుఁడు ఇత్యాదిగా. జీవునియం దీశ్వరుఁ డంతర్భవించునందువేని అప్పుడును ఈశ్వరునికంటె నితరుఁడు సంసారి యగువాఁడు లేమివలనను ఈశ్వరునకే సంసారం బనుట యనిష్టం బగుటవలనను సంసారమే లోకంబున నస్తమించు నని యర్థము. ఈరెండుప్రసంగములును ఇష్టంబు లనుటను నిరాకరించుచున్నాఁడు ఆరెండును ఇత్యాదిగా. సంసారమే లేనియెడ "తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి" ఇత్యాదిబంధశాస్త్రంబును తద్ధేతుకర్మవిషయకర్మకాండంబును అనర్థకంబు లగును, సంసార మీశ్వరాశ్రితం బగునెడ ఈశ్వరుం డభోక్త యని వచించుశ్రుతియును మోక్షతద్ధేతుజ్ఞానార్థమైనజ్ఞానకాండంబును అనర్థకంబు లగును, అందువలన నారెండుప్రసంగములును ఇష్టములు కావని యర్థము. సంసారాభావప్రసంగం బనిష్ట మనుటకు మఱియొక హేతువుఁ జెప్పుచున్నాఁడు ప్రత్యక్షా దిత్యాదిగా. అందుఁ బ్రత్యక్షవిరోధమును బ్రకటించుచున్నాఁడు ప్రత్యక్షమున నిత్యాదిగా. ఆదిశబ్దోపాత్తమయిన యనుమానవిరోధముఁ జెప్పుచున్నాఁడు జగ దిత్యాదిగా. విమతము విచిత్రహేతుకము, విచిత్రకార్యమగుటవలన, ప్రాసాదాదికమువలె నని యర్థము. ప్రత్యక్షానుమానాగమవిరోధమువలన నయుక్త మైక్యం బని యుపసంహరించుచున్నాఁడు అత్రేశ్వరేత్యాదిగా.

ఐక్యమునందును అవిద్యవలన సంసారిత్వంబును విద్యవలన అసంసారిత్వంబు ననువిభాగమువలన ననుపపత్తి లే దని యుత్తరముఁ జెప్పుచున్నారు కాదు ఇత్యాదిగా. అజ్ఞానాఽజ్ఞానంబులు స్వరూపంబున విలక్షణంబు లనుటకు శ్రుతి నుదాహరించుచున్నారు దూర మిత్యాదిగా. విద్య యనియు అవిద్య యనియుఁ బ్రసిద్ధము లయిన యీవిద్యాఽవిద్యలు రెండును, దూరం విపరీతే—మిక్కిలి విరుద్ధము లని యర్థము; విషూచీ—నానావిధ మయినగతి గలవి, భిన్నఫలము లని యర్థము. స్వరూపముచే విరోధమువలె ఫలముచేఁ గూడ విరోధము కల దని చెప్పుచున్నారు అన్యు ఇత్యాదిగా. ఫలభేదోక్తినే వ్యక్తీకరించుచున్నారు విద్యావిషయము ఇత్యాదిగా. అవి విలక్షణంబు లనుటకు వేదవ్యాసులసమ్మతిం జూపుచున్నారు వ్యాసుఁడును ఇత్యాదిగా. ఈ చెప్పినయర్థమునందు భగవత్స్మృతినిం దెలుపుచున్నారు ఇందును ఇత్యాదిగా. రెండునిష్ఠలును సమానముగా నుపాదేయంబు లనుశంకను నిరాకరించుచున్నారు అవిద్యను ఇత్యాదిగా. అవిద్యను గార్యసహితముగాఁ దొలఁగింపవలయు ననుటకు శ్రుతుల నుదాహరించుచున్నారు అందు శ్రుతులు ఇత్యాదిగా. ఇహ—జీవదవస్థయందు, చేత్ అనునది విద్యోదయము దుర్లభం బని తెలుపుచున్నది, అవేదీత్—నేనే బ్రహ్మ మని యెఱింగె నని యర్థము. విద్యానంతరమే సత్యము—అవితథము పునరావృత్తివర్జిత మయినకైవల్యము సిద్ధించు నని చెప్పుచున్నది అథేత్యాదిగా. అవిద్యావిషయంబునను శ్రుతిఁ జెప్పుచున్నారు నచే దిత్యాదిగా. జన్మమరణాదిరూప మగుసంసారము వినష్టి, అది మహతి—సమ్యక్ జ్ఞానము లేక నివర్తింపనశక్య మని యర్థము. విద్యావిషయంబున శ్రుత్యంతరముఁ జెప్పుచున్నారు త మేవ మిత్యాదిగా. పరమాత్మను జక్కగా నెవ్వఁడు సాక్షాత్కరించునో ఆదేహి జీవించియున్నపుడే ముక్తుఁ డగుచున్నాఁ డని యర్థము. విద్య లేకున్నను కాలాంతరమున ముక్తి కలుగవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు నాన్య ఇత్యాదిగా. భయహేతువగు నవిద్యను నిరాకరించువానికి తజ్జన్య మయినభయమునుగూడ విద్యనిరసించు ననుటకు వాక్యాంతరముఁ జెప్పుచున్నారు విద్వా న్నిత్యాదిగా. అవిద్యావిషయంబున వాక్యాంతరముఁ జెప్పుచున్నారు ఇఁక నవిద్వాంసునకు ఇత్యాదిగా. ఏకరస మయినప్రత్యగాత్మయందు స్వల్పమైనను భేదముఁ దలంచువానికి భేదదృష్టి కలిగినవెంటనె సంసారము ధ్రువం బగు నని యర్థము. అందే శ్రుత్యంతరముఁ జెప్పుచున్నారు అవిద్యాయా మిత్యాదిగా. అవిద్యామధ్యంబునఁ దత్పరవశులై యుండి తత్త్వమెఱుంగనివారలై దేహాద్యభిమానవంతులగు మూఢులు సంచరించుచున్నా

రని యర్థము. విద్యావిషయంబున శ్రుత్యంతరముఁ జెప్పుచున్నారు బ్రహ్మేత్యాదిగా. అవిద్యావిషయంబున శ్రుత్యంతరముఁ జెప్పుచున్నారు అన్యోఽసా విత్యాదిగా. భేద దృష్టిననువదించి తన్మూల మవిద్యయని చెప్పుచున్నది నసవేద అని. అతఁడు మను ష్యులకుఁ బశువువలె దేవాదులకుఁ బ్రేష్యుఁ ♦ డగుచున్నాఁ డని చెప్పుచున్నది యథేత్యాదిగా. విద్యావిషయంబున వాక్యాంతరముఁ జెప్పుచున్నారు ఆత్మవి దిత్యాదిగా. ఇదం సర్వమ్—ప్రత్యగ్భూతము పూర్ణ మయినబ్రహ్మ మని యర్థము. జ్ఞానము వలననే కైవల్యం బనుటకు శ్రుత్యంతరముఁ జెప్పుచున్నారు యదా చర్మవత్ అని. ఆకాశమును జర్మమునువలె మనుష్యుఁడు చుట్టుటకు సమర్థుండు కాఁడు గదా! అట్లు పరమాత్మను బ్రత్యగాత్మనుగా ననుభవింపక ముక్తుఁడు గాఁ డని యర్థము. ఆదిశబ్దముచే అనుక్తములు విద్యాఽవిద్యాఫలభేదార్థములు శ్రుతులు గ్రహింపఁబడు చున్నవి. అవి పెక్కులగుటచేఁ బ్రమాణము లని సూచించుచున్నారు వేనవేలు అని. విద్యాఽవిద్యావిషయము లగుస్మృతుల నుదాహరించుచున్నారు స్మృతులును ఇత్యాదిగా. అందవిద్యావిషయ మయినవాక్యముఁ జెప్పుచున్నారు అజ్ఞానే నేత్యాదిగా. విద్యావిషయము లయిన రెండువాక్యములఁ బ్రదర్శించుచున్నారు ఇహై వేత్యాదిగా. విద్యాఫలం బనర్థధ్వంసము అవిద్యాఫలం బనర్థప్రాప్తి యను నీయర్థము అన్వయవ్యతిరేకాఖ్యన్యాయమువలనఁ గూడ సిద్ధించుచున్న దని చెప్పుచున్నారు న్యాయంబును అని. అందే పురాణసమ్మతిం బ్రదర్శించుచున్నారు సర్వా విత్యాదిగా. ఉదపానము—నూయి. ఎట్లు ఆత్మజ్ఞానమునందు ఉత్తమ మయినఫలము కలుగునో అట్లు * ఎఱుంగు మని యన్వయము. న్యాయంబును అని చెప్పినదాని అన్వయవ్యతిరేకాఖ్యన్యాయమును వివరించుచున్నారు అట్లు ఇత్యాదిగా. అందు మొదట నన్వయముఁ జెప్పుచున్నారు దేహాదులయందు ఇత్యాదిగా. అనాద్యనిర్వాచ్యాఽవిద్యావంతుఁ డైనచిదాత్మ దేహాదిక మయినయనాత్మయం దాత్మబుద్ధి నుంచుచున్నాఁడు, దానితోఁ గూడినవాఁడై రాగాదులచేఁ బ్రేరింపఁబడుచున్నాఁడు, తత్ప్రయుక్తుండై కర్మము ననుష్ఠించుచున్నాఁడు, దాని ననుష్ఠించినవాఁడు ఆకర్మము చొప్పున నూతనదేహమును గ్రహించుచున్నాఁడు పురాతనమును విడుచుచున్నాఁడు—ఇట్లు అవిద్యకలుగునపుడు సంసారిత్వము సిద్ధ మని యర్థము. వ్యతిరేకము నిప్పుడు ప్రదర్శించుచున్నారు దేహా దిత్యాదిగా. శ్రుతియుక్తులవలన భేదము తెలిసి

♦ పరిచారకుఁడు.

* ఆత్మజ్ఞానమువలన నుత్తమఫలము సిద్ధించు నని.

నపుడు రాగాదులు ధ్వస్తంబు లగుటచేఁ గర్మమునుండి యుపరతి గలుగుటవలన
నశేషసంసారము వినష్ట మగుం గావున నవిద్యలేనపుడు బంధధ్వంసం బగు నని యర్థ
ము. చెప్పిన యన్వయవ్యతిరేకముల కన్యథాసిద్ధిని నిరాకరించుచున్నారు ఇది యెవ్వ
నికిని ఇత్యాదిగా. చెప్పినయర్థము అన్వయవ్యతిరేకవాది కెవ్వనికిని న్యాయమువలన
నిరాకరింప శక్యముగాదు, తదన్యథాసిద్ధిసాధకము లేమివలన నని యర్థము. అన్వ
యాదిక మన్యథాసిద్ధిరహిత మయినపుడు మున్ను చేసిన పూర్వపక్షముగూడ నిరాక
రింపఁబడిన దని చెప్పుచున్నారు అట్లు కావున నిత్యాదిగా. ఈచెప్పినన్యాయంబున
జ్ఞానాఽజ్ఞానంబులకు స్వరూపభేదంబును గార్యభేదంబును గలుగుటవలన, స్వారస్యం
బున ♦♦ఁ బరాపరుల కైక్యము సిద్ధమ యయినను బుద్ధ్యాద్యుపాధిభేదమువలన నాత్మ
కాభాసరూపంబై ప్రాతిభాసిక మగు నావిద్యక మయిన సంసారిత్వము సిద్ధించుచున్నది
యని యర్థము. ఆత్మకు బ్రహ్మత్వము స్వాభావిక మైనయెడ నే నని యాత్మభావంబున
బ్రహ్మత్వముగూడ భాసిల్లవలయు నని యాశంకించి చెప్పుచున్నారు ఎట్లు ఇత్యాదిగా.
దేహాదివ్యతిరేకం బాత్మకు వైదికపక్షమున స్వాభావికమైనను అది నే నని భాసిల్లు
చుండఁగానే తదతిరిక్తత్వము భాసిల్లదు, మ తే మనఁగా, అవిద్యవలన విపరీత మయిన
దేహాద్యాత్మత్వమే భాసిల్లు చున్నది; అట్లు ఆత్మకు బ్రహ్మత్వము స్వాభావికం బైనను
అది భాసిల్లు చుండఁగానే బ్రహ్మత్వము భాసిల్లదు, అవిద్యవలన అబ్రహ్మత్వమే భాసిల్లు
చున్న దని యర్థము. ఆత్మకు ఆవిద్యక మయినదేహాద్యాత్మత్వము భాసిల్లుచున్న
దని చెప్పినదాని ననుభవముచే స్పష్టీకరించుచున్నారు ప్రసిద్ధము గదా ఇత్యాదిగా.
అది కానిదానియం దది యనుబుద్ధి యవిద్యాకృతం బనుటకు దృష్టాంతముఁ జెప్పు
చున్నారు స్థాణువునందు ఇత్యాదిగా. ఎదుటనున్నస్థాణువునందు అవిద్యచేఁ బురుషుం
డనునిశ్చయము గలుగుచున్నది. అట్లు దేహాదిక మగు ననాత్మయం దాత్మబుద్ధి
యవిద్యవలన నిశ్చిత మని యర్థము. దేహాత్మల కైక్యము దలఁచినయెడ దేహధర్మ
మయిన జరాదికమున కాత్మయందును ఆత్మధర్మ మయినచైతన్యమునకు దేహము
నందును వినిమయం బగు నని యాశంకించి చెప్పుచున్నారు ఇంతమాత్రమున నిత్యా
దిగా. స్థాణువునందుఁ బురుషత్వము భ్రాంతిచేఁ దోఁచుచున్నది, ఇంతమాత్రమున
శిరోహస్తాదిపురుషధర్మము స్థాణువునకు సిద్ధింపదు, స్థాణుధర్మము గాని వక్రత్వాది
కము పురుషునకుఁ గనఁబడదు, మిథ్యాధ్యస్తతాదాత్మ్యమువలన వాస్తవధర్మసంబం
ధము కలుగమివలన. దృష్టాంతముఁ జెప్పి దార్ష్టాంతికముఁ జెప్పుచున్నారు అట్లు

♦♦ పరమార్థంబున.

ఇత్యాదిగా. జరాదికం బనాత్మధర్మ మైనను సుఖాదికం బాత్మధర్మ మని కొందఱు చెప్పెదరు, వారికిఁ జెప్పుచున్నారు ఇట్లు-ఇత్యాదిగా. కామసంకల్పాదిశ్రుతివలన అనాత్మధర్మం బని తెలియుటవలన నని యర్థము. మఱియును, వివతము ఆత్మ ధర్మము కాదు, అవిద్యాకృత మగుటవలన, జరాదికమువలె; హేతువు సిద్ధింపన దశక్యము గాదు, అది కానిదానియందుఁ తద్బుద్ధివిషయం బగుటచే స్థాణువునందుఁ బురుషత్వమువలె నవిద్యాకృతత్వము చెప్పఁబడిన దగుటవలన-అనునభిప్రాయముతోఁ జెప్పుచున్నారు అవిద్యాకృతత్వము ఇత్యాదిగా.

భా. ఆక్షేపము.—అది సరికాదు, అసమానం బగుటవలన. స్థాణు పురుషులు ఇద్దఱు జ్ఞేయులే జ్ఞాతచేఁ బరస్పరమునం దధ్యసింపఁబడుచున్నా రవిద్యచేత. దేహాత్మలకో జ్ఞేయజ్ఞాతలకే యితరేతరాధ్యాసము. కావున సమము గాదు దృష్టాంతము. అందువలన దేహధర్మము జ్ఞేయం బైనను జ్ఞాత యగునాత్మకుఁ గావచ్చును.

సమాధానము.—కాదు, అచైతన్యాదులు ప్రసక్తించుటవలన. జ్ఞేయం బగుదేహాదిక్షేత్రముయొక్క ధర్మములు సుఖదుఃఖమోహేచ్ఛాదులు జ్ఞాతకుఁ గల వనునెడ, అప్పుడు జ్ఞేయం బగుక్షేత్రముయొక్క ధర్మములు అవిద్యాధ్యారోపితములు కొన్ని యాత్మకుఁ గలవు, జరామరణాదులుమాత్రము లే వనుటకు విశేషహేతువు చెప్పవలయును గదా! లే వనుటకుఁ గల దనుమానము, అవిద్యాధ్యారోపితంబు లగుటవలన జరాది కమువలె నని. హేయము లగుటవలనను ఉపాయంబు లగుటవలనను ఇత్యాదికమువలనఁగూడ.

ఆ. స్థాణువునందుఁ బురుషత్వమువలె నావిద్యకత్వము దేహాదులకయు క్తము, దృష్టాంతదార్ష్టాంతికములు విషమంబు లగుటవలన నని శంకించుచున్నాఁడు అది సరికాదు ఇత్యాదిగా. దానినే ప్రపంచించుచున్నాఁడు స్థాణుపురుషులు ఇత్యాదిగా. జ్ఞేయమే జ్ఞేయాంతరమునం దధ్యస్త మగుటవలన నిట రెండును జ్ఞేయములు, వ్యాపకవ్యావృత్తిచే వ్యాప్యాధ్యాసమునకును వ్యావృత్తి * యని యర్థము. దేహాత్మ

* వ్యాపకమునకు—జ్ఞేయత్వమునకు వ్యావృత్తిచే వ్యాప్యాధ్యాసమునకు—జ్ఞాతృజ్ఞేయముల పర స్పరాధ్యాసమునకు వ్యావృత్తి.

బుద్ధికి భ్రమత్వము లే దని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా.

ఉపాధిధర్మము లగుసుఖాదు లుపహితుఁ డైనజీవునియందు వాస్తవంబు లనుట యయుక్తము, అతిప్రసంగమువలన నని పరిహరించుచున్నారు కాదు ఇత్యాదిగా. అతిప్రసంగమునే ప్రకటించుచున్నారు జ్ఞేయంబు ఇత్యాదిగా. ఉపాధిధర్మంబు లగుటవలన సుఖాదు లాత్మధర్మము లగునేని అనైతన్యంబును జరాదికంబును ఆత్మకు దుర్వారం బగు నని యర్థము. సుఖాదిక మాత్మధర్మము కా దనుపక్షమునందును లేదు విశేషహేతు వని యాశంకించి చెప్పుచున్నారు లే వనుటకు ఇత్యాదిగా. ఆ యనుమానమునే సాధించుచున్నాఁడు అవి ద్యేత్యాదిగా. వివాదము ఆత్మధర్మము కాదు, ఆగమాపాయి యగుటవలన, సంసారమువలె నని యనుమానాంతరముఁ జెప్పుచున్నారు హేయంబు లగుటవలనను ఇత్యాదిగా. ఆదిశబ్దముచే దృశ్యత్వజడత్వాదికము గ్రహింపఁబడుచున్నది.

భా. అట్లు కావున, కర్తృత్వభోక్తృత్వలక్షణ మయిన సంసారము జ్ఞేయస్థము. జ్ఞాతయం దవిద్యచే నధ్యారోపింపఁబడినది. అందువలన దానిచే జ్ఞాత కేమియు దోషము లేదు. బాలురచే నధ్యారోపింపఁబడిన తలమల వత్త్వాదికముచే నాకాశమున కెట్లో అట్లు. కావున సర్వక్షేత్రములందు నున్నట్టి భగవంతుఁడు క్షేత్రజ్ఞుఁ డగునీశ్వరునకు సంసారిత్వగంధమాత్ర మేనియు నాశంకింప శక్యము గాదు. లోకమున నెచ్చటనేనియు నవిద్యాధ్యస్త మయినధర్మముచే నెవ్వనికిని నుపకారము గాని -యపకారము గాని గానంబడదు గదా! దృష్టాంతము సమనుగా దని యేది చెప్పఁబడినదో అది సరిగాదు. ఎట్లు? అవిద్యాధ్యాసమాత్రము గదా దృష్టాంతదార్ష్టాంతికములయందు సాధర్మ్యము వివక్షింపఁబడినది. అది వ్యభిచరింపదు. ఇఁక జ్ఞాతయందు వ్యభిచరించు నని శంకించితివి, దానికిని అనైకాంతికత్వము ప్రదర్శింపఁబడినది జరాదులచేత.

పూర్వపక్షము.—అవిద్యావంతుఁ డగుటవలన క్షేత్రజ్ఞునకు సంసారిత్వము.

సమాధానము.—కాదు, అవిద్య తామస మగుటవలన. తామసము నప్రత్యయము గదా ఆవరణాత్మక మగుటవలన నవిద్య, విపరీత

గ్రాహకము గాని సంశయోపస్థాపకము గాని అగ్రహణాత్మకము గాని, వివేకప్రకాశకము కలుగునప్పు డది లేనివలనను, తామస మైన యావర ణాత్మక మగు తిమిరాదిదోష ముండునపుడు అగ్రహణాదిక మవిద్యా త్రయము కనఁబడుటవలనను.

పూర్వపక్షము.—ఇటఁ జెప్పుచున్నాఁడు.—ఇ ట్లయినయెడ జ్ఞాతృ ధర్మం బవిద్య—అని.

సమాధానము.—కాదు, కరణ మయినచక్షువునందుఁ దైమిరి కత్వాదిదోషము కనఁబడుటవలన. మఱి నీవేది తలఁచుచున్నావో— జ్ఞాతృధర్మం బవిద్య, అయ్యవిద్యాధర్మవత్త్వమే క్షేత్రజ్ఞునకు సంసారి త్వము, అందువలన, ఈశ్వరుఁడే క్షేత్రజ్ఞుఁడు, కాఁడు సంసారి యని చెప్పి నది అయుక్తము—అని. అది సరికాదు. ఎట్లు కరణ మయినచక్షువు నందు విపరీతగ్రాహకాదిదోషము కనఁబడుటవలన విపరీతాదిగ్రహణము గాని తన్నిమిత్త మయిన తైమిరికత్వాదిదోషము గాని గ్రహీత దగి కాదో, చక్షువునకు సంస్కారము చేయుటచేఁ దిమిరం బపనీత మయి నపుడు గ్రహీతయందుఁ గనఁబడమివలన నది యెట్లు గ్రహీతృధర్మము కాదో, అట్లు సర్వత్రయును అగ్రహణవిపరీతసంశయప్రత్యయములు త న్నిమిత్తములు కరణమునకే దేనికో యుండవలయుం గాని జ్ఞాత యగు క్షేత్రజ్ఞునివి కావు. సంవేద్యము లగుటవలననే స్వవ్యతిరిక్తసంవేద్యము * లగుచున్నవి. సర్వకరణవియోగము కలిగినపుడు కైవల్యమునందు సర్వ వాదులును అవిద్యాదిదోషవత్త్వము నంగీకరింపమివలనఁగూడ. ఆత్మ యగుక్షేత్రజ్ఞునకు అగ్ని కుష్ణమువలె నది స్వధర్మ మగునేని ఎప్పుడును దానితో నతనికి వియోగము సంభవింపదు. అవిక్రియుఁడు ఆకాశము వలె సర్వగతుఁడు అమూర్తుఁ డగునాత్మకు దేనితోను సంయోగవియో గము లనుపపన్నములు. అందువలన సిద్ధము క్షేత్రజ్ఞునకు నిత్యమే యీశ్వరత్వము. అనాదిత్వాన్నిర్గుణత్వా దిత్యాదిక మగుభగవద్వచ నమువలనఁగూడ.

ఆ. సుఖాదులు జరాదులుంబోలె నాత్మధర్మములు కా వని యేర్పడి నప్పుడు ఆత్మకు వాస్తవంబున అసంసారిత్వ మని ఫలితముఁ జెప్పుచున్నారు అట్లు

* తమకంటె భిన్ననిచే నెఱుంగఁబడినవి.

కావున నిత్యాదిగా. ఆరోపితముతో నధిష్ఠానమునకు వాస్తవంబగు స్పర్శము లేదని దృష్టాంతముఁ జెప్పుచున్నారు బాలురచే నిత్యాదిగా. ఈశ్వరాభిన్నుం డగు నాత్మకు సంసారిత్వ మధ్యస్తం బని యేర్పడినపుడు, ఈశ్వరునకు సంసారిత్వాపత్తి యేది చెప్పఁబడినదో అది యయుక్త మని చెప్పుచున్నారు కావున నిత్యాదిగా. ఆత్మయందు సంసారిత్వ మారోపితం బగుటవలనఁ దదభిన్నుఁ డగునీశ్వరునియందు సంసారిత్వాశంకయే యయుక్తం బనుట నుపపాదించుచున్నారు లోకమున నిత్యాదిగా. స్థాణువునందుఁ బురుషత్వనిశ్చయమువలె ఆత్మయందు దేహాద్యాత్మత్వనిశ్చయ మధ్యస్తం బనుట యుక్తము గాదు, దృష్టాంతము జ్ఞేయమాత్రవిషయం బగుటవలనను దార్ష్టాంతికము జ్ఞేయజ్ఞాతృవిషయం బగుటవలనను—అని పూర్వపక్షి చెప్పినదాని ననువదించుచున్నారు దృష్టాంతము ఇత్యాదిగా. వైషమ్యమును నిరాకరించుచున్నారు అది సరిగాదు అని. అప్పుడు దేనిచే సాధర్మ్యము? అని యడుగుచున్నాఁడు ఎట్లు? అని. సమ్మత మయినసాధర్మ్యమును బ్రదర్శించుచున్నారు అవిద్యేత్యాదిగా. అది యుభయస్థలంబులందును అనుగతం బని చెప్పుచున్నారు అది వ్యభిచరింపదు అని. జ్ఞేయాంతరమునందు జ్ఞేయమున కారోపం బనునియమంబువలన జ్ఞాతయం దారోపము సంభవింప దని యాశంకించి చెప్పుచున్నారు జ్ఞాతయందు ఇత్యాదిగా. ఇది నియమము గాదు, జ్ఞాతయందు జరాద్యారోపము చెప్పఁబడుటవలన నని చెప్పుచున్నారు దానికిని ఇత్యాదిగా. దానికిని—జ్ఞేయమునకే జ్ఞేయాంతరమున కధ్యాసనియమంబునకును. అందువలన జ్ఞాతయం దారోపవ్యభిచారశంక యుక్తము గా దని యర్థము.

ఆత్మయం దవిద్య యధ్యస్త మనుపక్షమునందు అవిద్య స్వాభావికం బగుటవలన ఆత్మకు తదధీనత్వంబును అట్లు సంసారిత్వంబును సిద్ధించు చున్నది యని శంకించుచున్నాఁడు అవిద్యావంతుఁ డగుటవలన నిత్యాదిగా.

అవిద్య యనఁగా నేమి? విపరీతగ్రహణాదికమా? అనాద్యనిర్వాచ్యాజ్ఞానమా? మొదటిది కాదు, విపరీతగ్రహణాదికము అనాద్యనిర్వాచ్యాజ్ఞానకార్యం బగుటవలన తన్నిష్ఠం బగునది యాత్మధర్మం బనుట యుక్తము గామివలన నని చెప్పుచున్నారు కాదు ఇత్యాదిగా. దానినే ప్రపంచించుచున్నారు తామసము ఇత్యాదిగా. ఆవరణాత్మకము—వస్తువునందు సమ్యక్ప్రకాశమునకుఁ బ్రతిబంధకము. విపరీతగ్రహణాదికము అవిద్యాకార్యం బనుటను విద్యానాశ్యం బగుటచే సాధించుచున్నారు వివేకేత్యాదిగా. అనాద్యనిర్వాచ్య మయినకారణావిద్యయు నాత్మ

ధర్మం బనుట చెల్లదు, అనిర్వాచ్యం బగుటవలననే దాని కాత్మధర్మత్వము దుర్వచం * బగుటవలన నని భావము. మఱియును, విపరీతగ్రహణాదికము అన్వయవ్యతిరేకములవలన దోషజన్య మని తెలియుటవలనఁ గూడ ఆత్మధర్మము కా దని చెప్పుచున్నారు తామసమై ఇత్యాదిగా. తమ స్సనుపేరు గల యజ్ఞానమువలనఁ బుట్టినదై వస్తుప్రకాశప్రతిబంధక మగునది తిమిరకాచాదిదోషము, అది యుండునపుడు అజ్ఞానము మిథ్యాజ్ఞానము సంశయము అను నీమూఁడును గనఁబడుటవలనను అది లేనపుడు కనఁబడమివలనను అన్వయవ్యతిరేకములవలన విపరీతజ్ఞానాదికము దోషాధీనం బని తెలియుటవలనఁ గేవలాత్మధర్మము కా దని యర్థము.

దోషము నిమిత్త మగుటవలనను భావకార్యమున కుపాదానము నియతం బగుటవలనను అనిర్వాచ్యావిద్య మాకసమ్మతం బగుటవలనను ఆత్మయే విపర్యయాదుల కుపాదానం బని యాక్షేపించుచున్నాఁడు ఇటఁ జెప్పుచున్నాఁను అని. ఇట—విపరీతగ్రహణాదులు దోషజన్యము లనుపక్షమునందు. అవిద్య—అగ్రహణాదిత్రయము.

విపర్యయాదులకు ఉపాదానము సత్యమగునెడ సత్యత్వము ప్రసక్తించుటవలన ఆత్మ వాని కుపాదానము కాఁదు, మ తే మనఁగా, దోషము చక్షురాదిధర్మం బని తెలియుటవలన అగ్రహణాదికము గూడ దోషం బగుటవలన నది కరణధర్మం బని యేర్పడుచున్నది, అందుకుఁ గరణము అవిద్యాజన్య మయినయంతఃకరణము, తత్కారణ మయినయవిద్య యసిద్ధం బన శక్యము గాదు, అజ్ఞుఁడను నేనను ననుభవమువలనను సుషుప్తియందు అజ్ఞానపరామర్శమువలనను నది తెలియుటవలన, కార్యలింగకానుమానమువలనను ఆగమమువలనను అది ప్రసిద్ధం బగుటవలన, అని పరిహరించుచున్నారు కాదు ఇత్యాదిగా. పూర్వపక్షమును వివరించుచున్నాఁడు మఱి నీవు ఇత్యాదిగా. అవిద్యావత్త్వ మున్నను జ్ఞాతకు అసంసారి యగుటవలనఁ గోఱలు పెఱికినసర్పమువలె నవిద్య యేమి చేయఁగల దని యాశంకించి చెప్పుచున్నాఁడు అవిద్యావత్త్వమే ఇత్యాదిగా. మిథ్యాజ్ఞానాదిమత్త్వమే యాత్మకు సంసారిత్వ మని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా. కరణ మయిన చక్షువునందు ఇత్యాదిగాఁ జెప్పినపరిహారమునే ప్రపంచించుచున్నారు. అది సరికాదు ఇత్యాదిగా. తిమిరాదిదోషంబును తత్కృత మైనవిపరీతగ్రహణాదికంబును గ్రహీత యగునాత్మకు లే దనుటకు హేతువుఁ జెప్పుచున్నారు చక్షువునకు ఇత్యాదిగా. చక్షు

* చెప్ప శక్యము గానిది.

గ్గత మైయున యుంజనాదిసంస్కారము చేతనెట్లు సాధించబడినను విపరీతగ్రహితా యగు దేవదత్తునందు దోషాదికము కనఁబడమివలన వానిది గాదు తద్ధర్మము. అందు వలన విపరీతము తత్త్వంబున ఆత్మధర్మము గాదు, దోష మగుటవలన, లేక, దోష కార్య మగుటవలన, సంప్రతిపన్నమువలె. అని యర్థము. మఱియును, విపరీతగ్రహా దికము తత్త్వంబున నాత్మధర్మము కాదు, వేద్యం బగుటవలన, సంప్రతిపన్నమువలె నని చెప్పుచున్నారు సంవేద్యము లగుటవలనఁ గూడ నిత్యాదిగా. మఱియును ఏది వేద్యమో అది స్వాతిరిక్తవేద్యము, దీపాదికమువలె—అనువ్యాప్తిచే విపరీతగ్రహా ణాదులును వేద్యంబు లగుటచే స్వాతిరిక్తవేద్యంబు లగుటంజేసి, జ్ఞాత జ్ఞేయధర్మవం తుఁడు కాఁడు, జ్ఞాత యగుటవలన, ఎట్లు దేవదత్తుఁడు జ్ఞేయరూపాదిమంతుఁడు కాఁడో అట్లు—అను ననుమానాంతరముఁ జెప్పుచున్నారు సంవేద్యము లగుటవలనే ఇత్యాదిగా. మఱియును, విపరీతగ్రహాదులు తత్త్వంబున నాత్మధర్మములు కావు, వ్యభిచారు లగుటవలన, కృశత్వాదులవలె నని చెప్పుచున్నారు సర్వకరణవియోగము ఇత్యాదిగా. చెప్పినదానినే వివరించుచు ఆత్మకు విపరీతగ్రహాదికము స్వాభావికమో లేక ఆగంతుకమో? అని వికల్పించి మొదటిపక్షమును నిరాకరించుచున్నారు ఆత్మ ఇత్యాదిగా. అందువలన మోక్షమే లేకపోవును అవిద్యాతత్కార్యధ్వంసము సంభ వింపమివలన నని భావము. ఆగంతుకం బన్నను తనయంతనే యన్నచో మోక్షము లేకపోవును, ఇతరముచే నన్నయెడ నందుకుఁ జెప్పుచున్నారు అవిక్రియుఁడు ఇత్యా దిగా. విభు వగుటవలనను అవిక్రియుఁ డగుటవలనను అమూర్తుఁ డగుటవలనను ఆత్మ ఆకాశమువలె దేనిచేతను సంయోగవిభాగములఁ బొందఁడు; విక్రియారహిత మయిన యాకాశమునందు వాస్తవంబున సంయోగవిభాగములు సంభవింపవు గదా! అసం గుఁ డగుటవలనఁగూడ ఆత్మకు విపరీతగ్రహాదికముతో సంయోగము సంభవింపమి వలన ఇతరముచేఁ గూడ నతని కది లే దని యర్థము. అది యాత్మధర్మము గా దని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. ఆత్మ నిర్ధర్మకుం డనుటకు భగవదనుమతిం జెప్పుచున్నారు అనాదిత్వా దిత్యాదిగా.

భా. పూర్వపక్షము.—ఓయీ! ఇట్లయిన యెడ సంసారులును సంసారిత్వంబును లే కుండుటంజేసి శాస్త్రానర్థక్యాదిదోషం బగును.

సమాధానము.—కాదు, అందఱిచేతను అంగీకృతం బగుటవలన. ఆత్మవాదులందఱిచేతను అంగీకృత మయినదోషం బొక్కరుఁడు పరిహ రింపవలసినది కాదు. ఎట్లంగీకరింపఁబడిన దంటివేని ముక్తాత్మలకు సంసా



41

సారసంసారిత్వవ్యవహారాభావం బాహ్యవాదుల కందఱకును సమ్మతము. వారికి శాస్త్రానర్థక్యాదిదోషప్రాప్తియూ సమ్మతము కాదు. అట్లే మాకును క్షేత్రజ్ఞుల కీశ్వరైకత్వము కలుగునపుడు శాస్త్రానర్థక్యం బగుఁగాక. అవిద్యావిషయంబుననో అర్థవత్త్వము సిద్ధించుచున్నది. ఎట్లు ద్వైతుల కందఱకును బంధావస్థయందే శాస్త్రాదుల కర్థవత్త్వము, ముక్తావస్థయందు లేదో, అట్లు.

పూర్వపక్షము.—ఓయీ! ద్వైతులకు మాకందఱకును ఆత్మకు బంధముక్తావస్థలు పరమార్థంబుననే వాస్తవములు. అందువలన హేయోపాదేయతత్సాధనములు కలుగుటం జేసి శాస్త్రాదుల కర్థవత్త్వము సిద్ధించుచున్నది. అద్వైతులకో ద్వైతం బపరమార్థం బగుటవలనను అవిద్యాకృతం బగుటవలనను బంధావస్థ యాత్మకపరమార్థమైనప్పుడు నిర్విషయ మగుటం జేసి శాస్త్రాదుల కానర్థక్యం బగును.

సమాధానము.—కాదు, ఆత్మకవస్థాభేదం బనుపపన్న మగుటవలన. ఆత్మకు బంధముక్తావస్థ లగు ననునెడ, ఏకకాలంబుననా? క్రమంబుననా? ఏకకాలంబుననో విరోధమువలన నొక్కనియందు సంభవింపవు, స్థితిగతులుం బోలె. క్రమభావిత్వమునందును నిర్నిమిత్తము లనునెడ అనిర్మోక్షప్రసంగము. అన్యనిమిత్తంబు లన్నచో నపరమార్థత్వప్రసంగము. అప్పు డభ్యుపమహాని యగును. మఱియును. బంధమోక్షావస్థలకుఁ బౌర్వాపర్యము నిరూపించునపుడు బంధావస్థ మొదటఁ గల్పింపవలయును, అనాదిమంతమును అంతవంతమును అని. అది ప్రమాణవిరుద్ధము. అట్లు మోక్షావస్థయు ఆదిమంతము ననంతము నని ప్రమాణవిరుద్ధమే యంగీకరింపవలయును. అవస్థావంతుఁడై యవస్థాంతరము నొందువానికి నిత్యత్వముగూడ నుపపాదింప శక్యము గాదు. ఇఁక, అనిత్యత్వదోషపరిహారముకొఱకు నవస్థాభేదము కల్పింపరు, అప్పుడు ద్వైతులకుఁ గూడ శాస్త్రానర్థక్యాదిదోషం బపరిహార్యమే యగును. కావున సమానం బగుటవలన నద్వైతవాదిచేఁ బరిహర్తవ్యము గాదీదోషము.

ఆ. ఆత్మకీశ్వరత్వంబును అసంసారిత్వమును చెప్పునెడ విధిశాస్త్రంబును ప్రత్యక్షాదికంబును అనర్థకం బగుటవలనఁ దాత్త్వికమే యతనికి సంసారిత్వ మని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా.

విద్యావస్థయందా అవిద్యావస్థయందా శాస్త్రార్థక్యము? అని వికల్పించి మొదటిపక్షమును నిరాకరించుచున్నారు కాదు ఇత్యాదిగా. విద్యావస్థయందు ముక్తుఁ డయినవానికి సంసారసంసారిత్వములు లేవనుట సర్వవాదిసమ్మతం బగుటవలన నందు శాస్త్రానర్థక్యాదిదోషము నేను మాత్రమే పరిహరింపవలసినది కాదని యర్థము. సంగ్రహవాక్యమును వివరించుచున్నారు ఆ త్మేత్యాదిగా, అభిప్రాయము తెలియమివలనఁ బ్రశ్నము చేయఁగా స్వాభిప్రాయముఁ జెప్పుచున్నారు ఎట్లన ఇత్యాదిగా. అప్పుడు ముక్తులవిషయంబున విధిశాస్త్రంబునకును బ్రత్యేకాధికారముకును ఆనర్థక్యం బని యాశంకించి చెప్పుచున్నారు వారికి నిత్యాదిగా. వ్యవహారాతీతు లగు వారివిషయమున గుణదోషాశంక సంభవింపదు గదా యని యర్థము. ద్వైతులమతమున ముక్తాత్మలవిషయమునందుంబోలె నస్మత్పక్షమునందును క్షేత్రజ్ఞున కీశ్వరత్వ మయినను తద్విషయమున శాస్త్రాద్యానర్థక్యము విద్యావస్థయం దంగీకృత మని ఫలితముఁ జెప్పుచున్నారు అట్లు మాకును ఇత్యాదిగా. ద్వితీయపక్షమును దూషించుచున్నారు అవిద్యావిషయంబుననో ఇత్యాదిగా. దానినే దృష్టాంతముచే వివరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. అట్లు అద్వైతులకుఁ గూడ విద్యోదయంబువఱకు మున్ను శాస్త్రాధికంబున కర్థవత్త్వము కల దని శేషము.

అద్వైతులకు ద్వైతులతో సామ్యము లే దని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. అవస్థలు వాస్తవము లగుటచేఁ దన్మతమునందు శాస్త్రాద్యర్థవత్త్వము ఫలితముఁ జెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా. అద్వైతిసిద్ధాంతమునందో అవస్థలకు వాస్తవత లే దని వైషమ్యముఁ జెప్పుచున్నాఁడు అద్వైతులకో ఇత్యాదిగా. వ్యావహారికం బగుద్వైతము అద్వైతిమతమునందును అంగీకృతం బని యాశంకించి చెప్పుచున్నాఁడు అవిద్యాకృతం బగుటవలన నని. కల్పితద్వైతముచే వ్యవహారమువలన దానికి వస్తుత లే దని యర్థము. బంధావస్థ వాస్తవము కా దన్నచో దోషాంతరముఁ జెప్పుచున్నాఁడు బంధేత్యాదిగా.

ఆత్మకుఁ దత్త్వంబున నవస్థాభేదము ద్వైతులకును లే దని పరిహరించుచున్నారు కాదు ఇత్యాదిగా. అనుపపత్తిని బ్రదర్శించుటకై వికల్పించుచున్నారు ఆత్మకు ఇత్యాదిగా. అందు మొదటిపక్షమును దూషించుచున్నారు ఏకకాలంబుననో ఇత్యాదిగా. ద్వితీయపక్షమునందును క్రమభావు లగునవస్థలు నిర్నిమిత్తములా? ససనిమిత్తములా? అని వికల్పించి ప్రథమకల్పంబున సదా ప్రసక్తించుటవలన బంధమోక్షముల కవ్యవస్థ వాటిల్లు నని చెప్పుచున్నారు క్రమభావిత్వమునందును ఇత్యా

దిగా. కల్పాంతరము నిరసించుచున్నారు అన్యనిమిత్తంబులు ఇత్యాదిగా. బంధ మోక్షావస్థలు పరమార్థములు గావు, అస్వాభావికము లగుటవలన, స్ఫటికరక్తిమ వలె, అని యేర్పడఁగా ఫలితము చెప్పుచున్నారు అప్పుడు ఇత్యాదిగా. అవస్థలు వాస్తవము లని చెప్పఁదలఁచి యవాస్తవము లని యంగీకరించుటవలన నని యర్థము. ఇందువలనఁ గూడ నవస్థలు వాస్తవములు గావని చెప్పుచున్నారు మఱియును ఇత్యాదిగా. అవస్థలకు వస్తుత్వముఁ గోరువాఁడు వాని కేకకాలికత్వము సంభవింప మిం జేసి క్రమము చెప్పవలయుటవలన నందు బంధము పూర్వం బనియు ముక్తి పశ్చిమం బనియు నంగీకరింపవలయును. అప్పుడు బంధము మొదటి దనుటచే వచ్చు దోషముఁ జెప్పుచున్నారు బంధావస్థ ఇత్యాదిగా. అది యకృతాభ్యాగమకృత వినాశదోషనివృత్తికొఱకు ననాది యని యంగీకరింపవలయును, ముక్తికొఱకు నంతవంత మని యంగీకరింపవలయును; అదియో, ఏది యనాదిభావరూపమో అది నిత్యము ఆత్మవలె ననువ్యాప్తికి విరుద్ధం బని యర్థము. మోక్షము పశ్చిమం బనుటచే వచ్చు దోషముఁ జెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. అది జ్ఞానాదిసాధ్యం బగుటవలన ఆది మంత మనియుఁ బునరావృత్తి నంగీకరింపమివలననంత మనియుఁ గదా చెప్పవల యును. అదియు, ఏది సాదిభావరూపమో అది యంతవంతము, ఘటాదికమువలె ననువ్యాప్త్యంతరమునకు విరుద్ధ మని యర్థము. మఱియును, క్రమభావు లగునవస్థల తో నాత్మ సంబంధించునా? సంబంధింపఁడా? మొదటిపక్షమునఁ బూర్వావస్థతోఁ గూడియే యుత్తరావస్థనొందు నేని యుత్తరావస్థయందును బూర్వావస్థాసంబంధము వలన అనిర్మోక్షము. పూర్వావస్థను విడిచి యుత్తరావస్థనొందు నేని యప్పుడు పూర్వ త్యాగోత్తరప్రాప్తులయందు ఆత్మకు సాతిశయత్వ మేర్పడుటవలన నిత్యత్వం బనుప పన్న మని చెప్పుచున్నారు అవస్థావంతుఁడై ఇత్యాదిగా. ఆత్మ కవస్థాద్వయసంబం ధము లే దనుద్వితీయపక్షము ననువదించి దూషించుచున్నారు ఇఁక నిత్యాదిగా.

భా. శాస్త్రానర్థక్యంబును లేదు, శాస్త్రము యథాప్రసిద్ధాఽవిద్వ త్పురుషవిషయం బగుటవలన. కలదు గదా అవిద్వాంసుల కనాత్మ లగుఫల హేతువులం దాత్మబుద్ధి. లేదు విద్వాంసులకు, విద్వాంసులకు ఫలహేతు వులకంటె నాత్మ భిన్నుం డని తెలియుటం జేసి వానియందు నే నని యాత్మ బుద్ధి యనుపపన్నం బగుటవలన. అత్యంతమూఢుఁ డున్మత్తాదులు గూడ జలాగ్నులయందుఁ గాని ఛాయాప్రకాశములందుఁ గాని యేకాత్మతను దలంపఁడు గదా! ఇఁక వివేకి తలంపఁ డని చెప్పవలయునా? దేవ

దత్తా! నీవు దీనిఁ జేయు మని దేవదత్తుఁ డొకానొకకర్మమునందు నియుక్తుఁడు కాఁగా విష్ణుమిత్త్రుఁడు నేను నియుక్తుఁడ నని తత్రిస్థుఁడై నియోగము వినుచున్నను బ్రతిపన్నుఁడు * కాఁడు గదా! నియోగవిషయవివేకగ్రహణము లేనియెడ మాత్రము గావచ్చును బ్రతిపత్తి. అట్లు ఫలహేతువులందును.

పూర్వపక్షము.—ఓయీ! ఫలహేతువులకంటె భిన్నుం డాత్మ యనుబుద్ధి యున్నను బ్రాకృతసంబంధాపేక్షచే శాస్త్రార్థవిషయం బగు ప్రతిపత్తి యుక్తమే యగుచున్నది. ఇష్టఫలహేతువునందుఁ బ్రవర్తితుఁడ నగుచున్నాను అనిష్టఫలహేతువునుండి నివర్తితుఁడ నగుచున్నా నని. ఎట్లు పితృపుత్త్రాదుల కితరేతరాత్మభిన్నత్వబుద్ధియున్నను అన్యోన్యనియోగప్రతిషేధార్థప్రతిపత్తి యగుచున్నదో అట్లు.

సమాధానము.—కాదు, వ్యతిరిక్తాత్మదర్శనప్రతిపత్తికి మున్ను మాత్రమే ఫలహేతువులం దాత్మాభిమానము కలుగుటవలన. నియోగప్రతిషేధార్థముల ననుష్ఠించినపిదపఁ గదా ఫలహేతువులకంటె నాత్మ భిన్నుం డని యెఱుఁగుచున్నాఁడు. మున్నెఱుఁగఁడు. అందువలన విధిప్రతిషేధశాస్త్రం బవిద్వద్విషయం బని సిద్ధము

ఆ. అప్పుడు పక్షద్వయంబునందును దోషము సమానం బగుటవలన నద్వైతమతమునం దనురాగమునకు హేతువు లేదని యాశంకించి « అవిద్యావిషయంబునన్ అర్థవత్త్వము సిద్ధించుచున్నది » అని చెప్పినదాని వివరించుచున్నారు శాస్త్రేత్యాదిగా. దానినే స్ఫుటీకరించుచున్నారు కలదు గదా ఇత్యాదిగా. ఫలము భోక్తృత్వము, హేతువు కర్తృత్వము. లేక, ఫలము దేహవిశేషము, హేతువు అదృష్టము. అనాత్మ లగువానియందు భోక్తను నేను కర్తను నేను మనుష్యుఁడ నేను ఇత్యాదిగా ఆత్మదర్శనము అధికారకారణము. అందుచే అవిద్వద్విషయము విధినిషేధశాస్త్ర మని యర్థము. విద్వాంసులకుఁ గూడ మనుష్యుఁడ నేను ఇత్యాది వ్యవహారము కలుగుటవలనఁ దద్విషయము శాస్త్రం బేల కారా దని యాశంకించి చెప్పుచున్నారు లేదు ఇత్యాదిగా. భోక్తృకర్తలకన్నను బ్రాహ్మణ్యాదివిశిష్ట మయిన దేహముకన్నను ధర్మాధర్మములకన్నను ఆత్మ యన్యుం డని తెలిసినవానికి లేదు విధినిషేధశాస్త్రాధికారము, ఈ చెప్పినఫలాదికమునందు ఆత్మాత్మీయాభిమానము సంభ

* కలంచుకాఁడు.

వింపమివలన నని యర్థము. ఆత్మ దేహాదులకంటె నన్యం దని యెఱింగినవానికి దేహాదులం దాత్మబుద్ధి సంభవింప దనుట నుపపాదించుచున్నారు అత్యం తేత్యాదిగా. శాస్త్రమున కవిద్వద్విషయత్వమువలె విద్వద్విషయత్వంబును గ్రహింపవలయును, ఇద్దఱకును శాస్త్రశ్రవణము సమానం బగుటవలన నని యాశంకించి చెప్పుచున్నారు దేవదత్తా ఇత్యాదిగా. తత్రస్థుడై—ఏప్రదేశమునందు దేవదత్తుఁ డుండెనో అందే యున్నవాఁడై యని యర్థము. ఓయీ! దేవదత్తుఁడు నియుక్తుఁడు కాఁగా విష్ణుమిత్రుఁడును ఒకానొకప్పుడు నియుక్తుఁడ నని తలంచుచున్నాఁడు! సత్యము తలంచుచున్నాఁడు, నియోగమునకు విషయము—నియోజ్యుఁడైన వానివలననుండి తనకు వివేకముయొక్క—భేదముయొక్క జ్ఞానము లేనప్పుడు తాను నియోజ్యుఁడ నను భ్రాంతివలన నని చెప్పుచున్నారు నియో గేత్యాదిగా. అవివేకికి నియోజ్యబుద్ధి సంభవించుననుటకు దృష్టాంతముఁ బ్రతిపాదించి ఫలమునందును హేతువునందును ఆత్మదృష్టివిశిష్టుం డగు నవిద్వాంసునకు విధినిషేధాధికారము సంభవింపనే సంభవించు నని దార్ష్టాంతికము చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా.

విధినిషేధశాస్త్రం బవిద్వద్విషయ మని ప్రతిపాదించుటచే శాస్త్రానర్థక్యదోషము సమాహిత మయ్యెను. ఇప్పుడు శాస్త్రమునకు విద్వద్విషయత్వంబుననే యర్థవత్త్వము సమర్థింప శక్యం బని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. ప్రకృతి యనఁగా అవిద్య, దానివలనఁ గలిగినది దేహాదికమునం దభిమానరూప మయిన సంబంధ మేది గలదో అది ప్రాకృతసంబంధము, విద్య యుదయించుటకు మున్ననుభవింపఁబడినది, తదపేక్షచే, విధిచేతఁ బ్రవర్తితుఁడ నైతిని నిషేధముచేత నివర్తితుఁడ నైతిని అను విధినిషేధవిషయ మయిన బుద్ధి విద్య యున్నపుడును యుక్తమే యని యర్థము. విద్వాంసునకును బూర్వముండిన యావిద్యకసంబంధము నపేక్షించి విధినిషేధవిషయ మయినబుద్ధి యుక్తం బని చెప్పినదానినే వ్యక్తీకరించుచున్నాఁడు ఇష్టేత్యాదిగా. ఓయీ! అవిద్వాంసునకు మిథ్యాభిమానము కలుగునట్లు విద్వాంసున కది యనువర్తింపదు కావున అవిద్యాసంబంధాపేక్షచే విద్వాంసునకు విధినిషేధబుద్ధి గల దనుట యుక్తము కా దని యాశంకించి చెప్పుచున్నాఁడు ఎట్లు ఇత్యాదిగా. తండ్రి పుత్త్రుఁడు భ్రాత మొదలగువారలకుఁ బరస్పరభిన్నత్వజ్ఞానమున్నను ఒకరివిషయ మయిననియోగార్థమునందుఁ గాని నిషేధార్థమునందుఁ గాని మఱియొకరికి బుద్ధి కనఁబడుచున్నది, తండ్రి నుద్దేశించి విధిగాని నిషేధముగాని ప్రవర్తించినపుడు యతనికిఁ దదనుష్ఠానమునందు శక్తి లేనియెడఁ బుత్త్రునకుఁ దద్విషయ

మయినబుద్ధి సమ్మతము, «అథా తస్సం పత్తిర్యదా ప్రైష్యన్మన్యతే ఽథ పుత్త్ర మాహ త్వం బ్రహ్మ త్వం యజ్ఞ స్త్వం లోకః» ఇత్యాదిసంప్రత్తిశ్రుతిచే అశేషానుష్ఠానంబును బుత్త్రకార్యం బని ప్రతిపాదింపఁబడుటవలన; పుత్త్రునుద్దేశించి గాని విధినిషేధములు ప్రవర్తించినపుడు అతనికిఁ దదనుష్ఠానంబున శక్తి లేనియెడఁ దండ్రికిఁ దద్విషయ మయినబుద్ధి యంగీకృతము, అట్లు భ్రాత్రాదులయందును గ్రహింపవలయును. ఇట్లు విద్వాంసునకు హేతుఫలములకంటె భిన్నత్వబుద్ధి యున్నను బూర్వ ముండిన యావిద్యకదేహాదిసంబంధమువలన విధినిషేధవిషయబుద్ధి యవిరుద్ధ మని యర్థము.

పుత్త్రాదులకు మిథ్యాభిమానము కలుగుటవలనఁ బరస్పరనియోగవిషయబుద్ధి యుక్తము, తత్త్వదర్శికో అది లేమివలన దేహాదిసంబంధాధీన మయిననియోగవిషయబుద్ధి సంభవింప దని పరిహరించుచున్నారు కాదు ఇత్యాదిగా. మఱియును, «సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతే రశ్వవత్» * అని సర్వాపేక్షాధికరణమునందు సమ్యగ్దర్శనము అదృష్టసాధ్యం బని చెప్పుటవలన విధినిషేధార్థానుష్ఠానము సమ్యగ్దర్శనముకంటెఁ బూర్వం బగుటచే విద్వాంసునకుఁ దదనుష్ఠానము సంభవింప దని చెప్పుచున్నారు నియోగేత్యాదిగా. అదృష్ట మున్నయెడ సమ్యగ్దర్శనము కలుగుటవలనను అది లేనియెడ నశుద్ధబుద్ధి కది కలుగమివలనను, ఇట్లన్వయవ్యతిరేకములవలనను వివిదిషావాక్యమువలనను విధినిషేధార్థానుష్ఠానమునకుఁ బూర్వము సమ్యగ్దర్శనము సిద్ధింప దని చెప్పుచున్నారు మున్నెఱుంగఁడు అని. విధినిషేధములు విద్వద్విషయములు కావని సిద్ధింపఁగా ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

**భా.** పూర్వపక్షము.—«స్వర్గకామో యజేత, న కలఞ్జం భక్షయేత్» ఇత్యాదికమునందు ఆత్మవ్యతిరేకదర్శులకుఁ బ్రవృత్తి లేదందు వేని, కేవల దేహాద్యాత్మదృష్టులకును బ్రవృత్తి సంభవింపదు గదా! అందువలనఁ గర్త లేమివలన శాస్త్రానర్థక్యం బగును.

---

* బ్రహ్మసూ. అ-౩. పా-౪. సూ-౨౬—విద్యయందు, సర్వాపేక్షా చ- సర్వకర్మములయపేక్షయుఁ గలదు, యజ్ఞాదిశ్రుతేః—యజ్ఞేన దానేనేత్యాదిగా యజ్ఞాదులు వివిదిషాజనకంబు లని శ్రుతి చెప్పుటవలన. అశ్వవత్—అశ్వమువలె, యోగ్యతావశంబువలన నెట్లశ్వము నాఁగలిలాగుటయం దుపయుక్తము గాదో రథములాగుటయం దుపయుక్తముగనో, అట్లు కర్మములు విద్యకు నుత్పత్తియం దుపయోగించును, ఫలసిద్ధియం దుపయోగింపవు.

సమాధానము.—కాదు, యథాప్రసిద్ధిగనే ప్రవృత్తినివృత్తు లుపపన్నము లగుటవలన. ఈశ్వరక్షేత్రజ్ఞైకత్వదర్శి యగుబ్రహ్మవిదుఁడేమో ప్రవర్తింపఁడు. అట్లు నైరాత్మ్యవాదియును, లేదు పరలోకం బని, ప్రవర్తింపఁడు. యథాప్రసిద్ధుఁడో విధిప్రతిషేధశాస్త్రశ్రవణాన్యథానుపపత్తిచే • ననుమానముచేత నాత్మాస్తిత్వముఁ గ్రహించినవాఁడు ఆత్మవిశేషానభిజ్ఞుఁడు, కర్మఫలములందుఁ దృష్ణ గలవాఁడై శ్రద్ధావంతుఁడై ప్రవర్తించుచున్నాఁ డని మనకందఱకును ప్రత్యక్షము. అందువలన లేదు శాస్త్రానర్థక్యము.

పూర్వపక్షము.—వివేకులకుఁ బ్రవృత్తిలేమి కనఁబడుటవలన వారి ననువర్తించువారును ప్రవర్తింపరు. అందువలన శాస్త్రానర్థక్యం బగును.

సమాధానము.—కాదు, ఒకానొకనికే వివేకము కలుగుటవలన. అనేకు లగుప్రాణులయం దొకానొకఁడే గదా వివేకి యగును, ఇప్పటివలె. వివేకిని మూఢు లనువర్తింపరు గూడ, ప్రవృత్తి రాగాదిదోషాధీనం బగుటవలన, అభిచారాదికమునందును * బ్రవృత్తి కనఁబడుటవలన, ప్రవృత్తిస్వాభావికం బగుటవలనఁ గూడ. « స్వభావస్తు ప్రవర్తతే » అని గదా చెప్పఁబడినది.

ఆ. శాస్త్ర మవిద్వద్విషయం బగుటచే సర్థవంత మని చెప్పినదాని నాక్షేపసమాధానములచేఁ బ్రపంచించుటకై యాక్షేపమ[illegible]ుచున్నారు ఓయీ ఇత్యాదిగా. ఆత్మ దేహాదులకంటె నతిరిక్తుం డని యెటిం[illegible] దేహాద్యభిమానరూప మయినయధికారహేతువు లేమింజేసి విధివలన యా[illegible]యందుఁ బ్రవృత్తియు నిషేధమువలన నభక్ష్యభక్షణాదులనుండి నివృత్తియు [illegible]భవింపవు, అప్పుడు వారికిఁ బ్రవృత్తినివృత్తులు లేవనునెడ, దేహాదికమే యాత్మ యని తలంచువారికిని బ్రవృత్తినివృత్తులు యుక్తములు కావు వారికిఁ బారలౌకికమునందు విశ్వాసము లేమివలన నని యర్థము. విద్వాంసులకును అవిద్వాంసులకును బ్రవృత్తినివృత్తులు లేని యప్పుడు ఫలితముఁ జెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా.

ఆత్మకు దేహాద్యతిరేకమును బరోక్షముగను దేహాద్యాత్మత్వము నపరోక్షముగను జూచువానికి శాస్త్రానురోధమువలననే ప్రవృత్తినివృత్తు లుపపన్నంబు లగుట

• ఆత్మాస్తిత్వజ్ఞానాదులు లేనివానికి విధిప్రతిషేధశాస్త్రశ్రవణ మనుపపన్న మగుటచే.

* శత్రువధాదులకొఱకుఁ జేయుమంత్రప్రయోగాదికము అభిచార మనఁబడును.

వలన లేదు శాస్త్రానర్థక్యం బని యుత్తరముఁ జెప్పుచున్నారు కాదు ఇత్యాదిగా. ప్రసిద్ధి యిట శాస్త్రీయం బభిమతము. దీనినే వివరించుటకై, బ్రహ్మవిదునకా నైరాత్మ్యవాదికా పరోక్షజ్ఞానవంతునకా ప్రవృత్తినివృత్తుల వివక్షించితివి? అని వికల్పించి మొదటిపక్షమును దూషించుచున్నారు ఈశ్వ రేత్యాదిగా. నివర్తిల్లఁడు గూడ అనియు నెఱుంగవలయును. ద్వితీయపక్షమును నిరసించుచున్నారు అట్లు ఇత్యాదిగా. పూర్వమునందువలె నిటఁ గూడ నివర్తిల్లఁడు గూడ అని సంబంధము. మూఁడవ పక్షము నంగీకరించుచున్నారు య థేత్యాదిగా. యథాప్రసిద్ధుఁడు—విధినిషేధాధీనమయినప్రసిద్ధి ననుసరించువాఁ డని యర్థము. నివర్తిల్లును గూడ అనియు గ్రహింపవలయును. బ్రహ్మవిదుని నైరాత్మ్యవాదిని విడిచి దేహాద్వ్యతిరిక్తుఁ డైనయాత్మను బరోక్షముగను దేహాద్వ్యాత్మత్వమును అపరోక్షముగను జూచువానికి విధినిషేధాధికారిత్వము సిద్ధించుచుండఁగా ఫలముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

మఱియొకవిధముచే శాస్త్రానర్థక్యము సమర్థింపఁ జూచుచున్నాఁడు వివేకులకు ఇత్యాదిగా. చూచుచున్నాము గదా వారలకు విధినిషేధములయందుఁ బ్రవృత్తి లేమిని. దేహాదులకంటె నిష్కృష్టుఁ డైనయాత్మ నెఱింగినట్టివారికిఁ బ్రవృత్తినివృత్తులయం దధికారము లేదు గదా! అందుచే వారివిషయమున శాస్త్రం బర్థవంతము కాదు. దేహాద్యాత్మదర్శులుగూడ శాస్త్రమునం దధికృతులు కారు, వారికిఁగూడ యద్య దాచరతి అనున్యాయంబున వివేకుల ననువర్తించువారికి విధ్యాదిశాస్త్రమునందుఁ బ్రవృత్తి సంభవింపమివలన. అందువలన నధికారి లేమివలన విధ్యాదిశాస్త్రంబునకును దదనుసారిశిష్టాచారమునకును ఆనర్థక్యం బని యర్థము.

ఏమి యందఱును వివేకు లగుటవలన నధికారి లేమింజేసి శాస్త్రమున కానర్థక్యముఁ జెప్పెదవా? లేక, ఒకానొకఁడు వివేకి యయినను వాని ననువర్తించునట్టి యితరులకును బ్రవృత్తి లేమివలన ఆనర్థక్యము చెప్పెదవా? అని వికల్పించి మొదటిపక్షము నిరాకరించుచున్నారు కాదు, ఒకానొకనికే ఇత్యాదిగా. మనుష్యాణాం సహస్రేషు అనున్యాయంబునఁ జెప్పినదానినే స్ఫుటీకరించుచున్నారు అనేకులు ఇత్యాదిగా. అందు కనుభవమునుబట్టి దృష్టాంతముఁ జెప్పుచున్నారు ఇప్పటివలె నని. ద్వితీయపక్షము దూషించుచున్నారు వివేకిని ఇత్యాదిగా. మఱియును, వివేకులకుఁ బ్రవృత్తి లేనియెడ నితరులకును బ్రవృత్తి కలుగ దనునాశంకను నిరసించుటకై శ్యేనయాగాదులందు వివేకులకుఁ బ్రవృత్తి లేకున్నను ఇతరులకుఁ బ్రవృత్తి కనఁబడుటవలన నని చెప్పుచున్నారు అభిచా రేత్యాదిగా. అవివేకులకు రాగాది

ద్వారమునఁ బ్రవృత్తివిషయమును సమస్తమును సంగ్రహించుటకై యాదిపదము. ఇందువలనఁ గూడ వివేకులకుఁ బ్రవృత్తి లేకున్నను అజ్ఞులకుఁ బ్రవృత్తి లేకపోదని చెప్పుచున్నారు ప్రవృత్తి ఇత్యాదిగా. ప్రవృత్తి స్వభావాఖ్య మయినయజ్ఞానము యొక్క కార్యం బనుటకు భగవద్వచనమును బ్రమాణీకరించు చున్నారు స్వభావస్తు ఇత్యాదిగా.

**భా.** అందువలన అవిద్యామాత్రము సంసారము, యథాదృష్టవిషయంబే. కేవలుం డగుక్షేత్రజ్ఞున కవిద్య గాని తత్కార్యము గాని లేదు. మిథ్యాజ్ఞానము పరమార్థవస్తువునకు దోషము ఘటింప సమర్థము గాదు. ఊషరదేశమును స్నేహముచేఁ బంకముగాఁ జేయ మృగతృష్ణికాజలము సమర్థము కాదు గదా! అట్లవిద్య క్షేత్రజ్ఞున కేమియుఁ జేయ సమర్థము కాదు. అందువలన నిది చెప్పఁబడినది « క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి » అని, « అజ్ఞానేనా ఽఽవృతం జ్ఞానమ్ ” అనియు.

**ఆ.** ప్రకృతి యజ్ఞానజం బని యేర్పడినపుడు విధినిషేధాధీనప్రవృత్తినివృత్త్యాత్మక మయినబంధము అవిద్యామాత్రం బగుటవలన శాస్త్రమునకు అవిద్వద్విషయత్వము సిద్ధం బని ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. దృష్టమునే యనుసరించునట్టియవిద్వాంసుఁడు యథాదృష్టుఁడు, తద్విషయము—తదాశ్రయము సంసారము. అందువలన, ప్రవృత్తినివృత్త్యాత్మకసంసారం బవిద్వద్విషయ మగుటవలన తద్ధేతుకవిధిశాస్త్రంబును అవిద్వద్విషయం బని యర్థము. ఓయీ! అవిద్య క్షేత్రజ్ఞు నాశ్రయించినదై స్వకార్య మగుసంసారమును గూడ నతనియం దుంచుచున్నది, అందుచే నతనికే శాస్త్రాధికారము. అనఁగా లే దని చెప్పుచున్నారు కేవలుండు ఇత్యాదిగా. అవిద్యాదికమునకు శుద్ధుఁ డగుక్షేత్రజ్ఞునందు వాస్తవంబున సంబంధము లేకున్నను, అది యతనియం దారోపితంబై యతనినే దుఃఖినిగాఁ జేయుచున్నది, అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు మిథ్యాజ్ఞానము ఇత్యాదిగా. దానినే దృష్టాంతముచే స్పష్టీకరించు చున్నారు ఊషరదేశమును ఇత్యాదిగా. క్షేత్రజ్ఞునకు వాస్తవంబున నవిద్యాసంబంధము లే దనుటను భగవద్వచనము గూడ బ్రకటించుచున్న దని చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. క్షేత్రజ్ఞేశ్వరుల కైక్య మగునెడ, ఎందువలన నితఁడు తన్ను నే నని యెఱుంగుచున్నను తనయీశ్వరత్వమును నే నీశ్వరుఁడ నని యెఱుంగఁడు? అనఁగాఁ జెప్పుచున్నారు అజ్ఞానే నేత్యాదిగా.

**భా.** పూర్వపక్షము.—మఱి యేమి యిది? సంసారులకుంబోలె “నే నిట్టివాఁడను, నాదే యిది? అని పండితులకును సంసారిత్వము కనఁబడుచున్నది,

సమాధానము.—వినుము, ఇది వారిపాండిత్యము—క్షేత్రమునందే యాత్మదర్శనము. మఱి వారు క్షేత్రజ్ఞు లవిక్రియు నెఱుంగుదురేని అప్పుడు భోగమును గాని కర్మమును గాని కాంక్షింపరు, నాకుఁ గావలయు నని. విక్రియయే గదా భోగకర్మములు. ఇఁక నిట్లుండఁగా ఫలార్థి యగుట వలన నవిద్వాంసుఁడు ప్రవర్తించుచున్నాఁడు. అవిక్రియాత్మదర్శి యగు విద్వాంసునకో ఫలార్థిత్వము లేమివలనఁ బ్రవృత్తి యనుపపన్న మగుటచే కార్యకరణసంఘాతవ్యాపారం బుపరతము కాఁగా నివృత్తి యుపచరింపఁబడుచున్నది. ఇదియు మఱియొకపాండిత్యము ఒకానొకనికిఁ గావచ్చును—“ క్షేత్రజ్ఞుఁ డీశ్వరుఁడే, క్షేత్రమో యన్యము క్షేత్రజ్ఞునకు విషయము, నేనో సంసారిని సుఖిని దుఃఖిని, సంసారోపరమంబు నాకుఁ గర్తవ్యము క్షేత్రక్షేత్రజ్ఞవిజ్ఞానముచేతను ధ్యానముచేతను క్షేత్రజ్ఞునీశ్వరుని సాక్షాత్కరించి తత్స్వరూపావస్థానముచేత నని. ఎవ్వఁ డిట్లెఱుంగుచున్నాఁడో ఎవ్వఁడు మఱి యితరులకు బోధించుచున్నాఁడో, అతఁడు క్షేత్రజ్ఞుఁడు కాఁ డని. ఎవ్వఁ డిట్లు సంసారమోక్షములకును శాస్త్రమునకును అర్థవత్త్వము సాధించెద నని తలంచుచున్నాఁడో అతఁడు పండితాపసదుఁడు, ఆత్మఘ్నుఁడు, తాను మూఢుఁడై యితరులను గూడ వ్యామోహింపఁజేయుచున్నాఁడు, శాస్త్రార్థసంప్రదాయరహితుం డగుటవలన శ్రుతహానిని అశ్రుతకల్పనను జేయుచు. అందువలన సంప్రదాయానభిజ్ఞుఁడు సర్వశాస్త్రవిదుఁడైనను మూర్ఖునియట్లుపేక్షణీయుఁడు.

**టీ.** ఆత్మకు వాస్తవంబున సంసారస్పర్శము లే దను నెడ విద్వదనుభవము విరోధించు నని యాక్షేపించుచున్నాఁడు మఱి ఇత్యాదిగా. ఇట్టివాఁడను అనుటచే అభిజాత్యాదివిశేషము చెప్పఁబడినది. ఇది యనుటచే క్షేత్రకలత్రాదికము చెప్పఁబడినది.

ఈపాండిత్యము దేహాదికమునం దాత్మదర్శనమా? కూటస్థాత్మదర్శనమా? లేక, సంసారిత్వాదిబుద్ధియా? అని వికల్పించి మొదటిపక్షమును నిరాక

రించుటకై చెప్పుచున్నారు వినుము ఇత్యాదిగా. అదియు వాస్తవం బగు నసంసారిత్వమున కవిరోధి యగు ప్రాతిభాసికసంసారిత్వ మైననో యిష్టం బని శేషము. రెండవపక్షమును నిరాకరించుచున్నారు మఱి ఇత్యాదిగా. కూటస్థాత్మవిషయ మయిన సంసారిత్వము ప్రతీతము కాదు, అది ప్రతీత మైనంగదా వాస్తవ మగునసంసారిత్వము విరుద్ధ మగును, కూటస్థాత్మబుద్ధివిరుద్ధ మయినసంసారిత్వబుద్ధి కవకాశము లేమివలన నని యర్థము. ఆత్మను అవిక్రియునిఁగా నెఱింగినవానికిఁ గూడ భోగకర్మము లేల కారాదు? అని యాశంకించి చెప్పుచున్నారు. విక్రియ యే ఇత్యాదిగా. అవిక్రియాత్మదర్శికి భోగకర్మకాంక్ష లేని యెడ నెవనికి శాస్త్రమునందుఁ బ్రవృత్తి కలుగును? అని యాశంకించి చెప్పుచున్నారు ఇఁక నిత్యాదిగా. ఫలార్థిత్వము లేమివలన విద్వాంసునకుఁ గర్మమునందుఁ బ్రవృత్తి లే దనుట యిట్లుండఁగా నిఁక నవిద్వాంసుఁడు ఫలార్థి యగుటవలనఁ గర్మమునందుఁ బ్రవర్తించుచున్నాఁడు, అతఁడు శాస్త్రాధికారి యని యర్థము. విద్వాంసునకు విధిప్రయుక్తప్రవృత్తి లే దను నెడ నిషేధప్రయుక్తనివృత్తియుఁ జెప్ప శక్యము గామివలన నివృత్తినిష్ఠత సిద్ధింప దని యాశంకించి చెప్పుచున్నారు అవిక్రియాత్మేత్యాదిగా. తృతీయపక్షము నెత్తుచున్నారు ఇదియు నిత్యాదిగా. సిద్ధాంతముతో సమానం బని యాశంకించి క్షేత్రమును క్షేత్రజ్ఞునికంటె వాస్తవంబున భిన్నంబునుగాను క్షేత్రజ్ఞునకు విషయమునుగాను అంగీకరించుటవలనఁ గాదు సమానం బని చెప్పుచున్నారు క్షేత్రమో ఇత్యాదిగా. అహంబుద్ధివేద్యుం డగునాత్మకు వాస్తవంబున సంసారిత్వంబును స్వీకరించుటవలనఁ గూడ సిద్ధాంతమునకు భేదము కల దని చెప్పుచున్నారు నేనో ఇత్యాదిగా. సంసారిత్వమునే ప్రకటించుచున్నారు సుఖిని ఇత్యాదిగా. సంసారిత్వము వాస్తవం బన్న యెడ నది నివర్తిల్లమింజేసి పురుషార్థము సిద్ధింప దని యాశంకించి చెప్పుచున్నాఁడు సంసారోపరమంబు ఇత్యాదిగా. ఎట్లు సంసారోపరమము హేతువు లేక కర్తవ్య మగు నని యాశంకించి చెప్పుచున్నాఁడు క్షేత్రక్షేత్రజ్ఞవిజ్ఞానముచేతను అని. క్షేత్రము నెఱింగి దానినుండి నిష్కృష్టుం డగుక్షేత్రజ్ఞునిజ్ఞాన మెట్లు సంసారోపరమముఁ గలిగించును? అని యాశంకించి చెప్పుచున్నాఁడు ధ్యానముచేతను అని. తాను సంసారి యని యెఱింగినవానికి సంసారరహితుం డగునీశ్వరునికంటె భేదం బని తెలుపుటకై అని యనుశబ్దము. ఆభేదమునే యుపపాదించుచున్నారు ఎవ్వఁడు ఇత్యాదిగా. సంసారి నగు నాకు అసంసారీశ్వరత్వము పొందవలయు నని యెవ్వఁ డెఱుంగుచున్నాఁడో, ఎవ్వఁ డట్టిజ్ఞానము నీవు సంపాదింపవలయు నని యితరుల కుపదేశించుచున్నాఁడో అతఁడు

క్షేత్రజ్ఞుఁ డగునీశ్వరునికంటె భిన్నుఁడుగా నెఱుంగవలయును, కానిచో నుపదేశం బనర్థక మగుటవలన నని యర్థము. ఆత్మ సంసారి, పరమాత్మకంటె అన్యుఁడు, అతనికిఁ దద్ధ్యానాధీనజ్ఞానముచే నీశ్వరత్వము సంపాదింపవలయు నను నిట్టిజ్ఞానము పాండిత్యం బనుమతమును దూషించుచున్నారు ఎవ్వఁ డిట్లు ఇత్యాదిగా. "అయమాత్మా బ్రహ్మ" అని యాత్మకు బ్రహ్మత్వము ప్రతిపాదించునట్టిశ్రుతికి విరుద్ధం బగుటవలన నని యర్థము. ఓయీ! సంసారము వాస్తవం బని యంగీకరించుటవలనఁ దత్ప్రతీత్యవస్థయందుఁ గర్మకాండ కర్థవత్త్వంబును ధ్యానాదికముచే సంసారిత్వమును నిరసించి యాత్మకు బ్రహ్మత్వము సాధింపఁబడినపుడు మోక్షావస్థయందు జ్ఞానకాండ కర్థవత్త్వమును సిద్ధించుచున్నది. ఇట్టి జ్ఞానము గలవాఁడు పండితాపసదుఁ డని యెట్లాక్షేపింపవచ్చును? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు సంసారమోక్షములకు ఇత్యాదిగా. కర్మకాండము కల్పితం బగుసంసారిత్వము నధికరించి సాధ్యసాధనసంబంధము బోధించునదై యర్థవంత మనుట గదా యిష్టము, జ్ఞానకాండంబును అట్టి సంసారిత్వమును నిరాకరించి యఖండైకరసం బగుప్రత్యగ్బ్రహ్మమునందుఁ బర్యవసించునదియై యర్థవంత మగు నని యర్థము. మఱియు నాత్మకు శాస్త్రసిద్ధం బగు బ్రహ్మత్వమును బరిత్యజించి అబ్రహ్మత్వమును గల్పించుటచే ఆత్మఘ్నుఁడై యుభయలోకబహిష్కృతుఁ డగు నని చెప్పుచున్నారు ఆత్మఘ్నుఁడు అని. ఓయీ! "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అనుటచే సర్వక్షేత్రాంతర్యామి యైనయీశ్వరుఁడు జీవునికంటె నన్యుఁడు చెప్పఁబడుచున్నాఁడు, కాని యిట జీవున కీశ్వరత్వము ప్రతిపాదితము కాదు, ఇట్లుండఁగా నేల యిటు లాక్షేపించుచున్నావు? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు తాను మూఢుఁడై యని. మఱియును, తత్త్వ మసి యనుచోటం బోలె నిటఁ బ్రసిద్ధక్షేత్రజ్ఞానువాదముచే నతనికి అప్రసిద్ధం బగు నీశ్వరత్వ ముపదేశమువలన శ్రుతము, దానియొక్క హానిని*, అశ్రుత మయినజీవేశ్వరులతాత్త్వికభేదముయొక్క కల్పనను జేయుచు నెట్లు వ్యామూఢుఁడు కాఁడు? అని చెప్పుచున్నారు శ్రుతేత్యాదిగా. ఓయీ! కొందఱు వ్యాఖ్యాతలు ఇట్టిపాండిత్యముఁ బురస్కరించి క్షేత్రజ్ఞం చాపీత్యాదిశ్లోకమునకు వ్యాఖ్యానము చేసి యున్నారు, అట్లుండఁగా ఇట్టి పాండిత్యము నవలంబించువాఁడు వ్యామూఢుం డని యెట్లు చెప్పవచ్చును? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

* విడుచుటను.

భా. ఇఁక, « ఈశ్వరునకు క్షేత్రజ్ఞైకత్వము చెప్పునెడ సంసారిత్వము ప్రాప్తించుచున్నది, క్షేత్రజ్ఞులకును ఈశ్వరైకత్వము వచించునెడ సంసారి లేమివలన సంసారాభావము ప్రసక్తించుచున్నది » అని యేవి చెప్పఁబడెనో, ఆదోషములు రెండును నిరాకరింపఁబడినవి, విద్యావిద్యలకు వైలక్షణ్యము నంగీకరించుటవలన నని. ఎట్లు? అవిద్యాపరికల్పితదోషముచేఁ దద్విషయ మయినవస్తువు పారమార్థికముగా దోషవంతము కాదని. అందుకు దృష్టాంతమునుం జూపఁబడినది—మృగతృష్ణికాజలముచే నూషరదేశము పంకీకరింప శక్యము గాదని. సంసారి లేమివలన సంసారాభావప్రసంగదోషము గూడ సంసారసంసారుల కవిద్యాకల్పితత్వము నుపపాదించి పరిహరింపఁబడియె.

పూర్వపక్షము.—ఓయీ! అవిద్యావత్త్వమే క్షేత్రజ్ఞునకు సంసారిత్వదోషము, తత్కృత మయినదుఃఖిత్వాదికంబును ప్రత్యక్షముగా నుపలబ్ధ మగుచున్నది.

సమాధానము.—కాదు, జ్ఞేయము క్షేత్రధర్మం బగుటవలన జ్ఞాత యగుక్షేత్రజ్ఞునకుఁ దత్కృతదోషం బనుపపన్న మగుటవలన. నీ వెంత దోషజాతము నైనను లేనిదానిని క్షేత్రజ్ఞున కారోపించుచున్నావో అది యంతయు జ్ఞేయం బగుటవలన క్షేత్రధర్మ మగుంగాని క్షేత్రజ్ఞధర్మము గాదు. దానిచేత క్షేత్రజ్ఞునకేమో దోషము లేదు, జ్ఞేయముతో జ్ఞాతకు సంసర్గం బనుపపన్నం బగుటవలన. సంసర్గము కలదేని, జ్ఞేయత్వమే యనుపపన్న మగును గదా! అవిద్యావత్త్వంబును దుఃఖిత్వాదికంబును ఆత్మధర్మ మగునేని, ఎట్లయ్యా అది ప్రత్యక్షముగా నుపలబ్ధ మగుచున్నది? ఎట్లు మఱి క్షేత్రజ్ఞధర్మ మగును? జ్ఞేయము సమస్తంబును క్షేత్రము జ్ఞాతయే క్షేత్రజ్ఞుఁ డని యవధారితమయి యుండఁగా, అవిద్యాదుఃఖిత్వాదికము క్షేత్రజ్ఞధర్మం బనియు నది ప్రత్యక్షోపలభ్యం బనియు విరుద్ధముఁ జెప్పుచున్నావు, కేవల మవిద్యామాత్రావష్టంభమువలన.

ఆ. క్షేత్రజ్ఞం చాపి యనుచో క్షేత్రజ్ఞేశ్వరులనైక్యమును స్వాభీష్టమును స్పష్టీకరించుటకై నిరాకృత మయినయాక్షేపమునే యనువదించుచున్నారు ఇఁక నిత్యాదిగా. ఏకత్వము తాత్త్వికం బనియు సంసారిత్వం బతాత్త్విక మనియు నం

గీకరించి చెప్పినసమాధానమునే స్మృతికిఁ దెచ్చుచున్నారు అదోషములు ఇత్యాదిగా. ఈశ్వరునకు సంసారిత్వంబును సంసారిలేమిచే సంసారాభావంబును అనునీదోషములు విద్యాఽవిద్యలకు వైలక్షణ్యా మున్నను ఎట్లు నిరాకరింపఁబడినవి? అని యడుగు చున్నాఁడు ఎట్లు అని. కల్పితసంసారముతోఁ గల్పనాధిష్ఠాన మయి యద్వయం బగు వస్తువు వాస్తవంబున సంబంధింప దని పరిహరించుచున్నారు అవి ద్యేత్యాదిగా. త ద్విషయము—కల్పనక కాస్పదము—అధిష్ఠాన మని యర్థము. కల్పితముతో నధిష్ఠాన మునకు వాస్తవంబున సంబంధము లే దనుటకుఁ జెప్పినదృష్టాంతమును స్మరింపఁజేయు చున్నారు అందుకు ఇత్యాదిగా. ఈశ్వరునకు సంసారిత్వప్రసంగనిరాసమును బ్రక టించి ప్రసంగాంతరనిరాసమును స్మృతికిఁ దెచ్చుచున్నారు సంసారి ఇత్యాదిగా.

సంసారమును సంసారిని గల్పించునట్టియవిద్య స్వతంత్ర కాదు, స్వతంత్ర యను నెడ సిద్ధాంతవ్యాఘాత మగును; ఇఁకఁ బరతంత్ర యను నెడ ఆశ్రయాంతరము లేమివలన క్షేత్రజ్ఞుఁడే యవిద్యావంతుఁ డనవలయును, అప్పు డతనికి సంసారిత్వము సిద్ధించుచున్న దని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. అవిద్యావత్త్వము గూడ అవిద్యాకృత మన శక్యము గాదు, అనవస్థ కలుగుటవలన నని భావము. కో అలుపెటికినసర్పమువలె నవిద్య యేమి చేయఁగల దని యేది చెప్పఁబడెనో అందుకుఁ జెప్పుచున్నాఁడు తత్కృతము ఇత్యాదిగా.

అవిద్యయుఁ దజ్జన్యంబును జ్ఞేయ మగుటవలన ఆత్మధర్మము కా దని యుత్తరము చెప్పుచున్నారు కాదు ఇత్యాదిగా. దానినే ప్రపంచించుచున్నారు నీవు ఇత్యాదిగా. జ్ఞేయము క్షేత్రధర్మ మయినను క్షేత్రద్వారమున క్షేత్రజ్ఞునకుఁ దత్కృతదోషం బగు నని యాశంకించి చెప్పుచున్నారు దానిచేత నిత్యాదిగా. క్షేత్రము గూడ జ్ఞేయం బగుటవలన దానితో నాత్మకు వాస్తవంబున స్పర్శము లే దని యుపపాదించుచున్నారు సంసర్గము ఇత్యాదిగా. ధర్మధర్మిభావంబున సంసర్గ మున్నను జ్ఞేయత్వమున కేమి క్షతి యని యాశంకించి చెప్పుచున్నారు అవిద్యా వత్త్వంబును ఇత్యాదిగా. ఆత్మధర్మము ఆత్మచే జ్ఞేయ మన్నపక్షమునఁ దనకును దనచే జ్ఞేయత్వ మాపాదిల్లుటంజేసి కర్మకర్తృవిరోధం బగు నని యర్థము. మఱి యును, విమతము క్షేత్రజ్ఞాశ్రితము కాదు, తద్వేద్యం బగుటవలన, రూపాదికము వలె నని చెప్పుచున్నారు ఎట్లు మఱి ఇత్యాదిగా. మఱియును, మహాభూతా నీత్యా దికముచే జ్ఞేయమాత్రము క్షేత్రమునం దంతర్భవించుటవలన అవిద్యాదికము జ్ఞాతృ ధర్మము కా దని చెప్పుచున్నారు జ్ఞేయము ఇత్యాదిగా. మఱియును, ఏత ద్దో

వేత్తి యని చెప్పుటచే క్షేత్రజ్ఞుఁడు జ్ఞాత యని నిశ్చితం బగుటవలన నతనియందు జ్ఞేయము కొంచెమేనియుఁ బ్రవేశింప దని చెప్పుచున్నారు జ్ఞాతయే ఇత్యాదిగా. క్షేత్రక్షేత్రజ్ఞులకు ఇట్టిలక్షణము సిద్ధ మగుటచే నవిద్యాదికమునకు క్షేత్రధర్మత్వము సిద్ధం బని ఫలితముఁ జెప్పుచున్నారు అని యవధారితమై యుండఁగా నని. విరోధమువలనఁ గూడ నవిద్యాదికమునకు క్షేత్రజ్ఞధర్మత్వము లే దని చెప్పుచున్నారు అవిద్యాదుఃఖిత్వాదికము ఇత్యాదిగా. విరుద్ధవాది యగుటకు మూలముఁ జెప్పుచున్నారు అవిద్యామాత్రేత్యాదిగా. మాత్రపదమునకు వ్యావర్త్యము ప్రమాణయుక్త్యాఖ్య మయిన యవష్టంభాంతర మని బోధించుటకై కేవలపదము.

భా. పూర్వపక్షము.—ఇటఁ జెప్పుచున్నాఁడు.—ఆయవిద్య యెవ్వనికి ?

సమాధానము.—ఎవ్వనికిఁ గనఁబడుచున్నదో వానికే.

పూర్వపక్షము.—ఎవనికిఁ గనఁబడుచున్నది ?

సమాధానము.—ఇటఁ జెప్పుచున్నాము. అవిద్య యెవనికిఁ గనఁబడుచున్న దనుప్రశ్నము నిరర్థకము. ఎట్లు? అవిద్య కనఁబడుచున్నచేని యవిద్యావంతునిఁగూడఁ జూచుచున్నావు. అవిద్యావంతుఁడు కనఁబడుచుండఁగా నది యెవని దనుప్రశ్నము యుక్తము గాదు. గోమంతుఁడు కనఁబడుచుండఁగా గోవు లెవని వనుప్రశ్నం బర్థవంతము కాదు గదా !

పూర్వపక్షము.—ఓయీ ! విషమము దృష్టాంతము. గోవులును గోమంతుఁడును బ్రత్యక్షు లగుటవలన సంబంధముగూడఁ బ్రత్యక్షము. కావునఁ బ్రశ్నము నిరర్థకము. అట్లవిద్యయు నవిద్యావంతుఁడును బ్రత్యక్షులు కారు, ప్రత్యక్షు లైనంగదా ప్రశ్నము నిరర్థకం బగును.

సమాధానము.—అప్రత్యక్షుఁ డైనయవిద్యావంతునితో నవిద్యాసంబంధము తెలియుటచే నీ కేమిప్రయోజనము ?

పూర్వపక్షము.—అవిద్య యనర్థహేతు వగుటవలన దానిఁ బరిహరింపవలయును.

సమాధానము.—అవిద్య యెవనికో యతఁడు దానిఁ బరిహరింపఁ గలఁడు.

పూర్వపక్షము.—ఓయీ ! నాకే యవిద్య.

సమాధానము.—ఎఱుంగుచున్నా వప్పు డవిద్యను అవిద్యావంతుఁ డయినయాత్మను గూడ.

పూర్వపక్షము.—ఎఱుంగుచున్నానుగాని ప్రత్యక్షమున నెఱుఁగను.

సమాధానము.—అనుమానముచే నెఱుంగుదువేని, ఎట్లు సంబంధగ్రహణము? జ్ఞాత వగు నీకు జ్ఞేయభూతం బగునవిద్యతోఁ దత్కాలంబున సంబంధము గ్రహింప శక్యము గాదు గదా! అవిద్య విషయంబై గదా జ్ఞాత యుపయుక్తుం డగుచున్నాఁడు. జ్ఞాతకును అవిద్యకును సంబంధమును గ్రహింపువాఁడు సంభవింపఁడు, తద్విషయ మయినజ్ఞానము గూడ మఱియొకటి సంభవింపదు, అనవస్థ కలుగుటవలన. జ్ఞేయసంబంధియగుజ్ఞాతయును జ్ఞాతుం డగునేని మఱియొకని జ్ఞాతను గల్పింపవలయును, అతనికిని మఱియొకజ్ఞాతను, అతనికిని మఱియొకజ్ఞాతను గల్పింపవలయును—ఇట్లనవస్థ దుష్పరిహారము. మఱి యవిద్య జ్ఞేయం బగునేని, ఇతరము గాని జ్ఞేయం బగునేని, అది జ్ఞేయమే యగుచున్నది. అట్లు జ్ఞాతయును జ్ఞాతయే యగుచున్నాఁడు గాని జ్ఞేయము కాఁడు. అందువలన నవిద్యాదుఃఖిత్వాదికములచే జ్ఞాత యగుక్షేత్రజ్ఞున కేమియు దోషము లేదు.

టీ. ఏయవిద్యచే విరుద్ధముగూడ నిర్వహింప శక్య మగునో ఆయవిద్య స్వతంత్రము గామివలన దాని కాశ్రయ మొకటి యుండవలయును. చిత్తుకంటె నితరము లేమింజేసి యది దాని కాశ్రయం బనుట చెల్లదు, చిత్తు విద్యాస్వభావం బగుటచే నది యవిద్య కాశ్రయం బనుట వ్యాఘాతం బగును, కావున ఆశ్రయజిజ్ఞాసచే నడుగుచున్నాఁడు.—ఇటుఁ జెప్పుచున్నాఁడు ఇత్యాదిగా.

ఆశ్రయమాత్రమునా తద్విశేషమునా యడుగుచున్నావు? మొదటిపక్షమునఁ బ్రశ్నమున కవకాశము లేదనునభిప్రాయంబునఁ జెప్పుచున్నాఁడు ఎవ్వనికి ఇత్యాదిగా. అవిద్య దృశ్యమా? అదృశ్యమా? దృశ్యం బగునేడఁ బరతంత్రం బగుటవలన యత్కించిదాశ్రయంబై యే యది కనఁబడుటవలన నాశ్రయమాత్రం బడుగవలసినది కాదు. అదృశ్యం బగునేడ నప్రకాశ మగుటవలన నవిద్యయే సిద్ధింపకపోవు నని యర్థము.

ద్వితీయపక్షము నాలంబించుచున్నాఁడు ఎవనికి ఇత్యాదిగా.

అవిద్య దృశ్యమానం బగుటవలనను ఆశ్రయవిశేషం బగునాత్మయు స్వానుభవసిద్ధుం డగుటవలనను బ్రశ్నము నిరవకాశం బని యుత్తరము చెప్పుచున్నారు ఇట నిత్యాదిగా. ప్రశ్న మనర్థకం బనుటను బ్రశ్నద్వారమునఁ దెలుపుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. అట్లయినను ఎట్లు ప్రశ్న సిద్ధింపదు? అనఁగాఁ జెప్పుచున్నారు అవిద్యావంతుఁడు ఇత్యాదిగా. దానినే దృష్టాంతముచే స్పష్టీకరించుచున్నారు గోమంతుఁడు ఇత్యాదిగా.

దృష్టాంతదార్ష్టాంతికములు విషమంబు లని యాక్షేపించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా.

అవిద్యాశ్రయుఁడు పరోక్షుం డైనను బ్రశ్న నిరర్థకం బని చెప్పుచున్నారు అప్రత్యక్షుఁడు ఇత్యాదిగా. అవిద్యావంతుఁ డప్రత్యక్షుఁ డైనను అతనితో నవిద్యాసంబంధము సిద్ధ మయినపుడు నీప్రశ్న నిరర్థకం బనుటకు సమాధాన మేదియు సిద్ధింప దని యర్థము.

సిద్ధాంతియొక్క యభిసంధి నెఱుంగక శంకించుచున్నాఁడు అవిద్య ఇత్యాదిగా.

అవిద్యావంతుఁడు దానిఁ బరిహరించుకోవలయును, అందుకై యితరుఁడు యత్నింపవలసినది లే దని చెప్పుచున్నారు అవిద్య యెవనికో ఇత్యాదిగా.

నేనే యవిద్యావంతుఁడ నగుటవలనఁ దత్పరిహారమునకై నేనే యత్నింపవలయు నని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా.

అప్పుడు ప్రశ్న నిరర్థకం బని స్వాభిసంధిని జెప్పుచున్నారు ఎఱుంగుచున్నావు ఇత్యాదిగా.

నే నవిద్యావంతుఁడ నని యెఱుంగుచున్నను తద్విషయప్రత్యక్షము లేమివలన నడుగుచున్నా నని శంకించుచున్నాఁడు ఎఱుంగుచున్నాను ఇత్యాదిగా.

అవిద్యావంతున కప్రత్యక్షత్వము వచించువానికి, « నే నవిద్యావంతుఁడను, అవిద్యాకార్యవంతుఁడ నగుటవలన, వ్యతిరేకంబున ముక్తాత్మవలె » • అని యనుమేయత్వము సమ్మతం బని యంగీకరించి దూషించుచున్నారు అనుమానముచే నిత్యాదిగా. ఆత్మకు అవిద్యాసంబంధగ్రహణమునందు ఏమి యనుపపత్తి? అని యాశంకించి, జ్ఞాత యగునాత్మయే తనయవిద్యాసంబంధము నెఱుంగుచున్నాఁడా?

• ఎవఁ డవిద్యావంతుఁడు కాఁడో అతఁ డవిద్యాకార్యవంతుఁడు కాఁడు ముక్తాత్మవలె—అని వ్యతిరేకము.

లేక, మఱియొకజ్ఞాత యెఱుంగుచున్నాఁడా? అని వికల్పించి మొదటిపక్షమును దూషించుచున్నారు జ్ఞాతవు ఇత్యాదిగా. తత్కాలంబున—తా నవిద్యకు జ్ఞాత యగు నవస్థయం దని యర్థము. అవిద్యను విషయముగా గ్రహించి తద్జ్ఞాతృత్వంబుననే యుపయుక్తుం డగునాత్మకు దానికిఁ దనయందు సంబంధము నెఱుంగ నెట్లు శక్యం బగును? ఒకనికిఁ గర్మకర్తృత్వములు విరోధించుటవలన నని చెప్పుచున్నారు అవిద్య ఇత్యాదిగా. ద్వితీయపక్షమును నిరసించుచున్నారు జ్ఞాతకును ఇత్యాదిగా. తద్విషయము—జ్ఞాతకును అవిద్యకును సంబంధము విషయముగాఁ గలది. అనవస్థనే ప్రపంచించుచున్నారు జ్ఞే యేత్యాదిగా. ఆత్మకు స్వపరజ్ఞేయత్వము సంభవింపమివలన నతనియం దవిద్యాసంబంధం బప్రామాణికం బగుటవలన నిత్యానుభవగమ్యత్వము సిద్ధ మగుచుండఁగా ఫలితముఁ జెప్పుచున్నారు మఱి యవిద్య ఇత్యాదిగా.

భా॥ పూర్వపక్షము.—ఓయీ! ఇదే దోషము—దోషవంత మగు క్షేత్రమునకు విజ్ఞాత యగుటయే.

సమాధానము.—కాదు, విజ్ఞానస్వరూపుఁడై యవిక్రియుఁ డైన వానికే విజ్ఞాతృత్వ ముపచరించుటవలన. ఎట్లు ఉష్ణతామాత్రంబున నగ్నికిఁ దపఃక్రియ యుపచరితం బగుచున్నదో అట్లు. అట్లిట భగవంతుం డాత్మయందుఁ గ్రియాకారకఫలాత్మత్వాభావమును దానే ప్రదర్శించెను. అవిద్యాధ్యారోపితమే క్రియాకారకాదికం బాత్మయం దుపచరింపఁబడుచున్నది. అట్లు అచ్చటచ్చట "య ఏనం వేత్తి హన్తారమ్, ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః, నాఽఽదత్తే కస్య చి త్పాపమ్" ఇత్యాది ప్రకరణంబులయందుఁ బ్రదర్శింపఁబడియె. అట్లే మేమును వ్యాఖ్యానము చేసినారము. ఉత్తరప్రకరణంబులయందును బ్రదర్శించెదము.

పూర్వపక్షము.—హాహా! అప్పుడు, ఆత్మయందుఁ గ్రియాకారకఫలాత్మత స్వభావంబున లేనియెడ నవిద్యచేతనే యధ్యారోపితం బైనయెడఁ గర్మము లవిద్వాంసులకే గాని విద్వాంసులకు లేవని ప్రాప్తించినది.

సమాధానము.—సత్య మిట్లు ప్రాప్తించినది. దీనినే నహి దేహభృతాశక్య మనుచో ప్రదర్శించెదము. సర్వశాస్త్రార్థోపసంహారప్రకరణమునందును, "సమాసే నైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యాపరా".

అనుచోట విశేషించి ప్రదర్శించెదము. ఇట బహువిస్తరం బేల యని యుపసంహరించుచున్నాము.

ఆ. జ్ఞాత యగునాత్మకు ఏమియు దోషము లే దనుటను సహింపనివాఁడై శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా.

ఏమి జ్ఞాతృత్వ మనఁగా జ్ఞానక్రియాకర్తృత్వమా? జ్ఞానస్వరూపత్వమా? మొదటిది కాదు, దాని నంగీకరింపమింజేసి తత్కృతదోషము లేమివలన. ద్వితీయ పక్షమునందును జ్ఞాతృత్వమే యౌపచారికం బగుటవలన లేదు తత్కృత మయిన దోషం బని చెప్పుచున్నారు కాదు ఇత్యాదిగా. క్రియ లే కున్నను గ్రియోపచారము దృష్టాంతముచే స్ఫుటీకరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. ఆత్మయందు వాస్తవం బున విక్రియ లే దనుటకు భగవదనుమతిం జూపుచున్నారు అట్లిట ఇత్యాదిగా. ఇట—గీతాశాస్త్రమునందు. అప్పుడు ఎట్లు క్రియాదిక మాత్మయందుఁ దోఁచుచు న్నది? అనఁగాఁ జెప్పుచున్నారు అవి ద్యేత్యాదిగా. ఎట్లు వాస్తవంబున నాత్మ యందుఁ గ్రియాదికము లేదో, ఉపచారముననే తోఁచుచున్నదో, అట్లు అచ్చటచ్చటఁ గడచినప్రకరణములయందు భగవంతుఁడు ప్రదర్శించె నని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. కడచినప్రకరణములయందుమాత్రమే కాదు, ఉత్తరప్రకరణముల యందుఁగూడ ఆత్మయందు వాస్తవక్రియాదికము లేమివలన తద్బుద్ధి యాధ్యాసికం బని భగవదభిప్రాయము తెలియఁగల దని చెప్పుచున్నారు ఉత్తరప్రకరణంబులయం దును ఇత్యాదిగా.

ఆత్మయందు వాస్తవక్రియాదికము లేనియెడ అధ్యాసమువలన నది సిద్ధిం చు ననునెడఁ గర్మకాండమునందు అవిద్వాంసుఁడే యధికారి యని ప్రాప్తించు చున్నది; అప్పుడు "విద్వా న్యజేత, జ్ఞాత్వా కర్మా ఽఽరభేత" ఇత్యాదిశాస్త్రవిరో ధం బగు నని శంకించుచున్నాఁడు హాహా ఇత్యాదిగా.

శాస్త్రము వ్యతిరేకవిజ్ఞానాభిప్రాయం బగుటవలన అశనాయాదిరహి తాత్మజ్ఞానవిహీనునకే కర్మకాండమునం దధికార మని యంగీకరించుచున్నారు సత్య ము ఇత్యాదిగా. అజ్ఞునకే కర్మాధికారం బనుట యెట్లుపపన్నము? అని యాశం కించి చెప్పుచున్నారు దీననే ఇత్యాదిగా. జ్ఞానికి జ్ఞాననిష్ఠయందే యధికారము, నిష్ఠాంతరమునందో యజ్ఞునకే యధికారం బని యుపసంహారప్రకరణమునందు విశే షించి ప్రతిపాదింపఁబడు నని చెప్పుచున్నారు స ర్వేత్యాదిగా. దానినే యెత్తు

చున్నారు సమాసే నేత్యాదిగా. జీవబ్రహ్మముల కైక్యము నంగీకరించుటయందే దోషంబును లేదని యుపసంహరించుచున్నారు ఇట నిత్యాదిగా.

హ. •

శ్రీం. ఇట్లు, “ఈశరీరము క్షేత్రము, దీనినెవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడు క్షేత్రజ్ఞుఁడు” అని యనాత్మయొక్కయు నాత్మయొక్కయుస్వరూపమును గృహప్రదీపములవలె విభజించి ప్రదర్శించి క్షేత్రజ్ఞుం డగునాత్మకు శ్రుత్యాదిప్రమాణసిద్ధం బగు బ్రహ్మాఽభిన్నత్వంబును బ్రతిపాదించుచున్నాఁడు బ్రహ్మమునకుఁ బరోక్షత్వసద్వితీయత్వనివృత్తికొఱకును ఆత్మకు నాత్యంతికసంసారనివృత్తికొఱకును ఆనందరూపత్వసిద్ధికొఱకును.—భారత=భా—అఖండవృత్తియందే, రత—సదా రమించువాఁడవు కావున ఓభారతుఁడా! సర్వక్షేత్రేషు = సమస్తము లయినబ్రహ్మాది స్తంబపర్యంతము లగు క్షేత్రములందు, చెప్పినలక్షణము గలశరీరములయందు; ఏక్షేత్రజ్ఞుఁడు తత్తత్క్షేత్రతద్ధర్మతత్కర్మతదవస్థల నెఱుంగువాఁడు తా నొక్కఁడే పరిపూర్ణుఁ డైనను ఘటాదులచే నాకాశమువలె నవిద్యచే స్వాత్మయందుఁ గల్పితము లయిన తత్తదుపాధుల చేతను సుఖదుఃఖాదిప్రత్యయములచేతను విభక్తుఁడుంబోలెఁ బ్రతిశరీరంబును నేను నేను అని అహంప్రత్యయార్థమై సర్వప్రత్యయసాక్షియై ప్రత్యగ్లక్షణుఁడై యున్నాఁడో, అట్టి, క్షేత్రజ్ఞమ్=ఈలక్షణముచే సర్వక్షేత్రములనుండి చక్కఁగా విభక్తుఁడై తత్తదుపాధితద్ధర్మతత్కార్యాదులచే అస్పృష్టుండై తత్తచ్ఛబ్దప్రత్యయముల కగోచరుండై ఆకాశమువలె నిరాకారుండై నిర్వికారుండై నిరంజనుండై కూటస్థుఁడై యసంగచిద్రూపుండైనయాత్మను; మామ్= నన్నుఁగా, సర్వశ్రుతిప్రసిద్ధమును సత్యజ్ఞానాదిలక్షణమును నిర్విశేషము నగుపరబ్రహ్మమునుగా; విద్ధి=ఎఱుంగుము, “అయ మాత్మా బ్రహ్మ” అనుశ్రుతివలన ఆత్మను బరబ్రహ్మమునుగా నెఱుంగు మని యర్థము. సర్వశరీరములందును ఆత్మ యొక్కఁడే యనుట మున్నె ప్రతిపాదింపఁబడినది, సర్వక్షేత్రములందును అహ మర్థమైయున్నయాత్మ బ్రహ్మమే యని యెఱుంగు మని యర్థము. క్షేత్రజ్ఞం చాపి అనుటచే, ఎట్లు క్షేత్రమునుండి విభక్తుఁడైనక్షేత్రజ్ఞుని నన్నుఁగానే యెఱుంగుచున్నావో అట్లు క్షేత్రముగూడ అవిద్యాకార్యం బగుటచే స్వతస్సత్తలేని దగుటవలన అధిష్ఠానబ్రహ్మమ నగు నాయందుఁ గల్పిత మగుటం జేసి దానినిగూడ నన్నుఁగానే యెఱుంగుము, అని క్షేత్రమునకును క్షేత్రజ్ఞునకుంబోలె బ్రహ్మాఽభిన్నత్వ

• ఈశ్లోకమున కేతద్వ్యాఖ్యానము లేదు.

మును బోధించుచున్నాఁడు. కానిచో ద్వైతహేతు వగుదేహాదిప్రపంచము వేఱుగా నుండునెడ బ్రహ్మమున కద్వితీయత్వము సిద్ధింపదు, అది సిద్ధింపనియెడ నద్వైతశ్రుతి విరోధం బగును. అందువలన క్షేత్రమును క్షేత్రజ్ఞుని నన్నుఁగా నెఱుంగు మని యిద్దఱకును బ్రహ్మత్వముఁ బ్రతిపాదించుట యుక్తము. అందుకు ఆయిద్దఱకును బ్రహ్మాభిన్నత్వజ్ఞానదృఢీకరణమే యపేక్షిత మయిన ప్రయోజనము అందువలన క్షేత్రమును క్షేత్రజ్ఞుఁడును సమస్తమును బ్రహ్మమే యని సిద్ధము. అట్లు శ్రుతియును స్మృతియును —“భోక్తా భోజ్యం ప్రేరితారం చ మత్వా సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మమేతత్ ♦, వాసుదేవాత్మకా న్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవచ” అని. ఓయీ! క్షేత్రక్షేత్రజ్ఞు లిర్వురును బ్రహ్మమే యనుటచేతనే సర్వంబును బ్రహ్మమాత్రం బనుట సిద్ధించుచుండఁగా ఇదం శరీరం కౌన్తేయే త్యాదిగ్రంథగౌరవం బేల? అందు వేని యట్లు శంకింపవలదు. ఈశరీరము క్షేత్రం బని ప్రకృతియును ప్రాకృతమును దృశ్యము సమస్తంబును క్షేత్రమే యని యనాత్మస్వరూపంబు నిరూపించి, దీని నెవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడు క్షేత్రజ్ఞుఁ డని క్షేత్రజ్ఞం డగునాత్మకు క్షేత్రతద్ధర్మతత్కర్మతదవస్థాసంబంధలేశరాహిత్యము ప్రతిపాదించుటంజేసి, క్షేత్రముకంటె భిన్నుఁడై యకర్తయు నభోక్తయు నవికారుఁడును గూటస్థాసంగచిద్రూపుఁడు నగుక్షేత్రజ్ఞునిఁగానే తన్ను సాక్షాత్కరించినవాఁడై దేహేంద్రియాదివ్యాపారంబు లున్నను లేకున్నను సర్వదా తటస్థునిఁగానే తన్నుఁ బ్రత్యగ్వృత్తిచేఁ జూచుచుండువిద్వాంసునకు క్షేత్రధర్మము లగు కర్తృత్వభోక్తృత్వాదులచేతను జరారోగాదులచేతను దత్కర్మము లగు పుణ్యపాపములచేతను దద్గోచరము లగు మానావమానములచేతను విక్షేపము సంభవింపదు, ఇట్లు జీవన్ముక్తిసుఖంబును ఆగామిసంచితాదిసర్వకర్మక్షయంబును సిద్ధించుచున్నది. క్షేత్రం చాపి మాం విద్ధి యనువాక్యంబున క్షేత్రంబును క్షేత్రజ్ఞం డగుతన్నును సర్వంబును బ్రహ్మమునుగానే చూచువానికి సర్వదా ద్వైతప్రత్యయము లేమివలన వాసనాక్షయమును మనోనాశమును గలిగి ప్రారబ్ధక్షయాంతమున విదేహకైవల్యము సిద్ధించుచున్నది. ఈయర్థమును సూచించుటకై క్షేత్రక్షేత్రజ్ఞులవిభజనముఁ జేసి వారియిర్వురకును బ్రహ్మమాత్రత్వము ప్రతిపాదింపఁబడినది. ఇఁక క్షేత్రక్షేత్రజ్ఞులకు బ్రహ్మాభిన్నత్వలక్షణమయినజ్ఞానమే ముక్తికిఁ బరమకారణం బని నిశ్చయించుచున్నాఁ డుత్తరార్ధముచేత.

---

♦ భోక్తయు భోజ్యమును ప్రేరితయును—సాక్షియును ఈత్రివిధ మయినప్రపంచము సమస్తంబును బ్రహ్మమే యని నాఁడు చెప్పఁబడినది.

పురుషుఁడు ప్రకృతికంటె భిన్నుఁడు, తద్గుణకర్మసంబంధలేశశూన్యుఁడు, సదా అసంగ చిద్రూపుఁడు—ఇట్లు ప్రకృతిపురుషులు పరస్పరభిన్ను లనుజ్ఞానము ముక్తికిఁ బరమ కారణ మని సాంఖ్యులు తలంచుచున్నారు, అయినను ప్రకృతిసన్నిధివలన బాధి తానువృత్తిచేఁ బురుషునకు మాటికి సంసారము ప్రతీత మగుచుండుంగాని నిశ్శేష ముగా నివర్తిల్లదు, నిశ్శేషసంసారనివృత్తిగదా మోక్షము బ్రహ్మరూపావస్థావలక్ష ణము, « నిరఞ్జనః పరమం సామ్య ముపైతి " ఇత్యాదిశ్రుతిప్రసిద్ధము; అది పరావరై కత్వజ్ఞానముచేతనే లభ్యము, « తస్మిన్ దృష్టే పరావరే » అనుశ్రుతివలన. అందు వలనఁ బరావరైకత్వవిషయకజ్ఞానమే నిశ్శేషసంసారధ్వాంతవిధ్వంసకము, ముక్తికిఁ బరమకారణం బనునభిప్రాయంబునఁ జెప్పుచున్నాఁడు.—క్షేత్రక్షేత్రజ్ఞయోః=ప్రకృతి పురుషులయొక్క; జ్ఞానం యత్=యాథాత్మ్యదర్శనము, ఇది సర్వంబును నేనును బ్రహ్మమే యని ప్రత్యగ్దృష్టిచే క్షేత్రంబును క్షేత్రజ్ఞుండును బ్రహ్మమాత్రమే యని యెఱుంగుట యనునది, ఏది గలదో; తత్=అదియే; జ్ఞానమ్=సమ్యక్జ్ఞానము, అత్యం తికసంసారనివృత్తికారణం బని; మమ = సర్వజ్ఞుఁడను ఈశ్వరుఁడ నగునాయొక్క; మతమ్=అభిమతము, నిశ్చయ మని యర్థము. లేక. ఏజ్ఞానముచే క్షేత్రక్షేత్రజ్ఞుల తత్త్వము—జ్ఞాతయు జ్ఞేయంబును సర్వమును బ్రహ్మమే యని యెఱుంగఁబడుచున్నదో అదియే, మమ—బ్రహ్మముయొక్క; జ్ఞానమ్= జ్ఞాన మని; మతమ్—క్షేత్రక్షేత్రజ్ఞులను అప్రతిబద్ధవృత్తిచే బ్రహ్మమాత్రం బని యెఱుంగుటయే బ్రహ్మజ్ఞానము కైవల్యకారణం బని ఋషులయొక్కయభిమతము—నిశ్చయ మని యర్థము. ఓయీ! సర్వక్షేత్రం బులయందును క్షేత్రజ్ఞుం డగునాత్మ బ్రహ్మమే యని జీవేశ్వరుల కేకత్వము చెప్పుట యనుపపన్నము, ప్రత్యక్షాదిసర్వప్రమాణవిరోధమువలన. ప్రత్యక్షంబున జీవునకు జన్మమృత్యుసుఖదుఃఖాదిలక్షణ మగుసంసారము కర్మైకనిబంధన ముపలబ్ధ మగు చున్నది గదా! అట్టి సంసారవంతుం డగుజీవునితో నీశ్వరున కేకత్వ మన్ననో, ఈశ్వరుఁడు దక్క నితరుఁడు భోక్త లేమివలన నీశ్వరునకే సంసారము ప్రసక్తించు చున్నది. అప్పుడు « అనశ్న న్నన్యో అభిచాకశీతి " ఇత్యాదిశ్రుతివిరోధంబును సంభవించుచున్నది. జీవుఁ డీశ్వరాఽభిన్నుఁ డన్నను, జీవవ్యతిరిక్తేశ్వరుఁడు లేమి వలన జీవునకే సర్వనియంతృత్వము సంభవించును. స్వతంత్రుం డగునతనికి సంసా రము సంభవింపమివలన సంసారమున కత్యంతాభావము ప్రసక్తించును. సంసారం బును సంసారియు లే రనునెడఁ బ్రత్యక్షవిరోధంబును, « కర్మానుగా న్యనుక్రమేణ

దేహీ స్థానేషు రూపా ణ్యభిసంప్రపద్యతే§, తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి» ఇత్యాదిశ్రుతివిరోధంబును, « ద్వా సుపర్ణా సయుజా » ఇత్యాదిభేదశాస్త్రవిరోధంబును గలుగును. « మన్త్రేషు కర్మాణి కవయో యాన్య పశ్యం స్తాని త్రేతాయాం బహుధా సంతతాని। తా న్యాచరథ నియతం సత్యకామాః » ♦♦ ఇత్యాది కర్మశాస్త్రంబునకును, « తరతి శోక మాత్మవిత్, ఆత్మా వా అరే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మన్తవ్యః" ఇత్యాదిజ్ఞానశాస్త్రంబునకును ఆనర్థక్యం బగును. జీవుఁడు ఈశ్వరుని కంటె భిన్నుఁడు, జన్మాదిమంతుఁ డగుటవలనను కించిద్జ్ఞుఁ డగుటవలనను మలినోపాధిమంతుఁ డగుటవలనను నిత్యదుఃఖి యగుటవలనను నియామ్యుఁ డగుటవలనను— ఇత్యా ద్యనుమానవిరోధంబును సంభవించును. అందువలన జీవేశ్వరుల కైకత్వము సిద్ధింపదు. అందువేని అది యుక్తము కాదు, బహుశ్రుతిస్మృతివిరోధము సంభవించుటవలన. ఎట్లనఁగా. « అయ మాత్మా బ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తద్వా ఏత ద్బ్రహ్మో ఽద్వయం సదానన్దచిన్మాత్ర మాత్మైవ బ్రహ్మ త దేత త్సత్య మాత్మా బ్రహ్మైవ బ్రహ్మాత్మైవ, అత్ర హ్యేవ న విచికిత్స్యమ్ ♦, సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం త త్త్వ మేవ త్వ మేవ తత్, త త్త్వ మసి, స ఏకః » ఇత్యాదిశ్రుతులచేతను, « సో ఽహం సచ త్వం సచ సర్వ మేతత్ *, ఆత్మనో బ్రహ్మణో భేద మస న్తం కః కరిష్యతి ♦♦, ఏక స్త్వ మాత్మా పురుషః పురాణః ❧, సకల మిద మహంచ వాసుదేవః, జీవో బ్రహ్మైవ నా ఽపరః, సర్వేషయ మతః పరమ్, భోక్తారం యజ్ఞతపసామ్, క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి, ఉపద్రష్టా ఽనుమన్తా చ » ఇత్యాదిస్మృతులచేతను, బ్రహ్మాత్మల కైకత్వమే నియమంబునఁ బ్రతిపాదింపఁబడుచున్నది. ఆత్మ బ్రహ్మమే యగుచున్నాఁడు, సద్రూపుఁ డగుటవలనను చిద్రూపుఁ డగుటవలనను ఆనందరూపుఁ డగుటవలనను అవిక్రియుఁ డగుటవలనను పరిపూర్ణుఁ డగుటవలనను, ఏది బ్రహ్మము గాదో అది సద్రూపత్వాదిమంతము గాదు, బుద్ధ్యాదికమువలె; జీవేశ్వరులభేదం బసత్యము,

---

§ దేహి యాయాస్థానములయందుఁ గర్మము ననుసరించి కలుగురూపములను గ్రమంబునఁ బొందుచున్నాఁడు.

♦♦ కవులు మంత్రములందే కర్మములను జూచిరో అవి త్రేతాయుగమునందు బహువిధంబులు విస్తీర్ణము లయ్యెను. ఓసత్యకాములారా! వాని నియతముగా నాచరింపుఁడు.

♦ ఇందు సందేహింపఁదగినది లేదు.

* అతఁడే నేను, అతఁడే నీవును, అతఁడే ఇది యంతయును.

♦♦ ఆత్మకును బ్రహ్మమునకును భేదమును లేనిదానిని ఎవ్వఁడు చేయఁగలఁడు?

❧ నీవు ఒక్కఁడవు ఆత్మవు పురాణపురుషుఁడవు.

ఉపాధికల్పితం బగుటవలన, ఘటాకాశమహాకాశములకుంబోలె; జీవోపాధి మిథ్య; మాయాకార్యం బగుటవలన, స్వప్నపదార్థమువలె.—ఇత్యాదియుక్తులచేతను జక్కగా విచారించినప్పుడు జీవేశ్వరుల కభేదమే తెలియవచ్చుచున్నది, కొంచెమేనియు భేదము కనఁబడదు, భేదము కలదేని భేదదర్శననిషేధం బనుపపన్న మగుటవలన. “నాత్ర కాచనభిదాస్తి నైవాత్ర కాచనభిదాస్తి । అత్రభిదా మివ మన్యమానశ్శతధా సహస్రధా భిన్నో మృత్యోస్స మృత్యు మాప్నోతి” § అని శ్రుతిచేతనే మాటిమాటికి భేదదర్శనము నిషేధింపఁబడుచున్నది, భేదదర్శికి మహానర్థముగూడఁ జెప్పఁబడుచున్నది. అందువలన జీవేశ్వరాభేదమునే జక్కగా నెఱుంగవలయును ముముక్షువులు. ఓయీ! నేను సుఖిని దుఃఖిని అని ప్రత్యక్షంబున జీవునకు సంసారముపలబ్ధ మగుచున్నది, ఎట్లు సంసారికిని అసంసారికిని ఏకత్వము సిద్ధించును? అందువేని, అట్లు కాదు, ఆత్మకు సంసారము మిథ్య, అవిద్యాధ్యారోపితం బగుటవలన, జరాదికమువలె—అను ననుమానమువలన నాత్మయందుఁ బ్రతీత మయినసంసారం బవిద్యాకార్య మగుటచే మిథ్య యగుటవలన. “అమూఢో మూఢ ఇవ వ్యవహర న్నాస్తే మాయ నైవ” ♦ అను శ్రుతివలన, ఆత్మ తాను అసంసారియే యయ్యు నవిద్యచే సంసారివలెఁ బ్రతీతుఁ డగుచున్నాఁడు, కరణదోషమువలన శంఖము పీతవర్ణముగాఁ దోఁచునట్లు. వాస్తవంబుననో “అయ మాత్మా సన్మాత్రో నిత్యశ్శుద్ధో బుద్ధ స్సత్యో ముక్తో నిరఞ్జనో విభు రద్వయాత్మా ఽఽనన్దః పరః ప్రత్యగేకరసః” అనుశ్రుతివలన నాత్మ నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడే యగుచున్నాఁడు. సంసారమో అనాత్మధర్మము, అవిద్యచే నాత్మయం దధ్యారోపింపఁబడినది, చక్షుర్ధర్మ మయినపీతత్వము శంఖమునందుంబోలె. సంసారం బనాత్మధర్మము, జ్ఞేయం బగుటవలన, రూపాదికమువలె—అను ననుమానమువలన సంసారమున కనాత్మధర్మత్వమే సిద్ధ మగుచున్నది కాని యాత్మధర్మత్వము కాదు. అది యాత్మధర్మ మగునెడ నాత్మకు మోక్షం బెప్పుడును సిద్ధింపదు. మోక్షమో శ్రుతి యుపదేశించుచున్నది గదా! “తరతి శోక మాత్మవిత్, విముక్తశ్చ విముచ్యతే, బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి” అని. అందువలన, ఆత్మకు నవిద్యారోపితసంసారిత్వప్రతీతిదశయందు

§ ఇం దేభేదమును లేదు, ఇం దేభేదము కలుగనే కలుగదు, ఇందు భేద ముంకునట్లు తలంచువాఁడు నూఱువిధములుగాను వేయివిధములుగాను బద్ధుడై అవిద్యాకామమృత్యువువలన సంసారరూపమృత్యువు నొందుచున్నాఁడు.

♦ మూఢుఁడు కానివాఁడు మాయచేతనే మూఢునియట్లు వ్యవహరించుచున్నాఁడు.

స్వప్నమునందుంబోలెఁ ప్రత్యక్షాదిప్రమాణసిద్ధద్వైతవ్యవహారము సమస్తంబును సంభవించుటవలన విరోధ మేమియు లేదు. కర్మజ్ఞానశాస్త్రముల కానర్థక్యముగూడ సంభవింపదు. విద్యావిద్యావదశయందుఁ బ్రబోధమునందు స్వప్నసంసారము లేని యట్లు అవిద్యకసంసారము లేమివలన నిత్యశుద్ధబుద్ధస్వభావుఁడు పరిపూర్ణుఁ డగు నాత్మకు బ్రహ్మాభిన్నత్వము విరుద్ధము గాదు. అందువలననే, ప్రమాణశిరోమణియు సర్వజ్ఞయు నగుశ్రుతియును "ఐత దాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వ మసి శ్వేతకేతో" అని యాత్మకు సంసారనిమిత్తమై యవిద్యాకార్యమై యధిష్ఠాన సత్తైకాలంబనమై స్వతస్సత్తాశూన్య మయినయాకాశాదిస్థూలాంతద్వైతప్రపంచము సమస్తంబును ఐతదాత్మ్య మ్మనుటచే సన్మాత్రం బని బోధించి భేదహేతు వగువిశేషము లేమివలనఁ జిదేకరసుం డగునాత్మకు తత్త్వ మసి యనుటచే బ్రహ్మత్వముఁ బ్రతిపాదించుచున్నది బ్రహ్మమున కద్వితీయత్వసిద్ధికొఱకు. ద్వైతము కల దనుపక్షముననో అద్వైతశ్రుతిస్మృతులకు విరోధం బగును. "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ, ఏక మేవా ఽద్వితీయం బ్రహ్మ, ఏకో రుద్రో నద్వితీయో ఽవతస్థే, ఏకో దేవో నారాయణః, ఏక ఏవహి భూతాత్మా, ఏకం స ద్విప్రా బహుధా వదన్తి, ఏక స్సన్ బహుధా విచచార, ఏకం సన్తం బహుధా కల్పయన్తి, ఏకో దాధారభువనానివిశ్వా, ఏకో దేవో బహుధా సన్నివిష్టః, త్వ మేకో ఽసి బహూ ననుప్రవిష్టః, త దేత ద్బ్రహ్మ ఽపూర్వ మనపర మనన్తర మబాహ్యమ్, ఈశావాస్య మిదం సర్వమ్, స ర్వం ఖల్విదం బ్రహ్మ, పర్వం చి ద్ధిదం సర్వమ్, పురుష ఏవేదం సర్వమ్, బ్రహ్మైవేదం విశ్వ మిదం వరిష్ఠమ్, మాయామాత్ర మిదం ద్వైతమ్, నేహ నానా ఽస్తి కించన, న హ్యస్తి ద్వైతసిద్ధిః" ఇత్యాదిశ్రుతులచేతను, "తస్మా న్న విజ్ఞాన మృతే ఽస్తికించిత్, జ్ఞానం విశుద్ధం విమలం విశోకమ్, ఏక స్సమస్తం య దిహా ఽస్తి కించిత్, విశుద్ధం జ్ఞాన మే వైకమ్, మత్తః పరతరం నాన్యత్, వాసుదేవ స్సర్వమితి, సర్వభూతస్థితం యో మామ్, పదార్థః పరమాద్వైతమ్" ఇత్యాదిస్మృతులచేతను, "బ్రహ్మము అద్వితీయము, అనంత మగుటవలనను, సర్వాత్మం బగుటవలనను, ఏది యద్వితీయము గాదో అది అనంతమును సర్వాత్మకమును గాదు, ఆకాశమువలె; బ్రహ్మము అద్వితీయము, వస్త్వంతరశూన్య మగుటవలన, సుషుప్తివలె" ఇత్యాదియుక్తులచేతను బ్రహ్మమున కద్వితీయత్వము ప్రతిపాదింపఁబడుచున్నది. అందువలన సర్వశ్రుతిస్మృతి ప్రసిద్ధమే క్షేత్రజ్ఞుం డగునాత్మకు బ్రహ్మత్వము. అందువలననే క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి యని సర్వజ్ఞుం డగుభగవంతుఁడు చెప్పుచున్నాఁడు. ఓయీ! ఇట జీవేశ్వరుల

కైకత్వము ప్రతిపాదితము గాదు భగవంతునిచేత, మ తే మనఁగా, "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి" అనున్యాయంబున సర్వక్షేత్రములయందును అంతర్యామిస్సైయున్న స్వస్వరూపమునకే యేకత్వము ప్రతిపాదింపఁబడుచున్నది, సర్వభూతములందు నంతర్యామియగు నీశ్వరుఁ డొక్కఁడే యని మూఢులకు నీశ్వరైకత్వవిజ్ఞానముకొఱకు. అందువేని, నిన్నిట నడుగవలయును. ఏమి యీశ్వరుఁడు తాను సావయవుఁడై భూతములను యమించుచున్నాఁడా? నిరవయవుఁడై యే యమించుచున్నాఁడా? లేక, ఉభయాత్మకుఁడై యమించుచున్నాఁడా? అని. మొదటిపక్షము కాదు, సావయవుఁ డనునెడ నీశ్వరునకు వికారిత్వాఽనిత్యత్వాది దోషప్రసంగమువలనను శ్రుతివిరోధమువలనను, "యస్యాఽఽదిత్యశ్శరీరమ్" ఇత్యాదిశ్రుతిచే నీశ్వరునకుఁ దదతిరిక్తశరీరములేమి ప్రతిపాదిత మగుటవలన. సావయవత్వపక్షమందుఁ బరిచ్ఛేదంబును, దానిచేఁ బూర్ణత్వవ్యాఘాతంబును ఏకత్వానుపపత్తియును సంభవించును. రెండవదియుఁ గాదు, "యః ప్రాణేన ప్రాణితి... స త ఆత్మా సర్వాన్తరః, ఏష త ఆత్మా సర్వాన్తరః" అనుశ్రుతివలన నీశ్వరునకుఁ బ్రాణిత్వంబును బ్రాణనక్రియావత్త్వంబును బ్రసక్తించుటంజేసి యశరీరత్వము సంభవింపమివలన. అది యంగీకరించునెడ, "అశరీరం శరీరేషు, అప్రాణో హ్యమనా శ్శుభ్రః" ఇత్యాదిశ్రుతివిరోధం బగును. తృతీయపక్షమును గాదు, నిరవయవత్వసావయవత్వములకు సామానాధికరణ్యము సిద్ధింపమివలన. మఱియును, ఈశ్వరుఁడే క్షేత్రజ్ఞుం డనునెడ, పురుష స్సుఖదుఃఖానా మ్మని చెప్పినన్యాయంబున నీశ్వరునకు సుఖదుఃఖాదిభోక్తృత్వంబును జీవత్వంబును సంభవించును. కారణం గుణసఙ్గోఽస్య యనువచనమువలన సదసద్యోనిజన్మంబుగూడఁ బ్రసక్తించును. ఓయీ! క్షేత్రజ్ఞుం డాత్మ యనుపక్షమునందును ఈదోష ముండనేయున్నది. అందువేని లేదు, అవిద్యచే నాత్మకు జన్మాద్యనర్థము నంగీకరించుటవలనను విద్యచేఁ దన్నివృత్తి యుపపన్నం బగుటవలనను. అందుచే బ్రహ్మత్వమునకు హాని లేదు, "బన్ధో మోక్ష ఇతి వ్యాఖ్యా గుణతో మే న వస్తుతః। గుణస్య మాయామూలత్వాన్న మే మోక్షో న బన్ధనమ్" ♦ అని యీశ్వరునిచేతనే చెప్పఁబడుటవలన. అందువలన, ఆత్మకవిద్యచే జీవత్వ మంగీకరించినపుడు నీవు చెప్పినదోషమున కవకాశము లేదు. విద్యచే బ్రహ్మత్వంబును సిద్ధించుచున్నది. అందువలన నిందే యనుపపత్తియు లేదని సిద్ధము.

---

♦ బంధము మోక్షము అనుమాట నాకు గుణమువలనఁ గాని వాస్తవంబున లేదు. గుణము మాయామూలం బగుటవలన నాకు మోక్షమును లేదు బాధము లేదు.

మ. ఇట్లు దేహేంద్రియాదివిలక్షణుండై స్వప్రకాశుం డగుక్షేత్రజ్ఞునిఁ బ్రతిపాదించి యతనిపారమార్థికతత్త్వమును--అసంసారి యగుపరమాత్మతో నైక్యమును జెప్పుచున్నాఁడు.—సర్వక్షేత్రేషు = సమస్తక్షేత్రములయందును; ఎవ్వఁడు ఒక్కఁడే స్వప్రకాశచైతన్యరూపుఁడు విభువు నిత్యుఁడు గలఁడో అట్టి యవిద్యాధ్యారోపితకర్తృత్వభోక్తృత్వాదిసంసారధర్ముం డగు, క్షేత్రజ్ఞమ్=క్షేత్రజ్ఞుని; అవిద్యరూపము విడిచి, మామ్=నన్నుఁగా, ఈశ్వరుని అసంసారిని అద్వితీయబ్రహ్మానందరూపునిఁగా; విద్ధి=ఎఱుంగుము. ఓభారతుఁడా! ఇట్లు, « క్షేత్రము మాయాకల్పితము మిథ్య, క్షేత్రజ్ఞుఁడో పారమార్థికసత్యుఁడు తద్భ్రమాధిష్ఠానం » బని, క్షేత్రక్షేత్రజ్ఞయోః యత్ జ్ఞానమ్ = క్షేత్రక్షేత్రజ్ఞులజ్ఞానం బేది గలదో; తత్=అదియే; మోక్షసాధనం బగుటవలన, జ్ఞానమ్ = అవిద్యావిరోధిప్రకాశరూపం బని; మమ మతమ్. ఇతరమో అజ్ఞానమే, అవిద్యకు అవిరోధి యగుటవలన నని యభిప్రాయము ఇట జీవేశ్వరుల కావిద్యకము భేదము, పారమార్థికమో యభేద మను విషయమునం దనేక యుక్తులు భాష్యకారులు వర్ణించి యున్నారు మేమో గ్రంథవిస్తరభయమువలనను మున్నే బహువిధంబులఁ బ్రతిపాదితం బగుటవలనను ఇట నుపన్యసింప లేదు.

శ్రీ. ఇట్లు సంసారిస్వరూపము చెప్పఁబడినది. ఇప్పు డతనికే పారమార్థికం బగునసంసారిస్వరూపముఁ జెప్పుచున్నాఁడు.—క్షేత్రజ్ఞమ్ = ఆక్షేత్రజ్ఞుని సంసారినైయున్నవానిని; వాస్తవంబున, సర్వక్షేత్రేషు = సమస్తక్షేత్రములయందును; అనుగతుఁడైనవానిని; మామ్=నన్నుఁగానే; విద్ధి, తత్త్వమసి యనుశ్రుతిచే లక్షితమయినచిదంశముచేత మద్రూపత్వము ప్రతిపాదింపఁబడుటవలన. ఆదరార్థము ఈ జ్ఞానమును స్తుతించుచున్నాఁడు.—క్షేత్రక్షేత్రజ్ఞయోః; యత్ జ్ఞానమ్=ఇట్లు వైలక్షణ్యంబున జ్ఞాన మేది గలదో; అదియే మోక్షహేతు వగుటవలన, మమ జ్ఞానమ్=నాయొక్కజ్ఞానం బని; మతిమ్=ఇతరమో వృథాపాండిత్యము బంధహేతు వగుటవలన నని యర్థము. అది చెప్పఁబడినది.—« తత్కర్మ యన్న బన్ధాయ సా విద్యా యా విముక్తయే। ఆయాసా యా ఽపరం కర్మ విద్యా ఽన్యా శిల్పనైపుణమ్ » * అని.

ప. ఇఁక విశేషించి క్షేత్రజ్ఞుని నిరూపించుచున్నాఁడు.—క్షేత్రజ్ఞంచాఽపి=శరీరాభిమానియై శారీరభోగము భుజించుచున్న క్షేత్రజ్ఞునిఁగూడ; వాస్తవంబున,

* ఏది బంధముకొఱకుఁ గాదో అది కర్మము. ఏది ముక్తికొఱ కగునో అది విద్య. ఇతరమయినకర్మము ఆయాసముకొఱకు. ఇతర మయినవిద్య శిల్పచాతుర్యము.

సర్వక్షేత్రేషు = సమస్తక్షేత్రములయందును, అనుగతుం డైనవాని; మాం విద్ధి. తత్త్వమసి శ్రుతిచేత లక్షితచిదంశముచే మద్రూపత్వము చెప్పఁబడుటవలన అది చెప్పఁబడినది.—“ కార్యోపాధి రయం జీవః కారణోపాధి రీశ్వరః । కార్యకారణతాం హిత్వా పూర్ణబోధో ఽవశిష్యతే ” * అని. ఇట్లు ఉపాధిద్వయమును బరిత్యజించుటచే శేషించునఖండబోధస్వరూపమే నారూపము. తత్పదలక్ష్యార్థమునకుఁ ద్వంపదలక్ష్యార్థమునకు నేకత్వ మని యర్థము. ఇఁక జ్ఞానస్వరూపమును బ్రదర్శించుచున్నాఁడు.—క్షేత్రక్షేత్రజ్ఞలయొక్క వైలక్షణ్యంబున నేజ్ఞానము గలదో అది, జ్ఞానమ్=జ్ఞాన మని; మతమ్=అభిమతము. అందువలన ఆత్మానాత్మవివేకము జ్ఞాన మని ప్రతిపాదిత మగుచున్నది.

రా. సర్వక్షేత్రేషు=దేవమనుష్యాదిసర్వక్షేత్రములయందును; జ్ఞాతృత్వమేయాకారముగాఁగల, క్షేత్రజ్ఞంచ = క్షేత్రజ్ఞుని; మాం విద్ధి=మదాత్మకునిఁగా నెఱుంగుము. క్షేత్రజ్ఞం చాపి యని యపిశబ్దమువలన క్షేత్రమునుగూడ నన్నుఁగా నెఱుంగు మని చెప్పఁబడిన దని తెలియవచ్చుచున్నది. ఎట్లు క్షేత్రము క్షేత్రజ్ఞవిశేషణత్వమే స్వభావముగాఁ గల దగుటచే క్షేత్రజ్ఞునికంటె వేఱుగా సిద్ధింపమివలనఁ దత్సామానాధికరణ్యముననే నిర్దేశింపఁ దగియున్నదో, అట్లు క్షేత్రమును క్షేత్రజ్ఞుఁడును మద్విశేషణత్వమే స్వభావముగాఁ గలవార లగుటచే నాకంటె వేఱుగా సిద్ధింపమివలన మత్సామానాధికరణ్యముననే నిర్దేశింపఁదగినవా రని యెఱుంగుము. పృథివ్యాదిసంఘాతరూపం బగుక్షేత్రంబును క్షేత్రజ్ఞుండును భగవచ్ఛరీరతైకస్వభావు లగుటచే భగవదాత్మకు లని శ్రుతులు చెప్పుచున్నవి, “ యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీ మన్తరో యమయతి స త ఆత్మా ఽన్తర్యా మ్యమృతః ” అని యారంభించి “ య ఆత్మని తిష్ఠ న్నాత్మనో ఽన్తరో యమాత్మా న వేద యస్యా ఽఽత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమయతి స త ఆత్మా ఽన్తర్యా మ్యమృతః ” ♦ ఇత్యాదిగా. ఇట్లు అంతర్యామియై సర్వక్షేత్ర

* ఈజీవుఁడు కార్యోపాధి, ఈశ్వరుఁడు కారణోపాధి, కార్యకారణభావమును విడిచిన యెడ అఖండబోధరూపము తేలుచున్నది.

♦ ఎవఁడు పృథివియం దున్నవాఁడై పృథివికి అంతరుఁడో ఎవనిఁ బృథివి యెఱుంగదో ఎవ్వనికిఁ బృథివి శరీరమో ఎవ్వఁడు పృథివిని అంతరుఁడై యమించుచున్నాఁడో అతఁడు నీకు ఆత్మ అంతర్యామి అమృతుఁడు....ఎవఁడు ఆత్మయం దున్నవాఁడై ఆత్మ కంతరుఁడో ఎవ్వని ఆత్మ యెఱుంగఁడో ఎవని కాత్మ శరీరమో ఎవఁ డాత్మను అంతరుఁడై యమించుచున్నాఁడో అతఁడు నీకు ఆత్మ అంతర్యామి అమృతుఁడు.

జ్ఞులకును ఆత్మత్వంబున నుండుటయే భగవంతునిఁ దత్సామానాధికరణ్యంబున నిర్దే
శించుటకు హేతువు. "అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయ స్థితః, న త దస్తి
వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్, విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాం
శేన స్థితో జగత్" అని ముందును వెనుకనుం జెప్పి మధ్యంబున సామానాధికరణ్య
ముచే వ్యపదేశించుచున్నాఁడు ఆదిత్యానా మహం విష్ణుః ఇత్యాదిగా. యత్ క్షేత్ర
క్షేత్రజ్ఞయోః జ్ఞానమ్ = క్షేత్రక్షేత్రజ్ఞులవివేకంబును వారు మదాత్మకు లనియు విష
యీకరించి యీజ్ఞాన మేది చెప్పఁబడినదో, తత్=అదియే; జ్ఞానమ్ = ఉపాదేయం
బగుజ్ఞాన మని; మమ మతమ్=నాయొక్క నిశ్చయము. కొందఱు చెప్పుచున్నారు.—
క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి అను సామానాధికరణ్యముచే నేకత్వము దెలియవచ్చు
చున్నది. అందువలన ఈశ్వరుఁడై యున్నవానికే యజ్ఞానమువలన క్షేత్రజ్ఞత్వము
పోలెఁ దోఁచుచున్నది యని యంగీకరింపవలయును. తన్నివృత్త్యర్థం బీయేకత్వోప
దేశము. ఆప్తతముం డగుభగవంతుని యీయుపదేశముచే "రజ్జు విది సర్పము
గాదు" అను నాప్తోపదేశముచేత సర్పత్వభ్రమ నివర్తిలునట్లు క్షేత్రజ్ఞత్వభ్రమ నివ
ర్తిల్లుచున్నది—అని. వారి నడుగవలయును—ఈయుపదేష్ట యగుభగవంతుఁడు వాసు
దేవుఁడు పరమేశ్వరుం డాత్మయాథాత్మ్యసాక్షాత్కారముచే నజ్ఞానము నివర్తిల్లిన
వాఁడా? లేక, కాఁడా? అని. అజ్ఞానము నివర్తిల్లినవాఁ డగునేని, నిర్విశేష
చిన్మాత్రైకస్వరూపుఁ డగుతనయందు అతద్రూపాధ్యాసం బసంభావిత మగుటం
జేసి కౌంతేయాదిభేదదర్శనంబును వారినుద్దేశించి యుపదేశాదివ్యాపారంబులును
సంభవింపవు. ఇఁక, ఆత్మసాక్షాత్కారము లేమివలన నజ్ఞానము నివర్తిల్లినవాఁడు
కాఁ డందురేని, అప్పు డజ్ఞుం డగుటవలననే యాత్మజ్ఞానోపదేశము సంభవింపదు.
"ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః" అని గదా చెప్పఁబడినది. అందు
వలన, ఏవమాదివాదములు శ్రుతిస్మృతీతిహాసపురాణన్యాయస్వోక్తివిరోధంబుల
విచారింపక యజ్ఞానులచే జగన్మోహనంబుకొఱకుఁ బ్రవర్తితంబు లని యనాదరణీయం
బులు. ఇందు, ఇది తత్త్వము.—అచిద్వస్తువునకును జిద్వస్తువునకును బరబ్రహ్మమున
కును క్రమంబున భోగ్యత్వంబునను భోక్తృత్వంబునను ఈశితృత్వంబునను స్వరూప
వివేకముఁ జెప్పుచున్నవి కొన్నిశ్రుతులు.—"అస్మా న్మాయీ సృజతే విశ్వ మేత
త్తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః, మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయి
నంతు మహేశ్వరమ్, క్షరం ప్రధాన మమృతాక్షరం హరః క్షరాత్మానా వీశతే
దేవ ఏకః"—ఇట అమృతాక్షరం హరః అని భోక్త నిర్దేశింపఁబడుచున్నాఁడు,

ప్రధానమును దనకు భోగ్యముగా హరించుచున్నాఁడు కావున నాఁడు—"స కారణం కరణాధిపాధిపో నచాఽస్య కశ్చి జ్జనితా నచాఽధిపః, ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశః, పతిం విశ్వస్యా త్మేశ్వరం శాశ్వతం శివ మచ్యుతమ్, జ్ఞాజ్ఞౌ ద్వా వజా వీశానీశౌ, నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్, భోక్తా భోగ్యం ప్రేరితారంచ మత్వా, పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా జుష్ట స్తత స్తేనాఽమృతత్వమేతి, తయో రన్యః పిప్పలం స్వా ద్వత్త్య నశ్న న్నన్యో ఽభిచాకశీతి, అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాంజన యన్తీం సరూపామ్ । అజో హ్యేకో జుషమాణో ఽను శేతే జహాత్యేనాం భుక్త భోగా మజో ఽన్యః" ఇత్యాదులు. ఇందుఁగూడ, "అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా । అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్॥ జీవభూతామ్, సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్ । కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్ । ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః । భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్, మయాఽధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాఽచరమ్ । హేతునా ఽనేన కౌన్తేయ జగ ద్విపరివర్తతే, ప్రకృతిం పురుషం చైవ వి ద్ధ్యనాదీ ఉభావపి, మమ యోనిర్మహ ద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధా మ్యహమ్ । సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత" అని. జగద్యోనిభూతం బగు, మహత్ బ్రహ్మ—మదీయం బగు ప్రకృత్యాఖ్య మయినభూత సూక్ష్మము అచిద్వస్తు వేది గలదో, దానియందుఁ జేతనాఖ్య మగుగర్భమును గూర్చుచున్నాను, అట్టి మత్సంకల్పకృత మయినచిదచిత్సంసర్గమువలననే దేవాదిస్థావరాంతము లయిన యచిన్మిశ్రము లగు సర్వభూతంబులకు సంభవం బగుచున్న దని యర్థము. ఇట్లు భోక్తృభోగ్యరూపంబున నవస్థితంబులు సర్వావస్థావస్థితంబు లగు చిదచిత్తులు పరమపురుషునకు శరీరంబులై తన్నియామ్యము లగుటంజేసి పరమపురుషునికంటె అపృథక్స్థితంబు లనియుఁ బరమపురుషుం డాత్మ యనియుఁ జెప్పుచున్నవి కొన్ని శ్రుతులు.—"యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీ మన్తరో యమయతి" అని యారంభించి "య ఆత్మని తిష్ఠ న్నాత్మనో ఽన్తరో యమాత్మా నవేద య స్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమయతి స త ఆత్మా ఽన్తర్యా మ్యమృతః" అని. మఱియు, "యః పృథివీ మన్తరే సంచరన్ యస్య పృథివీ శరీరం యం పృథివీ న వేద" అని యారంభించి, "యో ఽక్షర మన్తరే సంచర న్యస్యా ఽక్షరం శరీరం యమక్షరం న వేద..."

రో మృత్యు మన్తరే సంచరన్ యస్య మృత్యు శ్శరీరం యం మృత్యు ర్న వేద ఏష సర్వభూతాన్తరాత్మా ఽపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః"—ఇట మృత్యుశబ్దముచేఁ దమశ్శబ్దవాచ్యం బగు సూక్ష్మావస్థ మైనయచిద్వస్తువు చెప్పఁబడుచున్నది, ఈ యుపనిషత్తునందే "అవ్యక్త మక్షరే లీయతే అక్షరం తమసి లీయతే" అని వచించుటవలన.—"అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా" అనియు. ఇట్లు సర్వావస్థావస్థితచిదచిద్వస్తుశరీరుం డగుటచేఁ దత్ప్రకారుం డగుపరమపురుషుఁడే కార్యావస్థ కారణావస్థ జగద్రూపంబున నున్నవాఁ డను నీయర్థము తెలుపుటకై కొన్నిశ్రుతులు కార్యావస్థంబును గారణావస్థంబు నగు జగత్తు అతఁడే యని చెప్పుచున్నవి—"స దేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మేవా ఽద్వితీయమ్, త దైక్షత బహు స్యాం ప్రజాయే యేతి త త్తేజో ఽసృజత" అని యారంభించి "సన్మూలా స్సోమ్యేమాః ప్రజా స్సదాయతనా స్సత్ప్రతిష్ఠాః, ఐతదాత్మ్య మిదం సర్వం త త్సత్యం స ఆత్మా త త్త్వ మసి శ్వేతకేతో" అని. మఱియు, "సో ఽకామయత బహుస్యాం ప్రజాయే యేతి, స తపో ఽతప్యత, స తప స్తప్త్వా, ఇదం సర్వ మసృజత" అని యారంభించి—"సత్యం చా ఽనృతంచ సత్య మభవత్" అనియు. ఇచ్చటఁ గూడఁ జిదచిత్తులకును బరమపురుషునకును స్వరూపవివేకము శ్రుత్యంతరసిద్ధము స్మారితం బగుచున్నది. "హన్తా ఽహ మిమా స్తిస్రో దేవతా అనేన జీవేనా ఽఽత్మనా ఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి, తత్సృష్ట్వా త దేవా ఽనుప్రావిశత్, త దనుప్రవిశ్య, స చ్చ త్యచ్చా ఽభవత్, విజ్ఞానం చా ఽవిజ్ఞానంచ, సత్యం చానృతంచ సత్య మభవత్" అనియు. ఇట్టి నామరూపవ్యాకరణమే "త ద్ధేదం తర్హ్యవ్యాకృత మాసీ త్త న్నామరూపాభ్యాం వ్యాక్రియతే" అనుచోటనుం జెప్పఁబడినది. అందువలనఁ గార్యావస్థుండును గారణావస్థుండును స్థూలసూక్ష్మచిదచిద్వస్తుశరీరుం డగుపరమపురుషుఁడే యగుటను, కారణముకంటెఁ గార్యం బనన్యమగుటచేఁ గారణవిజ్ఞానంబునఁ గార్యము జ్ఞాతం బగుటచే నేకవిజ్ఞానంబున సర్వవిజ్ఞానము గూడ నపేక్షితం బుపపన్నతర మగుచున్నది. "హన్తాహ మిమా స్తిస్రో దేవతా అనేన జీవేనా ఽఽత్మనా ఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" అని తిస్రో దేవతాః అనుటచే సమస్త మయిన యచిద్వస్తువును నిర్దేశించి యందు స్వాత్మకజీవానుప్రవేశముచే నామరూపవ్యాకరణము చెప్పుటవలన సమస్తము లయినవాచకశబ్దములును అచిజ్జీవవిశిష్టపరమాత్మకే వాచకములు కావునఁ గారణావస్థపరమాత్మవాచకం బగుశబ్దముతోఁ గార్యావస్థపరమాత్మవాచకశబ్దమునకు సామానాధికర

ణ్యము ముఖ్యవృత్తము. అందువలన స్థూలసూక్ష్మచిదచిత్ప్రకారం బగుబ్రహ్మమే కార్యంబును గారణంబు నగుటంజేసి బ్రహ్మోపాదానము జగత్తు. సూక్ష్మచిదచిద్వస్తుశరీరం బగుబ్రహ్మమే కారణం బగుటను జగత్తు బ్రహ్మోపాదానం బైనను సంఘాతమే యుపాదానం బగుటచేఁ జిదచిత్తులకును బ్రహ్మమునకును స్వభావాఽసంకరముగూడ నుపపన్నతరము. ఎట్లు శుక్లకృష్ణరక్తతంతుసంఘాత ముపాదాన మైనను జిత్రపటమునకుఁ దత్తత్తంతుప్రదేశమునందే శుక్లత్వాదిసంబంధము కలుగుటంజేసి కార్యావస్థయందును సర్వత్రవర్ణసంకరము కలుగదో, అట్లు చిదచిదీశ్వరసంఘాతం బుపాదానం బైనను జగత్తునకుఁ గార్యావస్థయందును భోక్తృత్వభోగ్యత్వనియంతృత్వాదులకు సంకరము కలుగదు. తంతువులకుఁ బృథక్స్థితియోగ్యంబు లయినవానికే పురుషేచ్ఛచే నొకానొకప్పుడు సంహతము లయినప్పుడు కారణత్వంబును గార్యత్వంబును సిద్ధించుచున్నది. ఇటనో, సర్వావస్థంబు లయినచిదచిత్తులు పరమపురుషశరీరం బగుటచేఁ దత్ప్రకారత్వంబుననే పదార్థం బగుటవలనఁ దత్ప్రకారుం డగుపరమపురుషుఁడే కారణమును గార్యమును అగుచున్నాఁడు, అతఁడే సర్వదా సర్వశబ్దవాచ్యుఁ డని విశేషము. స్వభావభేదంబును తదసంకరంబును అందును ఇందును సమానము. ఇట్లగునపుడు పరబ్రహ్మమునకుఁ గార్యానుప్రవేశమునందును స్వరూపాన్యథాభావము లేమివలన అవికృతత్వ ముపపన్నతరము. స్థూలావస్థమై నామరూపవిభాగవిభక్త మైనచిదచిద్వస్తువున కాత్మయై యుండుటచేఁ గార్యత్వంబును ఉపపన్నము. అవస్థాంతరాపత్తియే గదా కార్యత్వము. నిర్గుణవాదములును బరబ్రహ్మమునకు హేయగుణసంబంధము లేమివలన నుపపన్నము లగుచున్నవి. "అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సో ఽపిపాసః" అని హేయగుణంబులను బ్రతిషేధించి "సత్యకామ స్సత్యసంకల్పః" అని కల్యాణగుణంబులను విధించునట్టి యాశ్రుతియే యితరస్థలంబుల సామాన్యంబున శ్రుతం బగు గుణనిషేధము హేయగుణవిషయం బని వ్యవస్థాపించుచున్నది. "జ్ఞానస్వరూపము బ్రహ్మము" అనువాదంబును సర్వజ్ఞంబును సర్వశక్తియును నిఖిలహేయప్రత్యనీకకల్యాణగుణగణాకరంబు నగుబ్రహ్మముయొక్క-స్వరూపము జ్ఞానైకనిరూపణీయంబును స్వప్రకాశ మగుటచే జ్ఞానస్వరూపంబు వని యంగీకరించుటవలన నుపపన్నతరము. "యః సర్వజ్ఞ స్సర్వవిత్, పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీజ్ఞానబలక్రియాచ, విజ్ఞాతార మరేకేన విజానీయాత్" ఇత్యాదిశ్రుతులు జ్ఞాతృత్వముఁ దెలుపుచున్నవి. "సత్యం జ్ఞానమ్" ఇత్యాదులు జ్ఞానైకనిరూపణీయం బగుటచేతను స్వప్రకాశ మగుటచేతను జ్ఞానస్వరూపతను దెలుపు

చున్నవి. "సో ఒకామయత, బహుస్స్యామ్, తదైక్షత బహుస్స్యామ్, త న్నామరూపాభ్యాం వ్యాక్రియతే" ఇత్యాదిశ్రుతిచొప్పున బ్రహ్మమే స్వసంకల్పమువలన విచిత్రస్థిరత్రము* వలె నానాప్రకార మయి యున్నది కావునఁ దత్ప్రత్యనీకా బ్రహ్మాత్మకవస్తు నానాత్వం బతత్త్వ మని ప్రతిషేధింపఁబడుచున్నది—"మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి, నేహ నానాస్తి కించన, యత్ర హి ద్వైత మివ భవతి। తదితర ఇతరం పశ్యతి, యత్ర త్వస్య సర్వ మాత్మైవా ఒభూత్ తత్కేన కం పశ్యేత్" ఇత్యాదిశ్రుతులచేత. మఱి, బ్రహ్మమునకు స్వసంకల్పకృత మైననానా నామరూపభాక్త్వప్రయుక్త మగు నానాప్రకారత్వమేమో బహుస్స్యాం ప్రజాయే యేత్యాదిశ్రుతిసిద్ధము నిషిద్ధము కాదు. "యత్ర త్వస్య సర్వ మాత్మైవా ఒభూత్" అను నిషేధవాక్యముయొక్క యారంభమునందే యది స్థాపింపఁబడినది—"సర్వం తం పరా దాద్యో ఒన్య త్రాత్మన స్సర్వం వేద, తస్య హవా ఏతస్య మహతో భూతస్య నిశ్శ్వసిత మేత ద్య దృగ్వేదః" ఇత్యాదికముచేత. ఇట్లు చిదచిదీశ్వరులకు స్వరూపభేదంబును స్వభావభేదంబునుం బ్రతిపాదించువానికిని కార్యకారణభావంబును కార్యకారణముల కనన్యత్వంబునుం బ్రతిపాదించువానికిని సర్వశ్రుతులకును విరోధము లేదని శ్రుతులచేతనే తెలియవచ్చుచున్నది. కావున, అపన్యాయమూలంబును సకలశ్రుతివిరుద్ధంబు నగు బ్రహ్మాజ్ఞానవాదంబునకుఁ గాని యౌపాధికబ్రహ్మభేదవాదంబునకుఁ గాని యితరమునకుఁ గాని కొంచెమేని యవకాశము కనఁబడదు. కావున నతివిస్తరం బేల?

మూ. ♦

తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్
సచ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. 3

భా. ఇదం శరీర మిత్యాదిశ్లోకముచే నుపదిష్ట మయిన క్షేత్రాధ్యాయార్థమునకు సంగ్రహశ్లోకం బిది యుపన్యసింపఁబడుచున్నది, వ్యాచిఖ్యాసిత మయిన § యర్థమునకు సంగ్రహోపన్యాసము న్యాయ్యము గదా యని.—తత్—ఇదం శరీర మ్మని యేది నిర్దేశింపఁబడెనో దానిఁ దచ్ఛబ్దముచేఁ బరామర్శించుచున్నాఁడు, అట్టి; క్షేత్రమ్—క్షేత్రశబ్దముచే నిర్దే

* పటము.

♦ ఈశ్లోకమున కిభాష్యము లేదు.

§ వ్యాఖ్యానము చేయఁ గోరఁబడిన.

శింపఁబడినది; యచ్చ=ఏరూపము గలదో. యాదృక్చ = స్వకీయధర్మములచే నెట్టిదో. చశబ్దము సముచ్చయార్థము; యద్వికారి=ఏవికారము గలదో. యతశ్చ=ఏక్షేత్రమువలనను; యత్=ఏది; కార్యమై పుట్టుచున్నదో అని వాక్యశేషము. సచ=ఆక్షేత్రజ్ఞుఁ డని నిర్దిష్టుఁ డైనవాఁడును; యః=ఏరూపము గలవాఁడో; యత్ప్రభావశ్చ = ఏప్రభావములు—ఉపాధికృతములయినశక్తులు గలవాఁడో. తత్=ఆక్షేత్రక్షేత్రజ్ఞులయాథాత్మ్యమును; యథావిశేషితముగా, సమాసేన = సంక్షేపముచేత; మే = నాయొక్క, వాక్యమువలన; శృణు=వినుము, విని యవధారణము చేసికొనుమని యర్థము.

ఆక్షేత్ర మెట్టిదో యేధర్మములు గలదో యెట్టివికారము గలదో యెట్టి యాక్షేత్రమువలన నేకార్యము పుట్టుచున్నదో, మఱియు నాక్షేత్రజ్ఞుఁ డెట్టివాఁడో యెట్టి యుపాధికృతప్రభావములు గలవాఁడో అది యంతయు సంక్షేపంబునఁ జెప్పెద విను మని తాత్పర్యము.

ఆ. ఇట్లు శ్లోకద్వయమునకు వ్యాఖ్యానము గావించి మీఁదిశ్లోకము దించుచున్నారు ఇద మిత్యాదిగా. ఎచ్చట సంగ్రహావచన ముపయోగించును? అనఁగాఁ జెప్పుచున్నారు వ్యాచిఖ్యాసితము ఇత్యాదిగా. గ్రహణసౌకర్యముకొఱకు సంగ్రహావచనం బర్థవంత మని యర్థము. చెప్పఁబోవునర్థమునందు శ్రోతకు మనస్సమాధానము కలుగుటకై సూత్రిత మయినవాక్యార్థోపాయమును వివరించుట యిటఁ బ్రతిజ్ఞాత మగుచున్న దను నభిప్రాయముతోఁ జెప్పుచున్నారు ఇదం శరీర మిత్యాదిగా. ప్రకృతార్థం బగుటవలన నని యర్థము. క్షేత్ర మనుచో జ్ఞాతవ్య మ్మని యధ్యాహారము. ఆక్షేత్రమునకు స్వకీయధర్మములు జన్మాదులు, తద్విశిష్ట మయినక్షేత్రము జ్ఞేయం బనుటచే నది హేయం బని ఫలితము. చశబ్దము లైదును అన్యోన్యసముచ్చయార్థంబు లని చెప్పుచున్నారు చశబ్దను ఇత్యాదిగా. వికారి యగుటచేఁ గూడ హేయం బని సూచించుచున్నారు యద్వికారి ఇత్యాదిగా. ఏది కార్యమో అది సర్వంబును దేనివలనఁ బుట్టుచున్నదో అది కారణం బగుటవలన జ్ఞాతవ్య మని చెప్పుచున్నారు యత శ్చేత్యాదిగా. క్షేత్రమునుంబోలె క్షేత్రజ్ఞునింగూడ జ్ఞాతవ్యునిఁగాఁ బ్రదర్శించుచున్నారు సచ అని. జ్ఞాతవ్యుఁ డని సంబంధము. చక్షురాద్యుపాధికృత దృష్ట్యాదిశక్తివశమువలన నతఁడు జ్ఞాతవ్యుఁ డని సూచించుచున్నారు యత్ప్రభావశ్చ

అని. ఈచెప్పినప్రభావముచే నతఁడు జ్ఞాతవ్యుఁ డని శేషము. ఇట్టిలక్షణము గల క్షేత్రమును గాని క్షేత్రజ్ఞునిఁ గాని యెట్లు తెలియశక్య మగు నని యాశంకించి భగవద్వచనములవలన నని చెప్పుచున్నారు తత్ ఇత్యాదిగా.

హ॰ తత్ అని ప్రకృత మయినక్షేత్రమును నిర్దేశించుచున్నాఁడు. యత్ = యదాత్మకమో. చశబ్దము సముచ్చయార్థము. యాదృక్ = స్వకీయధర్మములచే నట్టిదో. చశబ్దము పూర్వమువలె. యద్వికారి=వికారము గలది వికారి, దేనిచే వికారియో, సహసుపా అని యోగవిభాగమువలన సమాసము. యతః; యత్ = ఏకార్యము; పుట్టుచున్నదో అని వాక్యశేషము. చశబ్దము పూర్వమువలె. తత్; సమాసేన; మే; శృణు.

శ్లో॰ ఇట్లు «ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞః» అనుటచే క్షేత్రజ్ఞుం డగునాత్మకు ధర్మము జ్ఞత్వమే కాని యహంకారమమకారకర్తృత్వభోక్తృత్వాది లక్షణం బగుసంసారము కాదు, అదియో జ్ఞేయం బగుటచే క్షేత్రమునకే ధర్మ మని సూచించి «క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి» అనుటచే సర్వక్షేత్రములనుండి విభక్తుఁడై చిదేకరసుఁడైనయాత్మ పరిచ్ఛిన్నుఁడు గామింజేసి పూర్ణుం డగుటవలన «అయమాత్మా బ్రహ్మ» అనున్యాయంబున బ్రహ్మమే యగు నని ప్రతిపాదించి, ఇప్పుడు శ్రుతియుక్తులచే క్షేత్రక్షేత్రజ్ఞులవివేకము చక్కఁగాఁ జేయఁబడిననే పురుషునకు సంసారిత్వభ్రమ నిశ్శేషంబుగా నివర్తిల్లును, వేఱువిధంబున నివర్తిల్ల దని బోధించుటకై వెండియు క్షేత్రక్షేత్రజ్ఞులస్వరూపమును విశేషించి చక్కఁగా విభజించి ప్రదర్శించుటకై చెప్పుచున్నాఁడు — ఇదం శరీర మ్మని యేది చెప్పఁబడినదో, తత్ క్షేత్రమ్=ఆక్షేత్రము; యచ్చ=ఎట్టిస్వరూపము గలదో. యాదృక్చ=స్వాభావిక మగు రూపముచే నట్టి దగునో. యద్వికారి=ఏవికారములచే—స్వపరిణామాత్మకము లయి మహదాదిలక్షణము లగువానిచే వికారి—అవయవి యగుచున్నదో. లేక, స్వధర్మములచే, యాదృక్ = ఎట్టిధర్మములు గలదో; ఏధర్మములచేఁ దాను ధర్మి యగుచున్నదో. యతశ్చ యత్ = క్షేత్రాఖ్య మయిన యేకారణమువలన నేకార్యము పురుషునకు సంభవించుచున్నదో, క్షేత్రజ్ఞున కుపాధియై తాను ఏకార్యమును బుట్టించుచున్నదో యని యర్థము. అట్టిక్షేత్రము క్షేత్రజ్ఞునకు సంసారకారణం బగుటచే ముముక్షువు దానిఁ జక్కఁగా నెఱుంగవలయును. దాని నెఱింగినయెడఁ దాను సంసారి కాఁడు. మఱియును, సచ=ఏతద్యో వేత్తి యని చెప్పఁబడినట్టి యాక్షేత్రజ్ఞుఁ

డును; యః=స్వరూపంబున నెట్టివాఁ డగుచున్నాఁడో, తత్త్వంబునఁ దా నెట్టిస్వరూపము గలవాఁడై యున్నాఁడో యని యర్థము. యత్ప్రభావశ్చ = ఉపాధియోగము వలన నెట్టిస్వభావము గలవాఁ డగుచున్నాఁడో. అందువలన అతని నెఱుంగవలయును. వాని నెఱుంగుటవలననేఁ దాను ముక్తుఁ డగును. తత్ = ఆక్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపమును; సమాసేన=సంక్షేపముననే, విస్తరంబునఁ గాదు, చెప్పఁబడుచున్న దానిని; మే=నావలన; శృణు=వినుము. విని యాయర్థమును జక్కఁగా నవధారణము చేసి తన్నిష్ఠుఁడ వగుము. అదియే శ్రవణమునకు ఫలము, ఉపేక్షణము గాని విస్మరణము గాని చేయవల దని యర్థము.

మ. సంక్షేపంబునఁ జెప్పినదాని వివరింప నారంభించుచున్నాఁడు.—తత్=ఇదం శరీర మ్మని మున్ను చెప్పినట్టి జడవర్గరూప మయిన; క్షేత్రమ్; యచ్చ=స్వరూపంబున నెట్టి జడదృశ్యపరిచ్ఛిన్నాదిస్వభావము గలదో. యాదృక్చ = ఎట్టి యిచ్ఛాదిధర్మములు గలదో; యద్వికారి=ఎట్టి యింద్రియాదివికారములతోఁ గూడినదో. యతశ్చ=కారణ మయిన యేక్షేత్రమువలన; యత్=ఏ కార్యము; ఉత్పన్న మగుచున్నదో అని శేషము. లేక. యతశ్చ=ఏప్రకృతి పురుషసంయోగమువలన కలుగుచున్నదో; యత్=ఏస్థావరజంగమాదిభేదములచే భిన్న మగుచున్నదో అని యర్థము. ఇట అనిమంబునఁ జకారములు ప్రయోగించుటవలన సర్వసముచ్చయము గ్రహింపవలయును. సచ=ఆక్షేత్రజ్ఞుఁడును; యః=స్వరూపంబున నెట్టి స్వప్రకాశచైతన్యానందస్వభావము గలవాఁడో. యత్ప్రభావశ్చ = ఎట్టిప్రభావములు—ఉపాధికృతము లయినశక్తులు గలవాఁడో. తత్=అట్టిక్షేత్రక్షేత్రజ్ఞయాథాత్మ్యమును సర్వవిశేషణవిశిష్టమును; సమాసేన=సంక్షేపముచేత; మే=నావాక్యమువలన; శృణు—విని యవధారణము చేసికొను మని యర్థము.

శ్రీ. ఇట, చతుర్వింశతిభేదంబుల భిన్న మయినప్రకృతియే క్షేత్ర మని యభిప్రేతము వాస్తవమే, అయినను దేహరూపంబునఁ బరిణమించిన యాప్రకృతియందే యహంభావముచే నవివేకము స్ఫుట మగుచున్నది. కావున తద్వివేకార్థం బీశరీరము క్షేత్ర మనునది మొదలుగా చెప్పఁబడినది. దానిఁ బ్రపంచించుటకై ప్రతిజ్ఞఁ జేయుచున్నాఁడు.—ఏది నాచే క్షేత్ర మని చెప్పఁబడినదో, తత్ క్షేత్రమ్=ఆక్షేత్రము; యత్=స్వరూపంబున నెట్టి జడదృశ్యాదిస్వభావము గలదో. యాదృక్= ఎట్టి యిచ్ఛాదిధర్మములు గలదో. యద్వికారి = ఎట్టి యింద్రియాదివికారములతోఁ

గూడినదో. యతశ్చ=ఏప్రకృతిపురుషసంయోగము వలనఁ గలుగుచున్నదో. యత్=ఏస్థావరజంగమాదిభేదములచే భిన్నమో. సచ=ఆక్షేత్రజ్ఞుఁడును; యః=స్వరూపంబున నెట్టివాఁడో. యత్ప్రభావశ్చ=అచింత్యైశ్వర్యయోగముచే నేప్రభావములతోఁ గూడినవాఁడో. దాని సమస్తంబును సంక్షేపమున నావలన వినుము.

ప. దానిఁ బ్రపంచించుటకై ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు—♦

రా. తత్ క్షేత్రమ్; యచ్చ = ఎట్టిద్రవ్యమో; యాదృక్చ = ఎట్టివానికి * ఆశ్రయభూతమో. యద్వికారి=ఏవికారములు గలదో. యతశ్చ = ఏహేతువువలన నిది యుత్పన్నమో, ఏప్రయోజనముకొఱకు నుత్పన్నమో యని యర్థము. యత్=ఏది యేస్వరూపము గలదో. సచ=ఆక్షేత్రజ్ఞుఁడును; యః=ఏస్వరూపము గలవాఁడో. యత్ప్రభావశ్చ=ఏప్రభావములు గలవాఁడో. తత్=దానినంతను; సమాసేన=సంక్షేపముచేత; నావలన వినుము.

మా. యద్వికారి = ఏవికారములతోఁ గూడినదో. యతశ్చ = ఎవ్వనివలన; యత్=ప్రవర్తించుచున్నదో. సచ=ఆప్రవర్తకుఁడును. యతశ్చ యత్ అనుటచే నీనివలన ♦♦ క్షేత్రము ప్రవర్తించుచున్న దనియు, సచయః అనుటచే ప్రవర్తకస్వరూపమాత్రంబును జెప్పఁబడినది.

ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్రపదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః. ౪

భా. ఆక్షేత్రక్షేత్రజ్ఞులయాథాత్మ్యమును వివక్షితమును స్తుతించుచున్నాఁడు శ్రోతృబుద్ధిప్రరోచనముకొఱకు.—ఋషిభిః = వసిష్ఠాదులచేత; బహుధా=బహువిధముగా; గీతమ్=ప్రతిపాదింపఁబడినది. ఛన్దోభిః=ఛందస్సులు ఋగాదులు, వానిచేత; వివిధైః=నానావిధములగు వానిచేత; పృథక్=వివేకంబున; గీతమ్=ప్రతిపాదింపఁబడినది. మఱియును. బ్రహ్మసూత్రపదైశ్చైవ=బ్రహ్మముయొక్కసూచకము లైనవాక్యములు బ్రహ్మసూత్రములు, పద్యతే—ఎఱుంగఁబడుచున్నది బ్రహ్మము వానిచేతఁ గావున

♦ తక్కినది శ్రీధరీయములో సమానము.

* ఇంద్రియములకు.

♦♦ ఈశ్వరునివలన.

నవియే పదము లని చెప్పఁబడుచున్నవి, వానిచేతఁ గూడ; క్షేత్రక్షేత్రజ్ఞుల యాథాత్మ్యము, గీత మ్మని యనువర్తించుచున్నది, « ఆత్మే త్యే వోపాసీత " ఇత్యాదు లగుబ్రహ్మసూత్రపదములచేతఁ గదా యాత్మ యెఱుంగఁబడుచున్నాఁడు; హేతుమద్భిః = యుక్తియుక్తము లగు వానిచేత; వినిశ్చితైః—సంశయరూపము లయినవానిచేతఁ గాదు, నిశ్చితప్రత్యయముఁ బుట్టించువానిచేత నని యర్థము *.

ఆక్షేత్రక్షేత్రజ్ఞులయాథాత్మ్యము వసిష్ఠాదిమహర్షులచే బహువిధంబులఁ బ్రతిపాదింపఁబడినది. నానావిధశాఖాయుక్తంబు లయిన ఋగ్వేదాదివేదములచే వివేకంబునఁ బ్రతిపాదింపఁబడినది. యుక్తియుక్తంబులును నిశ్చితార్థబోధకంబులు నగు బ్రహ్మసూత్రపదములచేతఁ గూడఁ బ్రతిపాదింపఁబడినది యని తాత్పర్యము.

ఆ. మీఁదిశ్లోకమునకుఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు ఆక్షే త్రేత్యాదిగా. వివక్షితమును--జిజ్ఞాసితము నని యర్థము. స్తుతిఫలముఁ జెప్పుచున్నారు శ్రో త్రిత్యాదిగా. ఆప్తవాక్యమువలనమాత్రమే కాదు క్షేత్రాదియాథాత్మ్యము సంభావితము, మ రే మనఁగా, వేదవాక్యమువలనఁగూడ నని చెప్పుచున్నారు ఛన్దోభి రిత్యాదిగా. ఋగాదివేదములు నాలు గైనను వానికి నానావిధత్వము శాఖాభేదమువలన సమ్మతము. శ్రుతిస్మృతిసిద్ధముమాత్రమే కాదు ఈచెప్పఁబడినయాథాత్మ్యము, మ రే మనఁగా, యుక్తియుక్తము గూడ నని చెప్పుచున్నారు మఱియును ఇత్యాదిగా. ఏవి యాసూత్రములు? అని యాశంకించి చెప్పుచున్నారు ఆత్మేత్యే వేత్యాదిగా. ఆదిపదముచేత « బ్రహ్మవి దాప్నోతి పరమ్, అథ యో ఽన్యాం దేవతామ్ " ఇత్యాదులు విద్యాఽవిద్యాసూత్రములు చెప్పఁబడుచున్నవి. ఆత్మా అనుటచే క్షేత్రజ్ఞుఁడు చెప్పఁబడుచున్నాఁడు, అది క్షేత్రోపలక్షణము. « అథాతో బ్రహ్మజిజ్ఞాసా " ఇత్యాది సూత్రములు గూడ నిట గ్రహింపఁబడినవి, కానిచో ఛన్దోభిః అనుటచేఁ బునరుక్తి సంభవించుటవలన నని తలఁచి విశేషణము చేయుచున్నారు హేతుమద్భి రిత్యాదిగా.

హ. ఋషిభిః=వసిష్ఠాదులచేత; గాయత్ర్యాదులు ఛందస్సులు, తన్మాత్రములచే, వివిధైః=నానాప్రకారము లగువానిచే; పృథక్=వివేకమున; గీతమ్=తెలుపఁబడినది. మఱియును. బ్రహ్మముయొక్క ప్రతిపాదకములు సూత్రములు, పద్యతే—పొందఁబడుచున్నది వీనిచేతఁ గావున పదములు, వానిచేతఁ గూడ.

---

* ఈరెండును బ్రహ్మసూత్రపదములకు విశేషణములు.

శ౦. శ్రుతులచేతను సూత్రములచేతను మహాత్ములచేతను ఈయర్థము సుని శ్చితంబని వివక్షితార్థము సర్వశాస్త్రంబులకును దదర్థజ్ఞులకును సమ్మతంబగుటను జెప్పుచున్నాఁడు, శ్రోతకు ఆస్థాశ్రద్ధలతోఁ బ్రవృత్తి సిద్ధించుటకై.—క్షేత్రక్షేత్రజ్ఞులస్వరూపము వాసిష్ఠవిష్ణుపురాణాదులయందు, ఋషిభిః = వసిష్ఠపరాశరాదులచేత; బహుధా=బహుప్రకారముగా; గీతమ్=ప్రతిపాదింపఁబడినది. వివిధైః=శాఖాభేదంబున బహుప్రకారము లగు; ఛన్దోభిః=ఋగ్వేదాదివేదములచేత; « స ఏషత కథం త్విదం మద్భృతే స్యాత్, స వా ఏష పురుషో ఽన్నరసమయః అన్యో ఽన్తర ఆత్మా ప్రాణమయః, ఏతస్మిన్న దృశ్యే ఽనాత్మ్యే » ఇత్యాదిగా తత్స్వరూపము, పృథక్ = విభజించి; గీతమ్=చెప్పఁబడినది. హేతుమద్భిః=హేతువు లనఁగా అర్థసాధకము లయిన యుక్తులు, అవి గలవియు; వినిశ్చితైః = తత్త్వమును నిశ్చయించు నవియు, నిశ్చితార్థములు నగు; బ్రహ్మసూత్రపదైః=బ్రహ్మముయొక్క సూచకములు బ్ర[...] సూత్రములు, అవియే పదములు, పద్యతే-వస్తుతత్త్వ మెఱుంగఁబడుచున్నది [...] వ్వను, అట్టిబ్రహ్మసూత్రరూపము లగుపదములచేత, జన్మాద్యస్య యతః [...] ఎవ్వనివలన, [...] సూత్రములచేత; తద్యాథాత్మ్యము, గీతమ్=వివేచించి చక్కఁగా [...] అనుటచే [...] చే ప్రవ[...] దని యర్థము.

మ॰. ఎవ్వరిచే విస్తరంబునఁ బ్రతిపాదిత మగుదాని కిది సంక్షేప మని యాకాంక్షింపఁగా శ్రోతృబుద్ధిప్రరోచనార్థము స్తుతించుటకై చెప్పుచున్నాఁడు.—ఋషిభిః=వసిష్ఠాదులచేత; యోగశాస్త్రములయందు ధ్యానధారణావిషయత్వంబున, బహుధా; గీతమ్=నిరూపింపఁబడినది. ఇందుచే యోగశాస్త్రప్రతిపాద్యత్వము చెప్పఁబడినది. వివిధైః=నిత్యనైమిత్తికకామ్యకర్మాదివిషయము లగు; ఛన్దోభిః=ఋగాదిమంత్రములచేతను బ్రాహ్మణములచేతను; పృథక్=వివేకంబున; గీతమ్. ఇందుచేఁ గర్మకాండప్రతిపాద్యత్వము చెప్పఁబడినది. బ్రహ్మసూత్రపదైశ్చైవ=బ్రహ్మము సూత్ర్యతే-సూచింపఁబడుచున్నది-కొంచెము వ్యవధానంబునఁ బ్రతిపాదింపఁబడుచున్నది వీనిచేతఁ గావున బ్రహ్మసూత్రము లనఁగా « యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తి » ఇత్యాదు లగు తటస్థలక్షణపరము లయిన యుపనిషద్వాక్యములు, అట్లు, పదములు—పద్యతే—బ్రహ్మము సాక్షాత్తుగాఁ బ్రతిపాదింపఁబడుచున్నవి వీనిచేత ననువృత్తిచే « సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ » ఇత్యాదిస్వరూపలక్షణపరవాక్యములు, అట్టి బ్రహ్మసూత్రములచేతను బ్రహ్మపదముల

చేతను; హేతుమద్భిః = "స దేవ సౌమ్య దమగ్ర ఆసీ దేక మేవా ఽద్వితీయమ్" అని యుపక్రమించి, "త ద్ధైక ఆహు రస దేవేద మగ్ర ఆసీ దేక మేవా ఽద్వితీయం తస్మా దసత స్సజ్జాయేత" • అని నాస్తికమతము నుపన్యసించి "కుతస్తు ఖలు సౌమ్యైవం స్యా దితి హోవాచ కథ మసత స్సజ్జాయేత" * ఇత్యాదియుక్తులను ప్రతిపాదించువానిచేత; వినిశ్చితైః = ఉపక్రమోపసంహారముల నేకవాక్య మగుటచే సందేహరహిత మయినయర్థముఁ బ్రతిపాదించువానిచేత; బహుధా గీతమ్. ఇందుచే జ్ఞానకాండ ప్రతిపాద్యత్వము చెప్పఁబడియె. ఇట్లు వీనిచే నతివిస్తరంబునఁ జెప్పఁబడినదాని క్షేత్రక్షేత్రజ్ఞయాథాత్మ్యమును సంక్షేపంబున నీకుఁ జెప్పెదను వినుమని యర్థము. లేక. బ్రహ్మసూత్రము లగుపదములచేత నని కర్మధారయము గూడ కావచ్చును, అందు విద్యాసూత్రములు "ఆత్మే త్యే వోపాసీత" ఇత్యాదులు, అవిద్యాసూత్రములు "న స వేద యథా పశుః" ఇత్యాదులు, వానిచేత; గీతమ్.

శ్రీ. ఎవ్వరిచే విస్తరంబునఁ బ్రతిపాదింపఁబడినదాని కీసంక్షేప మని యపేక్షింపఁగాఁ జెప్పుచున్నాఁడు — ఋషిభిః=వసిష్ఠాదులచేత: యోగశాస్త్రములయందు ధ్యానధారణావిషయత్వంబున నైరాజాదిరూపంబున, బహుధా; గీతమ్=నిరూపింపఁబడినది. వివిధైః=నిత్యనైమిత్తిక కామ్యకర్మాదివిషయము లగు; ఛన్దోభిః = వేదములచేత; నానావిధయజనీయ దేవతాదిరూపంబున, బహుధాగీతమ్. బ్రహ్మసూత్రపదైశ్చైవ = బ్రహ్మముయొక్క సూత్రములచేతను పదములచేతను, బ్రహ్మము సూత్రింపఁబడుచున్నది — సూచింపఁబడుచున్నది వీనిచేతఁ గావున బ్రహ్మసూత్రము లనఁగా "యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాదు లయినతటస్థలక్షణపరము లగునుపనిషద్వాక్యములు, అట్లు, బ్రహ్మము పద్యతే — సాక్షాత్తుగా నెఱుంగఁబడుచున్నది వీనిచేతఁ గావున బ్రహ్మపదము లనఁగా "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" ఇత్యాదు లగు స్వరూపలక్షణపరము లయినయుపనిషద్వాక్యములు, అట్టివానిచేతఁ గూడ; బహుధా గీతమ్; మఱియును; హేతుమద్భిః=స దేవ సౌమ్య దమగ్ర ఆసీత్, కథ మసత స్సజ్జాయేత, కో హ్యేవా ఽన్యాత్కః ప్రాణ్యాత్ । య దేష ఆకాశ ఆనన్దో న స్యాత్, ఏష హ్యేవా ఽఽనన్దయాతి" ఇత్యాదియుక్తులు గలవానిచేత;

---

• అందుఁ గొందఱు చెప్పుచున్నారు — మున్ను ఇది యసత్తే యొకటి అద్వితీయమై యుండెను, అందువలన అసత్తువలన సత్తు జనియింపవలయును.

* సౌమ్యుఁడా! ఏకారణమువలన నిట్లగును? అని యాచార్యుఁడు చెప్పెను. ఎట్లు అసత్తువలన సత్తు పుట్టును?

కో హ్యేవాన్యాత్ — అపానవ్యాపారము నెవఁడు చేయును? కః ప్రాణ్యాత్ — ఎవ్వఁడు ప్రాణవ్యాపారముఁ జేయును? అని శ్రుతిపదంబుల కర్థము; వినిశ్చితైః= ఉపక్రమోపసంహారముల నేకవాక్యంబు లగుటచే అసందిగ్ధార్థప్రతిపాదకము లగువాని చేత నని యర్థము. అట్లు, వీనిచే విస్తరంబునఁ జెప్పఁబడినదాని సంగ్రహింప నశక్యమైనదాని సంక్షేపంబున నీకుఁ జెప్పెదను వినుమని యర్థము. లేక. "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" ఇత్యాదులు బ్రహ్మసూత్రములు, బ్రహ్మము పద్యతే—నిశ్చయింపఁ బడుచున్నది వీనిచేతఁ గావున అవియే పదములు, వానిచేత; హేతుమద్భిః= "ఈక్షతేర్నాశబ్దమ్, ఆనన్దమయో ఽభ్యాసాత్" ఇత్యాదిగా యుక్తిమంతము లగు వానిచేత; వినిశ్చితార్థము లగువానిచేత. శేషము సమానము.

ప. ఇఁక నెవ్వరిచే విస్తరించి చెప్పఁబడినదాని కీసంక్షేప మనఁగాఁ జెప్పు చున్నాఁడు.—ఋషిభిః = యాజ్ఞవల్క్యవసిష్ఠాదులచేతను; అష్టాంగయోగధారణా వైరాగ్యనిత్యనైమిత్తికకర్మవ్రతోపవాసాదమర్యాదచేత, బహుధా; గీతమ్=నిరూపితము. ఛన్దోభిః=వేదములచేత; వివిధైః = మంత్రబ్రాహ్మణాదిరూపము లగువానిచేత; నానాయజనీయదేవతాదిరూపంబున, గీతమ్. బ్రహ్మసూత్రపదైః = బ్రహ్మమునకు సూత్రము లగుపదములచేత, బ్రహ్మము సూత్రింపఁబడుచున్నది యేపదములచేతనో, అట్టి "విజ్ఞాన మానన్దం బ్రహ్మ, సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ, యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాద్యుపనిషద్భాగములచేత; హేతుమద్భిః= "స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్, కథ మసతః సజ్జాయేత" ఇత్యాది యుక్తిమంతము లగువాని చేత; వినిశ్చితార్థము లగువానిచేత; గీతమ్.

రా. ఆయీ క్షేత్రక్షేత్రజ్ఞతత్త్వము, ఋషిభిః=పరాశరాదులచేత; బహుధా=అనేకప్రకారముగా; గీతమ్ = ప్రతిపాదింపఁబడినది.—"అహం త్వం చ తథా ఽన్యే చ భూతై రుహ్యామ పార్థివ। గుణప్రవాహపతితో భూతవర్గో ఽపి యాత్యయమ్॥ కర్మవశ్యా గుణా హ్యేతే సత్త్వాద్యాః పృథివీపతే। అవిద్యాసంచితం కర్మ తచ్చాశేషేషు జన్తుషు॥ ఆత్మా శుద్ధో ఽక్షర శ్శాన్తో నిర్గుణః ప్రకృతేః పరః" * అని. మఱియు, "పిణ్డః పృథగ్యతః పుంసః శిరఃపాణ్యాదిలక్షణః। తతో ఽహ మితి

---

* రాజా! నేనును నీవును ఇతరులును భూతములచే వహింపఁబడుచున్నాము. ఈభూతవర్గము కర్మప్రవాహమునఁ బడినదై చరించుచున్నది రాజా! సత్త్వాదిగుణములు కర్మవశ్యములుగదా! ఆకర్మమును అవిద్యాసంచితమై యశేషజంతువులందును గలదు. ఆత్మ శుద్ధుఁడు అక్షరుఁడు శాంతుఁడు నిర్గుణుఁడు ప్రకృతికంటెఁ బరుఁడు.

కుత్రైతాం సంజ్ఞాం రాజన్కరోష్యహమ్ ॥ * అని. మఱియు, « కిం త్వ మేతచ్ఛిరః కిన్ను ఉర స్తవ తథోదరమ్ । కిము పాదాదికం త్వం వై తవైతత్కిం మహీపతే॥ సమస్తావయవేభ్య స్త్వం పృథగ్భూప వ్యవస్థితః । కోఽహ మిత్యేవ నిపుణో భూత్వా చిన్తయ పార్థివ" ♦♦ అని. ఇట్లు వివిక్తము లయిన రెంటికిని వాసుదేవాత్మకత్వమునుగూడఁ జెప్పుచున్నారు.—« ఇన్ద్రియాణి మనోబుద్ధి స్సత్త్వం తేజో బలం ధృతిః । వాసుదేవాత్మకా న్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ" ♦ అని. ఛన్దోభిః వివిధైః=నానావిధము లయిన ఋగ్యజుస్సామాథర్వ వేదములచేతను; దేహాత్మలస్వరూపము, పృథక్=భిన్నముగా; గీతమ్.—« తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః । ఆకాశా ద్వాయుః । వాయో రగ్నిః । అగ్నే రాపః । అద్భ్యః పృథివీ । పృథివ్యా ఓషధయః । ఓషధీభ్యో ఽన్నమ్ । అన్నా త్పురుషః । స వా ఏష పురుషో ఽన్నరసమయః" అని దేహస్వరూపమును నిరూపించి దానికన్న నంతరముగా మనోమయమును బ్రతిపాదించి, « తస్మా ద్వా ఏతస్మా న్మనోమయాత్ । అన్యో ఽన్తర ఆత్మా విజ్ఞానమయః" అని క్షేత్రజ్ఞస్వరూపమును వచించి « తస్మా ద్వా ఏతస్మా ద్విజ్ఞానమయాత్ । అన్యో ఽన్తర ఆత్మా ఽఽనన్దమయః" క్షేత్రజ్ఞునకు అంతరాత్మనుగా ఆనందమయుఁ డగు పరమాత్మను బ్రతిపాదించుచున్నవి. ఇట్లు ఋక్సామాథర్వవేదములందును అచ్చటచ్చట క్షేత్రక్షేత్రజ్ఞులకుఁ బృథగ్భావంబును వారు బ్రహ్మాత్మకు లనుటయును స్పష్టముగాఁ జెప్పఁబడినది. బ్రహ్మసూత్రపదైశ్చైవ=బ్రహ్మప్రతిపాదకము లగుసూత్రము లనుపేరు గల పదములచేత, శారీరకసూత్రములచేత; హేతుమద్భిః=హేతుయుక్తము లయినవానిచేత; వినిశ్చితైః=నిర్ణయాంతము లగువానిచేత; « న వియ దశ్రుతేః" అని యారంభించి క్షేత్రప్రకారనిర్ణయము చెప్పఁబడినది. « నాత్మా ఽశ్రుతే ర్నిత్యత్వా చ్చతాభ్యః" అని యారంభించి క్షేత్రజ్ఞస్వరూపనిర్ణయము చెప్పఁబడినది. « పరాత్తు తచ్ఛ్రుతేః" అని భగవత్ప్రవర్త్యము లగుటచే

---

* రాజా! శిరఃపాదాదిరూప మయినదేహము. ఎందువలనఁ బురుషునికంటె భిన్నమై యున్నదో, అందువలన నేను అనునీసంజ్ఞను దేనియందుఁ జేయుదును?

♦♦ నీ వీ శిరస్సా? నీ వొడలా నీవు? లేక యుదరమా? నీవు పాదాదికమా? రాజా! లేక, ఇది నీదా? రాజా! నీవు సమస్తావయవములకంటె భిన్నుఁడవై యున్నావు. రాజా! నే నెవ్వఁడ ననియు నిపుణుఁడవై యాలోచింపుము.

♦ ఇంద్రియములను మనస్సును బుద్ధియు సత్త్వమును తేజస్సును బలమును ధైర్యమును — వీనిని క్షేత్రమును క్షేత్రజ్ఞుని వాసుదేవాత్మకులనుగాఁ జెప్పుచున్నారు.

భగవదాత్మతత్త్వము చెప్పఁబడినది. ఇట్లు అధికముగాఁ బ్రతిపాదింపఁబడిన క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపమును నాచే సంక్షేపముగఁ జెప్పఁబడుచున్న దానిని విను మని యర్థము.

సూ. బ్రహ్మసూత్రము లనఁగా శారీరకము.

మహాభూతా న్యహఙ్కారో బుద్ధి రవ్యక్త మేవ చ
ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః. ౫
ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సఙ్ఘాత శ్చేతనా ధృతిః
ఏత త్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్. ౬

భా. స్తుతిచే నభిముఖీకరింపఁబడిన యర్జునునకుఁ జెప్పుచున్నాఁడు.— మహాభూతాని=సర్వవికారవ్యాపకంబు లగుటవలన గొప్ప వైనభూతములును, సూక్ష్మము లయినభూతములును; స్థూలములను ఇంద్రియగోచరశబ్దముచేఁ జెప్పఁబోవుచున్నాఁడు; అహఙ్కారః = మహాభూతములకుఁ గారణము, అహం ప్రత్యయరూపము; బుద్ధిః=అహంకారకారణ మయినబుద్ధి, అధ్యవసాయలక్షణము; అవ్యక్త మేవచ=బుద్ధికిఁ గారణ మయినయవ్యక్తము, వ్యక్తము కానిది, అవ్యాకృతము, ఈశ్వరశక్తి మమమాయా దురత్యయా అని చెప్పఁబడినది; ఏవకారము ప్రకృత్యవధారణార్థము, ఇంతమాత్రమే యెనిమిదివిధములభిన్న మయినప్రకృతి యని; చకారము భేదసముచ్చయార్థము; ఇన్ద్రియాణి = ఇంద్రియములు; దశ=పది—జ్ఞానోత్పాదకము లగుటవలన జ్ఞానేంద్రియము లనునవి శ్రోత్రాదులైదు, కర్మనిర్వర్తకంబు లగుటవలనఁ గర్మేంద్రియము లనునవి వాక్పాణ్యాదులైదు, అవి పది; ఏకంచ=ఒక్కటియు, ఏది యది? మనస్సు పదునొకండవది సంకల్పాదిలక్షణము; ఇన్ద్రియగోచరాః=శబ్దాదివిషయములు; పఞ్చచ= అయిదును. వీనినే సాంఖ్యులు చతుర్వింశతితత్త్వము లని చెప్పెదరు. ఇఁక, ఆత్మగుణము లని వేనిని వైశేషికులు చెప్పుచున్నారో అవియు క్షేత్రధర్మములే కాని క్షేత్రజ్ఞునిధర్మములు కా వని చెప్పుచున్నాఁడు భగవంతుఁడు.—ఇచ్ఛా=ఏజాతిలోని ♦ యర్థమును సుఖహేతువును బూర్వము చూచినాఁడో ఆజాతిలోనియర్థమును వెండియుఁ జూచినపుడు

♦ ఏతెగలోని.

దాని సుఖహేతు వని గ్రహింపఁగోరుచున్నాఁడు—అది యిచ్ఛ అంతఃకరణధర్మము జ్ఞేయం బగుటవలన క్షేత్రము. అట్లు, ద్వేషః=ఏజాతిలోని యర్థమును బూర్వము దుఃఖహేతువునుగా ననుభవించినాఁ డని ఆజాతిలోనిదాని వెండియుఁ జూచి ద్వేషించుచున్నాఁడు, అది ద్వేషము, జ్ఞేయం బగుటవలన క్షేత్రమే. అట్లు, సుఖమ్=అనుకూలము, ప్రసన్నమై సత్త్వాత్మక మయినది, జ్ఞేయ మగుటవలన క్షేత్రమే. దుఃఖమ్=ప్రతికూలాత్మకము, అదియు జ్ఞేయ మగుటవలన క్షేత్రము. సంఘాతః=దేహేంద్రియములసంహతి *, అదియు క్షేత్రము. చేతనా=ఆదేహేంద్రియసంహతియందుఁ దప్తలోహపిండమం దగ్నివలె నభివ్యక్తమై చైతన్యాంశరసవిద్ధ మయినయంతఃకరణవృత్తి చేతన, అదియు క్షేత్రము జ్ఞేయ మగుటవలన. ధృతిః=దేనిచే అవసాదమును ♦ బొందినదేహేంద్రియములు ధరింపఁబడుచున్నవో అది ధృతి, అదియు క్షేత్రము జ్ఞేయ మగుటవలన. సర్వాంతఃకరణధర్మోపలక్షణార్థము ఇచ్ఛాద్యుగ్రహణము, కావునఁ జెప్పినదాని నుపసంహరించుచున్నాఁడు.—ఏతత్=ఇది; క్షేత్రమ్=క్షేత్రము; సమాసేన=సంక్షేపముచేత; సవికారమ్=వికార మయినమహదాదికముతోఁ గూడినది యని; ఉదాహృతమ్=చెప్పఁబడినది. ఏక్షేత్రభేదజాతముయొక్క సంఘాతము ఈశరీరము క్షేత్ర మని చెప్పఁబడినదో ఆ క్షేత్రము మహదాదిభేదభిన్నము ధృత్యన్తము ప్రతిపాదింపఁబడినది.

ఐదు సూక్ష్మమహాభూతంబులును తత్కారణ మయినయహంకారమును అహంకారకారణ మయినబుద్ధియును బుద్ధికారణ మయినమూలప్రకృతియు పది యింద్రియంబులును మనస్సును శబ్దాదివిషయము లైదును — స్థూలమహాభూతంబు లైదును, ఇచ్ఛయును ద్వేషమును సుఖమును దుఃఖమును దేహేంద్రియసంఘాతమును అందభివ్యక్త మైనయంతఃకరణవృత్తియును ధృతియును — ఇవి మొదలగు నంతఃకరణధర్మములును ఇవియన్నియు సంక్షేపంబున వికారసహితము క్షేత్ర మని చెప్పఁబడినది యని తాత్పర్యము.

అ॰ క్షేత్రాదితత్త్వమును స్తుతించుటచే నర్జునున కాశకొలిపి యవి యెట్టి దని యతఁడు తెలియఁగోరఁగా నుద్దేశించిన చొప్పున నతనికి క్షేత్రమును జెప్పి

* కూడిక.

♦ కృశించుటను.

చున్నాఁ డని చెప్పుచున్నారు స్తుతిచే నిత్యాదిగా. గొప్ప వనుటకు హేతువుఁ జెప్పు
చున్నారు సర్వవికారవ్యాపకంబు లగుటవలన నని. భూతశబ్దముచే స్థూలములను
గూడ విశేషము లేమివలన గ్రహించినయెడ నేమి హాని యని యాశంకించి చెప్పు
చున్నారు స్థూలములను ఇత్యాదిగా. భూతంబులు ప్రాతీతికంబు లగుటవలన నభి
మానమాత్రంబు లనునభిప్రాయముతో నహంకారమునకు విశేషణము చేయుచు
న్నారు మహాభూతములకు నిత్యాదిగా. మహతః పర మవ్యక్త మిత్యాదికమునందుఁ
బ్రసిద్ధ మైన మహచ్ఛబ్దార్థము నహంకార హేతువుఁ జెప్పుచున్నారు బుద్ధిః ఇత్యాది
గా. ఈశ్వరశక్తి యన్నపుడు చైతన్య మని గూడ శంకింతు రని దానియర్థముఁ
జెప్పుచున్నారు మమ మా యేత్యాదిగా. అవధారణరూప మయినయర్థమునే స్ఫు
టీకరించుచున్నారు ఇంతమాత్రమే ఇత్యాదిగా. ఐదుతన్మాత్రములును అహంకార
మును మహత్తత్త్వమును అవ్యాకృతము నని యెనిమిదివిధముల భిన్నము. మూల
ప్రకృతితోఁ దన్మాత్రాదిభేదముల సముచ్చయించుచున్నది చకారము. పదియింద్రి
యములను విభజించి చూపుచున్నారు జ్ఞానోత్పాదకములు ఇత్యాదిగా. ఆయొక్క
టినే ప్రశ్నద్వారంబున స్ఫుటీకరించుచున్నారు ఏది యది ఇత్యాదిగా. శబ్దాదివిషయ
శబ్దముచే స్థూలభూతములు గ్రహింపఁబడుచున్నవి. చెప్పినతన్మాత్రాదులయందుఁ
దంత్రాంతరసమ్మతిని జెప్పుచున్నారు వీనినే ఇత్యాదిగా. "మూలప్రకృతి రవికృతి
ర్మహదాద్యాః ప్రకృతివికృతయ స్సప్త। షోడశక శ్చ వికారః" ♦ అని సాంఖ్యు
లు పఠించుచున్నారు. పఞ్చచేన్ద్రియ గోచరా యని శబ్దాదులనుమాత్రము గ్ర
హించినపుడు కర్మేంద్రియవిషయముల గ్రహింపమిచే వైరూప్యము కలుగుచున్నది,
క్షేత్రనిరూపణమే ప్రకృతము, కావున, అవ్యక్తాహంకారాదులు త్రైగుణ్యాభిమా
నాదిధర్మకంబు లని ప్రసిద్ధ మగుటవలన స్వరూపనిర్దేశముచేతనే తత్క్షేత్రం యచ్చ
యావచ్చ యనుభాగము వ్యాఖ్యాత మయ్యె నని యెఱుంగవలయును. ఇప్పుడు,
ఇచ్ఛాదుల కాత్మవికారత్వము నివర్తించుటకై క్షేత్రవికారత్వము నిరూపించి
యద్వికారి యనుదానియర్థము నిరూపించువాఁడై మతాంతరనివృత్తిపరంబుగా
మీఁదిశ్లోకము దించుచున్నారు ఇఁక నిత్యాదిగా. సర్వజ్ఞునివచనమునకు విరుద్ధం
బగుటవలన హేయము వైశేషికమతం బనునభిప్రాయముతో భగవంతుఁ డని చెప్పఁ

---

♦ వికారము కాని మూలప్రకృతియును, ప్రకృతులును వికారములు నగు మహదాదులు—బుద్ధి
అహంకారము అయిదు తన్మాత్రములు—ఇవి యేడును, పదునాఱువికారములును — ఇంద్రియములు పది
యు మనస్సును విషయము లైదును—ఇవి యిరువదినాలుగు.

బడినది పూర్వము చూచినయర్థముతో సజాతీయ మయినయర్థమును జూచినపుడు గ్రహింపఁ గోర్కి కలుగుటకు హేతువు చెప్పుచున్నారు సుఖహేతు వని అని. ఇచ్ఛను సుఖతద్ధేతువిషయంబుగా వివరించి దాని కాత్మధర్మత్వము నిరాకరించుచున్నారు అది యిచ్ఛ ఇత్యాదిగా. అట్లయినను అది క్షేత్రాంతర్భూతం బెట్లగును? అనఁగాఁ జెప్పుచున్నారు జ్ఞేయం బగుటవలన నని. ఇచ్ఛవలె ద్వేషంబును బుద్ధిధర్మం బని చెప్పుచున్నారు అట్లు అని. బుద్ధిధర్మం బని నీవు చెప్పుద్వేష మెట్టిది? అనఁగాఁ జెప్పుచున్నారు ఏజాతిలోని ఇత్యాదిగా. అదియును ఇచ్ఛవలె క్షేత్రాంతర్భూతం బని చెప్పుచున్నారు అది ద్వేషము ఇత్యాదిగా. ఇచ్ఛాద్వేషంబులవలె సుఖముగూడ బుద్ధిధర్మ మని చెప్పుచున్నారు అట్లు అని. దానికిని స్వరూపము చెప్పి క్షేత్రాంతర్భావముఁ జెప్పుచున్నారు అనుకూలము ఇత్యాదిగా. దుఃఖమునకును స్వరూపముఁ బ్రతిపాదించి క్షేత్రాంతఃపాతిత్వముఁ జెప్పుచున్నారు దుఃఖమ్ ఇత్యాదిగా. దేహేంద్రియాత్మవాదంబుల నిరాకరించుటకై క్షేత్రాంతర్భూతమును గానే సంఘాతమును విభజించుచున్నారు దేహేత్యాదిగా. విజ్ఞానవాదమును నిరాకరించుచున్నారు చేతనేత్యాదిగా. తప్తలోహపిండమునం దగ్ని యభివ్యక్తమగునట్లు ఈసంహతియందు బుద్ధివృత్తి యభివ్యక్త మగుచున్నది, అం దగ్ని యభివ్యక్తమై లోహపిండమునందే యగ్నిబుద్ధిఁ గలిగించుచున్నది, అట్లాత్మచైతన్యము బుద్ధివృత్తియం దభివ్యక్తమై యాబుద్ధివృత్తినే యాత్మనుగాఁ దోఁపఁజేయుచున్నది, అందువలనఁ దదాభాసానువిద్ధమైనయాబుద్ధివృత్తియే చేతన యని చెప్పఁబడుచున్నది, అట్టిచేతనయు ముఖ్యచేతనాపేక్షచే జ్ఞేయం బగుటవలనను అతద్రూపం బగుటవలనను క్షేత్రమే యని యర్థము. ధృతిస్వరూపము నుగ్గడించి యదియు క్షేత్రమని ప్రదర్శించుచున్నారు ధృతిః ఇత్యాదిగా. ఓయీ! ఇతరములుగూడ సంకల్పాదులు మనోధర్మములు కలవు, అవి యేల యిట క్షేత్ర మని చెప్పఁబడినవి కావు? అనఁగాఁ జెప్పుచున్నారు సర్వేత్యాదిగా. అది యుపలక్షణార్థం బనుటకు హేతువు జెప్పుచున్నారు కావున నిత్యాదిగా. ఇచ్ఛాదులుంబోలె నియ్యవసరమునందు సంకల్పాదులుగూడ ప్రదర్శితంబు లగుట సిద్ధముగా నెంచి ప్రకరణవిభాగార్థము భగవంతుఁడు ప్రతిపాదితం బగుక్షేత్రము నుపసంహరించుటవలన, ఇచ్ఛాదిగ్రహణము చెప్పనిసర్వబుద్ధిధర్మంబులకు నుపలక్షణార్థం బనుట యుక్త మని యర్థము. విరక్తునకు జ్ఞానమునం దధికారము గలుగుటకై వైరాగ్యార్థము క్షేత్రవ్యా

ఖ్యాఁ బని యనువదించుచున్నారు ఏతత్ క్షేత్రేత్యాదిగా. క్షేత్రభేదజాతముయొక్క— వ్యష్టి దేహవిభాగముయొక్క యని యర్థము. సంఘాతము—సమష్టిశరీరము.

౫. అహఙ్కారః=మహాభూతకారణము. అవ్యక్తమ్=అహంకారకారణ మయినయీశ్వరశక్తి, మమ మాయా దురత్యయా అని చెప్పఁబడినది. దశేన్ద్రియాణి=అయిదుజ్ఞానేంద్రియములును అయిదుకర్మేంద్రియములును; ఇన్ద్రియగోచరాః పఞ్చ = శబ్దస్పర్శరూపరసగంధములు అయిదును. వీనిని సాంఖ్యులు చతుర్వింశతి తత్త్వము లని చెప్పెదరు. ఇఁక, వేనిని ఆత్మగుణంబు లని వైశేషికులు చెప్పెదరో అవియు క్షేత్రధర్మములే కాని క్షేత్రజ్ఞునివి కావని చెప్పుచున్నాఁడు భగవంతుఁడు — సంఘాతః=కార్యకరణసంఘాతాత్మక మయినశరీరము. చేతనా=శరీరముయొక్క నిత్య సిద్ధ మైన యాత్మచైతన్యప్రకాశము. ధృతిః=ఉత్సాహము. ఏతత్ అనునది సర్వాం తఃకరణధర్మోపలక్షణార్థము. సవికారమ్=వికారములతోఁ గూడినది. వికారము లనఁగా ఇంద్రియములు.

౬౦. ఇట్లు క్షేత్రక్షేత్రజ్ఞులస్వరూపవివేచనము సర్వశాస్త్రములయందును తదర్థజ్ఞులయందును ప్రసిద్ధం బని ప్రతిపాదించి, అందు మొదట నుద్దేశించినక్షేత్ర మును ప్రతిపాదించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—మహాభూతాని = భవన్తి— అగుచున్నవి కావున భూతములు ఆకాశాదులు, అపంచీకృతము లయినసూక్ష్మములు, స్థూలభూతములను పఞ్చచేన్ద్రియగోచరా యని చెప్పఁబోవుచున్నాఁడు కావున నిట భూతశబ్దముచే తన్మాత్రములే గ్రహింపవలయును, మహత్తులైనభూతములు మహా భూతములు, సర్వకార్యవ్యాపకంబు లగుటవలన భూతములకు మహత్త్వము. అహ ఙ్కారః=మహాభూతకారణము, « అహఙ్కారా త్పఞ్చతన్మాత్రాణి » అనుశ్రుతివలన. బుద్ధిః=మహత్తత్త్వము, అహంకారకారణము, « మహతో ఽహఙ్కారః » అను శ్రుతివలన. అవ్యక్తమ్ = మహత్కారణ మయినమూలప్రకృతి, మహదాదికమువలె వ్యక్తము కాదు కావున అవ్యక్తము, అవ్యాకృతము జగద్బీజము త్రిగుణాత్మకము పరమేశ్వరశక్తి అపరప్రకృతి. « భిన్నా ప్రకృతి రష్టధా, అపరేయమ్ " అని యు, « దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా " అనియు అష్టధా భిన్నముగాఁ జెప్పఁబడినయపరప్రకృతియే యని ప్రకృతిస్వరూపావధారణార్థ మేవకా రము. చ కారము సముచ్చయార్థము. అవ్యక్తమే క్షేత్రముయొక్కస్వాభావికరూ పము, మహదాద్యులయేడింటితోను « ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చచేన్ద్రియగోచ

తాః" అని చెప్పఁబోవు పదునాఱువికారంబులతోను సవికార మని చెప్పినవిశేషణము గలక్షేత్రమునకే వైకారికరూపము. ఇన్ద్రియాణిదశ=చక్షురాదులు వాగాదులు పదియింద్రియములు ఏకంచ=అంతరింద్రియ మగుమనస్సు పదునొకండవది. పఞ్చఇన్ద్రియగోచరాశ్చ=శబ్దాదులు ఐదును. ఇవి పదునాఱువికారములును అయిదుమహాభూతములును మహదహంకారములును అవ్యక్తమును కలసి యిరువదినాలుగుపదార్థములు "మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతివికృతయ స్సప్త। షోడశక శ్చ వికారో న ప్రకృతి ర్న వికృతిః పురుషః" అను సాంఖ్యులచతుర్వింశతితత్త్వము లగుచున్నవి. యీ దృక్చ అని చెప్పినవిశేషణమును స్పష్టీకరించుచున్నాడు.—ఇచ్ఛా=దీనిచే భోగ్యముల నిచ్ఛించుచున్నాఁడు అనువ్యుత్పత్తిచే ఇచ్ఛ యనఁగా రాగము, విషయములయందుఁ బ్రీతి; ద్వేషః=అప్రీతి; ఇచ్ఛాద్వేషశ అనుట శమదమదయాదు లగు సాత్త్వికగుణంబులకును నిద్రాలస్యమోహాదితామసగుణంబులకు నుపలక్షణము; రాజససాత్త్వికతామసంబు లగు నిచ్ఛాద్వేషాదులన్నియు క్షేత్రాంతర్భూతములు అంతఃకరణధర్మము లగుటవలన; క్షేత్రమే యివిచేతను జన్మాదులచేతను ధర్మి యగుచున్నది, ఇచ్ఛాద్వేషాదులచేఁ బుణ్యపాపకర్మహేతు వగుటవలనఁ దానే కర్తయు నగుచున్నది; ఇచ్ఛాదులును బుణ్యాదికర్మంబులును క్షేత్రధర్మము లగుటవలనను జ్ఞేయము లగుటవలనను క్షేత్రమే యగును. ఇష్టానిష్టవస్తుసాన్నిధ్యమువలనఁ బ్రతీయమానము లగు సుఖదుఃఖములును అంతఃకరణపరిణామవిశేషము లగుటవలన క్షేత్రధర్మములే కాని యాత్మధర్మములు కావు, ఇది రాగం బిది ద్వేష మిది సుఖం బిది దుఃఖ మని జ్ఞేయము లగుటవలన, సుఖదుఃఖేచ్ఛాద్వేషప్రయత్నధర్మాధర్మము లాత్మధర్మము లన్నచో జ్ఞేయత్వం బనుపపన్న మగుటవలన; ఘటమువలె సుఖదుఃఖేచ్ఛాదిధర్మంబులును జ్ఞాయమానంబు లగుచున్నవి గదా! కావున నవి రూపమువలె అనాత్మధర్మములే యగును. సుఖదుఃఖాదులాత్మధర్మము లని తార్కికు లంగీకరించిరను అవి యంతఃకరణధర్మములే కాని యాత్మధర్మములు కావు, నిరవయవమునకును సావయవమునకును సంయోగసంబంధముకాని సమవాయసంబంధముకాని సంభవింపమివలనను, వానికి అయుతసిద్ధత్వము * లేమివలనను. ఆత్మ గుణి కాఁడు గదా! "కేవలో నిర్గుణశ్చ" అను శ్రుతివలన. క్రియావంతుఁడును గాఁడు, "నిష్కలం నిష్క్రియమ్" అను శ్రుతివలన.

* ఏరెంటిలో వినాశకారణము లేనియపుడు ఒకటి యితరము నాశ్రయించియే యుండునో ఆరెండును అయుతసిద్ధము లని వైశేషికులు.

నిష్కళుం డగుటవలన అవయవియుం గాఁడు అసంగుఁ డగుటవలన ఆత్మకు దేని తోను సంయోగముగాని సమవాయముగాని సంభవింపదు. అవి యాత్మధర్మములే యగునేని అప్పుడు నిత్యంబులును చైతన్యమువలె సదోపలభ్యమానంబులును గావలసి వచ్చును. అందువలన రాగద్వేషసుఖదుఃఖాదిధర్మంబులును జన్మజరాదిధర్మంబులును క్షేత్రమునకే యని సిద్ధము. అందువలననే భగవంతుఁడు గూడ ఇచ్ఛాద్వేష స్సుఖం దుఃఖ మ్మని యిచ్ఛాదులు క్షేత్రాంతర్భూతములే యని ప్రతిపాదించెను. మఱియు. సంఘాతః=కరచరణాదిసంహతిరూప మైన దేహంబును, క్షేత్రమే. తప్తాయఃపిండమునం దగ్నివలె బుద్ధియందు బుద్ధివృత్తివిశిష్టమై శబ్దాదివిషయావభాసక మైనయేయాత్మచైతన్యాభాసము గలదో అదియే చేతన, అదియు బుద్ధితోఁ గూడ సాక్షికి విషయమయి జ్ఞేయం బగుటవలనను తద్భాసభావి * యగుటవలనను క్షేత్రమే. ధృతిః=ధైర్యం బను బుద్ధివృత్తివిశేషము, అదియు జ్ఞేయం బగుటవలన క్షేత్రమే. ధృతిః అనునది కామసంకల్పవిచికిత్సాదులకును ఇదంకార మమకారాది సర్వప్రత్యయములకు నుపలక్షణము. అందుచే ఏ దేది యాత్మకు జ్ఞేయ మగునో అది యంతయు క్షేత్రమే యని సిద్ధము. సవికారమ్=వికారములైనమహదాదులతోను శబ్దాదులతోను గూడినది, ధర్మసహిత మైనది; ఏతత్=ఇది; క్షేత్రమ్; సమాసేన; నీకు, సముదాహృతమ్—చక్కఁగా నిరూపింపఁబడిన దని యర్థము.

మం॥ ఇట్లు రుచిఁబుట్టించి యర్జునునకు క్షేత్రస్వరూపమును మొదటఁ జెప్పుచున్నాఁడు భగవంతుఁడు.—మహాభూతాని = గొప్ప వైనభూతములు, భూమ్యాదు లైదు. అహఙ్కారః=వానికిఁ గారణభూత మైనయభిమానము. బుద్ధిః=అహంకారకారణ మైనమహత్తత్త్వము అధ్యవసాయరూపము. అవ్యక్తమ్=దానికిఁ గారణ మయినసత్త్వరజస్తమోగుణాత్మక మగుప్రధానము, సమస్తమునకుఁ గారణమై దేనికిని గార్యము కానిది. ఏవకారము ప్రకృత్యవధారణార్థము, ఇంతమాత్రమే యష్టధాభిన్న మగుప్రకృతి. చశబ్దము భేదసముచ్చయార్థము. ఇది సాంఖ్యమతంబున వ్యాఖ్యానము. ఇఁక నౌపనిషదమతంబునందో—అవ్యక్తమ్=అవ్యాకృతము అనిర్వచనీయ మగుమాయాఖ్య మయినపరమేశ్వరునిశక్తి, మమ మాయా దురత్యయా అని చెప్పఁబడినది. బుద్ధిః=సర్గాదియందు తద్విషయ మయినయీక్షణము. అహంకారః=ఈక్షణానంతరము అహం బహుస్యామ్ † అనుసంకల్పము. అందువలన ఆకా

* బుద్ధి యున్నప్పుడే తోఁచునది.

† [illegible] గావలయును.

కాదిక్రమంబునఁ బంచభూతోత్పత్తి అని. అవ్యక్తమహదహంకారములను సాంఖ్యులు చెప్పువానిని ఔపనిషదు లంగీకరింపరు అశబ్దత్వాము * మొదలగు హేతువుల చేత—అనుట సర్వసమ్మతము. “మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్, తే ధ్యానయోగానుగతా అపశ్యన్దే వాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢామ్” అను శ్రుతులచేఁ బ్రతిపాదితం బవ్యక్తము. “తద్దైక్షత” అని చెప్పఁబడినది యీక్షణరూపము బుద్ధి. “బహుస్యాం ప్రజాయేయ” అని చెప్పఁబడినది బహుభవనసంకల్పరూపం బహంకారము. “తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశస్సంభూతః । ఆకాశా ద్వాయుః । వాయో రగ్నిః । అగ్నే రాపః । అద్భ్యః పృథివీ” అని పంచభూతోత్పత్తి శ్రుతిచేఁ జెప్పఁబడినది ఈపక్షమే యుక్తము. ఇన్ద్రియాణి దశ—శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబు లనుజ్ఞానేంద్రియము లైదును వాక్పాణిపాదపాయూపస్థంబు లనుకర్మేంద్రియము లైదును ఏకంచ=సంకల్పవికల్పాత్మక మయిన మనస్సొకటియు. పఞ్చచేన్ద్రియగోచరాః = శబ్దస్పర్శరూపరసగంధము లైదును, అవి జ్ఞాప్యంబు లగుటచే జ్ఞానేంద్రియములకును గ్రాహ్యంబు లగుటచేఁ గర్మేంద్రియములకును విషయములు. ఈ చెప్పినవానినే సాంఖ్యులు చతుర్వింశతితత్త్వము లని చెప్పెదరు. ఇచ్ఛా=సుఖమునందును దత్సాధనమునందును ఇది నాకుఁ గావలయును అనుస్పృహారూప మయినచిత్తవృత్తి, కామ మనియు రాగ మనియుఁ జెప్పఁబడును. ద్వేషః=దుఃఖమునందును దత్సాధనమునందును ఇది నాకు వలదు అనుస్పృహావిరోధిచిత్తవృత్తి, క్రోధ మనియు ఈర్ష్య యనియుఁ జెప్పఁబడును. సుఖమ్=నిరుపాధీచ్ఛకు విషయ మయినదియు ధర్మమే యసాధారణకారణముగాఁ గలదియు నగుచిత్తవృత్తి, పరమాత్మసుఖవ్యంజకము. దుఃఖమ్=నిరుపాధిద్వేషమునకు విషయ మైనచిత్తవృత్తి, అధర్మమే యసాధారణకారణముగాఁ గలది. సంఘాతః=పంచమహాభూతపరిణామ మయి యింద్రియసహిత మగుశరీరము. చేతనా=స్వరూపజ్ఞానవ్యంజక మై ప్రమాణమే యసాధారణకారణముగాఁ గల దగుజ్ఞానాఖ్యచిత్తవృత్తి. ధృతిః=అవసాదము నొందినదేహేంద్రియముల కవష్టంభము కలిగించుప్రయత్నము. ఈయిచ్ఛాదిగ్రహణము సర్వాంతఃకరణధర్మముల కుపలక్షణము. అట్లు శ్రుతి “కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధా ఽశ్రద్ధా ధృతి రధృతి ర్హ్రీ ర్ధీ ర్భీ రిత్యేత త్సర్వం మన ఏవ” అని మృత్తికఘటం బన్నట్లు కారణాభేదంబునఁ గార్యంబు లగు కామాదులకు మనోధర్మత్వము చెప్పుచున్నది. ఏతత్ = ఈపరిదృశ్యమాన మగుసమ[illegible]త్వం

* వేదోక్తములు కావుండుట.

తము సాక్షి యగుక్షేత్రజ్ఞునిచే నవభాస్యం బగుటవలన తద్రూపము కానిదికి క్షేత్రమ్=భాస్యము అచేతనము; సమాసేన; ఉదాహృతమ్=చెప్పఁబడినది. ఓయీ! శరీరేంద్రియసంఘాతమే చేతనుండు క్షేత్రజ్ఞుఁడని లోకాయతికులు, చేతన యగు క్షణిక మయినజ్ఞానమే యాత్మ యని బౌద్ధులు, ఇచ్ఛాద్వేషప్రయత్నసుఖదుఃఖ జ్ఞానంబు లాత్మకు లింగ మని నైయాయికులు, అట్లుండఁగా క్షేత్రమే యిదియంతయు నని యెట్లు చెప్పనచ్చును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు —సవికారమ్=వికార మనఁగా జన్మాదినాశాంతము నైరుక్తులచేఁ జెప్పఁబడినది, దానితోఁ గూడినది యీమహాభూతాదిధృత్యంతము, కావున వికారసాక్షి కాదు, తనయుత్పత్తివినాశములు తనకుఁ జూడ నశక్యము లగుటవలనను, ఇతరము లైనస్వధర్మములను గూడ తన్నుఁ జూడక చూచుట యనుపపన్న మగుటవలనను, తానే తన్నుఁ జూచు నన్నఁ గర్తృకర్మవిరోధము కలుగుటవలనను సర్వవికారసాక్షి నిర్వికారుఁడే కావలయును. అది చెప్పఁబడినది—“ నర్తే స్యాద్విక్రియాం దుఃఖీ సాక్షితా కా వికారిణః ॥ ధీవిక్రియాసహస్రాణాం సాక్ష్యతో౽హ మవిక్రియః” * అని. అందుచే వికారిత్వమే క్షేత్రమునకు లక్షణము, ఈపరిగణనము కా దని యర్థము.

శ్రీ. అందు క్షేత్రస్వరూపము చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—మహాభూతాని—భూమ్యాదు లైదు. అహంకారః—తత్కారణ మయినది. బుద్ధిః=విజ్ఞానాత్మక మయినమహత్తత్త్వము. అవ్యక్తమ్=మూలప్రకృతి. ఇన్ద్రియాణిదశ=బాహ్యము లయినయింద్రియములు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణ వాక్పాణి పాద పాయూపస్థములు పది. ఏకంచ—మనస్సును. ఇన్ద్రియగోచరాశ్చ పఞ్చ=తన్మాత్రరూపము లైనశబ్దాదులే యాకాశాదివిశేషగుణత్వంబున వ్యక్తంబు లై యింద్రియ విషయము లగునవి యయిదు. ఇట్లు చతుర్వింశతితత్త్వములు చెప్పఁబడినవి. ఇచ్ఛాదులు ప్రసిద్ధములు. సంఘాతః = శరీరము. చేతనా=జ్ఞానాత్మక మయినమనోవృత్తి. ధృతిః-ధైర్యము. ఈ యిచ్ఛాదులు దృశ్యంబు లగుటవలన ఆత్మధర్మములు కావు, మ తే మనఁగా మనోధర్మములే, కావున క్షేత్రాంతర్భూతములే యగును. ఇది యుపలక్షణముసంకల్పాదులకు. అట్లు శ్రుతి—“ కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధా౽శ్రద్ధా ధృతి రధృతి ర్హ్రీ ర్ధీ ర్భీ రిత్యేత త్సర్వం మన ఏవ” అని. ఇందుచే యాదృక్ అని ప్రతిజ్ఞాతంబు లగు క్షేత్రధర్మములు ప్రదర్శింపఁబడినవి. ఏతత్ క్షేత్రమ్=

* వికారము లేక దుఃఖ కాఁదు, వికారవంతునకు సాక్షిత్వ మెక్కడిది? నేను బుద్ధివికారసహస్రములకు సాక్షిని, కావున అవిక్రియుఁడను.

ఇది క్షేత్రము; సవికారమ్=ఇంద్రియాదివికారసహితముగా, సంక్షేపముగ నీకు నాచే చెప్పఁబడినది యని క్షేత్రోపసంహారము.

ప. అందు మొదట క్షేత్రస్వరూపముఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకముల చేత.—మహాభూతాని=భూమ్యాదులు, అనుభవవిషయము లగుటవలన మొదట నుపన్యసింపఁబడినవి. అహంకారము తత్కారణభూతము, అది సాత్త్వికాదిభేదంబున మూఁడువిధములు, అది క్రమంబున జ్ఞానశక్తి క్రియాశక్తి ద్రవ్యశక్తుల కుత్పాదకము. బుద్ధిః=విజ్ఞానాత్మక మయినమహత్తత్త్వము. అవ్యక్తమ్ = మూలప్రకృతి. ఇన్ద్రియాణి దశ=బాహ్యేంద్రియములు పది. ఏకం చ=మనస్సును ఇన్ద్రియగోచరాశ్చ పఞ్చ=అయిదుతన్మాత్రములు శబ్దాదులు, అవి యాకాశాదులకు విశేషగుణములయి యింద్రియవిషయము లగుచున్నవి. ఇట్లు చతుర్వింశతితత్త్వములు ప్రతిపాదింపఁబడినవి *

రా. మహాభూతా న్యహఙ్కారో బుద్ధి రవ్యక్త మేవ చ అని క్షేత్రారంభకము లగుద్రవ్యములు చెప్పఁబడినవి. మహాభూతాని—పృథివ్యప్తేజోవాయ్వాకాశములు. అహఙ్కారః=భూతాది. బుద్ధిః=మహత్తత్త్వము. అవ్యక్తమ్=ప్రకృతి. ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః అని క్షేత్రాశ్రితము లయినతత్త్వములు చెప్పఁబడినవి. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము లైదు జ్ఞానేంద్రియములు, వాక్పాణిపాదపాయూపస్థము లైదు కర్మేంద్రియములు, అవి పది. ఏకం చ=మనస్సును. ఇన్ద్రియగోచరాశ్చ పఞ్చ=శబ్దస్పర్శరూపరసగంధము లైదు. ఇచ్ఛా ద్వేషస్సుఖం దుఃఖ మ్మనునవి క్షేత్రకార్యములు క్షేత్రవికారములుగాఁ జెప్పఁబడుచున్నవి. ఇచ్ఛాద్వేషసుఖదుఃఖంబు లాత్మధర్మభూతములే యయినను ఆత్మకు క్షేత్రసంబంధముచేఁ గలుగునవి కావున క్షేత్రకార్యము లగుటచే క్షేత్రవికారములుగాఁ జెప్పఁబడుచున్నవి. అవి పురుషధర్మము లనుటను పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే అని చెప్పఁబోవుచున్నాఁడు. సంఘాతః చేతనా ఉ. ధృతిః—ధృతి యనఁగా నాధారము, సుఖదుఃఖములను భుజించువాఁడును భోగాపవర్గములను సాధించువాఁడు నగు చేతనున కాధారముగా నుత్పన్నమైనభూతసంఘాతము. ప్రకృత్యాదిపృథివ్యంతద్రవ్యములచే నారబ్ధమై యింద్రియముల కాశ్రయభూతమై యిచ్ఛాద్వేషసుఖదుఃఖములు వికారములుగాఁ గలదై భూతసంఘాతరూపమై చేతనునకు

* తక్కినది శ్రీధరీయముతో సమానము.

సుఖదుఃఖోపభోగమున కాధార మగుటయే ప్రయోజనముగాఁ గలది క్షేత్ర మని ప్రతిపాదిత మగుచున్నది. ఏతత్ క్షేత్రమ్; సమాసేన=సంక్షేపముచే; సవికారమ్=కార్యసహితము; ఉదాహృతమ్=చెప్పఁబడినది.

మూ. ఇచ్ఛాదులు వికారములు.

అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః ౭

భా. క్షేత్రజ్ఞుఁడు చెప్పఁబోవువిశేషణములు గలవాఁడు. ప్రభావసహితుం డగు నెవ్వానిపరిజ్ఞానమువలన నమృతత్వము సిద్ధించునో అట్టి క్షేత్రజ్ఞుని 'జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి' ఇత్యాదిగ్రంథముచే విశేషణసహితముగాఁ దానే చెప్పఁబోవుచున్నాఁడు భగవంతుఁడు. ఇప్పుడో, తద్జ్ఞానసాధనసముదాయమును, ఏది యున్ననే జ్ఞేయుం డగునాక్షేత్రజ్ఞునివిజ్ఞానమునందు యోగ్యుం డధికృతుఁ డగుచున్నాఁడో, దేనియందు నిష్ఠ గలవాఁడు సన్న్యాసి జ్ఞాననిష్ఠుం డని చెప్పఁబడుచున్నాఁడో, అట్టి యమానిత్వాది సముదాయమును, జ్ఞానసాధన మగుటచే జ్ఞానశబ్దవాచ్యం బగుదాని విధించుచున్నాఁడు భగవంతుఁడు —అమానిత్వమ్=మానియొక్కభావము మానిత్వము ఆత్మశ్లాఘనము, అది లేమి యమానిత్వము. అదమ్భిత్వమ్ = స్వధర్మమును ప్రకటీకరించుట దంభిత్వము, అది లేమి యదంభిత్వము. అహింసా = హింసింప కుండుట, ప్రాణులఁ బీడింపకుండుట. క్షాన్తిః=తనయెడ నితరు లపరాధము చేసినపుడు వికారము లేక యుండుట. ఆర్జవమ్=ఋజుభావము, అవక్రత. ఆచార్యోపాసనమ్=మోక్షసాధనము నుపదేశించునట్టియాచార్యుని శుశ్రూషాదులు చేయుటచే సేవించుట. శౌచమ్=దేహమలంబులను మృత్తికచేతను జలముచేతను జక్కఁగాఁ గడుగుట, లోపలఁగూడ మనస్సునందలి రాగాది మలంబులను బ్రతిపక్షభావనచేఁ దొలఁగించుట, ఇది శౌచము. స్థైర్యమ్=స్థిరభావము, మోక్షమార్గమునందే పట్టుదల గలిగి యుండుట. ఆత్మవినిగ్రహః=ఆత్మ కపకారకంబై యాత్మశబ్దవాచ్యమైన కార్యకరణసంఘాతమును జక్కఁగా నిగ్రహించుట, స్వభావముచే నంతటను బ్రవృత్తమైన దాని సన్మార్గమునందే నిరోధించుట ఆత్మవినిగ్రహము.

ఆత్మశ్లాఘనము లేకుండుటయు, తా నాచరించుధర్మమును వెల్లడిచేయకుండుటయు, ప్రాణులఁ బీడింపకుండుటయు, తనకుఁ బరు లపకారము చేసినను వికారము నొందకుండుటయు, కపటము లేకుండుటయు, మోక్షసాధనము నుపదేశించునట్టిగురువును శుశ్రూషాదులచే సేవించుచుండుటయు, దేహమును మనస్సును బరిశుద్ధముగా నుంచుకొనుటయు, మోక్షమార్గమునందే నిలుకడ గలుగుటయు, దేహేంద్రియములను తప్పుద్రోవఁ బోనీయక సన్మార్గమునందే నిలుపుటయు నని తా.

ఆ. ఓయీ! క్షేత్రముఁ జెప్పినపిదప క్షేత్రజ్ఞునిఁ గదా చెప్పవలయును. వేఱువిషయ మేల చెప్పుచున్నాఁడు? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు క్షేత్రజ్ఞుఁడు ఇత్యాదిగా. అనాదిమ దిత్యాదిగాఁ జెప్పఁబోవువిశేషణములు గల క్షేత్రజ్ఞునిఁ దానే భగవంతుఁడు చెప్పఁదలఁచినవిశేషణములతో జ్ఞేయం యత్త దిత్యాదిగా. చెప్పఁబోవుచున్నాఁ డని సంబంధము. క్షేత్రజ్ఞు నేల చెప్పవలయును? అనఁగాఁ జెప్పుచున్నారు ప్రభ వేత్యాదిగా. జ్ఞేయం యత్త దిత్యాదికమునకుఁ బూర్వ మగు గ్రంథమునకుఁ దాత్పర్యము చెప్పుచున్నారు ఇప్పుడో ఇత్యాదిగా. జ్ఞానసాధనము దాయబోధనంబున కేట నుపయోగ మనఁగాఁ జెప్పుచున్నారు ఏది ఇత్యాదిగా. యోగ్యుం డగునధికృతునే వివరించుచున్నారు దేనియందు ఇత్యాదిగా. ఏతత్ జ్ఞానమని భగవంతుఁడు చెప్పఁబోవుచుండఁగా ఎట్లు దీని జ్ఞానసాధనం బనవచ్చును? అని యాశంకించి చెప్పుచున్నారు అట్టి యమానిత్వాది ఇత్యాదిగా. తద్విధానంబునకు వక్తృద్వారంబున దార్ఢ్యమును సూచించుచున్నారు భగవంతుఁ డని. అమానిత్వాదినిష్ఠుండై యంతర్బుద్ధి యగువానికి జ్ఞానము సిద్ధించు నని నియమించుటకై చెప్పుచున్నాఁడు అమానిత్వ మిత్యాదిగా. మాన మనఁగా ప్రచ్ఛన్న మగునయవలేపము ♦ అది తనయందు ఉత్కర్షారోపమునకు హేతువు, అది గలవాఁడు మాని, మాని కానివాఁడు అమాని, తద్భావము అమానిత్వము అని వ్యాఖ్యానము చేయుచున్నారు అమానిత్వ మిత్యాదిగా. ప్రతియోగిముఖంబున అదంభిత్వమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు అదంభిత్వ మిత్యాదిగా. వాఙ్మనోదేహములచేఁ బ్రాణులఁ బీడింపకుండుట అహింసనము, అదియే అహింస యని చెప్పుచున్నారు అహింసేత్యాదిగా. చిత్తవికారకారణం బగుపరాపరాధము ప్రాప్తించినపుడుగూడ చిత్తమునందు వికారము నొందక యపకారమును సహించుట క్షాంతి యని చెప్పుచున్నారు క్షాంతి రిత్యాదిగా. అవక్రత — కుటిలుఁడుగా కుండుట, మనస్సున నుండు

♦ గర్వము.

నట్లు వ్యవహరించుటయు నెల్లప్పుడు నేకరూపముగఁ బ్రవర్తించుటయు నని యర్థము. “ఉపనీయ తు యశ్శిష్యమ్” ఇత్యాదిగాఁ జెప్పినయాచార్యుని వ్యవచ్ఛేదించుచున్నారు మోక్షసాధన మిత్యాదిగా. శుశ్రూషాదులచే ననుచోటి యాదిపదము నమస్కారాదివిషయము. బాహ్యము నాభ్యంతరము నని ద్వివిధ మయిన శౌచమును క్రమముగ విభజించుచున్నారు శౌచ మిత్యాదిగా. రాగాదిమలంబులఁ దొలఁగించు నుపాయము నుపదేశించుచున్నారు ప్రతిపక్షభావనచే నని. రాగాదుల ప్రతికూలమును భావించుట — విషయములయందు దోషదృష్టి చేయుట, దానిచేత నని యర్థము. స్థిరభావమునే విశదీకరించుచున్నారు మోక్షేత్యాదిగా. నిత్యసిద్ధుఁడై యనాధేయాతిశయుఁ డగునాత్మను ఎట్లు నిగ్రహించుట? అనఁగాఁ జెప్పుచున్నారు ఆత్మకు నిత్యాదిగా.

హా. మాన మనఁగా ఆత్మశ్లాఘనము, అది లేమి అమానిత్వము. దంభ మనఁగా ధర్మము వెల్లడించుట, అది లేమి అదంభిత్వము. క్షాన్తిః=క్షమ. శౌచమ్=శుచిత్వము, శరీరమలము దొలఁగించుట. స్థైర్యమ్=స్థిరత్వము. ఆత్మవినిగ్రహః=శరీరముయొక్క ప్రవృత్తిని నియమించుట.

శ్లో౦. ఇట్లు, మహాభూతా న్యహంకార ఇత్యాదిగా క్షేత్రస్వరూపము నిరూపించి యిఁక క్షేత్రజ్ఞుని నిరూపింపవలసి యుండఁగా, క్షేత్రజ్ఞజ్ఞానము తత్సాధనము లేనియెడ సిద్ధింపదు జిజ్ఞాసువునకు తన్నియతసాధనసంపత్తి గలవానికే తజ్జ్ఞానము సులభం బని మొదటనే యాత్మజ్ఞానసాధనములను జెప్పుచున్నాఁ డైదుశ్లోకములచేత.—తా నుత్కృష్టుం డనుబుద్ధి మానము, ప్రతిష్ఠార్థము తనయం దుత్కర్షారోపమునకు హేతువు, అది గలవాఁడు మాని, మానిభావము మానిత్వము, అది లేమి యమానిత్వము. జ్ఞానోత్పత్తిహేతు వగుచిత్తశుద్ధికిఁ బ్రతిబంధకము మానము, అట్లే దంభాదులు గూడ, కావున ముముక్షువు అవి లేనివాఁడు కావలయు నని యర్థము. వేషభాషాక్రియాచాతుర్యాదులచేఁ దనమాహాత్మ్యమును బ్రకటించుట దంభము, అది గలుగుట దంభిత్వము, అది లేనివాఁ డగుట అదంభిత్వము. మనోవాక్కాయకర్మములచేఁ బ్రాణులఁ బీడింపకుండుట అహింస, భూతదయైకలక్ష్యము, బ్రహ్మచర్యాదుల కిది యుపలక్షణము. చింతయు విలాపంబును లేక యాధ్యాత్మికాద్యుపద్రవముల సహించుట క్షాంతి. స్వధర్మమునందు మనోవాక్కాయములకు సదా యేకరూప మయినప్రవృత్తి యార్జవము. ఆచార్యోపాసనమ్=జ్ఞానము నుపదేశించు

నాచార్యుని శ్రద్ధాభక్తులతో శుశ్రూషాదులు చేయుచు నారాధించుట యాచార్యోపాసనము. శౌచము ద్వివిధము బాహ్యమును ఆభ్యంతరము నని; మృత్తికాజలములతో దేహమును గడుగుటయు అస్పృశ్యమును అభక్ష్యమును అగ్రాహ్యమును విడుచుటయు బాహ్యశౌచము, రాగద్వేషలోభమోహగర్వకాఠిన్యాదిమలంబులను తత్ప్రతికూలగుణావలంబంబునఁ గడుగుట యాభ్యంతరశౌచము. ఆత్మవినిగ్రహః= విషయభోగవాసనాగ్రస్త మయినయాత్మకు—అంతఃకరణమునకు విషయధ్యానశ్రవణదర్శనాదులయందు ప్రవృత్తిని నిరోధించుట. స్థైర్యమ్=నిగ్రహింపఁబడినమనస్సును నిశ్చలముగా మోక్షేచ్ఛచే శ్రవణాదికమునందే నిలుపుట.

మ. ఇట్లు క్షేత్రముఁ బ్రతిపాదించి తత్సాక్షి యగుక్షేత్రజ్ఞుని క్షేత్రమునుండి వివేకించి విస్తరంబునఁ బ్రతిపాదించుటకై, తద్జ్ఞానయోగ్యత కలుగుకొఱ కమానిత్వాదిసాధనములం జెప్పుచున్నాఁడు జ్ఞేయం యత్త దిత్యాదిశ్లోకమునకుఁ బూర్వము లగు నైదుశ్లోకములచేత.—ఉన్నవానిచేఁగాని లేనివానిచేఁగాని గుణములచే నాత్మశ్లాఘనము మానిత్వము, లాభపూజాఖ్యాతులకొఱకు స్వధర్మమును బ్రకటముఁ జేయుట దంభిత్వము, వాక్కాయమనస్సులచేఁ బ్రాణులఁ బీడించుట హింస—ఈమూఁటిని విడుచుట యమానిత్వము అదంభిత్వము అహింస యని చెప్పఁబడినది. చిత్తవికారహేతు వగుపరాపరాధము ప్రాప్తించినను నిర్వికారం బగుచిత్తముతోఁ దదపరాధమును సహించుట క్షాంతి. ఆర్జవమ్=కుటిలతలేమి, మనసున నున్నట్లు వ్యవహరించుట, పరుల మోసపుచ్చకుండుట యని యర్థము. ఆచార్యుఁడు మోక్షసాధనము నుపదేశించువాఁ డిట వివక్షితుఁడు, మనువు చెప్పిన యుపనయనాధ్యాపనకర్త కాఁడు, అతని శుశ్రూషానమస్కారాదులచే సేవించుట యాచార్యోపాసనము. శౌచము ద్వివిధము, అందు బాహ్యము కాయమలంబుల మృజ్జలంబులతోఁ గడుగుట, ఆభ్యంతరము మనోమలంబు లగురాగాదుల విషయదోషదర్శనరూప మయినప్రతిపక్షము భావించుటచేఁ దొలఁగించుట. స్థైర్యమ్=మోక్షసాధనమునందుఁ బ్రవర్తించినవాఁడై యందుల కనేకవిధవిఘ్నములు సంభవించినను దాని విడువక మాటిమాటి కధికయత్నము చేయుచుండుట. ఆత్మవినిగ్రహః=దేహేంద్రియసంఘాతమునకు స్వభావప్రాప్త మయినమోక్షప్రతికూలమునందలిప్రవృత్తిని నిరోధించి దాని మోక్షసాధనమునందే వ్యవస్థాపించుట.

శ్రీ. ఇప్పుడు, అట్టిలక్షణము గలక్షేత్రముకంటె వివేకంబున జ్ఞేయుఁడు శుద్ధుం డగుక్షేత్రజ్ఞుని విస్తరంబున వర్ణింపఁబోవువాఁడై తద్జ్ఞానసాధనంబులం

జెప్పుచున్నాఁ డైదుశ్లోకములచేత —అమానిత్వమ్=స్వగుణశ్లాఘనము లేకుండుట. అదమ్భిత్వమ్=దంభము లేకుండుట. అహింసా=పరపీడనము విడుచుట. క్షాన్తిః= ఓర్పు. ఆర్జవమ్=అవక్రత. ఆచార్యోపాసనమ్=సద్గురుసేవ. శౌచమ్—బాహ్యమును ఆభ్యంతరమును, అందు బాహ్యము మృజ్జలాదులచేత, ఆభ్యంతరము రాగాదిమల క్షాలనము. అట్లు స్మృతి.—“ శౌచం తు ద్వివిధం ప్రోక్తం బాహ్య మాభ్యన్తరం తథా । మృజ్జలాభ్యాం స్మృతం బాహ్యం భావశుద్ధి స్తథాఽఽన్తరమ్ ” ♦ అని. స్థైర్యమ్=సన్మార్గమునందుఁ బ్రవర్తించి తదేకనిష్ఠ కలుగుట. ఆత్మవినిగ్రహః = శరీర సంయమనము. ఏతత్ జ్ఞాన మితి ప్రోక్త మ్మను నైదవశ్లోకముతో నన్వయము.

ప. ఇప్పుడీక్షేత్రమునుండి క్షేత్రజ్ఞుని శుద్ధుని జ్ఞేయుని వివేచించి సవిస్తరంబునఁ బ్రతిపాదించువాఁడై తద్జ్ఞానసాధనముల నైదింటిచేఁ జెప్పుచున్నాఁడు.— అమానిత్వమ్=స్వగుణశ్లాఘనము లేకుండుట. అది చెప్పఁబడినది.—“ మానాపమానే దుఃఖీ స్యా న్నైవ సాధారణో జనః । అతో దుఃఖనిదానత్వా న్మానం యోగీ పరిత్యజేత్ ” * అని. అదమ్భిత్వమ్=దంభము లేకుండుట, అది చెప్పఁబడినది.—“ కృతం దమ్భా దదమ్భా ద్వా కర్మ తుల్యశ్రమం భవేత్ । శ్రమైకఫల మాద్యం స్యా ద్ద్వితీయం సుఖసాధనమ్ ” ♦♦ అని. అట్లు, అహింసా=పరపీడానివృత్తి, అది చెప్పఁబడినది.—“ స్వయం బిభేతి హింస్రేభ్య స్తాన్ పాపా న్వ్యది హైర్హన్తైః । సుఖీ స్యామితి విజ్ఞాయ పరపీడాం వివర్జయేత్ ” § అని. క్షాన్తిః=సహనము. ఆర్జవమ్=అకుటిలత. ఆచార్యోపాసనమ్=సద్గురుసేవనము, “ ఆచార్యవాన్ పురుషో వేద ” అను శ్రుతి వలన. అది చెప్పఁబడినది శతశ్లోకియందు.—“ యద్యప్యగ్ర్యాముబుద్ధిః పఠనపరిణమ ద్వేదశాస్త్రాక్షురార్థో, నహ్యాచార్యం వినా ఽసౌ తదపి పరిచినో త్యే తదుక్తం

---

♦ శౌచము బాహ్యమును ఆభ్యంతరము నని రెండువిధములుగాఁ జెప్పఁబడినది, మృజ్జలంబులచేఁ జేయునది బాహ్యము, అట్లు చిత్తశోధనము ఆంతరము.

* మానమునందును అవమానమునందును దుఃఖి యగుచున్నాఁడు, ఏల యనఁగా జనము సాధారణము కానేకాదు—రెంటియందును దుఃఖమునే పొందును. కావున దుఃఖహేతు వగుటవలన మానమును యోగి విడువవలయును.

♦♦ దంభమువలనఁ జేసినను దంభము లేక చేసినను కర్మమునకు శ్రమము సమానము, మొదటిదానికి శ్రమమే ఫలము, రెండవది సుఖసాధనం బగును.

§ తానును హింసకులవలన భయపడుచున్నాఁడు. అట్టివారిని అహింసకుల వధించి తామును వారిచే వధింపఁబడువారిని బాపులం జూచుచున్నాను. నేను సుఖిని గావలయు నని యెంచి పరపీడను విడువవలయును.

రహస్యమ్ । బ్రూతే నామాని యద్య ప్యజిరనివసతా మస్యవక్త్రాచ్ఛ్రితాని, ప్రాయ స్తం తం పదార్థం నహి కథక మృతే వేత్త్యపోద్ఘాయకో౽పి ॥ ౧ అని. శౌచమ్—“శౌచం చ ద్వివిధం ప్రోక్తం బాహ్య మాభ్య న్తరం తథా । మృజ్జలాభ్యాం స్మృతం బాహ్యం భావశుద్ధి స్తథా౽౽న్తరమ్” అని చెప్పఁబడినది. స్థైర్యమ్=తదేకనిష్ఠ. ఆత్మవినిగ్రహః=శరీరసంయమము. ఏతత్ జ్ఞాన మితి ప్రోక్త మ్మను దానితో నన్వయము.

రా. ఇఁక క్షేత్రకార్యములయం దాత్మజ్ఞానసాధనంబు లగుటచే నుపాదేయంబు లగుగుణంబులఁ జెప్పుచున్నాఁడు.—అమానిత్వమ్=ఉత్తమజనులయెడఁ దిరస్కారబుద్ధి లేక యుండుట. అదమ్భిత్వమ్ = ధార్మికత్వకీర్తికొఱకు ధర్మానుష్ఠానము దంభము, అది లేకయుండుట అహింసా=వాఙ్మనఃకాయములచే పరపీడ చేయ కుండుట. క్షాన్తిః=పరులచేఁ బీడింపఁబడుచున్నను వారియెడఁ జిత్తమునందు వికారము నొంద కుండుట. ఆర్జవమ్=పరులయెడ వాఙ్మనఃకాయప్రవృత్తు లేకరూపముగా నుండుట. ఆచార్యోపాసనమ్ = ఆత్మజ్ఞానము నొసంగునట్టి యాచార్యునియందుఁ బ్రణిపాతము పరిప్రశ్నము సేవ మొదలగునవి నిరంతరము చేయుట. శౌచమ్=ఆత్మజ్ఞానమునందును తత్సాధనమునందును యోగ్యత మనోవాక్కాయగతము శాస్త్రసిద్ధము. స్థైర్యమ్=అధ్యాత్మశాస్త్రమునఁ జెప్పినయర్థమునందు నిశ్చలత. ఆత్మవినిగ్రహః=ఆత్మస్వరూపవ్యతిరిక్తము లయినవిషయములనుండి మనస్సును మరలించుట.

మూ. స చ యో యత్ప్రభావ శ్చ యనుదాని వివరించుటకై తద్జ్ఞానసాధనములం జెప్పుచున్నాఁడు.—తా నల్పుఁడసి యెఱింగియు గొప్పతనముఁ గనఁబఱచుట దంభము. “జ్ఞాత్వాపి స్వాత్మనో౽ల్పత్వం దంభో మాహాత్మ్యదర్శనమ్” అని నిఘంటువు. ఆర్జవమ్=మనోవాక్కాయకర్మములు విపరీతములు గా కుండుట.

ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహఙ్కార ఏవ చ
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషా౽నుదర్శనమ్. ౮

౧ గొప్పబుద్ధి గలిగి వేదశాస్త్రములు పఠించి తదర్థము నెఱిగినవాఁడయ్యును, ఆచార్యుఁడు లేనియెడ ఈచెప్పినరహస్యముఁ దెలియఁజాలఁడు, ముంగిట నున్నపదార్థములకు నితరముఖములవలన చిన్నపేర్లను జెప్పవచ్చును గాని ఆయాపదార్థస్వభావము నుపదేశించువాఁడు లేక యెంతమాటల నేర్చినవాఁడైన నెఱుంగఁజాలఁడు.

భా॰ మఱియును.—ఇన్ద్రియార్థేషు=శబ్దాదులయందు, దృష్టాదృష్టము లయినభోగములందు; వైరాగ్యమ్=విరాగభావమును. అనహఙ్కార ఏవచ=అహంకారము లేమియును. జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్=జన్మమును మృత్యువును జరయును వ్యాధులును దుఃఖములును—జన్మమృత్యుజరావ్యాధిదుఃఖములు, వానియం దొక్కొకటియందును దోషము నాలోచించుట; జన్మమునందు గర్భవాసాదికముచే వెడలుట దోషము, దానిం దలంచుట, అట్లు మృత్యువునందును దోషముం దలఁచుట, అట్లు జరయందును — వార్ధకమునందును ప్రజ్ఞాశక్తితేజోనిరోధంబును పరిభవంబును అనుదోషము నాలోచించుట, అట్లు వ్యాధులందును శిరోరోగాదులందు దోషానుదర్శనము, అట్లు దుఃఖములందును అధ్యాత్మాధిభూతాధిదైవనిమిత్తములందు దోషానుదర్శనము. లేక. దుఃఖములే యనుదోషము దుఃఖదోషము, దాని జన్మాదులందు అనుదర్శించుట—దుఃఖముజన్మము దుఃఖముమరణము దుఃఖమువార్ధకము దుఃఖము వ్యాధులు అని. దుఃఖనిమిత్తము లగుటవలన జన్మాదులు దుఃఖము, స్వరూపముననే దుఃఖ మని కాదు. ఇట్లు జన్మాదులందు దుఃఖదోషానుదర్శనంబువలన దేహేంద్రియవిషయభోగములందు వైరాగ్యము పుట్టుచున్నది. అంతఁ గరణంబుల కాత్మదర్శనంబుకొఱకుఁ బ్రత్యగాత్మయందుఁ బ్రవృత్తి కలుగుచున్నది. ఇట్లు జ్ఞానహేతు వగుటవలన జన్మాదిదుఃఖదోషానుదర్శనము జ్ఞానం బని చెప్పఁబడుచున్నది.

ఇహలోకమునందుఁగాని పరలోకమునందుఁగాని శబ్దాదిభోగములందు వైరాగ్యంబును అహంకారము లేమియు జన్మమునందును మరణంబునందును వార్ధకమునందును వ్యాధులయందును ఇవి దుఃఖరూపములు దుఃఖమే వీనివలన నెల్లప్పుడుఁ గలుగు నని యనుసంధించుటయు నని తాత్పర్యము.

ఆ॰ అమానిత్వాదులుమాత్రమె కావు జ్ఞానమున కంతరంగసాధనములు, మ తే మనఁగా, వైరాగ్యాదులు గూడ నట్టి వని చెప్పుచున్నారు మఱియును అని. దృష్టాదృష్టము లయిన యనేకార్థములందు రాగము కలిగినయెడఁ దత్ప్రతిబద్ధమై జ్ఞాన ముదయింప దని తలంచి వ్యాఖ్యానము చేయుచున్నారు ఇన్ద్రి యేత్యాదిగా. మనస్సునఁ బ్రాదుర్భవించినగర్వం బహంకారము, అది లేమియు జ్ఞానహేతు వని

చెప్పుచున్నారు అనహంకార ఇత్యాదిగా. ఇంద్రియార్థములందుఁ జెప్పినవైరాగ్యము నుపపాదించుచున్నారు జన్మేత్యాదిగా. ఒక్కొక్కటియందును దోషము నాలోచించుట యని చెప్పఁబడినది. అందు జన్మమునందు దోషానుదర్శనమును విశదీకరించుచున్నారు జన్మమునందు ఇత్యాదిగా. ఎట్లు జన్మమునందు దోషానుసంధానము చేయవలయునో అట్లు మృత్యువునందును సర్వమర్మచ్ఛేదనాదిదోషముల యనుసంధానము చేయువలయు నని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. జన్మమునందును మృత్యువునందును దోషానుసంధానము చేయునట్లు జరాదులందును దోషానుసంధానము చేయవలయు నని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. వ్యాధులందు అసహ్యాతారూపమయినదోషముయొక్క యనుసంధానము. త్రివిధము లయినదుఃఖములందును దోషానుసంధానము ప్రసిద్ధము. వ్యాఖ్యానాంతరము చెప్పుచున్నారు లేక ఇత్యాదిగా. ఎట్లు జన్మాదిదుఃఖాంతములందు దోషదర్శనము చెప్పఁబడినదో అట్లు వానియందే దుఃఖాఖ్యదోషముయొక్క యనుదర్శనమును స్పష్టీకరించుచున్నారు దుఃఖము ఇత్యాదిగా. బాహ్యేంద్రియగ్రాహ్యము లగుజన్మాదు లెట్లు దుఃఖ మగును? అనఁగాఁ జెప్పుచున్నారు దుఃఖేత్యాదిగా. జన్మాదులందు దోషానుదర్శనముచేఁ గలుగుఫలముఁ జెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. వైరాగ్యము కలిగినమీఁద ఆత్మదర్శనంబునకై కరణంబులకుఁ బ్రత్యఙ్ముఖ్యంబునఁ బ్రవృత్తి కలుగు నని వైరాగ్యఫలముఁ జెప్పుచున్నారు అంత నిత్యాదిగా. జన్మాదిదుఃఖదోషానుదర్శనము జ్ఞానసాధనములం దేల గణింపఁబడినది యని యాశంకించి వైరాగ్యద్వారంబున జ్ఞానహేతు వగుటవలన నని చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా.

హం. ఇన్ద్రియార్థేషు=శబ్దాదివిషయములందు. అనహఙ్కారః=అహంకారము లేమి ఇట్లు జన్మాదులందు దోషదర్శనంబును.

శ్రీ౦. స్థైర్యసిద్ధికి సాధనముఁ జెప్పుచున్నాఁడు.—ఇన్ద్రియార్థేషు = శబ్దాది భోగ్యపదార్థములయందు, అవి వినఁబడినను గనఁబడినను అన్నిటియందును; వైరాగ్యమ్=నిశ్శేషముగా రాగము విడుచుట, ఇది మనోనిగ్రహమునందును దన్నిశ్చలతయందును గారణము, కావున యతి దీనిఁ జక్కఁగా సంపాదింపవలయును. అట్లె, అనహఙ్కారఏవచ=జాతివర్ణాశ్రమాచారవిద్యాకులశీలాదులచేఁ దాను శ్రేష్ఠుం డను నభిమానము అహంకారము, అహంకారహేతువు లగుజాత్యాదు లున్నను బంధకం బనుబుద్ధిచే అహంకారము లేక యుండుట అనహంకారము, ఇదియే జ్ఞానసిద్ధియందు

ముఖ్యకారణం బని నిశ్చయార్థ మేవకారము, చకారము సముచ్చయార్థము. జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ — ఇదియే యన్నిటను వైరాగ్యము జనియించుటకును దత్కార్యసిద్ధికిని బరమకారణము, జన్మమునందును మృత్యువునందును జరయందును వ్యాధులయందును దుఃఖంబును దోషంబును అనుదర్శించుట—శాస్త్రంబును స్వానుభవంబు ననుసరించి యాలోచించుట, జన్మశబ్దముచేఁ దత్సన్నిహితమయినగర్భవాసముగూడ గ్రహింపఁబడుచున్నది, గర్భమునందు నవమాసము పిండాకారంబున వసించుటయు మలమునందలి క్రిములు కఱచుటయుఁ దల్లిజఠరాగ్ని దహించుటయు తల్లి విషమముగాఁ బరుండుట నడుచుట మొదలగువానిచే బాధపడుటయు దృఢముగా జరాయువు చుట్టి యుండుటయు మహాదుఃఖము, మలమూత్రములనడుమ నుండుటయుఁ దద్రసపానంబును దోషము; జన్మమునందుఁ బ్రసూతివాయువుచే నాకర్షింపఁబడుటయు యోనియంత్రమున నలంగుటయు మహాదుఃఖము, తద్ద్వారంబున వెడలుట దోషము; మరణమునందు సర్వనాడు లాకర్షించుటయు మర్మచ్ఛేదంబును బ్రాణంబులు ముడుఁగుటయు నూర్ధ్వశ్వాసంబును మరణతాపంబును మహాదుఃఖము, యామ్యాకర్షణంబునను వ్యథచేతను మలమూత్రపాతాదికము దోషము; మృత్యుశబ్దముచేఁ దత్సన్నిహితం బగునరకవాసముగూడ గ్రహింపఁబడుచున్నది, కుంభీపాకము రౌరవము అసిపత్రవనము వైతరణి మొదలగువానియందు యమదూతలచేఁ ద్రోయఁబడుటయు, శ్లేష్మరక్తపూయరేతోమలమూత్రహ్రదంబులయందు వాసంబును మహాదుఃఖము, అందు శ్లేష్మాదిపానము దోషము; జరయందు సర్వాంగశిథిలతయు ఆంధ్యంబును బాధిర్యంబును గద్గదవాక్కును కంపాదికంబును లేచుట మొదలగువానియందుఁ బడుటయు స్వజనులచేఁ బరిభవింపఁబడుటయు మహాదుఃఖము, మలమూత్రలాలాదిసంపర్కము దోషము; వ్యాధులయందు దౌర్బల్యంబును జ్వరవేగతాపాదికంబును గషాయపానాదికంబును మహాదుఃఖము, స్నానాభావదుర్గంధస్వేదాదికము దోషము. ఇట్లు జన్మాదులయందు మాటికిమాటికి దుఃఖదోషానుదర్శనముచేఁ బుణ్యశీలుం డగువివేకి కన్నిటను దీవ్రవైరాగ్యంబును మోక్షేచ్ఛయుఁ దత్సిద్ధికిఁ బ్రవృత్తియు సిద్ధించు చున్నది, అందువలన నీదుఃఖదోషానుదర్శనంబును ముముక్షువు చక్కగాఁ జేయవలయు నని యర్థము.

౯. మఱియును.—ఇన్ద్రియార్థేషు = శబ్దాదులయందు దృష్టములందుఁ గాని ఆనుశ్రవికములందుఁ ♦ గాని భోగములందు; వైరాగ్యమ్ = రాగవిరోధి యగు

♦ వేదబోధితము లగు పారలౌకికములందు.

అస్పృహాత్మకచిత్తవృత్తి. ఆత్మశ్లాఘనము లేకున్నను మనస్సునందు నేను సర్వోత్కృష్టుఁడ నని ప్రాదుర్భవించినగర్వము అహంకారము, అది లేకుండుట యనహంకారము. అయోగవ్యవచ్ఛేదార్థ మేవకారము, సముచ్చయార్థము చకారము, అందుచే అమానిత్వాదుల యిరువదింటిసముచ్చితయోగమే * జ్ఞాన మని చెప్పఁబడినది, ఒక్కటి లేకున్నను జ్ఞానము కా దని యర్థము. గర్భవాసయోనిద్వారనిర్గమనరూప జన్మమును, సర్వమర్మచ్ఛేదనరూప మయినమృత్యువును, ప్రజ్ఞాశక్తితేజోనిరోధమును పరిభవంబును గల్గించునట్టి జరను, జ్వరాతిసారాదిరూపంబు లైనవ్యాధులను, ఇష్టవియోగానిష్టసంయోగజన్యములు అధ్యాత్మాధిభూతాధిదైవనిమిత్తంబు లగుదుఃఖంబులను, వాతపిత్తశ్లేష్మమలమూత్రాదిపరిపూర్ణం బగుటచే దేహమునందు జుగుప్సారూపం బగుదోషమును, అనుదర్శించుట — మాటిమాటి కాలోచించుట; లేక, జన్మాదిదుఃఖాంతములందు దోషము ననుదర్శించుట యని గాని, జన్మమృత్యుజరావ్యాధులందు దుఃఖరూపదోషము ననుదర్శించుట యని గాని చెప్పవచ్చును. ఇది విషయవైరాగ్యహేతు వగుటచే నాత్మదర్శనంబున కుపకరించుచున్నది.

శ్రీ. మఱియును — జన్మాదులందు దుఃఖదోషములను అనుదర్శించుట — మాటికిమాటి కాలోచించుట, లేక, దుఃఖరూపదోషము ననుదర్శించుట. ఇతరము స్పష్టము.

ప. మఱియును — ఇన్ద్రియార్థేషు=రూపరసగంధాదివిషయములందు; వైరాగ్యమ్=తృష్ణ లేమియు. అట్లు, ఇంతటివాఁడ నేనను నహంకారము లేమియు. జన్మాదులందు దుఃఖదోషములను మాటిమాటి కాలోచించుటయు. అది చెప్పఁబడినది — "ఆరమ్భా ద్వపురామయై రుపహతం జ్ఞాత్వాపి నో పేక్షసే, కచ్చి ల్లగ్న హుతాశ వేశ్మని సుఖం స్థాతుం చిరం వాఞ్ఛసి। త్యక్ష్య స్యేవ ఘనాప దీద మసకృ ద్వ్యాక్రోశమానః క్షణాత్, భ్రశ్య ద్ధైర్యవివేకసంప దభితో వ్యామూఢచిత్త స్సఖే" ♦ అని.

రా. ఇన్ద్రియార్థేషు వైరాగ్యమ్ = ఆత్మవ్యతిరిక్తము లగువిషయములందు దోషవిశిష్టము లని యనుసంధించి జుగుప్సపడుట. అనహఙ్కారః = అనాత్మ యగు

---

* అన్నిటియొక్కయు కూడికయే.

♦ చెలికాఁడా! ఆరంభమునుండి దేహము రోగములచేఁ గొట్టఁబడుచుండునది యని యెఱింగియు దాని నుపేక్షింపవు. అగ్ని యంటుకొన్నయింటిలో బహుకాలము సుఖముగా నుండఁ గోరెదవా యేమి? మరణకాలమునందుఁ బలుమాఱు పెద్దగా నఱచుచు ధైర్యవివేకములు వీడి వ్యామూఢచిత్తుండవై దీని విడువనే విడువఁగలవు.

దేహమునం దాత్మాభిమానము లేకుండుట, ప్రదర్శనార్థం బిది, అనాత్మీయముల యందు ఆత్మీయాభిమానము లేకుండుటయు వివక్షితము. జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ = శరీర ముండునపుడు జన్మమృత్యుజరావ్యాధిదుఃఖరూప మయినదోషము అనివార్యం బని యనుసంధించుట.

మూ. *

అసక్తి రనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు. ౯

భా. మఱియును.—అసక్తిః=సక్తి యనఁగా సంగనిమిత్తంబు లైన విషయములయందుఁ బ్రీతిమాత్రము, అది లేమి అసక్తి; అనభిష్వఙ్గః= అభిష్వంగము లేమి, అభిష్వంగ మనఁగా సక్తివిశేషమే యనన్యాత్మ భావనారూపము ♦, ఎట్లనఁగా, ఇతరుఁడు సుఖియైనను దుఃఖి యైనను నేనే సుఖిని దుఃఖి ననియు వాఁడు జీవించి యున్నను మృతుఁ డైనను నేనే జీవించి యున్నాను మృతిఁ బొందెదను అనియు. ఎందు ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు —పుత్రదారగృహాదిషు=పుత్త్రులయందును భార్యల యందును గృహములయందును, ఆదిశబ్దముచే ఇతరములయందును మిక్కిలి యిష్టము లైనదాసవర్గాదులయందును. ఈ రెండును జ్ఞానార్థంబు లగుట వలన జ్ఞాన మని చెప్పఁబడుచున్నవి. నిత్యమ్=స్థిర మయిన; సమచిత్తత్వం చ=తుల్య మయినచిత్తము గలుగుటయు; వేనియందు ? ఇష్టానిష్టోప పత్తిషు=ఇష్టములయొక్కయు అనిష్టములయొక్కయు ప్రాప్తులయందు; వీనియందు నిత్యంబును తుల్యచిత్తత; ఇష్టప్రాప్తులయందు హర్షింపఁడు, అనిష్టప్రాప్తులయందు కోపింపఁడు. ఈనిత్య మైనసమచిత్తత్వంబును జ్ఞానము.

విషయములయందుఁ బ్రీతి లేకుండుటయుఁ బుత్త్రులు భార్యలు గృహ ములు మొదలగువారియందుఁ దానే వా రనుభావనము లేకుండుటయు ఇష్టము ప్రాప్తించినను అనిష్టము ప్రాప్తించినను నిత్యంబును హర్షవిషాదములు లేక సమ చిత్తము గలిగి యుండుటయు నని తాత్పర్యము.

---

* ఈశ్లోకమున కీభాష్యము లేదు.

♦ ఇతఁడు నాకంటె భిన్నుఁ డనుభావనము.

ఆ. జ్ఞానమున కంతరంగ మగుసాధనాంతరమునే చెప్పుచున్నారు మఱియును అని. ఓయీ! అసక్తియే కదా యనభిష్వంగము, కావునఁ బునరుక్తి యని యాశంకించి యభిష్వంగవివరణద్వారంబున నిరసించుచున్నారు అభిష్వంగ మనఁగా నిత్యాదిగా. ఇతరు లగుపుత్త్రాదులయందే వారు తనకంటె భిన్నులు కా రనుబుద్ధిచే వారికిఁ గల సుఖాదికమును దనయందు భావించుట యనుసక్తివిశేషమునే యుదాహరించుచున్నారు ఎట్లనఁగా నిత్యాదిగా ఈయసక్త్యనభిష్వంగములరెంటికిని ఆకాంక్షాద్వారమున విషయము చెప్పుచున్నారు ఎందు ఇత్యాదిగా. వీనియందు జ్ఞానశబ్దమున కుపపత్తి చెప్పుచున్నారు ఈరెండును ఇత్యాదిగా. ఎల్లప్పుడును హర్షవిషాదశూన్యచిత్తుం డగుటయు జ్ఞానహేతు వని చెప్పుచున్నారు నిత్య మిత్యాదిగా. దానినే విభజించుచున్నారు ఇష్టేత్యాదిగా. అది జ్ఞానహేతు వని నిగమనము చేయుచున్నారు ఈ నిత్యమైన ఇత్యాదిగా.

హ. అసక్తిః=సంగము లేమి. అనభిష్వఙ్గః = అభిష్వంగము లేమి, అభిష్వంగ మనఁగా నితరమునం దహంబుద్ధి.

శ్రీ. జన్మాదులయందు దుఃఖదోషానుసంధానమునకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.—అసక్తిః=సక్తి యనఁగా భోగములయం దంతఃకరణమునకు సంగము—రాగము, అది లేకుండుట అసక్తి, అప్రాప్తమునందుంబోలెఁ బ్రాప్త మయినవస్తువునందును విషయమాత్రమునం దంతటను బ్రీతిలేకుండుట యసక్తిశబ్దార్థము. అనభిష్వఙ్గః = అభిష్వంగ మనఁగా ఇది సమీచీనం బనుబుద్ధిచే మమకారంబునఁ జిత్తమెల్లప్పుడును ఇష్టవిషయమును బట్టుకొని యుండుట, అది లేమి యనభిష్వంగము, ముముక్షువుల కవశ్యసంపాదనీయము. ఎందు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—పుత్త్రదారగృహాదిషు — ఆదిశబ్దముచే ధనక్షేత్రాదికము గ్రహింపఁబడుచున్నది, వానియందుఁ జిత్తము లగ్నముగాఁ జేయఁగూడ దని యర్థము. ఓయీ! అనభిష్వఙ్గః పుత్త్రదారగృహాదిషు అనుటచే గృహస్థులకే శ్రవణాద్యధికారము గాని యతులకును లే దని తెలియవచ్చుచున్నది, వారలకు నధికారము కల దనుపక్షమునఁ బుత్త్రాదులం దభిష్వంగము చేయఁగూడ దని వ్యతిరేకంబున నిషేధం బనుపపన్నం బగుటవలన. పుత్త్రాదు లున్ననే కదా యభిష్వంగము ప్రసక్తించును. ప్రసక్తమునకే నిషేధము యుక్త మగుం గాని యప్రసక్తమునకుఁ గాదు. అగ్నిని ద్రావఁగూడ దని నిషేధము సంభవింపదు గదా! అందువలనఁ బ్రసక్తనిషేధబలమువలన

గృహస్థులకే శ్రవణాద్యధికారము గాని యాశ్రమాంతరనిష్ఠులకు లేదు. అందు వేని
నిన్నిట నడుగవలయును. గృహస్థులకు వేదాంతశ్రవణము మోక్షార్థమా? అక్షర
లాభార్థమా? లేక విలాసార్థమా? మొదటిది కాదు, సాధనము లేనియప్పుడు
సాధ్యము సిద్ధింపమివలన శ్రవణము అంగరహిత మైనపుడు తత్సాధ్యమయినజ్ఞానసిద్ధి
సంభవింపదు, సన్న్యస్య శ్రవణం కుర్యాత్ అని సన్న్యాసము శ్రవణాంగ మని
స్మృతి చెప్పుచున్నది, « అథాతో బ్రహ్మజిజ్ఞాసా » అనుచోట అథశబ్దమునకు
సన్న్యాసాదిసాధనసిద్ధి కలిగినయనంతరంబె బ్రహ్మజిజ్ఞాస చేయవలయు నని యానంత
ర్యార్థకత చెప్పఁబడినది. అందువలన సన్న్యాసాద్యంతరంగసాధనశూన్యు లగుగృహ
స్థులకే శ్రవణంబునం దధికారము లేదు, కాని మోక్షేచ్ఛచే సన్న్యస్త సర్వకర్మ
తత్సాధను లగుయతులకు లే దనరాదు. ముఖ్యాధికారి యగు పరమహంస యతికే
వేదాంతశ్రవణాదికముచే బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము సిద్ధించుం గాని యాశ్రమాంతర
నిష్ఠునకు సిద్ధింపదు, కావుననే శ్రవణము చేసినను అంగశూన్యులకు జ్ఞానము సిద్ధింప
దని స్మృతి వచించుచు చున్నది. అందువలనఁ బరమహంసయతులకే శ్రవణాధికా
రంబును జ్ఞానతత్ఫలప్రాప్తియు నని సిద్ధము, « వేదాన్తవిజ్ఞాన సునిశ్చితార్థా స్సన్న్యాస
యోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః। తే బ్రహ్మలోకేషు పరాన్తకాలే పరామృతా త్పరి
ముచ్యన్తి సర్వే » అను శ్రుతివలన, రెండవదియుఁ గాదు, నిరంతరము విక్షేప
వంతు లగు సంసారులకుఁ జక్కఁగా నక్షరలాభము సిద్ధింపమివలన. తృతీయపక్షం
బును జెల్లదు, కావ్యనాటకాదులయందుంబోలె నిందుఁ జమత్కారము లేమివలన.
అందువలన శ్రవణాదియోగ్యత యతులకే యని సిద్ధము. ఓయీ! మోక్షేచ్ఛచే
సన్న్యస్తసర్వకర్ము లగుయతులకే శ్రవణాధికారమేని పుత్త్రదారాదులయం దభి
ష్వంగము సేయఁగూడ దనునిషేధవచనం బనర్థకం బగు నందు వేని, కాదు, వారల
కును విడువఁబడినను బుత్త్రదారాదులయందుఁ బూర్వవాసనచే నభిష్వంగము ప్రస
క్తించుటచేఁ దన్నిషేధపరం బగుటవలన. « మనసో వశే సర్వ మిదం బభూవ భీష్మో
హి దేవ స్సహస స్సహీయాన్ ♦, బన్ధాయ విషయాసక్తమ్, ప్రమాథి బలవద్దృఢమ్,
ధ్యాయతో విషయాన్ పుంస స్సఙ్గ స్తేషూపజాయతే, విద్ధ్యేన మిహ వైరిణమ్,
జ్ఞానినో నిత్యవైరిణా » అని కామసంకల్పాదివికారవంతంబై యనాదిదుర్వాసనా
వాసితం బైనయంతఃకరణము దుర్ధర్షం బనియు దుర్నిగ్రహం బనియు బంధకం బని

♦ ఇది సమస్తంబును మనస్సుయొక్క వశంబునం దుండెను. ఏల యనఁగా మనస్సు అను
దేవుఁడు భీష్ముఁడు, వేగవంతునకన్నను వేగవత్తరుఁడు.

యు విషయస్మరణమాత్రంబున ననర్థాకరం బనియు జ్ఞానులయెడ బద్ధవైరం బనియు శ్రుతియందును స్మృతియందును జెప్పఁబడుచున్నది. అందువలన సన్న్యాసులకును బహిత్యక్తము లైనను బుత్త్రదారాదికములయందుఁ దత్తద్వార్తాశ్రవణాదులు కలిగి నపుడు దుర్వాసనచే నభిష్వంగము సంభవించుచున్నది. ఎట్లు సన్న్యాసాశ్రమంబున స్వీకృతము లయినవానియందుఁ దుచ్ఛము లైనను గౌపీనకంథాదులయందు ఇది మంచిది ఇది చెడ్డది యని సంగము కలుగుచున్నదో అట్లు. అందువలన నవి రెండును ప్రమాదముచే నైనను జేయఁగూడ దని వ్యతిరేకముఖంబున నుపదేశింపఁబడుచున్నది అసక్తి రనభిష్వఙ్గః పుత్త్రదారగృహాదిషు అని. గృహస్థుల కధికారము కల దనుపక్షంబున నీచెప్పఁబోవువిశేషణం బనుపపన్న మగును.—నిత్యంచ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు—ఇష్ట మనఁగా సుఖమును తత్సాధనంబును, అనిష్ట మనఁగా దుఃఖంబును తత్సాధనంబును, వానియుపపత్తులయందు—ప్రాప్తులయందు, నిత్యంబును—ఎల్లప్పుడును సమచిత్తత్వము, సమము—హర్షవిషాదముఖవికాసవైవర్ణ్యాదులగుబాహ్యాంతరవికారములు లేనిది చిత్తము ఏవిద్వాంసునకో అతఁడు సమచిత్తుఁడు, తద్భావము సమచిత్తత్వము—అవిక్రియాత్మకంబున నవస్థానము. ఇది సంసారుల కుపపన్నము కాదు, పుత్త్రోత్పత్తి యయినపుడు హర్షము వారింప శక్య మగునా? తన్మరణమునందు విషాదాదికంబును వారింప శక్య మగునా? అందువలన వీరి కధికారము కలుగనే కలుగ దని సిద్ధము.

ప. మఱియును.—సక్తి యనఁగా నాది యిది యను నింతమాత్రపుఁ బ్రీతి, అభిష్వంగ మనఁగా నేనే యితఁ డని యనన్యభావనముతోఁ గూడిన ప్రీత్యతిశయము, అతఁడు సుఖయైనను దుఃఖయైనను నేనే సుఖిని దుఃఖిని ఇత్యాదిగాఁ గలుగు ప్రీత్యతిశయము, తదభావములు అసక్తి యనభిష్వంగ మని చెప్పఁబడినవి; ఎందు సక్త్యభిష్వంగముల వర్జింపవలయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—పుత్త్రదారగృహాదిషు=పుత్త్రులయందును భార్యలయందును గృహములయందును, ఆదిశబ్దముచే ఇతరులయందును స్నేహవిషయము లయినభృత్యాదులయందఱియందు నని యర్థము. నిత్యమ్=ఎల్లప్పుడును; సమచిత్తత్వమ్ = హర్షవిషాదశూన్య మయినమనస్సు గలిగి యుండుట; ఇష్టానిష్టోపపత్తిషు=ఉపపత్తి యనఁగా ప్రాప్తి, ఇష్టప్రాప్తులయందు హర్షము లేమియు అనిష్టప్రాప్తులయందు విషాదము లేమియు నని యర్థము. చకారము సముచ్చయార్థము.

శ్రీ. మఱియును.—అసక్తిః=పుత్త్రాదిపదార్థములందుఁ బ్రీతిని విడుచుట. అనభిష్వఙ్గః=పుత్త్రాదులకు సుఖదుఃఖములు కలిగినపుడు నేనే సుఖిని దుఃఖిని అను నధ్యాసాతిశయము లేమి. ఇష్టానిష్టములయుపపత్తులయందు—ప్రాప్తులయందు, నిత్యమును సదా సమచిత్తుఁడై యుండుటయు.

ప. మఱియును.—పుత్త్రాదులయందు, అసక్తిః=ప్రీతిని విడుచుట; అనభిష్వఙ్గః=పుత్త్రదారగృహాదిగతమైనసుఖదుఃఖములను దనయం దారోపింప కుండుట. శాతపథశ్రుతియును.—« ఆత్మైవేద మగ్ర ఆసీ దేక ఏవ సో ఽకామయత జాయా మే స్యా దథ ప్రజాయే యా ఽథ విత్తం మే స్యా దథ కర్మ కుర్వీ యేత్యే తావా న్వై కామో నే చ్ఛంశ్చ నాతో భూయో విన్దేదిత్ » అని. ఇందుకు భాష్యము.—అగ్రే=వయోవస్థకుఁ బూర్వము; ఆత్మా=ఆత్మ; ఇద మేవ=ఈదేహమాత్రముగానే; ఏకఏవ=ఒక్కఁడుగానే; ఆసీత్=ఉండెను. సః=అయాత్మ; అకామయత=కోరెను; జాయా మే స్యాత్=భార్య నాకుఁ గావలయు నని. అథ=అంత మరలఁ గోరెను; ప్రజాయేయ=సంతానరూపంబున నుండవలయు నని. అథ=అంత మరలఁ గోరెను; విత్తం మే స్యాత్=తద్రక్షణార్థము ధనము నాకుఁ గావలయు నని. అథ=వెండియుఁ గోరెను; కర్మ కుర్వీయ=ధనముకొఱకు కర్మము చేయుదు నని. ఏతావా న్వై కామః= ఇంతమాత్రము కామము. నేత్ సత్=సత్తు కాదు, పరిణామంబున దుఃఖరూప మగుటవలన. అతః=ఈ జాయాదిప్రపంచముకంటె; ఇతరము, భూయః=అధిక మయినదాని; నవిన్దేత్=ఎఱుంగఁడు, బాహ్యగార్హస్థ్యముచే మోహితుం డగుటవలన, అందువలన దీనికంటె ఆంతర మగుగార్హస్థ్యము శ్రేయం బని చెప్పుచున్నది శ్రుతి. అట్లు, ఇష్టానిష్టోపపత్తిషు; ఎల్లప్పుడును, సమచిత్తత్వమ్.

రా. అసక్తిః=ఆత్మవ్యతిరిక్తము లయినపరిగ్రహములయందు సంగము లేకుండుట. అనభిష్వఙ్గః పుత్త్రదారగృహాదిషు=పుత్త్రాదులయందు శాస్త్రీయకర్మంబులకు ఉపకరణంబు లగుటకుఁ గావలసినంతకంటె నధికముగా శ్లేషము లేక యుండుట. సంకల్పప్రభవంబు లగు నిష్టానిష్టోపపత్తులయందు హర్షోద్వేగములు లేకయుండుట.

మా. సక్తి యనఁగా స్నేహము. అదియే యతిపక్వమై యభిష్వంగ మనఁబడును. « స్నేహ స్సక్తి స్స ఏవా ఽతిపక్వో ఽభిష్వఙ్గ ఉచ్యతే " అని నిఘంటువు.

మయి చా ఽనన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది. ౧౦

భా. మఱియును.—మయి=నాయందు, ఈశ్వరునియందు; అనన్యయోగేన=వేఱు లేదనుసమాధిచేత, భగవంతుఁడగు వాసుదేవునికంటె అన్యుఁడు లేఁడు కావున నతఁడే మాకు గతి యని నిశ్చితమై యవ్యభిచారి యగుబుద్ధి యనన్యయోగము, దానిచేత; అవ్యభిచారిణీ = వ్యభిచరించుస్వభావము గలది కానిది యగు; భక్తిశ్చ = భక్తియును. అదియు జ్ఞానము. వివిక్తదేశసేవిత్వమ్=వివిక్తము—స్వభావంబున సంస్కారమునం గాని యశుచ్యాదులును సర్పవ్యాఘ్రాదులును లేనిదై యరణ్యనదీపులినదేవాలయాదులచే నేకాంతపవిత్ర మైనదేశము, దాని సేవించుట స్వభావముగాఁ గలవాఁడు వివిక్తదేశసేవి, తద్భావము వివిక్తదేశసేవిత్వము, వివిక్తము లగుదేశములందుఁ గదా చిత్తము ప్రసన్న మగును, అందువలన ఆత్మాదిభావనము వివిక్తదేశమునందు సిద్ధించుచున్నది, కావున వివిక్తదేశసేవిత్వము జ్ఞాన మని చెప్పఁబడుచున్నది. అరతిః=రతి లేకుండుట; జనసంసది = ప్రాకృతులు సంస్కారశూన్యులు అవినీతు లగుజనులయొక్కసమూహమునందు, సంస్కారవంతులు వినీతు లగువారిసమూహమునందుఁ గాదు, అది జ్ఞానోపకారకం బగుటవలన; అందువలనఁ బ్రాకృతజనసమూహమునందు రతి లేకుండుట జ్ఞానార్థం బగుటవలన జ్ఞానము.

నాయందు నాకంటె నితరుఁడు లేఁ డని నేనె గతి యని నిశ్చయముచేఁ గూడిననిశ్చల మయినభక్తియును నిర్భయ మయి పవిత్ర మయినయేకాంతప్రదేశమున నుండుటయుఁ బ్రాకృతు లగుజనులసహవాసము విడుచుటయు నని తా.

ఆ. సాధనాంతరముఁ జెప్పుచున్నారు మఱియును అని. అనన్యయోగమునే సంక్షేపమునఁ జెప్పినదాని స్పష్టీకరించుచున్నారు భగవంతుఁడు ఇత్యాదిగా. చెప్పిన బుద్ధిమూలమునఁ బుట్టినభక్తికి భగవంతునందు స్థైర్యమును దెలుపుచున్నారు వ్యభిచరించు ఇత్యాదిగా. అందును జ్ఞానశబ్దము జ్ఞానహేతు వగుటవలన నని చెప్పుచున్నారు అదియును ఇత్యాదిగా. దేశముయొక్కవివిక్తత్వమును ద్వివిధము నుదాహరించుచున్నారు వివిక్తము ఇత్యాదిగా. దానినే స్పష్టీకరించుచున్నారు అరణ్యేత్యాదిగా. వివిక్తదేశసేవిత్వం బెట్లు జ్ఞానహేతు వగును? అనఁగాఁ జెప్పుచున్నారు వివిక్తములు ఇత్యాదిగా. ఆత్మాది యనుచోటియాదిశబ్దముచే పరమాత్మయు వాక్యార్థం

బును జెప్పఁబడుచున్నవి. ఓయీ! అరతి విషయముగా విశేషములేక సర్వజనసముదాయము నేల గ్రహింపఁగూడదు? అనఁగాఁ జెప్పుచున్నారు అది ఇత్యాదిగా. “సన్త స్సఙ్గస్య భేషజమ్” ♦ అని చెప్పఁబడుటవలన నని యర్థము.

హ. వివిక్తదేశసేవిత్వమ్=రహస్యదేశమును సేవించువాఁ డగుట.

శం. మఱియును.—అనన్యయోగేన=పరమేశ్వరునికన్న నితరుఁడు నాకు శరణము లేఁ డనునిశ్చయము గలది యనన్యము, యోగము—భక్తియోగము, అట్టి అనన్యమైనయోగముచే; మయి=సర్వేశ్వరుఁడును సర్వలోకశరణ్యుఁడును సర్వాత్ముఁడ వగు నాయందు; అవ్యభిచారిణీ=నియత మయిన; భక్తిశ్చ=భజనంబును. ఇదియు జ్ఞానసాధనము, జ్ఞానము మత్ప్రసాదైకలభ్యం బగుటవలన. కావున ముముక్షువు మదేకశరణుఁడై మద్భజనమును సదా చేయవలయు నని యర్థము. లేక; వివిక్తదేశసేవిత్వ మ్మనువచనముసామర్థ్యంబువలన నిది యర్థము.—అనన్యయోగేన=అన్యము—విజాతీయప్రత్యయము దేనియందు లేదో అది యనన్యము, యోగ మనఁగా సమాధి, అనన్య మగుయోగము అనన్యయోగము, దానిచేత, సజాతీయప్రత్యయావృత్తిలక్షణ మయినసమాధిచేత; మయి=నాయందు, నన్ను నిర్విశేషపరబ్రహ్మమును విషయీకరించి బ్రహ్మమే నేను నేనే బ్రహ్మము నని; భక్తిః=భజనము, అనుసంధానము; ఇది సర్వదా చేయవలయును. జ్ఞానము ప్రతిబంధకరహితం బగుటకుఁ గారణం బగుటవలన నిది జ్ఞాన మని చెప్పఁబడుచున్నది. మఱియును. వివిక్తదేశసేవిత్వమ్=వివిక్తము లగుదేశములను—జనసమ్మర్దరహితము లయిన నదీపులినగిరిగుహాఽఽరామాఽరణ్యాదు లగు నేకాంతప్రదేశములను నిదిధ్యాసనసిద్ధికొఱకు సేవించుస్వభావము గలవాఁడు వివిక్తదేశసేవి, « శూన్యాగారే దేవతాగృహే తృణకూటవల్మీక వృక్షమూల కులాలశాలా ఽగ్నిహోత్ర నదీపులిన గిరికుహర కన్దరకోటర నిర్ఝరస్థణ్డిలే ష్వనికేతవాసీ » అను శ్రుతివలన, వానిభావము వివిక్తదేశసేవిత్వము. జనసంసది=బహిర్ముఖులైనజనులయొక్కసమూహమునందు; వసించుటకు, అరతిః=అరుచియును.

మ. మఱియును—మయి=నాయందు, భగవంతుఁడను బరమేశ్వరుఁడ వగు వాసుదేవునియందు; భక్తిః=సర్వోత్కృష్టత్వజ్ఞానపూర్వక మయినప్రీతి; అనన్యయోగేన=భగవంతుఁ డగువాసుదేవునికన్నను బరుఁ డితరుఁడు లేఁడు కావున నతఁడే

♦ సత్పురుషులు సంగమునకు మందు.

మాకు గతి యనునిశ్చయముచేత; అవ్యభిచారిణీ=ప్రతికూలహేతువుచే దేనిచేనేనియు నివారింప నశక్య మయినది. అట్టిభక్తియు జ్ఞానసాధనము, « ప్రీతి ర్న యావ న్మయి వాసుదేవే నముచ్యతే దేహయోగేన తావత్ " * అని చెప్పుటవలన. వివిక్తము— స్వభావంబునఁ గాని సంస్కారంబునఁ గాని శుద్ధము, అశుచివస్తువులచేతను సర్పవ్యాఘ్రాదులచేతను రహితము, గంగాపులినాదికం బగు చిత్తప్రసాదకరం బయినదేశము, దానినే సేవించువాఁ డగుట; అట్లు శ్రుతి.—« స మే శుచౌ శర్కరా వహ్ని వాలుకా వివర్జితే శబ్ద జలాశ్రయాదిభిః। మనోనుకూలే నతు చక్షుపీడనే గుహానివాతాశ్రయణేన యోజయేత్ » అని. ఆత్మజ్ఞానవిముఖులును విషయభోగపరత నుపదేశించువారు నగుజనులయొక్క సంసత్తునందు—చేరికయందు తత్త్వజ్ఞానమునకుఁ బ్రతికూల మయిన దానియందు, అరతి—ప్రీతి లేమి; తత్త్వజ్ఞానానుకూల మయినసాధుసంగమునందో రతి యుచితము యగును. అట్లు చెప్పఁబడినది.—« సఙ్గ స్సర్వాత్మనా హేయ స్సచే త్త్యక్తుం నశక్యతే। స సద్భి స్సహ కర్తవ్య స్సన్త స్సఙ్గస్య భేషజమ్ » ♦ అని.

శ్రీ. మఱియును.—మయి = నాయందు పరమేశ్వరునియందు; అనన్యయోగేన=సర్వాత్మదృష్టిచేత; అవ్యభిచారిణీ భక్తిశ్చ=ఏకాంతభక్తియును. వివిక్తము—శుద్ధమై చిత్తప్రసాదకర మయినదేశమును సేవించుటయు. ప్రాకృతు లగు జనులసభయందు, అరతిః=రతి లేకుండుటయు.

ప. వివిక్తము=చిత్తమునకు శుద్ధిని బ్రసాదమును గలిగించునది. ♦♦

రా. మయి=నాయందు సర్వేశ్వరునియందు; అనన్యయోగేన=ఏకాంతత్వయోగముచేత, అవ్యభిచారిణీ=స్థిర మయిన, భక్తిశ్చ=భక్తియును. వివిక్తదేశసేవిత్వమ్=జనవర్జిత మయినదేశమునందు వసించుటయు. జనసంసది; అరతిః=అప్రీతియును.

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్
ఏతద్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం య దతో ఽన్యథా. ౧౧

---

* నాయందు వాసుదేవునియందు ఎంతవఱకుఁ బ్రీతి కలుగదో అంతవఱకు దేహయోగముచే—జన్మముచే విడుతఁబడఁడు.

♦ సంగమును సర్వవిధంబున విడువవలయును. అది విడువ నశక్య మగునేని, అసంగమును సత్పురుషులతోఁ గూడఁ జేయవలయును. సత్పురుషులు సంగమున కౌషధము—సంగదోషమును బరిహరింతు రని భావము.

♦♦ తక్కినది శ్రీధరీయముతో సమానము.

భా. మఱియును.—అధ్యాత్మజ్ఞాననిత్యత్వమ్= ఆత్మాదివిషయ మైన జ్ఞానము అధ్యాత్మజ్ఞానము, దానియందు స్థైర్యమును. తత్త్వజ్ఞానార్థదర్శనమ్ = అమానిత్వాదిజ్ఞానసాధనంబులభావనాపరిపాకముచేఁ గలుగునది తత్త్వజ్ఞానము, దానియొక్క యర్థము మోక్షము సంసారోపరమము, దాని నాలోచించుట తత్త్వజ్ఞానార్థదర్శనము. తత్త్వజ్ఞానముయొక్క ఫలము నాలోచించుచున్నం గదా తత్సాధనానుష్ఠానమునందుఁ బ్రవృత్తి కలుగును. ఏతత్=అమానిత్వము మొదలుగాఁ దత్త్వజ్ఞానార్థదర్శనము వఱకుఁ జెప్పిన యీసముదాయము; జ్ఞాన మితి=జ్ఞానం బని; ప్రోక్తమ్= చెప్పఁబడినది, జ్ఞానార్థం బగుటవలన. అతః = దీనికంటె; అన్యథా=విపరీతము; యత్=ఏది గలదో, మానిత్వము దంభిత్వము హింస అక్షాంతి అనార్జవము ఇత్యాదికము. అది, అజ్ఞానమ్=అజ్ఞానము; అని యెఱుంగవలయును, పరిహరించుకొఱకు, సంసారప్రవృత్తికారణం బగుటవలన.

ఆత్మానాత్మవివేకం బెల్లప్పుడు విడువక కలిగి యుండుటయు తత్త్వజ్ఞానఫల మైనమోక్షము నాలోచించుచుండుటయు — అమానిత్వ మొదలుగా తత్త్వజ్ఞానఫలాలోచనమువఱకుఁ జెప్పిన యీసాధనసముదాయము జ్ఞానార్థం బగుటవలన జ్ఞానం బని చెప్పఁబడుచున్నది. దీనికి విరుద్ధ మయినమానిత్వము మొదలగునది సంసారకారణం బగుటవలన అజ్ఞానం బని చెప్పఁబడుచున్నది యని తాత్పర్యము.

ఆ. సాధనాంతరముఁ జెప్పుచున్నారు మఱియును అని. ఆత్మాది యను చోటి యాదిశబ్దమున కనాత్మ యర్థము, తద్విషయ మయినజ్ఞానము — వివేకము, దానియందు నిత్యత్వము—దానియందే నిష్ఠ గలిగి యుండుట. వివేకనిష్ఠుండు గదా వాక్యార్థజ్ఞానసమర్థుం డగును. భావనాపరిపాక మనఁగా యత్నంబునఁ బ్రకర్షపర్యంతము * సాధించుట, దానిచేఁ గలుగుతత్త్వజ్ఞానము—ఐక్యసాక్షాత్కారము. తత్ఫలాలోచన మెందు కని యాశంకించి చెప్పుచున్నారు తత్త్వేత్యాదిగా. జ్ఞానమున కంతరంగసాధనముఁ జెప్పినదాని నుపసంహరించుచున్నారు ఏత దిత్యాదిగా. అజ్ఞానము నేల యెఱుంగవలయు? అని యాశంకించి చెప్పుచున్నారు. పరిహరించు కొఱకు అని. అందుకు హేతువు సంసా రేత్యాదిగా. సంసారముయొక్క ప్రవృత్తి— ఉత్పత్తి, దానికిఁ గారణం బగుటవలన మానిత్వాదికము విడువవలయును, అది యెఱింగినయెడ విడువ నగును, అందుచే దాని నెఱుంగవలయు నని యర్థము.

---

* పూర్తిగా.

హ *

శ్రీ౦. మఱియును — "ఆత్మా వా ఇద మేక ఏ వాగ్ర ఆసీత్, ఆత్మైవేద మగ్ర ఆసీత్, పురుషవిధః, ఆత్మా వా అరే ద్రష్టవ్యః" ఇత్యాదిగా ఆత్మ నధికరించి ప్రవర్తించినది యధ్యాత్మము, ఆత్మతత్త్వ మిందుచే నెఱుంగఁబడుచున్నది కావున జ్ఞానము, అధ్యాత్మమును జ్ఞానమును అధ్యాత్మజ్ఞానము — వేదాంతశాస్త్రము, దాని యందు నిత్యత్వము — నిరతుఁడై యుండుట, దానియందే యెల్లప్పుడు నాసక్తుండై యుండుటయే జ్ఞానోత్పత్తికి ముఖ్య మయినసాధనము, అందువలననే జ్ఞాన మని చెప్పఁబడినది. తత్త్వజ్ఞానార్థదర్శనమ్ = తత్త్వజ్ఞానముయొక్క యర్థము — ఫలరూప మయినమోక్షము, దానియొక్క దర్శనము — అది సిద్ధించుప్రక్రియ నాలోచించుట. బ్రహ్మరూపంబున నవస్థానము గదా మోక్షము, అది శ్రవణంబుననా మననంబుననా నిదిధ్యాసనంబుననా సమాధిచేతనా సర్వకామత్యాగంబుననా సిద్ధించు నని యుక్తిచేతను స్వానుభవముచేతను జ్ఞానము పుష్కలం బగుటకుఁ దగు సాధనసంపత్తి నాలోచించి తనయధికారమున కనురూపం బగు తత్సాధనంబును క్రమంబున ననుష్ఠింపవలయు నని బోధించుచున్నాఁడు భగవంతుఁడు తత్త్వజ్ఞానార్థదర్శనం బనుటచే. అందువలన మోక్షకాముం డగుయతి యమానిత్వాదిజ్ఞానసాధనమును బ్రయత్నంబున సంపాదింపవలయును, అది సిద్ధించిననే జ్ఞానము సిద్ధించును, జ్ఞానము సిద్ధించిననే మోక్షము కలుగును, కావున జ్ఞానమున కంతరంగసాధనమును జెప్పి దాని నుపసంహరించుచున్నాఁడు. — అమానిత్వము మొదలుగా తత్త్వజ్ఞానార్థదర్శనము వఱకు ఏది చెప్పఁబడినదో అట్టి, ఏతత్ = ఈ వింశతిసంఖ్యాక మయినజ్ఞానసాధనము; జ్ఞానోత్పత్తికారణం బగుటవలన, జ్ఞాన మితి = జ్ఞాన మని; మహర్షులచేత, ప్రోక్తమ్ = చెప్పఁబడినది. అతః = ఈ యమానిత్వాదిక మగుజ్ఞానసాధనముకంటెను. యత్ = ఏది; అన్యథా = విపరీత మో, మానిత్వము దంభిత్వము హింస అక్షాంతి అనార్జవము మొదలగురజస్తమోగుణజాతము గలదో, అది యంతయు; అజ్ఞానమ్ = అజ్ఞానవృద్ధిసాధనము, సంసారకారణంబును జ్ఞానప్రతిబంధకంబును. అందువలన మానిత్వాదికమును జక్కఁగా నెఱింగి ముముక్షువులు నిశ్శేషముగాఁ బరిహరింపవలయు నని యర్థము.

మ. మఱియును. — అధ్యాత్మజ్ఞాననిత్యత్వమ్ = ఆత్మ నధికరించి ప్రవర్తించినయాత్మానాత్మవివేకజ్ఞాన మధ్యాత్మజ్ఞానము, దానియందు నిత్యత్వము — అందే

* ఇందు శ్రీవ్యాఖ్యానము లేదు.

నిష్ఠ గలిగి యుండుట. వివేకనిష్ఠుండు గదా వాక్యార్థజ్ఞానసమర్థుం డగును. తత్త్వజ్ఞానార్థదర్శనమ్=వేదాంతవాక్యజన్యంబును అమానిత్వాదిసర్వసాధనపరిపాకఫలంబునగు తత్త్వజ్ఞానముయొక్క—అహం బ్రహ్మాస్మి యనుసాక్షాత్కారముయొక్క-అర్థము—ప్రయోజనము, అవిద్యాతత్కార్యాత్మకనిఖిలదుఃఖనివృత్తిరూపంబును పరమానందావాప్తిరూపంబు నగుమోక్షము, దానియొక్క-దర్శనము—ఆలోచనము. తత్త్వజ్ఞానఫలము నాలోచించినం గదా తత్సాధనమునందుఁ బ్రవృత్తి కలుగును. ఏతత్=అమానిత్వము మొదలుగా తత్త్వజ్ఞానార్థదర్శనమువఱకుఁ జెప్పినది వింశతిసంఖ్యాకము; జ్ఞాన మితి; ప్రోక్తమ్, జ్ఞానార్థం బగుటవలన. అతః=దీనికంటె; అన్యథా=విపరీత మయిన మానిత్వాదికము; యత్=ఏది గలదో అది; అజ్ఞానమ్=అజ్ఞాన మని చెప్పఁబడినది, జ్ఞానవిరోధి యగుటవలన. అందువలన నజ్ఞానమును విడిచి జ్ఞానమునే సంపాదింపవలయు నని భావము.

శ్రీ. మఱియును.—ఆత్మను అధికరించి వర్తించుజ్ఞానము అధ్యాత్మజ్ఞానము, దానియందు నిత్యత్వము—నిత్యభావము, తత్త్వంపదార్థములశోధనమునందు నిష్ఠ యని యర్థము. తత్త్వజ్ఞానముయొక్క-అర్థము—ప్రయోజన మయినమోక్షము, దానియొక్క-దర్శనము, మోక్షము సర్వోత్కృష్ట మని యనుసంధించుట యని యర్థము. ఏతత్=అమానిత్వము అదంభిత్వము ఇత్యాదిగా నిరువదింటినముదాయ మేది చెప్పఁబడినదో ఇది; జ్ఞాన మితి ప్రోక్తమ్=జ్ఞాన మని చెప్పఁబడినది, జ్ఞానసాధన మగుటవలన. అతః=దీనికంటె; అన్యథా=విపరీత మయిన మానిత్వాదికము; యత్=ఏది గలదో; అది, అజ్ఞానమ్—అజ్ఞాన మని చెప్పఁబడినది వసిష్ఠాదులచేత, జ్ఞానవిరోధి యగుటవలన. కావున సర్వవిధంబుల మానిత్వాదికము త్యాజ్య మని యర్థము.

ప. •

రా. ఆత్మయందు జ్ఞానము అధ్యాత్మజ్ఞానము, దానియందు నిష్ఠ గలిగి యుండుట. తత్త్వజ్ఞానార్థచిన్తనమ్ *=తత్త్వజ్ఞానము ప్రయోజనముగాఁ గలచింతన మేది గలదో అది, దానియందే నిరతుం డగుట యని యర్థము. జ్ఞాయతే—ఎఱుఁగఁబడుచున్నది దీనిచేత ఆత్మ, కావున జ్ఞానము, ఆత్మజ్ఞానసాధన మని యర్థము. క్షేత్రసంబంధి యగుపురుషునకు. ఈ చెప్పఁబడిన యమానిత్వాదిగుణబృందమే యాత్మ

• శ్రీధరీయముతో సమానము.

* రామానుజీయము తత్త్వజ్ఞానార్థచింతన మ్మని పాఠము.

జ్ఞానోపయోగి. ఇందులకు వ్యతిరిక్త మగుసమస్తంబును క్షేత్రకార్యము ఆత్మజ్ఞాన విరోధి కావున అజ్ఞానము.

పరా. తత్త్వజ్ఞానార్థదర్శనమ్ — అపరోక్షజ్ఞానమునకొఱకు శాస్త్రదర్శనము.

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాఽసదుచ్యతే. ౧౨

భా. ఈ చెప్పినజ్ఞానముచే నెఱుంగవలసిన దేది? అని యాకాంక్షింపఁగాఁ జెప్పుచున్నాఁడు జ్ఞేయం యత్తదిత్యాదిగా. ఓయీ! అమానిత్వాదులు యమనియమములు, వానిచే జ్ఞేయం బెఱుంగఁబడదు. అమానిత్వాదికం బొకానొకవస్తువునకుఁ బరిచ్ఛేదకముగా * దృష్టము కాదు గదా! అంతటను గూడ నేజ్ఞానము యద్విషయముగాఁ గలుగుచున్నదో ఆజ్ఞానమే ఆజ్ఞేయవిషయమునకుఁ బరిచ్ఛేదక మనుట దృష్టము. అన్యవిషయం బగుజ్ఞానముచే నన్యం బెఱుంగఁబడదు గదా! ఎట్లు ఘటవిషయం బగుజ్ఞానముచే అగ్ని యెఱుంగఁబడదో అట్లు. కాదిది దోషము, జ్ఞాననిమిత్తం బగుటవలన అమానిత్వాదికము జ్ఞాన మనఁబడుచున్న దని చెప్పినారము గదా! జ్ఞానమునకు సహకారికారణం బగుటవలనఁ గూడ జ్ఞాన మని చెప్పఁబడుచున్నది.—జ్ఞేయమ్=ఎఱుంగవలసినది; యత్=ఏదో; తత్=దాని; ప్రవక్ష్యామి=ప్రకర్షంబున—చక్కఁగాఁ జెప్పెదను. ఏఫలము గల దది యనఁగాఁ బ్రరోచనంబున శ్రోతనభిముఖీకరించుటకై చెప్పుచున్నాఁడు.—యత్=ఏజ్ఞేయమును; జ్ఞాత్వా=ఎఱింగి; అమృతమ్=అమృతత్వమును; అశ్నుతే=పొందుచున్నాఁడో, వెండియు మరణము నొందఁడో యని యర్థము. అట్టి జ్ఞేయమును చెప్పెదను. అనాదిమత్=ఆది గలది ఆదిమంతము, ఆదిమంతము కానిది యనాదిమంతము. అది యేది? పరమ్=నిరతిశయ మయిన; బ్రహ్మ=బ్రహ్మము, అది జ్ఞేయము. ఇటఁ గొందఱు అనాది మత్పరమ్మని పదచ్ఛేదము చేయుచున్నారు బహువ్రీహిచే జెప్పఁబడినయర్థమునందు మతుప్పున కానర్థక్యము కారా దని. అర్థవిశేషమును గూర్చఁ బ్రద

* ఇతరవస్తువునుండి వేఱుపఱచునది గా — వేఱుపఱచి యావస్తువును తెలియఁజేయునది గా నను ట.

ర్శించుచున్నారు.—నేను — వాసుదేవుఁ డనుపేరు గల పర యయినశక్తి దేనికిఁ గలదో అది మత్పరం బగు. ఇట్లపునరుక్తత లేకపోవచ్చును సత్యమే, అర్థము సంభవింపవలయును గదా! అట్టియర్థ మేమో సంభవింపదు, న సత్తన్నాసదుచ్యతే అని బ్రహ్మమును సర్వవిశేషప్రతిషేధమునసే తెలుపఁబోవుటవలన. విశిష్టశక్తిమత్త్వము ప్రదర్శించుటయు విశేషప్రతిషేధంబును — ఈరెండు పరస్పరవిరుద్ధములు. అందువలన మతుప్పు బహువ్రీహిలో సమాసార్థం బైనను తత్ప్రయోగము శ్లోకపూరణార్థము. అమృతత్వఫల మైన జ్ఞేయమును జెప్పెద నని ప్రరోచనముచే నభిముఖీకరించి చెప్పుచున్నాఁడు —తత్ = జ్ఞేయము; సత్ = ఉన్న దని; నోచ్యతే= చెప్పఁబడదు. అసత్ = లేని దనియు; నోచ్యతే= చెప్పఁబడదు.

ఇఁక నెఱుంగవలసిన దేదో దానిం జక్కఁగాఁ జెప్పెదను. దాని నెఱింగినయెడ వెండియు మరణము నొందఁడు — మోక్షము నొందును. అది అనాదియగు నిరతిశయ మైనబ్రహ్మము, దాని సత్తనిగాని అసత్తనిగాని చెప్ప శక్యము గాదు, అది సర్వశబ్దములకును అవిషయ మని తాత్పర్యము.

టీ॥ మీఁది గ్రంథమును దించుచున్నారు ఈచెప్పిన ఇత్యాదిగా. అమానిత్వాదులకు జ్ఞానత్వము నాక్షేపించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. వస్తుపరిచ్ఛేదకం బగుటవలన జ్ఞానము గావచ్చు నని యాశంకించి చెప్పుచున్నాఁడు అమానిత్వాదికంబు ఇత్యాదిగా. పరిచ్ఛేదకం బగుటవలన జ్ఞానత్వము జ్ఞానం బగుటవలనఁ బరిచ్ఛేదకత్వం బని యన్యోన్యాశ్రయం బగు నని యాశంకించి చెప్పుచున్నాఁడు అంతటను ఇత్యాదిగా. స్వవిషయజ్ఞానమే స్వపరిచ్ఛేదకం బనుదాని వ్యతిరేకద్వారంబున విశదీకరించుచున్నాఁడు అన్యేత్యాదిగా. వ్యతిరేకదృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు ఎట్లు ఇత్యాదిగా. అమానిత్వాదులకు జ్ఞానత్వము నాక్షేపించినదాని నిరాకరించుచున్నారు కాదిది ఇత్యాదిగా. అందుకు హేతువుగాఁ జెప్పినదాని స్ఫుటతకిఁ దెచ్చుచున్నారు జ్ఞానేత్యాదిగా. అమానిత్వాదికము జ్ఞానశబ్దవాచ్యం బగుటకు మఱియొక హేతువుఁ జెప్పుచున్నారు జ్ఞానసాధనను ఇత్యాదిగా. అమానిత్వాదులకు జ్ఞానత్వముఁ బ్రతిపాదించి జ్ఞాతవ్యమును దీయుచున్నారు జ్ఞేయ మిత్యాదిగా. ప్రశ్నద్వారంబున జ్ఞేయప్రవచనమునకు ఫలముఁ జెప్పి ప్రరోచనము గావించి

శ్రోతృణాభిముఖ్యము గలిగించుటకై ప్రవచనఫలోక్తిపరం బనంతరవాక్యం బని చెప్పుచున్నారు ఏఫలము ఇత్యాదిగా. దానికే విశేషణము చేయుచున్నారు అనాదిమత్ అని. ఆదిమత్త్వము లేమి యవ్యాకృతంబునకును గలదు కావున విశేషముం జూపుచున్నారు అది యేది అని. భోక్తకుం గూడ భోగ్యముకంటెం బరత్వము గలదు కావున విశేషణముం జేయుచున్నారు బ్రహ్మ యని. అనాది యని యొక పదంబును మత్పర మ్మని మఱియొకపదంబునుగా భేదించినచోఁ బునరుక్తి కలుగ దను మతాంతరము నెత్తుచున్నారు ఇట ఇత్యాదిగా. ఏకపదత్వము సంభవించునపుడు పదద్వయం బేల చేయవలయు? అని యాశంకించి చెప్పుచున్నాఁడు బహువ్రీహిచే నిత్యాదిగా. ఆది లేనిది అనాది యని బ్రహువ్రీహిచేఁ జెప్పఁబడినయర్థ మేది గలదో దానియం దాదిమత్త్వము నిషేధించుటచే మతుప్పు అర్థవంతము కాదు కావున మతుప్పున కానర్థక్యము కారా దని తలఁచి యట్లు పదచ్ఛేదము చేయుచున్నా రని పూర్వముతో సంబంధము. ఆది లేనిది యనాది యని చెప్పినచో మత్పర మ్మనుట కేమియర్థ మని యాశంకించి చెప్పుచున్నాఁడు అర్థవిశేషమును ఇత్యాదిగా. ఈ వ్యాఖ్యానం బయుక్త మగుటవలన నిది పునరుక్తికి సమాధానము కా దని చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. అర్థాసంభవమును సమర్థించుచున్నారు నసత్ ఇత్యాదిగా. అట్లయినను విశిష్టశక్తిమత్త్వ మేల కారా దని యాశంకించి చెప్పుచున్నారు విశిష్టేత్యాదిగా. అట్లయినను బహువ్రీహితో సమానార్థ మయిన మతుప్పున కానర్థక్యం బెట్లు పరిహరింపవలయును? అనఁగాఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. అనాదిమత్పరం బ్రహ్మ యనుచోటఁ బక్షాంతరము నిరాకరించి స్వపక్షము సమర్థింపఁబడినది, ఇప్పుడు బ్రహ్మము బ్రహ్మం బగుటవలననే కార్యకారణాత్మకం బని ప్రాప్తింపఁగాఁ బూర్వోక్తానువాదద్వారంబున నసదిత్యాదిభాగము నెత్తుచున్నారు అమృతత్వేత్యాదిగా. సత్—కార్యము, అభివ్యక్తనామరూపం బగుటవలన; అసత్—కారణము, తద్విపరీతం బగుటవలన నని విభాగము.

భా. పూర్వపక్షము.—ఓయీ! గొప్పపరికరబంధముతోను గంతరవముతోను జ్ఞేయం ప్రవక్ష్యామి యని యుద్ఘోషించి యననురూపముగాఁ జెప్పఁబడినది నస త్తన్నా స దుచ్యతే అని.

సిద్ధాంతము—కాదు. అనురూపమే చెప్పఁబడినది.

పూర్వపక్షము.—ఎట్లు?

సిద్ధాంతము.—సమస్తము లయినయుపనిషత్తులయందును జ్ఞేయంబగుబ్రహ్మము «నేతి నేత్యస్థూల మనణు» ఇత్యాదివిశేషప్రతిషేధంబునచే కదా నిర్దేశింపఁబడుచున్నది, ఇది అది యని కాదుగదా, వాఙ్మన కగోచరం బగుటవలన.

పూర్వపక్షము.—ఓయీ! ఏవస్తువు అస్తిశబ్దముచేఁ జెప్పఁబడదో అది లేదు. ఇఁక అస్తిశబ్దంబునఁ జెప్పఁబడ దందువేని ఆజ్ఞేయము లేదు. జ్ఞేయం బది, అస్తిశబ్దముచేఁ జెప్పఁబడ దనుట విరుద్ధము గూడ.

సిద్ధాంతము.—లే దనరాదు, నాస్తిబుద్ధి కవిషయం బగుటవలన.

పూర్వపక్షము.—ఓయీ! సర్వబుద్ధులును అస్తినాస్తిబుద్ధ్యనుగతంబులే యగుచున్నవి. అట్లుండఁగా, జ్ఞేయంబును అస్తిబుద్ధ్యనుగతప్రత్యయవిషయము గాని కావలయును, నాస్తిబుద్ధ్యనుగతప్రత్యయవిషయము గాని కావలయును.

సిద్ధాంతము—కాదు, అతీంద్రియం బగుటచే నుభయబుద్ధ్యనుగతప్రత్యయంబులకును అవిషయం బగుటవలన. ఏది యింద్రియగమ్యం బగువస్తువు ఘటాది కలదో అది గదా యస్తిబుద్ధ్యనుగతప్రత్యయవిషయము గాని నాస్తిబుద్ధ్యనుగతప్రత్యయవిషయము గాని యగును. ఈజ్ఞేయమో అతీంద్రియ మగుటచే శబ్దైకప్రమాణగమ్యం బగుటవలన ఘటాదికమువలె నుభయబుద్ధ్యనుగతప్రత్యయవిషయము కాఁజాలదు. అందువలన నసత్తన్నాసత్ అని చెప్పఁబడుచున్నది. విరుద్ధం బని యాశంకించితివి, జ్ఞేయం బది సత్తనిగాని యసత్తనిగాని చెప్పఁబడ దనుట. కాదు విరుద్ధము, «అన్యదేవ తద్విదితా దథో అవిదితా దధి» అనుశ్రుతివలన. శ్రుతియును విరుద్ధార్థం బందువా, యజ్ఞమునకు శాల నారంభించి «కోహి తద్వేద యద్యముష్మిఁ లోకే ఽస్తివా నవేతి» అనుశ్రుతివలె? కాదు, విదితావిదితంబులకన్న నన్యం బనుశ్రుతి యవశ్యవిజ్ఞేయార్థప్రతిపాదనపరం బగుటవలన. కోహి తద్వేద యనునదియో విధిశేషం బర్థవాదము. ఉపపత్తివలనఁగూడ సదసదాదిశబ్దములచే బ్రహ్మము వచియింపఁబడదు. శబ్దము సర్వంబును గదా అర్థప్రకాశనంబుకొఱకుఁ బ్రయుక్తమై శ్రోతలచే శ్రూయమాణంబునై జాతిగుణ

క్రియాసంబంధద్వారంబున సంకేతగ్రహణంబు నపేక్షించి యర్థముఁ దెలియఁజేయుచున్నది. వేఱువిధంబునం గాదు, అదృష్టం బగుటవలన. అది యెట్లనఁగా.—గోవు అశ్వము ఇత్యాదికము జాతివలన, పచించుచున్నాఁడు పఠించుచున్నాఁడు ఇత్యాదికము క్రియవలన, శుక్లము కృష్ణము ఇత్యాదికము గుణమువలన, ధనికుఁడు గోమంతుఁడు ఇత్యాదికము సంబంధమువలన. బ్రహ్మమో జాతిమంతము కాదు, కావునం గాదు పదాదిశబ్దవాచ్యము. గుణవంతంబునుం గాదు, కావున గుణశబ్దముచే వచియింపఁబడదు, నిర్గుణ మగుటవలన. క్రియాశబ్దవాచ్యమునుం గాదు. నిష్క్రియం బగుటవలన, « నిష్కలం నిష్క్రియం శాన్తమ్ » అను శ్రుతివలన. సంబంధియుఁ గాదు, ఏకం బగుటవలన. అద్వయం బగుటవలనను అవిషయ మగుటవలనను ఆత్మయగుటవలనను ఏశబ్దముచేతనుం జెప్పఁబడదు, « యతో వాచో నివర్తన్తే " ఇత్యాదిశ్రుతులవలననుం గూడ.

౨౦. జ్ఞేయప్రవచనం బనిర్వాచ్యవిషయ మగుటవలనఁ బ్రక్రమానుకూలము గాదని యాక్షేపించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా.

నిర్విశేషం బగువస్తువు జ్ఞేయం బగుటవలనఁ దద్విషయ మయినప్రవచనము ప్రక్రమానుకూలమే యని యుత్తరము చెప్పుచున్నారు కాదు ఇత్యాదిగా.

అనిర్వాచ్యముగా నసత్తన్నాసత్ అనుట యెట్లనురూప మని యడుగుచున్నాఁడు ఎట్లు అని.

బ్రహ్మాత్మప్రకాశము సిద్ధ మగుటవలన దానికొఱకు విధిముఖంబున నుపదేశము సంభవింపమిం జేసి అధ్యస్తతద్ధర్మనివృత్తి నిషేధద్వారమున నుపదేశంబే వేదాంతములయందుఁ బ్రసిద్ధం బగుటవలన ఆరోపితవిశేషనిషేధరూపం బయిన యాప్రవచనం బుచిత మని పరిహరించుచున్నారు సమస్తము లయిన ఇత్యాదిగా. జ్ఞేయం బగుబ్రహ్మమును విధిముఖంబున నుపదేశించుట సంభవింపమికి హేతువుఁ జెప్పుచున్నారు వాక్కునకు ఇత్యాదిగా.

బ్రహ్మము అస్తిశబ్దమునకు వాచ్యము కా దనునపుడు బ్రహ్మమునకు నరవిషాణమునకుంబోలె నాస్తిత్వము వచ్చు నని యనిష్టము నాశంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. ఇట్లు నిశ్చయించినను బ్రహ్మమున కేమి వచ్చు నని యాశంకించి

చెప్పుచున్నాఁడు ఇఁక నిత్యాదిగా. జ్ఞేయం బస్తివాచ్యము కా దన్నచో వ్యాఘాతముగూడ నని చెప్పుచున్నాఁడు జ్ఞేయంబు ఇత్యాదిగా.

అస్తిశబ్దమున కవాచ్య మగుటవలన అవస్తువు బ్రహ్మం బనుట యప్రయోజక మని చెప్పుచున్నారు లేదు ఇత్యాదిగా.

నాస్తిబుద్ధివిషయత్వమే యవస్తుత్వమునకు నిమిత్తము, కావున నది లేమివలన బ్రహ్మం బవస్తువు కా దనుదానినే వ్యక్తీకరించుటకై యాక్షేపము దీయుచున్నారు ఓయీ ఇత్యాదిగా. సర్వబుద్ధులును అస్తిబుద్ధిత్వమునం గాని నాస్తిబుద్ధిత్వమునం గాని అనుగతములై యుండునపుడు బ్రహ్మ మన్యతరబుద్ధిగోచరము గా దన్న పక్షమున బ్రహ్మమునకు అనిర్వాచ్యత్వము దుర్వారం బని ఫలితముఁ జెప్పుచున్నాఁడు అట్లుండఁగా నిత్యాదిగా.

బ్రహ్మము ఘటాదికముఁకంటె విలక్షణం బగుటవలన నుభయబుద్ధ్యవిషయం బైనను అనిర్వాచ్యము కా దని చెప్పుచున్నారు కాదు ఇత్యాదిగా. ఇంద్రియగ్రాహ్య మయినఘటాదికము ఉభయబుద్ధివిషయ మయినను ఇంద్రియగ్రాహ్యము కానియట్టిబ్రహ్మము ఉభయబుద్ధివిషయము కాదు, అట్లు దాని కనిర్వాచ్యము సంభవింపదు, సచ్చిదేకతానం బగుబ్రహ్మము శబ్దప్రమాణాదివిషయం బగుట దృష్టం బగుటవలన నని చెప్పినదానినే ప్రపంచించుచున్నారు ఏది ఇత్యాదిగా. పూర్వపక్షి చెప్పినవిరోధము ననువదించుచున్నారు విరుద్ధంబు ఇత్యాదిగా. శ్రుతిబలంబున నిరాకరించుచున్నారు కాదు విరుద్ధము ఇత్యాదిగా. అశ్రుతియును విరుద్ధార్థం బగుటవలనఁ బ్రమాణము కాదు, బోధకము * అవిరోధాపేక్షం బగుటవలన నని శంకించుచున్నాఁడు శ్రుతియును ఇత్యాదిగా. అది విరుద్ధార్థం బగుటచే అప్రమాణం బనుటకు దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు యజ్ఞమునకు ఇత్యాదిగా. ప్రాచీనవంశంకరోతి యని పారలౌకికఫల మయినయజ్ఞము ననుష్ఠించుటకు శాలానిర్మాణమును బ్రస్తుతించి పరలోకసత్త్వంబున సందేహముఁ దెలుపునట్టి కో హి తద్వేద యనుశ్రుతి విరుద్ధార్థం బగుటచే నెట్లు అప్రమాణమో అట్లు విదితావిదితాన్యత్వశ్రుతియు నని యర్థము. ఈశ్రుతి విరుద్ధార్థ మని యప్రమాణముగాఁ దలంపఁ గూడదు, అద్వితీయం బగు బ్రహ్మమునందుఁ బ్రత్యక్త్వము ప్రతిపాదించుటచేఁ బ్రమాణ మగుటవలన నని యుత్తరముఁ జెప్పుచున్నారు కాదు ఇత్యాదిగా. విరుద్ధార్థమునకు దృష్టాంతముగా కోహి యనునది యుదాహరించుట యుచితముగాదు, అది యర్థవాదమై విధిశేషం

* ప్రమాణము.

బగుటవలన స్వార్థమునందుఁ దాత్పర్యము లేని దగుటవలన నని చెప్పుచున్నారు రోహీత్యాదిగా. ఎట జాత్యాదిమత్త్వము గలదో అట గవాదికమునందుంబోలె వాచ్యత్వము సంభవించును, బ్రహ్మమునందు జాత్యాదిమత్త్వము లేదు, కావున నది యవాచ్య మగుటవలన నిషేధముచేతనే బోధ్యం బని చెప్పుచున్నారు ఉపపత్తి వలనఁ గూడ నిత్యాదిగా. వచియింపఁబడదు — నిషేధముచేతనే తదుపదేశం బని భావము. జాత్యాదిమంతం బగునర్థమే వాచ్యము, అందే సంగతిగ్రహణము గలుగుటవలన ననుటను బ్రపంచించుచున్నారు శబ్దము ఇత్యాదిగా. శబ్దమునకు బ్రహ్మమునందుఁ గాని జాత్యాదిద్వారంబున నగృహీతసంగతికిఁ గాని బోధకత్వము సంభవింపదు అదృష్టం బగుటవలన నని చెప్పుచున్నారు వేఱువిధంబున నిత్యాదిగా. జాత్యాదికమునకు సచ్ఛబ్దవిషయత్వము నుదాహరించుచున్నారు అది యెట్లనఁగా నిత్యాదిగా. బ్రహ్మమునకో అగోత్రము అవర్ణము ఇత్యాదిగా శ్రుతి వచించుటవలన జాత్యాదిమత్త్వము లేమింజేసి శబ్దవాచ్యత లేదని చెప్పుచున్నారు బ్రహ్మమో ఇత్యాదిగా. కేవలో నిర్గుణశ్చ యను శ్రుతివలన గుణద్వారంబున బ్రహ్మమునకు వాచ్యత లేదని చెప్పుచున్నారు గుణవంతంబును నిత్యాదిగా. నిష్క్రియం బనుటకుఁ బ్రమాణము చెప్పుచున్నారు నిష్కల మిత్యాదిగా. బ్రహ్మమున కద్వితీయత్వము సర్వోపనిషత్తులయందును సిద్ధ మగుటవలన విశిష్ట మగుసంబంధము బ్రహ్మమునందు సంభవింపమివలన తద్ద్వారంబునఁ గూడ దానికి వాచ్యత లేదని చెప్పుచున్నారు సంబంధియు నిత్యాదిగా. బ్రహ్మమునం దభిధానవృత్తిచే శబ్దము ప్రవర్తింప దనుటకు హేత్వంతరములఁ జెప్పుచున్నారు అద్వయం బగుటవలనను ఇత్యాదిగా. బ్రహ్మమవాచ్యం బనుటకు శ్రుతిసంవాదమును జూపుచున్నారు యత ఇత్యాదిగా.

హ. మత్పరమ్=మదాత్మకము.

శం. ఇట్లు జ్ఞానోత్పత్తికి సహకారికారణసామగ్రిని అమానిత్వాదికమును నిరూపించి మోక్షసాధనసంపత్తితోఁ జేయఁబడి శ్రవణాదికముచే జ్ఞానము నొందునట్టియతికి యేది జ్ఞాతవ్యం బగువస్తువో దాని నిరూపించుచున్నాఁడు — సాధనయుక్తుఁడై శ్రవణముచేసి దానిచే జ్ఞానము గలిగినయతికి, యత్=ఏది; జ్ఞేయమ్=శ్రీగురుముఖంబున నెఱుంగవలసినవస్తువో; తత్=దాని; ప్రవక్ష్యామి=ఉపదేశించెదను ఓయీ! దాని నెఱుంగుటచే మా కేమి కలుగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—తత్త్వమస్యాది వాక్యార్థమును విచారించి విచారజన్యజ్ఞానముచే, యత్=ఏవస్తువును; జ్ఞాత్వా=

ఎఱింగి; అమృతమ్=చెప్పఁబోవులక్షణము గలపరబ్రహ్మమును, «ఏత దమృత మభయ మేత ద్బ్రహ్మ» అను శ్రుతివలన, అమృతాఖ్య మయినబ్రహ్మమును విద్వాంసుఁడు; అశ్నుతే = పొందుచున్నాఁడో, «బ్రహ్మవి దాప్నోతి పరమ్" అను శ్రుతివలన. ఇట్లు ఫలవాదంబున శ్రోత నభిముఖీకరించి ప్రవక్ష్యామి యని యేది ప్రతిజ్ఞాత మా దానిఁ బ్రతిపాదించుచున్నాఁడు.—ముముక్షు వెఱుంగవలసిన యాబ్రహ్మము, అనాదిమత్ = ఆది యనఁగా కారణము లేక జన్మము, అది గలది యాదిమంతము మహదాదిస్థూలాంత మైనకార్యము, దానికంటె విలక్షణం బగుటవలన బ్రహ్మము అనాదిమంతము, సర్వవికారజాతముకంటె అన్య మని యర్థము. అనాదిమత్త్వ మక్షరం బగుటవలన అవికృతియు అవ్యాకృతాఖ్యంబు నగుమూలప్రకృతికిని గలదు, కావున దాని వ్యావర్తించుటకై విశేషణము పర మ్మని నిరవయవత్వంబునను నిత్యకూటస్థాసంగచిద్రూపత్వంబునను జ్ఞత్వంబునను అంతరత్వంబునను బరమమహత్త్వంబునను బ్రహ్మము అవ్యక్తముకంటె పరము — ఇతరమే. «అప్రాణో హ్యమనాశ్శుభ్రో హ్యక్షరా త్పరతః పరః» అను శ్రుతివలనను అనాదిమత్త్వమువలనను పరత్వమువలనను బ్రహ్మము వ్యక్తావ్యక్తము లయినకార్యకారణములకంటె అన్యం బే యని సిద్ధము, «అన్యదేవ తద్విదితా దథో అవిదితా దధి" అను శ్రుతివలన. ఓయీ! «త త్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్। సచ యో యత్ప్రభావశ్చ త త్సమాసేన మే శృణు» అని క్షేత్రక్షేత్రజ్ఞులయాథాత్మ్యముఁ బ్రతిపాదింప నుపక్రమించి మహాభూతా నీత్యాదికముచే క్షేత్రస్వరూపము ప్రతిపాదింపఁబడినది. పిదప క్షేత్రజ్ఞునిస్వరూపమును బ్రతిపాదింపవలసి యుండఁగా దాని విడిచి అనాదిమత్పరం బ్రహ్మ యని యుపక్రమింపఁబడినది. ఎట్లు ఉపక్రమింపనిబ్రహ్మస్వరూపముఁ బ్రతిపాదింప వచ్చును? ఉపక్రమవిరోధ మగుచున్నది. అందు వేని. కాదు, క్షేత్రజ్ఞబ్రహ్మముల కభేదనిశ్చయమువలన విరోధము సంభవింపమివలన. «నాఽయం హన్తి న హన్యతే" అని క్షేత్రజ్ఞుఁ డగునాత్మ కవిక్రియత్వము బోధింప నుపక్రమించి, దానిని «న జాయతే మ్రియతే వా" ఇత్యాదికముచే స్పష్టీకరించి, «నిత్యః సర్వగతః» అని నిత్యకూటస్థాసంగచిద్రూపత్వంబును వ్యాపకత్వంబును నిరూపించి, «యేన భూతా న్యశేషేణ» అని బ్రహ్మాఽభిన్నత్వము సూచించి, «భోక్తారం యజ్ఞతపసామ్, సర్వభూతస్థ మాత్మానమ్, యో మాం పశ్యతి సర్వత్ర» అని యాక్షేత్రజ్ఞబ్రహ్మముల కేకత్వమును దెలిపి, «జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అని కంఠరవంబున నైక్యమును వచించి, శ్రుతిస్మృతికోటిప్రసిద్ధ మయిన యాచెప్పినబ్రహ్మాత్మైక్యమును

"క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని మిక్కిలి స్పష్టతరముగాఁ బ్రతిపాదించి, భగవంతుఁడు, క్షేత్రజ్ఞుఁడే బ్రహ్మము బ్రహ్మమే క్షేత్రజ్ఞుఁ డని క్షేత్రజ్ఞబ్రహ్మములయభేదమునే మూఢులును అమూఢులును ఎల్లరు నెఱుంగవలయు నని, "సచ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు" అని జ్ఞేయునిఁగా నుపక్రమించినక్షేత్రజ్ఞని విధేయప్రాధాన్యమును బట్టి నపుంసకలింగంబున "జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి" అని పరామర్శించి తద్యాథాత్మ్యము బోధించుటకై అనాదిమత్పరం బ్రహ్మ యని ప్రతిపాదించినవాఁడు. అందుచే క్షేత్రజ్ఞబ్రహ్మశబ్దముల కొక్కటే యర్థ మని యిట్లు దుపపాదించినయుపక్రమవాక్యార్థము వివేకంబున నెఱుంగ సమర్థు లగువిద్వాంసు లెఱుంగవలయు నని సిద్ధము. ఇట్లు, అనాదిమత్పరం బ్రహ్మ యనుటచే బ్రహ్మము సర్వదృశ్యవిలక్షణం బని సూచించి, సచ యో యత్ప్రభావశ్చ యనుచో యచ్ఛబ్దవివక్షిత మయినదానియాథాత్మ్యమును "నేతి నేతీ త్యాత్మా గృహ్యో నహి గృహ్యతే, అథాత ఆదేశో నేతినేతి" ఇత్యాదిశ్రుత్యర్థము ననుసరించుచు అతద్వ్యావృత్తిద్వారమున బోధించుటకై చెప్పుచున్నాఁడు న సత్తన్నాఽసదుచ్యతే అని. ఏది యిది యది యని నామరూపక్రియాజాతిగుణములచే నిర్దేశింపయోగ్య మగునో అట్టి యభివ్యక్తనామరూపాదివిశేషం బగు మహదాదికార్యజాతము సర్వంబును సత్తని చెప్పఁబడుచున్నది. దానికి విలక్షణం బగుటవలన దానికారణ మగునవ్యక్తము అసత్తని చెప్పఁబడు చున్నది. ఈచెప్పినలక్షణము గలసత్తు బ్రహ్మము కాదు ఘటమువలె జన్మవంత మగుటవలనను నామరూపాదిమంత మగుటవలనను దృశ్య మగుటవలనను. బ్రహ్మము తద్విలక్షణం బగుటవలన. బ్రహ్మమునకు జన్మము లేదు గదా! "అజో నిత్యః" అనుశ్రుతివలన. నామరూపాదికంబును లేదు "అగ్రాహ్యమగోత్ర మశబ్ద మస్పర్శ మరూపమ్" అనుశ్రుతివలన. దృశ్యత్వంబును లేదు "అదృశ్య మవ్యవహార్యమ్" అనుశ్రుతివలన అందువలన బ్రహ్మము మహదాది సర్వవికారజాతముకంటె భిన్నమే యని యర్థము. ఇట్లు న సత్తత్ అని కార్యమునకు బ్రహ్మత్వము నిషేధించి కారణమునకును బ్రహ్మత్వము నిషేధించుచున్నాఁడు నాఽసదుచ్యతే అని. సద్విలక్షణంబై సర్వజగత్కారణం బగు నవ్యాకృతం బేది గలదో అదియు బ్రహ్మము గాదు, బీజమువలె సావయవం బగుటవలనను జ్ఞేయం బగుటవలనను జడ మగుటవలనను. కార్యము సావయవత్వాదిధర్మవిశిష్టముగాఁ గనఁబడుటవలనఁ గారణంబును తద్ధర్మవిశిష్ట మనుట యుక్తము, మృదాదులయందు అట్లు కనఁబడుటవలనను, కారణగుణములు కార్యగుణంబుల నారంభించుచున్న

ననున్యాయంబువలనను, ఏది సావయవమో అది వికారి ఏది వికారియో యది యని త్యము కావున అనిత్య మగుటవలనను జ్ఞేయ మగుటవలన జడము. నేనజ్ఞుడ నననుభవమువలన అవ్యక్తమునకు జ్ఞేయత్వము స్పష్టము. తద్విలక్షణము పర బ్రహ్మము. బ్రహ్మము సావయవము కాదుగదా, "నిష్కలం నిష్క్రియమ్" అను శ్రుతివలన. జడంబునునుం గాదు, "సాక్షీ చేతా" అనుశ్రుతివలన. జ్ఞేయంబునుం గాదు, "స వేత్తి వేద్యం నచ తస్యాఽస్తి వేత్తా" అనుశ్రుతివలన. ఓయీ! సదసచ్ఛబ్దవాచ్యము లయిన వ్యక్తావ్యక్తములు కార్యకారణములు రెంటికిని బ్రహ్మ త్వము నిషేధించినచో తదభావమె శేషించుం గాని తన్నిషేధావధిభూత మయిన వస్తువు మఱేదియుం గానరాదు కావున జ్ఞేయనిర్ద్దిష్టం బప్రామాణికము. అందు వేని, నిన్నిట నడుగవలయును. తన్నిషేధావధిభూత మయిన యభావము సత్తా? అసత్తా? లేక యుభయవిధమా? అది తనంతటఁ దానే భాసిల్లుచున్నదా? లేక యితరమువలన భాసిల్లుచున్నదా? అని. మొదటిది కాదు, సత్తయిన యెడ సదంతర్భూత మగుటవలన సత్తు కాదని నిషేధించినపుడు తానే తన్నిషేధమున కవధి యగుట యుపపన్నము గామివలన. రెండవది కాదు, స్వతస్సత్తారహిత మయినయసత్తు శశవిషాణమువలె శూన్య మగుటవలన దానికి నిషేధావధిత్వము సంభవింపమివలన. మూడవదియుం గాదు, పరస్పరవిరుద్ధంబు లగుసత్త్వాసత్త్వంబుల కేకాధికరణవృత్తిత్వం బనుపపన్న మగుటం జేసి యొకవస్తువునందు రెండు నుండుట యసిద్ధం బగుటవలన. అభావం బున్నదన్నచో నభావం బస్తిమంతమైనయపుడు సత్తావంత మగుటచే భావం బగుటవలన అభావం బున్నదని నిర్దేశమే యుపపన్నము కాదు. ఇది యున్నదని ప్రత్యక్షంబున నిర్దేశము భావమునకే కాని యభావంబున కుపపన్నము కాదు, విషయవిషయుల కన్యోన్యావయవసంయోగము సంభవింపమి వలన. అన్యోన్యావయవసంయోగము గలుగునపుడే ఘటాదులకు విషయత్వము దృష్టము. అసత్తునకుఁ గాదు. ఏది యస్తిమంతమై చక్షుర్విషయ మగునో అది భావమే కాని యభావము కాదు. అస్తిత్వాఽభావత్వముల కేకాధికరణవృత్తిత్వ మనుపపన్నము. అది యంగీకరించినను, నాలవపక్షము కాదు, అభావము జ్ఞేయ మగుటచే జడం బగుటవలన దానికి ఘటమునకుం బోలె స్వతోభానము సంభవింపమి వలన. ఇఁక నితరమువలననే భాసిల్లు నందువేని, అభావభాసక మయినవస్తువున్న దా? లేదా? రెండవది కాదు, లేదనునెడ సూర్యుండు లేనియప్పుడు ఘటాదిక మునకుంబోలె అభావమునకు భాననాభావము ప్రసక్తించుటవలన. ఉన్నదందువేని,

ఏది యుభావభాసకం బగువస్తువో అదియే బ్రహ్మమని చెప్పుచున్నారము. తత్స ద్భావమునకు నీవె మాకుఁ బ్రమాణము. శ్రుతియును, "అన్యదేవ తద్విదితాత్, అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాత్" ఇత్యాదికము. "న ప్రకృతిర్న వికృతిః పురుషః, సముష్టవచ్యాభ్యావ దవతిర్యగ్యన్మూలభూతం పదమామనంతి" ఇత్యాది స్మృతియును. ఇట్లు "అదృశ్యే౽నాత్మ్యే, అస్థూలమనణు" ఇత్యాదిశ్రుతులచే అధ్యస్తాశేషవిశేషప్రతిషేధమునవే బ్రహ్మము బోధితమగుటవలన సర్వశ్రుతిప్రసిద్ధమయిన యాజ్ఞేయబ్రహ్మము ప్రామాణికమె యగును. అందువలన, సదసత్తులకు భిన్నమై తన్నిషేధావధిభూతమై సదభావావభాసకమై నిర్విశేషమై నిత్యశుద్ధబుద్ధముక్తసత్య పరమానందాద్వితీయమైనపరబ్రహ్మమే యిదియే నేనని ముముక్షువు స్వస్వరూపంబున నెఱుంగవలసినవస్తువు, సత్తును గాదు అసత్తును గాదని సిద్ధము.

అవ. జ్ఞానశబ్దితములయిన యీసాధనములచే నేది జ్ఞేయము? అని యపేక్షింపఁగాఁ జెప్పుచున్నాఁడాయుశ్లోకములచేత.— యత్ = ఏది; జ్ఞేయమ్ = ముముక్షువుచే నెఱుంగవలసినదో; తత్ = దాని; ప్రవక్ష్యామి = ప్రకర్షంబున — స్పష్టముగాఁ జెప్పెదను. శ్రోత నభిముఖీకరించుకొఱకు ఫలముచే స్తుతించుచుఁ జెప్పుచున్నాఁడు.— యత్ = వక్ష్యమాణ మయిన యేజ్ఞేయమును; జ్ఞాత్వా = ఎఱింగి; అమృతమ్ = అమృతత్వమును; అశ్నుతే — సంసారమునుండి ముక్తుఁ డగుచున్నాఁడో యని యర్థము. అది యేది? అనాదిమత్ = ఆదిమంతము కానిది యనాదిమంతము; పరమ్ = నిరతిశయమగు; బ్రహ్మ = అన్నిటను అనవచ్ఛిన్న మయినపరమాత్మవస్తువు. ఇట అనాదియన్నమాత్రమునే బహువ్రీహిచే నర్థము లభించుచున్నను అతిశాయనమునందుఁ గాని నిత్యయోగమునందుఁ గాని మతుప్పుకుఁ బ్రయోగము. అనాది యనియు మత్పరమ్మనియుఁ గొందఱు పదచ్ఛేదము చేయుచున్నారు. మత్పరమ్ — మత్ = నాకంటె సగుణబ్రహ్మముకంటె, పరము నిర్విశేషరూప మయినబ్రహ్మమని యర్థము. నేను— వాసుదేవుండను అనుపర మయినశక్తి గలది యనుటమాత్ర మపవ్యాఖ్యానము, నిర్విశేష మయినబ్రహ్మము ప్రతిపాద్యం బగుటచే నందు శక్తిమత్త్వము చెప్పుట యనుపపన్నం బగుటవలన. నిర్విశేషత్వమునే చెప్పుచున్నాఁడు.— న సత్తన్నాసదుచ్యతే— విధిముఖంబునఁ బ్రమాణమునకు విషయము సచ్ఛబ్దముచేఁ జెప్పఁబడుచున్నది, నిషేధముఖంబునఁ బ్రమాణమునకు విషయ మసచ్ఛబ్దముచేఁ జెప్పఁబడుచున్నది. ఇదియో ఆరెంటికి విలక్షణము, నిర్విశేష మగుటవలనను స్వప్రకాశ

చైతన్యరూపం బగుటవలనను, «యతో వాచో నివర్తన్తే। అప్రాప్య మనసా సహ » ఇత్యాదిశ్రుతివలన. ఎందువలన ఆబ్రహ్మము సత్తు కాదో—భావత్వమున కాశ్రయము కాదో, అసత్తు కాదో—అభావత్వమున కాశ్రయము కాదో, అందువలన ఏశబ్దము చేతను జెప్పఁబడదు ముఖ్యవృత్తిచేత, శబ్దప్రవృత్తినిమిత్తము లందు సంభవింపమి వలన. ఎట్లనఁగా. గోవు అశ్వం బని జాతిచేతను, పచించుచున్నాఁడు పఠించు చున్నాఁ డని క్రియచేతను, శుక్లము కృష్ణం బని గుణముచేతను, ధనికుఁడు గోమం తుఁ డని సంబంధముచేతను శబ్ద మర్థమును బ్రతిపాదించుచున్నది. ఇట క్రియా గుణసంబంధములకంటె విలక్షణ మయినధర్మము సర్వంబును జాతిరూపము గాని యుపాధిరూపము గాని జాతిపదముచే సంగ్రహింపఁబడినది. డిత్థకపిత్థాదిక మయిన యదృచ్ఛాశబ్దము * కూడ ఒకానొకధర్మమును గాని స్వాత్మను గాని ప్రవృత్తిని మిత్తీకరించి ప్రవర్తించుచున్నది కావున నదియు జాతిశబ్దము. ఇట్లు ఆకాశశబ్దం బును తార్కికమతంబున శబ్దాశ్రయత్వాదిరూపం బగు నొకానొకధర్మమును బుర స్కరించి ప్రవర్తించుచున్నది అస్మన్మతంబునను, పృథివ్యాదులుంబోలె జన్యము లైనయాకాశవ్యక్తు లనేకంబు లగుటవలన ఆకాశత్వము గూడ జాతియే కావున నదియు జాతిశబ్దము. ఆకాశాతిరిక్త మైనదిక్కు లేదు. కాలము ఈశ్వరాతిరిక్తము కాదు. అతిరిక్తము లన్నను దిక్కాలశబ్దంబులును ఉపాధివిశేషప్రవృత్తినిమిత్తకం బులు కావున జాతిశబ్దంబులే. అందువలనఁ బ్రవృత్తినిమిత్తము చతుర్విధం బగుట వలనఁ జతుర్విధమే శబ్దము. అందు, న సత్తన్నాఽసత్ అని జాతినిషేధము క్రియాగుణసంబంధములకును నిషేధోపలక్షణార్థము. ఏక మేవాఽద్వితీయమ్ అనుటచే జాతినిషేధము, అనేకవ్యక్తివృత్తి యైనజాతి యేకవస్తువునందు సంభవిం పమివలన. నిర్గుణం నిష్క్రియం శాన్తమ్ అనుటచేఁ గ్రమంబున గుణక్రియాసంబంధ ములకు నిషేధము. అసఙ్గో హ్యయం పురుషః అనుటచేఁ గూడ. అథాత ఆదేశో నేతి నేతి యనుశ్రుతిచే సర్వనిషేధము. అందువలన బ్రహ్మ మేశబ్దముచేతనుం జెప్పఁ బడ దనుట యుక్తము. ఆక్షమున, ఎట్లు ప్రవక్ష్యామి యని చెప్పఁబడినది? ఎట్లు మఱి శాస్త్రయోనిత్వాత్ అనుసూత్రం బుపపన్నము? అందు వేని, ఎట్లో యొక విధంబున లక్షణచే శబ్దమువం బ్రతిపాదించుటవలన నని యెఱుంగునది. ప్రతిపాదన ప్రకారము ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన మనుచోట వ్యాఖ్యాతము. విస్తరము భా ష్యంబునం జూచునది.

---

* అవ్యుత్పన్న మయినశబ్దము.

శ్రీ. ఈసాధనంబులచే నేది జ్ఞేయమో దానిం జెప్పుచున్నాఁడాలుశ్లోకములచేత.—యత్ జ్ఞేయం తత్ ప్రవక్ష్యామి శ్రోత కాదరము గలుగుటకై జ్ఞానఫలము దెలుపుచున్నాఁడు.—యత్ = చెప్పఁబోవునట్టిదేనిని, జ్ఞాత్వా; అమృతమ్=మోక్షమును; అశ్నుతే=పొందుచున్నాఁడు ఏది యది? అనాదిమత్=అనంతము కానిది యనాదిమంతము. పరమ్=నిరతిశయ మయిన; బ్రహ్మ. అనాదియన్నమాత్రముననే బహువ్రీహిచే అనాదిత్వము సిద్ధ మగుచుండఁగా వెండియు మతుప్ప్రయోగము ఛాందసము. లేక. అనాది యనియు మత్పర మ్మనియు రెండుపదములు. మత్పరమ్=నాయొక్క—విష్ణువుయొక్క పరము— నిర్విశేష మయినస్వరూపము బ్రహ్మమని యని యర్థము. దానినే చెప్పుచున్నాఁడు—నసత్తన్నాసదుచ్యతే—విధిముఖంబునఁ బ్రమాణమునకు విషయము సచ్ఛబ్దార్థము, నిషేధమునకు విషయము నసచ్ఛబ్దార్థము. ఇదియో ఆరెంటికి విలక్షణము అవిషయం బగుటవలన నని యర్థము.

ప. ఈసాధనములచే నేది జ్ఞేయమో దానిఁ జెప్పుచున్నాఁడాలుశ్లోకములచేత.—యత్ జ్ఞేయం తత్ ప్రవక్ష్యామి. శ్రోత కవధానము కలుగుటకై జ్ఞానఫలముఁ జెప్పుచున్నాఁడు—యత్ =చెప్పఁబోవునట్టిదేనిని; జ్ఞాత్వా; అమృతమ్=మోక్షమును; అశ్నుతే= పొందునో. అది యేది? అనాదిమత్ = ఆదిమంతము కానిది; పరమ్=నిరతిశయము అగు; బ్రహ్మ. లేక. మత్పరమ్=నాకంటెపరము—నిర్విశేషమగుబ్రహ్మము. దానినే చెప్పుచున్నాఁడు.—తత్ =ఆబ్రహ్మము; నసత్ =సత్తు కాదు. న అసత్ =అసత్తును గాదు. విధిముఖమునఁ బ్రమాణమునకు విషయ మగునది సత్తు, నిషేధమునకు విషయము అసత్తు. బ్రహ్మము రెంటికంటెవిలక్షణము అవిషయ మగుటవలన.

రా. ఇఁక ఏతద్యోవేత్తి అని జ్ఞాతృత్వలక్షణునిఁగాఁ జెప్పిన క్షేత్రజ్ఞుని స్వరూపము శోధింపఁబడుచున్నది.—అమానిత్వాదిసాధనములచే, జ్ఞేయమ్=పొందఁదగినట్టి; యత్ =ప్రత్యగాత్మస్వరూపము గలదో తత్ =దాని; ప్రవక్ష్యామి=చెప్పెదను. యత్ =దేని; జ్ఞాత్వా; జన్మజరామరణాదిప్రాకృతధర్మరహితుఁ డైన, అమృతమ్=ఆత్మను; అశ్నుతే=పొందుచున్నాఁడో. అనాది=ఆది దేనికి లేదో అది యనాది; ఈప్రత్యగాత్మకు ఉత్పత్తి లేదు గదా, అందువలననే అంతమును లేదు, శ్రుతియును "నజాయతే మ్రియతే వా విపశ్చిత్" అని. నేను పరుఁడను దేనికో అది మత్పరము, "ఇతస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్। జీవభూతామ్" అని గదా చెప్పఁబడి

**భా.** జ్ఞేయము సచ్ఛబ్దప్రత్యయమున కవిషయ మైనపుడు అసత్తే కావలయు నని యాశంక గలుగఁగా సర్వప్రాణికరణోపాధులద్వారంబున దాని కస్తిత్వముఁ బ్రతిపాదించుచు నయ్యాశంకను నివర్తించుచున్నాఁడు —తత్ = ఆజ్ఞేయ మగుబ్రహ్మము; సర్వతః పాణిపాదమ్= అంతటను చేతులును పాదములును గలది. సర్వప్రాణికరణోపాధులచే క్షేత్రజ్ఞుని యస్తిత్వము విభావింపఁబడుచున్నది. ఎట్లనఁగా. క్షేత్రోపాధివలన క్షేత్రజ్ఞుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. క్షేత్రమో పాణిపాదాదులచే ననేకవిధముల భిన్నమై యున్నది. క్షేత్రోపాధిభేదకృత మగువిశేషజాతము క్షేత్రజ్ఞునకు మిథ్యయే కావున దానిఁ దొలఁగించి జ్ఞేయుం డని చెప్పఁబడినది నసత్తన్నాసదుచ్యతే అని. ఉపాధికృతము మిథ్యారూపమైనను అస్తిత్వగ్రహణమునకై జ్ఞేయధర్మమువలెఁ బరికల్పించి చెప్పఁబడుచున్నది సర్వతః పాణిపాద మిత్యాదిగా. అట్లు సంప్రదాయవిదుల వచనము "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపఞ్చం ప్రపఞ్చ్యతే" ♦ అని. అంతటను సర్వదేహావయవములుగాఁ గనఁబడుచున్న పాణిపాదాదులు జ్ఞేయశక్తిసద్భావమూలముననే స్వకార్యములు చేయుచున్నవి కావున నవి జ్ఞేయసద్భావమునందు లింగములు *, అందువలన నవి జ్ఞేయునివి యని యుపచారమునఁ జెప్పఁబడుచున్నది. అట్లే తక్కినస్థలములయందును వ్యాఖ్యానము చేయవలయును. ఆజ్ఞేయము సర్వతః పాణిపాదము. సర్వతః అక్షిశిరోముఖమ్=అంతటను నేత్రములును శిరస్సులును ముఖములును గలది. సర్వతః శ్రుతిమత్=అంతటను చెవులు గలది; లోకే=ప్రాణిసమూహమునందు. సర్వమ్=సమస్తమును; ఆవృత్య= చక్కఁగా వ్యాపించి; తిష్ఠతి=స్థితి గలిగి యున్నది.

ఆబ్రహ్మము ప్రాణిసమూహమునం దంతటను పాణిపాదములు గలది, అంతటను నేత్రములును శిరస్సులును పాదములును గలది, అంతటను చెవులు గలది. అది సమస్తంబును వ్యాపించి యున్నది. ఈసర్వదేహములయందలి పాణిపాదాదీంద్రియము లన్నియు క్షేత్రజ్ఞునిసన్నిధానమహిమవలననే గదా స్వవ్యాపార

♦ అధ్యారోపముచేతను—అనాత్మధర్మముల నారోపించి చూపుటచేతను, అపవాదముచేతను—ఆయనాత్మధర్మములను మిథ్య యని నిషేధించుటచేతను ప్రపంచాతీత మగుఆత్మ తెలుపఁబడుచున్నది.

* హేతువులు.

ములు చేయంగలిగి యున్నవి. కావున వీనివలన క్షేత్రజ్ఞుఁ డున్నాఁ డనుట సిద్ధమగుచున్నది. క్షేత్రజ్ఞుఁడే బ్రహ్మము. అని తాత్పర్యము.

ఆ. సర్వవిశేషరహితంబును అవాఙ్మనసగోచరంబును అదృష్టికిని దృష్టికిని విపరీతంబు నగుబ్రహ్మమునకు శూన్యత ప్రాప్తించఁగా, ప్రత్యక్షగుటచేతను ఇంద్రియప్రవృత్త్యాదులకు హేతు వగుటచేతను కల్పిత మగుద్వైతమునకు సత్తాస్ఫూర్తిప్రదం బగుటచేతను ఈశ్వరం బగుటచేతను బ్రహ్మమునకు సత్త్వము ప్రదర్శించుటకై, మొదట రథాదులవలె నచేతనములై ప్రవృత్తిమంతము లగుదేహాదులు ప్రేక్షాపూర్వక మయినప్రవృత్తి గలవి యగుటవలన చేతనాధిష్ఠితము లని సాధించుచు వానికి ప్రత్యక్షైకచేతనము బ్రహ్మ మని చెప్పుచున్నారు జ్ఞేయము ఇత్యాదిగా. ఓయీ! పాణులును పాదములును దేహస్థములై యుండఁగా సర్వదేహములందును పాణులును పాదములును గలది యని యెట్లు వాని నాత్మధర్మములనుగాఁ జెప్పవచ్చును? అనఁగా చెప్పుచున్నారు సర్వప్రాణికరణోపాధులచే నిత్యాదిగా. కరణములప్రవృత్తి రథాదిప్రవృత్తివలె ప్రేక్షాపూర్వక మయినప్రవృత్తి యగుటవలన చేతనుం డధిష్ఠాతగాఁ గలది యని యర్థము. కరణములప్రవృత్తిచే చేతనాస్తిత్వము సిద్ధించినను క్షేత్రజ్ఞాస్తిత్వం బెట్లు అని యాశంకించి చేతనుఁడే క్షేత్రోపాధిచే క్షేత్రజ్ఞుం డగుటవలన చేతనాస్తిత్వమే క్షేత్రజ్ఞాస్తిత్వ మని చెప్పుచున్నారు ఎట్లనఁగా నిత్యాదిగా. చేతనుఁడు క్షేత్రోపాధికుం డైనను పాణిపాదాక్షిశిరోముఖాదిమత్త్వం బతని కెట్లని యాశంకించి చెప్పుచున్నారు క్షేత్రమో ఇత్యాదిగా. ఈయుపాధివలననే యతని యందు విశేషము చెప్పఁబడిన దని శేషము. అప్పుడు ఎట్లు న సత్తన్నాస దుచ్యతే అని నిర్విశేషత్వము చెప్పఁబడినది? అని యాశంకించి చెప్పుచున్నారు క్షేత్రోపాధీత్యాదిగా. ఔపాధికం బగు పాణిపాదాదిమత్త్వము మిథ్య యగునెడ జ్ఞేయప్రవచనప్రకరణమునందు దాని నెట్లు చెప్పవచ్చును? అని యాశంకించి చెప్పుచున్నారు ఉపాధికృతము ఇత్యాదిగా. మిథ్యారూప మయినను జ్ఞేయవస్తుజ్ఞానమునం దుపయోగించు ననుటకు వృద్ధసమ్మతిని చెప్పుచున్నారు. అట్లు ఇత్యాదిగా. అన్యగతము లగు పాణిపాదాదులను ఆత్మధర్మములనుగా నారోపించి చెప్పుట కేమి హేతువు? అనఁగాఁ జెప్పుచున్నారు అంతటను ఇత్యాదిగా. జ్ఞేయ మగుబ్రహ్మముయొక్క శక్తి—సన్నిధానమాత్రంబునఁ బ్రవర్తింపఁజేయుసామర్థ్యము, దానియునికివలననే పాణ్యాదులు స్వకార్యములు చేయుచున్నవి కావున నని యర్థము. సర్వతోఽక్షీత్యాదిస్థలంబున నిటఁ జెప్పినదాని నతిదేశించుచున్నారు అట్లే ఇత్యాదిగా. సర్వతోఽక్షీత్యాదిక

మున కుత్తరార్ధముం జెప్పుచున్నారు సర్వతః ఇత్యాదిగా. అక్షిశ్రోత్రము అవశిష్ట జ్ఞానేంద్రియములకును పాణిపాదముఖము అవశిష్టకర్మేంద్రియములకును మనో బుద్ధ్యాదులకును ఉపలక్షణము. బ్రహ్మ మొక్కటి సర్వత్ర పాణ్యాదిమంత మనుటను సాధించుచున్నారు సర్వ మిత్యాదిగా.

హ

*౦. ఇట్లు "సచ యో యత్ప్రభావశ్చ" అనుచోట యచ్ఛబ్దముచే వివక్షిత మగు క్షేత్రజ్ఞుని పరమార్థతత్త్వమును ప్రకృతిప్రాకృతవిలక్షణ మయినదాని యతులు విదేహముక్తికొఱకు స్వాత్మరూపంబున నెఱుంగవలయు నని నిరూపించి, ఇప్పుడు సర్వశ్రుతిప్రసిద్ధ మైనను బ్రహ్మము విదితముకంటెను అవిదితముకంటెను అన్య మగుటచేఁ బరోక్ష మగుటవలన గానిసత్త్వముగుఱించి సంశయము గలుగఁ గాఁ దేహసన్నిధిమాత్రంబున దేహేంద్రియాదులు చేష్టించుచున్నవో అట్టి తచ్చేష్టా కారణమే బ్రహ్మ మని యుక్తిచే బ్రహ్మముయొక్క సత్త్వం బనుమానమువలన నెఱుంగవచ్చు నని బోధించుటకై, "యత్ప్రభావశ్చ" అను విశేషణముచే వివక్షిత మగు సర్వపాణిచరణోపాధిసత్త్వలక్షణ మయిన క్షేత్రజ్ఞునివిశేషితరూపమును శ్రుతిప్రసిద్ధ మయినదానిఁ బ్రతిపాదించుచున్నారు — తత్=ఏది జ్ఞేయం బని యుపక్రమింపఁబడెనో అట్టి యనాదిమత్త్వాదిలక్షణ మయినబ్రహ్మము; సర్వతః పాణిపాదమ్=అంతటను—సర్వపాణిసంబంధులైన పాణులును పాదములును గలది, పాణిపాదపదము ఇతరకర్మేంద్రియముల కుపలక్షణము సర్వతః అక్షిశిరోముఖమ్=అంతటను నేత్రములును శిరస్సులును ముఖములును గలది, అక్షిపదము ఇతరజ్ఞానేంద్రియములకును మనోబుద్ధ్యాదులకు నుపలక్షణము. శిరస్సు లనుటచే దేహము లనేకము లని సూచింపఁబడుచున్నది. ఘటమఠాదివిశేషణములచే నాకాశం బెట్లో యట్లు బ్రహ్మాదిపిపీలికాంతదేహవిశేషణములచే నామరూపములచేత బ్రహ్మము విశేషిత మగుచున్న దని యర్థము. సర్వతః శ్రుతిమత్=అంతటను శ్రోత్రములు గలది. లోకే=లోకింపఁబడుచున్నది — చూడఁబడుచున్నది కావున లోక మనఁగా ప్రాణివర్గము, దానియందు, ద్వితీయార్థమున సప్తమి, లోకమును—ప్రాణిసముదాయమును ప్రకృతిని ప్రాకృతమును; సర్వమ్ = సమస్తమును; వెలుపలను లోపలను అంతటను స్వరూపచైతన్యము చేత, ఆవృత్య = ఘటమఠాదికమును ఆకాశము వలె వ్యాపించి;

* ఈశ్లోకమున కీవ్యాఖ్యానము లేదు.

తిష్ఠతి=ఉన్నది. అది తాను వ్యాపించిన దేహేంద్రియాదికమును అయస్సును అయస్కాంతమువలెఁ జేష్టింపఁజేయుచున్నది, తాను చలింప దని యర్థము. నిర్విశేష మగుబ్రహ్మమునకు ఈపాణిపాదాదివిశేషణవిశేషిత మగురూపము ఔపాధికము మాయికం బని యెఱుంగవలయును. స్వాభావిక మేమో కాదు. స్వాభావిక మగు నేని నిషేధించుట సంభవింపదు. నిషేధింపఁబడుచున్నది గదా సవిశేషరూపము «నస త్తన్నాసదుచ్యతే» అని. అప్పు డిది యప్రామాణిక మందు వేని, కాదు. «సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్। సర్వతః శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి॥ సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్। సర్వస్య ప్రభు మీశానం సర్వస్య శరణం సుహృత్" ఇత్యాదిశ్రుతిప్రమాణకం బగుటవలన. అది మాయేశ్వరరూపము, వ్యవహారమున సత్యమే, దాని నారాధించి తత్ప్రసాదంబున ముముక్షువు ముక్తిని బొందుచున్నాఁడు. అట్లు చెప్పఁబడినది గూడ «మత్కర్మకృన్మత్పరమః" అని. నిర్విశేషుం డగుక్షేత్రజ్ఞాత్మకు సవిశేషస్వరూపము నుపన్యసించుట తత్సద్భావము నిరూపించుటకొఱకు. సర్వతః పాణిపాదాదిలక్షణ మయిన క్షేత్రమును ఎఱుంగుచున్నాఁడు, లేక, తత్క్షేత్రధర్మములచేఁ దా నెఱుంగఁబడుచున్నాఁడు, కావున ఆత్మ క్షేత్రజ్ఞుఁ డనఁబడుచున్నాఁడు. పాణిపాదబుద్ధీంద్రియాదులు చేతనశక్తివలననే స్వవ్యాపారములు చేయుచున్నవి, తాము జడము లగుటవలన, చర్మదారుమయప్రతిమాదులవలె. జడము లయిన దేహేంద్రియాదులు చేతనుఁ డధిష్ఠాతగాఁ గలవి, బుద్ధిపూర్వక మగునప్రవృత్తి గలవి యగుటవలన, రథాదులవలె. ఇవ్విధముగా సర్వప్రాణిదేహేంద్రియాద్యుపాధులచే జ్ఞేయ మగు బ్రహ్మముయొక్క అస్తిత్వము తెలియవచ్చుచున్నది. ఇందుకొఱకే క్షేత్రజ్ఞుఁ డగునాత్మ యసంగుఁ డైనను అతనికి ఔపాధికమై మిథ్యాభూతమైనను పాణిపాదాదిమత్త్వము నంగీకరించి చెప్పినాఁడు భగవంతుఁడు ముముక్షువులకు ఆత్మతత్త్వము దెలియుటకొఱకు, శాఖాగ్రమునందుఁ జంద్రుఁ డున్నాఁ డన్నట్లు. అందువలన «నస త్తన్నాసదుచ్యతే» అని చెప్పఁబడినదియే పారమార్థికరూపము. ఇందుచే పరస్పరభిన్నము లయినసర్వక్షేత్రములయందును క్షేత్రజ్ఞుఁ డగునాత్మకు నేకత్వంబును స్వసన్నిధిమాత్రంబున తత్తద్దేహేంద్రియాదిప్రవృత్తినిమిత్తత్వంబును తాను ప్రవర్తకుం డగుటచేఁ దనచేఁ బ్రవర్తింపఁజేయఁబడు నాదేహేంద్రియాదులకంటె భిన్నత్వంబును నిరవయవత్వంబును నిత్యత్వంబును చేతనత్వంబును అసంగత్వంబును అసంసారిత్వంబును పూర్ణత్వంబును బోధింపఁబడినవి.

ము. ఇట్లు నిరుపాధికంబగు బ్రహ్మము సచ్ఛబ్దప్రత్యయములకు విషయము గాదని చెప్పుటచేఁ గలుగు నసత్త్వాశంక "నాసత్" అనుటచే నిరాకరింపఁబడినను విస్తరంబున నయ్యాశంకను నివర్తించుటకై సర్వప్రాణికరణోపాధిద్వారంబునఁ జేతన క్షేత్రజ్ఞరూపతచే బ్రహ్మముయొక్క యస్తిత్వము బ్రతిపాదించుటకై చెప్పుచున్నాఁడు.—సర్వతః—సమస్తము లయిన దేహములయందును, పాణులును పాదములును అచేతనములు తమతమ వ్యాపారములయందుఁ బ్రవర్తింపఁ జేయఁ దగినవి యే చేతనునకు క్షేత్రజ్ఞునకుఁ గలవో అట్టి సర్వతఃపాణిపాదము జ్ఞేయ మగు బ్రహ్మము. సమస్తము లయినయచేతనముల ప్రవృత్తులును చేతనాధిష్ఠానపూర్వకంబు లగుటవలన, అట్టి సర్వాచేతనప్రవృత్తిహేతు వగు చేతనము క్షేత్రజ్ఞ మయిన బ్రహ్మమందు నాస్తితాశంక సంభవింప దని యర్థము. ఇట్లు, సర్వదేహములయందును అక్షులును శిరస్సులును ముఖములును దేనికిఁ బ్రవర్తనీయములై కలవో అది సర్వతోఽక్షిశిరోముఖము. ఇట్లు, సర్వతః శ్రుతులు—శ్రవణేంద్రియములు దేనికిఁ బ్రవర్తనీయములు గలవో అది సర్వతశ్శ్రుతిమంతము. లోకే=సర్వప్రాణినికాయమునందు. నిత్యంబును విభువును ఏకమే యగు తాను, సర్వమ్ = సమస్త మయిన యచేతనవర్గమును; ఆవృత్య=తన సత్తచేతను స్ఫూర్తిచేతను ఆధ్యాసికసంబంధమున వ్యాపించి; తిష్ఠతి= నిర్వికార మైయే యున్నది, దాని స్వాధ్యస్త మగు జడప్రపంచముయొక్క దోషముతోఁ గాని గుణములతోఁ గాని యణుమాత్రముతో నైనను సంబంధింప దని యర్థము. సర్వదేహములయందును నిత్యంబును విభువు నగు చేతన మొక్కటే గాని ప్రతిదేహమును భిన్నము గా దని మున్నె ప్రపంచింపఁబడినది.

శ్రీ. ఓయీ! ఇట్లు బ్రహ్మము సకలసద్విలక్షణంబందువేని "సర్వం ఖల్విదం బ్రహ్మ, బ్రహ్మైవేదం సర్వమ్" ఇత్యాదిశ్రుతులు విరోధించును. అని యాశంకించి, "పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" ఇత్యాదిశ్రుతిప్రసిద్ధ మయిన యచింత్యశక్తిచే బ్రహ్మముయొక్క సర్వాత్మతను బ్రతిపాదించుటకై చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—సర్వతః— అంతటను పాణులును పాదములును గలదియు, సర్వతః అక్షులును శిరస్సులును ముఖములును గలదియు, సర్వతః శ్రుతిమత్ — శ్రవణేంద్రియములు గలదియునై, లోకే, సర్వమ్, ఆవృత్య—వ్యాపించి, తిష్ఠతి—సర్వప్రాణివృత్తులైన పాణ్యాద్యుపాధులచే సర్వవ్యవహారాస్పదమై యున్నదని యర్థము.

బడుచున్నది. పురుషుఁడు— జీవుఁడు దానిచేఁ జేయఁబడిన సుఖదుఃఖములభోక్తృత్వమునందు హేతు వని చెప్పఁబడుచున్నాఁడు. ఇది భావము.—అచేతన మగు ప్రకృతికిఁ దనయంతఁ దనకుఁ గర్తృత్వము సంభవింపదు, అట్లు పురుషునకును అవిక్రియునకు భోక్తృత్వము సంభవింపదు వాస్తవమే. అయినను, కర్తృత్వ మనఁగా క్రియానిర్వర్తకత్వము. అది యచేతనమునకును జేతనాదృష్టవశమువలన సంభవించుచున్నది. అగ్నియందు ఊర్ధ్వజ్వలనంబును వాయువునందుఁ దిర్యగ్గమనంబును శిశువుయొక్క యదృష్టవశమువలన స్తన్యము స్రవించుటయుఁ జూచుచున్నాము గదా! అందువలనఁ బురుషసన్నిధానమువలనఁ బ్రకృతికిఁ గర్తృత్వము చెప్పఁబడుచున్నది. భోక్తృత్వ మనఁగా సుఖదుఃఖముల నెఱుంగుట, అది చేతనధర్మమే కావునఁ బ్రకృతిసన్నిధానమువలనఁ బురుషునకు భోక్తృత్వము చెప్పఁబడుచున్నది.

ప. *

రా. కార్యము—శరీరము, కారణములు— మనస్సహితములైన జ్ఞానకర్మేంద్రియములు, అవి క్రియాకారు లగుటయందుఁ బురుషాధిష్ఠిత మయిన ప్రకృతియే హేతువు. పురుషాధిష్ఠితక్షేత్రాకారపరిణత మైన ప్రకృతి భోగసాధనభూతము లగు క్రియల కాశ్రయ మని యర్థము. పురుషుం డధిష్ఠాతమాత్రమే గదా! దాని నపేక్షించియే « కర్తా శాస్త్రార్థవత్త్వాత్ » ♦ ఇత్యాదికము చెప్పఁబడినది. శరీరాధిష్ఠానప్రయత్నహేతుత్వమే గదా పురుషునకుఁ గర్తృత్వము. ప్రకృతిసంసృష్టుఁ డగుపురుషుఁడు, సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతుః — సుఖదుఃఖానుభవమున కాశ్రయ మని యర్థము.

మా. కార్యము—శరీరము, « శరీరం కార్య ముచ్యతే » అని నిఘంటువు. కారణములు—ఇంద్రియములు. భోగము—అనుభవము. పురుషుఁడు గదా చిద్రూపుఁ డగుటవలన ననుభవించుచున్నాఁడు. ప్రకృతియో జడ మగుటవలనఁ బరిణామి. « కార్యకారణకర్తృత్వే కారణం ప్రకృతిం విదుః । భోక్తృత్వే సుఖదుఃఖానాం పురుషం ప్రకృతేః పరమ్ » ❡ అని భాగవతమునందు.

* శ్రీధరీయముతో సమానము.

♦ శారీరకము, అ—౨. పా—3. సూ—33.

❡ కార్యకారణములకర్తృత్వమునందుఁ బ్రకృతిని గారణముగా [illegible]ంగిరి. సుఖదుఃఖముల యనుభవమునందు ప్రకృతికంటెఁ బరుం డగు పురు[illegible] గారణము[illegible].

పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్
కారణం గుణసఙ్గో ఽస్య సదసద్యోనిజన్మసు. ౨౧

**భా.** పురుషునకు సుఖదుఃఖములభోక్తృత్వమే సంసారిత్వ మని చెప్పఁబడినది, అది యతని కెందువలన నగుఁగాఁ జెప్పుచున్నాఁడు —పురుషః= భోక్త; ప్రకృతిస్థః = అవిద్యాలక్షణ మయినప్రకృతియందు కార్యకరణ రూపంబునఁ బరిణమించినదానియందు ఉన్నవాఁడు, ఆప్రకృతినే తా నని పొందినవాఁ డని యర్థము; హి=ఎంగునలననో; అందువలన, భుఙ్క్తే— ఎఱుంగుచున్నాఁ డని యర్థము; ప్రకృతిజాన్ = ప్రకృతివలనఁ బుట్టిన వగు; గుణాన్ = సుఖదుఃఖమోహాకారముగ నభివ్యక్తము లయినగుణములను; నేను సుఖిని దుఃఖిని మూఢుఁడను బండితుఁడను ఇత్యాదిగా అవిద్య యున్నను సుఖదుఃఖమోహాగుణములు భుజింపఁబడు చుండునప్పుడు వాని యందు సంగము—ఆత్మభావ మేది గలదో అది ప్రధానకారణము జన్మాది సంసారమునకు, «స యథాకామో భవతి తత్క్రతు ర్భవతి» ఇత్యాది శ్రుతివలన. దానినే చెప్పుచున్నాఁడు.—అస్య = ఈభోక్త యగుపురుషు నకు; సదసద్యోనిజన్మసు = ఉత్తమములును అధమములు నగుయోను లందుఁ బుట్టుకలయందు; గుణసఙ్గః=గుణములయం దాసక్తి; కారణమ్= హేతువు. లేక. సదసద్యోనిజన్మములయందు వీనికి సంసారమునకు గుణసంగము కారణ మని సంసారపదము నధ్యాహరింపవలయును. సద్యోనులు—దేవాదియోనులు, అసద్యోనులు—పశ్వాదియోనులు, సామ ర్థ్యమువలన సదసద్యోనులు మనుష్యయోను లనుటయు నవిరుద్ధ మని యెఱుంగునది. ఇది యభిప్రాయము— ప్రకృతిస్థత్వరూప మయినయవిద్య యు గుణములయందు సంగమును—కామమును సంసారమునకుఁ గారణ మని. అదియు వర్జించుటకొఱకుఁ జెప్పఁబడుచున్నది. దీనికి నివృత్తికార ణము వైరాగ్యముచే సన్న్యాసయుక్త మగుజ్ఞానము గీతాశాస్త్రమునం బ్రసిద్ధము. ఆజ్ఞానము క్షేత్రక్షేత్రజ్ఞవిషయ మని ముందే యుపన్యసింపఁ బడినది. «యద్జ్ఞాత్వా ఽమృత మశ్నుతే» ఇత్యాదిగా అన్యాపోహ ముచేతను అతద్ధర్మాధ్యారోపముచేతను బ్రతిపాదింపఁబడినది గూడ.

పురుషుఁడు దేహేంద్రియాదిరూపములఁ బరిణమించి యుండుప్రకృతిని అది తానే యని తలఁచి పొంది యున్నవాఁ డగుటవలనఁ బ్రకృతివలనఁ గలుగుసుఖ

దుఃఖాదిగుణములను నేను సుఖిని నేను దుఃఖిని ఇత్యాదిగా భుజించుచున్నాఁడు. వీనికి అవిద్యమాత్రమే గాక యీప్రకృతిగుణములందు ఆసక్తి కూడ దేవబ్రాహ్మణాద్యుత్తమయోనులందును పశ్వాద్యధమయోనులందును జన్మాదిసంసారమునకుఁ గారణము. కావున దాని వర్జింపవలయు నని తా.

ఆ. మీఁదిశ్లోకమును ప్రశ్నమునకు త్తరముగా దించుచున్నారు పురుషునకు ఇత్యాదిగా. నిమిత్తమును జెప్పుటకై మొదట వీనికి సంసారిత్వము అవిద్యతో ఐక్యాధ్యాసమువలన నని చెప్పుచున్నారు పురుషః ఇత్యాదిగా. గుణవిషయము ఁభోగమునే వివరించుచున్నారు నేను ఇత్యాదిగా. అవిద్య భోగహేతువై యుండఁగా కారణము నేల విచారింపవలయు నని యాశంకించి చెప్పుచున్నారు అవిద్య ఇత్యాదిగా. సంగము జన్మాదిసంసారమునకుఁ బ్రధానహేతు వనుటకుఁ బ్రమాణము చెప్పుచున్నారు స యథే త్యాదిగా. చెప్పినయర్థమునందు ఉత్తరార్థము దించి వ్యాఖ్య చేయుచున్నారు దానినే ఇత్యాదిగా. అధ్యాహారసహితముగా వ్యాఖ్యానాంతరము చేయుచున్నారు లేక ఇత్యాదిగా. సదసద్యోనులను వివేచించి వివరించుచున్నారు సద్యోనులు – ఇత్యాదిగా. యోనిద్వయము నిర్దేశించుటవలన మధ్యవర్తు లగుమనుష్యయోనులు గూడ ధ్వనితము లని చెప్పుచున్నారు సామర్థ్యము వలన నిత్యాదిగా. సంగమే ప్రధానకారణ మగునేని అవిద్య తత్కారణ మనుటకు లేదు, ఇక్కారణమువలననే సంసార ముత్పన్న మగుటవలన నని యాశంకించి చెప్పుచున్నారు ఇది యభిప్రాయము ఇత్యాదిగా. అవిద్య యుపాదానకారణము, సంగము నిమిత్తకారణము, కావున రెంటికిని కారణత్వము సిద్ధించుచున్నది యని యర్థము. రెండువిధము లయినహేతువులు చెప్పుటకు వివక్షిత మయినఫలముఁ జెప్పుచున్నారు అదియు ఇత్యాదిగా. సంగసహిత మగునజ్ఞానము తనంత నివర్తిల్లదు కావునఁ దన్నివర్తకము చెప్పవలయు నని యాశంకించి చెప్పుచున్నారు దీనికి ఇత్యాదిగా. వైరాగ్యముచే సన్న్యాసము సిద్ధించును, తత్పూర్వక మయినజ్ఞానము సంగసహితాజ్ఞాననివర్తక మని యర్థము. ఈజ్ఞానమునందుఁ బ్రమాణము చెప్పుచున్నారు గీ తేత్యాదిగా. అధ్యాయాదియందును ఈజ్ఞాన ముదాహరింపఁబడిన దని చెప్పుచున్నారు ఆజ్ఞానము ఇత్యాదిగా. ఆజ్ఞానమే యదృక్షా త్రేత్యాది నసత్తన్నా ఒసదిత్యంతగ్రంథముచే అతన్నిషేధముచేతను సర్వతః పాణిపాద మిత్యాదిగ్రంథముచే, అతద్ధర్మాధ్యాసముచేతను చెప్పఁబడిన దన్ని చెప్పుచున్నారు యదృక్షా త్రేత్యాదిగా.

శ౦. ఓయీ! ప్రకృతిపురుషులు నిత్యులగుటవలన తత్సంబంధమును ఆత్మకు నిత్యము కావలయును అందుచే సంసారముగూడ నిత్యమే యగును. ఇఁక ఎప్పుడు ఎట్లు లాత్మకు సంసారమోక్షము సిద్ధింపఁ గలదు? అని యాశంకింపఁగా, ఆత్మకు బుద్ధ్యాదిసంబంధము నిత్యము కాఁజాలదు, నిరవయవమునకును సావయవమునకును సంయోగసమవాయాదిసంబంధ మేదియు సంభవింపమివలన. మఱి యేమనఁగా అధ్యాసికసంబంధ మని చెప్పవలయును. అది స్వాజ్ఞానముచేతనే కలిగినది కావున వివేకవిజ్ఞాన ముదయింపఁగానే తప్పక నివర్తిల్లును—అని బోధించుటకై యాత్మకుఁ బ్రకృతిసంబంధమువలన సంసారంబును దత్కారణంబును విశదీకరించుచున్నాఁడు.—పురుషః=చెప్పినలక్షణములు గల ఆత్మ; తాను కూటస్థాసంగచిద్రూపుఁడైనను, ప్రకృతిస్థః = ప్రకృతి యనఁగా కార్యకరణసంఘాతము, తన్నుఁ దెలియక యదియే నేనని తదాత్మకుండై యున్నవాఁడు ప్రకృతిస్థుఁడు, శరీరతాదాత్మ్యము నొందుటచే స్వస్థుఁడు కాఁడని యర్థము; అందువలననే తద్ధర్మములును తత్కర్మములును గలవాఁడై, ప్రకృతిజాన్ = బుద్ధ్యాదిస్థూలాంతరూప మయిన ప్రకృతివలనఁ బుట్టిన; గుణాన్=ప్రాకృతగుణములను, దేహగుణములు బాల్యస్థౌల్యాదులు, ఇంద్రియగుణములు కాణత్వఖంజత్వాదులు, ప్రాణగుణములు క్షుధితత్వాదులు, మనోగుణములు సమీచీనత్వాదులు, బుద్ధిగుణములు కర్తృత్వభోక్తృత్వాదులు, ఈస్థూలసూక్ష్మకారణదేహధర్మములను సుఖదుఃఖాదిప్రత్యయములను తనవిగాఁదలఁచి; భుఙ్క్తే—నేను మనుష్యుఁడను బ్రాహ్మణుఁడను గృహస్థుఁడను యతిని మూఢుఁడను పండితుఁడను శిష్టుఁడను భ్రష్టుఁడను కర్తను భోక్తను సుఖిని దుఃఖిని అనియు నాది యిది యనియు దాను బ్రకృత్యాత్మకుండై తద్ధర్మములైనజన్మజరాజాతివర్ణాశ్రమాదులను పుణ్యపాపాదులను స్వధర్మములనుగా ననుభవించుచున్నాఁడని యర్థము. «ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః» ఇత్యాది శ్రుతిప్రసిద్ధిని సూచించుచున్నది హిశబ్దము. తాను అన్యాత్మకుఁడై యన్యధర్మములను సమీచీనములను అసమీచీనములను తనవిగాఁ దలంచుచున్నాఁ డనునది యేది గలదో అదియే క్షేత్రజ్ఞుఁ డగువాత్మకు సంసారము. ఓయీ! అవిక్రియుఁడై యసంగుఁ డగువాత్మకుఁ బ్రకృతితాదాత్మ్యము కలుగుటకును తదీయధర్మకర్మములను దనవిగా ననుభవించుటకును ఏమి హేతువు? అని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు.—అస్య=విద్వాంసులచే ప్రాకృతుగా ఆత్మ యని యనుభవింపఁబడుచున్న కూటస్థాసంగచిద్రూపుఁ డగునియాత్మకు; సదసద్యోనిజన్మసు = సద్యోనులు దేవఋషి

బ్రాహ్మణాదిపుణ్యయోనులు, అసద్యోనులు రక్షః పిశాచ శ్వపాక పశ్వాదిపాపయోనులు, వానియందు జనించుటలయందు; నేను నాది ఇత్యాదిసంసారమునకు, కారణమ్=హేతువు; గుణసఙ్గః = గుణములయందు—దృష్టాదృష్టములగు భోగ్యములయందు, సజ్యతే—సక్తుఁడగుచున్నాఁడు పురుషుఁడు దీనిచేతఁ గావున సంగ మనఁగా కామము, కామము గదా పురుషునకు బంధము, అవిద్య యుండునపుడు పురుషుఁడు కామముచేతనే నానావిధము లగుకర్మములను జేయుచున్నాఁడు, సుఖదుఃఖాత్మకము లగుఫలములను కూడ నానాజన్మములచే ననుభవించుచున్నాఁడు, అట్లు శ్రుతి.—"స యథాకామో భవతి, కామాన్యః కామయతే మన్యమానః" ఇత్యాదికము. అందువలన నావిద్యామూలకం బగు కామమే పురుషునకు నానాయోనులందు జన్మజరామరణాదిదుఃఖానుభవమునకుఁ గారణం బని సిద్ధము. లేక. గుణసఙ్గః = సజ్యతే—బంధింపఁబడుచున్నాఁడు దీనిచేత, కావున సంగము అనఁగా గుణములయందు—దేహేంద్రియాదులయందు ఇది నేను అని అహంకారాభినివేశరూపంబును శబ్దాదులయందు ఇది భోగ్యమని భోగ్యత్వాభినివేశరూపంబు నగు నధ్యాససంబంధము. దీనినే యవిద్య యని పండితులు వక్కాణించెదరు. అవిద్యావంతుఁ డగు పురుషునకే గదా కామంబును కర్మంబును సదసద్యోనులందు జన్మాదిదుఃఖకారణములు సంభవించుచున్నవి. తన్నివృత్తికారణము ఆత్మతత్త్వవిజ్ఞానము. అదియును, "న సత్తన్నాసదుచ్యతే" అని గూఢాభిప్రాయ ప్రకృతి తద్వికార తద్ధర్మ తత్కార్య సంబంధలేశంబును లేనివాఁడని తెలుపుటకు అతన్నిషేధద్వారంబునను, తత్స్వభావావబోధముకొఱకు "జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యమ్" అని స్వరూపనిరూపణద్వారంబునను చక్కఁగా నిరూపింపఁబడినది.

మం. పురుషునకు సుఖదుఃఖభోక్తృత్వమే సంసారిత్వ మని యేది చెప్పఁబడినదో యది యతని కేందువలన ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—ప్రకృతి యనఁగా మాయ, దానిని మిథ్యాభూతమైనదానినే తాదాత్మ్యముచేఁ బొందినవాఁడు ప్రకృతిస్థుఁడు, ప్రకృతిస్థుఁడైనే పురుషుఁడు; ప్రకృతిజాన్ గుణాన్, భుఙ్క్తే = అనుభవించుచున్నాఁడు. అందువలనఁ బ్రకృతిజగుణసంబంధహేతువు లయిన, సదసద్యోనిజన్మసు—సద్యోనులు దేవాదులు, వానియందు ఇష్టమయినసాత్త్వికఫలము గదా భుజింపఁబడును, అసద్యోనులు పశ్వాదులు, వానియందుఁ దామస మగు ననిష్టఫలము గదా భుజింపఁబడుచున్నది, సదసద్యోనులు ధర్మాధర్మమిశ్రము లగుటవలన బ్రాహ్మణాదిమనుష్యయోనులు, వానియందు రాజస మగుమిశ్రఫలము గదా భుజిం

పంబడును, అట్టివానియందు; అస్య=ఈపురుషునకు; గుణసఙ్గః=సత్త్వరజస్తమోగుణాత్మకప్రకృతి తాదాత్మ్యాభిమానమే; కారణము. కాని యసంగుం డగు నతనికి స్వతస్సంసారము లే దని యర్థము. లేక గుణసఙ్గః = గుణములయందు—సుఖదుఃఖమోహాత్మకము లగు శబ్దాదులయందు, సంగము—అభిలాష. కామ మని యర్థము; అదియే యితనికి సదసద్యోనిజన్మములయందుం గారణము, "స యథా కామో భవతి తత్క్రతుర్భవతి యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే యత్కర్మ కురుతే తదభిసంపద్యతే" ♦ అను శ్రుతివలన. ఈ క్రమమునందును ప్రకృతితాదాత్మ్యాభిమానము మూలకారణముగా నెఱుంగవలయును.

శ్రీ. అయినను అవికారియు జన్మరహితుండు నగువానికి భోక్తృత్వ మెట్లనంగాం జెప్పుచున్నాండు.—హి=ఎందుకనిన; ప్రకృతిస్థః=ప్రకృతికార్యమగు దేహమునందు తాదాత్మ్యమున నున్నవాండై; అందువలన, పురుషః=పురుషుండు; ప్రకృతిజనితము లయినసుఖాదులను భుజించుచున్నాండు. అస్య=వీనికి; ఉత్తమము లయిన దేవాదియోనులందును అధమము లైన తిర్యగాదియోనులందును జన్మము లేవి గలవో వానియందు; గుణసఙ్గః=గుణములతో—శుభాశుభకర్మకారు లగు నింద్రియములతో సంగము; కారణమ్=హేతువు.

ప. *

రా. ఈప్రకారముగా అన్యోన్యసంసృష్టు లగు ప్రకృతిపురుషుల కార్యభేదము చెప్పంబడినది. పురుషుండు తాను స్వాభావికమైనసుఖుండైనను అతనికి వైషయికసుఖోపభోగహేతుత్వముం జెప్పుచున్నాండు —గుణశబ్దము తత్కార్యములం దౌపచారికము. తాను స్వానుభవసుఖుండగు, పురుషః=పురుషుండు; ప్రకృతిస్థః=ప్రకృతిసంసృష్టుండు. కావున, ప్రకృతిజాన్ గుణాన్ = ప్రకృతిసంసర్గోపాధికంబు లగుసత్త్వాదిగుణకార్యభూతము లయినసుఖదుఃఖాదులను; భుఙ్క్తే = అనుభవించుచున్నాండు. ప్రకృతిసంసర్గహేతువుం జెప్పుచున్నాండు —పూర్వపూర్వము లైనప్రకృతిపరిణామరూపము లగు దేవమనుష్యాదిరూపవిశేషములయందుండినవాండగు నిపురుషుండు తత్తద్యోనివిశేషయుక్తసత్త్వాదిగుణమయము లైనసుఖాదులయందు సక్తుండై తత్సాధన

---

♦ అతండు ఎట్టికామము గలవాండగుచున్నాండో అట్టిసంకల్పము గలవాండగుచున్నాండు ఎట్టిసంకల్పము గలవాండగుచున్నాండో అట్టికర్మము చేయుచున్నాండు ఎట్టికర్మము చేయుచున్నాండో అట్టిఫలము నొందుచున్నాండు.

* శ్రీధరీయములో సమానము.

భూతము లయినపుణ్యపాపకర్మములయందుఁ బ్రవర్తించుచున్నాఁడు. అంత ఆపుణ్య పాపములఫలము ననుభవించుకొఱకు సదసద్యోనులయందు—ఉత్తమా౽ధమయోను లందు పుట్టుచున్నాఁడు. అంత వెండియు కర్మము చేయుచున్నాఁడు. వెండియుఁ బుట్టుచున్నాఁడు. అమానిత్వాదికంబు లగు నాత్మప్రాప్తిసాధనభూతము లయిన గుణముల సేవించువఱకు నిట్లు సంసరించుచుండును. ఈయర్థము చెప్పఁబడినది. « కారణం గుణసఙ్గో౽స్య సదసద్యోని జన్మసు » అని.

మూ. ♦

ఉపద్రష్టా౽నుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చా౽ప్యుక్తో దేహే౽స్మిన్ పురుషః పరః. ౨౨

భా. దానినే వెండియు సాక్షాత్తుగా నిర్దేశించుటకై చెప్పుచున్నాఁడు.—ఉపద్రష్టా=సమీపమునుండి చూచువాఁడు తాను వ్యాపృతుఁడు గాక, ఎట్లు ఋత్విజులును యజమానుఁడును యజ్ఞకర్మమునందు వ్యాపృతు లగుచుండఁగా తటస్థుఁడు మఱియొకఁడు యజ్ఞవిద్యాపండితుఁడు తా నవ్యాపృతుఁడై ఋత్విగ్యజమానులవ్యాపారములందు గుణదోషములఁ జూచునో అట్లు కార్యకరణవ్యాపారములందు అవ్యాపృతుఁడై తద్విలక్షణుఁడై వ్యాపారయుక్తము లగు నాకార్యకరణముల సామీప్యంబునఁ జూచువాఁడు ఉపద్రష్ట. లేక. దేహచక్షుర్మనోబుద్ధ్యాత్మలు ద్రష్టలు, వారిలో బాహ్యద్రష్ట దేహము, దాని నారంభించి యంతరతముఁడై నద్రష్ట — సమీపస్థుఁ డయినద్రష్ట ప్రత్యగాత్మ, ఎవ్వనికంటె అంతరుఁడై నమఱియొకద్రష్ట లేఁడో అతఁడు అతిశయసామీప్యంబున ద్రష్ట యగుటవలన ఉపద్రష్ట యగుచున్నాఁడు. లేక, యజ్ఞోపద్రష్ట వలె సర్వమును విషయీకరించుటవలన ఉపద్రష్ట. అనుమన్తా చ = అనుమనన మనఁగా అనుమోదించుట—చేయువారికార్యములందుఁ బరితోషము, దానిఁ జేయువాఁడు. లేక. అనుమన్తా = కార్యకరణప్రవృత్తుల యందు దాను ప్రవృత్తుఁడు కాక యున్నను ప్రవృత్తునియట్లు తిదనుకూలుఁడై కనఁబడుచున్నాఁడు కావున అనుమంత. లేక. స్వవ్యాపారముల యందుఁ బ్రవృత్తము లైనకార్యకరణములను తత్సాక్షిభూతుఁడై యెప్పు

♦ దీని కిభాష్యము లేదు.

డును నివారింపఁడు కావున అనుమంత. భర్తా = భరణ మనఁగా చైతన్యాత్మాధీనప్రయోజనత్వము నిమిత్తముగాఁ జైతన్యాభాసము లగు సంహతములైన దేహేంద్రియమనోబుద్ధులకు స్వరూపధారణము, అది చైతన్యాత్మకృతమే కావున, భర్త — భరించువాఁ డని యాత్మ చెప్పఁబడుచున్నాఁడు. భోక్తా—అగ్ని యుష్ణమువలె నిత్యచైతన్యస్వరూపంబున బుద్ధియొక్క సుఖదుఃఖమోహాత్మకము లైన సర్వవిషయగోచరము లగు ప్రత్యయములు చైతన్యాత్మచే గ్రస్తములుం బోలెఁ బుట్టుచు విభక్తము లై విభావింపఁబడుచున్నవి కావున భోక్త — ఎఱుంగువాఁ డని ఆత్మ చెప్పఁబడుచున్నాఁడు. మహేశ్వరః = సర్వాత్మ యగుటవలనను స్వతంత్రుఁ డగుటవలనను గొప్పవాఁడును ఈశ్వరుఁడును కావున మహేశ్వరుఁడు. పరమాత్మా = అవిద్యచే ప్రత్యగాత్మత్వంబునఁ గల్పితము లగు దేహాదిబుద్ధ్యంతములకు పరముఁడు—ఉపద్రష్ట్రుత్వాదిలక్షణుఁ డగు ఆత్మ కావున పరమాత్మ, ఇతిచా ఽపి = అనియును, "అన్తః పరమాత్మా" అనియును; ఉక్తః = పరమాత్మశబ్దముచేతఁ గూడ చెప్పఁబడెను శ్రుతియందు. ఎందున్నాఁ డతఁడు? అస్మిన్ దేహే = ఈ దేహమునందు. పరః = అవ్యక్తముకంటెఁ బరుఁ డగు; పురుషః = పురుషుఁడు, "ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః" అని యెవ్వఁడు చెప్పఁబడఁబోవుచున్నాఁడో. "క్షేత్రజ్ఞం చా ఽపి మాం విద్ధి" అని యెవ్వఁడు చెప్పఁబడినాఁడో, మాచే వ్యాఖ్యానముచేసి యుపసంహరింపఁబడెనో, అతఁడు ఈదేహమునం దున్న పరుఁ డగుపురుషుఁడు.

ఈదేహమునం దున్న యవ్యక్తాతీతుం డగుపరమపురుషుఁడు, కార్యకరణములవ్యాపారము లన్నియుఁ దాను నిర్వికారుండై సమీపంబున నుండి చూచువాఁడగుటవలన ఉపద్రష్ట యనియు, తద్వ్యాపారములను దాను నివారింపక యనుమోదించుటవలన అనుమంత యనియు, తనచైతన్యముచేతనే వానికి స్వరూపధారణము చేయుటవలన భర్త యనియు, తద్వృత్తుల నన్నిటిని విభాగముతో నెఱుంగుటవలన భోక్త యనియు, తాను వాని కన్నిటికిని అతీతుఁడై స్వతంత్రుఁ డగుటవలన మహేశ్వరుఁ డనియు, అవిద్యచే ఆత్మత్వంబునఁ గల్పితము లైనదేహేంద్రియాదుల యన్నిటికంటె ఉత్కృష్టుం డగుటవలనఁ బరమాత్మ యనియుఁ జెప్పఁబడుచున్నాఁ డని తాత్పర్యము.

తా. ప్రకృత మైన మోక్షహేతు వగుజ్ఞానమునే సాక్షాత్తుగా నిర్దేశించుట కై యుత్తరశ్లోకంబున దానిని నవతారిక చేయుచున్నారు దానినే ఇత్యాదిగా. వ్యాపారవంతము లగు కార్యకరణంబులసమీపంబున నున్నవాఁడై సన్నిధిమాత్రంబున దానికి సాక్షి యని యర్థ మని యుపద్రష్ట యనుపదమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు సమీపమున నిత్యాదిగా. లోకమునందలి ద్రష్టవలె నితఁడు గూడ వ్యాపారవిశిష్టుఁ డనుటచే నిష్క్రియుం డనుట విరోధించు నని యాశంకించి చెప్పుచున్నారు తాను ఇత్యాదిగా. తాను వ్యాపారవంతుఁడు గాక సన్నిధిమాత్రమున ద్రష్ట యగుటను దృష్టాంతముచే స్పష్టీకరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. ఉపద్రష్టా యనుపదమున కర్థాంతరముఁ జెప్పుచున్నారు లేక ఇత్యాదిగా. అనేకులు ద్రష్టలైనను వారిలో నెవ్వఁ డుపద్రష్ట? అనఁగాఁ జెప్పుచున్నారు వారిలో నిత్యాదిగా. ఉపయను నుపసర్గము సామీప్యార్థక మగుటచే దానికి ప్రత్యక్కు అర్థము, అందే సామీప్యము సమాప్త మగుటవలన. ప్రత్యగాత్మయు ద్రష్టయు నగువాఁ డుపద్రష్ట, సర్వసాక్షి యగుప్రత్యగాత్మ యని యర్థము. చెప్పినయర్థమునే స్పష్టీకరించుచున్నారు ఎవ్వనికంటె నిత్యాదిగా. ఎట్లు యజ్ఞకర్మమునందు యజమానుని యొక్కయు ఋత్విజులయొక్కయు గుణమునుగాని దోషమునుగాని సర్వయజ్ఞాభిజ్ఞుం డగు నుపద్రష్ట యెఱుంగుచున్నాఁడో అట్లు చిన్మాత్రస్వభావుం డగు నీయాత్మ సర్వంబును విషయీకరించుచున్నాఁడు కావున నుపద్రష్ట యని పక్షాంతరముఁ జెప్పుచున్నారు యజ్ఞేత్యాదిగా. అనుమన్తా చ యనుదానికి వ్యాఖ్య చేయుచున్నారు అనుమన్తా చ ఇత్యాదిగా. ఎవ్వరు కార్యము చేయుచున్నారో — వ్యాపారవంతు లగుచున్నారో వారు చేయుచుండఁగా వారికార్యములు లేని కలవో వానియందుఁ గార్యవ్యవస్థయందుఁ బరితోషము అనుమననము, అదియే యనుమోదించుట, దాని సన్నిధిమాత్రంబున నెవ్వఁడు చేయుచున్నాఁడో అతఁడు అనుమంత. వ్యాఖ్యాంతరము చేయుచున్నారు లేక అపి. దానినే స్ఫుటీకరించుచున్నారు నార్త్యేత్యాదిగా. అర్థాంతరము చెప్పుచున్నారు స్వవ్యాపారములయందు ఇత్యాదిగా. భర్తా యనుపదమునకు వ్యాఖ్యానము చేయును భరణమును నిరూపించి యాత్మకు భర్తృత్వము సాధించుచున్నారు భర్తేత్యాదిగా. భోక్త యనుటచే క్రియావత్త్వము ప్రాప్తింపఁగా «భోగశ్చిదవసానతా» అనున్యాయమున వివరించుచున్నారు అగ్నీత్యాదిగా. విశేషణాంతరము దీసి వ్యాఖ్యానము చేయుచున్నారు మహేశ్వరః ఇత్యాదిగా. పరమాత్మత్వము నుపపాదించుచున్నారు అవిద్యచే నిత్యాదిగా. పరముఁడు — ఉత్కృష్టుఁడు అతఁడే

పూర్వోక్తవిశేషణవిశిష్టుఁడని భావము. పరమాత్మశబ్దము ప్రత్యగాత్మవిషయము మగుటయందు శ్రుతిని ప్రమాణీకరించుచున్నారు అస్మి న్పరమాత్మా అసి. అతనికిఁ బ్రశ్నద్వారమునఁ దటస్థత్వము నిరాకరించుచున్నారు ఎంకు ఇత్యాదిగా. దేనికంటెఁ బరుఁడు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు అవ్యక్తమునకంటె నిత్యాదిగా. అందే వాక్యశేషము ప్రదర్శించుచున్నారు ఉత్తమ ఇత్యాదిగా శోధితము లగు తత్త్వంపదార్థముల నైక్యజ్ఞానమును మున్ను చెప్పినదానిని ఫలప్రతిపాదనముచే స్తుతించుచున్నారు క్షేత్రజ్ఞం చేత్యాదిగా.

హ.

శ్లో. మఱియు నావరతత్త్వమునే ముముక్షువులకుఁ జక్కఁగాఁ దెలుపుటకై యాత్మకుఁ బ్రకృతితత్కార్యసంబంధరహితత్వంబును అందుచే శుద్ధుఁడై దేహకరణుఁడైనవానికి బ్రహ్మాభిన్నత్వంబును బోధించుచున్నాఁడు — అస్మిన్ దేహే = ఈ కార్యకరణసంఘాతరూప మయిన శరీరమునందు; ఎవ్వఁడు అస్మత్ప్రత్యయార్థమయిన, పురుషః=ఆత్మ గలఁడో అతఁడు; పరః=దేహేంద్రియాదులకంటె భిన్నుఁడే యగుచున్నాఁడు. అది యెందువలన ననఁగా. ఉపద్రష్టా = సర్వమునకును ద్రష్ట చిదాభాసుఁడు, వానిని వానివ్యాపారమును సాక్షియై మీఁదనుండి చూచుచున్నాఁడు కావున ఉపద్రష్ట. లేక. ఉప—సమీపమునందు బుద్ధికన్నను అంతరుఁడై ప్రత్యక్త్వంబున నున్నవాఁడై బుద్ధిని తద్వ్యాపారంబును దృశ్యజాతమును సర్వంబును సాక్షాత్తుగా అవిక్రియస్వరూపంబున చూచుచున్నాఁడు కావున ఉపద్రష్ట హేతుగర్భితం బీవిశేషణము. ఆత్మ బుద్ధ్యాదులకన్న భిన్నుఁడు, ఉపద్రష్ట యగుటవలన, యజ్ఞోపద్రష్టవలె. యజ్ఞోపద్రష్ట యజమానఋత్విజులలోఁ జేరినవాఁడు కాఁడు గదా! వారిలోఁ జేరినవాఁ డగునేని యుపద్రష్టృత్వ మనుపపన్న మగుటవలన. ఉపద్రష్ట యనఁగా వ్యాపారవంతులకంటె భిన్నుఁడై తా నవ్యాపృతుఁడై తాటస్థ్యంబున వ్యాపారవంతులను తద్వ్యాపారములను జూచుచుండువాఁడు. కావున నెట్లుపద్రష్ట ద్రష్టవ్యు లగు యజమానాదుల యందఱికంటె భిన్నుఁడే యగుచున్నాఁడో అట్లీయాత్మయు నుపద్రష్ట యగుటవలన బుద్ధ్యాదులకంటె భిన్నుఁడే యగుచున్నాఁడు. ఇందుచే ఆత్మకు అవికారిత్వంబును నిత్యత్వంబును అకర్తృత్వంబును అభోక్తృత్వంబును సూచితమగుచున్నది. మఱియును. అనుమన్తా=స్వస్వవిషయములందుఁ బ్ర

* శ్రీశంకరభాష్యముచే గతార్థము.

ప్రవృత్తములు నివృత్తములు నగు బుద్ధ్యాదులను అను — వెంటనే మనుతే — ఎఱుంగుచున్నాఁడు కావున అనుమంత, బుద్ధ్యాదుల ప్రవృత్తిని నివృత్తిని తత్ఫలములను తదన్యుఁడైయే యెఱుంగుచున్నవాఁ డని యర్థము, «ఉపద్రష్టా ఽనుమన్తైష ఆత్మా» అను శ్రుతివలన. ఇందుచే, ఆత్మ దేహాదులకంటెఁ బరుఁడే యగుచున్నాఁడు, అనుమంత యగుటవలన, తటస్థునివలె—అని యాత్మకుఁ బ్రకృతి ప్రాకృతములకంటె భిన్నత్వమును సాధించునట్టి యనుమానము సూచితము. చకారమునకు సముచ్చయ మర్థము. మఱియును. భర్తా=స్వావిద్యచేఁ దనయం దధ్యస్తము లయిన మహదాది సర్గవికారములను సత్తాస్ఫూర్తుల నొసంగుటచే భరించుచున్నాఁడు కావున భర్త. జలతరంగఫేనబుద్బుదాదులకు మరుభూమివలెఁ దనయం దారోపితము లయిన దేహాదిశబ్దప్రత్యయములకుఁ దానే యధిష్ఠానమై సత్తను స్ఫూర్తిని గలిగించుచున్నాఁ డాత్మ యని యర్థము. భర్త భరణీయములకంటె భిన్నుఁడే కావున భర్తృత్వముగూడ ఆత్మ దేహాదులకంటె భిన్నుఁ డనుటకుఁ బూర్వమువలె వ్యావర్తకవిశేషణము. మఱియును. భోక్తా=తనయం దధ్యస్తమైన యవ్యాకృతాదిస్థూలాంతమును సర్వంబును చైతన్యాత్మక మగు స్వతేజస్సుచేఁ దమస్సును సూర్యుఁడుంబోలె భుజించుచున్నాఁడు—తనయందే తిరోభూతముగాఁ జేయుచున్నాఁడు కావున భోక్త, భ్రాంతిదశయందు నానారూపంబునఁ దానే ప్రతీతుఁడైనను సమ్యగ్జ్ఞానదశయందుఁ దానుమాత్రమే మిగిలినవాఁ డగుచున్నాఁ డని యర్థము. భోక్త భోజ్యముకంటె భిన్నుఁడే కావున భోక్తృత్వముగూడ ఆత్మకు దేహాదిభిన్నత్వమునందుఁ బూర్వమువలె వ్యావర్తకవిశేషణము. మఱియును. మహేశ్వరః = అవ్యక్తము కన్నను స్థూలతముఁ డగుటవలన, మహాన్ — గొప్పవాఁడు « మహతో మహీయాన్ » అను శ్రుతివలన, మహత్త్వము గూడ ఆత్మకు దేహాదిభిన్నత్వమునందు హేతువు, ఆత్మ దేహాదులకంటె భిన్నుఁడు, మహత్త్వమువలన ఆకాశమువలె, మహత్త్వ మనఁగా అపరిచ్ఛిన్నత్వము, పరిపూర్ణవస్తువునకుఁ బరిచ్ఛిన్నత్వము గాని దేహాద్యన్యతమత్వము * గాని సంభవింపదు గదా! మఱియును, ఈశ్వరః—సూదంటురాయి సన్నిధిని అయస్సువలె నెవ్వని సన్నిధిమాత్రంబున జడ మగుబుద్ధ్యాదిక మగు సర్వంబును చేష్టించుచున్నదో అట్టి యాత్మ యీశ్వరుఁడు — ఈశనశీలుఁడు సమస్తముయొక్క ప్రవృత్తులకును హేతువైనవాఁడు « ఈశానో భూత భవ్యస్య " అను శ్రుతివలన, ఆత్మ ప్రకృతితత్కార్యములకంటె భిన్నుఁడు ఈశ్వరుఁ డగుటవలన రాజువలె కావున నీశ్వరత్వము గూడ

---

* దేహాదులలోఁ జేరినవాఁ డగుట.

ఆత్మకు ఇతర భిన్నత్వమునందు హేతువు, ఇందుచే ఆత్మ ప్రకృతితద్వికార తద్ధర్మ తత్కర్మ తదవస్థాలేశశూన్యుఁడని సిద్ధము, మహాంశ్చ—గొప్పవాఁడును, ఈశ్వరశ్చ—ఈశ్వరుఁడును కావున మహేశ్వరుఁడు. పరిపూర్ణుఁడును కూటస్థుఁడును అసంగుఁడును చిదేకరసుఁడును ఆత్మ యని యీ వ్యాఖ్యానవిశేషణములచే వ్యవస్థాపింపఁబడినది. ఓయీ! ప్రత్యగాత్మ పరమాత్మ యని ద్వైవిధ్య ముండునప్పు డెట్లు ద్వైతము సిద్ధించును? అందువేసి అట్లాశంకింపవలదు, పరిపూర్ణ మయిన బ్రహ్మమునందే ఆరోపితాఽవిద్యాకార్యములచే పరిచ్ఛేదము తోఁచుటవలన. పరిచ్ఛిన్నత్వమును క్షేత్రజ్ఞత్వమును కల్పితము. ఎట్లు ఒక్కటే యగు నాకాశమునకు కల్పితఘటోపాధిచే పరిచ్ఛిన్నత్వమును ఘటాకాశత్వంబును కల్పితమో అట్లు. కావున బ్రహ్మమునందు అవిద్యచేఁ గల్పితము లగు ప్రకృతియుఁ బ్రాకృతమును సర్వంబును మిథ్యయే యగుం గాని సత్యము కాదు. «త్రయమప్యేతత్సుషుప్తం స్వప్నం మాయామాత్రమ్, చిదేకరసో హ్యయమాత్మా, వికల్పో న హి వస్తు, అసత్త్వాదస్య" ఇత్యాది శ్రుతులచేతను, ఇది సర్వంబును మిథ్య మాయాకార్య మగుటవలన ఐంద్రజాలికమునలె—ఇత్యాదియుక్తుల చేతను విచారింపఁగా దేహాదిద్వైతప్రపంచము సర్వంబును మాయాకార్య మగుటచే మిథ్య యగుటవలన ద్వైతకారణము లేమివలనను బ్రహ్మాత్మలకు భేదము మహాకాశఘటాకాశములకుంబోలె నుపాధి పరికల్పిత మగుటవలన నుపాధియు నవిద్యాకార్య మగుటచే మిథ్య యగుటవలనను అది లేనియప్పుడు బ్రహ్మాత్మల కభేదమే యగును. అందువలన బ్రహ్మమున కద్వితీయత్వము నిరంకుశ మని బోధించుటకై బ్రహ్మాత్మల కేకత్వముఁ జెప్పుచున్నాఁడు.—పరమాత్మేతి చాప్యుక్తః—ఎవ్వఁడు ఈ దేహమునందుఁ బురుషుఁడు అస్మత్ప్రత్యయార్హమైనవాఁడు బుద్ధితద్వృత్తిసాక్షియై యున్నాఁడో ఎవ్వనియందుఁ బ్రకృతిసాన్నిధ్యమువలనఁ గర్తృత్వభోక్తృత్వాదిసంసారము కల్పితమో ఉపద్రష్టృత్వాదిలక్షణములచే విచారింపఁగా నెవ్వఁడు ప్రకృతి తద్వికార తద్ధర్మ తత్కర్మసంబంధలేశశూన్యుఁడును అసంసారియును నిత్యకూటస్థాసంగచిద్రూపుఁడు నని నిశ్చితుఁ డగుచున్నాఁడో అట్టియాత్మ పరమాత్మయే—బ్రహ్మమే యని సర్వశ్రుతులచేతను చెప్పఁబడెను. «తదేతదాత్మాన మేవ మిత్యపశ్యన్తః పశ్యన్తి, తదేతత్సత్యమాత్మా బ్రహ్మైవ బ్రహ్మాత్మైవాత్ర హ్యేవ న విచిత్స్యమ్ *, స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో, అయమాత్మా బ్రహ్మ" ఇత్యాది శ్రుతు

* అట్టి దీనిని ఆత్మను ఓ మ్మని యెఱుంగనివారు ద్వైతము మాచుచున్నారు, అట్టి యిది సత్యము ఆత్మ బ్రహ్మమే బ్రహ్మము ఆత్మయే ఇందు సంశయింపవలసినది యేమీ లేదు.

లచే బ్రహ్మాత్మల కభేదమే స్పష్టముగాఁ బ్రతిపాదింపఁబడిన దని యర్థము. అందువలన క్షేత్రజ్ఞునకు బ్రహ్మభావము స్వాభావికమే కాని కల్పితము కాదు, అట్లు సర్వజ్ఞయు సత్యవాదినియుఁ బ్రమాణశిరోమణియు నగు శ్రుతి "తదేతత్ సత్యమాత్మా బ్రహ్మైవ బ్రహ్మాఽఽత్మైవ" అని బ్రహ్మాత్మల కభేదము [illegible] అట్లు భగవంతుఁడును క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి యని యుపదేశించెను, దేహేఽస్మిన్ పురుషః పరః అని యుపదేశించుచున్నాఁడుగూడ. అందువలన బ్రహ్మాత్మల కైకత్వము సిద్ధించుటంజేసి ద్వైతహేతు వేమియు లేమివలన బ్రహ్మమున కద్వితీయత్వము సిద్ధము.

ఆ. ఇట్లు ప్రకృతితో మిథ్యాతాదాత్మ్యమువలనఁ బురుషునకు సంసారము కాని స్వరూపంబునఁ గాదని చెప్పఁబడినది. సంసారదశయందు సంభవింపనట్టి పురుషుని స్వరూప మెట్టిది? అని [illegible] తత్స్వరూపమును సాక్షాత్తుగా నిర్దేశించుటకై చెప్పుచున్నాఁడు — అస్మిన్ = ఈ ప్రకృతిపరిణామ మయిన; దేహే = దేహమునందు; జీవరూపంబున వర్తించుచున్నను, పురుషః = పురుషుఁడు; పరః = ప్రకృతిగుణములచే అసంస్పృష్టుఁడు, పరమార్థంబున అసంసారి స్వరూపముచే నని యర్థము. ఎందువలన ననఁగా. ఉపద్రష్టా = ఎట్లు ఋత్విగ్యజమానులు యజ్ఞకర్మమునందు వ్యాపృతు లగుచుండఁగా తత్సమీపస్థుఁడు మఱియొకఁడు తా నవ్యాపృతుఁడై యజ్ఞవిద్యాకుశలుఁ డగుటవలన ఋత్విగ్యజమానుల వ్యాపారములందు గుణదోషములఁ జూచుచుండునో అట్లు కార్యకరణములు వ్యాపారవంతము లగుచుండఁగా తా నవ్యాపృతుఁడై తద్విలక్షణుండై ఆ వ్యాపారసహితము లగు కార్యకరణముల సమీపస్థుఁడై చూచుచుండువాఁడు కాని పురుషుఁడు కర్త కాఁడు, "స యత్తత్ర కించిత్పశ్యత్యనన్వాగతస్తేన భవత్యసఙ్గో హ్యయం పురుషః" * అను శ్రుతివలన. లేక. ద్రష్ట లగు దేహచక్షుర్మనోబుద్ధ్యాత్మలలో బాహ్యము లగు దేహాదులకంటె మిక్కిలి యవ్యవహితుఁడై ద్రష్ట ఆత్మ కావున పురుషుఁడు ఉపద్రష్ట, ఉపశబ్దము సామీప్యార్థక మగుటవలన నది యవ్యవధానరూప మగుటచేఁ బ్రత్యగాత్మయందే పర్యవసన్న మగుటవలన. అనుమన్తా చ = కార్యకరణ ప్రవృత్తులయందుఁ దాను బ్రవృత్తుఁడు కాకున్నను బ్రవృత్తునియట్లు సన్నిధిమాత్రంబునఁ దదనుకూలుం డగుటవలన అనుమంత, లేక, స్వవ్యాపారములయందుఁ బ్రవృత్తము లగు దేహేంద్రియాదులను తత్సాక్షిభూతుండై పురుషుఁ డెన్నఁడును నివారింపఁడు కావున అనుమంత, "సాక్షీ

* అతఁ డందు ఏదైనను దేనిని జూచుచున్నాఁడో దానితో అన్వాగతుఁడు - చేరినవాఁడు కాక యుండుచున్నాఁడు, కావున అసంగుఁడు గదా యీ పురుషుఁడు.

చేతా" అనుశ్రుతివలన. భర్తా = సంఘాతమాత్రె చైతన్యాభాసవిశిష్టము లయిన దేహేంద్రియమనోబుద్ధులను దనసత్తాచేతను స్ఫూర్తిచేతను ధరించువాఁడును పోషించువాఁడును. భోక్తా = బుద్ధియొక్క సుఖదుఃఖమోహాత్మకము లగువృత్తులను స్వరూపచైతన్యముచేఁ బ్రకాశింపఁ జేయుచున్నవాఁడు కావున సర్వాకారుఁ డయ్యె యెఱుంగుచున్నవాఁడు. మహేశ్వరః = సర్వాత్మ యగుటవలనను స్వతంత్రుఁ డగుటవలనను గొప్పవాఁడును • ఈశ్వరుఁడును గావున మహేశ్వరుఁడు పరమాత్మా = అవిద్యచే ఆత్మత్వముగాఁ గల్పితము లగు దేహాదిబుద్ధ్యంతములకంటె ఉపద్రష్ట్రాద్యపూర్వోక్తవిశేషణవిశిష్టుఁ డగుటచే పరముఁడు— శుద్ధుఁ డగుఆత్మ కావున పరమాత్మ. ఇతి అపి = పరమాత్మశబ్దమునచేఁ గూడ; ఉక్తః = చెప్పఁబడినాఁడు శ్రుతియందు. చకారమువలన ఉపద్రష్ట్రాదిశబ్దములచేతఁ గూడ చెప్పఁబడినాఁ డని యర్థము. "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః" అని ముందును ఆపురుషునే చెప్పఁబోవుచున్నాఁడు.

శ్లో. ఈప్రకారముగఁ బ్రకృతిని వివేచింపమివలనఁ బురుషునకు సంసారమే కాని స్వరూపంబున లే దనునభిప్రాయముతో తత్స్వరూపముఁ జెప్పుచున్నాఁడు.— అస్మిన్ దేహే = ఈప్రకృతికార్య మగుదేహమునందు; వర్తించుచున్నను, పురుషః పరః = భిన్నుఁడే, దానిగుణములతో సంబంధంపఁ డని యర్థము. అందులకు హేతువులు.—ఉపద్రష్టా = తాను వే ఆయినవాఁ డయ్యు సమీపమునుండి చూచుచుండువాఁడు, సాక్షి యని యర్థము. అట్లు, అనుమన్తా = అనుమోదించువానివలె సన్నిధిమాత్రమున ననుగ్రహించువాఁడు "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" ఇత్యాది శ్రుతివలన. అట్లు విశ్వరూపముగు రూపమున, భర్తా = విధారకుఁ డనియు చెప్పఁబడియె; భోక్తా = పాలకుఁ డనియు మహేశ్వరః = మహాన్ ఈశ్వరశ్చ—బ్రహ్మాదులకును అధిపతి యనియు. పరమాత్మా = అంతర్యామి యనియు. చెప్పఁబడినాఁడు శ్రుతిచేత. అట్లు శ్రుతి —"ఏష భూతాధిపతి రేష సర్వేశ్వర ఏష లోకపాలః" ఇత్యాదికము.

[illegible] ప్రకృతివివేకమువలననే పురుషునకు సంసారము కాని స్వరూపముచేఁ గాదని తెలుపుటకై చెప్పుచున్నాఁడు —అస్మిన్ దేహే = ఈప్రకృతికార్య మగు దేహమునందు వర్తించుచున్నను; పురుషః పరః = పురుషుఁడు భిన్నుఁడే, కాని దానిగుణములతో సంటఁ డని యర్థము. ఉపద్రష్టా అనుమన్తా భర్తా భోక్తా *.

---

• సర్వవ్యాపకుఁడును.

* ఈపదములకు వ్యాఖ్యానము శ్రీధరీయముతో సమానము.

ఇందు శాతపథశ్రుతి — «అదృష్టో ద్రష్టా ఽశ్రుత శ్శ్రోతా ఽమతో మన్తా ఽవిజ్ఞాతో విజ్ఞాతా నా ఽన్యో ఽస్తి ద్రష్టా నా ఽన్యో ఽస్తి శ్రోతా నా ఽన్యో ఽస్తి మన్తా నా ఽన్యో ఽస్తి విజ్ఞాతైష త అన్తర్యా మ్యమృతో ఽతో ఽన్యదార్తమ్" అని. భాష్యము.—అదృష్టః= దర్శనమునకు అయోగ్యుఁడై *, ద్రష్టా= విశ్వసాక్షి. ఇట్లంతటను. వానికంటె, అన్యః=ఇతరుఁడు, ద్రష్ట లేఁడు, అట్లు శ్రోతయు మంతయు విజ్ఞాతయు లేఁడు. ఇట్టివాఁ డగు, ఏషః తే అన్తర్యామీ = ఈ నీయాత్మ; అమృతః = నిత్యముక్తుఁడు. అతః=ఈయాత్మకంటె, అన్యత్ =ఇతరము, ఆత్మవిలక్షణ మయిన దృశ్యజాతము, ఆర్తమ్=బాధితము శుక్తిరజతమువలె నని యర్థము. మహేశ్వరః—బ్రహ్మాదులకును అధిపతి; పరమాత్మా=అంతర్యామి యనియు, ఉక్తః. శ్రుతియును. «ఏష భూతాధిపతి రేష లోకేశ్వర ఏష లోకపాలః» అని. ఇట అధిపతి యనఁగా ఈశ్వరుఁడు—నియామకుఁడు, లోకపాలుఁ డనఁగా భర్త.

రా. అస్మిన్ దేహే = ఈదేహమునందు, ఉన్నట్టి యీపురుషుఁడు, దేహప్రవృత్తి కనుగుణము లయినసంకల్పాదులచే దేహమున కుపద్రష్టయు అనుమంతయు నగుచున్నాఁడు అట్లు దేహమునకు భర్తయు నగుచున్నాఁడు, అట్లు దేహప్రవృత్తిజనితము లగుసుఖదుఃఖములకు భోక్తయు నగుచున్నాఁడు. ఇట్లు దేహమును నియమించుటచేతను భరించుటచేతను దేహమునకు శేషియగుటచేతను దేహేంద్రియమనస్సులకు మహేశ్వరుఁ డగుచున్నాఁడు అట్లు చెప్పఁబోవు చున్నాఁడు —«శరీరం యద వాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః। గృహీత్వైతాని సంయాతి వాయు ర్గన్ధా నివాశయాత్" అని. ఈదేహమునందు దేహేంద్రియ మనస్సులకుఁ బరమాత్మ యనియుఁ జెప్పఁబడియె. దేహమునందును మనస్సునందును ఆత్మశబ్దము వాడఁబడిగానే ప్రయోగింపఁబడు చున్నది— «ధ్యానే నాత్మని పశ్యన్తి కేచి దాత్మానమాత్మనా" అని. అపిశబ్దమువలన మహేశ్వరుఁ డనియుఁ జెప్పఁబడె నని తెలియవలయును. పురుషః పరః — అనాదిమత్పరం మిత్యాదిగ్రంథముచేఁ జెప్పఁబడిన యపరిచ్ఛిన్నజ్ఞానశక్తి యగు నీపురుషుఁడు అనాది ప్రకృతిసంబంధకృత గుణసంగము వలన ఈదేహమాత్రమునకు మహేశ్వరుఁడును బరమాత్మయు నగుచున్నాఁడు.

మా. యతశ్చయత్ అని చెప్పినదాని వివరించుచున్నాఁడు.—అనుమన్తా—అను—మాటిమాటికి—విశేషమున నిరూపకుఁడు. పురుష స్సుఖదుఃఖానామ్ అను

* ఈయాత్మను జూచుటకు శక్యము కాదు, అట్టివాఁడై యనుట.

టచే జీవుఁడు చెప్పఁబడినాఁడు. పురుషం ప్రకృతిమ్ అనుచో పురుషశబ్దముచే జీవేశ్వరులు ఏకశబ్దమునఁ జెప్పఁబడుచున్నారు. అట్లుగాక జీవేశ్వరుల కైక్యము చెప్పు పక్షమునందు మహాతాత్పర్యవిరోధ మగును. ఈశ్వరోత్కర్షమునందుఁ గదా మహాతాత్పర్యము. అట్లు సౌకరాయణశ్రుతి — "అవాచ్యోత్కర్షే మహాత్మ్యా స్సర్వవాచాం సర్వన్యాయానాం చ మహా త్తాత్పర్యత్వమ్ । విష్ణో రన న్తస్య పరాత్పరస్య తచ్చాపి హా స్త్యేవ న చాతిశఙ్కా ॥ అతో విరుద్ధంతు యదత్రమానం తదప్య బాధా వదథవాఽపి యుక్తిః । న తత్ప్రమాణం కవయో వదన్తి న చాఽపి యుక్తి ర్హ్యానమతి ర్హి దృష్టేః" ♦ అని. అందువలన యుక్తులచేతఁ గూడ దీని నపలపించుట యుచితము గాదు. కావున నేయుక్తిచే ననిర్వచనీయత్వాదికము కల్పించుచున్నారో అదియు నాభాసరూపమే కావున నెల్లప్పుడును మాహాత్మ్యమే వేదములచేఁ జెప్పఁబడు చున్న దని సిద్ధించు చున్నది. అం దవాంతరతాత్పర్యముఁ గూడఁ గలదు. దానియందే చెప్పఁబడినది "అవా న్తరం తత్పరత్వం చ సత్యే మహాద్వ్యైకత్వా త్తయో రనన్తే" అని. శూన్యత్వాదికము చెప్పఁబడుటవలనఁ గూడ. పురుష మతికల్పిత మగు యుక్త్యాదికం భాస మనుట యుక్తము, అజ్ఞానము సంభవించుటవలన. కాన స్వతఃప్రమాణ మగువేద మాభాస మనఁ దగదు. అజ్ఞానమో పురుషులకు సంభవించుచునే యున్నది, పెక్కండ్రకుఁ గూడ అజ్ఞానము కనఁబడుటవలన. అప్పుడు మననమధ్యయనింపని వేదమునందు ఏతద్విరుద్ధార్థ ముండవచ్చు నని చెప్ప శక్యము గాదు. ఎందువలన ననఁగా. అందే చెప్పఁబడినది "నైవ తద్విరుద్ధా వాచో నైవ తద్విరుద్ధా యుక్తయ ఇతిహ ప్రజాపతి రువాచ ప్రజాపతి రువాచ" అని. జీవేశ్వరైక్యము తద్విరుద్ధము. "ఆభాస ఏవచ" అని బ్రహ్మసూత్రము గూడ. జనమేజయుఁ డడిగెను "బహవః పురుషా బ్రహ్మ న్నుతాహో ఏక ఏవతు । కో హ్యత్ర పురుషశ్రేష్ఠ స్సంభవా న్వక్తు మర్హతి" అని. అందులకు శ్రీవైశంపాయనుఁడు చెప్పెను "నైత దిచ్ఛన్తి పురుష మేకం కురుకులోద్వహ । బహూనాం పురుషాణాం హి యథైకా యోని రుచ్యతే॥ తథా తే పురుషం విశ్వ మాఖ్యాస్యామి

♦ అనంతుఁడును పరాత్పరుండు నగువిష్ణువు సర్వోత్కృష్టుఁ డగుటవలన అనిర్వచనీయుఁ డగుననెడి సర్వోత్కర్షమునందే సర్వవేదములకును సర్వన్యాయములకును మహాతాత్పర్యము. ఆయుత్కర్ష మెట్లా యుండనే యున్నది. కావున నిందు శంక లేదు. అందువలన ఇందులకు విరుద్ధ మగు ప్రత్యక్షాదిప్రమాణ మేది గలదో యుక్తియు నేది గలదో అది ప్రమాణము గాదని కవులు చెప్పుచున్నారు. కేవలయుక్తియుఁ బ్రమాణము గాదు. అది దృష్టికన్నను-శ్రుతికన్నను దుర్బలము గదా!

గుణాధికమ్" అని మోక్షధర్మమునందు. అది యంతయు స్వప్నేంద్రజాలమువంటి దనియుఁ జెప్ప శక్యము గాదు. «వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్" అని గదా శ్రీ వ్యాసభగవద్వచనము. మఱియు స్వప్నమువలె నేజీవకల్పితం బనుటకుఁ బ్రమాణము కానరాదు. సత్యం బనుటకుఁ బ్రమాణములు ద్వితీయాధ్యాయమునఁ జెప్పినారము. అయాస్యశాఖయందును జెప్పఁబడెఁగి «స్వప్నోహ వా అయం చఞ్చలత్వాన్న స్వప్నో నహి విచ్ఛేద ఏతదితి" * అని. ఇదియు దోషము కాదు. ఈశ్వరునకు జీవునితో నైక్యము చెప్పఁబడదు గదా! జీవునకుఁ గదా యీశ్వరునితో నైక్యము ధ్యానింపవలయును. అదియు నిరుపాధికము గాదు. అందువలనఁ బ్రతిబింబమునకుఁ దద్విరోధి యగు బింబముతో నైక్యము లేదు. అట్లు మాధుచ్ఛన్దసశ్రుతి «ఐక్యం చాఽపి ప్రతిబిమ్బం విష్ణోర్ జీవస్యైక్యతి దృష్టయో వదన్తి" అని. అహం గ్రహోపాసనమునందు ఫలాధిక్య మగ్ని వేశ్యశ్రుతిసిద్ధము «అహం గ్రహోపాసక స్తస్య సామ్యమభ్యాశోహ వాఽశ్నుతే నాత్ర శఙ్కా" ♦ అని «తదీయోఽహ మితి జ్ఞాన మహం గ్రహ ఇతీరితః" అని వామనమునందు. «తద్వశత్వాత్తోస్సోఽస్మీతి భృత్యైరేవ నతు స్వతః" అనియును. ప్రతిబింబము నగుటచే నతఁడే నేను, భృత్యుఁడను గూడ — అని భావన. అట్ల యాస్యశాఖయందు «భృత్యత్వాచ్చాఽహం ప్రాతిబిమ్బ్యాన్ సోఽస్మీ త్యేవం హ్యుపాస్యః పురుషోఽన్యః" అని. ప్రాతిబింబ్య మనఁగా తత్సామ్యమే.

య ఏవం పురుషం వేత్తి ప్రకృతిం చ గుణైస్సహ
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే. ౨౩

**భా.** అట్టి యీయథోక్తలక్షణుం డగునాత్మను, యః = ఎవ్వఁడు; ఏవమ్=యథోక్తప్రకారమున; పురుషమ్=పురుషునిఁగా, సాక్షాత్తుగా నేనని; వేత్తి=ఎఱుంగుచున్నాఁడో; ప్రకృతించ=యథోక్తమయిన యవిద్యాలక్షణ మగుప్రకృతినిగూడ; గుణైస్సహ=స్వవికారములతోఁ గూడ; విద్యచే నివర్తిత మైనదానిఁగా — అభావమును బొందింపఁబడినదానిఁగా, యః వేత్తి=ఎవ్వఁ డెఱుంగుచున్నాఁడో; సర్వథా=సర్వవిధంబున; వర్త

* ఇది చంచల మగుటవలన స్వప్నమువలె నున్నది, కాని స్వప్నము కాదు, దీనికి బాధ లేదు గదా.

♦ అహం గ్రహోపాసకుఁడు అవిష్ణువుయొక్క-సామ్యమును శీఘ్రముగాఁ బొందుచున్నాఁడు. ఇందు సందేహము లేదు.

మానోఽపి= వర్తించుచున్నవాఁడైనను; సః= అతఁడు; భూయః= మరల; అవిద్వచ్ఛరీరము పతితమైనపిదప దేహాంతరముకొఱకు, నాభిజాయతే= పుట్టఁడు, దేహాంతరము నొందఁడని యర్థము. అపిశబ్దమువలన ఇఁక స్వకర్మమునందున్న వాఁడు పుట్టఁడని చెప్పనేదేమి? అని యభిప్రాయము.

పూర్వపక్షము —ఓయీ! వాస్తవమే, జ్ఞానోత్పత్త్యనంతరము వెండియు జన్మము లేదని చెప్పఁబడినది. అయినను జ్ఞానోత్పత్తికిఁ బూర్వము చేసినకర్మములును తదుత్తరము చేసినవియు అతిక్రాంతానేకజన్మములందుఁ జేసినవియు నీకర్మము లన్నియు ఫలము నొసంగక నశించు ననుట యుచితము గాదు. కావున మూఁడుజన్మములు సంభవించును. కృతవిప్రణాశము యుక్తము కాదు గదా! ఫలమునందుఁ బ్రవృత్తము లయిన యారబ్ధజన్మము లగు కర్మములకుంబోలె. కర్మములలో విశేషముగల దనుటయు శక్యము గాదు. అందువలన మూఁడువిధము లయినకర్మములును మూఁడుజన్మముల నారంభించును. లేక, సర్వకర్మములును సంహతములై యొక్కజన్మము నే యారంభించును. అట్లుగా దను నెడ కృతవినాశము సంభవించుటం జేసి సర్వత్ర యనాశ్వాసము ప్రసక్తించును. శాస్త్రానర్థక్యము గూడ సంభవించును. అందువలన న స భూయోఽభిజాయతే యని చెప్పుట యనుచితము.

సిద్ధాంతము.— కాదు. "క్షీయన్తే చాఽస్య కర్మాణి, బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి, తస్య తావదేవ చిర మిషీకాతూలవ త్సర్వకర్మాణి ప్రదూయన్తే" * ఇత్యాదిశ్రుతిశతములవలనఁ జెప్పఁబడినది విద్వాంసునకు సర్వకర్మదాహము. ఇందును జెప్పఁబడినది యథైధాంసీత్యాదిగా సర్వకర్మదాహము. చెప్పఁబోవుచున్నాఁడు గూడ ఉపపత్తివలనను. అవిద్యాకామక్లేశబీజనిమిత్తము లగుకర్మములు గదా జన్మాంతరాంకురము నారంభించుచున్నవి ఇందుఁ గూడ అహంకారాభిసంధిపూర్వకము లగుకర్మములు ఫలారంభకము లనియు ఇతరములు కావనియు నచ్చటచ్చట భగవంతునిచేఁ జెప్పఁబడినది. "బీజాన్యగ్న్యుపదగ్ధాని నరోహన్తి

* వీనికర్మములును క్షయించుచున్నవి, బ్రహ్మను నెఱుంగుచున్నాఁడు బ్రహ్మమే యగుచున్నాఁడు, అతని కంతమాత్రమే చిరకాలము తెల్లుపుడకయందలి దూదివలె సర్వకర్మములును పీడుచున్నవి.

యథా పునః । జ్ఞానదగ్ధై స్తథా క్లేశై ర్నాత్మా సంపద్యతే పునః ॥*

అనియును.

పూర్వపక్షము.—కాని జ్ఞానోత్పత్త్యనంతరము చేయుకర్మములకు జ్ఞానముచే దాహము, జ్ఞానసహభావు లగుటవలన. ఈజన్మమున జ్ఞానోత్పత్తికిఁ బూర్వము చేసినవానికిని అతీతానేకజన్మాంతరములఁ జేసినవానికిని మాత్రము దాహము యుక్తము కాదు.

సిద్ధాంతము —అట్లనఁ దగదు, సర్వకర్మాణి యను విశేషణము వలన.

పూర్వపక్షము —జ్ఞానోత్తరకాలమునందుఁ జేయు సర్వకర్మములని దానికర్థము.

సిద్ధాంతము —కాదు, సంకోచమునకుఁ గారణము లేమివలన. మఱి యేది చెప్పఁబడినదో—జ్ఞానమున్నను ఎట్లు ఫలదానమునకుఁ బ్రవృత్తములే వర్తమానజన్మారంభకము లగు కర్మములు నశింపవో అట్లు అనారబ్ధఫలము లగుకర్మములుగూడ నశింపవనుట యుక్తము — అని. అది యసంగతము. ఎట్లు? అవి ముక్తబాణమువలెఁ బ్రవృత్తఫలము లగుటవలన. ఎట్లు మొదట లక్ష్యము వేధించుటకై ధనువునుండి విడువఁబడినబాణము లక్ష్యమును వేధించినపిదపఁగూడ ఆరబ్ధవేగము నశించువఱకుఁ బోవుచుండి పతనముచేతనే నివర్తిల్లునో అట్లు శరీరారంభక మగు కర్మము శరీరస్థితిప్రయోజనము నివృత్తమయినను సంస్కారవేగము క్షయించువఱకు నెప్పటియట్లు వర్తించుచున్నది. ఎట్లు మఱి ధనుస్సునందు సంధింపఁబడినను విడువఁబడనిబాణము ప్రవృత్తినిమిత్తమగు వేగము అనారబ్ధమగుటచే నుపసంహరింపఁబడుచున్నదో అట్లనారబ్ధఫలంబులై స్వాశ్రయంబునందే యుండుకర్మములు జ్ఞానముచే నిర్బీజములుగాఁ జేయఁబడుచున్నవి. అందువలన ఈవిద్వచ్ఛరీరము పతితమైనపిదప నప భూయోఽభిజాయతే అని యుక్తమే చెప్పఁబడినది యని సిద్ధము.

ఇట్లు లాత్మయే తా ననియుఁ బ్రకృతియుఁ దత్కార్యములును ఆత్మ సంబంధులు కావనియు మిథ్యాకల్పితము లనియు నెవ్వఁ డెఱుంగుచున్నాఁడో

---

* ఎట్లు అగ్నిదగ్ధము లగువిత్తనములు మరల మొలువవో అట్లు జ్ఞానదగ్ధము లగుక్లేశములచే ఆత్మ వెండియు పొందఁబడఁడు—జన్మము నొందఁడు.

ఇత్యాదిగా. జ్ఞానమునకు జన్మానారంభరూపఫలము నిశ్చితము గాదని శేషము. ఈ కర్మములు జన్మముల నొసంగ వనుపక్షమున మున్ను చెప్పినదోషము ననువదించి దానిచేఁ గలుగు నతిప్రసంగము చెప్పుచున్నాఁడు అట్లు గాదు ఇత్యాదిగా. సర్వత్రే— అనిర్భుక్తకర్మములందుఁగూడ నని యర్థము. అనాశ్వాసము — ఫలజనకత్వము లను నిశ్చయము లేమి. కర్మములు జన్మారంభకములు కా వనునెడ శాస్త్రానర్థక్యము దోషాంతరముగాఁ జెప్పుచున్నాఁడు శాస్త్రేత్యాదిగా. అనారబ్ధకర్మములు జ్ఞాన మున్నను జన్మారంభకము లని నిశ్చిత మగుటకు ఫలితముఁ జెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా.

శ్రుతిబలముచేఁ బరిహరించు చున్నారు కాదు ఇత్యాదిగా. జ్ఞానము వలన ననారబ్ధకర్మములు దగ్ధము లగు ననుటకు భగవంతుని సమ్మతిఁగూడఁ జూపు చున్నారు ఇందును ఇత్యాదిగా. జ్ఞానమువలన సర్వకర్మదాహ మగుననుటకు సర్వ ధర్మాన్పరిత్యజ్య యను వాక్యశేషముగూడ ప్రమాణ మని చెప్పుచున్నారు చెప్పఁ బోవు చున్నాఁడు గూడ అని. మఱియు జ్ఞానమువలన అనారబ్ధశేషకర్మక్షయం బగు ననుటకు యుక్తిగూడఁ గల దని చెప్పుచున్నారు ఉపపత్తివలనను అని. దాని నే వివరించుచున్నారు అవిద్యేత్యాదిగా. అజ్ఞునకు అవిద్యా ఽస్మితా రాగద్వేషాభి నివేశాఖ్యక్లేశాత్మకము లగు సర్వానర్థబీజము లేవి గలవో తన్నిమిత్తము లైనధర్మా ధర్మకర్మము లేవి గలవో అవి జన్మారంభకములు, ఏవి మాత్ర విద్యాదగ్ధక్లేశబీజుం డగు విద్వాంసుని ప్రతిభాసమాత్రరూపము లగుకర్మములు గలవో అవి శరీరారంభక ములు కావు, దగ్ధపటమువలె నర్థక్రియాసమర్థములు కామివలన నని యర్థము. ప్రతీతి మాత్రరూపము లగు కర్మాభాసములు ఫలారంభకములు కా వనుటకు భగవత్సమ్మ తినిగూడఁ బ్రదర్శించు చున్నారు ఇందుఁ గూడ నిత్యాదిగా. తత్త్వజ్ఞానమునకుఁ బిదపఁ బ్రతీతిమాత్రరూపము లగు క్లేశములు కర్మద్వారంబున దేహారంభకములు కా వనుటకు వాక్యాంతరము గూడ ప్రమాణీకరించు చున్నారు బీజా నీత్యాదిగా.

జ్ఞానానంతరభావికర్మములకు జ్ఞానముచే దాహము నంగీకరించుచున్నాఁడు కానీ ఇత్యాదిగా. విరోధిగ్రస్తము లయ్యే పుట్టుటవలన నని హేతువుఁ జెప్పుచు న్నాఁడు జ్ఞానేత్యాదిగా. ఈజన్మమునందుఁ గాని జన్మాంతరమునందుఁ గాని జ్ఞాన మునకుఁ బూర్వము చేసినకర్మములకు దానివలన దాహము యుక్తము కాదు విరోధి లేనప్పుడు పుట్టిన వగుటవలన నని చెప్పుచున్నాఁడు ఈజన్మమున నిత్యాదిగా.

విద్గురుసన్నిధిని శ్రవణాదులు చేసి తజ్జన్యజ్ఞానముచే, ఏవమ్=చెప్పినవిధమున; ప్రకృతిమ్=అధిష్ఠానాజ్ఞానమువలన కార్యకారణకర్తృకర్మఫలరూపమున విజృంభించినదానిని అనాద్యనిర్వాచ్యను సర్వానర్థమూలభూత మయినయవిద్యను; గుణైః సహ=భోక్తృభోగ్యరూపమున నున్న మహదాదిస్థూలాంతము లగు గుణకార్యములతోఁ గూడ; మరుభూమిని జూచుటచే జలప్రవాహమునుంబోలె అధిష్ఠానసందర్శనముచే మిథ్యాభూతనుగా, వేత్తి=ఎఱుంగుచున్నాఁడో. అట్లు పురుషంచ=క్షేత్రజ్ఞునిఁ గూడ, చిదాభాసధర్మము లైనకర్తృత్వభోక్తృత్వాదిధర్మముల యధ్యారోపమున కధిష్ఠానభూతుని; విద్యచే నిరస్తాశేషవిశేషుండును సర్వావభాసకుండును ఉపద్రష్టృత్వాదిలక్షణలక్షితుండును ఆద్యంతరహితుండును ఆకాశమువలె నత్యంతవిశుద్ధుండును ఆనందఘనుఁడును చిదేకరసుఁ డగు నాత్మనుగా—పరబ్రహ్మమునుగా, వేత్తి=ఇతఁడే నేను, కర్తను గాను భోక్తను గాను సంసారిని గాను అని యతన్నిషేధపూర్వకముగాఁ బ్రత్యగభిన్న మగుపరబ్రహ్మమును బ్రత్యగ్దృష్టిచే స్వస్వరూపంబున నెవ్వఁడెఱుంగుచున్నాఁడో; సః=అట్టి బ్రహ్మవిదుఁ డగు యతి; సర్వథా=సర్వప్రకారమున; వర్తమానోఽపి=వర్తించుచున్నవాఁ డైనను; శుద్ధాత్ముఁడును సర్వాత్మదర్శియు నగు విద్వాంసునకు ఆత్మదర్శనేతరము గ్రాహ్యము లేమివలనఁ బ్రవృత్తియే సంభవింపదు, భేదదర్శియై రాగాదిమంతుఁ డైనవానికిఁ బ్రవృత్తి సంభవించుం గాని విశుద్ధవృత్తిచే సర్వంబును బ్రహ్మమునుగానే చూచువానికి సంభవింపదు గదా! అయినను దుష్టాదృష్టప్రారబ్ధవశమువలన దేహము తదనురూపముగాఁ బ్రవర్తించు చుండునపుడు ఇతరులదృష్టికిఁ దానును బ్రవర్తించినట్లు తోఁచుచుండును, అట్లున్నను నిష్క్రియుఁ డగుటవలనను నిత్యముక్తుఁ డగుటవలనను నిర్లేపుఁ డగుటవలనను నిర్మూలితాశేషకర్ముఁ డగుటవలనను స్వదృష్టిచేఁ దాను బ్రవృత్తుఁడు కానేకాఁడు. కావున, ప్రారబ్ధక్షయమువలన నీదేహము పతిత మైనపిదప, భూయః=మరల; నాభిజాయతే=పుట్టఁడు, పునర్జన్మమునకుఁ గారణము లైన యవిద్యాకామాదులు నిశ్శేషముగా జ్ఞానాగ్నిదగ్ధము లగుటచేఁ గారణము లేమివలనఁ గైవల్యము నొందుచున్నాఁ డని యర్థము. ఇఁకఁ జెప్పెడి దేమి సదాచారుఁడు జన్మము నొందఁ డని — అని యపిశబ్దార్థము. ప్రకృతిపురుషులస్వరూపమును క్షీరనీరములంబోలెఁ జక్కఁగా వివేచించి యెఱింగి ప్రకృతిని తద్గుణములతో విద్యచేఁ బ్రవిలయము నొందించి బ్రహ్మమే నేనని యవిక్రియబ్రహ్మరూపమున నున్నయతికి సర్వథా వర్తనము—యథేష్టాచరణము సంభవింపదు, అనాత్మయం దహంమమాభిమానము లేమివలన. అనాత్మ యగు

దేహేంద్రియాదికమునందు అహంమమాభిమాన ముండినచో ఇది కర్తవ్యము ఇది భోక్తవ్యము అని యిచ్ఛావేగము గలుగుటచేఁ బురుషునకు దృష్టమునందుఁ గాని యదృష్టమునందుఁ గాని కర్మమునందుఁ బ్రవృత్తి కనఁబడుచున్నది. అది లేనిచోఁ గనఁబడదు. అందువలన నట్టి యభిమానము లేక సర్వంబును బ్రహ్మమును గానే చూచుచున్న బ్రహ్మవిదునకు సత్కర్మమునందుఁ గాని యసత్కర్మమునందుఁ గాని ప్రవృత్తి యుపపన్నము గాదు, సర్వత్ర బ్రహ్మదర్శనమును బ్రపంచదర్శనమును బరస్పరవిరుద్ధము లగుటవలన. అట్లయిన సర్వథా వర్తమానోఽపి యనువచనమునకు వ్యాఘాత మగు నందురేని, చెప్పెదము. బ్రహ్మవిదుండు బ్రహ్మరూపమున నున్నను అతనికి దేహప్రారబ్ధవశమువలన నోకానొకప్పుడు ఆహారాదులందు నియమాతిక్రమము సంభవింపవచ్చును. అందుచే నతని జ్ఞానమును దత్ఫలంబును బ్రతిహత మగు నని మూఢులు తలంతురు. వారి భ్రాంతి నివారించుటకై సర్వథా వర్తమానోఽపి యను నీభగవద్వచనము. కావున దీనికి వ్యాఘాతము సంభవింపదు.

**వ.** ఇట్లు స చ యో యత్ప్రభావశ్చ యనునది వివరింపఁబడినది. ఇంకను యద్‌జ్ఞాత్వాఽమృతమశ్నుతే యని చెప్పినదాని నుపసంహరించుచున్నాఁడు.—

యః; ఏవమ్—చెప్పినవిధంబున; పురుషమ్; వేత్తి—ఇతఁడే నేనని సాక్షాత్కరించుచున్నాఁడో; ప్రకృతిం చ—అవిద్యనుగూడ; గుణైస్సహ—తద్వికారములతోఁ గూడ; మిథ్యాభూతనుగా ఆత్మవిద్యచే బాధితనుగా, వేత్తి—నశించినవి నాకజ్ఞానతత్కార్యము లని యెఱుంగుచున్నాఁడో; సః; సర్వథా—ప్రారబ్ధకర్మవశమువలన ఇంద్రుని వలె విధి నతిక్రమించి; వర్తమానోఽపి; భూయో నాభిజాయతే—ఈ విద్వచ్ఛరీరము పతిత మైనపిమ్మట మరల దేహగ్రహణమును జేయఁడు. అవిద్య విద్యచే నాశము నొందినపిమ్మటఁ దత్కార్యము సంభవింప దని బహువిధంబులఁ బ్రతిపాదింపఁబడుట వలన, "తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్" * అనున్యాయమువలన. అపిశబ్దమువలన, విధి నతిక్రమింపక స్వకర్మమునం దున్న వాఁడు మరల జన్మము నొందఁ డని చెప్పెడి దేమి? అని యభిప్రాయము.

* బ్ర-సూ. అ-౪. పా-౧ సూ-౧౩. తదధిగమే=బ్రహ్మజ్ఞానము కలుగఁగానే, ఉత్తరపూర్వాఘయోః=జ్ఞానోత్తరము చేయు పాపమునకును జ్ఞానమునకుఁ బూర్వము చేసినపాపమునకును, అశ్లేషవినాశౌ=మొదటిదానికి అసంబంధమును రెండవదానికి నాశమును గలుగును, తద్వ్యపదేశాత్=అట్లు చెప్పుటవలన.

శ్రీ. • ఇట్లు ప్రకృతి పురుషుల నెఱింగినవాని స్తుతించుచున్నాఁడు.—ఏవమ్—ఉపద్రష్టృత్వాదిరూపంబున, యః; పురుషం వేత్తి, ప్రకృతిం చ; గుణైః సహ=సుఖదుఃఖాదిపరిణామములతోఁ గూడ; యః వేత్తి. సః = ఆపురుషుఁడు; సర్వథా—విధి నతిక్రమించియు; వర్తమానో౽పి; భూయః నాభిజాయతే — ముక్తుఁడు కాఁగలఁడని యర్థము.

ప. •

రా. ఏవమ్ ‡ — చెప్పినస్వభావము గల; పురుషమ్ = పురుషుని; చెప్పిన స్వభావము గల, ప్రకృతిం చ=ప్రకృతిని గూడ; గుణైః సహ—చెప్పఁబోవుస్వభావము గల సత్త్వాదిగుణములతోఁ గూడ; యః=ఎవ్వఁడు; వేత్తి= యథార్థక్రమముగా వివేకమున నెఱుంగుచున్నాఁడో; సః = ఆతఁడు; సర్వథా — దేవమనుష్యాదిదేహములందు మిక్కిలి క్లేశము నొందుచు; వర్తమానో౽పి = వర్తించుచున్నను; భూయః; నాభిజాయతే=ప్రకృతిసంసర్గము నొందఁడు. అపరిచ్ఛిన్నజ్ఞానలక్షణుండును అపహతపాప్ముఁడు నగు నాత్మను తద్దేహావసానసమయమునందుఁ బొందుచున్నాఁడని యర్థము.

మూ. ••

ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా ।
అన్యే సాఙ్ఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ ౨౪

భా. ఈ యాత్మదర్శనమునందు ఉపాయవికల్పములు ధ్యానాదులు చెప్పుచున్నాఁడు.—ధ్యానేన=ధ్యానము చేతఁగా, శబ్దాదివిషయములనుండి శ్రోత్రాదికరణములను మనస్సునం దుపసంహరించి మనస్సును గూడ నేకాగ్రముగాఁ బ్రత్యగాత్మయం దుపసంహరించి చింతించుట యేది గలదో అది ధ్యానము; అట్లు "ధ్యాయతీవ బకో ధ్యాయతీవ పృథివీ ధ్యాయన్తీవ పర్వతాః" * అని సాదృశ్యము చెప్పుటవలన తైలధారవలె

• శ్రీధరీయములో సమానము
‡ వీరిమతమున యః ఏవం వేత్తి యని పాఠము.
•• దీనికి భాష్యము లేదు.
* బకము ధ్యానించున ట్లున్నది, భూమి ధ్యానించున ట్లున్నది, పర్వతములు ధ్యానించున ట్లున్నవి.

సంతతమై యవిచ్ఛిన్న మయిన ప్రత్యయము ధ్యానము, అట్టి ధ్యానము చేత; ఆత్మని = బుద్ధియందు; ఆత్మనా = ధ్యానసంస్కృతమైన యంతః కరణముచేత; ఆత్మానమ్ = ప్రత్యగాత్మను; పశ్యన్తి = చూచుచున్నారు; కేచిత్ = కొందఱు యోగులు. అన్యే = మఱికొందఱు; సాంఖ్యేన యోగేన = సాంఖ్య మనఁగా — ఈసత్త్వరజస్తమోగుణములు నాకు దృశ్యములు, నేను వానికంటె భిన్నుఁడను తద్వ్యాపారసాక్షిని నిత్యుఁడను గుణ విలక్షణుఁడను ఆత్మను అని చింతించుట, ఇది సాంఖ్యయోగము, దాని చేత; ఆత్మానమ్ ఆత్మనా పశ్యన్తి = ప్రత్యగాత్మను అంతఃకరణముచేఁ జూచుచున్నా రని యనుషఙ్గ మగుచున్నది. కర్మయోగేన = కర్మమే యోగము కర్మయోగము, ఈశ్వరార్పణబుద్ధితో ననుష్ఠింపఁబడుకర్మము ఘటనరూపమగు యోగార్థ మగుటవలన గౌణవృత్తిచే యోగ మని చెప్పఁ బడుచున్నది, అట్టి కర్మయోగముచే; సత్త్వశుద్ధిజ్ఞానోత్పత్తిద్వారమున, అపరే = మఱికొందఱు గూడ; ఆత్మానమ్ ఆత్మనా పశ్యన్తి.

ఉత్తమాధికారులు కొందఱు మనస్సు నేకాగ్రముగాఁ బ్రత్యగాత్మయందే నిలిపి ధ్యానముచేఁ బ్రత్యగాత్మయే పరమాత్మ యని యెఱుంగుచున్నారు. మధ్యమాధికారులు మఱికొందఱు గుణములు దృశ్యము లనియుఁ దాను ద్రష్టయై తద్విలక్షణుఁ డగు నాత్మ యనియు విమర్శించి యిట్టి సాంఖ్యయోగముచేఁ గ్రమంబున నపరోక్షజ్ఞానము నొందుచున్నారు. ఇఁకఁ గొంద ఱధమాధికారులు కర్మయోగముచే చిత్తశుద్ధిజ్ఞానోత్పత్తిద్వారమున నపరోక్షజ్ఞానము సంపాదించుచున్నా రని తాత్పర్యము.

**ఆ.** జ్ఞేయం యత్తదిత్యాదిగ్రంథముచే తత్పదార్థమును త్వంపదార్థమును వెంబడిగానే శోధింపఁబడినవి. తదైక్యముగాఁడ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి యని చెప్పఁబడినది. ఇప్పుడు తద్దర్శనసాధనములను అధికారమును బట్టి చెప్పుచున్నారు ధ్యానేనేత్యాదిగా. ధ్యానాఖ్యసాధనమును వివరించుచున్నారు ధ్యాన మనఁగా నిత్యాదిగా. ఆ చింతించుట యెట్టి దనఁగా దృష్టాంతద్వారమును శ్రుత్యవష్టంభముచే ధ్యానమును బ్రపంచించుచున్నారు అట్లు ఇత్యాదిగా. అట్లు—చెప్పఁదలఁచిన ధ్యానము ననుసరించి యని యర్థము. చూచుచున్నారు—పరమాత్మనుగా నని శేషము. కేచిత్ అనుటచే నుత్తమాధికారులు గ్రహింపఁబడుచున్నారు. మధ్యమాధికారుల నిర్దేశించుచున్నారు అన్యే అని. సాంఖ్య మను సాధనమును వివరించుటకై, విచార

జన్యము జ్ఞానము కాన్పున విచారణాత్మక మగు సాంఖ్యము జ్ఞానహేతు వగుటచే యోగశబ్ద్య మగుటవలన యోగశబ్దవాచ్య మని చెప్పుచున్నారు సాంఖ్య మనఁగా నిత్యాదిగా. అధమాధికారులను గూర్చి చెప్పుచున్నారు కర్మయోగేన ఇత్యాదిగా. యోగ మనఁగా చిత్తైకాగ్ర్యము, కర్మము శుద్ధిహేతు వగుటవలన చిత్తైకాగ్ర్య సాధన మగుచున్నది. కాన్పున కర్మానుష్ఠానమే యోగశబ్దవాచ్యమగు కర్మ మని చెప్పుచున్నారు గుణాన్వితచే సిత్యాదిగా. మహత్వ న్యాయాత్మన మహాత్మనా యనుస్మృతి సంగ్రహించి చెప్పుచున్నారు సత్త్వగుణ ఇత్యాదిగా.

పు॥౫

టీ. చిత్తము ఎడతెగక యేకప్రకారముగా నుండుటయే ధ్యానము, దానిచేత. సాంఖ్యేన=ఆత్మ సాక్షి నిత్యుఁడు విలక్షణుఁడు అని చింతించుటచేత. కర్మయోగేన ఈశ్వరార్పితమైన యనుష్ఠానకర్మముచేత.

భా. ఇట్లు జ్ఞేయము యత్తత్ప్రవక్ష్యామి ఇత్యాదిగ్రంథముచే నిరూపిత మగు బ్రహ్మస్వరూపము నెఱిఁగించి, ప్రకృతిని బ్రహ్మలయము నొందించి యిది యంతయు నేనును బ్రహ్మమే యని సర్వంబును బ్రహ్మముగానే చూచుచుండు యతికిఁ బద్వ జ్ఞానఫలమును విదేహకైవల్యముం బ్రతిపాదించి, యిప్పుడు ముముక్షువులకే యుత్తమ మధ్యమాధికారులకు నిర్విశేషబ్రహ్మప్రాప్తికొఱకు వారివారి యధికారముల కనురూపము లయిన సాధనములం జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—కేచిత్ = కొందఱు ఉత్తమాధికారు లగు యతులు; "వివిక్తదేశేచ సుఖాసనస్థ శ్శుచి స్సమగ్రీవ శిర శ్శరీరః, ఏకాన్తే సుఖ మాస్యతాం పరతరే చేత స్సమాధీయతామ్" అని చెప్పినరీతిని తీవ్రమోక్షేచ్ఛా వైరాగ్యములతో సర్వవిషయములనుండి యింద్రియముల మరలించి మనస్సును బ్రత్యగాత్మయందే యేకాగ్రము గావించి, ధ్యానేన = శ్రవణాదిసంస్కారజన్యజ్ఞానసాధ్య మగు ధ్యానముచేత, విజాతీయప్రత్యయముచే నెడ తెగని సజాతీయప్రత్యయప్రవాహముచేత; ఆత్మని = బుద్ధియందే; సర్వదృశ్య ప్రకాశకుఁడై యున్నవాఁడును నిర్విశేషుఁడును నిరాకారుఁడును ఆకాశమువలెఁ బరిపూర్ణుఁడు నగు, ఆత్మానమ్=పరమాత్మను; ఆత్మనా=స్వస్వరూపమున; పశ్యన్తి—భేదవాసనానివృత్తికొఱకు శ్రవణాదికముచే నెఱిఁగిన తత్త్వమును—బ్రహ్మమే నేను నేనే బ్రహ్మ మని యాత్మను సర్వదా బ్రహ్మమునుగానే భావించుచున్నా రని యర్థము. లేక, "సోమ్యే మా స్సర్వాః ప్రజా స్సదాయతనా స్సత్ప్రతిష్ఠాః" అని మాయాకార్యము సర్వంబును సదాస్పద మని శ్రుతి చెప్పుటవలన భ్రాంతిచేఁ గల్పిత మగు

నవ్యక్తాదిస్థూలాంతము సర్వంబు సర్వాధిష్ఠాన మగు, ఆత్మని — పరమాత్మయందుఁ బ్రతిలోమముగాఁ బ్రవిలయము నొందించి; అందుచే నిరస్తాశేషవిశేషుండును సద్ఘనుండును చిద్ఘనుండును ఆనందఘనుండును నగు, ఆత్మానమ్ = పరమాత్మను పరబ్రహ్మమును; ధ్యానేన—తైలధారవలె నవిచ్ఛిన్నమై వృత్త్యంతరరహిత మైనబ్రహ్మాకారాంతఃకరణవృత్తిచేత; బ్రహ్మమే నే నని, ఆత్మనా —స్వస్వరూపత్వమున; పశ్యన్తి—తన్నే బ్రహ్మమునుగా సర్వదా భావించుచున్నా రని యర్థము. అన్యే—మధ్యమాధికారము గలవారు, ఈధ్యానయోగమునం దసమర్థులైనవారు; సాఙ్ఖ్యేనయోగేన—సాంఖ్య మనఁగా, సర్వానర్థలయానంతరము నేను నిత్యకూటస్థానంగవిద్రూపుఁడ నద్వయుఁ డను, ఎప్పుడును చలింపను చేయను పొందను అని ప్రత్యగ్వృత్తిచేఁ దాను నిరాకారమాత్రుఁ డనియు ప్రకృతిత్రిగుణతద్వికారతద్ధర్మతత్కార్యతదవస్థాసంబంధరహితుఁ డనియు సర్వదా బుద్ధియందు భావించుచుండుట, సంసారమోక్షమున కుపాయమగుటచే సాంఖ్యమే యోగము, దానిచేత; ఆత్మని—బుద్ధియందు; ఆత్మానం పశ్యన్తి—తన్ను అకర్తనుగాను అభోక్తనుగాను నిష్క్రియునిఁగాను సర్వదా భావించుచున్నా రని యర్థము. అపరేచ—సదసద్వివేకవైరాగ్యసన్న్యాసైకసాధ్యము లగు ధ్యానసాంఖ్యయోగములయం దనధికారు లగుగృహస్థులును; కర్మయోగేన - "మత్కర్మకృన్మత్పరమః" అని చెప్పినరీతిని పరమేశ్వరార్థము కర్మానుష్ఠానము కర్మయోగము, మోక్షోపాయం బగుటవలన కర్మమే యోగము, చిత్తశుద్ధిహేతు వగు కర్మయోగముచే; ఆరాధించుచు, ఆత్మానమ్ పరమాత్మను విశ్వరూపుని, ఆత్మని—బుద్ధియందు; పశ్యన్తి — వాసుదేవ స్సర్వ మ్మను బుద్ధిచేత సర్వంబును విష్ణువునుగాఁ జూచుచున్నారు. లేక. పరమేశ్వరార్పణబుద్ధిచే శ్రద్ధాభక్తులతో ననుష్ఠించినకర్మయోగముచేఁ జిత్తశుద్ధి నొంది దానిచే సంపాదితం బగు శ్రవణాదిజన్యజ్ఞానముచే, ఆత్మని—బుద్ధియందు; ఆత్మాన మాత్మనా పశ్యన్తి. క్రమముగ నని యర్థము.

వి. ఈ యాత్మదర్శనమునం దివి సాధనవికల్పములు చెప్పఁబడుచున్నవి. లోకమునందుఁ జతుర్విధులు గదా జనులు, కొంద ఱుత్తములు కొందఱు మధ్యములు కొందఱు మందులు కొందఱు మందతరు లని. అం దుత్తముల కాత్మజ్ఞానసాధనముఁ జెప్పుచున్నాఁడు.—ధ్యానేన = విజాతీయప్రత్యయముచే నెడతెగనిసజాతీయప్రత్యయప్రవాహముచేత, శ్రవణమననఫలభూత మగు నిదిధ్యాసనం బను పేరు గల యాత్మచింతనముచేత; ఆత్మని = బుద్ధియందు; పశ్యన్తి= సాక్షాత్కరించుచున్నారు; ఆత్మానమ్=ప్రత్యక్చేతనుని; ఆత్మనా=ధ్యానసంస్కృత మయిన యంతః

కరణముచేత; కేచిత్=కొందఱు ఉత్తము లగు యోగులు. మధ్యముల కాత్మజ్ఞాన సాధనముం జెప్పుచున్నాఁడు.—అన్యే—మధ్యములు; సాఙ్ఖ్యేన యోగేన=నిదిధ్యాసన పూర్వభావియు నిత్యానిత్యవివేకానన్తరభావియు నగు శ్రవణమననరూప మైన సాంఖ్యయోగముచేత, ఈ గుణత్రయపరిణామములు అనాత్మలు అన్నియు మిథ్యాభూతములు, తత్సాక్షిభూతుఁడు నిత్యుఁడు విభువు నిర్వికారుఁడు సత్యుఁడు సమస్తజడసంబంధశూన్యుఁ డగు నాత్మ నేను—అని వేదాన్తవాక్యవిచారజన్య మగు చింతనముచేత; పశ్యన్త్యాత్మాన మాత్మని అని యనువర్తించుచున్నది. ధ్యానోత్పత్తిద్వారంబున నని యర్థము. మందులకు జ్ఞానసాధనముం జెప్పుచున్నాఁడు.—కర్మయోగేన = ఫలాభిసంధిరహితముగా నీశ్వరార్పణబుద్ధితోఁ జేయునట్టి వేదవిహితం బగు తత్తద్వర్ణాశ్రమోచితకర్మకలాపముచేతఁ గూడ; అపరే — మందులు; పశ్యన్త్యాత్మాన మాత్మని యని యనువర్తించును. సత్త్వశుద్ధిచే శ్రవణమననధ్యానోత్పత్తిద్వారమున నని యర్థము.

శ్రీ. ఇట్లు వివిక్త మయిన యాత్మజ్ఞానమునకు సాధనవికల్పములఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ధ్యానేన- ఆత్మాకారప్రత్యయావృత్తిచే; ఆత్మని దేహమునందు; ఆత్మనా- మనస్సుచేతనే; ఆత్మానమ్; కేచిత్ పశ్యన్తి. అన్యే = మఱికొందఱు; సాఙ్ఖ్యేన- ప్రకృతిపురుషుల వైలక్షణ్యము నాలోచించుటచేత. మఱికొందఱు, యోగేన- అష్టాంగయోగముచేత. అపరే చ; కర్మయోగేన. పశ్యన్తి అని సర్వత్ర యనువర్తించును. ఈ ధ్యానాదులకు యథాయోగ్యముగా క్రమముగను సముచ్చయం బావశ్యక మైనను తత్తన్నిష్ఠాభేదాభిప్రాయంబున వికల్పములుగాఁ జెప్పఁబడినది.

ప. ఇఁక నిట్టివివేకముం గల్గి ఆత్మజ్ఞానము నొందుటకు సాధనవికల్పములఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత —ధ్యానేన = ఆత్మాకారవృత్తిచేత; ఆత్మని= దేహమునందు; ఆత్మనా = మనస్సుచేతనే; ఆత్మానం కేచిత్పశ్యన్తి. శ్రుతియును.— “శ్రద్ధా విత్తో భూత్వా ఽఽత్మన్యేవా ఽఽత్మానం పశ్యతి సర్వస్యా ఽఽత్మా ? భవతి” అని. అర్థము స్పష్టము. అట్లు, అన్యే = ఇతరు లయిన యధికారులు; సాఙ్ఖ్యేన యోగేన = ప్రకృతిపురుషులవైలక్షణ్యము నాలోచించుటచేత; పశ్యన్తి. శ్రుతియును ఋగ్వేదమునందు.— “పతఙ్గ మక్త మసురస్య మాయయా హృదా పశ్యన్తి మనసా విపశ్చితః । సముద్రే అన్తః కవయో విచక్షతే మరీచీనాం పద

మిచ్ఛన్తి వేధసః" అని. భాష్యము.— అసురస్య = బలవంతుఁడగు పరమేశ్వరుని యొక్క; మాయయా=మాయచే; అక్తమ్ = వ్యాపింపఁబడినవాని; కావుననే, పతఙ్గమ్ = అనేకదేహాపతనశీలుఁడగు క్షేత్రజ్ఞుని; విపశ్చితః=జ్ఞానవంతులు; మొదట, మనసా= సంకల్పాత్మకమగు మనస్సుచేత; అనంతరము, హృదా= నిశ్చయాత్మకమగు బుద్ధిచేతను; పశ్యన్తి—ఇట్లు ఆత్మచేతనే ఆత్మను జూచుచున్నారని యర్థము. అతనినే, కవయః=క్రాంతదర్శులు; సముద్రే=సముద్రయతి—వ్యాపించుచున్నది కావున సముద్రమనఁగా ప్రపంచము, దానియందు; అన్తః=లోపల; విచక్షతే—వారల లోపల నున్న స్మృతిమునువలెఁ జూచుచున్నారని యర్థము. అంతట, వేధసః=హిరణ్యగర్భునియొక్క; మరీచీనామ్=ప్రకాశములయొక్క; పదమ్=స్థానమును; ఇచ్ఛన్తి=ఉపాస్యపరతత్త్వరూపమున గ్రహించుచున్నారు. అపరే; కర్మయోగేన; చిత్తశుద్ధిద్వారమున పశ్యన్తి. ఇట్లు అధికారిభేదమున వికల్పార్థము.

తా. కేచిత్=యోగనిష్ఠగలవారు కొందఱు; ఆత్మని=దేహమునందు; బుద్ధౌ, ఆత్మానమ్=ఆత్మను; ఆత్మనా=మనస్సుచేత; ధ్యానేన=ధ్యానయోగముచేత; పశ్యన్తి. అన్యే=యోగనిష్ఠలేనివారు కొందఱు; సాంఖ్యేన యోగేన=జ్ఞానయోగముచేత; యోగయోగ్యమునుగా మనస్సును గావించి, ఆత్మానం పశ్యన్తి. అపరే=జ్ఞానయోగమునకు అనధికారులును అశక్తులు నయ్యు సులభోపాయము గోరువారును కర్మయోగాధికారులును; కర్మయోగేన=కర్మయోగముచేత; అంతర్గతజ్ఞానమగు మనస్సుచే యోగయోగ్యత నొంది, ఆత్మానం పశ్యన్తి.

మహా. సాంఖ్యేన=వేదోక్తభగవత్స్వరూపజ్ఞానముచేత. కర్ములకును శ్రవణముచేతను జ్ఞానముచేతను ధ్యానముచేతను దర్శనము కలుగును. శ్రవణము చేయువారికి జ్ఞానముచేతను ధ్యానముచేతను, సాంఖ్యులకు ధ్యానముచేతను దర్శనము కలుగును. అట్లు గారుడశ్రుతి.— "కర్మకృచ్ఛ్రావపి తచ్ఛ్రుత్వా జ్ఞాత్వా ధ్యాత్వాఽనుపశ్యతి। శ్రావకోఽపి తథా జ్ఞాత్వా ధ్యాత్వా జ్ఞాన్యపి పశ్యతి॥ అన్యథా తస్య దృష్టిర్న కథంచిన్నోపపద్యతే" * అని. అన్యే అనుట యశక్తులకును ఉపాయదర్శనార్థము.

---

* కర్మముచేయువాఁడు భగవత్స్వరూపమును విని యెఱింగి ధ్యానించి చూచుచున్నాఁడు, వినువాఁడును ఎఱింగి ధ్యానించి చూచుచున్నాఁడు, జ్ఞానియు ధ్యానించి చూచుచున్నాఁడు. కానియెడ నేవిధమునను దర్శనము కలుగదు.

అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే
తే ఽపి చాఽతితర న్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. ౨౬

భా. అన్యేతు - ఇతరులును; ఈవికల్పములయందు దేనిచేతను, ఏవమ్ - యథోక్తప్రకారమున; ఆత్మను, అజానన్తః - ఎఱుంగనివారై; అన్యేభ్యః - ఇతరు లగు నాచార్యులవలన; శ్రుత్వా - విని, దీని నిట్లు చింతింపుఁ డని యుపదేశింపఁబడినవారై; ఉపాసతే - శ్రద్ధ గలవారై చింతించుచున్నారు. తే ఽపిచ - వారు గూడ; శ్రుతిపరాయణాః - శ్రవణమే పరమ మగు నయనముగా—మోక్షమార్గప్రవృత్తియందు ముఖ్య మగు సాధనముగాఁగలవారు, కేవలము పరోపదేశమే ప్రమాణముగాఁగలవారు, తాము వివేకరహితు లైన వారుగూడ నని యభిప్రాయము. మృత్యుమ్ - మృత్యువును, మృత్యుయుక్త మగు సంసారము ననుట; అతితరన్త్యేవ - అతిక్రమింతురు - యతిక్రమించుచున్నారు. ఇఁక ప్రమాణమునందు స్వతంత్రులై వివేకవంతు లగువారు మృత్యువు నతిక్రమింతు రని చెప్పవలసిన దేమి యని యభిప్రాయము.

పూర్వోక్తసాధనములలో దేనిచేత నేనియు నాత్మ నెఱుంగుటకు శక్తి లేని వారు పెద్దలవలన శ్రవణము చేసి వా రుపదేశించినదాని శ్రద్ధతో నుపాసింతురు. అట్లు తమకు వివేకశక్తి లేక పరోపదేశమే ప్రమాణముగా నమ్మి యుపాసించువారుగూడ క్రమముగ సంసారమును దప్పక తరింతు రని తాత్పర్యము.

ప్ర. అధమతము లైన యధికారులకు మోక్షమార్గమునందుఁ బ్రవృత్త్యుపాయముఁ జెప్పుచున్నారు అన్యే త్విత్యాదిగా. ఆచార్యులవలన శ్రవణమునే వివరించుచున్నారు దీని నిత్యాదిగా. ఉపాసనమును వివరించుచున్నారు శ్రద్ధ ఇత్యాదిగా. పరోపదేశమువలనఁ బ్రవర్తించినవారికిఁగూడ ప్రవృత్తి సఫల మగు నని చెప్పుచున్నారు తే ఽపిచ ఇత్యాదిగా. వారికి ముఖ్యాధికారిత్వము వ్యావర్తించుచున్నారు శ్రుతీత్యాదిగా. అపిశబ్దముచే సూచిత మయినయర్థముఁ జెప్పుచున్నారు ఇఁక నిత్యాదిగా.

హ.

* దీనికిని మీఁది మూఁడుశ్లోకములకును ఈవ్యాఖ్యానము లేదు.

శం ఇట్లు ధ్యానసాంఖ్యయోగములందును కర్మయోగమునందును అధికారు లగు యతులకును గృహస్థులకును బ్రాహ్మణాదులకు వారివారి యధికారము చొప్పున మోక్షసాధనము నుపదేశించి పరమదయాళు వగుటచే శ్రీభగవంతుఁడు కర్మములయందును అనధికారు లగువారికి ముక్తిసాధనముఁ జెప్పుచున్నాఁడు.—కర్మాధికారు లైన త్రైవర్ణికు లగు బ్రాహ్మణాదులకంటెు, అన్యేతు - ఇతరులుగూడ, కర్మములం దనధికారు లైన కేవలపామరు లగు స్త్రీశూద్రులు గూడ; ఏవమ్—చెప్పినసాధనములయం దొకదానినైనను; అజానన్తః - శాస్త్రాధ్యయనమునకును తద్విజ్ఞానమునకును యోగ్యత లేమివలన సాధనములలో దేనినేని చక్కఁగా నెఱుంగుటకును జేయుటకును అసమర్థులై; అన్యేభ్యః - ఇతరు లగు బ్రాహ్మణాదు లగు గురువులవలన; నీవు దీనిఁ జేయుము, దీని నిట్లనుసంధింపు మని; శ్రుత్వా - విని; శ్రద్ధాభక్తులతో, శ్రుతిపరాయణాః - వినఁబడుచున్నది కావున శ్రుతి యనఁగా వినఁబడినయర్థము, తత్పరాయణ లై - తదేకనిష్ఠులై; ఉపాసతే - విన్నయర్థమును చక్కఁగా ననుష్ఠించుచున్నారు. తే - అపి - వారుగూడ, అర్థ మనోపదేశానువర్తులుగూడ; ఈశ్వరానుగ్రహమును చిత్తశుద్ధిని తత్త్వజ్ఞానమును పొంది క్రమంబున, మృత్యుమ్ - మృత్యుదుఃఖప్రధాన మగు సంసారమును; అతితరన్త్యేవ - అతిక్రమించునే యతిక్రమించుచున్నారు, క్రమమున ముక్తిని బొందుచున్నా రని యర్థము.

మ. మందతరులకు జ్ఞానసాధనముఁ జెప్పుచున్నాఁడు.—అన్యేతు మిక్కిలి మందులైనవారో, తుశబ్దము పూర్వోక్తత్రివిధాధికారులకంటె విలక్షణతను సూచించుచున్నది; ఈ యుపాయములను దేనిచేతను, ఏవమ్ చెప్పినప్రకారమున ఆత్మను; అజానన్తః; అన్యేభ్యః—కారుణికు లగు నాచార్యులవలన; శ్రుత్వా= విని, దీని నిట్లుపాసింపుఁ డని చెప్పఁబడినవారై; ఉపాసతే-శ్రద్ధతో చింతించుచున్నారు. తే అపిచ - వారును; మృత్యుమ్=సంసారమును; అతితరన్త్యేవ; శ్రుతిపరాయణాః = తాము విచారము చేయ నసమర్థు లైనను శ్రద్ధతో గురూపదేశశ్రవణమాత్రపరాయణులు. అపిశబ్దమువలన, ఎవరు తమయంతఁ దాము విచారము సేయ సమర్థులో వారు మృత్యువు నతిక్రమింతు రని చెప్పెడి దేమి యని యభిప్రాయము

శ్రీ మిక్కిలి మందు లైనయధికారులకుఁ దరణోపాయముఁ జెప్పుచున్నాఁడు.—అన్యేతు; సాంఖ్యయోగాదిమార్గమున, ఏవమ్=ఇట్లు యుపద్రష్టృత్వాది

లక్షణుం డగునాత్మను; సాక్షాత్కరించుటకు, అజానన్తః; అన్యేభ్యః — ఆచార్యుల వలన; శ్రుత్వా = ఉపదేశముచేత విని; ఉపాసతే = ధ్యానించుచున్నారు. వారు గూడ శ్రద్ధతో నుపదేశశ్రవణపరాయణులై, మృత్యుమ్ = సంసారమును; తిన్నగా, అతితరన్త్యేవ.

ప. *

రా. అన్యేతు — కర్మయోగాదు లగు నానావిధసాధనములం దనధికృతులు; అన్యేభ్యః = తత్త్వదర్శు లగుజ్ఞానులవలన; శ్రుత్వా; కర్మయోగాదులచే ఆత్మను, ఉపాసతే. వారునుగూడ ఆత్మదర్శనముచే మృత్యువు నతితరించుచున్నారు. ఎవ రనఁగా, ఎవ్వరు, శ్రుతిపరాయణాః=శ్రవణమాత్రనిష్ఠులో వారుగూడ. శ్రవణనిష్ఠు లయినవారు గూడ పాపరహితులై క్రమంబునఁ గర్మయోగాదికము నారంభించి మృత్యువును దాఁటనే దాఁటుదురు. అపిశబ్దమువలనను అధికారిభేదము తెలియవచ్చుచున్నది.

మా. •

యావత్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజఙ్గమమ్
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్త ద్విద్ధి భరతర్షభ. ౨౬

భా. క్షేత్రక్షేత్రజ్ఞైకత్వవిషయ మగుజ్ఞానము మోక్షసాధన మని యజ్జ్ఞాత్వా ఽమృత మశ్నుతే అను గ్రంథముచేఁ జెప్పఁబడినది. అది యేహేతువువలన ననఁగా నాహేతువుఁ బ్రదర్శించుటకై యీశ్లోక మారంభింపఁబడుచున్నది.—యావత్ = ఏది; కించిత్ = ఒకానొకటియైనను; సత్త్వమ్ = వస్తువు; ఏది యావస్తువు? సమస్తవస్తువు నని చెప్పుచున్నాఁడు.—స్థావరజఙ్గమమ్=స్థావరమును జంగమమును; సంజాయతే = పుట్టుచున్నదో; తత్ = ఆవస్తువు; క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ = క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగమువలన; పుట్టుచున్న దని, విద్ధి = ఎఱుంగుము. భరతర్షభ = ఓభరతశ్రేష్ఠుఁడా!

**పూర్వపక్షము.**—ఏది మఱి యీక్షేత్రక్షేత్రజ్ఞులసంయోగము? రజ్జువుతో ఘటమునకుంబోలె నవయవసంశ్లేషద్వారక మగు సంబంధ

---

* శ్రీధరీయముతో సమానము.

• దీనికి భాష్యము లేదు.

విశేష మేమో సంయోగము క్షేత్రమునకు క్షేత్రజ్ఞునకు సంభవింపదు, ఆకాశమువలె నిరవయవుం డగుటవలన. తంతుపటములకుం బోలె సమవాయలక్షణ మగు సంబంధంబును క్షేత్రక్షేత్రజ్ఞులకుఁ జెల్లదు, ఇతరేతరకార్యకారణభావము నంగీకరింపమివలన.

సిద్ధాంతము.—చెప్పెదము. భిన్నస్వభావులును విషయవిషయిరూపులు నగు క్షేత్రక్షేత్రజ్ఞులకు నితరేతరతద్ధర్మాధ్యాసలక్షణము సంయోగము, క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపవివేకాభావమువలనఁ గలిగినది, రజ్జుశుక్తికాదులకుఁ దద్వివేకజ్ఞానాభావమువలన నధ్యారోపితసర్పరజతాదిసంయోగమువలె. అట్టిది యధ్యాసరూపం బీక్షేత్రక్షేత్రజ్ఞసంయోగము మిథ్యాజ్ఞానలక్షణము. యథాశాస్త్రముగా క్షేత్రక్షేత్రజ్ఞలక్షణభేదము నెఱింగి పూర్వోదర్శితలక్షణ మగు క్షేత్రమునుండి ముంజనుండి గింటనుం బోలె యథోక్తలక్షణుం డగు క్షేత్రజ్ఞుని విభజించి న సత్తన్నాసదుచ్యతే యని నిరస్తసమస్తోపాధివిశేషం బగు జ్ఞేయమైనబ్రహ్మమును స్వరూపంబున నెవ్వఁడు చూచుచున్నాఁడో, క్షేత్రంబును మాయానిర్మితహస్తియుంబోలె స్వప్నదృష్టవస్తువుంబోలె గంధర్వనగరాదికముంబోలె నసత్తే సత్తువలె నవభాసించుచున్న దని యెవఁడు నిశ్చితజ్ఞానము నొందుచున్నాఁడో అతనికి యథోక్తసమ్యగ్దర్శనవిరోధమువలన నశించుచున్నది మిథ్యాజ్ఞానము, దానిజన్మహేతువు నశించుటవలన. "య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ" అను గ్రంథముచే విద్వాంసుఁడు మెండియు జనియింపఁ డని యేది చెప్పఁబడినదో అది యుపపన్నముగాఁ జెప్పఁబడినది.

భరతశ్రేష్ఠా! స్థావరము గాని జంగమము గాని యేయేవస్తువు పుట్టుచున్నదో అది యంతయు క్షేత్రక్షేత్రజ్ఞుల యధ్యాసరూప మయిన సంయోగమువలననే పుట్టుచున్న దని యెఱుంగుము. అధ్యాసము స్వరూపజ్ఞానమువలన నశించుం గావున జ్ఞానికి సర్వప్రపంచనివృత్తియై మోక్షము సిద్ధించు నని తా.

అ. ఐక్యజ్ఞానము ముక్తిహేతు వని మున్ను చెప్పినదాని ననువదించి ప్రశ్నపూర్వకముగా జిజ్ఞాసితహేతువును బ్రతిపాదించునది యని మీఁదిశ్లోకమును దించుచున్నారు క్షేత్రేత్యాదిగా. సర్వప్రాణిజాతంబునకును ఉత్పత్తి క్షేత్రక్షేత్రజ్ఞ

సంబంధాధీనం బగుటవలన క్షేత్రజ్ఞాత్మకపరమాత్మకు భిన్నముగాఁ బ్రాతీజాతము లేమింజేసి యైక్యజ్ఞానమువలననే ముక్తి యని చెప్పుచున్నారు అది ఇత్యాదిగా.

క్షేత్రక్షేత్రజ్ఞసంబంధమును జెప్పినదాని నాక్షేపించుచున్నాఁడు ఏది మఱి ఇత్యాదిగా. క్షేత్రజ్ఞునకు క్షేత్రమునకు సంబంధము సంయోగమా సమవాయమా యని వికల్పించి మొదటిపక్షమును దూషించుచున్నాఁడు రజ్జువుతో నిత్యాదిగా. రెండవపక్షము నిరసించుచున్నాఁడు తంతు ఇత్యాదిగా.

నా స్తవసంబాధము లేకున్నను క్షేత్రక్షేత్రజ్ఞులకు అధ్యాసరూప మైన సంబంధము కల దని పరిహరించుచున్నారు చెప్పెదము అని. భిన్నస్వభావు లనుటకు హేతువుఁ జెప్పుచున్నారు విష యేత్యాదిగా. ఇతరేతరతద్ధర్మాధ్యాసలక్షణము—ఇతరేతర = ఒండొంటియందు, తద్ధర్మ = వారిధర్మములకు, క్షేత్రమునందు లేనిదియు క్షేత్రజ్ఞగతంబు నగు చైతన్యమునకు క్షేత్రమునందును క్షేత్రజ్ఞునందు లేనిదియు క్షేత్రనిష్ఠంబు నగు జాడ్యాదికమునకు క్షేత్రజ్ఞునందును, అధ్యాసలక్షణము—ఆరోపరూపము. అట్టి యారోపరూపము క్షేత్రక్షేత్రజ్ఞులకు సంబంధ మని యర్థము. అందుకు నిమిత్తముఁ జెప్పుచున్నారు క్షేత్రేత్యాదిగా. అవివేకము వలన ఆరోపితసంయోగమునకు దృష్టాంతముఁ జెప్పుచున్నారు రజ్జు ఇత్యాదిగా. చెప్పినసంబంధమును నిగమనము చేయుచున్నారు అట్టిది ఇత్యాదిగా. అది నివృత్తి యోగ్యం బని సూచించుచున్నారు మి థ్యేత్యాదిగా. ఎట్లు మఱి మిథ్యాజ్ఞానము నకు నివృత్తి యగు నని యాశంకించి చెప్పుచున్నారు య థేత్యాదిగా. యో ౽యం విజ్ఞానమయః ప్రాణే ష్విత్యాదిక మగు త్వంపదార్థవిషయమైనశాస్త్రము నను సరించి వివేకజ్ఞానము నొంది మహాభూతాదిధృత్యంత మగు క్షేత్రమునుండి మున్ను చెప్పిన యుపద్రష్ట్రిత్యాదిలక్షణుం డగు క్షేత్రజ్ఞుని ముంజేషీకాన్యాయంబున వివేచించి సర్వోపాధివినిర్ముక్తం బగు బ్రహ్మమును స్వరూపంబున జ్ఞేయము నెవ్వఁ డనుభవించుచున్నాఁడో అతనికి మిథ్యాజ్ఞానము నశించు చున్న దని సంబంధము. ఎట్లీ క్షేత్రజ్ఞునకు నిర్విశేషత్వము సవిశేషత్వమునకు హేతు వుండఁగా? అని యాశంకించి చెప్పుచున్నారు క్షేత్రంబును ఇత్యాదిగా. బహుదృష్టాంతములు చెప్పుట క్షేత్రము బహువిధం బనుటను సూచించు చున్నది. ఈజ్ఞానమువలన మిథ్యాజ్ఞానము నశించు ననుటకు హేతువుఁ జెప్పుచున్నారు య థోక్తేత్యాదిగా. అయినను బురుషార్థసిద్ధి యెట్లు? కాలాంతరమున నిట్టి మిథ్యాజ్ఞానము మరల నుదయింపవచ్చును గదా? అని యాశంకించి చెప్పుచున్నారు దాని ఇత్యాదిగా. సమ్యగ్దర్శనమువలన అజ్ఞానతత్కార్యనివృత్తిచే ముక్తియని సిద్ధింపఁగా ఫలితముఁ జెప్పుచున్నారు య ఏవమిత్యాదిగా.

౨౬. ఏతద్యోనీని భూతాని యనుగ్రంథముచే భూతముల సంసారమునకు క్షేత్రక్షేత్రజ్ఞలక్షణ ప్రకృతిద్వయసంబంధము కారణం బని యేది చెప్పఁబడినదో దాని నిప్పుడు విశదీకరించుచున్నాఁడు మోక్షకాము లగు పండితులు ప్రకృతిద్వయ సంబంధము ప్రయత్నమునఁ బరిహరింపవలయు నని సూచించుటకై.—స్థావరజఙ్గమమ్ - స్థావరరూపమును జంగమరూపమును; యావత్ = ఎంతపరిమాణము గలది యైనను; కించిత్ సత్త్వమ్ = ఏదో ప్రాణి; సంజాయతే - పుట్టుచున్నదో, మూఁడులోకములయందును; తత్ - అది, సమస్తమును; క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ = క్షేత్రక్షేత్రజ్ఞులసంబంధమువలననే; పుట్టుచున్నది. ఏదోప్రాణి యని యవిశేషగ్రహణముచేత దేవమనుష్యాదులయందును సర్వత్ర జన్మము సాధారణ మని సూచిత మగుచున్నది. క్షేత్రక్షేత్రజ్ఞు లగు ప్రకృతిపురుషులకు సంబంధ మున్ననే ప్రాణిజాతము సర్వంబును బుట్టుచున్నది.— అపరిచ్ఛిన్న మగు జన్మాదిదుఃఖము ననుభవించుచున్నది, లేనిచోఁ గా దని; విద్ధి - ఎఱుంగుము నీవు. ఓ భరతర్షభుఁడా! ప్రకృతిపురుషులకు సంబంధ మున్ననే జన్మాదిదుఃఖహేతువు లగు నవిద్యాస్మితాదులును వానివలన జన్మబీజము లగుకర్మములును విజృంభించుచున్నవి, అది లేనియెడ నివి సంభవింపవు, కావునఁ బ్రకృతిపురుషసంబంధమును తత్త్వజ్ఞులును మోక్షసుఖకాములు నగు యతులు ప్రయత్నమునఁ బరిహరింపవలయు ననియర్థము. శంకయా! ఏది యున్నయెడఁ బురుషునకు సంసారము కలుగునో యేది లేనియెడఁ గలుగదో ఆప్రకృతిపురుషసంబంధ మేది? ప్రకృతిపురుషులకుఁ బరస్పరావయవసంశ్లేషాత్మకం బగు సంయోగము సంభవింపదు, సావయవనిరవయవములకు సంయోగము సంభవింపమివలన, "నిష్కలం నిష్క్రియ" మ్మని పురుషుం డగు నాత్మ నిరవయవుం డని శ్రుతి చెప్పుటవలన. నిరవయవ మైనను ఆకాశమునకు విభుత్వసిద్ధికై సర్వమూర్తద్రవ్యసంయోగిత్వము విభుత్వ మని సర్వమూర్తద్రవ్యములతో సంయోగ మంగీకరింపఁబడిన దందు వేని, అట్లయినచో ఆకాశమునకు సావయవత్వమును వర్షవాతాగ్నిసంయోగమువలన క్లేదశోషదాహాద్యనర్థమును అనిత్యత్వంబును సంభవించును. సూక్ష్మ మగుటవలన స్థూలములతో సంయుక్తము గా దందు వేని అట్లు చెప్ప శక్యము గాదు, జలాదులసూక్ష్మావయవములతో సూక్ష్మమునకుఁ గూడ సంయోగమును పై చెప్పిన యనర్థమును దప్పవు. కావున మూర్తద్రవ్యసంయోగిత్వకల్పనము భ్రాంతిమాత్రమే. మఱే మనఁగా, నిరవయవ మగు నాకాశమునకుఁ గల సర్వమూర్తద్రవ్యవ్యాపకత్వమే తత్సంయోగిత్వ మని వ్యపదిష్టము

కాని సాకూౌదవయవసంశ్లేషిత్వము కాదు, నిరవయవం బగుటచే నాకాశమున కది సంభవింపమివలన. అట్లు క్షేత్రజ్ఞునకును క్షేత్రములతో సంయోగము సంభవింపదు. సమవాయముగూడ సంభవింపదు, క్షేత్రక్షేత్రజ్ఞుల కయుతసిద్ధత్వము లేమివలన. ఈ రెండుసంబంధములును సంభవింపనియప్పుడు సంబంధాంతరము లేమివలన ఏ సంబంధము చెప్పవలయును? ఇందులకుఁ జెప్పుచున్నాము. యుష్మదస్మత్ప్రత్యయార్థములై విషయవిషయిరూపులై యన్యోన్యవిరుద్ధస్వభావు లగు ప్రకృతిపురుషులు విపరీతముగా గ్రహింపఁబడుటవలన వారి కొండొరులయం దొండొరులధర్మముల యధ్యాసరూప మగు తద్వివేకజ్ఞానాభావమూలక మయినసంబంధము అనాదిసంస్కారజన్యము సంభవించు చున్నది, శుక్తిరజతములకుం బోలె. అది స్వరూపాజ్ఞానమూలక మగుటవలన మిథ్యాజ్ఞానరూపము. అదియే పురుషునకు సంసారకారణము. తత్స్వరూపవివేచనమే సంసారనివృత్తికారణము. తద్వివేచనప్రకారము చెప్పుచున్నాము. ఘటమును తద్ద్రష్టయుం బోలెఁ బ్రకృతిపురుషులు అన్యోన్యవిలక్షణులు. ప్రకృతి విషయము, పురుషుఁడు విషయి. ప్రకృతి జ్ఞేయము, పురుషుఁడు జ్ఞాత. ప్రకృతి ప్రకాశ్యము, పురుషుఁడు ప్రకాశకుఁడు. ప్రకృతి వికారి, పురుషుఁడవికారి. ప్రకృతి యనిత్యము, పురుషుఁడు నిత్యుఁడు. ప్రకృతి సావయవము, పురుషుఁడు నిరవయవుఁడు. ప్రకృతి యనేకము, పురుషుఁ డేకుఁడు. కావున తత్స్వరూపము పరస్పరవిలక్షణము. "ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమ్, ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి, సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్, జ్యోతిషా మపి త జ్జ్యోతిః, తమసః పరమ్, జ్ఞానమ్, హృది సర్వస్య విష్ఠితమ్" అని చెప్పినవిధంబునను, క్షేత్రజ్ఞుఁడు క్షేత్రముకంటె భిన్నుఁడు జ్ఞాత యగుటవలన ఘటజ్ఞాతవలె నిత్యాదియుక్తులచేతను వివేచించి తిలతండులములం బోలె విభజించి క్షేత్రముచుండి విభక్తుఁ డైనక్షేత్రజ్ఞుని ఇతఁడే నేనని స్వస్వరూపంబున నెఱుంగవలయును. ప్రకృతిని "నసత్తన్నాఽసదుచ్యతే" అని చెప్పినరీతిని ఆత్మయందుఁ బ్రవిలయము నొందింపవలయును. వెండియు నాభాసరూపమై యనువర్తించి యుండు ప్రకృతియు తద్ధర్మకర్మములును ఆహారాదులయందు అంటనియట్లు ఎల్లప్పుడును ఆత్మనిష్ఠయందే యుండవలయును. ఇట్లున్న బ్రహ్మవిద్యతికి దుఃఖహేతువు లగు నవిద్యాఽస్మితాదులును తత్కార్యము లైన జన్మబీజము లగు కర్మములును సంభవింపవు. విదేహముక్తియు హస్తగతం బగును. అందువలన క్షేత్రక్షేత్రజ్ఞులసంయోగ మెట్లు గలుగదో అట్లు బ్రహ్మవిదుఁడు బ్రహ్మనిష్ఠయందే యుండవలయు నని

సూచించుటకై క్షేత్రక్షేత్రజ్ఞులసంయోగమే విద్వాంసులకును అవిద్వాంసులకును యెల్లరకును జన్మాదిదుఃఖకారణం బని యావత్సంజాయతే కించి దిత్యాదిగ్రంథముచే జగద్గురు వుపదేశించుచున్నాఁడు. అందువలన సర్వదా సదాత్మరూపుండవనే యుండవలయు నని సిద్ధము.

మ. సంసార మావిద్యక మగుటవలన విద్యచే మోక్షం బుపపన్న మను నీయర్థమును దృఢీకరించుటకై సంసారంబును తన్నివర్తకజ్ఞానంబును బ్రపంచించుచున్నాఁ డధ్యాయపరిసమాప్తివఱకు. అం దిప్పుడు కారణం గుణసఙ్గో ఽస్య సదస ద్యోని జన్మసు అని మున్ను చెప్పినదాని వివరించుచున్నాఁడు.—యావత్ కించిత్ = ఏది యొకానొక టైనను; సత్త్వమ్ = వస్తువు; సంజాయతే = పుట్టుచున్నదో; స్థావరము గాని జంగమము గాని; తత్ = అది సర్వంబును; క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ = అవిద్యాతత్కార్యాత్మకంబును జడంబును అనిర్వచనీయంబు నగు దృశ్యజాతము క్షేత్రము, తద్విలక్షణమును తద్భాసకమును అసంగోదాసీనంబును నిర్ధర్మకంబును అద్వితీయంబు నగు స్వప్రకాశపరమార్థసచ్చైతన్యము క్షేత్రజ్ఞము, వానియొక్క - సంయోగము — మాయావశమువలన నితరేతరావివేకమునం గలుగు సత్యానృతమిథునీకరణాత్మక మగు మిథ్యాతాదాత్మ్యాధ్యాసము, దానివలననే; సంజాయతే - పుట్టుచున్నదని; విద్ధి; భరతర్షభ! అందువలన స్వరూపాజ్ఞానజన్య మగు సంసారము స్వరూపజ్ఞానమువలన నశించును స్వప్నాదికమువలె నని యభిప్రాయము.

శ్రీ. అట కర్మయోగము తృతీయచతుర్థపంచమములయందుఁ బ్రపంచింపఁబడినది. ధ్యానంబును యోగంబును షష్ఠాష్టమములయందుఁ బ్రపంచింపఁబడినవి. ధ్యానాదికము సాంఖ్యవివిక్తాత్మవిషయం బగుటవలన సాంఖ్యమునే యధ్యాయపరిసమాప్తివఱకుఁ బ్రపంచించుచున్నాఁడు.—యావత్ కించిత్, సత్త్వమ్ = వస్తుమాత్రము; పుట్టుచున్నదో అది యంతయు క్షేత్రక్షేత్రజ్ఞులసంయోగము వలన — అవివేకకృత మైన తాదాత్మ్యాధ్యాసమువలనఁ బుట్టుచున్న దని యెఱుంగుము.

ప. ఇక అన్యోన్యాధ్యాసయోగేన అని మున్ను చెప్పినదానిని ప్రకటించుటకై చెప్పుచున్నాఁడు.—యావత్ కించిత్; సత్త్వమ్ = వస్తుమాత్రము; స్థావరము గాని జంగమము గాని పుట్టుచున్నదో, అది యంతయు క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగమువలన—అవివేకకృత మయిన తాదాత్మ్యాధ్యాసమువలనఁ బుట్టుచున్నది యని యెఱుంగుము, ప్రకృతిపురుషయోగమువలన బుద్ధితత్త్వ మిత్యాదిగా.

తా. ఇట్టి ప్రకృతిసంసృష్టుం డగు నాత్మను వివేకంబున ననుసంధించు ప్రకారముఁ బ్రతిపాదించుటకై సమస్తమైనస్థావరజంగమవస్తువులును క్షేత్రక్షేత్రజ్ఞసంసర్గమువలనఁ బుట్టిన వని చెప్పుచున్నాఁడు.—ఏయే సత్త్వము స్థావరజంగమరూపమునఁ బుట్టుచున్నదో అది యంతయు క్షేత్రక్షేత్రజ్ఞుల యితరేతరసంయోగము వలననే పుట్టుచున్నది—క్షేత్రక్షేత్రజ్ఞసంయుక్తమయ్యే పుట్టుచున్నది గాని తద్వియుక్తమై కా దని యర్థము.

మూ. మఱియుఁ బ్రకృతిపురుషస్వరూపమును సామ్యాదిధర్మయుక్తమునుగాఁ జెప్పుచున్నాఁడు సమ మిత్యాదిగా.

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి. ౨౮

భా. సన్న భూయో౽భిజాయతే యనువచనముచే సమ్యగ్దర్శనఫలము అవిద్యాదిసంసారబీజనివృత్తిద్వారంబున జన్మాభావం బని చెప్పఁబడినది. జన్మకారణంబును అవిద్యామూలకం బగు క్షేత్రక్షేత్రజ్ఞసంయోగం బని చెప్పఁబడినది. అందువలన నాయవిద్యకు నివర్తకం బగు సమ్యగ్దర్శనము చెప్పఁబడినను మఱియు శబ్దాంతరమునఁ జెప్పఁబడుచున్నది.—సమమ్ = నిర్విశేషుని; తిష్ఠన్తమ్ = ఉన్నవానిని; వేనియందు? సర్వేషు భూతేషు = బ్రహ్మాదిస్థావరాంతము లగు ప్రాణులందు; ఎవనిని? పరమేశ్వరమ్ = దేహేంద్రియమనోబుద్ధ్యవ్యక్తాత్మల నపేక్షించి పరమేశ్వరుఁడైనవానిని; సర్వభూతములయందును నిర్విశేషుఁడై యున్న పరమేశ్వరుని; ఆభూతములకు విశేషణము చేయుచున్నాఁడు.— వినశ్యత్సు = నశించువాని యందు; ఆపరమేశ్వరునికిని విశేషణము చేయుచున్నాఁడు.— అవినశ్యన్తమ్=నశింపకున్నవాని అని, భూతములకును బరమేశ్వరునకును అత్యంతవైలక్షణ్యముఁ బ్రదర్శించుచున్నాఁడు; ఎట్లు? సర్వభావవికారములకును జనిరూప మయిన భావవికారము గదా మూలము, ఇతరము లయిన వినాశాంతములగు సర్వభావవికారములును జన్మోత్తరము కలుగునవి, వినాశముకన్నఁ బర మైన భావవికార మేదియు లేదు భావమే లేమివలన, ధర్మియున్నం గదా ధర్మము లుండును, అందువలనఁ జరమభావవికారాభావము ననువదించుటచేఁ బూర్వభావు లగు సర్వభావవికారములును

కార్యసహితముగాఁ బ్రతిషిద్ధము లగుచున్నవి. అందువలన సర్వభూతములతో నత్యంతము వైలక్షణ్యము—నిర్విశేషత్వమును నేకత్వమును బరమేశ్వరునకు సిద్ధము. ఇట్లు యథోక్తుం డగు పరమేశ్వరుని; యః—ఎవఁడు; పశ్యతి = చూచుచున్నాఁడో; సః = అతఁడు, పశ్యతి = చూచుచున్నాఁడు. ఓయీ! సర్వలోకము గూడఁ జూచుచున్నది, ఏల విశేషణము? సత్యము, చూచుచున్నది. వా ఈ మనఁగా, విపరీతముగాఁ జూచుచున్నది. అందువలన విశేషించుచున్నాఁడు, వాఁడే చూచుచున్నాఁడని. ఎట్లు అనేకచంద్రులను జూచు తిమిరదృష్టి నపేక్షించి యేకచంద్రదర్శి విశేషింపఁబడుచున్నాఁడో వాఁడే చూచుచున్నాఁ డని, అట్లు యింగను ఒక్కఁడును అవిభక్తుండు నగు యథోక్తుఁ డైనయాత్మ నెవ్వఁడు చూచుచున్నాఁడో అతఁడు విభక్తానేకాత్మవిపరీతదర్శుల నపేక్షించి విశేషింపఁబడుచున్నాఁడు, వాఁడే చూచుచున్నాఁ డని. ఇతరులు చూచుచున్నను చూడకున్నారు, విపరీతదర్శు లగుటవలన, అనేకచంద్రదర్శివలె నని యర్థము.

బ్రహ్మాదిస్థావరాంతసర్వప్రాణులయందును నిర్విశేషుండై యసి నశించుచున్నను దాను నశింపక యేకరసుండై యుండునట్టియాత్మను స్వరూపమున నెవ్వఁడు చూచుచున్నాఁడో అతఁడే యాత్మజ్ఞుఁ డని తాత్పర్యము.

త్రి. మీఁదిగ్రంథము నవతరింపఁజేయుటకై వ్యవహితముగాఁ గడచిన యర్థముఁ గీర్తించుచున్నారు నస ఇత్యాదిగా. అవిద్య యనఁగా అనాద్యనిర్వాచ్యమయిన యజ్ఞానము మిథ్యాజ్ఞానము, తత్సంస్కార మాదిశబ్దార్థము. వ్యవహితమనువదించి యవ్యవహితము ననువదించుచున్నారు జ న్మేత్యాదిగా. వ్యవహితావ్యవహితోక్తులనుబట్టి యజ్ఞానము సర్వానర్థమూలం బని యేర్పడుటవలన తన్నివర్తకమగు సమ్యగ్జ్ఞానము చెప్పవలయు నని చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. దానిఁ బలుమాఱు చెప్పి యుండుటవలనఁ జెప్పినయర్థమును నెండియుఁ జెప్పుట వ్యర్థ మని యాశంకించి యతిసూక్ష్మ మయినయర్థమును శబ్దభేదంబునఁ బలుమాఱు చెప్పుట మందాధికార్యనుగ్రహార్థ మని తలఁచి చెప్పుచున్నారు చెప్పఁబడినను ఇత్యాదిగా. సర్వత్ర పరమాత్మ యొక్కఁడే కావున నుత్కర్షాపకర్షములు లేనివాఁ డని చెప్పుచున్నారు సమ మ్మని. పరమత్వమును ఈశ్వరత్వమును ఉపపాదించుచున్నారు దేహేంద్రి యేత్యాదిగా. ఇట ఆత్మ యనఁగా జీవుఁడు. ఆశ్రయనాశము

వలన ఆశ్రితునకును నాశము నాశంకించి చెప్పుచున్నారు ఆపరమేశ్వరునికి ఇత్యాది గా. ఉభయస్థలములందును విశేషణద్వయమునకుఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు భూతములకును ఇత్యాదిగా. నాశానాశములచే వైలక్షణ్య మున్నను అత్యంతవైల క్షణ్య మెట్లు సవిశేషత్వభిన్నత్వములు తుల్యములై యుండఁగా? అని శంకించుచు న్నాఁడు ఎట్లు అని. భూతములకు సవిశేషత్వాదు లున్నను పరున కవి లేమివలన నత్యంతవైలక్షణ్య మని చెప్పుటకై జన్మము భావవికారములయందు మొదటి దని చెప్పుచున్నారు స ర్వేత్యాదిగా. అందు హేతువుఁ జెప్పుచున్నారు ఇతరములు ఇత్యాదిగా. జన్మము లేక మీఁదివికారములు సంభవింపవు, జన్మము గలవాని యందే గదా యవి కనఁబడుచున్నవి యని యర్థము. వినాశానంతరముగూడ మఱి యొకవికార ముపపన్నమై యుండఁగా నది కడపటివికార మనుట యెట్లని యాశం కించి చెప్పుచున్నారు వినాశముకన్న నిత్యాదిగా. అదియే కడపటివికార మని సిద్ధ ము కాఁగా ఫలితము చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. పరమేశ్వరునకు భూతములకంటె నత్యంతవైలక్షణ్యమును జెప్పినదాని నుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా. నిర్విశేషత్వమును – సర్వభావవికారరహితత్వమును కూట స్థత్వమును. ఏకత్వమును – అద్వితీయత్వమును. యః పశ్య తీత్యాదికమునకు వ్యాఖ్య చేయుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. ఉక్తవిశేషణుం డగు నీశ్వరునిఁ జూచు చున్నవాఁడే చూచుచున్నాఁ డని చెప్పినదాని నాక్షేపించుచున్నాఁడు ఏయుం ఇత్యాదిగా. ఈశ్వరపరాఙ్ముఖుఁ డయిన యనాత్మనిష్ఠుఁడు అతనిఁ జూచుచున్నను విప రీతముగాఁ జూచుటవలన ఈశ్వరప్రవణుఁడే సమ్యగ్దర్శి యను వివక్షచే విశేషణం బని పరిహరించుచున్నారు సత్యము ఇత్యాదిగా. చెప్పినదానినే దృష్టాంతముచే వివ రించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. యః పశ్య తీత్యాద్యర్థము నుపసంహరించుచు న్నారు ఇతరులు ఇత్యాదిగా. పరమాత్మనిష్ఠులకంటె నితరు లని యర్థము.

శ౦. క్షేత్రక్షేత్రజ్ఞుల వివేచించినను వెండియుఁ దద్వివేకంబు దృఢ మగు టకై తత్తన్నియతవిశేషణములచే వివేచించుచు నిట్టి వివిక్తుం డగునాత్మ నెవ్వఁడు సాక్షాత్తుగా నెఱుంగుచున్నాఁడో అట్టి యతియె జీవన్ముక్తుఁ డని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—భూతేషు = భవన్తి – జన్మలక్షణ మయినవికారమును బొందు చున్నవి కావున భూతము లనఁగా బ్రహ్మాదిస్థావరాంతములు, భూతము లనుటచే భూతములకే భవనము గాని యాత్మకు లేదు కావున నిత్యుం డగునాత్మకు భవనము లేమియు తన్నిమిత్తకి మగు నస్తిత్వము లేమియు సూచితము, అట్టి భూతముల

యందు; సర్వేషు = నామరూపజాతిక్రియాగుణవిశేషములచేఁ బరస్పరము విభక్తములయి విషమము లైన ప్రాణిశరీరము లన్నిటియందును; సమమ్ = అవిభక్తుని నేకరూపుని ఉత్కృష్టాపకృష్టవర్జితుని, నిర్విశేషుని నని యర్థము; ఆత్మయం దారోపితము లైన భూతములయందే నామరూపజాతిగుణాదికృత మగు విశేషము గాని యధిష్ఠాన మగు నాత్మయందు లేదు, నిరవయవుఁ డగుటవలనను నిర్గుణుఁ డగుటవలనను కేవలాత్మకు నుత్కృష్టాపకృష్టములు సంభవింపమి వలన. సమ మ్మనుటచే వృద్ధియు నపక్షయమును నను భావవికారము లాత్మకు లే వని సూచిత మగుచున్నది; మఱియును, తిష్ఠన్తమ్ = క్షర స్సర్వాణి భూతాని యను న్యాయంబున క్షరస్వభావము లగు భూతములు ప్రతిక్షణము విపరిణామమును నొందుచుండఁగాఁ దాను దద్రహితుండై సదా యేకరూపముతో వర్తించువానిని, నిరవయవుఁ డగుటవలన అక్షరుని, శైశవము మొదలు నాశమువఱకు తత్తద్దేహేంద్రియాదులు విపరీతము లగుచుండఁగా అహ మస్మి యని యాత్మసత్త సదా యేకరూపముగాఁ గనఁబడుటవలన సర్వదా యేకరూపమున నున్నవాని నని యర్థము, "అనవస్థం శరీరేష్వవస్థితమ్" అను శ్రుతివలన, భూతములకే విపరిణామము గాని యాత్మకు లే దని యాత్మకు విపరిణామాభావము సూచితము. మఱియును, వినశ్యత్సు = జన్మము గలవి యగుటవలన భూతములు నశించుచుండఁగా; తాను, అవినశ్యన్తమ్ = చరమవికారము లేనివానిని, నిత్యు నని యర్థము. సుషుప్తియందు సర్వభూతములును లయము నొందినపుడు సుఖముగా నిద్రించితి నని యాత్మసద్భావము తెలియవచ్చుటవలన ఆత్మ నిత్యుఁ డనుటకుఁ బ్రత్యక్షంబును, "ఆత్మ నిత్యుఁడు అజుం డగుటవలన" నను ననుమానంబును, "అవినాశీ వా అరేఽయ మాత్మా" అను శ్రుతియును బ్రమాణములు; అందువలననే, పరమేశ్వరమ్ = దేహేంద్రియమనోబుద్ధ్యవ్యక్తములకంటెఁ బరముని, నిత్యుఁ డగుటచేతను అతిసూక్ష్ముఁ డగుటచేతను అంతరుఁ డగుటచేతను వ్యాపకుఁ డగుటచేతను చేతనుఁ డగుటచేతను ప్రకాశకుఁ డగుటచేతను అధిష్ఠాన మగుటచేతను ఆనందరూపుఁ డగుటచేతను ఉత్కృష్టతముని నని యర్థము, "ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థాః" ఇత్యాదిశ్రుతివలన, ఈశ్వరుని = ఈశనశీలుని, అయస్సునకు సూదంటురాయివలె సన్నిధిమాత్రంబున ప్రకృతికిఁ బ్రవృత్తిహేతు వగుటయే యాత్మ కీశ్వరత్వము, రాజాదులకుఁ బోలె నియంతృత్వము గాదు, "నైవ కుర్వన్న కారయన్" అనియు "స్వభావస్తు ప్రవర్తతే" అనియుఁ జెప్పుటవలన; ఇట్లు సమత్వ కూటస్థత్వ నిత్యత్వ చేతనత్వాదిస్వధర్మములచే విష

మత్వ సవిక్రియత్వ వినాశిత్వ జడత్వాదిధర్మములు గల క్షేత్రమునుండి విలక్షణుఁడుగాఁ దెలియఁబడుచున్న నిర్విశేషుని అస్మత్పదప్రత్యయార్థ మయిన యాత్మను క్షేత్రజ్ఞుని క్షేత్ర తద్ధర్మ తత్కార్యములచే అసంస్పృష్టునిఁగా, యః పశ్యతి = క్రమముగ ననుష్ఠింపఁబడిన నిత్యనిరంతరశ్రవణమనననిదిధ్యాసనసమాధులచేఁ గలిగిన సమ్యగ్దర్శనముచే "నిత్యకూటస్థాసంగచిద్రూపుఁ డగు ప్రత్యగాత్మయే నేను, ఎప్పుడును సంసారి కాను" అని సంసారివిలక్షణుం డగు నాత్మ నెవ్వఁడు సాక్షాత్తుగాఁ జూచుచున్నాఁడో; సః = అట్టి బ్రహ్మవిదుఁ డగు యతియు; యథోక్తస్వరూపుండును కర్తృత్వ భోక్తృత్వాది సర్వసంసారధర్మవర్జితుండును సర్వోపాధివినిర్ముక్తుండును ఆకాశమువలె నతినిర్మలుండును బరిపూర్ణుండు నగు నాత్మను తన్ను సర్వదా సర్వావస్థలయందును ముక్తునిఁగానే చూచుచున్నాఁడు, ఇతరుఁడు శ్రవణమాత్రమునఁ దన్నుఁ గృతార్థునిఁగాఁ దలంచువాఁడు తన్ను ముక్తునిఁగాఁ జూడఁజాలఁ డని యర్థము. ఇందుచే, ఘటమఠాదులయం దాకాశమువలె బ్రహ్మాది స్తంబపర్యంతశరీరములయందాత్మ వ్యాపకుఁ డనియు సముఁ డనియు నసంగుఁ డనియు నిత్యుం డనియు నిష్క్రియుం డనియుఁ బూర్ణుఁ డనియు నెఱిఁగి ప్రారబ్ధానురూపముగా దేహేంద్రియాదులు ప్రవృత్తము లైనను నివృత్తము లైనను దాను తదుభయరహితుం డనియు నెవ్వఁడు సర్వదా యెఱుంగుచున్నాఁడో తాను నిర్వికారరూపంబునఁ బూర్ణవృత్తిచే నున్నాఁడో అతఁడే జీవన్ముక్తుఁ డని సూచిత మగుచున్నది.

మ. ఇట్లు సంసార మవిద్యాత్మక మని చెప్పి తన్నివర్తక మగు విద్యను ప్రతిపాదించుటకై య ఏవం వేత్తి పురుష మ్మని మున్ను చెప్పినదాని వివరించుచున్నాఁడు.—సర్వేషు భూతేషు = భవనధర్మము లైన స్థావరజంగమాత్మకము లగు సర్వప్రాణులయందును, అనేకవిధజన్మాదిపరిణామశీలము లగుటచేతను గుణప్రాధాన్యము నొందుటచేతను విషమము లై యందువలననే చంచలము లైనవానియందు, ప్రతిక్షణమును బరిణమించునవి గదా భావములు, పరిణమింపక క్షణమేనియు నిలువ నేరవు, అందువలనఁ బరస్పరబాధ్యబాధకభావము నొందినవానియందు; ఇట్టివై, వినశ్యత్సు = దృష్టనష్టస్వభావము లై మాయాగంధర్వనగరప్రాయము లైనవానియందు; సమమ్ = సర్వత్ర యేకరూపుఁ డైనవానిని, ప్రతిదేహమును ఒక్కఁడయ్యే యున్నవానిని; జన్మాదిపరిణామశూన్యుఁ డగుటచే, తిష్ఠన్తమ్ = పరిణమింపనివానిని; పరమేశ్వరమ్ = సర్వజడవర్గమునకును సత్తాస్ఫూర్తిప్రదుఁ డగుటచే బాధ్యబాధకభావము లేనివానిని, సర్వదోషరహితుని; అవినశ్యన్తమ్ = దృష్టనష్టప్రాయ మైన సర్వద్వైత

మునకును బాధ కలుగుచున్నను అబాధితుని; ఇట్లు సర్వప్రకారంబున జడప్రపంచ విలక్షణుఁ డగునాత్మను వివేకమున, యః = ఎవ్వఁడు: శాస్త్రదృష్టిచే, పశ్యతి = చూచుచున్నాఁడో; సః = అతఁడే; పశ్యతి = చూచుచున్నాఁ డాత్మను, జాగ్రద్బోధముచే స్వప్నభ్రమను బాధించువానియట్లు. అజ్ఞుఁడో స్వప్నదర్శివలె భ్రాంతిచే విపరీతముగాఁ జూచుచున్నను జూడనివాఁడే, భ్రమము అదర్శనాత్మకమగుటవలన. రజ్జువును సర్పముగాఁ జూచువాఁడు చూచుచున్నాఁడని చెప్పఁబడఁడు గదా! సర్పదర్శనము రజ్జ్వదర్శనాత్మక మగుటవలన. ఇట్లు ఇతిశాస్త్రానుపరక్తమైనశుద్ధాత్మయొక్క దర్శనమువలన తదదర్శనాత్మక మగు నవిద్య నివర్తిల్లు ననియు నందువలన తత్కార్యమగు సంసారము నివర్తిల్లు ననియు నభిప్రాయము. ఇట విశేషణమర్యాదచే ఆత్మానమ్మను విశేష్యపదము లభించుచున్నది. లేక. పరమేశ్వర మ్మనునదియే విశేష్యపదము కావచ్చును. విషమత్వ చంచలత్వ బాధ్యబాధకరూపత్వలక్షణ మగు జడగతవైధర్మ్యము సమత్వ తిష్ఠత్వ పరమేశ్వరత్వరూపము లైన యాత్మవిశేషణములసామర్థ్యమువలన నర్థప్రాప్త మగుచున్నది. ఇతరము కరతలామలకము. మని వివేకము.

శ్రీ. సంసారోత్పత్తి యవివేకకృత మని ప్రతిపాదించి తన్నివృత్తికొఱకు నివిక్తాత్మవిషయ మగు సమ్యగ్దర్శనమును జెప్పుచున్నాఁడు.—స్థావరజంగమాత్మకము లగు భూతములయందు నిర్విశేషముగా సద్రూపమున సమముగా నుండునట్టి వాని అందువలననే యాభూతములు నశించుచున్నను నశింపకున్న వానిఁ బరమాత్మ నెవ్వఁడు చూచుచున్నాఁడో అతఁడే చక్కగాఁ జూచువాఁడు, ఇతరుఁడు కాఁడు.

ప. ఇట్లు అవివేకమువలన సంసారము కలుగుచున్న దని చెప్పి తన్నివృత్త్యర్థము వివిక్తాత్మవిషయ మగు సమ్యగ్దర్శనముఁ జెప్పుచున్నాఁడు.—సమస్తము లయిన స్థావరజంగమభూతములయందు సమముగా సద్రూపంబున వర్తించుచున్న యీశ్వరు నెవ్వఁడు చూచుచున్నాఁడో అతఁడే చూచినవాఁడు. ఇతరుఁడు కాఁడు. శాతపథశ్రుతియును.—"య ద్వేవ సమః ప్లుషిణా సమో మశకేన సమో నాగేన ఏభి స్త్రిభి ర్లోకై స్సమో ఽనేన సర్వేణ తస్మా దేవ సామా ఽశ్నుతే సామ్న స్సాయుజ్యం సలోకతాం జయతి య ఏవం వేద" అని భాష్యము.—పూర్వము సా చామశ్చ అను వ్యుత్పత్తిచే సామస్వరూపము చెప్పి యిప్పుడు వికల్పంబున సమత్వమే సామ యని చెప్పుచున్నది. య ద్వేవ=లేక. ప్లుషిణా=అతిసూక్ష్మజీవముతో; సమః=సమానుఁడు. మశకేన=దోమతో; సమః నాగేన = ఏనుఁగుతో; సమః. ఏభిః త్రిభిః లోకైః = ఈ మూఁడులోకములతో; సమః. అనేన సర్వేణ=ఈ

సమస్తముతో; సముఁడు. తస్మాదేవ=అందువలననే; సామ=సామయను పదమును; అశ్నుతే=పొందుచున్నాఁడు. య ఏవం వేద=ఎవ్వఁడిట్లెఱుంగుచున్నాఁడో; అతఁడు, సామ్నః=పరమేశ్వరునియొక్క; సాయుజ్యమ్=సాయుజ్యమును; సలోకతామ్=సాలోక్యమును; జయతి – పొందుచున్నాఁడు. ఎట్టి భూతములయందు ? వినశ్యత్సు. ఎట్టి యీశ్వరుని ? అవినశ్యన్తమ్. ఎట్లు ఘటాదులు నష్టములైనను తదంతర్గతమైన యాకాశము నశింపదో, అట్లు. ఇట, "అపశ్య మస్య మహతో మాహిత్వమ్" ఇత్యాది శ్రుతులు పూర్వము వ్యాఖ్యాతములు.

టీ. ఇట్లు ఇతరేతరసంసృష్టము లయిన సర్వభూతములయందు దేవాది విషమాకారమునుండి వియుక్తుండై యందందు దాయాదేహేంద్రియమనస్సులకుఁ బరమేశ్వరుండై యున్నయాత్మను జ్ఞాతృత్వంబున సమానాకారునిఁగాను, ఆదేహాదులు నశించుచుండఁగా వినాశమున కయోగ్యమయిన స్వభావము గలవాఁడగుటచే నశింపనివానిఁగాను, ఎవ్వఁడు చూచుచున్నాఁడో, సః పశ్యతి=అతఁ డాత్మను యథావస్థితునిఁగాఁ జూచుచున్నాఁడు. ఎవ్వఁడు మఱి దేవాదివిషమాకారముచే ఆత్మను గూడ విషమాకారునిఁగాను జన్మవినాశాదియుక్తునిఁగాను జూచుచున్నాఁడో, అతఁ డెల్లప్పుడును సంసరించు నని యభిప్రాయము.

మూ. *

సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్
న హినస్త్యాత్మనా ఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్. ౨౮

భా. యథోక్త మగు సమ్యగ్దర్శనమును ఫలప్రతిపాదనముచే స్తుతింపవలయు నని యీశ్లోక మారంభింపఁబడుచున్నది. —హి=ఎందువలన; సర్వత్ర=సర్వభూతములయందును; సమవస్థితమ్=తుల్యుఁడై యున్నట్టి; ఈశ్వరమ్—పూర్వశ్లోకోక్తలక్షణుం డగు నాత్మ నని యర్థము; సమమ్=సమునిఁగా ; పశ్యన్=చూచుచున్నవాఁడు; చూచుచున్న నేమి ? ఆత్మనా=తనచేతనే; ఆత్మానమ్ =తన్ను; నహినస్తి=హింసింపఁడో; తతః= ఆహింసింపమివలన; పరామ్=ప్రకృష్ట మయిన; గతిమ్=మోక్షమును; యాతి = పొందుచున్నాఁడు. ఓయీ ! ఏప్రాణియుఁ దన్నుఁ దాను హింసింపఁడు. ఎట్లు అప్రాప్తమును నహినస్తి యని చెప్పవచ్చును, "న

* దీనికిని మీఁదిశ్లోకమునకును ఈభాష్యము లేదు.

పృథివ్యా మగ్ని శ్చేతవ్యో నాన్తరిక్షే " * ఇత్యాదికమువలె ? అందువేని, ఇది దోషము కాదు, అజ్ఞుల కాత్మతిరస్కరణ ముపపన్న మగుటవలన. అజ్ఞు లందఱును అత్యంతప్రసిద్ధుండై సాక్షాదపరోక్షుం డగునాత్మను దిరస్కరించి గదా యనాత్మ నాత్మనుగాం బరిగ్రహించి వానింగూడ ధర్మాధర్మము లనుష్ఠించి ప్రాప్తుం డయినవాని వధించి మఱియొక యభినవాత్మను గ్రహించుచున్నారు. వానింగూడ నిట్లు వధించి మఱియొకని గ్రహించుచున్నారు. ఇట్లతనింగూడ వధించి మఱియొకని మరల గ్రహించుచున్నారు. ఇట్లు క్రొత్తక్రొత్తగా నాత్మను గ్రహించి వధించుచున్నారు. కావున నజ్ఞు లందఱును ఆత్మహంతలు. ఎవ్వండు మఱి పరమార్థాత్మ గలండో అతండుగూడ సర్వదా యవిద్యచే హతుని యట్లు, ఉన్నందులకు ఫలము లేమివలన. కావున ఆత్మహంతలే యవిద్వాంసు లందఱును. ఇంక, ఎవ్వం డితరుండు యథోక్తాత్మదర్శి గలండో యతం డుభయవిధంబులను ఆత్మచే నాత్మను హింసింపండు. అందువలనం బరమయినగతిని బొందుచున్నాండు. యథోక్త మగుఫలం బతనికి సిద్ధించుచున్న దని యర్థము.

సర్వభూతములయందును సమముగా నున్నట్టి యాత్మను నిర్విశేషునింగాం జూచుచున్నవాండు తన్నుం దాను హింసింపండు. అందువలనం బరమగతిని — మోక్షమును బొందుచున్నాం డని తాత్పర్యము.

ఉ. ఈ చెప్పిన సమ్యగ్దర్శనముచే నేమి కలుగు నని యాకాంక్ష కలుగంగా తత్ఫలము ప్రతిపాదించుటచే దాని స్తుతించి దానియందుం బురుషునిం బ్రవర్తింపం జేయుటకై మీంది శ్లోకం బని చెప్పుచున్నారు యథోక్తము ఇత్యాదిగా. ఇందు మూండుపాదములచే జ్ఞానమువలన నజ్ఞానధ్వంసముచే ననర్థధ్వంసము చెప్పంబడెనది. ఆవరణము లయిన యజ్ఞానమిథ్యాజ్ఞానములు నశింపంగా విద్వాంసుండు సర్వోత్కృష్ట మయినగతిని—పరమపురుషార్థ మయినపరమానందము ననుభవించుచున్నాం డని చతుర్థపాదార్థము. నహిన స్త్యాత్మా నాత్మాన మ్మనుదాని యథాశ్రుతముగా గ్రహించి యాక్షేపించుచున్నాండు ఓయీ ఇత్యాదిగా. న పృథివ్యా మ్మనుచోటం బ్రాప్తిద్వారమున నిషేధము సార్థకం బగునట్లు నాంతరిక్షేన దివి యనుచోటం బ్రాప్తి లేమింజేసి నిషేధము ముఖ్యముగా నంగీకరింపంబడదు గదా! అట్లు ఇచ్చటం గూడ ప్రాప్తి లేమి

* పృథివియం దగ్నిచయనము చేయంగూడదు, అంతరిక్షమునందుం జేయంగూడదు.

వలన నిషేధము యుక్తము గాదని చెప్పుచున్నాఁడు న పృథివ్యా మిత్యాదిగా. అజ్ఞులకు ఆత్మచేతనే యాత్మహింస సంభవించుటవలన విద్వాంసులకుఁ దదభావము చెప్పుట యుక్తమని పరిహరించుచున్నారు ఇది దోషము కాదు ఇత్యాదిగా. దానినే వివరించుచున్నారు అజ్ఞులు ఇత్యాదిగా. అనాత్మను—దేహాదికమును. అవిద్వాంసుల కారోపితాత్మహంతృత్వమును నిగమనము చేయుచున్నారు కావున నిత్యాదిగా. అట్లయినను పారమార్థికుఁ డగునాత్మకు హననము లేమివలన వారి కందఱకు నాత్మహంతృత్వము లేదని యాశంకించి చెప్పుచున్నారు ఎవ్వఁడు మఱి ఇత్యాదిగా. చెప్పినవిధంబున అవిద్వాంసులయందఱకు నాత్మహంతృత్వము సిద్ధం బని యుపసంహరించుచున్నారు కావున నాత్మహంతలే ఇత్యాదిగా. ఆత్మచేతనే యాత్మహనన మవిద్వాంసులయందు దృష్టము, దాని నట విద్వద్విషయంబున నిషేధించుట యుక్తం బని చెప్పుచున్నారు ఇఁక నిత్యాదిగా. ఉభయవిధంబులను—ఆరోపములవలనను అనారోపమువలనను అని యర్థము. జ్ఞానమువలన అనర్థభ్రమ నష్టమగుటచేఁ బరమానందప్రాప్తిచేఁ బరితృప్తత్వము పూర్వోక్తము యుక్తం బని చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

౨౦. బ్రహ్మాదిదుఁ డగుయతి పరిపూర్ణుఁ డగునాత్మనే యంతర్యామిరూపంబున సదా చూచుచున్నాఁ డనుట యేది గలదో యానిరంతరదర్శనముచేతనే ముక్తుఁ డగుచున్నాఁ డని చెప్పుచున్నాఁడు.—శ్రవణమననాదులచేఁ బుట్టినవిజ్ఞానంబున ఇది యే నేనని యపరోక్షీకరించినయాత్మతత్త్వము గల యతి, సర్వత్ర = బ్రహ్మాదిస్తంబాంతము లగు భూతములయందు వెలుపలను లోపలను అంతటను; సమవస్థితమ్= చక్కఁగా—ఉత్కర్షాపకర్షములు లేక యేకరీతిచే ఘటమఠాదులయం దాకాశమువలె నిరంతరముగా వ్యాపించి యున్నవానిని; కావుననే, సమమ్ = ఏకరసుని నిర్విశేషుని; ఈశ్వరమ్ = సూర్యునివలె సర్వప్రాణిప్రవృత్తికారణభూతుఁ డగునాత్మను; పరిపూర్ణునిఁగా, పశ్యన్ =చూచుచు; హి = ఏకారణమువలన; ఆత్మానమ్ = తన్ను; ఆత్మనా=తనచేతనే; నహినస్తి—తన్నుఁ దానే హింసింపఁడో యని యర్థము. తన్నుఁ దాను హింసించుట యనఁగా నేమి? నిష్క్రియుండును నిస్సంగుండును నిరాకారుఁడును నిర్లేపుఁడు నగునాత్మకుఁ దనకు దేహేంద్రియాదితాదాత్మ్యాధ్యాసముచే నేను గర్తను భోక్తను సుఖిని దుఃఖిని శిష్టుఁడను భ్రష్టుఁడను సుకృతిని దుష్కృతిని ఇత్యాద్యతద్ధర్మకర్మముల నారోపించి యప్రతీతిని గలిగించుట యేది గలదో అదియే యాత్మహననము. ఈయాత్మహననదోషముచేతనే తాను కూటస్థాసంగచిద్రూపుఁ

డైనను సదానందుఁడైనను దేహియై కర్తృత్వభోక్తృత్వాది ధర్మముల నొంది జన్మమృత్యుదుఃఖసముద్రమునందు మునుంగుచున్నాఁడు. అట్టి యాత్మహాననమును విదేహకైవల్యార్థియై యాత్మతత్త్వముఁ జక్కఁగా నెఱింగినట్టి యతి చేయఁడు. మఱే మనఁగా, బాహ్యవాసనాకృత మయిన యసత్ప్రవృత్తిని విడిచి సదా ఆత్మనిష్ఠ యందే యుండును. తతః = అందువలన; సదా ఆత్మనిష్ఠచేతనే యజ్ఞానతత్కార్య ములను నిరసించినవాఁడై, పరామ్ = నిత్యనిరతిశయానందలక్షణ మగు; గతిమ్ = విదేహముక్తిని; యాతి = పొందుచున్నాఁడు. "బ్రహ్మసంస్థో ఽమృతత్వ మేతి" అని బ్రహ్మనిష్ఠుఁడై స్వస్వరూపమునుండి యప్రమత్తుఁడై యుండుయతికే యమృతత్వము సిద్ధించు నని శ్రుతి చెప్పుటవలన సర్వదా స్వరూపనిష్ఠయందే యుండు యతికి ముక్తి కలుగు నని స్పష్టము. సేక, సర్వేషు భూతేషు తిష్ఠన్తమ్ అని చెప్పఁబడిన ప్రకారమున సర్వభూతములయందును, సమవస్థితమ్ = చక్కఁగా — ఉత్కర్షాపకర్ష ములు లేక వెలుపలను లోపలను అంతటను వ్యాపించి యున్నవానిని; ఈశ్వరమ్ — ఉత్కృష్టలక్షణుఁ డగునాత్మను; తనయందును, సర్వత్ర — సర్వభూతములయందును; సమమ్ = ఏకరసునిఁగా, పరిపూర్ణునిఁగానే; పశ్యన్ — చూచుచు; హి = ఎందు వలన; బ్రహ్మవిదుఁ డగుయతి, ఆత్మానమ్ — పరిపూర్ణుఁ డగునాత్మను; న హినస్తి— వీఁడు బ్రాహ్మణుఁడు వీఁడు శూద్రుఁడు వీఁడు శిష్టుఁడు వీఁడు భ్రష్టుఁడు ఇది శుద్ధము ఇది యశుద్ధము ఇత్యాదిగా భేదదర్శనముచేఁ బూర్ణుఁ డగునాత్మను మఱుఁగుపఱు చుటయే హింసనము, సమ్యగ్దృష్టి యగు విద్వాంసుఁడు మోక్షేచ్ఛచే సదా సమదర్శ నము విడువనివాఁడు కావున దానిఁ జేయఁడు, మఱేమనఁగా ఇది యంతయు నేనే యని సదాపూర్ణునిఁగానే తన్నుఁ జూచుచున్నాఁడు. తతః; ఆ సర్వత్ర బ్రహ్మదర్శ నముచేతనే దహింపఁబడిన భేద గంధము గలవాఁడై, పరాంగతిం యాతి. ఎందు వలన సర్వత్ర పరిపూర్ణునిఁగానే తన్ను సర్వదా చూచుచుండు విద్వాంసుఁడే ముక్తుఁ డగుచున్నాఁడో అందువలన నొకప్పుడును భ్రమాందముచే నేనియు అనాత్మయం దును తద్ధర్మకర్మములయందును నేను నాది యను నధ్యాసమును జన్మాదిదుఃఖహేతు వును విదేహకైవల్యముఁ గోరి యాత్మతత్త్వము నెఱింగినయతులు చేయఁ దగ దని సూచిత మగుచున్నవి.

పం. ఈ యాత్మదర్శనమును ఫలముచే స్తుతించుచున్నాఁడు రుచిఁ బుట్టిం చుకొఱకు.—సమవస్థితమ్=జన్మాదివినాశాంతము అగు భావవికారములు లేనివాఁ డగుటచే చక్కఁగా నున్నవానిని, ఇందుచే అవినాశిత్వము చెప్పఁబడుచున్నది. ఇత

రము మున్నె వ్యాఖ్యాత మయ్యెను. ఇట్లు పూర్వోక్తవిశేషణుం డగునాత్మను, పశ్యన్ = ఇతఁడే నే నని శాస్త్రదృష్టిచే సాక్షాత్కరించుచున్నవాఁడు; ఆత్మనా ఆత్మానం నహినస్తి—అజ్ఞుఁడు పరమార్థంబున నున్నవాఁడును ఒక్కఁడును అకర్తయు అభోక్తయు పరమానందరూపుఁడు నగునాత్మను, ఉన్నదియు భాసిల్లునదియు నగు వస్తువునందుఁగూడ లేదు భాసిల్ల దను ప్రతీతిఁ బుట్టింప సమర్థ మయినయవిద్యచేఁ, దానే తిరస్కరించి లేనివానిం బోలెఁ జేయుచున్నాఁడు కావున ఆత్మను హింసించువాఁడే యగుచున్నాఁడు. మఱియు అవిద్యచే ఆత్మనుగా గ్రహించినదేహేంద్రియసంఘాతమును పురాతన మయినదాని వధించి కర్మవశమువలన నూతనమును గ్రహించుచున్నాఁడు కావున ఆకల్పితాత్మను హింసించువాఁడే యగుచున్నాఁడు. ఇట్లు రెండువిధములను గూడ అజ్ఞుఁ డాత్మహంతయే యగుచున్నాఁడు, వాని నుద్దేశించి యీ శకుంతలావచనరూప మగు స్మృతి.—"కిం తేన న కృతం పాపం చోరే ణాత్మాపహారిణా । యో ఽన్యథా సన్త మాత్మాన మన్యథా ప్రతిపద్యతే" * అని. శ్రుతియును.—"అసుర్యా నామ తే లోకా అన్ధేన తమసా వృతాః । తాం స్తే ప్రేత్యా భిగచ్ఛన్తి యే కే చా ఽఽత్మహనో జనాః" ♦ అని. అసుర్యాః — అసురునిసొమ్మయినవి, అసురసంపదచే భోగ్యము లని యర్థము. ఆత్మహనః — అనాత్మ యం దాత్మాభిమాను లని యర్థము. అందువలన, ఆత్మజ్ఞుఁ డగువాఁడు అనాత్మ యం దాత్మాభిమానమును శుద్ధాత్మదర్శనముచే బాధించుచున్నాఁడు. అందువలన స్వరూపము లభించుటవలన, ఆత్మనా ఆత్మానం న హినస్తి. తతః పరాంగతిం యాతి — ఆత్మహననము చేయమివలన అవిద్యాతత్కార్యనివృత్తిలక్షణ మగుముక్తిని బొందుచున్నాఁడని యర్థము.

శ్రీ. ఎందువలన ననఁగాఁ జెప్పుచున్నాఁడు.— సర్వత్ర = సర్వభూతములందు; సమమ్; సమవస్థితమ్ = చక్కఁగా — అప్రచ్యుత మయినస్వభావముతో నున్నవాని; పరమాత్మను, పశ్యన్; హి = ఏకారణమువలన; ఆత్మనా = తనచేతనే; ఆత్మానం న హినస్తి — అవిద్యచే సచ్చిదానందరూపుఁడగు తన్నుఁ దిరస్కరించి నా

* ఏపురుషుఁడు ఒకవిధముగా నున్న తన్ను మఱియొకవిధముగా గ్రహించుచున్నాఁడో అట్టి యాత్మాపహారి యగు దొంగచే నేపాపము చేయఁబడినది కాదు ?

♦ అసుర్యము లను పేరు గలవి గాఢ మగునజ్ఞానముచేఁ గప్పఁబడినవి ప్రసిద్ధము లగు లోకములు గలవు. ఎవ్వరు ఆత్మహంత లగు జనులు గలరో వారు మరణము నొందిన పిదప ఆలోకములను బొందుచున్నారు.

శము నొందఁజేయఁడు. అందువలనఁ బరమగతిని బొందుచున్నాఁడు. ఎవ్వఁడు మఱి యట్లు చూడఁడో వాఁడు దేహాత్మదర్శి దేహముతోఁగూడ ఆత్మను హింసించుచున్నాఁడు. అట్లు శ్రుతి —"అసుర్యా నామ తే లోకా అన్ధేన తమసా ఽఽవృతాః। తాంస్తే ప్రేత్యాఽభిగచ్ఛన్తి యేకే చాఽఽత్మహనో జనాః" అని.

ప. ఇఁక మున్ను చెప్పినజ్ఞానమునకుఁ బ్రయోజనముఁ జెప్పుచున్నాఁడు. సర్వత్ర=సర్వభూతములయందును; సమవస్థితమ్; ఈశ్వరమ్; సమమ్=తనతో సమానునిఁగా, లేక, తారతమ్యము లేనివానిఁగా; పశ్యన్; ఆత్మనా=సర్వవిధముచేతను, మనోవాక్కాయములచేత; ఆత్మానమ్; నహినస్తి=హింసింపఁడు. తతః—అట్టి యనుష్ఠానమువలన; పరాంగతిం యాతి. శ్రుతియును.—"యదైత మనుపశ్య త్యాత్మానం దేవ మఞ్జసా, ఈశానం భూతభవ్యస్య తదా న విచికిత్సతి" అని. భాష్యము.—యదా=ఎప్పుడు; ఏతమ్—అనుభవసిద్ధుని; ఎందువలన ననఁగా, దేవమ్=స్వప్రకాశుని; ఆత్మానమ్; భూతభవ్యస్య=కడచినదియు రాఁబోవునదియు నగు భూతమునకు; ఈశానమ్=నియామకుని; అఞ్జసా=సాక్షాత్తుగా; అనుపశ్యతి = చూచుచున్నాఁడో; తదా=అప్పుడు; నవిచికిత్సతి=హింసావమాననిందారూప మయిన విచికిత్సను జేయఁడు.

రా. సర్వత్ర—దేవాదిశరీరములయందు; తత్తచ్ఛేషి యగుటచే ఆధారముగాను నియంతగాను ఉన్నట్టి, ఈశ్వరమ్—ఆత్మను; దేవాదివిషమాకారవర్జితుని గాను జ్ఞానైకాకారుం డగుటచే సమునిఁగాను జూచుచు; ఆత్మనా = మనస్సుచేత; ఆత్మానమ్ = తన్ను; నహినస్తి— రక్షించుచున్నాఁడు—సంసారమునుండి విడిపించుచున్నాఁడు. తతః = అందువలన, సర్వత్ర జ్ఞాతృత్వరూప మయిన సమానాకారమును జూచుటవలన; పరాంగతిం యాతి=గమ్యతే—పొందఁబడుచున్నది కావున గతి యనఁగా గంతవ్య మగువస్తువు, ముఖ్యముగా గంతవ్యుఁ డగు పరమార్థరూపుఁ డైన యాత్మను బొందుచున్నాఁడు. దేవాద్యాకారయుక్తతచే సర్వత్ర విషమాకారునిఁగాఁ జూచినయెడ, ఆత్మానం హినస్తి — సంసారసముద్రమధ్యమునందుఁ ద్రోయుచున్నాఁడు.

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి. ౨౯

భా. సర్వభూతస్థుం డగు నీశ్వరుని సమునిఁగాఁ జూచువాఁడు తన్నుఁ దాను హింసింపఁ డని చెప్పఁబడినది. స్వగుణకర్మవైలక్షణ్యభేద

భిన్ను లగునాత్మలయం దది యనుపపన్న మని యాశంకించి చెప్పు చున్నాఁడు.—— ప్రకృతి యనఁగా భగవంతునిమాయ త్రిగుణాత్మిక, "మాయాంతు ప్రకృతిం విద్యాత్" అను శ్రుతివలన, అట్టి, ప్రకృత్యైవచ = ప్రకృతిచేతనే; ఇతర మగు మహదాదికార్యకారణాకార పరిణతప్రధానముచేతఁ గాదు; కర్మాణి = వాఙ్మనఃకాయములచేఁ జేయు కర్మములను; సర్వశః = సర్వప్రకారములచేతను; క్రియమాణాని = నిర్వర్తింపఁబడుచున్నవానిఁగా; యః = ఎవ్వఁడు; పశ్యతి = చూచుచున్నాఁడో. తథా = అట్లు; ఆత్మానమ్ = క్షేత్రజ్ఞుని; అకర్తారమ్ = కర్త కాని వానిఁగా, సర్వోపాధివర్జితునిఁగా; యః పశ్యతి - ఎవ్వఁడు చూచుచున్నాఁడో; సః = అతఁడు; పశ్యతి =చూచుచున్నాఁడు, అతఁడు పరమార్థదర్శి యని యభిప్రాయము. నిర్గుణుఁడును అకర్తయు నిర్విశేషుఁడు నగు వానికి ఆకాశమునకుంబోలె భేదము కల దనుటకుఁ బ్రమాణమే యనుపపన్న మని యర్థము.

సర్వకర్మములును త్రిగుణాత్మక మగు భగవన్మాయ యయిన ప్రకృతి చేతనే చేయఁబడుచున్న వనియు క్షేత్రజ్ఞుఁ డగు తాను అకర్త సర్వోపాధివర్జితుఁ డనియు నెవ్వఁ డెఱుఁగుచున్నాఁడో అతఁడు పరమార్థము నెఱిఁగినవాఁడు. ఇట్టి నిర్విశేషుఁ డగునాత్మకు భేదము కల దనుటకు ప్రమాణమే లే దని తాత్పర్యము.

ఆ. శంకకు సమాధానముగా మీఁదిశ్లోకము దించుటకై చెప్పినయర్థము ననువదించుచున్నారు స ర్వేత్యాదిగా. ప్రతిదేహంబును ధర్మాధర్మాదులు గలవాఁ డగుటచే ఆత్మకు భేదము కనఁబడుటవలన సమ్యగ్దర్శనము సంభవింప దని శంకించుచున్నాఁడు స్వగు ణేత్యాదిగా. స్వగుణము లగు సుఖదుఃఖములచేతను ధర్మాధర్మాఖ్యము లగు స్వకర్మములచేతను విలక్షణతవలన ప్రతిదేహమును భేదము కలుగుటంజేసి తద్విశిష్టు లగు నాత్మలయం దెట్లు సామ్యదర్శన మని యాశంకించి పరిహరించుచున్నాఁ డని చెప్పుచున్నారు అని యాశంకించి ఇత్యాదిగా. ప్రకృతిశబ్దము స్వభావవాచకము కా దని చెప్పుచున్నారు ప్రకృతి యనఁగా నిత్యాదిగా. మాయాశబ్దము సావిత్పర్యాయము కా దని చెప్పుచున్నారు త్రిగుణాత్మిక యని. భగవంతునిశక్తి మాయ యనుటకు శ్రుతిసమ్మతిఁ జూపుచున్నారు మాయాం త్విత్యాదిగా. ఇతరముచే దేనిచేతను జేయఁబడుచున్నవి కావు కర్మము లని యేవకారార్థము చెప్పుచున్నారు ఇతరము ఇత్యాదిగా. నిషేధ్య మగు నితర మేది యనఁగా

సాంఖ్యసమ్మత మగు ప్రధానాఖ్యప్రకృతి యని చెప్పుచున్నారు మహదా దీత్యాదిగా. సర్వప్రకారములచేతను — కామ్యనిషిద్ధాది బహుప్రకారములచేత నని యర్థము. స పశ్యతి యనుట యయుక్తము పునరుక్తివలన నని చెప్పుచున్నారు అతఁడు ఇత్యాదిగా. ఆత్మలు ప్రతిదేహమును భిన్నులై యుండఁగా వారియందు సమదర్శనము సంభవింప దని చెప్పినదాని కేమి సమాధాన మని యాశంకించి చెప్పుచున్నారు నిర్గుణుఁడును ఇత్యాదిగా.

హ. ప్రకృత్యా = అవిద్యచేత. సర్వశః - సర్వప్రకారములచేత.

శం. సెయూ! సుఖదుఃఖములు వివేకావివేకములు సూరత్వభీరుత్వములు మొదలగు గుణములచేతను స్వకృతకర్మవిశేషములచేతను నేను నేను అను భేదప్రత్యయములచేతను ప్రతిశరీరంబును ఆత్మలు భిన్నులై కనఁబడు చుండఁగా ఎట్లు సర్వభూతములందును ఆత్మను సమునిఁగాఁ జూడఁగలఁడు యతి? అని యాశంకింపఁదగదు. "విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపి చ, ఏష ద్రష్టా స్ప్రష్టా శ్రోతా కర్తా విజ్ఞానాత్మా పురుష" ఇత్యాది శ్రుతివలన కర్మానుష్ఠానంబును తత్ఫలానుభవంబును వివేకాదిగుణంబులును ప్రతిశరీరంబును నేను నే నను భేదాభిమానంబును విజ్ఞానాత్మకే కాని యాత్మకు లేదు, ఆత్మ అమనస్కుఁ డగుటవలనను నిరింద్రియుఁ డగుటవలనను నిరవయవుఁ డగుటవలనను గుణములును కర్మములును భేదంబును అతని కనుపపన్నము లగుటవలన. కావున సర్వకర్మంబులను ప్రకృతియే చేయుచున్నది కాని యాత్మ కర్త కాఁడు. అందుచే నాత్మకు సర్వభూతసమత్వము సిద్ధించుచున్న దని బోధించుటకై చెప్పుచున్నాఁడు.—ప్రకృతి యనఁగా త్రిగుణాత్మక మగు మాయ, దేహేంద్రియప్రాణమనోబుద్ధ్యాదిరూపంబునఁ బరిణతము, "కార్యకరణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే" అని యేది చెప్పఁబడినదో అది, అట్టి, ప్రకృత్యైవ = ప్రకృతిచేతనే; ఏవకార మన్యయోగవ్యవచ్ఛేదార్థము; కర్మాణి — శ్రవణ దర్శన స్పర్శన వచనా దాన విసర్గాదులను; సర్వశః — సర్వప్రకారములచేతను, విహితములను ప్రతిషిద్ధములను సర్వములను; క్రియమాణాని = చేయఁబడుచున్న వానిఁగా; చకారమువలన, తత్ఫలానుభవమునుగూడ చేయఁబడుచున్న దానిఁగా; యః పశ్యతి = ఎవ్వఁడు చూచుచున్నాఁడో—శ్రుతియుక్త్యనుభవములచేఁ ప్రకృతి పురుషు లగు ననాత్మాత్మలస్వరూపము నుక్తరీతిచేఁ జక్కఁగా వివేచించి యనాత్మనుండి యాత్మస్వరూపమును ముంజినుండి యిషీకనుంబోలె వేఱుపఱిచి దాని స్వస్వ

రూపముగాఁ జక్కఁగా నెఱింగి తద్రూపంబున సదా యుండునట్టి బ్రహ్మవిదుం డగు యతికే యాత్మనుండి విభక్త మయిన ప్రకృతిచేతనే సర్వకర్మములును జేయఁబడుచున్నవిగాఁ గనఁబడును, తత్ఫలానుభవంబును దానిచేతనే చేయఁబడుచున్నదిగాఁ గనఁబడును, ఇతరున కట్లు కనఁబడదు, ఇట్లు ఆత్మానాత్మవివేకజ్ఞానశక్తిచేత సర్వచేష్టయుఁ దత్ఫలానుభవంబును ప్రకృతికర్తృకముగా నెవ్వఁడు చూచుచున్నాఁడో; తథాశబ్దము చార్థకము, తథా ఆత్మానమ్ — తన్నుఁగూడ; అకర్తారమ్ = అకర్తనుగాను అభోక్తనుగాను నిష్క్రియునిఁగాను నిత్యకూటస్థునిఁగాను; యః పశ్యతి = ఏ యతి యపరోక్షముగాఁ జూచుచున్నాఁడో; స పశ్యతి = అతఁడే స్వానుభవముచేఁ బ్రత్యగ్దృష్టిచేత బ్రహ్మాది స్తంబాంతము లగు భూతములందు సర్వత్ర తాను అకర్తయై అభోక్తయై సర్వోపాధివినిర్ముక్తుఁడై సముఁడై యేకరసుఁ డద్వయుఁడై యున్నాఁ డని చూచుచున్నాఁడు. అందుచే నతఁడే పరమగతిని బొందుచున్నాఁడు, ఇతరుఁడు పొందనేరఁ డని యర్థము. ఈ మూఁడుశ్లోకములచేతను సర్వభూతస్థ మాత్మానమ్మనుశ్రుతి యుపదేశించిన న్యాయంబున సర్వభూతములందును దాను సముఁడుగానే యున్నాఁ డని యపరోక్షంబుగాఁ జూచు యతికి మోక్ష మని సూచిత మగుచున్నది.

మ. ఓయీ! శుభాశుభకర్త లగునాత్మలు ప్రతిదేహమును భిన్నులు, తత్తద్విచిత్రఫలభోక్త లగుటచే విషములుగూడ. అట్లుండఁగా, సర్వభూతస్థుఁడై యొక్కఁడె యగునాత్మను సమునిఁగాఁ జూచువాఁడు తన్నుఁ దాను హింసింపఁ డని యెట్లు చెప్పవచ్చును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—కర్మాణి—వాఙ్మనఃకాయములచేఁ జేయఁబడువానిని; సర్వశః = సర్వప్రకారములచేతను; ప్రకృత్యైవ = దేహేంద్రియసంఘాతాకారపరిణతమును సర్వవికారకారణభూతమును త్రిగుణాత్మకము నగు భగవన్మాయచేతనే; క్రియమాణాని = చేయఁబడుచున్నవానిఁగా; సర్వవికారశూన్యుఁడగు పురుషునిచేతఁ గాదు అని; యః = ఏవివేకి; పశ్యతి = చూచుచున్నాఁడో; తథా = అట్లు; క్షేత్రముచేఁ గర్మములు చేయఁబడుచున్నను, ఆత్మానమ్ = క్షేత్రజ్ఞుని; అకర్తారమ్ = సర్వోపాధివర్జితునిఁగాను అసంగునిఁగాను ఒక్కనిఁగాను సర్వత్ర సమునిఁగాను; ఎవ్వఁడు చూచుచున్నాఁడో. సః పశ్యతి — అతఁడు పరమార్థదర్శి అని పూర్వమువలె. సవికార మగుక్షేత్రము తత్తద్విచిత్రకర్మ కర్త యగుటచే ప్రతిదేహమును భిన్నమై విషమమై యున్నను నిర్విశేషుండును అకర్తయు నగు నాత్మ కాకాశమునకుంబోలె భేదము లేదు. ఆత్మభేదమునందుఁ బ్రమాణ మేమియు లే దని మున్నే యుపపాదింపఁబడినది.

శ్రీ. ఓయీ! శుభాశుభకర్మకర్త యగుటచే వైషమ్యము కనఁబడు చుండఁగా ఎట్లు ఆత్మ సముఁడని వచ్చును? అని యూహించి చెప్పుచున్నాఁడు.— ప్రకృత్యైవ – దేహేంద్రియాకారమునఁ బరిణమించినదానిచే; సర్వశః సర్వప్రకారములచేతను; క్రియమాణాని; కర్మాణి; యః పశ్యతి. తథా; ఆత్మానమ్; అకర్తారమ్—దేహాభిమానముననే యాత్మకుఁ గర్తృత్వము గాని పరమార్థంబున లేదని; యః పశ్యతి. అతఁడే చక్కఁగాఁ జూచువాఁడు, ఇతరుఁడు కాఁడని యర్థము.

పై ప్రథమోపాయమునకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.— సర్వశః=సర్వప్రకారములచేతను; కర్మాణి; దేహేంద్రియాదిరూపంబునఁ బరిణమించినప్రకృతిచేతనే చేయఁబడుచున్న వని యెవ్వఁడు చూచుచున్నాఁడో, అతఁడే ఆత్మను అకర్తనుగా — కర్తృత్వాభిమానశూన్యునిఁగాఁ జూచుచున్నాఁడు.

తా. సర్వకర్మములును కార్యకరణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే అను పూర్వోక్తరీతిని ప్రకృతిచేతఁ జేయఁబడుచున్న వని యెవ్వఁడు చూచుచున్నాఁడో, అట్లు ఆత్మను జ్ఞానాకారునిఁగాను అకర్తనుగాను ఎవ్వఁడు చూచుచున్నాఁడో, ఆత్మకుఁ బ్రకృతిసంబంధంబును తదధ్యాత్మత్వంబును తజ్జన్యసుఖదుఃఖానుభవంబును కర్మరూప మయినయజ్ఞానముచేఁ జేయఁబడిన వనియు నెవ్వఁడు చూచుచున్నాఁడో అతఁడు ఆత్మపరమార్థస్వరూపముఁ జూచుచున్నాఁడు.

మా. ఆత్మనుగూడ అకర్తనుగా నెవ్వఁడు చూచుచున్నాఁడో అని యన్వయము.

యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా. 30

భా. రెండవయు నాసమ్యగ్దర్శనమునే శబ్దాంతరముచేఁ బ్రపంచించుచున్నాఁడు.— యదా = ఏకాలమునందు; భూతపృథగ్భావమ్ = భూతములయొక్క పృథక్త్వమును — భేదమును; ఏకస్థమ్=ఒక్కఁడైన యాత్మయం దున్నదానిఁగా; అనుపశ్యతి = శాస్త్రాచార్యోపదేశమువలన ఆత్మనెఱింగి ప్రత్యక్షముగా ఆత్మయే యిది యంతయు నని చూచుచున్నాఁడో. తత ఏవ=ఆయాత్మవలననే; విస్తారమ్=ఉత్పత్తిని, వికాసమును *;

* ఆభేదముల విరివి ననుట.

"ఆత్మతః ప్రాణ ఆత్మత ఆశా ఆత్మతః స్మర ఆత్మత ఆకాశ ఆత్మత స్తేజ ఆత్మత ఆప ఆత్మత ఆవిర్భావతిరోభావా వాత్మతో౽న్నమ్" * ఇత్యాదిశ్రుతిచేఁ జెప్పఁబడినప్రకారమున విస్తారమును; యదా పశ్యతి = ఏకాలమునందుఁ జూచుచున్నాఁడో; బ్రహ్మసంపద్యతే—బ్రహ్మమే యగుచున్నాఁ డని యర్థము; తదా — ఆకాలమునందు.

భూతములభేదము లన్నియు ఆత్మయం దొక్కనియందే యున్నవి—ఇవి యన్నియు ఆత్మయే యనియు ఆత్మవలననే వీనియుత్పత్తి యనియు నెప్పుడు శాస్త్రాచార్యోపదేశములవలన నెఱుఁగుచున్నాఁడో అప్పుడే బ్రహ్మమే యగుచున్నాఁ డని తా.

ప్ర. ప్రకృతియును వికారములును సాంఖ్యమతమునందుంబోలెఁ బురుషునకన్యము లని ప్రసక్తింపఁగా నిరాకరించుచున్నారు వెండియు నిత్యాదిగా. దేశజన్య మగు ప్రత్యక్షదర్శన మనువదించుచున్నారు ఆత్మయే ఇత్యాదిగా. భూతములయొక్క—వికారములయొక్క—నానాత్వము ప్రకృతితోఁ గూడ ఆత్మమాత్రమున లయము నొందినదానిఁగాఁ జూచుచున్నాఁడో—ఏల యనఁగా ప్రకృతి వేఱుగా నుండఁగా భూతములనానాత్వమును కేవలుండగునాత్మయందు లయము నొందింప శక్యము గా దని యర్థము. పరిపూర్ణుం డగునాత్మవలననే ప్రకృత్యాదివిశేషాంతములకు స్వరూపలాభమును జూచి అది యాత్మమాత్రం బని చూచుచున్నాఁ డని చెప్పుచున్నారు తత ఏవేత్యాదిగా. చెప్పినవిస్తారమునే శ్రుతిప్రమాణముచే స్పష్టీకరించుచున్నారు ఆత్మతః ఇత్యాదిగా. బ్రహ్మసంపత్తి యనఁగా పూర్ణుఁడై భాసిల్లుట, యపూర్ణత్వమునకు హేతువు సర్వంబును ఆత్మయందుఁ బ్రవిలాపిత మగుటవలన నని చెప్పుచున్నారు బ్రహ్మమే ఇత్యాదిగా. జ్ఞానసమానకాలమునందే ముక్తి యని సూచించుచున్నారు తదా అని.

వ్యా. ఏకస్థమ్ = ఒక్కఁడై యున్నయాత్మయం దున్నదానిఁగా. విస్తారమ్ = వికాసమును.

శం. ఓయీ! సమం సర్వేషు భూతేషు అనుటవలనను సమం పశ్యన్హి సర్వత్ర యనుటవలనను ఆత్మకును భూతములకును ఆధారాధేయభావము తెలియ

* ఆత్మవలన ప్రాణము, ఆత్మవలన దిక్కులు, ఆత్మవలన కామము, ఆత్మవలన ఆకాశము, ఆత్మవలన తేజస్సు, ఆత్మవలన జలము, ఆత్మవలన ఆవిర్భావమును తిరోభావమును, ఆత్మవలన అన్నము.

వచ్చుటవలన ద్వైతము సంభవించుచున్నది. ఇట్లు ద్వైతదర్శియగువానికి తతో యాతి పరాం గతిమ్ అని కైవల్యప్రాప్తి యెట్లు చెప్పవచ్చును? అంటావేని అట్లు శంకింప వలదు. వరిమడియందు కల్పించిన గనిమలన్నియు భూమి యున్నది, గనిమలును భూమియందే యున్నవి, విచారింపఁగా గనిమలును భూములును సర్వమును మృత్తే యెట్లగునో, అట్లు కల్పితభూతములందాత్మ యున్నాఁడు, భూతములును ఆత్మయందే యున్నవి, శ్రుతియుక్తులచే విచారింపఁగా సర్వంబును ఆత్మయే యగుచున్నది. అందువలన ఆత్మవ్యతిరిక్త మైనవస్తువు లేమివలన ఆత్మైకత్వదర్శనము విద్వాంసునకు సంభవించుచున్నది. అందుచే బ్రహ్మసంప్రాప్తియు సిద్ధించు నని బోధించుచున్నాఁడు.—నిత్యానిరంతరబ్రహ్మనిష్ఠచే నిర్మూలిత మగు ద్వైతప్రత్యయము గల బ్రహ్మవిదుఁ డగుయతి, యదా - ఏకాలమునందు; భూతపృథగ్భావమ్ - భూతములయొక్క—ఆకాశాదులయొక్కయు తత్కార్యములయొక్కయు సమస్తములయొక్క పృథక్త్వమును — భిన్నపదార్థములనఁ బ్రతీయమానమగుటను; ఏకస్థమ్ - ఒక్కఁడైనయాత్మయందే కల్పిత మయినదానిఁగా, పటమునందుఁ జిత్రముపోలె దారువునందు గజముపోలెఁ బ్రతీయమాన మగుచున్నను ఆత్మసత్తావ్యతిరేకమున పృథక్సత్త లేమివలన ఆత్మమాత్రమును గానే; అనుపశ్యతి - శ్రుత్యాచార్యోపదేశజన్యజ్ఞానమున కనురూపముగా ఆత్మయే యిది యంతయు నని చూచుచున్నాఁడో, ప్రకృతిని తత్కార్యమును సర్వంబును ఆరోపిత మైనదాని అధిష్ఠాన మగునాత్మయందు స్వస్వరూపమునందు సద్వస్తువుచే ప్రవిలయము నొందించి తన్నే అద్వితీయునిఁగానే చూచుచున్నాఁడో యని యర్థము. ఇది దేనివలనఁ బుట్టుచున్నదో అది తన్మాత్రమే యనున్యాయంబునఁ బ్రతీతిదశయందుఁ గూడఁ బ్రపంచ మాత్మమాత్రమే యని ప్రదర్శించుటకై చెప్పుచున్నాఁడు.—"తస్మాత్తత్సర్వమభవత్" అనుశ్రుతివలన, తత ఏవ - ఆయాత్మవలననే; విస్తారం చ - ద్వైతప్రపంచముయొక్క విస్ఫూర్తినిగూడ; పశ్యతి - చూచుచున్నాఁడో, మృత్తికవలనఁ బుట్టిన ఘటాదికము మృత్తికామాత్ర మనుట ప్రత్యక్షముగాఁ జూచుచున్నాము, అట్లు ఆత్మవలనఁ బుట్టిన భూతవిస్తారము ప్రతీతిదశయందును ఆత్మసత్తావ్యతిరేకంబున స్వతస్సత్త లేమివలన ఆత్మమాత్ర మని చూచుచున్నాఁడో. ఇట్లు నేనే యిది యంతయు నని సర్వమును తన్నుఁగానే యెప్పుడు చూచుచున్నాఁడో, తదా - అప్పుడే, సూర్యోదయమునకును అంధకారనాశమునకును బోలె బ్రహ్మజ్ఞానమునకును దత్ఫలమునకును అంతరాళము లేమివలన ఏకక్షణమునందు సర్వంబును తన్నుఁగాఁ జూచుచున్నాఁడో

ఆత్మయందే; బ్రహ్మాపిదుం డగుయతి, బ్రహ్మసంపద్యతే = బ్రహ్మాభావము నొందు చున్నాఁడు, తాను ఉపాధికృతపరిచ్ఛేదరహితుండై పూర్ణభావంబున నునికియే బ్రహ్మాభావము, దానిఁ బొందుచున్నాఁ డని యర్థము.

వ్యా. ఇట్లు పాతంబున క్షేత్రభేదదర్శనము నంగీకరించి క్షేత్రజ్ఞభేదదర్శనము నిరాకరింపఁబడినది. ఇప్పుడు క్షేత్రభేదదర్శనమునుగూడ మాయికం బని నిరాకరించు చున్నాఁడు.—యదా = ఏకాలమునందు; భూతపృథగ్భావమ్=భూతములయొక్క— స్థావరజంగమము లగు జడవర్గముల యన్నిటియొక్కయు పృథగ్భావమును — పృథ క్త్వమును పరస్పరభిన్నత్వమును; ఏకస్థమ్ — ఒక్కఁడే యగు సద్రూపుఁడైన యాత్మయందు స్థితమునుగా — కల్పితమునుగా, కల్పితము అధిష్ఠానమునకంటె అనతి రిక్త మగుటవలన సద్రూపాత్మస్వరూపముకంటె అనతిరిక్తమునుగా; అనుపశ్యతి = శాస్త్రాచార్యోపదేశము ననుసరించి తా నాలోచించుచున్నాఁడో ఆత్మయే యిది యంతయు నని. ఇట్లయినను మాయావశమువలన, తతఏవ = ఆత్మవలననే; విస్తా రించ = భూతములపృథగ్భావమును గూడ; స్వప్నమాయాసదృశం బని; అనుపశ్య తి = ఆలోచించుచున్నాఁడో. బ్రహ్మసంపద్యతే తదా = సజాతీయ విజాతీయ భేద దర్శనము లేమివలన సర్వానర్థశూన్యం బగు బ్రహ్మమే యగుచున్నాఁడు ఆకాలము నందే, "యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవా ఽభూ ద్విజానతః । తత్ర కో మో హః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః" * అను శ్రుతివలన. ప్రకృత్యైవచ యనుశ్లోక మునం దాత్మభేదము నిరాకరింపఁబడినది, ఈ శ్లోకమునం దనాత్మభేదము గూడ నిరాకరింపఁబడిన దని విశేషము.

శ్రీ. ఇప్పుడు భూతములును ప్రకృతిమాత్రము లగుటవలన అభిన్నము లగుటఁ జేసి భూతభేదకృతి మయిన భేదము గూడ ఆత్మకు లే దని యెఱింగినవాఁడు బ్రహ్మత్వము నొందుచున్నాఁ డని చెప్పుచున్నాఁడు.—ఎప్పుడు స్థావరజంగమము లగు భూతములయొక్క పృథగ్భావమును — భేదమును, ఏకస్థమ్ = ఒక్కటి యగు నీశ్వరశక్తిరూప మయినప్రకృతియం దున్నదానిఁగా; ప్రలయమునందు, అనుప శ్యతి=ఆలోచించుచున్నాఁడో. తత ఏవచ=ఆప్రకృతినుండియే; భూతములయొక్క విస్తారమును సృష్టిసమయమునందు ఆలోచించుచున్నాఁడో, అప్పుడు ప్రకృతిమా

---

* ఏకాలమునందు విద్వాంసునకు సర్వభూతములును ఆత్మయే అయ్యెనో, ఆకాలమునందు ఏకత్వమును జూచుచున్న యతినికి మోహ మేది? శోక మేది?

త్రము లగుటచే భూతములకును భేదము లేదని చూచుచున్నవాఁడు పరిపూర్ణ మగు, బ్రహ్మసంపద్యతే – బ్రహ్మమే యగుచున్నాఁ డని యర్థము.

ప. ఇట్లు సమత్వంబును అకర్తృత్వంబును జూచుటవలన బ్రహ్మప్రాప్తిని బ్రతిపాదించి యిప్పుడు జగత్తు నేకమునుగాఁ జూచుటవలన బ్రహ్మప్రాప్తిని జెప్పుచున్నాఁడు.—యదా, నానానామరూపములు గల భూతములపృథగ్భావమును – పృథగవస్థానమును=వేఱువేఱుగా నుండుటను; ఏకస్థమ్ – ఒక్కనియందే సమష్టిరూపంబున నున్నదానిఁగా; అనుపశ్యతి – ఒక సూత్రమునందు నానారత్నములకుం బోలె నని యర్థము. తతఏవచ = ఆ యేకరూపుఁ డగు పరమేశ్వరునిలోఁడనే; విస్తారమ్; అనుపశ్యతి. జలములోఁ దరంగములకుంబోలె నని యర్థము. తదా; బ్రహ్మసంపద్యతే = బ్రహ్మమే యగుచున్నాఁడు.

రా. దేవాదిసర్వభూతములును ప్రకృతిపురుషాఖ్యతత్త్వద్వయాత్మకములై యుండఁగా, ఆభూతముల యొక్క దేవత్వమనుష్యత్వహ్రస్వత్వదీర్ఘత్వాదిక మగు పృథగ్భావమును; ఏకస్థమ్ = ఒక్కటే తత్త్వమునం దున్నదానిఁగా, ప్రకృతియందున్నది గాని ఆత్మయం దున్నది గా దని; ఎప్పుడు చూచుచున్నాఁడో. తతఏవ = ఆప్రకృతివలననే; ఉత్తరోత్తరపుత్త్రపౌత్త్రాదిభేదవిస్తారమును గూడ ఎప్పుడు చూచుచున్నాఁడో. అప్పుడే, బ్రహ్మసంపద్యతే – జ్ఞానైకాకార మగు నాత్మను బొందుచున్నాఁ డని యర్థము.

మా. ఏకస్థమ్ = ఒక్కఁడైనవిష్ణువునం దున్నదానిఁగా. తతఏవచ – ఆ విష్ణువువలననే; విస్తారమ్ = ఉత్పత్తిని.

అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మా ఽయ మవ్యయః
శరీరస్థో ఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే. 30

భా. ఒకఁడే యాత్మ సర్వదేహములకును ఆత్మ యయినపుడు తద్దేహదోషసంబంధము ప్రాప్తించు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—కౌన్తేయ = అర్జునా! అనాదిత్వాత్ = అనాదియొక్క భావము అనాదిత్వము, ఆది యనఁగా కారణము, అది లేనిది యనాది, ఏది యాదిమంతమో అది గదా స్వరూపంబున వికృత మగుచున్నది, ఇతఁడో అనాది యగుటవలన నిరవయవుఁ డగుటచే వికారము నొందఁడు; అట్లు, నిర్గుణత్వాత్ =

సగుణుఁడు గుణవ్యయమున వ్యయము నొందును, ఇతఁడో నిర్గుణుఁ డగుటవలన వ్యయము నొందఁడు, అట్టి నిర్గుణుఁ డగుటవలన; అయమ్ = ఈ; పరమాత్మా = పరమాత్మ; అవ్యయః = వ్యయము లేనివాఁడు. అగుటవలన, శరీరస్థోఽపి = శరీరములయం దాత్మ యుపలబ్ధుఁ డగుచున్నాఁ డని శరీరస్థుఁ డని చెప్పఁబడుచున్నాఁడు, అట్లు శరీరములం దున్నవాఁ డైనను; నకరోతి = చేయఁడు; చేయనివాఁ డగుటవలననే ఫలముచే, నలిప్యతే = అంటఁబడఁడు. ఎవఁడు కర్మము చేయుచున్నాఁడో వాఁడు గదా తత్ఫలము నొందుచున్నాఁడు, పరమాత్మయో కర్త కాఁడు, కావున ఫలముచేత లిప్తుఁడును గాఁ డని యర్థము.

పూర్వపక్షము.—ఎవ్వఁడు మఱి దేహములయందుఁ జేయుచున్నాఁడు? లిప్తుఁడు నగుచున్నాఁడు? పరమాత్మకంటె నితరుఁడు దేహి చేయుచున్నాఁడు లిప్తుఁ డగుచున్నాఁ డందువేని, అప్పుడు క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి ఇత్యాదిగా క్షేత్రజ్ఞేశ్వరైకత్వము చెప్పుట యనుపపన్నమగును. ఇఁక, ఈశ్వరునికంటె నితరుఁడు దేహి లేఁ డందువేని ఎవ్వఁడు చేయుచున్నాఁడో లిప్తుఁ డగుచున్నాఁడో చెప్పవలయును. ఈశ్వరుఁడే లేఁ డని గాని చెప్పవలయును. ఇట్లన్ని విధంబులను దెలియుటకును జెప్పుటకు నశక్య మని భగవత్ప్రోక్త మగు నౌపనిషదదర్శనమును బరిత్యజించిరి వైశేషికులును సాంఖ్యార్హతబౌద్ధులును.

సమాధానము.—అందులకుఁ బరిహారము భగవంతుఁడు తానే చెప్పియున్నాఁడు స్వభావస్తు ప్రవర్తతే అని. అవిద్యామాత్రస్వభావుఁడు గదా చేయుచున్నాఁడు లిప్తుఁ డగుచున్నాఁ డని వ్యవహారము కలుగుచున్నది. పరమార్థమునసో యొక్కఁడే యగు పరమాత్మయం దది లేదు. అందువలన, ఈ పరమార్థసాంఖ్యదర్శనమునం దున్నవారును జ్ఞాననిష్ఠులు నగు పరమహంసపరివ్రాజకులకు నవిద్యావ్యవహారముఁ దిరస్కరించినవారికిఁ గర్మాధికారము లే దని యక్కడక్కడఁ బ్రదర్శింపఁబడినది భగవంతునిచేత.

అనాది యగుటవలనను నిర్గుణుఁ డగుటవలనను నీపరమాత్మ నిర్వికారుఁడు. అందువలన శరీరములయం దున్నవాఁ డైనను గర్మమును జేయఁడు. తత్ఫలముతోను అంటఁ డని తాత్పర్యము.

ఆ. పరమాత్మ పరిపూర్ణుఁడై సర్వదేహములకు నాత్మ యనుసిద్ధాంతమునందు దేహాదిగతమైనకర్తృత్వాదికముచే నాతనికిని కర్తృత్వాదికము ప్రాప్తించుచున్నది. పవిత్రమైనపంచగవ్యము మొదలగువానికి నపవిత్రవస్తుసంసర్గముచే నపవిత్రత్వము సంభవించుటఁ జూచుచున్నారము గదా! అను నీయాశంక ననువదించి తత్పరిహారముగా మీఁదిశ్లోకమును దెల్పుచున్నారు ఒక్కఁడే ఇత్యాదిగా. అనాదిత్వమునే సాధించుచున్నారు ఆది యనఁగా నిత్యాదిగా. అప్పుడును నిష్ఫలాభ మని యాశంకించి కార్యత్వముచేఁ గలుగువ్యయము సంభవింప దని సిద్ధమగు నని చెప్పుచున్నారు ఏది యాదిమంతమో ఇత్యాదిగా. అట్లైనను గుణాపకర్షముచేఁ గలుగువ్యయము సంభవించు నని యాశంకించి సంభవింప దని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. నిరవయవుం డగుటవలన నవయవముచేఁ గలుగువ్యయంబును, నిర్గుణుం డగుటవలన గుణముచేఁ గలుగువ్యయంబును లేకున్నను స్వభావంబున వ్యయంబు గలుగవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు అవ్యయ మిత్యాదిగా. పరమాత్ముఁ డనయంతఁ గాని యితరముచేఁ గాని వ్యయము లే దని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నని. స్వమహిమ ప్రతిష్ఠితుఁ డైనపరమాత్మ శరీరస్థుం డెట్లగు ననఁగాఁ జెప్పుచున్నారు శరీరములయందు ఇత్యాదిగా. సర్వగతుం డగుటచేతను సర్వాత్మ యగుటచేతను దేహాదులయందున్నను స్వరూపంబునఁ గాని దేహాదిరూపంబునఁ గాని చేయఁడు, తాను కూటస్థుం డగుటవలనను దేహాదికము కల్పితం బగుటవలనను అని భావము. కర్త కాకున్నను భోక్త కావచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు చేయనివాఁ డగుటవల ననే ఇత్యాదిగా. దానినే యుపపాదించుచున్నారు ఎవఁడు ఇత్యాదిగా.

పరునకుఁ గర్తృత్వాదికము లేనిపక్షమున మఱియెవ్వని కా కర్తృత్వాదిక మని యడుగుచున్నాఁడు ఎవ్వఁడు మఱి ఇత్యాదిగా. పరమాత్మ కంటె భిన్నుఁ డయిన యొకానొకజీవునకుఁ గర్తృత్వాదికం బనునాశంక ననువదించుచున్నాఁడు పరమాత్మ కంటె నిత్యాదిగా. ఆపక్షమునందుఁ బూర్వోక్తవిరోధం బని నిరాకరించుచున్నాఁడు అప్పుడు ఇత్యాదిగా. ఈశ్వరునికంటె భిన్నుఁ డైనజీవు నంగీకరించుటవలనఁ బూర్వోక్తవిరోధము లే దని శంకించుచున్నాఁడు ఇఁక ఇత్యాదిగా. అప్పుడు కనఁబడుచున్నకర్తృత్వాదికము కలవాఁ డెవ్వఁడో చెప్పవలయు నని పూర్వవాది యడుగుచున్నాఁడు ఎవ్వఁడు ఇత్యాదిగా. పరుఁడే కర్తృత్వాదికము కలవాఁ డగుటవలనఁ జెప్పవలసినది లే దని చెప్పుచున్నాఁడు ఈశ్వరుఁడే ఇత్యాదిగా. కర్తృ

త్వాదులు కలవాఁ డన్నపక్షమున నస్మదాదులకుంబోలెఁ బరునకును నీశ్వరత్వము లే దని భావము. పరునకుఁ గాని యితరునకుఁ గాని కర్తృత్వాదికము సమానమై యుండఁగా శరీరస్థో పీత్యాది భగవద్వాక్యము వేదమూలకం బయినను ఎఱుఁగుటకును జెప్పుటకును నశక్య మగుటవలనఁ బరిత్యాజ్యమే యని యితరశాస్త్రకారులసమ్మతిని జూపి యుపసంహరించుచున్నారు ఇట్లన్ని విధంబులను ఇత్యాదిగా.

వాస్తవమున నకర్తయు నభోక్తయు నగుపరునకు నవిద్యచేఁ గర్తృత్వాదికం బారోపిత మగుటవలన నుపాదేయమే భగవన్మత మని పరిహరించుచున్నారు అందులకు ఇత్యాదిగా. పరిహారమునే ప్రపంచించుచున్నారు అవి ద్యేత్యాదిగా. కర్తృత్వాదికము వ్యావహారికం బని యంగీకరించినప్పుడు అది పారమార్థికమే యని యేల యంగీకరింపఁగూడ దనఁగాఁ జెప్పుచున్నారు పరమార్థమునన్ ఇత్యాదిగా. పారమార్థిక మయిన కర్తృత్వాదికము లే దనుటయందు హేతువు నుపన్యసించుచున్నారు. అందువలన నిత్యాదిగా.

ప్ర. శరీరస్థః—శరీరమునందుఁ గనఁబడుచుండువాఁడు.

శం. ఓయీ! "సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తమ్" అని చెప్పుటవలన భూతము లాత్మ కాశ్రయము లని గోచరించుచున్నది. అప్పుడు ఆశ్రయము నశింపఁగా నాశ్రితము కూడ నశించు ననున్యాయమువలన ఆత్మ కాశ్రయము లైన భూతములు నశింప నాశ్రిత మగు నాత్మకును నాశము ప్రసక్తించు చున్నది. దారువు నశింపఁగా నగ్నికిని నాశము చూచుచున్నారము. మఱియును గుఱ్ఱము నడచునపుడు దానిగతునకును గమనము ప్రసిద్ధము. అందువలనఁ బ్రకృతి కర్మములను జేయుచుండఁగా దానియందున్న యాత్మకును గర్మకర్తృత్వమును దత్ఫలానుభవమును సంభవించుచున్నది. కావున ఆత్మకు అజత్వంబును అకర్తృత్వంబును ఎట్లు సిద్ధించు నని సింహావలోకనన్యాయముచేఁ బూర్వశ్లోకద్వయార్థము నాశంకించి అజుఁ డగుటవలనను నిర్గుణుం డగుటవలనను ఆత్మకు నాశము సంభవింప దనియుఁ గూటస్థుం డగుటవలన వికారము సంభవింపమింజేసి కర్తృత్వాదికము కూడ లే దనియుఁ జెప్పుచున్నాఁడు.—అనాది త్వాత్—ఆది = ఉత్పత్తికిఁ గారణము నిమిత్తముగాని ఉపాదానముగాని దీనికి లేదు కావున అనాది, "న తస్య కశ్చి జ్జనితా న చాధిపః" అను శ్రుతి ఆత్మకు జనకుఁడు లేఁ డని చెప్పుటవలన ఈయాత్మ కారణము లేనివాఁడు; లేక ఆది యనఁగా మొదటివికారము, జన్మము అను భావవికారము, అది వీనికి లేదు కావున అనాది, ఈయాత్మ నిరవయవుం డగుటవలన అజుఁడు,

"అజో నిత్యః" అను శ్రుతివలన, అనాదియొక్క భావము అనాదిత్వము, అనాది యగుటవలన; ఏది సావయవమో యది ఆదిమంతము, ఏది ఆదిమంతమో యది వికారి, ఏది వికారియో ఆభూతజాతము వ్యయము నొందును, తనయుపాధి యగుచున భూతజాతము నశించినను దాను నిరవయవుం డగుటచే ననాది యగుటవలన వ్యయము నొందఁడు, కావున ఈయాత్మ అవ్యయుఁడు; కారణ మున్నయెడ కారణ నాశమువలనఁ గార్యమునకును నాశము గలుగు నను న్యాయముచే భూతములకుం బోలె నాత్మకును నాశము ప్రసక్తించును, కారణము లేనివాఁ డగుటవలన ఆశ్రయము నశించినను ఆకాశమువలె వ్యయము నొందనివాఁడు కావున అవ్యయుఁడు—నాశరహితుఁ డని యర్థము, "అవినాశీవా అరేయమాత్మా" అను శ్రుతి యాత్మకు నుపాధి నశించినను నాశము లే దని యుపదేశించుటవలన. నిర్గుణత్వాత్ — గుణములు సత్త్వాదులు, లేక శబ్దాదులు, లేక ఇచ్ఛ మొదలగునవి, ఆగుణములవలన నిర్గతుఁడు కావున నిర్గుణుఁడు, లేక, గుణము లనఁగా ప్రాణాదులు షోడశకళ లని పేర్కొనఁబడునవి, వానివలన నిర్గతుఁడు కావున నిర్గుణుఁడు, నిరవయవుం డని యర్థము, నిర్గుణుని భావము నిర్గుణత్వము, నిర్గుణుం డగుటవలన; ఏది సగుణమో అట్టి భూతసముదాయము గుణవ్యయమువలన వ్యయము నొందుచున్నది, ఈయాత్మయో నిర్గుణుం డగుటవలన వ్యయము నొందఁడు, సగుణుండును సకారణుండును నైనం గదా గుణవ్యయముచేతను కారణవ్యయముచేతను వ్యయము నొందును, ఈయాత్మ అట్టివాఁడు కాఁడు కావున అవ్యయుఁడు నిత్యుఁ డను యర్థము, "నిత్యో నిత్యానామ్" అను శ్రుతివలన. శంకా! ఆత్మకు అనాదియు నిర్గుణుండు నగుటచేఁ గారణనాశముచేతను గుణనాశముచేతను నాశము సంభవింపకున్నను ఘటాదికము నకుంబోలె ఇతరునిచేతఁ గాని వాయువునకుంబోలె తనచేతనే గాని నాశము సంభవింపవచ్చు నని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు.—పరమాత్మా — పరముఁడును ఆత్మయును అయినవాఁడు, ఇవి రెండును హేతుగర్భితము లైనవి శేషణములు, ఆత్మ ఖడ్గము అగ్ని మొదలగువానిచే నశింపఁడు, పరముం డగుటవలన, ఏది నాశరహితము కాదో అది పరమును కాదు, దేహమునవలె; పరమ మనఁగా అవ్యక్తముకన్నను నిరవయవ మగుటచే అతిసూక్ష్మము, లేక నిరతిశయమహత్తు; అందువలన నశింపఁ జేయుదానికి విషయము కానివాఁ డని యర్థము; ఆత్మ యగుటవలన తనచేఁ దనకు నాశము లేనివాఁడు, ఆత్మ యనఁగాఁ బ్రత్యక్చైతన్యుఁడు, అహంప్రత్యయమునకు అర్థ మగువాఁడు, బుద్ధ్యాదిస్థూలాంతభావము లన్నియుఁ బ్రతీతమును విపర్య

యము పొందుచున్నను "అహ మస్మి" అని సర్వావస్థలయందును నందఱిచేతను సర్వకాలంబును ఆత్మసత్త ఏకరీతిగా ననుభవింపఁబడుచున్నది, అందువలన నిరవయవుండును నిర్వికారుండును నిత్యుండును నిష్క్రియుండును బరిపూర్ణుండును నగు నీయాత్మ; శరీరస్థో௨పి — స్వమహిమప్రతిష్ఠితుండును బరమమహాద్రూపుండును నగు నాత్మకు అధికరణము సంభవింపకున్నను శరీరమునందే యాత్మోపలబ్ధి కలుగుటవలన శరీరస్థుం డని చెప్పఁబడుచున్నాఁడు, బ్రహ్మాది స్తంబపర్యంతము లైన శరీరములయందు ఘటాదులయం దాకాశమువలె ఉన్నవాఁ డైనను; అవి కర్మములు చేయుచున్నను దాను బుణ్యపాపరూప మయినకర్మమును, నకరోతి - చేయఁడు, మఱి మఱఁగా శరీరములయందు బుద్ధికిని తద్వృత్తులకును సాక్షియై నిర్వికారుఁడై యున్నాఁడు, గాలిక వృక్షములు చలించుచున్నను అచలమగు నాకాశమువలెఁ దా నేమియుఁ జేష్టింపఁడు, నిరవయవుండును బరిపూర్ణుఁడు నగువానికిఁ జలనము సంభవింపమివలన నని యర్థము, "వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠ త్యేకః" అను శ్రుతివలన. ఓయీ! కూటస్థుఁ డైనయాత్మ తాను గర్మము చేయకున్నను, దేహమునం దుండు నప్పుడు తత్సంబంధమువలన దేహేంద్రియాదులు చేయుకర్మములచే లేపము నొందుచున్నాఁడు, "తత్సంయోగీ చ పఞ్చమః" అని మహాపాతకము చేసినవారితో సంబంధమాత్రమువలనఁ బాతకము చేయనివానికిని బాపిత్వము స్మృతియందుఁ జెప్పఁబడుచున్నది, ఆన్యాయమువలన నాత్మకును గర్మలేపము సంభవించునందు వేని నట్లు గాదు. తత్సంయోగి యని పాపప్రాప్తికి హేతు వైన పాతకసంబంధము ప్రతిపాదింపఁబడి యుండుటవలనఁ దత్సంబంధికిఁ బాతకము సంభవింపవచ్చును గాని యట్టి సంబంధము నొందక దూరమున నున్నవానికి సంభవింపదు, అట్లు ఇందును నిరవయవుం డగుటచే నతిసూక్ష్ముఁ డగుటవలన నాత్మకు దేహేంద్రియాదులతోను అవి చేయు కర్మములతోను సంబంధము సంభవింపదు, కావున దేహేంద్రియాదులు చేయు కర్మములతో లేపము లే దని చెప్పుచున్నాఁడు.— నలిప్యతే — దేహేంద్రియములకును తద్వికారములకును తదవస్థలకును తద్వ్యాపారములకును సాక్షియై యవిక్రియరూపంబున నున్నయాత్మ తా నసంగుఁ డగుటవలన వానికర్మములతో లిప్తుఁడు కాఁ డని యర్థము.

**అ.** ఆత్మకు స్వభావంబునఁ గర్తృత్వము లేకున్నను శరీరసంబంధము వలనఁ గర్తృత్వము గలుగు నను నాశంకను నివారించుచు "యః పశ్యతి తథాత్మాన మకర్తారం స పశ్యతి" అనుదానియర్థమును వివరించుచున్నాఁడు.—

అయమ్—ఈ యపరోక్షుఁడయిన పరమాత్మ, పరమేశ్వరునికంటె అభిన్నుఁడైన ప్రత్యగాత్మ; అవ్యయః—వ్యయము లేనివాఁడు, సర్వవికారశూన్యుఁ డని యర్థము. అందు వ్యయము రెండువిధములు, ఎట్లనఁగా, ధర్మిస్వరూపమునకు ఉత్పత్తి గలిగినను వ్యయము కావచ్చును, ధర్మిస్వరూపము ఉత్పత్తిరహిత మయినను దద్ధర్మములకే యుత్పత్తి కలుగు నన్నను వ్యయము కావచ్చును. అందు మొదటిదానిని నిరాకరించుచున్నాఁడు.— అనాదిత్వాత్ ఆది యనఁగాఁ బ్రాగభావావస్థ, సర్వకాలములయందును సద్రూపుఁడైనయాత్మకు అది లేదు, అందువలన ఆతనికిఁ గారణము లేమివలన జన్మము లేదు, అనాదికి జన్మము సంభవింపదు గదా! జన్మము లేనియప్పుడు తదనంతరము సంభవించునట్టి యుత్తరభావవికారములు గూడ సంభవింపనే సంభవింపవు. అందువలన స్వరూపముచే వ్యయము నొందఁ డని యర్థము. ఇఁక రెండవదానిని నిరాకరించుచున్నాఁడు — నిర్గుణత్వాత్ - ధర్మరహితుఁ డగుటవలన నని యర్థము. ధర్మిని గదా వికారము నొందింపక యేధర్మముగాని పొందదు, విషయము, ధర్మధర్ములకుఁ దాదాత్మ్యసంబంధము నియత మగుటవలన; ఇతఁడో ధర్మరహితుఁడు, అందువలన ధర్మద్వారమునఁ గూడ వ్యయము నొందఁ డని యర్థము, "అవినాశీ వా అరే ఽయమాత్మా ఽనుచ్ఛిత్తి ధర్మా" అను శ్రుతివలన. ఇట్లు ఈ పరమాత్మ జాయతే అస్తి వర్ధతే విపరిణమతే అపక్షీయతే వినశ్యతి అను షడ్భావవికారములును లేనివాఁ డగుటవలన ఆధ్యాసికకల్పిత మగు సంబంధముచేత, శరీరస్థో ఽపి - శరీరమునం దున్నవాఁడైనను; ఆశరీరము కర్మము చేయుచున్నను ఈయాత్మ, నకరోతి -- చేయఁడు, ఎట్లు ఆధ్యాసికసంబంధముచే జలమునం దున్నసూర్యుఁడు ఆజలము చలించుచున్నను దాను జలింపనే చలింపఁడో యట్లు. ఎందువలన నేకర్మమునుం జేయఁడో యందువలన నేకర్మఫలముతోను, నలిప్యతే — సంబంధింపఁడు. ఎవఁడు ఏకర్మముఁ జేయుచున్నాఁడో వాఁడు గదా తత్ఫలముచే లిప్తుఁ డగును! ఇతఁడో లిప్తుఁడు కాఁడు, అకర్త యగుటవలన నని యర్థము, ఇచ్ఛ ద్వేషము సుఖము దుఃఖము మొదలగునవి యన్నియు క్షేత్రధర్మము లని చెప్పుటవలనను, "ప్రకృత్యైవచ కర్మాణి క్రియమాణాని" అని కర్మము మాయాకార్య మని చెప్పుటవలనను. అందువలననే పరమార్థదర్శులకు సర్వకర్మములయందును నధికారము నివర్తిల్లు నని మున్ను వక్కాణింపఁబడినది. ఇందుచేత ఆత్మకు నిర్ధర్మకత్వము ప్రతిపాదించుటవలన స్వగతభేదము కూడ నిరసింపఁబడినది. "ప్రకృత్యైవచ కర్మాణి" అనుటచే సజాతీయభేదము

నివారింపఁబడినది. "యదా భూతపృథగ్భావమ్" అను శ్లోకముచే విజాతీయభేదము నిరాకృతము. "అనాదిత్వాన్నిర్గుణత్వాత్" అనుశ్లోకంబున స్వగతభేదము నిరస్తము. కావున అద్వితీయ మగు బ్రహ్మమే యాత్మ యని సిద్ధము.

శ్రీ. అట్లయినను బరమేశ్వరునకు సంసారావస్థయందు దేహసంబంధములచేఁ గలుగుకర్మములచేతను తత్ఫలము లైన సుఖదుఃఖాదులచేతను వైషమ్యము పరిహరింప శక్యము కాదు, కావున సమదర్శన మెట్లు సిద్ధించును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు అనాదిత్వా దిత్యాదిగా. ఏది యుత్పత్తి గలదో యదియే గదా వ్యయమును — నాశమును బొందుచున్నది. మఱియు నేది గుణవంత మైనవస్తువో దానికి గుణనాశముచే వ్యయము సంభవించును. ఈ పరమాత్మయో యనాదియును నిర్గుణుఁడును గావున, అవ్యయుఁడు — అవికారి యని యర్థము. అందువలన శరీరమునం దున్నను ఏకర్మమునుం జేయఁడు, ఏకర్మఫలముచేతను లిప్తుఁడు కాఁడు.

ప. సమదర్శనమునందును సంసారావస్థయందుఁ బరమేశ్వరునకు శరీరసంబంధనిమిత్తము లైన కర్మములచేతను తత్ఫలము లైన సుఖదుఃఖాదులచేతను వైషమ్యము దుర్నివారము అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అయం పరమాత్మా; శరీరస్థో ఽపి; నకరోతి — అకర్తగానే యున్నాఁడు; తత్ఫలములచేతను, నలిప్యతే. ఎందువలన ననఁగా, అనాదిత్వాత్, నిర్గుణత్వాత్ — ఏది పుట్టువు గలదో అది నశించును, అట్లు ఏది గుణవంతమో అది గుణక్షయమువలన క్షయించును, పరమాత్మయో అనాదియును నిర్గుణుండును, అందువలన, అవ్యయుఁ—డవికారరహితుఁడు, కావున లిప్తుఁడు కాఁడు.

రా. అయం పరమాత్మా = శరీరమునుండి వేఱుపఱుపఁబడిన స్వరూపముచే నిరూపింపఁబడినట్టి యీపరమాత్మ; శరీరస్థో ఽపి; అనాదిత్వాత్ = ఆరభ్యుఁడు * కానందువలన; అవ్యయః = వ్యయము లేనివాఁడు; నిర్గుణత్వాత్ = సత్త్వాదిగుణరహితుఁ డగుటవలన; నకరోతి. నలిప్యతే — దేహస్వభావములచే లిప్తుఁడు కాఁడు.

ఏహా. వానికి వ్యయాదికము గూడ లే దని చెప్పుచున్నాఁడు అనాదిత్వా దిత్యాదిగా. ఆదిసహితము గదా ప్రాయికముగా వ్యయము నొందుచున్నది, గుణాత్మకము గూడ. నకరోతీత్యాదికమునకు అర్థము మున్ను చెప్పఁబడినది. లౌకిక

* జనన ము కలవాఁడు.

మైన క్రియాదికము అతనికి లేదు. కావున "న ప్రజ్ఞ" మిత్యాదికమునకువలె దీని యర్థ మొనరుగవలెను.

యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే. 3౨

భా. దేనివలెం జేయంబడు లిప్తుండు కాండని యనంగా దృష్టాంతము చెప్పుచున్నాండు.—యథా = ఎట్లు; సర్వగతమ్ = వ్యాపక మైనను; సౌక్ష్మ్యాత్ = సూక్ష్మ మగుటవలన; ఆకాశమ్ = ఆకాశము; నోపలిప్యతే = సంబంధింపదో; తథా = అట్లు; దేహే = దేహమునందు; సర్వత్ర = అంతటను; అవస్థితః = వ్యాపించియున్నవాం డైనను; ఆత్మా = ఆత్మ; నోపలిప్యతే = సంబంధింపండు.

ఎట్లు ఆకాశము సర్వపదార్థములయందును వ్యాపించియున్న దైనను, సూక్ష్మ మగుటవలన నేపదార్థములతోను సంబంధింపదో, అట్లు ఆత్మ సర్వదేహములయందును వ్యాపించియున్నవాం డైనను దేహాద్రియాదులతో సంబంధింపం డని తాత్పర్యము.

శ్రీ. సూక్ష్మము—అప్రతిహత మైనస్వభావము గలది యని యర్థము. సంబంధింపదో — పంకము మొదలగువానితో నని శేషము.

హ. పంక మంచు మొదలగువానిచే, నోపలిప్యతే = లేపము నొందదో.

శం. ఈ యుపాధి ప్రారబ్ధానుసారంబున సర్వవిధంబులను వర్తించుం గాక, దానియం దున్నవాం డైనను ఆత్మ దాని ధర్మకర్మావస్థలచే నించుకైనను నెప్పుడును స్పృశింపంబడకయే యున్నాండను దృఢనిశ్చయము గలవారై ఆత్మయందే యాత్మభావము పొందినట్టివా రగు బ్రహ్మవిదులు తమయందుం గర్తృత్వభోక్తృత్వాదిభ్రమము విడిచి మౌనంబున సర్వకాలములయందును ఆత్మానందరసమునే యనుభవింతురని సూచించుటకై భగవంతుండు ఆత్మకు ఉపాధికృతకర్మలేపము సంభవింప దని చెప్పియున్నవాం డైనను వెండియు దానినే దృష్టాంతసహితముగాం బ్రతిపాదించుచున్నాండు, మందబుద్ధులకును గర్తృత్వభోక్తృత్వభ్రమము నివర్తించుటకొఱకు.—సర్వగతమ్ = ఆకాశము నిరవయవ మగుటచే దానికి గమనము సంభవింపదు కావున సర్వమును దేనిచేత గతమో — వ్యాప్తమో అది సర్వగతము, సమస్తము లయిన ఘటమఠాదు లగు మూర్తద్రవ్యములయందు దృష్టములయందును

నదృష్టములయందును వెలుపలను లోపలను ఎల్లయెడలను వ్యాపించియున్న దైనను; ఆకాశమ్ = ఆకాశము; సౌక్ష్మ్యాత్ = తాను వ్యాపించియుండు ద్రవ్యములకన్నను అతిసూక్ష్మ మగుటవలన; తత్తద్గుణదోషములచేత, సుగంధాదులచేతను వర్షవాతాతపవహ్నిధూమరజఃపంకాదులచేతను, యథా = ఎట్లు; నోపలిప్యతే — లేప్యమునకును లేపకమునకును లేపనక్రియకును నవిషయం బగుటవలన దేనిచేతను లిప్తము కాదో, స్పృశింపఁబడదో యని యర్థము. తథా = అట్లు; సర్వత్ర దేహే = సమస్తదేహములయందును, జాతియం దేకవచనము, దేవమనుష్యతిర్యగాదినానావిధశరీరములయందు; అవస్థితః = అంతటను వెలుపలను లోపలను వ్యాపించియున్న వాఁడైనను; ఆత్మా = ఆత్మ; సౌక్ష్మ్యాత్ = "సూక్ష్మాచ్చ తత్సూక్ష్మతరం విభాతి" అను శ్రుతివలన అవ్యక్తమహదాదులకన్నను బరమసూక్ష్ముఁ డగుటవలన; దేహేంద్రియమనోబుద్ధ్యాదులచేతను ఇప్పుడును పూర్వము శతకోటిజన్మములయందును జేయఁబడినపుణ్యపాపకర్మములచేతను; నోపలిప్యతే — కొంచెమైనను స్పృశింపఁబడఁ డని యర్థము. ఇందుచే సమ్యగ్దర్శనంబున నిశ్శేషముగా నశించిన యవిద్యాతత్కార్యములు గల బ్రహ్మవిదు లగుయతులకు ఎందును ఆహారాదినిమిత్త మైనకర్మముచే దేనిచేతను లేపము సంభవింపదు కావున కైవల్యసిద్ధికిఁ బ్రతిబంధక మైన ద్వైతవాసన నిశ్శేషముగా నశియించుటకొఱకును ఆత్మానందానుభవముకొఱకును "సమం పశ్యన్ హి సర్వత్ర" అని ప్రతిపాదించినరీతిని సదా సమదర్శననిష్ఠయందే యుండవలె నని సూచిత మగుచున్నది. దాని విడిచి యథేష్టాచరణమో యుచితము కాదు, ఉదాహరించినవచనమునకు విరోధము గలుగుటవలనను సన్న్యాసశ్రవణాదిశ్రమఫలము లేకపోవుటవలనను. అందువలన నెల్లప్పుడును బరిపూర్ణవృత్తితోనే యుండవలయు నని సిద్ధము.

మ. శరీరస్థుం డైనను దత్కర్మముచే లిప్తుఁడు కాఁడు, తా నసంగుఁ డగుటవలన ననుటకు దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు—సౌక్ష్మ్యాత్ =అసంగస్వభావ మగుటవలన; ఆకాశమ్; సర్వగత మైనను పంకాదులచే నెట్లుపలిప్తము కాదో యని దృష్టాంతార్థము. ఇతరము స్పష్టము.

శ్రీ. అందులకు దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు.—ఎట్లు సర్వపదార్థములయందును పంకాదులయందును నున్నయాకాశము, సౌక్ష్మ్యాత్ = అసంగ మగుటవలన; పంకాదులచే నుపలిప్తము కాదో. తథా; సర్వత్ర — ఉత్తమమును మధ్య

మమును అధమమును అగు, దేహే = దేహమునందు; ఉన్నవాఁడైనను; ఆత్మా; నోపలిప్యతే — దేహసంబంధి గుణదోషములచే సంబంధింపఁడని యర్థము.

ఫ. *

తా. నిర్గుణుం డగుటవలనఁ జేయఁడు అనుట వాస్తవ మైనను, నిత్యసంయుక్తుఁడైనవాఁడు దేహస్వభావములచే నెట్లు లిప్తుఁడు కాఁడు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—యథా = ఎట్లు; ఆకాశము సర్వగత మైనను—సర్వవస్తువులందు సంయుక్త మైనను, సౌక్ష్మ్యాత్ = సూక్ష్మ మగుటవలన; సర్వవస్తుస్వభావములచేతను లిప్తము కాదో; తథా; ఆత్మా; అతిసూక్ష్ముఁ డగుటవలన, సర్వత్ర — దేవమనుష్యాదిక మైన; దేహే — దేహమునందు; ఉన్నవాఁడైనను తత్తద్దేహస్వభావములచేత లిప్తుఁడు కాఁడు.

మూ ♦

యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత. 33

భా. మఱియును. యథా = ఎట్లు; రవిః — సవిత, ఆదిత్యుఁడు; ఏకః = ఒక్కఁడు; కృత్స్నమ్ = సమస్త మైన; ఇమమ్ = ఈ; లోకమ్= లోకమును; ప్రకాశయతి = ప్రకాశింపఁజేయుచున్నాఁడో; తథా = అట్లు; క్షేత్రమ్=మహాభూతాదిధృత్యంత మైన క్షేత్రమును; కృత్స్నమ్ = సమస్తమును; తా నొక్కఁడే, ప్రకాశయతి = ప్రకాశింపఁజేయుచున్నాఁడు. ఎవఁడు? క్షేత్రీ — పరమాత్మ యని యర్థము. భారత = ఓయర్జునా! రవిదృష్టాంత మిట ఆత్మయందు రెండర్థములను గూడ సాధించుట నని తెలియవలెను, రవివలె సర్వక్షేత్రములయం దాత్మ యొక్కఁడే యనియు అలేపుఁ డనియు.

అర్జునా! ఎట్లు సూర్యుఁ డొక్కఁడే యీసమస్తలోకమును బ్రకాశింపఁజేయుచు నలిప్తుఁడై యున్నాఁడో అట్లు పరమాత్మ యొక్కఁడే మహాభూతాదిధృత్యంత మగు సమస్తక్షేత్రమును బ్రకాశింపఁజేయుచు నలిప్తుఁడై యున్నాఁ డని తా.

* శ్రీధరీయముతో సమానము.

♦ దీనికిని పైశ్లోకమునకును ఈభాష్యము లేదు.

ఆ. చేయుఁడు లిప్తుఁడును గాఁడు అనుటకు ద్రష్ట యగుటచే దృశ్యధర్మశూన్యుం డనుట హేతువుగాఁ జెప్పుచున్నారు మఱియును అని. దృష్టాంతముచే వివక్షిత మైన యర్థమును దెలుపుచున్నారు రవిదృష్టాంతముచే నిత్యాదిగా. ఆ రెం డర్థములనే స్పష్టీకరించుచున్నారు ఆవిపతె నిత్యాదిగా.

హ. *

శం. శ్రుతియుక్త్యనుభవములచే నాత్మ ప్రకృతివిలక్షణుం డని యెఱింగి ప్రకృతిని ఆత్మయందు లయము నొందించి యాత్మైకత్వమునే యెల్లప్పుడు ననుభవించుచున్నయతికి విదేహముక్తి సిద్ధించు నని నిశ్చయించి ప్రకరణము నుపసంహరించువాఁడై శ్రీభగవంతుఁడు ముక్తికి ఆత్మ ప్రకృతివిలక్షణుం డని యెఱుంగుటయే ముఖ్యకారణం బని మందప్రజ్ఞులకును ఈజ్ఞానమునందు నిస్సంశయముగా నిశ్చయము గలుగుటకై రెండియును "యత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ" అనుశ్లోకముచే నుక్తలక్షణుం డగు నాత్మకుఁ బ్రకృతివైలక్షణ్యమును రవిదృష్టాంతముచే స్పష్టీకరించుచున్నాఁడు.—ఏకః—ఒక్కఁడే, రవిః = తేజోఘనుం డగు సూర్యుఁడు; ఇమమ్=భూర్భువరాదిభేదములు గల; కృత్స్నమ్; లోకమ్ = బ్రహ్మాండమును; అంతటను వ్యాపించి తన తేజస్సుచే, యథా = ఎట్లు; ప్రకాశయతి—సర్వపదార్థములకును తానే సత్తను స్ఫూర్తిని ఇచ్చుచున్నాఁడో. సూర్యునిచేతనే గదా జడము లయిన ఘటాదిసర్వపదార్థములయందు "ఘట మున్నది, ఇది ఘటము" అని సత్తయును స్ఫూర్తియును తోఁచుచున్నవి, అందువలన సమస్తమును — నామరూపవిశేషములచే ననేకవిధములుగా భిన్న మగు బ్రహ్మాండమును, తాను అభిన్నస్వభావుఁడై యొక్కఁడే సూర్యుఁడు స్వభాస్య మైన లోకమునకంటె విలక్షణుఁడై, తత్సంబంధరహితుఁడై యెట్లు ప్రకాశింపఁజేయుచున్నాఁడో. తథా = అట్లు; క్షేత్రీ = క్షేత్రము — అవ్యక్తాదిస్థూలపర్యంతమును సమష్టివ్యష్టిరూపము నగు శరీరము వీనికిఁ గలదు—జ్ఞేయముగాను ప్రకాశ్యముగాను విషయమై యున్నది కావున క్షేత్రి యనఁగా క్షేత్రజ్ఞుఁ డగు ఆత్మ, తాను చిద్ఘనుఁ డొకఁడే, క్షేత్రి యని చెప్పుట క్షేత్రతత్స్వాములకుం బోలె క్షేత్రక్షేత్రజ్ఞులకు అచేతనత్వచేతనత్వములును జ్ఞేయత్వజ్ఞాతృత్వములును భాస్యత్వభాసకత్వములును మొదలగు ధర్మములచే వైలక్షణ్యము తెలుపుట కొఱకు, ఎందువలన క్షేత్రజ్ఞుఁడో యందువలన క్షేత్రముకంటె భిన్నుఁ డయినయాత్మయును; క్షేత్రమ్ = మహదాదిసర్వవికారయుక్తమై నామరూపజాతిక్రియాగుణవిశేషములచే ననేకవిధములుగా భిన్న మైనదానిని; కృత్స్నమ్ = తదవస్థలతోను దద్ధ

* దీని కీవ్యాఖ్యానము లేదు.

ర్మములతోను దత్కార్యములతోను గూడ సమస్తమును; ప్రకాశయతి — తనయం దధ్యస్తము లైన మహదాదిస్థూలాంతము లగు సర్వవికారములకును సత్తను—స్ఫూర్తిని ఇచ్చుచున్నాఁ డని యర్థము. దీనిచే క్షేత్రజ్ఞుం డగునాత్మ క్షేత్రమునకును దద్వికారములకును దద్ధర్మములకును దత్కార్యములకును ఏదిసస్థలకును జ్ఞాత యనియు చేతనుం డనియు నిత్యుం డనియు సర్వక్షేత్రములయం దొక్కఁడే యనియు బుద్ధ్యాది సర్వజడపదార్థములను బ్రకాశింపఁ జేయువాఁ డనియు ప్రకాశస్వరూపుం డనియు స్వప్రకాశుం డనియు వృద్ధిక్షయాదుల కవిషయ మనియు నేకరూపుఁ డనియు సర్వవ్యాపకుం డనియు అసంగుం డనియు అవిక్రియుం డనియు కర్తయు కారయితయు కాఁ డనియు భోక్తయు భోజయితయు కాఁ డనియు సర్వద్రష్ట యనియు సర్వదృశ్యధర్మశూన్యుం డనియు స్వసన్నిధానమాత్రంబున సర్వంబునకును బ్రవృత్తిహేతు వనియు భాస్యము లైనవాని సర్వగుణదోషములచేతను నస్పృష్టుం డనియు సర్వసాక్షి యనియు స్వసాక్షాత్కారముచేఁ దమస్సును దత్కార్యములను నివర్తింపఁజేయువాఁ డనియు ప్రతిపాదిత మగుచున్నది. మఱియును ఈలక్షణములచే క్షేత్రముకంటె భిన్నుఁ డైనయాత్మ సూక్ష్మబుద్ధులును యుక్తకుశలులు నగు యతులకు స్వాత్మరూపంబునఁ జక్కఁగా నెఱుంగ శక్య మగు నని సూచిత మగుచున్నది.

వ్యా. ఆత్మ లిప్తుఁడు కాఁ డనుట యసంగస్వభావుఁ డగుటవలనమాత్రమే కాదు. ప్రకాశకుఁ డగుటవలనఁగూడఁ బ్రకాశ్యధర్మములచే నుపలిప్తుఁడు కాఁ డని దృష్టాంతముతోఁ జెప్పుచున్నాఁడు.—యథా = ఎట్లు; రవిః = సూర్యుఁడు; ఏకః = ఒక్కఁడే; కృత్స్నమ్ = సమస్త మయిన; ఇమం లోకమ్ — ఈలోకమును, రూపవంతము లగు సర్వవస్తువుల నని యర్థము; ప్రకాశయతి=ప్రకాశింపఁ జేయుచున్నాఁడో, ప్రకాశ్యధర్మములచే లిప్తుఁడు కాఁడో, ప్రకాశ్యవస్తువులయొక్క భేదమువలన భిన్నుఁడును కాఁడో. తథా = అట్లు; క్షేత్రీ = క్షేత్రజ్ఞుఁడు, ఒక్కఁడే; కృత్స్నమ్, క్షేత్రమ్ = సమస్త మయిన దేహేంద్రియసంఘాతమును; ప్రకాశయతి = ప్రకాశింపఁ జేయుచున్నాఁడు. ఓ భారతుఁడా! అందువలననే ప్రకాశ్యధర్మములచే లిప్తుఁడు కాఁడు, ప్రకాశ్యభేదమువలనను భిన్నుఁడు కాఁ డని యర్థము, "సూర్యో యథా సర్వలోకస్య చక్షుర్న లిప్యతే చాక్షుషై ర్బాహ్యదోషైః। ఏక స్తథా సర్వభూతాన్తరాత్మా నలిప్యతే లోకదుఃఖేన బాహ్యః" * అను శ్రుతివలన.

---

* ఎట్లు సర్వలోకమునకును నేత్రరూపుఁ డైనసూర్యుఁడు నేత్రసంబంధ బాహ్యదోషములచే లిప్తుఁడు కాఁడో అట్లు ఒక్కఁ డైన సర్వభూతాంతరాత్మ బాహ్య మగు లోకదుఃఖముచే లిప్తుఁడు కాఁడు.

శ్రీ. అసంగుఁ డగుటవలన లేపము లే దని యాకాశదృష్టాంతముచేఁ జెప్పఁబడినది. ప్రకాశకుఁ డగుటవలనను గూడఁ బ్రకాశ్యధర్మములతోఁ సంబంధింపఁ డని రవిదృష్టాంతముచేఁ జెప్పుచున్నాఁడు.—అర్థము స్పష్టము.

ప. ఇట్లసంగుఁ డగుటవలన లేపము లే దని యాకాశదృష్టాంతముచేఁ బ్రతిపాదించి యిపుడు ప్రకాశకుం డగుటవలనను గూడఁ బ్రకాశ్యధర్మసంబంధము సంభవింప దని రవిదృష్టాంతముచేఁ జెప్పుచున్నాఁడు.—అర్థము స్పష్టము. ఈయర్థమే చెప్పఁబడినది. "యద్వత్సవితర్యుదితే కరోతి కర్మాణి జీవలోకోఽయమ్। నచ తాని కరోతి రవిర్న కారయతి తద్వదాత్మాపి॥" * అని.

రా. ఏ ఒక్కఁడే యాదిత్యుఁడు తనప్రకాశముచేత, కృత్స్నమ్, ఇమమ్, లోకమ్, ప్రకాశయతి. అట్లు క్షేత్రమును గూడ, క్షేత్రీ; ఈక్షేత్రము నాది యిట్టిది యని, కృత్స్నమ్ = వెలుపలను లోపలను, ఆపాదతలమస్తకమును; తనదైనజ్ఞానముచేత, ప్రకాశయతి. కావునఁ బ్రకాశ్య మగు లోకముకంటెఁ బ్రకాశకుఁ డగు నాదిత్యునివలె జ్ఞాత యగుటచే జ్ఞేయభూత మగు నీక్షేత్రముకంటె అత్యంత విలక్షణుఁ డీయాత్మ యని యర్థము.

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ మన్తరం జ్ఞానచక్షుషా
భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాన్తి తే పరమ్. ౩౪

భా. అధ్యాయార్థమంతయు నుపసంహరించుచున్నది యీశ్లోకము.— క్షేత్రక్షేత్రజ్ఞయోః = ఇదివఱకు వివరింపఁబడిన క్షేత్రముయొక్కయు క్షేత్రజ్ఞునియొక్కయు; ఏవమ్=ఇట్లు, ప్రదర్శితం బగుప్రకారంబున; అన్తరమ్=ఒండొంటికిని గల వైలక్షణ్యవిశేషమును; భూతప్రకృతిమోక్షంచ = భూతములయొక్క ప్రకృతి యనఁగా అవిద్య అవ్యక్త మను పేరు గలది, ఆభూతప్రకృతియొక్క మోక్షమును—అభావమును బొందించుటను; జ్ఞానచక్షుషా = శాస్త్రాచార్యోపదేశములచే జనియించునట్టి యాత్మవిషయక మగు జ్ఞాన మనునదే చక్షువు, అట్టి జ్ఞానచక్షువుచేత; యే = ఎవరు; విదుః = ఎఱుంగుచున్నారో. తే = వారు; పరమ్ = పర

* ఎట్లు సూర్యుఁ డుదయింపఁగా నీజీవలోకము కర్మములను జేయుచున్నదో సూర్యుఁ డేమో తాను ఆకర్మములను జేయఁడో చేయింపఁడో, అట్లు ఆత్మయును.

మార్థతత్త్వమును, బ్రహ్మమును; యాన్తి = పొందుచున్నారు, నొండియు దేహము నొందరని యర్థము.

ఈ యధ్యాయమునందుఁ జెప్పినరీతిని క్షేత్రక్షేత్రజ్ఞుల వైలక్షణ్యమును, అవిద్యావిమోచనప్రకారమును ఎవ్వరు జ్ఞానచక్షుస్సుచే నెఱుఁగుచున్నారో వారు బ్రహ్మముఁ బ్రాపింతురని తాత్పర్యము.

**ఆ.** అధ్యాయార్థమును ఫలసహితముగా నుపసంహరించుచున్నారు అధ్యా యేత్యాదిగా. వైలక్షణ్యవిశేషమును — కూటస్థత పరిణామము మొదలగు దానిననుట. ఇట్లు అమానిత్వాదిధర్మనిష్ఠుండై క్షేత్రక్షేత్రజ్ఞయాథాత్మ్యము నెఱిఁ గినవానికి సర్వానర్థములును నివర్తిల్లి పరిపూర్ణ పరమానందావిర్భావలక్షణం బగు పరమపురుషార్థము సిద్ధించు నని సిద్ధము.

**హ.** భూతప్రకృతిమోక్షమ్ = భూతప్రకృతి యనఁగా మాయ, దాని యొక్క మోక్షమును.

**శం.** అధ్యాయార్థ మంతయు సంక్షేపంబునఁ బ్రతిపాదించుచు నధ్యాయ ము నుపసంహరించుచున్నాఁడు:— క్షేత్రక్షేత్రజ్ఞయోః = "ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమ్, ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ." అని ప్రతిపాదింపఁబడిన ప్రకృతి పురుషులయొక్క; ఏవమ్ = "మహాభూతాని, జ్ఞేయమ్ యత్తత్" ఇత్యాదివాక్య ములచేఁ జెప్పఁబడినవిధమున; అన్తరమ్ = జ్ఞేయత్వ జ్ఞాతృత్వాదివిశేషములచే విలక్షణతను; అందు స్వాత్మయే క్షేత్రజ్ఞుఁ డనియు; భూతప్రకృతిమోక్షంచ — ఇట భూతశబ్దముచేత వ్యక్తనామరూపాత్మకమై సత్తని చెప్పఁబడునట్టి జగత్తు చెప్పఁ బడుచున్నది, ప్రకృతిపదముచేత అస్పష్టనామరూపమై అసత్తనుపేరు గలిగి వ్యక్త నామరూపాత్మక మగు జగత్తునకుఁ గారణ మగు నవ్యక్తము చెప్పఁబడుచున్నది, ఆ భూతప్రకృతులయొక్క మోక్షమును — "న సత్తన్నాస దుచ్యతే" అని చెప్పిన రీతిని అభావమును బొందించుటను గూడ; జ్ఞానచక్షుషా = మున్ను చెప్పఁబడిన యమానిత్వానిసాధనములతోను తీవ్రమోక్షేచ్ఛతోను జక్కఁగాఁ జేయఁబడిన శ్రవణాదికముచేఁ బుట్టినజ్ఞాన మేది కలదో క్షేత్రక్షేత్రజ్ఞుల తత్త్వమును గ్రహింప సమర్థమై యతిసూక్ష్మమైనది, అదియే చక్షువు, అట్టి జ్ఞానచక్షుస్సుచేత; యే = ముముక్షువు లైన యేయతులు; విదుః = ప్రకృతితత్కార్యవిలాపనంబున కధిష్ఠాన మైనదియు నిర్విశేషంబును నిత్యశుద్ధబుద్ధముక్తసత్యస్వభావమును సదానందైకరస

మును అపూర్వమును అనపరమును అనన్తరమును అబాహ్యమును అద్వితీయమును నగు పరబ్రహ్మమే నే నని స్వాత్మరూపంబున నెఱుంగుచున్నారో. తే = వారు; పరమ్ = పరమపురుషార్థమును విదేహకైవల్యమును; యాన్తి = పొందుచున్నారు అని యర్థము.

మ. ఇప్పు డధ్యాయార్థమును ఫలముం గూడ నుపసంహరించుచున్నారు.— క్షేత్రక్షేత్రజ్ఞయోః = మున్ను వివరింపఁబడిన క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క; ఏవమ్ = చెప్పినప్రకారంబున; అన్తరమ్ = పరస్పరవిలక్షణతను, జడత్వ చేతనత్వ వికారిత్వ నిర్వికారత్వాదిరూప మైనదానిని; జ్ఞానచక్షుసా = శాస్త్రాచార్యోపదేశజనిత మగు నాత్మజ్ఞానరూప మయిన నేత్రముచేత; యే విదుః=ఎవ రెఱుంగుచున్నారో. భూత ప్రకృతిమోక్షంచ = సర్వభూతములయొక్క ప్రకృతి అవిద్య మాయ యనుపేరు గలది, పరమార్థాత్మజ్ఞానముచేత దానియొక్క యభావమును బొందించుటను; యే, విదుః = ఎఱుంగుచున్నారో. తే — వారు; పరమ్ = పరమార్థవస్తుస్వరూప మగు కైవల్యమును; యాన్తి — పొందియు దేహము నొంద రని యర్థము. ఇట్లు అమా నిత్వాదిసాధననిష్ఠుండై క్షేత్రక్షేత్రజ్ఞవివేకము నెఱింగినవానికి సర్వానర్థములును నివర్తిల్లి పరమపురుషార్థము సిద్ధించు నని సిద్ధము.

శ్రీ. అధ్యాయార్థము నుపసంహరించుచున్నారు:— ఏవమ్ = చెప్పిన విధమున; క్షేత్రక్షేత్రజ్ఞయోః; అన్తరమ్ = భేదమును; వివేకజ్ఞానం బనుచక్షువు చేత; యే; విదుః. మఱియును, భూతముల ప్రకృతి చెప్పఁబడినది, దాననుండి మోక్షమును — మోక్షోపాయమును గూడ ధ్యానాదికమును; యే; విదుః. తే, పరమ్, యాన్తి = వారు పరమపదమును బొందుచున్నారు.

ప్రకృతిపురుషుల మిశ్రితుల స్పష్టముగను
దగ వివేచించి తెలిపె నేతండు కరుణ
నందనందనునిఁ బరమానందఘనుని
నీశ్వరుని వాని బ్రమొక్కెద నెలమి మనసు,

పి. *

ఇది యధ్యాయతాత్పర్యము.— క్షేత్రక్షేత్రజ్ఞయోగాధ్యాయము నందుఁ బ్రకృతిపురుషులయంతరము తెలుపుటకై తత్త్వములు చెప్పఁబడినవి. అందు మొదటిది యగుప్రకృతి గుణవికారరూపంబును గర్తృత్వకార్యత్వములకు హేతువు

* టీక శ్రీధరీయముతో సమానము.

నగును. ఆత్మ సుఖదుఃఖములభోక్తృత్వమునందు హేతు వగును. సూర్యునివలె సర్వక్షేత్రములయందును క్షేత్రజ్ఞుఁ డొక్కఁడే. ఇట్లు పదుమూఁడవయధ్యాయము నందుఁ బురుషప్రకృతులవిచారము చేయఁబడినది.

**రా.** ఏవమ్ = చెప్పినప్రకారంబున; క్షేత్రక్షేత్రజ్ఞయోః; అన్తరమ్ = విశేషమును; వివేకవిషయజ్ఞానం బనుచక్షుస్సుచేత; యే; విదుః; భూతప్రకృతి మోక్షంచ = భూతప్రకృతిమోక్షమునుగూడ. తే; పరమ్; యాన్తి = ముక్తిబాధుం డగునాత్మను బొందుచున్నారు. విడిపింపఁబడుచున్నాఁ డను దీనిచేతి అను వ్యుత్పత్తిచే మోక్ష మనఁగా అమానిత్వాదిసాధనం బని యర్థము. క్షేత్రక్షేత్రజ్ఞులవివేకమును గుఱించి చెప్పఁబడినజ్ఞానముచేతఁ దద్వివేకము నెఱింగి భూతాకారంబునఁ బరిణమించినప్రకృతివలన మోక్షమునకు నుపాయ మగు అమానిత్వాదికముం దెలిసి యెవ రాచరించుచున్నారో, వారు ముక్తిబంధులై స్వరూపంబున అవస్థితుండును అనవచ్ఛిన్నజ్ఞానస్వభావుండు నగు ఆత్మను బొందుచున్నా రని యర్థము.

**మా.** భూతప్రకృతిమోక్షమ్ = భూతములనుండియు ప్రకృతినుండియు మోక్షమునకు సాధనం బగు అమానిత్వాదికమును.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే ప్రకృతిపురుషవివేకయోగో నామ త్రయోదశోఽధ్యాయః.

వ్యాసప్రోక్త మయిన శతసహస్రగ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రంబును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందుఁ బ్రకృతి పురుషవివేకయోగం బనంబరఁగు త్రయోదశాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమత్కవాటోపనామ శ్రీరామవిద్వత్సుతతనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవద్గీ
తాంధ్ర వ్యాఖ్యానంబునందుఁ
త్రయోదశాధ్యాయటీక.

ఏతత్త్రయోదశక మివ కృత్స్న గీతార్థవివృతి రఖిలేయమ్
పరిపూర్తి మియా దచిరాత్ శ్రీమద్భగవత్ప్రసాదేన
ఘటయతు భాగవతీ మే దుర్ఘటఘటనాపటీయసీ కరుణా
సాధనవికలస్యాఽపి చ గీతాపరమార్థచన్ద్రికాపూర్తిమ్.



శ్రీరస్తు.

శ్రీ గణేశ శారదా గురుభ్యో నమః.

పరమార్థచంద్రికాసహిత

# శ్రీ భగవద్గీత, చతుర్దశాధ్యాయము.

వన్దే తం తులసీకాననస్థ మమ్బికాప్రియనన్దనమ్
స్మరణాత్కరుణామ్భోధి రన్తరాయా న్నిహన్తి యః.
స్వస్యైవ సమస్తజగత్కారణతాఖ్యాపనాయ కృపయా యో వే
క్షేత్రజ్ఞాఽభేదం యస్తం వన్దే కృష్ణ మాత్మానమ్.
క్షేత్రజ్ఞేశ్వరభేదభ్రమమూలం భవ మశేషదోషయుతమ్
ఆబాధతే స్వయం యా తాం విద్యా మమ్బికాం వన్దే.

శ్రీభగవానువాచ.—

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్।
యజ్జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధి మితో గతాః.

శ్రీశంకరభాష్యము.—

పుట్టునది యంతయును క్షేత్రక్షేత్రజ్ఞసంయోగమువలనఁ బుట్టుచున్నది యని చెప్పఁబడినది. అది యెట్లనఁగా దానిఁ బ్రదర్శించుటకై పరం భూయ ఇత్యాదిక మగు నీయధ్యాయ మారంభింపఁబడుచున్నది. లేక. ఈశ్వరాధీను లైన క్షేత్రక్షేత్రజ్ఞులకే జగత్కారణత్వముగాని సాంఖ్యులు చెప్పునట్లు క్షేత్రక్షేత్రజ్ఞులకు స్వతంత్రతచేత జగత్కారణత్వము కా దని తెలుపుటకై యేతదధ్యాయారంభము. అందు, ప్రకృతిస్థత్వమును గుణములయందు సంగమును సంసారకారణ మని యుపదేశింపఁబడినది. ఏగుణమునం దెట్లు సంగము? గుణము లేవి? ఆగుణము లెట్లు బంధించును? ఆగుణములవలననుండి మోక్షణం బెట్లు కలుగును? ముక్తునిలక్షణం బెట్టిది? ఈవిషయముల నీయధ్యాయము ప్రతిపాదించుచున్నది.—పరమ్ — ఇది వ్యవహిత మైనజ్ఞానమునకు విశేషణము.

భూయః = పూర్వాధ్యాయములయందుఁ బలుమాఱు చెప్పినప్పటికిని వెండియు; ప్రవక్ష్యామి=చెప్పెదను. అది, పరమ్ = ఉత్కృష్టము, ఉత్కృష్టవిషయ మగుటవలన. అది యేది? జ్ఞానమ్ = జ్ఞానము; జ్ఞానానాం = సమస్తజ్ఞానములలోపల; ఉత్తమమ్ = శ్రేష్ఠము, ఉత్తమ మైన ఫలము గలది యగుటవలన. జ్ఞానములలోపల ననఁగా అమానిత్వాదులలోపల నని కాదు. మఱే మనఁగా, యజ్ఞాదివిషయము లగు జ్ఞానములలోపల నని తెలియవలయును. అవి మోక్షార్థములు కావు, ఇదియో మోక్షార్థమని పరశబ్దముచేతను ఉత్తమశబ్దముచేతను స్తుతించుచున్నాఁడు శ్రోతృ బుద్ధికి రుచిఁ బుట్టించుటకై. యత్ =ఏజ్ఞానమును; జ్ఞాత్వా— పొంది; మునయః = సన్న్యాసులు, మననశీలురు; సర్వే = అందఱును; పరామ్ = ఉత్తమమైన; సిద్ధిం = మోక్ష మనుసిద్ధిని; ఇతః = ఈ దేహబాధమునుండి; గతాః = పొందినారో. అట్టి జ్ఞానమును చెప్పెద నని సంబంధము.

ఏజ్ఞానమును పొంది సన్న్యాసు లందఱును ఈ సంసారబంధమునుండి మోక్షమును జెందిరో అట్టి పరమాత్మవిషయమును సర్వజ్ఞానములలో నుత్తమము నగు జ్ఞానమును నే నీకిదివఱకుఁ జెప్పియున్నను వెండియుఁ జెప్పుచున్నా నని తాత్పర్యము.

ఆనందగిరి టీక.—

క్షేత్రక్షేత్రజ్ఞసంయోగము సమస్తముయొక్క యుత్పత్తికిని నిమిత్తమను విషయమును దెలియనిదానిఁ దేటపఱచుటకై మీఁది యధ్యాయమును దించుచు మీఁదియధ్యాయమునకును గతాధ్యాయమునకును ఉత్థాప్యోత్థాపకత్వ * రూపసంగతిని జెప్పుచున్నారు పుట్టునది యంతయు నిత్యాదిగా. పక్షాంతరముచేత నధ్యాయారంభమును సూచించుచున్నారు లేక అని. దానినే చెప్పుటకై చెప్పినదాని ననువదించుచున్నారు ఈశ్వరేత్యాదిగా. ప్రకృతిస్థత్వమును — పురుషునకుఁ బ్రకృతితో నైక్యాధ్యాసమును. వానికే, గుణములయందు — శబ్దాదులయందు, సంగమును—అభినివేశమును. షడ్విధ మైనయాకాంక్షను నిరూపించి దాని కుత్తరముగా నధ్యాయారంభ మని దెలిపి మున్ను చెప్పినట్లే

* ఉత్థాపకము — లేవనెత్తునది, ఆకాంక్ష గలిగించునది యనుట. ఉత్థాప్యము — లేవనెత్తఁదగినది, ఆయాకాంక్షను బూరించునది యనుట.

పూర్వాధ్యాయముతో సంబంధము సిద్ధించుచున్న దని చెప్పుచున్నారు ఏగుణ
మునందు నిత్యాదిగా. పరమ్మనుశబ్దము భవిష్యత్కాలార్థము కాదని తెలుపుట
కై యన్వయమును జెప్పుచున్నారు పరమ్ ఇత్యాదిగా. భూయశ్శబ్దమిట నధ
కార్థకము గా దని చెప్పుచున్నారు పూర్వేత్యాదిగా. పునరుక్తి యని యాశం
కించి సూక్ష్మ మగుటచే సులభముగాఁ దెలియుట యశక్య మగుటవలన వెండి
యుఁ జెప్పుట వ్యర్థము గా దని చెప్పుచున్నారు అది ఇత్యాదిగా. విశేష్యమున
ప్రశ్న ద్వారమున నిర్దేశించుచున్నారు అది యేది యని. నిర్ధారణార్థక మగు షష్ఠిని
గ్రహించి దానియుత్కర్షమును జూపుచున్నారు సమస్తజ్ఞానములలోపల అని. పరమ్
ఉత్తమమ్ అని పునరుక్తి నాశంకించి విషయఫలభేదమువలన నది లే దని చెప్పు
చున్నారు ఉత్తమము ఇత్యాదిగా. జ్ఞానం జ్ఞేయ మిత్యాదిస్థలమునందు జ్ఞానము
అమానిత్వాదికి మని ప్రతిపాదించి వానిలో జ్ఞానము సాధ్యముగాఁ జెప్పఁబడినది.
కావున నాయమానిత్వాదికములలో నుత్తమం బిది యనుట తగి దని చెప్పుచున్నారు
జ్ఞానములలోపల నిత్యాదిగా. యజ్ఞాదివిషయజ్ఞానములకన్నను ఆజ్ఞాన మెందువలన
నుత్తమము అనఁగాఁ జెప్పుచున్నారు అపి ఇత్యాదిగా. స్తుతిఫలమును చెప్పుచున్నారు
శ్రోతృబుద్ధికి ఇత్యాదిగా. జ్ఞానం జ్ఞాత్వా అనగా జ్ఞానము జ్ఞేయ మని యేర్పడుట
వలన అనవస్థ యగు నని యాశంకించి చెప్పుచున్నారు పొంది అని. మునిశబ్దము
చతుర్థాశ్రమవాచక మను నెడ చతుర్థాశ్రమమాత్రముచేత జ్ఞానము సంభవింపదు
కావున వారి కెట్లు ముక్తి కలుగు ననఁగాఁ జెప్పుచున్నారు మననశీలురు అని. పరా
మ్మను విశేషణమువలన సిద్ధిశబ్దమునకు జ్ఞానార్థమును నివారించి ముక్తి యర్థ మని
చెప్పుచున్నారు మోక్షము ఇత్యాదిగా. దేహాఖ్య మగుబంధము ప్రత్యేక మని
చెప్పుచున్నారు ఈదేహబంధమునుండి అని.

హనుమద్వ్యాఖ్యానము.— *.

శంకరానందీయము.—

పూర్వాధ్యాయమునందు ఆత్మానాత్మతత్త్వమును దెలియఁ గోరునట్టి ము
ముక్షువునకు క్షేత్రాఖ్య మగు నీశరీర మనాత్మ యనియు క్షేత్రజ్ఞుఁడే అహం పదార్థ
మగు నాత్మ యనియు బోధించి క్షేత్రమునుండి విభక్తుఁడైనయాత్మకు "క్షేత్రజ్ఞం
చాపి మాం విద్ధి" అని బ్రహ్మాభిన్నత్వము ప్రతిపాదించి ప్రకృతికే కర్తృత్వ భోక్తృ
త్వము లనియు ప్రకృతి తత్కార్యసాక్షియైన యాత్మకు గుణసంగమువలననే సంసా

* శంకరభాష్యముతో సమానము.

రము గాని వాస్తవమున లే దనియుఁ జెప్పఁబడినది. అందు **ఆ**గుణము లేవి? వాని యందుఁ **బురుషున** కెట్లు సంగము? ఆగుణములు పురుషు నెట్లు బంధించును? ఆగుణములనుండి యెట్లు విముక్తి? గుణముక్తునిలక్షణ మెట్టిది? అని యడుగఁగా ప్రకృతియొక్క ప్రవృత్తిసామర్థ్యంబును తద్గుణవిభాగంబును గుణములస్వరూపం బును కార్యంబును బంధకశక్తియును అవి యొకటొకటి హెచ్చినపుడు ఒండొంటి నభి భవించుటయును తత్ఫలభేదమును గుణబద్ధునికి ఫలమును గుణముక్తునిఫలమును గుణ ముక్తునిలక్షణమును గుణమోక్షోపాయంబును ఈ సమస్తంబును వివరించి "కారణం గుణసఙ్గో ఽస్య" అను వాక్యముయొక్కయర్థమును స్పష్టీకరించుటకై చతుర్దశాధ్యాయ మారంభింపఁబడుచున్నది. అందు మొదట క్షేత్రక్షేత్రజ్ఞులు పర స్పరభిన్ను లనియు క్షేత్రజ్ఞుం డగు తాను బ్రహ్మముకంటె భిన్నుఁడు కాఁ డనియు నెఱింగినట్టి బ్రహ్మవిదుం డగుయతికి విదేహమోక్షానికి లబ్ధజ్ఞానరక్షణముకొఱకు చెప్పఁబోవు జ్ఞానకార్యమునందే ప్రవృత్తి సిద్ధించుటకై గుణములను తత్కార్యము లను తెలియుట ముక్తికి ముఖ్యసాధన మని బోధించుటకు శ్రీభగవంతుఁ డిట్లనియె.— "త్రిభి ర్గుణ మయై ర్భావైః" "ఇచ్ఛాద్వేషసముత్థేన" "రాక్షసీ మాసురీం చైవ" ఇత్యాదిగాఁ బెక్కుమార్లు మున్ను చెప్పఁబడి యున్నను, భూయః=మరల, చక్కఁగాఁ తెలియుటకొఱకు; జ్ఞానమ్ = గుణములయు తత్కార్యములయు జ్ఞానమును; జ్ఞానా నాం = సాంఖ్యయోగకర్మజ్ఞానములలోపల; పరమ్=శ్రేష్ఠ మైనదానిని; పరం బను టకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—ఉత్తమమ్=ఉత్తమ మగు పరమపురుషార్థమునకు మోక్షమునకు కారణ మగుటవలన ఉత్తమ మైనదానిని; ఇట్టి జ్ఞానమును; ప్రవ క్ష్యామి = నాభక్తుఁడవు ముముక్షుఁడ వగు నీకుఁ జక్కఁగా నుపదేశించెదను. లేక. "క్షేత్రం బనాత్మ, క్షేత్రజ్ఞఁ డాత్మ, బ్రహ్మము సత్యాదిలక్షణము, బ్రహ్మమే క్షేత్ర జ్ఞుఁడు" ఇట్టి మోక్షవిషయము లగు జ్ఞానము లేవి గలవో ఆజ్ఞానములలోపల ఈగుణ తత్కార్యజ్ఞానము శ్రేష్ఠమును ఉత్తమమును అగుచున్నది. ఆత్మానాత్మవివేకజ్ఞానం బును ఆత్మ బ్రహ్మాభిన్నుఁ డనుజ్ఞానంబును ప్రకృతిప్రవిలాపనజ్ఞానంబును ఇవియే ముక్తికి నియమమున నసాధారణకారణ మగు ననుట వాస్తవమే, అయినను అవిద్యా కామాదిదోషవంతున కాజ్ఞానము అవిద్యాదులచేఁ బ్రతిబద్ధ మగుచున్నది, స్వఫలము నియదు. అది భరతాదులయందుఁ బ్రసిద్ధము. ఈగుణతత్కార్యజ్ఞానమో బ్రహ్మ విదుని గుణవాసనచేఁ గలుగు బాహ్యప్రవృత్తినుండి విముఖునిఁ గావించి జ్ఞానమును తత్ఫలమును బ్రతిబద్ధములు గానియట్లు సమ్యగ్దర్శననిష్ఠయందే నిలిపి గుణములనుండి

ముక్తుని గావించి విదేహముక్తిని బొందించుచున్నది. అందువలన నిజ్ఞానం బాత్మా నాత్మవివేకాదిజ్ఞానములకన్న నుత్తమము. ఎట్లు రోగజ్ఞానముకన్నను ఔషధజ్ఞానము కన్నను అనుపానజ్ఞానముకన్నను పథ్యజ్ఞానముకన్నను "ఈపదార్థం బపథ్యము దీని భక్షించుట ఔషధంబునకును ఆరోగ్యంబునకును ప్రతిబంధకము" అనుజ్ఞానము అప థ్యాచరణనివృత్తికిని ఆరోగ్యసిద్ధికిని గారణమై యుత్తమ మగుచున్నదో, అపథ్యా భావమువలననే ఔషధంబును ఆరోగ్యసిద్ధియును బలవత్తరంబు లగుటవలన, అట్లు జ్ఞానమునకును తత్ఫలమునకును ప్రతిబంధకము లగు గుణములయు తత్కార్యము లయు జ్ఞానము పూర్వోక్తజ్ఞానములకంటె నుత్తమ మగుచున్నది గుణతత్కార్యసం బాధాభావమువలననే జ్ఞానమును దత్ఫలసిద్ధియును బలవత్తరము లగుటవలన. అగు వలన గుణతత్కార్యజ్ఞానము జ్ఞానములలో నుత్తమ మనుట యుక్తము. దానినే స్పష్టీకరించుచున్నాఁడు.— శ్రవణాదిజన్యజ్ఞానరక్షణమునకు సాధన మగుటచేతను గుణవిమోక్షమునకు హేతు వగుటచేతను ముక్తికి బరమకారణ మైన, యత్ = ఏగుణతత్కార్యజ్ఞానమును; జ్ఞాత్వా — పొంది, దానిచే నది చేయవలయునో దాని ననుష్ఠించి యని యర్థము; మునయః = బ్రహ్మవిదు లగు శుకాదియతులు; ఇతః = ఈ గుణత్రితయమునుండి; ముక్తులై, పరామ్ = పునరావృత్తిలేని దగుటచేతను నిత్యనిరతిశయానందరూప మగుటచేతను సమస్తసిద్ధులకన్నను ఉత్తమ మైన; సిద్ధిమ్ = విదేహముక్తిని; గతాః — పొందిరో, పరిపూర్ణులైరో యని యర్థము.

మధుసూదనసరస్వతీ టీక.—

పూర్వాధ్యాయమునందు "యావత్సంజాయతే కించి త్సత్త్వం స్థావర జఙ్గమమ్। క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్తద్విద్ధి" అని చెప్పఁబడినది. అందు నిరీశ్వర సాంఖ్యమతము నిరాకరించి క్షేత్రక్షేత్రజ్ఞసంయోగ మీశ్వరాధీన మని చెప్పవల యును. అట్లు, "కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు" అని చెప్పఁబడినది. అందు ఏగుణములం దెట్టి సంగము? ఏవి గుణములు? అవి యెట్లు బంధించును? అను నీవిషయము వివరింపవలయును. మఱియు, "భూతప్రకృతిమోక్షంచ యే విదు ర్యాన్తితే పరమ్" అని చెప్పఁబడినది. అందు భూతప్రకృతిశబ్దవాచ్యము లగుగుణ ములవలన నెట్లు మోక్షణం బగును? ముక్తునిలక్షణ మెట్టిది? అను నీవిషయము గూడఁ బ్రతిపాదింపవలయును. ఈ విషయ మంతయు విస్తరించి చెప్పుటకై చతుర్ద శాధ్యాయము ప్రారంభింపఁబడుచున్నది. అందు చెప్పఁబోవునర్థమును రెండుశ్లోక ములచే స్తుతించువాఁడై శ్రోతలకు రుచిఁ బుట్టించుటకై శ్రీభగవంతుఁ డిట్లనియె.—

జ్ఞానమ్ = ఎఱుంగఁబడుచున్నది దీనిచేత నని జ్ఞాన మనఁగా పరమాత్మజ్ఞానసాధనము, దానిని; పరమ్ = శ్రేష్ఠమును, భగవస్తువిషయం బగుటవలన. అది యెట్టి దనఁగా, జ్ఞానానామ్ = బహిరంగజ్ఞానసాధనము లైన యజ్ఞాదులలోపల; ఉత్తమమ్, ఉత్తమఫల మగుటవలన; అమానిత్వాదులలోపలఁ గాదు, అవి యంతరంగము లగుటచే నుత్తమఫలము లగుటవలన. పర మ్మనుటచే నుత్కృష్టవిషయత్వము చెప్పఁబడినది, ఉత్తమ మ్మనుటచే నుత్తమఫలత్వ మని భేదము. ఇట్టి జ్ఞానమును నేను, ప్రవక్ష్యామి = చెప్పెదను; భూయః = మరల, పూర్వాధ్యాయములయందుఁ బెక్కుమార్లు చెప్పియున్నను. యత్ = ఏజ్ఞానమును; జ్ఞాత్వా— అనుష్ఠించి ; మునయః = మననశీలు రగు సన్న్యాసులు ; పరాం సిద్ధిమ్ = ఉత్తమమైనసిద్ధిని, మోక్షమును ; ఇతః = ఈ దేహబంధనమునుండి ; గతాః = పొందిరో.

శ్రీధరీయము.—

ప్రకృతిపురుషులు స్వతంత్రతఁ
బ్రకృతాధ్యాయమున శౌరి వారించి తగఁ
బ్రకటతఁ దెలిపెడు గుణసం
గకృతం బగు భవవిచిత్రగతిఁ బార్థునకున్.

“యావ త్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజఙ్గమమ్ । క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్త ద్విద్ధి భరతర్షభ” అని చెప్పఁబడినది. ఆక్షేత్రక్షేత్రజ్ఞసంయోగము నిరీశ్వరసాంఖ్యులకుఁ బోలె స్వతంత్రము కాదు, మ తే మనఁగా ఈశ్వరేచ్ఛచేతనే యని ప్రతిపాదించుచు, “కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు” అనువచనముచేఁ జెప్పఁబడిన సత్త్వాదిగుణజన్య మగు సంసారవైచిత్ర్యమును బ్రపంచించువాఁడై తా నుపదేశింపఁబోవు నర్థమును స్తుతించుచున్నాఁడు శ్రీభగవంతుఁడు రెండుశ్లోకములచేత.—పరమ్ = పరమాత్మవిషయ మగు; జ్ఞానమ్ = ఎఱుంగఁబడుచున్నది దీనిచేత అను వ్యుత్పత్తిచేత జ్ఞాన మనఁగా ఉపదేశమును ; వెండియును నీకుఁ బక్కగాఁ జెప్పుచున్నాను. ఎట్టిదానిని ? జ్ఞానానామ్ = తపః కర్మాదివిషయములగు జ్ఞానములలోపల ; ఉత్తమమ్, మోక్షహేతు వగుటవలన. దానినే చెప్పుచున్నాఁడు.— యత్ ; జ్ఞాత్వా — పొంది; మునయః = మననశీలురు; సర్వే = అందఱును; ఇతః = ఈ దేహబంధనమునుండి; పరాంసిద్ధిమ్ = మోక్షమును; గతాః = పొందినారో.

పరమార్థప్రప.—

పూర్వాధ్యాయమునందు "మహాభూతా న్యహంకారః" ఇత్యాదివాక్యములచే క్షేత్రస్వరూపమే చెప్పఁబడినది గాని తదుత్పత్తి చెప్పఁబడినది కాదు. అట్లు క్షేత్రము వికార మనుటమాత్రమే ప్రదర్శింపఁబడినది గాని దానివైచిత్ర్యమునకుఁ గారణము ప్రతిపాదింప లేదు. మఱియు క్షేత్రజ్ఞుల సూక్ష్మవ్యష్టిరూపము నిరూపింపఁబడినది గాని తత్సమష్టిస్వరూపము నిరూపింప లేదు. అందువలన అది యంతయుఁ జతుర్దశాధ్యాయమున వివరించుటకై శ్రీభగవంతుఁ డుపక్రమించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.— పరమ్ = పరమార్థసాధక మగు; జ్ఞానమ్=ఎఱుఁగఁబడుచున్నది కావున ఉపదేశమును; పూర్వము సూత్రప్రాయముగాఁ జెప్పి యున్నను, భూయః ప్రవక్ష్యామి. ఏతజ్జ్ఞానమును; జ్ఞానానామ్=తపఃకర్మాదివిషయజ్ఞానములలోపల; ఉత్తమమ్, మోక్షహేతు వగుటవలన. దానినే చెప్పుచున్నాఁడు.—యత్ జ్ఞాత్వా; సర్వే, మునయః=మననశీలు రగు యాజ్ఞవల్క్యవామదేవాదులు; పరామ్= ఆత్యంతిక మైన; సిద్ధిమ్; గతాః.

రామానుజభాష్యము.—

త్రయోదశాధ్యాయమునందుఁ బరస్పరసంసృష్టు లగు ప్రకృతిపురుషుల స్వరూపతత్త్వము నెఱింగి భగవద్భక్త్యనుగృహీతము లగు నమానిత్వాదులచేత బంధవిముక్తి నొందుచున్నాఁ డని చెప్పఁబడినది. అందు బంధహేతువు పూర్వపూర్వము లైనసత్త్వాదిగుణములచేఁ గలుగుసుఖాదులయందు సంగ మని ప్రతిపాదింపఁబడినది "కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు" అని. ఇఁక నిప్పుడు గుణములు బంధహేతువు లగు విధంబును గుణనివర్తనప్రకారంబును జెప్పఁబడుచున్నది.—పరమ్ = ముందు చెప్పినదానికన్న నితర మైన దానిని ప్రకృతిపురుషాంతర్గతమునే సత్త్వాదిగుణవిషయ మగు; జ్ఞానమ్, భూయః ప్రవక్ష్యామి. ఆజ్ఞానము సమస్తము లైనప్రకృతిపురుషవిషయజ్ఞానములలోపల నుత్తమము. యత్ = ఏజ్ఞానమును; జ్ఞాత్వా; సర్వే; మునయః — దానిని మననము చేయుచున్నవార లై; ఇతః = ఈ సంసారమండలమునుండి; పరాం సిద్ధిం గతాః = పరిశుద్ధాత్మస్వరూపప్రాప్తిరూప మైనసిద్ధిని పొందిరి.

మాధ్వభాష్యము.—

సాధనకర మగు జ్ఞానము నిచ్చునట్టి భగవంతునకు నమస్కారము. సాధనమును ప్రాధాన్యమున నుత్తరాధ్యాయములచేఁ జెప్పుచున్నాఁడు.

ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః
సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ.

**భా.** ఈ సిద్ధి నియతం బని తెలుపుచున్నారు.—ఇదమ్ = ఈ చెప్పినట్టి; జ్ఞానమ్ = జ్ఞానమును; ఉపాశ్రిత్య = ఆశ్రయించి, జ్ఞానసాధనము ననుష్ఠించి యని యర్థము; మమ = నాయొక్క, పరమేశ్వరునియొక్క; సాధర్మ్యమ్ = మత్స్వరూపతను; ఆగతాః = పొందినవారు; సాధర్మ్య మనఁగా సమానధర్మత యని కాదు, గీతాశాస్త్రమునందు క్షేత్రజ్ఞేశ్వరులకు భేదము నంగీకరింపమినలన; ఈ ఫలప్రతిపాదనంబును స్తుత్యర్థమై యున్నది; సర్గేఽపి = సృష్టికాలమునందును; నోపజాయన్తే = జన్మము నొందరు. ప్రలయే = బ్రహ్మదేవునకు నశించునప్పుడును; న వ్యథన్తి చ = వ్యథను బొందరు, చ్యుతి నొందరని యర్థము.

ఈ జ్ఞానమును యథోక్తసాధనానుష్ఠానముచే సంపాదించి నా యైక్యము నొందినవారు సృష్టియందు జనియింపరు. ప్రలయమునందు నాశమును బొందరని తాత్పర్యము.

**ఆ.** జ్ఞానఫలము కర్మఫలముకన్న విలక్షణం బని చెప్పుచున్నారు ఈ సిద్ధి ఇత్యాదిగా. జ్ఞానము నాశ్రయించుట యెట్లనఁగా దత్సాధనసామగ్రి సంపాదన ద్వారంబున నని చెప్పుచున్నారు జ్ఞా నేత్యాదిగా. సాధర్మ్యము నన్ను యెడ గోగన యములకుంబోలె విద్వదీశ్వరులకును భేద మగు నని యాశంకించి చెప్పుచున్నారు మత్స్వరూపతి నని. సాధర్మ్యము ముఖ్య మనుపక్షమున భేదము నిశ్చిత మగుట వలన గీతాశాస్త్రవిరోధ మగు నని చెప్పుచున్నారు సమా నేత్యాదిగా. జ్ఞానము స్తుతించుకొఱకుఁ దత్ఫలము వివక్షిత మగుటవలన ఇట సారూప్యము సమ్మతము కా దని చెప్పుచున్నారు ఈ ఫలప్రతిపాదనంబును ఇత్యాదిగా. సారూప్య మని చెప్పు పక్షమున ప్రస్తుత మగు జ్ఞానఫలమును విడచి యప్రస్తుత మగు ధ్యానఫలము చెప్పిన ట్లగు నని యర్థము. ఈశ్వరాత్మతను బొందినవారికిఁ గూడ అవాంతరసృష్టిప్రలయ ములందు జన్మనాశములు లేకున్నను మహాసృష్టిప్రలయములం దవి కలుగవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు సర్గేపి ఇత్యాదిగా.

**హ.** మమ—ఈశ్వరునియొక్క; సాధర్మ్యమ్ = సధర్మతను. నవ్యథన్తి = చలింపరు.

క్రియకవిషయం బగుటవలన వారి కించుకైనను చలనము లేదని యర్థము. ఓయీ ! బ్రహ్మభావమును బొందిన ముక్తులైన బ్రహ్మాదులకు "సర్గేపి నోపజాయన్తే ప్రలయేన వ్యథన్తిచ" అనునది అప్రాప్త ప్రతిషేధ మందువేని, అట్లు శంకింప వలదు, శివ విష్ణ్వాదిలోకములందు సారూప్యముక్తిని బొందినవారలకు మహాసృష్టియం దుత్పత్తియును మహాప్రళయమునందు ప్రళయమును సంభవించుచున్నవి, అట్లు బ్రహ్మభావమును జెందినవారలకుం గూడ జన్మాదికము కలుగునేమో యని శంకితులను సంశయింతురు, దాని నివర్తించుటకును ముముక్షువులకు నిస్సంశయముగా విదేహముక్తియందు బ్రహ్మప్రాప్తి కలుగుటకును ఇది చెప్పఁబడుచున్నది "సర్గేపి నోపజాయన్తే ప్రళయే నవ్యథన్తిచ" అని. బ్రహ్మాదులు కానివారు ముక్తులైనను వారికి జన్మాదికము కలుగు ననుటకు ఈవచనమే ప్రమాణము, సీతాహనుమజ్జయవిజయాదిచరిత్రములును ప్రమాణములు.

మ. ఈ విద్య యైకాంతికఫలముగలదని ప్రదర్శించుచున్నారు.—ఇదమ్=యథోక్తమైన; జ్ఞానమ్ — జ్ఞానసాధనమును; ఉపాశ్రిత్య = అనుష్ఠించి; మమ—పరమేశ్వరుని యొక్క; సాధర్మ్యమ్—మద్రూపతను; ఆగతాః — మిక్కిలి అభేదంబునం బొందిన వారలై; సర్గేపి—హిరణ్యగర్భాదులు పుట్టినపుడును; నోపజాయన్తే. ప్రలయే = బ్రహ్మదేవుని వినాశకాలమునందుఁగూడ; నవ్యథన్తిచ = లయమునుం బొందరు.

శ్రీ. మఱియును.—ఇదమ్ — ఈ చెప్పఁబోవుచున్న; జ్ఞానముపాశ్రిత్య = జ్ఞానసాధన మనుష్ఠించి; మమసాధర్మ్యమ్ = మద్రూపతను; ఆగతాః = పొందిన వారలై; సర్గేపి బ్రహ్మాదులసృష్టికాలమందును; జన్మము నొందరు. అట్లు, ప్రలయేపి; నవ్యథన్తిచ=ప్రలయదుఃఖముల ననుభవింపరు, పునరావృత్తి నొంద రని యర్థము.

ప. *

రా. పిమ్మట జ్ఞానము ఫలసహితముగాఁ బ్రతిపాదించుచున్నాఁడు.—ఇదమ్—వక్ష్యమాణ మగు; జ్ఞానమ్; ఉపాశ్రిత్య; మమసాధర్మ్యమాగతాః=నాసామ్యమును బొందినవారలై; సర్గేపి నోపజాయన్తే — సృష్టికిఁ గమ్యము కారు. ప్రలయే నవ్యథన్తిచ — సంహారమునకును గమ్యము కారు.

మా. ♦

---

* శ్రీధరీయముతో సమానము.

♦ ఈ శ్లోకమున కీభాష్యము లేదు.

చున్నారు సర్వభూతములకని. ప్రకృతికి మహత్త్వము సాధించుచున్నారు సర్వ కార్యములకన్నను ఇత్యాదిగా. సర్వకార్యవ్యాప్తి మగుటచే యోనియే బ్రహ్మము, గుణవైషమ్యమువలన మహద్బ్రహ్మశబ్దవాచ్యము భిన్నమని యాశంకించి చెప్పుచున్నారు యోనిర్మ ఇత్యాదిగా. ఇట్టి క్షేత్రక్షేత్రజ్ఞసంయోగము భూతకారణ మని చెప్ప నారంభించిన దేనివిషయము చెప్పఁబడిన దని యాశంకించి చెప్పుచున్నారు క్షేత్రేత్యాదిగా. గర్భశబ్దముచేత చెప్పఁబడినసంయోగముయొక్కఫలమును బ్రదర్శించుచున్నారు సర్వభూతానామ్ ఇత్యాదిగా. "ఆదికర్తా స భూతానామ్" అను స్మృతిచేత భూతములు హిరణ్యగర్భకార్యము లని చెప్పఁబడుచుండఁగా అవి ఈ చెప్పిన గర్భాధానముయొక్క కార్యము లని యెట్లు చెప్పవచ్చును? అని యాశంకించి చెప్పుచున్నారు సర్వయోని ష్విత్యాదిగా.

హా. *

తే౦. స్థూలసూక్ష్మకార్యజ్ఞానము ఉత్పన్నమగుచుండఁగా సత్త్వాదిగుణాతిక్రమము పాయమగుటచేతను విదహాముక్తికి ముఖ్యకారణం బని ప్రతిపాదించి ప్రకృతియును తద్గుణములును ఈశ్వరశక్తిసామర్థ్యమువలననే స్వకార్యము నిర్వహింప సమర్థము లగుం గాని స్వతంత్రతచేఁ గావని సూచించుటకై ప్రకృతి ఈశ్వర శక్తిసంబంధము గల్గి సర్వభూతోత్పాదిక మని ప్రతిపాదించుచున్నారు.— మమ - నాయొక్క; ఈశ్వరత్వమున కుపాధిభూతమై మదాత్మిక మైనమాయ గుణత్రయసామ్యావస్థారూప మైనప్రకృతి, యోనిః = సర్వభూతోత్పత్తికారణము; ఏది గలదో అది సర్వకార్యములకన్నను గొప్పది యగుటచేత, మహత్ = మహత్తరియు; స్వకార్యములకు బృంహణ మగుటచేతను బ్రహ్మమున కుపాధి యగుటచేతను, బ్రహ్మ = బ్రహ్మ మనియు; చెప్పఁబడుచున్నది. తస్మిన్ = ఆజగత్కారణ మైనబ్రహ్మమునందు, అవ్యక్తమునందు; సాక్షాత్తుగాను పరంపరగాను కార్యకారణరూపమునఁ బరిణామము నొందుచుండుటకై, అహమ్ - తదవచ్ఛిన్నచైతన్యైకరూపుఁడను ఈశ్వరుఁడను నేను అనంతశక్తిసంపన్నుఁడను; గర్భమ్ = నాయాభాసమును, ప్రకృతితద్గుణములయొక్క వికారముల విజృంభణమునకుఁ గారణ మైనదానిని; దధామి = ఉంచుచున్నాను, నిక్షేపించుచున్నా నని యర్థము. తతః = అట్టి నాయాభాసముయొక్కశక్తివలన, లేక, మదాభాసశక్తిసమన్విత మైన మహద్బ్రహ్మ మగు ప్రకృతివలన; సర్వభూతానామ్ = మహదాదిక్రమంబున నాకాశాదిభూతములకును

* శంకరభాష్యముతో సమానము.

భూతకార్యము లైన చతుర్విధశరీరములకును; సంభవః - ఉత్పత్తి; భవతి — సర్వభూతములు సంభవించుచున్న వని యర్థము.

**మ.** ఇట్లు ప్రశంసచే శ్రోతి నభిముఖుని గావించి పరమేశ్వరాధీను లైన ప్రకృతిపురుషులకే సర్వభూతోత్పత్తిహేతుత్వము గాని సాంఖ్యులు చెప్పునట్లు స్వతంత్రులకుం గాదను వివక్షిత మగునర్థమును రెండుశ్లోకములచేత చెప్పుచున్నాఁడు.—సమస్తకార్యములకిన్నను గొప్పది యగుటవలన కారణము, మహత్; సర్వకార్యములకును వృద్ధిరూప మగుబృంహణము చేయునది యగుటవలన, బ్రహ్మ; అవ్యాకృతము త్రిగుణాత్మికప్రకృతి మాయ యనుపేరు గలది యీ మహద్బ్రహ్మ మని చెప్పఁబడుచున్నది. ఇది, మమ — ఈశ్వరునకు; యోనిః - గర్భాధానస్థానము. తస్మిన్ - ఆ మహద్బ్రహ్మ మనుయోనియందు; గర్భమ్ - సర్వభూతజన్మకారణమును, "బహు స్యాం ప్రజాయేయ" అని చెప్పఁబడిన ఈక్షణరూప మగుసంకల్పమును; అహమ్ - నేను; దధామి ధరించుచున్నాను, ఆసంకల్పమునకు విషయముగాఁ జేయుచున్నా నని యర్థము. ఎట్లు తండ్రియగువాఁ డనుశయవంతుఁ డను * వ్రీహ్యాద్యాహారరూపముగఁ దనయందు లీనుఁడగు పుత్రునిశరీరమునకుఁ గూర్చుటకై యోనియందు రేత స్సేకపూర్వకముగా గర్భాధానముఁ జేయుచున్నాఁడో, ఆగర్భాధానమువలనఁ బుత్రుఁడు శరీరము నొందుచున్నాఁడో, అందుకొఱకు మధ్యమునఁ గలిలాద్యవస్థలు కలుగుచున్నవో; అట్లు ప్రలయమునందు నాయందు లీనుఁడై యవిద్యాకామకర్మానుశయవంతుఁ డనక్షేత్రజ్ఞసముదాయ మగుసు భోగ్య మగు క్షేత్రముతో — కార్యకరణసంఘాతముతోఁ గూర్చుటకై చిదాభాసాఖ్యరేత స్సేకపూర్వకముగా మాయావృత్తిరూప మగు గర్భము నుంచుచున్నాను. తదర్థము మధ్యమున ఆకాశవాయుతేజోజలపృథివ్యాద్యుత్పత్తు లను నవస్థలు కలుగుచున్నవి. తతః-ఆగర్భాధానమువలన; సంభవః - ఉత్పత్తి; సర్వభూతానామ్ హిరణ్యగర్భాదులకు; భవతి. హేభారత! ఈశ్వరుఁడు చేయు గర్భాధానము లేక కా దని యర్థము.

**శ్రీ.** ఇట్లు స్తుతిచే నర్జునుని నభిముఖుఁ గావించి పరమేశ్వరాధీను లగు ప్రకృతిపురుషులు సర్వభూతోత్పత్తికి హేతువులుగాని స్వతంత్రులకు హేతుత్వము లే దను నివక్షితార్థమును జెప్పుచున్నాఁడు.—దేశముచేతను గాలముచేతను అపరిచ్ఛిన్న మగుటవలన, మహత్; స్వకార్యములకు బృంహణము — వృద్ధిహేతు

* అనుశయ మనఁగా లోకాంతరమునందు అనుభూతము కాఁగా శేషించినదై ఇహలోకమందు జన్మమునకు హేతు వైనకర్మము.

హ. సర్వయోనిషు — దేవాదియోనులయందు; మూర్తయః = దేహవిశిష్టము లగుభూతములు. తాసామ్; మహత్ బ్రహ్మ; యోనిః. అహమ్—వాసుదేవుఁడను.

శం. ప్రకృతి తనయనుగ్రహబలంబున సర్వజగత్తును బుట్టించు నని ప్రతిపాదించి యది సర్వభూతములను బుట్టించునది యగుటచే సర్వజగత్తునకును దల్లి యనియు గర్భాధానము చేయువాఁ డగుటచేఁ దాను దండ్రి యనియు సూచించుటకై చెప్పుచున్నాఁడు.—సర్వయోనిషు=దేవమనుష్యతిర్యగాదియోనులయందు; యాః; మూర్తయః = ప్రాణిదేహములు; సంభవన్తి = పుట్టుచున్నవో; తాసామ్ = ఆమూర్తులకు, ప్రాణుల కనుట; మహత్ బ్రహ్మ — పూర్వము చెప్పినప్రకృతి; యోనిః = తల్లి యగుచున్నది. బీజప్రదః = గర్భము నిచ్చునట్టి; అహమ్ = నేను, ఈశ్వరుఁడను; పితా = తండ్రి నగుచున్నాను. ఇందుచేత తల్లి యగు ప్రకృతియొక్కయు తండ్రి యగు నీశ్వరునియొక్కయుఁ బ్రసాదమువలననే మోక్షము గలుగు నని సూచింపఁబడినది, "జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వః," "తస్య దేవ మాత్మబుద్ధి ప్రకాశమ్" అను శ్రుతులవలనను, "బుద్ధిప్రసాదాచ్చ శివప్రసాదా ద్గురుప్రసాదాత్పురుషస్యముక్తిః" అను స్మృతివలనను.

మ. దేవాదిదేహవిశేషములకుఁ గారణాంతరములు సంభవించుచుండఁగా సర్వభూతములకును దానివలననే యుత్పత్తి యని యెట్లు చెప్పవచ్చును? అని యాశంకించి చెప్పుచున్నాఁడు.— దేవపితృమనుష్యపశుమృగాదిసర్వయోనులయందును, యా మూర్తయః = జరాయుజాండజోద్భిజ్జాదిభేదముచేత విలక్షణములై వివిధములైన సన్నివేశములు గల యేదేహములు; సంభవన్తి. హే కౌన్తేయా! తాసామ్ = ఆమూర్తులకు; తత్తత్కారణభావమును పొందిన, మహత్ బ్రహ్మ = ప్రకృతియే; యోనిః = మాతృస్థానీయము. అహమ్ = పరమేశ్వరుఁడను నేను; బీజప్రదః=గర్భాధానము చేయువాఁడనై; పితా = పితృస్థానీయుఁడను. అందుచేతఁ గారణాంతరములన్నియు మహద్బ్రహ్మముయొక్కయవస్థావిశేషములే గావున. "సంభవ స్సర్వభూతానాం తతో భవతి" యనుట యుక్తము.

శ్రీ. నాచే నధిష్ఠితు లైన ప్రకృతిపురుషులవలన భూతోత్పత్తి సృష్ట్యారంభమునందు మాత్రమే కాదు, మఱే మనఁగా ఎల్లప్పుడు నని. చెప్పుచున్నాఁడు.— సర్వయోనిషు = సమస్తము లైన మనుష్యాదియోనులయందు; యామూర్తయః — స్థావరజంగమరూపములు, పుట్టుచున్నవో; ఆమూర్తులకు, మహత్ బ్రహ్మ=ప్రకృతి; యోనిః=మాతృస్థానీయము. నేనో, బీజప్రదః=గర్భాధానాదికము చేయునట్టి; పితా.

ప. * శ్రుతియును. "సహైతావానాస యథా స్త్రీపుమాంసౌ సంపరిష్వక్తౌ సంమీలితౌ స ఇమమేవాత్మానం ద్వేధా పాతయత్ తతః పతిశ్చ పత్నీ చాభవతామ్" ఇత్యాదిగా. దీనికి భాష్యము.—సృష్టిక్రమమునందుఁ బూర్వము ద్వితీయము నిచ్ఛించె నని చెప్పఁబడినది. సః హ—అతఁడు, ఏతావాన్=ఇట్టివాఁడు, ఆస = అయ్యెను. ఎట్టివాఁ డనఁగా, ఒండొరులను కౌఁగిలించుకొన్నవారును కలసి యున్నవారు నగు స్త్రీపురుషులుగా. పిమ్మట సృష్టికొఱకు ఆత్మ మాయాసంవలితుఁ డగు తన్నే, ద్వేధా = రెండువిధములుగా, పాతయత్ = కావించెను. అంత పతియును పత్నియు నాయెను. "మిథునసంభవానాం ప్రజానాం" అని బ్రాహ్మణము గూడ.

రా. కార్యావస్థమైన చిదచిత్ప్రకృతిసంసర్గము కూడ నాచేతనే చేయఁబడినది యని చెప్పుచున్నాఁడు.—సర్వయోనిషు = సమస్తము లైన దేవ గంధర్వ యక్ష రాక్షస మనుష్య పశు మృగ పక్షి సరీసృపాది యోనులయందు; తత్తన్మూర్తయః యాః = ఏవి, సంభవన్తి = పుట్టుచున్నవో; తాసామ్; బ్రహ్మమహత్; యోనిః = కారణము, నాచేతఁ గూర్పఁబడిన చేతనవర్గము గలదియు మహదాదివిశేషాంతము లగు నవస్థలు గలదియు నగు ప్రకృతి కారణము బని యర్థము. అహం బీజప్రదః పితా — ఆయా మూర్తులయందు తత్తత్కర్మానుగుణముగా చేతనవర్గమును కూర్చువాఁ డను నే నని యర్థము.

మూ. †

> సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః
> నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్. ౫

భా. గుణము లేవి? అవి యెట్లు బంధించును; అను నియంశము లను చెప్పుచున్నాఁడు.—సత్త్వమ్ = సత్త్వము; రజః = రజస్సు; తమః = తమస్సు; ఇతి = అను పేరులు గల; గుణాః — ఇది పారిభాషికమైనశబ్దము, ఇవి రూపాదులవలె ద్రవ్యాశ్రితములు కావు, మఱియు గుణగుణులకు భేద మిట వివక్షితము కాదు, అందువలన గుణములవలె నిత్యపరతంత్రములు క్షేత్రజ్ఞునకు, అవిద్యాత్మకము లగుటవలన; క్షేత్ర

---

* వ్యాఖ్యానము శ్రీధరీయముతో సమానము.

† దీనికి భాష్యము లేదు.

జ్ఞుని, నిబధ్నన్తి = బంధించుచున్నట్లున్నవి *. వాని నాశ్రయముగాఁ జేసి కొని స్వరూపమును బొందుచున్నవి కావున నిబధ్నన్తి అని చెప్పఁబడి నది. అవి, ప్రకృతిసంభవాః = భగవన్మాయవలనఁ కారణముగాఁ గలవి. మహాబాహో = గొప్పవై – మిక్కిలి సమర్థములై మోఁకాళ్లవఱకు వ్రేలుచున్న చేతులు గలవాఁడా! దేహే = శరీరమునందు; దేహినమ్ = దేహము గలవానిని; అవ్యయమ్ = వ్యయము లేనివానిని; అనాదిత్వా దిత్యాది శ్లోకమునందు అవ్యయత్వము చెప్పఁబడినది; ఈ దేహిని ఆగుణములు బంధించుచున్న వని సంబంధము. ఓ యీ! దేహి లిప్తుఁడు కాఁడని చెప్పఁబడినది, ఇక్కడ నిబధ్నన్తి అని వేఱు విధముగా నెట్లు చెప్పవచ్చును? అందువేని, ఈ యాశంకను ఇవశబ్దముచేఁ బరిహరించియున్నాము బంధించుచున్నట్లున్నవి యని.

మహాబాహుఁడా! సత్త్వరజస్తమము లనుగుణములు ప్రకృతివలనఁ బుట్టుచున్నవి, అవి గుణములవలె క్షేత్రజ్ఞు నాశ్రయించినవై తాను వాస్తవమున వ్యయరహితుఁడై దేహమునందు "ఇది నేను, ఇది నాది" అను నధ్యాసము గల క్షేత్రజ్ఞుని బంధించునట్లు కనఁబడుచున్నవి అని తాత్పర్యము.

ఆ. ఇట్లు క్షేత్రక్షేత్రజ్ఞసంయోగమువలన జగదుత్పత్తి యని వచించుటచే బ్రహ్మమునకే యవిద్యచే సంసార మని సిద్ధము. ఇప్పుడు అధ్యాయాదియం దుదాహరించిన యాకాంక్షలను రెంటిని ముందుగా ననువదించి యనంతరశ్లోకముచే నుత్తరము చెప్పుచున్నారు గుణములు ఇత్యాదిగా. సత్త్వాదులయందు గుణశబ్దం బెట్లు ప్రవర్తించు నని యాశంకించి పరతంత్రము లగుటవలన నని చెప్పుచున్నారు గుణాః ఇత్యాదిగా. రూపాదులయందువలె సత్త్వాదులయందును ద్రవ్యాశ్రితత్వరూప హేతువుచే గుణశబ్ద మేల ప్రవర్తింపఁగూడ దని యాశంకించి ప్రకృత్యాత్మకము లగు సత్త్వాదులు సర్వాశ్రితము లగుటవలన నట్లు కా దని చెప్పుచున్నారు ఇవి ఇత్యాదిగా. గుణములను బ్రకృతిని వేఱుగాఁ జెప్పి యుండుటచే నవి పరస్పరభిన్నములై యుండఁగా గుణములకుఁ బ్రకృత్యాత్మకత్వ మెట్లని యాశంకించి చెప్పుచున్నారు మఱియు నిత్యాదిగా. గవాశ్వములవలె నత్యంతభిన్నము లైనయెడ తద్భావము సంభవింపమివలన నని యర్థము. భేదాభేదపక్షమందును తద్భావము

* క్రియతో ఇవ అనునది భాష్యకారులచే జేర్పఁబడినది.

సంభవింపదు కావున నేవిశేషమువలన వానియందు గుణత్వపరిభాష చేయఁబడిన దని యాశంకించి చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. క్షేత్రజ్ఞునకు నిత్యపరతంత్రము లగుటకు హేతువు చెప్పుచున్నారు అవి ద్యేత్యాదిగా. గుణము లేవి అనుదాని కుత్తరము చెప్పఁబడినది. ఎట్లు బంధించు ననుదాని కుత్తరము చెప్పుచున్నారు క్షేత్రజ్ఞుని ఇత్యాదిగా. దానిని యుపపాదించుచున్నారు వాని నిత్యాదిగా. ప్రాకృతము లగుగుణములు ప్రకృత్యాత్మికము లని చెప్పుచున్నారు అవి ఇత్యాదిగా. సంభవించును దీనివలన నను వ్యుత్పత్తిచే సంభవ మనఁగా కారణము, ప్రకృతి సంభవముగాఁ గలవి ప్రకృతిసంభవములు. ప్రధాన మను పేరు గల సాంఖ్యులప్రకృతి యిది గా దని చెప్పుచున్నారు భగవ దిత్యాదిగా. మిక్కిలి బంధించున ట్లున్నవి–స్వవికారవంతునిగాఁ జూపుచున్నవి. ముఖ్యశాబ్దముసకు వ్యాఖ్యానముఁ జేయుచున్నారు గొప్పలై ఇత్యాదిగా. దేహము గలవానిని–దేహమే తా నని తలంచువానిని, దేహస్వామి నని యర్థము. కూటస్థుఁ డెట్లు బద్ధుఁ డగు నని యాశంకించి "కుర్యాన్నే రావణుభయమ్" * అను న్యాయంబున నిది మాయామాహాత్మ్యం బని చెప్పుచున్నారు అవ్యయ మ్మని. వ్యయము లేమి తనచేతనా ధర్మముచేతనా యనఁగాఁ జెప్పుచున్నారు అనాదిత్వా దిత్యాదిగా. "లిప్యతే న స పాపేన" అనుదానికి నిబధ్నన్తి అనుట విరుద్ధం బని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. ఇవకారముఖ క్రియాపదమునకు వ్యాఖ్యానము చేయుటవలన నియాక్షేపము పరిహృతి మయ్యె నని చెప్పుచున్నారు ఈ యాశంకను ఇత్యాదిగా.

హ. గుణము లేవి ? ఎట్లు బంధించును ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ప్రకృతిసంభవాః = అవిద్యాసంభవములు. నిబధ్నన్తి=కట్టుచున్నవి. అవ్యయమ్=నాశము లేనివానిని.

శం. ప్రకృతియును త్రిగుణంబులును దన యనుగ్రహబలముచేతనే కార్యము చేయ సమర్థము లని ప్రతిపాదించి గుణముల విభజించుచు నవి బంధకంబు లనుటను చెప్పుచున్నాఁడు.—మోక్షమునకుఁ బరమకారణమై యుత్కృష్ట మగుటవలన సత్త్వము మొదటఁ జెప్పఁబడినది. సర్వప్రవృత్తికిని గారణ మగుటవలన పిమ్మట రజస్సును దానికంటె నికృష్ట మగుటవలన కడపటఁ దమస్సును చెప్పఁబడినవి. సత్త్వము రజస్సు తమస్సు అను పేర్లుగల, గుణాః = గుణములు; ప్రకృతి

* మేరుపర్వతమునంతయు లంకామాత్రం బనుబుద్ధిని చేయును.

సమ్భవాః = సంభవించుచున్నది దీనివలన, కావున సంభవ మనఁగా నుపాదాన కారణము, ప్రకృతియే సంభవముగాఁ గలవి ప్రకృతిసంభవములు. సత్త్వాదులు రూపాదులవలె ద్రవ్యమాత్రాశ్రితములు కావు, మఱే మనఁగాఁ గార్యకారణము లభిన్నము లగుటచేఁ బ్రకృత్యాత్మకములు గావున సర్వగతము లగుచున్నవి. అందుచేత జగత్తు సమస్తమును గుణమయమే యగుచున్నది. అందువలననే వెలుపల విషయరూపంబునను లోపల రాగద్వేషలోభాదిరూపంబునను నిద్రాలస్యప్రమాదాదిరూపంబునను శమదమసత్యదయాదాక్షిణ్యాదిరూపంబునను వర్తించుచున్న సత్త్వాదిగుణములు, అవ్యయమ్ = తాను నాశరహితుఁడైనను; దేహినమ్=ఆత్మను, ఆత్మవిదుని నని యర్థము; స్వవికారవ్యాప్తిచేతఁ బ్రత్యగ్బుద్ధి తిరోహితమై దేహమునందే యాత్మభావము గలవానిఁగాఁ జేసి, దేహే నిబధ్నన్తి — దేహమునందును తద్ధర్మతత్కార్యములయందును అహమ్మమాభిమానములను బొందించి జన్మమరణాదియుక్తునిఁ గావించి నశింపఁజేయుచున్నవి యని యర్థము. ఓయీ! "సర్వేన్ద్రియవివర్జితమ్, అసక్తమ్, ప్రకృత్యైవచ కర్మాణి, నకరోతి నలిప్యతే" అనువచనములచేత క్షేత్రజ్ఞుఁడైనయాత్మకు క్షేత్రతద్ధర్మతత్కార్యరహితత్వమును అసంగత్వమును అకర్తృత్వమును అలిప్తత్వమును ప్రతిపాదింపఁబడినది. ఎట్లు గుణసంగరహితుఁడగు పురుషుఁడు గుణములచే బద్ధుఁడగు నని యడుగుదువేని చెప్పెదము. నిష్కళుండును నిష్క్రియుండును అసంగుఁడు నగునాత్మకేమో యధ్యాసమువలననే బంధము. వాస్తవమున లేదు. వాస్తవమునఁ గల దనినపక్షమున మోక్షమే సంభవింపక పోవును. అందువలన నిరవయవుఁడును అసంగుఁడును అవిరోధియు నగు ప్రత్యగాత్మకు సూర్యునకంధకారసంబంధమువలె నవిద్యాతత్కార్యసంబంధ మెప్పుడును సంభవింపదు. మఱే మనఁగా, స్వానుభూతియందుఁ బ్రమత్తుఁడగు బ్రహ్మావిద్యతి కనాత్మాధ్యాసంబును సత్త్వాదిగుణబంధంబును గలుగుచున్నవి నిత్యనిరంతరాత్మానుభవముచేత ననాత్మాధ్యాసరహితుఁడగువిద్వాంసునకే దృష్టదుఃఖాభావమును సదాత్మానందరసానుభూతియు గుణాతిక్రమణమును విదేహముక్తియు సిద్ధించును. గుణదోషముచే నయ్యనాత్మాధ్యాసమునకు లోనైన యతికిమాత్రము సంపాదించినజ్ఞానమునకుఁ గూడ సంకోచంబును విక్షేపంబును జన్మాదిబంధంబును గలుగును. అందువలన దేహేంద్రియాదులయందుఁ గాని మఱియొకటఁ గాని అహంమమాధ్యాసరహితత విద్వాంసునకు జీవన్ముక్తి, అహమ్మమాధ్యాసమే బంధము. సత్త్వాదిగుణదోషముచే దానిఁ జేయునేని విద్వాంసుఁడును బద్ధుఁ డగును. సత్త్వగుణకృత మగు

దయాదోషముచే దూషితహృదయుఁడై అనాత్మ యగు కురంగమునందు పోష్యత్వ మమత్వరూప మైనయధ్యాసముఁ జేసినందున స్నేహపాశబద్ధుఁడై విద్వాంసుఁ డగు భరతుఁడు గూడ జన్మాదిబంధము నొందెను గదా! అందువలన విదేహకైవల్యార్థి యగువిద్వాంసుఁడు సత్త్వాదిగుణతత్కార్యములచే నించుకేనియుఁ జలింపక సదా యాత్మనిష్ఠయందే నిలువవలయు నని బోధించుటకే చతుర్దశాధ్యాయారంభము.

మ. ఇట్లు నిరీశ్వరసాంఖ్యమతము నిరాకరించి క్షేత్రక్షేత్రజ్ఞసంయోగ మీశ్వరాధీనం బని చెప్పఁబడినది. ఇప్పుడు ఏగుణమునం దెట్లు సంగము? ఏవి గుణములు? అవి ఎట్లు బంధించును? అను విషయములు పదునాల్గుశ్లోకములచేఁ జెప్పఁబడుచున్నవి.—సత్త్వం రజస్తమ ఇతి = సత్త్వరజస్తమము లనుపేళ్లు గలవి; గుణాః — పురుషునకు నిత్యపరతంత్రము లనుట, అచేతనము లన్నియు చేతనార్థము లగుటవలన; ఇవి వైశేషికమతమునందలి రూపాదులవలె ద్రవ్యాశ్రితములు కావు, గుణగుణులకు భేదంబును ఇట వివక్షితము గాదు, ప్రకృతి గుణత్రయాత్మిక మగుట వలన. అప్పుడు ప్రకృతిసంభవము లనుట ఎట్లు? చెప్పెదము. గుణత్రయముయొక్క సామ్యావస్థ ప్రకృతి, అదియె భగవంతునిమాయ, దానను డి పరస్పరాంగాంగి భావంబున విషమములై పరిణమించినవి ప్రకృతిసంభవము లని చెప్పఁబడుచున్నవి. అవి, దేహే = ప్రకృతికార్య మైన దేహేంద్రియసంఘాతమునందు; దేహినమ్ = దేహతాదాత్మ్యాధ్యాసము నొందిన పురుషుని; పరమార్థమున సర్వవికారశూన్యుఁ డగుటచే, అవ్యయమ్; నిబధ్నన్తి—సర్వవికారశూన్యుఁ డైనవానినే తమవికారములు గలవానినవలెఁ జూపుచున్నవి భ్రాంతిచేత, జలపాత్రములు ఆకాశమునం దున్నసూర్యుని ప్రతిబింబాధ్యాసముచేత చలనాదిధర్మములు గలవానినవలెఁ జూపునట్లు. పారమార్థిక మైనబంధము లేదని మున్నె వివరించి యున్నారము "శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే" అనుస్థలమునందు.

శ్రీ. ఇట్లు పరమేశ్వరాధీను లగు ప్రకృతిపురుషులవలన సర్వభూతోత్పత్తిని నిరూపించి ఇప్పుడు ప్రకృతిసంయోగముచేఁ గలుగు పురుషునిసంసారమును బ్రపంచించుచున్నాఁడు పదునాలుగుశ్లోకములచేత.—సత్త్వరజస్తమము లను పేర్లు గలమూఁడుగుణములు, ప్రకృతిసంభవాః=ప్రకృతివలనఁ బుట్టుక గలవి. గుణసామ్యము ప్రకృతి, దాననుండి పార్థక్యంబున నభివ్యక్తములై, దేహే = ప్రకృతికార్య మైన దేహమునందు; దేహినమ్ = తాదాత్మ్యంబున నున్నచిదంశమును; అవ్యయమ్ =

వాస్తవమున నిర్వికారుఁ డయ్యే యున్నవానిని; నిబధ్నన్తి — స్వకార్యము లగు సుఖ దుఃఖమోహాదులతోఁ గూర్చుచున్న వని యర్థము.

ఏ. *. శ్వేతాశ్వతరోపనిషత్తునందు శ్రుతియును. "అజా మేకాం లోహిత శుక్ల కృష్ణాం బహ్వీం ప్రజాం జనయన్తీం సరూపామ్ । అజో హ్యేకో జుషమాణోను శేతే జహాత్యేనాం భుక్తభోగా మజోన్యః" అని. భాష్యము.—ఓయీ! ఒక్కటే యగు నుపాదానకారణమువలన కార్యవైచిత్ర్య మెట్లగు నని యాశంకించి కారణంబు నట్టిదే యని చెప్పుచున్నాఁడు.—అజామ్ = అనాదియును; ఏకామ్=ఒక్కటి యైనదియు; లోహితశుక్లకృష్ణామ్ = రజ స్సత్త్వ తమోరూప గుణత్రయ మయ మును; ఇట్లు విచిత్ర మగుటవలన, బహ్వీమ్ = వేఱువేఱు నామరూపవర్ణములు గల; సరూపామ్ - స్వకీయసమానరూపము గల; ప్రజామ్ = భూతవర్గమును; జన యన్తీం=పుట్టించునదియు నగుప్రకృతిని; ఇఁకఁ దచ్ఛబలత్వమునను శుద్ధత్వమునను క్షేత్రజ్ఞ పరమాత్మలస్వరూపమును చెప్పుచున్నాఁడు.—ఇట్టిదైన యాప్రకృతిని, అను = లక్ష్యీకరించి; తత్కార్యము లైనవిషయములను, జుషమాణః = భుజించుచు; ఏకః = ఒకఁడు; అజః=జీవుఁడు; శేతే=నిద్రఁజెందినవానివలె సుఖావస్థను బొందు చున్నాఁడు. ఇఁక, అన్యః = తద్విలక్షణుఁ డగు; అజః = పరమాత్మ; ఏనామ్ = ఈ చెప్పినప్రకృతిని; భుక్తభోగామ్ = భుజింపఁబడినభోగములు గలదానిని; జహాతి=విడు చుచున్నాఁడు, స్పృశింపఁడు. ఎట్లో కానొక బ్రాహ్మణుఁడు స్వప్నమునందు శూద్రత్వ మును బొందినవాఁడై వెండియు జాగ్రదవస్థయందు తనశుద్ధస్వరూపమును బొందు చున్నాఁడో ఆవిధమున నని యర్థము.

టీ. ఇట్లు సర్గాదియందుఁ బ్రాచీనకర్మవశమువలన నచిత్సంసర్గముచేత దేవాదియోనులయందు జన్మము కలుగుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—సత్త్వ రజ స్తమస్సు లను మూఁడుగుణములు ప్రకృతియొక్కస్వరూపానుబంధు లగు స్వభా వవిశేషములు, ప్రకాశాదిక మగు స్వకార్యముచేతనే నిరూపింపఁదగినవి. ప్రకృత్య వస్థయం దుద్భూతములు గావు, తద్వికారములైన మహదాదులయం దుద్భూత ములు, మహదాదివిశేషాంతారబ్ధము లగు దేవమనుష్యాదిదేహములతో సంబంధము గల యీదేహిని, అవ్యయమ్ = తాను గుణసంబంధమున కనర్హుఁడై యున్నవానిని, దేహమందు వర్తించుచున్నవాని, నిబధ్నన్తి — దేహమునందు వర్తమానత్వోపాధి చేత బంధించుచున్న వని యర్థము.

---

* పదయోజన మధుసూదనీయముతో సమానము.

**మా.** బంధప్రకారమును బ్రదర్శించుచున్నారు సాధనానుష్ఠానమునకొఱకు సత్త్వ మిత్యాదిగా.

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశక మనామయమ్।
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ॥ ౬

**భా.** తత్ర=ఆ సత్త్వాదిగుణములయందు; సత్త్వమునకే యీలక్షణము చెప్పఁబడుచున్నది. నిర్మలత్వాత్ = స్వచ్ఛమగుటవలన స్ఫటికమణివలె; ప్రకాశకమ్ = ప్రకాశింపఁజేయునది; అనామయమ్=ఉపద్రవము లేనిది; సత్త్వమ్ - సత్త్వగుణము. అది, బధ్నాతి=బాధించుచున్నది. ఎట్లు? సుఖసఙ్గేన - సుఖమునందాసక్తిచేత. నేను సుఖిని అను వృత్తికి విషయీభూత మైనసుఖముతో విషయి యైనయాత్మయందు సంశ్లేషము కలిగించుట సుఖసంజనము మృషయే యగును. అది యవిద్య. విషయధర్మము విషయియందు సంభవింపదు గదా! ఇచ్ఛ మొదలుగా ధృతివఱకుఁ గలవి యన్నియు క్షేత్రమునకే ధర్మమని చెప్పఁబడినది భగవంతునిచేత. అందువలన నవిద్యచేతనే స్వకీయధర్మభూతమై విషయవిషయ్యవివేకరూపమైనదానిచేత అస్వాత్మభూత మైనసుఖమునందు సక్తునివలె చేయుచున్నది అసుఖిని సుఖినలె. అట్లు, జ్ఞానసఙ్గేనచ=జ్ఞానమునందాసక్తిచేతఁ గూడ. జ్ఞాన మనునదియు సుఖముతోఁ జేర్పఁబడుటవలన క్షేత్రమైనయంతఃకరణముయొక్క ధర్మమే కాని ఆత్మధర్మము కాదు, ఆత్మధర్మ మగునెడల సంగమును బంధమును అనుపపన్నము లగుటవలన. సుఖమునందువలె జ్ఞానాదికమునందును సంగము నెఱుంగవలయును. అనఘ = వ్యసనము లేనివాఁడా!

అందు సత్త్వగుణము నిర్మల మగుటవలన ప్రకాశము నిచ్చునదియు ఉపద్రవము లేనిదియునై యున్నది. అది విషయసుఖమునందు సంగమును అంతఃకరణధర్మమైనజ్ఞానమునందు సంగమును బొందించి జీవుని బంధించుచున్నది. అని తాత్పర్యము.

**శ్రీ.** ఎట్టిగుణము దేనిచేత బంధించుచున్నది యనఁగాఁ జెప్పుచున్నారు తత్రేత్యాదిగా. స్వచ్ఛము—ఆవరణమును తొలఁగించుటయందు సమర్థము. ప్రకాశింపఁజేయునది—చైతన్యాభివ్యంజకము. ఉపద్రవము లేనిది—నిర్మలమై సుఖమున కభివ్యంజక మని యర్థము. ఏద్వారముచేత నది యాత్మను బంధించుచున్నది యని.

యనఁగుచున్నాఁడు ఎట్లు అని. సుఖసఙ్గేన అని యుత్తరము. దానినే వివరించుచున్నారు నేను ఇత్యాదిగా. ముఖ్యసుఖమున కభివ్యంజక మైన సత్త్వపరిణామ మిట విషయజన్య మగుసుఖ మని చెప్పఁబడుచున్నది. సంశ్లేషము కలిగించుటనే విశదీకరించుచున్నారు మృషయే యగు నని. సంగము వాస్తవ మగుచుండఁగా దాని మృషయే యని యెట్లు చెప్పవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు అది ఇత్యాదిగా. ఓయీ! ఇచ్ఛ సంగము అభినివేశము అనునివి యేకార్థకములు, ఇచ్ఛాదికం ఆత్మధర్మ మగుటవలన నవిద్య యన నేల యని యాశంకించి ఇచ్ఛాదికము మనోధర్మమే గాని యాత్మధర్మము కా దని చెప్పుచున్నారు విషయధర్మము ఇత్యాదిగా. ఇచ్ఛాదిక మనాత్మధర్మ మనుట కేమి ప్రమాణ మని యాశంకించి చెప్పుచున్నారు ఇచ్ఛ ఇత్యాదిగా. అది యాత్మధర్మముకా దని యేర్పడఁగా ఫలితము చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. సక్తునివలె చేయుచున్నది—సత్త్వ మని శేషము. ఇవకారము ప్రయోగించుటకు హేతువు చెప్పుచున్నారు అవిద్యచేతనే యని. ఆయవిద్యకును వాస్తవమున నాత్మసంబంధము లేకున్నను వేఁడుసంబాధి లేమివలనను అస్వాతంత్ర్య మగుటవలనను ఆత్మధర్మముగా కల్పితమై ననుభవింపఁబడుచుండుటను జెప్పుచున్నారు స్వకీయధర్మభూతమై అని. వృత్తివిశిష్టాంతఃకరణము విషయ మగుటవలన ఆత్మసాధకుఁడై విషయి యగుచున్నను తదవివేకరూపం బవిద్యయని తత్స్వరూపము చెప్పుచున్నారు విష యేత్యాదిగా. తనస్వరూపము గాక తనధర్మమునుం గాక యుండుదానియందు సంగము గలిగించుట యేది గలదో అదియే యీ చెప్పిన యవిద్యమాహాత్మ్యం బని చెప్పుచున్నారు అస్వా త్మేత్యాదిగా. దానినే స్ఫుటీకరించుచున్నారు సక్తునివలె నని. ప్రకారాంతరముచేత సత్త్వము బంధించుటను చెప్పుచున్నారు అట్లు అని. జ్ఞాయతే—ఎఱుంగఁబడుచున్నది దీనిచేత కావున జ్ఞాన మనఁగాఁ సత్త్వపరిణామము, అందుచేత నేను జ్ఞానిని అను విపరీతాభిమానముచేత సత్త్వ మాత్మను బంధించుచున్నది యని చెప్పుచున్నారు జ్ఞానము ఇత్యాదిగా. విషయము నందు దోషము చెప్పుచున్నారు ఆ త్మేత్యాదిగా. స్వాభావికమై ప్రాప్త మగుట వలన దానియందు తనయంతనే సంయోగము సంభవించుటవలన తద్ద్వారంబున బంధము కలిగినపుడు తన్నివృత్తి సంభవింపదు కావున ఆత్మధర్మము కా దని యర్థము. జ్ఞానైశ్వర్యాదిక్షేత్రధర్మమునందును సంగము పూర్వమువలె నావిద్యక మని సూచించుచున్నారు సుఖమునందువలె నిత్యాదిగా. పాపాదిదోషశూన్యునకే యీ శాస్త్రమునం దధికార మని దెలుపుచున్నారు అనఘ అని.

హ. ఈ సత్త్వాదిగుణములయందు సత్త్వమునకు లక్షణము చెప్పుచున్నాఁడు.—నిర్మలత్వాత్ – స్ఫటికమణివలె; ప్రకాశకమ్. అనామయమ్ – ఉపద్రవము లేనిది యని యర్థము. సుఖసఙ్గేన = సుఖేచ్ఛచేత.

శం. సామాన్యంబున గుణసమష్టికార్యమును దెలిపి ప్రత్యేకము గుణములస్వరూపంబును కార్యంబును బ్రతిపాదించుచున్నాఁడు పదుమూఁడింటిచేత.—తత్ర = ఆ త్రిగుణములయందు; సత్త్వమ్ = సత్త్వగుణము; నిర్మలత్వాత్ = రజస్తమము లనుమలములవలన నిర్గత మగుటచే నతిస్వచ్ఛ మగుటవలన; ప్రకాశకమ్- ప్రత్యగ్వస్తుస్వరూపమును భాసిల్లఁ జేయునది; అనామయమ్ = సత్త్వమునకు ఆమయ మేది యనఁగా విక్షేపమును జాడ్యమును, తత్కారణము లైన రజస్తమములు లేనందువలన విక్షిప్తము గానిదియు జడము గానిదియు; ఇట్టిది యైనను సత్త్వము తన్నుఁ దగిలియున్న బ్రహ్మవిదుని యొక్క, సుఖసఙ్గేన - శబ్దాదు లగు ప్రియవస్తువులతోఁ సంపర్కముచేఁ గలుగు సుఖ మేది గలదో దానియందలి సక్తిచేత; బధ్నాతి— విషయసుఖలోలునిగాఁ జేయుచున్న దని యర్థము. లేక, శమదమదయాఉపరతిక్షాంత్యాదిసాధనసంపత్తిచేత బ్రహ్మవిదుని, బ్రహ్మ విష్ణు శివలోకసుఖములందలి యాసక్తిచేత; బధ్నాతి – బ్రహ్మానుసంధానసుఖానుభవములనుండి తప్పించి బహిర్ముఖునిఁగాఁ జేయుచున్న దని యర్థము. మఱియును, జ్ఞానసఙ్గేనచ = జ్ఞాన మనఁగా నానాశాస్త్రజన్యము దానియందు సంగము – కామము దానిచేత; బధ్నాతి—తర్కమీమాంసాసాంఖ్యయోగాగమతంత్రములయర్థజ్ఞానమునం దాసక్తునిఁగా బ్రహ్మవిదుని గూడఁ జేయుచున్న దని యర్థము. లేక, ఎఱుంగఁబడుచున్నాఁడు పరమేశ్వరుఁడు దీనిచేత కావున జ్ఞాన మనఁగా ఈశ్వరమహత్త్వప్రతిపాదక మైనశాస్త్రము, దానియందు సంగము – తత్ప్రతిపాదిత పరమేశ్వరగుణకథాశ్రవణభజనకీర్తనాదులయం దాసక్తి, దానిచేత; బధ్నాతి – బ్రహ్మనిష్ఠనుండి తప్పించి తదాసక్తునిఁగా చేయుచున్న దని యర్థము.

మ అందు ఏగుణము ఏసంగముచేత బంధించుచున్నది యనఁగా చెప్పుచున్నాఁడు.—తత్ర = ఆగుణములలోపల; సత్త్వమ్; ప్రకాశకమ్ = చైతన్యముయొక్కతమోగుణకృత మైన ఆవరణమును నివారించునది; నిర్మలత్వాత్ = స్వచ్ఛ మగుటవలన, చిద్బింబము గ్రహించుయోగ్యత గలది యగుటవలన నని యర్థము; చైతన్యాభివ్యంజకముమాత్రమే కాదు, మఱే మనఁగా, అనామయమ్ = ఆమయ

మనఁగా దుఃఖము, దానికి విరోధి యగు సుఖమునకుఁ గూడ వ్యంజక మని యర్థము; అది, బధ్నాతి; సుఖసఙ్గేన, జ్ఞానసఙ్గేనచ; అనఘ = వ్యసనరహితుఁడా! సర్వత్ర సంబోధనములయభిప్రాయము ముందు చెప్పఁబడినది స్మరింపవలయును. ఇట సుఖ జ్ఞానశబ్దములచే తద్వ్యంజకము లగు నంతఃకరణపరిణామములు చెప్పఁబడుచున్న వి, "ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః" అని సుఖచేతనలనుగూడ ఇచ్ఛాదులవలె క్షేత్రధర్మములుగాఁ బలుకుటవలన. అందు అంతఃకరణధర్మ మగు సుఖమును జ్ఞానమును నేను సుఖిని నే నెఱుంగుచున్నాను అని ఆత్మయం దధ్యసించుట సంగము. విషయధర్మము విషయికిఁ గాదు గదా! అందువలన నవిద్యామాత్రం బిది యని పెక్కుమార్లు ముందు చెప్పఁబడి యున్నది.

శ్రీ అందు సత్త్వముయొక్క లక్షణంబును అది బంధించుప్రకారంబును చెప్పుచున్నాఁడు.—తత్ర ఆగుణములలో; సత్త్వమ్; నిర్మలత్వాత్ = స్వచ్ఛ మగుటవలన; స్ఫటికమణివలె, ప్రకాశకమ్ - ప్రకాశము గలది; అనామయమ్ = ఉపద్రవము లేనిది, శాంత మని యర్థము. శాంత మగుటవలన; తనకార్య మగు సుఖమునం దెవ్వనికి సంగ మేది గలదో దానిచేత, బధ్నాతి. ప్రకాశక మగుటవలన తనకార్య మగుజ్ఞానమునం దెవ్వనికి సంగ మేది గలదో దానిచేతను. అనఘ=పాపరహితుఁడా! నేను సుఖిని నేను జ్ఞానిని అని మనోధర్మములను తదభిమాని యగు క్షేత్రజ్ఞునియందుఁ జేర్చుచున్న దని యర్థము.

ప. *

రా. సత్త్వరజస్తమోగుణములస్వరూపమును అవి బంధించువిధమును చెప్పుచున్నాఁడు.—తత్ర = ఆసత్త్వరజస్తమస్సులయందు; సత్త్వముయొక్క స్వరూప మిట్టిది. నిర్మలత్వాత్ ప్రకాశకమ్—ప్రకాశసుఖముల నావరించుస్వభావము లేకుండుట నిర్మలత్వము, ప్రకాశసుఖములఁ బుట్టించు నియతస్వభావము గల దగుటచే ప్రకాశసుఖములకు హేతుభూత మని యర్థము. ప్రకాశ మనఁగా వస్తుతత్త్వ జ్ఞానము. అనామయమ్=ఆమయాఖ్య మగుకార్యము లేనిది, ఆరోగ్యమునకు హేతు వని యర్థము. ఈ సత్త్వగుణము ఈ దేహిని, సుఖసఙ్గేన జ్ఞానసఙ్గేనచ బధ్నాతి—పురుషునకు సుఖసంగమును జ్ఞానసంగమును పుట్టించుచున్న దని యర్థము. జ్ఞాన సుఖములయందు సంగము గలిగినం గదా తత్సాధనము లగు లౌకికవైదికముల

* శ్రీధరీయముతో సమానము.

యందుఁ బ్రవర్తించుచున్నాఁడు, అందువలన తత్ఫలానుభవసాధనభూతము లైన యోనులయందు జనియించుచున్నాఁడు, కావున సత్త్వము సుఖజ్ఞానసంగిద్వారమున పురుషుని బంధించుచున్నది. సత్త్వము జ్ఞానసుఖములను బుట్టించునదియు నెంతయు వానియందు సంగము గలిగించునదియు నని యభిప్రాయము.

మూ. *

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాఽఽసంగసముద్భవమ్
తన్నిబధ్నాతి కౌన్తేయ కర్మసఙ్గేన దేహినమ్. ౭

భా. రజః — రజోగుణమును; రాగాత్మకమ్ — స్త్రీకాంచనాదిపుత్రులవలన రంజించుటవలన రాగమనఁబడును, రాగమే స్వరూపముగాఁ గలదానిఁగా; తృష్ణాఽఽసంగసముద్భవమ్ — అప్రాప్తవిషయమునం దభిలాష తృష్ణ, ప్రాప్త మగువిషయమునందు మనస్సునకుఁ బ్రీతిరూప మైనతగులము ఆసంగము, తృష్ణాఽఽసంగములకు కారణ మైనదానిఁగా; విద్ధి = ఎఱుంగుము. తత్ = ఆరజస్సు; కౌన్తేయ — ఓయర్జునుఁడా! కర్మసఙ్గేన — దృష్టాదృష్టార్థకర్మములయం దాసక్తిచేత; దేహినమ్ — ఆత్మను; నిబధ్నాతి — బంధించుచున్నది.

ఓ యర్జునుఁడా! రజోగుణము రాగరూప మనియు తృష్ణకును ఆసంగమునకును గారణ మనియు నెఱుంగుము. అది దృష్టాదృష్టార్థము లగు కర్మములయం దాసక్తి నొందించి ఆత్మను బంధించుచున్న దని తాత్పర్యము.

ప్ర. రజస్సున కేమి లక్షణము? అది యెట్లు బంధించును? అనఁగా చెప్పుచున్నారు.—రజ్యతే—కలుపఁబడుచున్నాఁడు దీనిచేతఁ బురుషుఁడు దృశ్యములతో కావున రాగము, అది యాత్మగాఁ గలది రాగాత్మకము. సముద్భవతి—పుట్టుచున్నది దీనివలన కావున సముద్భవ మనఁగా కారణము. కార్యద్వారమున రజస్సును వివరించువారై తృష్ణాఽఽసంగముల యర్థభేదమును చెప్పుచున్నారు అప్రాప్తేత్యాదిగా. రజోలక్షణమును చెప్పి అవి బాధించువిధమును చెప్పుచున్నారు తదిత్యాదిగా. కర్మసంగమును విభజించుచున్నారు దృష్టేత్యాదిగా. అకర్తయే యగు పురుషుని చేయుచున్నా ననునభిమానము నొందించి ప్రవర్తింపఁజేయుచున్న దని యర్థము.

* దీని కీభాష్యము లేదు.

హ. రజః; రాగాత్మకమ్=ఇచ్ఛాత్మకము; తృష్ణాఽఽసంగసముద్భవమ్ = తృష్ణ యనఁగా అప్రాప్తమునం దభిలాష, ఆసంగ మనఁగా ప్రాప్తమునందు మనస్సునకుఁ బ్రీతి, దానికి కారణమునుగా. కర్మసఙ్గేన = కర్మపరత్వముచేత.

శం. ఇట్లు నిర్మలత్వమును ప్రకాశకత్వమును విక్షేపశూన్యతయును సత్త్వమునకు స్వరూపముగాను సుఖసంయోజనమును జ్ఞానసంయోజనమును దాని కార్యముగాను నిరూపించి రజోగుణముయొక్క కార్యమును స్వరూపమును చెప్పుచున్నాఁడు.—రజః = రజోగుణమును; రాగాత్మకమ్ = రజ్యతే — రక్తుఁ డగుచున్నాఁడు దీనిచేతఁ బురుషుఁడు కావున రాగ మనఁగా రక్త, రాగమే ఆత్మ గా — స్వరూపముగాఁ గలది రాగాత్మకము, రాగస్వరూపమునుగాను రాగముచేతనే యెఱుఁగఁదగినదానిఁగాను; తృష్ణాఽఽసంగసముద్భవమ్ = తృష్ణ యనఁగా అప్రాప్తార్థములయం దాశ, ఆసంగ మనఁగా ప్రాప్తములయందు పట్టుదల, ఆ రెంటియొక్క సముద్భవము — ఉత్పత్తి దేనివలననో అది తృష్ణాసంగసముద్భవము, దేశకాలముల వలన వ్యవహితములును అవ్యవహితములు నగు నర్థములయందు ఆశను బుట్టించుదానిగాను; విద్ధి = ఎఱుంగుము. ఇట్టి లక్షణము గల రజోగుణము, దేహినమ్ = ఆత్మను, ఆత్మవిదు నని యర్థము; కర్మసఙ్గేన = కర్మములు ఐహికాముష్మికప్రయోజనము లగు లౌకికములును వైదికములును, వానియందు సంగము—సక్తత్వము తత్పరత్వము, దానిచేత; నిబధ్నాతి — స్వస్వరూపానుభవమునుండి మోసపుచ్చి బ్రహ్మవిదునిఁగూడ కర్మఠునిగాఁ జేయుచున్న దని యర్థము.

మ. రజ్యతే—రక్తుఁ డగుచున్నాఁడు దీనిచే పురుషుఁడు విషయములయందు కావున రాగ మనఁగా కామము, అదియే ఆత్మగా—స్వరూపముగాఁ గలది రాగాత్మకము ధర్మధర్ములకు తాదాత్మ్యమువలన, రాగాత్మకమునుగా; రజః విద్ధి. కావుననే తృష్ణాఽఽసంగసముద్భవమ్ = అప్రాప్తమునం దభిలాష తృష్ణ, ప్రాప్తమునకు నాశము వచ్చునపుడు దాని సంరక్షించునభిలాష ఆసంగము, ఆతృష్ణాసంగములకు సముద్భవముదేనివలననో అట్టిది తత్ = ఆరజస్సు; నిబధ్నాతి; కౌన్తేయ = ఓయర్జునుఁడా! కర్మసంగేన — దృష్టాదృష్టార్థము లగుకర్మములయందు నేను దీనిని జేయుచున్నాను దీనిఫలము భుజింపఁగలను అను నభినివేశవిశేషముచేత; దేహినమ్ — వాస్తవమున అకర్త యైనను కర్తృత్వాభిమానము గలవానినిగా, రజస్సు ప్రవృత్తిహేతు వగుటవలన.

శ్రీ. రజోగుణముయొక్క లక్షణమును బంధకత్వమును జెప్పుచున్నాఁడు.—రజః; రాగాత్మకమ్ = అనురంజనరూపముగా; విద్ధి. కావుననే, తృష్ణాసంగసముద్భవమ్ = అప్రాప్తార్థమునందభిలాష తృష్ణ, ప్రాప్తార్థమునందు ప్రీతి విశేషించి ఆసక్తి ఆసంగము, తృష్ణాసంగములసముద్భవము దేనివలననో అట్టిది. తత్ = ఆరజస్సు; దేహినమ్ = దృష్టాదృష్టార్థము లైనకర్మములయందు సంగముచేత — ఆసక్తిచేత; మిక్కిలి బంధించుచున్నది. తృష్ణాసంగములవలనఁ గదా కర్మములయందాసక్తి కలుగుచున్నది.

ప. *

రా. రజః; రాగాత్మకమ్ = రాగహేతుభూతమునుగా, రాగమనఁగా స్త్రీపురుషులకు బంధువులయందు స్పృహ; తృష్ణాసంగసముద్భవమ్ = తృష్ణాసంగములకు నుత్పత్తిస్థానమునుగా, తృష్ణాసంగములకు హేతువునుగా నని యర్థము; తృష్ణ యనఁగా శబ్దాదిసర్వవిషయములయందు నుండు స్పృహ, సంగమనఁగా పుత్రమిత్రాదిసంబంధులకూడికయందలి స్పృహ; అది, దేహినమ్; కర్మములయందు — క్రియలయందు స్పృహాజననద్వారమున బంధించుచున్నది. క్రియలయందు స్పృహ దేహి క్రియలను నారంభించుచున్నాఁడో పుణ్యాపాపరూపములు కావున అవియే గదా తత్ఫలానుభవసాధనభూతము లగు యోనులయందు జన్మము కలిగించుచున్నవి. అందువలన కర్మసంగద్వారమున రజోగుణము దేహిని బంధించుచున్నది. ఇట్లు రజోగుణము రాగతృష్ణాసంగములకు హేతు వనియు కర్మసంగమునకు హేతు వనియు నభిప్రాయము.

మా. తృష్ణాసంగములకు సముద్భవము — కారణము.

తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత. ౮

భా. తమస్తు = మూడవది యైన తమోగుణమును; అజ్ఞానజమ్ = అజ్ఞానమువలనఁ బుట్టినదానిఁగా; సర్వదేహినామ్=సమస్తదేహవంతులకును; మోహనమ్ = మోహమును — అవివేకమును కలిగించుదానిఁగా; విద్ధి=ఎఱుంగుము. ప్రమాదాలస్యనిద్రాభిః=ఏమఱుపాటుచేతను అలస్య

* శ్రీధరీయముతో సమానము.

ముచేతను నిద్రచేతను; తత్ = ఆ తమోగుణము; నిబధ్నాతి=బంధించు చున్నది. భారత = ఓయర్జునా!

అర్జునా! తమోగుణము అజ్ఞానమువలనఁ బుట్టినదియు సర్వజీవులకును మోహము కలిగించునదియు నని యెఱుంగుము. అది ప్రమాదమును ఆలస్యమును నిద్రను బొందించి జీవుని బంధించుచున్నది యని తాత్పర్యము.

రా. ఇఁక తమస్సునకు లక్షణ మేమి? అది ఎట్లు బంధించును? అనఁగా చెప్పుచున్నారు.—గుణము లన్నిటికి ప్రకృతిసంభవత్వము సమాన మైనను తద్విపరీతస్వభావమును పొందకుండుటవలన తమస్సునకు అజ్ఞానజ మనువిశేషణము అను నభిప్రాయమున చెప్పుచున్నారు అజ్ఞానమువలన నిత్యాదిగా. మోహము నొందు చున్నారు దీనిచేత కావున మోహనము—వివేకమునకు ప్రతిబంధకము అని కార్య ద్వారమున తమస్సును నిర్దేశించుచున్నారు మోహన మ్మని. తమస్సుయొక్క-లక్షణ మును ప్రతిపాదించి బాధకత్వమును చెప్పుచున్నారు ప్రమా దేత్యాదిగా. కార్యాం తరమునం దగిలి చేయఁదలంచుకొన్నకర్తవ్యమును జేయకుండుట ప్రమాదము, ఇచ్ఛ లేక ప్రవృత్తియం దుత్సాహము నొందకుండుట ఆలస్యము. వీనిచేత ఆత్మను నిర్వి కారునే తమముగూడ వికారవంతునిగాఁ జేయుచున్న దని యర్థము.

హ. *

శం తమస్సునకును స్వరూపమును కార్యమును ప్రతిపాదించుచున్నాఁ డు.—రజస్సత్త్వములకన్నను దోషముచే నధిక మగు బంధకత్వముతోఁ గూడినది గావున వానికన్నను గొప్పది తమ స్సని బోధించుచున్నది తుశబ్దము. తమస్తు; అజ్ఞానజమ్ = దేనియందు జ్ఞానము నిలుకడఁ బొందదో నది అజ్ఞానము కాని జ్ఞానా భావము కాదు, అభావము కార్యకారి కానందువలన, దానివలనఁ బుట్టినది అజ్ఞాన జము; "గుణాః ప్రకృతిసంభవాః" అనుటచే మూడుగుణములకును ప్రకృతిజన్య త్వము సమాన మైనను తమస్సు అజ్ఞానస్వభావము నెప్పుడును విడువనిది యగుట వలన విశేషించి దానికి అజ్ఞానజ మ్మను విశేషణము; అందువలననే, సర్వదేహి నామ్ = బ్రహ్మాది స్తంబపర్యంతప్రాణుల కందఱకును తన్నుఁ బొందినవారికి అవిశేష ముగా; మోహనమ్ = మోహపఱుచునది — తన యావిర్భావముచే ప్రాప్త మైన

* శంకరభాష్యముతో సమానము.

సదసద్వివేకజ్ఞానమును గూడ తిరోభూతముగఁ జేయునది. తమస్సు అజ్ఞానజ మనియు స్వరూపముచే జ్ఞానము నావరించునది యనియు నెఱుఁగు మని యర్థము. తమస్సు యొక్క ఉత్పత్తిని స్వరూపమును ప్రతిపాదించి కార్యమును చెప్పుచున్నాఁడు.— అజ్ఞానము జడము, దానివలనఁ బుట్టిన దగుటవలననే వివేకవిజ్ఞానము నావరించునట్టి తమస్సు, ప్రమాదాలస్యనిద్రాభిః = ప్రయత్నమున చేయవలసినకార్యమును మఱచుట ప్రమాదము, చేయవలసినకార్యమునందు శ్రద్ధ లేకుండుటచే ఉత్సాహము లేమి యాలస్యము, బుద్ధిజాడ్యాతిశయముచేత చేయవలసినదాని విడిచి నిద్రించుట నిద్ర, ఈ ప్రమాదాదు లగు నన్ర్థములచేత; నిబధ్నాతి — మిక్కిలి తనగుణముచే మోహము నొందించి బ్రహ్మవిదునిగూడ ఆత్మనిష్ఠావిముఖునిగా చేయుచున్న దని యర్థము. బుద్ధినైర్మల్యముచేతను విషయసుఖాసక్తిచేతను సత్త్వగుణావిర్భావమును, విషయములయందు రాగావిర్భావముచేతను కర్మాసక్తిచేతను రజోగుణావిర్భావమును బుద్ధిజాడ్యముచేతను విపరీతప్రత్యయావిర్భావముచేతను ప్రమాదాలస్యనిద్రాదుల చేతను తమోగుణావిర్భావమును, ఎఱిఁగి బ్రహ్మవిద్యతి తాను సత్త్వాదిగుణవికారములకు వశుఁడు గాక ఆయావికారములకుఁ బ్రతియోగు లగుగుణముల నవలంబించి గుణదోషములఁ దొలఁగించుకొని సదా ఆత్మానుభవమునందే యుండవలయు నని సూచిత మగుచున్నది.

మ. తుశబ్దము సత్త్వరజస్సులకన్నను విశేషము తెలుపుటకు. ఆవరణ శక్తిరూప మైనయజ్ఞానమువలన నుద్భూతము కావున నజ్ఞానజము; తమః; విద్ధి; కావున సమస్తదేహులకును, మోహనమ్ = అవివేకరూప మగుటచే భ్రాంతిజనకము. ప్రమాదముచేతను ఆలస్యముచేతను నిద్రచేతను, తత్ = ఆ తమస్సు; నిబధ్నాతి. దేహినమ్ అని అనువర్తించుచున్నది. ఓ, భారతుఁడా! ప్రమాద మనఁగా వస్తువివేకమునం దసామర్థ్యము సత్త్వకార్య మగు ప్రకాశమునకు ప్రతిబంధకము, ఆలస్య మనఁగా ప్రవృత్తియం దసామర్థ్యము రజోగుణకార్య మగు ప్రవృత్తికి ప్రతిబంధకము, నిద్ర యనఁగా ఆరెంటికిని ప్రతిబంధక మగు తమోగుణాలంబన మైనవృత్తి యని వివేకము.

శ్రీ. తమస్తు; అజ్ఞానజమ్ = అజ్ఞానమువలన — ఆవరణశక్తిరూప మైన ప్రకృత్యంశమువలనఁ బుట్టినదానిగా; విద్ధి. కావుననే, సర్వదేహులకును, మోహనమ్ = భ్రాంతిజనకము. అందువలననే ప్రమాదాలస్యనిద్రలచేత ఆతమస్సు దేహిని

బంధించుచున్నది. ప్రమాదము—ఎచ్చరిక లేక యుండుట, ఆలస్యము—ప్రయత్నము లేమి, నిద్ర—చిత్తమునకు శ్రమముచేత లయము.

ప. *

రా. ఇట జ్ఞానముకంటె భిన్నము అజ్ఞాన మని యభిప్రాయము. జ్ఞాన మనఁగా వస్తుతత్త్వావబోధము, దానికంటె భిన్నము తద్విపరీతజ్ఞానము. తమస్తు; వస్తుతత్త్వవిపరీతజ్ఞానమువలనఁ బుట్టినది. సర్వదేహినాం మోహనమ్ — మోహ మనఁగా విపరీతజ్ఞానము, విపరీతజ్ఞానహేతు వని యర్థము. తత్ = ఆ తమస్సు; ప్రమాదాలస్యనిద్రాహేతు వగుటచేత తద్ద్వారమున దేహిని బంధించుచున్నది. ప్రమాదము — చేయవలసినకర్మములను విడిచి మఱియొకచోఁ బ్రవర్తించుటకు హేతువైన యనవధానము, ఆలస్యము — కర్మములయందు ప్రవర్తింపకుండుస్వభావము స్తబ్ధత్వ మనుట, నిద్ర—పురుషునకు ఇంద్రియవ్యాపారములను చేసి శ్రాంతుఁ డగుటచే సర్వేంద్రియములు ఉపరమించుట, అందు బాహ్యేంద్రియప్రవృత్త్యుపరతి స్వప్నము, మనస్సునకును ఉపరతి సుషుప్తి.

మా. అజ్ఞానము దేనివలనఁ బుట్టుచున్నదో అది అజ్ఞానజము, "ప్రమాద మోహౌ తమసః" అను వాక్యశేషమువలన.

సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సఞ్జయ త్యుత. ౯

భా. వెండియు గుణములవ్యాపారమును సంక్షేపమునఁ జెప్పుచున్నాఁడు.—సత్త్వమ్=సత్త్వగుణము; సుఖే=సుఖమునందు; సఞ్జయతి= తగిలించుచున్నది. రజః=రజోగుణము; కర్మణి = కర్మమునందు; సఞ్జయతి = తగిలించుచున్నది. జ్ఞానమ్=సత్త్వగుణముచేఁ గలిగిన వివేకమును; ఆవృత్య=కప్పి; తమస్తు=తమోగుణమో; ఆ యావరణరూపము చేత, ప్రమాదే = ప్రమాద మనఁగా ప్రాప్త మగుకర్తవ్యమును జేయకుండుట, దానియందు; సఞ్జయతి ఉత=తగిలింపనే తగిలించుచున్నది.

జీవుని సత్త్వగుణము సుఖమునం దాసక్తునిఁగా చేయుచున్నది. రజోగుణము కర్మమునం దాసక్తునిఁగా చేయుచున్నది. తమోగుణము సత్త్వకార్యమైన జ్ఞానము నావరించి ప్రమాదమునం దాసక్తునిఁగా జేయుచున్న దని తాత్పర్యము.

* శ్రీధరీయముతో సమానము.

ఆ. ఈ గుణములలో నేకార్యమునం దేగుణమున కుత్కర్ష మనఁగా చెప్పుచున్నారు వెండియు నిత్యాదిగా. సుఖము సాధ్య మైనప్పుడు సత్త్వగుణ ముత్కృష్ట మగుచున్న దని చెప్పుచున్నారు సత్త్వ మిత్యాదిగా. కర్మము సాధ్య మైనపుడు రజోగుణము ప్రబల మని చెప్పుచున్నారు రజ ఇత్యాదిగా. ప్రమాదము నందు తమస్సునకు ప్రాధాన్యమును తెలుపుచున్నారు జ్ఞాన మిత్యాదిగా.

హ. కర్మణి = క్రియయందు. జ్ఞానమావృత్య = జ్ఞానము నాచ్ఛాదించి. ప్రమాదే = ప్రాప్త మైనదాని మఱచుటయందు.

శం. జ్ఞాననిష్ఠకుఁ బ్రతిబంధక మైనగుణకార్యమును నిరూపించుచు నిది వఱకుఁ జెప్పినను ఆగుణకార్యమును బరిహరింపఁగోరు బ్రహ్మవిద్యలకి గుణకార్య స్వరూపజ్ఞానము దృఢ మగుటకై వెండియుఁ జెప్పుచున్నాఁడు.—పురుషుని, సత్త్వమ్=సత్త్వగుణము; సుఖే=విషయసుఖమునందు; సఞ్జయతి = సక్తునిఁ జేయుచున్నది. రజః; కర్మణి = కృష్యాదికకర్మమునందును ఇతరకర్మమునందును; సఞ్జయతి= అంటించుచున్నది. తమస్తు; జ్ఞానమ్ - స్వరూపజ్ఞానమును; ఆవృత్య; ప్రమాదే = నియమమునఁ జేయవలసినజ్ఞాననిష్ఠను మఱచుటయందు; సఞ్జయతి. ఉత — అప్యర్థకము, ఆలస్యాదికమునందును సక్తునిఁ జేయుచున్న దని యర్థము.

మ. ఈ గుణములలో నేగుణమున కేకార్యమునందుఁ బ్రాబల్య మనఁగాఁ జెప్పుచున్నాఁడు.—సత్త్వమ్; అధిక మై, సుఖే సఞ్జయతి=దుఃఖకారణమును బాధించి సుఖమునందు సక్తునిఁ జేయుచున్నది. అంతటను దేహవన్తుని అనువర్తించును. ఇట్లు, రజః; హెచ్చినదై, సుఖకారణమును బాధించి, కర్మణి సఞ్జయతి. తమస్తు; ప్రమాణబలమున జనించుచున్నదానిని గూడ, జ్ఞానమ్ = సత్త్వకార్య మైనజ్ఞానమును; ఆవృత్య = కప్పి; ప్రమాదే = ప్రాప్త మై తెలియఁబడుచుండుటగల దానినిగూడఁ * తెలియకుండుటయందు; సఞ్జయతి. ఉత — మఱియును, ప్రాప్త మైనకర్తవ్యత గల దానిని గూడ ♦ చేయకుండుటయందును—ఆలస్యమునందును తామస మగు నిద్రయందును సక్తునిఁ జేయుచున్న దని యర్థము.

శ్రీ. సత్త్వాదులకు తమతమకార్యమును జేయుటయందు సామర్థ్యాతిశయమును జెప్పుచున్నాఁడు. సత్త్వంసుఖేసఞ్జయతి — దుఃఖశోకాదికారణ మున్నను

* చక్కఁగా దెలియవచ్చుచున్నదానిని గూడ.

♦ చేయవలసినకర్మమును గూడ.

సుఖాభిముఖునిఁగానే దేహిని జేయుచున్న దని యర్థము. ఇట్లు సుఖాదికారణ మున్నను రజోగుణము కర్మమునందే, సఞ్జయతి. తమస్తు; పెద్దలసహవాసముచేతఁ గలుగుచున్న జ్ఞానమును గూడ. ఆవృత్య = కప్పి; ప్రమాదేసఞ్జయతి — పెద్ద లుప దేశించునర్థమును గ్రహింపకుండుటయందు సక్తునిఁ జేయుచున్న దని యర్థము. ఉత — ఆలస్యాదులయందును సక్తునిఁ జేయుచున్న దని యర్థము.

ప. రజః, దుఃఖాదికారణ మున్నను, కర్మణి సఞ్జయతి. *

రా. సత్త్వాదులకు బంధద్వారము లైనవానియందుఁ బ్రధానములను జెప్పుచున్నాఁడు.—సత్త్వము సుఖసంగప్రధానము. రజస్సు కర్మసంగప్రధానము. తమస్సు వస్తుజ్ఞానము నావరించి విపరీతజ్ఞానహేతు వగుటచేతఁ గర్తవ్యమును విడిచి విపరీతప్రవృత్తియందు సక్తతయే ప్రధానముగాఁ గలది.

మా. ♦

రజ స్తమ శ్చా ఽభిభూయ సత్త్వం భవతి భారత
రజ స్సత్త్వం తమ శ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా. ౧౦

భా. ఈకార్యమును గుణము లెప్పుడు చేయు ననఁగా చెప్పఁబడు చున్నది.—రజః = రజోగుణమును; తమశ్చ = తమోగుణమును, ఈ రెంటినిగూడ; అభిభూయ=లోఁగొని; సత్త్వమ్=సత్త్వగుణము; భవతి= ఉద్భవించుచున్నది, వృద్ధిఁ బొందుచున్నది, ఎప్పుడో అప్పుడు సత్త్వము లబ్ధాత్మకమై తనకార్యమగు జ్ఞానసుఖాదికము నారంభించుచున్నది. భారత=ఓయర్జునుఁడా! అట్లు, రజః=రజోగుణము; సత్త్వమ్=సత్త్వగుణ మును; తమశ్చైవ = తమోగుణమును; రెంటినిగూడ అభిభవించి ఎప్పుడు వృద్ధిఁబొందు చున్నదో అప్పుడు కర్మతృష్ణాదికమగు స్వకార్యము నారంభించుచున్నది. తథా — అట్లు; తమః=తమోగుణము; సత్త్వమ్= సత్త్వగుణమును; రజః = రజోగుణమును; రెంటినిగూడ అభిభవించి ఎప్పుడు వృద్ధిఁ బొందుచున్నదో అప్పుడు జ్ఞానావరణాదిస్వకార్యమును ఆరంభించుచున్నది.

---

* తక్కినది శ్రీధరీయముతో సమానము.

♦ ఇఁక నేదుశ్లోకముల కీభాష్యము లేదు.

సత్త్వగుణము రజస్తమోగుణముల నడంచి తా నెప్పుడు వృద్ధిఁ బొందుచున్నదో అప్పుడు జ్ఞానసుఖాదిస్వకార్యము నారంభించుచున్నది. అట్లు రజోగుణము సత్త్వతమోగుణముల నభిభవించి తాను వృద్ధిఁ బొందినపుడు కర్మసంగాదిస్వకార్యము నారంభించుచున్నది. తమోగుణము రజస్సత్త్వముల లోఁగొని తాను హెచ్చియుండునపుడు జ్ఞానావరణాదిస్వకార్యము నారంభించుచున్న దని తాత్పర్యము.

ప్ర సత్త్వాదిగుణములు ఏకకాలమునందే యుండుటచే కవిరోధమునఁ బ్రబలము లగుచున్నవా? లేక పరస్పరవిరోధమునఁ బ్రబలము లగుచున్నవా? కాదేని క్రమంబున నొక్కొకటి యొక్కొకకాలంబునఁ బ్రబల మగునా? అని సందేహించి యడుగుచున్నాఁడు ఈకార్యము నిత్యాదిగా. సత్త్వోత్కర్షము గోరువారలకు ఇతరగుణముల నభిభవించు నేర్పు గలుగుటకై క్రమపక్షము నాశ్రయించి యుత్తరముఁ జెప్పుచున్నారు చెప్పఁబడుచున్నది అని. సత్త్వాభివృద్ధినే వివరించుచున్నారు అప్పుడు ఇత్యాదిగా. అప్పుడు—రజస్తమములు తిరోహితమైనప్పుడు అని యర్థము. రజస్సువృద్ధిఁబొందువిధమును దానికార్యమును జెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. తమస్సువృద్ధిఁబొందుటయును దానికార్యమును జెప్పుచున్నారు తథేత్యాదిగా.

హ. *

శం జడగా నల్లిన కేశభాగములవలె మూఁడుగుణములును సమములైయుండి ప్రవర్తించునేని అవి సమష్టిచేఁ దమకార్యముల నారంభింపవలయును గాని ఎట్లు ప్రత్యేకము తమతమకార్యము నారంభించును? అని యాశంక కలుగఁగా, "ప్రాణులకర్మఫలంబుల కనురూపముగా గుణము లొక్కొకటి తగ్గును హెచ్చును కాని అవి సమములై ప్రవర్తింపవు. అట్లగునెడ కర్మఫలవైచిత్ర్యము సంభవింపకపోవును. అందువలన నిగుణములలో నేది హెచ్చి ప్రధాన మగునో అది ప్రవర్తించును" అనిబోధించుటకై చెప్పుచున్నాఁడు.—ప్రాణియదృష్టముచే సుఖము సాధ్యమైనపుడు, రజః = రజోగుణమును; తమః=తమోగుణమును; అభిభూయ=తగ్గించి; సత్త్వమ్ = సత్త్వగుణము; తాను హెచ్చినది, భవతి — రజస్తమములను దన కంగములుగాఁ జేసికొని తా నంగియై తనకార్యమును జేయుచున్న దని యర్థము. కర్మము సాధ్యమైనపుడు, సత్త్వమ్, తమశ్చ; అభిభూయైవ — తగ్గించియే; రజః = రజోగుణము, తాను హెచ్చుచున్నది — ఆ రెండుగుణములను దన కంగములుగాఁ జేసికొని తా నంగియై స్వకార్యమును జేయుచున్న దని యర్థము. అట్లు జ్ఞానావర

* దీని కీవ్యాఖ్యానము లేదు.

ణము సాధ్య మగునపుడు, సత్త్వమ్; రజః; తగ్గించి, తమః = తమోగుణము; తాను హెచ్చుచున్నది — ఆ రెండుగుణములను దన కంగములుగాఁ జేసికొని తా నంగియై స్వకార్యమును జేయుచున్న దని యర్థము.

వ్యా. ఈకార్యమును గుణము లెప్పుడు చేయుననఁగాఁ జెప్పుచున్నాఁడు.— రజః; తమశ్చ; ఏకకాలమున నీరెండుగుణములను, అభిభూయ; సత్త్వమ్; భవతి— ఎప్పు డుద్భవ మగుచున్నదో—వృద్ధినొందుచున్నదో అప్పుడు, పూర్వము చెప్పిన తన కార్యమును ముఖ్యముగాఁ జేయుచున్న దని శేషము. ఇట్లు, రజః = రజోగుణము గూడ; సత్త్వం తమశ్చైవ — ఈ రెండుగుణములను; అభిభవించి ఎప్పుడు తా నుద్భూత మగుచున్నదో అప్పుడు మున్ను చెప్పిన తనకార్యమును జేయుచున్నది. తథా = ఆవిధముననే; తమోగుణము సత్త్వరజోగుణముల రెంటి నభిభవించి తా నెప్పు డుద్భూత మగుచున్నదో అప్పుడు మున్ను చెప్పిన తనకార్యమును జేయు నని యర్థము.

శ్రీ. అందు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—రజస్సు తమస్సు అను రెంటిని, అభిభూయ = తిరస్కరించి; సత్త్వం భవతి=అదృష్టవశమున నుద్భూతి మగుచున్నది. అందువలన స్వకార్య మగు సుఖజ్ఞానాదికమునందు సక్తునిఁ జేయుచున్న దని యర్థము. ఇట్లు రజోగుణముగూడ సత్త్వతమోగుణముల రెంటి నభిభవించి యుద్భూతి మగుచున్నది, అందువలన స్వకార్య మగు తృష్ణాకర్మాదికమునందు సక్తునిఁ జేయుచున్నది. ఈవిధముననే తమోగుణముగూడ సత్త్వరజస్సుల నభిభవించి యుద్భూత మగుచున్నది. అందువలన స్వకార్యము లగు ప్రమాదాలస్యాదులందు సక్తునిఁ జేయుచున్న దని యర్థము.

వ. రెండుగుణము లుపరమించినపుడు ఒకటి వృద్ధిఁ బొందినదై తనకార్యమును జేయు నని చెప్పుచున్నాఁడు.— *

రా. శరీరాకారమునఁ బరిణమించినప్రకృతికి సత్త్వాదులు స్వరూపానుబంధు లైనగుణములు. స్వరూపానుబంధు లగుటచే నవియెల్ల నెల్లప్పుడును వర్తించును. కావునఁ బరస్పరవిరుద్ధ మగుకార్యము నెట్లు పుట్టించు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—సత్త్వాదులు మూడును ప్రకృతిసంసృష్టుఁ డగు నాత్మయొక్క స్వరూపమున కనుబంధులై యుండు ననుట వాస్తవమే. అయినను, ప్రాచీనకర్మవశమువల

* తక్కినది శ్రీధరీయముతో సమానము.

నను శరీరపోషణము లైన యాహారములవైషమ్యమువలనను సత్త్వాదు లొకటికంటె నొకటి హెచ్చుచుఁ దగ్గుచు నుండును. ఒకానొకప్పుడు రజస్తమముల నభిభవించి సత్త్వ ముద్రిక్త మగును. అట్లొకప్పుడు తమస్సత్త్వముల నభిభవించి రజస్సును, ఒకప్పుడు రజస్సత్త్వముల నభిభవించి తమస్సును ఉద్రిక్తము లగును.

సర్వద్వారేషు దేహేఽస్మి న్ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వ మిత్యుత. ౧౧

భా. ఎప్పు డేగుణ ముద్భూత మగునో అప్పుడు దాని కేమి చిహ్నా మనఁగాఁ జెప్పుచున్నాఁడు.—సర్వద్వారేషు = ఆత్మకు ఉపలబ్ధిద్వారములు శ్రోత్రాదీంద్రియము లన్నియు ద్వారము లనఁబడును, వాని యందు; ప్రకాశః = అంతఃకరణ మగుబుద్ధియొక్క వృత్తి; అదియే, జ్ఞానమ్ = జ్ఞానము; అస్మిన్దేహే = ఈ దేహమునందు; ఉపజాయతే = పుట్టుచున్నది; యదా = ఎప్పుడో, ఎప్పుడు జ్ఞానాఖ్య మగుప్రకాశము కలుగుచున్నదో; తదా=అప్పుడు; సత్త్వమ్=సత్త్వగుణము; వివృద్ధమ్= వృద్ధిఁబొందినది; ఇతిఉత = అని చక్కఁగా; విద్యాత్ =ఎఱుంగవలయును.

ఈ దేహమునందు ఆత్మ కుపలబ్ధిద్వారము లగు శ్రోత్రాదికరణముల యన్నిటియందును బుద్ధివృత్తిరూప మగుజ్ఞాన మెప్పుడు స్పష్టముగాఁ గలుగు చున్నదో అప్పుడు సత్త్వగుణము వృద్ధినొందె నని యెఱుంగవలయు నని తాత్పర్యము.

శ్రీ. మీఁది మూఁడుశ్లోకములకు నాకాంక్షను దెలుపుచున్నారు ఎప్పుడు ఇత్యాదిగా. సత్త్వాభివృద్ధికిఁ జిహ్నము దెలుపుటకై మీఁదిశ్లోకము నెత్తుచున్నారు చెప్పుచున్నాఁడు అని. సర్వద్వారేషు — ఇట నిమిత్తార్థమునందు సప్తమి. ఉత — ఇది అప్యర్థకము, అతిశయమును దెలుపుచున్నది.

హ. సర్వద్వారేషు = సర్వేంద్రియములయందు; ప్రకాశః జ్ఞానమ్ = ప్రకాశ మను నామాంతరము గల జ్ఞానము.

శం. ఓయీ! సత్త్వాదిగుణము తగ్గుటయును హెచ్చుటయును ఎట్లు లేచి హ్నముచేతఁ దెలియవచ్చును? తెలిసినం గదా అవి హెచ్చినపుడు వాని నడంచుటకు శక్య మగును గాని తెలియనియెడ శక్యము కా దని యాశంకింపఁగాఁ జెప్పుచు న్నాఁడు.—యదా = ఎప్పుడు; సర్వద్వారేషు = సమస్తము లైనయంతఃకరణ

ప్రవృత్తిద్వారము లగు త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణములయందును; అస్మిన్దేహే = ఈ దేహమునందు; జ్ఞానమ్ = జ్ఞానప్రసాదరూప మగు; ప్రకాశః = స్ఫూర్తి; ఉపజాయతే = విజృంభించుచున్నదో; తదా=ఆ కాలమునందు; సత్త్వమ్= సత్త్వగుణము; వివృద్ధమ్ = వృద్ధి నొందినది; ఇతి = అనియును; ఉత — రజస్తమములు తగ్గిన వనియును; విద్యాత్ — అంతఃకరణప్రసాదాతిశయం బను చిహ్నము చేత సత్త్వముయొక్కవృద్ధిని ఇతరగుణములహ్రాసమును నెఱుంగవలయు నని యర్థము.

మ. ఇప్పుడు వృద్ధినొందినగుణములకు గుఱుతులం జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—అస్మిన్ = ఈ, ఆత్మకు భోగాయతన మైన; దేహే=దేహము నందు; సమస్తము లైనద్వారములందును—ఉపలబ్ధిసాధనము లైనశ్రోత్రాదికరణములయందు; యదా; ప్రకాశః = దీపమువలె స్వవిషయావరణవిరోధి యైన విషయాకార మగు బుద్ధివృత్తివిశేషము; అదియే, జ్ఞానమ్ = శబ్దాదివిషయ మగుజ్ఞానము; ఉపజాయతే. తదా; ఈ శబ్దాదివిషయజ్ఞానాఖ్యప్రకాశ మను గుఱుతుచేత, ప్రకాశాత్మక మగు సత్త్వగుణము, వివృద్ధ మితి = వృద్ధినొందిన దని; విద్యాత్ = ఎఱుంగవలయును. ఉత = మఱియును — సుఖాదికం బను గుఱుతుచేతఁ గూడ నెఱుఁగవలయు నని యర్థము.

శ్రీ. *

పం. ఇఁక సత్త్వాదుల నెఱుంగువిధముఁ జెప్పుచున్నాఁడు.—ఆత్మకు భోగాయతన మైన యీశరీరమునందు, సర్వద్వారేషు—శ్రోత్రాదులయందు; ప్రకాశే= శబ్దాదిప్రకాశము గలిగినపుడు; యదా = ఎప్పుడు; జ్ఞానమ్ = స్వరూపస్ఫురణము; పుట్టుచున్నదో, తదా; సత్త్వమ్; వివృద్ధ మితి = వృద్ధినొందిన దని; విద్యాత్.

రా. దానిని కార్యజ్ఞానముచేతనే యెఱుంగవలయు నని చెప్పుచున్నాఁడు.—సమస్తము లైన చక్షురాదిజ్ఞానద్వారములయం దెప్పుడు వస్తుతత్త్వప్రకాశం బున జ్ఞానము పుట్టుచున్నదో అప్పు డాదేహమునందు సత్త్వము వృద్ధినొందె నని యెఱుంగునది.

* మధుసూదనీయముతో సమానము.

లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణా మశమ స్స్పృహా
రజ స్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ. ౧౨

భా॥ రజోగుణము వృద్ధినొందె ననుట కిది చిహ్నము.—లోభః = పరద్రవ్యము గ్రహింపఁగోరుట; ప్రవృత్తిః = ప్రవర్తించుట, సామాన్య వ్యాపారము; కర్మణామ్ = కర్మములయొక్క; ఆరమ్భః=ఆరంభించుట; అశమః = ఉపశాంతి లేకుండుట, హర్ష రాగాదులు కల్గుట; స్పృహా = సర్వసామాన్యవస్తువులయం దాశ; ఏతాని = ఈ చిహ్నములు; రజసి = రజోగుణము; వివృద్ధే = వృద్ధినొందఁగా; జాయన్తే = పుట్టుచున్నవి. భరతర్షభ = భరతవంశమునఁ బుట్టినవారియందు శ్రేష్ఠుఁడా!

అర్జునా! రజోగుణము వృద్ధిఁబొందినపుడు పరద్రవ్యాశయు ప్రవృత్తియు కర్మములఁ నారంభించుటయు హర్షరాగాదుల నొందుటయు సర్వసామాన్యవస్తువుల యం దాశయు ననునివి కలుగుచున్న వని తాత్పర్యము.

శ్రీ. అతిశయంబున వృద్ధి నొందినరజోగుణమునకుఁ జిహ్నముఁ జెప్పుచున్నారు రజోగుణము ఇత్యాదిగా. కామ్యములు నిషిద్ధము లగు లౌకికకర్మములు ఆరంభమునకు విషయము లని నిర్దేశించుచున్నారు కర్మణా మని. ఉపశాంతి లేకుండుట—బాహ్యాంతఃకరణముల కని శేషము. లోభాదులు కనఁబడునపుడు రజోవృద్ధి నెఱుంగవలయు నని భావము.

హ॥ లోభః=శాస్త్రముచేత విడువవలయు నని చెప్పఁబడినవాని విడువ కుండుటయును శాస్త్రముచేత నిషేధింపఁబడినవానిఁ గోరుటయును; ప్రవృత్తిః — ప్రవర్తించుట, స్వాభావిక మగుచేష్ట; కర్మణామ్ — లౌకికవైదికములయొక్క; ఆరమ్భః; అశమః—శమ మనఁగా శోకహర్షాదులయందు సామ్యము, అది లేకుండుట; స్పృహా — ఇచ్ఛ.

శం॥ రజోవృద్ధివలన నీగుఱుతులు కలుగు నని చెప్పుచున్నారు.— లోభః — ఉన్నవస్తువును విడువ నొల్లకుండుట; ప్రవృత్తిః — సాధారణ మైన సర్వేంద్రియవ్యాపారము; లౌకికవైదికకర్మములయొక్క, ఆరమ్భః—ఉపక్రమము; అశమః— కామసంకల్పాదులచే నంతఃకరణమునకు శాంతి లేకుండుట; స్పృహా = విషయ ములయందు వాంఛ; రజసి = రజోగుణము; వివృద్ధే = వృద్ధినొందఁగా; ఏతాని =

ఈ కార్యములు; జాయన్తే. ఈ గుఱుతులచే రజోగుణము వృద్ధినొందె ననియు ఇతర గుణములు తగ్గిన వనియుఁ దెలియవలయు నని యర్థము.

మ. లోభః — అధికధనము ప్రాప్తించుచున్నను అనుక్షణము దానియందు వృద్ధినొందుచున్న యభిలాష, విషయము ప్రాప్తించినను నివర్తిల్లని యిచ్ఛావిశేష మనుట; ప్రవృత్తిః — నిరంతరముగా యత్నించుట, కర్మణామారమ్భః — బహు ద్రవ్యవ్యయమునకును అధికాయాసమునకును హేతువు లైన కామ్యనిషిద్ధలౌకిక మహాగృహాదివ్యాపారముల నారంభించుట; అశమః—దీనిఁ జేసి దీనిఁ జేయుదు నను సంకల్పములప్రవాహమునకు విరామము లేకుండుట; స్పృహా—నానావిధము లైన పరధనములను జూచినమాత్రమున వాని గ్రహింపఁ గోరుట; రజసి — రాగాత్మక మగు రజోగుణము; వివృద్ధే; ఏతాని — ఈ రాగాత్మకములగు చిహ్నములు; జాయన్తే. భరతర్షభ ! ఈ చిహ్నములచే రజోగుణము వృద్ధిఁబొందినదిగా నెఱుఁగవలయు నని యర్థము.

శ్రీ. *

ప. *

రా లోభః — తనద్రవ్యమును విడువకుండుస్వభావము; ప్రవృత్తిః — ప్రయోజనము నుద్దేశింపకయే చలించుస్వభావము, కర్మణామారమ్భః = ఫలసాధనము లైనకర్మముల నారంభించుట; అశమః — ఇంద్రియముల కుపరతి లేకుండుట; స్పృహా=విషయేచ్ఛ; రజసి వివృద్ధే ఏతాని జాయన్తే—ఎప్పుడు లోభాదులు కలుగునో అప్పుడు రజస్సు వృద్ధినొందె నని తెలియునది యని యర్థము.

అప్రకాశో ఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ
తమ స్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన. ౧౩

భా. అప్రకాశః = మిక్కిలి యవివేకము; అప్రవృత్తిశ్చ — ప్రవృత్తి లేకుండుటయును; ప్రమాదః=తత్కార్య మగుమఱపు; మోహఏవచ— అవివేకము, మూఢత యని యర్థము; తమసి=తమోగుణము; వివృద్ధే = వృద్ధిఁబొందినపుడు; ఏతాని=ఈ చిహ్నములు; జాయన్తే=పుట్టుచున్నవి. కురునన్దన = అర్జునుఁడా !

* మధుసూదనీయముతో సమానము.

అర్జునా ! తమోగుణము వృద్ధినొందినపుడు మిక్కిలి యవివేకము ప్రవృత్తి లేకుండుట ప్రమాదము మోహము అనునవి జనియించు నని తాత్పర్యము.

ఆ. తమోవృద్ధికి లింగమును జెప్పుచున్నారు.—అప్రకాశాప్రవృత్తి శబ్దములచే జ్ఞానకర్మములయత్యంతాభావము చెప్పఁబడినది. తత్కార్యము — ఆ యవివేకముయొక్క కార్యము. మోహ మనఁగా ఎఱుంగవలసినదాని వేఱువిధముగా నెఱుంగుట. దానికే ప్రకారాంతరమున నర్థము చెప్పుచున్నారు అవివేకము ఇత్యాదిగా. అవివేకాతిశయము మొదలగువానిచేత తమోవృద్ధి నెఱుంగవలయు నని తాత్పర్యము.

హ. అప్రకాశః — అజ్ఞానము; అప్రవృత్తిః = ఆలస్యము; ప్రమాదః = ప్రాప్తము నెఱుంగకుండుట; మోహః — అవివేకము.

శం. తమోవృద్ధికి లింగములఁ జెప్పుచున్నాఁడు.—అప్రకాశః = బుద్ధికి స్ఫూర్తి లేకుండుట; అప్రవృత్తిః = ఆలస్యము; ప్రమాదః=చేయవలసినదానియం దెచ్చరిక లేకుండుట; మోహః = మూఢత్వము; చకారమువలన నిద్రాపారవశ్యమును; ఇవియే తమోవృద్ధికి లింగములు. వీనిచేఁ దమోగుణవృద్ధిని ఇతరగుణముల హ్రాసమును దెలియవలె నని యర్థము.

మ. అప్రకాశః = ఉపదేశాదిజ్ఞానకారణ మున్నను జ్ఞానము కలుగకుండుట; అప్రవృత్తిశ్చ = అగ్నిహోత్రం జుహుయాత్ ఇత్యాదికమగు ప్రవృత్తికారణ మైన శాస్త్రముఁ దెలియవచ్చుచున్నను అందు ప్రవృత్తి యొంతమాత్రము లేకుండుట; ప్రమాదః = తత్కాలమునందు చేయవలసినదిగా నేర్పడినకార్యమును తలంపకుండుట; మోహఏవచ — మోహ మనఁగా నిద్ర, లేక అన్యథాజ్ఞానము; చకారములు సముచ్చయార్థములు; ఏవకారము వ్యభిచారమును వారించుచున్నది. తమస్సు వృద్ధినొందినపుడె ఈ లింగములు పుట్టుచున్నవి. అవ్యభిచారులైన యీ లింగములచే తమోవృద్ధి నెఱుంగవలయు నని యర్థము.

శ్రీ మఱియును.—అప్రకాశః=వివేకభ్రంశము; అప్రవృత్తిః=యత్నము లేకుండుట; ప్రమాదః = చేయవలసినయర్థమును దలంపకుండుట; మోహః = మిథ్యాభినివేశము; తమస్సు వృద్ధినొందినయెడ నీలింగములు పుట్టుచున్నవి. వీనిచేఁ దమోవృద్ధి నెఱుంగవలె నని యర్థము.

ప. *

శ్రా. అప్రకాశః = జ్ఞాన ముదయింపకుండుట; అప్రవృత్తిశ్చ = స్తబ్ధత్వము; ప్రమాదః = కార్యప్రవృత్తిరూపఫలరహిత మగు ననవధానము; మోహః = విపరీత జ్ఞానము; ఏతాని తమసి వివృద్ధే జాయన్తే = వీనిచే తమోవృద్ధి నెఱుంగవలయు నని యర్థము.

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్
తదోత్తమవిదాం లోకా నమలా న్ప్రతిపద్యతే. ౧౪

భా. మరణద్వారమునను ఏఫలము పొందఁబడుచున్నదో అదియు సంగరాగహేతుకము కావున సర్వంబును గుణమే యని తెలుపుటకై చెప్పుచున్నాఁడు.—యదా = ఎప్పుడు; సత్త్వే = సత్త్వగుణము; ప్రవృద్ధేతు = వృద్ధిపొందినపుడే; దేహభృత్ = జీవుఁడు; ప్రలయమ్ = మరణమును; యాతి = పొందుచున్నాఁడో; తదా = అప్పుడు; ఉత్తమవిదామ్ = మహదాదితత్త్వవేత్తలయొక్క; లోకాన్ = లోకములను; అమలాన్ = మలరహితము లైనవానిని; ప్రతిపద్యతే = పొందుచున్నాఁడు.

జీవుఁడు తనకు సత్త్వగుణము వృద్ధినొంది యుండునపుడు మరణమొందు నేని మహదాదితత్త్వవేత్తలు పొందునట్టి నిర్మలము లైన యుత్తమలోకములఁ జెందు నని తాత్పర్యము.

ఆ. సాత్త్వికాదిభావములకుఁ బారలౌకికభేదముఁ జెప్పుచున్నారు యద త్యాదిగా. సంగ మనఁగా సక్తి, రాగ మనఁగా తృష్ణ, వీనిబలమువలన ననుష్ఠాన ద్వారమునఁ బొందఁబడుచున్న దని యర్థము. గుణము — సత్త్వాదిగుణప్రయుక్త మనుట. అందు సత్త్వగుణవృద్ధిచేఁ గలుగు ఫలవిశేషముఁ జెప్పుచున్నారు యదేత్యాదిగా. మలరహితము లైనవానిని -- రజోగుణతమోగుణములలో నొకదానికి వృద్ధి మలము, దానిచే రహితము లైనవానిని, ఆగమసిద్ధము లగు బ్రహ్మలోకాదుల నని యర్థము.

హ. ప్రలయమ్ = మరణమును. ఉత్తమవిదామ్ = మహదాదితత్త్వస్వరూపవేత్తలయొక్క.

---

* శ్రీధరీయముతో సమానము.

శం. మృతులకు గుణానుషంగమున కనురూపముగనే పరలోకప్రాప్తి యగుంగాని వర్ణాశ్రమాద్యనురూపముగఁ గాదు. కావున దేహపాతానంతరము గుణములే గతికారణము లని చెప్పుచున్నాఁడు.—తుశబ్దము రజస్తమముల వ్యావర్తించుచున్నది. యదా = ఏకాలమునందు; సత్త్వే ప్రవృద్ధే=సత్త్వగుణము వృద్ధినొంది యుండఁగా; దేహభృత్ = ప్రాణి; ప్రలయంయాతి = మృతి నొందుచున్నాఁడో; తదా = అప్పుడు; ఉత్తమవిదామ్ = ఉత్తము లనఁగా హిరణ్యగర్భాదులు, వారిని విదన్తి=ఉపాసించువారు ఉత్తమవిదులు, అట్టివారియొక్క, వారిచేఁ బొందఁదగినట్టి; అమలాన్ = మల మనఁగా జన్మజరాదిదుఃఖము, తద్రహితము లైన; లోకాన్ = హిరణ్యగర్భాదిలోకములను; ప్రతిపద్యతే=పొందుచున్నాఁడు. ఓయీ! "యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే తదభిసంపద్యతే" అను శ్రుతి పరలోకగతి పుణ్యాపుణ్యకర్మానురూపం బని బోధించుచున్నది. ఎట్లు శ్రుతివిరుద్ధముగా గతి గుణానుగుణం బని చెప్పవచ్చును? అందు వేని, సత్యము. ప్రాణులకు స్వకర్మానురూపముగనే శుభాశుభగతి కలుగును గాని వర్ణాశ్రమాద్యనురూపముగఁ గాని పాండిత్యాద్యనురూపముగఁ గాని సంభవింపదు. ఏనను ప్రాణులకు మరణకాలంబున జన్మాంతరీయపుణ్యాపుణ్యకర్మవశముననే సత్త్వాదిగుణోత్కర్ష మగును, తదనురూపముగనే బ్రహ్మాదిలోకప్రాప్తి యగును, అందువలన శ్రుతి స్మృతి విరోధము లేదు.

మ. ఇఁక మరణసమయమునందు వృద్ధినొందినసత్త్వాదులకు ఫలవిశేషమును జెప్పుచున్నారు రెంటిచేత.—సత్త్వే ప్రవృద్ధే; యదా; దేహభృత్ = దేహాభిమాని యగు జీవుఁడు; ప్రలయంయాతి = మృత్యువును బొందుచున్నాఁడో; తదా; ఉత్తమవిదామ్ = ఉత్తము లగు హిరణ్యగర్భాదు లెవరు గలరో వారి నుపాసించువారియొక్క; లోకాన్ = దేవసుఖముల ననుభవించుస్థానవిశేషములను; అమలాన్ = రజస్తమోమలరహితములను; ప్రతిపద్యతే = పొందుచున్నాఁడు.

శ్రీ. అమలాన్ = ప్రకాశమయము లైనవానిని. *

ప. ఉత్తమవిదామ్=ముఖ్యప్రాణరూపుఁ డగు హిరణ్యగర్భు నుపాసించువారియొక్క; లోకాన్ = సిద్ధ్యావిర్భావసుఖములను.

రా. యదా = ఎప్పుడు, సత్త్వము ప్రవృద్ధ మగునో; తదా సత్త్వే ప్రవృద్ధే; దేహభృత్; ప్రలయంయాతి = మరణము నొందినయెడ; ఉత్తమవిదామ్=

* తక్కినది మధుసూదనీయముతో సమానము.

ఉత్తమతత్త్వము నెఱింగినవారియొక్క, ఆత్మతత్త్వము నెఱింగినవారియొక్క; లోకాన్ = సమూహములను; అమలాన్ = మలరహితములను, అజ్ఞానరహితములను; ప్రతిపద్యతే = పొందుచున్నాఁడు. సత్త్వము వృద్ధినొందినపుడు మృతుఁడగువాఁడు ఆత్మవిదులకులంబులందు జనియించి ఆత్మతత్త్వజ్ఞానసాధనంబు లగుకర్మములయం దధికృతుఁ డగుచున్నాఁ డని యభిప్రాయము.

రజసి ప్రలయం గత్వా కర్మసఙ్గిషు జాయతే
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. ౧౫

భా॥ రజసి = రజోగుణము; వృద్ధినొందినపుడు, ప్రలయం=మరణమును; గత్వా = పొంది; కర్మసఙ్గిషు = కర్మాసక్తిగల మనుష్యులయందు; జాయతే = పుట్టుచున్నాఁడు. తథా = అట్లే; తమసి = తమోగుణము వృద్ధినొందినపుడు; ప్రలీనః = మృతినొందినవాఁడు; మూఢయోనిషు — పశ్వాదియోనులందు; జాయతే = పుట్టుచున్నాఁడు.

రజోగుణము వృద్ధినొందినపుడు మరణముఁ జెందినవాఁడు కర్మములందాసక్తిగల మనుష్యులయందు జన్మము నొందును. అట్లే తమోగుణము హెచ్చియుండఁగా మృతుఁ డగువాఁడు పశ్వాదియోనులందు జనియించు నని తాత్పర్యము.

శ్రీ॥ రజోభివృద్ధిసమయమున మృతుఁ డగువానికి ఫలవిశేషముఁ దెలుపుచున్నారు రజ సీత్యాదిగా. పుట్టుచున్నాఁడు.—శరీరము నొందుచున్నాఁ డని యర్థము. ఎట్లు సత్త్వము వృద్ధినొందినపుడు మృతుఁడు బ్రహ్మలోకాదులయందు—దేవాదులయందు జన్మించునో ఎట్లు రజస్సు వృద్ధినొందినపుడు మరణించినవాఁడు మనుష్యలోకమునందు—మనుష్యులయందు జన్మించునో అట్లే యని చెప్పుచున్నారు అట్లే ఇత్యాదిగా.

హ॥ రజసి — రజోగుణము వృద్ధినొందినపుడు. కర్మసఙ్గిషు జాయతే. తమసి — తమోగుణము వృద్ధినొందినపుడు; ప్రలీనః=మృతుఁడు; మూఢయోనిషు= తిర్యగ్జంతువులయందు.

శం॥ రజస్సును తమస్సును హెచ్చినపుడు మృతుఁ డగువానిగతిఁ జెప్పుచున్నాఁడు.—రజసి — రజోగుణము ప్రవృద్ధ మగుచుండఁగా; దేహీ, ప్రలయం గత్వా; రజోవృద్ధివేగముచేత వెండియు, కర్మసఙ్గిషు = కర్మయోగయుక్తులైనమను

ష్యులయందు; జాయతే. తథా; తమసి — తమోగుణము ప్రవృద్ధ మగుచుండఁగా; ప్రలీనః = మృతినొందినప్రాణి; తమోవృద్ధివేగముచేత, మూఢయోనిషు = పశ్వాదులయందు; జాయతే.

మ. రజసి — రజోగుణ మధిక మైనపుడు; ప్రలయమ్ = మృత్యువును; గత్వా = పొంది; కర్మసఙ్గిషు = శ్రుతిస్మృతులయందు విహితప్రతిషిద్ధము లైనకర్మములఫలములయం దధికృతు లగుమనుష్యులయందు; జాయతే. *

శ్రీ. కర్మసఙ్గిషు — కర్మాసక్తు లగుమనుష్యులయందు. ♦

ప. ‖

రా. రజోగుణము ప్రవృద్ధ మైనపుడు మరణమునొందె ఫలార్థము కర్మము చేయువారికులములయందు జనియించుచున్నాఁడు — అందు జన్మించి స్వర్గాదిఫలసాధనము లగుకర్మములయం దధికృతుఁ డగుచున్నాఁ డని యర్థము. అట్లు తమస్సు ప్రవృద్ధ మైనపుడు మృతుఁ డగువాఁడు, మూఢయోనిషు = శ్వసూకరాదియోనులయందు; జాయతే — సకలపురుషార్థముల నారంభించుట కనర్హుఁ డగుచున్నాఁ డని యర్థము.

కర్మణః సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్. ౧౬

భా. అతీతశ్లోకములయర్థమునే సంక్షేపమునఁ జెప్పుచున్నాఁడు.— సుకృతస్య — సాత్త్విక మైనట్టి యని యర్థము; కర్మణః = కర్మమునకు; సాత్త్వికమ్ = సాత్త్వికమే యగు; నిర్మలమ్ = నిర్మల మైన; ఫలమ్ = ఫలమును; ఆహుః = చెప్పుచున్నారు శిష్టులు. రజసస్తు — రాజస మైన కర్మమున కని యర్థము, కర్మము ప్రకృతి మగుటవలన; ఫలమ్=ఫలము; దుఃఖమ్ = దుఃఖమే, కారణానురూపతవలన రాజసమే. అట్లు, అజ్ఞానమ్ = అజ్ఞానము; తమసః = తామస మైనకర్మమునకు, అధర్మమునకు; ఫలమ్ = ఫలము, పూర్వమువలె.

* తక్కినది శంకరానందీయముతో సమానము.

♦ తక్కినది శంకరానందీయముతో సమానము.

‖ శ్రీధరీయముతో సమానము.

సాత్త్వికమైనకర్మమునకు సాత్త్వికంబును నిర్మలంబు నగుఫలము గలుగును. రాజసకర్మమునకు రాజసమైనదుఃఖము ఫలము. తామసకర్మమునకుఁ దామసమైనయజ్ఞానము ఫలమని పెద్దలు చెప్పుచున్నారని తాత్పర్యము.

ఆ. భావములకు ఫలముఁ జెప్పి సాత్త్వికాదికర్మములకు ఫలము చెప్పుచున్నారు అతీ తేత్యాదిగా. సుకృతస్య — శోభనముగాఁ జేయఁబడినది, పుణ్యమునకని యర్థము. సాత్త్వికము — అసుద్ధరహిత మనుట. సాత్త్వికము — సత్త్వముచే నిర్వృత్తము. నిర్మలము — రజస్తమోజన్యమైనమలము లేనిది. రజశ్శబ్దమునకు రాజసకర్మమని యెట్లర్థము చెప్పవచ్చు ననఁగాఁ జెప్పుచున్నారు కర్మము ఇత్యాదిగా. దుఃఖమే — దుఃఖబహులము కావున దుఃఖమే యని యర్థము. ఇట్లు వ్యాఖ్యానము చేయుటకు నేమి కారణ మనఁగాఁ జెప్పుచున్నారు కారణేత్యాదిగా. పాపమిశ్రమగుపుణ్యకర్మము రజోనిమిత్త మగునది కారణం బగుటవలన తదనుసారంబున ఫలముగూడ రజోనిమిత్తం బనుట యుక్త మని యర్థము. అజ్ఞానము — అవివేకప్రాయ మగుదుఃఖము తామసమైన యధర్మమునకు ఫల మని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా.

హ. సుకృతస్య = పుణ్యమునకు. సాత్త్వికమ్ - సత్త్వప్రధానము. నిర్మలమ్ = శుద్ధము సుఖస్వరూపము. రజసః = రాజసకర్మమునకు. అజ్ఞానమ్—మోహావృత మని యర్థము.

శం ఇట్లు గుణములస్వరూపంబును బంధకత్వంబును వృద్ధిని వృద్ధికార్యమును బ్రతిపాదించి సత్త్వాదిగుణప్రధానము లగుకర్మములఫలముఁ జెప్పుచున్నాఁడు.—సుకృతస్య = శమదమశ్రద్ధాదిసత్త్వసంపత్తితోను ఈశ్వరార్పణబుద్ధితోను చక్కఁగా ననుష్ఠింపఁబడినసాత్త్విక మగు; కర్మణః=కర్మమునకు; సాత్త్వికమ్—సత్త్వగుణముచే నభివృద్ధంబును; నిర్మలమ్=మల మనఁగా గుణవైషమ్యముచే కలుగుదుఃఖము, అది లేనిదియు నగు, బ్రహ్మలోకసుఖమును గాని విష్ణులోకసుఖమును గాని; ఫలమ్=ఫలమునుగా; ఆహుః=చెప్పుచున్నారు. రజసస్తు=రాజసము రజోగుణప్రధానము కామసంకల్పాదిపూర్వకముగా ననుష్ఠింపఁబడినది యగుకర్మమునకు; దుఃఖమ్=గమనాగమనసంతాపాదిదుఃఖభూయిష్ఠం బగుస్వర్గసుఖమును; ఫలమ్=ఫలమునుగా చెప్పుచున్నారు. తమసః = తమోగుణనిర్వృత్తమై విధినియమశ్రద్ధారహిత మగు

తామసకర్మమునకు; అజ్ఞానమ్ = భోక్తృభోగ్యగుణరసజ్ఞానరహిత మగు నిద్రామయసుఖమును; ఫలమ్ = ఫలమునుగాఁ జెప్పుచున్నా రని యర్థము.

మ. ఇప్పుడు స్వానురూపకర్మద్వారమున సత్త్వాదిగుణములకు విచిత్రఫలత్వమును జెప్పుచున్నాఁడు.—సుకృతస్య=సాత్త్విక మగు; కర్మణః=ధర్మమునకు; సాత్త్వికమ్ = సత్త్వగుణముచే నిర్వృత్తమగు; నిర్మలమ్ = రజస్తమోమలములసంపర్కము లేనట్టి; సుఖమును, ఫలమ్=ఫలమునుగా; ఆహుః = మహర్షులు చెప్పుచున్నారు. రజసస్తు=రాజస మగుకర్మమునకు,పాపమిశ్ర మగుపుణ్యమునకు; ఫలమ్ = రాజస మగుఫలము; దుఃఖమ్ = దుఃఖబహుల మైనయల్పసుఖము, కార్యము కారణానురూప మగుటవలన. అజ్ఞానమ్ — అవివేకప్రాయ మగుదుఃఖము; తమసః=తామసకర్మమునకు అధర్మమునకు; ఫలమ్. సాత్త్వికాదికర్మలక్షణమును నియతం సఙ్గరహిత మిత్యాదిగ్రంథముచేత అష్టాదశాధ్యాయంబునఁ జెప్పఁబోవుచున్నాఁడు. ఇట రజస్తమశ్శబ్దములు తత్కార్య మగుకర్మమునందు వర్తించుచున్నవి, కార్యకారణముల కభేదోపచారమువలన. "గోభి శ్శ్రీణీత మత్సరమ్" అనుస్థలమున గోశబ్దము తజ్జన్య మగుపయస్సునందును, "ధాన్య మసి ధినుహి దేవాన్" అనుస్థలమున ధాన్యశబ్దము తజ్జన్య మగు తండులమునందును ఎట్లు వర్తించుచున్నవో అట్లు, అట పయస్తండులములవలె ఇట కర్మము ప్రకృత మగుటవలన.

శ్రీ. ఇప్పుడు సత్త్వాదిగుణములు స్వానురూపకర్మద్వారమున విచిత్రఫలహేతువు లగు నని చెప్పుచున్నాఁడు.—సుకృతస్యకర్మణః = సాత్త్వికకర్మమునకు; సాత్త్వికమ్ = సత్త్వప్రధాన మగు; నిర్మలమ్ = ప్రకాశబహుల మగుసుఖమును; ఫలమ్; ఆహుః, కపిలాదులు. రజసః — రాజసకర్మమున కని యర్థము, కర్మఫలప్రతిపాదనము ప్రకృత మగుటవలన; దుఃఖం ఫలమ్. తమసః — తామసకర్మమున కని యర్థము; అజ్ఞానమ్ — మూఢతను; ఫలమునుగాఁ జెప్పుచున్నారు. సాత్త్వికాదికర్మలక్షణం బష్టాదశాధ్యాయమున నియతం సఙ్గరహిత మిత్యాదిగ్రంథముచేఁ జెప్పఁబోవుచున్నాఁడు.

ప. *

రా. ఇట్లు సత్త్వవృద్ధియందు మరణము నొంది యాత్మవిదులకులమునందు జనియించినవానిచే ననుష్ఠింపఁబడిన, సుకృతస్యకర్మణః = ఫలాభిసంధిరహితమై మదా

* శ్రీధరీయముతో సమానము.

రాధనరూప మైనకర్మమునకు; ఫలమ్; వెండియు నంతకన్నను అధికసత్త్వగుణజని తంబై, నిర్మలమ్=దుఃఖగంధరహితము; అగు నని సత్త్వగుణపరిణామవిదులు చెప్పు చున్నారు. మరణకాలమునందు వృద్ధినొందిన, రజసస్తు=రజోగుణమునకో; ఫలమ్; ఫలసాధనకర్మాసక్తు లగువారికులమున జన్మమును అందు ఫలాభిసంధిపూర్వకముగా కర్మానుష్ఠానంబును తత్ఫలానుభవంబును వెండియు జన్మంబును రజోభివృద్ధియును వెండియు ఫలాభిసంధిపూర్వకకర్మానుష్ఠానంబును ఇత్యాదిపరంపరారూపసాంసారిక దుఃఖప్రాయమే యని చెప్పుచున్నారు రజోగుణతత్త్వవిదులు. అజ్ఞానం తమసః ఫలమ్ — ఇట్లు అంత్యకాలప్రవృద్ధ మగు తమోగుణమునకు ఫలము అజ్ఞానపరంపరా రూపము.

మూ రజసస్తు ఫలం దుఃఖమ్ — అల్ప మైనసుఖము గలదుఃఖము. అట్లు శార్కరాక్ష్యశ్రుతియందు. "రజసో హ్యేవ జాయతే మాత్రయా సుఖం దుఃఖం తస్మా త్తాః సుఖినో దుఃఖిన ఇత్యాచక్షతే" * అని. అట్లు కాదేని దుఃఖం బతికష్ట మగుటవలన రజోగుణమునకు తమోగుణముకన్న నుత్కృష్టత్వ ము లేకపోవును.

సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ
ప్రమాదమోహౌ తమసో భవతో ఽజ్ఞాన మేవ చ. ౧౭

భా నుఱియు నివి సత్త్వాదిగుణములవలనఁ గలుగును.—సత్త్వాత్ = లబ్ధాత్మక ♦ మగు సత్త్వగుణమువలన; జ్ఞానమ్=జ్ఞానము; సంజాయతే= చక్కఁగా పుట్టుచున్నది. రజసః=రజోగుణమువలన; లోభఏవచ=లోభము పుట్టుచున్నది. తమసః = తమోగుణమువలన; ప్రమాదమోహౌ = ప్రమాదమును మోహమును ఈరెండును; భవతః = కలుగుచున్నవి. అజ్ఞానమేవచ = అజ్ఞానముకూడ కలుగుచున్నది.

నిరూఢ మైనసత్త్వగుణమువలనఁ జక్కనిజ్ఞానము కలుగును. రజోగుణ మువలన లోభము కలుగును. తమోగుణమువలనఁ బ్రమాదమోహములును అజ్ఞాన మును గలుగు నని తాత్పర్యము.

* రజోగుణమువలన లేశముచే సుఖ మైనదుఃఖము పుట్టుచున్నది అందువలన వారలను సుఖు లును దుఃఖులును అని చెప్పుచున్నారు.

♦ పొందఁబడిన స్వరూపము గలది, నిరూఢ మనుట.

ఆ. విహితప్రతిషిద్ధజ్ఞానకర్మరూపము లైన సత్త్వాదిలక్షణములను సంక్షేపించి చెప్పుచున్నారు మఱియు నిత్యాదిగా. జ్ఞానము— సర్వకరణములద్వారమునఁ గలుగునది. అజ్ఞానము—వివేకాభావము.

హ. *

శం. సత్త్వాదిగుణములకార్యాంతరముఁ జెప్పుచున్నాఁడు కార్యముచేఁ గారణము నెఱుంగుటకు.—సత్త్వాత్ = సత్త్వగుణావిర్భావమువలన; జ్ఞానమ్ = కార్యాకార్యవివేకజ్ఞానము; సంజాయతే = కలుగుచున్నది. రజసః = రజోగుణావిర్భావమువలన; లోభ ఏవచ=పదార్థాదులయందు తృష్ణ కలుగుచున్నది. తమసః= తమోగుణావిర్భావమువలన; ప్రమాదమోహౌ; భవతః. అజ్ఞానమేవచ — బుద్ధిజాడ్యము, చేయవలసినదాని నెఱుంగకుండుట కూడ; కలుగుచున్నది.

మ. ఇట్టి విచిత్రఫలము గలుగుటకు మున్ను చెప్పినహేతువునే చెప్పుచున్నాఁడు.—జ్ఞానమ్ = సమస్తకరణములద్వారమునఁ గలుగునట్టి ప్రకాశరూపమైనజ్ఞానము; సత్త్వాత్సంజాయతే. అందువలన దానికనురూపముగ సాత్త్వికకర్మమునకు ప్రకాశబహుల మగుసుఖము ఫల మగుచున్నది. రజసః; లోభః = కోట్యవధివిషయములు కలిగినను నివర్తింప నశక్య మైన యభిలాషవిశేషము కలుగుచున్నది. అది నిరంతరము వృద్ధినొందుచుఁ బూరింప నశక్య మై సర్వదా దుఃఖహేతు వగుటవలన దానిచేఁ జేయునట్టి రాజసకర్మమునకు దుఃఖము ఫల మగుచున్నది. ఇట్లు, ప్రమాదమోహౌ; తమోగుణమువలన, భవతః = కలుగుచున్నవి. అజ్ఞానమేవచ=అజ్ఞానముకూడ కలుగుచున్నది; ఏవకారము ప్రకాశమును వ్యావర్తించుచున్నది. కావున తామసకర్మమునకు తామస మగు నజ్ఞానాదిప్రాయము ఫల మగు ననుట యుక్తమే యని యర్థము. ఇట అజ్ఞాన మనఁగా అప్రకాశము. ప్రమాదమోహములకు అప్రకాశో ఽప్రవృత్తిశ్చ అనుస్థలమున వ్యాఖ్యానము చేయఁబడినది.

శ్రీ. అందులకే హేతువును చెప్పుచున్నాఁడు.—సత్త్వాత్ జ్ఞానం సంజాయతే. అందువలన సాత్త్వికకర్మమునకు ప్రకాశబహులం బగుసుఖము ఫల మగుచున్నది. రజసో లోభ స్సంజాయతే. లోభము దుఃఖహేతు వగుటవలన తత్పూర్వక మగుకర్మమునకు దుఃఖము ఫల మగుచున్నది. తమసః; ప్రమాదమోహౌఽజ్ఞాన

* దీని కీవ్యాఖ్యానము లేదు.

ములు కలుగుచున్నవి. అందువలన తామసకర్మమునకు అజ్ఞానము నొందించుఫల మగు ననుట యుక్తమే యని యర్థము.

ప. అర్థము స్పష్టము.

రా. ప్రవృద్ధము లగు సత్త్వాదిగుణములచే జనించు నిర్మలాదిఫలం బది యెట్టి దనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఇట్లు పరంపరచే వృద్ధినొందిన సత్త్వగుణము వలన ఆత్మతత్త్వాపరోక్షరూప మగుజ్ఞానము కలుగుచున్నది. అట్లు ప్రవృద్ధం బగు రజోగుణమువలన స్వర్గాదిఃఫలలోభము కలుగుచున్నది. అట్లు ప్రవృద్ధ మగు తమోగుణమువలన, ప్రమాదః = అనవధానమువలన అసత్కార్యమునందు ప్రవృత్తియును; దానివలన, మోహః = విపరీతజ్ఞానమును; దానివలన మిక్కిలి యధిక మైనతమస్సును దానివలన, అజ్ఞానమ్ = జ్ఞానాభావంబును; కలుగుచున్నవి.

మా. *

ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః
జఘన్యగుణవృత్తస్థా అధో గచ్ఛన్తి తామసాః. ౧౮

భా. మఱియును.—సత్త్వస్థాః = సత్త్వగుణవృత్తమునం దున్నవారలు; ఊర్ధ్వమ్=ఉత్తమలోకమునకు; గచ్ఛన్తి=పోవుచున్నారు — దేవలోకాదులయందుఁ బుట్టుచున్నారు. రాజసాః=రాజసులు; మధ్యే= నడుమను; తిష్ఠన్తి = నిలుచుచున్నారు — మనుష్యులయందుఁ బుట్టుచున్నారు. జఘన్యగుణవృత్తస్థాః = జఘన్య మైనగుణము — అధమ మైన తమోగుణము, దానియొక్కవృత్తము—నిద్రాలస్యాదికము, దానియం దున్నవారలు మూఢు లగు; తామసాః = తామసులు; అధః = క్రిందికి; గచ్ఛన్తి = పోవుచున్నారు — పశ్వాదులయందుఁ బుట్టుచున్నారు.

సత్త్వగుణప్రయుక్తము లైన జ్ఞానకర్మములయం దుండువారలు దేవతాదులయందు జన్మింతురు. అట్లు రజోగుణవ్యాపారములయం దుండువారలు మనుష్యులయందుఁ బుట్టుదురు. తమోగుణవ్యాపారము లైన నిద్రాలస్యాదులయం దున్నవారలు పశ్వాదులలో జన్మింతు రని తాత్పర్యము.

* ౧౭-౧౮ ఈశ్లోకముల కీభాష్యము లేదు.

ఆ. సాత్త్వికాదిజ్ఞానకర్మఫలములను బ్రతిపాదించి చెప్పనియంశముల సంగ్రహించుటకై సామాన్యమున నుపసంహరించుచున్నారు మఱియును నిత్యాదిగా. మఱియును — చెప్పఁబోవుఫలమువలనఁగూడ సత్త్వాదుల నెఱుంగవచ్చు నని యర్థము. సత్త్వగుణవృత్తమునందు — సత్త్వగుణముయొక్క-వృత్తము — ఉత్తమమైనకర్మము లేక జ్ఞానము, దానియం దని యర్థము. రాజసులు — రజోగుణముచేఁ గలుగుకర్మమునందుఁ గాని జ్ఞానమునందుఁ గాని యున్నవారలు.

హ. సాత్త్వికులు దేహము విడిచి స్వకర్మఫలభోగముకొఱకు, ఊర్ధ్వమ్= దేవలోకాదులను, గచ్ఛన్తి = పొందుచున్నారు. రాజసులు స్వకర్మఫలభోగము కొఱకు మనుష్యలోకమునందు జన్మించుచున్నారు. జఘన్యగుణ మనఁగాఁ దమోగుణము, దానియొక్క-వ్యాపారమైన మోహామునం దున్నవార లగు తామసులు, అధోగచ్ఛన్తి.

శం. జ్ఞానాదిగుణకార్యములను బ్రతిపాదించి సత్త్వాదిగుణనిష్ఠులగతిని జెప్పుచున్నాఁడు.——సత్త్వస్థాః=మోక్షేచ్ఛచే సత్త్వగుణోత్పన్నమగు సదసద్వివేకజ్ఞానమునందును తత్కా-ర్య మగు పరమేశ్వరోపాసనాదులయందును ఎవ్వరు నిలుచుచున్నారో వారు సత్త్వస్థులు, అట్టి పురుషులు; ఊర్ధ్వమ్ = ఊర్ధ్వలోకమును, బ్రహ్మవిష్ణ్వాదిలోకమును; గచ్ఛన్తి. రాజసాః = రజోగుణోత్పన్న మగు కామసంకల్పాది గుణయుక్తజ్ఞానమునందును తత్కా-ర్య మగు శ్రౌతాదికర్మమునందును భోగేచ్ఛచే నెవ్వరు నిలుచుచున్నారో వారు, రాజసపురుషులు; మధ్యే = బ్రహ్మలోకమునకును తిర్యగ్లోకమునకును నడుమ, గమనాగమనములచే దేవలోకమనుష్యలోకములయందు; తిష్ఠన్తి. జఘన్యము — నికృష్టమైన తమోగుణ మేది గలదో దానియొక్క-వృత్తమునందు — తమఃప్రధాన మైన యజ్ఞానమునందుఁ గాని సదసద్వివేకవర్జిత మగు కర్మమునందుఁ గాని ఎవరు నిలుచుచున్నారో అట్టి తామసు లగుపురుషులు కార్యాకార్యవివేకజ్ఞానశూన్యులు; అధోగచ్ఛన్తి — తిర్యగ్యోనులయందుఁ బుట్టుచున్నారు. మాటిమాటికి మరణము నొందుచున్నా రని యర్థము.

మ. ఇప్పుడు సత్త్వాదిగుణవృత్తనిష్ఠులకుఁ బూర్వోక్తఫలమునే యూర్ధ్వమధ్యాధోవిభాగముచేఁ జెప్పుచున్నాఁడు.——ఇక్క-డ తృతీయగుణమునందు వృత్తశబ్దము ప్రయోగించుటవలన మొదటి రెంటియందును వృత్తమే వివక్షితము. అందుచే, సత్త్వస్థాః=సత్త్వవృత్తమునందు — శాస్త్రీయ మగుకర్మమునందును జ్ఞాన

మునందును నిరతు లగువారు; ఊర్ధ్వమ్ = సత్యలోకపర్యంత మగుదేవలోకమును; గచ్ఛన్తి — వారు దేవతలయందుఁ బుట్టుదురు జ్ఞానతారతమ్యముచేత. రాజసాః = రజోగుణవృత్తమునందు — లోభాదియుక్త మగురాజసకర్మమునందు నిరతు లగు వారు; మధ్యే = పుణ్యపాపమిశ్ర మగుమనుష్యలోకమునందు; తిష్ఠన్తి — ఊర్ధ్వ లోకమును బొందరు, అధోలోకమునుం బొందరు, మనుష్యులయందుఁ బుట్టుదురు. జఘన్యగుణవృత్తస్థాః = జఘన్యము — మీఁది రెండుగుణములకన్నను వెనుకటిది నికృష్ట మగు తమోగుణముయొక్క వృత్తమునందు నిద్రాలస్యాదికమునం దున్న వారలు; అధోగచ్ఛన్తి — పశ్వాదులయందుఁ బుట్టుచున్నారు. కొందలు సాత్త్వి కులును రాజసులును ఒకానొకప్పుడు జఘన్యగుణవృత్తస్థు లగుదురు కావునఁ జెప్పు చున్నాఁడు. -- తామసాః = సర్వదా తమఃప్రధాను లైనవారు, ఇతరు లొకానొక ప్పుడు తద్వృత్తస్థు లైనను తత్ప్రధానులు కా రని భావము.

శ్రీ. ఇప్పుడు సత్త్వాదివృత్తమే స్వభావముగాఁ గలవారలకు ఫలభేదముఁ జెప్పుచున్నాఁడు.—సత్త్వస్థాః = సత్త్వవృత్తమునం దున్నవారలు, సత్త్వవృత్తమే ప్రధానముగా గలవారలు; ఊర్ధ్వంగచ్ఛన్తి — సత్త్వోత్కర్ష తారతమ్యమువలన ఉత్త రోత్తరముగా ఒకటికన్న నొకటి నూఱింత లధికమైన యానందముగల సత్యలోక పర్యంతము లగు గంధర్వ పితృదేవాదిలోకములను బొందుచున్నా రని యర్థము. రాజసాః — తృష్ణాదినిరతు లగువారు; మధ్యేతిష్ఠన్తి — మనుష్యలోకమునందే పుట్టు చున్నారు. జఘన్యము — నికృష్ట మగుతమోగుణము, దానివృత్త మగు ప్రమాద మోహాదులయం దున్నవారలు; అధోగచ్ఛన్తి — తమోవృత్తితారతమ్యమువలన తామిస్రాదినిరయములందుఁ బుట్టుచున్నారు.

ప. *

రా. ఇట్లు చెప్పినవిధంబున, సత్త్వస్థాః; ఊర్ధ్వం గచ్ఛన్తి — క్రమముగా సంసారబంధమునుండి మోక్షము నొందుచున్నారు. రజోగుణము స్వర్గాదిఫలలోభ హేతు వగుటవలన రాజసులు ఫలసాధన మగుకర్మము ననుష్ఠించి తత్ఫలము ననుభ వించి వెండియు జన్మమొంది ఆకర్మమునే చేయుచుందురు కావున మధ్యే తిష్ఠన్తి అని చెప్పఁబడెను. పునరావృత్తిరూప మగుటచే అది దుఃఖప్రాయమే యగును.

* శ్రీధరీయముతో సమానము.

ఇఁక తామసులు, జఘన్యగుణవృత్తిస్థాః * = ఉత్తరోత్తరము నికృష్టము లైన తమోగుణవృత్తులయం దున్నవారలు; అధోగచ్ఛన్తి — అంత్యజులుగాను తిర్యగ్జంతువులుగాను క్రిమికీటాదులుగాను స్థావరములుగాను గుల్మలతాదులుగాను శిలాకాష్ఠలోష్టతృణాదులుగాను క్రమక్రమముగా జన్మము నొందుదు రని యర్థము.

నా౽న్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టా౽నుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సో౽ధిగచ్ఛతి. ౧౯

భా. ప్రకృతిస్థత్వరూపం బగు మిథ్యాజ్ఞానముతోఁ గూడినట్టి పురుషునకు భోగ్యము లగు సుఖదుఃఖమోహాత్మకము లైనగుణములయందు నేను సుఖిని దుఃఖిని మూఢుఁడను అను సంగమేది గలదో అది కారణము పురుషునిసదసద్యోనిజన్మప్రాప్తిరూపం బగు సంసారమున కని సంక్షేపముగఁ బూర్వాధ్యాయమునం దేది చెప్పఁబడినదో ఆ యజ్ఞానమూలం బగు బంధకారణమైన మిథ్యాజ్ఞానము నీయధ్యాయంబున సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవా ఇత్యాదిగా నారంభించి గుణస్వరూపమును గుణవృత్తంబును స్వవృత్తముచే గుణబంధకత్వంబును గుణవృత్తనిబద్ధుండగు పురుషునిగతియు నను నీసర్వంబును విస్తరంబునఁ బ్రతిపాదించి ఇఁక సమ్యగ్దర్శనమువలన మోక్షము ప్రతిపాదింపవలయు నని చెప్పుచున్నాఁడు భగవంతుఁడు.—గుణేభ్యః = కార్యకరణవిషయాకారమునఁ బరిణతము లైనగుణములకంటె; అన్యమ్=ఇతరుని; కర్తారమ్=కర్తనుగా; యదా = ఎప్పుడు; ద్రష్టా = ఎఱింగినవాఁడు; నా౽నుపశ్యతి = మఱి చూడఁడో, సర్వావస్థము లగు గుణములే సర్వకర్మములకును కర్తలని చూచుచున్నాఁడో; గుణేభ్యశ్చ = గుణములకంటె; పరమ్ = వ్యతిరిక్తుని, గుణవ్యాపారసాక్షిభూతుని; వేత్తి = ఎఱుంగుచున్నాఁడో; అప్పుడు, మద్భావమ్ = నాయొక్కభావమును, నేనగుటను; సః = ఆద్రష్ట; అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

కార్యకరణవిషయాకారపరిణతము లగు గుణములే కర్తలు గాని యాగుణముల కంటె నితరుఁ డెవ్వఁడును కర్త లేఁ డని ఎప్పుడు జ్ఞాని యెఱుంగుచున్నాఁడో

* పేరిమతమునందు గుణవృత్తిస్థాః అనిపాఠము.

గుణవ్యాపారసాక్షిభూత మైన నిర్గుణబ్రహ్మమునుగాఁ దన్నెఱుంగుచున్నాఁడో అప్పు డాజ్ఞాని మద్భావమును బొందుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. ఏగుణమునం దెట్లనునది మొదలగు ప్రశ్నల కుత్తరముఁ జెప్పి గుణములనుండి మోక్షణం బెట్లను ప్రశ్న కుత్తరముఁ జెప్పుటకై పూర్వోక్తము ననువదించుచు మిథ్యాజ్ఞాననివర్తకం బగు సమ్యగ్దర్శనమును బ్రస్తావించుచున్నారు ప్రకృ తీత్యాదిగా. మోక్షము — గుణములనుండి విడుపు బ్రహ్మభావము. సత్త్వాది వాచకం బగు గుణశబ్దమునకు వివక్షితార్థముఁ జెప్పుచున్నారు కా ర్యేత్యాదిగా. మఱి — జ్ఞానానంతర మని యర్థము. అక్షరార్థముఁ బ్రతిపాదించి పూర్వార్థమున కార్థిక మైనయర్థముఁ జెప్పుచున్నారు స ర్వేత్యాదిగా. సర్వావస్థములు — తత్తత్కార్యకరణాకారపరిణతము లనుట. సర్వకర్మములకును — విహితప్రతిషిద్ధములైన కాయిక వాచిక మానసముల కని యర్థము. వ్యతిరిక్తతనే స్పష్టీకరించుచున్నారు గుణవ్యాపా రేత్యాదిగా. నిర్గుణబ్రహ్మాత్మ నని యర్థము. మద్భావమ్— బ్రహ్మాత్మను. పొందుచున్నాఁడు—అతనికి బ్రహ్మభావ మభివ్యక్త మగు నని యర్థము.

హ. ద్రష్టా = విద్వాంసుఁడు. గుణేభ్యః పరమ్ = గుణవ్యాపారసాక్షిభూతుని. మద్భావమ్ = ఈశ్వరభావమును.

శం. "త్రిభి ర్గుణ మయై ర్భావైః, దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, కారణం గుణసఙ్గోఽస్య" అని గుణములు మోహకంబులనియు దుర్జయంబు లనియు సదసద్యోనిజన్మకారణంబు లనియు నేది చెప్పఁబడినదో దానినే స్పష్టీకరించుటకై సత్త్వం రజ స్తమ ఇత్యాదిగ్రంథముచేత గుణములే సుఖజ్ఞానములయందును తృష్ణాసక్తికర్మప్రవృత్తులయందును ప్రమాదాలస్యనిద్రాదులయందును సంజకంబులై అవిద్యాదిదోషవంతుఁడును గుణతత్కార్యములయందహం మమేతి మిథ్యాజ్ఞానయుక్తుఁడు నగు పురుషునకు దేవ మర్త్యతిర్యగ్యోనులయందు జన్మాద్యనర్థకారణంబు లని ప్రతిపాదించి యిప్పుడు "మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే" అని చెప్పినరీతిని శాస్త్రాచార్యప్రసాదంబునను నాయనుగ్రహంబునను జక్కగా వివేచించి ఆత్మానాత్మస్వరూపము నెఱింగినట్టి బ్రహ్మవిదుండగుయతి గుణసంగముచేఁ గలుగు ననర్థము నెఱింగి యనాత్మవాసనకుఁ దాను వశుండు గాక ప్రత్యగ్దృష్టిని విడువనివాఁడై సర్వావస్థలయందును సర్వదా గుణములే కర్తలు కారయితలు భోక్తలనియు తా నసంగుఁ డనియు గుణతత్కార్యతద

వస్థాసాక్షి యనియుఁ జూచుచు సదాత్మనిష్ఠచేఁ గార్యసహితంబు లగు మూఁడుగుణముల నతిక్రమించి ముక్తుఁ డగు నని ప్రతిపాదించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.— "చక్షుషో ద్రష్టా శ్రోత్రస్య ద్రష్టా వాచో ద్రష్టా మనసో ద్రష్టా బుద్ధే ర్ద్రష్టా ప్రాణస్య ద్రష్టా తమసో ద్రష్టా సర్వస్య ద్రష్టా, సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ, అప్రాణో హ్యమనా శ్శుభ్రః" * ఇత్యాది శ్రుతులవలనను, "ఆత్మ దేహేంద్రియ మనోబుద్ధ్యాదులకంటె భిన్నుఁడు, ద్రష్ట యగుటవలన, ఘట ద్రష్టవలె" ఇత్యాది యుక్తులవలనను దేహేంద్రియాది భిన్నునిగాను స్వాత్మునుగాను ఆత్మస్వరూపమును చక్కఁగా నెఱింగినవాఁడై తా నవిక్రియుం డని, ద్రష్టా=ఎఱుంగునట్టియతి; యదా= ఏకాలమునందు సమాధిచే జ్ఞానపరిపాకదశయందు; గుణేభ్యః = గుణకార్యభూతము లైనదేహేంద్రియాదులకంటె; అన్యమ్ = భిన్నుని; కర్తారమ్ = కర్తనుగా; నాను పశ్యతి=చూడఁడో; కాయిక వాచిక మానసికము లగు విహితములకును నిషిద్ధములకును సామాన్యములగు సర్వకర్మములకును కర్త దేహేంద్రియములకంటె నతిరిక్తుఁ డని తలంపఁడో, ఆయాకర్మము నెఱవేఱినయుత్తరక్షణమే ఆయాకర్మమునకుఁ గర్త దేహేంద్రియాదికమే యని యెఱుంగుచున్నాఁడో, చక్షువే చూచుచున్నది శ్రోత్రమే వినుచున్నది మనసే తలంచుచున్నది బుద్ధియే యెఱుంగుచున్నది వాక్కే పలుకుచున్నది నేను కాదు నే ననింద్రియుఁడను అని తన్నకర్తనుగానే యెఱుంగుచున్నాఁడో, గజారూఢుఁడు గజమే నడుచుచున్నది గాని తాను నడవలే దని యెట్లు చూచుచున్నాఁడో అట్లు బ్రహ్మవిదుఁడు తనకంటె భిన్నము లని తెలియఁబడుచున్న దేహేంద్రియాదులే కర్త లనియు సత్త్వాదిగుణకార్యము లగు నవిద్యాకామాదులే కారయిత లనియు విజ్ఞానాత్మయే తత్ఫలభోక్త యనియుఁ దాను కర్త గాని కారయిత గాని భోక్త గాని కాఁ డని చూచుచున్నాఁడో, ఎప్పు డిట్లు బ్రహ్మవిద్యతి ఆత్మానాత్మ వివేకజ్ఞానముచేతఁ దనకంటె భిన్నమైన దేహేంద్రియాదికమునందే కర్తృత్వభోక్తృత్వములను జూచుచున్నాఁడో; అట్లే, గుణేభ్యః = గుణకార్యము లగు నహంకారాదులకంటె; పరమ్ = విలక్షణునిగా, అకర్తను అభోక్తను అగంతను అమంతను అబోద్ధను అవికారుని క్షేత్రతద్ధర్మతత్కర్మముల నంటనివానినిగా; స్వాత్మను,

* నేత్రమును జూచువాఁడు శ్రోత్రమును జూచువాఁడు వాక్కును జూచువాఁడు మనస్సును జూచువాఁడు బుద్ధిని జూచువాఁడు ప్రాణమును జూచువాఁడు తమస్సును — అజ్ఞానమును జూచువాఁడు సర్వంబును జూచువాఁడు, సాక్షియు ఆత్మయు కేవలుఁడును నిర్గుణుఁడును, ప్రాణరహితుఁడు మనోరహితుఁడు శుద్ధుఁడు.

వేత్తి = ఎఱుంగుచున్నాఁడో, నిష్కలుని నిష్క్రియుని శాంతుని ఆకాశమువలె పరిపూర్ణునిఁగాఁ జూచుచున్నాఁడో; ఇట్లు దేహేంద్రియాదులే కర్తలనియుఁ దాన కర్త యనియు నెప్పు డేవిద్వాంసుఁడు సాక్షాత్తుగాఁ జూచుచున్నాఁడో అప్పుడు, సః = ఆవిద్వాంసుఁడు; మద్భావమ్ = నిర్విశేషపరబ్రహ్మ మగునాయొక్క భావము మద్భావము, మత్స్వరూపతను పరిపూర్ణత్వమును; అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు, నిత్యనిరంతరసమాధిచేఁ బొందఁబడిన సమ్యగ్దర్శనముచేత ఇది సర్వంబును నేనును బ్రహ్మమే యని సర్వంబును దన్నును బ్రహ్మమాత్రమునుగాఁ జూచుచు గుణతత్కార్యరూప మగు ననర్థపరంపరను దాఁటి జీవించి యున్నపుడే బ్రహ్మరూపుఁ డగుచున్నాఁడు, ముక్తుఁ డగుచున్నాఁ డని యర్థము.

మ ఈ యధ్యాయమునందు మూఁడువిషయములు ప్రతిపాదింప నారంభింపఁబడినవి. అందు క్షేత్రక్షేత్రజ్ఞసంయోగ మీశ్వరాధీన మనుటయు గుణము లెవ్వి అవి యెట్లు బంధించు ననుటయు నీరెండువిషయంబులు ప్రతిపాదింపఁబడినవి. ఇప్పుడు గుణములనుండి యెట్లు మోక్షము? ముక్తునిలక్షణ మేమి? అనువిషయము ప్రతిపాదించుట కవశిష్టమై యున్నది. అందు గుణములు మిథ్యాజ్ఞానాత్మకము లగుటవలన సమ్యగ్దర్శనమువలన వానినుండి మోక్షణం బని చెప్పుచున్నాఁడు.— గుణేభ్యః = కార్యకరణవిషయాకారపరిణతము లైనగుణములకంటె; అన్యమ్ = ఇతరుని; కర్తారమ్ = కర్తనుగా; యదా = ఎప్పుడు; ద్రష్టా = విచారకుశలుఁ డగుపురుషుఁడు; నానుపశ్యతి = విచారానంతరము చూడఁడో, గుణములే యంతఃకరణబహిష్కరణ శరీరవిషయరూపమును బొందినవై సమస్తకర్మములకును గర్తలని చూచుచున్నాఁడో; గుణేభ్యశ్చ=తత్త దవస్థావిశేషంబునఁ బరిణతము లైనగుణములకంటె; పరమ్ = గుణతత్కార్యముల నంటనివానిని వాని భాసిల్లఁజేయువానిని జలతత్కంపాదుల నంటని సూర్యునివలె నున్నవానిని నిర్వికారుని సర్వసాక్షిని అంతట సమముగా నున్నవానిని క్షేత్రజ్ఞు నొక్కని; వేత్తి = ఎఱుంగుచున్నాఁడో. అప్పుడు, మద్భావమ్ = మద్రూపతను; సః = ఆద్రష్ట; అధిగచ్ఛతి.

శ్రీ. ఇట్లు ప్రకృతిగుణములచేఁ గలుగు సంసారమును విస్తరంబునఁ బ్రతిపాదించి యిప్పుడు తద్వివేకంబున మోక్షమును దెలుపుచున్నాఁడు.—యదా; ద్రష్టా = వివేకియై; బుద్ధ్యాద్యాకారపరిణతము లైన గుణములకంటె, అన్యం కర్తారం నానుపశ్యతి, మఱే మనఁగా గుణములే కర్మములను జేయుచున్న వని చూచు

చున్నాఁడో; గుణేభ్యశ్చ; పరమ్ = వ్యతిరిక్తుని, తత్సాక్షి యైనయాత్మను; వేత్తి; సః; మద్భావమ్ = బ్రహ్మత్వమును; అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

ప. ఇట్లు గుణప్రవాహరూప మగుసంసారమును వర్ణించి యిప్పుడు "ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః" అని పూర్వము ప్రతిజ్ఞ చేసినదానిని స్మృతికిఁ దెచ్చుచు మోక్షసాధనజ్ఞానోపాయమును జెప్పుచున్నాఁడు. *

రా. ఆహారవిశేషములచేతను ఫలాభిసంధిరహితసత్కర్మవిశేషములచేతను క్రమక్రమముగా సత్త్వమును వృద్ధినొందించుకొన్నవారికి గుణాత్యయద్వారంబున నూర్ధ్వగమనప్రకారమును జెప్పుచున్నాఁడు.—ఇట్లు సాత్త్వికాహారముల సేవించుచు ఫలాభిసంధి లేక భగవదారాధనరూపము లైనకర్మముల ననుష్ఠించుటచేత రజస్తమోగుణములను నిశ్శేషముగా నభిభవించి యుత్కృష్టం బగు సత్త్వంబున నున్నట్టి యాద్రష్ట, యదా గుణేభ్యో౽న్యం కర్తారం నా౽నుపశ్యతి — గుణములే స్వానురూపప్రవృత్తులయందుఁ గర్త లని చూచుచున్నాఁడో; గుణేభ్య శ్చ పరం వేత్తి—కర్త లగు గుణములకంటెఁ బరుని—అన్యుని ఆత్మను అకర్తనుగా నెఱుంగుచున్నాఁడో; సః; మద్భావ మధిగచ్ఛతి—నాయొక్క భావ మేది గలదో దానిఁ బొందుచున్నాఁడు. ఇది యభిప్రాయము.—స్వభావమునఁ బరిశుద్ధస్వభావుఁ డగునాత్మకు వివిధకర్మములయందుఁ గర్తృత్వము పూర్వపూర్వకర్మమూల మైనగుణసంగముచేఁ గలిగినది. ఆత్మ స్వభావంబున నకర్త యనియు అపరిచ్ఛిన్నజ్ఞానైకాకారుం డనియు త న్నెప్పుడు చూచుచున్నాఁడో అప్పుడు మద్భావము నొందుచున్నాఁడు.

మా. పరిణామికర్తను, గుణేభ్యోన్యం నానుపశ్యతి. కాదేని "యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిమ్" అన్నశ్రుతి విరోధించును. "నాహం కర్తా నకర్తా త్వం కర్తా యస్తు సదా ప్రభుః" అని మోక్షధర్మమునందు.

గుణా నేతా నతీత్య త్రీ న్దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తో౽మృత మశ్నుతే. ౨౦

భా. ఎట్లు పొందుచున్నాఁ డనఁగాఁ జెప్పుచున్నాఁడు.— ఏతాన్= ఈ యథోక్తము లైన; గుణాన్ = గుణములను; త్రీన్=మాయోపాధిభూతము లైనమూటిని; దేహసముద్భవాన్=దేహోత్పత్తిబీజభూతము

* పదయోజన శ్రీధరీయముతో సమానము.

లైనవానిని; అతీత్య = జీవించి యున్నపుడే అతిక్రమించి; దేహీ = దేహము గలవాఁడు; జన్మమృత్యుజరాదుఃఖైః=జన్మముచేతను మరణము చేతను ముసలితనముచేతను దుఃఖముచేతను; విముక్తః=జీవించి యున్న పుడే విడువఁబడినవాఁడై; విద్వాంసుఁడు, అమృతం = మోక్షమును; అశ్నుతే=పొందుచున్నాఁడు, ఈవిధముగా మద్భావము నొందుచున్నాఁ డని యర్థము.

మాయోపాధిరూపములై దేహోత్పత్తికిఁ గారణము లైన యీ సత్త్వరజస్తమోగుణముల మూఁటి నతిక్రమించి విద్వాంసుఁడు జన్మమృత్యుజరాదుఃఖములచే విముక్తుఁడై జీవించి యున్నపుడే మద్భావరూప మైనమోక్షము నొందుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. అనర్థసమూహమును విడిచి విద్వాంసుఁడు బ్రహ్మత్వము నొందుచున్నాఁ డను నర్థమును బ్రశ్నద్వారమున వివరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. యథోక్తము లన్నదానినే వివరించుచున్నారు మా యేత్యాదిగా. మాయయే యుపాధి, తద్రూపములు—అనర్థరూపము లైన సత్త్వాదుల నని యర్థము. వీనివలనఁ బుట్టుచున్నవి గావున సముద్భవము లనఁగాఁ గారణములు, దేహమునకు సముద్భవములు దేహసముద్భవము లను వ్యుత్పత్తిని గ్రహించి వ్యాఖ్యానము చేయుచున్నారు దేహోత్పత్తీత్యాదిగా. ఏవిద్వాంసుఁ డవిద్యామయము లైనగుణముల జీవించి యున్నపుడే యతిక్రమించి యున్నాఁడో వానినే విశేషించుచున్నారు జన్మేత్యాదిగా. మున్ను విస్తరంబునఁ జెప్పఁబడినదియు యిప్పుడు ప్రసంగవశమువలన సంక్షేపముగాఁ బ్రతిపాదింపఁబడినదియు నగు సమ్యగ్దర్శనమునకు ఫలము చెప్పుచున్నారు ఈవిధముగా నిత్యాదిగా.

హ. దేహసముద్భవాన్ = దేహమునకుఁ గారణభూతము లైనవానిని.

శ ౦. కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములు గల దేహేంద్రియాదులకంటెఁ భిన్నుఁడే యవిక్రియుం డగు నాత్మ యని యెఱింగి బ్రహ్మవిదుం డగుయతి యెల్లప్పుడును స్వానుభూతిపరుండై గుణత్రయము నతిక్రమించిననే ముక్తుఁ డగును, కానిచోఁ గాఁ డని చెప్పుచున్నాఁడు.—ఎట్లాదిత్యుఁడు మేఘముకంటె భిన్నుఁడై మేఘతత్కార్యముల నంటఁడో అట్లు దేహేంద్రియాదులకంటె భిన్నుఁడై దేహతత్కార్యముల స్పృశింపకయె యున్నవాఁ డాత్మ యని యెఱింగి, దేహీ = బ్రహ్మవిదుం డగుయతి;

ఏతాన్ = ఈ; చిత్తప్రసాదరాగలోభమోహాదిలింగములచే నెఱుఁగఁబడుచున్నవై సుఖజ్ఞానకర్మప్రవృత్తిప్రమాదాదులయందే పురుషున కాసక్తి కలిగించి జ్ఞానమును దత్ఫలమును బ్రతిబంధించునట్టివి; కావుననే, దేహసముద్భవాన్ = దేహారంభకము లగు; తమపరిణామవిశేషము లగు దయాసత్యశౌచవినయదానశీలత్వాదిసాత్త్వికవికారములచేతను రాగద్వేషలోభాసూయాదిరాజసవికారములచేతను మోహాభినివేశాహంకారమమకారాదితామసవికారములచేతను పుణ్యాపాపములచేతను సత్త్వాదిగుణములే దేహోత్పత్తికి హేతువులు; అట్టి యీ, త్రీన్గుణాన్ = సత్త్వాదిగుణముల మూఁటిని, గుణధర్మము లైన యవిద్యాకామాదులను; అతీత్య — అతిక్రమించి, ప్రత్యగ్వృత్తిచే ఇది సమస్తమును నేనును బ్రహ్మమే యను సర్వత్ర బ్రహ్మమాత్రదర్శనాగ్నిచేత గుణములను గుణకార్యభూతము లైన అహం మమేత్యాదివిపరీతప్రత్యయములను నిర్దహించి సన్మాత్రాత్ముఁడై; జన్మమృత్యుజరాదుఃఖైః—దేహసంబంధమునఁ గలిగినవానిచే; విముక్తః=జన్మాదిదుఃఖములచే స్పృశింపఁబడనివాఁడై; అమృతమ్ = విదేహకైవల్యమును; అశ్నుతే — నిత్యాఖండానందైకరసాద్వితీయబ్రహ్మరూపమున నుండు నని యర్థము.

మ. ఎట్లు పొందుచున్నాఁ డనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఏతాన్గుణాన్ = మాయాత్మకము లైన యీగుణములను; త్రీన్ = సత్త్వరజస్తమముల మూఁటిని; దేహసముద్భవాన్ — దేహోత్పత్తిబీజభూతము లైనవానిని; అతీత్య=జీవించి యున్నపుడే తత్త్వజ్ఞానముచే బాధించి ; జన్మమృత్యుజరాదుఃఖైః = జన్మముచేతను మృత్యువుచేతను వార్ధకముచేతను ఆధ్యాత్మికాదిదుఃఖములచేతను మాయామయము లైనవానిచేత ; విముక్తః = జీవించి యున్నపుడే తత్సంబంధము లేనివాఁడై; విద్వాంసుఁడు, అమృతమ్ = మోక్షమును, సుధ్యానమును; అశ్నుతే = పొందుచున్నాఁడు.

శ్రీ. అందువలన గుణకృతసర్వానర్థంబులు నివర్తిల్లి కృతార్థుం డగు నని చెప్పుచున్నాఁడు.—దేహసముద్భవాన్ = దేహాకారము లైన సముద్భవములు—పరిణామములు గల; ఏతాన్ త్రీన్ గుణాన్, అతీత్య = అతిక్రమించి; వానిచేఁ జేయఁబడు జన్మాదులచే విముక్తుండై, అమృతమశ్నుతే = బ్రహ్మానందము నొందుచున్నాఁడు.

ప. *

* శ్రీధరీయముతో సమానము.

రా. కర్త లగు గుణములకంటె భిన్నునిగా అకర్తనుగా నాత్మను జూచుచు భగవద్భావము నొందుచున్నాఁ డని చెప్పఁబడినది. ఆ భగవద్భావ మెట్టి దనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఈ దేహీ, దేహసముద్భవాన్ = దేహాకారమునఁ బరిణత మైన ప్రకృతివలనఁ బుట్టిన; ఏతాన్ త్రీన్ గుణాన్=ఈ సత్త్వాదిగుణములమూఁటిని; అతీత్య; వానికంటె భిన్నుఁడై జ్ఞానైకాకారుఁ డైన యాత్మను జూచుచు, జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తః; అమృతమ్ = ఆత్మను; అనుభవించుచున్నాఁడు. ఇది మద్భావ మని యర్థము.

మా. •

అర్జున ఉవాచ.—

కైర్లింగై స్త్రీన్ గుణా నేతా నతీతో భవతి ప్రభో
కిమాచారః కథం చైతాం స్త్రీన్ గుణా నతివర్తతే. ౨౧

భా. జీవించియున్నపుడే గుణముల నతిక్రమించి యమృతము నొందుచున్నాఁ డన విని ప్రశ్నబీజము నొందినవాఁడై యర్జునుం డిట్లనియె— కైః లింగైః = ఏగుఱుతులచేత; ఏతాన్ = ఈ వివరింపఁబడిన; త్రీన్ గుణాన్ = మూఁడుగుణములను; అతీతః=అతిక్రమించినవాఁడు; భవతి = ఉండును? ప్రభో = ఓ భగవంతుఁడా! కి మాచారః = అతఁడు ఎట్టి యాచారము గలవాఁడు? కథంచ = ఏవిధమున; ఏతాన్ త్రీన్ గుణాన్ = ఈ మూఁడుగుణములను; అతివర్తతే = అతిక్రమించును?

అర్జునుం డిట్లనియె. భగవంతుఁడా! ఈ మూఁడుగుణముల నతిక్రమించిన వాఁ డేమి గుఱుతులు గలిగి యుండును? అతని యాచార మెట్టిది? ఎట్లు మఱి యీమూఁడుగుణముల నతిక్రమింపవచ్చును? అని తాత్పర్యము.

ఆ. సమ్యగ్దర్శనఫలము గుణాతిక్రమణపూర్వకమైన యమృతత్వం బని చెప్పినదానిని విని యిఁక ముక్తునిలక్షణము చెప్పవలయు నని ప్రకృతము నడుగఁ గోరినయర్జునునిప్రశ్నము తీయుచున్నారు జీవించి ఇత్యాదిగా. సత్త్వాదిగుణము లేవి వ్యాఖ్యాతము లయ్యెనో వానిపరిణామము లైన యధ్యాసముల నతిక్రమించినపురుషుని ఏలింగములచే నెఱుంగవలయునో వానిం జెప్పవలయును, సిద్ధికొఱకుఁ బూర్వ

• ౨౧—౨౭ ఈ శ్లోకముల కీభాష్యము లేదు.

మనుష్ఠింపవలసినవియును సిద్ధి నొందిన పిమ్మట నయత్నలభ్యంబులు నగు నాలింగము లేవియని యడుగుచున్నాఁడు కై రిత్యాదిగా. యథేష్టచేష్టను వ్యావర్తించుటకై రెండవప్రశ్నము కిమాచారః అని. గుణాతిక్రమణమున కుపాయముగా జ్ఞానము చెప్పఁబడినది కావున నుపాయప్రకారము నెఱుంగుటకై ప్రశ్నాంతరము కథ మిత్యాదిగా.

హ. లింగైః — చిహ్నములచేత. అతీతః = అతిక్రమించినవాఁడు.

శం. దేహవ్యతిరిక్తాత్మదర్శి యగు యతి జీవించి యున్నపుడే మూఁడుగుణముల నతిక్రమించి ముక్తుఁ డగుచున్నాఁ డని విని యాశ్చర్యము నొందినవాఁడై గుణాతీతునిలక్షణమును ఆచారమును గుణాతిక్రమణోపాయమును ఎఱుంగఁగోరి యర్జునుం డి ట్లనియె.—మిక్కిలి భాస్వరరూపుఁ డగుటవలన ప్రభు వనఁగా చిద్ఘనుఁడు, తత్సంబుద్ధి ఓప్రభూ! ఏతాన్ =ఈ చెప్పఁబడినలక్షణములు గల; త్రీన్‌గుణాన్; అతీతః = అతిక్రమించి బ్రహ్మరూపుఁడై యున్నబ్రహ్మవిదుఁ డగుయతి; కైః లింగైః = ఏలక్షణములచేత; భవతి—ఎఱుంగఁబడుచున్నాఁడు ? వేనిచే నితఁడు గుణాతీతుఁ డని దెలియవచ్చునో అట్టివి గుణాతీతుం డగు సిద్ధునిలక్షణము లేవి యని యర్థము. గుణాతీతుఁడు, కిమాచారః=ఎట్టియాచారము గలవాఁడు? వీఁడు వైదికము నాచరించునా? లౌకికము నాచరించునా? లేక యథేష్టముగా నాచరించునా? అని యర్థము. ఏతాన్ = ఈ, తమతమవికారములచేత సముద్రములవలె నుండునట్టి, త్రీన్‌గుణాన్ = మూఁడైన సత్త్వాదిగుణములను, మూఁ డనుట తత్సాధనము దుర్లభ మని దెలుపుచున్నది; కథంచ = ఏవిధముచేత; అతివర్తతే = అతిక్రమించుచున్నాఁడు? ఏ యుపాయముచే నితఁడు గుణత్రయాతిక్రమణము చేయుచున్నాఁడు? ఈ మూఁడుప్రశ్నములకును జక్కగా సమాధానము చెప్పవలయు నని యర్థము.

మ. ఈ గుణముల నతిక్రమించి జీవించి యున్నపుడే యమృతము నొందుచున్నాఁ డనుటను విని గుణాతీతునిలక్షణమును ఆచారమును గుణాతీతుఁ డగుటకుపాయమును దెలియఁ గోరినవాఁడై యర్జునుం డి ట్లనియె.—ఏతా న్గుణా నతీతః= ఈగుణముల నతిక్రమించినవాఁ డెవఁడో అతఁడు; కై ర్లిఙ్గై ర్భవతి=ఏలక్షణములతోఁ గూడినవాఁ డగుచున్నాఁడు? ఏలక్షణములచే నతనిఁ దెలియనగునో వాని నాకుఁ దెలియఁజెప్పు మని యొకప్రశ్నము. ప్రభు వగుటవలన భృత్యునిదుఃఖమును భగవంతుఁడే నివారింపవలయు నని సూచించుచు సంబోధించుచున్నాఁడు ప్రభో అని.

ఏది వీని యాచారము అని కిమాచారః. ఇతఁడు యథేష్టచేష్టుఁడై యుండునా లేక నియమము కలిగి యుండునా యని రెండవప్రశ్నము. కథంచ = ఏప్రకారముచేత; ఏతాన్ త్రీన్గుణాన్; అతివర్తతే = అతిక్రమించుచున్నాఁడు? గుణాతీతత్వోపాయం బేమి యని మూఁడవప్రశ్నము.

శ్రీ. ఈ గుణముల నతిక్రమించి యమృతము నొందుచున్నాఁ డన విని గుణాతీతునిలక్షణమును ఆచారమును గుణాత్యయోపాయమును జక్కఁగా దెలియఁ గోరినవాఁడై యర్జునుం డి ట్లనియె.—ప్రభో; కైర్లిఙ్గైః = తనయందుఁ బుట్టిన వగు నెట్టి చిహ్నములతో; గుణాతీతుం డగు దేహి యున్నాఁ డని లక్షణప్రశ్నము. కిమాచారః = ఏ యాచారము గలవాఁడు? ఎట్లు వర్తించు నని యర్థము. కథంచ = ఏ యుపాయముచేత; ఈ గుణముల మూఁటిని గూడ నతిక్రమించును? దానిఁ జెప్పు మని యర్థము.

మ. *

రా. గుణాతీతునిస్వరూపమును దెలుపునట్టి యాచార ప్రకారంబును గుణాత్యయహేతువును నడుగుటకై యర్జునుం డి ట్లనియె.—సత్త్వాదు లగు నీమూఁడు గుణముల నతిక్రమించినవాఁడు, కైః లిఙ్గైః = ఏలక్షణములచేత; ఉపలక్షితుఁ డగుచున్నాఁడు? కిమాచారః — ఏ ఆచారముతోఁ గూడినవాఁడు? వీనిస్వరూపము నెఱుంగుటకు గుఱుతైన యాచార మెట్టి దని యర్థము. కథంచ = ఏయుపాయముచేత; ఈసత్త్వాదిగుణములమూఁటిని, అతివర్తతే ?

శ్రీభగవా నువాచ.—

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహ మేవ చ పాణ్డవ
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి. ౨౨

భా. గుణాతీతునిలక్షణంబును గుణాతీతత్వోపాయంబును అర్జునునిచే నడుగఁబడినవాఁడై ప్రశ్నద్వయంబునకును బ్రతివచనము శ్రీభగవంతుఁ డి ట్లనియె.—ఏలింగములతోఁ గూడినవాఁడు గుణాతీతుఁ డని యేప్రశ్న నడిగితివో దాని వినుము. ప్రకాశంచ = సత్త్వకార్య మైన ప్రకాశమును; ప్రవృత్తించ = రజఃకార్య మైనప్రవృత్తిని; మోహమే

* శ్రీధరీయముతో సమానము.

నచ = తమఃకార్యమైనమోహమును; వీనిని, సంప్రవృత్తాని=చక్కగా విషయభావంబున వృద్ధిఁ బొందినవానిని; నద్వేష్టి = ద్వేషింపఁడు. పాణ్డవ=ఓయర్జునుఁడా ! నాకుఁ దామసప్రత్యయము కలిగెను అందుచే మూఢుఁడ నైతిని; అట్లు దుఃఖాత్మక మైనరాజస మగుప్రవృత్తి నాకుఁ బుట్టెను, నేను రజోగుణముచేఁ బ్రవర్తితుఁడ నైతిని, స్వరూపము నుండి చలనము నొందితిని, నాస్వరూపావస్థానమునుండి యీభ్రంశ మేది గలదో అది నాకుఁ గష్టముగా నున్నది; అట్లు ప్రకాశాత్మక మైన సాత్త్వికగుణము నన్ను వివేకము నొందించుచు సుఖమునందు సక్తునిఁ జేయుచు బంధించుచున్నది—అని వాని నసమ్యగ్దర్శి యగువాఁడు ద్వేషించుచున్నాఁడు; ఇట్లు గుణాతీతుఁడు సంప్రవృత్తము లైనవానిని ద్వేషింపఁడు. మఱియు నెట్లు సాత్త్వికాదిపురుషుఁడు తనయందుద్భవించి నివృత్తము లైనసాత్త్వికాదికార్యములను గాంక్షించుచున్నాఁడో అట్లు గుణాతీతుఁడు, నివృత్తాని = తొలఁగినవానిని; నకాంక్షతి = కోరఁడు. అని యర్థము. ఇది పరులకుఁ బ్రత్యక్ష మగులింగము కాదు. మ తే మనఁగా, తనకుమాత్రమే ప్రత్యక్ష మగుటవలన నాత్మవిషయమే యీ లక్షణము. స్వాత్మవిషయ మగు ద్వేషమును గాని కాంక్షను గాని పరుఁడు చూఁడఁజాలఁడు గదా.

అర్జునా ! సత్త్వరజస్తమోగుణకార్యము లైన ప్రకాశప్రవృత్తి మోహములు కలిగినపుడు గుణాతీతుఁడు వాని ద్వేషింపఁడు, అవి నివర్తిల్లినపుడు వానిఁ గాంక్షింపఁ డని తాత్పర్యము.

ఆ. ప్రశ్నస్వరూప మనువదించి వానియుత్తరమును బ్రదర్శించుచున్నారు గుణాతీతుని ఇత్యాదిగా. కిం శబ్దమునకు * మూఁడుమాఱులు ప్రయోగము కనఁబడుటవలన ప్రశ్నద్వయమున కనుట యుపలక్షణము, ప్రశ్నత్రయమున కని గ్రహింపవలయును. మీఁదిశ్లోకమునకుఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు ఏలింగములతో నిత్యాదిగా. వాని సమ్యగ్దర్శి ద్వేషింపఁ డని చెప్పినదానినే స్పష్టీకరించుటకై యసమ్యగ్దర్శికి వానియందుఁ గల ద్వేషమును నిషేధింపవలసినదానిని బ్రకటించుచున్నారు నాకు ఇత్యాదిగా. సమ్యగ్దర్శికి సంప్రవృత్తము లైన ప్రకా

* అర్జునప్రశ్నశ్లోకమునందు.

శాదులయందు ద్వేషము లే దనుట నుపసంహరించుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. ననివృత్తాని యను భాగమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు ఋతియు నిత్యాదిగా. అవి యాత్మసంబంధులు గా వని చక్కగా నెఱింగినవాఁడై వాని యం దాత్మానుకూలప్రతికూలభావారోపణముచే నుద్వేగము వహింపఁడు స్పృహయును జేయఁ డని యర్థము. గుణాతీతునకు స్వానుభవసిద్ధ మైనలక్షణము చెప్పఁబడిన దని చెప్పుచున్నారు ఇది ఇత్యాదిగా. పరునకుఁ బ్రత్యక్షము కా దనుటను బ్రపంచించుచున్నారు స్వాత్మేత్యాదిగా. విషయ మనఁగా నాశ్రయ మని యర్థము.

హ. *

శ౦ అందు మొదటి ప్రశ్న కుత్తరము చెప్పుటకై శ్రీభగవంతుఁ డిట్లనియె.—గుణములకును గుణకార్యములకును దాను విషయము గాక వానిఁ జిద్వృత్తిచే నతిక్రమించి బ్రహ్మమునందే సదా తద్రూపుఁడై యెవఁ డున్నాఁడో అట్టి గుణాతీతుఁ డగు బ్రహ్మవిద్యతి, ప్రకాశంచ = ప్రకాశము, సత్త్వవికారవిషయసుఖజ్ఞానములయం దాసక్తిఁ గలిగించునట్టి చిత్తేంద్రియప్రసాదము, సమాధికి రసాస్వాదం బను నంతరాయము, అట్టి ప్రకాశమును; ప్రవృత్తించ=రాగమూలక మగు రజఃకార్యము ప్రవృత్తి, మనస్సునకును నింద్రియములకును బహిర్ముఖత, విక్షేపం బను సమాధ్యంతరాయము, ఇంద్రియములకుఁ గలుగు విషయప్రవృత్తిని ; మోహామేవచ = ఏవకారము అప్యర్థకము, మోహము తమోవికారము నిద్రాలస్యప్రమాదాదులయందు సంగముఁ గలిగించునది, లయము కషాయ మను పేరుగల సమాధ్యంతరాయము, అట్టి మోహమును గూడ; అట్టి యీ సత్త్వరజస్తమోగుణకార్యములను, సంప్రవృత్తాని=చక్కగాఁ బ్రసక్తించినవానిని ; నద్వేష్టి—తనకుఁ బ్రాప్తము లైన ప్రకాశాదులయందుఁ బ్రతికూలతాబుద్ధిచేత ద్వేషబుద్ధిని జేయఁడు, అవి చిదాభాసవిషయము లగుటవలన వానికిని దనకును సంబంధము లేమివలన నించుకేనియు విక్షేపము నొందఁడు. ఎట్లు నిదిధ్యాసనముఁ జేయఁ గోరు సాధకుఁడు సమాధికి విఘ్నభూతము లైన రసాస్వాదవిక్షేపలయకషాయరూపము లగు ప్రకాశాదిసత్త్వాదిగుణకార్యములను దనకు సంభవించినవానిని ద్వేషించుచున్నాఁడో, నా కివి సమాధివిఘ్నములు సంభవించిన వని విక్షేపము నొందుచున్నాఁడో, వాని నివృత్తములుగాఁ గాంక్షించుచున్నాఁడో, తన్నివృత్తికొఱకు దృశ్యానిందాది ప్రతిక్రియను జేయుచున్నాఁడో యని యర్థము, అట్లు సిద్ధుఁ డగు గుణాతీతుఁడు

* దీని కివ్యాఖ్యానము లేదు.

ప్రకాశాదులను సంప్రవృత్తము లైనవానిని ద్వేషింపఁడు; ననివృత్తానికాఙ్క్షతి—అవి చిద్విలాసము లగుటచే బ్రహ్మదృష్టియం దంతర్భూత మగుటవలన తన్నివృత్తినిగూడ నపేక్షింపఁ డని యర్థము. అధ్యాసమువలన ననాత్మతాదాత్మ్య ముండినం గదా రాగద్వేషాదులు సంభవించును, నిత్యనిరంతరనిర్వికల్పకసమాధి యను నగ్నిచే నహంమమాధ్యాసబంధమును నిర్దహించి యున్నవాఁ డగు విద్వాంసునకు రాగద్వేషాద్యనాత్మగుణములయావిర్భావము లేకుండుట యుక్త మని భావము. ఇందుచే విక్షేపహేతువు లగు గుణకార్యములు ప్రాప్తించినను ద్వేషాదులు లేకుండుట గుణాతీతునకు స్వప్రత్యక్షమైన యాంతరలింగ మని సూచిత మగుచున్నది.

మ. స్థితప్రజ్ఞస్య కా భాషే త్యాదిగాఁ బ్రశ్న చేసియు ప్రజహాతి యదా కామా నిత్యాదిగాఁ దదుత్తరము వినియు వెండియుఁ బ్రకారాంతరంబునఁ దెలియఁ గోరి యడుగుచున్నాఁ డని యెఱింగి ప్రకారాంతరంబునఁ దల్లక్షణాదుల నైదుశ్లోకములచే శ్రీభగవంతుఁ డి ట్లనియె.—ఏలింగములతోఁ గూడినవాఁడు గుణాతీతుఁ డనుప్రశ్న మేది కలదో దాని కుత్తరము వినుము. ప్రకాశంచ—సత్త్వకార్యమును; ప్రవృత్తించ — రజఃకార్యమును; మోహంచ — తమఃకార్యమును, ఇది యుపలక్షణము; సమస్తమైన గుణకార్యములనుగూడ, సంప్రవృత్తాని = స్వ సామగ్రీవశము వలన వృద్ధి నొందినవానిని, దుఃఖరూపము లైనవానిఁగూడ; దుఃఖబుద్ధిచే నెవఁడు, నద్వేష్టి = ద్వేషింపఁడో; అట్లు వినాశసామగ్రీవశమువలన, నివృత్తాని — నివర్తిల్లిన వానిని, సుఖరూపము లైనవానినిగూడ; సుఖబుద్ధిచే, నకాఙ్క్షతి = కామింపఁడో, స్వప్నమువలె మిథ్య యనునిశ్చయమువలన. ఇట్టి ద్వేషరాగశూన్యుఁ డెవఁడో వాఁడు గుణాతీతుఁ డని "గుణాతీత స్స ఉచ్యతే" అను చతుర్థశ్లోకభాగముతో నన్వయము. ఇది స్వాత్మప్రత్యక్షలక్షణము, స్వార్థమే కాని పరార్థము కాదు. తన యందున్న ద్వేషతదభావములను గాని రాగతదభావములను గాని పరుఁ డెఱుంగఁ జాలఁడు గదా.

శ్రీ. స్థితప్రజ్ఞస్య కా భాషే త్యాదిగా ద్వితీయాధ్యాయమున నడిగియుఁ దదుత్తరము వినియు విశేషము దెలియఁగోరి యడుగుచున్నాఁ డని యెఱింగి ప్రకారాంతరమునఁ దల్లక్షణాదికము నాలుశ్లోకములచే శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు. అం దొకశ్లోకముచే లక్షణముఁ జెప్పుచున్నాఁడు.—ప్రకాశంచ — సర్వద్వారేషు దేహేస్మిన్ అని మున్ను చెప్పినసత్త్వకార్యమును; ప్రవృత్తించ — రజఃకార్యమును; మోహంచ — తమఃకార్యమును, ఇది యుపలక్షణము; సత్త్వాదుల

సర్వకార్యములనప్పుడప్పుడు, సంప్రవృత్తాని=తమయంతఁ బ్రాప్తములైనవానిని; దుఃఖబుద్ధిచే, నద్వేష్టి. నివృత్తములైనవాని సుఖబుద్ధిచే, నకాఙ్క్షతి. గుణాతీత స్స ఉచ్యతే అని చతుర్థశ్లోకముతో నన్వయము.

ప *

రా. ఆత్మవ్యతిరిక్తములైన యనిష్టవస్తువులయందు సంప్రవృత్తములగు సత్త్వరజస్తమోగుణకార్యములను ప్రకాశప్రవృత్తిమోహముల నెవఁడు ద్వేషింపఁడో, అట్లాత్మవ్యతిరిక్తములైన యిష్టవస్తువులయందు నివృత్తములైన యా ప్రకాశప్రవృత్తిమోహములను కాంక్షింపఁడో.

మా. ప్రాయికముగా ద్వేషింపఁడు కాంక్షింపఁడు. అట్లు సామవేదంబున భాల్లవేయశాఖయందు "రజస్తమస్సత్త్వగుణా న్ప్రవృత్తా న్ప్రియో నచ ద్వేష్టి న చాపి కాఙ్క్షతి। తథా ఽపి సూక్ష్మం సత్త్వగుణంచ కాఙ్క్షే ద్యది ప్రవిష్టం సుత మశ్చ జహ్యాత్" అని. "నహి దేవా ఋషయ శ్చ సత్త్వస్థా నృపసత్తమ। హీనా స్సత్త్వేన సూక్ష్మేణ తతో వైకారికా మతాః। కథం వైకారికో గచ్ఛే త్పురుషః పురుషోత్తమమ్" అని మోక్షధర్మమునందు; "సాత్త్వికః పురుషవ్యాఘ్ర భవే న్మోక్షార్థనిశ్చితః" అనియును.

ఉదాసీనవ దాసీనో గుణై ర్యో న విచాల్యతే
గుణా వర్తన్త ఇత్యేవ యో ఽవతిష్ఠతి నేఙ్గతే. ౨౩

భా. ఇఁక నిప్పుడు గుణాతీతుఁడు కిమాచారుం డను ప్రశ్న కుత్తరముఁ జెప్పుచున్నాఁడు.—ఉదాసీనవత్ = ఉదాసీనునివలె, ఎట్లుదాసీనుఁడు ఎవనిపక్షమునుం జేరఁడో అట్లు; గుణాతీతతోపాయమార్గమునందున్నవాఁడై, ఆసీనః=కూర్చుండిన, ఆత్మవిదుఁడైన; యః=ఏసన్న్యాసి; గుణైః = గుణములచేత; నవిచాల్యతే = వివేకజ్ఞానావస్థనుండి చలింపఁజేయఁబడఁడో. దానినే స్ఫుటీకరించుచున్నాఁడు.—గుణాః=కార్యకరణవిషయాకారపరిణతములగు గుణములు; ఒండొంటియందు, వర్తన్తే = వర్తించుచున్నవి; ఇత్యేవ = అనిమాత్రమే; యః=ఎవఁడు; అవతిష్ఠతి= నిశ్చయించుచున్నాఁడో, ఛందోభంగము లేకుండుటకై పరస్మై పద

* శ్రీధరీయముతో సమానము

ప్రయోగము; అనుతిష్ఠతి యని పాఠాంతరము—అనుష్ఠించుచున్నాఁడో; నేఙ్గతే = చలింపఁడో, స్వరూపావస్థుఁ డయ్యే యుండు నని యర్థము.

వాదిప్రతివాదులలో నెవరిపక్షమునుం జేరక యుండు మధ్యస్థునివలెఁ దాను గూటస్థుఁ డని యెఱిఁగి దేనియందును సంబంధింపక యవిక్రియరూపుఁడై యుండునట్టి యేపురుషుని గుణములు కూటస్థావస్థనుండి చలింపఁజేయఁజాలవో కార్యకరణాకారపరిణతము లగు గుణములు తా మొండొంటియందుఁ బ్రవర్తించుచున్నవి గాని తన కేమియు సంబంధము లేదను నిశ్చయము గలవాఁడై యెవఁడు తనస్వరూపావస్థనుండి చలింపఁడో యతఁడు గుణాతీతుఁ డని తాత్పర్యము.

ఆ. కైర్లిఙ్గై రిత్యాదిప్రశ్నమున కుత్తరముఁ జెప్పి ద్వితీయప్రశ్నమున కుత్తరముఁ జెప్పుచున్నారు ఇఁక నిత్యాదిగా. దృష్టాంతమును వివరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. ఉపేక్షకునకుఁ బక్షపాత ముండినయెడ నుపేక్షకత్వమే సంభవింపమివలన నని యర్థము. ఆత్మవిదుఁడు తాను కూటస్థుఁ డని యెఱుంగుటచేత ఆసీనుఁడై — కర్తృత్వాభిమానము విడిచి ప్రయత్నము లేనివాఁడై యుండు నని దార్ష్టాంతికముఁ జెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. గుణాతీతత్వోపాయమార్గము.—జ్ఞానము. శబ్దాదివిషయములచేత వీనికిఁ గూటస్థత్వజ్ఞానమునుండి చలనము నాశంకించి చెప్పుచున్నారు గుణా ఇత్యాదిగా. ప్రాప్తము లైన విషయములు రాగద్వేషద్వారముననే ప్రవర్తకములగు నను టను బ్రపంచించుచున్నారు దానినే ఇత్యాదిగా. అవపూర్వకమైన స్థాధాతు వాత్మనేపద మగుటవలనఁ బరస్మైపదప్రయోగం బెట్లని యాశంకించి చెప్పుచున్నారు ఛందోభంగము ఇత్యాదిగా. పాఠాంతరమునందు అనుష్ఠాన మనఁగా బాధితానువృత్తియే. కరణాకారపరిణతము లైనగుణములు విషయాకారపరిణతగుణములయందుఁ బ్రవర్తించుట స న్నంట దని చూచుచు నచలుండై తనకూటస్థదృష్టిని విడువఁ డని చెప్పుచున్నారు నేఙ్గతే యని. అతఁడు గుణాతీతుఁ డని యుత్తరత్రాన్వయము.

హ. నేఙ్గతే = చలింపఁడో. కార్యకరణసంఘాతవిషయాకారపరిణతము లై గుణములు వర్తించుచున్న వని, యోవతిష్ఠతి = ఎవఁడు ఎఱుంగుచున్నాఁడో, కావుననే చలింపఁడో.

శం. ఓయీ! గుణాతీతుఁ డగు విద్వాంసుఁడు సత్త్వాదిగుణకార్యములు సంప్రవృత్త మగునపుడు ద్వేషమునుం జేయక తన్నివృత్తినిం గోరఁడేని, అప్పుడు

సర్వంబును మిథ్య యని తత్తద్గుణవృత్తుల ననుసరించి యథేష్టముగాఁ బ్రవర్తించునా? అని యాశంకింతువేని, అట్లుఁ బ్రవర్తింపఁడు. వానికిఁ బ్రవృత్తిహేతు వగు నవిద్య వాసనాసహితముగఁ గార్యసహితముగా నిర్వికల్పకసమాధి యను నగ్నిచే నిర్దగ్ధ మగుటవలన వైదికమునందును లౌకికమునందును ఇతరమునందును గాని ప్రవృత్తి సంభవింపదు. మ తే మనఁగా స్వానందానుభవముచేఁ దనయందుఁ దాను నిశ్చలుం డయ్యే యుండును, ఇంచుకేని వికారము నొందఁ డని చెప్పుచున్నాఁడు.—వాది ప్రతివాదుల యిద్దఱియం దెవనిపక్షమేని యనలంబింపక వారియిద్దఱివ్యాపారములను జూచుచుండునట్టి తటస్థుం డుదాసీనుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. అట్టి యుదాసీనునివలె విషయములయందుఁ బ్రవర్తకము లైన ప్రకాశ దయా దాక్షిణ్య సత్య వినయ రాగ ద్వేష లోభ మోహాదు లగు సత్త్వాదిగుణంబులను తత్ప్రవర్త్యము లగు దేహేంద్రియాదులను దద్వ్యాపారములను జూచుచుఁ దా నుదాసీనునివలె వానికిని వానివ్యాపారములకును సాక్షిభూతుఁడై, ఆసీనః = దూరమున నుండునట్టి; యః = ఏవిద్వాంసుఁడు; గుణైః = ప్రకాశాదిసాత్త్వికములచేతను రాగాదిరాజసములచేతను మోహాదితామసములచేతను; నవిచాల్యతే = ఆత్మనిష్ఠనుండి భ్రంశము నొందింపఁబడఁడో, బాహ్యవాసనాబద్ధునివలె బ్రహ్మాకారవృత్తినుండి జలింపఁజేయ నలవికాఁడో యని యర్థము. ఈపక్షమున విద్వాంసుఁడు దేహయాత్రయం దెట్లు ప్రవర్తించు నని యాకాంక్ష కలుగఁగాఁ జెప్పుచున్నాఁడు.—చిరకాలము నిత్యనిరంతరనిర్వికల్పసమాధి చేయుటచేత స్థిరీభూతప్రజ్ఞుం డగు, యః = ఏసిద్ధుఁ డైనబ్రహ్మవిద్యతి; గుణాఏవ = దేహేంద్రియాదులే; ఫలమొసంగుకర్మముచేత యథాకాలముగాఁ బ్రేరింపఁబడుచున్న వై గుణములయందు — విషయములయందుఁ బ్రవర్తించుచున్నవి—భోజనాదివ్యాపారమును జేయుచున్నవి, వానికిని వానివ్యాపారములకును సాక్షిని బ్రత్యగ్రూపుఁడ నగు నేనో ప్రవర్తించుట లేదు సదా నిష్క్రియుఁడ నయ్యే యున్నాను అని, అవతిష్ఠతి = బ్రహ్మాకారవృత్తిచే బ్రహ్మమునందే సదా తద్రూపంబున నిలిచి యున్నాఁడో; తాను మఱి గుణంబులవలనను గుణకార్యములవలనను గొంచెమేనియు, నేఙ్గతే = చలింపఁడో, నేను కర్తను భోక్తను నా కిది భోగ్యం బని కర్తృత్వభోక్తృత్వాధ్యాసముఁ జేయఁ డని యర్థము. అవతిష్ఠతి యని పరస్మైపదము ఛాందసము. ఇట్టివాఁ డగు బ్రహ్మవిత్తముఁ డెవఁడు గలఁడో అతఁడు గుణాతీతుఁ డని యుత్తరశ్లోకముతో నన్వయము. ఇందుచే గుణప్రేరితంబులై దేహేంద్రియాదులు విషయములయందుఁ బ్రవర్తించినను ఉదాసీనతయు నిర్వికారతయు

విద్వాంసుని గుణాతీతత్వమునందు లింగ మని సూచింపఁబడినది. కిమాచారుఁ డను ప్రశ్నమున కుత్తరంబును దత్త మగుచున్నది.

**మ.** ఇట్లు లక్షణము ప్రతిపాదించి గుణాతీతుఁడు కిమాచారుఁ డను రెండవప్రశ్నమున కుత్తరము చెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—ఎట్లుదాసీనుఁ డిద్దఱు వివాదము చేయుచుండఁగా నెవ్వనిపక్షమునుం జేరనివాఁడై రాగమును గాని ద్వేషమును గాని పొందఁడో అట్లు ఆత్మవిదుఁడు రాగద్వేషశూన్యుఁ డగుటచే స్వస్వరూపమునందే, ఆసీనః = కూర్చున్నవాఁడై; గుణైః — సుఖదుఃఖాద్యాకారపరిణతము లైనవానిచేత; యః; నవిచాల్యతే — స్వరూపావస్థానమునుండి భ్రంశము నొందింపఁబడఁడో; మ తే మనఁగా, గుణాఃఏవ = దేహేంద్రియవిషయాకారపరిణతము లైన యీగుణములే; ఒంటొంటియందు, వర్తన్తే = ప్రవర్తించుచున్నవి. నాకో యీ సమస్తంబును సూర్యుని కెట్లో అట్లు. భాసకునకు భాస్యధర్మముతో దేనితోను సంబంధము లేదు. ఈ జడ మగు భాస్యప్రపంచ మేమో స్వప్నమువలె మాయామాత్రము. స్వయంప్రకాశస్వభావుఁ డగు నేనో పరమార్థసత్యుఁడను నిర్వికారుఁడను ద్వైతశూన్యుఁడను. ఈప్రకారంబున నిశ్చయించి, యః; స్వరూపమునందు, అవతిష్ఠతి — అవతిష్ఠతే = ఉన్నాఁడో; యోనుతిష్ఠతి అని పాఠాంతరము, ఇం దనుశబ్దమునకు వేఱుగా నని యర్థము, తాను వేఱుగా నున్నాఁడో యనుట. నేఙ్గతే=దేనియందును వ్యాపృతుఁడు కాఁడో. గుణాతీత స్స ఉచ్యతే అని తృతీయశ్లోకముతో నన్వయము.

**శ్రీ.** ఇట్లు తనకుమాత్రమే తెలియునట్టి గుణాతీతునిలక్షణమును చెప్పి పరునకుఁ దెలియులక్షణము చెప్పుటకై కిమాచారుం డను ప్రశ్న కుత్తరమును చెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—ఉదాసీనవత్ =ఉదాసీనునివలె సాక్షియై; ఆసీనః = ఉన్నవాఁడై; గుణైః = సుఖదుఃఖాదిగుణకార్యములచేత; యః; నవిచాల్యతే = స్వరూపమునుండి ప్రచ్యుతి నొందింపఁబడఁడో. మ తే మనఁగా, గుణములే తమకార్యములయందు వర్తించుచున్నవి వీనితో నాకు సంబంధమే లే దని వివేకజ్ఞానముచేత నెవ్వఁ డూరక, అవతిష్ఠతి=ఉన్నాఁడో, పరస్మై పదమార్షము. నేఙ్గతే= చలింపఁడో.

**ప.** *

* శ్రీధరీయముతో సమానము.

రా॰ ఉదాసీనవదాసీనః = గుణవ్యతిరిక్తుం డగు నాత్మను జూచు తృప్తిచేత నితరమునం దుదాసీనునివలె నున్నవాఁడై; గుణైః; ద్వేషకాంక్షాద్వారమున, యో నవిచాల్యతే. గుణములు తమకార్యము లగు ప్రకాశాదులయందు వర్తించుచున్నవి యని యనుసంధించి యెవఁ డూరక యున్నాఁడో, నేఙ్గతే = గుణకార్యమున కనుగుణముగా చేష్టింపఁడో.

మా॰ *

సమదుఃఖసుఖః స్వస్థ స్సమలోష్టాశ్మకాఞ్చనః
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః. ౨౪

భా॰. మఱియును.—సమదుఃఖసుఖః = సమానము లైన సుఖమును దుఃఖమును గలవాఁడు; స్వస్థః = తనయం దున్నవాఁడు, ప్రసన్నుఁడు; సమలోష్టాశ్మకాఞ్చనః=మట్టియును రాయియును బంగారమును సమానముగాఁ గలవాఁడు; తుల్యప్రియాప్రియః—ప్రియమును అప్రియమును సమానముగాఁ గలవాఁడు; ధీరః = బుద్ధిమంతుఁడు; తుల్యనిన్దాత్మసంస్తుతిః =నిందయును ఆత్మస్తుతియును సమానముగాఁ గలవాఁడు.

దుఃఖము కలిగినను సుఖము కలిగినను సమానుఁడై యెల్లప్పుడు ప్రసన్నుఁడై మట్టి రాయి బంగారు మొదలగువాని సమానముగాఁ జూచువాఁడై ప్రియమునందును అప్రియమునందును సమానుఁడై తన్ను నిందించినను స్తుతించినను సమదృష్టి గల వివేకబుద్ధిసంపన్నుఁ డెవఁడో యతఁడు గుణాతీతుఁ డని తాత్పర్యము.

ఆ॰ గుణాతీతునిలింగాంతరముఁ జెప్పుచున్నారు మఱియును ఇత్యాదిగా. సుఖదుఃఖములయందు సమత్వ మనఁగా రాగద్వేషాదులఁ బుట్టింపక తనవి యను నభిమానమునకు నాస్పదము గాకుండుట. ప్రసన్నుఁడు—స్వాస్థ్యమునుండి భ్రంశము లేనివాఁడు, అవిక్రియుఁడు. విద్వద్దృష్టికిఁ బ్రియాప్రియములు లేకున్నను లోకదృష్టి నాశ్రయించి చెప్పుచున్నారు ప్రియమును ఇత్యాదిగా. కాంచనాదులు ప్రియాప్రియగ్రహణముచేతనే గృహీతము లైనను బ్రాహ్మణపరివ్రాజకన్యాయంబున వేఱుగా గ్రహింపఁబడినవి. నింద—తనయందు దోషము చెప్పుట, ఆత్మసంస్తుతి—తనగుణములఁ గీర్తించుట.

* ౨౩-౨౪ ఈ రెండుశ్లోకముల కీభాష్యము లేదు.

హ. *

౪౦. ఓయీ! దేహేంద్రియాదులు స్వస్థములై యుండునపు డితఁడు గుణములచేఁ జాలితుఁడు గాకయుండవచ్చును. ఐనను ఆధ్యాత్మికాధిభౌతికదుఃఖములును నిందాద్యనర్థములును బ్రాప్తించినపుడు గుణములచే నిమ్నుఁడై చాలితుఁడై ఖేదమోహాదుల నవశ్యము పొందుచున్నాఁడు అని యాశంకింతువేని, పొందఁడు. బాహ్యసుఖదుఃఖాదులకును నిందాస్తుత్యాదులకును విషయం బనాత్మయే కాని నిర్విశేషుఁడను నిరాకారుఁడను జిదేకరసుఁడను ఆత్మ నగు నేను కాను అని నిశ్చలబుద్ధియై బాహ్యసుఖదుఃఖాద్యవస్థలయందుఁగూడ స్వాత్మయందే యుండుం గాని యనాత్మయం దహం మమే త్యధ్యాసమును మూఢునివలెఁ జేయఁ డని చెప్పుచున్నాఁడు శ్లోకద్వయముచేత.—దేనియందు శోభనములు – హృష్టములు ఖములు ♦ అగునో అది సుఖము, దేనియందు దుష్టములు ఖము లగునో అది దుఃఖము సమములు దుఃఖసుఖము లెవ్వనికో వాఁడు సమదుఃఖసుఖుఁడు, సమచిత్తుఁ డని యర్థము. సుఖదుఃఖములయందు సమత్వ మనఁగా చిత్తమున కిష్టానిష్టభావన లేకుండుటయే, అదియే సమచిత్తత, పరునియందుంబోలె తద్భోక్తయందు నే నను నధ్యాసముయొక్క సంబంధము లేనివాఁ డని యర్థము; కావుననే, స్వస్థః = సర్వావస్థలయందును సర్వదా తనయందే – పరబ్రహ్మమునందే తద్రూపుఁడై యున్నాఁడు కావున బ్రహ్మవిదుఁ డొకఁడే స్వస్థుఁ డని చెప్పఁబడుచున్నాఁడు, అందువలననే జన్మాదిదుఃఖములచేతను ఆధ్యాత్మికాదిదుఃఖములచేతను అభిభూతుఁడు కాఁడు, బహిర్ముఖు లగు తదితరులైననో అస్వస్థులే యగుచున్నారు, అందువలననే అనాత్మధర్మము లగు జన్మాదిదుఃఖములచేతను ఆధ్యాత్మికాదిదుఃఖములచేతను ఇతరములచేతను అభిభవింపఁబడుచున్నారు, విక్షేపము కలిగినపుడు బ్రహ్మాకారవృత్తికి బ్రచ్యుతి సంభవింపకుండుటయే స్వస్థత్వము కాని ధైర్యంబున దాని సహించుట స్వస్థత్వము కాదు; కావుననే, తుల్యప్రియాప్రియః = ప్రియ మనఁగా ఇష్టము అప్రియ మనఁగా అనిష్టము, తుల్యములు ప్రియాప్రియము లెవ్వనికో వాఁడు తుల్యప్రియాప్రియుఁడు, రెండింటియందును సముఁ డని యర్థము; ఓయీ! ప్రియాప్రియములయందును సుఖదుఃఖములయందును విద్వాంసునకు సమత్వము సంభవింపదు, అత్యంతమధురపదార్థమును భుజించునపుడును భయంకరమైనయెండయందును చల్లనినీడయందును ఉండునపుడు విద్వాంసు

---

* దీని కీవ్యాఖ్యానము లేదు.

♦ ఇంద్రియములు.

నకుఁగూడ ఇష్టానిష్టజ్ఞానము వారింప శక్యము కాదు, తదనుభవమునందు వానికి విషమబుద్ధి కలుగక తప్పదు. అందువేని సత్యము. సుఖదుఃఖములును ప్రియాప్రియములును ప్రాప్తించినపుడు విద్వాంసునకును విషమబుద్ధి తప్పదు, జ్ఞేయభేదమువలన జ్ఞానభేదం బుపపన్న మగుటవలన. ఐనను బ్రహ్మనిష్ఠునకు విషమబుద్ధి సంభవింపదు, కారణము లేమివలన. విషమబుద్ధికి విషమపదార్థసంయోగము కదా కారణము. ఇది కలిగిననే యిష్టానిష్టత్వజ్ఞానము కలుగుచున్నది, ఇష్టానిష్టత్వజ్ఞానము కలిగిననే విషమబుద్ధి కలుగును గాని యది లేనపుడు కలుగదు. చిరకాలనిత్యనిరంతర సమాధ్యభ్యాసబలముచేత బ్రహ్మాకారతను బొంది బుద్ధివృత్తి సర్వదా బ్రహ్మమునందే నిశ్చలమై నిలిచియుండఁగా బుద్ధికి విషమవిషయములతో సంయోగ మెట్లు సంభవించును? అది సంభవింపనియపు డిష్టానిష్టత్వజ్ఞానము సంభవించు నన శక్యము కాదు. అది లేకుండుటవలన బ్రహ్మనిష్ఠుం డగువిద్వాంసునకు విషమబుద్ధియు సంభవింపదు. అందువలన సుఖదుఃఖములయందును ప్రియాప్రియములయందును విద్వాంసుఁడు సముఁ డనుట విరుద్ధము కాదు. ఓయీ! బలవత్తర మగు విక్షేపకారణము సంభవించినను బుద్ధికి బ్రహ్మాకారంబున నునికి యెట్లుపపన్న మగు నందువేని,అభ్యాసాతిశయమే అందులకుఁ గారణ మని చెప్పెదము. ఔషధము గాని మంత్రము గాని లయయోగము గాని తత్కారణములు కాఁజాలవు కొందఱు విద్వాంసులకును అనభ్యాసవశంబుననే బహిర్ముఖత గాని యవివేకంబునఁ గాదు; అభ్యాసేనతు కౌన్తేయ అనిచెప్పఁబడి యుండుటవలన శ్రద్ధాభక్తిపూర్వకముగా సమాధి నభ్యసించుటచేత బాహ్యస్పర్శము లేని బ్రహ్మనిష్ఠ సిద్ధించుచున్నది.అన్నిటికిని అభ్యాసమే గొప్పకారణము "అభ్యాసా త్పక్వవిజ్ఞానః కైవల్యం లభతే నరః" * అను స్మృతివలన. ప్రియాప్రియములయందు సమత్వ మేది చెప్పఁబడినదో దాని స్పష్టీకరించుచున్నాఁడు.— సమలోష్టాశ్మకాఞ్చనః=సమము లైన—ప్రీత్యప్రీతుల కవిషయము లైన లోష్టాశ్మకాంచనములు గలవాఁడు, లేక, సమములైన — ప్రత్యగ్దృష్టిచేత సమభావమును బొందినవి — బ్రహ్మాకారంబున దృష్టము లైన లోష్టాశ్మకాంచనములు గలవాఁడు, అంతటను బ్రహ్మబుద్ధి గలవాఁ డని యర్థము; విద్వాంసునకు సుఖదుఃఖప్రియాప్రియాదులయందంతటను సమదృష్టి సిద్ధించుటకు హేతువును జెప్పుచున్నాఁడు.—ధీరః = అభాసవాసనచేత బహిర్ముఖ మగు ధీని రాతి — నిగ్రహించుచున్నాఁడు ఆత్మాకారముననే నిలుపుచున్నాఁడు కావున ధీరుఁడు, ఆత్మనిష్ఠనుండి తొలఁగనియట్లు చేయఁబడిన బుద్ధి

* అభ్యాసమువలన తత్త్వజ్ఞానము పక్వమై మనుష్యుఁడు కైవల్యము నొందుచున్నాఁడు.

వృత్తి గలవాఁడని యర్థము. కావుననే, తుల్యనిన్దాత్మసంస్తుతిః = నిందా — దూషణము, ఆత్మసంస్తుతిః — ఆత్మయొక్క—అనఁగా దేహాదులయొక్క—గుణకీర్తనము, తుల్యములు అనాత్మవిషయము లగు నిందయును ఆత్మసంస్తుతియు నెవ్వనికో వాఁడు తుల్యనిందాత్మసంస్తుతి, అనాత్మవిషయము లైన నిందాత్మసంస్తుతులకు విషయము కాని స్వరూపము గలవాఁ డని యర్థము. సుఖదుఃఖప్రియాప్రియాదులయందు సమత్వము జీవన్ముక్తుఁ డగు విద్వాంసునకుఁ బరప్రత్యక్ష మగు చిహ్నమని సూచితమగుచున్నది.

మ సమములు దుఃఖసుఖములు ద్వేషరాగములకు విషయములు గానివగుటచేతను అనాత్మధర్మము లగుటచేతను అనృతము లగుటచేతను ఎవ్వనికో అతఁడు సమదుఃఖసుఖుఁడు. ఎందువలన సమదుఃఖసుఖుఁ డనఁగా, స్వస్థః = తనయందే — ఆత్మయందే యున్నవాఁడు, ద్వైతదర్శనశూన్యుఁ డగుటవలన. కావుననే, సమములు— హేయములుగాని యుపాదేయములుగాని కానివి లోష్టాశ్మకాంచనము లెవ్వనికో అట్టివాఁడు, లోష్ట మనఁగా మట్టిగడ్డ. కావుననే, తుల్యములు — సుఖదుఃఖములకు సాధనములు కానివి ప్రియాప్రియము లెవ్వనికో అట్టివాఁడు, హితసాధనతాబుద్ధికిఁ గాని అహితసాధనతాబుద్ధికిఁ గాని విషయములు కాని వగుటచే నుపేక్షణీయము లగుటవలన. ధీరః = బుద్ధిమంతుఁడు, లేక ధైర్యవంతుఁడు; కావుననే. తుల్యములు నిందాత్మసంస్తుతులు—దోషకీర్తనగుణకీర్తనము లెవ్వనికో అట్టివాఁడు, అతఁడు గుణాతీతుఁ డని రెండవశ్లోకముతో నన్వయము.

శ్రీ. మఱియును.—సమము లైన దుఃఖసుఖములు గలవాఁడు. ఎందువలన ననఁగా, స్వస్థః = స్వరూపమునందే యున్నవాఁడు, కావుననే, సమము లైన లోష్టాశ్మకాంచనములు గలవాఁడు. తుల్యము లైన ప్రియాప్రియములు సుఖదుఃఖహేతువు లైనవి కలవాఁడు. ధీరః = బుద్ధిమంతుఁడు. తుల్యము లైన నిందయును ఆత్మస్తుతియును కలవాఁడు.

ప. *

రా. ♦

* శ్రీధరీయముతో సమానము.

♦ ఈ భాష్యమునం దీశ్లోకమునకు మీఁదిశ్లోకముతో వ్యాఖ్యానము చేయఁబడును.

మానాపమానయోస్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే. ౨౫

భా. మఱియును.— మానాపమానయోః = సత్కారమునందును తిరస్కారమునందును; తుల్యః = సముఁడు; నిర్వికారుఁడు. మిత్రారిపక్షయోః — మిత్రపక్షమునందును శత్రుపక్షమునందును; తుల్యః = సమానుఁడు. కొందఱు స్వాభిప్రాయముచేత నుదాసీను లైనవా రున్నారనుట వాస్తవమే, ఐనను బరాభిప్రాయంబున వారును మిత్రారిపక్షంబునఁ జేరినవా రగుదురు కావున తుల్యో మిత్రారిపక్షయోః అని చెప్పఁబడినది. సర్వారమ్భపరిత్యాగీ = ఆరంభింపఁబడుచున్నవి కావున ఆరంభము లనఁగా దృష్టాదృష్టార్థము లైన కర్మములు, అట్టి సమస్తము లైనయారంభములను విడుచుట స్వభావముగా గలవాఁడు, దేహధారణనిమిత్త మైనది దక్కఁ దక్కిన సర్వకర్మముల విడుచువాఁడని యర్థము. సః=అట్టివాఁడు; గుణాతీతః=గుణాతీతుఁ డని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు. ఉదాసీనవ దిత్యాదిగా గుణాతీత స్స ఉచ్యతే అను నిదివఱకుఁ జెప్పఁబడిన ధర్మజాత మెంతవఱకు యత్నసాధ్యం బగునో అంతవఱకు ముముక్షు వగు సన్న్యాసి కనుష్ఠేయం బగు గుణాతీతత్వసాధన మగుచున్నది. స్థిరీభూతం బగునేని స్వసంవేద్యంబై గుణాతీతుఁ డగుయతికి లక్షణ మగుచున్నది.

తన్ను సత్కరించినను దిరస్కరించినను సమచిత్తుఁడును మిత్రపక్షమందును శత్రుపక్షమందును సమవృత్తి గలవాఁడును దేహయాత్రకుఁ గావలసినది దక్కఁ దక్కిన సమస్తకర్మములను విడిచినవాఁడును ఎవ్వఁడో అతఁడు గుణాతీతుఁ డని తాత్పర్యము.

ఆ. ఇందువలనఁ గూడ గుణాతీతు నెఱుంగవచ్చు నని చెప్పుచున్నారు మఱియును అని. పరదృష్టిచేత నెవరు మిత్రశత్రువులో వారిపక్షములయందు నిర్విశేషుఁడు, ఎవనిపక్షమునుం జేరనివాఁ డని చెప్పుచున్నారు మిత్ర ఇత్యాదిగా. విద్వాంసునకు మిత్రాదిబుద్ధి లేమివలన తుల్యోమిత్రారిపక్షయోః అనుట యనుచితం బని యాశంకించి చెప్పుచున్నారు కొందఱు ఇత్యాదిగా. సర్వకర్మములను విడిచినపుడు దేహధారణము గూడ తత్సాధనకర్మము లేమివలన సంభవింప దని

యాశంకించి చెప్పుచున్నారు దే హేత్యాదిగా. ఇట్టి విశేషణములు గలవాఁడు గుణాతీతుఁ డని యెఱుంగవలయు నని చెప్పుచున్నారు స ఇత్యాదిగా. ఉపేక్షకత్వాదిక మేది చెప్పఁబడినదో అది జ్ఞానోత్పత్తికి మున్ను యత్నసాధ్యము జ్ఞానాధికారి జ్ఞానసాధనముగా ననుష్ఠింపవలయు ననియు, జ్ఞానము కలిగినపిమ్మట జీవన్ముక్తునకీధర్మజాత మంతయు స్థిరీభూతంబై స్వానుభవసిద్ధలక్షణంబై యొప్పుచుండు ననియు నీచెప్పినధర్మజాతమునందు విభాగమును బ్రదర్శించుచున్నారు ఉదాసీ నేత్యాదిగా.

హ. గుణాతీతః=దేహేంద్రియవిషయాకారపరిణతము లైనగుణముల నతిక్రమించినవాఁడు, వానియందు నిస్స్పృహుఁడు.

శం గుణాతీతుం డితఁ డని విద్వాంసుని గుణాతీతత్వము నెఱుంగుటకై లింగాంతరంబును కిమాచారః అనుప్రశ్న కుత్తరంబును జెప్పుచు జీవన్ముక్తునిలక్షణము నుపసంహరించుచున్నాఁడు.—మాన మనఁగా నుపచారములచే బహూకరించుట, అపమాన మనఁగా నపచారములచే లఘూకరించుట, వాని రెంటియందును, తుల్యః—తన ప్రారబ్ధవశమువలన వానికి విషయభూత మైన దేహమునం దాత్మత్వభావము లేనివాఁ డగుటవలన రెంటియందును వికారరహితుఁ డని యర్థము. పూజావమానములయందు ముఖవికాసవైవర్ణ్యాదివికారము లొందక సమచిత్తుఁడై యుండుట జీవన్ముక్తునికి లింగము. సర్వంబును బ్రహ్మమునుగానే చూచునట్టి బ్రహ్మవిద్యుతికి ప్రియాప్రియ మిత్రామిత్రభేదదృష్టి సంభవింపదు వాస్తవమే, ఐనను ఏది యిష్టముగా భుజింపఁబడునో అది ప్రియ మనియు నేది యనిష్టమువలె నుపేక్షింపఁబడునో అది యప్రియ మనియు నెవఁడు బ్రహ్మవిదునిచర్యను జూచి యనుమోదించునో యతఁడు మిత్రపక్ష మనియు నెవఁ డనుమోదింపఁడో యతం డరిపక్ష మనియు లోకదృష్టిచే సంభవించుచున్నది, అట్టి మిత్రారిపక్షములయందుఁ దమబుద్ధిదోషముచేతనే మిత్రారిభావమును బొందినవారియందు ఇద్దఱియందును, తుల్యః = సమదర్శి; సర్వత్ర సమదర్శనమే జీవన్ముక్తునకుఁ బరప్రత్యక్షలింగము. మఱియును, సర్వారమ్భపరిత్యాగీ = నా కిది కావలయు నని ఫలకామనచేత ఆరంభింపఁబడుచున్నవి కావున ఆరంభము లనఁగా కర్మములు, దృష్టాదృష్టఫలవిషయము లగు శ్రౌతస్మార్తములును ఉపాసనాదులును ఆశ్రమోచితములును శరీరవ్యతిరిక్తము లైన లౌకికములును నగు సర్వకర్మములును సర్వశబ్దముచేత గ్రహింపఁబడుచున్నవి. బ్రహ్మభావమును బొంది యవాప్తసకలకాముఁ డగుటచేత ఆసర్వారంభములను తత్సాధ్యము తనకు లే దనుబుద్ధిచే పరిత్యజించుట శీలముగాఁ గల

వాఁడు; బ్రహ్మభావము నొందినవాఁడు పూర్ణకాముఁడు శ్రోత్రియుఁడు అకామహతుఁ డగు బ్రహ్మవిదునకుఁ గర్మముచే సాధ్యము లేదు గదా! ఏది యున్ననే కర్మము కర్తవ్య మగునో అది లే కుండుటవలన సర్వారంభపరిత్యాగము యుక్తమే యగును. ఓయీ! కర్మసాధ్యములును ఉపాసనాసాధ్యములును సార్వభౌమాది బ్రహ్మాంతము లైన యానందవిశేషములు ఉత్తరోత్తరశతగుణములు విద్వాంసునకును ఆశింపఁదగినవి యుండనే యున్నవి అందు వేని, అట్లు కాదు; నిత్యనిరతిశయానన్దాయి బ్రహ్మానందరసానుభూతి గల విద్వాంసునకు వానియం దాశా సంభవింపమి వలన;అవి కర్మజన్యము లగుటచే అనిత్యములును అల్పములును అసత్తులు నగుటవలన విద్వాంసునకు వానియం దాశ యనుపపన్న మగుటవలన "ఏతస్యైవా నన్దస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి" * అను శ్రుతిచే నవియు బ్రహ్మానందమునం దంతర్భూతము లగుటవలన బ్రహ్మానందము పొందుటచేతనే శతే పంచాశన్న్యాయంబున నవియుఁ బొందఁబడిన వగుటవలన సర్వాత్మభావాపన్నుం డైన బ్రహ్మవిదుఁ డగు మహాత్మునకుఁ బ్రాప్తవ్యశేష మేదియు లేదు. సర్వాత్మభావసిద్ధియును బ్రాప్తవ్యశేషంబును ఒక్కని కెట్లు సంభవించును? అందువలన బ్రహ్మవిదునకు సర్వకర్మసన్న్యసము యుక్తమే యని సిద్ధము. ఇందుచే కి మాచారుం డను ప్రశ్నమునకుఁ బూర్ణవృత్తిచే సర్వత్ర యౌదాసీన్యము దక్క మఱి వేఱాచారము జీవన్ముక్తునకు లే దని యుత్తర మీయఁబడినది. విద్వాంసుఁడు జీవన్ముక్తుఁ డనుటకు నిష్కర్మత్వము పరప్రత్యక్ష మగులింగ మని సూచిత మగుచున్నది. ఇట్టి సమదుఃఖసుఖత్వాది లక్షణములు గలవాఁ డెవఁడో; సః = అతఁడే; గుణాతీతః = గుణములయందు — దేహేంద్రియాదులయందు ప్రతిబింబప్రతిచ్ఛాయాపరదేహములయందుం బోలె నాత్మభావమును విడిచి గుణకార్యవిలక్షణమై తద్ధర్మకర్మాదులను స్పృశింపనిదై తన స్వరూప మైన పరబ్రహ్మమునందుఁ దద్రూపంబున నున్నవాఁడై ప్రకాశప్రవృత్తిమోహముల నెవ్వఁ డతిక్రమించుచున్నాఁడో వాఁడు గుణాతీతుఁ డని; ఉచ్యతే = గుణములకును గుణకార్యములకును అవిషయీభూతుం డని నిశ్చయించి లక్షణజ్ఞులచే బ్రహ్మవిద్యతి యితఁడు గుణాతీతుఁ డని చెప్పఁబడుచున్నాఁ డని యర్థము.

౨౫. మాన మనఁగా సత్కారము ఆదర మను నామాంతరము గలది; అపమాన మనఁగాఁ దిరస్కారము అనాదర మను నామాంతరము గలది; ఆ రెంటి యందును; తుల్యః = హర్షవిషాదములు లేనివాఁడు. నిందాస్తుతులు శబ్దరూపములు.

* ఈ యానందముయొక్కయే యితరభూతములు లేశము నుపజీవించుచున్నవి.

మానాపమానములలో శబ్దము లేకయే కాయమనోవ్యాపారవిశేషము లని భేదము. మిత్రారిపక్షయో స్తుల్యః = మిత్రపక్షమునకుఁబలె అరిపక్షమునకును ద్వేషవిషయము కానివాఁడు. లేక; తాను వారియం దనుగ్రహనిగ్రహములు లేనివాఁడు. సర్వారమ్భపరిత్యాగీ = ఆరంభింపఁ బడుచున్నవి ఆరంభములు, కర్మము లని యర్థము, వానినన్నిటిని పరిత్యజించుట శీలముగాఁ గలవాఁడు; దేహయాత్ర దక్కఁ దక్కినసర్వకర్మములను విడుచువాఁ డని యర్థము. ఉదాసీనవదాసీన ఇత్యాదిగాఁ జెప్పఁబడిన వివిధమగు నాచారము గలవాఁడు; గుణాతీతస్స ఉచ్యతే. ఉపేక్షకత్వాదిధర్మజాత మేది చెప్పఁబడెనదో అది జ్ఞానోత్పత్తికి మున్ను యత్నసాధ్యము జ్ఞానాధికారికి సాధనత్వంబున ననుష్ఠేయము; జ్ఞానము కలిగిన పిమ్మట ఈ ధర్మజాతి మఱియు జీవన్ముక్తుఁడగు గుణాతీతున కయత్నసాధ్యంబై లక్షణమై యొప్పు నని యర్థము.

శ్రీ సర్వారమ్భపరిత్యాగీ = సమస్తము లైన యారంభములను — యత్నములను బరిత్యజించుస్వభావము గలవాఁడు. *

ప. ♦

రా. సమదుఃఖసుఖః = దుఃఖసుఖములయందు సమచిత్తుఁడు; స్వస్థః=తనయం దున్నవాఁడు; స్వాత్మయే ప్రియుఁడుగాఁ గలవాఁ డగుటచేత తద్వ్యతిరిక్తపుత్రాదిజన్మమరణాదిసుఖదుఃఖములయందు సమచిత్తుఁ డని యర్థము; కావుననే; సమలోష్టాశ్మకాఞ్చనః; అందువలననే; తుల్యప్రియాప్రియః = తుల్యము లైన ప్రియాప్రియవిషయములు గలవాఁడు; ధీరః = ప్రకృత్యాత్మవివేచనమునందు సమర్థుఁడు; కావుననే, తుల్యనిన్దాత్మసంస్తుతిః = ఆత్మయందు మనుష్యత్వాభిమానకృత మైన గుణదోషములచేఁ గలుగు స్తుతినిందలయందుఁ దనకు సంబంధము లే దని యనుసంధించుటచేఁ దుల్యచిత్తుఁడు; తత్ప్రయుక్తమానావమానములయందును తత్ప్రయుక్తమిత్రారిపక్షములయందును తనకు సంబంధము లేమివలననే తుల్యచిత్తుఁడు; అట్లు దేహిత్వప్రయుక్తము లైన సర్వారంభములను బరిత్యజించువాఁడు; ఇట్టివాఁ డెవఁడో, అతఁడు గుణాతీతుఁ డని చెప్పఁబడుచున్నాఁడు.

మా. తుల్యశబ్దార్థము మున్ను చెప్పఁబడినది.

* తక్కినది యవిశిష్టము.

♦ శ్రీధరీయముతో సమానము.

మాం చ యో ఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణా న్సమతీత్యైతా న్బ్రహ్మభూయాయ కల్పతే. ౨౬

**భా.** ఇప్పుడు ఎట్లు మూఁడుగుణముల నతివర్తించు నను ప్రశ్న వచనమునకుఁ బ్రతివచనమును జెప్పుచున్నాఁడు.—మాంచ = నన్ను — ఈశ్వరుని నారాయణుని, సర్వభూతహృదయముల నున్నవానిని; యః = ఎవ్వఁడు, యతిగాని కర్మిగాని; అవ్యభిచారేణ = ఎప్పుడును వ్యభిచరింపనట్టి; భక్తియోగేన = భక్తి యనఁగా భజనము, అదియే యోగము భక్తియోగము, దానిచేత ; సేవతే = సేవించుచున్నాఁడో; సః = అతఁడు; ఏతాన్ = ఈ యథోక్తము లైన; గుణాన్ = గుణములను; సమతీత్య = చక్కఁగా నతిక్రమించి; బ్రహ్మభూయాయ = భూయః అనఁగా భవనము, బ్రహ్మముగా నగుటకొఱకు, మోక్షముకొఱకు; కల్పతే—సమర్థుఁ డగుచున్నాఁ డని యర్థము.

సన్న్యాసిగాని కర్మనిష్ఠుఁడుగాని యెవఁడు సర్వభూతహృదయస్థుఁ డను సర్వేశ్వరుఁ డను నారాయణుని నన్ను సదా నిశ్చలమైన భక్తియోగముచే సేవించుచున్నాఁడో అతఁడు సత్త్వాదిగుణత్రయము నతిక్రమించి జీవన్ముక్తుఁడు కాఁగలఁడు అని తాత్పర్యము.

**ఆ.** ప్రశ్నద్వయమును బరిహరించి మూఁడవప్రశ్నమును బరిహరించుచున్నారు ఇప్పుడు ఇత్యాదిగా. నన్ను అనునది సంసారివిషయము కాదని తెలుపుచున్నారు ఈశ్వరుని అని. ఈశ్వరునియందే నారాయణశబ్దముఁ బ్రయోగించుటవలన మూర్తిభేదము వ్యావర్తింపఁబడుచున్నది. అతనికి తటస్థతను వ్యవచ్ఛేదించుచున్నారు సర్వేత్యాదిగా. ముఖ్యాముఖ్యాధికారిభేదమునుబట్టి వికల్పము. భక్తియోగము యాదృచ్ఛికము కారాదని తెలుపుటకై అవ్యభిచారేణ అని చెప్పఁబడినది. భజన మనఁగా బరమప్రేమ. సేవించుచున్నాఁడు—పరాక్చిత్తుఁడు గాక యెల్లప్పుడు ననుసంధించుచున్నాఁ డని యర్థము. సః—భగవదనుగ్రహముచేఁ బొందఁబడిన సమ్యగ్దర్శనముతోఁ గూడినవాఁ డగు విద్వాంసుఁడు జీవించియె యున్నవాఁ డని యర్థము.

**హ.** భక్తి యనుయోగము భక్తియోగము. బ్రహ్మభూయాయ = బ్రహ్మభావముకొఱకు. కల్పతే = సమర్థుఁ డగుచున్నాఁడు.

౪౦. "కథం త్వేతాన్ త్రీన్గుణా నతివర్తతే" అని యడుగఁబడిన మూఁడవప్రశ్నమున కుత్తరమును జెప్పుచున్నాఁడు.—చ శబ్దము తు అనుదాని యర్థము కలది. యశ్చ = ఏ బ్రహ్మవిద్యతి మతి; తీవ్రమోక్షేచ్ఛచేత వాసనాకృత మగు బాహ్యాంబును సర్వంబును బరిత్యజించి యత్యంతవైరాగ్యమున్ను తద్బుద్ధిత్వాది సాధనసంపత్తిన్ను గూడినవాఁడై, మామ్ = ప్రత్యగభిన్నమును నిర్విశేషమును నిరాభాసమును నిరాకారమును అఖండచిదేకరసమును పరిపూర్ణము నగు పరబ్రహ్మమును నన్ను; భక్తియోగేన=ధ్యేయాకారం బగు నఖండరూపంబున విషయాస్పర్శి యగు చిత్తముయొక్కపరిణామము భక్తి, అఖండాకారవృత్తి యనుట, అది చెప్పఁబడినది "మత్కథా శ్రుతిమాత్రేణ మయి సర్వగుహాశయే। మనోగతి రవిచ్ఛిన్నా యథా గఙ్గామ్భసో ఽమ్బుధౌ॥ అహైతుక్యవ్యవహితా యా భక్తిః పురుషోత్తమే। లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతమ్" * అని, ఇట్టి భక్తియే యోగము — కైవల్యసిద్ధికిఁ బరమోపాయము, దానిచేత; అవ్యభిచారేణ = వృత్త్యంతరముచేత వ్యవచ్ఛేదము వ్యభిచారము, ఎప్పుడును అది లేనియట్టి నిత్యనిరంతర సమాధిచేత; సేవతే= విషయగ్రహణవిముఖమును నిర్మలమును నిశ్చలమును చిదాకారాపన్నమును తైలధారవలె నవిచ్ఛిన్నము నగు వృత్తిచేత వ్యుత్థానావ్యుత్థానములయందును వెలుపలను లోపలను బరిపూర్ణుని సర్వోపాధివినిర్ముక్తుని నిష్కలుని నిష్క్రియుని శాంతుని అనంతుని గగనతుల్యుని ఆనందఘనుని పరబ్రహ్మమును నన్ను ఇది యంతయు నేనును బ్రహ్మమే యని తన్నును విశ్వమును బ్రహ్మముగానే చూచుచు సర్వదా యనుసంధించుచున్నాఁడో యని యర్థము. ఇట్లు చిరకాలము నిత్యనిరంతరముగా బ్రహ్మమందే నిలిచి యుండునట్టి, సః=ఆయతి; సదాకారము నొందింపఁబడిన యంతఃకరణము గలవాఁ డగుటచేత సర్వదా సర్వంబును బ్రహ్మముగానే చూచుచు, ఏతాన్ = యథోక్తలక్షణము లైన; గుణాన్ = సత్త్వాదిగుణములను; తత్కార్య మగు ప్రపంచమున్గూడ, సమతీత్య=అతిక్రమించి, ప్రకృతిని ప్రకృతికార్యమగు విశ్వమును సర్వంబును అధిష్ఠానబ్రహ్మమునందు లయము నొందించి, ఇట్లు గుణాత్యయముచేసి; గుణాత్యయ మనఁగా అధిష్ఠానస్వరూపము నెఱుంగుటచేత ఆభా

* నాకథను విన్నమాత్రంబున సర్వహృదయస్థుఁడను బురుషోత్తముఁడ నగు నాయందు గంగాజలము సముద్రమునందుఁ బ్రవహించునట్లు మనస్సు లగ్న మగుట యేది గలదో అట్టి హేతురహితంబును అవ్యవహితంబు నగు పరమప్రీతి యేది గలదో అది నిర్గుణం బగు భక్తియోగమునకు లక్షణ మని చెప్పఁబడినది.

సభావంబునఁ బ్రతీయమానము లగు నారోపితగుణతత్కార్యములను అధిష్ఠానమాత్రముగా గ్రహించుస్వభావము గల చిదాకారవృత్తిచేత వెండియు నేను ఇది అది యను గ్రహణము లేకుండుటయే, అట్టి గుణాత్యయమును గావించి బ్రహ్మీభూతసర్వప్రపంచుఁ డగు బ్రహ్మవిత్తముఁడు, బ్రహ్మభూయాయ=బ్రహ్మభావముకొఱకు, జీవించి యున్నపుడే బ్రహ్మరూపంబున నుండుటకొఱకు; కల్పతే = సమర్థుఁ డగుచున్నాఁడు. "మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే" అని చెప్పిననాయ్యంబునఁ దనయందును అంతటను బ్రహ్మమాత్రదర్శనలక్షణ మగు భగవత్ప్రపత్తిరూప మైన బ్రహ్మనిష్ఠయందు ఎవఁడు ప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడో అతఁడే గుణమయంబును గుణతత్కార్యతద్వ్యవహారరూపంబు నగు మాయను తత్ప్రత్యయములసంతతి నతిక్రమించి విదేహకైవల్యసుఖమును బొందుచున్నాఁడు, ఇతరుఁడు పొందనేరఁ డని తాత్పర్యార్థము. ఇందుచేత ఇది యంతయును నేనును బ్రహ్మమే యని పూర్ణవృత్తిచేత ప్రత్యయాంతరవ్యవధానము లేక సదా సర్వత్ర బ్రహ్మదర్శనమే సత్త్వాదిగుణతత్కార్యముల నతిక్రమించునుపాయ మని సూచిత మగుచున్నది.

మ. ఇఁక నెట్లీ గుణముల నతివర్తించు నను తృతీయప్రశ్నమునకుఁ బ్రతివచనము చెప్పుచున్నాఁడు.—చకారమునకు తు అని అర్థము. మాం చ = నన్నే, నారాయణుని సర్వభూతాంతర్యామిని మాయచే క్షేత్రజ్ఞభావమును బొందినవానిని పరమానందఘనుని భగవంతుని వాసుదేవుని; అవ్యభిచారేణ = పరమప్రేమలక్షణ మగు; భక్తియోగేన – ద్వాదశాధ్యాయమునఁ జెప్పఁబడినదానిచేత; యః=ఎవఁడు; సేవతే = ఎల్లప్పుడు సేవించుచున్నాఁడో; సః = అట్టి నాభక్తుఁడు; ఏతాన్ – పూర్వము చెప్పఁబడిన; గుణాన్; సమతీత్య = చక్కఁగా నతిక్రమించి, అద్వైతదృష్టిచే బాధించి; బ్రహ్మభూయాయ = బ్రహ్మభవనముకొఱకు, మోక్షముకొఱకు; కల్పతే = సమర్థుఁ డగుచున్నాఁడు. సర్వదా భగవచ్చింతనమే గుణాతీతుఁ డగుటకుపాయ మని యర్థము.

శ్రీ. ఎట్లు మఱి ఈ గుణముల నతివర్తించు నను ప్రశ్నమున కుత్తరము చెప్పుచున్నాఁడు.—చశబ్ద మవధారణార్థము. మాం చ = నన్నే, పరమేశ్వరుని శ్రీనారాయణుని; అవ్యభిచారేణ భక్తియోగేన = ఏకాంతభక్తియోగముచేత; యస్సేవతే; సః; ఏతా న్గుణాన్; సమతీత్య=చక్కఁగా నతిక్రమించి; బ్రహ్మభూయాయ= బ్రహ్మభావముకొఱకు, మోక్షముకొఱకు; కల్పతే = యోగ్యుఁ డగుచున్నాఁడు.

ప. *

రా. ఇఁక నీవిధమైన గుణాత్యయమునందుఁ బ్రధానహేతువు చెప్పు చున్నాఁడు.—"నాన్యం గుణేభ్యః కర్తారమ్" ఇత్యాదిగాఁ జెప్పఁబడిన ప్రకృత్యాత్మవివేకానుసంధానముచేతనే గుణాత్యయము సిద్ధింపదు. ఏల యనఁగా, అది యనాదికాలప్రవృత్త మగు విపరీతవాసనచే బాధ్య మగును. మామ్ – నన్ను సత్యసంకల్పుని పరమకారుణికుని ఆశ్రితవాత్సల్యజలధిని; అవ్యభిచారేణ=ఏకాంతత గల; భక్తియోగేనచ = భక్తియోగముచేతఁ గూడ; య స్సేవతే; సః; ఏతాన్ గుణాన్ = ఈ సత్త్వాదిగుణములను, దురత్యయము లైనవానిని; సమతీత్య; బ్రహ్మభూయాయ = బ్రహ్మత్వముకొఱకు; కల్పతే – బ్రహ్మభావముకొఱకు యోగ్యుఁ డగు చున్నాఁడు. యథావస్థితుఁ డైన యమృతుండును అవ్యయుండు నగు నాత్మను బొందు చున్నాఁ డని యర్థము.

మా. బ్రహ్మమువలె—ప్రకృతివలెఁ బ్రియుఁ డగుట బ్రహ్మభూయము ♦ ఐనను ప్రియమాత్రుం డగుం గాని ప్రకృతియంత ప్రియుండు గాఁడు "బద్ధావాపి తు ముక్తా వా న రమావ ప్రియా హరేః" అని పాద్మమునందు. భూయాయ=భావముకొఱకు. బ్రహ్మము=మాయ.

బ్రహ్మణో హి ప్రతిష్ఠా ఽహ మమృతస్యా ఽవ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాన్తికస్య చ. ౨౭

భా. ఇది యెందువలన ననఁగాఁ జెప్పుచున్నాఁడు. హి=ఎందువలన ననఁగా. బ్రహ్మణః = పరమాత్మకు; ప్రతిష్ఠా= దీనియందుఁ బ్రతిష్ఠితము గావునఁ బ్రతిష్ఠ ❨; అహమ్=నేను ప్రత్యగాత్మను. ఎట్టి బ్రహ్మమున కనఁగా— అమృతస్య = అవినాశికి; అవ్యయస్యచ = నిర్వికారమునకు; శాశ్వతస్యచ = నిత్యమునకు; ధర్మస్య=జ్ఞానయోగ మను ధర్మముచేఁ బొందఁ దగినవానికి; సుఖస్య = ఆనందరూపమునకు; ఐకాన్తికస్యచ = అవ్యభిచారి యైనదానికి, ఇది సుఖమునకు విశేషణము. ఎందువలన నమృతాది

* శ్రీధరీయముతో సమానము

♦ బ్రహ్మమువలె నగుటకొఱకు అనఁగా ప్రకృతివలె – లక్ష్మీదేవివలె ప్రియుఁ డగుటకొఱ కని యర్థము.

❨ స్థాన మనుట.

స్వభావ మగు పరమాత్మకు ప్రత్యగాత్మ ప్రతిష్ఠ యగునో అందువలన సమ్యగ్దర్శనముచే ప్రత్యగాత్మ పరమాత్మయే యని నిశ్చితమగుచున్నది. ఈ విషయమే బ్రహ్మభూయాయ కల్పతే అని చెప్పఁబడినది. ఏ యీశ్వర శక్తిచేత భక్తానుగ్రహాదిప్రయోజనములకొఱకు బ్రహ్మము ప్రతిష్ఠిత మగుచున్నదో—ప్రవర్తించుచున్నదో ఆశక్తి బ్రహ్మమే నేను, శక్తిశక్తిమంతము లనన్యము లగుటవలన నని యభిప్రాయము. లేక. బ్రహ్మశబ్దవాచ్య మగుట వలన సవికల్పకమే బ్రహ్మము, ఆసవికల్పకబ్రహ్మమునకు నిర్వికల్పక బ్రహ్మమగు నేనే ప్రతిష్ఠను—ఆశ్రయమును, ఇతరుఁడు కాఁడు. ఎట్టి సవికల్పకబ్రహ్మమునకు? అమృతస్య = అమరణము ధర్మముగాఁ గలదానికి; అవ్యయస్య=వ్యయరహితమునకు; మఱియును, శాశ్వతస్యచ=నిత్యమునకును; ధర్మస్య = జ్ఞాననిష్ఠాలక్షణ మైనధర్మమునకు; ఐకాన్తికస్య = ఏకాంతనియత మగు; సుఖస్య=తజ్జన్య మైనసుఖమునకును; నేను ప్రతిష్ఠ నని యర్థము.

అమృతమును అవ్యయమును నిత్యమును జ్ఞానయోగరూపధర్మముచేఁ బ్రాప్యంబును నిత్యానందరూపమును నగు బ్రహ్మమునకు నేనే ప్రతిష్ఠను — బ్రహ్మశక్తిరూపుఁడను, నేనే బ్రహ్మము కావున నన్ను భజించువాఁడు బ్రహ్మమే యగు నని తాత్పర్యము.

ఆ. విద్వాంసుండు బ్రహ్మమే యనుటకు హేతువును ప్రశ్నపూర్వకముగాఁ జెప్పుచున్నారు ఇది ఇత్యాదిగా. బ్రహ్మశబ్దమునకు బాధకము లేనప్పుడు ముఖ్యార్థము గ్రహింపఁదగు నను నభిప్రాయముతోఁ జెప్పుచున్నారు పరమాత్మకు అని. ఆబ్రహ్మమును గూర్చి ప్రత్యగాత్మకే ప్రతిష్ఠాత్వము గలదో దాని నుపపాదించుచున్నారు దీనియందుఁ బ్రతిష్ఠిత మగు నని. ఏబ్రహ్మము ప్రత్యగాత్మయందుఁ బ్రతిష్ఠిత మగుచున్నదో ఆబ్రహ్మ మెట్టి దనఁగాఁ జెప్పుచున్నారు అమృత స్యేత్యాదిగా. అం దమృతశబ్దముచే నవ్యయశబ్దమునకుఁ బునరుక్తిని బరిహరించుచున్నారు నిర్వికారమున కని. నిత్యమునకు — అపక్షయరహితమున కని యర్థము, ఇందుచేఁ బూర్వవిశేషణములవలనఁ బునరుక్తి లేదు. ప్రసిద్ధార్థ మగు ధర్మశబ్దమునకు బ్రహ్మమునం దనుపపత్తి నాశంకించి చెప్పుచున్నారు జ్ఞా నేత్యాదిగా. విషయేంద్రియ సంబంధముచేఁ గలుగునట్టి సుఖమును వ్యావర్తించుటకై ఐకాన్తికస్య అని దానికి విశేషణము. పదార్థముఁ జెప్పి వాక్యార్థముఁ జెప్పు

చున్నారు ఎందువలన నిత్యాదిగా. ఈ శ్లోకమునకుఁ బూర్వశ్లోకముతో నేకవాక్యతను జెప్పుచున్నారు ఈ విషయమే ఇత్యాదిగా. వివక్షిత మగు వాక్యార్థమును బ్రపంచించుచున్నారు ఏ యీశ్వరశక్తిచే నిత్యాదిగా. ఆశక్తి బ్రహ్మమే యని ఎట్లు సామానాధికరణ్య మనఁగాఁ జెప్పుచున్నారు శక్తిత్యాదిగా. వ్యాఖ్యానాంతరముఁ జెప్పుచున్నారు లేక అని. ఇట్లీ యధ్యాయముచేత క్షేత్రక్షేత్రజ్ఞసంయోగము సంసారకారణమనియు పంచప్రశ్ననిరూపణాద్వారమున సమ్యగ్దర్శనము సకలసంసారనివర్తకం బనియు నుపపాదించి గుణములచే నచాల్యత్వాదికము ముముక్షువునకు యత్నసాధ్యం బనియు ముక్తునకయత్నసిద్ధ మగు లక్షణ మనియు సిద్ధాంతింపఁబడినది.

తా. హి—ఎందువలన ననఁగా. బ్రహ్మణః=పరమాత్మకు; ప్రతిష్ఠా = ప్రతిష్ఠతి — దీనిచే క్షేత్రజ్ఞుఁ డభిముఖముగా నిలుచుచున్నాఁడు కావునఁ బ్రతిష్ఠను; అహమ్ = ఈశ్వరుఁడను. అవ్యయస్య - అవినాశిక. శాశ్వతస్య - నిత్యమునకు. ధర్మస్య—మోక్షసాధనమునకు. ఐకాన్తికస్య - అవ్యభిచారి యైన; సుఖస్య - బ్రహ్మానందమునకు. అందువలన నవ్యభిచారి యగు భక్తియోగముచే నన్నుఁ సేవించుచున్నవాఁడే అతఁడు బ్రహ్మభూయమునకు సమర్థుఁ డగుచున్నాఁ డని యర్థము.

భా. సంయోగ! గుణాతీతత్వ-ప్రార్థ్యక్రమణమాత్రంబున బ్రహ్మవిదుఁడు బ్రహ్మము గాఁ గాలఁడు. బ్రహ్మవిదుఁ డహంమన్య మగుటచే జ్ఞాతయు బ్రహ్మ మిద మర్థ మగుటచే జ్ఞేయము నగుటవలన జ్ఞాతకు జ్ఞేయభావము సంభవింపదు, ప్రత్యక్షవిరుద్ధ మగుటవలన. అంపువేని అట్లు కాదు. ఎట్లు లోకమునందు నీఁడు నేను * అను శబ్దము అహంశబ్దార్థ శబ్దాంశములకు శబ్దోపాధిచే జ్ఞాతృజ్ఞేయరూపమున భేదము దోఁచుచున్నను విచారింపఁగా వాని కర్థముచే నేకత్వ ముపపన్న మగుచున్నదో, అందుఁ బ్రత్యక్షవిరోధము గనఁబడదో, అట్లే యిచ్చటఁ గూడ. మఱియును. "సర్వాణి రూపాణి విచిత్య ధీరో నామాని కృత్వాఽభివదన్ యదాస్తే, అనేన జీవేనాఽఽత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" ♦ అనుశ్రుతులు బ్రహ్మమే నామరూపవ్యాకరణోపాధియందు జ్ఞాతృరూపంబున నవస్థితం బని ప్రతిపాదించుచున్నవి. అందువలన జ్ఞాని యగు విద్వాంసున కుపాధి యుపరమించినపుడు బ్రహ్మభావ ముపపన్న మగుచున్నది. ఘటోపాధి లేనపుడు ఘటాకాశమునకు మహాకాశభావం

---

* వీఁడుగో నేను, లేక, ఈ నేను అనుట.

♦ పరమాత్మ సర్వరూపములనుసంకల్పించి నామములను కల్పించి చెప్పుచున్నాఁడు, ఈ జీవాత్మరూపంబున సృష్టమగు జగత్తును బ్రవేశించి నామరూపముల వివరించెదను.

బెట్లో అట్లు. "నాన్యో ఽతోఽస్తి విజ్ఞాతా, అవిజ్ఞాతం విజ్ఞాతృ" అని విజ్ఞాతృబ్రహ్మములకభేదమును శ్రుతి యుపదేశించుటవలనను బ్రహ్మమునకుఁ బ్రతిష్ఠ యగుటవలనను ప్రత్యగ్రూపుఁ డగు విద్వాంసునకుఁ బ్రహ్మభావ ముపపన్న మని బోధించుటకై చెప్పుచున్నాఁడు.—అమృతస్య = "ఏత దమృత మభయ మేత ద్బ్రహ్మ" అను శ్రుతివలన మరణధర్మము లేనిది, అవినాశి; జన్మరహితమునకే యవినాశిత్వము యుక్తము కావున అమృతస్య యనుటచే ఆద్యంతవికారములు లేమి సూచితము; అవ్యయస్య = వ్యయరహితము అవికారి, ఇందుచే వృద్ధివిపరిణామము లనువికారములు లేమి సూచితము; శాశ్వతస్యచ = నిత్యము, దీనిచే ఆగంతుకమైన యస్తిత్వమును అపక్షయమును లేమి సూచితము; చకారములు రెండును సముచ్చయార్థములు; ధర్మస్య = అవిద్యచే జన్మమరణప్రవాహమునందుఁ ద్రోయఁబడుచున్న పురుషుఁడు దీనిచే ధ్రియతే — ధరింపఁబడుచున్నాఁడు నిలుపఁబడుచున్నాఁడు కావున ధర్మ మనఁగా జ్ఞానము, అట్టిధర్మము, ధర్మముచే నెఱుంగఁబడునది యని యర్థము; సుఖస్య=ఆనందరూపము; ఐకాన్తికస్యచ=దృఢముగా ఇది యిట్టిదే యని దీనిచే నిశ్చయింపఁబడుచున్నది కావున అంత మనఁగా ప్రత్యయము, ఒక్కటైన అంతము ఏకాంతము—ఏకప్రత్యయము, దానిచేఁ దెలియఁబడుచున్నది కావున ఐకాన్తికము, సర్వత్ర యవ్యభిచరిత మైనసత్త గలది, పరిపూర్ణము, అట్టి; బ్రహ్మణః=నిర్విశేషబ్రహ్మమునకు; హి=ఎందువలన; అహమ్=అహ మర్థ మగు ప్రత్యగాత్మను, సర్వదృశ్యజ్ఞాతను; ప్రతిష్ఠా = దీనిచేత ప్రతితిష్ఠతి — జ్ఞాతృస్వరూపంబున నామరూపవ్యాకరణమునకుఁ బ్రవర్తించుచున్నది కావునఁ బ్రతిష్ఠనో; "త దేవా ఽనుప్రావిశత్" అను శ్రుతివలన ప్రత్యగాత్మస్వరూపంబున నుపాధియం దుండి పరబ్రహ్మమే బుద్ధ్యాదిసర్వదృశ్యజాతము నెఱుంగుచున్నది ప్రకాశింపఁజేయుచున్నది గూడ. అందుచే నాత్మకు బ్రహ్మత్వ మనుపపన్నము కాదు. ఎట్లు దీపరూపంబునఁ బదార్థంబులను ప్రకాశింపఁజేయునట్టి దీపరూపం బగు నగ్ని కగ్నిత్వ మెట్లు తప్పదో అట్లు. అందువలన జ్ఞాత యైన యాత్మ కుపాధి లేనపుడు, బ్రహ్మత్వము యుక్తము, జ్ఞాత యగు నాత్మయే విద్వాంసుఁడు, అందువలన జ్ఞాత యగు విద్వాంసుఁడు బ్రహ్మమే యగుచున్నాఁ డని యర్థము. లేక. ఉక్తలక్షణం బగు నిర్విశేషపరబ్రహ్మమునకు, అహమ్=అహ మర్థ మగు ప్రత్యగాత్మ; ప్రతిష్ఠా, స్వభావస్థితిహేతు వగుటవలన; ప్రత్యగాత్మచేతఁ గదా పరబ్రహ్మము స్వభావస్థితిని బొందుచున్నది; బ్రహ్మముయొక్క సత్త్వము చిత్త్వము ఆనందరూపత్వము పరిపూర్ణత్వము అద్వితీయత్వము మొదలగునది బుద్ధ్యుపాధికుఁడై

చేతనుం డగు ప్రత్యగాత్మ చేతనే కదా సిద్ధించును, మఱి తనవలన సిద్ధింపదు, బ్రహ్మము నిర్విశేష మగుటవలన; అందువలన నహమర్థము బ్రహ్మమునకుఁ బ్రతిష్ఠ యగుచున్నది; బ్రహ్మవ్యతిరిక్త మగు చేతనవస్తువు లేమివలనను "అయ మాత్మా బ్రహ్మ" అను శ్రుతివలనను ప్రత్యగాత్మ కుపాధి లేనపుడు బ్రహ్మత్వము యుక్తము. అందువలన విద్వాంసుఁడు బ్రహ్మమే యనుట సిద్ధము.

మ ఇందులకు హేతువు చెప్పుచున్నాఁడు —బ్రహ్మణః= తత్పదవాచ్యంబును సోపాధికంబును జగదుత్పత్తిస్థితిలయహేతువు నగు బ్రహ్మమునకు; ప్రతిష్ఠా= పారమార్థికంబును నిర్వికల్పకంబును సచ్చిదానందాత్మకంబును నిరుపాధికంబును తత్పదలక్ష్యంబు నగు స్వరూపము; అహమ్= నేను నిర్వికల్పకుఁడను వాసుదేవుఁడను. దీనియందుఁ బ్రతిష్ఠిత మగుఁ గావున ప్రతిష్ఠ యనఁగా కల్పితరూపరహిత మైన యకల్పితరూపము. అందువలన నెవ్వఁ డనుపాధిక మగు బ్రహ్మమును నన్ను సేవించుచున్నాఁడో అతఁడు బ్రహ్మభూయమునకు సమర్థుఁ డగు ననుట యుక్తమే. ఎట్టి బ్రహ్మమునకు నేను బ్రతిష్ఠ నని యాకాంక్ష కలుగఁగా విశేషణములఁ జెప్పుచున్నాఁడు.—అమృతస్య = వినాశరహితమునకు; అవ్యయస్య = విపరిణామరహితమునకు; శాశ్వతస్య=అపక్షయరహితమునకు, ధర్మస్య = జ్ఞాననిష్ఠాలక్షణ మగు ధర్మముచే పొందఁదగినదానికి; సుఖస్య = పరమానందరూపమునకు; విషయేంద్రియసంయోగజన్యసుఖము కాదని చెప్పుచున్నాఁడు.—ఐకాన్తికస్య=వ్యభిచరింపనిదానికి; సర్వదేశకాలములయందును విదునకి యుండునట్టి యైకాంతికసుఖరూపమున కని యర్థము, ఇట్టి బ్రహ్మమున కెందువలన నేను వాస్తవస్వరూపమై యున్నానో అందువలన నా భక్తుఁడు సంసారమునుండి ముక్తుఁ డగుచున్నాఁ డని భావము. అట్లు చెప్పఁబడినది బ్రహ్మదేవునిచే భగవంతుఁ డగు శ్రీకృష్ణునిగూర్చి "ఏక స్త్వ మాత్మా పురుషః పురాణః సత్యః స్వయంజ్యోతి రనన్త ఆద్యః। నిత్యో ఽక్షరో ఽజస్రసుఖో నిరఞ్జనః పూర్ణో ఽద్వయో ముక్త ఉపాధితో ఽమృతః" అని. ఇందు, సర్వోపాధిశూన్యుఁ డైన యాత్మ యగుబ్రహ్మము నీ వని యర్థము. శుకుఁడు గూడ స్తుతి లేకయే చెప్పియున్నాఁడు. "సర్వేషా మేవ వస్తూనాం భావార్థో భవతి స్థితః। తస్యాపి భగవాన్కృష్ణః కి మత ద్వస్తు రూప్యతామ్" అని. సమస్తము లైన కార్యవస్తువులకును; భావార్థః= సత్తారూప మైనపరమార్థము, భవతి—కార్యాకారంబున నున్నసోపాధికబ్రహ్మమునందు, స్థితః — ఉన్నది, కారణసత్తకన్నను వేఱుగాఁ గార్యసత్త నంగీకరింపమివలన; తస్యాపి—అభవద్రూప మైనకారణ మగు సోపాధికబ్రహ్మమునకుఁ గూడ, భావార్థః—

సత్తారూప మైన యర్థము, భగవాన్ కృష్ణః, సోపాధికము నిరుపాధిక మందుఁ గల్పిత మగుటవలనను కల్పితం బధిష్ఠానముకంటె నతిరిక్తము కామివలనను భగవంతుఁ డగు కృష్ణుఁడు సర్వకల్పనలకును నధిష్ఠాన మగుటచేఁ బరమార్థసత్యనిరుపాధిక బ్రహ్మ రూపుఁ డగుటవలనను; అందువలన, కిం అతత్ వస్తు — అట్టి శ్రీకృష్ణునికంటె అన్య మైనవస్తువు పారమార్థిక మేది కలదు ? రూప్యతామ్=నిరూపింపఁబడుఁ గాక, అది యొక్కటియే పారమార్థికము, అన్య మేదియుఁ గా దని యర్థము. అదియే యిక్కడఁగూడ చెప్పఁబడినది."బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమ్" అని. లేక. నీభక్తుఁడు నీభావము నొందవచ్చును, ఎట్లు బ్రహ్మభావము నొందును ? నీవు బ్రహ్మముకంటె భిన్నుఁడ వగుటవలన నని యాశంకించి చెప్పుచున్నాఁడు.—బ్రహ్మణః = పరమాత్మ యొక్క; ప్రతిష్ఠా = పర్యాప్తి; అహమ్=నేనే, నాకంటె భిన్నముకాదు బ్రహ్మ మని యర్థము. అట్లు, అమృతస్యచ = మోక్షమునకును, అవ్యయస్య=సర్వవిధంబులను విచ్ఛిత్తి లేనిదానికి; ప్రతిష్ఠను నేనే, నాయందే మోక్షము పర్యాప్త మగుచున్నది—నన్నుఁ బొందుటయే మోక్ష మని యర్థము. తథా=అట్లు, శాశ్వతస్య= నిత్య మైన మోక్షము ఫలముగాఁ గల; ధర్మస్యచ=జ్ఞాననిష్ఠాలక్షణధర్మమునకును, పర్యాప్తిని నేనే, జ్ఞాననిష్ఠాలక్షణ మగు ధర్మము నాయందే పర్యవసితము. దానిచే మద్భిన్న మైన దేదియుఁ బొందఁదగినది లే దని యర్థము. అట్లు ఐకాంతికసుఖమునకును పర్యాప్తి నేనే పరమానందరూపుఁడ నగుటవలన, మద్భిన్న మైనసుఖ మేదియుఁ బొందఁ దగినది లే దని యర్థము. అందువలన యుక్తమే చెప్పఁబడినది నాభక్తుఁడు బ్రహ్మభూయము నొందుచున్నాఁ డని యర్థము.

క. నరరూపపరబ్రహ్మముఁ, బరాస్తనతిబంధనున్ విభాసురవరసుం
దరభావసర్వసారము, నరయుదు మది నందనందనాఖ్యము మహిమున్.

శ్రీ. అందులకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—హి = ఎందువలన; బ్రహ్మణః = బ్రహ్మమునకు; అహమ్ = నేను; ప్రతిష్ఠా = ప్రతిమనో, నేను ఘనీభూత మగు బ్రహ్మమే నై యున్నానో, ఎట్లు ఘనీభూత మగు ప్రకాశమే సూర్యమండలమో అట్లే యని యర్థము. అట్లు, అవ్యయస్య=నిత్యమగు; అమృతస్య=మోక్షమునకును, నిత్యముక్తుఁడ నగుటవలన; అట్లు, తత్సాధన మగు, శాశ్వతస్య ధర్మస్యచ, శుద్ధసత్త్వాత్మకుఁడ నగుటవలన; అట్లు, ఐకాన్తికస్య = అఖండ మగు; సుఖస్యచ — ప్రతిష్ఠను నేను పరమానందైకరూపుఁడ నగుటవలన; కావున నన్ను సేవించువానికి

మద్భావం బవశ్యము కలుగవలసిన దగుటవలన యుక్తమే చెప్పఁబడినది బ్రహ్మభూయాయ కల్పతే యని.

క. భగవదనన్యాసాధ్య, త్రిగుణాసంజాతభవాంబుధిన్ దరియించున్
భగవద్భక్తుఁడు సుఖముగ, నగధరుఁ డనియెన్ జతుర్దశాధ్యాయమునన్.

ప. ఇఁకఁ దాను మనుష్యవేషధారి యగుటచే మూఢులకు దేహబుద్ధి నిరాసార్థమై తనయీశ్వరత్వమును చెప్పుచున్నాఁడు.—చిదానందమాత్రరూప మగు, బ్రహ్మణః=బ్రహ్మమునకు; అహమ్=నేను; ప్రతిష్ఠా=ప్రతిమను, ఘనీభావరూపుఁడను; ఎట్లు ఘనీభూత మగు తేజస్సు సూర్యాకార మగుచున్నదో ఎట్లు ఘనీభూతమైన పరిమలము కర్పూరాకార మగుచున్నదో అట్లని యర్థము. అట్లు, అవ్యయస్య=నిత్య మగు; అమృతస్య చ=మోక్షమునకును, నిత్యముక్తుఁడ నగుటవలన; అట్లు, శాశ్వతస్య=నిత్యఫలద మగు; ధర్మస్య చ, శుద్ధసత్త్వాత్మకుఁడ నగుటవలన; అట్లు, ఐకాన్తికస్య=అఖండ మగు; సుఖస్య చ; ప్రతిష్ఠా అహమ్, పరమానందరూపుఁడ నగుటవలన. అందువలన నన్ను సేవించువానికి మద్భావం బవశ్యము కలుగవలయును గావున యుక్తమే చెప్పఁబడినది బ్రహ్మభూయాయ కల్పతే అని. అది చెప్పఁబడినది అధ్యాత్మమీమాంసయం దారంభమున. "కృష్ణాకారేణ సాక్షాదిహహి విజయతే సూత్రసఞ్జ్ఞః పరాత్మా, జ్యోతి ర్విశ్వప్రకాశం వ్రజతి దినకరాకారతాం యద్వదత్ర। యస్స్వగాత్రే ఽథ వక్త్రే ఽర్జునజననికృతే ఽదర్శయ ద్విశ్వరూపం, తం నత్వా స్వానుభూతిప్రద ముపనిషదాం సారగర్భం బ్రవీమి" *. అధ్యాయతాత్పర్యము.—ఒకటే యుపాదానము కల దైనను ఏగుణములచే నీప్రపంచము బహువిధ మయ్యెనో అట్టి యీగుణములు సుఖలోభప్రమాదములచేత నజ్ఞానిజంతువులను బంధించుచున్నవి. నాభక్తుల నేమో బంధింపఁజాలవు. ఎవఁడు శుద్ధసత్త్వమును స్వీకరించినవాఁడై యితరగుణముల జయించునో అతఁడు నన్నుఁ బొందుచున్నాఁడు. సత్యము. అని యీ గుణాతీతయోగము చతుర్దశాధ్యాయమందుఁ జక్కఁగాఁ బ్రతిపాదింపఁబడినది.

రా. హి శబ్దము హేత్వర్థము. హి = ఎందువలన; అహమ్; అవ్యభిచారియైన భక్తియోగముచే సేవింపఁబడినవాఁడను; అమృతస్య అవ్యయస్య చ బ్రహ్మణః

* ఎట్లు విశ్వప్రకాశం బగు తేజస్సు సూర్యాకారమును బొందుచున్నదో అట్లీలోకంబున సాక్షాత్సూత్రాత్ముం డగు పరమాత్మ కృష్ణాకారంబున విజయము చేసి యున్నాఁడు. ఎవ్వాఁడు అర్జునునికి దేహంబునను తల్లికి నోటను విశ్వరూపముఁ జూపెనో అట్టి యాత్మానుభవప్రదుం డగు శ్రీకృష్ణుని నమస్కరించి యుపనిషత్తులయొక్క హృదయస్థం బగు నర్థమును జెప్పుచున్నాను.

ప్రతిష్ఠా. అట్లు, శాశ్వతస్య ధర్మస్యచ—సర్వాతిశాయి యగు నిత్యైశ్వర్యమునకును. ఐకాన్తికస్య సుఖస్యచ — వాసుదేవ స్సర్వ మిత్యాదిగాఁ జెప్పఁబడిన జ్ఞానముచేఁ బొందఁదగినసుఖమున కని యర్థము. శాశ్వతధర్మశబ్దము సాధనవాచక మైనను పూర్వోత్తరములు సాధ్యము లగుటచే వానితో సహపఠిత మగుటవలన నదియును సాధ్యలక్షకము. ఇది యభిప్రాయము.—ముందు "దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా। మా మేవ యే ప్రపద్యన్తే" అని యారంభించి గుణాత్యయమునకును తత్పూర్వకము లగు నక్షరైశ్వర్యభగవత్ప్రాప్తులకును భగవత్ప్రపత్తియొక్కటే యుపాయం బని ప్రతిపాదిత మగుటవలన గుణాత్యయమునకును తత్పూర్వక బ్రహ్మభావమునకును ఏకాంతభగవత్ప్రపత్తి యొక్కటే యుపాయము.

**మా.** బ్రహ్మణః = మాయకు.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయవిభాగయోగో నామ చతుర్దశో ఽధ్యాయః.

వ్యాసప్రోక్త మయిన శతసహస్రగ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రంబును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు గుణత్రయవిభాగయోగం బనంబరఁగు చతుర్దశాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమత్ఛవాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవద్గీ
తాంధ్ర వ్యాఖ్యానంబునందు
జతుర్దశాధ్యాయటీక.

---

ఏత చ్చతుర్దశక మివ కృత్స్నా గీతార్థవివృతి రక్షతేయమ్
పరిపూర్తి మియా దచిరాత్ శ్రీమ ద్భగవ త్ప్రసాదేన
ఘటయతు భాగవతీ మే దుర్ఘటఘటనాపటీయసీ కరుణా
సాధనవికలస్యా ఽపి చ గీతాపరమార్థచన్ద్రికాపూర్తిమ్.

---

శ్రీ ర స్తు.

శ్రీ గణేశ శారదా గురుభ్యో నమః.

పరమార్థచంద్రికాసహిత

# శ్రీభగవద్గీత, పంచదశాధ్యాయము.

గుణతత్త్వవినాశో యత్ప్రాదుర్భావతో విభాతి సతామ్
పరభవభేదదమసీం తాం విద్యా మమ్బికాం వన్దే.

ఆత్మైకభక్తి రమలా త్రిగుణాతీతత్వహేతు రిత్యాహ
యో విజ్ఞానమయం తం కృష్ణం వన్దే పరాత్మానమ్.

శ్రీభగవా నువాచ.—

ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్. ౧

శంకరభాష్యము.—

ఎందువలనఁ గర్ములకర్మఫలంబును జ్ఞానులజ్ఞానఫలంబును నాయధీనములో అందువలన భక్తియోగముచే నన్ను సేవించువారలు నాప్రసాదమువలన జ్ఞానప్రాప్తిద్వారమున గుణాతీతులై మోక్షము నొందుదురు. ఇఁకఁ జెప్పెడి దేమి నాయొక్కతత్త్వమునే చక్కఁగా నెఱింగినవారలు మోక్షము నొందుదు రని? అందువలన భగవంతుఁ డర్జునుం డడుగకున్నను తనతత్త్వము వచింపఁ గోరినవాఁడై పలికెను ఊర్ధ్వమూల మిత్యాదిగా. అందు వైరాగ్యము కలుగుటకై వృక్షత్వారోపముచేత సంసారస్వరూపమును వర్ణించుచున్నాఁడు సంసారమునెడ విరక్తుఁడైనవానికే భగవత్తత్త్వజ్ఞానమునం దధికార మగుం గాని యితరునకుఁ గాదని.—ఊర్ధ్వమూలమ్ — కాలముకంటె సూక్ష్మ మగుటవలనను కారణ మగుటవలనను నిత్య మగుటవలనను మహత్తగుటవలనను ఊర్ధ్వ మని చెప్పఁబడుచున్నది అవ్యక్తమాయాశక్తివిశిష్ట మగుబ్రహ్మము, అది మూలముగాఁ గలది కావున ఈ సంసారవృక్ష మూర్ధ్వమూలము, శ్రుతివలనఁ గూడ "ఊర్ధ్వమూలో ఽర్వాక్శాఖః" అని, పురాణమునం

దును "అవ్యక్తమూలప్రభవ స్తస్యైవానుగ్రహోత్థితః । బుద్ధిస్కన్ధమయ శ్చైవ ఇన్ద్రియాన్తరకోటరః ॥ మహాభూతవిశాఖశ్చ విషయైః పత్త్రవాం స్తథా । ధర్మాధర్మసుపుష్పశ్చ సుఖదుఃఖఫలోదయః ॥ ఆజీవ్య స్సర్వభూతానాం బ్రహ్మవృక్ష స్సనాతనః । ఏత ద్బ్రహ్మవనం చైవ బ్రహ్మా ఽఽచరతి నిత్యశః ॥ ఏత చ్ఛిత్త్వాచ భిత్త్వాచ జ్ఞానేన పరమాసినా । తతశ్చా ఽఽత్మరతిం ప్రాప్య యస్మి న్నా ఽఽవర్తతే పునః" * ఇత్యాదిగా, అట్టి యూర్ధ్వమూల మగు సంసారమాయామయ మైనవృక్షమును; అధఃశాఖమ్ = మహదహంకారతన్మాత్రాదులు శాఖలవలె దీనికి క్రిందనున్నవి కావున అధఃశాఖలుగలదాని; అశ్వత్థమ్=శ్వోపిన స్థాతా—రేపుగూడ ఉండునది కాదు కావున అశ్వత్థము, అట్టి క్షణవినాశి యైన యశ్వత్థమునుగా; ప్రాహుః = చెప్పుచున్నవి వేదవాదములు; అవ్యయమ్=సంసారమాయామయమును, అనాదికాలప్రవృత్త మగుటవలన యీసంసారవృక్ష మవ్యయము, అనాద్యనంతము లైన దేహాదిపరంపరలకు ఆశ్రయం బని సుప్రసిద్ధము గదా, అందువలన అవ్యయము ననఁగా నాశము లేనిదానిఁగాఁ గూడ. ఆ సంసారవృక్షమునకే మఱియొకవిశేషణమును జెప్పుచున్నాఁడు.—ఛన్దాంసి = ఆచ్ఛాదించుటవలన ఋగ్యజుస్సామరూపము లైన వేదములు; యస్య=ఏ సంసారవృక్షమునకు; పర్ణాని = పత్త్రములవంటివి గావున పత్త్రములో, ఎట్లు పత్త్రములు వృక్షమునకు పరిరక్షణార్థములో అట్లు సంసారవృక్షమునకు వేదములు పరిరక్షణార్థములు, ధర్మాధర్మములను తజ్జన్యఫలములను బ్రతిపాదించుటయే ప్రయోజనముగాఁ గలవి యగుటవలన. తమ్=వ్యాఖ్యాత మగు సంసారవృక్షమును; యః=ఎవ్వఁడు; వేత్తి=సమూలముగా నెఱుంగుచున్నాఁడో; సః = అతఁడు; వేదవిత్ — వేదార్థము నెఱింగినవాఁ డని

---

* అవ్యక్త మను మూలమునుండి యుత్పత్తి గలదియును దానియనుగ్రహమువలననే వృద్ధి నొందినదియును బుద్ధియే బోదెగాఁగలదియును ఇంద్రియరంధ్రములే తొఱ్ఱగాఁగలదియును మహాభూతములే కొమ్మలుగాఁ గలదియును విషయములే పత్త్రములుగాఁ గలదియును ధర్మాధర్మములు పుష్పములుగాను సుఖదుఃఖములు ఫలములుగాను గలదియును సర్వభూతములకును జీవనాధారమును సనాతనమును నగునది బ్రహ్మవృక్షము. ఇది బ్రహ్మవన మనియుఁ జెప్పఁబడును. దీనిని జ్ఞానం బను నుత్తమఖడ్గముచే ఛేదించి భేదించి అంత ఆత్మరతిని బొంది దేననుండి వెండియు మరలిరాఁడో అట్టి బ్రహ్మమును ఎల్లప్పుడును జెందుచున్నాఁడు.

యర్థము. సమూల మగు నీసంసారవృక్షముకంటె నితర మెఱుంగవలసి నది యణుమాత్రమును అవశిష్టము లేదు గదా! అందువలన నావేదా ర్థము నెఱింగినవాఁడు సర్వజ్ఞుఁ డని సమూలవృక్షజ్ఞానమును స్తుతించు చున్నాఁడు.

మాయామయ మగు సంసారవృక్షమునకు బ్రహ్మమే వేరువంటిది. దాని క్రిందఁ బెరుఁగుచున్న మహదహంకారతన్మాత్రాదులు శాఖలవంటివి. వృక్షమును బత్త్రము లాచ్ఛాదించి రక్షించునట్లు యీసంసారవృక్షమును కర్మకాండరూప వేదములు ధర్మాధర్మములను తత్ఫలములను బోధించునవియై యాచ్ఛాదించి రక్షిం చును. ఈ మహావృక్షము అనాద్యనంత మైనదేహాదిపరంపరను బుట్టించునదియైనను రేపుగూడ నుండనిది అనఁగా క్షణభంగుర మని వేదములు చెప్పుచున్నవి. ఈసం సారవృక్షమును మూలసహితముగా నెవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడు సర్వ వేదార్థము నెఱింగినవాఁ డని తాత్పర్యము. మూలభూత మైన బ్రహ్మముతో నీసంసా రవృక్షము నెఱింగినవాఁడు కర్మజ్ఞానకాండరూపము లైన సర్వవేదముల తాత్పర్యము నెఱింగినవాఁ డగు నని భావము.

ఆనందగిరికృత టీక.—

జ్ఞానముచేత గుణాత్యయము కలుగు నని పూర్వాధ్యాయమునఁ బ్రతి పాదింపఁబడినది. ఆగుణములు నశ్వరము లన్న యెడ జ్ఞానములేకయె తదత్యయము సంభవించుటవలనను, అనశ్వరము లన్నచో జ్ఞానముచేతఁ గూడ తదత్యయము సిద్ధిం పమివలనను, జ్ఞానము గుణాత్యయహేతువు కా దను నాశంకను నిరసించి సాక్షాత్తు గానే శ్రవణాదిసాధన మగు సన్న్యాసమును విధించుటకును బ్రహ్మభావమే పరమ పురుషార్థ మని బోధించుటకును అధ్యాయాంతరము నారంభించుచున్నారు ఎందు వలన నిత్యాదిగా. కర్ములును జ్ఞానులును శాస్త్రమునం దధికారము గలవారు. అందు కర్మానుష్ఠాతల కర్మానుకూల మైనఫల మీశ్వరునియధీనము, "ఫల మత ఉప పత్తేః" * అనున్యాయమువలన. జ్ఞానుల జ్ఞానఫలముగూడ ఈశ్వరునియధీనమే, "తతో హ్యస్య బన్ధవిపర్యయౌ" ♦ అని చెప్పఁబడి యుండుటవలన. ఇందువలన

* అతః — ఈ యీశ్వరునివలననె, ఫలమ్—కర్మఫలము కలుగుచున్నది, ఉపపత్తేః—ఉపపన్న మగుటవలన.

♦ తతోహి — ఆ యీశ్వరునివలననే కదా, అస్య—ఈ జీవునకు, బంధవిపర్యయౌ — బన్ధమును మోక్షమును గలుగుచున్నవి.

ఎవరు భక్తియోగముచేత నన్ను సేవింతురో వారు నాప్రసాదముద్వారమున జ్ఞానము నొంది గుణాతీతులై ముక్తు లగుదు రని సిద్ధ మని యర్థము. మఱి యెవ్వరు సంశయాదులు లేక భగవత్తత్త్వమునే యెఱుంగుదురో వార లాజ్ఞానముచేత గుణాతీతులై ముక్తిఁ జెందుదు రని చెప్పెడి దేమి అని అర్థసిద్ధ మైనయర్థమును జెప్పుచున్నారు ఇఁక నిత్యాదిగా. ఎందువలన ఆత్మతత్త్వముయొక్క యజ్ఞానము సంసారహేతువో తద్జ్ఞానము మోక్షహేతువో అందువలన అర్జునుం డది యేది యని యడుగకున్నను తత్త్వమును భగవంతుఁడు చెప్పెను ప్రశ్నము చేయకున్నను అర్జునునకు దానిఁ దెలుపవలయు నను నభిమానమువలన నని చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. తత్త్వము చెప్పవలసియుండఁగా సంసారము నేల వర్ణించుచున్నాఁ డనఁగా చెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. అందు అనఁగా అధ్యాయాదియం దని యర్థము. వైరాగ్యమునుగూడ నేల నపేక్షింపవలయు ననఁగాఁ జెప్పుచున్నారు సంసారమునెడ ఇత్యాదిగా. అని — వైరాగ్యముకొఱకు సంసారమును వర్ణించుట యని శేషము. నాశయోగ్య మని తెలియుటకొఱకు బంధహేతువునకు వృక్షరూపకమును జూపుచున్నారు ఊర్ధ్వమూల మ్మని. కాలముకంటె నెట్లు సూక్ష్మ మనఁగాఁ జెప్పుచున్నారు కారణ మగుటవలనను అని. ఎట్లు కారణం బగు ననఁగా కార్యముకంటె నియతముగా పూర్వభావి యగుటవలన నని చెప్పుచున్నారు నిత్య మగుటవలనను అని. సర్వవ్యాపి యగుటవలనను ఉత్కృష్టముఁ బ్రదర్శించుచున్నారు మహత్తగుటవలనను అని. ఊర్ధ్వ మనఁగా ఉన్నతము ఉత్కృష్ట మని యర్థము. కూటస్థ మైన బ్రహ్మము మూలం బెట్లగు నని యాశంకించి చెప్పుచున్నారు అవ్యక్తేత్యాదిగా. స్మృతికి మూలముగా శ్రుతి నుదాహరించుచున్నారు శ్రుతివలనను ఇత్యాదిగా. అర్వాక్శాఖః — అర్వాక్కులు — నికృష్టములైన శాఖలవంటి మహదాదులు కల దని యర్థము. ప్రకృత మగు సంసారవృక్షమునందుఁ బురాణసమ్మతిని జెప్పుచున్నారు పురాణమునందును ఇత్యాదిగా. అవ్యక్త మనఁగా అవ్యాకృతము, అవ్యక్త మను మూలమువలన ఉత్పత్తి గలది కావున అవ్యక్తమూలప్రభవము. తస్యైవ — ఆ మూలభూతమైన యవ్యక్తముయొక్కయే, అనుగ్రహమువలన — అతిదృఢత్వమువలన ఉత్థితము—వృద్ధిఁ బొందినది. దానికి లౌకికవృక్షముతో సాదృశ్యముఁ జెప్పుచున్నాఁడు బుద్ధీత్యాదిగా. వృక్షమునకు స్కంధమునుండి గదా శాఖలు పుట్టుచున్నవి, సంసారమునకును బుద్ధివలననుండి నానాపరిణామములు గలుగుచున్నవి, అందుచే దీనికి బుద్ధియే స్కంధము, తన్మయ

మనఁగా తత్ప్రచురము – అది యధికముగాఁ గలది ఈ సంసారవృక్షము. ఇంద్రియములయొక్క–అంతరములు–రంధ్రములు కోటరములుగాఁ గలది. మహాభూతములు పృథివ్యప్తేజోవాయ్వాకాశములు వివిధశాఖలుగాఁ గలది. ఆజీవ్య మనఁగా ఉపజీవ్య మని యర్థము. బ్రహ్మముచే నధిష్ఠిత మైన వృక్షము కావున బ్రహ్మవృక్ష మని చెప్పఁబడుచున్నది. ఇనను జ్ఞానముచేతనే గాని ఛేదింప నశక్య మగుటవలన సనాతనము–చిరకాల ముండునది. బ్రహ్మవనము–పరమాత్మ యగు బ్రహ్మముయొక్క వనము అనఁగా సేవింపఁదగి నది, దీనియందుఁ గదా బ్రహ్మము ప్రతిష్ఠితమై యున్నది, ఈ సంసారాఖ్యవృక్షమునకు ఆ బ్రహ్మమే సారభూతమై యున్నది. లేక, ఈ యనవచ్ఛిన్న మగు సంసారమండలరూప మైన బ్రహ్మవృక్షమునకు ఆ బ్రహ్మము వనముపంటిది గావున వన మనఁబడెను, అనఁగా సేవింపఁదగిన దని యర్థము, సంసారమునకు బ్రహ్మముకంటె నతిరిక్త మైన యాస్పదము లేదు గదా! బ్రహ్మమే యవిద్యచేత సంసరించుచున్న దని యంగీకరించుటవలన నని యర్థము. నేనే బ్రహ్మ మను దృఢజ్ఞానముచేత నీ చెప్పినసంసారవృక్షమును ఛేదించి ప్రతిబంధకము లేమివలన ఆత్మనిష్ఠుఁడై పునరావృత్తిరహిత మగు కైవల్యమును జెందు నని చెప్పుచున్నారు ఏత దిత్యాదిశ్లోకముచేత. అధఃశాఖ మిత్యాదికమునకు వ్యాఖ్యానముఁ జేయుచున్నారు మహ దిత్యాదిగా. ఆదిశబ్దముచే నింద్రియాదులు గ్రహింపఁబడుచున్నవి. సంసారవృక్షము అతి నశ్వర మనుటకుఁ బ్రమాణముఁ జెప్పుచున్నారు ప్రాహు రని. క్షణభంగుర మగు దాని నవ్యయ మనుట విరుద్ధ మని యాశంకించి చెప్పుచున్నారు సంసా రేత్యాదిగా. దానినే యుపపాదించుచున్నారు అనా దీత్యాదిగా. ఆచ్ఛాదించుట–రక్షించుట, లేక, కప్పుట. గతాగతములు ఫలములుగాఁ గలవియు నానావిధములైన యర్థవాదములతోఁ గూడినవియు నగు కర్మకాండములు గదా సంసారవృక్షమును రక్షించుచున్నవి, దానియం దున్నదోషమును గూడఁ గప్పుచున్నవి, అందువలన నీఛందస్సులు పర్ణములవంటి వని యర్థము. దానినే ప్రపంచించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. చెప్పినయర్థమునందు హేతువును జూపుచున్నారు ధర్మాధర్మములను ఇత్యాదిగా. కర్మకాండరూపము లైనవేదము లని శేషము. కర్మబ్రహ్మాఖ్య మగు సర్వవేదార్థమునకును అం దంతర్భావమును దలఁచి వ్యాఖ్యానముఁ జేయుచున్నారు వేదార్థము నెఱింగినవాఁ డని యర్థ మని. సమూలముగా సంసారవృక్షము నెఱింగి నపుడు మూలము కానిదాని విడిచి మూలమును వివేచించి ఎఱుఁగశక్య మగును కావున దాని నెఱుంగుటకు యత్నింపవలయు నని దలఁచి తద్జ్ఞానస్తుతి యిట వివక్షింపఁబడిన దని చెప్పుచున్నారు సమూలము ఇత్యాదిగా.

హనుమద్విరచిత పైశాచభాష్యము.—

ఏది సర్వలోకములకును మీఁద వర్తించునో సత్యలోకనివాసి యగు హిరణ్యగర్భునియంతఃకరణమునం దభివ్యక్తమై యుండునో సర్వజగంబునకును సృష్టిస్థితిసంహారహేతుభూతమో అట్టి యవ్యక్తాత్మక మగుబ్రహ్మము ఊర్ధ్వ మనఁబడును, అట్టి యూర్ధ్వము మూలముగా — కారణముగాఁ గలది యూర్ధ్వమూలము సంసారవృక్షము, దాని; అధఃశాఖమ్ = ఆ సత్యలోకముకంటె క్రిందనుండు లోకములలో నుండువారలే శాఖలుగాఁ గలదాని; అశ్వత్థమ్ = రేపుగూడ నుండనిదానిఁగా; ప్రాహుః = చెప్పుచున్నారు పండితులు; అవ్యయమ్ = నాశము లేనిదాని. ఛన్దాంసి = వేదములు; యస్య; పర్ణాని, ఆవరణరూపము లగుటవలన. అట్టి సంసారవృక్షమును అశ్వత్థ మైనదానిని క్షణధ్వంసి యైనదానిని, యః వేద = ఎవఁ డెఱుంగుచున్నాఁడో; స వేదవిత్ — అతఁడు వేదార్థము నెఱింగినవాఁ డని యర్థము.

శంకరానందీయ గీతా తాత్పర్యబోధిని.—

“సత్త్వం రజ స్తమ” ఇత్యాదిగ్రంథముచేత జ్ఞానతత్ఫలములకుఁ బ్రతిబంధకము లగుటచే జ్ఞానికిఁ బరిత్యాజ్యము లగు సత్త్వాదిగుణములస్వరూపమును కార్యమును తద్విశిష్టులకుఁ గలుగుఫలమును గుణాతిక్రమముఁ గాంచినవానిలక్షణమును ఫలమును చక్కఁగాఁ బ్రతిపాదించి అధ్యాయాంతమున గుణాతిక్రమమున కుపాయముఁ జెప్పుటకై “మాం చ యో ఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే” అనిబ్రహ్మానుసంధానము గుణాత్యయమునకు సాధనముగాఁ జెప్పఁబడినది. ముముక్షు వగుపురుషునకు “ఎట్టిది బ్రహ్మము? ఎట్లు దాని యనుసంధానము?” అని యాకాంక్ష కలుగఁగా, క్షరాక్షరవిలక్షణ మగు పురుషోత్తమాఖ్య మైన పరబ్రహ్మమును తదనుసంధానమును అందు మహాపురుషులప్రవృత్తిని తత్ప్రవృత్తిఫలమును బ్రతిపాదించుటకై పంచదశాధ్యాయ మారంభింపఁబడుచున్నది. అందు మొదట ముముక్షువునకు సంసారమునందు జుగుప్సయు వైరాగ్యమును సన్న్యాసమును మొదలగునవి సిద్ధించుటకై సంసారమును వృక్షరూపమున వర్ణించుచున్నాఁడు.—ఊర్ధ్వమూలమ్—అవ్యక్తమహదాదులకన్నను మిక్కిలి గొప్పదియును మిక్కిలి సూక్ష్మమును సర్వప్రకాశకమును సర్వాధిష్ఠానమును సర్వవ్యాపకమును సర్వకారణము నగుటచే పరబ్రహ్మము ఊర్ధ్వ మని చెప్పఁబడుచున్నది, సర్వోత్తమ మగుటవలన బ్రహ్మమునకు ఊర్ధ్వ మని వ్యపదేశము, ఊర్ధ్వము — ఉన్నతము సర్వోత్కృష్ట మైన యేపరబ్రహ్మము గలదో మాయాశబలమైన యాపరబ్రహ్మమే మూలము — బీజము దేనికో అది యూర్ధ్వమూలము.

సంసారవృక్షము, అది శ్రుతిప్రసిద్ధము "ఊర్ధ్వమూలో ఽవాక్శాఖ ఏ షోఽశ్వత్థ స్సనాతనః । ఊర్ధ్వమూల మవాక్శాఖం వృక్షం యో వేత్తి సంప్రతి" ఇత్యాది శ్రుతుల వలన. ఎట్లు వటవృక్షముయొక్క బీజము అవ్యక్తమును అతిసూక్ష్మమును దుర్విజ్ఞేయమును అపారశక్తియుక్తమునై యున్నదో అట్లు జగద్బీజ మైనబ్రహ్మముగూడ అవ్యక్తమును అతిసూక్ష్మమును దుర్విజ్ఞేయమును అపారశక్తియుక్తమునై యున్నది, దానివలననే అతివిస్తారమును అతివిచిత్రము నగు సంసారవృక్షము పుట్టినది, అట్టి సంసారవృక్షమును; అధఃశాఖమ్—"అవ్యక్తా న్మహా న్మహతో ఽహంకారో ఽహంకారా త్పఞ్చతన్మాత్రాణి పఞ్చతన్మాత్రేభ్యః పంచమహాభూతాని" అనుశ్రుతివలన మహదాదివికారము లన్నియు ప్రకృతికి క్రిందివి యగుటవలన అధః అనఁగా క్రింద అని చెప్పఁబడుచున్నవి, అధః—అధశ్శబ్దవాచ్యము లైన మహదాదులు శాఖలవంటివిగాఁ గలది కావున అధఃశాఖము, మహత్తత్త్వము అహంకారముగాను అహంకారము స్కంధముగాను పంచతన్మాత్రలు శాఖలుగాను పంచభూతములు ఉపశాఖలుగాను ఈసంసారవృక్షమున కగుచున్న వని యర్థము; దేనికి మహదాదులు శాఖలుగా నున్నవో అట్టి అధశ్శాఖ మైనదానిని; అశ్వత్థమ్—మాయాకార్య మగుటచే శ్వోఽపి న తిష్ఠతి—రేపుగూడ నుండనిది కావున అశ్వత్థము, క్షణభంగురము అనిత్య మని యర్థము, అట్టి యాక్షణప్రధ్వంసియై యశ్వత్థ మైనసంసారవృక్షమును; అవ్యయమ్—వ్యయ మనఁగా నాశము, నాశము లేనిది యవ్యయము, అట్టిదానిగా నిత్యమునుగా; ప్రాహుః=చెప్పుచున్నారు, ప్రరోచనోక్తులచే ప్రమోహితులై కామపరు లగు మీమాంసకులు జగత్తెప్పుడును ఇట్టిది గాక యుండ దని * జగత్తు నిత్య మని చెప్పుదు రని యర్థము; ఛన్దాంసి—సంసారవృక్షముయొక్క అనిత్యత్వము దుఃఖరూపత్వము వ్యామోహకత్వము అనర్థకరత్వము మొదలగుదోషములసమూహమును ఆచ్ఛాదించుచున్నవి "ధ్రువా ద్యౌర్ధ్రువా పృథివీ, దక్షిణావన్తో అమృతత్వం భజన్తే, స్వర్గే లోకే న భయం కించ నాస్తి, స్వర్గలోకా అమృతత్వం భజన్తే, ఏషవః పుణ్యః సుకృతో బ్రహ్మలోకః" • ఇత్యాది ప్రరోచనవాక్యములచేత కప్పుచున్నవి కావున ఛందస్సులు ఋగ్యజుస్సామములు; యస్య — ఏ మాయామయ సంసారవృక్షమునకు; పర్ణాని—ఆకులవంటివి

* ఎల్లప్పుడును ఇట్టిదిగానే యుండు నని.

• నిత్య మాకాశము నిత్యము పృథివి, దక్షిణ గలవారు అనఁగా సంపూర్ణదక్షిణ యిచ్చినవారు అమృతత్వమును పొందుచున్నారు, స్వర్గలోకమునందు కొంచెమైనను భయము లేదు, స్వర్గలోకమును బొందినవారు అమృతత్వము నొందెదరు,మీకు పుణ్యమును సుకృతమును అనఁగా నిత్యము నగు యీబ్రహ్మలోకము గలుగును.

గా నున్నవో, ఎట్లు పర్ణములు సర్వమునుండియు వృక్షదోషము నాచ్ఛాదించి యక్షతముగా రక్షించునో అట్లు కర్మోపాసనయోగాగమతంత్రక్రియాపరము లగు వేదములును పురాణేతిహాసములును అన్నియు కర్మతత్సాధనతత్ఫలముల బోధించుచు అనిత్యత్వదుఃఖరూపత్వాదిదోషములఁ గప్పి యేసంసారవృక్షమును వృద్ధిఁ బొందించుచున్నవో యని యర్థము; తమ్ — వేదములే పత్రములుగాఁ గలదియు ధర్మాధర్మములే పుష్పములుగాఁ గలదియు జన్మమరణాదిదుఃఖ మొక్కటియే ఫలముగాఁ గలదియు నగు యీ చెప్పిన సంసారవృక్షమును; సమూలముగా, యః వేద — ఎవఁడు చక్కగా నెఱుంగుచున్నాఁడో; సః వేదవిత్ — అతఁడు వేదార్థము నెఱింగినవాఁ డని యర్థము. ఓయీ అనృతజడదుఃఖాత్మకమును తనగుణములచే వ్యామోహముఁ గల్పించునది యగుటచేత జన్మాద్యనర్థహేతువు నగు సంసారవృక్షము దెలియుటచే వేదార్థముఁ దెలిసినవాఁ డెట్లగును? అందువేని చెప్పెదము. ఏబీజము నుండి యేవృక్ష ముత్పన్న మగునో ఆవృక్ష మాబీజముయొక్క రసము గలదియే యగును, ఎట్లు చేఁ దగు నింబబీజమునుండి పుట్టిన నింబవృక్షము చేఁదే యగును గాని వేఱువిధము కాదో అట్లు. ఈ న్యాయము సర్వవృక్షములయందును ప్రసిద్ధము. ఇట్లు చిదేకరస మగు బ్రహ్మమునుండి పుట్టిన సంసారవృక్షము చిద్రసమే యగును. అందువలన "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాది శ్రుతులచేతను, "సంసారవృక్షము తన బీజముయొక్క రసము గలదియే యగును, వృక్ష మగుటవలన, నింబవృక్షమువలె" ఇత్యాది యుక్తులచేతను వానివలనఁ గలిగిన స్వానుభవముచేతను ఈ సంసారవృక్షము చిదేకరసము కారణబ్రహ్మమాత్రమే యని శుద్ధాత్ముఁ డైన యేపండితుఁ డెఱుంగుచున్నాఁడో అతఁడు వేదార్థవిదుఁడే యగును. సర్వే వేదా య త్పద మామనన్తి అను శ్రుతిన్యాయముచేత సర్వవేదార్థము బ్రహ్మమే యగుచున్నది కావున వేదార్థవిదుఁడు బ్రహ్మవిదుఁడే యగుచున్నాఁడు "కస్మి న్భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి" * అను న్యాయముచేత సర్వజ్ఞుఁడు నగుచున్నాఁడు. సర్వజ్ఞుఁ డగునాతనికి కర్తవ్యమునుగూడ భగవంతుఁడు చెప్పఁబోవుచున్నాఁడు స సర్వవి ద్భజతి మామ్ అని. సకారణజ్ఞానముచేత కార్య మగువృక్షము కారణమాత్రమే యను జ్ఞానము కలుగుటవలన తజ్జ్ఞానము గలవాఁడు వేదార్థవిదుఁ డనుట సిద్ధము.

మధుసూదనసరస్వతీరచిత గూఢార్థదీపిక.—

పూర్వాధ్యాయమునందు భగవంతుఁడు సంసారబంధహేతువు లగు గుణములను వివరించి వాని నతిక్రమించుటచే బ్రహ్మభావరూప మగు మోక్షము నన్ను

* భగవంతుఁడా యేది యెఱుంగఁబడినయెడ యిది సర్వంబును యెఱుంగఁబడినది యగును?

భజించుటచేతఁ బొందఁబడు నని వచించెను "మాం చ యో ऽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే। సగుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే" అని. అందు మనుష్యుఁడ వగు నీయందు భక్తియోగము చేయుటచే నెట్లు బ్రహ్మభావము పొందఁబడు నని యాశంకింపఁగా తానే బ్రహ్మరూపుఁ డని తెలుపుటకొఱకు సూత్రభూత మగు నీశ్లోకము భగవంతునిచేఁ జెప్పఁబడినది "బ్రహ్మణో హి ప్రతిష్ఠా ऽహ మమృతస్యావ్యయస్య చ। శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ" అని. ఈ సూత్రమునకు వృత్తిస్థానీయ మీపంచదశాధ్యాయ మారంభింపఁబడుచున్నది. భగవంతుఁ డగు శ్రీకృష్ణునితత్త్వము నెఱింగి గదా యాతని ప్రేమతో భజించుటచే గుణాతీతుఁడై బ్రహ్మభావముఁ జెందవలయును పురుషుఁ డని యభిప్రాయము. అందు బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మిత్యాది భగవద్వచనము నాకర్ణించి నావంటిమనుష్యుఁ డితఁ డిట్లు చెప్పుచున్నాఁ డేమి యని యాశ్చర్యము నొందినవాఁడై యేమియుఁ దోఁపక లజ్జించి యడుగఁజాలక యున్న యర్జునుం గాంచి కృపచే స్వస్వరూపముఁ జెప్పఁ గోరినవాఁడై శ్రీభగవంతుఁ డిట్లనియె.—అందు సంసారమునుండి విరక్తుఁ డైనవానికే భగవత్తత్త్వజ్ఞానమునం దధికార మగుం గాని యొండువిధమునం గాదు కావున పూర్వాధ్యాయోక్త మగు పరమేశ్వరాధీనప్రకృతిపురుషసంయోగకార్య మైన సంసారమును వృక్షరూపకల్పనచే వైరాగ్యముకొఱకు వర్ణించుచున్నాఁడు, వైరాగ్యము ప్రస్తుతం బైన గుణాతీతత్వమున కుపాయం బగుటవలన. ఊర్ధ్వ మనఁగా ఉత్కృష్టము స్వప్రకాశపరమానంద మగుటచేతను నిత్య మగుటచేతను బ్రహ్మము, లేక సర్వసంసారము బాధిత మైనను అబాధితమై సర్వసంసారభ్రమమునకును అధిష్ఠాన మైన బ్రహ్మము ఊర్ధ్వ మనఁబడుచున్నది, అదియే మాయచేత దీనికి మూలము కావున ఊర్ధ్వమూలము; అధశ్శబ్దముచేత అర్వాచీను లైన కార్యోపాధు లగు హిరణ్యగర్భాదులు గ్రహింపఁబడుచున్నారు, వారు నానాదిక్కులయందు వ్యాపించి దీనికి శాఖలవలె నున్నారు గావున అధఃశాఖము; శీఘ్రముగా నశించునది యగుటచే రేపుగూడ నుండనిది గావున అశ్వత్థము, ఇట్టి మాయామయ మగు సంసారవృక్షమును; అవ్యయమ్ = అనాద్యనంతదేహాదిపరంపరకు ఆశ్రయంబును ఆత్మజ్ఞానము లేక నశింపనిదియుఁ గావున అవ్యయమునుగా — అనంతమునుగా; ప్రాహుః = చెప్పుచున్నవి శ్రుతులును స్మృతులును. అందు శ్రుతులు "ఊర్ధ్వమూలో ऽర్వాక్శాఖ ఏషో ऽశ్వత్థ స్సనాతనః" ఇత్యాదులు కఠవల్లులయందు పఠింపఁబడుచున్నవి, అర్వాక్కులనఁగా నికృష్టము లగు కార్యోపాధులు గాని లేక మహదహంకారతన్మాత్రాదులు

గాని శాఖలుగాఁ గలది కావున అర్వాక్శాఖము. ఇది మూలమునందలి అధఃశాఖపదముతో సమానార్థకము. సనాతనః అనునది అవ్యయపదముతో సమానార్థకము. స్మృతులును "అవ్యక్తమూలప్రభవ స్తస్యైవానుగ్రహోత్థితః। బుద్ధిస్కన్ధమయ శ్చైవ ఇన్ద్రియాన్తరకోటరః॥ మహాభూతవిశాఖశ్చ విషయైః పత్రవాం స్తథా। ధర్మాధర్మసుపుష్పశ్చ సుఖదుఃఖఫలోదయః॥ ఆజీవ్య స్సర్వభూతానాం బ్రహ్మవృక్ష స్సనాతనః। ఏత ద్బ్రహ్మవనం చాస్య బ్రహ్మాఽఽచరతి సాక్షివత్॥ ఏతచ్ఛిత్త్వాచ భిత్త్వాచ జ్ఞానేన పరమాసినా। తతశ్చాఽఽత్మగతిం ప్రాప్య తస్మా న్నావర్తతే పునః"॥ ఇత్యాదులు అవ్యక్త మనఁగా అవ్యాకృతము మాయోపాధిక మైన బ్రహ్మము అదియే మూలము -- కారణము, దానివలన నుత్పత్తి గలది అవ్యక్తమూలప్రభవము. తస్యైవ—ఆ మూలమైన అవ్యక్తముయొక్క—అనుగ్రహమువలన—అతిదృఢత్వమువలన ఉత్థితము — సంవర్ధితము. వృక్షమునకు స్కంధమునుండి గదా శాఖలు పుట్టుచున్నవి, సంసారమునకును బుద్ధివలననుండి నానావిధపరిణామములు కలుగుచున్నవి, ఆసాధర్మ్యముచేత దీనికి బుద్ధియే స్కంధము, తన్మయము — ఆ బుద్ధి యనుస్కంధమే ప్రచురముగాఁ గలది యీ సంసారవృక్షము. ఇంద్రియములయంతరములు — రంధ్రములు కోటరములుగాఁ గలది. ఆకాశాదిపృథివ్యంతము లగు మహాభూతములు వివిధశాఖలుగా, లేక, స్తంభములుగాఁ గలది. ఆజీవ్యః — ఉపజీవింపఁ దగినది. బ్రహ్మముచేత — పరమాత్మచేత అధిష్ఠిత మైన వృక్షము కావున బ్రహ్మవృక్షము. ఆత్మజ్ఞానము లేక ఛేదింప శక్యము కానిది కావున సనాతనము. ఇది, బ్రహ్మవనమ్ = జీవరూపుఁ డగు బ్రహ్మమునకు భోగ్యమై వననీయము—భజింపఁ దగినది కావున వనము. బ్రహ్మ సాక్షివ దాచరతి — బ్రహ్మము దీనికార్యముతో నెంతమాత్ర మంట దని యర్థము. ఈ సంసారవృక్షాత్మక మగు బ్రహ్మవనమును, ఛిత్త్వాచ భిత్త్వాచ — అహం బ్రహ్మాస్మి యను అతిదృఢజ్ఞానరూప మైన ఖడ్గముచేత సమూలముగా ఛేదించి యని యర్థము. ఆత్మరూప మైనగతిని బొంది ఆయాత్మరూపగతివలననుండి — మోక్షమునుండి మరలఁ డని యర్థము. తక్కినది స్పష్టము. ఇట గంగానదియందు తరంగము లొరయుచున్నయున్నతతీరంబున వాయువేగముచే నర్ధోన్మూలితంబై తలక్రిందుగాఁబడి బ్రతికియున్న మహోన్నత మైన యశ్వత్థవృక్షము నుపమానముగాఁ గొని యీరూపకము కల్పింపఁబడిన దని తెలియవలయును, అందుచే నూర్ధ్వమూల త్వాధఃశాఖత్వాదుల కనుపపత్తి లేదు. యస్య = ఏ మాయామయ మైన యశ్వత్థవృక్షమునకు; ఛన్దాంసి = ఆచ్ఛాదించుటవలన —

తత్త్వవస్తువును గప్పుటవలన, లేక రక్షించుటవలన ఋగ్యజుస్సామరూపము లైన కర్మకాండములు; పర్ణాని = పర్ణములవంటివో, ఎట్లు వృక్షమును బర్ణములు రక్షించుచున్నవో అట్లు సంసారవృక్షమును కర్మకాండములు రక్షించుచున్నవి, అవి ధర్మాధర్మములను తజ్జన్యఫలములను బోధించుటయె ప్రయోజనముగాఁ గలవి యగుటవలన. యః = ఎవఁడు; తమ్=ఈ వ్యాఖ్యాత మైన సంసారరూప మగు మాయామయాశ్వత్థవృక్షమును సమూలమును; వేద=తెలియుచున్నాఁడో; స వేదవిత్ -కర్మబ్రహ్మాఖ్య మగు వేదార్థము దెలిసినవాఁ డతఁడే యని యర్థము. ఎట్లనఁగా - సంసారవృక్షమునకు మూలము బ్రహ్మము, హిరణ్యగర్భుఁడు మొదలగుజీవులు శాఖాస్థానియులు, మఱియు నాసంసారవృక్షము స్వరూపముచే నశ్వరము, ప్రవాహరూపమున అనంతము, మఱియు నది వేదోక్తకర్మములచే తడుపఁబడుచున్నది, బ్రహ్మజ్ఞానముచే ఛేదింపఁబడుచున్నది, ఇంతమాత్రమే గదా వేదార్థము. ఎవ్వఁడు వేదార్థవిదుఁడో అతఁడే సర్వవిదుఁ డని సమూలవృక్షజ్ఞానమును స్తుతించుచున్నాఁడు స వేదవిత్ అని.

శ్రీ. జ్ఞానమును భక్తియును విరక్తిను గాని
పడయనేరదు కావునఁ బంచదశము
నందు వైరాగ్యసహకృతం బైనజ్ఞాన
మీశ్వరుఁడు విశదంబుగ నెఱుఁగఁ బలికె.

పూర్వాధ్యాయాంతమున "మాం చ యో ఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే" ఇత్యాదిగా పరమేశ్వరు నేకాంతభక్తిఁ భజించువానికిఁ దత్ప్రసాదలబ్ధం బగు జ్ఞానముచే బ్రహ్మభావము సిద్ధించు నని ప్రతిపాదింపఁబడినది. ఏకాంతభక్తి గాని జ్ఞానము గాని వైరాగ్యహీనునకు సంభవింపదు కావున వైరాగ్యపూర్వకముగా జ్ఞానముపదేశింపఁగోరి అందు మొదట సార్ధశ్లోకద్వయముచే సంసారస్వరూపమును వృక్షరూపకాలంకారముచే వర్ణించుచు శ్రీభగవంతుం డిట్లనియె.—ఊర్ధ్వఁ డనఁగా ఉత్తరుఁడు — క్షరాక్షరపురుషులకన్నను ఉత్కృష్టుఁడు పురుషోత్తముఁడు మూలముగాఁ గలదానిని; అధఃశబ్దముచే ఆపురుషోత్తమునికంటె అర్వాచీను లైన కార్యోపాధు లగు హిరణ్యగర్భాదులు గ్రహింపఁబడుచున్నారు, వారు శాఖలువంటివారుగాఁ గలదానిని; వినశ్వర మగుటచే శ్వః — తెల్లవాఱువఱకుఁ గూడ ఉండదు గావున నమ్మఁదగనిది యగుటవలన అశ్వత్థమునుగా; ప్రాహుః=చెప్పుచున్నవి; ప్రవాహరూపంబున అవిచ్ఛిన్న మగుటవలన అవ్యయమును గాను ప్రాహుః, "ఊర్ధ్వమూలో ఽర్వాక్శాఖ ఏ షోఽశ్వత్థ స్సనాతనః" ఇత్యాదిశ్రుతులు. ఛన్దాంసి = వేద

ములు; యస్య = పర్ణాని — ధర్మాధర్మములను ప్రతిపాదించుద్వారంబున ఛాయా స్థానీయము లగు కర్మఫలములచే సంసారవృక్షమును సర్వజీవులకును ఆశ్రయణీయముగాఁ జేయుటవలన పర్ణస్థానీయములు వేదములు. యః; తమ్=అట్టియశ్వత్థమును; వేద; అతఁడే వేదార్థవిదుఁడు. సంసారవృక్షమునకు మూల మీశ్వరుఁడు శ్రీనారాయణుఁడు, తదంశభూతు లగు బ్రహ్మాదులు శాఖాస్థానీయులు, ఆ సంసారవృక్షము వినశ్వరము, ప్రవాహరూపంబున నిత్యముగాఁ దోఁచును, వేదోక్తము లగు కర్మములచే నది సేవ్యముగాఁ జేయఁబడినది — ఇంతమాత్రమే గదా వేదార్థము. అందువలననే దాని నెఱింగినవాఁడు వేదవిదుఁ డని స్తుతింపఁబడుచున్నాఁడు.

ప. పూర్వాధ్యాయము చివరను మాం చ యో ఽవ్యభిచారేణ ఇత్యాదిగా ఈశ్వరుని నన్యైకాంతభక్తిచే సేవించువానికి నాయనుగ్రహముచే లబ్ధ మగు జ్ఞానంబున గుణత్రయవిస్తార ముపరతమై బ్రహ్మభావము సిద్ధించు నని చెప్పఁబడినది. అందు విషయపరులకు వైరాగ్యము కలిగినం గాని యేకాంతభక్తి జనియింపనేరదు. అందువలన గుణత్రయవిచిత్రవిస్తారాత్మక మగు స్థూలప్రపంచమును వృక్షదృష్టాంతమునఁ గుఠారమువంటి వైరాగ్యముచే ఛేదింపఁదగినదానిగాఁ దెలుపుచు అథర్వోపనిషత్ప్రతిపాదిత మగుసంసారవృక్షమును సార్ధశ్లోకద్వయంబున రూపకాలంకారయుక్తముగా వర్ణించుచు శ్రీభగవంతుం డిట్లనియె.— ఊర్ధ్వఁడు — సర్వోత్కృష్టుఁడైన క్షరాక్షరాతీతుఁ డగు పురుషుఁడు మూలకారణముగాఁ గలదానిని; అధః—అర్వాచీను లగు కార్యోపాధులైన హిరణ్యగర్భాదులు శాఖలుగాఁ గలదానిని; శ్వః — మేలుకొనిన పిమ్మట నుండదు కావున అశ్వత్థమును గా; ప్రాహుః; మేలుకొనుట దుర్లభము కావున, అవ్యయమ్ — ప్రవాహరూపమున చిరకాల ముండుదానిగాను; ప్రాహుః. ఇఁక వృక్షసాధర్మ్యము చెప్పుచున్నాఁడు.— యస్య = ఏ ప్రపంచవృక్షమునకు; ఛన్దాంసి = వేదములు; పర్ణాని — ప్రవృత్తిమార్గమున ధర్మాధర్మములఁ బ్రతిపాదించుచు ఛాయాస్థానీయము లగుచున్నవి, వాని ననువర్తించువారలకు ఆపాతరమణీయములై విశ్రమమును గలిగించునవి యగుటవలన. ఇట్లు, యః = ఏపురుషుఁడు; తమ్ = ఆ యశ్వత్థమును; వేద. అతఁడే వేదవిదుఁడు. ఇది యర్థము.— వేదమునందు ఉపక్రమమున కర్మకాండవిభాగముచే విషయకాములకు ఫలములయం దాశఁగొలిపి ప్రపంచవృక్షము ప్రశంసింపఁబడినది, ఉపసంహారముననో యుపనిషద్విభాగముచే ముముక్షువులకు వైరాగ్యము నుపదేశించి యది దుఃఖరూప మని తదుపరతి ప్రశంసింపఁబడినది. కావున వేద

విదుఁ డనుటచే వేదతాత్పర్యవిదుఁ డని సూచితము. లేక, ఈ శ్లోకముచే స్థూల ప్రపంచరూపుఁడును శిరఃపాణ్యాదిలక్షణపురుషాకారవిశిష్టుఁడు నగు స్థూలశరీరసమష్టిరూపుఁ డైన విరాట్టు వృక్షముగా వర్ణింపఁబడుచున్నాఁడు. ఆ విరాడ్రూపవృక్షము లౌకికవృక్షమువలె నధోమూలము నూర్ధ్వశాఖమును గాదు. మ ఱే మనఁగా, ఊర్ధ్వమూల మధః శాఖం ప్రాహుః — ఊర్ధ్వము — హిరణ్యగర్భాఖ్యసూక్ష్మదేహసమష్టి మూలముగా — ఆదికారణముగాఁ గలదానిఁగాను; అధః—ఇంద్రాదిదేవతోత్పత్తిహేతువు లైన హస్తపాదాదులు శాఖలుగాఁ గలదానిఁగాను; చెప్పుచున్నారు. "గుణప్రవృద్ధా విషయప్రవాలాః" అని చెప్పఁబోవుటవలన. ఛన్దాంసి = వాసనలే; యస్య = ఏ సంసారవృక్షమునకు; పర్ణాని — ఆచ్ఛాదనములో, దుఃఖరూపమైనను సంసారవృక్షము ఫలవాసనలచే సుఖరూపముగాఁ దోఁచు నని యర్థము. శ్రుతియును. "అర్వాగ్బిల శ్చమస ఊర్ధ్వబుధ్న స్తస్మి న్యశో నిహితం విశ్వరూపమ్। తస్యాసతే ఋషయ స్సప్త తీరే వాగష్టమీ బ్రహ్మణా సంవిదానా" అని. భాష్యము. — తస్య = ఆవిరాట్టుయొక్క; చమసః = శిరోదేశము; ఊర్ధ్వబుధ్నః—ఊర్ధ్వము మూలముగాఁ గలది;"మహ ద్యశః" అను శ్రుతివలన, యశః=పరమాత్మస్వరూపము; నిహితమ్ = గూఢముగా స్థాపితమై యున్నది. * ఇందులకు ప్రమాణము చెప్పుచున్నాఁడు.— తస్య = దానియొక్క; తీరే = సమీపమునందు; సప్తర్షయః; ఆసతే = స్థితిని పొందుచున్నవి, వ్యాపారమును జేయుచున్నవి, సప్తఋషు లనఁగా జ్ఞానేంద్రియములు, నేత్రములు రెండు కర్ణములు రెండు నాసికలు రెండు ఏడవది రసన మని యెఱుంగవలయును. అందు, వాగష్టమీ = కర్మేంద్రియ మగు వాక్కు ఎనిమిదవది; దీనికిఁ బ్రవర్తకుఁడు సూత్రాత్మ, తత్సమీపంబునఁ దత్ప్రకాశముచేఁ బ్రవర్తించుచున్న దని యర్థము. దానినే చెప్పుచున్నాఁడు — ఎట్టిది వాక్కు అనఁగా, బ్రహ్మణా=బ్రహ్మముచేత; సంవిదానా—వ్యాపారము చేయుచున్న దని యర్థము. అట్లు అథర్వవల్లులయందును "ఊర్ధ్వమూలో ఽవాక్శాఖ ఏషో ఽశ్వత్థ స్సనాతనః। త దేవ శుక్రం త ద్బ్రహ్మ తదే వామృత ముచ్యతే। తస్మిం ల్లోకాః శ్రితా స్సర్వే తదు నాత్యేతి కశ్చన" అని. ఇట శుక్రమ్ అనఁగా శబలబ్రహ్మ మని యర్థము. తత్—దానిని, కశ్చన—ఏదియును, నాత్యేతి—దాఁటిపోదు, దానిలోపలనే యుండును. తక్కినది మున్ను వివరింపఁబడినది.

---

* విశ్వరూప మనునది పరమాత్మస్వరూపమునకు విశేషణము.

రా. క్షేత్రాధ్యాయమునందు క్షేత్రక్షేత్రజ్ఞరూపు లైన ప్రకృతిపురుషులస్వరూపమును శోధించి, విశుద్ధుఁ డై యపరిచ్ఛిన్నజ్ఞానైకాకారుఁడే యగు పురుషునకుఁ బ్రాకృతగుణసంగప్రవాహమువలన దేవాద్యాకారంబునఁ బరిణత మగు ప్రకృతిసంబంధ మనాదియై యున్న దని చెప్పఁబడినది. తదనంత రాధ్యాయమునందుఁ బురుషునకు గుణసంగమువలనఁ గార్యకారణోభయావస్థ మగు ప్రకృతితోఁ గలుగుసంబంధము భగవంతునిచేతనె చేయఁబడిన దని ప్రతిపాదించి గుణసంగప్రకారమును సవిస్తరముగా నిరూపించి గుణసంగనివృత్తిపూర్వక మగు నాత్మస్వరూపప్రాప్తి భగవద్భక్తి వలన సిద్ధించు నని వచియింపఁ బడినది. ఇప్పుడు భజనీయుం డగు భగవంతునకు క్షరాక్షరాత్మకబద్ధముక్తులు విభూతు లనియు విభూతు లైన యాక్షరాక్షరపురుషులయిద్దఱకన్నను నిఖిలహేయప్రత్యనీకకల్యాణైకతానుఁ డై యత్యంతోత్కృష్టుఁ డగుటచే విలక్షణుఁ డైన భగవంతుఁడు పురుషోత్తముఁ డనియు నిరూపించుట కై యారంభించు చున్నాఁడు.—అందు, అసంగరూపశస్త్రముచే ఛిన్నబంధ మైన యక్షరాఖ్యవిభూతిని నిరూపించుట కై ఛేద్య మగు బంధాకారంబున విస్తీర్ణ మైన యచిత్పరిణామవిశేషమును అశ్వత్థవృక్షాకారముగాఁ గల్పించుచు శ్రీభగవంతుం డి ట్లనియె. ఏసంసారం బను నశ్వత్థము నూర్ధ్వమూలమునుగాను అధఃశాఖమునుగాను అవ్యయమునుగాను జెప్పుచున్నవో "ఊర్ధ్వమూలో ఽవాక్శాఖ ఏ షో ఽశ్వత్థ స్సనాతనః । ఊర్ధ్వమూల మవాక్శాఖం వృక్షం యో వేద సమ్ప్రతి" ఇత్యాదిశ్రుతులు — సప్తలోకములకు మీఁదనుండు చతుర్ముఖుఁడు మొదలుగాఁ గలది యగుటచే నది యూర్ధ్వమూలము, భూమియందు నివసించు సకలనరపశుమృగక్రిమికీటపతంగస్థావరములు అంతముగాఁ గలది యగుటచే నధఃశాఖము, అసంగతయే హేతువుగాఁ గల సమ్యక్జ్ఞాన ముదయించువఱకు ప్రవాహరూపంబున నచ్ఛేద్య మగుటచే నవ్యయము; మఱియు, యస్య=ఏయశ్వత్థమునకు; ఛన్దాంసి = శ్రుతులను; పర్ణాని = పర్ణములుగాఁ జెప్పుచున్నవో, "వాయవ్యం శ్వేత మాలభేత భూతికామః, ఐన్ద్రాగ్న మేకాదశకపాలం నిర్వపే త్ప్రజాకామః" ఇత్యాది శ్రుతిప్రతిపాదితము లైన కామ్యకర్మములచే నీసంసారవృక్షము వృద్ధి నొందుచున్నది కావున ఛందస్సులే దీనికిఁ బర్ణములు. పర్ణములచేతఁ గదా వృక్షము వృద్ధినొందును. ఎవఁడు ఇట్టిదైన యీ యశ్వత్థవృక్షమును దెలియుచున్నాఁడో అతఁడు వేదవిదుఁడు. వేదము సంసారవృక్షచ్ఛేదోపాయమును గదా చెప్పుచున్నది, ఛేద్యవృక్షస్వరూపము యొక్క-

జ్ఞానము భేదనోపాయజ్ఞానమున కుపయోగించుఁ గావున వేదవిదుఁ డని చెప్పఁబడు చున్నాఁడు.

మా. సంసారచ్ఛేత్త యగు భగవంతునికి నమస్కారము. సంసారస్వరూపమును తదతిక్రమోపాయంబును విజ్ఞానంబును నియధ్యాయమునఁ బ్రదర్శించుచున్నాఁడు.—ఊర్ధ్వుఁడు—విష్ణువు, "ఊర్ధ్వపవిత్రో వాజినీవస్వమృతమస్మి ద్రవిణం సవర్చసమ్" అని గదా శ్రుతి, ఊర్ధ్వుఁ డనఁగా అందఱికన్న నుత్తముఁడు. అధః—. నికృష్టము. శాఖలై యున్నవి. రేపుగూడ ఏకవిధంబున నుండదు గావున నశ్వత్థము. ఐనను ప్రవాహమునకు వ్యయము లేదు, పూర్వబ్రహ్మకాలమునం దెట్లుండెనో అట్లే సర్వకాలంబునను ఉండునది గావున నవ్యయము. ఫలకారణములు గావున ఛందస్సులు పర్ణము లనఁబడినవి. ఒకానొకవృక్షమును పర్ణము కలుగక ఫలము గలుగదు గదా.

అధ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయప్రవాలాః
అధ శ్చ మూలా న్యనుసన్తతాని కర్మానుబన్ధీని మనుష్యలోకే. ౨

భా. ఆ సంసారవృక్షమునకే అన్యమైన అవయవకల్పన చెప్పఁబడుచున్నది.—అధః=మనుష్యాదులు మొదలుకొని స్థావరమువఱకును; ఊర్ధ్వంచ = బ్రహ్మదేవునివఱకును, ఆబ్రహ్మదేవుని ధర్మము * వఱకును; వారివారి కర్మము నొప్పునను జ్ఞానము నొప్పునను జ్ఞానకర్మఫలములు, తస్య = ఆ సంసారవృక్షమునకు; శాఖాః = శాఖలుగా; ప్రసృతాః= వ్యాపించియున్నవి; గుణప్రవృద్ధాః ♦ = ఉపాదానభూతము లైన సత్త్వరజస్తమోగుణములచే స్థూలములుగాఁ జేయఁబడినవి; విషయప్రవాలాః= శబ్దాది విషయములు పల్లవములుగాఁ గలవి, దేహాదికర్మఫలము లైన శాఖలనుండి విషయము లంకురించునవివలె నున్నవి కావున విషయప్రవాలములు శాఖలు. సంసారవృక్షమునకుఁ బరమమూల మైన యుపాదానకారణము పూర్వము చెప్పఁబడినది, ఇఁక నిప్పుడు కర్మజనితరాగద్వేషవాసనలు మూలములవలె ధర్మాధర్మప్రవృత్తికి కారణములు అవాంతరభావులు చెప్పఁబడుచున్నవి.— అధశ్చ = దేవాదులకంటె

* సృష్టిరూప మైనయధికారము.

♦ గుణప్రవృద్ధా అనునదియు శాఖలకు విశేషణము.

క్రిందుగాను; ఆ కర్మజనిత రాగద్వేషాదివాసనలు, మూలాని = మూలములవలె; అనుసంతతాని = అనుప్రవిష్టములు; కర్మానుబన్ధీని = కర్మము అనుబంధముగాఁ గలవి, అనుబంధ మనఁగా పిమ్మటఁ బుట్టునది, ధర్మాధర్మరూప మైనకర్మము ఏవాసనారూపమూలము లుదయించిన పిమ్మటఁ బుట్టుచున్నవో అట్టివి కర్మానుబంధులు ఆమూలము లని యర్థము; మనుష్యలోకే = మనుష్యలోకమునందు విశేషించి ఇక్కడఁ గదా మనుష్యులకుఁ గర్మాధికారము.

మనుష్యులు మొదలు స్థావరములవఱకుఁ గ్రిందుగాను మనుష్యలోకము మొదలు సత్యలోకమువఱకును మీఁదుగాను ఆయాజీవుల జ్ఞానకర్మఫలములు సత్త్వరజస్తమోగుణములచే వృద్ధినొంది శబ్దాదివిషయములే పల్లవములుగాఁ గలవై ఆ సంసారవృక్షమునకు శాఖలుగా వ్యాపించి యున్నవి. మఱియును పూర్వాపూర్వకర్మజన్యరాగద్వేషాదులు వాసనలు మూలములవలె ధర్మాధర్మరూపకర్మమునకుఁ గారణములై అట్లే క్రిందుగాను మీఁదుగాను విశేషించి మనుష్యలోకమునందు అంతటను వ్యాపించియున్న వని తాత్పర్యము.

**ఆ.** అన్యము — పూర్వము చెప్పినదానికంటె భిన్నము, అవయవములఁ గుఱించినది. మనుష్యలోకమునుండియు బ్రహ్మలోకమునుండియు నని అధశ్శబ్దార్థము చెప్పుచున్నారు మనుష్యాదులు ఇత్యాదిగా. అది మొదలుకొనియే సత్యలోకము వఱకు నని యూర్ధ్వశబ్దార్థముఁ జెప్పుచున్నారు బ్రహ్మదేవునివఱకును ఇత్యాదిగా. శాఖాశబ్దార్థమును బ్రదర్శించుచున్నారు జ్ఞా నేత్యాదిగా. అవి కారణానుగుణముగా బహువిధంబు లని సూచించుచున్నారు వారివారి ఇత్యాదిగా. ప్రత్యక్షము లైన శబ్దాదివిషయములు శాఖలయందు పల్లవము లనఁగా నంకురము లని తెలుపుచున్నారు దేహ దీత్యాదిగా. ఊర్ధ్వమూల మ్మను శ్లోకమునందు సంసారవృక్షమునకు మూలము చెప్పఁబడినది, ఇప్పుడు వెండియు అధశ్చ మూలాని అని చెప్ప నేల అనఁగా చెప్పుచున్నారు సంసా రేత్యాదిగా. అనుప్రవిష్టములు — సర్వలింగశరీరములయందును అనుగతములై అవిచ్ఛిన్నములుగా నున్నవి. రాగాదులు కర్మఫలజన్యము లనుటను బ్రకటించుచున్నారు క ర్మేత్యాదిగా. కర్మములకును రాగాదులకును పరస్పరము హేతుహేతుమద్భావము గలదు, వానికి కారణకార్యభావముచేత అవిచ్ఛిన్న మైన ప్రవృత్తి విశేషించి మనుష్యలోకంబున నున్న దనుటకు హేతువు

చెప్పుచున్నారు ఇక్కడ గదా ఇత్యాదిగా. కర్మవ్యుత్పత్తిచేత * లోక మనఁగా ప్రాణి సమూహము, మనుష్యుఁడును లోకమును అగునది మనుష్యలోకము, శాస్త్రమునం దధికృత మైన బ్రాహ్మణ్యాదివిశిష్ట మగు దేహ మని యర్థము.

హ. అధశ్చోర్ధ్వమ్ = మహర్లోకము మొదలు ఊర్ధ్వముగా జనలోకము నందు; ప్రసృతాః = వ్యాప్తిని బొందినవి; తస్య శాఖాః — కర్మఫలభూతము లైన కర్మజ్ఞానవాసనారూపములును శరీరేంద్రియవిషయరూపములును; గుణప్రవృద్ధాః = ఉపాదానకారణము లైన సత్త్వరజస్తమోగుణములచే మిక్కిలి వృద్ధినొందినవి; విషయప్రవాలాః = శబ్దస్పర్శరూపరసగంధము లను విషయములు చిగుళ్లవలె వేనికిఁ గలవో అట్టివి ఆశాఖలు. అధశ్చ — మహర్లోకము మొదలు; మూలాని — ప్రవృత్తిధర్మములు, వాని యుపకరణములును; అనుసంతతాని = అనుసరించి యున్నవి; కర్మానుబన్ధీని—కర్మము నిమిత్తముగాఁ గలవి. మనుష్యలోకమునం దనుట యుపలక్షణార్థము.

శం. శుద్ధాత్మునకే ఈశ్వరప్రసాదము గలవానికి కారణజ్ఞానముచేత కార్య మగువృక్షము కారణమాత్రమే యని తెలియుటవలన బ్రహ్మవిత్త్వమును విదేహముక్తియును సిద్ధించుచున్నవి, మలినాత్మునకో సంసారవృక్షస్వరూపము నెఱింగి అసత్య మనుబుద్ధిచేత నాసంసారవృక్షమునుండి విరక్తుఁ డైనవానికే జ్ఞానమును మోక్షమును సిద్ధించు నని బోధించుటకై వెండియు సంసారవృక్షమునకు విశేషణము చేయుచున్నారు.—తస్య = ఉక్తలక్షణ మైన యాసంసారవృక్షముయొక్క; శాఖాః=ఉపశాఖాస్థానీయము లైన పాపపుణ్యకర్మఫలము లగు దేహములు; అధశ్చోర్ధ్వమ్ = క్రిందుగాను మీఁదుగాను, మనుష్యజాతి మొదలు స్థావరమువఱకుఁ గ్రిందుగాను మనుష్యజాతి మొదలు బ్రహ్మలోకపర్యంతము మీఁదుగాను అని యర్థము; ప్రసృతాః = అంతటను వ్యాపించియున్నవి. ఈవాక్యమున కిది యభిప్రాయము.— క్షణిక మగు నీదేహము నశింపఁగానే పురుషునకు ముక్తి తనంతనె సిద్ధింపఁ గలదు, ఇందులకు పురుషప్రయత్న మేల అని తలంప వలదు; అనంతములును విచిత్రములును విచిత్రఫలజనకములు నగు పుణ్యపాపరూపము లైన సంచితకర్మము లేవి గలవో అవియే "నాభుక్తం క్షీయతే కర్మ" అను న్యాయంబున ఈ దేహము నశించినను స్థావరము మొదలు బ్రహ్మలోకమువఱకు నచ్చటచ్చటఁ బురుషునకు శరీర

* లోక్యతే — చూడఁబడుచున్నది అను వ్యుత్పత్తిచేత.

ములఁ బుట్టించుచున్నవి; అందువలన పురుషప్రయత్నము లేక ముక్తి తనయంతనే సిద్ధింపదు అని. ఓయీ! తత్కర్మఫలము ననుభవించిన పిదప దేహములు తమ యంతనే నశించును కావున తనయంతనే ముక్తి తానే యగు నని యాశంకింపఁగా, అట్లు నశింపవు, ఆయా దేహములయందుఁ జేయఁబడు కర్మములచే వృద్ధి నొందు నని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—గుణప్రవృద్ధాః = గుణములచేత—సత్త్వాదిగుణ వికారము లగు కామక్రోధలోభాదులచేతను తజ్జన్యము లగు పాపపుణ్యాదులచేతను ప్రవృద్ధములు—ప్రకర్షంబున వృద్ధిఁ బొందినవి యగుచున్నవి, కామాదులచేతను కర్మాదులచేతను మీఁదుమీఁదుగా మిక్కిలి వృద్ధిఁ బొందుచున్న వని యర్థము; మీఁదు మీఁదుగా వృద్ధినొందుటకు కారణము చెప్పుచున్నాఁడు.—విషయప్రవాలాః = విషయములు — శబ్దాదిభోగ్యపదార్థములు ప్రవాలములుగా — అంకురములుగా ఏశాఖలనుండి పుట్టుచున్నవో అవి విషయప్రవాలములు, శాఖలు అంకురములను వలె దేహములు అక్కడక్కడ శబ్దస్పర్శరూపరసాదిభోగ్యపదార్థములను ఇంద్రియ సన్నికర్షద్వారమున కలిగించి వానియందు రాగద్వేషకామక్రోధలోభములను పుట్టించి మరలమరలఁ గర్మములను జేయించుచున్న వని యభిప్రాయము. కామము లును కర్మములును సిద్ధించుటకు కారణము చెప్పుచున్నాఁడు.— కర్మానుబంధీని = నానావిధశరీరారంభకము లైన కామ్యనిత్యనైమిత్తికప్రతిషిద్ధము లేవి గలవో ఆకర్మములను అనుబధ్నన్తి — తాము పుట్టించినపిమ్మటనే చేయించుచున్నవి కావున కర్మానుబంధులు, కామ్యాదికర్మములయుత్పత్తికిఁ గారణము లనుట, అట్టి; మూలాని= పూర్వము చెప్పిన దానికంటె అవాంతరము లైన సంసారకారణములు, విషయ వాసనలును కర్మవాసనలును అని యర్థము; అధశ్చ = అధశ్శరీరములయందును, చకారమువలన ఊర్ధ్వశరీరములయందును, సర్వలింగశరీరములయందును; అనుసన్తతాని=ప్రాణి కర్మానురూపముగా నంతటను వ్యాపించియున్నవి; మనుష్యలోకే=ప్రాణి వర్గమునందు అంతటను విషయములయందుఁ గామములఁ బుట్టించుచుఁ గర్మములఁ జేయించుచు భోగవాసనలు లింగశరీరములయందు సంతతములై యున్నవి. అందు వలన వాసనలు కామములఁ బుట్టించును, కామములు నానావిధము లైనకర్మములఁ జేయించును, కర్మము లన్నివిధంబులను మాటిమాటికి శరీరములఁ గలిగించును; ఇట్లు వాసనలచేతను కామాదులచేతను పుణ్యపాపాదికర్మములచేతను అన్నివిధంబు

---

* మనుష్యశరీరముకంటె నీచము లైన శరీరములయందును ఉత్తమము లైన శరీరములయందును అనుట.

లను శరీరపరంపరయభివృద్ధినొందును గాని యొకానొకప్పుడును క్షీణింపదు, ఆకారణమువలన సంసారవృక్షారూఢులై విషయసుఖాశాపాశబద్ధులైనవారికి జననమరణదుఃఖప్రవాహపతనముదక్క ఏవిధంబునను ఏదేశంబునను ఏకాలంబునను మోక్షము సిద్ధింపదని యర్థము ఇందుచేఁ గర్మోపాసనాఫలము లగు స్వర్గసత్యలోకవైకుంఠాదులయందును దత్సుఖములయందును అవి యనిత్యములు నసత్యములు నను బుద్ధిచే ముముక్షువునకు వైరాగ్యము గలుగుటకై మాయోపహితబ్రహ్మమువలన నుత్పన్నమైన సంసారవృక్షమునకు స్కంధశాఖోపశాఖలుగా వర్ణితులైన మహదాదిమాయాకార్యోపాధికు లగు హిరణ్యగర్భవిరాడాదులును గుణత్రయోపాధికు లగు బ్రహ్మవిష్ణ్వాదులును ఇంద్రాదులును మాయాకల్పితు లనియు అనిత్యు లనియు సూచింపఁబడినవి. కర్మోపాసనలను తత్ఫలములను బ్రతిపాదించునట్టి వేదవాక్యములు సంసారవృక్షమునకుఁ బర్ణము లని వర్ణించుటచే ముముక్షువు వటాశ్వత్థపర్ణములవలె నా వేదవాక్యముల నుపేక్షింపవలయు నని సూచిత మగుచున్నది.

మ. ఆ సంసారవృక్షమునకే యవయవములను గుఱించి మఱియొకకల్పన చెప్పఁబడుచున్నది.—— పూర్వశ్లోకమునఁ గార్యోపాధు లగు హిరణ్యగర్భాదిజీవులు శాఖాస్థానీయులుగాఁ జెప్పఁబడిరి, ఇప్పుడో యందలి విశేషము చెప్పఁబడుచున్నది. వారియం దెవరు కపూయచరణులో—పాపాచారులో వారు అధః — పశ్వాదియోనులందు; ప్రసృతాః— వ్యాపించి యున్నారు. ఎవ్వరు మఱి రమణీయచరణులో—పుణ్యాచారులో వారు ఊర్ధ్వమ్ — దేవాదియోనులందు వ్యాపించి యున్నారు. అందువలన, అధశ్చ = మనుష్యత్వము మొదలుకొనియు బ్రహ్మదేవుని మొదలుకొనియు క్రిందను; ఊర్ధ్వమ్=ఆమనుష్యత్వమే మొదలుకొని సత్యలోకమువఱకు మీఁదను; ప్రసృతాః; తస్య = ఆ సంసారవృక్షముయొక్క; శాఖాః. ఆశాఖ లెట్టి వనఁగా, గుణములచేత — దేహేంద్రియవిషయాకారపరిణతము లైన సత్త్వరజస్తమములచేత జలసేకము చేతవలె ప్రవృద్ధములు — స్థూలము లైనవి; మఱియును, విషయములు — శబ్దాదులు ప్రవాలములవలె — పల్లవములవలె ఏసంసారవృక్షశాఖలకుఁ గలవో అట్టివి, శాఖాగ్రస్థానీయము లైన యింద్రియవృత్తులతోఁ సంబంధించుటవలనను రాగమున కధిష్ఠానము లగుటవలనను. మఱియును, అధశ్చ= క్రిందను, చకారమువలన మీఁదను; మూలాని=అవాంతరము లైనవి తత్తద్భోగజనితవాసనారూపములు మూలములవలె ధర్మాధర్మములయందుఁ బ్రవృత్తి కలిగించుచున్నవి; ఆ సంసారవృక్షమునకు, అనుసన్తతాని=అనుస్యూతములై యున్నవి. ముఖ్యమైన మూలమో బ్రహ్మమె యని విరోధము

లేదు. ఆ యవాంతరమూలము లెట్టి వనఁగా, కర్మమును—ధర్మాధర్మరూపమును అను బంధించుట— తాము పుట్టినపిమ్మటఁ బుట్టించుట స్వభావముగాఁ గలవి. కావున కర్మానుబంధులు. ఎక్కడ? మనుష్యలోకే = మనుష్యరూప మైన లోకము కావున అధికృతి మైన బ్రాహ్మణ్యాదివిశిష్ట మగు దేహము మనుష్యలోక మనఁబడు చున్నది, దాని యందు బాహుళ్యంబున కర్మానుబంధు లని యర్థము; మనుష్యులకుఁ గదా కర్మాధకారము ప్రసిద్ధము.

శ్రీ. మఱియును.—కార్యోపాధు లగు హిరణ్యగర్భాదిజీవులు శాఖాస్థానీయులుగాఁ జెప్పఁబడిరి. వారియం దెవ్వరు పాపులో వారు, అధః — పశ్వాది యోనులయందు, ప్రసృతాః—విస్తారమును బొందినవారు; ఎవరు సుకృతులో వారు, ఊర్ధ్వమ్ — దేవాదియోనులందు, ప్రసృతాః; తస్య = ఆ సంసారవృక్షముయొక్క, శాఖాః. మఱియును, గుణములచేత — సత్త్వాదివృత్తులచేత జలసేకములచేతవలె యథాయోగ్యముగా ప్రవృద్ధములు — వృద్ధి నొందినవి. మఱియును, విషయములు—రూపాదులు ప్రవాలములుగా — పల్లవస్థానీయములుగాఁ గలవి, శాఖాగ్రస్థానీయములగు నింద్రియవృత్తులతో సంయోగము గలవి యగుటవలన. మఱియును, అధశ్చ—క్రిందను మీఁదను; మూలాని; అనుసంతతాని= పాదుకొని యున్నవి; ముఖ్య మగు మూల మీశ్వరుఁ డొక్కఁడే, ఇవియో యవాంతరమూలములు తత్తద్భోగవాసనారూపములు. వాని కార్యమును చెప్పుచున్నాఁడు.—మనుష్యలోకే; కర్మానుబన్ధిని = కర్మను అనుబంధముగా అనంతరము కలుగునదిగాఁ గలవి. ఊర్ధ్వాధోలోకముల యం దేది అనుభవింపఁబడినదో తత్తద్భోగవాసనలచేతఁ గదా కర్మక్షయంబున మనుష్యలోకముఁ బ్రాపించినవారికిఁ దత్తదనురూపము లైన కర్మములయందుఁ బ్రవృత్తి కలుగుచున్నది. ఇందే కదా కర్మాధికారము, ఇతరలోకములయందు లేదు, అందువలన మనుష్యలోకమునం దని చెప్పఁబడినది.

ప. ఇఁక దాని శాఖావిస్తారమును జెప్పుచున్నాఁడు.—అధః = దేవపితృమనుష్యలోకాదులును, ఊర్ధ్వంచ = మహర్జనతపోలోకాదులును, శాఖాః = ప్రసృతాః = విస్తృతము లై యున్నవి. ఎట్టివి? గుణప్రవృద్ధాః = యథాయోగ్యముగా సత్త్వరజస్తమోగుణములచేత జలసేకాదులచేతవలె వృద్ధినొందినవి; అట్లు, విషయప్రవాలాః = రూపరసాదివిషయములును; ప్రసృతము లై యున్నవి. అధః=పాతాలలోకమునందు; మూలాని — యక్షరాక్షసులు; అనుసన్తతాని = చక్కగా విస్తృతము లై యున్నవి. మనుష్యలోకమునందో, కర్మానుబన్ధిని = కర్మమున కధీనము లై

యున్నవి, మనుష్యులే కర్మమునం దధికారు లగుటవలన; మనుష్యలోకమందుఁ గర్మము ననుష్ఠించి యితరలోకములందుఁ దత్ఫలము భుజించుచున్నా రని యర్థము.

రా. తస్య = మనుష్యాదులు శాఖలుగాఁ గల యావృక్షమునకు; ఆయా కర్మములచేఁ గలుగునట్టి యితరములుగూడ, శాఖాః = శాఖలు; అధః — మనుష్యపశ్వాదిరూపమున; ప్రసృతము లగుచున్నవి. ఊర్ధ్వంచ = గంధర్వయక్షదేవాదిరూపమునను; ప్రసృతము లగుచున్నవి. అవియు, గుణప్రవృద్ధాః = సత్త్వాదిగుణములచే వృద్ధినొందినవి; విషయప్రవాలాః = శబ్దాదివిషయములు పల్లవములుగా గలవి. ఎట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు — బ్రహ్మలోకము మూలముగాఁ గలదియు మనుష్యలోకము అగ్రముగాఁ గలదియు నగు నీవృక్షమునకు, అధః — క్రింద; మనుష్యలోకేచ = మనుష్యలోకమునందును; మూలాని; అనుసన్తతాని. ఆమూలములు, కర్మానుబన్ధీని = కర్మములే యనుబంధులు—మూలములు, కర్మరూపము లైన మూలములు మనుష్యలోకమునందుఁ గల వని యర్థము. మనుష్యత్వావస్థయందుఁ జేయఁబడిన కర్మములచేతఁ గదా క్రింద మనుష్యపశ్వాదులును మీఁద దేవాదులును కలుగుచున్నారు.

మా. భూతములు అవ్యక్తమునందు సూక్ష్మరూపంబునను శరీరాదులయందు స్థూలరూపమునను ఉన్నవి కావున, అధః ఊర్ధ్వంచ ప్రసృతాః. గుణప్రవృద్ధాః — సత్త్వాదిగుణములచే ప్రవృద్ధములు. ప్రతీతిమాత్రమునందే సుఖరూపము లగుటవలన విషయములు ప్రవాలములు. మూలాని—భగవద్రూపాదులు, భగవంతుఁడు గూడ కర్మానుబంధము చేతనే గదా ఫలము నిచ్చుచున్నాఁడు. అట్లు భాల్లవేయశాఖయందు "బ్రహ్మావాఽస్య పృథ గ్మూలం ప్రకృతిః సమూలం సత్త్వాదయోఽర్వాచీనమూలమ్। భూతాని శాఖా ఛందాంసి పర్ణాని దేవా సృతిర్యజ్ఞాశ్చ శాఖాః। పత్రేభ్యో హి ఫలం జాయతే। మాత్రాః శిఫాః। ముక్తిః ఫలమ్ అముక్తిః ఫలమ్। మోక్షో రసో ఽమోక్షో రసః॥ అవ్యక్తేచ శాఖాః వ్యక్తేచ శాఖా అవ్యక్తేచ మూలం వ్యక్తేచ మూలమ్। ఏషో ఽశ్వత్థో గుణా లోలపత్రో నశ్యతే ననశ్యతే నహ్యేష కదాచ నాన్యథా జాయతే నాన్యథా జాయతే" అని.

న రూప మస్యేహ తథోపలభ్యతే నాన్తో నచాఽఽది ర్నచ సంప్రతిష్ఠా
అశ్వత్థ మేనం సువిరూఢమూల మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా. 3

భా. ఏ యీసంసారవృక్షము మఱి వర్ణింపఁబడినదో, అస్య – అట్టి యీసంసారవృక్షముయొక్క; రూపమ్ = రూపము; తథా = ఎట్లు వర్ణింపఁబడినదో అట్లు; ఇహ = ఈ సంసారమునందు; నోపలభ్యతే = కనఁబడనే కనఁబడదు, స్వప్నముతోను మృగతృష్ణికాజలముతోను ఇంద్రజాలముతోను గంధర్వనగరముతోను సమం బగుటవలన, దృష్టనష్టస్వరూపము గదా యది. ఇందువలననే, అన్తః = పర్యంతము. సమాప్తి; నోపలభ్యతే = కనఁబడదు. అట్లు, ఆదిశ్చ = ఇది మొదలుకొని యిది ప్రవర్తించె ననియు; నోపలభ్యతే = ఎవనికిని కనఁబడదు. సమ్ప్రతిష్ఠాచ = దీనియొక్క స్థితియును, మధ్యమును; నోపలభ్యతే = ఎవ్వనికిని కనఁబడదు. ఏనమ్ = ఈ యథోక్తమగు; అశ్వత్థమ్ = సంసారవృక్షమును; సువిరూఢమూలమ్ = చక్కగా విరూఢములు – పాదుకొన్నవగు మూలములు గలదానిని; అసఙ్గశస్త్రేణ = అసంగ మనఁగా పుత్రవిత్తలోకైషణాదులనుండి వ్యుత్థానము, అదియే శస్త్రము, దానిచేత; దృఢేన = పరమాత్మాభిముఖతయందలి నిశ్చయముచే దృఢముగాఁ జేయఁబడినదానిచేత, మాటిమాటికి వివేకాభ్యాస మను రాతియందు సానపెట్టఁబడినదానిచేత; ఛిత్త్వా = ఛేదించి, సంసారవృక్షమును బీజసహితముగా పెల్లగించి.

ఇంత వర్ణించినను ఈ సంసారవృక్షముయొక్కస్వరూపము వర్ణించిన విధంబున నెవ్వనికిని సంసారావస్థయందు కనఁబడదు, అట్లు దీని తుదయు మొదలును మధ్యమును గూడ ఎంతమాత్రము కనఁబడవు. అట్లు అంతటను వేళ్లుపాఱి పాదుకొనియున్న యీసంసారవృక్షమును దృఢమైన వైరాగ్యపూర్వక మగు సన్న్యాసం బను ఖడ్గముచే బీజసహితముగా ఛేదించి అని తాత్పర్యము.

ఆ. మాటిమాటికి రాగాదులచే వృద్ధి నొందునదియు ననాదియు నగుటవలన నీసంసారవృక్షం బెవ్వనిచేతను ఛేదింపఁబడదు, ఛేదించుటకు శక్యమునుం గాదని యాశంకించి చెప్పుచున్నారు ఏ యీసంసారవృక్షము ఇత్యాదిగా. ఎట్లు వర్ణింపఁబడినదో మఱియు నెట్లు లోకమునందు ప్రసిద్ధముగా నున్నదో ఆవిధముగా దీని రూపము శాస్త్రమువలన ననుమానింపఁబడుచున్నది, అందుచే నిది జ్ఞాననాశ్యం బనుట యుక్త మని చెప్పుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. అది ప్రమేయము కా దను

టకు హేతువు చెప్పుచున్నారు స్వప్నములోను ఇత్యాదిగా. అది స్వప్నాదిసమం బనుటకు దృష్టనష్టస్వరూపత్వమును హేతువుగాఁ జెప్పుచున్నారు దృష్టేత్యాదిగా. అందువలన నది యమేయం బని శేషము. అట్లు అమేయం బగుటవలననె దాని యవసానముగూడ తెలియరా దని చెప్పుచున్నారు ఇందువలననే ఇత్యాదిగా. భ్రాంతివాసనాకర్మములు అన్యోన్యనిమిత్తము లగుటవలన జ్ఞానముచేతనే గాని వాని కవసానము సంభవింప దని యర్థము. దీని కిది మొద లనుటయు తెలియ శక్యము గా దని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. ఆద్యంతములవలె మధ్యముగూడ దీనికిఁ బ్రామాణికము గా దని చెప్పుచున్నారు మధ్యమును ఇత్యాదిగా. అశ్వత్థశబ్దముచేఁ జెప్పఁబడిన క్షణభంగురమైన సంసారవృక్షమునకుఁ దనయంతనే యుచ్ఛేదము సంభ వించుటవలన దానియుచ్ఛేదముకొఱకుఁ బ్రయత్నింపవలసినది లే దని యాశంకించి చెప్పుచున్నారు అశ్వత్థ మిత్యాదిగా. వ్యుత్థానము — వైరాగ్యపూర్వక మగు సన్న్యా సము. దృఢముగాఁ జేయఁబడుటనే వివేకపూర్వకం బని స్ఫుటీకరించుచున్నారు మాటిమాటికి ఇత్యాదిగా.

హ. *

శం. వేదముల నధ్యయనించి తదర్థము నెఱింగినపండితు లగుపురుషులు గూడ అవిద్యాకామపరతంత్రులై ప్రరోచనవాక్యములచేత సంసారవృక్షఫలముల యందు దృష్టములయందును అదృష్టములగు స్వర్గాదులయందును తత్సుఖముల యందును రమ్యత్వనిత్యత్వబుద్ధి గలవారై మోహితు లగుచు తాము భ్రమించి యితరులను భ్రమింపఁజేయు చున్నారు. లోకస్థితి యెట్లున్నను ఎవ్వఁడు శుద్ధా త్ముఁడై వివేకియై సూక్ష్మబుద్ధియై ముముక్షు వగుచున్నాఁడో అతఁడు " త ద్యథేహ కర్మచితో లోకః క్షీయతే, శ్వో భావా మర్త్యస్య య దన్తకై తత్, శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేత స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః" ఇత్యాది శ్రుతులచేతను, "ఇది యంతయు మిథ్య, మాయాకార్య మగుటవలన, ఇంద్రజాలమువలె" ఇత్యాది యుక్తులచేతను సదసద్విచారము చేసి దానఁ గలుగు వైరాగ్యఖడ్గముచేత సంసార వృక్షమును ఛేదించి సర్వంబును సన్న్యసించి మోక్షముకొఱకు యత్నింపవలయు నని బోధించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ఉక్తరీతిని సంసారవృక్షము పామర దృష్టికి నుత్తమపర్ణపుష్పఫలాదులు గలది యగుటచే రమణీయంబై యాశ్రయణీయం

* శంకరభాష్యముతో సమానము.

బుగాఁ దోఁచు చున్నను, సూక్ష్మబుద్ధు లగు పండితులచేత, ఇహ – ఈ అర్థము నందు, చక్కఁగా విచారించినయెడ, "ధ్రువా ద్యౌ ర్ధ్రువా పృథివీ, స్వర్గలోకా అమృతత్వం భజన్తే" ఇత్యాది ప్రరోచనశ్రుతులచే, దీనిస్వరూప మెట్లు నిత్యముగాను సుఖరూపముగాను వర్ణింపఁబడు చున్నదో, తథా = ఆప్రకారమున; రూపమ్ = దీని స్వరూపము; నోపలభ్యతే = చూడఁబడదు. ఓయీ ధ్రువా ద్యౌః ఇత్యాద శ్రుతులచేత అంతరిక్షాదులు నిత్యము లని చెప్పఁబడుచున్నది, ఎట్లవి నిత్యము లని చూడఁబడవు అని యందువేని, వాక్యశేషంబున ధ్రువేణ హవిషా యని క్షణిక మగు హవిస్సుగూడ ధ్రువ మని చెప్పుటవలన హవిస్సునకువలె నంతరిక్షాదులకును ధ్రువత్వం బౌపచారిక మని జ్ఞాపిత మగుచున్నది. "ఏది సావయవమో అది అనిత్యము" ఇత్యాది యుక్తిబలంబునను "త్రయ మప్యేత త్సుషుప్తం స్వప్నం మాయామాత్రమ్, యథా స్వప్న ప్రపఞ్చోఽయమ్" ఇత్యాది శ్రుతిస్మృతులచేతను సంసారవృక్షము స్వప్నపదార్థమువలె నియతసత్త లేనిది యగుటవలనను జ్ఞేయ మగుటవలనను జన్మలయాదిమంత మగుటవలనను ప్రత్యక్షంబున చూడఁబడుచున్న సంసారవృక్షమునకు నిత్యత్వంబును సుఖరూపత్వంబును అప్రామాణికము లని యర్థము. ఇందుచే స్వర్గాదులు నిత్యము లనుటయు నిత్యసుఖము లనుటయు భ్రాంతిమాత్రం బని సిద్ధము. ఓయీ ! సంసారవృక్ష మనిత్య మనియు దుఃఖరూప మనియు నిశ్చితమేని అపుడది యభ్రచ్ఛాయవలె క్షణిక మని యేర్పడుటవలన స్వల్పకాలము తద్దుఃఖమును సహించి యది నశించిన పిమ్మట సుఖ మనుభవింప వచ్చు నని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు.—జననమరణదుఃఖప్రవాహ మెడతెగక సాఁగుచుండుటవలన తద్రూపమున నెల్లప్పుడు వర్తించుచున్న యీసంసారవృక్షమునకు, ఆదిః = తత్ప్రవృత్తికి మొదలు; నోపలభ్యతే, అవిద్యాతత్కార్యప్రవృత్తి యనాది యగుటవలన నని యర్థము. అందువలననే, సంప్రతిష్ఠాచ = మధ్యస్థితియును; నోపలభ్యతే. ఇది దీని మొదలు ఇది దీనిమధ్య మని యెఱుంగుటకు శక్యము గా దని యర్థము. అట్లే, అన్తః = దీని పర్యవసానముగూడ; నోపలభ్యతే. ఇది యిక్కడ సమాప్తి నొందె నని దీని సమాప్తియు నెఱుంగరా దని యర్థము. ఓయీ! అట్లైనయెడ సదసద్వివేకి యగు ముముక్షు వేమి చేయవలయు నని యాశంకింపఁగా తేపటికార్యము నేఁడే చేయవలయు నను న్యాయంబున సర్వమును సన్న్యసించి మోక్షమునకై యత్నింపవలయు నని బోధించుటకై చెప్పుచున్నాఁడు.—అనేకజన్మములు పరమేశ్వరు నారాధించి తత్ప్రసాదము నొంది

నట్టి పండితుండగు ముముక్షువుచేత, * అసఙ్గశస్త్రేణ=దీనిచేత పురుషుఁడు విషయములయందు సక్తుఁడగుచున్నాఁడు కావున సంగమనఁగా విషయములయందు రాగము, దాని యభావము అసంగము విరాగము, అనఁగా తీవ్రమోక్షేచ్ఛచేతను సదసద్వివేకవిజ్ఞానముచేతను బుట్టిన వైరాగ్యము, అదియే శస్త్రము దానిచేత; దృఢేన = మాటిమాటికి విషయములయందు దోషదర్శనముచేతను విషయములు బంధకంబులని దెలియుటవలనఁ గలుగు భయముచేతను తీవ్రమోక్షేచ్ఛచేతను నిరంతరముగా నభ్యసించుచున్న వివేకముబలిమిచేతను దృఢమైనదానిచేత; అట్టి దృఢమైనయసంగశస్త్రముచే, సువిరూఢమూలమ్=ఆముద ముంచినపాత్రమును ఆయాముదమెట్లు వ్యాపించియుండునో అట్లు మిక్కిలి యంతటను విరూఢములు—విశేషించి వ్యాపించినవగు మూలములు – వివిధవిషయవాసనాజాలములు గలదానిని, అనేకకోటిబ్రహ్మకల్పములుగా నవిచ్ఛిన్నమగు నానావిధవాసనాపటలముచే జటిలమైనదానిని; అశ్వత్థమ్ = సంసారవృక్షమును; ఏనమ్ = దీనిని; ఛిత్త్వా – పుత్రాద్యేషణలన్నియును విడిచి సన్న్యసించి యని యర్థము.

ప. ఇఁక నీసంసారవృక్షమేది వర్ణింపఁబడినదో, ఇహ=ఈ సంసారమందున్నప్రాణులచేత; అస్య = అట్టి యీసంసారవృక్షముయొక్క–; ఎట్లు వర్ణింపఁబడినదో, తథా = ఆప్రకారమున; రూపమ్ = ఊర్ధ్వమూలత్వాదిరూపము; నోపలభ్యతే=చూడఁబడదు, అది స్వప్నమరీచ్యుదకమాయాగంధర్వనగరములవలె మిథ్యయై దృష్టనష్టస్వరూప మగుటవలన. ఇందువలననే దానియొక్క–, అన్తః=అవసానము; నోపలభ్యతే, ఇంతకాలముచే సమాప్తి నొందఁగలదని, పర్యంతరహిత మగుటవలన. దీనియొక్క–, ఆదిశ్చ నోపలభ్యతే, ఇది మొదలు ప్రవర్తించెనని, అనాది యగుటవలన. నచ సంప్రతిష్ఠా = దీని స్థితియు – మధ్యమును చూడఁబడదు, అది యాద్యంతములున్ననే యుండునది యగుటవలన. ఎందువలన నిట్టి స్వరూపము గల యీసంసారవృక్షము ఛేదింప నశక్యమై యనర్థకరముగా నున్నదో అందువలన, సువిరూఢమూలమ్ = అనాద్యజ్ఞానముచే మిక్కిలి బద్ధములైన మూలములు గలదానిని; ఏనమ్ అశ్వత్థమ్ = మున్ను చెప్పిన యీసంసారవృక్షమును; అసఙ్గశస్త్రేణ = సంగమనఁగా స్పృహ, అసంగము స్పృహావిరోధి యగు వైరాగ్యము పుత్రవిత్తలోకైషణాత్యాగరూపము, అదియే శస్త్రము, రాగద్వేషమయ మగు సంసారమునకు విరోధి యగుటవలన, అట్టి యసంగశస్త్రముచేత; దృఢేన = పరమాత్మజ్ఞానమునందలి

* ఈ తృతీయకు పైశ్లోకమునందలి పరిమార్గితవ్య మ్మను క్రియాపదముతో నన్వయము.

యుత్సాహముచే దృఢీకృతమై మాటమాటికి వివేకాభ్యాసముచే వాఁడి యైనదాని చేత; ఛిత్వా = సమూలముగా ఛేదించి, వైరాగ్యశమదమాదిసంపత్తితో సర్వకర్మసన్న్యాసము చేసి యనుట.

శ్రీ. మఱియును.—ఇహ = ఈ సంసారమందున్న ప్రాణులచేత; అస్య = ఈ సంసారవృక్షముయొక్క; తథా = మున్ను చెప్పిన యూర్ధ్వమూలత్వాదిప్రకారమున; రూపమ్; నోపలభ్యతే. అన్తః=అవసానముగూడ; నోపలభ్యతే, అపర్యంతమగుటవలన. నచాదిః, అనాది యగుటవలన. సంప్రతిష్ఠాచ = స్థితియును, ఎట్లున్నదని; నోపలభ్యతే. ఇట్టిది యగుటవలన నీసంసారవృక్షము ఛేదింపరానిదియు ననర్థకరంబును కావున దీని దృఢమైనవైరాగ్యం బనుశస్త్రముచే ఛేదించి తత్త్వజ్ఞానమునందు యత్నింపవలయు నని చెప్పుచున్నాఁడు సార్ధశ్లోకముచేత. — ఏనమశ్వత్థమ్; సువిరూఢమూలమ్ = మిక్కిలి బద్ధమూలమై యున్నదానిని; అసంగమనఁగా సంగరాహిత్యము, అహంకారమమకారత్యాగ మనుట, ఆశస్త్రముచేత; దృఢేన—చక్కని విచారముతోఁ గూడినదానిచేత; ఛిత్వా—వేఱుగాఁ జేసి.

ప. ఇఁక నిది దుర్విజ్ఞేయ మని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.— ఇహ = ఈ సంసారమునందు; అస్య=ఈ స్థూలప్రపంచవృక్షముయొక్క; రూపమ్= స్వరూపము; తథా = అట్లు; లౌకికదృష్టిచేత, నోపలభ్యతే — ఎట్లు జ్ఞానదృష్టిచేత చూడఁబడునో అట్లు లౌకికదృష్టిచేఁ జూడఁబడ దని యర్థము, "దివ్యం దదామి తే చక్షుః" అని చెప్పి యుండుటవలన. చ = మఱియు; దీనియొక్క, అన్తః = పర్యవసానమును; అట్లు, సంప్రతిష్ఠాచ = స్థితియును; ఆదిః = ఆవిర్భావమును; చూడఁబడవు. ఇఁక నిది యుపరమించువిధముఁ జెప్పుచున్నాఁడు.—ఏనమ్ = నిరూపించిన ప్రకారము గలదానిని; సువిరూఢమూలమ్—మఱి యొకవిధమున ఛేదింప నలవికాని దానిని; అశ్వత్థమ్; దృఢేన = వాఁడియైన; అసఙ్గశస్త్రేణ = వైరాగ్యకుఠారముచేత; ఛిత్వా.

రా. ఈ వృక్షమునకు చతుర్ముఖుం డాది యగుటచే. నది యూర్ధ్వమూలం బనియు తత్సంతానపరంపరనుబట్టి మనుష్యాగ్రం బగుటచే నధఃశాఖం బనియు మనుష్యావస్థయందుఁ జేయఁబడినకర్మములు మూలభూతంబులుగా వెండియు క్రిందను మీఁదను బ్రసరించినశాఖలు గలది యనియు నెట్లీరూపము నిర్దేశింపఁబడినదో అట్లది సంసారులచేఁ జూడఁబడదు, నేను మనుష్యుఁడను దేవదత్తపుత్రుఁడను

యజ్ఞదత్తునితండ్రిని తదనురూప మైనపరిగ్రహము గలవాఁడను అను నింతమాత్రమే చూడఁబడుచున్నది. అట్లు ఈవృక్షముయొక్క-యంతము—వినాశముగూడ గుణమాయభోగములయం దసంగముచేఁ గలుగునది యని చూడఁబడదు. మఱియు దీనికి గుణసంగమే యాది యని చూడఁబడదు. దానియొక్క-ప్రతిష్ఠయును అనాత్మయందాత్మాభిమానరూప మైనయజ్ఞాన మని చూడఁబడదు. దీనియందె ప్రతిష్ఠితము కావున అజ్ఞానమే దీనికి ప్రతిష్ఠ. ఏనమ్ = ఈ చెప్పినలక్షణము గల; సువిరూఢమూలమ్=చక్క-గా వివిధముగా రూఢ మైనమూలములు గల; అశ్వత్థమ్; సమ్యక్ జ్ఞానమూలమై దృఢ మైనదానిచేత గుణమయభోగములయందు అసంగ మనుశస్త్రముచేత, ఛిత్వా.

భా. ఎట్లున్నదో అట్లు చూడఁబడదు. అంతాదికము విష్ణువు, "త్వమాది రన్తో జగతోఽస్య మధ్యమ్" అని భాగవతమునందు. "అనాద్యన్తం పరంబ్రహ్మ నదేవా ఋషయో విదుః" అని మోక్షధర్మమునందును. అసఙ్గశస్త్రేణ = సంగరాహిత్యముతోఁ గూడిన జ్ఞానముచేత, "జ్ఞానాసి నోపాసనయా సితేన" అని భాగవతమునందును. ఛేద మనఁగా విమర్శమే దానివలన వానికే యబంధకం బగును. ఎందువలన ననఁగా మూలస్థ మగు బ్రహ్మము ప్రతీత మగును. అదియుఁ జెప్పఁబడినది యాశ్రుతియందే. "విమర్శో హ్యస్య ఛేదః, స త న్నబధ్నాతి బధ్నాతి చాన్యాన్" అని.

తతః పదం త త్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తన్తి భూయః
తమేవచాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ.

భా. తతః = అందుమీఁద; తత్ = ఆ; పదమ్ = వైష్ణవ మగు పదము; పరిమార్గితవ్యమ్=పరిమార్గణ మనఁగా అన్వేషణము, ఎట్టుంగఁబడవలయు నని యర్థము. యస్మిన్=ఏపదమునందు; గతాః = ప్రవిష్టులైనవారు; భూయః=మెండియు సంసారమునకు; ననివర్తన్తి=మరలరో. ఎట్లుంగవలయు ననఁగా చెప్పుచున్నాఁడు —తమేవచ=ఎవఁడు పదశబ్దముచేఁ జెప్పఁబడెనో వానినే; ఆద్యమ్=ఆదియం దున్నవానిని; పురుషమ్ = పురుషుని; ప్రపద్యే=శరణు పొందుచున్నాను. అని తదేకశరణుఁడై మెట్టుంగవలయు నని యర్థము. ఈ పురుషుఁ డనువాఁ డెవ్వఁడు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు. — యతః = ఏపురుషునివలన; పురాణీ =

చిరంతన మగు; ప్రవృత్తిః = సంసారమాయావృక్షముయొక్క ఆవిర్భావము; ప్రసృతా = వెడలినదో, ఇంద్రజాలికునివలన మాయవలె. అట్టి పురుషుని శరణు పొంది వాని నెఱుంగవలయు నని సంబంధము.

ఈ సంసారవృక్ష మంతయు నేపురుషునివలనఁ బుట్టెనో సర్వంబునకును ఆది యైన యప్పరమాత్మనే శరణు పొందుచున్నా నని ఇతరముల నన్నిటిని వర్జించి తదేకశరణుఁడై సంసారవృక్షమున కావల నున్న యాపరమాత్మను వేదాంత వాక్యములచే విచారించి యెఱుంగవలయును. వాని నెఱింగి తద్భావము నొందిన వారు వెండియు సంసారము నొందరని తాత్పర్యము.

ఆ. పెల్లగించి యేమి చేయవలె ననగాఁ జెప్పుచున్నారు తత ఇత్యాదిగా.—అందుమీఁద — ఆ యశ్వత్థమున కూర్ధ్వమున నున్న దని యర్థము. దేని నన్వేషించి యెఱుంగవలయునో ఆపద మెట్టి దనఁగాఁ జెప్పుచున్నారు యస్మి న్నిత్యాదిగా. పురుషుని—ఎవనిచేత సర్వంబును పూర్ణమో వానిని, లేక, పురములయందు శయనించి యున్నవానిని. వివర్తవాదానుసారంబున దృష్టాంతము చెప్పుచున్నారు ఇంద్రేత్యాదిగా.

హ. *

శం. ఇట్లు సదసద్వివేకముచే కలిగిన తీవ్రవైరాగ్యమోక్షేచ్ఛలవేగమున బాహ్యప్రవణ మైన యంతఃకరణమును ప్రత్యగభిముఖముగాఁ జేసికొని మోక్షైక కాముఁడై యతి యాత్మజ్ఞానైకతత్పరుఁడు కావలయు నని చెప్పుచున్నాఁడు.— తతః=అటుపిమ్మట; "సన్న్యస్య శ్రవణం కుర్యాత్" అను న్యాయంబున సద్గురుసన్నిధియందు, తత్పదమ్=పరతత్త్వము; పరిమార్గితవ్యమ్—శ్రుతియుక్తులచేతఁ జక్కగా విచారింపఁబడవలయు నని యర్థము. లేక. తసిల్ప్రత్యయము షష్ఠ్యర్థకము, తతః= ఆ సంసారవృక్షముయొక్క; పదమ్ = ప్రవృత్తిమూలకారణ మైనపరబ్రహ్మ మేది గలదో; తత్ =అదియే; పరిమార్గితవ్యమ్ — బ్రహ్మవిదుని సన్నిధానంబున చక్కగా విచారించి యెఱుంగఁబడవలయు నని యర్థము. ఆ జ్ఞానముయొక్కఫలము చెప్పుచున్నాఁడు.—సద్గురుపరమేశ్వరప్రసాదసంపన్ను లగు మహాత్ము లైనయతులు శ్రవణ మననాదిజన్యవిజ్ఞానముచేత, యస్మిన్=నిర్విశేషము చిదేకరస మైన యేపరబ్రహ్మము నందు; గతాః = స్వాత్మభావముఁ బొందినవారై, బ్రహ్మభావముఁ జెందినవారై;

* శంకరభాష్యముతో సమానము.

భూయః = మెండియు సంసారమునకు; ననివర్తన్తి— మెండియు శరీరము నొందరని యర్థము. సదసద్వివేకవైరాగ్యమోక్షేచ్ఛలచేత సర్వమును సన్న్యసించి జ్ఞానసిద్ధి కొఱకు శ్రవణాదికము చేయునట్టి యతి యీవిధంబున నుండవలయు నని చెప్పు చున్నాఁడు.—యతః=జగజ్జన్మాదిహేతు వైన యే యీశ్వరునివలన; పురాణీ=చిరంతన మగు, అనాది యగు; ప్రవృత్తిః = ఈ సంసారవృక్షప్రవృత్తి; ప్రసృతా అంతటను ప్రాణులకుఁ బ్రవర్తించెనో; చకారము హి అనుదానియర్థము గలది; ఈ సంసారవృక్షమునకు బీజభూతుఁ డైన యెవ్వఁడు పదశబ్దముచేఁ జెప్పఁబడెనో, తమ్= అట్టి; ఆద్యమ్=ఆదియం దున్నవానిని, మాయచే సృష్టికొఱకు సగుణభావ మొందిన వానిని భక్తవత్సలుని; పురుష మేవచ=పరమేశ్వరునే కదా; ప్రపద్యే = శరణముఁ బొందుచున్నాను. హిశబ్దము తత్పరత్వావధారణము దృఢీకరించుచున్నది. "తం హ దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే" అను శ్రుతి వలన సంసారబంధమోక్షముకొఱకు పరమేశ్వరునే శరణు పొందుచున్నా నని ముముక్షు వీశ్వరైకశరణుఁడై శ్రవణాదికము చేయవలయు నని యర్థము.

మ. అటుపిమ్మట గురువు నాశ్రయించి, తతః=ఆయశ్వత్థమున కూర్ధ్వమున నున్నట్టి; తత్ = ఆ వైష్ణవ మగు; పదమ్ = తత్త్వము; వేదాంతవాక్యవిచారము చేత, పరిమార్గితవ్యమ్ = అన్వేషింపఁబడవలయును, "సో ఽన్వేష్టవ్యః సవిజిజ్ఞాసితవ్యః" అను శ్రుతివలన ఆపదమును శ్రవణాదులచే నెఱుంగవలయు నని యర్థము. ఆపద మెట్టిది ? యస్మిన్ = ఏపదమునందు; గతాః=జ్ఞానముచే ప్రవేశించినవారలు; ననివర్తన్తి = మరలరు; భూయః = మెండియు సంసారమునకు. దాని నెట్లన్వేషింప వలయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఎవఁడు పదశబ్దముచేతఁ జెప్పఁబడెనో, త మేవచ = వానినే; ఆద్యమ్ = ఆదియం దున్నవానిని; పురుషమ్ = ఎవనిచేత నిది యంతయుఁ బూర్ణమో అట్టివానిని, లేక పురములయందు శయనించి యున్నవానిని; ప్రపద్యే = శరణు పొందినవాఁడను, అని తదేకశరణుఁడై దాని నన్వేషింపవలయు నని యర్థము. ఆ పురుషుఁ డెట్టివాఁడు ? యతః = ఏపురుషునివలన; ప్రవృత్తిః = మాయామయ మగు సంసారవృక్షముయొక్కప్రవృత్తి; పురాణీ = చిరంతనము, అనాది యనుట; ప్రసృతా=వెడలెనో, ఐంద్రజాలికునివలన మాయాహస్త్యాదికము వలె. ఆపురుషుని శరణు పొందుచున్నా నని యన్వయము.

శ్రీ. తతః = దానికి; మూలభూత మైన, తత్పదమ్ = ఆవస్తువు, వైష్ణవ పదము; పరిమార్గితవ్యమ్ = అన్వేషింపఁబడవలయును. ఎట్టిపదమును ? యస్మిన్

గతాః = ఏపదమును బొందినవారలై; భూయః; ననివర్తన్తి — మరల రని యర్థము. అన్వేషణప్రకారమునే చెప్పుచున్నాఁడు.—యతః; పురాణీ = చిరంతన మగు; ఈ సంసారప్రవృత్తిః, ప్రసృతా = వెడలినదో; త మేవ చాఽద్యం పురుషమ్; ప్రపద్యే = శరణము పొందుచున్నా నని, ఏకాంతభక్తిచే అన్వేషింపవలయు నని యర్థము.

ప ఏమి చేయవలయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—తతః = ఆ సంసార వృక్షముకంటె నుత్కృష్ట మైన, మూలభూత మైన; ఏపదము — స్థానము మున్ను చెప్పఁబడినదో, తత్ = ఆ విష్ణువుయొక్క పరమపదము, పరబ్రహ్మాఖ్యము; పరి = అంతటను వ్యాపించి యుండునది; మార్గితవ్యమ్ = సుషుమ్నా వివరమార్గముచే వెతుకఁగఁబడవలయును. ఆపదం బేది ? యస్మిన్; గతాః=ప్రవిష్టులై; భూయో నని వర్తన్తి = ఆవృత్తిని బొందరో. ఇఁక ఏయాకారంబున ప్రవిష్టులై యనఁగాఁ చెప్పుచున్నాఁడు.— తమేవచ; ఆద్యమ్ = జ్యేష్ఠుని, దృశ్యజాతమునకు మూలస్థాన భూతుని; ప్రపద్యే = శరణుపొందుచున్నా నని. వాఁ డెవ్వఁడు ? యతః; పురాణీ = అనాదిప్రవాహరూప మైన, ప్రవృత్తిః = ప్రపంచవృత్తి; ప్రసృతా = వెడలినదో, అట్టి యధికరణరూపు నని యర్థము. ఇఁక క్రమంబున శ్రుతులు. అందు అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా అనుటకు ఆశ్వలాయనోపనిషదుక్త మైన శ్రుతి. “నకర్మణా నప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వమానశుః । పరేణ నాకం నిహితం గుహాయాం విభ్రాజతే య ద్యతయో విశన్తి” అని. భాష్యము.—ఏకే = కొందఱు యోగులు; పరేణ త్యాగేన = ఉత్కృష్ట మైన వైరాగ్యముచేత; అమృతత్వమ్ = మోక్షమును; ఆనశుః = పొందిరి. మ ఱే మనఁగా, నకర్మణా = ఫలాభిసంధికృత మైన కర్మముచేతఁ గాదు. న ప్రజయా, “నాపుత్రస్య లోకో ఽస్తి” అను శ్రుతి వలన. న; ధనేన = తులాపురుషాది దానములయందు వెచ్చింపఁబడినదానిచేత. ఆ యమృతత్వ మనఁగా నేది ? యత్ = దేనిని; యతయః = సన్న్యాసులు; విశన్తి— పొందుచున్నారో. ఎట్టిదానిఁ బొందుచున్నారు ? నాకమ్ = అలౌకిక మైన స్వర్గము; గుహాయామ్ = హృదయాకాశమునందు; నిహితమ్ = నిధివలె దాఁచఁ బడినది; విభ్రాజతే = అర్థప్రకాశకమై ప్రకాశించుచున్నది. తతః పదం తత్పరి మార్గితవ్య మ్మనుటకు శాతపథశ్రుతి “తద ప్యేతే శ్లోకాః అణుపథోవితరః పురాణో మాఽజ స్పృష్టోనువిత్తో మ యైవ । తేన ధీరా అపియన్తి బ్రహ్మ విద ఉత్క్రమ్య స్వర్గం లోకమితో విముక్తాః । తస్మిన్ శుక్ల ముత నీల మాహుః

పిఙ్గలగ్ం హరితం లోహితంచ । ఏష పన్థా బ్రహ్మణా హానువిత్త స్తే నైతి బ్రహ్మ విత్తైజసః పుణ్యకృచ్ఛ” అని. భాష్యము.—ఆ యర్థమునందు వేదోపజీవ్యము లగు శ్లోకరూపప్రమాణములు గల వని యాజ్ఞవల్క్యుఁడు చెప్పుచున్నాఁడు.—అవి యేవి యనఁగా.—అణుపథః = సూక్ష్మమైన సుషుమ్నాపలక్షిత మగుమార్గము; వితరః= మిక్కిలి విశిష్టతరము; పురాణః = అనాదిసిద్ధము; కలదు. మాం స్పృష్టః=నాచేతఁ బొందఁబడినది; మయైవ అనువిత్త - అనంతరము నాచేతనే యనుష్ఠింపఁబడినది. తేన=ఆమార్గముచేత; ధీరాః=అభ్యాసయోగులు; బ్రహ్మవిదః = బ్రహ్మవిదులై; ఉత్క్రమ్య=ఊర్ధ్వముగాఁ బోయి; స్వర్గంలోకమ్ = భ్రూమధ్యమును; యన్తి = పొందుచున్నారు. ఎట్టి వార లై? ఇతః=ఈ ప్రపంచమునుండి; విముక్తాః=విముక్తులై. అందు నాడీసందర్భమును చెప్పుచున్నాఁడు శుక్ల మిత్యాదిగా. ఏషపన్థాః=ఈమార్గము; నాచేతమాత్రమే యనుష్ఠితము కాదు, మతే మనఁగా బ్రహ్మదేవునిచేతనుగూడ అను విత్తము—అనుష్ఠితము. తేన = ఆమార్గముచేత; బ్రహ్మవిత్ = వేదార్థవేత్తయు; పుణ్యకృత్ = అనుష్ఠాతయు; తైజసశ్చ = ప్రకాశాత్మయు; ఏతి=పొందుచున్నాఁడు, ఇతరుఁడు పొందఁడు.

రా. తతః — విషయములయం దసంగమువలన; తత్ పదమ్; పరిమార్గితవ్యమ్ = అన్వేషింపఁబడవలయును; యస్మి న్గతా భూయో ననివర్తన్తి. అనాదికాల ప్రవృత్త మగు గుణమయభోగసంగమును తన్మూల మగు నజ్ఞానంబును ఎట్లు నివర్తిల్లు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—అజ్ఞానాదినివృత్తికొఱకు, తమేవచ; ఆద్యమ్ = సమస్తమునకును ఆది యైనవానిని; “ మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్, అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే, మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ ” ఇత్యాదిగాఁ జెప్పఁబడిన యాద్యుం డగు నాపురుషునే శరణముగా, ప్రపద్యేత్ = పొందవలయును. యతః = సమస్తమును సృజించు నట్టి ఎవనివలన; ప్రవృత్తిః = ఈ గుణమయభోగసంగప్రవృత్తి; పురాణీ = పురాతనము; ప్రసృతా. దీని మున్నే నేను చెప్పియున్నాను గదా “ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా । మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే ” అని. ప్రపద్యేయతః ప్రవృత్తిః అని పాఠాంతరము. ఆ యాద్యుం డగు పురుషునే, ప్రపద్య = శరణు పొంది; ఇయతః=అజ్ఞాననివృత్త్యాదిక మగు నీసమస్తముయొక్క; సాధనభూత మైన, ప్రవృత్తిః; పురాణీ=పురాతనము; ప్రసృతా; పురాతను లగు ముముక్షువులప్రవృత్తి కావున పురాణ మని చెప్పఁబడు

చున్నది, పురాతను లగు ముముక్షువులు నన్నే శరణు పొంది గదా బంధవిముక్తిం జెంది రని యర్థము.

**మూ.** అందుకొఱకు, తమేవ = వానినే, ప్రపద్యే=శరణు పొందవలయును. అదియు నందే చెప్పఁబడినది. "తం వై ప్రపద్యేత యం వై ప్రపద్య నశోచతి నహృష్యతి నజాయతే నమ్రియతే తద్బ్రహ్మమూలం తచ్ఛిత్త్వః" అని. "నారాయణేన దృష్టశ్చ ప్రతిబుద్ధో భవే త్పుమాన్" అనియు మోక్షధర్మమునందు. ఇట ఛేదనోపాయముగదా యాకాంక్షింపఁబడుచున్నది. భగవంతునికంటె మఱియొకఁడు శరణ్యుండో లేఁడు.

> నిర్మానమోహా జితసఙ్గదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
> ద్వన్ద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై ర్గచ్ఛన్త్యమూఢాః పద మవ్యయం తత్.

**భా.** ఎట్టివా రాపదము నొందుదు రనఁగాఁ జెప్పుచున్నాఁడు.—నిర్మానమోహాః = మానమును మోహమును ఎవరియొద్దనుండి నిర్గతములో అట్టివారు, మానమోహములచే విడువఁబడినవారు; జితసఙ్గదోషాః — జయింపఁబడిన సంగం బనుదోషము గలవారు; అధ్యాత్మనిత్యాః = పరమాత్మస్వరూపాలోచనమునందు తత్పరులు; వినివృత్తకామాః = విశేషంబున నిర్లేపతచే నివర్తిల్లినకామములు గలవారు; సన్న్యాసులు; ద్వన్ద్వైః — ప్రియాప్రియములు మొదలగువానిచేత; సుఖదుఃఖసంజ్ఞైః=సుఖదుఃఖములు అను పేరు గలవానిచేత; విముక్తాః= విడువఁబడినవారు; అమూఢాః = మోహవర్జితులు; అవ్యయమ్ = నాశరహిత మైన; తత్ =పూర్వోక్త మగు; పదమ్ = పదమును; గచ్ఛన్తి= పొందుచున్నారు.

అహంకారమును అవివేకమును లేనివారును సంగ మనుదోషమును జయించినవారును నిరంతరముగాఁ బరమాత్మస్వరూపపర్యాలోచనముఁ జేయువారును కామముల విడిచినవారును సుఖదుఃఖాదిద్వంద్వముల జయించినవారునై యజ్ఞానము వీడిన సన్న్యాసులు పూర్వోక్త మగు పునరావృత్తివర్జిత మైనపదమును బ్రాపింతు రని తాత్పర్యము.

**రా.** పరిమార్గణపూర్వకముగా వైష్ణవపదముఁ జెందువారికి సాధనాంతరముల నాకాంక్షించి చెప్పుచున్నారు ఎట్టివారు ఇత్యాదిగా. మానము = అహం

కారము. మోహము=అవివేకము. జితసఙ్గదోషాః—శత్రుమిత్రులు సన్నిధి నున్నను ద్వేషప్రీతులు లేనివా రని యర్థము. తత్పరులు – శ్రవణాదినిష్ఠులు. ప్రియాప్రియాదులు — ఆదిశబ్దముచేఁ దత్కారణము గ్రహింపఁబడుచున్నది. మోహావర్జితులు — ఉక్తసాధనములచే సమ్యక్జ్ఞానము నొందినవారు. సన్న్యాసులు – వైరాగ్యద్వారమున సర్వకర్మముల విడిచినవా రని యర్థము.

హ. జితసఙ్గదోషాః = సంగ మనఁగా విషయసంకల్పము, వశీకరింపఁబడిన మనస్సు గలవా రగుటచే జయింపఁబడిన విషయసంకల్ప మనుదోషము గలవారు, విషయసంకల్పరహితు లని యర్థము; అధ్యాత్మనిత్యాః = ఆత్మజ్ఞానమునందు నిరతులు; వినివృత్తకామాః = నివర్తిల్లినకామములు గలవారు; సుఖదుఃఖసంజ్ఞైః = సుఖదుఃఖాదు లను పేరు గల; ద్వన్ద్వైః; విముక్తాః; అమూఢాః = వివేకులు; అవ్యయమ్ = నాశము లేనట్టి; తత్ పదమ్ = ఆ వైష్ణవపదమును; గచ్ఛన్తి = పొందుచున్నారు.

శం ఇట్లవిద్యాకామకర్మములచే సంసారచక్రమందు భ్రమించుచున్నవారును ఈశ్వరప్రసాదముచే సంప్రాప్త మగు సదసద్వివేకవిజ్ఞానమువలన తీవ్రవైరాగ్యము నొంది సర్వకర్మతత్సాధనములను సన్న్యసించినవారు నగు ముముక్షువులు శ్రవణాదిజన్యజ్ఞానముచే జగత్కారణ మగు నిర్విశేషపరబ్రహ్మమును స్వస్వరూపంబున నెఱుంగవలయు నని యుపదేశించి అట్లు ఆత్మస్వరూపజ్ఞానము నొందిన యతులుగూడ " స సర్వవి ద్భజతి మామ్ " అని చెప్పఁబోవున్యాయంబున తాము సంపాదించినజ్ఞానమునకును దత్ఫలసిద్ధికిని బ్రతిబంధకము లైన యనాత్మ తద్ధర్మాధ్యాసమునకు లోనుగాకుండుటకై సదా బ్రహ్మదృష్టితోనే యుండవలయు నని బోధించుకొఱకు ఇట్టి లక్షణము గల యతులే విదేహముక్తిని బ్రాపింతు రని చెప్పుచున్నాఁడు.—మాన మనఁగా అభిమానము, దేహేంద్రియాదులయందు ఇవి నేను అను నభినివేశరూప మైన యహంకారము, మోహ మనఁగా తత్కారణ మగు నజ్ఞానము ఆవరణరూపము, అనాత్మయం దాత్మబుద్ధికి హేతువు, స్వరూపజ్ఞానము చేతను ఆత్మయందే యాత్మభావము నొందుటచేతను ఆమానమోహములనుండి నిర్గతులు కావున నిర్మానమోహులు, శ్రవణాదులవలన ఇతఁడే నే నని యెఱుంగుటచేతను ఆత్మయందే యాత్మబుద్ధినిశ్చయముచేతను అనాత్మయం దహంభావశూన్యులని యర్థము; మానమోహములును చెప్పఁబోవునట్టి యవిద్యాకామములును నిశ్శేష

ముగా నివర్తిల్లుటకు కారణము చెప్పుచున్నాఁడు. — అధ్యాత్మనిత్యాః = అధ్యాత్మ మనఁగా నాత్మజ్ఞానము సర్వత్ర బ్రహ్మమాత్రదృష్టిరూపము, దానియందే నిత్యులు— నిరతులు ఆత్మారాము లెవ్వరు గలరో వా రధ్యాత్మనిత్యులు, ఇది యంతయు నేనును బ్రహ్మమే యని తనయందును సర్వమునందును బ్రహ్మదృష్టి దృఢ మగుట కొఱకు నిరంతరము బ్రహ్మనిష్ఠయందే నిలిచి యున్నవా రని యర్థము; అందువలననే, వినివృత్తకామాః = వీనిచేత విషయములు కామింపఁబడుచున్నవి కావున కామ మనఁగా వాసనలు, వాసనచేతఁగదా విషయములను కామించుచున్నాఁడు, అందు వలన వాసనలు కామము లని చెప్పఁబడుచున్నవి, నిరంతరబ్రహ్మనిష్ఠచేత నంతఃకర ణమునుండి విశేషించి నివృత్తములైన కామములు — బాహ్యవాసనలు గలవారు, నిరంతరసమాధినిష్ఠచే నిర్దగ్ధము లైన యహంకారాది సర్వవాసనాగ్రంథులు గలవా రని యర్థము; సర్వవాసనానాశమునకు ఫలము చెప్పుచున్నాఁడు.—జితసఙ్గదోషాః = ఇంద్రియములకును మనస్సునకును విషయములతో సంసర్గము సంగము, అదియె కామసంకల్పాదిదోషములకు హేతు వగుటవలన దోష మని చెప్పఁబడుచున్నది, ధ్యానశ్రవణదర్శనాదులచేత చిత్తమునకును ఇంద్రియములకును విషయసంసర్గము కలిగినపుడు కామసంకల్పాదిదోషములు పుట్టుచున్నవి, వానివలన భోక్తృభోగ్యాద్య ధ్యాసమును దానివలనఁ బ్రవృత్తియు నందువలన ప్రత్యగ్దృష్టివిచ్ఛిత్తియు దానివలన "ధ్యాయతో విషయా న్పుంసః" అని చెప్పఁబడిన యనర్థపరంపరయు సంభవిం చును, అందువలన అవి సంభవింప కుండుటకై జితము — విడువఁబడినది సంగదోష మెవ్వరిచేతనో వారు జితసంగదోషులు, బాహ్యసంబంధము లేనివా రని యర్థము. అధ్యాత్మనిత్యు లగుటవలన నిర్మానమోహులును అందువలన వినివృత్తకాములును అందువలన జితసంగదోషులును అందువలననే, సుఖదుఃఖసంజ్ఞైః = సుఖ మనియు దుఃఖ మనియు జ్ఞానము వేనివలన కలుగుచున్నదో అవి సుఖదుఃఖసంజ్ఞములు, శీతోష్ణములు ప్రియాప్రియములు శత్రుమిత్రములు మొదలగునవి, అట్టి; ద్వన్ద్వైః= ద్వంద్వములచేత; విముక్తాః — గుణాతీతు లని యర్థము; ఇట్టి లక్షణములు గలవా రగుటవలననే, అమూఢాః=నేను నాది యిది అను భేదబుద్ధి గలవారు మూఢులు, అట్టివారు కానివారు అమూఢులు, నిశ్శేషముగా నివర్తిల్లిన యవిద్య గలవారు బ్రాహ్మణులు, "అమౌనంచ మౌనంచ నిర్విద్యాథబ్రాహ్మణః" అని శ్రుత్యుక్త మైనలక్షణము గల బ్రహ్మవిదు లగు యతులు; అవ్యయమ్ = దేశచేతను నశింపదు కావున అవ్యయము, "నిత్యం విభు సర్వగతం సుసూక్ష్మం తదవ్యయమ్" అను

శ్రుతివలన, అన్వయ మనుటచేత నిర్విశేషబ్రహ్మవ్యతిరిక్తములకు నాశము గల దని సూచింపఁబడినది, అందుచే ముముక్షువులు నిర్విశేష మగు పరబ్రహ్మమునే యెఱుంగ వలయును స్మరింపవలయును వచింపవలయు నని తెలుపఁబడినది; ఏది సర్వవేదాంత ప్రసిద్ధమో దేనిఁ జెంది ముక్తులైనవారు పునరావృత్తి నొందరో, తత్ = అట్టి శాశ్వతమును నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావంబును సచ్చిదానందైకరసంబును నద్వితీయము నగు. పదమ్ = పరబ్రహ్మమును; గచ్ఛన్తి—ఉపాధినాశముచేత ఆభాసకృతమైన పరిచ్ఛేదము విడిచి పూర్ణత్వముఁ జెందుచున్నా రని యర్థము.

మ. పరమార్థగుణపూర్వకముగా నైష్ణవపదమును జెందువారిలకు అంగాంతరములఁ జెప్పుచున్నాఁడు.—మాన మనఁగా అహంకారము గర్వము, మోహ మనఁగా అవివేకము లేక విపర్యయము, వానివలన నిష్క్రాంతులు—విడివడినవారు నిర్మానమోహులు, లేక, అవి యెవరివలననుండి నిర్గతము లయ్యెనో వారు నిర్మానమోహులు, అహంకారావివేకములు లేనివా రని యర్థము; జితసఙ్గదోషాః — ప్రియాప్రియములు సన్నిహితములై యున్నను రాగద్వేషములు లేనివా రని యర్థము; అధ్యాత్మనిత్యాః = పరమాత్మస్వరూపాలోచనతత్పరులు; వినివృత్తకామాః — విశేషించి — నిశ్శేషముగా నివృత్తములు కామములు—విషయభోగము లెవ్వరికో అట్టివారు, వివేకవైరాగ్యంబున సర్వకర్మత్యాగము చేసినవా రని యర్థము; ద్వన్ద్వైః — శీతోష్ణక్షుత్పిపాసాదులచేత; సుఖదుఃఖసంజ్ఞైః — సుఖదుఃఖములకు హేతువు లగుటవలన సుఖదుఃఖము లను పేరు గలవానిచేత; సుఖదుఃఖసజ్ఞైః అను పాఠమునందు సుఖదుఃఖములతో సంబంధము వేనికిఁ గలదో యట్టివానిచేత నని యర్థము; అట్టి ద్వంద్వములచే, విముక్తాః=విడువఁబడినవారు; అమూఢాః—వేదాంత ప్రమాణమువలనఁ బుట్టిన సమ్యక్జ్ఞానముచే నశింపఁజేయఁబడిన ఆత్మస్వరూపాజ్ఞానము గలవారు; తత్ అవ్యయం పదమ్ — యథోక్తమైన పదమును; గచ్ఛన్తి.

శ్రీ. తత్ప్రాప్తికి సాధనాంతరములఁ దెలుపుటకై చెప్పుచున్నాఁడు.—మానమోహములు—అహంకారమిథ్యాభినివేశములు ఎవరివలననుండి నిర్గతములో అట్టివారు; పుత్రాదిసంగరూప మగు దోషము జయింపఁబడినది యెవరిచేతనో యట్టివారు; అధ్యాత్మమునందు — ఆత్మజ్ఞానమునందు నిత్యులు — నిలుకడ గలవారు; విశేషించి నివర్తిల్లినది కామ మెవ్వరివలన నుండియో అట్టివారు; సుఖదుఃఖహేతువు లగుటవలన సుఖదుఃఖము లను పేరు గల శీతోష్ణాదిద్వంద్వములచే విముక్తులు;

అందువలననే, అమూఢాః — నశించినయవిద్య గలవార లగుచు; తత్ అవ్యయమ్; పదమ్—వైష్ణవమును; గచ్ఛన్తి.

**ప.** ఇఁక "ఇతో విముక్తాః" అను శ్రుతితాత్పర్యమును ప్రకటించుటకై చెప్పుచున్నాడు.—*

**రా.** ఇట్లు నన్ను శరణు పొంది, నిర్మానమోహాః = నిర్గత మైన యనాత్మయందలి యాత్మాభిమానరూప మైన మోహము గలవారు; జితసఙ్గదోషాః = జయింపఁబడిన గుణమయభోగసంగ మను దోషము గలవారు; అధ్యాత్మనిత్యాః = అధ్యాత్మ మనఁగా ఆత్మయందలి జ్ఞానము, ఆత్మజ్ఞానమునందు నిరతులు; వినివృత్తకామాః = వినివృత్త మైన తదితరకామము గలవారు; సుఖదుఃఖసంజ్ఞైః ద్వన్ద్వైః—వీనిచేతను గూడ; విముక్తాః; అమూఢాః — ఆత్మానాత్మస్వభావము నెఱింగినవారు; తత్ అవ్యయం పదం గచ్ఛన్తి — అనవచ్ఛిన్నజ్ఞానాకారుఁ డైనయాత్మను యథావస్థితముగాఁ బొందుచున్నారు. నన్ను శరణు పొందినవారలకు నాప్రసాదమువలన నీప్రవృత్తు లన్నియు సిద్ధిపర్యంతము సులభముగా సాధ్యము లగు నని యర్థము.

**మా.** సాధనాంతరము చెప్పుచున్నాఁడు నిర్మానేత్యాదిశ్లోకముచేత.

న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ. ౬

**భా.** ఆ పదమే వెండియు విశేషింపఁబడుచున్నది.—తత్ = దీనికి వ్యవహిత మైనధామముతో సంబంధము, ఆ తేజోరూప మైనపదమును; సూర్యః = ఆదిత్యుఁడు; నభాసయతే = ప్రకాశింపఁజేయఁడు, సర్వమును ప్రకాశింపఁజేయ శక్తిగలవాఁ డైనను. శశాఙ్కః=చంద్రుఁడు; న = ప్రకాశింపఁజేయఁడు. పావకః = అగ్నియును; న = ప్రకాశింపఁజేయఁడు. యత్ = ఏధామమును, వైష్ణవపదమును; గత్వా = పొంది; ననివర్తన్తే = మరలరో; మఱియు దేనిని సూర్యాదులు ప్రకాశింపఁజేయరో, తత్ = అట్టి; పరమమ్ = ఉత్తమ మైన; ధామ = పదము; మమ = విష్ణు వైన నాది.

---

* పదయోజన శ్రీధరీయముతో సమానము.

స్వయంప్రకాశతేజోరూప మైన యేపదమును సూర్యచంద్రాగ్నులు గూడ ప్రకాశింపఁజేయఁజాలరో మఱియు దేనిని బొందినవారు పునరావృత్తి నొందరో అట్టిది విష్ణుఁడ నైన నాపరమపద మని తాత్పర్యము.

ఆ. ఆపదము వేద్య మన్నయెడ కర్తకంటె కర్మము భిన్న మగుటవలన ద్వైతము సంభవించును, వేద్యము కా దన్నయెడ పురుషార్థము కానందువలన ప్రేప్సితము * కాకపోవును అని యాశంకించి చెప్పుచున్నారు త దిత్యాదిగా.

హ. ♦

శం. ఓ యీ! బ్రహ్మవిష్ణ్వాదిలోకము నొందినవారికివలె నిర్విశేషబ్రహ్మభావము నొందినవారికి మాత్ర మెందువలన పునరావృత్తి లేదు? అని యాశంకింపఁగా, "న స పునరావర్తతే న స పునరావర్తతే" అని దహరాద్యుపాసనము గావించి క్రమముక్తిఁ జెందునట్టి సగుణోపాసకునకే పునరావృత్తి లే దని శ్రుతి యుపదేశించుచున్నది, ఇఁక ఉపాధి నశింపఁగా సచ్చిదానందైకరస మగు సాక్షాన్నిర్విశేషపరబ్రహ్మమునే స్వాత్మభావమునఁ జెందినవారికిఁ బునరావృత్తి లేదని చెప్పెడి దేమి? అను నీయర్థమును బోధించుటకై బ్రహ్మము సూర్యాదులచే భాస్యము కాదనియు స్వయంప్రకాశ మనియు అదియే తనస్వరూప మనియు బోధించుచున్నాఁడు.— తత్=పూర్వోక్త మైన, ముక్తులకు ప్రాప్య మైన; ధామ=పరమజ్యోతిస్స్వరూపమగు పదశబ్దవాచ్య మైనపరబ్రహ్మమును; పరమప్రకాశరూపుఁ డగుటవలన సర్వమును ప్రకాశింపఁజేయుశక్తి గలవాఁడై సహస్రకిరణుఁ డైనను, సూర్యః = సూర్యుఁడు; నభాసయతే—ప్రకాశింపఁజేయ సమర్థుఁడు కాఁ డని యర్థము, "న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతో ఽయ మగ్నిః" అను శ్రుతి వలన. శశాఙ్కః=చంద్రుఁడును; నభాసయతే. పావకః=అగ్నియును; నభాసయతే. చక్షురాదులును మనస్సునుగూడ బ్రహ్మమును భాసింపఁ జేయఁజాల వనుట కుపలక్షణ మిది, చక్షురాదులచేతఁగూడ బ్రహ్మము భాస్యము కా దని యర్థము, "న తత్ర చక్షు ర్గచ్ఛతి, న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యై ర్దేవైః" అను శ్రుతివలన. ఇందుచే వెలుపలనుండు భౌతికములైన సూర్యాదులకును చక్షురాదులకును లోపలి బుద్ధ్యాదులకును అభాస్య మగుటవలన బ్రహ్మము అభౌతికము అతిసూక్ష్మతమము

* పొందఁ గోరఁబడినది.

♦ భాష్యముకంటె నవిశిష్టము.

సర్వాంతరము అన్యానవభాస్యము సర్వప్రకాశకము అదృశ్యము అజడము అప్రమేయము నిరవయవము నిష్క్రియము నిర్వికారము నిత్యశుద్ధము నని సిద్ధము, "న సన్నాఽసన్న సదసత్, తస్మాత్తమ స్సంజాయతే, సూక్ష్మాత్సూక్ష్మతరమ్, ఏషత ఆత్మా సర్వాన్తరః, న తత్ర సూర్యో భాతి, తస్య భాసా సర్వ మిదం విభాతి, అత్రాయం పురుషః స్వయంజ్యోతిః, స్వప్రకాశానన్దఘనమ్, అదృశ్య మవ్యవహార్యమ్, సాక్షీ చేతా కేవలః, అప్రమేయం ధ్రువమ్, నిష్కలం నిష్క్రియమ్, చిద్రూప ఏవా వికారో హ్యుపలబ్ధా, నిత్యం శుద్ధం బుద్ధం ముక్తం సత్యం పరిపూర్ణ మద్వయమ్, స దానన్దచిన్మాత్రమ్" అను శ్రుతులవలన. ఇట్లు పరమజ్యోతిస్స్వరూప మైన బ్రహ్మము సూర్యాదులచే నభాస్యం బగుటవలన అభౌతికత్వాదిలక్షణం బని సూచించి ఇఁక నుపక్రమించినవిషయముం బ్రతిపాదించుచున్నాఁడు. — నిర్మానమోహత్వాదిముక్తలక్షణలక్షితు లైన మహాత్ము లగుయతులు, యత్ = అభౌతికత్వాదిలక్షణ మైన యేధామమును, పరమజ్యోతిస్స్వరూపమై పదశబ్దార్థమగు పరబ్రహ్మమును; గత్వా—తద్భావము నొంది; ననివర్తన్తే—వెండియు నేను నాది యను సంసారము నొంద రని యర్థము. ఏది సూర్యాదులకు భాస్యము కాదో దేనిభావము నొందినవారికిఁ బునరావృత్తి లేదో ఏది యపూర్వమో అనపరమో అనంతరమో అబాహ్యమో అఖండానందైకరసమో అద్వితీయమో, తత్ ధామ = అట్టి పరమజ్యోతి; మమ=నాయొక్క, విష్ణువుయొక్క—నిజతత్త్వము, అమాయికమైన స్వరూప మని యర్థము. శంకా. "సోమ్యేమా స్సర్వాః ప్రజాః స్సత ఆగమ్య నవిదుః సత ఆగచ్ఛామహే" * అని సత్సంపన్నులకుఁ గూడఁ బునరావృత్తిని శ్రుతి చెప్పుచున్నది, యద్గత్వా ననివర్తన్తే యని సత్సంపన్నులకుఁ బునరావృత్తి లే దని యెట్లు చెప్పవచ్చును? అని యందువేని, సత్యము. సత్సంపన్నులకుఁగూడ సత్తునుండి పునరావృత్తి కల దని శ్రుతి చెప్పుచున్నది గాని అందు విశేషము గలదు. దానిఁ బ్రతిపాదించెదము. "ప్రయతో వాఙ్మనసి సంపద్యతే మనః ప్రాణే ప్రాణ స్తేజసి తేజః పరస్యాం దేవతాయామ్" ♦ అను శ్రుతిచే విద్వాంసునకును అవిద్వాంసునకును ఇద్దఱకును సత్సంపత్తి సమాన మైనను అవిద్యాకామాదిసంసారబీజవిశిష్టుఁ డైన యవిద్వాంసుఁడుమాత్రము సత్తును బొందియు సంసార

---

* సౌమ్యుఁడా ఈప్రజ లందఱును సత్తునుండి వచ్చి మేము సత్తునుండి వచ్చుచున్నా మని యెఱుంగరు.

♦ మరణించువానివాక్కు మనస్సునందును మనస్సు ప్రాణమునందును ప్రాణము తేజస్సునందును తేజస్సు పరదేవతయందును లయ మగుచున్నది.

హేతు వగు నవిద్యాదిక ముండుటవలన తద్వేగంబున సత్తునుండి వెండియు నుత్క్రమించుచున్నాఁడు. అట్లు శ్రుతి. "తేనైష ఆత్మా నిష్క్రామతి చక్షుష్టో వా మూర్ధ్నో వాన్యేభ్యో వా శరీరదేశేభ్యస్తముత్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణమనూత్క్రామన్తం సర్వే ప్రాణా అనూత్క్రామన్తి, సవిజ్ఞానో భవతి సవిజ్ఞానమేవాన్వవక్రామతి తం విద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞా చ, అవిద్యాం గమయిత్వాన్యన్నవతరం కల్యాణతరం రూపం కురుతే పిత్ర్యం వా గాన్ధర్వం వా దైవం వా ప్రాజాపత్యం వా బ్రాహ్మం వాఽన్యేషాం భూతానామ్, తదేవ సక్తః సహ కర్మణైతి లిఙ్గం మనో యత్ర నిషక్తమస్య, కామాన్యః కామయతే మన్యమానః స కామభిర్జాయతే తత్ర తత్ర, పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన, * ఇత్యాదికము. "నాభుక్తం క్షీయతే కర్మ" ఇత్యాది స్మృతియును. కానువలన అవిద్యాకామాదిబలముచే నవశిష్టకర్మము ననుభవించుటకొఱకు అవిద్యాకామాదిమంతు లగు సనాతన్మజులు సత్తును పొందియును బునరావృత్తి నొందుచున్నారు, సుషుప్తినుండి యెట్లో అట్లు. అట్లు బ్రహ్మవిదుఁ డగు యతి పునరావృత్తి నొందఁడు బ్రహ్మైకత్వజ్ఞానాగ్నిచే నవిద్యాకామాదులు నిశ్శేషముగా దగ్ధము లగుటవలన నుపాధివిలయంబున స్వస్వరూపమే యగు నిర్విశేష నిత్యశుద్ధ పరబ్రహ్మమును బ్రాపించిన బ్రహ్మవిదునకు వ్యుత్థాన హేతువు లేమివలన బ్రహ్మస్వరూపావస్థానమే యగుఁ గాని పునరుత్క్రమణము సంభవింపదు, అవిద్యాదిమంతునకువలె. అట్లు శ్రుతులు. "గుహాగ్రన్థిభ్యో విముక్తోఽమృతో భవతి, యోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామః, న తస్య ప్రాణా ఉత్క్రామన్తి బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి, పర్యాప్తకామస్య కృతాత్మనస్తు ఇహైవ సర్వే ప్రవిలీయన్తి కామాః, యథా నద్యః స్యన్దమానాః సముద్రేఽస్తం గచ్ఛన్తి నామరూపే విహాయ। తథా విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం

---

* అందుచే నీయాత్మ యుత్క్రమించుచున్నాఁడు వాని నుత్క్రమించువాని ప్రాణము వెంబడించి యుత్క్రమించుచున్నది ప్రాణమును సర్వేంద్రియములును వెంబడించి యుత్క్రమించుచున్నవి, అతఁడు విజ్ఞానవంతుఁ డగుచున్నాడు విజ్ఞానమునే యనుసరించుచున్నాఁడు, వాని విద్యయు కర్మమును పూర్వప్రజ్ఞయు అనుసరించుచున్నది, అవిద్యను పొంది యితరమైన క్రొత్తకల్యాణతర మగు రూపము పిత్ర్యమునుగాని గాంధర్వమునుగాని దైవమునుగాని ప్రాజాపత్యమునుగాని బ్రాహ్మమునుగాని ఇతర భూతముల రూపమునుగాని పొందుచున్నాఁడు, దానినే అంటినవాఁడై లింగరూప మగు నీతని మనస్సు దేనియందు సక్త మగునో దానినే కర్మముచేఁ బొందుచున్నాఁడు, కామముల సంకల్పించుచు నెవఁడు కామించుచున్నాఁడో వాఁడు కామములచే నచ్చటచ్చటఁ బుట్టుచున్నాఁడు, పుణ్యకర్మముచే పుణ్యుఁడును పాపముచేఁ బాపుఁడును అగుచున్నాఁడు.

పురుష ముపైతి దివ్యమ్ "* అని. కూటస్థుఁ డగుటవలన నాత్మకు నిర్గమాగమములు సంభవింపమివలనఁగూడ. ఎట్లు మహాకాశస్వరూపమే యగు ఘటాకాశమునకు ఘటోపాధిచే భిన్నమువలెఁ దోఁచుచున్న దానికి ఘటము నశించినపుడు మహాకాశ స్వరూపంబున నునికి దక్కఁ బునరావృత్తి సంభవింపదో అట్లు బ్రహ్మరూపుఁడె యగునాత్మకును అవిద్యోపాధిచే భిన్నుఁడుంబోలెఁ దోఁచుచున్నవాని కుక్తరీతి నవి ద్యాతత్కార్యములు నశించినపుడు బ్రహ్మస్వరూపావస్థానము దక్కఁ బునరావృత్తి సంభవింపదు, కూటస్థుం డగుటచే క్రియాశ్రయత్వం బనుపపన్న మగుటవలన. అందువలన సమ్యగ్దర్శనముచేతను బ్రహ్మనిష్ఠచేతను అవిద్యాదులు నశించుటవలన నుపాధివిలయంబున నిర్విశేషనిత్యశుద్ధబ్రహ్మభావము నొందినవారగు మహాత్ములకుఁ బునరావృత్తి లే దని సిద్ధము.

**మ.** ఆ గంతవ్యమగుపదమునకే విశేషణము చేయుచున్నాఁడు — యత్ =వైష్ణవపదమును; గత్వా; యోగులు, ననివర్తన్తే; తత్ =ఆపదమును; సర్వమును ప్రకాశింపఁ జేయుశక్తి గలవాఁ డైనను, సూర్యః; నభాసయతే. సూర్యుఁ డస్తమించినను ప్రకాశింపఁజేయువాఁడు చంద్రుఁ డున్నాఁ డని యాశంకించి చెప్పుచున్నాఁడు నశశాఙ్కః అని. సూర్యచంద్రు లిద్దఱు నస్తమించినను అగ్ని ప్రకాశింపఁ జేయు నని యాశంకించి చెప్పుచున్నాఁడు నపావకః అని. భాసయతే అని రెండుస్థలములయందు ననువర్తించును. సూర్యాదులకు దానిఁ బ్రకాశింపఁజేయుసామర్థ్య మెందువలన లే దనఁగాఁ జెప్పుచున్నాఁడు.—తత్ ; ధామ=జ్యోతి, స్వయంప్రకాశము ఆదిత్యాదులగు సకలజడజ్యోతులఁ బ్రకాశింపఁజేయునది; పరమమ్=ప్రకృష్టము; మమ=నాయొక్క, విష్ణువుయొక్క స్వరూపాత్మక మైనపదము. ఎవం డెవనిచే ప్రకాశింపఁ జేయఁబడుచున్నాఁడో అతఁడు తన్ను ప్రకాశింపఁ జేయునాతనిఁ బ్రకాశింపఁ జేయఁజాలఁడు గదా. అట్లు శ్రుతి. "న తత్ర సూర్యో భాతి న చన్ద్ర తారకం నేమా విద్యుతో భాన్తి కుతో ఽయ మగ్నిః। త మేవ భాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి" అని. ఇందుచే, "ఆపదము వేద్యమా? కాదా? మొదటి

* హృదయగ్రంథులనుండి విముక్తుఁడై యమృతుఁ డగుచున్నాఁడు, ఎవఁడు అకాముఁడును నిష్కాముఁడును ఆప్తకాముఁడును ఆత్మకాముఁడును అగునో వాని ప్రాణములు ఉత్క్రమింపవు బ్రహ్మమే యయి బ్రహ్మము నొందుచున్నాఁడు, పర్యాప్తకాముఁడై ఆత్మజ్ఞుఁడగు వానికో ఇందే సర్వప్రాణములును లయము నొందుచున్నవి, ఎట్లు నదులు సముద్రమునందుఁ బ్రవహించినవై నామరూపముల విడిచి లయము నొందుచున్నవో అట్లు విద్వాంసుఁడు నామరూపవిముక్తుఁడై పరాత్పరుఁడు దివ్యుఁ డగు పరమాత్మ నొందుచున్నాఁడు.

పక్షమున వేద్యమునకు భిన్నుఁ డైన వేదిత యుండవలయును గావున ద్వైతం బాపాదిల్లును, రెండవపక్షమునఁ బురుషార్థము కాకపోవును" అను నీయాశంక నిరాకృతము, అవేద్యం బైనను తానే యపరోక్షం బగుటవలన. అం దవేద్యత్వము సూర్యాదులచే నభాస్యం బనుటచే నీశ్లోకమునఁ జెప్పఁబడినది, సర్వభాసకం బై తానే యపరోక్షం బనుటను య దాదిత్యగతం తేజః అను శ్లోకమునం జెప్పఁబోవుచున్నాఁడు. ఇట్లు రెండుశ్లోకములచేతను శ్రుతియొక్క రెండుదళములకును వ్యాఖ్యానము చేయఁబడిన దని యెఱుంగవలయును.

శ్రీ. ఆ గంతవ్యపదమునకే విశేషణము.—ఆపదమును సూర్యాదులు ప్రకాశింపఁ జేయఁజాలరు. దేనిఁ జెంది యోగులు నివర్తిల్లరో, తద్ధామ = అది స్వరూపము; పరమం మమ. సూర్యాదిప్రకాశమునకు విషయము గా దనుటచే జడత్వశీతోష్ణాదిదోషప్రసక్తి నిరసింపఁబడినది.

ప. ఆ పదమునకు విశేషణము.—తత్ = ఆపదమును, పరబ్రహ్మమును; సూర్యుఁడు గాని శశాంకుఁడు గాని అగ్ని గాని ప్రకాశింపఁ జేయఁజాలఁడు, "యద్భాసా సర్వ మిదం విభాతి" అను శ్రుతివలన సూర్యాదులుగూడ తత్ప్రకాశముచేతనే భాస్యు లగుటవలన. యత్; గత్వా = పొంది; యోగులు, న నివర్తంతే = పునరావృత్తిఁ జెందరో; అది నాపరమ మైన ధామ మని యెఱుంగవలయును.

రా. తత్ = ఆ యాత్మజ్యోతిని; సూర్యః, న భాసయతే. న శశాఙ్కః. న పావకః. అంతటను జ్ఞానమే కదా ప్రకాశకము. బాహ్యము లైన జ్యోతులో విషయేంద్రియసంబంధమునకు విరోధి యగు తమము నిరసించుద్వారమున నుపకారకములు. ఈ యాత్మ జ్యోతికిఁ బ్రకాశకము యోగము. దానికి విరోధి యనాది కర్మము. భగవత్ప్రపత్తిమూల మైన యసంగాదికము దాని నివర్తించు నని చెప్పఁబడినది. యత్ గత్వా; పొందియు, న నివర్తన్తే; తత్ పరమం ధామ=ఆ పరమజ్యోతి; మమ = నాది, నావిభూతి యైన నాయంశ మని యర్థము. ఆదిత్యాదులకును ప్రకాశకం బగుటచే నది పరమము. ఆదిత్యాదిజ్యోతులు జ్ఞానజ్యోతికిఁ బ్రకాశకములు కావు గదా. జ్ఞానమే సర్వంబునకును బ్రకాశకము.

మా. స్వరూపమును జెప్పుచున్నాఁడు న త దిత్యాదిగా.

మమై వాంశో జీవలోకే జీవభూత స్సనాతనః
మనష్షష్ఠా నీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. 7

**భా.** య ద్గత్వా న నివర్తన్తే యని చెప్పఁబడినది. ఓయీ ! గమన మంతయు ఆగమనాంతము గదా. సంయోగా విప్రయోగాన్తాః అని గదా ప్రసిద్ధము. ఆధామము నొందినవారికి లేదు నివృత్తి యని యెట్లు చెప్పవచ్చును ? విను మందు లకుఁ గారణము.—మమైవ=నాయొక్కయే, పరమాత్మయొక్కయే; అంశః = భాగము, అవయవము, ఏకదేశము అనునివి సమానార్థములు; జీవలోకే = జీవులలోకమునందు, సంసారము నందు; జీవభూతః = భోక్త కర్త అని ప్రసిద్ధుఁడు; సనాతనః=నిత్యుఁడు. ఎట్లు జలమునందలి సూర్యుని ప్రతిబింబము జలరూప మైననిమిత్తము నశింపఁగా సూర్యునే పొంది నివర్తిల్లదో అట్లు ఈయంశమును ఆ పరమాత్మతోనే చేరుచున్నది యావిధముననే. లేక. ఘటాద్యుపాధిపరిచ్ఛిన్న మైన ఘటాకాశము ఆకాశాంశ మగుటచే ఘటాదినిమిత్తము నశించినపు డాకాశమును బొంది నివర్తిల్లదో అట్లు. అందువలన నుపపన్న మే చెప్పఁబడినది య ద్గత్వా ననివర్తన్తే అని. ఓయీ! నిరవయువుం డగు పరమాత్మకు అవయవము ఏకదేశము అను టెక్కడిది ? సావయవుం డన్న యెడ అవయవవిభాగమువలన వినాశము ప్రసక్తించును. ఇది దోషము కాదు. ఎందువలన ననఁగా, అవిద్యాకృతోపాధిపరిచ్ఛిన్నుఁడై యేకదేశమువలె అంశమువలె కల్పింపఁబడియె. ఈయర్థము క్షేత్రాధ్యాయంబునందు విస్తరంబున నిరూపింపఁబడినది. ఆజీవుఁడు నాయంశముగాఁ గల్పితుఁ డైనవాఁ డెట్లు సంసరించును ఉత్క్రమించును అనఁగాఁ జెప్పెదము. మనః షష్ఠాని = మన స్సాఱవదిగాఁ గల; ఇన్ద్రియాణి = శ్రోత్రాదీంద్రియములను; ప్రకృతిస్థాని=కర్ణశష్కుల్యాదు లగు స్వస్థానములయం దున్నవానిని; కర్షతి = ఆకర్షించుచున్నాఁడు.

సంసారమునందు భోక్త కర్త యని ప్రసిద్ధుఁ డైనసనాతనుఁ డగు జీవుఁడు ఘటాకాశము మహాకాశాంశముగాఁ దోఁచున ట్లుపాధివశంబున పరమాత్మ నగు నాయంశముగాఁ దోఁచుచున్నాఁడు. అట్లు వాస్తవమున నాకంటె నభిన్నుఁ డైనను ఆ యవిద్యాకృతోపాధిచేతనే మనస్సుతోను యింద్రియములతోను సంబంధించి

యుండుటవలన సంసారము నొంది యాయింద్రియముల నాకర్షించుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. చెప్పినదాని ననువదించి యాక్షేపించుచున్నాఁడు యద్గత్వా ఇత్యాదిగా. అందుఁ బ్రసిద్ధిని ప్రమాణీకరించుచున్నాఁడు సంయోగా ఇత్యాదిగా. గమనము ఆగమనాంత మని ప్రసిద్ధ మగుటవలన యద్గత్వా ననివర్తన్తే అనుట యనుచిత మని యుపసంహరించుచున్నాఁడు అథాపము నిత్యాదిగా. ఆక్షేపమును పరిహరించుచున్నారు వినుము ఇత్యాదిగా. అందులకు—భగవత్ప్రాప్తి నివృత్త్యంతముః కా దనుటకు. జీవుఁడు పరమాత్మాంశ మైనను చెప్పినదోషమున కెట్లు సమాధాన మని యాశంకించి ప్రతిబింబపక్షమును గ్రహించి దృష్టాంతముచేఁ బరిహరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. అవచ్ఛేదపక్షము నాశ్రయించి మఱియొకదృష్టాంతముచే నుక్తదోషమునకు సమాధానముఁ జూపుచున్నారు లేక ఇత్యాదిగా. ఆక్షేపమునకు సమాధానము నుపసంహరించుచున్నారు అందువలన నిత్యాదిగా. పరమాత్మ నిరవయవుం డగుటవలన జీవుఁడు తదంశ మనుట యుక్తము కా దని శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. వానికి నిరవయవత్వము సాధించుచున్నాఁడు సావయవుండు ఇత్యాదిగా. వాస్తవంబున పరమాత్మ నిరంశుఁ డైనను కల్పనచే జీవుఁడు తదంశము కాఁ గలఁ డని పరిహరించుచున్నారు ఇది దోషము కా దని. వాస్తవంబుననో జీవుఁ డంశము కాఁడు పరమాత్మయంతటివాఁడే యని నిరూపింపఁబడి యుండుటవలన నని చెప్పుచున్నారు ఈయర్థము ఇత్యాదిగా. పరమాత్ముని యంశముగాఁ గల్పితుఁ డైనజీవుఁడు వాస్తవంబున తద్రూపుఁడే యగునేని అప్పు డతనికి సంసారము గాని యుత్క్రాంతి గాని లే దని శంకించుచున్నాఁడు ఆ జీవుఁడు ఇత్యాదిగా. జీవునికి సంసారోత్క్రాంతుల నుపపాదింప నుపక్రమించుచున్నారు చెప్పెదము ఇత్యాదిగా.

హ. మమైవ; అంశః = ఏకదేశము; జీవలోకే = ప్రాణిసమూహమందు; జీవభూతః = క్షేత్రజ్ఞుఁడు; సనాతనః; మనఃషష్ఠాని = మన స్సాఱవదిగాఁ గలవానిని; ఇన్ద్రియాణి; ప్రకృతిస్థాని = ప్రకృతియందు—మాయారూప మైన కారణమం దున్నవానిని; ఆ యింద్రియములను శబ్దాదివిషయోపలబ్ధికొఱకు తదభిముఖముగా, కర్షతి = ఆకర్షించుచున్నాఁడు, శ్రోత్రాదీంద్రియములను శబ్దాదివిషయములతో సంబంధింపఁజేయు చున్నాఁ డని యర్థము.

శ్లో. ౭. ఇట్లు సంసారవృక్షస్వరూపము నెఱింగి సదసద్వివేకంబున విరక్తుఁడై మోక్షైకకామనచే సర్వకర్మంబులను సన్న్యసించినయతికి సద్గురుప్రసాదజన్యజ్ఞానంబున బ్రహ్మప్రాప్తిని అపునరావృత్తిని బ్రతిపాదించి యిప్పుడు శ్రవణము చేయని యతులకుఁగూడ అనాత్మయం దాత్మత్వభ్రమ నివర్తిల్లుకొఱకు బ్రహ్మమునకే యవిద్యోపాధివశమువలన జీవత్వం బని బోధించుటకై జీవుఁడు బ్రహ్మాంశ మనియు ఆత్మ దేహేంద్రియాదివ్యతిరిక్తుఁడును అసంసారియు ననియుఁ బ్రతిపాదించుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—మమైవ – నిర్విశేషుఁడను చిదేకరసుఁడ నగు బ్రహ్మము యొక్క—యే; అంశః = అంశమువంటివాఁడు, అవిద్యచేఁ గల్పిత మైన భాగము; జీవలోకే = సంసారమునందు; లేక, జీవులచే లోక్యతే – అనుభవింపఁబడుచున్నది కావున జీవలోక మనఁగా క్షేత్రము, దానియందు; జీవభూతః = నామరూపవ్యాకరణముకొఱకు క్షేత్రజ్ఞతను బొందినవాఁడు, ప్రసూతఁడై యున్నాఁ డని యర్థము. ఓయీ! నిరవయవము నిర్విశేషము నగు పరబ్రహ్మమునకు జీవుం డంశ మని యంశాంశిత్వకల్పన యుక్తము కాదు, సాంశ మగునెడ సావయవత్వమును అనిత్యత్వమును సద్వితీయత్వమును సంభవించును, "నిష్కలం నిష్క్రియమ్, ఏక మేవాద్వితీయమ్" ఇత్యాది శ్రుతివిరోధముగూడ బ్రసక్తించును. అందువేని, నిన్నిట నడుగవలయును. నీవు బ్రహ్మము కన్న నితరుఁ డొకఁడు జీవుఁ డున్నాఁ డని చెప్పెదవా? బ్రహ్మమే జీవుఁ డని చెప్పెదవా? జీవుఁడే లేఁ డని చెప్పెదవా? మూఁడవ పక్షము కాదు. నే నున్నా ననుచు నెదుట నున్ననీకే యభావము సంభవించుట వలన. అది యిష్టాపత్తి యందువేని ప్రత్యక్షవిరోధము సంభవించును. మొదటి పక్షమునందు, ఆ జీవుఁడు చేతనుఁడా? అచేతనుఁడా? రెండవది సరికాదు, నీకే నేను నాది యిది యను జ్ఞానము లేమి సంభవించుటవలనను సుషుప్తియందువలె సదా సర్వత్ర వ్యవహారలోపము సంభవించుటవలనను. మొదటిదియుఁ గాదు, "సాక్షీ చేతా కేవలః" అను శ్రుతి బ్రహ్మమాత్రమే చేతన మని చెప్పుటచే తదతిరిక్తునకుఁ జేతనత్వం బనుపపన్న మగుటవలన. ఇఁక బ్రహ్మమే జీవుఁ డందువేని అదియుఁ గాదు, అప్పుడు సర్వప్రాణులకును బ్రహ్మమే నే ననియు తాను పూర్ణుఁ డనియు అసంసారి యనియు జ్ఞానము కావలయును, సంసారమే లేకపోవలయును, అట్లైనయెడ ప్రత్యక్షాది సర్వప్రమాణవిరోధము సంభవించును. అంత నవిద్యచే బ్రహ్మమునకే జీవత్వ మని చెప్పుదువేని ఆయుష్మంతుఁడ వగుము. ఈ యర్థమునే గత్యంతరముఁ గానక భగవంతుఁడును చెప్పుచున్నాఁడు మమైవాంశో జీవలోకే జీవ

భూతః అని. ఓయీ ! బ్రహ్మమునకే యవిద్యచే జీవత్వం బగుఁగాక, అట్లైనను నిరవయవమును ఏకము నగు బ్రహ్మమున కంశాంశిభావ మెట్లుపపన్న మగును? అందువేని, అవిద్యోపాధిచే నుపపన్న మగుచున్నది. ఎట్లు నిరవయవమును ఏకము నగు మహాకాశమునకు ఘటోపాధివశంబున ఘటాకాశభావము కల్పించి ఘటాకాశము మహాకాశ మని యొక్కటే యగు మహాకాశమున కంశాంశిభావము కల్పించుట యుపపన్న మగుచున్నదో అట్లు బ్రహ్మ మొక్కటే యైనను అవిద్యాకృతబుద్ధ్యాద్యుపాధివశంబున తదవచ్ఛిన్నమున కంశత్వము కల్పించి జీవుఁడు బ్రహ్మాంశ మని యొక్కటే యగు బ్రహ్మమున కంశాంశిభావముఁ గల్పించుట యుపపన్నము. అయినను వాస్తవంబున లేదు. వాస్తవంబున నున్న దనునెడ సిద్ధ చెప్పినదోషము ప్రసక్తించును, శ్రుతివిరోధంబును సంభవించును. వాస్తవంబున లేమివలన నేయనుపపత్తియును గలుగదు. అందువలన బ్రహ్మమునకే యుపాధివిశిష్టమునకు జీవుఁ డని పేరు. ఎట్లు అగ్నికే నూనె వత్తుల సంబంధముచేత దీప మని పేరు గలుగుచున్నదో అట్లు. ఓయీ అసంగ మగు బ్రహ్మమున కెట్లుపాధిసంబంధము ? ఎట్లు మఱి వికారిత్వము ? అందువేని చెప్పెదను. అసంగ మగు శంఖమునకు నయనమునందలి పీతత్వముతో నట్టాధ్యాసికసంబంధము కలుగుచున్నదో దానిచేతనే దానికి శంఖము పీతవర్ణం బని పీతత్వముగూడ సిద్ధించుచున్నదో అట్లు బ్రహ్మమునకును బుద్ధ్యాదితో నాధ్యాసికసంబంధము గలుగుచున్నది, దానిచేతనే యాత్మ చేయుచున్నాఁడు భుజించుచున్నాఁ డని సంసారిత్వముగూడ సిద్ధించుచున్నది. అది యాత్మ కాధ్యాసికము గాని వాస్తవము కాదు, " ధ్యాయతీవ లేలాయతీవ " అను శ్రుతివలన. ఈ యాధ్యాసికసంసారమునే యాత్మకు ప్రతిపాదించుచున్నాఁడు ప్రకృతిస్థాని కర్షతి అని. ఈ శ్లోకముతో మీఁదిశ్లోకమునకు నన్వయానురూపముగా నేకవాక్యతచే నర్థము చెప్పవలయును. సనాతనః = బ్రహ్మ మగుటవలన నిత్యుఁడు; అందువలననే ఈశ్వరః = దేహేంద్రియాదులప్రవృత్తికి హేతు వగుటవలన వానికి ప్రభు వైన జీవుఁడు; చకారము తు అనుదానియర్థము గలది, అపిశబ్దము వార్థకము. యచ్చాపి= ఎప్పుడైనఁ గాని; ఉత్క్రామతి = ఉన్న దేహమునుండి వెడలుచున్నాఁడో; అప్పుడు, మనష్షష్ఠాని = మన స్సాఱవదిగాఁగల; ఇన్ద్రియాణి=చక్షురాదులను వాగాదులను, ఇది ప్రాణములకు నుపలక్షణము, ప్రాణములనుగూడ; ప్రకృతిస్థాని = తాను విడుచుదేహమునం దున్నవానిని; కర్షతి = ఆకర్షించుచున్నాఁడు, తాను పొందఁబోవు శరీరమునందు విషయోపభోగముకొఱకు గ్రహించుచున్నాఁ డని యర్థము. ఈ

శరీరముకంటె నితర మైన, శరీరమ్ = శరీరమును; యత్ = ఎప్పుడు; అవాప్నోతి = పొందుచున్నాఁడో; అప్పుడు, వాయుః = వాయువు; ఆశయాత్ = పుష్పస్థానము నుండి; గన్ధానివ = మిక్కిలి సూక్ష్మము లైన పుష్పావయవములనువలె; ఏతాని = మనస్సును ప్రాణములను ఉభయేంద్రియములను; గృహీత్వా = గ్రహించి; సంయాతి = శరీరాంతరము నొందుచున్నాఁడు. ఇది రెండుశ్లోకముల కర్థము.

**ప్ర.** ఓయీ! యద్గత్వా ననివర్తన్తే అని చెప్పఁబడినది. పొందుదురేని అప్పు డవశ్య మావృత్తినిగూడఁ జెందుదురు, స్వర్గమునుండివలె. ఆవృత్తిఁ జెందరేని యప్పుడు పొంద రనియే చెప్పవలయును. అందుచే గత్వా యనుటయు ననివర్తన్తే యనుటయు పరస్పరవిరుద్ధములు. "సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః । సంయోగా విప్రయోగాన్తా మరణాన్తం హి జీవితమ్" అని సదా శాస్త్రమునందును లోకమునందును ప్రసిద్ధము. అనాత్మప్రాప్తికిఁ బునరావృత్తి గలదు కాని స్వాత్మప్రాప్తికి మాత్ర మది లేదందువేని అట్లు కాదు, సుషుప్తియందు "సతా సోమ్య తదా సంపన్నో భవతి" అని శ్రుతిచేఁ బ్రతిపాదింపఁబడిన ఆత్మప్రాప్తికిఁగూడఁ బునరావృత్తిపర్యంతత్వము సిద్ధ మగుటవలన. అట్లు కాదేని సుషుప్తుఁడు ముక్తుఁ డగుటచే వానికిఁ బునరుత్థానము కలుగరాదు. అందువలన ఆత్మప్రాప్తియందు గత్వా యనుట యుపపన్నము కాదు. గమనం బౌపచారిక మన్నను అనావృత్తియేమో యుపపన్నము కాదు. అని ప్రాప్తింపఁగాఁ జెప్పుచున్నాము. గంత యగు జీవుఁడు గంతవ్య మగు బ్రహ్మముకన్న నభిన్నుఁ డగుటవలన గత్వా యనుట యౌపచారికము, అజ్ఞానమాత్రముచే వ్యవహితుఁ డగు జీవునకు జ్ఞానముమాత్రముచేతనే బ్రహ్మప్రాప్తి యని వ్యపదేశించుటవలన. బ్రహ్మముయొక్క ప్రతిబింబము జీవుఁ డనుపక్షమున నప్పు డెట్లు జలప్రతిబింబితుఁ డగు సూర్యునకు జలము నశించినపుడు బింబభూతసూర్యప్రాప్తియు ఆబింబసూర్యునుండి యనావృత్తియు సిద్ధించుచున్నవో, ఇఁక బుద్ధ్యవచ్ఛిన్నబ్రహ్మభాగము జీవుఁ డనుపక్షమున నప్పు డెట్లు ఘటాకాశమునకు ఘటము నశింపఁగా మహాకాశప్రాప్తియు ఆమహాకాశమునుండి యనావృత్తియు సిద్ధించుచున్నవో, అట్లు జీవునకును నుపాధి నశించినపుడు నిరుపాధిస్వరూపగమనంబును దానినుండి యనావృత్తియు నని యుపచారంబునఁ జెప్పఁబడుచున్నది, ఏకస్వరూపుఁ డగుటవలనను భేదభ్రమము ఉపాధినివృత్తిచే నివర్తిల్లుటవలనను. సుషుప్తియందో స్వకారణ మైన యజ్ఞానమునందు భావనాకర్మపూర్వప్రజ్ఞాసహిత మగు జీవోపాధి యైన యంతఃకరణము సూక్ష్మ

రూపంబున నుండుటవలన ఆయజ్ఞానమునుండియే పునరుత్థానము సంభవించు చున్నది. జ్ఞానమువలన నజ్ఞానము నివర్తిల్లినప్పుడో కారణము లేక యుండఁగా కార్యం బెట్లుదయించును? అంతఃకరణాద్యుపాధులకు అజ్ఞానమే కారణ మగుట వలన. అందువలన జీవునకు " అహం బ్రహ్మాస్మి " అను వేదాంతవాక్యజన్య సాక్షాత్కారమువలన నేను బ్రహ్మము కాను అను నజ్ఞానముయొక్కనివృత్తి గత్వా అను శబ్దముచేఁ జెప్పఁబడుచున్నది. అనాద్యజ్ఞానము నివృత్తమైన పిదప దానికిఁ బునరుత్థానము సంభవింపమిచేఁ దత్కార్య మగు సంసారము కలుగ దనుట ననివర్తన్తే యను శబ్దములచేఁ జెప్పఁబడుచున్నది. కావున నేవిరోధంబును లేదు. జీవుని పారమార్థికస్వరూపమో బ్రహ్మమే యని పలుమాఱు ప్రదర్శింపఁబడినది. ఈవిషయ మంతయు నుత్తరగ్రంథముచేఁ బ్రతిపాదింపఁబోవుచున్నాఁడు. అందు జీవుఁడు బ్రహ్మరూపుఁ డగుటవలన నజ్ఞాననివృత్తిచేఁ దత్స్వరూపముఁ బ్రాపించిన యాతని కాబ్రహ్మస్వరూపమునుండి ప్రచ్యుతి లే దని ప్రతిపాదింపఁబడుచున్నది మమై వాంశః యను శ్లోకార్థముచేత. సుషుప్తియందో సర్వకార్యసంస్కార సహిత మైన యజ్ఞానము కలిమివలన దాననుండి వెండియు సంసారము జీవున కని మనష్షష్ఠాని యను శ్లోకార్థముచేఁ జెప్పఁబడుచున్నది. వాస్తవంబున నసంసారి యయ్యు మాయచే సంసారము నొంది మందమతులచే దేహతాదాత్మ్యమునఁ జూడఁబడుచున్నయాజీవునకు దేహాదివ్యతిరిక్తత ప్రతిపాదింపఁబడుచున్నది శరీర మిత్యాది శ్లోకముచేత. శ్రోత్రం చక్షు రిత్యాదిశ్లోకముచేతనో యథాయోగ్యముగా స్వవిషయములయం దింద్రియములఁ బ్రవర్తింపఁ జేయుచుండు నాజీవునకు ఆ యింద్రి యములకంటె వ్యతిరిక్తత ప్రతిపాదింపఁబడుచున్నది. ఇట్లు దేహేంద్రియాదివిలక్ష ణుండగు జీవుని నతఁడు స్వాత్మరూపుఁడై యుండఁగా నుత్క్రాంత్యాదిసమయమున నెందువలన నందఱును జూడ రను నాశంకకు విషయవిక్షిప్తచిత్తు లతఁడు దర్శన యోగ్యుఁ డైనను వానిఁ జూడఁజాల రని చెప్పఁబడుచున్నది ఉత్క్రామన్త మిత్యాది శ్లోకముచేత. వాని జ్ఞానచక్షువులు చూతు రన్నయర్థము యతన్తో యోగినః అను శ్లోకార్థముచేత వివరింపఁబడినది. విమూఢులు చూడలే రన్నయర్థము యతన్తో పీతి శ్లోకార్థముచేత వివరింపఁబడినది. ఇట్లయిదుశ్లోకములకును సంగతి. ఇఁక నక్షర ములకు వ్యాఖ్యానముఁ జేసెదము.—మమైవ — పరమాత్మయొక్కయే; అంశః — పరమాత్మ నిరంశుఁ డైనను జలమునందు సూర్యునకువలెను ఘటమునం దాకాశ మునకువలెను మాయచేఁ గల్పితమై మిథ్యాభేదము గల యంశము, అంశమువం

టిది; జీవలోకే = సంసారమునందు. ఆ యంశమే ప్రాణధారణోపాధిచేత, జీవభూతః — కర్త భోక్త సంసారి యని మిథ్యాప్రసిద్ధినే పొందినది; సనాతనః = నిత్యము, ఉపాధిచే పరిచ్ఛిన్నమైనను వాస్తవంబున పరమాత్మస్వరూప మగుటవలన. అందువలన జ్ఞానముచే నజ్ఞానము నివర్తిల్లఁగా స్వస్వరూప మైన బ్రహ్మమునొంది యాబ్రహ్మమునుండి నివర్తిల్ల రనుట యుక్తము. ఇట్టి దైనను సుషుప్తినుండి యెట్లావృత్తి నొందుచున్న దనఁగాఁ జెప్పుచున్నాఁడు. మనష్షష్ఠాని = మన స్సాఱవదిగాఁ గలవానిని; ఇన్ద్రియాణి = శ్రోత్రత్వక్చక్షూరసనఘ్రాణము లను పేరు గల పంచేంద్రియములను, ఇంద్రునకు — ఆత్మకు విషయోపలబ్ధికరణంబు లగుటచే లింగము లైనవానిని; జాగ్రత్స్వప్నములయందు భోగము కలిగించుకర్మము క్షయించినపుడు; ప్రకృతిస్థాని = ప్రకృతియందు—అజ్ఞానమునందు సూక్ష్మరూపమున నున్న వానిని; వెండియు జాగ్రద్భోగము గలిగించుకర్మ ముదయించినపుడు భోగముకొఱకు, కర్షతి = కూర్మమంగములనువలె ప్రకృతినుండి — అజ్ఞానమునుండి యాకర్షించుచున్నది, విషయగ్రహణయోగ్యములుగా నావిర్భవింపఁ జేయుచున్న దని యర్థము. ఇందువలన జ్ఞానమువలన నావృత్తి లేక యున్నను అజ్ఞానమువలన నావృత్తి యనుపపన్నము కా దని భావము.

శ్రీ ఓయీ! నీధామము నొందినవారు నివర్తిల్ల రేని అప్పుడు "సతి సంపద్య న విదుః సతి సంపద్యామహే" అను శ్రుతివలన సుషుప్తిప్రలయసమయములందు త్వత్ప్రాప్తి యందఱికిం గలదు గాన నీకి నెవ్వఁడు సంసారి యని యాశంకించి సంసారిని బ్రదర్శించుచున్నాఁడు అయిదుశ్లోకములచేత.—మమైవ అంశః; ఎవ్వఁ డవిద్యచే, జీవభూతః; సనాతనః — ఎల్లప్పుడును సంసారి యని ప్రసిద్ధుఁడో; అతఁడు సుషుప్తిప్రలయములయందు, ప్రకృతిస్థాని=ప్రకృతియందు లీనములై యున్న వానిని; మనఃషష్ఠాని = మన స్సాఱవదిగాఁ గలవానిని; ఇన్ద్రియాణి; జీవలోకే = సంసారమునందు; భోగముకొఱకు కాకర్షించుచున్నాఁడు. ఇది కర్మేంద్రియములకును ప్రాణములకును ఉపలక్షణార్థము. ఇది భావము. సుషుప్తిప్రలయములయందును నాయంశము లగుటవలన సర్వజీవులకును నాయందు లయము గలుగుటచే మత్ప్రాప్తి గల దనుట సత్యమే. ఐనను అవిద్యచే నావృతుఁడై యనుశయసహితుఁడైనవానికి సప్రకృతికుఁడ నగు నాయందు లయ మగుంగాని శుద్ధునియందు లయము లేదు. అది చెప్పఁబడినది " అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవన్తి" ఇత్యాదిగా. అందువలన వెండియు సంసారమునకు నిర్గమించుచు నవిద్వాంసుఁడు

ప్రకృతియందు లీనములై యున్న స్వోపాధిభూతము లైన యింద్రియముల నాకర్షించు చున్నాఁడు. విద్వాంసునకో శుద్ధస్వరూపము నొందుటవలనఁ బునరావృత్తి లేదు.

ప. ఓయీ! సుషుప్తియందు సర్వజీవులకును బ్రహ్మప్రాప్తి యగుచుండఁగా. వారికిమాత్రము పునరావృత్తి యెందువలన నని యాశంకించి చెప్పుచున్నాఁ డిందు శ్లోకములచేత.—మమైవాంశః; ఎవ్వఁడవిద్యచే, జీవభూతః; సనాతనః = సదా సంసారి యని ప్రసిద్ధుఁడో యతఁడు, మనష్షష్ఠా నీంద్రియాణి — పంచజ్ఞానేంద్రియములను; సుషుప్తియందు, కర్షతి = ఆకర్షించుచున్నాఁడు. శ్రుతియును. "తాని యదా గృష్ణాత్యథ హైతత్స్వపితి నామ తద్గృహీత ఏవ ప్రాణో భవతి గృహీతా వాక్ గృహీతం చక్షుర్గృహీతగ్ శ్రోత్రమ్" ఇత్యాది. అర్థము స్పష్టము. ఎట్టి ఇంద్రియములను? ప్రకృతిస్థాని = ప్రకృతియం దున్నవానిని, లీన కుపాధు లైన వానిని. ఇది యర్థము. అవిద్యావృతుఁ డగుటచే సానుశయుం డగు జీవునకు సప్రకృతికుఁడ నగు నాయందు లయము, అందువలనఁ బునరావృత్తి. అవిద్యానాశము నొందినజీవునకు శుద్ధుఁడ నగు నాయందు లయము, అందువలన ముక్తి. "అవ్యక్తాద్వ్యక్తయ స్సర్వాః" ఇత్యాదిగా మున్నె చెప్పఁబడినది.

రా. ఇట్లు చెప్పినస్వరూపము గలవాఁడు సనాతనుఁడు నాయంశమే యగుచు ఒకానొకఁడు అనాదికర్మరూపావిద్యావృతుఁడై జీవభూతుఁడై జీవలోకము నందు వర్తించి దేవమనుష్యాదు లగు ప్రకృతిపరిణామవిశేషము లైన శరీరముల యందున్న మనష్షష్ఠము లగు నింద్రియముల నాకర్షించుచున్నాఁడు. మఱి యొకానొకఁడు పూర్వోక్తమార్గమున నీయవిద్యవలన ముక్తుఁడై స్వస్వరూపముతో నిలిచి యుండును. జీవభూతుఁడో మిక్కిలి సంకుచితము లైన జ్ఞానైశ్వర్యములు గలవాఁడై కర్మలబ్ధప్రకృతిపరిణామవిశేషము లైన శరీరములయం దున్న మనష్షష్ఠము లైన యింద్రియముల కీశ్వరుఁడై యాయింద్రియములను కర్మానుగుణముగా నీవల నావలకు నాకర్షించును.

మూ. *.

శరీరం యదవాప్నోతి యచ్చా ప్యుత్క్రామ తీశ్వరః
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధా నివా ఽఽశయాత్. ౮

* ఈ శ్లోకమున కీభాష్యము లేదు.

భా. ఏకాలమునందు ? యచ్చాపి=ఎప్పుడుగాని; ఈశ్వరః=దేహాది సంఘాతమునకు స్వామి యైనజీవుఁడు; ఉత్క్రామతి = శరీరమునుండి వెడలుచున్నాఁడో; అప్పు డాకర్షించుచున్నాఁ డని శ్లోకముయొక్క ద్వితీయపాదమున కర్థవశంబుచేఁ బ్రథమంబున నన్వయము. యత్ = ఎప్పుడు మఱి; పూర్వశరీరమునుండి, శరీరమ్ = మఱియొకశరీరమును; అవాప్నోతి=పొందుచున్నాఁడో; అప్పుడు, ఏతాని = ఈ మనష్షష్ఠము లైన యింద్రియములను; గృహీత్వా=తీసికొని; సంయాతి = చక్కఁగా పొందుచున్నాఁడు; దేనివలె ననఁగాఁ జెప్పుచున్నాఁడు. వాయుః = వాయువు; ఆశయాత్ = పుష్పాదికమునుండి; గన్ధానివ=గన్ధములనువలె.

దేహాదిసంఘాతమునకు ప్రభు వైనజీవుఁ డెప్పుడు దేహమును విడిచి వెడలుచున్నాఁడో అప్పుడు మనఃషష్ఠము లైన యింద్రియముల నాకర్షించు చున్నాఁడు. ఎప్పుడు మఱియొకశరీరమును పొందుచున్నాఁడో అప్పుడు వాయువు పుష్పాదులనుండి గంధములం గొనునట్లు ఆ మనష్షష్ఠము లైన యింద్రియములను దీసి కొని పొందుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. స్వస్థానములయందున్న యింద్రియములను జీవుఁ డాకర్షించుకాలము నడుగుచున్నాఁడు ఏకాలమునం దని. జీవునకే యుత్క్రాంతి గాని యీశ్వరునకు లే దని యాశంకించి యీశ్వరశబ్దార్థమును జెప్పుచున్నారు దేహా దీత్యాదిగా. అర్థవశం బుచే – గతి యుత్క్రాం త్యనంతరము కలుగునది యగుటవలన నని భావము.

పూ శరీరమ్; యత్ ; అవాప్నోతి = పొందుచున్నాఁడో; పొందినవాఁడై, యచ్చాపి = ఎప్పుడు మఱి; ఉత్క్రామతి = వెడలుచున్నాఁడో; ఈశ్వరః = పుర స్వామి యైనక్షేత్రజ్ఞుఁడు, అప్పు డీయింద్రియములను గ్రహించుకొని పోవుచున్నాఁ డు; వాయుః; ఆశయాత్ ; గన్ధా నివ.

శం. *

మ. ఏకాలమునం దాకర్షించుచున్నాఁ డనఁగాఁ జెప్పఁబడుచున్నది.— యత్ = ఎప్పుడు; ఈశ్వరః=దేహాదిసంఘాతమునకు స్వామి యైనజీవుఁడు; ఉత్క్రా మతి = వెలుపలకు వెడలుచున్నాఁడో; అప్పుడు ఏదేహమునుండి వెడలు చున్నాఁడో ఆదేహమునుండి మనష్షష్ఠము లైన యింద్రియముల నాకర్షించు

* ఈ శ్లోకమునకు గతశ్లోకముతోఁ జేర్చి వ్యాఖ్యానము చేయఁబడినది.

చున్నాఁడని ద్వితీయపాదమునకు మొదట నన్వయము, గమనం బుత్క్రమణా నంతరము కలుగునది యగుటవలన. ఆకర్షించుటమాత్రమే కాదు, మఱి యే మనఁగా.—యచ్చ = ఎప్పుడు మఱి; పూర్వశరీరమునుండి శరీరాంతరము నొందు చున్నాఁడో అప్పుడు, ఏతాని = ఈ మనష్షష్ఠము లైన యింద్రియములను; గృహీత్వా; సంయాత్యపి = చక్కగా—వెండియు నొందవలసినది లేనియట్లు పొందు చున్నాఁడు గూడ, శరీర ముండునపుడే యింద్రియగ్రహణమునందు దృష్టాంతము.— ఆశయాత్ = పుష్పాదిక మగు స్థానమునుండి; గన్ధాన్ = గంధాత్మకము లైన సూక్ష్మాం శములను; గ్రహించి యెట్లు వాయువు పొందుచున్నాఁడో అట్లు.

**శ్రీ.** వాని నాకర్షించి యేమి చేయుచున్నాఁ డనఁగాఁ జెప్పుచున్నాఁడు— యత్ = ఎప్పుడు; శరీరాంతరమును కర్మవశమున పొందుచున్నాఁడో; యచ్చాపి= ఏశరీరమునుండి; ఉత్క్రామతి = వెడలుచున్నాఁడో; ఈశ్వరః=దేహాదులకు స్వామి యైనజీవుఁడు; అప్పుడు పూర్వశరీరమునుండి వీని గ్రహించి యాశరీరాంతరమును చక్కగా నొందుచున్నాఁడు. శరీర మున్నపుడే యింద్రియగ్రహణమునందు దృష్టాం తము. ఆశయాత్ = గంధస్థాన మైన పుష్పాదికమునుండి; గన్ధాన్ = గంధవంతము లైన సూక్ష్మాంశములను; గ్రహించి యెట్లు వాయువు పొందుచున్నాఁడో అట్లు.

**ప.** ఎప్పుడు శరీరాంతరము నొందుటను దృష్టాంతముచేఁ జెప్పుచున్నాఁ డు.—యత్ = ఎప్పుడు; పూర్వశరీరమునుండి, ఉత్క్రామతి. మఱియు నెప్పుడు శరీరాంతరము నొందుచున్నాఁడో అప్పుడు, ఈశ్వరః = ఇంద్రియములను చలింపఁ జేయునట్టి యంతర్యామి; ఏతాని = ఈ యింద్రియములను; గ్రహించియే చక్కగా నొందుచున్నాఁడు. దేనివలె? ఆశయాత్ = గంధమునకు ఆశ్రయభూత మైన పుష్పా దికమునుండి; గన్ధాన్ = గంధవంతము లైన సూక్ష్మాంశములను; గ్రహించి వాయు వెట్లు పొందుచున్నాఁడో అట్లు శరీర మున్నను దానినుండి యర్థగ్రాహకములును అధ్యాత్మరూపములు నగు నింద్రియములను దీసికొని శరీరాంతరము నొందు చున్నాఁడు. ఆత్మయో సర్వత్ర వ్యాపకుఁడు కావున వానికి గమనాగమనములు సంభవింపవు, మ ఱే మనఁగా తదంశభూతసూక్ష్మభూతేంద్రియప్రాణావస్థాత్మక మగు లింగశరీరమే పోవుచున్నది వచ్చుచున్నది యని యర్థము.

**రా.** ఏశరీరము నొందుచున్నాఁడో ఏశరీరమునుండి యుత్క్రమించు చున్నాఁడో, అందు ఇంద్రియముల కీశ్వరుఁ డైన నితఁడు ఈయింద్రియములను

భూతసూక్ష్మములతోఁగూడ గ్రహించి కొనిపోవుచున్నాఁడు. వాయు ర్గన్ధానివాశ యాత్ =ఎట్లు వాయువు ప్రస్పందనకస్తూరికాదిస్థానమునుండి సూక్ష్మావయవములతోఁ గూడ గంధములను గ్రహించి యొండుచోటికిఁ బోవుచున్నాఁడో అట్లని యర్థము.

**మా.** కర్షతి అని చెప్పుటచే జీవునకు స్వాతంత్ర్యము తోఁచుచున్నది, దాని నివారించుచున్నాఁడు.—ఎప్పుడు జీవుఁడు శరీరము నొందుచున్నాఁడో ఉత్క్రమించుచున్నాఁడో అప్పుడు ఈశ్వరుఁ డీయింద్రియములను గ్రహించి కొనిపోవుచున్నాఁడు. "యత్ర యత్రచ సంయుక్తో ధాతా గర్భం పునః పునః । తత్ర తత్రైవ వసతి న యత్ర స్వయ మిచ్ఛతి" అని మోక్షధర్మమునందు. "భావాభావా వపి జానన్గరీయో జానామి శ్రేయో నతు తత్కరోమి। ఆశాసు హర్మ్యాసు ప్రాదాసు కుర్వ న్యథా నియుక్తో స్మి తథా వహామి" అనియు, "హత్వా జిత్వాపి మఘవన్యః కశ్చి త్పురుషాయతే। అకర్తా త్వేవ భవతి కర్తా త్వేవ కరోతి తత్" అనియు. "తద్యథా ఒనః సుసమాహిత ముత్సర్జ ద్యాయా దేవ మే వాయం శరీర ఆత్మా ప్రాజ్ఞేనా న్వారూఢ ఉత్సర్జద్యాతి" అనియును శ్రుతి. "వాఙ్మనసి సంపద్యతే మనః ప్రాణే ప్రాణ స్తేజసి తేజః పరస్యాం దేవతాయామ్" అనియును. గంధములవలె సూక్ష్మము లైనవానిని. వీనికిని భోగము సాధింపఁబడినది పూర్వము.

శ్రోత్రం చక్షుః స్పర్శనంచ రసనం ఘ్రాణ మేవచ
అధిష్ఠాయ మనశ్చా ఒయం విషయా నుపసేవతే. ౯

**భా.** అవి యేవి మఱి.—శ్రోత్రమ్ = శ్రవణమును; చక్షుః = నేత్రమును; స్పర్శనమ్ = త్వగింద్రియమును; రసనమ్ = జిహ్వను; ఘ్రాణ మేవచ = నాసికను; మనశ్చ = ఆఱవది యయినమనస్సును, ఒక్కొక యింద్రియముతోఁ గూడ; అధిష్ఠాయ = అధిష్ఠించి; దేహమునం దున్నవాఁడై; అయమ్=ఈ జీవుఁడు; విషయాన్ = శబ్దాదులను; ఉపసేవతే= సేవించుచున్నాఁడు.

శ్రోత్రాదు లగు నింద్రియములను వీనిలో నొక్కొకటితోఁ గలిసినమనస్సును అధిష్ఠించి దేహమునం దీజీవుఁడు శబ్దాదివిషయముల సేవించుచున్నాఁ డని తాత్పర్యము.

**ఆ.** మనష్షష్ఠము లైన యింద్రియములనే ప్రశ్నద్వారమున విశేషించి ప్రదర్శించుచున్నారు అవి యేవి ఇత్యాదిగా.

హ. అధిష్ఠాయ = ఆశ్రయించి. అయమ్=ఈ క్షేత్రజ్ఞుఁడు; విషయాన్ = శబ్దాదులను; ఉపసేవతే = ఎఱుంగుచున్నాఁడు.

శం. ఇంద్రియములను గ్రహించి శరీరాంతరము నొంది యం దేమి చేయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—శ్రోత్రమ్; చక్షుః; స్పర్శనంచ = త్వగింద్రియమును, చకారము సముచ్చయార్థకము; రసనమ్ = జిహ్వను; ఘ్రాణమేవచ; ఏవకారము అప్యర్థకము, చకారమువలన కర్మేంద్రియములను గూడ; మనః = ఆఱవది యైన యంతరింద్రియమును; చకారమువలన బుద్ధిని అహంకారమును; అధిష్ఠాయ=ఆశ్రయించి, భోగసాధనములుగాఁ జేసికొని; తాను, అయమ్=ఈ జీవుఁడు, క్షేత్రజ్ఞుఁ డైన యాత్మ; శరీరమునం దున్నవాఁడై, విషయాన్=శబ్దాదులను; ఉపసేవతే=ఎఱుంగుచున్నాఁడు, "ఏతస్మిన్ బుద్ధాన్తే రత్వా చరిత్వా దృష్ట్వైవ పుణ్యంచ పాపంచ" అను శ్రుతివలన ఇంద్రియార్థసన్నికర్షమువలన జనియించుచున్న పుణ్యపాపక్రియను ఇంద్రియములను అర్థములనుం జూచుచున్నాఁ డని యర్థము. ఇట "శరీరం యద వాప్నోతి యచ్చాప్యుత్క్రామతి" అని శరీరమునుండి యుత్క్రమణంబును తత్ప్రాప్తిని జెప్పుటచేత జీవుఁడు సూక్ష్మశరీరవిశిష్టుం డనియు హేయోపాదేయం బగు స్థూలశరీరముకన్న భిన్నుఁ డనియుఁ బ్రతిపాదింపఁబడినది. "మనః షష్ఠానీంద్రియాణి కర్షతి, గృహీత్వా సంయాతి" అనుటచేత గ్రాహ్యగ్రాహకములకు భేదము ప్రత్యక్ష మగుటవలన జీవుఁడు బుద్ధిమాత్రోపాధికుం డనియు ఇంద్రియములకన్నను మనస్సుకన్నను భిన్నుఁ డనియుఁ దెలుపఁబడినది. శ్రోత్రం చక్షు రిత్యాది శ్లోకముచే శ్రోత్రాదీంద్రియములను మనోబుద్ధులను సాధనములనుగాఁ జేసికొని విషయములఁ జూచుచున్నాఁ డని చెప్పుటం జేసి చూచువానికి సాధనములకన్నను చూడఁబడు వానికన్నను భేదము ప్రత్యక్ష మగుటవలన ఇంద్రియములకన్నను యింద్రియార్థములకన్నను మనోబుద్ధులకన్నను భోగాయతనం బగు దేహముకన్నను వ్యతిరిక్తుఁడే యని స్పష్టముగాఁ బ్రతిపాదింపఁబడినది. ఇందుచే "చక్షుషః సాక్షీ శ్రోత్రస్య సాక్షీ వాచః సాక్షీ మనసః సాక్షీ బుద్ధేః సాక్షీ ప్రాణస్య సాక్షీ తమసః సాక్షీ సర్వస్య సాక్షీ తతో ఽవిక్రియః" ఇత్యాది శ్రుత్యుక్తరీతిని ఆత్మ సర్వసాక్షియు నవిక్రియుఁడు ననునర్థము సూచిత మగుచున్నది.

మ. ఆ యింద్రియములనే ప్రదర్శించుచు దేనికొఱకు గ్రహించి కొనిపోవుచున్నాఁడో దానినే చెప్పుచున్నాఁడు.—శ్రోత్రం చక్షుః స్పర్శనంచ రసనం

ఘ్రాణ మేవచ, చకారమువలన కర్మేంద్రియములను ప్రాణమునుగూడ; మనశ్చ — ఆఱవదానిని; అధిష్ఠాయ = ఆశ్రయించియే; అయమ్ = ఈ జీవుఁడు; విషయాన్ = శబ్దాదులను; ఉపసేవతే = భుజించుచున్నాఁడు.

శ్రీ *

ప. ఇఁక శరీర మున్నప్పు డాత్మ విషయముల ననుభోగించువిధముఁ జెప్పుచున్నాఁడు.—అయమ్ = ఈ యాత్మ; మనః; అధిష్ఠాయ — తన కాశ్రయముగాఁ బ్రవర్తింపఁజేసి; ఆయావిషయముల గ్రహించునింద్రియములచే శబ్దాదివిషయములను, ఉపసేవతే = అహంకారాధ్యాసముచే సేవించుచున్నాఁడు. శ్రుతియును "అన్యత్ర మనా అభూవం నాదర్శ మన్యత్ర మనా అభూవం నా శ్రౌషమ్, మనసాహ్యేవ పశ్యతి మనసా శృణోతి" ఇత్యాది. అర్థము స్పష్టము.

రా. ఏవి మఱి యాయింద్రియము లనగాఁ జెప్పుచున్నాఁడు.—మనః షష్ఠము లైన ఈయింద్రియములను, అధిష్ఠాయ = తమతమవిషయముల నెఱుంగుటకనుగుణములనుగాఁ జేసికొని, ఆ శబ్దాదివిషయములను, ఉపసేవతే = ఉపభోగించుచున్నాఁడు.

మా ఇంద్రియద్వారమునఁగూడ నతఁడును భుజించుచున్నాఁడు. "తద్య ఇమే వీణాయాం గాయన్త్యే తం గాయన్తి" అనియు శ్రుతి. గుణాన్వితము నే భుజించుచున్నాఁడు, "సహ నైవ దేవా న్పాపం గచ్ఛతి" అను శ్రుతివలన.

ఉత్క్రామన్తం స్థితం వా ఽపి భుఞ్జానం వా గుణాన్వితమ్
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః. ౧౦

భా ఇట్లు దేహమునుండి దేహము నొందుచు, ఉత్క్రామన్తమ్ = పూర్వప్రాప్తమైనదేహమును విడుచుచున్నవానిని గాని; స్థితం వాపి = దేహమునం దున్నవానిని గాని; భుఞ్జానంవా = శబ్దాదుల ననుభవించుచున్నవానిని గాని; గుణాన్వితమ్ = సుఖదుఃఖమోహంబు లను గుణములతోఁ గూడినవానినిగాని; ఇట్టివాఁడై చక్కఁగాఁ జూడ నలవియైయున్నను ఈయాత్మను, విమూఢాః = దృష్టాదృష్టవిషయభోగవేగముచే నాకృష్టమైనమనస్సు గలవార లగుటచేత వివిధముగా మూఢు లైనవారు; నాను

* మధుసూదనీయముతో సమానము.

పశ్యన్తి=చూడరు! అక్కటా కష్టం బిది యని యనుక్రోశించుచున్నాఁడు భగవంతుఁడు. ఎవ్వరు మఱి, జ్ఞానచక్షుషః = ప్రమాణజనిత మైనజ్ఞాన దృష్టి గలవారో, వారు; ఈ యాత్మను, పశ్యన్తి = చూచుచున్నారు. జ్ఞానదృష్టి గలవా రనఁగా వివేకదృష్టి గలవా రని యర్థము.

ఇట్లు దేహమును విడిచి పోవునపుడు గాని మరల దేహము నొంది యున్నపుడు గాని శబ్దాదు లనుభవించునపుడు గాని సుఖదుఃఖమోహాదుల నొందునపుడు గాని యీయాత్మ తమస్వరూపమే యగుటచే స్పష్టముగా నెఱుంగఁ దగినవాఁడై యున్నను విషయభోగవశతచే బహువిధముగా మూఢులై యుండు వారు అక్కటా వీని నెఱుంగ కున్నారు వివేకదృష్టి గలవారుమాత్రమే యెఱుంగుదు రని తాత్పర్యము.

ఆ. శరీర మిత్యాదిశ్లోకమునందు దేహముకన్న నాత్మ యతిరిక్తుం డని ప్రతిపాదించి శ్రోత్రం చక్షు రిత్యాదిశ్లోకమునందు స్వేష్టవిషయమున యథా యోగ్యముగా నింద్రియప్రవర్తకుఁ డగుటవలన నాయింద్రియములకన్న నతిరిక్తుం డాత్మ యని చెప్పఁబడినది. అప్పుడు ఉత్క్రామన్త మిత్యాదికముఁ జేయునట్టి యీయాత్మ తమకు స్వరూప మయ్యె యుండఁగా వీని నందఱును జూడ రేల యని యాశంకించి చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. మిక్కిలి సన్నిహితుఁ డగుటచే నాత్మ దర్శన యోగ్యుఁడైనను విషయపారవశ్యమువలన నితని నందఱును జూడ లేకున్నా రని భగవంతుని యనుక్రోశముఁ జూపుచున్నారు ఇట్టివాఁడై ఇత్యాదిగా. అప్పు డెవ్వ రాత్మను జూతు రనఁగా దానిఁ జెప్పుచున్నారు ఎవ్వరు మఱి ఇత్యాదిగా.

హ. ఉత్క్రామన్తమ్ = శరీరమునుండి వెడలుచున్నవానిని; స్థితంవాపి = శరీరమునం దున్నవానినిగాని; భుఞ్జానంవా = విషయముల ననుభవించువానిని గాని; గుణాన్వితమ్=బుద్ధ్యాద్యాకారపరిణతము లగు సత్త్వరజస్తమోగుణములతోఁ గూడినవానినిగాని; విమూఢాః—కార్యకరణసంఘాతమునం దాత్మదృష్టి గలవారు; నానుపశ్యన్తి=ఎఱుంగరు. జ్ఞానమే చక్షువుగాఁ గలవారు జ్ఞానచక్షువులు, అట్టివారు మాత్ర మెఱుంగుదు రని యర్థము.

శం. ఇట్లు దేహేంద్రియమనోబుద్ధ్యాదులకన్న భిన్నుండును అవిక్రియుండును అకర్తయును అభోక్తయునై సర్వసాక్షియై యున్నస్వాత్మను మహాత్ము లగు బ్రహ్మవిదులు సర్వదా చూచుచుందురు, బ్రహ్మవిదులు కాని మూఢులు చూడఁజాల

రని చెప్పుచున్నాఁడు.—మొదటి వాశబ్ద మివార్థకము, రెండవది యప్యర్థకము. ఉపాధి యుత్క్రమించు చుండఁగా – భిక్షాదికార్యము నుద్దేశించి పోవుచుండఁగా "ధ్యాయతీవ లేలాయతీవ" అను న్యాయముచేత. తాను, ఉత్క్రామన్తమ్ = పోవుచున్న వానివలె కనఁబడుచున్న వానిని; నిలిచి యుండఁగా, స్థితమ్=నిలిచి యున్న వానివలెను; భుజించుచుండఁగాఁ గూడ, భుంజానమ్=భుజించుచున్న వానివలెను;గుణాన్వితమై – సత్త్వాదిగుణవికారము లైన సుఖదుఃఖకామక్రోధమోహభయాదులతోఁ గూడియుండఁగా, గుణాన్వితమ్ = తానును సుఖదుఃఖకామక్రోధమోహభయాదులతోఁ గూడియున్న వానివలెఁ దోఁచుచున్న వానిని; స్వభావంబున నిష్కలుఁడు నిష్క్రియుఁడు నిర్వికారుఁడు నిర్వికల్పుఁడు చిదేకరసుఁడు ఆనందఘనుఁ డైనస్వాత్మను అవిక్రియునిగానే, జ్ఞానచక్షుషః=జ్ఞాన మనఁగా ప్రత్యగ్భావము నొందిన శుద్ధబుద్ధివృత్తి, అదియే రూపాదిగ్రహణమునందు నేత్రమువలె స్వరూపగ్రహణమునందు నేత్రముగాఁ గలవారు, శుద్ధాత్ము లగు యతులు; పశ్యన్తి = ఆహారాదిసర్వకర్మముల యందును సర్వదా స్వాత్మను నిష్కలునిగా నిష్క్రియునిగా నిత్యశుద్ధునిగా సర్వోపాధివినిర్ముక్తునిగా పరిపూర్ణునిగానే చూచుచున్నా రని యర్థము. విమూఢాః = దృష్టాదృష్టము లగు విషయములయందలి యాశకు లోనైన మనస్సు గలవారు మూర్ఖులు బహిర్ముఖులు; సదసద్వివేకవైరాగ్యసన్న్యాసశమదమాదిసాధనములును తీవ్రమోక్షేచ్ఛయుఁ గలిగి సద్గురుసమాశ్రయణముచే సమ్యక్జ్ఞానము సంపాదింపని వార లగుటవలన, నేనే ఇది యంతయు నని స్వాత్మస్వరూపమును, నానుపశ్యన్తి= మహావాక్యార్థమున కనురూపముగా నెఱుఁగరు. మఱి యే మనఁగా, నేను కర్తను భోక్తను సుఖిని దుఃఖిని హతుఁడను మరణము నొందుచున్నాను నాది యిది నష్టమనియే యాత్మను సంసారినిగాఁ జూచుచుందు రని యర్థము.

మ. ఇట్లు దేహగతుఁడై దర్శనయోగ్యుఁ డైనను దేహమునుండి, ఉత్క్రామన్తమ్ = దేహాంతరము నొందుచున్న వానిని; స్థితంవాపి=ఆదేహమునందే యున్న వానిని గాని; భుంజానంవా = శబ్దాదివిషయముల ననుభవించుచున్న వానిని గాని; గుణాన్వితమ్ = సుఖదుఃఖమోహాత్మకము లగు గుణములతోఁ గూడినవానిని గాని; ఇట్లు సర్వావస్థలయందును దర్శనయోగ్యునిగూడ వీనిని, విమూఢాః = దృష్టాదృష్ట విషయభోగవాసనచే నాకృష్టమైనమనస్సు గలవార లై యాత్మానాత్మవివేకము లేని వారలు; నానుపశ్యన్తి. అహో! కష్టం బని యను క్రోశించుచున్నాఁడు భగవంతుఁడు. ఎవ్వరు మఱి ప్రమాణజనిత మైన జ్ఞాన మను నేత్రము గలవారలో వారుమాత్రమే యెఱుంగుదురు.

శ్రీ. ఓయీ! కార్యకరణసంఘాతమునుండి వివేచించి యిట్టి యాత్మను సర్వజనులును ఎందువలన నెఱుంగరనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఉత్క్రామన్తమ్=దేహమునుండి దేహాంతరము నొందుచున్నవానినిగాని; స్థితంవాపి=దేహమునందే యున్నవానినిగాని; భుంజానంవా = విషయములను భుజించుచున్నవానినిగాని; గుణాన్వితమ్ = ఇంద్రియాదులతోఁ గూడినవానినిగాని; జీవుని, విమూఢాః; నానుపశ్యన్తి=ఎఱుంగరు. జ్ఞానదృష్టి గల వివేకు లెఱుంగుదురు.

ప. ఇఁక దీనినే ప్రకటించుటకై చెప్పుచున్నాఁడు.—విమూఢులు ప్రాయికముగా పరమాత్మను నాశము నొందినట్లు తలంతురు. అట్లు కాదేని, ఉత్క్రామన్తమ్ = దేహము విడిచి పోవువానిగాఁ దలంతురు. అది చెప్పఁబడినది "హృదయాకాశమాత్రస్య వినాశే దేహనాశతః। వ్యర్థం భూతాని శోచన్తి నష్ట ఆత్మేతి శంకయా" * అని. అట్లు, దేహాకారమున నున్నవానిగాను భుంజానునిగాను గుణాన్వితునిగాను జూతురు. నానుపశ్యన్తి = తత్త్వమున కనురూపముగాఁ జూడరు. ఇఁక, జ్ఞానరూప మైనచక్షువు గలవారు తత్త్వదర్శులు లింగదేహావృతుఁడై యుత్క్రమించుచున్నయాత్మను ఒకగృహమునుండి గృహాంతరమునకుఁ గొనిపోవుఘటమునందున్నతదావృతాకాశమునువలెఁ జూతురు, అట్లు దేహమున నున్నవానిని తిరుగుచున్నకులాలచక్రమునందలి కీలకమునువలెఁ జూతురు, అట్లు ప్రతిమారూపు లగు దేవతలకుఁ జూపఁబడునై వేద్యమునువలె భుంజానునిం జూతురు, అట్లు స్ఫటికోదరమునందుఁ బ్రతిఫలించిన జపాకుసుమముయొక్క యెఱ్ఱఁదనమునువలె గుణాన్వితుం జూతురు. ఉత్క్రాన్తియం దాత్మ వ్యాపకుఁ డగుటవలన వానికి గమనాగమనములు సంభవింప వని, మ త్తే మనఁగా లింగదేహాధిష్ఠిత మగు మనస్సే గమనము చేయు నని మున్నే వ్యాఖ్యాత మైనది. శ్రుతియును. "యత్తే యమం వైవస్వతం మనో జగామ దూరకమ్। తత ఆవర్తయామసీహ క్షయాయ జీవసే" అని. భాష్యము.—మున్ను సనాతి యను రాజునకు సుబంధ్వాదులు సహోదరులు నలుగురు పురోహితు లుండిరి. అందు సుబంధువు కొందఱు శత్రువు లగు విప్రులచేత నాభిచారికమున హతుఁ డయ్యెను. తక్కిన మువ్వురును వాని బ్రతికించుటకై యీమంత్రమును బఠించుచున్నారు. ఓ సుబంధూ! తే = నీయొక్క; యత్ మనః = ఏమనస్సు; దూరకమ్ = దూర మగునట్లు; వైవస్వతమ్ = సూర్యపుత్త్రుఁ

* దేహనాశమువలన హృదయాకాశమాత్రమునకే నాశము కలుగుచుండఁగా ఆత్మ నశించె నను శంకచే వ్యర్థముగాఁ బ్రాణులు శోకించెదరు.

దైన; యమమ్ = యముని గూర్చి; జగామ=పోయెనో; ఆ నీమనస్సును, ఇహ = ఈ మృతశరీరమునందు; ఆవర్తయామసి=వెండియు రావించెదము. ఏప్రయోజనము కొఱకు? క్షయాయ=మరల నిక్కడ వసించుకొఱకు; జీవసే=చిరకాలము జీవించుకొఱకును.

రా. ఇట్లు, గుణాన్వితమ్=సత్త్వాదిగుణమయ మైన ప్రకృతియొక్క పరిణామ విశేషము లగు మనుష్యత్వాద్యాకారము లైన పిండములతోఁ జేరియున్నవానిని; పిండవిశేషమునుండి యుత్క్రమించుచున్నవానిని గాని, పిండవిశేషమునం దున్నవానినిగాని, గుణమయము లగు విషయములను భుజించుచున్నవానినిగాని, ఒకప్పుడును ప్రకృతిపరిణామవిశేష మైన మనుష్యత్వాదిపిండములకంటె విలక్షణుని గాను, జ్ఞానైక స్వరూపునిగాను, విమూఢానానుపశ్యన్తి=విమూఢు లెఱుంగరు, విమూఢు లనఁగా మనుష్యత్వాదిపిండమునందు ఆత్మాభిమానము గలవారు. జ్ఞానచక్షుషః = పిండాత్మ వివేకవిషయ మైనజ్ఞానము గలవారుమాత్రము; సర్వావస్థలయం దున్నను వీనిని వివేచింపఁబడినయాకారము గలవానినిగానే, పశ్యన్తి = చూతురు.

మా. అట్లైనయెడ ఎందుచేతనఁ గానఁబడఁడు అనఁగా చెప్పుచున్నాఁడు.

యతన్తో యోగినశ్చైనం పశ్య న్త్యాత్మ న్యవస్థితమ్
యతన్తో ఽప్యకృతాత్మానో నైనం పశ్య న్త్యచేతసః. ౧౧

భా. కొందఱుమాత్రము, యతన్తః = ప్రయత్నము చేయుచున్నవారును; యోగినశ్చ = సమాహితచిత్తులు నగువారు; ఏనమ్ = ఈ యాత్మను; ఆత్మని = తమబుద్ధియందు; అవస్థితమ్=ఉన్నవానిని; పశ్యన్తి= ఇతఁడే నేనని యెఱుంగుచున్నారు. యతన్తోపి = శాస్త్రాదిప్రమాణముల చేత యత్నము చేయుచున్నవారైనను; అకృతాత్మానః=తపస్సుచేతను ఇంద్రియజయముచేతను సంస్కృతము కాని చిత్తము గలవారు, దుశ్చరితమునుండి యుపరతిఁ జెందనివారు దర్పము శమింపనిమనస్సు గలవారు; అచేతసః = అవివేకులు; ఇట్టివారు ప్రయత్నము చేసినను; ఏనమ్ = ఈ యాత్మను; నపశ్యన్తి = చూడరు.

సమాహిత మైనచిత్తము గలిగి శ్రవణాదికము చేయునట్టివారుమాత్రమే తమబుద్ధియందున్న యీయాత్మను ఇతఁడే నేనని స్వస్వరూపంబున నెఱుంగుదురు.

తపస్సుచేతను ఇంద్రియజయముచేతను చిత్తసంస్కారము నొందనియవివేకులు శ్రవణాదికముఁ జేసినను ఈయాత్మ నెఱుఁగఁజాల రని తాత్పర్యము.

ఆ. జ్ఞానచక్షుఃశబ్దముచేత న్యాయానుగృహీత మైనశాస్త్రము జ్ఞానమునకు సాధన మని చెప్పఁబడినది. ఇప్పుడు న్యాయానుగృహీత మగుశాస్త్రమాత్రముచేతనే ఆత్మజ్ఞానము సిద్ధించునా? అనఁగా సిద్ధింప దని చెప్పుచున్నారు కొందఱు ఇత్యాదిగా. ప్రయత్నము శ్రవణమననరూపము. అకృతాత్మత్వమును వివరించుచున్నారు తపస్సుచేతను ఇత్యాదిగా. దుశ్చరితమునుండి అనుపరతిఫలమును జెప్పుచున్నారు దర్పము ఇత్యాదిగా. అశుద్ధబుద్ధులును అవివేకులు నగువారికి శ్రవణాదికము సిద్ధించినను అది ఫలవంతము కా దని తలఁచి చెప్పుచున్నారు ఇట్టివారు ఇత్యాదిగా.

హ. యతన్తః = యమనియమాద్యనుష్ఠానముచేత ప్రయత్నము చేయుచున్న; యోగినః=యోగ మనఁగా సమ్యక్‌జ్ఞానము, దానియందు ప్రవృత్తు లైనవారు; ఏనమ్ = ఈ యాత్మను; పశ్యన్తి = చూచుచున్నారు; ఆత్మని=శరీరమునందు. యతన్తోపి = యోగానుష్ఠానముచేతఁ బ్రయత్నము చేయువా రైనను; అకృతాత్మానః = అభ్యాసవైరాగ్యములచే సంస్కృతము కాని చిత్తము గలవారు; అచేతసః = అవివేకులు; ఏనమ్; నపశ్యన్తి.

శం. కేయూ! ఎవ్వరు మఱి సంసిద్ధులును సమ్యక్‌జ్ఞానులును శుద్ధాత్ములు నగుదురో వారు మాత్రమే సర్వోపాధివినిర్ముక్తుఁ డైన యాత్మ నెఱుంగుదురు, ఇతరు లెఱుంగఁజాల రని యాశంకింపఁగా, అట్లు కాదు, ఎవ్వరు నాప్రసాదము నొంది యతులును యోగనిష్ఠులు నగుదురో వారును ఆత్మ నెఱుంగుదురు. తద్విలక్షణులుమాత్ర మెఱుఁగఁజాల రని చెప్పుచున్నాఁడు.—శాస్త్రాచార్యాత్మేశ్వరప్రసాదసంపన్ను లై సదసద్వివేకము తీవ్రవైరాగ్యము శమదమాదికము మొదలగు సాధనముల నొంది, యతన్తః — శ్రవణమననాదులచేత జ్ఞానసిద్ధికొఱకు యత్నము చేయుచు; అందుచేత జ్ఞానము నొందినట్టి యతు లెవ్వరు, యోగినః=యోగు లగుదురో, "లక్ష్యైకతాం సమాసాద్య నిర్వికారత యాత్మని । మనసో నిశ్చలత్వేన స్థితిర్యోగ ఇతీర్యతే" అని చెప్పినచొప్పున తీవ్రమోక్షేచ్ఛావైరాగ్యములచేత బహిస్సంగవిముఖ మైనచిత్తమున కాత్మయందు నిర్వికారతచే స్థితి యోగ మనఁబడును, అది గలవారు యోగులు, స్వాత్మయందే నిలిచినచిత్తము గలవా రగుదురో; వారు గూడ, ఆత్మని = బుద్ధియందు; అవస్థితమ్ = ఉన్నట్టి, బుద్ధ్యాదిప్రకాశకుఁ డైన; ఏనమ్ = ఈ

యాత్మను; పశ్యన్తి=ఎఱుంగుచున్నారు, ఇతఁడే నేనని స్వస్వరూపమున సాక్షాత్కరించి తన్ను అకర్తను అభోక్తను అసంసారిని గానే ఎఱుంగుచున్నా రని యర్థము. నాత్మప్రసాదము నొందనివారు, యతన్తోపి=శ్రవణమననాదులచే నాత్మసాక్షాత్కారము కొఱకు బహువిధములఁ బ్రయత్నము చేయుచున్నను, వినుచును, వినిపించుచునున్నను; అకృతాత్మానః=అకృతము – విషయకర్మశాస్త్రాదివిషయము లైన బాహ్యవాసన లుండుటవలన వశీకృతము కానిది, వెలుపలికే ప్రవహించుచుండునది, అట్టి యాత్మ – చిత్తము గలవారు అకృతాత్ములు, అవిద్యాస్మితారాగద్వేషాభినివేశములు గలవారు; అందువలననే, అచేతసః=వివేకశూన్యులు బహిర్ముఖులు; నపశ్యన్తి–ఇతఁడే నే నని నిర్విశేషపరబ్రహ్మమును స్వాత్మనుగా నెఱుంగఁజాల రని యర్థము.

మ పశ్యన్తి జ్ఞానచక్షుషః అనుదానిని వివరించుచున్నాఁడు.—ఆత్మని=స్వబుద్ధియందు; అవస్థితమ్ = ప్రతిఫలించియున్న; ఏనమ్=ఈయాత్మను; యతన్తః=ధ్యానాదులచేఁ బ్రయత్నించుచున్న; యోగినః = యోగులుమాత్రమే; పశ్యన్తి. చకార మవధారణార్థకము. యత్నించినను, అకృతాత్మానః=యజ్ఞాదులచే శుద్ధముగాఁ జేయఁబడని యంతఃకరణము గలవారు; అందువలననే, అచేతసః=వివేకశూన్యులు; ఏనమ్; నపశ్యన్తి. ఇది విమూఢా నానుపశ్యన్తి యనుదానికి వివరణము.

శ్రీ. ఈ యాత్మ దుర్జ్ఞేయుఁడు, ఎందువలన ననఁగా వివేకులయందుఁగూడ కొందఱుమాత్రమే యెఱుంగుదురు కొంద ఱెఱుంగ రని చెప్పుచున్నాఁడు.— యతన్తః = ధ్యానాదులచే యత్నించువారు; యోగినః; కొందఱు, ఏనమ్ = ఈ యాత్మను; ఆత్మని = దేహమునందు; అవస్థితమ్=ఉన్నవానిని; పశ్యన్తి = వివేచించి యెఱుంగుదురు. శాస్త్రాభ్యాసాదులచేఁ బ్రయత్నముఁ జేయుచున్నను, అకృతాత్మానః = అశుద్ధ మైనచిత్తము గలవారు; కావుననే, అచేతసః = మందబుద్ధులు; ఏనమ్; నపశ్యన్తి.

ప. ఇఁక జ్ఞానచక్షువులును రెండువిధములు, అనుభవము గలవా రనియు శాస్త్రజ్ఞానము గలవా రనియు నని చెప్పుచున్నాఁడు.—స్వరూపప్రాప్తికొఱకు, యతన్తః= ప్రయత్నము చేయునట్టి; యోగినః; ఏనమ్ = ఈయాత్మను; ఆత్మని=దేహమునందలి హృదయాకాశమునందు; అవస్థితమ్; పశ్యన్తి. అట్లు, అకృతాత్మానః = తత్త్వార్థము తెలియనివారు; కావుననే, అచేతసః = అల్పబుద్ధులు; శాస్త్రపఠనాద్యుపాయములచేత, యతన్తోపి; ఏనమ్; నపశ్యన్తి.

**రా.** నన్ను బ్రపన్నులై కర్మయోగాదుల యత్నముం జేయునట్టి యోగులు యోగాఖ్యంబగు నేత్రముచేత శరీరమునం దున్నవాఁడైనను శరీరమునుండి విముక్తుఁడై స్వరూపంబున నున్న యాత్మను జూతురు. యత్నము చేయువారైనను అకృతాత్మలు – మత్ప్రపత్తి లేనివారలును. కావుననే సంస్కృతము కానిమనస్సు గలవారలును, అందువలనన్, అచేతసులు—ఆత్మను జూచుటకు సమర్థమైనచిత్తము లేనివారు, ఏనమ్ నపశ్యన్తి – ఈయాత్మను జూడఁజాలరు.

**మా.** యతన్తః—జ్ఞానము నొంది, అకృతాత్మానః=అశుద్ధమైనబుద్ధిగలవారు.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్. ౧౨

**భా.** ఏపదమును సర్వప్రకాశకమయ్యును అగ్న్యాదిత్యాది జ్యోతి ప్రకాశింపఁజేయదో, ఏపదము నొందినవారు వెండియు సంసారాభిముఖులై నివర్తిల్లరో, మఱియు నేపదంబునకే యుపాధిభేదవశగతులైన జీవులు మహాకాశమునకు ఘటాకాశాదులుంబోలె నంశములో, ఆపదమె సర్వాత్మయనియు సర్వవ్యవహారాస్పదమనియు వచింపఁగోరినవాఁడై నాలుగుశ్లోకములచే విభూతిసంక్షేపమును జెప్పుచున్నాఁడు భగవంతుఁడు.—యత్ = ఏది; ఆదిత్యగతమ్ = సూర్యుని పొందినట్టి; తేజః = దీప్తి, ప్రకాశము; జగత్ = లోకమును; అఖిలమ్=సమస్తమును; భాసయతే = ప్రకాశింపఁజేయుచున్నదో; యత్ =ఏది; చన్ద్రమసి=చంద్రునియందు; అట్టి ప్రకాశకమైన తేజస్సు గలదో; యచ్చ = మఱియు నేది; అగ్నౌ = అగ్నియందు; అట్టి తేజస్సు గలదో; తత్ తేజః=ఆ తేజస్సును; మామకమ్=నాదిగా; విద్ధి=ఎఱుంగుము. అది యంతయు నాయొక్క—విష్ణువుయొక్క—జ్యోతి. లేక. యత్; ఆదిత్యగతమ్; తేజః=చైతన్యాత్మకమైనజ్యోతి గలదో; యత్ చన్ద్రమసి; చంద్రునియం దేచైతన్యాత్మకమైనజ్యోతి గలదో; యచ్చ అగ్నౌ = అగ్నియందు నేచైతన్యాత్మకమైనజ్యోతి గలదో; తత్ తేజః మామకం విద్ధి = ఆ చైతన్యాత్మకమైన జ్యోతి నాది – విష్ణువుది అని యెఱుంగుము. ఓయీ! స్థావరములయందును జంగమములయందును ఆ చైతన్యాత్మకమైనజ్యోతి సమానముగా

నున్నది, అంతుయ దాదిత్యగత మిత్యాదిగా విశేషణం బెట్లు చేయ వచ్చును ? ఇది దోషము కాదు, సత్త్వాధిక్యమువలన నాధిక్యము సంభవించుటవలన. ఆదిత్యాదులయందుఁ గదా అత్యంతప్రకాశము అత్యంత భాస్వర మగుసత్త్వము గలదు, అందువలన వానియందే జ్యోతి మిక్కిలి యావిర్భవించి యున్నది కావున నివిశేషణము, కాని వానియం దది యధిక మని కాదు. ఎట్లు లోకమున ముఖసంస్థానము సమానమై యున్నను కాష్ఠకుడ్యాదులయందు ముఖ మావిర్భవింపదో ఆదర్శాదుల యం దైననో స్వచ్ఛమునందును స్వచ్ఛతరమునందును దారతమ్యంబున నావిర్భవించుచున్నదో అట్లు.

సూర్యచంద్రాగ్నులయం దున్న యే తేజస్సు సమస్తలోకములఁ బ్రకాశింపఁజేయుచున్నదో ఆ తేజస్సు నాది యని యెఱుంగుము. లేక, సూర్యచంద్రాగ్నులయం దున్న యే చైతన్యజ్యోతి లోకమును ప్రకాశింపఁజేయుచున్నదో ఆచైతన్యజ్యోతి నాది యని తాత్పర్యము.

టీ. మీఁది నాలుగుశ్లోకములకుఁ జెప్పినదాని ననువదించుచుఁ దాత్పర్యము చెప్పుచున్నారు ఏపదమును ఇత్యాదిగా.—జీవాత్మ యగుటచే చిద్రూపం బని చెప్పి బ్రహ్మచైతన్యముచేతనే యాదిత్యాదులు ప్రకాశకము లగుటవలనఁగూడ బ్రహ్మము చిద్రూపం బని చెప్పఁబడుచున్నది యీశ్లోకముచేత. చిద్రూప మైన బ్రహ్మమే సర్వాత్మకం బని ప్రతిపాదనపరముగా శ్లోకమునకు వ్యాఖ్యానము చేయుచున్నారు యత్ ఇత్యాదిగా. ఆదిత్యాదులయందు అచ్చటచ్చట నున్న బ్రహ్మచైతన్యజ్యోతి సర్వప్రకాశకం బని యర్థము. బ్రహ్మము సర్వజ్ఞం బగుటచే చిద్రూపం బనుట యుట వివక్షిత మని వ్యాఖ్యానాంతరము చేయుచున్నారు లేక ఇత్యాదిగా. చైతన్యజ్యోతి సర్వత్ర సమానం బగుటవలన నాదిత్యాదిగతం బని దానికి విశేషణము చేయుట యనుచితం బని శంకించుచున్నారు ఓయీ ఇత్యాదిగా. సర్వత్ర యున్నను ఒకానొకచోటనే విశేషమున నభివ్యక్త మగుటవలన విశేషణం బుచిత మని పరిహరించుచున్నారు ఇది దోషము కా దని. దానినే ప్రపంచించుచున్నారు ఆదిత్యాదులయందు ఇత్యాదిగా. చైతన్యజ్యోతి సర్వత్ర సమానం బైనను ఒకానొకచోటనే యభివ్యక్త మగుటవలన విశేషణం బుపపన్న మగుటను దృష్టాంతముచే స్పష్టీకరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా.

హ. అందువలన అజ్ఞానచక్షుస్సులు యత్నించినను ఈయాత్మ నెఱుంగఁ జాలరు, నేనే యాత్మను అనేకయత్నములచేతను ఆత్మసంస్కారముచేతను సాధ్యుఁడ నగుటవలన దుర్విజ్ఞేయుఁడను, అయినను సకలలోకప్రసిద్ధుఁడ నే నని చెప్పుచున్నాఁడు.—యత్ ఆదిత్యగతమ్; తేజః = ప్రకాశము; అఖిలం జగత్ భాసయతే; యత్ చన్ద్రమసి; యచ్చ అగ్నౌ; తత్ తేజః మామకం విద్ధి; అట్లు శ్రుతి. “యేన సూర్య స్తపతి తేజసేద్ధః, త దహం జ్యోతిః” అని.

శం. ఎందువలన అకృతాత్ములు యత్నించినను వారికి నాప్రసాదము లేమివలన నాత్మసాక్షాత్కారము కలుగదో అందువలన ముముక్షువు నాప్రసాదము నొందుటకై న న్నవశ్య ముపాసింపవలయును. సర్వమునందును నేనే యనుబుద్ధి నుంచి న న్నుపాసించువారలకు రాగాదిదోషములు కలుగవు, అందుచే చిత్తప్రసాదంబును జ్ఞానంబును సిద్ధించు నని బోధించుటకై తాను సర్వాత్ముఁ డని ప్రతిపాదించుచున్నాఁడు నాలుగుశ్లోకములచేత.—ఆదిత్యగతమ్ - ఆదిత్యుని వెలుపలను లోపలను అంతటను వ్యాపించియున్నట్టి; యత్ తేజః; అఖిలంజగత్ భాసయతే; అట్లు, యత్ చన్ద్రమసి; తేజస్సు జగమును భాసింపఁజేయుచున్నదో; అట్లు, అగ్నియందే తేజస్సు జగత్తును భాసింపఁజేయుచున్నదో; తత్ తేజః మామకం విద్ధి “య దగ్నే రోహితం రూపమ్” అను న్యాయముచేత నాదిత్యాదులకు తేజస్సు దక్క వేఱు స్వరూపము లేమివలన అవి తేజోమాత్రములే యని సిద్ధము. సూర్యచంద్రాగ్న్యాశ్రితమైన తేజస్సు నాది యనుచో రాహువుయొక్క శిరస్సు అనునట్లు మచ్ఛబ్దార్థమునకును తేజశ్శబ్దార్థమునకును అభేదము గ్రహింపవలయును. నావిభూతు లగుటవలన సూర్యచంద్రాదులు నేనే యనియు అందు మద్బుద్ధి నుంపవలయు ననియు బోధిత మగుచున్నది.

మ. ఇప్పుడు, సమస్తమును ప్రకాశింపఁజేయుసమర్థులైనను ఆదిత్యాదు లేపదమును ప్రకాశింపఁజేయ సమర్థులు కారో ఏపదమును జెందినట్టి ముముక్షువులు వెండియు సంసారమునకు మరలరో ఏపదమునకే యుపాధిభేదవశగతులైన జీవులు ఘటాకాశాదులాకాశమునకుఁ బోలెఁ గల్పితాంశభూతులై మృషాసంసారమునే యనుభవించుచున్నారో ఆపదమే సర్వాత్మకం బనియు సర్వవ్యవహారాస్పదం బనియుఁ బ్రదర్శించుటచేత బ్రహ్మణోహి ప్రతిష్ఠాహ మ్మని పూర్వోక్తమైనదాని వివరించుటకై నాలుగుశ్లోకములచేఁ దన విభూతిసంక్షేపముఁ జెప్పుచున్నాఁడు భగవంతుఁడు.—“న తత్ర సూర్యో భాతి నచన్ద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతో”

ఉయ మగ్నిః” అను శ్రుతి పూర్వార్ధము వ్యాఖ్యాత మయ్యెను న త ద్భాసయతే సూర్యః అను శ్లోకముచేత. “త మేవ భాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి” అను తదుత్తరార్ధ మీశ్లోకముచే వ్యాఖ్యాత మగుచున్నది. యత్ ఆదిత్యగతమ్; తేజః=చైతన్యాత్మక మగుజ్యోతి; యత్ చన్ద్రమసి; యచ్చ అగ్నౌ; ఉన్నట్టి తేజస్సు; అఖిలం జగత్ భాసయతే; తత్ తేజః మామకం విద్ధి. స్థావరజంగమములయందు చైతన్యాత్మకజ్యోతి సమానమే యైనను సత్త్వోత్కర్షముచే నాదిత్యాదులయం దుత్కర్ష ముండుటవలన అందే చైతన్యజ్యోతి మిక్కిలి యావిర్భవించుచున్నది. కావున య దాదిత్యగత మిత్యాదిగా జ్యోతికి విశేషణము చేయఁబడినది. ఎట్లు ముఖసన్నిధానము సమాన మైనను కాష్ఠకుడ్యాదులయందు ముఖ మావిర్భవింపదో దర్పణాదులయందుమాత్రము స్వచ్ఛమునందును స్వచ్ఛతరమునందును తారతమ్యంబున నావిర్భవించుచున్నదో అట్లు. య దాదిత్యగతం తేజః అని చెప్పి వెండియు త త్తేజో విద్ధి మామక మ్మని తేజశ్శబ్దము చెప్పుటవలన, యత్ ఆదిత్యగతమ్; తేజః – ప్రకాశము, పరప్రకాశసమర్థమును ధవలభాస్వరంబును నగురూపము, అఖిలంజగత్ –రూపవంత మైన వస్తువును సమస్తమును, ప్రకాశింపఁజేయుచున్నదో; ఇట్లు, యత్ చన్ద్రమసి యచ్చఅగ్నౌ–జగత్ప్రకాశక మైన తేజస్సు గలదో, తత్ జః మామకం విద్ధి అని విభూతికథనముకొఱకు రెండవయర్థముగూడ గ్రహింపవలయును. కానిచో వెండియు తేజశ్శబ్దము చెప్పకయే తన్మామకం విద్ధి యని మాత్రమే చెప్పునని భావము.

శ్రీ. ఇట్లు న త ద్భాసయతే సూర్య ఇత్యాదిగా పారమేశ్వర మగు పరమధామము చెప్పఁబడినది. దానిఁ జెందినవారి కపునరావృత్తియు ప్రతిపాదింపఁబడినది. అందు సంసారియె సంభవింపఁ డని యాశంకించి దేహాదివ్యతిరిక్త మైన సంసారిస్వరూపము ప్రదర్శింపఁబడినది. ఇప్పుడు ఆపారమేశ్వరరూపమునే యనంత శక్తియుక్తమునుగా నిరూపించుచున్నాఁడు నాలుగుశ్లోకములచేత.–ఆదిత్యాదులయం దున్నదై యనేకవిధ మైనతేజ స్సేది విశ్వమును ప్రకాశింపఁజేయుచున్నదో అది యంతయు నాదియే యని యెఱుంగుము.

ప. ఇఁక “న త ద్భాసయతే సూర్యః” ఇత్యాదిగా ఆదిత్యాదివిభూతులుగూడ ప్రమాణాంతరాగోచరుఁ డైన యాత్మను ప్రదర్శింపఁజాల వని చెప్పఁబడినది. ఇఁక శాస్త్రాభ్యాసప్రయత్నము ప్రదర్శింపఁజాల దని చెప్పవలయునా? అని సూచించుచు సూర్యాదులు తనచేతనే ప్రకాశ్యు లనియు తనచే నియ్యఁబడినసామ

ర్థ్యము గలవారనియు నిరూపించుటకై చెప్పుచున్నాఁడు.—పగలు త్రైలోక్యమును ప్రకాశింపఁజేయునట్టి యాదిత్యగత మైనతేజస్సేది గలదో, అట్లు రాత్రి చంద్రుని యందు చంద్రికారూపమై యగ్నియందు దీపరూపమై యుండు తేజస్సేది గలదో, అది, మామకమ్ = నాది యని; విద్ధి = ఎఱుంగుము, “యో సా వాదిత్యః పురుష స్సో సా వహమ్” అనుశ్రుతివలన. శ్రుతిగీయకిమునందును “యాస్తే అగ్నే సూర్యే రుచ ఉద్యతో దివ మాతన్వన్తి రశ్మిభిః । తాభి స్సర్వాభి రుచే జనాయ న స్కృధి” అని. భాష్యము. అగ్నే – ఓసర్వేశ్వరుఁడా ! ఉద్యతః = ఎల్లప్పుడు నుద యించుచున్న; తే = నీయొక్క; యాఃరుచః = ఏదీప్తులు; సూర్యే = సూర్యుని యందున్నవై; రశ్మిభిః = కిరణములచేత; దివమ్ = స్వర్గమును; ఆతన్వన్తి = వ్యాపిం చుచున్నవో; తాభిస్సర్వాభిః = ఆసర్వకిరణములచేతను; నః జనాయ=మాకొఱకు; రుచే = ప్రకాశముకొఱకు; కృధి = చేయుము. తద్బ్రాహ్మణమునందును. “శోమాషో హ నై వార్ష్ణేయ ఆదిత్యేన సమాజగామ” అని. శోమషః = శోషణశక్తిగల; వార్ష్ణేయః = కృష్ణుఁడు; తేజోరూప మైనవిభూతిచే, ఆదిత్యేన సమాజగామ=సూర్యు నింగోఁ జేరెను.

రా ఇట్లు ఇంద్రియసన్నికర్షవిరోధి యైన తమస్సును తొలఁగించుద్వారం బున నింద్రియముల ననుగ్రహించి ప్రకాశ మొసంగునట్టిజ్యోతిష్మంతు లగు రవిచం ద్రాగ్నులనుగూడ ప్రకాశింపఁజేయు జ్ఞానజ్యోతిస్స్వరూపుం డాత్మ ముక్తావస్థుండును జీవావస్థుండు ననియు నతఁడు భగవద్విభూతి యనియు చెప్పఁబడినది, “తద్ధామ పరమం మమ, మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః” అని. ఇప్పుడు అచి త్పరిణామవిశేషభూతం బైన యాదిత్యాది జ్యోతిష్మంతులజ్యోతిగూడ భగవద్విభూతి యని చెప్పుచున్నాఁడు.—అఖిలజగత్తును భాసిల్లఁజేయునట్టి యీయాదిత్యాదుల తేజస్సేది గలదో అది నాతేజస్సు. వారువారు నన్నారాధింపఁగా నాచే వారి కియ్యఁబడినది యని యెఱుంగుము.

మా. పూర్వోక్త మైనజ్ఞానమునే ప్రపంచించుచున్నాఁడు య దాదిత్యగత మిత్యాదిగా.

గా మావిశ్యచ భూతాని ధారయా మ్యహ మోజసా
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః. ౧౩

భా. మఱియును.—గామ్ = భూమిని; ఆవిశ్య చ = ప్రవేశించియు; భూతాని — జగత్తును; అహమ్ = నేను; ఓజసా = బలముచేత; ధారయామి = ధరించుచున్నాను. కామరాగవివర్జిత మైన యీశ్వరునిబల మేది జగద్విధారణముకొఱకు భూమిని బ్రవేశించి యున్నదో ఏబలము చేత బరువైనను భూమి క్రిందఁ బడక పగులదో ఆబలముచేత ధరించుచున్నా నని యర్థము. అట్లు మంత్రవర్ణము. "యేన ద్యౌ రుగ్రా పృథివీచ దృఢా, స దాధార పృథివీమ్" ఇత్యాదికము అందువలన భూమిని బ్రవేశించి చరాచరభూతములను ధరించుచున్నా నని యుక్తము చెప్పఁబడినది. మఱియును. భూమియందుఁ బుట్టిన, ఓషధీః = ఓషధులను; సర్వాః చ = వ్రీహియవాదుల నన్నిటని; రసాత్మకః = సర్వరసస్వభావుఁడగు, సర్వరసంబులకు నాకర మైన; సోమః = సోముఁడను; భూత్వా = అయి; పుష్ణామి = పుష్టి గలవానిగాను రసమును స్వాదుత్వమును గలవానిగాను చేయుచున్నాను. సోముఁడు గదా సర్వౌషధులను తనరసమును జొప్పించి పోషించుచున్నాఁడు.

నేను భూమిని బ్రవేశించి అందలి స్థావరజంగమభూతముల నన్నిటిని నాబలముచేత నిలువరించుచున్నాను. నేనే రసాత్మకుఁ డగు చంద్రుఁడై యోషధుల నన్నిటిని పుష్టి నొందించుచున్నా నని తాత్పర్యము.

ఆ. ఇందువలనఁ గూడ ఈపదమునకు సర్వాత్మత్వము యుక్తం బని చెప్పుచున్నారు మఱియును అని. ఈశ్వరుఁడు గదా పృథివీదేవతారూపంబునఁ బృథివిని బ్రవేశించి భూతశబ్దముచేఁ జెప్పఁబడినజగత్తును ధరించుచున్నాఁడు, అందువలన పృథివి బరువైనను పగిలి క్రిందఁబడకున్నది. ఇందులకుఁ బ్రమాణము చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. పరుఁడే హిరణ్యగర్భరూపంబున నుండుటవలన ఈమంత్రములు హిరణ్యగర్భపరము లైనను దోషము లే దని భావము. ద్యావాపృథివులయుగ్రత్వంబును ఉద్ధరణంబును దేవతాత్మ చేతనే యగుచున్నను స్వరూపధారణం బీశ్వరాధీనమే యగును, ఈశ్వరాపేక్షచే దేవతాత్మ దుర్బలం బగుటవలన నని యెఱుంగునది ఈశ్వరుఁడు సర్వాత్ముం డనుటకు మఱియొకహేతువును జెప్పుచున్నారు మఱియును అని. ఈశ్వరునకు రసాత్మకసోమరూపత్వం బున్నను ఈశ్వరుఁ డోషధుల నన్నిటిని బోషించుచున్నాఁ డని యెట్లు చెప్పవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు సోముఁడు గదా ఇత్యాదిగా.

హ. *

రం. మఱియును.—అహమ్ = ఈశ్వరుఁడ నగు నేనే; ఓజసా = అపరిమితమాయాశక్తిబలముచేత; గామ్=భూమిని; జలం బెట్లు తనస్నేహశక్తిచే కలిగిన జిగటబలంబున గోడను వ్యాపించుచున్నదో అట్లు, ఆవిశ్య = అంతటను వ్యాపించి; భూతాని = స్థావరజంగమముల నన్నిటిని; ధారయామి. ఎట్లు వాయువు తనశక్తిచే మేఘమండలమును ప్రవేశించి జలములను ధరించుచున్నదో అట్లు ధరించుచున్నా నని యర్థము. వాయు వతీంద్రియ మగుటవలన మేఘమండలమునందుఁ గనఁబడక యున్నను యోగిదృష్టిచేతను యుక్తిచే విచారించినను వాయువు దక్క వేఱుస్వరూపము మేఘమండలమునకు లేదు. ఇట్లు అగ్నిమ యాయఃపిండాదులయందును వ్యాప్యమునకు వ్యాపకస్వరూపమునం దంతర్భావము ప్రత్యక్షము. అట్లు శక్తిద్వారమున నాచే వ్యాపింపఁబడినభూమికి నాకంటె వేఱుస్వరూపము లేదు. అందువలన భూమియం దంతటను మద్బుద్ధి యుంపవలయు నని యర్థము. రసాత్మకః = అమృతరసాత్మకుఁడు లేక జలస్వరూపుఁడు; అగుసోముఁ డెవ్వఁడు గలఁడో అతఁడే నే నయి — చంద్రస్వరూపంబున నున్నవాఁడనై, వ్రీహియవగోధూమాదులును వృక్షలతాతృణగుల్మాదులు నగు సర్వౌషధులను, పుష్ణామి — పుష్టి గలవానిగా చేయుచున్నా నని యర్థము. ఇందుచేత చంద్రుఁడును చంద్రామృతపుష్టము లైన సర్వౌషధులును నావిభూతియె కావున నాసియందును మద్బుద్ధి యుంపవలయు నని సూచిత మగుచున్నది.

మ. మఱియును.—గామ్ = పృథివిని; ఆవిశ్య = పృథివీదేవతారూపంబునఁ బ్రవేశించి; ఓజసా = నాబలముచేత; ఘూలిరాశివంటి పృథివిని దృఢముగాఁ జేసి, భూతాని = పృథివియం దున్నవస్తువులను; అహమ్=నేనే; ధారయామి=నిలువరించుచున్నాను. కానియెడ పృథివి యిసుకప్రోగువలె చెదరిగాని క్రందికిమునిఁగిగాని పోవును, "యేన ద్యౌ రుగ్రా పృథివీచ దృఢా" అను మంత్రవర్ణమువలన. "స దాధార పృథివీమ్" అనునదియు హిరణ్యగర్భభావము నొందిన భగవంతునే వచించుచున్నది. మఱియును. రసాత్మకః = సర్వరసస్వభావుఁ డగు; సోమో భూత్వా = చంద్రుఁడనై; ఓషధీః సర్వాః=పృథివియందుఁ బుట్టిన వ్రీహి యవాదుల నన్నిటిని; నేనే, పుష్ణామి = పుష్టిమంతములను గాను రసస్వాదుమంతములను గాను చేయుచున్నాను.

---

* భాష్యముకంటె అవిశిష్టము.

శ్రీ. మఱియును.—గామ్ = పృథివిని; ఓజసా = బలముచేత; అధిష్ఠించి నేనే చరాచరభూతములను ధరించుచున్నాను. నేనే రసమయుఁ డగు సోముఁడై వ్రీహ్యాద్యోషధుల నన్నిటిని వృద్ధి నొందించుచున్నాను.

ప ఇఁక అన్నరూపంబునను అన్నాదరూపంబునను చంద్రాగ్నులకు తా నిచ్చిన సామర్థ్యము ననువదించునట్టి సామవేదశ్రుతి తాత్పర్యమును చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—అహమ్, రసాత్మకః=రసరూపుఁడనై; రసరూపవిభూతిచేత, సోమో భూత్వా; గామ్ = పృథివిని; ఆవిశ్య; సర్వాః ఓషధీః; ధాన్యఫలవంతము లనుగా, పుష్ణామి = వృద్ధి నొందించుచున్నాను. అందువలన, ఓజసా=అన్నాదిబల ముచేత; భూతాని; ధారయామి = పోషించుచున్నాను. "ఓషధీభ్యో న్న మ న్నా త్పురుషః" అను శ్రుతివలన.

రా. భూతధారిణి యగు పృథివియొక్క-ధారణాశక్తి నాదే యని చెప్పు చున్నాఁడు.—నేను పృథివి నావేశించి సర్వభూతంబులను, ఓజసా = నా యప్రతి హతసామర్థ్యముచేత; ధారయామి. అట్లు నే నమృతమయుఁ డగు సోముఁడనై సర్వౌషధులను పోషించుచున్నాను.

మా. గామ్ = భూమిని.

> అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః
> ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్. ౧౪

భా. మఱియును. అహమ్ = నేనే; వైశ్వానరః = ఉదరమున నున్న యగ్ని; భూత్వా = అయి; "అయ మగ్ని ర్వైశ్వానరో యో ఽయ మన్తః పురుషే యే నేద మన్నం పచ్యతే"* ఇత్యాది శ్రుతివలన వైశ్వా నరుఁడనై; ప్రాణినామ్ = ప్రాణులయొక్క-; దేహమ్ = దేహమును; ఆశ్రితః = ప్రవేశించినవాఁడనై; ప్రాణాపానసమాయుక్తః = ప్రాణాపాన ములతోఁ గూడినవాఁడనై; చతుర్విధమ్=నాలుగువిధము లైన, భోజ్య మును భక్ష్యమును చోష్యమును లేహ్యము నగు; అన్నమ్ = అన్న మును; పచామి = పక్వము చేయుచున్నాను. భోక్త వైశ్వానరాగ్ని

* ఎవఁడు పురుషునందు లోపలనున్నాఁడో ఎవ్వనిచే అన్నము పక్వమగుచున్నదో అట్టి వైశ్వాన రాగ్ని యితఁడు.

యనియు భోజ్యమగు నన్నము సోముం డనియు ఈ యిద్దఱు అగ్నీ షోములే సర్వంబు నని చూచువాని కన్నదోషలేపము కలుగదు.

నేనే జఠరమునందుండు వైశ్వానరాగ్నినై ప్రాణులదేహమును బ్రవేశించి ప్రాణాపానవాయువులతోఁ గూడినవాఁడనై భోజ్యభక్ష్యచోష్యలేహ్యరూప మైన చతుర్విధ మగు నన్నమును పక్వము చేయుచున్నా నని తాత్పర్యము.

ఆ. భగవంతుఁడు సర్వాత్ముఁ డనుటకు హేత్వంతరమును చెప్పుచున్నారు మఱియును అని.— నేనే యని అహంశబ్దముచేత పరుఁడు లక్షితుఁ డగుచున్నాఁడు. పరుఁడే జఠరాగ్నిరూపంబున నున్నాఁ డనుటకు శ్రుతిని ప్రమాణీకరించుచున్నారు అయ మిత్యాదిగా. శ్రుతియందు యోయం మనునది శాస్త్రీ మైన జఠరాగ్నిని వ్యావర్తించుచున్నది; యేన అనునది దేహాంతరమునకు కారణ మైన భూతాగ్నిని వ్యావర్తించుచున్నది. పరుఁడు జఠరాగ్నిరూపంబున నుండునపుడు వానికి దేహాశ్రితత్వము సిద్ధము కాఫున నది వేఱుగాఁ జెప్పవలసినది కా దని యాశంకించి, "పురుషవిధం పురుషే ఽన్తః ప్రవిష్టం వేద" అను శ్రుతి నాశ్రయించి చెప్పుచున్నారు ప్రవేశించినవాఁడనై అని. జఠరాగ్నిరూపంబున నన్నపచనము చేయుట యందుఁ బరునకు సహకారికారణమును జెప్పుచున్నారు ప్రాణేత్యాదిగా. కూడిన వాఁడనై—ప్రేరింపఁబడినవాఁడనై. అన్నముయొక్క నాలుగువిధములను ప్రకటించుచున్నారు భోజ్యము ఇత్యాదిగా. భోక్తయందు వైశ్వానరదృష్టిని భోజ్యమునందు సోమదృష్టిని జేయుచు ఇట్లు భోక్తృభోజ్యాత్మక మైన సర్వజగంబును అగ్నీషోమరూపంబున భోజనకాలమునందు ధ్యానించునట్టి భోక్తకు అన్నముచేఁ గలుగు దోషము లే దని ప్రసక్తినిబట్టి స్థలముగా ధ్యానము తెలుపుచున్నారు భోక్త ఇత్యాదిగా.

హ. *

శం. మఱియును "అయ మగ్ని ర్వైశ్వానరో యో ఽయ మన్తః పురుషే యే నేద మన్నం పచ్యతే" అను శ్రుతిచేఁ జెప్పఁబడిన జాఠరాగ్ని యెవ్వఁడు గలఁడో నేను అతఁడే అయి, వైశ్వానరరూపంబున సర్వప్రాణులదేహము నాశ్రయించినవాఁడనై "తస్య మధ్యే మహా నగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతోముఖః, నాభ్యా ముపరితిష్ఠతి" అను శ్రుతులవలన ప్రాణుల యుదరమునందుండి, ప్రాణా

* విశేషము లేదు.

పానసమాయుక్తః = ఉచ్ఛ్వాసనిశ్వాసరూపములై పచనసహకారు లగు ప్రాణాపానములచే ప్రజ్వలింపఁజేయఁబడుచున్న వాఁడ నగుచు; భక్ష్యభోజ్యలేహ్యచోష్య భేదముచేత చతుర్విధ మగు, అన్నమ్ = ప్రాణులచే భుజింపఁబడినయన్నమును; పచామి. లేక. ప్రాణినామ్ అని సామాన్యమునఁ జెప్పుటచేత సర్వప్రాణులచేతను భుజింపఁబడుచున్న యన్నమును, అద్యతే—భుజింపఁబడుచున్నది కావున అన్న మనం బడుదానిని, పార్థివమును ఆప్యమును తైజసమును వాయవ్యమును ఇట్లు చతుర్విధ మును, పచామి. మనుష్యాదులపార్థివమును, చాతకాదులయాప్యమును—జలమయ మును, వాలఖిల్యాదులతైజసమును, సర్పాదులవాయవ్యమును ఏతచ్చతుర్విధ మైన యన్నమును ఆయాప్రాణులజఠరముననుండి ఆప్రాణులచే భుజింపఁబడినదాని పక్వము చేయుచున్నా నని యర్థము. ఇందుచే నగ్నిస్వరూపుఁడ నగు నాచే నాపాదతలమస్తకము వ్యాపింపఁబడినప్రాణులకు నాకంటె వేఱుస్వరూపము లేమి వలన నాచే వ్యాప్తు లగు నాప్రాణులయం దెల్లను మద్బుద్ధి యుంపవలయు నని సూచిత మగుచున్నది.

౧౪. మఱియును.—అహమ్ = ఈశ్వరుఁడను నేనే; వైశ్వానరః = జాఠ రాగ్ని; భూత్వా=అయి; "అయ మగ్ని ర్వైశ్వానరో యో ఽయ మన్తః పురుషే. యే నేద మన్నం పచ్యతే" ఇత్యాది శ్రుతులచేఁ బ్రతిపాదితుఁడను, ప్రాణినామ్ = సర్వప్రాణులయొక్క; దేహమాశ్రితః = దేహములోపలఁ బ్రవేశించినవాఁడనై; ఆ జఠరాగ్ని కుద్దీపకము లగు ప్రాణాపానములచే ప్రజ్వలింపఁ జేయఁబడినవాఁడ నగుచు, పచామి = పక్వము చేయుచున్నాను; ప్రాణులచే భుక్త మగునన్నమును, చతుర్విధమ్=భక్ష్యము భోజ్యము లేహ్యము చోష్యము అని నాలుగువిధము లైనదానిని, అందు దంతములచే కొఱికికొఱికి భక్షింపఁబడు గారెలు మొదలగునది భక్ష్యము చర్వ్యమనియు చెప్పఁబడును, నాలుకచేతనే నమలి మ్రింగఁబడు సూపౌదనాదికము భోజ్యము, నాలుకలో నుంచుకొని రసము నాస్వాదించి మ్రింగఁబడు కించిద్ద్రవీభూత మైన బెల్లపుపాగు పెరుఁగుపచ్చడి మొదలగునది లేహ్యము, దంతములచే నమలి రసాంశమునుమాత్రము గ్రహించి విడువఁబడు నట్టి యిక్షుఖండము మొదలగునది చోష్యము అని భేదము. భోక్త వైశ్వానరాగ్ని భోజ్యమగునన్నము సోముఁడు ఏత దుభయరూప మైనసర్వంబును నగ్నీషోము లని ధ్యానించువాని కన్నదోష ముంట దనియు నెఱుంగునది.

శ్రీ. మఱియును. *

ప. ఇఁక నగ్నియం దియ్యఁబడినసామర్థ్యము చెప్పుచున్నాఁడు.—ప్రాణినామ్ = సర్వదేహులయొక్క; దేహమాశ్రితః; వైశ్వానరో భూత్వా = జఠరాగ్నియయి; ప్రాణాపానములచే కొలిమితిత్తివాయువులచేతవలె సమాయుక్తుఁడను — దీప్తి నొందింపఁబడినవాఁడ నగుచు, చతుర్విధ మన్నమ్ — లేహ్య పేయ చోష్య భక్ష్యరూపమును; పచామి = పాకము నొందించుచున్నాను. శ్రుతియును సామవేదమునందు "హా ఉ 3 అహ మన్న 3 అహ మన్నాదః 3 అహం విధాస్య 3" ఇత్యాది. భాష్యము. అందు హా ఉ అనునది స్తోమాక్షరము. అది చెప్పఁబడినది "హౌహాయి ఇతిచ సంబుద్ధౌ వికల్పే హా ఉ కీర్తితమ్" అని. ఇఁక మనుష్యదేవాత్మభేదముచే అన్నత్రయమును అన్నాదత్రయమును గలుగు కావున అన్నా ఽన్నాద శబ్దములకు మూఁడుమాఱు లావృత్తివే వికల్పార్థము నిరూపింపఁబడినది. విధాస్యః= ధరించువాఁడు. మఱియు నీయర్థమును దెలుపు శాతపథశ్రుతియును, "అథ యత్క్లిన్నం చేద మార్ద్రం త ద్రేతసో సృజత తదుసోమ ఏత ద్వా ఇదగ్ం సర్వ మన్నం చైవాన్నాదశ్చ సోమ ఏ వాన్న మగ్ని రన్నాదః" అని. భాష్యము. యత్క్లిన్నం చేదమార్ద్రమ్ = శుక్లశోణితోద్భవ మైన యీప్రాణిజాత మేది గలదో; తత్ = దానిసర్వమును; రేతసః = శుక్లమువలన; అసృజత = సృజించెను. ఇఁక రేతస్స్వరూపము చెప్పఁబడుచున్నది.—తత్ ఉ = ఆ రేతస్సంతయు; సోమః = సోమునియం దున్నది. ఏత ద్వా ఇదగ్ం సర్వమ్ = ఈ రేతస్సే సమస్తమును; అన్నంచైవ = అన్నమును; అన్నాదశ్చ=అన్నము భక్షించువాఁడును. కావున. సోమ ఏవ అన్నమ్=సోముఁడే యన్నము; అగ్నిరన్నాదః=అగ్నియే యన్నాదుఁడు. తైత్తిరీయకమునందును. "యః కామయే తాన్నవా నన్నాదః స్యామి త్యగ్ని నైవాన్న మవరుద్ధే సోమే నాన్నాద్య మన్నవా నే వాన్నాదో భవతి" అని. భాష్యము. యః = ఏపురుషుఁడు; అన్నవాన్ అన్నాదః స్యాం ఇతి= అన్నవంతుఁడను అన్నాదుఁడను కావలయు నని; కామయేత = కోరునో; అతఁడు, అగ్నినైవ=అగ్ని నుపాసించుటచేతనే; అన్నమ్= అన్నమును; అవరుద్ధే = ఆక్రమించుచున్నాఁడు—పాకము నొందించుచున్నాఁడు. సోమోపాసనచేత నన్నాద్యమును పొందుచున్నాఁడు. ఇట్లు అన్నవంతుఁడును అన్నాదుఁడును అగుచున్నాఁ డని యర్థము. అట్లు భృగువల్లియందును "అథైత త్సామగా యన్నాస్తే" అని. ఈశ్రుతిరహస్యము సర్వంబును భగవంతునిచేతనే ప్రకటింపఁబడినది.

* మధుసూదనీయముతో సమానము.

రా. నేను వైశ్వానరుఁడనై—జాఠరాగ్నినై సర్వప్రాణులదేహము నాశ్రయించి వారిచే భుజింపఁబడిన భక్ష్యచోష్యలేహ్యపేయాత్మక మగు చతుర్విధాన్నమును ప్రాణాపానవృత్తిభేదసమాయుక్తుఁడనై పచించుచున్నాను.

మా. *

సర్వస్య చాఽహం హృది సన్నివిష్టో మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం చ
వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో వేదాన్తకృ ద్వేదవిదేవ చాఽహమ్.

భా. మఱియును. సర్వస్యచ=సమస్తప్రాణిజాతమునకును; అహమ్=నేను; ఆత్మ నగుచు, హృది = బుద్ధియందు; సన్నివిష్టః=ఉన్నవాఁడను. అందువలన, మత్తః=ఆత్మ నగు నావలననే; సర్వప్రాణులకును, స్మృతిః=స్మృతియును; జ్ఞానమ్=జ్ఞానమును; అపోహనంచ=ఆ స్మృతిజ్ఞానములనాశమును; కలుగుచున్నవి. ఏపుణ్యకర్ములకు పుణ్యకర్మానుసారంబున జ్ఞానస్మృతులు గలుగుచున్నవో అట్లు ఏపాపకర్ములకు పాపకర్మానుసారంబున తద్వినాశము — అజ్ఞానస్మృతులు దొరఁకుట కలుగుచున్నదో వారి కవి నావలననే కలుగుచున్నవి. వేదైశ్చ — వేదములచేతను; సర్వైః=అన్నింటిచేతను; అహ మేవ = పరమాత్మను నేనే; వేద్యః = ఎఱుంగవలసినవాఁడను. వేదాన్తకృత్ = వేదాంతార్థసంప్రదాయము చేసినవాఁడను; వేదవిదేవచ=వేదార్థము నెఱింగినవాఁడనుగూడ; అహమ్ = నేనే.

నేను సర్వప్రాణులబుద్ధియం దాత్మనై యున్నాను. ఆత్మ నగు నావలననే సర్వప్రాణులకును పూర్వజన్మకర్మానుసారంబునఁ బుణ్యకర్ములకు స్మృతిజ్ఞానంబులును పాపకర్ములకు తన్నాశంబును కలుగుచున్నవి. సర్వవేదములచేతను ఎఱుంగవలసిన పరమాత్మను నేనే. లోకంబున వేదాంతార్థసంప్రదాయమునకు నేనే ప్రవర్తకుఁడను. నేనే వేదార్థమంతయు నెఱింగినవాఁడ నని తాత్పర్యము.

శ్రీ. ఇందువలననుగూడ ఈశ్వరుఁడు సర్వాత్మ యగుటచే సర్వవ్యవహారాస్పదం బని చెప్పుచున్నారు మఱియును అని.—ప్రాణిజాతము — బ్రహ్మాది స్తంబపర్యంతము. ఆత్మ నగుచు బుద్ధియం దున్నవాఁడను — తద్గుణదోషంబుల జూచుచున్నవాఁడను. అందువలన — బుద్ధిమధ్యమం దున్నవాఁడు తద్గుణదోషంబు

---

* దీని కీభాష్యము లేదు.

లకు ద్రష్ట యగుటవలన నని భావము. మత్తః—సర్వకర్మాధ్యక్షుఁడనై జగద్యంత్రము నకు సూత్రధారుఁడ నగు వానివలన నని యర్థము. ప్రాణులకు స్మృతిజ్ఞానంబులును తన్నాశంబును భగవదధీనము లైనయెడ భగవంతునకు వైషమ్యము గలుగు నని యాశంకించి చెప్పుచున్నారు పుణ్యకర్ములకు ఇత్యాదిగా. స్మృతియును—జన్మాంత రాదికమునం దనుభవించిన దానితలంపును. జ్ఞానమును — దేశకాలస్వభావములచే దూరస్థమైనదానిఁగూడ అనుభవించుట. ధర్మాధర్మములనుబట్టి వివిధముగాఁ జేయు నట్టియీశ్వరునకు వైషమ్యము లే దని భావము. వేదవేద్యమగు పరబ్రహ్మము భగ వంతునికంటె భిన్న మనుశంకను వారించుచున్నారు వేదై శ్చేత్యాదిగా. వేదాంత ములు పౌరుషేయము లనుటను బరిహరించుచున్నారు వేదాంతా ర్థేత్యాదిగా. వేదాంతార్థసంప్రదాయమునకుఁ బ్రవర్తకుఁ డగుటకు తదర్థసిద్ధాంతజ్ఞానము కలవాఁ డని చెప్పుచున్నారు వేదార్థము నిత్యాదిగా.

హ. అధికము చెప్ప నేల ?.—సర్వస్య = సమస్తప్రాణిజాతమునకును; హృది = హృదయపుండరీకమునందు; సన్నివిష్టః. అపోహనమ్=హేయ మనుబుద్ధి; ఇది యుపలక్షణార్థ మగుటచే ఉపాదేయ మనుబుద్ధిగూడ. వేదాన్తకృత్ — ఉప దేశము చేయువాఁడను. అట్లు శ్రుతి “ యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై” అని. ప్రహిణోతి — ఉపదేశించుచున్నాఁడు. వేద విత్ = వేదము నెఱింగినవాఁడను, వేదార్థము నెఱింగినవాఁడ నని యర్థము. అంగు నలన నేను సర్వలోకప్రసిద్ధుఁడను.

శం. ఇట్లు జాఠరాగ్నిస్వరూపుఁడైన యీశ్వరునిచే వ్యాపింపఁబడిన సర్వ ప్రాణులును ఈశ్వరవిభూతు లగుటచే నీశ్వరమాత్రములే యనుట సిద్ధమైనను వీఁడు శిష్టుఁడు వీఁడు భ్రష్టుఁడు వీఁడు శూద్రుఁడు వీఁడు పుల్కసుఁడు అనుభేదబుద్ధిని భ్రమ ప్రమాదములచేఁ గూడ నీశ్వరోపాసకు లగు ముముక్షువులు చేయఁగూడ దని వారికి సర్వత్రపరమేశ్వరబుద్ధి దృఢమగుటకై వెండియును సర్వప్రాణులును దాను వ్యాపించి యుండుటచేఁ దానే యనియు తన్నుపాసించుటచే శుద్ధాత్ము లగువారికి జ్ఞానంబును తద్విపరీతుల కజ్ఞానంబును నావలననే కలుగు ననియుఁ బ్రతిపాదించుచున్నాఁడు.— “మమై వాంశో జీవలోకే జీవభూతః, ఈశ్వరో జీవకలయా ప్రవిష్టః ” అని చెప్పిన రీతిని, సర్వస్యచ = బ్రహ్మాదిస్తంబపర్యంత మగు సమస్తప్రాణిజాతమునకును, చకా రము సన్నివేశ మంతటను సమం బని సూచించుచున్నది; హృది=బుద్ధిగుహయందు;

అహమ్ = పరమాత్మను నేను; క్షేత్రజ్ఞరూపంబున, సన్నివిష్టః = సన్నిహితుఁడనై యున్నాను. అందువలనఁ బ్రాణివర్గము సమస్తంబును నేనే యని యర్థము. ఇందుచే భేదదృష్టి కవకాశము లే దని సూచింపఁబడినది. ఇట్లు సర్వంబును పరమేశ్వరుఁడే యని సర్వత్ర పరమేశ్వరబుద్ధితోఁ బరమేశ్వరోపాసనము చేయువారికిని దానిఁ జేయని వారికిని ఫలభేదము చెప్పుచున్నాఁడు.— మత్తః = పరమేశ్వరుఁ డగు నావలననే; నన్నుపాసించుటచే శుద్ధాత్ము లగువారికి శాస్త్రాచార్యానుగ్రహము వలన, స్మృతిః = "స ఆత్మా, తత్త్వమసి" అని గురుపులచే నిర్విశేషుఁడును త్రివిధ పరిచ్ఛేదశూన్యుఁడు నగు నేయాత్మ తా నని బోధింపఁబడెనో అతఁడే నే నని ఆయాత్మయందే స్వరూపతయొక్క- స్మరణమును; జ్ఞానమ్ = ఇదియంతయు నేనును బ్రహ్మమే యని తానును సర్వంబును బ్రహ్మమాత్రమే యను ననుభవమును; కలుగుచున్నది. నన్నుపాసింపక మలినబుద్ధులై రాగాదిదోషదుష్టులైన వారికి ఈశ్వరుఁడ నగు నావలననే, అపోహనంచ = ఆ స్మృతిజ్ఞానములయొక్క- యసంభవంబును కలుగుచున్నది. మఱియును. వేదాన్తకృత్ = "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అను శ్రుతివలన బ్రహ్మదేవునకు వేదాంతానుగ్రహము చేసినవాఁడను నేనే. లేక, లోకమునందు శిష్యుల కాచార్యరూపంబున వేదాంతార్థము బోధించువాఁడను నేనే. వేదవిచ్చ= వేదార్థమైన నిర్విశేష బ్రహ్మమును నాయనుగ్రహమువలనను గుర్వనుగ్రహము వలనను స్వస్వరూపంబున నెవ్వఁ డెఱుంగుచున్నాఁడో వాఁడు వేదవిదుఁడు బ్రహ్మవేత్త, అతఁడును; అహమేవ = నేనే; "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" అనుటచే సమస్తప్రాణిజాతంబును తనచే వ్యాప్త మగుటచే తానే యని సిద్ధమగుచుండఁగా "వేదాన్తకృ ద్వేదవిదేవ చాహమ్" అను విశేషవచనము పామరులును పండితులును వేదాంతార్థ ముపదేశించుగురువునందును బ్రహ్మవిదునియందును బరమేశ్వరత్వబుద్ధి నవశ్యము చేయవలయు నని బోధించుకొఱకు. "య దాదిత్యగతం తేజః" ఇత్యాదిగా ముముక్షువుల కుపాసనము సిద్ధించుటకై తనవిభూతిని బ్రతిపాదించినవాఁడై అదియే పరమేశ్వరుని పారమార్థికరూపం బని ప్రాప్తింపఁగాఁ జెప్పుచున్నాఁడు.—సర్వైః వేదైశ్చ = "సర్వే వేదా యత్పద మామనన్తి" అని చెప్పఁబడినన్యాయంబున సమస్తము లైన ఋగాదివేదములచేతను వేదాంతములచేతను; వేద్యః = "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ, విజ్ఞాన మానన్దం బ్రహ్మ, ఆనన్దో బ్రహ్మ, త దేత ద్బ్రహ్మా౽పూర్వమ్, అస్థూల మన ణ్వహ్రస్వ మప్రాణ మముఖ

మశ్రోత్ర మప్రాగమనో ఽతేజస్క మచక్షుష్క మనామగోత్రమ్, అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్, నిష్కలం నిష్క్రియం శాన్తమ్, నిత్యం శుద్ధం ముక్తం సత్యం సూక్ష్మం పరిపూర్ణ మద్వయం సదానన్దం చిన్మాత్రం శాన్తం చతుర్థం మన్యన్తే స ఆత్మా సవిజ్ఞేయః, తత్త్వ మసి" ఇత్యాదివచనములచే నెఱుంగవలసిన నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుండును సచ్చిదానందైకరసుండును అద్వితీయుఁడు నగు పరమాత్మ ఎవ్వఁడు గలఁడో పరమార్థంబున నతఁడే నేను, మున్ను చెప్పిన మాయోపాధికరూపము నాపారమార్థికస్వరూపము కాదని యర్థము.

ప. మఱియును.—సర్వస్యచ = బ్రహ్మాదిస్థావరాంతమైన సమస్తప్రాణిజాతమునకును; అహమ్ = నేను; ఆత్మనై, హృది = బుద్ధియందు; సన్నివిష్టః. "స ఏష ఇహ ప్రవిష్టః, అనేన జీవేనాఽఽత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" అను శ్రుతివలన. అందువలన, మత్తః = ఆత్మ నగు నావలననే; ప్రాణిజాతమునకు వారివారికిఁ దగినట్లు, స్మృతిః = ఈజన్మమునందు పూర్వానుభూతమైన యర్థమును విషయీకరించువృత్తియును, యోగులకు జన్మాంతరమునం దనుభూతమైనయర్థమును విషయీకరించువృత్తియును; అట్లు నావలననే, జ్ఞానం = విషయేంద్రియసంయోగజమైనజ్ఞానంబును, యోగులకు దేశకాలములకు దూరస్థవిషయమైనజ్ఞానంబును కలుగుచున్నది. అట్లు కామక్రోధశోకాదివ్యాకులచిత్తులకు, అపోహనంచ = స్మృతిజ్ఞానములనాశంబును నావలననే కలుగుచున్నది. ఇట్లు తన జీవరూపతను బ్రతిపాదించి బ్రహ్మరూపతను జెప్పుచున్నాఁడు.—వేదైశ్చసర్వైః = వేదములింద్రాదిదేవతాప్రకాశకములైనను ఆసమస్తవేదములచేతను; అహమేవ వేద్యః, సర్వాత్మ నగుటవలన. "ఇన్ద్రం మిత్రం వరుణ మగ్ని మాహు రథో దివ్యః ససుపర్ణో గరుత్మాన్ । ఏకం స ద్విప్రా బహుధా వద న్త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః" అను మంత్రవర్ణమువలన, "ఏష ఉ హ్యేవ సర్వే దేవాః" అను శ్రుతివలనను. వేదాన్తకృత్ = వేదవ్యాసాదిరూపంబున వేదాంతార్థసంప్రదాయప్రవర్తకుఁడను నేనే. ఇంతమాత్రమే కాదు, వేదవిదేవచాహమ్ = కర్మకాండోపాసనాకాండజ్ఞానకాండాత్మకములై మంత్రబ్రాహ్మణరూపములైన సమస్తవేదములయర్థము నెఱింగినవాఁడను గూడ నేనే. అందువలన బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మిత్యాదిగాఁ జెప్పఁబడినది యుపపన్నము.

శ్రీ. మఱియును.—సర్వస్యచ = ప్రాణిజాతమున కెల్లను; హృది; నేను జక్కఁగా నంతర్యామిరూపమునఁ బ్రవేశించి యున్నవాఁడను. అందువలన, మత్తః =

నావలననే; ప్రాణిమాత్రమునకు పూర్వానుభూతార్థ విషయమైన స్మృతి కలుగుచున్నది, విషయేంద్రియసంయోగజన్యమైనజ్ఞానంబును కలుగుచున్నది. అపోహనంచ — వానినాశంబును కలుగుచున్నది. వేదైశ్చ సర్వైః; తత్త ద్దేవతాదిరూపంబున, అహ మేవ వేద్యః. వేదాన్తకృత్ — తత్సంప్రదాయప్రవర్తకుఁడను నేనే, జ్ఞానము నిచ్చు గురుఁడను నేనే యని యర్థము. వేదవిదేవచ=వేదార్థము నెఱింగినవాఁడను గూడ; అహ మేవ.

ప. ఇఁక అన్నాన్నాదవిభూతిరూపంబున దేహమాత్రంబున నున్నాననుటమాత్రమే కాదు, మఱే మనఁగా సాక్షిత్వంబునఁగూడ నున్నా నని చెప్పుచున్నాఁడు.—అహమ్; సర్వస్య = సమస్తప్రాణిజాతమునకును; హృది = హృదయాకాశమునందు; సన్నివిష్టః=అంతర్యామిరూపంబున ప్రవేశించి యున్నాను. అది యెట్లు తెలియు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఎందువలన ననఁగా, మత్తః=నావలననే; పూర్వానుభూతార్థవిషయమైన స్మృతి కలుగుచున్నది. అట్లు విషయేంద్రియసంయోగజన్యమైనజ్ఞానము కలుగుచున్నది. అపోహనంచ = ఆ స్మృతిజ్ఞానముల యొక్క—నాశంబును కలుగుచున్నది. ఇఁక నియనుభవరూపజ్ఞానము లేనియెడ నుపాయాంతరము చెప్పుచున్నాఁడు.—సంహితాబ్రాహ్మణారణ్యకరూపములైన సర్వవేదములచేతను నేనే, వేద్యః = అతద్వ్యావృత్తిచే నెఱుఁగవలసినవాఁడను. ఏవకారము క్షుద్రదేవతలను వ్యావర్తించుచున్నది. ఎట్లు నిన్ను సాక్షాత్కరింపవలయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు. — వేదాన్తకృత్ = వేదాంతము లనఁగా ఉపనిషత్తులు, వానిఁ జేయువాఁడను, ఉప — సమీపమునందు — శీఘ్రముగా, నిషీదన్తి — పర్యవసానము నొందుచున్నవి కావున నుపనిషత్తు లనఁబడును, "నేతినేతి, నహ్యేస్మా త్పరమస్తి" ఇత్యాదివాక్యములచే నాపర్యవసానమునే యవి ప్రతిపాదించుచున్నవి, ఆ వేదాంతవాక్యములకును నేనే నిమిత్తమై యున్నా నని యర్థము. ఇఁక నీవేదవాక్యములు ప్రతిపాదించుపరమరహస్యము నుపదేశించునట్టి పరమగురుఁడనుగూడ నేనే యని చెప్పుచున్నాఁడు వేదవిత్తని. లేక, నేనే వేదవిదుఁడను నన్ను వేద మెఱుఁగదు, "యే వేదం సర్వం విజానాతి తం కేన విజానీయాత్" అను శ్రుతి వలన.

రా. ఇట పరమపురుషవిభూతులైన సోమవైశ్వానరులు "సోమో భూత్వా, వైశ్వానరో భూత్వా" అని ఆపరమపురుషునితో సమానాధికరణతచే నిర్దేశింపఁబడిరి. వారలను సమస్తభూతజాతమును పరమపురుషునితో సమానాధి

కరణతచే నిర్దేశించుటకు హేతువు చెప్పుచున్నాఁడు.—ఆ సామన్యవైశ్వానరులకును సర్వభూతజాతమునకును సకలప్రవృత్తినిమిత్తమైనజ్ఞాన ముదయించుస్థాన మగు, హృది = హృదయదేశమునందు; నాసంకల్పముచే నియమించువాఁడనై, అహమ్= నేను; ఆత్మనై, సన్నివిష్టః. అట్లు చెప్పుచున్నవి శ్రుతులు "అన్తః ప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా, యః పృథివ్యాం తిష్ఠన్, య ఆత్మని తిష్ఠ న్నాత్మ నోఽన్తరో యమయతి, పద్మకోశప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్, అథ య దిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుణ్డరీకం వేశ్మ" ఇత్యాదులు. స్మృతులును "శాస్తా విష్ణు రశేషస్య జగతో యో జగన్మయః, ప్రశాసితారం సర్వేషా మణీయాంస మణీయసామ్, యమో వైవస్వతో రాజా యస్తవైష హృది స్థితః" ఇత్యాదులు. కావున నావలననే యెల్లవారికిని స్మృతి యనఁగా పూర్వానుభూత విషయమై అనుభవసంస్కారమాత్రమునఁ బుట్టునట్టిజ్ఞానము. జ్ఞానమ్- ప్రత్యక్షాను మానశబ్దప్రమాణములచే కలుగు వస్తునిశ్చయము. అదియును నావలననే కలుగు చున్నది. అపోహనంచ = జ్ఞాననివృత్తిగూడ. లేక ఊహనమే యపోహనము, ఊహన మనఁగా ఊహ, ఈప్రమాణ మిట్లు ప్రవర్తించు నని ప్రమాణప్రవృత్తి యోగ్యతను విషయీకరించునదియు సామగ్ర్యాదినిరూపణజన్యమై ప్రమాణాను గ్రాహకము నగు జ్ఞాన మూహ యనఁబడును. ఆయూహయును నావలననే కలుగు చున్నది. వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః=ఇందువలన అగ్ని వాయు సూర్య సో మేంద్రాదిదేవతల కందఱకును నేనే యంతర్యామి నగుటచే వారలు మదాత్మకు లగుటవలన వేదములు వారిఁ బ్రతిపాదించుచున్నను సర్వవేదములచేతను నేనే వేద్యుఁడను, దేవమనుష్యాదిశబ్దములచే జీవాత్మనవలె; "ఇన్ద్రం యజేత, వరుణం యజేత" ఇత్యాదులయొక్క-అంతము- ఫలము, ఫలమునందుఁగదా యావేదము లన్నియు పర్యవసన్నము లగుచున్నవి, అన్తకృత్ - ఫలము చేయువాఁడను, వేదోక్తఫలము నిచ్చువాఁడను నేనే యని యర్థము. అది మున్నే చెప్పఁబడినది. "యోయో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి" అని యారంభించి "లభతేచ తతః కామా న్మయైవ విహితా న్హితాన్" అని. "అహం హి సర్వ యజ్ఞానాం భోక్తాచ ప్రభు రేవచ" అనియును. వేద విదేవచాహమ్=వేదవిదుఁడను గూడ నేనే, ఇట్లు నన్నుఁ బ్రతిపాదించునట్టి వేదమును నేనే యెఱుంగుదును, ఇందులకు భిన్నముగా నెవఁడు వేదార్థముఁ జెప్పుచున్నాఁడో వాఁడు వేదవిదుఁడు కాఁ డని యభిప్రాయము.

మా. వేదనిర్ణయాత్మకము లైన మీమాంసలు వేదాంతములు. అట్లు సామవేదమునందు ప్రాచీనశ్రుతి. " స వేదాన్తకృత్సకాలక ఇతి సహ్యేవ యుక్తి సూత్రకృత్సకాలకః " అని.

ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాఽక్షర ఏవచ
క్షర స్సర్వాణి భూతాని కూటస్థో ఽక్షర ఉచ్యతే. ౧౬

భా. భగవంతుఁడు నారాయణాఖ్యుఁ డగు నీశ్వరుని విశిష్టోపాధికృత మైన విభూతిసంక్షేపము చెప్పఁబడినది య దాదిత్యగతం తేజ ఇత్యాదిగా. ఇఁక నిప్పుడు అతఁడే క్షరాక్షరోపాధులచే ప్రవిభక్తుం డని నిరూపించి నిరుపాధికుఁ డగు కేవలుని స్వరూపము నిర్ధారించుటకై మీఁది మూఁడుశ్లోకము లారంభింపఁబడుచున్నవి. అందు అతీతానాగతము లగు సర్వాధ్యాయముల యర్థజాతము సర్వంబును మూఁడురాసులుగాఁ జేసి చెప్పుచున్నాఁడు.—ద్వౌ = ఇద్దఱు; ఇమౌ = వీరు, వేఱువేఱురాశిగాఁ జేయఁబడినవారు; పురుషౌ = పురుషు లని చెప్పఁబడుచున్నారు; లోకే = సంసారమునందు; క్షరశ్చ = క్షరతి—నశించువాఁడు కావున క్షరుఁ డనఁ బడుచున్నాఁడు, ఈక్షరుఁ డొకరాశి; రెండవపురుషుఁడు, అక్షర ఏవచ = వానికంటె విపరీతుఁడు, భగవంతునిమాయాశక్తి, క్షరాఖ్యుఁ డగు పురుషుని కుత్పత్తిబీజమును, సర్వసంసారిజంతువుల కామకర్మాదిసంస్కారములకు ఆశ్రయము నగు పురుషుఁడు అక్షరుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. ఆపురుషు లెవ్వ రనఁగా భగవంతుఁడు తానే చెప్పుచున్నాఁడు. — క్షరః = క్షరుఁ డనుపురుషుఁడు; సర్వాణి భూతాని = సమస్త మైనభూతములును. సమస్తవికారజాతమును క్షరుఁ డని యర్థము. కూటస్థః = కూట మనఁగా రాశి, రాశివలె నున్నవాఁడు; లేక, కూటము మాయ వంచన జిహ్మత కుటిలత అను నివి పర్యాయపదములు, అనేకమాయాదివిధంబున నున్నవాఁడు కూటస్థుఁడు; అక్షరః = సంసారబీజ మనంత మగుటవలన నక్షరతి — నాశము నొందఁ డని అక్షరుఁ డని; ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

సంసారమున క్షరుఁడు అక్షరుఁ డని యిద్దఱు పురుషులు గలరు. అందు సర్వకార్యరాశియు క్షరుఁ డని చెప్పఁబడును. సర్వసంసారబీజ మైన భగవంతుని మాయాశక్తియే యక్షరుం డనఁబడు నని తాత్పర్యము.

ఆ. మీఁదిశ్లోకముల తాత్పర్యము చెప్పుటకై కడచినదానిఁ గీర్తించుచున్నారు భగవంతుఁడు ఇత్యాదిగా. విశిష్టోపాధు లాదిత్యాదులు. ఇప్పు డధ్యాయసమాప్తిపర్యంత ముత్తరగ్రంథతాత్పర్యము చెప్పుచున్నారు ఇఁక నిత్యాదిగా. ఉత్తరగ్రంథము నిరూపాధికాత్మస్వరూపనిర్ధారణముకొఱకుమాత్రమే కాదు, మఱేమనఁగా సమస్తమైనగీతాశాస్త్రమునకును దాత్పర్యము నిర్ణయించుకొనుట కని చెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. క్షరాక్షరోపాధులును బరమాత్మయును నీ మూఁడు రాసు లని యెఱుఁగునది. సర్వాత్మ యని చెప్పుటచేఁ బరమాత్మ కశుద్ధ్యాది దోషము ప్రసక్తింపఁగాఁ జెప్పఁబడినది ద్వావిమా ఇత్యాదిగా. పురుషోపాధు లగుటచే సాక్షాత్పురుషత్వము గా దని వివక్షించి చెప్పుచున్నారు పురుషు లని యని. పరమపురుషుని వ్యావర్తించుచున్నారు భగవంతునిమాయాశక్తి యని. అందు కార్యలింగకమగు ననుమానమును సూచించుచున్నారు క్షరాఖ్యుఁడు ఇత్యాదిగా. మాయాశక్తి లేకున్నను భోక్తల కర్మాదిసంస్కారమువలననే పై చెప్పినకార్య ముత్పన్న మగు నని యాశంకించి యది నిమిత్తమైనను మాయాశక్తియే యుపాదానకారణ మని తలంచి చెప్పుచున్నారు సర్వేత్యాదిగా. కామకర్మాది యనుస్థలమునందలి యాది శబ్దముచేత జ్ఞానము గ్రహింపఁబడుచున్నది. ప్రకృతిం పురుషం చైవ యని చెప్పఁబడిన ప్రకృతిపురుషులే యిట చెప్పఁబడుచున్నా రనుశంక నాకాంక్షాద్వారమున వారించుచున్నారు ఆపురుషు లెవ్వ రని. కూటశబ్దార్థము ప్రతిపాదించి కూటముచే స్థితుఁడు కూటస్థుఁ డని సంపిండితమైనయర్థము చెప్పుచున్నారు అనే కేత్యాదిగా. వాని కక్షరత్వ మెట్లనఁగా బ్రహ్మజ్ఞానముచేతనే గాని నాశము లేమివలన నని చెప్పుచున్నారు సంసారేత్యాదిగా.

హ. మఱియును.—క్షరుఁ డొకఁడు. రెండవవాఁ డక్షరుఁడు. అందు క్షరునిఁ దెలుపుచున్నాఁడు.— సర్వాణి భూతాని = సమస్తప్రాణులును. అక్షరః = అక్షరపురుషుఁడు; కూటస్థః = అచలుఁడు, అతఁ డక్షరుఁ డని చెప్పఁబడుచున్నాఁడు.

శం. శుద్ధాత్ము లగు ముముక్షువులకు విచక్షణులును యుక్తికుశలులును సూక్ష్మబుద్ధులు నగువారికి వివేకవైరాగ్యములు సిద్ధించుటకై సంసారమును వృక్షముగా వర్ణించి యాసంసారవృక్షము నెక్కియున్న వివేకవైరాగ్యహీను లగుమానవులకు పతనమే కాని మోక్షఫలం బెప్పుడును సిద్ధింప దని యందువలన వివేకమువలన నుదయించినవైరాగ్యఖడ్గముచే ఆవృక్షమును ఛేదించి సదసద్వివేచనము చేసి పర

తత్త్వము నెఱుంగువలయు నని తజ్జ్ఞానమునందు ప్రవృత్తి సిద్ధించుటకై బ్రహ్మవిదుల బ్రహ్మప్రాప్తిని తత్ప్రాప్తిసాధనంబును తత్ఫలమును నిరూపించి యిప్పుడు వా రెఱుంగ వలసిన బ్రహ్మముయొక్క స్వరూపమును అతద్వ్యావృత్తిపూర్వకముగా బోధించుచు న్నాఁడు మూఁడుశ్లోకములచేత. అందు మొదటిశ్లోకముచే పురుషోత్తమాఖ్య మగు పరబ్రహ్మమున కేపురుషులయపేక్షచే పురుషోత్తమత్వము కలుగుచున్నదో ప్రకృతి తత్కార్యరూపోపాధిలక్షణు లైన యాపురుషులను నిర్దేశించుచున్నాఁడు. దేని నప వదించుటచే బ్రహ్మమున కసంసారిత్వంబును నిర్విశేషత్వంబును శుద్ధత్వంబును నిత్య ముక్తత్వంబును అద్వితీయత్వంబును సిద్ధించునో దానిఁ జెప్పుచున్నాఁడు.—క్షరశ్చ= చకారము సముచ్చయార్థము, స్వకాలమునందు క్షరతి—నశించును గావున క్షరుఁడు, నశ్వరుఁ డని యర్థము, మహదాదిస్థూలాంత మైన సంసారలక్షణ మగు కార్యవర్గ మంతయు నొకపురుషుఁడు; అక్షరశ్చ—చకారము సముచ్చయార్థము, రెండవపురు షుఁడు, క్షరుఁ డెట్లు స్వకాలమునందు నశించునో అట్లు నక్షరతి—నశింపఁడు గావున అక్షరుఁడు, పరమాత్మజ్ఞానముచేతనే గాని నశింపని మూలప్రకృతి యని యర్థము, సంసారకారణరూపుఁ డైనపురుషుఁడు; పురుషుఁ డగు నాత్మకు పాధు లగుటచే క్షరా క్షరు లిద్దఱకును బురుషత్వము గాని వాస్తవమునఁ గాదు, పరిచ్ఛిన్ను లగుటవలనను అనిత్యు లగుటవలనను అసత్యు లగుటవలనను; ఏవకారం బిక్కడ నన్వయింప వలయును, పదవినియోగం బర్థానుసారి యగుటవలన; ఇమౌ=ఈ క్షరాక్షరులు; ద్వౌ పురుషావేవ=ఇద్దఱు పురుషులు మాత్రమే; లోకే=సంసారమునందు. పురుషుఁ డగు నాత్మకు సంసారిత్వము కలుగుటకు యీక్షరాక్షరు లిద్దఱు పురుషులే పురుషోపా ధులు. వారు దక్క నన్యుఁ డెవ్వఁడును లేఁ డని యేవకారాభిప్రాయము. ఆక్షరాక్షరు లెవ్వ రని యాశంకింపఁగా చెప్పుచున్నాఁడు.—భూతాని = భవన్తి — పుట్టుచున్నవి కావున భూతము లనఁగా ఆకాశాదిపంచభూతములును దేహేంద్రియాదు లగు భూతకార్యములును సమస్తములును; క్షరః = క్షరుఁ డని చెప్పఁబడును, అభివ్యక్త నామరూపాత్మక మగు దేహాంతమహదాదివికారజాత మంతయు క్షరపురుషుఁ డని యర్థము. మహదాదిపృథివ్యంత మగు సమష్టివ్యష్ట్యాత్మకస్థూలసూక్ష్మప్రపంచ మను కార్యరాశి కూట మని చెప్పఁబడుచున్నది, వికారమాత్రము సర్వంబును కూటము, స్వకార్య మగు నాకూటమం దంతటను తాను కారణమై ఘటాదులయందు మృత్తిక వలె వెలుపల లోపల నంతటను వ్యాపించియుండును కావున ప్రకృతి శబ్దవాచ్య మైన యవ్యక్తము కూటస్థుఁ డని చెప్పఁబడును; లేక, పుత్రసంతతికిని పుత్రికాసంత

తికిని మూల భూతుం డగు పురుషుం డెట్లు కూటస్థుం డని చెప్పంబడునో అట్లు రజః కార్యసంతతికిని తమఃకార్యసంతతికిని సత్త్వకార్యసంతతికిని మూలభూత మైనత్రిగుణాత్మకప్రకృతి కూటస్థుం డని చెప్పంబడును; లేక, కూటసాక్షియనుచో కూటశబ్దము కపటవాచకము, ఆకూటమునందు కపటమునందు — పురుషునకు విపరీతభావము చేయుటయం దుండును కావున కూటస్థుం డనంగా మాయ అదియే యక్షరుం డనం బడును. క్షరుండును అక్షరుండును వీరిద్దఱే పురుషునకు సంసారప్రాప్తికిం గారణము, తన్నివృత్తికారణమో " నస త్తన్నా స ఉచ్యతే" అను రీతిని తన్నిరాసమే యగును. ఇట్లు నిరస్తాశేషవిశేష మగు పరబ్రహ్మమునందే యాత్మభావము నొంటి వెండియు అనాత్మను దగిలించుకొనక యుండుటయే విదేహముక్తికారణ మని మున్నే చెప్పంబడినది. అది మఱవ వలదు.

మ. ఇట్లు సోపాధికాత్మను బ్రతిపాదించి క్షరాక్షరశబ్దవాచ్యము లగు కార్యకారణోపాధుల నిరసించుటచే నిరుపాధికుం డైనయాత్మను నిరూపించుచున్నాం డర్జునునకు కృపచే భగవంతుండు మూండుశ్లోకములచేత.——ద్వా విమౌ=వేఱువేఱు రెండురాసులుగాం జేయంబడిన యిద్దఱు వీరు; పురుషౌ = పురుషోపాధు లగుటచే పురుషనామము గలవారు; లోకే=సంసారమునందు. ఎవ్వరు వా రనంగాం జెప్పుచున్నాండు.—క్షరశ్చ అక్షరఏవచ=క్షరతి—నశించును కావున క్షరుండు, వినాశము గల కార్యరాశియంతయు నొకపురుషుండు, నక్షరతి—నశింపండు కావున నక్షరుండు, వినాశరహితమై క్షరాఖ్యపురుషున కుత్పత్తిబీజ మైన భగవంతునిమాయాశక్తి రెండవపురుషుండు. ఆ పురుషులను వివరించుచున్నాండు తానే భగవంతుండు.——క్షరః సర్వాణి భూతాని — సమస్త మైన కార్యజాతము క్షరుం డని యర్థము. కూటస్థః = కూట మనంగా యథార్థవస్తువు నాచ్ఛాదించి అయథార్థవస్తువు లోంపించునట్టి వంచనము, మాయ యనుట దాని పర్యాయపదము, ఆవరణవిక్షేపశక్తిద్వయరూప మైన యాకూటముచే నున్నవాండు కూటస్థుండు, భగవన్మాయాశక్తిరూప మైన కారణోపాధి; సంసారబీజ మగుటచే అనంత మగుటవలన, అక్షరః ఉచ్యతే = అక్షరుం డని చెప్పంబడును. కొందఱు క్షరశబ్దముచే నచేతనవర్గము చెప్పంబడు ననియు కూటస్థో ఽక్షర ఉచ్యతే అనుటచే జీవుండు చెప్పంబడు ననియుం జెప్పెదరు. అది సరి కాదు, ఇట క్షేత్రజ్ఞుండే పురుషోత్తముం డని ప్రతిపాదింపంబోవుటవలన. అందువలన క్షరాక్షరశబ్దములచే కార్యకారణోపాధులు రెండును జడములే చెప్పంబడుచున్నవి యనుటయె యుచితము.

శ్రీ. ఇప్పుడు తద్ధామ పరమం మమ యని తనసర్వోత్కృష్టస్వరూప మేది చెప్పఁబడెనో దానిఁ బ్రదర్శించుచున్నాఁడు మూఁడింటిచేత.—క్షరుఁడు అక్షరుఁ డని వీరిద్దఱుపురుషులు లోకమునఁ బ్రసిద్ధులు. వారినే చెప్పుచున్నాఁడు.— అందు క్షరపురుషుఁ డనఁగా, సర్వాణి భూతాని = బ్రహ్మాదిస్థావరాంతము లైన శరీరములు, అవివేకిజనులు శరీరములనే పురుషు లనుటవలన. కూట మనఁగా శిలారాశి, పర్వత మువలె శరీరము నశించుచున్నను నిర్వికారుఁడై యున్నవాఁడు కావున కూటస్థుఁ డనఁగా చేతనుఁ డైనభోక్త, అతఁడు అక్షరపురుషుఁ డని వివేకులచే చెప్పఁబడు చున్నాఁడు.

ప. ఇఁక వేదముచేత క్షరాక్షరపురుషుల కతీతముగా నెఱుంగఁదగిన తన సూత్రాత్మరూపమును చెప్పుచున్నాఁడు.—ఇమౌ = ఈ యనుభవింపఁబడుచున్న; ద్వౌ పురుషౌ = ఇద్దఱు పురుషులు; లోకే=లోకమునందు ప్రసిద్ధులు. వారిని జెప్పు చున్నాఁడు.—క్షరశ్చ అక్షర ఏవచ. అందు, సర్వాణి భూతాని=సమస్తము లైన శరీరములు; క్షరః=నశ్వరము లగుటవలన క్షరపురుషుఁ డని చెప్పఁబడును. కూట మునందు— స్థూలప్రపంచమునం దున్నవాఁడు కావున కూటస్థుఁడు చేతనరూపుఁడు, అతఁ డక్షరుఁ డని చెప్పఁబడును.

రా. అందువలన నాయొద్దనే సర్వవేదములకును సారభూత మైనయర్థము వినుము.—క్షరుఁ డనియు అక్షరుఁ డనియు వీ రిద్దఱుపురుషులు లోకమున ప్రసిద్ధులు. అందు క్షరశబ్దముచే నిర్దిష్టుఁ డగు పురుషుఁడు జీవశబ్దముచేఁ జెప్పఁబడునట్టి బ్రహ్మాది స్తంబపర్యంతములును క్షరణస్వభావాచిత్సంసృష్టములు నగు సర్వభూతములును. ఇట అచిత్సంసర్గరూపమైన యొక్క టేయుపాధిచేత పురుషుఁ డని యేకత్వము చెప్పఁ బడినది. అక్షరశబ్దముచేఁ జెప్పఁబడిన కూటస్థుఁడు అచిత్సంసర్గవియుక్తుఁడై స్వరూ పముచే నవస్థితుఁ డగు ముక్తాత్మ. అతఁ డచిత్సంసర్గము లేమివలన నచిత్పరిణామ విశేషము లైన బ్రహ్మాదిదేహములచే భిన్నాకారుఁడు కాఁడు కావున కూటస్థుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. ఇక్కడఁగూడ నేకత్వనిర్దేశము అచిద్వియోగరూప మైన యుపాధి యొకటే యగుటచే చేయఁబడినది. ఇంతకుమున్ననాదికాలమునందు ముక్తుఁ డొక్కఁడే కాఁడు గదా. అట్లు చెప్పఁబడినది. “ బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాశ్రితాః, సర్గేపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తిచ ” అని.

మా. క్షరభూతములు బ్రహ్మాదులు. కూటస్థము ప్రకృతి. అట్లు శార్క రాక్షశ్రుతి. "ప్రజాపతి ప్రముఖాః సర్వజీవాః క్షరో ఉక్షరః పురుషో వై ప్రధానం తదుత్తమం చాన్య ముదాహరన్తి జాలాజాలం మాతరిశ్వాన మేకమ్" అని.

ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః. ౧౭

భా. ఈ క్షరాక్షరపురుషులకంటెను విలక్షణుఁడును క్షరాక్షరోపాధిదోషద్వయస్పర్శము లేనివాఁడును నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడును.— ఉత్తమః=మిక్కిలి యుత్కృష్టుఁ డగు; పురుషస్తు పురుషుఁడో; అన్యః= మిక్కిలి విలక్షణుఁడు, వీరికంటెను; పరమాత్మా=దేహాద్యవిద్యాకృతు లైన యాత్మలకంటెను పరముఁడు—ఉత్కృష్టుఁ డగు ఆత్మ, సర్వభూతములకును ప్రత్యక్చైతన్యుఁడు కావున పరమాత్మ; ఇతి=అని; ఉదాహృతః=వేదాంతములందు చెప్పఁబడెను. వానికే విశేషణము చేయుచున్నాఁడు.— యః=ఎవ్వఁడు; లోకత్రయమ్=భూర్భువఃస్వరాఖ్యము లైనమూఁడిని; తన చైతన్యబలశక్తిచేత, ఆవిశ్య=ప్రవేశించి; బిభర్తి=స్వరూపస్థితిమాత్రమున ధరించుచున్నాఁడో; అవ్యయః=వ్యయము లేనివాఁడో; ఈశ్వరః=ఈశన శీలుఁడై సర్వజ్ఞుఁ డగు నారాయణాఖ్యుఁడో; అట్టివాఁ డాయుత్తమ పురుషుఁడు.

ఈ క్షరాక్షరపురుషులకంటెను నుత్తముఁ డగు పురుషుఁడు క్షరాక్షరోపాధిదోషము నంటక వీరికన్న నత్యంతవిలక్షణుఁడై యున్నాఁడు. అవిద్యాకల్పితు లైన దేహాద్యాత్మలకన్నను బరముఁడైన యాత్మ కావున వానిఁ బరమాత్మ యని వేదాంతములు చెప్పుచున్నవి. అతఁడే తన చైతన్యబలశక్తిచేత సర్వప్రపంచమును వ్యాపించి తనయునికిమాత్రమున నే సర్వమును ధరించుచున్నాఁడు. అతనినే యవ్యయుం డనియు ఈశ్వరుఁడైన నారాయణుం డనియు చెప్పుదు రని తాత్పర్యము.

ఆ. కార్యకారణాఖ్యము లైన రాసులఁ బ్రదర్శించి మూఁడవరాశిని బ్రదర్శించుచున్నారు ఈ ఇత్యాదిగా. విలక్షణతకు ఫలము చెప్పుచున్నారు క్ష రేత్యాదిగా. ఉపాధిద్వయముచేఁ గలుగు గుణదోషములస్పర్శము లేమిచే ఫలితముఁ జెప్పుచున్నారు ని త్యేత్యాదిగా. వీరికంటె—క్షరాక్షరపురుషులకంటె అని యర్థము. ఉత్తమః

అన్యః అను రెండుపదములు వాస్తవంబున సర్వవిధంబులను నితనియందు క్షరాక్షరాత్మత్వము లేదని దెలుపుటకొఱకు. అన్యుఁ డని చెప్పుటచే జడవర్గమునందుఁ దోఁచు స్వాతంత్ర్యమును నిరసించుచున్నారు వానికే ఇత్యాదిగా. లోకత్రయ మ్మనది యుపలక్షణము, సర్వజగత్తును వివక్షింపఁబడినది. చైతన్యమే బలము, దానియందలి శక్తియనఁగా మాయ, దానిచేత నని యర్థము. జగద్ధారణమునందుఁ బరమాత్మకు వ్యాపారాంతరము వారించుచున్నారు స్వరూ పేత్యాదిగా. వీని ధరించువాఁడు మఱియొకఁడు లేఁడు ఇతఁడు తానే యచలుఁ డగుటవలన నని చెప్పుచున్నారు అవ్యయః అని. "సంయుక్త మేతత్ క్షర మక్షరంచ వ్యక్తావ్యక్తం భరతే విశ్వమీశః" అను శ్రుతియొక్కయర్థమును గ్రహించి చెప్పుచున్నారు ఈశ్వరః అని.

హ. మూఁడవపురుషునిఁ దెలుపుటకై చెప్పుచున్నాఁడు.—ఉత్తమః = మిక్కిలి యుత్కృష్టుఁడు; పురుషః=వీనిచే జగత్తు పూర్ణము కావున పురుషుఁడు; పరమాత్మేతి; ఉదాహృతః=వేదాంతమునందు చెప్పఁబడెను. విశేషణము చేయుచున్నాఁడు.-- యః=ఏపురుషుఁడు; లోకత్రయమ్ = భూమిని అంతరిక్షమును స్వర్గమును; ఆవిశ్య; బిభర్తి =బలముచే ధరించుచున్నాఁడో; అట్లు శ్రుతి. "యేన ద్యౌ రుగ్రా పృథివీచ దృఢా, యేన స్వః స్తభితం యేన నాకః" అని. ఈశ్వరః = స్వామి.

శం. ఇట్లు కార్యకారణరూపు లైన క్షరాక్షరు లిద్దఱు పురుషు లని ప్రతిపాదించి ఉపాధిభూతు లైన యాక్షరాక్షరులకంటె భిన్నంబును తద్ధర్మకర్త్రాదిస్పర్శము లేనిదియును నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావంబును పదశబ్దార్థంబును ముక్తులచేఁ బొందఁదగినదియును నగు పరతత్త్వమును నిర్దేశించుచున్నాఁడు.—ఉత్తమః=సర్వోత్కృష్టుఁడు, "దివో జ్యాయా నన్తరిక్షా జ్జ్యాయా ర్నా, అతో జ్యాయాంశ్చ పూరుషః" అనుశ్రుతులు సర్వోత్కృష్టుఁ డని చెప్పుటవలన, ఆత్మ తానే యుత్తముఁడు, సత్తచేతను స్ఫూర్తిచేతను మహాత్తముఁడు నిరతిశయవైభవుఁడు పరిచ్ఛేదశూన్యుఁ డని యర్థము. కావుననే సర్వమునందును బరిపూర్ణుఁ డగుటవలన, పురుషః = పురుషుఁడు; ఉత్తమత్వముతోఁ గూడినపురుషత్వము ఆత్మయందుఁ దక్క నితరత్ర లే దని సూచించుచున్నది తుశబ్దము. ఉత్తముఁడైన పురుషుఁడుమాత్రము, అన్యః=సంసారకారణరూపు లైన క్షరాక్షరు లను నిద్దఱుపురుషులకన్నను అన్యుఁడు, పరమమహాత్తముఁడును చేతనుఁడును జ్ఞాతయును ప్రకాశకుఁడును ప్రకాశస్వరూపుఁడు నగుటచే నుత్కృష్టుఁ డగుటవలన నుత్తమపురుషుఁడు అసంసారియు ప్రత్యగాత్మయు, కావున నిట్టి లక్షణములు గలవాఁడు ఆ క్షరాక్షరపురుషులకంటె భిన్నుఁడే యగుచున్నాఁడు,

ఎట్లు స్థావరజంగమప్రకాశకుఁడును జ్ఞాతయు నగు సూర్యుఁడు ఆస్థావరజంగమములకంటె భిన్నుఁడును తద్ధర్మకర్మాదు లంటనివాఁడు నగుచున్నాఁడో అట్లే "నే నజ్ఞుఁడను, నాయహంకారాదికము దుష్టము" అని తనచే ప్రకాశింపఁజేయఁదగిన యజ్ఞానతత్కార్యములకంటె జ్ఞాతయు తత్ప్రకాశకుఁడు నగు నాత్మ భిన్నుఁడే యని యనుభవింపఁబడుచున్నాఁడు, అందువలన జ్ఞాతయు నతిసూక్ష్ముఁడు నసంగుఁడు నగుటచే క్షరాక్షరపురుషులకన్న భిన్నుఁడే యనియు తద్ధర్మకర్మాదు లంటనివాఁడనియు నని యెఱుంగవలయు నని యర్థము. ఓయీ! మహత్త్వము గలవాఁడును అతిసూక్ష్ముఁడునైనను వాయువునకు స్వభిన్నము లగు దుష్టాదుష్టద్రవ్యములసంబంధముచేత దుష్టాదుష్టగంధలేపము కనఁబడుచున్నది, దానిచే వాయువు దుర్గంధియు సుగంధియు నగుచున్నాఁడు, అట్లు పురుషోత్తముఁడైనయాత్మ క్షరాక్షరభిన్నుఁడైనను తత్సంబంధమువలన వానికి తద్ధర్మకర్మాదిలేప మగు నందువేని కాదు. సావయవుం డగుటవలన వాయువునకు సర్వము సంభవించును, ఆత్మయో నిరవయవత్వాదిధర్మములచే క్షరాక్షరులకంటె పరముఁ డగుటవలన తద్ధర్మకర్మాదుల నంటఁ డని బోధించుచున్నాఁడు.—పరమాత్మా—"అన్యో ఽన్తర ఆత్మా ప్రాణమయః" అని అన్నమయాదులును కూటస్థాంతములు నగుకోశము లాత్మ లని శ్రుతి చెప్పుటవలన ఆత్మశబ్దవాచ్యులైన క్షరాక్షరులకంటె నిరవయవుఁ డతిసూక్ష్ముఁ డంతరుఁడు ప్రత్యగ్రూపుఁడు జ్ఞాత భాసకుఁడు వ్యాపకుఁ డసంగుఁ డగుటచే నిరతిశయుఁ డగుటవలన ప్రత్యగాత్మ ప్రకృతితత్కార్యములకు స్పృశింప నశక్యుఁ డగుటచే పరముఁ డని చెప్పఁబడుచున్నాఁడు, పరముఁడైనయాత్మ; ఇతి ఉదాహృతః=అని "ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః। మనసస్తు పరా బుద్ధిర్బుద్ధే రాత్మా మహాన్పరః॥ మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః। పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరాగతిః, దివ్యోహ్యమూర్తః పురుషః సబాహ్యాభ్యన్తరోహ్యజః। అప్రాణో హ్యమనాశ్శుభ్రో హ్యక్షరాత్పరతః పరః, అతో జ్యాయాంశ్చ పూరుషః। పాదో ఽస్య విశ్వా భూతాని। త్రిపాదస్యామృతం దివి" ఇత్యాది శ్రుతులచేఁ బ్రతిపాదింపఁబడిన దని యర్థము. పరమత్వ చేతనత్వ జ్ఞాతృత్వ ప్రకాశకత్వాదిధర్మములచేత నుత్తముఁడైనపురుషునకు సంసారతత్కారణరూపులైన క్షరాక్షరులకంటె నన్యత్వమేది చెప్పఁబడినదో దానినే వెండియు విశేషణములచే స్పష్టీకరించుచున్నాఁ డుత్తరార్థముచేత. అందు క్షరాక్షరులకన్న ఆత్మ యన్యుఁడే యనుటను చెప్పుచున్నాఁడు.—అవ్యయః—సుషుప్తిసమాధులయుం దాక్షరాక్షరులకు వ్యయము—నాశము కలుగుచున్నను ఆత్మ తాను నాశము నొందఁడు కావున నవ్యయుఁడు, హేతుగర్భం బీవిశేషణము, "ఆత్మ క్షరాక్షరపురుషులకంటె నన్యుఁడు,

అవ్యయుఁ డగుటవలన, ఏది తదన్యము కాదో అది యవ్యయము కాదు, బుద్ధ్యాదికమువలె.” అను ననుమానమువలన సుషుప్తిసమాధులయందు క్షరాక్షరవ్యయసాక్షియై యున్నయాత్మకు వ్యయము లేమివలన నిత్యత్వమువలన క్షరాక్షరపురుషులకంటె నన్యత్వంబును ఉత్తమత్వంబును సిద్ధము. మఱియును. ఈశ్వరః=తనసన్నిధానమాత్రముచేత క్షరాక్షరుల వ్యాపారములకు హేతు వగుటవలన ఈశ్వరుఁడు, హేతుగర్భితం బీవిశేషణము, ఆత్మ నారికంటె భిన్నుఁడు, వారిప్రవృత్తికి హేతువగుటవలన, రాజువలె; తనచేఁ బ్రవర్తింపఁ జేయఁదగిన ప్రధానాదులకంటె రాజున కెట్లు భిన్నత్వమును నుత్తమత్వంబును కలుగుచున్నదో అట్లాత్మకుఁ దనచేఁ బ్రవర్త్యులైన క్షరాక్షరులకంటె భిన్నత్వంబును నుత్తమత్వంబును సిద్ధము. మఱియును. యః=ఎవ్వఁడు; లోకత్రయమ్=లోక్యంతే—ఎఱుంగఁబడుచున్నవి కావున లోకము లనఁగా అభిమానిసహితములును నవస్థాసహితములు నగు సమష్టివ్యష్టిరూపములైన స్థూలసూక్ష్మకారణదేహములు, వానియొక్క త్రయము లోకత్రయము—స్థూలసూక్ష్మకారణములు అను మూఁడుశరీరములు, వాని; ఆవిశ్య = వెలుపలను లోపల నంతట వ్యాపించి; బిభర్తి = సత్తను స్ఫూర్తిని ఇచ్చుచు ధరించుచున్నాఁడో, “వ్యక్తావ్యక్తం భరతే విశ్వ మీశః”అను శ్రుతివలన. “ఆత్మ తనచే ధార్యమైనలోకత్రయముకంటె భిన్నుఁడు ఆధార మగుటవలన, చిత్రాధారకుడ్యమువలె” అను ననుమానమువలన నాత్మకు క్షరాక్షరులకంటెభిన్నత్వమును ఉత్తమత్వమును సిద్ధము. లేక. లోక్యన్తే—చూడఁబడుచున్నవి కావున లోకము లనఁగా అభిమానిభోగ్యార్థసహితములైన జాగ్రత్స్వప్నసుషుప్తులు, వానియొక్క త్రయము లోకత్రయము, దానిని; ఆవిశ్య = వ్యాపించి; బిభర్తి = ప్రకాశింపఁజేయు చున్నాఁడు, “జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపఞ్చం యత్ప్రకాశతే” అను శ్రుతివలనను, “ఆత్మ స్వప్రకాశ్యమైన లోకత్రయముకంటె భిన్నుఁడు, ప్రకాశకుఁ డగుటవలన, సూర్యునివలె” అను ననుమానమువలనను, “ఎవ్వఁడను జాగ్రత్త ననుభవించితినో ఎవ్వఁడను స్వప్నముఁ జూచితినో ఎవ్వఁడను సుఖముగా నిద్రించితినో అతఁడే నేను” అను ప్రత్యభిజ్ఞ యుండుటవలనను, ప్రకాశకుఁ డగునాత్మ లోకత్రయభిన్నుఁ డనుటకు శ్రుతియు ననుమానంబును ప్రత్యక్షంబును బ్రమాణములు. ఆత్మకు లోకత్రయప్రకాశకత్వము సిద్ధించుటచే నిత్యత్వమును పరమమహత్త్వమును చేతనత్వమును ప్రకాశస్వరూపత్వమును అకర్తృత్వమును అభోక్తృత్వమును అవిక్రియత్వమును సిద్ధము. అవ్యయుఁడు నీశ్వరుఁడు భర్తయు నగుటచే క్షరాక్షరపురుషులయిద్దఱికన్నను మిక్కిలి యుత్కృష్టుఁ డగుటవలన ఆత్మ పురుషోత్తముం డనుట సర్వప్రమాణసిద్ధ మని భావము.

**మ.** ఈ క్షరాక్షరులకంటె విలక్షణుఁడు క్షరాక్షరద్వయదోషము స్పృశింపనివాఁడు నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడు.—ఉత్తమః=మిక్కిలి యుత్కృష్టుఁడగు; పురుషస్తు=పురుషుఁడో; అన్యః=భిన్నుఁడే, జడరాసులైన క్షరాక్షరులకంటె అత్యంత విలక్షణుఁడు, రెండురాసులను ప్రకాశింపఁజేయునట్టి మూఁడవదైన చేతనరాశి యని యర్థము. పరమాత్మేత్యుదాహృతః=అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమ యానందమయము లను నవిద్యాకల్పితాత్మల నైదింటికన్నను పరముఁడు — ప్రకృష్టుఁడు, అకల్పితుఁడు బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా అని చెప్పఁబడిన యాత్మ, సర్వభూతములకును ప్రత్యక్చేతనుఁడు, కావున పరమాత్మయని చెప్పఁబడెను వేదాంతములయందు. యః = ఏపరమాత్మ; లోకత్రయమ్ = భూ ర్భువః స్వ ర్లోకముల మూఁటిని, సర్వజగంబు నని యర్థము; ఆవిశ్య = తన మాయాశక్తిచేత నధిష్ఠించి; బిభర్తి = సత్తాస్ఫూర్తుల నిచ్చుటచే ధరించుచున్నాఁడు పోషించుచున్నాఁడు గూడ. ఎట్టివాఁడు? అవ్యయః = సర్వవికారశూన్యుఁడు; ఈశ్వరః=సర్వమును నియమించువాఁడు నారాయణుఁడు. అతఁ డుత్తమపురుషుఁడు పరమాత్మ యని చెప్పఁబడె నని యన్వయము, "స ఉత్తమః పురుషః" అను శ్రుతివలన.

**శ్రీ.** ఎవ్వనిఁ జెప్పుటకొఱ కీక్షరాక్షరులు చెప్పఁబడిరో వానిఁ జెప్పుచున్నాఁడు.—ఈ క్షరాక్షరులకంటె, అన్యస్తు = విలక్షణుఁ డైనవాఁడో; ఉత్తమః పురుషః. వైలక్షణ్యమునే చెప్పుచున్నాఁడు.—పరమాత్మేతి=పరముఁ డైన యాత్మ యని; ఉదాహృతః = శ్రుతులచేఁ జెప్పఁబడెను. ఆత్మ యగుటచే అచేతనుఁ డైన క్షరునికంటె విలక్షణుఁడు, పరముఁ డగుటచే చేతనుఁడై భోక్త యగునక్షరునికంటె విలక్షణుఁ డని యర్థము. పరమాత్మత్వమునే చెప్పుచున్నాఁడు.—యః = ఎవ్వఁడు; ఈశ్వరః = ఈశనశీలుఁడై; అవ్యయః = నిర్వికారుఁడే యగుచు; లోకత్రయమ్ = లోకత్రయమును సర్వమును; ఆవిశ్య; బిభర్తి = పాలించుచున్నాఁడో.

**ప.** ఇఁక వారికంటె విలక్షణుఁడైన పురుషోత్తమునిఁ జెప్పుచున్నాఁడు.—అన్యః = వారికంటె విలక్షణుఁడు; ఉత్తమః పురుషః. వాఁడే; పరమాత్మేతి; ఉదాహృతః = చెప్పఁబడెను. యః, ఆవిశ్య=అంతటను బ్రవేశించి; లోకత్రయం బిభర్తి, "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అను శ్రుతివలన; అవ్యయః=నిర్వికారుఁడు; ఈశ్వరః = నియామకుఁడు సూత్రాత్మ.

రా. ఉత్తముండైన పురుషుండో, క్షరాక్షరశబ్దములచే చెప్పంబడిన బద్ధముక్తపురుషు లిద్దఱికన్నను, అన్యః = భిన్నుండు; పరమాత్మేత్యుదాహృతః = పరమాత్ముండని చెప్పంబడెను సర్వశ్రుతులయందును. పరమాత్మ యని చెప్పుటవలననే యుత్తమపురుషుండు బద్ధముక్తపురుషులకంటె నర్థాంతరభూతుండని తెలియవచ్చుచున్నది. ఎట్లు? యః లోకత్రయ మావిశ్య బిభర్తి = లోక్యతే — తెలియంబడుచున్నది కావున లోకము, ఆలోకములమూండు లోకత్రయము, అచేతనమును తత్సంసృష్టుండైన చేతనుండును ముక్తుండును అని ప్రమాణముచే దెలియఁనచ్చునట్టి యీమూంటిని ఏయాత్మ యావేశించి భరించుచున్నాండో అతండు వ్యాప్యము భర్తవ్య మగు నాలోకత్రయముకంటె భిన్నుండు. ఇందువలనంగూడ నతం డీలోకత్రయముకంటె భిన్నుండు. ఎందువలన ననంగా నతండు, అవ్యయః ఈశ్వరః—అవ్యయస్వభావుండు వ్యయస్వభావ మైన యచేతనముకన్నను తత్సంబంధముచే తదనుసారి యైనచేతనునికన్నను అచిత్సంబంధయోగ్యతచే బూర్వసంబంధి యగు ముక్తునికన్నను భిన్నుండే గదా! అట్టిలోకత్రయమున కీశ్వరుం డీశితవ్య మైన లోకత్రయమునకంటె భిన్నుండు.

మా. *

యస్మాత్ క్షర మతీతో ఽహ మక్షరా దపి చోత్తమః
అతో ఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః. ౧౮

భా. ఇంతవఱకు వ్యాఖ్యాతుండగు నీశ్వరునిపురుషోత్తముండనునీ నామము లోకవేదములయందుం బ్రసిద్ధము. ఆ నామమునకు నిర్వచన ప్రసిద్ధిచే నర్థవత్త్వముం దెలుపుచుం దాను నిరతిశయుండని తెలుపుచున్నాండు భగవంతుండు.—యస్మాత్ = ఎందువలన; అహమ్ = నేను; క్షరమ్ = అశ్వత్థాఖ్య మైన సంసారమాయావృక్షమును; అతీతః=అతిక్రమించినవాండనో; అక్షరాదపిచ=సంసారవృక్షమునకు బీజభూత మైన దానికన్నను; ఉత్తమః = మిక్కిలి యుత్కృష్టుండైనవాండనో, లేక, మిక్కిలి యూర్ధ్వుండనో; అతః = అందువలన, ఇట్లు క్షరాక్షరులకంటె నుత్తముండ నగుటవలన; లోకే = లోకమునందును; వేదేచ = వేదమునందును; పురుషోత్తమః = పురుషోత్తముండని; ప్రథితః = ప్రఖ్యాతుం

* అధ్యాయసమాప్తి వఱకు కీభాష్యము లేదు.

డను; అస్మి=అగుచున్నాను. నేను పురుషోత్తముఁ డని భక్తజను లెఱుంగు దురు, కవులును కావ్యాదులయం దీనామమును నిబద్ధముఁ గావింతురు, పురుషోత్తముఁ డను నీనామముచేత నన్ను లోకులు వ్యవహరింతురు.

నేను అశ్వత్థాఖ్యసంసారమాయావృక్షరూపుఁ డగు క్షరపురుషు నతిక్ర మించినవాఁడనై అసంసారవృక్షమునకు బీజభూత మైన యజ్ఞానమే యగు నక్షరపు రుషునికంటె నుత్కృష్టుఁడనై యున్నవాఁడను కావున లోకమునందును వేదమునం దును నాకుఁ బురుషోత్తముఁ డను పేరు ప్రసిద్ధమై యున్న దని తాత్పర్యము.

ఆ. లోకవేదములయందుఁ బురుషోత్తమనామము భగవంతునకుఁ బ్రసిద్ధ మగుటచే అప్రపంచత్వము సిద్ధ మని చెప్పుచున్నారు ఇంతవఱకు ఇత్యాదిగా. అశ్వకర్ణాదిశబ్దమువలె నీనామము రూఢి మగుటవలన అర్థవిశేషము లేమివలన లౌకికేశ్వరునకువలె భగవంతునకుఁగూడ నీశ్వరత్వము సాతిశయ మనఁగా కా దని చెప్పుచున్నారు ఆనామమునకు ఇత్యాదిగా.

హ. పురుషోత్తమనామము నిర్వచించుటకై చెప్పుచున్నాఁడు.—యస్మాత్; క్షరమ్ = క్షరపురుషుని; అతీతః = అతిక్రమించినవాఁడను; అక్షరాదపిచ=అక్షర పురుషునికన్నను; ఉత్కృష్టతముఁడను, సర్వపాప్మములవలన ఉదితుఁడ * నగుట వలన. అట్లు శ్రుతి "ఉదితినామ స ఏవ సర్వేభ్యః పాప్మభ్య ఉదితః" అని. అతః= ఈకారణమునవలన; ఈ లోకమునందును వేదమునందును పురుషోత్తముఁ డని ప్రసిద్ధుఁ డను. అందువలన నేను సర్వలోకప్రసిద్ధుఁడ నని యర్థము.

శం. అవ్యయత్వము ఈశ్వరత్వము భర్తృత్వము మొదలగుధర్మముల చేతఁ బురుషోత్తమత్వము సిద్ధించువిధమునే విశదీకరించుచు "అట్టిది గదా నానా మముయొక్కయర్థవత్త్వము వేదశాస్త్రప్రసిద్ధం" బని ప్రతిపాదించుద్వారమున తన యొక్కయవిక్రియత్వంబును అసంసారిత్వంబును సచ్చిదానందైకరసత్వంబును అద్వి తీయత్వంబును సూచించుచున్నాఁడు.—యస్మాత్=ఎందువలన; నిత్యత్వజ్ఞాతృత్వాది ధర్మములచేత, క్షరమ్ = మహదాదిస్థూలాంతరూపుఁడును ఉత్పత్తిలయాదివికార ములు గలవాఁడును కర్తృత్వభోక్తృత్వాదిసంసారధర్మవిశిష్టుఁడు నగు కార్యలక్షణుఁ డైనపురుషుని; అహమ్ = నేను; అతీతః=అతిక్రమించినవాఁడ నగుచున్నానో, నిత్య త్వాదిధర్మములచేత విలక్షణుఁడనగుటచే నుత్కృష్టుఁడ నగుటవలన క్షరపురుషునికంటె

* విముక్తుఁడను, లేక, ఊర్ధ్వగతుఁడను.

నుత్తముఁడ నగుచున్నానో యని యర్థము. అట్లు, ప్రకాశస్వరూపత్వము ప్రకాశకత్వము ఆధారత్వము మొదలగుధర్మములచేత మహత్తరుఁడ నగుటవలన, అక్షరాదపిచ = సంసారబీజ మైన యవ్యక్తముకన్నను; ఉత్తమః=ఉత్తముఁడ నగుచున్నానో. అతః = ఇందువలననే; లోకే = పురాణమునందును; వేదేచ = వేదములయందును; పురుషోత్తమః = ఉక్తలక్షణు లైన క్షరాక్షరపురుషులకంటె నిష్కలత్వ నిత్యత్వ నిర్గుణత్వ చేతనత్వాదిధర్మములచేత నుత్తముఁడ నగుటవలన పురుషోత్తముఁ డని, ఈ పురుషులతోను వీరిధర్మకర్మావస్థలతోను సంబంధము లేశమేనియు లేనివాఁడ నగుటవలన నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడను కేవల సచ్చిదానందైకరసుఁడను పరమాత్మ నని; ప్రథితః=ప్రసిద్ధుఁడను, "మహతో ఽవ్యక్త ముత్తమమ్, అవ్యక్తాత్తు పరః పురుషః, పురుషాన్న పరం కించిత్, అయమాత్మా సన్మాత్రో నిత్యః శుద్ధో బుద్ధః సత్యో ముక్తో నిరఞ్జనో విభు రద్వయ ఆనన్దః పరః ప్రత్యగేకరసః, తేభ్యో విలక్షణః సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః" ఇత్యాది శ్రుతులచేతను, "కార్యకారణసంబన్ధరహితః కేవలః శివః" ఇత్యాది స్మృతులచేతను ప్రతిపాదింపఁబడినవాఁడ నని యర్థము. చిత్రము నతిక్రమించి గోడ యున్నది యనునపుడు యుక్తిచేతను సూక్ష్మబుద్ధిచేతను విచారింపఁగా గోడకంటె భిన్నముగా చిత్రముయొక్క స్వరూపము గనఁబడదు, గోడసత్తకంటె భిన్నముగా చిత్రమునకు వేఱుసత్త లేమివలన. అట్లు. క్షరాక్షరాఖ్యపురుషుల నతిక్రమించినవాఁడ నన్నపుడు "వికల్పో నహి వస్తు, మాయామాత్ర మిదం ద్వైతమ్, అసత్త్వా దన్యస్య" ఇత్యాదిశ్రుతులచేతను "ఇది యంతయు నసత్తు, మాయాకార్య మగుటవలన, ఇంద్రజాలమువలె." "సర్వమును సన్మాత్రమె, సదనుగత మగుటవలన, మృత్తికానుగత ఘటమువలె" ఇత్యాదియుక్తులచేతను విచారింపఁగా పరమాత్మసత్తకంటె భిన్నముగా అక్షరాక్షరపురుషులకు వేఱుసత్త లేమివలనను "సర్వం హ్యేత ద్బ్రహ్మ" ఇత్యాది శ్రుతివాక్యబలమువలనను పురుషోత్తమాఖ్య మగు పరబ్రహ్మ మద్వితీయమే యగుచున్నది. అందువలన సర్వంబును బ్రహ్మమే యని యెఱుంగవలయు నని సిద్ధము.

మ. ఇప్పుడు యథావ్యాఖ్యాతుఁడు క్షరాక్షరవిలక్షణుఁ డైన యీశ్వరుని పురుషోత్తముఁ డను ప్రసిద్ధనామము నిర్వచించుటచేత యిట్టి పరమేశ్వరుఁడు నేనే యని తన్నుఁ దెలుపుచున్నాఁడు భగవంతుఁడు, "బ్రహ్మణో హి ప్రతిష్ఠా ఽహమ్, త ద్ధామ పరమం మమ" అని మున్ను చెప్పిన తనమహిమ నిర్ధారించుకొఱకు.—యస్మాత్ = ఎందువలన; క్షరమ్ = కార్య మగుటచే వినాశి యైన మాయామయ

మగు నశ్వత్థాఖ్యసంసారవృక్షమును; అహమ్ = నేను పరమేశ్వరుఁడను; అతీతః = అతిక్రమించినవాఁడనో; అక్షరాదపిచ = మాయాఖ్య మైన యవ్యాకృతముకన్నను, "అక్షరా త్పరతః పరః" అను శ్రుతియందు పంచమ్యంతాక్షరపదముచేతఁ బ్రతిపాదిత మైన సంసారవృక్షబీజభూత మగు సర్వకారణముకన్నను; ఉత్తమః=మిక్కిలి యుత్కృష్టుఁడనో; అతః = పురుషోపాధులై యధ్యాసంబున పురుషపదముచే వ్యవహరింపఁబడునట్టి యీక్షరాక్షరులకన్న నుత్తముఁడ నగుటవలన; లోకే వేదేచ; పురుషోత్తమః = పురుషోత్తముఁ డని; ప్రథితః = ప్రఖ్యాతుఁడను; అస్మి = అగుచున్నాను. "స ఉత్తమః పురుషః" అని వేద ముదాహరింపఁబడియే యున్నది. లోకమునందును కవికావ్యాదులయందు "హరి ర్హ్య క్షక పురుషోత్తమః స్మృతః" ఇత్యాదికము ప్రసిద్ధము.

కారుణ్యంబున మానుషాకృతిఁ గృతు ల్గావించుచు న్గ్రీడి కం
సారం దెల్పె నిజేశ్వరత్వము మహోదారుండు సచ్చిత్సుఖా
కారుం డాపురుషోత్తమోత్తమపదఖ్యాతుండు నారాయణుం
డారా పారము లేదు తన్మహిమకున్ స్వాంతంబునం దెన్నఁగన్.

కరణముల నొచ్చి భోగము కడఁ దొలంచి
యోగి మొనరింత్రు విమలాత్మ యోగు లేను
బరమపూరుషుని యనంతపార మమృత
సారమహిమంబు చవిగొంచుఁ జనుదు ముక్తి.

శ్రీ. తన యీపురుషోత్తమత్వము నామనిర్వచనముచేఁ దెలుపుచున్నాఁడు.—యస్మాత్; క్షరమ్ = జడవర్గమును; అతీతః=నే నతిక్రమించినవాఁడనో, నిత్యముక్తుఁడ నగుటవలన; అక్షరాత్ = చేతనవర్గముకన్నను; ఉత్తమః, నియంత నగుటవలన; అతః; లోకే వేదేచ; పురుషోత్తమః = పురుషోత్తముఁ డని; ప్రథితోస్మి = ప్రఖ్యాతుఁడ నగుచున్నాను. అట్లు శ్రుతి; "సవా అయమాత్మా సర్వస్య వశీ సర్వస్యేశానః సర్వ స్యాధిపతిః సర్వ మిదం ప్రశాస్తి" ఇత్యాదికము.

ప * పురుషోత్తమః=దేహాభిమానిజీవునకుఁ బురుషుఁ డని సంజ్ఞ, వానికంటె నుత్తముఁడను కావునఁ బురుషోత్తముఁడ నని, లోకమునందుఁ బ్రసిద్ధుఁడను.

---

* పదయోజన శ్రీధరీయముతో సమానము.

"నహి నిర్మూలా ప్రసిద్ధిః" — నిర్మూల మైనప్రసిద్ధి లేదు గదా అను న్యాయముచేత, "ఏతావానస్య మహిమా అతో జ్యాయాంశ్చ పూరుషః" అని వేదమునందును ప్రసిద్ధుఁడను. అది యథర్వవేదమందును చెప్పఁబడినది. "ఇన్ద్రియేభ్యః పరం మనో మనసః సత్త్వ ముత్తమమ్ । సత్త్వా దపి మహానాత్మా మహతో ఽవ్యక్త ముత్తమమ్॥ అవ్యక్తాత్పరః పురుషో వ్యాపకో ఽలింగ ఏవచ । యం జ్ఞాత్వా ముచ్యతే జన్తు రమృతత్వంచ గచ్ఛతి" అని. స్పష్టార్థము.

రా. ఎందువలన ఈ చెప్పఁబడినస్వభావములచేత క్షరపురుషుని నే నతిక్రమించినవాఁడనో, అక్షరునికన్నను — ముక్తునికన్నను పై చెప్పినకారణములచేత మిక్కిలి యుత్కృష్టుఁడనో, అందువలన నేను లోకమందును వేదమందును పురుషోత్తముఁ డని ప్రసిద్ధుఁడ నైతిని. వేదార్థావలోకనమువలన లోకశబ్దముచేత నిట స్మృతి చెప్పఁబడుచున్నది. శ్రుతియందును స్మృతియందును అని యర్థము. అందు శ్రుతియందు "పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపే ణాభి నిష్పద్యతే, స ఉత్తమః పురుషః" ఇత్యాదియందు. స్మృతియందును "అంశావతారం పురుషోత్తమస్య హ్యనాదిమధ్యాన్త మజస్య విష్ణోః" ఇత్యాదియందు.

యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత. ౧౯

భా. ఇఁక నిప్పుడు నిర్వచించినప్రకారమున త న్నెవఁ డెఱుంగుచున్నాఁడో వాని కీఫలము చెప్పుచున్నాఁడు.—యః = ఎవ్వఁడు; మామ్=నన్ను ఈశ్వరుని, యథోక్తవిశేషణుని; ఏవమ్=యథోక్తప్రకారంబున; పురుషోత్తమమ్=పురుషోత్తముని; అసమ్మూఢః=సమ్మోహవర్జితుఁడై; జానాతి = ఇతఁడే నే నని యెఱుంగుచున్నాఁడో; సః = అతఁడు; సర్వవిత్ =సర్వాత్మతచే సర్వంబును ఎఱుంగుచున్నాఁడు కావున సర్వజ్ఞుఁడు; సర్వభావేన = సర్వాత్మచిత్తతచేత; మామ్=సర్వభూతస్థుఁ డగు నన్ను; భజతి = పొందుచున్నాఁడు. భారత = అర్జునుఁడా!

అర్జునా! ఏపురుషుఁడు మున్ను చెప్పిన సర్వాత్మత్వాదివిశేషణములతోఁ గూడిన యీశ్వరుని నన్ను ఇప్పుడు చెప్పిన క్షరాక్షరాతీతత్వముచేఁ బురుషోత్తముఁ డని ప్రసిద్ధుఁ డైనవానిని మోహము లేనివాఁడై యితఁడే నే నని యెఱుంగుచున్నాఁడో అతఁడు సర్వాత్మబుద్ధి గలవాఁడై సర్వము నెఱింగినవాఁడు కావున

సర్వజ్ఞుఁ డగును, సర్వాత్ముఁడ నగు నాయందే నిలిచినచిత్తము గలవాఁడై సర్వభూతస్థుఁడ నగు నన్నే పొందుచున్నాఁడు.

ఆ. ఆత్మయొక్కయప్రపంచత్వమును జ్ఞానఫలము చెప్పుటచే స్తుతించుచున్నారు ఇఁకనిత్యాదిగా.—యథోక్తవిశేషణుని—సర్వాత్మత్వాదివిశేషణములతోఁ గూడినవాని నని యర్థము. యథోక్తప్రకారంబున—క్షరాక్షరాతీతత్వమున. సమ్మోహవర్జితుఁడై—సమ్మోహ మనఁగా దేహాదులయందు తాను తనది యనుబుద్ధి, దానిచేత విడువఁబడినవాఁడై యని యర్థము. భగవంతు నెఱింగినవాఁడే సర్వజ్ఞుఁడు, భగవంతుఁడే సర్వబుద్ధిచేత నెఱుంగఁదగినవాఁ డగుటవలన నని చెప్పుచున్నారు సః ఇత్యాదిగా. సర్వాత్మచిత్తతచే—సర్వాత్ముఁడ నగు నాయందే యాసక్తమైనచిత్తము గలవాఁ డగుటచేత నని యర్థము.

హ. ఇఁక నిప్పు డెవ్వఁడు పురుషోత్తముఁ డను పేరు గల పురుషు నెఱుంగుచున్నాఁడో వానిఫలము చెప్పుచున్నాఁడు.—యః; మామ్—పరమేశ్వరుని; ఏవమ్; అసమ్మూఢః — నిశ్చితమైనబుద్ధి గలవాఁడై; పురుషోత్తమం జానాతి. నామ కర్మస్వరూపబలవీర్యతేజములచేత నని యర్థము.

శం. ఇట్లు మాయాతత్కార్యములతోఁ సంబంధము లేనివాఁ డగుటచేఁ దాను నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁ డని ప్రతిపాదించి ఇట్టివాని నన్నెవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడు ముక్తుఁ డగు నని చెప్పుచున్నాఁడు.—అనేకజన్మసహస్రములయందు శ్రద్ధాభక్తులతోఁ సత్కర్మములఁ బరమేశ్వరు నారాధించి తత్ప్రసాదమునకుఁ బాత్రభూతుఁడై దైవసంపద్విశిష్టుఁడైన శుద్ధాత్ముఁడు, యః = ఏముముక్షువైన యధికారి; శమదమసన్న్యాసాదిసాధనసంపత్తితోఁ జేయఁబడిన శ్రవణాదులచేఁ గలిగినజ్ఞానముచేత, ఏవమ్ = పై చెప్పినలక్షణములు గలవాఁడను, నిత్యత్వేశ్వరత్వాదిధర్మములచే క్షరాక్షరవిలక్షణుఁడను; పురుషోత్తమమ్ = పురుషోత్తముఁడను సర్వసంసారధర్మనిర్ముక్తుఁడను సదానందైకరసుఁడను అద్వితీయుఁడ నగు; మామ్—పరమాత్మను; జానాతి=ఇతఁడే నే నని స్వస్వరూపంబున సాక్షాత్కరించుచున్నాఁడో; సః = అతఁడు; సర్వవిత్ =సర్వమును బ్రహ్మమే యని యపరోక్షముగా సర్వమును బ్రహ్మమునుగా నెఱింగినవాఁడు కావున సర్వజ్ఞుఁడు; అందువలననే, అసమ్మూఢః = దేహేంద్రియాదులయందు నేను నాది యనుబుద్ధి గలవాఁడు సంమూఢుఁడు, తద్విలక్షణుఁడు అసమ్మూఢుఁడు, దేహాదులయం దహంభావమమభావములు

లేనివాఁడై; సర్వభావేన = నేనే ఇది యంతయు ననునది సర్వభావము దానిచేత, సర్వాత్మతచేత, సర్వాత్మభావప్రాప్తిచేత; మామ్; భజతి = పొందుచున్నాఁడు, ఈ దేహము పడినపిదపఁ బూర్ణాత్ముఁడై నిలుచుచున్నాఁ డని యర్థము. లేక, యః = ఏముముక్షువు; అసంమూఢః=విషయాశాపరవశుఁడు సమ్మూఢుఁడు, అట్లు కానివాఁ డసమ్మూఢుఁడు, ఎల్ల యేషణలనుండియు వ్యుత్థితుఁడై; మామ్ = ఇట్టి లక్షణములు గల నన్ను; పురుషోత్తమమ్; జానాతి = స్వస్వరూపమున నెఱుఁగుచున్నాఁడో; స సర్వవిత్; సర్వభావేన = సర్వమును బ్రహ్మమే యని సర్వత్ర బ్రహ్మదృష్టిచేత; మామ్; భజతి = జ్ఞానమునకును తత్ఫలమునకును బ్రతిబంధము లే కుండుటకొఱకు న న్ననుసంధించుచున్నాఁడు. నిర్మానమోహత్వాదిసాధనసంపత్తితో సర్వభావమున నన్ను భజించుచున్నవాఁడై బ్రహ్మజ్ఞానంబునకును తన్నిష్ఠకును ఫల మైన యా యవ్యయపదమును పొందు నని మున్నే చెప్పఁబడిన దని యెఱుఁగవలయును.

మ ఈ నామనిర్వచనము దెలియుటకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.— యః; మామ్—ఈశ్వరుని; ఏవమ్ = యథోక్తనామనిర్వచనముచేత; అసమ్మూఢః = ఈ కృష్ణుఁడును ఒకానొకమనుష్యుఁడే యను సమ్మోహము లేనివాఁడై; పురుషోత్తమమ్ = మున్ను చెప్పఁబడినయర్థము గల పురుషోత్తమునిఁగా; జానాతి=ఈశ్వరుఁడే యితఁ డని యెఱుంగుచున్నాఁడో; సః=అతఁడు; మామ్; భజతి=సేవించుచున్నాఁడు; సర్వవిత్ = నన్ను సర్వాత్మునిఁగా నెఱుంగుచున్నాఁడు కావున నతఁడే సర్వజ్ఞుఁడు; సర్వభావేన = ప్రేమలక్షణం బగు భక్తియోగముచేత. ఓభారతుఁడా! అందువలన, "మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే । సగుణా న్సమతీత్యైతా న్బ్రహ్మభూయాయ కల్పతే" అని యేది చెప్పఁబడినదో అది యుపపన్నము. మఱియు "బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహమ్" అని చెప్పినదియు నుపపన్నతరము.

క్షేమము గోరువారలు భజింపుఁడు చిత్సుఖధామముం ఘన
శ్యామము వేదసారము వ్రజప్రమదాకుచభారహారముం
భూమికి భారముం దలఁగ మూర్త్యవతారము మాటి కొందునా
శ్రీమహముం బొరిం భజనసిద్ధులకుం భవవార్ధిపారముం. ౧౯

శ్రీ. ఇట్టి యీశ్వరు నెఱింగినవానికి ఫలము చెప్పుచున్నాఁడు.—యః; ఏవమ్ = చెప్పినవిధంబున; అసమ్మూఢః = నిశ్చిత మగుబుద్ధి గలవాఁడై; మాం

పురుషోత్తమం జానాతి=నన్ను పురుషోత్తమునిఁగా నెఱుంగుచున్నాఁడో; సః; సర్వభావేన = సర్వప్రకారముచేతను; మాం భజతి=నన్నే భజించుచున్నాఁడు. అందువలన, సర్వవిత్ = సర్వజ్ఞుఁ డగుచున్నాఁడు.

ప. *

రా. యః; ఏవమ్ = చెప్పినప్రకారంబున; పురుషోత్తమం మామ్; అసంమూఢో జానాతి—క్షరాక్షరపురుషులకంటె అన్యయస్వభావుఁడ నగుటచేతను వ్యాపన భరణైశ్వర్యములు గలవాఁడ నగుటచేతను నన్ను విలక్షణునిఁగా నెఱుఁగుచున్నాఁడో; స సర్వవిత్ = అతఁడు మత్ప్రాప్తి కుపాయముగా దేని నెఱుఁగవలయునో దాని నెఱింగినవాఁడు; సర్వభావేన మాం భజతి = మత్ప్రాప్తి కుపాయములుగా భజనప్రకారము లేవి చెప్పఁబడినవో ఆసర్వభజనప్రకారములచేతను అతఁడు నన్ను భజించుచున్నాఁడు. సమస్తము లైన మద్విషయజ్ఞానములచే నా కే ప్రీతి కలుగునో మఱియు మద్విషయము లైన భజనములచే నా కేప్రీతి కలుగునో రెండువిధము లైన యాప్రీతియు నీజ్ఞానముచే నాకుఁ గలుగుచున్నది.

ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయాఽనఘ ।
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్య శ్చ భారత. ౨౦

భా. ఈ యధ్యాయమునందు మోక్షఫలం బగు భగవత్తత్త్వజ్ఞానము ప్రతిపాదించి యిఁక నిప్పుడు దాని స్తుతించుచున్నాఁడు.—ఇతి= ఈ; గుహ్యతమమ్ = గోప్యతమ మైన, మిక్కిలి రహస్య మైన యనుట; శాస్త్రమ్=శాస్త్రము; గీతాగ్రంథము సమస్తమును శాస్త్ర మని చెప్పఁబడుచున్నది వాస్తవమే, అయినను ఈయధ్యాయమే యిట స్తుతికొఱకు శాస్త్ర మని చెప్పఁబడుచున్నది, ప్రకరణమువలన, సమస్త మైన గీతాశాస్త్రార్థమునుం గదా ఇట సంక్షేపమునఁ జెప్పఁబడినది, ఇంతియ కాదు, సమస్తమైన వేదార్థముగూడ నిందుఁ బరిసమాప్తము, "య స్తం వేద స వేదవిత్, వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః" అనియుఁ బ్రతిపాదింపఁబడినది; ఇదమ్ = ఇది; మయా = నాచేత; ఉక్తమ్ = చెప్పఁబడినది. అనఘ = పాపము లేనివాఁడా. ఏతత్ =ఈ శాస్త్రమును; నేను దెల్పిన విధమున, బుద్ధ్వా = ఎఱింగి; బుద్ధిమాన్ = జ్ఞానవంతుఁడు; స్యాత్ =

* శ్రీధరీయముతో సమానము.

అగును, వేఱువిధమున కాఁడు. కృతకృత్యశ్చ = చేయఁబడిన చేయవల సినది గలవాఁడును అగును, ఉత్తమజన్మజాతుఁ డగు బ్రాహ్మణుఁ డేది చేయవలయునో అది సర్వంబును భగవత్తత్త్వము నెఱింగినయెడలఁ జేయఁబడినది యగు నని యర్థము, వేఱువిధమున నెవ్వరికిని గర్తవ్యము పరిసమాప్తము కా దని యభిప్రాయము, "సర్వం కర్మా౽ఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే" అని గదా చెప్పఁబడినది. "ఏతద్ధి జన్మసాఫల్యం బ్రాహ్మణస్య విశేషతః। ప్రాప్యైతత్కృతకృత్యో హి ద్విజో భవతి నాన్యథా" అని మానవవచనముగూడ. ఈ పరమార్థతత్త్వము నా వలన విన్నవాఁడవు కావున కృతార్థుఁడవు నీవు, భారత=ఓ యర్జునుఁడా.

పాపరహితుఁడ వైన ఓయర్జునుఁడా। గీతాశాస్త్రార్థమును సర్వవేదార్థ మును సంక్షేపించి పరమరహస్యమైన యీశాస్త్రమును నీకుఁ జెప్పితిని. నేను చెప్పిన ప్రకారము దీని నెఱింగినవాఁడు జ్ఞానవంతుఁడై కృతార్థుఁ డగును. వానికిఁకఁ గర్తవ్య మేమియు లే దని తాత్పర్యము.

టీ. అధ్యాయార్థము ననువదించి యుపసంహారశ్లోకము దించుచున్నారు ఈ యధ్యాయమునందు ఇత్యాదిగా. సమస్త మైనగీతయందును శాస్త్రశబ్దము చెప్పవలసియుండఁగా ఈయధ్యాయము శాస్త్ర మని యెట్లు చెప్పవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు గీతాగ్రంథము ఇత్యాదిగా. స్తుతించుటకైనను ఈయధ్యా యమునందు శాస్త్రార్థము లేకయుండఁగా శాస్త్రశబ్దం బెట్లు ప్రయోగింపనగు ననఁగా నందులకుఁ జెప్పుచున్నారు సమస్త మైన ఇత్యాదిగా. గీతాశాస్త్రార్థము సమస్తంబును ఇట సంక్షేపముగాఁ జెప్పఁబడినందువలన మాత్రమే కాదు దీనికి శాస్త్రశబ్దము, మ ఱే మనఁగా వేదార్థమంతయు నిందు పరిసమాప్త మగుటవలనఁ గూడ దీనికి శాస్త్రశబ్దము యుక్త మని చెప్పుచున్నారు ఇంతియకాదు ఇత్యాదిగా. అందు గమకమును చెప్పుచున్నారు యస్త మిత్యాదిగా. భగవత్తత్త్వము దెలియుట చేతఁ గృతకృత్యుఁ డగు నన్నదాని నుపపాదించుచున్నారు ఉత్త మేత్యాదిగా. వేఱువిధమున కాఁ డన్నదాని వివరించుచున్నారు వేఱువిధమున నిత్యాదిగా. తత్త్వ జ్ఞానము కలిగినను కర్మములు చేయవలసినవి యుండుటవలన కర్తవ్యసమాప్తి కా దని యాశంకించి చెప్పుచున్నారు సర్వ మిత్యాదిగా. తత్త్వజ్ఞానమువలనఁ గృతా ర్థుఁ డగు ననుటకు మనుస్మృతినిగూడఁ జెప్పుచున్నారు ఏత ద్ధీత్యాదిగా. భారత యని సంబోధించుటకుఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు ఈ పరమార్థతత్త్వ మిత్యాదిగా.

ఈయధ్యాయముచేత ఆత్మ దేహాద్యతిరిక్తుఁ డనియు చిద్రూపుఁ డనియు సర్వాత్ముఁ డనియు కార్యకారణవినిర్ముక్తుఁ డగుటచే ప్రపంచాతీతుఁ డనియు అతఁడే యఖండైకరసబ్రహ్మరూపుఁ డని యెఱుఁగుటవలన నశేషపురుషార్థపరిసమాప్తి యగు ననియు వర్ణింపఁబడినది.

హ. ఇతి; గుహ్యతమమ్; శాస్త్రమ్–శిక్షించునది యగుటవలనను రక్షించునది యగుటవలనను శాస్త్రము; ఉక్తమ్ = చెప్పఁబడినది. ఏతత్ = ఈశాస్త్రమును; బుద్ధ్వా; బుద్ధిమాన్ = బ్రహ్మవిదుఁడును; కృతకృత్యశ్చ = చేయఁబడినకర్తవ్యము గలవాఁడును; స్యాత్.

శం. అశోచ్యా నన్వశోచస్త్వ మ్మని యారంభించి యుపదేశించిన గీతాశాస్త్రమునకు దీని నుపలక్షణము గావించి పంచదశాధ్యాయలక్షణ మైన యీశాస్త్ర మతిరహస్య మనియు దీనియర్థము నెఱింగి పురుషుఁడు కృతార్థుఁ డగు ననియుఁ బ్రతిపాదించుచు నీయధ్యాయము నుపసంహరించుచున్నాఁడు.—ఇతి = ఈప్రకారమున; మయా = నాచేత; ఉక్తమ్ = చెప్పఁబడిన; ఇదం శాస్త్రమ్=ఈశాస్త్రము, నిర్విశేష మగు పరతత్త్వమును శాస్తి–బోధించుచున్నది కావున శాస్త్రము పంచదశాధ్యాయరూపము; గుహ్యతమమ్ = బ్రహ్మస్వరూపప్రతిపాదనపర మగుటవలన నత్యంత గోప్యము, ఎవనికిఁ గాని దుష్టుఁడును ఆసురసంపద గలవాఁడు నగువానికిఁ జెప్పను వినిపింపను గూడనిది. ఎవ్వఁడు బ్రాహ్మణాద్యుత్తమవర్ణజాతుఁడు శుభాచారనిరతుఁడై సుశీలుఁడై సర్వైషణల విడిచి మోక్షైకకాముఁ డగుచున్నాఁడో అతఁడు, ఏతత్ = ఈ పంచదశాధ్యాయరూప మైన శాస్త్రమును, దీనియందుఁ బ్రతిపాదింపఁబడిన యర్థమును; సద్గురువు ననుగ్రహమువలన, బుద్ధ్వా=చక్కఁగాఁ దెలిసి; బుద్ధిమాన్= బ్రహ్మమే నే ననుజ్ఞానమె యిట బుద్ధిశబ్దమున కర్థము, అది కలవాఁడు, బ్రహ్మజ్ఞానసంపన్నుఁడును తత్ఫలము నొందినవాఁడును; స్యాత్. కృతకృత్యశ్చ = కృతకృత్యుఁడును అగును, కృత్యము–శుద్ధాత్ము లగు బ్రాహ్మణాదులు చేయవలసిన యగ్నిహోత్రాద్యశ్వమేధాంతమును ఔపాసనాదీశానబల్యంతమును మఱియు నితరము నగు శ్రౌతస్మార్తకర్మ మేది గలదో అది సర్వంబును, ఈ బ్రహ్మవిదునిచే కృతము–చేయఁబడినది యగును కావునఁ గృతకృత్యుఁడు, సర్వకర్మముల ననుష్ఠించినవాఁడును అగును; సర్వాత్మ యగు బ్రహ్మము నెఱింగిన పిదప విద్వాంసుఁడు సర్వవేదశాస్త్రపురాణేతిహాసాగమప్రసిద్ధ మైన సమస్తకర్మము నాచరించినవాఁ డగును, తజ్జన్యసుఖము సర్వంబు ననుభవించినవాఁ డగును, బ్రహ్మానందమునందు సర్వానందము

లంతర్భూతము లగుటవలన, "ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి" అను శ్రుతివలన. అందువలన బ్రహ్మవిదుఁడే కృతార్థుఁ డని సిద్ధము.

**మ.** ఇప్పు డధ్యాయార్థమును స్తుతించుచు నుపసంహరించుచున్నాఁడు.— ఇతి = ఈప్రకారంబున; గుహ్యతమమ్ = మిక్కిలి రహస్యము; సంపూర్ణ మైన శాస్త్రమే సంక్షేపంబున, ఇదమ్ – ఈ యధ్యాయమునందు; మయా; ఉక్తమ్; అనఘ = వ్యసనము లేనివాఁడా! ఏతద్బుద్ధ్వా; ఇతరుఁడుకూడ నెవ్వఁడైనను, బుద్ధిమాన్ = ఆత్మజ్ఞానవంతుఁడు; స్యాత్. కృతకృత్యశ్చ = ఎవ్వనిచేత సమస్త మైన కృత్యమును చేయఁబడినదో మఱి చేయవలసినకృత్య మెవ్వనికిని లేదో అట్టి కృతకృత్యుఁడును అగును; ఉత్తమజన్మజాతుఁ డగు బ్రాహ్మణుఁ డేది చేయవలయునో అది యంతయును భగవత్తత్త్వము దెలిసినయెడ చేయఁబడిన దగును, వేఱువిధమున నెవ్వనికిని గర్తవ్యపరిసమాప్తి కానేరదని యభిప్రాయము. ఓ భారతుఁడా—నీవో మహాకుల ప్రసూతుఁడవు తానును వ్యసనరహితుఁడవు కావున కులగుణంబునను స్వగుణంబునను దీని నెఱింగి కృతకృత్యుఁడవు కాఁగల వని చెప్పవలయునా? అని యభిప్రాయము.

కరమున వేణువున్ మొలను గాంచనచేలము బింబమంజులా
ధరమును బూర్ణచంద్రలలితం బగుమోము ప్రఫుల్లపద్మసుం
దరనయనంబు లొప్ప జలదద్యుతి భాసిలు కృష్ణుకన్న నొం
డుర వగు తత్త్వ మొక్కటియు నుల్లమునందుఁ దలంప ధన్యతన్.

నిర్మలానందమగ్నమై నెమ్మనంబు
తనదుభావంబుఁ దనయంతఁ దాన విడుచు
నలగతాగతాయాసంబు దొలఁగి నరుఁడు
తగుఁ బరాపరాతీతతత్త్వంబు నొంది.

శైవు లైన గాణేశులు సౌరు లైన
శక్తిపూజకు లైన వైష్ణవులు నైన
యన్యయత్వంబు నొందుదు రంతమందు
నట్టి పరమశివుం డేన నట్టి చూడ.

ప్రమితిసిద్ధాంతితం బఁటు పరఁగుదానిఁ
గృష్ణమహిమను సైరింప నెవ్వ రొల్ల

రట్టివారు విమూఢులు గట్టు లేని
నిరయసాగరముఁ దరింప నేర రింక.

**శ్రీ.** అధ్యాయార్థము నుపసంహరించుచున్నాఁడు.—ఇతి=ఇట్లు సంక్షేప ప్రకారంబున; గుహ్యతమమ్ = అతిరహస్యము; సంపూర్ణ మైనశాస్త్రమే నాచేతఁ జెప్పఁబడినది. ఇరువదిశ్లోకములయధ్యాయముమాత్రమే యిది యని దలంప నలదు. అనఘ = వ్యసనశూన్యుఁడా! కావున, ఏతత్ = నేను చెప్పిన యీశాస్త్రమును; బుద్ధ్వా; బుద్ధిమాన్ స్యాత్ = సమ్యక్జ్ఞానము గలవాఁ డగును; కృతకృత్యశ్చ = కృతకృత్యుఁడును అగును, ఎవ్వఁడు గాని. భారత—నీవు కృత్యుఁడ వతి యని చెప్ప వలయునా అని భావము.

పురుషోత్తమయోగం బనఁ
బరఁగెడు నధ్యాయమందుఁ బంచదశమునం
దర లే కుపదేశించెను
బరుండు భవతరుపు నటకి పరమపదంబున్.

**వ.** ఇఁక నధ్యాయార్థము నుపసంహరించుచున్నాఁడు.—* అధ్యాయ తాత్పర్యము.—సంసారవృక్షమున కూర్ధ్వభాగంబున శిరస్సునందు బ్రహ్మము మూలమై యున్నది, క్రిందికి చేతులు పాదములు మొదలగుశాఖలు ప్రసరించి యున్నవి, దానికి గుణత్రయమే పల్లవములు, విషయములే యభివృద్ధి, వాసనలే పత్రములు, అట్టి ప్రపంచరూప మైన స్థూలవృక్షమును పురుషోత్తము నాశ్రయించి మూలము నెఱింగి యసంగశస్త్రముచేతి ఛేదింపు మని కృష్ణుఁడు పంచదశాధ్యాయ మునఁ బ్రతిపాదించెను.

**రా.** ఇట్లు నాయొక్క—పురుషోత్తమభావముఁ బ్రతిపాదించునదియు సర్వ గుహ్యములలోను గుహ్యతమంబు నగు నీశాస్త్రము నీ వనఘుండ వగుటచే యోగ్య తముఁడ వని తెలిసి నాచే నీకు చెప్పఁబడినది. ఏతత్ బుద్ధ్వా; బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ — నన్నుఁ బొందఁ గోరువాఁడు సంపాదింపవలసిన బుద్ధి యేది గలదో అది యంతయు సంపాదిత మగును, మఱియు వాని కేది కర్తవ్యమో అది యంతయుఁ గృతం బగు నని యర్థము. ఈ శ్లోకముచే నిప్పుడు చెప్పఁబడిన పురుషోత్తమవిషయ

* పదయోజన శ్రీధరీయముతో సమానము.

జ్ఞానము శాస్త్రజన్యమే యీఫల మంతయుఁ గలిగించును గాని యది సాక్షాత్కార రూపము కా దని చెప్పఁబడుచున్నది.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమయోగో నామ పంచదశో ఽధ్యాయః.

వ్యాసప్రోక్త మయిన శతసహస్రగ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రం బును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందుఁ బురుషోత్తమయోగం బనంబరఁగు పంచదశాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమత్షవాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవద్గీ
తాంధ్ర వ్యాఖ్యానంబునందుఁ
బంచదశాధ్యాయటీక.

పంచదశాధ్యాయావత్ కృత్స్నా గీతార్థవివృతి రఖలేయమ్
పరిపూర్తి మియా దచిరాత్ శ్రీమ ద్భగవ త్ప్రసాదేన.
ఘటయతు భాగవతీ మే దుర్ఘటఘటనాపటీయసీ కరుణా
సాధనవికలస్యా ఽపి చ గీతాపరమార్థచన్ద్రికాపూర్తిమ్.



శ్రీ ర స్తు.

శ్రీ గణేశ శారదా గురుభ్యో నమః.

పరమార్థచంద్రికాసహిత

# శ్రీభగవద్గీత, షోడశాధ్యాయము.

వైరాగ్యైకవినాశ్యం భవవృక్షం విచ్ఛినత్తి యా కృపయా
పురుషోత్తమాప్తిహేతుం తాం విద్యా మస్మికాం వన్దే.
క్షరి మక్షరంచ పురుషౌ భూతా ఽవిద్యాకృతౌ అతీతో ఽస్మి
ఆత్మా ఽహ మితి య ఊచే కృష్ణం వన్దే త మాత్మానమ్.

శ్రీభగవా నువాచ.—

అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్.

శంకరభాష్యము.—

దైవియు నాసురియు రాక్షసియు నను ప్రాణులప్రకృతులు నవమాధ్యాయమున సూచింపఁబడినవి. వానివి స్తరమునఁ బ్రదర్శించుటకై అభయం సత్త్వసంశుద్ధి రిత్యాదిక మగు నధ్యాయ మారంభింపఁబడుచున్నది. అందు సంసారమోక్షముకొఱకు దైవప్రకృతియు సంసారనిబంధనముకొఱకు నాసురియు రాక్షసియుం గావున దైవప్రకృతి సంపాదనముకొఱకును ఇతరములు పరివర్జనముకొఱకును బ్రదర్శింపఁబడుచున్నవి. శ్రీభగవంతుఁ డి ట్లనియె.—అభయమ్ = భయము లేక యుండుట. సత్త్వసంశుద్ధిః = సత్త్వ మనఁగా అంతఃకరణము, దానియొక్క మిక్కిలి శుద్ధి, వ్యవహారములయందుఁ బరవంచనా మాయాఽనృతాదుల వర్జించుట, శుద్ధభావమున వ్యవహరించుట యని యర్థము. జ్ఞానయోగవ్యవస్థితిః = జ్ఞానము – శాస్త్రమువలనను ఆచార్యునివలనను ఆత్మాదిపదార్థముల నెఱుంగుట, ఎఱింగినవాని నింద్రియాదుల నుపసంహరించి యేకాగ్రతచేఁ దనకుఁ జక్కఁగాఁ దెలియునట్లు చేసికొనుట యోగము,

ఆ జ్ఞానయోగములయందు వ్యవస్థితి—నిష్ఠ గలవాఁ డగుట. ఇది ప్రధాన మగు దైవసంపద, సాత్త్వికసంపద. ఎందైనను అధికృతుల కిట్టి ప్రకృతి యేది గలదో అం దది సాత్త్విక మని చెప్పఁబడుచున్నది. దానమ్ = యథాశక్తి అన్నాదుల నిచ్చుట. దమశ్చ=బాహ్యకరణముల నిగ్రహించుట. అంతఃకరణనిగ్రహమును శాంతిని వేఱుగాఁ జెప్పఁబోవుచున్నాఁడు. యజ్ఞశ్చ = శ్రౌత మైన యగ్నిహోత్రాదికమును, స్మార్త మయిన దేవయజ్ఞాదికమును. స్వాధ్యాయః = ఋగ్వేదాదుల యధ్యయనము అదృష్టార్థము *. తపః=చెప్పఁబోవు శారీరాదితపస్సు. ఆర్జవమ్= ఎల్లపుడును ఋజుత్వము. ♦

ఆనందగిరికృత టీక.—

వ్యవహితాధ్యాయములతో సంబంధముఁ జెప్పుచు మీఁదియధ్యాయము దించుచున్నారు దైవియు నిత్యాదిగా. "రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీమ్" ఇత్యాదిస్థలంబున నని శేషము. ప్రకృతుల విస్తరించి ప్రదర్శించుట దేనియం దుపయోగించు నని యాశంకించి విభజించి యుపయోగముఁ జెప్పుచున్నారు సంసారేత్యాదిగా. కడచినయధ్యాయమందును "కర్మానుబన్ధీని, అధశ్చమూలా న్యనుసంతతాని" అనుచోటఁ గర్మవ్యంగ్యము లైన వాసనలు సంసారమున కవాంతరమూలము లని చెప్పఁబడినవి, మనుష్య దేహమునందుఁ బూర్వజన్మకృతకర్మానుసారంబునఁ బొడ తెంచుచుండు నావాసనలను సాత్త్వికాదిభేదములచే దైవ్యాదిప్రకృతిత్రయరూపమున విభజించి విస్తరింపఁ గోరినవాఁడై భగవంతుఁడు పలికె నని చెప్పుచున్నారు శ్రీభగవంతుఁడు ఇత్యాదిగా. భయము లేక యుండుట — శాస్త్రముచే నుపదేశింపఁబడిన యర్థమునందు సందేహము లేక నిష్ఠతో ననుష్ఠానము. పరవంచనము — పరులను వ్యాజముచే వశీకరించుట, మాయ — హృదయమున నొకవిధముగాను వెలుపల మఱియొకవిధముగాను వ్యవహరించుట, అనృతము — చూచినట్లు గాక వేఱువిధము చెప్పుట, ఆదిపదముచే విప్రలంభాదులు గ్రహింపఁబడుచున్నవి. చెప్పినయర్థమును సంక్షేపించి చెప్పుచున్నారు శుద్ధేత్యాదిగా. ఇది— అభయము సత్త్వసంశుద్ధి జ్ఞానయోగవ్యవస్థితి అని మూఁడువిధములుగాఁ జెప్పఁబడి

* ఆచార్యునియొద్ద దృష్టార్థ మయిన యధ్యయనము కాదు, ప్రతిదినమును బ్రహ్మయజ్ఞరూప మైన యధ్యయన మనుట.

♦ నిష్కపటత.

నది యని యర్థము. ఆ సాత్త్వికప్రకృతినే ప్రకటించుచున్నారు ఎందైనను ఇత్యాదిగా. ఎందైనను—జ్ఞానమునందుఁ గాని కర్మమునందుఁ గాని. మహాభాగ్యులయత్యుత్తమ మగు దైవసంపద చెప్పఁబడినది, ఇప్పుడు యథాసంభవముగా సర్వజనుల సంపదను వ్యపదేశించుచున్నారు దాన మిత్యాదిగా. బాహ్యకరణముల నని విశేషించుటకుఁ గారణము చెప్పుచున్నారు అంతఃకర ణేత్యాదిగా. దేవయజ్ఞాదికమను—ఆదిశబ్దముచేఁ బితృయజ్ఞము భూతయజ్ఞము మనుష్యయజ్ఞము అను మూఁడు చెప్పఁబడినవి, బ్రహ్మయజ్ఞమును స్వాధ్యాయశబ్దముచే వేఱుగాఁ జెప్పుటవలన.

హనుమద్విరచిత పైశాచభాష్యము.—

నవమాధ్యాయంబున దైవి యాసురి రాక్షసి యని ప్రాణులప్రకృతులు చెప్పఁబడినవి. ఇప్పుడు వానినే విస్తరమునఁ బ్రతిపాదింప నీయధ్యాయ మారంభింపఁబడుచున్నది.—అభయమ్ = భయము లేకుండుట. సత్త్వసంశుద్ధిః = వంచన లేమి. జ్ఞానయోగవ్యవస్థితిః=శాస్త్రాచార్యోపదేశముచే ఆత్మాదిపదార్థముల నెఱుంగుట జ్ఞానము, ఎఱింగినవానిని యోగానుష్ఠానముచే సాక్షాత్కరించుట యోగము, ఆజ్ఞానయోగములందు నిలుకడ. దానమ్ = యాచకులకుఁ దనద్రవ్యము నిచ్చుట. దమః = అంతఃకరణముయొక్కయుపరతి. యజ్ఞశ్చ = స్మార్తము లగు పంచమహాయజ్ఞములును శ్రౌతములగు నగ్నిష్టోమాదులును. స్వాధ్యాయః = వేదాభ్యాసము. తపః = కాయికము వాచికము మానసము అని త్రివిధ మయిన తపస్సును. ఆర్జవమ్ = వక్రత లేమి.

శంకరానందీయ గీతా తాత్పర్యబోధిని.—

సత్త్వాదిగుణత్రయము నతిక్రమించుటకై దేనియందు నిష్ఠ చేయవలయునో యట్టి నిర్విశేష మగు పరబ్రహ్మముయొక్కస్వరూపమును తజ్జ్ఞానప్రకారమును జ్ఞానమును తత్ఫల మగు విదేహకైవల్యంబును బ్రతిపాదించి ఇప్పుడు “యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్” అనుటచే అసమ్మూఢునకే పురుషోత్తమస్వరూపజ్ఞానమునం దధికారము కలుగుటవలన, అధికారి యగు యోగి ముముక్షువు తన కసమ్మూఢత్వము సిద్ధించుటకై దైవసంపద సంపాదింపవలయును ఆసురసంపద వర్జింపవలయు నని యీ రెండుసంపదలస్వరూపముఁ బ్రదర్శించుకొఱకు షోడశాధ్యాయ మారంభింపఁబడుచున్నది. అందు మొదట ఆ రెండుసంపదలయందును దైవసంపదయే మోక్షసాధన మగుటచే నుత్తమం బగుటవలనను

అదియే ముముక్షువున కుపాదేయ మగుటవలనను ప్రథమమున దైవసంపదను ప్రతిపాదించుటకై శ్రీభగవంతుఁ డిట్లనియె.—అభయమ్ = భయము లేమి, ఆధ్యాత్మికాద్యుపద్రవములు ప్రాప్తించినను మనస్సున భయపడ కుండుట, లేక, పరులకు భయముఁ బుట్టింప కుండుట, లేక, సర్వశాస్త్రముల నెఱుంగుటచే నిస్సంశయముగా సర్వకర్మముల ననుష్ఠించుట. సత్త్వసంశుద్ధిః = అంతఃకరణమునకు శుద్ధత, రాగద్వేషలోభమోహాఽసూయామత్సరాఽహంకారాదిదోషములు లేకుండుట. జ్ఞానయోగవ్యవస్థితిః = జ్ఞానయోగము—శ్రవణమననాదికము, దానియందే మనస్సునకు విశేషించి యునికి, ఎల్లప్పుడును దానియందే యాసక్తుఁడై యుండుట. దానమ్ = యాచకులకు శ్రద్ధతో యథాశక్తి అన్నాదుల నిచ్చుట. దమశ్చ=దుర్వృత్తినుండి బాహ్యేంద్రియముల యుపరతి, లేక, మనస్సును దండించుట. చకారము సముచ్చయార్థకము. యజ్ఞశ్చ = శ్రౌత మగు దర్శపూర్ణమాసాగ్నిహోత్రసోమయాగాదికము, చకారమువలన స్మార్త మగు స్థాలీపాకాదికము గూడ గ్రహింపఁబడుచున్నది. స్వాధ్యాయః = బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞాదులకు నుపలక్షణము. తపః= దేవద్విజగురు ప్రాజ్ఞపూజనాదికము, శారీరము వాచికము మానసికము నని చెప్పఁబోవు త్రివిధతపస్సు. ఆర్జవమ్=మనోవాక్కాయకర్మములందు సర్వవిషయంబుల సదా యేకరూపముగా నుండుట.

మధుసూదనసరస్వతీరచిత గూఢార్థదీపిక.—

పూర్వాధ్యాయంబున "అధశ్చ మూలా న్యనుసన్తతాని కర్మానుబన్ధీని మనుష్యలోకే" అనుచోట మనుష్యదేహమునందుఁ బూర్వాజన్మకర్మానుసారమున వ్యక్తము లగు వాసనలు సంసారమున కవాంతరమూలము లని చెప్పఁబడినవి. అవియే దైవి ఆసురి రాక్షసి యను ప్రాణులప్రకృతు లని నవమాధ్యాయమున సూచింపఁబడినవి. అందు వేదబోధితము లగు కర్మాత్మజ్ఞానోపాయముల ననుష్ఠించుటయందుఁ బ్రవృత్తికి హేతువైన సాత్త్విక మగు శుభవాసన దైవప్రకృతి యని చెప్పఁబడుచున్నది. ఇట్లు వైదికనిషేధము నతిక్రమించి స్వాభావసిద్ధము లయిన రాగద్వేషముల ననుసరించి సర్వానర్థహేతువులందుఁ బ్రవర్తించుటకు హేతువు లైన రాజస తామసము లగు నశుభవాసనలు ఆసురరాక్షసప్రకృతు లనఁబడును. అందు విషయభోగప్రాధాన్యముచే రాగప్రాబల్యమువలన నాసురియనియు హింసాప్రాధాన్యముచే ద్వేషప్రాబల్యమువలన రాక్షసి యనియు వివేకము. ఇప్పుడో, శాస్త్రానుసారంబునఁ దద్విహితమునందుఁ బ్రవృత్తికి హేతుభూత మైన సాత్త్విక మగు శుభవాసన

దైవసంపద యనియు, శాస్త్రాతిక్రమంబునఁ దన్నిషిద్ధవిషయములందుఁ బ్రవృత్తికి హేతుభూతములయిన రాజసతామసము లగు నశుభవాసనలైన యాసురరాక్షససంపదల రెంటిని ఒక్కటిగాఁ జేసి యాసురసంపద యనియు, రెండురాసులుగా శుభాఽశుభవాసనాభేదమును "ద్వయాహ ప్రాజాపత్యా దేవాశ్చాఽసురాశ్చ" ఇత్యాది శ్రుతిప్రసిద్ధమును, శుభవాసనల గ్రహించుకొఱకును అశుభవాసనల విడుచుకొఱకును బ్రతిపాదించుటకై షోడశాధ్యాయ మారంభింపఁబడుచున్నది. అందు మొదటి మూఁడుశ్లోకములచే గ్రాహ్యమగు దైవసంపదను శ్రీభగవంతుఁ డిట్లనియె.--
అభయమ్ = శాస్త్రోపదిష్ట మైన యర్థమునందు సందేహము లేక నియమమున ననుష్ఠించుట, లేక, ఏకాకినై సర్వపరిగ్రహముల విడిచి యెట్లు జీవింపఁగల నని భయము లేక యుండుట. సత్త్వసంశుద్ధిః=సత్త్వముయొక్క — అంతఃకరణముయొక్క-శుద్ధి—నిర్మలత్వము, దానిసమ్యక్తి * అనఁగా భగవత్తత్త్వస్ఫురణయోగ్యత; లేక, పరవంచనము మాయ అనృతము ఇత్యాదులు లేక యుండుట, వ్యాజముచేఁ బరుని వశీకరించుట పరవంచనము, హృదయమున వేఱువిధ ముంచుకొని వెలుపల మఱియొకవిధముగా వ్యవహరించుట మాయ, అయథాదృష్టమును—చూచినందులకు విరుద్ధ మయినదాని చెప్పుట యనృతము. జ్ఞానయోగవ్యవస్థితిః=శాస్త్రమువలన ఆత్మతత్త్వము నెఱుంగుట జ్ఞానము, చిత్తైకాగ్రతచే నది స్వానుభవారూఢ మగుట యోగము, ఆ రెంటియందును వ్యవస్థితి — సదా వానియందే నిష్ఠ. ఇఁక, అభయమ్ = సర్వభూతములకును అభయదానసంకల్పమును బాలించుట ఇది యితరములయిన పరమహంసధర్మముల కుపలక్షణము; సత్త్వసంశుద్ధిః=శ్రవణాదిపరిపాకముచే అంతఃకరణమునకు అసంభావనావిపరీతభావనాదిమలములు లేక యుంటుట; ఆత్మసాక్షాత్కారము జ్ఞానము, మనోనాశవాసనాక్షయములకై పురుషప్రయత్నము యోగము, వానిచే విశిష్టము — సంసారివిలక్షణ మయిన అవస్థితి — జీవన్ముక్తి జ్ఞానయోగవ్యవస్థితి. ఇట్లు వ్యాఖ్యానము చేయునెడ, ఫలభూతమే దైవసంపద యిది యని యెఱుంగునది. భగవద్భక్తి యున్నంగాని యంతఃకరణసంశుద్ధి సంభవింపదు కావున దానితో నదియును జెప్పఁబడినది యని గ్రహింపవలయును, "మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః । భజ న్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్" అని నవమాధ్యాయమున దైవసంపదయందు భగవద్భక్తి చెప్పఁబడుటవలనఁగూడ. భగవద్భక్తి అతిశ్రేష్ఠ మగుటవలన నభయాదులతో

* మేలిమి.

సహాపఠితము గా దర్యో నని యెఱుంగునది. మహాభాగ్యు లగు పరమహంసుల ఫలభూత మగు దైవసంపదను బ్రతిపాదించి వారికన్న న్యూను లగు గృహస్థాదుల సాధనభూత మగు దైవసంపదను జెప్పుచున్నాఁడు.—దానమ్ = తనవైన యన్నాదులను యథాశక్తి శాస్త్రోక్తప్రకారమున నిచ్చుట. దమః=బాహ్యేంద్రియనిగ్రహము, ఋతుకాలమునందుఁ దక్కఁ దక్కినకాలమునందు మైథునాదికము విడుచుట. చకారముచే అనుక్తము లయిన నివృత్తిలక్షణధర్మములకు సముచ్చయము. యజ్ఞశ్చ= శ్రౌతము అగ్నిహోత్రదర్శపూర్ణమాసాదికము, స్మార్తము దేవయజ్ఞము పితృయజ్ఞము భూతయజ్ఞము మనుష్యయజ్ఞము అని చతుర్విధము, బ్రహ్మయజ్ఞమును స్వాధ్యాయపదముచే వేఱుగాఁ జెప్పుటవలన. చకారముచే అనుక్తము లైన ప్రవృత్తిలక్షణధర్మములకు సముచ్చయము. ఇవి మూఁడును గృహస్థునకు. స్వాధ్యాయః = బ్రహ్మయజ్ఞము, అదృష్టార్థము ఋగ్వేదాదులయధ్యయనము. యజ్ఞశబ్దముచేఁ బంచవిధమహాయజ్ఞగ్రహణము సంభవించినను అసాధారణ మయిన బ్రహ్మచారిధర్మ మని చెప్పుటకై వేఱుగాఁ జెప్పఁబడినది. తపః = శారీరాదిత్రివిధతపస్సు సప్తదశాధ్యాయమునఁ జెప్పఁబోవునది, వానప్రస్థునియసాధారణ మయినధర్మము. ఇట్లు నాలుగాశ్రమముల యసాధారణధర్మములం జెప్పి నాలుగువర్ణముల యసాధారణధర్మములఁ జెప్పుచున్నాఁడు.—ఆర్జవమ్ = అవక్రత, నమ్మి వినువారికిఁ దనకుఁ దెలిసినయర్థము దాఁప కుండుట.

శ్రీధరస్వామిప్రణీత మగుసుబోధిని.—

తలఁగి యాసురసంపద దైవ మైన
దానినే యాశ్రయించినమానవులకు
ముక్తి సిద్ధించు నని తెల్పుపొంటె నింక
సంపదలు చెప్పఁబడు షోడశంబునందు.

పూర్వాధ్యాయాంతమున "ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత" అని చెప్పఁబడినది. అందు, ఎవ్వఁ డీతత్త్వము నెఱుంగఁగలఁడు? ఎవ్వఁ డెఱుంగ లేఁడు? అని యాకాంక్ష కలుగఁగా, తత్త్వజ్ఞానమునం దధికారిని అనధికారిని వివేచించుటకై షోడశాధ్యాయారంభము. చేయవలసినయర్థము నిరూపించినం గదా యధికారి నెఱుంగ నగును. అది చెప్పఁబడినది భాట్టులచేత, "భారో ఽయం యేన వోఢవ్య స్స ప్రాగా లోచితో యదా। తదా కస్తస్య వోఢేతి

శక్యం కర్తుం నిరూపణమ్" * అని. అం దధికారివిశేషణ మైన దైవసంపదను జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—అభయమ్ = భయము లేమి. సత్త్వము యొక్క — చిత్తముయొక్క—సంశుద్ధి – ప్రసన్నత. జ్ఞానయోగమునందు—ఆత్మజ్ఞానో పాయమునందు వ్యవస్థితి — పరినిష్ఠ. దానమ్ = తనకు భోజ్య మయిన యన్నాదిక మును యథోచితముగా నిచ్చుట. దమః = బహిరింద్రియనిగ్రహము. యజ్ఞః అధి కారముచొప్పున దర్శపూర్ణమాసాదికము. స్వాధ్యాయః = బ్రహ్మయజ్ఞాదికము, లేక జపయజ్ఞము. తపః = మీఁదియధ్యాయమునఁ జెప్పఁబోవు శారీరాదితపస్సు. ఆర్జవమ్ = అవక్రత.

పరమార్థప్రప దైవజ్ఞసూర్యపండిత ప్రణీతము.—

పూర్వాధ్యాయాంతమున "ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత" అని చెప్పఁబడినది. అప్పుడు, ఎవ్వఁడు దీని నెఱింగి కృతకృత్యుఁ డగును? ఎఱుంగఁజాలక సంసారి యగును? అనునర్థము వివేచించుటకై దేవాసుర సంపదలఁ బ్రతిపాదించుకొఱకు షోడశాధ్యాయప్రారంభము. అందు మొదటఁ దత్త్వజ్ఞానాధికారిని నిరూపించుటకై భగవంతుఁడు దైవి యగుసంపదను జెప్పు చున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—అభయమ్ = భయము లే కుండుట. సత్త్వ సంశుద్ధిః = చిత్తముయొక్క ప్రసన్నత. జ్ఞానయోగమునందు — ఆత్మజ్ఞానమునందు వ్యవస్థితి — పరినిష్ఠ. దానమ్ = తనకు భోజ్య మయిన యన్నాదికమును యథో చితముగా పంచిపెట్టుట. దమః = బాహ్యేంద్రియనిగ్రహము. యజ్ఞః=అధికారము చొప్పున దర్శపూర్ణమాసాదికము. స్వాధ్యాయః = బ్రహ్మయజ్ఞాదికము, లేక, జప యజ్ఞము. తపః = వక్ష్యమాణ మగు శారీరాదిత్రివిధతపస్సు. ఆర్జవమ్ = అవక్రత.

రామానుజభాష్యము.—

అతీత మగు నధ్యాయత్రయముచే వివిక్తులయు సంసృష్టులయుఁ బ్రకృతి పురుషులస్వరూపంబును, తత్సంసర్గవియోగములకుఁ గుణసంగమును తదభావంబును హేతువు లనియు, సర్వప్రకారంబున నున్న • ప్రకృతిపురుషులు భగవద్విభూతు లనియు, విభూతిమంతుఁ డగు భగవంతుఁడు విభూతిభూతం బగు నచిద్వస్తువుకన్నను బద్ధముక్తోభయరూప మయిన చిద్వస్తువుకన్నను అవ్యయత్వవ్యాపనభరణస్వామ్య

* ఏభారము నెవ్వఁడు మోయవలయునో దాని వాఁడు మొదటఁ గదలించినయెడ దాని నెవఁడు మోయఁగలఁడో నిరూపింపవచ్చును.

• వివిక్తులుగాని సంసృష్టులుగాని.

ములచే అర్థాంతర * మనియుఁ బురుషోత్తముఁ డనియు భగవత్స్వరూపంబును వర్ణింపఁబడినవి. అనంతర మీ చెప్పినయర్థమునకు సమస్తంబునకు స్థైర్యముకొఱకు శాస్త్రవశ్యతను బ్రతిపాదించుటకై శాస్త్రవశ్య తద్విపరీతము లగు దైవాసురసర్గములవిభాగమును శ్రీభగవంతుఁ డి ట్లనియె.—ఇష్టానిష్టవియోగసంయోగరూపమగు దుఃఖమునకు హేతు వైనదానిఁ జూచుటవలనఁ గలుగుదుఃఖము భయము, తన్నివృత్తి అభయము. సత్త్వసంశుద్ధిః = సత్త్వమునకు — అంతఃకరణమునకు రజస్తమములస్పర్శ లేకుండుట. జ్ఞానయోగవ్యవస్థితిః = ప్రకృతివియుక్త మగు నాత్మస్వరూపముయొక్క వివేకమునందు నిష్ఠ. దానమ్ = న్యాయార్జిత మగు ధనమును పాత్రమునం దర్పించుట. దమః=మనస్సునకు విషయాన్ముఖ్యనివృత్తి నభ్యసించుట. యజ్ఞః = ఫలాభిసంధిరహితముగా భగవదారాధనరూపము లైన మహాయజ్ఞాదుల ననుష్ఠించుట. స్వాధ్యాయః=విభూతిసహితుఁ డగు భగవంతునిస్వరూపమును తదారాధనప్రకారమును బ్రతిపాదించునది సమస్త మగు వేదం బని యనుసంధించుచు వేదాభ్యాసమునందు నిష్ఠ. తపః = భగవత్ప్రీణనకర్మమునందు యోగ్యతను గలిగించునట్టి కృచ్ఛ్రచాంద్రాయణద్వాదశ్యుపవాసాదులఁ జేయుట. ఆర్జవమ్=పరుల యెడ మనోవాక్కాయవృత్తు లేకరూపముగా నుండుట.

మాధ్వభాష్యము.—

సాధనవిఘ్నహర్త్రే నమః. పురుషార్థసాధనవిరోధులను ఈ యధ్యాయముచేఁ దెలుపుచున్నాఁడు.—తపః = బ్రహ్మచర్యాదికము. "బ్రహ్మచర్యాదికం తపః" అని నిఘంటువు.

అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాన్తి రపైశునమ్
దయా భూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్. ౨

**భా.** మఱియు.—అహింసా = హింసింపకుండుట, ప్రాణులఁ బీడింపకుండుట. సత్యమ్=అప్రియమును అనృతమును విడిచి జరగినట్లు చెప్పుట. అక్రోధః = పరులచే నిందింపఁబడినపుడు గాని కొట్టఁబడినపుడు గాని సంభవించిన క్రోధము నడంచుట. త్యాగః=సన్న్యాసము, దానము పూర్వము చెప్పఁబడుటవలన. శాన్తిః=అంతఃకరణమును నిగ్రహించుట. అపైశునమ్=పిశునత లేమి, ఒకనికి మఱియొకనిఛిద్రములను దెలుపుట

---

* భిన్నుఁడు.

పైశునము, అది లేకుండుట యపైశునము *. భూతేషు=దుఃఖితులైన ప్రాణులయందు; దయా = కనికరము. అలోలుప్త్వమ్ = ఇంద్రియములకు విషయసన్నిధియందు వికారము లేకుండుట. మార్దవమ్ = మెత్తఁదనము, క్రౌర్యము లేకుండుట. హ్రీః = లజ్జ. అచాపలమ్ = ప్రయోజనము లేనపుడు వాక్కు హస్తములు పాదములు మొదలగువాని వ్యాపారము లేక యుండుట.

ఆ. దైవసంపదతోఁ బుట్టినవాని విశేషణాంతరములఁ జూపుచున్నారు మఱియు నిత్యాదిగా. త్యాగశబ్దముచే దానము నేల చెప్పఁగూడ దనఁగాఁ జెప్పుచున్నారు దానము ఇత్యాదిగా. లజ్జ — అకార్యమునుండి నివర్తిల్లుటకు హేతువగు జుగుప్సవలనఁ గలుగు చిత్తవృత్తి.

హ. మఱియును.—అహింసా = ప్రాణులఁ బీడింపకుండుట. అక్రోధః= ప్రసక్త మయిన క్రోధమును విడుచుట. శాన్తిః=బాహ్యేంద్రియనిగ్రహము. అపైశునమ్ = పరులరంధ్రములను బయలుపడనీయకుండుట. దయా = భూతములందు వీని రక్షింపవలయు నను తలంపు. అలోలుప్త్వమ్=ఇంద్రియములకు విషయసన్నిధియందు వికారము లేక యుండుట. మార్దవమ్ = అక్రూరత. అచాపలమ్ = వ్యర్థచేష్టల విడుచుట.

శం. మఱియును.—అహింసా = తీర్థములకై తప్ప ప్రాణుల హింసింపకుండుట. సత్యమ్ = యథార్థభాషణము. అక్రోధః = క్రోధము లేమి, కొట్టుట పీడించుట మొదలగు నపకారములు చేసినను ఆగ్రహము పుట్టకుండుట. త్యాగః= నిత్యమును జేయు శ్రౌతాదికర్మములఫలమును ఈశ్వరార్పణబుద్ధిచే విడుచుట. శాన్తిః = అంతఃకరణమునకు సర్వవిషయములనుండియు నుపరతి. అపైశునమ్ = పరోక్షమునఁ బరులమర్మముల వెల్లడింపకుండుట. దయా = దీను లయిన ప్రాణులందు ఆర్తులు అంధులు మొదలగువారియందుఁ గరుణ. అలోలుప్త్వమ్ = విషయసన్నిధియందు ఇంద్రియములకు వికారము లేకుండుట. మార్దవమ్ = చిత్తమునకు కాఠిన్యము లేమి, చల్లఁదనము. హ్రీః=లజ్జ, అకార్యాచరణమునందుఁ జిత్తమునకు సంకోచము, ప్రవర్తింపమికిఁ గారణము. అచాపలమ్ = మనస్సునకును ఇంద్రియములకును నిర్నిమిత్తవ్యాపారము లేకుండుట.

---

* కొండెములు చెప్పకుండుట.

మ. ప్రాణవృత్తికి ఛేదము హింస, దానికి హేతువు గాకుండుట అహింస. సత్యమ్ = అనర్థము కలిగింపని యథార్థవచనము. పరులు తిట్టినను కొట్టినను ప్రాప్తించిన క్రోధమును అప్పుడే యుపశమింపఁజేయుట అక్రోధము. దానము మున్ను చెప్పఁబడుటవలన త్యాగ మనఁగా సన్న్యాసము. దమము పూర్వము చెప్పఁబడినది కావున శాంతి యనఁగా అంతఃకరణోపశమము. పరునకుఁ జాటున మఱియొకనిదోషము వెల్లడించుట పైశునము, దానియభావము అపైశునము. దయా= దుఃఖితు లయిన ప్రాణులయందుఁ గనికరము. అలోలుప్త్వమ్ = అలోలుపత్వము— ఇంద్రియములకు విషయసన్నిధానమున వికారము లేకుండుట. మార్దవమ్=అక్రూరత, శిష్యాదులు వ్యర్థముగాఁ బూర్వపక్షము చేసినను అప్రియభాషణము చేయక బోధించుట. హ్రీః = అకార్యమునందుఁ బ్రవర్తింప నారంభించునపుడు దానికిఁ బ్రతిబంధక మైన లోకలజ్జ. అచాపలమ్ = ప్రయోజనము లే కున్నను వాక్పాణ్యాదులఁ జేష్టింపఁజేయుట చాపలము, దాని యభావము. ఆర్జవము మొదలుగా అచాపలమువఱకుఁ జెప్పినవి బ్రాహ్మణున కసాధారణధర్మములు.

శ్రీ. మఱియును.—అహింసా = పరులఁ బీడింపకుండుట. సత్యమ్ = ఎట్లు చూచినాఁడో అట్లు పలుకుట. అక్రోధః = కొట్టఁబడినను చిత్తమున క్షోభము పుట్టకుండుట. త్యాగః = ఔదార్యము. శాన్తిః = చిత్తోపరతి. పైశునమ్ = పరునకుఁ బరునిదోషముఁ దెలుపుట పైశునము, దాని వర్జించుట. దీను లయిన భూతములయందు దయ. అలోలుప్త్వమ్ = అలోలుపత్వము, అకారలోప మార్షము. మార్దవమ్ = మృదుత్వము, అక్రూరత. హ్రీః = అకార్యమునఁ బ్రవర్తించునపుడు లోకలజ్జ. అచాపలమ్ = వ్యర్థకార్యము లేకుండుట.

ప అహింసా = పరపీడ చేయకుండుట. సత్యమ్ = యథార్థభాషణము. అక్రోధః = కొట్టినను చిత్తమున క్షోభము లేకుండుట. అది చెప్పఁబడినది "క్రుద్ధే స్మేరముఖావధారణ మథా విష్టే ప్రసాదక్రమో వ్యాక్రోశే వినయోక్తి రాత్తదురితోచ్ఛేదోత్సవ స్తాడనే" * అని. త్యాగః = ఔదార్యము. శాన్తిః = చిత్తోపరతి. అపైశునమ్ = పరుల దూఱకుండుట. దీను లయిన భూతములయెడ దయ.

* పరుఁడు కోపించినపుడు చిఱునవ్వు మొగము ధరించుట, అతఁడు కోపముచే దేహము మఱచినపుడు అతని నాశ్వాసించుట, అతఁడు తిట్టినపుడు వినయముతోఁ బలుకుట, కొట్టినయెడఁ దనపాపము తీఱె నని సంతోషించుట.

అలోలుప్త్వమ్ = అలోలుపత్వము, వర్ణలోపము ఛాందసము. మార్దవమ్=మృదుత్వము, అక్రూరత. హ్రీః = అకార్యప్రవృత్తియందు లోకలజ్జ. అచాపలమ్ = వ్యర్థకార్యము చేయకుండుట, లేక, ఒక్కచోట నుండుట.

రా. అహింసా = పరపీడావర్జనము. సత్యమ్ = దృష్టార్థము తప్పనిదియు భూతములకు హితము నగు వాక్యము. అక్రోధః = పరులు తన్నుఁ బీడించుటచేఁ దత్ఫల మైన చిత్తవికారము లేకుండుట. త్యాగః=ఆత్మహితమునకు విరుద్ధ మయిన పరిగ్రహమును విడుచుట. శాన్తిః = ఇంద్రియములకు విషయాసక్తినిరోధము నభ్యసించుట. అపైశునమ్=పరుల కనర్థము కలిగించువచనముఁ బలుకకుండుట. దయా భూతేషు=సర్వభూతములయందును వానిదుఃఖమును సహింపమి. అలోలుప్త్వమ్= అలోలుపత్వము, లేక, అలోలుత్వమ్ అని పాఠము, విషయములయందు స్పృహ లేకయుండుట యని యర్థము. మార్దవమ్ = అకఠినత, సాధుజనులసంశ్లేషమునకు యోగ్యత యని యర్థము. హ్రీః=అకార్యము చేయుటయందు లజ్జ. అచాపలమ్= కోరఁదగిన విషయముయొక్కసన్నిధియందును అచంచలత.

మా. పైశున మనఁగా పరుల కుపద్రవము కలిగించుదోషములను రాజు మొదలగువారితోఁ జెప్పుట, "పరోపద్రవహేతూనాం దోషాణాం పైశునం వచః। రాజాదేస్తు మదా ద్భీతే రదృష్టి ర్దర్ప ఉచ్యతే" * అని నిఘంటువు. లౌల్య మనఁగా రాగము "రాగో లౌల్యం తథా రక్తిః" అని నిఘంటువు. అచాపలమ్= స్థైర్యము, "చపల శ్చఞ్చలో ఽస్థిరః" అని నిఘంటువు.

తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాఽతిమానితా
భవన్తి సంపదం దైవీ మభిజాతస్య భారత. 3

భా. మఱియును.— తేజః=ప్రగల్భత, త్వక్కు ♦ నం దున్న కాంతి కాదు. క్షమా = పరులచేఁ దాను నిందింపఁబడినపుడు కాని కొట్టఁబడినపుడు కాని లోపల వికారము పుట్టకుండుట, వికారము పుట్టినపుడు దాని నడంచుట యక్రోధ మని చెప్పఁబడినది, ఇట్లు క్షమకును అక్రోధ

---

* పరుల కుపద్రవమునకుఁ గారణము లయిన దోషముల రాజాదులకుఁ జెప్పుట పైశునము. మదమువలన భయము దెలియకుండుట దర్ప మనఁబడును. ఇందుచే ఆసురలక్షణ మయిన దర్పముగూడ వ్యాఖ్యాతము.

♦ దేహచర్మము.

మునకును విశేషము. ధృతిః=దేహేంద్రియములు లలయునప్పుడయ్యలం తను దొలఁగించు నంతఃకరణవృత్తివిశేషము, దేనిచేత నుత్తంభితములై ♦ యింద్రియములును దేహమును అలఁత నొందవో అది. శౌచమ్= పరిశుద్ధత, శౌచము రెండువిధములు, మృత్తికాజలములచేఁ జేయఁబడునది బాహ్యము, అభ్యంతరము మనోబుద్ధులనైర్మల్యము మాయాంరాగాది కాలుష్యము లేకుండుట, ఇట్లు రెండువిధములశౌచమును. అద్రోహః= పరుల హింసించు నిచ్ఛ లేకుండుట, హింసింప కుండుట యహింస యని భేదము, నాతిమానితా = అత్యంతము మానము అతిమానము, అది గలవాఁ డతిమాని, వానిభావ మతిమానిత, అది లేకుండుట నాతిమానిత, తాను మిక్కిలి పూజ్యుఁ డనుభావన లేకుండుట యని యర్థము. భవన్తి = కలుగుచున్నవి, అభయము మొదలుగా నాతిమానితవఱకుఁ జెప్పినలక్షణములు; సంపదమ్ = ప్రకృతిని; ఎట్టిసంపదను ? దైవీమ్ = దేవతల దైనదానిని, దేవతలయొక్క-సంపదను; అభిజాతస్య = అభిలక్షించి ✱ పుట్టినవానికి, దేవసంపదకుఁ దగినవానికి, కల్యాణము నొందఁబోవువాని కని యర్థము. భారత = ఓయర్జునా !

అర్జునా ! భయము లేకుండుటయు, పరులతో వ్యవహారమునందు మనస్సు శుద్ధమై యుండుటయు, శాస్త్రాచార్యులవలన ఆత్మాదిపదార్థముల గ్రహించుటయందును గ్రహించినదాని స్పష్టముగా ననుభవమునకు వచ్చునట్లు చేసికొనుట యను యోగమునందును నిష్ఠయు, దానమును, బాహ్యేంద్రియముల నిగ్రహమును, శ్రౌతమగు నగ్నిహోత్రాదియజ్ఞమును దేవపితృభూతమనుష్యయజ్ఞములును, బ్రహ్మయజ్ఞమును, శారీరాదితపస్సును, ఎల్లప్పుడును నిష్కపటతయు, ప్రాణులఁ బీడింపకుండుటయు, సత్యప్రియభాషణమును, పరులు నిందించినను కొట్టినను క్రోధము నడంచుకొనుటయు, సన్న్యాసమును, అంతఃకరణనిగ్రహమును, కొండెములు చెప్పకుండుటయు, భూతములయందు దయయు, విషయము సన్నిహితమైనను వికారము నొందకుండుటయు, క్రౌర్యము లేమియు, అకార్యము చేయుటయందు లజ్జయును, ప్రయోజనము లేక దేహావయవములను జలింపజేయకయుండుటయు, ప్రగల్భతయు, పరులు నిందించినను కొట్టినను కోపవికారమే పొందకుండుటయు, అవశ్యకార్య

♦ నిలుపఁబడినవై.

✱ ఉద్దేశించి.

ములందు దేహేంద్రియముల కలఁత లేకుండునట్లు చేయు ధైర్యమును, బాహ్యాభ్యంతరశౌచమును, పరుల హింసించునిచ్ఛయే లేకుండుటయు, తాను బూజ్యుఁడను గర్వము లేకుండుటయు — ఈ లక్షణములు దైవసంపద నుద్దేశించి పుట్టినవానికిఁ గలుగుచున్నవి యని తాత్పర్యము.

ఆ. దైవసంపద గలవాని కితరవిశేషణములుం గలవని చెప్పుచున్నారు మఱియును అని. ఇట తేజ స్సనఁగా దేహకాంతి కా దని చెప్పుచున్నారు త్వక్కునందు ఇత్యాదిగా. అధ్యాత్మప్రకరణ మగుటవలన నని శేషము. క్షమయు నక్రోధమును సమానార్థము లగుటచేఁ బునరుక్తి నాశంకించి పరిహరించుచున్నారు వికారము ఇత్యాదిగా. వానిరెంటికిని విశేష ముండుటవలన అపునరుక్తత సిద్ధించుచున్నదని చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. వృత్తివిశేషమునే విశదీకరించుచున్నారు దేనిచేత నిత్యాదిగా. శౌచముయొక్క రెండువిధములనే ప్రకటించుచున్నారు మృత్తికేత్యాదిగా. నైర్మల్యమునే తెలుపుచున్నారు మా యేత్యాదిగా. చెప్పినదానినుపసంహరించుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. అతిమానిత్వాభావమునే స్పష్టీకరించుచున్నారు తాను ఇత్యాదిగా. ఎవ్వని కివిశేషణము లని యాకాంక్ష కలుగఁగాఁ జెప్పుచున్నారు భవన్తి ఇత్యాదిగా. సాధకుఁడు మనుష్యదేహమునందే యుండి యెట్లు దైవసంపద నభిలక్షించి జాతుఁ డగు నని యాశంకించి చెప్పుచున్నారు దేవేత్యాదిగా.

హ. తేజః = ప్రతాపము. క్షమా = క్రోధకారణములు కలుగునపుడు చిత్తము వికారము నొందకుండుట. ధృతిః = క్షుత్పిపాసాదిసహనము. శౌచమ్ = మలశోధనము. అద్రోహః = పరుల హింసించునిచ్ఛ లేకుండుట. నాతిమానితా = తనకుఁ బూజ్యత కల దని తలంపకుండుట. ఈ యుభయాదులు, భవన్తి = కలుగుచున్నవి; సంపదమ్ = లాభమును, దైవీమ్ = దేవతలసంబంధి దైవి, దాని; అభిజాతస్య = అభిలక్షించి పుట్టినవానికి, దైవసంపద నొంది పుట్టినవాని కని యర్థము.

శం. తేజః = బుద్ధియొక్కసూక్ష్మత, లేక, అధిక మయిన ప్రకాశము. క్షమా = శాంతి, వికారము లేక ప్రాప్తోపద్రవమును సహించుట. ధృతిః = ధైర్యము, విక్షేపము కలిగినపుడు దేహేంద్రియమనోబుద్ధులను నిశ్చలములనుగాఁ జేయుశక్తి. శౌచమ్ = ఆంతరమును బాహ్యమును, అందు బాహ్యశౌచము మృజ్జలములచే దేహమలమును తొలఁగించుట, ఆంతరము సదసద్వివేకవిజ్ఞానముచేఁ జిత్తమునందలి దుర్వాసనామలములఁ దొలఁగించుట. అద్రోహః = ద్రోహ

మనఁగాఁ దన కపకారము చేసినవాని వధింపవలయు నను నిచ్ఛ, అది లేకుండుట. నాతిమానితా=తా నతిపూజ్యుఁ డను నభినివేశము అతిమానము, దానియభావము నాతిమానము, అది గలవాఁడు నాతిమాని, వానిభావము, తనకుఁ బ్రతిష్ఠ నపేక్షింప కుండుటయనుట. అభయము మొదలుగా నాతిమానితవఱకుఁ జెప్పిన యీ యిరువది యాఱుసాత్త్వికధర్మములు, దైవీంసంపదమ్—"తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్" అనుటవలన దీవ్యతే – నిర్మలత్వముచేఁ బ్రకాశించుచున్నది కావున దేవశబ్దమునకు సత్త్వగుణ మర్థము, దానిసంబంధి దైవి, సంప త్తనఁగా సమృద్ధి ఉత్కర్షము, అట్టి దైవి యగు సంపదను; అభిజాతస్య = పూర్వజన్మకృత పుణ్యాతిశయమువలన సత్త్వాతిశయమును అభి – అనుసరించి జాతస్య – పుట్టిన వానికి; లేక, దేవతలయొక్క-సంపదను దైవసంపదను. అభిజాతునకు – పరమపురు షార్థము నొందఁబోవు పుణ్యపురుషునకు; భవన్తి – సంభవించుచున్నవి యని యర్థము.

౧. తేజః=ప్రాగల్భ్యము, స్త్రీబాలకాదిమూఢులకు లోఁబడ కుండుట. క్షమా = సామర్థ్య మున్నను తన్నుఁ బరిభవించినవానియెడఁ గ్రోధము నొంద కుండుట. ధృతిః=దేహేంద్రియము లవసాదము * నొందినను వానిఁ బ్రోత్సాహ పఱుచు ప్రయత్నవిశేషము, దేనిచేఁ బ్రోత్సాహితములై కరణములును శరీరమును అవసాదము నొందవో అట్టిది. ఈ మూఁడును క్షత్త్రియునియసాధారణధర్మములు. శౌచమ్ = ఆభ్యంతరశుద్ధి, అర్థప్రయోగాదులందు మాయ అనృతము మొదలగు నవి లేకుండుట; మృజ్జలాదిజనిత మగు బాహ్యశౌచమో యిట గ్రాహ్యము కాదు, అది శరీరశుద్ధిరూపమై బాహ్య మగుటచే నంతఃకరణవాసన కాకుండుటవలన, సాత్త్వికాదిభేదభిన్నము లగు నంతఃకరణవాసనలనే దైన్యాసుర్యాదిసంపద్రూపము లనుగా నిటఁ బ్రతిపాదించుట యిష్ట మగుటవలన; స్వాధ్యాయాదికమువలె నేరూ పమున నేని వాసనారూపం బగునెడ నదియు గ్రాహ్యమే కావచ్చును. ద్రోహము– పరుని వధింపఁగోరి శస్త్రము గ్రహించుట మొదలగునవి, తదభావ మద్రోహము. ఈ రెండును వైశ్యున కసాధారణములు. అత్యర్థము మానిత–తనయందుఁ బూజ్య తాతిశయము కల దనుభావన, తదభావము నాతిమానిత, పూజ్యులయెడ నమ్రత. ఇది శూద్రునియసాధారణధర్మము. "త మేతం వేదానువచనేన బ్రాహ్మణా, వివిది షన్తి యజ్ఞేన దానేన తపసా ఽనాశకేన" ఇత్యాది శ్రుతిచే వివిదిషాసాధనము

* అలసటను.

లుగా వినియుక్తము లైన యసాధారణములు సాధారణములు నగు వర్ణాశ్రమ ధర్మము లిట నుపలక్షితము లగుచున్నవి. ఈ ధర్మములు, భవన్తి=కలుగుచున్నవి; దైవీమ్ = శుద్ధసత్త్వమయ మగు; సంపదమ్=వాసనాసంతతిని శరీరారంభకాల మునఁ బుణ్యకర్మములచే నభివ్యక్త మయినదానిఁ; అభిలక్షించి జాతుం డగుపురుషు నకు, "తం విద్యాకర్మణీ సమారభేతే పూర్వప్రజ్ఞాచ, పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన"* ఇత్యాదిశ్రుతులవలన. ఓ భారతా యని సంబోధించుచు శుద్ధవంశజాతుండ వగుటచేఁ బవిత్రుఁడవు నీవు ఇట్టి ధర్మములకు యోగ్యుఁడ వని సూచించుచున్నాఁడు.

శ్రీ. మఱియును.— తేజః = ప్రగల్భత. క్షమా = పరిభవాదులు గలిగి నపుడు కోపము నడంచుట. ధృతిః = దుఃఖాదులచే శ్రాంత మగుచిత్తమును స్థిరీ కరించుట. శౌచమ్ = బాహ్యాంతరశుద్ధి. అద్రోహః = వధింప నిచ్ఛ లేకుండుట. అతిమానిత — తా నతిపూజ్యుఁ డను నభిమానము, తదభావము నాతిమానిత. అభ యాదు లగు నీయిరువదియాఱులక్షణములు, దైవీం సంపద మభిజాతస్య భవన్తి = దేవయోగ్య మయిన సాత్త్వికసంపదను అభిలక్షించి — తదభిముఖుండై పుట్టిన వానికి భావికల్యాణుం డగు పురుషునకుఁ గలుగుచున్నవి యని యర్థము.

మ. అద్రోహః = ద్వేషము లేకుండుట. నాతిమానితా=తాను బూజ్యుం డను నభిమానము లేకుండుట. ఈ యభయాదు లిరువదియాఱులక్షణములు దైవ సంపద నభిలక్షించి జాతుం డగువానికి నిష్పన్నము లగుచున్నవి. ♦

రా. తేజః = దుర్జనులచే నభిభవింప శక్యము గాకుండుట. క్షమా=పరుల వలనఁ బీడ ననుభవించి వారియందు దానిచేఁ జిత్తవికారము నొందకుండుట. ధృతిః = గొప్పయాపదయందును దనకృత్యమును దాను జేయవలయు నను నిశ్చ యము. శౌచమ్ = బాహ్యాంతరకరణములకు శాస్త్రీయ మగు కర్మయోగ్యత. అద్రోహః=పరుల నిర్బంధింపకుండుట, వారియథేచ్ఛవృత్తిని నిరోధింప కుండుట. నాతిమానితా = అస్థానంబున గర్వము అతిమానిత్వము, అది లేకుండుట. ఈగుణ ములు, దైవీం సంపద మభిజాతస్య భవన్తి=దేవసంబంధిని దైవి, భగవదాజ్ఞానువర్తన స్వభావులు దేవశబ్దముచేఁ జెప్పఁబడుచున్నారు, వారిసంపద దైవసంపద, అది భగ

* అతని విద్యయును కర్మమును బూర్వప్రజ్ఞయును వెంబడించుచున్నవి, పుణ్యకర్మముచేఁ బుణ్యుఁ డగును, పాపకర్మముచేఁ బాపుఁ డగును.

♦ తక్కినది శ్రీధరీయముతో సమానము.

వదాజ్ఞానువర్తనమే యగును, దాని అభిజాతస్య—అభిముఖీకరించికొని జాతుఁడైన వానికి — దాని నెఱవేర్చుటకుఁ బుట్టినవానికి, కలుగుచున్నవి యని యర్థము.

**మా.** క్షమయో క్రోధము లేమిత్త గూడ అపకరించినవాని కపకరింప కుండుట "అక్రోధదోష కృచ్ఛ్రత్రోః క్షమా నా స నిగద్యతే" అను నిఘంటువు వలన.

దమ్భో దర్పో ఽతిమానశ్చ క్రోధః పారుష్య మేవచ
అజ్ఞానం చా ఽభిజాతస్య పార్థ సంపద మాసురీమ్. ౪

**భా.** ఇంక నిప్పు డాసురసంపద చెప్పఁబడుచున్నది.—దమ్భః = ధర్మధ్వజిత్వము *. దర్పః = ధనమును బంధువులును గలవాఁ డగుట వలనఁ గలుగుమదము. అతిమానః — మున్ను చెప్పఁబడినది. క్రోధశ్చ= క్రోధమును. పారుష్యమేవచ = పరుషవచనముగూడ, ఎట్లనఁగా—గ్రుడ్డి వానిఁ గన్నులు గలవాఁ డని, విరూపుని రూపవంతుఁ డని, హీనకులజుని నుత్తమకులజుఁ డని — ఈవిధముగాఁ బలుకుట. అజ్ఞానంచ=అవివేకజ్ఞాన ముగూడ, మిథ్యాజ్ఞానము, కర్తవ్యా ఽకర్తవ్యములయందు విపరీతజ్ఞాన ము. పార్థ = అర్జునా! అభిజాతస్య=అభిలక్షించి పుట్టినవానికి. దేని నభిల క్షించిపుట్టినవాని కనఁగాఁ జెప్పుచున్నారు. — ఆసురీమ్ = అసురుల దైన; సంపదమ్ = సంపదను, దాని నభిజాతునకు కని యర్థము.

అర్జునా! ఆసురసంపదతోఁ బుట్టినవానికి దంభము మదము అతిమానము క్రోధము పరుషవచనము అజ్ఞానము అనునివి కలుగుచున్న వని తాత్పర్యము.

**ఆ.** సంపాదించుటకై దైవసంపదను బ్రతిపాదించి వర్జించుటకై యా సురసంపదను జెప్పుచున్నారు ఇంక నిత్యాదిగా. మదము—పెద్దల నవమానించుటకు హేతువు. అతిమానము—తనయం దుత్కృష్టత నారోపించుకొనుట. క్రోధ మనఁగా కోపమను నామాంతరము కలది, తనకును బరునకును అపకారము చేయఁ బ్రవర్తిం చుటకు హేతువును నేత్రాదివికారములు చిహ్నములుగాఁ గలదియు నగునంతఃకరణ వృత్తివిశేషము. పరుషుఁ డనఁగా నిష్ఠురుఁడు, ప్రత్యక్షముగాఁ గఠినముగఁ బలుకు వాఁడు, వానిభావము పారుష్యము. దాని నుదాహరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా.

* కీర్తికొఱకు ధర్మము చేయుట.

ఆసురసంపద నభిజాతునకు దంభము మొదలుగా అజ్ఞానమువఱకుఁ జెప్పినవి, భవన్తి — కలుగుచున్నవి. భవన్తి యని పూర్వశ్లోకమునుండి యనువర్తించుచున్నది.

హ. దమ్భః = ధర్మధ్వజము. దర్పః = ధనాదులచేఁ గలుగు చిత్తమునం దలి గర్వము. అభిమానశ్చ * = తాను పూజ్యుఁ డను తలంపు. క్రోధః= కోపము. పారుష్యమ్ = క్రౌర్యము. అజ్ఞానమ్ = తెలివి లేమి. ఆసురీం సంపదమ్ = అసురుల దైన సంపదను.

శం. దైవసంపద నభిజాతున కభయాదులు మోక్షహేతువులగు సాత్త్విక గుణములు గలుగు నని ప్రతిపాదించి యాసురి యగు సంపద నభిజాతున కీగుణ ములు గలుగుచున్నవి యని చెప్పుచున్నాఁడు.—వేషభాషాచారాదులచేఁ దాను గొప్పవాఁ డనిపించుకొనుటకుఁ దానే తనకులశీలవిద్యాద్యాచారములగొప్పతన మును బ్రకటించుట దంభము. విద్యారూపకులధనకర్త్రాదులవలనఁ గలుగు చిత్తో ద్రేకము సత్పురుషావమానహేతువు దర్పము. తానే యుత్కృష్టుఁ డను బుద్ధి యభి మానము. పరుల కపకారము చేయించునదియు మహానర్థహేతువు నగు చిత్త క్షోభము క్రోధము. పరుషుఁడు నిష్ఠురభాషణము గలవాఁడు, వానిభావము పారు ష్యము. చకారము సముచ్చయార్థము. ఏవకారము స్వప్నమునందును నీనియందు మృదువచనము లే దని యితరవ్యవచ్ఛేదార్థము. అజ్ఞానమ్=సదసద్వివేకము లేమి. చకారమువలనఁ దత్కార్యమును. దంభము మొదలుగా నజ్ఞానమువఱకుఁ జెప్పిన యీరజస్తమోధర్మము లాఱును, ఆసురీంసంపదమ్=" రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగ సముద్భవమ్ । తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ " అని చెప్పఁబడుటవలన ఘోర మగు కర్మమును జేయించుటకై పురుషుని అసూన్—ప్రాణ ములను ఇంద్రియములను రాతి — ఆకర్షించుచున్నది కావున అసురశబ్దమునకు రజో గుణమును దమోగుణమును అర్థము, తత్సంబంధిని ఆసురి, సంప త్తనఁగా సమృద్ధి ఉత్కర్షము, అట్టి యాసురి యగు సంపదను; అభిజాతస్య=పూర్వజన్మకృత పాపాతి శయమువలన రజస్తమోగుణాతిశయమును అభి — అనుసరించి పుట్టినవానికి; లేక, అసురులది అసురి, అట్టి యాసురి యగు సంపదను అభిజాతుఁ డైనవానికి, దురా త్ముఁడును ముం దనర్థము పొందఁబోవువాఁడు నగు పురుషునకు; భవన్తి — సంభ వించుచున్నవి యని యర్థము.

* ఈవ్యాఖ్యానమునందును శంకరానందీయ శ్రీధరీయ పరమార్థప్రపలయందును అభిమానశ్చ అని పాఠము.

మ ఆదేయముగా దైవసంపదను బ్రతిపాదించి హేయముగా నాసురసంపదను ఒకశ్లోకముచే సంక్షేపించి చెప్పుచున్నాఁడు.—దమ్భః=తాను ధార్మికుఁ డని ప్రకటించుట, అదియే ధర్మధ్వజిత్వము. దర్పః = ధనము బంధుసంపత్తి మొదలగు వానివలనఁ గలుగునదియు మహాత్ముల నవమానించుటకు హేతువునగు గర్వవిశేషము. అతిమానః=తనయం దత్యంతపూజ్యతాతిశయము నధ్యారోపించుకొనుట, "దేవాశ్చ వా అసురాశ్చోభయే ప్రాజాపత్యాః పస్పృధిరే తతో ఽసురా అతిమానేనైవ కస్మిన్ను వయం జుహుయామేతి స్వేష్వేవా ఽఽస్యేషు జుహ్వతశ్చేరుస్తే ఽతిమానేనైవ పరాబభూవుస్తస్మాన్నాతిమన్యేత పరాభవస్య హ్యేతన్ముఖం యదతిమానః" * అను శతపథశ్రుతియందుఁ జెప్పఁబడినది. క్రోధః=తనకును బరునకును అపకారమునందుఁ బ్రవర్తించుటకు హేతు వగు నభిజ్వలనాత్మక మైన యంతఃకరణవృత్తివిశేషము. పారుష్యమ్ = ప్రత్యక్షమున నిష్ఠురముగాఁ బలుకు స్వభావము. చకార మనుక్తము లగు భావభూతము లైన చాపలాదిదోషముల సముచ్చయార్థము. అజ్ఞానమ్=కర్తవ్యాఽకర్తవ్యాదివిషయవివేకము లేమి. చకార మనుక్తములగు నభావభూతము లైన యధృత్యాదిదోషముల సముచ్చయార్థము. ఆసురీమ్=అసురులసంతోషమునకు హేతువై రజస్తమోమయ మగు; సంపదమ్=అశుభవాసనాసంతతిని, శరీరారంభకాలంబునఁ బాపకర్మములచే నభివ్యక్త మైనదాని; అభిలక్షించి జాతుఁ డైనవానికి కుత్సితపురుషునకు దంభము మొదలుగా నజ్ఞానమువఱకుఁ జెప్పినదోషములే కలుగుం గాని యభయాదిగుణములు కలుగ వని యర్థము. పార్థ అని సంబోధించుచు నీవు శుద్ధురా లగు తల్లి గలవాఁడ వగుటచే నీ కట్టిదోషములు లే వని సూచించుచున్నాఁడు.

శ్రీ- ఆసురసంపదను చెప్పుచున్నాఁడు.—దమ్భః = ధర్మధ్వజిత్వము. దర్పః = ధనము విద్య మొదలగువానిచేఁ గలుగు చిత్తోత్సేకము. అభిమానము వివరింపఁబడినది. క్రోధము ప్రసిద్ధము. పారుష్యమ్ = నిష్ఠురత. అజ్ఞానమ్=అవివేకము. ఆసురీమ్ — ఇది యుపలక్షణము; అసురులయు రాక్షసులయు సంపద యేది గలదో దాని నభిలక్షించి జాతుఁ డగువాని కీదంభాదులు కలుగు నని యర్థము.

---

* దేవతలును అసురులును ఉభయులును బ్రాజాపత్యులు ఒండొరునిమీఁద స్పర్ధ వహించిరి, అంత నసురు లతిమానముచేతనే దేనియందు మేము హోమము చేయుదు మని తమముఖములయందే హోమము చేయుచుఁ జరించిరి, వా రాయతిమానముచేతనే పరాభవము నొందిరి, అందువలనఁ దా నెక్కుడ యని తలంపఁగూడదు, అతిమాన మనునది యేది గలదో అదియే గదా పరాభవమునకు మూలము.

ప. ఇఁక నాసురసంపదను జెప్పుచున్నాఁడు.—అభిమానః = అహంభావము. క్రోధః = కోపాతిశయము. *

రా. దమ్భః = తాను ధార్మికుఁ డని ప్రకటించుటకై ధర్మానుష్ఠానము. దర్పః = కృత్యాకృత్యములయవివేకమునకుఁ గారణ మయిన విషయానుభవజన్యమగు హర్షము. అతిమానశ్చ = తనవిద్యకును గులమునకును అననురూప మయిన యభిమానము. క్రోధః=పరపీడకుఁ గారణ మయిన చిత్తవికారము. పారుష్యమ్ = సాధువుల కుద్వేగము కలిగించుస్వభావము. అజ్ఞానమ్=పరావరతత్త్వముయొక్కయు కృత్యాకృత్యములయొక్కయు అవివేకము. ఈ స్వభావములు ఆసురసంపద నభిజాతునకుఁ గలుగుచున్నవి—అసురులు భగవదాజ్ఞ నతిక్రమించుస్వభావము గలవారు.

మూ. †

దైవీ సంప ద్విమోక్షాయ నిబన్ధాయా ఽఽసురీ మతా
మా శుచ స్సంపదం దైవీ మభిజాతో ఽసి పాణ్డవ. ౫

భా. ఈ సంపదలకార్యము చెప్పఁబడుచున్నది.—దైవీసంపత్ = దైవసంపద యేది గలదో అది; విమోక్షాయ = సంసారబంధమునుండి మోక్షము కొఱకు. ఆసురీ=ఆసురసంపద; నిబన్ధాయ = నియత మైన బంధము నిబంధము, దానికొఱకు; మతా=తలంపఁబడినది. అట్లు రాక్షస సంపదయు. తత్కార్యము నిట్లు చెప్పఁగా నర్జునుండు తా నేమి యాసుర సంప ద్యుక్తుఁడా మఱి దైవసంప ద్యుక్తుఁడా యని యాలోచించు నని యాతని యంతర్గత మైనభావము నూహించి చెప్పుచున్నాఁడు భగవంతుఁడు. — మా శుచః = శోకము నొందకుము. దైవీంసంపదమ్=దైవ సంపదను; అభిజాతః=అభిలక్షించి పుట్టినవాఁడవు; అసి=అగుచున్నావు, భావికల్యాణుఁడవు ‡ నీ వని యర్థము. పాణ్డవ = ఓపాండుపుత్త్రా!

అందు దైవసంపద సంసారబంధమునుండి మోక్షమునకు సాధన మగును. ఆసురసంపద సంసారబంధమునే బలపఱుచును. పాండుపుత్త్రా! శోకము నొంద వలదు, నీవు దైవసంపద గలవాఁడ వని తాత్పర్యము.

---

* తక్కినది శ్రీధరీయముతో సమానము.

† ఈ శ్లోకమున కిభాష్యము లేదు.

‡ కలుగఁబోవుకల్యాణము గలవాఁడవు.

**ఆ.** కార్యము—ఫలవిభాగము. ఆసురీ యనునది యుపలక్షణము, రాక్షసియు నట్టిదే యని యెఱుఁగవలయు నని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. రెండుసంపదలకును ఫలవిభాగము నిట్లు చెప్పఁగా నర్జునునకుఁ గలిగినయభిప్రాయము నెఱింగి భగవంతునివచనం బిది యని చెప్పుచున్నారు తత్కార్యము నిత్యాదిగా. అందులకు సత్కులజత్వము హేతువుగాఁ జెప్పుచున్నారు పాణ్డవ అని.

**హ.** ఈ సంపదలఫలముఁ జెప్పుచున్నాఁడు.—విమోక్షాయ=సంసారము నుండి మోక్షముకొఱకు. నిబన్ధాయ = అవిద్యాకామకర్మబంధముకొఱకు. మా శుచః=శోకము నొందకుము.

**శం.** రెండుసంపదలయుఁ గార్యముఁ జెప్పుచున్నాఁడు.—దైవీసంపత్ = అభయం సత్త్వసంశుద్ధి రిత్యాదికముచే ఏ దైవసంపద చెప్పఁబడినదో అది; విమోక్షాయ = సంసారబంధమునుండి ముక్తికొఱకు; అగుచున్నది. అందువలన దైవసంపద్యుక్తుఁడే యసంమూఢుఁడై జ్ఞానాధికారి యగుచున్నాఁడు, కాఁడు మఱి యాసురసంపద్యుక్తుఁ డని సూచించుటకై యాసురసంపద బంధకం బని చెప్పుచున్నాఁడు.—ఆసురీ = దమ్భో దర్ప ఇత్యాదికముచే నేయాసురసంపద చెప్పఁబడుచున్నదో అది; నిబన్ధాయ=సంసారబంధముకొఱకే యగుచున్నదని; మతా=నాచే నిశ్చయింపఁ బడినది, ఎప్పుడును మోక్షముకొఱకుఁ గా దని యర్థము. అప్పుడు నేను దైవసంపద గలవాఁడనో, లేక ఆసురసంపద గలవాఁడనో అని సందేహించుచున్నయర్జునుఁ గాంచి తత్సంశయముఁ బరిహరించుటకై చెప్పుచున్నాఁడు.—పాణ్డవ ! నీవు, దైవసంపదనే యభిజాతుఁడ వగుచున్నావు, దైవసంపద్యుక్తుఁడవై సంసారమునుండి ముక్తుఁడవు కాఁగలవు. మాశుచః—నీ వీయర్థమునందుఁ జింతచేయకు మని యర్థము.

**మ.** ఈ సంపదల ఫలవిభాగము చెప్పఁబడుచున్నది.—ఏవర్ణమునకు ఏయాశ్రమమునకు ఏది ఫలాభిసంధిరహిత మగు సాత్త్వికకర్మము విహితమో అది యావర్ణము ఆయాశ్రమము గలదానికి దైవసంపద. అది సత్త్వశుద్ధి భగవద్భక్తి జ్ఞానయోగస్థితిపర్యంత మగుచు సంసారబంధనమునుండి విమోక్షాయ=కైవల్యము కొఱ కగుచున్నది. అందువలన శ్రేయోర్థులు దానినే సంపాదింపవలయును. ఏది మఱి యెవ్వనికి శాస్త్రనిషిద్ధమును ఫలాభిసంధిపూర్వకమును సాహంకారము నగు రాజసము తామస మయిన కర్మము గలదో అది యంతయు వాని కాసురసంపద. కావున రాక్షసియును దానియం దంతర్భూతమే యగును. అది, నిబన్ధాయ=నియత మయిన

సంసారబంధముకొఱకు; మతా=సమ్మతము శాస్త్రములకును తదనుసారులకును. అందువలన శ్రేయోర్థులు దాని విడువవలసినదియే యని యర్థము. ఇట్లుండఁగా నే నేసంపదతోఁ గూడినవాఁడ నని సందేహించుచున్న యర్జును నాశ్వాసించుచున్నాఁడు భగవంతుఁడు.—మా శుచః = నే నాసురసంపదతోఁ గూడినవాఁడ నను శంక చే శోకమును – అనుతాపమును పొందకుము. దైవీంసంపదమ్ = దైవసంపదను; అభి జాతోఽసి=అభిలక్షించి పుట్టినవాఁడ వగుచున్నావు, పూర్వ మార్జింపఁబడిన కల్యా ణము గలవాఁడవును ముందును గల్యాణముఁ బొందఁబోవువాఁడవు నగుచున్నావు నీవు. ఓపాండవా! పాండుపుత్త్రులయం దితరులయందును దైవసంపద ప్రసిద్ధము, నీ యందుఁ జెప్పవలయునా అని భావము.

శ్రీ. ఈ సంపదలకార్యమును దెలుపుటకై చెప్పుచున్నాఁడు.—దైవసం పద యేది గలదో దానితోఁ గూడినవాఁడు నేను జెప్పిన తత్త్వజ్ఞానమునం దధికారి, ఆసురసంపదతోఁ గూడినవాఁడో నిత్యమును సంసారియే యగు నని యర్థము. దీని నాలకించి ఏమి నే నిం దధికారి యగుదునో కానోయని సందేహముచే వ్యాకులచిత్తుం డగు నర్జును నాశ్వాసించుచున్నాఁడు.— ఓపాండవా! మాశుచః = శోకము నొందకుము. ఎందువలన ననఁగా నీవు, దైవీంసంపద మభిజాతోఽసి.

ప. *

రా. దైవీ సంపత్ = మదాజ్ఞానువర్తనరూప మైనసంపద; విమోక్షాయ= బంధమునుండి ముక్తికొఱకు అగుచున్నది, క్రమంబున మత్ప్రాప్తికొఱ కగుచున్న దని యర్థము. ఆసురీ = మదాజ్ఞాతిక్రమణరూప మగుసంపద; నిబన్ధాయ = అధో గతిప్రాప్తికొఱ కగుచున్నది యని యర్థము. ఇది విని తనప్రకృతి నిశ్చితము కానం దున నతిభీతుఁ డయిన యర్జునున కిట్లు చెప్పుచున్నాఁడు.—శోకము నొందకుము. నీవో, దైవీం సంపద మభిజాతోఽసి. పాణ్డవ – ధార్మికాగ్రేసరుఁ డగు పాండుని తనయుఁడవు గదా నీ వని యభిప్రాయము.

మా. దైవీం సమ్పదమ్, అభిజాతః = కూర్చి పుట్టినవాఁడవు.

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవచ
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు. ౬

---

* శ్రీధరీయముతో సమానము.

భా. ద్వౌ = రెండు; భూతసర్గౌ = భూతములయొక్క—మనుష్యుల యొక్క సర్గములు — సృష్టులు, సృజింపఁబడుచున్నవి కావున సర్గము లనఁబడును, భూతములే సృజింపఁబడుచున్నవి దైవాసురసంపద్యుక్తములు రెండు భూతసర్గము లని చెప్పఁబడుచున్నది, "ద్వయా హ ప్రాజాపత్యా దేవా శ్చా ఽసురాశ్చ" * అను శ్రుతివలన; అస్మిన్ లోకే — ఈ సంసారమునం దని యర్థము; సర్వభూతములకును ద్వైవిధత్వ ముపపన్న మగుటవలన. ఏవి యాభూతసర్గము లని చెప్పఁబడుచున్నవి? ప్రకృతములే, దైవః = దైవమనియు; ఆసురఏవచ = ఆసుర మనియు. చెప్పినవే వెండియు ననువదించుటకుఁ బ్రయోజనముఁ జెప్పుచున్నాఁడు.—దైవః = దైవ మగు భూతసర్గము; అభయం సత్త్వసంశుద్ధి రిత్యాదిగ్రంథముచే, విస్తరశః = విస్తరప్రకారములచేత; ప్రోక్తః= చెప్పఁబడినది. కాని యాసురము విస్తరించి ప్రతిపాదింపఁబడినది కాదు. కావున దానిఁ బరివర్జించుటకై, ఆసురమ్=ఆసుర మగు భూతసర్గమును; పార్థ = అర్జునా! మే = నాయొక్క, వచనమువలన విస్తరించి చెప్పఁబడుదానిని; శృణు = వినుము.

ఈ సంసారమునందు దైవ మనియు ఆసుర మనియు భూతసర్గము రెండు విధములై యున్నది. అందు దైవమును విస్తరించి నీకుఁ జెప్పితిని, ఇఁక ఆసురమును విస్తరించి చెప్పెద వినుము. అర్జునా! అని తాత్పర్యము.

ఆ. నిర్దయు లగు రాక్షసులసంపద మూఁడవది కలదు, దానినేల చెప్పలే దని యాశంకించి యాసురియం దంతర్భవించుటవలన నని చెప్పుచున్నారు ద్వౌ అని. భూతములు ద్వివిధము లనుటకుఁ బ్రమాణముగా నుద్గీథబ్రాహ్మణము నుదాహరించుచున్నారు ద్వయా హేత్యాదిగా. ఈ రెండుసంపదలు గలవారికన్నను భిన్నులుగూడ ప్రాణులు సంభవించుటవలన భూతములు రెండువిధములే యని యెట్లు చెప్పవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు స ర్వేత్యాదిగా.

హా. సర్గ మనఁగా సృష్టి. దేవసంబంధి దైవము. అసురసంబంధి ఆసురము. దైవః = దైవసర్గము. విస్తరశః = విస్తరముచేత.

---

* ప్రజాపతివలనఁ బుట్టినవారు దేవత లనియు నసుర లనియు రెండువిధములై యున్నారు.

**శ౦.** ఓయీ! "రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః" అనియు "దైవీం ప్రకృతి మాశ్రితాః" అనియు "ప్రకృత్యా నియతా స్స్వయా" అనియుఁ బెక్కుప్రకృతులు చెప్పఁబడినవి, ఎట్లు వీని నిర్ణయము? అని యాశంక కలుగఁగా, "రాక్షసి యాసురియందే యంతర్భవించుచున్నది, దైవియు ఆసురియు నని ప్రకృతి రెండువిధములే యగును, ప్రకృత్యా నియతా స్స్వయా అని దైవియు నాసురియునే చెప్పఁబడుచున్నవి కాని తదతిరిక్తము కాదు" అని ప్రకృతులు రెండువిధములే యని నిదర్శించుచు నాసురప్రకృతినే విశేషించి ప్రతిపాదించుచున్నాఁడు హేయాంశము తెలిసినయెడ నుపాదేయాంశము తద్విలక్షణముగా నెఱుంగ శక్య మగు నని సూచించుటకై.—అస్మిన్ లోకే = ఈ సంసారమండలమునందు; భూతసర్గౌ=భూతములయొక్క—ప్రాణులయొక్క—సర్గములు—సృష్టములు—సంసృష్టము లగుచున్నవి గంధము పుష్పమునుబోలె ప్రాణిచిత్తము ననుబంధించియున్నవి కావున సర్గములనఁగా స్వభావములు, అట్టి సర్గములు—ప్రకృతులు; దైవః=దైవము; ఆసురఏవచ = ఆసురము నని; ద్వౌ=రెండే కలవు. తదతిరిక్తము లే దని యర్థము. ఆసర్గములలో అభయ మిత్యాదిగా, దైవః = దైవ మగు భూతసర్గము; విస్తరశః = విస్తరముచేత; ప్రోక్తః=చెప్పఁబడినది. కాని యాసురము చెప్పఁబడినది కాదు. దాని, ముముక్షువునకు హేయ మగుటచే నెఱుఁగవలసినదానిని, మే — నా చెప్పఁబోవుదానిని; శృణు = వినుము.

**మ.** ఓయీ! రాక్షసప్రకృతి యాసురియం దంతర్భూత మగుఁగాక, శాస్త్రనిషిద్ధకర్మోన్ముఖతచే సమాన మగుటవలన. కామభోగప్రాధాన్యమును ప్రాణిహింసాప్రాధాన్యమును బట్టి యొకానొకచో భేదంబునను వ్యపదేశ ముపపన్నము. మానుషప్రకృతియో తృతీయము వేఱుగా నున్నది, "త్రయాః ప్రాజాపత్యాః ప్రజాపతౌ పితరి బ్రహ్మచర్య మూషు ర్దేవా మనుష్యా అసురాః" * అను శ్రుతివలన. కావున దానినిగూడ హేయకోటియందుఁ గాని యుపాదేయకోటియందుఁ గాని చెప్పవలయును. ఇందులకుఁ జెప్పుచున్నాఁడు.—అస్మిన్ లోకే=సమస్త మైన యీ సంసారసర్గమునందు. ద్వౌ=రెండువిధములే; భూతసర్గౌ=మనుష్యసర్గములు కలవు. ఏవి యవి? దైవః, రాక్షసఏవచ. కాని రాక్షసముగాని మానుషముగాని యధికమైనసర్గము లే దని యర్థము. ఏమనుష్యుఁ డెప్పుడు శాస్త్రసంస్కారప్రాబల్యమున

---

* ప్రాజాపత్యులు మూఁడుతెగలవారు తండ్రి యగు ప్రజాపతియొద్ద బ్రహ్మచర్యము చరించిరి, దేవతలు మనుష్యులు అసురులు అని.

స్వభావసిద్ధము లగు రాగద్వేషములను జయించి ధర్మపరాయణుఁ డగుచున్నాఁడో అతఁ డప్పుడు దేవశబ్దవాచ్యుఁడు. ఎప్పుడు మఱి స్వభావసిద్ధరాగద్వేషప్రాబల్యముచే శాస్త్రసంస్కారముఁ గోలుపోయి యధర్మపరాయణుఁ డగుచున్నాఁడో అతఁ డప్పు డసురుఁడు. ఇట్లు ద్వివిధతయే యుపపన్నము. ధర్మాఽధర్మములు దక్క వే ఱయిన మూఁడవకోటి లేదు గదా. అట్లు శ్రుతి "ద్వయా హ ప్రాజాపత్యా దేవా శ్చాఽసురాశ్చ తతః కనీయసా ఏవ దేవా జ్యాయసా అసురాః" అని. దమదానదయావిధిపర మగు త్రయాః ప్రాజాపత్యా ఇత్యాదివాక్యమునందో దమదానదయారహితు లగు మనుష్యు లసురులే యగుచు నొకానొకసాధర్మ్యంబున దేవశబ్దమునను మనుష్యశబ్దమునను అసురశబ్దమునను ఉపచారమునఁ జెప్పఁబడుచున్నారు. కావున నాధిక్యమున కవకాశము లేదు. "ద" అను నొకయక్షరముచేతనే ప్రజాపతి దమరహితు లగు మనుష్యులకు దమోపదేశమును దానరహితులకు దానోపదేశమును దయారహితులకు దయోపదేశమును జేసెను. కాని విజాతీయు లగు దేవాసురమనుష్యు లట వివక్షితులు కారు, శాస్త్రము మనుష్యాధికార మగుటవలన. అట్లు అంతమున నుపసంహరించుచున్నది శ్రుతి "త దేత దేవైషా దైవీ వా గనువదతి స్తనయిత్ను ర్ద ద ద ఇతి దామ్యత దత్త దయధ్వ మితి తదేత త్త్రయం శిక్షే ద్దమం దానం దయా మితి" * అని. అందువలన రాక్షసమానుషప్రకృతు లాసురియందే యంతర్భవించుం గావున యుక్తము చెప్పఁబడినది ద్వౌ భూతసర్గౌ అని. అందు, దైవః=దైవ మగు భూతసర్గము; నాచే నీకు, విస్తరశః = విస్తరప్రకారములచేత; ప్రోక్తః=చెప్పఁబడినది, ద్వితీయాధ్యాయంబునందు స్థితప్రజ్ఞలక్షణమునను ద్వాదశమునందు భక్తలక్షణమునను త్రయోదశమునందు జ్ఞానలక్షణమునను జతుర్దశమునందు గుణాతీతలక్షణమునను ఇందును అభయ మిత్యాదిగ్రంథమునను. ఇప్పుడు, ఆసురమ్ = ఆసురభూతసర్గమును; మే=నా వాక్యముచే; విస్తరమునఁ బ్రతిపాదింపఁబడుచున్నదాని నీవు, శృణు = విడుచుటకొఱకు వినుము, చక్కఁగా నెఱింగినం గదా వర్జింప శక్య మగును గావున. పార్థ అని సంబంధము సూచించుటచే నుపేక్షణీయుఁడవు కావు నీ వని తెలుపుచున్నాఁడు.

శ్రీ. ఆసురసంపద సర్వప్రయత్నంబున వర్జనీయము గావునఁ దదర్థమై యాసురసంపదను బ్రపంచించుటకై చెప్పుచున్నాఁడు.—ద్వౌ = రెండువిధములు;

* అట్టి దీనినే యీదైవవాక్కు గర్జించుచు ననువదించుచున్నది ద ద ద అని — దమము నొందుఁడు దానము చేయుఁడు దయ గలుగుఁడు అని. అందువలన ఈ మూఁటిని దమమును దానమును దయను నేర్వవలయును.

భూతములయొక్క–సర్గములు. మే–నావాక్యమువలన; శృణు. ఆసురరాక్షసప్రకృతుల నొక్కటిగాఁ జేసి రెండువిధము లని చెప్పఁబడినది. అందువలన "రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః" ఇత్యాదిగా నవమాధ్యాయమునఁ జెప్పిన ప్రకృతిత్రైవిధ్యముతో విరోధము లేదు. ఇతరము స్పష్టము.

ప. *

రా. అస్మిన్ లోకే = ఈ కర్మలోకమునందు; కర్మకరము లగు భూతముల యొక్క–సర్గములు ద్వివిధములు దైవమును ఆసురమును అని. సర్గ మనఁగా ఉత్పత్తి. ప్రాచీనపుణ్యపాపరూపకర్మవశమువలన భగవదాజ్ఞానువర్తనమునకు అకును తద్విపరీత కరణమునకు అకును ఉత్పత్తికాలమునందే విభాగమున భూతము లుత్పన్నము లగు చున్నవి యని యర్థము. అందు, దైవః = దైవసర్గము; విస్తరశః ప్రోక్తః–మదాజ్ఞానువర్తనశీలు రగు దేవశబ్దవాచ్యులయుత్పత్తి యేయాచారము నాచరించుట ప్రయోజనముగాఁ గలదో ఆయాచారము కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగరూపము, విస్తరశః ప్రోక్తః. అసురులసర్గంబును ఏయాచారము ప్రయోజనముగాఁ గలదో ఆయాచారమును, మే శృణు = నావలన వినుము.

మూ. ♦

ప్రవృత్తించ నివృత్తించ జనా న విదు రాసురాః
న శౌచం నాపి చాఽఽచారో న సత్యం తేషు విద్యతే. ౭

భా. అధ్యాయపరిసమాప్తివఱకు నాసురసంపదను ప్రాణివిశేషణ ముగాఁ ‡ ప్రదర్శించుచున్నాఁడు ప్రత్యక్షముగాఁ జేయుటచేతనే దీని వర్జింప శక్య మగు నని.—ప్రవృత్తించ = ప్రవర్తనమును, చేయవలసిన యేపురుషార్థసాధనమందుఁ బ్రవర్తింపవలయునో ఆప్రవృత్తిని; నివృత్తించ=తద్విపరీత మయిన నివర్తనమును, అనర్థహేతు వైనదేనినుండి నివర్తిల్లవలయునో అది నివృత్తి, దానిని; ఆసురాః = అసురసంపద గల; జనాః=జనులు; నవిదుః=ఎఱుంగరు. ప్రవృత్తినివృత్తులనే యెఱుంగ రనుట మాత్రమే కాదు, తేషు = ఆ యాసురులందు; శౌచమ్=శౌచము; న=

* శ్రీధరీయముతో సమానము.

♦ ఈ శ్లోకమున కీభాష్యము లేదు.

‡ తద్విశిష్టు లయిన ప్రాణులఁ బ్రదర్శించుటచే ననుట.

లేదు. ఆచారోఽపిచ=ఆచారముగూడ; న=లేదు. సత్యమ్=సత్యము; నవిద్యతే=లేదు. శౌచరహితులు అనాచారులు మాయావులు అనృత వాదులును గదా యాసురులు.

పురుషార్థసాధనమునందు శాస్త్రవిహితప్రవృత్తిని గాని అనర్థహేతువు నుండి శాస్త్రనిషిద్ధ మయిన నివృత్తినిగాని యాసురు లెఱుంగరు. ఇంతేకాదు. వారియందు శౌచముగాని యాచారముగాని సత్యముగాని లే దని తాత్పర్యము.

ఆ. ఓయీ! అధ్యాయశేషముచే నాసురసంపదను బ్రదర్శించుట యుక్తము కాదు, అది త్యాజ్య మగుటచేఁ బంకప్రక్షాలనన్యాయమునకు * విషయ మగుటవలన అని యాశంకించి చెప్పుచున్నారు ప్రత్యక్షముగా నిత్యాదిగా. వర్జింప వలసినయాసురసంపదను వివరించుచున్నారు ప్రవృత్తిం చేత్యాదిగా. ఆప్రవృత్తిని — శాస్త్రవిహిత మైనదానిని. దానిని—శాస్త్రనిషిద్ధ మయినకార్యము ననుట. నశౌచ మిత్యాదికమునకుఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు శౌ చేత్యాదిగా. శౌచ సత్యము లాచారమునం దంతర్భూతము లైనను బ్రాహ్మణపరివ్రాజకన్యాయముచే ♦ వేఱుగాఁ జెప్పఁబడినవి.

హ. ప్రవృత్తిమ్=కర్తవ్యానుష్ఠానమును. నవిదుః=ఎఱుంగరు. ఆసురాః= ఆసురసంపదను బొందినవారు. ఆచారః = శిష్టాచారము. సత్యమ్ = యథార్థ వచనము.

శం. ఆ యాసురసంపదనే ప్రతిపాదించుచున్నాఁడు పండ్రెండుశ్లోకముల చేత. అందు మొదటిశ్లోకముచే వారిశీలముఁ జెప్పుచున్నాఁడు.—ప్రవృత్తించ = శాస్త్రదృష్టము కర్తవ్య మగు ధర్మమునందుఁ బ్రవృత్తిని; నివృత్తించ=శాస్త్రదృష్ట మైన యనర్థమునకు హేతు వగు నధర్మమునుండి నివృత్తిని; ఆసురాః = ఆసురస్వ భావులు రజస్తమోగుణప్రధాను లగు; జనాః = జనులు; న విదుః — ధర్మమును అధర్మమును ఎఱుంగ రని యర్థము. ఓయీ! "సత్యం వద, ధర్మం చర" ఇత్యాది శ్రుతి యుండఁగా నెల్లు వారు ధర్మాధర్మముల నెఱుంగరు? అనఁగా నందు వారి కప్ర మాణబుద్ధిచే విశ్వాసము లే దని సూచించుటకై చెప్పుచున్నాఁడు. — కర్త

---

* అడుసులో నడుగుఁబెట్టి కడుగుకొనుటకన్నను అం దడుగుఁ బెట్టక యుండుట మేలు అను న్యాయమునకు.

♦ బ్రాహ్మణులును పరివ్రాజకులును = సన్న్యాసులును అని పరివ్రాజకులు బ్రాహ్మణులే యై నను విశేషవివక్షచే వేఱుగాఁ జెప్పఁబడునట్లు.

వ్యాకర్త న్యార్థజ్ఞానశూన్యు లగుటచే నిషిద్ధకర్మాసక్తు లగు, తేషు = వారియందు; శౌచమ్ – బాహ్యమును అభ్యంతరమును; న = లేదు. అట్లే, ఆచారోపి న=ఆచారమును లేదు. చకారమువలన దయయును లేదు. సత్యమ్ = యథార్థభాషణము నుగూడ. దయాసత్యశౌచాచారరహితు లాసురు లని యర్థము.

మ. వర్జనీయ మగు నాసురసంపదను ప్రాణివిశేషణముగా తానహం మ్మను నదివఱకుఁ గల పదిరెండుశ్లోకములచే వివరించుచున్నాఁడు.—ప్రవృత్తిమ్=ప్రవృత్తివిషయ మయిన ధర్మమును; చకారముచే తత్ప్రతిపాదక మగు విధివాక్యమును; ఇట్లు, నివృత్తిమ్ = నివృత్తివిషయ మగు నధర్మమును, చకారమువలనఁ దత్ప్రతిపాదక మగు నిషేధవాక్యమును; ఆసురస్వభావు లగు జనులు; నవిదుః = ఎఱుంగరు. అందువలన, తేషు = వారియందు; నశౌచమ్ = ద్వివిధ మగు శౌచము లేదు. నాప్యాచారః = మన్వాదులచేఁ జెప్పఁబడిన యాచారముగూడ లేదు. న సత్యంచ విద్యతే=ప్రియహిత యథార్థభాషణముగూడ లేదు. శౌచసత్యము లాచారమం దంత ర్భవించినను బ్రాహ్మణపరివ్రాజకన్యాయంబున నవి వేఱుగాఁ జెప్పఁబడినవి. శౌచరహితు లాచారశూన్యు లనృతవాదు లని ప్రసిద్ధులు గదా మాయావు లగునసురులు.

శ్రీ. అసురసంపదను విస్తరమున నిరూపించుచున్నాఁడు పదిరెండు శ్లోకములచేత.—ధర్మమునందుఁ బ్రవృత్తిని అధర్మమునుండి నివృత్తిని ఆసుర స్వభావు లగు జను లెఱుంగరు. అందువలన శౌచమును ఆచారమును సత్యమును వారియందు ఉండనే యుండదు.

ప *

రా. ప్రవృత్తించ నివృత్తించ = అభ్యుదయసాధనంబును మోక్షసాధనంబు నగు వైదిక మైన ధర్మమును; ఆసురాః; నవిదుః = ఎఱుంగరు. శౌచమ్ = శాస్త్రసిద్ధ మగు వైదికకర్మయోగ్యత, అది బాహ్యమును ఆంతరమును; ఆసురులయందు లేదు. నాపిచాచారః = ఆ బాహ్యాంతరశౌచ మేసంధ్యావందనాద్యాచారముచేఁ గలుగుచున్నదో ఆ యాచారముగూడ వారియందు లేదు. అట్లు చెప్పఁబడినది "సన్ధ్యాహీనో౽శుచి ర్నిత్య మనర్హ స్సర్వకర్మసు" ♦ అని. అట్లు, సత్యం తేషు న విద్యతే = ఎఱింగినట్లు భూతహితరూపభాషణము వారియందు లేదు.

* శ్రీధరీయములో సమానము.

♦ సంధ్య చేయనివాఁడు ఎల్లప్పుడును అశుచియు సర్వకర్మములయందును అనర్హుఁడును.

మూ. *

అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్
అపరస్పరసంభూతం కి మన్య త్కామహైతుకమ్. ౮

భా. మఱియును.— తే = ఆయాసురజనులు; జగత్ = జగత్తు; అసత్యమ్ = ఎట్లు మన మనృతప్రాయులమో అట్లు ఈజగ త్తంతయు నసత్య మనియు; అప్రతిష్ఠమ్ = ప్రతిష్ఠ లేని దనియు, ఈ జగత్తునకు ధర్మాऽధర్మము లనుప్రతిష్ఠ లే దనియు; అనీశ్వరమ్ = ధర్మాధర్మసాపేక్షుఁడై శాసించునట్టి యీశ్వరుఁడు దీనికి లేఁడు కావున అనీశ్వర మనియు; ఆహుః = చెప్పుచున్నారు. మఱియును.—అపరస్పరసంభూతమ్ = కామప్రయుక్తు లయిన స్త్రీపురుషులపరస్పరసంయోగమువలనఁ బుట్టినది జగతు సర్వంబును. కామహైతుకమ్=కామహేతుకమే కామహైతుకము, కామమే హేతువుగాఁ గలది. అన్యత్ = వేఱుకారణము; కిమ్ = ఏది గలదు ? అదృష్ట మగు ధర్మాऽధర్మాదిక మేదియుఁ గారణాంతరము లేదు జగత్తునకు, ప్రాణులకామమే కారణము అని చెప్పుచున్నారు. లోకాయతిక ♦ మతం బిది.

ఆసురజనులు మన మెట్లు అసత్యప్రాయులమో అట్లు జగత్తును అసత్యమే యనియు దానికి ధర్మాऽధర్మములు ఆధారము కా వనియు ఆధర్మాధర్మములమూలమున శాసించునట్టి యీశ్వరుఁడే జగత్తునకు లేఁ డనియుఁ జెప్పుచున్నారు. మఱియు కామప్రయుక్తు లగు స్త్రీపురుషులయన్యోన్యసంయోగమువలన జగ త్తంతయుఁ బుట్టినది కావునఁ బ్రాణులకామమే జగత్తునకుఁ గారణము కాని ధర్మాధర్మాద్యదృష్ట కారణము వే ఱేదియు లే దని చెప్పుచున్నా రని తాత్పర్యము.

ఆ॰ ఆసురజనులకు మఱియు విశేషణములు కల వని చెప్పుచున్నారు మఱియును అని. శాస్త్రైకగమ్య మగు నదృష్టము నిమిత్తముగాఁ బ్రకృతికి నధిష్ఠాత యగు బ్రహ్మము జగమునకు లే దనునెడ నెట్లు జగదుత్పత్తి యని యాశంకించి చెప్పుచున్నాఁడు మఱియును ఇత్యాదిగా. కి మన్యత్ అను నాక్షేపమునకుఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు అదృష్టము ఇత్యాదిగా.

---

* ఈ శ్లోకమున కీభాష్యము లేదు.

♦ నాస్తిక.

హ. అసత్యమ్ = ధర్మాధర్మములు లేనిదానింగాను, అప్రతిష్ఠమ్ = దేనివలనను ప్రతిష్ఠ లేనిదానింగాను, అనీశ్వరమ్ = ఈశ్వరుఁడు.—స్వామి లేనిదానింగాను, స్త్రీపురుషులసంయోగము – మైథునము, దానిచేత సంభూతము అపరస్పరసంభూతము. కామహేతువే కామహైతుకము.

శం. వారి స్వభావానురూప మగు నిశ్చయముఁ జెప్పుచున్నాఁడు.— దయాతపస్సత్యశౌచరహితు లగు, తే=ఆ యాసురజనులు; ఎట్లు తామసత్యపరులో అట్లు, జగత్ =జగమును సర్వంబును; అసత్యమ్ ఆహుః = అసత్యమునుగాఁ జెప్పుచున్నారు, వేదములును వేదోక్తధర్మములును తత్ఫలము లయిన లోకములును సర్వంబును మిథ్యయే యని చెప్పుచున్నా రని యర్థము. ఓయీ! సుఖదుఃఖాదిభేదరూప మైన జగద్వైచిత్ర్యము కనఁబడుచున్నది, అందువలనఁ దత్కారణమును తత్ఫలభూతము లగు ధర్మాధర్మములును వేదమును లోకములును సర్వంబును సత్యమని నిశ్చయింప శక్య మగుచున్నది యనఁగాఁ జెప్పుచున్నాఁడు.— అప్రతిష్ఠమ్ = దీనిచేతఁ బ్రతిష్ఠిత మగును గావునఁ బ్రతిష్ఠ యనఁగా కారణము, సుఖదుఃఖాదివైచిత్ర్యహేతువు లయిన ధర్మాధర్మము లను ప్రతిష్ఠ దీనికి లే దని చెప్పుచున్నారు. జగద్వైచిత్ర్యము ధర్మాధర్మములవలనఁ గలుగునది కాదు, మ ఱే మనఁగా వస్తుస్వభావమువలననే సుఖదుఃఖాదివైచిత్ర్యము గలుగుచున్న దని చెప్పుచున్నా రని యర్థము. అట్లు, అనీశ్వరమ్ = దేని కీశ్వరుఁ డుత్పత్తికారణము లేఁడో అది యనీశ్వరము, అట్టిదానింగా జగత్తును జెప్పుచున్నా రని యర్థము. ఓయీ! ఈశ్వరుఁడు జగదుత్పత్తికారణ మని యంగీకరింపనియెడ ప్రజాసర్గ మె ట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అపరస్పరసంభూతమ్=అపరమును పరమును అపరస్పరము—మిథునము, దానివలనఁ బుట్టినది అపరస్పరసంభూతము, స్త్రీపురుషులసంయోగమువలన జగత్తు సర్వంబును బుట్టిన దని చెప్పుచున్నా రని యర్థము. ఓయీ! వారలకును ప్రేరకునింగా నిమిత్తకారణము నీశ్వరు నంగీకరింపవలయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.— కామహైతుకమ్ = ప్రజాసర్గమునందుఁ గామమే హేతువు దేనికో అది కామహేతుకము, కామహేతుకమే కామహైతుకము, ప్రజాసృష్టియందు దా స్త్రీపురుషుల ప్రేరణమునకు కామమే కారణము; కి మన్యత్ =కామముకన్నను వేఱుకారణ మేది కల దని చెప్పుచున్నారు. దృష్టమును విడిచి యదృష్ట మగు ధర్మాధర్మములుగాని యీశ్వరుఁడు గాని కారణ మని కల్పించుట యుక్తము కా దని చెప్పుచున్నా రని యర్థము.

అపరస్పరసంభూతం కిమన్యత్ — స్త్రీపురుషుల పరస్పరసంబంధముచేఁ బుట్టినదిగా నీమనుష్యపశ్వాదికము కనఁబడుచున్నది, ఇట్టిది కానిది యేది యితరము కనఁబడుచున్నది? ఏదియుఁ గనఁబడదని యర్థము. అందువలన సమస్తమయిన యీ జగత్తు కామహేతుకము.

మా. జగత్తునకు సత్యమును బ్రతిష్ఠయు నీశ్వరుఁడును విష్ణువు, తద్విపరీతముగాఁ జెప్పిదరు. "తస్యోపనిష త్సత్యస్య సత్యమ్, ప్రాణా వై సత్యం తేషా మేష సత్యమ్" అని గదా శ్రుతి. "ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చాఽమూర్తంచ స్థితం చ యచ్చ సచ్చ త్యచ్చేతి, తస్యోపనిష త్సత్యస్య సత్య మితి ఏషహ్యే వై తత్సాదయతి యామయతి చేతి" అని ప్రాచీనశాలాశ్రుతి. పరస్పరసంభవ మని గదా చెప్పఁబడినది. "అన్నాద్భవన్తి భూతాని" ఇత్యాదిగా.

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః
ప్రభవ న్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః. ౯

భా. ఏతామ్ = ఈ; దృష్టిమ్ = లోకాయతికదృష్టిని; అవష్టభ్య = ఆశ్రయించి; నష్టాత్మానః = నష్టమైన స్వభావము * గలవారును, భ్రష్టమయిన పరలోకసాధనము గలవారును; అల్పబుద్ధయః = విషయముల యందే ప్రవర్తించునట్టి యల్పమయిన బుద్ధిగలవారును; ఉగ్రకర్మాణః = క్రూరమయిన కార్యము గలవారును, హింసాత్మకులును; జగతః = లోకమునకు; అహితాః = శత్రువులు నగువారు; క్షయాయ = లోకనాశము కొఱకు; ప్రభవన్తి = పుట్టుచున్నారు.

పై శ్లోకమునందుఁ జెప్పిన నాస్తికమతము నవలంబించి పరలోకసాధనము నుండి భ్రష్టులై విషయములందే యుండుటవలన అల్పమయినబుద్ధి గలవారై హింసయే స్వభావముగాఁ గలిగి లోకమునకు శత్రువులై లోకనాశముకొఱకు అసురులు పుట్టుదు రని తాత్పర్యము.

ఆ. పై శ్లోకమునందుఁ జెప్పినదృష్టి బ్రహ్మదృష్టివలె సమ్మతమే కాఁబోలు నని యాశంకించి చెప్పుచున్నారు ఏతా మిత్యాదిగా. నష్టస్వభావత్వమునే స్పష్టీ

* స్వధర్మము.

కరించుచున్నారు భగ్నేష్టేత్యాదిగా. విషయబుద్ధికి అల్పత్వము దృష్టమాత్రమునందుఁ బ్రవర్తించుట. లోకమునకు — ప్రాణిజాతమునకు.

. హ. ఏతాం దృష్టిమ్ = ఈ లోకాయతమతమును; అవష్టభ్య=ఆశ్రయించి; నష్టాత్మానః; అల్పబుద్ధయః=విషయములందు భోగ్యభోక్తృబుద్ధిమాత్రమే గలవారు; ప్రభవన్తి=పుట్టుచున్నారు; ఉగ్రకర్మాణః=వధము బాధము మొదలగు కర్మములందు నిరతులు; జగతః; క్షయాయ = నాశముకొఱకు; అహితాః = ఆపద చేయువారు; ప్రభవన్తి అని సంబంధము.

శం. ఇట్లు ప్రత్యక్షమే ప్రమాణముగా నవలంబించునట్టి యయ్యాసురుల నిశ్చయముఁ జెప్పి యా నిశ్చయముయొక్క కార్యమును జెప్పుచున్నాఁడు.— ఏతాం దృష్టిమ్ = ఈ చెప్పిన లోకాయతికదృష్టిని; అవష్టభ్య = అవలంబించి; నష్టఆత్మానః= కామక్రోధలోభమోహాదిరూప మగు రజస్తమోగోషముచేత, నష్టము—తిరోహిత మగు ఆత్మ—వివేకబుద్ధి గలవారలు, నష్టాత్ములై; కావుననే, అల్పబుద్ధయః=అల్పము— తుచ్ఛ మగు విషయభోగమునందు బుద్ధి గలవారలు, లేక అల్పమునందు మల మాంసాస్థిమయ మగు దేహమునందు నేనను బుద్ధి గలవారలు అల్పబుద్ధులు, అట్టి వారలై; అందువలననే, ఉగ్రకర్మాణః=ఉగ్రము—క్రూరము శాస్త్రవిరుద్ధమును దేహ పోషణైకప్రయోజనమును హింసాప్రధానము నగు కర్మము గలవారలై; అందు వలననే అసురులు, అందువలననే, అహితాః = సాధువులకు శత్రువులై; తాము, జగతఃక్షయాయ=జగత్తునకు స్థితిహేతువు లైన వేదతదుక్తధర్మములయొక్క—నాశము కొఱకే; ప్రభవన్తి=సమర్థు లగుచున్నారు. కాని రక్షణముకొఱకుఁ గా రని యర్థము.

మ. ఈ దృష్టి శాస్త్రీయదృష్టివలె నిష్టమే యగునా యని యాశంకించి చెప్పుచున్నాఁడు.—ఏతామ్=మున్ను చెప్పిన; దృష్టిమ్ = లోకాయతికదృష్టిని; అవ ష్టభ్య = అవలంబించి; నష్టాత్మానః = పరలోకసాధనభ్రష్టులై; అల్పబుద్ధయః = దృష్ట భోగములందె ప్రవృత్త మగుబుద్ధి గలవారై; ఉగ్రకర్మాణః = హింసాప్రధానులు; అహితాః = శత్రువులు; జగతః = ప్రాణి[illegible]యొక్క; క్షయాయ; వ్యాఘ్రసర్పాది రూపమున; ప్రభవన్తి = పుట్టుచున్నా[illegible] [illegible]నువలన నీదృష్టి యత్యంతాధోగతికి హేతు వగుటచే శ్రేయోర్థులు సర్వప్ర[illegible] [illegible] విడువవలయు నని యర్థము.

తృప్తి నొందించుట కశక్య మగుటవలన దుష్పూర మగు; కామమ్=కామము నొక దానినే; ఆశ్రిత్య = ఆశ్రయించి, ధర్మమును గాదు; దమ్భమాన మదాన్వితాః = దంభము—వెలుపలికి ధార్మికత్వచిహ్నము, మానము—తానే యుత్కృష్టుఁ డను నభినివేశము, మదః — విద్య యైశ్వర్యము మొదలగువానిచేఁ గలుగు చిత్తవికారము వివేకనాశహేతువు, వీనితోఁ గూడినవారలై; ఆసురులు, మోహాత్ = అసత్తునందు సద్బుద్ధి మోహము అవివేకము, దానివలన; అసద్గ్రాహాన్=అసత్తునే—అనర్థమునే గ్రహింపఁజేయుచున్నవి — సంభావింపఁజేయుచున్నవి కావున అసద్గ్రాహములు, అట్టి నిశ్చయములను వేదశాస్త్రవిరుద్ధములను; గృహీత్వా; అశుచివ్రతాః = అశుచులు — అమంగలకరములు నరకాద్యనర్థహేతువు లగు వ్రతములు—నియమములు గలవారలై; జగమ్మునయొక్క—నాశముకొఱకు, ప్రవర్తన్తే.

మ. వారు మఱి యెప్పు డొకానొకకర్మముచే మనుష్యయోనియందు జనియింతురో అప్పుడు.——కామమ్ = ఆయాదృష్ట విషయములందలి యభిలాషను; దుష్పూరమ్=పూరింప నశక్య మయినదాని; ఆశ్రిత్య; దంభముతోను—తాము అధార్మికు లైనను ధార్మికత్వఖ్యాపనముతోను, మానముతోను — అపూజ్యు లయినను పూజ్యత్వఖ్యాపనముతోను, మదముతోను — ఉత్కర్షము లేకున్నను దమయందుత్కర్షవిశేషము నారోపించుటతో సాధుతిరస్కారహేతువుతోను కూడినవారలై, అసద్గ్రాహాన్ = అశుభనిశ్చయములను, ఈ మంత్రముచే నీ దేవత నారాధించి స్త్రీజనాకర్షణము చేసెదము, ఈ మంత్రముచే నీ దేవత నారాధించి మహానిధులను సాధించెదము — ఇత్యాది దురాగ్రహరూపములను; మోహాత్ = అవివేకమువలన; గృహీత్వా; శాస్త్రమువలనఁ గాదు; అశుచివ్రతాః=శ్మశానాదిదేశము ఉచ్ఛిష్టత్వా ద్యవస్థ మొదలయిన యశౌచముతోఁ గూడిన వామాగమాద్యుపదిష్టము లయిన వ్రతములు గలవారై; ప్రవర్తన్తే, దేనియం దైనను అవైదికమును దృష్టఫలము నగు క్షుద్రదేవతారాధనాదికమునం దని శేషము. ఇట్టివారు, పతన్తి నరకే౽శుచౌ అని పదునాఱవశ్లోకమునం దన్వయము.

శ్రీ. మఱియును.——దుష్పూరమ్=పూరింప నలవికాని; కామమ్; ఆశ్రిత్య; దంభాదులతోఁ గూడినవారై క్షుద్రదేవతారాధనాదులందుఁ బ్రవర్తించుచున్నారు. ఎట్లు? అసద్గ్రాహాన్ గృహీత్వా—ఈమంత్రముచే నీదేవత నారాధించి మహానిధుల సాధింతము ఇత్యాది దురాగ్రహములను మోహమాత్రముచే స్వీకరించి ప్రవ

ర్తించుచున్నారు; అశుచివ్రతాః=అశుచు లైన—మద్యమాంసాదివిషయము లయిన వ్రతములు గలవారలై.

**ప.** ఇతరులను గూడఁ జెప్పుచున్నాఁడు.—దుష్పూరమ్=దుఃఖముచేతను బూరింప శక్యము గాని; కామమ్=అభిలాషను; ఆశ్రిత్య=అంగీకరించి; దంభమానమదాదు లగు నుపాయములతోఁ గూడినవారై క్షుద్రదేవతారాధనాదులందుఁ బ్రవర్తించుచున్నారు. ఏమి చేసి? అసద్గ్రాహాన్ గృహీత్వా = సత్తును—పరబ్రహ్మము నేవి గ్రహించునో అవి సద్గ్రాహములు, తదితరమును—స్వర్గాదిసుఖమును గ్రహించునవి యసద్గ్రాహములు, అసద్గ్రాహము లగు మంత్రము లేవి గలవో వాని గ్రహించి, ఈ మంత్రముచేసి దేవత నారాధించెద నని సంకల్పించి. మఱియు నితరులు, అశుచివ్రతాః = మద్యమాంసాద్యాహారమే వ్రతముగా — నియమముగాఁ గలవారలై.

**రా.** దుష్పూరమ్ = పొంద నశక్యమైనవిషయము గల; కామమ్; ఆశ్రిత్య; మోహాత్ = అజ్ఞానమువలన; అసద్గ్రాహాన్ = అన్యాయగృహీతము లయిన పరిగ్రహములను; గృహీత్వా; అశుచివ్రతాః = శాస్త్రవిహితములు కాని వ్రతములు గలవారలై; దంభమానమదాన్వితులై, ప్రవర్తన్తే.

**మా.** దుష్పూరము గదా కామము. "పాతాల ఇవ దుష్పూరో మాం హి క్లేశయతే సదా" * అని మోక్షధర్మమునందు.

చిన్తా మపరిమేయాంచ ప్రలయాన్తా ముపాశ్రితాః
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః. ౧౧

**భా.** మఱియును.—చిన్తాంచ = చింతను; అపరిమేయామ్ = ఇంత మాత్ర మని యేచింతకొలఁదిపెట్ట నలవికాదో అట్టి అపరిమేయ మయిన దానిని. ప్రలయాన్తామ్ = మరణమె యంతముగాఁగల దానిని; ఉపాశ్రితాః=ఆశ్రయించినవారై; కామోపభోగపరమాః = కామింపఁబడుచున్నవి కావునఁ గామము లనఁగా శబ్దాదివిషయములు, వానియుపభోగమే ముఖ్యముగాఁ గలవారు; కామోపభోగ మనునది యేది

* పాతాలమువలెఁ బూరింప శక్యము కాని కామము న న్నెల్లప్పుడును క్లేశము నొందించుచున్నది గదా!

గలదో అదియె పరమపురుషార్థము అని నిశ్చితాత్ములు; ఏతావదితి=ఇంత మాత్రమే యని; నిశ్చితాః = నిశ్చయించినవారు.

మఱియు వారు మరణమువఱకును గొలఁదిలేని చింత వహించి యుందురు, విషయోపభోగమే పరమపురుషార్థము, దానికన్నను వేఱుపురుషార్థము లే దని నిశ్చయించికొన్నవా రని తాత్పర్యము.

**రా.** వారినే మఱియొకవిధముగా విశేషించుచున్నారు మఱియును అని. చిన్తామ్=తనయోగక్షేమముల యుపాయమును గుఱించి యాలోచించుటను. అపరిమేయము లైన విషయములు గలదికావున కొలఁదిపెట్ట నశక్య మయినదానిని. ఈ కామోపభోగమే సుఖమునకు ముఖ్యమయినస్థానము, ఇంతియె కాని పరలోకసుఖం బను నది కల్ల యని నిశ్చయించి యున్నా రని చెప్పుచున్నారు ఏతావ దితి ఇత్యాదిగా.

**హ.** అపరిమేయామ్ = పరిమితి లేని దగు; ప్రలయాన్తాం చిన్తా ముపాశ్రితాః — సదా చింతా పరు లని యర్థము; కామోపభోగపరమాః = విషయోపభోగమే ప్రధానముగాఁ గలవారు. ఏతావదితి నిశ్చితాః = శబ్దాదివిషయోపభోగమేది గలదో అంతమాత్రమే పురుషార్థ మని నిశ్చయించినవారు.

**శం.** మఱియును.—అపరిమేయామ్ = పరిమాణము చేయ నశక్య మైనదాని, ఇంతమాత్ర మని కొలఁది లేనిదాని నని యర్థము; ప్రలయాన్తామ్=కడపటిశ్వాసము అంతముగా—అవధిగాఁ గలదాని, మరణమే యవధిగాఁ గలదాని; చిన్తామ్= భోగ్యపదార్థముల సౌష్ఠవాసౌష్ఠవములను సిద్ధ్యసిద్ధులను గుఱించిన యాలోచనను; ఉపాశ్రితాః; కామోపభోగపరమాః = కామింపఁబడుచున్నవి కావున కామము లనఁగా భోగ్యపదార్థములు, వానియొక్క యుపభోగమే పరమము — నిరతిశయమయిన పురుషార్థము పురుషత్వసిద్ధికి ఫలము ఎవ్వరికో. వారు కామోపభోగపరములు; ఏతావదితినిశ్చితాః=పురుషుఁడు పుట్టి మరణాంతము చక్కఁగా విషయముల ననుభవించుచున్నాఁ డనునది యేది గలదో అంతమాత్రమే పురుషునిజన్మమునకు ఫలము, దేహపాతమే మోక్ష మగుటవలన లే దింతకన్న నధిక మైనఫల మను నిశ్చితము—సిద్ధాంతము ఎవరికో వారు ఏతావదితి నిశ్చితులు, అట్టివారలై. ఈహన్తే కామభోగార్థ మ్మని యుత్తరశ్లోకముతో నన్వయము.

మ. వారివే వెండియు విశేషణములు చెప్పుచున్నాఁడు.—చిన్తామ్ = తమ యోగక్షేమములయొక్క యుపాయములయాలోచనమును; అపరిమేయామ్ = కొలఁదిలేని విషయములు గలది యగుటవలన కొలఁదిపెట్ట నశక్య మయినదాని; ప్రలయాన్తామ్=మరణమే యంతముగాఁ గలదాని, యావజ్జీవ మనువర్తించుచుండు దాని నని యర్థము; అశుచివ్రతులై మాత్రమే ప్రవర్తించు వారు కారు చ. శ. మనఁగా ఇట్టి చింతనుగూడ నుపాశ్రితులై యని సముచ్చయార్థము చకారము. ఎల్లప్పుడును అనంతచింతాపరులైనను ఒకప్పుడును పారలౌకికచింతాయుక్తులు కారు మఱే మనఁగా, కామోపభోగపరమాః = కామింపఁబడుచున్నవి కావున కామములనఁగా దృష్టము లగు శబ్దాదివిషయములు, వానియుపభోగమే పరమపురుషార్థము, కాదు ధర్మాదికము, ఎవ్వరికో అట్టివారలు. పారలౌకిక మగు నుత్తమసుఖము నేల కామింపరు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు. — ఏతావత్ = దృష్టమైన సుఖమే గాని యితర మేదియు నీదేహము విడిచినపిదప ననుభవింపఁదగినసుఖము లేదు, ఏతద్దేహాతిరిక్తుఁ డగు భోక్త లేమివలన; అని: నిశ్చితాః = ఇట్టి నిశ్చయము గలవారలు. అట్లు బృహస్పతిప్రణీత మగు సూత్రము "చైతన్యవిశిష్టః కాయః పురుషః, కామ ఏవైకః పురుషార్థః" * అని.

శ్రీ. మఱియును.—ప్రలయము – మరణమే యంతముగాఁ గలదాని; అపరిమేయామ్ = కొలఁది కశక్య మయినదాని; చిన్తామ్ ఉపాశ్రితాః – నిత్యమును చింతాపరు లని యర్థము. కామోపభోగమే పరమముగాఁ గలవారు, ఏతావదితి– కామోపభోగమే పరమపురుషార్థము వేఱు లే దని; నిశ్చయము గలవారలై, అర్థసంచయా నీహన్తే అని మీఁదిశ్లోకముతో నన్వయము. అట్లు బార్హస్పత్యసూత్రములు "కామ ఏవైకః పురుషార్థః, చైతన్యవిశిష్టః కాయః పురుషః" అని.

ప. మఱియును.—ప్రలయమే—మరణమే పర్యవసానముగాఁ గలదాని, కొలఁది లేనిదాని, చిన్తాం=మనోరథసంతతిని; ఉపాశ్రితాః, కామము లనఁగా విషయములు, వానియుపభోగమే పరమము – ఆత్యంతిక మయిన పురుషార్థము ఎవరికో అట్టివారు, ఇంతమాత్రమే పురుషార్థ మని నిశ్చయము గలవారు. శ్రుతియును. — "స యావ దస్యే తేషా మేకైకం న ప్రాప్నో త్యకృత్స్న ఏవ తావ న్మన్యతే తస్యో దకృత్స్నతా" అని. భాష్యము.—తస్య—ఆ పురుషునకు; ఉత్ అనునది నిర్ధారణార్థ

* చైతన్యవిశిష్ట మగు దేహమే పురుషుఁడు, కామ మొక్కటే పురుషార్థము.

కము; అకృత్స్నతా=సమగ్రప్రాప్తిరహితత. ఎవ్వనికి? యః=ఎవఁడు, ఏతేషామ్=పూర్వోక్తవిషయములలో, యావత్=ఎంతవఱకు; ఏకైకమ్=ఒక్కొకవిషయమును; నప్రాప్నోతి — పొందఁడో, తావదపి — అంతవఱకును, సః — అతఁడు, అకృత్స్నఏవ మన్యతే — నేను సంపూర్ణముగా సకలార్థములను పొందనివాఁడ ననియే తలంచుచున్నాఁడు.

**రా.** నేఁడో రేపో మరణము నొందువారు, చిన్తామ్; అపరిమేయామ్ = పరిచ్ఛేద్యము కానిదాని; ప్రలయాన్తామ్ = ప్రాకృతప్రలయకాలమునకు సాధ్యము లయిన విషయములు గలదానిని; ఉపాశ్రితాః; కామోపభోగపరమాః=కామోపభోగమే పరమపురుషార్థ మని తలంచినవారు; ఏతావదితి నిశ్చితాః=ఇంతకన్న నధిక మయిన పురుషార్థము లే దని నిశ్చయము గలవారు.

**మూ.** *

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః
ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్థసంచయాన్. ౧౨

**భా.** ఆశాపాశశతైః = ఆశలే పాశములు, వానియొక్క నూఱులచే; బద్ధాః = కట్టఁబడినవారలై, అన్నివైపులను ఆకర్షింపఁబడుచున్నవారై; కామక్రోధపరాయణాః = కామక్రోధములే ముఖ్య మయిన అయనముగా — ఆశ్రయముగాఁ గలవారలై; కామభోగార్థమ్ = కామోపభోగముకొఱకు, కాదు ధర్మముకొఱకు; అన్యాయేన=అన్యాయముచేత; అర్థసంచయాన్ = అర్థముల చేర్పుటలను; ఈహన్తే = చేయుచున్నారు; అన్యాయేన — పరస్వాపహరణాదికముచేత నని యర్థము.

అనంతములైన యాశ లనుపాశములచేఁ గట్టఁబడినవారై యయ్యాశాపాశములచే నానావిధవిషయములవెంట నాకర్షింపఁబడుచుఁ గామక్రోధములనే ముఖ్యముగా నవలంబించి విషయోపభోగముకొఱకై పరధనాపహారము మొదలగు పాపకృత్యములచే నర్థములఁ జేర్చుచున్నా రని తాత్పర్యము.

**ఆ.** అసురులనే వెండియు విశేషించుచున్నారు ఆశేత్యాదిగా. దేని సాధించుట కుపాయ మశక్యమో అట్టి యర్థమునందలి కోర్కులు, లేక, దేని సాధించుట

* ఇది మొదలు ౧౬వ శ్లోకమువఱకు నీ భాష్యము లేదు.

కుపాయము తెలియదో అట్టి యర్థమునందలి కోర్కులు ఆశ లనఁబడును. అవి పాశములవంటివి కావున పాశములు, వాని నూఱులచే బద్ధులైనయట్లు శ్రేయస్సు నుండి తొలఁగించి యీవైపున కావైపునకు నాకర్షింపఁబడువారని చెప్పుచున్నారు ఆశలే ఇత్యాదిగా.

హ. పాశమువంటిది కావున పాశము, ఆశాపాశశతములచేత; బద్ధాః — ఆకర్షింపఁబడుచున్నవారలై; కామక్రోధములే పరమయిన అయనముగాఁ గల వారు, కామక్రోధవశులై యని యర్థము; ఈహన్తే=ఆర్జించుచున్నారు; కామోపభోగప్రయోజనముకొఱకు, అన్యాయేన=శాస్త్రవిహితము కాని యుపాయముచేత; అర్థసంచయాన్=ద్రవ్యరాసులను.

శం. మఱియును.—ఆశాపాశశతైః=ఆశలు—అప్రాప్తములైన విషయము లందలి యభిలాషలు, అవియె పాశములు—కట్టుత్రాళ్లు, వాని నూఱులచేత; బద్ధాః; కామక్రోధపరాయణాః; అట్టి యాసురులు, కామభోగార్థమ్=కామములయొక్క — విషయములయొక్క—భోగముకొఱకు, దానార్థమేమో కాదు ధర్మార్థంబునుం గాదు, మఱేమనఁగా విషయానుభవముకొఱకే; అన్యాయేన=శాస్త్రవిరుద్ధమగు మార్గముచేత, కపటము వంచనము మొదలగు నుపాయముచేత; అర్థసంచయాన్; సంపాదింపవలసినవానిని, ఈహన్తే—చేయుచున్నారని యర్థము.

మ. ఇట్టి యయ్యాసురులు.—ఆశ లనఁగా అశక్యమయిన యుపాయము గల యర్థములందుఁ గాని తెలియరాని యుపాయము గల యర్థములందుఁ గాని కోర్కులు, అవియే పాశములవంటివి బంధనహేతువు లగుటవలనఁ బాశములు, వానియొక్క—శతములచేత—సమూహములచేత; బద్ధులవలె శ్రేయస్సునుండి తొలఁ గించి యిక్కడికి నక్కడికి నాకర్షించి నయింపఁబడుచున్న వారలై; కామక్రోధములే పరమైన అయనము — ఆశ్రయముగాఁ గలవారు కామ క్రోధపరాయణులు, స్త్రీలయందభిలాషయుఁ బరుల కనిష్టము సేయు నభిలాషయు సదా కలిగియున్న వారలై యని యర్థము; ఈహన్తే = చేయఁబూనుచున్నారు; కామభోగార్థము, ధర్మార్థమేమో కాదు; అన్యాయేన—పరధనాపహారాదికముచేత; అర్థసంచయాన్= ధనరాసులను. సంచయాన్ అని బహువచనముచేత ధనము ప్రాప్తించినను దానియందుఁ దృష్ణ విడువకుండుటవలన విషయప్రాప్తి వర్ధమాన తృష్ణారూప మగు లోభము తెలుపఁబడినది.

శ్రీ. అందువలననే మఱియు.—ఆశలే యను పాశములయొక్క-శతములచే; బద్ధాః—ఇక్కడికి నక్కడికి లాగఁబడుచున్నవారై, కామక్రోధములే ముఖ్యమగు అయనము — ఆశ్రయము గలవారై; కామభోగార్థము, అన్యాయేన—దొంగతనము మొదలగుదానిచేత, అర్థములయొక్క-సంచయములను—రాసులను, ఈహన్తే=కోరుచున్నారు.

ప. మఱియును.—ఆశలే యను పాశములు — బంధనరజ్జువులు, వానియొక్క-శతములచేత బద్ధులు, అది చెప్పఁబడినది. "ఆశానామ మనుష్యస్య కాచిదాశ్చర్య శృఙ్ఖలా। యయా బద్ధాః ప్రధావన్తి ముక్తా స్తిష్ఠన్తి పఙ్గువత్" * అని. అట్లు, కామక్రోధములే పర మగు అయనముగా — గతిగాఁ గలవారు; కామభోగార్థమ్=విషయభోగార్థము; అన్యాయేన—జూదము చౌర్యము మొదలగుదానిచే; అర్థసంచయాన్ = ద్రవ్యసంగ్రహములను; ఈహన్తే = అపేక్షించెదరు.

రా. ఆశాపాశశతైః = ఆశ లనుపాశముల నూఱులచేత; బద్ధాః; కామక్రోధపరాయణాః = కామక్రోధైకనిష్ఠులై; కామభోగార్థమ్; అన్యాయేన; అర్థసంచయములను గూర్చి ప్రవర్తించుచున్నారు.

ఇద మద్య మయా లబ్ధ మిదం ప్రాప్స్యే మనోరథమ్
ఇద మస్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్. ౧౩

భా. మఱియు నిట్టిది వారి యభిప్రాయము.—ఇదమ్=ఈద్రవ్యము; అద్య=ఇప్పుడు; మయా=నాచేత; లబ్ధమ్=పొందఁబడినది. ఇదమ్=దీనిని, ఇతరమును; మనోరథమ్=మనస్సునకు తుష్టి కలిగించుదానిని; ప్రాప్స్యే=పొందఁగలను. ఇదమ్=ఈ ధన మేమో; అస్తి=ఉన్నది. ఇదమ్=ఈ; ధనమపి = ధనముగూడ; మే=నాకు; పునః=ఇంకను; భవిష్యతి=కలుగును, పై సంవత్సరమునందు. అందుచే నేను ధనవంతుఁడను ప్రసిద్ధుఁడను కాఁగలను.

ఈ ద్రవ్యము నా కిప్పుడు లభించి యున్నది. ఇంక దీనినిగూడ కోరిక దీరఁ బొందఁగలను. నా కిపుఁ డింతధన మున్నది. ఇఁక మీఁదిసంవత్సరమున నింత

* మనుష్యునకు ఆశ యనునది ఆశ్చర్యకర మయిన సంకెల. ఎట్లనఁగా దానిచే బద్ధులై పరువిడుచున్నారు. ముక్తులై కుంటివారివలె కదల కుండెదరు.

చేరఁగలదు. అంత నేను మిక్కిలి ధనవంతుఁడ నగుదును. ఇట్లాసురులు తలంచు చుందు రని తాత్పర్యము.

త్రి. వారియభిప్రాయముగూడ వివేకమునకు విరుద్ధ మని చెప్పు చున్నారు. మఱియు నిత్యాదిగా. ద్రవ్యము – గోవులు హిరణ్యము మొదలగునది. ఇతరమును–బుద్ధియందుఁ గోరఁబడుచున్నదై తిరుగుచున్న దాని ననుట.

హ. ఇదమ్=ఈ సువర్ణాదిద్రవ్యము; అద్య=నేఁడు; లబ్ధమ్=పొందఁబడినది. ఇమమ్ * మనోరథమ్; ప్రాప్స్యే = నేను పొందఁగలను. మనోరథ మనఁగా అభిమత విషయము. ఇదమ్—ఈ ధనము; అస్తి. ఈ ధనము కూడ నాకు రాఁగలదు.

శం. అన్యాయంబున నర్థసంపాదనపరు లగు నాసురులసంకల్పప్రకారముఁ జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—అర్థము స్పష్టము.

మ. ఇట్టి యయ్యాసురుల ధనతృష్ణానువృత్తిని వారిమనోరాజ్యము చెప్పుటచే వివరించుచున్నాఁడు.—ఇదమ్=ఈ ధనము; అద్య = ఇప్పుడు; ఈ యుపాయంబున; మయా=నాచే; లబ్ధమ్=పొందఁబడినది. ఇదమ్=దానికంటె నితరమును; మనోరథమ్=మనస్తుష్టికరమును; శీఘ్రముననే, ప్రాప్స్యే=పొందఁగలను. ఇదమ్=మున్నే సంచితమైన యిది; నాగృహమున, అస్తి=కలదు. ఇద మపి=ఇది గూడ; ధనమ్=అధిక మయిన ధనము; పునః=రెండియు, రాఁబోవుసంవత్సరమున; భవిష్యతి. ఇట్లు ధన తృష్ణాకులులై పతన్తి నరకే ఽశుచౌ అని యగ్రిమశ్లోకముతో నన్వయము.

శ్రీ. వారిమనోరాజ్యముఁ జెప్పుచు వారికి నరకప్రాప్తిని జెప్పుచున్నాఁడు నాలుగుశ్లోకములచేత.—మనోరథమ్=మనస్సునకుఁ బ్రియ మయినదానిని. శేషము స్పష్టము. తక్కిన మూఁడుశ్లోకములకును ఇట్లజ్ఞానవిమోహితులై పతన్తి నరకే ఽశుచౌ అని నాలవశ్లోకముతో నన్వయము.

ప. అన్యాయంబున నర్థము లభించినను మనోరాజ్యముమాత్రము చేయుచునే యుందు రని చెప్పుచున్నాఁడు నాలుగుశ్లోకములచేత.— ♦

రా. ఇదమ్ = ఈ క్షేత్రపుత్రాదికము సర్వంబును; మయా – నాసామర్థ్యముచేతనే; లబ్ధమ్. అదృష్టాదికముచే కాదు. ఇమం మనోరథమ్ = ఈ మనో

---

* కొందఱి వ్యాఖ్యానములందు ఇమమ్ అని పాఠము.

♦ తక్కినది శ్రీధరీయముతో సమానము.

రథమును గూడ; ప్రాప్స్యే — నేనే పొందఁగలను, అదృష్టాదిసహితుఁడనై కాదు. ఇదమ్=ఈధనము, నాసామర్థ్యమున లబ్ధమైనది; మే=నాకు; అస్తి=కలదు. ఇదమపి ధనమ్=ఈ ధనము గూడ; పునః=మరల; నాకు నాసామర్థ్యముచే, భవిష్యతి.

అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చా ఽపరా నపి
ఈశ్వరో ఽహ మహం భోగీ సిద్ధో ఽహం బలవాన్ సుఖీ. ౧౪

భా. అసౌ=ఇతఁడు, దేవదత్తుఁ డనువాఁడు; దుర్జయుఁ డగు, శత్రుః=శత్రువు; మయా=నాచేత; హతః=వధింపఁబడినాఁడు. అపరానపి=ఇతరులనుగూడ, అల్లులను; హనిష్యే=చంపెదను. ఏమి చేయఁగల రీపందలు? అన్ని విధంబులను లేఁడు నాకు సమానుఁడు. అహమ్=నేను; ఈశ్వరః=ప్రభుఁడను. అహమ్ = నేను; భోగీ = భోగశాలిని. సర్వవిధంబునను, అహమ్=నేను; సిద్ధః=సంపన్నుఁడను, కొడుకులచేతను మనుమలచేతను మునిమనుమలచేతను, మనుష్యమాత్రుఁడనా నేను? బలవాన్=బలముగలవాఁడను; సుఖీ = సుఖవంతుఁడను, నేనే. ఇతరులు భూమికి భారముగాఁ బుట్టినవారు.

నేను ప్రబలుఁ డగు నీశత్రువును వధించితిని. ఇంక నల్లుల నితరులను వధించెదను. ఇఁక నాకు సమానుఁడు లేఁడు. నేనే ప్రభుఁడను భోగశాలిని బుత్త్రపౌత్త్రాదిసంపన్నుఁడను, నేను సాధారణపుమనుష్యుఁడను గాను, నేనే లోకంబున బలవంతుఁడను, సుఖవంతుఁడను. ఇతరులు భూమికి భార మయినవారు. ఇట్లాసురులు తలంతు రని తాత్పర్యము.

శ్రీ. నేను తలఁచినదానికిఁ బ్రతిబంధము చేయు శత్రువుగూడ సంభవింపఁడని చెప్పుచున్నాఁడు.—నీకంటెఁ దక్కువయినవారిని నీవు జయించినను నీతో సమానులైనవారి నీవు జయింపఁజాల వని యాశంకించి చెప్పుచున్నాఁడు.—అన్ని ఇత్యాదిగా. ఐశ్వర్య మధికముగా నున్నను నీకు భోగసామర్థ్య మెక్కడిది అని యాశంకించి చెప్పుచున్నాఁడు భోగశాలిని అని. సిద్ధత్వమునే స్పష్టీకరించుచున్నాఁడు కొడుకులచేతను ఇత్యాదిగా. సుఖవంతుఁడను — రోగరహితుఁడను.

హ. ఈశ్వరః అహమ్ = నేను సర్వప్రకారంబునను వరుఁడను. భోగీ = విషయభోగవంతుఁడను. సిద్ధః = సంపన్నుఁడను. బలవాన్ = బలసంపన్నుఁడను.

శ.ం. ఈశ్వరః = విద్యాధనాదులచే సమర్థుఁడను. సిద్ధః = పుత్రపౌత్త్రపశు ధనధాన్యసంపన్నుఁడను, కృతకృత్యుఁడను. శేషము స్పష్టము.

మ. ఇట్లు లోభమును బ్రపంచించి తదభిప్రాయము చెప్పుటచేతనే వారి క్రోధమును బ్రపంచించుచున్నాఁడు.—అసౌ=ఈ, దేవదత్తుఁ డనువాఁడు; మయా; హతః; శత్రుః — అతిదుర్జయుఁ డైనవాఁడు. ఇఁక నిప్పుడు అనాయాసమున, హనిష్యే = చంపఁగలను; అపరా నపి=ఇతరు లగు శత్రువులనందఱను గూడ. ఎవ్వఁడును నాముందఱ జీవింపఁజాలఁ డని యపి శబ్దార్థము. చకారమువలన, వారి వధించుటమాత్రమె కాదు మఱే మనఁగా వారి భార్యాధనాదికమునుగూడ గ్రహింపఁగల నని యభిప్రాయము. నీ కింతసామర్థ్య మెక్కడిది? నీతో సమానులును నీకన్న నధికులు నగు శత్రువులు సంభవింపరా? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.— ఈశ్వరోహమ్—నేను మనుష్యమాత్రుఁడఁ గాను, నాకు సమానుఁడును అధికుఁడును ఎవ్వఁ డుండఁగలఁడు? అల్పులు వీ రేమి చేయఁగలరు? అన్నివిధంబులను లేఁడు నాకు సమానుఁ డెవ్వఁడును అను నీ యభిప్రాయంబున నీశ్వరత్వమును వివరించుచున్నాఁడు.— ఎంగువలన ననఁగా నేను, భోగీ = సమస్తము లయిన భోగోపకరణములతోను గూడినవాఁడను. సిద్ధోఽహమ్—పుత్త్రపౌత్త్రాదిసహాయసంపన్నుఁడను నాయంతనే నేను. బలవాన్=తేజస్విని. సుఖీ—అన్నివిధముల రోగరహితుఁడను.

శ్రీ. మఱియును.—సిద్ధః = కృతకృత్యుఁడను. ఇతరము స్పష్టము.

ప. అసౌ = ఈ వర్తమానుఁ డగు; శత్రుః; మయా; హతః. అపరా నపి = భవిష్యచ్ఛత్రువులను గూడ; హనిష్యే = వధింపఁగలను. సిద్ధః = కృతార్థుఁడను. అది చెప్పఁబడినది. “మృషామనోరథశ్రేణీ మాధుర్యా న్మోహితో దివా। రాత్రౌ స్వాప్నం సుఖం భుఞ్జ న్నరో జయతి జీవితమ్” * అని.

రా. అసౌ శత్రుః = ఈ శత్రువు; మయా = బలవంతుఁడ నగు నాచేత; హతః. అపరానపి = ఇతరశత్రువులను గూడ; శూరుఁడను ధీరుఁడ నగు నేను, హనిష్యే = వధింపఁగలను. ఇట నీదుర్బలు లగు మందబుద్ధులచేఁ బరికల్పిత మగు నదృష్టపరికరం బేమి చేయఁగలదు? అందువలన, ఈశ్వరోఽహమ్=స్వతంత్రుఁడను

* మనుష్యుఁడు పగలు మిథ్యామనోరథములసమూహముచే మోహితుఁడై రాత్రి స్వప్నసుఖము ననుభవించుచు జీవితమును జయించుచున్నాఁడు.

నేను, ఇతరులకును నేనే నియంతను. అహం భోగీ = నాసామర్థ్యముచేతనే నేను భోగిని, అదృష్టాదులచేతఁ గాదు. సిద్ధోహమ్ = నాసామర్థ్యమువలననే నేను సిద్ధుఁడను, అదృష్టాదులవలన దేనివలనను గాదు. అట్లు, నాసామర్థ్యముచేతనే బలవంతుఁడను, నాసామర్థ్యముచేతనే సుఖిని.

ఆఢ్యో ఽభిజనవా నస్మి కో ఽన్యో ఽస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః. ౧౫

**భా.** ఆఢ్యః = ధనముచేత గొప్పవాఁడను; అభిజనవాన్ = సత్కులము గలవాఁడను, సప్తపురుషముగా శ్రోత్రియత్వాదులు గలవాఁడను. అస్మి = అగుచున్నాను. అందుచేతఁగూడ నాకు సమానుఁ డెవ్వఁడును లేఁడు. అన్యః = ఇతరుఁడు; మయా = నాతో; సదృశః = సమానుఁడు; కః = ఎవ్వఁడు; అస్తి = కలఁడు? మఱియును. యక్ష్యే = యాగము చేతనుగూడ ఇతరుల జయించెదను. దాస్యే = ఇచ్చెదను, నటాదులకు. మోదిష్యే = అధిక మయిన హర్షమునుగూడ పొందెదను. ఇతి = ఈ విధముగా; అజ్ఞానవిమోహితాః = అజ్ఞానముచే వివిధముగా అవివేకభావము నొందినవారు వారు.

నేను ధనవంతుఁడను, సత్కులప్రసూతుఁడను, నాకు సాటి మఱి యెవ్వఁడు గలఁడు? యాగములఁ జేసి యందఱికన్న నధికుఁడ ననిపించుకొనెదను, నటవిటాదులకు దానము చేసెదను, ఆనందము నొందెదను — ఈవిధముగా నాసురులజ్ఞానముచే నానావిధముగా మోహము నొంది తలంచుచుందు రని తాత్పర్యము.

**ఆ.** విద్యచేతను సదాచారముచేతను ధనముచేతను సత్కులముచేతను నాసాటి లేఁ డని చెప్పుచున్నాఁడు ఆఢ్య ఇత్యాదిగా. అట్లయినను యజ్ఞదానములచేతను దత్ఫలముచేతను అధికుఁ డొకానొకఁ డుండు నని యాశంకించి చెప్పుచున్నాఁడు మఱియును అని. వారి యీయభిప్రాయము సాధువు కా దని చెప్పుచున్నారు ఇతీత్యాదిగా.

**హ.** అభిజనవాన్ = బంధుజనము గలవాఁడను. దాస్యామి = ఇచ్చెదను. గోభూహిరణ్యాదికమును యాచకులకు. మోదిష్యే=హర్షాతిశయము నొందెదను. ఇతి=ఇట్లు; అజ్ఞానవిమోహితాః=అవివేకముచే విమోహితు లగుచు

శ౦. మఱియును.—ఆఢ్యః = అధికధనము గలవాఁడను. అభిజనవాన్ = సత్కులము గలవాఁడను. యక్ష్యే = ప్రతిష్ఠార్థము ధనార్థము జీవనార్థము గాని యాగము చేసెదను. దాస్యామి = ఇచ్చెదను స్తుతించునట్టి నటవిటాదులకు, శ్రోత్రియులకును బంధువులకును గాదు. మోదిష్యే = దానభోగములసంతోషము నొందెదను. ఇతి = ఇట్లు; అజ్ఞానవిమోహితాః = అజ్ఞాన మనఁగా సదసద్వివేకము లేమి, దానిచే వివిధముగా మోహము నొందినవారు.

మ౦. ఓయీ! ధనమునఁ గాని కులమునఁ గాని నీకు సమానుఁ డుండు వచ్చును అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఆఢ్యః=ధనవంతుఁడను; అభిజనవాన్ అస్మి = కులీనుఁడను గూడ నేనే యగుచున్నాను. కావున, కో ఽన్యో ఽస్తి సదృశో మయా—నాతో సమానుఁ డెవ్వఁడును లేఁ డని యర్థము. యాగముచేఁ గాని దానముచేఁ గాని సమానుం డుండు ననఁగాఁ జెప్పుచున్నాఁడు. — యక్ష్యే — యాగముచేఁ గూడ నితరుల జయించెదను. దాస్యామి=ధనము నిచ్చెదను స్తుతించువారికిని నటాదులకును, అందువలన, మోదిష్యే = హర్షము నొందెదను ఆటకత్తెలు మొదలగువారినిగూడి. ఇతి = ఇట్లు; అజ్ఞానముచే — అవివేకముచే వివిధ మయిన మోహమును—భ్రమపరంపరను నొందింపఁబడినవారలు.

శ్రీ. మఱియును.—ఆఢ్యః=ధనాదిసంపన్నుఁడను. అభిజనవాన్=కులీనుఁడను. యక్ష్యే — యాగము చేసి గూడ ఇతరదీక్షితులకంటె గొప్పప్రతిష్ఠఁ బొందెదను. దాస్యామి, నుతించువారికి. మోదిష్యే=హర్షము నొందెదను. ఇతి = ఇట్లు; అజ్ఞానముచే విమోహితులు — మిథ్యాభినివేశము నొందింపఁబడినవారు.

వ. మఱియును.—ఆఢ్యః = ధనసమృద్ధి గలవాఁడను. అభిజనవాన్ = కులీనుఁడను. మయా సదృశః కో ఽన్యో ఽస్తి — ఎవ్వఁడును లేఁ డని యర్థము. ఇఁక సామర్థ్యము లేకున్నను వ్యర్థమనోరథములఁ జెప్పుచున్నాఁడు. — యక్ష్యే = యాగము చేసెదను. దాస్యామి=తులాభారాదిదానము చేసెదను. ఇట్లు లోకోత్తర కార్యములచేత, మోదిష్యే=సంతోషము నొందెదను. ఇట్లు అజ్ఞానముచే విమోహితులు — మిథ్యాభినివేశము నొందింపఁబడినవారు.

రా. నేను నావలననే ఆఢ్యుఁడ నైతిని. ఈ లోకమునందు నాతో సమానుఁడు మఱియొకఁ డెవ్వఁడు స్వసామర్థ్యముచేత సమస్తవిభవముల నొందినవాఁడు కలఁడు? నేను నాసామర్థ్యముచేతనే, యక్ష్యే దాస్యామి మోదిష్యే. ఇతి అజ్ఞాన

విమోహితాః—ఈశ్వరానుగ్రహము లేక తామే యాగదానాదికము చేయ సమర్థులని యజ్ఞానవిమోహితులై తలంచుచున్నారు.

అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకే౽శుచౌ. ౧౬

భా. అనేకచిత్తవిభ్రాన్తాః=చెప్పినవిధములు గల యనేకము లయిన తలంపులచే నానావిధముగా భ్రాంతులై; మోహజాలసమావృతాః = మోహ మనఁగా అవివేకము అజ్ఞానము, అదియే ఆవరణాత్మక మగుట వలన వలవంటిది, దానిచేఁ జుట్టఁబడినవారలై; కామభోగేషు=విషయ భోగము లందు; ప్రసక్తాః = ఆసక్తులై, వానియందే యున్నవారలై; అందుచే వృద్ధినొందినపాపము గలవార లగుచు, అశుచౌ = అపవిత్ర మగు; నరకే = వైతరణ్యాదినరకమునందు; పతన్తి = పడుచున్నారు.

ఇట్లనేకము లైన దుష్టసంకల్పములు గలిగి నానావిధముగా భ్రాంతులై యజ్ఞాన మనువలకుఁ దగులుకొన్నవారై విషయభోగములయందే మిక్కిలి యాసక్తులై యాపాపముచే వారు తుదకు హేయ మగు వైతరణ్యాదినరకమునం బడుదురని తాత్పర్యము.

ఆ. చెప్పినవిధమున విపరీతబుద్ధిచేఁ గృత్యాకృత్యవివేకము లేనివారి కేమగు ననఁగాఁ జెప్పుచున్నారు అనే కేత్యాదిగా.

హ. అనేకచిత్తవిభ్రాన్తాః — అనవస్థితులు *. జాలము—వల, దానివంటి మోహము మోహజాలము. పతన్తి=పడుచున్నారు.

శం. ఇట్లు కామసంకల్పములచే వివిధమోహము నొంది కామపరు లైన వారిప్రవృత్తికి ఫలముఁ జెప్పుచున్నాఁడు.—అనేకచిత్తవిభ్రాన్తాః = ఇది యిప్పుడు నాచేఁ బొందఁబడినది ఇత్యాదిరూపము లగు ననేకవిధము లైన చిత్తవికారములచే విభ్రాంతులు—వివిధముగా భ్రాంతులు; మోహజాలసమావృతాః=మోహ మనఁగా సదసద్వివేకాభావము, అదియే జాలము — వల మత్స్యములకువలె ఆవరణాత్మకమును నాశకరంబును, దానిచేఁ జక్కఁగా నావరింపఁబడినవారు — కప్పఁబడిన వివేకము గలవారు; అందువలననే; కామభోగేషు=విషయసేవనలయందే; ప్రసక్తాః =

* దేనియందును నిలుకడ లేనివారు.

ప్రకర్షమున సక్తులు — పరిస్థితులు, దేనియందును స్వధర్మమునందుఁ గాదు; అందువలననే, అశుచౌ = శ్లేష్మపూయహ్రదాదిరూప మగుటవలన అశుద్ధ మగు; నరకే = రౌరవాదినరకమునందు; పతన్తి.

మ. ఉక్తప్రకారము లగు ననేకము లయిన చిత్తములచేత.—ఆయాదుష్ట సంకల్పములచేత వివిధముగా భ్రాంతులు. ఎందువలన ననఁగా, మోహజాలసమావృతాః=మోహ మనఁగా హితాహితవస్తువుల వివేచించుసామర్థ్యము లేమి, అదియే జాలము — వల ఆవరణాత్మకమై బంధహేతు వగుటవలన, దానిచే చక్కఁగా ఆవృతులు—అన్నివైపులను జుట్టఁబడినవారు సూత్రమయ మగు జాలముచే మత్స్యముల వలె, పరవశీకృతు లని యర్థము. అందువలననే, తమ కనిష్టసాధనము లయినను, కామభోగేషు; ప్రసక్తాః—అన్నివిధములను వానియందే ఆసక్తులు; ప్రతిక్షణమును వృద్ధినొందుచున్న పాపము గలవారలై, అశుచౌ — విణ్మూత్రశ్లేష్మాదిపూర్ణ మగు; నరకే — వైతరణ్యాదికమునందు; పతన్తి = పడుచున్నారు.

శ్రీ. ఇట్టివారు దేనిఁ బొందుదురో దాని వినుము.—అనేకము లగు మనోరథములందుఁ బ్రవృత్త మగు చిత్తము అనేకచిత్తము, దానిచే విభ్రాంతులు—విక్షేపము నొందినవారు; ఆ మోహమయ మగు జాలముచేతనే సమావృతులు—సూత్రమయ మగు జాలముచే మత్స్యములుంబోలె బద్ధులు; ఇట్లు, కామభోగేషు; ప్రసక్తాః=అభినివేశము గలవారై; అశుచౌ=కశ్మల మగు; నరకే; పతన్తి.

ప. మఱియును.—అనేకము లగు వ్యర్థమనోరథములయందుఁ బ్రవృత్త మగు చిత్తము అనేకచిత్తము, దానిచే విశేషమున భ్రాంతులు. వారి కుద్ధార మెప్పుడును లే దని చెప్పుచున్నాఁడు.—మోహజాలసమావృతాః — ఎట్లు సూత్రమయ మగు వలలోఁ జిక్కిన మత్స్యములకు నిర్గమము సంభవింపదో అట్లు మోహజాలసమావృతులు. కామభోగేషు; ప్రసక్తాః = ప్రకర్షమున సక్తులు; అశుచౌ = కల్మషరూప మగు; నరకే; పతన్తి. ఇట నిది ప్రతిపాదిత మగుచున్నది:—“తుల్యా వ్యవహృతి స్సర్వా స్వప్నజాగ్రదవస్థయోః। ఏకస్యా ఽవసరే ఽన్యస్య యు న్మిథ్యాత్వం ప్రతీయతే” * అని వైతథ్యోపనిషత్తునందుఁ జెప్పఁబడినది. శ్రుతులచే స్వప్నవ్యవహారదృష్టాంతముచే జాగ్రద్వ్యవహారముగూడ మిథ్య యని దర్శిత

* స్వప్నమునందును జాగ్రదవస్థయందును వ్యవహారమంతయు సమానము. ఎందువలన ననఁగా, ఒకదానికాలమందు మఱియొకటి మిథ్య యని ప్రతీత మగుచున్నది.

మయ్యెను. ఇప్పు డది స్వరూపముననే మనోరథరూప మగుటచే మిథ్య యని భగవంతునిచే విస్తరించి ప్రకటిత మగుచున్నది. అందు మనోరథము రెండువిధములు, సంభావితము అసంభావితము అని. అందుఁ బ్రతిదినము చేయు నన్నపానాదివిషయ భోగమునందలిమనోరథము సంభావితము, అదియు దైవాధీన మగుటవలనఁ బాక్షికము *. రాజ్యప్రాప్తి మొదలగు సకలభోగములచే మనోరంజనము అసంభావితము. ఇట్లిది మిథ్యాభూత మని యెఱింగియు మనోరథపరంపరను జేయుచున్నారు. వీరి కుద్ధార మెప్పుడును లే దని యర్థము. అట్లు చెప్పఁబడినది టిప్పణికలయందు "స్వాప్నం సుఖం దుఃఖ మసత్యమేవ తథాపి తస్యా ఽనుభవ స్తదానీమ్ । తథైవ శుక్తౌ రజతస్య మిథ్యా మనోరథోత్థంతు వినా ఽనుభూతిమ్॥ ౧॥ సర్వత స్తనుభృతా మఖిలో ఽపి స్యా న్మనోరథ మయో వ్యవహారః । యుక్తిత స్త్వనుభవా దనువేలం త న్మృషాత్వ ముదితం మునివర్యైః॥ ౨॥ " ♦ అని. అట్లు విష్ణుపురాణమునందును సౌభర్యాఖ్యానంబున " మనోరథానాం న సమాప్తి రస్తి వర్షాయుతై ర ప్యథవాపి లక్షైః । పూర్ణేషు పూర్ణేషు పునర్నవానా ముత్పత్తయ స్సన్తి మనోరథానామ్॥ ౧॥ పద్భ్యాం గతా యౌవనతశ్చ జాతా దారైశ్చ సంయోగ మితాః ప్రసూతాః । దృష్టా స్సుతా స్త త్తనయ ప్రసూతిం ద్రష్టుం పున ర్వాఞ్ఛతి మే ఽన్తరాత్మా॥ ౨॥ య జ్జీవతో నైవ మనోరథానా మన్తో ఽస్తి విజ్ఞాత మిదం మయా ఽద్య । మనోరథాసక్తిపరస్య చిత్తం నజాయతే వై పరమార్థసఙ్గి॥ ౩॥ " ❨ అని.

రా. అదృష్టేశ్వరాదిసహకారము లేక తానే సర్వమును జేయ సమర్థుఁడని తలఁచి ఇట్లు చేయుదును అదియు చేయుదును ఇతరమునుం జేయుదును అని

---

* పక్షాంతరము ననుసరించి సంభావిత మని భేదమునఁ జెప్పుచున్నాము గాని దానికిని మిథ్యాత్వము సమానము.

♦ స్వప్నమునందలి సుఖదుఃఖము లసత్యములే, అయినను అప్పుడు వానియనుభవము గలదు. అట్లే శుక్తియందు రజతముయొక్కయనుభవము కలదు. మనోరథవిషయమో యనుభవము లేకయే మిథ్య. ౧. అన్నివిషయములయందును దేహులవ్యవహారము సర్వంబును మనోరథమయ మగును. యుక్తి వలనను అనుభవమువలనను అది మిథ్య యని మునివర్యులచేఁ జెప్పఁబడినది. ౨.

❨ వర్షములు పదివేలకుఁ గాని లక్షలకుఁ గాని మనోరథములకు సమాప్తి లేదు. నిండినవి నిండుచుండఁగా వెండియు నూతనమనోరథములు జనియించు చుండును. ౧. నా కొడుకులు దోఁగాడిరి. యౌవనము నొందిరి. భార్యలతోఁ గూడిరి. బిడ్డలఁ గనిరి. ఇట్లు కొడుకులఁ జూచితిని. ఇఁక వారి కొడుకులకుఁ గొడుకులఁ జూడఁ గోరుచున్నది నాయంతరాత్మ. ౨. జీవించి యుండువఱకు మనోరథముల కంతము లే దని నా కిప్పుడు తెలిసినది. మనోరథములయందుఁ దగిలి యున్నవానిచిత్త మెంతమాత్రమును పరమార్థమునం దాసక్తము కాదు.

యనేకచిత్తవిభ్రాంతులు, ఈ విధ మయిన మోహజాలముచే సమావృతులు, కామభోగములందుఁ బ్రకర్షంబున సక్తులు, నమమ మృతులై, అశుచి యగు నరకమునందుఁ బడుచున్నారు.

ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనా ఽవిధిపూర్వకమ్. ౧౭

**భా.** ఆత్మసంభావితాః=సర్వగుణవిశిష్టుల మని తమచేతనే తాము పొగడుకొనఁబడువారు, సాధులచేతఁ గాదు; స్తబ్ధాః = వినయము లేనివారు; ధనమానమదాన్వితాః = ధనముచేఁ గలిగిన మానముతోను మదముతోను గూడినవారు; తే = ఆ యాసురులు; నామయజ్ఞైః=నామమాత్రపుయజ్ఞములచేత; దమ్భేన=ధర్మధ్వజితచేత *; అవిధిపూర్వకమ్= విధియుక్తము కానట్లు, శాస్త్రమునందు విధింపఁబడిన యంగములను విధానక్రమమును విడిచి; యజన్తే = యజించుచున్నారు.

వారు తాము గుణవంతు లని తమ్ముఁ దామే పొగడుకొనుచుందురు, వినయము లేక గర్వించి యుందురు, ధనముచే మానమును మదమును గలవారు, దంభార్థము శాస్త్రోక్తవిధిని సరకుసేయక పేరునకు యజ్ఞములు చేసి తామును యజ్ఞములు చేసినవా రని యనిపించుకొందు రని తాత్పర్యము.

**ఆ.** వారికిని గొందఱకు యాగదానాదివైదికకర్మమునందుఁ బ్రవృత్తి యుండుటవలన వారు వైతరణ్యాదినరకమునఁ బడుదు రనుట యుక్తము కా దనఁగాఁ జెప్పుచున్నారు ఆ త్మేత్యాదిగా.

**హ.** తమచేతనే సంభావితులు — పూజితులు. స్తబ్ధాః — గురువునకును దేవతకునుగూడ నమస్కరింపనివారు. ధననిమిత్త మయిన మానము ధనమానము, ధనమానముతోను మదముతోను గూడినవారు. నామయజ్ఞైః = పేరుమాత్రమే ప్రధానముగాఁ గల యజ్ఞములచేత; దమ్భేన = ధార్మికత్వఖ్యాపనముచేత; అవిధిపూర్వకమ్ — శాస్త్రీయవిధిని విడిచి; యజన్తే = యజించుచున్నారు.

* తాము యజ్ఞములు చేసితి మని పరులు తమ్ము స్తుతింపవలయు నను తలంపుచేత.

శ౦. ఓయీ! వారికిని బ్రాహ్మణు లగుటచే శ్రుతాధ్యయ నాధ్యాపనము లును వైదికకర్మానుష్ఠానంబును సంభవించుటవలన వైదికు లగువారి కీశుచి నరక పాతం బెట్లని యాశంకించి, "శ్రద్ధయా ఽగ్ని స్సమిధ్యతే, యో వా ఏత దక్షరం గార్గ్య విదిత్వా ఽస్మిఁ ల్లోకే జుహోతీ" * ఇత్యాది శ్రుత్యుక్తలక్షణము లేమి వలన వారు విధిని విడిచి చేయు యజ్ఞాభాసములచే నీశ్వరుఁడు ప్రీతుండు కాఁడనియు ఈశ్వరుఁడు గావించిన నియమము నుల్లంఘించుటయందుఁ బ్రవృత్తు లగుటవలన నయ్యాసురులకు నరకప్రాప్తియే సిద్ధ మనియుఁ బ్రతిపాదించుచున్నాఁడు రెండు శ్లోకములచేత.—ధనమానమదాన్వితాః = మానము—గర్వము, మదము—మత్తత, ధనాతిశయముచేఁ బుట్టిన వగు మానమదములతోఁ గూడినవారు; కావుననే, ఆత్మసంభావితాః=తమచే తాము గౌరవింపఁబడువారు, ఎప్పుడును శిష్టులచేతఁ గాదు; కావుననే, స్తబ్ధాః = ఉద్ధతులు, నమ్రత లేనివారు; తే = ఆయాసురులు; నామయజ్ఞైః=పేరునకు యజ్ఞములచేత; వైదిక మగు క్రియతోఁ గాని లక్షణముతోఁ గాని గూడిన వానిచేతఁ గాదు, మఱే మనఁగా ఆభాసయజ్ఞములచేత; అవిధిపూర్వకమ్—నియత మగు కాలమును మంత్రమును హోమమును ఋత్విజులును లేనట్లుగా; దమ్భేన—తాము గొప్ప లని ప్రసిద్ధికొఱకు, ఈశ్వరప్రీతికొఱకుఁ గాదు; యజన్తే.

మ. ఓయీ! వారిలోను గొందఱకు యాగదానాదివైదికకర్మమునందుఁ బ్రవృత్తి కనఁబడుటవలన నరకపతనము కలుగు ననుట యుక్తము కాదు. అనఁగా నట్లు తలంపవల దని చెప్పుచున్నాఁడు.—సర్వగుణవిశిష్టులము మే మని తమచేతనే తాము పూజ్యతను పొందింపఁబడువారు, కాని సాధువు లెవ్వరిచేతనుం గాదు; స్తబ్ధాః = నమ్రములు కానివారు; ఎందువలన ననఁగా, ధనమానమదాన్వితాః = ధన నిమిత్తమైన యేమానము గలదో తమయందుఁ బూజ్యతాతిశయాధ్యాసము, తన్నిమిత్త మయిన యేమదము గలదో యుత్తము లగు గుర్వాదులయందును అపూజ్యత్వాభిమానము, వానితోఁ గూడినవారు; తే=ఆ యాసురులు; నామయజ్ఞైః=నామమాత్రము లగు యజ్ఞములచేత, తాత్త్వికములచేతఁ గాదు, లేక, దీక్షితులు సోమ యాజులు అను నామమాత్రము కలిగించు యజ్ఞములచేత; అవిధిపూర్వకమ్=విహితము లయిన యంగములును కర్తవ్యక్రమమును లేనివానిచేత; దమ్భేన = ధర్మధ్వజితతో, శ్రద్ధతోఁ గాదు; యజన్తే. అందువలనఁ దత్ఫలము నొందఁజాల రని యర్థము.

---

* శ్రద్ధతో అగ్ని జ్వలింపఁజేయఁబడుచున్నది, గార్గీ! ఎవ్వఁ డీ యక్షరము నెఱుంగక యీ లోకమునందు హోమముఁ జేయుచున్నాఁడో.

శ్రీ. యత్స్వ అనువారిమనోరథ మేది చెప్పఁబడినదో అది కేవలము దంభాహంకారాదిప్రధానమే కాని సాత్త్వికము కా దను నభిప్రాయముతోఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—తమచేతనే తాము పూజ్యతను బొందింపఁబడినవారు, సాధువులచే నెవ్వరిచేతనుం గాదు; కావుననే, స్తబ్ధాః=నమ్రములు కానివారు; ధనముచేఁ గలుగు మానమును మదమును ఏవి గలవో వానితోఁ గూడినవా రగుచు; తే; నామమాత్రంబున యజ్ఞము లనఁబడునవి యేవి గలవో అవి నామయజ్ఞములు, లేక, దీక్షితుఁడు సోమయాజి ఇత్యాది నామమాత్రప్రసిద్ధికిఁ జేయు యజ్ఞము లేవి గలవో అవి నామయజ్ఞములు, వానిచేత; యజన్తే. ఎట్లు? దమ్భేన, శ్రద్ధచేతఁ గాదు; అవిధిపూర్వకముగాఁ గూడ.

మ. తమచేతనే తాము, సంభావితులు — పొగడుకొనఁబడువారు, ఇతరులెవ్వరిచేతనుం గాదు; అంతమాత్రముచేతనే, స్తబ్ధాః = నమ్రములు కానివారు; ధనమానములతోను మదముతోను — గర్వముతోను గూడినవా రగుచు; దమ్భేన యజ్ఞైః యజన్తే, పరమార్థబుద్ధిచేతఁ గాదు. అయినను యజ్ఞఫలమును బొందనే పొందుదు రనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అవిధిపూర్వకమ్—ద్రవ్యపాత్రాదులయశుద్ధి అవిధి, తత్పూర్వక మగు కర్మము ఫలవంతము కా దని యర్థము.

రా. ఆత్మసంభావితాః—తామే తమ్ము పూజించుకొనువా రని యర్థము. స్తబ్ధాః — తాము పరిపూర్ణు లని తలఁచి యేమియును జేయనివారు. ఎట్లు? ధనమానమదాన్వితాః=ధనముచేతను విద్యాసత్కులాభిమానముచేతను కలిగిన మదముతోఁ గూడినవారు; నామయజ్ఞైః = నామప్రయోజనములు — సోమయాజి యను నామమాత్రమె ప్రయోజనముగాఁ గల వగు యజ్ఞములచేత; యజన్తే. అదియును, దంభ మనుకారణముచేత, సోమయాజి యను ఖ్యాతికొఱకు; అవిధిపూర్వకమ్ — యథాశాస్త్రము కాదు.

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః
మా మాత్మ పరదేహేషు ప్రద్విషన్తో ఽభ్యసూయకాః. ౧౮

భా. అహంకారమ్ = అహంకరించుటను, ఉన్నవానిని లేనివానిని గుణములఁ దనయం దధ్యారోపించుకొని తద్విశిష్టుఁడను నే నని తలంచుట యేది గలదో అది యహంకారము అవిద్యాఖ్యము కష్టతమము, సర్వ

దోషములకును సర్వానర్థప్రవృత్తులకును మూలము, దానిని; అట్లు, బలమ్ = పరుల నభిభవించుటకు హేతువై కామరాగయుక్త మగు బలమును; దర్పమ్=దర్ప మనఁగా ఏది పుట్టినపుడు పురుషుఁడు ధర్మము నతిక్రమించునో అట్టి యంతఃకరణాశ్రయ మగు దోషవిశేషము, దానిని; కామమ్ = స్త్రీ మొదలగువానియందు కామమును; క్రోధంచ=అనిష్ట విషయములందు క్రోధమును, వీనిని ఇతరములను గూడ మహాదోషము లను; సంశ్రితాః = పొందినవారు. మఱియు వారు, మామ్ = నన్ను ఈశ్వరుని; ఆత్మపరదేహేషు=తమదేహములందును బరదేహములందును; తద్బుద్ధి కర్మసాక్షియై యున్నవానిని నన్ను; ప్రద్విషన్తః = మిక్కిలి ద్వేషించుచున్నవారు, నన్ను ద్వేషించుట యనఁగా నాయాజ్ఞ నతిక్ర మించుట, దానిని జేయుచున్నవారు; అభ్యసూయకాః = సన్మార్గవర్తుల యొక్క గుణములందు సహనము లేనివారు.

మఱియు నయ్యాసురులు అహంకారమును బలదర్పములను గామక్రోధ ములను ఆశ్రయించి తమదేహములందును బరదేహములందును తద్బుద్ధి కర్మసాక్షినై యున్న నాయందు నాయాజ్ఞ నతిక్రమించి ద్వేషము గలవారై సత్పురుషులగుణ ములయెడ నసూయ గలవారై యుందు రని తాత్పర్యము.

ఆ. ఆసురసంపద నభిలక్షించి పుట్టినవారు వైదికకర్మమునందుఁ బ్రవృత్తు లైనను వారికి ధర్మమే కలుగుం గాని పుణ్యము కలుగ దని చెప్పఁబడినది. ఇఁక బ్రహ్మజ్ఞానమునుండియో యాసురులు దూరముననే యుద్విగ్ను లగుదు రని చెప్పు చున్నారు అహంకార మిత్యాదిగా. అహంకారమునే విశదీకరించుచున్నారు ఉన్న వానిని ఇత్యాదిగా. అధ్యారోపితగుణవిశిష్టత విషయముగాఁ గలది యగుటవలన నహంకార మవిద్యామూల మగుటచే నవిద్య యని చెప్పుచున్నారు అవిద్యాఖ్య మని. వివేకులు దాని మహాయత్నముచే విడువవలయు నని సూచించుచున్నారు కష్టతమ మని. దానినే స్పష్టీకరించుచున్నారు స ర్వేత్యాదిగా. బలమును - కార్యము చేయుసామర్థ్యమును, చెప్పిన విశేషణములు గలదానిని. అహంకారమే పెద్దలఁ దిరస్కరించువఱకుఁ బరిణమించినదై దర్ప మనఁబడును, దానిని వివరించు చున్నారు దర్ప మనఁగా నిత్యాదిగా. ఇతరములనుగూడ — మాత్సర్యాదులను. ఈ చెప్పిన విశేషణము మాత్రమే కాదు, మఱే మనఁగా కష్టతమ మైనది మఱి యొకవిశేషణముగూడ వారియందుఁ గల దని చెప్పుచున్నారు మఱియు నని. వారి

కీశ్వరునందు ద్వేష మున్నను ఎట్లు స్వదేహమునందును బరదేహములందును ఈశ్వరు నెడ వారికి ద్వేషం బనవచ్చును? దేహములందు భోక్త యున్నాడు గాని యీశ్వరుడు లేడు గదా యని యాశంకించి చెప్పుచున్నారు తదన్య ద్ధిత్యాదిగా. వారి కీశ్వరునందున్న ద్వేషమునే ప్రకటించుచున్నారు నాయాజ్ఞ నిత్యాదిగా. ఈశ్వరుని యాజ్ఞ--శ్రుతిస్మృతిరూపము, దాని నతిక్రమించుట—దానియందు జెప్పబడిన యర్థము నెఱుంగుటయందును అనుష్ఠించుటయందును బరాఙ్ముఖు లగుట.

హ. లేనివైనను గుణములఁ దమయం దధ్యారోపించికొని వానిచే మేము గుణవంతు లని తలంచుట అహంకారము, దాని; సంశ్రితాః; మామ్=నన్ను ఈశ్వరుని; ఆత్మ పరదేహేషు = తమయొక్కయు ఇతరులయొక్కయు దేహములందు, ఉన్నవానిని; ప్రద్విషన్తః=సహింపనివారు; అభ్యసూయకాః=ఆత్మ పరదేహములందున్న యీశ్వరునందును ఇతరునియందువలె గుణదోషములు దలంచువారు.

శం. మఱియును.—నేనే కులశీలసంపన్నుఁడను సర్వశాస్త్రపారగుఁడను సర్వజ్ఞుఁడను ధర్మిష్ఠుండను సర్వోత్తముండను అని దేనిచేఁ దన్నుత్కృష్టునిఁగాఁ దలంచుచున్నాఁడో అది యహంకారము, దాని; బలమ్—కామరాగజన్య మయిన దాని; దర్పమ్ = గర్వమును; కామం క్రోధంచ; చకారమువలన మోహ లోభ పారుష్యాది బుద్ధిదోషములను; సంశ్రితాః; ఆత్మ పరదేహేషు=తమదేహములందును బరులదేహములందును; మామ్ = నన్ను ప్రత్యగాత్మను; ప్రద్విషన్తః = నన్నుఁ తర్యామినిగా నంగీకరింపక మిక్కిలి ద్వేషించువారలు, లేక, ఆత్మ నగు నేను దేహాది వ్యతిరిక్తుఁడ ననియు నిత్యుఁడ ననియు చైతన్యమాత్రుఁడను అకర్తను అభోక్తను అనియు నంగీకరింపక మిక్కిలి ద్వేషించువారలు; అందువలననే, అభ్యసూయకాః-- ఆత్మ దేహవ్యతిరిక్తుఁడును నిత్యుఁడును ఒక్కఁడును పూర్ణుఁడును అవిక్రియుఁడును అని చెప్పునట్టి సత్పురుషులగుణములయందు దోషారోపము చేయువారలు. ఇట్లాసురులు లోకమున బౌద్ధాచారు లయి యుందురు.

మ. దంభాహంకారాది ప్రధాన మగు యక్ష్యేదాస్యా మిత్యాదిసంకల్పముచేఁ బ్రవర్తించునట్టి యాసురులకు బహిరంగసాధన మగు యాగదానాదిక మైన కర్మముగూడ సిద్ధింపదు, ఇఁక నంతరంగసాధన మగు జ్ఞానవైరాగ్యభగవద్భజనాదికము వారికి మొదలే సిద్ధింప దని చెప్పవలయునా? అని చెప్పుచున్నాఁడు.—నేను అను నభిమానరూప మైన యహంకార మేది గలదో అది సర్వసాధారణము. ఆరోపితము లగు గుణములచేఁ దనయందు మహత్త్వము నభిమానించుట యను నహం

కారమును; బలమ్=ఇతరులఁ బరిభవించుటకు నిమిత్తమగు శరీరగతసామర్థ్యవిశేషమును; దర్పమ్=పరావమానరూపమును గురువు రాజు మొదలైనవారి నతిక్రమించుటకు కారణంబు నగు చిత్తదోషవిశేషమును; కామమ్ = ఇష్టవిషయాభిలాషను; క్రోధమ్=అనిష్టవిషయద్వేషమును; చకారమువలన పరగుణముల సహింపమి యను మాత్సర్యమును, ఇట్లితరములైన మహాదోషములనుగూడ; సంశ్రితాః. ఇట్టి పతితులయ్యును నీయందలిభక్తిచేఁ బవిత్రులై నరకముఁ దప్పించుకొందురు అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—మామ్ = నన్ను ఈశ్వరుని భగవంతుని; ఆత్మపరదేహేషు=తమ యొక్కయు—ఆయాసురులయొక్కయు పరులయొక్కయు — వారి పుత్త్రభార్యాదుల యొక్కయు దేహములయందు ప్రేమాస్పదము లయన వారియందు వారివారి బుద్ధికర్మములకు సాక్షినై యున్నవాని అతిప్రేమాస్పదునిఁగూడ; దుర్దైవపరిపాకము వలన, ప్రద్విషన్తః = ఈశ్వరుఁడ నగు నాయొక్క శాసనము శ్రుతిస్మృతిరూపము, దానియందుఁ జెప్పఁబడిన యర్థము ననుష్ఠించుటయందుఁ బరాఙ్ముఖతచే దాని నతిక్రమించుటయె నాయందుఁ బ్రద్వేషము, దానిఁ జేయుచున్నవారు; రాజాదుల యాజ్ఞ నుల్లంఘించుటయే గదా వారి ద్వేషించుట యని ప్రసిద్ధము లోకమునందు. ఓయీ! గుర్వాదు లేల వారికి నేర్పరు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అభ్యసూయకాః = వైదికమార్గస్థు లగు గుర్వాదుల కారుణ్యాదిగుణములందు మోసము మొదలగు దోషముల నారోపించువారు, అందువలన వారు సర్వసాధనశూన్యులై నరకమునందే పడుదు రని యర్థము. మా మాత్మపరదేహేషు అనుదానికి మఱియొక వ్యాఖ్యానము.—స్వదేహములందును పరదేహములందును చిదంశరూపమున నున్న నన్ను ద్వేషించుచు; యజన్తే—దంభయజ్ఞములయందు శ్రద్ధ లేకుండుటవలన దీక్షాదికముచేఁ దనకు వ్యర్థ మయిన పీడయే కలుగుచున్నది, అట్లు పశ్వాదులనుగూడ అవిధిచే హింసించుటవలనఁ జైతన్యద్రోహముమాత్రమే మిగులుచున్నది. ఇంకొక వ్యాఖ్యానము.—జీవునిచే ఆవేశింపఁబడనిదియు నాలీలావిగ్రహమును వాసుదేవాది నామములు గలదియు నగు నాదేహమునందు మనుష్యత్వాదిభ్రాంతివలన నన్ను ద్వేషించుచున్నవారు, అట్లు పరదేహములందును భక్తదేహములందు ప్రహ్లాదాది నామము లగువానియందు సదా ఆవిర్భూతుఁడ నగు నన్ను ద్వేషించుచున్నవార లని యోజన. చెప్పఁబడినది గదా నవమాధ్యాయమునందు "అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్ । పరంభావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః । రాక్షసీ మాసురీం

చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః" అని. "అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మా మబుద్ధయః" అనియు మఱియొకచోట. అట్లు భజనీయునందు ద్వేషము గలుగుటవలన భక్తిచేఁ బరిశుద్ధత వారికి సంభవింప దని యర్థము.

శ్రీ. అవిధిపూర్వకత్వమునే ప్రపంచించుచున్నాఁడు.—అహంకారాదుల నాశ్రయించినవారై; ఆత్మపరదేహేషు=తమదేహములందును బరదేహములందును; చిదంశంబున నున్న నన్ను, ప్రద్విషన్తః; యజన్తే *. దంభయజ్ఞములందు శ్రద్ధ లేమివలన తనకు వ్యర్థముగాఁ బీడమాత్రమే కలుగును, అట్లు పశ్వాదులను గూడ అవిధియుక్తముగా హింసించుటచే చైతన్యద్రోహము మాత్రమే శేషించుచున్న దని ప్రద్విషన్తః అని చెప్పఁబడినది. అభ్యసూయకాః=సన్మార్గవర్తులగుణములందు దోషముల నారోపించువారు.

ప. దానినే ప్రపంచించుచున్నాఁడు.—అహంకారాదులను సంశ్రితులై; ఆత్మపరదేహేషు; చిదంశరూపంబున నున్న నన్ను ద్వేషించుచు అవిధిపూర్వకముగా యజించుచు వ్యర్థముగానే తమదేహమును క్లేశపఱుచుకొనుచున్నారు, పశ్వాది హింసచేఁ బరదేహములను వ్యర్థముగానే క్లేశపఱుచుచున్నారు, రెండువిధములను నన్ను ద్వేషించుచు; అభ్యసూయకాః = సన్మార్గవర్తులగుణములందు దోషారోపము చేయువారు.

రా. మఱియు వారిట్టివారలై యజింతు రని చెప్పుచున్నాఁడు.—ఇతరుల నపేక్షింపక నేనే సర్వంబును జేయుచున్నా నను నహంకారమును, సమస్తమును సాధించుటయందు నాబలమే చాలు నని బలంబును, కావున నాకు సమానుఁ డెవ్వఁడును లేఁ డని దర్పమును, ఇంతవాఁడ నగు నాకుఁ గామమాత్రంబున సర్వంబును సిద్ధింపఁగల దని కామంబును, నాకెవ్వ రనిష్టము చేయుదురో వారి నందఱ వధింతు నని క్రోధంబును, ఇట్లు వీనిని సంశ్రితులై స్వదేహములందును బరదేహములందును ఉన్నవాఁడను సర్వంబును జేయించువాఁడను బురుషోత్తముఁడ నగు నన్ను, అభ్యసూయకాః ప్రద్విషన్తః—కుయుక్తులచే నాస్థితియందు దోషములు చెప్పుచు నన్ను సహింపనివారై యహంకారాదుల నాశ్రయించి యాగాది సర్వకర్మములఁ జేయుచుందు రని యర్థము.

* అధ్యాహార్యము.

మా. మా మాత్మ పరదేహేషు ప్రద్విషన్తః—ఎవ్వనికిని విష్ణువు చేయించువాఁడు కాఁడు, అగునేని నాచేతను ఇప్పుడు చేయించుఁ గాక, ఇత్యాదిగా. "ఈశ్వరో యది సర్వస్య కారకః కారయాత మామ్ । అద్వైతి వాదినం బ్రూయాత్ సదా ఽధో యాస్యసి" * అని సామవేదంబున యాస్కశ్రుతి.

తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు. ౧౯

భా. తాన్ = అట్టివారి నందఱను సన్మార్గమునకు శత్రువులై సాధుద్వేషు లయినవారిని; ద్విషతః = నన్నును ద్వేషించువారిని; క్రూరాన్ = హింసాపరులను; నరాధమాన్ = నీచు లయిన మనుష్యులను, అధర్మదోషము గలవా రగుటవలన; అజస్రమ్ = ఎల్లప్పుడును; అశుభాన్ = అశుభకర్మముఁ జేయువారిని; అహమ్ = నేను; సంసారేషు = నరకసంసరణమార్గములందు; ఆసురీషు = క్రూరకర్మప్రాయము లయిన; యోనిష్వేవ = వ్యాఘ్రసింహాది యోనులందే; క్షిపామి=పడవేయుచున్నాను.

అట్లు సన్మార్గమునకు శత్రువులై సాధుద్వేషులై నన్నును ద్వేషించుచుఁ గ్రూరులై యధర్మపరులై యెల్లపుడు నశుభకర్మములనే చేయుచుండునట్టి నరాధములగు నయ్యాసురులను నేను ఘోరనరకములం బడవైచి యంతఁ గ్రూరకర్మములనే చేయు వ్యాఘ్రసింహాది యోనులందుఁ బుట్టింతు నని తాత్పర్యము.

శ్రీ. ఈ విశేషణములు గల యయ్యాసురుల గతి యేమి యనఁగాఁ జెప్పుచున్నారు తా నిత్యాదిగా. భగవంతుని నైర్ఘృణ్యప్రసక్తిని దొలఁగించుచున్నారు అధ ర్మేత్యాదిగా.

హ. ఆసురీషు = సింహవ్యాఘ్రాదులయందు.

శం. మఱియును.—స్వదేహపరదేహములం దాత్మ యగు నన్ను, ద్విషతః= ద్వేషించువారును; కావుననే, క్రూరాన్=క్రూరకర్ములును, దయాసత్యశౌచాచారశూన్యులును; అశుభాన్ = అమంగళాచారనిరతులును; కావుననే, నరాధమాన్; తాన్ = అట్టి యాసురులను, ఈ చెప్పిన యాసురసంపదతోఁ గూడిన జనులను;

* ఈశ్వరుఁడు సర్వప్రాణులచేతను జేయించువాఁ డగునేని నాచే నిప్పుడు చేయించుఁగాక అని వాదించువానికిఁ జెప్పవలయును—నీవు సదా అధోగతి నొందువాఁడవు అని.

వారు చేయు కర్మములఁ బట్టి, సంసారేషు=సంసారమార్గములయందు; లేక, సంస్రియన్తే— భుజింపఁబడుచున్నవి కావున సంసారము లనఁగా జననమరణాదిభేదములు, అవి యనుభవింపవలసినపుడు వాని ననుభవించుటకై; ఆసురీషు యోనిష్వేవ = అతిక్రూరము లైన శునక సూకర సర్ప వ్యాఘ్రాదియోనులయందే; క్షిపామి = వేయుచున్నాను, తత్కర్మానురూప మయిన శునకాదియోనినే అజస్రము — మాటిమాటికిని పొందించుచున్నాను; అహమ్ = ఈశ్వరుఁడను నేను; నాయాజ్ఞ నతిక్రమించుజనుల నని యర్థము.

వ్యా. వారును నీకృపచే నొకానొకప్పుడు తరింపఁగల రనఁగా తరింపఁజాలరని చెప్పుచున్నాఁడు.—తాన్ = ఆ సన్మార్గశత్రువులను; ద్విషతః = సాధువులను నన్నును ద్వేషించువారిని; క్రూరాన్ = హింసాపరులను; కావున, నరాధమాన్ — మిక్కిలి నిందితులను; అజస్రమ్=ఎల్లప్పుడును; అశుభాన్ = అశుభకర్మములఁ జేయువారిని; అహమ్ = సర్వకర్మఫలదాత నగు నీశ్వరుఁడను నేను; సంసారేషు = నరకసంసరణమార్గములయందే; క్షిపామి = పడవేయుచున్నాను. నరకానుభవ మయిన పిమ్మట, ఆసురీష్వేవ యోనిషు—అతిక్రూరము లయిన వ్యాఘ్రసర్పాదియోనులందే; తత్తత్కర్మవాసనానుసారంబున, క్షిపామి అని యనువర్తించుచున్నది. ఇట్టిద్రోహులయందు లేదు నాకు నీశ్వరునకుఁ గృప యని యర్థము. అట్లు శ్రుతి.—“అథ య ఇహ కపూయచరణా అభ్యాశోహ యత్తే కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం వా సూకరయోనిం వా చణ్డాలయోనిం వా” అని. కపూయచరణాః= నిందిత మైనకర్మము గలవారు; అభ్యాశోహ=శీఘ్రముగనే; కపూయాం యోనిమ్= నిందిత మైన యోనిని; ఆపద్యేరన్=పొందుదురు అని శ్రుతి కర్థము. అందువలననే పూర్వపూర్వకర్మానుసారి యగుటవలన ఈశ్వరునకు వైషమ్యము గాని నైర్ఘృణ్యము * గాని లేదు. అట్లు పరమర్షిప్రణీత మగు సూత్రము “వైషమ్య నైర్ఘృణ్యే న సాపేక్షత్వా త్తథా హి దర్శయతి” ♦. ఇందుచే పాపకర్మములనే వారిచేఁ జేయించుచున్నాఁడు భగవంతుఁడు వారియందుఁ దద్బీజము లుండుటవలన, కారుణికుఁ డైనను ఆబీజముల నశింపఁజేయఁడు వారియందుఁ దన్నాశక మగు పుణ్యోపచయము లేమివలన, పుణ్యోపచయమును జేయింపఁడు వార లందులకు యోగ్యులు

* నిర్దయత.

♦ బ్ర. సూ. ఈశ్వరునకు వైషమ్యనైర్ఘృణ్యములు లేవు. పూర్వకర్మము ననుసరించి చేయుటవలన. అట్లు తెలుపుచున్నది శ్రుతి.

కామివలన. ఈశ్వరుఁడు పాషాణములందు యవాంకురములఁ బుట్టింపఁడు కదా! ఈశ్వరుఁ డగుటవలన నయోగ్యమునకుఁగూడ యోగ్యతను గలిగింప శక్తుఁ డగునందు వేని, శక్తుఁడే యగును సత్యసంకల్పుఁ డగుటవలన సంకల్పించునేని; కాని సంకల్పింపఁడు, తన యాజ్ఞ నతిక్రమించువారును దనభక్తులకు ద్రోహులు నగు దురాత్ముల యందు అప్రసన్నుఁ డగుటవలన. అందువలననే శ్రుతి—"ఏష ఉ హ్యేవ సాధు కర్మ కారయతి తం య మున్నినీషతే। ఏష ఉ ఏవా ఽసాధు కర్మ కారయతి తం య మధో నినీషతే" *. అని ఎవ్వరియం దాజ్ఞాపాలనాదిక మగు ప్రసాదకారణము కలదో వారియందుఁ బ్రసన్నుఁ డగును. ఎవరియందు మఱి తద్వైపరీత్యము కలదో వారి యందుఁ బ్రసన్నుఁడు కాఁడు. కారణ మున్నయెడఁ గార్యము గలుగును. కారణము లేనియెడఁ గార్యము కలుగదు. ఇందు వైషమ్య మేమి కలదు? "పరా త్తు తచ్ఛ్రుతేః" † అను న్యాయమువలనఁగూడ. అధికముగాఁ బెనఁగులాడి యించుక వైషమ్యము మోపినను మహామాయుం డగుటవలన నది దోషము కాదు.

శ్రీ. వారి కెప్పుడును ఆసురస్వభావనివృత్తి కలుగ దని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—తాన్; అహమ్; ద్విషతః = నన్ను ద్వేషించువారలను; క్రూరాన్; సంసారేషు = జన్మమృత్యుమార్గములయందు; అందును, ఆసురీష్వేవ యోనిషు = అతిక్రూరము లైన వ్యాఘ్రాదియోనులందు; అజస్రమ్ = ఎల్లప్పుడును; క్షిపామి. ఆ పాపకర్ముల కట్టి ఫలము నిచ్చుచున్నా నని యర్థము.

ప. ‡

రా. ఎవరు న న్నిట్లు ద్వేషించుచున్నారో, తాన్ క్రూరాన్ నరాధమాన్ అశుభాన్; అహమ్; అజస్రమ్; సంసారేషు=జన్మజరామరణాదిరూపమునఁ బరివర్తమానము లగు పరంపరలయందు; అందును, ఆసురీష్వేవ యోనిషు; క్షిపామి — నాయం దానుకూల్యము నొందుటకు విరోధు లగు యోనులందే పడవేయుచున్నాను; వారికి ఆయాజన్మము నొందుట కనుగుణ మైన ప్రవృత్తికి హేతువు లయిన క్రూర బుద్ధులను నేనే కలిగించుచున్నా నని యర్థము.

* ఈ యీశ్వరుఁడే సాధుకర్మమును జేయించుచున్నాఁడు, తా నెవని ఊర్ధ్వగతి నొందింపఁ గోరుచున్నాడో వానిచేత; ఇతఁడే అసాధుకర్మమును జేయించుచున్నాఁడు, తా నెవని అధోగతి నొందింపఁగోరుచున్నాఁడో వానిచేత.

† బ్ర. సూ. పుణ్యపాపములఁ జేయుటయందు జీవునికి స్వాతంత్ర్యము పరునివలననే, అట్లు శ్రుతివలన.

‡ శ్రీధరీయముతో సమానము.

మూ. *

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని
మా మప్రాప్యైవ కౌన్తేయ తతో యా న్త్యధమాం గతిమ్. ౨౦

భా. ఆసురీమ్ = క్రూరకర్మప్రాయ మయిన; యోనిమ్=జన్మమును; ఆపన్నాః = పొందినవారై; జన్మనిజన్మని = ప్రతిజన్మమును; మూఢాః = అవివేకులై—ప్రతిజన్మమును తమోబహులములంబు లగు యోనులందుఁ బుట్టుచు అధోగతి నొందుచు మూఢులై; మామ్ = నన్ను ఈశ్వరుని; అప్రాప్యైవ = పొందకయే; కౌన్తేయ = ఓయర్జునా! తతః = దాని కన్నను; అధమామ్ = మిక్కిలి నికృష్టమైన; గతిమ్=గతిని; యాన్తి= పొందుచున్నారు. మా మప్రాప్యైవ — నన్నుఁ బొందుటకు వారికిఁ గొంచెమైనను ప్రసక్తియే లేదు కావున నాచే శాసింపఁబడిన సాధు మార్గమును బొందకయే యని యర్థము.

అర్జునా! అట్లు వారు ప్రతిజన్మమును ఆసురయోనియందే పుట్టుచు మూఢులై నన్నుఁ బొందుటకు సాధనమైన సాధుమార్గమునుగూడ నాచేతనే శాసింపఁబడినదానిఁ బొందనేరక యంతకన్నను నికృష్టమగు గతిని బొందుదు రని తాత్పర్యము.

ఆ. వారికిని క్రమంబున బహుజన్మములతుదను శ్రేయము కలుగవచ్చు ననఁగా కలుగనేర దని చెప్పుచున్నారు ఆసురీ మిత్యాదిగా. వారి కీశ్వరప్రాప్తి కలుగు నను శంకయే లేనపుడు తన్నిషేధ మేల యని యాశంకించి చెప్పుచున్నారు మా మప్రాప్యై వేత్యాదిగా. అసురసంపద యనర్థపరంపర కలిగించి సర్వపురుషార్థముల జెడఁగొట్టునది కావునఁ బురుషుఁడు తా నెంతవఱకు స్వతంత్రుఁడై యుండునో యెంత వఱకుఁ బారవశ్యము కలిగించునట్టి యోనిని జెందఁడో అంతలోపలనే యయ్యాసుర సంపదను బరిహరించుకొనవలయు నని ఘనుదాయార్థము.

హ. ఆపన్నాః = పొందినవారై. మామ్—నన్ను సర్వజ్ఞుఁ డగు నీశ్వరుని. అధమాం గతిమ్ = నికృష్ట మయినగతిని, నరకము నని యర్థము.

శం. ఓయీ! శునకాదియోనులందుఁ బుట్టింపఁబడినను వారికి బహు జన్మములకుఁ బిదప మోక్షము సిద్ధించు ననఁగా, సిద్ధింపదు. "ఇమాని క్షుద్రా

* ఇది మొదల అధ్యాయాంతముఖఱకు నీభాష్యము లేదు.

ణ్యాసకృదావర్తీని భూతాని భవన్తి, జాయస్వ మ్రియస్వ" * అను శ్రుతులవలన వేదవిరుద్ధాచారనిరతులు పాపిష్ఠు లగు నయ్యాసురులకు మాటిమాటికి జన్మమరణములే గాని యెప్పుడును మత్ప్రాప్తి కలుగ దని చెప్పుచున్నాఁడు.—అనేకచిత్తవిభ్రాంతులు కామభోగప్రసక్తులు అశుచివ్రతులు మూఢు లగు నాయాసురులు తా మొనరించిన దోషములయతిశయమువలననే, జన్మని జన్మని = ప్రతిజన్మమును; ఆసురీం యోనిమ్ ఆపన్నాః = ఆసురయోనినే పొందినవారలై; మామ్ = నన్ను ఈశ్వరుని; అప్రాప్యైవ = పొందకయే; ఇట మామ్ అనఁగా ఈశ్వరప్రాప్తిసాధనము లక్షిత మగుచున్నది, మత్ప్రాప్తికి సాధన మైన మానవదేహమును పొందకయే; తతః = ఆ యాసురయోనికన్నను; అధమామ్=నికృష్ట మయిన, వృక్ష.పాషాణాదిరూప మైన, లేక, పిశాచరూప మయిన; గతిమ్=గమ్యతే—పొందఁబడుచున్నది కావున గతి యనఁగా దేహము, దానిని; యాన్తి = పొందుచున్నారు. ఆ శునకాది యోనులనే వెండియు నొందుదు రను నియమముగూడ లే దని యర్థము. "ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః" అని యారంభించి "తతో యా న్త్యధమాం గతిమ్" అనునదివఱకుఁ గల గ్రంథముచేత, "రజస్తమోదోషదూషితాంతరంగు లగు నాసురులసంపద యేది గలదో దానిఫలము మఱి మఱి యధఃపతనమే యగుం గాని యెప్పుడును అది గలవారికి శ్రేయఃప్రాప్తి యెందువలన కలుగదో అందువలన బుద్ధిమంతుఁడును సదసద్వివేకియు నగు పురుషుఁడు పురుషత్వసిద్ధి సఫలం బగుకొఱకు వివేకభ్రంశహేతు వగు దుర్యోనిప్రాప్తికి మున్నే యాసురసంపదకు లోనుగాక సదా సదసద్వివేకవైరాగ్యములతోఁ బరమపురుషార్థముకొఱకు యత్నింపవలయు" నని సూచిత మగుచున్నది. అందుచే ఆసురసంపద బంధముకొఱకే గాని యెప్పుడును మోక్షముకొఱకుఁ గా దని సిద్ధము.

మ. ఓయీ! వారికిని బహుజన్మములయంతమున శ్రేయఃప్రాప్తి కావచ్చు ననఁగా కా దని చెప్పుచున్నాఁడు.—ఎవ రొకానొకప్పుడు, ఆసురీం యోనిమాపన్నాః = ఆసురయోనిఁ బొందినారో వారు; జన్మని జన్మని = ప్రతిజన్మమును; మూఢాః = తమోబహులు లగుటచే నవివేకులై; తతః = దానికన్నను; అధమాం గతిమ్ = నికృష్టతమ మయినగతిని; యాన్తి = పొందుచున్నారు. మా మప్రాప్య—వారికి మత్ప్రాప్తి కలుగునా యను నాశంకగూడ లేదు, కావున నాచే నుపదిష్టమయిన వేదమార్గము నొందక యని యర్థము. ఏవకారము తిర్యక్స్థావరాదుల

* ఈ క్షుద్రము లగు భూతములు మాటిమాటికి ఆవృత్తినొందునవే యగును, పుట్టుము గిట్టుము.

యందు వేదమార్గప్రాప్తికి స్వరూపముచే నయోగ్యతను దెలుపుచున్నది. అందుచే నత్యంతతమోబహులులై వేదమార్గప్రాప్తికి స్వరూపముచే యోగ్యత లేనివార లగుచుఁ బూర్వపూర్వనికృష్టయోనికంటె నుత్తరోత్తరము అధమము నికృష్టతమ మగు యోనిని జెందుచున్నారని యర్థము. కౌన్తేయ యని తనతో సంబంధముఁ జెప్పుటచే నీవు దీని దాఁటినవాఁడ వని సూచించుచున్నాఁడు. ఈ శ్లోకద్వయ మాసుర యోనిం జెందినవారికి నుత్తరోత్తరము నికృష్టతరనికృష్టతమయోనిప్రాప్తియే కాని దానికిఁ బ్రతీకారము చేయు సామర్థ్యముగూడఁ గలుగదు, మిక్కిలి తమోబహులు లగుటవలన. అందువలన మనుష్యదేహలాభ మున్నపుడే పరమకష్టతమం బగు నాసురసంపదను బరిహరించుకొనుటకుఁ ద్వరపడి యథాశక్తి దైవసంపద ననుష్ఠింప వలయు శ్రేయోర్థులు. అట్లు చేయనియెడఁ దిర్యగాదిదేహములు కలిగిన పిదప సాధనానుష్ఠానమునం దయోగ్యులై యెప్పటికిని నిస్తారము నొందఁజాలరు. కావున మహాసంకటము సంభవించు నని సముదాయార్థము. అది చెప్పఁబడినది. "ఇహైవ నరకవ్యాధే శ్చికిత్సాం న కరోతి యః । గత్వా నిరౌషధం స్థానం స రుజః కిం కరిష్యతి" * అని.

శ్రీ. వారు మఱి.—మామప్రాప్యైవ — ఏవకారముచే, మత్ప్రాప్తి శంక వారి కెక్కడిది? మత్ప్రాప్త్యుపాయ మగు సన్మార్గమును గూడఁ బొందక యని యర్థము. దానికన్నను, అధమాం గతిమ్ = క్రిమికీటాదియోనిని గూడ; యాన్తి. శేషము స్పష్టము.

ప. ఇఁక నాసురయోనిసంస్కారవశమువలన వారు నీచనీచతర యోనులం దుత్పన్నులగుదు రని చెప్పుచున్నాఁడు —ఆసురీం యోనిమ్; ఆపన్నాః= పొందినవారు; జన్మనిజన్మని; మూఢాః=జ్ఞానలేశము గూడ లేనివా రగుదురు. తతో మామప్రాప్యైవ అధమాం గతిం యాన్తి. శ్రుతియును ఈశావాస్యోపనిషత్తుల యందు "అసుర్యా నామ తే లోకా అన్ధేన తమసా వృతాః । తాం స్తే ప్రేత్యాఽభిగచ్ఛన్తి యే కే చాఽఽత్మహనో జనాః" అని. భాష్యము.—ఏలోకములు, అసుర్యానామ—అసురులయంశభూతములో; తే—అవి, అన్ధేన తమసా—మిక్కిలి దట్టమయిన యజ్ఞానముచే; వృతాః=కప్పఁబడినవి. యే—ఎవరు; ఆత్మహనః—ఆత్మఘాతు

* ఎవ్వఁ డీలోకమునందే నరకవ్యాధికిఁ జికిత్సఁ జేసికొనఁడో అతఁ డౌషధము లేని స్థానముఁ జేరి రోగమున కేమి చేయఁగలఁడు?

కులోఁ పశ్వాదిహింసారతులో; తే=వారు; ప్రేత్య=దేహమును విడిచి; తాః—ఆ లోక ములను; అభిగచ్ఛన్తి=పొందుచున్నారు. అందుండి యిఁక నిస్తారము లేదని యర్థము.

**రా.** నాయం దానుకూల్యమునకు విరోధి యగు జన్మము నొందినవారై వెండియును జన్మము జన్మమునందును మూఢులై — మద్విపరీతజ్ఞానులై, మామప్రాప్యైవ — భగవంతుఁడు సర్వేశ్వరుఁడు వాసుదేవుఁడున్నాఁడనుజ్ఞానము నొందక; తతః=ఆ జన్మముకంటె; అధమమే యగు గతిని బొందుచున్నారు.

త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్. ౨౧

**భా.** సమస్త మయిన యాసురసంపదకును సంక్షేపం బిది చెప్పఁబడుచున్నది. త్రివిధమైన దేనియందు దనంత మగు నాసురసంపద్భేద మంతయు నంతర్భవించుచున్నదో, దేనిఁ బరిహరించుటచేతఁ బరిహృతంబు నగుచున్నదో, ఏది సమస్త మయిన యనర్థమునకును మూలమో అట్టిది చెప్పఁబడుచున్నది.—త్రివిధమ్ = మూఁడువిధములు గలది; నరకస్య= నరకముయొక్క; ప్రాప్తియందు, ఇదమ్ = ఇది; ద్వారమ్ = ద్వారము; ఆత్మనః = ఆత్మయొక్క; నాశనమ్ = నశింపఁజేయునది, ఏద్వారమును ప్రవేశించుచునే యాత్మ నశించునో ఒకానొకపురుషార్థమునకును యోగ్యుఁడు కాఁడో అట్టిది, కావునఁ జెప్పఁబడుచున్నది ద్వారము నాశనము ఆత్మ౦ అని. ఏది యది? కామః = కామము; క్రోధః = క్రోధము; తథా=అట్లు; లోభః=లోభము. తస్మాత్=అందువలన; ఏతత్= దీని; త్రయమ్ = మూఁటిని; త్యజేత్ = విడువవలయును. ఎందువలన నిది ద్వారమును ఆత్మనాశనమును అగుచున్నదో అందువలన నీకామాది త్రయమును విడువవలయును. త్యాగస్తుతి యిది.

మూఁడువిధములు గలది నరకమునకు ద్వారమును ఆత్మను నశింపఁ జేయునదియు, ఈ ద్వారముఁ జొచ్చినంతనె పురుషుఁడే పురుషార్థమునకును యోగ్యుఁడు గాక చెడిపోవును. అవి యేవి యనఁగా కామక్రోధలోభములు. అందు వలన నీ మూఁటిని విడువవలయు నని తాత్పర్యము.

**ఆ.** అనంతభేదములు గల యాసురసంపద పురుషాయుషముచే నేనియుఁ బరిహరింప శక్యము కాదని యాశంకించి చెప్పుచున్నారు సమస్తము ఇత్యాదిగా.

సంక్షేపవచనమునకు ఫలముఁ జెప్పుచున్నారు త్రివిధము ఇత్యాదిగా. కామాది త్రయమునందు సమస్తమైన యాసురసంపద్భేద మంతర్భవించినను అది యెట్లు పరిహరింప నగు ననఁగాఁ జెప్పుచున్నారు దేని నిత్యాదిగా. కామాదిపరిహారముచే నాసురసంపద్భేదము పరిహృతం బైనను సర్వానర్థపరిహార మెట్లగు నని యాశంకించి చెప్పుచున్నారు ఏది ఇత్యాదిగా. నిత్యుఁ డయిన యాత్మకు నాశ మెట్లనఁగాఁ జెప్పుచున్నారు ఒకానొక ఇత్యాదిగా. త్రివిధంబును సామాన్యమునఁ బ్రదర్శిత మైన దాని నాకాంక్షాద్వారమున విశేషించి ప్రదర్శించుచున్నారు ఏది యది యని. తస్మాత్ అనుదాని వివరించుచున్నారు ఎందువలన నిత్యాదిగా. కామాదుల విడుచుటచే అనర్థవారణంబును శ్రేయఃప్రతిబంధనివృత్తియు నగు నని భావము.

హ. త్రివిధమ్=మూఁడువిధములు గలది. ద్వారమ్=మార్గము. ఆత్మనః; నాశనమ్ = నాశకారణము. ఏత త్త్రియమ్; త్యజేత్ =విడువవలయును.

శం. ఈ ప్రతిపాదించిన యాసురసంపద సర్వంబును ఈ మూఁటియందే పర్యవసానము నొందుచున్నది. ఈ మూఁటిని విడిచినయెడఁ బ్రధానమల్లనిబర్హణ న్యాయంబున * నాసురసంపద సర్వంబును బరిత్యక్త మగును. అందువలన ముముక్షు వవశ్యం బీమూఁటిని ద్యజింపవలయును. వీని విడిచి స్వధర్మంబున శ్రేయస్సాధనము ననుష్ఠించుచుండు పురుషునకుఁ బురుషార్థము సిద్ధించు నని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—నరత్వంబున నుత్కృష్టజన్మము గల నరులకు నిరతిశయ మైన అకము — దుఃఖము దేనియందుఁ గలదో అది నరకము, శకంధ్వాది యగుటచే నరక మని రూపము, శునక సూకరాది నీచయోని నరకశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది. అట్టి నరకమునకు, శునకాదినికృష్టయోనియొక్క ప్రాప్తికి; కామః; క్రోధః; లోభః; అని, త్రివిధమ్ = మూఁడేవిధములు గలది; ద్వారమ్ = ప్రవేశమార్గము, ఇట్టి ద్వారము మఱియొకటి లే దని యర్థము. కామాదులు నీచయోనిప్రాప్తికి ద్వార మగుఁ గాక, అందువలన మా కేమి హాని? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఆత్మనః నాశనమ్ = అనేకజన్మాంతరకృతసుకృతాతిశయమువలన మనుష్యత్వము పురుషత్వము బ్రాహ్మణత్వము వేదాద్యధ్యయనవత్త్వము అను మోక్షసాధాంతము నెక్కిన యాత్మకు — అధికారికి, ముముక్షు వైన తనకు, ఈ కామాది త్రయము పురుషార్థనాశక మగుచున్నది, ధర్మాధర్మములు కర్తవ్యాకర్తవ్యములు అనర్థానర్థములు బంధమోక్షములు — వీనియందలి వివేకవిజ్ఞానమును నశింపఁజేయు

* ప్రధానుఁడైన జెట్టి — పీరుడు జంపఁబడినయెడఁ దక్కినవా రందఱును హతు లెనట్లే.

చున్నవి యని యర్థము. కామాకులునకుఁ గాని క్రోధావిష్టునకుఁ గాని లోభగ్రహ గ్రస్తునకుఁ గాని ధర్మాధర్మాదివివేకవిజ్ఞానము కలుగదు గదా! అది లేనప్పుడు పురుషుఁడు నశింపనే నశించును. మనుష్యత్వము మున్నగు నుత్కృష్టమోక్షసాధనముల సంపత్తిచే మోక్షసౌధాంతము నెక్కినవాఁడయ్యును బ్రమాదముచేఁ దాటిచెట్టెక్కినవానివలెఁ గామాదులచేఁ గ్రిందికిఁ ద్రోయఁబడినవాఁడై నిశ్శేషముగా నశించును. ఉన్నతస్థానమునుండి పడినవానికి స్వరూపనాశమే కాని యించుకేనియు శేషము నిలువదు గదా! అందువలననే చెప్పఁబడుచున్నది నాశన మాత్మనః అని. ఎందువలనఁ గామాదులప్రభావ మిట్టిదో, తస్మాత్ = అందువలన; వివేకసంపన్నుఁడగు ముముక్షువు వానిస్వభావము నెఱింగి తాను నశింప కుండుటకై చండాలునిఁ బోలెఁ గామమును కృష్ణసర్పమునుబోలెఁ గ్రోధమును మలమునుంబోలె లోభమును, ఏతత్త్రయమ్=ఈ మూఁటిని; దూరమున, త్యజేత్=విడువవలయును, వానికి లోనుగాక యుండవలయు నని యర్థము.

**మ.** ఓయీ! ఆసురసంపద యనంతభేదములు గలది, పురుషాయుషము చేతఁ గూడ నది పరిహరింప శక్యము కాదు. అని యాశంకించి దాని సంక్షేపించి చెప్పుచున్నాఁడు.—ఇదమ్=ఇది; త్రివిధమ్ = మూఁడువిధములు గలది; నరకస్య= నరకముయొక్క; ప్రాప్తియందు, ద్వారమ్ = సాధనము, సమస్తమైన యాసుర సంపదకును మూలభూతము; ఆత్మనః నాశనమ్=సర్వపురుషార్థములకును అనర్హునిఁ జేసి మిక్కిలి యధమమైన యోనిని బొందించునది. ఏది యది? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—కామః క్రోధః తథా లోభః — మున్ను వ్యాఖ్యాతము. ఎందువలన నీమూఁడే సర్వానర్థములకును మూలమో, తస్మాత్=అందువలన; ఏతత్త్రయం త్యజేత్. ఏతత్త్రయమును విడుచుటచేతనే ఆసురసంపద సర్వంబును విడువఁబడిన దగుచున్నది. వీని విడుచుట యనఁగా నివి పుట్టినపుడు వివేకముచేఁ దత్కార్యమును బ్రతిబంధించుట. అంతఁ గ్రమంబున నవి పుట్టకయే పోవు నని యెఱుంగునది.

**శ్రీ.** చెప్పిన యాసురదోషములలో సకలదోషమూలభూతమును దోషత్రయమును సర్వప్రయత్నంబున వర్జింపనలయు నని చెప్పుచున్నాఁడు.—కామః క్రోధః లోభః; ఇదమ్, త్రివిధం నరకస్య ద్వారమ్. కావుననే, ఆత్మనః; నాశనమ్—నీచయోనిని బొందించునది. తస్మాత్; ఏతత్త్రయమ్; సర్వప్రయత్నమున, త్యజేత్.

**ప.** ఇక నీ చెప్పిన యాసురదోషములయందు సకలదోషమూలభూతములగు మూఁడుదోషములను సర్వవిధంబులఁ బరిహరింపవలయు నని చెప్పు

చున్నాఁడు.—ఇదమ్ = ఈ చెప్పఁబోవునది; నరకస్య = నిరయప్రాప్తికి; ద్వారమ్; త్రివిధమ్. అది యేది? కామః క్రోధ స్తథా లోభః—అందు కామనచే విషయీకరింపఁబడుచున్నది కావున కామ మనఁగా అభిలాష, అది ప్రయత్నించినను బ్రాప్తింపనిచో క్రోధము, ప్రాప్తించిన దానిఁ బ్రాణముకన్నను అధికప్రయత్నముచే రక్షించుట లోభము. ఏతత్త్రియ మెట్టిది? ఆత్మనః నాశనమ్ — అధమగతిని పొందించునది. తస్మాత్; సర్వప్రయత్నమున, ఏతత్త్రియం త్యజేత్.

రా. ఈ యాసురస్వభావమున కాత్మనాశమునకు మూలహేతువుఁ జెప్పుచున్నాఁడు.—ఈ యాసురస్వభావరూప మగు నరకమునకు, ఏతత్ * త్రివిధం ద్వారమ్. అది, ఆత్మనః నాశనమ్. కామః క్రోధః లోభః. ఈ మూఁటిస్వరూపము పూర్వమే వ్యాఖ్యాతము. ద్వార మనఁగా మార్గము హేతు వని యర్థము. తస్మాదేతత్త్రియం త్యజేత్. తస్మాత్ — కామక్రోధలోభములు అతిఘోర మగు నరకమునకు హేతువు లగుటవలన ఈమూఁటిని దూరమునఁ బరిత్యజింపవలయును.

ఏతై ర్విముక్తః కౌన్తేయ తమోద్వారై స్త్రిభి ర్నరః
ఆచర త్యాత్మన శ్శ్రేయ స్తతో యాన్తి పరాం గతిమ్. ౨౨

భా. కౌన్తేయ = అర్జునా! ఏతైః = ఈ; తమోద్వారైః = తమస్సునకు నరకమునకు దుఃఖమోహాత్మక మైనదానికి ద్వారము లగు; త్రిభిః= కామాదులు మూఁటిచేత; విముక్తః = విడువఁబడిన; నరః = మనుష్యుఁడు; ఆచరతి = చేయుచున్నాఁడు. దేనిని? ఆత్మనః = తనకు; శ్రేయః = శ్రేయస్సును, వేనిచేఁ బ్రతిబద్ధుఁడై పూర్వము శ్రేయస్సును చేయ కుండెనో ఆకామాదులు తొలఁగుటవలనఁ జేయుచున్నాఁడు. తతః = ఆశ్రేయస్సు చేయుటవలన; పరాంగతిమ్=మోక్షమును గూడ; యాతి = పొందుచున్నాఁడు.

అర్జునా! దుఃఖమోహాత్మక మైన నరకమునకు ద్వారము లగు నీకామాదుల మూఁటిని విడిచినట్టి మనుష్యుఁడు తన కేది శ్రేయస్సో దాని నాచరించుచున్నాఁడు. అందువలన మోక్షమునుగూడ పొందుచున్నాఁ డని తాత్పర్యము.

---

* పిరిపుతమున "ఏతత్త్రివిధమ్" అని పాఠము.

ఆ. మోక్షమును గూడ – ఆసురసంపదను వర్జించి శ్రేయము నాచరించుచు మోక్షమును సమ్యగ్దర్శనద్వారమునఁ బొందుచున్నాఁ డనుట మాత్రమే కాదు, లౌకిక మగు సుఖమును గూడ పొందుచున్నాఁ డని యర్థము.

హ. ఏతైః; తమోద్వారైః = నరకద్వారములచేత; విముక్తః; ఆచరతి = అనుష్ఠించుచున్నాఁడు, అనువర్తించుచున్నాఁడు.

శం. ఇట్లు కామాదు లధర్మప్రవృత్తికి హేతువు లగుటచే నరకద్వారము లనియు ముముక్షువు వాని విడువవలయు ననియుఁ బ్రతిపాదించి వాని విడిచినవాఁడు శ్రేయస్సాధననిష్ఠుఁడై శ్రేయస్సుఁ బ్రాపించు నని చెప్పుచున్నాఁడు —నరః = ముముక్షు వగు నధికారి, విద్వాంసుఁ డగు బ్రాహ్మణుఁడు మొదలగువాఁడు; తమోద్వారైః = నరకమునకు ద్వారభూతము లగు; ఏతైః త్రిభిః = ఈ కామక్రోధలోభములు మూఁటిచేత; విముక్తః=విశేషించి విడువఁబడినవాఁడై; ఆత్మనః=తనయొక్క; శ్రేయః=శ్రేయస్సాధనమును, తన యధికారమునకును దనయాశ్రమమునకును అనురూప మయినదాని, వైదిక మగు ధర్మమును గాని శ్రవణాదికమును గాని; ఆచరతి= ఎప్పుడు చక్కఁగా ననుష్ఠించుచున్నాఁడో; తతః=అప్పు డాయనుష్ఠానముచేత; చిత్తశుద్ధిద్వారమునఁ బుట్టిన యాత్మజ్ఞానముచే, పరాంగతిమ్=విదేహముక్తిని; యాతి – పొందుచున్నాఁ డని యర్థము.

మ. ఈ మూఁటిని విడుచువాని కేమి గలుగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.— ఏతైః = ఈ కామక్రోధలోభములచేత; త్రిభిః=మూఁటిచేత; తమోద్వారైః = నరకసాధనములచేత; విముక్తః = విడువఁబడినవాఁ డగు పురుషుఁడు; ఆత్మనః = తనకు; శ్రేయః = వేదబోధిత మైన హిత మేది గలదో దాని; ఆచరతి = చేయుచున్నాఁడు. పూర్వము కామాదిప్రతిబద్ధుఁడై గదా తనకు దేనిచేఁ బురుషార్థము సిద్ధించునో అట్టి శ్రేయము నాచరింపకుండెను, దేనిచే నరకపాతము గలుగునో అట్టి యశ్రేయము నాచరించెను, ఇప్పుడో తత్ప్రతిబంధరహితుఁడై యశ్రేయము నాచరింపఁడు, శ్రేయమునే యాచరించును. తతః = అందువలన; ఐహిక మగు సుఖము ననుభవించి సమ్యగ్దర్శనద్వారమున, పరాంగతిమ్=మోక్షమును; యాతి.

శ్రీ. తత్త్యాగమునం దధికఫలముఁ జెప్పుచున్నాఁడు.—తమోద్వారైః = తమస్సునకు – నరకమునకు ద్వారభూతము లగు; ఏతైః త్రిభిః = ఈ కామాదులు

మూఁటిచేత; విముక్తః నరః; ఆత్మనః; శ్రేయః = శ్రేయస్సాధన మగు తపోయోగ కర్మాదికమును; ఆచరతి. అందువలన మోక్షమును బొందుచున్నాఁడు.

ప. *

రా. ఏతైః=ఈ కామక్రోధలోభములచేత; తమోద్వారైః = మద్విషయక జ్ఞానహేతువు లయిన వానిచేత; విముక్తః నరః; ఆత్మనః శ్రేయః ఆచరతి — మద్విషయజ్ఞానము నొంది మదానుకూల్యమునందుఁ బ్రవర్తించుచున్నాఁడు. అందువలన నన్నే పరమగతిని బొందుచున్నాఁడు.

యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. ౨౩

భా. ఆసురసంపదను వర్జించుటకును శ్రేయస్సు నాచరించుటకును ఈసమస్తమునకును శాస్త్రము కారణము. శాస్త్రప్రమాణమువలన రెంటను జేయ శక్య మగును. వేఱువిధమునఁ గాదు. అందువలన.— యః = ఎవ్వఁడు; శాస్త్రవిధిమ్ = శాస్త్రముయొక్క విధానమును; ఇది కర్తవ్యము, ఇది కాదు, అను జ్ఞానమునకుఁ గారణమును విధినిషేధాఖ్యమును; ఉత్సృజ్య = విడిచి; కామకారతః = కామము చేయుటవలన, కామప్రయుక్తుఁడై; వర్తతే=వర్తించుచున్నాఁడో; సః=అతఁడు; సిద్ధిమ్= పురుషార్థయోగ్యతను; న అవాప్నోతి = పొందఁడు. సుఖమ్ = ఈ లోకమునందు సుఖమును గూడ; న = పొందఁడు. పరామ్ = ఉత్తమ మయిన; గతిమ్ = స్వర్గమును మోక్షమును గాని; న = పొందఁడు.

ఎవ్వఁడు ధర్మాధర్మములను బోధించునట్టి విధినిషేధరూప మయిన శాస్త్రము నుల్లంఘించి కామప్రయుక్తుఁడై వర్తించుచున్నాఁడో అతఁడు పురుషార్థమును బొందఁజాలఁడు. ఈ లోకమునందును సుఖము నొందనేరఁడు. ఇఁక నతనికి స్వర్గము గాని మోక్షము గాని కలుగనేర దని చెప్పెడి దేమి? అని తాత్పర్యము.

శ్రీ. ఆసురసంపద వర్జించుటకును శ్రేయస్సును జేయుటకును ఏమి సాధన మనఁగా దానిఁ జెప్పుచున్నారు ఆస ఇత్యాదిగా. అది సాధన మనుటను సాధించుచున్నారు శా స్త్రేత్యాదిగా. చెప్పిన యర్థము నవలంబించి మీఁది శ్లోకము నెత్తు

* శిఖరీయముతో సమానము.

చున్నారు అందువలన నని. శాసింపఁబడుచున్నది—బోధింపఁబడుచున్నది దీనిచే నపూర్వ మగు నర్థము కావున శాస్త్ర మనఁబడియె. అది విధినిషేధాత్మక మను నభిప్రాయమున వ్యాఖ్యానముఁ జేయుచున్నారు ఇది ఇత్యాదిగా. కామకార మనఁగా కామకరణము, ఆకారణమువలన నను నభిప్రాయముచే శాస్త్రవిముఖుని ప్రవృత్తి కామాధీన మని చెప్పుచున్నారు కామప్రయుక్తుఁడై అని. కామాధీన మగు ప్రవృత్తి గలవాఁడై సదా పురుషార్థమున కయోగ్యుఁడైనవానికి సర్వపురు షార్థములును సిద్ధింప వని చెప్పుచున్నారు సుఖ మిత్యాదిగా.

హ. సిద్ధిమ్=పురుషార్థప్రాప్తియోగ్యతను. సుఖమ్ = స్వర్గమును. పరాం గతిమ్ = మోక్షమును.

శ ౦. ఇట్లు దంభదర్పాతిమానాద్యాసురసంపద గలవారై వేదశాస్త్రవిధి నుల్లంఘించి తదుక్తధర్మాధర్మముల సరకుసేయక తత్ఫలప్రదాత యగు నీశ్వరు నాద రింపక యథేష్టముగాఁ గామోపభోగములందును బరస్వాహరణాదులందును బ్రవృత్తు లగు పాపిష్ఠులకుఁ బునరారోహవర్జిత మగు నధఃపతనముఁ బ్రతిపాదించి తనయాజ్ఞ నుల్లంఘింపకుండుటకై వెండియును, ఎవ్వఁ డివ్విధముననే ప్రవర్తించునో ఆతండును అధోలోకమునే పొందును స్వప్నమునందేని ముక్తివార్త పొందనేరఁ డని, చెప్పిన యర్థమునే దృఢీకరించుచున్నాఁడు.—యః = ఎవ్వఁడు, శ్రుతాధ్యయనసంపన్నుఁ డగు నధికారి బ్రాహ్మణుఁడు మొదలగువాఁడు; విధియతే — దీనిచే నపూర్వార్థము బోధింపఁబడుచున్నది కావున విధి యనఁగా ఆజ్ఞ, "అగ్నీషోమీయం పశు మాలభేత, న కలఞ్జం భక్షయేత్" అని కర్తవ్యాకర్తవ్యార్థముల బోధించునట్టి శాస్త్రవిధిని, చోదనారూపమును నిషేధరూపమును; ఉత్సృజ్య = విచారింపక, శాస్త్రవిధి నుపేక్షించి యని యర్థము; కామకారతః=కామనచేత, యథేచ్ఛముగా; వర్తతే — శాస్త్రనియమము నుల్లంఘించి తన యిచ్చకు వచ్చినట్లు శ్రద్ధావిరహిత మయిన ధర్మానుష్ఠానము నెవఁడు చేయుచున్నాఁడో అని యర్థము. సః = కామా ధీన మయిన ప్రవృత్తి గల యాపురుషుఁడు; సిద్ధిమ్=విధిని విడిచి చేయఁబడిన దగుట వలన ఆకర్మములచేఁ జిత్తశుద్ధిని; నావాప్నోతి=పొందఁడు, విధ్యుక్త మయిన కర్మ మునకే ఫలం బవశ్యము కలుగు నను నియమమువలన. అందువలననే, సుఖమ్ = స్వర్గసుఖమును; న—పొందఁడు, కర్మములు ముక్తిసాధనములు కామివలన. పరాం గతిమ్=మోక్షమును గూడ; న—పొందఁడు. యథేచ్ఛముగా విధిని విడిచి కర్మము చేయువాఁడు సంసారాపవర్గముల రెంటను భ్రష్టుఁడగు నని యర్థము.

మ. అశ్రేయము నాచరింపకుండుటకును శ్రేయము నాచరించుటకును శాస్త్రమే నిమిత్తము, అవి రెండును శాస్త్రముచేతనే తెలియఁదగినవి యగుటవలన. అందువలన.—శిష్యతే—అపూర్వ మయినయర్థము బోధింపఁబడుచున్నది దీనిచేతఁ గావున శాస్త్ర మనఁగా వేదము తదుపజీవిస్మృతిపురాణాదులును, తత్సంబంధి యగువిధి—లిఙాదిశబ్దము, చేయవలయును జేయఁగూడదు అని ప్రవర్తనానివర్తనాత్మకము, కర్తవ్యాకర్తవ్యముల జ్ఞానమునకు హేతువు, విధి నిషేధాఖ్యము, అట్టి శాస్త్రవిధిని; విధినిషేధాతిరిక్తముగూడ బ్రహ్మప్రతిపాదక మగు శాస్త్రము కల దని సూచించుటకై విధిశబ్దము; ఉత్సృజ్య = అశ్రద్ధచేఁ బరిత్యజించి; కామకారతః = స్వేచ్ఛామాత్రమున; వర్తతే—విహితమును గూడ ఆచరింపఁడో నిషిద్ధమునుగూడ ఆచరించునో; సః=అతఁడు; సిద్ధిమ్=పురుషార్థప్రాప్తియోగ్యతను, అంతఃకరణశుద్ధిని; కర్మములఁ జేయుచున్నను, న అవాప్నోతి=పొందఁడు. న సుఖమ్=ఐహికసుఖమును గూడ పొందఁడు. న పరాంగతిమ్=ప్రకృష్ట మయినగతిని—స్వర్గమును గాని మోక్షమునుగాని పొందఁడు.

శ్రీ. కామాదిత్యాగమో స్వధర్మాచరణముచేతనే గాని సాధ్యము గా దని చెప్పుచున్నాఁడు.—శాస్త్రవిధిమ్=వేదవిహిత మగు ధర్మమును; ఉత్సృజ్య; యః; కామకారతః = యథేచ్ఛముగా; వర్తతే; సః; సిద్ధిమ్ = తత్త్వజ్ఞానమును; న అవాప్నోతి = పొందఁడు. న సుఖమ్=ఉపశమమును గాని పొందఁడు. న పరాంగతిమ్—ముక్తిని పొందఁడు.

ప. న సుఖమ్ = తత్త్వజ్ఞానముయొక్క—ఫల మైన యాత్మసుఖమును పొందఁడు. తత్ఫల మైన, పరాంగతిం న = మోక్షమును పొందఁడు. *

రా. శాస్త్రమునం దనాదర మీనరకమునకుఁ బ్రధానహేతు వని చెప్పుచున్నాఁడు.—శాస్త్ర మనఁగా వేదములు, విధి యనఁగా అనుశాసనము. వేదాఖ్య మగు నాయనుశాసనమును విడిచి; యః కామకారతః వర్తతే=ఎవ్వఁడు తనయిచ్ఛకు అనుగుణ మగు మార్గమున వర్తించునో. న స సిద్ధి మవాప్నోతి=అతఁ డాముష్మిక మయిన సిద్ధిని దేనినిగూడ పొందఁడు. న సుఖమ్ = కొంచెమేని సుఖమును పొందఁడు. న పరాంగతిమ్—ఇఁక పరమగతి నెట్లు పొందు నని యర్థము.

---

* తక్కినది శ్రీధరీయముతో సమానము.

తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాఽకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహా ఽర్హసి. ౨౪

భా. తస్మాత్=అందువలన; తే = నీకు; కార్యాఽకార్యవ్యవస్థితౌ = కర్తవ్యాఽకర్తవ్యముల నిశ్చయమునందు; శాస్త్రమ్ = శాస్త్రము; ప్రమాణమ్=జ్ఞానసాధనము. ఇందువలన; శాస్త్రవిధానఉక్తమ్=విధాన మనఁగా విధి, శాస్త్రముచేఁ జేయఁబడినవిధి శాస్త్రవిధానము, "చేయవలయును చేయఁగూడదు" అను లక్షణము గలది, దానిచేఁ జెప్పఁబడినదానిని; జ్ఞాత్వా = ఎఱింగి; కర్మ = స్వకర్మ మేదో దాని; ఇహ= ఇక్కడ; కర్తుమ్ = చేయుటకు; అర్హసి=తగుదువు. ఇహ—ఇక్కడ అని కర్మభూమి ప్రదర్శింపఁబడినది.

అందువలన ధర్మమును అధర్మమును నిశ్చయమున నెఱుఁగుటకు నీకు శాస్త్రమే ప్రమాణము. శాస్త్రమునందు నీకు ధర్మముగా నేది విధింపఁబడినదో యెఱింగి నీవు దాని నీలోకమున ననుష్ఠింపు మని తాత్పర్యము.

ఆ. శాస్త్రప్రమాణము విడిచి చేయుకర్మము నిష్ఫల మని యేర్పడి నపుడు ఫలితముఁ జెప్పుచున్నారు తస్మాత్ ఇత్యాదిగా. కర్తవ్యాఽకర్తవ్యములు — ధర్మాఽధర్మములు. అందు శాస్త్రము ప్రమాణ మైనను నేను జేయవలసిన దేమి? అని యాశంకించి చెప్పుచున్నారు ఇందువలన నిత్యాదిగా. ఇట్లీయధ్యాయముచేఁ బూర్వజన్మకృతకర్మవాసనానుసారంబున నభివ్యజ్యమాన మగు సాత్త్వికాదిప్రకృతి త్రయమును విభజించి దైవి యాసురి యను రెండుసంపదలను సంపాదించుటకొఱకును పరిహరించుటకొఱకును ఉపదేశించి పురుషార్థముఁ గోరుపురుషుఁడు కామ క్రోధలోభంబులఁ బరిత్యజించి శాస్త్రాధీనుండై తదుక్తకర్మము ననుష్ఠించుచుండ వలయు నని నిర్ధారితము.

హ. తస్మాత్ = అందువలన; తే = నీకు; శాస్త్రం ప్రమాణమ్; కార్యాఽకార్యవ్యవస్థితౌ=ఇది కార్యము ఇది యకార్యము అను వ్యవస్థయందు. శాస్త్రవిధానోక్తమ్ = విధాన మనఁగా విధి, శాస్త్రమే విధి, దానిచేఁ జెప్పఁబడినదాని; కర్మ = కార్యమును. ఇహ = ఈ సంసారమునందు; అర్హసి = తగుదువు.

శం. శాస్త్రవిధిచొప్పుననే కర్మములు కర్తవ్యము లని నిర్ధారించుచున ధ్యాయము నుపసంహరించుచున్నాఁడు.—ఎల్లప్పుడు అశాస్త్రీయములు కామైక

మూలము లగు కర్మములకు ఫలము లేదని నిశ్చిత మయ్యెనో, తస్మాత్=అందువలన; తే=ముముక్షు వగు నీకు; కార్యాఽకార్యవ్యవస్థితౌ = కర్తవ్యాకర్తవ్యముల వ్యవస్థయందు, దీని నిట్లితఁడు చేయవలయును దీనిఁ జేయఁగూడదు అని యనుష్ఠేయముయొక్కయు అననుష్ఠేయముయొక్కయు నిశ్చయమునందు; శాస్త్రమ్=శ్రుతిస్మృతిలక్షణమగు శాస్త్రమే; ప్రమాణమ్=అయాయర్థములఁ దెలుపునది, దేశ కాల మంత్ర తంత్ర దేవతాద్రవ్యములు మొదలగువానిజ్ఞానమునకును హేయద్రవ్యములజ్ఞానమునకును కారణ మని యర్థము. అందువలన, ఇహ=ఈ కర్మభూమియందు; కర్మాధికారి వగు నీవు దైవసంపద నవలంబించి కామాదిదోషములఁ బరిత్యజించి వేదాధ్యయనమును దదర్థజ్ఞానంబును పొందినవాఁడవై, శాస్త్రవిధానోక్తం కర్మ=శాస్త్రవిధిదృష్టమగు కర్మమునే; జ్ఞాత్వా=ఎఱింగి; నే నీకర్మము చేయవలయు నని శాస్త్రమువలన నెఱింగియే; నిదైనకర్మమును, కర్తు మర్హసి. వేఱువిధమునఁ జేయఁగూడదు, కర్మఫలవైగుణ్యము సంభవించుటవలన. ఇందుచే ముముక్షువు తనవర్ణాశ్రమోచితమగు కర్మమును శాస్త్రముచే నెఱింగి యాచరింపవలయు నని సిద్ధము.

మ. ఎందువలన శాస్త్రవిముఖుఁడై కామాధీన మగు ప్రవృత్తి గలవాఁడిహమునందును బరమునందును సర్వపురుషార్థములకును అనర్హుఁ డగునో, తస్మాత్ = అందువలన; తే = శ్రేయోర్థి వగు నీకు; కార్యాఽకార్యవ్యవస్థితౌ=ఏది కార్యము ఏది యకార్యము అను విషయమునందు; శాస్త్రమ్ = వేదమును తదుపజీవిస్మృతిపురాణాదికమును మాత్రమే; ప్రమాణమ్=బోధకము. ఇతరము సియూహా బుద్ధవాక్యము మొదలగునది ప్రమాణము కా దని యభిప్రాయము. కావున, ఇహ = ఈ కర్మాధికారభూమియందు; శాస్త్రవిధానముచేత — చేయవలయును చేయఁగూడదు అని ప్రవర్తనా నివర్తనారూప మగు వైదికలిఙాదిపదముచేత, ఉక్త మగు; కర్మ — విహితమును ప్రతిషిద్ధమును; జ్ఞాత్వా; నిషిద్ధమును వర్జించి క్షత్రియునకు విహిత మగు యుద్ధాదికర్మమును నీవు, కర్తు మర్హసి. సత్త్వశుద్ధిపర్యంత మని యర్థము. ఇట్లీయధ్యాయమునందు, ఆసురసంపద సర్వంబునకును మూలభూతములును అశ్రేయము లన్నిటికిని గారణములును శ్రేయము లన్నిటికిని బ్రతిబంధకములు నగు మహాదోషములను కామక్రోధలోభములను విడిచి శ్రేయోర్థి యగువాఁడు శ్రద్ధతో శాస్త్రప్రమాణుండై దానియందుఁ జెప్పఁబడినయర్థము ననుష్ఠించుటయందుఁ దత్పరుఁడు కావలయు నని సంపద్ద్వయవిభాగప్రదర్శనద్వారమున నిర్ధారితము.

శ్రీ. ఫలితముఁ జెప్పుచున్నాఁడు.—ఇది కార్యము ఇది యకార్యము అను నీవ్యవస్థయందు, తే=నీకు; శాస్త్రమ్=శ్రుతిస్మృతిపురాణాదికమే; ప్రమాణమ్. అందువలన, శాస్త్రవిధానోక్తం కర్మ జ్ఞాత్వా, ఇహ=ఈ కర్మాధికారమునందు, ఉన్న నీవు నీయధికారమునొప్పున కర్మమును, కర్తు మర్హసి, సత్త్వశుద్ధి సమ్యక్జ్ఞాన ముక్తులు తన్మూలము లగుటవలన నని యర్థము.

దైవదైతేయసంపత్ప్రదర్శనమున
లోకవినుతుండు దెలిపెను లోకమునకుఁ
దత్త్వవిజ్ఞానమునయందు సాత్త్వికుండె
యధికృతుం డని షోడశాధ్యాయమందు.

ప. ఫలితార్థముఁ జెప్పుచున్నాఁడు.—ఇది కార్యము ఇది అకార్య మను వ్యవస్థయందు, తే=నీకు; శ్రుతిస్మృతిరూప మగు శాస్త్రమే ప్రమాణము. అందువలన, శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహ అర్హసి, తన్మూలక మగుటవలన సత్త్వశుద్ధిపూర్వకముగాఁ దత్త్వజ్ఞానము నీకు సిద్ధించు నని యర్థము. అధ్యాయతాత్పర్యము.—శమము దమము సమత క్షమ వైరాగ్యము అనులక్షణములు గల దైవసంపద ముక్తిని గలిగించును. కామము క్రోధము లోభము అభిమానము అనృతము కపటము అను లక్షణములు గల యాసురసంపద బంధమునకు హేతువు. అస్మదీయులగు జనులకుఁ బ్రతిజన్మమును దైవసంపదయందే యుత్పత్తి యగును. అర్జునా! నీవు భయపడ వలదు. అని కృష్ణునిచే షోడశాధ్యాయమునందుఁ జెప్పఁబడినది.

రా. తస్మాత్; కార్యాఽకార్యవ్యవస్థితౌ=ఉపాదేయముయొక్కయు అనుపాదేయముయొక్కయు వ్యవస్థయందు; శాస్త్రమే నీకుఁ బ్రమాణము. ధర్మశాస్త్రేతిహాసపురాణాదులచే నుపబృంహితము లగు వేదములు ఏపురుషోత్తమాఖ్యపరతత్త్వమును తత్ప్రీణనరూపము తత్ప్రాప్త్యుపాయభూతము నగు నేకర్మమును బోధించుచున్నవో అట్టి శాస్త్రవిధానోక్త మగు తత్త్వమును కర్మమును, జ్ఞాత్వా=చక్కగా అన్యూనానతిరిక్తముగా నెఱింగి; నీవు, కర్తు మర్హసి=దానినే గ్రహింప వలయును.



ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయా[illegible]
సిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం[illegible]

యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయవిభాగయోగో నామ చతుర్దశోఽధ్యాయః.

వ్యాసప్రోక్త మయిన శతసహస్రగ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రంబును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు దైవాసురసంపద్విభాగయోగం బనంబరఁగు షోడశాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమత్కవాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మ సంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవ
ద్గీతాంధ్ర వ్యాఖ్యానంబునందు
షోడశాధ్యాయటీక.



అధ్యాయషోడశక మివ కృత్స్నా గీతాన్ధ్రవివృతి రఖిలేయమ్
పరిపూర్తి మియా దచిరాత్ శ్రీమద్భగవత్ప్రసాదేన.

ఘటయతు భాగవతీ మే దుర్ఘటఘటనాపటీయసీ కరుణా
సాధనవికలస్యాఽపిచ గీతా పరమార్థచన్ద్రికాపూర్తిమ్.

